

సదాశివ సమారంభాం
గురు దక్షిణామూర్తి
గురు వేదవ్యాస మహర్షి
గురు శుక మహర్షి
గురు నారద మహర్షి
గురు వాల్మీకి మహర్షి
గురు శ్రీకృష్ణ
శంకరాచార్య మధ్యమాం
గురు దత్తాత్రేయ
గురు బాబాజి
గురు గౌతమ బుద్ధ
గురు ఆదిశంకరాచార్య
గురు రామానుజాచార్యులు
గురు జ్ఞానేశ్వర్
గురు రవిదాస్
గురు కబీర్ దాస్
గురు చైతన్య మహా ప్రభువు
గురు నానక్
గురు రాఘవేంద్ర స్వామి
గురు వీరబ్రహ్మేంద్ర స్వామి
యోగి వేమన
అస్మదాచార్య పర్యంతాం
గురు త్రైలింగ స్వామి
గురు లాహిరి మహాశయ
గురు రామకృష్ణ పరమహంస
అమ్మ శారదా దేవి
గురు వివేకానంద
గురు సాయిబాబా
గురు అరబిందో
గురు రమణ మహర్షి
గురు యోగానంద
గురు భక్తివేదాంత ప్రభుపాద
గురు మళయాళ స్వామి
గురు విద్యాప్రకాశానందగిరి
గురు చంద్రశేఖర పరమాచార్య
వందే గురుపరంపరాం..

Free Gurukul

“ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్” ద్వారా విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందించే సేవా కార్యక్రమంలో బాగంగా ఈ పుస్తకాన్ని తిరుమల తిరుపతి దేవస్థానం వెబ్ సైట్ నుంచి సేకరించి అందిస్తున్నాము. ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము.

సాయి రామ్ వారి సేవల విస్తరణలో బాగంగా ఈ ఫౌండేషన్ స్థాపించబడినది. ఈ స్వచ్ఛంద సంస్థ ద్వారానే అన్ని సేవలు అందించబడును. ఇటువంటి పుస్తకాలు మీరు వ్రాసినట్లయితే (లేక) సేకరిస్తే మాకు తెలియచేయండి. మేము ప్రతి విద్యార్థికి ఉచితంగా అందేలా చేస్తాము, తద్వారా ఉన్నత విలువలు, నైపుణ్యాలు కలిగిన విద్యార్థులను మన దేశానికి అందించవచ్చు. మాతో కలిసి నవ భారత నిర్మాణ కార్యక్రమంలో పనిచేయుటకు, భాగస్వామ్యం అగుటకు ఆసక్తి ఉంటే సంప్రదించగలరు.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) తిరుమల తిరుపతి దేవస్థానం వారి వెబ్ సైట్: http://ebooks.tirumala.org
2) ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ వెబ్ సైట్ : www.freegurukul.org
3) సాయి రామ్ వెబ్ సైట్ : https://sites.google.com/site/sairealattitudemanagement
4) మొబైల్ ఆప్: Free Gurukul

గమనిక: భక్తి,జ్ఞాన,ధర్మ ప్రచారార్థం ఉచితంగా eBook రూపంలో తిరుమల తిరుపతి దేవస్థానం వారి సహాయంతో ఇవ్వడం జరిగింది. ఇది లాభార్జన దృష్టిలేని ఉచిత సేవ. ఈ సేవలో అంతర్జాలంలోని(ఇంటర్నెట్) లైసెన్సు / కాపీరైటు అభ్యంతరాలు లేనివి అనుకొన్న పుస్తకాలను గ్రహించటం జరిగినది. అనుకోకుండా ఏవైనా అభ్యంతరకరమైనవి ఉన్నచో మాకు తెలుప మనవి, వాటిని తొలగించగలము అని మనవి చేసుకొంటున్నాము.


Website: www.freegurukul.org  Mobile App: Free Gurukul  email: support@freegurukul.org
Facebook: www.facebook.com/freegurukul  Helpline/WhatsApp: 9042020123


“ మన లక్ష్యం: విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య అనేది ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందరికి అందించబడాలి “

ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ – Free Gurukul Education Foundation

సర్వం పరమాత్మ పాద సమర్పణమస్తు

**TTD(తిరుమల తిరుపతి దేవస్థానం)**

**http://ebooks.tirumala.org**



# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# పోతన భాగవతము

(ప్రథమ, ద్వితీయ, తృతీయ స్కంధములు)

మొదటి సంపుటము



తిరుమల తిరుపతి దేవస్థానములు,
తిరుపతి

# పోతన భాగవతము

*(సరళ గద్యానువాద సహితము)*

## మొదటి సంపుటము

**1, 2, 3 స్కంధములు**


*అనువాదకులు*

**డా॥ జంధ్యాల పాపయ్యశాస్త్రి**

**డా॥ సముద్రాల లక్ష్మణయ్య**

**డా॥ ఆశావాది ప్రకాశరావు**

*ప్రధాన సంపాదకులు*

**డా॥ నండూరి రామకృష్ణమాచార్య**

**డా॥ జంధ్యాల పాపయ్యశాస్త్రి**



*ప్రచురణ*

**కార్యనిర్వహణాధికారి**

**తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి**

**POTANA BHAGAVATAMU,** with Lucid Prose
First Volume - 1, 2 & 3 Skandhas

**Author :** Potana Mahakavi

**Prose Rendering :** Dr. Jandhyala Papaiah Sastry
Dr. Samudrala Lakshmanaiah
Dr. Asavadi Prakasa Rao

**Edited by :** Ist Skandha - Dr. Nanduri Ramakrishnamacharya
2nd & 3rd Skandhas - Dr. Jandhyala Papaiah Sastry. "Karuna Sri"



T.T.D Religious Publication Series No. 639-A

**First Edition** **:** 1987
**Re-prints** **:** 1998, 2004, 2005, 2008,2010
**Revised Edition** **:** 2015

**Copies :** 5,000

**Published by**

**Dr. D.Sambasiva Rao ,** I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati.

**D.T.P**

Sri Asangananda Graphics
Sri Vyasasramam, Yerpedu.
Ph:08578-287528

**Printed at**

# ముందుమాట

బ్రహ్మదేవుని చతుర్ముఖాలనుండి పురాణాలు, తరువాత వేదాలు వినిస్సృతాలైనట్లు తెలుస్తుంది. కాగా పురాణాల అనాదిత్వం పావనత్వం విద్యోతిత మవుతుంది. ఏనాటినుంచో సజీవంగా వెలిగేదే పురాణమంటారు. 'పురాపి నవం పురాణం'- ఎంత పాతదైనా పురాణం సరికొత్తగానే ఉంటుందన్నమాట!

సర్గం, ప్రతిసర్గం, వంశం, మన్వంతరం, వంశానుచరితం - అని పురాణాలు అయిదు లక్షణాలు కలిగి ఉంటాయి. ఈ లక్షణాలతో కూడిన పురాణాలు పద్దెనిమిది. ఉపపురాణాల సంఖ్యకూడా అంతే. ఈ పురాణాలన్నీ వేదవ్యాస మహర్షి విరచితాలే అని ప్రతీతి. ఇవి భిన్న కర్తృకాలు అనే ప్రవాదం కూడా ఉన్నది. ఏమైనా పురాణాలు ప్రాచీన సంస్కృతి సంప్రదాయాలకు ఆదర్శం లాంటివే కాకుండా, పూర్వ రాజవంశాలను గురించికూడ తెలపడంవల్ల ఒక విధంగా చరిత్రగ్రంథాలుగా కూడా ఉపకరిస్తాయి.

కథలద్వారా ప్రజలకు నీతి ధర్మాలు ఉపదేశించడం వీటి పరమాశయంగా కనిపిస్తుంది. భాగవత రచనవల్ల వ్యాసభగవానుడికి మనశ్శాంతి చేకూరిందనడంలో పురాణ ప్రభావం ఏమిటో విదిత మవుతుంది.

అష్టాదశ పురాణాలలో ప్రశస్తి వహించిన శ్రీమద్భాగవతాన్ని బమ్మెరపోతనామాత్యులు తెలుగులోనికి అనువదించి ఆంధ్రలోకానికి మహోపకారం చేశారు. పరమభాగవతోత్తముడైన పోతనగారు తన సహజ పాండిత్యముతో అనితరభక్తితో భాగవతాన్ని రచించారు. మహాతపస్వి పోతరాజుగారి లేఖిని నుండి జాలు వారిన కవితా ప్రవంతి ఆంధ్ర జనహృదయ కేదారాలను తడుపుతూ తాపత్రయాన్ని హరిస్తున్నదనడం సత్యం. భాగవతంలోని ప్రతి పద్యం ఎంతో హృద్యం. తెలుగునాట పోతనగారి పద్యం నోటికి రాని పండితుడు గాని, పామరుడుగాని లేడంటే అతిశయోక్తి కాదు.

ఇలా తెలుగునాట ప్రముఖస్థానాన్ని అలంకరించిన ఆంధ్రమహాభాగవతం అక్షరాస్యులందరికీ సులభ గ్రాహ్యం అయ్యేందుకు తి.తి.దేవస్థానంవారు ప్రముఖ విద్వాంసులచేత సులభశైలిలో తాత్పర్యాలు వ్రాయించి, ముద్రించారు.

ప్రధాన సంపాదకులైన డా॥ జంధ్యాల పాపయ్యశాస్త్రి (కరుణశ్రీ) గారికి, ఆయా సంపుటాల తాత్పర్య రచయితలకును మా అభినందనలు. తి.తి.దేవస్థానం వారు ప్రచురించిన పోతన భాగవత సంపుటాల ప్రతులన్నీ చెల్లిపోయినందున పాఠకుల సౌకర్యార్థమై పరిష్కరించి పునర్ముద్రించటం జరిగింది. పాఠకులు యథాపూర్వం ఆదరించగలరు.

శ్రీనివాసుని కృపతో తిరుమల తిరుపతి దేవస్థానంవారు చేస్తున్న ధార్మిక గ్రంథ ప్రచురణలపట్ల తెలుగునాట బహుళామోదం లభిస్తున్నందుకు సంతోషం.

**కార్యనిర్వహణాధికారి,**

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

## అనువాదకులు

డాక్టర్ జంధ్యాల పాపయ్య శాస్త్రి (ప్రథమ స్కంధము)

డాక్టర్ సముద్రాల లక్ష్మణయ్య (ద్వితీయ స్కంధము)

డాక్టర్ ఆశావాది ప్రకాశరావు (తృతీయ స్కంధము)

# పోతన భాగవతము

**అనువాదకులు** | **స్కంధములు**

### మొదటి సంపుటము

| | | | |
|---|---|---|---|
| 1. | డా॥ జంధ్యాల పాపయ్య శాస్త్రి | --- | ప్రథమ స్కంధము |
| 2. | డా॥ సముద్రాల లక్ష్మణయ్య | --- | ద్వితీయ స్కంధము |
| 3. | డా॥ ఆశావాది ప్రకాశరావు | --- | తృతీయ స్కంధము |

### రెండవ సంపుటము

| | | | |
|---|---|---|---|
| 4. | శ్రీ శనగన నరసింహస్వామి | --- | చతుర్థ స్కంధము |
| 5. | డా॥ సర్వోత్తమరావు | --- | పంచమ స్కంధము |
| 6. | శ్రీ తలమర్ల కళానిధి | --- | షష్ఠ స్కంధము |

### మూడవ సంపుటము

| | | | |
|---|---|---|---|
| 7. | శ్రీ జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రి | --- | సప్తమ స్కంధము |
| 8. | శ్రీ జి. చెన్నయ్య | --- | అష్టమ స్కంధము |
| 9. | డా॥ బి. భాస్కర చౌదరి | --- | నవమ స్కంధము |

### నాల్గవ సంపుటము

| | | | |
|---|---|---|---|
| 10. | డా॥ ఎక్కిరాల కృష్ణమాచార్య | --- | దశమ స్కంధము (పూర్వభాగం 1- 725 పద్యములు) |
| 11. | శ్రీమాన్ ముదివర్తి కొండమాచార్యులు | --- | దశమ స్కంధము (పూర్వభాగం 726 - 1791 పద్యములు) |

### ఐదవ సంపుటము

| | | | |
|---|---|---|---|
| 12. | డా॥ అమరేంద్ర | --- | దశమస్కంధము - ఉత్తరభాగము ( 1- 535 పద్యములు) |
| 13. | శ్రీ డి. నాగసిద్ధారెడ్డి | --- | దశమస్కంధము - ఉత్తరభాగము (536 - 1342 పద్యములు) |
| 14. | డా॥ ప్రసాదరాయ కులపతి | --- | ఏకాదశ స్కంధము |
| 15. | శ్రీ టి. భాస్కర రావు (స్ఫూర్తిశ్రీ) | --- | ద్వాదశ స్కంధము |

# మున్నుడి

పోతన మహాకవి భాగవతమును నిగమముగా ఆమ్నాయముగా అభివర్ణించి ఉన్నాడు-

**నిగమములు వేయు చదివిన, సుగమంబులు గావు ముక్తి సుభగత్వంబుల్**
**సుగమంబు భాగవత మను, నిగమంబు పఠింప ముక్తి నివసనము బుధా.** **భా. ప్ర. 140**

**భువనక్షేమంకరంబైన, భాగవతామ్నాయము**
**బాదరాయణుఁడు దాఁగల్పించె నేర్పొప్పఁగన్.** **భా.ప్ర.136**

పోతన దృష్టిలో భాగవతము వేదవాఙ్మయములో అంతర్భాగమే

## వేదవాఙ్మయము - భాగవత తత్త్వము

వేదములు- వేదాంగములూ- ఉపనిషత్తులు- పంచమవేదమైన భారతము- సనాతన భారతీయ సారస్వతములో ప్రాచీనములనీ, భాగవతము అర్వాచీన శాఖయనీ లోకములో ఒక అభిప్రాయం వ్యాపించి ఉంది. సూక్ష్మదృష్టితో అనుశీలిస్తే భాగవత తత్త్వము వేదతత్త్వము సమానములే. భాగవతము సుస్పష్టముగ ప్రతిపాదించే ఆస్తికత్వం, అవతారతత్త్వం, భక్తియోగం బీజప్రాయంగా వేదసారస్వతంలో ఉన్నట్టివే.

భాగవతమునకు అంతరాత్మయైన "భక్తి" లోని నవవిధభక్తి మార్గాలు భాగవతంలో హృదయంగమంగా అభివర్ణితాలు.

**శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్।**
**అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మనివేదనమ్॥**

పైశ్లోకానికి పోతన ఆంధ్రీకృతి

**తనుహృద్భాషల సఖ్యమున్, శ్రవణమున్ దాసత్వమున్ వందనా**
**ర్చనముల్ సేవయు నాత్మలో నెఱుకయున్ సంకీర్తనల్ చింతనం**
**బను నీ తొమ్మిది భక్తిమార్గముల సర్వాత్మున్ హరిన్ నమ్మి స**
**జ్జనుఁడై యుండుట భద్ర మంచుఁ దలఁతున్ సత్యంబు దైత్యోత్తమా!** **భా- 7-167**

భాగవతము భక్తి వేదాంత తత్త్వమునకు పరాకాష్ఠను ప్రతిపాదించు సాహిత్య శిఖరం. భక్తి వేదాంత తత్త్వక్రమ పరిణామ వికాసం. వేదవాఙ్మయంలో సూక్ష్మదృష్టితో అనుశీలించే వారికి భాగవతం సుగమమే. వేద వాఙ్మయములో నవవిధములైన భక్తికి ఆస్తిక్యానికి ఉదాహరణలు కో కొల్లలు. అందు వక్ష్యమాణములైన ఉదాహరణములు ప్రధానంగా ఎన్నుకోవచ్చు.

### శ్రవణం

1. **భద్రం శ్లోకం శ్రూయాసం - - అథర్వ. 16-2**

భగవంతుని కల్యాణ గుణాలే వినగోరుచున్నాను.

II

**కీర్తనం**

2. **విష్ణోర్నుకం వీర్యాణి ప్రోవోచమ్ - - ఋగ్వేద. 1-514-1**

   శ్రీమన్మహా విష్ణుమూర్తి పరాక్రమ గాథలు ప్రవచింపగోరుచున్నాను.

**స్మరణం**

3. **మనామహే చారు దేశ్య నామ - - ఋగ్వేద. 1-24 -1**

   పరమాత్మ వైభవోత్కర్ష స్మరించవలె.

**పాదసేవనం**

4. **జుషాణ ఇంద్ర సప్తభిర్న ఆగహి - - ఋగ్వేద. 8-13-13**

   ప్రభూ! నీరాజ కీవితో మాకడకు విచ్చేయుదువుగాక.

**అర్చనం**

5. **అర్చా చక్రాయ శాకినే - - ఋగ్వేద. 1-54-2**

   పరాత్పరుడైన ఇంద్రునికి అర్చన సమర్పించ దగు.

**వందనం**

6. **వందామహే త్వా - - ఋగ్వేద. 3-8-9**

   నీకు అభివాదాలు.

**దాస్యం**

7. **వైశ్వానరస్య సుమతౌ స్యామ - - ఋగ్వే. 1-98-1**

   మనము విశ్వశిల్పి ప్రాభవంలో అణగి యుండదగు.

**సఖ్యం**

8. **మరుత్వంత్వం సఖ్యాయ హవామహే - - ఋగ్వేద. 1-101 -6**

   సకలదేవతాధినేత సఖ్యం అర్థించెదము గాక.

**ఆత్మనివేదనం**

9. **భర్గో దేవస్య ధీమహి - - ఋగ్వేద. 3-62-10**

   పరాత్పరుని తేజం ధ్యానింతుము.

పూర్వోదాహృతులైన వేద వాక్యాలను బట్టి భాగవతభక్తి వేదాంత తత్త్వం వేదప్రోక్త మైనదే అని తేలుతున్నది.

III

**భారతము - భాగవతము**

**భారతకర్త భాగవత ప్రవక్త వేదవ్యాస మహర్షియే;**
**భారత కథలో చివరిఘట్టం శ్రీకృష్ణనిర్యాణం,**
**భాగవతములో ప్రారంభఘట్టం శ్రీకృష్ణనిర్యాణం.**

సూక్ష్మదృష్టితో పరిశీలిస్తే భారతం ఏ వేదాంత తత్త్వానికి భరతవాక్యం పలికిందో భాగవతం ఆ వేదాంత తత్త్వానికే నాందీగీతిక ఆలపించినట్లు చెప్పవచ్చు- భాగవతంలోని ఇతివృత్తాలకు కేంద్రం అవతారమూర్తియైన శ్రీకృష్ణుడూ, శ్రీకృష్ణుని పూర్వావతారాలూ. భారతంలో ఎన్నో ఘట్టాలలో శ్రీకృష్ణుడు విష్ణుదేవుని అవతారంగా ప్రశంసితుడు.

## సభాపర్వంలో

**ఆదిజుఁడైన బ్రహ్మయుదయంబున కాస్పదమైన వాఁడు ! వే**
**దాది సమస్త వాఙ్మయములందుఁ బ్రశంసితుఁ డైనవాఁడు! లో**
**కాది త్రిలోకపూజ్యుఁడని ఆత్మ నెఱింగి పితామహుండు దా**
**మోదరుఁ జెప్పెఁ బూజ్యుఁడని యుక్తము కా కిది యేమి దోసమే!** **భా. సభా-2-18**

అని ధర్మరా జన్నాడు.

భీష్ముఁడు సభాపర్వంలో మాత్రమేకాక భీష్మపర్వములో గూడ ప్రస్ఫుటంగా శ్రీకృష్ణుని పరాత్పరుడిగ ప్రశంసించి నట్లుంది.

పార్థసారథిగా నున్న శ్రీకృష్ణుడు భీష్మునిపైకి చక్రం పట్టి సంహరించేందుకు దుమికినపుడు భీష్ముడు రెండుసార్లు శ్రీకృష్ణుని విష్ణువు యొక్క అవతారమూర్తిగా స్తుతిచేస్తాడు -

అట్లే విష్ణుసహస్రనామం భారతంలో ఏకదేశమే. అంతేకాక అవతార తత్త్వానికి మూలకందమైన భగవద్గీత భారతంలో అంతర్భాగమే.

భాగవతం భగవద్గీతకు భాష్యమే. అందుచేత భారత భాగవత వేదాంత తత్త్వాలు విప్రతిపన్నాలు గావు. అవి భిన్నసాహిత్య గ్రంథాలుమాత్రమే. భక్తి వేదాంత తత్త్వప్రతీతిలో భారత భాగవతాలు పరస్పర వైరుద్ధ్యం లేని సమాంతర రేఖలు. స్థూలదృష్టికి అవి కలసినట్లు కన్పించవు. పారమార్థిక దృష్టిలో ఉన్నత గణితవ్యపదేశంలో వలె- అవి అనంత తత్త్వంలో కలుస్తాయి.

సింహావలోకనప్రాయంగా చెప్పదగిన మాట, వేదవాఙ్మయం భారత వేదాంతం, భాగవతతత్త్వం అవినాభావ సంబంధం గలిగినట్టివే; ఏకార్థప్రతిపాదకములే.

భాగవతం అవతరణ గూర్చి ఆ గ్రంథపీఠికలోనే హృదయంగమమైన కథ ఉంది. వేదతత్త్వవేత్తగా పంచమవేదమైన భారతవక్తగా సుగృహీత నామధేయుడైన వ్యాసమహర్షి ఆశ్రమానికి వచ్చి

**"ధాతవు భారత శ్రుతి విధాతవు వేద పదార్థజాత వి**
**జ్ఞాతవు! కామ ముఖ్యరిపుషట్క విజేతవు బ్రహ్మతత్త్వ ని**
**ర్ణేతవు యోగినేతవు వినీతుఁడ వీవు చలించి చెల్లరే!**
**కాతరు కైవడిన్ వగవ కారణమేమి? పరాశరాత్మజా!** **1-89**

అంటాడు. నారదమహర్షి వ్యాసునికి వేదాంతతత్త్వం ఉపదేశిస్తాడు. వేదవ్యాస మహర్షికి చిత్తశాంతి లభించింది. భారతభూమిలో యుగయుగాంతరాల నుండి భాగవతం చదివే సహృదయులకూ కోటానుకోట్ల ప్రజానీకానికి చిత్తశాంతి లభిస్తుంది!

వ్యాసప్రోక్తమైన భాగవతం పరీక్షిత్తునకు చెప్పింది వ్యాసుని కుమారుడైన శుకమహర్షి- తండ్రిని మించిన సత్పుత్త్రుఁడు. నగ్నంగా అరణ్యంలో స్నానం చేస్తున్న అప్సరసలు అతని రాకను పట్టించుకోలేదు. గాని కొడుకును వెదకుతూ వచ్చిన వేదవ్యాసుణ్ణిచూచి ససంభ్రమంగా చీరలు ధరించారట! అట్టి శుకుడు ఏడు రోజులలో ప్రాయోపవేశదీక్షితుడై మృత్యునిరీక్షణలో ఉన్న పరీక్షిత్తుకు, మోక్షప్రాప్తికై చెప్పిన గాథ భాగవతం. ఆవుపాలు పితుకు వ్యవధిదాటి శుకుడు ఒక చోట నిలిచేవాడు కాడు. ఏడు రోజులలో ముక్తి పొందే మార్గం కోరిన పరీక్షిత్తునకు భాగవత తత్త్వోపదేశం శుకమహర్షి చేశాడు. వేదవేదాంగాలు, భారత రామాయణాలు, వివిధపురాణాలూ, ముక్తిమార్గాన్ని జిజ్ఞాసువులైన భక్తులకు ప్రబోధించేవే. అవి సుదీర్ఘశరణాగతులు. భాగవతం సద్యోముక్తి ప్రదాయకమైన శీఘ్రశరణాగతి.

సనాతన భారతీయ సంప్రదాయానుసారం వేదవ్యాసమహర్షి క్రీస్తుకు పూర్వం సుమారు మూడువేల సంవత్సరాలకు ముందు జీవించినవాడు. పంచమవేదం భారతం అప్పుడే పుట్టింది. వేద వాఙ్మయం అంతకు ముందే వెల్లివిరిసింది. అందుచేత భారతదేశంలో ఇప్పటికీ అయిదువేల సంవత్సరాలకు ముందే చరిత్రోదయానికి పూర్వమే భాగవత భక్తి వేదాంతం వెల్లివిరిసినట్లు చెప్పవచ్చు.

సంస్కృత భాగవతంలోనే ప్రస్ఫుటంగా భాగవతం "సర్వవేదేతిహాసం'' గా చెప్పబడింది.

**ఇదం భాగవతం నామ పురాణం బ్రహ్మసమ్మితం**
**ఉత్తమ శ్లోకచరితం చకార భగవా నృషిః**
**సర్వం వేదేతిహాసానాం సారం సారం సముద్ధృతమ్**
**స తు సంశ్రావయామాస మహారాజం పరీక్షితమ్॥** **భాగవతం. 1 స్కం. 40-42**

భారతదేశ చరిత్రలో క్రీ.పూ. 113వ సంవత్సరంలో యవనరాజు ఏంటియాల్ సిడిస్ పంపిన రాయబారి హెలియొడోలస్ సుంగరాజు భగదత్తుడి ఆస్థానానికి విదిశలో గరుడస్తంభం ఎత్తించాడు. తాను భగవంతుడి నని సగర్వంగా చాటుకున్నాడు. దీన్నిబట్టి భారతదేశంలో భాగవత సంప్రదాయం క్రీస్తుపూర్వం రెండవ శతాబ్ది నాటికి సుస్థిరంగా నాటుకొని ఉండడమే గాక విదేశీయుల్ని సైతం ఆకర్షించినట్లు తెలుస్తుంది.

ప్రాచీన వేదవాఙ్మయంలోనే సగుణ నిర్గుణోపాసన లున్నాయి. అథర్వవేదంలో

**"ద్వే వా వో బ్రహ్మణో రూపే మూర్తం చై వామూర్తం చ. "** అని వుంది.

అట్లే అవతారతత్త్వం గూడ వేదవాఙ్మయం లోనిదే.

**ప్రజాపతిశ్చరతి గర్భేరంత రజాయమానో బహుధా విజాయతే.** **యజుర్వేద- 31-19**

దేవుడైన ప్రజాపతి మానుషగర్భస్థుడై వివిధాకృతులు ధరిస్తాడు అని పై మంత్ర తాత్పర్యం.

**ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే.** **ఋగ్వేద - 4-47-18**

ఇంద్రుడు మాయాప్రభావంచే పృథివిలో అవతరిస్తున్నాడు అని పై మంత్ర తాత్పర్యం. భగవద్గీతలో శ్రీకృష్ణుడు తానే భగవానుణ్ణి అని సుస్పష్టంగా ప్రకటించుకున్నాడు. దుష్టశిక్షణ కొఱకూ, ధర్మరక్షణకొఱకూ తాను యుగ యుగాంతరాలలో భూలోకంలో అవతరిస్తానని చెప్పియున్నాడు.

**పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్ ।**
**ధర్మసంస్థాప నార్థాయ! సంభవామి యుగే యుగే ॥** **భ.గీ. 4-9**

భాగవత భక్తి వేదాంత తత్త్వానికి ఆద్య ప్రకృతులు సనాతన వేద వాఙ్మయంలోనే ప్రస్ఫుటంగా కన్పిస్తున్నాయి.

భక్తి వేదాంతతత్త్వ ప్రవర్తకులూ ప్రచారకులూ వేదకాలం నుంచి యుగయుగాంతరాలుగా భారత వర్షంలో ఎందఱో మహానుభావులు ఉద్భవించారు. ఎందఱిపేర్లు చెప్పినప్పటికి అది సశేషమైన ఆకృతిగణమే అవుతుంది. భక్తి వేదాంత తత్త్వ ప్రవక్తలలో సుప్రసిద్ధుడైన భగవద్రామానుజుల కాలం క్రీస్తుశకం పదకొండవ శతాబ్ది. ఆయన శ్రీ వైష్ణవ గురుపరంపరలో చివరివాడే గాని మొదటిప్రవక్త గాదు. ఆయనకు ముందు ఆ గురుపరంపరలో ప్రముఖులైన ఆళ్వారులు ఉన్నారు. వారు దక్షిణాపథానికి చెందినవారు. భగవద్రామానుజులు అటు ఉత్తరాపథంలోని వాఙ్మయం ఇటు దక్షిణాపథంలోని ద్రావిడవేద వాఙ్మయం సమన్వయించిన తొలి ఉభయవేదాంత మార్గ ప్రతిష్ఠాపనాచార్యులు. వేదవాఙ్మయం నుంచి అవిచ్ఛిన్నంగా ఆసేతుహిమాలయం వర్ధిల్లిన భక్తి వేదాంతతత్త్వానికి సంస్కృతభాగవతం సారస్వత మూలకందమైంది.

భారతదేశచరిత్రలో భక్తి వేదాంతతత్త్వ ప్రవర్తకులుగా కీర్తి గడించిన మహనీయులు శ్రీ చైతన్యుడు- వల్లభాచార్యులు- సూరదాసు- తులసీదాసు- సమర్థరామదాసు ప్రభృతులు. వారు పోతన మహాకవికి అర్వాచీనులు. వంగదేశంలో జన్మించిన శ్రీ చైతన్యుడు యావత్ భారతదేశం పర్యటించిన పరమ భాగవతోత్తముడు. ఆతని కాలము క్రీస్తుశకం 1485 నుండి 1533 వరకు అని చరిత్రకారుల నిర్ణయం. శ్రీ చైతన్యుడు తెలుగు దేశంలోని మంగళగిరిక్షేత్రం దర్శించినందుకు నిదర్శనంగా అతడి పాద ముద్రికలు అక్కడ చెక్కబడి ఉన్నాయి.

శ్రీ వల్లభాచార్యులవారి రాధామాధవతత్త్వం శుద్ధాద్వైతంగా పుష్టి మార్గంగా పేరు కెక్కింది. ఆయన తెలుగు బ్రాహ్మణుడు. చైతన్యునిపై పరోక్షంగా, వల్లభాచార్యులపై ప్రత్యక్షంగా, పోతన ప్రభావం ప్రసరించినట్లు భావింప వచ్చు. మహారాష్ట్రంలో శివాజి మహారాజు గురువుగారైన సమర్థరామదాసుగారు తాము రచించిన దాసబోధ అనే గ్రంథంలో పోతన మహాకవిని ప్రశంసించి యున్నారు. హిందీ సాహిత్యంలో భక్తి వేదాంత తత్త్వోపదేష్టలుగా ప్రశస్తి గాంచిన సూరదాసు, తులసీదాసులు ఇంచుమించు సమకాలీనులు. సూరదాస్ 1540 ప్రాంతంలో జన్మించాడని, తులసీదాసు కాలం క్రీస్తు 1532-1623 అనీ, హిందీ సాహిత్యవేత్తల అభిప్రాయం. వీరిద్దఱూ పోతనకు అర్వాచీనులు -

సూరదాసు రచించిన సూరసాగర్‌లో భాగవతంలో వలె ద్వాదశస్కంధాలు ఉన్నాయి. అది భాగవతానికీ అనువాదగ్రంథం గాదు. కాని దానిపై భాగవత కవితా ప్రభావం సుస్పష్టం. తులసీదాసు పోతనవలె రామభక్తుడు. ఆయన వ్రాసిన  రామాయణంలో వాల్మీకి కవితాప్రభావం, భాగవత భక్తి వేదాంత తత్త్వ ప్రభావం గంగా యమునల వలె సంగమించాయి. సూరదాసు వల్లభాచార్యుల వారికి ప్రత్యక్షశిష్యుడట! ఈ విధంగా పోతన మహాకవి తెలుగు భాగవత ప్రభావం వంగమహారాష్ట్ర దేశాలలో విస్తరిల్లింది అని ఊహింపవచ్చు.

భారతదేశభాషల్లో వెలువడిన భాగవతాలన్నీ పోతన తెలుగు భాగవతం తర్వాత వెలసినవే. తమిళంలో భాగవతకర్త అరియప్పపులవర్ క్రీ.శ. 1700 ప్రాంతం వాడు. కన్నడ భాగవతకర్త విఠలనాథుడు క్రీస్తుశకము 1530 ప్రాంతం వాడు, మహారాష్ట్ర భాషలో భాగవతం వ్రాసిన మహాభక్తుడు ఏకనాథుడు క్రీ.శ. 1580 ప్రాంతం వాడు. ఒరియాభాషలో భాగవతం వ్రాసిన జగన్నాథదాసు 15 వ శతాబ్దివాడు. మలయాళ భాగవతకర్త విజుతచ్చన్ కూడ 15వ శతాబ్ది వాడు. వంగభాగవతం వ్రాసిన మాలాధరదాసు 16 వ శతాబ్ది వాడు. అస్సాంభాషలో భాగవతకర్త శంకరదేవుడు క్రీ. శ. 1449-1568 సంవత్సరాలమధ్య జీవించి, తనజీవితంలో అపర సంధ్యాసమయంలో దానిని వ్రాసినట్లు చెప్పుకున్నారు.

ఇక తాళ్ళపాక అన్నమాచార్యులు, వారి వంశీయులు, రామదాసుగా ప్రసిద్ధికెక్కిన గోపన్న- త్యాగరాజు ప్రభృతులపై పోతన్న ప్రభావం ప్రసరించడం సహజం. త్యాగరాజు నిత్యార్చనలో పోతన భాగవతపారాయణం సలిపేవాడు. తెలుగుదేశంలో పోతన భాగవతంలోని పద్యాలు తరతరాలుగా వేలకొలది నాలుకలపై నిత్య ప్రార్థనాశ్లోకాలుగా నిలిచిపోయాయి. ఆంధ్రదేశంలోనే కాక యావత్ భారతదేశంలో ఉద్యమస్థాయిలో వెల్లివిరిసిన భక్తి వేదాంత తత్త్వప్రచారానికి పోతన మహాకవియే భవ్యకవితావేశం అందించిన మూలపురుషుడు. భక్తినే ముక్తికి రాచబాటగా యోగీశ్వరు లెందఱో ఉపదేశించిచారు. వారి చరిత్రలు జీవదుదాహరణము లైనాయి. భక్తి ప్రచారం సనాతన భారతీయ సంస్కృతిని  ప్రతికూల సభ్యతా ఝంఝూ మారుతాలనుండి సంరక్షించిన వజ్రకవచమైంది. సనాతనమతంలో కర్మజ్ఞాన వైరాగ్యమార్గాలు సామాన్య ప్రజా సముదాయానికి సులువైనవి కావు. భక్తియోగం సరళసుందరమై సద్యోముక్తి దాయకంగా సమస్త ప్రజావళికి ఆరాధ్యమైంది. కర్మజ్ఞాన వైరాగ్యమార్గాలు ఆస్తికులైన అనుష్ఠాన వేదాంతులు చిరసాధనతో చేయవలసిన సుదీర్ఘ శరణాగతి. భక్తి శీఘ్రశరణాగతి; సద్యోముక్తి ప్రదాయకం.

పోతన తెలుగు భాగవతంలోని ప్రతి పద్యం సద్యోముక్తి సంధాయకం. అందుచే భాగవతం ఆంధ్రుల అభిమానకావ్యంగా తరతరాల తెలుగు హృదయాలను ఉవ్విళు లూరిస్తున్నది.

పోతన మహాకవి మూర్తీభవించిన భక్తివేదాంత తత్త్వమై ఆంధ్రంలోనికి భాగవతం అవతరింపజేశాడు. భాగవతం తెలిగించడం **"పునర్జన్మంబు లేకుండుటకై"** పోతనజేసిన సాహితీతపస్సు. **"హరి కిచ్చి చెప్పె ఈ బమ్మెర పోతరా జొకడు భాగవతంబు జగద్ధితంబుగన్"** అని తనకృతిని నరాంకితం సల్పకుండా శపథం చేసిన మహామహితాత్ముడాయన! భగవద్భక్తికి గుండెల్లో వెన్నెల కోవెల నిర్మించుకొని భాగవతకృతి

వ్రాసిన పోతన తన కావ్యపీఠికలో వ్యాస, వాల్మీకి కాళిదాసాది ప్రాచీన కవుల్ని ప్రశంసించి, ఆంధ్రకవితా గౌరవ జనమనోహారి నన్నయసూరిం గైవారంబు సేసి, హరిహర చరణారవిందవంద నాభిలాషిం దిక్కన మనీషిం భూషించి, మఱియు నితరపూర్వకవి జనసంభావనంబు గావించి వర్తమానకవులకుం బ్రియంబు పలికి, "భావికవుల" బహూకరించిన సహృదయసార్వభౌముడు. భాగవతంకోసమే తెలుగు పుడమిలో పుట్టిన కారణజన్ముడుగానే తన్ను గూర్చి పోతన సంభావించుకొన్నవాడు. పోతన భక్తి సంకుచితమైంది కాదు.

చేతులారంగ శివపూజ చేయవలెననీ, నోరు నొవ్వంగ హరికీర్తి నుడువ వలెననీ అతని అభిమతం.

అట్లే కవితాశైలిలో గూడ,

**"కొందఱకు తెలుగు గుణమగు, కొందఱకును సంస్కృతంబు గుణమగు రెండుం**
**గొందఱకు గుణములగు నే, నందఱ మెప్పింతు కృతుల నయ్యై యెడలన్"** **1-20**

అని ఒడ్డున నిలిచిన మధ్యవర్తి.

**"భాగవతము తెలిసి పలుకుట చిత్రంబు, శూలికైన తమ్మిచూలికైన!**
**విబుధ జనుల వలన విన్నంత కన్నంత, తెలియ వచ్చినంత తేట పఱతు"** **1-19**

అని చేతులు జోడించి చెప్పిన వినయమాధుర్యమూర్తి పోతన.

ఆంధ్రసాహితీ జగత్తులో కవిత్రయాన్ని పోతన ప్రశంసించియున్నాడు. కాబట్టి భాస్కరరామాయణ పద్యాలకు అనుకృతులు తెలుగుభాగవతంలో కనిపిస్తున్నాయి. కాబట్టి పోతన వారికి పిమ్మటివాడే అయి ఉండాలికదా! ఎట్లున పదమూడవ శతాబ్దిమధ్య ఉన్నవాడు. క్రీ. శ. 1370లో భాస్కరరామాయణం రచన పూర్తియైనట్లు శ్రీ నిడదవోలు వెంకటరావుగారి అభిప్రాయం. అందుచే పోతన మహాకవి జీవితకాలం క్రీ.శ. 1378 నుండి 1460 అని వారి నిర్ణయం. పలువురు సాహితీవేత్తలు పోతన ఈ కాలం వాడనే అభిప్రాయపడు తున్నారు. పోతన భోగినీదండక కృతిభర్త క్రీ.శ. 1435 ప్రాంతంవాడు. కవిసార్వభౌమ బిరుదాంకితుడైన శ్రీనాథమహాకవి పోతన సమకాలీనుడు.

## పోతన వ్రాసిన ఇతర కృతులు

1. వీరభద్రవిజయము, 2. నారాయణశతకము, 3. భోగినీదండకము 4. భాగవతమున 8 స్కంధములు (1,2,3,4, మఱియు 7,8,9,10 స్కంధాలు)

భాగవతరచనలో పోతన సహవ్రతులు

గంగన --- పంచమస్కంధము
సింగన --- షష్ఠస్కంధము
నారయ --- ఏకాదశ ద్వాదశ స్కంధాలు.

రెండవ స్కంధములో కొంతభాగం కూడ ఇతడే వ్రాసినట్లుగా కొందఱు భావిస్తున్నారు.

తెలుగు భాగవతం గద్యపద్యాల సంఖ్య సుమారు తొమ్మిదివేలు.

సంస్కృత భాగవతానికి తెలుగు భాగవతం కేవలం యథాక్షరానువాదం కాదు. యథోచితానుసరణం అని చెప్పవచ్చు. ఎన్నోచోట్ల పోతన మూలాన్ని పెంచి వ్రాశాడు. పలుతావుల్లో సంస్కృతభాగవతానికి శ్రీధరుడు వ్రాసిన వ్యాఖ్యానం కూడా పోతన తెలుగులోకి అనువదించియున్నాడు. మూలంలో "నిమిశక్షేత్రే'' అని ఉన్నంత మాత్ర తెలుగులో పోతన

**"పుణ్యంబై మునివల్లభ, గణ్యంబై కుసుమ ఫల నికాయోత్థిత సా**
**ద్గుణ్య మయి నైమిశాఖ్యా,రణ్యంబు నుతింపఁదగు నరణ్యంబులలోన్."** **1-38**

అని మాత్రమేగాక ఒక సుదీర్ఘగద్యం- సంస్కృత కాదంబరీ గద్యకావ్యశైలిలో ప్రౌఢ సమాసశ్లేషాను ప్రాణితంగా "మధువైరి మందిరంబుంబోలె మాధవీ మన్మథ సహితంబై'', బ్రహ్మగేహంబునుంబోలె శారదాన్వితంబై ... ... నైమిశారణ్యంబను శ్రీ విష్ణుక్షేత్రంబున - ఇత్యాదిగా అభివర్ణించాడు. షష్ఠస్కంధంలో గజేంద్ర మోక్షణఘట్టం మూలంలో కంటె తెలుగులో నాలుగు రెట్లు పెరిగింది. అట్లే శ్రీకృష్ణలీలలు గల దశమస్కంధం గూడ తెనుగు భాగవతంలోని కొన్ని పద్యాలకు సంస్కృతభాగవతంలో మూలాధారాలు అని చెప్పదగిన శ్లోకాలు లేవు. **"అల వైకుంఠపురంబులో'', "ఇంతింతై వటుఁ డింతయై'', "మందార మకరంద మాధుర్యమునఁ జొక్కు'', "ప్రాణేశ! నీ మంజుభాషలు వినలేని'', "అన్నవు నీవు చెల్లెలికి''**- మున్నగు ఎన్నో పద్యాలు ఇందుకు తార్కాణాలుగా ఉదాహరించవచ్చు. అయితే పోతన మూలతత్త్వం అతిక్రమించకుండగనే స్వకపోల కల్పనలు చేశాడు. మూలార్థమునే హృదయంగమంగా వెలయించే తెనుగు పద్యాలు పోతన వ్రాసిన అధిక సంఖ్యాకాలు. ఉదాహరణకు -

**మతిర్నకృష్ణే పరత స్స్వతో వా మిథోభి పద్యేత గృహవ్రతానామ్ ।**
**అదాంతగోభిర్విశతాం తమిస్రం పునఃపున శ్చర్విత చర్వణానామ్ ॥**

అనే శ్లోకానికి పోతనగారి తెనుగు అనువాదం-

**అచ్చపుఁ జీఁకటిం బడి గృహవ్రతులై విషయ ప్రవిష్టులై**
**చచ్చుచుఁ బుట్టుచున్ మఱలఁ జర్వితచర్వణు లైన వారికిన్**
**జెచ్చెరఁ బుట్టునే, పరులు సెప్పిన నైన నిజేచ్ఛ నైన నే**
**మిచ్చిన నైన కానలకు నేగిన నైన, హరిప్రబోధముల్.** **సప్తమ - 181**

ఈ బహుళాంధ్రోక్తి మయప్రపంచంలో తరతరాలనుంచి సాహితీప్రియం భావుకులైన సహృదయుల్ని మాత్రమేగాక సాధారణప్రజానీకంలోని నిరక్షర కుక్షుల్ని సయితం ఉఱ్ఱూత లూగించిన పోతన కవితకు లభించిన అనన్య సామాన్యప్రచారానికి కారణం ఏమిటి? అనేక కారణాలు ఉన్నాయి. పోతన భాగవతం కేవలం రసవత్కవిత్వ బంధుర మేకాక భక్తితత్త్వ ప్రబోధకమైన ఆధ్యాత్మిక గ్రంథం కావటం ప్రధానకారణం అని చెప్పవచ్చు.

**"అపశబ్దంబులఁ గూడియున్ హరిచరిత్రాలాపముల్ సర్వపాపపరిత్యాగముసేయు''** అని పోతన ఎలుగెత్తి చాటాడు. అయితే లాక్షణికులు ప్రౌఢ సాహితీవేత్తలు పోతన భాగవతం నరాంకితం ఇష్టంలేక, సర్వజ్ఞ

భూపాలుని అభ్యర్థన తిరస్కరించినట్లూ, ఆ మహారాజా కోపంతో భాగవతప్రతులను భూస్థాపితం చేసినట్లూ, ఉత్సన్న భాగాలను ఆయన శిష్యులు వెలిగందల నారయాదులు పూరించినట్లు, ఒక కథ ప్రచారంలో ఉంది.

తెలుగు భాగవతంలోని అప్రమాణిక ప్రయోగాలు పోతనగారివి కావనీ ఆయన శిష్యుల వనీ ఒక విచిత్ర వితర్కసమర్థన కూడా బయలుదేరింది. కాళ్లు కళ్లు-లేని ఈకట్టుకథ శుద్ధాబద్ధమని పలువురు పరిశోధకులు తేల్చివేశారు. పోతన లాక్షణికుల్ని సరకుసేయని స్వతంత్రప్రవృత్తి గల కవి. **"నిరంకుశాః కవయః"** కవులు నిరంకుశు లనే లోకోక్తికి పోతన నిర్వికల్ప నిదర్శనం. పోతన వహించిన "సహజపాండిత్య" బిరుదమే పై విషయం ఋజువు చేస్తుంది.

పోతన **"పుట్టుకవి"**. కవిత పోతనకు ఆజన్మసిద్ధంగా లభించిన వరప్రసాదంగా భావించే భక్తు లున్నారు. పోతనయే "పలికించెడివాడు రామభద్రుండట!" అని తనకవిత దైవదత్తమని సవినయంగా భావించుకొనుచున్నట్లు సూచించాడు. లలితకళలు అన్నీ దైవదత్తవరాలు లేదా ప్రకృతి సిద్ధమైన ప్రజ్ఞలు అనే చెప్పాలి. పరిశ్రమవల్ల పాండిత్యం సిద్ధించవచ్చు గాని కవిత, సంగీతం, చిత్రలేఖనం, శిల్పంలో అభినివేశం అలవడదు. అందుచే పోతన సహజపాండిత్య సంశోభితుడైన ఆ జన్మ కవి యని నిస్సందేహంగా చెప్పవచ్చు.

కవితకు, ఛందస్సుకు గల అవినాభావసంబంధం ఆలంకారిక జగత్పితామహుడైన భరతముని గుర్తించి **"ఛందోహీనమైన శబ్దమే లేదని"** వక్కాణించాడు. ప్రపంచభాష లన్నింటిలో ప్రాచీనకాలంనుంచి ఛందస్సుకు విశిష్టమైన స్థానం ఉంటుంది. తెలుగు కవితాగానానికి యతిప్రాసలు మృదంగ వ్యాపారం నిర్వర్తించడం సహృదయులకు అనుభవామ్రేడితం. "దేశభాషలందు తెలుగు లెస్స"అను కీర్తిలో తెనుగు ఛందస్సుకు చెందవలసిన పాలు ఎక్కువ.

**శ్రవణ సుభగ మైన ఛందోనియతి గల్గి, యతులు గలిగి ప్రాసగతులు గలిగి**
**తీపి లయలు గలిగి తెలుగులో పద్యాలు, హొయలు గలిగి యెడద లూప గలవు !**

విశ్వసాహితీ జగత్తులో ఛందోమాధుర్యం తెలుగు పద్యశిల్పంలో పరాకాష్ఠ పొందినట్లు భావిస్తే తెలుగు పద్యశిల్పం పోతన కవితలో విరాట్ స్వరూపం ధరించి సాక్షాత్కరించింది అని చెప్పవచ్చు. అసలు క్రాంతదర్శియైన కవిభావన-సంపూర్ణంగా స్వయంవ్యక్తం చేసే శక్తి ప్రపంచంలో ఏ భాషకూ లేదనే చెప్పక తప్పదు. శబ్దాలకు గల అర్థం పరిమిత మైంది. కవి భావన అవాఙ్మనన గోచర మైనట్టిది. అయితే వర్ణనాతీతమైన అనుభూతిని మాటలలో చెప్పడమే కవితాకళలోని ఒక విచిత్ర విరోధాభాసం. అందుచేత ప్రపంచంలో ఎల్లెడల కవులు పరిమితశక్తి గల భాషకు ఛందస్సు అలంకారాదులు జోడించి కృతకృత్యులు కావాలని యథాశక్తి ప్రయత్నాలు చేస్తారు. అందుచేత మహాకవితలో భాష, భాషకు అతీతములైన అలంకారములూ, అలంకార సామగ్రికి అతీతమైన ఛందస్సు, ఛందస్సుకు అతీతమైన నాదబిందు కళోపాసనా సూక్ష్మదృష్టికి అభివ్యక్తాలు. అందుచేత పోతన ఛందస్సుతో మాత్రం తృప్తి చెందక స్వచ్ఛందంగా కోరికోరి మఱికొన్ని విధినిషేధాలు తన రచనలో ఏర్చి కూర్చుకున్నాడు.

పోతన **'భాగవతము తెలిసి పలుకుట చిత్రమ్ము, శూలికైన తమ్మిచూలికైన'**

అన్నపుడు అందు శబ్దాలంకారాలకు అతీతమైన ఛందస్సు-ఛందస్సుకు అతీతమైన నాదబిందుకళోపాసనా అంతర్లీనంగా అనిర్వచనీయమైన రసప్రతీతికి హేతుభూతం కావడం వేత్తలకు అనారూఢవిషయం కాదు. అట్లే **"హారికి నంద గోకులవిహారికి.......దైత్యసంహారికి............మనోహారికి"** అన్నప్పుడు పోతన నాదబిందు కళోపాసన అనుప్రాసాలంకార పరిమిత మైందికాదు. **"పూరించెన్ హరి పాంచజన్యము"** అని పోతన పద్యం ఒత్తితే వక్ష్యమాణ సంస్కృత సమాస గాంభీర్యం సహస్ర శంఖారావసార సదృశంగా సహృదయుడికి విన్పిస్తుంది. కన్నతల్లిపై వ్రాసిన పద్యం నిదర్శనప్రాయం. పోతన తన తల్లికి, **''మానినులీడురారు......దీనమానసగ్లానికి.......గభీరతాస్థానికి........ నయవాగ్భవానికి.......బమ్మెర కేతయ లక్కసానికిన్''** అని అంటాడు. వాచామగోచరమైన, వర్ణనాతీతమైన ఆ పవిత్రమాతృమూర్తి వ్యక్తిత్వం మాటలకు అతీత మైనది. ఏదో యీ పుడమికవ్వలి వెలుగులు సంతరించుకున్న పవిత్రత పాత్రత ఆ యిల్లాలి వ్యక్తిత్వంలో గిజిగాని గూడువలె అల్లిబిల్లిగ అల్లుకొని ఊగుతూ, సహృదయుల హృదయాలు ఉఱ్ఱూత లూగించ గలవు. అది ఇంద్రజాల మహేంద్రజాలాలను మించి కవితాకళ ప్రయోగించ గల భువన సమ్మోహనాస్త్రం. పోతన అక్షయ సమ్మోహనాస్త్ర తూణీరుడు.

ఉదాహరణకు వామన చరిత్ర ఘట్టం. ఒక మరుగుజ్జు వటువు త్రివిక్రముడై మూడులోకాలు అతిక్రమించి ఎదిగిపోయాడు. ఏ కవి ఏ భాషలో వర్ణనాతీతమైన ఆ అత్యద్భుత సన్నివేశం అభివర్ణించగలడు? వామనమైన భాషకు త్రివిక్రమత్వం చేకూర్చగల సామర్థ్యం-ఛందస్సుకు, అలంకారములకు అతీత మైన నాదబిందు కళోపాసనకు ఉంటుంది.

**"ఇంతింతై! వటుఁ డింతయై మఱియుఁ దానింతై ! నభోవీథిపై**
**నంతై ! తోయదమండలాగ్రమున కల్లంతై ! ప్రభారాశిపై**
**నంతై ! చంద్రుని కంతయై ధ్రువునిపై నంతై! మహర్వాటిపై**
**నంతై ! సత్యపదోన్నతుం డగుచు బ్రహ్మాండాంతసంవర్ధియై !!** **భాగవతం-8-622**

ఈ పద్యం చదవిన సాహితీ ప్రియంభావుకుడు సద్యఃపరనిర్వృతి చెంది "అహా! మనోనేత్రనిర్వాణం" అని రసానందపారవశ్యంలో లీన మవుతాడు అంతే.

పోతన కవితకు విశిష్టత చేకూర్చునది అతని భాగవత భాషాశైలి. ఏ భాషలోనైన కవిత యుగళకళ. సాహిత్యం వాగర్థాల సమ్మేళనం. కాళిదాసమహాకవి పరమేశ్వరప్రార్థన వాగర్థాల అవినాభావ సమ్మేళనాన్ని హృదయంగమంగా అభివ్యక్తం చేస్తోంది.

**వాగర్థా వివ సంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే ।**
**జగతః పితరౌ వందే పార్వతీపరమేశ్వరౌ ॥** **రఘు.1-1**

పరమేశ్వరుడు క్షుధార్తునకు అన్నరూపంలోనే సాక్షాత్కరిస్తాడు అన్నాడు గాంధీమహాత్ముడు. జగదేకగాయకుడైన త్యాగరాజు దృష్టిలో భగవంతుడు నాదబిందు కళాస్వరూపుడు. వసుధైక కవియైన కాళిదాసు పార్వతీపరమేశ్వరుల అవినాభావ సమ్మేళనం, కవితాకళలోని వాగర్థాల సాయుజ్యం వంటిది అని ప్రస్తుతించాడు. కవితా = భావం + భాష. అయితే కవితకు భాష శరీరం; భావం ప్రాణం. ప్రాణంలేని శరీరం శవం.

శరీరంలేని ప్రాణం దయ్యం. ప్రపంచంలోని ఏ భాషలోనైన కవులు బహుళంగా భాషమీదనో భావం మీదనో కొంత "మొగ్గు" చూపించినవారలే. అయితే "సమఃపూర్ణ తుల్యేవ స్యాత్" అన్నట్లు భాష-భావములకు సమాన ప్రతిపత్తి నిచ్చిన మహాకవులు విశ్వసాహితీజగత్తులో వ్రేళ్లపై లెక్కపెట్టదగినవారే. అందులో తెలుగు కవిత, యుగళకళలో అంతర్లీనమైన యుగళకళ. భాష- భావములకే గాక తెలుగులో భాషను సంస్కృతపదాలుగా తెలుగుపదాలుగ విభజింపవలసి యుంటుంది. తెలుగుభాష అనగానే అందులో సంస్కృతపదాలు విధిగా ఉంటాయి. "అచ్చతెలుగు" నామమాత్రమైనదే. యథార్థమునకు అచ్చతెలుగు కబ్బము మిక్కిలి కృతకమైనది అనే విషయం వేత్తలకు అనారూఢ విషయం కాదు. పోతన మహాకవి సంస్కృత తెలుగు పదాలకు సరితూకం వేసి అపశ్రుతి లేని సాయుజ్యం కల్పించి ప్రయోగించాడు.

**కొందరకు తెనుఁగు గుణమగు, కొందరకును సంస్కృతంబు గుణమగు రెండుం**
**గొందరకు గుణములగు నే, నందఱ మెప్పింతుఁ గృతుల నయ్యైయెడలన్. 1-20**

అన్నాడు పోతన.

పోతనకవితలో తెలుగు నుడికారవు సొంపులు వంపులు తామర తంపరలు. సీతాదేవిని వర్ణించుచు, పోతన వ్రాసిన పద్యం ఉదాహరణ ప్రాయం.

**సిగ్గుపడుట గల్లి- సింగారమును గల్గి, భక్తి గల్గి చాల భయము గల్గి**
**నయము ప్రియము గల్గి- నరనాథుచిత్తంబు, సీత తనకు వశము చేసికొనియె. (భాగ - 9-337)**

పోతన, అలతి అలతి తునియలుగా కాహళ సంధించినట్లు తేట తెలుగు నానుడులు అల్లగలడు. గంభీరరీతి సుభగమైన కాదంబరీశైలిలో ప్రౌఢ సంస్కృత సమాసాలనూ ప్రయోగించ గలడు.

**'అలవైకుంఠ పురంబులో నగరిలో ఆమూలసౌధంబు దాపల'** అని అలతి అలతి తునియలతో ఆరంభించి- **'మందార వనాంతరామృతసరః ప్రాంతేందు కాంతోపలోత్పల పర్యంకరమావినోది'** అని సుదీర్ఘ సంస్కృత సమాసం విసరగలడు పోతన. **'ఇందు గలఁ డందు లేడని'** అనగలడు. **'కలఁడు కలండనెడు వాఁడు కలఁడో లేఁడో'** అనగలడు. తెలుగుపదాలకు సంస్కృతశబ్దాలకు అందరూ తపస్సు చేయక తప్పదు. వ్యాకరణం వైరిసమాసాలను నిషేధించి ఈ తల నొప్పి కొంత తప్పించుకో జూచింది. కాని ఇది వ్యాకరణపరిధిని దాటిన సమస్య. ఈ సారస్వతయోగసాధన పోతన భాగవతంలో సర్వత్ర సాక్షాత్కరిస్తుంది. ఉదాహరణకు ఒక పద్యం.

**'పాదద్వంద్వము నేల మోపి, పవనున్ బంధించి' పంచేంద్రియో**
**న్మాదంబున్ బరిమార్చి, బుద్ధిలతకున్ మారాకు హత్తించి ని**
**ష్ఖేద బ్రహ్మపదావలంబనగతిన్ గ్రీడించు యోగీంద్రు మ**
**ర్యాదన్ నక్రము విక్రమించె కరిపాదాక్రాంత నిర్వక్రమై'**

'కవిత వేరు- కవిజీవితం వేరు' - అని వాదించేవారు కొందరు ఉన్నారు. కాని, కవికీ కావ్యానికీ బింబ ప్రతిబింబభావం నిసర్గం. కవి అంతరాత్మ ధరించే విరాట్ స్వరూపమే కావ్యం. కవి బ్రదుకు వేరై, కవిత్వం వేరైతే అనిర్వచనీయమైన అపశ్రుతి ఏదో ఆ మధ్యలో విన్పిస్తుంది. సత్య హరిశ్చంద్రుని గాథ వ్రాసే కవి నిజజీవితంలో సత్యసంధుడు కాకపోవచ్చు. బుద్ధభగవానుని జీవితచరిత్ర చిత్రించే రచయిత దయార్ద్ర హృదయుడు

కాక పోవచ్చు. అదృష్టవశాత్తు కవికీ, కవివ్రాసిన కావ్యానికీ అభేదాధ్యవసాయం సిద్ధిస్తే ఎంత బాగుంటుంది? భాగవతం వ్రాసిన పోతన నిజజీవితంలో పరమ భాగవతోత్తముడు. నిరుపేదగా పర్ణశాలలో నివసించి- కృషీవలుడైన కర్మయోగిగా, పొలము దున్నుకొని బ్రదికిన రైతుబిడ్డ. భాగవతకవిగా తాను అందించిన సందేశాన్ని ఆచరించి లోకానికి చూపిన మహానుభావుడు పోతన కవిమాత్రుడే గాక త్రికరణశుద్ధి గల అనుష్ఠానవేదాంతి. సత్ప్రవర్తన సాహితీ ప్రతిభ జీవితములో గంగా యమునల వలె సంగమించుటచేత అతడు ఆంధ్రవాఙ్మయాకాశంపై ధ్రువతారవలె వెలుగొందుచున్నాడు. పోతన పద్యాలు రసగుళికలు.

పోతన భాగవతంలో ప్రజానురంజకములైన పద్యాలు మాత్రమే గాక, గంభీర వేదాంత దర్శనాత్మకములైన గద్యపద్యాలు ఎన్నో ఉన్నాయి. ఈ దృష్టితో పరిశీలిస్తే, సంస్కృతభాగవతముకంటె గూడ తెలుగు భాగవతం కొన్నిచోట్ల క్లిష్టతరం అని చెప్పవచ్చు. ఏలన, పోతన సంస్కృతభాగవతాన్ని మాత్రమే గాక యెడనెడ శ్రీధర వ్యాఖ్యానాన్ని గూడ తెనిగించాడు! ఈ ఘట్టాలు సాధారణ పఠితలకు కొరుకుడు పడవు. అంతేగాక అశేషప్రజానీకం నాలుకలపై నర్తించే పద్యాలు మందార మకరందమాధుర్య ధురీణములైన వాటిల్లో కూడ సులభసాధ్యం కాని శబ్దాలు దొరలటం కద్దు. అందుచేత, అక్షరాస్యులైన ఆంధ్రప్రజానీకానికి అందరకు అందుబాటులో ఉండేటట్లు, ప్రాథమిక విద్యాభ్యాసం చేసిన చదువరులకు అర్థమయ్యేటట్లు పోతన భాగవతం లోని పద్యాలకు తాత్పర్యం ప్రచురిస్తే బాగుంటుంది అనిపించింది. ఇంటింట పోతన భాగవతం వంటిది ఈ ప్రణాళిక. పన్నెండు స్కంధాలు- తొమ్మిది వేల గద్యపద్యాలు తాత్పర్య సహితంగా ప్రచురించే ప్రణాళికకు ఎంతటి వ్యయప్రయాసలు, మరెంతటి సాహితీ తపోదీక్ష అవసరం? వివిధ స్కంధాలకు తాత్పర్యం వ్రాయటానికి విద్వాంసులను ఎన్నుకోవటం జరిగింది.

ఇది ప్రథమస్కంధం. ఈ ప్రథమస్కంధ తాత్పర్య రచయిత, సుప్రసిద్ధ కవివరేణ్యులు శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు. శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారికి పోతన కవితపైగల ప్రీతి జగద్విదితం. తన అభిమాన కవియైన పోతన పద్యాలకు శ్రీ శాస్త్రిగారు వ్రాసిన తాత్పర్యం సరళ సుందర సుకుమారంగా సహృదయ హృదయంగమంగా వెల్లివిరిసింది.

ఈ ప్రథమస్కంధ ముద్రణలో ప్రత్యేక శ్రద్ధ వహించిన శ్రీ విజయకుమార్ రెడ్డి గారికి- నా సుహృదభినందనలు. వారితోపాటు ప్రెస్సు కార్మికులు అందించిన సహకారము ఉగ్గడింప దగినది. శ్రీమాన్ బహుజనపల్లి శేషాచార్యులవారి పరిశ్రమ ఎన్నదగినది. అందరకు నా నమోవాకములు.

ఈ ప్రచురణ ప్రజానురంజకం కాగలదని మా ఆశ.

**తిరుపతి** **నండూరి రామకృష్ణమాచార్య**

14-1-1962 సంపాదకుడు, పుస్తక ప్రచురణ విభాగము,

తి.తి. దేవస్థానములు

# విషయసూచిక

## మొదటి స్కంధము (1-149)

## రెండవ స్కంధము (150-248)



## మూఁడవ స్కంధము (249-536)

శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః

# పోతన భాగవతము

## (సరళ గద్యానువాద సహితము)

## మొదటి స్కంధము

**శ్రీ కైవల్య పదంబుఁ జేరుటకునై చింతించెదన్, లోక ర**
**క్షైకారంభకు, భక్త పాలన కళా సంరంభకున్, దానవో**
**ద్రేక స్తంభకుఁ, గేళి లోల విలసద్దృగ్జాల సంభూత నా**
**నా కంజాత భవాండ కుంభకు, మహానందాంగనా డింభకున్. 1**

---

భాగవతానికే కాదు- తెలుగు సాహిత్య సరస్వతికే మకుటాయమానమైన పద్యమిది. ఇష్టదేవతా స్తుతీ, వస్తు నిర్దేశమూ కల ఈ మనోజ్ఞవృత్తం మహాభాగవతంలోని ఇతివృత్తాని కంతా అద్దం పడుతుంది. ఈ పద్యంలో ఆరు దళాలు ఉన్నాయి. 1. శ్రీ కైవల్య పదంబు జేరుటకునై చింతించెదన్ 2. లోకరక్షైకారంభకున్ 3. భక్తపాలన కళా సంరంభకున్ 4. దానవోద్రేక స్తంభకున్ 5. కేళిలోల విలసద్ దృగ్జాల సంభూత నానా కంజాత భవాండ కుంభకున్ 6. మహానందాంగనా డింభకున్ అనేవి. భగవంతుని ప్రధాన గుణాలైన సర్వేశ్వరత్వం, ధర్మ సంస్థాపకత్వం, శిష్టరక్షణ పరాయణత్వం, దుష్ట శిక్షణ చణత్వం, విశ్వకర్తృత్వం, ఆనందమయత్వం- అనేవి ఆరు క్రమంగా పై ఆరు దళాల లోనూ ప్రస్ఫురిస్తున్నాయి.

ఇక "శ్రీ కైవల్య పదంబు జేరుటకునై చింతించెదన్" అన్న ప్రథమ దళంలో మోక్షం కోసం ఉత్కంఠితుడైన పరీక్షిత్తు వృత్తాంతంతో పాటు మొత్తం భాగవతమే ధ్వనిస్తున్నది. అలాగే ప్రథమ స్కంధంలోని నారదుడు, భీష్ముడు, కుంతీదేవి మొదలైనవారి కథలూ; తృతీయ స్కంధంలోని దేవహూతి వృత్తాంతమూ, చతుర్థ స్కంధంలోని ధ్రువ చరిత్రా స్ఫురిస్తూ భగవంతుని "సర్వేశ్వరత్వా"న్ని నిరూపిస్తున్నాయి. ఎందుకంటే కైవల్యాన్ని అనుగ్రహించే అధికారం సర్వేశ్వరునికి మాత్రమే ఉంటుంది.

"లోకరక్షైకారంభకున్" అన్న ద్వితీయదళం వల్ల హిరణ్యాక్ష హిరణ్యకశివు కంస కాల యవనాదులను (తృతీయ, సప్తమ, దశమ స్కంధాలు) సంహరించి వారి అత్యాచారాల వల్ల అస్తవ్యస్తమైన లోకాన్ని ఉద్ధరించిన భగవంతుని "ధర్మ సంస్థాపకత్వం" స్థాపించబడింది.

భక్తులను పాలించటం ఒక కళ. ఎప్పుడెప్పుడు ఆర్తులను ఆదుకుందామా అని అనుక్షణం తహతహలాడుతుంటాడు స్వామి. "భక్తపాలన కళా సంరంభకున్" అనే తృతీయ దళం వల్ల గజేంద్రుణ్ణి కాపాడటానికి మహా విష్ణువు వైకుంఠం నుంచి పరుగెత్తుకు వచ్చిన వృత్తాంతం (అష్టమ స్కంధం) ధ్వనిస్తూ భగవంతుని "శిష్ట రక్షణ పరాయణత్వాన్ని" చాటుతున్నది.

"దానవోద్రేక స్తంభకున్" అన్న చతుర్థ దళం వల్ల అష్టమ స్కంధంలోని వామనావతారం వ్యంజకమైంది. పై మన్వంతరంలో ఇంద్రుడు కావలసిన బలి, వరబలంతో ముందుగానే స్వర్గాన్ని ఆక్రమించి ఇంద్రపదం కాంక్షించాడు. ఆ దానవేంద్రుని ఉద్రేకానికి పగ్గాలు పట్టి స్తంభింపజేయటం కోసం " దుష్టశిక్షణచణు" డైన స్వామి వామనుడైనాడు.

"కేళిలోన.... కుంభకున్" అనే పంచమదళం వల్ల భగవంతుని "విశ్వకర్తృకత్వా" న్ని వెల్లడించే సూర్యవంశ చంద్రవంశాల చరిత్ర (నవమస్తంధం) స్ఫురించింది. స్వామి విలాసంగా త్రిప్పే కళ్లలో నుంచి బ్రహ్మాండాలు ఉద్భవిస్తాయి. సృష్టి జరుగుతుంది. నిజానికి స్వామికళ్లు సూర్యచంద్రులేగా!

"మహానందాంగనా డింభకున్" అన్న షష్ఠదళం కృష్ణలీలా సర్వస్వమైన దశమ స్కంధానికి ప్రతీక. ఆ నందాంగనకు ఆనందం

* అక్షర మైన మోక్ష సంపదను అపేక్షించిన నేను ఆనంద స్వరూపిణి ఐన ఆనందగోపుని ఇల్లాలి ఒడిలో అల్లారు ముద్దుగా ఆడుకుంటున్న అందాల బాలుణ్ణి ధ్యానిస్తున్నాను. ఆ యశోదా కిశోరుడు సామాన్యుడు కాడు; ఏ మాత్రం ఏమరుపాటు లేకుండా ఎల్లలోకాలనూ చల్లగా పాలిస్తూ ఉంటాడు. నిరంకుశులైన నిశాచరుల ఔద్ధత్యాన్ని నిర్మూలిస్తూ ఉంటాడు. అంతే కాదు. కన్నతల్లి ఒడిలో ఒయ్యారంగా కూర్చున్న ఆ చిన్ని కన్నయ్య ఒక్కమాటు అలా కన్నులెత్తి చూస్తే చాలు, ఎన్నెన్నో బ్రహ్మాండభాండాలు తండోపతండాలుగా ఆ చూపుల్లో రూపులు దిద్దుకుంటాయట.

**ఉ. వాలిన భక్తి మ్రొక్కెద నవారిత తాండవ కేళికిన్ దయా**
**శాలికి శూలికిన్ శిఖరిజా ముఖపద్మ మయూఖ మాలికిన్**
**బాల శశాంక మౌళికిఁ గపాలికి మన్మథ గర్వ పర్వతో**
**న్మూలికి నారదాది ముని ముఖ్య మనస్సరసీరుహాలికిన్.** 2

* కరాన ముమ్మొనవాలూ, ఉరాన పునుకల పేరూ, శిరాన నెలవంకా ధరించి లీలాతాండవలోలుడైన పరమశివునికి శిరస్సు వంచి భక్తి పురస్సరంగా ప్రణామం చేస్తున్నాను. కరుణాసాగరుడైన ఆ హరుడు కందర్ప దర్పహరుడు. పర్వత రాజపుత్రి ముఖపద్మాన్ని ప్రఫుల్లం కావించే ప్రభాకరుడు. నారదుడు మొదలైన మౌనిసత్తముల చిత్తములనే నెత్తమ్మి విరులలో విహరించే మత్తమధుకరుడు.

**ఉ. ఆతత సేవఁ జేసెద సమస్త చరాచర భూత సృష్టి వి**
**జ్ఞాతకు భారతీ హృదయసౌఖ్య విధాతకు వేద రాశి ని**
**ర్ణేతకు దేవతా నికర నేతకుఁ గల్మషజేతకున్ నత**
**త్రాతకు ధాతకున్ నిఖిల తాపస లోక శుభ ప్రదాతకున్.** 3

* చరాచర ప్రపంచాన్నంతా చక్కగా సృష్టింప నేర్చినవాడూ, సరస్వతీదేవి స్వాంతానికి సంతోషం చేకూర్చినవాడూ, వేదాల నన్నింటినీ సమర్థంగా సమకూర్చినవాడూ, నాయకుడై బృందారక బృందాన్ని దిద్ది తీర్చినవాడూ, భక్తుల పాపాలను పోకార్చిన వాడూ, దీన జనులను ఓదార్చినవాడూ, తపోధను లందరికీ శుభాలు ఒనగూర్చినవాడూ ఐన మహానుభావుణ్ణి బ్రహ్మ దేవుణ్ణి నేను శ్రద్ధాభక్తులతో సంసేవిస్తున్నాను.

**వ. అని నిఖిల భువన ప్రధాన దేవతా వందనంబు సేసి.** 4

* ఈ విధంగా సకలలోక చక్రవర్తులైన ముగ్గురు మూర్తులకూ చేతులొగ్గి నమస్కారం చేసిన అనంతరం-

---

అందిస్తూ ఆనందం అనుభవిస్తున్న "ఆనందమయుడు" కదా ఆ నందనందనుడు.

ఈ విధంగా భాగవతంలోని స్కంధాలలోని కథలన్నిటినీ ధ్వనింపజేస్తున్న ఈ పద్యం సహజపాండిత్యుని సహజ పాండిత్యానికి చక్కని ఉదాహరణం. ఆంధ్ర సాహిత్యంలో ఇంతటి హృద్యమైన పద్యం "న భూతో న భవిష్యతి."

ఉ. ఆదర మొప్ప మ్రొక్కిడుదు నద్రిసుతా హృదయానురాగ సం
పాదికి దోషభేదికిఁ బ్రపన్న వినోదికి విఘ్నవల్లికా
చ్ఛేదికి మంజువాదికి నశేష జగజ్జన నంద వేదికిన్
మోదకఖాదికిన్ సమద మూషక సాదికి సుప్రసాదికిన్. 5

* హిమాచల కుమారి అయిన ఉమాదేవి మనస్సులోని అనురాగ సంపదను సంపాదించి, కలి కల్మషాలను భేదించి, ఆపన్నుల విన్నపాలను ఆమోదించి, ఆశ్రితుల విఘ్నలతలను ఛేదించి, మంజుల మధుర భాషణాలతో అశేష భక్తులకూ విశేష సంతోషాన్ని ప్రసాదించి, నివేదించిన కుడుములూ ఉండ్రాళ్లూ కడుపునిండా ఆరగించి మూషకరాజును అధిరోహించి, ముల్లోకాలకూ మోదప్రదాయకుడైన వినాయకునకు కై మోడ్పులు ఘటిస్తాను.

ఉ. క్షోణితలంబునన్ నుదురు సోఁకఁగ మ్రొక్కి నుతింతు సైకత
శ్రోణికిఁ జంచరీక చయ సుందరవేణికి రక్షితామర
శ్రేణికిఁ దోయజాతభవ చిత్త వశీకరణైక వాణికిన్
వాణికి నక్షదామ శుక వారిజ పుస్తక రమ్య పాణికిన్. 6

* నేలకు నెన్నుదురు సోకునట్లు సాగిలపడి మ్రొక్కి సైకత శ్రోణీ, చదువులవాణీ, అలినీలవేణీ అయిన వాణిని సన్నుతిస్తాను. ఆ చల్లని తల్లి ఒక చేతిలో అక్షమాలనూ, మరొకచేతిలో రాచిలుకనూ, ఇంకొకచేతిలో తామర పువ్వునూ, వేరొకచేతిలో పుస్తకాన్నీ ముచ్చటగా ధరిస్తుంది. సుధలు వర్షించే తన సుందర సుకుమార సూక్తులతో అరవిందభవుని అంతరంగాన్ని ఆకర్షిస్తుంది. తన కటాక్ష వీక్షణాలతో సుర నికరాన్ని కనికరిస్తుంది.

శా. పుట్టం బుట్ట శిరంబునన్ మొలవ, నంభోయానపాత్రంబునన్
నెట్టం గల్గను, గాళిఁ గొల్వను, బురాణింపన్ దొరంకొంటి మీఁ
దెట్టే వెంటఁ జరింతు దత్సరణి నా కీవమ్మ! యో యమ్మ! మేల్
పట్టున్ నాకగుమమ్మ! నమ్మితిఁ జుమీ బ్రాహ్మీ! దయాంభోనిధీ! 7

*అమ్మా సరస్వతీ! నేను శిరస్సుపై పుట్ట పెరిగిన ఆదికవి వాల్మీకిగా పుట్టలేదు. పడవలో ప్రభవించిన వ్యాసుడను కాను. కవికులతిలకుడైన కాళిదాసుడనూ కానమ్మా! అయినా తగుదు నమ్మా అని పురాణాన్ని తెలిగించటానికి పూనుకున్నాను. ఎం చెయ్యాలో, ఏమీ తోచటం లేదు. ఇటువంటి సమయంలో ఎటువంటి మార్గం అవసరమో అది నీవే నాకు అనుగ్రహించి నా చేయి పట్టుకొని నడిపించు, ముమ్మాటికి నిన్నే నమ్ముకున్నాను తల్లీ! నీవే నాకు ఆధారం. నాకు తెలుసు తల్లీ! నీ కరుణ అపార పారావారం.

ఉ. శారదనీరదేందు ఘనసార పటీర మరాళ మల్లికా
హార తుషార ఫేన రజతాచల కాశ ఫణీశ కుంద మం

**దార సుధాపయోధి సితతామర సామర వాహినీ శుభా**
**కారత నొప్పు నిన్ను మదిఁ గానఁగ నెన్నడు గల్గు భారతీ!** 8

* తల్లీ! భారతీ! తెల్లని కాంతులు వెల్లివిరసే శరన్మేఘకదంబమూ, శారదచంద్రబింబమూ. పచ్చకర్పూరమూ, పటీరమూ, రాజహంసలూ, జాజిచెండ్లూ, నీహారమూ, డిండీరమూ, వెండికొండా, రెల్లుపూలూ, ఆదిశేషుడూ, మల్లెలూ, మందారాలూ, పాలసముద్రమూ, పూచిన పుండరీకాలు, ఆకాశగంగా- ఇవన్నీ నీ శుభాకారానికి ఉజ్జ్వలమైన ఉపమానాలు, అటువంటి స్వచ్ఛ ధవళ సుందరమూర్తివైన నిన్ను కన్నులారా మనసుదీరా ఎన్నడు దర్శింపగలుగుతానో గదా!

**ఉ. అంబ, నవాంబుజోజ్జ్వలకరాంబుజ, శారదచంద్రచంద్రి కా**
**డంబర చారుమూర్తి, ప్రకట స్ఫుట భూషణ రత్నదీపికా**
**చుంబిత దిగ్విభాగ, శ్రుతిసూక్తి వివిక్త నిజప్రభావ, భా**
**వాంబరవీథి విశ్రుత విహారిణి, నన్ గృపఁజూడు భారతీ!** 9

* అమ్మా! భారతీదేవీ! వికాసప్రకాశాలకు ప్రతీకగా విచ్చుతూ విచ్చుతూ ఉన్న కమలాన్ని కరకమలంలో ధరించిన దానవై, శరచ్చంద్ర చంద్రికానురూపమైన స్వరూపంతో, అలంకరించుకొన్న ఆభరణాల మణిదీప్తులు దిగ్ దిగంతాలను వెలిగింపగా, పవిత్ర వేదసూక్తులు నీ ప్రభావాన్ని వెల్లడింపగా, భక్తకవుల భావాంబర వీథులలో స్వేచ్ఛగా విహరించే బంగారుతల్లీ! నీ కృపారసపు జల్లులు నా మీద చల్లి నన్ను కృతార్థుణ్ణి కావించు.

**ఉ. అమ్మల గన్నయమ్మ, ముగురమ్మల మూలపుటమ్మ, చాలఁ బె**
**ద్దమ్మ, సురారులమ్మ కడు పాఱడి వుచ్చిన యమ్మ, దన్ను లో**
**నమ్మిన వేల్పుటమ్మల మనమ్ముల నుండెడి యమ్మ, దుర్గ, మా**
**యమ్మ, కృపాబ్ధి యిచ్చుత మహత్త్వ కవిత్వ పటుత్వ సంపదల్.** 10

* ఆమె అమ్మలందరికీ అమ్మ. ముల్లోకాలకు మూలమైన ముగ్గురమ్మలకూ మూలమైన అమ్మ. అందరమ్మల కన్నా అధికురాలైన అమ్మ. ముక్కిడులైన రక్కసిమూకలను ఉక్కడగించిన అమ్మ. నమ్ముకొన్న వేల్పుటమ్మల నిండుగుండెలలో నివసించే అమ్మ. దయాపయోనిధియైన మాయమ్మ దుర్గాభవాని మహత్త్వ కవిత్వ పటుత్వ సంపదలను నాకు ప్రసాదించాలి.

**మ. హరికిం బట్టపుదేవి, పున్నెముల ప్రో, వర్థంపుఁ బెన్నిక్క, చం**
**దురు తోఁబుట్టువు, భారతీ గిరిసుతల్ తో నాడు పూఁ బోఁడి, తా**
**మరలం దుండెడి ముద్దరాలు, జగముల్ మన్నించు నిల్లాలు, భా**
**సురతన్ లేములు వాపు తల్లి, సిరి యిచ్చున్ నిత్యకల్యాణముల్.** 11

---

(పై 9,10 పద్యాలు కొన్ని వ్రాతప్రతులలో లేవు. 9 వ పద్యం ఎఱ్ఱన భారతం లోనిది)

* శ్రీదేవి దేవాది దేవుడైన వాసుదేవునకు పట్టపుదేవి. పుణ్యాల దీవి. సిరిసంపదల పెన్నిధి. రేరాజుకు గారాబు చెల్లెలు. వాణితో శర్వాణితో కూడి క్రీడించే పూబోణి. అరవింద మందిరయైన జవరాలు. అఖిల లోకాలకూ ఆరాధ్యురాలైన ఇల్లాలు. కాంతులీనే ఒక్క కటాక్షవీక్షణంతో భక్తుల దారిద్ర్యాన్ని పటాపంచలు కావించే బంగారు తల్లి శ్రీమహాలక్ష్మి మాకు నిత్యకల్యాణాలు అనుగ్రహించాలి.

**వ. అని యిష్టదేవతలం జింతించి దినకర కుమార ప్రముఖులం దలంచి ప్రథమ కవితా విరచన విద్యావిలాసాతిరేకి వాల్మీకి నుతియించి, హయగ్రీవ దనుజకర పరిమిళిత నిగమ నివహ విభాగ నిర్ణయ నిపుణతా సముల్లాసునకు వ్యాసునకు మ్రొక్కి, శ్రీమహాభాగవత కథా సుధారస ప్రయోగికి శుకయోగికి నమస్కరించి; మృదు మధుర వచన రచన పల్లవిత స్థాణునకున్ బాణునకుం బ్రణమిల్లి, కతిపయ శ్లోకసమ్మోదితసూరు మయూరు నభినందించి, మహా కావ్యకరణ కళా విలాసుం గాళిదాసుం గొనియాడి, కవికమలవిసరరవిన్ భారవిన్ బొగడి విదళితాఘు మాఘు వినుతించి, యాంధ్ర కవితాగౌరవ జనమనోహరి నన్నయ సూరిం గై వారంబు సేసి, హరిహర చరణారవింద వందనాభిలాషిం దిక్కమనీషిన్ భూషించి, మఱియు నితర పూర్వ కవిజన సంభావనంబు గావించి, వర్తమాన కవులకుం బ్రియంబు పలికి, భావికవుల బహూకరించి, యుభయ కావ్య కరణ దక్షుండనై. 12**

* ఈ విధంగా ఇష్టదేవత లందరినీ స్మరిస్తున్నాను. సూర్యభగవానునీ కుమారస్వామినీ భావిస్తున్నాను. మొదట కవితాసరస్వతి విలాస విన్యాసాలను వెలయింపజేసిన వాల్మీకుల వారికి వందనం చేస్తున్నాను. చిక్కుపడిన వేదసమూహాన్ని మొక్కపోని ఓర్పుతో, నేర్పుతో చక్కదిద్దిన వ్యాసులవారికి దోసిలొగ్గుతున్నాను. శ్రీ మహాభాగవతకథ అనే సుధారసాన్ని పంచి పెట్టిన శుకయోగికి తలవంచి నమస్కరిస్తున్నాను. అనంతరం తన మెత్తనైన తియ్యనైన పలుకుల కులుకులతో శిలల్ని సైతం చిగురింపజేసిన బాణకవికి ప్రణామం చేస్తున్నాను. ఎన్నదగిన కొన్ని శ్లోకాలతోనే భగవానుడైన భాస్కరుణ్ణి ప్రసన్నుణ్ణి చేసికొన్న మయూరకవిని అభినందిస్తున్నాను. మహాకావ్యాలను నిర్మించే కళలో ఆరితేరిన కాళిదాస కవి చంద్రుణ్ణి కైవారం చేస్తున్నాను. కవుల హృదయ కమలాలను వికసింపజేయటంలో రవి వంటివాడైన భారవిని స్తవం చేస్తున్నాను. నిర్దుష్టమైన కవితకు పేరెన్నిక గన్న మాఘకవిని శ్లాఘిస్తున్నాను. అనంతరం తెలుగు కవితను వెలయింపజేసి అందరి హృదయాలను దోచుకున్న నన్నయ భట్టారకుని సన్నుతించి, హరిహరనాథుని చరణారవిందాలకు ఆనందాతిశయంతో మ్రొక్కుతున్న తిక్కనార్యుణ్ణి కొనియాడి, తక్కిన పూర్వకవులందరినీ మనసారా భావించి సంభావిస్తున్నాను. ఈనాటి కవులందరినీ అభినందించి, ముందు రాబోయే కవులందరికీ శుభం పలికి, ఉభయ భాషల్లో గద్యపద్యాత్మకాలైన కావ్యాలు రచించే నైపుణ్యం అలవర్చుకున్నాను.

## -: కృతిపతి నిర్ణయము :-

**ఉ. ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు వాహనంబులున్**
**సొమ్ములుఁ గొన్ని పుచ్చుకొని, చొక్కి, శరీరము వాసి, కాలుచే**

**సమ్మెట వ్రేటులం బడక సమ్మతి శ్రీహరి కిచ్చి చెప్పె నీ**
**బమ్మెర పోతరా జొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్.** 13

* విశ్వశ్రేయస్సును దృష్టిలో పెట్టుకొని విరచించిన భాగవతాన్ని భగవంతునికి తప్ప ఈ చిల్లర మల్లర ప్రభువులకు అంకిత మివ్వటానికి నా అంతరంగం అంగీకరించటం లేదు. ఎందుకంటే ఈ రాజులిచ్చే అగ్రహారాలూ, హారాలూ, వస్తు వాహనాలూ పుచ్చుకొని ఆ మైకంలో మైమరచి,ఈ లోకంలో సుఖం అనుభవించినా, ఆ లోకంలో అడుగు పెట్టిన పిమ్మట పూర్వం చేసిన తప్పిదాలకు యమధర్మరాజు చేతిలో సమ్మెటపోట్లు తప్పవు, అందుకే ఈ బమ్మెర పోతరాజు చక్కగా ఆలోచించి ఈ భాగవత మహాగ్రంథాన్ని భగవంతుడైన శ్రీహరికే సమర్పించటానికి నిశ్చయించుకున్నాడు.

**తే. చేతులారంగ శివునిఁ బూజింపఁడేని, నోరు నొవ్వంగ హరికీర్తి నుడువఁడేని**
**దయయు సత్యంబు లోనుగాఁ దలఁపఁడేనిఁ, గలుగ నేటికిఁ దల్లుల కడుపుఁ జేటు.** 14

* ఈ జగత్తులో జన్మించిన ప్రతి ఒక్కడు చేతులారా శివుణ్ణి పూజించి, నోరారా కేశవుణ్ణి కీర్తించి, సత్యమూ కరుణా మొదలైన సద్గుణాలను అలవర్చుకోవాలి. అలా చేయని నిర్భాగ్యుడు ఈ లోకంలో పుట్టటం దేనికి? తల్లి కడుపు చెడగొట్టటం దేనికి?

**వ. అని మఱియు మదీయ పూర్వజన్మ సహస్ర సంచిత తపఃఫలంబున శ్రీ మన్నారాయణకథా ప్రపంచ విరచనా కుతూహలుండనై యొక్క రాకానిశాకాలంబున సోమోపరాగంబు రాకఁగని సజ్జనానుమతంబున నభ్రంకష శుభ్ర సముత్తుంగ భంగ యగు గంగకుం జని క్రుంకులిడి వెడలి మహనీయ మంజుల పులినతలంబున మహేశ్వర ధ్యానంబు సేయుచుఁ గించిదున్మీలితలోచనుండనై యున్న యెడ.**15

* నేను ఎన్నెన్నో జన్మలెత్తి ఉంటాను. వేల కొలది జన్మల్లో కూడబెట్టుకున్న నా తపస్సు పండింది, నా హృదయంలో శ్రీమన్నారాయణదేవుని పుణ్యకథలను విస్తరించి ప్రస్తరించి రచించాలనే కుతూహలం నిండింది. అది ఒక పూర్ణిమా రాత్రి, నిండు జాబిల్లి పండు వెన్నెలలు కురుస్తున్నాడు. ఆనాడు చంద్రగ్రహణం. పెద్దల అనుజ్ఞ పొందాను. ఆకాశాన్నంటే ఉత్తుంగ తరంగాలతో పొంగి ప్రవహించే గౌతమీగంగకు వెళ్లాను. ఆ నదిలో స్నానం చేశాను. వెలుపలికి వచ్చి ఒక ఎత్తయిన తెల్లవి ఇసుక తిన్నెమీద పరమశివుణ్ణి ధ్యానిస్తూ అర్ధ నిమీలిత నేత్రాలతో కూర్చున్నాను.

**సీ. మెఱుఁగు చెంగట నున్న మేఘంబు కైవడి నువిద చెంగట నుండ నొప్పువాఁడు**
**చంద్రమండల సుధాసారంబు పోలిక ముఖమునఁ జిఱునవ్వు మొలచువాఁడు**
**వల్లీయుత తమాల వసుమతీజము భంగి బలువిల్లు మూఁపునఁ బరఁగువాఁడు**
**నీల నగాగ్ర సన్నిహిత భానుని భంగి ఘన కిరీటము దలఁ గలుగువాఁడు.**

**ఆ. పుండరీకయుగముఁ బోలు కన్నులవాఁడు, వెడఁద యురమువాఁడు, విపులభద్ర**
**మూర్తివాఁడు రాజముఖ్యుఁడొక్కరుఁడు నా, కన్నుఁగవకు నెదురఁ గానఁబడియె.** 16

* ఆ సమయంలో ఒక రాజశ్రేష్ఠుడు నా కన్నుల ముందు సాక్షాత్కరించాడు. మేఘం ప్రక్కన మెరుపులాగా ఆయన చెంగట ఒక అంగన ఉన్నది. చంద్ర మండలంలో నుంచి అమృతంలాగా ఆయన ముఖంలో మందహాసం చిందుతూ ఉంది. తమాలవృక్షాన్ని చుట్టుకొన్న తీగలాగా ఆయన భుజాగ్రాన ధనుస్సు వ్రేలాడు తున్నది. నీలగిరి శిఖరాన ప్రకాశించే భానుబింబంలాగా ఆయన శిరస్సుపై కిరీటం విరాజిల్లుతూ ఉంది. ఈ విధంగా విచ్చిన తెల్ల దామరరేకులవంటి కన్నులతో, విశాలమైన వక్షస్థలంతో, విశ్వమంగళ స్వరూపంతో, ఆ రాజశేఖరుడు నా కందోయికి విందుచేశాడు.

**వ. ఏను నా రాజశేఖరుం దేఱిచూచి భాషింప యత్నంబు సేయు నెడ నతడు దా 'రామభద్రుండ మన్నామాంకితంబుగ శ్రీమహాభాగవతంబుఁ దెనుంగు సేయుము. నీకు భవబంధంబులు దెగు'నని యాన తిచ్చి తిరోహితుండయిన సమున్మీలిత నయనుండనై వెఱఁగుపడి చిత్తంబున. 17**

* అప్పుడు నేను రాజశిరోమణిని రెప్పవాల్చకుండా చూచాను. ఏమైనా మాట్లాడుదామని ప్రయత్నిస్తున్నాను. అంతలో ఆయన "నేను రామభద్రుణ్ణి. నా పేరు మీదుగా శ్రీ మహాభాగవతాన్ని తెలుగు చెయ్యి. నీ భవబంధాలు పటాపంచలౌతాయి" అని సెలవిచ్చి అంతలోనే అంతర్ధానమైనాడు. నేను కన్నులు తెరచి చూచాను. అంతా ఆశ్చర్యంగా ఉంది. నాలో నే నిట్లా అనుకున్నాను.

**క. పలికెడిది భాగవతమఁట!, పలికించెడి వాడు రామభద్రుండఁట! నేఁ**
**బలికిన భవహర మగునఁట!, పలికెద వేఱొండు గాథ పలుకఁగ నేలా? 18**

* ఆహా! ఏమీ నా అదృష్టం. పలికేది పరమపవిత్రమైన భాగవతమా! పలికించే ప్రభువు కరుణాసముద్రుడైన రామభద్రుడా! పలికి నందువల్ల భవబంధాలు పరిహారమౌతాయా! అటువంటప్పుడు వృథాగా మరో కథ పలకటం దేనికి? భాగవతమే పలుకుతాను.

**ఆ. భాగవతము దెలిసి పలుకుట చిత్రంబు!, శూలికైనఁ దమ్మిచూలికైన!**
**విబుధజనుల వలన విన్నంత కన్నంత, దెలియ వచ్చినంత దేటపఱుతు. 19**

* అయితే చిత్రమేమంటే శివుడేకానీ, పద్మభవుడే కానీ, భాగవతాన్ని చక్కగా సమగ్రంగా తెలుసుకొని చెప్పలేరంటే ఇక నా సంగతి వేరే చెప్పాలా? అయితే పెద్దల వల్ల విన్నంతగా, వారి సన్నిధిలో నేర్చుకున్నంతగా, స్వయంగా నేను తెలుసుకున్నంతగా విషయాన్ని తేటతెల్లం చేస్తాను.

**క. కొందఱకుఁ దెనుఁగు గుణమగుఁ, గొందఱకును సంస్కృతంబు గుణమగు, రెండుం**
**గొందఱికి గుణములగు నే, నందఱ మెప్పింతుఁ గృతుల నయ్యెయెడలన్. 20**

* ఇక భాష విషయ మంటారా! కొందరు తెనుగంటే ఇష్టపడతారు. కొందరు సంస్కృతమంటే చెవి కోసుకుంటారు. మరి కొందరు తెనుగునూ సంస్కృతాన్ని సమానంగా అభిమానిస్తారు. నేను నా గ్రంథాన్ని అందరూ ఆనందించి మెచ్చుకునే విధంగా రచన సాగిస్తాను.

మ. ఒనరన్ నన్నయ తిక్కనాది కవు లీయుర్విం బురాణావళుల్
తెనుఁగుం జేయుచు మత్పురాకృత శుభాధిక్యంబు దా నెట్టిదో
తెనుఁగుం జేయరు మున్ను భాగవతమున్ దీనిం దెనింగించి నా
జననంబున్ సఫలంబుఁ జేసెదఁ బునర్జన్మంబు లేకుండఁగన్. 21

* ఇంతకు ముందు నన్నయ భట్టారకుడూ, తిక్కన సోమయాజీ మొదలైన కవులు సంస్కృతంలో ఉన్న పురాణగ్రంథాలు తెనుగు చేశారు. అయితే నా పూర్వ పుణ్యపరిపాకం ఎటువంటిదో కాని ఆ మహామహులు భారతం రామాయణం తప్ప భాగవతం జోలికి రాలేదు. బహుశః నా కోసమే ఈ భాగవతాన్ని వదిలిపెట్టారేమో! ఇంకేం కావాలి! ఈ మహాగ్రంథాన్ని తెనుగుచేసి మళ్లీ జన్మంటూ లేకుండా ఈ నా జన్మను సార్థకం చేసుకుంటాను.

 మ. లలిత స్కంధము, కృష్ణమూలము, శుకాలాపాభిరామంబు, మం
జులతాశోభితమున్, సువర్ణ సుమన స్సుజ్ఞేయమున్, సుందరో
జ్జ్వలవృత్తంబు, మహాఫలంబు, విమల వ్యాసాలవాలంబునై
వెలయున్ భాగవతాఖ్య కల్పతరు వుర్విన్ సద్విజ శ్రేయమై. 22

* ఈ భాగవతం సాక్షాత్తూ కల్పవృక్షమే! సందేహం లేదు. ఏమంటే లలితములైన స్కంధములు గలది భాగవతం; సుందరమైన బోదె కలది కల్పవృక్షం. కృష్ణుడే మూలాధారంగా కలది భాగవతం; నల్లని వేళ్లు కలది కల్పవృక్షం, శుకమహర్షి ఆలాపాలతో మనోహరమైనది భాగవతం; చిలుక పలుకులతో రమణీయమైనది కల్పవృక్షం. సౌందర్యంతో సంశోభితమైనది భాగవతం; సుందరమైన లతలతో శోభిల్లేది కల్పవృక్షం. చదువుకున్న సహృదయులకు చక్కగా తెలుసుకోదగింది భాగవతం; మంచి రంగుగల పువ్వులతో గ్రహింపదగింది కల్పవృక్షం. సుందరమూ ఉజ్జ్వలమూ అయిన ఇతివృత్తం గలది భాగవతం; సుందరమూ ఉజ్జ్వలమూ అయిన గుండ్రని ఆకారం గలది కల్పవృక్షం. కైవల్య రూపమైన గొప్ప ప్రయోజనంతో కూడింది భాగవతం; పెద్ద పెద్ద పండ్లతో కూడింది కల్పవృక్షం. పవిత్రుడైన వ్యాసులవారే ఆధారంగా గలది భాగవతం; స్వచ్ఛమైన వ్యాసంతో కూడిన పాదు గలది కల్పవృక్షం. ఉత్తములైన ద్విజులకు శ్రేయోదాయకమైనది భాగవతం; శుక పిక శారికాది పక్షులకు శ్రేయస్కరమైనది కల్పవృక్షం. అయితే ఆ కల్పవృక్షం స్వర్గలోకంలో ఉంటుంది; భాగవతమనే కల్పవృక్షం ఈ భూలోకములోనే విరాజిల్లటం విశేషం.

వ. ఇట్లు భాసిల్లెడు శ్రీమహాభాగవతపురాణ పారిజాత పాదపసమాశ్రయంబునను, హరికరుణా విశేషంబునను, గృతార్థత్వంబు సిద్ధించెనని బుద్ధి నెఱింగి లేచి మరలి కొన్ని దినంబులకు నేక శిలానగరంబునకుం జనుదెంచి యందు గురువృద్ధ బుధబంధు జనానుజ్ఞాతుండనై. 23

* ఈ ప్రకారంగా ప్రకాశమానమైన భాగవత మహాపురాణమనే పారిజాతమహీజాన్ని సమాశ్రయించటం మూలాన, శ్రీహరి విశేషంగా అనుగ్రహించటం మూలాన నా జన్మ చరితార్థమైన దన్న సంగతి చక్కగా అర్థం

చేసుకున్న నేను ఆ నదీ ప్రదేశం నుంచి కదలి కొన్నాళ్ళకు ఏకశిలా నగరానికి తిరిగివచ్చాను, అక్కడ గురువులూ, వృద్ధులూ, పండితులూ, బంధువులూ మొదలైన పెద్దల అనుజ్ఞ అందుకున్నాను.

## - : గ్రంథకర్తృ వంశ వర్ణనము :-

సీ. కౌండిన్యగోత్ర సంకలితుఁ డాపస్తం సూత్రుఁడు పుణ్యుండు సుభగుఁడైన
భీమన మంత్రికిఁ బ్రియపుత్త్రుఁ డన్నయ, కలకంఠి తద్భార్య గౌరమాంబ
కమలాప్తు వరమునఁ గనిన సోమన మంత్రి వల్లభ మల్లమ, వారి తనయుఁ
డెల్లన, యతనికి నిల్లాలు మాచమ వారిపుత్త్రుఁడు వంశవర్ధనుండు

ఆ. లలిత మూర్తి బహుకళానిధి కేసన, దాన మాన నీతి ధనుఁడు ఘనుఁడు
దనకు లక్కమాంబ ధర్మగేహిని గాఁగ, మనియె శైవశాస్త్రమతముఁ గనియె. 24

* ఇక మా వంశాన్ని అభివర్ణిస్తున్నాను, మాది కౌండిన్యసగోత్రం. అపస్తంబసూత్రం. పుణ్యాత్ముడు, ధన్యాత్ముడు అయిన భీమన్న మంత్రి మా మూలపురుషుడు. ఆయన కుమారుడు అన్నయ్య. ఆయన అర్ధాంగి గౌరమ్మ. ఆ దంపతులకు సూర్యుని వరప్రసాదం వల్ల సోమన్న జన్మించాడు. ఆయన ఇల్లాలు మల్లమ్మ. ఆ సతీపతుల సంతానం ఎల్లన్న. ఆయన భార్య మాచమ్మ. వారిద్దరికీ వంశవర్ధనుడైన కేసనమంత్రి ఉదయించాడు. చక్కనివాడూ, పెక్కు కళలలో పేరెక్కినవాడూ, దాతా, నీతిమంతుడూ, అభిమానధనుడూ అయిన కేసన్నగారు లక్కమాంబను సహధర్మచారిణిగా వరించి శాస్త్ర సమ్మతమైన శైవమతాన్ని స్వీకరించాడు.

క. నడవదు నిలయము వెలువడి, తడవదు పరపురుషు గుణముఁ దనపతి నుడువుం
గడవదు, వితరణ కరుణలు, విడువదు, లక్కాంబ విబుధ విసరము వొగడన్. 25

* లక్కమాంబ మహాసాధ్వి. ఆ దొడ్డ యిల్లాలు ఇల్లు వదలి వెలుపల కాలు పెట్టి ఎరుగదు. పర పురుషుల సంగతి తలపెట్టి ఎరుగదు. పెనిమిటి మాట జవదాటి ఎరుగదు. ఆమె దాన ధర్మాలకూ, దయాదాక్షిణ్యాలకూ, పెట్టింది పేరు. పెద్దల మన్ననల్ని పెద్దగా అందుకున్న ముద్దరాలు.

ఉ. మానిను లీడు గారు, బహుమాన నివారిత దీనమానస
గ్లానికి, దాన ధర్మ మతి గౌరవ మంజులతా గభీరతా
స్థానికి, ముద్దుసానికి, సదాశివపాదయుగార్చనానుకం
పా నయవాగ్భవానికిని, బమ్మెర కేసయ లక్కసానికిన్. 26

* ఆ చల్లని తల్లి బీదసాదలను ఆదరించి వారి కష్టాలు పోగొట్టేది. ఔదార్యానికీ, బుద్ధి చాతుర్యానికి, సౌందర్యానికీ, గాంభీర్యానికీ ఆమె ఆస్థానం. సదా, సదాశివుని పదాలు అర్చిస్తూ, దయతో కూడిన నయవాక్కులతో, సాక్షాత్తూ పార్వతీ దేవిలా కనిపించే ఆ కేసనమంత్రి గారి ధర్మపత్నికి సామాన్యకాంతలు సాటిరారు.

క. ఆ మానినికిం బుట్టితి, మే మిరువుర మగ్రజాతుఁ డీశ్వరసేవా
కాముఁడు తిప్పన; పోతన, నామవ్యక్తుండ సాధునయ యుక్తుండన్. 27

* ఆమెగారికి మేమిద్దరం కొడుకులం పుట్టాము. పెద్దవాడు తిప్పన్న; ఆయన ఈశ్వరార్చన కళాశీలుడు. నేను చిన్నవాణ్ణి; నా పేరు పోతన్న. పెద్దల అడుగుజాడల్లో నడుస్తున్న వాణ్ణి.

వ. అయిన నేను నా చిత్తంబునఁబెన్నిధానంబునుంబోని శ్రీరామచంద్రు సన్నిధానంబుఁ గల్పించుకొని 28

* అటువంటి నేను శ్రీ రామచంద్రుణ్ణి నా నిండుగుండెలో నిలువుకొన్నవాడనై-

## -: షష్ఠ్యంతములు :-

ఉ. హారికి, నందగోకులవిహారికిఁ, జక్రసమీర దైత్య సం
హారికి, భక్తదుఃఖపరిహారికి, గోపనితంబినీ మనో
హారికి, దుష్టసంపదపహారికి, ఘోషకుటీపయోఘృతా
హారికి, బాలకగ్రహమహాసురదుర్వనితాప్రహారికిన్. 29

* మనోహరాలైన హారాలు ధరించినవాడూ, నందులవారి బృందావనంలో విహరించినవాడూ, తృణావర్తుడనే దానవుణ్ణి సంహరించిన వాడూ, భక్తుల పరితాపాలను పరిహరించినవాడూ, గోపాంగనల మనస్సులను అపహరించినవాడూ, దుష్టుల సంపదలను హరించిన వాడూ, వ్రేపల్లెలో గోపికల యిండ్లలో పాలూ నెయ్యీ అపహరించినవాడూ, పిల్లల పాలిటి పెనుభూతమైన పూతన అనే మహారాక్షసిని మట్టు పెట్టినవాడూ-

ఉ. శీలికి, నీతిశాలికి, వశీకృతశూలికి, బాణ హస్త ని
ర్మూలికి, ఘోర నీరదవిముక్త శిలాహత గోపగోపికా
పాలికి, వర్ణ ధర్మపరిపాలికి, నర్జునభూజయుగ్మ సం
చాలికి, మాలికిన్, విపుల చక్ర నిరుద్ధ మరీచి మాలికిన్. 30

* శీలవంతుడూ, నీతిమంతుడూ, త్రిశూలధారియైన శివుణ్ణి వశం చేసుకున్నవాడూ, బాణాసురుని బాహుదండాలు ఖండించిన వాడూ, ఇంద్రుని పంపున మేఘాలు కురిసిన రాళ్ల జల్లుకు చెల్లా చెదరైన గో గోప గోపికలను కాపాడినవాడూ, వర్ణాశ్రమ ధర్మాలను ఉద్ధరించిన వాడూ, జంట మద్ది చెట్లు పెల్లగించినవాడూ, వనమాల ధరించిన వాడూ, సైంధవ సంహార సమయాన తన చేతి చక్రంతో సూర్యమండలాన్ని కప్పివేసినవాడూ-

ఉ. క్షంతకుఁ గాళియోరగవిశాలఫణావళినర్తనక్రియా
రంతకు, నుల్లసన్మగధరాజ చతుర్విధ ఘోర వాహినీ
హంతకు, నింద్ర నందన నియంతకు, సర్వచరాచరావళీ
మంతకు, నిర్జితేంద్రియసమంచిత భక్త జనానుగంతకున్. 31

* క్షమాగుణం కలవాడూ. కాళియుని విశాలమైన పడగలపై నాట్యమాడటం నేర్చినవాడూ, పొంగి పడుతున్న జరాసంధుని చతురంగ సైన్యాలను హతమార్చినవాడూ, పార్థుని రథం నడిపినవాడూ, సమస్త చరాచర ప్రపంచం స్మరించేవాడూ, జితేంద్రియులైన భక్తులను అనుసరించేవాడూ-

**ఉ. న్యాయికి, భూసురేంద్రమృతనందనదాయికి, రుక్మిణీ మన**
**స్స్థాయికి, భూతసమ్మదవిధాయికి, సాధుజనానురాగ సం**
**ధాయికిఁ బీతవస్త్రపరిధాయికి, బద్మభవాండభాండ ని**
**ర్మాయికి, గోపికానివహ మందిరయాయికి, శేషశాయికిన్. 32**

* న్యాయాన్ని మెచ్చినవాడూ, చచ్చిపోయిన బ్రాహ్మణ బాలుణ్ణి తెచ్చి యిచ్చినవాడూ, రుక్మిణీదేవి మనస్సుకు బాగా నచ్చినవాడూ, సకల జగతికీ సంతోషాన్ని సమకూర్చేవాడూ, సజ్జనుల ఆదరాభిమానాలను దిద్ది తీర్చేవాడూ, పట్టు పీతాంబరాన్ని కట్టుకునేవాడూ, బ్రహ్మాండ భాండాలను సృజించేవాడూ, గోపికల గృహాల వైపు పయనించేవాడూ, ఆదిశేషునిపై శయనించేవాడూ-

**వ. సమర్పితంబుగా నే నాంధ్రంబున రచియింపఁ బూనిన శ్రీమహాభాగవతపురాణంబునకుం గథాప్రారంభం బెట్టిదనిన. 33**

* అయిన నా స్వామికి సమర్పితంగా శ్రీమన్మహాభాగవత పురాణం తెనిగించటానికి పూనుకొని ఆ గ్రంథానికి కథా ప్రారంభం ఈ విధంగా చేస్తున్నాను.

## -: కథాప్రారంభము :-

**సీ. విశ్వజన్మస్థితివిలయంబు లెవ్వని వలన నేర్పడు ననువర్తనమున**
**వ్యావర్తనమునఁ గార్యములం దభిజ్ఞుఁడై తాన రా జగుచుఁ జిత్తమునఁ జేసి**
**వేదంబు లజునకు విదితముల్ గావించె నెవ్వఁడు బుధులు మోహింతు రెవ్వ**
**నికి నెండమావులు నీటఁ గాచాదుల నన్యోన్యబుద్ధిఁ దా నడరునట్లు**

**ఆ. త్రిగుణసృష్టి యెందు దీపించి సత్యము భంగిఁ దోఁచు స్వప్రభానిర స్త**
**కుహకుఁ డెవ్వఁ డతనిఁ గోరి చింతించెద, ననఘు సత్యుఁ బరుని ననుదినంబు. 34**

* ఎవనివల్ల ఈ విశ్వానికి సృష్టి స్థితి లయాలు ఏర్పడుతుంటాయో, ఎవడు సర్వతోముఖమైన కార్య నిర్వహణలో సమర్థుడో, ఎవడు సమస్తానికీ రాజై విరాజిల్లుతుంటాడో, ఎవడు సంకల్పమాత్రం చేతనే బ్రహ్మదేవునికి వేదాలన్నీ తేటతెల్లం చేశాడో, ఎవని మాయకు పండితులు సైతం లోబడిపోతారో, ఎవనియందు సత్త్వరజ స్తమో గుణాత్మకమైన ఈ సృష్టి అంతా ఎండమావుల్లో, నీళ్లలో, గాజు వస్తువుల్లోలాగా అసత్యమై కూడ సత్యంగా ప్రతిభాసిస్తూ ఉంటుందో, ఎవడు తనతేజస్సుతో మాయను దూరంగా తొలగిస్తాడో, అనఘుడూ, సత్యస్వరూపుడూ అయిన ఆ పరాత్పరుని ప్రతినిత్యమూ స్తుతి చేస్తున్నాను.

వ. ఇట్లు "సత్యం పరం ధీమహి" యను గాయత్రీ ప్రారంభమున గాయత్రీనామబ్రహ్మ స్వరూపంబై మత్స్యపురాణంబులోన గాయత్రి నధికరించి ధర్మవిస్తరంబును వృత్రాసురవధంబును నెందు జెప్పంబడు నదియ భాగవతం బని పలుకుటం జేసి యీ పురాణంబు శ్రీమహాభాగవతం బన నొప్పుచుండు. 35

* "సత్యం పరం ధీమహి'' అనే గాయత్రీ మహామంత్రంతో ఆరంభించటం వల్ల గాయత్రీ పరదేవతాస్వరూప మైనది ఈ మహా గ్రంథం. "గాయత్రిని అతిశయింపజేస్తూ, ధర్మప్రస్తారాన్నీ, వృత్రాసుర సంహారాన్నీ అభివర్ణించే గ్రంథాన్ని భాగవతం అంటారు'' అని మత్స్యపురాణంలో చెప్పి ఉండటంవల్ల ఇది "శ్రీ మహాభాగవతం'' అని ప్రసిద్ధి గాంచింది.

సీ. శ్రీమంతమై మునిశ్రేష్ఠకృతంబైన భాగవతంబు సద్భక్తితోడ
వినఁ గోరువారల విమల చిత్తంబులఁ జెచ్చెర నీశుండు చిక్కుఁ గాక;
యితర శాస్త్రంబుల నీశుఁడు చిక్కనే మంచి వారలకు నిర్మత్సరులకుఁ
గపట నిర్ముక్తులై కాంక్ష సేయకయును దగిలి యుండుట మహాతత్త్వబుద్ధిఁ

తే. బరఁగ నాధ్యాత్మికాది తాపత్రయంబు, నడచి పరమార్థభూతమై యధిక సుఖద
మై సమస్తంబుఁ గాకయు నయ్యు నుండు, వస్తు వెఱుఁగంగఁ దగు భాగవతమునందు. 36

* శ్రీమంతమూ, వేదవ్యాస మహాముని విరచితమూ అయిన ఈ భాగవత మహాపురాణాన్ని అచంచల భక్తితో ఆకర్ణించగోరే భక్తుల అంతరంగాలలోనే భగవంతుడు నిరంతరం నివసిస్తాడు. అంతే గాని ఇతర గ్రంథాల వల్ల ఈశ్వరుడు చిక్కడు. మహితులూ, మాత్సర్యరహితులూ అయిన సజ్జనులు కపటమార్గాన పోకుండా, ఎటువంటి కాంక్షా లేకుండా, భాగవత శ్రవణమందే ఆసక్తులై ఉండటం మంచిది. ఇందువల్ల "తాపత్రయం'' అంటే ఆధ్యాత్మికమూ, ఆధిభౌతికమూ, ఆధిదైవికమూ అనే త్రివిధ తాపాలూ నశించి వారికి తత్త్వజిజ్ఞాస కలుగుతుంది. ఈ భాగవతంలో పరమార్థభూతమూ, పరమానంద దాయకమూ, వ్యక్తావ్యక్తమూ అయిన పరబ్రహ్మ స్వరూపం అభివ్యక్త మవుతుంది.

ఆ. వేదకల్పవృక్షవిగళితమై శుక, ముఖసుధాద్రవమున మొనసియున్న
భాగవతపురాణఫలరసాస్వాదన, పదవిఁ గనుఁడు రసిక భావవిదులు. 37

* "భాగవత'' మనే ఈ మహాఫలం "వేద''మనే కల్పవృక్షం నుండి బాగా పండి రాలింది. శుకముఖ సుధాద్రవంతో నిండి ఉంది. భావజ్ఞులూ రసజ్ఞులూ అయిన భక్తవరేణ్యులు రండి! ఈ ఫలరసాన్ని ఆస్వాదించి ధన్యులు కండి!

క. పుణ్యంబై మునివల్లభ, గణ్యంబై కుసుమ ఫల నికాయోత్థిత సా
ద్గుణ్యమయి నైమిశాఖ్యా, రణ్యంబు నుతింపఁ దగు నరణ్యంబులలోన్. 38

* పుణ్యమూ, పుష్ప ఫల భరిత తరువరేణ్యమూ, తాపసోత్తములకు శరణ్యమూ అయిన నైమిశారణ్యం అరణ్యా లన్నింటికీ అగ్రగణ్యమై అలరారుతూ ఉంది.

వ. మఱియును మధువైరి మందిరంబునుం బోలె మాధవీమన్మథమహితంబై, బ్రహ్మగేహంబునుం బోలె శారదాన్వితంబై, నీలగళసభానికేతనంబునుం బోలె వహ్ని వరుణ సమీరణ చంద్ర రుద్ర హైమావతీ కుబేర వృషభ గాలవ శాండిల్య పాశుపత జటి పటల మండితంబై, బలభేదిభవనంబునుం బోలె నైరావతామృత రంభా గణికాభిరామంబై, మురాసురునిలయంబునుంబోలె నున్మత్తరాక్షస వంశసంకులంబై, ధన దాగారంబునుం బోలె శంఖ పద్మకుంద ముకుంద సుందరంబై, రఘురాము యుద్ధంబునుం బోలె నిరంతర శరానలశిఖాబహుళంబై, పరశురాము భండనంబునుం బోలె నర్జునోద్భేదంబై, దానవ సంగ్రామంబునుంబోలె నరిష్ట జంభనికుంభ శక్తియుక్తంబై, కౌరవ సంగరంబునుం బోలె ద్రోణార్జునకాంచనస్యందనకదంబ సమేతంబై, కర్ణుకలహంబునుం బోలె మహోన్నతశల్య సహకారంబై, సముద్రసేతు బంధనంబునుంబోలె నలనీల పనసాద్యద్రి ప్రదీపితంబై, భర్గు భజనంబునుం బోలె నానా శోకలేఖా ఫలితంబై, మరుని కోదండంబునుం బోలె బున్నాగ శిలీముఖభూషితంబై, నరసింహరూపంబునుం బోలె గేసరకరజ కాంతంబై, నాట్యరంగంబునుం బోలె నటనటీ సుషిరాన్వితంబై, శైలజా నిటలంబునుంబోలెఁ జందన కర్పూర తిలకాలంకృతంబై, వర్షాగమంబునుంబోలె నింద్రబాణాసన మేఘ కరక కమనీయంబై, నిగమంబునుం బోలె గాయత్రీ విరాజితంబై, మహాకావ్యంబునుం బోలె సరల మృదులతా కలితంబై, వినతానిలయంబునుం బోలె సుపర్ణ రుచిరంబై, యమరావతీ పురంబునుం బోలె సుమనోలలితంబై, కైటభోద్యోగంబునుం బోలె మధుమానితంబై, పురుషోత్తమసేవనంబునుం బోలె నమృతఫలదంబై, ధనంజయ సమీకంబునుంబోలె నభ్రంకష పరాగంబై, వైకుంఠపురంబునుం బోలె ఖడ్గ పుండరీక విలసితంబై, నందఘోషంబునుం బోలెఁ గృష్ణసార సుందరంబై లంకానగరంబునుంబోలె రామమహిషీవంచక సమంచితంబై, సుగ్రీవ సైన్యంబునుం బోలె గజ గవయ శరభ శోభితంబై, నారాయణస్థానంబునుం బోలె నీలకంఠ కౌశిక భరద్వాజ తిత్తిరి భాసురంబై, మహాభారతంబునుం బోలె నేకచక్ర బకకంకధార్తరాష్ట్ర శకుని నకుల సంచార సమ్మిళితంబై, సూర్య రథంబునుం బోలె నురుతరప్రవాహంబై, జలదకాల సంధ్యాముహూర్తంబునుం బోలె బహువితత జాతిసౌమనస్యంబై, యొప్పు నైమిశారణ్యంబను శ్రీ విష్ణు క్షేత్రంబునందు శౌనకాదిమహామునులు స్వర్లోకగీయమానుండగు హరిం జేరుకొఱకు సహస్రవర్షంబు లనుష్ఠానకాలంబుగా గల సత్ర సంజ్ఞికంబైన యాగంబు సేయుచుండి రందొక్క నాఁడు వారలు రేపకడ నిత్య నైమిత్తికహోమంబు లాచరించి సత్కృతుండై సుఖాసీనుండై యున్న సూతుం జూచి. 39

[1]ఆ నైమిశారణ్యం మాధవీ మన్మథమహితమై మహావిష్ణువు మందిరం వలె ఉంది.

[2]శారదాన్వితమై బ్రహ్మదేవుని భవనం వలె ఉంది.

---

1. మాధవీ+మన్మథ=పూల గురివెంద చెట్లు + వెలగ చెట్లు, లక్ష్మీ మన్మథులు.
2. శారద=ఏడాకుల అరటిచెట్లు, సరస్వతీ దేవి

[3]వహ్ని, వరుణ, సమీరణ, చంద్ర, రుద్ర, హైమావతీ, కుబేర, వృషభ, గాలవ, శాండిల్య, పాశుపత, జటి పటల మండితమై సాంబశివుని సభామంటపం వలె ఉంది.

[4]ఐరావత, అమృత, రంభా, గణికాభిరామమై దేవేంద్రుని ప్రాసాదం వలె ఉంది.

[5]ఉన్మత్త రాక్షసవంశ సంకులమై మురాసురుని యిల్లువలె ఉంది.

[6]శంఖ, పద్మ, కుంద, ముకుంద సుందరమై కుబేరుని సౌధం వలె ఉంది.

---

[1]నిరంతర శరానల శిఖాబహుళమై రఘురాముని రణరంగం వలె ఉంది.

[2]అర్జునోద్భేదమై పరశురాముని భండనం వలె ఉంది.

[3]అరిష్ట, జంభ, నికుంభ, శక్తి యుక్తమై రాక్షసయుద్ధం వలె ఉంది.

[4]ద్రోణార్జున కాంచన స్యందన కదంబ సమేతమై కురుపాండవ సంగ్రామం వలె ఉంది.

[5]మహోన్నత శల్య సహకారమై కర్ణుని కదనం వలె ఉంది.

[6]నలనీల పనసాది అద్రి ప్రదీపితమై సముద్రసేతు బంధనం వలె ఉంది.

[7]నానా శోక లేఖా ఫలితమై శివదేవుని సేవ వలె ఉంది.

[8]పున్నాగ శిలీముఖభూషితమై మన్మథుని విల్లు వలె ఉంది.

[9]కేసర కరజ కాంతమై నృసింహుని రూపం వలె ఉంది.

---

3. వహ్ని=చిత్రమూలం, అగ్నిదేవుడు, వరుణ=ఉలిమురి చెట్లు, వరుణదేవుడు. సమీకరణ=మరువము, వాయుదేవుడు. చంద్ర=పెద్ద ఏలకి, చంద్రుడు. రుద్రాక్ష= రుద్రాక్షవృక్షాలు, ఏకాదశ రుద్రులు. హైమవతీ = కరకచెట్లు, పార్వతీదేవి. కుబేర= నంది వృక్షాలు, కుబేరుడు. వృషభ=అడ్డసర, ఆఁబోతు. గాలవ=లొద్దుగచెట్లు, ఒకముని. శాండిల్య=మారేడు చెట్లు, ఒక ముని. పాశుపత=శ్రీవల్లి, శివభక్తులు. జటిపటిల=జువ్వి చెట్లు, ముని సమూహము.
4. ఐరావత=నారింజ చెట్లు, ఇంద్రుని ఏనుగు. అమృత=ఉసిరిక చెట్లు, అమృతం. రంభా=అరటిచెట్లు, అప్సరస. గణికా =అడవి మొల్లలు, వేశ్యలు.
5. ఉన్మత్త+రాక్షస+వంశ=ఉమ్మెత్త +బలురక్కెస+వెదురు, మదించిన రాక్షస సమూహాలు.
6. శంఖ+పద్మ+కుంద +ముకుంద = శంఖాలు +పద్మాలు+మొల్లలు+తారలు, నవనిధులు

---

1. శర+అనల శిఖా=రెల్లు+శక్ర పుష్పి. బాణాగ్ని జ్వాలలు.
2. అర్జున +ఉద్భేద=మద్ది అంకురాలు, కార్తవీర్యార్జున సంహారం
3. అరిష్ట+జంభ+నికుంభ=వేపచెట్లు+ నిమ్మచెట్లు+దంతి చెట్లు, అరిష్టుడు+జంభుడు+నికుంభుడు (రాక్షసులు).
4. ద్రోణ+అర్జున+కాంచన+స్యందన+కదంబ=తుమ్మిచెట్లు+మద్దిచెట్లు+సంపెంగ చెట్లు+ కడిమి చెట్లు, బంగారు రథాలు.
5. శల్య+సహకార =మంగ చెట్లు+మామిడిచెట్లు, శల్యుని తోడ్పాటు.
6. నల+నీల+పనస=వట్టి వేరు, నీలిచెట్లు, పనసచెట్లు, ఆ పేరు గల వానరులు, అద్రి =చెట్లు, కొండ.
7. అశోక+లేఖా=అశోక వృక్ష పంక్తులు, శుభలేఖలు.
8. పున్నాగ+శిలీముఖ=సురపొన్నలు+తుమ్మెదలు, పున్నాగ పుష్పాల బాణాలు.
9. కేసర+కరజ=పొన్నచెట్లు+కానుగు చెట్లు, జూలు+గోళ్ళు.

[10]నట నటీ సుషిరాన్వితమై నాట్యరంగం వలె ఉంది.

[11]చందన కర్పూర తిలకాంచితమై పార్వతీ ఫాలభాగంవలె ఉంది.

[12]ఇంద్రబాణాసన మేఘకరక కమనీయమై వర్షాగమం వలె ఉంది.

[13]గాయత్రీ విరాజితమై వేదం వలె ఉంది.

[14]సరళ మృదులతా కలితమై మహాకావ్యం వలె ఉంది.

[15]సుపర్ణ రుచిరమై వినతాగృహం వలె ఉంది

[16]సుమనోలలితమై అమరావతీ పట్టణం వలె ఉంది.

[17]మధుమానితమై కైటభుని అధికారం వలె ఉంది.

[18]అమృత ఫలదమై హరిసేవనం వలె ఉంది.

[19]అభ్రంకష పరాగమై ధనంజయుని యుద్ధం వలె ఉంది.

[20]ఖడ్గ పుండరీక విలసితమైన వైకుంఠపురం వలె ఉంది.

[21]కృష్ణసార సుందరమై నందఘోషం వలె ఉంది.

[22]రామమహిషీ వంచక సమంచితమై లంకానగరం వలె ఉంది.

[23]గజ గవయ శరభ శోభితమై సుగ్రీవ సైన్యం వలె ఉంది.

---

10. వట+వటీ+సుషిర=దుండిగ చెట్లు+దొండ చెట్లు+గువ్వగుతిక చెట్లు, నటీ నటుల వాద్య విశేషాలు.
11. చందన+కర్పూర+తిలక =చందన వృక్షాలు+కలిగొట్లు+బొట్టుగు చెట్లు, మంచి గంధం+కర్పూర తిలకం.
12. ఇంద్ర+బాణ+ఆసన+మేఘ+కరక=మరువం+నల్లగోరింట+వేగిస+తుంగముస్తెలు+దానిమ్మ చెట్లు, ఇంద్ర ధనుస్సు+మబ్బులు+వడగండ్లు.
13. గాయత్రీ=చంద్ర చెట్లు, గాయత్రీ మహామంత్రం.
14. సరల మృదులతా=తెల్ల తెగడ చెట్లు+కోమల వల్లికలు, సారళ్య సౌకుమార్యాలు
15. సుపర్ణ=సుందరమైన ఆకులు, గరుత్మంతుడు.
16. సుమనస్=పుష్పాలు, దేవతలు.
17. మధు=పూదేనె, మధుడనే రాక్షసుడు.
18. అమృత ఫలద=తియ్యని పండ్లు ఇచ్చేది, మోక్ష ఫలాన్ని ఇచ్చేది.
19. అంభ్రకష పరాగము= ఆకాశమంతా క్రమ్మిన పుప్పొడి కలది, ఆకాశం నిండా క్రమ్మిన దుమారం కలది.
20. హరి+ఖడ్గ+పుండరీక=సింహాలు, నందకమనెడి ఖడ్గం+పుండరీకుడనే భక్తుడు.
21. కృష్ణసార=నల్ల జింకలు, శ్రీ కృష్ణుని శక్తి.
22. రామ మహిషీ +వంచక=దుప్పులు+నక్కలు, రాముని పత్నిని మోసగించిన రావణుడు.
23. గజ+గవయ+శరభ=ఏనుగులు+గురుపోతులు+శరభమృగాలు, ఆ పేరులు గల వానర సేనాపతులు.

[24]నీలకంఠ హంస కౌశిక భరద్వాజ తిత్తిరి భాసురమై నారాయణస్థానం వలె ఉంది.

[25]ఏకచక్ర బకకంక ధార్తరాష్ట్ర శకుని నకుల సంచార సమ్మిళితమై మహాభారతం వలె ఉంది.

[26]ఉరుతర ప్రవాహమై సూర్య రథం వలె ఉంది.

[27]బహు వితత జాతి సౌమనస్యమై జలదకాల సంధ్యాసమయం వలె ఉంది.

ఈ విధంగా నానావిధాలైన వృక్షాలతో, లతలతో మృగాలతో, పక్షులతో నిండి పరమ పవిత్రమై శ్రీ విష్ణుక్షేత్రమైన ఆ నైమిశారణ్యంలో శౌనకుడు మొదలైన మహామునులు సురలోకవంద్యుడైన శ్రీహరి సన్నిధి కోరినవారై, వెయ్యి సంవత్సరాల పర్యంతం కొనసాగే సత్త్రయాగం ప్రారంభించారు. ఒకనాడు వారంతా ఉదయమే నిత్య నైమిత్తికాలైన హోమాలు నిర్వర్తించినవారై -

### -: శౌనకాది ఋషుల ప్రశ్న :-

**క. ఆ తాపసు లిట్లనిరి వి నీతున్, విజ్ఞాన ఫణిత నిఖిల పురాణ**
**వ్రాతున్, నుత హరి గుణ సం, ఘాతున్, సూతున్, నితాంత కరుణోపేతున్. 40**

* ఆ శౌనకాది మునీంద్రులు వినయశీలుడూ; విజ్ఞాన విశేషం చేత వేదాలనూ, పురాణాలనూ పండించుకున్నవాడూ; శ్రీమన్నారాయణుని సద్గుణ సమూహాన్ని సంకీర్తించేవాడూ; అనంతమైన కారుణ్యంతో నిండినవాడూ అయిన సూతుణ్ణి ఆలోకించి ఈ విధంగా అన్నారు-

**మ. సమతం దొల్లి పురాణపంక్తు లితిహాసశ్రేణులున్ ధర్మ శా**
**స్త్రములున్ నీవ ❁ యుపన్యసింపుదువు వేద వ్యాస ముఖ్యుల్ మునుల్**
**సుమతుల్ సూచిన వెన్ని యన్నియును దోఁచున్ నీమదిం; దత్ప్రసా**
**దమున్ జేసి యెఱుంగ నేర్తువు సమస్తంబున్ బుధేంద్రోత్తమా! 41**

* "సుధీమణులలో ప్రథమగణ్యుడవైన సూతమునీంద్రా! నీవు బ్రహ్మాండాది పురాణాలు, మహాభారతం మొదలైన ఇతిహాసాలూ, ఇంకా ఎన్నో ధర్మశాస్త్రాలూ మీ గురువుల సన్నిధిలో చక్కగా చదువుకున్నావు. అవన్నీ మాకు వివరించి చెప్పావు. ధీమంతులైన వేదవ్యాసాది మహర్షులు దర్శించిన విశేషాలన్నీ నీ మనస్సులో స్ఫురిస్తాయి. ఆ మహానుభావుల అనుగ్రహంవల్ల నీ బుద్ధికి అందని దంటూ ఏదీ లేదు. నీవు సర్వజ్ఞుడవు.

---

24. నీలకంఠ+హంస+కౌశిక+భరద్వాజ+తిత్తిరి=నెమళ్ళు+హంసలు+గుడ్లగూబలు+ఏట్రింతలు+తీతువులు, శివుడు+సూర్యుడు+ఇంద్రుడు+భరద్వాజ మహర్షి +తైత్తిరీయం

25. ఏక చక్ర +బక+ధార్తరాష్ట్ర+శకుని+నకుల=శ్రేష్ఠమైన చక్రవాకాలు+కొంగలు+ రాబందులు+హంసలు+ పిచ్చుకలు+ముంగిసలు, ఏకచక్రపురం+బకాసురుడు+కౌరవులు+శకుని+నకులుడు.

26. ఉరుతర ప్రవాహము=మంచి జల ప్రవాహాలు కలది, మేలు జాతి గుర్రాలు కలది.

27. బహువితత జాతి సౌమనస్యము=మిక్కిలి విశాలమైన జాతీయ సౌహార్దం కలది. మిక్కిలి జాజిపూలు కలది.

❁ నీవు పఠించి చెప్పితివి.

క. గురువులు ప్రియశిష్యులకుం, బరమ రహస్యములు దెలియ బలుకుదు రచల
స్థిర కల్యాణం బెయ్యది, పురుషులకును నిశ్చయించి బోధింపు తగన్. 42

* గురువులైనవారు ప్రీతిపాత్రులైన శిష్యులకు అత్యంత రహస్యాలైన సంగతులు ఎన్నో బోధిస్తారు. ఈ లోకంలోని మానవులకు శాశ్వతమైన కల్యాణాన్ని కలిగించే విషయమేదో బాగా ఆలోచించి దాన్ని దయతో మాకు ఉపదేశించు.

క. మన్నాఁడవు చిరకాలము, గన్నాఁడవు పెక్కులైన గ్రంథార్థంబుల్
విన్నాఁడవు వినఁదగినవి, యున్నాఁడవు పెద్దలొద్ద నుత్తమగోష్ఠిన్. 43

* మహానుభావుల సాన్నిధ్యంలో బహుకాలం ఉన్నావు. ఆయా మహాగ్రంథాలలోని పరమార్థాలను కన్నావు. పెద్దల వద్ద వినదగిన విశేషాలెన్నో విన్నావు.

చ. అలసులు మందబుద్ధియుతు లల్పతరాయువు లుగ్రరోగసం
కలితులు మందభాగ్యులు సుకర్మము లెవ్వియుఁ జేయజాల రీ
కలియుగమందు మానవులు; గావున నెయ్యది సర్వసౌఖ్యమై
యలవడు? నేమిటం బొడము నాత్మకు శాంతి? మునీంద్ర! చెప్పవే? 44

* మునీంద్రా! ఈ కలియుగంలోని మానవులందరూ సోమరి పోతులు, మందబుద్ధులు, మందభాగ్యులు, అల్పాయుష్కులు. నానా విధాలైన భయంకర వ్యాధులు వాళ్ళని పట్టి పల్లారుస్తున్నాయి. వాళ్ళు సత్కార్యము లేవీ చేయటానికి అసమర్థు లౌతున్నారు. అందువల్ల ఏది వారి ఆత్మలకు శాంతిని ప్రసాదిస్తుంతో అటువంటి మార్గాన్ని అనుగ్రహించు.

సీ. ఎవ్వని యవతార మెల్ల భూతములకు సుఖమును వృద్ధియు సొరిదిఁజేయు!
నెవ్వని శుభనామ మే ప్రొద్దు నుడువంగ సంసార బంధంబు సమసిపోవు!
నెవ్వని చరితంబు హృదయంబుఁ జేర్పంగ భయమంది మృత్యువు పరువువెట్టు!
నెవ్వని పదనది నేపారు జలములు సేవింప నైర్మల్యసిద్ధి గలుగుఁ!

తే. దపసు లెవ్వని పాదంబు దగిలి శాంతి, తెరువుఁ గాంచిరి! వసుదేవదేవకులకు
నెవ్వఁడుదయించెఁ దత్కథలెల్ల వినఁగ, నిచ్చ పుట్టెడు నెఱిఁగింపు మిద్ధచరిత! 45

* ఏ మహానుభావుని అవతారం ఈ జగత్తులోని సమస్త జీవులకూ ఆనందాన్నీ, అభివృద్ధినీ అందిస్తుందో; ఏ మహానుభావుని దివ్యనామాన్ని ఎల్లప్పుడూ ఉచ్చరించటం మూలాన భవబంధాలన్నీ పటా పంచలై పోతాయో; ఏ మహానుభావుని పవిత్ర చరిత్రాన్ని భావించిన మాత్రంచేతనే మృత్యుదేవత భయపడి పారిపోతుందో, ఏ మహానుభావుని పాదాల నుంచి ఉద్భవించిన నదీజలాలను సేవించినంత మాత్రాన సమస్త కల్మషాలూ నశించి పావనత్వం ప్రాప్తిస్తుందో, ఏ మహానుభావుని చరణాలను సమాశ్రయించి సంయమీంద్రులు శాంతి మార్గాన్ని సాధించారో, ఏ మహానుభావుడు దేవకీ వసుదేవులకు ముద్దుల బిడ్డగా

జన్మించాడో, ఆ వాసుదేవుని కథలన్నీ వినాలని ఎంతో ముచ్చట పడుతున్నాము. ఓ సచ్చరిత్రుడా! అవన్నీ మాకు వినిపించు.

**క. భూషణములు వాణికి నఘ, శోషణములు మృత్యుచిత్త భీషణములు హృ**
**త్తోషణములు కల్యాణ వి, శేషణములు హరి గుణోపచిత భాషణముల్. 46**

* ఓ మహర్షీ! శ్రీహరి గుణ సంకీర్తనలతో నిండిన సంభాషణలు వాగ్దేవికి అలంకారాలు! సకల పాప పరిహారాలు! మృత్యు దేవతకు భయంకరాలు! భక్త హృదయాలకు సంతోషకరాలు! నిత్య కల్యాణ కరాలు!

**క. కలిదోషనివారకమై, యలఘుయశుల్ వొగడునట్టి హరికథనము ని**
**ర్మలగతిఁ గోరెడు పురుషుఁడు, వెలయఁగ నెవ్వాఁడు దగిలి వినఁడు ? మహాత్మా! 47**

* మహాత్మా! కలికాల దోషాలను పారద్రోలుతూ ప్రసిద్ధులైన సత్పురుషుల ప్రశంస లందుకొన్న గోవిందుని కథలు పుణ్యలోకాలు కోరేవాడు ఎవడు ఆసక్తితో వినకుండా ఉంటాడు?

**ఆ. అనఘ! విను రసజ్ఞులై వినువారికి, మాటమాట కధికమధురమైన**
**యట్టి కృష్ణ కథన మాకర్ణనము సేయఁ, దలఁపు గలదు మాకుఁ దనివి లేదు. 48**

* అనఘుడా! ఆసక్తితో ఆలకించే రసజ్ఞ హృదయాలకు పదే పదే మధురాతి మధురాలైనవి శ్రీకృష్ణుని కథలు. వానిని ఆకర్ణించాలని మాకు ఎంతో కుతూహలంగా ఉంది. ఎన్ని విన్నా మాకు తనివి తీరటం లేదు.

**మ. వర గోవింద కథా సుధా రస మహావర్షోరు ధారా పరం**
**పరలం గాక బుధేంద్ర చంద్ర! యితరోపాయానురక్తిం బ్రవి**
**స్తర దుర్దాంత దురంత దుస్సహ జనుస్సంభావితానేక దు**
**స్తర గంభీర కఠోర కల్మష కనద్దావానలం బాఱునే? 49**

* బుధేంద్రచంద్రా! అత్యంత విస్తరమూ, దుస్తరమూ, దుర్దాంతమూ, దురంతమూ, దుస్సహమూ అయి, అనేక జన్మల నుంచీ అతిశయించి, అంతటా వ్యాపించి, దాట శక్యం గానిదై, గంభీరమూ, కఠోరమూ అయిన కల్మషమనే కారుచిచ్చు మహాభయంకరంగా ఉన్నది. దీన్ని ఆర్పివేయాలంటే శ్రేష్ఠమయిన ఆనంద నందనుని కథా సుధా రసంతో నిండిన బ్రహ్మాండమైన వర్షధారా పరంపరలు తప్ప వేరే ఉపాయం లేదు.

**సీ. హరినామ కథన దావానలజ్వాలచేఁ గాలవే ఘోరాఘ కాననములు!**
**వైకుంఠదర్శన వాయు సంఘంబుచేఁ దొలఁగవే భవదుఃఖ తోయదములు!**
**కమలనాభధ్యాన కంఠీరవంబుచేఁ గూలవే సంతాప కుంజరములు!**
**నారాయణస్మరణ ప్రభాకరదీప్తిఁ దీఱవే షడ్వర్గ తిమిర తతులు!**

**ఆ. నలిన నయన భక్తినావచేఁ గాక సం, సారజలధి దాఁటి చనఁగ రాదు;**
**వేయు నేల! మాకు విష్ణు ప్రభావంబుఁ, దెలుపవయ్య సూత! ధీసమేత! 50**

* ధీమంతుడవైన సూతమహర్షీ! భయంకర పాపాలనే అరణ్యాలను భస్మీభూతం చేయాలంటే, శ్రీహరి నామ సంకీర్తనలనే దావాగ్ని జ్వాలలే కావాలి. సంసార దుఃఖాలనే మేఘాలను పారద్రోలాలంటే, వాసుదేవ సందర్శనమనే వాయు సమూహమే కావాలి. పరితాపాలనే కరి సమూహాన్ని సంహరించాలంటే, శ్రీమన్నారాయణ ధ్యానమనే సింహమే కావాలి. అరిషడ్వర్గమనే అంధకార సమూహాన్ని పటాపంచలు చేయాలంటే, హరి స్మరణమనే సూర్యకాంతి కావాలి. సంసార సముద్రాన్ని దాటి గట్టెక్కాలంటే, విష్ణుదేవుని భక్తి అనే నావనే ఎక్కాలి. వేయి మాట లెందుకు గాని మహానుభావా! మాకు శ్రీహరి మాహాత్మ్యాన్ని వినిపించండి స్వామీ!

**వ. మఱియుఁ గపటమానవుండును గూఢుండునైన మాధవుండు రామసహితుండై యతిమానుషంబులైన పరాక్రమంబులు సేసెనఁట! వాని వివరింపుము, కలియుగంబు రాఁగలదని వైష్ణవ క్షేత్రంబున దీర్ఘసత్ర నిమిత్తంబున హరికథలు విన నెడగలిగి నిలిచితిమి. దైవయోగంబున. 51**

* అంతేకాదు, అప్రమేయుడైన గోవిందుడు మాయామానుష శరీరం ధరించి బలరామునితో గూడి మానవాతీతములైన మహా వీరకృత్యాలు ఎన్నో చేశాడని వింటాము. అవన్నీ మాకు వివరంగా సెలవీయండి! కలియుగం రాబోతున్నదని విని ముందుగానే విష్ణు క్షేత్రమైన ఈ నైమిశారణ్యంలో దీర్ఘసత్రమనే యజ్ఞం ప్రారంభించి హరికథలు ఆలకించే అవకాశం కలిగించుకున్నాము. దైవం మాకు తోడుపడింది.

**క. జలరాశి దాఁటఁ గోరెడి, కలము జనుల్ కర్ణధారుఁ గాంచిన భంగిం**
**గలి దోష హరణ వాంఛా, కలితులమగు మేము నిన్నుఁ గంటిమి సూతా! 52**

* మహాసముద్రాన్ని తరించాలని ప్రయత్నించే ప్రయాణికులకు ఓడ నడిపే నావికుడు లభించినట్లుగా కలికాల కలుషాలను పోకార్చాలనే కోరికతో నిరీక్షిస్తున్న మాకు నీవు కన్పించావు.

**క. చారుతర ధర్మరాశికి, భారకుఁడగు కృష్ణుఁ డాత్మపదమున కేఁగన్**
**భారకుఁడు లేక యెవ్వనిఁ, జేరును ధర్మంబు బలుపు సెడి మునినాథా! 53**

* ఉత్తమ ధర్మాలకు ఆధారంగా ఉండే శ్రీకృష్ణుడు పరమపదం చేరుకున్న అనంతరం, ఆధారహీనమై ఈ ధర్మం దిక్కుమాలి చిక్కి జీర్ణించి ఎవరిని ఆశ్రయించుతుందో వివరించవయ్యా మునీంద్రా!''

## -: సూతుండు నారాయణ కథాప్రశంస సేయుట :-

**వ. అని యిట్లు మహనీయ గుణగరిష్ఠులయిన శౌనకాది మునిశ్రేష్ఠు లడిగిన రోమహర్షణ పుత్త్రుండయి యుగ్రశ్రవసుం డనుపేర నొప్పి నిఖిల పురాణ వ్యాఖ్యాన వైఖరీ సమేతుండైన సూతుండు. 54**

* ఈ విధంగా సద్గుణ సాంద్రులైన శౌనకుడు మొదలైన మునిచంద్రులు అడగ్గా రోమహర్షుని కుమారుడూ, సమస్త పురాణాలను చక్కగా వివరించి చెప్పే నేర్పు కలవాడూ అయిన ‘‘ఉగ్రశ్రవసు’’డనే సూతుడు ఇలా ఉపక్రమించాడు.

మ. సముఁడై యెవ్వఁడు ముక్తకర్మచయుఁడై సన్న్యాసియై యొంటిఁబో
వ మహాప్రీతి నొహో కుమార! యనుచున్ వ్యాసుండు చీరంగ వృ
క్షములుం దన్మయతం బ్రతిధ్వనులు సక్కం జేసె మున్నట్టి భూ
త మయున్ మ్రొక్కెద బాదరాయణిఁ దపోధన్యాగ్రణిన్ ధీమణిన్. 55

* ఏ మహాత్ముడు సర్వభూతములందూ సమానభావంతో సంచరిస్తుంటాడో, ఏ మహాత్ముడు సర్వసంగ పరిత్యాగియై, విరాగియై, మహాయోగియై, ఒంటరిగా అరణ్యంలో వెళ్లుతున్న సమయంలో తండ్రియైన వ్యాసులవారు అత్యంత వాత్సల్యంతో “ఓ కుమారా!” అని పెద్దగా గొంతెత్తి పిలిచినప్పుడు అడవిలోని చెట్లన్నీ తన్మయత్వంతో “ఓయి ఓయి” అంటూ ప్రత్యుత్తర రూపంగా ప్రతిధ్వనులు చేశాయో; అటువంటి సర్వభూతమయుడూ, తపోధనులలో అగ్రేసరుడూ, మహామనీషి అయిన మహానుభావునికి శ్రీ శుకదేవునికి నమస్కారం చేస్తున్నాను.

సీ. కార్యవర్గంబును గారణ సంఘంబు నధికరించి చరించు నాత్మ తత్త్వ
మధ్యాత్మ మనఁబడు నట్టి యధ్యాత్మముఁ దెలియఁజేయఁగఁ జాలు దీప మగుచు
సకల వేదములకు సారాంశమై యేకమై యసాధారణమగు ప్రభావ
రాజకంబైవ పురాణ మర్మంబును గాఢ సంసారాంధకార పటలి

తే. దాఁటఁ గోరెడివారికి దయ దలిర్ప, నే తపోనిధి వివరించె నేర్పడంగ
నట్టి శుకనామధేయ మహాత్మగేయు, విమల విజ్ఞాన రమణీయు వేడ్కఁ గొలుతు. 56

* కార్యకారణాలను వశీకరించుకొని అలరారే ఆత్మతత్త్వాన్నే పెద్దలు ‘అధ్యాత్మం’ అంటారు. అటువంటి అధ్యాత్మతత్త్వాన్ని సమగ్రంగా సాక్షాత్కరింపజేసే దీపం వంటిదీ, సకల వేదాల సారభూతమై నటువంటిదీ; అనన్యమూ, అసామాన్యమూ, మహాప్రభావ సంపన్నమూ, సమస్త పురాణ రహస్యమూ అయిన మహాభాగవతాన్ని సంసారమనే గాఢాంధకార సమూహాన్ని తరించగోరే విపన్నులకు ఉపదేశించిన అపార కృపా పయోధిని, తపోనిధిని, విశేష వివేకజ్ఞానాల పెన్నిధిని, వేదవ్యాసుల పుత్రుణ్ణి, సుధీజన స్తుతి పాత్రుణ్ణి శ్రీశుకుణ్ణి ఆసక్తితో ఆరాధిస్తున్నాను.

క. నారాయణునకు నరునకు, భారతికిని మ్రొక్కి వ్యాసు పదములకు నమ
స్కారము సేసి వచింతు ను, దార గ్రంథంబు దళిత తను బంధంబున్. 57

* నరనారాయణలకు నమస్కారం చేసి, పలుకుల తల్లి భారతీ దేవికి మ్రొక్కి, వ్యాసులవారి పాదపద్మాలకు ప్రణామం కావించి, జనన మరణ బంధాలను పటాపంచలు చేసే పవిత్ర గ్రంథాన్ని, భాగవతాన్ని పలుకుతున్నాను.

వ. అని ఇట్లు దేవతా గురు నమస్కారంబు సేసి యిట్లనియె ‘మునీంద్రులారా! నన్ను మీరలు నిఖిల లోక మంగళంబయిన ప్రయోజనం బడిగితిరి. ఏమిటం గృష్ణ సంప్రశ్నంబు సేయంబడు నెవ్విధంబున

నాత్మ ప్రసన్నంబగు, నిర్విఘ్నయు నిర్హేతుకయునై హరిభక్తి యేరూపంబునం గలుగు నది పురుషులకుఁ బరధర్మంబగు, వాసుదేవునియందు బ్రయోగింపంబడిన భక్తియోగంబు వైరాగ్య విజ్ఞానంబులం బుట్టించు. నారాయణ కథవలన నెయ్యే ధర్మంబులు దగులు వడ వవి నిరర్థకంబులు. అపవర్గ పర్యంతంబయిన పరధర్మంబునకు దృష్టశ్రుత ప్రపంచార్థంబు ఫలంబు గాదు. ధర్మంబునం దవ్యభిచారియైన యర్థంబునకుఁ గామంబు ఫలంబు గాదు. విషయభోగంబైన కామంబున కింద్రియ ప్రీతి ఫలంబు గాదు. ఎంత తడవు జీవించు నంతియ కామంబునకు ఫలంబు, తత్త్వజిజ్ఞాసగల జీవునకుఁ గర్మంబులచేత నెయ్యది సుప్రసిద్ధం బదియు నర్థంబు గాదు; తత్త్వజిజ్ఞాస యనునది ధర్మజిజ్ఞాస యగుటఁ గొందఱు ధర్మంబే తత్త్వంబని పలుకుదురు; తత్త్వవిదులు జ్ఞానంబను పేర నద్వయంబైన యది తత్త్వంబని యెఱుంగుదురు. ఆ తత్త్వంబు నౌపనిషదులచేత బ్రహ్మమనియు, హైరణ్యాగర్భులచేతం బరమాత్మ యనియు, సాత్త్వతుల చేత భగవంతుం డనియును బలుకంబడు. వేదాంత శ్రవణంబున గ్రహింపంబడి జ్ఞానవైరాగ్యంబులతోడం గూడిన భక్తిచేతఁ దత్పరులైన పెద్దలు క్షేత్రజ్ఞుండైన యాత్మయందుఁ బరమాత్మం బొడగందురు. ధర్మంబునకు భక్తి ఫలంబు, పురుషులు వర్ణాశ్రమధర్మ భేదంబులం జేయు ధర్మంబునకు మాధవుండు సంతోషించుటయె సిద్ధి. ఏక చిత్తంబున నిత్యంబును గోవిందు నాకర్ణింపనుం వర్ణింపనుం దగుఁ జక్రాయుధ ధ్యానం బను ఖడ్గంబున వివేకవంతు లహంకారనిబద్ధంబైన కర్మంబు ద్రుంచివైతురు; భగవంతునియందలి శ్రద్ధయు నపవర్గదంబగు తత్కథాశ్రవణాదులయం దత్యంతాసక్తియుఁ బుణ్య తీర్థావగాహన మహత్సేవాదులచే సిద్ధించు. కర్మనిర్మూలన హేతువులైన కమలలోచను కథలం దెవ్వండు రతిసేయు, విన నిచ్చగించు, వాని కితరంబు లెవ్వియు రుచి పుట్టింపనేరవు. పుణ్యశ్రవణకీర్తనుండైన కృష్ణుండు దన కథలు వినువారి హృదయంబులందు నిలిచి శుభంబు లాచరించు; నశుభంబులు పరిహరించు; నశుభంబులు నష్టంబు లయిన, భాగవతశాస్త్రసేవావిశేషంబున నిశ్చల భక్తి యుదయించు; భక్తి గలుగ రజస్తమోగుణ ప్రభూతంబులైన కామ లోభాదులకు వశంబుగాక చిత్తంబు సత్త్వగుణంబునఁ బ్రసన్నం బగుఁ; బ్రసన్న మనస్కుండైన ముక్త సంగుండగు; ముక్త సంగుండైన నీశ్వర తత్త్వజ్ఞానంబు సిద్ధించు; నీశ్వరుండు గానంబడినఁజిజ్జడ గ్రథన రూపంబైన యహంకారంబు భిన్నంబగు; నహంకారంబు భిన్నంబైన నసంభావనాది రూపంబులగు సంశయంబులు విచ్ఛిన్నంబులగు; సంశయ విచ్ఛేదంబైన నవారబ్ధఫలంబులైన కర్మంబులు నిశ్శేషంబులై నశించుం గావున. 58

* అని దేవతలకూ, గురువులకూ ప్రణామం చేసి సూతుడు శౌనకాదులతో ఇలా అన్నాడు- మునీంద్రులారా! సమస్త విశ్వానికీ శ్రేయోదాయకమైన పరమార్థాన్ని చెప్పుమని నన్ను మీరు అడిగారు. దేనివల్ల కృష్ణుని విషయమైన ప్రశ్నలు అడగబడతాయో, దేనివల్ల అంతరాత్మకు ఆనందం చేకూరుతుందో, దేనివల్ల నిర్విరామమూ నిర్వ్యాజమూ అయిన హరిభక్తి ప్రాప్తిస్తుందో అదే మానవులకు పరమధర్మం అవుతుంది. గోవిందునియందు సమర్పితమైన భక్తి యోగం వల్ల వైరాగ్యమూ, ఆత్మజ్ఞానమూ లభిస్తాయి. ముకుందుని కథా సుధలకు దూరమైన ధర్మాలు సారహీనాలు. కైవల్యమే గమ్యస్థానమైన పరమధర్మానికీ ఫలం, కనబడుతూ వినబడుతూ ఉన్న ఈ ప్రాపంచిక సుఖం సుఖం కాదు. ధర్మాన్ని అతిక్రమించని అర్థానికి ఫలం కామం

కాదు. విషయభోగరూపమైన కామానికి ఫలం ఇంద్రియ సంతుష్టి కాదు. జీవించి ఉన్నంత వరకే కామానికి ప్రయోజనం. తత్త్వవిచారం ఉన్నవాడికి నిత్య నైమిత్తిక కర్మల వల్ల లభించే స్వర్గాది సుఖం నిరర్థకం. తత్త్వజిజ్ఞాసకూ ధర్మ జిజ్ఞాసకూ అభేదాన్ని భావించినవారు ధర్మాన్నే తత్త్వ మంటున్నారు. ఐతే తత్త్వవేత్తలైన వారు అద్వయజ్ఞానమే తత్త్వమని తలుస్తారు. ఆ తత్త్వాన్ని ఔపనిషదులు 'బ్రహ్మం' అంటున్నారు. హైరణ్యగర్భులు 'పరమాత్మ' అంటున్నారు. సాత్త్వతులు 'భగవంతుడు' అంటున్నారు. ఉపనిషత్తుల శ్రవణంచేత సంప్రాప్తమై, జ్ఞానంతోనూ, వైరాగ్యంతోనూ కూడిన భక్తి యందు ఆసక్తులైన మహాత్ములు జీవాత్మ యందే పరమాత్మను దర్శిస్తారు. ధర్మానికి భక్తియే ఫలం. వర్ణాశ్రమ ధర్మాలను అనుష్ఠించే మానవ ధర్మానికి భగవంతుడు సంతోషించుటయే ప్రయోజనం. తదేకాయత్తమైన చిత్తంతో నిత్యమూ పురుషోత్తముని లీలలు ఆకర్ణించటం, అభివర్ణించటం అవశ్యకర్తవ్యం. వివేకం గల మానవులు హరి స్మరణమనే కరవాలంతో అహంకార పూరితమైన కర్మబంధాన్ని కోసివేస్తారు. ముకుందుని మీది శ్రద్ధ ముక్తిని ప్రసాదిస్తుంది. పుణ్య తీర్థాలనూ, పుణ్య పురుషులనూ సేవించటం వల్లనే భగవంతుని కథలు వినాలనే ఉత్కంఠ ఉదయిస్తుంది. కర్మ బంధాలను నిర్మూలించే కమలాక్షుని కథలను ఆసక్తితో ఆకర్ణించేవానికి మరేవీ రుచించవు. పుణ్య శ్రవణ కీర్తినుడైన పురుషోత్తముడు తన కథలు ఆలకించే భక్తుల అంతరంగాలలో నివసించి వారికి సర్వశుభాలూ సమకూర్చి అశుభాలు పోకార్చుతాడు. అశుభ పరిహారంవల్ల భాగవతసేవ లభిస్తుంది, భాగవతసేవ వల్ల అచంచలభక్తి ప్రాప్తిస్తుంది. భక్తివల్ల రజస్తమో గుణాలతో చెలరేగిన కామ లోభాదులకు లొంగక చిత్తం సత్త్వగుణాయత్తమై ప్రసన్నమౌతుంది. చిత్తం ప్రసన్నమైతే బంధాలు విడిపోతాయి. బంధరహితుడైన వానికి తత్త్వజ్ఞానం సిద్ధించి ఈశ్వర దర్శనం లభిస్తుంది. ఈశ్వరదర్శనం వల్ల అజ్ఞానరూపమైన అహంకారం దూరమౌతుంది. అహంకారం దూరం కాగానే సమస్త సంశయాలూ పటాపంచలౌతాయి. సంశయాలు తొలగిపోగానే అశేషకర్మలూ నిశ్శేషంగా నశిస్తాయి. అందువల్లనే-

**క. గురుమతులు తపసు లంతః, కరణంబుల శుద్ధి సేయ ఘనతరభక్తిన్**
**హరియందు సమర్పింతురు, పరమానందమున భిన్నభవబంధనులై.** 59

* బుద్ధిమంతులైన తపోధనులు అంతరంగాలను శుద్ధి చేసుకోవటం కోసం సంసారబంధాలను త్రోసివేసి, అచంచలమైన అనురక్తితో కూడిన తమ భక్తినంతా పరమానందంతో భగవంతునికే సమర్పించుకుంటారు.

**త. పరమపూరుషు డొక్కడాఢ్యుఁడు పాలనోద్భవ నాశముల్**
**సొరిదిఁ జేయు ముకుంద పద్మజ శూలి సంజ్ఞలఁబ్రాకృత**
**స్ఫురిత సత్త్వ రజస్తమంబులఁ బొందు నందు శుభస్థితుల్**
**హరి చరాచరకోటి కిచ్చు ననంత సత్త్వ నిరూఢుఁడై.** 60

* ఈ అనంత విశ్వానికి అధీశ్వరుడైన పరమపురుషుడు ఒక్కడే. ఆయనే సత్వరజస్తమోగుణాలను స్వీకరించి హరి, విరించి, రుద్రుడు అనే ముమ్మూర్తులు ధరించి ఈ లోకాలను రక్షిస్తూ, సృష్టిస్తూ, అంతం చేస్తూ ఉంటాడు. అందులో అనంత సత్త్వగుణ సంపన్నుడైన శ్రీహరి చరాచర ప్రపంచానికి అపార శుభాలను అనుగ్రహిస్తాడు.

> వ. మఱియు నొక్క విశేషంబు గలదు; కాష్ఠంబు కంటె ధూమంబు, ధూమంబు కంటెఁ ద్రయీ మయంబయిన వహ్ని యెట్లు విశేషంబగు నట్లు తమోగుణంబుకంటె రజోగుణంబు, రజోగుణంబు కంటె బ్రహ్మప్రకాశంబగు సత్త్వగుణంబు విశిష్టంబగు; తొల్లి మునులు సత్త్వమయుండని భగవంతు హరి నధోక్షజుం గొలిచిరి; కొందఱు సంసారమందలి మేలు కొఱకు నన్యుల సేవింతురు; మోక్షార్థు లయినవారలు ఘోరరూపులయిన భూతపతుల విడిచి దేవతాంతర నింద సేయక శాంతులయి నారాయణ కథల యందే ప్రవర్తింతురు; కొందఱు రాజస తామసులయి సిరియు నైశ్వర్యంబును బ్రజలనుం గోరి పితృభూతప్రజేశాదుల నారాధింతురు. మోక్ష మిచ్చుటం జేసి నారాయణుండు సేవ్యుండు; వేద యాగ యోగ క్రియా జ్ఞాన తపోగతి ధర్మంబులు వాసుదేవ పరంబులు; నిర్గుణుం డయిన పరమేశ్వరుఁడు గలుగుచు లేకుండుచుఁద్రిగుణంబులతోడం గూడిన తన మాయచేత నింతయు సృజియించి గుణవంతుని చందంబున నిజ మాయా విలసితంబు లయిన గుణంబులలోఁ బ్రవేశించి విజ్ఞాన విజృంభితుండై వెలుంగు; నగ్ని యొక్కరుండయ్యుఁబెక్కుమ్రాఁకులందుఁ దేజరిల్లుచుఁ బెక్కండ్రై తోఁచు తెఱంగున విశ్వాత్మకుండైన పురుషుం డొక్కండ తన వలనం గలిగిన నిఖిలభూతంబులందు నంతర్యామి రూపంబున దీపించు; మహాభూత సూక్ష్మేంద్రియంబు లతోడంగూడి గుణమయంబు లయిన భావంబులం దనచేత నిర్మితంబులైన భూతంబులందుఁ దగులు వడక తద్గుణంబు లనుభవంబు సేయుచు; లోకకర్తయైన యతండు దేవ తిర్యఙ్మనుష్యాది జాతులందు లీల నవతరించి లోకంబుల రక్షించు నని మఱియు సూతుం డిట్లనియె. 61

* ఇంకా ఒక విశేషం ఉంది. పృథివీ వికారమైన దారువు కంటే ధూమం విశిష్టమయింది. ధూమం కంటే యజ్ఞసాధకమైన అగ్ని విశిష్టమయింది. అదే విధంగా తమోగుణం కన్నా రజోగుణమూ, రజోగుణం కన్నా పరమాత్మను దర్శింపజేసే సత్త్వగుణమూ ఉత్తమ మయింది. పూర్వం మహర్షులు సత్త్వస్వరూపుడూ, భగవంతుడూ, అధోక్షజుడూ అయిన శ్రీహరిని సేవించారు.

కొంతమంది సంసార సుఖాలను వాంఛించి ఇతరులను ఆరాధిస్తారు. మోక్షాన్ని కోరినవారు మాత్రం వికృతాకారులైన భూతపతులను వదలి, శాంతభావులై ఇతరదేవతలను నిందించకుండా శ్రీహరినే ఆశ్రయిస్తారు. కాని మోక్షప్రదాత అయిన వాసుదేవుడే సేవింప దగ్గవాడు. వేదాలూ, యాగాలూ, యోగాలు క్రియలూ, జ్ఞానాలూ, తపస్సులూ, ధర్మాలూ అన్నీ వాసుదేవ స్వరూపాలే.

త్రిగుణాతీతుడైన భగవంతుడు వ్యక్తావ్యక్త స్వరూపుడై త్రిగుణాత్మకమైన నిజమాయ వల్ల విశ్వమంతా సృష్టించి, సత్త్వరజస్తమో గుణాలను అంగీకరించి, గుణసహితునిలాగా విజ్ఞాన విశేషంతో విరాజిల్లుతాడు.

ఒకే అగ్ని అనేక దారుఖండాలలో విరాజిల్లుతూ పెక్కు రూపాలుగా కన్పిస్తున్నట్లు, విశ్వమయుడైన పరమాత్మ ఒక్కడే తాను సృజించిన ప్రాణులన్నింటియందూ అంతర్యామియై ప్రకాశిస్తుంటాడు. మనస్సువంటి సూక్ష్మేంద్రియాలతో కూడినవాడై గుణాత్మకాలైన భావాల ద్వారా తాను సృష్టించిన ప్రాణులలో చిక్కు పడకుండా ఆ యా గుణాలను అనుభవిస్తుంటాడు. లోకాలను సృష్టించిన ఆ పరమాత్మ దేవ మనుష్య తిర్యగ్యోనులలో లీలావతారుడై జన్మించి లోక రక్షణం చేస్తుంటాడు అని చెప్పి సూతుడు మళ్లీ ఇలా చెప్పసాగాడు.

సీ. **మహదహంకార తన్మాత్ర సంయుక్తుఁడై చారు షోడశ కళాసహితుఁ డగుచుఁ**
**బంచ మహాభూతభాసితుండై శుద్ధ సత్త్వుఁడై సర్వాతిశాయి యగుచుఁ**
**జరణోరు భుజ ముఖ శ్రవణాక్షి నాసా శిరములు నానాసహస్రములు వెలుఁగ**
**నంబర కేయూర హార కుండల కిరీటాదులు పెక్కువే లమరుచుండఁ**

తే. **బురుష రూపంబు ధరియించి పరుఁ డనంతుఁ, డఖిల భువనైక వర్తన యత్నమమర**
**మానితోదార జలరాశి మధ్యమునను, యోగనిద్రా విలాసియై యొప్పుచుండు.** 62

* అనంతుడైన ఆ భగవంతుడు సమస్త భువనాలనూ సృష్టింప దలచి మహదహంకారాలతో శబ్దస్పర్శ రూప రస గంధాలతో కూడి షోడశ కళా పరిపూర్ణుడై పృథివి; జలం, అగ్ని, వాయువు, ఆకాశం అనే పంచభూతాలతో ప్రకాశమానుడై, శుద్ధ సత్త్వ స్వరూపుడై; సర్వేశ్వరుడై, వేలకొలది పాదాలతో, ఊరువులతో, భుజాలతో, ముఖాలతో, చెవులతో, కన్నులతో, శిరాలతో అలరారుతూ వేలకువేలు వస్త్రాలూ, భుజకీర్తులూ, హారాలు, మకరకుండలాలూ, మణికిరీటాలూ ధరించి పరమపురుష స్వరూపంతో యోగనిద్రా ముద్రితుడై మహా సముద్ర మధ్యంలో శయనించి ఉంటాడు.

## -: భగవంతుని యేకవింశత్యవతారములు :-

వ. **అది సకలావతారంబులకు మొదలి గనియైన శ్రీమన్నారాయణ దేవుని విరాజమానంబయిన దివ్యరూపంబు; దానిం బరమ యోగీంద్రులు దర్శింతురు; అప్పరమేశ్వరు నాభికమలంబు వలన సృష్టికర్తలలోన శ్రేష్ఠుండైన బ్రహ్మ యుదయించె; నతని యవయవ స్థానంబులయందు లోకవిస్తారంబులు గల్పింపంబడియె; మొదల నద్దేవుండు కౌమారాఖ్యసర్గంబు నాశ్రయించి బ్రహ్మణ్యుండై దుశ్చరంబైన బ్రహ్మచర్యంబు చరియించె, రెండవ మాఱు జగజ్జననంబు కొఱకు రసాతలగత యయిన భూమి నెత్తుచు యజ్ఞేశుం డయి వరాహదేహంబు దాల్చె;మూఁడవ తోయంబున నారదుండను దేవర్షియై కర్మనిర్మోచకంబైన వైష్ణవతంత్రంబు సెప్పె; నాల్గవ పరి ధర్మభార్యా సర్గంబునందు నరనారాయణాభిధానుండై దుష్కరంబైన తపంబు సేసెఁ బంచమావతారంబునం గపిలుండను సిద్ధేశుండయి యాసురి యను బ్రాహ్మణునకుఁ దత్త్వగ్రామనిర్ణయంబు గల సాంఖ్యంబు నుపదేశించె; నాఱవ శరీరంబున ననసూయాదేవియందు నత్రిమహామునికిం గుమారుండై యలర్కునికిఁ బ్రహ్లాదముఖ్యులకు నాత్మ విద్యఁ దెలిపె; నేడవ విగ్రహంబున నాకూతియందు రుచికి జన్మించి యజ్ఞుండనఁ బ్రకాశమానుండై యమాది దేవతలం గూడి స్వాయంభువ**

మన్వంతరంబు రక్షించె; అష్టమ మూర్తిని మేరుదేవియందు నాభికి జన్మించి యురుక్రముం డనం బ్రసిద్ధుండై విద్వజ్జనులకుఁ బరమ హంస మార్గంబుం బ్రకటించె; ఋషులచేతఁ గోరంబడి తొమ్మిదవ జన్మంబునఁ బృథు చక్రవర్తియై భూమిని ధేనువుం జేసి సమస్త వస్తువులం బిదికె; చాక్షుష మన్వంతర సంప్లవంబున దశమంబయిన మీనావతారంబు నొంది మహీరూపంబగు నావ నెక్కించి వైవస్వత మనువు నుద్ధరించె; సముద్ర మథన కాలంబునం బదునొకండవ మాఱు కమఠాకృతిని మందరాచలంబుఁ దన పృష్ఠకర్పరంబున నేరుపరియై నిలిపె; ధన్వంతరి యను పండ్రెండవ తనువున సురాసుర మథ్యమాన క్షీరపాథోధిమధ్య భాగంబున నమృత కలశహస్తుండై వెడలె; బదుమూఁడవది యయిన మోహినీ వేషంబున నసురుల మోహితులంజేసి సురల నమృతాహారులం గావించె; బదునాలుగవదియైన నరసింహ రూపంబునం గనకకశిపుని సంహరించెఁ; బదునేనవదియైన కపట వామనావతారంబున బలిని బదత్రయంబు యాచించి మూఁడు లోకంబుల నాక్రమించెఁ; బదునాఱవదియైన భార్గవ రామాకృతినిఁ గుపితభావంబుఁ దాల్చి బ్రాహ్మణ ద్రోహులయిన రాజుల నిరువది యొక్క మాఱు వధియించి భూమి నిఃక్షత్త్రంబుఁ గావించె; బదునేడవదియైన వ్యాసగాత్రంబున నల్పమతులయిన పురుషులం గరుణించి వేదవృక్షంబునకు శాఖ లేర్పఱచెఁ; బదునెనిమిదవదైన రామాభిధానంబున దేవకార్యార్థంబు రాజత్వంబునొంది సముద్ర నిగ్రహాది పరాక్రమంబు లాచరించె; నేకోనవింశతి వింశతితమంబులైన రామకృష్ణరూపంబులచే యదువంశంబునందు సంభవించి విశ్వంభరాభారంబు నివారించె; నేకవింశతి తమంబైన బుద్ధనామధేయంబునం గలియుగా ద్యవసరంబున రాక్షస సమ్మోహనంబు కొఱకు మధ్యగయా ప్రదేశంబున జినసుతుండయి తేజరిల్లు; యుగసంధియందు వసుంధరాధీశులు చోరప్రాయులై సంచరింప విష్ణుయశుండను విప్రునికిఁ గల్కి యను పేర నుద్భవింపఁగలండని యిట్లనియె. 63

* అదే అన్ని అవతారాలకూ "మూలవిరా"ట్ట యిన అదినారాయణుని దేదీప్యమానమైన దివ్యరూపం. ఆ దివ్యరూపాన్ని మహాత్ములైన యోగీంద్రులు సందర్శిస్తారు. శ్రీమన్నారాయణ దేవుని నాభికమలం నుంచి సృష్టికర్తలలో ఆద్యుడైన బ్రహ్మదేవుడు ఉద్భవించాడు. శ్రీహరి అవయవ స్థానాల నుంచి సమస్తలోకాలూ ఆవిర్భవించాయి.

ఆదినారాయణదేవుడు మొదట 'కౌమార'మనే స్వర్గాన్ని ఆశ్రయించి "సనకసనంద"నాది రూపాలతో కఠోరమైన బ్రహ్మ చర్యాన్ని ఆచరిస్తూ బ్రహ్మణ్యుడై చరించాడు. రెండవసారి "యజ్ఞ వరాహ" దేహం ధరించి విశ్వసృష్టి నిమిత్తం రసాతలం నుంచి భూమండలాన్ని ఉద్ధరించాడు. మూడవ పర్యాయం "నారదు"డనే దేవర్షిగా జన్మించి మోక్షదాయకమైన వైష్ణవ ధర్మాన్ని బోధించాడు. నాలుగో అవతారంలో ధర్ముడను వానికి మూర్తియందు "నరనారాయణ" స్వరూపుడై ఆవిర్భవించి ఆత్మ శాంతికోసం అపారమైన తపస్సు చేశాడు. ఐదోది "కపి"లావతారం. దేవహూతి కర్దములకు జనించి ఆసురి అనే బ్రహ్మణుడికి తత్త్వనిరూపకమైన సాంఖ్యాన్ని ఉపదేశించాడు. ఆరో అవతారంలో అత్రి అనసూయలకు "దత్తాత్రేయుడై"

పుట్టి అలర్కుడు, ప్రహ్లాదుడు మొదలైనవారికి ఆత్మవిద్య ప్రబోధించాడు. ఏడవ పర్యాయం "యజ్ఞు"డ నే నామంతో రుచికి, ఆకూతికి కుమారుడై, యమాది దేవతలతో స్వాయంభువ మన్వంతరాన్ని సంరక్షించాడు. ఎనిమిదో రూపంలో నాభికి మేరుదేవియందు "ఋషభుడై" ప్రభవించి పండితులకు పరమహంస మార్గాన్ని ప్రకటించాడు. తొమ్మిదో జన్మలో ఋషుల ప్రార్థన మన్నించి "పృథుచక్రవర్తి" యై భూదేవిని గోవు గావించి ఔషధులను పిదికాడు. పదవదైన "మత్స్యావతారం" దాల్చి చాక్షుష మన్వంతరంలో సంభవించిన జలప్రళయంలో నావపై నెక్కించి వైవస్వత మనువును కాపాడాడు. పదకొండో పర్యాయం "కూర్మావతారం" స్వీకరించి మున్నీటిలో మునిగిపోతున్న మందరపర్వతాన్ని నేర్పుగా వీపుపై ధరించాడు. పన్నెండో అవతారంలో "ధన్వంతరి" యై దేవదానవులు మథిస్తున్న పాలసముద్రంలో నుంచి అమృతకలశం హస్తాన ధరించి సాక్షాత్కరించాడు. పదమూడో అవతారంలో "మోహిని" వేషంతో రాక్షసులను వంచించి దేవతలకు అమృతం పంచి పెట్టాడు. పద్నాలుగో సారి "నరసింహమూర్తి"యై ధూర్తుడైన హిరణ్యకశిపుణ్ణి రూపుమాపాడు. పదిహేనో అవతారంలో మాయా "వామను"డై బలిచక్రవర్తిని మూడడుగులు దానమడిగి ముల్లోకాలు ఆక్రమించాడు. పదహారోమారు "పరశురాము"డై రౌద్రాకారంతో బ్రాహ్మణ ద్రోహులైన రాజులను, ఇరవై ఒక్కమారు సంహరించి ధాత్రిని క్షత్రియహీనం కావించాడు. పదిహేడోసారి వేదవ్యాసుడై అల్పప్రజ్ఞులైన వారికోసం వేదశాఖలను విస్తరింపజేశాడు. పద్దెనిమిదో పర్యాయం "శ్రీరాము"డై సముద్రబంధనాది వీరకృత్యాలు ఆచరించి దేవకార్యం నిర్వర్తించాడు. పందొమ్మిదో అవతారంలో "బలరాముడు"గా, ఇరవయ్యో అవతారంలో "శ్రీకృష్ణుడు"గా సంభవించి భూభారాన్ని హరించాడు. ఇరవై ఒకటోసారి "బుద్ధు"డై మధ్య గయా ప్రదేశంలో తేజరిల్లి రాక్షసులను సమ్మోహపరచి పరాజితులను చేస్తాడు. ఇరవై రెండో పర్యాయం "కల్కి" రూపంతో విష్ణుయశుడనే విప్రునికి కుమారుడై జన్మించి కలియుగాంతంలో కలుషాత్ములైన రాజులను కఠినంగా శిక్షిస్తాడు అని పలికి సూతుడు ఇంకా ఇలా అన్నాడు.

**మ. సరసిం బాసిన వేయు కాలువల యోజన్ విష్ణునం దైన శ్రీ**
**కర నానా ప్రకటావతారము లసంఖ్యాతంబు లుర్వీశులున్**
**సురలున్ బ్రాహ్మణ సంయమీంద్రులు మహర్షుల్ విష్ణునంశాంశజుల్**
**హరి కృష్ణుండు బలానుజన్ముఁ డెడ లేఁ; దా విష్ణుఁడౌ నేర్పడన్. 64**

* సరస్సులో నుంచి పలు విధాలైన కాలువలు ప్రవహించిన ప్రకారం. శ్రీమన్నారాయణునిలోనుంచి విశ్వశ్రేయోదాయకాలై అనేకాలైన అవతారాలు ఆవిర్భవిస్తూ ఉంటాయి. భూపతులూ, దేవతలూ, బ్రహ్మర్షులూ, మహర్షులూ మహావిష్ణువు అంశవల్ల పుట్టినవారే. బలరాముని సోదరుడైన శ్రీకృష్ణుడు సాక్షాత్తూ శ్రీహరి అవతారమే. వారిద్దరికీ భేదం లేదు.

**క. భగవంతుం డగు విష్ణుఁడు, జగముల కెవ్వేళ రాక్షస వ్యథ గలుగుం**
**దగ నవ్వేళలఁ దడయక, యుగయుగమునఁ బుట్టి కాచు నుద్యల్లీలన్. 65**

* ఏయే సమయాలలో లోకాలు రాకాసి మూకల వల్ల చీకాకు పాలవుతాయో, ఆయా సమయాలలో, ఆయా యుగాలలో, భగవంతుడైన శ్రీమన్నారాయణుడు లీలావతారుడై ప్రాదుర్భవించి దుష్టశిక్షణం శిష్టరక్షణం చేస్తుంటాడు.

**ఆ. అతిరహస్యమైన హరిజన్మకథనంబు, మనుజుఁ డెవ్వఁడేని మాపు రేపుఁ**
**జాల భక్తితోడఁ జదివిన సంసార, దుఃఖరాశిఁ బాసి తొలఁగిపోవు. 66**

* అత్యంత రహస్యాలైన వాసుదేవుని అవతారగాథలు, ఏ మానవుడు ఉదయమూ సాయంకాలమూ అత్యంత శ్రద్ధాభక్తులతో నిత్యమూ పఠిస్తాడో అతడు దుఃఖమయమైన సంసార బంధాలకు దూరంగా తొలగిపోయి ఆనందం అనుభవిస్తాడు.

**వ. వినుం డరూపుండయి చిదాత్మకుండయి పరఁగు జీవునికిం బరమేశ్వరు మాయాగుణంబులైన మహాదాదిరూపంబులచేత నాత్మస్థానంబుగా స్థూలశరీరంబు విరచితంబైన, గగనంబునందుఁ బవనాశ్రిత మేఘ సమూహంబును, గాలియందుఁ బార్థివధూళిధూసరత్వంబును నేరీతి నారీతి ద్రష్టయగు నాత్మయందు దృశ్యత్వంబు బుద్ధిమంతులు గాని వారిచేత నారోపింపంబడు. నీ స్థూల రూపంబు కంటె నదృష్ట గుణంబయి యశ్రుతంబైన వస్తువగుటంజేసి వ్యక్తంబు గాక సూక్ష్మంబై కరచరణాదులు లేక జీవునికి నొండొక రూపంబు విరచితంబై యుండు; సూక్ష్ముఁడయిన జీవునివలన నుత్క్రాంతి గమనాగమనంబులం బునర్జన్మంబు దోఁచు; నెప్పు డీ స్థూల సూక్ష్మరూపంబులు రెండు స్వరూప సమ్యగ్జ్ఞానంబునం బ్రతిషేధింపంబడు నపుడు నవిద్యం జేసి యాత్మను గల్పింపంబడు ననియుం దెలియు ననియు జీవుండు బ్రహ్మదర్శనంబున కధికారి యగు; దర్శనంబన జ్ఞానైక స్వరూపంబు విశారదుండైన యీశ్వరునిదై క్రీడించుచు నవిద్య యనంబడుచున్న మాయ యుపరతయై యెప్పుడు దాన విద్యారూపంబునం బరిణతయగు నప్పుడు జీవోపాధి యయిన స్థూలసూక్ష్మరూపంబు దహించి జీవుండు కాష్ఠంబు లేక తేజరిల్లు వహ్ని చందంబునం దాన యుపరతుం డయి బ్రహ్మ స్వరూపంబునం బొంది పరమానందంబున విరాజమానుం డగు; నిట్లు తత్త్వజ్ఞులు సెప్పుదు రని సూతుం డిట్లనియె. 67**

* ప్రాకృత రూపరహితుడూ, జ్ఞానస్వరూపుడూ అయిన జీవునికి మహదాదులైన మాయాగుణాల వల్ల ఆత్మస్థానమైన స్థూలశరీరం ఏర్పడింది. గగన మందు మేఘసమూహాన్ని ఆరోపించినట్లూ, గాలి యందు పైకి లేచిన దుమ్ముదుమారాన్ని ఆరోపించినట్లూ అజ్ఞానులైన వారు సర్వదర్శి అయిన ఆత్మయందు దృశ్యత్వాన్ని ఆరోపించుతున్నారు. జీవునికి కనిపించే ఈ స్థూలరూపం కంటే కనిపించనిదీ, వినిపించనిదీ, అవ్యక్తమైనదీ, కరచరణాదులు లేనిదీ అయిన సూక్ష్మరూపం మరొక్కటి ఉంటుంది. సూక్ష్మమైన ఈ జీవాత్మయొక్క ఉత్క్రాంతి గమనాగమనాల వల్ల మళ్లీ మళ్లీ జన్మిస్తున్నట్లు అనిపించుతుంది. స్వస్వరూపజ్ఞానం వల్ల ఈ స్థూల సూక్ష్మరూపాలు రెండూ తొలగిపోతాయనీ, మాయవల్ల ఇవి ఆత్మకు కల్పింపబడతాయనీ గ్రహించినప్పుడు జీవునికి బ్రహ్మసందర్శనానికి అధికారం లభిస్తుంది. సమ్యక్ జ్ఞానమే దర్శనం. సర్వజ్ఞుడైన ఈశ్వరునికి లోబడి క్రీడిస్తూ 'అవిద్య' అనబడే మాయ ఉపశమించి, తాను విద్యగా

పరిణమించినప్పుడు ఉపాధి అయిన స్థూల సూక్ష్మరూపాలను దగ్ధం చేసి, జీవుడు కాష్ఠం లేకుండా ప్రకాశిస్తున్న అగ్నిలాగా తానే బ్రహ్మస్వరూపాన్ని పొంది పరమానందంతో విరాజిల్లుతాడు. ఈ విధంగా తత్త్వవేత్తలు చెబుతున్నారు అని సూతుడు మళ్లీ చెప్పసాగాడు.

**చ. జననము లేక కర్మముల జాడలఁ బోక సమస్తచిత్త వ**
**ర్తనుఁ డగు చక్రికిం గవు లుదార పదంబుల జన్మకర్మముల్**
**వినుతులు సేయుచుండుదురు వేదరహస్యములందు నెందుఁ జూ**
**చిన మఱి లేవు జీవునికిఁ జెప్పిన కైవడి జన్మకర్మముల్. 68**

* భగవంతునకు జన్మం లేదు. ఏ కర్మములూ ఆయన్ని అంటవు. సమస్తజీవుల భావాలలో ఆయన నివసిస్తూ ఉంటాడు. అటువంటి పరాత్పరునికి విద్వాంసులైనవారు జన్మ కర్మములు కల్పించి, ఉదాత్తములైన పదజాలాలతో వర్ణిస్తున్నారు. స్తోత్రాలు చేస్తున్నారు. వాస్తవానికి వేదాలన్నీ వెదకి చూచినా జీవునికి వలె దేవునికి జన్మ కర్మాలు లేనేలేవు.

**మ. భువనశ్రేణి నమోఘలీలఁ దగుచుం బుట్టించు రక్షించు నం**
**త విధిం జేయు, మునుంగఁ డందు; బహుభూత వ్రాతమం దాత్మ తం**
**త్రవిహారస్థితుఁడై షడింద్రియ సమస్త ప్రీతియున్ దవ్వులన్**
**దివి భంగిం గొనుఁజిక్కఁ; డింద్రియములం ద్రిప్పున్ నిబంధించుచున్. 69**

* శ్రీమన్నారాయణుడు ఈ సకల భువన జాలాన్నీ తన అమోఘమైన లీలావిలాసం చేత పుట్టిస్తుంటాడు; రక్షిస్తుంటాడు; అంతం చేస్తూ ఉంటాడు. అంతే కాని తాను మాత్రం ఆ జన్మ మరణాలలో నిమగ్నం కాడు. అనేకమైన ప్రాణి సమూహమందు ఆత్మస్వరూపుడై విహరిస్తుంటాడు. ఎంతో దూరంలో అందకుండా స్వర్గంలాగా ఉండి, జీవుల ఇంద్రియాలకు సంతోషాన్ని సంతరిస్తూ, తాను మాత్రం ఇంద్రియాలకు అతీతుడుగా, నియంతయై ఇంద్రియాలను తన ఇష్టం వచ్చినట్లు త్రిప్పుతూ ఉంటాడు.

**చ. జగదధినాథుఁడైన హరి సంతతలీలలు నామరూపముల్**
**దగిలి మనోవచోగతులఁ దార్కికచాతురి యెంత గల్గినన్**
**మిగిలి కుతర్కవాది దగ మేరలు సేసి యెఱుంగ నేర్చునే ?**
**యగణిత నర్తనక్రమము నజ్ఞుఁ డెఱింగి నుతింప నోఁపునే? 70**

* లోకేశ్వరుడైన శ్రీహరి లీలావిలాసంగా నానావిధాలైన నామరూపాలు ధరిస్తూ ఉంటాడు. కళామర్మజ్ఞుడు కాని అజ్ఞుడు, నాట్యంలోని అందచందాలను అర్థంచేసికొని ఆనందించి అభినందించలేనట్లే, వితర్కాలూ కుతర్కాలూ నేర్చినవాడు తర్క శాస్త్ర పాండిత్యం ఎంత ఉన్నప్పటికీ భగవంతుని సత్యస్వరూపాన్ని, మనస్సుచేత గానీ వాక్కుల చేతగానీ "ఇంత" "అంత" అని గ్రహింపలేడు.

**ఉ. ఇంచుక మాయ లేక మది నెప్పుడుఁ బాయని భక్తితోడ వ**
**ర్తించుచు నెవ్వఁడేని హరి దివ్య పదాంబుజ గంధరాశి సే**

వించు నతం డెఱుంగు నరవింద భవాదులకైన దుర్లభో
దంచితమైన యాహరి యుదార మహాద్భుత కర్మమార్గముల్. 71

* వంచన ఇంచుకైనా లేకుండా, ఎడతెగని భక్తితో ప్రవర్తిస్తూ, నారాయణ చరణారవింద సుగంధాన్ని సేవించే మహాత్ముడు బ్రహ్మాదులకు సైతం అందుకో శక్యం కాని భగవంతుని అత్యద్భుతమైన లీలావిశేషాలను తెలుసుకొంటాడు. ఈ విధంగా చెప్పి సూతుడు శౌనకాది మహర్షులతో ఇలా అన్నాడు.

మ. హరిపాదద్వయభక్తి మీ వలన నిట్లారూఢమై యుండునే
తిరుగం బాఱదు చిత్తవృత్తి హరిపై దీపించి మీలోపలన్
ధరణీ దేవతలార! మీరలు మహాధన్యుల్ సమస్తజ్ఞులున్
హరిచింతన్ మిముఁ జెంద వెన్నఁడును జన్మాంత ర్వ్యథాయోగముల్. 72

* ఓ బ్రహ్మణ్యులారా! మీరు పుణ్యవంతులలో అగ్రగణ్యులు. సర్వం తెలిసిన మునివరేణ్యులు, మీలో శ్రీహరి చరణయుగంపై భక్తి ఇంతగా ఆరూఢమై ఉన్నది. మీ హృదయాలు శ్రీహరియందు ఆసక్తములై ఎడబాటు ఎరుగకుండా ఉన్నాయి. శ్రీమన్నారాయణ సంస్మరణ ప్రభావం వల్ల ఈ చావు పుట్టుకల బాధలు ఎన్నడూ మీ సమీపానికి రాలేవు.

సీ. పుణ్యకీర్తనుఁడైన భువనేశు చరితంబు బ్రహ్మతుల్యంబైన భాగవతము
సకలపురాణరాజము దొల్లి లోక భద్రముగ ధన్యముగ మోదముగఁ బ్రీతి
భగవంతుఁడగు వ్యాసభట్టారకుఁ డొనర్చి శుకుఁ డనియెడు తన సుతునిచేతఁ
జదివించె నింతయు సకల వేదేతిహాసములలోపల నెల్ల సారమైన

ఆ. యీ పురాణమెల్ల నెలమి నా శుకయోగి, గంగ నడుమ నిల్చి ఘన విరక్తి
యొదవి మునులతోడ నుపవిష్టుఁడగు పరీ, క్షిన్నరేంద్రుఁ డడుగఁ జెప్పె వినుఁడు. 73

* శ్రీమద్భాగవతం పుణ్యకీర్తనుడైన లోకేశ్వరుని చరిత్రం. ఇది పరబ్రహ్మ ప్రతిరూపమైంది. సర్వపురాణాలకూ మేలుబంతి. ఈ మహాగ్రంథాన్ని పూర్వం లోక కల్యాణం కోసం భగవంతుడైన వ్యాసభట్టారకుడు అత్యంత పవిత్రంగా, ఆనందమయంగా, అనురాగ పూర్వకంగా రచించాడు. అలా రచించిన ఈ గ్రంథాన్ని సమగ్రంగా ఆయన తన కుమారుడైన శ్రీశుకునిచేత పఠింపచేశాడు. సమస్తవేదాలలో, ఇతిహాసాలలో సారభూతమైన ఈ భాగవతాన్ని ఆ శుకయోగీంద్రుడు గంగానదీ మధ్యలో మునిగణ సహితుడై, అత్యంత విరక్తుడై, ప్రాయోపవిష్టుడై ఉన్న పరీక్షిన్మహారాజు అడుగగా సెలవిచ్చాడు.

వ. కృష్ణుడు ధర్మజ్ఞానాదులతోడం దన లోకంబునకుఁ జనిన పిమ్మటం గలికాలదోషాంధకారంబున నష్టదర్శనులైన జనులకు నిప్పు డిప్పురాణంబు కమల బంధుని భంగి నున్నది. నాఁ డందు భూరితేజుండయి కీర్తించుచున్న విప్రర్షివలన నేఁ బఠించిన క్రమంబున నా మదికి గోచరించి నంతయు వినిపించెద ననిన సూతునకు మునివరుండయిన శౌనకుం డిట్లనియె. 74

* శ్రీకృష్ణభగవానుడు ధర్మజ్ఞానసమేతంగా తన లోకానికి వెళ్లి పోయిన అనంతరం లోకంలో కలియుగం ప్రవేశించింది. కలికాల దోషాలనే గాఢాంధకారంలో అంధప్రాయులై దిక్కు తెలియక చిక్కుపడి ఉన్న మానవులకు ఇప్పుడీ మహాపురాణం సూర్యోదయం లాగా వెలుగులు వెలార్చుతూ ఉంది. ఆనాడు ఆ మునుల ముందు మహా తేజస్వియై శ్రీహరి లీలలు కీర్తిస్తూ ఉన్న బ్రహ్మర్షి శ్రీశుకయోగివల్ల నేను నేర్చుకొన్న విధంగా, నా మనస్సుకు స్ఫురించి నంతవరకు మీకు వినిపిస్తాను- అన్నాడు సూతుడు. అప్పుడు ఆయనతో ముని శ్రేష్ఠుడైన శౌనకుడు ఇలా పలికాడు.

**శా. సూతా! యే యుగవేళ నేమిటికి నెచ్చోటన్ మునిశ్రేష్ఠు నే**
**శ్రోతల్ గోరిరి? యేమి హేతువునకై, శోధించి లోకైక వి**
**ఖ్యాతిన్ వ్యాసుఁడు మున్ను భాగవతముం గల్పించెఁ? దత్పుత్త్రుఁ డే**
**ప్రీతిన్ రాజున కీ పురాణకథఁ జెప్పెం? జెప్పవే యంతయున్.** 75

* సూతమహర్షీ! ఏ యుగంలో ఏ ప్రదేశంలో ఏ ఉద్దేశంతో వ్యాసుల వారిని భాగవతాన్ని రచించమని అర్థించారు? ఆ వ్యాసభగవానుడు ఎందుకోసం ఎంతో ఆలోచించి ఈ మహాగ్రంథాన్ని రచించాడు? ఆయన కుమారుడైన శ్రీశుకుడు ఎటువంటి ఆదరంతో పరీక్షిన్మహారాజుకి భాగవతకథ వినిపించాడు. ఇదంతా మాకు సమగ్రంగా వివరించి చెప్పు.

**వ. బుధేంద్రా! వ్యాసపుత్రుండైన శుకుండను మహాయోగి సమదర్శనుం డేకాంతమతి మాయాశయ నంబువలనం దెలిసిన వాఁడు గూఢుండు మూఢుని క్రియ నుండు నిర స్తభేదుం డదియునుం గాక.** 76

* విద్వన్మణీ! వ్యాసపుత్రుడైన శ్రీశుకుడు విరాగి అనీ, మహాయోగి అనీ, సమదర్శనుడనీ, బ్రహ్మజ్ఞుడనీ, మాయాతీతుడనీ సర్వజ్ఞుడనీ విన్నాము. ఆయన నిగూఢమైన ప్రవర్తన గలవాడవటం చేత మూఢునిలాగా లోకానికి కనిపిస్తాడు. ఆ మహానుభావుని మనస్సుకు ఎటువంటి భేదాలూ అంటవు.

**త. శుకుఁడు గోఁచియు లేక పైఁ జనఁ జూచి తోయములందు ల**
**జ్జకుఁ జలింపక చీర లొల్లక చల్లులాడెడి దేవ క**
**న్యకలు హా శుక, యంచు వెన్కఁ జనంగ వ్యాసునిఁ జూచి యం**
**శుకములన్ ధరియించి సిగ్గున స్రుక్కి రందఱు ధీనిధీ!** 77

* అంతేకాదు. ఒకనాడు కొందరు దేవకన్యలు స్నానాలు చేస్తూ ఉన్నారు. ఆ సమయంలో శ్రీశుకుడు దిగంబరుడై అటుగుండా వెళ్లటం చూచికూడా వారు ఏ మాత్రం చలింపలేదు; సిగ్గుపడలేదు; చీరలు ధరించలేదు; అలాగే ఉల్లాసంగా జల్లులాడుతూ ఉన్నారు. ఇంతలో వ్యాసులవారు "శుకా! శుకా!" అని కుమారుణ్ణి పిలుస్తూ అటువైపు వచ్చేసరికి ఆ దేవకాంతలంతా ఆయన్ని చూచి ఎంతో సిగ్గుతో గబగబా తమతమ చీరల్ని కట్టుకొన్నారు.

వ. మఱియు నగ్నుండుఁ దరుణుండునై చను తన కొడుకుం గని వస్త్రపరిధానం బొనరింపక వస్త్రధారియు వృద్ధుండును నైన తనుం జూచి చేలంబులు ధరియించు దేవ రమణులం గని వ్యాసుండు కారణం బడిగిన వారలు నీ పుత్త్రుండు స్త్రీ పురుషులనెడు భేద దృష్టి లేక యుండు; మఱియు నతండు నిర్వికల్పుండు గాన నీకు నతనికి మహాంతరంబు గలదని; రట్టి శుకుండు కురుజాంగలదేశంబులు సొచ్చి హస్తినాపురంబునఁ బౌరజనంబులచే నెట్లు జ్ఞాతుండయ్యె? మఱియు నున్మత్తుని క్రియ, మూఁగ తెఱంగున, జడుని భంగి నుండు నమ్మహాయోగికి రాజర్షి యైన పరీక్షిన్మహారాజు తోడ సంవాదం బెట్లు సిద్ధించె? కథనీయం బయిన శ్రీభాగవత నిగమవ్యాఖ్యానం బేరీతి సాఁగె? నయ్యోగి ముఖ్యుండు గృహస్థుల గృహంబుల గోవును బిదికినయంత దడవుగాని నిలువంబడం డతండు గోదోహన మాత్రకాలంబు సంచరించిన స్థలంబులు తీర్థంబులగు నండ్రు; పెద్దకాలం బేక ప్రదేశంబున నెట్లుండె? భాగవతోత్తముండైన జనపాలుని జన్మకర్మంబు లే ప్రకారంబులు? వివరింపుము. 78

* అప్పుడు దిగంబరుడూ, నవయువకుడూ అయిన తన తనయుణ్ణి చూసి సిగ్గుపడి చీరలు ధరించకుండా, వస్త్రధారియై వచ్చిన వృద్ధుడైన తనను చూచి లజ్జతో వస్త్రాలు కట్టుకొన్న దేవకాంతల్ని కాంచి ఆశ్చర్యపడి వ్యాసుడు అందుకు కారణ మేమిటని అడిగాడు. అప్పుడు వారు "నీ కుమారుడికి స్త్రీలు పురుషులు అనే భేదభావం లేదు. అంతేకాక ఆయన నిర్వికల్పుడు. మరి నీలో స్త్రీ పురుష భేదభావం ఇంకా పోలేదు. నీకూ ఆయనకూ ఎంతో అంతరముంది'' అని అన్నారట! అటువంటి శ్రీశుకుడు కురుజాంగల దేశాలు ఎలా ప్రవేశించాడు? హస్తినాపురంలోని పౌరులు ఆయన్ని ఎలా గుర్తుపట్టారు? పిచ్చివాడులాగా, మూగవాడులాగ, జడుడులాగా ఉండే ఆ మహర్షికీ, రాజర్షియైన పరీక్షిన్మహారాజుకూ సంభాషణం ఏ విధంగా కుదిరింది? ఎంతో కాలం చెప్పదగినటువంటి శ్రీమన్మహాభాగవత సంహితను వివరించటం ఎలా సాగింది? అంతేగాక మహావిరాగియైన ఆ శుకయోగి గృహస్థుల ఇండ్లలో గోవును పాలు తీసేటంత కాలం మాత్రమే నిలుస్తాడనీ, ఆయన గో దోహన మాత్రకాలం ఏయే చోట్ల నిలుస్తాడో, అవన్నీ పుణ్యతీర్థా లౌతాయనీ పెద్దలు చెప్తారు. అటువంటి మహాను భావుడు అన్ని దినాలు ఒకే ప్రదేశంలో ఎలా ఉన్నాడు? భగవద్భక్తులలో శ్రేష్ఠుడైన ఆ పరీక్షిన్నరేంద్రుడు ఎలా జన్మించాడు? ఏమేమి చేశాడు? దయతో ఈ విశేషాలన్నీ వివరించవలసిందిగా ప్రార్థిస్తున్నాను.

సీ. పాండవ వంశంబు బలము మానంబును వర్ధిల్ల గడిమి నెవ్వాఁడు మనియెఁ!
బరిపంథిరాజులు భర్మాది ధనముల నర్చింతు రెవ్వని యంఘ్రియుగము !
గుంభజ కర్ణాది కురు భట వ్యూహంబు సొచ్చి చెండాడె నే శూరు తండ్రి!
గాంగేయ సైనికాక్రాంత గోవర్గంబు విడిపించి తెచ్చె నే వీరుతాత!

ఆ. యట్టి గాఢ కీర్తి యగు పరీక్షిన్మహారాజు విడువరాని రాజ్యలక్ష్మిఁ
బరిహరించి గంగఁ బ్రాయోపవిష్టుఁడై యసువు లుండ, నేల యడఁగియుండె? 79

* ఆ పరీక్షిత్తు సామాన్యుడు కాడు. తన పరాక్రమంతో పాండవుల వంశమూ, బలమూ, గౌరవప్రతిష్ఠలూ వర్ధిల్లునట్లుగా ప్రవర్తించాడు. ప్రతిపక్ష భూపతులందరూ బంగారురాసులు తీసికొని వచ్చి ఆయన కాళ్లముందు క్రుమ్మరించి ఆయన పాదపద్మాలను సేవించారు. ఆ మహావీరుని తండ్రియైన అభిమన్యుడు అసహాయశూరుడై, ద్రోణ కర్ణాదులచే పరిరక్షితమైన కౌరవసేనా వ్యూహంలో ప్రవేశించి చీల్చి చెండాడాడు. ఆయన తాతయైన అర్జునుడు భీష్మాభిరక్షితమైన కురుసేనావాహినిని పారద్రోలి గోవులను మరలించి తెచ్చాడు. అటువంటి అఖండ కీర్తి సంపన్నుడు పరీక్షిత్తు. ఆ మహారాజు విడవటానికి వీలులేని రాజ్యలక్ష్మిని విడిచి, గంగానదిలో ప్రాయోపవేశం చేసి ప్రాణాలను బిగపట్టుకొని ఎందుకు ఉండవలసి వచ్చింది.

**ఉ. ఉత్తమ కీర్తులైన మనుజోత్తము లాత్మహితంబు లెన్నఁడుం**
**జిత్తములందు గోరరు హసించియు, లోకుల కెల్ల నర్థ సం**
**పత్తియు భూతియున్ సుఖము భద్రముఁ గోరుదు, రన్య రక్షణా**
**త్యుత్తమమైన మేను విభుఁ డూరక యేల విరక్తిఁ బాసెనో? 80**

* ఉత్తమమైన కీర్తి ప్రతిష్ఠలు కల రాజోత్తములు నవ్వులాటకు కూడా ఆత్మ సుఖాన్ని అంతరాత్మలలో అభిలషించరు. అట్టివారు ఎల్లప్పుడూ లోకులందరికి అర్థసంపదా, ఐశ్వర్యమూ, సౌఖ్యమూ, శ్రేయస్సూ చేకూర్చాలని కాంక్షిస్తూ ఉంటారు. పరోపకార పారీణమైన తన దేహాన్ని ఆవిధంగా ప్రాయోపవేశం చేసి పరిత్యజించటానికి ఆ ప్రభువరేణ్యుడు ఎందుకు పాల్పడ్డాడో?

**క. సారముల నెల్ల నెఱుఁగుదు, పారగుఁడవు భాషలందు బహువిధ కథనో**
**దారుఁడవు మాకు సర్వముఁ, బారము ముట్టంగఁ దెలియఁ బలుకు మహాత్మా! 81**

* మహానుభావా! నీవు సమస్త గ్రంథముల సారాన్నీ కనిపెట్టినవాడవు. అనేకభాషలందు పారం ముట్టినవాడవు. నానావిధములైన కథలను చక్కగా చెప్పటంలో కంకణం కట్టినవాడవు. ఇప్పుడు మేము అడిగిన విషయాలన్నీ, ఆ మూలాగ్రంగా మాకు వివరించవలసిందిగా కోరుతున్నాము.

## -: వ్యాసుండు వ్యాకులచిత్తుండై చింతించుట :-

**వ. అని యడిగిన శౌనకాది మునిశ్రేష్ఠులకు సూతుం డిట్లనియెఁ దృతీయంబైన ద్వాపరయుగంబు దీఱు సమయంబున నుపరిచర వసువు వీర్యంబున జన్మించి వాసవి నాఁ దగు సత్యవతి యందుఁ బరాశరునికి హరికళం జేసి విజ్ఞాని యయిన వేదవ్యాసుండు జన్మించి, యొక్కనాఁడు బదరి కాశ్రమంబున సరస్వతీ జలంబుల స్నానాది కర్మంబులం దీర్చి శుచియై పరులు లేని చోట నొంటిఁ గూర్చుండి సూర్యోదయ వేళ నతీతానాగత వర్తమానజ్ఞుండయిన యాఋషి వ్యక్తంబు గాని వేగంబు గల కాలంబునం జేసి యుగధర్మంబులకు భువి సాంకర్యంబు వొందు. యుగయుగంబుల భౌతిక శరీరంబులకు శక్తి సన్నం బగుఁ, బురుషులు నిస్సత్త్వులు ధైర్యశూన్యులు మందప్రజ్ఞు లల్పాయువులు దుర్బలులు నయ్యెద రని తన దివ్య దృష్టిం జూచి సర్వవర్ణాశ్రమంబులకు హితంబు సేయం**

**దలంచి నలువురు హోతలచేత ననుష్ఠింపందగి ప్రజలకు శుద్ధికరంబులయిన వైదిక కర్మంబులగు యజ్ఞంబు లెడ తెగకుండు కొఱకు నేకంబైన వేదంబు ఋగ్యజుస్సామాథర్వణం బులను నాలుగు నామంబుల విభాగించి యితిహాసపురాణంబు లన్నియుఁబంచమ వేదంబని పల్కెనందు. 82**

* అని అడుగుతున్న శౌనకాది మునీంద్రులతో సూతుడు ఇలా అన్నాడు- మూడో యుగమైన ద్వాపరం పూర్తి అవుతుండగా ఉపరిచర వసువు వీర్యం వల్ల ఉద్భవించి "వాసవి" అనబడే సత్యవతికి పరాశరుని వల్ల నారాయణాంశతో వేదవ్యాసుడు జన్మించాడు. ఒకనాడు ఆయన బదరికాశ్రమంలో, సరస్వతీనదిలో స్నానాది నిత్యకృత్యాలు పూర్తిచేసుకొని శుచియై, సూర్యోదయ సమయంలో ఏకాంతస్థలంలో ఒంటరిగా కూర్చున్నాడు. భూత భవిష్య ద్వర్తమానాలు తెలిసిన ఆ మహర్షి అవ్యక్తమైన కాల వేగానికి లోకంలో యుగ ధర్మాలు సాంకర్యం పొందుతాయనీ, పాంచ భౌతిక శరీరాలకు శక్తి సన్నగిల్లుతుందనీ, మానవులు సారహీనులూ, ధైర్యరహితులూ, మంద బుద్ధులూ, అల్పాయుష్కులూ, దుర్బలులూ అవుతారనీ తన దివ్య దృష్టితో తెలుసుకొన్నాడు. అన్ని వర్ణాలకూ, అన్ని ఆశ్రమాలకూ మేలు కలిగించాలనే ఆశయంతో హోత, ఉద్గాత, అధ్వర్యుడు. బ్రహ్మ అనే నలుగురు ఋత్విక్కులచే అనుష్ఠింపదగి ప్రజలకు క్షేమం చేకూర్చే వైదికకర్మలైన యజ్ఞాలు నిరంతరం అవిచ్ఛిన్నంగా సాగటం కోసం ఒకటిగా ఉన్న వేదాన్ని ఋక్కు, యజుస్సు, సామము, అథర్వము అనే నాలుగు వేదాలుగా విభజించాడు. ఇతిహాస పురాణాలన్నీ కలిపి పంచమ వేదంగా పేర్కొన్నాడు.

**సీ. పైలుండు ఋగ్వేదపఠనంబు దొరఁకొనె సామంబు జైమిని సదువుచుండె,**
**యజువు వైశంపాయనాఖ్యుండు గైకొనెఁ దుది నథర్వము సుమంతుఁడు పఠించె**
**నఖిల పురాణేతిహాసముల్ మా తండ్రి రోమహర్షణుఁడు నిరూఢిఁ దాల్చెఁ**
**దమతమ వేద మా తపసులు భాగించి శిష్యసంఘములకుఁ జెప్పిరంత**

**తే. శిష్యు లెల్లను నాత్మీయశిష్యజనుల, కంత బహుమార్గములు చెప్పి యనుమతింపఁ**
**బెక్కు శాఖలు గలిగి యీ పృథివి లోన, నిగమ మొప్పారె భూసుర నివహమందు. 83**

* పైలుడు ఋగ్వేదాన్ని పఠించటం ప్రారంభించాడు. జైమిని సామవేదం చదువసాగాడు. వైశంపాయనుడు యజుర్వేదాన్ని అధ్యయనం చేయటం మొదలు పెట్టాడు. సుమంతుడు అథర్వ వేదాన్ని ఆరంభించాడు. మా తండ్రిగారైన రోమహర్షణుడు పట్టుదలతో సమస్త పురాణాలూ, ఇతిహాసాలూ చదవటం మొదలు పెట్టాడు. ఈ విధంగా తాము నేర్చుకొన్న వేదాలూ, పురాణాలూ, ఇతిహాసాలూ ఆ తపోధనులు తమ శిష్యులకు వేరువేరుగా విభజించి చెప్పారు. ఆ శిష్యులందరూ తమ తమ శిష్యులకు అనేక విధాలుగా ఉపదేశించారు. ఇలా వేదం ఈ మేదిని మీద అనేక శాఖలతో భూసుర సమూహంలో భాసిల్లింది.

**వ. ఇట్లు మేధావిహీనులయిన పురుషులచేత నట్టి వేదంబులు ధరియింపంబడుచున్నవి. మఱియు దీనవత్సలుండయిన వ్యాసుండు స్త్రీశూద్రులకుం ద్రైవర్ణికాధములకు వేదంబులు విన నర్హంబులు గావు. గావున మూఢుల కెల్ల మేలగునని భారతాఖ్యానంబు చేసియు నమ్ముని భూతహితంబునందు**

**దన హృదయంబు సంతసింపకున్న సరస్వతీ తటంబున నొంటియుండి హేతువు వితర్కించుచుఁ దనలో నిట్లనియె. 84**

* ఈ ప్రకారంగా వేదములు విభజింపబడి మందబుద్ధులైన మానవులచే పఠింపబడుతూ ఉన్నవి. స్త్రీలూ, శూద్రులూ, బ్రహ్మ బంధువులూ వేద శ్రవణానికి సమర్థులు కాని కారణంగా, సామాన్యులందరికీ క్షేమం కలగాలని దీనవత్సలుడైన వ్యాసభగవానుడు మహాభారతాన్ని రచించాడు. అప్పటికీ విశ్వశ్రేయస్సు కోసం తాను చేసిన కృషిలో ఆయన హృదయం సంతుష్టం కాలేదు. అందువల్ల ఆ మహర్షి సరస్వతీ నదీతీరంలో ఏకాంతంగా కూర్చుండి తన అసంతుష్టికి హేతువేమిటా అని ఆలోచింపసాగాడు.

**సీ. వ్రతధారినై వేద వహ్నిగురుశ్రేణి మన్నింతు విహితకర్మములఁ గొఱఁత**
**పడకుండ నడపుదు భారత మిషమునఁ బలికితి వేదార్థభావ మెల్ల**
**మునుకొని స్త్రీ శూద్రముఖ్యధర్మము లందుఁ దెలిపితి నేఁ జెల్ల దీనఁ జేసి**
**యాత్మ సంతస మంద దాత్మలో నీశుండు సంతసింపక యున్న జాడ దోఁచె.**

**ఆ. హరికి యోగివరుల కభిలషితంబైన, భాగవత విధంబుఁబలుకనైతి**
**మోసమయ్యెఁ దెలివి మొనయదు మఱచితి, ననుచు వగచుచున్న యవసరమున. 85**

* "కఠోరమైన వ్రతాలెన్నో చేపట్టాను. వేదాలను విభజించాను. అగ్నులను అర్చించాను. ఆచార్యులను గౌరవించాను. శాస్త్రోక్తాలైన కర్మలను ఏ మాత్రం లోపం లేకుండా నడుపుతున్నాను. వేదాల్లోని అర్థాన్నంతా మహాభారతరూపంలో వెల్లడించాను. ఈ రూపంగా స్త్రీ శూద్రాదులు తమ తమ ధర్మ కర్మాలు గుర్తించేటట్లు చేశాను. ఇంత చేసినా అదేమో కాని నా అంతరాత్మకు సంతోషం కలగటం లేదు. నా మనస్సులో ఉన్న పరమేశ్వరుడు సంతుష్టుడు కానట్లే తోస్తున్నది. హేతువేమిటో? అన్నీ చేశాను కాని హరికీ, హరిభక్తులైన పరమ హంసలకూ అత్యంత ప్రియమైన భాగవత స్వరూపాన్ని చెప్పటం మాత్రం మరచిపోయాను. ఎంత పొరపాటు చేశాను! ఎంత తెలివి తక్కువ పని చేశాను! ఎంతటి విస్మృతి పాలయ్యాను!" అని వ్యాసమహర్షి విచారిస్తూ కూర్చున్నాడు.

## -: వ్యాసునికడకు నారదుండు వచ్చుట :-

**సీ. తనచేతి వల్లకీతంత్రీ స్వనంబున సతత నారాయణ శబ్ద మొప్ప**
**నానన సంభూతహరిగీత రవ సుధా ధారల యోగీంద్ర తతులు సొక్కఁ**
**గపిల జటాభార కాంతిపుంజంబుల దిశలు ప్రభాత దీధితి వహింపఁ**
**దనులగ్నతులసికా దామగంధంబులు గగనాంతరాళంబుఁ గప్పికొనఁగ**

**ఆ. వచ్చె మింటనుండి వాసవీ నందను, కడకు మాటలాడఁ గడఁకతోడ**
**భద్రవిమలకీర్తి పొరగుఁ డారూఢ,నయవిశారదుండు నారదుండు. 86**

* ఆ సమయంలో వ్యాసుని దగ్గరకు ముల్లోకాలలో అఖండమైన పేరు ప్రతిష్ఠలు సంపాదించినవాడూ, శాస్త్రపురాణ విశారదుడూ అయిన నారదుడు ఆకాశ మార్గాన విచ్చేశాడు. ఆయన చేతిలో ఉన్న "మహతి"

అనేవీణ తీగలో నుంచి నారాయణనామం నిరంతరంగా ప్రతిధ్వనిస్తూ ఉంది. ఆయన నోటివెంట వెలువడే హరినామ సంకీర్తన మనే అమృతప్రవాహంలో మహాయోగులందరూ పరవశించిపోతున్నారు. ఆయన బంగారు రంగు జటాజూట కాంతి సమూహాలకు దిక్కులన్నీ ప్రభాతకాంతులు వహిస్తున్నాయి. ఆయన ఒంటినిండా ధరించిన తులసిమాలల సుగంధాలు గగనాంగణం నిండా వ్యాపిస్తున్నాయి.

**క. కనియెన్ నారదుఁ డంతన్, వినయైక విలాసు నిగమ విభజన విద్యా**
**జనితోల్లాసున్ భవదుఃఖ నిరాసున్ గురుమనోవికాసున్ వ్యాసున్. 87**

* ఆ విధంగా వచ్చిన నారదమహర్షి వినయశీలుడూ, వేద విభాగ విద్యాసముల్లాసుడూ, సంసార దుఃఖదూరుడూ, మనోవిజ్ఞానసాంద్రుడూ అయిన వ్యాసమునిచంద్రుణ్ణి సందర్శించాడు.

**వ. ఇట్లు నిజాశ్రమంబునకు వచ్చిన నారదు నెఱింగి లేచి వ్యాసుండు విధివత్ క్రమంబునం బూజించిన నతండు లేనగవు నెగడెడి మొగంబు తోడ విపంచికాతంత్రి వ్రేల మీటుచు నిట్లనియె. 88**

* ఈవిధంగా తన ఆశ్రమానికి విచ్చేసిన నారదుణ్ణి చూచి లేచి పారాశర్యుడు యథావిధిగా పూజించాడు. అప్పుడు నారదుడు మధుర మందహాస సుందర వదనారవిందంతో మహతీవిపంచిని మెల్లగా మీటుతూ ఇలా ప్రశ్నించాడు.-

**ఉ. ధాతవు! భారతశ్రుతివిధాతవు! వేదపదార్థజాత వి**
**జ్ఞాతవు! కాముఖ్యరిపుషట్కవిజేతవు! బ్రహ్మతత్త్వ ని**
**ర్ణేతవు! యోగినేతవు! వినీతుఁడ వీవు చలించి చెల్ల రే!**
**కాతరుకైవడిన్ వగవఁగారణ మేమి? పరాశరాత్మజా! 89**

* "పరాశరనందనా! నీవు ధాతవు. పంచమవేదమైన భారతాన్ని రచించావు. వేదాల తాత్పర్యాన్ని చక్కగా తెలుసుకొన్నావు. కామం, క్రోధం, లోభం, మోహం, మదం, మాత్సర్యం అనే అరిషడ్వర్గాన్ని జయించినవాడవు. పరబ్రహ్మ తత్త్వాన్ని నిర్ణయించినవాడవు, యోగులలో అగ్రేసరుడవు, వినయసంపన్నుడవు. ఇటువంటి నీవు ఈ విధంగా చలించిపోయి పిరికివానివలె విచారించటానికి కారణమేమయ్యా? ఆశ్చర్యంగా ఉందే!"

**వ. అనినఁ బారాశర్యుం డిట్లనియె 90**

* అప్పుడు నారదమహర్షితో వ్యాసమహర్షి ఇలా అన్నాడు-

**క. పుట్టితి వజు తనువునఁ జే, పట్టితివి పురాణపురుషు భజనము పదముల్**
**మెట్టితివి దిక్కులం దుది, ముట్టితివి మహాప్రబోధమున మునినాథా! 91**

* "మహామునీ! నీకు తెలియని దేముంది. బ్రహ్మమానస పుత్రుడవు. శ్రీమన్నారాయణ సంకీర్తనాన్ని స్వీకరించావు. దశదిశలా కాలూని సంచరించావు. మహత్తరమైన తత్త్వోపదేశంలో "అందెవేసిన చేయి" అనిపించుకొన్నావు.

**వ. అదియునుం గాక నీవు సూర్యునిభంగి మూఁడు లోకంబులం జరింతువు; వాయువు పగిది నఖిలజనులలోన మెలంగుదువు; సర్వజ్ఞుండ వగుటం జేసి. 92**

* అంతేకాదు. నీవు సూర్యభగవానుడిలాగా ముల్లోకాల్లో సంచరిస్తావు. వాయుదేవుడిలాగా సర్వమానవుల మనస్సులలో మెలగు తుంటావు. సమస్తమూ తెలిసినవాడవు.

**క. నీ కెఱుఁగరాని ధర్మము, లోకములను లేదు బహువిలోకివి నీవున్**
**నాకొఱఁత యెట్టి దంతయు, నాకున్ వివరింపుమయ్య నారద! కరుణన్. 93**

* నీవు ఎరుగని ధర్మమంటూ ఈ లోకాలలో ఏదీ లేదు. అనేకం ఆలోచించినవాడవు. నాకు ప్రాప్తించిన కొరత ఏమిటో నీకు తెలియంది కాదు. ఓ నారదా! ఈ లోపానికి కారణం ఏమిటో దయతో నాకు వివరించి చెప్పు.

**వ. అనిన నారదుం డిట్లనియె. 94**

* వ్యాసమునీంద్రుని మాటలు విని నారదుడు ఇలా అన్నాడు.

**ఉ. అంచితమైన ధర్మచయ మంతయుఁ జెప్పితి, వందులోన నిం**
**చించుక గాని విష్ణు కథ లేర్పడఁ జెప్పవు; ధర్మముల్ ప్రపం**
**చించిన మెచ్చునే గుణవిశేషము లెన్నినఁ గాక నీకు నీ**
**కొంచెము వచ్చుటెల్ల హరిఁ గోరి నుతింపమి నార్యపూజితా! 95**

* "ఆర్యపూజితా! నీవు అశేషాలైన ధర్మవిశేషాలన్నీ వెల్లడించావు. అయితే చేసిన పొరపాటేమిటంటే- అందులో విష్ణుకథలు కొంచెం కొంచెంగా మాత్రమే చెప్పావు. చక్కగా సమగ్రంగా చెప్పలేదు. ఎన్ని ధర్మాలు విస్తరించి చెప్పినా భగవంతుడు సంతోషించడు. వాసుదేవుని గుణవిశేషాలు అందంగా వర్ణించి చెప్పాలి. నీ మనస్సుకు ఈ కొరత రావటానికి కారణం నీవు నీ గ్రంథాలలో హరినామ సంకీర్తనం ప్రధానంగా చేయకపోవటమే.

**మ. హరినామస్తుతి సేయు కావ్యము సువర్ణాంభోజహంసావళీ**
**సురుచిభ్రాజితమైన మానస సరస్స్ఫూర్తిన్ వెలుంగొందు, శ్రీ**
**హరినామస్తుతి లేని కావ్యము విచిత్రార్థాన్వితం బయ్యు శ్రీ**
**కరమై యుండ; ద యోగ్య దుర్మద నదత్కాకోల గర్తాకృతిన్. 96**

* పారాశర్యా! హరినామ సంకీర్తనంతో ప్రకాశించే కావ్యం బంగారు కమలాలతో, కలహంస పంక్తులతో శోభాయమానమైన మానససరోవరం లాగా విరాజిల్లుతుంది. హరినామ సంకీర్తనం లేని కావ్యం చిత్ర విచిత్రాలైన అర్థాలతో కూడినదై కూడా దుర్గంధ భూయిష్ఠమై కాకులు మూగిన ఎంగిలాకుల బురదగుంట లాగా శోభాకరం కాదు.

మ. అపశబ్దంబులఁ గూడియున్ హరి చరిత్రాలాపముల్ సర్వ పా
ప పరిత్యాగము సేయుఁ గావున హరిన్ భావించుచుం బాడుచున్
జపముల్ సేయుచు వీనులన్ వినుచు నశ్రాంతంబు గీర్తించుచుం
దపసుల్ సాధులు ధన్యులౌదురు గదా తత్త్వజ్ఞ! చింతింపుమా. 97

* తత్త్వవిశారదా! నీవే ఆలోచించి చూడు! అపశబ్దాలతో కూడుకొన్నప్పటికీ పవిత్రమైన హరి చరిత్రంతో కూడిన కావ్యాలు సకల పాపాలనూ పటాపంచలు చేస్తాయి. అందువల్ల సజ్జనులైన తపోధనులు శ్రీహరిని భావిస్తూ, శ్రీహరి లీలలు గానం చేస్తూ, ఆయన నామం జపం చేస్తూ, ఆయన కథలు చెవులారా వింటూ, ఎప్పుడూ ఆయననే కీర్తిస్తూ తమ జన్మ సార్థకం చేసికొంటున్నారు.

వ. మునీంద్ర! నిర్గతకర్మంబై నిరుపాధికంబైన జ్ఞానంబు హరిభక్తి లేకున్న విశేషంబుగ శోభితంబు గాదు, ఫలంబు గోరక కర్మంబీశ్వరునకు సమర్పణంబు సేయకున్న నది ప్రశస్తంబై యుండదు; భక్తిహీనంబు లయిన జ్ఞానవాచాకర్మకౌశలంబులు నిరర్థకంబులు; గావున మహానుభావుండవు, యథార్థదర్శనుండవు, సకల దిగంత ధవళకీర్తివి, సత్యరతుండవు, ధృతవ్రతుండవు నగు నీవు నిఖిల బంధమోచనంబు కొఱకు వాసుదేవుని లీలా విశేషంబులు భక్తితోడ వర్ణింపుము; హరివర్ణనంబు సేయక ప్రకారాంతరంబున నర్థాంతరంబులు వీక్షించి తద్వివక్షాకృత రూప నామంబులంజేసి పృథగ్దర్శనుండైన వాని మతి పెనుగాలిచేతం ద్రిప్పంబడి తప్పంజను నావ చందంబున నెలవు సేర నేరదు; కామ్యకర్మంబులందు రాగంబు గల ప్రాకృతజనులకు నియమించిన ధర్మంబులు సెప్పి శాసకుండవగు నీవు వగచుట దగ; దది యెట్టు లనిన వార లదియె ధర్మం బని జుగుప్సితంబు లగు కామ్యకర్మంబులు సేయుచుఁ దత్త్వజ్ఞానంబు మఱతురు; గావున బుద్ధి మోహంబు జనియింపక తత్త్వజ్ఞుండవై వృథా వియోగంబు సేయుమని మఱియు నిట్లనియె. 98

* మహామునీ! కర్మవాసనా రహితమూ, ఉపాధి విరహితమూ అయిన జ్ఞానం విష్ణుభక్తి లేకపోతే విశేషంగా ప్రకాశించదు. ఫలాపేక్షలేని నిష్కామకర్మమయినా భగవదర్పితం కాకపోతే అది ప్రశస్తం కాదు. జ్ఞానం కానీ, వాక్కు కానీ కర్మకానీ అవి యెంత గొప్పవైనా భక్తిలేనినాడు నిరర్థకాలే. అందువల్ల వ్యాసమహర్షీ! నీవు మహానుభావుడవు! సత్యదర్శనుడవు! దిగంత విశ్రాంతమైన యశస్సు కలవాడవు! సత్యనిష్ఠుడవు! నియమ పరాయణుడవు! మానవులందరికీ భవబంధవిముక్తి కోసం భగవంతుడైన మాధవుని లీలలు భక్తి పురస్సరంగా అభివర్ణించు, వాసుదేవుని వర్ణించకుండా వేరొకవిధంగా ఇతర వర్ణనలు చేసేవాని బుద్ధి ప్రచండమైన వాయువేగానికి ప్రవాహంలో పడి కొట్టుకుపోయే పడవలాగా రేవు చేరలేదు. కామ్యకర్మలందు ఆసక్తులైన మూఢమానవులకు నియతాలైన ధర్మాలు చెప్పి అనుశాసించటం నీ వంటి వానికి తగదు. ఎందుకంటే వారు అదే ప్రధానమని భావించి కలుషితాలైన కామ్యకర్మలకు అలవాటు పడి పరమార్థాన్ని విస్మరిస్తారు.

అందువల్ల బుద్ధి పెడదారి పట్టించకుండా వారికి భగవత్తత్త్వాన్ని అందించి వారి వ్యథలు తొలగించు" అని చెప్పి నారదుడు ఇంకా ఇలా పలికాడు-

**చ. ఎఱిఁగెడు వాఁడు కర్మచయ మెల్లను మాని హరి స్వరూపమున్**
**నెఱయ నెఱింగి యవ్వలన నేరుపుఁ జూపు గుణానురక్తుఁడై**
**తెఱకువ లేక క్రుమ్మరుచు దేహధనాద్యభిమాన యుక్తుఁడై**
**యెఱుఁగని వానికిం దెలియ నీశ్వరులీల లెఱుంగఁ జెప్పవే. 99**

* మునీంద్రా ! ప్రాజ్ఞుడైనవాడు కామ్యకర్మ లన్నింటినీ పరిత్యజించి గోవిందుని గుణగణాలందు అనురక్తుడై, హరి స్వరూపాన్ని తెలిసికోవటం కోసం సమర్థమైన ప్రయత్నం చేస్తాడు. అజ్ఞుడైనవాడు వివేకహీనుడై దేహాభిమానం, ధనాభిమానం, రూపాభిమానం కలవాడై సంచరిస్తూ ఉంటాడు. అటువంటి అజ్ఞానికి సైతం ఈశ్వరుని లీలావిలాసాలు తెలిసేటట్లుగా నీవు చెప్పాలి.

**చ. తన కులధర్మమున్ విడిచి దానవవైరి పదారవిందముల్**
**పనివడి సేవ సేసి పరిపాకము వొందక యెవ్వఁడేనిఁ జ**
**చ్చిన మఱు మేన నైన నది సిద్ధి వహించుఁ దదీయ సేవఁ బా**
**సినఁ గుల ధర్మగౌరవము సిద్ధి వహించునె యెన్ని మేనులన్ ! 100**

* ఎవడైతే తన కులధర్మాలను వదలిపెట్టి గోవింద పదారవిందాలను శ్రద్ధాభక్తులతో సేవిస్తూ కృతార్థుడు కాకుండనే మృతి పొందుతాడో అట్టివానికి నష్టమేమీ కలుగదు. అతడు ఆ జన్మలో కాకపోయినా మరుజన్మలో నైనా తన సేవకు ఫలాన్ని పొందుతాడు. అలా కాకుండా విష్ణుసేవా విదూరు డైనవాడు ఎట్టి కులధర్మాలను గౌరవించి ఆచరించినా వాడు ఎన్ని జన్మలెత్తినా కృతార్థుడు కాలేడు.

**వ. అది గావున నెఱుక గలవాఁడు హరిసేవకుం బ్రయత్నంబు సేయందగుఁ; గాలక్రమంబున సుఖ దుఃఖంబులు ప్రాప్తంబు లయినను హరిసేవ విడువం దగదు; దానం జేసి యూర్ధ్వంబున బ్రహ్మ పర్యంతంబు గ్రింద స్థావర పర్యంతంబుఁ దిరుగుచున్న జీవులకు నెయ్యది పొందరా దట్టిమేలు సిద్ధించు కొఱకు హరిసేవ సేయవలయు. హరిసేవకుం డగువాఁడు జననంబు నొందియు నన్యుని క్రియ సంసారంబునఁ జిక్కఁడు; క్రమ్మఱ హరిచరణస్మరణంబుఁ జేయుచు భక్తి రస వశీకృతుండయి విడువ నిచ్చగింపఁడు; మఱియును. 101**

* అందువల్ల తెలిసినవాడు శ్రీహరి చరణ సేవాపరాయణుడు కావటానికి ప్రయత్నం చేయటం మంచిది. కాలానుసారంగా కష్ట సుఖాలు సంప్రాప్తమైనా శ్రీహరి సేవను విడిచిపెట్టటం తగినపని కాదు. ఆ హరిసేవ వల్ల బ్రహ్మలోకం నుండి స్థావరలోక పర్యంతం పరిభ్రమిస్తున్న మానవులకు పొంద శక్యం కాని ఆనందం ఏదైతే కలదో అది తప్పకుండా సిద్ధిస్తుంది. శ్రీహరి సేవాపరాయణుడైనవాడు నీచజన్మం పొందినప్పటికీ సంసారబంధాల్లో చిక్కుకోడు. పూర్వజన్మ సంస్కారం వల్ల భక్తి రస పరవశుడై హరిచరణస్మరణం విడిచిపెట్టకుండా సాగిస్తూనే ఉంటాడు.

సీ. విష్ణుండు విశ్వంబు; విష్ణుని కంటెను వేఱేమియును లేదు; విశ్వమునకు
భవవృద్ధి లయము లా పరమేశుచే నగు; నీ వెఱుంగుదు గాదె నీ ముఖమున
నెఱిఁగింపఁ బడ్డది యేక దేశమున నీ భువన భద్రమునకై పుట్టినట్టి
హరికళాజాతుండ వని విచారింపుము; రమణతో హరిపరాక్రమము లెల్ల

ఆ. వినుతిసేయు మీవు వినికియుఁ జదువును,దాన మతుల నయముఁ దపము ధృతియుఁ
గలిమి కెల్ల ఫలముగాదె పుణ్యశ్లోకుఁ, గమలనాభుఁ బొగడఁ గలిగెనేని. 102

* ఈ విశ్వమంతా విష్ణుమయం. ఈ విశాల ప్రపంచంలో విష్ణువు కంటె అన్యమైనది ఏదీ లేదు. ఆ పరమేశ్వరుని సంకల్పం చేతనే ఈ ప్రపంచానికి సృష్టి స్థితిసంహారాలు ఏర్పడుతుంటాయి. వ్యాస మహర్షీ! నీవు సర్వజ్ఞుడవు! నీకు తెలియంది ఏముంది! నీవే ఒక చోట ఒక విషయాన్ని చెప్పి ఉన్నావు. ఈ విశ్వకల్యాణం కోసం మహావిష్ణువు అంశతో జన్మించానన్న మాట గుర్తు చేసుకో. అందువల్ల నీవు శ్రీహరి లీలావతారాలలోని విక్రమ విశేషాలను సంస్తుతించు మానవుని జ్ఞానానికీ, అధ్యయనానికీ, ఔదార్యానికీ, అనుష్ఠానానికీ, తపస్సుకూ, ధైర్యానికీ, సంపదకూ ప్రయోజనం పుణ్యశ్లోకుడైన పురుషోత్తముణ్ణి స్తుతించటమే.

## -: నారదుని పూర్వజన్మ వృత్తాంతము :-

వ. మహాత్మా! నేను బూర్వకల్పంబునం దొల్లిటి జన్మంబున వేదవాదుల యింటి దాసికిం బుట్టి పిన్ననాఁడు వారలచేఁ బంపంబడి యొక్క వానకాలంబునఁ జాతుర్మాస్యంబున నేక స్థలనివాసంబు సేయ నిశ్చయించు యోగిజనులకుం బరిచర్య సేయుచు. 103

* మహానుభావా! నేను గడచిన కల్పంలో గత జన్మంలో - ఒక దాసీపుత్రుణ్ణి. మా అమ్మ వేదవేత్తలైన వారి ఇండ్లలో పని చేస్తూ ఉండేది. నేను ఆ పెద్దల ఆనతి శిరసా వహిస్తూ వారికి సేవ చేస్తూ ఉండేవాణ్ణి. చాతుర్మాస్యాలలో వానాకాలం నాలుగు నెలలూ ఒకే స్థానంలో నివాసం ఏర్పరచుకొని ఆ మహానుభావులకు పరిచర్యలు చేసేవాణ్ణి.

క. ఓటమితో నెల్లప్పుడుఁ బాటవమునఁ, బనులు సేసి బాలురతో నే
యాటలకుఁ బోక యొక జం, జాటంబును లేక భక్తి సలుపుదు ననఘా! 104

* ఓ పుణ్యచరిత్రా! ఓర్పుతో నేర్పుతో భయభక్తులతో ప్రవర్తించేవాణ్ణి. తోడిపిల్లలతో ఆటపాటలకు పోకుండా, ఎటువంటి ఇతర సంబంధమూ, పెట్టుకోకుండా శ్రద్ధాభక్తులతో ఆ మహాత్ముల్ని ఆరాధించేవాణ్ణి.

క. మంగళ మనుచుచు వారల, యెంగిలి భక్షింతు; వాన కెండకు నోడన్
ముంగల నిలుతును నియతిని, వెంగలి క్రియఁ జనుదు నురు వివేకము తోడన్. 105

* నే నా వేదవేత్తలు భుజించిన అనంతరం భిక్షాపాత్రలలో మిగిలి ఉన్న అన్నాన్ని భక్షించేవాణ్ణి. ఎండనీ వాననీ లేకుండా వారి ముందు నిలబడి, ఎంతో జాగ్రత్తగా మారు మాటడకుండా వారి ఆజ్ఞలు నెరవేర్చేవాణ్ణి.

వ. ఇట్లేను వర్షాకాల శరత్కాలంబులు సేవించితి; వారును నాయందుఁ గృపసేసి రంత. 106

* ఈ ప్రకారంగా వర్షాకాలమూ, శరత్కాలమూ గడచిపోయాయి. ఆ మహానుభావులకు నా మీద అనుగ్రహం కలిగింది.

శా. వారల్ కృష్ణ చరిత్రముల్ చదువఁగా వర్ణింపఁగా బాడఁగా
నా రావంబు సుధారసప్రతిమమై యశ్రాంతమున్ వీనులం
దోరంబై పరిపూర్ణమైన మది సంతోషించి నే నంతటం
బ్రారంభించితి విష్ణుసేవ కితర ప్రారంభదూరుండనై. 107

* ప్రాజ్ఞులైన ఆ బ్రహ్మజ్ఞులు శ్రీకృష్ణుని కథలు చదువుతూ, హరి లీలలు వర్ణిస్తూ హరినామ సంకీర్తనం చేస్తూ ఉండేవారు. అనుక్షణమూ ఆ పుణ్యాత్ముల నోటినుండి వెడలి వచ్చే శబ్దాలు అమృత రసప్రవాహాలై నా వీనులవిందు చేసేవి. నా హృదయం ఆనందంతో నిండిపోయేది. క్రమక్రమంగా నేను ఇతర విషయా లన్నింటికీ స్వస్తి చెప్పి భక్తితో భగవంతుడైన హరిని ఆరాధించటం ఆరంభించాను.

వ. ఇట్లు హరిసేవారతిం జేసి ప్రపంచాతీతుండనై బ్రహ్మరూపకుండనయిన నాయందు స్థూల సూక్ష్మంబయిన యీ శరీరంబు నిజ మాయాకల్పితంబని యమ్మహాత్ములగు యోగిజనుల మూలంబున రజస్తమోగుణపరిహారిణి యయిన భక్తి సంభవించె; నంతఁ జాతుర్మాస్యంబు నిండిన నయ్యోగిజనులు యాత్ర సేయువారలై; రివ్విధంబున. 108

* అప్పుడు నాకు హరిసేవలో అత్యంతమైన ఆసక్తి ఏర్పడింది. అందువల్ల నేను ప్రపంచాతీతుణ్ణి బ్రహ్మ స్వరూపుణ్ణీ అయిన నా యందు, స్థూలమూ సూక్ష్మమూ అయిన ఈ శరీరం కేవలం మాయా కల్పితం అని తెలుసుకున్నాను. మహానుభావులైన ఆ యోగీంద్రుల అనుగ్రహంవల్ల రజస్తమోగుణాలను రూపుమాపే అచంచల భక్తి నాకు సంప్రాప్తించింది. చాతుర్మాస్య వ్రతం అనంతరం ఆ మహాత్ములు మరొక ప్రదేశానికి వెళ్లటానికి ఉద్యుక్తులైనారు.

మ. అపచారంబులు లేక నిత్యపరిచర్యాభక్తి యుక్తుండనై
చపలత్వంబును మాని నేఁగొలువఁగా సంప్రీతులై వారు ని
ష్కపటత్వంబున దీనవత్సలతతోఁ గారుణ్య సంయుక్తులై
యుపదేశించిరి నాకు నీశ్వరరహస్యోదార విజ్ఞానమున్. 109

* ఈ విధంగా ఎట్టి ఒడుదుడుకులూ రాకుండా, చాంచల్యం లేకుండా ముప్పూటలా భక్తితో ఆరాధించినందుకు ఆ సాధుపుంగవులు సంప్రీతులైనారు. ఎంతో సంతోషంతో, ఎంతో కారుణ్యంతో, ఎంతో వాత్సల్యంతో అతిరహస్యమూ, అమోఘమూ అయిన ఈశ్వరవిజ్ఞానాన్ని ఆ మహాత్ములు నాకు ఉపదేశించారు.

వ. ఏనును వారి యుపదేశంబున వాసుదేవుని మాయానుభావంబుఁ దెలిసితి; నీశ్వరునియందు సమర్పితం బయిన కర్మంబు తాపత్రయంబు మానుప నౌషధంబగు; నే ద్రవ్యంబువలన నే రోగంబు జనియించె నా ద్రవ్యం బా రోగంబు మానుపనేరదు; ద్రవ్యాంతరంబులచేత నైన చికిత్స మానుప నోపు; ఇవ్విధంబునఁ గర్మంబులు సంసార హేతుకంబు లయ్యు నీశ్వరార్పితంబులై తాము తమ్ముఁ జెఱుపుకొన నోపియుండు; నీశ్వరునియందుఁ జేయంబడు కర్మంబు విజ్ఞానహేతుకంబై నీశ్వర సంతోషణంబును భక్తి యోగంబునుం బుట్టించు; నీశ్వరశిక్షంజేసి కర్మంబులు సేయువారలు కృష్ణగుణ నామవర్ణన స్మరణంబులు సేయుదురు; ప్రణవపూర్వకంబులుగా వాసుదేవ ప్రద్యుమ్న సంకర్ష ణానిరుద్ధమూర్తి నామంబులు నాలుగు భక్తిం బలికి నమస్కారంబు సేసి మంత్రమూర్తియు మూర్తిశూన్యుండు నయిన యజ్ఞపురుషుం బూజించు పురుషుండు సమ్యగ్దర్శనుం డగు. 110

* నేను కూడా ఆ మహనీయుల మహోపదేశం వల్ల దేవాదిదేవుడైన వాసుదేవుని మాయాప్రభావం తెలుసుకున్నాను. ఈశ్వరార్పణం చేసిన కర్మమే తాపత్రయాన్ని రూపుమాపే పరమౌషధం. లోకంలో ఏ పదార్థం వల్ల ఏ రోగం ఉద్భవించిందో ఆ పదార్థం ఆ రోగాన్ని పోగొట్టలేదు. మరో పదార్థం చేత చికిత్స జరిగితేనే కాని ఆ రోగం శాంతించదు.

ఈ ప్రకారంగా కర్మలు భవబంధ కారణాలే అయినప్పటికీ, ఈశ్వరార్పణం చేయటం మూలాన తమ అస్తిత్వాన్ని కోల్పోతాయి. పరమేశ్వరుణ్ణి ఉద్దేశించి చేసే కార్యం విశిష్టమైన జ్ఞానాన్ని ప్రసాదిస్తుంది. అందువల్ల ఈశ్వరుడు సంతోషించి అచంచల భక్తిని అనుగ్రహిస్తాడు. భగవంతుని ప్రబోధం వల్ల కర్మలు కావించేవారు శ్రీ కృష్ణ గుణ నామాలను కీర్తించటంలో, సంస్మరించటంలో ఆసక్తులౌతారు.

ఓంకారపూర్వకంగా వాసుదేవ - ప్రద్యుమ్న- సంకర్షణ- అనిరుద్ధ నామాలు నాలుగూ భక్తితో ఉచ్చరించి నమస్కరించి చిన్మయ స్వరూపుడైన యజ్ఞేశ్వరుణ్ణి ఆరాధించే మానవుడు సమ్యగ్దర్శనుడై సమదృష్టి కలవాడౌతాడు.

క. ఏ నవ్విధమునఁ జేయఁగ, దానవకుల వైరి నాకుఁ దనయందలి వి
జ్ఞానము నిచ్చెను మదనుష్ఠానము నతఁ డెఱుఁగు, నీవు సలుపుము దీనిన్. 111

* నేను ఈ విధంగా ప్రవర్తించినందువల్ల విష్ణుభగవానుడు విశిష్టమైన ఈశ్వరజ్ఞానాన్ని నాకు అనుగ్రహించాడు. నా నడవడి నారాయణ మూర్తికి తెలుసు. వ్యాసమహర్షీ! నీవు కూడా శ్రీహరిని సంకీర్తించు.

క. మునికులములోన మిక్కిలి, వినుకులు గలవాఁడ వీవు; విభుకీర్తులు నీ
వనుదినముఁ బొగడ వినియెడి జనములకున్ దుఃఖ మెల్ల శాంతిం బొందున్. 112

* మునులలో అగ్రేసరుడవు. ఎంతో ఎరుక కలవాడవు. వినేవారి దుఃఖాలన్నీ దూరమై వారి స్వాంతాలకు శాంతి లభించేటట్లు నీవు చక్కగా వాసుదేవుని యశోగాథలను సంస్తుతించు.

వ. ఇట్లు నారదు జన్మకర్మంబులు విని క్రమ్మఱ వ్యాసుం డిట్లనియె. 113

* ఈ విధంగా నారదమునీంద్రుడు తన పుట్టు పూర్వోత్తరాలు వినిపించగా ఆలకించి, వ్యాసముని నారదుణ్ణి మళ్లీ ఇలా ప్రశ్నించాడు-

**మ. విను మా భిక్షులు నీకు నిట్లు కరుణన్ విజ్ఞానముం జెప్పి పో**
**యిన బాల్యంబున వృద్ధభావమున నీ కేరీతి సంచారముల్**
**సనె? నీ కిప్పుడు పూర్వకల్పమతి యే జాడం బ్రదీపించెఁ? ద**
**త్తనువుం బాసిన చంద మెట్లు చెపుమా దాసీసుతత్వంబుతోన్. 114**

* అయ్యా! మహానుభావులైన ఆ సాధువులు ఎంతో దయతో నీకు ఈశ్వరజ్ఞానాన్ని ఉపదేశించి వెళ్లిపోయారు గదా! ఆ తరువాత నీ బాల్యం ఎలా గడిచింది? పెద్దవాడివై ఎక్కడెక్కడ సంచరించావు? ఈ జన్మలో ఇప్పుడు నీకు పూర్వ జన్మస్మృతి ఏ విధంగా కలిగింది? దాసీపుత్రుడవైన నీవు ఏ ప్రకారంగా నీ దేహాన్ని త్యజించావు? దయచేసి వివరించు.

**వ. అని యిట్లు వ్యాసుం డడిగిన నారదుం డిట్లనియె, దాసీ పుత్రుండ నయిన యేను భిక్షుల వలన హరి జ్ఞానంబు గలిగి యున్నంత. 115**

* వ్యాసులవారు అడిగిన ప్రశ్నలకు నారదులవారు ఇలా సమాధానం చెప్పారు- ఆ విధంగా నేను ఆ సాధుపుంగవుల వల్ల ఈశ్వర పరిజ్ఞానాన్ని పొందిన సంగతి విన్నారు కదా!

**సీ. మమ్ము నేలినవారి మందిరంబునఁ గల పనులెల్లఁ గ్రమమున భక్తిఁ జేసి**
**తన పరాధీనతఁ దలఁపదు; సొలసితి నలసితి నాకొంటి ననుచు వచ్చి**
**మాపును రేపును మా తల్లి మోహంబు సొంపార ముద్దాడు చుంచు దువ్వు**
**దేహంబు నివురు మోదించుఁ గౌఁగిటఁ జేర్చు నర్మిలి న న్నిట్టు లరసి మనుప**

**ఆ. నేను విడిచి పోక యింట నుండితి నయ్య, మోహిఁగాక, యెఱుక మోసపోక**
**మాఱు చింత లేక మౌనినై యేనేండ్ల, వాఁడ నగుచుఁ గొన్ని వాసరములు. 116**

* మా తల్లిది చాలా జాలిగుండె. ఉత్త అమాయకురాలు. తల వంచుకొని యజమానుల గృహాల్లో పనులన్నీ వరుసగా చేసేది. తన దాస్యాన్ని గూర్చి కించిత్తు కూడా కించపడేదికాదు. నేనంటే ఆమెకు పంచప్రాణాలు. "అయ్యో! నా బిడ్డ అలసిపోయాడు. సొలసిపోయాడు, ఆకలి గొన్నాడు." అని అంటూ రేపులూ మాపులూ అల్లారుముద్దుగా ఆదరించి నన్ను పెంచి పెద్దచేసింది. ఎంతో ప్రేమగా మాటిమాటికీ నా బుగ్గలు ముద్దుపెట్టుకొనేది. నా జుట్టు దువ్వేది. నాఒళ్లు నిమిరేది. నన్ను ఆప్యాయంగా అక్కున చేర్చుకొనేది. ఈ విధంగా తల్లి ప్రేమతో పెరిగిన నేను ఆమెను విడిచి పోలేక ఇంట్లోనే ఉండిపోయాను. అయితే నేను సంసారవ్యామోహంలో చిక్కుబడలేదు. జ్ఞానాన్ని కోల్పోలేదు. విషయాంతర వ్యాసక్తుణ్ణి కాలేదు. పంచ వర్షప్రాయం గల నేను అలాగే మా అమ్మను కనిపెట్టుకొని మౌనంగా ఆ బ్రాహ్మణుల ఇండ్లలో కొన్నాళ్లు గడిపాను.

క. సదనము వెలువడి తెరువునఁ, జెదరక మా తల్లి రాత్రిఁ జీఁకటివేళన్
మొదవుం బిదుకఁగ నొకఫణి, పదభాగముఁ గఱచెఁద్రొక్కఁబడి మునినాథా! 117

* వ్యాసమునీంద్రా! ఒకనాడు ఏమి జరిగిందంటే మా అమ్మ రాత్రివేళ కటిక చీకటిలో ఆవును పాలు పిండటం కోసం ఇల్లు వదలి బయటికి వెళ్లింది. త్రోవలో ఆమె ఒకపామును త్రొక్కింది. ఆ సర్పం ఆమె పాదాన్ని కరచింది.

క. నీలాయతభోగఫణా, వ్యాళానలవిష మహోగ్రవహ్నిజ్వాలా
మాలావినిపాతితయై, వ్రాలెన్ నను౯ గన్నతల్లి వసుమతి మీఁదన్. 118

* అత్యంత భయంకరమైన ఆ త్రాచుపాము కోరలలోని విషాగ్ని జ్వాలల వల్ల అమ్మ నేల మీద పడిపోయింది.

ఉ. తల్లి ధరిత్రిపై నొఱఁగి తల్లడపాటునుఁ జెంది చిత్తముం
బల్లటిలంగఁ బ్రాణములు వాసినఁ జూచి కలంగ కేను నా
యుల్లములోన మోహరుచి నొందక సంగము వాసె మేలు రా
జిల్లె నటంచు విష్ణుపదచింత యొనర్పఁగ బుద్ధి సేయుచున్. 119

* అలా మా అమ్మ క్రిందపడి విలవిల తన్నుకొని వివశురాలై ప్రాణాలు విడిచింది. అప్పుడు నేను ఆ విషాదదృశ్యాన్ని చూచి ఏ మాత్రం కలవరపడకుండా, నాచిత్తం శోకాయత్తం కాకుండా, నిబ్బరించుకొని నిలబడ్డాను. 'మంచిది; బంధం తెగిపోయింది' అనుకొన్నాను. ఇక నాకు హరిచరణస్మరణమే అవశ్యకర్తవ్యమని నిర్ణయించుకొన్నాను.

వ. ఉత్తరాభిముఖుండనై యేను వెడలి జనపదంబులుఁ బురంబులు బట్టణంబులుఁ గ్రామంబులుఁ బల్లెలు మందలుఁ గిరాత పుళింద నివాసంబులు నుపవనంబులుఁ జిత్రధాతువిచిత్రితంబు లయిన పర్వతంబులు సమద కరికర విదళిత శాఖలు గల శాఖులును, నివారిత పథిక జనశ్రమాతిరేకంబులైన తటాకంబులు బహువిధ విహంగ నినద మనోహరంబులై వికచారవింద మధుపాన పరవశ పరిభ్రమద్భ్రమర సుందరంబులైన సరోవరంబులు దాఁటి చనుచు క్షుత్పిపాసా సమేతుండనై యొక్క నదీహ్రదంబునఁ గ్రుంకులిడి శుచినై నీరు ద్రావి గతశ్రముండనై 120

* ఆ విధంగా అనుకొని నేను ఉత్తర దిక్కుగా బయలుదేరి పల్లెలూ, పట్టణాలూ, నగరాలూ, జనపదాలూ, గ్రామాలూ, పేటలూ, భిల్లవాటికలూ దాటుకొంటూ; ఆటవికులు నివసించే చిట్టడవులూ, రంగు రంగుల ధాతువులతో కూడిన పర్వతాలూ, మదించిన ఏనుగులు కదలించే విదలించే కొమ్మలు గల మహావృక్షాలూ, బాటసారుల మార్గాయాసాన్ని పోగొట్టే తటాకాలూ, నానావిధాలైన పక్షుల కలకలా రావాలతో రమణీయమై వికసించిన తామరపూలలోని మకరందాన్ని త్రాగి పరవశించి పరిభ్రమించే గండుతుమ్మెదలతో నిండిన సరస్సులూ అతిక్రమిస్తూ ముందుకు సాగాను. అప్పుడు నాకు ఆకలీ దప్పికా అతిశయించాయి. ఒక యేటి మడుగులో శుభ్రంగా స్నానం చేసి నీరు త్రాగి నా మార్గాయాసాన్ని తగ్గించుకొన్నాను.

క. సాలావృక కపిభల్లుక, కోలేభ లులాయ శల్య ఘూక శరభ శా
ర్దూల శశ గవయ ఖడ్గ, వ్యాళాజగరాదిభయద వనమధ్యమునన్. 121

* తోడేళ్ళూ, కోతులూ, ఎలుగుబంట్లూ, వనవరాహాలూ, ఏనుగులూ, మహిషాలూ, ఏదుపందులూ, గుడ్లగూబలూ, శరభమృగాలూ, శార్దూలాలూ, కుందేళ్లూ, మనుబోతులూ, ఖడ్గమృగాలూ, క్రూరసర్పాలూ, కొండచిలువలూ నిండిన భయంకరారణ్యాల గుండా మళ్లీ ప్రయాణించాను.

వ. దుస్తరంబు లైన నీలవేణు కీచక గుల్మ లతా గహ్వరంబుల పొంత నొక్క రావిమ్రాని డగ్గఱఁ గూర్చుండి యే విన్న చందంబున నా హృదయగతుం బరమాత్మ స్వరూపు హరిం జింతించితి.122

* దాట శక్యం కాని నీలితుప్పలతో కూడిన వెదురు పొదరిండ్లు దగ్గరగా ఒక రావిచెట్టు క్రింద కూర్చున్నాను. నేను విన్న విధంగా నా హృదయంలో పదిలం చేసికొన్న పరమాత్మ స్వరూపుడైన హరిని ధ్యానం చేశాను.

శా. ఆనందాశ్రులు గన్నులన్ వెడల రోమాంచంబుతోఁ దత్పద
ధ్యానారూఢుఁడ నైన నా తలఁపులో నద్దేవుఁడుం దోఁచె నే
నానందాబ్ధిగతుండనై యెఱుఁగ లేనైతిన్ నను న్నీశ్వరున్
నానాశోకహమైన యత్తనువు గానన్ లేక య ట్లంతటన్. 123

* నా కన్నుల్లో ఆనందబాష్పాలు పొంగిపొరలాయి. నా శరీరమంతా పులకించిపోయింది. ఆ భక్తి పారవశ్యంలో భగవంతుని చరణాలు ధ్యానిస్తున్న నా చిత్తంలో ఆ దేవదేవుడు సాక్షాత్కరించాడు. నేను కన్నులు తెరచి చూచేసరికి భక్తుల దుఃఖాలను పటాపంచలు చేసే పరమేశ్వరుని స్వరూపం అదృశ్యమైంది.

వ. లేచి నిలుచుండి క్రమ్మఱ నద్దేవుని దివ్యాకారంబుఁ జూడ నిచ్ఛించుచు హృదయంబున నిలుపుకొని యాతురుండునుంబోలెఁ జూచియుం గానలేక నిర్మనుష్యంబైన వనంబునం జరియించుచున్న నన్ను నుద్దేశించి వాగగోచరుండైన హరి గంభీర మధురంబులైన వచనంబుల శోకం బుపశమింపం జేయు చందంబున నిట్లనియె. 124

* నేను విచారంతో లేచి నిల్చున్నాను. మళ్లీ ఆ దేవదేవుని దివ్యస్వరూపాన్ని దర్శించాలనే ఉత్కంఠతో నిర్మానుష్యమైన ఆ అరణ్యంలో అటూ ఇటూ తిరిగాను. కాని నాకు తిరిగి ఈశ్వర సాక్షాత్కారం కలుగలేదు. అంతలో వాచామగోచరుడైన శ్రీహరి మధుర గంభీర వచనాలు నాశోకాన్ని ఉపశమింపజేస్తూ నన్ను ఓదారుస్తూ ఈ విధంగా వినవచ్చాయి-

ఉ. ఏల కుమార! శోషిలఁగ? నీజననంబున నన్నుఁ గానఁగా
జాలవు నీవు కామముఖషట్కము నిర్దళితంబు సేసి ని

**ర్మూలితకర్ములైన మునిముఖ్యులు గాని కుయోగి గానఁగాఁ**
**జాలఁడు; నీదు కోర్కి కొనసాగుటకై నిజమూర్తిఁ జూపితిన్.** 125

* నాయనా! ఎందుకు వృథాగా ఆయాసపడతావు. నీవు ఎంత ప్రయత్నించినా ఈ జన్మలో నన్ను దర్శించలేవు. కామక్రోధాది అరిషడ్వర్గాన్ని జయించి నిర్మూలితకర్ములైన ముని ముఖ్యులే నన్ను చూడ గల్గుతారు. అంతే కాని జితేంద్రియులు కానివారు నన్ను దర్శించలేరు. అయినా నీ మనసులోని కోరికను కొనసాగించటం కోసం క్షణ కాలం నా స్వరూపాన్ని నీకు స్ఫురింపజేశాను.

**క. నావలని కోర్కి యూరక, పోవదు; విడిపించు దోషపుంజములను మ**
**త్సేవం బుట్టును వైళము, భావింపఁగ నాదు భక్తి బాలక! వింటే.** 126

* వత్సా! నా యందు లగ్నమైన నీ కోరిక వ్యర్థం కాదు. నీ సమస్త దోషాలూ దూరమౌతాయి. నన్ను సేవించటం వల్ల నాభక్తి అచిరకాలంలోనే నీమదిలో పదిలమౌతుంది.

**క. నాయందుఁ గలుగ నీ మది, వాయదు జన్మాంతరముల బాలక! నీ వీ**
**కాయంబు విడిచి మీదట, మా యనుమతిఁ బుట్టఁగలవు మద్భక్తుఁడవై.** 127

* కుమారా! నా యందు లగ్నమైన నీ హృదయం వచ్చే జన్మలో కూడా నన్ను అంటిపెట్టుకొని ఉంటుంది. నీవు ఈ దేహాన్ని వదలిన అనంతరం నా అనుజ్ఞతో మళ్లీ జన్మలో నా భక్తుడివై ఉద్భవిస్తావు.

**మ. విను మీ సృష్టి లయంబు నొంది యుగముల్ వేయైన కాలంబు యా**
**మినియై పోయెడిఁ బోవఁగా గలుగుఁజూ మీదం బునః సృష్టి యం**
**దు నిరూఢస్మృతితోడఁ బుట్టెదవు; నిర్దోషుండవై నా కృపన్**
**ఘనతం జెందెదు శుద్ధ సాత్త్వికులలో గణ్యుండవై యర్భకా!** 128

* విను చిట్టితండ్రీ! ఈ సృష్టి యావత్తూ లయమైపోయిన పిమ్మట వేయి యుగాలు చీకటి రాత్రిగా గడిచిపోతుంది. అప్పుడు తిరిగి సృష్టి ఏర్పడుతుంది. నీవు మళ్లీ జన్మిస్తావు. నీకు పూర్వస్మృతి ఉంటుంది. నా అనుగ్రహం వల్ల నీ దోషాలన్నీ నశించి సత్య గుణసంపన్నులైన హరిభక్తులలో అగ్రగణ్యుడవై పేరెన్నిక గంటావు.

**వ. అని యిట్లాకాశంబు మూర్తియు, ఋగ్వేదాదికంబు నిశ్వాసంబునుగా నొప్పి, సర్వనియామకంబైన మహాభూతంబు పలికి యూరకున్న నేను మస్తకంబు వంచి మ్రొక్కి, తత్కరుణకు సంతసించుచు మదంబు దిగనాటి, మచ్చరంబు విడిచి, కామంబు నిర్జించి, క్రోధంబు వర్జించి, లోభమోహంబుల వెడల నడిచి, సిగ్గు విడిచి, యనంతనామంబులు పఠించుచుఁ, బరమభద్రంబు లయిన తచ్చరిత్రంబులం జింతించుచు, నిరంతర సంతుష్టుండనై కృష్ణుని బుద్ధి నిలిపి, నిర్మలాంతః కరణంబులతోడ విషయ విరక్తుండనై కాలంబున కెదురు సూచుచు భూమిం దిరుగుచు నుండునంతం గొంతకాలంబునకు మెఱుంగు మెఱసిన తెఱంగున మృత్యువు దోఁచినం బంచభూతమయంబయి**

**కర్మ స్వరూపంబైన పూర్వదేహంబు విడిచి హరికృపావశంబున శుద్ధ సత్త్వమయంబైన భాగవతదేహంబు సొచ్చితి; నంతం ద్రైలోక్యంబు సంహరించి ప్రళయకాల పయోరాశిమధ్యంబున శయనించు నారాయణమూర్తి యందు నిదురవోవ నిచ్చగించు బ్రహ్మనిశ్వాసంబు వెంట నతని లోపలం బ్రవేశించితి; నంత సహస్రయుగ పరిమితంబయిన కాలంబు సనిన లేచి లోకంబులు సృజియింప నుద్యోగించు బ్రహ్మనిశ్వాంబు వలన మరీచి ముఖ్యులగు మునులును నేనును జన్మించితిమి; అందు నఖండిత బ్రహ్మచర్యుండనై యేను మూడు లోకంబుల బహిరంతరంబులందు మహావిష్ణుని యనుగ్రహంబున నడ్డంబు లేక యీశ్వరదత్తయై బ్రహ్మాభివ్యంజకంబులైన సప్త స్వరంబులు దమయంతన మ్రోయుచున్న యీ వీణాలాపన రతింజేసి నారాయణ కథాగానంబు సేయుచుఁ జరియించుచుందు. 129**

* ఈ విధంగా చెప్పి విరమించిన సర్వవ్యాపి, సర్వనియంత, వేదమయం బయిన ఆ మహాభూతానికి నేను తలవంచి మ్రొక్కాను. భగవంతుని అనుగ్రహానికి ఆనందించాను. మదాన్ని వీడాను. మాత్సర్యాన్ని దిగనాడాను. కామాన్ని నిర్జించాను. క్రోధాన్ని వర్జించాను. లోభాన్ని, మోహాన్ని పారద్రోలాను. సంకోచం లేకుండా గొంతెత్తి అనంతుని అనంతనామాలు ఉచ్చరిస్తూ, పరమపవిత్రాలయిన హరి చరిత్రాలను స్మరిస్తూ, నిత్యసంతుష్టుడినై వాసుదేవుని హృదయంలో పదిలపరచుకొన్నాను. ప్రశాంతమైన అంతఃకరణంతో వైరాగ్యాన్ని అవలంబించి కాలాన్ని నిరీక్షిస్తూ తిరుగసాగాను. కొన్నాళ్లకు మెరుపు మెరిసినట్లుగా మృత్యుదేవత నా ముందు ప్రత్యక్షమయింది. అప్పుడు నేను పంచభూతాత్మకమైన పూర్వదేహాన్ని పరిత్యజించి భగవంతుని దయవల్ల సత్త్వగుణాత్మకమైన భాగవతదేహంలో ప్రవేశించాను. తర్వాత కల్పాంతకాలంలో ఏకార్ణవ జలమధ్యంలో శ్రీమన్నారాయణుడు శయనించి ఉన్న సమయాన బ్రహ్మదేవుని విశ్వాసంతో పాటు నేనూ భగవానుని ఉదరంలో ప్రవేశించాను. వెయ్యి యుగాలు గడిచిపోయిన తర్వాత లేచి లోకాలు సృష్టించబోయే బ్రహ్మదేవుని నిశ్వాసం నుంచి మరీచి మొదలయిన మునులూ నేనూ జన్మించాము. ఈ జన్మలో నేను అస్ఖలిత బ్రహ్మచారినై, భగవంతుని అనుగ్రహం వల్ల త్రిలోక సంచారినై, పరబ్రహ్మ ప్రతిపాదకాలైన సప్తస్వరాలు తమంతతామే మ్రోగే ఈ "మహతీ" వీణమీద విష్ణు కథలు గానం చేస్తూ ఇలా విహరిస్తున్నాను.

**ఆ. తీర్థపాదుఁడయిన దేవుండు విష్ణుండు, దన చరిత్ర నేను దవిలి పాడఁ
జీరఁబడ్డవాని చెలువున నేతెంచి, ఘనుఁడు నా మనమునఁ గానవచ్చు. 130**

* తీర్థపాదుడైన దేవాది దేవుడు వాసుదేవుడు, నేను ఆయన లీలలను గానం చేసినప్పుడు పేరు పెట్టి పిలిచినట్లుగా వచ్చి నా మనస్సులో అచ్చు గ్రుద్దినట్లు కానవచ్చేవాడు.

**క. విను మీ సంసారం బను, వననిధిలో మునిఁగి కర్మవాంఛలచే వే
దనఁ బొందెడు వానికి వి, ష్ణుని గుణవర్ణనము తెప్ప సుమ్ము మునీంద్రా! 131**

* ఓ వ్యాసమునీంద్రా! ఈ సంసార సముద్రంలో మునిగి తేలుతూ విషయవాంఛలచే క్రిందుమీదై బాధపడేవానికి గోవింద గుణకీర్తనం గట్టు చేర్చే తెప్పవంటిది.

చ. యమ నియమాది యోగముల నాత్మ నియంత్రిత మయ్యుఁ గామరో
షముల బ్రచోదితంబ యగు శాంతి వహింపదు విష్ణుసేవచేఁ
గ్రమమున శాంతిఁ గైకొనిన కైవడి నాదు శరీర జన్మ క
ర్మముల రహస్య మెల్ల మునిమండన, చెప్పితి నీవు గోరినన్. 132

* యమమూ, నియమమూ, ప్రాణాయామమూ, ప్రత్యాహారమూ మొదలైన అష్టాంగముల ద్వారా మనస్సును ఎంత కట్టుదిట్టం చేసుకొన్నప్పటికీ కామమూ, రోషమూ మొదలైన వానిచే అది మాటి మాటికీ రెచ్చిపోతూనే ఉంటుంది. కాని శాంతించదు. అట్టి శాంతి వాసుదేవుని సేవ వల్లనే క్రమంగా లభిస్తుంది. మునికులభూషణా! నా పుట్టు పూర్వోత్తరాల రహస్యమంతా నీవు కోరిన ప్రకారం నీకు వివరించి చెప్పాను.

వ. అని యిట్లు భగవంతుం డగు నారదుండు వ్యాసమునీంద్రుని వీడ్కొని, వీణ వాయించుచు యదృచ్ఛామార్గంబునం జనయె నని సూతుం డిట్లనియె. 133

* అని ఈ ప్రకారంగా పరమపూజ్యుడైన బ్రహ్మమానస పుత్రుడైన నారదుడు బాదరాయణ మునీంద్రునితో పలికి వీడ్కోలందుకొని వీణను మ్రోగించుకుంటూ వెళ్లిపోయాడు. అనంతరం సూతముని శౌనకాదులతో ఇలా అన్నాడు.

క. వాయించు వీణ నెప్పుడు, మ్రోయించు ముకుందగీతముల జగములకుం
జేయించుఁ జెవుల పండువు;, మాయించు నఘాళి నిట్టి మతి మఱి గలఁడే. 134

* సర్వదా మహతీ విపంచి వాయిస్తూ, ముకుందగీతాలు మ్రోయిస్తూ, సకల జగత్తులకూ వీనులవిందు చేయిస్తూ, లోకుల పాప సమూహాలను మాయిస్తూ, సంచరించే మేటి భక్తుడు నారదమహర్షి. ఆయనకు ఆయనే సాటి.

వ. అని నారదుం గొనియాడిన సూతునిం జూచి నారదు మాటలు విన్న వెనుక భగవంతుండైన బాదరాయణుం డేమి సేసె నని శౌనకుం డడిగిన సూతుం డిట్టనియె; బ్రహ్మ దైవత్య యైన సరస్వతి పడమటి తీరంబున ఋషులకు సత్త్ర కర్మవర్ధనంబై బదరీ తరుషండమండితంబయి "శమ్యాప్రాసం" బనం బ్రసిద్ధంబగు నాశ్రమంబు గలదు. అందు జలంబుల వార్చి కూర్చుండి వ్యాసుండు దన మది దిరంబు సేసికొని భక్తి యుక్తం బయిన చిత్తంబునం బరిపూర్ణుండయిన యీశ్వరుం గాంచి యీశ్వరాధీన మాయావృతంబైన జీవుని సంసారంబుఁ గని జీవుండు మాయచేత మోహితుండయి గుణవ్యతిరిక్తుండయ్యు మాయాసంగతిం దాను ద్రిగుణాత్మకుండని యభి మానించుచు ద్రిగుణత్వాభిమానంబునం గర్తయు భోక్తయు నను ననర్థంబు నొందుననియు; నయ్య నర్థంబునకు నారాయణభక్తి యోగంబు గాని యుపశమనంబు వేఱొకటి లేదనియు నిశ్చయించి,135

* అంటూ నారదమహర్షిని స్తుతించే సూతుణ్ణి చూచి "నారదుని మాటలు ఆలకించిన అనంతరం వ్యాసభగవానుడు ఏమి చేశాడో చెప్పు"మని శౌనకుడు అడగ్గా సూతుడు ఇలా అన్నాడు.

బ్రహ్మదేవతాకమైన సరస్వతీ నది పడమటి తీరాన ఋషులు యజ్ఞాలు చేసుకోటానికి అనుకూలమై బదరీ తరుపంక్తులలో నిండి "శయ్యాప్రాస" మనే ఆశ్రమం ఉంది. వ్యాసుడు ఆ ఆశ్రమానికి వెళ్ళి తన చిత్తంలో భగవంతుణ్ణి దర్శించాడు. ఈశ్వరుని మాయ ఆవరించి ఉన్న జీవుని సంసారాన్ని ఆలోకించాడు. మాయా మోహితుడైన జీవుడు త్రిగుణాతీతుడై కూడా మాయా ప్రభావం వల్ల గుణాభిమానం కలవాడై తానే కర్తనూ భోక్తనూ అని అనర్థభావన చేస్తాడనీ, ఈ అనర్థాన్నీ ఉపశమింప చేయటానికి 'హరిభక్తి' అనే యోగం తప్ప మరొకటి ఏదీ లేదనీ నిశ్చయించాడు.

మ. అవనీచక్రములోన నే పురుషుఁడే యామ్నాయమున్ విన్న మా
ధవుపై లోకశరణ్యుపై భవములం దప్పింపఁగాఁ జాలు భ
క్తి విశేషంబు జనించు నట్టి భువనక్షేమంకరంబైన భా
గవతామ్నాయము బాదరాయణుఁడు దాఁ గల్పించె నేర్పొప్పఁగన్. 136

* ఈ విశాల మహీమండలంలో ఏ మహాగ్రంథాన్ని విన్నంత మాత్రం చేతనే సంసారబంధాలు సమసిపోయి జగన్నాథుడైన జనార్దనునిపై అచంచలమైన భక్తి ఆవిర్భవిస్తుందో, అటువంటి లోకకల్యాణకరమైన మహాగ్రంథాన్ని - వేదస్వరూపమైన భాగవతాన్ని బాదరాయణ మహర్షి ఓర్పుతో నేర్పుతో రూపొందించాడు.

వ. ఇట్లు భాగవతంబు నిర్మించి మోక్షార్థియైన శుకునిచేఁ జదివించెనని చెప్పిన విని శౌనకుండు నిర్వాణతత్పరుండును సర్వోపేక్షకుండును నైన శుకయోగి యేమిటికి భాగవతం బభ్యసించె? ననవుడు సూతుం డిట్లనియె. 137

* ఈ విధంగా మహాభాగవత సంహితను కల్పించి ముముక్షువైన శ్రీశుకునిచే చదివించాడు అని సూతుడు చెప్పగానే శౌనకముని విని "మోక్షమందు మాత్రమే అపేక్ష కలిగి, సమస్తాన్నీ ఉపేక్షించే, శుకయోగీంద్రుడు భాగవతాన్ని ఎందుకు అధ్యయనం చేశాడు?" అని ప్రశ్నించగా సూతమహర్షి ఇలా పలికాడు-

క. ధీరులు నిరపేక్షులు నా, త్మారాములునైన మునులు హరిభజనము ని
ష్కారణము చేయుచుందురు, నారాయణుఁ డట్టి వాఁడు నవ్యచరిత్రా! 138

* పురాణచరితా! జితేంద్రియులూ, నిష్కాములూ, ఆత్మారాములైన మహామునులు ఫలాపేక్ష లేకుండానే నిర్వ్యాజమైన భక్తితో శ్రీహరిని భజిస్తూ ఉంటారు. శ్రీమన్నారాయణుడు సైతం భక్తుల విషయంలో నిర్హేతుక జాయమాన కరుణాకటాక్షం కలవాడే!

క. హరిగుణవర్ణన రతుఁడై, హరితత్పరుఁడైన బాదరాయణి శుభ త
త్పరతం బఠించెఁ ద్రిజగ, ద్వరమంగళమైన భాగవత నిగమంబున్. 139

* శ్రీహరి గుణకీర్తన మందు ఆసక్తుడూ, ఉత్తమ విష్ణు భక్తుడూ అయిన శుకమహర్షి ముల్లోకాలకూ కల్యాణప్రదమైన భాగవత మహాసంహితను విశ్వశ్రేయస్సును ఆకాంక్షించి అధ్యయనం కావించాడు.

క. నిగమములు వేయుఁ జదివిన, సుగమంబులు గావు ముక్తిసుభగత్వంబుల్
సుగమంబు, భాగవతమను, నిగమంబుఁ బఠింప ముక్తినివసనము బుధా! 140

* బుధేంద్రా! వేలకొద్దీ వేదాలు వల్లించినా మోక్షసౌభాగ్యాలు సంప్రాప్తించవు. భాగవతమనే ఆమ్నాయాన్ని అధ్యయనం చేస్తే కైవల్యం కరతలామలక మౌతుంది.

## -: అర్జునుండు పుత్రఘాతియగు అశ్వత్థామ నవమానించుట :-

వ. అని పలికి రాజర్షియైన పరీక్షిన్మహారాజు జన్మ కర్మ ముక్తులును, బాండవుల మహాప్రస్థానంబును, కృష్ణకథోదయంబును జెప్పెదం; గౌరవధృష్టద్యుమ్నాదుల యుద్ధంబున వీరులైన వారలు స్వర్గమునకుం జనిన వెనుక భీము గదాఘాతంబున దుర్యోధనుండు దొడలు విఱిగి కూలిన నశ్వత్థామ దుర్యోధనునకుం బ్రియంబు సేయువాఁడై నిదురవోవు ద్రౌపదీ పుత్రుల శిరంబులు ఖండించి తెచ్చి సమర్పించె. అది క్రూరకర్మంబని లోకులు నిందింతురు. 141

* రాజర్షి యైన పరీక్షిత్తు జన్మవృత్తాంతాన్నీ, ధర్మకార్యాలనూ, మోక్షప్రాప్తినీ, పాండవుల మహాప్రస్థానాన్నీ కృష్ణ కథోదయాన్నీ నీకు వివరిస్తాను. కౌరవ పాండవులకు జరిగిన కురుక్షేత్ర సంగ్రామంలో వీరు లైనవారు చాలామంది చనిపోయి స్వర్గానికి వెళ్లారు. అనంతరం భీమసేనుని గదాదండం దెబ్బకు రారాజు దుర్యోధనుడు తొడలు విరిగి నేల కొరిగాడు. గురుపుత్రుడైన అశ్వత్థామ రారాజుకు సంతోషం కలిగించటం కోసం నిద్రాసక్తులైన ద్రౌపదీ కుమారుల శిరస్సులు ఖండించాడు. ఇది చాలా దారుణమైన పని. లోకులందరూ ఈ క్రూరకృత్యానికి అశ్వత్థామను నిందించారు.

ఉ. బాలుర చావు కర్ణములఁ బడ్డఁ గలంగి యలంగి, యోరువం
జాలక బాష్పతోయ కణజాలము చెక్కుల రాల నేడ్చి, పాం
చాలతనూజ నేలఁబడి జాలిఁ బడం గని, యెత్తి మంజు వా
చాలతఁ జూపుచుం జికురజాలము దువ్వుచుఁ గ్రీడి యిట్లనున్. 142

* కన్న కొడుకులంతా, అశ్వత్థామ ఖడ్గానికి బలైపోయినారని విని ద్రుపదరాజపుత్రి దుఃఖాన్ని సహించలేక పోయింది. చెక్కిళ్లపై కన్నీళ్ల కాలువలు కట్టగా ఏడ్చి ఏడ్చి జాలితో నేలపై పడి దొర్లుతున్న ద్రౌపదిని అర్జునుడు ఓదార్చి, మధురమైన మాటలతో ధైర్యం చెబుతూ ఆమె శిరోజాలు దువ్వుతూ ఇలా అన్నాడు-

మ. ధరణీశాత్మజ వీవు నీకు వగవన్ ధర్మంబె? యా ద్రౌణి ని
ష్కరుణుండై విదళించె బాలకుల! మద్గాండీవ నిర్ముక్త భీ
కర బాణంబుల నేఁడు వాని శిరమున్ ఖండించి నేఁ దెత్తుఁ ద
చ్ఛిరముం ద్రొక్కి జలంబు లాడు మిచటన్ శీతాంశుబింబాననా! 143

* రాకాచంద్రముఖీ! నీవు రాజకుమారివి, క్షత్రియకాంతవైన నీకు చనిపోయినవారికోసం విచారించటం ధర్మం కాదు. ఇదిగో విను- ఆ అశ్వత్థామ దయాదాక్షిణ్యాలు లేనివాడై నీ బిడ్డలను సంహరించాడు. అందుకు

ప్రతీకారంగా నా గాండీవం నుండి వెలువడిన మహోగ్రబాణాలతో వాని శిరస్సు ఖండించి నీకు కానుకగా తీసుకొని వస్తాను. ఆ తలను కాలితో తన్నిన తరువాతే నీవు మైలస్నానం చేద్దువు గాని.

**వ. అని యిట్లోడంబఱచి తనకు మిత్త్రుండును సారథియునైన హరి మేలనుచుండం గవచంబు దొడిగి గాండీవంబు ధరియించి కపిధ్వజుండై గురుసుతుని వెంట రథంబు దోలించిన. 144**

* ఈ విధంగా ద్రౌపదికి నచ్చజెప్పి ఆత్మీయుడైన శ్రీకృష్ణుడు మేలుమేలని ప్రశంసించుతుండగా, కవచాన్ని ధరించి గాండీవాన్ని చేతఁ బట్టి, కపిధ్వజంతో కూడిన రథాన్ని సారథియై గోవిందుడు ముందుకు కదలింపగా అశ్వత్థామను వెంబడించాడు అర్జునుడు.

**శా. తన్నుం జంపెదనంచు వచ్చు విజయున్ దర్శించి తద్ద్రౌణి యా**
**పన్నుండై శిశుహంత గావున నిజ ప్రాణేచ్ఛఁ బాఱెన్ వడిన్**
**మున్నా బ్రహ్మ మృగాకృతిం దనయకున్ మోహించి క్రీడింప నా**
**సన్నుండౌ హరుఁ జూచి పాఱు పగిదిన్ సర్వేంద్రియ భ్రాంతితోన్. 145**

* శిశుహంతయైన అశ్వత్థామ తనను సంహరించటం కోసం సన్నద్ధుడై వస్తున్న విజయుణ్ణి వీక్షించి, విభ్రాంతుడై దిక్కు తోచక ప్రాణాలు కాపాడు కోవటం కోసం ఆలోచించాడు. పూర్వం కన్న కూతుర్ని మోహించి కామాతురుడైన బ్రహ్మదేవుడు పరమశివుణ్ణి చూచి లేడి రూపం దాల్చి పరుగెత్తినట్లుగా కాలికొద్దీ పరుగెత్తాడు.

**వ. ఇట్లోపినంత దూరంబు బరువిడి వెనుకఁ జూచి రథతురగంబు లలయుటఁ దెలిసి నిలిచి ప్రాణరక్షణంబునకు నొండుపాయంబు లేమి నిశ్చయించి, జలంబుల వార్చి, ద్రోణనందనుండు సమాహిత చిత్తుండై ప్రయోగంబ కాని యుపసంహారంబు నేరకయుఁ బ్రాణ సంరక్షణార్థంబు పార్థునిమీఁద బ్రహ్మ శిరో నామ కాస్త్రంబుం బ్రయోగించిన నది ప్రచండ తేజంబున దిగంతరాళంబు నిండి ప్రాణి భయంకరంబై తోఁచిన హరికి నర్జునుం డిట్లనియె. 146**

* ఈ ప్రకారం కాళ్లలో సత్తువ ఉన్నంత వరకూ పరుగు లెత్తుతున్న అశ్వత్థామ ఒక్కమాటు వెనక్కు తిరిగి చూశాడు. పార్థుని రథాశ్వాలు అలసిపోయినట్లుగా తెలిసికొన్నాడు. ఇక తన ప్రాణాల్ని రక్షించుకోవటానికి వేరే ఉపాయం లేదనే నిశ్చయంతో, ఆచమనం చేసి, అచంచలచిత్తంతో ప్రయోగమే గాని ఉపసంహారం తెలియని బ్రహ్మశిరోనామకాస్త్రాన్ని పార్థునిపై ప్రయోగించాడు అశ్వత్థామ. ఆ బ్రహ్మశిరోనామకాస్త్రం ప్రచండ తేజంతో దిగ్దిగంతాలు వ్యాపించి, సర్వప్రాణులకూ భయం కలిగిస్తూ, విజృంభించటం చూచి అర్జునుడు కృష్ణునితో ఇలా అన్నాడు.

**సీ. పద్మలోచన! కృష్ణ! భక్తాభయప్రద! వినుము సంసారాగ్ని వేఁగుచున్న**
**జనుల సంసారంబు సంహరింపఁగ నీవు దక్క నన్యులు లేరు దలఁచి చూడ**

**సాక్షాత్కరించిన సర్వేశ్వరుండవు ప్రకృతికి నవ్వలి ప్రభుఁడ వాద్య**
**పురుషుండవగు నీవు బోధముచే మాయ నడఁతువు నిశ్శ్రేయసాత్మయందు**

**ఆ. మాయచేత మునిఁగి మనువారలకుఁ గృప, సేసి ధర్మముఖ్యచిహ్నమయిన**
**శుభముసేయు దీవు సుజనుల నవనిలోఁ, గావఁ బుట్టుదువు జగన్నివాస! 147**

* పద్మనయనా! భక్తజనరక్షాపరాయణా! కృష్ణా! సంసార జ్వలనజ్వాలల్లో తపించిపోతున్న జనుల కష్టాన్ని పోగొట్టటం నీకు తప్ప మరొకరికి శక్యం కాదు. నీవు సాక్షాత్తూ సర్వేశ్వరుడవు. ఈ ముల్లోకాలకు అవ్వలివాడవు! ఆదిపురుషుడవైన ప్రభుడవు! నీవు ముముక్షువులకు జ్ఞానాన్ని ప్రసాదించి మాయను మటుమాయం చేస్తావు. నీవు మాయాజాలంలో మునిగిన వారికి ధర్మసమ్మతమైన తేజస్సును అనుగ్రహిస్తావు. ఓ జగన్నివాసా! శిష్టరక్షణం కోసమే నీ వీ జగత్తులో జన్మిస్తావు.

**క. ఇది యొక తేజము భూమియుఁ, జదలును దిక్కులును నిండి సర్వంకషమై**
**యెదురై వచ్చుచు నున్నది, విదితముగా నెఱుఁగఁ జెప్పవే దేవేశా! 148**

* దేవాదిదేవా! వాసుదేవా! ఇదేదో ఒక ప్రచండమైన తేజస్సు. భూమ్యాకాశాలూ, దిక్కులూ వ్యాపించి ఎదురుగా వస్తున్నది. దీని స్వరూప మేమిటో నాకు స్పష్టం చెయ్యి.

**వ. అనిన హరి యిట్లనియె. 149**

* అర్జునుని మాటలు విని శ్రీకృష్ణుడు ఇలా పలికాడు-

**శా. జిహ్మత్వంబునఁ బాఱి ద్రోణజుఁడు దుశ్శీలుండు ప్రాణేచ్ఛమై**
**బ్రహ్మాస్త్రం బదె యేసె; వచ్చె నిదె తద్బాణాగ్ని బీభత్స! నీ**
**బ్రహ్మాస్త్రంబున గాని దీని మరలింపన్ రాదు; సంహార మీ**
**బ్రహ్మపత్య మెఱుంగఁ డేయుము వడిన్ బ్రహ్మాస్త్రమున్ దీనిపై. 150**

* "విప్వచ్చుడా! చిచ్చులు చెరుగుతూ ఈ వచ్చేది బ్రహ్మాస్త్రం. దీన్ని పిక్కబలంతో పారిపోతున్న కుటిలాత్ముడూ, ధూర్తుడూ అయిన అశ్వత్థామ ప్రాణరక్షణం కోసం ప్రయోగించాడు. దీన్ని త్రిప్పి కొట్టటానికి నీ బ్రహ్మాస్త్రం తప్ప మరొక్కటి సమర్థం కాదు. బ్రాహ్మణయువకుడైన ఈ అశ్వత్థామకు బ్రహ్మాస్త్ర ప్రయోగం తప్ప ఉపసంహారం తెలియనే తెలియదు. అర్జునా! ఆలస్యం చేయక దీని పైన నీ బ్రహ్మాస్త్రం ప్రయోగించు."

**వ. అనిన నర్జునుండు జలంబులు వార్చి హరికిం బ్రదక్షిణంబు వచ్చి, ద్రోణనందనుం డేసిన బ్రహ్మాస్త్రంబు మీఁదఁ దన బ్రహ్మాస్త్రంబుఁ బ్రయోగించిన. 151**

* వాసుదేవుని వచనాలు వినగానే అర్జునుడు ఆచమించి, కృష్ణునికి ప్రదక్షిణం చేసి, అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మాస్త్రం మీద తన బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించాడు.

**మ. అవని వ్యోమములందు నిండి తమలో నా రెండు బ్రహ్మాస్త్రముల్**
**రవి వహ్నిద్యుతిఁ బోరుచుం ద్రిభువనత్రాసంబు గావింపఁగా**
**వివశభ్రాంతి యుగాంతమో యని ప్రజల్ వీక్షింప నా వేళ మా**
**ధవు నాజ్ఞన్ విజయుండు సేసె విశిఖద్వంద్వోపసంహారమున్. 152**

* ఆ రెండు బ్రహ్మాస్త్రాలూ మిన్నూ మన్నూ ఏకం చేస్తూ ఇద్దరు సూర్యుల లాగా, అగ్నిహోత్రుల లాగా పరస్పరం ఘోరంగా పోరు సాగించాయి. అదిచూచి భయంతో ముల్లోకాలూ కంపించాయి. ప్రళయకాలమేమో నని ప్రజలంతా భయభ్రాంతులతో పరికింపసాగారు. ఇదంతా శ్రీకృష్ణుడు చూచాడు. అర్జునునికి అనుజ్ఞ ఇచ్చాడు. బ్రహ్మాస్త్రాలు రెండింటినీ పార్థుడు ఉపసంహరించాడు.

**వ. ఇట్లస్త్రద్వయంబు నుపసంహరించి, ధనంజయుండు ద్రోణనందనుం గూడ నరిగి తటిమి పట్టుకొని, రోషారుణిత లోచనుండై యాజ్ఞికుండు రజ్జువునం బశువుఁ గట్టిన చందంబున బంధించి శిబిరంబు కడకుం గొని చని హింసింతునని తిగిచినం జూచి హరి యిట్లనియె. 153**

* ఈ విధంగా అస్త్రాలు రెండింటినీ ఉపసంహరించిన అనంతరం క్రీడి అశ్వత్థామను వెన్నాడి పట్టుకొన్నాడు. కోపంతో ఎర్రబడ్డ కన్నులు కల అర్జునుడు, యాజ్ఞికుడు యజ్ఞంలో పశువును బంధించినట్లుగా అతణ్ణి త్రాళ్లతో బంధించాడు. శిబిరానికి లాక్కొని వెళ్లి ఈ ధూర్తుణ్ణి, చిత్రహింస చేస్తానని ఈడ్చుకొని వస్తున్న అర్జునుణ్ణి, చూచి అధికమైన క్రోధంతో కృష్ణుడు ఇలా అన్నాడు-

**ఉ. మాఱుపడంగలేని యసమర్థుల సుప్తుల నస్త్రవిద్యలం**
**దేఱని పిన్న పాపల వధించె నిశీథమునందుఁ గ్రూరుఁడై,**
**పాఱుఁడె వీఁడు పాతకుఁడు, ప్రాణభయంబున వెచ్చ నూర్చుచుం**
**బాఱెడి వీనిఁ గావుము కృపామతి నర్జున! పాపవర్జనా! 154**

* అర్జునా! వీడు దుర్మార్గుడు. ప్రాణఘాతకుడు. మహాపాతకుడు. అర్ధరాత్రి సమయంలో అస్త్రవిద్యలలో ఆరితేరనివారూ, ఎదుర్కొనలేని అసహాయ స్థితిలో నిద్రిస్తున్నవారూ అయిన పసిపాపలను ఈ పాపాత్ముడు పట్టి వధించాడు. వీ డెక్కడి బ్రాహ్మణుడు? పాప కృత్యం చేసి, పాడు ప్రాణాలు కాపాడుకోవటం కోసం వేడి నిట్టూర్పులు నిగిడిస్తూ పరుగెత్తి పోతున్నాడు. ఐనా వీణ్ణి కనికరించు.

**చ. వెఱచిన వాని, దైన్యమున వేఁదుఱు నొందినవాని, నిద్ర మై**
**మఱచినవాని, సౌఖ్యమున మద్యము ద్రావిన వాని, భగ్నుఁడై**
**పఱచిన వాని, సాధు జడభావము వానిని, గావు మంచు వా**
**చఱచిన వానిఁ, గామినులఁ జంపుట ధర్మము గాదు ఫల్గునా! 155**

*ఫల్గునా! భయపడిన వాడినీ, దిగులుతో మతిభ్రమించిన వాడినీ, నిద్రపోయిన వాడినీ, మద్యపానంచేసి మైమరచిన వాడినీ, పరాజితుడై పారిపోయే వాడిని, కదలక మెదలక పడి ఉన్నవాడినీ, రక్షించమని వేడినవాడినీ, ఆడువారినీ చంపటం ధర్మం కాదుగా.

శా. స్వప్రాణంబుల నెవ్వఁడేనిఁ గరుణాసంగంబు పాలించి య
న్య ప్రాణంబులచేత రక్షణము సేయన్ వాఁ డధోలోక దుః
ఖప్రాప్తుండగు రాజదండమున సత్కల్యాణుఁడౌ నైన నీ
విప్రుం దండితుఁ జేయ నేటికి మహావిభ్రాంతిచే నుండఁగన్. 156

* ఎవడు కనికరం లేకుండా తన ప్రాణాలు కాపాడుకోవటం కోసం పరుల ప్రాణులు తీస్తాడో అటువంటి దుర్మార్గుడు నరలోకంలో నానాదుఃఖాలూ అనుభవిస్తాడు. అయితే రాజు వాణ్ణి శిక్షిస్తే వాడి పాపం నశించి వాడికి శ్రేయస్సు లభిస్తుంది. కాని భయభ్రాంతుడైన ఈ అశ్వత్థామను కఠినంగా శిక్షించకు.

వ. అని యివ్విధంబున గృష్ణుం డానతిచ్చినం బ్రాహ్మణుండు కృతాపరాధుండయ్యు వధ్యుండు గాఁడను ధర్మంబు దలంచి చంపక ద్రుపదరాజుపుత్రికిం దన చేసిన ప్రతిజ్ఞం దలంచి, బద్ధుండైన గురు నందనుం దోడ్కొని, కృష్ణుండు సారథ్యంబు సేయ శిబిరంబుకడకు వచ్చి. 157

* ఈ విధంగా కృష్ణుడు వివరించినా “అపరాధం చేసినప్పటికీ బ్రాహ్మణుణ్ణి చంపకూడదు” అనే ధర్మాన్నే పాటించి అర్జునుడు అశ్వత్థామను సంహరింపలేదు. పాంచాల రాజపుత్రి సమక్షంలో తాను పలికిన ప్రతిజ్ఞ ప్రకారం కాళ్లూ చేతులూ కట్టివేసి అశ్వత్థామను లాక్కునివచ్చి రథం పైన ఎత్తి పడవేశాడు. కృష్ణుడు అశ్వాలను అదలించాడు. రథం శిబిరం వద్దకు చేరింది.

క. సురరాజసుతుడు చూపెను, దురవధి సుతశోకయుతకు ద్రుపదుని సుతకుం
బరిచలితాంగ శ్రేణిం, బరుష మహాపాశ బద్ధపాణిన్ ద్రౌణిన్. 158

* ఇచ్చిన మాట నెరవేర్చుకొన్న ఇంద్రనందనుడు గట్టి త్రాళ్లతో కాళ్లూ చేతులూ బిగింపబడి గిలగిల కొట్టుకొంటున్న గురునందనుణ్ణి పుత్ర శోకంతో పరితపిస్తున్న ద్రుపదనందన ముందు తెచ్చి పడవేశాడు.

## -: ద్రౌపది యశ్వత్థామను జూచి సంభాషించుట :-

వ. ఇట్లర్జునుండు దెచ్చి చూపిన బాలవధ జనితలజ్జా పరాఙ్ముఖుండైన కృపి కొడుకుం జూచి మ్రొక్కి సుస్వభావయగు ద్రౌపది యిట్లనియె. 159

* చిన్న పిల్లల ప్రాణాలు తీసినందుకు సిగ్గుపడిన అశ్వత్థామ ద్రౌపది ముందు తల ఎత్తలేకపోయాడు. సుగుణవతియైన ద్రౌపది పరాఙ్ముఖుడైన గురువు పుత్రుణ్ణి చూచి నమస్కరించి ఇలా అన్నది -

మ. పరఁగన్ మా మగవార లందఱును మున్ బాణప్రయోగోప సం
హరణాద్యాయుధవిద్య లన్నియును ద్రోణాచార్యుచే నభ్యసిం
చిరి పుత్రాకృతి నున్న ద్రోణుఁడవు, నీ చిత్తంబులో లేశముం
గరుణాసంగము లేక శిష్యసుతులన్ ఖండింపగా బాడియే? 160

* నాయనా! మీ నాయనగారైన ద్రోణాచార్యులవారి సన్నిధిలో మా మగవార లందరూ ప్రయోగోపసంహారాలతో సమస్త శస్త్రాస్త్ర విద్యలూ అభ్యసించారు. పుత్రాకారంలో ఉన్న ఆచార్య ద్రోణుడవునీవు.

మాకు గురుతుల్యుడవైన నీవు లవలేశం కూడా మనస్సులో కనికరం లేకుండా నీ శిష్యనందనుల శిరస్సులు ఖండించావే. ఇది ధర్మమటయ్యా!

**క. భూసురుఁడవు, బుద్ధిదయా, భాసురుఁడవు శుద్ధవీరభటసందోహా**
**గ్రేసరుఁడవు, శిశుమారణ, మాసురకృత్యంబు ధర్మమగునే తండ్రీ! 161**

* బ్రాహ్మణుడవై పుట్టావే! వివేకాన్ని, దయాదాక్షిణ్యాలనూ చేపట్టావే! వీరాధివీరులలో ముందడుగు పెట్టావే! అట్టి నీవు బాలుర ప్రాణాలు తీసే ఇట్టి రాక్షసకృత్యానికి ఎలా ఒడిగట్టావు తండ్రీ!

**శా. ఉద్రేకంబున రారు శస్త్రధరులై, యుద్ధావనిన్ లేరు, కిం**
**చిద్ద్రోహంబును నీకుఁ జేయరు బలోత్సేకంబుతోఁ జీఁకటిన్**
**భద్రాకారులఁ బిన్న పాపల రణప్రౌఢ క్రియాహీనులన్**
**నిద్రాసక్తుల సంహరింప నకటా! నీ చేతు లెట్లాడెనో? 162**

* ఉద్రేకంతో నీ పైకి దూకలేదే! యుద్ధరంగంలో ఆయుధపాణులై ఎదురు నిలువలేదే! లవలేశం కూడా నీకు అపకారం చేయలేదే! అటువంటి చిన్నవాళ్లను, అందాలు చిందే పిన్నవాళ్లను, సంగ్రామరంగంలో ఇంకా సంపూర్ణ సామర్థ్యం పొందని వాళ్లను, నిద్రలో ఆదమరచి ఉన్న వాళ్లను- కారుచీకటిలో - వీరావేశంతో- వధించటానికి అయ్యో! నీకు చేతు లెలా వచ్చాయయ్యా?

**ఉ. అక్కట! పుత్ర శోక జనితాకుల భార విషణ్ణచిత్తనై**
**పొక్కుచు నున్నభంగి నినుఁ బోరఁ గిరీటి నిబద్ధుఁ జేసి నే**
**డిక్కడ కీడ్చి తెచ్చుట సహింపనిదై భవదీయ మాత నేఁ**
**డెక్కడ నిట్టి శోకమున నే క్రియ నేడ్చుచుఁబొక్కుచున్న దో! 163**

* గురునందనా! పుత్రశోకంతో బరువెక్కి వ్యాకులమైన చిత్తంతో ఇక్కడ నేను ఏడుస్తున్నట్లే అక్కడ నీ తల్లి, కదనరంగంలో కాళ్లూ చేతులూ కట్టి నిన్ను అర్జునుడు ఇక్కడికి ఈడ్చుకొని వచ్చాడన్న సంగతి తెలిసి, దుర్భరమైన దుఃఖంతో ఎంతగా తల్లడిల్లి పోతున్నదో కదా!

**వ. అని కృష్ణార్జునులం జూచి యిట్లనియె. 164**

* ఈ విధంగా అశ్వత్థామతో పలికి పాంచాల రాజపుత్రి కృష్ణార్జునుల వైపు చూచి ఇలా అన్నది-

**ఉ. ద్రోణునితో శిఖిం బడక ద్రోణకుటుంబిని యున్న దింట న**
**క్షీణతనూజ శోకవివశీకృతనై విలపించుభంగి, నీ**
**ద్రౌణిఁ దెరల్చి తెచ్చుటకు దైన్యము నొందుచు నెంత పొక్కునో!**
**ప్రాణ వియుక్తుఁడైన నతి పాపము; బ్రాహ్మణహింస మాన రే. 165**

* ఆచార్య ద్రోణులతో సహగమనం చేయకుండా ఆచార్య పత్ని ఇంకా బ్రతికి ఉన్నది. ఇంట్లో ఒంటరి జీవితం గడుపుతున్న ఆ యిల్లాలు తన ఏకైక పుత్రుణ్ణి బంధించి పట్టుకు వెళ్లారని విని భరింపరాని

పుత్ర శోకంతో నాలాగానే గుండెలు పగిలేటట్లు ఎంత ఆక్రోశిస్తున్నదో! మీరు ఈ అశ్వత్థామను హింసించటం మానండి. పాపం! ఇతడు ప్రాణాలు కోల్పోతే మనకు మహాపాపం చుట్టుకుంటుంది.

**క. భూపాలకులకు విప్రులఁ, గోపింపం జేయఁదగదు; కోపించిన ద**
**త్కోపానలంబు మొదలికి, భూపాలాటవులఁ గాల్చు భూకంపముగన్. 166**

* ప్రజాపాలకులైన రాజులు బ్రాహ్మణులకు ఆగ్రహం తెప్పించకూడదు. క్రుద్ధులైన విప్రుల కోపాగ్ని జ్వాలలకు పుడమి కంపిస్తుంది. ధరణీపతుల వంశాలు ధ్వంసమౌతాయి.

**వ. అని యిట్లు ధర్మ్యంబును సకరుణంబును నిర్వ్యళీకంబును సమంజసంబును శ్లాఘ్యంబును గాఁ బలుకు ద్రౌపది పలుకులకు ధర్మనందనుండు సంతసిల్లె. నకుల సహదేవ సాత్యకి ధనంజయ కృష్ణులు సమ్మతించిరి; సమ్మతింపక భీముం డిట్లనియె. 167**

* ఈ ప్రకారం ద్రౌపది ధర్మసమ్మతంగా, దాక్షిణ్యసహితంగా నిష్కపటంగా, నిష్పక్షపాతంగా, న్యాయంగా, ప్రశంసనీయంగా పలికింది. పాంచాలి అలా మాట్లాడినందుకు ధర్మరాజు సంతోషించాడు. నకుల సహదేవులూ, సాత్యకీ, కృష్ణార్జునులు సమ్మతించారు. భీమసేనుడు మాత్రం తన అసమ్మతి ప్రకటిస్తూ-

**చ. కొడుకులఁ బట్టి చంపె నని కోపము నొందదు బాలఘాతుకున్**
**విడువు మటంచుఁ జెప్పెడిని వెఱ్ఱిది ద్రౌపది; వీడు విప్రుఁడే?**
**విడువఁగ నేల? చంపుఁడిటు వీనిని మీరలు సంప రేని నా**
**పిడికిటిపోటునన్ శిరము భిన్నము సేసెదఁ జూడుఁ డిందఱున్. 168**

* "కన్నకొడుకుల కుత్తుకలు కోసినందుకు కోపం రాగపోగా ఈ పాపాత్ముణ్ణి, ఈ బాలఘాతుకుణ్ణి విడిచి పెట్టమంటుందేమిటి ఈ వెర్రిబాగుల ద్రౌపది? వీడు పేరుకు మాత్రమే విప్రుడు. వీని విషయంలో కనికరం పనికిరాదు. ఇతణ్ణి ఈ కిరాతహంతకుణ్ణి హతమార్చండి. ఆ పని మీ వల్ల కాకపోతే మీరు అలా చూస్తూ ఉండండి. ఒక్క ముష్టిఘాతంతో ఈ దుష్టుడి శిరస్సు ఛిన్నాభిన్నం చేస్తాను.'' అన్నాడు.

**వ. అని పలికిన నశ్వత్థామకు ద్రౌపది యడ్డంబు వచ్చె; భీముని సంరంభంబు సూచి హరి చతుర్భుజుండయి రెండు చేతుల భీముని వారించి కడమ రెంటను ద్రుపదపుత్రికను దలంగించి నగుచు భీమునకిట్లనియె. 169**

* భీముడు అన్నంత పనీ చేస్తాడనీ భయంతో పాంచాలి అశ్వత్థామకు అడ్డం వచ్చింది. భీముని తొందరపాటు చూసి శ్రీకృష్ణుడు తన చతుర్భుజత్వం సార్థకంగా ఈ ప్రక్క రెండు చేతులతో భీముణ్ణి గట్టిగా పట్టుకున్నాడు. ఆ ప్రక్క రెండు చేతులతో పాంచాలిని ప్రక్కకు ఒత్తిగించుతూ భీమునితో -

**ఉ. అవ్వఁడు గాఁడు వీఁడు శిశుహంత, దురాత్మకుఁ డాతతాయి హం**
**తవ్యుఁడు బ్రహ్మబంధుఁడగుఁ దప్పదు నిక్కము 'బ్రాహ్మణో న హ**

న్తవ్య' యటంచు వేదవిదితం బగుఁ గావున ధర్మదృష్టిఁ గ
ర్తవ్యము వీని గాఁచుట యథాస్థితిఁజూడుము పాండవోత్తమా! 170

* "పాండుకుల విభూషణా! పాతకుడూ, శిశు ఘాతకుడూ, కిరాతకుడూ, భ్రష్టజాతకుడూ అయిన ఈ అశ్వత్థామ చంపదగినవాడే కాని రక్షింపదగినవాడు కానేకాదు. ఇది ముమ్మాటికీ సత్యం. అయితే "బ్రాహ్మణో న హంతవ్యః" అనే వేదవాక్యం వినవస్తున్నది. ఈ ధర్మసూక్ష్మం ప్రకారం ఈతణ్ణి రక్షించటమే న్యాయంగా తోస్తున్నది. యథార్థం నీవే ఆలోచించు" అన్నాడు.

వ. అని సరసాలాపంబు లాడి పవననందను నొడంబఱచి యర్జునుంజూచి ద్రౌపదికి నాకు భీమసేనునకు సమ్మతంబుగ మున్న నీ చేసిన ప్రతిజ్ఞయు సిద్ధించునట్లు నా పంపుసేయుమని, నారాయణుం డానతిచ్చిన నర్జునుండును నారాయణానుమతంబున. 171

* ఈ విధంగా చతురోక్తులతో, భీమన్నను చల్లపరచి, శ్రీకృష్ణుడు అర్జునుణ్ణి ఆలోకించి "ఫల్గునా! పాంచాలికీ, నాకూ, భీముడికి సమ్మత మయ్యేటట్లూ నీ ప్రతిజ్ఞ నెరవేరేటట్లూ ఈ విధంగా చెయ్యి." అని కర్తవ్యం సూచించాడు.

శా. విశ్వస్తుత్యుఁడు శక్రసూనుఁడు మహావీరుండు ఘోరాసిచే
నశ్వత్థామ శిరోజముల్ దఱిఁగి చూడాంతర్మహారత్నమున్
శశ్వత్కీర్తి వెలుంగఁ బుచ్చుకొని పాశవ్రాతబంధంబులన్
విశ్వాసంబున నూడ్చి త్రోచె శిబిరోర్వీభాగముం బాసి పోన్. 172

* విశ్వమంతా కొనియాడ దగినవాడూ, వీరాధివీరుడూ అయిన విజయుడూ శ్రీకృష్ణుని అభిప్రాయానుసారం కరకు కరవాలం పెరికి గురుపుత్రుని శిరోజాలు ఖండించి లోపల మెరుస్తున్న మహామణిని విశాలయశస్సుతోపాటు వశం చేసుకున్నాడు. తరువాత కట్టిన త్రాళ్లన్నీ విప్పదీసి శిబిరంలో నుంచి వెలుపలికి గెంటివేశాడు.

క. నిబ్బరపు బాలహంతయు, గొబ్బునఁ దేజంబు మణియుఁ గోల్పడి నతుఁడై
ప్రబ్బిన వగచే విప్రుఁడు, సిబ్బితితో నొడలి గబ్బు సెడి వడిఁ జనియెన్. 173

* నిర్భయంగా అర్భకులను హత్యచేసిన ఆ బ్రాహ్మణ బ్రువుడు భరింపరాని అవమానంతో మర్యాదనూ, మణిని కూడా కోల్పోయి సిగ్గుతో తలవంచుకొని అతిశయించిన ఆవేదనతో వెలవెల్లనై, వేగంగా వెళ్లిపోయాడు.

ఆ. ధనము గొనుట యొండె, దలఁ గొఱుగుట యొండె, నాలయంబు వెడల నడచు టొండెఁ,
గాని చంపఁదగిన కర్మంబు సేసినఁ, జంపఁదగదు విప్రజాతిఁ బతికి. 174

* ధనం తీసికోవాలి, లేదా తల గొరిగించాలి, అదీ కాదా ఇంట్లో నుంచి వెళ్లగొట్టాలి. అంతే గాని చంపదగిన దుష్కర్మం చేసినా ఆ విప్రుణ్ణి చంపటం రాజులకు ధర్మం కాదు.

వ. ఇట్లశ్వత్థామం బ్రాణావశిష్టుం జేసి వెడలనడిచి, పాండవులు పాంచాలీ సహితులై పుత్త్రులకు శోకించి మృతులైన బంధువుల కెల్ల దహనాదికృత్యంబులు సేసి యుదక ప్రదానంబు సేయు కొఱకు స్త్రీల ముందట నిడికొని గోవిందుండునుం దారునుం గంగకుం జని తిలోదకంబులు సేసి క్రమ్మఱ విలపించి హరిపాద పద్మజాత పవిత్రంబులయిన భాగీరథీజలంబుల స్నాతులయి యున్న యెడం బుత్త్ర శోకాతురు లయిన గాంధారీ ధృతరాష్ట్రులను, గుంతీ ద్రౌపదులను జూచి మాధవుండు మునీంద్రులుం దానును బంధుమరణశోకాతురు లయిన వారల వగపు మానిచి మన్నించె నివ్విధంబున. 175

* ఈ మాదిరిగా అశ్వత్థామను ప్రాణాలతో గెంటివేసి పాంచాలీ సహితులైన పాండునందనులు నిజనందనుల కోసం శోకించారు. అనంతరం చనిపోయిన బంధువు లందరికీ దహన సంస్కారాలు ఆచరించారు. స్త్రీ జన పురస్సరంగా శ్రీకృష్ణునితో గూడి గంగానదికి వెళ్ళి, పొంగి పొరలే దుఃఖం దిగ మ్రింగి మృతులందరికీ తిలోదకాలు వదిలారు, అనంతరం అందరూ శ్రీమన్నారాయణ చరణ కంజాత సంజాతాలైన పవిత్ర భాగీరథీ జలాలలో స్నానాలు చేశారు. తరువాత వాసుదేవుడు మునివరేణ్యులతో కూడి పుత్రశోకంతో వ్యాకుల మనస్కులై ఉన్న గాంధారీ ధృతరాష్ట్రులనూ, కుంతీ ద్రౌపదులనూ సమీపించి ఎన్నో విధాల ఊరడించి ధైర్యం చెప్పాడు.

శా. పాంచాలీ కబరీవికర్షణ మహాపాప క్షతాయుష్కులం
జంచద్గర్వుల ధార్త రాష్ట్రుల ననిం జంపించి గోవిందుఁ డి
ప్పించెన్ రాజ్యము ధర్మపుత్త్రునకుఁ , గల్పించెన్ మహాఖ్యాతిఁ జే
యించెన్ మూఁడు తురంగ మేధములు దేవేంద్ర ప్రభావంబునన్. 176

* ఈ విధంగా నందనందనుడైన గోవిందుడు నిండుసభలో ద్రుపదనందన వేణి పట్టి లాగిన మహాపాపం వల్ల క్షీణించిన ఆయుస్సులు గల దుర్మదాంధులైన ధృతరాష్ట్రనందను లందరినీ సమరాంగణంలో చంపించి, ధర్మరాజుకు రాజ్యం ఇప్పించాడు. విజయభేరి మ్రోయించి మహేంద్రవైభవంతో మూడు అశ్వమేధాలు చేయించి రాజు లందరిలోనూ ధర్మరాజుకు గొప్ప పేరు తెప్పించాడు.

## -: శ్రీకృష్ణుండుత్తరా గర్భస్థుఁడగు నర్భకుని తన చక్రంబుచే రక్షించుట :-

వ. అంత వాసుదేవుండు వ్యాస ప్రముఖభూసుర పూజితుండయి యుద్ధవ సాత్యకులు గొలువ ద్వారకాగమన ప్రయత్నంబునం బాండవుల వీడ్కొని రథారోహణంబు సేయు సమయంబునం దత్తరపడుచు నుత్తర సనుదెంచి కల్యాణ గుణోత్తరుండైన హరి కిట్లనియె. 177

* అనంతరం వ్యాసాది మహర్షులపూజ లందుకొన్న వాసుదేవుడు ఉద్ధవుణ్ణీ, సాత్యకినీ వెంటబెట్టుకొని ద్వారకకు బయలు దేరాడు. పాండవులందరికీ చెప్పి రథం ఎక్కుతుండగా ఉత్తర తత్తరపడుతూ పరుగెత్తుకు వచ్చి పురుషోత్తమునితో ఇలా మొరపెట్టుకొంది.

**మ. ఇదె కాలానల తుల్య మైన విశిఖం బేతెంచె దేవేశ ! నేఁ**
**డుదరాంతర్గత గర్భ దాహమునకై యుగ్రప్రభన్ వచ్చు చు**
**న్నది దుర్లోక్యము మానుపన్ శరణ మన్యం బేమియున్ లేదు నీ**
**పద పద్మంబులె కాని యొండెఱుఁగ నీ బాణాగ్ని వారింపవే! 178**

* "దేవదేవా! ప్రళయాగ్ని జ్వాలాభీలమైన బాణం ఒక్కటి ఎక్కటినుంచో కళ్లకు మిరుమిట్లు గొల్పుతూ వచ్చి నా కడుపులో ఉన్న కసుగందును కాల్చివేయాలని చూస్తున్నది. ఈ భయంకర శరాన్ని నిరోధించి నన్ను రక్షించేవారు వేరెవరూ లేదు. నీచరణ కమలాలను శరణుజొచ్చాను. కరుణించి ఈ శరాగ్నిని నివారించు.

**క. దుర్భర బాణానలమున, గర్భములో నున్న శిశువు ఘన సంతాపా**
**విర్భావంబును బొందెడి, నిర్భరకృపఁ గావుమయ్య నిఖిలస్తుత్యా! 179**

* ఓ విశ్వంభరా! భరింపరాని ఈ బాణాగ్నికి కడుపులో ఉన్న పసిగందు కసుగంది పోతున్నాడు. అక్షీణ దాక్షిణ్యంతో రక్షించు.

**క. చెల్లెలి కోడల, నీ మే, నల్లుఁడు శత్రువులచేత హతుఁ డయ్యెను, సం**
**ఫుల్లారవిందలోచన!, భల్లాగ్ని నడంచి శిశువు బ్రతికింపఁగదే! 180**

* నేను నీ చెల్లెలి సుభద్రమ్మకు కోడల్ని. నీ మేనల్లుణ్ణి శత్రువులు అన్యాయంగా పొట్టన పెట్టుకొన్నారు. విచ్చిన తామర రేకుల వంటి కన్నులెత్తి చూడు. ఈ అమ్మను వమ్ముచేసి నా బంగారు తండ్రి ప్రాణాలు కాపాడు.

**ఆ. గర్భమందుఁ గమల గర్భాండశతములు, నిముడుకొన వహించు నీశ్వరేశ!**
**నీకు నొక్క మానినీగర్భరక్షణ, మెంత బరువు నిర్వహింతు గాక! 181**

* గర్భంలో వందల కొద్దీ బ్రహ్మాండాలను భద్రంగా భరించే నీకు ఒక ఆడదాని గర్భాన్ని రక్షించటం ఏమంత బ్రహ్మాండం! ఆపదలో ఉన్న నన్ను ఆదుకోస్వామీ!"

**వ. అనిన నాశ్రితవత్సలుండగు నప్పరమేశ్వరుండు సుభద్ర కోడలి దీనాలాపంబు లాలించి, యిది ద్రోణనందనుండు లోక మంతయు నపాండవం బయ్యెడు మని యేసిన దివ్యాస్త్రంబని యెఱింగె; నంతఁ బాండవుల కభిముఖంబయి ద్రోణనందన దివ్యాస్త్ర నిర్గత నిశిత మార్గణంబులు డగ్గఱిన బెగ్గడిలక వారును బ్రత్యస్త్రంబు అందికొని పెనంగు సమయంబున. 182**

* ఆపన్నశరణ్యుడైన గోపాలుడు అనుగు చెల్లెలి కోడలైన ఉత్తర దీనాలాపాలు విన్నాడు. ఇది "లోకం అపాండవం కావా"లని కావాలని అశ్వత్థామ ప్రయోగించిన దివ్యాస్త్రమని తెలుసుకొన్నాడు. అంతట్లో ఆ దివ్యాస్త్రంలో నుంచి వెలువడిన పదునైన బాణాలు పాండవులను చుట్టుముట్టాయి. వారు బెదరిపోకుండా ఎదురు నిలిచి శరపరంపరలతో సమరం సాగించారు.

మ. తనసేవారతిచింత గాని పరచింతా లేశమున్ లేని స
జ్జనులం బాండుతనూజులన్ మనుచు వాత్సల్యంబుతో ద్రోణ నం
దను బ్రహ్మాస్త్రము నడ్డపెట్టఁ బనిచెన్ దైత్యారి సర్వారి సా
ధన నిర్వక్రము రక్షితాఖిల సుధాంధశ్చక్రముం జక్రమున్ . 183

* శ్రీకృష్ణుణ్ణి సేవించాలనే భావం తప్ప ఇతర భావం ఏమాత్రమూ ఎరుగని సచ్చరిత్రులు పాండుపుత్రులు, అటువంటి సజ్జనులను ఆపదలో కాపాడాలనే కారుణ్యాభావంతో, మహానుభావుడైన వాసుదేవుడు గురుపుత్రుని బ్రహ్మాస్త్రాన్ని త్రిప్పికొట్టటం కోసం, శత్రువుల ఆయుధాలకు చెక్కు చెదరనిదీ, సమస్త దేవతాచక్రాన్ని కనురెప్పలా కాపాడేదీ అయిన సుదర్శన చక్రాన్ని ప్రయోగించాడు.

మ. సకల ప్రాణిహృదంతరాళముల భాస్వజ్జ్యోతియై యుండు సూ
క్ష్మకళుం డచ్యుతుఁ డయ్యెడన్ విరటజా గర్భంబుఁ దాఁ జక్రహ
స్తకుఁడై వైష్ణవమాయఁ గప్పి కురు సంతానార్థియై యడ్డమై
ప్రకటస్ఫూర్తి నడంచె ద్రోణతనయ బ్రహ్మాస్త్రమున్ లీలతోన్. 184

* సూక్ష్మాతి సూక్ష్మమైన రూపంతో సమస్త ప్రాణుల హృదయాంతరాళాల్లో జ్యోతిర్మూర్తియై ప్రకాశించే వాసుదేవుడు పాండవుల వంశాంకురాన్ని రక్షించటం కోసం చక్రాన్ని ధరించి, ఉత్తరా గర్భాన్ని యోగమాయతో కప్పివేసి, అమోఘమైన వైష్ణవ తేజస్సుతో అశ్వత్థామ బ్రహ్మాస్త్రాన్ని అవలీలగా అణచివేశాడు.

వ. ఇట్లు ద్రోణతనయుండేసిన ప్రతిక్రియారహితంబయిన బ్రహ్మశిరంబనియెడి దివ్యాస్త్రంబు వైష్ణవతేజంబున నిరర్థకం బయ్యె; నిజమాయా విలసనమున సకలలోక సర్గస్థితి సంహారంబు లాచరించు నట్టి హరికి ధరణీసుర బాణ నివారణంబు విచిత్రంబు గాదు; తత్సమయంబున సంతసించి, పాండవ పాంచాలీ సహితయై గొంతి, గమనోన్ముఖుండయిన హరిం జేరవచ్చి యిట్లనియె. 185

* గురుపుత్రుడు ప్రయోగించిన బ్రహ్మాస్త్రం తిరుగులేనిదైనా వైష్ణవ తేజస్సు ముందు వ్యర్థమై పోయింది. తన మాయా ప్రభావంతో నిఖిల జగత్తునూ నిర్మించి భరించి హరించే పరమాత్మునికి ఒక బ్రాహ్మణ యువకుని బాణాన్ని నివారించటం విచిత్రమైన విషయమేమీ కాదు. అప్పుడు ఎంతో సంతోషంతో కుంతీదేవి కోడలైన ద్రౌపదితోనూ, కొడుకులైన పాండవులతోనూ వచ్చి ప్రయాణమై ద్వారకకు వెళ్లబోతున్న శ్రీకృష్ణుణ్ణి ఈ విధంగా స్తుతించింది-

## -: కుంతీదేవి శ్రీకృష్ణుని స్తుతించుట :-

క. పురుషుం డాద్యుఁడు ప్రకృతికిఁ, బరుఁడవ్యయుఁ డఖిలభూత బహిరంతర్భా
సురుఁడును లోక నియంతయుఁ, బరమేశ్వరుఁడైన నీకుఁ బ్రణతులగు హరీ! 186

* 'కృష్ణా! నీవు పురాణపురుషుడవు. దేవదేవుడవు. ప్రకృతికి అవ్వలివాడవు. అనంతుడవు. సమస్త ప్రాణులలో వెలుపల లోపల వెలుగుతుండే వాడవు. విశాల విశ్వాన్ని నడిపే పరమేశ్వరుడవైన నీకు నమస్కారాలు.

వ. మఱియు జవనిక మఱువున నాట్యంబు సలుపు నటుని చందంబున మాయా యవనికాంతరాళంబున నిలువంబడి నీ మహిమచేఁ బరమహంసలు వివృతరాగద్వేషులు నిర్మలాత్ములు నయిన మునులకు నదృశ్యమానుండవయి పరిచ్ఛిన్నుండవు గాని నీవు మూఢదృక్కులు గుటుంబవంతులు నగు మాకు నెట్లు దర్శనీయుండ వయ్యెదు? శ్రీకృష్ణ! వాసుదేవ! దేవకీనందన! నందగోపకుమారా! గోవింద! పంకజనాభ! పద్మమాలికాలంకృత! పద్మలోచన! పద్మసంకాశ చరణ! హృషీకేశ! భక్తి యోగంబునం జేసి నమస్కరించెద. నవధరింపుము. 187

* తెరచాటున వర్తించే నటునిలాగా మాయ అనే యవనిక మాటున వర్తించే నీ మహిమ అగోచరమైనది. పరమహంసలూ, రాగద్వేషరహితులూ, నిర్మలహృదయులూ అయిన మునీశ్వరులు సైతం దర్శింపలేని పూర్ణపురుషుడవైన నిన్ను సంసార నిమగ్నులమూ జ్ఞానహీనులమూ అయిన మా వంటి వారం ఎలా చూడగలుగుతాం? శ్రీకృష్ణా! వాసుదేవా! దేవకీనందనా! నందగోపకుమారా! గోవిందా! పద్మనాభా! పద్మమాలా విభూషణా! పద్మనయనా! పద్మసంకాశ చరణా! హృషీకేశా! భక్తి పూర్వకమైన నా ప్రణామాలు పరిగ్రహించు! నా విన్నపం మన్నించు.

సీ. తనయులతోడ నే దహ్యమానం బగు జతుగృహంబందునుఁ జావకుండఁ
గురురాజు వెట్టించు ఘోరవిషంబుల మారుతపుత్త్రుండు మడియకుండ
ధార్తరాష్ట్రుఁడు సముద్ధతిఁ జీర లొలువంగ ద్రౌపదిమానంబు దలఁగకుండ
గాంగేయ కుంభజ కర్ణాదిఘనులచే నాబిడ్డ లని లోన నలఁగకుండ

తే. విరటు పుత్త్రిక కడుపులో వెలయు చూలుఁ, ద్రోణనందను శరవహ్నిఁ ద్రుంగకుండ
మఱియు రక్షించితివి పెక్కుమార్గములను, నిన్ను నేమని వర్ణింతు? నీరజాక్ష! 188

* భగభగ మండుతున్న లక్కయింట్లో నా బిడ్డలూ, నేనూ కాలి భస్మమైపోకుండా కాపాడావు. దుర్యోధనుడు పెట్టించిన దుస్సహవిషాన్నం తిని చనిపోకుండా భీమ సేనుణ్ణి రక్షించావు. దురహంకారంతో త్రుళ్లిపడుతూ దుశ్శాసనుడు ద్రుపదరాజపుత్రి కట్టుబట్టలు ఒలుస్తున్న కష్టసమయంలో నా కోడలు అవమానం పాలు కాకుండా ఆదుకొన్నావు. భీష్ముడూ, ద్రోణుడూ, కర్ణుడూ మొదలైన యోధానుయోధుల వల్ల పోరాటంలో చేటు వాటిల్లకుండా నా బిడ్డలకు అడ్డు పడ్డావు. మళ్లీ ఇప్పుడు గురుపుత్రుని శరాగ్ని జ్వాలలలో మ్రగ్గిపోకుండా చిట్టితల్లి ఉత్తర కడుపులోని కసుగందును కనికరించావు. ఇన్ని విధాలుగా నన్నూ, నా బిడ్డలనూ కటాక్షించిన పుండరీకాక్షా! నిన్ను ఏ విధంగా కొనియాడేది!

మత్తకోకిల. బల్లిదుం డగు కంసుచేతను బాధ నొందుచు నున్న మీ
తల్లిఁ గాచిన భంగిఁ గాచితి ధార్తరాష్ట్రులచేత నేఁ
దల్లడంబునఁ జిక్కకుండగఁ దావకీన గుణవ్రజం
బెల్ల సంస్తుతి సేసి చెప్పఁగ నెంత దాన జగత్పతీ! 189

* బలవంతుడై కంసుని బారి నుంచి మీ తల్లి దేవకీదేవిని రక్షించినట్లుగా కౌరవులు పెట్టిన కష్టాలకు లోనుగాకుండా నన్ను కాపాడావు. ఆపన్న ప్రసన్నుడవైన నీ అనంతకోటి గుణాలు అభివర్ణించటానికి నే నెంతదాన్ని జగన్నాథా!

**క. జననము నైశ్వర్యంబును, ధనమును విద్యయును గల మదచ్ఛన్ను లకిం**
**చన గోచరుఁడగు నిన్నున్, వినుతింపఁగ లేరు నిఖిలవిబుధస్తుత్యా! 190**

* గొప్పవంశంలో జన్మించామనీ, భోగభాగ్యా లున్నాయనీ, ధనం సంపాదించామనీ, విద్యావంతుల మనీ, మదాంధులైన మానవులు- నిష్కాములైన భక్తులకు మాత్రమే గోచరించే- నిన్ను నిఖిల దేవతా సంస్తూయ మానుణ్ణి ప్రస్తుతింపలేరు.

**వ. మఱియు భక్తధనుండును, నివృత్తధర్మార్థకామ విషయుండును, రాగాదిరహితుండును, గైవల్యదాన సమర్థుండును, గాలరూపకుండును, నియామకుండును, నాద్యంతశూన్యుండును, విభుండును, సర్వసముండును, సకల భూతనిగ్రహానుగ్రహకరుండును నైన నిన్నుఁ దలంచి నమస్కరించెద నవధరింపుము. మనుష్యుల విడంబించు భవదీయవిలసనంబు నిర్ణయింప నెవ్వఁడు సమర్థుండు? నీకుం బ్రియాప్రియులు లేరు; జన్మకర్మశూన్యుండ వయిన నీవు తిర్యగాదిజీవుల యందు వరాహాది రూపంబులను, మనుష్యులందు రామాది రూపంబులను, ఋషులయందు వామనాది రూపంబులను, జలచరంబులయందు మత్స్యాది రూపంబులను నవతరించుట లోక విడంబనార్థంబు గాని, జన్మకర్మ సహితుండ వగుటం గాదు. 191**

* నీవు భక్తులకు కొంగుబంగారానివి. ధర్మార్థ సంబంధమైన వ్యామోహాన్ని తొలగించే వాడివి. ఆత్మారాముడివి. శాంతమూర్తివి. మోక్షప్రదాతవు. కాలస్వరూపుడివి, జగన్నియంతవు. ఆద్యంతాలు లేనివాడవు. సర్వేశ్వరుడవు. సర్వసముడవు. నిగ్రహానుగ్రహ సమర్థుడవు. నీ ప్రభావాన్ని భావించి చేసే నా నమస్కారాలు స్వీకరించు. మానవభావాన్ని అనుకరిస్తూ వర్తించే నీ లీలలు గుర్తించటం ఎవరికి సాధ్యం! నీకు ఐనవారూ కానివారూ లేరు. జన్మకర్మలు లేవు. జంతువులలో వరాహాదిరూపాలతో, జలచరాలలో మత్స్యాదిరూపాలతో నీవు అవతరించటం లోకం కోసమే కాని నిజానికి నీకు జన్మాదులు లేనే లేవు.

**ఉ. కోపముతోడ నీవు దధికుంభము భిన్నము సేయుచున్నచో**
**గోపికఁ ద్రాటఁ గట్టిన వికుంచిత సాంజనబాష్పతోయ ధా**
**రా పరిపూర్ణ వక్త్రముఁ గరంబులఁ బ్రాముచు వెచ్చ నూర్చుచుం**
**బాపఁడవై నటించుట కృపాపర! నామదిఁ జోద్య మయ్యెడిన్. 192**

* దయామయా! చిన్నతనంలో ఒకమాటు నీకు కోపం వచ్చి పెరుగుకుండ బద్దలు కొట్టావు. మీ అమ్మ యశోద నిన్ను త్రాళ్లతో గట్టిగా కట్టివేసింది. అప్పుడు నీవు ముఖం చిన్నబుచ్చుకొని, వెక్కి వెక్కి ఏడుస్తూ వెచ్చనూరుస్తూ పసిపాపని లాగా నటించావు. ఆ నీ బాలలీల నాకు ఎంతో వింతగా తోచింది.

క. మలయమున జందనము క్రియ, వెలయఁగ ధర్మజుని కీర్తి వెలయించుటకై
యిలపై నభవుఁడు హరి యదు, కులమున నుదయించె నండ్రు గొంద ఱనంతా! 193

* అనంతా! ధర్మనందనుని యశస్సు నలుదెసలా ప్రసరింపజేయటానికి మలయపర్వతం మీద చందనవృక్షం చందాన పుట్టుక ఎరుగని పురుషోత్తముడు యదువంశంలో ఉదయించాడని కొందరంటారు.

క. వసుదేవ దేవకులు తా, పసగతి భవమునందుఁ బ్రార్థించిన సం
తసమునఁ బుత్రత నొందితి, వసురుల మృతి కంచుఁ, గొంద ఱండ్రు మహాత్మా! 194

* పూర్వజన్మంలో అపూర్వమైన తపస్సు చేసి దేవకీ వసుదేవులు ప్రార్థించగా రాక్షస సంహారం కోసం ఆ పుణ్యదంపతులకు పుత్రుడవై పుట్టావని కొందరు చెబుతారు.

క. జలరాశి నడుమ మునిగెడు, కలముక్రియన్ భూరిభారకర్శిత యగు నీ
యిలఁ గావ నజుఁడు గోరినఁ, గలిగితి వని కొంద ఱండ్రు గణనాతీతా! 195

* నట్టనడి సముద్రంలో మునిగిపోయే నావలాగా భరింపరాని బరువుతో క్రుంగి కూలారుతున్న భూమండలాన్ని ఉద్ధరించటం కోసం బ్రహ్మదేవుడు ప్రార్థింపగా అవతారం ఎత్తావంటారు మరికొందరు.

తే. మఱచి యజ్ఞాన కామ్యకర్మములఁ దిరుగు, వేదనాతురులకు దన్నివృత్తిఁ జేయ
శ్రవణ చింతన వందనార్చనము లిచ్చు, కొఱకు నుదయించి తండ్రు నిన్ గొంద ఱభవ! 196

* కర్తవ్యం విస్మరించి కామ్యకర్మలలో మునిగి తేలుతూ అజ్ఞానంతో కొట్టుమిట్టాడుతున్న ఆపన్నుల ఆర్తి పోగొట్టి వారికి శ్రవణం, చింతనం, వందనం, అర్చనం మొదలైన భక్తి మార్గాలను ప్రసాదించే నిమిత్తం ప్రభవించావని కొందరి అభిప్రాయం.

మ. నినుఁ జింతించుచుఁ బాడుచుం బొగడుచున్ నీ దివ్యచారిత్రముల్
వినుచుం జూతురుగాక లోకు లితరాన్వేషంబులం జూతురే
ఘన దుర్జన్మ పరంపరా హరణ దక్షంబై మహాయోగి వా
గ్వినుతంబైన భవత్పదాబ్జయుగమున్ విశ్వేశ! విశ్వంభరా! 197

* ఓ విశ్వేశ్వరా! విశ్వంభరా! దురంతాలైన జన్మపరంపరలను అంతం చేసేవీ, పరమయోగులు పవిత్రవాక్కులతో ప్రస్తుతించేవీ అయిన నీ పాదపద్మాలను, ఎల్లప్పుడు నిన్నే ధ్యానిస్తూ, నీ లీలలే గానం చేస్తూ నిన్నే ప్రశంసిస్తూ, నీ పవిత్ర చరిత్రాలే ఆకర్ణిస్తూ ఉండే వారు మాత్రమే దర్శించగలుగుతారు. అంతేకాని ఇతర ప్రయత్నాలేవీ ఫలవంతాలు కావు.

వ. దేవా! నిరాశ్రయులమై భవదీయ చరణారవిందంబు లాశ్రయించి నీ వారలమైన మమ్ము విడిచి విచ్చేయ నేల? నీ కరుణావలోకనంబుల నిత్యంబును జూడవేని యాదవసహితులైన పాండవులు జీవునిం బాసిన యింద్రియంబుల చందంబున గీర్తిసంపదలు లేక తుచ్ఛత్వంబు నొందుదురు; కల్యాణ లక్షణ లక్షితంబు లయిన నీ యడుగులచేత నంకితంబైన యీ ధరణీమండలంబు నీవు వాసిన

**శోభితంబు గాదు; నీ కృపావీక్షణామృతంబున నిక్కడి జనపదంబులు గుసుమఫల భరితంబులై యోషధి తరు లతా గుల్మ నద నదీ సమేతంబులై యుండు. 198**

* దేవదేవా! నీ వారలం. నిరాశ్రయులమై నీ చరణ కమలాలనే ఆశ్రయించాము. అటువంటి మమ్మల్ని విడిచి వెళ్లటం న్యాయం కాదు. కరుణామయాలైన నీ కటాక్ష వీక్షణాలతో వీక్షించకపోతే యాదవులతో కూడి పాండవులు, జీవాత్మను ఎడబాసిన పంచేంద్రియాల మాదిరిగా పేరు ప్రతిష్ఠలు కోల్పోయి అనామకులౌతారు. సమస్త శుభలక్షణాలూ అలరారే నీ పాదపంకజాలతో అంకితమైన ఈ భూభాగం నీవు లేకపోతే శోభాహీన మవుతుంది. నీ చల్లని చూపుల్లో వెల్లి విరిసే కరుణారసామృతప్రభావం వల్ల ఇక్కడి పల్లెలు పుష్పఫల సమృద్ధి కలిగి ప్రకాశిస్తున్నాయి. బాగా పండిన పంటచేలతో, వృక్షాలతో, లతలతో, పొదలతో, నిండిన నదీనదాలతో కనులపండువు చేస్తున్నాయి.

**ఉ. యాదవులందుఁ బాండుసుతులందు నధీశ్వర! నాకు మోహ వి**
**చ్ఛేదము సేయుమయ్య ఘన సింధువుఁ జేరెడి గంగభంగి నీ**
**పాదసరోజ చింతనముపై ననిశంబు మదీయబుద్ధి న**
**త్యాదరవృత్తితోఁ గదియు నట్లుగఁ జేయఁగదయ్య! యీశ్వరా! 199**

* స్వామీ! జగన్నాథా! ఆత్మీయులైన యాదవులమీదా, పాండవులమీదా నాకున్న అనురాగ బంధాన్ని త్రెంపి వెయ్యి. కడలిరాజులో కలిసే గంగాతరంగిణిలాగా నా బుద్ధి సర్వదా నీ చరణ సరోజ సంస్మరణంలోనే సంలగ్న మయ్యేటట్లు చెయ్యి.

**శా. శ్రీకృష్ణా! యదుభూషణా! నరసఖా! శృంగారరత్నాకరా!**
**లోకద్రోహి నరేంద్రవంశదహనా! లోకేశ్వరా! దేవతా**
**నీక బ్రాహ్మణ గోగణార్తిహరణా! నిర్వాణసంధాయకా!**
**నీకున్ మ్రొక్కెదఁ ద్రుంపవే భవలతల్ నిత్యానుకంపానిధీ! 200**

* "శ్రీకృష్ణా! యదుకులభూషణా! విజయప్రియా! శృంగార రసరత్నాకరా! జగత్కంటకులైన మహీపతుల వంశాలను దహించి వేసే జగదీశ్వరా! ఆపన్నులైన అమరులనూ, అవనీసురులనూ, ఆవులమందలనూ ఆర్తి బాపి కాపాడే స్వామీ! మోక్షాన్ని ప్రసాదించే ప్రభూ! నీకు నమస్కరిస్తున్నాను. పరిపూర్ణ కరుణాపయోనిధివై నా భవబంధాలు ఖండించు."

**వ. అని యిట్లు సకల సంభాషణంబుల నుతియించు గొంతిమాటలకు నియ్యకొని, గోవిందుండు మాయా నిరూఢ మందహాస విశేషంబున మోహంబు నొందించి రథారూఢుండై కరినగరంబునకు వచ్చి, కుంతీ సుభద్రాదుల వీడ్కొని, తన పురంబునకు విచ్చేయ గమకించి, ధర్మరాజుచేఁ గించిత్కాలంబు నిలువు మని ప్రార్థితుండై నిలిచె నంత బంధువధశోకాతురుం డయిన ధర్మజుండు నారాయణ వ్యాస ధౌమ్యాదులచేతఁ దెలుపంబడియుఁ దెలియక మోహితుండై నిర్వివేకంబగు చిత్తంబున నిట్లనియె. 201**

* ఈ మాదిరిగా మధురోక్తులతో మాధవుణ్ణి కొనియాడింది కుంతీదేవి. ఆమె ప్రార్థనను స్వీకరించిన శ్రీకృష్ణుడు మాయా మయమైన తన మధుర మందహాసంతో పాండవ జననిని మైమరపించి రథారూఢుడై హస్తినాపురానికి తిరిగివచ్చాడు. కొంత కాలమైన తర్వాత కుంతికీ సుభద్రకూ చెప్పి ద్వారకానగరానికి ప్రయాణమైన గోవిందుడు కొలదికాలం ఉండుమని ధర్మరాజు బతిమాలగా ఉండిపోయాడు. చుట్టాలందరినీ మట్టు పెట్టానన్న దుఃఖంతో తల్లడిల్లుతున్న ధర్మజుణ్ణి కృష్ణుడు, వ్యాసుడు, ధౌమ్యుడు మొదలైనవారు ఎన్నో విధాల ఓదార్చారు. అయినా ఆయన మనస్సుకు ఊరట లభించలేదు. వ్యాకులమైన హృదయంతో ధర్మరాజు ఈ విధంగా అనుకొన్నాడు-

**మ. తన దేహంబునకై యనేకమృగ సంతానంబుఁ జంపించు దు**
**ర్జనుభంగిం గురుబాలకద్విజ తనూజ భ్రాతృ సంఘంబు ని**
**ట్లనిఁ జంపించిన పాపకర్మునకు రాజ్యాకాంక్షికిన్ నాకు హా**
**యన లక్షావధి నైన ఘోరనరక వ్యాసంగముల్ మానునే? 202**

* తన శరీరపోషణకోసం అమాయికాలైన అనేక మృగాలను చంపించే దుర్మార్గుడు లాగా, రాజ్యంకోసం గురువులనూ, బాలకులనూ, బ్రాహ్మణులనూ, ఆత్మజులనూ, అన్నదమ్ములనూ సమర రంగంలో చంపించాను. ఇంతటి పాపానికి ఒడిగట్టిన నాకు నూరు వేల సంవత్సరాల పర్యంతం ఘోరమైన నరకం అనుభవించక తప్పదు.

**వ. మఱియుఁ బ్రజాపరిపాలనపరుం డయిన రాజు ధర్మయుద్ధంబున శత్రువుల వధియించినం బాపంబు లేదని శాస్త్ర వచనంబు గల, దయిన నది విజ్ఞానంబు కొఱకు సమర్థంబు గాదు; చతురంగంబుల ననేకాక్షౌహిణీ సంఖ్యాతంబులం జంపించితి; హతబంధులయిన సతుల కేను జేసిన ద్రోహంబు దప్పించుకొన నేర్పులేదు; గృహస్థాశ్రమ ధర్మంబులైన తురంగ మేధాది యాగంబుల చేతఁబురుషుండు బ్రహ్మహత్యాది పాపంబులవలన విడివడి నిర్మలుండగు నని నిగమంబులు నిగమించుఁ; బంకంబునఁ బంకిలస్థలంబునకు, మద్యంబున మద్యభాండంబునకు శుద్ధి సంభవింపని చందంబున బుద్ధిపూర్వక జీవహింసనంబు లయిన యాగంబులచేతం బురుషులకుఁ బాపబాహుళ్యంబ కాని పాప నిర్ముక్తిగాదని శంకించెద. 203**

* ప్రజలను పరిపాలించే రాజు ధర్మబుద్ధితో శత్రువులను సంహరించటంలో దోషం లేదని శాస్త్రాలు చెబుతున్నాయి. అయినా ఆలోచించి చూస్తే ఈ మాట నాకు సమంజసంగా కన్పించటం లేదు. రథాలతో, ఏనుగులతో, గుర్రాలతో, కాలిబంట్లతో కూడిన పెక్కు అక్షౌహిణులను చంపించాను. పతులనూ, బంధువులనూ హతమార్చి సతులకు నేను క్షమించరాని మహా ద్రోహం చేశాను. నా యీ పాపానికి పరిహారం లేదు. గృహస్థధర్మాలైన అశ్వమేధాది యాగాలు ఆచరిస్తే బ్రహ్మహత్యాది దోషాలు పరిహార మౌతాయని వేదాలు అనుశాసిస్తున్నాయి. బురదవల్ల బురదనేల పరిశుభ్రం కాదు. కల్లుపోసి కడిగి నందువల్ల కల్లుకుండకు శుద్ధి లభించదు. అలాగే బుద్ధి పూర్వకంగా చేసే జీవహింసతో కూడిన యజ్ఞాలవల్ల మానవుల పాపం పెరుగుతుందే కాని తరుగదని నా సందేహం.''

క. అని యిట్లు ధర్మసూనుఁడు, మొనసి నిరాహారభావమున దేవనదీ
తనయుఁడు గూలిన చోటికిఁ, జనియెఁ బ్రజాద్రోహ పాప చలితాత్ముండై. 204

* ఈ విధంగా ధర్మరాజు ప్రజాద్రోహం వల్ల సంభవించిన పాపానికి భయవిహ్వలు డగుతూ నిరాహారుడై భీష్ముడు పడి ఉన్న చోటుకు వెళ్ళాడు.

## -: ధర్మజుఁడు శ్రీ కృష్ణసహితుండై భీష్మునికడ కేగుట :-

వ. అయ్యవసరంబునం దక్కి పాండవులును ఫల్గునసహితుండైన పద్మలోచనుండును గాంచన సమంచితంబు లయిన రథంబు లెక్కి ధర్మజుం గూడి చనిన నతండు గుహ్యకసహితుం డయిన కుబేరుని భంగి నొప్పె; నిట్లు పాండవులు పరిజనులు గొలువఁ బద్మనాభసహితులై కురుక్షేత్రంబున కేఁగి దివంబుననుండి నేలం గూలిన దేవత తెఱంగున సంగ్రామ రంగపతితుండైన గంగానందనునకు నమస్కరించి; రంత బృహదశ్వ భరద్వాజ పరశురామ పర్వత నారద బాదరాయణ కశ్యపాంగిరస కౌశిక ధౌమ్య సుదర్శన శుక వసిష్ఠాద్యనేక రాజర్షి బ్రహ్మర్షులు శిష్యసమేతులై చనుదెంచినం జూచి సంతసించి దేశకాలవిభాగవేదియైన భీష్ముండు వారలకుం బూజనంబులు సేయించి. 205

* ఆ సమయంలో కృష్ణార్జునులూ, భీమ నకుల సహదేవులూ, బంగారు రథాలు అధిరోహించి ధర్మరాజు వెంట వెళ్ళారు. అప్పుడు ధర్మజుడు గుహ్యకులతో కూడిన కుబేరుని మాదిరిగా ప్రకాశించాడు. ఈ విధంగా పాండవులు సపరివారులై శ్రీకృష్ణునితో కూడా కురుక్షేత్రానికి వెళ్ళారు. అక్కడ దివినుంచి భువిమీద కూలిన దేవతలాగా సంగ్రామరంగంలో శరతల్పంపై పడి ఉన్న గాంగేయునికి నమస్కరించారు. అప్పుడు బృహదశ్వుడు, భరద్వాజుడు, పరశురాముడు, పర్వత నారదులు, వేదవ్యాసుడు, కశ్యపుడు, ఆంగిరసుడు, కౌశికుడు, ధౌమ్యుడు, సుదర్శనుడు, శుకుడు, వసిష్ఠుడు మొదలైన పెక్కుమంది రాజర్షులూ, దేవర్షులూ, శిష్యులతో కూడా రావటం చూచి ఆనందించి దేశకాల విభాగాలు తెలిసిన భీష్మాచార్యుడు వచ్చిన వారందరినీ వేరువేరుగా అర్చించాడు.

క. మాయాంగీకృత దేహుండై యఖిలేశ్వరుఁడు మనుజుఁ డైనాఁడని ప్ర
జ్ఞాయతచిత్తంబున గాం, గేయుఁడు పూజనము సేసెఁ గృష్ణున్ జిష్ణున్. 206

* తర్వాత సర్వేశ్వరుడు మాయా మానవ దేహం ధరించి అరుదెంచినాడనే పరమ పవిత్రభావంతో గాంగేయుడు జయశీలుడైన గోపాలుణ్ణి పూజించాడు.

వ. మఱియు గంగానందనుండు వినయ ప్రేమ సుందరులయిన పాండునందనులం గూర్చుండ నియోగించి మహానురాగ జనిత బాష్ప సలిల సందోహ సమ్మిళిత లోచనుండై యిట్లనియె. 207

* అనంతరం ఆచార్య భీష్ముడు వినయ వినమ్రులూ, ప్రేమ పాత్రులూ అయిన పాండుపుత్రులను దగ్గర కూర్చో పెట్టుకొన్నాడు. అపారమైన అనురాగంతో పొంగి పొరలే బాష్పధారలతో నిండిన కన్నులు కలవాడై ఇలా పలికాడు-

ఆ. ధరణీసురులు హరియు ధర్మంబు దిక్కుగా, బ్రదుకఁదలఁచి మీరు బహువిధముల
నన్నలార! పడితి రాపత్పరంపర, లిట్టి చిత్రకర్మమెందుఁ గలదు? 208

* "నాయనలారా! భగవానుడైన కృష్ణుడూ, బ్రాహ్మణులూ, ధర్మమూ, దిక్కుగా భావించి జీవించే మీరు ఎన్నెన్నో కష్ట పరంపరల పాలైనారంటే, ఇంతకంటే విచిత్రమయిన విషయం ఏముంటుంది?

ఉ. సంతస మింతలేదు మృగశాప వశంబునఁ బాండు భూవిభుం
డంతము నొందియుండ మిము నర్భకులం గొనివచ్చి కాంక్షతో
నింతల వారిఁగాఁ బెనిచె నెన్నఁడు సౌఖ్యము పట్టు గాన దీ
గొంతి యనేక దుఃఖములఁ గుందుచు నుండును; భాగ్య మెట్టిదో! 209

* పాపం! మీ అమ్మ కుంతీదేవి సంతోషం రవ్వంతైనా ఎరుగదు. పాండుమహీపతి మృగరూపంలో ఉన్న మునిశాపం వల్ల మృతి చెందగా పసికందులైన మిమ్మల్ని అరచేతులలో పెట్టుకొని పెంచి పెద్దచేసి ఇంతవారిని కావించింది. ఏనాడూ సౌఖ్యానికి నోచుకోలేదు. ఈమె దురదృష్టమేమో కాని బ్రతుకంతా పడరాని కష్టాలతోనే గడిచి పోయింది.

ఉ. వాయువశంబులై యెగసి వారిధరంబులు మింటఁ గూడుచుం
బాయుచు నుండు కైవడిఁ బ్రపంచము సర్వముఁ గాల తంత్రమై
పాయుచుఁ గూడు చుండు నొకభంగిఁ జరింపదు కాల మన్నియుం
జేయుచు నుండుఁ గాలము విచిత్రము దుస్తర మెట్టివారికిన్. 210

* ఆకాశంలోని మేఘాలు గాలికి ఎగిరి పరస్పరం కలుసుకొంటూ విడిపోతూ ఉన్నట్లు ఈ ప్రపంచంలోని ప్రాణికోటి సమస్తమూ కాలచక్రం వల్ల కూడుతూ, వీడుతూ ఉంటుంది. స్వేచ్ఛ అనేది లేదు. కాలమే అన్నిటికీ మూలం. కాలం చాలా విచిత్రమైంది. ఎంత వారు కూడా ఈ కాల ప్రవాహాన్ని చాటలేరు.

ఉ. రాజఁట ధర్మజుండు, సురరాజసుతుండఁట ధన్వి, శాత్రవో
ద్వేజకమైన గాండివము విల్లఁట, సారథి సర్వభద్ర సం
యోజకుఁ డైన చక్రి యఁట, యుగ్రగదాధరుఁడైన భీముఁ డ
య్యాజికిఁ దోడు వచ్చునఁట, యాపద గల్గుటిదేమి చోద్యమో! 211

* ధర్మజుఁ డంతవాడు రాజు. మహావీరుడైన అర్జునుడు యోద్ధ. శత్రుభయంకరమైన గాండీవం అతని ధనుస్సు. సర్వ సౌభాగ్య సంధాత శ్రీకృష్ణుడు సారథి, ప్రచండ గదాదండధారి అయిన భీమసేనుడు కొండంత అండ. ఇంతటి సహాయసంపత్తి కల్గినా పాండవులకు అరణ్యావాసాలూ, అజ్ఞాతవాసాలు తప్పలేదు. ఎంత ఆశ్చర్యం!

ఆ. ఈశ్వరుండు విష్ణు డెవ్వేళ నెవ్వని, నేమి సేయుఁ బురుషుఁ డేమి యెఱుఁగు
నతని మాయలకు మహాత్ములు విద్వాంసు, లడఁగి మెలఁగుచుందు రంధు లగుచు. 212

* లోకేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు ఎప్పుడు ఎవరికి ఏమి చేస్తాడో ఎవరు చెప్పగలరు? ఆ మహానుభావుని మాయలకు పెద్ద పెద్ద విద్వాంసులు సైతం దిక్కు తెలియనివారై, లోబడి అణఁగి మణఁగి ఉంటారు.

వ. కావున దైవతంత్రంబైన పనికి వగవం బనిలేదు; రక్షకులు లేని ప్రజల నుపేక్షింపక రక్షింపఁ బుండరీకాక్షుండు సాక్షాత్కరించిన నారాయణుండు, తేజోనిరూఢుండు గాక యాదవులందు గూఢుండై తన మాయచేత లోకంబుల మోహాతిరేకంబు నొందించు; నతని రహస్య ప్రకారంబులు భగవంతుడైన పరమేశ్వరుం డెఱుంగు; మఱియు దేవర్షియగు నారదుండును భగవంతుండగు కపిలమునియు నెఱుంగుదురు; మీరు కృష్ణుండు దేవకీ పుత్రుండని మాతులేయుండని తలంచి దూత సచివ సారథి బంధు మిత్ర ప్రయోజనంబుల నియమింతు; రిన్నిటం గొఱంత లేదు; రాగాది శూన్యుండు, నిరహం కారుం, డద్వయుండు, సమదర్శనుండు, సర్వాత్మకుండు నయిన యీశ్వరునకు నతోన్నత భావ మతివైషమ్యంబు లెక్కడివి? లేవు. అయిన భక్తవత్సలుండు గావున నేకాంతభక్తులకు సులభుండై యుండు. 213

* అందువల్ల దైవసంకల్పం వల్ల జరిగినదానికి విచారించటం వివేకం కాదు. రక్షణ లేని ప్రజానీకాన్ని రక్షించటంకోసం శ్రీహరి పుండరీకాక్షరూపంలో సాక్షాత్కరించాడు. వాసుదేవుడు తన దైవత్వం అభివ్యక్తం కాకుండా యదుకులంలో రహస్యంగా సంచరిస్తూ తన మాయ చేత ముల్లోకాలను మోహంలో ముంచి తేలుస్తున్నాడు. ఆయన లోగుట్టు పెరుమాళ్లకే ఎరుక. ఆ గుట్టుమట్టులు ఇంకా దేవర్షి ఐన నారదునికీ, జ్ఞానస్వరూపుడైన కపిలమహర్షికీ కొంత కొంత తెలుసు. నాయనలారా! మీరు శ్రీకృష్ణుని దేవకీ పుత్రుడనీ, మీ మేనమామ కుమారుడని తలంచారు. దూతగా, సచివుడుగా, సారథిగా, బంధువుగా, మిత్రుడుగా భావించి ఎన్నో పనులకు నియోగించి ఆయన్ని వినియోగించుకొన్నారు. ఐనా ఇందువల్ల ఆయనకు ఎలాంటి లోపం రాదు. రాగద్వేషాలు లేనివాడూ, అహంకారి కానివాడూ, ద్వంద్వాలకు అతీతుడైనవాడూ, సమదర్శనుడూ, సర్వాత్మకుడూ ఐన జగన్నాథునకు ఎక్కువ తక్కువ భావాలూ, అభిప్రాయభేదాలూ ఎక్కడివి? అయినప్పటికీ భగవంతుడు భక్తవత్సలుడు అయినందున ఆత్మీయులైన భక్తులకు మాత్రం తగినంత అందుబాటులో ఉంటాడు.

సీ. అతిభక్తి నెవ్వని యందుఁ జిత్తముఁ జేర్చి యెవ్వని నామ మూహించి పొగడి
కాయంబు విడుచుచుఁ గామ కర్మాదినిర్మూలనుండై యోగి ముక్తి నొందు
నట్టి సర్వేశ్వరుం డఖిలదేవోత్తంసుఁ డెవ్వేళఁ బ్రాణంబు లేను విడుతు
నందాఁక నిదె మహాహర్షుఁడై వికసిత వదనారవిందుఁడై వచ్చె నేఁడు

తే. నాల్గు భుజములు గమలాభ నయనయుగము, నొప్పఁగన్నుల ముందట నున్నవాఁడు
మానవేశ్వర!, నా భాగ్యమహిమఁ జూడు మేమి సేసితినో పుణ్య మితనిఁ గూర్చి 214

* యోగి అయినవాడు అత్యంత భక్తియుక్తుడై ఏ దేవుని యందు చిత్తం లగ్నంచేసి, ఏ దేవుని పవిత్రనామం ఉచ్చరిస్తూ తనువు చాలించి, కామాది కర్మఫలాన్ని నిర్మూలించి మోక్షాన్ని పొందుతాడో అటువంటి దేవదేవుడైన గోవిందుడు నేను శరీరం చాలించే సమయానికి మహానందంతో వికసిత వదనారవిందంతో విచ్చేసి నాలుగు చేతులతో తామరరేకులవంటి కన్నులతో నా కన్నుల ముందు సాక్షాత్కరించాడు. ధర్మరాజా! నాభాగ్యం పండింది. ఈ మహాభావుని కోసం పూర్వజన్మంలో ఎంత పుణ్యం చేశానో''

**వ. అని యిట్లు ధనంజయ సంప్రాపిత శరపంజరుం డయిన కురుకుంజరుని వచనంబు లాకర్ణించి మునులందఱు వినుచుండ ధర్మనందనుండు మందాకినీ నందను వలన నరజాతి సాధారణంబులగు ధర్మంబులును, వర్ణాశ్రమ ధర్మంబులును, రాగవైరాగ్యోపాధులతో గూడిన ప్రవృత్తి ధర్మంబులును, దానధర్మంబులును, రాజ ధర్మంబులును, స్త్రీ ధర్మంబులును శమదమాదికంబులును, హరి తోషణంబులగు ధర్మంబులును, ధర్మార్థ కామ మోక్షంబులును, నానావిధోపాఖ్యానేతిహాసంబులును, సంక్షేప విస్తారరూపంబుల నెఱింగె; నంత రథిక సహస్రంబులకు గమికాఁడైన భీష్ముండు స్వచ్ఛంద మరణులైన యోగీశ్వరులచేత వాంఛితంబగు నుత్తరాయణంబు సనుదెంచిన నది దనకు మరణోచితకాలంబని నిశ్చయించి. 215**

* ఈ విధంగా అర్జునుడు కల్పించిన శరతల్పం మీద శయనించి ఉన్న కురుకుల పితామహుడు పలికిన పలుకులు అచ్చటకు విచ్చేసిన మునులందరూ విన్నారు. అప్పుడు ధర్మనందనుడు గంగానందనుడైన ఆచార్య భీష్ముని వలన మానవజాతికి అవశ్యాలైన సామాన్యధర్మాలు, వర్ణాశ్రమ ధర్మాలు, అనురాగ వైరాగ్యాలకు సంబంధించిన ప్రవృత్తి నివృత్తి ధర్మాలు, దాన ధర్మాలు, రాజ ధర్మాలు, స్త్రీ ధర్మాలు భగవంతునికి ప్రియమైన భాగవత ధర్మాలు, శమదమాదులు, చతుర్విధ పురుషార్థాలైన ధర్మార్థ కామ మోక్షాలు, నానావిధాలైన ఉపాఖ్యానాలు, ఇతిహాసాలు మొదలైనవన్నీ కొన్ని సంక్షేపంగానూ కొన్ని వివరం గానూ విన్నాడు. తర్వాత మహారథులకు శిరోభూషణమైన భీష్ముడు స్వచ్ఛందమరణులైన సంయమీంద్రులు వాంఛించే ఉత్తరాయణ పుణ్యకాలం వచ్చిందని తెలుసుకొని అది తాను తనువు చాలించటానికి అనుకూలమైన సమయమని నిశ్చయించుకొన్నాడు.

**శా. ఆలాపంబులు మాని చిత్తము మనీషాయత్తముం జేసి దృ**
**గ్జాలంబున్ హరిమోముపైఁ బఱపి తత్కారుణ్యదృష్టిన్ విని**
**ర్మూలీభూత శరవ్యథా నిచయుఁడై మోదించి భీష్ముండు సం**
**శీలం బొప్ప నుతించెఁ గల్మషగజ శ్రేణీహరిన్ శ్రీహరిన్. 216**

*అప్పుడు గాంగేయుడు మౌనం వహించి మనస్సును ఏకాగ్రం చేసుకొని తన చూపులన్నీ గోపాలదేవుని ముఖమండలంపై కేంద్రీకరించాడు. ఆ కమలాక్షుని దాక్షిణ్యమయవల్ల కటాక్షవీక్షణం వల్ల ఆయన శరీరంమీది గాయాలబాధ ఉపశమించింది. అప్పుడు శాంతశీలుడైన శాంతనవుడు సంతోషించి కలుషాలనే గజసమూహాన్ని చించి చెండాడే యదు సింహుణ్ణి నుతించాడు.

వ. ఇట్లు పీతాంబరధారియుఁ జతుర్భుజుండు నాదిపూరుషుండుఁ బరమేశ్వరుండునగు హరియందు నిష్కాముండై విశుద్ధంబగు ధ్యాన విశేషంబుచే నిరస్తదోషుం డగుచు ధారణావతియైన బుద్ధిని సమర్పించి, పరమానందంబు నొంది ప్రకృతివలననైన సృష్టి పరంపరలఁ బరిహరించు తలంపున మందాకినీ నందనుం డిట్లనియె. 217

* మందాకినీ నందనుడైన భీష్ముడు సమస్త దోషాలనూ, పరాస్తం చేసి నిష్కామభావంతో, నిర్మలధ్యానంతో పీతాంబరధరుడూ, చతుర్భుజుడూ, పురాణపురుషుడూ, పరమేశ్వరుడూ అయిన గోవిందుని యందు ఏకాగ్రబుద్ధిని సంధానించి పరమానంద భరితుడై స్వభావసిద్ధాలైన సంసారబంధాలను పరిహరించే ఉద్దేశంతో ఈ విధంగా ప్రస్తుతించాడు-

## -: భీష్ముడు శ్రీకృష్ణుని స్తుతించుట :-

మ. త్రిజగన్మోహన నీలకాంతిఁ దను వుద్దీపింపఁ బ్రాభాత నీ
రజబంధుప్రభమైన చేలము పయిన్ రంజిల్ల నీలాలక
వ్రజ సంయుక్త ముఖారవింద మతి సేవ్యంబై విజృంభింప మా
విజయుం జేరెడు వన్నెలాఁడు మది నావేశించు నెల్లప్పుడున్. 218

* ముల్లోకాలనూ మోహింపజేసే నీలవర్ణకాంతులతో నిగనిగలాడే దేహంతో వెలుగులు వెదజల్లుతూ బాలభానుప్రభలతో ప్రకాశించే బంగారుచేలంతో, ఒయ్యారం ఒలకబోస్తూ, నల్లని ముంగురులతో, ముద్దులు మూటగట్టే ముఖారవిందంతో, అనురాగాలు చిందిస్తూ మా అర్జునుణ్ణి సమీపించే అందగాడు నా అంతరంగంలో నిరంతరం నిలిచిపోవాలి.

మ. హయ రింఖాముఖ ధూళి ధూసర పరిన్యస్తాలకోపేతమై
రయజాతశ్రమ తోయబిందుయుతమై రాజిల్లు నెమ్మోముతో
జయముం బార్థున కిచ్చు వేడ్క నని నాశస్త్రాహతిం జాల నొ
చ్చియుఁ బోరించు మహానుభావు మదిలోఁ జింతింతు నశ్రాంతమున్. 219

* గుర్రాల గిట్టలు రేపిన దుమ్ము కొట్టుకొని రంగుచెడి చెదరిన ముంగురులతోనూ, గమన వేగంవల్ల కందళించిన ఘర్మబిందువులతోనూ కూడి ముచ్చట గొల్పే ముఖం కలవాడై కిరీటిని గెలిపించాలనే కుతూహలంతో నా శరాఘాతాలకు బాగా బాధపడుతూ కూడా వివ్వచ్చుణ్ణి ప్రోత్సహించి పోరించిన మహానుభావుణ్ణి మనస్సులో అశ్రాంతమూ ధ్యానిస్తున్నాను.

మ. నరు మాటల్ విని, నవ్వుతో నుభయసేనామధ్యమక్షోణిలోఁ
బరు లీక్షింప రథంబు నిల్పి పరభూపాలావళిం జూపుచుం
బరభూపాయువు లెల్లఁ జూపులన శుంభత్కేళి వంచించు, నీ
పరమేశుండు వెలుంగు చుండెడును హృత్పద్మాసనాసీనుఁడై. 220

* అర్జునుని మాటలు ఆకర్ణించి చిరునవ్వు నవ్వుతూ పగవారు చూస్తుండగా పాండవ కౌరవ సైన్యాల మధ్యప్రదేశంలో తేరు నిలిపి పేరు పేరునా వైరిపక్షంలోని వీరులను చేయెత్తి చూపిస్తూ, తన చూపులతోనే ఆ భూపతుల ఆయువులన్నీ అవలీలగా ఆకర్షించే లోకేశ్వరుడు నా హృదయపద్మంలో పద్మాసనం పైన భాసిల్లుతున్నాడు.

క. తనవారిఁ జంపఁజాలక, వెనుకకుఁ బో నిచ్చగించు విజయుని శంకన్
ఘనయోగవిద్యఁ బాపిన మునివంద్యుని పాదభక్తి మొనయున్ నాకున్. 221

* రణరంగంలో తన బంధుమిత్రుల ప్రాణాలు తీయటానికి ఇష్టపడక వెనుకంజ వేస్తున్న ధనంజయునికి గీతోపదేశం చేసి సందేహాన్ని పోగొట్టి ముందంజ వేయించిన మునిజన వంద్యుడైన ముకుందుని పాదభక్తి నాలో పరిఢవిల్లాలి.

సీ. కుప్పించి యెగసినఁ గుండలంబుల కాంతి గగనభాగంబెల్లఁ గప్పికొనఁగ
నుఱికిన నోర్వక యుదరంబులో నున్న జగముల వ్రేఁగున జగతి గదలఁ
జక్రంబుఁ జేపట్టి చనుదెంచు రయమునఁ బై నున్న పచ్చని పటము జాఱ
నమ్మితి నాలావు నగుఁబాటు సేయక మన్నింపు మని క్రీడి మరలఁ దిగువఁ

తే. గరికి లంఘించు సింహంబుకరణి మెఱసి, నేఁడు భీష్మునిఁ జంపుదు నిన్నుఁ గాతు
విడువు మర్జున యనుచు మద్విశిఖ వృష్టిఁ, దెరలి చనుదెంచు దేవుండు దిక్కు నాకు. 222

* ఆ నాడు రణక్షోణిలో నా బాణవర్షాన్ని భరించలేక నా మీదికి దుమికే నా స్వామి వీరగంభీరస్వరూపం ఇప్పటికీ నాకు కన్నులకు కట్టినట్లు కన్పిస్తున్నది. కుప్పించి పై కెగిరినప్పుడు కుండలాల కాంతులు గగనమండలం నిండా వ్యాపించాయి. ముందుకు దూకినప్పుడు బొజ్జలోని ముజ్జగాల బరువు భరించలేక భూమి కంపించిపోయింది. చేతిలో చక్రాన్ని ధరించి అరుదెంచే వేగానికి పైనున్న బంగారుచేలం జారిపోయింది. నమ్ముకొన్న నన్ను నలుగురిలో నవ్వులపాలు చేయవద్దని మాటిమాటికి కిరీటి వెనక్కు లాగుతున్నా లెక్కచేయకుండా "అర్జునా! నన్ను వదులు. ఈ నాడు భీష్ముని రూపుమాపి నిన్ను కాపాడుతాను" అంటూ కరిపైకి లంఘించే కంఠీరవం లాగా నా పైకి దూకే గోపాల దేవుడే నాకు రక్ష.

మ. తనకున్ భృత్యుఁడు వీనిఁ గాచుట మహాధర్మంబు వొమ్మంచు న
ర్జునసారథ్యము పూని పగ్గములు చేఁ జోద్యంబుగాఁ బట్టుచున్
మునికోలన్ వడిఁ బూని ఘోటకములన్ మోదించి తాడించుచున్
జనులన్ మోహము నొందఁ జేయుఁ బరమోత్సాహుం బ్రశంసించెదన్. 223

* "ఇతడు నా నమ్మినబంటు, ఇతణ్ణి కాపాడటం నా కర్తవ్యం సుమా!" అంటూ అర్జున సారథ్యాన్ని అంగీకరించి నొగల నడుమ కూర్చుండి ఒక చేతిలో ఒయ్యారంగా పగ్గాలు పట్టుకొని, మరొక చేతిలో కొరడా ధరించి, పరమోత్సాహంగా అశ్వాలను అదలిస్తూ చూచేవాళ్లను ఆశ్చర్యచకితులను చేస్తున్న పార్థసారథిని ప్రశంసిస్తున్నాను.

క. పలుకుల నగవుల నడపుల, నలుకల నవలోకనముల నాభీరవధూ
కులముల మనముల తాలిమి, కొలుకులు వదలించు ఘనునిఁ గొలిచెద మదిలోన్. 224

* మాటలతో మందహాసాలతో, ప్రవర్తనలతో, ప్రణయకోపాలతో, వాల్చూపులతో వ్రజవధూమణుల వలపులు దోచుకొనే వాసుదేవుని మనస్సులో మరీ మరీ సేవిస్తాను.

ఆ. మునులు నృపులుఁ జూడ మును ధర్మజుని సభా, మందిరమున యాగమండపమునఁ
జిత్ర మహిమతోడఁ జెలువొందు, జగదాది దేవుఁ డమరు నాదు దృష్టియందు. 225

* మునీంద్రులు, నరేంద్రులు చూస్తూ ఉండగా మునుపు ధర్మ నందనుని సభామందిరంలోని యజ్ఞమండపంలో చిత్ర విచిత్ర ప్రభావాలతో చెలువొందే జగన్నాథుడు నా చూపుల్లో రూపు దిద్దుకొంటున్నాడు.

మ. ఒక సూర్యుండు సమస్తజీవులకుఁ దా నొక్కొక్కఁడై తోఁచు పో
లిక నే దేవుఁడు సర్వకాలము మహాలీలన్ నిజోత్పన్న జ
న్య కదంబంబుల హృత్సరోరుహములన్ నానావిధానూన రూ
పకుఁడై యొప్పుచునుండు నట్టి హరి నేఁ బ్రార్థింతు శుద్ధుండనై. 226

* ఒకే ఒక సూర్యుడు సకల జీవరాసులలో ఒక్కొక్కరికి ఒక్కొక్కడుగా కానవచ్చే విధంగా తాను సృష్టించిన నానావిధ ప్రాణి సమూహాల హృదయ కమలాలలో నానా విధములైన రూపాలతో సర్వకాల సర్వావస్థల యందు తన లీలా విలాసంతో తనరారే భగవంతుణ్ణి పవిత్రహృదయంతో ప్రార్థిస్తున్నాను.

వ. అని యిట్లు మనోవాగ్దర్శనంబులం బరమాత్ముండగు కృష్ణుని హృదయంబున నిలిపికొని, నిశ్శ్వాసంబులు మాని నిరుపాధికంబయిన వాసుదేవ బ్రహ్మంబునందుం గలసిన భీష్మునిం జూచి సర్వజనులు దివసావసానంబున విహంగంబు లూరకయుండు తెఱంగున నుండిరి; దేవ మానవ వాదితంబులై దుందుభి నినాదంబులు మొరసె; మృతుండయిన భీష్మునికి ధర్మజుండు పరలోక క్రియలు సేయించి ముహూర్తమాత్రంబు దుఃఖితుండయ్యె; నంత నచ్చటి మునులు కృష్ణునిఁ దమ హృదయంబుల నిలిపికొని సంతుష్టాంతరంగు లగుచుం దదీయ దివ్యావతారనామంబులచే స్తుతియించి స్వాశ్రమంబులకుం జనిరి; పిదప నయ్యుధిష్ఠిరుండు గృష్ణసహితుండై గజపురంబునకుం జని గాంధారీ సమేతుండయిన, ధృతరాష్ట్రు నొడంబఱచి, తత్సమ్మతంబున వాసుదేవానుమోదితుండై పితృపైతామహంబైన రాజ్యంబు గైకొని, ధర్మ మార్గంబునం బ్రజాపాలనంబు సేయుచుండె నని చెప్పిన విని సూతునకు శౌనకుం డిట్లనియె. 227

* ఈ ప్రకారంగా గాంగేయుడు మనస్సుద్వారా, మాటలద్వారా, చూపులద్వారా శ్రీకృష్ణపరమాత్మను హృదయంలో పదిలపరచుకొని నిశ్వాసాన్ని నిరోధించి నిరుపాధిక పరబ్రహ్మమైన వాసుదేవునిలో ఐక్యమైనాడు.

అప్పుడు అది చూచి అక్కడ ఉన్న వారందరూ సంధ్యా సమయంలో పక్షుల్లాగా మౌనం వహించారు. దేవలోకంలోనూ, మానవ లోకంలోనూ దుందుభులు ధ్వనించాయి. సాధుసంకీర్తనలు వినిపించాయి. పూలవానలు కురిశాయి. తనువు చాలించిన సురనదీ తనయునికి దహన సంస్కారాలు జరిపించి ధర్మరాజు ముహూర్తకాలం దుఃఖించాడు. అక్కడి మునులందరూ శ్రీకృష్ణుని రూపం తమ మనస్సులలో నిలుపుకొని ఆయన దివ్యావతారాలను కొనియాడుతూ సంతోషితస్వాంతులై తమ తమ ఆశ్రమాలకు తరలిపోయారు. అనంతరం ధర్మనందనుడు నందనందనునితో కలిసి హస్తినాపురానికి వెళ్లాడు. అక్కడ గాంధారీ సహితుడైన ధృతరాష్ట్రుణ్ణి ఒప్పించి ఆయన అంగీకారంతో, శ్రీకృష్ణుని ఆమోదంతో తన తాత తండ్రులు పరిపాలించిన రాజ్యాన్ని స్వీకరించినవాడై ధర్మం తప్పకుండా ప్రజలను పరిపాలించసాగాడు. ఇలా చెప్పగానే శౌనకుడు సూతమహర్షిని చూచి -

**ఆ. ధనము లపహరించి తనతోడఁ జెనకెడు, నాతతాయి జనుల నని వధించి**
**బంధు మరణ దుఃఖ భరమున ధర్మజుఁ, డెట్లు రాజ్యలక్ష్మి నిచ్చగించె. 228**

* "తన సిరిసంపదలన్నీ అపహరించి తనతో యుద్ధానికి సిద్ధమైన దుర్మార్గులను సమరంలో సంహరించిన ధర్మరాజు చుట్టాలందరూ మరణించారనే దుఃఖభారంతో పాటు ఈ రాజ్యభారాన్ని భరించటానికి ఏ విధంగా అంగీకరించాడు? అని అడిగాడు.

**వ. అనిన సూతుం డిట్లనియె. 229**

* సూతుడు ఇలా సమాధానం చెప్పాడు.

**క. కురుసంతతికిఁ బరీక్షి, న్నరవరు నంకురము సేసి నారాయణుఁ డీ**
**ధరణీ రాజ్యమునకు నీ, శ్వరుగా ధర్మజుని నిలిపి సంతోషించెన్. 230**

* కురువంశాంకురంగా పరీక్షిత్తును నిలబెట్టి ఈ సమస్త సామ్రాజ్యానికి యుధిష్ఠిరుణ్ణి అధినేతగా నిలిపి శ్రీకృష్ణుడు సంతుష్టాంతరంగుడైనాడు.

**వ. ఇట్లు జగంబు పరమేశ్వరాధీనంబుగాని స్వతంత్రంబు గా దనునది మొదలగు భీష్ముని వచనంబులం, గృష్ణుని సంభాషణంబుల ధర్మనందనుండు ప్రవర్ధమాన విజ్ఞానుండును, నివర్తిత శంకాకళంకుండును నై నారాయణాశ్రయుండైన యింద్రుండునుంబోలె జతుస్సాగర వేలాలంకృతంబగు వసుంధరా మండలంబు సహోదర సహాయుండై యేలుచుండె. 231**

* ఈ విధంగా ధర్మరాజు భీష్మాచార్యుని ఉపదేశాలవల్ల, శ్రీకృష్ణుని ప్రబోధాలవల్ల తన విజ్ఞానాన్ని పెంపొందించుకొని, తన సందేహా లన్నింటిని నివర్తించుకొని, ఉపేంద్రుని సహాయంతో మహేంద్రుని వలె శ్రీకృష్ణుని అండదండలతో చతుస్సముద్ర ముద్రితమైన మహీమండలాన్ని సహచరుల సహాయంతో పరిపాలించసాగాడు.

**సీ. సంపూర్ణవృష్టిఁ బర్జన్యుండు గురియించు నిల యెల్ల కోర్కుల నీనుచుండు**
**గోవులు వర్షించు ఘోషభూములఁ బాలు ఫలవంతములు లతా పాదపములు**

పండు సస్యములు దప్పక ఋతువుల నెల్ల ధర్మ మెల్లెడలను దనరి యుండు
దైవభూతాత్మతంత్రము లగు రోగాది భయములు సెందవు ప్రజల కెందుఁ

ఆ. గురుకులోత్తముండు గుంతీతనూజుండు, దానమాన ఘనుఁడు ధర్మజుండు
సత్యవాక్య ధనుఁడు సకల మహీరాజ్య, విభవభాజి యయిన వేళయందు. 232

* దానఘనుడూ, మానధనుడూ, సత్యసంధుడు, కురుకులాలంకారుడూ, కుంతికుమారుడూ ఐన ధర్మరాజు సర్వధరణీ మండలాన్ని వైభవోపేతంగా పరిపాలిస్తున్న సమయంలో మేఘుడు కుంభవృష్టి కురిపించాడు. పృథివి బంగారు పంటలు పండించింది. గోశాలలోని గోవులు కుండల కొద్దీ పాలిచ్చాయి. వృక్షాలూ, లతలూ సంపూర్ణంగా ఫలించాయి. ఋతుధర్మం తప్పకుండా నిండుగా పంటలు పండాయి. దేశమంతటా ధర్మం పాతుకున్నది. ఆధ్యాత్మికాలూ, ఆధిభౌతికాలూ, ఆధి దైవికాలూ అయిన ఆధివ్యాధులు ప్రజలను బాధించలేదు.

## -: శ్రీకృష్ణుండు ద్వారకా నగరంబున కేగుట :-

వ. అంత గృష్ణుండు చుట్టాలకు శోకంబు లేకుండం జేయుకొఱకును సుభద్రకుఁ బ్రియంబు సేయుకొఱకును గజ పురంబునం గొన్ని నెలలుండి, ద్వారకానగరంబు నకుం బ్రయాణంబు సేయం దలంచి ధర్మనందనునకుం గృతాభినందనుం డగుచు నతనిచే నాలింగితుండై యామంత్రణంబు వడసి కొందఱు దనకు నమస్కరించినం గౌఁగిలించికొని కొందఱు దనుం గౌఁగిలింప నానందించుచు రథారోహణంబు సేయు నవసరంబున సుభద్రయు ద్రౌపదియుఁ గుంతియు నుత్తరయు గాంధారియు ధృతరాష్ట్రుండును విదురుండును యుధిష్ఠిరుండును యుయుత్సుండును గృపాచార్యుండును నకులసహదేవులును వృకోదరుండును ధౌమ్యుండును సత్సంగంబు వలన ముక్తదుస్సంగుండగు బుధుండు సత్కృత్కాల సంకీర్త్యమానంబై రుచికరంబగు నెవ్వని యశంబు నాకర్ణించి విడువనోపం డట్టి హరితోడి వియోగంబు సహింపక దర్శన స్పర్శనాలాపశయ నాసన భోజనంబుల వలన నిమిషమాత్రంబును హరికి నెడ లేని వారలైన పాండవులం గూడికొని హరి మరలవలయునని కోరుచు హరి చనిన మార్గంబు సూచుచు హరి విన్యస్త చిత్తులయి లోచనంబుల బాష్పంబు లొలుక నంత నిలువంబడి రయ్యవసరంబున. 233

* బంధువులైన పాండవుల శోకం పోకార్చటం కోసం ప్రియసోదరి సుభద్ర మనస్సుకు సంతోషం సమకూర్చుటం కోసం, వాసుదేవుడు హస్తినాపురంలో కొన్ని మాసాలపాటు ఉన్న తర్వాత ద్వారకా నగరానికి బయలుదేరాడు. తనకు అభినందనాలు సమర్పిస్తున్న నందనందనుణ్ణి ధర్మనందనుడు ఆనందంతో అభినందించి ఆలింగనం చేసుకొని వీడ్కోలిచ్చాడు. అనంతరం శ్రీకృష్ణుడు కొందరి నమస్కారాలు అందుకొన్నాడు. కొందరిని కౌగిలించుకొన్నాడు. కొందరు తనను కౌగిలించుకొనగా వారికి శుభాకాంక్ష లందించాడు. గోవిందుడు స్యందనం ఎక్కబోతున్న సమయంలో సుభద్రా ద్రౌపదులు, కుంతీ గాంధారులు, ధృతరాష్ట్రుడు, విదురుడు, ధర్మరాజు, యుయుత్సుడు, కృపాచార్యుడు, నకుల సహదేవులు, భీమసేనుడు, ధౌమ్యుడు మొదలైన వారంతా, సజ్జనసాంగత్యం వల్ల దుర్జన సాంగత్యాన్ని పరిత్యజించిన బుద్ధిమంతుడు ఎవని మధురగాథలు ఒక్కమాటు వింటే మళ్లీ విడిచి పెట్టలేడో అటువంటి శ్రీకృష్ణుని ఎడబాటు సహించ

లేనివారైనారు. అనుక్షణం ఆయనను చూస్తూ, తాకుతూ, మాట్లాడుతూ, ఆయనతో కలిసి శయనిస్తూ, కూర్చుంటూ, భుజిస్తూ ఉండే పాండవులతో పాటు శ్రీకృష్ణుడు వెనుకకు మరలి రావాలని అభిలషిస్తూ, ఆయన వెళ్లిన మార్గాన్ని అవలోకిస్తూ, హరిమయాలైన హృదయాలతో, అశ్రుమయాలైన నయనాలతో అల్లంత దూరంలో నిలబడి పోయారు.

**సీ. కనకసౌధములపైఁ గౌరవకాంతలు గుసుమవర్షంబులు గోరి కురియ**
**మౌక్తికదామ సమంచిత ధవళాత పత్రంబు విజయుండు పట్టుచుండ**
**నుద్ధవ సాత్యకు లుత్సాహవంతులై రత్న భూషితచామరములు వీవ**
**గగనాంతరాళంబు గప్పి కాహళభేరి పటహ శంఖాది శబ్దములు మొరయ**

**ఆ. సకలవిప్రజనులు సగుణనిర్గుణరూప, భద్రభాషణములు పలుకుచుండ**
**భువన మోహనుండు పుండరీకాక్షుండు, పుణ్యరాశి హస్తిపురము వెడలె. 234**

* భువనమోహనుడూ, పుండరీకాక్షుడూ అయిన కృష్ణుడు పుంజీభవించిన పురజనుల పురాకృత పుణ్యంలాగా హస్తినాపుర వీథుల వెంట సాగిపోతున్నాడు. అంతఃపుర కాంతలు బంగారు మేడలపై నిలబడి పురుషోత్తమునిపై పుష్ప వర్షాలు కురిపించారు. విజయుడు వెనుక నిలబడి ముత్యాలసరాలతో విరాజిల్లే శ్వేతచ్ఛత్రాన్ని పట్టాడు. ఉద్ధవుడూ, సాత్యకీ, ఉత్సాహంతో ఇటూ నటూ రత్నఖచితాలైన పిడులు పట్టుకొని వింజామరలు వీస్తున్నారు. బాకాలూ, నగారాలూ, తప్పెటలూ, శంఖాలూ ఆకాశం బద్దలయేటట్లు మ్రోగుతున్నాయి. వేదవేత్తలైన బ్రాహ్మణులు సగుణ నిర్గుణ స్వరూపనిరూపకంగా స్వస్తివచనాలు పలుకుతున్నారు.

**వ. తత్సమయంబునం బౌరసుందరులు ప్రాసాదశిఖర భాగంబుల నిలిచి గోపాలసుందరుని సందర్శించి, వర్గంబులై మార్గంబుల రెండు దెసలం గరారవిందంబులు సాచి యొండొరులకుం జూపుచుం దమలోనం దొల్లిటం బ్రళయంబున గుణంబులం గూడక జీవులు లీనరూపంబులై యుండం బ్రపంచంబు ప్రవర్తింపని సమయంబున నొంటి దీపించు పురాణపురుషుం డితండనువారును, జీవులకు బ్రహ్మత్వంబు గలుగ లయంబు సిద్ధించుట యెట్లను వారును, జీవోపాధి భూతంబు లయిన సత్త్వాదిశక్తుల లయంబు జీవుల లయంబను వారును, గ్రమ్మఱ సృష్టికర్తయైన యప్పరమేశ్వరుండు నిజవీర్య ప్రేరితయై నిజాంశ భూతంబులైన జీవులకు మోహిని యగుచు సృష్టి సేయ నిశ్చయించి నామరూపంబులు లేని జీవులందు నామరూపంబులు గల్పించుకొఱకు, వర్తిల్లు స్వమాయ నంగీకరించు ననువారును, నిర్మలభక్తి సముత్కంఠావిశేషంబుల, నకుంఠితులై జితేంద్రియులగు విద్వాంసు లిమ్మహానుభావు నిజరూపంబు దర్శింతు రనువారును, యోగమార్గమునంగాని దర్శింపరాదను వారునునై మఱియును. 235**

* ఆ సమయంలో శ్యామసుందరుణ్ణి సందర్శించటానికి పౌరసుందరీమణులు వీథి కిరువైపులా ఉన్న సౌధాలపై కెక్కారు. గుంపులు గుంపులుగా నిలబడి, చేతులు చాచి కృష్ణుణ్ణి ఒకళ్లు మరొకళ్లకు చూపించుకొంటూ తమలో తాము సంభాషించుకో సాగారు. ఆదికాలంలో ప్రపంచం పుట్టక ముందు ఆకారం

ధరించని ప్రాణి సమూహాన్నంతా తనలో లీనం చేసుకొని అద్వితీయ పరబ్రహ్మమై విరాజిల్లే పురాణ పురుషుడనేవారు కొందరూ, ఉపాధిభూతాలైన సత్త్వాది శక్తుల లయమే జీవుల లయ మనేవారు కొందరూ; మళ్లీ ఆ పరమేశ్వరుడే ఆత్మ శక్తిచే ప్రేరేపించబడి దేవాంశ సంభూతులైన జీవులను మోహింప జేసేదీ, నామరూపాలు లేని జీవులకు నామరూపాలు కల్పించి సృష్టిని ప్రవర్తింపజేసేది, అయిన మాయను అంగీకరిస్తాడు అనేవారు కొందరూ, పరిశుద్ధమైన భక్తి ప్రపత్తులతో, కుంటుపడని ఉత్కంఠతో జితేంద్రియులై, సుగుణవతంసులై విద్వాంసులు ఈ దేవదేవుని సత్య స్వరూపాన్ని సందర్శిస్తారు అనేవారు మరికొందరూ, యోగమార్గం ద్వారానే సర్వేశ్వర సాక్షాత్కారం సంభవమనే ఇంకొందరూ.

**మ. రమణీ! దూరము వోయెఁ గృష్ణురథమున్; రా దింక వీక్షింప నీ**
**కమలాక్షుం బొడగానలేని దినముల్ గల్పంబులై తోఁచు; గే**
**హములం దుండఁగ నేలపోయి పరిచర్యల్ సేయుచున్ నెమ్మి నుం**
**దము రమ్మా, యనె నొక్క చంద్రముఖి కందర్పాశుగభ్రాంతయై. 236**

* ఓ చెలీ! శ్రీకృష్ణుని రథం దూరంగా వెళ్లింది. ఇక మన కళ్లకు కన్పించదు. కమలాక్షుణ్ణి కనుగొనలేని దినాలు కల్పాలుగా తోస్తాయి. ఇక ఈ యిండ్లలో క్షణం కూడా ఉండలేము. మాధవుని వెంట మనం కూడా వెళ్లి ఆయనకు సేవలు చేస్తూ అక్కడే హాయిగా ఉందాము అంది పువ్విలుకాని క్రొవ్విరి తూపులకు గురియైన ఒక జవ్వని.

**మ. తరుణీ! యాదవరాజు గాఁడితఁడు; వేదవ్యక్తుఁడై యొక్కఁడై**
**వరుసన్ లోకభవస్థితి ప్రళయముల్ వర్తింపఁగాఁ జేయు దు**
**స్తర లీలారతుఁడైన యాశుఁ, డితనిన్ దర్శించితిం బుణ్య భా**
**సుర! నే నంచు నటించె నొక్కతె మహాశుద్ధాంతరంగంబునన్. 237**

* సఖీ! ఈ కృష్ణుడు వేద వేద్యుడైన ఆదినారాయణుడే గాని యాదవ ప్రభువు కాదే! ఈ మహానుభావుడు విశ్వానికి సృష్టి స్థితి లయాలు కల్పించే దేవదేవుడే! ఈయన లీలలు మనం తెలుసుకోలేం. లోకేశ్వరుణ్ణి కనులారా ఆలోకించిన నేను ఎంత అదృష్టవంతురాలనో అని ఒక అంగన ఆనంద తరంగాలు పొంగిపొరలే అంతరంగంతో చిందులు వేసింది.

**క. తామసగుణు లగు రాజులు, భూమిం బ్రభవించి ప్రజలఁ బొలియింపఁగ స**
**త్త్వామలతనుఁడై యీతఁడు, భామిని! వారల వధించుఁ బ్రతికల్పమునన్. 238**

* తమోగుణ దూషితులైన భూపతులు ప్రతికల్పంలోనూ ఈ పుడమిలో పుట్టి ప్రజానీకాన్ని బాధించి వేధించే సమయంలో సత్య స్వరూపుడై సముద్భవించి ఆ జగత్కంటకులను సంహరించే స్వామిని చూడవే భామినీ! అన్నది ఒక కలహంసగామిని.

**వ. ఇదియునుం గాక. 239**

* వారు ఇంకా ఈ విధంగా అనుకొన్నారు-

సీ. ఈ యుత్తమశ్లోకుఁ డెలమి జన్మింపంగ యాదవకుల మెల్ల ననఘ మయ్యె;
నీ పుణ్యవర్తనుఁ డేప్రొద్దు నుండంగ మథురాపురము దొడ్డ మహిమఁ గనియె
నీ పూరుష శ్రేష్ఠు నీక్షింప భక్తితో ద్వారకావాసులు ధన్యులైరి
యీ మహాబలశాలి యెఱిఁగి శిక్షింపంగ నిష్కంటకం బయ్యె నిఖిలభువన

తే. మీ జగన్మోహనాకృతి నిచ్చగించి, పంచశర భల్ల జాల విభజ్యమాన
వివశ మానసమై వల్లవీసమూహ, మితని యధరామృతము గ్రోలు నెల్లప్రొద్దు. 240

* ఈ సచ్చరిత్రుడు జన్మించటం మూలంగానే యాదవవంశం పునీతమయింది. ఈ పుణ్యమూర్తి ఎల్లప్పుడూ నివసించటం వల్లనే మధురానగరం మహిమాన్వితమై పేరెన్నిక గన్నది. ఈ పురుషోత్తముణ్ణి అనుక్షణం వీక్షించటం చేతనే ద్వారకలో ఉండే పౌరులు ధన్యాత్ములైనారు. ఈ వీరాధివీరుడు క్రూరాత్ములను ఏరి పారవేయటం ద్వారా ఈ విశాల విశ్వం ప్రశాంతంగా మనగలుగుతున్నది. ఈ జగన్మోహనుని సౌందర్యాన్ని సందర్శించి, మన్మథ శరపరంపరలకు కంపించిన హృదయాలతో వ్రేపల్లెలోని పల్లవపాణులు ఎల్లవేళలా ఈ నల్లనయ్యమోవి తేనియలు త్రావుచూ ఉంటారు.

ఉ. ఈ కమలాక్షు నీ సుభగు నీ కరుణాంబుధిఁ బ్రాణనాథుఁగాఁ
జేకొని వేడ్కఁ గాఁపురము సేయుచు నుండెడి రుక్మిణీ ముఖా
నేక పతివ్రతల్ నియతి నిర్మలమానసలై జగన్నుతా
స్తోక విశేషతీర్థములఁ దొల్లిటి బాముల నేమి నోఁచిరో! 241

* ఈ కమలాక్షుణ్ణి, ఈ సౌందర్య రాశిని, ఈ కరుణాసముద్రుణ్ణి తమ జీవితేశ్వరునిగా స్వీకరించి ఆనందంగా కాపురం చేస్తున్న ఆ రుక్మిణీ, సత్యభామా మొదలైన సాధ్వీమణులు నిష్కల్మష హృదయాలతో పూర్వజన్మలో ఏ పుణ్యతీర్థాలు సేవించారో, ఏ మంచినోములు నోచారో-

వ. అని యిట్లు నానా విధంబులుగాఁ బలుక పురసుందరుల వచనంబు లాకర్ణించి కటాక్షించి నగుచు నగరంబు వెడలె; ధర్మజుండును హరికి రక్షకంబులై కొలిచి నడువం జతురంగ బలంబులం బంచిన దత్సేనాసమేతులై దనతోడి వియోగంబున కోర్వక దూరంబు వెనుతగిలిన కౌరవుల మరలించి కురుజాంగల పాంచాల దేశంబులు దాటి, శూరసేన యామున భూములం గడచి బ్రహ్మావర్త, కురుక్షేత్ర, మత్స్య, సారస్వత, మరుధన్వ, సౌవీరాభీరసైంధవ విషయంబు లతిక్రమించి, తత్తద్దేశవాసు లిచ్చిన కానుకలు గైకొనుచు నానర్త మండలంబు సొచ్చి పద్మబంధుండు పశ్చిమ సింధు నిమగ్నుండయిన సమయంబున బరిశ్రాంతవాహుండై చనిచని. 242

* అని అనేక విధాలుగా సంభాషించుకొంటున్న పౌర కాంతామణుల పలుకులు వింటూ, క్రీగంటి చూపులతో కనుగొంటూ, మందహాస వదనారవిందుడైన గోవిందుడు మున్ముందుకు సాగాడు. ధర్మరాజు

శ్రీకృష్ణునికి అంగరక్షకులుగా చతురంగబలాలను పంపించాడు. ఆ సైన్యంతో పాటు తన ఎడబాటుకు ఓర్వలేక పంపటం కోసం బహుదూరం వచ్చిన పాండునందనులను వెనుకకు పంపించి వసుదేవనందనుడు యమునాతీరంలో ఉన్న కురుజాంగల పాంచాల శూరసేన దేశాలు దాటాడు. బ్రహ్మావర్తాన్నీ, కురుక్షేత్రాన్ని గడిచాడు. మత్స్య సారస్వత మరుధన్వ దేశాల గుండా సాగి ఆభీర సౌవీర సింధుదేశాలను అతిక్రమించాడు. ఆ యా దేశప్రజలు సమర్పించిన కానుకలు అందుకొంటూ ద్వారకలో అంతర్భాగమైన ఆవర్తమండలాన్ని చేరుకొన్నాడు. సంధ్యాసమయం సమీపించింది. అశ్వాలు అలిసిపోయాయి. అల్లంత దూరంలో ద్వారకానగరం కనిపించింది.

## -: శ్రీకృష్ణుడు ద్వారకానగరంబు ప్రవేశించుట :-

మ. జలజాతాక్షుఁడు శౌరి డగ్గఱె మహాసౌధాగ్ర శృంగారకన్
గలహంసావృత హేమపద్మపరిఖా కాసారకన్ దోరణా
వళి సంఛాదిత తారకన్ దరులతా వర్గానువేలోదయ
త్ఫలపుష్పాంకుర కోరకన్ మణిమయ ప్రాకారకన్ ద్వారకన్. 243

* తామరరేకుల వంటి కన్నులు గల శ్రీకృష్ణుడు బంగారు కలశాలతో ప్రకాశించే ఎత్తైన మేడలు కలదీ, కలహంసలతోనూ కాంచనవర్ణ కమలాలతోనూ అలరారే అగడ్తమడుగు కలదీ, చుక్కలు తాకే చక్కని తోరణాలు కలదీ; పండ్లతో, పువ్వులతో, చివుళ్లతో, మొగ్గలతో నిండిన లతాకుంజాలూ, వృక్షపంక్తులూ కలదీ; రత్నఖచిత ప్రాకారాలు కలదీ ఐన ద్వారకానగరాన్ని సమీపించాడు.

వ. ఇట్లు తన ప్రియపురంబు డగ్గఱి 244

* ఈ విధంగా తన అత్యంత ప్రియమైన రాజధాని సమీపానికి వెళ్లినవాడై-

మత్త. అన్యసన్నుత సాహసుండు మురారి యొత్తె యదూత్తముల్
ధన్యులై వినఁ బాంచజన్యము దారితాఖిలజంతు చై
తన్యమున్ భువనైక మాన్యము దారుణధ్వని భీత రా
జన్యమున్ బరిమూర్ఛితాఖిలశత్రు దానవసైన్యమున్. 245

* ఆత్మీయులే కాక అన్యులు సైతం అభినందించే ధైర్యసాహసాలు కల గోవిందుడు సమస్త ప్రాణులనూ నిశ్చేష్టులను చేసేదీ, లోకం ప్రశంసలు అందుకోగలిగిందీ, చెవులు బద్దలయ్యే శబ్దంతో రాజులను బెదరగొట్టేదీ, ప్రతిపక్షులైన రాక్షసయోధు లందరినీ మూర్ఛిల్లచేసేదీ అయిన "పాంచజన్య" మను తన శంఖాన్ని పూరించాడు. మాన్యులైన యదుకులాగ్రగణ్యు లందరూ ఆ శంఖధ్వనిని విని ధన్యులైనారు.

శా. శంఖారావము వీనులన్ విని జనుల్ స్వర్ణాంబర ద్రవ్యముల్
సంఖ్యాతీతము కొంచు వచ్చిరి దిదృక్షాదర్పితోత్కంఠన

**ప్రేంఖద్భక్తులు వంశకాహళమహా భేరీగజాశ్వావళీ**
**రింఖారావము లుల్లసిల్ల దనుజారిం జూడ నాసక్తులై. 246**

* పాంచజన్య శంఖారావం చెవుల పడగానే ప్రజలంతా ఉరకలు వేసే ఉత్కంఠతో, పరవళ్ళు తొక్కే భక్తితో, అతిశయించిన ఆసక్తితో వేణువులూ, బాకాలూ ఊదుతూ, నగారాలు మ్రోగిస్తూ, గిట్టల చప్పుళ్లు చేస్తూ నడిచే గుర్రాలతో ఏనుగులతో అసంఖ్యాకమైన బంగారు వస్తువులూ, విలుగల వలువలూ కానుకగా తీసుకొని యదుకుల స్వామికి ఎదురువచ్చారు.

**క. బంధులుఁ బౌరులుఁ దెచ్చిన, గంధేభ హయాదులైన కానుకలు దయా**
**సింధుఁడు గైకొనె నంబుజ, బంధుఁడు గొను దత్త దీప పంక్తులభంగిన్. 247**

* బంధుమిత్రులూ, ప్రజలూ కొనితెచ్చిన ఏనుగులూ, గుర్రాలూ మొదలైన బహుమతులను కరుణాసింధువైన శ్రీకృష్ణుడు, భక్తులర్పించిన దీపపంక్తులను పరిగ్రహించే పద్మబంధునిలాగా అందుకొన్నాడు.

**వ. ఇట్లాత్మారాముండును బూర్ణకాముండునైన యప్పరమేశ్వరునికి నుపాయనంబు లిచ్చుచు నాగరులు వికసితముఖులయి గద్గద భాషణంబులతోడ డయ్యకుండ నడపునయ్యకు నెయ్యంపుఁ జూపుల నడ్డంబు లేని బిడ్డల చందంబున మ్రొక్కి యిట్లనిరి. 248**

* ఈ విధంగా ద్వారకాపుర పౌరులు ఆత్మారాముడూ, సంపూర్ణకాముడూ అయిన శ్యామసుందరునికి కానుకలు సమర్పించి ఆనందంతో వికసించిన ముఖాలు కలవారూ, హర్షగద్గద భాషణాలు కలవారూ అయి కంటికి రెప్పలా కాపాడే నల్లనయ్యకు, కన్నతండ్రికి చిన్నబిడ్డల వలె నమస్కరించి ఇలా పలికారు-

**శా. నీ పాదాబ్జము బ్రహ్మపూజ్యము గదా, నీ సేవ సంసార సం**
**తాపధ్వంసినియౌఁ గదా, సకలభద్రశ్రేణులం బ్రీతితో**
**నాపాదింతుఁ గదా, ప్రపన్నులకుఁ గాలాధీశ! కాలంబు ని**
**ర్వ్యాపారంబు గదయ్య చాలరు నినున్ వర్ణింప బ్రహ్మాదులున్. 249**

* స్వామీ! నీ పాదాబ్జాలు బ్రహ్మపూజ్యాలు. నీ చరణ సేవ సంతాపమయమైన సంసార సముద్రాన్ని దాటించే నావ. నీవు ఆపన్నులకు సకలసౌభాగ్యాలూ సంతోషంగా ప్రసాదించే కరుణామూర్తివి. నీవు కాలస్వరూపుడవు. కాలానికి అధీశ్వరుడవు. బ్రహ్మాది దేవతలు కూడా నిన్ను ప్రశంసించలేరు.

**క. ఉన్నారము సౌఖ్యంబున, విన్నారము నీ ప్రతాప విక్రమకథలన్**
**మన్నారము ధనికులమై, కన్నారము తావకాంఘ్రి కమలములు హరీ! 250**

* కృష్ణా! నీ దయవల్ల క్షేమంగా ఉన్నాము. సిరిసంపదలు సమృద్ధిగా గైకొన్నాము. నీ అవక్రపరాక్రమ గాథలను వీనులారా విన్నాము. ఇప్పుడు నీ చరణ కమలాలను కనులారా కన్నాము.

**క. ఆరాటము మది నెఱుఁగము, పోరాటము లిండ్లకడలఁ బుట్టవు పురిలోఁ**
**జోరాటన మెగయదు నీ, దూరాటన మోర్వలేము తోయజనేత్రా! 251**

* కమల నేత్రుడవైన ఓ స్వామీ! మనస్సులలో ఆరాటం లేకుండా, గృహాల్లో పోరాటం లేకుండా సుఖంగా ఉన్నాము. నగరంలో ఎక్కడా చోరభయాలు లేవు. అయినా నీవు దూరదూరాలకు పోయినప్పుడు నీ వియోగాన్ని సహించలేము.

ఉ. తండ్రుల కెల్లఁ దండ్రియగు ధాతకుఁ దండ్రివి దేవ! నీవు మా
తండ్రివిఁ దల్లివిం బతివి దైవమవున్ సఖివిన్ గురుండ; వే
తండ్రులు నీక్రియం బ్రజల ధన్యులఁ జేసిరి. వేల్పు లైన నో
తండ్రి! భవన్ముఖాంబుజము ధన్యతఁ గానరు మా విధంబునన్. 252

* తండ్రులందరికీ తండ్రియైన బ్రహ్మదేవునికి నీవు తండ్రివి. మా అందరికీ తండ్రివీ, తల్లివీ, దైవానివీ, భర్తవూ, మిత్రుడవూ, గురుడవూ, సమస్తమూ నీవే, కన్నతండ్రులైనా నీలాగా ప్రజలను పరమానంద భరితులను చేసి ధన్యులను చేయలేరు. దేవతలైనా మా లాగా నీ ముఖ పద్మాన్ని వీక్షించి కృతార్థులు కాలేరు.

క. చెచ్చెర గరినగరికి నీ, విచ్చేసిన నిమిషమైన వేయేండ్లగు నీ
వెచ్చోటికి విచ్చేయక, మచ్చికతో నుండుమయ్య మా నగరమునన్. 253

* ప్రభూ! నీవు మాటిమాటికి హస్తినాపురానికి వెళ్ళినప్పుడు ఒక్క నిమేషమే మాకు వేయేండ్లుగా తోస్తుంది. ఓ పచ్చనివిల్తుని కన్నయ్యా! నీవు ఇచ్చటినుంచి ఎచ్చటికీ విచ్చేయక మచ్చికతో మా నగరంలోనే నివసించవయ్యా!

ఆ. అంధకారవైరి యపరాద్రి కవ్వలం, జనిన నంధమయిన జగముభంగి
నిన్నుఁ గానకున్న నీరజలోచన! యంధతమస మతుల మగుదు మయ్య. 254

* సూర్యభగవానుడు పడమటి కొండచాటుకు పోయినప్పుడు అంధకారబంధురమైన జగత్తులాగా నీవు కన్నులకు కానరాకుంటే మేము కటిక చీకటిలో పడి కొట్టుమిట్టాడుతుంటాము.

వ. అని యిట్లు ప్రజలాడెడి భక్తియుక్త మధుర మంజులాలాపంబులు గర్ణకలాపంబులుగా నవధరించి, కరుణావలోకనంబులు వర్షించుచు హర్షించుచుఁ దనరాక విని మహానురాగంబున సంరంభ వేగంబుల మజ్జనభోజనశయనాది కృత్యంబు లొల్లక యుగ్రసేనాక్రూర వసుదేవ బలభద్ర ప్రద్యుమ్న సాంబచారు దేష్ణగద ప్రముఖ యదుకుంజరులు కుంజర తురగ రథారూఢులై దిక్కుంజరసన్నిభంబయిన యొక్క కుంజరంబు ముందట నిడుకొని, సూతమాగధ నట నర్తక వందిసందోహంబుల మంగళ భాష ణంబులును, భూసురాశీర్వాద వేదఘోషణంబులును, వీణావేణు భేరీపటహశంఖ కాహళ ధ్వానంబు లును, రథారూఢ విభూషణ భూషిత వార యువతీ గానంబులును, నసమానంబులై చెలంగ నెదురుకొని యథోచిత ప్రణామాభివాదన పరిరంభ కరస్పర్శన సంభాషణ మందహాస సందర్శనాది విధానంబుల బహుమానంబులు సేసి, వారలుం దానును భుజగేంద్ర పాలితంబైన భోగవతీనగరంబు చందంబున స్వ సమాన బల యదు భోజ దాశార్హ కుకు రాంధక వృష్ణివీరపాలితంబును, సకల కాల సంపద్యమానాంకుర పల్లవ కోరక కుట్మల కుసుమ ఫలమంజరీపుంజ భార వినమిత లతా పాదపరాజ

విరాజి తోద్యానమహావనోపవనారామ భాసితంబును, వనాంతరాళ రసాల సాల శాఖాంకుర ఖాదనక్షుణ్ణకషాయ కంఠ కలకంఠ మిథునకోలాహల ఫల రసాస్వాద పరిపూర్ణ శారికా కీరకులకలకల కహ్లార పుష్పమకరంద పాన పరవశ భృంగభృంగీకదంబ ఝంకారసరోవర కనకకమల మృదులకాండ ఖండస్వీకారమత్త వరాటాయత్త కలహంసనివహ క్రేంకారసహితంబును, మహోన్నతసౌధజాల రంధ్ర నిర్గతకర్పూర ధూపధూమపటల సందర్శన సంజాత జలధర భ్రాంతి విభ్రాంత సముద్ధతపింఛ నర్తనప్రవర్తమాన మత్తమయూరకేకారవ మహితంబును, నానారూపతోరణధ్వజ వైజయంతికా నికాయ నిరుద్ధతారకాగ్రహప్రకాశంబును, ముక్తాఫల విరచితరంగవల్లి కాలంకృత మందిరద్వార దేహళీవేదికా ప్రదేశంబును ఘనసార గంధసార కస్తూరికా సంవాసిత వణిగ్గేహగేహళీ నికర కనకగళంతికా వికీర్యమాణ సలిలధారా సంసిక్తవిపణి మార్గంబును బ్రతినివాస బహిరంగణ సమర్పిత రసాలదండ ఫలకుసుమ గంధాక్షత ధూపదీప రత్నాంబరాది వివిధోపహార వర్గంబును, బ్రవాళనీలమరకతవజ్ర వైడూర్య నిర్మిత గోపురాట్టాలకంబును, విభవనిర్జిత మహేంద్రనగరాలకంబును నైన పురవరంబుం బ్రవేశించి రాజమార్గంబున వచ్చు సమయంబున. 255

* ఈ ప్రకారంగా ద్వారకానగరంలోని ప్రజలు పలుకుతున్న భక్తి బంధురమైన మధుర మంజులాలాపాలు వీనులవిందుగా వింటూ, కరుణార్ద్రాలైన కడకంటిచూపులు కురిపిస్తూ, మురిపిస్తూ తన ఆగమనం విని మహానురాగంతో, సంరంభవేగంతో స్నానం, భోజనం శయనం మొదలైన నిత్యకృత్యాలు కూడా పరిత్యజించి ఉగ్రసేనుడూ, అక్రూరుడూ, వసుదేవుడూ, బలభద్రుడూ మొదలైన పెద్దలూ, ప్రద్యుమ్నుడూ, సాంబుడూ, చారుదేష్ణుడూ, గదుడూ మొదలైన యదు కుమారులూ ఏనుగులనూ గుర్రాలనూ రథాలనూ అధిరోహించినవారై, ఐరావతం వంటి ఒక భద్రగజాన్ని ముందుంచుకొని సూతులూ, నటులూ, నర్తకులూ, వందిమాగధులూ మొదలైనవారి మంగళభాషణాలతో భూసురోత్తముల ఆశీర్వాద వేదనినాదాలతో వీణ, వేణువు, నగారా, తప్పెట, శంఖం, బాకా మొదలైన వాద్య ధ్వనులతో నానాలంకారాలూ ధరించి రథాలపై కూర్చున్న వారకాంతల కమనీయ గానాలతో ఎదురువచ్చారు. వారందరినీ శ్రీకృష్ణుడు వందనాలతో, అభివాదాలతో, కౌగిలింతలతో, కరస్పర్శలతో యథోచితంగా గౌరవించాడు. వారితో కూడి, నాగరాజులచే పరిపాలింపబడే భోగవతీనగరంలాగా, తనంతటి బలసంపన్నులైన యదు భోజ దాశార్హ కుకుర అంధక వృష్ణివీరులచే సంరక్షింపబడుతున్న ద్వారకాపురాన్ని వాసుదేవుడు ప్రవేశించాడు.

ఆ మహానగరం ఎల్లకాలములందూ కోకొల్లలుగా ఉండే అంకురాలతో, పల్లవాలతో, కోరకాలతో, కుట్మలాలతో, కుసుమాలతో, పండ్ల గుత్తులతో , వంగిన లతలయొక్క, వృక్షాలయొక్క సమూహాలతో, విరాజిల్లే ఉద్యానవనాలతో, ఉపవనాలతో, క్రీడావనాలతో ప్రమదవనాలతో ప్రకాశిస్తున్నది. ఆ వనాలనడుమ ఉన్న బాలరసాల సాల నవపల్లవాలను కొరికి కషాయకంఠాలైన కలకంఠదంపతుల కుహూనినాదాలతో, ఫలరసాలను సంతృప్తిగా ఆస్వాదించిన గోరువంకల చిలుకల కలకలధ్వనులతో, వికసించిన కలువపూవుల్లోని మకరందాన్ని పానంచేసి పరవశించిన తుమ్మెద దంపతుల కమ్మని ఝంకారాలతోనూ, సరస్సులలో బంగరుతామరతూండ్ల తునుకలు తిని మైమరచిన కలహంసదంపతుల క్రేంకారాలతోనూ కూడి ఉన్నది.

మహోన్నతాలైన మేడల గవాక్షాలలో నుంచి బయలు వెడలిన కర్పూర ధూపాలూ, అగరుధూమాలూ చూచి నీలమేఘాలనే భ్రాంతితో ఒడలు తెలియక పింఛాలు విప్పి నాట్యాలు చేస్తున్న మత్తమయూరాల కేకారవాలతో నిండిఉంది. ఆనగరంలోని నానావిధాలైన మకర తోరణాలతో, విజయధ్వజాలతో, వైజయంతికలతో ఆకాశంలోని నక్షత్ర గ్రహమండలాల ప్రకాశాలు నిరుద్ధము లౌతున్నాయి. మంచిముత్యాలతో కూర్చిన రంగవల్లికలతో, అలంకరింపబడ్డ మందిరద్వారాలూ, గడపలూ, వేదికలూ ప్రకాశిస్తున్నాయి. కర్పూరం, చందనం, కస్తూరి పరిమళించే వర్తకుల గృహాల ద్వారబంధాలూ, బంగారు పాత్రలు జల్లుమని చల్లుతున్న నీటి జల్లులతో బాగా తడిసిన రాజమార్గాలూ, ప్రతి గృహం ప్రాంగణాలలో సిద్ధంగా ఉంచబడిన చెరకుగడలూ, పండ్లూ, పువ్వులూ, సుగంధద్రవ్యాలూ, మంగళాక్షతలూ, ధూపదీపాలూ, రత్నాంబరాలూ మొదలైన నానావిధాల కానుకలు కనువిందు కావిస్తున్నాయి. పగడాలతో, నీలాలతో, పచ్చలతో, వజ్రవైడూర్యాలతో నిర్మింపబడ్డ గోపురాలు, చంద్రశాలలు అంతటా ప్రకాశిస్తున్నాయి. ఆ పట్టణం తన మహావైభవంతో మహేంద్రుని స్వర్గపట్టణాన్నీ, కుబేరుని అలకాపట్టణాన్నీ తిరస్కరిస్తున్నట్లున్నది. ఇటువంటి ద్వారకా నగరాన్ని ప్రవేశించి శ్రీకృష్ణుడు రాజమార్గంలో గుండా వస్తున్నాడు.

**మత్త. కన్నులారగ నిత్యమున్ హరిఁ గాంచుచున్ మనువారల**
**య్యు న్నవీన కుతూహలోత్సవయుక్తి నాగర కాంతల**
**త్యున్నతోన్నతహర్మ్య రేఖల నుండి చూచిరి నిక్కి చే**
**సన్నలం దమలోన దద్విభు సౌకుమార్యము సూపుచున్.** 256

* ఆ నగరంలోని పౌరకాంతలందరూ ఆయన్ని చూడటానికి ఉన్నతోన్నతమైన సౌధాలను అధిరోహించారు. ప్రతినిత్యమూ కన్నుల విందుగా కనుగొంటున్నప్పటికీ వారు క్రొంగ్రొత్త కుతూహలంతో కూడినవారై నిక్కినిక్కి చూడసాగారు. తమలో తాము ఆ శ్యామసుందరుని సౌందర్య సౌకుమార్య లావణ్యమయ స్వరూపాన్ని చేతులు చాచి చూపించుకొంటూ ఆనందించారు.

**సీ. కలుముల నీనెడు కలకంఠి యెలనాఁగ వర్తించు నెవ్వాని వక్షమందు!**
**జనదృక్చకోరసంఘంబునకు సుధా పానీయపాత్రమే భవ్యముఖము!**
**సకలదిక్పాలకసమితికి నెవ్వాని బాహుదండంబులు పట్టుఁగొమ్మ!**
**లాశ్రితశ్రేణి కే యధిపుని పాదరాజీవ యుగ్మంబులు చేరుగడలు!**

**ఆ. భువనమోహనుండు పురుషభూషణుఁ, డెవ్వఁ డట్టి కృష్ణుఁ డరిగె హర్మ్యశిఖర,**
**రాజమాన లగుచు రాజమార్గంబున, రాజముఖులు గుసుమరాజిఁ గురియ.** 257

* ఏ మహానుభావుని వక్షస్థలంలో సిరిసంపదలు కురిసే నారీ శిరోమణి శ్రీదేవి నర్తిస్తూ ఉంటుందో, ఏ మహాత్ముని పావనవదనం ప్రేక్షకుల నయనచకోరాలకు అమృతం చిందే వెన్నెల పాత్రమో, ఏ మహనీయుని భుజాదండాలు సర్వదిక్పాలకులకు పట్టుకొమ్మలో, ఏ మహితాత్ముని పాదపద్మాలు ఆశ్రితులకు అండదండలో, ఏ మహాపురుషుడు భువనమోహనుడో అట్టి పురుషోత్తముడు, శ్రీకృష్ణుడు, సౌధశిఖరాలపై విరాజిల్లే రాజీవనలోచనలు కుసుమరాజి కురిపించగా రాజమార్గంలో సాగివెళ్లాడు.

ఉ. జలజాతాక్షుఁడు సూడ నొప్పె ధవళచ్ఛత్రంబుతోఁ జామరం
బులతోఁ బుష్ప పిశంగచేలములతో భూషామణి స్ఫీతుఁడై
నలినీబాంధవుతో శశిధ్వజముతో నక్షత్ర సంఘంబుతో
బలభిచ్చాపముతోఁ దటిల్లతికతో భాసిల్లు మేఘాకృతిన్. 258

* శ్వేతచ్ఛత్రంతో, చామరాలతో పుష్పాలతో, పీతాంబరాలతో, మణిగణాలంకారంతో, ప్రకాశించే పద్మ పత్ర నేత్రుడైన శ్యామసుందరుడు, సూర్యబింబంతోనూ, చంద్రధ్వజంతోనూ, నక్షత్రసమూహంతోనూ, ఇంద్ర చాపంతోనూ, మెరుపుతీవతోనూ భాసిల్లే నీలమేఘం లాగా ఉన్నాడు.

వ. ఇట్లరిగి తల్లిదండ్రుల నివాసంబు సొచ్చి దేవకీ ప్రముఖులయిన తల్లుల కేడ్వురకు మ్రొక్కిన. 259

* శ్రీకృష్ణుడు జననీజనకుల సౌధానికి వెళ్లాడు. దేవకి మొదలైన ఏడుగురు తల్లులకూ నమస్కరించాడు.

క. బిడ్డఁడు మ్రొక్కినఁ దల్లులు, జడ్డన నంకముల నునిచి చన్నుల తుదిఁ బా
లొడ్డగిలఁ బ్రేమభరమున, జడ్డువడం దడిపి రక్షిజలముల ననఘా! 260

* చిన్నికన్నయ్య మ్రొక్కగా కన్నతల్లులు తటాలున ఆయన్ను తమ ప్రేమాంకాలలో కూర్చుండబెట్టుకొన్నారు. పుత్ర ప్రేమవల్ల వారివక్షోజాలలో పాలు పొంగి పొరలాయి. తల్లులందరూ నల్లనయ్యను తమ ఆనందబాష్పాలతో అభిషేకించారు.

## -: శ్రీకృష్ణుఁ డంతఃపురకాంతలం జూడఁ బోవుట :-

వ. తదనంతరంబ యష్టోత్తరశతషోడశ సహస్ర సౌధకాంతంబయిన శుద్ధాంతభవనంబు సొచ్చి హరి దన మనంబున- 261

* తరువాత గోవిందుడు పదహారువేల నూటయెనిమిది స్వర్ణ సౌధాలతో కూడిన అంతఃపుర ప్రాంగణంలోకి ప్రవేశిస్తూ ఇలా అనుకొన్నాడు.

మ. ఒక భామా భవనంబు మున్ను సొర వేఱొక్కర్తు లోఁగుందునో
సుకరాలాపము లాడదో, సొలయునో, సుప్రీతి నీక్షింపదో,
వికలత్వంబున నుండునో యనుచు నవ్వేళన్ వధూగేహముల్
ప్రకటాశ్చర్యవిభూతిఁ జొచ్చె బహురూపవ్యక్తుఁడై భార్గవా! 262

* ముందుగా ఒక సుందరి మందిరానికి వెళ్లితే వేరొక సుందరి కుందుతుందేమో! తొందరపాటుతో సూటిగా మాట్లాడదేమో! సొక్కిపోతుందేమో! ప్రేమతో వీక్షించదేమో! వైకల్యం వహిస్తుందేమో! అని అందరు భార్యల గృహాలలోకి అన్ని రూపాలు ధరించి అత్యద్భుతమైన మహిమతో ఒక్కమాటుగానే ప్రవేశించాడు.

వ. ఆ సమయంబున 263

* ఆవిధంగా వచ్చిన తమ హృదయేశ్వరుడైన యదునందనుణ్ణి చూచి-

క. శిశువులఁ జంకల నిడి తను, కృశతలు విరహాగ్నిఁ దెలుప గృహగేహళులన్
రశనలు జాఱఁగ సిగ్గున, శశిముఖు లెదురేఁగి రపుడు జలజాక్షునకున్. 264

* చంటిబిడ్డలను చంకనబెట్టుకొని, విరహతాపంవల్ల చిక్కి పోయిన శరీరాలతో, దిగ్గునలేచి సిగ్గుతో కాంచీకలాపాలు జారిపోగా చంద్రముఖు లందరూ యదుచంద్రునకు ఎదురువచ్చారు.

మ. పతి నాయింటికి మున్ను వచ్చె, నిదె నా ప్రాణేశుఁ డస్మద్గృహో
గతుఁడయ్యెన్ మును సేరెఁబో తొలుత మత్కాంతుండు నాశాలకే
నితరాలభ్య సుఖంబు గంటి నని తా రింటింట నర్చించి ర
య్యతివల్ నూఱుఁ బదాఱు వేలు నెనమండ్రవ్వేళ నాత్మేశ్వరున్. 265

* "ఇదుగో నా భర్త నా యింటికే తొలుత వచ్చాడు. నా ప్రాణేశ్వరుడు ముందుగా నా గృహంలోనే అడుగుపెట్టాడు. నా మనోనాథుడు నా మందిరానికే ముందుగా చేరాడు. అనన్య సామాన్యమైన ఆనందాన్ని నేనే పొందాను'' అనుకొంటూ పదహారువేల నూట యెనిమిదిమంది రమణీమణులు ఇంటింటా తమ ఆత్మేశ్వరుణ్ణి ఆర్చించారు.

వ. వారలం జూచి హరి యిట్లనియె. 266

* ఆ శుభ సమయంలో ప్రేమమయుడైన శ్రీకృష్ణుడు ఆ కామినీ మణుల క్షేమాన్ని ఇలా అడిగాడు-

మ. కొడుకుల్ భక్తి విధేయు లౌదురు గదా? కోడండ్రు మీ వాక్యముల్
గడవంజాలక యుందురా? విబుధ సత్కారంబు గావింతురా?
తొడవుల్ వస్త్రములుం బదార్థరస సందోహంబులుం జాలునా?
కడమల్ గావు గదా, భవన్నిలయముల్ గల్యాణయుక్తంబులే! 267

* "మీ కొడుకులు వినయవినమ్రులై మీ ఆజ్ఞలను పాలిస్తున్నారా? మీ కోడళ్లు మీ మాటలను జవదాటకుండా ఉన్నారా? చదువుకొన్న విద్వాంసులు అరుదెంచినప్పుడు సత్కారాలు చేస్తున్నారా? నగలూ, చీరలూ, రసవంతాలైన మధుర పదార్థాలూ అన్నీ సమృద్ధిగా ఉన్నాయా? మీకు ఎటువంటి లోటూ వాటిల్లటం లేదు. కదా!

సీ. తిలక మేటికి లేదు తిలకినీతిలకమ? పువ్వులు దుఱుమవా పువ్వుఁబోఁడి?
కస్తూరి యలఁదవా కస్తూరికాగంధి? తొడవులు దొడువవా తొడవుతొడవ?
కలహంసఁ బెంపుదే కలహంసగామిని? కీరముఁ జదివింతె కీరవాణి?
లతలఁ బోషింతు వా లతికా లలితదేహ? సరసి నోలాడుదే సరసిజాక్షి?

ఆ. మృగికి మేఁత లిడుదె మృగశాబలోచన? గురుల నాదరింతె గురువివేక?
బంధుజనులఁ బ్రోతె బంధుచింతామణి? యనుచు సతుల నడిగె నచ్యుతుండు. 268

* వధూతిలకమా! అలికాన దిలకం దిద్దుకోలేదేమి? పువ్వుబోణీ! తలలో పువ్వులు తురుముకోలేదేమి? చందనగంధీ! చందనం పూసుకోలేదేమి? హంసగామినీ! హంసలను పెంచుతున్నావా? చిలుకల కొలికీ! చిలుకలను తీయగా పలికిస్తున్నావా? లతాంగీ! లతలను పోషిస్తున్నావా? సరోజాక్షీ! సరోవరంలో చక్కగా స్నానం చేస్తున్నావా? హరిణలోచనా? బాలహరిణాలకు మేతలు పెడుతున్నావా? ముద్దుగుమ్మా? పెద్దలను గౌరవిస్తున్నావా? చుట్టాల సురభీ? చుట్టాలను ఆదరిస్తున్నావా?'' అంటూ మురారి ప్రియకాంత లందరినీ పరామర్శించాడు.

వ. అని యడిగిన వారలు హరిం బాసిన దినంబులందు శరీరసంస్కార కేళీ విహార హాస వన మందిర గమనమహోత్సవ దర్శనంబు లొల్లని యిల్లాండ్రు కావున. 269

* అప్పుడు ఆ కాంతలంతా తమ కాంతుడు ద్వారకలో లేని దినాలలో శరీర సంస్కారాలూ, లీలా విలాసాలు, పరిహాస భాషణాలూ, ఉద్యాన విహారాలూ, ఆలయ గమనాలూ, మహోత్సవ సందర్శనాలూ, ఇష్టపడని ఇల్లాండ్రు. అందువల్లవారు-

మ. సిరి చాంచల్యముతోడిదయ్యుఁ దనకున్ జీవేశ్వరుం డంచుఁ నే
పురుష శ్రేష్ఠు వరించె నట్టి పరమున్ బుద్ధిన్ విలోకంబులన్
గరయుగ్మంబులఁ గౌఁగిలించిరి సతుల్ గల్యాణ బాష్పంబు లా
భరణ శ్రేణులుగాఁ బ్రతిక్షణ నవ ప్రాప్తానురాగంబులన్. 270

* శ్రీదేవి చంచలస్వభావం కలదై కూడా, తన జీవితేశ్వరుడని ఏ పురుషోత్తముణ్ణి వరించి, ఒక్క క్షణం కూడా వదలిపెట్టకుండా ఉందో, అటువంటి పరమాత్ముణ్ణి ముందు మనస్సుతో, తరువాత చూపులతో, అటుపిమ్మట చేతులతో ఆనందాతిశయంతో కనుల వెంట ద్రవించే కల్యాణ బాష్పాలు అణిముత్యాల సరాలుగా జాలువారగా, క్షణక్షణమూ క్రొత్తదనంతో కూడిన అనురాగంతో గట్టిగా కౌగిలించుకొన్నారు.

మత్త. పంచబాణుని నీఱు సేసిన భర్గునిం దనవిల్లు వ
ర్జించి మూర్ఛిలఁ జేయఁజాలు విశేష హాస విలోకనో
దంచితాకృతులయ్యుఁ గాంతలు దంభచేష్టల మాధవున్
సంచలింపఁగఁ జేయ నేమియుఁ జాలరైరి బుధోత్తమా! 271

* సుధీమణివైన శౌనకా! పంచబాణుణ్ణి కంటిమంటతో భస్మం చేసిన పినాకపాణియైన పరమశివుణ్ణి సైతం విల్లు విడిచి మూర్ఛిల్లచేసే చిరునవ్వులూ, వాల్చూపులూ, మనోహరదేహాలూ కలవారై కూడా ఆ కాంతలు తమ శృంగార చేష్టలతో మాధవుని మనస్సును చలింప చేయలేక పోయినారు.

**వ. ఇవ్విధంబున సంగరహితుండైన కంసారి క్రైవడి విహరింప నజ్ఞాన విలోకులయిన లోకులు లోక సామాన్య మనుష్యుండనీ తలంతు, రాత్మాశ్రయమైన బుద్ధి యాత్మయందున్న యానందాదులతోడం గూడని తెఱంగున నీశ్వరుండు ప్రకృతితోడం గూడియు నా ప్రకృతి గుణంబులైన సుఖదుఃఖంబులఁ జెందకయుండుఁ, బరస్పరసంఘర్షణంబులచే వేణువుల వలన వహ్నిఁ బుట్టించి వనంబుల దహించు మహావాయువు చందంబున భూమికి భారహేతువులై యనేకాక్షౌహిణులతోడం బ్రవృద్ధతేజులగు రాజుల కన్యోన్య వైరంబులు గల్పించి నిరాయుధుండై సంహారంబు సేసి, శాంతుండై పిదపం గాంతామధ్యంబునఁ బ్రాకృతమనుష్యుండునుం బోలె సంచరించుచుండె నా సమయంబున- 272**

* ఈ విధంగా సర్వసంగ పరిత్యాగియైన కంసారి, సంసారిలాగా విహరించటం చూచి, మూర్ఖులైన లోకులు సామాన్య మానవునిగా భావిస్తారు. ఆత్మాశ్రయమైన బుద్ధి ఆత్మగతమైన గుణాలతో కలవని విధంగా పరమేశ్వరుడు ప్రకృతితో కలిసి ఉండి కూడా ఆ ప్రకృతిగుణాలైన సుఖదుఃఖాలను పొందకుండా ఉంటాడు. వెదురు గడలకు పరస్పరం సంఘర్షణ కలిగింది. అగ్ని పుట్టింది. అరణ్యాలను దహించే మహాప్రభంజనం మాదిరిగా వాసుదేవుడు, అనేక అక్షౌహిణీ సైన్యాలతో భూమికి బరువు చేటైన, ప్రవృద్ధ తేజులైన రాజులకు అన్యోన్యకలహాలు కల్పించి తానుమాత్రం ఆయుధం పట్టకుండా దుష్టసంహారం చేయించి పరమశాంతుడై ఇప్పుడు అంతఃపురాలలో కాంతాజనమధ్యంలో సామాన్య మానవుని వలె సంచరిస్తున్నాడు.

**క. యతు లీశ్వరుని మహత్త్వము, మిత మెఱుఁగని భంగి నప్రమేయుఁడగు హరి**
**స్థితి నెఱుఁగక కాముకుఁడని, రతములు సలుపుదురు తిగిచి రమణులు సుమతీ! 273**

* బుద్ధిమంతుడవైన శౌనకా! తపోనియతులైన యతులు పరమేశ్వరుని ప్రభావం ఇదమిత్థమని ఎరుగని విధంగా అప్రమేయుడైన వాసుదేవుని మహత్త్వాన్ని గుర్తించకుండా కాముకుడనే భావంతో రమణులందరూ ఆ రమారమణునితో క్రీడించారు.

**క. ఎల్లప్పుడు మా యిండ్లను, వల్లభుఁడు వసించు, నేమ వల్లభలము శ్రీ**
**వల్లభున కనుచు గోపీ, వల్లభుచే సతులు మమతవలఁ బడి రనఘా! 274**

* 'సచ్చరిత్రుడవైన శౌనకా! మా వల్లభుడు ఎప్పుడూ మా గృహాలను వదలిపెట్టడు. రమావల్లభుడైన యదువల్లభునకు మేమే ప్రియమైన వారం' అని భావించే ఆ కాంతలందరూ యశోదానందనుని వలపుల వలలో చిక్కుకొన్నారు.

**వ. అని చెప్పిన విని శౌనకుండు సూతున కిట్లనియె. 275**

* ఈ విధంగా చెప్పిన సూతుని మాటలు విని శౌనకుడు ఇలా అన్నాడు-

## -: ఉత్తరకుఁ బరీక్షిత్తు జన్మించుట :-

సీ. గురునందనుండు సక్రోధుఁడై యేసిన బ్రహ్మశిరో నామబాణవహ్నిఁ
గంపించు నుత్తరగర్భంబుఁ గ్రమ్మఱఁ బద్మలోచనుచేత బ్రదికె నండ్రు,
గర్భస్థుఁడగు బాలుఁ గంసారి యేరీతి బ్రతికించె మృత్యువు భయము వాపి
జనియించి యతఁ డెన్ని సంవత్సరము లుండె? నెబ్భంగి వర్తించె? నేమి సేసె?

ఆ. వినుము శుకుఁడు వచ్చి విజ్ఞాన పద్ధతి, నతని కెట్లు సూపె? నతఁడు పిదపఁ
దన శరీర మే విధంబున వర్జించె? విప్రముఖ్య! నాకు విస్తరింపు. 276

* "బ్రహ్మణ్యులలో అగ్రగణ్యుడవైన సూతమహర్షీ! ఆగ్రహావేశంతో అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మశిరోనామకమైన మహాస్త్రం మంటలకు, తపించిపోయిన ఉత్తర గర్భంలోని పసికందును దేవకీ నందనుడు తిరిగి బ్రతికించాడని విన్నాను. తల్లి గర్భంలో ఉన్న అర్భకుణ్ణి కమలాక్షుడు మృత్యువుబారి పడకుండా ఎలా రక్షించాడు? అలా సురక్షితుడై జన్మించిన ఆ బాలుడు ఈ ధరణిలో ఎన్ని సంవత్సరాలు జీవించాడు? ఏ విధంగా ప్రవర్తించాడు? ఏయే ఘనకార్యాలు చేశాడు? అనంతరం ఆయన తన తనువును ఏ విధంగా త్యజించాడు? ఈ విషయాలన్నీ నాకు వివరించు."

వ. అనిన సూతుం డిట్లనియె. ధర్మనందనుండు చతుస్సముద్ర ముద్రితాఖిల జంబూ ద్వీపరాజ్యంబు నార్జించియు, మిన్ను ముట్టిన కీర్తి నుపార్జించియు, నంగనాతురంగమాతంగ సుభట కాంచనాది దివ్యసంపదలు సంపాదించియు, వీరసోదర విప్ర విద్వజ్జన వినోదంబులఁ బ్రమోదించియు, వైభవంబు లలవరించియుఁ గ్రతువు లాచరించియు, దుష్టశిక్షణ శిష్టరక్షణంబు లొనరించియు, ముకుంద చరణారవింద సేవారతుండై సమస్త సంఘంబులందు నభిలాషంబు వర్జించి యరిషడ్వర్గంబు జయించి, రాజ్యంబు సేయుచు. 277

* అప్పుడు సూతుడు ఈ విధంగా చెప్పసాగాడు. ధర్మనందనుడు నాల్గు సముద్రాల నడుమ గల జంబూద్వీప సామ్రాజ్యానికి అధిపతి అయినాడు. ఆకాశాన్నంటిన అఖండకీర్తిని ఆర్జించాడు. అంగనామణులూ, ఉత్తమ తురంగాలూ, మత్త మాతంగాలూ, సుభట నికాయాలూ, సురుచిర సువర్ణాలూ మొదలైన అపార సంపదలను సంపాదించాడు. వీరాధివీరులైన సోదరులతో, విద్వాంసులైన విప్రవరేణ్యుల విద్యావినోదాలతో ఆనందించాడు. భోగభాగ్యాలను కైవసం చేసుకొన్నాడు. యజ్ఞాలు ఆచరించాడు. దుష్టులను శిక్షించాడు. శిష్టులను రక్షించాడు. గోవింద పాదారవింద సేవారతుడై, సమస్త ఐహిక విషయాలయందు విరక్తుడై, అరిషడ్వర్గాన్ని జయించినవాడై రాజ్యపాలన సాగించాడు.

తే. చందనాదుల నాఁకట స్రగ్గువాఁడు, దనివి నొందని కైవడి ధర్మసుతుఁడు
సంపదలు పెక్కు గలిగియుఁ జక్రిపాద, సేవనంబులఁ బరిపూర్తి సెందకుండె. 278

* ఆకలితో అటమటించే వానికి చందనచర్చలూ, పూలమాలలూ సంతుష్టిని కలిగించని విధంగా హరిచరణ సేవాతత్పరుడైన ధర్మరాజుకు ఈ ఐశ్వర్యాలేవీ సంపూర్ణమైన సంతోషాన్ని సమకూర్చలేదు.

వ. అంతం గొన్ని దినంబులకు నభిమన్యు కాంతాగర్భంబునందున్న డింభకుండు దశమమాస పరిచ్ఛేద్యుండై గర్భాంతరాళంబున దురంతంబైన యశ్వత్థామ బాణానలంబున దందహ్యమానుండై తల్లడిల్లుచు. 279

* ఇలా కొన్నాళ్లు గడిచాయి. అభిమన్యుని అర్ధాంగి అయిన ఉత్తరకు నవమాసాలు నిండాయి. పదవనెల ప్రవేశించింది. అప్పుడు కడుపులోని శిశువు గురుపుత్రుని శరాగ్ని జ్వాలలకు కమిలి, కుమిలిపోతూ ఇలా ఆక్రోశించసాగాడు-

ఉ. కుయ్యిడ శక్తి లే దుదరగోళములోపల నున్న వాఁడ ది
క్కెయ్యది దా ననాథ నని యెప్పుడుఁ దల్లి గణింప విందు నే
డియ్యిషువహ్ని వాయుటకు నెయ్యది మార్గము నన్నుఁ గావ నే
యయ్య గలండు? గర్భజనితాపద నెవ్వఁ డెఱుంగు దైవమా! 280

* ఓ భగవంతుడా! ఏడ్వటానికి ఓపికలేదు. తల్లిగర్భంలో తల్లడిల్లుతున్నాను. దిక్కులేని దీనుణ్ణి. 'అనాథ' నంటూ అనుక్షణం అమ్మ ఆక్రందించటం ఆలకిస్తున్నాను. ఈ బాణాగ్నిని నివారించే ఉపాయం ఏమిటి? ఈ అపాయంనుంచి నన్ను ఆదుకొనే దయగల తండ్రి ఎక్కడ ఉన్నాడో? తల్లి గర్భంలో నేను అనుభవించే వేదన అర్థంచేసుకొనే దైవమెవ్వరు?

క. చిచ్చఱకోలవశంబునఁ, జచ్చి బహిర్గతుఁడఁ గాని సమయమునను దాఁ
నుచ్చలితగర్భవేదనఁ, జచ్చును మా తల్లి ఘోర సంతాపమునన్. 281

* అయ్యో! ఈ చిచ్చులు చిమ్మే భయంకరబాణం వల్ల నేను చచ్చిపోవటం తథ్యం. కడుపులోని మృతశిశువును కనలేక అతిశయించిన గర్భవేదనతో అల్లాడి అల్లాడి, అమ్మకూడా మరణించటం తప్పదు.

క. చెచ్చెర బాణజ్వాలలు, వచ్చిన విష్ణుండు గావవచ్చు ననుచుఁ దాఁ
ముచ్చటలు సెప్పు సతులకు, నిచ్చలు మాయవ్వ నేఁడు నిజమయ్యెడినో. 282

* అమాంతంగా అస్త్ర జ్వాలలు నా పైకి వచ్చి పడినప్పుడు శ్రీహరి నన్ను రక్షిస్తాడని మా అమ్మ అనుదినం అందరితో అంటూ ఉంటుంది. అమ్మ చల్లని మాట యథార్థమౌతుందా?

శా. రాఁడా చూడ, సమస్తభూతములలో రాజిల్లువాఁ డిచ్చటన్
లేఁడా! పాఱుని చిచ్చఱమ్ముఁ దొలఁగన్ లీలాగతిం ద్రోచి నా
కీఁడా నేఁడభయప్రదాన మతఁ డూహింపన్ నతత్రాత మున్
గాఁడా! యెందఱిఁ గావఁడీ యెడల మత్కర్మంబు దా నెట్టిదో! 283

*అఖిల ప్రాణులలో అంతర్యామిగా ప్రకాశించే స్వామి నా కష్టాలు వీక్షించలేడా! నన్ను రక్షించటానికి రాడా! నిప్పులు చెరిగే ఈ బ్రహ్మాస్త్రాన్ని శాంతింపజేయడా! ఆపన్నుడనైన నాకు అభయమీయడా! కాపాడమని కైమోడ్చేవాళ్లను ఎందరినో కనికరించి కాచిన కరుణామయుడు నా మొరలాలించి నన్ను లాలించి పాలించడా! ఏమో! నా అదృష్టం ఎలా ఉన్నదో!

వ. అని గతప్రాణుండై భ్రూణగతుండైన శిశువు చింతించు సమయంబున- 284

* ఇలా వస్తూ పోతూ ఉన్న ప్రాణాలతో ఉత్తర కడుపులో ఉన్న చిన్నారి ఎన్నో విధాల చింతించసాగాడు.

సీ. మేఘంబుమీఁది క్రొమ్మెఱుఁగు కైవడి మేని పైనున్న పచ్చని పటమువాఁడు
గండభాగంబులఁ గాంచన మణి మయ మకరకుండల కాంతి మలయువాఁడు
శరవహ్ని నడఁగించు సంరంభమునఁ జేసి కన్నుల నునుఁగెంపు కలుగువాఁడు
బాలార్కమండల ప్రతిమాన రత్నహాటక విరాజిత కిరీటంబు వాఁడు

తే. కంకణాంగద వనమాలికా విరాజ, మానుఁ డసమానుఁ డంగుష్ఠమాత్రదేహుఁ
డొక్క గదఁ జేతఁ దాల్చి నేత్రోత్సవముగ, విష్ణుఁ డావిర్భవించె నవ్వేళయందు. 285

* ఆ సమయంలో మేఘంమీద మెరుపుతీవలాగా, నల్లని దేహం మీద పచ్చని చేలం ధరించినవాడూ, చెక్కిళ్ళపైన మణులు చెక్కిన మకరకుండలాల పసిడికాంతులు ప్రసరించేవాడూ, శరాగ్ని జ్వాలల్ని చల్లార్చే సంరంభం వల్ల రవ్వంత జేవురించిన కన్నులు కలవాడూ, ఉదయించే సూర్యబింబాన్ని పోలిన రత్నఖచిత సువర్ణ కిరీటం తలపై దాల్చినవాడూ, కంకణాలతో, భుజకీర్తులతో, వనమాలికతో విరాజిల్లేవాడూ, అంగుష్ఠమాత్రదేహుడూ అయిన శ్రీమహావిష్ణువు గదాధరుడై కన్నులపండువుగా గర్భంలోని అర్భకుని ముందు అవిర్భవించాడు.

వ. ఇట్లు భక్త పరాధీనుండయిన పరమేశ్వరుం డావిర్భవించి మంచు విరియించు మార్తాండు చందంబున శిశువునకు దశదిశలం దనచేతి యఖండిత మహోల్కాసన్నిభంబైన గదాదండంబు మండలాకారంబుగ. జిఱజిఱం ద్రిప్పి విప్రుని చిచ్చఱమ్ము వేఁడిమి పోఁడిమిఁ జెఱచి, డింభకుని పరితాపవిజృంభణంబు నివారించి, గర్భంబు గందకుండ నర్భకునికి నానందంబు గల్పించిన 286

* ఈ విధంగా సాక్షాత్కరించి భక్తపరాధీనుడైన భగవానుడు భానుడు మంచును పటాపంచలు గావించినట్లు మండుతున్న ఉల్కవంటి గదాదండాన్ని మండలాకారంగా శిశువు దశదిశలా గిరగిర త్రిప్పుతూ, సెగలు పొగలు గ్రక్కే బ్రహ్మాస్త్ర ప్రతాపాన్ని శాంతింపజేశాడు. కడుపు కసుకందకుండా పసికందు పరితాపాన్ని ఉపశమింపజేసి అపరిమితానందం కలిగించాడు.

మ. గదఁ జేఁబట్టి పరిభ్రమించుచు గదాఘాతంబులం దుర్భయ
ప్రదమై వచ్చు శరాగ్నిఁ దుత్తుమురుగా భంజించి రక్షించు నీ
సదయుం డెవ్వఁడొకో యటంచు మదిలోఁ జర్చించుచున్ శాబకుం
డెదురై చూడ నదృశ్యుఁడయ్యె హరి సర్వేశుండు విప్రోత్తమా! 287

* "అరే! ఎవరీ కరుణామూర్తి! గదాహస్తుడై పరిభ్రమిస్తూ, భయంకరంగా పైనబడి బాధిస్తున్న బాణాగ్ని జ్వాలల్ని పటాపంచలు చేసి, నన్ను కటాక్షించి రక్షించిన ఈ దాక్షిణ్యామూర్తి ఎవరు?'' అంటూ

తర్కించుకొంటూ గర్భస్థశిశువు పరీక్షించి నిరీక్షించేలోగా భగవంతుడు అంతర్హితుడైనాడు.

**వ. అంత ననుకూల శుభగ్రహోదయంబును, సర్వగుణోత్తర ఫలసూచకంబును నైన శుభలగ్నంబునం బాండవ వంశోద్ధారకుం డయిన కుమారుడు జన్మించిన, ధర్మనందనుండు ధౌమ్యాది భూసుర వర్గంబు రప్పించి, పుణ్యాహంబు సదివించి జాతకర్మంబు సేయించి, కుమారు జన్మ మహోత్సవ కాలంబున భూసురులకు విభవాభి రామంబు లయిన గో భూ హిరణ్య హయానేక గ్రామంబులును స్వాదు రుచి సంపన్నంబు లయిన యన్నంబు లిడిన వారలు తృప్తులై ధర్మపుత్త్రున కిట్లనిరి. 288**

* అనంతరం శుభగ్రహాలన్నీ ఉచ్చస్థానాల్లో ఉండగా, సర్వసౌభాగ్య సముద్దాత్తమైన ఉత్తమ ముహూర్తంలో, ఉత్తరకు పాండవ వంశోద్ధారకుడైన బాలుడు ఉద్భవించాడు. ధర్మరాజు ధౌమ్యుడు మొదలైన పురోహితులను పిలిపించి పుణ్యాహవాచనం, జాతకర్మాదులు జరిపించాడు. పుత్రోదయ మహోత్సవాన్ని వైభవోపేతంగా నిర్వర్తించి, భూసురోత్తములకు షడ్రసోపేత భోజనాలు పెట్టించి, గోవులూ భూములూ సువర్ణాలూ అశ్వాలూ అగ్రహారాలూ దానం చేశాడు. సంతుష్టులైన బ్రాహ్మణ శ్రేష్ఠులు యుధిష్ఠిరుణ్ణి చూచి-

**చ. ప్రకటిత దైవ యోగమునఁ బౌరవ సంతతి యంతరింపఁగా**
**వికలత నొందనీక ప్రభవిష్ణుఁడు విష్ణుఁ డనుగ్రహించి శా**
**బకుఁ బ్రదికించెఁ గావున నృపాలక! శాబకుఁ డింక శాత్రవాం**
**తకుఁ డగు, విష్ణురాతుఁ డన ధాత్రిఁ బ్రసిద్ధికి నెక్కుఁ బూజ్యుఁడై. 289**

* "మహారాజా! దాటరాని దైవనియోగం వల్ల భారతవంశం అంతరించి పోకుండా ప్రభవిష్ణువైన శ్రీమహావిష్ణువు పరమానుగ్రహంతో ఈ పసిపాపను బ్రతికించాడు. ఈ బాలుడు, పగవారిపాలిటి లయకాలుడై విష్ణువుచేత రక్షించబడినందున విష్ణురాతు డనే నామంతో విఖ్యాతుడై, జగన్మాన్యుడౌతాడు." అని పలికారు.

**వ. అనిన వినిన భూదేవోత్తములకు నరదేవోత్తముం డిట్లనియె. 290**

* అప్పుడు ధర్మపుత్రుడు వారిని ఇలా అడిగాడు-

**శా. ఓ పుణ్యాత్మకులార! నా పలుకు మీ రూహింపుఁడా మ్రొక్కెదన్**
**మా పెద్దల్ శ్రుతకీర్తులై సదయులై మన్నారు రాజర్షులై**
**యీ పిన్నాతఁడు వారిఁ బోలెడిఁగదా యెల్లప్పుడున్ మాధవ**
**శ్రీపాదాంబుజ భక్తి యుక్తుఁ డగుచున్ జీవించునే! చూడరే. 291**

* "ఓ మహాత్ములారా! మీకు చేతులెత్తి నమస్కరిస్తున్నాను. నా పలుకులు ఆలకించి నా సందేహం తీర్చండి. మా పెద్దలంతా దిగంత విశ్రాంత కీర్తులై, కారుణ్యమూర్తులై, రాజర్షులై విరాజిల్లారు. ఈ చిన్నారి బాలుడు సైతం తన తాతముత్తాల అడుగుజాడల్లో నడుస్తూ వారిలాగానే ఎల్లప్పుడూ శ్రీ వల్లభుని పాద పద్మాలను భక్తితో సేవిస్తూ జీవిస్తాడు గదా! దయచేసి కొంచెం సెలవీయండి."

**వ. అనిన విని నరేంద్రా! భవదీయపౌత్త్రుండు మనుపుత్త్రుండయిన యిక్ష్వాకుని చందంబునం బ్రజల రక్షించు; శ్రీరామచంద్రుని భంగి బ్రహ్మణ్యుండు సత్య ప్రతిజ్ఞుండు నగు; డేగ వెంట నంటిన బిట్టు భీతంబై వెనుకకు వచ్చిన కపోతంబుఁ గాచిన శిబిచక్రవర్తి రీతి శరణ్యుండును వితరణ ఖనియు నగు; దుష్యంతసూనుండైన భరతు పగిది సోమాన్వయ జ్ఞాతివర్గంబులకు యజ్వలకు ననర్గళ కీర్తి విస్తరించు; ధనంజయ కార్తవీర్యుల కరణి ధనుర్ధరాగ్రేసరుండగుఁ; గీలి పోలిక దుర్ధర్షుం డగు; సముద్రుని తెఱంగున దుస్తరుండగు; మృగేంద్రంబు కైవడి విక్రమశాలి యగు; వసుమతివోలె నక్షయ క్షాంతి యుక్తుండగు; భానుని లాగునఁ బ్రతాపవంతుండగు; వాసుదేవు వడువున సర్వభూతహితుం డగుఁ; దల్లిదండ్రుల మాడ్కి సహిష్ణుం డగు. మఱియును. 292**

* అప్పుడు అజాతశత్రునితో విప్రులు ఈ విధంగా అన్నారు- ధర్మపుత్రా! ఈ నీ పౌత్రుడు మనువు కుమారుడైన ఇక్ష్వాకు నరేంద్రునిలాగా ప్రజలను పాలిస్తాడు. కారుణ్యసాంద్రుడైన శ్రీరామచంద్రునిలాగా సత్యసంధుడూ సౌజన్యసింధుడూ ఔతాడు. ఆకలిగొన్న డేగ వెన్నంటి తరమగా, అత్యంత భయసమేతమైన కపోతానికి అభయ మిచ్చిన శిబిచక్రవర్తిలాగా ఆర్తశరణ్యుడై వదాన్యులలో అగ్రగణ్యు డౌతాడు. దుష్యంతుని కుమారుడైన భరతునిలాగా యజన క్రియానిరతుడై. అఖండయశోభరితుడై చంద్రవంశానికి పేరు తెస్తాడు. అర్జునుని వలె, కార్తవీర్యార్జునునివలె విలుకాండ్రలో మేలుబంతి అవుతాడు. అగ్నిహోత్రుడులా చెనకరాని వాడూ, సముద్రనిలా అతిక్రమింపరాని వాడూ, సింహంవంటి పరాక్రమశాలీ, వసుంధరవంటి క్షమాశీలీ అవుతాడు. దినకరునిలా తేజో మహితుడూ, దేవకీనందనునిలా సకలభూత హితుడూ, జననీ జనకులులా సహన సహితుడూ అవుతాడు. అంతేకాదు-

**సీ. సమదర్శనంబున జలజాతభవుఁ డనఁ బరమప్రసన్నత భర్గుఁ డనఁగ**
**నెల్ల గుణంబుల నిందిరావిభుఁ డన నధికధర్మమున యయాతి యనఁగ**
**ధైర్యసంపద బలిదైత్యవల్లభుఁ డన నచ్యుతభక్తిఁ బ్రహ్లాదుఁ డనఁగ**
**రాజతోదారత రంతిదేవుం డన నాశ్రిత మహిమ హేమాద్రి యనఁగ**

**తే. యశము నార్జించుఁ, బెద్దల నాదరించు, నశ్వమేధంబు లొనరించు, నాత్మసుతుల**
**ఘనులఁ బుట్టించు, దండించు ఖలులఁ బట్టి, మానధనుఁడు నీ మనుమఁడు మానవేంద్ర! 293**

* ఇతడు సమదృష్టిలో జలజభవుడు- ప్రసాదంలో పరమశివుడు. రమణీయ గుణసంపదలో రమాధవుడు- అనిపించుకొంటాడు. ధర్మాతిశయంలో యయాతిగా, ధైర్యంలో బలిచక్రవర్తిగా, భక్తిద్రఢిమలో ప్రహ్లాదుడుగా, దాతృత్వగరిమలో రంతిదేవుడుగా, ఆశ్రయమహిమలో హిమగిరిగా ఖ్యాతి గాంచుతాడు. కీర్తిపై అనురక్తీ, పెద్దలపై భక్తీ, కలిగి అశ్వమేధాలు ఆచరిస్తాడు. తనవంటి తనయులకు తండ్రియై వంశాన్ని పండిస్తాడు. దుర్మార్గులను దండిస్తాడు. నీ మనుమడు మానధనులలో మాననీయు డౌతాడు.

**భుజంగ ప్రయాతము. హరించుం గలిప్రేరితాఘంబు లెల్లన్, భరించున్ ధరన్ రామభద్రుండుఁబోలెన్ జరించున్ సదా వేద శాస్త్రానువృత్తిన్, వరించున్ విశేషించి వైకుంఠు భక్తిన్. 294**

* ఇతడు కలికల్మషాలను హరిస్తాడు. శ్రీరామచంద్రుడులాగా భూభారాన్ని భరిస్తాడు. వేదశాస్త్రాలను అనుసరించి సదా చరిస్తాడు విశిష్టమైన విష్ణుభక్తిని వరిస్తాడు.

**వ. ఇట్లు పెక్కేండ్లు జీవించి, భూసుర కుమార ప్రేరితం బయిన తక్షక సర్ప విషానలంబునం దనకు మరణంబని యెఱింగి, సంగ వర్జితుండయి ముకుంద పదారవింద భజనంబు సేయుచు, శుకయోగీంద్రుని వలన నాత్మ విజ్ఞాన సంపన్నుండై, గంగాతటంబున శరీరంబు విడిచి, నిర్గత భయశోకం బయిన లోకంబుఁ బ్రవేశించునని జాతకఫలంబు సెప్పి లబ్ధకాములయి భూసురులు సని రంత.295**

* ఈ బాలుడు ఈ విధంగా అనేక సంవత్సరాలు గడిపి, మునికుమారునివల్ల ప్రేరేపించబడిన తక్షకుని విషాగ్నిజ్వాలలచే తాను చనిపోతానని తెలుసుకొని సర్వసంగ పరిత్యాగియై, గోవింద చరణారవింద భజనానురాగియై, శుకయోగీంద్రులవల్ల బ్రహ్మజ్ఞాన సంపన్నుడై గంగానదీతీరంలో శరీరాన్ని పరిత్యజించి భయశోకాలు లేని పుణ్య లోకానికి చేరుకుంటాడు- అని ఈ ప్రకారంగా బాలకుని భవిష్యత్తు ప్రకటించి, ధర్మరాజు ఇచ్చిన కానుకలు అందుకొని, భూసురోత్తములు సంతుష్టచిత్తులై వెళ్లిపోయారు.

**క. తన తల్లి కడుపులోపల, మును సూచిన విభుఁడు విశ్వమున నెల్లఁ గలం**
**డనుచుఁ బరీక్షింపఁగ జను, లనఘుఁ బరీక్షిన్న రేంద్రుఁ డండ్రు మునీంద్రా! 296**

* శౌనక మునీంద్రా! తన కన్నతల్లిగర్భంలో మున్ను తాను సందర్శించిన భగవంతుడు విశ్వమంతటా విరాజిల్లుతున్నాడేమో నని పరీక్షించినందువల్ల ఆ బాలుణ్ణి లోకులు 'పరీక్షిత్తు' అని పిలిచారు.

**ఆ. కళలచేత రాజు గ్రమమునఁ బరిపూర్ణు, డయిన భంగిఁ దాత లనుదినంబుఁ**
**బోషణంబు సేయఁ బూర్ణుఁ డయ్యెను ధర్మ, పటలపాలకుండు బాలకుండు. 297**

* తాతలు దినదినమూ అనురాగంతో పెంచి పెద్దచేయగా ఆ బాలకుడు, షోడశకళలచేత పరిపూర్ణుడైన చంద్రునివలె క్రమంగా వృద్ధిపొందసాగాడు.

**వ. మఱియు ధర్మనందనుండు బంధు సంహారదోషంబు వాయుకొఱకు నశ్వమేధయాగంబు సేయం దలంచి, ప్రజలవలనం గరదండంబుల నుపార్జితంబయిన విత్తంబు సాలక చిత్తంబునఁ జింతించునెడ నచ్యుత ప్రేరితులై భీమార్జునాదులు, దొల్లి మరుత్తుండను రాజు మఖంబు సేసి పరిత్యజించి నిక్షేపించిన సువర్ణ పాత్రాదికంబైన విత్తం బుత్తరదిగ్భాగంబువలన బలవంతులై తెచ్చిన, నా రాజసత్తముండు సమాయత్త యజ్ఞోపకరణుండై సకల బంధు సమేతంబుగఁ గృష్ణుని నాహ్వానంబు సేసి, పురుషోత్తము నుద్దేశించి మూఁడు జన్నంబులు గావించెఁ దదనంతరంబ కృష్ణుండు బంధుప్రియంబు కొఱకుఁ గరినగరంబునఁ గొన్నినెల లుండి ధర్మ పుత్త్రాదులచే నా మంత్రణంబు వడసి, యాదవ సమేతుండయి ధనంజయుఁడు దోడరా నిజనగరంబునకుం జనియె, నంతకు మున్ను విదురుండు తీర్థయాత్ర సని మైత్రేయు ముందటఁ గర్మయోగవ్రతాది విషయంబు లయిన**

**ప్రశ్నంబులఁ గొన్నిటిం జేసి యతని వలన నాత్మ విజ్ఞానంబు దెలిసి, కృతార్థుండై హస్తినాపురంబునకు వచ్చిన. 298**

* తర్వాత ధర్మనందనుడు చుట్టాలను చంపిన పాపం పోగొట్టుకోవటం కోసం అశ్వమేధయజ్ఞం చేయాలనుకొన్నాడు. పన్నుల రూపంలోనూ, శిక్షలరూపంలోనూ ప్రజలనుంచి రాబట్టిన ధనం సరిపోదే అని అతడు విచారించసాగాడు. అప్పుడు పూర్వం మరుత్త మహారాజు యజ్ఞంచేసి మిగిలిన ధనాన్ని భూమిలో నిక్షేపించాడని విని శ్రీకృష్ణభగవానునిచే ప్రేరితులైన భీమార్జునులు ఉత్తరానికి వెళ్లి సువర్ణరాసులు కొని తెచ్చారు. అనంతరం రాజవరేణ్యుడైన ధర్మనందనుడు యజ్ఞానికి కావలసిన ఉపకరణాలన్నీ సిద్ధంచేసుకొన్నాడు. శ్రీకృష్ణుణ్ణి బంధుసమేతంగా ఆహ్వానించాడు. పురుషోత్తముణ్ణి యజ్ఞపురుషుడుగా భావించి మూడు అశ్వమేధాలు కావించాడు. ఆ తర్వాత గోవిందుడు బంధువులైన పాండవుల సంతోషంకోసం హస్తినానగరంలో కొన్ని మాసాలపాటు ఉన్నాడు. అనంతరం ఆయన పాండవులను వీడ్కొని సకలబంధు సమేతుడై, అర్జునుణ్ణి వెంటబెట్టుకొని ద్వారకా నగరానికి వెళ్లిపోయాడు.

కొంతకాలానికి తీర్థయాత్రలకని బయలుదేరిన విదురుడు మైత్రేయ మహాముని సన్నిధి చేరుకొన్నాడు. కర్మాలు, యోగాలు, వ్రతాలు మొదలైన అంశాలపై ఆయన్ని కొన్ని ప్రశ్నలు అడిగి సందేహ నివృత్తి కావించుకొన్నాడు. పరమార్థజ్ఞానం సంపాదించిన విదురుడు కృతార్థుడై తిరిగి హస్తినకు అరుదెంచాడు.

**క. బంధుఁడు వచ్చె నటంచును, గాంధారీవిభుఁడు మొదలుగా నందఱు సం**
**బంధములు నెఱపి ప్రీతిం, బంధురగతిఁజేసి రపుడు మన్నన లనఘా! 299**

* ఆత్మ బంధుడైన విదురుడు తీర్థయాత్రలు ముగించి తిరిగి వచ్చాడని విని, ధృతరాష్ట్రుడూ, మొదలైన వారంతా ఎంతో సంతోషంతో ఎదురేగి స్వాగతం పలికారు.

**వ. అంత ధర్మనందనుండు విదురునికి మజ్జనభోజనాది సత్కారంబులు సేయించి సుఖాసీనుండై తనవార లందఱు విన నిట్లనియె. 300**

* ధర్మరాజు ధర్మవిదుడైన విదురునికి స్నానం, భోజనం మొదలైన సకల సత్కారాలూ చేయించి భోజనానంతరం సుఖాసీనుడై ఉన్న ఆయన్ను సమీపించి ఇలా అడిగాడు-

**సీ. ఏ వర్తనంబున నింతకాలము మీరు సంచరించితి రయ్య జగతిలోన**
**నే తీర్థములు గంటి రెక్కడ నుంటిరి భావింప మీవంటి భాగవతులు**
**తీర్థసంఘంబుల ధిక్కరింతురు గదా మీయందు విష్ణుండు మెఱయు కతన**
**మీరు తీర్థంబులు; మీ కంటె మిక్కిలి తీర్థంబు లున్నవె తెలిసిచూడ**

**తే. వేఱు తీర్థంబు లవనిపై వెదక నేల, మిమ్ముఁ బొడగని భాషించు మేలె చాలు**
**వార్త లేమంద్రు? లోకులు వసుధలోన, మీకు సర్వంబు నెఱిఁగెడి మేధ గలదు. 301**

* "అయ్యా! ఇంతకాలమూ మీరు ఏయే ప్రాంతాలు సందర్శించారు? ఎలా ఎలా సంచరించారు? ఏయే పుణ్యతీర్థాలు సేవించారు? ఏయే ప్రదేశాల్లో నివసించారు? మీవంటి పరమభాగవతోత్తములు తీర్థాలను లెక్కచేయరుగదా! మీలో భగవంతుడు సన్నిధిచేసి ఉన్నాడు. కనుక మీరే పుణ్యతీర్థాలు. ఆలోచించి చూస్తే మీకంటే మించిన పుణ్యతీర్థాలు పుడమిలో ఎక్కడ ఉన్నాయి? మీవంటి మహాత్ములను దర్శించి సంభాషించే అదృష్టం అబ్బితే చాలదా! వేరే తీర్థాలకోసం వెదకవలసిన పనేమున్నది? మీరు సర్వజ్ఞులు, వివేకవంతులు. ఉన్న చోటనే ఉండి లోకంలో ఉన్న విశేషాలన్నీ తెలుసుకోగలరు.

**మత్త. తండ్రి సచ్చినమీఁద మా పెదతండ్రిబిడ్డలు దొల్లి పె**
**క్కండ్రు సర్పవిషాగ్ని బాధల గాసిఁబెట్టఁగ మమ్ము ని**
**ల్లాండ్ర నంతముఁ బొందకుండఁగ లాలనంబున మీరు మా**
**తండ్రి భంగి సముద్ధరింతురు తద్విధంబు దలంతురే? 302**

* మా తండ్రిగారు చనిపోయిన అనంతరం మా పెదతండ్రి కుమారులు మమ్మల్ని ఎన్నో బాధలు పెట్టారు. సర్పాలచేత కరిపించారు. విషాన్నం తినిపించారు. కొంపకు నిప్పు అంటించారు. మా తండ్రివంటి మీరు మమ్మల్నీ మాతల్లినీ మృత్యువువాత పడకుండా అత్యంత అనురాగంతో లాలించి పాలించారు. కష్టాలలో నుంచి ఉద్ధరించారు. ఆ విషయాలన్నీ ఎన్నడైనా తలచుకొంటారా?

**క. పక్షులు తమఱెక్కలలోఁ, బక్షంబులు రాని పిల్లపదువుల మమతన్**
**రక్షించిన క్రియ మీరలు, పక్షీకరణంబు సేయ బ్రతికితిమి గదే. 303**

* రెక్కలురాని తమ పసికందుల్ని రెక్కల్లో దాచుకొని మమకారంతో రక్షించే పక్షుల విధంగా, మీరు ఎంతో దాక్షిణ్యంతో మాపక్షం వహించి మమ్మల్ని రక్షించారు.

**క. మన్నారా ద్వారకలో, నున్నారా యదువు లంబుజోదరు కరుణన్**
**గన్నారా లోకులచే, విన్నారా మీరు వారి విధ మెట్టిదియో? 304**

* మహానుభావా! మీరు తీర్థయాత్రలు చేస్తూ ద్వారకకు వెళ్లారా? వాసుదేవుణ్ణి కన్నారా? యాదవులంతా ఆ స్వామి అనుగ్రహం వల్ల సుఖంగా ఉన్నారా? పోనీ ఎవరివల్లనైనా వారి వృత్తాంతం విన్నారా?"

**చ. అన విని ధర్మరాజునకు నా విదురుండు సమస్తలోక వ**
**ర్తనముఁ గ్రమంబుతోడ విశదంబుగఁ జెప్పి యదుక్షయంబు చె**
**ప్పిన నతఁడుగ్రశోకమున బెగ్గిలు చుండెడి నంచు నేమియున్**
**విను మని చెప్పఁడయ్యెఁ; యదువీరుల నాశము భార్గవోత్తమా! 305**

* ఈ విధంగా ప్రశ్నించిన ధర్మరాజుతో విదురుడు తన తీర్థ యాత్రా విశేషాలన్నీ వివరించి చెప్పాడు. అన్నీ చెప్పాడు. కాని యాదవుల నాశనం మాత్రం చెప్పలేదు. అలా చెప్పితే ధర్మరాజు దుఃఖా వేశంతో క్రుంగి కృశించిపోతాడనే భయంతో ఆ విషయాన్ని చెప్పకుండా దాటవేశాడు.

ఆ. మేలు సెప్పెనేని మే లండ్రు లోకులు, చెట్టయండ్రు కీడు చెప్పెనేని
నంతమీఁద శూద్రుఁడైన కతంబున, శిష్టమరణ మతఁడు సెప్పఁడయ్యె. 306

* లోకులు మంచి విషయం చెప్పితే మేలు మేలని వింటారు. చెడ్డవిషయం చెబితే చీదరించుకొంటారు. అందువల్ల సదయహృదయుడైన విదురుడు యదువీరుల మరణవార్తను ధర్మరాజుకు చెప్పలేకపోయాడు.

వ. అది యెట్లనిన మాండవ్యమహాముని శాపంబునం దొల్లి యముండు శూద్ర యోనియందు విదురుండై జన్మించియున్న నూఱు వత్సరంబు లర్యముండు యథాక్రమంబునం బాపకర్ముల దండించె; నిట యుధిష్ఠిరుండు రాజ్యంబుఁ గైకొని లోకపాలసంకాశు లయిన తమ్ములుం దానును గులదీపకుండైన మనుమని ముద్దుసేయుచుఁ బెద్దకాలంబు మహావైభవంబున సుఖియై యుండెనంత. 307

* విదురుడు ధర్మస్వరూపుడు, పూర్వకాలంలో మాండవ్యుడనే మహర్షి శాపంవల్ల, యమధర్మరాజు శూద్రకులంలో విదురుడై జన్మించాడు. ఆ నూరు సంవత్సరాలూ, సూర్యుడే యథావిధిగా యమధర్మరాజు స్థానంలో ఉండి పాపాత్ముల పాపాలకు తగిన శిక్షలు విధిస్తూ ఉన్నాడు.

ఈ ప్రకారంగా ధర్మరాజు రాజ్యభారాన్ని స్వీకరించి దిక్పాలురవంటి సోదరులతో కూడి, కులదీపకుడైన మనుమణ్ణి ముద్దు ముద్దుగా పెంచి పెద్దచేశాడు. చాలాకాలం మహావైభవంతో సుఖంగా కాలం గడిపాడు.

క. బాలాజన శాలా ధన, లీలావన ముఖ్య విభవలీన మనీషా
లాలసు లగు మానవులను, గాలము వంచించు దురవగాహము సుమతీ! 308

* నాయనా! శౌనకా! విన్నావుగదా! అంగనా జనాలూ, ఆనంద భవనాలూ, అపారధనాలూ, అందాల వనాలూ మొదలైన భోగభాగ్యాలలో బుద్ధిపూర్వకంగా మునిగితేలుతూ, సుఖలాలసులైన మానవులను కాలం తెలియకుండానే మోసం చేస్తుంది. వంచనాశీలమైన అటువంటి కాలప్రవాహం దురవగాహం సుమా!

## -: గాంధారీ ధృతరాష్ట్రులు దేహత్యాగము సేసికొనుట :-

వ. అది నిమిత్తంబుగాఁ గాలగతి యెఱింగి విదురుండు ధృతరాష్ట్రున కిట్లనియె. 309

* అందువల్ల కాలజ్ఞుడైన విదురుడు ధృతరాష్ట్రుని సమీపించి ఇలా ప్రబోధించాడు.

మ. కనకాగార కళత్ర మిత్ర సుత సంఘాతంబులన్ ముందటం
గని ప్రాణేచ్ఛల నుండు జంతువుల నే కాలంబు దుర్లంఘ్యమై
యనివార్యస్థితిఁ జంపునట్టి నిరుపాయంబైన కాలంబు వ
చ్చె నుపాంతంబున, మాఱు దీనికి మదిం జింతింపు ధాత్రీశ్వరా! 310

* "రాజా! ప్రపంచంలోని మానవులు బంగారు భవనాలనూ, పుత్ర మిత్ర, కళత్ర పరివారాలనూ ఎల్లప్పుడూ ఎదురుగుండా చూచుకొంటూ, ప్రాణాలమీద తీపిని పెంచుకొంటూ ఉంటారు. అయితే దుర్నివారకమైన కాలం వాళ్లను చంపి తీరుతుంది. కాలాన్ని కాదని ఎదిరించే శక్తి ఎవరికీ లేదు. అక్కడ ఏ

ఉపాయాలూ పనిచేయవు. అటువంటి కాలం నీ సమీపానికి వచ్చి నీకోసం ఎదురుచూస్తున్నది మహారాజా! దీనికి ప్రతిక్రియ ఏదైనా ఆలోచించండి.

**శా. పుట్టంధుండవు, పెద్దవాఁడవు, మహాభోగంబులా లేవు, నీ**
**పట్టెల్లం జెడిపోయె; దుస్సహ జరాభారంబు పైఁగప్పె, నీ**
**చుట్టా లెల్లను బోయి; రాలు మగఁడున్ శోకంబునన్ మగ్నులై**
**కట్టా! దాయలపంచ నుండఁదగవే గౌరవ్యవంశాగ్రణీ! 311**

* ఓ కురుకులశిరోమణీ! అసలు నీవు పుట్టుకతోనే అంధుడవు. పైగా ఇప్పుడు మూడుకాళ్ల ముసలివైనావు. మహారాజ వైభవాలన్నీ అంతరించాయి. అధికారం అడుగంటింది. భరింపరాని వార్ధక్యం పైన బడింది. నా అన్నవారు అంతా గతించారు. ఇప్పుడు ఈ విధంగా బ్రతికి చెడ్డ మీ భార్యాభర్తలు బండెడు దుఃఖంతో మునిగి తేలుతూ అయ్యయ్యో! దాయాదులైన పాండవుల పంచలో పడి ఉండటం ఏమంత బాగుంది?

**క. పెట్టితిరి చిచ్చు గృహమునఁ, బట్టితిరి దదీయభార్యఁ, బాడడవులకుం**
**గొట్టితిరి, వారు మనుపఁగ, నెట్టైన భరియింపవలెనె?యీ ప్రాణములన్. 312**

* మీరు పాండవుల కొంపకు చిచ్చుపెట్టారు. పాండవపత్నిని నిండుసభలో చెరబట్టారు. ఆ అమాయికుల్ని అన్యాయం చేసి అరణ్యాలకు వెళ్లగొట్టారు. ఇప్పుడు ఈ విధంగా వారి అండజేరి, వారు పెట్టిన తిండి తిని ప్రాణాలు నిలుపుకుంటున్నారు.

**క. బిడ్డలకు బుద్ధి సెప్పని, గ్రుడ్డికిఁ బిండంబు వండికొని పొం; డిదె పైఁ**
**బడ్డాఁడని భీముం డొఱ గొడ్డెము లాడంగఁ గూడుఁ గుడిచెద వధిపా! 313**

* ఆనాడు బిడ్డలకు బుద్ధిచెప్పలేని గ్రుడ్డివాడు ఈ నాడు సిగ్గు లేకుండా మాయింటి మీద పడ్డాడు. ఈ కళ్లులేని కబోదికి ఇంత పిండం వండి పట్టుకెళ్లి పడెయ్యండి' అంటూ భీముడు పలికే పరుష వాక్కులు వింటూ, ఆ దిక్కుమాలిన తిండి తింటూ, ఎలా ఉంటున్నావు. మహారాజా!

**క. కనియెదవో బిడ్డల నిఁక, మనియెదవో, తొంటికంటె మనుమల మాటల్**
**వినియెదవో, యిచ్చెద ర, మ్మనియెదవో దానములకు నవనీసురులన్, 314**

* ఇక ఈ జన్మలో కన్నకొడుకుల ముఖాలు కనలేవు గదా! వెనుకటి దర్పంతో మనలేవు గదా! నీ మనుమల ముద్దు పలుకులు వినలేవుగదా! అగ్రహారాలు దానాలు గ్రహించటానికి ధరణీసురులను రమ్మనలేవు గాదా! ఎందుకయ్యా ఇంకా ఈ బ్రతుకు!

**క. దేహము నిత్యము గాదని, మోహముఁ దెగఁ గోసి సిద్ధ మునివర్తనుఁడై**
**గేహము వెలువడు నరుఁ డు, త్సాహముతోఁ జెందు ముక్తి సంపద ననఘా! 315**

* ఈ దేహం నిత్యం కాదన్న సత్యం తెలుసుకొని దేహం మీద వ్యామోహం తెంచుకొని, యోగ్యమైన వైరాగ్యమార్గంలో ఉత్సాహంగా ముందడుగు వేసేవాడే మోక్షలక్ష్మిని కైవసం చేసుకో గలుగుతాడు.''

**వ. అని విదురుండు ధృతరాష్ట్రునకు విరక్తి మార్గం బుపదేశించిన, నతండు ప్రజ్ఞాచక్షుండై, సంసారంబు దిగనాడి, మోహపాశంబు వలన నూడి, విజ్ఞానమార్గంబునం గూడి, దుర్గమంబగు హిమవన్నగంబునకు నిర్గమించిన 316**

* ఈ విధంగా విదురుడు ధృతరాష్ట్రునికి విరక్తి మార్గాన్ని ఉపదేశించాడు. ఆ ప్రబోధంతో కురురాజు జ్ఞాననేత్రం విప్పారింది. అతడు సంసార సౌఖ్యాలను విసర్జించి, మోహ బంధాలను త్రెంచి, జ్ఞాన మార్గాన్ని అవలంబించి, దురంతాలైన హిమవత్పర్వత ప్రాంతాలకు ప్రయాణం సాగించాడు.

**శా. అంధుండైన పతిన్ వరించి, పతిభావాసక్తి నేత్రద్వయీ**
**బంధాచ్ఛాదనమున్ ధరించి, నియమప్రఖ్యాతయై యున్న త**
**ద్గాంధారక్షితినాథు కూఁతురును యోగప్రీతి చిత్తంబులో**
**సంధిల్లం బతివెంట నేఁగె, నుదయత్సాధ్వీగుణారూఢయై. 317**

* పుట్టంధుడైన భూభర్తను భర్తగా వరించి, పతి చూడలేని ప్రపంచాన్ని తను మాత్రం ఎందుకు చూడాలనే పట్టుదలతో కళ్లకు గంతలు ధరించి, లోకావలోకనం పరిహరించిన ఆ సాధ్వీమణి- ఆ ఉత్తమ ఇల్లాలు- ఆ పుణ్యపురంధ్రి- ఆ గాంధార మహారాజు గారాబు కూతురు- గాంధారి అతిశయించిన వైరాగ్యభావంతో పతి వెంట బయలుదేరి పోయింది.

**చ. వెనుకకు రాక చొచ్చు రణవీరునికైవడి, రాజదండనం**
**బునకు భయంబు లేక వడిఁ బోయెడు ధీరుని భంగి, నప్పు డా**
**వనిత దురంతమైన హిమవంతము పొంత వనాంతభూమికిం**
**బెనిమిటితోడ నించుకయు భీతి వహింపక యేగెఁ బ్రీతితోన్. 318**

* సందేహం లేకుండా ముందుకు చొచ్చుకొనిపోయే సమర వీరుని రీతిగా, జంకూ గొంకూ లేకుండా రాజదండనాన్ని అనుభవించటానికి చకచక సాగిపోయే మగధీరుని మాదిరిగా, తిరుగులేని నిర్భీతితో, తరిగిపోని ప్రీతితో, తన వల్లభుని వెంటబడి హిమవంతం ప్రాంతంలోని దుర్గమవనాంతాలకు ఆమె నిర్గమించింది.

**వ. ఇట్లు విదురసహితులై గాంధారీ ధృతరాష్ట్రులు వనంబునకుం జనిన మఱునాడు ధర్మనందనుండు ప్రభాతంబున సంధ్యావందనంబు సేసి నిత్య హోమంబు గావించి బ్రాహ్మణోత్తములకు గో హిరణ్య తిల వస్త్రాది దానంబులు సేసి నమస్కరించి, గురువందనంబుకొఱకుఁ బూర్వప్రకారంబునం దండ్రి మందిరంబునకుం జని యందు విదుర సహితు లయిన తల్లిదండ్రులం గానక మంజుపీఠంబునఁ గూర్చున్న సంజయున కిట్లనియె. 319**

* ఈ ప్రకారంగా గాంధారీ ధృతరాష్ట్రులు విదురునితో కూడి అరణ్యాలకు వెళ్లారు. ఆ మర్నాడు ధర్మరాజు ప్రాతఃకాల కృత్యాలు తీర్చుకొని, సంధ్యావార్చుకొని, అగ్నికార్యాలు నెరవేర్చుకొన్నాడు. అనంతరం ఉత్తములైన విప్రులకు గోదాన సువర్ణదాన తిలదాన వస్త్రదానాదులు నిర్వర్తించి, పెద్దలకు నమస్కరించే నిమిత్తం యథావిధిగా పెదతండ్రిగారి భవనానికి వెళ్లాడు. అక్కడ విదురుడూ, గాంధారీ ధృతరాష్ట్రులూ కనిపించలేదు. ఒక సురుచిరపీఠం మీద సుఖాసీనుడై ఉన్న సంజయుణ్ణి చూచి ధర్మరాజు ఇలా అడిగాడు-

**సీ. మా తల్లిదండ్రు లీ మందిరంబున లేరు, సంజయ! వారెందుఁ జనిరి నేఁడు**
**ముందఱ గానఁడు ముదుసలి మా తండ్రి పుత్త్ర శోకంబునఁ బొగులుఁ దల్లి**
**సౌజన్యనిధి ప్రాణసఖుఁడు మా పినతండ్రి మంద బుద్ధులమైన మమ్ము విడిచి**
**యెటఁబోయిరో ముప్పు రెఱిఁగింపు గంగలోఁ దన యపరాధంబుఁ దడవికొనుచు**

**ఆ. భార్యతోడఁ దండ్రి పరితాపమునఁ బడుఁ, గపట మింత లేదు కరుణ గలదు**
**పాండుభూవిభుండు పరలోకగతుఁడైన, మమ్ముఁ బిన్నవాండ్ర మనిచె నతఁడు. 320**

* "సంజయా! మా తల్లీ తండ్రీ ఈ మేడలో కన్పించటం లేదు. వారెక్కడికి వెళ్లారో తెలియదు. మా తండ్రిగారు కంటిచూపు కరవైన ముదుకాళ్లముసలి. మా తల్లిగారు కడివెడు శోకంతో కన్నీరు మున్నీరుగా విలపిస్తుంటుంది. మా పినతండ్రిగారు మాకు ప్రాణ సమానుడు. సౌజన్యమూర్తి. ఈ ముగ్గురూ మందమతులమైన మమ్మల్ని వదలిపెట్టి ఎటు పోయినారో తెలియదు. మాపెదతండ్రిగారు ఒకవేళ తాము చేసిన తప్పులకు పశ్చాత్తాపం చెంది భార్యతో కూడా గంగలో దూకాడేమోనని అనుమానంగా ఉంది. తెలిస్తే చెప్పు. ఆయన చాలా అమాయకుడు, కరుణార్ద్రహృదయుడు. మా తండ్రి పాండుభూపాలుడు పరలోకగతుడు కాగా పిన్నవాళ్లమైన మమ్మల్ని ఎంతో ప్రేమతో పెంచి పెద్దచేశారు."

**వ. అనిన సంజయుండు దయాస్నేహంబుల నతికర్శితుం డగుచుఁ, దన ప్రభువు వోయిన తెఱం గెఱుంగక, కొంత దడ వూరకుండి, తద్వియోగ దుఃఖంబునఁ గన్నీరు దుడిచికొనుచు, బుద్ధి బలంబునం జిత్తంబు ధైర్యాయత్తంబు సేసి, తవ భర్తృపాదంబుల మనంబున నెన్నుచు ధర్మజున కిట్లనియె.321**

* ధర్మజుని మాటలు విని సంజయుడు కనికరంతోనూ, ప్రేమతోనూ నిండిన గుండెతో తన ప్రభువు ఎక్కడికి పోయినాడో తెలియక కొంచెం సేపు మౌనం వహించాడు. ఆ మహారాజు వెళ్లిపోయినందుకు పొంగివచ్చే కన్నీరు తుడుచుకొన్నాడు. గుండె దిటవుపరచుకొని తన ప్రభువు పాదాలు మనస్సులో ధ్యానిస్తూ ధర్మరాజుతో ఇలా అన్నాడు సంజయుడు.

**తే. అఖిల వార్తలు మున్ను నన్నడుగుచుండు, నడుగఁ డీ రేయి మీ తండ్రి యవనినాథ!**
**మందిరములోన విదురుతో మంతనంబు, నిన్న యాడుచు నుండెను నేఁడు లేఁడు. 322**

* "ధర్మజా! నీపెద తండ్రిగారు ప్రతిదినమూ వార్తలేమిటని నన్ను అడుగుతుండేవారు. ఈ రాత్రి ఆయన నన్నేమీ అడగలేదు. నిన్నటివరకూ రాజమందిరంలో విదురునితో కలిసి రహస్యాలోచనలు చేస్తూ ఉండేవాడు. ఈనాడు కంటికి కన్పించకుండా వెళ్లాడు.

వ. విదుర గాంధారీ ధృతరాష్ట్రులు నన్ను వంచించి యెందుఁబోయిరో వారల నిశ్చయంబులెట్టివో యెఱుంగనని సంజయుండు దుఃఖించు సమయంబునఁ దుంబురు సహితుండై నారదుండు వచ్చిన, లేచి నమస్కరించి తమ్ములుం దానును నారదుం బూజించి, కౌంతేయాగ్రజుం డిట్లనియె. 323

* విదురుడూ గాంధారీ ధృతరాష్ట్రులూ నాకు చెప్పకుండా నా కన్నుగప్పి ఎక్కడికి వెళ్లిపోయారో, ఏ ఉద్దేశ్యంతో వెళ్లిపోయారో తెలియదు'' అంటూ సంజయుడు బావురుమన్నాడు. ఆ సమయంలో తుంబురునితో నారదుడు అక్కడికి విచ్చేశాడు. ధర్మరాజు లేచి తమ్ములూ తానూ వారికి నమస్కారం చేసి పూజించాడు. అనంతరం అజాతశత్రుడు బ్రహ్మమానస పుత్రునితో-

ఉ. అక్కట! తల్లిదండ్రులు గృహంబున లేరు మహాత్మ! వారు నేఁ
డెక్కడ వోయిరో యెఱుఁగ, నెప్పుడు బిడ్డల పేరు గ్రుచ్చి తాఁ
బొక్కుచునుండుఁ దల్లి యెటు వోయెనొకో! విపదంబు రాశికిన్
నిక్కము కర్ణధారుఁడవు నీవు, జగజ్జన పారదర్శనా! 324

* దేవర్షీ! నీవు సర్వజ్ఞుడవు. ముల్లోకాలలో నీకు తెలియని దంటూ ఏమీలేదు. ఆపదలనే సముద్రం దాటించటానికి నిజంగా నీవు కర్ణధారుడవు. అయ్యో! మహాత్మా! ఏమని చెప్పమంటావు. తెల్లవారి చూచే సరికి మాతల్లిదండ్రులు ఇంటిలో లేరు. వారు ఇల్లు వదలి ఎక్కడికి పోయారో తెలియకుండా ఉంది. సర్వదా తనబిడ్డలను పేరు పేరునా తలచుకొని తల్లడిల్లే మా తల్లి ఎటుపోయిందో! ఏమయిపోయిందో!'' అని అన్నాడు.

వ. అనిన సర్వజ్ఞుండైన నారదుండు ధర్మజున కిట్లనియె; నీశ్వర వశంబు విశ్వంబు. ఈశ్వరుండ భూతంబుల నొకటితో నొకటిఁజేర్చు, నెడఁబాపు. సూచీ భిన్ననాసిక లందు రజ్జుప్రోతంబు లగుచుఁ గంఠరజ్జువులఁ గట్టఁబడిన బలీవర్దంబులంబోలెఁ గర్తవ్యాకర్తవ్యవిధాయక వేదలక్షణ యగు వాక్తంత్రియందు వర్ణాశ్రమ లక్షణంబులు గల నామంబులచే బద్ధులైన లోకపాల సహితంబులై లోకంబీశ్వరాదేశంబు వహించుఁ; గ్రీడాసాధనంబులగు నక్షకందు కాదుల కెట్లు సంయోగ వియోగంబు లట్లు క్రీడించు; నీశ్వరుని క్రీడాసాధనంబులైన జంతువులకు సంయోగ వియోగంబు లగుచుండు. సమస్తజనంబును జీవరూపంబున ధ్రువంబును దేహ రూపంబున నధ్రువంబునై యుండు; మఱియు నొక్క పక్షంబున ధ్రువంబు నధ్రువంబునుంగాక యుండు; శుద్ధబ్రహ్మస్వరూపంబున ననిర్వచనీయంబుగ రెండునై యుండు. అజగరంబుచేత మ్రింగం బడిన పురుషుం డన్యుల రక్షింప లేని తెఱంగునఁ బంచభూతమయంబై కాలకర్మ గుణాధీనంబైన దేహంబు పరుల రక్షింప సమర్థంబు గాదు. కరంబులు గల జంతువులకుఁ గరంబులు లేని చతుష్పదంబు లాహారంబు లగుఁ; జరణంబులు గల ప్రాణులకుం జరణంబులు లేని తృణాదులు భక్షణీయంబు లగు; నధికజన్మంబు గల వ్యాఘ్రాదులకు నల్పజన్మంబులు గల మృగాదులు భోజ్యంబు లగు, సకల దేహి దేహంబులందు జీవుండు గలుగుటం జేసి జీవునికి జీవుండ జీవిక యగు; అహస్త సహస్తాది

**రూపంబైన విశ్వమంతయు నీశ్వరుండుగాఁ దెలియుము. అతనికి వేఱు లేదు; నిజమాయా విశేషంబున మాయావియై జాతిభేద రహితుండైన యీశ్వరుండు బహుప్రకారంబుల భోగిభోగ్య రూపంబుల నంతరంగ బహిరంగంబుల దీపించుఁ గాన యనాథులు దీనులు నగు నాదు తల్లిదండ్రులు నను బాసి యే మయ్యెదరో, యెట్లు వర్తింతురో, యని వగవం బని లేదు. అజ్ఞానమూలం బగు స్నేహంబున నైన మనో వ్యాకులత్వంబు పరిహరింపు మని మఱియు నిట్లనియె. 325**

* ఆ పలుకుల విని నారదుడు ఇలా అన్నాడు- "ధర్మరాజా! ఈ విశ్వమంతా ఈశ్వరాధీనం. పరమేశ్వరుడే ప్రాణులను ఒకరితో ఒకరిని కలుపుతూ విడదీస్తూ ఉంటాడు. ముక్కుత్రాళ్ళు పొడిచి, మెడకు పలుపులు తగిలించి, పగ్గాలు చేత పట్టుకొని, కర్షకుడు ఎద్దులను త్రిప్పినట్లుగా భగవంతుడు కర్తవ్యాకర్తవ్యాలను బోధించి, వేద వాక్కులనే త్రాడు బిగించి , వర్ణాశ్రమధర్మాలకు అనుగుణమైన విధంగా ఇంద్రాది దిక్పాలకులతో సహా ప్రాణులను ఇష్టం వచ్చినట్లు త్రిప్పుతుంటాడు. క్రీడాకారుని ఇష్టానుసారం పాచికలూ, బంతులూ మొదలైన ఆటవస్తువులు కలుస్తూ విడిపోతూ ఉన్నట్లు భగవంతుని ఇచ్ఛానుసారంగా ప్రాణులకు సంయోగ వియోగాలు ప్రాప్తిస్తుంటాయి.

సమస్త దేవలోకమూ ఆత్మరూపంలో నిత్యమైనదై దేహరూపంలో అనిత్యమైనదై ఉంటుంది. మరోవిధంగా చూస్తే రెండు కాకుండా ఉంటుంది. అనిర్వచనీయమైన బ్రహ్మస్వరూపం పొందినప్పుడు నిత్యానిత్యమై ఉంటుంది. కొండచిలువ పట్టుకొన్న మనుష్యుడు ఇంకో మనుష్యునికి సహాయం చేయలేనట్లే పాంచభౌతికమై కాలకర్మాధీనమై, సంసారపంక నిర్మగ్నమైన దేహం పరులను కాపాడలేదు. చేతులున్న ప్రాణులకు చేతులులేని చతుష్పాద జంతువులూ, కాళ్ళుండి కదలగల ప్రాణులకు కాళ్ళులేని తృణాదులూ, ఆహార మవుతున్నాయి. పెద్దజంతువులైన పెద్దపులులు మొదలైనవి లేళ్ళు మొదలైన చిన్న జంతువులను తింటున్నవి. సమస్త దేహధారుల దేహాల్లో జీవుడు ఉన్నందువల్ల జీవికి జీవియే జీవనాధార మగుతున్నాడు. చేతులున్న ప్రాణులతోనూ, చేతులులేని ప్రాణులతోనూ నిండిన ఈ విశ్వమంతా ఈశ్వర స్వరూపంగా భావించు, ఆయనకంటే అన్యం లేదు. తన మాయావిశేషంచేత మహామాయావి అయిన పరాత్పరుడు బహురూపాలు ధరించి తానే భోక్తయై, భోజ్యమై; లోపలా, వెలుపలా అంతటా తానై విరాజిల్లుతున్నాడు.

అందువల్ల మహారాజా! "నా తల్లిదండ్రులు దీనులే! దిక్కు లేనివారే! నన్ను వదలి ఏమైపోతారో! ఏలా జీవిస్తారో!" అనే విచారం మాను. అజ్ఞానమూలకమైన మమకారం పెంచుకొని అనవసరంగా మనస్సును క్లేశపెట్టుకోవద్దు.

**ఆ. అట్టి కాలరూపుఁ డఖిలాత్ముఁడగు విష్ణుఁ, డసురనాశమునకు నవతరించి**
**దేవకృత్య మెల్లఁ దీర్చి చిక్కిన పని, కెదురుసూచుచుండు నిప్పు డధిప! 326**

* కాలస్వరూపుడై అఖిలాంతర్యామి అయిన భగవంతుడు అసురులను సంహరించటంకోసం అవతరించాడు. దేవకార్యం తీరిపోయింది. ఇప్పుడు మిగిలిన పనికోసం నిరీక్షిస్తున్నాడు.

మత్త. ఎంత కాలము గృష్ణుఁ డీశ్వరుఁ డిద్ధరిత్రిఁ జరించు, మీ
రంత కాలము నుండుఁ డందఱు నవ్వలం బనిలేదు, వి
క్రాంతి మానుము; కాలముం గడవంగ నెవ్వరు నోప, రీ
చింత యేల నరేంద్రసత్తమ! చెప్పెదన్ విను మంతయున్. 327

* అందువల్ల శ్రీకృష్ణభగవానుడు ఈ భూమిమీద ఉన్నంత కాలం మీరంతా ఉండండి. ఆయన అవతారం చాలించిన అనంతరం మీరూ ఉండవలసిన పనిలేదు. మహారాజా! వ్యాకులపడకు. ఎంత వాడయినా కాల ప్రభావానికి తలవంచక తప్పదు. ఎందుకు నీకీ విచారం, ఏమి జరిగిందో చెబుతా విను.

వ. ధృతరాష్ట్రుండు గాంధారీవిదుర సహితుండై హిమవత్పర్వతదక్షిణ భాగంబున నొక్క మునివనంబునకుం జని తొల్లి సప్తర్షులకు సంతోషంబు సేయుకొఱకు నాకాశగంగ యేడు ప్రవాహంబులయి పాఱిన పుణ్యతీర్థంబునం గృతస్నానుండై యథావిధి హోమం బొనరించి, జలభక్షణంబు గావించి, సకల కర్మంబులు విసర్జించి, విఘ్నంబులం జెందక నిరాహారుండయి, యుపశాంతాత్ముండయి పుత్త్రార్థదారైషణంబులు వర్జించి, విన్యస్తాసనుండై ప్రాణంబుల నియమించి, మనస్సహితంబులైన చక్షురాదీంద్రియంబుల నాఱింటిని విషయంబులం బ్రవర్తింపనీక నివర్తించి హరిభావనచే ధారణాయోగంబు వహించి, రజస్సత్త్వతమోరూపంబు లగు మలంబుల మూఁటిని హరించి మనంబు నహంకారాస్పదంబైన స్థూలదేహంబువలనం బాపి, బుద్ధియందు నేకీకరణంబు సేసి, యట్టి విజ్ఞానాత్మను దృశ్యాంశంబువలన వియోగించి, క్షేత్రజ్ఞుని యందుఁ బొందించి, దృష్టంబైన యీశ్వరుని వలన క్షేత్రజ్ఞునిం బాపి, మహాకాశంబుతోడ ఘటాకాశముం గలుపు కైవడి, నాధారభూతం బైన బ్రహ్మమందుఁ గలిపి, లోపలి గుణక్షోభంబును, వెలుపలి యింద్రియ విక్షేపంబును లేక నిర్మూలిత మాయాగుణవాసనుం డగుచు నిరుద్ధంబు లగు మనశ్చక్షురాదీంద్రియంబులు గలిగి, యఖిలాహారంబు లను వర్జించి, కొఱడు చందంబున. 328

* మీపెత్తండ్రి ధృతరాష్ట్రుడు గాంధారీ విదురులతో కలిసి హిమవత్పర్వతానికి దక్షిణంగా ఉన్న మునుల తపోవనానికి వెళ్లాడు. అక్కడ పూర్వం సప్తమహర్షుల సంతోషం కోసం ఆకాశగంగ ఏడు పాయలుగా ప్రవహించింది. 'సప్తస్రోత' మనే ఆ పుణ్యతీర్థంలో మీ తండ్రిగారు మూడు వేళలా స్నానం చేస్తూ, యథావిధిగా అగ్నికార్యం ఆచరిస్తూ, నిరాహారుడై కేవలం జలం మాత్రమే స్వీకరిస్తూ, సకలకర్మలూ పరిత్యజించి నిరాటంకంగా ప్రశాంతచిత్తుడై, ఈషణత్రయాన్ని విసర్జించి దర్భాసనాసీనుడై, జితేంద్రియుడై, సత్వరజస్తమో గుణాల మాలిన్యాన్ని పోకార్చి, తదేకధ్యానంతో శ్రీహరిని చింతిస్తూ ఉన్నాడు. ఆ విధంగా ఆయన తన మనస్సును అహంకారానికి ఆలవాలమైన స్థూల దేహంనుంచి సమైక్యంచేశాడు. అట్టి విజ్ఞానాత్మకమైన బుద్ధిని విషయాలనుంచి బుద్ధియందు మళ్లించి ఆత్మయందు సంలగ్నం చేశాడు. అట్టి ఆత్మను మహాకాశంలో ఘటాకాశాన్ని కలిపినట్టు సమస్త జగత్తుకు ఆధారభూతుడైన పరమాత్మలో సంలీనం చేశాడు. ఇప్పుడు మీ తండ్రి అంతరింద్రియ బాహ్యేంద్రియాల సంక్షోభం లేకుండా మాయను నిరోధించి, వాంఛలను నిర్మూలించి స్థాణువువలె పర్ణశాల లోపల ఉన్న వేదికపై నిశ్చలంగా ఆసీనుడై ఉన్నాడు.

మ. ఉటజాంతస్థ్సల వేదికన్ నియతుఁడై యున్నాఁడు నేఁడాదిగా
నిటపై నేనవనాఁడు మేన్ విడువఁగా నిజ్యాగ్ని యోగాగ్ని త
త్పటు దేహంబు దహింపఁ జూచి, నియమ ప్రఖ్యాత గాంధారి యి
ట్టటు వో నొల్లక ప్రాణవల్లభునితో నగ్నిం బడున్ భూవరా! 329

* మహారాజా! మీ తండ్రి ధృతరాష్ట్రుడు నేటికి ఐదవనాడు యోగాగ్నిలో దేహత్యాగం చేయటానికి సంసిద్ధుడై ఉన్నాడు. ఆ విధంగా ఆయన యోగాగ్నిలో దగ్ధం కావటం చూసి మహాపతివ్రత అయిన గాంధారి నిస్సంకోచంగా తన ప్రాణేశ్వరునితోపాటు ఆ పావక జ్వాలల్లో పడి భస్మమై పోతుంది.

క. అంతట వారల మరణము, వింత యగుచుఁ జూడఁబడిన విదురుఁడు చింతా
సంతాప మొదవఁ బ్రీత, స్వాంతుండై తీర్థములకుఁ జనియెడు నధిపా! 330

* అప్పుడు ఆ మహారాజ దంపతుల ఆత్మత్యాగానికి ఆశ్చర్య చకితుడైన విదురుడు సంతోష సంతాపాలు పెనగొన్న హృదయంతో పుణ్యతీర్థాలకు వెళ్లిపోతాడు.

వ. అని విదురాదుల వృత్తాంతం బంతయు ధర్మనందనుని కెఱింగించి తుంబురు సహితుండయిన నారదుండు స్వర్గంబునకు నిర్గమించిన వెనుక, ధర్మజుండు భీమునిం జూచి యిట్లనియె. 331

* ఈ విధంగా విదుర గాంధారీ ధృతరాష్ట్రుల వృత్తాంతాన్ని ధర్మరాజుకు సంపూర్ణంగా వివరించిన నారదుడు తుంబురునితో కూడా స్వర్గలోకానికి సాగిపోయాడు. అనంతరం అజాతశత్రుడు భీమసేనుణ్ణి చూచి ఇలా అన్నాడు-

## -: ధర్మరాజు దుర్నిమిత్తంబులం గని చింతించుట :-

సీ. ఒక కాలమునఁ బండు నోషధిచయము వే ఱొక కాలమునఁ బండకుండు నండ్రు
క్రోధంబు లోభంబు క్రూరత బొంకును దీపింప నరులు వర్తింతు రండ్రు
వ్యవహారములు మహావ్యాజ యుక్తము లండ్రు సఖ్యంబు వంచనా సహిత మండ్రు
మగలతో నిల్లాండ్రు మచ్చరించెద రండ్రు సుతులు దండ్రులఁ దెగఁ జూతు రండ్రు

తే. గురుల శిష్యులు దూషించి కూడ రండ్రు, శాస్త్రమార్గము లెవ్వియుఁ జరుగ వండ్రు
న్యాయపద్ధతి బుధులైన నడవరండ్రు, కాలగతి వింతయై వచ్చెఁ గంటె నేఁడు. 332

* "తమ్ముడూ! చూశావు కదా! కాలగమనంలో ఎంత మార్పు వచ్చిందో! పంటలు సకాలానికి పండటం లేదు. క్రోధం, లోభం, క్రౌర్యం, అసత్యం మితిమీరి ప్రజలు ప్రవర్తిస్తున్నారు. వ్యాపారాలలో మోసం చోటు చేసుకొంటున్నది. స్నేహంలో ద్రోహం కనిపిస్తూ ఉంది. భార్యలు భర్తలను ద్వేషిస్తున్నారు. కొడుకులు కన్నతండ్రులపై కాలుదువ్వుతున్నారు. శిష్యులు గురువులను దూషిస్తున్నారు. శాస్త్రవిధులు కుంటుబడ్డాయి. విజ్ఞులు సైతం న్యాయ మార్గాన్ని విడిచిపెట్టారు. కాలగమనం ఎంతగా వింతగా మారిపోయింది!

మ. హరిఁ జూడన్ నరుఁ డేఁగినాఁడు నెల లేడయ్యెం గదా రారు కా
లరు లెవ్వారును; యాదవుల్ సమద లోల స్వాంతు లీ వేళ సు
స్థిరులై యుండుదురా? మురారి సుఖియై సేమంబుతో నుండునా?
యెరవై యున్నది చిత్త మీశ్వరకృతం బెట్లో కదే! మారుతీ! 333

* మరున్నందనా! మాధవుని వెంట మన అర్జునుడు కూడా ద్వారకానగరానికి వెళ్ళాడు గదా! ఇప్పటికి ఏడు మాసాలు గడిచి పోయాయి. ఇంతవరకూ తిరిగిరాలేదు. మళ్లీ మనకు వారిక్షేమం తెలియలేదు. చారులు కూడా ఎవరూ రాలేదు. యాదవులు కొంచెం ఉద్ధత స్వభావులు. వారిది వేడిరక్తం. వారు ప్రశాంతచిత్తులై ఉండి ఉంటారు గదా! వాసుదేవుడు కుశలంగానే ఉంటాడు కదా! మనస్సంతా చికాకుగా ఉంది. ఈశ్వర సంకల్పం ఎలా ఉందో ఏమో!

క. మానసము గలఁగు చున్నది, మానవు బహుదుర్నిమిత్త మర్యాదలు, స
న్మానవ దేహక్రీడలు, మాన విచారింప నోపు మాధవుఁ డనుజా! 334

* భీమసేనా! నా మనస్సంతా వ్యాకులంగా ఉంది. అన్నీ దుశ్శకునాలే తోస్తున్నాయి. వాసుదేవుడు లీలామానుష దేహాన్ని చాలించాలని ఆలోచిస్తున్నాడేమో!

క. మనవులు సెప్పక ముందఱ, మన దార ప్రాణ రాజ్య మాన శ్రీలన్
మనుపుదు నని మాధవుఁడిట, మనమునఁ దలపోసి మనిచె మనలం గరుణన్. 335

* ఆ మధుసూదనుడు మనం విన్నవించుకొనక ముందే మన కష్టాలన్నీ గుర్తించి మన ధర్మపత్నినీ, ప్రాణాలనూ, రాజ్యాన్నీ, మర్యాదనూ, సిరిసంపదలనూ కంటికి రెప్పలా కాపాడాడు.

క. నారదుఁడాడిన కైవడిఁ, గ్రూరపుఁగాలంబు వచ్చుఁ గుంభిని మీఁదన్
ఘోరములగు నుత్పాతము, లారభటిం జూడఁబడియె ననిలజ! కంటే. 336

* నాయనా! నారదుడు చెప్పినట్లుగా చెడుకాలం దాపురించిదేమో! ఈ భూమిమీద భయంకరాలైన ఉపద్రవాలు కనిపిస్తున్నాయి. చూచావు. కదా!

సీ. ఒడక ముందట నొక సారమేయంబు మొఱుఁగుచు నున్నది మోర యెత్తి!
యాదిత్యుఁ డుదయింప నభిముఖంబై నక్క వాపోయె మంటలు వాతఁ గలుగ!
మిక్కిలుచున్నవి మెఱసి గృధ్రాదులు గర్దభాదులు దీర్చి క్రందుకొనియె!
నుత్తమాశ్వంబుల కుదయించెఁ గన్నీరు మత్తగజంబుల మదము లుడి గెఁ!

ఆ. గాలు దూతభంగిఁ గదిసెఁ గపోతము!, మండ దగ్ని హోమమందిరములఁ!
జుట్టుఁ బొగలు దిశల సొరిది నాచ్ఛాదించెఁ!, దరణి మాసెఁ జూడు ధరణి గదలె. 337

* అదుగో! మన ముందుగా ఒక్క కుక్క ముఖం పై కెత్తి మొరుగుతున్నది. నక్క ఉదయించే సూర్యునికి ఎదురుగా నిలబడి నోటి వెంట నిప్పులు గ్రక్కుతూ ఏడుస్తున్నది. గ్రద్దలు మొదలైన పక్షులు

గుంపులు గుంపులుగా తిరుగుతున్నాయి. గాడిదలు మొదలైన జంతువులు బారులు తీర్చినాయి. మేలిజాతి గుర్రాలు కన్నీరు కారుస్తున్నాయి. మదపుటేనుగులు నీరుగారి పోతున్నాయి. కపోతాలు యమదూతల్లాగా పైపైకి వస్తున్నాయి. హోమకుండాల్లో అగ్నిహోత్రాలు మండటంలేదు. దట్టమైన పొగలు దిక్కు లంతటా చుట్టుముట్టాయి. సూర్యబింబం మసక వేసినట్లుగా ఉంది. భూమి కంపించుతూ ఉంది.

**క. వాతములు విసరె, రేణు, వ్రాతము లాకసముఁ గప్పె, వడి సుడిగొని ని**
**ర్ఘాతములు వడియె, ఘన సంఘాతంబులు రక్తవర్షకలితము లయ్యెన్.** 338

* విపరీత వాయువులు వీచాయి. ఆకాశం ధూళి ధూసరితమైంది. పైనుండి పిడుగులు పడుతున్నాయి. మేఘాలు రక్తవర్షాన్ని కురుస్తున్నాయి.

**క. గ్రహములు పోరాడెడి నా, గ్రహములు వినఁబడియె, భూత కలకలములు దు**
**స్సహము లగుచు శిఖికీలా, వహములక్రియఁ దోఁచె గగన వసుధాంతరముల్.** 339

* గ్రహాలు ఆగ్రహంతో పోరాడుకొంటున్నాయి. ఎటు చూచినా భూతాల కలకలాలు వినబడుతున్నాయి. మన్నూ మిన్నూ ఏకమై భగ భగ మండిపోతున్నట్లు తోస్తున్నది.

**క. దూడలు గుడువవు చన్నులు, దూడలకున్ గోవు లీవు దుగ్ధము లొడలం**
**బీడలు మానవు పశువులఁ, గూడవు వృషభములు తఱపి కుఱ్ఱల నెక్కున్.** 340

* దూడలు పాలు తాగటం లేదు. ఆవులు దూడలకు పాలీయటం లేదు. దేశమంతటా వ్యాధులు వ్యాపించాయి. వృషభాలు గోవులను వదలి కోడెల మీద ఎక్కుతున్నాయి.

**క. కదలెడు వేల్పుల రూపుల, వదలెడుఁ గన్నీరు వానివలనం జెమటల్**
**వొదలెడిఁ బ్రతిమలు వెలిఁజని, మొదలెడి నొక్కొక్క గుడిని మేదినియందున్.** 341

* దేవమందిరాలలో దేవతావిగ్రహాలు కదులుతున్నాయి. కన్నీరు వదులుతున్నాయి. గుడిలోని ప్రతిమలు ఉక్కకు తాళలేకనేమో వెలుపలకు వెళ్ళిపోతున్నాయి.

**క. కాకంబులు వాపోయెడి, ఘూకంబులు నగరఁ బగలు గుండ్రలు గొలిపెన్**
**లోకంబులు విభ్రష్ట, శ్రీకంబులు గతి నశించి శిథిలము లయ్యెన్.** 342

* కాకులు కేకలు వేస్తున్నాయి. గుడ్లగూడలు పట్టపగలే గుండ్రంగా తిరుగుతున్నాయి. లోకాలు శోభను కోల్పోయి చీకాకు పాలైనాయి.

**మ. యవ పద్మాంకుశ చాప చక్ర ఝష రేఖాలంకృతంబైన మా**
**ధవు పాద ద్వయ మింక మెట్టెఁడు పవిత్రత్వంబు నేఁడాదిగా**
**నవనీకాంతకు లేదు పో మఱి మదీయాంగంబు వామాక్షి బా**
**హువు లాకంపము నొందుచుండు నిల కే యుగ్రస్థితుల్ వచ్చునో.** 343

* నాయనా! భీమసేనా! చ(క్ర-చాప-పద్మ- అంకుశాది శుభరేఖలతో అలంకృతమైన వాసుదేవుని పాదపద్మాలు స్పృశించి పావనమయ్యే అదృష్టం ఇక ఈ భూదేవికి లేదేమో! నా ఎడమ కన్నూ, ఎడమ భుజం మాటిమాటికీ అదురుతున్నాయి. ఈ లోకానికి ఇంకా ఎటువంటి భీకర పరిస్థితులు రానున్నాయో!

వ. **మఱియు మహోత్పాతంబులు పెక్కులు పుట్టుచున్నయని; మురాంతకుని వృత్తాంతంబు వినరాదని కుంతీసుతాగ్రజుండు భీమునితో విచారించు సమయంబున.** 344

* ఇంకా ఎన్నో ఉత్పాతాలు పుట్టుకొస్తున్నాయి. అక్కడ ద్వారకలో మన బావ శ్రీకృష్ణుడు ఎలా ఉన్నాడో ఏమో! ఆయన క్షేమవృత్తాంతం ఇంతవరకూ తెలియరాలేదు.'' అని ధర్మరాజు విషణ్ణహృదయంతో భీమసేనునితో మాటాడుతున్నాడు.

## -: అర్జునుండు ద్వారక నుండి వచ్చి కృష్ణ నిర్యాణంబుఁ దెల్పుట :-

క. **ఖేదమున నింద్రసూనుఁడు, యాదవ పురినుండి వచ్చి యగ్రజుఁ గని త**
**త్పాదముల నయన సలిలో, త్పాదకుఁడై పడియె దీనుభంగి నరేంద్రా.** 345

* శౌనకాది మునీంద్రులారా! అంతలో ద్వారకానగరం నుంచి వచ్చిన అర్జునుడు అ(శుపూరిత నే(త్రాలతో భరింపరాని దుఃఖంతో దీనుడై అగ్రజుని పాదాలపై వాలాడు.

క. **పల్లటిలిన యుల్లముతోఁ, దల్లడపడుచున్న పిన్నతమ్మునిఁ గని వె**
**ల్వెల్ల నగుమొగముతో జను, లెల్లను విన ధర్మపుత్రుఁ డిట్లని పలికెన్.** 346

* అల్లకల్లోలమైన మనస్సుతో తల్లడిల్లిపోతున్న చిన్న తమ్ముణ్ణి చూచి ధర్మరాజు ముఖం వెలవెలబోయింది. ఆయన అందరూ వింటుండగా అర్జునునితో ఇలా పలికాడు-

సీ. **మాతామహుండైన మన శూరుఁ డున్నాడె? మంగళమే మన మాతులునకు ?**
**మోదమే నలుగురు ముగురు మేనత్తల? కానందమే వారి యాత్మజులకు?**
**నక్రూర కృతవర్మ లాయుస్సమేతులే? జీవితుఁడే యుగ్రసేనవిభుఁడు?**
**కల్యాణయుక్తులే గద సారణాదులు? మాధవు తమ్ములు మానధనులు?**

తే. **నందమే మన సత్యకనందనునకు? భద్రమే శంబరాసుర భంజనునకుఁ?**
**గుశలమే బాణదనుజేంద్రు కూఁతుపతికి? హర్షమే పార్థ! ముసలికి, హలికి, బలికి?** 347

* నాయనా! అర్జునా! మన మాతామహుడైన శూరసేనుడు కుశలమే కదా! మన మేనమామ వసుదేవుడు సుఖంగా ఉన్నాడు కదా! మన మేనత్తలు ఏడుగురూ సంతోషంగా ఉన్నారు కదా! వారి కొడుకు లందరూ క్షేమమే కదా! అక్రూర కృతవర్మలకు ఆరోగ్యమే కదా! ఉగ్రసేన మహారాజు తిన్నగా తిరుగుతున్నాడా! మానధనులూ వాసుదేవుని సోదరులూ అయిన గదుడు, సారణుడు మొదలైన వారంతా కుశలమేనా? మన సాత్యకి క్షేమమేనా? ప్రద్యుమ్నుడు బాగా ఉన్నాడా? అనిరుద్ధుడు కులాసాగా ఉన్నాడా? మన పెద్దబావ బలరాముడు సుఖంగా ఉన్నాడా?

వ. మఱియు నంధక మధు భోజ దశార్హ వృష్ణి సాత్వతులు మొదలయిన యదువంశ వీరులును, హరికుమారులైన సాంబ సుషేణ ప్రముఖులును, నారాయణానుచరులైన యుద్ధవాదులును, గృష్ణ సహచరులైన సునంద నందాదులును సుఖానందులే యని యందఱ నడిగి ధర్మజుండు గ్రమ్మఱ నిట్లనియె. 348

* ఇంకా అంధకులూ, మధువులూ, భోజులూ, దశార్హులు, వృష్ణులూ, సాత్వతులూ మొదలైన యదువంశ వీరులందరూ క్షేమంగా ఉన్నారా? శ్రీకృష్ణుని పుత్రులైన సాంబుడూ, సుషేణుడూ మొదలైనవారూ, అనుచరులైన ఉద్ధవుడూ మొదలైనవారూ, సహచరులైన నందుడూ, సునందుడూ మొదలైన వారూ సుఖంగానూ, ఆనందంగానూ ఉన్నారా? అని ఈ విధంగా అందరి క్షేమమూ అడిగి ఇంకా ఇలా అన్నాడు ధర్మరాజు.

సీ. వైకుంఠవాసుల వడువున నెవ్వని, బలమున నానందభరితు లగుచు
వెఱవక యాదవ వీరులు వర్తింతు రమరులు గొలువుండునట్టి కొలువు
చవికె నాకర్షించి చరణసేవకులైన బంధుమిత్రాదుల పాదయుగము
నెవ్వఁడు ద్రొక్కించె నింద్రపీఠము మీఁద వజ్రంబు జళిపించి వ్రాలువాని

తే. ప్రాణ వల్లభ కెంగేలఁ బాదు సేసి, యమృతజలములఁ బోషింప నలరు పారి
జాత మెవ్వఁడు గొనివచ్చి సత్యభామ, కిచ్చె నట్టి మహాత్మున కిపుడు శుభమె? 349

* "అర్జునా! ఏ మహానుభావుని అండదండలవల్ల వైకుంఠంలో నివసించే వారిలాగా, ద్వారకలో నివసించే యాదవవీరులు ఆనందసహితులై భయరహితులై ఉంటున్నారో, ఏ మహానుభావుడు దేవతలు కొలువు తీర్చే సుధర్మామంటపంలో తన భక్తులనూ బంధువులనూ మిత్రులనూ కూర్చుండ పెట్టాడో, ఏ మహానుభావుడు, వజ్రాయుధం ధరించి ముక్కోటి దేవతల మధ్య ముత్యాల గద్దెపై కొలువు తీర్చే ఇంద్రుని ప్రాణేశ్వరి అయిన శచీదేవి తన చేతులతో పాదుచేసి అమృతం పోసి పెంచిన పారిజాత వృక్షాన్ని, దివి నుంచి భువికి తీసుకొని వచ్చి తన ప్రియురాలైన సత్యభామకు బహూకరించాడో- ఆ మహానుభావుడు వాసుదేవుడు క్షేమమేనా?

శా. అన్నా! ఫల్గున! భక్తవత్సలుఁడు బ్రహ్మణ్యుండు గోవిందుఁ డా
పన్నానీకశరణ్యుఁ డీశుఁడు జగద్భద్రానుసంధాయి శ్రీ
మన్నవ్యాంబుజ పత్ర నేత్రుఁడు సుధర్మామధ్య పీఠంబునం
దున్నాఁడా బలభద్రుఁగూడి సుఖియై యుత్సాహియై ద్వారకన్? 350

* నాయనా! అర్జునా! భక్తులయందు వాత్సల్యం కురిపించే వాడూ, బ్రహ్మణ్యుడూ, ఆపన్నశరణ్యుడూ, సర్వేశ్వరుడూ, లోకాలకు మేలు కలిగించేవాడూ, శోభావంతాలై అప్పుడప్పుడే వికసిస్తున్న తామరరేకుల వంటి

కన్నులు కలవాడూ, అయిన గోవిందుడు ద్వారకలో సుధర్మాసింహాసనం మధ్య అన్నగారైన బలరామునితో కూడ సుఖంగా ఉత్సాహంగా ఉన్నాడా?

**క. ఆ రామ కేశవులకును, సారామలభక్తి నీవు సలుపుదువు గదా**
**గారాములు సేయుదురా, పౌరాముల బంధు లెల్లప్రొద్దు జితారీ! 351**

* విజయా! ఆ రామకృష్ణులను నీవు స్థిరమైన భక్తితో ఆసక్తితో సేవించావు గదా! అక్కడి మన చుట్టాలంతా నిన్ను అనుదినం అప్యాయంగా అనురాగంగా ఆదరించారు కదా!

**శా. మున్నుగ్రాటవిలో వరాహమునకై ముక్కంటితోఁ బోరుచో**
**సన్నాహంబునఁ గాలకేయుల ననిం జక్కాడుచోఁ బ్రాభవ**
**స్కన్నుండై చను కౌరవేంద్రు పనికై గంధర్వులం దోలుచోఁ**
**గన్నీ రెన్నఁడుఁ దేవు తండ్రి! చెపుమా కల్యాణమే చక్రికిన్? 352**

* తండ్రీ! ఇదేమిటయ్యా! కన్నులవెంట నీరు కారుస్తున్నావు? పూర్వం భయంకరారణ్యంలో పందికోసం ఫాలాక్షునితో పోరాటం సాగించినప్పుడు కానీ, సర్వసన్నాహాలతో పోయి కాలకేయులను కదనరంగంలో చించి చెండాడేటప్పుడు కానీ, వైభవం కోల్పోయి గౌరవం పడిపోయిన కౌరవేంద్రుణ్ణి విడిపించటం కోసం గంధర్వులతో కయ్యానికి తలపడినప్పుడు కానీ, కంటనీరు పెట్టి ఎరుగవే! ఇప్పుడేమి కష్టం వచ్చింది? ముందీ మాట చెప్పు- యశోదానందనుడు కుశలంగా ఉన్నాడు కదా!

**వ. అదియునుంగాక 353**

* మారు పలుక వేమయ్యా!

**క. ఓడితివో శత్రువులకు, నాడితివో సాధు దూషణాలాపములం**
**గూడితివో పరసతులను, వీడితివో మానధనము వీరుల నడుమన్! 354**

* పగవారితో పోరాడి ఓడిపోలేదు కదా! సజ్జనులను తూలనాడలేదుకదా! పరాంగనలను కూడలేదు కదా! అరివీరుల నడుమ అభిమానాన్ని వీడలేదు కదా!

**క. తప్పితివో, యిచ్చెద నని; చెప్పితివో కపటసాక్షి! చేసిన మేలుం**
**దెప్పితివో! శరణార్థుల, రొప్పితివో ద్విజులఁ బసుల, రోగుల, సతులన్! 355**

* అన్నమాట తప్పలేదు కదా! దొంగసాక్ష్యం చెప్పలేదు కదా! ఇతరులకు మేలు చేసి తిరిగి చెప్పలేదు కదా! శరణార్థుల మీదా, బ్రాహ్మణుల మీదా, గోవుల మీదా, రోగులమీదా, స్త్రీల మీదా పొరపాటున బాణాలు గుప్పలేదు కదా!

**క. అడిచితివో భూసురులను?, గుడిచితివో బాలవృద్ధగురువులు వెలిగా?**
**విడిచితివో యాశ్రితులను?, ముడిచితివో పరుల విత్తములు లోభమునన్? 356**

* ఆరాధ్యులైన భూసురులను అడిచినందుకా? లేక బాలురనూ వృద్ధులనూ గురువులనూ పిలవకుండా కుడిచినందుకా? శరణన్న వారిని విడిచినందుకా? పోనీ పరుల ధనాలను లోభం కొద్దీ ముడిచి నందుకా? ఎందుకయ్యా నీ కీ విచారం?

**వ. అని పలికినం గన్నీరు కరతలంబునం దుడిచికొనుచు, గద్గదస్వరంబున మహానిధిం గోలుపోయిన పేదచందంబున నిట్టూర్పులు నిగిడించుచు, నర్జునుం డన్న కిట్లనియె. 357**

* ధర్మజుడు ఇలా ప్రశ్నించగానే అరచేతులతో అశ్రువుల తుడుచుకొంటూ, గద్గదకంఠంతో, పెన్నిధిని పోగొట్టుకొన్న పేదవాని మాదిరిగా వేడి వేడి నిట్టూర్పులు నిగిడిస్తూ అర్జునుడు అన్నగారితో ఇలా అన్నాడు-

**క. మన సారథి, మన సచివుఁడు, మన వియ్యము, మన సఖుండు, మన బాంధవుఁడున్**
**మన విభుఁడు, గురుఁడు, దేవర, మనలను దిగనాడి చనియె, మనుజాధీశా! 358**

* "మహారాజా! ఏమని చెప్పేది? మన సారథి , మన మంత్రి, మన వియ్యం, మన మిత్రుడూ, మన బంధువు, మన ప్రభువు, మన గురువు, మన దేవుడు, మన వాసుదేవుడు మనలను వదలిపెట్టి మరో లోకానికి వెళ్ళిపోయాడు.

**క. కంటకులు నృపులు సూడఁగ, మింటం గంపించు యంత్రమీనముఁ గోలన్**
**గెంటించి మనము వాలుం, గంటిం జేకొంటి మతని కరుణన కాదే! 359**

* శత్రురాజు లందరూ కళ్లు అప్పగించి చూస్తూ ఉండగా ఆకాశాన తిరిగే మత్స్యయంత్రాన్ని గురిపెట్టి కొట్టి మనం పాంచాలరాజ పుత్రిని పరిణయమాడింది ఆ కరుణామయుని కటాక్షం వల్లనే కదా!

**క. దండి ననేకులతో నా, ఖండలుఁ డెదు రయిన గెలిచి ఖాండవవనముం**
**జండార్చికి నర్పించిన, గాండీవము నిచ్చెఁ జక్రి గలుగుట నధిపా! 360**

* గండర గండడై, అమరచమూ సమూహంతో ఆఖండలుడు ఎదురై నిల్చినా, గెల్చి ఖాండవవనాన్ని అగ్నిదేవునికి అర్పించి, గాండీవాన్ని గైకొన్నది ఆ చక్రధరుని చలువ వల్లనే కదా!

**క. దిక్కుల రాజుల నెల్లను, మక్కించి ధనంబు గొనుట మయకృతసభ ము**
**న్నెక్కుట జన్నము సేయుట, నిక్కము హరి మనకు దండ నిలిచినఁ గాదే! 361**

* నానా దిశలలోని నరనాథులను సమరంలో జయించి అశేష ధనరాసులను కైవసం చేసుకొన్నదీ, మయసభను అందుకొన్నదీ, రాజసూయ మహాయాగం నిర్వర్తించిందీ నిజానికి ఆ వాసుదేవుడు మనకు బాసటగా నిల్చినందువల్లనే కదా!

**మ. ఇభజిద్వీర్య! మఖాభిషిక్త మగు నీ యిల్లాలి ధమ్మిల్లమున్**
**సభలో శాత్రవు లీడ్చినన్ ముడువ కా చంద్రాస్య దుఃఖింపఁగా**
**నభయం బిచ్చి ప్రతిజ్ఞ సేసి భవదీయారాతికాంతా శిరో**
**జభరశ్రీల హరింపఁడే విధవలై సౌభాగ్యముల్ వీడఁగన్! 362**

* సింహపరాక్రముడవైన మహారాజా! రాజసూయ మహాయజ్ఞంలో అభిషేకపూతమైన నీ యిల్లాలి కబరీభరాన్ని పట్టి లాగి ఈడ్చుకొని వచ్చి నిండు సభలో నీ శత్రువులు అవమానించి నప్పుడు ఆ సతి ఆక్రోశించగా, ఆమెకు అభయమిచ్చి దీక్ష వహించి, నీ శత్రుకాంతల శిరోజ వైభవాన్ని వారి సౌభాగ్యాన్ని హరించి మనకు జయం చేకూర్చిన ఆప్తబంధుడు ఆయనే కదా!

**శా. వైరుల్ గట్టిన పుట్టముల్ విడువఁగా వారింప నా వల్లభుల్**
**రా రీ వేళ, నుపేక్ష సేయఁదగవే, రావే, నివారింపవే?**
**లేరే త్రాతలు! కృష్ణ! యంచు సభలో లీనాంగి యై కుయ్యిడం**
**గారుణ్యంబున భూరివస్త్రకలితంగాఁ జేయఁడే ద్రౌపదిన్! 363**

* ఆనాటి మహాసభలో క్రూరాత్ములై కౌరవులు చీరలు విప్పేటప్పుడు 'నా వల్లభులు నన్ను ఉపేక్షించారు. ఇక నీవే నన్ను రక్షించాలి, రావే రక్షించవే' అని పాంచాలి లజ్జాసంకుచితాంగియై ప్రార్థించినప్పుడు చీరలిచ్చి కారుణ్యంతో కాపాడాడు.

**సీ. దుర్వాసుఁ డొకనాఁడు దుర్యోధనుఁడు పంపఁ బదివేల శిష్యుల భక్తిఁ గొలువఁ**
**జనుదెంచి మనముఁ బాంచాలియుఁ గుడిచిన వెనుక నాహారంబు వేఁడికొనినఁ**
**బెట్టెద ననవుడుఁ బెట్టకున్న శపింతు ననుచుఁ దోయావగాహమున కేఁగఁ**
**గడవల నన్న శాకములు దీఱుటఁ జూచి పాంచాల పుత్త్రిక పర్ణశాల**

**తే. లోనఁ దలఁచిన విచ్చేసి లోవిలోని, శిష్టశాకాన్నలవముఁ బ్రాశించి, తపసి**
**కోప ముడిగించి, పరిపూర్ణకుక్షిఁ జేసె, నిట్టి త్రైలోక్యసంతర్పి యెందుఁ గలఁడు? 364**

* ఒకనాడు ముక్కోపి అయిన దుర్వాసుడు దుర్యోధన ప్రేరితుడై పదివేల మంది శిష్యులతో మన వద్దకు వచ్చాడు. అప్పటికే మన మందరమూ, పాంచాలీ భుజించాము. ఆ సమయంలో ఆ మునీంద్రుడు 'మాకు అన్నం పెడతారా? పెట్టరా? పెట్టకపోతే శాపం పెడతాను' అంటూ చరచరా నదికి స్నానానికి సాగిపోయాడు. అప్పుడు పర్ణశాలలోకి పోయి పాంచాలి పాత్రలన్నీ పరికించి చూచింది. ఎక్కడా ఒక్క కూరముక్క కూడా కన్పించలేదు. ఆమె నిశ్చల హృదయంతో ఆ మహానుభావుణ్ణి తలచుకొంది. తక్షణం ఆ దయామయుడు ప్రత్యక్షమై వంటపాత్రలో అడుగున అంటుకొని ఉన్న ఒక్క మెతుకును నోటిలో వేసుకొన్నాడు అంతే. ఇంకేముంది! మునీశ్వరులకు కడుపులన్నీ నిండిపోయాయి. వారు శాంతించి తేపుకుంటూ వెళ్లిపోయారు. సంకల్పమాత్రం చేతనే ముల్లోకాలకూ సంతుష్టి కలిగించే అటువంటి మహానుభావుడు మనకు మరెక్కడ దొరుకుతాడు!

**సీ. పందికై పోరాడ ఫాలాక్షుఁ డెవ్వని బలమున నా కిచ్చెఁ బాశుపతము?**
**నెవ్వని లావున నిమ్మైన దేవేంద్రు పీఠార్ధమున నుండఁ బెంపుఁ గంటిఁ?**
**గాలకేయ నివాతకవచాది దైత్యులఁ జంపితి నెవ్వని సంస్మరించి?**
**గోగ్రహణమునాఁడు కురుకులాంభోనిధిఁ గడచితి నెవ్వని కరుణఁ జేసి?**

ఆ. కర్ణసింధు రాజ కౌరవేంద్రాదుల, తలల పాగ లెల్లఁ దడవి తెచ్చి,
యే మహాత్ము బలిమి నిచ్చితి విరటుని, పుత్త్రి యడుగ బొమ్మపొత్తికలకు. 365

* అన్నా! ఆ నాడు వరాహం కోసం సాగిన సమరంలో ఫాలనేత్రుని వల్ల పాశుపత మహాస్త్రాన్ని ఆయన దయవల్లనే కదా అందుకొన్నాను. త్రిలోకాధీశుడైన దేవేంద్రుని అర్ధసింహాసనాన్ని ఆయన అనుగ్రహం వల్లనే కదా అధిష్ఠింప గలిగాను. కాలకేయుడు, నివాతకవచుడు మొదలైన రాక్షసులను ఆ మహనీయుని బలం వల్లనే కదా పరిమార్చాను. ఉత్తర గోగ్రహణ సందర్భంలో పొంగి వచ్చిన కౌరసేనావాహినిని ఆయన కరుణాకటాక్షం వల్లనే కదా దాట గలిగాను. ఆనాడు బొమ్మ పొత్తికలను తెమ్మని ఉత్తర అడిగితే కర్ణ సైంధవ సుయోధనాదుల పట్టుకుచ్చుల తలపాగలు కోసి తెచ్చి ఆమె ముద్దు చెల్లించగలిగింది ఆ పరమ పురుషుని దయవల్లనే కదా!

మ. గురుభీష్మాదులు గూడి పన్నిన కురుక్షోణీశ చక్రంబులో
గురుశక్తిన్ రథయంత యై నొగలపైఁ గూర్చుండి యా మేటి నా
శరముల్ వాఱక మున్న వారల బలోత్సాహాయు రుద్యోగ త
త్పరతల్ చూడ్కుల సంహరించె నమితోత్సాహంబు నా కిచ్చుచున్ 366

* భీష్మ ద్రోణాది మహాయోధులతో కూడిన కురుక్షేత్ర మహాసంగ్రామంలో నాకు సారథ్యం చేస్తూ, రథం నొగలపై కూర్చుండి నా బాణ పరంపరలు వర్షింపకముందే తన చూపులతో శత్రువుల శక్తినీ, ఉత్సాహాన్నీ ఆయుర్దాయాన్నీ, తదేకదీక్షనూ అపహరించి, నాకు అమితానందాన్ని అందించిన విజయ సారథి ఆయనే కదా!

మ. అసురేంద్రుం డొనరించు కృత్యములు ప్రహ్లాదుం బ్రవేశించి గె
ల్వ సమర్థంబులు గాని కైవడిఁ గృపాశ్వత్థామ గాంగేయ సూ
ర్యసుత ద్రోణ ధనుర్విముక్త బహుదివ్యాస్త్ర ప్రపంచంబు నా
దెసకున్ రాక తొలంగె మాధవు దయాదృష్టిన్ నరేంద్రోత్తమా! 367

* మహారాజా! పూర్వం హిరణ్యకశిపుని క్రూరకృత్యాలు ప్రహ్లాదుని విషయంలో విఫలాలైనట్లే, భీష్మ ద్రోణ కర్ణ కృప అశ్వత్థామల ధనుస్సుల నుంచి వెలువడిన నానావిధాలైన శస్త్రాస్త్రాలు నా మీదకు రాకుండా ఆ మాధవుని దయాదృక్కులతో ప్రక్కకు తొలగి పోయాయి.

చ. వసుమతి దివ్యబాణముల వ్రక్కలు వాపి కొలంకు సేసి, నా
రసములు మాటుగాఁ బఱపి రథ్యములన్ రిపు లెల్లఁ జూడ సా
హసమున నీటఁ బెట్టితి రణావని సైంధవుఁ జంపునాఁడు, నా
కసురవిరోధి భద్రగతి నండయి వచ్చినఁ గాదె భూవరా! 368

* వసుమతీ వల్లభా! సైంధవుని వధించే ఆ నాటి రణరంగంలో శత్రువులు కళ్లారా చూస్తుండగానే, నా దివ్య బాణాలతో భూమిని వ్రయ్యలు చేసి జలాశయాన్ని కల్పించి అలసి సొలసిన నా రథాశ్వాలకు దప్పిక తీర్చింది ఆ దయామయుని అండవల్లనే కదా!

**సీ. చెలికాఁడ! రమ్మని చీరు నన్నొకవేళ మన్నించు నొకవేళ మఱఁది యనుచు**
**బంధుభావంబునఁ బాటించు నొకవేళ, దాతయై యొకవేళ ధనము లిచ్చు,**
**మంత్రియై యొకవేళ మంత్ర మాదేశించు, బోధియై యొకవేళ బుద్ధిసెప్పు,**
**సారథ్య మొనరించుఁ జన విచ్చి యొకవేళఁ, గ్రీడించు నొకవేళ, గేలిసేయు,**

**తే. నొక్క శయ్యాసనంబున నుండుఁ, గన్న, తండ్రి కైవడిఁ జేసిన తప్పుఁ గాచు,**
**హస్తములు వట్టి పొత్తున నారగించు, మనుజవల్లభ! మాధవు మఱవ రాదు. 369**

* ఆ వాసుదేవునికి నేనంటే ఎంత ప్రేమ! ఒక మాటు చెలికాడా! రా ర'మ్మని పిలిచేవాడు. ఒకమాటు 'ముద్దుల మరదీ' అని ముద్దు చేసేవాడు, ఒకమాటు ఆత్మబంధువై ఆదరించేవాడు. ఒకమాటు ఔదార్యమూర్తియై బహుధనాలు బహూకరించేవాడు. ఒకమాటు మంత్రియై హితోపదేశం చేసేవాడు. ఒకమాటు గురువై కర్తవ్యాన్ని బోధించేవాడు. మరొకమాటు సారథియై చనువు చూపేవాడు. వేరొకమాటు ఆత్మీయుడై హాస్యమాడుతూ ఆటలు పట్టించేవాడు. ఇంకొక మాటు ఒకే ప్రక్కమీద కూర్చోపెట్టుకొని కన్నతండ్రి వలె నా తప్పులు సరిదిద్దేవాడు. మరొకమాటు నా చేతులు పట్టుకొని బలవంతం చేసి పొత్తున ఆరగింప జేసేవాడు. అటువంటి మన ముద్దులబావ అయిన మాధవుణ్ణి మరచిపోవటం ఎలా మహారాజా!

**క. విజయ, ధనంజయ, హనుమ, ద్ధ్వజ ఫల్గున, పార్థ, పాండుతనయ, నర, మహేం**
**ద్రజ, మిత్రార్జున యంచును, భుజములు దలకడవ రాకపోకలఁ జీరున్. 370**

* రాకపోకల సందర్భంలో చేతులు చాచి 'విజయా! ధనంజయా! కపిధ్వజా! ఫల్గుణా! పార్థా! పాండునందనా! కిరీటీ! సవ్యసాచీ! అర్జునా! అని ఎంత ఆప్యాయంగా పిలిచేవాడో కదా!

**క. వారిజగంధులు దమలో, వారింపఁగ రాని ప్రేమ వాదము సేయన్**
**వారిజనేత్రుఁడు ననుఁ దగ, వారిండ్లకుఁ బనుపు నలుక వారింప నృపా! 371**

* అప్పుడప్పుడు తనకు అంతఃపుర కాంతలతో ప్రణయకలహం సంభవించినప్పుడు వారి పొలయలుకను తీర్చటం కోసం నన్ను బ్రతిమాలి వారి యిండ్లకు పంపే వారిజాక్షుని ఏ విధంగా విస్మరించగలం ప్రభూ!

**క. నిచ్చలు లోపలి కాంతలు, మచ్చికఁ దనతోడ నాడు మాటలు నాకున్**
**ముచ్చటలు సెప్పు మెల్లన, విచ్చలవిడిఁ దొడలమీఁద విచ్చేసి నృపా! 372**

* తాను చనువుగా నా చెంత చేరి, నా ఒడిలో కూర్చొని, నిత్యమూ తన ప్రియురాళ్లకూ తనకూ మధ్య జరిగే రహస్య సంభాషణలన్నీ పూసగ్రుచ్చినట్లు మెల్లగా నా చెవిలో చెప్పేవాడు.

**చ. అటమటమయ్యె నా భజన మంతయు భూవర! నేఁడు సూడుమా**
**యిటువలె గారవించు జగదీశుఁడు గృష్ణుఁడు లేని పిమ్మటం**
**బటుతర దేహలోభమునఁ బ్రాణము లున్నవి వెంటఁబోక నేఁ**
**గటగట! పూర్వజన్మమునఁ గర్మము లెట్టివి చేసినాఁడనో? 373**

* నా సేవలన్నీ ఈ నాడు నిరర్థకాలైనాయి. ఈ విధంగా ఆప్యాయంగా ఆదరించే శ్రీకృష్ణుడు ఈలోకం నుంచి వెళ్లిపోయిన తరువాత కూడ నా ప్రాణాలు ఆయనవెంట పోకుండా ఈ దేహాన్ని అంటి పెట్టుకుని ఉన్నాయి. అయ్యయ్యో! పూర్వజన్మలో ఎట్టి పాపకృత్యాలకు ఒడిగట్టానో!

**శా. కాంతారంబున నొంటి దోడుకొని రాఁగాఁ జూచి గోవిందు శు**
**ద్ధాంతస్త్రీలఁ బదాఱువేల మదరాగాయత్తులై తాఁకి నా**
**చెంతన్ బోయలు మూఁగి పట్టికొన నా సీమంతినీ సంఘమున్**
**భ్రాంతిన్ భామిని భంగి నుంటి విడిపింపన్ లేక; ధాత్రీశ్వరా! 374**

* ఆ మహానుభావుడు తనువు చాలించిన అనంతరం ఆయన అంతఃపురకాంతలను పదహారువేలమందినీ వెంటబెట్టుకొని వస్తుండగా అరణ్యమధ్యంలో మదోన్మత్తులైన కిరాతులు చుట్టుముట్టి పట్టుకొన్నారు. వారి బారినుంచి ఆ నారీమణులను కాపాడలేక ఆడుదానిలాగా విస్తుపోయి కళ్లప్పగించి చూస్తూ ఊరుకొన్నారు.

**శా. ఆ తే రా రథికుండు నా హయము లా యస్త్రాసనం బా శర**
**వ్రాతం బన్యులఁ దొల్లి జంపును దుదిన్ వ్యర్థంబులై పోయె మ**
**చ్చేతోఽధీశుఁడు చక్రి లేమి, భసిత క్షిప్తాజ్యమాయావి మా**
**యా తంత్రోషరభూమి బీజముల మర్యాదన్ నిమేషంబునన్. 375**

* ఆత్మేశ్వరుడైన ఆ శ్రీహరి లేకపోయినందువల్ల ఆ రథంపై నున్న నేనూ, ఆ గుర్రాలూ, ఆవిల్లు, శత్రుసంహారకాలైన ఆ శరసమూహాలూ, అన్నీ బూడిదలో పోసిన నెయ్యిలాగా, మాయావి యందు ప్రయోగించిన మాయలాగా, ఊషరక్షేత్రంలో చల్లిన విత్తనాల్లాగా క్షణకాలంలో నిరుపయోగాలై పోయాయి.

**మ. యదువీరుల్ మునినాథు, శాపమునఁ గాలాధీనులై, యందఱున్**
**మదిరాపాన వివర్ధమాన మదసమ్మర్దోగ్ర రోషాంధులై**
**కదనంబుల్ దమలోన ముష్టిహతులం గావించి నీల్గైరి, న**
**ష్టదశం జిక్కిరి నల్వురేవు రచటన్ సర్వంసహావల్లభా! 376**

* ధరణీవల్లభా! ఇంతకుముందు మీరు పేర్కొన్న యాదవ వీరులంతా విధివైపరీత్యం వల్ల మునిశాపోపహతులై. వారందరూ మద్యపానం చేసిన మత్తులో మైమరచి ఆగ్రహావేశంతో ద్వేషరోషాలతో కన్నూ మిన్నూ కానక తమలో తాము పోరాడుకొన్నారు. ముష్టిఘాతాలతో పరస్పరం కొట్టుకొని ప్రాణాలు పోగొట్టుకొన్నారు. పోయినవారు పోగా నలుగు రైదుగురు మాత్రం ఎలాగో బ్రతికి బయటపడ్డారు.

క. భూతములవలన నెప్పుడు, భూతములకు జన్మ మరణ పోషణములు ని
ర్ణీతములు సేయుచుండును, భూతమయుం డీశ్వరుండు భూతశరణ్యా! 377

* ఆశ్రితవత్సలా! పరమేశ్వరుడు సర్వభూతాంతర్యామి. ఆయన ప్రాణులకు సృష్టి స్థితి సంహారాలు, తోటి ప్రాణుల వల్లనే సంభవింప జేస్తుంటాడు.

క. బలములు గల మీనంబులు, బలవిరహిత మీనములను భక్షించు క్రియన్
బలవంతు లయిన యదువులు, బలరహితులఁ జంపి రహితభావముల నృపా! 378

* బలవంతములైన పెద్దచేపలు బలవంతంగా, బలహీనమైన చిన్న చేపలను మింగుతుంటాయి. అదేవిధంగా బలవంతులైన యదువీరులు, నిర్దయులై నిష్కారణ కోపావేశాలతో బలహీనులైన తమ తోడి యాదవులనే రూపుమాపారు.

మ. బలహీనాంగులకున్ బలాధికులకుం బ్రత్యర్థిభావోద్యమం
బులు గల్పించి, వినాశమున్ నెఱపి, యీ భూభారముం బాపి, ని
శ్చలబుద్ధిం గృతకారుఁడై చనియె, నా సర్వేశ్వరుం డచ్యుతుం
డలఘుం డేమని చెప్పుదున్ భగవదాయత్తంబు పృథ్వీశ్వరా! 379

* పృథ్వీనాథా! బలవంతులైన వారికీ బలహీనులైన వారికీ నడుమ పగలు కల్పించి, పరస్పర సంహారం చేయించి, ఈ భూభారాన్ని తీర్చి ఆ అచ్యుతుడు, ఆ అప్రమేయుడు, ఆ అఖిలేశ్వరుడు, ఆ శ్రీకృష్ణుడు వచ్చిన కార్యం పూర్తి చేసుకొని నిబ్బరంగా, నిశ్చలంగా వెళ్లిపోయాడు. ఇంకా ఏమి చెప్పేది! ఆ సర్వేశ్వరుని సంకల్పం ప్రకారం జరిగిపోయింది.

వ. మఱియు దేశకాలార్థ యుక్తంబులు, నంతఃకరణ సంతాప శమనంబులు నయిన హరివచనంబులం దలంచి, చిత్తంబు పరాయత్తంబయి యున్నది అని యన్నకుం జెప్పి, నిరుత్తరుండై, నిరంతర హరిచరణారవింద చింతామలబుద్ధియై శోకంబు వర్జించి, సదా ధ్యానభక్తి విశేషంబులం గామక్రోధాదుల జయించి, తొల్లి తన కుభయ సేనామధ్యంబున నచ్యుతుం డానతిచ్చిన గీతలు దలంచి, కాలకర్మ భోగాభినివేశంబులచేత నావృతంబయిన విజ్ఞానంబుఁ గ్రమ్మఱ నధిగమించి, హేతుమద్భావంబున శోకహేతు వహంకార మమకారాత్మకం బయిన ద్వైతభ్రమం బనియును, ద్వైత భ్రమంబునకుఁ గారణంబు దేహం బనియును, దేహంబునకు బీజంబు లింగం బనియును, లింగంబునకు మూలంబు గుణంబు లనియును, గుణంబులకు నిదానంబు ప్రకృతి యనియును, 'బ్రహ్మాహ' మనియెడు జ్ఞానంబున లీనయై ప్రకృతి లేకుండు ననియు, ప్రకృతి యడంగుటయ నైర్గుణ్యం బనియును, నైర్గుణ్యంబువలనఁ గార్య లింగనాశం బనియును, గార్యలింగనాశంబున నసంభవంబగు ప్రకృతిం బాసి క్రమ్మఱ స్థూలశరీరప్రాప్తుండు గాక పురుషుండు సమ్యగ్భోగంబున నుండు ననియును నిశ్చయించి, యర్జునుండు విరక్తుండై యూరకుండె; ధర్మజుండు

**భగవదీయమార్గంబుఁ దెలిసి, యాదవుల నాశంబు విని నారదు వచనంబులం దలంచి, నిశ్చల చిత్తుండై స్వర్గమార్గ గమనంబునకు యత్నంబు సేయుచుండె నా సమయంబున. 380**

* అని ఈ విధంగా అర్జునుడు అన్నకు చెప్పి దేశకాలాలను అనుసరించేవి, మానసిక సంతాపాన్ని శమింపజేసేవీ ఐన వాసుదేవుని వాక్కులు స్మరించుకొని పరమేశ్వరాయత్తమైన చిత్తంతో మౌనం వహించాడు. సంతతగోవింద చరణారవింద సంస్మరణంచేత స్వచ్ఛమైన బుద్ధికలవాడై శోకాన్ని విసర్జించాడు. నిరంతర ధ్యానరూపమైన భక్తివిశేషంతో కామక్రోధాదులను జయించాడు. పూర్వం కురుక్షేత్రంలో కౌరవ పాండవ సేనామధ్యంలో భగవానుడైన వాసుదేవుడు తనకు బోధించిన గీతావాక్యాలు మననం చేసుకొన్నాడు. కాలానుగుణంగా కర్మలను అనుభవించటంచేత మరుగుపడిన గీతావిజ్ఞానాన్ని మళ్లీ అందుకొన్నాడు.

అర్జునుడు కార్యకారణభావాన్ని అనుసరించి శోకానికి అహంకార మమకారాలతో కూడిన ద్వైతభ్రాంతి కారణమని, ఆ ద్వైతభ్రాంతికి శరీరం కారణమనీ, ఆ శరీరానికి లింగం కారణమనీ, ఆ లింగానికి గుణాలు కారణమనీ, ఆ గుణాలకు ప్రకృతి కారణమనీ గ్రహించాడు. 'అహం బ్రహ్మాస్మి' అనే జ్ఞానంతో ప్రకృతి విలీనమైపోతుందని, ప్రకృతి నశించిపోవటమే గుణరాహిత్యమనీ, గుణరాహిత్యమే లింగ శరీరవినాశమనీ, లింగశరీరవినాశమే జన్మరాహిత్యమనీ తెలుసుకొన్నాడు. ప్రకృతిని పరిత్యజించిన పురుషుడు తిరిగి స్థూల శరీరాన్ని పొందక బ్రహ్మైక్యాన్ని పొందుతాడని నిశ్చయించుకొని అర్జునుడు విరక్తుడైనాడు. ధర్మరాజు భగవంతుడైన శ్రీకృష్ణుని అవతార సమాప్తిని, యాదవుల వినాశనాన్ని విని, నారదుని ప్రబోధ వాక్కులు తలంచుకొని అచంచల హృదయుడై పుణ్యలోక ప్రాప్తికి ప్రయత్నించ సాగాడు.

**క. యదువుల నాశము మాధవు, పదవియు విని కుంతి విమలభక్తిన్ భగవ**
**త్పదచింతాతత్పరయై, ముదమున సంసారమార్గమునకుం బాసెన్. 381**

* యాదవుల మరణమూ, మాధవుని నిర్యాణమూ ఆలకించిన కుంతీదేవి నిర్మలమైన భక్తితో హరిచరణ సంస్మరణంలో ఆసక్తురాలై ప్రశాంతంగా శరీరాన్ని పరిత్యజించింది.

**వ. ఇట్లు కంటకంబునం గంటకోన్మూలనంబు సేసి కంటకంబులు రెంటిని పరిహరించు విన్నాణి తెఱంగువ, యాదవరూప శరీరంబునంజేసి యీశ్వరుడు లోకకంటక శరీరంబులు సంహరించి నిజ శరీరంబు విడిచె; సంహారంబునకు నిజశరీర పరశరీరంబులు రెండు నీశ్వరునకు సమంబులు. నిజరూపంబున మెలంగుచు రూపాంతరంబులు ధరియించి క్రమ్మఱ నంతర్ధానంబు నొందు నటుని కైవడి లీలాపరాయణుండైన నారాయణుండు మీన కూర్మాది రూపంబులు ధరియించుం బరిహరించునని చెప్పి మఱియు నిట్లనియె. 382**

* ఈ విధంగా కంటకంతో మరో కంటకాన్ని పెకలించి, రెండు కంటకాలనూ దూరంగా పారవేసే వివేకవంతునిలాగా, పరమేశ్వరుడు యాదవశరీరం ధరించి జగత్కంటకాలైన పరుల శరీరాలను అంత మొందించి తన శరీరాన్ని వదిలిపెట్టాడు. పరమేశ్వరునికి సంహార విషయంలో స్వపరదేహాలనే భేదం లేదు. రెండూ సమానమే. స్వస్వరూపంతో ప్రవర్తిస్తూ, అన్యరూపాలు పెక్కులు ధరించి, మళ్లీ స్వస్వరూపాన్ని

పొందే నటునిలాగా విచిత్రలీలావిలాసుడైన వైకుంఠవాసుడు మత్స్యకూర్మాది అవతారాలు ధరిస్తూ పరిహరిస్తూ ఉంటాడు.

క. ఏ దినమున వైకుంఠుఁడు, మేదినిపైఁ దాల్చినట్టి మేను విడిచి నాఁ
డా దినమున నశుభ ప్రతి, పాదకమగు కలియుగంబు ప్రాప్తం బయ్యెన్. 383

* శ్రీమన్నారాయణుడు లీలామానుషరూపాన్ని దాల్చి ఏనాడు అవతారసమాప్తి కావించాడో ఆనాడే అమంగళ దాయకమైన కలియుగం ఆరంభమయింది.

## -: ధర్మరాజు పరీక్షితునకుఁ బట్టము గట్టి మహాప్రస్థానంబున కేగుట :-

సీ. కలివర్తనంబునఁ గ్రౌర్యహింసాసత్య దంభ కౌటిల్యాద్యధర్మచయము
పురముల గృహముల భూములఁ దమలోనఁ గలుగుట దలపోసి కరిపురమున
మనుమని రాజువై మను మని దీవించి సింధుతోయకణాభిషిక్తుఁ జేసి
యనిరుద్ధ నందనుండైన వజ్రునిఁ దెచ్చి మధురఁ బట్టము గట్టి మమతఁ బాసి

ఆ. కరుల హరుల భటులఁ గంకణాదికముల, మంత్రిజనుల బుధుల మానవతుల
నఖిల మయిన ధనము నభిమన్యు సుతునకు, నప్పగించి బుద్ధి నాశ్రయించి. 384

* కలి ప్రవేశం వల్ల క్రౌర్యం, హింస, అసత్యం, ఆడంబరం, కౌటిల్యం మొదలైన వానితో అధర్మచక్రం పట్టణాలలో, పల్లెలలో, గృహాలలో, సమస్త ప్రదేశాలలో విస్తరించిందని తెలుసుకొన్న ధర్మరాజు తన మనుమడైన పరీక్షిత్తును రాజును కావించి హస్తినాపుర సింహాసనం పైన కూర్చుండబెట్టాడు. పవిత్ర సింధుజలాలతో అభిషేకించి ఆశీర్వదించాడు. అనిరుద్ధుని కుమారుడైన వజ్రుణ్ణి మధురా రాజ్యానికి అధిపతి చేశాడు. మమకారాలను పరిత్యజించి ఏనుగులు, గుర్రాలు, సైనికులు, కంకణాది ఆభరణాలు, అమాత్యులు, విద్వాంసులు, స్త్రీలు మొదలైన సకల ధన కనక వస్తు వాహనాలను అభిమన్యు నందనుడైన పరీక్షిత్తుకు అప్పగించి ధర్మనందనుడు వైరాగ్యమార్గాన్ని ఆశ్రయించాడు.

వ. విరక్తుడైన దర్మనందనుండు ప్రాజాపత్యం బనియెడి యిష్టిఁ గావించి యగ్నుల నాత్మారోపణంబు సేసి, నిరహంకారుండును, నిర్దళితాశేష బంధనుండునునై సకలేంద్రియంబుల మానసంబున నడంచి, ప్రాణాధీనవృత్తి యగు మానసంబును బ్రాణమందును, బ్రాణము నపానమందును, నుత్సర్గసహితం బయిన యపానము మృత్యువు నందును, మృత్యువును పంచభూతంబులకు నైక్యంబైన దేహంబు నందును, దేహమును గుణత్రయంబు నందును, గుణత్రయంబు నవిద్యయందును, సర్వారోపహేతు వగు నవిద్యను జీవునియందును, జీవుం డయిన తన్ను నవ్యయంబయిన బ్రహ్మమందును లయింపజేసి బహిరంగ వ్యాపారంబులు విడిచి, నార చీరలు ధరియించి మౌనియు నిరాహారుండును ముక్తకేశుండునునై, యున్మత్త పిశాచ బధిర జడుల చందంబున నిరపేక్షకత్వంబున. 385

* విరక్తుడైన ధర్మరాజు ప్రాజాపత్యమనే యాగం చేసి గార్హపత్యం మొదలైన అగ్నులను ఆత్మయందు ఆరోపించుకొన్నాడు. నిరహంకారుడై సంసారబంధాలు తెగతెంపులు చేసి వాక్కు మొదలైన ఇంద్రియాలను మనస్సునందూ, మనస్సును ప్రాణమందూ, ప్రాణాన్ని అపానమందూ, అపానాన్ని మృత్యువునందూ, మృత్యువును పాంచభౌతికమైన శరీరమందూ, శరీరాన్ని సత్త్వరజస్తమో గుణములందూ, ఆ గుణత్రయాన్ని అవిద్యయందూ, ఆరోపా లన్నిటికి హేతువైన అవిద్యను జీవాత్మయందూ, జీవాత్మను అవ్యయమైన పరమాత్మయందూ లయింపజేశాడు. సర్వసంగ పరిత్యాగియై నార చీరలు ధరించాడు. మౌనంతో నిరాహారుడై ముక్తకేశుడై, పిచ్చివాని వలె, పిశాచగ్రస్తుని వలె, బధిరుని వలె, జడుని వలె నిరపేక్షుడైనాడు.

**క. చిత్తంబున బ్రహ్మము నా, వృత్తముఁ గావించికొనుచు విజ్ఞానధనా**
**యత్తులు దొల్లి వెలింగెడి, యుత్తరదిశ కేఁగె నిర్మలోద్యోగమునన్. 386**

* మనస్సులో పరబ్రహ్మన్ని మననం చేసుకొంటూ పూర్వం విజ్ఞానవంతులైన మహానుభావులు అనుసరించిన ఉత్తర దిక్కుగా ఏకాగ్రచిత్తంతో ప్రస్థానం సాగించాడు ధర్మనందనుడు.

**సీ. అంత నాతని తమ్ము లనిలపుత్త్రాదులు గలిరాకచేఁ బాపకర్మ లగుచుఁ**
**జరియించు ప్రజల సంచారంబు లీక్షించి యఖిలధర్మంబుల నాచరించి**
**వైకుంఠ చరణాబ్జ వర్తితహృదయులై తద్భక్తినిర్మలత్వమును జెంది**
**విషయయుక్తులకుఁ బ్రవేశింపఁగా రాక నిర్ధూతకల్మష నిపుణమతులు**

**తే. బహుళ విజ్ఞానదావాగ్ని భసితకర్ములైన, యేకాంతులకు లక్ష్యమై వెలుంగు**
**ముఖ్యనారాయణ స్థానమునకుఁ జనిరి, విగతరజమైన యాత్మల విప్రముఖ్య! 387**

* అనంతరం ధర్మజుని సోదరులైన భీమసేనాదులు కలిప్రభావంతో ప్రజలంతా పాపమార్గంలో సంచరించటం గమనించారు. దానధర్మాలు ఆచరించారు. శ్రీమన్నారాయణుని పాదపద్మాలను తమ హృదయంలో పదిలపరచుకొన్నారు. భగవద్భక్తిచే పరిశుద్ధ జీవనులైనారు. ఈ విధంగా వారు రజోగుణ రహితమైన హృదయాలతో విషయాసక్తులకు ప్రవేశింపరానిదీ, పాపరహితులూ, విజ్ఞాన సంపన్నులూ అయిన ఏకాంతభక్తులకు గమ్యస్థానమై వెలుగొందేదీ ఐన విష్ణు లోకాన్ని చేరుకున్నారు.

**వ. అంత విదురుండు ప్రభాస తీర్థంబున హరియందుఁ జిత్తంబు సేర్చి, శరీరంబు విడిచి, పితృవర్గంబు తోడ దండధరుం డగుటం జేసి నిజాధికార స్థానంబునకుం జనియె; ద్రుపదరాజపుత్రియుఁ బతులవలన నుపేక్షితయై జగత్పతియైన వాసుదేవునందుఁ జిత్తంబు సేర్చి తత్పదంబు సేరె నిట్లు.388**

* తరువాత విదురుడు పవిత్రమైన ప్రభాసతీర్థంలో భగవంతుని యందు మనస్సు లగ్నంచేసి తన శరీరాన్ని త్యజించి, పూర్వజన్మలో యమధర్మరాజు అయినందువల్ల పితృదేవతలతో కలసి, తన అధికార పీఠాన్ని అధిష్ఠించాడు. ద్రౌపది నిరపేక్షులైన భర్తలచే ఉపేక్షితయై దేవదేవుడైన వాసుదేవుని యందు ఆసక్తమైన హృదయంతో పరమేశ్వర సాన్నిధ్యాన్ని పొందింది.

క. పాండవకృష్ణుల యానము, పాండురమతి నెవ్వఁడైనఁ బలికిన విన్నన్
ఖండితభవుఁడై హరిదా, సుండై కైవల్యపదము సొచ్చు నరేంద్రా. 389

* ఈ విధంగా జరిగిన పాండవుల మహాప్రస్థానమూ, శ్రీకృష్ణుని పరమపద యానమూ, స్వచ్ఛమైన హృదయంతో చదివినవాడూ, విన్నవాడూ, భవబంధ విముక్తుడై, పరమేశ్వర భక్తుడై కైవల్య పథాన్ని కైవసం చేసుకొంటాడు.

వ. అంత నటం బరీక్షిత్కుమారుండు జాతకర్మవిదులైన పెద్దలు సెప్పిన చందంబున భూసురో త్తమశిక్షావశంబున మహాభాగవత శేఖరుండై ధరణీపాలనంబు సేయుచు నుత్తరుని పుత్రిక నిరావతి యను మత్తకాశినిం బెండ్లియయి, జనమేజయ ప్రముఖులైన నలువురు గొడుకుల నుత్పాదించి, గంగా పులినతలంబునఁ గృపాచార్యుండు గురుత్వంబు సేయ యాగభాగంబులకు వచ్చిన దేవతల నీక్షించుచు, భూరిదక్షిణంబులుగా మూఁడశ్వమేధంబు లాచరించి, దిగ్విజయకాలంబున గోమిథునంబుఁ దన్ను శూద్రుండును రాజచిహ్న ముద్రితుండును నగు కలిం బట్టి నిగ్రహించె నని చెప్పిన, శౌనకుండు పౌరాణికున కిట్లనియె. 390

* అక్కడ హస్తినాపురంలో రాజకుమారుడైన పరీక్షిత్తు, ప్రాజ్ఞులైన దైవజ్ఞులు చెప్పిన విధంగా భూసురోత్తముల సన్నిధిలో సమస్త విద్యలూ అభ్యసించాడు. మహాభక్త శిరోమణియై రాజ్యపాలనం చేయసాగాడు. పరీక్షిన్నరేంద్రుడు ఉత్తరుని కుమార్తెయైన ఇరావతి అనే తరుణీమణిని పరిణయమాడాడు. ఆ దంపతులకు జనమేజయుడు మొదలైన నలుగురు కుమారులు జన్మించారు. పరీక్షిత్తు గంగానదీతీరంలో కృపాచార్యుని పర్యవేక్షణలో భూరిదక్షిణలతో కూడిన మూడు అశ్వమేధయాగాలు చేశాడు. ఆ యజ్ఞాలలో దేవతలు ప్రత్యక్షంగా వచ్చి హవిర్భాగాలు అందుకొన్నారు. అనంతరం పరీక్షిన్మహారాజు జైత్రయాత్రకు బయలుదేరి దిక్కులన్నీ జయిస్తూ ఒక్కచోట గోమిథునాన్ని తన్నుతూ రాజచిహ్న ముద్రితుడై శూద్రవేషంలో ఉన్న కలి పురుషుని పట్టుకొని శిక్షించాడు.

అని చెప్పగానే శౌనకుడు సూతునితో ఇలా అన్నాడు.

### -: పరీక్షిన్మహారాజు భూధర్మదేవతల సంవాదం బాలించుట :-

క. భూవరరూపుఁడు శూద్రుఁడు, గోవుం దా నేల తన్నెఁ గోరి పరీక్షి
ద్భూవరుఁడు దిశల గెలుచుచు, నే విధిఁ గలి నిగ్రహించె నెఱిఁగింపఁగదే. 391

* అయ్యా! సూతమహర్షీ! రాజవేషంలో ఉన్న శూద్రుడు గోవును ఎందుకు తన్నాడు? జైత్రయాత్ర సాగిస్తున్న పరీక్షిన్నరేంద్రుడు ఆ కలిని ఏ విధంగా నిగ్రహించాడు? నాకు వివరంగా చెప్పు.

మ. అరవిందాక్ష పదారవింద మకరందాసక్తులై యున్న స
త్పురుషశ్రేష్ఠుల వృత్తముల్ వినక దుర్బుద్ధిన్ విలంఘించి, దు

ర్వరవార్తాకథన ప్రపంచములు గర్ణప్రాప్తముల్ సేసి, వా
సరముల్ వ్యర్థతఁ ద్రోచుచుండఁ జన దీ సంసార మోహంబునన్. 392

* నందనందన పాదారవింద మకరంద పానంచేత పరవశులైన ఉత్తమ పురుషుల పవిత్ర చరిత్రలు వినకుండా పెచ్చు పెరిగిన మచ్చరంతో దుర్జనుల దుశ్చరిత్రలకు చెవులొగ్గి, సంసారబంధాలకు లోబడి, పరమార్థాన్ని విస్మరించి, వ్యర్థంగా కాలం గడపటం తెలివి తక్కువ పని.

సీ. మనుట నిత్యము గాదు మరణంబు నిజ మని యెఱిఁగి మోక్షస్థితి నిచ్ఛగించు
నల్పాయువు లగు మా కన్యదుర్జన చరిత్రము లోలిఁ గర్ణ రంధ్రములఁ బెట్టి
బంగారు వంటి యీ బ్రదికెడు కాలంబుఁ బోనాడఁగా నేల పుణ్యచరిత!
మాధవపదపద్మ మకరందపానంబు సేయింపవే యేము సేయునట్టి

ఆ. సత్త్రయాగమునకు సన్మునీంద్రులు సీర, వాఁడె దండధరుఁడు వచ్చెఁ జూడు
చంపఁ డొకనినైన జన్న మయ్యెడుదాక, వినుచునుండుఁ దగిలి విష్ణుకథలు. 393

* పుణ్యచరిత్రా! బ్రతుకు శాశ్వతం కాదు. "పుట్టిన ప్రాణి గిట్టక తప్పదు." అన్న సత్యాన్ని గుర్తించి మోక్షాన్ని కాంక్షించే అల్పాయుష్కులం మేము. అటువంటి మాకు అపవిత్రాలైన అల్పుల చరిత్రాలు చెవులొగ్గి ఆలకిస్తూ, బంగారం వంటి జీవిత కాలాన్ని పాడుచేసుకోవటం యుక్తం కాదు. అందువల్ల గోవింద పవిత్ర పదారవింద మకరందధారలు మాకు అనుగ్రహించు, మహానుభావా! మేము సాగిస్తున్న ఈసత్త్రయాగానికి మునీంద్రులు ఆహ్వానించగా యమధర్మరాజు విచ్చేశాడు చూశావా! ఈ యజ్ఞం పూర్తయ్యేదాకా ఆయన ఏ ఒక్కని ప్రాణం కూడా తీయకుండా మైమరచి ఆసక్తితో వాసుదేవుని కథలు ఆలకిస్తున్నాడు.

క. మందునకు మందబుద్ధికి, మందాయువునకు నిరర్థమార్గునకును గో
విందచరణారవింద మ, రందము గొనఁ దెఱపి లేదు రాత్రిందివముల్. 394

* మందబుద్ధులూ, సోమరి పోతులూ, అల్పాయుష్కులూ ఐన మూర్ఖులు మాత్రమే పనికిమాలిన మార్గాలలో పడి కొట్టుకొంటూ ఉంటారు. అటువంటి వారికి హరిచరణ కమల సుధాధారల చవిచూడటానికి రాత్రింబవళ్లు అవకాశమే ఉండదు."

వ. అని శౌనకుడు పలికిన సూతుం డిట్లనియెఁ బరీక్షిన్న రేంద్రుండు నిజవాహినీ సందోహ సురక్షితంబగు కురుజాంగలదేశంబునం గలి ప్రవేశంబు నాకర్ణించి, యుద్ధకుతూహలత నంగీకరించి, యొక్క నాఁడు సముల్లాసంబున బాణాసనంబు గైకొని, నీల నీరద నిభతురంగ నివహ యోజితంబును, ఫలిత మనోరథంబును నైన రథంబు నారోహణంబు సేసి, మృగేంద్ర ధ్వజంబు వెలుంగ రథ కరి తురంగమ సుభట సంఘటితంబగు వాహినీచక్రంబు నిర్వక్రంబుగం గొలువ, దిగ్విజయార్థంబు వెడలి పూర్వదక్షిణ పశ్చిమోత్తర సముద్రలగ్నంబు లయిన, యిలావృత రమ్యక హిరణ్మయ హరివర్ష కింపురుష భద్రాశ్వ

కేతుమాల భారత వర్షంబులు నుత్తర కురుదేశంబులును జయించి, పుష్కల ధనప్రదాన పూర్వికలగు సపర్యల నభ్యర్చితుండై తత్తద్దేశవాసు లిచ్చిన కానుకలు గైకొనుచు మంగళ పాఠక సంఘాత జేగీయమాన పూర్వరాజవృత్తాంతంబు లాకర్ణించుచుఁ బాఠకపఠితపద్యంబుల వలనం బాండవులకు భక్తవత్సలుండై పుండరీకాక్షుం డాచరించిన సారథ్య, సఖ్య, సాచివ్య, సభాపతిత్వ, వీరాసనత్వ, దూతభావాది కర్మంబులు నశ్వత్థామాస్త్ర తేజంబు వలనఁ దన్ను రక్షించుటయు, యాదవ పాండవులందలి స్నేహానుబంధంబును, వారలకుఁ గలిగిన భగవద్భక్తివిశేషంబును విని, విశ్వంభరుని భక్త వాత్సల్యంబునకు నాశ్చర్యంబు నొందుచు, వందిబృందంబులకున్ మహార్హంబులగు హారాంబరాభరణాది సందోహంబుల నొసంగుచుఁ, బద్మనాభ పాదపద్మ భజన పరతంత్ర పవిత్రమానసుండై యుండె; నయ్యెడ వృషభ రూపంబున నేకపాదంబున సంచరించు ధర్మదేవుండు దన సమీపంబున లేఁగలేని లేఁగటి కుఱి చందంబున హతప్రభయై నేత్రంబుల సలిలంబులు గురియుచు గోరూపయై యున్న ధాత్రి కిట్లనియె. 395

* ఈ విధంగా పలికిన శౌనకుని మాటలు విని సూతుడు ఇలా చెప్పసాగాడు- "మునీంద్రా! పరీక్షిన్నరేంద్రుడు తన సేనా సమూహం చేత రక్షించబడుతున్న కురు జాంగలదేశంలో కలిపురుషుడు ప్రవేశించాడని విన్నాడు. ఒకనాడు కదన కుతూహలం కలవాడై ఉప్పొంగే ఉల్లాసంతో విల్లు చేబట్టాడు. నీలమేఘాలవంటి గుర్రాలను కట్టిన సఫల మనోరథమైన రథాన్ని అధిరోహించాడు, సింహధ్వజం కాంతులు వెదజల్లుతుండగా రథ గజ తురగ పదాతి సంఘటితయై ముందుకు సాగే అపారసేనా వాహినితో విజయ యాత్రకు బయలుదేరాడు. తూర్పున, దక్షిణాన, పశ్చిమాన, ఉత్తరాన ఉన్న సాగర తీరాలలోని ఇలావృత్తం. రమ్యకం, హిరణ్మయం, హరివర్షం, కింపురుషం, భద్రాశ్వం, కేతుమాలం, భారతవర్షం అనే దేశాలనూ ఉత్తర కురుదేశాలనూ జయించి. ఆయా దేశవాసులు కొనివచ్చి యిచ్చిన కానుకలు అందుకొన్నాడు వందిమాగధబృందాలచే గానం చేయబడుతున్న పూర్వభూపతుల వృత్తాంతాలను ఆకర్ణించాడు. స్తోత్ర పాఠకులు పఠించిన పద్యాలవల్ల భక్తవత్సలుడైన శ్రీకృష్ణుడు పాండవులకు సారథిగా, ఇష్టసఖుడుగా, సచివుడుగా, సభాపతిగా, సంరక్షకుడుగా, దూతగా ఆచరించిన కృత్యాలన్నీ అర్థం చేసుకున్నాడు. అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మాస్త్రం విరజిమ్మే అగ్నిజ్వాలల నుంచి తనను రక్షించిన వృత్తాంతం తెలుసుకొన్నాడు. యాదవులకూ పాండవులకూ ఉన్న పరస్పర స్నేహానుబంధాన్నీ, వారికి గల శ్రీకృష్ణ భక్తినీ గ్రహించాడు. విశ్వంభరుని భక్తవాత్సల్యానికి పరమాశ్చర్య భరితుడైనాడు. స్తుతి పాఠకులకు బహుమూల్యాలైన హారాలూ, వస్త్రాలూ, అభరణాలూ బహూకరించాడు. పద్మనాభుని పాదపద్మారాధనంలో పరవశమై పవిత్రమైన మానసంతో ఉన్నాడు.

ఆ సమయంలో వృషభాకారం ధరించి ఒంటికాలితో సంచరిస్తున్న ధర్మదేవుడు, దూడను వీడిన పాడి ఆవు మాదిరిగా కాంతి కోల్పోయి కన్నీళ్లు కారుస్తూ గోరూపధారిణి అయిన భూదేవితో ఇలా అన్నాడు.

మ. నయనాంభఃకణజాల మేల విడువన్ నాతల్లి! నీ మేను సా
మయమై యున్నది; మోము వాడినది; నీ మన్నించు చుట్టాలకున్

భయదుఃఖంబులు నెందు నొందవు గదా? బంధించి శూద్రుల్ పద
త్రయహీనన్ నను( బట్ట వత్తు రనియో, తాపంబు నీ కేటికిన్? 396

* "తల్లీ! నీ కన్నుల నుంచి బాష్పధారలు ప్రవహించుతున్నా యేమిటి? నీ దేహం వ్యాధిగ్రస్తమై ఉన్నదేమిటి? నీ వదనమంతా అలా వాడిపోయిందేమిటి? నీ ప్రియ బంధువులకు భయదుఃఖాలు ప్రాప్తించలేదు కదా! 'శూద్రులు ఒంటికాలితో కుంటుతూ ఉన్న నన్ను పట్టి బంధిస్తారేమో'నని దిగులు పడుతున్నావా! పిచ్చి తల్లీ! ఎందుకిలా ఉన్నావు?

సీ. మఖములు లేమి నమర్త్యుల కిటమీ(ద మఖభాగములు లేక మాను ననియొ?
రమణులు రమణుల రక్షింప రనియొ పుత్త్రులు( దల్లిదండ్రులు ప్రోవ రనియొ?
భారతి గుజనుల బ్రాపించు ననియొ సద్విప్రులు నృపుల సేవింతు రనియొ?
కులిశ హస్తు(డు వాన గురియింపకుండ(గ( బ్రజలు దుఃఖంబుల( బడుదురనియొ?

ఆ. హీనవంశజాతు లేలెద రనియొ, రాజ్యములు పాడి గలిగి జరుగవనియొ?
మనుజు లన్నపానమైథున శయనాస, నాది కర్మసక్తు లగుదు రనియొ? 397

* యజ్ఞాలు లేనందువల్ల ఇకముందు దేవతలకు హవిర్భాగాలు లభించవనీ, భర్తలు భార్యలను భరించరనీ, పిల్లలు తల్లిదండ్రులను పోషించరనీ బాధపడుతున్నావా? సరస్వతి దుర్జనులను ఆశ్రయిస్తుందనీ, ఉత్తమ విప్రులు రాజులకు సేవ చేస్తారనీ, ఇంద్రుడు వర్షం కురిపించకపోతే ప్రజలు కష్టాల పాలవుతారనీ ఖేదపడుతున్నావా? హీన వంశ జాతులు రాజ్యాలు ఏలుతారనీ, దేశంలో న్యాయం నశించి పోతుందనీ, మానవులు ఆహార నిద్రా మైథునాది కర్మలయందు ఆసక్తు లౌతారనీ విచారిస్తున్నావా? ఎందుకు నీ కీ ఆవేదన?

మ. జననీ! నీ భర మెల్ల డించుటకునై చక్రాయుధుం డిన్ని హా
యనముల్ దాను నరాకృతిన్ మెల(గి నిత్యానందముం జేసి పో
యిన నే నింక ననాథ నైతి(; గుజనుం డెవ్వా(డు శాసించునో
పెను దుఃఖంబుల నేమి పొందు ననియో భీతిల్లి చింతించుటల్. 398

* "భూభారాన్ని తగ్గించటం కోసం చక్రధరుడైన శ్రీహరి ఇన్ని సంవత్సరాలు మానవాకారం ధరించి, చరించి, ఆనందం చేకూర్చి అవతారం చాలించాడే? ఇక నేను దిక్కులేనిదాన నైనాను. ఏ దుర్మార్గుడు ఇక ముందు నన్ను పాలిస్తాడో, ఎటువంటి దుఃఖాలు ప్రాప్తిస్తాయో" అని దిగులుపడి ఆక్రోశిస్తున్నావా తల్లీ?

క. దెప్పర మగు కాలముచే, నెప్పుడు దేవతలకెల్ల నిష్టం బగు నీ
యొప్పిదము( గృష్ణు( డరిగిన(, దప్పె(గదా! తల్లి! నీవు తల్లడపడ(గన్. 399

* అనర్థాలకు ఆలవాలమైన కాలంలో కృష్ణుడు ఉన్నంత వరకూ దేవతలకు కూడా సంస్తవనీయమైనది నీ సౌభాగ్యం. ఇప్పుడు కృష్ణుడు వెళ్లిపోగానే అదృష్టం మారిపోయింది. అనర్థం వాటిల్లింది.

వ. అనిన భూదేవి యిట్లనియె. 400

* అని ధర్మదేవుడు పలుకగా విని భూదేవి ఇలా అన్నది-

క. ఈ లోకంబునఁ బూర్వము, నాలుగు పాదముల నీవు నడతువు నేఁ డా
శ్రీలలనేశుఁడు లేమిని, గాలముచే నీకు నొంటి కాలయ్యెఁ గదే! 401

* "ధర్మదేవతా స్వరూపుడవైన నీవు పూర్వం ఈ లోకంలో నాలుగు పాదాలతో నడుస్తూ ఉండేవాడివి. ఈ నాడు ఇందిరావల్లభుడైన గోవిందుడు లేనందువల్లనే కదా కాలప్రభావానికి లోబడి ఒంటి కాలితో నడుస్తున్నావు!

వ. మఱియు సత్య శౌచ దయా క్షాంతులును, ద్యాగసంతోషార్జవంబులును, శమ దమ తపంబులును, సమత్వంబును, పరాపరాధ సహనంబును, లాభంబు గలయెడ నుదాసీనుండై యుండుటయును, శాస్త్రవిచారంబును, జ్ఞానవిరక్తులును, నైశ్వర్య శౌర్యప్రభా దక్షత్వంబులును, స్మృతియును, స్వాతంత్ర్యంబును. గౌశలకాంతి ధైర్యమార్దవ ప్రతిభాతిశయ ప్రశ్రయశీలంబును, జ్ఞానేంద్రియ కర్మేంద్రియ మనోబలంబులును, సౌభాగ్యగాంభీర్య స్థైర్యంబులును, శ్రద్ధాకీర్తి మాన గర్వాభావంబులును ననియెడి ముప్పది తొమ్మిది గుణంబులు; నవియునుంగాక బ్రహ్మణ్యతా శరణ్యతాది మహా గుణసమూహంబును శ్రీకృష్ణదేవుని యందు వర్తిల్లుంగావున- 402

* సత్యం, శౌచం, దయ, క్షమ, త్యాగం, సంతోషం, ఆర్జవం, శమం, దమం, తపస్సు, సమభావం, తితిక్ష, ఉపరతి, శ్రుతం, జ్ఞానం, వైరాగ్యం, ఐశ్వర్యం, శౌర్యం, తేజస్సు, సామర్థ్యం, స్మృతి, స్వాతంత్ర్యం; కౌశలం, కాంతి, ధైర్యం, మార్దవం, ప్రతిభ, వినయం, శీలం, జ్ఞానేంద్రియ పటుత్వం, కర్మేంద్రియ పటుత్వం, మనోబలం, సౌభాగ్యం, గాంభీర్యం, స్థైర్యం, శ్రద్ధ, కీర్తి, గౌరవం, నిరహంకారం అనే ముప్పై తొమ్మిది సుగుణాలే కాకుండా వేదవిజ్ఞానం, శరణాగత పరిత్రాణం మొదలైన అనంత గుణగణాలు ఆ శ్రీ కృష్ణపరమాత్మ యందు అలరారుతుంటాయి.

క. గణనాతీతము లగు సద్గుణములు గల చక్రి ఘోరకలి ప్రే
రణమునఁ బాప సమూహ, ప్రణయుతులగు జనులఁ జూచి వగచెదఁ దండ్రీ! 403

* ఓ తండ్రీ! ఈ విధంగా లెక్కించటానికి శక్యంకాని సుగుణాల రాశి చక్రధరుడు అవతారం చాలించగానే, కలుషాత్ముడైన కలిపురుషుని ప్రేరణ మూలంగా భయంకర పాపకృత్యాలకు పాల్పడిన ప్రజాసమూహాన్ని చూడంగానే నాకు దుఃఖం పొంగి వస్తున్నది.

క. దేవతలకు ఋషులకుఁ బితృ, దేవతలకు నాకు నీకు ధీరులకును నా
నా వర్ణాశ్రమములకును, గోవులకును బాధ యనుచుఁ గుందెద ననఘా! 404

* ఓ పుణ్యమూర్తీ! దేవతలకూ, పితృదేవతలకూ, ఋషులకూ, నాకూ, నీకూ, నానావిధాలైన వర్ణాశ్రమాలకూ, గోవులకూ, మహానుభావులకూ బాధలు ప్రాప్తిస్తున్నందుకు బాధపడుతున్నాను.

సీ. బ్రహ్మాదు లెవ్వని భద్రకటాక్ష వీక్షణము వాంఛింతురు సత్తపములఁ
గమలాలయము మాని కమల యెవ్వని పాద కమలంబు సేవించుఁ గౌతుకమునఁ
బరమ యోగీంద్రులు భవ్య చిత్తములందు నిలుపుదు రెవ్వని నియతితోడ
వేదంబు లెవ్వని విమలచారిత్రముల్ వినుతింపఁగా లేక వెగడు వడియె.

ఆ. నట్టి వాసుదేవు నబ్జ వజ్రాంకుశ, చక్ర మీన శంఖ చాప కేతు
చిహ్నితంబులైన శ్రీచరణము లింక, సోఁక వనుచు వగపు సోఁకె నయ్య! 405

* బ్రహ్మాది దేవతలంతా ఎంతో కాలం తపస్సులు చేసి చేసి ఏ దేవుని కల్యాణ కరుణా కటాక్ష వీక్షణాలను కాంక్షిస్తారో, పద్మాలయ అయిన లక్ష్మీదేవి తన నివాసమైన పద్మాన్ని సైతం పరిత్యజించి, అత్యంత కుతూహలంతో ఏ దేవుని పాదపద్మాలను ఆరాధిస్తున్నదో, పరమ నిష్ఠాగరిష్ఠులైన మునిశ్రేష్ఠులు తమ పవిత్ర హృదయ ఫలకాలపై ఏ దేవుని పావన స్వరూపాన్ని నియమపూర్వకంగా నిలుపు కొంటున్నారో, సమస్త వేదాలూ ఏ దేవుని దివ్య చరిత్రలు సరిగా వర్ణించలేక తడబాటు పడుతున్నాయో, అటువంటి దేవాదిదేవుడైన వాసుదేవుని పద్మ, వజ్ర, అంకుశ, శంఖ, చక్ర, చాప, మీన, ధ్వజ రేఖలతో అలంకృతాలైన శ్రీచరణాలు ఇక మీద, నా మీద సోకవు గదా అని శోకిస్తున్నాను.

క. హరిపాదంబులు సోఁకెడి, సిరికతమున నఖిలభువనసేవ్యత్వముతో
స్థిర నైతి నిన్ని దినములు, హరి నా గర్వంబు మాన్చి యరిగె మహాత్మా! 406

* మహాత్మా! భగవంతుని పాదపద్మాలు పైపై సోకే మహాభాగ్యం నాకు లభించటం మూలాన అఖిలలోకాలకు ఆరాధ్యురాలనై ఇన్నాళ్ళూ పొంగి పులకించాను. ప్రభువు నా అభిమానాన్ని అంతం చేసి ఇప్పుడు అంతర్ధానం చెందాడు.

క. లీలాకారము దాల్చెను, శ్రీలలనేశుండు ఖలుల శిక్షించి భవో
న్మూలనము సేయుకొఱకును, నాలుగు పాదముల నిన్ను నడిపించుటకున్. 407

* శ్రీమన్నారాయణుడు దుష్టశిక్షణ కోసం, శిష్టరక్షణ కోసం, సంసార సంతాపాన్ని శాంతింపజేయటం కోసం, ధర్మస్వరూపుడవైన నిన్ను నాలుగు పాదాలతో నడిపించటం కోసం లీలామానుష దేహాన్ని ధరించాడు.

ఉ. ఆ మధురోక్తు లా నయము లా దరహాసము లా దయారసం
బా మురిపంబు లా తగవు లా గమనక్రియ లా మనోహర
ప్రేమకరావలోకనము ప్రీతిఁ గనుంగొనలేమి మాధవుం
గామిను లేల? నిర్దళితకర్ములు యోగులుఁ బాయ నేర్తురే! 408

* మాధవుని లీలలు మరిచిపోలేము. ఆ తీయ తీయని మాటలు, ఆ నయగారాలు, ఆ చిరునవ్వులు, ఆ కనికరాలు, ఆ ముద్దు మురిపాలు, ఆ ప్రణయకలహాలు, ఆ సుందరమందయానాలు, మనస్సులను హరించే ఆ మధుర కటాక్షవీక్షణాలు దూరమై పోతాయే అనే విచారంతో అంగనలే కాదు సర్వసంగ పరిత్యాగులైన యోగులు కూడా ఆ దయామయుని వియోగాన్ని సహించలేరు.

క. మెల్లన నాపై యాదవ, వల్లభుఁ డడుగిడఁగ మోహవశనై నే రం
జిల్లగ రోమాంచము క్రియ, మొల్లములై మొలచు సస్యములు మార్గములన్. 409

* ఆ గోపికా వల్లభుఁడు నా పైన మెల్ల మెల్లగా అడుగులు పెడుతూ నడుస్తుంటే ఆనంద పారవశ్యంలో నా ఒళ్లు గగుర్పొడిచేది. నా దేహం నిండా మొలిచిన ఆ పులకాంకురాలే దట్టమైన సస్యాంకురాలై అడుగడుగునా పొడచూపేవి.

వ. అని యిట్లు పూర్వవాహిని యైన సరస్వతీతీరంబున ధర్మదేవుండును భూమియు వృషధేనురూపంబుల భాషింప రాజర్షియైన పరీక్షిద్భూవరుండు డగ్గఱియె; నా సమయమున. 410

* ఈ విధంగా వృషభ ధేను రూపాలతో ధర్మదేవుడూ, భూదేవి ఇద్దరూ తూర్పుగా ప్రవహించే సరస్వతీ నది ఒడ్డున సంభాషించు కొంటున్న సమయంలో రాజర్షి అయిన పరీక్షిన్మహీపాలుడు అచ్చటికి వచ్చాడు. అప్పుడు-

## -: కలిపురుషుఁడు ధర్మదేవతను దన్నుట :-

శా. కైలాసాచల సన్నిభంబగు మహాగంభీర గోరాజముం
గాలక్రోధుఁడు దండహస్తుఁడు నృపాకారుండు క్రూరుండు జం
ఘాలుం డొక్కఁడు శూద్రుఁ డాసురగతిం గారుణ్య నిర్ముక్తుఁడై
నేలం గూలఁగఁ దన్నెఁ బంచితిలఁగా నిర్ఘాతపాదాహతిన్. 411

* కదలివచ్చిన కైలాస పర్వతంలాగా తెల్లగా గంభీరంగా నున్నగా అంతెత్తున ఉన్న ఆ మహావృషభాన్ని క్రోధోన్మత్తుడూ, కఠోరచిత్తుడూ, దండహస్తుడూ, రాజవేషధారీ, బలమైన పిక్కలు కలవాడూ అయిన ఒకానొక శూద్రుడు కటిక రాక్షసునిలా గబగబ వచ్చి కనికరం లేకుండా కాలితో తన్నాడు. పిడుగుపాటు వంటి ఆ తన్నుకు పాపం ఆ వృషభం నేల మీద కూలబడి మూత్ర విసర్జనం చేసింది.

వ. మఱియును. 412

* వాడు అంతటితో ఆగలేదు-

శా. ఆలోలాంగక నశ్రు తోయ కణ జాలాక్షిన్ మహాంభారవన్
బాలారూఢ తృణావళీకబళలోభ వ్యాప్త జిహ్వాగ్ర నాం
దోళస్వాంత నజీవవత్స, నుదయద్దుఃఖాన్వితన్ ఘర్మ కీ
లాలాపూర్ణ శరీర, నా మొదవు నుల్లంఘించి తన్నెన్ వడిన్. 413

* గడగడ వడకుతూ కన్నుల వెంబడి అశ్రుధారలు కారుస్తున్న దాన్ని, గొంతెత్తి 'అంబా' అని అరుస్తున్నదాన్ని, జంపుగా పెరిగిన లేత పచ్చిక మేయటానికి నాలుక చాస్తున్న దాన్ని, చెదరిన గుండె

కలదాన్ని, లేగదూడ లేకుండా ఒంటరిగా వచ్చిన దాన్ని, స్వేదజలంతో నిండిన దేహం కలదాన్ని, ఆ గోమాతను, ఆ భయోపేతను ఆ పాపాత్ముడు పైకెగిరి ఫెడేల్మని తన్నాడు.

**వ. ఇ ట్లా ధేనువృషభంబులు రెంటిం గంటకుండై తన్నుచున్న రాజ లక్షణ ముద్రితుం డయిన శూద్రునిం జూచి సువర్ణ పరికర స్యందనారూఢుండగు నభిమన్యు నందనుండు గోదండంబు సగుణంబు సేసి మేఘగంభీర రవంబులగు వచనంబుల నిట్లనియె. 414**

* ఈ విధంగా తన కంటి ముందే ఆ ధేను వృషభాలను రెంటినీ వెంటబడి తన్నుతున్న జగత్కంటకుడైన ఆ శూద్రుణ్ణి పరికించి కాంచన రథారూఢుడై ఉన్న పరీక్షిన్నరేంద్రుడు విల్లెక్కు పెట్టి మేఘ గంభీర భాషణాలతో ఇలా అన్నాడు.

**శా. నిన్నుం గొమ్ములఁ జిమ్మెనో? కదిసెనో? నిర్భీతివై గోవులం**
**దన్నం గారణమేమి? మద్భుజసనాథక్షోణి నే వేళలం**
**దు న్నేరంబులు సేయ రా;దెఱుఁగ వా ధూర్తత్వమున్ భూమి భృ**
**త్సన్నాహంబు నొనర్చె దెవ్వఁడవు నిన్ శాసించెదన్ దుర్మతీ! 415**

* ఎవడవురా నీవు? నిన్ను కొమ్ములతో చిమ్మలేదే! నీ మీదికి రాలేదే! ఏ పాపమూ ఎరుగని ఈ గోవులను అన్యాయంగా తన్నా వెందుకురా? నా భుజదండం సంరక్షించే ఈ మహీమండలంలో ఏ వేళా ఎవరూ ఎటువంటి నేరాలూ చేయకూడదని తెలియదా? దుర్బుద్ధితో రాజవేషాన్ని ధరించి రాజసం ఒలకబోస్తున్న ధూర్తుడా! నిన్ను కఠినంగా శిక్షిస్తాను.

**క. గాండీవియుఁ జక్రియు భూ, మండలిఁ బెడఁబాసి చనిన మదమత్తుఁడవై**
**దండింపఁ దగని వారల, దండించెదు నీవ తగుదు దండనమునకున్. 416**

* గాండీవధారి అర్జునుడూ, చక్రధారి శ్రీకృష్ణుడూ ఈ భూమండలాన్ని విడిచి వెళ్లారనే ధీమాతో మదోన్మత్తుడవై దండింపతగని సాధువులను దండిస్తున్న నీకు ప్రచండమైన రాజదండన తప్పదు"

**వ. అని వృషభంబు నుద్దేశించి యిట్లనియె. 417**

* అని పలికి పరీక్షిన్మహారాజు వృషభరాజాన్ని చూచి ఇలా అన్నాడు-

**మ. కురుధాత్రీశ్వర, బాహు వప్ర యుగళీ గుప్తక్షమా మండలిం**
**బరికింపన్ భవదీయనేత్ర జనితాంభశ్శ్రేణిఁ దక్కన్ జనుల్**
**దొరఁగం జేయ రధర్మసంజనిత జంతుశ్రేణి బాష్పంబులన్**
**గురుశక్తిన్ విదళింతుఁ జూడు మితనిన్ గోమూర్తిదేవోత్తమా! 418**

* "ఓ వృషభ రూపంలో ఉన్న ధర్మదేవా! కురువంశీయులైన నరేంద్రుల బాహుదండాలనే కోటగోడల నడుమ సురక్షితమై ఉన్న ఈ ధరాచక్రంలోని జనులు, నీ కమల వెంట స్రవించే బాష్పధారలు తప్ప అధర్మబాధితులైన ఏ యితర జీవుల కన్నీటి ధారలూ ఇంతవరకు చూచి ఎరుగరు. ఇదిగో చూడు! నా అవక్రపరాక్రమంతో ఈ దురాత్ముణ్ణి చించి చెండాడుతాను.

**క. జాలిఁ బడ నేల? నా శర, జాలంబుల పాలు సేసి చంపెద వీనిన్**
**భూలోకంబున నిపుడే, నాలుగు పాదముల నిన్ను నడిపింతుఁ జుమీ. 419**

* ఓ ధర్మస్వరూపా! దిగులు పడబోకు. నా వాడితూపులతో ఈ పాపాత్ముణ్ణి రూపుమాపుతాను. నిన్ను ఇప్పుడే ఈ భూమి మీద మళ్లీ నాలుగు పాదాలతో నడిపించుతాను.

**ఉ. వాచవియైన గడ్డిఁ దిని వాహినులందు జలంబు ద్రావఁగా**
**నీ చరణంబు లెవ్వఁడిటు నిర్దళితంబుగఁ జేసె; వాఁడు దా**
**ఖేచరుఁడైన, వాని మణి కీలిత భూషణ యుక్త బాహులన్**
**వే చని త్రుంచివైతు వినువీథికి నేగిన నేల డాఁగినన్. 420**

* అడవులలో ఇచ్చవచ్చిన పచ్చిగడ్డి మేస్తూ, నదులలో స్వచ్ఛమైన నీరు త్రావుతూ, స్వేచ్ఛగా జీవించే ధర్మమూర్తివైన నీ పాదాలు ఏ పాపాత్ముడు ఈ విధంగా విరగగొట్టాడో చెప్పు, వాడు ఖేచరుడైనా, భూచరుడైనా, నింగిలోకి పారినా, నేలలోకి దూరినా, ఆ దుండగుని మణికంకణ మండితాలైన రెండు చేతులనూ ఇప్పుడే ఖండించి వేస్తాను.''

**వ. అని మఱియు గోరూప యయిన భూదేవితో నిట్లనియె- 421**

* అని పలికి పరీక్షిత్తు గోరూపధారిణి అయిన భూదేవితో ఇలా అన్నాడు -

**చ. అగణితవైభవుం డగు మురాంతకుఁ డక్కట పోయె నంచు నె**
**వ్వగలఁ గృశించి నేత్రముల వారికణంబులు దేకు మమ్మ! లో**
**బెగడకు మమ్మ! మద్విశిఖబృందములన్ వృషలున్ వధింతు నా**
**మగఁటిమిఁ జూడవమ్మ! వెఱ మానఁ గదమ్మ! శుభ ప్రదాయినీ! 422**

* "అమ్మా! అనంత వైభవోపేతుడైన శ్రీకృష్ణస్వామి ఈ లోకాన్ని వదలి వెళ్లిపోయాడనే ఆవేదనతో కృశించి కన్నీరు మున్నీరుగా ఏడువకు. మనస్సులో దిగులు పెట్టుకోబోకు. భయకంపితవు కాబోకు. కల్యాణదాయినివైన నిన్ను తన్నిన ఈ దుర్మార్గుణ్ణి ఇప్పుడే నా బాణాలతో నేల కూలుస్తాను, చూడు తల్లీ!

**క. సాధువులగు జంతువులకు, బాధలు గావించు ఖలుల భంజింపని రా**
**జాధము నాయుస్స్వర్గ, శ్రీధనములు వీటిఁబోవు సిద్ధము తల్లీ! 423**

* నిరపరాధులైన సాధుజనులను బాధించి వేధించే దుర్మార్గులను రాజైనవాడు అవశ్యం శిక్షించాలి. అలా శిక్షించకుండా ఉపేక్షించిన రాజాధముని జీవితమూ, ఆయుస్సూ, ఐశ్వర్యమూ, సర్వం వ్యర్థం. ఈ మాట ముమ్మాటికీ యథార్థం తల్లీ!

**క. దుష్టజన నిగ్రహంబును, శిష్టజనానుగ్రహంబుఁ జేయఁగ నృపులన్**
**స్రష్ట విధించెఁ బురాణ, ద్రష్టలు సెప్పుదురు పరమధర్మము సాధ్వీ! 424**

సాధ్వీమణివైన పృథ్వీ! దుష్టులను శిక్షించటం కోసం శిష్టులను రక్షించటం కోసమే భగవంతుడైన బ్రహ్మదేవుడు రాజులను సృష్టించాడని శాస్త్రవేత్తలు చెబుతారు. కనుక ఇప్పుడు రాజునైన నాకు ఆర్తరక్షణం అన్నది పరమధర్మం.''

**వ. అనిన ధర్మనందన పౌత్త్రునకు వృషభమూర్తినున్న ధర్మదేవుం డిట్లనియె. 425**

* ఇలా పలికిన ధర్మనందనుని మనుమడైన పరీక్షిన్నరేంద్రునితో వృషభరూపంలో ఉన్న ధర్మదేవుడు ఇలా అన్నాడు-

**ఉ. క్రూరులఁ జంపి, సాధువులకున్ విజయం బొనరించునట్టి యా**
**పౌరవ వంశజాతుఁడవు భాగ్యసమేతుఁడ వౌదు తొల్లి మీ**
**వా రిటువంటి వా రగుట వారిజనేత్రుఁడు మెచ్చి దౌత్య సం**
**చారము సేసెఁ గాదె నృపసత్తమ! భక్తిలతానిబద్ధుఁడై. 426**

* "నరనాథ శిరోమణీ! దుర్జనులను నిగ్రహించి, సజ్జనులను అనుగ్రహించే పురువంశంలో పుట్టిన ధర్మమూర్తులు కనుకనే భగవంతుడైన శ్రీకృష్ణుడు మీ వారి భక్తి శ్రద్ధలకు మెచ్చి మనసిచ్చి దూతయై రాయబారాలు నడిపాడు.

**వ. నరేంద్రా! యేము ప్రాణులకు దుఃఖహేతువులము గాము; మావలన దుఃఖంబు నొందెడు పురుషుండు లేఁడు; వాదివాక్య భేదంబుల యోగీశ్వరులు మోహితులై భేదంబు నాచ్ఛాదించి, తమకు నాత్మ సుఖదుఃఖంబుల నిచ్చు ప్రభువని చెప్పుదురు. దైవజ్ఞులు గ్రహదేవతాదులకుఁ బ్రభుత్వంబు సంపాదింతురు; మీమాంసకులు గర్మంబునకుం బ్రాభవంబుం బ్రకటింతురు;లోకాయతికులు స్వభావంబునకుఁ బ్రభుత్వంబు సంపాదింతురు; ఇందెవ్వరికిని సుఖదుఃఖ ప్రదానంబు సేయ విభుత్వంబు లేదు; పరులవలన దుఃఖంబు వచ్చిన నధర్మంబు పరులు సేసిరని విచారింప వలదు; తర్కింపను నిర్దేశింపను రాని పరమేశ్వరునివలన సర్వంబు నగుచుండు ననిన ధర్మదేవునికి ధర్మనందన పౌత్త్రుం డిట్లనియె. 427**

* రాజేంద్రా! మేము ఇతర ప్రాణులను బాధ పెట్టేవాళ్లం కాము. మా మూలంగా ఏ ప్రాణికీ ఎటువంటి ఆపదా కలుగదు. నానా విధాలైన వాదోపవాదాలకు సమ్మోహితులైన యోగీశ్వరులు ఆత్మయే సుఖదుః ఖాలు కల్పించే ప్రభువంటారు. దైవజ్ఞులు గ్రహాలకూ, దేవతలకూ ప్రభుత్వాన్ని ఆపాదిస్తారు. మీమాంసకులు కర్మానికే ప్రాధాన్యం అంగీకరిస్తారు. లోకాయతికులు ప్రకృతికే ప్రాభవాన్ని కట్టబెడతారు. కాని వారు

చెప్పేవారిలో ఎవ్వరికీ సుఖదుఃఖాలను ఇచ్చే సామర్థ్యం లేదు. ఎవరి వల్లనో తమకు దుఃఖం ప్రాప్తించిందనీ, ఎవరో తమకు ఎగ్గు చేశారనీ అనుకోవటం పొరపాటు. బుద్ధికీ మనస్సుకీ అతీతుడైన పరమేశ్వరుని వల్లనే సమస్తమూ జరుగుతుంది.'' అని పలికే ధర్మదేవునితో ధర్మరాజు పౌత్రుడైన పరీక్షిత్తు ఇలా అన్నాడు-

**ఆ. ధర్మమూర్తి వయ్య ధర్మజ్ఞ వృషరూప, పరమధర్మ మీవు పలుకు త్రోవ**
**పాపకర్మ చేయు పాపంబు సూచింపఁ బాపకర్ముఁ డేఁగు పథము వచ్చు. 428**

* "వృషభ రూపంలో ఉన్న ధర్మదేవా! నీవు ధర్మమూర్తివి. ధర్మజ్ఞుడవు. నీ పలుకుల తీరు పరమధర్మంగా ఉంది. పాపాత్ముడు చేసిన పాపాన్ని ప్రకటించటానికి కూడా ఇష్టపడవు. నిజమే! పాప కర్ముల పాపాన్ని ప్రకటించే వారికి ఆ పాప ఫలం అంటుకుంటుందంటారు.

**వ. మఱియు దేవమాయవలన భూతంబుల వాఙ్మానసంబులకు వధ్యఘాతుక లక్షణంబగు వృత్తి సులభంబునం దెలియరాదు; నీవు ధర్మదేవతవు; కృతయుగంబునం దప శ్శౌచ దయా సత్యంబులను నాలుగు నీకుం బాదంబు లని చెప్పుదురు; త్రేతాయుగంబునఁ బూర్వోక్తపాద చతుష్కంబునం దపశ్శౌచదయా సత్యంబులం దొక్క పాదంబు క్షీణం బయ్యె; ద్వాపరంబునం బాదద్వయంబు నశించెం; గలియుగంబందు నివ్వడువున నిప్పుడు నీకుఁ బాదత్రయంబు భగ్నంబయ్యె, నవశిష్టంబగు భవదీయ చతుర్థ పాదంబున ధర్మంబు గల్యంతంబున నిగ్రహింప గమకించుచున్నయది, విను మదియునుంగాక. 429**

* వాక్కుకూ మనస్సుకూ అతీతమైన దైవీమాయవల్ల జీవులకు వధ్యఘాతుక స్వరూపం సులభవేద్యం కాదు. నీవు ధర్మ దేవతవు. కృతయుగంలో నీకు తపం, శౌచం, దయ, సత్యం అనే నాలుగు పాదాలు ఉండేవని చెబుతారు. త్రేతాయుగంలో ఆ నాలుగు పాదాలలో ఒక పాదం భగ్నమయింది. ద్వాపరయుగం రాగానే రెండు పాదాలు లోపించాయి. ఇప్పుడు కలియుగంలో మూడు పాదాలు లుప్తమైపోయి సత్యమనే ఒక్కపాదం మాత్రం మిగిలి ఉంది. ఆ పాదాన్ని కూడా కలియుగాంతంలో అధర్మం ఆక్రమించి భగ్నం చెయ్యాలని కాచుకొని ఉంది. ఇదుగో ఇటు చూడు-

**మ. భరముం బాపి రమావిభుండు గరుణం బాదంబులం ద్రొక్కఁగా**
**స్థిరయై వేడుక నింతకాలము సుఖశ్రీ నొందె భూదేవి; త**
**చ్చరణస్పర్శము లేమి శూద్రకులజుల్ శాసింతు రంచున్ నిరం**
**తర శోకంబున నీరు గన్నుల నిడెన్ ధర్మజ్ఞ! వీక్షించితే. 430**

* శ్రీకృష్ణభగవానుడు అవతరించి భూభారం తీర్చాడు. శ్రీకృష్ణదేవుని శ్రీపాదస్పర్శవల్ల భూదేవి పులకించి సుస్థిరానందంతో మైమరచి పోయింది. ఇప్పుడు భగవంతుని పాదస్పర్శకు దూరమై పాపాత్ము లైనవారు తనమీద పెత్తనం చలాయిస్తారేమో ననే భయంతో కన్నులవెంట బాష్పాలు కారుస్తున్నది. ధర్మస్వరూపా! ఈమెను వీక్షించు.''

## -: పరీక్షిన్మహారాజు గలిని నిగ్రహించి ధర్మపరిపాలనము సేయుట :-

**వ. అని యటు ధరణీ ధర్మదేవతల బుజ్జగించి మహారథుండయిన విజయపౌత్త్రుండు క్రొక్కారు మెఱుంగు చక్కదనంబు ధిక్కరించి దిక్కులకు వెక్కసంబయిన యడిదంబు బెడిదంబుగ జడిపించి పాపహేతువయిన కలిని రూపుమాప నుద్యోగించిన, వాఁడు రాజరూపంబు విడనాడి, వాడిన మొగంబుతోడ భయవిహ్వలుండై హస్తంబులు సాఁచి తత్పాదమూల విన్యస్త మస్తకుండై ప్రణామంబు సేసి. 431**

* ఈ విధంగా పరీక్షిన్మహారాజు ధరణినీ, ధర్మదేవుణ్ణీ ఊరడించాడు. మహారథుడూ, అర్జునుని మనుమడూ అయిన ఆ వీరాగ్రేసరుడు తొలకరి మెరుపుతీగలా తళ తళ మెరుస్తూ కళ్లకు మిరుమిట్లు గొలిపే తన ఖడ్గాన్ని చివాలున దూసి, పాపాత్ముడైన కలిని రూపుమాపాలని నిశ్చయించాడు. అప్పుడు తనను సంహరించటానికి ఉద్యుక్తుడైన మహారాజును చూచి, కలి రాజచిహ్నాలన్నీ విడిచి, వడలిన వదనంతో గడగడలాడుతూ భయవిహ్వలుడై ఆ రాజుపాదాల మీద పడి సాష్టాంగ నమస్కారం చేసి-

**క. కంపించె దేహమెల్లం, జంపకు మో రాజతిలక! శరణాగతు ర**
**క్షింపు మని తనకు మ్రొక్కినఁ, జంపక కలిఁజూచి నగుచు జనపతి పలుకున్. 432**

* ఓ నృపాలతిలకా! భయంతో నా దేహమంతా కంపించి పోతున్నది. నన్ను చంపవద్దు, నీ చరణాలను శరణు వేడుతున్నాను. నన్ను కరుణించు." అని ప్రార్థించాడు. పరీక్షిత్తు కలిపురుషుణ్ణి చంపకుండా క్షమించి ఇలా మందలించాడు-

**క. అర్జునకీ ర్తిసమేతుం, డర్జున పౌత్త్రుండు భయ రసావృత జనులన్**
**నిర్జితులఁ జంప నొల్లఁడు, దుర్జనభావంబు విడిచి తొలగు దురాత్మా! 433**

* "ఓయీ! అత్యంత నిర్మలయశోవిశాలుడైన అర్జునుని అనుగు మనుమడు ఓడి, ధైర్యం వీడి, దోసిలొగ్గిన వారిని వధింపడు. ఇక నీ ధూర్తస్వభావాన్ని విడిచి దూరంగా తొలగిపో దుర్మార్గుడా!

**వ. నీవు పాపబంధుడవు మదీయబాహుపాలితం బయిన మహీమండలంబున నిలువ వలవదు; రాజదేహంబునందు వర్తించు నిన్ను నసత్యలోభ చౌర్య దౌర్జన్య దురాచార మాయాకలహ కపట కలుషాలక్ష్మ్యాది ధర్మేతరసమూహంబు లాశ్రయించు; సత్యధర్మంబులకు నివాసంబగు బ్రహ్మావర్తదేశంబున యజ్ఞ విస్తార నిపుణు లయిన వారు యజ్ఞేశ్వరుం డయిన హరింగూర్చి యాగంబు సేయుచున్న వారు; యజించు వారలకు సుఖప్రదానంబుసేయుచు, సకల భూతాంతర్యామియై భగవంతుం డయిన హరి జంగమస్థావరంబులకు నంతరంగ బహిరంగముల సంచరించు వాయువు చందంబున నాత్మరూపంబు మనోరథంబు నిచ్చుం; గావున నీ విం దుండ వలవ దనుచు దండ హస్తుండయిన జముని కైవడి మండలాగ్రంబు సాఁచిన రాజవర్యునకుం గలి యిట్లనియె. 434**

* పరమ పాపాత్ముడవైన నీకు నేను పాలించే ఈ భూమండలంలో స్థానం లేదు. రాజవేషధారివైన నీలో అసత్యం, లోభం, దొంగతనం, దౌర్జన్యం, దురాచారం, మోసం, కలహం, కపటం, కలుషం, దౌర్భాగ్యం మొదలైన అధర్మ గుణాలు గూడుకట్టుకొని ఉన్నాయి. సత్యానికీ ధర్మానికీ ఆలవాలమైన ఈ బ్రహ్మావర్తదేశంలో యజ్ఞవేత్తలైన పెద్దలు యజ్ఞేశ్వరుడైన శ్రీమహావిష్ణువును యజ్ఞాలతో ఆరాధిస్తున్నారు. చరాచర ప్రపంచంలో వెలుపలా లోపలా నిండి సంచరించే వాయువులాగా సర్వాంతర్యామి అయిన ఆ స్వామి వారికి సమస్త శుభాలూ చేకూరుస్తూ వారి కోరికలు తీరుస్తూ ఉంటాడు. అందువల్ల ఈ ప్రదేశంలో నీవు ఉండటానికి వీలులేదు.'' అని కత్తిని పైకెత్తిన చక్రవర్తితో కలిపురుషుడు ఇలా పలికాడు-

**క. జగతీశ్వర! నీ యడిదము, ధగధగితప్రభలతోడఁ దఱచుగ మెఱయన్**
**బెగడెం జిత్తము గుండెలు, వగిలెడి నెందుఁ జొత్తు నిఁక భావింపఁ గదే** **435**

* "జగత్పతీ! ధగద్ధగిత కాంతులతో మెరుస్తున్న నీ కరకు కరవాలాన్ని చూచి నా గుండెలు పగులుతున్నాయి. నా హృదయం బెదురుతున్నది. ఇప్పుడు నే నెక్కడికి పోయేది? ఎక్కడ ఉండేది? నీవే ఆలోచించు.

**వ. నరేంద్రా! నిన్ను, నారోపితశరశరాసను సర్వప్రదేశంబులందును విలోకించుచున్న వాఁడ; నే నెక్కడ నుండుదు నానతిమ్మనిన రాజన్య శేఖరుండు ప్రాణివధ స్త్రీ ద్యూత పానంబు లనియెడు నాలుగు స్థానంబుల నిచ్చి మఱియు నడిగిన సువర్ణమూలంబగు నసత్య మద కామ హింసా వైరంబు లనియెడు పంచప్రదేశంబుల నొసంగి, యితరస్థలంబుల స్పృశియింపకుండ నియమించె, నిట్లు కలినిగ్రహంబు సేసి హీనంబు లయిన తపశ్శౌచదయ లనియెడు మూఁడు పాదంబులు వృషభమూర్తి యయిన ధర్మదేవుని కిచ్చి, విశ్వంభరకు నిర్భరం బయిన సంతోషంబు సంపాదించి.** **436**

* "రాజేంద్రా! ఎటు చూస్తే అటు సర్వత్రా ధనుర్ధరుడవైన నీ రూపమే నాలోచనాలకు గోచరిస్తున్నది. మరి నేను ఎచట తలదాచుకొనేది? ఆజ్ఞాపించు'' అని అలమటించే కలిపురుషుని ప్రార్థన ఆలకించి పరీక్షిత్తు వానికి జూదం, మద్యపానం, స్త్రీలు, ప్రాణివధ అనే నాలుగు స్థానాలు ఇచ్చాడు. ఇంకా అతడు అర్థించగా మహారాజు "సువర్ణం'' అనే అయిదో స్థానాన్ని కూడా అనుగ్రహించాడు. అందువల్ల అసత్యం, గర్వం, కామం, హింస, వైరం అనే ఇంకా ఐదు స్థానాలు కూడా కలి నివసించే ప్రదేశాలు ఐనాయి. ఈస్థానాలలో తప్ప ఇతర స్థలాలను స్పృశించవద్దని కలిని కట్టడి చేశాడు పరీక్షిత్తు. ఈ ప్రకారం ఆ మహారాజు కలిపురుషుణ్ణి నిగ్రహించి పోగొట్టుకొన్న తపస్సు, శౌచం, దయ అనే మూడు పాదాలూ వృషభమూర్తి అయిన ధర్మదేవతకు అర్పించి భూదేవికి అపారమైన ఆనందాన్ని కలిగించాడు.

**క. గజనామధేయపురమున, గజరిపుపీఠమున ఘనుఁడు గలిదమనుం డ**
**గ్గజవైరిపరాక్రముఁ డై, గజిబిజి లేకుండఁ దాల్చెఁ గౌరవలక్ష్మిన్.** **437**

* అనంతరం సింహపరాక్రముడైన ఆ రాజసింహుడు హస్తినాపురంలో సింహాసనాసీనుడై కౌరవ సామ్రాజ్యలక్ష్మిని గౌరవ పూర్వకంగా ప్రశాంతంగా పరిపాలించాడు.

వ. ఇట్లు కృష్ణుని యనుగ్రహంబున నశ్వత్థామబాణపావకంబు వలన బ్రదికి, వృషభమూర్తి యయిన ధర్మదేవతకు నభయం బిచ్చిన పరీక్షిన్న రేంద్రుండు బ్రాహ్మణ శాపప్రాప్తతక్ష కాహిభయంబు వలనఁ బ్రాణంబులు వోవు నని యెఱింగి సర్వసంగంబులు వర్జించి, శుకునకు శిష్యుండై విజ్ఞానంబు గలిగి, గంగాతరంగిణీ తీరంబునం గళేబరంబు విడిచె, వినుఁడు. 438

* ఈ విధంగా వాసుదేవుని అనుగ్రహం వల్ల అశ్వత్థామ అస్త్రానల జ్వాలల్లో నుంచి బ్రతికి బయటపడి వృషభరూపంలోని ధర్మ దేవతకు అభయమిచ్చిన పరీక్షిత్తు మునిశాపగ్రస్తుడై, తక్షకుని విషానలజ్వాలల వల్ల మరణం ప్రాప్తిస్తుందన్న సంగతి తెలుసుకొని సర్వసంగ పరిత్యాగియై శుకయోగిని ఆశ్రయించి, పరమార్థాన్ని గ్రహించి, గంగానదీ తీరంలో శరీరాన్ని పరిత్యజించాడు అని చెప్పి సూతుడు శౌనకునితో ఇంకా ఇలా అన్నాడు.

క. హరివార్త లెఱుఁగు వారికి, హరిపదములు దలఁచువారి కనవరతంబున్
హరికథలు వినెడివారికి, మరణాగత మోహసంభ్రమము లేదనఘా! 439

* పవిత్ర చరిత్రా! హరిలీలలు అర్థం చేసుకొనేవారూ, హరి చరిత్రలు ఆలకించేవారూ, హరి చరణాల స్మరణం చేసుకోనేవారూ మరణ సమయంలో కూడా ఎటువంటి వేదనా, ఆవేదనా, తొందరపాటూ తొట్రుపాటూ పొందరయ్యా!

క. శుభచరితుఁడు హరి యరిగినఁ, బ్రభవించి ధరిత్రి నెల్లఁ బ్రబ్బియుఁ గలి దా
నభిమన్యుసుతుని వేళను, బ్రభవింపక యడఁగి యుండె భార్గవముఖ్యా! 440

* పుణ్యచరిత్రుడైన పురుషోత్తముడూ అవతారం చాలించిన అనంతరం విజృంభించిన లోకమంతా వ్యాపించిన కలి అభిమన్యునందనుడైన పరీక్షిత్తు కాలంలో తలవంచి అణగిమణగి ఉన్నాడు.

వ. ఇవ్విధంబునఁ జతుస్సముద్ర ముద్రితాఖిల మహీమండల ప్రాజ్యసామ్రాజ్యంబు పూజ్యంబుగాఁ జేయుచు నా యభిమన్యు సంభవుండు. 441

* ఈ ప్రకారంగా నాలుగు సముద్రాల నడుమ ఉన్న భూమండలాన్ని ఏకచ్ఛత్రంగా పరిపాలించాడు పరీక్షిన్నరేంద్రుడు.

ఉ. చేసినఁ గాని పాపములు సెందవు; చేయఁ దలంచి నంతటం
జేసెద నన్న మాత్రమునఁ జెందుఁ గదా కలివేళఁ బుణ్యముల్;
మోసము లే దటంచు నృపముఖ్యుఁడు గాచెఁ గలిన్ మరంద ము
ల్లాసముతోడఁ గ్రోలి విరులం దెగఁజూడని తేఁటి కై వడిన్. 442

* అయితే ఈ కలియుగంలో ఒక విశేషముంది, చేస్తేనే గాని పాపాలు తమ ఫలితాన్ని ఇవ్వవు. ఇక పుణ్యాలందామా చేస్తాను అని అనుకొంటే చాలు ఫలాన్ని ఇస్తాయి. అందుకనే అభిమన్యు కుమారుడు కలి విజృంభణాన్ని మాత్రం అరికట్టి ప్రాణాలతో విడిచి పెట్టాడు. తుమ్మెద, లోపల ఉన్న మకరందాన్ని మాత్రం ఆనందంతో త్రాగి పూలను వదులుతుంది కదా!

వ. మఱియుం బ్రమత్తులై యధీరులగు నరులయందు వృకంబు చందంబున నొదిగి కాచుకొని యుండి చేష్టించుంగాని ధీరులైన వారికిం గలివలని భయంబు లేదని కలినంతంబు నొందింపఁడయ్యె ననిన విని ఋషులు సూతున కిట్లనిరి. 443

* అదీగాక పొంచి పైకి దూకే తోడేలులాగా ప్రమత్తులై చంచల చిత్తులైన వారిని మాత్రమే కలి బాధిస్తుంది కాని ధీరులైన వారికి కలి వల్ల ఎట్టి భయమూ కలగదని భావించినవాడై ఆ మహారాజు కలిని సర్వనాశనం చెయ్యలేదు అని చెప్పగానే విని శౌనకాది మహర్షులు సూతుని అభినందిస్తూ ఇలా అన్నారు.

సీ. పౌరాణికోత్తమ! బ్రదుకుము పెక్కేండ్లు తామరసాక్షుని ధవళయశము
మరణశీలురమైన మా కెఱింగించితి కల్పితంబగు క్రతుకర్మమందుఁ
బొగలచేఁ బొగిలి యబుద్ధచిత్తులమైన మము హరి పదపద్మ మధుర రసము
ద్రావించితివి నీవు, ధన్యుల మైతిమి స్వర్గ మేనియు నపవర్గమేని

తే. భాగవత సంగ లవ భాగ్యఫలము కీడె?, ప్రకృతిగుణహీనుఁడగు చక్రి భద్రగుణము
లీశ కమలాసనాదులు నెఱుఁగ లేరు, వినికి వినఁజాల మనియెడి వెఱ్ఱి గలఁడె? 444

* పౌరాణిక శిరోమణీ! నీవు చిరకాలం వర్ధిల్లు. మరణశీలురమైన మాకు అమృతమయమైన హరి లీలావిశేషాలు వినిపించావు. బరువైన ఈ యజ్ఞకార్యం ఆరంభించి హోమధూమాలతో పొగచూరి పోయిన మా హృదయాలకు గోవించ చరణారవింద మధురమకరందాన్ని తనివితీరా త్రాగించావు. ధన్యులమైనాము. స్వర్గమే కాదు. అపవర్గం కూడా భగవద్భక్తుల సాంగత్య ఫలంలో శతాంశానికి కూడా సాటి రాదు కదా! ప్రాకృత గుణాతీతుడైన వాసుదేవుని కల్యాణ గుణవిశేషాలు తెలుసుకోవటం భవునకూ పద్మభవునకూ కూడా సాధ్యం కాదు. అటువంటి భగవంతుని పవిత్రగాథలు వీనులవిందుగా వింటానికి ఇష్టపడని వెర్రివాళ్లు ఎక్కడైనా ఉంటారా?

క. శ్రీపంబులు ఖండిత సం, తాపంబులు గల్మషాంధతమస మహోద్య
ద్దీపంబులు పాషండ దు, రాపంబులు విష్ణువందనాలాపంబుల్. 445

* ఆ నందనందమని వందనాలాపాలు శ్రీలను చేపట్టేవి; పాపాలనూ, సంతాపాలనూ పూడ్చి పెట్టేవీ, కాంతులీనే దివ్వెలై కలుషాలనే కటిక చీకట్లను పోగొట్టేవీ, పాషండుల భావాలకు సమాధి కట్టేవీ-

క. పావనములు దురితలతా, లావనములు నిత్యమంగళ ప్రాభవ సం
జీవనములు లక్ష్మీసం, భావనములు వాసుదేవు పదసేవనముల్. 446

* ఆ గోపాలదేవుని శ్రీపాదసేవలు పావనత్వాన్ని ప్రసాదించేవీ, దురిత లతలను ఛేదించేవీ, జగతికి నిత్యకల్యాణాన్ని సంపాదించేవీ, శ్రీదేవి సేవను ఆమోదించేవి-

ఆ. పరమభాగవతుఁడు పాండవపౌత్త్రుండు, శుకుని భాషణముల శుద్ధబుద్ధి
యై విరాజమానుఁడై ముక్తి యగు విష్ణు, పాదమూల మెట్లు వడసె ననఘ! 447

* పరమ భాగవతాగ్రేసరుడూ, పాండవ పౌత్రుడూ, సద్గుణ సాంద్రుడూ అయిన పరీక్షిన్నరేంద్రుడు శుకమహర్షి సూక్తులు ఆలకించి పరిశుద్ధమైన పరమార్థబుద్ధితో తేజరిల్లుతూ ముక్తికి ఆలవాలమైన వాసుదేవుని పాదమూలాన్ని ఎలా పొందాడు?

వ. మహాత్మా! విచిత్రయోగనిష్ఠా కలితంబును, విష్ణుచరిత లలితంబును, బరమ పుణ్యంబును, సకలకల్యాణ గుణగణ్యంబును, భాగవత జనాపేక్షితంబును నైన పారీక్షిత భాగవతాఖ్యానంబు వినిపింపు మనిన సూతుం డిట్లనియె. 448

* మహానుభావా! యోగవిద్యాసముపేతమూ, భగవత్కథాపరిపూతమూ, పరమపుణ్యమూ, సమస్త కల్యాణ సాద్గుణ్యమూ, భక్త జనులకు అపేక్షితమూ అయిన పరీక్షిత్తు శ్రవణం చేసిన భాగవతగాథను మాకు వినిపించు- అని అడుగుతున్న మహర్షులతో సూతుడిలా చెప్పసాగాడు-

క. మిముబోఁటి పెద్దవారలు, కమలాక్షుని చరిత మడుగఁగాఁ జెప్పెడి భా
గ్యము గలిగె నేఁడు నా జ, న్మము సఫలం బయ్యె వృద్ధమాన్యుఁడ నగుటన్. 449

* అయ్యా! పెద్దలైన మీ వంటి వారు కావాలని కోరగానే కమలాక్షుని గాథలు వినిపించే మహాభాగ్యం నాకు ప్రాప్తించింది. నా జన్మం ధన్యమైంది. నా జీవితం సజ్జన సమ్మాన్య మయింది.

క. కులహీనుఁడు నారాయణ!, విలసత్కథనములు గడఁక వినిపించినఁ ద
త్కులహీనతఁ బాసి మహో, జ్జ్వల కులజత్వమును బొందు సన్మునులారా! 450

* నికృష్టకులంలో జన్మించినవాడు కూడా ప్రకృష్టమైన భగవంతుని గాథలు పరులకు వినిపించగలిగితే అత్యుత్తమ కులగౌరవాన్ని అందుకొంటాడు.

సీ. ఎవ్వని గుణజాల మెన్న జిహ్వలు లేక నలినగర్భాదు లనంతుఁ డండ్రు
కోరెడు విబుధేంద్రకోటి నొల్లక లక్ష్మి ప్రార్థించె నెవ్వని పాద రజము
బ్రహ్మ యెవ్వని పాదపద్మంబు గడిగిన జలము ధన్యత నిచ్చె జనుల కెల్ల
భగవంతుఁ డనియెడి భద్రశబ్దమునకు నెవ్వఁడర్థాకృతి నేపు మిగులు

ఆ. నే మహాత్ము నాశ్రయించి శరీరాది, సంగకోటినెల్ల సంహరించి
ప్రాభవమున మునులు పారమ హంస్యంబు, నొంది తిరిగి రాక యుందు రెలమి. 451

* ఏ దేవుని గుణగణాలను గణించటానికి నాలుకలు చాలక పద్మగర్భాది దేవతలు "అనంత గుణవంతు"డని అన్నారో, తనను వాంఛించే తక్కిన ముక్కోటి దేవతలనూ తిరిస్కరించి శ్రీదేవి ఎవని పాద పరాగాన్ని స్వీకరించిందో, బ్రహ్మదేవుడు ఏ పాదపద్మాలు కడిగి ఆ పవిత్రగంగను అఖిలజగతికి అనుగ్రహించాడో, 'భగవంతుడు' అనే పరమ పవిత్ర శబ్దానికి అర్థంగా ఏ దేవుని స్వరూపం విరాజిల్లుతున్నదో,

ఏ దేవుని ఆశ్రయించి మహామునులు నిస్సంగులై తిరిగిరాని పరమహంస పదాన్ని అందుకొన్నారో, ఆ వాసుదేవుని దివ్యగాథలు సమగ్రంగా గుర్తించి తెలుసుకోవటానికి ఎవరికి సాధ్యమౌతుంది?

చ. క్రమమున మింటికై యెగయుఁగాక విహంగము మింటిదైన పా
రముఁ గననేర్చునే? హరిపరాక్రమ మోపినయంతఁ గాక స
ర్వము వివరింప నెవ్వఁడు ప్రవర్తకుఁడౌ మునులార! నాదు చి
త్తమునకు నెంత గానఁబడెఁ దప్పక చెప్పెద మీకు నంతయున్. 452

* పక్షులు తమ శక్తి కొద్దీ రెక్కలాడిస్తూ ఎంత పైకి ఎగిరినా ఆకాశం అంతు కనుక్కోలేవు. అదేవిధంగా వాసుదేవుని మహావైభవాన్ని తనకు తెలిసినమాత్రం తప్ప సమగ్రంగా వివరించి చెప్పగల సమర్థు డెవడున్నాడు? నా మనస్సుకు అందినంతవరకూ మీకు వినిపిస్తాను. వినండి.

క. వేదండపురాధీశుఁడు, గోదండము సేతఁ బట్టికొని గహనములో
వేదండాదుల నొకనాఁ, డే దండలఁ బోవ నీక యెగచెన్ బలిమిన్. 453

* ఒకనాడు కరిపూరాధీశ్వరుడైన పరీక్షిత్తు ఎక్కు పెట్టిన విల్లు చేతబట్టి కాంతారభూముల్లో ఏనుగులు మొదలైన జంతువులను వెంటాడి వేటాడ సాగాడు.

క. ఒగ్గములు ద్రవ్వి పడు మని, యొగ్గెడు పెనుఁదెరల వలల నురలు మృగములన్
డగ్గఱి చంపెడు వేడుక, వెగ్గలమై చిత్తమందు వెంటాడింపన్. 454

* లోతైన కందకాలు త్రవ్వీ, పెద్ద పెద్ద వలలు పరచీ, ఉచ్చులు పన్నీ మృగాలనూ, పక్షులనూ పట్టుకొని బంధించే ఉత్సాహంతో అరణ్యమంతా విచ్చలవిడిగా తిరిగాడు.

క. కోలముల గవయ వృక శార్దూ, లములఁ దరక్షు ఖడ్గ రోహిత హరి శుం
డాలముల శరభ చమర, వ్యాలముల వధించె విభుఁడు వడి నోలములన్. 455

* వన వరాహాలనూ, అడవి ఎద్దులనూ, తోడేళ్ళనూ, పెద్ద పులులనూ, సివంగులనూ, ఖడ్గమృగాలనూ, అడవి గొర్రెలనూ, సింహాలనూ, ఏనుగులనూ, శరభాలనూ, జడల బర్రెలనూ, కొండచిలువలనూ ఆ మహారాజు నైపుణ్యంతో పడగొట్టాడు.

## -: పరీక్షితుఁడు వేఁటాడి శమీకునిపై మృతసర్పము నెత్తి వైచుట :-

క. మృగయులు మెచ్చ నరేంద్రుఁడు, మృగరాజు పరాక్రమమున మెఱసి హరించెన్
మృగధర మండలమునఁ గల, మృగ మొక్కటి దక్క సర్వమృగముల నెల్లన్. 456

* ఆ నరేంద్రుడు మృగేంద్ర విక్రమంతో వేటగాళ్లు మెచ్చేటట్లుగా చంద్రమండలంలోని మృగాన్ని తప్ప అరణ్యంలో ఉన్న మృగాలన్నింటినీ వేటాడాడు.

**వ. ఇట్లు వాటంబయిన వేఁటతమకంబున మృగంబుల వెంబడిం బడి యెగచుచుం జరించుటం జేసి బుభుక్షా పిపాసల వలన మిగులఁ బరిశ్రాంతుండయి ధరణీకాంతుండు చల్లని నీటి కొలంకుం గానక కలంగెడు చిత్తంబుతోఁ జని యొక్క తపోవనంబు గని యందు. 457**

* ఈ విధంగా మృగయాకౌతుకంతో మృగాల వెంటబడి తరుముతూ పరుగులెత్తటం మూలాన ఆకలి దప్పుల వల్ల అలసి పోయాడు మహారాజు. పరిశ్రాంతుడైన ఆ భూకాంతుడు చల్లని జలాశయం కోసం వెదకి వేసారి ఒక తపోవనాన్ని ప్రవేశించాడు.

**సీ. మెలఁగుట చాలించి మీలిత నేత్రుఁడై శాంతుఁడై కూర్చుండి జడత లేక**
**ప్రాణ మనోబుద్ధి పంచేంద్రియంబుల బహిరంగవీథులఁ బాఱనీక**
**జాగరణాదిక స్థానత్రయము దాఁటి పరమమై యుండెడి పదముఁ దెలిసి**
**బ్రహ్మభూతత్వ సంప్రాప్త్య విక్రియుఁ డయి యతిదీర్ఘజటలుఁ ద న్నావరింప**

**తే. నలఘు రురు చర్మధారియై యలరుచున్న, తపసిఁ బొడగని శోషితతాలుఁ డగుచు**
**నెండి తడిలేక కుత్తుక నెలుఁగు డింద, మందభాషల నిట్లను మనుజ విభుఁడు. 458**

* అక్కడ నిమీలితనేత్రాలతో కూర్చుని శాంతంగా తపస్సు చేస్తున్న శమీకమునిని చూచాడు. ఆ తపస్వి పొడుగుపాటి జడలతో, జింక చర్మం ధరించి పంచేంద్రియాలను నిరోధించి ప్రాణాన్నీ, మనస్సునూ, బుద్ధినీ లోగొని జాగ్రత్, స్వప్నం, సుషుప్తి అనే మూడు అవస్థలనూ అతిక్రమంచి నాలుగవదైన సమాధి అవస్థలో ఏకాగ్రచిత్తుడై, బ్రహ్మానుసంధానం చేసి ఉన్నాడు. పరీక్షిత్తు ఆ సంయమీంద్రుని సమీపించి దవడలు ఎండి, నాలుక తడి ఆరి, డగ్గుత్తికతో మెల్ల మెల్లగా

**క. తోయములు దెమ్ము మా కీ, తోయము వేఁటాడ వెరవు దొరకదు ఘన చే**
**తోయుత డప్పి జనించెను, తోయము వారలును లేరు దుస్సహ మనఘా! 459**

* "నీళ్ళు నీళ్లు! ఈ సమయంలో వేటాడలేక దుస్సహమైన దాహంతో వచ్చాను. నా వారంతా దూరంగా ఉన్నారు." అన్నాడు.

**వ. అని భూవరుండు శమీకమహాముని సమాధి నిష్ఠానిమీలిత నేత్రుండును విస్మృత బాహ్యాంతరింద్రియ కృత సంచారుండును హరిచింతా పరుండునునై యుండుటం దెలియలేక. 460**

* ఆ ముని మాట్లాడలేదు. ఆ మునీంద్రుడు నిమీలితనేత్రుడై, సమాధిస్థుడై బాహ్యేంద్రియజ్ఞానం లేక పరమేశ్వర చింతా పరతంత్రుడై ఉన్నాడని మహారాజు తెలుసుకోలేక ఆగ్రహోదగ్రుడైనాడు.

**ఉ. కన్నులు మూసి బ్రాహ్మణుఁడు గర్వముతోడుత నున్న వాఁడు, చే**
**సన్నల నైన రమ్మనఁడు, సారజలంబులు దెచ్చి పోయఁ డే**
**మన్ననలైనఁ జేయఁడు, సమగ్రఫలంబులు వెట్టఁడింత సం**
**పన్నత నొందెనే తన తపశ్చరణాప్రతిమ ప్రభావముల్. 461**

* "ఎంత గర్వం! ఈ బ్రాహ్మణుడు కళ్లు తెరవడు! బెల్లం గొట్టిన రాయిలాగా కదలడు. మెదలడు! పోనీ రమ్మని చేతితో సైగైనా చెయ్యడు! మంచినీళ్లు ఇయ్యడు! మహారాజునని మర్యాదగా పండో ఫలమో తెచ్చి పెట్టడు, మహర్షిననే అహంభావం తలకెక్కి ఇంతగా కన్నులు మూసుకు పోయాయి కాబోలు!

**ఆ. వారిఁ గోరుచున్న వారికి శీతల, వారి యిడుట యెట్టివారి కయిన**
**వారితంబుగాని వలసిన ధర్మంబు, వారి యిడఁడు దాహవారి గాఁడు. 462**

* దాహంతో నోరెండి గేహం ముందుకు వచ్చి అడిగిన అతిథికి చల్లని జలం తెచ్చి యివ్వటం ఎటువంటి వారికైనా అవశ్యకర్తవ్యం. ఈ జటి జలమిచ్చి నా దప్పిక నివారించడేమిటి?"

**చ. అని మనుజేశ్వరుండు మృగయాపరిఖేద నితాంత దాహ సం**
**జనిత దురంత రోషమున సంయమి దన్నుఁ దిరస్కరించి, పూ**
**జనములు సేయఁడంచు, మృతసర్పము నొక్కటి వింటికోపునం**
**బనివడి తెచ్చి వైచె, నటు బ్రహ్మమునీంద్రుని యంసవేదికన్. 463**

* అని లో లోపల ఉడికిపోయాడు పరీక్షిత్తు. అసలే వేటలో అలసి గొంతెండి దురంత రోషంతో కుమిలిపోతున్న రాజు కోపాన్ని ఆపుకోలేక, అవమానాన్ని భరించలేక, వింటి కొప్పుతో ఒక చచ్చిన పామును పనికట్టుకొని కొనితెచ్చి ఆ బ్రహ్మర్షి భుజాన పడవేశాడు.

**వ. ఇట్లతండు ప్రత్యాహృత బాహ్యాంతరింద్రియుం డగుట నిమీలితలోచనుండు గా నోపునో యట్లుగాక గతాగతులగు క్షత్త్రబంధులచే నేమియని మృషాసమాధి నిష్ఠుండు గానోపునో, యని వితర్కించుచు వృథారోష దర్పంబున ముని మూఁపున గతాసువయిన సర్పంబు నిడి నరేశ్వరుండు దనపురంబునకుం జనియె; నంత సమీపవర్తులైన మునికుమారు లంతయుం దెలియం జూచి శమీకనందనుండైన శృంగికడకుం జని. 464**

* "ఈ ముని ఏకాగ్రచిత్తంతో నిజంగానే నిష్ఠాగరిష్ఠుడై నిమీలిత నేత్రుడై కూర్చున్నాడా? లేక ఎప్పుడూ వస్తూ పోతూ ఉండే సామాన్యరాజులతో ఏమి పని అని దొంగజపం చేస్తున్నాడా?" అని మనస్సులో వితర్కించుకొంటూనే భూపాలుడు ఆపుకోలేని కోపాటోపంతో దాపున పడి ఉన్న మృతసర్పాన్ని ముని మూపున వేసి హస్తినాపురానికి వెళ్లిపోయాడు. అప్పుడు చుట్టుప్రక్కల తిరుగుతున్న మునికుమారులు ఇదంతా చూచి శమీకముని కుమారుడైన శృంగి సమీపానికి వెళ్లి-

## -: శమీకపుత్త్రుం డగు శృంగి పరీక్షితుని శపించుట :-

**క. నరగంధగజస్యందన, తురగంబుల నేలు రాజు తోయాతురుఁడై**
**పరఁగన్ నీ జనకుని మెడ, నురగముఁ దగిలించి పోయె నోడక తండ్రీ! 465**

* "భటులు, ఏనుగులు రథాలు, గుర్రాలు అనే చతురంగ సైన్యానికి అధిపతి అయిన ఎవడో ఒకరాజు జలం కోసం వచ్చి వెనుక ముందు ఆలోచించకుండా నీ జనకుని కంఠంలో సర్పాన్ని తగిలించి పోయాడయ్యా! " అని చెప్పారు.

వ. అని పలికిన సమాన వయో రూప మునికుమార లీలాసంగి యయిన శృంగి శృంగంబులతోడి మూర్తి ధరించినట్లు విజృంభించి రోషసంరంభంబున నదరిపడి బల్యన్నంబుల భుజించి పుష్టంబు లగు నరిష్టంబులుం బోలె బలిసియు ద్వారంబుల గాచికొని యుండు సారమేయంబుల పగిది దాసభూతులగు క్షత్త్రియాభాసు లెట్టు బ్రాహ్మణోత్తములచే స్వరక్షకులుగ నిరూపితు లయిరి? అట్టివార లెట్లు తద్గృహంబుల భాండసంగతంబగు నన్నంబు భుజింప నర్హు లగుదురు? తత్కృతంబు లయిన ద్రోహంబు లెట్లు నిజ స్వామిం జెందు నని మఱియు నిట్లనియె. 466

* ఆ మాటలు విని తోడి మునికుమారులతో ఆటలాడుతున్న శృంగి కొమ్ములు తిరిగిన క్రోధరసంలాగా హుంకరించి , రోషావేశంతో  అదరిపడుతూ ఇలా అన్నాడు- "ఈ రాజులు బలిముద్దలు తిని బలిసిన కాకుల వంటివారు. ద్వారాలవద్ద కాచుకొని ఉండే సారమేయాల వంటివారు. గృహదాసులైన ఈ ఆభాస క్షత్రియులను భూసురోత్తములు తమ గృహరక్షకులుగా ఎలా నియమించారు? ద్వారపాలకులుగా ఉండదగినవారు వంటింటిలో ప్రవేశించి వండిన అన్నాన్ని భుజించటానికి ఎలా అర్హులౌతారు? వారు చేసే ద్రోహాలకు గృహస్వామి ఎందుకు బాధ్యు డవుతాడు?

ఉ. ఆడఁడు తన్ను దూషణము, లాశ్రమవాసులఁ గాని వైరులం
గూడఁడు, కందమూలములు గూడుగఁ దించు సమాధినిష్ఠుఁడై
వీడఁడు లోని చూడ్కులను, విష్ణునిఁ దక్కఁ బరప్రపంచముం
జూడఁడు మద్గురుండు; ఫణిఁ జుట్టఁగ నేటికి రాచవానికిన్? 467

* మా తండ్రి తనను తూలనాడలేదే! ఆశ్రమవాసులతోనే గాని తమ శత్రు రాజులతో కూడలేదే! అడవిలో కందమూలాలు భుజిస్తూ అచంచల మనస్కుడై అంతర్దృష్టిని వీడకుండా, ఇష్టదైవాన్ని తప్ప ఇతర ప్రపంచాన్ని చూడకుండా, తపోనిష్ఠలో ఉన్న ఆయన మీద ఆ రాచవాడు త్రాచుపామును విసిరిపోతాడా?

ఉ. పోము హిరణ్య దానములఁ బుచ్చుకొనంగ, ధనంబు లేమియుం
దేము, సవంచనంబులుగ దీవన లిచ్చుచు వేసరింపఁగా
రాము, వనంబులన్ గృహవిరాములమై నివసింపఁ జెల్లరే
పామును వైవఁగాఁ దగునె బ్రహ్మమునీంద్రుభుజార్గళంబునన్? 468

* మేము హిరణ్యదానాలు పుచ్చుకోవటానికి పోమే! ఆశీర్వాదాలని మోసం చేసి ధనం గుంజుకోమే! పరులను వేధించేవాళ్లం కామే! ఇళ్లూ వాకిళ్లూ విడిచిపెట్టి అడవుల్లో పడి ఉన్నామే, అటువంటప్పుడు బ్రహ్మర్షి అయిన మా తండ్రిగారి మెడలో  పామును పడవేయటానికి ఆ రాజుకు ఏం పోయే కాలం వచ్చిందో!

క. పుడమిఁగల జనులు వొగడఁగఁ, గుడుతురు గట్టుదురుగాక కువలయ పతులై
యడవుల నిడుమలఁ బడియెడి, బడుగుల మెడ నిడఁగఁ దగునె పన్నగ శవమున్? 469

* ప్రపంచాన్ని పాలించే ప్రభువు లయితే పంచభక్ష్యపరమాన్నాలు కడుపునిండా కుడవమనండి. విలువగల వలువలు ముడవమనండి. అంతేకాని అడవులలో ఇడుములు పడే బడుగు తాపసుల మెడలో పామును చుడతారా?

క. భగవంతుఁడు గోవిందుఁడు, జగతిం బెడఁబాసి చనిన శాసింపంగాఁ
దగువారు లేమి దుర్జను, లెగసి మహాసాధుజనుల నేఁచెద రకటా! 470

* భగవంతుడైన శ్రీకృష్ణుడు లోకాన్ని విడిచి వెళ్లిన తర్వాత సమర్థుడైన శాసకుడు ఎవరూ లేకపోవటంతో దుర్మార్గులు విజృంభించి నిరపరాధులైన సాధువులను బాధింప సాగారు.

క. బాలకులార! ధరిత్రీ, పాలకు శపియింతు ననుచు బలువడిని విలో
లాలకుఁడగు మునికుంజర, బాలకుఁ డరిగెం ద్రిలోకపాలకు లదరన్. 471

* "బాలకులారా! వినండి. ఇప్పుడే ఆ భూపాలకునికి శాపం'' పెడతాను అని మునిబాలకుడైన శృంగి దేవతలు దద్దరిల్లేటట్లు పెద్ద పెద్ద కేకలు వేస్తూ-

వ. ఇట్లు రోషించి కౌశికీనదికిం జని జలోపస్పర్శంబు సేసి. 472

* కౌశికీనదికి వెళ్లాడు. నీళ్ళు చేతిలోకి తీసుకొన్నాడు.

ఉ. ఓడక వింటికోపున మృతోరగముంగొని వచ్చి మాఱు మా
టాడక యున్న మజ్జనకు నంస తలంబునఁ బెట్టి దుర్మద
క్రీడఁ జరించు రాజు హర కేశవు లడ్డినఁ నైనఁ జచ్చుఁ బో
యేడవనాఁడు తక్షక ఫణీంద్ర విషానల హేతి సంహతిన్. 473

* "సంకోచం లేకుండా చచ్చిన సర్పాన్ని కొనివచ్చి మౌనముద్రలో ఉన్న మా తండ్రిగారి భుజంపైన పడవేసి దురహంకారంతో కన్నూ మిన్నూ కానని ఆ రాజు, హరిహరులు అడ్డుపడినా నేటికి ఏడవనాడు తక్షకుని విషాగ్ని జ్వాలలకు దగ్ధమైపోతాడు.''

వ. అని శమీకమహామునికుమారుం డయిన శృంగి పరీక్షిన్నరేంద్రుని శపియించి, నిజాశ్రమంబునకుం జనుదెంచి, కంఠలగ్న కాకోదర కళేబరుండైన తండ్రిం జూచి. 474

* అని పరీక్షిన్నరేంద్రుణ్ణి భయంకరంగా శపించి శమీక మహాముని కుమారుడైన శృంగి ఆశ్రమానికి అరుదెంచి ధ్యానముద్రలో ఉన్న తండ్రిని దర్శించాడు. ఆయన మెడలో ఇంకా ఆ మృతసర్పం అలా వ్రేలాడుతూనే ఉంది.

క. ఇయ్యెడ నీ కంఠమునను, నియ్యురగ కళేబరంబు నిటు వైచిన యా
యయ్య నిఁక నేమి సేయుదు, నెయ్యంబులు లేవు సుమ్ము నృపులకుఁ దండ్రీ! 475

* "అయ్యో! తండ్రీ! ఈ రాజులకు పరువు మర్యాదలు తెలియవు. ఇతడెవడో మృతసర్పాన్ని తెచ్చి నీ కంఠంలో వేశాడు. మరి ఈ దొరగారికి ఎలా బుద్ధి చెప్పాలో ఏమో!

శా. ప్రారంభంబున వేఁట వచ్చి ధరణీపాలుండు, మా తండ్రిపై
నేరం బేమియు లేక సర్పశవమున్ నేఁ డుగ్రుఁ డై వైచి నాఁ
డీరీతిన్ ఫణి గ్రమ్మఱన్ బ్రదుకునో, హింసించునో కోఱలన్,
రారే తాపసులార! దీనిఁ దివరే, రక్షింపరే, మ్రొక్కెదన్. 476

* ఓ తాపసులారా! ఎవరో రాజుగారు వేటకోసం అడవికి వచ్చి నిరపరాధి అయిన మా తండ్రి మీద నిర్దాక్షిణ్యంగా ఈ చచ్చిన పామును పడవేసి వెళ్లాడు. ఈ భయంకర సర్పం మళ్లీ బ్రతుకుతుందో ఏమో! క్రూరమైన కోరలతో కాటు వేస్తుందేమో! మీకు చేతులెత్తి నమస్కరిస్తాను. వేగిరం రండి. ఈ పామును తోసేయండి. మా తండ్రిని రక్షించండి.''

వ. అని వెఱపున సర్పంబుఁ దిగుచు నేర్పు లేక యెలుంగెత్తి యేడ్చుచున్న కుమారకు రోదనధ్వని విని యాంగిరసుండయిన శమీకుండు సమాధి సాలించి మెల్లన కన్నులు దెఱచి మూఁపున వ్రేలుచున్న మృతోరగంబు నీక్షించి, తీసి పాఱవైచి, కుమారకుం జూచి. 477

* అంటూ భయంతో ఆ సర్పాన్ని తొలగించే నేర్పులేక పెద్దగా ఏడవసాగాడు. అనుగు నందనుని ఆక్రందనం ఆకర్ణించి శమీక మహాముని సమాధి చాలించి మెల్లగా కళ్ళు తెరిచాడు. భుజాన వ్రేలాడుతున్న భుజంగాన్ని తీసి దూరంగా పారవేసి కుమారుణ్ణి చూచి-

క. ఏ కీడు నాచరింపము, లోకులకున్ మనము సర్వలోక సములమున్
శోకింప నేల పుత్రక!, కాకోదర మేల వచ్చెఁ గంఠంబునకున్? 478

* "నాయనా! మనం ఎవరకీ ఏ కీడూ చేసేవాళ్ళం కామే! సకల లోకులనూ సమానంగా ఆదరిస్తామే! నీవు ఎందుకు ఆక్రందిస్తున్నావు? అసలు ఈ కాల సర్పాన్ని నా కంఠానికి ఎవరు చుట్టారు?''

వ. అని యడిగినఁ దండ్రికిఁ గొడుకు, రాజు సర్పంబు వైచుటయుం దాను శపించుటయును వినిపించిన, నమ్ముని తన దివ్య జ్ఞానంబున నమ్మానవేంద్రుండు పరీక్షిన్నరేంద్రుండని యెఱింగి కొడుకువలన సంతసింపక యిట్లనియె. 479

* అని ప్రశ్నించాడు. అప్పుడు శృంగి రాజు వచ్చి పామును వేయటం, ఆ రాజును తాను శపించటం తన తండ్రికి విన్నవించాడు. వెంటనే శమీకమహర్షి తన దివ్యదృష్టితో ఆ రాజు పరీక్షిన్నరేంద్రుడని తెలుసుకొని కొడుకు చేసిన పనికి విచారిస్తూ ఇలా అన్నాడు-

క. బెట్టిద మగు శాపమునకు, దట్టపు ద్రోహంబు గాదు, ధరణీకాంతుం
గట్టా యేల శపించితి, పట్టీ! తక్షక విషాగ్నిపాలగు మనుచున్? 480

* నాయనా! ఇంతటి కఠోరమైన శాపం పెట్టటానికి అంతటి మహాపరాధం ఆ మహారాజు ఏంచేసాడు? తక్షకవిషాగ్ని జ్వాలల పాలు కమ్మని ఆ ధరణీపాలుణ్ణి, అయ్యయ్యో! ఎందుకు శపించావు?

ఆ. తల్లి కడుపులోన దగ్ధుఁడై క్రమ్మఱఁ, గమలనాభు కరుణఁ గలిగినాఁడు;
బలిమి గలిగి ప్రజలఁ బాలించుచున్నాఁడు, దిట్టవడుగ! రాజుఁ దిట్టఁ దగునె? 481

* పాపం పరీక్షిత్తు తల్లి గర్భంలోనే దగ్ధుడైనాడు. మళ్ళీ శ్రీకృష్ణుని కటాక్షం వల్ల బ్రతికి బయటపడ్డాడు. ఇప్పుడు పెరిగి పెద్దవాడై పరాక్రమవంతుడై ప్రజలను పరిపాలిస్తున్నాడు. ఓరి పిచ్చి తండ్రీ! అటువంటి మంచిరాజును శపించవచ్చా?

ఉ. కాపరి లేని గొఱ్ఱియల కైవడిఁ గంటక చోర కోటిచే
నేపఱి యున్న దీభువన మీశుఁడు గృష్ణుఁడు లేమి, నిట్టిచో
భూ పరిపాలనంబు సమబుద్ధి నితం డొనరింపఁ జెల్లరే
యీ పరిపాటి ద్రోహమున కిట్లు శపింపఁగ నేల బాలకా? 482

* వాసుదేవుడు లేకపోవటం మూలాన లోకమంతా చీకాకు పాలైంది. ప్రజలు కాపరిలేని గొర్రెల్లాగా ఆపద పాలయ్యారు. దొంగలూ దుండగులూ పెచ్చరిల్లారు. ఇటువంటి క్లిష్టసమయంలో మన మహారాజు సమదృష్టితో సమర్థంగా ప్రజలను పాలిస్తున్నాడు. అయ్యో! ఈ రవ్వంత అపరాధానికి రాజును శపించా వెందుకు నాయనా?

సీ. పాపంబు నీచేతఁ బ్రాపించె మన; కింక రాజు నశించిన రాజ్యమందు
బలవంతుఁ డగువాఁడు బలహీను పశు దార హయ సువర్ణాదుల నపహరించు
జార చోరాదులు సంచరింతురు ప్రజ కన్యోన్య కలహంబు లతిశయిల్లు
వైదికంబై యున్న వర్ణాశ్రమాచార ధర్మమించుక లేక తప్పిపోవు

ఆ. నంతమీద లోకు లర్థకామంబులఁ, దగిలి సంచరింప ధరణి నెల్ల
వర్ణసంకరములు వచ్చును మర్కట, సారమేయ కులము మేరఁ బుత్ర! 483

* నీ మూలంగా మనకు పాపం ప్రాప్తించింది. రాజు మరణిస్తే రాజ్యంలో అరాచకం ప్రబలుతుంది. బలం కలవాడు బలం లేనివాడి మీద పడి వాడి సర్వస్వం దోచుకుంటాడు. జార చోరులు నిరాఘాటంగా విహరిస్తారు. ప్రజలలో పరస్పర కలహాలు పెరిగి పోతాయి. వైదిక ధర్మాలూ, వర్ణాశ్రమాచారాలూ సమూలంగా నశిస్తాయి, ధర్మం నశించిపోగా లోకులు అర్థకామాల వెంటబడతారు. రాజ్యమంతటా వానర సారమేయాల్లో లాగా వర్ణసంకరం వ్యాపిస్తుంది.

ఉ. భారతవంశజుం బరమభాగవతున్ హయమేధయాజి నా
చారుపరున్ మహానయవిశారదు రాజ కులైక భూషణున్
నీరము గోరి నేఁడు మన నేలకు వచ్చిన యర్థి భక్తి స
త్కారము సేసి పంపఁ జనుఁగాక, శపింపఁగ నీకు ధర్మమే! 484

* పవిత్రమైన భారతదేశంలో జన్మించాడు. పరమ భాగవతుడని పేరుగాంచాడు. అశ్వమేధం ఆచరించాడు. సదాచారసంపన్నుడూ, రాజనీతిజ్ఞుడూ, రాజకులాలంకారుడూ అయిన అంతటి మహారాజు దాహమై మన తపోవనానికి వస్తే ఆదరంతో అతిథిసత్కారాలు ఆచరించకుండా పంపితే పంపవచ్చుగాని ఇలా శపించటం ఏమి ధర్మమయ్యా!

**క. భూపతికి నిరపరాధము, శాపము దా నిచ్చె బుద్ధి చాపలమున మా**
**పాపఁడు, వీఁడొనరించిన పాపము దొలఁగింపు కృష్ణ! పరమేశ! హరీ! 485**

* ఓ పరమేశ్వరా! శ్రీకృష్ణా! వాసుదేవా! నా పిల్లవాడు బుద్ధి చాపల్యంవల్ల భూపాలుడైన పరీక్షిత్తుకు శాపం పెట్టి పాపం కట్టుకొన్నాడు. ఈ దోషాన్ని తొలగించు తండ్రీ!

**క. పొడిచినఁ దిట్టినఁ గొట్టినఁ, బడుచుందురు గాని పరమభాగవతులు దా**
**రొడఁబడరు మాఱు సేయఁగఁ, గొడుకా! విభుఁ డెగ్గుసేయఁ గోరఁడు నీకున్. 486**

* కుమారా1 కొట్టినా తిట్టినా పరమభక్తులైన వారు శాంతంతో భరిస్తారే కాని ప్రతీకారం చెయ్యటానికి అంగీకరించరు. నీ శాపానికి మన మహారాజు ప్రతిశాపం ఇవ్వడు.

**క. చెలఁగరు కలఁగరు సాధులు, మిళితములయి పరులవలన మేలుం గీడున్**
**నెలకొనిన నైన నాత్మకు, నొలయవు సుఖదుఃఖచయము లుగ్రము లగుచున్. 487**

* సజ్జనులు ఇతరులు చేసిన ఉపకారానికి పొంగిపోరు. అపకారానికి క్రుంగిపోరు. మహాత్ముల ఆత్మలను సుఖదుఃఖాలు ఆవహించవు."

**వ. అని యిట్లు శమీక మహామునీంద్రుండు గ్రమ్మఱింప శక్తి లేని కొడుకు సేసిన పాపంబునకు సంతాపంబు నొంది, తన శిష్యునొక మునికుమారునిం బిలిచి, యేతద్వృత్తాంతం బంతయు రాజున కెఱింగించి రమ్మని పంచె; నంత నా యభిమన్యుపుత్త్రుండు శమీకముని శిష్యునివలన శాపవృత్తాంతంబు విని, కామక్రోధాది విషయాసక్తుండగు తనకుం దక్షకవిషాగ్ని విరక్తి బీజం బగు ననుచుఁ గరినగరంబునకుం జని యేకాంతంబున. 488**

* అని ఈ విధంగా శమీకమహాముని కుమారుడు చేసిన తిరుగులేని శాపరూపమైన పాపానికి సంతాపం చెందాడు. వెంటనే తన శిష్యుడైన ఒక ముని పుత్రుణ్ణి పిలిచి ఈ వృత్తాంత మంతా మహారాజుకు చెప్పిరమ్మని పంపించాడు.

అభిమన్యు పుత్రుడైన పరీక్షిత్తు మునిశిష్యునివల్ల శమీక కుమారుని శాపవృత్తాంతం విన్నాడు. కామక్రోధాది సంసార విషయాలలో మునిగి తేలుతున్న తనకు తక్షకుని విషాగ్ని కీలాజాలం వైరాగ్యానికి మూల మౌతుందని విచారిస్తూ హస్తినాపురికి చేరి ఏకాంతంగా తనలో ఇలా అనుకొన్నాడు-

## -: పరీక్షితుఁడు విప్రశాపం బెఱింగి ప్రాయోపవిష్టుం డగుట :-

ఉ. ఏటికి వేఁట వోయితి? మునీంద్రుఁడు గాఢసమాధి నుండఁగా
నేటికిఁ దద్భుజాగ్రమున నేసితి సర్పశవంబుఁ దెచ్చి? నేఁ
డేటికిఁ బాపసాహసము లీక్రియఁ జేసితి? దైవ యోగమున్
దాఁటఁగ రాదు వేగిరమ తథ్యము గీడు జనించు ఘోరమై. 489

* "నేను వేటకోసమని అరణ్యానికి ఎందుకు వెళ్లాను? ఆ మహాముని నిశ్చలధ్యాన సమాధిలో ఉన్నప్పుడు మృతసర్పాన్ని కొనివచ్చి ఆయన మెడలో ఎందుకు వేశాను? ఈ విధమైన పాపకార్యాలు ఎందుకు చేశాను? ఇదంతా కలిప్రభావం. దైవ సంకల్పాన్ని ఎవ్వరూ అతిక్రమించలేరు. తప్పదు. చేసిన పాపానికి శిక్ష అనుభవించక తప్పదు.

ఉ. పామువిషాగ్ని కీలలను బ్రాణము లేఁగిన నేఁగుఁగాక , యీ
భూమియు రాజ్యభోగములుఁ బోయిన నిప్పుడ పోవుఁ గాక, సౌ
దామనిఁ బోలు జీవనముఁ దథ్యముగాఁ దలపోసి యింక నే
నేమని మాఱు దిట్టుదు మునీంద్రకుమారకు దుర్నివారకున్. 490

* భీకరమైన తక్షకుని విషాగ్ని జ్వాలలకు ప్రాణాలు పోతేపోనీ! ఈ సామ్రాజ్యమూ, భోగభాగ్యాలూ లేకపోతే లేకపోనీ! విద్యుల్లత వంటి బ్రతుకు శాశ్వతమని భావించి దుర్నివారుడైన ఆ మునికుమారుణ్ణి నేను తిరిగి ఏమని శపించేది?

ఆ. రాజ ననచుఁ బోయి రాజ్యగర్వంబున, వనము కొఱకు వారివనము సొచ్చి
దందశూకశవముఁ దండ్రిపై వైచినఁ, బొలియఁ దిట్ట కేల పోవు సుతుఁడు? 491

* నిజానికి ఆ బాలుని తప్పేముంది? మహారాజును గదా అని అహంకారంతో దాహంకోసం వారి తపోవనంలోకి ప్రవేశించి తండ్రిపై చచ్చినపామును పడవేస్తే కొడుకు చచ్చేటట్లు శపించకుండా నోరు మూసుకు కూర్చుంటాడా?

క. గోవులకును బ్రాహ్మణులకు, దేవతలకు, నెల్లప్రొద్దుఁ దెంపునఁ గీడుం
గావించు పాపమానస, మే విధమునఁ బుట్టకుండ, నే వారింతున్. 492

* గోవులనూ, దేవతలనూ, బ్రాహ్మణులనూ, నిష్కారణంగా వధించి బాధించాలనే దుర్బుద్ధి ఎల్లప్పుడూ నాలో పుట్టకుండా నివారించే ఉపాయ మేమిటి?"

వ. అని వితర్కించె. 493

* అని తనలో తర్కించుకొన్నాడు.

క. దామోదర పదభక్తిం, గామాదుల గెల్చినాఁడు గావునఁ గరుణన్
భూమీశుఁ డలుగఁ డయ్యెను, సామర్థ్యము గలిగి దోషసంగిన్ శృంగిన్. 494

* దేవదేవుడైన వాసుదేవుని దివ్యచరణాల మీది భక్తి ప్రపత్తుల వల్ల కామక్రోధాది అరిషడ్వర్గాన్ని జయించి కరుణార్ద్ర హృదయుడైన పరీక్షిత్తు తనను శపించిన శృంగి మీద ఏ మాత్రం ఆగ్రహించలేదు. సామర్థ్యం ఉండి కూడా శపించలేదు.

వ. అంత మునికుమారుడు శపించిన వృత్తాంతంబుఁ దక్షకుండు విని యెదురు వేచియుండె; నిటఁ దక్షకవ్యాళ విషానల జ్వాలాజాలంబునం దనకు సప్తమ దినంబున మరణంబని యెఱింగినవాఁడు గావున, భూపాలుండు భూలోక స్వర్గలోక భోగంబులు హేయంబులని తలంచి, రాజ్యంబు విసర్జించి, నిరశన దీక్షాకరణంబు సంకల్పించుకొని. 495

* మునికుమారుడు రాజును శపించిన వృత్తాంతం విన్న తక్షకుడు సమయం కోసం ఎదురుచూస్తున్నాడు. పరీక్షిన్నరేంద్రుడు తక్షకుని దారుణ విషాగ్ని జ్వాలల మూలాన తనకు ఏడవనాడు మరణం తప్పదని నిర్ణయించుకొన్నాడు. భూలోక భోగాలూ, స్వర్గలోక సుఖాలూ పనికిమాలినవని భావించాడు. రాజ్యాన్ని పరిత్యజించాడు. నిరాహార దీక్ష అవలంబించటానికి నిశ్చయించాడు.

మ. తులసీసంయుతదైత్యజిత్పదరజస్స్తోమంబుకంటెన్ మహో
జ్జ్వలమై దిక్పతిసంఘసంయుతజగత్సౌభాగ్యసంధాయియై
కలిదోషావలి నెల్లఁ బాపు దివిషద్గంగా ప్రవాహంబు లో
పలికిం బోయి మరిష్యమాణుఁ డగుచుం బ్రాయోపవేశంబునన్. 496

* తులసీదళాలతో విలసిల్లే శ్రీమన్నారాయణ చరణకమల పరాగాలతో కలిసి మహోజ్జ్వలంగా ప్రవహిస్తూ లోకపాలురతో పాటు సకల లోకాల వారికీ సౌభాగ్యసంపదలు ప్రసాదిస్తూ కలి కలుషాల నన్నింటినీ కడిగివేసే దివ్యమైన గంగానదీతీరంలో ప్రాయోపవేశం చేసి ప్రాణాలు విడవటానికి సంకల్పించుకొన్నాడు.

క. చిత్తము గోవిందపదా, యత్తముఁ గావించి మౌనియై తనలో నే
తత్తఱము లేక భూవర, సత్తముఁడు వసించె ముక్త సంగత్వమునన్ 497

* ఆ రాజసత్తముడు తన చిత్తాన్ని గోవింద పదాయత్తం చేసి సర్వసంగ పరిత్యాగియై ఎటువంటి మనోవైకల్యం లేకుండా మౌనంగా కూర్చున్నాడు.

వ. ఇట్లు పాండవపౌత్రుండు ముకుంద చరణారవింద వందనానంద కందాయమాన మానసుండై విష్ణుపదీతీరంబునం బ్రాయోపవేశంబున నుండుట విని సకలలోక పావనమూర్తులు మహానుభావులు నగుచుఁ దీర్థంబులకుం దీర్థత్వంబు లొసంగ సమర్థులైన యత్రి విశ్వామిత్ర మైత్రేయ భృగు వసిష్ఠ పరాశర చ్యవన భరద్వాజ పరశురామ దేవల గౌతమ కశ్యప కణ్వ కలశసంభవ వ్యాస పర్వత

**నారదప్రముఖులైన బ్రహ్మర్షి దేవర్షి రాజర్షి పుంగవులును కాండర్షులయిన యరుణాదులును, మఱియు నానాగోత్ర సంజాతులైన మునులును శిష్య ప్రశిష్యసమేతులై చనుదెంచిన వారలకుఁ బ్రత్యుత్థానంబు సేసి పూజించి దండప్రణామంబు లాచరించి, కూర్చుండ నియోగించి. 498**

* ఈ విధంగా పాండవపౌత్రుడైన పరీక్షిత్తు హరిచరణ సంస్మరణానంద కందళిత హృదయారవిందుడై విష్ణు పాదోద్భవ యైన గంగానది ఒడ్డున ప్రాయోపవిష్టుడై ఉన్నాడన్న సంగతి విన్నవారై అఖిలభువన పవిత్రులై, మహోదారచరిత్రులై, తీర్థయాత్రా వ్యాజంతో తీర్థాల తీర్థత్వాన్ని సార్థకం చేసే, సర్వ సమర్థులైనవారు అత్రి, విశ్వామిత్రుడు, మైత్రేయుడు, భృగువు, వసిష్ఠుడు, పరాశరుడు, చ్యవనుడు, భరద్వాజుడు, పరశురాముడు, దేవలుడు, పర్వతుడు, నారదుడు మొదలైన బ్రహ్మర్షులూ దేవర్షులూ రాజర్షులూ; అరుణుడు మొదలైన కాండర్షులూ, ఇంకా వివిధ గోత్రసంభవులైన మహర్షులు శిష్యులతోనూ ప్రశిష్యులతోనూ కలిసి అచ్చటికి విచ్చేశారు. పరీక్షిన్నరేంద్రుడు ఆ విధంగా వచ్చిన మునీంద్రులకు ఎదురువచ్చి, ఆర్ఘ్యపాద్యాలిచ్చి అర్చించి సాష్టాంగ నమస్కారాలు చేసి సుఖాసీనులను కావించాడు.

**క. క్రమ్మఱ నమ్ముని విభులకు, నమ్మనుజేంద్రుండు మ్రొక్కి హర్షాశ్రుతతుల్**
**గ్రమ్మఁగ ముకుళితకరుఁడై, సమ్మతముగఁ జెప్పె నాత్మ సంచారంబున్. 499**

* ఆ మహారాజు ఆనందబాష్పాలు పొంగి పొరలుగా ఆ మునిరాజుల ముందు ముకుళిత కరకమలుడై ఇలా విన్నవించుకొన్నాడు.

**ఉ. ఓపిక లేక, చచ్చిన మహోరగముం గొని వచ్చి, కోపినై**
**తాపసు మూఁపుపై నిడిన దారుణ చిత్తుఁడ; మత్తుఁడన్ మహా**
**పాపుఁడ మీరు పాపతృణపావకు లుత్తము లయ్యలార, నా**
**పాపము వాయు మార్గము గృపాపరులార! విధించి చెప్పరే. 500**

* "దయానిధులైన తపోధనులారా! నేను సహనం కోల్పోయి కోపాన్ని ఆపుకోలేక చచ్చిన సర్పాన్ని తెచ్చి మునీంద్రుని మూపుపై వేసిన పాపాత్ముణ్ణి, ప్రమత్తుణ్ణి, క్రూరచిత్తుణ్ణి. మీరో పాపారణ్య పావకులు ఉత్తములు. సంయమిసత్తములు. అయ్యలారా! నా పాపం పరిహార మయ్యే మార్గం సెలవీయండి.

**ఉ. భూసురపాద రేణువులు పుణ్యులఁ జేయు నరేంద్రులన్ ; ధరి**
**త్రీసురులార! మీ చరణ రేణు కణంబులు మేను సోఁక నా**
**చేసిన పాప మంతయు నశించెఁ; గృతార్థుఁడ నైతి; నెద్ది యేఁ**
**జేసిన ముక్తి పద్ధతికిఁ జెచ్చెరఁ బోవఁగఁ వచ్చుఁ జెప్పరే. 501**

* మహీసురుల చరణరేణువులు మహీపతుల పాపాలను పారదోలి పవిత్రులను చేస్తాయి. బ్రహ్మజ్ఞులారా! మీ పాదపరాగాలు నాపై ప్రసరించగానే నా పాపం పటాపంచలయింది. నేను కృతార్థుణ్ణి అయ్యాను. ఇప్పుడు నేను ఏమి చేస్తే నాకు వేగంగా ముక్తి ప్రాప్తిస్తుందో దయచేసి చెప్పండి.

క. భీకరతరసంసార, వ్యాకులతన్ విసిగి దేహవర్జనగతి నా
లోకించు నాకుఁ దక్షక, కాకోదరవిషము ముక్తి కారణమయ్యెన్. 502

* మిక్కిలి భయంకరమైన సంసార పంకంలో చిక్కుకొని విసిగి వేసారి దేహం విడిచి పెడదామని ఆలోచిస్తున్న నాకు తక్షకుని మహావిషం మోక్షహేతువైంది.

క. ఏపారు నహంకార, వ్యాపారములందు మునిఁగి వర్తింపంగా
నా పాలిటి హరి భూసుర, శాపవ్యాజమున ముక్త సంగుం జేసెన్. 503

* అతిశయించిన అహంకారంతో కూడిన సంసార సాగరంలో మునిగి తేలుతున్న నాకు నా పాలిటి భగవంతుడు "బ్రాహ్మణశాప"మనే మిషతో విముక్తి ప్రసాదించాడు.

మ. ఉరగాధీశు విషానలంబునకు మే నొప్పింతు; శంకింప నీ
శ్వరసంకల్పము నేఁడు మానదు; భవిష్యజ్జన్మ జన్మంబులన్
హరిచింతారతియున్ హరిప్రణుతి భాషాకర్ణ నాసక్తియున్
హరిపాదాంబుజ సేవయుం గలుగ మీ రర్థిం బ్రసాదింపరే! 504

* తక్షకుని భయంకర విషాగ్ని జ్వాలలకు సంకోచం లేకుండా నా శరీరం సమర్పిస్తాను. సందేహం లేదు. ఈశ్వరసంకల్పం అనివార్యం. అయితే రాబోయే ప్రతిజన్మలో కూడా శ్రీకృష్ణ చింతయందు అనురక్తి, శ్రీకృష్ణకథాశ్రవణమందు ఆసక్తి, శ్రీకృష్ణ చరణకమలాల యందు భక్తి, కలిగి ఉండేటట్లుగా మీరు అనుగ్రహించాలి.

క. చూడుఁడు నా కల్యాణము, పాడుఁడు గోవిందు మీఁది పాటలు దయతో
నాడుఁడు హరిభక్తుల కథ, లే డహములలోన ముక్తి కేఁగఁగ నిచటన్. 505

* నా శ్రేయస్సును కాంక్షించండి. కమలాక్షుని లీలలు గానం చేయండి, హరిభక్తుల చరిత్రలు వినిపించండి. ఏడు దినాల్లో నాకు కైవల్యం ప్రసాదించండి.

క. అమ్మా! నినుఁ జూచిన నరుఁ, బొమ్మాయని ముక్తి కడకుఁ బుత్తు వఁట కృపన్
లెమ్మా నీ రూపముతో, రమ్మా నా కెదుర గంగ! రమ్యతరంగా! 506

* అమ్మా! గంగమ్మా! నీ తరంగాలు ఎంత రమణీయంగా ఉన్నాయమ్మా! నిన్ను దర్శించిన వారిని మోక్షానికి పంపిస్తావని విన్నాను. కదలి లేచి రావమ్మా! కనికరించి దర్శన మీయవమ్మా!"

వ. అని తనకు మీఁద నయ్యెడి జన్మాంతరంబులందును హరిపాదభక్తి సౌజన్యంబులు సంధిల్లంగాత మని గంగాతరంగిణీ దక్షిణకూలంబునం బూర్వాగ్ర దర్భాసనంబున నుత్తరాభిముఖుండై యుపవేశించి, జనమేజయు రప్పించి, రాజ్యభారంబు సమర్పించి, యత్నంబు సంసారబంధంబునకుం దప్పించి చిత్తంబు హరికి నొప్పించి పరమ భాగవతుండైన పాండవ పౌత్రుండు ప్రాయోప విష్టుండై యున్న సమయంబున. 507

* అని రాబోయే జన్మ జన్మాలకూ భగవత్ భక్తి సౌభాగ్యం తనకు ప్రాప్తించాలని ప్రార్థించాడు. తనయుడైన జనమేజయుణ్ణి రప్పించి రాజ్యభారం అప్పగించాడు. గంగాతరంగిణి దక్షిణతీరంలో తూర్పుకొనలు ఉండేటట్లుగా పరచిన దర్భాసనం మీద ఉత్తరాభిముఖుడై కూర్చున్నాడు. తన చిత్తాన్ని సంసారబంధాలనుంచి నివృత్తం చేసి పరమేశ్వరాయత్తం కావించాడు, ఈ విధంగా భాగవతోత్తముడైన పాండవ పౌత్రుడు ప్రాయోపవిష్టుడై ఉన్న శుభ సమయంలో

**క. ఒత్తిలి పొగడుచు సురలు వి, యత్తలమున నుండి మెచ్చి యలరుల వానల్**
**మొత్తములై కురిసిరి నృప, సత్తముపై భూరి భేరి శబ్దంబులతోన్.** 508

* సురలు ఆకాశం నుంచి విరులవానలు కురిపించారు. పరీక్షిత్తు గుణగణాలు గానం చేస్తూ నగారాలు మ్రోగించారు.

**వ. ఆ సమయంబున సభాసీను లయిన ఋషు లిట్లనిరి.** 509

* ఆ సమయంలో సుఖాసీనులై ఉన్న మహర్షులు ఆ రాజర్షితో ఇలా అన్నారు-

**మ. క్షితినాథోత్తమ! నీ చరిత్రము మహాచిత్రంబు మీ తాత లు**
**గ్ర తపోధన్యులు విష్ణుపార్శ్వపదవిం గామించి రాజన్య శో**
**భితకోటీరమణి ప్రభాన్వితమహాపీఠంబు వర్జించి రు**
**న్నతులై; నీవు మహోన్నతుండవు గదా నారాయణధ్యాయివై.** 510

* "రాజేంద్రా! నీ చరిత్రం చాలా చిత్రం! స్తుతిపాత్రం! మీ పితామహులు మహాతపస్సంపన్నులు, వారు వాసుదేవుని సన్నిధిని వాంఛించి నానారాజ కిరీట చిరత్న రత్న ప్రభారాజితో విరాజిల్లే రాజపీఠాన్ని విసర్జించారు. వారే ఉన్నతు లనుకొంటే నారాయణ నామ పారాయణుడవైన నీవు వారి కంటె మహోన్నతుడవు.

**మ. వసుధాధీశ్వర! నీవు మర్త్యతనువున్ వర్జించి నిశ్శోకమై**
**వ్యసనచ్ఛేదకమై రజోరహితమై వర్తించు లోకంబు స**
**ర్వసమత్వంబునఁ జేరునంతకు భవద్వాక్యంబులన్ వించు నే**
**దెసకుం బోవక చూచుచుండెదము నీ దివ్యప్రభావంబులన్.** 511

* వసుమతీవల్లభా! నీవు ఈ మనుష్యదేహాన్ని వదలి శోక రహితమై, వ్యసనరహితమై, రజోరహితమై వర్తించే పుణ్యలోకాన్ని చేరేటంతవరకూ మేమిక్కడే ఉంటాము. ఎక్కడకీ పోకుండా నీ మాటలు వింటూ నీ దివ్యప్రభావం తిలకిస్తూ ఇక్కడే కూర్చుంటాము"

**వ. అని యిట్లు పక్షపాతశూన్యంబులును మహనీయ మాధుర్య గాంభీర్య సౌజన్య ధుర్యంబులును నైన భాషణంబు లాడుచు మూఁడు లోకంబులకు నవ్వలిదైన సత్యలోకంబునందు మూర్తి మంతంబులై నెగడుచున్న నిగమంబుల చందంబునం దేజరిల్లుచున్న ఋషులం జూచి భూవరుండు నారాయణ కథాశ్రవణ కుతూహలుండయి నమస్కరించి యిట్లనియె.** 512

* అని ఇలా నిరాక్షేపంగా నిష్పక్షపాతంగా మహర్షులు పలికిన మధుర గంభీర భాషణాలు విని, ముల్లోకాలకూ అవతల ఉన్న సత్యలోకంలో మూర్తిమంతాలై వెలిగే వేదాల్లాగా విరాజిల్లే మహర్షులను మహారాజు నమస్కరించాడు. విష్ణులీలలు వినాలనే కుతూహలంతో ఇలా అన్నాడు-

క. ఏడు దినంబుల ముక్తిం, గూడఁగ నే రీతి వచ్చు గురు సంసార
క్రీడన మే క్రియ నెడతెగుఁ, జూడుఁడు మా తండ్రులార! శ్రుతివచనములన్. 513

* " తండ్రులారా! వేదవాక్యాలు బాగా పరిశీలించి సెలవీయండి. సప్తదినాలలో సంసారబంధాలు త్రెంచుకొని అపవర్గాన్ని అందుకొనే మార్గం కృపతో ఉపదేశించండి.

శా. ప్రాప్తానందులు బ్రహ్మబోధన కళాపారీణు లాత్మప్రభా
లుప్తాజ్ఞానులు మీర లార్యులు దయాళుత్వాభిరాముల్ మనో
గుప్తంబుల్ సకలార్థజాలములు మీకుం గానవచ్చుం గదా!
సప్తాహంబుల ముక్తి కేఁగెడు గతిం జర్చించి భాషింపరే! 514

* మీరు ఆనంద స్వరూపులు, బ్రహ్మజ్ఞాన పారీణులు, విజ్ఞులు, ఆత్మ తత్త్వజ్ఞులు. దయార్ద్రహృదయులు. సకలమూ తెలిసినవారు. జగత్తులోని సమస్త విషయాలూ మీరు మీ మనోనేత్రంతో సుస్పష్టంగా చూడగలుగుతారు. ఏడునాళ్లలో మోక్షం ప్రాప్తించే విధానం విచారించండి."

వ. అని యుత్తరానందనుం డాడిన వచనంబులకు ముని లందఱుఁ బ్రత్యుత్తరంబు విమర్శించు నెడ దైవయోగంబున. 515

* అని పలుకుతున్న ఉత్తరానందనుని ప్రశ్నలకు సరియైన ప్రత్యుత్తరం కోసం సంయమీంద్రు లందరూ సమాలోచనలు జరుపుతున్నారు.

## -: శుకమహర్షి పరీక్షిన్మహారాజు నొద్ద కేతెంచుట :-

సీ. ప్రతినిమేషము పరబ్రహ్మంబు నీక్షించి మదిఁ జొక్కి వెలువల మఱచువాఁడు
కమలంబుమీఁది భృంగముల కైవడి మోముపై నెఱపిన కేశపటలివాఁడు
గిఱి వ్రాసి మాయ నంగీకరించని భంగి వసనంబుఁ గట్టక వచ్చువాఁడు
సంగిగాఁడని వెంటఁ జాటుభూతములు నా బాలుర హాసశబ్దముల వాఁడు

తే. మహిత పద జాను జంఘోరు మధ్య హస్త, బాహు వక్షో గళానన ఫాల కర్ణ
నాసికా గండ మస్తక నయన యుగళుఁ, డైన యవధూతమూర్తి వాఁ డరుగుదెంచె. 516

* ఆ సమయంలో దైవయోగంవల్ల, ప్రతిక్షణమూ పరబ్రహ్మ స్వరూపాన్ని సందర్శిస్తూ పరవశించిన హృదయంతో బయటి ప్రపంచాన్ని మరచినవాడూ, కమలం మీద గండుతుమ్మెదల్లాగా ముద్దులు మూటగట్టే ముఖంపైన ముంగురులు ముసురుతున్న వాడూ, గీత గీసి మాయను తిరస్కరించినట్లు వస్త్రాన్ని

విసర్జించినవాడూ; సర్వసంగ పరిత్యాగియైన మహాయోగి ఇతడని చాటుతున్నట్లు పరిహాసవచన పరిచాలకులైన బాలకులు వెంటనంటి వస్తున్నవాడూ, సహజ సుందరాలైన చరణాలూ, జంఘలూ, ఊరువులూ, నడుమూ, చేతులూ, భుజాలూ, వక్షస్థలమూ, కంఠమూ, ముఖమూ, లలాటమూ, వీనులూ, కన్నులూ, నాసికా, చెక్కిళ్లూ, శిరస్సూ కలిగిన ఒక అవధూతమూర్తి అనుకోకుండా అచ్చటికి విచ్చేశాడు.

**ఉ. ఈరని లోకులం గనిసి, యెగ్గులు వల్కనివాఁడు గోరికల్**
**గోరనివాఁడు గూటువలఁ గూడని వాఁడు వృథా ప్రపంచముం**
**జేరనివాఁడు దైవగతిఁ జేరిన లాభముఁ జూచి తుష్టుఁడై**
**నేరని వానిచందమున నేర్పులు సూపెడు వాఁడు వెండియున్. 517**

* ఈయలేదని ఎవరినీ కోపంతో ఎగ్గులు పలకడు. కావాలని ఏకోరికలూ కోరడు. ఎవరితోనూ సంబంధాలు పెట్టుకోడు. వ్యర్థమైన ప్రపంచ విషయాల మీదికి మనస్సు పోనీయడు. దైవవశం వల్ల తనకు ప్రాప్తించిన దానితో సంతృప్తి చెంది ఏమీ ఎరుగని అమాయకునిలా కనబడుతాడు.

**ఆ. అమ్మహాత్ము షోడశాబ్ద వయోరూప, గమన గుణ విలాస కౌశలములు**
**ముక్తికాంత సూచి మోహిత యగు నన, నితరకాంత లెల్ల నేమి సెప్ప! 518**

* ఆ మహాత్ముని పదహారేళ్ల నవయౌవనం చూస్తే ఆ సుందర గమనం గమనిస్తే, ఆ గుణవిశేషాలు ఆలోకిస్తే, ముక్తికాంత సైతం ముచ్చటపడి మోహిస్తుందంటే ఇక ఇతరకాంతల విషయం వేరే చెప్పే దేముంది?

**ఆ. వెఱ్ఱితనము మాని విజ్ఞానమూర్తియై, బ్రహ్మభావముునను బర్యటింప**
**వెఱ్ఱి యంచు శుకుని వెంట నేతెంతురు, వెలఁదు లర్భకులును వెఱ్ఱు లగుచు. 519**

* వెర్రిలోకాన్ని విసర్జించి విజ్ఞానమూర్తితో, బ్రహ్మజ్ఞాన పరిస్ఫూర్తితో పర్యటిస్తున్న మహానుభావుడైన శ్రీశుకుణ్ణి వెర్రివాడని భావించి ఏదో వెర్రెత్తినట్లు స్త్రీలూ, బాలకులూ ఆయన వెంటబడి పరుగెత్తుకొంటూ వస్తుంటారు.

**వ. ఇట్లు వ్యాసనందనుండైన శుకుం డరుగుదెంచిన నందలి మునీంద్రు లమ్మహానుభావుని ప్రభావంబు లెఱుంగుదురు గావున నిజాసనంబులు డిగ్గి ప్రత్యుత్థానంబు సేసిరి; పాండవ పౌత్రుండు నా యోగిజన శిఖామణికి నతిథి సత్కారంబులు గావించి దండప్రణామంబు సేసి పూజించె; మఱియు గ్రహ నక్షత్ర తారకామధ్యంబునం దేజరిల్లు రాకాసుధాకరుండునుంబోలె బ్రహ్మర్షి దేవర్షి రాజర్షి మధ్యంబునం గూర్చుండి విరాజమానుండైన శుకయోగీంద్రుం గనుంగొని. 520**

* ఈ విధంగా వేదవ్యాస నందనుడైన శుకయోగీంద్రుడు అక్కడకు రాగా ఆ మహానుభావుని మహత్త్వం తెలిసిన అక్కడి మునివర్యులంతా తమతమ ఆసనాల నుంచి లేచి ఎదురువచ్చి స్వాగత మిచ్చారు. పాండవ పౌత్రుడైన పరీక్షిత్తు ఆ మహాయోగికి అతిథి సత్కారాలు కావించాడు. సాష్టాంగ దండప్రణామం చేసి పూజించాడు. గ్రహ నక్షత్ర తారకా సమూహం నడుమ విరాజిల్లే సంపూర్ణ పూర్ణిమా చంద్రుడులాగా బ్రహ్మర్షి దేవర్షి రాజర్షి మధ్యంలో శుకయోగీంద్రుడు తేజరిల్లాడు.

ఉ. ఫాలము నేల మోపి, భయభక్తులతోడ నమస్కరించి, భూ
పాల కులోత్తముండు గరపద్మములన్ ముకుళించి, నేఁడు నా
పాలిటిభాగ్య మెట్టిదియొ, పావనమూర్తివి పుణ్యకీర్తి వీ
వేళకు నీవు వచ్చితి వివేకవిభూషణ! దివ్య భాషణా! 521

* కురుకులావతంసమైన పరీక్షిత్తు భయభక్తులతో మళ్లీ క్షోణితలాన నెన్నుదురు సోకేటట్లుగా ప్రణామంచేసి కరకమలాలు జోడించి ఇలా విన్నవించుకొన్నాడు- "మహానుభావా! శుకదేవా! నా అదృష్టమేమో గాని పావనమూర్తివీ, పుణ్యకీర్తివీ, విజ్ఞాన విభూషణుడవూ, దివ్యభాషణుడవూ అయిన నీవు సమయానికి విజయం చేశావు.

మ. అవధూతోత్తమ! మంటి, నేఁడు నిను డాయం గంటి, నీవంటి వి
ప్ర వరుం బేర్కొను నంతటన్ భసితమౌఁ బాపంబు నా బోఁటికిన్
భవదాలోకన భాషణార్చన పదప్రక్షాళన స్పర్శనా
ది విధానంబుల ముక్తి చేపడుట చింతింపంగ నాశ్చర్యమే? 522

* అవధూత శిరోమణీ! నీ ఆగమనం వల్ల నేను ధన్యుణ్ణయినాను. నీ సందర్శనం వల్ల నా జన్మ తరించింది. నీవంటి బ్రహ్మజ్ఞాని పవిత్ర నామం ఒక్కమాటు ఉచ్చరిస్తే పాపాలన్నీ భస్మీపటల మౌతాయి. ఇక నిన్ను దర్శించి, నీ మాటలు విని, నిన్ను అర్చించి, నీ కాళ్లు కడిగి నీళ్లు పైన చల్లుకొని, నిన్ను స్పృశించి నీ సేవ చేసుకొనే మహాభాగ్యం లభించిన నా వంటి వానికి మోక్షం ప్రాప్తిస్తుందంటే అందులో ఆశ్చర్య మేముంది?

క. హరిచేతను దనుజేంద్రులు, ధరఁ ద్రుంగెడు భంగి నీ పదస్పర్శముచే
గురుపాతక సంఘంబులు, పొరిమాలుఁ గదయ్య యోగిభూషణ! వింటే. 523

* భగవంతుడైన వాసుదేవుని వల్ల జగత్కంటకులైన నిశాచరులు నశించిపోయినట్లే పరమయోగివైన నీ పాదస్పర్శవల్ల పాపరాసులు భస్మమవుతాయి.

మ. ఎలమిన్ మేనమఱందియై సచివుఁడై యేమేటి మా తాతలన్
బలిమిం గాచి సముద్ర ముద్రిత ధరం బట్టంబుఁ గట్టించె, న
య్యలఘుం డీశుఁడు చక్రి రక్షకుఁడు గా కన్యుల్ విపద్రక్షకుల్
గలరే, వేఁడెద భక్తి నా గుణనిధిం గారుణ్య వారాన్నిధిన్. 524

* ఏ మహానుభావుడు ప్రియమైన మరదియై, మంత్రియై మా పితామహులైన పాండవుల చతుస్సముద్ర ముద్రితమైన ధరణీచక్రానికి చక్రవర్తులను చేశాడో ఆ మహాత్ముడు, ఆ లోకేశ్వరుడు, ఆ చక్రాయుధుడు అందరికీ రక్షకుడై ఉంటాడు. ఆపదలో ఉన్నవారిని ఆదరాభిమానాలతో ఆదుకొనే 'రక్షకులు ఆయన గాకపోతే లోకంలో మరెవరున్నారు? ఆ భక్తులపాలిటి పెన్నిధిని ఆ కారుణ్యవారాన్నిధిని భక్తితో వేడుకొంటాను.

సీ. అవ్యక్తమార్గుండ వైన నీ దర్శన మాఱడి పో నేర దభిమతార్థ
సిద్ధి గావించుట సిద్ధంబు నే డెల్లి దేహంబు వర్జించు దేహధారి
కేమి చింతించిన నేమి జపించిన, నేమి గావించిన, నేమి వినిన,
నేమి సేవించిన నెన్నఁడు సంసార పద్ధతిఁ బాసిన పదవి గలుగు

తే. నుండు మనరాదు గురుఁడవు యోగివిభుఁడ, వావుఁ బిదికిన తడవెంత యంత సేపు
గాని యొక దెస నుండవు కరుణతోడఁ, జెప్పవే తండ్రి ముక్తికిఁ జేరు తెరువు! 525

* అవధూతలతో అగ్రగణ్యుడవు. అవ్యక్తమైన గమనం కలవాడవు. నీ సందర్శనం వ్యర్థం కాదు. నా వాంఛితార్థం ముమ్మాటికి సిద్ధిస్తుంది. ఈనాడో రేపో దేహాన్నే త్యజించబోయే జీవికి సంసార బంధాలు సమసిపోయి మోక్షం ప్రాప్తించే నిమిత్తం చింతింపవలసిందీ, జపించవలసిందీ, చేయవలసిందీ, వినవలసిందీ, సేవలందించవలసిందీ ఏమిటో దయచేసి విశదీకరించమని వేడుకొంటున్నాను. నీవు జగద్గురుడవు. నీకు తెలియంది ఏమి లేదు. గోవును పాలు పిదికినంత సేపటి కంటే ఎక్కువ సేపు ఎక్కడా ఉండవు. ఓ దయగల తండ్రీ! మోక్ష మార్గాన్ని నాకు తెలియజెప్పు."

వ. అని పరీక్షిన్నరేంద్రుండు బాదరాయణి నడిగె నని చెప్పి. 526

* ఈ విధంగా పరీక్షిన్నరేంద్రుడు శుకయోగీంద్రుణ్ణి ప్రశ్నించాడు.

క. రాజీవపత్రలోచన! రాజేంద్ర కిరీట ఘటిత రత్న మరీచి
భ్రాజితపాదాంభోరుహ! భూజన మందార! నిత్యపుణ్యవిచారా! 527

* తామర రేకులవంటి కన్నులు కలవాడా! రాజాధిరాజుల కిరీటాలలో చెక్కిన రత్నకాంతులచే ప్రకాశించే పాదపద్మాలు కలవాడా! భక్తుల పాలిటి పారిజాతమైన వాడా! విశ్వకల్యాణ భావనలతో విరాజిల్లేవాడా!

మా. అనుపమగుణహారా! హన్యమానారివీరా!
జన వినుత విహారా! జానకీ చిత్తచోరా!
దనుజ ఘన సమీరా! దానవశ్రీ విదారా!
ఘన కలుష కఠోరా! కంధి గర్వాపహారా! 528

* అనుపమ కల్యాణ గుణహారుడవై, పరాజిత వైరి వీరుడవై, విశ్వవినుత విహారుడవై, జానకీచిత్త చోరుడవై, శత్రువులనే మేఘాలకు సమీరుడవై, దానవ విభవవిదారుడవై, కలుషాత్ములకు కఠోరుడవై, సాగర గర్వాపహారుడవైన వాడా!

గద్యము :- ఇది శ్రీ పరమేశ్వర కరుణాకలిత కవితా విచిత్ర కేసనమంత్రి పుత్ర సహజపాండిత్య పోతనామాత్యప్రణీతంబైన శ్రీమహాభాగవతంబను మహాపురాణంబునందు నైమిశారణ్య వర్ణనంబును శౌనకాదుల ప్రశ్నంబును సూతుండు నారాయణ కథాసూచనంబు సేయుటయు, వ్యాసచింతయు,

**నారదాగమనంబును, నారదుని పూర్వకల్ప వృత్తాంతంబును, బుత్రశోకాతురయైన ద్రుపదరాజ నందన కర్జునుం డశ్వత్థామం దెచ్చి యొప్పించి గర్వ పరిహారంబు సేయించి విడిపించుటయు, భీష్మ నిర్యాణంబును, ధర్మనందను రాజ్యాభిషేకంబును, గోవిందుని ద్వారకాగమనంబును, విరాట కన్యకా గర్భ విద్యమానుండైన యర్భకు నశ్వత్థామ బాణానలంబు వలనం బాపి విష్ణుండు రక్షించుటయుఁ , బరీక్షిజ్జన్మంబును గాంధారీ ధృతరాష్ట్ర విదురుల నిర్గమంబును, నారదుండు ధర్మరాజునకుఁ గాల సూచనంబు సేయుటయుఁ, గృష్ణనిర్యాణంబు విని, పాండవులు మహాపథంబునం జనుటయు నభిమన్యు పుత్త్రుండు దిగ్విజయంబు సేయుచు శూద్రరాజలక్షణ లక్షితుండగు కలిగర్వంబు సర్వంబు మాపి గోవృషాకారంబుల నున్న ధరణీ ధర్మదేవతల నుద్ధరించుటయు, శృంగి శాపభీతుండై యుత్తరా నందనుండు గంగాతీరంబునం బ్రాయోపవేశంబున నుండి శుక సందర్శనంబు సేసి, మోక్షోపాయం బడుగుటయు నను కథలు గల ప్రథమ స్కంధము. 529**

* భాగవతమనే మహాపురాణాన్ని పరమేశ్వర కరుణాకలిత కవితా విచిత్రుడూ, కేసనామాత్యుని పుత్రుడూ, సహజపాండిత్యుడూ ఐన పోతనామాత్యుడు రచించాడు. ఈ మహాగ్రంథంలో నైమిశారణ్యా వర్ణనమూ, శౌనకాది మహర్షుల సంప్రశ్నమూ, సూతులవారి నారాయణ కథా సూచనమూ, వ్యాసులవారి విచారమూ, నారదాగమనమూ, నారదులవారి పూర్వజన్మ వృత్తాంతమూ, ద్రౌపది పుత్రశోకంతో పరితపించటమూ, అర్జునుడు అశ్వత్థామను బంధించి తీసుకొనిరావటమూ అశ్వత్థామ గర్వ పరిహారమూ, భీష్మని నిర్యాణమూ, ధర్మరాజు పట్టాభిషేకమూ, శ్రీకృష్ణుని ద్వారకాగమనమూ, ఉత్తరా గర్భస్థుడైన అర్భకుణ్ణి అశ్వత్థామ అస్త్ర జ్వాలల నుంచి శ్రీకృష్ణుడు రక్షించటమూ, పరీక్షిత్తు జననమూ, గాంధారీ ధృతరాష్ట్ర విదురుల నిష్క్రమణమూ, నారదుడు ధర్మజునకు చేసిన కాలసూచనమూ, శ్రీకృష్ణ నిర్యాణమూ, పాండవుల మహాప్రస్థానమూ, పరీక్షిత్తు దిగ్విజయమూ, కలిగర్వ భంజనమూ, ధరణీ ధర్మదేవుల సముద్ధరణమూ, పరీక్షిత్తుకు శృంగి శాపమూ, గంగాతీరంలో ప్రాయోపవేశమూ, శ్రీ శుక సందర్శనమూ, మోక్షమార్గాభ్యర్థనమూ అనే కథలతో కూడిన ప్రథమస్కంధ మిది.

**శ్రీ కృష్ణార్పణమస్తు**

## ప్రవేశిక

**రాణ్మహేంద్ర కవీంద్రు రతనాల మేడలో, పసిడిగిన్నెల గుమ్మపాలు త్రావి**
**సోమయాజుల గృహారామసీమలలోన, అల్లారుముద్దుగా ఆటలాడి**
**శ్రీనాథుల సువర్ణ సీసమాలికలలో, హాయిగా తూగుటుయ్యాల లూగి**
**భాగవతులవారి లోగిళ్లలో మెత్త, మెత్తని శయ్యల నొత్తిగిల్లి**
**విజయ విద్యానగర రాజవీథులందు, దిగ్గజంబుల మీదనే తిరిగి తిరిగి**
**కంచు జయభేరి దెసల మ్రోగించుకొన్న ఆంధ్ర కవితా కుమారి ! జయోఽస్తు నీకు !**

ఈ పద్యంలో ఆంధ్రకవితా కుమారి బమ్మెర పోతన్నగారి భాగవతంలో మెత్తమెత్తని శయ్యలపై ఒత్తిడి తగిలిందన్న అంశం గమనార్హం. ఆ మహాకవి శయ్యా సౌభాగ్యం అంతటి సుతి మెత్తనిది. అందుకనే-

**అచ్చపు జుంటితేనియల, నైక్షవఖండ సుధారసాల, గో**
**ర్వెచ్చని పాలమీగడల, విచ్చెడి కన్నెగులాబి మొగ్గలన్**
**మచ్చరికించు ఈ మధుర మంజుల మోహనముగ్ధశైలి నీ**
**వెచ్చట నేర్చినావు? సుకవీ, సుకవిత్వ కళా కళానిధీ!**

అన్న మెచ్చుకోలు పోతన్నగారిని వలచివచ్చి వరించింది. పోతన్న గారు “కవిత్వ”మనే చిక్కని ఆవుపాలలో “భక్తి”అనే చక్కని పంచదార కలిపి మధురాతి మధురమైన పాకంచేసి మహాభాగవత రసాయనాన్ని మనందరికీ అందించారు. ముద్దులు మూటకట్టే ఆయన పద్యాలు క్రొంగ్రొత్త సుగంధాలు గుబాళిస్తూ మల్లెలూ, సన్నజాజులూ కలబోసి దండలు కట్టినట్లుంటాయి.

### కవితామాధుర్యం

“మధుమయ ఫణితీనాం మార్గదర్శీ మహర్షిః” అన్న సుకవిసూక్తి వాల్మీకి తరువాత పోతన్న గారి పట్లనే సార్థకత్వం సంపాదించుకుంటుంది. కవులు పోతన్నగారి కవితా మాధుర్యాన్ని ఇలా అభివర్ణించారు-

**ముద్దులు గార భాగవతమున్ రచియించుచు పంచదారలో**
**నద్దితివేమొ గంటము మహాకవిశేఖర! మధ్య మధ్య అ**
**ట్లద్దక వట్టి గంటమున నట్టిటు గీచిన తాటియాకులో**
**పద్దెములందు - ఈ మధురభావము లెచ్చటనుండి వచ్చురా?**

నిజానికి పోతన్నగారు తన గంటాన్ని పంచదారలో అద్దే వ్రాశారో, తియ్యతేనెలో ముంచే వ్రాశారో కానీ భాగవతం పద్యాలకున్న ప్రసాద మాధుర్య సౌకుమార్యాలు మరే కవుల పద్యాలకు ప్రాప్తించలేదంటే అందులో సందేహం అణుమాత్రమూ లేదు. అందుకు ఆ మహానుభావుని భక్తి పారవశ్యంతో కూడిన పదబంధ నిర్మాణనైపుణ్యమే ప్రధానకారణం కావచ్చు.

### పుణ్య విశేషం

నన్నయ్య తిక్కనాది మహాకవులు భారత రామాయణాలను మాత్రమే తెనిగించి భాగవతాన్ని తనకోసం అట్టిపెట్టటం తన పురాకృతపుణ్య విశేషంగా భావించి పొంగి పులకించిపోయినారు పోతన్నగారు.

**ఒనరన్ నన్నయ తిక్కనాది కవు లీ యుర్విం బురాణావళుల్**
**తెనుఁగుం జేయుచు మత్పురాకృత శుభాధిక్యంబు దానెట్టి దో**
**తెనుఁగుం జేయరు మున్ను భాగవతమున్; దీనిం దెనింగించి నా**
**జననంబున్ సఫలంబుఁ జేసెద పునర్జన్మంబు లేకుండఁగన్.**

వాస్తవానికి అది పోతన్నగారి పురాకృత సుకృత విశేషం మాత్రమే కాదు, ఆంధ్రులందరి అపూర్వ పూర్వపుణ్యవిశేషం. శ్రీమద్భాగవతాన్ని తెనిగించడంవల్ల ఆ మహాకవికి మాత్రమేకాదు, మహాభాగవతానికి కూడా పునర్జన్మ అనునది లేకుండా పోయింది.

### వినయ వినమ్రత

సహజ పాండిత్యుడైన పోతనామాత్యుడు తన సహజ వినమ్ర స్వభావాన్ని ఎంత చక్కగా వెల్లడిస్తున్నాడో చూడండి-

**భాగవతము తెలిసి పలుకుట చిత్రంబు, శూలికైన తమ్మిచూలికైన,**
**విబుధవరుల వలన విన్నంత కన్నంత, తెలియవచ్చినంత తేటపఱతు.**

### ఆత్మ విశ్వాసం.

నేను నిమిత్తమాత్రుణ్ణి...."అన్నిటికి ఆ రామభద్రుడే ఉన్నాడు"అన్నది ఆయన ఆత్మవిశ్వాసం. అదే ఆయన దృఢసంకల్పం.

**పలికెడిది భాగవతమఁట, పలికించు విభుండు రామభద్రుండఁట, నే**
**పలికిన భవహర మగునఁట, పలికెద వేఱొండుగాథ పలుకఁగ నేలా?**

అవును, ఆ మహాకవి పలుకు పలుకులో రామభద్రుడు పలుకుతూనే ఉన్నాడు.

### అద్వైతభావన

పోతన్నగారు శైవాచారసంపన్నమైన వంశంలో జన్మించారు. వారి తండ్రి కేసనమంత్రిగారు మహాశైవులు. తల్లి లక్కమాంబగారు సదాశివ పాదయుగార్చనా పరురాలు. అన్న తిప్పన్నగారు ఈశ్వరసేవాకాముడు. ఇక తానో "పరమేశ్వర కరుణా కలిత కవితా విచిత్రుణ్ణి"అని స్వయంగా పోతన్నగారే చెప్పుకొన్నారు. అటువంటి శైవ కుటుంబంలో జన్మించిన మహాకవి శ్రీరామభక్తుడై భాగవతం వ్రాయటం విచిత్రంగానే ఉంది.

చూడండి ఆయన "శ్రీమన్నారాయణ కథా ప్రపంచ విరచనా **"కుతూహలం"**తో, అభ్రంకష సముత్తుంగ తరంగ ఐన గౌతమిగంగలో స్నానంచేసి మహనీయ మంజుల పులినతల మధ్యంలో మహేశ్వర

ధ్యాన పరవశుడై కూర్చున్నాడు. సీతా సమేతుడైన శ్రీరామచంద్రుడు ఆయన కనులముందు సాక్షాత్కరించాడు. "మన్నామాంకితంబుగా భాగవతంబు తెనుఁగు సేయు"మని ఆజ్ఞాపించాడు. పోతనగారు భాగవతాన్ని వ్రాసి "హారికి నందగోకుల విహారికి గోపనితంబినీ మనోహారికి" శ్రీకృష్ణునికి అంకితం చేశాడు. ఎంత అత్యద్భుతంగా ఉందో చూడండి. శ్రీమన్నారాయణ కథలు వ్రాయాలనుకొన్న వాడు శివుణ్ణి ధ్యానిస్తూ కూర్చోవడమేమిటి? శివుణ్ణి ధ్యానిస్తున్న వానికి శ్రీరాముడు ప్రత్యక్షం కావడమేమిటి? శ్రీరాముడు తనకివ్వమన్న కృతిని శ్రీకృష్ణునికి అంకితం చేయడమేమిటి? ఈనాటకమంతా శ్రీమహావిష్ణువుకూ, శివునకూ, శ్రీరాముడికీ, శ్రీకృష్ణునికీ భేదం లేదని ధ్వనింపజేయటం కాకపోతే మరేమిటి? ఇదొక అత్యద్భుతమైన, అతివిచిత్రమైన, అత్యంత మనోహరమైన కావ్యధ్వని. అందుకే అవతారిక ప్రారంభంలోనే -

**"చేతులారంగ శివుని పూజింపఁడేని, నోరునొవ్వంగ హరికీర్తి నుడువఁడేని"**

అని చెప్పటంలోనే పోతన్నగారి అద్వైతదృష్టి స్పష్ట మవుతున్నది.

వ్రేపల్లెలో నందులవారి గుమ్మం ముందు దుమ్ములోపడి ఆడుకుంటున్న బాలకృష్ణుని అభివర్ణిస్తూ ఇలా వ్రాశారు.

**తనువున నంటిన ధరణీపరాగంబు, పూసిన నెఱిభూతి పూత గాఁగ**
**ముందర వెలుఁగొందు ముక్తాలలామంబు, తొగల సంగడికాని తునుక గాఁగ**
**ఫాలభాగంబుపై పరఁగు కావిరిబొట్టు, కాముని గెలిచిన కన్ను గాఁగ**
**కంఠమాలికలోని ఘననీలరత్నంబు, కమనీయమగు మెడకప్పు గాఁగ**
**హారవల్లు లురగహారవల్లులు గాఁగ, బాలలీల ప్రౌఢబాలకుండు**
**శివుని భంగినొప్పె శివునకు దనకును, వేఱు లేమి తెల్ప వెలయునట్లు.**

శివునికీ తనకూ అభేదం చెప్పాలనే భావం శ్రీకృష్ణునకు ఉన్నదో లేదో కానీ మన పోతన్న గారికి మాత్రం సంపూర్ణంగా ఉంది.

ఆనాటి సమాజంలో చెలరేగుతున్న శైవవైష్ణవ మతాల పరస్పర సంఘర్షణాన్ని శాంతింపజేసే సదుద్దేశంతో పోతన్నగారు తిక్కన్నగారి అడుగుజాడల్లో హరిహరాద్వైత భావనను ఇలా ఆవిష్కరించారు.

## క్రాంతదర్శనం

పోతన్నగారు చాలా ముందుచూపు కలవారు. ప్రారంభంలో కాళిదాసు మొదలైన సంస్కృత కవులందరికీ ప్రణామాలు చేశారు. నన్నయ్యగారికీ తిక్కన్నగారికీ ఎర్రన్నగారికీ నమస్కారాలు చేశారు. తక్కిన పూర్వకవు లందరినీ తగిన విధంగా సంభావించారు. అందరిలాగా కుకవినింద చేయకపోగా చివరకు వర్తమాన కవులకు ప్రియం పలికారు. అంతటితో ఊరకున్నారా? ఎప్పుడో ముందు రాబోయే భావికవులను కూడా భావించి బహూకరించి శుభం పలికారు. ఎంత చిత్తశుద్ధి, ఎంతదూరదృష్టి, ఎంత విశాల హృదయం, ఈ అయిదువందల

ఏండ్లలో జన్మించిన కవులంతా - ఈ భావికవులంతా పోతన్నగారి భావుకత్వానికి చేతులెత్తి శతసహస్ర ప్రణామాలు చేయక తప్పదు.

ఇంకా ఆయన క్రాంతదర్శనం ఎలాంటిదో చిత్తగించండి -

**"భీష్ముని పైకి కుప్పించి లంఘించు గో పాలకృష్ణుని కుండలాల కాంతి;**
**కరిరాజు మొరపెట్ట పరువెత్తు కరివేల్పు ముడివీడి మూపుపై బడిన జుట్టు;**
**సమరంబు గావించు సత్య కన్నుల నుండి వెడలు ప్రేమ క్రోధ వీక్షణములు;**
**కొసరి చల్దులు మెక్కు గొల్లపిల్లల వ్రేళ్ల సందు మాగాయ పచ్చడి పసందు"**

మహాకవి ప్రతిభాచక్షుస్సులతో వీక్షించాడు.

భక్తకవి పోతన్నగారి మాటల్లో భాగవతం ఒక కల్పతరువుగా రూపొందింది -

**లలితస్కంధము, కృష్ణమూలము, శుకాలాపాభిరామంబు, మం**
**జులతా శోభితమున్, సువర్ణ సుమనస్సుజ్ఞేయమున్, సుందరో**
**జ్జ్వల వృత్తంబు, మహాఫలంబు, విమలవ్యాసాలవాలంబునై**
**వెలయున్ భాగవతాఖ్య కల్పతరు వుర్విన్ సద్ద్విజ శ్రేయమై,**

పోతన్నగారి ఊహలు పూలవానలు, పోతన్న గారి భావాలు తేనెసోనలు

పోతన్నగారి పద్యాలు "మందార మకరంద మాధుర్యాల"ను చిందిస్తాయి.

పోతన్నగారి పద్యాలు నిర్మల మందాకినీ వీచికలలో పరితల హృదయాలను ఓలలాడిస్తాయి.

పోతన్నగారి పద్యాలు చెంగు చెంగున గంతులు వేసే బాలకురంగా ల్లాగా పరుగులు తీస్తాయి :

పోతన్నగారి పద్యాలు వెన్నెల్లో ఆడుకునే కన్నెపిల్లల్లాగా ఒయ్యారాలు ఒలకబోస్తాయి.

పోతన్నగారి పద్యాలు పసిపాపల బుగ్గల్లాగా మెత్తమెత్తగా హృదయానికి హత్తుకుంటాయి.

అటువంటి పోతనభాగవతం ప్రతిపద్యభావార్థసహితంగా ప్రకటితం కావటం ఆంధ్రులందరికీ ఆనందకరమైన విషయం.

సహజ సుందరమైన సహజపాండిత్యుడి భాగవతం అక్షరాస్యు లందరికీ అందుబాటులో ఉండే నిమిత్తం సరళ గద్యానువాద సహితంగా ప్రకటించాలనే సంకల్పం తిరుమల తిరుపతి దేవస్థానములవారికి కలగటం ప్రశంసనీయం. ఈ సదుద్దేశ్యంతోనే పోతన భాగవతం ప్రాజెక్టు ప్రారంభింపబడింది. ఈ మహాకావ్యంలో నాకున్నూ అవకాశం కల్పించిన కార్య నిర్వహణాధికారి శ్రీ. జి. కుమారస్వామిరెడ్డి గారికి నా కృతజ్ఞతాపూర్వక ధన్యవాదాలు.

ఈ సందర్భంలో నన్ను ఆహ్వానించి అనువాదభాగా లన్నింటినీ పరిశీలించి పరిష్కరించి ఏకసూత్రత కల్పించేకార్యం నా మీద ఉంచిన శ్రీరావుల సూర్యనారాయణమూర్తి - పి. ఆర్. ఓ. గారికి నా అభివందనాలు.

బాల్యంనుంచి బమ్మెరపోతన్నగారి భాగవతం అంటే నాకు పంచప్రాణాలు. ఇటువంటి పరమ పవిత్రగ్రంథాన్ని సానువాదంగా రూపొందించే అదృష్టం ప్రేమపెన్నిధి అయిన ఏడుకొండలస్వామి సన్నిధిలో నాకు లభించింది. నా విధిని నేను ఎంతో సంతోషంతో నిర్వహిస్తున్నాను.

ప్రస్తుతం తమ హస్తకమలాలను అలంకరించి ఉన్న గ్రంథం పోతనభాగవత ద్వితీయస్కంధం. ఈ స్కంధాన్ని సరళగద్యంలో అనువదించిన వారు సుప్రసిద్ధ విద్వాంసులు శిరోమణి, శ్రీసముద్రాల లక్ష్మణయ్య ఎం.ఏ., గారు. శ్రీసముద్రాలవారు సద్గురు శ్రీ మలయాళ స్వాములవారి ప్రియశిష్యులు. అన్నమాచార్య సంకీర్తనామృతము మొదలైన అనేక గ్రంథాలు రచించినవారు. టి.టి.డి. హిందూధర్మ రక్షణసంస్థ కార్యనిర్వాహకులు, మంచివక్తలు, సేవాతత్పరులు, సహృదయులు, వీరి అనువాదం సహజంగా, సరళంగా సర్వాంగసుందరంగా సాగింది.

ఈ ద్వితీయస్కంధాన్ని ఇంత త్వరగా ఇంత ముచ్చటగా ముద్రించి ఇచ్చిన దేవస్థానం ప్రెస్ మేనేజరు శ్రీ విజయకుమార్ రెడ్డి గారికి, వారి సిబ్బందికి నా సాధువాదాలు.

అక్షర దోషాలు దొర్లకుండా సహసాక్షులై ప్రూఫులు సరిదిద్దిన పూజ్యమిత్రులు శ్రీ ముదివర్తి కొండమాచార్యులవారికి, శ్రీ ములుకుట్ల రామకృష్ణశాస్త్రిగారికి నా ధన్యవాదాలు. ముద్రణకు తగునట్లు ప్రెస్ కాపీ సిద్ధం చేసి ఇచ్చిన చిరంజీవి కోరాడ రామకృష్ణకు నా ఆశీర్వాదాలు.

మీ

**కరుణశ్రీ**

ప్రధాన సంపాదకుడు,
పోతన భాగవతం.

**తిరుపతి**
10-4-84

శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః

# పోతన భాగవతము

## (సరళ గద్యానువాద సహితము)

## రెండవ స్కంధము

**శ్రీమద్భక్త చకోరక సోమ! వివేకాభిరామ ! సురవినుత గుణ**
**స్తోమ! నిరలంకృ తాసురరామాసీమంతసీమ ! రాఘవరామా! 1**

* భక్తులనే చకోరపక్షులకు చంద్రుడవూ, వివేకముతో విలసిల్లువాడవూ, దేవతల పొగడ్త గాంచిన సద్గుణ సముదాయము గలవాడవూ, రాక్షసస్త్రీల పాపటబొట్టులు తొలగించిన వాడవూ అయిన ఓ రఘువంశలలామా ! రామా! అవధరించు.

**వ. మహనీయ గుణగరిష్ఠులగు నమ్మని శ్రేష్ఠులకు నిఖిల పురాణవ్యాఖ్యాన వైఖరీ సమేతుండైన సూతుం డిట్లనియె; అట్లు పరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుం డిట్లనియె. 2**

* ఉన్నత గుణాలలో అగ్రేసరులైన ఆ మునీశ్వరులను చూచి వివిధ పురాణాలను విశదీకరించడంలో విద్వాంసుడైన సూతుడు ఇలా అన్నాడు.

* ఆ విధంగా ప్రాయోపవేశం చేసిన పరీక్షిన్మహారాజుతో శుక మహర్షి ఈ విధంగా చెప్పాడు.

### -: శుకుఁడు పరీక్షిత్తునకు ముక్తి మార్గంబుఁ దెల్పుట :-

**సీ. క్షితిపతి! నీ ప్రశ్న సిద్ధంబు మంచిది యాత్మవేత్తలు మెత్తు రఖిలశుభద**
**మాకర్ణనీయంబు లయుతసంఖ్యలు గల వందు ముఖ్యం బిది యఖిల వరము**
**గృహముల లోపల గృహమేధులగు నరు లాత్మతత్త్వము లేశమైన నెఱుఁగ**
**రంగనారతుల నిద్రాసక్తిఁ జను రాత్రి పోవుఁ గుటుంబార్థబుద్ధి నహము**

**ఆ. పశు కళత్ర పుత్రబాంధవ దేహాది, సంఘ మెల్లఁ దమకు సత్య మనుచుఁ**
**గాఁపురములు సేసి కడపటఁ జత్తురు, కనియుఁ గాన రంత్యకాలసరణి. 3**

* రాజా! ఇప్పుడు నీవడిగిన ప్రశ్న చాలా సమంజసమైనది. దీనిని ఆత్మతత్త్వం తెలిసిన వాళ్లు మెచ్చుకుంటారు. ఇది సమస్త శుభాలను సమకూరుస్తుంది. లోకంలో వినదగిన విషయాలు వేలకొలది ఉన్నాయి. అందులో ఇది అతి ముఖ్యమైంది; గొప్పది. సంసారంలో మునిగితేలుతున్న గృహస్థులకు

ఆత్మతత్త్వం కొంచెం కూడా తెలియదు. వాళ్లకు స్త్రీ సంగంతోను, నిద్రతోనూ, రేయి గడచిపోతుంది. పగలంతా కుటుంబ వ్యవహారాలతో సరిపోతుంది. పశువులూ, భార్యలూ, బిడ్డలూ, చుట్టాలూ, శరీరమూ ఇత్యాది పరివార మంతటినీ నిజమని నమ్ముకొని కాపురాలు సాగిస్తూ, సాగిస్తూ కడకు వాళ్ల కన్నుమూసి కాటిపాలవుతారు. అంత్యకాల దుర్దశ తెలిసినా తెలియనట్లే ఉండిపోతారు.

**క. కావున సర్వాత్మకుఁడు మ, హావిభవుఁడు విష్ణుఁ డీశుఁ డాకర్ణింపన్**
**సేవింపను వర్ణింపను, భావింపను భావ్యుఁ డభవభాజికి నధిపా! 4**

* రాజా! అందువల్ల మోక్షమార్గంలో పయనించే వాడికి అన్నిటికీ ఆత్మయైన వాడూ, మహావైభవం కలవాడూ, జగదీశ్వరుడూ ఐన విష్ణువే భావించడానికీ, సేవించడానికీ, వర్ణించడానికీ, ఆకర్ణించడానికీ తగినవాడు.

**ఆ. జనుల కెల్ల శుభము సాంఖ్య యోగము; దాని, వలన ధర్మనిష్ఠవలన నయిన**
**నంత్యకాలమందు హరిచింత సేయుట, పుట్టువులకు ఫలము భూవరేంద్ర! 5**

* ప్రజలందరికీ సాంఖ్యయోగం మేలు చేకూరుస్తుంది. ఆ యోగం వల్లనైనా లేక ధర్మాచరణతో నైనా అవసానకాలంలో హరిని చింతించాలి. రాజేంద్రా! జన్మమెత్తినందుకు ప్రయోజనం అలా చెయ్యడమే!

**తే. అరసి నిర్గుణబ్రహ్మంబు నాశ్రయించి, విధినిషేధ నివృత్తి సద్విమలమతులు**
**సేయుచుందురు హరి గుణచింతనములు, మానసంబుల నేప్రొద్దు మానవేంద్ర! 6**

* నరవరా! నిర్మలబుద్ధి గల మహనీయులు విధి నిషేధాలు విడనాడి గుణరహితమైన పరబ్రహ్మమును ఆశ్రయించి మనస్సులో సదా మాధవుని గుణాలను మననం చేస్తుంటారు.

**సీ. ద్వైపాయనుఁడు నాదు తండ్రి, ద్వాపరవేళ బ్రహ్మసమ్మితమైన భాగవతముఁ**
**బఠనంబు సేయించె: బ్రహ్మతత్పరుఁడనై యుత్తమశ్లోకలీలోత్సవమున**
**నాకృష్ట చిత్తుండనై పఠించితి! నీవు హరి పాద భక్తుఁడ వగుటఁజేసి**
**యెఱిఁగింతు వినవయ్య! యీ భాగవతమున విష్ణు సేవాబుద్ధి విస్తరిల్లు:**

**ఆ. మోక్షకామునకును మోక్షంబు సిద్ధించు, భవభయంబు లెల్లఁ బాసిపోవు;**
**యోగిసంఘమునకు నుత్తమ వ్రతములు, వాసుదేవ నామవర్ణనములు. 7**

* మా తండ్రి వ్యాసభగవానుడు ద్వాపరయుగంలో వేదతుల్యమైన భాగవతం నా చేత చదివించాడు. నేను పరబ్రహ్మమందు లగ్నచిత్తుడనై భగవంతుని అవతారలీలలు నన్నాకర్షించడంవల్ల దీన్ని పఠించాను. నీవు పంకజాక్షుని పాదపద్మాలను ఆశ్రయించిన భక్తుడివి. అందువల్ల నీకు భాగవతతత్త్వం తెలియపరుస్తాను. వినవయ్యా మహారాజా! భాగవత శ్రవణం వల్ల విష్ణువును సేవించాలనే బుద్ధి విశాల మవుతుంది. మోక్షం కాంక్షించేవాడికి ముక్తి లభిస్తుంది. జన్మ జరామరణాది సంసార భయాలన్నీ సమసిపోతాయి. వాసుదేవుని నామ సంకీర్తనలే యోగిసత్తములకు ఉత్తమ వ్రతాలు.

త. హరి నెఱుంగక యింటిలో బహుహాయనంబులు మత్తుఁ డై
పొరలుచుండెడి వెఱ్ఱి ముక్తికిఁ బోవ నేర్చునె? వాఁడు సం
సరణముం బెడఁబాయఁ డెన్నఁడు; సత్య మా హరినామ సం
స్మరణమొక్క ముహూర్తమాత్రము చాలు ముక్తిదమౌ నృపా! 8

* రాజా! విష్ణుదేవుని తెలుసుకోకుండా మత్తెక్కి సంసారములో సంవత్సరాల తరబడి పొరలాడుతూ సతమత మవుతుండే అవివేకి ముక్తి కెలా పోగలడు? వాడు సంసారబంధం నుండి ఎన్నటికీ బయటపడలేడు. ఇది నిజం. ఒక్క క్షణమైనా హరినామం స్మరిస్తే చాలు. అది ముక్తిని ప్రసాదిస్తుంది.

సీ. కౌరవేశ్వర! తొల్లి ఖట్వాంగుఁడను విభుం డిల నేడు దీవుల నేలుచుండి
శక్రాది దివిజులు సంగ్రామభూముల నుగ్రదానవులకు నోడి వచ్చి
తమకుఁ దో డడిగిన ధరనుండి దివి కేఁగి దానవవిభుల నందఱ వధింప
వర మిత్తు మనుచు దేవతలు సంభాషింప "జీవితకాలంబు సెప్పుఁ డిదియ

ఆ. వరము నాకు నొండు వర మొల్ల" ననవుడు, "నాయు వొక ముహూర్తమంత తడవు,
గల" దటంచుఁ బలుక గగనయానమున న, మ్మానవేశ్వరుండు మహికి వచ్చి. 9

* కౌరవనాథా! పూర్వం "ఖట్వాంగు"డనే రాజు సప్తద్వీపాలనూ పరిపాలిస్తూ ఉండేవాడు. ఇంద్రాదిదేవతలు యుద్ధంలో భీకరులైన రాక్షసుల చేతుల్లో ఓడిపోయి ఆయన దగ్గరకు వచ్చి తమకు సాయపడమని ప్రార్థించారు. ఆయన భూలోకం నుంచి స్వర్గలోకానికి వెళ్లి దానవరాజుల నందరినీ సంహరించాడు. అప్పుడు దేవతలు సంతోషించి ఖట్వాంగుణ్ణి వరం కోరుకోమన్నారు. "నేనెంత కాలం బ్రతుకుతానో చెప్పండి. ఇదే నేను కోరే వరం; మరో వరం నా కక్కరలేదు" అని అత డన్నాడు. "నీకు ఆయువు ఇక ఒక ముహూర్తకాలమే ఉంది" అని వేల్పు లన్నారు. వెంటనే ఆ భూపాలుడు విమాన మెక్కి భూలోకానికి వచ్చాడు.

క. గిరులం బోలెడి కరులను, హరులం దన ప్రాణదయితలై మనియెడి సుం
దరులను, హితవరులను, బుధ వరులను వర్జించి గాఢవైరాగ్యమునన్. 10

* అలా వచ్చి ఖట్వాంగ మహారాజు పర్వతాలవంటి యేనుగులను, గుర్రాలనూ, ప్రాణప్రియలైన సుందరాంగులనూ, సన్నిహితులైన హితులనూ, పండితశ్రేష్ఠులనూ ప్రగాఢమైన వైరాగ్యంతో పరిత్యజించాడు.

క. గోవిందనామకీ ర్తనఁ, గావించి భయంబు దక్కి ఖట్వాంగ ధరి
త్రీవిభుఁడు సూర గొనియెను, గైవల్యముఁ దొల్లి రెండు గడియలలోనన్. 11

* ఈ విధంగా ముక్తసంగుడైన ఖట్వాంగుడు గోవిందనామ సంకీర్తనం చేసి భయరహితుడై రెండు గడియల్లోనే మోక్షం పొందాడు.

వ. వినుము. నీకు నేఁడు దివసంబులకుం గాని జీవితాంతంబు గాదు; తావత్కాలంబునకుం బారలౌకిక సాధనభూతంబగు పరమకల్యాణంబు సంపాదింపవచ్చు. నంత్యకాలంబు దగ్గఱినన్ బెగ్గడిలక దేహి దేహపుత్ర కళత్రాది సందోహంబువలని మోహపాలంబు నిష్కామకరవాలంబున నిర్మూలనంబు సేసి గేహంబు వెడలి పుణ్యతీర్థ జలావగాహంబు సేయుచు నేకాంతశుచి ప్రదేశంబున విధివత్ప్రకారంబునం గుశాజినచేలంబుల తోడం గల్పితాసనుండై మానసంబున నిఖిలజగత్పవిత్రీకరణ సమర్థంబై యకారాది త్రివర్ణ కలితంబై బ్రహ్మబీజంబయిన ప్రణవంబు సంస్మరించుచు వాయువుల జయించి విషయంబుల వెంట నంటిపాఱెడి యింద్రియంబుల బుద్ధిసారథియై మనోనామకంబులైన పగ్గంబుల బిగ్గఁబట్టి మ్రొగ్గం దిగిచి దట్టంబులైన కర్మఘట్టంబులు నిట్టట్టు మెట్టెడి మనంబును శేముషీబలంబున నిరోధించి భగవదాకారంబు తోడ బంధించి నిర్విషయంబైన మనంబున భగవత్పాదాద్యవయవంబులం గ్రమంబున ధ్యానంబు సేయుచు రజస్తమో గుణంబులచేత నాక్షిప్తంబును విమూఢంబునగు చిత్తంబునం దద్గుణంబులవలన నయ్యెడి మలంబులం ధారణావశంబునం బోనడిచి నిర్మలచిత్తంబునం బరమంబైన విష్ణుపదంబునకుం జను. ధారణానియమంబు గలుగ సుఖాత్మకం బగు విషయంబు నవలోకించు యోగికి భక్తి లక్షణంబైన యోగాశ్రయంబున వేగంబ మోక్షంబు సిద్ధించు ననిన యోగీంద్రునకు నరేంద్రుం డిట్లనియె. **12**

* రాజా! విను. నీకు ఏడు రోజులు తర్వాతనే గదా మరణం. అంతవరకు పరలోకసాధనమైన పరమశుభాన్ని ఆర్జించడానికి అవకాశం ఎంతో ఉంది. అవసానకాలం సమీపించగానే భయపడకుండా దేహధారియైన వాడు శరీరం, పుత్రులు, భార్య మొదలైన వారిపైగల మోహమనే వృక్షాన్ని నిష్కామమనే ఖడ్గంతో తెగనరకాలి. ఇల్లు వదలి పవిత్రమైన తీర్థజలాల్లో స్నానమాడుతూ ప్రశాంతమైన ఏకాంత ప్రదేశం చేరుకోవాలి. అక్కడ శాస్త్రం విధించినట్లు దర్భలూ, జింకచర్మమూ, వస్త్రమూ పరచుకొని కూర్చోవాలి. జగమంతా పవిత్రం చెయ్యగలదీ, అకార ఉకార మకారాలనే మూడక్షరాలతో కూడినదీ, బ్రహ్మ బీజమూ ఐన ఓంకారాన్ని మనస్సులో స్మరిస్తూ ఉచ్ఛ్వాస నిశ్వాసాలను వశపరచుకోవాలి. ఆ పైన విషయాల వెంబడి పరుగిడే ఇంద్రియాలను బుద్ధి అనే సారథితోను, మనస్సనే పగ్గంతోను బిగబట్టి నిగ్రహించాలి. గట్టివైన కర్మబంధాలలో చిక్కుకొని ఊగిసలాడే చిత్తాన్ని ప్రజ్ఞాబలంతో నిరోధించి భగవంతుని మీద నిశ్చలంగా నిలపాలి. విషయరహితమైన మనస్సుతో ఆ దేవుని కరచరణాదులైన అవయవాలను క్రమంగా ధ్యానం చేయాలి. రజోగుణం చేతా తమోగుణం చేతా ఆకర్షింపబడి మోహానికి లోనయ్యే మనస్సునూ, ఆ గుణాలవల్ల కలిగిన మాలిన్యాలనూ ధారణతో తొలగించి నిర్మలం చెయ్యాలి. అలా చేసినవాడు సర్వోత్కృష్టమైన విష్ణుపదం చేరుతాడు. ధారణానియమం సిద్ధిస్తే ఆతడు సుఖమయమైన విషయాన్ని చూస్తాడు. అట్టి యోగి భక్తిలక్షణమైన యోగాన్ని ఆశ్రయించి మోక్షం చూరగొంటాడు. ఈ విధంగా పలుకుతున్న శుకయోగీంద్రునితో పరీక్షిన్నరేంద్రుడు ఇలా అన్నాడు.

క. ధారణ యే క్రియ నిలుచును?, ధారణ కే రూప? మెద్ది ధారణ యనఁగా?
ధారణ పురుషు మనోమల, మేరీతి హరించు? నాకు నెఱిఁగింపఁగదే. **13**

* "స్వామీ! ధారణ ఎలా నిలుస్తుంది? దాని స్వరూపం ఎట్టిది? ధారణ అంటే ఏమిటి? అది జీవుని చిత్తమాలిన్యాన్ని ఎలా పోగొడుతుంది? దయచేసి నాకు తెలియపరచండి."

వ. అనిన విని రాజునకు నవధూతవిభుం డిట్లనియె. 14

* ఆ మాటలు విని అవధూతలలో మేటియైన శుకుడు పరీక్షిత్తును జూచి ఇలా పలికాడు.

ఆ. పవనములు జయించి పరిహృతసంగుఁడై, యింద్రియముల గర్వమెల్ల మాపి
హరి విశాలరూపమందుఁ జిత్తముఁ జేర్చి, నిలుపవలయు బుద్ధి నెఱపి బుధుఁడు. 15

* పండితుడైనవాడు గాలిని అరికట్టి, దారపుత్త్రాదులతోడి సంసర్గం వదలిపెట్టి, ఇంద్రియాలను జయించి బుద్ధిబలంతో మనస్సును విష్ణుదేవుని విశాల స్వరూపంలోనే స్థిరంగా నిలపాలి.

వ. వినుము భగవంతుండైన హరి విరాడ్విగ్రహంబునందు భూతభవిష్యద్వర్తమానం బైన విశ్వంబు విలోక్యమానం బగు, ధరణీసలిల తేజస్సమీరణ గగనాహంకార మహత్తత్త్వంబు లని యెడి సప్తావరణంబులచేత నావృతంబగు మహాండకోశంబైన శరీరంబునందు ధారణాశ్రయం బయిన వైరాజపురుషుండు దేజరిల్లు, నమ్మహాత్మునికిఁ బాదమూలంబు పాతాళంబు, పార్ష్ణిభాగ పాదాగ్ర భాగంబులు రసాతలంబు, గుల్ఫంబులు మహాతలంబు, జంఘలు తలాతలంబు, జానుద్వయంబు సుతలం, బూరువులు వితలా తలంబులు, జఘనంబు మహీతలంబు, నాభీవివరంబు నభస్థలంబు, వక్షంబు గ్రహతారకాముఖ జ్యోతిస్సమూహ సమేతంబగు నక్షత్ర లోకంబు, గ్రీవంబు మహర్లోకంబు, ముఖంబు జనలోకంబు, లలాటంబు తపోలోకంబు, శీర్షంబు సత్యలోకంబు, బాహుదండంబు లింద్రాదులు, గర్ణంబులు దిశలు, శ్రవణేంద్రియంబు శబ్దంబు, నాసాపుటంబు లశ్వినీదేవతలు, ఘ్రాణేంద్రియంబు గంధంబు, వదనంబు వహ్ని, నేత్రంబు లంతరిక్షంబు, చక్షురింద్రియంబు సూర్యుండు, రేయింబగళ్ళు ఱెప్పలు, భ్రూయుగ్మ విజృంభణంబు బ్రహ్మపదంబు, తాలువులు జలంబు, జిహ్వేంద్రియంబు రసంబు, భాషణంబులు సకల వేదంబులు, దంష్ట్రలు దండధరుండు, దంతంబులు పుత్త్రాదిస్నేహ కళలు, నగవులు జనోన్మాద కరంబు లయిన మాయా విశేషంబులు, కటాక్షంబు లనంతసర్గంబులు, పెదవులు వ్రీడాలోభంబులు, స్తనంబులు ధర్మంబులు, వె న్నధర్మమార్గంబు, మేఢ్రంబు ప్రజాపతి, వృషణంబులు మిత్రావరుణులు, జఠరంబు సముద్రంబులు, శల్యసంఘంబులు గిరులు, నాడీనివహంబులు నదులు, తనూరుహంబులు తరువులు, నిశ్శ్వాసంబులు వాయువులు, ప్రాయంబు నిరవధికం బయిన కాలంబు, కర్మంబులు నానావిధజంతు నివహసంవృత సంసరణంబులు, శిరోజంబులు మేఘంబులు, కట్టుపుట్టంబులు సంధ్యలు, హృదయంబు ప్రధానంబు, సర్వవికారంబులకు నాశ్రయంబైన మనంబు చంద్రుండు, చిత్తంబు మహత్తత్త్వం, బహంకారంబు రుద్రుండు, నఖంబు లశ్వాశ్వత ర్యుష్ట్రగజంబులు, కటిప్రదేశంబు పశుమృగాదులు, విచిత్రంబులైన యాలాప నైపుణ్యంబులు పక్షులు, బుద్ధి మనువు, నివాసంబు పురుషుండు, షడ్జాదు లైన స్వరవిశేషంబులు గంధర్వ విద్యాధర చారణాప్సర స్సమూహంబులు, స్మృతి ప్రహ్లాదుండు, వీర్యంబు దైత్యదానవానీకంబై యుండు, మరియు న మ్మహీవిభునకు ముఖంబు బ్రాహ్మణులును, భుజంబులు

**క్షత్త్రియులు, నూరులు వైశ్యులును, జరణంబులు శూద్రులును, నామంబులు నానా విధంబులైన వసురుద్రాది దేవతాభిధానంబులును, ద్రవ్యంబులు హవిర్భాగంబులును, కర్మంబులు యజ్ఞ ప్రయోగంబులును నగు, నిట్టి సర్వమయుండైన పరమేశ్వరుని విగ్రహంబు ముముక్షు వైనవాఁడు మనంబున ననుసంధానంబు సేయవలయునని వక్కాణించి వెండియు నిట్లనియె. 16**

* రాజా! విను. భగవంతుడైన విష్ణుని విరాట్ స్వరూపంలో జరిగిన, జరగనున్న, జరుగుతున్న ప్రపంచమంతా గోచరిస్తుంది. భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, అహంకారము, మహత్తత్త్వము అనే ఆవరణాలు ఏడూ మహాండకోశమైన విరాట్పురుషుని శరీరాన్ని కప్పి ఉన్నాయి. ఆ శరీరంలో ధారణకు నెలవై విరాట్పురుషుడు ప్రకాశిస్తున్నాడు. ఆ మహాత్ముడికి పాతాళం అరికాలు; రసాతలం కాలిమడమ, మునివ్రేళ్ళు; మహాతలం చీలమండలు; తలాతలం పిక్కలు; సుతలం మోకాళ్ళజంట; వితలమూ అతలమూ తొడలు; భూతలం పిరుదు; ఆకాశం బొడ్డు; గ్రహాలూ, తారకలూ మొదలైన జ్యోతిస్సమూహంతో కూడిన నక్షత్రలోకం వక్షఃస్థలం; మహర్లోకం మెడ; జనలోకం ముఖం; తపోలోకం నొసలు; సత్యలోకం శిరస్సు; ఇంద్రుడు మొదలైనవారు భుజదండాలు; దిక్కులు చెవులు; శబ్దం శ్రోత్రేంద్రియం; అశ్వినీ దేవతలు ముకుపుటాలు; గంధం ఘ్రాణేంద్రియం; అగ్ని నోరు; అంతరిక్షం కళ్లు; సూర్యుడు నేత్రేంద్రియం; రేపవళ్ళు కనురెప్పలు; బ్రహ్మపదం కనుబొమలు; జలాలు దవడలు; రసం జిహ్వేంద్రియం; సమస్తవేదాలు భాషణాలు; యముడు కోరలు; పుత్రాదులమీద స్నేహకళలు దంతాలు; జనులకు పిచ్చెత్తించే మాయా విశేషాలు నవ్వులు; తుదిలేని సృష్టులే కడగంటి చూపులు; సిగ్గు, లోభం పెదవులు; ధర్మ మార్గాలు రొమ్ములు, అధర్మమార్గం వెన్ను; ప్రజాపతి పురుషాంగం; మిత్రావరుణులు వృషణాలు, సముద్రాలు కడుపు; కొండలు ఎముకలు; నదులు నాడులు; చెట్లు రోమాలు; వాయువు నిట్టూర్పులు; కడలేని కాలమే ప్రాయం. పలువిధాలైన ప్రాణులతో గూడిన సంసారాలు కర్మలు; మబ్బులు శిరోజాలు; సంధ్యలు కట్టుబట్టలు. ప్రధానం హృదయం. చంద్రుడు వికారాలన్నింటికీ నెలవైన మనస్సు. మహత్తత్త్వం చిత్తం. రుద్రుడు అహంకారం; గుర్రాలు, కంచరగాడిదలు, ఒంటెలు, ఏనుగులు గోళ్ళు; పశువులు మృగాదులు కటిప్రదేశం; పక్షులు చిత్రమైన మాటల నేర్పులు; మనువు బుద్ధి; పురుషుడు నివాసం; గంధర్వులు, విద్యాధరులు, చారణులు, అప్సరసలు షడ్జం మొదలైన స్వరాలు; ప్రహ్లాదుడు స్మృతి; దైత్యులు, దానవులు వీర్యం. అంతేకాదు. ఆ మహాప్రభువునకు బ్రాహ్మణులు ముఖం; క్షత్రియులు బాహువులు; వైశ్యులు తొడలు; శూద్రులు పాదాలు; వసువులు రుద్రులు మొదలైన పెక్కు దేవతల పేర్లే నామాలు; హవిర్భాగాలు ద్రవ్యాలు; యజ్ఞప్రయోగాలు కర్మలు అవుతున్నాయి. ఇటువంటి విశ్వమయుడైన విరాట్పురుషుని విగ్రహాన్ని మోక్షార్థి అయినవాడు తన మనస్సులో అనుసంధానం చేసుకోవాలి అంటూ చెప్పి ఇంకా ఈ విధంగా చెప్పసాగాడు శ్రీశుకుడు.

క. **హరిమయము విశ్వ మంతయు, హరి విశ్వమయుండు, సంశయము పనిలే దా**
**హరిమయము గాని ద్రవ్యము, పరమాణువు లేదు వంశపావన! వింటే. 17**

* కులపావనుడవైన రాజా! విశ్వమంతా విష్ణుమయం. విష్ణువు విశ్వమయుడు. ఇందులో సందేహం లేదు. విష్ణుమయం కాని పదార్థం ఈ ప్రపంచంలో ఒక్క పరమాణువు కూడా లేదు.

సీ. కలలోన జీవుండు కౌతూహలంబునఁ బెక్కు దేహంబులఁ బేరు వడసి
యింద్రియంబుల వెంట నెల్లవృత్తంబులు నీక్షించి మఱి తన్ను నెఱుఁగుకరణి
నఖిలాంతరాత్మకుఁడగు పరమేశ్వరుఁ డఖిలజీవుల హృదయముల నుండి
బుద్ధి వృత్తుల నెల్ల బోద్ధయై వీక్షించు బద్ధుండు గాఁడు ప్రాభవము వలన

తే. సత్యుఁ డానందబహుళ విజ్ఞానమూర్తి, యతని సేవింప నగుఁగాక, యన్యసేవఁ
గలుగనేరవు కైవల్య గౌరవములు, పాయ దెన్నఁడు సంసారబంధ మధిప! 18

* రాజా ! జీవుడు కలలో ఉబలాటంతో పలు శరీరాలు తాలుస్తాడు. పలుపేర్లతో వ్యవహరింప బడతాడు. ఇంద్రియాల ద్వారా విశేషాలన్నీ గమనిస్తాడు. ఆ తర్వాత తన్ను తాను తెలుసుకుంటాడు. ఇలాగే అంతటికీ అంతరాత్మగా ఉన్న పరమేశ్వరుడు అన్ని ప్రాణుల హృదయాలలో ఉండి ప్రజ్ఞావంతుడై బుద్ధివ్యాపారా లన్నింటినీ పరిశీలిస్తుంటాడు. తానే అన్నిటికీ ప్రభువు కాబట్టి దేనికీ బద్ధుడు కాడు. తాను సత్యస్వరూపుడు. ఆనందంతో నిండిన విజ్ఞానమూర్తి. ఆయన సేవ వల్లే మోక్షం సిద్ధిస్తుంది. ఇతరులను కొలిస్తే మోక్షం లభించదు. ఈ సంసార బంధం వదలదు.

మ. బహువర్షంబులు బ్రహ్మ తొల్లి జగముత్పాదింప విన్నాణి గా
క హరి ప్రార్థన ధారణావశమునం గాదే! యమోఘోల్లస
న్మహనీయోజ్జ్వల బుద్ధియై భువననిర్మాణ ప్రభావంబుతో
విహరించెన్ నరనాథ! జంతునివహావిర్భావనిర్ణేతయై. 19

* ఓ పరీక్షిన్మహారాజా! పూర్వం బ్రహ్మ జగత్తును సృష్టించాలనుకొన్నాడు. పెక్కేండ్లు ప్రయత్నించాడు. అయినా నేర్పరి కాలేకపోయాడు. ఆ పైన ఏకాగ్రచిత్తంతో హరిని ప్రార్థించాడు. మహోన్నత బుద్ధి వికాసం పొందాడు. పిమ్మట ప్రాణి కోట్ల పుట్టుకను నిర్ణయించి జగన్నిర్మాణదక్షుడై విహరించాడు.

వ. విను, మూఢుండు శబ్దమయ వేదమార్గంబైన కర్మఫల బోధన ప్రకారంబున వ్యర్థంబులైన స్వర్గాది నానాలోక సుఖంబుల నిచ్ఛగించుచు మాయామయ మార్గంబున వాసనా మూలంబున నిద్రించువాఁడు గలలు గను తెఱంగునం బరిభ్రమించుచు నిరవద్య సుఖలాభంబుం జెందఁడు; తన్నిమిత్తంబున విద్వాంసుండు నామమాత్ర సారంబులగు భోగ్యంబులలోన నెంత దేహనిర్వహణంబు సిద్ధించు నంతియ కైకొనుచు నప్రమత్తుండై సంసారంబు సుఖం బని నిశ్చయింపక యొండు మార్గంబున సిద్ధి గలదని చూచి పరిభ్రమణంబు సేయుచుండు. 20

* అజ్ఞాని శబ్దప్రధానమైన వేదంలోని కర్మకాండ బోధించిన విధంగా నిరర్థకాలయిన స్వర్గాదిసుఖాలు అర్థిస్తాడు. నిద్రించేవాడు పూర్వ సంస్కారంతో కలలు కన్నట్లు మాయలో పరిభ్రమిస్తాడు. అంతేకాని మోక్షసుఖం పొందలేడు. జ్ఞాని అలా కాదు. అతడు శరీరధారణకు అవసరమైనంత మేరకే నిస్సారమైన భోగాలను స్వీకరిస్తాడు. జాగరూకుడై మెలగుతాడు. సంసారం సుఖ మనుకోడు. దాని కతీతమైన త్రోవలో పయనిస్తేనే సిద్ధి కలుగుతుందని గుర్తించి అలా ప్రవర్తిస్తాడు.

సీ. కమనీయ భూమిభాగములు లేకున్నవే! పడియుండుటకు దూదిపఱుపు లేల?
సహజంబులగు కరాంజలులు లేకున్నవే! భోజనభాజనపుంజ మేల?
వల్కలాజిన కుశావళులు లేకున్నవే! కట్ట దుకూల సంఘంబు లేల?
గొనకొని వసియింప గుహలు లేకున్నవే! ప్రాసాదసౌధాది పటల మేల?

తే. ఫలరసాదులు గురియవే పాదపములు!, స్వాదుజలముల నుండవే సకలనదులు!
పొసఁగ భిక్షము వెట్టరే పుణ్యసతులు!, ధనమదాంధుల కొలువేల తాపసులకు? 21

* బుద్ధిమంతుడు ఈ విధంగా భావన చేస్తాడు - పడుకోవడానికి చాలినంత చదునైన చక్కని నేల ఉండగా దూదిపరుపు లెందుకు? పుట్టుకతో వచ్చిన దోసిళ్ళు ఉన్నాయి కదా, మరి భుజించడానికి కంచాలూ గరిటెలూ ఎందుకు? నారచీరలు, జింకచర్మాలు, దర్భచాపలు లేవా! కట్టుకోవడానికి పట్టుపుట్టా లెందుకు? నిత్యమూ నివసించడానికి గుహలున్నాయి కదా, ఇక మేడలూ మిద్దెలూ ఎందుకు? చెట్లు తగినట్లు ఫలరసాదులు వర్షిస్తున్నాయి కదా! నదులలో తియ్యని నీటికి కొదవలేదు కదా! పుణ్యస్త్రీలు పుష్కలంగా భిక్షం పెడుతున్నారు గదా! ఇక తపోధనులైన వాళ్లు, ధనమదంతో కన్నూమిన్నూ కానని వాళ్లను ఎందుకు సేవించాలి?

క. రక్షకులు లేనివారల, రక్షించెద ననుచుఁ జక్రి రాజై యుండన్
రక్షింపు మనుచు నొక నరు, నక్షముఁ బ్రార్థింపనేల యాత్మజ్ఞులకున్? 22

* దిక్కులేని వారికి దిక్కై రక్షిస్తానంటూ చక్రధారియైన శ్రీహరి సిద్ధంగా ఉన్నాడు. అటువంటప్పుడు ఆత్మజ్ఞులైన ప్రాజ్ఞులు అసమర్థుడైన ఒక మానవుణ్ణి రక్షింపమని ఎందుకు ప్రాధేయపడాలి?

వ. అని యిట్లు స్వతస్సిద్ధుండును, నాత్మయుఁ, బ్రియుండును, నిత్యుండును, సత్యుండును, భగవంతుండును నైన వాసుదేవుని భజించి తదీయ సేవానుభవానందంబున సంసార హేతువగు నవిద్యవలన బుద్ధిమంతుండు విడువంబడుం గావున. 23

* ఇలా భావించి బుద్ధిమంతు డైనవాడు స్వయంభువుడూ, ఆత్మ స్వరూపుడూ, ప్రియమైనవాడూ, నిత్యుడూ, సత్యుడూ, భగవంతుడూ అయిన వాసుదేవుణ్ణి సేవిస్తాడు. ఆ సేవ వల్ల కలిగే ఆనందం అనుభవిస్తూ అతడు సంసారకారణమైన అవిద్య నుండి విముక్తి పొందుతాడు.

మ. హరిఁ జింతింపక మత్తుఁడై విషయ చింతాయత్తుఁడై చిక్కి వా
సరముల్ ద్రోసెడువాఁడు కింకరగదా సంతాడితోరస్కుఁడై
ధరణీశోత్తమ ! దండభృన్నివసన ద్వారోపకంఠోగ్ర వై
తరణీవహ్ని శిఖాపరంపరలచే దగ్ధుండు గాకుండునే? 24

* రాజోత్తమా! శ్రీహరిని చింతింపక మదోన్మత్త చిత్తుడై విషయ భోగాయత్తుడై దినాలు గడిపే వాడికి యమభటుల గదల దెబ్బలు తప్పవు. అతడు నరకద్వారం వద్ద వైతరిణీ నదిలోని భయంకర జ్వలన జ్వాలల్లో పడి మలమల మాడిపోతాడు.

క. మొత్తుదురు గదల, మంటల, కెత్తుదు రడ్డంబు, దేహ మింతింతలు గా
నొత్తుదు, రసిపుత్త్రికలను, హత్తుదురు కృతాంతభటులు హరివిరహితులన్. 25

* భగవంతుని భజించని పాషండులను యమకింకరులు గదలతో మోదుతారు. వాళ్ల శరీరాలను మంటలపాలు చేస్తారు. వాళ్ల అవయవాలను కరకు కత్తులతో ముక్కలు ముక్కలుగా ఖండిస్తారు.

వ. మఱియు హరి చరణ కమలగంధ రసాస్వాదనం బెఱుంగని వారలు నిజకర్మబంధంబుల దండధర మందిర ద్వార దేహళీ సమీప జాజ్వల్యమాన వైతరణీ తరంగిణీ దహనదారుణ జ్వాలా జాల దందహ్యమానదేహులం గూడి శిఖిశిఖావగాహంబుల నొందుచుండుదురు; మఱియు విజ్ఞానసంపన్నులై మను ప్రసన్నులు మాయాపన్నులు గాక విన్నాణంబునం దమతమ హృదయాంతరాళంబులం బ్రాదేశమాత్ర దివ్యదేహుండును, దిగిభరాజశుండా దండసంకాశదీర్ఘ చతుర్బాహుండును, కందర్పకోటి సమానసుందరుండును, ధృతమందరుండును, రాకావిరాజమాన రాజమండలసన్నిభ వదనుండును, సౌభాగ్యసదనుండును, బ్రభాతకాల భాసమాన భాస్కరబింబ ప్రతిమానవిరాజిత పద్మరాగరత్న రాజీవిరాజమాన కిరీటకుండలుండును, శ్రీవత్సలక్షణ లక్షిత వక్షోమండలుండును. రమణీయ కౌస్తుభరత్నఖచిత కంఠికాలంకృత కంధరుండును, నిరంతర పరిమళమిళిత వనమాలికా బంధురుండును, నానావిధ గంభీర హారకేయూర కటకకంకణ మేఖలాంగుళీయక విభూషణ వ్రాతసముజ్జ్వలుండును. నిటలతట విలంబమాన విమలస్నిగ్ధ నీలకుంచిత కుంతలుండును. తరుణచంద్ర చంద్రికాధవళ మందహాసుండును, బరిపూర్ణ కరుణావలోకన భ్రూభంగ సంసూచిత సుభగ సంతతానుగ్రహ లీలావిలాసుండును, మహాయోగిరాజ వికసిత హృదయకమల కర్ణికామధ్య సంస్థాపిత విలసిత చరణకిసలయుండును, సంతతానందమయుండును, సహస్రకోటి సూర్య సంఘాతసన్నిభుండును, విభుండును నైన పరమేశ్వరుని మనోధారణావశంబున నిలిపికొని తదీయగుల్ఫచరణజాను జంఘాద్యవయవంబులం గ్రమంబున నొక్కొక్కటిని బ్రతిక్షణంబును ధ్యానంబు సేయుచు నెంతకాలంబునకుఁ బరిపూర్ణ నిశ్చలభక్తి యోగంబు సిద్ధించు నంతకాలంబునుం దదీయచింతా తత్పరులై యుండుదురని మఱియు నిట్లనియె. 26

* అంతేకాదు. శ్రీ గోవింద చరణారవింద మకరంద మాధుర్యానికి విముఖులైన వాళ్ళు తమతమ కర్మబంధాల్లో తగుల్కొంటారు. తత్ఫలితముగా యమమందిర ద్వారం వద్ద ప్రవహించే వైతరణీనదిలో భగభగమండే భయంకరాగ్నిజ్వాలలలో కాలిపోతున్నవారితో జతగూడుతారు. విశేష జ్ఞానసంపన్నులై జీవించే శరణాగతులు మాయకు లోబడక నేర్పుతో తమతమ హృదయాలలో భగవంతుని ధ్యానిస్తారు. ఆ భగవంతుడు జుత్తెడు కొలత గల దివ్యశరీరం కలవాడు; దిగ్గజతుండాలవలె పొడవైన నాలుగు చేతులు గలవాడు; చక్కదనంలో కోటి మన్మథులకు దీటైనవాడు; మందరగిరిని ధరించినవాడు; పున్నమనాటి చందమామ వంటి మోము కలవాడు; సౌభాగ్యానికి నెలవైనవాడు, ప్రాతఃకాలపు భానుబింబములాగా ప్రకాశించే పద్మరాగమణులు పొదిగిన కిరీటకుండలాలు తాల్చినవాడు; వక్షఃస్థలంలో శ్రీవత్సమనే పుట్టుమచ్చ కలవాడు; కమనీయ

కౌస్తుభరత్నం తాపిన కంఠాభరణం మెడలో అలంకరించుకొన్నవాడు; ఎప్పుడూ సువాసనలీనే వనమాలికతో ఒప్పారేవాడు; పలువిధాలైన పెద్దపెద్ద హారాలూ, భుజకీర్తులూ, కడియాలూ, మురుగులూ, మొలనూలూ, ఉంగరాలూ మొదలైన సొమ్ములతో శోభిల్లేవాడు; నొసట ముసురుకొన్న నిగనిగలాడే నీలి ముంగురులు గలవాడు; కరుణామయమైన కడగంటి చూపులతోడి భ్రూవిలాసాలతో భక్తులపై పరమానుగ్రహం ప్రసరింప జేసేవాడు; మహా యోగీశ్వరుల హృదయపద్మాలలో చివుళ్లవంటి తన చరణాలు మోపిన వాడు; సదా ఆనందస్వరూపుడు; వేయి కోట్ల సూర్యులతో సమానమైనవాడు; లోకాధిపుడు. అట్టి పరమేశ్వరుణ్ణి విజ్ఞానసంపన్నులు ధారణతో చిక్కబట్టి ఆయన చీలమండలు, పాదాలు, మోకాళ్ళు, పిక్కలు మొదలైన అవయవాలలో ఒక్కొక్క దానిని క్రమంగా అనుక్షణం ధ్యానిస్తారు. అచంచలమైన పూర్ణభక్తియోగం సిద్ధించేవరకు ఆ పరమాత్ముని ధ్యానంలోనే నిమగ్నులై ఉంటారు. ఇలా చెప్పి శుకుడు మళ్ళీ ఈ విధంగా అన్నాడు.

**సీ. ఆసన్న మరణార్థియైన యతీశుండు కాలదేశములను గాచికొనఁడు**
**తనువు విసర్జించు తలఁపు జనించిన భద్రాసనస్థుఁడై ప్రాణపవను**
**మనసుచేత జయించి మానసవేగంబు బుద్ధిచే భంగించి బుద్ధిఁదెచ్చి**
**క్షేత్రజ్ఞుతోఁ గూర్చి క్షేత్రజ్ఞు నాత్మలోపలఁ జేర్చి యాత్మను బ్రహ్మ మందుఁ**

**తే. గలిపి యొక్కటి గావించి గారవమున, శాంతితోడ నిరూఢుఁడై సకలకార్య**
**నివహ మెల్లను దిగనాడి నిత్యసుఖము, వలయు నని చూచు నటమీఁద వసుమతీశ! 27**

* రాజా! ప్రారబ్ధకర్మ నశింపగా శరీరం త్యజించాలనుకొన్న సన్న్యాసి దేశకాలాలకోసం ఎదురుచూడడు. ఆ భావన కలగగానే అతడు సుఖాసనాసీను డవుతాడు. మనస్సుతో ప్రాణవాయువును నిగ్రహిస్తాడు. మనోవేగాన్ని బుద్ధితో అరి కడతాడు. బుద్ధిని క్షేత్రజ్ఞు డనబడే జీవాత్మతో పొందిస్తాడు. జీవాత్మను శుద్ధాత్మలో చేరుస్తాడు. శుద్ధాత్మను పరమాత్మలో లీనం చేస్తాడు. అలా చేసి శాంతాత్ముడై కార్యాలన్నింటినీ పరిత్యజిస్తాడు. ఆపై నిత్యసుఖం కావాలని అభిలషిస్తాడు.

**వ. వినుము! పరమాత్మయైన బ్రహ్మంబునకుఁ దక్క కాల దేవ సత్త్వరజస్తమో గుణాహంకార మహత్తత్త్వ ప్రధానంబులకుఁ బ్రభుత్వంబు లేదు, కావునం బరమాత్మ వ్యతిరిక్తంబు లేదు, దేహాదులయం దాత్మత్వంబు విసర్జించి యన్య సౌహృదంబు మాని పూజ్యం బయిన హరిపదంబుం బ్రతిక్షణంబును హృదయంబున నాలింగనంబు సేసి వైష్ణవంబయిన పరమపదంబు సర్వోత్తమంబని సత్పురుషులు దెలియుదు, రివ్విధంబున విజ్ఞాన దృగ్వీర్యజ్వలనంబున నిర్దగ్ధవిషయ వాసనుండై క్రమంబున నిరపేక్షత్వంబున. 28**

* నరేంద్రా! విను. పరమాత్మయైన బ్రహ్మమునకు తప్ప కాలానికి, కాలప్రభావానికీ లోబడ్డ బ్రహ్మాది దేవతలకూ, సత్త్వరజ స్తమస్సులనే గుణాలకూ, అహంకారానికీ, మహత్తత్త్వానికి, సమస్తసృష్టికీ హేతు భూతమై ప్రధాన మనబడే ప్రకృతికీ ఆధిపత్యం లేదు. అందుచేత పరమాత్మకు భిన్నమైన పదార్థమంటూ ఏదీ లేదు. సత్పురుషులు శరీరాదులపై ఆత్మభావన వదులుతారు. ఇతర విషయాలమీద వ్యామోహం విడుస్తారు.

మహనీయాలైన మాధవుని చరణారవిందాలనే మనస్సులో అనుక్షణమూ నిల్పుకుంటారు. విష్ణుసంబంధ మగు పరమపదమే అన్నింటికంటె ఉత్తమస్థానమని గ్రహిస్తారు. ఈ రీతిగా శాస్త్రజ్ఞానబలము అనే మంటలో విషయవాసనలను తగులబెట్టి వారు దేని మీదా అపేక్ష లేకుండా ఉంటారు.

**సీ. అంఘ్రిమూలమున మూలాధారచక్రంబుఁ బీడించి, ప్రాణంబు బిగియఁ బట్టి,**
**నాభితలముఁజేర్చి, నయముతో మెల్లన హృత్సరోజము మీఁది కెగయఁ బట్టి,**
**యటమీఁద నురమందు హత్తించి, క్రమ్మఱఁ దాలు మూలమునకుఁ దఱిమి నిలిపి,**
**మమతతో భ్రూయుగమధ్యంబు సేర్చి, దృ క్కర్ణనాసాస్య మార్గములు మూసి,**

**ఆ. యిచ్చలేని యోగి యెలమి ముహూర్తార్ధ, మింద్రి యానుషంగ మింత లేక**
**ప్రాణములను వంచి బ్రహ్మ రంధ్రము చించి, బ్రహ్మమందుఁ గలయుఁ బౌరవేంద్ర! 29**

* రాజా! యోగి పాదమూలంతో మూలాధారచక్రాన్ని అనగా గుదస్థానాన్ని అదిమి పడతాడు. ఆ పై ప్రాణవాయువును బిగబట్టి బొడ్డువద్ద ఉన్న మణిపూరక చక్రానికి తీసుకుపోతాడు. అక్కడనుండి హృదయంలోని అనాహతచక్రానికీ, అందుండి వక్షంలో ఉన్న విశుద్ధ చక్రానికి, అటనుండి ఆ చక్రాగ్రముండే తాలుమూలానికీ, ఆ తాలుమూలం నుండి కనుబొమ్మలమధ్య నున్న ఆజ్ఞా చక్రానికీ ప్రాణవాయువును తరలిస్తాడు. అందుమీదట కండ్లు, చెవులు, ముక్కు, నోరు - ఇవి మూసుకొని ఏ కోరికలు లేనివాడై అర్ధముహూర్తకాలం ఇంద్రియాలతో ఏ మాత్రం సంబంధం లేకుండా ప్రాణాలను నిగ్రహిస్తాడు. పిమ్మట బ్రహ్మ రంధ్రం భేదించుకొని పరబ్రహ్మంలో లీనమవుతాడు.

**వ. మఱియు దేహత్యాగకాలంబున నింద్రియంబులతోడి సంగమంబు విడువని వాఁడు వానితోడన గుణసముదాయ రూపంబగు బ్రహ్మాండంబు నందు ఖేచరసిద్ధ విహారయోగ్యంబును నణిమాదిక సకలైశ్వర్య సమేతంబును నైన పరమేష్ఠి పదంబుఁ జేరు, విద్యాతపోయోగ సమాధిభజనంబు సేయుచుఁ బవనాంతర్గత లింగశరీరులైన యోగీశ్వరులకు బ్రహ్మాండ బహిరంతరాళంబులు గతి యని చెప్పుదు, రేరికిం గర్మంబుల నట్టి గతిఁ బొంద శక్యంబు గాదు, యోగి యగువాఁడు బ్రహ్మలోకంబునకు నాకాశపథంబునం బోవుచు సుషుమ్నానాడివెంట నగ్నియను దేవతం జేరి జ్యోతిర్మయంబైన తేజంబున నిర్మలుండై యెందునుం దగులు వడక తారామండలంబుమీఁద సూర్యాది ధ్రువాంతపదంబులఁ గ్రమక్రమంబున నతిక్రమించి హరిసంబంధంబయిన శింశుమార చక్రంబుఁ జేరి యొంటరి యగుచుఁ బరమాణు భూతంబైన లింగ శరీరంబుతోడ బ్రహ్మవిదులకు నెలవైన మహర్లోకంబుఁ జొచ్చి మహాకల్పకాలంబు క్రీడించుఁ; గల్పాంతంబైన ననంతముఖానల జ్వాలా దందహ్యమానంబగు లోకత్రయంబు నీక్షించుచుఁ దన్నిమిత్త సంజాతానల దాహంబు సహింపంజాలక - 30**

* శరీరం విసర్జించేటప్పుడు ఇంద్రియాలతో సంబంధం వదలనివాడు వాటితో సహా గుణమయమైన బ్రహ్మాండంలో ఖేచరులు, సిద్ధులు, విహరించడానికి అనువైనదీ, అణిమాదులైన ఐశ్వర్యాలన్నింటితో కూడినదీ అయిన బ్రహ్మలోకం చేరుతాడు. విద్య, తపస్సు, యోగం, సమాధి - ఇవి అనుష్ఠిస్తూ లింగశరీరాన్ని వాయులీనం చేసిన యోగీశ్వరులు బ్రహ్మాండం లోపలా, వెలుపలా సంచరిస్తుంటారని పెద్దల మాట. కర్మలతో ఎవ్వరూ

అలాంటి స్థానం పొందలేరు. బ్రహ్మలోకాభిముఖుడైన యోగి సుషుమ్నానాడీ ద్వారం నుండి బయలుదేరి ఆకాశమార్గంలో పయనిస్తూ అగ్ని దేవతను చేరుకుంటాడు. అక్కడ జ్యోతిర్మయమైన ప్రకాశంతో పుణ్యాపాపాలు నశింపజేసుకొని నిర్మలుడై భాసిస్తాడు. అతడు దేనిలోనూ తగుల్కోడు. నక్షత్రపథం గడచిపోతాడు. ఆపై సూర్యమండలం మొదలు ధ్రువమండలం వరకు మండలాలన్నీ వరుసగా దాటుకుంటాడు. తుదకు విష్ణు సంబంధమైన శింశుమార చక్రం చేరుతాడు. అక్కడ ఒంటరిగా పరమాణు స్వరూపమైన లింగశరీరంతో బ్రహ్మవేత్తలు నివసించే మహర్లోకం ప్రవేశిస్తాడు. మహాకల్పకాలం వరకూ అందే క్రీడిస్తాడు. కల్పాంతంలో అనంతుని వదనమునుండి వెలువడే కరాళాగ్ని జ్వాలల్లో దగ్ధమయి పోతున్న త్రిలోకాలను చూస్తాడు. అందువల్ల జనించే అగ్ని దాహం సహించలేక అక్కడనుండి బ్రహ్మలోకం చేరుకుంటాడు; అక్కడే నివసిస్తాడు.

**సీ. ఇలమీఁద మనువు లీరేడ్వురుఁ జనువేళ దివసమై యెచ్చోటఁ దిరుగుచుండు,**
**మహనీయ సిద్ధవిమాన సంఘము లెందు దినకరప్రభములై తేజరిల్లు,**
**శోకజరామృత్యుశోషణ భయదుఃఖ నివహంబు లెందు జనింపకుండు,**
**విష్ణుపద ధ్యాన విజ్ఞాన రహితుల శోకంబు లెందుండి చూడవచ్చు,**

**ఆ. పరమసిద్ధయోగి భాషణామృత మెందు, శ్రవణ పర్వమగుచు జరుగుచుండు**
**నట్టి బ్రహ్మలోకమందు వసించును, రాజవర్య! మరల రాఁడు వాఁడు. 31**

* భూలోకంలో పదునల్గురు మనువులూ పుట్టి గిట్టే కాలమంతా కలిస్తే బ్రహ్మలోకంలో ఒక్క దినమవుతుంది. అక్కడ మహనీయులైన సిద్ధుల విమానాలు సూర్యతేజంతో విరాజిల్లుతుంటాయి. శోకం, వార్ధక్యం, మృత్యువు, కృశత్వం, భయం, దుఃఖం - ఇలాంటి బాధ లక్కడలేవు. హరిచరణాలను ధ్యానించాలనే తెలివి లేక మూఢులైన వారి శోకస్థితిని బ్రహ్మలోకం నుంచి గమనించవచ్చు. శ్రేష్ఠులైన సిద్ధులూ, యోగులూ అమృతప్రాయంగా సంభాషించుకోవడాన్ని చెవుల పండువుగా అక్కడ వినవచ్చు. రాజేంద్రా! అలాంటి బ్రహ్మలోకంలో అతడు నివసిస్తాడు. మళ్ళీ ఆ లోకంనుండి తిరిగి రానేరాడు.

**వ. మఱియు నొక్క విశేషంబు గలదుః పుణ్యాతిరేకంబున బ్రహ్మలోకగతు లైన వారు కల్పాంతరంబునం బుణ్యాతారతమ్యంబుల నధికారవిశేషంబు నొందువార లగుదురు, బ్రహ్మాది దేవతాభజనంబునం జనువారు బ్రహ్మజీవిత కాలం బెల్ల బ్రహ్మ లోకంబున వసియించి ముక్తు లగుదురు, నారాయణ చరణకమల భక్తి పరాయణత్వంబునం జనినవారు నిజేచ్ఛావశంబున నిరర్గళ గమనులై బ్రహ్మాండంబు భేదించి మహోన్నత వైష్ణవపదారూఢులయి తేజరిల్లుదు, రీశ్వరాధిష్ఠితంబైన ప్రకృతియంశంబున మహత్తత్త్వంబగు, మహత్తత్త్వాంశంబున నహంకారంబగు, నహంకారాంశంబున శబ్దతన్మాత్రంబగు, శబ్దతన్మాత్రాంశంబున గగనంబగు, గగనాంశంబున స్పర్శతన్మాత్రంబగు, స్పర్శతన్మాత్రాంశంబున సమీరణంబగు, సమీరణాంశంబున రూపతన్మాత్రంబగు, రూపతన్మాత్రాంశంబువలనఁ దేజంబగు, తేజోఽంశంబున రసతన్మాత్రంబగు, రసతన్మాత్రాంశంబువలన జలంబగు, జలాంశంబున గంధతన్మాత్రం బగు, గంధతన్మాత్రాంశంబునఁ బృథివి యగు, వాని మేళనంబునం జతుర్దశ**

భువనాత్మకంబైన విరాడ్రూపంబగు; నా రూపంబునకుఁ గోటియోజన విశాలంబైన యండకటాహంబు ప్రథమావరణంబైన పృథ్వియగు, దీనిఁ బంచాశత్కోటివిశాలంబని కొందఱు వలుకుదురు, అయ్యావరణంబు మీఁద సలిల తేజస్సమీర గగనాహంకార మహత్తత్త్వంబు లనియెడి యావరణంబులు క్రమంబున నొండొంటికి దశగుణోత్తరాధికంబులై యుండు, నట్టి యేడింటిమీఁదఁ బ్రకృత్యావరణంబు మహావ్యాపకం బగు; బ్రహ్మాండంబు భేదించి వైష్ణవపదారోహణంబు సేయువాఁడు నిర్భయుండై మెల్లన లింగ దేహంబునఁ బృథివ్యాత్మకత్వంబు నొంది యట్టి పృథివ్యాత్మకత్వంబున ఘ్రాణంబున గంధంబును, జలాత్మకత్వంబున రసనేంద్రియంబున రసంబును, దేజోరూపకత్వంబున దర్శనంబున రూపంబును, సమీరణాత్మకత్వంబున దేహంబున స్పర్శనంబును, గగనాత్మకత్వంబున శ్రవణంబున శబ్దంబును, నతిక్రమించి భూతసూక్ష్మేంద్రియ లయస్థానంబైన యహంకారావరణంబున సంప్రాప్తుండై యందు మనోమయంబును, దేవమయంబునునైన సాత్త్వికాహంకార గమనంబున మహత్తత్త్వంబు సొచ్చి, గుణత్రయంబున లయించి, ప్రధానంబు నొంది, ప్రధానాత్మకత్వంబున దేహంబును, నుపాధిపరంపరావసానంబునం బ్రకృతిం బాసి యానందమయుండై యానందంబునం బరమాత్మరూపంబైన వాసుదేవ బ్రహ్మంబునందుఁ గలయునని చెప్పి వెండియు నిట్లనియె. 32

* ఇంకా ఒక విశేషముంది. గొప్ప పుణ్యం వల్ల బ్రహ్మలోకం చేరిన వారు మరొక కల్పంలో తమ తమ పుణ్యాల హెచ్చు తగ్గులను బట్టి ఆ యా అధికారాలను పొందుతారు. బ్రహ్మ మొదలైన దేవతలను సేవించి శరీరత్యాగం చేసినవారు ఆ బ్రహ్మ జీవించినంతకాలం బ్రహ్మలోకంలో నివసించి కడపట ముక్తి పొందుతారు. శ్రీహరి పాదపద్మాలపై అత్యంత భక్తి కలిగి దేహం వీడినవారు స్వేచ్ఛతో నిరాటంకంగా పయనం సాగించి బ్రహ్మాండాన్ని భేదించుకొని అత్యున్నతమైన వైష్ణవస్థానం అధిష్ఠించి ప్రకాశిస్తారు. ఈశ్వరు డధిష్ఠించిన ప్రకృతి అంశంతో మహత్తత్త్వం పుడుతుంది. మహత్తత్త్వం అంశంతో అహంకారం పుడుతుంది. అహంకారం అంశంతో శబ్దతన్మాత్ర పుడుతుంది. శబ్దతన్మాత్ర అంశంతో ఆకాశం పుడుతుంది. ఆకాశం అంశంతో స్పర్శ తన్మాత్ర పుడుతుంది. స్పర్శతన్మాత్ర అంశంతో వాయువు పుడుతుంది. వాయువు అంశంతో రూపతన్మాత్ర పుడుతుంది. రూపతన్మాత్ర అంశంనుండి తేజస్సు పుడుతుంది. తేజస్సు అంశంనుండి రసతన్మాత్ర పుడుతుంది. రసతన్మాత్ర అంశంనుండి జలం పుడుతుంది. జలాంశం నుండి గంధ తన్మాత్ర పుడుతుంది. గంధ తన్మాత్ర అంశంతో పృథ్వి పుడుతుంది. వీటన్నిటి కలయిక వల్ల పదునాల్గు భువనాల స్వరూపమైన విరాడ్రూపం ఉద్భవిస్తుంది. ఆ రూపానికి కోటి యోజనాల విస్తీర్ణమైన అండకటాహమే మొదటి ఆవరణమైన భూమి అవుతుంది. కొందరు దీనిని ఏబదికోట్ల యోజనాల విశాలమని వర్ణిస్తారు. ఈ ఆవరణం మీద జలం, తేజస్సు, వాయువు, ఆకాశం, అహంకారం, మహత్తత్త్వం అనే ఆరు ఆవరణాలున్నాయి. అవి క్రమంగా ఒకదాని కొకటి పదేసి రెట్లు పెద్దవిగా ఉన్నాయి. ఆ యేడావరణాల మీద ఎనిమిదవదైన ప్రకృత్యావరణం గొప్పగా వ్యాపించి ఉంది. ఈ బ్రహ్మాండాన్ని భేదించుకొని విష్ణుపదం అధిష్ఠించినవాడు మరణాది భయరహితు డవుతాడు. అతడు మెల్లగా లింగశరీరంతో పృథివీ తత్త్వం పొందుతాడు. ఆ పృథివీ

తత్త్వంలో ఘ్రాణేంద్రియంతో గంధాన్ని గ్రహిస్తాడు. జలస్వరూపుడై రసనేంద్రియంతో రసాన్ని గ్రహిస్తాడు. తేజోరూపుడై నేత్రేంద్రియంతో రూపాన్ని గ్రహిస్తాడు. వాయు స్వరూపుడై త్వగింద్రియంతో స్పర్శాన్ని గ్రహిస్తాడు. గగన స్వరూపుడై శ్రోత్రేంద్రియంతో శబ్దాన్ని గ్రహిస్తాడు. అన్నింటినీ అతిక్రమించి ఆ యోగి ఆకాశాది పంచభూతాలకూ, సూక్ష్మేంద్రియాలకూ లయస్థానమైన అహంకారావరణం చేరుకుంటాడు. అక్కడ మనోమయమూ, దేవమయమూ ఐన సాత్త్వికాహంకారంతో మహత్తత్త్వంలో ప్రవేశిస్తాడు. ఆ పైని సత్త్వరజస్తమోగుణాలు లయించిన ప్రకృతిని పొందుతాడు. ఆ ప్రకృత్యాత్మకత్వంతో దేహాన్నీ, ఉపాధిపరంపరలన్నీ ముగిసిన పిమ్మట ప్రకృతినీ పరిత్యజించి ఆనందమయు డవుతాడు. ఆ ఆనందంతో పరమాత్మ స్వరూపమైన వాసుదేవ పరబ్రహ్మంలో లీనమవుతాడు. ఈ విధంగా చెప్పి శుకుడు పరీక్షిత్తుతో ఇంకా ఇలా అన్నాడు.

**ఆ. పరమభాగవతులు పాటించు పథ మిది, యీ పథమున యోగి యేఁగె నేని**
**మగుడి రాఁడు వాఁడు మఱి సంశయము లేదు, కల్పశతము లైనఁ గౌరవేంద్ర! 33**

* కురునాథా! ఇది భాగవతోత్తములు అనుసరించే మార్గం. ఈ మార్గాన పయనించిన యోగి వందలకొలది కల్పాలు గడచినా మళ్ళీ తిరిగిరాడు. ఇందుకు సందేహం లేదు.

**వ. వినుము, నీవడిగిన సద్యోముక్తియుఁ గ్రమముక్తియు ననియెడు నీ రెండు మార్గంబులు వేదగీతలందు వివరింపంబడియె, వీనిం దొల్లి భగవంతుండైన వాసుదేవుండు బ్రహ్మచేత నారాధితుండై చెప్పె, సంసార ప్రవిష్టుండైన వానికిఁ దపోయోగాదు లయిన మోక్షమార్గంబులు పెక్కులు గల, వందు భక్తిమార్గంబుకంటె సులభంబు లేదు. 34**

* సద్యోముక్తి, క్రమముక్తి అనే రెండు మార్గాలు నీవు అడిగావు. ఇవి రెండూ వేదగీతలలో వివరింప బడ్డాయి. పూర్వం బ్రహ్మ తన్ను ఆరాధింపగా భగవంతుడైన విష్ణువు ఆయనకు వీటిని బోధించాడు. సంసారంలో ప్రవేశించిన వానికి తపస్సు, యోగం మొదలైన మోక్ష మార్గాలు ఎన్నో ఉన్నాయి. అన్నింటి కంటే సులభమైంది భక్తిమార్గం.

## -: శుకుఁడు పరీక్షిత్తునకు భక్తిమార్గంబె ముఖ్యంబని తెలుపుట :-

**మ. విను మంభోజభవుండు మున్ను మదిలో వేదంబు ముమ్మాఱు ధ**
**ర్మ నయజ్ఞత్వముతోడ నెంతయుఁ బరామర్శించి మోక్షంబు ద**
**క్కిన మార్గంబున వెంట లేదనుచు భక్తిం జింత సేసెన్ జనా**
**ర్దను నాత్మాకృతి నిర్వికారుఁ డగుచుం దన్మార్గ నిర్ణేతయై. 35**

* ఇది ఇంకా వివరంగా చెపుతాను విను: పూర్వం బ్రహ్మ మనసులో మూడుసార్లు వేదాన్ని ధర్మపరాయణమైన దృష్టితో పరామర్శించాడు. అలా పరామర్శించి భక్తితో తప్ప మరో మార్గాన మోక్షం లభించదని నిశ్చయించాడు. ఆ మార్గాన్నే తరణోపాయంగా నిర్ణయించుకొని వికారానికి లోనుగాకుండా జనార్దనుని ఆత్మస్వరూపాన్ని భక్తితో ధ్యానించాడు.

సీ. అఖిలభూతములందు నాత్మరూపంబున నీశుండు హరి యుండు నెల్లప్రొద్దు
బుద్ధ్యాది లక్షణంబులఁ గానఁబడును మహత్సేవనీయుఁ డహర్నిశంబు
వందనీయుఁడు భక్త వత్సలుం డత్యంత నియతుఁడై సతతంబు నియత బుద్ధి
నాత్మరూపకుఁడగు హరికథామృతమును గర్ణ పుటంబులఁ గాంక్ష దీరఁ

తే. గ్రోలుచుండెడు ధన్యులు కుటిలబహుళ, విషయ మలినీకృతాంగముల్ వేగ విడిచి
విష్ణు దేవుని చరణారవిందయుగము, కడకుఁ జనుదురు సిద్ధంబు కౌరవేంద్ర! 36

* జగదీశ్వరుడైన శ్రీహరి సమస్తప్రాణులలో సదా ఆత్మరూపుడై ఉన్నాడు. బుద్ధి మొదలైన లక్షణాలతో ఆయన మనకు గోచరిస్తాడు. పెద్దలకు ఆయన సేవింపదగినవాడు. సమస్తవేళల నమస్కరింపదగిన వాడు. భక్తుల మీద వాత్సల్యం కురిపించేవాడు. నియమ నిష్ఠలు కల్గి ఏకాగ్రమైన బుద్ధితో ఆత్మస్వరూపుడైన శ్రీహరి కథా సుధాపూరాన్ని తనివి దీరా, చెవులారా గ్రోలేవారు ధన్యులు. అటువంటివారు కుటిలమైన పలువిషయాలతో దూషితాలైన తమ శరీరాలను త్వరగా త్యజించి విష్ణు దేవుని పాదపద్మాలను చేరుకుంటారు. కౌరవనాథా! ఇది నిజం.

క. మానుషజన్మము నొందిన, మానవులకు లభ్యమాన మరణులకు మహా
జ్ఞానులకుఁ జేయవలయు వి, ధానము నిగదింపఁబడియె ధరణీనాథా! 37

* రాజా! మనుష్యులుగా జన్మించినవాళ్ళూ, మరణము ఆసన్నమైన వాళ్ళూ, మహాజ్ఞానులూ చేయవలసిన కర్తవ్యం ఇలా నొక్కి వక్కాణింపబడి ఉంది.

వ. వినుము. బ్రహ్మవర్చసకాముడైన వానికి వేదవిభుండగు చతుర్ముఖుండును, నింద్రియ పాటవకామునకు నింద్రుండును, బ్రజాకామునకు దక్షాది ప్రజాపతులును, భోజనకామునకు నదితియు, స్వర్గకామునకు నాదిత్యులును, రాజ్యకామునకు విశ్వదేవతలును, దేశప్రజా ధనకామునకు సాధ్యులును, శ్రీకామునకు దుర్గయుఁ, దేజస్కామునకు నగ్నియు, వసుకామునకు వసువులును, వీర్యకామునకు వీర్యప్రదులగు రుద్రులును, నాయుష్కామునకు నశ్వినీదేవతలును, బుష్టికామునకు భూమియుఁ, బ్రతిష్ఠా కామునకు లోకమాతలైన గగనభూదేవతలును, సౌందర్యకామునకు గంధర్వులును, గామినీకామునకు నప్సరసయైన యూర్వశియు, సర్వాధిపత్యకామునకు బ్రహ్మయుఁ, గీర్తికామునకు యజ్ఞంబులును, విత్తసంచయకామునకుం బ్రచేతసుండును, విద్యాకామునకు నుమావల్లభుండును, దాంపత్య ప్రీతికామునకు నుమాదేవియు, ధర్మార్థకామునకు నుత్తమశ్లోకుండగు విష్ణువును, సంతానకామునకుఁ బితృదేవతలును, రక్షాకామునకు యక్షులును, బలకామునకు మరుద్గణంబులును, రాజత్వకామునకు మనురూప దేవతలును, శత్రుమరణ కామునకుఁ గోణపాలకుండైన రాక్షసుండును, భోగకామునకుం జంద్రుండును భజనీయు లగుదురు మఱియును. 38

* విను. బ్రహ్మవర్చస్సు కోరేవాడు వేదపాలకుడైన చతుర్ముఖ బ్రహ్మను సేవించాలి. అలాగే ఇంద్రియశక్తి కాంక్షించేవాడు ఇంద్రుణ్ణీ, సంతానం అభిలషించేవాడు దక్షుడు మొదలైన ప్రజాపతులనూ, భోజనం

ఆశించేవాడు అదితినీ పూజించాలి. స్వర్గం వాంఛించేవాడు ఆదిత్యులనూ, రాజ్యాభిలాష కలవాడు విశ్వదేవతలనూ, దేశప్రజలను స్వాధీనం చేసుకొనగోరేవాడు సాధ్యులనూ, సిరిని వరించేవాడు దుర్గనూ ఉపాసించాలి. తేజస్సుకోరేవాడు అగ్నినీ, ధనాభిలాషి వసువులనూ, వీర్యం అర్థించేవాడు రుద్రులనూ, ఆయువు కోరేవాడు అశ్వినీ దేవతలనూ, పుష్టి కావాలి అనేవాడు భూమినీ అర్చించాలి. ప్రతిష్ఠను అపేక్షించేవాడు లోకమాతలైన ఆకాశభూదేవతలనూ, అందం కోరేవాడు గంధర్వులనూ, వనితలపై వాంఛకలవాడు అప్సరసయైన ఊర్వశినీ, సర్వాధికారం కాంక్షించేవాడు పరమేష్ఠినీ భజించాలి. కీర్తికోరేవాడు యజ్ఞమూర్తియైన విష్ణువునూ, విత్తం ఆశించేవాడు ప్రచేతసుణ్ణీ, విద్యపై కోరిక గలవాడు శివుణ్ణీ, దాంపత్యసుఖం అర్థించేవాడు పార్వతినీ కొలవాలి. ధర్మార్థాలపై అభిలాష కలవాడు పుణ్యచరిత్రుడైన విష్ణువునూ, సంతానం కోరేవాడు పితృదేవతలనూ, రక్షణ కాంక్షించేవాడు యక్షులనూ, బలం కోరేవాడు మరుద్గణాలనూ, రాచరికం కావాలి అనేవాడు మనురూపంలో ఉన్న దేవతలనూ, శత్రుమరణం వాంఛించేవాడు నిరృతినీ, భోగాలను అభిలషించేవాడు చంద్రుణ్ణీ ఆరాధించాలి.

**క. కామింపకయును సర్వముఁ, గామించియునైన ముక్తిఁ గామించి తగన్**
**లో మించి పరమపురుషుని, నేమించి భజించుఁ దత్త్వనిపుణుం డధిపా! 39**

* నరేంద్రా! పై చెప్పిన వాటి నన్నింటినీ కోరినా, కోరకపోయినా తత్త్వం తెలిసినవాడు మోక్షం మాత్రం తప్పక కోరుతాడు. హృదయంలో పరమేశ్వరుణ్ణి ప్రతిష్ఠించి భజిస్తాడు.

**మ. అమరేంద్రాదులఁ గొల్చుభంగి జనుఁ డాయబ్జాక్షు సేవింపఁగా**
**విమలజ్ఞాన విరక్తి ముక్తు లొదవున్ వేయేల? భూనాథ! త**
**త్కమలాధీశ కథాసుధారస నదీకల్లోలమాలా పరి**
**భ్రమ మెవ్వారికినైనఁ గర్ణయుగళీ పర్వంబు గాకుండునే! 40**

* పై కోరికలతో ఇంద్రుడు మొదలైన వారిని సేవించినట్లే పద్మ నేత్రుడైన విష్ణుని భజిస్తే నిర్మలమైన జ్ఞానమూ, వైరాగ్యమూ, మోక్షమూ సిద్ధిస్తాయి. రాజా! పలుమాట లెందుకు? ఆ లక్ష్మీనాథుని కథాప్రసంగాలనే నదీతరంగాలలో ఓలలాడటం కంటే అదృష్ట మేముంటుంది? శ్రీహరి కథలు ఎవరికైనా చెవుల పండువు చేయకుండా ఉంటాయా?

**వ. అని యిట్లు రాజునకు శుకుండు సెప్పె ననిన విని శౌనకుండు సూతున కిట్లనియె. 41**

* ఈ విధంగా పరీక్షిన్మహారాజుకు శుకయోగి చెప్పాడని సూతుడు పలుకగా విని శౌనకుడు సూతునితో ఇలా అన్నాడు.

**క. వర తాత్పర్యముతో నిటు, భరతాన్వయవిభుఁడు శుకుని పలుకులు విని స**
**త్వరతాయుతుఁడై శ్రేయ, స్కరతామతి నేమి యడిగె గణుతింపఁగదే! 42**

* ఈ రీతిగా శ్రీశుకుడు చెప్పిన మాటలు శ్రద్ధగా విన్న పరీక్షిత్తు శ్రేయోభిలాషియై వెంటనే యేమని ప్రశ్నించాడో వివరించవయ్యా!

**క. ఒప్పెడి హరికథ లెయ్యవి, సెప్పెడినో యనుచు మాకుఁ జిత్తోత్కంఠల్**
**గుప్పలుగొనుచున్నవి; రుచు, లుప్పతిలన్ నీ మనోహరోక్తులు వినఁగన్. 43**

* చవులూరించే మనోజ్ఞమైన నీ మాటలు వింటుంటే ఇంకా ఎలాంటి మంచి మంచి హరికథలు చెపుతాడో అని మా మనస్సులో ఉబలాటం పెల్లుబుకుతున్నది.

**వ. అనిన విని సూతుం డిట్లనియె. 44**

* శౌనకుడి మాటలు విని సూతు డిలా చెప్పాడు.

**క. తూలెడి కూఁకటితోడను, బాలురతో నాడుచుండి బాల్యమున మహీ**
**పాలుఁడు హరిచరణార్చన, హేలాలసుఁ డగుచు నుండె నెంతయు నియతిన్. 45**

* మునులారా! ఆ పరీక్షిన్మహారాజు బాల్యంలో తూలిపడే జులపాలజుట్టుతో తోడి బాలురతో ఆడుకుండే రోజుల్లోకూడ శ్రద్ధతో శ్రీహరి పాదాలను అర్చించేవాడు.

**వ. అట్టి పరమభాగవతుండైన పాండవేయునకు వాసుదేవ పరాయణుండైన శుకుం డిట్లనియె. 46**

* అలాంటి భాగవత శ్రేష్ఠుడైన పరీక్షిత్తుతో వాసుదేవుని భక్తుడైన శ్రీశుకుడిలా చెప్పాడు.

**సీ. వాసుదేవ శ్లోకవార్త లాలించుచుఁ గాల మే పుణ్యుండు గడుపుచుండు**
**నతని యాయువుఁదక్క నన్యుల యాయువు నుదయా స్తమయముల నుగ్రకరుఁడు**
**వంచించి కొనిపోవు, వాఁడది యెఱుఁగక జీవింతుఁ బెక్కేండ్లు సిద్ధ మనుచు**
**నంగనాపుత్ర గేహారామ విత్తాది సంసారహేతుక సంగ సుఖముఁ**

**తే. దగిలి వర్తింపఁ గాలంబు తఱి యెఱింగి, దండధరకింకరులు వచ్చి తాడనములు**
**సేసి కొనిపోవఁ బుణ్యంబు సేయ నైతిఁ, బాపరతి నైతి నని బిట్టు పలవరించు. 47**

* ఏ పుణ్యాత్ముడు భగవంతుని కథలు వింటూ కాలం గడుపుతాడో ఆతని ఆయుస్సు తప్ప ఇతరుల ఆయుస్సును సూర్యుడు ఉదయాస్తమయ సమయాలలో మోసగించి లాక్కుపోతూ ఉంటాడు. ఆ సంగతి తెలియక మూఢుడు 'నేను తప్పక బహుకాలం జీవిస్తాను' అనుకుంటాడు. సంసార కారణాలైన ఆలుబిడ్డలు, ఇల్లువాకిళ్ళు, తోటలు దొడ్లు ధనము మొదలైన వాటి తగులంలో చిక్కువడతాడు. అదను చూచి యముని బంట్లు వాణ్ణి పలువిధాల బాధిస్తూ యమలోకానికి తీసుక వెళతారు. అప్పుడు 'అయ్యో! నేను పుణ్యం చేయలేదే; పాపం చేశానే' అంటూ వాడు గోడుగోడున ఏడుస్తాడు.

వ. అది గావున. 48

సీ. అలరు జొంపములతో నభ్రంకషంబులై బ్రదుకవే వనములఁ బాదపములు!
ఖాదన మేహనాకాంక్షలఁ బశువులు జీవింపవే గ్రామసీమలందు!
నియతివై నుచ్ఛ్వాస నిశ్శ్వాస పవనముల్ ప్రాప్తింపవే చర్మభస్త్రికలును!
గ్రామసూకర శునకశ్రేణు లింటింటఁ దిరుగవే దుర్యోగదీనవృత్తి!

తే. నుష్ట్ర ఖరములు మోయవే యురుభరములఁ, బుండరీకాక్షు నెఱుఁగని పురుష పశువు
లడవులందు నివాసములందుఁ బ్రాణ, విషయభరయుక్తితో నుంట విఫల మధిప! 49

* అందువల్ల ఓ రాజా! పూలగుత్తులతో ఆకసమంటుతూ అడవులలో చెట్లు జీవించడం లేదా? ఆహారమైథునాది వాంఛలతో పశువులు పల్లె పట్టుల్లో బ్రతకడం లేదా? కొలిమితిత్తులు కూడ ఎడతెరిపి లేకుండా ఉచ్ఛ్వాస నిశ్శ్వాసలు సాగిస్తున్నాయి కదా! ఊరపందులు, కుక్కలు గుంపులుగుంపులుగా ఇల్లిల్లు చుడుతూ దిక్కుమాలినవై దీనంగా తిరగటం లేదా? ఒంటెలు, గాడిదలు పెద్దపెద్ద బరువులు మోస్తున్నాయి కదా? అదే విధంగా పద్మాక్షుని తెలియనేరని నరపశువులు అడవులలోనో, గృహాలలోనో సంసారభారాన్ని మోస్తూ జీవిస్తున్నారు. వాళ్ల బ్రతుకు వ్యర్థం.

సీ. విష్ణుకీర్తనములు వినని కర్ణంబులు కొండల బిలములు కువలయేశ!
చక్రిపద్యంబులఁ జదువని జిహ్వలు గప్పల జిహ్వలు కౌరవేంద్ర!
శ్రీమనోనాథు నీక్షింపని కన్నులు కేకిపింఛాక్షులు కీర్తిదయిత!
కమలాక్షు పూజకుఁగాని హస్తంబులు శవము హస్తంబులు సత్యవచన!

ఆ. హరిపద తులసీ దళామోద రతి లేని, ముక్కు పందిముక్కు మునిచరిత్ర!
గరుడగమను భజనగతి లేని పదములు, పాదపముల పాదపటల మనఘ! 50

* భూపతీ! విష్ణుదేవుని నామ సంకీర్తనలు వినని వీనులు పర్వతగుహలు. కురునాథా! చక్రధరుని మీద పద్యాలు చదువని నాలుకలు కప్పల నాలుకలు. కీర్తిమంతుడా! శ్రీకాంతుని కనలేని కన్నులు నెమలిపింఛపు కన్నులే. సత్యవచనుడా! రాజీవాక్షుని పూజకు ఉపకరించని చేతులు శవము చేతులు. రాజర్షీ! శ్రీహరి చరణాల మీది తులసీదళ పరిమళం ఆఘ్రాణించని ముక్కు పందిముక్కు. పాపరహితుడా! గరుడధ్వజుని భజించడానికి కదలని కాళ్లు చెట్ల వేళ్లు.

సీ. నారాయణుని దివ్యనామాక్షరములపైఁ గరఁగని మనములు కఠినశిలలు
మురవైరి కథలకు ముదితాశ్రురోమాంచ మిళితమై యుండని మేను మొద్దు
చక్రికి మ్రొక్కని జడుని యౌదల నున్న కనక కిరీటంబు గట్టెమోపు
మాధవార్పితముగా మనని మానవు సిరి వనదుర్గ చంద్రికావైభవంబు

ఆ. కైటభారిభజన గలిగి యుండని వాఁడు, గాలిలోన నుండి కదలు శవము
కమలనాభుపదముఁ గనని వాని బ్రతుకు, పసిఁడికాయలోని ప్రాణి బ్రతుకు. 51

* అంతేకాదు. శ్రీమన్నారాయణుని పవిత్ర నామాక్షర స్మరణతో ద్రవించనివి మనస్సులు కావు, అవి కరకు బండలు; అబ్జనాభుని కథలకు ఆనందబాష్పాలు రాలగా, పొంగి పులకించనిది శరీరం కాదు, అది వట్టిమొద్దు; పరమాత్మునకు ప్రణమిల్లని మూఢుని తలమీదిది బంగారు కిరీటం కాదు, అది కట్టెలమోపు; భగవంతునికి అర్పణంగాని మానవుని ఐశ్వర్యం ఐశ్వర్యం కాదు, అడవిగాసిన వెన్నెల; వాసుదేవుని సేవింపనివాడు ప్రాణవాయువులోపల ఉండటంవల్ల కదిలే శవం. పద్మనాభుని పాదములు ఆశ్రయింపనివాని జీవితం పొత్తి నూలికాయలోని పురుగు జీవితం.

**వ. అని యిట్లు వలికిన వైయాసి వచనంబుల కౌత్తరేయుండు కందళిత హృదయుండై నిర్మలమతి విశేషంబున. 52**

* ఇలా పలికిన శుకుని పలుకులకు పరీక్షిత్తు హృదయం వికసించింది. అతడు నిర్మలమైన బుద్ధి విశేషం కలవాడైనాడు.

**అ. సుతుల హితుల విడిచి, చుట్టాల విడిచి, యి ల్లాలి విడిచి, బహుబలాళి విడిచి,**
**రాజు హృదయ మిడియె రాజీవనయనుపై, ధనము విడిచి, జడ్డు(దనము విడిచి. 53**

* ఆ రాజు బిడ్డలనూ, హితులనూ, బంధువులనూ, భార్యనూ, ఇతర పరిజనాన్నీ, ధనాన్నీ, జడత్వాన్నీ వదలిపెట్టి పద్మనేత్రుడైన భగవంతుని పై మనస్సు నిలిపాడు.

**వ. ఇట్లు మృత్యుభయంబు నిరసించి ధర్మార్థకామంబులు సన్న్యసించి పురుషోత్తమునందుఁ జిత్తంబు విన్యసించి హరిలీలాలక్షణంబు లుపన్యసింపు మను తలంపున నరేంద్రుం డిట్లనియె. 54**

* ఈ విధంగా మరణభీతిని నిరాకరించి, ధర్మార్థకామములనే త్రివర్గాన్ని తిరస్కరించి, పరమ పురుషునందే మనస్సును కేంద్రీకరించి, శ్రీ మన్నారాయణుని లీలావిశేషాలను అభివర్ణింపగా ఆకర్ణించాలనే సంకల్పంతో పరీక్షిన్మహారాజు ఇలా అన్నాడు.

**క. సర్వాత్ము వాసుదేవుని, సర్వజ్ఞుఁడ వైన నీవు సంస్తుతి సేయన్**
**సర్వభ్రాంతులు వదలె మ, హోర్వీసురవర్య! మానసోత్సవ మగుచున్. 55**

* బ్రాహ్మణోత్తమా! సర్వమూ తెలిసిన నీవు సర్వానికీ ఆత్మయైన వాసుదేవుణ్ణి వినుతించేసరికి నాలోని భ్రమలన్నీ తొలగిపోయాయి. నా మనస్సు సంతోషపరవశమైంది.

**సీ. ఈశుండు హరి విష్ణుఁ డీ విశ్వ మే రీతిఁ బుట్టించుఁ రక్షించుఁ బొలియఁ జూచు**
**బహుశక్తియుతుఁడగు భగవంతుఁ డవ్యయుఁ డాది నే శక్తుల నాశ్రయించి**
**బ్రహ్మశక్రాది రూపముల వినోదించెఁ గ్రమముననో యేకకాలముననొ**
**ప్రకృతి గుణంబులఁబట్టి గ్రహించుట నేకత్వమున నుండు నీశ్వరుండు**

**ఆ. భిన్నమూర్తి యగుచుఁ బెక్కువిధంబుల, నేల యుండు? నతని కేమి వచ్చె**
**నుండకున్నఁ? దాపసోత్తమ! తెలుపవే!, వేడ్క నాకు సర్వవేది వీవు! 56**

* మునిపుంగవా! సర్వేశ్వరుడూ, సర్వవ్యాపీ ఐన శ్రీహరి ఈ జగత్తును ఎలా సృష్టించి, పోషించి, సంహరిస్తున్నాడు? అవ్యయుడైన ఆ పరమాత్ముడు అనేక శక్తులతో గూడినవాడు. అతడు మొదట ఏ శక్తుల సాయంతో బ్రహ్మ, ఇంద్రుడు మొదలైన రూపాలు తాల్చి వినోదించాడు? ఆయన ప్రకృతి గుణాలను పరిగ్రహించడం క్రమంగా జరుగుతుందా? లేక ఒకే సమయంలో జరుగుతుందా? ఏకమూర్తియైన ఈశ్వరుడు అనేక మూర్తులు ధరించి అనేక విధాల ఎందుకు ప్రవర్తిస్తాడు? అలా ప్రవర్తించక పోతే ఆయనకు వచ్చే నష్టమేమిటి? నీవు అంతా తెలిసినవాడవు. నాకీ విషయాలు వివరించు.

**వ. అనిన న య్యుత్తరానందను వచనంబులకు నిరుత్తరుండు గాక సదుత్తరప్రదాన కుతూహలుండై లోకోత్తర గుణోత్తరుండైన తాపసోత్తముండు దన చిత్తంబున. 57**

* పరీక్షిత్తు అలా అడిగేసరికి మౌనం వహింపక తగు సమాధానం చెప్పాలన్న కుతూహలంతో ఉత్తమగుణ సంపన్నుడైన శుకయోగి మనస్సులో ఇలా భగవంతుణ్ణి ప్రార్థించాడు.

**మ. పరుఁడై, యీశ్వరుఁడై, మహామహిముఁడై, ప్రాదుర్భవస్థాన సం**
**హరణక్రీడనుఁడై, త్రిశక్తియుతుఁడై యంతర్గతజ్యోతియై,**
**పరమేష్ఠి ప్రముఖామరాధిపులకుం బ్రాపింపరాకుండు దు**
**స్తర మార్గంబునఁ దేజరిల్లు హరికిం దత్త్వార్థినై మ్రొక్కెదన్. 58**

* ప్రకృతికంటే జీవునికంటే పరుడూ, ఈశ్వరుడూ, గొప్ప మహిమ కలవాడూ, సృష్టిస్థితిలయాలను ఆటగా సాగించేవాడూ, బ్రహ్మ విష్ణు మహేశ్వరులనే త్రిమూర్తుల శక్తి కలవాడూ, అందరికీ అంతరాత్మగా వెలుగొందేవాడూ, బ్రహ్మాదిదేవతలు అందుకోడానికి వీలుకాని దుస్తరమైన త్రోవలో ప్రకాశించేవాడూ అయిన శ్రీహరికి తత్త్వాభిలాషతో నమస్కరిస్తున్నాను.

**వ. మఱియు సజ్జనదురిత సంహారకుండును, దుర్జననివారకుండును, సర్వరూపకుండును, బరమహంసాశ్రమ ప్రవర్తమాన మునిజన హృదయ కమల కర్ణికా మధ్య ప్రదీపకుండును, సాత్వత శ్రేష్ఠుండును, నిఖిల కల్యాణ గుణ గరిష్ఠుండును, బరమ భక్తియుక్త సులభుండును, భక్తిహీనజన దుర్లభుండును, నిరతిశయ నిరుపమ నిరవధిక ప్రకారుండును, నిజస్వరూప బ్రహ్మవిహారుండును నైన యప్పరమేశ్వరునకు నమస్కరించెద. 59**

* సత్పురుషుల పాపాలను పరిహరించేవాడూ, దుర్జనులను శిక్షించే వాడూ, అన్నిరూపులూ తనరూపమే అయినవాడూ, పరమహంసాశ్రమములో ఉండే మునుల హృదయ కమల మధ్యంలో వెలుగొందేవాడూ, యాదవులలో శ్రేష్ఠుడూ, సమస్తకల్యాణ గుణాలతో శోభిల్లేవాడూ, ఉత్తములైన భక్తులకు సులువుగా లభించేవాడూ, భక్తి లేనివారికి ప్రాప్తించనివాడూ; అత్యుత్తమమూ, అనుపమానమూ, అనంతమూ అయిన ప్రవర్తన గలవాడూ, స్వస్వరూపమైన బ్రహ్మములో విహరించేవాడూ అయిన పరమేశ్వరునకు ప్రణమిల్లుతున్నాను.

**ఉ. ఏ విభు వందనార్చనము లే విభు చింతయు నామకీర్తనం**
**బే విభులీల లద్భుతము లెప్పుడు సంశ్రవణంబు సేయ దో**

**షావలిఁ బాసి లోకము శుభాయతవృత్తిఁ జెలంగునండ్రు నే**
**నా విభు నాశ్రయించెద నఘౌఘనివర్తను భద్రకీర్తనున్.** 60

* ఏ పరమేశ్వరుణ్ణి ఉద్దేశించి చేసిన నమస్కారం, పూజ, చింతన, నామసంకీర్తన అమోఘమో: ఎవరి కథలు వింటే దోషాలన్నీ తొలగి లోకం మంగళసంపన్న మవుతుందని పెద్దలు చెపుతున్నారో - అట్టి పాపనిచయ నివర్తనుడూ, మంగళమయ కీర్తనుడూ అయిన పరమేశ్వరుణ్ణి ఆశ్రయిస్తున్నాను.

ఉ. **ఏ పరమేశు పాదయుగ మెప్పుడు గోరి భజించి నేర్పరుల్**
**లోపలి బుద్ధితో నుభయలోకములందుల జడ్డుఁబాసి, యే**
**తాపము లేక బ్రహ్మగతిఁ దారు గతశ్రములై చరింతు: రే**
**నా పరమేశు మ్రొక్కెద నఘౌఘనివర్తను భద్రకీర్తనున్.** 61

* ఏ పరమేశ్వరుని పాదాలను ఎల్లవేళలా కోరి సేవించి నిపుణులైనవారు అంతర్ముఖమైన బుద్ధితో ఇహ పరలోకాలతోడి తగులం వదలుకొని, ఏ తాపమూ లేక పరబ్రహ్మను చేరే మార్గంలో ఏ కష్టమూ లేనివారై సంచరిస్తారో అట్టి పాపనిచయనివర్తనుడూ, మంగళమయ కీర్తనుడూ అయిన పరమేశ్వరుణ్ణి భజిస్తున్నాను.

చ. **తపములఁ జేసియైన, మఱి దానము లెన్నియుఁ జేసియైన, నే**
**జపములఁ జేసియైన, ధనసంచయ మెవ్వనిఁ జేర్చకున్న హే**
**యపదములై దురంత విపదంచితరీతిగ నొప్పుచుండు న**
**య్యపరమితున్ భజించెద నఘౌఘనివర్తను భద్రకీర్తనున్.** 62

* ఎన్నెన్ని తపస్సులూ, దానాలూ, జపాలూ చేసినా వాటివల్ల కలిగే ఫలాలను ఏ పరమేశ్వరుడికి అర్పించ కుంటే అవన్నీ నింద్యాలై ఆపదల క్రింద పరిణమిస్తాయో, అట్టి పరిమితి లేనివాడూ, పాపనిచయ నివర్తనుడూ, మంగళమయకీర్తనుడూ అయిన పరమేశ్వరుణ్ణి సేవిస్తున్నాను.

మ. **యవన వ్యాధ పుళింద హూణ శక కంకాభీర చండాల సం**
**భవులుం దక్కిన పాపవర్తనులు నే భద్రాత్ము సేవించి భా**
**గవతశ్రేష్ఠుల డాసి శుద్ధతనులై కళ్యాణులై యుందు రా**
**యవికారుం బ్రభవిష్ణు నాదు మదిలో నశ్రాంతమున్ మ్రొక్కెదన్.** 63

* యవనులు, కిరాతులు, పుళిందులు, హూణులు, శకులు, కంకులు, ఆభీరులు, చండాలురు - ఈ జాతుల్లో పుట్టినవారూ, మిగిలిన పాపాత్ములూ ఏ పరమపావనుని సేవించి భాగవత శ్రేష్ఠుల నాశ్రయించినవారై, పరిశుద్ధ శరీరులై మంగళాకారులై ఉంటారో అట్టి వికారరహితుడూ, సర్వసమర్థుడూ అయిన పరమాత్మకు నా మనస్సులో ఎల్లవేళలా నమస్కరిస్తాను.

**మ. తపముల్ సేసినవో, మనోనియతినో, దానవ్రతావృత్తినో**
**జపమంత్రంబులనో, శ్రుతిస్మృతులనో, సద్భక్తినో యెట్లు ల**
**బ్ధపదుండౌనని బ్రహ్మరుద్రముఖరుల్, భావింతు రెవ్వాని న**
**య్యపవర్గాధిపుఁ డాత్మమూర్తి సులభుండౌఁగాక నా కెప్పుడున్.** **64**

* తపస్సులతోనా? మనోనిగ్రహంతోనా? దానాలతోనా? వ్రతాలతోనా? జపాలతోనా? మంత్రాలతోనా? శ్రుతిస్మృతులను వల్లించడం వల్లనా? లేక ఉత్తమభక్తితోనా? ఎలా ఆయన దివ్యసన్నిధికి చేరగలం? అని బ్రహ్మ, రుద్రుడు మొదలైన వారు ఏ పరమాత్మను భావిస్తుంటారో ఆ మోక్షప్రభువూ, ఆత్మస్వరూపుడూ నాకు ఎల్లవేళలా సులభుడవుగాక!

**క. శ్రీపతియు యజ్ఞపతియుఁ బ్ర, జాపతియున్ బుద్ధిపతియు జగదధిపతియున్**
**భూపతియు యాదవశ్రే, ణీ పతియున్ గతియునైన నిపుణు భజింతున్.** **65**

* లక్ష్మికీ, యజ్ఞానికీ, ప్రజలకూ, బుద్ధికీ, జగత్తుకూ, భూమికీ, యాదవ వర్గానికీ, పతీ గతీ అయిన భగవంతుని సేవిస్తాను.

**మ. అణువో కాక కడున్ మహావిభవుఁడో, యచ్ఛిన్నుఁడో, ఛిన్నుఁడో,**
**గుణియో, నిర్గుణుఁడో యటంచు విబుధుల్ - గుంఠీభవత్తత్త్వ మా**
**ర్గణులై యే విభుపాదపద్మ భజనోత్కర్షంబులం దత్త్వ వీ**
**క్షణముం జేసెద రట్టి విష్ణుఁ బరమున్ సర్వాత్ము సేవించెదన్.** **66**

* ఆ పరమాత్ముడు అణుస్వరూపుడా? లేక విశ్వమంతటా వ్యాపించిన మహా స్వరూపుడా? దేశకాలాదులచేత అపరిచ్ఛిన్నుడా? లేక పరిచ్ఛిన్నుడా? ఆయన సగుణుడా? లేక నిర్గుణుడా? అని పండితులు వ్యర్థమైన తత్త్వాన్వేషణం చేసి చేసి చివరకు ఏ భగవంతుని పాదపద్మాలను అతిశయంగా భజించడం ద్వారా తత్త్వస్వరూపాన్ని గుర్తిస్తారో అట్టి సర్వవ్యాపకుడూ, సర్వోత్కృష్టుడూ, సర్వాత్మకుడూ అయిన పరాత్పరుణ్ణి భజిస్తాను.

**మ. జగదుత్పాదనబుద్ధి బ్రహ్మకు మదిన్ సంధింప నూహించి యే**
**భగవంతుండు సరస్వతిం బనుప నా పద్మాస్య దా నవ్విభున్**
**మగనిం గా నియమించి తద్భువన సామ్రాజ్యస్థితిన్ సృష్టి పా**
**రగుఁ జేసెన్ మును బ్రహ్మ: నట్టి గుణి నారంభింతు సేవింపఁగన్.** **67**

* బ్రహ్మకు జగత్తును సృష్టించాలనే బుద్ధిపుట్టించాలనే ఊహతో ఏ భగవంతుడు పూర్వం సరస్వతిని పంపగా ఆమె బ్రహ్మను భర్తగా స్వీకరించి లోకసామ్రాజ్యంలో ఆయనను సృష్టినిపుణుణ్ణి చేసిందో అట్టి గుణవంతుడైన భగవంతుని భజనకు ఉపక్రమిస్తాను.

**సీ. పూర్ణుఁ డయ్యును మహాభూత పంచకయోగ, మున మేనులను పురములు సృజించి**
**పురములలో నుండి పురుషభావంబున, దీపించు నెవ్వడు ధీరవృత్తిఁ**

**బంచభూతములను పదునొకం డింద్రియ, ములఁ బ్రకాశింపించి భూరిమహిమ**
**షోడశాత్మకుఁ డన శోభిల్లి జీవత్వ, నృత్తవినోదంబు నెఱపుచుండు**

**తే. నట్టి భగవంతుఁ డవ్యయుం డచ్యుతుండు, మానసోదిత వాక్పుష్పమాలికలను**
**మంజు నవరస మకరంద మహిమ లుట్ట, శిష్టహృద్భావలీలలఁ జేయుఁగాత! 68**

* తాను పరిపూర్ణుడై ఉండికూడా పృథివ్యాది పంచ మహాభూతాలను కలిపి శరీరాలను పురాలను సృష్టించి వాటిలో పురుషుడనే పేరుతో ఎవడు సదా ధీరుడై ప్రకాశిస్తుంటాడో; పంచభూతాలనూ, పదకొండు ఇంద్రియాలనూ ప్రకాశింపజేసి గొప్ప ప్రభావంతో షోడశకళాత్మకుడై శోభిల్లుతూ ఎవడు జీవత్వ మనే నృత్తవిలాసం ప్రదర్శిస్తుంటాడో; అవ్యయుడూ, అచ్యుతుడూ అయిన అట్టి భగవంతుడు మనోజ్ఞమైన నవరసాలనే తేనెలు జాలువారుతూ నా మనస్సునుండి పుట్టిన వాక్కులనే పుష్పమాలికలతో సజ్జనుల హృదయాల నలరించుగాక!

**ఉ. మానధనుల్, మహాత్ములు, సమాధినిరూఢులు, యన్ముఖాంబుజ**
**ధ్యానమరందపానమున నాత్మభయంబులఁ బాసి ముక్తులై**
**లూనత నొంద: రట్టి మునిలోక శిఖామణికిన్ విశంక టా**
**జ్ఞానతమో నభోమణికి సాధుజనాగ్రణి కేను మ్రొక్కెదన్. 69**

* మానమే ధనముగా గలవారూ, మహనీయులూ, సమాధినిష్ఠులూ, ఏ మహామహుని ముఖపద్మధ్యాన మనే తేనె లానుతూ, భయరహితులై, భవబంధ విముక్తులై ప్రకాశిస్తారో అట్టి మునిజన మకుటాయమానుడూ, గాఢమైన అజ్ఞానము అనే చీకటికి సహస్రభానుడూ, శిష్టులలో ప్రధానుడూ అయిన వ్యాసభగవానునికి వందనములు ఆచరిస్తున్నాను.

**వ. అని యిట్లు హరిగురువందనంబు సేసి శుకయోగీంద్రుండు రాజేంద్రున కిట్లనియె. 70**

* అని ఇలా హరికీ, తండ్రియైన వ్యాసమహర్షికీ ప్రణమిల్లి యోగీంద్రుడైన శుకుడు పరీక్షిన్మహారాజుతో ఇలా అన్నాడు.

**మ. అవిరోధంబున నీవు నన్నడుగు నీయర్థంబు మున్ బ్రహ్మ మా**
**ధవుచేతన్ విని నారదుం డడిగినం దథ్యంబుగాఁ జెప్పె! మా**
**నవలోకేశ్వర! నారదుండు వెనుకన్ నాకుం బ్రసాదించె! సం**
**శ్రవణీయంబు మహాద్భుతంబు వినుమా సందేహవిచ్ఛేదమున్. 71**

* రాజా! నీ విపుడు నన్నడిగిన విషయమే పూర్వం బహ్మదేవుడు నారాయణునివల్ల విన్నాడు. నారదు డడిగితే దానినే ఆయన వివరించాడు. ఆపైన నారదుడు నాకది తెలియజేశాడు. వినదగిందీ, మహాద్భుతమైనదీ, సంశయం తొలగించేదీ అయిన ఆ విషయం నీకు చెపుతాను; విను.

## -: నారదుండు బ్రహ్మను బ్రపంచ ప్రకారంబు నడుగుట. :-

వ. నారదుండు బ్రహ్మ కిట్లనియె. 72

* నారదమహర్షి బ్రహ్మదేవునితో ఇలా అన్నాడు.

**మ. చతురాస్యుండవు! వేల్పుఁ బెద్దవు! జగత్సర్గానుసంధాయి వీ**
**శ్రుతిసంఘాతము నీ ముఖాంబుజములన్ శోభిల్లు శబ్దార్థ సం**
**యుతమై! సర్వము నీ కరామలకమై యుండుం గదా! భారతీ**
**సతి యిల్లా లఁట నీకు! నో జనక! నా సందేహముం బాపవే! 73**

* తండ్రీ! నీవు చతుర్ముఖుడవు. దేవతలలో పెద్దవాడవు. లోకాలకు సృష్టికర్తవు. ఈ వేదాలన్నీ నీ ముఖపద్మాలలోనే ప్రకాశిస్తున్నాయి. శబ్దార్థమయమైన విశ్వమంతా నీకు అరచేతిలోని ఉసిరికపండు మాదిరి తేటతెల్లమే, పైగా నీకు సరస్వతీదేవి ఇల్లాలట ! ఇదిగో ! ఈ నా సందేహం తీర్చు.

**శా. ప్రారంభాది వివేక మెవ్వఁ డొసఁగుం? బ్రారంభసంపత్తి కా**
**ధారం బెయ్యది? యేమి హేతువు? యదర్థం బే స్వరూపంబు సం**
**సారానుక్రమ మూర్ణనాభపగిదిన్ సాగించె నెల్లప్పుడుం**
**భారం బెన్నఁడు లేదు! నీ మనువు దుష్ప్రాపంబు వాణీశ్వరా! 74**

* ఈ జగత్తుయొక్క సృష్టిని ప్రారంభించే విజ్ఞానం నీ కెవడు ప్రసాదిస్తున్నాడు! ఆ ప్రారంభసంపదకు ఆధార మేమిటి? ఈసృష్టి నిర్మాణానికి హేతు వేమిటి? దీనికి ప్రయోజన మేమిటి? దీని స్వరూప మేమిటి? సాగిస్తున్నా నీకు శ్రమ అనేది లేకుండా ఉన్నది. సరస్వతీనాథా! నీ జీవనపద్ధతి అందరికీ లభ్యపడేది కాదు.

**శా. నాకుం జూడఁగ నీవు రాజ వనుచున్నాఁడన్ యథార్థస్థితిన్**
**నీకంటెన్ ఘనుఁ డొక్క రాజు గలఁడో? నీ వంతకున్ రాజవో?**
**నీ కే లాభము రాఁదలంచి జగముల్ నిర్మించె, దీ చేతనా**
**నీకం బెందు జనించు నుండు నడఁగున్, నిక్కంబు భాషింపుమా. 75**

* నా మట్టుకు నేను నీవే ప్రభువని అనుకుంటున్నాను. వాస్తవానికి నీకంటే అధికుడైన ప్రభువు మరొకడున్నాడా? నీవే అందరికీ ప్రభుడవా? అయితే యే ప్రయోజనం కాంక్షించి నీ వీ లోకాలు సృష్టిస్తున్నావు? ఈ జీవసముదాయం ఎక్కడినుండి ఉద్భవిస్తున్నది? ఎక్కడ ఉంటున్నది? ఎక్కడ లయ మవుతున్నది? నిజం చెప్పవయ్యా!

**మ. సదసత్సంగతి నామ రూప గుణ దృశ్యం బైన విశ్వంబు నీ**
**హృదధీనంబు గదా! ఘనుల్ సములు నీకెవ్వారలున్ లేరు, నీ**

**పద మత్యున్నత, మిట్టి నీవు తపముం బ్రావీణ్యయుక్తుండవై**
**మది నే యీశ్వరుఁ గోరి చేసితివి? తన్మార్గంబు సూచింపవే! 76**

* సత్తు అసత్తుల కలయికవల్ల నామరూపగుణాలతో కనిపిస్తున్న ఈ ప్రపంచం నీ హృదయానికి లోబడిందే కదా! నీ కంటే అధికులు, నీతో సమానులు ఎవ్వరూ లేరు. నీ స్థానం కడు దొడ్డది. ఇలాంటి నీవు ఏ పరమేశ్వరుణ్ణి ఉద్దేశించి నేర్పుతో తపస్సు చేశావు? ఆ దారి ఏదో చూపవయ్యా!

**శా. అంభోజాసన! నీకు నీశుఁడు గలం డంటేనిఁ దత్పక్ష మం**
**దంభోజాతభవాండ మే విభుని లీలాపాంగ సంయుక్తిచే**
**సంభూతం బగు వర్తమాన మగు సంఛన్నం బగుం దద్విభున్**
**సంభాషింపఁగ వచ్చునేఁ దలఁప నే చందంబువాఁ డాకృతిన్? 77**

* ఓ పద్మసంభవా! నీకు ఒక ప్రభువున్నా డంటావా? అట్లైతే ఈ బ్రహ్మాండం ఏ ప్రభుని కటాక్ష విలాసంతో పుట్టుతున్నదో, పెరుగుతున్నదో, గిట్టుతున్నదో ఆ ప్రభుని గూర్చి ముచ్చటించుకోవచ్చునా? ఆయన స్వరూప మెలాంటిది?

**క. తోయజసంభవ! నా కీ, తోయము వివరింపు, చాలఁ దోఁచిన నే నా**
**తోయమువారికి నన్యుల, తోయములం జెందకుండ ధ్రువ మెఱిఁగింతున్. 78**

* కమల సంభవా! ఈ విషయం చక్కగా వివరించు. నా కీ సంగతి చక్కగా అర్థమైతే నన్నుసరించే వాళ్లకు ఈ సత్యం తెలియపరుస్తాను. వాళ్లు ఇతర మార్గాలను అనుసరింపకుండా చేస్తాను.

**వ. దేవా ! భూత భవిష్యద్వర్తమానంబులగు వ్యవహారంబులకు నీవ వల్లభుండు! నీ యెఱుంగని యర్థం బొండెద్దియు లేదు! విశ్వప్రకారంబు వినిపింపు మనిన విని వికసితముఖుండై విరించి యిట్లనియె. 79**

* స్వామీ! జరిగిన, జరుగనున్న, జరుగుతున్న వ్యవహారా లన్నిటికీ నీవే కర్తవు. నీకు తెలియని విషయమంటూ ఏదీ లేదు. ఈ ప్రపంచవిధానం నాకు తెలియజెప్పు - అని నారదుడు ప్రశ్నించాడు. అందుకు విప్పారిన వదనంతో విధాత ఇలా అన్నాడు.

**క. రారా బుధులు! విరక్తులు, గారా! యీ రీతి నడుగఁగా నేరరు వి**
**స్మేరావహము భవన్మత, మౌరా! నా విభుని మర్మ మడిగితి వత్సా! 80**

* కుమారా! ఎందరు పండితులు నిత్యం నా వద్దకు రావడం లేదు వారందరూ విరక్తులే కదా! అయినా వాళ్లెవరూ నీలాగా నన్ను ప్రశ్నించలేదు. నీ యభిప్రాయం నాకెంతో ఆనందం కలిగిస్తున్నది. ఆశ్చర్యం! నా ప్రభుని మర్మమే అడిగావు!

**శా. నానా స్థావర జంగమ ప్రకరముల్ నాయంత నిర్మింప వి**
**జ్ఞానం బేమియులేక తొట్రుపడ నిచ్చున్ నాకు సర్వానుసం**

ధానారంభ విచక్షణత్వము మహోదారంబుగా నిచ్చె ము
న్నే నా యీశ్వరు నాజ్ఞఁగాక జగముల్ నిర్మింప శక్తుండనే? 81

* నారదా! విను ! నానారూపాలతో ఉన్న ఈ చరాచర ప్రపంచాన్ని నా అంతట నేనే సృజించటానికి చాలిన తెలివి ఏ కొంచెమూ లేక తబ్బిబ్బు పడుతున్నాను. ఆ స్థితిలో పూర్వం సమస్త సృష్టిని ప్రారంభించడానికి అవసరమైన విజ్ఞానాన్ని నా కా ప్రభువు ఎంతో ఉదారబుద్ధితో అనుగ్రహించాడు. అలాంటి పరమేశ్వరుని ఆనతి లేకపోతే ఈ లోకాలు నిర్మించే శక్తి నాకెక్కడిది నాయనా!

మ. అనఘా! విశ్వము నెల్ల దీప్తముగఁ జేయన్ నే సమర్థుండనే?
యినచంద్రానల తారకాగ్రహగణం బే రీతి నా రీతి నె
వ్వని దీప్తిం బ్రతిదీప్త మయ్యె భువనవ్రాతంబు దద్దీప్తిచే
ననుదీప్తం బగునట్టి యీశ్వరున కే నశ్రాంతమున్ మ్రొక్కెదన్. 82

* పాపరహితుడా! ఈ ప్రపంచాన్నంతటినీ ప్రకాశింపజేసే సామర్థ్యం నాకు లేదు. ఎవని ప్రకాశం వల్ల సూర్యుడూ, చంద్రుడూ, అగ్నీ, నక్షత్రాలూ, గ్రహాలూ లాగానే ఈ లోకాలన్నీ సముజ్జ్వలంగా ప్రకాశిస్తున్నాయో, అట్టి దివ్యదీప్తితో తేజరిల్లుతున్న పరమేశ్వరునకు నే నెల్ల వేళలా ప్రణమిల్లుతున్నాను.

మ. విను మీ యీశ్వరు దృష్టిమార్గమున నావేశింప శంకించి సి
గ్గున సంకోచము నొందు మాయవలనం గుంఠీభవత్ప్రజ్ఞచే
నను లోకేశ్వరుఁడంచు మ్రొక్కు మతిహీనవ్రాతముం జూచి నే
ననిశంబున్ నగి ధిక్కరింతు హరిమాయాకృత్య మంచున్ సుతా! 83

* ఇంకా ఈ విషయం విశదంగా వినిపిస్తాను; విను. మాయ ఈశ్వరుని దృష్టిపథంలో ప్రవేశించడానికి శంకించి సిగ్గుతో కుంచించుకపోతుంది. ఈ మాయవల్ల తమ ప్రజ్ఞ కుంఠితం కాగా బుద్ధిలేని వాళ్లు నన్నే లోకవిభుడని భావించి నాకు నమస్కరిస్తుంటారు. వత్సా! అలాంటి మూర్ఖులను చూచి ఇది శ్రీహరి మాయవల్ల జరిగే పని కదా అని నాలో నేను నవ్వుకొని వాళ్లను త్రోసిపుచ్చుతాను.

వ. మఱియు దేహంబునకు ద్రవ్యంబులైన మహాభూతంబులును. జన్మనిమిత్తంబులైన కర్మంబులును, గర్మక్షోభకంబైన కాలంబును, గాలపరిణామ హేతువైన స్వభావంబును, భోక్తయైన జీవుండును. వాసుదేవుండ కా నెఱుంగుము, వాసుదేవ వ్యతిరిక్తంబు లేదు, సిద్ధంబు, నారాయణ నియమ్యంబులు లోకంబులు, దేవతలు నారాయణశరీర సంభూతులు, వేద యాగ తపో యోగ విజ్ఞానంబులు నారాయణ పరంబులు, జ్ఞానసాధ్యం బగు ఫలంబు నారాయణు నధీనంబు, కూటస్థుండును సర్వాత్మకుండును సర్వద్రష్టయు నయిన యీశ్వరుని కటాక్ష విశేషంబున సృజియింపంబడి ప్రేరితుండనై సృజ్యంబైన ప్రపంచంబు సృజించుచుండుదు, నిర్గుణుండైన యీశ్వరుని వలన రజస్సత్త్వతమోగుణంబులు ప్రభూతంబులై యుత్పత్తి స్థితి లయంబులకుం బాలుపడి కార్యకారణ కర్తృత్వభావంబులందు ద్రవ్యంబులైన మహాభూతంబులను జ్ఞానమూర్తులయిన దేవతలును

**గ్రియారూపంబులయిన యింద్రియంబులును నాశ్రయంబులుగా నిత్యముక్తుం డయ్యును మాయాసమన్వితుండైన జీవుని బంధించు, జీవునకు నావరణంబులయి యుపాధి భూతంబులయిన మూఁడు లింగంబులు సేసి పరులకు లక్షితంబుగాక తనకు లక్షితంబైన తత్త్వంబు గల యీశ్వరుం డివ్విధంబునం గ్రీడించుచుండు. 84**

* అంతేకాదు. శరీరనిర్మాణానికి ఉపయోగపడే పృథివ్యాది పంచ మహాభూతాలూ, పుట్టుకకు హేతువులైన కర్మలూ, కర్మ ప్రవృత్తికి హేతువైన కాలమూ, కాలము మార్పునకు కారణమైన స్వభావమూ, కర్మఫలం అనుభవించే జీవుడూ - అంతా వాసుదేవ స్వరూపులే అని తెలుసుకో. ఆ దేవుని కంటే అన్యమైనదీ లేదు. ఇది నిజం. ఈ లోకాలన్నీ నియమించే వాడు శ్రీమన్నారాయణుడే! వేల్పులు నారాయణుని శరీరంనుండి పుట్టినవారే! వేదాలూ, యాగాలూ, తపస్సులూ, ప్రాణాయామాది యోగాలూ, విజ్ఞానమూ అంతా నారాయణుని ఆరాధనా రూపమైనవే! జ్ఞానం వల్ల సాధించే ఫలం కూడా నారాయణుని అధీనంలోనే వుంది. నిర్వికారుడూ, సర్వాంతర్యామీ, సర్వదర్శనుడూ అయిన భగవంతుని క్రీగంటిచూపు వల్లనే నేను జన్మించాను. ఆయన కటాక్షం వల్లనే ప్రేరణపొంది సృజింపదగ్గ విశ్వమంతటినీ సృష్టిస్తున్నాను. గుణరహితుడైన ఈశ్వరుని నుండి రజస్సూ, సత్త్వమూ, తమస్సూ అనే మూడు గుణాలు పుడుతున్నాయి. అవి ఉత్పత్తికీ, స్థితికీ, లయానికీ హేతువు లవుతున్నాయి. కార్యభావంలోనూ, కారణభావంలోనూ, కర్తృభావంలోనూ ద్రవ్యాలైన పృథివ్యాది పంచ మహాభూతాలనూ, జ్ఞానరూపాలైన బ్రహ్మాది దేవతలనూ, క్రియారూపాలైన ఇంద్రియాలనూ ఆశ్రయిస్తున్నాయి. జీవుడు సదా ముక్తుడే అయినా మాయతో కూడి ఉండడం వల్ల ఆ త్రిగుణాలు అతణ్ణి బంధిస్తున్నాయి. జీవుణ్ణి కప్పివేసే ఉపాధులైన ఈ మూడు గుణాలను కల్పించి తద్వారా ఈశ్వరుడు ఇతరులకు ఏ మాత్రం గోచరించక తనకు మాత్రం గోచరించే తత్త్వంతో ఈ విధంగా వినోదిస్తూ ఉంటాడు.

**క. ఆ యీశుఁ డనంతుఁడు హరి, నాయకుఁ డీ భువనములకు, నాకున్, నీకున్,**
**మాయకుఁ బ్రాణివ్రాతము, కీ యెడలన్ లేద యీశ్వరేతరము సుతా! 85**

* కుమారా! ఆ పరమేశ్వరుడు తుది లేనివాడు. ఆ శ్రీహరి ఈ లోకాలకూ, నాకూ, నీకూ, మాయకూ, ప్రాణిసముదాయానికి ప్రభువు. ఆయన కంటే అన్యమైనది ఏదీ ఈ జగత్తులో లేనే లేదు.

**వ. వినుము, మాయావిభుండైన యీశ్వరుండు దన మాయంజేసి దైవయోగంబునం బ్రాప్తంబులయిన కాలజీవాదృష్ట స్వభావంబులు వివిధంబులు సేయ నిశ్చయించి కైకొనియె, నీశ్వరాధిష్ఠితంబైన మహత్తత్త్వంబు వలన నగు కాలంబున గుణవ్యతికరంబును స్వభావంబున బరిణామంబును జీవాదృష్టభూతంబయిన కర్మంబున జన్మంబును నయ్యె, రజస్సత్త్వంబులచే నుపబృంహితంబై వికారంబు నొందిన మహత్తత్త్వంబువలనం దమఃప్రధానంబై ద్రవ్యజ్ఞాన క్రియాత్మకంబగు నహంకారంబు గలిగె, నదియు రూపాంతరంబు లొందుచు ద్రవ్యశక్తియైన తామసంబును గ్రియాశక్తియైన రాజసంబును జ్ఞానశక్తియైన సాత్త్వికంబును నన మూఁడు విధంబులయ్యె, నందు భూతాదియైన తామసాహంకారంబు వలన నభంబు కలిగె, నభంబునకు సూక్ష్మరూపంబు**

ద్రష్టృదృశ్యములకు బోధకంబైన శబ్దంబు గుణంబగు, నభంబువలన వాయువు గలిగె, వాయువునకుం బరాన్వయంబున శబ్దంబు స్పర్శంబు నను రెండు గుణంబులు గలిగియుండు, నది దేహంబులం దుండుటం జేసి ప్రాణరూపంబై యింద్రియ మనశ్శరీర పాటవంబునై యోజస్సహోబలంబులకు హేతువై వర్తించు, వాయువు వలన రూప స్పర్శ శబ్దంబు లనియెడు గుణంబులుఁ మూఁటితోడఁ దేజంబు గలిగె, దేజంబువలన రస రూప స్పర్శ శబ్దంబు లనియెడు నాలుగు గుణంబులతో జలంబు గలిగె, జలంబువలన గంధ రస రూప స్పర్శ శబ్దంబు లనియెడు గుణంబు లయిదింటితోడం బృథివి గలిగె, వైకారికంబైన సాత్త్వికాహంకారంబు వలనఁ జంద్ర దైవతంబయిన మనంబు గలిగె; మఱియు దిక్కులును వాయువును నర్కుండును బ్రచేతసుండును నాశ్వినులును వహ్నియు నింద్రుండును నుపేంద్రుండును మిత్రుండును బ్రజాపతియు ననియెడి దశదేవతలు గలిగిరి, తైజసంబైన రాజసాహంకారంబు వలన దిగ్దైవతంబైన త్వగింద్రియంబును సూర్యదైవతంబైన రసనేంద్రియంబును నశ్విదైవతంబైన ఘ్రాణేంద్రియంబును వహ్నిదైవతంబైన హస్తేంద్రియంబును నుపేంద్ర దైవతంబైన పాదేంద్రియంబును మిత్ర దైవతంబైన గుదేంద్రియంబును బ్రజాపతి దైవతంబైన గుహ్యేంద్రియంబును ననియెడి దశేంద్రియంబులును బోధజనకాంతఃకరణైక భాగంబయిన బుద్ధియుఁ గ్రియాజనకాంతః కరణంబయిన ప్రాణంబునుం గలిగె,నిట్టి శ్రోత్రాదులగు దశేంద్రియంబులతోఁ గూడిన భూతేంద్రియ మనోగుణంబులు వేర్వేఱుగఁ బ్రహ్మాండ శరీర నిర్మాణంబునంద సమర్థంబు లగునపుడు గృహనిర్మాణంబునకుం బెక్కు పదార్థంబులు సంపాదించినంగాని చాలని చందంబున భూతేంద్రియ మనోగుణంబులవలన గృహంబుకైవడి భగవచ్ఛక్తి ప్రేరితంబు లగుచు నేకీభవించిన సమష్టి వ్యష్ట్యాత్మకత్వంబు నంగీకరించి చేతనాచేతనంబులం గల బ్రహ్మాండంబు కల్పితంబయ్యె, నట్టి యండంబు వర్షాయుత సహస్రాంతంబు దనుక జలంబునందుండెఁ, గాల కర్మ స్వభావంబులం దగులువడక సమస్తంబును జీవయుక్తంబుగఁ జేయ నీశ్వరుం డచేతనంబును సచేతనంబునుగ నొనర్చె, నంతం గాలకర్మస్వభావ ప్రేరకుండయిన పరమేశ్వరుండు జీవరూపంబున మహావరణ జలమధ్య స్థితంబయిన బ్రహ్మాండంబు లోను సొచ్చి సవిస్తారంబు గావించి యట్టి యండంబు భేదించి నిర్గమించె నెట్లంటేని. 86

* ఈశ్వరుడు మాయకు నియామకుడు, ఆ ప్రభువుకు తన మాయవల్ల కాలమూ, జీవాదృష్టమూ, స్వభావమూ అప్రయత్నంగా సిద్ధించాయి. వాటిని ఆయన వివిధరూపాలుగా చేయాలని నిశ్చయించుకొని సృష్టి కార్యానికి సహకారులుగా స్వీకరించాడు. ఈశ్వరునిచే అధిష్ఠింప బడ్డ మహత్తత్త్వం కారణంగా కాలంనుండి త్రిగుణాల వ్యత్యాసమూ, స్వభావం నుండి పరిణామమూ, జీవుని అదృష్టరూపంలో వున్న కర్మనుండి జన్మమూ సిద్ధించాయి. రజోగుణం చేతా, సత్త్వగుణం చేతా, వృద్ధిపొందిన మహత్తత్త్వం వికారానికి లోనయింది. దానినుంచే తమోగుణ ప్రధానమైనదీ, పంచభూతాలు, పంచజ్ఞానేంద్రియాలు, పంచకర్మేంద్రియాలు రూపంగా కలదీ అయిన అహంకారం జనించింది. ఆ అహంకారం మళ్ళీ వికారానికి లోనై ద్రవ్యశక్తి యైన తామసమనీ, క్రియాశక్తియైన రాజసమనీ, జ్ఞానశక్తియైన సాత్త్వికమనీ మూడు రూపాలుగా పరిణమించింది.

పంచభూతాలకూ మూలకారణమైన తామసాహంకారం నుండి ఆకాశం పుట్టింది. ద్రష్ట అయిన ఆత్మకూ, దృశ్యమైన జగత్తుకూ బోధకమూ, సూక్ష్మరూపమై వున్న శబ్దం ఆకాశానికి గుణమయింది. వికారానికి లోనైన ఆకాశం నుండి స్పర్శ గుణప్రధానమైన వాయువు పుట్టింది. తనకు కారణమైన ఆకాశమందలి శబ్దమూ, తనకు సహజమైన స్పర్శమూ అనే రెండు గుణాలు వాయువున కున్నాయి. వాయువు శరీరాలలో ప్రాణరూపంలో వుంటుంది. అది ఇంద్రియ పాటవానికీ, మనోబలానికీ, శారీరక శక్తికీ హేతువవుతున్నది. వికారం పొందిన వాయువునుండే రూపం, స్పర్శం, శబ్దం అనే మూడు గుణాలతో పాటు తేజస్సు జనించింది. తేజస్సునుండి రసం, రూపం, స్పర్శం, శబ్దం అనే నాలుగు గుణాలతోపాటు జలం జనించింది. జలంనుండి గంధం, రసం, రూపం, స్పర్శం, శబ్దం అనే అయిదు గుణాలతో పృథ్వి పుట్టింది. పై జెప్పినవన్నీ తామసాహంకారంనుండి కల్గినవే.

వికారానికి లోనైన సాత్త్వికాహంకారం నుండి మనస్సు పుట్టింది. దానికి చంద్రుడు అధిదేవత. అంతేకాక ఆ సాత్త్వికాహంకారం నుండే దిక్కులూ, వాయువూ, సూర్యుడూ, వరుణుడూ, అశ్వినీ దేవతలూ, అగ్ని, ఇంద్రుడూ, ఉపేంద్రుడూ, మిత్రుడూ, ప్రజాపతి అనే పదిమంది దేవతలు పుట్టారు.

తైజసమైన రాజసాహంకారం నుండి శ్రవణం మొదలైన ఐదు జ్ఞానేంద్రియాలూ, వాక్కు మొదలైన ఐదు కర్మేంద్రియాలూ, బుద్ధీ, ప్రాణమూ కలిగాయి. ఆ పది యింద్రియాల అధిదేవతల వివరమిది -

శ్రవణేంద్రియానికి దిక్కులూ, త్వగింద్రియానికి వాయువూ, నేత్రేంద్రియానికి సూర్యుడూ, రసనేంద్రియానికి ప్రచేతసుడూ, ఘ్రాణేంద్రియానికి అశ్వినీదేవతలూ, వాగింద్రియానికి అగ్నీ, హస్తేంద్రియానికి ఇంద్రుడూ, పాదేంద్రియానికి ఉపేంద్రుడూ, గుదేంద్రియానికి మిత్రుడూ, ఉపస్థేంద్రియానికి ప్రజాపతీ దేవతలుగా వున్నారు. బుద్ధి జ్ఞానం కలిగించే అంతఃకరణంలో ఒక భాగం. ప్రాణం క్రియను కల్గించే అంతఃకరణం.

శ్రోత్రం మొదలైన పది యింద్రియాలతో కూడిన భూతాలు, ఇంద్రియాలు, మనస్సు, శబ్దస్పర్శాది గుణాలు విడివిడిగా వున్నప్పుడు బ్రహ్మాండమనే శరీరాన్ని నిర్మించలేక పోయాయి. ఇల్లు కట్టాలంటే అనేక వస్తువులను ఒక్కచోట చేర్చితే కాని సాధ్యం కాదు గదా! అదే రీతిగా పైన జెప్పిన భూతాలు, ఇంద్రియాలు, మనస్సు, గుణాలు భగవంతుని శక్తివల్ల ప్రేరణపొంది ఒక్కటిగా చేరాయి. సమష్టిగానూ, వ్యష్టిగానూ కలిసి చేతనాలనూ, అచేతనాలనూ కల్పించాయి. అలా యీ బ్రహ్మాండాన్ని నిర్మించాయి. ఆ విధంగా నిర్మింపబడ్డ అండం కోటి సంవత్సరాల వరకూ నీళ్లలోనే వుండిపోయింది.

ఆ పైన కాలకర్మస్వభావాలకు లోను గానివాడూ, అన్నిటినీ ప్రాణవంతాలుగా చేయగలవాడూ అయిన ఈశ్వరుడు ప్రాణరహితమైన దానిని ప్రాణ సహితం చేశాడు. కాలకర్మస్వభావాలకు ప్రేరకుడైన ఆ పరమేశ్వరుడు మహావరణ జలమధ్యంలోవున్న బ్రహ్మాండంలో జీవరూపంలో ప్రవేశించి దాన్ని మిక్కిలి విస్తృతం చేశాడు. చివరికి ఆ అండాన్ని భేదించుకొని వెలికి వచ్చాడు. అది ఎలా జరిగిందో విను.

క. భువనాత్మకుఁ డాయీశుఁడు, భవనాకృతితోడ నుండు బ్రహ్మాండంబున్
వివరముతోఁ బదునాలుగు, వివరంబులుగా నొనర్చె విశదంబులుగన్. 87

* ప్రపంచ స్వరూపుడైన ఆ యీశ్వరుడు ఒక భవనం లాగావున్న బ్రహ్మాండాన్ని విడివిడిగా చేసి విపులమైన చతుర్దశభువనాలుగా తీర్చిదిద్దాడు.

మ. బహుపాదోరుభుజాన నేక్షణశిరఃఫాలశ్రవో యుక్తుఁడై
విహరించున్ బహుదేహి దేహగతుఁడై, విద్వాంసు లూహించి త
ద్బహు రూపావయవంబులన్ భువనసంపత్తిన్ విచారింతు, రా
మహనీయాద్భుతమూర్తి యోగిజనహృన్మాన్యుండు మేధానిధీ! 88

* బుద్ధిమంతుడా! ఆ దేవుడు అనేకాలైన పాదాలూ, ఊరువులూ, భుజాలూ, ముఖాలూ, నేత్రాలూ, శిరస్సులూ, నొసళ్లూ, చెవులతో కూడి వున్నాడు. అలా వుంటూ అనేక ప్రాణుల శరీరాలలో నెలకొని విహరిస్తూ వుంటాడు. పండితులు చక్కగా విమర్శించి ఆ భగవంతుని అనేక రూపాలైన అవయవాలలోనే సమస్తభువనాల ఉనికినీ విచారిస్తూ ఉంటారు. మహామహుడూ, ఆశ్చర్యకర స్వరూపుడూ అయిన ఆ భగవానుడు యోగుల హృదయాలలో అర్చింపదగి వున్నాడు.

వ. వినుము. చతుర్దశలోకంబులందు మీఁది యేడు లోకంబులు శ్రీమహావిష్ణువునకుం గటిప్రదేశంబున నుండి యూర్ధ్వదేహ మనియును, గ్రింది యేడు లోకంబులు జఘనంబునుండి యధోదేహ మనియునుం బలుకుదురు. ప్రపంచ శరీరుండగు భగవంతుని ముఖంబువలన బ్రహ్మకులంబును, బాహువులవలన క్షత్త్రియకులంబును, నూరువులవలన వైశ్యకులంబును, బాదంబులవలన శూద్రకులంబును జనియించెనని చెప్పుదురు; భూలోకంబు గటి ప్రదేశంబు, భువర్లోకంబు నాభి, సువర్లోకంబు హృదయంబు, మహర్లోకంబు వక్షంబు, జనలోకంబు గ్రీవంబు, తపోలోకంబు స్తనద్వయంబు, సనాతనంబును బ్రహ్మనివాసంబును నైన సత్యలోకంబు శిరంబు, జఘన ప్రదేశం బతలంబు, తొడలు వితలంబు, జానువులు సుతలంబు, జంఘలు తలాతలంబు, గుల్ఫంబులు మహీతలంబు, పదాగ్రంబులు రసాతలంబు, పాదతలంబు పాతాళంబు నని (లోకమయుంగా) భావింతురు. కొందఱు మఱియుం బాదతలంబువలన భూలోకంబును, నాభివలన భువర్లోకంబును, శిరంబువలన స్వర్లోకంబును గలిగెనని లోకకల్పనంబు నెన్నుదురు. పురుషోత్తముని ముఖంబువలన సర్వజంతు వాచాజాలంబును, తదధిష్ఠాతయగు వహ్నియు నుదయించె! చర్మరక్తమాంస మేదశ్శల్య మజ్జాశుక్లంబులు సప్తధాతువు లందురు. పక్షాంతరంబున రోమ త్వఙ్మాంసాస్థి స్నాయుమజ్జా ప్రాణంబులును సప్తధాతువులని యందురు, అందు రోమంబు లుష్ణిక్ఛందంబనియుఁ. ద్వక్కు ధాత్రీఛందం బనియు, మాంసంబు త్రిష్టుప్ఛందం బనియు, స్నాయు వనుష్టుప్ఛందం బనియు, నస్థి జగతీఛందం బనియు, మజ్జ పంక్తిచ్ఛందం బనియుఁ, బ్రాణంబు బృహతీఛందం బనియు నాదేశింతురు. హవ్యకవ్యామృతాన్నంబులకు, మధురాది షడ్రసంబులకు రసనేంద్రియంబునకు, రసాధీశ్వరుండైన వరుణునికిని హరిరసనేంద్రియంబు జన్మస్థానంబు. సర్వప్రాణాదులకు వాయువునకు

విష్ణునాసికా వివరంబు నివాసంబు. సమీప దూరవ్యాపి గంధంబులకు, నోషధులకు, నశ్విదేవతలకు భగవంతుని ఘ్రాణేంద్రియంబు నివాసంబు; దేవలోక సత్యలోకంబులకుఁ, దేజంబునకు, సూర్యునకు, సకలచక్షువులకు లోకలోచనుని చక్షురింద్రియంబు స్థానంబు; దిశలకు, నాకాశంబునకు, శ్రుతి భూతంబులైన యంశంబులకు, శబ్దంబునకు సర్వేశ్వరుని కర్ణేంద్రియంబు జన్మస్థానంబు. వస్తుసారంబులకు, వర్ణనీయ భాగ్యంబులకుఁ బరమ పురుషుని గాత్రంబు భాజనంబు. స్పర్శంబునకు, వాయువునకు, సకలస్నిగ్ధత్వంబునకు దివ్యదేహుని దేహేంద్రియంబు గేహంబు. యూపప్రముఖ యజ్ఞోపకరణంబులగు తరుగుల్మ లతాదులకుఁ బురుషోత్తముని రోమంబులు మూలంబులు, శిలాలోహంబులు సర్వమయుని నఖంబులు, మేఘజాలంబులు హృషీకేశుని కేశంబులు, మెఱుంగులు విశ్వేశ్వరుని శ్మశ్రువులు. భూర్భువస్సువర్లోక రక్షకులైన లోకపాలకుల పరాక్రమంబులకు భూరాది లోకంబులకు క్షేమంబునకు, శరణంబునకు నారాయణుని విక్రమంబులు నికేతనంబులు; సర్వకర్మంబులకు, నుత్తమంబులైన వరంబులకుఁ దీర్ఘపాదుని పాదారవిందంబు లాస్పదంబులు. జలంబులకు, శుక్లంబునకుఁ, బర్జన్యునకుఁ, బ్రజాపతిసర్గంబునకు సర్వేశ్వరుని మేఢ్రంబు సంభవ నిలయంబు. సంతానంబునకుఁ, గామాదిపురుషార్థంబులకుఁ జిత్తసౌఖ్యరూపంబులగు నానందంబు లకు, శరీర సౌఖ్యంబునకు నచ్యుతుని యుపస్థేంద్రియంబు స్థానంబు. యమునికి, మిత్రునికి, మలవిసర్గంబునకు భగవంతుని పాయ్వింద్రియంబు భవనంబు. హింసకు, నిర్ఋతికి, మృత్యువునకు, నిరయంబునకు నిఖిలరూపకుని గుదంబు నివాసంబు. పరాభవంబునకు, నధర్మంబునకు, నవిద్యకు, నంధకారంబునకు ననంతుని పృష్ఠభాగంబు సదనంబు, నదనదీ నివహంబునకు నీశ్వరునినాడీ సందోహంబు జన్మమందిరంబు. పర్వతంబులకు నధోక్షజుని శల్యంబులు జనకస్థలంబులు. ప్రధానంబునకు, నన్నరసంబునకు, సముద్రంబులకు, భూతలయంబునకు బ్రహ్మాండగర్భుని యుదరంబు నివేశంబు. మనోవ్యాపార రూపంబగు లింగశరీరంబునకు మహామహిముని హృదయంబు సర్గభూమి యగు, మఱియును. 89

* ఈ పదునాలుగు లోకాలలోనూ పై యేడు లోకాలూ శ్రీ మహావిష్ణువునకు నడుమునుండి పై శరీరమంటారు. అలాగే క్రింది యేడు లోకాలూ నడుమునుండి క్రింది శరీరమని చెబుతారు. ప్రపంచమే భగవంతునికి శరీరం. ఆయన ముఖంనుండి బ్రహ్మకులమూ, బాహువులనుండి క్షత్రియకులమూ, తొడలనుండి వైశ్యకులమూ, పాదాలనుండి శూద్రకులమూ పుట్టాయని వర్ణిస్తారు.

ఆ మహావిష్ణువుకు కటిస్థలం భూలోకం, నాభి భువర్లోకం, హృదయం సువర్లోకం, వక్షం మహర్లోకం, కంఠం జనలోకం, స్తనాలు తపోలోకం, శిరస్సు సనాతనమైన బ్రహ్మ నివసించే సత్యలోకం, జఘనం అతలం, తొడలు వితలం, మోకాళ్లు సుతలం, పిక్కలు తలాతలం, చీలమండలం మహాతలం, కాలి మునివేళ్లు రసాతలం, అరికాలు పాతాళం - ఈ కారణంగా ఆయనను లోకమయుడని భావిస్తారు.

మరికొంతమంది ఆయన పాదతలం నుండి భూలోకమూ, బొడ్డునుండి భువర్లోకమూ, శిరస్సునుండి స్వర్లోకమూ పుట్టాయని మూడు లోకాల సృష్టినీ వివరిస్తారు.

శ్రీమన్నారాయణుని ముఖంనుండి సమస్త ప్రాణుల వాక్కులూ, వాక్కుల కధిష్ఠానమైన అగ్నీ పుట్టాయి. చర్మం, రక్తం, మాంసం, మెదడు, ఎముకలు, మజ్జ, శుక్లం - ఇవి యేడూ ఆ దేవుని యేడు ధాతువులని చెబుతారు. మరొక పద్ధతిలో రోమాలు, చర్మం, మాంసం, ఎముకలు, స్నాయువులు, మజ్జ, ప్రాణాలు - ఇవి ఏడు ధాతువులని వర్ణిస్తారు.

వాటిలో రోమాలు ఉష్ణిక్ ఛందస్సనీ, చర్మం ధాత్రీఛందస్సనీ, మాంసం త్రిష్టుప్ ఛందస్సనీ, స్నాయువు అనుష్టుప్ ఛందస్సనీ, శల్యం జగతీఛందస్సనీ, మజ్జ పంక్తిచ్ఛందస్సనీ, ప్రాణం బృహతీ ఛందస్సనీ వ్యవహరిస్తారు.

దేవతల కర్పించే పురోడాశరూపమైన హవ్యానికీ, పితృదేవతలకిచ్చే చరురూపమైన కవ్యానికీ, అమృతాన్నానికీ, తీపి మొదలయిన ఆరు రసాలకీ, రసనేంద్రియానికీ, రసానికీ అధీశ్వరుడైన వరుణుడికీ విష్ణుదేవుని రసనేంద్రియమే జన్మస్థానం. అలాగే అన్ని ప్రాణాదులకూ, వాయువుకూ విష్ణుని నాసా రంధ్రం నెలవు. దగ్గరగానూ, దూరంగానూ వ్యాపించే వాసనలకూ, ఓషధులకూ, అశ్వినీ దేవతలకూ ఆ పరమేశ్వరుని ఘ్రాణేంద్రియం స్థానం.

దేవలోకానికీ, సత్యలోకానికీ, తేజస్సుకూ, సూర్యుడికీ, సకల నేత్రాలకూ లోకనేత్రుడైన పరమాత్ముని చక్షురింద్రియమే నివాసం. దిక్కులకూ, ఆకసానికీ, శ్రవణాంశాలకూ, శబ్దానికీ సర్వేశ్వరుని శ్రోత్రేంద్రియం జన్మభూమి. ప్రశస్తాలైన వస్తువులకూ, కొనియాడదగిన సౌందర్యాలకూ పరమ పురుషుని శరీరమే స్థానం.

స్పర్శానికీ, గాలికీ, నైగనిగ్యానికీ ఆ దివ్యశరీరుని త్వగింద్రియమే గృహం. యాగపశువును బంధించే స్తంభాది యజ్ఞపరికరాలైన చెట్లూ, పొదలూ, తీగలూ మొదలైన వాటికి పురుషోత్తముని రోమాలు స్థానాలు. రాళ్లూ, లోహాలు ఆ విశ్వమయునికి గోళ్లు. మబ్బులు సరోజాక్షుని శిరోజాలు. మెరపులు సర్వేశ్వరుని మీసాలు; భూలోక భువర్లోక సువర్లోకాలను కాపాడే లోకపాలకుల పరాక్రమాలకు, భూలోకం మొదలైన లోకాల క్షేమానికీ, శరణానికీ నారాయణుని పరాక్రమం నట్టిల్లు. ఎల్లకోరికలకూ, శ్రేష్ఠమైన వరాలకూ ఆ పవిత్రపాదుని పాదపద్మాలే నిలయాలు.

జలాలు, శుక్లం, పర్జన్యుడు, ప్రజాపతి సృష్టి - వీటన్నింటికీ ఆ సర్వేశ్వరుని పురుషాంగం జన్మస్థలం. సంతతికీ, కామం మొదలైన పురుషార్థాలకూ, మనస్సుకూ హాయి కలిగించే ఆనందాలకూ, శరీరసుఖానికీ అచ్యుతుని గుహ్యేంద్రియం స్థానం. యముడికీ, మిత్రుడికీ, మలవిసర్జనానికీ ఆ దేవుని గుదేంద్రియం ఇల్లు. హింసకూ, నిరృతికీ, మృత్యువుకూ, నరకానికీ ఆ సర్వరూపుని గుదం నెలవు. అవమానానికీ, అధర్మానికీ, అవిద్యకూ, చీకటికీ, అంతము లేని ఆ దేవుని పృష్ఠప్రదేశం నివాసం. నదనదీ సమూహాలకు ఈశ్వరుని నాడీ సంఘం పుట్టిల్లు. కొండలకు అధోక్షజుని ఎముకలు జన్మస్థానాలు. ప్రధానానికీ, అన్నరసానికీ, సముద్రాలకూ, భూతాల విలయానికీ ఆ బ్రహ్మాండగర్భుని ఉదరమే ఉనికిపట్టు. మానసిక వ్యాపార రూపమైన లింగదేహానికి గొప్పమహిమ గల ఆ దేవుని హృదయం సృష్టి స్థానం. అంతే కాదు.

**ఆ. నీలకంధరునకు నీకు నాకు సనత్కు, మారముఖ్య సుతసమాజమునకు**
**ధర్మసత్త్వబుద్ధి తత్త్వములకు నీశ్వ, రాత్మ వినుము పరమమైన నెలవు. 90**

* శివునికీ, నీకూ, నాకూ, సనత్కుమారుడు మొదలైన కుమారవర్గానికీ, ధర్మానికీ, సత్త్వానికీ, విజ్ఞానానికీ శ్రేష్ఠమైన మనికి పట్టు ఆ పరమేశ్వరుని ఆత్మే.

**సీ. నర సురాసుర పితృ నాగ కుంజర మృగ, గంధర్వ యక్ష రాక్షస మహీజ**
**సిద్ధ విద్యాధర జీమూత చారణ, గ్రహ తారకాప్సరోగణ విహంగ**
**భూత తటిద్వస్తు పుంజంబులును నీవు, ముక్కంటియును మహామునులు నేను**
**సలిలనభస్థ్సలచరములు మొదలైన, వివిధజీవులతోడి విశ్వమెల్ల**

**ఆ. విష్ణుమయము పుత్ర! వేయేల బ్రహ్మాండ, మతని జేనలోన నడఁగి యుండు**
**బుద్ధి నెఱుఁగరాదు భూతభవద్భవ్య, లోకమెల్ల విష్ణులోన నుండు. 91**

* కుమారా! మానవులూ, దేవతలూ, దానవులూ, పితరులూ, ఉరగులూ, గజాలూ, మృగాలూ, గంధర్వులూ, యక్షులూ, రాక్షసులూ, వృక్షాలూ, సిద్ధులూ, విద్యాధరులూ, మేఘాలూ, చారణులూ, గ్రహాలూ, నక్షత్రాలూ, అచ్చరలూ, పక్షులూ, భూతగణాలూ, మెరపులూ, కనకాది ధనరాసులూ, నీవూ, శివుడూ, మహర్షులూ, నేనూ; నీళ్లలోనూ, ఆకాశంలోనూ, భూమిమీదా సంచరించే వివిధ ప్రాణులతో గూడిన ఈ ప్రపంచమూ - అంతా విష్ణుమయమే. వేయిమాట లెందుకు? బ్రహ్మాండభాండాలన్నీ అతని జేనలో ఇమిడిపోతాయి. కేవలం బుద్ధిబలంతో మనం ఆ దేవదేవుని తెలిసికోలేము. కడచన్నవీ, ఇపుడున్నవీ, రానున్నవీ అయిన లోకాలన్నీ విష్ణువులోనే వున్నాయి.

**క. మండలములోన భాస్కరుఁ, డుండి జగంబులకు దీప్తి నొసఁగెడి క్రియ, బ్ర**
**హ్మాండములోపల నచ్యుతుఁ, డుండుచు బహిరంతరముల నొగి వెలిఁగించున్. 92**

* తన మండలంలోనే తానుంటూ సూర్యుడు లోకాలకు కాంతి నిస్తున్నాడు. అలాగే అచ్యుతుడు బ్రహ్మాండంలో వుంటూనే లోపలా, వెలుపలా ప్రకాశింపజేస్తున్నాడు.

**ఉ. అట్టి యనంతశక్తి జగదాత్ముని నాభిసరోజమందుఁ నేఁ**
**బుట్టి యజింపఁగా మనసు పుట్టిన యజ్ఞపదార్థజాతముల్**
**నెట్టన కానరామికి వినిర్మల యైన తదీయ రూపమున్**
**గట్టిగ బుద్ధిలో నిలిపి కంటి నుపాయము నామనంబునన్. 93**

* అటువంటి అనంతశక్తి గల విశ్వాత్ముని బొడ్డు తామరలో నేను పుట్టాను. నాకు యజ్ఞం చేయాలనే బుద్ధి పుట్టింది. కాని యజ్ఞాని కవసరమైన పదార్థా లేవీ నాకంటికి కనిపించలేదు. అపుడు అతి స్వచ్ఛమైన ఆ భగవంతుని స్వరూపాన్ని దృఢంగా బుద్ధిలో నిలిపి ధ్యానం చేశాను. అపుడు నా మనస్సులో ఒక ఉపాయం తోచింది.

సీ. పశుయజ్ఞ వాటయూపస్తంభ పాత్ర మ్ము, ద్ఘట శరావ వసంత కాలములును
స్నేహౌషధీబహులోహచాతుర్హోత్ర, మత నామ ధేయసన్మంత్రములును
సంకల్పఋగ్యజుస్సామ నియుక్త వ, షట్కారమంత్రానుచరణములును
దక్షిణల్ దేవతాధ్యాన తదనుగత, తంత్రవ్రతోద్దేశ ధరణిసురులు

తే. నర్పణంబులు బోధాయనాదికర్మ, సరణి మొదలగు యజ్ఞోపకరణ సమితి
యంతయును న మ్మహాత్ముని యవయవములు, గాఁగఁ గల్పించి విధివత్ప్రకారమునను. 94

* యజ్ఞపశువులూ, యాగశాలా, యూపస్తంభమూ, పాత్రలూ, మట్టికుండలూ, మూకుళ్ళూ, యాగానికి తగిన వసంత ఋతువూ, నేయీ, వడ్లూ మొదలైన ఓషధులూ, కాంచనాదులైన వివిధలోహాలూ, నలుగురు హోతలతో గూడిన దర్శపూర్ణమాసాది కర్మలూ, జ్యోతిష్టోమాది నామాలూ, మంత్రాలూ, సంకల్పమూ, ఋగ్యజుస్సామ వేదాలలోని వషట్కారాలతో గూడిన మంత్రాలూ, యాగదక్షిణలూ, దేవతాధ్యానమూ, దానికి తగిన తంత్రాలూ, వ్రతాలూ, భూసురులూ, దేవతల నుద్దేశించి చేసే కర్మ సమర్పణమూ, బోధాయనాది కల్పగ్రంథాలలోని కర్మక్రమమూ, యజ్ఞానికి కావలసిన ఇతర సంభారాలూ - ఇవన్నీ ఆ పరమేశ్వరుని అవయవాలుగా కల్పించాను. ఆపై శాస్త్రోక్త విధి ననుసరించాను.

క. యజ్ఞాంగి యజ్ఞఫలదుఁడు, యజ్ఞేశుఁడు యజ్ఞకర్త యగు భగవంతున్
యజ్ఞపురుషుఁగా మానస, యజ్ఞముఁ గావించితిం దదర్పణబుద్ధిన్. 95

* యజ్ఞమే శరీరమైన వాడూ, యజ్ఞానికి ఫలమిచ్చేవాడూ, యజ్ఞానికి ప్రభువూ, యజ్ఞానికి కర్తా అయిన భగవంతుణ్ణే యజ్ఞపురుషుణ్ణిగా చేసుకొన్నాను. ఆ యజ్ఞాన్ని ఆయనకే అర్పించాలన్న బుద్ధితో మానసయజ్ఞం చేశాను.

క. అప్పుడు బ్రహ్మలు దమలో, దప్పక ననుఁ జూచి సముచితక్రియు లగుచు
న్నప్పరమేశున కభిమత, మొప్పఁగఁ దగ సప్తతంతు వొగిఁ గావింపన్. 96

* అప్పుడు మరీచి మొదలైన ప్రజాపతులు నేను చేసిన యాగం చూచి తాము గూడా ఉత్సుకులై ఆ భగవానునికి ప్రీతి కలిగేటట్లు యజ్ఞం చేశారు.

చ. మనువులు, దేవదానవులు, మానవనాథులు, మర్త్యకోటి, దా
రనయము వారివారికిఁ బ్రియంబగు దేవతలన్ భజించుచున్,
ఘనతరనిష్ఠ యజ్ఞములఁ గైకొని చేసిరి, తత్ఫలంబు ల
య్యనుపమమూర్తి యజ్ఞమయుఁడైన రమావరునందుఁ జెందఁగన్. 97

* అది చూచి స్వాయంభువుడు మొదలైన మనువులూ, దేవతలూ, దానవులూ, రాజులూ, మనుష్యులూ - వీరందరూ వాళ్ల వాళ్ల కిష్టమైన దేవతలను కొలుస్తూ సాటిలేనివాడూ, యజ్ఞస్వరూపుడూ అయిన లక్ష్మీ నాథునికే ఫలం చెందునట్లుగా మహానిష్ఠతో యజ్ఞాలు చేశారు.

క. సువ్యక్త తంత్రరూపకుఁ, డవ్యక్తుఁ డనంతుఁ డభవుఁ డచ్యుతుఁ డీశుం
డవ్యయుఁ డగు హరి సురగణ, సేవ్యుఁడు క్రతుఫలదుఁ డగుటఁ జేసిరి మఖముల్. 98

* స్పష్టమైన తంత్రరూపం కలవాడూ, ఇతరులకు వ్యక్తం కానివాడూ, తుది లేనివాడూ, పుట్టుక లేనివాడూ, చ్యుతి లేనివాడూ, జగదీశ్వరుడూ, అవ్యయుడూ అయిన శ్రీహరి దేవతలకు సేవింపదగినవాడూ, యజ్ఞఫలాలను అనుగ్రహించేవాడూ కావడం వల్ల పైన చెప్పిన వారందరూ ఆయన నుద్దేశించే యజ్ఞాలు చేశారు.

క. అగుణుండగు పరమేశుఁడు, జగములఁ గల్పించుకొఱకుఁ జతురత మాయా
సగుణుం డగుఁ గావున హరి, భగవంతుం డనఁగఁ బరఁగె భవ్యచరిత్రా! 99

* పవిత్ర చరిత్రుడవైన నారదా! పరమేశ్వరుడు నిర్గుణుడు ఐనా జగత్తులను సృష్టించడానికై నేర్పుతో ఆయన తన మాయా ప్రభావం వల్ల గుణసహితు డవుతున్నాడు. అందువల్లనే ఆయన "భగవంతుడు"అని చెప్పబడుతున్నాడు.

క. విశ్వాత్ముఁడు. విశ్వేశుఁడు, విశ్వమయుం, డఖిలనేత, విష్ణుఁ, డజుం డీ
విశ్వములోఁ దా నుండును, విశ్వము దనలోనఁ జాల వెలుఁగుచు నుండన్. 100

* విశ్వానికి ఆత్మ అయినవాడూ, విశ్వానికి ప్రభువూ, విశ్వరూపుడూ, సమస్తానికీ నాయకుడూ, పుట్టుక లేనివాడూ అయిన విష్ణువు ఈ విశ్వంలో వుంటాడు. ఈ విశ్వం ఆయనలో మిక్కిలిగా ప్రకాశిస్తూ వుంటుంది.

చ. అతని నియుక్తిఁ జెంది సచరాచరభూత సమేతసృష్టి నే
వితతముగా సృజింతుఁ, బ్రభవిష్ణుఁడు విష్ణుఁడు ప్రోచుఁ, బార్వతీ
పతి లయ మొందఁజేయు, హరి పంకరుహోదరుఁ డాదిమూర్తి య
చ్యుతుఁడు త్రిశక్తియుక్తుఁ డగుచుండును నింతకుఁ దాన మూలమై. 101

* ఆ దేవుని ఆనతి ననుసరించి నేను చరాచరప్రాణులతో గూడిన ఈ సృష్టిని విస్తారంగా సృజిస్తున్నాను. ప్రభావసంపన్నుడైన విష్ణువు దీనిని పోషిస్తున్నాడు. పార్వతీనాథుడైన శివుడు దీనిని లయింప జేస్తున్నాడు. పద్మనాభుడూ, మొదటి వేలుపూ, అచ్యుతుడూ అయిన శ్రీహరి సృష్టి స్థితిలయాల కన్నిటికీ మూలహేతువై ఆ మూడు విధాలైన శక్తులతోనూ కూడి వుంటాడు.

క. విను వత్స! నీవు నన్నడి, గిన ప్రశ్నకు నుత్తరంబు కేవలపరమం
బను బ్రహ్మం బీ యఖిలం, బున కగు నాధారహేతుభూతము సుమ్మీ! 102

* కుమారా! నీవు నన్ను అడిగినప్రశ్నకు సమాధానం చెబుతాను, విను. ఈ సమస్త విశ్వానికీ ఆధారకారణ మైనది ఒకే ఒక పరబ్రహ్మమే సుమా!

క. హరి భగవంతుఁ డనంతుఁడు, కరణాంబుధి సృష్టికార్యకారణ హేతు
స్ఫురణుం డవ్విభుకంటెం, బరుఁ డెవ్వఁడు లేఁడు తండ్రి! పరికింపంగన్. 103

* శ్రీహరి షడ్గుణైశ్వర్య సంపన్నుడు, అంతము లేనివాడు, దయాసముద్రుడు, సృష్టి అనే కార్యానికి కారణభూత మైనవాడు. నాయనా! ఆలోచించి చూడగా ఆ ప్రభుని కంటే శ్రేష్ఠుడైనవాడు ఇంకొకడెవ్వడూ లేడు.

సీ. ఇది యంతయును నిక్క మే బొంక నుత్కంఠ మతిఁ దద్గుణధ్యానమహిమఁ జేసి
పరికింప నే నేమి పలికిన నది యెల్ల సత్యంబ యగు బుధస్తుత్య! వినుము
ధీయుక్త మామకేంద్రియములు మఱచియుఁ, బొరయ వసత్యవిస్ఫురణ మెందు!
నదిగాక మత్తను వామ్నాయతుల్యంబు, నమరేంద్రవందనీయంబు నయ్యెఁ,

తే. దవిలి యా దేవదేవుని భవమహాబ్ధి, తారణంబును మంగళకారణంబు
నఖిలసంపత్కరంబునై యలరు పాద, వనజమున కే నొనర్చెద వందనములు. 104

* ఇప్పుడు నేను చెప్పినదంతా నిజం. నేను అసత్యమాడను. పండిత స్తుతి పాత్రుడవైన ఓ నారదా! విను. ఔత్సుక్యంతో ఆ భగవంతుని గుణాలను ధ్యానించడం వల్ల కలిగిన ప్రభావంతో నే నేమి పలికినా అదంతా నిజమే అవుతుంది. ఓ బుద్ధిమంతుడా! నా ఇంద్రియాలు ఏ సందర్భంలో గానీ పొరపాటునగూడా అసత్యంవైపు ప్రసరించవు. అంతే కాదు. నా శరీరం వేదంతో సమానం. దేవేంద్రునికి గూడా ఇది నమస్కరింపదగిన దయింది. సంసార సాగరాన్ని దాటించేదీ, శుభాలకు హేతువై నదీ, సమస్తసంపదలను సమకూర్చేదీ అయిన ఆ దేవాదిదేవుని పాదపద్మ యుగళానికి నేను భక్తి భావంతో ప్రణామాలు చేస్తున్నాను.

ఉ. ఆ నళినాక్షు నందనుఁడ నయ్యుఁ, బ్రజాపతి నయ్యు, యోగ వి
ద్యానిపుణుండ నయ్యును, బదంపడి మజ్జననప్రకారమే
యేను నెఱుంగ, నవ్విభుని యిద్ధమహత్త్వ మెఱుంగ నేర్తునే?
కానఁబడున్ రమేశపరికల్పితవిశ్వము గొంతకొంతయున్. 105

* నేను ఆ పద్మలోచనుని కుమారుడనే, ప్రజాపతినే; యోగవిద్యలో నేర్పరినే - ఐనా నా పుట్టుక ఎలా జరిగిందో నేనే తెలిసికోలేకున్నాను. ఇక ఆ ప్రభుని ప్రదీప్తప్రభావం ఎలా తెలిసికోగలను? ఆ లక్ష్మీనాథుడు కల్పించిన ఈ ప్రపంచం కొంచెం కొంచెం నాకు గోచరిస్తున్నది.

మ. విను వే యేటికిఁ దాపసప్రవర! యి వ్విశ్వాత్ముఁ డీశుండు దాఁ
దన మాయామహిమాంతముం దెలియఁగాఁ దథ్యంబుగాఁ జాలఁ డ
న్నను, నే నైనను మీరలైన సురలైనన్ వామదేవుండు నై
నను నిక్కం బెఱుఁగంగఁ జాలుదుమె జ్ఞాన ప్రక్రియా యుక్తులన్. 106

* మునిశ్రేష్ఠా! వేయి మాట లెందుకు? ఇది విను. విశ్వస్వరూపుడైన ఈ పరమేశ్వరుడు తన మాయావైభవాన్ని కడముట్టా తానే గ్రహించలేకున్నాడు. ఇది వాస్తవం. అలాంటప్పుడు నేను గానీ, మీరుగానీ, ఇంద్రాది దేవతలుగానీ, కడకు శివుడుగానీ, మన జ్ఞానంతోనూ, క్రియలతోనూ ఉపాయాలతోనూ సత్యం తెలిసికోగలమా?

**వ. అమ్మహాత్ముండైన పుండరీకాక్షుండు సర్వజ్ఞుం డంటేని. 107**

* ఆ మహాత్ముడైన పద్మనేత్రుడు సర్వజ్ఞుడు గదా! తన మహిమ ఆయన కెందుకు తెలియదు? అని నీవు ప్రశ్నించవచ్చు. ఆ విషయం వివరిస్తాను, విను.

**క. గగనము దన కడపలఁ దాఁ, దగ నెఱుఁగని కరణి విభుఁడు దా నెఱుఁగఁ డనన్**
**గగనప్రసవము లే దన, నగునే సర్వజ్ఞతకును హాని దలంపన్. 108**

* ఆకాశం తన అంతాన్ని తానే తెలుసుకోలేదు. అదే విధంగా సర్వవ్యాపి అయిన దేవుడు తన సమగ్రతను తానే ఎరుగలేకున్నాడు. ఆకాశకుసుమం లేదన్నంతమాత్రాన సర్వజ్ఞత్వానికి హాని కల్గదుకదా! అదేరీతిగా తన అంతు తనకే తెలియదన్నంత మాత్రాన భగవంతుని సర్వజ్ఞత్వానికి లోటు వాటిల్లదు.

**చ. తలకొని యమ్మహాత్మకుఁడు దాల్చిన యయ్యవతారకర్మముల్**
**వెలయఁగ నస్మదాదులము వేయి విధంబుల సన్నుతింతు, మ**
**య్యలఘు ననంతునిం జిదచిదాత్మకు నాద్యు ననీశు నీశ్వరుం**
**దెలియఁగ నేర్తుమే తవిలి? దివ్యచరిత్రున కేను మ్రొక్కెదన్. 109**

* ఆ మహాత్ముడు జగద్రక్షణకు పూనుకొని ఆ యా అవతారాల్లో చేసిన పనులు మా బోంట్లం వేయి విధాల వినుతిస్తూ వుంటాం. మహామహుడూ, తుది లేనివాడూ, చిదచిత్స్వరూపుడూ, మొదటివాడూ, తనకు ప్రభువు లేనివాడూ, తానే ప్రభువైనవాడూ అయిన ఆ దేవుని ఎంత ప్రయత్నించినా మనం తెలుసుకోగలమా! దివ్యశీలుడైన ఆ దేవదేవునకు నేను నమస్కరిస్తాను.

**మ. పరమాత్ముం డజుఁ డీ జగంబుఁ బ్రతికల్పంబందుఁ గల్పించుఁ దాఁ**
**బరిరక్షించును ద్రుంచునట్టి యనఘున్ బ్రహ్మాత్ము నిత్యున్ జగ**
**ద్భరితుం గేవలు నద్వితీయుని విశుద్ధజ్ఞాను సర్వాత్ము నీ**
**శ్వరు నాద్యంతవిహీను నిర్గుణుని శశ్వన్మూర్తిఁ జింతించెదన్. 110**

* పుట్టుకలేని ఆ పరమాత్ముడు ప్రతికల్పంలోనూ ఈ విశ్వాన్ని పుట్టిస్తాడు, పోషిస్తాడు, సంహరిస్తాడు. పాపరహితుడూ, బ్రహ్మస్వరూపుడూ, శాశ్వతుడూ, జగమంతా నిండినవాడూ, కేవలుడూ, సాటిలేనివాడూ, నిర్మలమైన జ్ఞానం కలవాడూ, సర్వాంతర్యామీ, తుదిమొదళ్లు లేనివాడూ, గుణరహితుడూ, నిత్యుడూ అయిన ఆ పరమేశ్వరుణ్ణి ధ్యానిస్తున్నాను.

**చ. సరసగతిన్ మునీంద్రులు ప్రసన్న శరీరహృషీకమానస**
**స్ఫురణ గలప్పు డవ్విభుని భూరికళాకలిత స్వరూపముం**

దర మిడి చూతు! రెప్పుడుఁ గుతర్కతమోహతిచేత నజ్ఞతం
బొరసిన యప్పు డవ్విభుని మూర్తిఁ గనుంగొనలేరు నారదా! 111

* నారదా! మునీశ్వరులు తమ శరీరం, ఇంద్రియాలు, మనస్సు ప్రసన్నంగా వున్నప్పుడు మాత్రమే ఆ పరమాత్ముని మహితకళావిలసితమైన స్వరూపం చూడగలరు. ఎప్పుడు వాళ్లు కుత్సితమైన తర్కవితర్కాలనే తమస్సుకు లోబడి అజ్ఞానులై ప్రవర్తిస్తారో అప్పుడు ఆ దేవుని స్వరూపం గుర్తించలేరు.

వ. అని వెండియు నిట్లను. ననఘా! యమ్మహనీయతేజోనిధి మొదలి యవతారంబు సహస్రశీర్షాది యుక్తంబయి ప్రకృతి ప్రవర్తకంబగు నాదిపురుష రూపంబగు, నందుఁ గాలస్వభావంబులను శక్తు లుదయించె; నందుఁ గార్యకారణరూపంబయిన ప్రకృతి జనించెఁ, బ్రకృతివలన మహత్తత్త్వంబును దానివలన నహంకార త్రయంబును బుట్టె, నందు రాజసాహంకారంబువలన నింద్రియంబులును సాత్త్వికాహంకారంబువలన నింద్రియగుణ ప్రధానంబులైన యధిదేవతలును, తామసాహంకారంబు వలన భూతకారణంబు లయిన శబ్ద స్పర్శరూపరస గంధతన్మాత్రంబులునుం బొడమెఁ, బంచతన్మాత్రంబులవలన గగనానిలవహ్ని సలిలధరాదికంబైన భూతపంచకంబు గలిగె, నందు జ్ఞానేంద్రియంబులయిన త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వా ఘ్రాణంబులును గర్మేంద్రియంబులైన వాక్పాణి పాద పాయూపస్థంబులును మనంబును జనియించె, నన్నింటి సంఘాతంబున విశ్వరూపుండైన విరాట్పురుషుండు పుట్టె నతని వలన స్వయం ప్రకాశుం డయిన స్వరాట్టు సంభవించె, నందుఁ జరాచరరూపంబుల స్థావరజంగమాత్మకంబయిన జగత్తు గలిగె, నందు సత్త్వరజస్తమో గుణాత్మకుల మయిన విష్ణుండును హిరణ్యగర్భుండ నయిన యేనును రుద్రుండును గలిగితి, మందు సృష్టి జననకారణుండయిన చతుర్ముఖుండు పుట్టె. వానివలన దక్షాదులగు ప్రజాపతులు దొమ్మండ్రు గలిగిరి. అందు భవత్ప్రముఖులైన సనకసనందనాది యోగీంద్రులును, నాకలోకనివాసులయిన వాసవాదులును, ఖగలోకపాలకులగు గరుడాదులును, నృలోకపాలకులగు మనుమాంధాతృ ప్రముఖులును, దలలోకపాలకులగు ననంత వాసుకి ప్రభీతులును, గంధర్వ విద్యాధర చారణసాధ్యరక్షో యక్షోరగ నాగలోకపాలురును, మఱియు ఋషులును, బితృదేవతలును, దైత్యదానవ భూతప్రేతపిశాచ కూశ్మాండ పశుమృగాదులును నుద్భవించిరి. ఇట్టి జగత్ప్రథమోద్భవంబు మహత్తత్త్వసృష్టి యనంబడు. ద్వితీయం బండసంస్థితం బనం దగుఁ, దృతీయంబు సర్వభూతస్థం బననొప్పు, నం దైశ్వర్య తేజోబలసంపన్నులైన పురుషులు సర్వాత్ముండైన నారాయణుని యంశసంభవులుగా నెఱుంగుము. అప్పుండరీకాక్షుని లీలావతారంబు లనంతంబులు, దత్కర్మంబులు లెక్కవెట్ట నెవ్వరికిని నలవిగాదు, అయినను నాకుం దోఁచినంత నీ కెఱింగించెద వినుము. 112

*అని చెప్పి మళ్లీ బ్రహ్మ ఇలా అన్నాడు.

పాపరహితుడు! వేయి తలలు, వేయి నేత్రాలు, వేయి పాదాలు కలిగి ప్రకృతిని ప్రవర్తింపజేసే ఆదిపురుషుని రూపమే మహాతేజస్వి అయిన ఆ దేవదేవుని మొదటి అవతారం. ఆ అవతార స్వరూపం

నుండి కాలమూ స్వభావమూ అనే రెండు శక్తులు పుట్టాయి. అందులోనుంచి కార్యకారణరూపమైన ప్రకృతి పుట్టింది. ప్రకృతి నుండి మహత్తత్త్వం పుట్టింది. దానినుండి రాజసాహంకారం, సాత్త్వికాహంకారం, తామసాహంకారం అనే మూడహంకారాలు పుట్టాయి, వాటిలో రాజసాహంకారంనుండి ఇంద్రియాలు పుట్టాయి. సాత్త్వికాహంకారం నుండి ఇంద్రియగుణాలు ప్రధానంగా గల ఇంద్రాది దేవతలు పుట్టారు. తామసాహంకారం నుండి పంచభూతాలకు హేతువులైన శబ్దం, స్పర్శం, రూపం, రసం, గంధం అనే తన్మాత్రలు పుట్టాయి. ఆ తన్మాత్రలనుండి ఆకాశం, వాయువు, అగ్ని, జలం, భూమి అనే పంచభూతాలు ప్రభవించాయి. వాటినుండి త్వక్కు, చక్షువు, శ్రోత్రం, జిహ్వ, ఘ్రాణం అనే జ్ఞానేంద్రియాలూ మనస్సూ పుట్టాయి.

వీటన్నిటి చేరికవల్ల విశ్వస్వరూపుడైన విరాట్పురుషుడు ఉదయించాడు. అతని నుండి స్వయంప్రకాశుడైన స్వరాట్టు ఆవిర్భవించాడు. అతనిలో నుంచి చరాచర రూపాలతో స్థావరజంగమాత్మకం అయిన జగత్తు పుట్టింది. అందుండి సత్త్వగుణ స్వరూపుడైన విష్ణుడూ, రజోగుణ స్వరూపుడనై హిరణ్యాగర్భు డనబడే నేనూ, తమోగుణ స్వరూపుడైన రుద్రుడూ జన్మించాము. అందుండే సృష్టి ఉత్పత్తికి హేతువైన నాలుగు ముఖాల బ్రహ్మ ఉద్భవించాడు. ఆయనవల్ల దక్షుడు మొదలైన తొమ్మిది మంది ప్రజాపతులు పుట్టారు. వారినుండి నీవు, సనకుడు, సనందుడు మొదలైన యోగీశ్వరులు, స్వర్గలోకంలో వుండే ఇంద్రాదులు, పక్షిలోక రక్షకులైన గరుడాదులు, మానవలోకాన్ని పాలించే మనువు, మాంధాత మొదలగు వారూ, తలలోకాన్ని పాలించే అనంతుడు, వాసుకి మొదలైన వారూ, ఇంకా గంధర్వులూ, సిద్ధులూ, విద్యాధరులూ, చారణులూ, సాధ్యులూ, రాక్షసులూ, యక్షులూ, ఉరగులూ, నాగులూ - ఆ జాతులను పాలించేవారూ, ఋషులు, పితృదేవతలు, దైత్యులు, దానవులు, భూతాలు, ప్రేతాలు, పిశాచాలు, కూశ్మాండులు మరిన్నీ పశుమృగాదులు ఉద్భవించాయి.

ఇలాంటి జగత్తు మొదటి పుట్టుకను మహత్తత్త్వ సృష్టి అంటారు. రెండవది అండగతమైన సృష్టి. మూడవది సమస్త భూతగతమైన సృష్టి. అందులో ఐశ్వర్యమూ, తేజస్సు, బలమూ గల పురుషులు సర్వాంతర్యామి అయిన శ్రీ మన్నారాయణుని అంశమందు పుట్టినవారుగా తెలుసుకో. ఆ అరవిందాక్షుని లీలావతారాలకు అంతం లేదు. ఆయన ఆచరించే మంచి పనులు లెక్కించడం ఎవరికీ శక్యం గాదు. అయినా నాకు తోచినంత వరకూ నీకు వినిపించుతాను, విను.

### -: శ్రీ మన్నారాయణుని లీలావతారంబుల యభివర్ణనము :-

**ఉ. అన్యకథానులాపము లహర్నిశమున్ వినునట్టి సత్క్రియా**
**శూన్యములైన కర్ణముల సూరిజనస్తుత! సర్వలోక స**
**మ్మాన్యమునై తనర్చు హరిమంగళ దివ్యకథామృతంబు సౌ**
**జన్యతఁ గ్రోలవయ్య బుధసత్తమ! యే వివరించి చెప్పెదన్! 113**

* సూరివరేణ్యులకు ఆరాధనీయుడవైన నారదా! రేయింబవళ్లూ ఇతరకథా ప్రసంగాలు వింటూ ఏమాత్రం పుణ్యకథల పొంతబోని వీనులకు విష్ణుకథలు విందుచేస్తాయి. సకల లోక పూజనీయమై వెలుగొందే ఆ దేవదేవుని దివ్యమంగళ కథాసుధారసాన్ని నేను నీకు అందిస్తాను. ఆసక్తితో ఆస్వాదించవయ్యా!

వ. అని పలికి నారదుం జూచి మఱియు నిట్లనియె. 114

* ఈ విధంగా పలికి నారదుని చూచి బ్రహ్మ మళ్లీ ఇలా చెప్పసాగాడు.

మ. కనకాక్షుండు భుజావిజృంభణమునన్ క్ష్మాచక్రముం జాపఁ జు
ట్టిన మాడ్కిం గొనిపోవ, యజ్ఞమయదంష్ట్రి స్వాకృతిందాల్చి య
ద్దనుజాధీశ్వరుఁ దాఁకి యబ్ధినడుమన్ దంష్ట్రాహతిం ద్రుంప ధా
త్రిని గూలెం గులిశాహతిం బడు మహాద్రిం బోలి యత్యుగ్రతన్. 115

* పూర్వం హిరణ్యాక్షుడనే రాక్షసు డుండేవాడు. వాడు బాహుబలాటోపంతో భూచక్రాన్ని చాపచుట్టినట్లు చుట్టి సాగరగర్భంలో దాగాడు. అప్పుడు శ్రీమన్నారాయణుడు యజ్ఞవరాహరూపం ధరించి ఆ దానవరాజుతో దారుణమైన రణం చేశాడు. అపార పారావారం నడుమ కోరలతో క్రుమ్మి ఆ రక్కసుణ్ణి ఉక్కడగించాడు. వజ్రాయుధం వ్రేటుకు నేలగూలే మహాపర్వతం లాగా వాడు అతిభీకరాకారంతో క్రిందపడ్డాడు. ఇది యజ్ఞవరాహావతార కథ.

వ. మఱియు సుయజ్ఞావతారంబు విను మని యిట్లనియె. 116

* ఇక సుయజ్ఞావతారం ఎలా జరిగిందో చెబుతాను వినుమని నారదునితో బ్రహ్మ మళ్లీ ఇలా అన్నాడు.

సీ. ప్రకట రుచి ప్రజాపతికిని స్వాయంభువుని కూఁతు రాకూతి యను లతాంగి
కర్థి జన్మించి సుయజ్ఞుండు నా నొప్ప నతఁడు దక్షిణ యను నతివయందు
సుయమనామామరస్తోమంబుఁ బుట్టించి యింద్రుఁడై వెలసి యుపేంద్రలీల
సఖిలలోకంబుల యార్తి హరించిన నతని మాతామహుండైన మనువు

తే. తనమనంబునఁ దచ్చరిత్రమున కలరి, పరమ పుణ్యుండు హరి యని పలికెఁ గాన
నంచిత జ్ఞాననిధియై సుయజ్ఞుఁ డెలమిఁ, దాపసోత్తమ! హరి యవతారమయ్యె. 117

* పూర్వం రుచి అనే ప్రజాపతికీ, స్వాయంభువ మనువు కూతురైన ఆకూతి అనే సుగుణవతికీ "సుయజ్ఞుడు" అనేవాడు పుట్టాడు. అతడు "దక్షిణ"అనే కాంతను పత్నిగా స్వీకరించాడు. ఆమె కడుపున సుయములు అన్న పేరుగల వేల్పులను జన్మింపజేశాడు. ఇంద్రుడై దేవతలకు నాయకత్వం ఇచ్చాడు. విష్ణువులాగా సమస్తలోకాల దుఃఖాన్నీ పరిహరింప జేశాడు. తాత అయిన స్వాయంభువ మనువు తన మనుమని చరిత్రకు మనసులో ఎంతో సంతోషించి 'ఈ పరమ పవిత్రుడు శ్రీహరియే"అని పలికాడు. మునీంద్రా! ఆ కారణంవల్ల ఉత్తమ జ్ఞానానికి నిధియైన సుయజ్ఞుడు "హరి" అవతారంగా ప్రశస్తి వహించాడు.

వ. అని చెప్పి సాంఖ్యయోగ ప్రవర్తకాచార్యవర్యుం డగు కపిలుని యవతారంబు విను మని యిట్లనియె.118

* బ్రహ్మదేవుడు పై కథ చెప్పి ఆపై షడ్దర్శనాలలో ఒకటైన సాంఖ్య యోగం ప్రవర్తింపజేసిన కపిలమహర్షి అవతారగాథను ఆలకించమంటూ ఇలా అన్నాడు.

**చ. ధృతమతి దేవహూతికిని దివ్యవిభుండగు కర్దమప్రజా**
**పతికిఁ బ్రమోద మొప్ప నవభామలతోఁ గపిలాఖ్యఁ బుట్టి యే**
**గతి హరి పొందు నట్టి సుభగంబగు సాంఖ్యము దల్లి కిచ్చి దు**
**ష్కృతములు వాసి చూపె మునిసేవితమై తనరారు మోక్షమున్. 119**

* దేవహూతి అనే ఆమె నిశ్చలమతి అయిన సతి. దివ్యతేజస్వియైన కర్దమ ప్రజాపతి ఆమె పతి. ఆ దంపతులకు ఆనందం అతిశయింపగా తొమ్మండుగురు ఆడు తోబుట్టువులతో సహా శ్రీహరి 'కపిలుడు' అన్న పేరుతో ఆవిర్భవించాడు. ఏ యోగంతో నారాయణుని పొందటానికి వీలవుతుందో, ఆ మనోజ్ఞమైన సాంఖ్యయోగాన్ని ఆ మహనీయుడు తల్లికి బోధించాడు. ఆ విధంగా ఆమె పాపాలు రూపుమాపి మునులు అపేక్షించే మోక్షాన్ని ఆమెకు ప్రసాదించాడు.

**వ. మఱియు దత్తాత్రేయావతారంబు వినుము. 120**

* ఇక దత్తాత్రేయుని అవతారం ఎలా విలసిల్లిందో వివరిస్తాను విను.

**సీ. తాపసో త్తముఁ డత్రి తనయునిఁ గోరి రమేశు వేఁడిన హరి యేను నీకు**
**ననఘ! "దత్తుఁడ నైతి" నని పల్కుకతమున నతఁడు దత్తాత్రేయుఁడై జనించె**
**న మ్మహాత్ముని చరణాబ్జ పరాగ సందోహంబుచేఁ బూతదేహు లగుచు**
**హైహయ యదువంశ్యు లైహికాముష్మిక ఫలరూప మగు యోగబలము వడసి**

**తే. సంచిత జ్ఞాన ఫల సుఖైశ్వర్య శక్తి, శౌర్యములఁ బొంది తమ కీర్తి చదల వెలుఁగ**
**నిందు నందును వాసికి నెక్కి, రట్టి, దివ్యతర మూర్తి విష్ణు నుతింపఁదరమె? 121**

* అత్రిమహర్షి మునులలో మేటి. ఆయన తనకు పుత్రుణ్ణి ప్రసాదించమని లక్ష్మీనాథుణ్ణి ప్రార్థించాడు. అప్పుడు శ్రీహరి "పాపరహితుడవైన ఓ మునీంద్రా! నేను నీకు "దత్తుడ నయ్యాను" అని అన్నాడు. అందువల్ల హరియే అత్రికి దత్తాత్రేయుడై జన్మించాడు. ఆ మహనీయుని పాదపద్మపరాగం సోకి హైహయవంశానికీ, యదువంశానికీ చెందిన వారందరూ పవిత్రదేహు లయ్యారు. ఆయన అనుగ్రహంవల్లనే వాళ్లు ఇహపరలోకాలు ప్రసాదించే యోగబలం ఆర్జించుకొన్నారు. జ్ఞాన ఫలాన్నీ, సుఖాన్నీ, ఐశ్వర్యాన్నీ, శక్తినీ, శౌర్యాన్నీ పొందారు. తమ కీర్తి మింట వెలుగొందుతుండగా ఉభయలోకాలలో ప్రసిద్ధి వహించారు. అలాంటి దివ్యరూపుడైన విష్ణుదేవుని వినుతించడం సాధ్యమా!

**వ. వెండియు సనకాద్యవతారంబు వినుము. 122**

* ఇక సనకాదుల అవతార ప్రకారం ఆలకించు.

సీ. అనఘాత్మ! యేను గల్పాదిని విశ్వంబు సృజియింపఁ దలఁచి యంచిత తపంబు
నర్థిఁ జేయుచు "సన" యని పల్కుటయు నది కారణంబుగ సనాఖ్యలను గల "స
నందన", "సనక", "సనత్కుమార", "సనత్సుజాతులు" నల్వురు సంభవించి
మానసపుత్రులై మహి నుతికెక్కిరి పోయిన కల్పాంతమున నశించి

తే. నట్టి యాత్మీయ తత్త్వంబు పుట్టఁ జేసి, సంప్రదాయక భంగిని జగతి నెల్లఁ
గలుగఁజేసిరి య విష్ణుకళలఁ దనరి, నలువు రయ్యును నొక్కఁడ నయచరిత్ర! 123

* పవిత్రాత్మా! నేను కల్పారంభంలో విశ్వాన్ని సృష్టింపదలచు కొన్నాను. అందుకై తపస్సు చేస్తూ 'సన' అని పలికాను. అందువల్ల 'సన' అనే పేరుతో 'సనకుడు, సనందుడు, సనత్కుమారుడు, సనత్సుజాతుడు' అనే నలుగురు పుట్టారు. వాళ్ల బ్రహ్మమానసపుత్రులుగా ప్రపంచంలో ప్రసిద్ధికెక్కారు. గతించిన కల్పం చివర అంతరించిపోయిన ఆత్మ తత్త్వాన్ని వాళ్లు మళ్లీ లోకంలో సంప్రదాయానుసారంగా ప్రవర్తింపజేశారు. నయశీలుడవైన నారదా! ఆ విష్ణుదేవుని కళలతో జన్మించిన వాళ్లు నలుగురైనా నిజానికి వారి అవతారం ఒక్కటే.

వ. మఱియు నరనారాయణావతారంబు వినుము. 124

* ఇంక నరనారాయణుల అవతారపద్ధతి ఆకర్ణించు.

క. గణుతింపఁగ నరనారా, యణు లన ధర్మునకు నుదయ మందిరి దాక్షా
యణి యైన "మూర్తి"వలనం, బ్రణుతగుణోత్తరులు పరమపావనమూర్తుల్. 125

* వినుతిగాంచిన గుణాలు గలవారూ, మిక్కిలి పవిత్రమూర్తులూ అయిన నరనారాయణు లనేవారు ధర్మానికి అధిష్ఠానమైన ధర్ముడికి, దక్షుని కుమార్తె అయిన 'మూర్తి' యందు జన్మించారు.

క. అనఘులు బదరీవనమున, వినుతతపోవృత్తి నుండ, విబుధాధిపుఁడున్
మనమున నిజపదహానికి, ఘనముగఁ జింతించి దివిజకాంతామణులన్. 126

* ఆ పరమపావనులు బదరికా వనానికి వెళ్లి నిశ్చల తపస్సులో నిమగ్ను లయ్యారు. వాళ్ల తపస్సు ఫలిస్తే తన పదవికి ఎక్కడ ముప్పు మూడుతుందో అని మహేంద్రుడు మనస్సులో ఎంతో చింతించాడు. అప్సరసలను పిలిపించాడు.

క. రావించి "తపోవిఘ్నముఁ, గావింపుం"డనుచు బనుపఁ గడు వేడుకతో
భావభవానీకిను లనఁ, గా వనితలు సనిరి బదరికా వనమునకున్. 127

* ఆ విధంగా అతడు సురసుందరులను పిలిపించి 'నరనారాయణుల తపస్సు చెడగొట్టండి'అని చెప్పి పంపాడు. ఆకాంతలు ఎంతో సంతోషంతో కంతుని చతురంగసేనలా అన్నట్లు బయలుదేరి బదరీవనానికి వెళ్ళారు.

వ. అందు. 128

మ. నరనారాయణు లున్న చోటికి మరున్నారీసమూహంబు భా
స్వరలీలం జని రూపవిభ్రమ కళాచాతుర్య మేపారఁగాఁ
బరిహాసోక్తుల నాటపాటలఁ జరింపం జూచి నిశ్చింతతన్
భరితధ్యాన తపఃప్రభావనిరతిం బాటించి నిష్కాములై. 129

* అక్కడ నరుడు, నారాయణుడు తపస్సు చేస్తున్న ప్రదేశానికి దేవకాంతలు సవిలాసంగా వచ్చారు. అందచందాల తీరూ, కళానైపుణ్యాల సొరూ, ఉట్టిపడేటట్లు పరియాచకాలు పలుకుతూ, ఆటలాడుతూ, పాటలు పాడుతూ విహరించారు. అలా విలాసలీలలతో తపోవనంలో విచ్చలవిడిగా విహరిస్తున్న అప్సరసలను నరనారాయణులు చూచారు. కాని ఏ మాత్రం చలించలేదు. కామానికి లోను కాలేదు. నిశ్చింతులై, నిర్మోహులై వాళ్లు అలాగే నిరతిశయమైన నిశ్చలమైన ధ్యానంతో మహా తపస్సులో నిమగ్నులై వుండిపోయారు.

క. క్రోధము దమ తపములకును, బాధక మగు టెఱిఁగి దివిజభామలపై న
మ్మేధాత్మకు లొక యింతయుఁ, గ్రోధముఁ దేరైరి సత్త్వగుణయుతు లగుటన్. 130

* కోపం తమ తపస్సులకు లోపం కలిగిస్తుందని గ్రహించి సత్త్వ సంపన్నులూ, బుద్ధిమంతులూ అయిన నరనారాయణులు వాళ్లమీద ఏ మాత్రం కోపం చూపలేదు.

క. నారాయణుఁ డప్పుడు దన, యూరువు వెసఁ జీర, నందు నుదయించెను బెం
పారంగ నూర్వశీ ముఖ, నారీజనకోటి దివిజనారులు మెచ్చన్. 131

* అప్పుడు నారాయణుడు వెంటనే తన ఊరు భాగాన్ని గోటితో చీరాడు. అతని తొడలోనుండి అమర కాంతలు మెచ్చేటట్లుగా ఊర్వశి మొదలైన అప్సరః స్త్రీ సమూహం ఉద్భవించింది.

క. ఊరువులందు జనించిన, కారణమున "నూర్వశి"యన ఘనతకు నెక్కెన్
వారల రూపవిలాస వి, హారములకు నోడి రంత నమరీజనముల్. 132

* నారాయణుని ఊరువులో నుండి పుట్టడంవల్ల ఆమె " ఊర్వశి" అని పేరుగాంచింది. ఇంద్రుడు పంపగా వచ్చిన దేవతాస్త్రీలు ఊర్వశి మొదలైన వాళ్ల అందచందాలూ, హావభావాలూ, వినోదవిహారాలూ చూచి లజ్జతో కుంచించుకు పోయారు.

వ. అంతం దాము నరనారాయణుల తపోవిఘ్నంబు గావింపంబూని చేయు విలాసంబులు, మానసిక సంకల్పమాత్రంబున సృష్టిస్థితి సంహారంబు లొనర్పంజాలు నమ్మహాత్ముల దెసం బనికిరాక కృతఘ్నునకుం జేయు నుపకృతులుంబోలె నిష్ఫలంబులైన సిగ్గునం గుందుచు, నూర్వశిం దమకు ముఖ్యురాలిగాఁ గైకొని తమ వచ్చిన జాడన మరలి చని రంత. 133

* మనస్సులో అనుకుంటే చాలు, ఆ నరనారాయణులు సృష్టిస్థితిలయాలు చేయగలరు. అలాంటి మహానుభావుల తపస్సుకు భంగం కలిగించడానికి సురకాంతలు చేసిన శృంగార విలాసాలు కృతఘ్నుడికి

చేసిన ఉపకారాల లాగా నిరుపయోగా లయ్యాయి. అందువల్ల వాళ్ళు సిగ్గుతో పరితపించారు. ఆ ఊర్వశినే తమకు నాయకురాలుగా చేసుకొని వచ్చినదారినే తిరిగిపోయారు.

**క. కాముని దహించెఁ గ్రోధ మ, హామహిమను రుద్రుఁ, డట్టి యతికోపము నా**
**ధీమంతులు గెలిచి రనం, గామము గెలుచుటలు సెప్పఁగా నేమిటికిన్? 134**

* పూర్వం రుద్రుడు మహాక్రోధంతో కామున్ణి కాల్చివేశాడు. కోపం అంత దారుణ మయింది. అట్టి కోపాన్ని సైతం ఆ బుద్ధిమంతులు అవలీలగా జయించారు. ఇక కామాన్ని గెలవడం గురించి చెప్పేదేముంది?

**వ. అట్టి నరనారాయణావతారంబు జగత్పావనంబై విలసిల్లె, వెండియు ధ్రువావతారంబు వివరించెద వినుము. 135**

* అలాంటి నరనారాయణుల అవతారం భువనత్రయాన్ని పవిత్రం చేసింది.

ఇక ధ్రువావతారం వివరిస్తాను, విను.

**సీ. మానితచరితుఁ "డుత్తానపాదుం"డను భూవరేణ్యునకు సత్పుత్రుఁ డనఁగ**
**నుదయించి మహిమఁ బెంపొంది బాల్యంబున జనకునికడ నుండి సవతితల్లి**
**దను నాడు వాక్యాస్త్రతతిఁ గుంది మహిత తపంబు గావించి కాయంబుతోడఁ**
**జని మింట ధ్రువపదస్థాయి యై యటమీఁద నర్థి వర్తించు భృగ్వాదిమునులఁ**

**తే. జతురగతి గ్రింద వర్తించు సప్తఋషులఁ, బెంపు దీపింపఁ దన్ను నుతింప వెలసి**
**"ధ్రువుఁడు" నా నొప్పి య వ్విష్ణుతుల్యుఁ డగుచు, నున్న పుణ్యాత్ముఁ డిప్పుడు నున్నవాఁడు. 136**

* ధ్రువుడు ఉత్తమచరిత్రుడైన "ఉత్తానపాదు'డనే రాజుకు సత్పుత్రుడుగా జన్మించాడు. ప్రభావసంపన్నుడై పేరుగాంచాడు. చిన్న తనంలో ఒకనాడు తండ్రివద్ద ఉన్నప్పుడు సవతితల్లి "సురుచి" అతణ్ణి నిందావచనాలనే అస్త్రాలతో నొప్పించింది. దుఃఖితుడైన ధ్రువుడు గొప్ప తపస్సు చేశాడు. ఆ తపస్సు ఫలించింది. భగవంతుడు సాక్షాత్కరించి అతణ్ణి అనుగ్రహించాడు. అతడు సశరీరంగా వెళ్లి ఆకసంలో మహోన్నతమైన ధ్రువస్థానంలో స్థిరపడ్డాడు. ఆ స్థానానికి పైన వుండే భృగువు మొదలైన మహర్షులూ, క్రింద వుండే సప్తర్షులూ ఆ మహనీయుణ్ణి గొప్పగా ప్రశంసించారు. అతడు "ధ్రువు"డనే పేరుతో ప్రకాశించి విష్ణువుతో సమానుడైనాడు. ఇప్పుడు కూడా ఆ పుణ్యాత్ముడు ధ్రువస్థానం లోనే వున్నాడు.

**వ. మఱియుఁ బృథుని యవతారంబు వినుము. 137**

**ఉ. వేనుఁడు విప్రభాషణ పవి ప్రహతి చ్యుత భాగ్య పౌరుషుం**
**డై నిరయంబునం బడిన నాత్మతనూభవుఁడై పృథుండు నాఁ**
**బూని జనించి తజ్జనకుఁ బున్నరకంబును బాపె, మేదినిన్**
**ధేనువుఁజేసి వస్తు వితతిం బిదికెన్ హరిసత్కళాంశుఁడై. 138**

* ఇక పృథుచక్రవర్తి అవతారం విను.

"వేను"డనే భూపాలుడు భూసురుల శాపవచనాలనే వజ్రాయుధపు దెబ్బలకు గురియైనాడు. సిరినీ, పౌరుషాన్నీ కోల్పోయాడు. తుదకు నరకం పొందాడు. అతనికి "పృథు"డనే కుమారుడున్నాడు. అతడు తండ్రిని పున్నామనరకం నుండి రక్షించాడు. శ్రీహరి కళాంశభవుడైన ఆ పృథుచక్రవర్తి ఈ భూమిని ధేనువుగా జేసి అమూల్యమైన అనేక వస్తువులను పిదికాడు.

**వ. అని మఱియు వృషభావతారంబు నెఱింగింతు, వినుము, అగ్నీధ్రుం డనువానికి "నాభి" యనువాఁ డుదయించె, నతనికి మేరుదేవి యను నామాంతరంబు గల "సుదేవి"యందు హరి వృషభావతారంబు నొంది జడస్వభావంబైన యోగంబు దాల్చి ప్రశాంతాంతః కరణుండును, బరిముక్తసంగుండునునై పరమ హంసాభిగమ్యం బయిన పదం బిది యని మహర్షులు వలుకుచుండం జరించె, మఱియు హయగ్రీవావతారంబు సెప్పెద వినుము. 139**

* ఇలా చెప్పి బ్రహ్మ మళ్లీ నారదుడితో ఈ రీతిగా అన్నాడు. ఇప్పుడు వృషభుని అవతారం తెలియపరుస్తాను, ఆలకించు. "అగ్నీధ్రు" డనే వాడికి "నాభి" అనే కొడుకు పుట్టాడు. నాభి భార్య సుదేవి. అమెకు మేరుదేవి అని మరో పేరు ఉండేది. ఆమెకు హరి వృషభావతారుడై అవతరించాడు. అతడు జడశీలమైన యోగం పూనాడు. ప్రశాంతమైన చిత్తం కల్గి ఇతరులతో పొత్తు వదిలాడు. " ఇది పరమహంసలు పొందదగినస్థితి" అని తన్ను గూర్చి మహర్షులు ప్రశంసించేటట్లు ప్రవర్తించాడు.

ఇక హయగ్రీవావతారం అభివర్ణిస్తాను విను.

**చ. అనఘచరిత్ర! మన్మఖమునందు జనించె హయాననాఖ్యతన్**
**వినుతసువర్ణ వర్ణుఁడును వేదమయుం డఖిలాంతరాత్మకుం**
**డనుపమ యజ్ఞపూరుషుఁడు నై భగవంతుఁడు, దత్సమస్త పా**
**వన మగు నాసికాశ్వసనవర్గములం దుదయించె వేదముల్. 140**

* సచ్చరిత్రుడా! మేలిమిబంగారు కాంతికలవాడూ, వేదస్వరూపుడూ, సర్వాంతర్యామీ, సాటిలేని యజ్ఞపురుషుడూ అయిన దేవదేవుడు "హయగ్రీవుడు"అన్న పేరుతో నేను చేసిన యజ్ఞంలోనుండి జన్మించాడు. సర్వాన్నీ పవిత్రం చేసే ఆ హయగ్రీవుని ముకుపుటాలలోని శ్వాసవాయువులనుండి వేదాలు ప్రాదుర్భవించాయి.

**వ. మఱియు మత్స్యావతారంబు వినుము. 141**

**సీ. ఘనుఁడు వైవస్వత మనువుకు దృష్టమై యరుదెంచునట్టి యుగాంతసమయ**
**మందు విచిత్రమత్స్యావతారము దాల్చి యఖిలావనీమయం బగుచుఁ జాల**
**సర్వజీవులకు నాశ్రయభూతుఁ డగుచు నే కార్ణవంబైన తోయముల నడుమ**
**మన్ముఖశ్లథవేదమార్గంబులను జిక్కు వడకుండ శాఖ లేర్పడఁగఁ జేసి**

**తే. దివ్యు లర్థింప నాకర్థిఁ దెచ్చి యిచ్చి, మనువు నెక్కించి పెన్నావ వనధినడుమ**
**మునుఁగకుండంగ నరసిన యనిమిషావ, తార మేరికి నుతియింపఁ దరమె వత్స! 142**

* ఇక మత్స్యావతారం సంగతి చెబుతాను విను. ప్రళయకాలంలో సమస్తమూ జలమయమైపోయింది. ఆ పరిస్థితిని వైవస్వతమనువు ముందే గ్రహించి ఒక పడవపై కూర్చున్నాడు. అప్పుడు భగవంతుడు విచిత్రమైన మత్స్యావతార మెత్తాడు. భూతలానికి ఆశ్రయమైన ఆ దేవుడప్పుడు ఎల్లప్రాణులకూ నివాసభూతుడైనాడు. నా వదనంనుండి జారిపోయిన వేదశాఖలు సంకీర్ణం కాకుండా విభజించి దేవతల కోరికమేరకు మళ్ళీ నాకు ప్రీతితో అందజేశాడు. వైవస్వతమనువు అధిష్ఠించిన నావ సముద్రంలో మునిగిపోకుండా కాపాడాడు. నాయనా! మహనీయమైన ఆ మత్స్యావతారాన్ని వివరించడం ఎవరికి సాధ్యం?

**వ. మఱియుఁ గూర్మావతారంబు వినుము. 143**

**మ. అమృతోత్పాదనయత్నులై విబుధదైత్యానీకముల్, మందరా**
**గముఁ గవ్వంబుగఁ జేసి యబ్ధి దరువంగాఁ, గవ్వపుంగొండ వా**
**ర్ధి మునుంగన్ హరి కూర్మరూపమున నద్రిం దాల్చెఁ దత్పర్వత**
**భ్రమణవ్యాజత వీఁపుఁదీట శమియింపంజేయఁగా నారదా! 144**

* ఇక కూర్మావతారం వృత్తాంతం తెలుపుతాను విను. నారదా! పూర్వం దేవతలూ, రాక్షసులూ అమృతం సాధించాలనే ప్రయత్నంలో మందరగిరిని కవ్వంగా జేసుకొని క్షీరసాగరాన్ని మథించారు. ఆ కవ్వపు కొండ కడలి నడుమ మునిగిపోయింది. అప్పుడు శ్రీమన్నారాయణుడు తన వీపుదురద తొలగించుకోవటానికా అన్నట్లు గిరగిర తిరుగుతున్న గిరిని కూర్మరూపం ధరించి ధరించాడు.

**వ. వెండియు నృసింహావతారంబు వినుము. 145**

**మ. సురలోకంబుఁ గలంచి దేవసమితిన్ఁ స్రుక్కించి యుద్యద్గదా**
**ధరుఁడై వచ్చు నిశాచరుం గని, కనద్దంష్ట్రాకరాళాస్య వి**
**స్ఫురితభ్రూకుటితో నృసింహగతి రక్షోరాజ వక్షంబు భీ**
**కరభాస్వన్నఖరాజిఁద్రుంచెఁ ద్రిజగత్కల్యాణసంధాయియై. 146**

* ఇక నరసింహావతార వృత్తాంతం విను.

హిరణ్యకశిపుడనే రక్కసుడు దేవలోకంపై దండెత్తి దేవతలను బాధించాడు. ప్రచండమైన గదాదండం చేబూని వస్తున్న ఆ దానవుణ్ణి శ్రీహరి చూచాడు. వాణ్ణి పరిమార్చి ముల్లోకాలకూ క్షేమం కలిగించాలనుకొన్నాడు. వెంటనే కోరలతో భీతికొలిపే నోరూ, కోపంతో ముడివడ్డ కనుబొమ్మలూ గల నరసింహావతారం ధరించాడు. వాడి గోళ్లతో ఆ రాక్షసేశ్వరుని వక్షం చీల్చి హతమార్చాడు.

**వ. ఇంక నాదిమూలావతారంబు సెప్పెద వినుము. 147**

మ. కరినాథుండు జలగ్రహ గ్రహణదుఃఖాక్రాంతుఁడై వేయి వ
త్సరముల్ గుయ్యిడుచుండ వేల్పులకు విశ్వవ్యాప్తి లేకుండుటన్
"హరి నీవే శరణంబు నా" క నినఁ గుయ్యాలించి వేవేగ వా
శ్చరముం ద్రుంచి కరీంద్రుఁ గాచె మహితోత్సాహంబునం దాపసా! 148

* ఇక ఆదిమూలావతారం వివరిస్తా విను.

నారదా! గజేంద్రుడు మొసలిచేత పట్టువడి దుఃఖించాడు. వేయి సంవత్సరాలు దానితో పెనగులాడుతూ రక్షణకై మొరపెట్టుకొన్నాడు. తక్కిన దేవతలు విశ్వమయులు కారు కాబట్టి అతని ఆపద మాన్పలేక పోయారు. అప్పుడతడు 'శ్రీహరీ! నీవే నాకిక దిక్కు' అని ఆర్తుడై ఆక్రందనం చేశాడు. అది విని వెనువెంటనే పరమాత్ముడు ఆదిమూల స్వరూపుడై వచ్చి పరమోత్సాహంతో మకరిని చంపి కరిని కాపాడాడు.

వ. మఱియును వామనావతారంబు వినుము. 149

సీ. యజ్ఞేశ్వరుండగు హరి విష్ణుఁ డదితిసంతానంబునకు నెల్లఁ దమ్ముఁడయ్యుఁ
బెంపారు గుణములఁబెద్ద యై, వామన మూర్తితో బలిచక్రవర్తిఁ జేరి
తద్భూమి మూడు పాదమ్ముల నడిగి పదత్రయంబునను జగత్త్రయంబు
వంచించి కొనియెను వాసవునకు రాజ్య మందింప నీశ్వరుం డయ్యు మొఱఁగి

తే. యర్థిరూపంబు గైకొని యడుగ వలసె, ధార్మికుల సొమ్ము వినయోచితముగఁ గాని
వెడఁగుఁదనమున నూరక విగ్రహించి, చలన మందింపరాదు నిశ్చయము పుత్ర! 150

* ఇక వామనావతారం వర్ణిస్తాను విను. యజ్ఞాధిపుడైన విష్ణువు అదితి బిడ్డలలో కనిష్ఠుడు ఐనా ఉత్తమ గుణాలలో అందరికంటే జ్యేష్ఠుడయ్యాడు. ఆయన వామనాకారంతో బలి చక్రవర్తిదగ్గరకు వచ్చి మూడడుగుల నేల అతణ్ణి యాచించి పుచ్చుకొన్నాడు. ఆ మూడడుగులతో ముల్లోకాలనూ ఆక్రమించి వంచనతో అపహరించాడు. తాను సర్వేశ్వరుడై వుండికూడ ఇంద్రుడికి రాజ్యం ముట్టజెప్పడానికై ఆయన వంచనతో బలిని యాచించవలసి వచ్చింది. వత్సా! ధర్మాత్ముల సొమ్ము వినయంగా వెళ్లి ఉచిత పద్ధతిలో గ్రహించాలి. అంతే కాని మూర్ఖత్వంతో పోట్లాడి ఆక్రమించ గూడదు సుమా! ఇది నిజం!

చ. బలి నిజమౌళి న వ్వటుని పాదసరోరుహ భవ్యతీర్థ ము
త్కలిక ధరించి, తన్నును జగత్త్రయమున్ హరి కిచ్చి, కీర్తులన్
నిలిపె వసుంధరాస్థలిని నిర్జరలోక విభుత్వ హానికిం
దలఁకక శుక్రు మాటలకుఁ దారక భూరివదాన్యశీలుఁడై. 151

* పరమదాత అయిన బలిచక్రవర్తి ఆ బ్రహ్మచారి వామనుని పాదపద్మాలు కడిగిన పవిత్ర తీర్థాన్ని ఔత్సుక్యంతో తలమీద చల్లుకున్నాడు. తనతోపాటు మూడులోకాలనూ నారాయణుడికి ధారాదత్తం చేశాడు. విశ్వమంతటా శాశ్వతమైన యశస్సు నిలుపుకొన్నాడు. ఆ దానంవల్ల దేవలోకం మీద తనకున్న పెత్తనం పోతుందని జంక లేదు. తనకు హాని జరుగుతుందని శుక్రాచార్యుడు చెప్పినా లక్ష్య పెట్టలేదు.

వ. మఱియు న ప్పరమేశ్వరుండు నారదా! హంసావతారంబు నొంది యతిశయ భక్తియోగంబున సంతుష్టాంతరంగుం డగుచు నీకు నాత్మతత్త్వ ప్రదీపకంబగు భాగవత మహాపురాణం బుపదేశించె, మన్వవతారంబు నొంది స్వకీయ తేజఃప్రభావంబున నప్రతిహతంబైన చక్రంబు ధరియించి దుష్టవర్తనులైన రాజుల దండించుచు శిష్టపరిపాలనంబు సేయుచు నాత్మీయ కీర్తిచంద్రికలు సత్యలోకంబున వెలింగించె, మఱియు ధన్వంతరి యన నవతరించి తన నామస్మరణంబున భూజనంబునకు సకలరోగనివారణంబు సేయుచు నాయుర్వేదంబుఁ గల్పించె, నింకం బరశురామావతారంబు వినుము. 152

* నారదా! అంతేకాదు. ఆ పరమేశ్వరుడు హంసావతార మెత్తాడు. అతిశయమైన నీ భక్తి యోగానికి సంతసించాడు. నీకు ఆత్మతత్త్వం తెలియపరచే భాగవత మనే మహాపురాణం ఉపదేశించాడు. మనువుగా అవతరించి తన తేజోమహిమతో అమోఘమైన చక్రం చేబూని దుర్జనులైన రాజులను శిక్షించాడు, సజ్జనులను రక్షించాడు. తన కీర్తిచంద్రికలు సత్యలోకంలో ప్రకాశింప జేశాడు.

ఇంకా ధన్వంతరిగా అవతారం దాల్చాడు. తన నామస్మరణతోనే భూమిమీది జనానికి రోగాలన్నీ పోగొట్టుతూ ఆయుర్వేదం కల్పించాడు. ఇక పరశురామావతారం ఎలా జరిగిందో చెబుతా, విను.

మ. ధరణీ కంటకులైన హైహయ నరేంద్ర వ్రాతమున్ భూరి వి
స్ఫురితోదార కుఠారధారఁ గలనన్ ముయ్యేడు మాఱుల్ పోరిం
బొరి మర్దించి, సమస్త భూతలము విప్రుల్ వేఁడఁగా నిచ్చి తాఁ
జిరకీర్తిన్ జమదగ్ని రాముఁడన మించెం దాపసేంద్రోత్తమా! 153

* మునీంద్రులలో అగ్రగణ్యుడవైన నారదా! హైహయరాజులు లోక విరోధులై దురుసుగా ప్రవర్తించారు. వాళ్లను శిక్షించడానికి శ్రీమన్నారాయణమూర్తి భార్గవరాముడుగా అవతరించాడు. రణరంగంలో ఇరవై యొక్కసార్లు ఈ రాజసమూహాన్ని దారుణమైన తన గండ్రగొడ్డలితో చెండాడినాడు. బ్రాహ్మణులు వేడుకోగా భూమండల మంతా వాళ్లకు దానం చేశాడు. జమదగ్నిసుతుడైన ఆ పరశురాముడు అలా శాశ్వత కీర్తితో వెలుగొందాడు.

వ. మఱియు శ్రీ రామావతారంబు సెప్పెద వినుము. 154

సీ. తోయజ హిత వంశ దుగ్ధ పారావార రాకా విహార కైరవహితుండు
కమనీయ కోసలక్ష్మాభృత్సుతా గర్భ శుక్తి సంపుట లసన్మౌక్తికంబు
నిజపాదసేవక వ్రజ దుఃఖ నిబిడాంధ కార విస్ఫురిత పంకరుహసఖుఁడు
దశరథేశ్వర కృతాధ్వర వాటికా ప్రాంగణాకర దేవతానోకహంబు

**తే. చటుల దానవ గహన వైశ్వానరుండు, రావణాటోప శైల పురందరుండు**
**నగుచు లోకోపకారార్థ మవతరించె, రాముఁడై చక్రి లోకాభిరాముఁ డగుచు.** 155

* ఇక శ్రీరామావతారం వివరిస్తాను విను.

చక్రధరుడైన శ్రీ మహావిష్ణువు లోకోపకారం చేయడానికై జగదభిరాముడైన శ్రీరాముడుగా అవతరించాడు. ఆయన సూర్యవంశమనే పాల్కడలికి పున్నమచందురుడు. కోసలరాజు కూతురైన కౌసల్యాదేవి గర్భమనే ముత్తెపు చిప్పలో పుట్టిన మేలి ముత్యం. తన పాదసేవకుల శోకమనే చిమ్మచీకట్లను పోకార్చే సూర్యభగవానుడు. దశరథమహారాజు గారి పుత్రకామేష్టి యాగశాల ముంగిట మొలకెత్తిన కల్పవృక్షం. దానవులనే దారుణారణ్యాన్ని దహించే కార్చిచ్చు. రావణుని గర్వమనే పర్వతాన్ని బద్దలు చేసే ఇంద్రుడు.

**క. చిత్రముగ భరత లక్ష్మణ, శత్రుఘ్నుల కర్థి నగ్రజన్ముం డగుచున్**
**ధాత్రిన్ రాముఁడు వెలసెఁ బ, విత్రుఁడు దుష్కృత లతాలవిత్రుం డగుచున్.** 156

* ఆ శ్రీరామచంద్రుడు భరతుడు, లక్ష్మణుడు, శత్రుఘ్నుడు అనే సోదరులకు అగ్రజుడై జన్మించాడు. ఆ మహా పావనుడు పాపాలనే తీవలను ఛేదించే కొడవలిగా ఈ లోకంలో ప్రకాశించాడు.

**వ. అంత.** 157

**సీ. కిసలయ ఖండేందు బిస కుంద పద్మాబ్జ పద ఫాల భుజ రద పాణి నేత్రఁ**
**గాహళ కరభ చక్ర వియత్పులిన శంఖ జంఘోరు కుచ మధ్య జఘన కంఠ**
**ముకుర చందన బింబ శుక గజ శ్రీకార గండ గంధోష్ఠవాగ్గమన కర్ణఁ**
**జంప కేందు స్వర్ణ శఫర ధను ర్నీల నాసికాస్యాంగదృగ్భ్రూశిరోజ**

**తే. నళి సుధావర్త కుంతల హాస నాభి, కలిత జనకావనీపాలకన్యకా ల**
**లామఁ బరిణయమయ్యె లలాటనేత్ర, కార్ముక ధ్వంస ముంకువ గాఁగ నతఁడు.** 158

* ఆపైన శ్రీరాముడు శివుని ధనుర్భంగం ఓలి కాగా జనకమహారాజు పుత్రిక సీతాదేవిని చేపట్టాడు. ఆ మహాదేవి పాదాలు చివుళ్ల వంటివి; ఫాలం అర్ధచంద్రుని వంటిది; భుజాలు తామరతూండ్ల వంటివి; దంతాలు మొల్లల వంటివి; హస్తాలు పద్మాల వంటివి; నేత్రాలు కలువల వంటివి; పిక్కలు కాహళుల వంటివి; తొడలు కరభాల వంటివి; స్తనాలు చక్రవాకాల వంటివి; నడుము ఆకసం వంటిది; పిరుదులు ఇసుక తిన్నెల వంటివి; కంఠం శంఖం వంటిది; చెక్కిళ్లు అద్దాల వంటివి; శరీర పరిమళం చందనం వంటిది; పెదవి దొండపండు వంటిది; పలుకు చిలుక పలుకు వంటిది; గమనం గజగమనం వంటిది; చెవులు శ్రీకారాల వంటివి; ముక్కు సంపెంగ వంటిది; మోము చంద్రుని వంటిది. శరీరం స్వర్ణం వంటిది; చూపులు చేపల వంటివి; కనుబొమలు ధనుస్సు వంటివి; తల వెండ్రుకలు నీలాల వంటివి; ముంగురులు తుమ్మెదల వంటివి; నవ్వు అమృతం వంటిది; బొడ్డు సుడి వంటిది.

**వ. అంత.** 159

క. రాముఁ మేచకజలద, శ్యాముఁ సుగణాభిరాము సద్వైభవ సు
త్రాముఁ దుష్టనిశాట వి, రాముం బొమ్మనియెఁ బంక్తిరథుఁ డడవులకున్. 160

* ఆ పైన, నీలిమబ్బువలె నల్లనివాడూ, సద్గుణాలతో ఒప్పేవాడూ, ఐశ్వర్యంలో ఇంద్రునితో సాటియైనవాడూ, చెడుగురక్కసులను చెండాడేవాడూ అయిన రామచంద్రుణ్ణి దశరథుడు అడవులకు పొమ్మన్నాడు.

వ. ఇట్లు పంచిన. 161

చ. అరుదుగ లక్ష్మణుండు జనకాత్మజయుం దనతోడ నేఁగుదే
నరిగి రఘూత్తముండు ముదమారఁగఁ జొచ్చెఁ దరక్షు సింహ సూ
కర కరి పుండరీక కపి ఖడ్గ కురంగ వృకాహి భల్ల కా
సర ముఖ వన్య సత్త్వ చయ చండతరాటవి దండకాటవిన్. 162

* అలా పంపేసరికి అడవులకు వెళ్తున్న రాముణ్ణి లక్ష్మణుడూ, సీతా వెంబడించారు. రఘువంశ లలాముడైన రాముడు సివంగులూ, సింహాలూ, అడవిపందులూ, ఏనుగులూ, పులులూ, కోతులూ, ఖడ్గమృగాలూ, జింకలూ, తోడేళ్లూ, పాములూ, ఎలుగుబంట్లూ, అడవి దున్నలూ మొదలైన అడవి మృగాలతో అత్యంత భీకరమైన దండకారణ్యం ప్రవేశించాడు.

క. ఆ వనమున వసియించి నృ, పావననయశాలి యిచ్చె నభయములు జగ
త్పావన మునిసంతతికిఁ గృ, పావననిధియైన రామభద్రుం డెలమిన్, 163

* రాజరక్షణ నీతి సంపన్నుడూ, దయాసముద్రుడూ అయిన రామభద్రుడు ఆ మహారణ్యంలో నివసించాడు. అక్కడ లోకపావనులైన మునిగణాలకు అభయప్రదానం చేశాడు.

క. ఖరకర కుల జలనిధి హిమ, కరుఁడగు రఘురామవిభుఁడు గఱకటితోడన్
ఖరుని వధించెను ఘనభీ, కర శరముల నఖిలజనులుఁ గర మరుదందన్. 164

* సూర్యవంశమనే సముద్రానికి చంద్రునివంటివాడైన ఆ రామచంద్రుడు అందలి జనులందరూ ఆశ్చర్యపడగా కోపంతో మిక్కిలి భయంకరమైన బాణాలు ప్రయోగించి ఖరుడనే రక్కసుణ్ణి ఉక్కడగించాడు.

క. హరిసుతుఁ బరిచరుఁగాఁ గొని, హరిసుతుఁ దునుమాడి పనిచె హరిపురమునకున్,
హరివిభునకు హరి మధ్యను, హరి రాజ్యపదంబు నిచ్చె హరివిక్రముఁడై. 165

* సింహపరాక్రముడైన శ్రీరాముడు సూర్యసుతుడైన సుగ్రీవుణ్ణి అనుచరుడుగా స్వీకరించాడు. ఇంద్ర పుత్రుడైన వాలిని నేలగూల్చి యమపురికి పంపాడు. వానరాధిపుడైన సుగ్రీవునికి కిష్కింధా రాజ్యాన్నీ, సింహం వంటి నడుము గల రుమనూ అప్పగించాడు.

వ. అంత సీతానిమిత్తంబునం ద్రిలోకకంటకుండగు దశకంఠుం దునుమాడుటకునై కపిసేనా సమేతుండయి చనిచని ముందుట నతిదుర్గమం బయిన సముద్రంబు పేర్చి తెరువు సూపకున్న నలిగి. 166

* అటుపిమ్మట శ్రీ రామచంద్రుడు సీత కొరకై ముజ్జగాలకూ విరోధియైన రావణుణ్ణి సంహరింప దలచాడు. వానర సేనలను వెంటబెట్టుకొని లంకవైపు పయనించాడు. దక్షిణ సముద్రతీరం చేరాడు. దాట వీలుగాని ఆ సాగరం బాట చూపనందున ఆయనకు ఆగ్రహం వచ్చింది.

మ. వికట భ్రూకటి ఫాలభాగుఁ డగుచున్ వీరుండు క్రోధారుణాం
బకు డై చూచిన యంత మాత్రమున నప్పాథోధి సంతప్త తో
య కణ గ్రాహ తిమింగిల ప్లవ ఢులీ వ్యాళ ప్రవాళోర్మికా
బక కారండవ చక్ర ముఖ్య జలసత్త్వశ్రేణితో నింకినన్. 167

* అంతట ఆ మహావీరుడు నొసట కనుబొమలు ముడివడగా కోపం వల్ల ఎరుపెక్కిన నేత్రాలతో సముద్రం వైపు చూచాడు. అలా చూచేసరికి సముద్రం, నీటికోళ్లూ, తాబేళ్లూ, పాములూ, మొసళ్లూ, తిమింగిలాలూ, పవడపు తీగలూ, తరంగాలూ, కొంగలూ, కన్నెలేళ్లూ, చక్రవాకాలూ మొదలైన జలజంతువులతో సహా నీళ్లు తుకతుక ఉడకగా ఇంకి పోయింది.

వ. అయ్యవసరంబున సముద్రుండు కరుణాసముద్రుం డగు శ్రీరామభద్రుని శరణంబు సొచ్చినం గరుణించి యెప్పటి యట్ల నిలిపి నలునిచే సేతువు బంధింపించి తన్మార్గంబునం జని. 168

* అప్పుడు సముద్రుడు దయాసముద్రుడైన రామభద్రుడికి శరణాగతు డయ్యాడు. రాము డతనిపై దయచూపి యథాప్రకారం ఉండమని అనుగ్రహించాడు. నలుడనే వానర ప్రముఖునిచే వంతెన కట్టించి రాముడు సముద్రం దాటాడు.

మ. పురముల్ మూఁడును నొక్కబాణమున నిర్మూలంబు గావించు శం
కరు చందంబున నేర్చె రాఘవుఁడు లంకాపట్టణం బిద్ధ గో
పుర శాలాంగణ హర్మ్య రాజభవన ప్రోద్యత్ప్రతోళీ కవా
ట రథాశ్వ ద్విప శస్త్రమందిర నిశాట శ్రేణితో వ్రేల్మిడిన్. 169

* పూర్వం శివుడు ఒకే బాణంతో త్రిపురాలను కాల్చివేశాడు. అదే విధంగా రాముడు పెద్దపెద్ద గోపురాలు, శాలలు, ముంగిళ్లు, మేడలు, రాజగృహాలు, రచ్చలు, తలుపులు, రథాలు, గుఱ్ఱాలు, ఏనుగులు, ఆయుధాగారాలు, రాక్షసగణాలు నిండివున్న లంకానగరాన్ని చిటికలో భస్మీపటలం చేశాడు.

క. రావణు నఖిల జగద్వి, ద్రావణుఁ బరిమార్చి నిలిపె రక్షోవిభుఁగా
రావణునవజన్ముని నై, రావణసితకీర్తి మెఱసి రాఘవుఁ డెలమిన్. 170

* ఈ విధంగా ఐరావణగజం వలె తెల్లని కీర్తితో ప్రకాశించిన శ్రీ రాముడు సమస్త భువనాలనూ వేధించి బాధించిన రావణుని హతమార్చినాడు. అతని తమ్ముడైన విభీషణుణ్ణి రక్కసులకు రాజుగా చేశాడు.

సీ. ధర్మ సంరక్షకత్వ ప్రభావుం డయ్యు ధర్మ విధ్వంసకత్వమునఁ బొదలి
ఖరదండనాభిముఖ్యముఁ బొంద కుండియు ఖరదండ నాభిముఖ్యమున మెఱసి
బుణ్యజనావన స్ఫూర్తిఁ బెంపొందియుఁ బుణ్యజనాంతక స్ఫురణఁ దనరి
సంతతాశ్రిత విభీషణుఁడు గాకుండియు సంతతాశ్రిత విభీషణత నొప్పి

తే. మించెఁ, దనకీర్తిచేత వాసించె దిశలు, దరమె నుతియింప జగతి నెవ్వరికినైనఁ
జారుతరమూర్తి నవనీశ చక్రవర్తిఁ, బ్రకటగుణసాంద్రు దశరథరామచంద్రు. 171

* ఆయన ధర్మాన్ని రక్షించినవాడు అనే మహిమ కలిగి కూడా ధర్మవిధ్వంసకుడై ప్రకాశించాడు; అనగా శివధనుర్భంగం చేశాడన్నమాట! ఖరదండనలో అభిముఖుడు కాకపోయినా ఖరదండనలో అభిముఖుయ్యాడు; అంటే కఠినశిక్షలు విధించడానికి విముఖుడైన ఆరాముడు ఖరుడనే రాక్షసుణ్ణి దండించడానికి సుముఖు డయ్యాడు. పుణ్య జనరక్షకుడై కూడ పుణ్యజనులను హతమార్చాడు; అనగా పుణ్యాత్ములను రక్షించి రక్కసులను శిక్షించాడన్నమాట! ఆశ్రితవిభీషణుడు కాకపోయినా ఆశ్రితవిభీషణు డయ్యాడు; అనగా ఆశ్రయించిన వారిపట్ల భయంకరుడు కాకుండా విభీషణుని కాశ్రయం ఇచ్చినవాడయ్యాడు. తన విశాల యశస్సును దశదిశలా వ్యాపింపజేసి సుప్రసిద్ధు డయ్యాడు. మహాసుందరుడూ, మహారాజులలో మేటి, సుగణాభిరాముడూ అయిన ఆ దశరథ రాముణ్ణి కీర్తించడానికి లోకంలో ఎవరికీ సాధ్యం కాదు.

వ. అట్టి శ్రీరామావతారంబు జగత్పావనంబును నస్మత్ప్రసాద కారణంబునునై నుతికెక్కె, నింకఁ గృష్ణావతారంబు వివరించెద, వినుము. 172

* అలాంటి శ్రీరాముని అవతారం లోకపావనమై అస్మదాదులకు అనుగ్రహకారణ మయింది. ఇక కృష్ణావతారాన్ని వర్ణిస్తాను, విను.

సీ. తాపసోత్తమ! విను దైత్యాంశములఁ బుట్టి నరనాథు లతుల సేనాసమేతు
లగుచు ధర్మేతరులై ధాత్రిఁ బెక్కుబాధల నలంచుటఁ జేసి ధరణి వగలఁ
బొందుచు వాపోవ భూభార ముడుపుట కై హరి పరుఁడు నారాయణుండు
చెచ్చెరఁ దన సితాసిత కేశయుగమున బలరామ కృష్ణ రూపములఁ దనరి

తే. యదుకులంబున లీలమై నుదయ మయ్యె, భవ్యయశుఁ డగు వసుదేవు భార్యలైన
రోహిణియు దేవకియు నను రూపవతుల, యందు నున్మత్తదైత్య సంహారి యగుచు. 173

* మునిశ్రేష్ఠుడవైన నారదా! రాక్షసాంశంలో పుట్టిన రాజులు పెక్కుమంది తమ అపారసేనాబలంతో అధర్మమార్గాన ప్రవర్తించారు. భూదేవికి అనేకబాధలు కలిగించారు. ఆమె దుఃఖిస్తూ హరితో మొరపెట్టుకొన్నది. పరాత్పరుడైన శ్రీమన్నారాయణుడు మదోన్మత్తులైన దానవులను సంహరించి భూ భారాన్ని తొలగించాలనుకొన్నాడు. యదువంశంలో వన్నెకెక్కిన వాసుదేవునకు రోహిణి, దేవకి అనే భార్యలయందు తన తెల్లని వెంట్రుకతో బలరాముడుగానూ, నల్లని వెంట్రుకతో కృష్ణుడుగానూ ఆయన వెంటనే అవతరించాడు.

వ. ఇట్లు పుండరీకాక్షుండగు నారాయణుండు సమస్తభూభారనివారణంబు సేయం దన మేని కేశద్వయంబ చాలునని యాత్మ ప్రభావంబు దెలుపుకొఱకు నిజకళాసంభవులైన రామకృష్ణుల దేహవర్ణంబులు శ్వేతకృష్ణంబులని నిర్దేశించు కొఱకు సితాసిత కేశ ద్వయ వ్యాజంబున రామకృష్ణాఖ్యల నలరి యవతరించె,నందు భగవంతుండును సాక్షాద్విష్ణుండును నైన కృష్ణుండు జనమార్గవర్తి యయ్యును నతిమానుషకర్మంబుల నాచరించుటం జేసి కేవల పరమేశ్వరుం డయ్యె, నమ్మహాత్ముం డాచరించు కార్యంబులు లెక్క వెట్ట నెవ్వరికి నలవి గాదు, అయినను నాకు గోచరించినయంత యెఱింగించెద, వినుము. 174

* ఈ విధంగా పద్మాక్షుడైన శ్రీమన్నారాయణుడు భూభార మంతా నివారించడానికి తన రెండు వెంట్రుకలే చాలనుకున్నాడు. తన ప్రభావం తెలపడానికి తన అంశంలో పుట్టిన రామకృష్ణుల శరీరకాంతులు తెలుపు నలుపులుగా చేశాడు. ధవళమూ, నీలమూ అయిన రెండువెంట్రుకల నెపంతో రాముడు, కృష్ణుడు అను పేర్లతో అవతరించాడు. వారిలో షడ్గుణైశ్వర్య సంపన్నుడూ, సాక్షాద్విష్ణు స్వరూపుడూ అయిన కృష్ణుడు ఇతరజనులు నడిచిన మార్గంలో నడిచినా మానవాతీతమైన కార్యాలెన్నో చేశాడు. అందువల్ల పరమేశ్వరుడుగానే ప్రసిద్ధి చెందాడు. ఆ మహనీయు డొనర్చిన కార్యాలు గణించడం ఎవరికీ సాధ్యం కాదు. అయినా నాకు తెలిసినంత వరకూ తెలుపుతాను, విను.

క. నూతన గరళ స్తని యగు, పూతనఁ బురుటింటిలోనఁ బొత్తుల శిశువై
చేతనముల హరియించి ప, రేతనగరమునకు ననిచెఁ గృష్ణుఁడు పెలుచన్. 175

* కృష్ణుడు పురిటింట్లో పొత్తులబిడ్డగా వున్న సమయమది. పూతన అనే రక్కసి చన్నులకు విషం పూసుకొని పాలివ్వడానికి వచ్చింది. కృష్ణుడు పాలతోపాటు దాని ప్రాణాలుగూడా త్రాగి దాన్ని యమలోకాని కంపాడు.

క. వికటముగ నిజపదాహతిఁ, బ్రకటముగా మూఁడు నెలల బాలకుఁడై యా
శకట నిశాటుని నంతక, నికటస్థునిఁ జేసె భక్తనికరావనుఁడై. 176

* భక్తలోక రక్షకుడైన కృష్ణుడు మూడునెలల పిల్లవాడుగా ఉన్నాడు. శకటరూపంలో ఒక రాక్షసుడు అతణ్ణి పరిమార్చటానికి వచ్చాడు. అది గమనించిన బాలకృష్ణుడు తన కాలితన్నుతో ఆ దానవుణ్ణి దండధరుని సమీపానికి సాగనంపాడు.

క. ముద్దుల కొమరుని వ్రేతల, రద్దులకై తల్లి ఱోల రజ్జులఁ గట్టం
బద్దులకు మిన్ను ముట్టిన, మద్దుల వడిఁ గూల్చె జనసమాజము వొగడన్. 177

* కృష్ణుడు అల్లరి చేస్తున్నాడని గోపికలు యశోదవద్ద గోలపెట్టారు. యశోద అతణ్ణి త్రాటితో రోటికి కట్టివేసింది. వెంటనే అతడు రోలీడ్చుకొంటూ వెళ్లి ఆకస మంటే జంట మద్దులను నేలగూల్చాడు. అప్పుడు అక్కడి జనమంతా కృష్ణుణ్ణి కీర్తించారు.

మ. మదిఁ గృష్ణుండు యశోదబిడ్డఁడని నమ్మంజాల యోగీంద్ర! త
ద్వదనాంభోజములోఁ జరాచరసమస్త ప్రాణిజాతాటవీ
నదనద్యద్రిపయోధియుక్త మగు నానాలోకజాలంబు భా
స్వదనూనక్రియఁ జూపెఁ దల్లికి మహాశ్చర్యంబు వాటిల్లఁగన్. 178

* యోగివర్యా! బాల్యంలోనే ఇలాంటి పరమాద్భుతాలు ఎన్నో చేసిన కృష్ణుడు యశోద కొడుకని నేను నమ్మలేకున్నాను. ఒకనాడు అతడు తల్లికి సకలచరాచర ప్రాణులూ, అరణ్యాలూ, నదీనదాలూ, పర్వతాలూ, సముద్రాలూ - వీటితో కూడిన వివిధ జగజ్జాలాన్ని అపూర్వంగా తన నోట చూపాడు. అది చూచి ఆ తల్లి ఆశ్చర్య చకితురా లయింది.

చ. వరయమునా నదీహ్రద నివాసకుఁడై నిజ వక్త్రనిర్గత
స్ఫురిత విషాంబుపానమున భూజనులన్ మృతిఁ బొందఁజేయు భీ
కర గరళ ద్విజిహ్వుఁడగు కాళియ పన్నగు నాహ్రదంబుఁ జె
చ్చెర వెడలించి కాచె యదుసింహుఁడు గోపకగోగణంబులన్. 179

* యమునా నది మడుగులో కాళియుడనే సర్పరాజు నివసించేవాడు. అతని నాల్కలు రెండూ భయంకరమైన విషంతో నిండి వుండేవి. అతడు క్రక్కిన గరళం కలిసిన నీళ్ల త్రాగి ప్రజలు ప్రాణాలు గోల్పోయే వారు. ఇలా వుండగా యాదవశ్రేష్ఠుడైన కృష్ణుడు కాళియుణ్ణి ఆ మడుగునుండి వెడలగొట్టి గోవులనూ, గోపాలురనూ కాపాడాడు.

మ. తనయా! గోపకు లొక్కరేయి తఱి, నిద్రం జెందఁ గార్చిచ్చు వ
చ్చినఁ "గృష్ణా! మము నగ్ని పీడితుల రక్షింపం దగుం గావవే"
యనినం "గన్నులు మీరు మోడ్చుఁ డిదె దావాగ్నిన్ వెసన్నార్తు నే"
నన వా రట్ల యొనర్ప మ్రింగె శిఖిఁ బద్మాక్షుండు లీలాగతిన్. 180

* కుమారా! అది ఒకనాటిరాత్రి. గోపకులందరూ నిద్రిస్తున్నారు. ఇంతలో అమాంతంగా కార్చిచ్చు వాళ్లను చుట్టుముట్టింది. "కృష్ణా! మంటల్లో చిక్కుకొన్నాము. మమ్మల్ని కాపాడు, కాపాడు'' అంటూ వాళ్లందరూ తన్ను వేడుకొన్నారు. అప్పుడు పద్మనేత్రుడు "మీరంతా కళ్లు మూసుకోండి! ఇదిగో క్షణంలో నేను ఆ దావానలాన్ని ఆర్పి వేస్తాను'' అన్నాడు. వారలా చేశారు. కృష్ణుడు అలవోకగా కార్చిచ్చును కబళించి వేశాడు.

క. మందుని గతి యమునాంబువు, లందు నిసిం గ్రుంకి బద్ధుఁడై చిక్కిన యా
నందుని, వరుణుని బంధన, మందు నివృత్తునిగఁ జేసె హరి సదయుండై. 181

* ఒక అర్ధరాత్రివేళ నందుడు ముందు వెనుకలు చూడకుండా యమునా నదీ జలాలలో స్నానం చేస్తూ మునిగిపోయాడు. అక్కడ వరుణుని పాశాలలో చిక్కుకొన్నాడు. అప్పుడు దయాసింధుడైన హరి ఆ బంధంనుండి అతణ్ణి విడిపించాడు.

మ. మయసూనుండు నిజానువర్తుల మహామాయన్ మహీభృద్గుహా
శ్రయులంగా నొనరించి తత్పథము నీరంధ్రంబు గావించినన్
రయ మొప్పం గుటిలాసురాధముని( బోరం ద్రుంచి గోపావళిన్
దయతో( గాచిన కృష్ణు సన్మహిమ మేతన్మాత్రమే తాపసా! 182

* మయుని కుమారుడైన వ్యోమాసురుడు ఒకసారి తన మాయా ప్రభావంతో కృష్ణుని సహచరులైన గోపకు లందరినీ ఒక గుహలో ప్రవేశపెట్టాడు. ఇంకెవరూ ఆ గుహలో దూరకుండా దారి మూసివేశాడు. వెంటనే మహావేగంతో కృష్ణుడు ఆ క్రూరదానవుణ్ణి పోరాటంలో చంపాడు. గోపాలకుల నందరినీ కృపతో కాపాడినాడు. మునీంద్రా! అటువంటి కృష్ణుని మహామహిమ ఇంతింతని చెప్పతరమా!

క. దివిజేంద్రప్రీతిగ వ, ల్లవజను లే(టే(ట( జేయు లాలిత సవనో
త్సవము హరి మానిపిన గో, పవరులు గావింపకున్న బలరిపు( డలుకన్. 183

* గోపకులు ప్రతిసంవత్సరమూ ఇంద్రుడికి ప్రీతిగా యాగం చేసేవారు. ఆ యాగం చేయవద్దని శ్రీహరి వారికి బోధించాడు. గోపకులు కృష్ణుని మాట ననుసరించి యాగం చేయడం మానివేశారు. ఇంద్రుడు కోపోద్దీపితు డయ్యాడు.

తే. మంద గొందలమంద నమందవృష్టి(, గ్రందుకొను( డంచు నింద్రుండు మందలింప(
జండపవన సముద్ధూత చటుల విలయ, సమయ సంవర్త కాభీల జలధరములు. 184

* వెంటనే "వ్రేపల్లె కలతపడేటట్టు జోరున ఎడతెరపిలేని వాన కురవండి" అంటూ అతడు మేఘాలను ఆదేశించాడు. ప్రచండమైన మారుతవేగానికి పై కెగిరి ప్రళయకాలంలోని సంవర్తకాలవంటి ఆ మేఘాలు భీకరంగా అంతటా క్రమ్ముకొన్నాయి.

శా. సప్తస్కంధ శిఖా కలాప రుచిమత్సౌదామనీవల్లికా
దీప్తోదగ్రముహు స్తమః పిహితధాత్రీ భాగనీరంధ్రమై
సప్తాశ్వస్ఫురదిందు మండలనభస్సంఛాదితాశాంతర
వ్యాప్తాంభోద నిరర్గళ స్ఫుటశిరోవాః పూరధారాళమై. 185

* వాన ప్రారంభ మయింది. అగ్ని జ్వాలల్లాగా మిరుమిట్లు గొలిపే మెరుపులతోనూ, మాటిమాటికి ఉగ్రంగా ఉరిమే ఉరుములతోనూ ఆ వర్షం అంతకంతకూ భయంకర మయింది! సూర్య చంద్రమండలాలతో సహా గగనాన్ని కప్పివేసి దిగంతరాలకు వ్యాపించాయి ఆ కారుమబ్బులు. ధారాళంగా కుండపోతగా రాళ్లవాన కురియసాగింది.

వ. కురియు వానజల్లు పెల్లున రిమ్మగొని సొమ్మలు వోయి గోకులం బాకులంబయి "కృష్ణ! కృష్ణ! రక్షింపు" మని యార్తిం బొంది కుయ్యిడ నయ్యఖండ కరుణారస సముద్రుండును భక్తజన సురద్రుముండును నైన పుండరీకాక్షుండు. 186

* విరామం లేకుండా అలా కురిసే పెద్ద వానజల్లుకు గోకులమంతా వ్యాకుల మయిపోయింది. జనులందరూ మతిభ్రమ చెంది మూర్ఛిల్లారు. ఆ విధంగా కలతవడి బాధతో "కృష్ణా! కృష్ణా! కాపాడు! కాపాడు!" మంటూ మొరపెట్టుకొన్నారు. అప్పుడు అనంత దయాసముద్రుడూ, భక్త జనుల పాలిటి కల్పవృక్షమూ అయిన పద్మాక్షుడు.

**శా. సప్తాబ్దంబుల బాలుఁడై నిజభుజా స్తంభంబునన్ లీలమై**
**సప్తాహంబులు శైలరాజము లసచ్ఛత్రంబుగాఁ దాల్చి, సం**
**గుప్తప్రాణులఁ జేసె మాధవుఁడు గోగోపాలక వ్రాతమున్**
**సప్తాంభోధి పరీతభూధరున కాశ్చర్యంబె చింతింపఁగన్.** 187

* ఏడేండ్ల బాలుడు స్తంభాలవంటి తన భుజాలతో అలవోకగా గోవర్ధన గిరిని గొడుగులాగ ఏడురోజులపాటు ఎత్తిపట్టుకొన్నాడు. గోవులకూ, గోపాలకులకూ ప్రాణరక్షణ కావించాడు. సప్తసముద్రాలతో చుట్టబడిన భూమినే ధరించిన  ఆ పరమాత్ముడు ఒక్క కొండను గొడుగుగా ఎత్తి పట్టుకోవడం ఏమంత ఆశ్చర్యం.

**సీ. సాంద్ర శరచ్చంద్ర చంద్రికా ధవళిత విమల బృందావన వీథియందు**
**రాసకేళీ మహోల్లాసుఁడై యుత్ఫుల్ల జలజాక్షుఁ డొక నిశా సమయమునను**
**దనరారు మంద్ర మధ్యమ తారముల నింపు దళుకొత్త రాగభేదములఁ జెలఁగి**
**ధైవత ఋషభ గాంధార నిషాద పంచమ షడ్జ మధ్యమ స్వరము లోలిఁ**

**తే. గళలు జాతులు మూర్ఛనల్ గలుగ వేణు, నాళ వివరాంగుళన్యాస లాలనమున**
**మహితగతిఁ బాడె నవ్యక్త మధురముగను, పంకజాక్షుండు దారువు లంకురింప.** 188

* అది ఒక శరత్కాలపు రాత్రి. పండువెన్నెలలో బృందావన మంతా తెల్లగా కన్పిస్తున్నది. విరబూచిన తామరలవంటి కన్నులుగల కృష్ణుడు ఆ వనంలో రాసకేళికి ఉపక్రమించాడు. ఆ క్రీడోల్లాసంతో పిల్లనగ్రోవి చేత బట్టాడు. దాని రంధ్రాలపై వ్రేళ్లానుతూ ఇంపుగా అనేక రాగాలను ఆలాపించాడు. వాటిలో మంద్రస్థాయినీ, మధ్యమస్థాయినీ, తారస్థాయినీ వినిపించాడు. దైవతం, ఋషభం, గాంధారం, నిషాదం, పంచమం, షడ్జం, మధ్యమం అనే స్వరాలు, కళలూ, జాతులూ, ఆరోహణావరోహణ క్రమాలూ తేటపడేటట్లుగా అవ్యక్త మధురంగా గానం చేశాడు. ఆ గానానికి మ్రోళ్లు చివురించాయి.

**మ. హరివేణూద్గత మంజుల స్వరనినాదాహూతలై గోప సుం**
**దరు లేతేర ధనాధిపానుచర గంధర్వుండు గొంపోవఁ ద**
**త్తరుణుల్ గుయ్యిడ శంఖచూడుని భుజాదర్పంబు మాయించి తాఁ**
**బరిరక్షించిన యట్టి కృష్ణుని నుతింపన్ శక్యమే యేరికిన్?** 189

* శ్రీహరి వేణువు నుండి వెలువడే మధుర ధ్వని పిలుపు విని గోపికలు పరుగెత్తుకు వచ్చారు. అప్పుడు కుబేరుని అనుచరుడైన శంఖచూడుడనే గంధర్వుడు వాళ్ల నెత్తుకుపోయాడు. వాళ్ళు "కృష్ణ!

కృష్ణ!" అంటూ మొరపెట్టుకొన్నారు. వెంటనే మాధవుడు శంఖచూడుని భుజగర్వం పోకార్చి ఆ రమణీమణులను రక్షించాడు. అలాంటి వనమాలిని కొనియాడడం ఎవరికీ శక్యం కాదు.

చ. నరక మురప్రలంబ యవనద్విప ముష్టిక మల్ల కంస శం
బర శిశుపాల పంచజన పౌండ్రక పల్వల దంతవక్త్ర వా
నర ఖర సాల్వ వత్స బక నాగ విదూరథ రుక్మి కేశి ద
ర్దుర వృష ధేనుక ప్రముఖదుష్టనిశాటులఁ ద్రుంచె వ్రేల్మిడిన్. 190

* ఆ పరమాత్ముడు నరకాసురుడు, మురాసురుడు, ప్రలంబుడు, కాలయవనుడు, కువలయాపీడము అనే ఏనుగు, ముష్టికుడు చాణూరుడు మొదలైన మల్లురు, కంసుడు, శంబరుడు, శిశుపాలుడు, పౌండ్రక వాసుదేవుడు, పల్వలుడు, దంతవక్త్రుడు, ద్వివిదుడు అనే వానరుడు, గర్దభాసురుడు, సాల్వుడు, వత్సాసురుడు, బకాసురుడు, విదూరథుడు, రుక్మి, కేశి, దర్దురుడు, వృషభాకారాలు గల ఏడుగురు దనుజులు, ధేనుకుడు మొదలైన పెక్కుమంది రక్కసులను ఒక్కత్రుటిలో రూపుమాపాడు.

వ. మఱియును. 191

మ. బలభీమార్జున ముఖ్య చాపధర రూపవ్యాజతం గ్రూరులన్
ఖలులన్ దుష్టధరాతలేశ్వరుల సంగ్రామైక పారీణ దో
ర్బల కేళిం దునుమాడి సర్వధరణీభారంబు మాయించి సా
ధుల రక్షించిన యట్టి కృష్ణుని ననంతుం గొల్తు నెల్లప్పుడున్. 192

* అంతేకాదు. బలరాముడు, భీముడు, అర్జునుడు మొదలైన విలుకాండ్ర రూపాలతో అవతరించి కఠినులు, నీచులు, దుర్మార్గులు అయిన రాజులను రణరంగంలో ఆరితేరిన భుజబలక్రీడతో శ్రీకృష్ణుడు హతమార్చాడు. సమస్త భూభారాన్ని తొలగించాడు. సజ్జనులను రక్షించాడు. అట్టి అనంతుణ్ణి నేను అనుక్షణమూ ఆరాధిస్తాను.

వ. అట్టి లోకోత్కృష్టుండైన కృష్ణుని యవతారమాహాత్మ్యం బెఱింగించితి నింక వ్యాసావతారంబు వినుము. 193

* అటువంటి లోకశ్రేష్ఠుడైన శ్రీకృష్ణుని అవతార ప్రభావాన్ని చెప్పాను. ఇంక వ్యాసావతారంబు వినుము.

చ. ప్రతియుగమందు సంకుచిత భావులు నల్పతరాయువుల్ సుదు
ర్గతికులు నైన మర్త్యుల కగమ్యములున్ స్వకృతంబులున్ సుశా
శ్వతములు నైన వేదతరుశాఖలు దా విభజించినట్టి స
న్నుతుఁడు పరాశరప్రియతనూజుఁడు నా హరి పుట్టె నర్మిలిన్. 194

* ప్రతి యుగంలో అల్పబుద్ధులూ, అల్పాయుష్కులూ, దుర్గతి పాలయ్యేవారూ అయిన మానవు లుంటారు. వాళ్లకు భగవంతుడు నిర్మించినవీ, శాశ్వతములూ అయిన వేదాలు బోధపడవు. అలాంటి వాళ్లను

అనుగ్రహించాలనే బుద్ధితో శ్రీహరి సజ్జనస్తుతి పాత్రుడై పరాశర మహర్షి ప్రియపుత్రుడైన వ్యాసుడుగా ప్రభవించి ఆ వేదవృక్షాన్ని శాఖలు శాఖలుగా విభజించాడు.

వ. మఱియు బుద్ధావతారంబు వినుము. 195

మ. అతిలోలాత్ములు సూనృతేతరులు భేదాచార సంశీలు రు
ద్ధత పాషండమతౌపధర్ము్యలు జగత్సంహారు లైనట్టి యా
దితి సంజాతు లధర్మ వాసనల వర్తింపం, దదాచార సం
హతి మాయించి హరించె దానవులఁ బద్మాక్షుండు బుద్ధాకృతిన్. 196

* ఇక బుద్ధావతారం విను. చపలస్వభావులూ, అసత్యవాదులూ, భేదాచారపరాయణులూ, అధర్మనిరతులూ శుద్ధ పాషండులూ అయిన దైత్యులు లోకాన్ని చంపుకు తినేవారు. పుండరీకాక్షుడు బుద్ధుడుగా అవతరించి ఆ రక్కసులను వారి దురాచారాలతోపాటు నిర్మూలించాడు.

వ. మఱియుం గల్క్యవతారంబు వినుము. 197

మ. వనజాక్ష స్తవశూన్యులై మఱి వషట్స్వాహా స్వధా వాక్య శో
భన రాహిత్యులు, సూనృతేతరులునుం, బాషండులు న్నైన వి
ప్రనికాయంబును శూద్రభూపులుఁ గలిం బాటిల్లినం గల్కియై
జననం బంది యధర్మము న్నడఁచు సంస్థాపించు ధర్మం బిలన్. 198

* ఇక కల్క్యవతారం గురించి ఆలకించు. కలియుగంలో బ్రాహ్మణులు భగవంతుని వినుతించరు. వేదవిహితమైన యజ్ఞయాగాది కర్మలు ఆచరించరు. వాళ్ల నోటినుండి 'వషట్, స్వాహా, స్వధా' అనే మంగళ వచనాలు వినిపించవు. వాళ్ళు సత్యం పాటించరు; నాస్తికులై ప్రవర్తిస్తారు. శూద్రులు రాజు లవుతారు. ఇలాంటి పరిస్థితి సంభవించినప్పుడు భగవంతుడు కల్కిగా అవతరిస్తాడు. అధర్మం తొలగిస్తాడు. భూతలంలో ధర్మం స్థాపిస్తాడు.

వ. అని మఱియుఁ బితామహుండు నారదున కిట్లనియె, మునీంద్రా, పుండరీకాక్షుం డంగీకరించిన లీలావతారకథావృత్తాంతంబు నేను నీకు నెఱింగించు నంతకు మున్న హరి వరాహాద్యవతారంబు లంగీకరించి తత్ప్రయోజనంబులఁ దీర్చె, మన్వంతరావతారంబు లంగీకరించి నవియు నంగీకరింపఁ గలవియునై యున్నయవి; వర్తమానంబున ధన్వంతరి పరశురామావతారంబులు దాల్చి యున్నవాడు, భావికాలంబున శ్రీరామాద్యవతారంబుల నంగీకరింపంగలవాఁడ మ్మహాత్ముండు సృష్ట్యాది కార్య భేదంబులకొఱకు మాయాగుణావతారంబులందు, బహుశక్తి ధారణుండైన భగవంతుండు సర్గాదిని దపంబు నేనును ఋషి గణంబులును నవప్రజాపతులునునై యవతరించి విశ్వోత్పాదనంబు గావించు చుండు, ధర్మంబును విష్ణుండును యజ్ఞంబులును మనువులును నింద్రాది దేవగణంబులును ధాత్రీపతులును నయి యవతరించి జగంబుల రక్షించుచుండు, నధర్మంబును రుద్రుండును మహోరగంబులును రాక్షసానీకంబులును నై యవతరించి విలయంబు నొందించు చుండు,

**నిత్తెఱంగునం బరమేశ్వరుండును సర్వాత్మకుండును నైన హరి విశ్వోత్పత్తిస్థితి లయ హేతు భూతుండై విలసిల్లు, ధరణీరేణువుల నయిన గణుతింప నలవియగుం గాని యమ్మహాత్ముని లీలావతారాద్భుత కర్మంబులు లెక్క వెట్ట నెవ్వరికి నశక్యంబై యుండు, నీకు సంక్షేపరూపంబున నుపన్యసించితి సవిస్తారంబుగా నెఱింగింప నాకుం దరంబుగా దనిన నన్యులం జెప్పనేల? వినుము. 199**

* ఇలా చెప్పి బ్రహ్మ మళ్లీ నారదునితో ఈ విధంగా అన్నాడు. మునిశ్రేష్ఠా! శ్రీమన్నారాయణుడు స్వీకరించిన లీలావతారకథా విశేషాలు నేనిప్పుడు నీకు చెప్పాను. ఇంతకు ముందే శ్రీహరి ఆదివరాహం మొదలైన అవతారాలు స్వీకరించి చేయవలసిన పనులన్నీ చేశాడు. మన్వంతరముల సంబంధమైన అవతారాలు ఇంతవరకూ జరిగినవీ ఉన్నాయి. ఇక జరగబోయేవీ ఉన్నాయి. వర్తమాన కాలంలో ఆయన ధన్వంతరి, పరశురామావతారాలు ధరించి వున్నాడు. భవిష్యత్తులో శ్రీరాముడు మొదలైన అవతారాలు తాల్చ గలడు. ఆ మహాత్ముడు సృష్టి మొదలైన వివిధ కార్యాలు నెరవేర్చడానికి మాయాగుణంతో నిండిన అవతారాలు స్వీకరిస్తాడు.

అనేకశక్తులతో కూడిన ఆ భగవంతుడు సృష్ట్యాదిలో తపస్సుగా, నేనుగా, ఋషులుగా, తొమ్మిదిమంది ప్రజాపతులుగా అవతరించి లోకాన్ని సృష్టిస్తూ వుంటాడు. ధర్మము, విష్ణువు, యజ్ఞాలు, మనువులు, ఇంద్రుడు మొదలైన దేవతల రూపాలతో, రాజుల రూపాలతో అవతరించి లోకాలను రక్షిస్తూ వుంటాడు. అధర్మము, రుద్రుడు, భీకరసర్పాలు, రాకాసిమూకలుగా అవతరించి విశ్వాన్ని సంహరిస్తూ వుంటాడు.

పరమేశ్వరుడూ, సర్వస్వరూపుడూ అయిన శ్రీహరి ఈ విధంగా ఈ విశాల విశ్వం సృష్టికీ, స్థితికీ, లయానికీ హేతువై ప్రకాశిస్తాడు. భూమిలోని ధూళికణాల నయినా లెక్కపెట్టవచ్చుగాని ఆ భగవంతుని లీలావతారాలలోని అద్భుత కృత్యాలను లెక్కపెట్టడం ఎవ్వరికీ అలవికాదు. నీకు సంగ్రహంగా చెప్పాను. సవిస్తరంగా చెప్పడం నాకే సాధ్యం కాదు. ఇక ఇతరుల మాట చెప్పడ మెందుకు? ఇంకా విను.

**చ. అమరఁ ద్రివిక్రమస్ఫురణ నందిన యమ్మహితాత్ముపాద వే**
**గమున హతంబు లైన త్రిజగంబుల కావల వెల్గు సత్య లో**
**కము చలియించినం గరుణఁ గైకొని కాచి ధరించు పాద ప**
**ద్మము తుది నున్న యప్రతిహతంబగు శక్తి గణింప శక్యమే. 200**

* ఆ మహాత్ముడు త్రివిక్రమావతారం ధరించాడు. ఆయన పాదాల విసురుకు ముల్లోకాలూ తల్లడిల్లాయి. అంతేకాదు. ఆ ముజ్జగాలకు ఆవల వెలుగొందే సత్యలోకం గూడా వణకిపోయింది. అప్పుడు ఆ దేవుడు కృపతో ముప్పునుండి తప్పించి ఆ లోకాలను రక్షించాడు. అటువంటి ఆ పరమాత్ముని పాదాగ్రాని కుండే అప్రతిహతమైన శక్తి ఇంతింతని వర్ణించడం ఎవరికీ శక్యం కాదు.

**మ. హరి మాయాబల మే నెఱుంగ నఁట శక్యంబే సనందాది స**
**త్పురుష వ్రాతముకైన, బుద్ధి నితరంబున్ మాని సేవాధిక**

**స్ఫురణం దచ్చరితానురాగ గుణవిస్ఫూర్తిన్ సహస్రాస్య సుం**
**దరతం బొల్పగు శేషుఁడుం దెలియఁ డన్నన్ జెప్పనే లొండొరున్. 201**

* శ్రీహరి మాయాశక్తిని నేనే తెలుసుకోలేకున్నాను. ఇక సనందుడు, సనకుడు, సనత్కుమారుడు మొదలైన సజ్జన సంఘాలకు మాత్రం తెలుసుకోవడానికి వీలవుతుందా? ఆదిశేషుడు ఇతరమైన ఆలోచనలు వదలి పెట్టి బుద్ధిని సదా భగవత్సేవకే అంకితం చేశాడు. వేయి నోళ్లతో ఆ పరమేశ్వరుని చరిత్రను అనురక్తుడై కీర్తిస్తూ వుంటాడు. అట్టి శేషుడు గూడ ఆయన మాయామహిమ ఎలాంటిదో తెలుసుకోలేకున్నాడు. ఇక ఇతరుల సంగతి చెప్పాలా?

**చ. ఇతరము మాని తన్ను మది నెంతయు నమ్మి భజించువారి నా**
**శ్రితజనసేవితాంఘ్రి సరసీరుహుఁడైన సరోజనాభుఁ డం**
**చితదయతోడ నిష్కపటచిత్తమునం గరుణించు, నట్టి వా**
**రతుల దురంతమై తనరు నవ్విభు మాయఁ దరింతు రెప్పుడున్. 202**

* ఎవరు ఇతర చింతలు మాని సదా శ్రీమన్నారాయణుణ్ణే దృఢంగా నమ్మి సేవిస్తారో, వాళ్లను, ఆశ్రితులు అర్చించే పాదపద్మాలు కలవాడైన పద్మనాభుడు మిక్కిలి దయగలిగి కల్లాకపటంలేని మనస్సుతో అనుగ్రహిస్తాడు. అలా భగవంతుని సేవించి ఆయన కృపకు పాత్రులైనవాళ్లు మాత్రమే సాటిలేనిదీ, దాటరానిదీ అయిన ఆ భగవంతుని మాయను నిరంతరం తరింపగలుగుతారు.

**వ. మఱియును సంసారమగ్నులయి దివసంబులు ద్రోఁచియు నంతంబున శునక సృగాలభక్షణంబులైన కాయంబులందు మమత్వంబు సేయక భగవదర్పణంబు సేసిన పుణ్యాత్ములుం గొందఱు గల రెఱింగింతు వినుము, నేను నీ బ్రహ్మత్వంబునం జెందు రాజసంబు విడిచి య మ్మహాత్ముని పాదారవిందంబుల భక్తి నిష్ఠుండ నయి శరణాగతత్వంబున భజియించునప్పుడు దెలియుదు, రాజసగుణుండనై యున్నవేళం దెలియంజాలఁ, గావున శాస్త్రంబులు ప్రపంచింపక కేవలభక్తిజ్ఞాన యోగంబున సేవింతు, మఱియు సనకాదులగు మీరును, భగవంతుండైన రుద్రుండును, దైత్యపతియైన ప్రహ్లాదుండును, స్వాయంభువ మనువును, నతని పత్నియగు శతరూపయుఁ, దత్పుత్రులగు ప్రియవ్రతోత్తానపాదులునుం, బ్రాచీన బర్హియు, ఋభువును, వేనజనకుండగు నంగుండును, ధ్రువుండును గడవం జాలుదురు వెండియు. 203**

* ఇంతేకాదు. ఇంక కొందరు పుణ్యాత్ము లున్నారు. వాళ్లసంగతి వివరిస్తాను విను. వాళ్లు సంసారంలో మునిగి తేలుతూ దినాలు గడిపినా చివరలో కుక్కలూ, నక్కలూ పీక్కొని తినే ఈ శరీరాలపై మమకారం పెట్టుకోలేదు. తమ దేహాలను పూర్తిగా భగవంతునికే అర్పించారు. నేను బ్రహ్మను గదా అన్న గర్వంతో ఒక్కొక్కసారి రజోగుణం నన్ను పైకొంటుంది. ఆ సందర్భంలో నే నామహాత్ముని తత్త్వం ఇలాంటి దని తెలుసుకోలేను. రజోగుణం వదలి భక్తియుక్తుడనై ఆయన పాదపద్మాలను శరణాగతి భావంతో సేవించేటప్పుడు మాత్రమే ఆ భగవన్మహిమ తెలుసుకోగలుగుతున్నాను. అందుచేతనే శాస్త్రాలపై ఆధారపడక భక్తి జ్ఞానయోగాలతో మాత్రమే నేను ఆ పరమాత్మను సేవిస్తాను.

నేను కాదు; సనకుడు, సనందనుడు, సనత్కుమారుడు, సనత్సుజాతుడు, నీవు మొదలైన వాళ్లూ, భగవంతుడైన శివుడూ, దైత్యులను పాలించే ప్రహ్లాదుడూ, స్వాయంభువుడనే మనువూ, అతని భార్య శతరూప అనే సతీమణీ, వాళ్ల కుమారులైన ప్రియవ్రతుడూ, ఉత్తానపాదుడూ, పుత్రికలైన దేవహూతి మొదలైనవారూ, "ప్రాచీనబర్హి"అనే రాజేంద్రుడూ, "ఋభువు"అనే మహర్షి; వేనుని తండ్రిఅయిన అంగుడూ, ఉత్తానపాదుని కుమారుడగు ధ్రువుడూ - వీరందరూ భగవన్మాయను తరింపగల్గినవారే! ఇంకా విను!

**సీ. గాధి గయాదు లిక్ష్వాకు దిలీప మాంధాతలు భీష్మ యయాతి సగర**
**రఘు ముచుకుం దైళ రంతిదే వోద్ధవ సారస్వతోదంక భూరిషేణ**
**శ్రుతదేవ మారుతి శతధన్వ పిప్పల బలి విభీషణ శిబి పార్థ విదురు**
**లంబరీష పరాశ రాలర్క దేవల సౌభరి మిథిలేశ్వరాభిమన్యు**

**తే. లార్ష్టిషేణాదులైన మహాత్ము లెలిమిఁ, దవిలి యద్దేవు భక్తిఁ జిత్తముల నిల్పి**
**తత్పరాయణులౌట దుర్దాంతమైన, విష్ణుమాయఁ దరింతురు విమలమతులు. 204**

* గాధి, గయుడు మొదలైనవారు, ఇక్ష్వాకువు, దిలీపుడు, మాంధాత, భీష్ముడు, యయాతి, సగరచక్రవర్తి, రఘుమహారాజు, ముచుకుందుడు, ఐలుడు, రంతిదేవుడు, ఉద్ధవుడు, సారస్వతుడు, ఉదంకుడు, భూరిషేణుడు, శ్రుతదేవుడు, హనుమంతుడు, శతధన్వుడు, పిప్పలుడు, బలిచక్రవర్తి, విభీషణుడు, శిబిచక్రవర్తి, అర్జునుడు, విదురుడు, అంబరీషుడు, పరాశరమహర్షి, అలర్కమహారాజు, దేవలుడు, సౌభరి, జనకమహారాజు, అభిమన్యుడు, ఆర్ష్టిషేణుడు, మొదలగు నిర్మలమతులైన మహాత్ములందరూ అనురక్తులై భక్తితో ఆ దేవుని తమ మనస్సులో నిల్పారు. ఆయనే గతి అని సేవించారు. అందువల్లనే దాట వీలుగాని విష్ణుమాయను దాటగలవారయ్యారు.

**మ. అనఘా! వీరల నెన్న నేమిటికిఁ, దిర్యగ్జంతుసంతాన ప**
**క్షినిశాటాటవికాఘజీవ నివహస్త్రీ శూద్రహూణాదు లై**
**నను నారాయణభక్తి యోగమహితానందాత్ము లై రేని వా**
**రనయంబుం దరియింతు రవ్విభుని మాయావైభవాంభోనిధిన్. 205**

* పాపరహితుడా! సహజంగా పుణ్యాత్ములయిన వీళ్లను గూర్చి చెప్పవలసిన పనిలేదు. పశువులైనా, పక్షులైనా, రాక్షసులైనా, అడవిలో జీవించేవారైనా, పాపజీవనులైనా, స్త్రీలైనా, శూద్రులైనా, హూణులు మొదలైన వారైనా - ఎవరైనా సరే - ఆ శ్రీమన్నారాయణుని మీది భక్తి యోగంతో అఖండమైన ఆత్మానందం పొందినవారైతే చాలు; అవశ్యం ఆ దేవదేవుని మాయావైభవమనే మహాసముద్రాన్ని సులభంగా తరిస్తారు.

**వ. కావున. 206**

**క. శశ్వత్ప్రశాంతు నభయుని, విశ్వాత్ముఁ బ్రబోధమాత్రు విభు సంశుద్ధున్**
**శాశ్వతు సము సదసత్పరు, నీశ్వరుఁ జిత్తమున నిలుపు మెపుడు మునీంద్రా! 207**

* అందువల్ల మునీంద్రా! ఎల్లవేళలా మిక్కిలి శాంతుడై వుండేవాడూ, భయరహితుడూ, విశ్వమయుడూ, కేవల జ్ఞానస్వరూపుడూ, సర్వేశ్వరుడూ, శుద్ధాత్ముడూ, శాశ్వతుడూ, సముడూ, సత్తుకూ అసత్తుకూ అతీతుడూ అయిన పరమేశ్వరుణ్ణి సదా నీ హృదయంలో ప్రతిష్ఠించుకో!

**వ. అట్లయిన నప్పుణ్యాత్ముల ననవద్యశీలుర నవిద్య లజ్జావనత వదనయై పొందం జాలక వైముఖ్యంబున దవ్వు దవ్వులం దలంగి పోవు. మఱియును. 208**

* ఎవరు పరమాత్ముని చిత్తంలో ప్రతిష్ఠించుకొంటారో, అట్టి పుణ్యాత్ములూ, సచ్చరిత్రులూ అయిన మహనీయుల చెంతకు పోలేక "అవిద్య" సిగ్గుతో తల వంచుకొని పెడమొగమై దూరదూరాలకు తొలగి పోతుంది. ఇంతేకాదు.

**చ. హరిఁ బరమాత్ము నచ్యుతు ననంతునిఁ జిత్తములం దలంచి సు**
**స్థిరత విశోక సౌఖ్యములఁ జెందిన ధీనిధు లన్యకృత్యము**
**ల్మఱచియుఁ జేయ నొల్లరు, తలంచిన నట్టిదయౌ, సురేంద్రుఁడుం**
**బరువడి నుయ్యి ద్రవ్వునె పిపాసితుఁడై సలిలాభిలాషితన్? 209**

* పరమాత్ముడూ, చ్యుతి లేనివాడూ, అంతం లేనివాడూ అయిన శ్రీహరిని మనస్సులో స్థిరంగా భావించిన వాళ్లు శోకం లేని సుఖస్థితి పొందుతారు. అలాంటి బుద్ధిమంతులు భగవంతుని స్మరణ తప్ప ఇతర కార్యాలు ఏమరుపాటున గూడా చేయరు. ఆలోచిస్తే అది అంతే! వర్షం కురిపించే దేవేంద్రుడు దప్పిగొని నీళ్లకొరకై బావి త్రవ్వుతాడా?

**ఉ. సర్వఫల ప్రదాతయును, సర్వశరణ్యుఁడు, సర్వశక్తుఁడున్**
**సర్వజగత్ప్రసిద్ధుఁడును, సర్వగతుం డగు చక్రపాణి యీ**
**సర్వశరీరులున్ విగమసంగతిఁ జెంది విశీర్యమాణులై**
**పర్వినచో నభంబుగతి బ్రహ్మము దాఁ జెడకుండు నెప్పుడున్. 210**

* ఆ భగవంతుడు అందరికీ అన్ని ఫలాలు ఇచ్చేవాడు. అందరికీ శరణు పొందదగినవాడు. అన్ని శక్తులూ గలవాడు. అన్ని లోకాలలోనూ ప్రసిద్ధి పొందినవాడు. అంతటా వ్యాపించినవాడు. సుదర్శన మనే చక్రం ధరించిన బ్రహ్మస్వరూపుడైన ఆ దేవుడు, తక్కిన ఈ సమస్త ప్రాణులూ చిక్కి స్రుక్కి శిథిలమై అంతరించిపోయిన కల్పాంత కాలంలో గూడా ఆకాశంలాగా తానొక్కడూ చెక్కుచెదరకుండా నిర్వికారుడై నిలిచి వుంటాడు.

**ఉ. కారణకార్యహేతు వగు కంజదళాక్షునికంటె నన్యు లె**
**వ్వారును లేరు, తండ్రి! భగవంతు ననంతుని విశ్వభావనో**
**దారుని సద్గుణావళు లుదాత్తమతిం గొనియాడకుండినం**
**జేరవు చిత్తముల్ ప్రకృతిఁ జెందని నిర్గుణమైన బ్రహ్మమున్. 211**

* తండ్రీ! అటు కారణాలకూ, ఇటు కార్యాలకూ అన్నిటికీ కారణభూతుడైనవాడు ఆ కమలాక్షుడే. ఆయన కంటే ఇతరు లెవరూ ఆశ్రయింపదగిన వాళ్లు లేరు. షడ్గుణైశ్వర్య సంపన్నుడూ, తుది లేనివాడూ, ప్రపంచసృష్టి గావించే ఉదారుడూ అయిన ఆ పరమాత్ముని సద్గుణ పుంజాలను గొప్ప మనస్సుతో కొనియాడాలి. లేకుంటే మనస్సులు ప్రకృతికి అతీతమైన నిర్గుణ బ్రహ్మను పొందలేవు.

**మ. నిగమార్థ ప్రతిపాదక ప్రకటమై, నిర్వాణ సంధాయిగా**
**భగవంతుండు రచింప భాగవతకల్పక్ష్మాజమై శాస్త్ర రా**
**జి గరిష్ఠంబగు నీ పురాణ కథ సంక్షేపంబునం జెప్పితిన్,**
**జగతిన్ నీవు రచింపు దాన నతివిస్తారంబుగాఁ బుత్రకా! 212**

* వత్సా, ఈ పురాణకథ వేదార్థాలను ప్రతిపాదించడం చేత ప్రశస్తమై వుంది. మోక్షప్రదంగా వుండేటట్లు ఆ భగవంతుడు దీన్ని రచించాడు. ఇది భగవద్భక్తులకు కల్పవృక్షం, శాస్త్రాలన్నిటిలోనూ శ్రేష్ఠమైనది. ఈ పురాణకథను నేను నీకు సంగ్రహంగా చెప్పాను. నీవు దీన్ని లోకంలో విస్తృతంగా ప్రచారం కావించు.

**చ. పురుషభవంబు నొందుట యపూర్వము జన్మములందు, నందు భూ**
**సురకులమందుఁ బుట్టు టతిచోద్యము, నిట్లగుటన్ మనుష్యు ల**
**స్థిర మగు కార్యదుర్దశలచేత నశింపక విష్ణుసేవనా**
**పరతఁ దనర్చి నిత్య మగు భవ్యపథంబును బొందు టొప్పదే? 213**

* జన్మలలో పురుషజన్మం చాలా అపురూపం. అందులోనూ బ్రాహ్మణకులంలో పుట్టడం మరీ అరుదు. అందువల్ల మానవులు అనిత్యమైన నిష్ప్రయోజన కార్యాలలో బడి దురవస్థల పాలు కాకుండా శ్రీహరిని సేవించి నిత్యమైన పరమపదం పొందడం ఉచితం కదా?

**మ. ఉపవాసవ్రత శౌచ శీల మఖ సంధ్యోపాస నాగ్నిక్రియా**
**జప దానాధ్యయనాది కర్మముల మోక్షప్రాప్తి సేకూర, ద**
**చ్ఛపుభ క్తిన్ హరిఁ బుండరీకనయనున్ సర్వాతిశాయిన్ రమా**
**ధిపుఁ బాపఘ్నుఁ బరేశు నచ్యుతుని నర్థిం గొల్వలేకుండినన్. 214**

* పద్మనేత్రుడూ, అన్నిటినీ మించినవాడూ, లక్ష్మీకాంతుడూ, పాపనాశకుడూ, పరమేశ్వరుడూ, చ్యుతిరహితుడూ అయిన శ్రీహరిని నిర్మలభక్తి గలిగి ఆసక్తితో భజించాలి. అలా చేయకుండా ఉపవాసాలు, వ్రతాలు, శౌచాలు, శీలాలు, యాగాలు, సంధ్యోపాసనలు, అగ్నికార్యాలు, జపాలు, దానాలు, వేదాధ్యయనాలు మొదలైన పనులెన్ని చేసినా మోక్షం లభించదు.

**క. వనజాక్షు మహిమ నిత్యము, వినుతించుచు, నొరులు వొగడ వినుచున్, మదిలో**
**ననుమోదించుచు నుండెడు, జనములు దన్మోహవశతఁ జనరు మునీంద్రా! 215**

* మునిశ్రేష్ఠా! పద్మనేత్రుని మహిమను ఎల్లవేళలా స్తుతించాలి. ఇతరులు స్తుతిస్తూ వుంటే వినాలి. మనస్సులో ఆ మహిమను మననం చేస్తూ సంతసించాలి. అలా చేసే వాళ్లు దేవుని మాయకు లోనుగారు.

క. అని వాణీశుఁడు నారద, మునివరునకుఁ జెప్పినట్టి ముఖ్యకథా సూ
చన మతిభక్తిఁ బరీక్షి, జ్జనపాలునితోడ యోగిచంద్రుఁడు నుడివెన్. 216

* ఇలా పూర్వం బ్రహ్మదేవుడు మునిశ్రేష్ఠుడైన నారదునికి ముఖ్యకథను వివరించాడు. ఆ విషయాన్ని యోగీశ్వరుడైన శుకుడు మహా భక్తితో పరీక్షిన్మహారాజుకు తెలియజేశాడు.

### -: పరీక్షితుఁడు శుకునిఁ బ్రపంచోద్భవాదికంబు నడుగుట. :-

సీ. విను శుకయోగికి మనుజేశుఁ డిట్లను మునినాథ! దేవదర్శనము గలుగ
నారదమునికిఁ బంకేరుహభవుఁ డెఱింగించిన తెఱఁగు సత్కృప దలిర్ప
గణుతింప సత్త్వాదిగుణశూన్యుఁడగు హరి కమలాక్షు లోకమంగళములైన
కథలు నా కెఱిఁగింపు కైకొని నిస్సంగ మైన నా హృదయాబ్జమందుఁ గృష్ణు

తే. భవ్యచరితుని నాద్యంతభావశూన్యుఁ, జిన్మయాకారు ననఘు లక్ష్మీసమేతు
నిలిపి, యస్థిరవిభవంబు నిఖిల హేయ, భాజనం బై న యీ కళేబరము విడుతు. 217

* అప్పుడు పరీక్షిత్తు శుకమహర్షితో ఇలా అన్నాడు - "మునీశ్వరా! బ్రహ్మదేవుడు నారదమునికి భగవత్సాక్షాత్కారం కలగడానికి చెప్పిన ఉపాయం దయతో నాకు చెప్పండి. సత్త్వరజస్తమోగుణాలకు అతీతుడూ, పద్మాక్షుడూ అయిన శ్రీహరి కథలు లోకానికి మంగళం చేకూరుస్తాయి. అవి నాకు తెలియపరచండి. మీరు చెప్పింది విని సంగరహితమయిన నా హృదయకమలంలో శుభచరిత్రుడూ, తుది మొదళ్లు లేనివాడూ, చిన్మయస్వరూపుడూ, పాపరహితుడూ, లక్ష్మీ సహితుడూ అయిన కృష్ణుణ్ణి నిలుపుకొంటాను. చంచలమూ, హేయాలన్నిటికీ నెలవూ అయిన ఈ శరీరాన్ని విడిచి పెడతాను.

వ. అదియునుంగాక యెవ్వండేని శ్రద్ధా భక్తి యుక్తుండై కృష్ణగుణకీర్తనంబులు వినుచుం బలుకుచు నుండు నట్టివాని హృదయపద్మంబునందుఁ గర్ణ రంధ్రమార్గంబులం బ్రవేశించి కృష్ణుండు విశ్రమించి సలిలగతంబైన కలుషంబును శరత్కాలంబు నివారించు చందంబున నాత్మగతంబైన మాలిన్యంబు నపకర్షించుఁ గావున. 218

* అంతేకాక ఎవడు శ్రద్ధా భక్తులు కలిగి కృష్ణుని గుణగణాలను ఇతరులు కీర్తిస్తుంటే వింటాడో, తాను స్వయంగా కీర్తిస్తాడో, అలాంటి వాని హృదయకమలం లోకి శ్రవణ కుహరాల ద్వారా కృష్ణుడు ప్రవేశిస్తాడు. అక్కడ విశ్రమిస్తాడు. నీటిలోని మాలిన్యాన్ని శరదృతువు తొలగించినట్లు మనస్సులోని మాలిన్యాన్ని తొలగిస్తాడు.

మ. భరితోదగ్రనిదాఘతప్తుఁడగు నప్పాంథుం డరణ్యాది సం
చరణక్లేశసముద్భవం బగు పిపాసం జెంది యాత్మీయ మం

దిరముం జేరి గతశ్రముం డగుచు నెందేనిం జనంబోని భం
గి రమాధీశుపదారవిందయుగసంగీభూతుఁడై మానునే! 219

* అడవుల్లో సంచరిస్తూ వేసవి మండుటెండల తాపానికి పరితాపం చెందిన బాటసారి బడలి దప్పిగొని చివరికి తన యిల్లు చేరుకొంటాడు. అక్కడ హాయిగా అలసట తీర్చుకొంటాడు. అక్కడినుండి మళ్ళీ ఎక్కడికీ కదలడు. అలాగే రమాకాంతుని చరణకమల ద్వంద్వంతో సంబంధం కలిగి ఆ ఆనందం చవి చూచినవాడు మళ్లీ దాన్ని వదలడు.

వ. అదియునుంగాక సకలభూత సంసర్గశూన్యంబైన యాత్మకు భూతసంసర్గం బేప్రకారంబునం గలిగె? నది నిర్నిమిత్తత్వంబునం జేసియో కర్మంబునం జేసియో యాక్రమంబు నా కెఱింగింపుము. 220

* అంతేకాదు సమస్త భూతాలతోటి కలయిక లేని ఆత్మకు భూతాలతో సాంగత్యం ఎలా కలిగింది? అది అకారణంగా కలిగిందా? లేక కర్మవల్ల కలిగిందా? ఆ వైనం నాకు వివరించు.

సీ. ఎవ్వని నాభియం దెల్ల లోకాంగ సంస్థానకారణపంకజంబు వొడమె,
నం దుదయించి సర్వావయవస్ఫూర్తిఁ దనరారునట్టి పితామహుండు
గడఁగి యెవ్వని యనుగ్రహమున నిఖిల భూతముల సృజించె నుత్కంఠతోడ
నట్టి విధాత యే యనువున సర్వేశు రూపంబు గనుఁగొనె రుచిరభంగి

తే. నా పరంజ్యోతి యైన పద్మాక్షునకును, నలినజునకుఁ బ్రతీకవిన్యాసభావ
గతులవలనను భేదంబు గలదె చెపుము, యతిదయాసాంద్ర! యోగికులాబ్ధిచంద్ర! 221

* ఎవనినాభిలో సమస్తలోకాల ఉనికికీ హేతువైన పద్మం పుట్టిందో, ఆ పద్మంలో, ప్రభవించి సర్వాంగ సుందరంగా ప్రకాశించే బ్రహ్మ ఎవని అనుగ్రహం వల్ల ఔత్సుక్యంతో సమస్త ప్రాణులనూ సృష్టించాడో, ఆ బ్రహ్మ సర్వేశ్వరుని స్వరూపాన్ని ఏ విధంగా సాక్షాత్కరింప జేసుకొన్నాడో, అలాంటి పరంజ్యోతి స్వరూపుడైన పద్మాక్షుడికీ, బ్రహ్మకూ అవయవవిన్యాసంలోనూ, భావగతిలోనూ భేదమున్నదా? ఓ పరమకరుణాసాంద్రా! యోగికుల జలధిచంద్రా! నాకు చెప్పవయ్యా!

వ. మఱియును భూతేశ్వరుం డయిన సర్వేశ్వరుం డుత్పత్తి స్థితిలయకారణంబైన తన మాయను విడిచి మాయానియామకుండై యేయే ప్రదేశంబుల శయనంబు సేసె? నదియునుంగాక పురుషావయవంబులచేఁ బూర్వకాలంబున లోకపాలసమేతంబులైన లోకంబు లెత్తెఱంగునం గల్పితంబు లయ్యె? నదియునుంగాక మహాకల్పంబులును, నవాంతర కల్పంబులును, భూతభవిష్యద్వర్తమాన కాలంబులును, దేహాభిమానులై జనియించిన దేవపితృమనుష్యాదులకుం గలుగు నాయుః ప్రమాణంబులును, బృహత్సూక్ష్మకాలానువర్తనంబులును, ఏ యే కర్మంబులం జేసి జీవు లే యే లోకంబుల నొందుదురు? మఱియు నేయే కర్మంబులం జేసి దేవాది శరీరంబులం బ్రాపింతు? రట్టి కర్మమార్గప్రకారంబును, సత్త్వాది గుణంబుల పరిణామంబులగు దేవాదిరూపంబులం గోరు జీవులకు నే యే కర్మసముదాయం బెట్టు సేయందగు? నెవ్వనికి నర్పింపందగు? నవి

యెవ్వనిచేత గ్రహింపంబడు? భూ పాతాళ కకుబ్వ్యోమ గ్రహ నక్షత్ర పర్వతంబులును సరిత్సముద్రంబులును ద్వీపంబులును నే ప్రకారంబున సంభవించె? నా యా స్థానంబుల గలవారి సంభవంబు లేలాటివి? బాహ్యాభ్యంతరంబులం గలుగు బ్రహ్మాండ ప్రమాణం బెంత? మహాత్ముల చరిత్రంబు లెట్టివి? వర్ణాశ్రమ వినిశ్చయంబులును, ననుగతంబులై యాశ్చర్యావహంబులగు హరియవతార చరిత్రంబులును, యుగంబులును, యుగప్రమాణంబులును, యుగధర్మంబులును, బ్రతియుగంబునందును మనుష్యుల కేయే ధర్మంబు లాచరణీయంబు లట్టి సాధారణ ధర్మంబులును, విశేషధర్మంబులును, జాతి విశేష ధర్మంబులును, రాజర్షి ధర్మంబులును, నాపత్కాల జీవన సాధన భూతంబులగు ధర్మంబులును, మహదాదితత్త్వంబుల సంఖ్యయును, సంఖ్యాలక్షణంబును, నా తత్త్వంబులకు హేతుభూత లక్షణంబులును, భగవత్సమారాధన విధంబును, అష్టాంగయోగ క్రమంబును, యోగీశ్వరుల యణిమాద్యైశ్వర్య ప్రకారంబును, వారల యర్చిరాదిగతులును, లింగశరీర భంగంబులును, ఋగ్యజుస్సామాథర్వవేదంబులును, నుపవేదంబులైన యాయుర్వేదాదులును, ధర్మశాస్త్రంబులును, నితిహాస పురాణంబుల సంభవంబును, సర్వభూతంబుల యవాంతర ప్రళయంబును, మహాప్రళయంబును, నిష్టాపూర్తంబులును, యాగాది వైదిక కర్మజాలంబును, వాపీకూపతటాక దేవాలయాది నిర్మాణంబులును, నన్నదానం బారామప్రతిష్ఠ మొదలగు స్మార్తకర్మంబులును, కామ్యంబులైన యగ్నిహోత్రంబుల యనుష్ఠాన ప్రకారంబును, జీవసృష్టియు, ధర్మార్థకామంబు లనియెడు త్రివర్గంబుల యాచరణప్రకారంబును, మలినోపాధిక పాషండ సంభవంబును, జీవాత్మబంధ మోక్ష ప్రకారంబును, స్వరూపావస్థాన విధంబును, సర్వస్వతంత్రుండైన యీశ్వరుం డాత్మమాయం జేసి సర్వ కర్మసాక్షి యయ్యు నమ్మాయ నెడఁబాసి యుదాసీన గతిని విభుండై క్రీడించు తెఱంగును గ్రమంబునఁ బ్రపన్నుండనైన నాకు నెఱింగింపుము.

బ్రాహ్మణ శాపంబునంజేసి శోకవ్యాకుల చిత్తుండనై యనశన వ్రతుండనైన నీవు వినుట యెట్లని సందేహింపవలవదు, త్వదీయ ముఖారవింద వినిఃసృత నారాయణ కథామృత పానకుతూహలి నైన నాకు నింద్రియంబులు వశంబులై యుండు, నది గావున నేనడిగిన ప్రశ్నంబులకు నుత్తరంబులు సవిస్తరంబులుగా నానతిచ్చి కృతార్థునిం జేయఁ బరమేష్ఠితుల్యుండవగు నీవపూర్వ సంప్రదాయానురోధంబున నర్హుండ వగుదు వని విష్ణురాతుం డయిన పరీక్షిన్నరేంద్రుండు బ్రహ్మరాతుండైన శుకయోగి నడిగిన నతండు బ్రహ్మ నారదసంవాదంబును నేక సంప్రదాయాను గతంబును గతానుగతిక ప్రకారంబునునై తొల్లి సర్వేశ్వరుండు బ్రహ్మకల్పంబున బ్రహ్మకుపదేశించిన బాగవతపురాణంబు వేదతుల్యంబు, నీ కెఱింగింతు విను మని చెప్పెనని సూతుండు శౌనకాది మహామునులకుం జెప్పి నట్లు శుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రున కిట్లనియె. 222

* భూతాలకు అధినాథుడైన సర్వేశ్వరుడు ఉత్పత్తికీ, స్థితికీ, లయానికీ హేతువైన తనమాయను వదలి మాయానియామకుడై ఏయేస్థలాలలో శయనించాడు? అంతేకాక పూర్వం విరాట్పురుషుని అవయవాలతో ఇంద్రుడు మొదలైన లోకపాలకులతో కూడిన లోకాలు ఎలా సృష్టింపబడ్డాయి. అంతేకాక

మహాకల్పాలు, అవాంతరకల్పాలు, భూతభవిష్యద్వర్తమానకాలాలు, శరీరాభిమానంతో జన్మించే దేవతలు, పితరులు, మానవులు మొదలగువారికి కలిగే ఆయుఃప్రమాణాలు నాకు చెప్పు.

మహాకాలాన్నీ, సూక్ష్మకాలాన్నీ అనువర్తించి జీవులు ఏ యే కర్మలు చేసి ఏ యే లోకాలకు ప్రయాణం సాగిస్తారు? ఏయే కర్మలవల్ల వాళ్లకు దేవతాశరీరాలు వస్తాయి? అట్టి కర్మమార్గపద్ధతి నాకు వివరించు.

ఇంకా సత్త్వాది గుణాలకు ఫలములైన దేవాది స్వరూపాలు కోరే జీవులు ఏ యే కర్మలు ఏ విధంగా చేయాలి? ఆ కర్మలను ఎవరికి సమర్పించాలి? వాటిని ఎవరు స్వీకరిస్తారు?

భూమి, పాతాళం, దిక్కులు, ఆకాశం, గ్రహాలు, నక్షత్రాలు, పర్వతాలు, నదులు, సముద్రాలు, దీవులు ఎలా ఉద్భవించాయి. ఆయా చోట్ల ఉండే జీవుల జన్మలు ఎలాంటివి?

వెలుపలా, లోపలా బ్రహ్మాండం కొలత ఎంత? మహాత్ముల చరిత్రలు ఎటువంటివి? వర్ణాశ్రమ నియమాలు, క్రమంగా ఏర్పడి ఆశ్చర్యం కల్గించే శ్రీమన్నారాయణుని అవతారకథలు, నాలుగుయుగాలు, ఆ యుగాల ప్రమాణాలు, యుగధర్మాలు, ప్రతియుగంలోనూ మానవులు పాటించవలసిన సాధారణధర్మాలు, విశేషధర్మాలు, ఆయాజాతులకు సంబంధించిన ధర్మాలు, రాజర్షుల ధర్మాలు, జీవనసాధనాలైన ఆపద్ధర్మాలు, మహత్తు మొదలైన తత్త్వాలసంఖ్య, వాటి లక్షణము, ఆ తత్త్వాలకు హేతువులయిన లక్షణాలు, భగవానుణ్ణి ఆరాధించే పద్ధతి, యమనియమాదులైన అష్టాంగాలతో కూడిన యోగక్రమము, యోగిశ్రేష్ఠులైన వారి అణిమ, మహిమ మొదలగు అష్టసిద్ధుల స్వరూపం, అర్చిరాది మార్గాలలో ఆ యోగులు పయనించే తీరు, లింగశరీరాల వినాశము, ఋక్కు, యజుస్సు, సామము, అథర్వం అనే నాలుగు వేదాలు, ఆయుర్వేదం మొదలైన ఉపవేదాలు, ధర్మశాస్త్రాలు, ఇతిహాసాలు, పురాణాలు ఆవిర్భవించిన పద్ధతి, అన్ని భూతాలకూ ఏర్పడే అవాంతర ప్రళయము, వాటిస్థితి, మహాప్రళయము, ఇష్టాపూర్తాలనబడే యజ్ఞాది వైదిక కర్మలు, బావులు, మడుగులు, చెరువులు, దేవాలయాలు మొదలగు వాటి నిర్మాణం, అన్నదానం, ఆరామప్రతిష్ఠ మొదలైన స్మృతుల్లో చెప్పిన కర్మలు, కామ్య కర్మలైన అగ్నిహోత్రాదులు నిర్వర్తించే విధానం, జీవుల సృష్టి, ధర్మం, అర్థం, కర్మం అనే మతవర్గాలను ఆచరించే తీరు, మలిన శరీరులైన పాషండుల పుట్టుక, జీవాత్ముడు బంధింపబడే రీతి, ఆపై మోక్షం పొందే పద్ధతి, స్వస్వరూపంలో నెలకొనే ప్రకారము, దేనికీ లోబడక అన్నిటా స్వతంత్రుడైన ఈశ్వరుడు తన మాయతో సమస్త కర్మలకూ సాక్షిగా వుంటూనే ఆ మాయకు అతీతుడై ఉదాసీనుని లాగా ప్రభువై క్రీడించే పద్ధతి - ఈ సంగతులన్నీ విపన్నుడనై ప్రపన్నుడనైన నాకు వివరించు.

"నీవు బ్రాహ్మణ శాపం వల్ల దుఃఖిస్తున్నావు; నీ మనస్సు కలత జెంది వుంది; పైగా నిరాహార దీక్షలో ఉన్నావు! నేను చెప్పే ఈ విషయాలు ఎలా వినగలవు''? అని సంశయింపవద్దు. నేను మీ ముఖపద్మం నుండి వెలువడే శ్రీమన్నారాయణ కథాసుధను తనివిదీరా త్రాగాలన్న కుతూహలంతో వున్నాను. అట్టి నాకు యింద్రియాలు స్వాధీనంలోనే వున్నాయి. కాబట్టి నేను అడిగిన ప్రశ్నలు అన్నిటికీ సమాధానాలు సవిస్తరంగా ఆనతిచ్చి నన్ను కృతార్థుణ్ణి కావించు. ప్రాచీన సంప్రదాయాన్ని అనుసరించి, అందుకు తగినవాడవు నీవే! నీవు బ్రహ్మతో సమానుడవు!''

ఈ విధంగా విష్ణురాతుడైన (విష్ణువుచే రక్షితుడైన) పరీక్షిన్మహారాజు బ్రహ్మరాతుడైన (బ్రహ్మచే వ్యాసునికి పుత్రుడుగా అనుగ్రహింపబడిన) శుకమహాయోగిని అడిగాడు.

అప్పుడు శుకమహర్షి "రాజా! బ్రహ్మ నారదుల సంవాదరూపమూ, ఒకే సంప్రదాయానికి చెందిందీ, క్రమపద్ధతిలో పరంపరగా వస్తున్నదీ అయిన భాగవత మనే మహాపురాణ మున్నది. అది వేదంతో సమానం. దానిని పూర్వం సర్వేశ్వరుడు బ్రహ్మకల్పంలో బ్రహ్మకు ఉపదేశించాడు. అది నీకు తెలియ పరుస్తాను, విను"అని చెప్పి పరీక్షిత్తుతో ఇలా అన్నాడు.

**సీ. భూపాలకోత్తమ! భూతహితుండు సుజ్ఞానస్వరూపకుఁ డైన యట్టి**
**ప్రాణికి దేహసంబంధ మెట్లగు నన్న మహి నొప్పు నీశ్వరమాయ లేక**
**కలుగదు, నిద్రలోఁ గలలోనఁ దోఁచిన దేహబంధంబుల తెఱఁగువలెను**
**హరియోగ మాయామహత్త్వంబునం బాంచ భౌతిక దేహసంబంధుఁ డగుచు**

**తే. నట్టి మాయాగుణంబుల నాత్మ యొలి, బాల్య కౌమార యౌవనభావములను**
**నర సుపర్వాది మూర్తులఁ బొరసి "యేను", "నాయ దిది" యను సంసారమాయఁ దగిలి. 223**

**వ. వర్తించుచు నిట్లున్న జీవునికి భగవద్భక్తి యోగంబున ముక్తి సంభవించుట యెట్లన్న - నెప్పుడేని జీవుండు ప్రకృతి పురుషాతీతంబయిన బ్రహ్మస్వరూపంబునందు మహితధ్యాన నిష్ఠుండగు నప్పుడు విగతమోహుండై యహంకార మమకారాత్మకంబయిన సంస్కరణంబు దొఱంగి ముక్తుండయి యుండు, మఱియు జీవేశ్వరులకు దేహసంబంధంబులు గానంబడుచుండు, నట్టి దేహధారియైన భగవంతునందలి భక్తిం జేసి జీవునకు ముక్తి యెత్తెఱంగునం గలుగునని యడిగితివి, జీవుం డవిద్యామహిమం జేసి కర్మానుగతంబయిన మిథ్యా రూపదేహసంబంధుండు, భగవంతుండు నిజయోగమాయా మహిమంబునం జేసి స్వేచ్ఛా పరికల్పిత చిద్ఘన లీలావిగ్రహుండు. కావున భగవంతుండైన యీశ్వరుండు స్వభజనంబు ముక్తి సాధనజ్ఞానార్థంబు కల్పితంబని చతుర్ముఖునకుఁ దదీయనిష్కపటతపశ్చర్యాది సేవితుండయి నిజజ్ఞానానందఘనంబయిన స్వరూపంబు సూపుచు నానతిచ్చె, నది గావున జీవునికి భగవద్భక్తి మోక్షప్రదాయకంబగు, నిందులకు నొక్క యితిహాసంబు గల దెఱింగింతు నాకర్ణింపుము,దాన భవదీయ సంశయనివృత్తి యయ్యెడు నని శుకయోగీంద్రుండు రాజేంద్రున కిట్లనియె. 224**

* రాజోత్తమా! "జీవుడు భూతాలకు మేలు చేకూర్చేవాడు, జ్ఞానమే స్వరూపంగా కలవాడు, అలాంటి వానికి శరీరంతో సంబంధం ఎలా కలిగింది!" అంటావా? జగతీతల మంతా వ్యాపించివున్న ఈశ్వరుని మాయ అనేది లేకపోతే జీవునికి దేహంతో సంబంధం కలుగదు. నిద్రించే వేళ స్వప్నంలో దేహాలతో సంబంధం గోచరిస్తుందికదా! అలాగే నారాయణుని యోగమాయాప్రభావంవల్ల జీవుడు పంచభూతాలతో కూడిన దేహంతో సంబంధం కలవాడవుతాడు. ఆ మాయాగుణాలవల్లనే క్రమంగా బాల్యం, కౌమారం, యౌవనం అనే దశలు పొందుతాడు. మనుష్య, దేవతాది ఆకారాలను గూడా స్వీకరిస్తాడు. 'నేను' అనే అహంకారాన్నీ, 'నాది' అనే మమకారాన్నీ పెంచుకొంటాడు. సంసారమాయలో బద్ధుడవుతాడు.

ఈ విధంగా బద్ధుడై వర్తించే జీవుడికి భగవంతునిమీది భక్తితో ముక్తి ఎలా కలుగుతుంది అంటావా? అది చెబుతాను విను. ప్రకృతికీ, పురుషుడికీ అతీతమైన బ్రహ్మస్వరూపాన్ని ఎప్పుడు జీవుడు తీవ్రంగా ధ్యానిస్తాడో, అప్పుడు మోహంనుండి విడివడుతాడు. అహంకార మమకార మయమైన సంసారంనుండి విముక్తుడై ముక్తి పొందుతాడు.

అంతేకాదు; జీవుడికీ, ఈశ్వరుడికీ, శరీరాలతో సంబంధాలు కనిపిస్తున్నాయి. భగవంతుడుకూడా శరీరం ధరించేవున్నాడు. అట్టి భగవంతుడి మీద భక్తి గలిగి వుంటే జీవుడి కెలా ముక్తి సిద్ధిస్తుంది? అని అడిగావు.

అవిద్యకు లోనైనవాడు జీవుడు. అవిద్య ప్రభావంవల్ల అతడు కర్మ ననుసరించి సంప్రాప్తించిన శరీరాన్ని ధరిస్తాడు. ఆ దేహం మిథ్యారూప మైనది. భగవంతుడు యోగమాయతో గూడినవాడు. ఆయన తనయోగమాయాప్రభావం వల్ల తన ఇష్టానుసారం జ్ఞానమయమైన లీలాశరీరం కల్పించుకొంటాడు. అందువల్ల మోక్షానికి సాధనమైన జ్ఞానానికై తన సేవ కల్పించబడిందని భగవంతుడైన ఈశ్వరుడు బ్రహ్మతో చెప్పాడు. బ్రహ్మ నిష్కపటంగా తపస్సుచేసి పరమేశ్వరుని ఆరాధించాడు. అప్పుడు తన జ్ఞానానందఘనమైన స్వరూపం బ్రహ్మకు చూపిస్తూ ఈశ్వరుడు పై విధంగా తెలిపాడు.

అందువల్ల జీవుడికి భగవద్భక్తి తప్పక మోక్ష మిస్తుంది. ఈ విషయం నిరూపించే ఇతిహాసం ఒకటి వుంది. అది వివరిస్తాను, విను. దానివల్ల నీకు కల్గిన సందేహం తొలగిపోతుంది అని చెప్పి యోగిశ్రేష్ఠుడైన శుకుడు రాజశ్రేష్ఠుడైన పరీక్షిత్తుతో ఇలా అన్నాడు.

### -: నారాయణుండు బ్రహ్మ తపంబునకు మెచ్చి వరంబు లిచ్చుట :-

**సీ. హరిపాదభక్తి రహస్యోపదేష్టయు నఖిల దేవతలకు నధివిభుండు**
**నైన విధాత గల్పాదియందును నిజాశ్రయపద్మమున కధిష్ఠాన మరయ**
**నర్థించి జలముల నన్వేషణము సేసి నలినంబు మొదలు గానంగలేక**
**విసివి క్రమ్మఱను దద్బిసరుహాసీనుఁడై సృష్టినిర్మాణేచ్ఛఁ జిత్తమందుఁ**

**తే. జాల నూహించి తత్పరిజ్ఞానమహిమ, సరణి మనమునఁ దోఁపక జడనుపడుచు**
**లోకజాలంబుఁ బుట్టింపలేక మోహి, తాత్ముఁడై చింత నొందు నయ్యవసరమున. 225**

* దేవాదిదేవుని పాదాలమీద భక్తి గల్గివుండడంలోని పరమ రహస్యాన్ని ఉపదేశించినవాడు, దేవతల కందరికీ అధినేత అయిన విధాత కల్పారంభంలో తనకు నెలవైన పద్మానికి మూల మేమిటో పరిశీలించాలనుకొన్నాడు. నీళ్లలో వెదకడం ప్రారంభించాడు. ఎంత వెదకినా ఆ పద్మానికి మొద లెక్కడ వుందో తెలుసుకోలేకపోయాడు. చివరికి విసిగి వేసారి మరలివచ్చి ఆ పద్మంలోనే ఆసీను డయ్యాడు. జగత్తును సృష్టించాలనే సంకల్పం ఆయన హృదయంలో ఉదయించింది. ఎంతో ఆలోచించాడు. కాని సృష్టికి సంబంధించిన పరిజ్ఞానం ఆయన మనస్సుకు అందక క్రిందుమీదయినాడు. అలసత్వం ఆవహించింది. లోకాలను సృష్టించలేక పోయాడు. అతనిచిత్తం మోహాయత్త మయింది. చింతాక్రాంతు డయ్యాడు.

వ. జలమధ్యంబుననుండి యక్షర సమామ్నాయంబున స్పర్శంబులందు షోడశాక్షరంబును మఱియు నేకవింశాక్షరంబును నైన యియ్యక్షర ద్వయంబు వలన నగుచు మహాముని జనధనం బయిన "తప" యను శబ్దం బినుమా ఉచ్చరింపంబడి వినంబడిన, నట్టి శబ్దంబు వలికిన యప్పురుషుని వీక్షింపంగోరి నలుదిక్కులకుం జని వెదకి, యెందునుం గానక. మరలి వచ్చి నిజస్థానంబైన పద్మంబునం దాసీనుండై యొక్కింత చింతించి యట్టి శబ్దంబు దన్నుఁదపంబు సేయుమని నియమించుటగాఁ దలంచి ప్రాణాయామ పరాయణుండై, జ్ఞానేంద్రియ కర్మేంద్రియంబుల జయించి, యేకాగ్ర చిత్తుండై, సకలలోక సంతాపహేతువగు తపంబు వేయి దివ్యవత్సరంబులు గావింప, నీశ్వరుండు ప్రసన్నుండై పొడసూపిన నక్కమలసంభవుండు తత్క్షణంబ రాజసతామసమిశ్రసత్త్వగుణాతీతంబును, శుద్ధ సత్త్వగుణావాసంబును, నకాల విక్రమంబును - సర్వలోకోన్నతంబును, సకల సురగణ స్తుత్యంబును, ననంత తేజోవిరాజితంబు, నైన వైకుంఠ పురంబుం బొడగని యందు. **226**

* ఆ సమయంలో నీటినడుమ నుండి ఒక శబ్దం వినిపించింది. 'క' మొదలు 'మ' వరకూ ఉండే స్పర్శాక్షరాలలో పదునారవదీ ఇరవై యొకటవదీ అయిన "తప"అనే రెండు అక్షరాలవల్ల ఆ శబ్దం ఏర్పడింది. "త ప" అనే ఆ పదం మహర్షులకు అమూల్యమైన ధనం. ఆ మాట రెండుసార్లు 'తప తప' లని ఉచ్చరింపబడింది. బ్రహ్మ దాన్ని విన్నాడు. ఆ శబ్దాన్ని ఉచ్చరించిన పురుషుణ్ణి చూడాలనుకొన్నాడు. నాలుగు దిక్కులకూ వెళ్లి వెతికాడు. ఎక్కడా ఆ పురుషుడు గోచరించలేదు. తిరిగివచ్చి తన నివాసమైన పద్మంలోనే కూర్చున్నాడు. కొంత సేపు ఆలోచించాడు. తన్ను తపస్సు చేయమని హెచ్చరించటానికే ఆ శబ్దం వినిపించింది అనుకొన్నాడు. ప్రాణాయామం ప్రారంభించాడు. జ్ఞానేంద్రియాలనూ, కర్మేంద్రియాలనూ స్వాధీనం చేసుకొన్నాడు. మనస్సును ఏకాగ్రం చేసుకొని వెయ్యి దివ్య సంవత్సరాలు అలా తపస్సు చేశాడు. ఆ దారుణ తపస్సుకు లోకాలన్నీ తపించిపోయాయి. అప్పుడు శ్రీహరి ప్రసన్నుడై బ్రహ్మకు ప్రత్యక్షమయ్యాడు.

వెంటనే బ్రహ్మ వైకుంఠపురాన్ని చూచాడు. ఆ పురం రాజసగుణానికీ, తామసగుణానికీ ఆ గుణాలతో మిశ్రమైన సత్త్వగుణానికీ అతీత మయింది. కేవల సత్త్వగుణానికి నివాస మయింది. కాలానికి అక్కడ ప్రాబల్యం లేదు. అది  అన్ని లోకాలకంటే అత్యున్నత మైనది. సమస్త దేవతలకూ ప్రస్తుతింప దగినది. అక్కడ లోభం, మోహం, భయం అనేవి లేవు. అక్కడికి పోయినవారు మళ్లీ తిరిగి రావడమంటూ జరగదు. తుది లేని తేజస్సుతో అది ప్రకాశిస్తూ వున్నది. అలాంటి వైకుంఠపురాన్ని సరోజ సంభవుడు సందర్శించాడు.

సీ. సూర్యచంద్రానల స్ఫురణలం జొరనీక నిజదీధితి స్ఫూర్తి నివ్వటిల్ల
దివ్య మణిప్రభా దీపిత సౌధ విమాన గోపుర హర్మ్య మండపములుఁ
బ్రసవ గుచ్ఛ స్వచ్ఛ భరిత కామిత ఫల సంతాన పాదప సముదయములుఁ
గాంచన దండ సంగత మారుతోద్ధూత తరళ విచిత్ర కేతనచయములు

తే. వికచకైరవ దళదరవింద గత మ, రంద రసపాన మోదితేందిందిర ప్ర
భూత మంజుల నినదప్రబుద్ధ రాజ, హంసశోభిత వరకమలాకరములు, **227**

* అక్కడ మేడలు, విమానాలు, గోపురాలు, మిద్దెలు, మండపాలు, దివ్యమణికాంతులతో దేదీప్యమానంగా తేజరిల్లుతున్నాయి. ఆ దీప్తి ప్రభావం ముందు సూర్యచంద్రాగ్నుల తేజస్సులు వెలవెలబోతున్నాయి. ఇంకా ఆ వైకుంఠపురంలో పూలగుత్తులతో నిండి కోరిన ఫలాలు ప్రసాదించే కల్పవృక్ష సమూహాలు ఉన్నాయి. బంగారు కర్రలకు తగిలించిన రంగు రంగుల పతాకలు గాలికి రెపరెప లాడుతున్నాయి. వికసించిన కలువల్లోనూ, కమలాల్లోనూ మకరందం గ్రోలుతూ మధుకర బృందాలు ఆనందంతో ఝుంకారం చేస్తున్నాయి. ఆ శబ్దానికి మేల్కొన్న కలహంసలతో అక్కడి తటాకాలు కనులపండువు కావిస్తున్నాయి.

**సీ. వల నొప్పఁ గా 'న దైవం కేశవాత్పర' మ్మని పల్కు రాజకీరావళియును**
**మహిమ 'జగద్విష్ణుమయ మఖిల'మ్మని చదివెడు శారికాసముదయంబు**
**నేపారఁగా 'జితం తే పుండరీకాక్ష' యని లీలఁ బాడు పికావళియును**
**లలి మీఱఁగా 'మంగళం మధుసూదన' యనుచుఁ బల్కెడు మయూరావళియును**

**తే. దవిలి 'శ్రౌషడ్వషట్స్వధే' త్యాది శబ్ద, కలితముగ మ్రోయు మధుప నికాయములును**
**గలిగి యఖిలైక దివ్య మంగళ విలాస, మహిమఁ జెన్నొందు వైకుంఠమందిరంబు. 228**

* అక్కడి రాచిల్కలు 'కేశవుని కంటె పరదైవం లేదు' అని పల్కుతున్నాయి. గోరువంకలు 'విశ్వమంతా విష్ణుమయం' అని చదువుతున్నాయి. కోయిలలు 'పద్మాక్షా! నీదే జయం!'అని పాడుతున్నాయి. నెమళ్లు 'మధుసూదనా! నీకు మంగళం'అని ఆడుతున్నాయి. తుమ్మెదల గుంపులు 'శ్రౌషట్', 'వషట్', 'స్వధా' ఇత్యాది శబ్దాలతో ఝుంకారం చేస్తున్నాయి. ఈ విధంగా వైభవోపేతమైన వైకుంఠమందిరం సమస్త దివ్య మంగళ లీలావిలాసాలతో పరమసుందరంగా వుంది.

**వ. మఱియుం బయోధరావళీ విభాసితనభంబునుంబోలె వెలుంగుచున్న యద్దివ్యధామంబునందు.229**

* ఇంకా ధారాధర రాజితో విరాజిల్లే తారాపథంలాగా తేజరిల్లుతున్న ఆ దివ్యమందిరంలో.

**సీ. సలలితేందీవరశ్యామాయమానోజ్జ్వ లాంగులు నవ్యపీతాంబరులును**
**ధవళారవిందసుందర పత్రనేత్రులు సుకుమారతనులు భాసుర వినూత్న**
**రత్న విభూషణ గ్రైవేయ కంకణ హార కేయూర మంజీర ధరులు**
**నిత్యయౌవనులు వినిర్మలచరితులు, రోచిష్ణులును హరిరూపధరులు**

**తే. నగు సునందుండు నందుండు నర్హణుండుఁ, బ్రబలుఁడును నాది యగు నిజపార్శ్వచరులు**
**మఱియు వైదూర్య విద్రుమామల మృణాళ, తుల్యగాత్రులు దను భక్తితో భజింప. 230**

* సునందుడు, నందుడు, అర్హణుడు, ప్రబలుడు మొదలైన సేవకులు భగవానుని భక్తితో భజిస్తున్నారు. వాళ్ళు నల్ల కలువల్లాగా నీలమై నిగనిగలాడే శరీరాలతో నివ్వటిల్లుతున్నారు. పచ్చని కొంగ్రొత్త పట్టుపుట్టాలు

కట్టుకొన్నారు. తెల్లతామర రేకుల వంటి కన్నులతో శోభిల్లుతున్నారు. వారివి సుతిమెత్తని దేహాలు. వాళ్లు ధగధగలాడే రత్నాభరణాలూ, కంఠహారాలూ, కంకణాలూ, ముత్యాల సరాలూ, భుజకీర్తులూ, అందెలూ ధరించి వున్నారు. మాసిపోని యౌవనంతో భాసిస్తున్నారు. పవిత్రమైన ప్రవర్తన కలిగి వున్నారు. అందరూ హరిరూపాలు ధరించి జాజ్వల్యమానంగా వెలుగొందుతున్నారు. వారు వైడూర్యాలతోనూ, పగడాలతోనూ, తామర తూండ్లతోనూ సమానమైన శరీరాలు కల్గివున్నారు. అందరూ భక్తితో శ్రీమన్నారాయణుని భజిస్తున్నారు.

సీ. క్షాళితాఖిలకల్మషవ్రజామరనదీ జనక కోమల పదాబ్జముల వాని
నఖిల సంపత్కారణాపాంగ లక్ష్మీ విలాసిత వక్షఃస్థలంబు వానిఁ
బద్మమిత్రామిత్ర భాసిత కరుణాతరంగిత చారునేత్రముల వాని
భువననిర్మాణ నైపుణ భవ్య నిజ జన్మ కారణ నాభి పంకజము వాని

తే. నహి హితాహిత శయన వాహముల వాని, సేవితామరతాపసశ్రేణి వాని
నఖిలలోకంబులకు గురుఁడైన వానిఁ గాంచెఁ బరమేష్ఠి గన్నుల కఱవు దీఱ. 231

* ఆ భగవంతుని కోమల పాదపద్మాలనుండే సమస్త పాపాలనూ కడిగివేసే గంగానది ఉద్భవించింది. తన కడగంటి చూపుతో కలుములన్నీ ప్రసాదింపగల శ్రీమహాలక్ష్మి ఆయన వక్షఃస్థలంలోనే నివసిస్తున్నది. ఆయన సూర్యచంద్రులనే సుందరమైన కన్నులు కలవాడు. ఆ కనులలో కరుణా తరంగాలు పొంగిపొరలుతూ వుంటాయి. జగత్తును సృష్టించడంలో నిపుణుడైన బ్రహ్మ ఆ భగవంతుని నాభికమలం నుండే జన్మించాడు. శేషుడే ఆయనకు శయనం. గరుడుడే ఆయనకు వాహనం. ముక్కోటి దేవతలూ, మునులూ ఆయనను సేవిస్తూ వుంటారు. ఆయన సమస్తలోకాలకూ తండ్రి. అలాంటి పరమేశ్వరుణ్ణి బ్రహ్మదేవుడు కన్నులకరవు దీరేటట్టుగా చూచాడు.

క. కమనీయ రూపరేఖా, రమణీయతఁ జాల నొప్పు రమణీమణి య
క్కమలాలయ దన మృదు కర, కమలంబుల విభుని పాదకమలము లొత్తెన్ 232

* రూపరేఖావిలాసాలతో చక్కని చుక్కలా వున్న లక్ష్మీదేవి తన కోమలమైన పాణి పద్మాలతో ప్రాణేశ్వరుని పాదపద్మాలను ఒత్తుతున్నది.

వ. వెండియు. 233

శా. శ్రీకాంతాతిలకంబు రత్నరుచిరాజిప్రేంఖితస్వర్ణ డో
లాకేళిన్ విలసిల్లి తత్కచభరాలంకార స్రగ్గంధ లో
భాకీర్ణ ప్రచరన్మధువ్రత మనోజ్ఞాలోల నాదంబు ల
స్తోకానుస్వర లీల నొప్పఁగ నిజేశున్ వేడ్కతోఁ బాడఁగన్. 234

* అంతేకాదు. శ్రీ మహాలక్ష్మి రత్నకాంతులతో విరాజిల్లే బంగారపు తూగుటూయెలలో ఊగుతూ వున్నది. ఆమె కొప్పులో చెరివికొన్న సుమమాలికల సుగంధం మీది ఆశతో గుమిగూడిన తుమ్మెదలు

మనోజ్ఞంగా జుమ్మని రొద చేస్తూ విహరిస్తున్నాయి. ఆ భ్రమర ఝుంకారమే శ్రుతిగా శ్రీదేవి శ్రీహరిమీద పాటలు పాడుతున్నది.

వ. అట్టి నిత్యవిభూతియందు. 235

మ. సతతజ్ఞానరమా యశో బల మహైశ్వర్యాది యుక్తున్ జగ
త్పతి యజ్ఞేశు ననంతు నచ్యుతు దళత్పంకేరుహాక్షున్ శ్రియః
పతి నాద్యంత వికారదూరుఁ గరుణాపాథోనిధిన్ సాత్వతాం
పతి వర్ధిష్ణు సహిష్ణు విష్ణు గుణవిభ్రాజిష్ణు రోచిష్ణునిన్. 236

* అలాంటి పరమపదంలో ఎల్ల వేళలా జ్ఞానమూ, సంపదా, కీర్తి, బలమూ, ఐశ్వర్యమూ మొదలైన గుణాలతో కూడినవాడూ, భువనాలకు ప్రభువూ, యజ్ఞానికి అధీశ్వరుడూ, తుది లేనివాడూ, చ్యుతి లేనివాడూ, వికసించుచున్న పద్మాలవంటి నేత్రాలు కలవాడూ, లక్ష్మీవల్లభుడూ, మొదలు తుద వికారము లేనివాడూ, దయాసముద్రుడూ, యాదవులకు అధినాథుడూ, వృద్ధిశీలుడూ, సహనశీలుడూ, అంతటా వ్యాపించిన వాడూ, కల్యాణగుణాలతో విరాజిల్లేవాడూ, కాంతిమంతుడూ -

మ. దరహాసామృత పూరితాస్యు నిజభక్తత్రాణ పారాయణు
న్నరుణాంభోరుహపత్రలోచనునిఁ బీతావాసుఁ ద్రైలోక్య సుం
దరు మంజీర కిరీట కుండల ముఖోద్యద్భూషు యోగీశ్వరే
శ్వరు లక్ష్మీయుతవక్షుఁ జిన్మయు దయాసాంద్రుం జతుర్బాహునిన్. 237

* చిరునవ్వు అనే అమృతం విరజిమ్మే నెమ్మోము గలవాడూ, తన భక్తులను రక్షించడంలో ఆసక్తి గలవాడూ, ఎర్రతామర రేకులవంటి కన్నులు కలవాడూ, పీతాంబరధరుడూ, త్రిలోక సుందరుడూ, అందెలు, కిరీటమూ, మకర కుండలాలూ మొదలైన మేలిసొమ్ములు గలవాడూ, యోగీశ్వరులకు ప్రభువూ, వక్షః స్థలంలో లక్ష్మిని ధరించినవాడూ, జ్ఞాన స్వరూపుడూ, కృపానిధీ, నాలుగుభుజాలు కలవాడూ.

వ. మఱియు ననర్ఘ రత్నమయ సింహాసనాసీనుండును సునంద నందకుముదాది సేవితుండును, బ్రకృతిపురుష మహదహంకారంబులను చతుశ్శక్తులును గర్మేంద్రియ జ్ఞానేంద్రియమనో మహాభూతంబులను షోడశ శక్తులును బంచతన్మాత్రంబులునుం బరివేష్టింపఁ గోట్యర్క ప్రభావిభాసితుండును, స్వేతరాలభ్య స్వాభా విక సమస్తైశ్వర్యాతిశయుండునునై స్వస్వరూపంబునం గ్రీడించు సర్వేశ్వరుండైన పరమపురుషుం బురుషోత్తముం బుండరీకాక్షు నారాయణుం జూచి సాంద్రానందకందళిత హృదయారవిందుండును, రోమాంచకంచుకిత శరీరుండును, ఆనందబాష్పధారాసిక్త కపోలుండును నగుచు. 238

* అమూల్యమైన మణిమయ సింహాసనంలో కూర్చున్నవాడూ; సునందుడు, నందుడు, కుముదుడు మొదలైన అనుచరుల సేవలు గైకొనుచున్నవాడూ; ప్రకృతి, పురుషుడు, మహత్తత్త్వము, అహంకారము అనే

నాల్గు శక్తులూ; వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థ అనే పంచ కర్మేంద్రియాలూ; శ్రోత్రము, త్వక్కు, చక్షువు, జిహ్వ, ఘ్రాణము అనే పంచ జ్ఞానేంద్రియాలూ; మనస్సు; పృథివి, అప్పు, తేజస్సు, వాయువు, ఆకాశము అనే పంచభూతాలూ - ఈ పదునారు శక్తులూ, శబ్దం, స్పర్శం, రూపం, రసం, గంధం అనే ఐదు తన్మాత్రలూ తనచుట్టూ చేరి కొలుస్తుండగా కోటి సూర్యుల కాంతితో భాసించేవాడూ; ఇతరులకు లభ్యం కానివీ, తనకు మాత్రమే స్వభావసిద్ధమైనవీ అయిన సకలైశ్వర్యాలతో ప్రకాశించేవాడూ, నిజస్వరూపంలోనే వినోదించేవాడూ, అంతటికీ అధినాథుడూ, పరమపురుషుడూ, పరమశ్రేష్ఠుడూ, పద్మాక్షుడూ అయిన నారాయణుణ్ణి బ్రహ్మ చూచాడు. ఆయన హృదయపద్మం అమితానందంతో వికసించింది. ఆయన శరీరం గగుర్పాటు చెందింది. ఆయన చెక్కిళ్లు ఆనంద బాష్పాలతో ఆర్ద్రములైనాయి.

**క. వర పరమహంస గమ్య, స్ఫురణం దనరారు పరమపురుషుని పద పం**
**కరుహములకు నజుఁడు చతు, శ్శిరములు సోఁకంగ నతులు సేసిన హరియున్. 239**

* ఆ పైన మహానుభావులైన పరమహంసలకు మాత్రమే చేరదగిన ఆ పరమపురుషుని పాదపద్మాలకు బ్రహ్మ తన నాలుగు తలలు తగిలేటట్లు ప్రణామాలు చేశాడు.

**చ. ప్రియుఁడగు బొడ్డుఁదమ్మి తొలిబిడ్డఁడు వేలుపుఁబెద్ద భూత సం**
**చయములఁ జేయుకర్త నిజశాసనపాత్రుఁడు ధాత మ్రొక్కినన్**
**దయ దళుకొత్తఁ బల్కెఁ బ్రమదస్మిత చారుముఖారవిందుఁడై**
**నయమునఁ బాణిపంకజమునన్ హరి యాతనిదేహ మంటుచున్. 240**

* తన నాభిపద్మంలో జన్మించిన ముద్దుల పెద్దకొడుకు, దేవతలలో జ్యేష్ఠుడు, ప్రాణులకు సృష్టికర్త, తన అదుపాజ్ఞలలో మెలిగేవాడు అయిన బ్రహ్మ తనకు నమస్కరించే సరికి శ్రీహరికి దయ పొంగిపొరలింది. ఆనందంతో కూడిన మందహాసంతో ఆయన ముఖారవిందం విప్పారింది. తన కరకమలంతో విధాత శరీరాన్ని మెల్లగా నిమురుతూ శ్రీమన్నారాయణుడు ఇలా అన్నాడు.

**ఆ. కపటమునుల కెంత కాలమునకు నైన, సంతసింప నేను జలజగర్భ!**
**చిరతపస్సమాధిఁ జెంది విసర్గేచ్ఛ, మెలఁగు నిన్నుఁ బరిణమింతుఁగాని. 241**

* సరోజసంభవా! చిరకాలం నన్ను సేవించినా చిత్తశుద్ధిలేని మునులపట్ల నేను సంతోషం పొందను. బహుకాలం తపోనిష్ఠలో ఉండి సృష్టిచేయాలన్న కోరికతో ఉన్న నిన్ను మాత్రం మెచ్చుకొంటాను.

**తే. భద్రమగుఁగాక, నీకు నో పద్మగర్భ, వరము నిపుడిత్తు నెఱిఁగింపు వాంఛితంబు,**
**దేవదేవుఁడ నగు నస్మదీయ పాద, దర్శనం బవధి విపత్తిదశల కనఘ, 242**

* కమలగర్భా! నీకు మంగళ మగుగాక! నీ కోరిక యేమిటో చెప్పు. ఇప్పుడే నీకు వరం ప్రసాదిస్తాను. పాపరహితుడా! నేను దేవతలకు దేవుడను. నా పాదసందర్శనం వల్ల ఆపదలన్నీ అంతమైపోతాయి.

చ. సరసిజగర్భ! నీయెడఁ బ్రసన్నత నొంది మదీయలోక మే
నిరవుగఁ జూపుటెల్లను సహేతుక భూరి దయా కటాక్ష వి
స్ఫురణన కాని, నీదగు తపోవిభవంబునఁ గాదు, నీ తప
శ్చరణము నాదు వాక్యముల సంగతిఁగాదె సరోజసంభవా! 243

* అరవిందభవా! నీపై అనుగ్రహం కలిగి వైకుంఠ లోకమంతా నీకు చూపాను. ఇలా చూపడానికి కారణం ఉంది. ఇది నా అపార కృపా కటాక్షప్రసారం వల్లనే జరిగింది. అంతేకాని నీ తపోవైభవం వల్ల జరగలేదు. కమలసంభవా! నీవు తపస్సు చేయడం కూడా నా మాటలను పాటించే కదా!

క. తప మనఁగ మత్స్వరూపము, తపమను తరువునకు ఫలవితానమునే నా
తపముననే జనన స్థి, త్యుపసంహరణము లొనర్చుచుండుదుఁ దనయా! 244

* తపస్సు అంటే నా స్వరూపమేకాని మరేమీ కాదు. తపస్సు అనే వృక్షానికి ఫలం నేనే కుమారా! ఆ తపస్సు వల్లనే నేను లోకాల సృష్టి స్థితి లయాలు కావిస్తూ వుంటాను.

క. కావున మద్భక్తికిఁ దప, మేవిధమున మూలధనము నిది నీ మది రా
జీవభవ! యెఱిఁగి తప మిటు, గావించుట విగతమోహకర్ముఁడ వింకన్. 245

* అందువల్ల నాయందలి భక్తికి ఏ విధంగా చూచినా తపస్సే మూలధనం. పద్మసంభవా! ఇది నీ మనస్సులో లెస్సగా గుర్తించి తపస్సు చేశావు. కాబట్టి నీ కర్మలూ, మోహమూ తొలగిపోయాయి.

క. అని యానతిచ్చి కమలజ!, యెనయఁగ భవదీయమానసేప్సిత మే మై
నను నిత్తు, వేఁడు మనినను, వనరుహసంభవుడు వికచవదనుం డగుచున్. 246

* ఈ విధంగా చెప్పి విష్ణువు మళ్లీ "చతుర్ముఖా! నీ మనోభీష్టం ఏదైనా సరే, ఇస్తాను. కోరుకో!" అన్నాడు. ఆ మాటలు విని విధాత మోము వికసించింది.

చ. హరివచనంబు లాత్మకుఁ బ్రియం బొనరింపఁ బయోజగర్భుఁ డో
పరమపదేశ! యోగిజనభావన! యీ నిఖిలోర్వియందు నీ
యరయని యట్టి యర్థ మొకఁడైనను గల్గునె? యైన నా మదిన్
బెరసిన కోర్కి దేవ! వినిపింతు దయామతిఁ జిత్తగింపవే! 247

* శ్రీహరి వాక్కులు హృదయానికి ఆనందం కలిగింపగా అరవింద సంభవుడు విష్ణుదేవునితో ఇలా విన్నవించుకున్నాడు. పరమపద నాయకుడవైన స్వామీ! యోగిజన హృదయాంతర్యామీ! ఈ సమస్త భూవలయంలో నీకు తెలియని విషయ మంటూ ఏమీ లేదు. ఐనా నా చిత్తంలో నెలకొన్న కోరిక నీకు మనవి చేస్తాను. కృపతో చిత్తగించు దేవాది దేవా!

వ. దేవా! సర్వభూతాంతర్యామివై భగవంతుండవైన నీకు నమస్కరించి మదీయ వాంఛితంబు విన్నవించెద నవధరింపు, మవ్యక్తరూపంబులై వెలుంగు భవదీయ స్థూలసూక్ష్మరూపంబులును,

**నానాశక్త్యుపబృంహితంబులైన బ్రహ్మాది రూపంబులును, నీయంత నీవే ధరించి జగదుత్పత్తి స్థితిలయంబులం దంతు కీటంబునుం బోలెఁ గావించుచు నమోఘసంకల్పుండవై లీలావిభూతిం గ్రీడించు మహిమంబు దెలియునట్టి పరిజ్ఞానంబుఁ గృపసేయుము, భవదీయ శాసనంబున జగన్నిర్మాణంబు గావించునపుడు బ్రహ్మాభిమానంబునంజేసి యవశ్యంబును మహదహంకారంబులు నామదిం బొడముం గావునఁదత్పరిహారార్థంబు వేఁడెద, నన్నుం గరుణార్ద్ర దృష్టి విలోకించి దయసేయు మని విన్నవించిన నాలించి పుండరీకాక్షుం డతని కిట్లనియె. 248**

* స్వామీ! నీవు భగవంతుడవై సమస్త ప్రాణులలో అంతర్యామి వై వున్నావు. ఇట్టి నీకు ప్రణమిల్లి నా కోరిక విన్నవిస్తాను, అవధరించు, వ్యక్తం కాని రూపాలతో ప్రకాశించే నీ స్థూల సూక్ష్మ స్వరూపాలూ, వివిధ శక్తులతో వృద్ధిపొంది విలసిల్లే బ్రహ్మ మొదలైన వారి రూపాలూ నీయంతటి నీవే తాలుస్తున్నావు. సాలెపురుగులాగా జగత్తుకు సృష్టిస్థితి లయాలు జరుపుతున్నావు. నీ సంకల్పం వ్యర్థం కానిది. ఇలా లీలా విభూతితో వినోదిస్తున్న నీ ప్రభావం తెలుసుకొనే తెలివి నాకు ప్రసాదించు. నేను నీ యాజ్ఞానుసారం జగత్తును సృష్టిస్తుంటాను. ఆ పనిచేసేటప్పుడు బ్రహ్మను కదా అన్న అభిమానంతో నా మనస్సులో మహదహంకారాలు పొడసూపుతాయి. వాటిని నశింపజేయవలసిందిగా ప్రార్థిస్తున్నాను. నన్ను దయార్ద్ర దృష్టితో అనుగ్రహించు!

ఇలా బ్రహ్మదేవుడు గావించిన విన్నపం విని పద్మాక్షుడు ఈ రీతిగా పలికాడు.

**క. వారిజభవ! శాస్త్రార్థ వి, చారజ్ఞానమును భక్తి సమధికసాక్షా**
**త్కారము లను నీ మూఁడు ను, దారత నీ మనమునందు ధరియింపనగున్. 249**

* ఓయీ! సరోజసంభవా! శాస్త్రాల అర్థాన్ని పరిశీలించినందువల్ల కలిగే జ్ఞానమూ, నా మీది భక్తీ, ఉత్తమమైన సాక్షాత్కారమూ అనే ఈ మూడే నీ మనస్సులో గట్టిగా నిల్పుకో!

**సీ. పరికింప మత్స్వరూప స్వభావములును మహిమావతార కర్మములుఁ దెలియఁ**
**తత్త్వవిజ్ఞానంబు దలకొని మత్ప్రసాదమునఁ గల్గెడి నీకుఁ గమలగర్భ!**
**సృష్టిపూర్వమునఁ జర్చింప నే నొకరుండఁ గలిగి యుండుదు వీతకర్మి నగుచు**
**సమధికస్థూల సూక్ష్మ స్వరూపములుఁ దత్కారణ ప్రకృతియుఁ దగు మదంశ**

**ఆ. మందు లీనమైన నద్వితీయుండనై, యుండు నాకు నన్య మొకటి లేదు,**
**సృష్టికాలమందు సృజ్యమానం బగు, జగము మత్స్వరూప మగును వత్స! 250**

* జలజగర్భా! నా స్వరూపమూ, స్వభావమూ, ప్రభావమూ, అవతారాలూ, అందు నేను చేసే కర్మలూ - వీటి నన్నింటినీ గ్రహించే తత్త్వజ్ఞానం నా అనుగ్రహం వల్లనే నీకు కలుగుతుంది. సృష్టికి ముందు నేను ఒక్కణ్ణే ఉండేవాణ్ణి. అప్పుడు నాకు ఎలాంటి కర్మసంబంధమూ ఉండేదికాదు. స్థూల రూపమూ, సూక్ష్మరూపమూ, వాటికి కారణమైన ప్రకృతీ, నా అంశంలోనే అప్పుడు లీనమై వుంటాయి. అందువల్ల

నేనొక్కడనే తప్ప నాకంటే వేరైన మరొక పదార్థమంటూ ఉండదు. కుమారా! సృష్టికాలంలో జనించిన జగత్తంతా నా స్వరూపమే అని గ్రహించుకో.

క. అరయఁగఁ గల్పప్రళయాం, తరమున నాద్యంత విరహిత క్రియతోడం
బరిపూర్ణ నిత్య మహిమం, బరమాత్ముఁడనై సరోజభవ! యే నుందున్. 251

* కమలసంభవా! కల్పానికీ ప్రళయానికీ మధ్యకాలంలో తుది మొదలు లేనివాడనై, నిండైన నిత్యమహిమతో గూడి నేను పరమాత్ముడనై ఉంటాను.

వ. అదియుంగాక నీవు నన్నడిగిన యీ జగన్నిర్మాణమాయా ప్రకారం బెఱింగింతు, లేని యర్థంబు శుక్తి రజతభ్రాంతియుంబోలె నేమిటి మహిమం దోఁచి క్రమ్మఱఁ దోఁపకమాను నదియె మదీయ మాయావిశేషం బని యెఱుంగు, మదియునుం గాక లేని యర్థంబు దృశ్యమానం బగుటకును, గల యర్థంబు దర్శనగోచరంబు గాకుండుటకును, ద్విచంద్రాదికంబును దమః ప్రభాసంబును దృష్టాంతంబులుగాఁ దెలియు, మే ప్రకారంబున మహాభూతంబులు భౌతికంబులయిన ఘట పటాదులందుఁ బ్రవేశించియుండు, నా ప్రకారంబున నేను నీ భూత భౌతికంబు లయిన సర్వకార్యంబులందు సత్త్వాదిరూపంబులం బ్రవేశించి యుండుదు, భౌతికంబులు, భూతంబులందుఁ గారణావస్థంబొందు చందంబున భూతభౌతికంబులు గారణావస్థం బొంది నాయందు నభివ్యక్తంబులై యుండవు; సర్వదేశంబులయందును, సర్వకాలంబులయందును, నేది బోధితంబై యుండు నట్టిదియ పరబ్రహ్మస్వరూపంబు, తత్త్వం బెఱుంగ నిచ్ఛించిన మిముబోఁటి వారలకు నీ చెప్పిన మదీయ తత్త్వాత్మకంబైన యర్థంబ యర్థం బని యెఱుంగు. ఈ యర్థం బుత్కృష్టం బయినయది, యేకాగ్రచిత్తుండవై యాకర్ణించి భవదీయచిత్తంబున ధరియించిన నీకు సర్గాది కర్మంబులందు మోహంబు సెందకుండెడి నని భగవంతుండయిన పరమేశ్వరుండు చతుర్ముఖున కానతిచ్చి నిజలోకంబుతో నంతర్ధానంబు నొందె నని చెప్పి శుకుండు వెండియు నిట్లనియె. 252

* అంతేకాదు, నీ వింతాక నన్ను జగత్తును నిర్మించడానికి హేతువైన మాయావిధానాన్ని గురించి అడిగావు. ఆ విషయం తెలియపరుస్తాను. ముత్తెపుచిప్పను చూచినపుడు దానిలో వెండి లేకున్నా ఉన్నట్లు తోస్తుంది. అదే మాదిరి లేని వస్తువు ఉన్నట్లు తోచి విచారించి చూస్తే లేదని స్పష్టమవుతుంది. ఇది దేని మహిమవల్ల జరుగుతున్నదో, అదే నా మాయా విశేషమని గ్రహించుకో.

అంతేకాక మాయాప్రభావం వల్ల లేని వస్తువు కనిపించడం, ఉన్న వస్తువు కనిపించకపోవడం జరుగుతూ ఉంటుంది. చంద్రుడొక్కడే ఐనా ఇద్దరు చంద్రులున్నట్లు కనిపిస్తుంది కదా! ఇది లేని వస్తువు కనిపించటానికి దృష్టాంతం. రాహుగ్రహం ఉన్న వస్తువు కనిపించకపోవడానికి దృష్టాంతం. గ్రహమండలంలో రాహుగ్రహ మనే గ్రహం ఉన్నా అది మనకు కనిపించదుగదా!

పృథివ్యాదులైన మహాభూతాలు, భౌతికపదార్థాలైన ఘటం, పటం మొదలగు వస్తువులలో ప్రవేశించి ఉంటాయి. అలాగే నేను భూతాలలోనూ, భూతనిర్మితాలైన సమస్త భౌతిక పదార్థాలలోనూ సత్త్వాది రూపాలలో ప్రవేశించి ఉంటాను.

పృథివి మొదలైన భూతాలలో ఘటపటాదులైన భౌతిక పదార్థాలు కారణావస్థను పొందుతాయి, అదేరీతిగా భూతాలూ, భౌతికాలూ - ఇవన్నీ నాలో కారణావస్థను పొంది ఉంటాయి. అంతేకాని అభివ్యక్తాలై ఉండవు. ఇంతవరకూ నిరూపితమైన ఈ పరబ్రహ్మస్వరూపం అన్ని దేశాలలోనూ, అన్ని కాలాలలోనూ ఇలాగే ఉంటుంది కాని మార్పు చెందదు. తత్త్వం తెలుసుకోగోరే మీబోటివాళ్ళకు నేనిప్పుడు చెప్పినదే తత్త్వ స్వరూపమైన అర్థమని గ్రహించు. ఈ అర్థమే అన్నిటికంటె శ్రేష్ఠ మయినది. దీన్ని ఏకాగ్రమైన మనస్సుతో విని నీ హృదయంలో నిలుపుకో. అలా చేస్తే జగన్నిర్మాణాది కార్యాలు చేసేటప్పుడు మోహం నిన్నంటదు. ఈ విధంగా భగవంతుడైన పరమేశ్వరుడు బ్రహ్మకు ఆనతిచ్చాడు. అనంతరం తన వైకుంఠలోకంతో కూడా అంతర్ధానం చెందాడు.

శుకుడు పరీక్షిత్తుతో ఇలా చెప్పి మళ్ళీ ఈ విధంగా అన్నాడు.

**సీ. అవనీశ! బ్రహ్మ యిట్లంతర్హితుండైనఁ బుండరీకాక్షుని బుద్ధి నిలిపి**
**యానందమునఁ బొంది యంజలి గావించి తత్పరిగ్రహమునఁ దనదు బుద్ధిఁ**
**గైకొని పూర్వప్రకారంబునను సమస్త ప్రపంచంబును దగ సృజించి**
**మఱియొకనాఁడు ధర్మప్రవర్తకుఁ డౌచు నఖిల ప్రజాపతియైన కమల**

**తే. గర్భుఁ డాత్మహితార్థమై కాక సకల, భువనహితబుద్ధి నున్నతస్ఫురణ మెఱసి**
**మానితంబైన యమనియమముల రెంటి, నాచరించెను సమ్ముదితాత్ముఁ డగుచు. 253**

* రాజా! ఈ విధంగా అంతర్ధానం చెందిన పద్మాక్షుణ్ణి బ్రహ్మ తన హృదయంలో నిలుపుకొన్నాడు. ఎంతో ఆనందంతో ఆయనకు నమస్కారం చేశాడు. ఆయన కృపకు పాత్రుడై పూర్వంలాగానే సమస్త లోకాన్నీ సృష్టించాడు. ధర్మాన్ని ప్రవర్తింపజేసేవాడూ, ప్రజాపతీ అయిన బ్రహ్మదేవుడు మరొకనాడు తన మేలుకోసం కాక సకలలోకాల క్షేమం కాంక్షించి సంతుష్టాత్ముడై యమ నియమాలతో మహోన్నతమైన తపస్సు చేశాడు.

**వ. అయ్యవసరంబున 254**

**క. ఆ నలినాసన నందను, లైన సనందాదిమునుల కగ్రేసరుఁడున్**
**మానుగఁ బ్రియతముఁడును నగు, నా నారదుఁ డేఁగుదెంచె నబ్జజు కడకున్. 255**

* ఆ సమయంలో బ్రహ్మమానసపుత్రులైన సనందుడు మొదలైన మునులలో మొదటివాడూ, ఆయనకు మిక్కిలి ఇష్టుడూ అయిన నారదమునీంద్రుడు తండ్రి అయిన బ్రహ్మ దగ్గరకు వచ్చాడు.

క. చనుదెంచి తండ్రికిం బ్రియ, మొనరఁగ శుశ్రూషణంబు లొనరిచి యతఁడుం
దనదెసఁ బ్రసన్నుఁ డగుటయుఁ, గని భగవన్మాయ దెలియఁగా నుత్సుకుఁడై, 256

* అలా వచ్చి సంప్రీతితో సపర్యలు చేశాడు. బ్రహ్మకూడా అతని పట్ల ప్రసన్ను డయ్యాడు. అప్పుడు నారదుడు భగవన్మాయ ఎట్టిదో తెలుసుకోవటానికి ఉబలాట పడ్డాడు.

సీ. అవనీశ! నీవు నన్నడిగిన పగిది నాతఁడుఁ దండ్రి నడుగఁ బితామహుండు
భగవంతుఁ డాశ్రితపారిజాతము హరి గృపతోడఁ దన కెఱింగించినట్టి
లోకమంగళచతుశ్శ్లోక రూపంబును దశలక్షణంబులఁ దనరు భాగ
వతము నారదున కున్నతిఁ జెప్పె నాతఁడు చారు సరస్వతీ తీరమునను

తే. హరిపదధ్యాన పారీణుఁ డాత్మవేది, ప్రకటతేజస్వి యగు బాదరాయణునకుఁ
గోరి యెఱిఁగించె న మ్మహోదారుఁ డెలిమి, నాకు నెఱిఁగించె, నెఱిఁగింతు నీకు నేను. 257

* రాజా! నీవు నన్ను అడిగినట్లే నారదుడు తండ్రి నడిగాడు. అప్పుడు భగవంతుడూ, ఆశ్రితులకు కల్పవృక్షము వంటివాడూ అయిన శ్రీహరి దయతో తనకు తెలియపరచినదీ, లోకాలకు శుభం కలిగించేదీ, నాలుగు శ్లోకాల రూపంతో ఉన్నదీ, పదిలక్షణాలతో కూడినదీ అయిన భాగవతాన్ని బ్రహ్మదేవుడు ఉదారబుద్ధితో నారదునికి ఉపదేశించాడు. నారదుడు ఆ భాగవత స్వరూపాన్ని మనోజ్ఞమైన సరస్వతీ నదీతీరంలో శ్రీహరి పాదాలను ధ్యానించడంలో నిమగ్నుడూ, ఆత్మతత్త్వ మెరిగిన వాడూ, మహాతేజస్వీ అయిన వ్యాసమహర్షికి బోధించాడు. ఉదాత్త చరిత్రుడైన వ్యాసమహర్షి ప్రీతితో నాకు బోధించాడు. నేను నీకు బోధిస్తాను.

వ. అదియునుం గాక యిపుడు విరాట్పురుషునివలన నీ జగంబు లే వడుపునఁ బొడమె నను నివి మొదలయిన ప్రశ్నంబులు గొన్ని నన్నడిగితివి, ఏను నన్నింటికి నుత్తరం బగునట్లుగా నిమ్మహాభాగతం బుపన్యసించెద నాకర్ణింపుము, అమ్మహాపురాణంబు చతుశ్శ్లోకరూపంబును దశలక్షణంబునునై సంకుచితమార్గంబున నొప్పు, నందు దశలక్షణంబు లెవ్వి యనిన - సర్గంబును, విసర్గంబును, స్థానంబును, బోషణంబును, నూతులును, మన్వంతరంబులును, నీశానుచరితంబులును, నిరోధంబును, ముక్తియు, నాశ్రయంబును నవం బది తెఱంగు లయ్యె, దశమాశ్రయవిశుద్ధ్యర్థంబు తక్కిన తొమ్మిది లక్షణంబులుఁ జెప్పంబడె నవి యెట్టివనిన. 258

* అంతేకాక ఇప్పుడు నీవు నన్ను "విరాట్పురుషుని నుండి ఈ లోకాలు ఎలా పుట్టాయి?"అని ఈ లాంటి ప్రశ్నలు కొన్ని అడిగావు. వాటి కన్నింటికీ సమాధానంగా నేను ఈ మహాభాగవతం నీకు ఉపదేశిస్తాను, విను. ఆ మహాపురాణం నాలుగు శ్లోకాలూ, పదిలక్షణాలూ కల్గి సంగ్రహ రూపంగా ఉన్నది. అందులో పదిలక్షణాలు ఏవంటే సర్గం, విసర్గం, స్థానం, పోషణం, ఊతులు, మన్వంతరాలు, ఈశానుచరిత్రలు, నిరోధం, ముక్తి, ఆశ్రయం - అనేవి. వీనిలో పదవలక్షణమైన ఆశ్రయమే బ్రహ్మం. ఆ బ్రహ్మతత్త్వజ్ఞానం కొరకై చెప్పినవే మిగిలిన తొమ్మిది లక్షణాలూ. వాటి స్వరూపం ఎలాంటిదో వివరిస్తాను.

**తే. మహదహంకార పంచతన్మాత్ర గగన, పవన శిఖి తోయ భూ భూతపంచ కేంద్రి**
**య ప్రపంచంబు భగవంతునందు నగుట, "సర్గ" మందురు దీనిని జనవరేణ్య! 259**

* రాజా! మహత్తత్త్వం, అహంకారం, శబ్దస్పర్శరూప రసగంధాలనే ఐదు తన్మాత్రలు, ఆకాశం, గాలి, అగ్ని, నీరు, భూమి అనే పంచభూతాలు, ఐదు కర్మేంద్రియాలు, ఐదు జ్ఞానేంద్రియాలు - ఇవి అన్నీ భగవంతునిలో కన్పించడమే "సర్గ"మంటారు.

**క. సరసిజగర్భుండు విరా, ట్పురుషుని వలనన్ జనించి, భూరితర చరా**
**చర భూత సృష్టిఁ జేయుట, పరువడిని "విసర్గ"మండ్రు భరతకులేశా! 260**

* భరతవంశంలో ప్రభవించిన ఓ పరీక్షిన్మహారాజా! చతుర్ముఖ బ్రహ్మ విరాట్పురుషుని నుండి ఆవిర్భవించి అపారమైన చరాచర ప్రాణికోటిని సృష్టించడాన్ని "విసర్గం" అంటారు.

**క. లోకద్రోహినరేంద్రా, నీకముఁ బరిమార్చి జగము నెఱి నిల్పిన యా**
**వైకుంఠనాథు విజయం, బాకల్ప "స్థాన" మయ్యె నవనీనాథా! 261**

* రాజా! జగద్ద్రోహులైన రాజసమూహాన్ని చంపి జగత్తును ఉద్ధరించిన ఆ విష్ణుదేవుని విజయాన్నే 'స్థాన'మని అంటారు.

**క. హరి సర్వేశుఁ డనంతుఁడు, నిరుపమశుభమూర్తి సేయు నిజభక్త జనో**
**ద్ధరణము "పోషణ"మవనీ, వర! "యూతు" లనంగఁ గర్మవాసన లరయన్. 262**

* సర్వేశ్వరుడూ, తుదిలేనివాడూ, సాటిలేని మంగళ స్వరూపుడూ అయిన శ్రీహరి తన భక్త జనులను ఉద్ధరించడమే "పోషణం"అవుతుంది. నరనాథా! జన్మాంతరాల నుండి జీవుల ననుసరించి వచ్చే కర్మవాసనలకే " ఊతులు"అని పేరు.

**తే. జలజనాభ దయాకటాక్ష ప్రసాద, లబ్ధి నఖిలైక లోకపాలక విభూతి**
**మహిమఁ బొందినవారి ధర్మములు విస్తరమునఁ బలుకుట "మన్వంతరములు" భూప! 263**

* రాజా! ఆ పద్మనాభుని కృపాకటాక్షం వల్ల సమస్త లోకాలనూ పాలించే మహాభాగ్యం పొందిన మహనీయుల ధర్మాలను విపులంగా వర్ణించడాన్నే "మన్వంతరా"లని చెబుతారు.

**క. వనజోదరునవతార క, థనముఁ దదీయానువృత్తిఁ ద చ్చారిత్రం**
**బును విస్తరించి పలుకం, జను నవి "యీశాను కథలు" సౌజన్యనిధీ! 264**

* సౌజన్యమూర్తివైన రాజేంద్రా! అబ్జనాభుని అవతారాలను అభివర్ణించడం - ఆయనను అనుసరించే భక్తజనుల కథలను విస్తృతంగా వివరించడం - "ఈశానుకథలు" అంటారు.

**సీ. వసుమతీనాథ! సర్వస్వామి యైన గోవిందుండు చిదచిదానందమూర్తి**
**సలలిత స్వోపాధి శక్తిసమేతుఁడై తనరారు నాత్మీయధామమందు**

ఫణిరాజ మృదుల తల్పంబుపై సుఖలీల యోగనిద్రారతి నున్నవేళ
నఖిలజీవులు నిజవ్యాపార శూన్యులై, యున్నత తేజంబు లురలుకొనఁగ

తే. జరుగు న య్యవస్థావిశేషంబు లెల్ల, విదిత మగునట్లు వలుకుట యది "నిరోధ"
మన నిది యవాంతర ప్రళయం బనంగఁ, బరఁగు నిఁక "ముక్తి" గతి విను పార్థివేంద్ర! 265

* భూనాథా! సర్వానికీ ప్రభువూ; చిత్తు, అచిత్తు, ఆనందము మేళవించిన స్వరూపం గలవాడూ అయిన గోవిందుడు సుందరమైన తన ఉపాధి శక్తులతో కూడినవాడై వైకుంఠంలో మెత్తని శేషశయ్యపై సుఖంగా యోగ నిద్రలో ఉంటాడు. అప్పుడు సమస్త జీవులూ తమ తమ తేజస్సులను కోల్పోయి వ్యాపార శూన్యులు అవుతారు. అప్పటి ఆ అవస్థావిశేషాలన్నీ స్పష్టంగా తెలిసేటట్లు పలకడమే "నిరోధం". దాన్నే "అవాంతర ప్రళయ"మంటారు. రాజా! ఇక "ముక్తి" అంటే ఏమిటో విను.

సీ. జీవుండు భగవత్కృపావశంబునఁ జేసి దేహధర్మంబులై ధృతి ననేక
జన్మానుచరితదృశ్యము లైన యజ్జరా మరణంబు లాత్మధర్మంబు లయిన
ఘన పుణ్య పాప నికాయ నిర్మోచన స్థితి నొప్పి పూర్వసంచితములైన
యపహత పాప్మవత్త్వాద్యష్ట తద్గుణవంతుఁడై తగ భగవచ్ఛరీర

తే. భూతుఁడై పారతంత్ర్యాత్మబుద్ధి నొప్పి, దివ్య మాల్యానుతాపన భవ్య గంధ
కలిత మంగళ దివ్య విగ్రహ విశిష్టుఁ, డగుచు హరిరూప మొందుటే యనఘ! "ముక్తి." 266

* పాపరహితుడా! జీవుడు భగవంతుని దయవల్ల శరీరధర్మాలై అనేక జన్మలనుండి పరంపరగా ప్రాప్తించిన జరామరణాలను తప్పించుకొంటాడు. అలాగే ఆత్మధర్మాలైన పుణ్యపాపాలనుండి కూడ విడివడుతాడు. ముందటివైన "అపహత పాప్మవత్త్వం" మొదలైన ఎనిమిది గుణాలు కల్గి భగవంతునికి శరీరభూతు డవుతాడు. భగవత్పరతంత్ర మైన బుద్ధి గల్గి ప్రకాశిస్తాడు. దివ్యమాల్యాలతో, దివ్యానులేపనాలతో, దివ్యగంధాలతో ఒప్పే దివ్యశరీరం కలవాడవుతాడు. ఈ విధంగా జీవుడు హరి స్వరూపం పొందడమే "ముక్తి" అంటారు.

వ. మఱియు నుత్పత్తిస్థితిలయంబు లెందగుచుఁ బ్రకాశింపఁ బడునది "యాశ్రయం" బనంబడు, నదియ పరమాత్మ, బ్రహ్మ శబ్దవాచ్యంబు నదియ, ప్రత్యక్షానుభవంబున విదితంబు సేయుకొఱకు నాత్మ యాధ్యాత్మికాది విభాగంబు సెప్పంబడియె, నది యెట్టనిన నాత్మ "యాధ్యాత్మి" "కాధిదైవి" "కాధి భౌతికంబు"లం ద్రివిధం బయ్యె, నందు నాధ్యాత్మికంబు చక్షురాది గోళకాంతర్వర్తియై యెఱుంగం బడుఁ, జక్షురాది కరణాభిమానియై ద్రష్టయైన జీవుండె యాధిదైవికుం డనందగుఁ, జక్షురాద్యధిష్ఠా నాభిమానదేవతయై సూర్యాది తేజోవిగ్రహుండు నగుచు నెవ్వని యందు నీ యుభయ విభాగంబునుం గలుగు నతండె యాధిభౌతికుండును, విరాడ్విగ్రహుండును నగుం గావున ద్రష్టయు దృక్కును దృశ్యంబు ననందగు నీ మూఁటియందు నొకటి లేకున్న నొకటి గానరా, దీ త్రితయంబు నెవ్వం డెఱుంగు నతండు సర్వలోకాశ్రయుండై యుండు. నతండె

పరమాత్మయును, ఆ మ్మహాత్ముండు లీలార్థంబైన జగత్సర్జనంబుసేయు తలంపున బ్రహ్మాండంబు నిర్భేదించి తనకు సుఖస్థానంబు నపేక్షించి మొదల శుద్ధంబు లగు జలంబుల సృజియించె; స్వతః పరిశుద్ధుండు గావున స్వసృష్టంబై యేకార్ణవాకారం బైన జలరాశియందు శయనంబు సేయుటం జేసి 'శ్లో', ఆపో నారా ఇతి ప్రోక్తా ఆపో వై నరసూనవః, తా య దస్యాయనం పూర్వం తేన నారాయణఃస్మృతః " అను ప్రమాణము చొప్పున నారాయణశబ్దవాచ్యుండు గావున నతనిప్రభావంబు వర్ణింప దుర్లభం, బుపాదానభూతంబయిన ద్రవ్యంబును, ద్రివిధం బయిన కర్మంబును, గళాకాష్ఠాద్యుపాధి భిన్నంబయిన కాలంబును, జ్ఞానాదికంబగు జీవస్వభావంబును, భోక్త యగు జీవుండును, నెవ్వని యనుగ్రహంబునం జేసి వర్తించు చుండు, నెవ్వని యుపేక్షంజేసి వర్తింపకుండు, నట్టి ప్రభావంబు గల సర్వేశ్వరుండు దా నేకమయ్యు ననేకంబుగాఁ దలంచి యోగకల్పంబునం బ్రబుద్ధుండై యుండు. అంఁట మీఁద స్వసంకల్పంబునం జేసి హిరణ్మయంబైన తన విగ్రహంబు నధిదైవతంబును, నధ్యాత్మికంబును, నధిభూతంబును నను సంజ్ఞాయుతంబై త్రివిధంబుగా సృజియించె. 267

* ఇక ఉత్పత్తి స్థితిలయాలు అనేవి ఎక్కడ జరుగుతాయో దానినే " ఆశ్రయ'' మంటారు. అదే పరమాత్మ. బ్రహ్మశబ్దం చేత చెప్పబడేదీ అదే! దానిని ప్రత్యక్షానుభవంతో తెలియజేయటానికై ఆత్మసంబంధమైన ఆధ్యాత్మికం మొదలైన విభాగం చెప్పబడింది. అది ఎలాగంటే.

ఆత్మ ఆధ్యాత్మికమనీ, ఆధిదైవికమనీ, ఆధి భౌతికమనీ మూడు విధాలు. నేత్రం మొదలైన గోళకాలలో ఉంటూ తెలియబడేది ఆధ్యాత్మికం. నేత్రాదీంద్రియాభిమానం కలిగి ద్రష్ట అవుతున్న జీవుడే ఆధిదైవికుడు. నేత్రాదులైన అధిష్ఠానాలలో అభిమానం కల దేవతయై, సూర్యాది తేజస్సులే శరీరంగా కలవాడైన ఎవనిలో, ఆధ్యాత్మిక - ఆధిదైవికాలనే ఈ రెండు విభాగాలు సంభవిస్తాయో అతడే ఆధిభౌతికుడు, విరాట్స్వరూపుడు గూడా అవుతున్నాడు. అందువల్ల చూచేవాడు, చూచే సాధనము, చూడదగినదీ అనబడే ఈ మూడింటిలోనూ ఏ ఒక్కటి లేకున్నా మరొకటి కనిపించదు. "త్రిపుటి''అనబడే ఈ మూడింటినీ ఎవడు తెలుసుకొంటాడో అతడే సర్వలోకాలకూ ఆశ్రయుడై ఉంటాడు. పరమాత్మకూడ అతడే.

వినోదంకొరకు జగత్తును సృష్టించాలనే తలంపు ఆ మహాత్ముడికి కలిగింది. ఆ సంకల్పంతో ఆయన బ్రహ్మండాన్ని నిర్భేదించాడు. తనకు సుఖస్థానం కోరి మొదట పవిత్రమైన నీళ్లను సృష్టించాడు. ఆయన సహజంగా పరిశుద్ధుడు. అందువల్ల తాను సృష్టించిన అపార పారావార రూపంలో ఉన్న జలరాశిలో శయనించాడు. అందుచేతనే.

**ఆపో "నారా" ఇతి ప్రోక్తా, ఆపో వై నర సూనవః,**
**తా యదస్యాయనం పూర్వం, తేన "నారాయణః" స్మృతః.**

(నరుడనే నామాంతరం కల భగవంతుడు జలాలను సృష్టించాడు. అందుకే నీళ్లకు "నారము''లని పేరు. అట్టి నారములు స్థానంగా కలిగి ఉండడంవల్ల ఆయనకు "నారాయణుడు''అనే పేరు వచ్చింది.) అన్న ప్రమాణా న్ననుసరించి ఆయన 'నారాయణ' శబ్దవాచ్యు డవుతున్నాడు. అటువంటి ఆయన ప్రభావం వర్ణించడం అసాధ్యం.

ఉపాదానకారణమైన ద్రవ్యం సంచితం, ప్రారబ్ధం, ఆగామి అనే మూడు విధాలైన కర్మమూ; కళ, కాష్ఠ మున్నగు ఉపాధులచే భిన్నమైన కాలమూ, జ్ఞానం మొదలైన జీవుని స్వభావమూ, అనుభవించే జీవుడూ - ఇవన్నీ ఆయన అనుగ్రహం వల్ల ఉనికి గల్గి ఉన్నాయి. ఆయన ఉపేక్షిస్తే వాటికి ఉనికి లేదు. అలాంటి మహిమ కలవాడు ఆ సర్వేశ్వరుడు.

తాను మొదట ఒక్కడైనా ఆ పరమాత్ముడు దేవ మనుష్యాది రూపాలతో అనేకం కావాలని సంకల్పించాడు. స్వాత్మానుభవరూప మైన యోగశయనంలో మేల్కొనియుండి తన సంకల్పంతో హిరణ్మయమైన తన శరీరాన్నే అధిదైవతం, అధ్యాత్మికం, అధిభూతం అనే పేర్లతో మూడు విధాలుగా సృష్టించాడు.

**సీ. అట్టి విరాడ్విగ్రహాంత రాకాశంబు వలన నోజస్సహోబలము లయ్యెఁ**
**బ్రాణంబు సూక్ష్మరూపక్రియా శక్తిచే జనియించి ముఖ్యాసు వనఁగఁ బరఁగె**
**వెలువడి చను జీవి వెనుకొని ప్రాణముల్ సనుచుండు నిజనాథు ననుసరించు**
**భటుల చందంబునఁ, బాటిల్లు క్షుత్తును భూరితృష్ణయు మఱి ముఖమువలనఁ**

**తే. దాలు జిహ్వాదికంబు లుద్భవము నొందె, నందు నుదయించె నానావిధైక రసము,**
**లెనయ నవి యెల్ల జిహ్వచే నెఱుఁగఁబడును, మొనసి పలుక నపేక్షించు ముఖమువలన. 268**

* అలాంటి విరాట్పురుషుని శరీరంలోపలి ఆకాశం నుండి ప్రవృత్తి సామర్థ్యరూపమైన ఓజస్సు, వేగసామర్థ్యం, బలం అనే ధర్మాలు కలిగాయి. సూక్ష్మరూపమైన క్రియాశక్తి వల్ల ప్రాణం పుట్టింది. అదే సమస్త ప్రాణులకు ముఖ్యమైనది. యజమాని ననుసరించే సేవకులలాగ ప్రాణాలు జీవి ననుసరించి వెడలిపోతుంటాయి. విరాట్పురుషునకు జఠరాగ్ని దీపించగానే ఆకలిదప్పికలు ఏర్పడ్డాయి. ముఖం నుండి దవుడలు, నాలుక మొదలైనవి పుట్టాయి. అందుండే ఆరువిధాలైన రసాలు జనించాయి. ఆ రసభేదా లన్నీ నాలుకతోనే గ్రహింపబడుతున్నాయి. ముఖం సంభాషించాలని కోరింది.

**వ. మఱియు వాగింద్రియంబు పుట్టె, దానికి దేవత యగ్ని, యా రెంటివలన భాషణంబు వొడమె, నా యగ్నికి మహాజల వ్యాప్తం బగు జగంబున నిరోధంబు గలుగుటంజేసి యా జలంబె ప్రతిబంధకం బయ్యె, దోదూయమానం బైన మహావాయువు వలన ఘ్రాణంబు పుట్టెం గావున వాయుదేవతాకం బైన ఘ్రాణేంద్రియంబు గంధ గ్రహణ సమర్థం బయ్యె, నిరాలోకం బగు నాత్మ నాత్మయందుఁ జూడం గోరి తేజంబువలన నాదిత్యదేవతాకంబై రూపగ్రాహకంబైన యక్షియుగళంబు పుట్టె, ఋషి గణంబులచేత బోధితుం డగుచు భగవంతుండు దిగ్దేవతాకంబును శబ్దగ్రాహకంబును నైన శ్రోత్రేంద్రియంబు పుట్టించె, సర్జనంబు సేయు పురుషునివలన మృదుత్వకాఠిన్యంబులును, లఘుత్వ గురుత్వంబులును, నుష్ణత్వ శీతలత్వంబులును జేసెడు త్వగింద్రియాధిష్ఠానంబగు చర్మంబు పుట్టె, దానివలన రోమంబు లుదయించె, వానికి మహీరుహంబు లధిదేవత లయ్యె, నందు నధిగతస్పర్శ**

గుణుండును, నంతర్బహిః ప్రదేశంబుల నావృతుండును నగు వాయువువలన బలవంతంబులును, నింద్రదేవతాకంబులును, నాదానసమర్థంబులును, నానాకర్మకరణ దక్షంబులును నగు హస్తంబు లుదయించె, స్వేచ్ఛా విషయగతి సమర్థుండగు నీశ్వరుని వలన విష్ణు దేవతాకంబులగు పాదంబు లుదయించెఁ, బ్రజానందామృతార్థియగు భగవంతునివలనఁ ప్రజాపతి దేవతాకంబై, స్త్రీ సంభోగాది కామ్యసుఖంబులు కార్యంబులుగాఁ గల శిశ్నోపస్థంబు లుదయించె, మిత్రుం డధిదైవతంబుగాఁ గలిగి భుక్తాన్నాద్యసారాంశ త్యాగోపయోగంబగు "పాయు"వనెడి గుదం బుద్భవించె, వాని కృత్యం బుభయ మలమోచనంబు, దేహంబున నుండి దేహాంతరంబుఁ జేరం గోరి పూర్వకాయంబు విడుచుటకు సాధనం బగు నాభిద్వారంబు సంభవించె, నట్టి నాభియే ప్రాణాపానబంధ స్థానం బనంబడుఁ, దద్బంధ విశ్లేషంబె మృత్యువగు, నదియు యూర్ధ్వాధోదేహ భేదకం బనియును జెప్పంబడు, నన్నపానాది ధారణార్థంబుగ నాంత్ర కుక్షి నాడీనిచయంబులు గల్పింపంబడియె, వానికి నదులును, సముద్రంబులును నధిదేవత లయ్యె, వానివలనఁ దుష్టి పుష్టులను నుదరభరణ పరిణామంబులు గలిగియుండు, నాత్మీయ మాయాచింతనం బొనర్చునపుడు కామ్యసంకల్పాదిస్థానం బగు హృదయంబు గలిగె, దానివలన మనంబును, జంద్రుండును, గాముండును, సంకల్పంబును నుదయించె, నంతమీఁద జగత్సర్జనంబు సేయు విరాడ్విగ్రహంబున సప్తధాతువులును, బృథివ్యప్తేజోమయంబు లయిన సప్త ప్రాణంబులును, వ్యోమాంబు వాయువులచే నుత్పన్నంబులై గుణాత్మకంబులైన యింద్రియంబులును, నహంకార ప్రభవంబులైన గుణంబులును, సర్వవికార స్వరూపం బగు మనస్సును, విజ్ఞానరూపిణి యగు బుద్ధియును బుట్టు. వివిధంబగు నిది యంతయు సర్వేశ్వరుని స్థూల విగ్రహంబు, మఱియును. 269

* ముఖం నుండి వాక్కు అనే ఇంద్రియం పుట్టింది. దానికి అగ్ని అధిష్ఠానదేవత. వాగింద్రియం నుండీ, అగ్నినుండీ సంభాషణం పుట్టింది. జగత్తంతా జలవ్యాప్తం కావడం వల్ల అగ్నికి జలం వల్ల నిరోధం కల్గింది. అందువల్ల అగ్నికి జలమే ప్రతిబంధక మయింది. మిక్కిలిగా చలించే మహావాయువు నుండి ఘ్రాణం పుట్టింది. దానికి వాయువు అధిదేవత. ఆ ఘ్రాణేంద్రియం గంధాన్ని గ్రహించడంలో నేర్పుగల దయింది. విరాట్పురుషుడు కంటికి కనిపించని ఆత్మను తనలో చూడగోరాడు. అప్పుడు సూర్యుడు దేవతగా కలవీ, రూపం గ్రహించేవీ అయిన నేత్రాలు రెండూ తేజస్సునుండి పుట్టాయి.

మునులందరూ భగవంతుని ప్రార్థించగా ఆయన దిక్కులు దేవతగా కలిగి, శబ్దాన్ని గ్రహించే శ్రోత్రేంద్రియాన్ని ఉద్భవింపజేశాడు.

సృష్టికర్తయైన పురుషుని నుండి త్వగింద్రియానికి అధిష్ఠానమైన చర్మం పుట్టింది. ఆ చర్మం ఆ యా వస్తువులలోని మార్దవాన్నీ, కాఠిన్యాన్నీ, తేలికతనాన్నీ, బరువునూ, వేడిమినీ, చల్లదనాన్నీ గ్రహిస్తుంది. చర్మము నుండి వెంట్రుకలు పుట్టాయి. వాటికి చెట్లు అధిదేవతలయ్యాయి.

త్వగింద్రియాన్ని అధిష్ఠించినవాడూ, స్పర్శమనే గుణం కలవాడూ, లోపలా వెలుపలా వ్యాపించినవాడూ అయిన వాయువునుండి హస్తాలు పుట్టాయి. అవి బలం కలవీ, వస్తుగ్రహణంలో నేర్పు కలవీ, అనేకమైన పనులు చేయగలవీ. వాటికి ఇంద్రుడు అధిదేవత.

తనకు ఇచ్ఛ వచ్చిన చోటికి పోయే సామర్థ్యం కల ఈశ్వరుని నుండి పాదాలు పుట్టాయి. వాటికి విష్ణువు అధిదేవత.

ప్రజానంద మనే అమృతం కాంక్షించే భగవంతుని నుండి పురుషాంగమూ, ఉపస్థ జనించాయి. వాటికి అధిదేవత ప్రజాపతి. స్త్రీసంభోగం మొదలైనవి వాటిపనులు. మిత్రుడు అధిదేవతగా గల "పాయువు"అనే ఇంద్రియాన్ని "గుదం"అని కూడ అంటారు. అది భుక్త పదార్థాలలోని నిస్సారమైన అంశాన్ని త్యజించటానికి సాధన మవుతుంది. అది ఉభయ మలాలనూ వర్జిస్తుంది.

ఒక శరీరం వదలి మరొక శరీరం ధరింప గోరినప్పుడు మొదటి శరీరం వదలడానికి సాధనంగా 'బొడ్డు'అనే ద్వారం పుట్టింది. ప్రాణం, అపానం బంధింపబడే స్థానం అదే. ఆ బంధం విడిపోవడమే మృత్యువు. పై శరీరాన్నీ, క్రిందిశరీరాన్నీ వేరు చేసేది గూడా ఆ నాభిస్థానమే. ఆహార పానీయాదులను ధరించడానికి పేగులు, పొట్ట, నాడీ సమూహం కల్పితము లైనాయి. వాటికి నదులూ, సముద్రాలూ, అధిదేవతలు. వాటివల్ల తుష్టి, పుష్టి అనే ఉదరాన్ని భరించే రసపరిణామాలు కలిగాయి.

ఆ విరాట్పురుషుడు తన మాయను ధ్యానించేటప్పుడు కామానికీ, సంకల్పాదులకూ, స్థానమైన హృదయం పుట్టింది. ఆ హృదయం నుండి మనస్సూ, చంద్రుడూ, కాముడూ, సంకల్పమూ పుట్టాయి.

ఆపైన జగత్తును సృష్టించే విరాట్పురుషుని శరీరంలో త్వక్కు, చర్మం, మాంసం, రక్తం, మేదస్సు, మజ్జ, ఎముకలు - అనే ఏడు ధాతువులూ, పృథివీ జల తేజోరూపాలైన ఏడు ప్రాణాలూ, ఆకాశజల వాయువులనుండి జనించిన గుణస్వరూపాలైన ఇంద్రియాలూ, అహంకారాన్ని కలిగించే గుణాలూ, అన్నివికారాలూ స్వరూపంగా కల మనస్సూ, విజ్ఞాన రూపమైన బుద్ధీ జనించాయి. ఇదంతా ఆ సర్వేశ్వరుని స్థూల శరీరమే. ఇంతేకాదు.

**క. వరుసఁ బృథివ్యాద్యష్టా, వరణావృతమై సమగ్రవైభవములఁ బం**
**కరుహభవాండాతీత, స్ఫురణం జెలువొందు నతివిభూతి దలిర్పన్. 270**

* ఆ స్థూల విగ్రహం క్రమంగా పృథివి, జలం, తేజం, వాయువు, గగనం, అహంకారం, మహత్తత్త్వం, అవ్యక్తం - అనే ఎనిమిది ఆవరణాలతో వ్యాప్తమై ఉంది. సంపూర్ణ వైభవంతో బ్రహ్మాండాన్ని మించినదై అత్యుజ్జ్వలంగా ప్రకాశిస్తున్నది.

**క. పొలుపగు సకల విలక్షణ, ములు గల యాద్యంత శూన్యమును నిత్యమునై**
**లలి సూక్ష్మమై మనో వా, క్కులకుం దలపోయఁగా నగోచర మగుచున్. 271**

* విరాట్పురుషుని సూక్ష్మరూపం విలక్షణమైనది. దానికి మొదలు, తుది - లేవు. అది నిత్యమైనది. మనస్సుకూ, వాక్కుకూ గోచరం కానిది

సీ. అలఘు తేజోమయం బైన రూపం బిది క్షితినాథ! నాచేతఁ జెప్పఁబడియె,
మానిత స్థూల సూక్ష్మ స్వరూపంబుల వలన నొప్పెడు భగవత్స్వరూప
మమ్మహాత్మకుని మాయాబలంబునఁ జేసి దివ్యమునీంద్రులుఁ దెలియలేరు,
వసుధేశ! వాచ్యమై వాచకంబై నామ రూపముల్ క్రియలును రూఢిఁదాల్చి

ఆ. యుండు నట్టి యీశ్వరుండు నారాయణుం, డఖిలధృత జగన్నియంతయైన
చిన్మయాత్మకుండు సృజియించు నీ ప్రజా, పతుల ఋషులఁ బితృవితతుల నెలమి. 272

* రాజా! మహాతేజస్సుతో నిండిన భగవత్స్వరూపాన్ని గూర్చి నేనిప్పుడు నీకు చెప్పాను. స్థూలమనీ, సూక్ష్మమనీ రెండురూపాలతో విలసిల్లే ఆ భగవదాకారాన్ని ఆ పరమాత్ముని మాయా ప్రభావం వల్ల దివ్య తేజోధనులైన మునులు కూడా తెలిసికోలేకున్నారు. వాచ్యమై, వాచకమై, నామరూపక్రియలు దాల్చిన ఈశ్వరుడు సమస్తలోకాలకూ నియామకుడై ఉన్నాడు. జ్ఞానమయ స్వరూపుడైన ఆ శ్రీమన్నారాయణుడు ప్రజాపతులనూ, ఋషులనూ, పితృదేవతలనూ ప్రీతితో సృష్టిస్తున్నాడు.

వ. మఱియును. 273

సీ. సుర సిద్ధ సాధ్య కిన్నర వర చారణ గరుడ గంధర్వ రాక్షస పిశాచ
భూత వేతాళ కింపురుష కూశ్మాండ గుహ్యక డాకినీ యక్ష యాతుధాన
విద్యాధ రాప్సరో విషధర గ్రహ మాతృ గణ వృక హరి ఘృష్టి ఖగ మృగాళి
భల్లూక రోహిత పశు వృక్షయోనుల వివిధకర్మంబులు వెలయఁబుట్టి

తే. జల నభో భూతలంబుల సంచరించు, జంతు చయముల సత్త్వరజ స్తమో గు
ణములఁ దిర్యక్సురాసురనరధరాది, భావముల భిన్ను లగుదురు పౌరవేంద్ర! 274

*ఇంకా విను. రాజా! జీవులు తాము చేసిన నానావిధాలైన కర్మల్ని అనుసరించి సురలు, సిద్ధులు, సాధ్యులు, కిన్నరులు, చారణులు, గరుడులు, గంధర్వులు, రాక్షసులు, పిశాచాలు, భూతాలు, బేతాళాలు, కింపురుషులు, కూశ్మాండులు, గుహ్యకులు, డాకినులు, యక్షులు, యాతుధానులు, విద్యాధరులు, అచ్చరలు, నాగులు, గ్రహాలు, మాతృగణాలు, తోడేళ్లు, సింహాలు, సూకరాలు, పక్షులు, మృగాలు, ఎలుగుబంట్లు, చేపలు, పశువులు, చెట్లు - వీటి జాతుల్లో పుట్టి నీటిలోనూ, నింగిలోనూ, నేలమీదనూ సంచరిస్తారు. సత్త్వగుణ, రజోగుణ, తమోగుణాలు కల్గి వుంటారు. ఈ ప్రాణిజాత మంతా తిర్యక్కులు, సురలు, అసురులు, నరులు, గిరులు - ఇత్యాది భిన్నభిన్న రూపాలతో ఉంటుంది.

మ. ఇరవొందన్ ద్రుహిణాత్మకుం డయి రమాధీశుండు విశ్వంబు సు
స్థిరతం జేసి, హరిస్వరూపుఁ డయి రక్షించున్ సమస్తప్రజో
త్కర సంహారము సేయునప్పుడు హరాంతర్యామియై యింతయున్
హరియించుం బవనుండు మేఘముల మాయం జేయు చందంబునన్. 275

* లక్ష్మీనాథుడు చతుర్ముఖుడై జగత్తును సృష్టిస్తాడు. విష్ణు స్వరూపుడై దానిని రక్షిస్తాడు. సంహార సమయంలో హరునికి అంతర్యామిగా ఉంటూ మారుతం మబ్బులను హరించినట్లే సమస్త విశ్వాన్నీ సంహరిస్తాడు.

**క. ఈ పగిదిని విశ్వము సం, స్థాపించును మనుచు నడఁచు ధర్మాత్మకుఁడై**
**దీపిత తిర్యఙ్నర సుర, రూపంబులు దాన తాల్చి రూఢి దలిర్పన్. 276**

* ఈ విధంగా ఆ దేవుడు ధర్మస్వరూపుడై తానే పశుపక్ష్యాదులు, నరులు, సురలు మొదలైన రూపాలు ధరిస్తాడు. తానే ఈ విశ్వాన్ని సృష్టిస్తాడు, పోషిస్తాడు, సంహరిస్తాడు.

**సీ. హరియందు నాకాశ, మాకాశమున వాయు, వనిలంబువలన హుతాశనుండు,**
**హవ్యవాహనునందు నంబువు, లుదకంబు వలన వసుంధర గలిగె, ధాత్రి**
**వలన బహుప్రజావళి యుద్భవం బయ్యె, నింతకు మూలమై యెసఁగునట్టి,**
**నారాయణుఁడు, చిదానంద స్వరూపకుం, డవ్యయుం, డజుఁడు, ననంతుఁ, డాఢ్యుఁ**

**తే. డాది మధ్యాంత శూన్యుం, డనాదినిధనుఁ, డతనివలనను సంభూత మైన యట్టి**
**సృష్టి హేతుప్రకార మీక్షించి తెలియఁ, జాల రెంతటి మునులైన జనవరేణ్య! 277**

* శ్రీహరినుండి ఆకాశం పుట్టింది. ఆకాశం నుండి వాయువు పుట్టింది. వాయువు నుండి అగ్ని పుట్టింది. అగ్నినుండి నీరు పుట్టింది. నీటి నుండి భూమి పుట్టింది. భూమి నుండి నానావిధ జీవ సంతతి పుట్టింది. ఇంతటికీ మూలమై ప్రకాశించేవాడు ఆ నారాయణుడే. ఆయన జ్ఞానానంద స్వరూపుడు, అవ్యయుడు, పుట్టుక లేనివాడు, అంతము లేనివాడు, ప్రభువు, ఆదిమధ్యాంత రహితుడు, జనన మరణాలు లేనివాడు. రాజా! ఆయన నుండి జనించిన ఈ సృష్టికి హేతువేమిటో, దాని స్వరూప మెలాంటిదో ఎంత పరీక్షించినా ఎంతటి మునీశ్వరులైనా తెలుసుకోలే కున్నారు.

**వ. అదియునుం గాక, 278**

**మ. ధరణీశోత్తమ! భూతసృష్టి నిటు సంస్థాపించి రక్షించు నా**
**హరికర్తృత్వము నొల్ల కాత్మగత మాయారోపితం జేసి, తా**
**నిరవద్యుండు నిరంజనుండుఁ బరుఁడున్ నిష్కించనుం డాఢ్యుఁడున్**
**నిరపేక్షుండును నిష్కళంకుఁ డగుచున్ నిత్యత్వముం బొందెడిన్. 279**

* అంతేకాక రాజోత్తమా! ఈ విధంగా ప్రాణులను సృష్టించి రక్షిస్తున్న ఆ శ్రీహరి తనకు కర్తృత్వం అంగీకరించడు. ఇదంతా తన మాయకే ఆరోపిస్తాడు. తాను నిరవద్యుడు, నిరంజనుడు, పరుడు, నిష్కించనుడు, ఆఢ్యుడు, నిరపేక్షుడు, నిష్కళంకుడు, అయినవాడై శాశ్వతత్వాన్ని పొందుతాడు.

**వ. బ్రహ్మసంబంధియగు నీ కల్పప్రకారం బవాంతరకల్పంబుతోడ సంకుచిత ప్రకారంబున నెఱింగించితి, నిట్టి బ్రహ్మకల్పంబున నొప్పు ప్రాకృతవైకృత కల్ప ప్రకారంబులును, దత్పరిమాణంబులును, కాలకల్ప**

**లక్షణంబులును, నవాంతర కల్ప మన్వంతరాది భేద విభాగ స్వరూపంబును నతివిస్తారంబుగ నెఱింగింతు విను మదియునుం బద్మ కల్పం బనం దగునని భగవంతుండైన శుకుండు పరీక్షిత్తునకుం జెప్పెనని సూతుండు మహర్షులకు నెఱింగించిన. 280**

* బ్రహ్మకు సంబంధించిన ఈ కల్ప స్వరూపాన్ని అవాంతర కల్పంతో సహా సంగ్రహంగా చెప్పాను. ఇలాంటి ప్రాకృతాలు, వైకృతాలు అయిన కల్పాల విధానాలూ, వాటి పరిమాణాలూ, కాల లక్షణాలూ, కల్పాల లక్షణాలూ, అవాంతర కల్పాలూ, మన్వంతరాలూ, మొదలైన వాని భేదాలూ, విభాగాలూ, విపులంగా వివరిస్తాను, విను. దాన్ని కూడ "పద్మకల్పం" అంటారు అని భగవంతుడైన శుకయోగి పరీక్షిత్తుకు చెప్పినట్లు సూతుడు శౌనకాది మహర్షులకు వెల్లడించాడు.

**క. విని శౌనకుండు సూతుం, గనుఁగొని యిట్లనియె సూత! కరుణోపేతా!**
**జనసుత గుణ సంఘాతా! ఘనపుణ్యసమేత! విగత కలుష వ్రాతా! 281**

* సూతుడు చెప్పినదంతా విని శౌనకుడు ఆయన్ని చూచి ఇలా అన్నాడు - "సూతమునీంద్రా! కరుణాసాంద్రా! జనులు శ్లాఘించే సద్గుణసమూహం కలవాడవు! అఖండ పుణ్యరాశివి. లవలేశం కూడా పాపం నిన్ను స్పృశింపలేదు.

**వ. పరమ భాగవతోత్తముండైన విదురుండు బంధుమిత్ర జాతంబుల విడిచి సకల భువన పావనంబులును, గీర్తనీయంబులును నైన తీర్థంబులను, నగణ్యంబులైన పుణ్యక్షేత్రంబులను దర్శించి, క్రమ్మఱ వచ్చి కౌషారవియగు మైత్రేయుం గని యతనివలన సధ్యాత్మ బోధంబు వడసె నని వినంబడు, నదియంతయు నెఱింగింపు మనిన నతండిట్లనియె. 282**

* మహాభాగవత వరేణ్యులలో అగ్రగణ్యుడైన విదురుడు బంధువులనూ, మిత్రులనూ, పరిత్యజించాడనీ, సమస్తలోక పావనాలూ, స్తుతి పాత్రాలూ ఐన తీర్థాలూ, లెక్కకు మిక్కుటమైన పుణ్యక్షేత్రాలూ సందర్శించాడనీ, మళ్ళీ తిరిగి వచ్చి కౌషారవి అయిన మైత్రేయ మహామునిని దర్శించి ఆయననుండి అధ్యాత్మతత్త్వజ్ఞానం పొందాడనీ వింటున్నాము. అదంతా మాకు వివరించి చెప్పు."

ఈ విధంగా అడిగిన శౌనకాదులతో సూతమహర్షి ఈ ప్రకారంగా అన్నాడు.

**క. వినుఁడిపుడు మీరు నన్నడి, గిన తెఱఁగున శుకు మునీంద్రగేయుఁ బరీక్షి**
**జ్జనపతి యడిగిన నతఁడా, తని కెఱిఁగించిన విధంబుఁదగ నెఱిఁగింతున్. 283**

**వ. సావధానులరై వినుండని, 284**

* మునులారా! వినండి! మీరిప్పుడు నన్నడిగినట్లే మునీంద్ర స్తవనీయుడైన శుకయోగిని పరీక్షిన్మహారాజు ప్రశ్నించాడు. శుకుడు రాజుకు చెప్పిన విషయాలను మీకు నేను తెలియజేస్తాను. శ్రద్ధతో ఆలకించండి!

ఉ. రామ! గుణాభిరామ! దినరాజకులాంబుధిసోమ! తోయద
శ్యామ! దశాననప్రబలసైన్యవిరామ! సురారిగోత్ర సు
త్రామ! సుబాహుబాహుబలదర్ప తమఃపటుతీవ్రధామ! ని
ష్కామ! కుభృల్లలామ! గరకంఠ సతీనుతనామ! రాఘవా! 285

* శ్రీ రామచంద్రా, నీవు కల్యాణగుణసాంద్రుడవు, సూర్యవంశమనే సముద్రానికీ చంద్రుడవు, నీలమేఘశ్యాముడవు, రావణాసురుని భీకరసైన్యాన్ని అంతమొందించిన రఘుకుల లలాముడవు, ఈ రక్కసులనే పర్వతాలను ముక్కలుచేసే వజ్రధరుడవు, సుబాహుని బాహుబల గర్వం అనే చీకటికి ప్రభాకరుడవు, కాంక్షలు లేనివాడవు, అవనీపతులలో అగ్రగణ్యుడవు. శర్వాణి సర్వదా నీనామం సన్నుతిచేస్తూ ఉంటుంది.

క. అమరేంద్రసుత విదారణ! కమలాప్తతనూజ రాజ్యకారణ! భవ సం
తమస దినేశ్వర! రాజోత్తమ! దైవత సార్వభౌమ! దశరథరామా! 286

* వాలిని హతమార్చినవాడవు! సుగ్రీవుని రాజ్యాభిషిక్తుని చేసిన మొనగాడవు! సంసార మనే అంధకారానికి సహస్రకరుడవు! రాజలలాముడవు! దైవతసార్వభౌముడవు అయిన దశరథరాముడవు నీవు!

మా. నిరుపమగుణజాలా! నిర్మలానందలోలా! దురిత ఘన సమీరా! దుష్టదైత్య ప్రహారా!
శరధిమదవిశోషా! చారుసద్భక్తపోషా! సరసిజదళనేత్రా! సజ్జనస్తోత్రపాత్రా! 287

* సాటిలేని సుగణాలు గలమేటివి, స్వచ్ఛమైన ఆనందంలో ఓలలాడుతుంటావు. పాపాలనే మేఘాలకు ప్రభంజనం వంటివాడవు, దుష్టరాక్షసులను శిక్షించినవాడవు, సముద్రుని అహంకారాన్ని అణచినవాడవు, అనురక్తులైన భక్తులను పరిపాలించే వాడవు, కమల దళములవంటి కన్నులుగల స్వామీ! నీవు సజ్జనుల స్తోత్రములకు పాత్రమైన వాడవు.

గ. ఇది శ్రీపరమేశ్వర కరుణా కలిత కవితా విచిత్ర కేసన మంత్రిపుత్ర సహజపాండిత్య పోతనామాత్య ప్రణీతం బైన శ్రీమహాభాగవత పురాణంబునందు పరీక్షిత్తుతోడ శుకయోగి భాషించుటయు, భాగవతపురాణ వైభవంబును, "ఖట్వాంగు" మోక్షప్రకారంబును, ధారణాయోగవిషయం బయిన మహావిష్ణుని శ్రీపాదాద్య వయవంబుల సర్వలోకంబులు నున్న తెఱంగును, సత్పురుషవృత్తియు, మోక్షవ్యతిరిక్త సర్వకర్మఫల ప్రదదేవతా భజన ప్రకారంబును, మోక్షప్రదుండు శ్రీహరి యనుటయు, హరి భజనవిరహితులైన జనులకు హేయతాపాదనంబును, రాజప్రశ్నంబును, శుకయోగి శ్రీహరి స్తోత్రంబు సేయుటయు, వాసు దేవప్రసాదంబునం జతుర్ముఖుండు బ్రహ్మాధిపత్యంబు వడయుటయు, శ్రీహరివలన బ్రహ్మరుద్రాదిలోక ప్రపంచంబు పుట్టుటయు, శ్రీమన్నారాయణ దివ్య లీలావతార పరంపరావైభవ వృత్తాంతసూచనంబును, భాగవతవైభవంబును, బరీక్షిత్తు శుకయోగి నడిగిన ప్రపంచాది ప్రశ్నంబులును, నందు శ్రీహరి ప్రధానకర్తయని తద్వృత్తాంతంబు సెప్పుటయు, భగవద్భక్తి వైభవంబును, బ్రహ్మతపశ్చరణంబునకుం బ్రసన్నుండై హరి వైకుంఠ నగరంబుతోడ బ్రసన్నుండయిన స్తోత్రంబు సేసి తత్ప్రసాదంబునం దన్మహిమంబు వినుటయు, వాసుదేవుం డానతిచ్చిన ప్రకారంబున

* ఇది పరమేశ్వరుని అనుగ్రహంవల్ల ప్రాప్తించిన అత్యద్భుతమైన కవిత్వం కలవాడూ, కేసనమంత్రి కుమారుడూ, సహజమైన పాండిత్యం కలవాడూ అయిన పోతనామాత్యుడు రచించిన శ్రీమహాభాగవత పురాణం.

ఇందులో పరీక్షిన్మహారాజుతో శుకయోగి సంభాషణమూ, భాగవతపురాణప్రశస్తీ, ఖట్వాంగుడు మోక్షం పొందిన విధానమూ, ధారణా యోగానికి విషయమైన మహావిష్ణుదేవుని శ్రీ పాదాలు మొదలైన అవయవాలలో సమస్తలోకాలు ఉన్నపద్ధతీ, సత్పురుషవర్తనమూ, మోక్షంకంటె భిన్నమైన సమస్త కర్మఫలాలనూ ఇచ్చే దేవతలను భజించే రీతీ, మోక్షప్రదాత శ్రీహరి ఒక్కడే అనడమూ, హరిసేవ చేయని ప్రజలకు హీనత్వాపాదనమూ, రాజు ప్రశ్నించడమూ, శుకయోగి శ్రీహరిని స్తుతించడమూ, వాసుదేవుని అనుగ్రహంవల్ల బ్రహ్మ బ్రహ్మలోకాధిపత్యం వహించడమూ, శ్రీహరినుండి బ్రహ్మ, రుద్రుడు మొదలైనవారి లోకాలు జనించడమూ, శ్రీమన్నారాయణుని దివ్యలీలావతారాల వైభవవార్తలను సూచించడమూ, భాగవతప్రాముఖ్యమూ, పరీక్షిత్తు శుకయోగిని ప్రపంచం మొదలైన వాటిని గూర్చి ప్రశ్నించడం, అందులో శ్రీహరి అన్నిటికీ ముఖ్యకర్త అని ఆయన వృత్తాంతాన్ని ప్రతిపాదించడమూ, భగవద్భక్తి ప్రాశస్త్యమూ, బ్రహ్మ చేసిన తపస్సుకు మెచ్చి శ్రీహరి వైకుంఠంతో సహా ఆయనకు ప్రత్యక్షం కావడమూ, బ్రహ్మ విష్ణువును స్తుతించి ఆయన అనుగ్రహం వల్ల ఆయనమహిమను ఆలకించడమూ, వాసుదేవుడు చెప్పినట్లే బ్రహ్మ నారదుడికి భాగవతపురాణానికి సంబంధించిన ప్రధానమైన పది లక్షణాలను వివరించడమూ, శ్రీమన్నారాయణుని వైభవమూ, జీవుడు మొదలైన తత్త్వాల సృష్టీ వాసుదేవుని నిత్యవిభూతి మొదలైన వాటి వర్ణనమూ, కల్పప్రకారం మొదలైన వాటి సూచనా, శౌనకుడు విదురునికీ మైత్రేయునికీ జరిగిన సంవాదం చెప్పమని సూతుని అడగడమూ అనే కథలు గల ద్వితీయస్కంధం సమాప్త మయింది.

**శ్రీ కృష్ణార్పణమస్తు**

# ప్రవేశిక

> "ఎండిన మ్రోడులే కిసలయించెనొ! ఏకశిలాపురమ్ములో
> బండలు పుల్కరించెనొ! అపారముదమ్మున తెల్గు తల్లికిన్
> గుండెలు పొంగిపోయి కనుగొల్కులు నిండెనొ, పచ్చిపైరులే
> పండెనొ! జాలువారిన భవత్కవితామృత వర్షధారలన్!!"

అవును. పోతన్నగారి లేఖిని నుంచి అమృతవర్షం కురిసింది. ఆయన కవితాసుధారసధారలు అనంతశక్తి సంపన్నమైనవి. ఆయన రచనా రామణీయకాలు అంతటి మహిమాన్వితమైనవి. వాల్మీకి వ్యాసకృతాలైన రామాయణ, భారత, భాగవతాలు భారతీయ సంస్కృతికి మూలకందాలు. ఈ త్రయీసంపద ఆంధ్రభాషలో సంతరించుకొన్నంత సర్వతోముఖసమృద్ధి మరే భాషలోనూ అందుకోలేదనటంలో అతిశయోక్తి లేదు.

మీ సాహిత్యంలో గొప్పగ్రంథాలు ఏమిటని ఒక తమిళ సోదరుణ్ణి ప్రశ్నిస్తే "కంబ రామాయణం"అని చటుక్కున సమాధానం చెబుతాడు. అదే ప్రశ్న ఒక కన్నడ సోదరుడికి వేస్తే వెంటనే "పంప భారతం" అంటాడు. అలాగే ఒక హిందీ సోదరుణ్ణి అడిగితే "తులసీ రామాయణం"అని జవాబు వస్తుంది. ఇక ఒక తెలుగువాణ్ణి "మీ భాషలో గొప్ప గ్రంథాలు ఏవి?" అని అడిగితే వాడు ఏ మాత్రం తడుముకోకుండా "కవిత్రయంవారి భారతం, బమ్మెర పోతన్నగారి భాగవతం, బుద్ధారెడ్డి రంగనాథరామాయణం"అని చకచకా చెప్పేస్తాడు.

భారతం ఒక మహేతిహాసం. భాగవతం ఒక మహాపురాణం. రామాయణం ఒక మహాకావ్యం. ఇంతటి సంస్కృతి సంపన్నమైన సాహితీ సమృద్ధి, సారస్వత సంపద తెలుగు భాషలో తప్ప మరే ప్రాంతీయ భాషలోనూ కనిపింపదు. ఆంధ్రభాషలో అనూదితాలైన భారత, భాగవత, రామాయణాలలో విశేషప్రచారం సంపాదించుకున్నది బమ్మెరవారి భాగవతం అనటంలో సందేహం లేదు.

తమిళం, మలయాళం, కన్నడం, మరాఠీ, గుజరాతీ, బెంగాలీ, ఒరియా, అస్సామీ, పంజాబీ మొదలైన ప్రాంతీయ భాషలలో ఆ యా కవులచేత భాగవతం అనువదింపబడినప్పటికి ఆ అనువాదాలు సమగ్రంగా కాక ఏకదేశంగానో, సంగ్రహంగానో కనిపిస్తాయి. కొన్ని స్కంధాలు మాత్రమే కొందరు, కొన్ని ఘట్టాలు మాత్రమే కొందరు అనువాదం చేశారు. హిందీలో సూరదాసు రచించిన "సూరసాగర్"అనే మహా గ్రంథం భాగవతంలోని దశమస్కంధానికే అత్యంత ప్రాధ్యానమిచ్చి తక్కిన స్కంధాలలోని కథ చాలా సంక్షిప్తంగా వర్ణించింది. అందువల్ల అది వ్యాసుని భాగవతానికి సరియైన అనువాదం అని చెప్పటానికి అవకాశం లేదు.

సర్వాంగసుందరంగా రసభావబంధురంగా భక్తి శృంగార సంగమంగా సహృదయహృదయంగమంగా సంస్కృత భాగవతాన్ని అనువదించిన అదృష్టం పోతన్నగారికే దక్కింది. అటువంటి అవకాశం తెలుగు భాషకే చిక్కింది.

పోతన భాగవతం ఆంధ్రజాతికి ఆబాలగోపాలానికి ఆరాధ్య గ్రంథమైనది. ఒక్క తెలుగుదేశంలోనే కాదు ఛత్రపతి శివాజీకి గురుదేవుడైన సమర్థ రామదాసస్వామి పోతన భాగవతం చదివి పోతన భక్తి

ప్రపత్తులను "దాసబోధ"అనే గ్రంథంలో బహుధా ప్రశంసించాడు. ఆధునిక తమిళ సాహిత్య యుగప్రవక్త సుబ్రహ్మణ్యభారతి "సిల కవియరశర్"అననే వ్యాసంలో బమ్మెరవారిని అనేక విధాలుగా కొనియాడాడు. నారద మహర్షి అవతారంగానూ, నాదబ్రహ్మోపాసకుడుగానూ, వాగ్గేయకార శిరోమణిగానూ ప్రసిద్ధిగాంచిన త్యాగరాజస్వామి బమ్మెరవారి భాగవతాన్ని ప్రతిదినమూ భక్తిపూర్వకంగా పారాయణం చేసేవాడని చెబుతారు. అది యిప్పటికీ తిరువయ్యారులో త్యాగయ్య గృహంలో దేవతార్చన పేటికయందు పదిలపరచబడి ఉన్నదని ఆర్యుల అభిభాషణ. సంగీత సాహిత్య సరస్వతియై అష్టభాషా పండితుడై హరికథాపితామహుడైన ఆదిభట్ట నారాయణదాసుగారు తన బాల్యంలోనే పోతన భాగవతంలోని పద్యాలన్నీ అప్పగించేవారనీ అందుకని ఆయన అయిదవయేట ఆంధ్రమహాభాగవతంతోనే ఆయనకు అక్షరాభ్యాసం చేశారనీ పెద్దలంటారు.

పోతన్నగారికంటె తరువాతివారైన వల్లభాచార్యులు, చైతన్య ప్రభువు పోతన భాగవతంవల్ల ప్రభావితులైనారన్న ఆచార్య నిడుదవోలు వేంకటరావుగారి అభిప్రాయం గమనింపదగింది. వల్లభాచార్యులు తెలుగువాడే అయినందువల్ల చైతన్య ప్రభువు తెలుగుదేశంలో సంచరించాడనటానికి తగిన ఆధారాలు ఉన్నందువల్ల నిడుదవోలువారి అభిప్రాయం సమంజసంగానే తోస్తున్నది.

భాగవతం పన్నెండు స్కంధాల గ్రంథం. దశమస్కంధంలో శ్రీకృష్ణుని చరిత్రం సర్వాంగసుందరంగా అభివర్ణింపబడింది. చిత్రమేమంటే ప్రథమ స్కంధంలో శ్రీకృష్ణ నిర్యాణం చెప్పబడింది. ఇది పైకి చూడటానికి కొంచెం విరుద్ధంగానే కనబడుతుంది. అందుకు కారణం లేక పోలేదు.

భాగవత మహాగ్రంథానికి వక్త శుక మహర్షి. శ్రోత పరీక్షిన్మహారాజు. పరీక్షిత్తును రంగంమీదకు రప్పించటానికి శ్రీకృష్ణ నిర్యాణగాథ ఆవశ్యక మయింది.

అర్జునుడు ద్వారక నుంచి వచ్చి ధర్మరాజుకు కృష్ణనిర్యాణ వార్త వినిపిస్తాడు. ధర్మరాజు ఆ వార్త విని విషాదంతో విరక్తుడై అభిమన్యునందనుడైన పరీక్షిత్తును పట్టాభిషిక్తుణ్ణి చేసి తమ్ములతో ద్రౌపదితో మహాప్రస్థానానికి వెళ్లుతాడు. మహారాజైన పరీక్షిత్తు వేటకోసం వెళ్ళి దాహార్తుడై శమీక మహర్షి మెడలో చచ్చిన పామును వేసి తిరిగి రాజధానికి చేరుకుంటాడు. మహర్షి కుమారుడైన శృంగి మహారాజును ఘోరంగా శపిస్తాడు. ఏడు దినాలలో తనకు మృత్యువు తప్పదని తెలుసుకున్న పరీక్షిత్తు పవిత్ర గంగాతీరంలో ప్రాయోపవిష్టు డవుతాడు. భగవానుడైన శుకమహర్షి పరీక్షిత్తు దగ్గరకు వస్తాడు. మహారాజు మహర్షికి సాష్టాంగనమస్కారం చేసి ఏడు దినాలలో మోక్షం సాక్షాత్కరించే ఉపాయం చెప్పమని ప్రార్థిస్తాడు. ఈ విధంగా ప్రథమ స్కంధం ముగుస్తుంది.

ఇక ద్వితీయ స్కంధం. శ్రీశుకుడు రెండు గడియలలో కైవల్యాన్ని సంపాదించిన ఖట్వాంగుని వృత్తాంతం చెప్పి "నీకు ఏడుదినాలు గడువు వుందికదా! తప్పకుండా మోక్షపదాన్ని అందుకుంటావు"అని పరీక్షిత్తుకు ధైర్యం చెబుతూడు. భక్తి మార్గమే ప్రధానమని పలికి భాగవతతత్త్వాన్ని ఉపదేశిస్తాడు.

శ్రీమన్నారాయణుని లీలావతారాల అభివర్ణనం ఈ స్కంధంలో ప్రధానమైన విషయం. భాగవత స్వరూపం శ్రీమన్నారాయణునివల్ల బ్రహ్మదేవునికీ, బ్రహ్మవల్ల నారదునికీ, నారదునివల్ల వ్యాస మహర్షికీ, వ్యాసమహర్షివల్ల శ్రీశుకునికీ సంప్రాప్తమయింది. ఆ భాగవత తత్త్వాన్ని శ్రీశుకులు పరీక్షిన్మహారాజుకు వివరిస్తారు.

ఇప్పుడు తృతీయ స్కంధంలోకి వచ్చాము. ఇందులో విదుర మైత్రేయ సంవాదం, హిరణ్యాక్ష హిరణ్యకశిపుల వృత్తాంతం, జగత్కంటకుడైన హిరణ్యాక్షుని శ్రీమహావిష్ణువు యజ్ఞవరాహావతారం ధరించి సంహరించటం, దేవహూతి కర్దముల దాంపత్యం, కపిల దేవహూతి సంవాదం మొదలైనవి ప్రధాన ఘట్టాలు.

తెలుగు భాగవతానికి ఇంతటి దీప్తి, వ్యాప్తి రావటానికి సహజ పాండిత్యుని సహజసుకుమారమైన శయ్యా సౌభాగ్యం, భావావేశం, భక్తి పారవశ్యం ప్రధాన హేతువులు. అర్థగాంభీర్యమూ, శబ్దసౌందర్యమూ బాలరసాల సాల నవపల్లవ కోమలమైన పోతన్నగారి కావ్యకన్యకకు పెట్టని సొమ్ములు. వాగర్థాలు పార్వతీ పరమేశ్వరులవలె బమ్మెరవారి కవిత్వంలో కలసి మెలసి ఉంటాయి.

### అర్థ గాంభీర్యము !

కౌరవసభలో ధృతరాష్ట్ర మహారాజుకు హితబోధ చేస్తున్న విదురుని పలుకులు గమనించండి.

**అట్టి జగన్నివాసుఁడు మురాసురభేది పరాపరుండు చే**
**పట్టి సఖుండు వియ్యమును బాంధవుఁడున్ గురుఁడున్ విభుండునై**
**యిట్టలమైన ప్రేమమున నెప్పుడుఁ దోడ్పడుచుండు వారలన్**
**జుట్టన వ్రేల నెవ్వరికిఁ జూపఁగ వచ్చును బార్థివోత్తమా! (3-31)**

ఈ సందర్భంలోనిదే మరొక పద్యం -

**ధరణీనాయక! పాండు భూవిభుఁడు నీ తమ్ముండు దత్పుత్రులన్**
**బరిరక్షించిన ధర్మముం దగవునుం బాటిల్లు, వంశంబు సు**
**స్థిర సౌఖ్యోన్నతిఁజెందు, శత్రుజయమున్ జేకూరు, గోపాల శే**
**ఖరు చిత్తంబును వచ్చునట్లగుట యో కౌరవ్య వంశాగ్రణీ! (3-24)**

వైకుంఠంలోని వాసుదేవుని వర్ణనం ఈ పద్యంలో చిత్తగించండి.

**వరవైకుంఠము సారసాకరము; దివ్యస్వర్ణ శాలాంక గో**
**పుర హర్మ్యావృతమైన తద్భవన మంభోజంబు; తన్మందిరాం**
**తరవిభ్రాజిత భోగి కర్ణిక; తదుద్యద్భోగ పర్యంకమం**
**దిరహొందన్ వసియించు మాధవుఁడు దా నేపారు భృంగాకృతిన్. (3-513)**

లోకకంటకుడైన హిరణ్యాక్షుని సంహరించటంకోసం అవతరించి అవార్యశౌర్యంతో మారులేని విహారం చేస్తున్న ఆదివరాహమూర్తిని పోతన్నగారు ఈ క్రింది సీసపద్యంలో సహజసుందరంగా అభివర్ణించారు.

**తుద మొదళ్లకుఁ జిక్కి తునిసి పాఱఁగ మోరఁ గులశైలములఁ జిమ్ముఁ గొంత తడవు**
**బ్రహ్మాండభాండంబు పగిలి చిల్లులు వోవఁ గొమ్ములఁ దాటించుఁ గొంత తడవు**
**జలధు లేడును బంకసంకులంబై యింక ఖురముల మట్టాడుఁ గొంత తడవు**
**ఉడురాజు సూర్యుండు నొక్కమూలకుఁ బోవఁ గుఱుచవాలముఁ ద్రిప్పుఁ గొంత తడవు**
**గునియుఁ గుప్పించు లంఘించుఁ గొప్పరించు నెగయు ధరఁ ద్రవ్వుఁ బొఱియఁగా నేపు మిగిలి**
**దానవేంద్రుని గుండెలు దల్లడిల్లఁ బంది మెల్లన రణ పరిస్పంది యగుచు.** (3.637)

**శబ్ద సౌందర్యము :**

అర్థ గాంభీర్యముతో కూడిన శబ్ద సౌందర్యము సుమనో మనోజ్ఞంగా ఉంటుంది. పోతన్న గారికి అంత్యానుప్రాసాలతో పద్యాన్ని హృద్యంగా నడపటం వెన్నతో పెట్టిన విద్య. శ్రీహరి పాదాలను ఈ క్రింది చంపకమాలతో అలంకరించాడు. వైకుంఠంలో సనక సనందనాదులు గోవిందుని సందర్శించిన సందర్భమిది.

**సునిశిత భక్తిఁ దన్ముఖముఁ జూచిన చూడ్కులు ద్రిప్పలేకయుం**
**గనుఁగొని రెట్టికేలకు నకల్మష భక్త విధూత ఖేదముల్,**
**మునిజన చిత్త మోదములు, ముక్తినివాస కవాట భేదముల్,**
**వినుత వినూత్న నూపురిత వేదము, లమ్మహనీయు పాదముల్.** (3.541)

రణరంగంలో హిరణ్యాక్షుడు వరాహమూర్తికి లొంగిపోవటం ఈ క్రింది కందంలో అందంగా వర్ణింపబడింది.

**దిట చెడి లోఁబడె దైత్యుఁడు, సటికిన్, దంష్ట్రా విభిన్న శత్రుమహోర**
**స్తటికిన్, ఖరఖుర పుటికిన్, గటి తట హత కమల జాండ ఘటికిన్, గిటికిన్.** (3.698)

మైత్రేయ మహర్షి తీర్థ యాత్రలు చేస్తూ శ్రీకృష్ణుని దర్శించిన సందర్భంలోనిది యీ పద్యం.

**కనియెం దాపసపుంగవుం డఖిలలోకఖ్యాత వర్ధిష్ణు, శో**
**భన భాస్వత్పరి పూర్ణ యౌవన కళాభ్రాజిష్ణు, యోగీంద్రహృ**
**ద్వనజాతైకచరిష్ణుఁ, గౌస్తుభముఖోద్యద్భూషణాలంకరి**
**ష్ణు, నిలింపాహితజిష్ణు, విష్ణుఁ, బ్రభవిష్ణుం, గృష్ణు, రోచిష్ణునిన్.** (3.148)

సీసాలలోఅంత్యప్రాస విలాస విన్యాసాలు పోతన్న గారికి ఎంతో ఇష్టం.

**దళ దరవింద సుందర పత్ర రుచిరాక్షు సలలిత శ్రీవత్స కలిత వక్షు**
**నీలనీరద నీలనీలోత్పల శ్యాము నలికులాకుల మాలికాభిరాముఁ**
**గౌస్తుభకలిత ముక్తాహారయుత కంఠు యోగిమానస పంకజోపకంఠు**
**సతత ప్రసన్న సస్మితవదనాంభోజు దినకర కోటి సందీప్త తేజు........** (3.922)

మరొక విధమైన అనుప్రాసవిన్యాసం కల ఈ సీసాన్ని చిత్తగించండి.

**కంజాత కింజల్క పుంజరంజిత పీత కౌశేయవాసు జగన్నివాసు**
**శత్రు భీకర చక్ర శంఖ గదా పద్మ విహిత చతుర్బాహు విగతమోహు.......** (3.924)

ఈ క్రింది ప్రాసముక్తాయింపులు కూర్చటంలో పోతన్న గారిది అందె వేసిన చేయి.

**భక్త పరితోషణ భూషణ! పాపశోషణా!** (3.115)
**కలుష గహనదమునన్ యమునన్.** (3.170)
**పుండరీకాక్ష! సంతత భువన రక్ష!** (3.309)
**కృపాగుణ భూషణ! పాపశోషణా!** (3.548)
**సుధీజనతావన! విశ్వభావనా!** (3.570)
**జగత్పరిపాలన! నిత్యఖేలనా!** (3.572)
**రిపుమాన విమర్దను నా జనార్దనున్.** (3.666)
**వివేక విశాలుని పుణ్యశీలునిన్.** (3.707)

ఈ విధంగా బమ్మెరవారి భాగవతం అర్థగాంభీర్యానికి, శబ్ద సౌందర్యానికీ, భక్తి పరవశత్వానికి, మహత్త్వ కవిత్వ పటుత్వానికి ఆలవాలమై అలరారుతున్నది.

ఇటువంటి పోతన భాగవతం అక్షరాస్యులందరికి అందుబాటులో ఉండే విధంగా సరళ గద్యానువాద సహితంగా ప్రకటించాలనే సంకల్పం తిరుమల తిరుపతి దేవస్థానాల వారికి కలగటం అభినందించ వలసిన విషయం. ఈ సదుద్దేశంతోనే పోతన భాగవతం ప్రాజెక్టు ప్రారంభింపబడింది. ఈ మహాకార్యంలో నాకు అవకాశం కల్పించిన కార్యనిర్వహణాధికారి శ్రీ ఎస్. లక్ష్మీనారాయణ, ఐ. ఏ. ఎస్., గారికి నా హృదయ పూర్వక నమస్సుమనస్సులు సమర్పిస్తున్నాను.

ఈ సందర్భంలో నన్ను అహ్వానించి అనువాద భాగా లన్నింటినీ పరిశీలించి పరిష్కరించి ఏక సూత్రతను కల్పించేభారం నామీద ఉంచిన డాక్టర్ రావుల సూర్యనారాయణమూర్తి, పి. ఆర్. ఓ., గారికి నా అభివందన మందారాలు అందిస్తున్నాను.

ప్రేమ పెన్నిధి అయిన శ్రీనివాసుని సన్నిధిలో ఎంతో సంతోషంతో నేను నా విధిని నిర్వర్తించటానికి సహకరిస్తున్న శ్రీ.కె. సుబ్బారావు, ఎడిటర్ గారికి నా హార్దిక అభివాదాలు.

తమ కరకమలాలను అలంకరించి ఉన్న గ్రంథం పోతన భాగవతం తృతీయ స్కంధం. ఈ స్కంధాన్ని సరళగద్యంలో అనువాదం చేసినవారు శ్రీ ఆశావాది ప్రకాశరావు, ఎం. ఏ., గారు. వీరు చిత్తూరుజిల్లా, నగరి డిగ్రీ కళాశాలలో ఆంధ్రోపన్యాసకులు. అష్టావధానకళలో ఆరితేరినవారు. వినయభూషణులు. మధురభాషణులు.

ఆశావాది వారి అనువాదం సరసంగా సరళంగా సాగింది. ఈ తృతీయ స్కంధాన్ని ఇంత ముచ్చటగా ముద్రించిన దేవస్థానం ప్రెస్ మేనేజర్ శ్రీ విజయకుమార్‌రెడ్డి గారికి, వారి సిబ్బందికి నా సాధువాదాలు.

అక్షరదోషాలు దొరలకుండా సహస్రాక్షులై ప్రూఫులు సరిదిద్దిన పూజ్యమిత్రులు శ్రీ ముదివర్తి కొండమాచార్యుల వారికీ, శ్రీములుకుట్ల రామకృష్ణశాస్త్రి గారికీ నా ధన్యవాదాలు. ముద్రణకు తగునట్లు ప్రెస్‌కాపీ సిద్ధంచేసి ఇచ్చిన చిరంజీవి కోరాడ రామకృష్ణ, ఎం.ఏ., ఎం.ఫిల్.,కు నా శుభాశీస్సులు.

తిరుపతి,
10-2-86.

భవదీయుడు
***కరుణశ్రీ***
ప్రధాన సంపాదకుడు
పోతన భాగవతం

శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః

# పోతన భాగవతము

*(సరళ గద్యానువాద సహితము)*

## మూడవ స్కంధము

**శ్రీ మహిత వినుత దివిజ**
**స్తోమ! యశస్సోమ! రాజసోమ! సుమేరు**
**స్థేమ! వినిర్జిత భార్గవ**
**రామ! దశానన విరామ! రఘుకులరామా!** **1**

* రామా! రఘువంశలలామా! నీవు అత్యంత శోభావంతమై, దిగంతవిశ్రాంతమై, దేవతలు సంకీర్తించే కీర్తివైభవం కలవాడవు. నరేంద్రులలో చంద్రుడవు! మేరు ధీరుడవు! పరశురాముని భంగపరచిన వీరుడవు. పదితలల రావణుని తుదముట్టించిన శూరుడవు. అవధరించు!

**వ. మహనీయగుణగరిష్ఠులగు నమ్ముని శ్రేష్ఠులకు నిఖిలపురాణవ్యాఖ్యాన వైఖరీ సమేతుండైన సూతుం డిట్లనియె. అట్లు ప్రాయోపవిష్టుండైన పరీక్షిన్నరేంద్రునకు శుక యోగీంద్రుం డిట్లనియె.** **2**

* సమస్త పురాణాలను చక్కగా వివరించటంలో మిక్కిలి నేర్పుగల సూతమహర్షి ఉత్తమగుణ సంపన్నులైన శౌనకాది మునిసత్తములతో ఇట్లా అన్నాడు-

ఆ విధంగా ప్రాయోపవేశ దీక్షలో ఉన్న పరీక్షిన్నరేంద్రుణ్ణి వీక్షించి శుకయోగీంద్రుడు ఈ విధంగా పలికాడు-

### -: విదురుండు తీర్థయాత్ర సేయుట :-

**ఉ పాండునృపాల నందనులు బాహుబలంబున ధార్తరాష్ట్రులన్**
**భండనభూమిలో గెలిచి పాండుర శారద చంద్ర చంద్రికా**
**ఖండయశః ప్రసూన కలికావళిఁ గౌరవ రాజ్యలక్ష్మి నొం**
**డొండ యలంకరింపుచు జయోన్నతి రాజ్యము సేయుచుండఁగన్.** **3**

* పాండురాజకుమారులైన ధర్మరాజాదులు బాహువిక్రమంతో ధృతరాష్ట్రుని కొడుకులైన దుర్యోధనాదులను రణరంగంలో జయించారు. స్వచ్ఛమైన శరత్కాలపు పండు వెన్నెలలాంటి అఖండకీర్తిని ఆర్జించారు. అటువంటి యశస్సు అనే పూలమొగ్గలతో కౌరవరాజ్యలక్ష్మిని అలంకరించారు. ఈవిధంగా వారు విజయోల్లాసంతో రాజ్యపాలనం సాగించారు.

క. మనుజేంద్ర! విదురుఁ డంతకు మును, వనమున కేఁగి యచట మునిజనగేయున్
విమత తపో ధౌరేయున్ ఘను, ననుపమ గుణవిధేయుఁ గనె మైత్రేయున్. 4

* ఓ పరీక్షిన్మహారాజా! అంతకుముందే- అనగా మహాభారతయుద్ధం జరగటానికి ముందుగానే విదురుడు అడవులకు వెళ్ళాడు. అక్కడ మునులచే కీర్తింపబడేవాడూ, ప్రశస్తమైన తపస్సులో పేరెన్నికగన్న వాడూ, సాటిలేని మేటిగుణాలు గలిగి సంస్తవనీయుడూ అయిన మైత్రేయుణ్ణి సందర్శించాడు.

క. కనుఁగొని తత్పాదంబులు, దన ఫాలము సోక మ్రొక్కి తగ నిట్లనియెన్
మునివర! సకల జగత్పా, వన చరితుఁడు కృష్ణుఁ డఖిల వంద్యుం డెలమిన్. 5

* అలా దర్శించి ఆ మహాముని పాదాలపై తన నుదురు సోకేటట్లు నమస్కారం చేసి విదురుడు ఇట్లా అన్నాడు. మునీంద్రా! సమస్తలోకాల్ని పవిత్ర మొనర్చ గల చరిత్ర గలవాడైన శ్రీకృష్ణుడు అందరికీ వందనీయుడు.

క. మండిత తేజోనిధి యై, పాండవ హితమతిని దూతభావంబున వే
దండపురి కేగి కురుకుల, మండనుఁ డగు ధార్తరాష్ట్ర మందిరమునకున్. 6

* దేదీప్యమానమైన తేజస్సు తనకు పరివేషభూషణంగా వెలుగొందే ఆ గోవిందుడు పాండవుల మేలు కోరి, రాయబారిగా హస్తినాపురానికి వచ్చాడు. అలా విచ్చేసిన శ్రీకృష్ణుడు కౌరవకుల వతంసుడైన దుర్యోధనుని సౌధానికి వెళ్ళలేదు.

తే. చనఁగ నొల్లక మద్గృహంబునకు భక్త, వత్సలుం డగు కృష్ణుండు వచ్చుటేమి
కతము? నాకది యెఱిఁగింపు కరుణతోడ, ననుచు విదురుండు మైత్రేయు నడిగె నవిన. 7

* అట్లా వెళ్ళకుండా, ఆ భక్తవత్సలుడు ప్రత్యేకంగా నా యింటికి దయచేశాడు. ఇట్లా రావడానికి కారణం ఏమిటి? దయచేసి ఇందులో ఉన్న రహస్యం నాకు విప్పి చెప్పు అని విదురుడు మైత్రేయుణ్ణి అడిగాడు.

క. విని వెఱఁగంది పరీక్షి, న్మనుజవరేణ్యుండు విమలమతి నిస్తంద్రున్
మునికుల జలనిధి చంద్రున్, సునిశిత హరిభక్తిసాంద్రు శుకయోగీంద్రున్. 8

* ఇట్లా చెబుతున్న మహర్షిమాటలు విని పరీక్షిన్మహారాజు ఆశ్చర్యపడి పరిశుద్ధమైన మనస్సు గలవాడూ, స్థిర సంకల్పుడూ, మునిజనమనే సముద్రానికి చంద్రునివంటివాడూ, తిరుగులేని హరిభక్తిచే గుండె పండినవాడూ- అయిన శుకమహర్షివైపు చూచాడు.

క. కని యిట్లనె మైత్రేయుని, ననఘుండగు విదురుఁ డేరహస్యము లడిగెన్?
ముని యేమి చెప్పె? నే పగి, దిని దీర్థము లాడె? నెచటఁ దిరుగుచు నుండెన్? 9

* అట్లా చూస్తూ ఇట్లా అన్నాడు. పుణ్యుడైన విదురుడు మాన్యుడైన మైత్రేయుని ఏ యే రహస్యాలు అడిగాడు? అందుకు ఆ మహాముని యేమేమి సమాధానాలు చెప్పాడు? విదురుడు ఏ యే తీర్థాలలో ఏ విధంగా స్నానం చేశాడు? ఎక్క డెక్కడ ఏ విధంగా సంచరించాడు?

**తే. ఇన్ని దెలియంగ నానతి యిచ్చి నన్ను, నర్థి రక్షింపవే విమలాంతరంగ!**
**ఘన దయాపాంగ! హరిపాద కమలభృంగ!, మహిత గుణసంగ! పాపతమఃపతంగ! 10**

* మహర్షీ! నీవు స్వచ్ఛమైన హృదయం గలవాడవు! కరుణతో నిండిన కడగంటి చూపులు గలవాడవు! విష్ణు పాదాలనే పద్మాలకు తుమ్మెదలాంటివాడవు! నీవు ఉత్తమ గుణ సంపన్నుడవు. పాపమనే చీకటిని పటాపంచలుచేసే సూర్యభగవానుడవు. దయచేసి ఇవన్నీ వివరించి ఆపన్నుడనైన నన్ను రక్షించు.

**చ. అనవుడు బాదరాయణి ధరాధిపుతో ననుఁ బూరువంశ వ**
**ర్ధన! విను కష్టుఁడైన ధృతరాష్ట్రనృపాలుఁడు పెంపుతో సుయో**
**ధన ముఖ పుత్రులం గడు ముదంబునఁ బెంపుచుఁ బాండురాజు ద**
**ప్పిన పిదపన్ దదాత్మజులు పెల్కుఱి తన్నని చేర వచ్చినన్. 11**

* అనగా శుకుడు పరీక్షిత్తుతో ఇట్లా అన్నాడు. పురువంశ వర్ధనా! విను. దుష్టుడైన ధృతరాష్ట్రుడు, తన కుమారులైన దుర్యోధనాదుల్ని ఎక్కువ గారాబంగా పెంచాడు. తండ్రి పాండురాజు పరమపదించగానే ఆయన కుమారులు పాండవులు భయంతో కంపించి అతని అండచేరినారు.

**వ. ఇట్లు వచ్చిన పాండవుల యెడ నసూయా నిమగ్నులై సుయోధనాదులు 12**

**క. పెట్టిరి విషాన్న; మంటం, గట్టిరి ఘనపాశములను; గంగానదిలో**
**నెట్టిరి; రాజ్యము వెడలం, గొట్టిరి; ధర్మంబు విడిచి కుటిలాత్మకులై. 13**

* ఈవిధంగా వచ్చిన పాండవులను చూచి దుర్యోధనాదులు అసూయాగ్రస్తులైనారు. ధర్మదూరులు, కుటిల బుద్ధులు అయిన కౌరవులు వారికి విషం కలిపిన అన్నం పెట్టారు. పెద్ద పెద్ద తాళ్లతో కట్టారు. గంగా నదిలో నెట్టారు. రాజ్యంనుండి కూడా వెళ్లగొట్టారు.

**క. క్రూరాత్ము లగుచు లాక్షా, గారంబున వారు నిద్ర గైకొని యుండన్**
**దారుణ శిఖి దరికొలిపిరి, మారణ కర్మముల కప్రమత్తులు నగుచున్. 14**

* లక్క ఇంట్లో మైమరచి పాండవులు నిద్రపోతూ ఉండగా క్రూరహృదయులైన కౌరవులు ఇంటికి నిప్పంటించారు. వారిని రూపు మాపటానికి ఏమరుపాటు లేకుండా ఎన్నో పన్నాగాలు పన్నారు.

**తే. సూరిజనగేయ మగు రాజసూయ యజ్ఞ, విలస దవభృథస్నాన పవిత్రమైన**
**ద్రౌపదీ చారు వేణీభరంబు వట్టి, కొలువు లోపల నీడ్చిరి కుత్సితమున. 15**

* పండితవరేణ్యుల ప్రశంస లందుకొన్న రాజసూయ మహాయజ్ఞంలో పూజనీయమైన అవభృథస్నానంతో పరమ పవిత్రమై ఒప్పారుతున్న పాంచాలి కొప్పు పట్టుకొని నీచాతినీచంగా నిండుకొలువు లోపలికి ఈడ్చారు.

క. కావున వారల కపకృతిఁ, గావింపని దొక దినంబు గలుగదు. తమ జ
న్మావధి నిజనందనులను, వారిరి న య్యంధనృపతి వలదనఁ డయ్యెన్. 16

* ఇట్లు కౌరవులు పాండవులకు ఆజన్మాంతం అపకారం చెయ్యని దినమే లేదు. ఆ గ్రుడ్డిరాజు కొడుకులకు అడ్డు చెప్పలేకపోయాడు.

తే. మాయజూదంబు వన్ని దుర్మార్గవృత్తిఁ, బుడమిఁ గొని యడవులకుఁ బోనడువ నచటఁ
దిరిగి వారలు సమయంబు దీర్చి యేఁగు, దెంచి తమ యంశ మడిగినఁ బంచి యిడక. 17

* అనంతరం మాయ జూదంలో కౌరవులు అన్యాయంగా పాండవుల రాజ్యాన్ని లాక్కొన్నారు. వారిని అడవులకు వెడలగొట్టారు. పాండవులు ఒడంబడిక ప్రకారం గడువు ముగిశాక తిరిగివచ్చి తమకు రావలసిన రాజ్యభాగాన్ని అడిగితే కౌరవులు ఇయ్యలేదు.

వ. ఉన్న యెడ. 18

చ. సకల నియంత యైన హరి సర్వశరణ్యుఁడు మాధవుండు సే
వక నవకల్పకంబు భగవంతుఁ డనంతుఁ డనంతశక్తి నం
దకధరుఁ డబ్జలోచనుఁడు ధర్మతనూభవుచే నియుక్తుఁడై
యకుటిల భక్తి యోగమహితాత్మకుఁడై ధృతరాష్ట్రుపాలికిన్. 19

* ఇలా ఉండగా నిఖిల సృష్టికీ నియంత అయినవాడూ, అఖిల లోక శరణ్యుడూ, ఆశ్రితజన పారిజాతమూ, అంతం లేనివాడూ, ఎంతో శక్తి సంపన్నుడూ, నందకం అనే ఖడ్గాన్ని ధరించినవాడూ, కమలదళాలవంటి కన్నులు గలవాడూ అయిన శ్రీకృష్ణుడు నిష్కళంకమైన భక్తియోగానికి అంకితమైన మనస్సు కలవాడై ధర్మరాజు నియోగం ప్రకారం రాయబారం నడపటానికి ధృతరాష్ట్రుని దగ్గరకు వెళ్లాడు.

క. చని యచట భీష్మ గురు త, త్తనయ కృపాచార్య నిఖిల ధాత్రీపతులున్
విని యనుమోదింపఁగ ని,ట్లనియెన్ ధృతరాష్ట్రుతోడ నవనీనాథా! 20

* భూపాలా! అలా వెళ్ళిన గోపాలుడు అక్కడ భీష్ముడూ, ద్రోణుడూ, అశ్వత్థామా, కృపుడూ, సకల రాజన్యులూ అంతా విని సంతోషించేటట్లు ధృతరాష్ట్రునితో ఇట్లా అన్నాడు.

క. కౌరవ పాండవు లిరువురు, నారయ నీకొక్క రూప యవనీవర! నీ
వే రీతి నైన బాండు కు, మారుల పాలొసఁగి తేని మను నుభయంబున్. 21

* మహారాజా! కౌరవులూ, పాండవులూ ఇద్దరూ నీకు ఒక్కటే. నీవు ఏ విధంగానైనా సరే పాండవులకు రావలసిన రాజ్యభాగం ఇచ్చినట్లైతే, ఉభయులూ క్షేమంగా ఉంటారు..

క. అని ధర్మబోధమునఁ బలి, కిన మాటలు చెవుల నిడమిఁ గృష్ణుడు విదురున్
ఘన నీతిమంతుఁ బిలువం, బనిచినఁ జనుదెంచెఁ గురుసభాస్థలమునకున్. 22

* అంటూ కృష్ణుడు ధర్మప్రబోధం చేశాడు. ఆ మాటలు వారి చెవికెక్కలేదు. అప్పుడు శ్రీకృష్ణుడు విశేష నీతివిదుడైన విదురుణ్ణి పిలువనంపాడు. విదురుడు కౌరవుల కొలువుకూటానికి వచ్చాడు.

**వ. చనుదెంచి యచటి జనంబులచేత నుపస్థితంబైన కార్యంబు దెలుపఁబడినవాఁడై ధృతరాష్ట్రు నుద్దేశించి యిట్లనియె. 23**

* విదురుడు అక్కడి వారివల్ల జరుగుతూవున్న వ్యవహారమంతా తెలుసుకున్నాడు. ధృతరాష్ట్రునితో ఇట్లా అన్నాడు.

**మ. ధరణీనాయక! పాండుభూవిభుఁడు నీతమ్ముండు; దత్పుత్త్రులన్**
**బరిరక్షించిన ధర్మముం దగవునుం బాటిల్లు; వంశంబు సు**
**స్థిర సౌఖ్యోన్నతిఁ జెందు; శత్రుజయమున్ జేకూరు; గోపాల శే**
**ఖరు చిత్తంబును వచ్చు నట్లగుట యౌఁ గౌరవ్యవంశాగ్రణీ! 24**

* మహారాజా! పాండురాజు నీ తమ్ముడు. ఆయన కుమారుల్ని సంరక్షించడం ధర్మమూ, న్యాయమూ. అందువల్ల మీ వంశం శాశ్వత సుఖసంపదలతో వర్ధిల్లుతుంది. మీకు శత్రు విజయం సంప్రాప్తమౌతుంది. కురుకులచూడామణీ! మీరు ఈ విధంగా ఆచరిస్తే గోపాలశిరోమణి అయిన కృష్ణుని మనస్సుకూ ప్రియం కలిగించిన ట్లవుతుంది.

**అ. వారి తండ్రి పాలు వారికి నొసఁగి నీ,పాలు సుతుల కెల్లఁ బంచి యిచ్చి**
**చలము విడిచి ధర్మ మలవడ నీ బుద్ధిఁ, జొనుపవయ్య! కులము మనుపవయ్య! 25**

* మహారాజా! వారి తండ్రిభాగం వారికివ్వు. నీ భాగం కొడుకులకు పంచి ఇవ్వు. ఈర్ష్య వదలిపెట్టు. ధర్మమార్గంలో మనస్సు ప్రవేశపెట్టు. వంశాన్ని నిలబెట్టు.

**చ. వినుము నృపాల! నా పలుకు; వేయును నేల సమీరసూతి నీ**
**తనయుల పేరు విన్నఁ బదతాడిత దుష్టభుజంగమంబు చా**
**డ్పునఁ గనలొందు! నింతయును మున్నునుఁ జెప్పితిఁగాదె వాని చే**
**తన భవదీయపుత్త్రులకుఁ దప్పదు మృత్యు వదెన్ని భంగులన్. 26**

* రాజా! నా మాట పాటించు. నీకొడుకు దుడుకుతనం విన్నప్పుడల్లా ఆ భీమసేనుడు కాలు తగిలిన కాలసర్పం లాగా మండిపడతాడు. ఇదంతా నీకు ముందే చెప్పానుగదా! ఏ విధంగా అయినా సరే ఆవాయుకుమారుని చేతిలో నీ కుమారులకు చావు తప్పదు.

**వ. అదియునుం గాక, 27**

**క. నీపుత్త్రుల శౌర్యంబును, చాపాచార్యాపగాత్మజాత కృపభుజా**
**టోపంబును గర్ణు దురా, లాపంబును నిజముగాఁ దలంతె మనమునన్. 28**

* అంతేకాదు రాజా! నీ కన్న కొడుకుల ప్రతాపాలూ; ద్రోణాచార్య, భీష్మాచార్య, కృపాచార్యుల పటాటోపాలూ; అంగరాజు అసందర్భప్రలాపాలూ- ఇవన్నీ నిజమే అని నీ మనస్సులో నమ్ముతున్నావా!

వ. అట్లేని వినుము. 29

ఉ. ఏ పరమేశుచే జగము లీ సచరాచరకోటితో సము
ద్దీపిత మయ్యెఁ; నే విభుని దివ్యకళాంశజు లబ్జగర్భ గౌ
రీపతి ముఖ్యదేవ ముని బృందము; లెవ్వఁ డనంతుఁ డచ్యుతుం
డా పురుషోత్తముండు కరుణాంబుధి గృష్ణుఁడు వో నరేశ్వరా! 30

* అయితే- విను. ఓ రాజా! ఏ పరమేశ్వరుని అనుగ్రహం వల్ల ఈ ప్రపంచం చరాచర జంతుజాలంతో ప్రకాశిస్తూ ఉంటున్నదో; బ్రహ్మదేవుడు, మహాదేవుడు మొదలైన దేవతలూ, మునిగణమూ అంతా ఏ దేవుని దివ్యకళాంశలనుండి జన్మించారో, ఎవ్వడు అనంతుడో, ఎవ్వడు అచ్యుతుడో ఆ పురుషోత్తముడే దయాపయోనిధి అయిన ఈ శ్రీకృష్ణుడు.

ఉ. అట్టి జగన్నివాసుఁడు మురాసురభేది పరాపరుండు చే
పట్టి సఖుండు వియ్యమును బాంధవుఁడున్ గురుఁడున్ విభుండునై
యిట్టల మైన ప్రేమమున నెప్పుడుఁ దోడ్పడుచుండు వారలన్
జుట్టనవ్రేల నెవ్వరికిఁ జూపఁగ వచ్చును బార్థివోత్తమా! 31

* మహారాజా! అన్నిలోకాలనూ తనలో అట్టిపెట్టినవాడూ, మురుడు అనే రాక్షసుణ్ణి మట్టుపెట్టినవాడూ, సర్వశ్రేష్ఠుడూ అయిన శ్రీకృష్ణుడు చెలికాడై, వియ్యంకుడై, చుట్టమై, ప్రబోధకుడై, ప్రభువై అతిశయించిన అనురాగంతో ఎల్లప్పుడూ పాండువులకు తోడ్పడుతుంటాడు. అలాంటి వారిని వ్రేలెత్తి చూపడానికి ఎవరికైనా సాధ్యం అవుతుందా?

ఉ. కావునఁ బాండునందనులఁ గాఱియ పెట్టక రాజ్యభాగమున్
వావిరి నిచ్చి రాజ్యమును వంశముఁ బుత్రుల బంధువర్గమున్
గావుము; కాక లోభియగు కష్ట సుయోధను మాట వింటివే
భూవర! నీ యుపేక్ష నగుఁబో కులనాశము బంధునాశమున్. 32

* అందుకని నా మాటవిని పాండువుల్ని బాధపెట్టకుండా వారి రాజ్యభాగాన్ని వారికి ఇచ్చి దేశాన్నీ, వంశాన్నీ, పుత్రుల్నీ, బంధువుల్నీ కాపాడు. అలాకాక లోభావిష్టుడూ, దుష్టుడూ అయిన దుర్యోధనుని మాటలు విన్నావా నీ నిర్లక్ష్యం కారణంగా కులనాశం, బంధునాశం జరిగితీరుతుంది.

తె. ఒకనికై యిట్లు కుల మెల్ల నుక్కడంప, నెత్తుకొనఁ జూచె దిది నీతియే నృపాల!
వినుము నామాట; నీ సుయోధనుని విడిచి, కులము రాజ్యంబుఁ దేజంబు నిలుపవయ్య. 33

* ఒక్కడి కోసం వంశమంతా ధ్వంసం చేసుకోటానికి ప్రయత్నిస్తున్నావు. ఇదెక్కడి రాజనీతి? మహారాజా! నామాట విను. ఈ దుర్యోధనుణ్ణి విడనాడు. వంశమర్యాదనూ. ప్రభుత్వాన్నీ, ప్రతాపాన్నీ కాపాడు!

**క. అని యిట్లు దెలిమి చెప్పిన, విని దుర్యోధనుఁడు రోషవివశుండై తా**
**నినతనయ శకున దుశ్శా, సనుల నిరీక్షించి తామసంబునఁ బలికెన్. 34**

* అని ఈ విధంగా విదురుడు నొక్కి చెప్పాడు. ఆ మాటలు విని దుర్యోధనుడు రోషావేశంతో వశం తప్పిపోయాడు. మిత్రుడైన కర్ణుణ్ణీ, మేనమామ శకునినీ, తమ్ముడైన దుశ్శాసనుణ్ణీ చూచి అహంకారంతో ఇట్లా అన్నాడు.

**క. దాసీపుత్రుని మీర లు, దాసీనుం జేయ కిటకుఁ దగునె పిలువఁగా?**
**నాసీనుండై ప్రేలెడు, గాసిలి చెడిపోవ వెడలఁగా నడువుఁ డిఁకన్. 35**

* దాసీపుత్రుణ్ణి తీసుకొని ఆసనం ఇచ్చి కూర్చోపెట్టారు. ఇటువంటి వాళ్లను ఈ సభకు ఎందుకు పిలిపించారు. కుదురుగా కూర్చొని అధిక ప్రసంగాలు చేస్తూ ఉన్నాడు. వెంటనే ఈ తుంటరిని మెడబట్టి గెంటివెయ్యండి. తిక్క కుదురుతుంది.

**వ. అని యిట్లు దుర్యోధనుం డాడిన దురాలాపంబులు దనకు మనస్తాపంబుసేయం గార్యంబు విచారించి ధైర్యం బవలంబించి యొండు పలుక నొల్లక శరశరాసనంబులు విడిచి క్రోధంబు నడఁచి వనంబునకు జని యందు. 36**

* ఈ విధంగా దుర్యోధనుడు పలికిన దుడుకు మాటలకు విదురుని మనస్సు తుకతుక ఉడికిపోయింది. అప్పుడు విదురుడు కర్తవ్యం గుర్తుకు తెచ్చుకొని, గుండె నిబ్బరించుకొని, మరేమీ మారుమాట పలుకకుండా, ధనుర్బాణాలు విడిచిపెట్టి, ఆగ్రహాన్ని అడచిపెట్టి అరణ్యానికి వెళ్ళిపోయాడు.

**సీ. విష్ణుస్వయంవ్యక్త విమలభూములను బవిత్రంబులగు హరిక్షేత్రములను**
**నెలకొని దేవతానిర్మితహరిదివ్య భూముల గంగాది పుణ్యనదుల**
**సిద్ధపురాణప్రసిద్ధ పుణ్యాశ్రమ స్థలముల నుపవనస్థలములందు**
**గంధమాదనముఖ క్ష్మాభృత్తటంబుల మంజులగిరి కుంజ పుంజములను**

**తే. వికచకైరవ పద్మ హల్లక మరంద, పాన పరవశ మధుకర గాన బుద్ధ**
**రాజహంస విలాస విరాజమాన, మగుచుఁ జెలువొందు పంకేరుహాకరముల. 37**

* ఆ విధంగా వెళ్ళిన విదురుడు విష్ణుదేవుడు స్వయంగా వెలసిన పావనప్రదేశాలనూ, పరమపవిత్రాలైన వైష్ణవ క్షేత్రాలనూ, దేవతలు నిర్మించిన దివ్యస్థలాలనూ, గంగ మొదలైన పుణ్యనదులనూ, పురాణాలలో ప్రసిద్ధాలైన సిద్ధాశ్రమాలనూ, తపోవనాలనూ దర్శించాడు. గంధమాదనం మొదలైన కొండచరియలనూ, అక్కడి చక్కని చిక్కని పొదరిండ్లనూ, వికసించిన రకరకాల కలువలలో, కమలాలలో మకరందం త్రాగి మైమరచిన తుమ్మెదల కమ్మని గానానికి మేలుకొన్న రాజహంసల విలాస విహారాలతో విరాజిల్లుతున్న సరోవరాలనూ విలోకించాడు.

క. మఱియును ఋష్యాశ్రమ వన, సరి దుపవన నద పుళింద జనపద గిరి గ
హ్వర గోష్ఠ యజ్ఞశాలా, పుర దేవాయతన పుణ్యభూముల యందున్. 38

* మునుల వనాలలో, నదీనదాలలో, ఉపవనాలలో, బోయపల్లెలలో, కొండగుహలలో, గోశాలల్లో, యాగశాలల్లో, పట్టణాలలో, దేవాలయాలలో, తీర్థస్థలాలలో తిరిగాడు.

క. కూరలుఁ గాయలు నీ ళ్ళా, హారముగాఁ గొనుచు నియమ మలవడఁగ నసం
స్కార శరీరుం డగుచు ను, దారత నవధూతవేషధరుఁడై వరుసన్. 39

* ఆ యా స్థలాలలో ఆకులు, దుంపలు, కూరగాయలు, నీళ్లు మాత్రమే ఆహారంగా తీసుకొంటూ నియమ సహితుడై, శరీరసంస్కార రహితుడై, ఔదార్యమహితుడైన విదురుడు పరివ్రాజక వేషధారియై సంచారం చేశాడు.

క. హర్షము గదురఁగ భారత, వర్షమునం గలుగు పుణ్యవరతీర్థము లు
త్కర్షం జూచుచు విగ తా, మర్షుండై సంచరించె మనుజవరేణ్యా! 40

వ. ఇట్లు సంచరించుచుఁ బ్రభాస తీర్థమ్మునకు వచ్చునపుడు 41

* ఈ విధంగా భారత దేశంలో గల ఉత్తమ పుణ్యతీర్థా లన్నింటినీ సంతోషాతిశయంతో సందర్శిస్తూ, రాగద్వేషాలు విడిచిన విదురుడు క్రమంగా ప్రభాసతీర్థం చేరాడు.

చ. అరుగుచు దైత్యభేదన దయాపరిలబ్ధ సమస్త మేదినీ
భరణధురంధరుం డగుచుఁ బాండుసుతాగ్రజుఁ డొప్పుచుండ న
త్తఱి విదురుండుఁ దత్సరి దుదంచిత సాల రసాల మాధవీ
కురవక మాలతీ వకుళ కుంజ లసత్తట మందు నున్నెడన్. 42

* సరిగా అదే సమయంలో శ్రీకృష్ణభగవానుని అనుగ్రహం వల్ల సంప్రాప్తమైన సామ్రాజ్యాన్ని పరిపాలిస్తున్నాడు ధర్మరాజు. ఆ విధంగా పాండవాగ్రజుడు సమస్త మహీమండలభారాన్ని వహిస్తున్న సమయంలో విదురుడు ఆ ప్రాంతానికి వచ్చాడు. అక్కడి మద్దిచెట్లూ, మామిడిచెట్లు; గురివెంద, ఎర్రగోరింట, మాలతి, పొగడ మొదలైన తరులతాదులతోకూడి వున్న నదీ తీరంలో విదురుడు నివసించాడు.

చ. నరవర! వేణుజానలవినష్ట మహాటవి మాడ్కిఁ బాండు భూ
వర! ధృతరాష్ట్ర సూను లనివార్య నిరూఢ విరోధ మెత్తి యొం
డొరుల జయింపఁ గోరి కదనోర్విఁ గురుక్షితిపాలముఖ్యు లం
దఱు మృతు లౌటయున్ విని ఘనంబుగ శోకనిమగ్నచిత్తుఁడై. 43

* పరీక్షిన్మహారాజా! అప్పుడు అతడికి కురుక్షేత్రసంగ్రామం సంగతి తెలిసింది. కౌరవులూ, పాండవులూ వారింప రాని వైరం పెంచుకొని ఘోరంగా పోరాడుకున్నారనీ, పరస్పర విజయోత్కంఠతో జరిగిన ఆ కురుక్షేత్ర మహాసంగ్రామంలో వెదురుపొదలలో ఉద్భవించిన దావాగ్నిలో దగ్ధమైన అరణ్యంలాగా దుర్యోధనాది కురుకుమార సమూహమంతా నశించారనీ విని విదురుడు పట్టరాని శోకంలో మునిగాడు.

ఉ. ఆ యెడఁ గాలు దన్నక రయంబున నేఁగి సరస్వతీనదీ
తోయములందుఁ గ్రుంకి మునితుల్యుఁడు వే చనియెం దనూనపా
త్తోయరుహాప్తభార్గవ పృథుత్రిత సోమ సుదాస శక్తి భృ
ద్వాయు యమాభిధానయుత వాహినులం దనురక్తిఁ గ్రుంకుచున్. 44

* అక్కడ ఉండడానికి విదురునకు కాలు నిలువలేదు. మునిసదృశుడైన విదురుడు వెంటనే బయలుదేరాడు. సరస్వతీ నదిలో స్నానంచేశాడు. అనంతరం అగ్ని, సూర్య, శుక్ర, పృథు, త్రిత, సోమ, సుదాస, కుమార, వాయు, యమ ఇత్యాది దేవతానామాలతో ప్రసిద్ధమైన పుణ్యతీర్థాలను ఆసక్తితో సేవించాడు.

ఉ. వెండియుఁ బుణ్యభూములఁ బవిత్రసరిత్తులఁ జూచుచున్ రమా
మండనుఁ డుండు దివ్యరుచిమన్మణి చారుకవాట గేహళీ
మండిత సౌధగోపుర విమానము లున్నత భక్తిఁ జూచుచున్
నిండిన వేడ్కఁ గృష్ణపద నీరజ చింతనుడై క్రమంబునన్. 45

* ఈ విధంగా విదురుడు పుణ్యస్థలాలనూ, పవిత్రనదీ తీర్థాలనూ సేవిస్తూ వెళ్ళి ఇందిరా వల్లభుడైన గోవిందుని మందిరాలై మహోజ్జ్వలాలైన మణులు పొదిగిన తలుపులతో, గడపలతో విరాజిల్లుతున్న విమానాలనూ, గోపురాలనూ, ఆలయాలనూ అత్యంత భక్తితో ఆలోకిస్తూ నందనందనుని పాదారవిందాలను స్మరిస్తూ ఎంతో సంతోషంతో ముందుకు సాగాడు.

## -: విదురుం డుద్ధవుం గని కృష్ణాదుల వృత్తాంతం బడుగుట :-

చ. చని చని తొంటి మత్స్య కురుజాంగలభూము లతిక్రమించి చ
య్యన యమునానదిం గదిసి యచ్చట భాగవతున్ సరోజ లో
చన దృఢభక్తు సద్గుణవిశారదు శాంతుని దేవమంత్రి శి
ష్యుని మహిత ప్రసిద్ధుఁ బరిశోషితదోషుఁ బ్రబుద్ధు నుద్ధవున్. 46

* అలాగా ముందుకువెళ్ళి మత్స్య, కురు, జాంగల భూములను అతిక్రమించి అనంతరం యమునా నదిని సమీపించాడు, ఆ నదీతీరంలో పరమభాగవతుడు, పుండరీకాక్షుని మీద అఖండమైన భక్తిగలవాడు. ఉత్తమగుణ సంపన్నుడు, శాంతుడు, రాజనీతిలో బృహస్పతి శిష్యుడు, విశాలయశో విరాజితుడు, దోషశూన్యుడు, ఉజ్జ్వలచైతన్యుడు అయిన ఉద్ధవుణ్ణి దర్శించాడు.

క. కని యనురాగ వికాసము, దన మనమునఁ దొంగలింపఁ దగ గాఢాలిం
గన మాచరించి నెయ్యం, బునఁ గుశల ప్రశ్న సేసి ముదమునఁ బలికెన్. 47

* ఉద్ధవుణ్ణి చూడగానే విదురుని హృదయంలో అనురాగం పొంగిపొరలింది. రెండుచేతులు చాచి గట్టిగా కౌగిలించు కున్నాడు. స్నేహం కొద్దీ కుశల ప్రశ్నలు కురిపించిన అనంతరం సంతోషంతో విదురుడు ఉద్ధవునితో ఇట్లా అన్నాడు.

క. హరిభక్తులు పుణ్యాత్ములు, దురితవిదూరులు విరోధిదుర్దమబలులుం
గురుకుల తిలకులు గుంతీ, వరసూనులు గుశలులే యవారిత భక్తిన్. 48

* వృష్ణికులోద్భవా! ఉద్ధవా! కృష్ణభక్తులూ, పవిత్రచరిత్రులూ, విరోధులకు నిరోధింపరాని వీరాధివీరులూ, కురుకు లాలంకారులూ అయిన కుంతీకుమారులు కుశలంగా వున్నారా?

చ. హరి దన నాభిపంకరుహమందు జనించిన యట్టి భారతీ
శ్వరుఁ డతిభక్తి వేఁడ యదువంశమునన్ బలకృష్ణమూర్తులై
పరఁగ జనించి భూభరముఁ బాపిన భవ్యులు రేవతీందిరా
వరు లట శూరసేనుని నివాసమునన్ సుఖ మున్నవారలే? 49

* తన నాభికమలం నుండి పుట్టిన బ్రహ్మదేవుడు పరమభక్తితో ప్రార్థింపగా శ్రీహరి బలరాముడుగా, కృష్ణుడుగా యదువంశంలో ఉదయించాడు. అట్లా పుట్టి భూభారాన్ని పోగొట్టిన మహోదయులు, రేవతీరుక్మిణీ హృదయప్రియులు రామకృష్ణులు తమ తాత గారైన శూరసేనుని గృహంలో సుఖంగా ఉన్నారా?

చ. కురుకులు లాదరింపఁగ సఖుండును నాప్తుఁడునై తనర్చి సో
దర తరుణీజనంబులను దత్పతులం గడు గారవంబునం
గరుణ దలిర్ప నాత్మజులకంటెఁ బ్రియోన్నతిఁ బ్రోచువాఁడు సు
స్థిరమతి నున్నవాఁడె వసుదేవుఁడు వృష్ణికుల ప్రదీపకా! 50

* యదువంశదీపకా! కురువంశీయులైన కౌరవులూ, పాండవులూ తన్నెంతో గౌరవింపగా, నెయ్యమై, వియ్యమై, తన అనుగు చెల్లెళ్లను వారిభర్తల్నీ ఎంతో ఆదరంగా ఆప్యాయంగా కన్నబిడ్డలకంటే మిన్నగా లాలించి పాలించే వసుదేవుడు ఆరోగ్యంగా ఉన్నాడా?

శా. కందర్పాంశమునం దనూజుఁ బడయం గామించి భూదేవతా
బృందంబున్ భజియించి తత్కరుణ దీపింపం బ్రభావంబు పెం
పొందన్ రుక్మిణి గన్న నందనుఁడు ప్రద్యుమ్నుండు భాస్వచ్చమూ
సందోహంబులు దన్నుఁ గొల్వ మహితోత్సాహంబునన్ మించునే. 51

* మన్మథుని అంశగల కుమారుణ్ణి పొందదలచి రుక్మిణీదేవి బ్రాహ్మణుల్ని పూజించింది, వారి అనుగ్రహం వల్ల అత్యంతమహిమోపేత అయిన రుక్మిణీమాత కడుపుచల్లగా కన్నసంతానం ప్రద్యుమ్నుడు సమస్త సేనాసమూహం తనను సంసేవిస్తూ ఉండగా ఉత్సాహంతో ఉన్నాడుగదా!

క. సరసిజలోచన కరుణా, పరిలబ్ధ సమస్త ధరణిపాలన మహిమం
బరమప్రీతి సుఖించునె, చిరవిభవోదారుఁ డుగ్రసేనుఁడు జగతిన్. 52

* కమలాక్షుని కరుణాకటాక్షం వల్ల సంప్రాప్తమైన సమస్త రాజ్యాన్నీ పాలిస్తున్న ఉగ్రసేనుడు సంప్రీతుడై, శాశ్వత వైభవోపేతుడై సుఖంగా ఉన్నాడా?

చ. లలిత పతివ్రతామణి విలాసవతీ తిలకంబు పార్వతీ
లలన గుమారుఁ గన్నటు సులక్షణ జాంబవతీ లలామ ని
ర్మలగతిఁ గన్న పట్టి సుకుమారత నుండు విరోధిభంజనో
త్కలిక సుఖించునే గుణకదంబుఁడు సాంబుడు వృష్ణిపుంగవా! 53

* పతివ్రతా శిరోమణీ, ఉత్తమ రమణీమణీ, సమస్త సద్గుణవతీ అయిన జాంబవతి, పార్వతీదేవి కుమారస్వామిని కన్నట్లు సాంబుని కన్నది. విరోధులను చీల్చి చెండాడే వీరాధివీరుడు, సుగుణాలవాలుడు- ఆ సాంబుడు క్షేమమేనా?

క. హరిపదసేవకుఁ డరి భీ, కరుఁ డర్జును వలన మిగులఁ గార్ముక విద్యల్
దిరముగఁ గఱచిన సాత్యకి, వరసుఖ విభవముల నున్నవాఁడె ధరిత్రిన్? 54

* హరిచరణ కింకరుడూ, అరిజన భయంకరుడూ, అర్జునుని దగ్గర చక్కగా విలువిద్య నేర్చుకొన్నవాడూ అయిన సాత్యకి అత్యంత సుఖవైభవాలతో అలరారుతున్నాడా?

మ. జలజాతాంకుశ చక్ర చాప కులిశ చ్ఛత్రాది రేఖాంకితో
జ్జ్వల గోవింద పదాబ్జ లక్షిత విరాజన్మార్గ ధూళిచ్ఛటా
కలితాంగుండు విధూతకల్మషుఁడు నిష్కామైక ధర్ముండు స
త్కులజాతుండన నొప్పునట్టి ఘనుఁ డక్రూరుండు భద్రాత్ముఁడే? 55

* గోవిందుని పాదాలు- పద్మం, అంకుశం, చక్రం, ధనుస్సు, వజ్రం, ఛత్రం మొదలైన శుభరేఖలతో ఒప్పు తుంటాయి. అటువంటి శ్రీపాదముద్రలు ప్రకాశించే త్రోవలలోని దుమ్ముతో క్రమ్మిన నెమ్మేనుతో, దురితదూరుడైన అక్రూరుడు ఆనందంగా ఉన్నాడా? నిష్కాముడూ, నిర్మల ధర్మపరుడూ, సద్వంశ సంజాతుడూ ఐన ఆ మహానుభావునికి క్షేమమే కదా?

క. శ్రుతులును గ్రతుజాతము స, మ్మతిఁ దాల్చినయట్టి వేదమాతగతిన్ శ్రీ
పతిఁ దన గర్భమ్మున ర, క్షితుఁ జేసిన గరిత దేవకీసతి సుఖమే. 56

* వేదాలనూ యజ్ఞాలనూ తనలో సాదరంగా దాచుకొన్న వేదమాతలా శ్రీమన్నారాయణుణ్ణి తన గర్భంలో ఆప్యాయంగా ధరించి కాపాడిన దొడ్డ ఇల్లాలు దేవకీదేవి సుఖంగా ఉందా?

వ. మఱియు మహాత్మా! మహితోపాసకు లగువారల కోర్కులు నిండింపంజాలిన భగవంతుండును. శబ్దశాస్త్రంబునకుం గారణంబని తన్ను నఖిలదేవతాజనంబు లగ్గింప గల మేటి యగుటంజేసి

**మనోమయుండును, సకలజీవ జతుర్విధాంతఃకరణంబు లయిన చిత్తాహంకారబుద్ధి మనంబులకుం గ్రమంబున వాసుదేవ- సంకర్షణ-ప్రద్యు-మ్నానిరుద్ధు లధిదైవతంబు లగుదు రట్టి చతుర్విధ తత్త్వంబులకుఁ దుర్యంబైన తత్త్వంబునునైన యనిరుద్ధకుమారుండు సంతోషచిత్తుం డగునే యని.57**

* మహాత్మా! అనిరుద్ధుడు- నిత్యం తన్ను భక్తితో సేవించేవారి కోరికలన్నీ నెరవేర్చగల భగవానుడు. శబ్దశాస్త్రానికి కారణమని సమస్త దేవతలూ కొనియాడే వాడు. మనోమయుడైనవాడు. అఖిల ప్రాణులకూ అంతఃకరణాలైన చిత్తం- అహంకారం-బుద్ధి- మనస్సుఅనే నాలుగింటికీ క్రమంగా వాసుదేవుడు-సంకర్షణుడు-ప్రద్యుమ్నుడు- అనిరుద్ధుడు అధిష్ఠాన దైవాలు. ఇలా మనస్సుకు అధిపతియైన ఆ అనిరుద్ధుడు ఆనందంగా ఉన్నాడా?

**మ. ఇతరారాధన మాని కృష్ణుఁ గమలాధీశుం బయోజాస నా**
**ర్చితు భక్తిన్ నిజనాథుఁగా సతతమున్ సేవించు పుణ్యుల్ జగ**
**న్నుతు లధ్యాత్మవిదుల్ మహాభుజులు మాన్యుల్ ధర్మమార్గుల్ సము**
**న్నతి సత్యాత్మజచారుధేష్ణగదు లానందాత్ములే యుద్ధవా! 58**

* ఓ ఉద్ధవా! తక్కిన పూజలన్నీ విడిచిపెట్టి, బ్రహ్మదేవునికికూడ పూజనీయుడూ, లక్ష్మీ వల్లభుడూ అయిన శ్రీకృష్ణుణ్ణి తమకు రక్షకుడుగా భావించి భక్తితో నిత్యం సేవించే ధన్యులూ, జగన్మాన్యులూ, అంతేకాక లోకంచే పొగడబడు వారూ, ఆధ్యాత్మిక విద్యావేత్తలూ, ధర్మమార్గంలో నడిచేవారూ అయిన సత్యభామానందనులు చారుధేష్ణగదులు సంతోషంగా ఉన్నారా?

**తే. క్రోధమాత్సర్యధనుఁడు సుయోధనుండు, వొలుచు నెవ్వనిసభఁ జూచి కలుష మొదవి**
**మనములోన నసూయానిమగ్నుఁ డయ్యె, నట్టి ధర్మజుఁ డున్నాఁడె యనఘచరిత! 59**

* ఓ పుణ్యాచరిత్రా! దేదీప్యమానమైన ఏ మహనీయుని మయసభను చూచి దుర్యోధనుడు క్రోధమాత్సర్యాలతో క్రుంగిపోయి మనస్సునిండా కల్మషం నింపుకొని, అంతులేని అసూయలో మునిగితేలాడో- ఆ ధర్మరాజు సుఖంగా ఉన్నాడా?

**తే. ఘనగదాభ్యాస చిత్ర సంగతుల మెఱసి, కురుకుమారుల భూరి సంగరము లోన**
**హతులఁ గావించి వెలసినయట్టి జెట్టి, వాయుతనయుండు గుశలియై వఱలునయ్య! 60**

* ఉద్ధతమైన గదాయుద్ధ కౌశలంతో కౌరవుల నందర్నీ రణరంగంలో మట్టుపెట్టిన జగజెట్టి వాయుదేవుని ముద్దులపట్టి భీముడు క్షేమంగా ఉన్నాడా?

**చ. హరికరుణాతరంగిత కటాక్ష నిరీక్షణ లబ్ధ శౌర్య వి**
**స్ఫురణఁ దనర్చి తన్ను నని బోయగతిన్ గిరిశుం డెదిర్చినన్**

బరవస మొప్పఁగా గెలిచి పాశుపతాస్త్రముఁ గొన్న శత్రు భీ
కరుఁడు ధనంజయుండు సుభగస్థితి మోదము నొందుచుండునే? 61

* కరుణాతరంగాలు పొంగిపొరలే కమలాక్షుని కటాక్షవీక్షణాలవల్ల ప్రాప్తించిన పరాక్రమాతిశయం కలవాడూ, మాయా కిరాతరూపంతో మహేశ్వరు నంతవాడు యుద్ధానికి సిద్ధమైనా తొడగొట్టి నిలిచి గెలిచి మెప్పించి పాశుపతాస్త్రం ఇప్పించుకొన్న మొనగాడూ, అరిభయంకరుడూ అయిన అర్జునుడు సుఖంగా సంతోషంగా ఉన్నాడా?

మ. తెఱఁగొప్పన్ జననీవియోగమునఁ గుంతీస్తన్యపానంబు సో
దర సంరక్షయుఁ గల్గి దేవవిభు వక్త్రస్థామృతంబుం ఖగే
శ్వరుఁ డర్థిం గయికొన్న మాడ్కిఁ గురువంశ శ్రేణి నిర్జించి త
ద్ధరణీరాజ్యముఁ గొన్న మాద్రికొడుకుల్ ధన్యాత్ములే? యుద్ధవా! 62

* విధివశంవల్ల తమకన్నతల్లి కన్నుమూయగా కుంతీదేవి చనుబాలు త్రాగుతూ, అన్నలచే రక్షింపబడినట్టివారూ, అమరేంద్రుని అధీనంలో ఉన్న అమృతాన్ని సంపాదించిన గరుత్మంతునిలా కౌరవుల నందరినీ నిర్జించి వారి రాజ్యాన్ని ఆర్జించినవారూ అయిన మాద్రీ నందనులు  నకులసహదేవులు కుశలంగా ఉన్నారా?

తే. పాండుభూమీశ్వరుండు సంప్రాప్తమరణుఁ, డైన శిశువులఁ బ్రోచుటకై నిజేశుఁ
గూడి చనకున్న యట్టి యా కుంతిభోజ, తనయ జీవించునే నేఁడు? మనుచరిత్ర! 63

* ఉదాత్తచరిత్రుడవైన ఉద్ధవా! ఆనాడు పాండురాజు మరణింపగా భర్తతో పాటు తానుకూడా సహగమనం చేయకుండా బిడ్డల మంచి చెడ్డలు చూడటంకోసం ప్రాణాలు బిగబట్టుకొని ఉన్నది కుంతీదేవి. ఆ తల్లి ఇప్పుడు క్షేమంగా జీవించి ఉన్నది కదా!

వ. అని వెండియు. 64

మ. అనుజాతుండగు పాండుభూవిభుఁడు నిర్యాణంబునం బొంద నా
తని పుత్రుల్ దనుఁజేర వచ్చినను మాధ్యస్థంబుఁ బోఁ దట్టి యె
గ్గొనరించెన్ ధృతరాష్ట్ర భూమివిభుఁ డట్లూహింపఁగా నెగ్గు సే
సిన వాఁడే యగుఁగాక మేలు గలదే చింతింపఁగా నుద్ధవా! 65

* అని మరల ఇలా అన్నాడు విదురుడు. తమ్ముడు పాండురాజు తనువు చాలించగా అతని కొడుకులు తన దగ్గరకు వచ్చినపుడు న్యాయం చేసేవానిలా వెన్నుదట్టి ఆశ్రయ మిచ్చి ఆపై కీడే చేశాడు ధృతరాష్ట్రుడు. వాస్తవానికి ఆ గ్రుడ్డిరాజు చెడ్డవాడేకానీ ఉద్ధవా! ఆయన సుఖంగా ఉన్నాడా?

క. అనుజుఁడు వీఁ డనకయ తన, తనయులు నను వెడల నడువఁదా నూరక యుం
డిన ధృతరాష్ట్రుఁడు నరకం, బునఁ బడు నాద్రైన దుఃఖమున ననఘాత్మా! 66

* ఓ పాపరహితుడవైన మహానుభావా! తుంటరులైన తన కొడుకులు నన్ను బయటికి గెంటిన సమయంలో తమ్ముడే అనికూడా అనుకోకుండా నోరుమూసుకొని ఊరకున్నాడు ధృతరాష్ట్రుడు. అతడు నాకు కలిగించిన దుఃఖం కారణంగా తప్పక నరకయాతన అనుభవిస్తాడు.

**వ. అదియునుం గాక పరమశాంతుండ వైన నీ మనంబున దుఃఖంబు గర్తవ్యంబు గాదంటేని. 67**

* "నీవేమో పరమశాంతుడవు. నీవు ఇలా దుఃఖపడటం సమంజసం కా"దని అంటావేమో!

**క. నరలోక విడంబనమున, హరి పరమపరుండు మానవాకృతితో ని**
**ద్ధరఁ బుట్టి యాత్మమాయా, స్ఫురణన్ మోహింపఁజేయు భూజనకోటిన్. 68**

* పరాత్పరుడైన హరి లీలామానవుడై ఈ లోకంలో పుట్టి తన మాయాప్రభావంతో మానవుల నందరినీ వ్యామోహంలో ముంచుతున్నాడు.

**ఉ. కావున నమ్మహాత్ముని వికార విదూరుని సర్వమోహ మా**
**యావిల మానసుండ నగు నప్పుడు సంసృతి దుఃఖి నౌదు న**
**ద్దేవుని సత్కృపామహిమఁ దేలిన వేళ సుఖింతు నేన కా**
**దా విధి శంకరప్రభృతు లవ్విభుమాయఁ దరింప నేర్తురే? 69**

* కాబట్టి, ఎట్టి వికారాలూ లేనివాడూ, మహాత్ముడూ అయిన ఆ శ్రీహరి మాయావ్యామోహాలకు నా మనస్సు లోనైనపుడు సంసార సంబంధమైన ఈ దుఃఖాలు అనుభవిస్తాను. అలాకాక ఆ దేవదేవుని అపారకృపారసం ప్రసరించిననాడు సుఖంగా ఉంటాను. నేనే కాదు, ఆ బ్రహ్మరుద్రాదులు కూడా ఆ పరాత్పరుని మాయాజాలం నుంచి తప్పించుకొని బయటపడలేరు.

**వ. అయిన నమ్మహాత్ముని కరుణాతరంగి తాపాంగ పరిలబ్ధ విజ్ఞాన దీపాంకుర నిరస్త సమస్త దోషాంధకారుండ నగుటంజేసి మదీయచిత్తంబు హరిపదాయత్తంబయిన కారణంబునను దత్త్వంబు సతతంబు నిరీక్షించుచు నుండుదు; మఱియును. 70**

* అయినా, కరుణారసం వెల్లివిరిస్తే ఆ మహానుభావుని కడగంటి చూపులద్వారా సంప్రాప్తమైన జ్ఞానదీపకళికవల్ల నా దోషాలనే చీకట్లన్నీ తొలగిపోయాయి. నా చిత్తం భగవంతుని పాదాలను హత్తుకున్నది. అందువల్ల ఆ పరతత్త్వం కోసమే నిరంతరం నిరీక్షిస్తూ ఉన్నాను.

**సీ. అట్టి సరోజాక్షుఁ డాత్మీయ పదభక్తు లడవుల నిడుమలఁ గుడుచుచుండ**
**దౌత్యంబుసేయఁ గొందఱు విరోధులు పట్టి బద్ధునిఁ జేయ సన్నద్ధులైన**
**బలహీనుమాడ్కి మార్పడలేఁడ యసమర్థుఁడని తలంచెదవేని నచ్యుతుండు**
**పరుల జయింప నోపక కాదు విద్యాభిజన ధనమత్తులై జగతిఁ బెక్కు**

**తే. బాధల నలంచు దుష్టభూపతుల నెల్ల, సైన్య యుక్తంబుగా నని సంహరించు**
**కొఱకు సభలోన నప్పు డా కురుకుమారు, లాడు దుర్భాషణములకు నలుగఁడయ్యె. 71**

* ఆ కమలాక్షుడు అనురక్తులైన తన భక్తులు అడవుల్లో అష్టకష్టాలు పడడం చూడలేక వారికోసం రాయబారం నడిపాడు. పగబట్టిన శత్రువులు కొందరు అతణ్ణి పట్టి కట్టివేయాలని గట్టి ప్రయత్నాలు చేశారు. అప్పుడు అచ్యుతుడు అశక్తునిలాగా వారిని వారించలేదు. అంతమాత్రం చేత అది ఆయన అసమర్థత అనుకోకూడదు. ఆయన వారిని జయింపలేక కాదు. విద్య-వంశం-ధనం- వీనివల్ల అహంకరించి లోకుల్ని పలుబాధలకు బలిచేస్తున్న పలుగాకులైన రాజుల్ని ససైన్యంగా సంగ్రామభూమిలో సంహరించాలనే సదుద్దేశంతోనే ఆనాటి సభలో కౌరవుల సూటిపోటు మాటలకు నొచ్చుకోలేదు. ఆగ్రహం తెచ్చుకోలేదు.

**మ. జననం బందుట లేని యీశ్వరుఁడు దా జన్మించు టెల్లన్ విరో**
**ధి నిరాసార్థము; వీతకర్ముఁడగు న ద్దేవుండు గర్మప్రవ**
**ర్తనుఁ డౌటెల్లఁ జరాచర ప్రకట భూత శ్రేణులం గర్మ వ**
**ర్తనులం జేయఁ దలంచికాక కలవే దైత్యారికిం గర్మముల్. 72**

* పుట్టుకలేని భగవంతుడు పుడుతున్నాడంటే- కేవలం శత్రువుల్ని అంతం చేయడానికే! కర్మలు లేని దేవుడు కర్మలు చేస్తున్నాడంటే చరాచర జీవకోటిని కర్మబద్ధుల్ని చేయడానికే! అంతేకాని, రాక్షసాంతకుడైన కమలాక్షునికి కర్మలంటూ ఉన్నాయా?

**క. హరి నరుల కెల్లఁ బూజ్యుఁడు, హరి లీలామనుజుఁడును గుణాతీతుఁడునై**
**పరఁగిన భవ కర్మంబులఁ, బొరయం డఁట; హరికిఁ గర్మములు లీల లగున్. 73**

* హరి నరులందరికీ పూజనీయుడు. ఆయన లీలామానుష విగ్రహుడు. గుణాలకు అతీతుడు. జన్మసంబంధమైన బంధాలు ఆయనకు లేవు. అవి కేవలం ఆ వాసుదేవునికి లీలావిలాసాలు మాత్రమే.

**క. మదిఁ దన శాసన మిడి నజ, పదములు సేవించు లోకపాలాదుల పెం**
**పొదవింప యదుకులంబున, నుదయించెను భువిని బలసహోదరుఁ డగుచున్. 74**

* తన అనుజ్ఞ తలదాల్చి తన పాదాల్ని సేవించి లోకపాలకులకు అభ్యుదయం కలిగించేందుకు భూలోకంలో యాదవ వంశంలో బలరామునికి తమ్ముడై శ్రీహరి జన్మించాడు.

**తే. చలన మందక భూరి సంసరణ తరణ, మైన సత్కీర్తి దిక్కుల నతిశయిల్లి**
**వఱల సమమతియై యున్నవాఁడె కృష్ణుఁ, డనుచు నుద్ధవుని విదురుఁ డడుగుటయును. 75**

* సంసారసాగరాన్ని తరింపజేస్తూ చెక్కుచెదరని యశోవైభవాన్ని దిక్కులంతటా నిండిస్తూ, అందరినీ సమబుద్ధితో ఆదరించే ఆ నందనందనుడు క్షేమంగా ఉన్నాడా! ఈ విధంగా విదురుడు ఉత్కంఠతో ఉద్ధవుణ్ణి అడిగాడు.

**వ. అట్టి యెడ న య్యుద్ధవుండు. 76**

క. యదుకులనిధి యగు కృష్ణుని, పద జలజ వియోగ తాప భరమున మాటల్
ప్రిదులక హృదయం బెరియఁగఁ, బెదవులు దడుపుచును వగలఁ బెంపఱియుండెన్. 77

* అప్పుడు యాదవకులానికి పెన్నిధి అయిన కృష్ణుని పాదపద్మాలకు, దూరమైన కారణంగా ఉద్ధవునికి దుఃఖం పొంగి వచ్చింది. నోటమాట రాలేదు. గుండె పగిలినట్లయింది. పెదవులు తడుపుకున్నాడు. శోకం వల్ల కాంతివిహీనుడైనాడు.

క. అని చెప్పి బాదరాయణి, మనుజేంద్రుని వలను సూచి మఱి యిట్లనియెన్
విను మొకనాఁ డీ యుద్ధవుఁ, డనయము నైదేండ్ల బాలుఁడై యున్న తఱిన్. 78

వ. మున్ను కృష్ణునిం గూడి యాడు బాలకులలో నొక్క బాలునిఁ గృష్ణునింగా భావించి పరిచర్య సేయుచుండ గుణవతీ మతల్లి యగు తల్లి సనుదెంచి "యాఁకొంటి; విదియేల రావన్న" యని పిలిచిన జననీ వాక్యంబులు గైకొనక యఖండతేజోనిధియైన పుండరీకాక్షు పాదారవింద మకరంద సేవానురక్తిం జేసి యున్న యుద్ధవుండు నేఁడు కృష్ణ వియోగతాపంబున హరివార్త విదురునకుఁ జెప్పజాలక యొప్పఱి యుండుట యేమి చిత్రంబని వెండియు నిట్లనియె; నంత నుద్ధవుండు సరోజాక్ష పాదారవింద మకరంద సుధాజలనిధి నిమగ్న మానసుండై సముత్కంఠం జింతించి యొక్క ముహూర్తమాత్రంబునకు బాష్పజల పూరితలోచనుండై గద్గదకంఠుం డగుచు. 79

* అని చెప్పి, శుకుడు పరీక్షిత్తును చూచి, ఇంకా ఇలా అన్నాడు. "రాజా! విను. చిన్నతనంలో ఈ ఉద్ధవుడు ఐదేండ్ల బాలుడై ఉండగా ఒకనాడు కృష్ణునితో కలసి ఆడుకుంటున్న ఆ బాలురందరిలో ఒక బాలుణ్ణి కృష్ణునిగానే భావిస్తూ సేవలు చేయసాగాడు. సుగుణాలవెల్లి అయిన అతని తల్లి అక్కడికి వచ్చి "నాయనా! ఆకలి గొన్నావు, అన్నానికి రా! ఇంకా ఆటలేమిట్రా" అని పిలిచింది. ఉద్ధవుడు తల్లి మాటలు వినిపించుకోలేదు. అనంత తేజస్సంపన్నుడగు పద్మాక్షుని పాదారవింద మకరంద మాధుర్యంలో మైమరచి అలాగే ఉన్నాడు. అటువంటి ఉద్ధవుడు నేడు కృష్ణుని ఎడబాటువల్ల ప్రాప్తించిన పరితాప భారంతో ఆ విషయాన్ని విదురునకు చెప్పలేక కుప్పగూలి పోవడంలో ఆశ్చర్యం ఏముంది" అని మళ్ళీ శుకుడు ఇట్లా అన్నాడు. అప్పుడు ఉద్ధవుని హృదయం శ్రీకృష్ణచరణారవింద మకరందాల పాలమున్నీటిలో మునిగి తేలింది. ఏదో తహ తహ పాటుతో ఒక్క క్షణంపాటు కన్నులు బాష్పాలతో నిండిపోయాయి. కంఠం గద్గద మయింది.

క. ఘనముగ నెమ్మనమున మిం, చిన కృష్ణవియోగ జనిత శిఖి దరికొనఁగాఁ
గనుఁగవఁ బెడచే నొత్తుచుఁ, బెనుపొందిన దురిత శిఖరిభిదురున్ విదురున్. 80

వ. కనుంగొని యిట్లనియె. 81

* శ్రీకృష్ణ వియోగంవల్ల కలిగిన శోకాగ్నికి చీకాకైన మనస్సుతో ఉద్ధవుడు ముంజేతులతో కన్నులు తుడుచుకుంటూ పాపాలు అనే పర్వతాలకు వజ్రాయుధం వంటివాడైన విదురుణ్ణి చూచి ఇలా అన్నాడు.

క. యముఁడను ఘనకాలభుజం, గమ పుంగవుఁ డెగచి పట్టఁగా యదువంశో
త్తముల చరిత్రలుఁ దత్కు,శ, లము లేమని చెప్పుదుం గలంగెడి మనమున్. 82

* యమధర్మరాజు అనే నల్లని నాగరాజు యదువంశాన్ని ఒడిసిపట్టి కాటువేశాడు. ఇప్పుడు యాదవ వంశీయుల వృత్తాంతమూ, వారి క్షేమమూ ఏమని చెప్పేది? నా మనస్సు కళవళ పడుతూవుంది.

సీ. మునిజన ముఖపద్మములు ముకుళింపంగ ఖలజన లోచనోత్పలము లలర
జార చోరుల కోర్కి సఫలత నొందంగ దానవదర్పాంధ తమస మడర
వర యోగి జన చక్రవాకంబు లడలంగఁ గలుషజనానురాగంబు పర్వ
భూరి దోషానల స్ఫూర్తి వాటిల్లంగ నుదిత ధర్మక్రియ లుడిగి యడఁగ

తే. మానుషాకార రుచికోటి మందపఱిచి, యనఘ! యే మన నేర్తుఁ గృష్ణాభిధాన
లోకబాంధవుఁ డుత్తమశ్లోకమూర్తి, మించు తేజంబుతో నస్తమించెనయ్య! 83

* పుణ్యమూర్తీ! విదురా! నోటమాట పెగలటం లేదు. లోకబాంధవుడూ, ఉత్తమశ్లోకుడూ, మహాతేజస్వీ అయిన శ్రీకృష్ణుడనే సూర్యుడు అస్తమించాడయ్యా! ఇంకేమున్నది! మునీంద్రుల ముఖకమలాలు ముకుళితాలయినాయి. కలుషాత్ముల కనుగలువలు విప్పారాయి. జారచోరుల కోరికలు ఫలించాయి. రాక్షసుల గర్వాంధకారాలు నలుదిశలా వ్యాపించాయి. పరమ యోగులనే చక్రవాకాలు శోకించాయి. దురితమనే సంధ్యారాగాలు చెలరేగాయి. దోషాభిధానయైన రాత్రి విజృంభించింది. ధర్మకృత్యాలకు ప్రత్యవాయం ఏర్పడింది. మానవుల తేజస్సులు మందగించాయి.

వ. మఱియును. 84

క. హల కులిశ జలజరేఖా, లలిత శ్రీకృష్ణ పాదలక్షితయై ని
ర్మలగతి నొప్పెడు ధరణీ, లలనామణి నేఁడభాగ్యలక్షణ యయ్యెన్. 85

* అంతేకాదు; హలమూ, వజ్రమూ, పద్మమూ మొదలైన రేఖలతో అందమైన నందనందనుని అడగుముద్రలతో స్వచ్ఛంగా సలక్షణంగా ప్రకాశించే భూదేవి ఈనాడు దౌర్భాగ్యలక్షణాలు కలది అయింది.

క. యాదవుల వలన రాజ్య, శ్రీ దొలఁగెను; ధర్మగతి నశించెను; భువి మ
ర్యాదలు దప్పె నధర్మో, త్పాదనమున; దైత్యభేది దప్పిన పిదపన్. 86

* దానవాంతకుడైన శ్రీకృష్ణుడు కనుమరుగు కావడంతో యాదవుల రాజ్యవైభవం మాయమయింది. ధర్మమార్గం నశించింది. అధర్మం అతిశయించింది. లోకంలో మర్యాదలు లేకుండా పోయాయి.

వ. మఱియు లలిత నికషణ విరాజమాన మణిగణ కిరణ సుషమా విశేష విడంబిత విమల సలిలంబులందుఁ బ్రతిఫలిత సంపూర్ణ చంద్రమండల రుచి నిరీక్షించి జలచర బుద్ధిం జేసి తజ్జల విలోలమీనంబు లనూన స్నేహంబునం దలంచు చందంబునఁ గృష్ణానుచరులైన యదు వృష్టికుమారు లమ్మహనీయ మూర్తిం దమకు నగ్రేసరుం డని కాని లీలామానుష విగ్రహుండైన పరమాత్ముండని

**యెఱుంగక హరిమాయా జనితంబగు నసద్భావంబునం జేసి భోజన శయనాసనానుగమనంబులం జేరి సహోదరాది భావంబులం గూడి చరియింతు; రద్దేవుని ఆయా పయోనిధి నిమగ్నులు గాకుండ నబ్జభవాదులకైనం దీఱదు. సర్వగుణ గరిష్ఠులును, సత్పురుష శ్రేష్ఠులును నగు పరమభాగవతులకుం దక్కఁ దక్కినవారలకుం జెప్పనేల? అదియునుంగాక యభిజన విద్యాధన బలగర్వ మదాంధీభూత చేతస్కులైన శిశుపాలాది భూపాలకు లమ్మహాత్మునిం బరతత్త్వంబని యెఱుంగక నిందించు దుర్భాషలు దలంచి మనస్తాపంబు నొందుచుండుదు నని వెండియు. 87**

* అంతేకాకుండా- చక్కగా సానపట్టటం వల్ల ఎక్కువగా ప్రకాశించే మణిసమూహాల మనోజ్ఞ కాంతిరేఖలవలె తళతళ మెరిసే స్వచ్ఛమైన జలాల్లో ప్రతిబింబించిన పరిపూర్ణ చంద్రమండల కాంతిని చూచి ఏదో జలచరమని భ్రాంతిపడి ఆ నీటిలో తిరిగే చేపలు దానిచుట్టూ తిరుగుతూ సాటిలేని చనువునూ, స్నేహాన్నీ ప్రకటిస్తాయి. అదేవిధంగా కృష్ణుని వెంట తిరిగే యదువృష్ణి కుమారులు ఆ మహానుభావుని తమకు అగ్రనాయకుడని మాత్రము భావించేవారుకాని లీలావిలాసార్థం మానవరూపం ధరించిన పరాత్పరుడని తెలుసుకోలేక, శ్రీహరిమాయామోహితులై ఆయనతోపాటు భుజిస్తూ, శయనిస్తూ, కలసికూర్చుంటూ, వెంట తిరుగుతూ తమతోబుట్టువు, చుట్టం ఇత్యాది భావాలతో ప్రవర్తించేవారు. ఆ దేవాదిదేవుని మాయాసముద్రంలో మునిగి పోకుండా ఉండేందుకు బ్రహ్మాదులకు కూడా సాధ్యం కాదు. అన్ని గుణాల్లోనూ మిన్నయైన వారూ, ఉత్తమ పురుషుల్లో అగ్రేసరులూ అయిన భాగవతోత్తములమాట అటుంచితే ఇక మిగిలిన వారి విషయం చెప్పడం ఎందుకు? కులం-విద్య-ధనం-బలం-వీటివల్ల విర్రవీగుతూ గర్వాంధకారంతో మసక బారిన మనస్సులతో శిశుపాలుడు మొదలైన మహీపతులు ఆ మహానుభావుణ్ణి దేవదేవుణ్ణిగా తెలుసుకోలేక పలికిన దుర్భాషలు, నిందావాక్యాలు తలుచుకుంటే నా మనస్సు క్షోభించిపోతూ ఉంటుంది.

**మ. అవితృప్తేక్షణధీ సమాహిత తపోవ్యాసంగు లైనట్టి భా**
**గవత శ్రేష్ఠుల కాత్మమూర్తి నిఖిలైక జ్యోతియైఁ జూపి శో**
**క విశోకంబులు నిర్దహించి కమలాకాంతుండు శాంతుండు మా**
**నవ రూపంబగు దేహమున్ వదలి యంతర్ధానుఁ డయ్యెం జుమీ. 88**

* తనివి తీరక తన్ను చూచేవారికీ, బుద్ధియోగంతో తన్ను తెలుసుకోగోరినట్టి వారికీ, తన్ను గూర్చి తపస్సుచేసి భాగవతధర్మం అవలంబించినవారికీ, సమస్తసృష్టిలో తన్నే దర్శించే భక్తులకూ తన అఖండ జ్యోతి స్వరూపం చూపించి వారి జంజాటాలూ, దుఃఖాలూ పోగొట్టి ప్రశాంత సాక్షాత్కారం ప్రసాదించి లక్ష్మీవల్లభుడైన శ్రీకృష్ణుడు తన అవతారం చాలించి అంతర్హితు డయ్యాడు!

**సీ. మానవైక వికాసమానమై తనకును విస్మయజనకమై వెలయునట్టి**
**యాత్మీయ యోగమాయాశక్తిఁ జేపట్టి చూపుచు నత్యంత సుభగ మగుచు**
**భూషణంబులకును భూషణంబై వివేకముల కెల్లను బరాకాష్ఠ యగుచు**
**సకల కల్యాణ సంస్థానమై సత్యమై తేజరిల్లెడునట్టి దివ్యమూర్తి**

**తే. తాన తనమూర్తి నిజశక్తిఁ దగ ధరింప, యమతనూభవు రాజసూయాధ్వరంబు**
**నందు నెవ్వని శుభమూర్తి నర్థితోడ, నిండు వేడుకఁజూచి వర్ణించి రెలమి. 89**

* మానవులకు మహాభ్యుదయానికి అవధియై, తనకు కూడా ఆశ్చర్యాన్ని కల్గించే తనయోగ మాయాబలాన్ని స్వీకరించి ప్రకటీకరించుచు, మిక్కిలి సుందరమై అలంకారాలకే అలంకారమై, జ్ఞానానికి పెన్నిధానమై, సకల శుభాలకూ సన్నిధానమై, సత్యమై, నిత్యమై దీపించే ఆ దివ్యమంగళమూర్తి తన ఆకారాన్ని తనశక్తివల్ల తానే ధరించాడు. ధర్మరాజుని రాజసూయ యాగంలో మూర్తీభవించిన ఆనందనందనుని సౌందర్యాన్ని ఎంతో ఆనందంతో అందరూ సందర్శించారు. ఎంతో సంతోషంతో అభివర్ణించారు.

**క. ప్రకటముగఁ గమలభవ సృ, ష్టికిఁ గారణ మి మ్మహాత్ముఁడే యనుచును ను**
**త్సుకులై తన్మూర్తినిఁ ద, ప్పక చూచిరి గాదె తత్సభాజను లెల్లన్. 90**

* ఆనాడు ఆ సభలోని వారంతా "బ్రహ్మసృష్టికి కూడా మూలకారణం ఈ మహానుభావుడే" అని ఉత్సాహంతో ఆయన దివ్య మంగళ స్వరూపాన్ని తదేకధ్యానంతో రెప్పవాల్చకుండా చూచారు కదా!

**వ. మఱియు శాంతోగ్రరూపధరుండైన సర్వేశ్వరుండు శాంతరూపుండు గావునఁ బరకృతాపరాధ నిపీడ్యమాన మానసుండయ్యు ననుకంపాయత్త చిత్తుండై వర్తించు పరాపరుండును బ్రకృతికార్యం బైన మహత్త్వరూపుండును జననవిరహితుం డయ్యును దారువులవలన ననలంబు దోఁచు చందంబున జననంబు నందుచుండు నట్టి సరోజనాభుని హాసరాస లీలానురాగ విలోకన ప్రతిలబ్ధమానలైన గోప కామినులు తన్మూర్తి దర్శనానుషక్త మనీషలం గలిగి వర్తించి రదియునుంగాక. 91**

* శ్రీకృష్ణుడు వారి వారి స్వభావాలను అనుసరించి కొందరికి శాంతస్వరూపుడుగానూ, మరికొందరికి భయంకర స్వరూపుడుగాను కనిపించుతాడు. ఆ సర్వేశ్వరుడు సహజంగా శాంత స్వభావుడు. అందువలన ఇతరులు తనకు చేసిన అపరాధాలకు ఆయన మనస్సు ఎంతో బాధపడుతున్నా వారియందు వాత్సల్యపరిపూర్ణమైన బుద్ధితోనే వర్తిస్తూ ఉంటాడు. ఆ పరాత్పరుడు ప్రకృతి కార్యమైన మహత్తత్త్వమే స్వరూపంగా కలవాడు. పుట్టుక లేనివాడైనా కట్టెలలోనుండి అగ్ని పుట్టు నట్లుగా ఆవిర్భవిస్తూ ఉంటాడు. అటువంటి శ్రీకృష్ణుని చిరునవ్వులకూ, రాసక్రీడలకూ, ప్రేమావలోకనాలకూ తహతహలాడు తున్న వ్రేపల్లెలోని గొల్లభామలంతా ఆయన దివ్యసౌందర్య సందర్శనంలో పరవశమైన భావాలతో ప్రవర్తించారు. సరే ఈ సంగతి ఇలా ఉంచు.

**చ. దివిజుల కోర్కిఁ దీర్ప వసుదేవుని యింట జనించి కంస దా**
**నవుఁడు వధించునన్ భయమునం జని నందుని యింట నుంటకున్**
**యవన జరాసుతాదులకు నాజి నెదుర్పడలేక సజ్జన**
**స్తవ మథురాపురిన్ విడిచి దాఁగుటకున్ మదిఁ జింతనొందుదున్. 92**

* అంతటి మహానుభావుడు దేవతల కోర్కె తీర్చడానికై వసుదేవుని ఇంట్లో జన్మించి నృశంసుడైన కంసుడు హింసిస్తాడేమో అనే భయంతో వెళ్ళి, నందుని ఇంట్లో చాటుమాటుగా పెరగటమూ-

కాలయవనుడూ, జరాసంధుడూ మొదలైన వాళ్ళను కదనరంగంలో ఎదిరించకుండా తప్పుకొని సజ్జనస్తవనీయమైన మథురాపట్టణాన్ని కూడా వదలిపెట్టి ఎక్కడో దాక్కోటమూ- ఈ రెండు సన్నివేశాలను స్మరించినపుడు నా మనస్సు దుఃఖంతో కుమిలి పోతుంది.

వ. అదియునుంగాక. 93

సీ. కడఁగి పెక్కేడుములఁ గుడుచుచుఁ జిత్తముల్ గలఁగఁగ బంధనాగారములను
వనరిన దేవకీవసుదేవులను డాయఁ జనుదెంచి భక్తి వందన మొనర్చి
తలిదండ్రులార! యేఁ గలుగంగ మీరలు కంసుని నలజడి గ్రాఁగుచుండఁ
గడఁగి శత్రునిఁ జంపఁగా లేక చూచుచు నున్న నా తప్పుఁ బ్రసన్ను లగుచుఁ

తే. గావుఁడని యానతిచ్చిన దేవదేవు, నద్భుతావహమధుర వాక్యములఁ దలఁచి
తలఁచి నా చిత్తమునఁ బెద్ద గలఁగుచుందుఁ, బృథులపాతక భూమిభృద్భిదుర! విదుర! 94

* ఇంతేకాదు, కొండలను వజ్రాయుధం చెండాడినట్లు ప్రచండమైన పాపాలను పటాపంచలు చేసే ఓ విదురా! ఇది విను. గుండెనిబ్బరంతో ఎన్నోకష్టాలు అనుభవిస్తూ మనస్సంతా అల్లకల్లోలమవుతూ చిరకాలం చెరసాలలో బాధపడ్డారు దేవకీ వసుదేవులు. వారి దగ్గరకు వెళ్ళి కృష్ణుడు భక్తితో నమస్కారం చేసి "జననీజనకులారా! నేనుండగా మీరిద్దరూ కంసుని క్రూరకృత్యాలకు గురికావలసి వచ్చింది. ఆ దుర్మార్గుణ్ణి తుదముట్టించకుండా చూస్తూ ఉపేక్షించిన నా అపరాధాన్ని కృపతో క్షమించండి'' అని విన్నవించుకొన్నాడు. ఆ దేవదేవుని అద్భుతమైన ఆ మృదుమధుర వచనాలను పదేపదే స్మరించి నాహృదయం ఎంతో వ్యథపడుతూ ఉంటుందయ్యా!

క. విమలమతిఁ దలఁప నెవ్వని, బొమముడి మాత్రమున నిఖిల భూదేవీ భా
రము వాయు నట్టి హరిపద, కమల మరందంబు గ్రోలు ఘనుఁడెవ్వాఁడో? 95

* వాస్తవానికి ఆయన కనుబొమలు ఒక్కమాటు ముడిపడితే చాలు; దుష్టశిక్షణ జరిగి భూభారమంతా తొలగి పోతుంది. అటువంటి ఆదిదేవుని పాదపద్మ మకరందాన్ని ఆస్వాదించే అదృష్టం పట్టిన మహాత్ముడే గదా ధన్యాత్ముడు!

క. మందప్రజ్ఞుఁడనై గో, విందుని మురదైత్యహరునిఁ విష్ణునిఁ బరమా
నందుని నందతనూజుని, మందరధరుఁ జిత్తమందు మఱతునె యెందున్. 96

* ఆ గోవిందుణ్ణి, ఆ మురాంతకుణ్ణి, ఆ విష్ణుస్వరూపుణ్ణి, ఆ ఆనందమయుణ్ణి, ఆ నందనందనుణ్ణి, ఆ మందరగిరి ధరుణ్ణి ఎక్కడైనా ఎప్పుడైనా మరచిపోయేటంత మందబుద్ధినా నేను!

చ. అదియునుగాక మీరు నృపులందఱుఁ జూడఁగ ధర్మసూతి పెం
పొదవిన రాజసూయ సవనోత్సవ మందును జన్మమాదిగాఁ

**బదపడి యెగ్గొనర్చు శిశుపాలుఁడు యోగిజనంబు లిట్టి ద**
**ట్టి దని యెఱుంగ నోపని కడిందిపదంబును బొందెనే కదా!** 97

* మరొక్కమాట. తాను పుట్టినప్పటినుండి పనిగట్టుకొని ఎన్నో ఎగ్గులు చేసినవాడేకదా శిశుపాలుడు. అటువంటి శిశుపాలుడు మీరందరూ చూస్తుండగా, సమస్తరాజులూ చూస్తూ ఉండగా ధర్మరాజు సర్వోత్తమంగా నిర్వహించిన రాజసూయ మహోత్సవంలో మహాయోగీంద్రుల మనస్సులకుకూడా అగమ్యగోచరమైన పరమపదాన్ని అందుకున్నాడుగదా!

**చ. కురునృప పాండు నందను లకుంఠితకేళిఁ జమూ సమేతులై**
**యరిగి రణోర్వి నెవ్వని ముఖాంబురుహామృత మాత్మలోచనో**
**త్కరములఁ గ్రోలి పార్థ విశిఖప్రకర క్షత పూతగాత్రులై**
**గురుతర మోక్షధామమునకుం జని సౌఖ్యము నొందిరో గదా!** 98

* కౌరవులూ, పాండవులూ మొక్కపోని మగటిమితో, లెక్కలేని సైన్యాలతో కదనభూమికి కదలిపోయారు. అక్కడ రణవీరులు శ్రీకృష్ణుని ముఖారవిందాన్ని సందర్శిస్తూ, ఆ సౌందర్య మధురసాన్ని త్రాగుతూ కిరీటి శరాఘాతాలకు క్షతగాత్రులై పరమపవిత్రులై మహోన్నతమైన మోక్షాన్ని పొంది ఆనందించారు గదా!

**సీ. అట్టి సరోజాక్షుఁ డాద్యంత శూన్యుండు సుభగుండు త్రైలోక్య సుందరుండు**
**కమనీయ సాగర కన్యకా కుచకుంకు మాంకిత విపుల బాహాంతరుండు**
**సకల దిక్పాల భాస్వత్కిరీటన్యస్త పద్మరాగారుణ పాదపీఠుఁ**
**డజుఁ డనంతుఁడు సమానాధిక విరహితుం డిద్ధమూర్తి త్రయాధీశ్వరుండు**

**తే. నైన హరి యుగ్రసేనుని నఖిలరాజ్య, రుచిర సింహాసనమునఁ గూర్చుండఁబెట్టి**
**భృత్యభావంబు నొంది సంప్రీతి నతని, పనుపుసేయుట కెపుడు నా మనము గుందు.** 99

* అటువంటి అరవిందాక్షుడు, ఆద్యంతరహితుడు, అత్యంత సుందరుడు, త్రిజగన్మనోహరుడు, అందాలు చిందే ఇందిరాదేవి చందోయి కుంకుమగుర్తులు హత్తుకొన్న విశాలవక్షఃస్థలం కలవాడు, సకల దిక్పాలకుల ధగధగ మెరిసే బంగారు కిరీటాలలోని పద్మరాగాల కాంతులతో ఎర్రనైన పాదపీఠం కలవాడు, పుట్టడం గిట్టడం లేనివాడు, సాటిలేని వాడు, తనకంటె మేటి లేనివాడు, బ్రహ్మ విష్ణు మహేశ్వరులకు అధీశ్వరుడు అయిన శ్రీకృష్ణుడు- కంసుని తండ్రి అయిన ఉగ్రసేనుణ్ణి సర్వరాజ్యానికి పట్టంగట్టి సింహాసనం మీద కూర్చోబెట్టి తాను వానికి భృత్యుడై అతని ఆజ్ఞల్ని ఆనందంతో తలదాల్చటం తలచుకుంటే నామనస్సు ఎప్పుడూ ఎంతో సంతాపపడుతూ ఉంటుంది.

**వ. అని వెండియు నిట్లనియెః ననఘా! పరాత్పరుండును యోగేశ్వరేశ్వరుండును నగు కృష్ణుండు భగవద్భక్తుండును బరమభాగవతోత్తముండును నైన యుగ్రసేనుని సేవించుట యాశ్చర్యంబుకాదు;**

తన్ను హరియింపఁదలంచి కుచంబుల విషంబు ధరియించి స్తన్యపానంబు సేయించిన దుష్టచేతన యైన పూతనకుం జన్నిచ్చి పెంచిన యశోదాదేవికి నైన నందరాని పదంబు గారుణ్యాయత్తచిత్తుండై యొసంగె ననిన నిజపద ధ్యానపరాయణు లగు వారల ననుసరించి సేవించుట సెప్పనేల? యనిన నుద్ధవునికి విదురుం డిట్లనియె; భక్తవత్సలుండును గారుణ్యజలనిధియునై భాగవత జనుల ననుగ్రహించు పుండరీకాక్షుండు నిజదాస లోకంబున కొసంగు పరమపదంబు నుగ్రకర్ములైన రాక్షసుల కెట్లొసంగె నత్తెఱం గెఱింగింపు మనిన విదురునకు నుద్ధవుం డిట్లనియె. 100

* అని మళ్ళీ ఇట్లా అన్నాడు ఉద్ధవుడు. ఓ పుణ్యుడా! పరాత్పరుడూ, పరమ యోగీశ్వరుడూ, అయిన శ్రీకృష్ణుడు- దైవభక్తుడు, ఉత్తమ భాగవతుడు అయిన ఉగ్రసేనుణ్ణి సేవించడం ఏమంత ఆశ్చర్యంగా లేదు; కాని తనను చంపాలని, చన్నులకు విషం పూసుకొని వచ్చి పాలిచ్చిన పరమపాతకురాలు పూతనకు మోక్షం ఇచ్చాడంటే- చన్నిచ్చి పెంచిన యశోదమ్మకు సైతం అతీతమైన పరమపదాన్ని కరుణార్ద్రహృదయంతో ఆఘాతుకురాలికి ప్రసాదించాడంటే- ఇక నిజ పాదాల్ని నిరంతరం భావించే వారిని అంటిపెట్టుకొని సేవించటంలో విశేష మేమున్నది?

ఈ విధంగా పల్కిన ఉద్ధవునితో విదురుడు ఇట్లా అన్నాడు. "భక్తులపై వాత్సల్యం కలవాడూ, కరుణా సాగరుడూ, భాగవతులను పరిరక్షించే కమలాక్షుడు, తన అనుచరులకు ప్రసాదించే పరమపదాన్ని ఘోరకృత్యాలు చేసే క్రూర రాక్షసులకు ఎట్లా ఇచ్చాడు? ఆ కథంతా సవిస్తరంగా నాకు చెప్పు".

ఈ ప్రకారంగా అడిగిన విదురుణ్ణి చూచి ఉద్ధవుడు ఇట్లా అన్నాడు:

మ. దనుజానీక మనేక వారములు దోర్దర్పంబు సంధిల్లఁగా
వినతాసూను భుజావరోహుఁడగు నవ్విష్ణున్ సునాభాస్త్రుఁ దా
రనిలో మార్కొని పోకు పోకు హరి! దైత్యారాతి యంచుం దదా
ననముం జూచుచుఁ గూలి మోక్షపదమున్ బ్రాపింతు రత్యున్నతిన్. 101

* గరుడ వాహనారూఢుడూ, సుదర్శన చక్రధరుడూ అయిన శ్రీమన్నారాయణుని ఎందరో రాక్షసులు ఎన్నో పర్యాయాలు అవక్రభుజ పరాక్రమంతో కదనరంగంలో ఎదుర్కొన్నారు. "ఓరీ హరీ! అసురవైరీ! ఆగు! పారిపోకు! నిలు" అని ఆయన నామాన్నే అంటూ, ఆయన ముఖాన్నే కనుగొంటూ రణరంగంలో నేలగూలిన వారై ఆ రాక్షసులు మోక్షసామ్రాజ్యాన్ని చూరగొని అత్యున్నతమైన స్థానాన్ని పొందారు.

క. ధీరజనోత్తమ! నవ సిత, సారసలోచనుఁడు కృష్ణు జననంబును ద
చ్చారిత్రము నెఱిఁగింతు ను,దారత నీ విపుడు వినుము తద్విధ మెల్లన్. 102

* ధీరవరేణ్యా! నిగనిగలాడే తెల్లని క్రొందామరరేకులవంటి కందోయి కల ఆ నందకుమారుని జన్మవృత్తాంతాన్నీ, ఆయన లీలా విశేషాలనూ నీకు తెటతెల్లంగా వెల్లడిస్తాను. నీవు ఏకాగ్ర చిత్తంతో ఆకర్ణించు.

**చ. ధరణిభరంబుఁ బాపుటకుఁ దామరసాసను ప్రార్థనన్ రమా**
**వరుఁ డల కంసబంధన నివాసమునన్ వసుదేవదేవకీ**
**వరులకు నుద్భవింప బలవంతుఁడు కంసుఁడు హింస సేయు న**
**న్వెఱపున నర్ధరాత్రి సుతునిం గొని యవ్వసుదేవుఁ డిమ్ములన్. 103**

* పుట్టుక ఎరుగని ఆ శ్రియఃపతి భూభారాన్ని పోగొట్టడానికి బ్రహ్మదేవుని ప్రార్థన మన్నించి కంసుని కారాగారంలో దేవకీ వసుదేవులకు పుత్రుడై పుట్టారు. తన ముద్దుల కుమారుణ్ణి నృశంసుడైన కంసుడు హింసిస్తాడేమో అనే భయం కలిగింది వసుదేవుడికి. వెంటనే వసుదేవుడు ఆ నిసిరేయి పసివాణ్ణి చేతుల్లోకి తీసుకుని బయలుదేరాడు.

**క. నందుని మందకుఁ జని త, త్సుందరి తల్పమునఁ బరులు సూడకయుండన్**
**నందనుని నునిచి యానక,దుందుభి మఱలంగ నేఁగెఁ దొల్లిటి పురికిన్. 104**

* నందుడున్న వ్రేపల్లెకు వెళ్ళాడు. ఎవ్వరూ చూడకుండా నందుని భార్య యశోద పక్కలో బాలుణ్ణి పడుకోబెట్టాడు. తిరిగి మధురా నగరం లోని తన కారాగారానికి వచ్చాడు.

**క. హరి యేకాదశ సంవ, త్సరములు నందవ్రజమునఁ దను హరి యని యె**
**వ్వరు నెఱుఁగకుండ నా హల, ధరుతోఁ గ్రీడించుచుండెఁ దద్దయుఁ బ్రీతిన్. 105**

* నంద గోకులంలో బాలముకుందుడు నందనందనుడు అన్న బలరామునితో కలిసి ఆనందంగా ఆడుకుంటున్నాడు. ఇలా పదకొండు సంవత్సరాలు గడిచాయి. ఆయన్ని శ్రీహరి అవతారమని ఎవరూ గుర్తించలేదు.

**క. గోపాల వరుల కైనను, నాపోవఁగఁ దన సమంచితాకార మొగిం**
**జూపని శ్రీపతి వేడుక, గోపాలురఁ గూడి కాచె గోవత్సములన్. 106**

* కొమ్ములు తిరిగిన దేవతలకు సైతం కన్నుల విందుగా తన దివ్యస్వరూపాన్ని చూపించని రమాపతి తోడి గొల్ల పిల్లల్తోకూడి ఆడుతూ ఎంతో వేడుకగా ఆవుల్నీ దూడల్ని కాచాడు.

**వ. అయ్యవసరంబునం గృష్ణుండు లీలావినోదంబులు దోడి గోపాలబాలురకుం జూపం దలంచి. 107**

* ఆ సమయంలో శ్రీకృష్ణుడు తనతో ఉండే గోపాలబాలురకు తన లీలలూ వినోదాలూ చూపించాలనుకున్నాడు.

**చ. వరయమునా నదీ సలిల వర్ధిత సౌరభయుక్తపుష్ప మే**
**దుర మకరంద పాన పరితుష్ట మధువ్రత యూథ మాధవీ**
**కురవక కుంద చందన నికుంజములందు మయూర శారికా**
**పరభృత రాజకీరమృదుభాషలభంగిఁ జెలంగి పల్కుచున్. 108**

* ఆ బాలగోపాలుడు నిర్మలాలైన యమునానదీ జలాలతో పెరిగి పెద్దవైనవీ, గుమగుమలాడే పూలనిండా చిందుతున్న మకరందాన్ని కడుపునిండా త్రాగి మైమరచిన తుమ్మెదల గుంపులతో కూడినవీ అయిన మాధవీ మంటపాలలో- గోరింట గుబురులలో- మొల్లపొదలలో- మంచిగంధపు నికుంజాలలో దూరి- నెమలిలాగా కేకలు వేస్తూ, గోరువంకలాగా కూతలు కూస్తూ, కోకిలలాగా రాగాలు తీస్తూ? రామచిలుకలాగా రమణీయధ్వనులు చేస్తూ ఉండేవాడు.

**ఉ. శ్రీరమణీ మనోవిభుఁడు సింహ కిశోరముఁ బోలి లీలఁ గౌ**
**మారదశన్ రమా విమల మందిరముం బురుడించు గోతతిన్**
**వారక మేపు చుండెఁ దన వంశ రవస్ఫుట మాధురీ సుధా**
**సారముచేత గోపజన సంఘములన్ ముదమందఁ జేయుచున్. 109**

* ఇందిరా వల్లభుడైన ఆ నందకుమారుడు తన కుమారదశలో సింహకిశోరంలాగా ప్రకాశించాడు. లీలగా పిల్లన గ్రోవిని మ్రోగిస్తూ ఆ మధురగాన సుధా సరస్సులో గోగోపబృందాన్ని ముంచి తేల్చి పరవశింపజేస్తూ లక్ష్మీనివాసాలైన గోవుల్ని మేపుతూ ఉండేవాడు.

**వ. మఱియును. 110**

**మ. చిరకేళీరతి బాలకుల్ తృణములన్ సింహాది రూపంబులం**
**గరమొప్పన్ విరచించి వాని మరలన్ ఖండించు చందంబునం**
**గరుణాతీతులఁ గామరూపు లగు నక్కంసప్రయుక్తక్షపా**
**చరులం గృష్ణుఁడు సంగరస్థలములం జక్కాడె లీలాగతిన్. 111**

* చిన్న పిల్లలు ఆడుకోటానికి - గడ్డితో సింహం మొదలైన బొమ్మల్ని తయారుచేస్తారు. ఆట పూర్తి కాగానె వాటిని మళ్లీ చించితుంచి పారేస్తారు. అదే విధంగా కరుణా దూరులూ, కామరూపధారులూ, కంసుని చారులూ అయిన రాక్షసవీరుల్ని ఎందరినో గోవిందుడు కదన రంగంలో అవలీలగా చించి చెండాడినాడు.

**చ. వర యమునా నదీ జల నివాస మహోరగ విస్తృతాస్య వి**
**స్ఫురిత విషానల ప్రభల సోఁకునఁ గ్రాఁగిన గోపగోధనో**
**త్కరముల నెల్లఁ గాచి భుజగప్రవరున్ వెడలంగఁ దోలి త**
**త్సరి దమలాంబు పానమున సంతస మందఁగఁ జేసె గోతతిన్. 112**

* యమునా నదిలో ఒక భయంకరమైన మహాసర్పం నివాసం చేస్తూ ఉండేది. విశాలంగా తెరచిన దాని ముఖంలో నుంచి వెలువడే విషానల జ్వాలల తాపానికి గోపాలకులు తాళలేక పొయ్యేవారు. గోధనం బాధపడుతూ ఉండేది. నందనందనుడు ఆ నాగరాజును నదిలోనుండి తరిమివేశాడు. గోవుల్ని కాపాడి వాటికి మళ్లీ ఆ నదిలోని నిర్మలమైన నీటిని త్రాగే అవకాశాన్ని అనుగ్రహించాడు. అందరికీ ఆనందం కలిగించాడు.

మ. దివిజాధీశు గుఱించి వానకొఱకై దీపింప నందాది వ
ల్లవు లే టేఁట ననూన సంపదల నుల్లాసంబునం జేయు ను
త్సవముం గృష్ణుఁడు మాన్పి గోపగణముల్ సంప్రీతినొందన్ శచీ
ధవు గర్వం బడఁపంగ నవ్యయముగాఁ దాఁజేసె గోయాగమున్. 113

* వర్షం బాగా కురియటంకోసం నందుడు మొదలైన యాదవులు ఇంద్రుణ్ణి గూర్చి ఎంతో వైభవంతో, ఎంతో ఉత్సాహంతో ఏటేటా గొప్ప ఉత్సవం చేసేవారు. కృష్ణుడు, ఆ ఇంద్రోత్సవాన్ని మాన్పించి ఇంద్రుని అహంకారం అడుగంటేటట్లూ, గోపాలు రందరూ సంతోషించేటట్లూ గోపూజ ప్రధానమైన గోయాగాన్ని తక్కువ వ్యయంతో, ఎక్కువ వైభవంతో జరిపించాడు.

చ. హరిహయుఁ డంత రోషవివశావిల మానసుఁడై సరోరుహో
దరు మహిమం బెఱుంగక మదం బడరంగ వలాహకాది భీ
కరఘన పంక్తిఁ బంపిన నఖండ శిలామయభూరి వర్షముల్
గురిసె ననూన గర్జనల గోకుల మాకుల మొచుఁ గుందఁగన్. 114

* ఈ విషయం తెలుసుకొని ఇంద్రుడు ఆగ్రహోదగ్రుడైనాడు. అతడి మనస్సు ద్వేషంతో, రోషంతో నిండిపోయింది. పద్మనాభుని మహత్త్వం తెలుసుకోలేక అహంకారంతో "వలాహకం" మొదలైన భయంకర కాలమేఘాల్ని పంపించాడు. ఆ కారుమబ్బులు గోకులమంతా శోకవ్యాకులమై పోయేటట్లు పెద్దగా ఉరుముతూ ఎడతెగకుండా రాళ్లవర్షం కురిశాయి.

ఉ. ఆతటి మంద కొందలము నందఁగ వల్లవులెల్లఁ గృష్ణ యీ
చేతను లెల్ల నిట్టి జడిఁ జిందఱ వందఱలై కలంగుచుం
గాతరులైరి నీవు కృపఁ గావుము కావు మనాథనాథ! ని
ర్ధూతకళంక! భక్తపరితోషణ భూషణ! పాప శోషణా! 115

* అప్పుడు వ్రేపల్లెలోని గోపాలురూ, గోవులూ ఆ వర్షానికి అల్లకల్లోలమైనారు. గొల్లలంతా తల్లడిల్లి ఒకచోట చేరారు. "కృష్ణా! రక్షించు రక్షించు. దిక్కులేని వారికి నీవే దిక్కు. నీవు నిష్కళంకుడవు సజ్జన పోషకుడవు! దుర్జన శోషకుడవు! ఈ జడివాన ధాటికి గోకులంలోని ప్రాణులంతా చీకాకుపడి చిందరవందరైనారు. దయతో కాపాడు!"

మ. అని యిబ్భంగి విపన్నులై పలుకఁ గుయ్యాలించి కృష్ణుండు స
జ్జన వర్ధిష్ణుఁడు గోప గో నివహ రక్షా దక్షుఁడై దేవతా
జను లగ్గింపఁ గరాంబుజాతమున సచ్ఛత్రంబుఁగాఁ దాల్చె బో
రన గోవర్ధన శైలముం దటచరద్రమ్యామరీజాలమున్. 116

* ఈ విధంగా ఆపన్నులైన వ్రేపల్లెగోపాలకు లందరూ ప్రార్థింపగా సజ్జనుల పెంపుకోరే కృష్ణుడు, వారి మొర ఆలకించి గోవులనూ, గోపాలకులనూ కాపాడటానికి నడుం కట్టాడు. చక్కని దేవతా స్త్రీలు విహరించే చరియలు గల గోవర్ధన పర్వతాన్ని ఒక్కచేత్తో గొడుగుగా ఎత్తి పట్టాడు. ఆ దృశ్యం ఆలోకించి ఆకాశంలోని అమరులంతా 'బళీ' అని ప్రశంసించారు.

వ. వెండియు. **117**

**సీ. శరదాగమారంభ సంపూర్ణ పూర్ణిమాచంద్ర సాంద్రాతపోజ్జ్వలిత మగుచు**
**వెలయు బృందాటవీ వీథియం దొకనాఁడు రాసకేళీ మహోల్లాసుఁ డగుచు**
**రుచిర సౌభాగ్యతారుణ్య మనోరమ స్ఫూర్తిఁ జెన్నొందిన మూర్తి దనర**
**సలలిత ముఖచంద్ర చంద్రికల్ గోపికా నయనోత్పలముల కానంద మొసఁగ**

**తే. భవ్య చాతుర్య భంగిఁ ద్రిభంగి యగుచు, నబ్జనాభుఁడు సమ్మోద మతిశయిల్ల**
**లీలఁబూరించు వర మురళీ నినాద, మర్థి వీతేర విని మోహితాత్మ లగుచు. 118**

* మరొక్క సంగతి. శరత్కాలం ప్రారంభమైంది. పూర్ణిమనాటి నిండు చందమామ పండువెన్నెలలో బృందావనం కన్నుల విందు చేస్తున్నది. ఒకనాడు కృష్ణునకు రాసకేళిపై ఉల్లాసం కలిగింది. అందాలు చిందే రూపంతో హృదయంగమ మైన నవయౌవనంతో భువనమోహనమూర్తియై తన ముఖచంద్రుని కాంతులతో గోపికల కను కలువలకు ఆనందాన్ని అందిస్తూ నందనందనుడు 'త్రిభంగి'గా నిలబడి వేణుగానం కావించాడు. ఆ ముప్వంకల ముద్దుకృష్ణుని మురళీనినాదం వీనులవిందుగా విని వ్రేపల్లెలోని గోపికలు మైమరచిపోయారు.

**చ. పతులు మఱందులున్ సుతులు బావలు నత్తలు మామలున్ సము**
**న్నతి వలదన్న మానక మనంబునఁ గృష్ణపదాబ్జ సేవనా**
**న్వితరతి గోప కామినులు వే చనుదేర దయాపయోధి శో**
**భితగతి రాసకేళి సలిపెం దరుణీనవపుష్పచాపుఁడై. 119**

* తమ భర్తలూ, మరదులూ, కొడుకులూ, బావలూ, అత్తలూ, మామలూ ఎంతగానో వెళ్ళవద్దని చెప్పినా ఏమాత్రం వినకుండా చిత్తాలలో శ్రీకృష్ణుని పాదపద్మాలను ఆరాధించాలనే ఆరాటం అధికం కాగా గోపికలు పరుగు పరుగున వచ్చారు. కరుణాసముద్రుడైన శ్రీకృష్ణుడు, ఆ జవరాండ్ర పాలిట నవమన్మథుడై రమ్యమైన రాసకేళీనాట్యంతో వారందరినీ ఆనందింపజేశాడు.

**ఉ. రాముఁడు దానుగూడి మధురాపురికిం జని యందు వైభవో**
**ద్దామనృపాసనంబున ముదంబున నున్న దురాత్ముఁ గంసు దు**
**ష్టామరశత్రుఁ ద్రుంచి ముదమారఁగఁ దల్లినిఁ దండ్రి నంచిత**
**శ్రీమహితాత్ములై తనరఁజేసె సరోరుహనాభుఁ డున్నతిన్. 120**

* అనంతరం అన్నగారైన బలరామునితో కలిసి మాధవుడు మధురకు వెళ్ళాడు. అక్కడ మహావైభవంగా మదోన్మత్తుడై మణిమయ సింహాసనాన్ని అధిష్ఠించి ఉన్న దుర్మార్గుణ్ణి దుష్టరాక్షసుణ్ణి కంసుణ్ణి సంహరించాడు.

తల్లిదండ్రులైన దేవకీ వసుదేవుల్ని బంధవిముక్తుల్ని గావించి భోగభాగ్యాలతో సంతుష్టులై సమున్నతులై ఉండేటట్లు చేశాడు.

మ. నలువొప్పంగ షడంగయుక్త మహితామ్నాయంబు చౌషష్టి వి
ద్యలు సాందీపనిచే నెఱింగెఁ జెలువొందన్ విన్నమాత్రంబు లో
పలనే లోకగురుండు దాన తనకున్ భావింప నన్యుల్ గురు
ల్గలరే లోకవిడంబనార్థ మగు లీలల్ గావె యమ్మేటికిన్. 121

* శ్రీకృష్ణుడు సమస్త జగత్తుకూ గురువు. అయినా శ్రద్ధగలవాడై షడంగాలతో కూడిన వేదాల్నీ, అరవైనాల్గు కళల్నీ "సాందీపని" అనే గురువుగారి సన్నిధిలో అభ్యసించాడు. నిజానికి జగద్గురువులకు ఇతరులు గురువులు అవుతారా? ఇవన్నీ ఆ పరాత్పరుడు లోకాచారం కోసం చేసే లీలలు కాక మరేమిటి?

ఉ. మించి ప్రభాసతీర్థమున మృత్యువశంబునఁ బొందిపోయి యా
పంచజనోదరస్థుఁడగు బాలకు దేశికనందనుం బ్రభో
దంచిత లీలఁ దెచ్చి గురుదక్షిణగా నతిభక్తి యుక్తి న
ర్పించె గురుండు చిత్తమునఁ బెంపెసలార మురారి వెండియున్. 122

* శ్రీకృష్ణుడు తన ఆచార్యునకు అపరిమితానందం కలిగించేటట్లు సమర్పించిన గురుదక్షిణ పేర్కొనదగింది. ఒకనాడు గురుపుత్రుడు ప్రభాస తీర్థంలో క్రుంకులాడుతున్నాడు. అతనికి చావు ముంచుకొని వచ్చింది. పంచజనుడనే రాక్షసుడు అతణ్ణి పొట్టనపెట్టుకున్నాడు. ఆ సందర్భంలో ఆమృతబాలకుణ్ణి రక్షించి శ్రీకృష్ణుడు గురువుగారి కోరిక మేరకు గురుదక్షిణగా తెచ్చియిచ్చాడు.

సీ. ఘనుఁడు విదర్భేశుఁ డనఁనొప్పు భీష్మకు వరసుతామణి నవవారిజాక్షిఁ
బద్మా సమాన రూపశ్రీ విభాసితఁ గమనీయభూషణఁ గంబుకంఠిఁ
జతురస్వయంవరోత్సవ సమాగత చైద్య సాల్వ మాగధ ముఖ్య జనవరేణ్య
నికర సమావృతఁ బ్రకట సచ్చారిత్ర రుక్మిణి నసమాన రుక్మ కాంతి

తే. నమరగుప్తామృతంబు విహంగ విభుఁడు, గొనిన కైవడి మనుజేంద్ర కోటిఁ దోలి
కమలనాభుండు నిజభుజాగర్వ మలరఁ, దెచ్చి వరియించె నతని నుతింప వశమె ! 123

* విదర్భ దేశాధిపతి భీష్మకుడు. ఆయన ముద్దుల కూతురు రుక్మిణి, అందమైన ఆమె కన్నులు క్రొందామర రేకులు. లక్ష్మీసమానురాలైన లావణ్యరాశి ఆమె. శుభంకరాలైన అలంకారాలతో శంఖంవంటి కంఠంతో సాటిలేని మేటి బంగారు చాయతో సంస్తవనీయమైన సత్ప్రవర్తనంతో విరాజిల్లే రుక్మిణికి స్వయంవరం ప్రకటించారు. ఆ స్వయంవర మహోత్సవానికి శిశుపాలుడు, సాల్వుడు, జరాసంధుడు మొదలైన రాజాధిరాజులంతా వచ్చి పడ్డారు. దేవతలు రక్షించు తున్న అమృత కలశాన్ని పక్షిరాజైన గరుత్మంతుడు

ఎగురదన్నుకొనిపోయిన విధంగా భగవంతుడైన శ్రీకృష్ణుడు తన బాహుబలాన్ని ప్రదర్శించి ఆ రాజు లందరినీ పరాజితులను గావించి రుక్మిణిని తీసుకొనివెళ్ళి పరిణయమాడారు. అటువంటి ఆ జగదేక వీరుణ్ణి పొగడడం ఎవరికి సాధ్యమౌతుంది.

**చ. పరువడిఁ బట్టి సప్తవృషభంబుల ముక్కులు గుట్టఁ దద్బల**
**స్ఫురణ సహింపఁజాలక నృపుల్ దలపడ్డ జయించి నగ్నజి**
**ద్ధరణిపు నందనన్ వికచ తామరసాక్షిఁ బ్రమోదియై స్వయం**
**వరమునఁ బెండ్లియాడె గుణవంతుఁ డనంతుఁ డనంతశక్తితోన్. 124**

* అంతేకాదు. ఏడు మదించిన ఆబోతు లున్నాయి. వాటి ధాటికి నిలువలేక రాజులంతా పలాయనం చిత్తగించారు. అటువంటి సమయంలో శ్రీకృష్ణుడు ఎదురొడ్డి నిలిచి తన అపారశక్తితో ఆ ఆబోతులకు ముక్కుతాళ్ళు బిగించి వాటిని లొంగదీసుకొన్నాడు. వికసించిన తామరరేకులవంటి కన్నులు గల రాజపుత్రి నాగ్నజిత్తిని గుణవంతుడూ, అనంతుడూ, అనంతశక్తిమంతుడూ అయిన గోపాలకృష్ణుడు సంతోషంతో స్వయంవరంలో పెండ్లాడాడు.

**మ. ప్రతివీరక్షయకారి నాఁబరఁగి సత్రాజిత్తనూజా హృ దీ**
**ప్సితముం దీర్పఁ దలంచి నాకమునకుం బెంపారఁగా నేఁగి వ**
**ర్ణిత శౌర్యోన్నతిఁ బారిజాత మిలకున్ లీలాగతిం దెచ్చె ను**
**ద్ధతి దేవేంద్రు జయించి కృష్ణుఁడన నేతన్మాత్రుఁడే చూడఁగన్. 125**

* శత్రువీరులకు సింహస్వప్నంగా పేరుగాంచిన యదుసింహుడు సత్యభామ మనస్సులోని కోర్కెను తీర్చడానికై స్వర్గానికి జైత్రయాత్ర సాగించి ప్రశంసనీయమైన పరాక్రమాతిశయంతో ఇంద్రుణ్ణి జయించి పారిజాతాన్ని అవలీలగా దివినుండి భువికి తీసుకొనివచ్చాడు. అటువంటి జగన్మాన్యుడు కృష్ణుడు సామాన్యుడా?

**సీ. మానితాఖిల జగన్మయ దేహమునఁ బొల్చు ధరణిదేవికిఁ బ్రియతనయుఁడైన**
**నరక దానవుని సునాభాఖ్యఁ జెన్నొందు ఘన చక్రధారా విఖండితోత్త**
**మాంగునిఁ జేయ నయ్యవనీ లలామంబు వేఁడినఁ దత్పుత్రు విపుల రాజ్య**
**పదమున నిల్పి లోపలి మందిరంబులఁ జిరముగ నరకుండు సెఱలఁ బెట్టి**

**తే. నట్టి కన్యలు నూఱుఁ బదాఱువేలు, నార్త బంధువుఁడైన పద్మాక్షుఁ జూచి**
**హర్ష బాష్పాంబు ధారాప్రవర్ష మొదవఁ, బంచశర బాణ నిర్భిన్న భావ లగుచు. 126**

* సమస్త జీవులకు అంతర్లీనమైన రూపం ధరించి గౌరవాన్ని అందుకొనే భూదేవికి ప్రియమైన కుమారుడు నరకుడు. అయినా వాడు రాక్షస లక్షణాలు కలవాడయినందువల్ల శ్రీకృష్ణుడు "సునాభము" అనే పేరుగల చక్రము అంచుతో అతని శిరస్సును త్రుంచివైచినాడు. అనంతరం ధరణీమాత ప్రార్థింపగా

అతని కుమారుణ్ణి ఆ విశాల సామ్రాజ్యానికి అధిపతిగా చేశాడు. ఆ నరకాసురుని అంతఃపురంలోని చెరసాలలో మ్రగ్గుతున్న పదారువేల నూర్గురు కన్యలను విడిపించాడు. సులక్షణలైన ఆహరిణేక్షణ లందరూ ఆర్తజన రక్షకుడైన కమలాక్షుని వీక్షించి హర్షిస్తూ ప్రమోదబాష్పాలు వర్షిస్తూ ఆయన దివ్య సౌందర్యానికి ఆకర్షితలైనారు.

**చ. లలిత తదీయ సుందర విలాస విమోహిత లైన వారి నిం**
**పొలసిన కోర్కిఁ దీర్చుటకు నొక్క ముహూర్తమునన్ వరించి క**
**న్యల లలితావరోధ భవనంబుల నందఱ కన్ని రూపులై**
**కలిసి సుఖస్థితిం దనిపెఁ గాంతల భక్తినితాంతచిత్తలన్. 127**

* అందాలరాశియైన నందనందనుడు తన సౌందర్యవిలాసాలకు వ్యామోహం చెందిన ఆ సుందరీమణుల కోర్కె తీర్చటంకోసం ఒక్క సుముహూర్తంలోనే వారందరినీ పెండ్లాడాడు. అత్యంతమనోహరాలైన అంతఃపురాలలో అందరికీ అన్ని రూపులై అంతులేని అనురాగంతో కూడిన స్వాంతాలు గల ఆ కాంతాలలామలను సంతోషపరచాడు.

**క. చతురతతో నం దొక్కొక, యతివకుఁ బదురేసి సుతులఁ నాత్మసముల ను**
**న్నత భుజశక్తులఁ గాంచెను, వితతంబై కీర్తి దిశల వినుతికి నెక్కన్. 128**

* చతురకళానిధి అయిన శ్రీకృష్ణుడు తనకు సాటి అయిన మేటి పరాక్రమం గల కుమారులను ఒక్కొక్క భార్యకు పదిమంది చొప్పున ప్రసాదించాడు. నలుదిశలా విశాలమైన యశోదీప్తులు నిండించాడు.

**సీ. మథురాపురముఁ జతుర్విధ బలౌఘములతో నావరించిన కాలయవన సాల్వ**
**మగధ భూపాలాది మనుజేంద్ర లోకంబు సైన్యయుక్తము గాఁగ సంహరించి**
**తన బాహుశక్తిఁ జిత్తముల నర్థించిన భీమ పార్థులకు నుద్దామ విజయ**
**మొసఁగి తద్వైరుల నుక్కడంగఁగఁ ద్రుంచి బాణ శంబర ముర పల్వలాది**

**తే. దనుజ నాయక సేనా వితానములను హలధరాది సమేతుఁడై హతులఁజేసె**
**దంతవక్త్రాది దైత్యులు దన్ను నెదుర భండనములోనఁ ద్రుంచె దోర్బలము మెఱసి. 129**

* కాలయవనుడు, సాల్వుడు, జరాసంధుడు మొదలైన మహీపతులంతా, చతురంగ బలసహితులై మథురాపురాన్ని చుట్టుముట్టారు. ఆ రాజలోకాన్ని సేనానీకంతో సహా శ్రీకృష్ణుడు సంహరించాడు. మనసార తన అండదండలను అర్థించిన భీమార్జునులకు సాటిలేని విజయశ్రీని సమకూర్చాడు. మదోన్మత్తులైన వారి శత్రువులను తుదముట్టించాడు. బలరాముణ్ణి వెంటబెట్టుకొని బాణుడు, శంబరుడు, మురుడు, పల్వలుడు అనే రాక్షస నాయకుల్ని, సేనలతోసహా సంహరించాడు. కదనరంగంలో ఎదిరించిన దంతవక్త్రుడు మొదలైన దానవుల్ని అవక్రవిక్రమంతో నేలకూల్చాడు.

**వ. వెండియుం గృష్ణుండు కౌరవ పాండవ భండనంబునకుం దోడ్పడి రాజన్యు లన్యోన్య మాత్స ర్యోత్సాహసమేతులై సైనిక పాదఘట్టనంబుల ధరాచక్రంబు కంపింప ననన్య సామాన్యంబు లైన**

శంఖ భేరీ ప్రముఖ తూర్యఘోషంబుల నింగి మ్రింగఁ దురంగమ రింఖా సముద్ధూత ధూళి పటల పరిచ్ఛన్న భానుమండలంబుగాఁ జనుదెంచి కురుక్షేత్రంబున మోహరించిన నుభయపక్షబలంబులం దునుమాడి నిఖిలరాజ్యవైభవ మదోన్మత్తుం డయిన సుయోధనుండు నిఖిలరాజ సమక్షంబునఁ గర్ణశకుని దుశ్శాసనాదుల దుర్మంత్రంబున నిరంతరంబుఁ గుంతీనందనుల కెగ్గు చేసిన దోషంబునం జేసి సంగరరంగంబున భీమ గదాఘాతంబునం దొడలు విఱిగి పుడమింబడి గతాయుశ్శ్రీ విభవుండై యుండఁ జూచినంగదా పరితుష్ట చిత్తుండ నగుదు నని యపరిమిత బాహుబలోత్సాహులైన భీష్మ ద్రోణ భీమార్జునులచేత నిఖిలధరాపతుల నష్టాదశాక్షౌహిణీ బలంబులతోడం దునిమించి మఱియు స్వసమానబలులైన యదువీరుల జయింప నెంతవారల కైనం దీరదు; మధుపాన మదవిఘూర్ణి తాతామ్ర విలోచనులై ప్రవర్తించు యాదవుల కన్యోన్య వైరంబులు గల్పించి పోరించి యితరేతర కరాఘాతంబుల హతులై తన్నుఁ గలసినంగాని భూభారం బుడుగదని చిత్తంబునం దలంచి యంత ధర్మనందనుచే నిస్సపత్నంబగు రాజ్యంబు పూజ్యంబుగాఁ జేయించుచు మర్త్యులకుం గర్తవ్యంబులైన ధర్మపథంబులు సూపుచు, బంధుమిత్రుల నెల్లఁ బరితోషంబు నొందించుచుం దత్పరోక్షంబున వారి వంశం బుద్ధరింపం దలంచి యభిమన్యువలన నుత్తర యందు గర్భంబు నిలిపి, గురుతనయ ప్రయుక్తమహిత బ్రహ్మాస్త్రపాతంబునం దద్గర్భదళనంబు గాకుండ నర్భకుని రక్షించి, నిజపదారవింద సేవారతుండైన ధర్మసుతుచేఁ గీర్తిప్రతాపంబులు నివ్వటిల్లం దురంగమేధంబులు మూఁడు సేయించి వెండియు. **130**

* దుర్యోధనుడు సమస్త మహీరాజ్య మహాసంపత్తివల్ల మదోన్మత్తుడైనాడు. కర్ణ, శకుని, దుశ్శాసనుల దురాలోచనలూ, దుర్బోధలూ తలకెక్కి, తెగనిక్కి పాండవులకు తగని, ఎడతెగని ఎన్నెన్నో ఎగ్గులు చేశాడు. ఆ పాపానికి ప్రాయశ్చిత్తంగా సంగ్రామంలో భీముని ప్రచండ గదా ఘాతంతో తొడలు విరిగి, ప్రాణాలు సురిగి, రాజ్యం పోయి, ప్రతిష్ఠ గోల్పోయి, భూమిమీద పొరలాడుతున్న రారాజును చూడాలని వేడుక కలిగింది శ్రీకృష్ణస్వామికి కౌరవపాండవుల పోరాటం నిశ్చయ మయింది. ఉభయ పక్షాల రాజులూ పెచ్చు పెరిగిన మచ్చరంతో ఉరకలు వేసే ఉత్సాహంతో కురుక్షేత్రంలో యుద్ధానికి సన్నద్ధులై నిలిచారు. సైనికుల చరణ ఘట్టనలకు ధరణి కంపించింది. శంఖధ్వానాలకూ భేరీపటహాది వాద్యధ్వనులకూ ఆకాశం దద్దరిల్లింది. గుర్రాల డెక్కల తొక్కిడికి రేగిన పరాగపటలాలు సూర్యమండలాన్ని కప్పివేశాయి.

ఒకరు మరొకరి చేతుల్లో చచ్చి తనలో చేరితే తప్ప భూభారం తగ్గదు అనుకొన్నాడు శ్రీకృష్ణుడు. అపారపరాక్రమోపేతులూ, అపరిమితోత్సాహసమేతులూ అయిన భీష్మ ద్రోణులను ఒక పక్షంలోనూ, భీమార్జునులను ఒక పక్షంలోనూ నిలిపి మదోన్మత్తులైన మహీపతులతోపాటు పదునెనిమిది అక్షౌహిణుల సైన్యాన్ని సైతం చంపించాడు. తనతో సమానమైన బలం గల యాదవయోధుల్ని నిర్జించటం ఎంతబలవంతులకైనా సాధ్యం కాదు. అందువల్ల మద్యపానంవల్ల మత్తెక్కి గిరగిర తిరుగుతూ ఎర్రబడిన కన్నులతో కన్నుమిన్ను గానని యదువీరులకు వారిలో వారికే వైరాలు పెట్టించి, పోరాటాలు పుట్టించి తుదకు అందరినీ తుదముట్టించాడు. అలా అన్యోన్యం కొట్టుకొని మరణించి తనలో చేరితేనే కాని భూభారం

తగ్గదని భావించిన వాసుదేవుడు ధర్మరాజుచే నిష్కంటకమైన రాజ్యాన్ని ప్రశంసనీయంగా పాలింపజేశాడు. మానవులకు ఆవశ్యకాలైన ధర్మమార్గాలను ప్రతిష్ఠించాడు. బంధువులకూ, మిత్రులకూ పరమానందాన్ని కలిగించాడు. పాండవ వంశాన్ని నిలుపదలచి అభిమన్యుని అర్ధాంగి అయిన ఉత్తర గర్భాన్ని రక్షించాడు. అశ్వత్థామ ప్రయోగించిన అమోఘమైన బ్రహ్మాస్త్రం వల్ల ఆమె గర్భంలోని అర్భకుడికి హాని కలుగకుండా కాపాడాడు. తన చరణ కమలసేవా పరాయణుడైన ధర్మతనయుని పేరు ప్రతిష్ఠలూ, శౌర్యసాహసాలూ ప్రకటితం అయ్యేట్లు ఆయనచేత మూడు అశ్వమేధయాగాలు చేయించాడు.

**సీ. వలనొప్ప లౌకిక వైదిక మార్గముల్ నడపుచు ద్వారకానగర మందు**
**నవిదితాత్మీయ మాయా ప్రభావమున నిస్సంగుఁడై యుండి సంసారిపగిదిఁ**
**జెంది కామంబులచేత విమోహితుం డై సుఖించుచు ముదితాత్ముఁ డగుచు**
**నంచిత స్నిగ్ధ స్మితావలోకముల సుధా పరిపూర్ణ సల్లాపములను**

**తే. శ్రీ నికేతన మైన శరీరమునను, బాండునందన యదుకుల ప్రకరములను**
**లీలఁ గారుణ్య మొలయఁ బాలించుచుండె, నార్త రక్షాచణుండు నారాయణుండు. 131**

* భక్త రక్షణ దీక్షాపరాయణుడైన శ్రీమన్నారాయణుడు ద్వారకా పట్టణంలో నివసిస్తూ వైదికములూ, లౌకికములూ అయిన సముదాచారాలను సక్రమంగా చక్కగా నిర్వహిస్తూ తన మాయామహత్త్వం అభివ్యక్తం కాకుండా ప్రవర్తించాడు. ఏమీ అంటనివాడై కూడా సంసారిలాగా, కోరికలకు ఆకర్షితుడైన వానిలాగా, భోగభాగ్యాలతో నిత్య సంతోషియై ఉన్నాడు. సౌందర్యలక్ష్మికి మందిరమైన దేహంతో, అతిశయించిన స్నేహంతో, చిరునవ్వులు విరిసే కడగంటి చూపులతో, అమృతం కురిసే సరససల్లాపాలతో ఇటు పాండవులనూ, అటు యాదవులనూ ఆనందింపజేస్తూ కరుణతో లాలించి పాలించాడు.

**సీ. సంపూర్ణ పూర్ణిమా చంద్ర చంద్రిక నొప్పు రమణీయశారద రాత్రు లందు**
**సలలిత కాంచన స్తంభ సౌధోపరి చంద్రకాంతోపల స్థలములందు**
**మహిత కరేణుకా మధ్య దిగ్గజముల గతిని, సౌదామనీ లతల నడిమి**
**నీల మేఘంబుల లీల, ముక్తా మధ్య లాలిత శక్ర నీలముల భాతి**

**తే. సతత యౌవన సుందరీయుత విహారుఁ డగుచు సతు లెంద ఱందఱ కన్ని రూప**
**ములను గ్రీడించెఁ బెక్కబ్దములు సెలంగి, నందనందనుఁ డభినవానందలీల. 132**

* పున్నమనాటి నిండు జాబిల్లి పండు వెన్నెల వెలుగులతో విరాజిల్లే శరత్కాల రాత్రుల్లోనూ, అందమై మేలిమిబంగారు స్తంభాలు గల సౌధాల పైఅంతస్తుల్లోని చలువరాతి తిన్నెలపైనా, తరుగని తారుణ్యం, చెరగని సౌందర్యం గల అంగనలతో కూడి క్రీడించాడు. అందమైన ఆడు ఏనుగులమధ్య దిగ్గజాలు తిరిగినట్లు, మెరపుతీగల నడుమ నీలమేఘాలు విహరించినట్లు, ముత్యాల సందున ఇంద్రకాంతమణులు ప్రకాశించినట్లు అందగత్తె లందరికీ అన్ని రూపాలు ధరించిన నందనందనుడైన గోవిందుడు సరికొత్త ఆనందంతో ఎన్నో సంవత్సరాలు విహరించాడు.

వ. అంత నొక్కనాఁడు 133

చ. మునివరు లేఁగుదేర యదు భోజవరేణ్యులు గూడి ముట్టఁ బ
ల్కినఁ గనలొంది వారు దమకించి శపించినఁ గొన్ని మాసముల్
సనునెడ దైవయోగమున జాతరఁబో సమకట్టి వేడుకల్
మనములఁ దొంగలింప గరిమన్ నిజయానము లెక్కి యాదవుల్. 134

* ఇలా వుండగా ఒక్క రోజు కొంతమంది మహామునులు ద్వారకా నగరానికి వచ్చారు. అప్పుడు కొందరు యాదవకుమారులు వారిని చుట్టుముట్టి ఎత్తిపొడుపు మాటలతో వారి మనస్సు నొప్పించారు. అందుకు వారు ఆగ్రహించి ఆ తొందరలో ఘోరంగా శపించారు. కొన్ని మాసాలు గడిచాయి.

దైవయోగం వల్ల యాదవు లంతా ఒక పెద్ద ఉత్సవం చెయ్యటానికి తలపెట్టారు. అతిశయించిన కుతూహలంతో కూడిన అంతరంగాలతో పొంగిపోతూ, తమతమ వాహనా లెక్కి జాతరకోసం ప్రయాణమైనారు.

ఉ. కోరి ప్రభాసతీర్థమునకుం జని తన్నదిఁ గ్రుంకి నిర్మలో
దారత నందు దేవమునితర్పణముల్ పితృ తర్పణంబులున్
వారని భక్తిఁ జేసి నవ వత్సలతోఁ బొలుపారు గోవులన్
భూరిసదక్షిణాకముగ భూసురకోటికి నిచ్చి వెండియున్. 135

* అలా ప్రయాణమై యాదవు లందరూ ప్రభాసతీర్థానికి వెళ్ళారు. ఆ నదీజలాల్లో స్నానాలు చేశారు. అరమరికలు లేని ఉదారబుద్ధితో దేవతలకూ, మహర్షులకూ, పితృదేవతలకూ తర్పణాలు విడిచారు. అపారమైన భక్తితో లేగదూడలతో చూడముచ్చటైన గోవులను ధరణీసురులకు దక్షిణలతోపాటు దాన మిచ్చారు.

క. అజిన పట రత్నకంబళ, రజత మహారజత తిల ధరా వరకన్యా
గజ తురగ రథములను స, ద్విజ కోటికి నిచ్చి పెంపు దీపింపంగన్. 136

* అనంతరం జింకచర్మాలూ, మంచిమంచివస్త్రాలూ, రత్నకంబళ్ళూ, వెండీ, బంగారమూ, నువ్వులూ, భూములూ, కన్నెమిన్నలూ, ఏనుగులూ, గుర్రాలూ, రథాలు- తమతమ గౌరవ మర్యాదలకు తగినట్లు బ్రాహ్మణోత్తములకు బహూకరించారు.

వ. ఇట్లు సఫలంబు లయిన భూదానంబు మొదలుగా గల దానంబు లనూనంబులుగా భగవదర్పణబుద్ధి జేసి యనంతరంబ. 137

* ఈ విధంగా పంటలతో కూడిన భూమి మొదలైన వాటిని భగవంతునికే ఇస్తున్నామన్న భావంతో ఎడతెరపి లేకుండా దానం చేశారు.

తే. ఎసఁగు మోదంబు సంధిల్ల నిష్టమైన, రసిక మృదులాన్న మర్థిఁ బారణలు సేసి
మంజులాసవ రసపాన మత్తు లగుచుఁ, గడఁగి యన్యోన్య హాస్య వాక్యముల గలఁగి. 138

* ఈ విధంగా దానధర్మాలు చేసిన తర్వాత యాదవు లందరూ సంతుష్టిగా ఇష్టమృష్టాన్నాలను కడుపునిండా భుజించి మధుర మోహనమైన మద్యపానంతో మత్తెక్కి మైమరచి పరస్పరం పరిహసించుకోసాగారు.

వ. ఇట్లు దమలోన మదిరాపాన మద విఘూర్ణిత తామ్రలోచనులై మత్సరంబుల నొండొరులం బొడిచి సమస్త యాదవులును వేణు జాతానలంబునఁ దద్వంశపరంపరలు దహనంబు నొందుచందంబునం బొలిసి; రది యంతయుం గనుంగొని శ్రీకృష్ణుం డప్పుడు. 139

* మధుపానమత్తులైన వారి కళ్లు బాగా ఎరుపెక్కాయి. ఒళ్లు తిరిగింది. మచ్చరం పెచ్చు పెరిగింది. ఒకరి నొకరు పొడుచుకొని చచ్చారు. వెదుళ్ళ రాపిళ్లవల్ల ఆవిర్భవించిన అగ్నిజ్వాలల్లో వెదురు పొదలన్నీ దగ్ధమైపోవునట్లు సమస్త యాదవులూ నాశనమైనారు. ఈ యాదవకుల విధ్వంస మంతా శ్రీకృష్ణుడు చూచాడు.

క. చతురతతో నిజమాయా, గతిఁ జూచి లసద్విలోల కల్లోల సమం
చిత విమల కమల సార, స్వత జలముల విహిత విధులు సలిపినవాఁడై. 140

* చాతుర్యంతో కూడిన తన మాయా విలాసాన్ని తిలకించిన అనంతరం పొంగిపొరలే తరంగాలతో, వికసించిన కమలాలతో, జలజల ప్రవహించే సరస్వతీ నదిలోని జలాలలో చనిపోయిన వారందరికీ యథావిధిగా ఉత్తరక్రియలు జరిపాడు.

క. ఒక వృక్షమూల తలమున, నకలంక గుణాభిరాముఁ డాసీనుండై
యకుటిలమతి బదరీ వన,ముకు ననుఁ బొమ్మనుచు మొఱఁగి పోయిన నేనున్. 141

* మచ్చలేని మంచి గుణాలతో విరాజిల్లే శ్రీకృష్ణుడు ఒక చెట్టు మొదట్లో కొంచెముసేపు కూర్చున్నాడు. తర్వాత నన్ను పిలిచి “ఉద్ధవా! ఇక నీవు బదరీవనానికి పో” అని చెప్పి నన్ను మాయపుచ్చి ఎచ్చటికో లేచి వెళ్ళాడు.

క. క్రమమున నిజకుల సంహా, రము సేయఁ గడంగు టెఱిఁగి రమణీయ శ్రీ
రమణు చరణాబ్జ యుగ విర, హమునకు మది నోర్వ లేక యనుగమనుఁడనై. 142

* స్వామి తన వంశాన్ని సంపూర్ణంగా సమాప్తం చేసుకోవటానికి సంకల్పించాడన్న సంగతి నేను గ్రహించాను. ఆ నందనందనుని సుందర పాదారవిందాల ఎడబాటును సహించలేకపోయాను. ఆయన వలదన్నా ఆయన అడుగు జాడలను అనుసరించాను.

క. హరి నరయుచుఁ జనిచని యొక, తరుమూల తలంబు నందుఁ దన దేహరుచుల్
పరఁగఁగ నున్న మహాత్మునిఁ, బరునిఁ బ్రపన్నార్తిహరుని భక్తవిధేయున్. 143

* ఆ విధంగా గోవిందుని జాడ అన్వేషిస్తూ వెళ్ళగా వెళ్ళగా ఒక వృక్షాన్ని ఆనుకొని నేలమీద ఆసీనుడై ఉన్న వాసు దేవుడు నాకు కన్పించాడు. ఆయన దేహం దేదీప్యమానంగా కాంతులు వెదజల్లుతున్నది. ఆ సమయంలో ఆ మహాను భావుడు ఆర్తుల కష్టాలను పోగొట్టి భక్తజనులను పరిపాలించే పరమాత్మగా నాకు కన్పించాడు.

వ. మఱియును. 144

సీ. అస్మత్ప్రియస్వామి నచ్యుతుఁ బరు సత్త్వగుణగరిష్ఠుని రజోగుణవిహీను
సురుచిర ద్వారకాపుర సమాశ్రయు ననాశ్రయు నీల నీరద శ్యామ వర్ణు
దళ దరవింద సుందర పత్రనేత్రు లక్ష్మీయుతుఁ బీత కౌశేయ వాసు
విలసిత వామాంక విన్యస్త దక్షిణ చరణారవిందు శశ్వత్ప్రకాశు

తే. ఘన చతుర్బాహు సుందరాకారు ధీరుఁ, జెన్నుగల లేఁత రావిపై వెన్ను మోపి
యున్న వీరాసనాసీను నన్నుఁ గన్న, తండ్రి నానంద పరిపూర్ణు దనుజహరుని. 145

* నా ప్రేమమూర్తి, నాస్వామి, అచ్యుతుడు, పరాత్పరుడు, సత్త్వగుణసంపన్నుడు, రజోగుణ రహితుడు, సుందర ద్వారకా మందిరుడు, అన్యులను ఆశ్రయింపనివాడు, నీలమేఘశ్యామల శరీరుడు, అప్పుడే వికసించుతున్న అందమైన అరవిందాలవంటి కన్నులు కలవాడు, శ్రీనివాసుడై పట్టుపీతాంబరం కట్టుకుని తన ఎడమ తొడపై కుడిపాదాన్ని ఉంచి కూర్చుని ఉన్నాడు. అక్షర తేజస్సుతో, చతుర్బాహువులతో ప్రకాశిస్తున్నాడు. అటువంటి ధీరుణ్ణి, సుందరాకారుణ్ణి, దనుజసంహారుణ్ణి, లేత రావిమ్రాకు నానుకొని వీరాసనాసీనుడై విరాజిల్లుతున్న ఆనందమయుణ్ణి నన్ను గన్న తండ్రిని కన్నులారా కన్నాను.

మత్త. కంటిఁ గంటి భవాబ్ధి దాఁటఁగఁ గంటి నాశ్రిత రక్షకుం
గంటి యోగిజనంబు డెందముఁ గంటిఁ జుట్టముఁ గంటి ము
క్కంటికిం గనరాని యెక్కటిఁ గంటి దామరకంటిఁ జే
కొంటి ముక్తివిధానముం దలకొంటి సౌఖ్యము లందఁగన్. 146

* దర్శించాను! సందర్శించాను! సంసార సాగరాన్ని తరించాను. ఆశ్రిత రక్షకుణ్ణి అవలోకించాను. ఆయన మహాయోగుల ఆత్మబంధువు. మూడుకన్నుల దేవర కూడ చూడలేని జోడులేని వేలుపు. ఆ కమలాక్షుని కనుగొన్నాను. ముక్తిమార్గాన్ని చేరుకొన్నాను. ఆనందాన్ని అందుకొన్నాను.

వ. అయ్యవసరంబునం బరమ భాగవతోత్తముండును, మునిజన సత్తముండును, ద్వైపాయన సఖుండును, మహాయోగి ప్రముఖుండును, నఘశూన్యుండును, నఖిల జన మాన్యుండును, బుధజన విధేయుండును నగు మైత్రేయుండు తీర్థాచరణంబు సేయుచుం జని చని. 147

* విదురా! అదే సమయంలో భగవద్భక్తులలో వరేణ్యుడూ, మునులలో అగ్రగణ్యుడూ, వేదవ్యాసుని సహాధ్యాయుడూ, యోగిజనధ్యేయుడూ, సద్గుణనికాయుడూ, సకలజన పూజనీయుడూ, సుధీవిధేయుడూ అయిన మైత్రేయుడు తీర్థయాత్రలు చేస్తూ అచ్చటికి విచ్చేశాడు.

మ. కనియెం దాపస పుంగవుం డఖిల లోకఖ్యాత వర్ధిష్ణు శో
భన భాస్వత్పరిపూర్ణ యౌవనకళాభ్రాజిష్ణు యోగీంద్ర హృ
ద్వన జాతైక చరిష్ణుఁ గౌస్తుభ ముఖోద్య ద్భూషణాలంకరి
ష్ణు నిలింపాహితజిష్ణు విష్ణుఁ బ్రభవిష్ణుం గృష్ణు రోచిష్ణునిన్. 148

*ఆ విధంగా అచ్చటికి వచ్చిన మైత్రేయుడు విశ్వమంతటా విస్తరిల్లిన శాశ్వతకీర్తితోనూ, సౌభాగ్యశోభా వైభవంతో కూడిన సంపూర్ణ యౌవన స్ఫూర్తితోనూ విరాజిల్లేవాడూ, మహాయోగీంద్రుల మానస పద్మాలలో సంచరించేవాడూ, కౌస్తుభం మొదలైన వెలుగులు వెల్లివిరిసే ఆభరణాలు అలంకరించుకొన్నవాడూ, రాక్షసులను శిక్షించేవాడూ, సర్వవ్యాపకుడూ, సర్వసమర్థుడూ, తేజోమయుడూ అయిన శ్రీకృష్ణుణ్ణి అవలోకించాడు.

క. తదనంతరంబ హరిఁ దన, హృదయాబ్జము నందు ముకుళితేక్షణముల స
మ్మదమునఁ జూచుచు నానత, వదనుండై యుండె ముదము వఱలఁగ ననఘా! 149

* అనఘాత్ముడవైన విదురా! విను! అలా చూచి చూచి కన్నులు మూసుకున్నవాడై మైత్రేయ మహర్షి తన హృదయకమలంలోనే పదిలపరచుకున్న ఆ భగవంతుణ్ణి సంతోషంతో సందర్శించుతూ తలవంచుకొని నిలబడ్డాడు.

వ. అంత డగ్గఱ నేతెంచి యున్న మైత్రేయుండు వినుచునుండ దరహాస చంద్రికా సుందర వదనార విందుండును, నానంద సుధానిష్యంద కందళిత హృదయుండును, భక్తానురక్త దయాసక్త విలోకనుండును నగు పుండరీకాక్షుండు నన్ను నిరీక్షించి యిట్లని యానతిచ్చె; పూర్వభవంబున వసుబ్రహ్మలు సేయు సత్త్రయాగంబున వసువై, భవదీయహృదయంబున నితర పదార్థంబులు గోరక మదీయపాదారవింద సేవం గాంక్షించితివి కావునం దన్నిమిత్తంబున నేను నీ హృదయంబున వసియించి సమస్తంబును గను చుండుదు; నాత్మారాముండ నైన నన్ను నెవ్వరేని సదసద్వివేకులై యెఱుంగంజాలరు; వారలకు నేను నగోచరుండనై యుండుదు; మత్పరిగ్రహంబు గల నీక నీజన్మంబ కాని పునర్భవంబు నొంద కుండుటకు భవదీయపూర్వ జన్మకృత సుకృత విశేషంబు కతంబున నియ్యాశ్రమంబున మత్పాదారవింద సందర్శనంబు గలిగె; నదియునుంగాక పద్మకల్పంబునందు మన్నాభి పద్మ మధ్య నిషణ్ణుం డయిన పద్మసంభవునకు జన్మమరణాది సంసృతి నివర్తకంబును నవిరతానశ్వర సౌఖ్య ప్రవర్తకంబును నగు మన్మహత్త్వంబుఁ దెలియం జేసితి నట్టి దివ్యజ్ఞానంబు నీకు నెఱింగింతు నని యమ్మహనీయ తేజోనిధి యానతిచ్చిన సుధాసమాన సరసాలాపంబులు కర్ణకలాపంబులై మనస్తాపంబులం బాపిన రోమాంచ కంచుకిత శరీరుండును, నానంద బాష్పధారా సిక్త కపోలుండును, బరితోష సాగరాంతర్నిమగ్న మానసుండును నయి యంజలిపుటంబు నిటల తటంబున ఘటియించి యిట్లంటి. 150

* అలా తన దగ్గరికి వచ్చి మైత్రేయుడు వింటూ ఉండగా, చిరు నవ్వు వెన్నెలలు చిందించే అందమైన అరవిందంలాంటి ముఖం కలవాడూ, ఆనందం అనే అమృతంతో వికసించిన హృదయం కలవాడూ, భక్తులను ఆదరించే దయతో కూడిన చూపులు కలవాడూ- అయిన కమలాక్షుడు నా ముఖం వైపు చూచి ఈ విధంగా ఆజ్ఞాపించాడు. "ఉద్ధవా! పూర్వజన్మలో వసుబ్రహ్మలు చేస్తూ ఉండిన సత్త్రయాగంలో వసువువైన నీవు నీ మనస్సులో మరే వస్తువునూ కోరకుండా నా పాదపద్మాలసేవనే కోరుకొన్నావు. అందుకని నేను ఇకమీద నీ ఎదలో నివాసం చేస్తూ సకలం చూస్తూ ఉంటాను. ఆత్మారాముడనైన నన్ను ఇది సత్తు ఇది అసత్తు అని విమర్శించేవారు ఎవరూ తెలుసుకోలేరు. నేను వారికి కనిపించకుండా ఉంటాను. ఆ అనుగ్రహంవల్ల ఇదే నీకు చివరిజన్మ. మరోజన్మ ఉండదు. అందుకనే నీ పూర్వజన్మ లోని పుణ్యవిశేషం కారణంగా నా చరణారవిందాలకు ఈనాడు ఈ ఆశ్రమంలో సందర్శించగలిగావు. అంతేకాక పద్మకల్పంలో నా నాభికమలంలో ఆసీనుడై వున్న బ్రహ్మదేవునికి తెలియజేసిన దివ్యజ్ఞానాన్ని నీకు ఉపదేశిస్తాను. ఆ దివ్యజ్ఞానం వల్ల జనన మరణాది సంసారబంధాన్ని నివర్తింపజేసి అఖండమూ, అనంతమూ అయిన ఆనందాన్ని ప్రవర్తింపజేసే నా మహత్త్వం నీకు తెలుస్తుంది."

ఈ విధంగా మహాతేజస్సంపన్నుడైన కృష్ణుడు ఆజ్ఞాపించాడు. అమృతసమానాలయిన స్వామి సరససంభాషణలు నాకు శ్రవణ భూషణా లైనాయి. నా మనస్తాపాన్ని తొలిగించాయి. నా శరీరం సంతోషంతో గగుర్పొడిచింది. నా చెక్కిళ్లు ఆనందబాష్పాలతో తడిసి పోయాయి. నా అంతరంగం సంతోష సముద్రతరంగాలలో ఓలలాడింది. నేను దోసిలి నెన్నుదుటిపై చేర్చి ఇలా విన్నవించుకొన్నాను.

**క. పురుషోత్తమ! నీ పద, సర సీరుహ ధ్యానామృతాభిషేక స్ఫురణం**
**గర మొప్పిన నా చిత్త మి, తరవస్తువులందు వాంఛఁ దగులునె యెందున్.** **151**

* పరమపురుషా! నీ చరణ కమలస్మరణ మనే అమృతాభిషేకంతో పొంగి పరవశించిన నామనస్సు ఇతర వస్తువులను ఎందుకు కాంక్షిస్తుంది?

**చ. జననము లేని నీవు భవ సంగతి నొందుట కేమి కారణం**
**బనియును, గాలసంహరుఁడవై జగముల్ విలయించు నీవు పా**
**యని రిపుభీతికై సరిదుదంచిత దుర్గము నాశ్రయించు టె**
**ట్లనియును దేవ! నామనమునందుఁ దలంతు సరోజలోచనా!** **152**

* పుండరీకాక్షా! పుట్టుకలేని నీవు పుడమిపై అవతరించట మేమిటో బోధపడటం లేదు. కాల స్వరూపుడవై లోకాలను లోగొనే నీవు శత్రుభయంతో నదులను అడ్డుపెట్టు కొని సముద్రాలలో కోటలు కట్టుకోవటం ఏమిటో నా మనస్సుకు అర్థం కావటం లేదు.

**వ. అదియునుంగాక.** **153**

**క. శ్రీ రమణీశ్వర! నీ వా, త్మారాముఁడ వయ్యు లీలఁ దరుణీకోటిం**
**గోరి రమించితి వనియును, వారక యేఁ దలఁతు భక్తవత్సల! కృష్ణా! 154**

* అంతేకాక ఇందిరారమణా! భక్తవత్సలా! శ్రీకృష్ణా! నీవు ఆత్మలలో విహరించువాడవు. అయినా స్త్రీల సమూహాల నడుమ లీలావిలాసాలతో విహరించట మేమిటో ఊహించలేకున్నాను.

**క. వరతత్త్వజ్ఞులు కరుణా, కర! నిను సంసారి వనుచుఁ గడఁకఁ దలంప**
**న్నరసి ననుఁ గాచు టెల్లను, గర మరుదు తలంచి చూడఁ గమలాధీశా! 155**

* ఓ కమలాపతీ! నీవు కరుణా నిలయుడవు. పెద్దలు చాలమంది వేదాంతులు గూడ నిన్ను సంసారివి అనుకుంటున్నారు. నీవు నాపై చూపే దయ, రక్షించే విధానం గమనిస్తే నాకే మిక్కిలి ఆశ్చర్యంగా ఉంటుంది. ఇది ఎంతటి అరుదైన సంగతి?

**వ. దేవా! నీ వఖండిత విజ్ఞాన రూపాంతఃకరణుండ వయ్యును ముగ్ధభావంబునఁ బ్రమత్తుని చందంబున విమోహికైవడిం బ్రవర్తించుచు నెందేని నొదిగి యుండుటం దలంచి నా డెందంబు గుందుచుండు; నరవిందలోచన! సురవందిత! ముకుంద! యిందిరా సుందరీ రమణ! సరస్వతీరమణునకుం గరుణించిన సుజ్ఞానంబు ధరించు శక్తి నాకుం గలదేనిఁ గృపసేయుము! భవదీయశాసనంబు ధరియించి భూరిసంసార పారావారోత్తరణంబు సేయుదు నని విన్నవించి బహుభంగులం బ్రస్తుతించిన భగవంతుఁడును బ్రపన్నపారిజాతంబును నైన కృష్ణుండు పరతత్త్వ నిర్ణయంబు నెఱింగించిన. 156**

* దేవా! నీవు మొక్కవోని విజ్ఞానమే రూపుకట్టిన ఆత్మకలవాడవై కూడ అమాయకునిలా, అవివేకిలా, వ్యామోహానికి లొంగిన వానిలా ప్రవర్తిస్తావు. ఒక్కొక్కప్పుడు ఎక్కడో దాక్కొని ఉంటావు. ఈ సంగతులు గుర్తుకు వచ్చినప్పుడు నా స్వాంతం ఎంతో చింతాక్రాంత మవుతుంది. అరవింద నయనా! బృందారక బృందవందిత చరణా! ఇందిరా రమణా! ముకుందా! సరస్వతీ పతియైన చతుర్ముఖబ్రహ్మకు ప్రసాదించిన సుజ్ఞానాన్ని, దాన్ని పరిగ్రహించి భరించగల శక్తిసామర్థ్యాలు నాకంటూ ఉన్నట్లైతే, ఆ జ్ఞానాన్ని నాకు కూడా అనుగ్రహించు. దానిని గ్రహించి, మీ ఆజ్ఞ శిరసావహించి అపార సంసార సముద్రాన్ని తరిస్తాను అని విన్నవించుకొని ఎన్నో విధాల సన్నుతించగా-భగవంతుడూ, భక్తజన కల్పవృక్షమూ అయిన శ్రీకృష్ణుడు నాకు పరతత్త్వ సంబంధమైన పరిపూర్ణజ్ఞానాన్ని ప్రసాదించాడు.

**క. సరసిజలోచన కరుణా, పరిలబ్ధ జ్ఞాన కలిత భావుఁడ నగుటం**
**బరతత్త్వవేత్తనై త, చ్చరణ సరోజముల కెఱఁగి సమ్మతితోడన్. 157**

* కమల దళాక్షుని కరుణాకటాక్షం వల్ల సంప్రాప్తమైన జ్ఞానంతో మనస్సు నింపుకొన్నవాడనై పరతత్త్వాన్ని తెలుసు కొన్నాను. ఎంతో ఇష్టంగా ఆ స్వామి పాదపద్మాలకు ప్రణామం చేశాను.

**క. హరిపద జలరుహ విరహా, తురతన్ దుర్దాంత దుఃఖ తోయధిఁ గడవన్**
**వెర వేది తిరుగ వలసెను, సరసిజభవకల్ప విలయ సమయము దాఁకన్. 158**

* కృష్ణుని పాదపద్మాలతో కలిగిన ఎడబాటు నాకు తడబాటు కలిగించింది. భరింపరాని ఆ దుఃఖ సముద్రాన్ని తరించటానికి మరో ఉపాయం లేదు. కల్పాంత పర్యంతం నేనిలాగు తిరుగుతూ ఉండవలసిందే.

**వ. ఇట్లు దిరుగుచు. 159**

**మ. నర నారాయణ తాపసాశ్రమ పదౌన్నత్యంబునం బొల్చు భా**
**సుర మందార రసాల సాల వకు ళాశో కామ్ల పున్నాగ కే**
**సర జంబీర కదంబ నింబ కుట జాశ్వత్థ స్ఫురన్మల్లికా**
**కరవీర క్షితిజాభిరామ బదరీకాంతార సేవారతిన్. 160**

* నేను తిరిగి తిరిగి బదరికాశ్రమాన్ని దర్శించాలనే కుతూహలంతో బయలుదేరాను. ఆ పుణ్యభూమి పరమ తపోధనులైన నరనారాయణులు తపస్సు చేసిన పవిత్రాశ్రమంగా ప్రఖ్యాతి గన్నది. ఆ బదరీవనం అందమైన మందారాలు, తీయ మామిళ్ళు, పొగడలు, అశోకాలు, చింతలు, సురపొన్నలు, పొన్నలు, నిమ్మలు, కదంబాలు, వేములు, కొండమల్లెలు, రావులు, మల్లెలు, గన్నేరులు మొదలైన మంజుల తరునికుంజాలతో నిండి మనోహరంగా ఉంటుందిట.

**క. చనుచున్నవాఁడ నని ప, ల్కిన పలుకుల కులికి కళవళించుచు విదురుం**
**డనుపమశోకార్ణవమున, మునిఁగియు నిజయోగ సత్త్వమునఁ దరియించెన్. 161**

* నేను బదరికాశ్రమానికి వెళ్తూ ఉన్నాను అని ఉద్ధవుడు చెప్పగానే ఆ పలుకులు విని అదిరిపడి కలతచెంది విదురుడు అపారమైన దుఃఖసాగరంలో మునిగిపోయాడు. మళ్ళీ తనయోగసాధనవల్ల సంప్రాప్తమైన సత్త్వబలంతో గుండె నిబ్బరించుకొని మామూలు స్థితికి వచ్చాడు.

**వ. ఇట్లు విదురుండు శోకపావకునిం దన వివేకజలంబుల నార్చి యుద్ధవున కిట్లనియె. 162**

**మ. అనఘా! యుద్ధవ! నీకుఁ గృష్ణుఁ డసురేంద్రారాతి మన్నించి చె**
**ప్పిన యధ్యాత్మరహస్యతత్త్వ విమలాభిజ్ఞాన సారంబు బో**
**రన నన్నుం గరుణించి చెప్పినఁ గృతార్థత్వంబునం బొందెదన్**
**విను పుణ్యాత్ములు శిష్యసంఘముల నర్విం బ్రోవరే వెండియున్. 163**

* ఈ విధంగా విదురుడు శోకం అనే అనలాన్ని వివేకం అనే సలిలంతో చల్చార్చి, ఉద్ధవునితో ఇలా అన్నాడు. పరమ పావనుడవైన ఉద్ధవా! దైత్యమర్దనుడైన జనార్దనుడు అత్యాదరంతో నీకు అనుగ్రహించిన ఆ అధ్యాత్మ తత్త్వ రహస్యాన్ని, అతి పవిత్రమైన అభిజ్ఞానసారాన్ని అపార కృపాతిశయంతో ఇపుడే నాకు ఉపదేశించు. నా జన్మ సార్థకమౌతుంది. పుణ్యాత్ములైన గురువులు తమ శిష్యులను ధన్యాత్ములను చేయాలి కదా!

**క. భగవద్భక్తులు సుజనులు, దగ వెతిఁగి పరోపకారతాత్పర్య వివే**
**క గరిష్ఠులై చరింతురు, జగతిం బొగడొంది వృష్ణిసత్తమ! యెందున్. 164**

* వృష్ణివంశపావనా! ఈ భూవలయంలో పుణ్యమూర్తులైన భగవద్భక్తులు ధర్మానురక్తులై, పరోపకార పరాయణులై ప్రవర్తిస్తారు. అటువంటి వారిని ప్రజలు ప్రస్తుతిస్తారు.

క. అనవుడు నుద్ధవుఁ డవ్విదు, రున కిట్లను ననఘ! మునివరుఁడు సాక్షా ద్వి
ష్ణు నిభుండగు మైత్రేయుఁడు, దన మనమున మనుజగతి వదలఁ దలఁచి తగన్. 165

క. హరి మురభేదిఁ బరాపరుఁ, గరుణాకరుఁ దలఁచునట్టి ఘనుఁ డమ్ముని కుం
జరు కడ కేఁగిన నాతఁడు, గర మర్థిం దెలుపు సాత్త్విక జ్ఞానంబున్. 166

* ఆ మాటలు విని ఉద్ధవుడు విదురునితో ఇలా అన్నాడు. వినవయ్యా! విదురా! సంయమివరేణ్యుడూ, సాక్షాత్తూ విష్ణువుతో సమానుడూ అయిన మైత్రేయుడు తన మనుష్యదేహాన్ని వదిలిపెట్టడానికి మనస్సులో నిశ్చయించుకున్నాడు. ఆ మహానుభావుడు ఆ మురహరుని, ఆ పరాత్పరుని, ఆ కరుణాకరుని స్మరిస్తూ ఉన్నాడు. ఇప్పుడు నీవు ఆయన సన్నిధికి వెళ్ళు. తప్పకుండా ఆ మహాముని నీకు అత్యంత ప్రీతితో ఆధ్యాత్మిక తత్త్వజ్ఞానాన్ని అనుగ్రహిస్తాడు.

వ. అని యుద్ధవుండు విదురుం గూడి చని చని. 167

ఉ. ముందటఁ గాంచె నంత బుధ ముఖ్యుఁడు హల్లక ఫుల్లపద్మ ని
ష్యంద మరంద పాన విలసన్మదభృంగఁ, జలత్తరంగ, మా
కంద లవంగ లుంగ లతికాచయసంగ, సురాంగనాశ్రితా
నందితపుణ్యసంగ, యమునన్, భవభంగ, శుభాంగ నర్మిలిన్. 168

* ఈ విధంగా చెప్పి ఉద్ధవుడు విదురునితో కలిసి కొంత దూరం వెళ్ళారు. ఎదురుగుండా యమునానది కన్పించింది. ఆ నదిలో కలువపూలూ, తామరపూలూ వికసించివున్నాయి. ఆ పూలలో చిందే మకరందబిందువులను కమ్మగా కడుపునిండా త్రాగిన తుమ్మెదలు మైమరచి విహరిస్తున్నాయి. నదిలో తరంగాలు కదలాడుతున్నాయి. ఆ నది ఒడ్డున మామిడిచెట్లూ, లవంగ లతలూ, మాదీఫల వృక్షాలూ చిక్కగా చక్కగా క్రిక్కిరిసి ఉన్నాయి. ఆ పొదరిండ్లలో సురసుందరులు చరిస్తున్నారు. సంసార బంధాలను పోకార్చి పుణ్యాన్ని చేకూర్చే సుగుణాల దొంతి అయిన ఆ యమునా ప్రవంతి కన్నుల విందుగా కానవచ్చింది.

క. కని డాయ నేఁగి మోదం, బునఁ దత్సరిదమల పులిన భూములఁ దగ నా
దిన శేషము నివసించెను, వనజోదర పాదపద్మ వశమానసుఁడై. 169

* ఆ విధంగా దర్శన మిచ్చిన యమునా నదిని విదురునితో కూడిన ఉద్ధవుడు సమీపించాడు. ఆ నదిలోని అందమైన తెల్లని ఇసుక తిన్నెల మీద ఆనందంగా ఆసీనుడైనాడు. నందనందన చరణారవింద స్మరణ పరాయణుడై ఆ దినమంతా గడిపాడు.

క. మఱునాఁడు రేపకడ భా, సురపుణ్యుఁడు ఘనుఁడు మధు నిషూదన చరణ
స్మరణ క్రీడా కలితుఁడు, దరియించెన్ గలుష గహనదమునన్ యమునన్. 170

* మరుదినాన ఉదయాననే విదురునితో కలిసి యదునందన పదచింతన సంతోష తరంగాలలో ఓలలాడే అంతరంగం గల పుణ్యమూర్తి ఉద్ధవుడు పాపాలను రూపుమాపే యమునా తరంగిణిని దాటాడు.

**వ. ఇట్లుద్ధవుండు యమునానది నుత్తరించి బదరికాశ్రమంబునకుం జనియె ననిన విని రాజేంద్రుండు యోగీంద్రున కిట్లనియె. 171**

* ఉద్ధవుడు యమునానది దాటి బదరికాశ్రమానికి వెళ్ళాడు అని చెప్పగా విని రాజశ్రేష్ఠుడైన పరీక్షితుడు యోగిశ్రేష్ఠుడైన శ్రీశుకునితో ఇలా అన్నాడు.

**క. శౌరియు నతిరథ వరులు మ, హారథ సమరథులు యదు బలాధిపు లెల్లం**
**బోరి మృతిఁ బొంద నుద్ధవుఁ, డేరీతిన్ బ్రదికె నాకు నెఱిఁగింపు తగన్. 172**

* శ్రీకృష్ణుడు అవతారం చాలించాడు. అతిరథ మహారథ సమరథులైన యాదవ వీరు లందరూ తమలో తాము పోరాడుకొని ప్రాణాలు గోల్పోయారు. సర్వులూ చనిపోగా ఉద్ధవుడు మాత్రం ఎలా బ్రతుక గలిగాడు? ఈ విషయం నాకు వివరించండి.

**సీ. నావుడు రాజేంద్రునకు శుకయోగీంద్రుఁ డిట్లను మున్ను లోకేశుచేత**
**సంప్రార్థితుండైన జలరుహనాభుండు వసుమతిపై యదువంశమందు**
**నుదయించి తనుఁ దాన మదిలోనఁ జింతించి తెలివొంది యాత్మీయ కులవినాశ**
**మొనరించి తాను బంచోపనిషన్మయ మగు దివ్యదేహంబునందుఁ జెందఁ**

**తే. దలఁచి విజ్ఞాన తత్త్వంబు ధరణిమీఁదఁ, దాల్చి జనకోటి కెఱిఁగింపఁ దగిన ధీరుఁ**
**డుద్ధవుఁడు దక్క నితరులే నోప రితఁడు, నిర్జితేంద్రియుఁ డాత్మసన్నిభుఁ డటంచు. 173**

* ఈ విధంగా అడిగిన పరీక్షిత్తుతో శుకుడు ఇలా అన్నాడు. పూర్వం బ్రహ్మదేవుడు ప్రార్థింపగా పుండరీకాక్షుడు భూలోకంలో యదువంశంలో ఉదయించాడు. తనకు తాను మనస్సులో ఆలోచించి ఒక నిశ్చయానికి వచ్చినవాడై తన సంకల్పానుసారం తన కులాన్నంతా అంతం చేసివేశాడు. ఐదు ఉపనిషత్తులతో కూడిన దివ్యదేహాన్ని పొందదలచి తన తర్వాత విజ్ఞాన తత్త్వాన్ని అందుకొని లోకంలో జిజ్ఞాసువులైన ప్రజలకు తెలియజేయగల ప్రజ్ఞాశాలి, జితేంద్రియుడు, తనంతటివాడు- ఒక్క ఉద్ధవుడు తప్ప ఇంకొకడు లేడని భావించాడు.

**క. క్షితిపై నిలిపిన కతమున, నతనికి మృతి దొరక దయ్యె నవనీశ! రమా**
**పతి యభిమానము గలిగిన, యతి పుణ్యుఁడు సనియె బదరికాశ్రమమునకున్. 174**

* అందుచేతనే భూలోకంలో అతణ్ణి నిల్పాడు. ఈ కారణాల వల్ల అతనికి మృతి లేకుండాపోయింది. రాజా! రమావల్లభునిమీద ఆదరాభిమానాలు గల ఆ పరమ పుణ్యుడు ఉద్ధవుడు బదరికాశ్రమానికి వెళ్ళాడు.

**వ. అంత. 175**

**క. ఉద్ధవుఁ డరిగిన పిదప స, మిద్ధ పరిజ్ఞాను, సుజనహితు, మైత్రేయున్**
**వృద్ధజన సేవ్యుఁ, దాపస, వృద్ధశ్రవుఁ జూడఁగోరి విదురుఁడు గడఁకన్. 176**

ఈ విధంగా ఉద్ధవుడు వెళ్ళిపోయిన తర్వాత, విదురుడు దేదీప్యమానమైన జ్ఞానం కలవాడూ, సజ్జనులకు మిత్రుడైనవాడూ, మహనీయులకు సైతం సేవనీయుడూ, తాపసేంద్రుడూ అయిన మైత్రేయ మహామునిచంద్రుణ్ణి సందర్శించటానికి ముందుకు సాగాడు.

**వ. యమునానది దాఁటి కతిపయ ప్రయాణంబులఁ బుణ్యనదుల, హరిక్షేత్రంబులను దర్శించుచు నతిత్వరిత గమనంబున.** 177

* యమునానదిని దాటిన అనంతరం కొన్ని దినాలు ప్రయాణం సాగించి పుణ్యానదులనూ, పురుషోత్తమ క్షేత్రాలను దర్శించుకుంటూ బిరబిరా పురోగమించాడు.

**క. చని చని ముందటఁ గనుఁగొనె, ఘనపాప తమః పతంగఁ, గరుణాపాంగన్,**
**గనదుత్తుంగ తరంగన్, జనవరనుత బహుళపుణ్య సంగన్, గంగన్.** 178

* అలా వెళ్ళి వెళ్ళి విదురుడు ఉత్తుంగ తరంగాలతో పొంగి ప్రవహించే గంగానదిని కన్నుల విందుగా కనుగొన్నాడు. ఆ గంగానది పాపాలనే చీకట్లను సూర్యునివలె పారదోలుతుంది. కరుణారసం ప్రసరించే కడగంటి చూపులు కలది. పెద్దలైనవారు ప్రశంసించే అగణ్య పుణ్యాలకు ఆలవాలమైంది.

**క. అందు నరవింద సౌరభ, నందిత పవమాన ధూత నట దూర్మి పరి**
**స్పందిత కందళశీకర, సందోహ లసత్ప్రవాహ జల మజ్జనుఁడై.** 179

ఆ గంగానదిలో పద్మాల సువాసనలతో నిండిన గాలులు వీస్తున్నాయి. ఆ పద్మ సుగంధాలు వహించిన వాయువుల వల్ల కదలి నదీ తరంగాలు నాట్యం చేస్తున్నాయి. అలా ఎగిరిపడుతున్న కెరటాలు తుంపురులను విరజిమ్ముతున్నాయి. అటువంటి పరమపవిత్ర గంగాప్రవాహంలో విదురుడు స్నానం చేశాడు.

**సీ. ఘనసారరుచి వాలుకా సముదంచిత సైకత వేదికా స్థలము నందు**
**యమ నియ మాది యోగాంగ క్రియా నిష్ఠఁ బూని పద్మాసనాసీనుఁ డగుచు**
**హరిపాద సరసీరుహ న్యస్తచిత్తుఁడై బాహ్యేంద్రియ వ్యాప్తిఁ బాఱఁదోలి**
**సకల విద్వజ్జన స్తవనీయ సముచితాచార వ్రతోపవాసములఁ గ్రుస్సి**

**తే. యున్న పుణ్యాత్ము, విగత వయో వికారు, వినుత సంచారు, భువన పావన విహారు**
**యోగిజనగేయు, సత్కీర్తి భాగధేయు, నాశ్రితవిధేయు, మైత్రేయు నచటఁ గాంచె.** 180

* స్నానానంతరం విదురుడు ఎదురుగుండా యోగిజన స్తవనీయుడూ, సాధుజన భాగధేయుడూ, శ్రితజన విధేయుడూ అయిన మైత్రేయుణ్ణి చూచాడు. ఆ మహనీయుడు కప్పురము కుప్పపోసినట్లున్న, ఒకానొక ఇసుక తిప్పమీద పద్మాసనాసీనుడై ఉన్నాడు. యమ నియమాదులతో కూడిన అష్టాంగ యోగాన్ని నిష్ఠాగరిష్ఠుడై ఆచరిస్తున్నాడు. శ్రీకృష్ణుని చరణ సరోజాలపై చిత్తం లగ్నం చేసి ఉన్నాడు. ఇంద్రియాలను వశం చేసుకొని ఉన్నాడు. సమస్త విద్వాంసులకు సంస్తవనీయమైన సదాచారాలతో, వ్రతాలతో, ఉపవాసాలతో, ఆ మహాముని శరీరం సన్నబడి ఉన్నది. ఆయనలో వార్ధక్యలక్షణాలు ఏమీ కన్పించటం లేదు. అటువంటి పుణ్యాజీవనుడూ, భువనపావనుడూ అయిన మైత్రేయుడు విదురుని ముందు సాక్షాత్కరించాడు.

## -: విదురమైత్రేయ సంవాదము :-

వ. ఇట్లు గనుంగొని యమ్మునీంద్రుని పాదంబులకుం బ్రణమిల్లి ముకుళిత హస్తుండై యిట్లనియె 'మునీంద్రా! లోకంబున సకల జనంబులు మనంబులు ఘనంబులగు సౌఖ్యంబు లందం దలంచి తత్ఫలప్రాప్తి హేతువులైన కర్మంబు లాచరించి దైవోపహతులై తత్కర్మంబులచేత నిష్ఫలారంభు లగుదురు; కర్మంబులు బంధకంబులును దుఃఖహేతువులునుం గాని సౌఖ్యదాయకంబులై పాప నివృత్తి జేయనోప; వది యట్లుండె; భూరి దుఃఖానుసారంబైవ సంసార చక్రంబు నందుఁ బరిభ్రమించుచుం గామవిమోహితులై పూర్వకర్మానుగతంబులైన శరీరంబులు దాల్చుచుం జచ్చుచు మరలం బుట్టుచు నెంతకాలంబునకుఁ బాపనివృత్తిఁ గానక మాతృయౌవన వన కుఠారులై జనియించి వర్తించు మూఢాత్ములం, బశుప్రాయుల రక్షించుకొఱకుఁగాదె నారాయణ పరాయణులైన మీవంటి పుణ్యాత్ములు లోకంబునం జరియించుట; యదియునుం గాక. 181

* విదురుడు మైత్రేయుని పాదాలకు నమస్కారం చేసి, చేతులు జోడించి ఇట్లా అన్నాడు. "మునీంద్రా! లోకు లంతా తమతమ మనస్సులలో ఎల్లప్పుడూ సుఖాన్నే కోరుకుంటారు. దానిని పొందడానికై ఎన్నోకర్మలు చేస్తారు. దైవం అనుకూలించక పోవడంతో తమ ప్రయత్నాలన్నీ వ్యర్థమైపోయి వాటి ఫలాన్ని అందుకోలేక పోతున్నారు. ఈ కర్మలన్నీ ప్రతిబంధకాలు. అంతేగాక దుఃఖాన్ని కల్గిస్తాయే గాని సుఖాన్నిచ్చి పాపాన్ని పోగొట్టలేవు. అంతేకాక ఈ లోకులు దురంత దుఃఖాలకు కారణమైన సంసారం అనే చక్రంలో తగుల్కొని గిరగిర తిరుగుతూ ఉంటారు. కోర్కెల వ్యామోహంలో చిక్కి పూర్వం తాము చేసిన కర్మఫలాలకు తగినట్టి శరీరాలను పొందుతూ ఉంటారు. ఇలా చస్తూ, పుడుతూ ఎంతో కాలానికిగాని పాపాన్ని పోగొట్టుకొనే మార్గం తెలుసుకోలేరు. తల్లి యౌవనానికి గొడ్డలిపెట్టులాంటివారై పుట్టే ఇటువంటి పశుప్రాయులైన బుద్ధిహీనులను ఉద్ధరించడానికి గదా తమ వంటి పుణ్యాత్ములు శ్రీమన్నారాయణ సేవాపరాయణులై లోకంలో తిరుగుతూ ఉంటారు!

మ. అవివేకానుగత స్వకార్య జలవేలాకీర్ణమై మిత్ర బం
ధు వధూ పుత్ర జలగ్రహోగ్రయుతమై దుర్దాంత మైనట్టి దు
ర్భవ పాథోధిఁ దరింపలేరు హరిసంబంధ క్రియాలోల భా
గవతానుగ్రహ నావ లేని యధముల్ కారుణ్య సంధాయకా! 182

* ఓ కరుణామయా! భగవత్కార్య నిర్వాహకులై సదా భగవంతుని యందే ఆసక్తులైన దైవభక్తుల అనుగ్రహం అనే నావ లేకుండా ఈ సంసార సముద్రాన్ని దాటటానికి ప్రయత్నించడం పరమ మూర్ఖత. భయంకరమైన ఈ సంసార సాగరానికి అవివేకమే జలం. స్వార్థ పరత్వమే చెలియలి కట్ట. మిత్రులూ, బంధువులూ, భార్యాపుత్రులే జలచరాలు. ఇది దురంతమైనది.

క. మునినాథచంద్ర! ననుఁ గై, కొని కాచు తలంపు బుద్ధిఁ గూడిన యేనిన్
వినుము మదీప్సిత మది నా, చనవునఁ గావింపవయ్య సజ్జన తిలకా! 183

* సౌజన్యసాంద్రుడవైన ఓ మునిచంద్రా! నన్ను మన్నించి రక్షించే ఉద్దేశం నీకు ఉన్నట్లయితే నా విన్నపం ఆలకించు. నా మనస్సులోని కోరిక తీర్చు.

**వ. అని వెండియు విదురుండు మైత్రేయుం జూచి మునీంద్రా! త్రిగుణాత్మకమాయా నియంత యగు భగవంతుండు స్వతంత్రుండయ్యు నవతరించి యే యే యవతారంబులనే కర్మంబు లాచరించె? నదియు నిష్క్రియుండగు నీశుండు మొదలం బ్రపంచంబు నే విధంబునం గల్పించె? నే పగిదిం బాలించె? మఱియు నీ విశ్వంబు నాత్మీయ హృదయాకాశ గతముం జేసి నివృత్తవృత్తి యగుచు యోగమాయయం దెట్లు వసియించె? బ్రహ్మాండంబునందు నే లీలవర్తించె? నందు బ్రహ్మాదిరూపంబులం బొంది బహుప్రకారంబుల నెట్లు క్రీడించె? భూసుర గోసురాదులఁ బరిరక్షించుటకై మత్స్యాద్యవతారంబులు ధరియించి యే యే ప్రయోజనంబులం దీర్చెఁ? బయోరుహ గర్భాండ కటాహాంతర్గతంబులై లోకపాల సహితంబులైన లోకంబులను లోకాలోక పర్వతంబుల బహిర్భాగంబులును నేయే తత్త్వభేదంబులను నెత్తెఱంగునం బుట్టించె? నందు బ్రతీతంబగు జీవకోటి యెవ్వనిం గొల్చి బ్రదుకు? జనులకు గర్మ నామ రూప భేదంబు లెట్లు నిర్దేశించె? నింతయు సవిస్తరంబుగా వివరింపు; ముత్తమశ్లోకమౌళి మండనుండును యోగేశ్వరుండును నైన పుండరీకాక్షుని చరిత్ర శ్రవణంబునం గాని జన్మమరణాది సకల దుఃఖాకరంబులును, దుష్కర్మప్రాప్తంబులును నగు భవబంధంబులు దెగవని వెండియు నిట్లనియె. 184**

* అని మళ్లీ విదురుడు మైత్రేయుణ్ణి చూచి ఇట్లా అన్నాడు- మునీంద్రా! సత్త్వము రజస్సు, తమస్సు అనబడే మూడు గుణాలతో కూడిన మాకు నియామకుడైన భగవంతుడు సర్వస్వతంత్రుడు. అటువంటివాడు ఎందుకు అవతారా లెత్తాడు. ఏ యే అవతారాలలో ఏ యే సత్కార్యాలు సాధించాడు? క్రియారహితుడైన ఈశ్వరుడు ఆదిలో ఈ ప్రపంచాన్ని ఏ విధంగా సృష్టించాడు? ఏ విధంగా పరిపాలించాడు? మళ్లీ ఈ విశ్వాన్ని తన హృదయాకాశంలో ఎలా విలీనం చేసుకున్నాడు? ఏ వ్యాపారాలూ లేనివాడు ఏ విధంగా యోగమాయలో ఉన్నాడు? తను సృష్టించిన బ్రహ్మాండంలో ఎట్లా సంచరించాడు? బ్రహ్మ, విష్ణు, మహేశ్వరాది రూపాలు పొంది, ఎట్లా అనేక విధాలుగా విహరించాడు? బ్రాహ్మణులనూ, గోవులనూ, దేవతలనూ రక్షించడానికై మత్స్యావతారం మొదలైన అవతారా లెత్తి ఏ యే ప్రయోజనాలు నెరవేర్చాడు? బ్రహ్మాండభాండం లోపల ఉన్న దిక్పాలకులతో కూడిన లోకాలనూ, లోకాలోక పర్వతం బయటి భాగాలను ఏయే తత్త్వ భేదాలతో ఏ విధంగా పుట్టించాడు? ఆ సృష్టిలో నివసించే జీవకోటి ఎవ్వనిని సేవించి జీవిస్తూ ఉంటుంది? జీవులకు కర్మ, నామ, రూప భేదాలు ఎట్లా నిర్ణయింపబడినాయి? ఇదంతా నాకు చక్కగా వివరంగా చెప్పు. పుణ్యమూర్తులకు శిరోభూషణమై యోగేశ్వరులకు అధీశ్వరుడైన శ్రీమన్నారాయణుని పవిత్ర చరిత్ర వింటేనేకాని జననమరణాది సకల దుఃఖాలకూ, సమస్త దుష్కార్యాలకూ అనుబంధాలైన ఈ సంసార బంధాలు తెగవు అని మళ్లీ ఇట్లా అన్నాడు.

తర. సతతమున్ సరసీరుహోదర సత్కథామృత పూరమున్
శ్రుతి పుటాంజలి చేత నిమ్ముల జుఱ్ఱియుం దనివోదు భా
రత కథామిష మూని విష్ణుఁ బరాశరప్రియసూతి స
న్మతి నుతించిన చోట సన్మునినాథ! నామది నుబ్బుదున్. 185

* ఓ మునీంద్రా! శ్రీమన్నారాయణుని సత్కథలనే అమృతాన్ని చెవులనే దోసిళ్ళతో ఎంతగా జుర్రుకొన్నా తనివి తీరదు. భరతవంశీయుల చరిత్ర ఐన భారతంలో కూడా సందర్భానుసారంగా వ్యాసులవారు ఎక్కడైతే శ్రీమహావిష్ణువును నుతించారో అక్కడ నామనస్సు ఎంతో ఉబ్బి తబ్బిబ్బైపోతుంది.

క. ఇతర కథాకర్ణనముల, నతి హేయత నొందెఁ జిత్త మనఘాత్మ! రమా
పతి చరితామృత రతి సం, సృతి వేదన లెల్లఁ బాయఁజేయు మునీంద్రా! 186

* ఓ పుణ్యాత్ముడా! ఇతర కథలు విని విని నా మనస్సుకు చాల వెగటు కలిగింది, ఓ మునినాథా! రమానాథుడైన శ్రీమన్నారాయణుని కథాసుధాపూరాన్ని తనివితీరా సేవించడం వల్లనే సంసార బాధలు దూరంగా తొలగిపోతాయి.

తే. భూరి విజ్ఞాన నిధులగు నారదాది, నిర్మలాత్ముల కయిన వర్ణింపరాని
హరికథామృత పానంబునందు, విసివి యొల్ల ననువాడెపో వెఱ్ఱిగొల్లఁ డనఘ! 187

* ఓ పుణ్య పురుషా! విశేషమైన విజ్ఞానానికి నిధులవంటివారు నారదాది మహనీయులు. అటువంటి నిర్మల హృదయులకు కూడా వర్ణింపశక్యము కానివి విష్ణుకథలు. అటువంటి హరికథాసుధారసాన్ని త్రాగి విసుగుచెంది 'ఇక వద్దు' అనే వాడే పనికిమాలిన మొద్దు.

వ. అదియునుం గాక. 188

సీ. అరవిందనాభుని యపరావతారమై జనన మొందిన పరాశర సుతుండు
చతురవర్ణాశ్రమాచార ధర్మంబులు రవణింప లోకవిడంబనంబు
లగు గ్రామ్యకథలు పెక్కర్థిఁ గల్పించుచు హరికథావర్ణన మందులోన
నించుకించుక గాని యేర్పడఁ జెప్పమి నంచిత విజ్ఞాన మాత్మ నిలుప

తే. కున్నఁ జింతించి మఱి నారదోపదిష్టుఁ, డగుచు హరివర్ణనామృత మాత్మఁ గ్రోలి
విమల సుజ్ఞాననిధి యన వినుతి కెక్కి, ధన్యుఁ డయ్యెను లోకైకమాన్యుఁ డగుచు. 189

* అదీ కాకుండా శ్రీమన్నారాయణుని అవతారమైనవ్యాసుడు నాలుగు వర్ణాల, నాలుగు ఆశ్రమాల ఆచార ధర్మాలను లోకానికి చాటి చెప్పదలచినవాడై పురాణాలలో పామర కథలు ఎన్నెన్నో కల్పించవలసి వచ్చింది. అందువల్ల ఆ గ్రంథాలలో హరికథలను అక్కడక్కడా కొంచెం కొంచెంగా మాత్రమే అభివర్ణించాడు. భగవద్విజ్ఞానాన్ని ఆత్మగతం చేసుకోలేనందుకు ఎంతో చింతించాడు. చివరకు నారదమహర్షి ఉపదేశంతో నారాయణ కథాసుధాపూరాన్ని తనివితీరా త్రాగి ధన్యుడై, సుధీజనమూర్ధన్యుడై, సకలలోక సమ్మాన్యుడైనాడు.

వ. కావున. 190

క. సరసిరుహోదరు మంగళ, చరితామృత మాత్మఁ గ్రోలు జనుఁ డితరకథా
గరళముఁ గ్రోలునె? హరి సం, స్మరణము జీవులకు నఖిల సౌఖ్యద మనఘా! 191

* కాబట్టి ఓ పుణ్యాత్ముడా! విశ్వకల్యాణకరమైన విష్ణుదేవుని చరితామృతాన్ని స్వేచ్ఛగా సేవించే మానవునికి మరో కథలు విషంతో సమానం. శ్రీమన్నారాయణ ధ్యానం సకల జీవులకూ సమస్త సౌఖ్యనిధానం.

క. శ్రీవనితాధిప! నామ క, థా విముఖుల కిహముఁ బరము దవ్వై పిదపం
బోవుదురు నరకమునకున్, వారిరి నే వారిఁ జూచి వగతు మునీంద్రా! 192

* ఓ మునీంద్రా! శ్రీమన్నారాయణుని నామస్మరణానికీ, కథాశ్రవణానికి విముఖులైన వారు ఈ లోకానికీ, పరలోకానికీ- రెంటికీ కాకుండా చెడతారు. నరకంలో పడతారు. అట్లాంటి వాళ్ళను చూచి నేను ఎంతగానో బాధపడతాను.

క. ఏ నరుఁడే నొక నిమిషం, బైన వృథావాదగతిని హరిపదకమల
ధ్యానానందుఁడు గాఁడే, నా నరునకు నాయు వల్పమగు మునినాథా! 193

* ఓ మునిశ్రేష్ఠా! ఎవడైనా సరే పనికిమాలిన వాదాలలో పడి ఒక్క నిముసమైన హరిపాదపద్మాలను స్మరించి ఆనందించడో అట్టివాని ఆయుస్సు అల్పమైపోతుంది.

చ. మృదుగతిఁ బువ్వుఁదేనియ రమించుచుఁ బానము సేయఁ బాఱు ష
ట్పదమునుబోలి యార్తజన బాంధవు విశ్వభవస్థితివ్యయా
స్పద మహితావతారుఁడగు పంకరుహోదరు నిత్యమంగళ
ప్రద గుణకీర్తనామృతముఁ బాయక గ్రోలెదఁ జెప్పవే దయన్. 194

* ఆపన్నులకు ఆప్తబాంధవుడూ, విశ్వానికి సంబంధించిన సృష్టి స్థితి లయాలకు కారణభూతుడూ, అవతారపురుషుడూ, అయిన శ్రీమన్నారాయణుని కల్యాణగుణ సంకీర్తనం అనే అమృతాన్ని మృదుమధురంగా పువ్వులలోని తేనెను గ్రోలే తుమ్మెదవలెనే నేను తనివి తీరా త్రాగుతాను. దయచేసి చెప్పుస్వామి!

క. అని విదురుఁడు మైత్రేయుం, డను మునినాయకుని నడిగె నని వేదవ్యా
సుని తనయుం డభిమన్యుని, తనయునకుం జెప్పి మఱియుఁ దగ నిట్లనియెన్. 195

* ఈ విధంగా విదురుడు మునిశ్రేష్ఠుడైన మైత్రేయుణ్ణి అడిగాడు అని శుకుడు పరీక్షిత్తునకు చెప్పి మళ్ళీ ఇలా అన్నాడు.

వ. ఇట్లు విదురుండు మైత్రేయు నడిగిన నతం డతనిం గని యతిమృదుమధుర వచన రచనుండై యిట్లనియె: ననఘా! కృష్ణకథాశ్రవణ తత్పరుండవై నీవ నన్నడిగితివి గావున భద్రంబయ్యెః నీవు

**భగవద్భక్తుండవు గావున హరి కథాసక్తుండ వగుట విచిత్రంబు గా: దదియును గాక మాండవ్యు శాపంబున సాత్యవతేయువలన భ్రాతృక్షేత్రంబున శూద్రయోనిం బుట్టినట్టి ప్రజాసంయమనుండ వగు యముండవు: నారాయణునకుం బ్రియతముండవు గావునఁ గృష్ణుండు నిర్యాణకాలంబునం దన సన్నిధికిం జనిన నన్ను డాయం జీరి విజ్ఞానం బెల్ల నుపదేశించి నీకు నెఱింగింపు మని యానతిచ్చుటంజేసి యవశ్యంబును నీకు నెఱింగింతు; దత్తావధానుండవై వినుము. 196**

* ఈ విధంగా విదురుడు మైత్రేయుణ్ణి అడిగాడు. అప్పుడు ఆ మహర్షి విదురుణ్ణి చూచి మిక్కిలి మృదుమధుర వాక్యాలతో ఇట్లా అన్నాడు. ఓ పుణ్యాత్ముడా! వీనులవిందుగా విష్ణుకథలు వినాలన్న ఆసక్తితో నన్ను అడిగావు. మంచిది. నీవు భగవంతునియందు భక్తి గలవాడవు. కాబట్టి హరి కథలపై నీకు ఆసక్తి ఉండడంలో ఆశ్చర్యం లేదు. అంతేకాక నీవు సాక్షాత్తూ  సమవర్తియై ప్రజలను శాసించే యముడవు. మాండవ్యమహాముని శాపంవల్ల వ్యాసభగవానునకు శూద్ర స్త్రీయందు జన్మించావు. శ్రీమన్నారాయణుని ప్రేమకు పాత్రుడైనవాడివి. అందుకనే కృష్ణుడు తన అవసాన సమయంలో సమీపానికి వెళ్ళిన నన్ను చేరపిలిచి విజ్ఞానాన్నంతా బోధించాడు. దానిని నీకు చెప్పవలసిందిగా నన్ను ఆదేశించాడు. ఆయన ఆనతి ప్రకారం అదంతా నీకు తప్పకుండా చెబుతాను. ఏకాగ్రమైన మనస్సుతో ఆకర్ణించు.

**క. వనజాక్ష యోగమాయా, జనితం బగు విశ్వ జనన సంస్థాన వినా**
**శనముల తెఱఁ గెఱిఁగింపుచు, ననఘా! విష్ణుని మహత్త్వ మభివర్ణింతున్. 197**

* ఓ పుణ్యాత్ముడా విష్ణుదేవుని యోగమాయాప్రభావం వల్ల ప్రాదుర్భవించిన ఈ ప్రపంచం పుట్టుకనూ, అభివృద్ధినీ, వినాశాన్నీ తెల్పుతూ మహావిష్ణువు మహిమలను అభివర్ణిస్తాను. ఆలకించు:

**సీ. సకలజీవులకెల్లఁ బ్రకట దేహము నాత్మ నాథుండుఁ బరుఁడు నానావిధైక**
**మత్యుపలక్షణ మహితుండు నగు భగవంతుండు సృష్టిపూర్వంబునందు**
**నాత్మీయ  మాయా లయంబు నొందిన విశ్వగర్భుఁడై తాన యొక్కటి వెలుంగు**
**పరమాత్మఁ డభవుం డుపద్రష్ట యయ్యు వస్త్వంతరపరిశూన్యుఁ డగుటఁజేసి**

**తే. ద్రష్ట గాకుండు మాయా ప్రధానశక్తి, నతుల చిచ్ఛక్తి గలవాఁడు నగుచుఁ దన్ను**
**లేని వానిఁగఁ జిత్తంబులోనఁ దలఁచి, ద్రష్ట యగుఁ దన భువన నిర్మాణ వాంఛ. 198**

* ఈ విశ్వంలోగల సమస్త జీవుల దేహాలూ భగవంతుని స్వరూపాలు. సమస్తమైన ఆత్మలూ ఆయనే. ఆయనే సర్వానికీ ప్రభువు. పరాత్పరుడు. అనేకవిధా లయిన  బుద్ధులకు ఉపలక్షణమైన మహానుభావుడు. అటువంటి భగవంతుడు తన మాయవల్ల తనలోనే లీనమైన ప్రపంచాన్ని, తన గర్భంలో ధరించి ఒక్కడుగా వెలుగుతూ ఉంటాడు. ఆ పరమాత్మ పుట్టుక లేనివాడు. సమస్తమూ పై నుండి చూచేవా డయినప్పటికీ వేరే మరే వస్తువూ లేకుండా తానే సర్వమూ అయినప్పుడు ఇక ద్రష్ట కాడు. కానీ-మాయాప్రధాన శక్తి కలవాడై ప్రపంచాన్ని నిర్మించే కోరికతో గొప్ప చిచ్ఛక్తి గల్గి తనను తాను లేనివాడుగా మనస్సులో భావించు కొంటాడు. సృష్టికి ఉపక్రమించిన పిమ్మట ద్రష్ట అవుతాడు.

తే. బుద్ధిఁ దోఁచిన న మ్మహాపురుషవరుఁడు, కార్య కారణ రూపమై ఘనత కెక్కి
భూరి మాయాభిధాన విస్ఫురిత శక్తి, వినుత కెక్కినయట్టి యవిద్య యందు. 199

* ఈ విధంగా భగవంతునికి సృష్టి చేయాలనే సంకల్పం కలగగానే కార్యకారణాల రూపమై ఘనత వహించినదై మహత్తరమైన మాయాశక్తిగా ప్రకాశించే అవిద్య రూపొందుతుంది.

క. పురుషాకృతి నాత్మాంశ, స్ఫురణము గలశక్తి నిలిపి పురుషోత్తముఁ డీ
శ్వరుఁ డభవుం డజుఁడు, నిజో, దర సంస్థిత విశ్వ మపుడు దగఁ బుట్టించెన్. 200

* ఈ విధంగా తన అంశనుండి ఆవిర్భవించిన మాయను తన శక్తిగా ప్రతిష్ఠించి, పుట్టుక లేనివాడూ పురుషోత్తముడూ ఐన ఈశ్వరుడు తన కడుపులో ఉన్న విశ్వాన్ని ఉద్భవింపజేశాడు.

సీ. ధృతిఁ బూని కాలచోదితము నవ్యక్తంబుఁ బ్రకృతియు నను పేళ్లఁ బరఁగు మాయ
వలన మహత్తత్త్వ మెలమిఁ బుట్టించె మాయాంశ కాలాది గుణాత్మకంబు
నైన మహత్తత్త్వ మచ్యుత దృగ్గోచర మగుచు విశ్వనిర్మాణ వాంఛ
నందుటఁజేసి రూపాంతరంబునఁ బొంది నట్టి మహత్తత్త్వమందు నోలిఁ

తే. గార్యకారణ కర్త్రాత్మకత్వమైన, మహిత భూతేంద్రియక మనోమయ మనంగఁ
దగు నహంకారతత్త్వ ముత్పన్న మయ్యెఁ, గోరి సత్త్వరజస్తమోగుణక మగుచు.

201

* కాలచోదితము- అవ్యక్తము- ప్రకృతి- అనే పేర్లతో వ్యవహృతమైన తన మాయవల్ల మహత్తత్త్వాన్ని పుట్టించాడు. మాయకు సంబంధించినదీ, కాలము మొదలైన గుణాలు కలదీ అయిన ఈ మహత్తత్త్వం భగవంతుని కంటికి మాత్రమే కనిపిస్తూ ప్రపంచాన్ని నిర్మించాలనే కోరిక కల్గడంతో ఇంకొక రూపాన్ని పొందింది. రూపాంతరం పొందిన అటువంటి మహత్తత్త్వంలో నుంచి క్రమంగా కారణం, కార్యం, కర్త అనే భేదాలు ఏర్పడి అవి వరుసగా పంచభూతాలు- ఇంద్రియాలు- మనస్సు అను రూపములుగా గోచరించాయి. ఈమూడింటితో సత్త్వరజస్తమోగుణాలతో కూడిన అహంకారం ఏర్పడింది.

వ. వెండియు రూపాంతరంబులం బొందుచున్న సాత్త్వికాహంకారంబు వలన మనంబును, వైకారిక కార్యభూతంబులైన దేవతా గణంబులును సంభవించె. ఇంద్రియాధిష్ఠాతలైన వాని వలన శబ్దంబు పూర్వంబునఁ బ్రకాశం బగుటంజేసి జ్ఞానేంద్రియంబులైన త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణంబులును, కర్మేంద్రియంబు లయిన వాక్పాణిపాద పాయూపస్థములును, తైజసాహంకారంబున నుత్పన్నంబు లయ్యెఁ: దామసాహంకారంబువలన శబ్దస్పర్శరూప రసగంధంబు లుదయించె: నందు శబ్దంబు నిజగుణంబైన శబ్దంబు వలన నాకాశంబుఁ బుట్టించె. గగనంబు కాల మాయాంశ యోగంబునం బుండరీకాక్షు నిరీక్షణంబున స్పర్శతన్మాత్రంబు వలన వాయువుం గలిగించె; బవనుండు నభోబలంబున రూపతన్మాత్రంబువలన లోకలోచనంబైన తేజంబు నుత్పాదించెఁ: దేజంబు కాల మాయాంశ యోగంబున నుత్తమశ్లోకుని విలోకనంబునఁ బవమానయుక్తం బగుచు రసతన్మాత్రంబు

వలన నంబువులం బుట్టించె; సలిలంబు కాల మాయాంశయోగంబునం బరమేశ్వరానుగ్రహంబు గలిగి తేజోయుక్తంబైన గంధగుణంబు వలనఁ బృథివిం గలిగించె; నందు గగనంబునకు శబ్దంబును, వాయువునకు శబ్దస్పర్శంబులును. దేజంబునకు శబ్దస్పర్శరూపంబులును, సలిలంబునకు శబ్దస్పర్శరూపరసంబులును, బృథివికి శబ్దస్పర్శరూపరస గంధంబులును గుణంబులై యుండుఁ; గాల మాయాంశ లింగంబులు గలిగి మహదాద్యభిమానంబును నొందిన దేవతలు విష్ణుకళాకలితు లగుదు; రట్టి మహదాదితత్త్వంబు లైక్యంబు సాలమిం బ్రపంచంబులు కల్పింప సమర్థంబులు గాక కృతాంజలులై యోగేశ్వరేశ్వరుండైన నారాయణు నిట్లని స్తుతియించె. 202

* మార్పు చెందుతున్న సాత్త్వికాహంకారం వల్ల మనస్సూ, ఇంద్రియాల అధిదేవతలైన దేవతా గణాలూ ఉదయించాయి. రాజసాహంకారం వల్ల జ్ఞానేంద్రియాలైన చర్మం, కన్నులు, చెవులు, నాలుక, ముక్కు; కర్మేంద్రియాలైన వాక్కు, హస్తాలు పాదాలు, పాయువు, ఉపస్థ-జన్మించాయి. తామసాహంకారం వల్ల శబ్దం, స్పర్శం, రూపం, రసం, గంధం అనే పంచ తన్మాత్రలు ఆవిర్భవించాయి. వీనిలో శబ్దం వల్ల ఆకాశం పుట్టింది. ఆకాశం కాలమాయాంశ యోగంతో పుండరీకాక్షుని నిరీక్షణంతో స్పర్శతన్మాత్రవల్ల వాయువును పుట్టించింది. వాయువు ఆకాశంతో కలిసి కాలమాయాంశ యోగంతో పుండరీకాక్షుని నిరీక్షణంతో రూపతన్మాత్రవల్ల లోకలోచనమైన తేజస్సును పుట్టించింది. తేజస్సు వాయువుతో కలిసి కాలమాయాంశ యోగంతో పుండరీకాక్షుని నిరీక్షణంతో రసతన్మాత్రవల్ల జలాన్ని కలిగించింది. జలం తేజస్సుతో కలిసి కాల మాయాంశయోగంతో పుండరీకాక్షుని నిరీక్షణంతో గంధతన్మాత్రవల్ల పృథ్విని పుట్టించింది.

ఈ విధంగా ఏర్పడ్డ పంచభూతాలలో ఆకాశానికి గుణం శబ్దం; వాయువునకు శబ్ద స్పర్శాలు గుణాలు; తేజస్సుకు శబ్దస్పర్శ రూపాలు గుణాలు; జలానికి శబ్దస్పర్శరూపరసాలు గుణాలు; పృథ్వికి శబ్ద స్పర్శరూపరస గంధాలు గుణాలై ఉంటాయి. కాల మాయాంశ లింగ స్వరూపులై మహదాదులందు అభిమానం గల దేవతలు విష్ణుదేవుని కళలే. ఐనా మహదాది తత్త్వాలూ, పంచభూతాలూ, పంచేంద్రియాలూ, పంచతన్మాత్రలూ వేరువేరుగా ఉండి అన్నీ సమైక్యం కాకపోవడంతో ప్రపంచాన్ని సృష్టించడానికి సామర్థ్యం వానికి చాలలేదు. అందువల్ల అందరూ చేతులు జోడించి యోగేశ్వరులకు ఈశ్వరుడైన శ్రీమన్నారాయణుని ఇట్లా స్తోత్రం చేశారు-

## దండకము

శ్రీనాథనాథా! జగన్నాథ! నమ్రైకరక్షా! విపక్షక్షమాభృత్సహస్రాక్ష! నీరేజపత్రేక్షణా! దేవదేవా! భవ ద్దాసవర్గోపతాపంబులం బాపఁగా నోపు దివ్యాతపత్రంబు నాఁబొల్చు యుష్మత్పదాంభోజ మూలంబు పుణ్యాలవాలంబుగాఁ బొంది యోగీంద్రు లుద్దామ సంసార తాపంబులం బోవఁగా మీటి వర్తింతురో తండ్రి! యీశా! సమస్తాఘ నిర్నాశ! యీ విశ్వమందెల్ల జీవుల్ భవోదగ్ర దుర్వార తాపత్రయాభీల దావాగ్నిచేఁ గ్రాఁగి దుఃఖాబ్ధిలోఁ దోఁగి యే కర్మమున్ ధర్మముం బొందఁగా లేక సంసారచక్రంబునందుం బరిభ్రామ్యమాణాత్ములై యుందు; ర మ్మూఢచేతస్కులం జెప్పఁగా నేల యో దేవ! విజ్ఞాన దీపాంకురంబైన నీ పాదపంకేరుహచ్ఛాయఁ బ్రాపింతు; మబ్జాక్ష! సన్మౌనిసంఘంబు లైకాంతిక

స్వాంతతం బేర్చి దుర్దాంత పాపౌఘనిర్ణాశకాంబుప్రవాహాభ్ర గంగా నివాసంబు గా నొప్పు నీ పాదయుగ్మంబు యుష్మన్ముఖాంభోజ నీడోద్గతం బైన వేదాండజ శ్రేణిచేతన్ గవేషించి సంప్రాప్తులై యుందు; రో నాథ! వైరాగ్యశక్తిస్ఫుట జ్ఞాన బోధాత్ములై నట్టి ధీరోత్తముల్ నిత్య నైర్మల్య భవ్యాంతరంగంబులం దే పరంజ్యోతి పాదాబ్జ పీఠంబు గీలించి కైవల్య సంప్రాప్తులై రట్టి నిర్వాణ మూర్తిం బ్రశంసింతు; మింద్రాది వంద్యా! ముకుందా! సమస్తంబుఁ గల్పింపఁ బాలింపఁ దూలింపఁ గాఁ; బెక్కు దివ్యావతారంబులం బొందు నీ పాద పంకేరుహ ధ్యానపారీణ సుస్వాంతులై యొప్పు భక్తాళికిన్ మోక్షదం బైన మీ పాద కంజాతముల్ గొల్తు; మీశా! రమాధీశ! పుత్రాంగనా మిత్ర సంబంధ బంధంబులం జెంది నిత్యంబు దుష్ట క్రియా లోలురై దేహగేహంబుం దోలి వర్తించు దుర్మానవ శ్రేణులం దంతరాత్ముండవై యుండియున్ దూరమై తోఁచు నీ పాదపద్మంబు లర్చింతు; మో దేవ! బాహ్యేంద్రియ వ్యాప్తి నుద్వృత్తులైనట్టి మూఢాత్ము లధ్యాత్మ తత్త్వ ప్రభావాఢ్యులై నీ పదాబ్జాతవిన్యాస లక్ష్మీ కళావాసముం గన్న యయ్యుత్తమశ్లోకులం గానఁగాఁ జాల; రప్పుణ్యులా దుష్టులం జూడఁగా నొల్ల రంభోధిరాట్కన్యకాకాంత! వేదాంత శుద్ధాంత సిద్ధాంతమై యొప్పు నీ సత్కథాపార చంచత్సుధాసారపూరంబులం గ్రోలి, సౌఖ్యోన్నతిన్ సోలి, ధీయుక్తులై వ్రాలి, తాపంబులం దోలి, మోదంబులం దేలి, సంపన్నులై మన్న నిత్యప్రసన్నుల్ మహోత్కంఠతం బేర్చి వైకుంఠ ధామంబు నల్పక్రియాలోలురై కాంతు; రద్దివ్యవాసైక సంప్రాప్తికిం గోరుచున్నార; మోదేవ! వైరాగ్య విజ్ఞాన బోధాత్మ యోగక్రియారూఢి నంతర్బహిర్వ్యాప్తిఁ జాలించి శుద్ధాంతరంగంబు గావించి హృత్పద్మవాసుండవై చిన్మయాకారమై యున్న నీ యున్న తానంత తేజో విలాసోల్లసన్మూర్తిఁ జిత్తంబులం జేర్చి యానంద లోలాత్మతం బొల్చు యోగీశ్వర శ్రేణికిం దావకీనానుకంపానులబ్ధిస్ఫుటజ్ఞానముం గల్గుటం జేసి యాయాసముం జెంద; రో దేవతాచక్రవర్తీ! సదానందమూర్తీ! జగద్గీతకీర్తీ! లసద్భూతవర్తీ! భవద్దాసులైనట్టి మమ్మున్ జగత్కల్పనాసక్త చిత్తుండవై నీవు త్రైగుణ్యవిస్ఫూర్తిఁ బుట్టించినం బుట్టుటే కాక నీ భవ్యలీలానుమేయంబుగా సృష్టినిర్మాణముం జేయ నే మెంతవారొదు? మీ శక్తి యుక్తిన్ భవత్పూజ గావింతు; మట్లుండె నీ సత్కళాజాతులై నట్టి మమ్మెన్నఁగా నేల? యధ్యాత్మతత్త్వంబ వన్నం బరంజ్యోతి వన్నం బ్రపంచంబ వన్న న్నధిష్ఠాతవన్నన్ సదాసాక్షి వన్నన్ గుణాతీత! నీవే కదా పద్మపత్రాక్ష! సత్త్వాదిత్రైగుణ్య మూలంబు నా నొప్పు మాయా గుణంబందు నుద్యన్మహా తత్త్వ మైనట్టి నీ వీర్యముం బెట్టుటం జేసి నీ వింతకుం గారణం బౌదు! వాయాయి కాలంబుల న్నీకు సౌఖ్యంబు లేమెట్లు గావింతు? మే రీతి నన్నంబు భక్షింతు? మెబ్భంగి వర్తింతు? మే నిక్కడన్నుందు? మీ జీవలోకంబె యాధారమై యుండి భోగంబులం బొందుచు న్నున్న యిక్కార్య సంధానులై నట్టి మాకుం జగత్కల్పనా శక్తికిన్ దేవ! నీ శక్తిఁ దోడ్పాటు గావించి, విజ్ఞానముం జూపి, కారుణ్య సంధాయివై మమ్ము రక్షింపు లక్ష్మీమనః పల్వలక్రోడ! యోగీంద్ర చేతస్సరోహంస! దేవాదిదేవా! నమస్తే నమస్తే నమః. 203

* ఓ లక్ష్మీవల్లభా! అనాథ నాథా! అఖిలజగన్నాథా! నీవు శిరస్సు వంచిన వారిని చేర దీసే కరుణా సాంద్రుడవు! పగవారనే పర్వతాలను బద్దలు కొట్టే దేవేంద్రుడవు; కమలదళాల వంటి కన్నులు గలవాడవు!

దేవతలకు దేవుడవైనవాడవు! నీ దాసుల తాపాన్ని పోగొట్టే చల్లని వెల్లగొడుగులు నీ అడుగులు. అఖిల సౌభాగ్యాలకూ అలవాలాలైన నీ అంఘ్రికమలాలను ఆశ్రయించిన మహాయోగులు దుర్వార సంసార బాధలన్నింటినీ దూరంగా పారదోలి సుఖంగా ఉంటారు. సకల పాతక సమూహాలనూ సంహరించే ఓ తండ్రీ! నీవు జగదీశ్వరుడవు! ఈ ప్రపంచంలోని ప్రాణులందరూ భయంకరమైన భవబంధాలలో చిక్కుకొని ఆధ్యాత్మికం-ఆధిభౌతికం-ఆధి దైవికం అనే తాపత్రయ రూప మైన దావానలంలో కాలుతూ దుఃఖసముద్రంలో మునిగి తేలుతున్నారు. ఒక సత్కర్మం గానీ, ధర్మం గాని లేకుండా సంసార చక్రంలో పడి క్రింద మీదులుగా తిరుగుతున్నారు. అటువంటి పరమ మూర్ఖుల మాట చెప్పేదేముంది! ఓ దేవాదిదేవా! విజ్ఞానదీపాన్ని వెలిగించి అజ్ఞాన తమస్సును తొలగించే మీ పాద పద్మాలను ఆశ్రయిస్తాము. కమలలోచనా! ఘనులైన మునులు మనస్సును ఏకాగ్రంచేసుకొని గూటిలోనుండి పక్షులవలె నీ నోటిలో నుండి వెలువడిన వేదవాక్కుల ద్వారా వెదకి వెదకి నీ పదారవిందాలను అందుకుంటారు. నీ చరణ కమల ద్వయం దుర్దాంతమూ, దురంతమూ అయిన దురిత సంచయాన్ని తుడిచివేసే గగన గంగా తరంగిణికి ఆశ్రయం.

ఓ ప్రభూ! నీవే అందరికీ పైవాడవు: నీపైని ఎవ్వరు లేరు. వైరాగ్యబలంచేత ప్రాప్తించిన నిశ్చలమైన జ్ఞానోదయంతో మేల్కాంచిన ధీరశ్రేష్ఠులు నిత్యములూ, నిర్మలములూ అత్యంత పవిత్రములూ అయిన తమ హృదయంలో ఏపరంజ్యోతి పాద పీఠాన్ని నెలకొల్పి మోక్షాన్ని పొందారో- ఆ మోక్ష స్వరూపుడవైన నిన్ను సన్నుతిస్తున్నాము. ఇంద్రాది బృందారక బృందాల అభివందనాలు అందుకొనే ఓ ముకుందా! ఈ సృష్టినంతటినీ పుట్టించి, రక్షించి నశింప జేయడానికై అనేకాలైన దివ్యావతారాలు ధరించావు. నీ పదకమలాలను హృదంతరాలలో నిరంతరం స్మరించే భక్త సమూహానికి ముక్తిని ప్రసాదించే ప్రభూ! మేము నీ చరణ సరోజాలను సంసేవిస్తాము. ఈశా! ఓ రమాధీశా! పిల్లలూ, ఇల్లాలు, మిత్రులూ- అనే సంబంధ బంధాల్లో బంధితులై ఎల్లప్పుడూ దుష్టకార్యాలు చేయుటయందే ఇష్టం కలిగి నాయిల్లూ నా ఒళ్లూ అనే మమకారంతో ప్రవర్తించే మూఢమానవుల అంతరంగాలలో కూడా సర్వాంతర్యామివైన స్వామీ! నీవు నిండి ఉంటావు. కాని నీ పాదాలు వారికి దూరంగానే ఉంటాయి. అటువంటి నీ చరణ సరోజాలను పూజిస్తాము.

ఓ దేవా! ఇంద్రియోన్మాదానికి లోబడి చెడుపనులనే చేస్తూ మిడిసిపడే పరమ శుంఠలు, అధ్యాత్మ తేజోవిరాజితులై అఖిల సంపదలకు ఆలవాలమైన నీ పాద మూలమందే మనస్సు నిల్పిన మహానుభావులను దర్శించాలని వాంఛింపరు. ఈ మహాపురుషులు కూడా ఆ కాపురుషుల ముఖం చూడటానికి సుముఖులు కారు. లక్ష్మీమనోవల్లభా! ఉనిషత్కాంతలకు అంతఃపురమైన నీ కథాసారమనే సుధాపూరాన్ని గ్రోలుతూ సంతోషాతిశయంతో సోలుతూ, జ్ఞానవంతులై సంసార తాపాన్ని పారదోలుతూ, ఆనంద పారవశ్యంలో మునిగి తేలుతూ, సత్త్వసంపన్నులై నిత్యప్రసన్ను లైనవారు పరమోత్కంఠతో నీ వైకుంఠ ధామాన్ని చేరుతారు. మేముకూడా అటువంటి దివ్యస్థానాన్ని కోరుతున్నాము. ఓ దేవదేవా! వైరాగ్యం చేతనూ, విజ్ఞానం చేతనూ ప్రబుద్ధమైన ఆత్మయోగంలో సిద్ధిపొంది, లోపలా బయటా వ్యాపించి చలిస్తూ ఉండే మనోవృత్తిని నిరోధించి, పరిశుద్ధమైన అంతరంగంతో ఒప్పే యోగీశ్వరులు - తమ హృదయపద్మాల్లో వర్తిస్తూ చిన్మయాకారంతో

ప్రవర్తిస్తూ ఉన్న నీ అనంతతేజో విరాజితమైన దివ్యమూర్తిని తమ మనస్సులో నిలుపుకొని ఎల్లప్పుడు ఆనందిస్తూ ఉంటారు. నీ అనుగ్రహంవల్ల ప్రాప్తించిన పరమ జ్ఞానం పొందినందువల్ల వారికి ఆయాస మనేది ఉండదు.

ఓ సకల దేవతా చక్రవర్తీ! ఓ సచ్చిదానందమూర్తీ! నీ కీర్తిని విశ్వమంతా కీర్తిస్తున్నది. నీ మూర్తి సమస్తజీవరాసులలో వర్తిస్తున్నది. లోకాలను సృష్టించాలనే సంకల్పంతో సత్త్వరజస్తమో గుణాలను ప్రస్ఫురింపజేసి నీ దాసులైన మమ్ములను పుట్టించావు. పుట్టిస్తే పుట్టామే తప్ప గొప్పదైన నీసృష్టిని అనుసరించి లోకాలను సృష్టించటానికి మే మెంత వాళ్లం స్వామీ! నీ ప్రసాదంవల్ల కల్గిన శక్తియుక్తులతో నిన్ను పూజిస్తాము. అంతే. నీ అంశవల్ల పుట్టిన మమ్మల్ని ప్రత్యేకంగా గణించడం ఎందుకు? త్రిగుణాలకు అతీతుడవైన ఓ పరమాత్మా! అధ్యాత్మతత్త్వాని వన్ననూ, పరంజ్యోతి వన్ననూ, ప్రపంచాని వన్ననూ, అధిష్ఠాత వన్ననూ, సదాసాక్షి వన్ననూ- అన్నీ నీవే కదా? తామర రేకులవంటి కన్నులు కలదేవా! సత్త్వరజస్తమో గుణాలకు మూలమైన మాయాగుణంలో మహత్తత్త్వమైన నీ తేజస్సును ప్రవేశపెట్టిన నీవు నీ సృష్టికంతటికీ కారణమైనావు. నీ అంశలమైన మేము కాలానుసారంగా నీ కేవిధంగా సంతోషాన్ని సమకూర్చుతాము? మా ఆహారం ఏమి? మేము ఏ విధంగా ప్రవర్తించాలి? మా స్థితి ఏమి? ఈ ప్రాణి లోకమే మాకు ఆధారం కాగా అనుభవాల్ని పొందుతూ నీ కార్యం నెరవేర్చాలని కుతూహలపడుతున్న మాకు మార్గాన్ని చూపించు. కరుణతో నీశక్తిని ప్రసాదించి జగత్తును సృష్టించే శక్తిని కల్గించి రక్షించు. లక్ష్మీహృదయమనే నీటి పడియలో విహరించే మహావరాహస్వామీ! మహాయోగుల మానస సరోవరాలలో సంచరించే మరాళరాజా! దేవాది దేవా! నీకు నమస్కారం! నీకు నమస్కారం!

**సీ. అనినఁ బ్రసన్నుఁడై హరి మహదాదుల కన్యోన్యమిత్రత్వ మందకున్న**
**కతమున నిఖిలజగత్కల్పనాశక్తి వొడమ కుండుటఁ దన బుద్ధి నెఱిఁగి**
**కైకొని కాలవేగమున నుద్రేకంబు నొందిన ప్రకృతితోఁ బొంది నిజ బ**
**లము నిల్పి తా నురుక్రముఁడన సప్తవింశతి తత్త్వములయందు సమత నొక్క**

**తే. పరి ప్రవేశించి యా తత్త్వభవ్యగుణము, నందు జ్యేష్ఠానురూపంబు లలరఁజేంది**
**యొకటి నొకటిని గలయక యుండి విశ్వ, రచన మెఱుఁగని యాతత్త్వ నిచయమునకు. 204**

* ఇలా స్తోత్రం చేయగా విని శ్రీహరి సంతోషించాడు. మహత్తు మొదలగు తత్త్వాలకు పరస్పరం పొత్తు కుదరక పోవడం వల్ల సమస్తజగత్తును సృష్టించే శక్తి లభ్యం కాకపోవటాన్ని తెలుసుకొన్నాడు. అప్పుడు కాలవేగంతో ఉద్రేకం పొందిన ప్రకృతితోకూడి నిజశక్తిని నిక్షేపించి ఉరుక్రముడై ఇరవైయేడు తత్త్వాలలో ఏకకాలంలో తాను ప్రవేశించి ఘన పరిణామరూపుడై విడివిడిగా ఉన్న వానికి ఏకత్వం కలిగించాడు. పంచభూతాలు-పంచతన్మాత్రలు-పది ఇంద్రియాలు- కాలం, ప్రకృతి, మహత్తు; మనస్సు, బుద్ధి, చిత్తం అహంకారం అనే అంతఃకరణ చతుష్టయం- ఇవి ఇరువదియేడు తత్త్వాలు.

వ. ఇట్లు విశ్వనిర్మాణ నిపుణత్వంబు నెఱుంగం జూపుచు నన్నింటికి నన్యోన్యతం గల్పించి తన యనుగ్రహంబునం బ్రేరితంబై కానంబడి క్రియాసామర్థ్యంబునం జెన్నొందిన తత్త్వవితానంబు దేవప్రేరితం బయి స్వకీయంబు లగు నంశంబులచేతం బుట్టించిన విరాడ్విగ్రహంబై తత్త్వవితతి దమయందుఁ జెందిన పుండరీకాక్షుని కళాంశంబున నొకటి కొకటికి నైక్యంబు వాటిల్లి పరిణతంబై రూపాంతరంబును జెందు;నే తత్త్వంబునఁ జరాచరలోక పుంజంబులు నిండియుండు నా హిరణ్మయంబైన విరాడ్విగ్రహంబు నొందిన పురుషుండు సర్వజీవ సమేతుండై యుండె నంత. 205

* ఈ విధంగా ప్రపంచాన్ని నిర్మించడంలో వానికి నేర్పు కలగజేస్తూ శ్రీహరి క్రమానుసారంగా అన్నింటికీ పరస్పరమైత్రి కల్పించాడు. ఇలా శ్రీహరి అనుగ్రహంచేత ప్రేరేపింపబడి సృష్టిక్రియకు సమర్థమైన తత్త్వసమూహం, తమ తమ అంశలతో విరాడ్విగ్రహంగా రూపొందింది. విష్ణుదేవుని కళాంశలతో ఒకటి మరొక్కదానితో ఏకీభావం పొంది, పరిపక్వమై ఇంకొక రూపం ధరించింది. ఏ తత్త్వం ఈ జగత్తంతా నిండి ఉందో హిరణ్మయమైన ఆ విరాట్ స్వరూపం ధరించిన పరమాత్మ సమస్త జీవులలో నిండియున్నవా డయ్యాడు.

క. జలముల లోపల నిమ్ముల, జలరుహజాతాండమందు సాహస్రాబ్దం
బులు నిలిచెఁ గార్యరూపా, కలితంబగు నవ్విరాట్పుగర్భము వరుసన్. 206

* ఈ విరాట్ పురుషుడు మొదటి జలాలలో ఏర్పడ్డ బ్రహ్మాండం అనే గర్భరూపంతో వేయి సంవత్సరాలు ఉన్నాడు. దాని నుండే సమస్తసృష్టి కార్యరూపంగా వెలువడింది.

తే. దైవకర్మాత్మ శక్తి వితానములను, దగిలి తనచేతఁ దనుఁ దాన దైవశక్తి
యగుచు వెలుఁగొందుచును బ్రకారాంతరమునఁ, దనువు వితతంబు గాని చైతన్య మొంది. 207

* దైవం-కర్మ-ఆత్మ అనువాటి శక్తి వ్యాపించి భగవంతుడు తానే బహుళ రూపాలతో వెలుగొందుతాడు. అపుడు సంకల్పమయమైన సృష్టి చైతన్యంతో విస్తరిస్తుంది గాన దేహం ఏర్పడదు.

తే. రూపసంసక్తిఁ జేసి నిరూఢకర్మ, శక్తియును వృత్తిభేద సంసక్తి దశ వి
ధములు గలిగిన ప్రాణరూపమున నాత్మ, శక్తి బోధత్వ మగుచున్న శక్తి కలిగి. 208

* ఆ చైతన్య శక్తికి రూపాలుగా ఏర్పడే లక్షణం ఏర్పడుతుంది. అదే కర్మశక్తి. దీనివల్ల అనేక ప్రవృత్తి భేదాలు ఉద్భవిస్తాయి. దానియందు పది విధాలైన ప్రాణాలు స్పందిస్తాయి. ఇన్ని శక్తులతో గూడిన ప్రజ్ఞవల్ల తాను అనగా ఏమో తనకు తెలిసే శక్తి ఏర్పడుతుంది.

క. త్రివిధం బగుచును నాధ్యా, త్మ్య విభేదంబులను బాపి మఱి యధిభూతా
త్మ విరాడ్రూప మ్మగు నిది, వివిధప్రాణులకు నాత్మవిధమై మఱియున్. 209

* అధ్యాత్మం, అధిభూతం, అధిదైవం అనబడే మూడు భేదాలు కలిగి ఈ విరాట్ స్వరూపం జీవులకు తాను ఆత్మగా మెలగుతుంది.

క. జీవంబై పరమాత్మకుఁ, దావలమై యాదిమావతారంబగు న
ద్దేవుని గర్భంబున భూ, తావలితోడం బ్రపంచ మర్థిం దోఁచెన్. 210

* సమస్తానికి జీవమై పరమాత్మకు స్థానమై తొలి అవతారమైన ఆ విరాట్ పురుషుని గర్భం నుండి భూతమయ మైన ఈ సమస్త ప్రపంచం పుట్టింది.

వ. ఇట్లు దోఁచిన విరాట్పురుషుం డాధ్యాత్మి కాధిదైవి కాధిభౌతికంబులను భేదంబులచేఁ బూర్వోక్త క్రమంబున వెలుఁగొందు ననుచు విదురునకు మైత్రేయుం డెఱింగించె నని చెప్పి వెండియు నిట్లనియె.211

* ఈ విధంగా విరాజిల్లిన విరాట్ పురుషుడు - ఆధ్యాత్మికము, ఆధిదైవికము, ఆధిభౌతికము అనే భేదాలతో మొదట చెప్పిన విధంగా ప్రకాశిస్తూ ఉంటాడు అని మైత్రేయుడు విదురునికి తెలియజెప్పి నాడని మళ్లీ శ్రీశుకుడు పరీక్షిత్తుతో ఇలా అన్నాడు.

చ. హరి పరమాత్ముఁ డీశుఁ డజుఁ డాఢ్యుఁ డనంతుఁ డనంతమూర్తి సా
గర తనయాహృదీశుఁడు వికారవిదూరుఁడు నిత్యమంగళా
కరుఁడు కృపాపయోనిధి యకల్మష చిత్తుఁడు సర్వశక్తి తా
మరస విలోచనుండు బుధమాన్య చరిత్ర పవిత్రుఁ డిమ్ములన్. 212

* ఆ శ్రీహరి, పరమాత్ముడు, ఈశ్వరుడు, అజుడు, ఆఢ్యుడు, అనంతుడు, అనంతమూర్తి, లక్ష్మీరమణుడు, నిర్వికారుడు, నిత్యమంగళస్వరూపుడు, కరుణాసముద్రుడు, నిర్మలహృదయుడు, సమస్త శక్తిమంతుడు, కమదళ నేత్రుడు, సకల బుధ సంస్తవనీయ చరిత్రుడు, పరమ పవిత్రుడు.

వ. ఇత్తెఱంగువ నీశుండగు నధోక్షజుండు మహదాది తత్త్వంబుల మనంబుల ఘనంబులగు తలంపులు దానెఱిఁగి యట్టి తత్త్వంబుల వివిధవృత్తి లాభంబునకై స్వకీయ చిచ్ఛక్తిచే నిట్టు లొనర్తునని చింతించి నిజకళాకలితంబగు విరాడ్విగ్రహంబునందు నగ్ని ప్రముఖంబగు దేవతావళి కెల్ల నివాసం బగుచుఁ గానంబడిన వైరాజపురుషుని యాస్యాద్యవయవంబుల వినిపింతు; దత్తావధానుండవై వినుము. 213

* సర్వేశ్వరుడైన పరాత్పరుడు ఈ విధంగా మహదాది తత్త్వాల మనస్సుల్లోని గొప్ప ఆలోచనలన్నీ తెలుసుకొన్నాడు. ఆ తత్త్వాల ప్రవర్తనలన్నీ సఫలం కావటానికి తన చైతన్యం శక్తిని ఉపయోగించాలని నిశ్చయించాడు. తన కళలతో కూడిన విరాట్ స్వరూపంలో అగ్ని మొదలైన దేవత లందరికీ నివాసాలు కల్పించాడు. విరాట్ పురుషుని ముఖం మొదలైన అవయవాల స్వరూపాలను వినిపిస్తాను. ఏకాగ్రమైన భావంతో ఆకర్ణించు.

సీ. నరనుత! యా దివ్యపురుషోత్తముని పృథ గ్భావంబు నొంది ముఖంబు వలన
భువనపాలకుఁడైన పవమాన సఖుఁ డంత రాత్ముఁ డీశ్వరు నంశ మైన వాణి

కనయంబు ననుకూల మగుచు నిజస్థానమునఁ బ్రవేశించిన ముఖమునందుఁ
బరఁగు జీవుండు శబ్దము నుచ్చరించుఁ బృథగ్భావములను నేత్రముల నినుఁడు

తే. చక్షురింద్రియ యుక్తుఁడై సరవిఁ జెంది, రూపవిజ్ఞాన మహిమ నిరూఢి నొందు
మఱియుఁ జర్మంబునను బవమానుఁ డీశ్వ, రాంశమై తత్త్వగింద్రియమందుఁ గూడి. 214

* భవ్యచరిత్రుడైన విదురా! ఆ దివ్యమూర్తియైన విరాట్పురుషుని నుండి కొంతభాగం వేరయింది. అది ముఖంగా రూపొందింది. ఆ పరమేశ్వరుని అంశ గలవాడై వాయుదేవుని మిత్రుడైన అగ్నిదేవుడు ముఖాన్ని నిజస్థానంగా చేసుకొన్నాడు. అందువల్ల జీవుడు శబ్దాన్ని పలుక గలుగుతున్నాడు. విరాట్ పురుషునినుండి మరికొంత భాగము వేరై కన్నులుగా రూపొందాయి. సూర్యుడు చక్షురింద్రియానికి అధికారియై రూప విజ్ఞానాన్ని జీవునకు కలుగజేస్తున్నాడు. అట్లే విరాట్పురుషునిలో కొంతభాగం వేరై చర్మంగా ఏర్పడింది. ఈశ్వరాంశ అయిన వాయువు త్వగింద్రియంలో నిల్చాడు.

వ. నిజనివాసంబు నాశ్రయించిన జీవుండు స్పర్శేంద్రియ గతుండగు పృథగ్భావంబైన శ్రోత్రంబుల దిక్కు లచ్యుత కళాంశంబులగు, శ్రవణేంద్రియ యుక్తంబులై నిజస్థానంబునం బొందిన జీవుండు శబ్దజ్ఞాన గతుండగు; వెండియుఁ దాలువు నిర్భిన్నం బయిన లోకపాలుండగు వరుణుం డందుఁ బ్రవేశించి రసనేంద్రియంబుచేఁ బ్రకాశించినం బ్రాణి రసంబులం గ్రహించెఁ; బరమేశ్వరుని నాసికేంద్రియంబు పృథగ్భావంబు నొంది యాశ్వినే యాధిష్ఠానంబై ఘ్రాణాంశంబు నొందిన జంతువు గంధగ్రహణ సమర్థంబయ్యెఁ; వెండియు భిన్నంబయిన చర్మంబును నోషధులును బరమపురుషాంశంబు లయిన కేశంబులంగూడి నిజనివాసంబు నొందిన జీవుండు కండూయ మానుండగు; భిన్న భూతంబైన మేఢ్రంబునం బ్రజాపతి రేతంబున నిజస్థానంబు నొందిన జీవుం డానందంబునం బొరయు; భిన్నభావంబైన గుదంబున మిత్రుం డచ్యుతాంశంబును బొంది వాయువుం గూడి నిజాధిష్ఠానంబు నొందిన జీవుండు విసర్గంబుఁ జెందు; వేఱు వేఱైన బాహువులం ద్రిదశాధీశ్వరుండయిన పురందరుండు క్రయవిక్రయాది శక్తియుక్తుం డగుచు నిజస్థానంబు నొందిన జీవుండు వానిచేత జీవికం బొందు; మఱియుఁ బాదంబులు నిర్భిన్నంబు లయిన విష్ణుండు స్వావాసంబు గైకొని గతిశక్తిం బొందిన జీవుండు గమనాగమ నార్హుండయ్యెఁ; వెండియు భిన్నభావంబయిన హృదయంబు మనంబుతోడం గలసి నిజాధిష్ఠానంబునం జంద్రుండు ప్రవేశించిన జీవుండు శరీరసంకల్పాది రూపంబగు వికారంబునుం బొందు; భిన్నభావంబైన యహంకారంబున నహంకృతి యుక్తుండై రుద్రుండు నిజస్థానంబుగా వసియించు; నా యహంకృతిచే శరీరి కర్తవ్యంబులు నడపు; బుద్ధి వాగీశ్వరావాసంబై హృదయంబు తోడం గలసి నిజాధిష్ఠానంబున బోధాంశంబుచే వెలింగిన శరీరి బోద్ధవ్యతం బొందు; భిన్నంబైన చిత్తంబు బ్రహ్మావాసంబై చేతనాంశంబు నొందినఁ బ్రాణి విజ్ఞానంబునుం బొందు; నట్టి విరాట్పురుషుని శీర్షంబున స్వర్గంబును, జరణంబుల వసుమతియు, నాభియందు గగనంబునుం గలిగె; సత్త్వాదిగుణ పరిణామంబుల నమరులైరి; ఊర్జిత సత్త్వగుణంబున న ద్దేవతలు త్రిదివంబునుం బొందిరి; రజోగుణంబున మనుజులును గవాదులును ధరణిం బొందిరి; తామసంబున భూతాదులైన

**రుద్రపారిషదులు ద్యావాపృథి వ్యంతరంబగు వియత్తలంబునుం బొందిరి; ముఖంబువలన నామ్నాయంబు ఉత్పన్నంబులయ్యె. వెండియు- 215**

* జీవునకు స్పర్శజ్ఞానాన్ని కలిగించు విరాట్పురుషు నుండి వేరైన చెవులయందు ఈశ్వరాంశలైన దిక్కులు జీవుని శ్రవణేంద్రియాన్ని కూడి జీవునకు శబ్ద జ్ఞానాన్ని కలిగిస్తున్నవి. అట్లే వేరైన తాలువులందు లోకపాలకుడైన వరుణుడు ఈశ్వరాంశతో ప్రవేశించి జీవుని రసనేంద్రియంగా ప్రకాశిస్తున్నాడు. అందువల్ల ప్రాణి రుచులను తెలుసుకొంటాడు. పరమేశ్వరుని నాసికేంద్రియం వేరై ఆయన అంశగల అశ్వినీ దేవతలకు అధిష్ఠాన మయింది. అందువల్ల జీవునకు వాసన చూచే శక్తి కలిగింది. పరమపురుషు నుండి వేరైన చర్మం ఓషధులు ఆయన అంశలైన కేశాలను కూడడంచేత జీవునకు కండూయమానస్థితి (గోకుకొనుట) ఏర్పడింది. అట్లే పరమేశ్వరుని నుండి వేరైన పురుషాంగంలో ఈశ్వరాంశమైన ప్రజాపతి రేతస్సుతో సంయోగ మందటం వల్ల జీవుడు ఆనందాన్ని పొందుతున్నాడు. పరమేశ్వరునినుండి వేరైన గుదస్థానంలో అచ్యుతాంశమైన మిత్రుడు, వాయువుతో కూడి ప్రవేశించటంవల్ల జీవునకు మలవిసర్జన శక్తి కలుగుతున్నది.

విరాట్పురుషుని నుండి వేరైన చేతులందు ఈశ్వరాంశమైన ఇంద్రుడు ప్రవేశించటం వల్ల ఇచ్చిపుచ్చుకొను శక్తి కలవాడై, నిజస్థానాన్ని పొందిన జీవుడు జీవనోపాధిని పొందుతున్నాడు. విరాట్ పురుషుని నుండి వేరైన పాదాలను విష్ణువు అధిష్ఠించి గమన శక్తి కలిగించటం వల్ల జీవుడు నడచుటకు శక్తి మంతు డగుతున్నాడు. పరమేశ్వరుని నుండి బయటికి వచ్చిన హృదయం మనస్సుతో కలిసి, అధిష్ఠాత అయిన చంద్రుడు ప్రవేశించడం చేత జీవుడు సంకల్ప వికల్పాలను పొందుతున్నాడు. వేర్పాటు చెందిన అహంకారంలోఅహంకృతియుక్తుడైన రుద్రుడు నిజస్థానంగా ప్రవేశించి నప్పుడు జీవుడు కర్తవ్యాలను నిర్వర్తిస్తాడు. విడివడిన బుద్ధి వాగీశ్వరుని ఆవాసమై హృదయంతో కలిసి జ్ఞానాంశతో వెలిగినప్పుడు జీవునకు గ్రహణశక్తి కలుగుతుంది. వేరుపడిన చిత్తం బ్రహ్మకు ఆవాసమై చేతనాంశం పొందినప్పుడు జీవుడు విజ్ఞానాన్ని పొందుతాడు.

అటువంటి విరాట్‌పురుషుని శిరస్సునుండి స్వర్గమూ, పాదాల నుండి భూమీ, నాభి నుండి ఆకాశమూ కలిగాయి. సత్త్వరజస్తమోగుణాల మార్పుచేత జీవులు అమరు లయ్యారు. సత్త్వగుణం అధికంగా ఉండడంచేత ఆ దేవతలు స్వర్గాన్ని పొందారు. రజోగుణంవల్ల మనుష్యులూ, గోవులూ మొదలైన జీవులు భూమిని పొందాయి. తామసగుణం వల్ల భూతాదులైన రుద్రపారిషదులు భూమికీ, ఆకాశానికీ మధ్యగల ప్రదేశాన్ని పొందారు. విరాట్పురుషుని ముఖం నుండి వేదాలు పుట్టాయి.

**క. ధరణీదివిజులు శ్రుతులును, నరవర! యమ్మేటి ముఖమునం బొడముట భూ**
**సురుఁ డఖిల వర్ణములకున్, గురుఁడున్ ముఖ్యుండు నయ్యె గుణరత్న నిధీ! 216**

* ప్రశస్త గుణసంపన్నుడవైన పరీక్షిన్మహారాజా! బ్రాహ్మణులూ, వేదాలూ ఆ విరాట్ పురుషుని ముఖం నుండి పుట్టడం వల్ల బ్రాహ్మణుడు సమస్త వర్ణాలకు జ్యేష్ఠుడూ, శ్రేష్ఠుడు అయ్యాడు.

**క. ధర బ్రాహ్మణాదికము ద, స్కర బాధలఁ బొందకుండఁ గైకొని కావం**
**బురుషోత్తము బాహువులన్, నరనాథకులంబు పుట్టె నయతత్త్వనిధీ! 217**

* నీతి విద్యావిశారదుడవైన విదురా! బ్రాహ్మణాది వర్ణాల వారు దొంగలూ దుండగులూ మొదలైన వారి వల్ల బాధలు పొందకుండా వారిని రక్షించడానికే ఆ పురుషోత్తముని భుజాల నుండి క్షత్రియజాతి జన్మించింది.

**క. గణుతింపఁగఁ గృషిగో ర, క్షణవాణిజ్యాది కర్మకలితంబుగ నా**
**గుణనిధి యూరువులందుం, బ్రణుతింపఁగ వైశ్యజాతి ప్రభవం బయ్యెన్. 218**

* వ్యవసాయం, గోసంరక్షణం, వ్యాపారం-మొదలైన కార్యాలను నిర్వహించటం కోసం ఆ సర్వేశ్వరుని తొడల నుండి వైశ్యజాతి ఆవిర్భవించింది.

**తే. తివిరి సేవక ధర్ములై దేవదేవు, పదములను శూద్రసంతతు లుదయమైరి**
**వీర లందఱుఁ దమతమ విహితకర్మ, మలరఁ జేయుచు జనకుండు నాత్మగురుఁడు 219**

**క. అగు సర్వేశుఁ బరాత్పరు, జగదేకప్రభుని పాదజలజాతంబుల్**
**దగిలి భజింతురు సతతము, నిగమోక్తిన్ భక్తియోగనిపుణాత్మకులై. 220**

* ఆ దేవదేవుని పాదాలనుండి సేవావృత్తియే ధర్మంగా గల శూద్రజాతి పుట్టింది. వీరంతా తమకై విధింపబడిన పనులు చేస్తూ-జగజ్జనకుడూ, విశ్వగురుడూ, సర్వేశ్వరుడూ, పరాత్పరుడూ అయిన ఆలోకైకనాథుని పాదపద్మాలకు వేదాల్లో చెప్పిన విధంగా భక్తియోగ పరాయణులై అనుదినమూ ఆరాధిస్తుంటారు.

**తే. మహిమ దీపింపఁ గాలకర్మ స్వభావ, శక్తి సంయుక్తుఁ డగు పరేశ్వరుని భూరి**
**యోగమాయా విజృంభణోద్యోగ మెవ్వఁ, డెఱిఁగి నుతియింపఁగా నోపు నిద్ధచరిత! 221**

* మహనీయ చరిత్రా! కాల, కర్మ, స్వభావశక్తులతో ప్రకాశించే పరమేశ్వరుని యోగమాయ అమేయమైనది. దాని విశేష విజృంభణాన్ని తెలుసుకొని సంస్తుతించడానికి ఎవరికి సాధ్యమౌతుంది?

**చ. అన్యకథానులాపము లహర్నిశముం బఠియించి చాల మా**
**లిన్యము నాత్మశోభన విలీనత నొందు మదీయ జిహ్వ సౌ**
**జన్యము నొందె నేఁడు హరిసద్గుణ దివ్య కథామృతంబు స**
**న్మాన్యచరిత్రమై నెగడు మద్గురు వాక్యపదంబుఁ జెందఁగన్. 222**

* విదురా! ఈ నా నాలుక ఇతరుల కథాకలాపాలను రాత్రింబవళ్ళు చదివి చదివి, చాలా మలినమై, ఆత్మ సౌందర్యాన్ని పోగొట్టుకొన్నది. నేడు నా గురుదేవునిచే నిర్దేశింపబడిన మార్గాన్ని అవలంబించి విష్ణుదేవుని సద్గుణవంతమైన సత్కథా గానం అనే అమృతాన్ని పానం చేసి సౌజన్యాన్నీ, సౌభాగ్యాన్నీ సంతరించుకున్నది.

మ. హరినామాంకిత సత్కథామృత రసవ్యాలోలుఁ డైనట్టి స
త్పురుష శ్రేష్ఠుఁ డసత్కథాలవణవాః పూరంబుఁ దాఁ గ్రోలునే?
వరమందార మరంద పానకుతుకస్వాంత ద్విరేఫంబు స
త్వరమై పోవునె చేఁదు వేములకుఁ దద్గంధానుమోదాత్మమై. 223

* హరి నామస్మరణ పరాయణమైన సరస కథాసుధా రసాన్ని ఆసక్తితో ఆస్వాదించి ఆనందించే సత్పురుషవరేణ్యుడు రసహీనమైన అసత్కథలచే ఉప్పునీటిని త్రాగాలని ఉబలాటపడతాడా? మధురమైన మందార మకరందాన్ని త్రాగి మైమరచే తుమ్మెద చేదువాసనలు వెదజల్లే వేపచెట్ల వైపు వెళ్ళాలని వేగిరపడుతుందా?

క. హరి మహిమముఁ దన్నాభీ, సరసిజ సంజాతుఁడైన చతురాననుఁడుం
బరికించి యెఱుఁగఁ డన్న ని, తర మనుజులఁ జెప్పనేల తత్త్వజ్ఞనిధీ! 224

తత్త్వవేత్తవైన ఓ విదురా! నారాయణుని మహిమను ఆయన నాభికమలం నుండి పుట్టిన నాలుగు ముఖాల బ్రహ్మకూడా తెలుసుకోలేడు అంటే, ఇక ఇతరుల విషయం చెప్పడం ఎందుకు?

తే. శ్రుతులు దమలోన వివరించి చూచి పుండ, రీకలోచను నుత్తమ శ్లోకచరితు
నమర గుణ వంద్యమాన పాదాబ్జ యుగళు, వెదకి కనుఁగొనలే వండ్రు విమల మతులు. 225

* ఉత్తమశ్లోకుడూ ఉదారచరితుడూ, ముక్కోటి దేవతలు మ్రొక్కే చక్కని పాదపద్మాలు గలవాడూ అయిన ఆ దేవాది దేవుని వేదాలు కూడా తమలో తాము వితర్కించి, విచారించి వెదకి వెదకి వీక్షింపలేవని విజ్ఞులంటారు.

క. హరియుం దన మాయాగతిఁ, బరికించియుఁ గానఁడయ్యెఁ బరిమితి లేమిన్
మఱి మాయావిని మోహిని, చరితముఁ గనుఁ గొందు రెట్లు చతురాస్యాదుల్?

226

* ఇదిగో విదురా! ఆ హరికూడా అనంతమైన తన మాయావ్యవహారాన్ని అవగాహనం చేసుకోలేక పోయాడంటే మాయావిని అయిన ఆ మహామోహిని ప్రభావం బ్రహ్మాదులకు మాత్రం ఎలా అంతుపట్టుతుంది?

క. ఆ దివిజాధీశుఁడు, మహదా, దులు, దిక్పతులుఁ, బంకజాసనుఁడున్, గౌ
రీ దయితుఁడు గనఁజాలని, శ్రీ దేవుని పదయుగంబుఁ జింతింతు మదిన్. 227

* మహేంద్రుడూ, మహదాది తత్త్వాలూ, దిక్పాలకులూ, పద్మసంభవుడూ. పరమశివుడూ కూడా చూడలేని ఆ దేవదేవుని పాద పద్మాలను నామనస్సులో ధ్యానిస్తాను.

క. అని మైత్రేయుం డవ్విదు, రున కెఱిఁగించిన తెలుంగు రుచిరముగా న
ర్జున పౌత్రునకుఁ బరాశర, ముని మనుమం డెఱుఁగఁ జెప్పి ముదము దలిర్పన్. 228

వ. వెండియు నిట్లనియె. 229

* ఈ విధంగా మైత్రేయ మహర్షి విదురునికి వెల్లడించిన విశేషాలను పార్థుని పౌత్రుడైన పరీక్షిత్తుకు పరాశరుని పౌత్రుడైన శుకమహర్షి హర్షపూర్వకంగా విశదీకరించి మరల ఇట్లా అన్నాడు.

క. భూమీశ్వర! మైత్రేయ మ, హాముని విదురునకు నట్లు హరి శుభగుణ లీ
లా మాహాత్మ్యముఁ జెప్పిన, నా మైత్రేయునకు విదురుఁ డనియెన్ మఱియున్. 230

మహారాజా! ఆ విధంగా మైత్రేయమహాముని అత్యంత మంగళ ప్రదాలైన హరిలీలా మహత్త్వాలను విదురునికి విశదీకరించగా విని మైత్రేయునితో విదురుడు మళ్ళీ ఇట్లా అన్నాడు.

క. అగుణుండగు నీశ్వరునకు, జగదవనోద్భవ వినాశ సత్కర్మములుం
దగులీల లెట్టు లాతఁడు, సగుణుండై యుండు టెట్లు సౌజన్యనిధీ! 231

* సౌజన్య మహనీయా! మైత్రేయా! భగవంతుడు నిర్గుణ పరబ్రహ్మ కదా! మరి ఈ లోకాలన్నీ పుట్టించటం రక్షించటం లయం చెయ్యటం ఆయన క్రీడావిశేషాలు కదా! నిర్గుణుడైన వానికి ఈ క్రీడలూ, ఈ లీలలూ ఎలా పొసగు తాయి? నిర్గుణుడైన ఈశ్వరుడు సగుణుడుగా ఎలా ఉంటాడు? ఇది పరస్పర విరుద్ధంగా లేదా?

సీ. అని యర్భకునిగతి యనుకొని మైత్రేయ మునిఁ జూచి విదురుఁ డిట్లనియె మరల
బాలుఁడు క్రీడావిలోలమానసమున దీపించు లీలానురూపుఁ డగుచుఁ
గానిచోఁ గామానుగతుఁడై రమించును నర్భకుఁ డర్థి వస్త్వంతరమున
నర్భకాంతరమున నైనను బాలకేళీసంగుఁ డగుచు నోలిని జరించు

తే. హరియు నెపుడు నివృత్తుఁ డత్యంత తృప్తుఁ, డగుట వర్తించు టెట్లు క్రీడాదులందు?
మఱియుఁ ద్రిగుణాత్మకంబైన మాయఁ గూడి, యఖిల జగములఁ గల్పించె ననుట యెట్లు? 232

* అని అడిగి విదురుడు "ఒక వేళ భగవంతుడు బాలునివలె క్రీడించునేమో" అనుకొని, మైత్రేయుణ్ణి చూచి మళ్ళీ ఇట్లా అన్నాడు. బాలుడు ఆడుకోవాలి అనుకున్నప్పుడు అతడి మనస్సు క్రీడాలోల మౌతుంది. అందుకు తగినట్లుగా ఆడుకుంటాడు. బాలుడు ఆడుకోటానికి ఆటవస్తువులు కావాలి. లేదా మరికొందరు బాలకులు కావాలి. అప్పుడు ఆనందంగా ఆట సాగుతుంది. కాని భగవంతుడు ఎటువంటి కోరికలు లేని వాడూ, నిత్య సంతృప్తుడూ గదా! అటువంటి వానికి ఆటలందు ఆసక్తి కలగటం ఆశ్చర్యంగా ఉంది. త్రిగుణాత్మకమైన మాయను సృష్టించి ఆ మాయవల్ల సమస్తలోకాలనూ కల్పించే కుతూహలం ఆయనకు ఎట్లా కలిగిందో చిత్రంగా ఉంది.

సీ. అమ్మాయచేత నీ యఖిలంబు సృజియించి పాలించి పొలియించి పరమపురుషుఁ
డనఘాత్మ! దేశకాలావస్థలందును నితరులయందు నహీనమైన
జ్ఞానస్వభావంబుఁ బూని యా ప్రకృతితో నెబ్భంగిఁ గలసె దా నేకమయ్యుఁ
గోరి సమస్తశరీరంబులందును జీవరూపమున వసించి యున్న

తే. జీవునకు దుర్భగక్లేశసిద్ధి యెట్టి, కర్మమున సంభవించెను? గడఁగి నాదు
చిత్త మజ్ఞాన దుర్గమస్థితిఁ గలంగి, యధికఖేదంబు నొందెడు ననఘచరిత! 233

* ఓ పుణ్యుడా! తన మాయచేత ఈ లోకాలన్నింటినీ సృష్టించి, పాలించి, లయంచేసే ఆ పరమాత్ముడు దేశం కాలం మొదలైన అవస్థలను కల్పించు తున్నాడు. ఇతరులను సృష్టించి వారియందు అఖండమైన జ్ఞానంతో వర్తిస్తున్నాడు. కేవలం జ్ఞాన స్వరూపుడైన భగవంతుడు ఆ ప్రకృతితో తాను ఏ విధంగా కలసి ఉంటాడు? దేవుడు ఒక్కడై ఉండి అన్ని శరీరాల్లోనూ జీవుడుగా వసించి ఉంటున్నాడు గదా! దేవుడైన జీవునకు భరింపరాని గర్భనరకం వంటి కష్టాలు ఏ కర్మం వల్ల సంభవిస్తున్నవి? ఈ సందేహాలతో నామనస్సు చాల వ్యాకుల పడుతున్నది. ఈ అజ్ఞానావస్థనుండి బయట పడలేక తల్లడిల్లి పోతున్నది.

వ. అది గావున సూరిజనోత్తముఁడవైన నీవు మదీయ మానసిక సంశయంబులం దొలఁగింప నర్హుండవని విదురుండు మైత్రేయ మహామునీంద్రు నడిగె నని బాదరాయణతనూభవు డభిమన్యు నందనున కిట్లనియె. 234

* ఈ విధమైన నామనస్సులోని సందేహాలను తొలగించడానికి విద్వాంసులలో అగ్రగణ్యుడవైన నీవే సమర్థుడవు- అని విదురుడు మైత్రేయుణ్ణి వేడుకొన్నాడు అని చెప్పి శుకమహర్షి పరీక్షిత్తుతో ఇలా అన్నాడు.

క. సరసిరుహోదర మంగళ, చరితామృతపాన కుతుకసంగంబున ని
ర్భరుఁడగు విదురునకు మునీ, శ్వరుఁడగు మైత్రేయుఁ డనియె సజ్జనతిలకా! 235

* నృపకుల తిలకా! కల్యాణదాయకమైన కమలనాభుని మధురకథా సుధారసాన్ని ఆస్వాదించాలనే కుతూహలంతో ఉవ్విళ్ళూరే విదురునితో మహనీయుడైన మైత్రేయుడు ఇట్లా అన్నాడు.

చ. వినుము వితర్కవాదములు విష్ణుని ఫుల్ల సరోజపత్ర నే
త్రుని ఘనమాయ నెప్పుడు విరోధము సేయుఁ బరేశు నిత్య శో
భనయుతు బంధనాదిక విపద్దశలుం గృపణత్వ మెప్పుడే
ననయముఁ బొందలేవు విభుఁ డాద్యుఁ డనంతుఁడు నిత్యుఁ డౌటచేన్. 236

* వినవయ్యా! విదురా! విను! వికసించిన కమలాలవంటి కన్నులు గల విష్ణుదేవుని మాయ అజేయ మైనది. కేవలం పిడివాదాలైన ఈ తర్కవితర్కాలు ఆ మాయను స్పృశింపలేవు. ఆయన ఆద్యుడు, అనంతుడు, నిత్యుడు అయిన కారణంగా నిత్య మంగళ స్వరూపుడైన ఆ పరమేశ్వరుణ్ణి ఈ బంధాలు ప్రతి బంధాలూ విపత్తులూ విషాదాలూ అంటవు. ఆయన వీటి కన్నింటికీ అతీతుడు.

వ. మఱియును. 237

చ. పురుషుఁడు నిద్రవోఁ గలలఁ బొందు సమస్తసుఖంబు లాత్మ సం
హరణ శిరోవిఖండనము లాదిగ జీవునికిం బ్రబోధమం
దరయఁగఁ దోఁచుచున్న గతి నాదిఁ బరేశుఁడు బంధనాదులం
బొరయక తక్కు టెట్లనుచు బుద్ధిని సంశయ మందె దేనియున్. 238

* ఇంకా విను. పురుషుడు నిద్రపోయే సమయంలో ఏవేవో కలలు వస్తాయి. ఎన్నో సుఖాలు పొందుతున్నట్లూ, తనను ఎవరో చంపినట్లూ, తన శిరస్సు ఖండించి వేసినట్లూ కలలు కంటాడు. మెలకువ వచ్చిన పిమ్మట అవన్నీ అసత్యాలని తెలుసుకుంటాడు. ఆ విధంగానే దేవుడు జీవుడుగా నటించునప్పుడు ఈ కష్టసుఖాలు ఏవీ ఆయనకు అంటవు. అయితే స్వప్నంలో ఉన్నంతకాలమూ జీవుడు పడే చిక్కులూ బాధలూ జీవుడుగా ఉన్న భగవంతునకు మాత్రం ఎందుకు కలుగవు? అనే సందేహం కలిగినట్లైతే విను.

వ. అవ్విధం బతనికిం గలుగ నేర దది యెట్లంటేని- 239

చ. లలిత విలోల నిర్మల జలప్రతిబింబిత పూర్ణచంద్ర మం
డలము దదంబుచాలనవిడంబన హేతువు నొందియున్ వియ
త్తలమునఁ గంప మొందని విధంబున సర్వశరీరధర్మముల్
గలిగి రమించు నీశునకుఁ గల్గఁగ నేరవు కర్మబంధముల్. 240

భగవంతుడికి ఆ విధమైన బాధలూ బంధనాలూ ఏవీ అంటవు. అది ఎలాగంటే అందంగా అటూ ఇటూ కదలుతూ ఉన్న స్వచ్ఛమైన కోనేటి నీటిలో ప్రతిబింబించే సంపూర్ణపూర్ణిమా చంద్రబింబం ఆ నీటి కదలిక వల్ల కదులు తున్నట్లు కన్పిస్తుంది. జలం కదలిక వల్ల ప్రతిబింబం కదలినా ఆకాశంలో ఉన్న చంద్రబింబం ఏమాత్రం చలించదు. అదే విధంగా- సర్వజీవుల శరీర ధర్మాలను కలిగి క్రీడించే ఈశ్వరునకు కర్మబంధాలు ఏ మాత్రమూ అంటవు.

వ. కావున జీవునకు నవిద్యామహిమంజేసి కర్మబంధనాదికంబు సంప్రాప్తం బగుంగాని సర్వ భూతాంతర్యామి యైన యీశ్వరునకుం బ్రాప్తంబు గానేరదని వెండియు- 241

* కాబట్టి జీవునకు మాత్రమే అజ్ఞానప్రభావంవల్ల కర్మబంధాలు కలుగుతున్నాయి. కాని సర్వభూతాల్లో అంతర్యామిగా ఉండే పరాత్పరునకు బంధనాలు ప్రాప్తించవు.

చ. నరునకు నాత్మ దేహజగుణంబులఁ బాపఁగ నోపుఁ బంకజో
దర చరణారవింద మహితస్ఫుట భక్తియ; యింద్రియంబు లీ
శ్వర విషయంబులైన మది సంచితనిశ్చలతత్త్వ మైనచో
సరసిజనేత్రు కీర్తనమె చాలు విపద్దశలన్ జయింపఁగన్. 242

* మానవునకు- తన శరీరం నుండి పుట్టిన గుణాలను పోగొట్టడానికి నారాయణుని పాదసరోజాలమీద విశేషించి విస్పష్టమైన భక్తి ఒకటే చాలు. అట్లే ఆపదలను బాపుకొనడానికి పంచేంద్రియాలను భగవంతుని అధీనంచేసి మనస్సును- చలించని ఉన్నతమైన ఏకాగ్రభావంతో నింపి ఆ సరోజాక్షుని సంకీర్తనం సలిపితే చాలు.

చ. హరిచరణారవింద యుగళార్చన సన్నుతి భక్తి యోగముల్
నిరతముఁ గల్గువారు భవ నీరజగర్భుల కందరాని భా
సురపదమందుఁ జేరుదురు; సూరిజనస్తవనీయ! యట్టి స
త్పురుషుల పూర్వజన్మఫలమున్ గణుతింపఁ దరంబె యేరికిన్. 243

* విద్వజ్జనులు వినుతింపదగిన చరిత్రము గల విదురా! విను. ఎవరైతే శ్రీహరి పాదపద్మాలను పూజించుతూ సన్నుతించుతూ నిరంతరమూ భక్తియోగంలో సమాసక్తులై ఉంటూ ఉంటారో వారు, శివునకూ పద్మభవునకూ సైతం అందుకోరాని దివ్యమైన స్థానాన్ని చేరుకుంటారు. అటువంటి పుణ్యపురుషుల పూర్వజన్మ సుకృత విశేషాన్ని పొగడడానికి ఎటువంటి వారికైనా చేతనౌతుందా?

వ. అని చెప్పిన విదురుండు మైత్రేయుం గనుంగొని ముకుళిత హస్తుండును వినమిత మస్తకుండును నగుచుఁ దన మనంబున శ్రీహరిం దలంచుచు వినయ వచనరచనుండై యిట్లనియె. మునీంద్రా! భవదీయ వాక్యంబులచేత నా మనంబున నారాయణుండు లోకైకనాథుం డెట్లయ్యె ననియు, శరీరధారియైన జీవునికిఁ గర్మబంధంబు లేరీతి సంభవించె ననియునుం బొడమిన సంశయంబు నేఁడు నివృత్తం బయ్యె; నెట్లనిన లోకంబున కీశ్వరుండు హరి యనియు జీవుండు పరతంత్రుం డనియును దలంపుదు; నారాయణభక్తిప్రభావంబు ప్రాణిగోచరంబైన యవిద్యకు నాశన కారణం బనం దనరుచుండు; నారాయణుండు దనకు నాధారంబు లేక సమస్తంబునకుం దాన యాధారభూతుండై విశ్వంబుం బొదివి యందుఁ దా నుండు తెఱంగెట్లు? శరీరాభిమానంబును బొంది యెవ్వఁడు మూఢతముండై సంసారప్రవర్తకుం డగు? నెవ్వండు భక్తిమార్గంబునఁ బరమాత్ముండైన పుండరీకాక్షునిం జెందు? వీర లిద్దఱును సంశయ క్లేశంబులు లేమింజేసి సుఖానంద పరిపూర్ణులై యభివృద్ధి నొందువార లగుదు; రెవ్వండు సుఖదుఃఖానుసంధానంబుచే లోకానుగతుం డగుచుం బ్రమోద వేదనంబుల నొందు; నతండు దుఃఖాశ్రయుండగు; నారాయణ భజనంబున సమస్త దుఃఖనివారణం బగునని భవదీయచరణ సేవానిమిత్తంబునం గంటిఁ: బ్రపంచంబు ప్రతీతిమాత్రంబు గలిగి యున్న దయిన నందులకుఁ గారణంబు లేకుండుటంజేసి తెలియనివాఁ డనై వర్తింతునని వెండియు. 244

* అని మైత్రేయమహాముని చెప్పగా వింటున్న విదురుడు ఒక్కమాటు తలయెత్తి మైత్రేయుణ్ణి చూచాడు. చేతులు జోడించి, శిరస్సు వంచి నమస్కరించాడు. తన మనస్సుతో శ్రీహరిని స్మరిస్తూ వినయమొలుకు పలుకులతో ఈ విధంగా అన్నాడు. 'మునివరేణ్యా! నారాయణుడు లోకానికి ఏకైక ప్రభువు

ఎట్లా అయ్యాడు? శరీరాన్ని ధరించిన జీవునకు కర్మబంధాలు ఏ విధంగా కలిగాయి? అనే అనుమానాలు ఇప్పుడు మీ మాటలవల్ల తొలగిపోయాయి. లోకాలన్నింటికీ ఈశ్వరుడైన శ్రీహరి సర్వస్వతంత్రుడనీ, జీవుడు అస్వతంత్రుడనీ తెలుసుకొన్నాను. నారాయణుని మీద భక్తి గల్గిఉండటం ఒక్కటే జీవులలోని అవిద్యను తొలగించడానికి మూలం అవుతుంది' అని భావిస్తున్నాను.

నారాయణుడు తనకు తాను ఏ ఆధారం లేకుండానే సమస్తలోకానికి తానే ఆధారమై ఈ విశ్వాన్నంతా పొదివి పట్టుకొని ఆ విశ్వంలోనే తానుండటం ఎలా కుదురుతుంది? ఎవడు కేవలం శరీరంపై అభిమానం పెంచుకొని పరమ మూర్ఖుడై సంసారాన్ని సాగిస్తూ ఉంటాడో, ఎవడు భక్తిమార్గంలో ప్రవర్తించి పరబ్రహ్మమైన శ్రీహరిని చేరుకుంటాడో వీళ్లిద్దరూ సంశయమూ క్లేశమూ లేనివారవటం వల్ల సుఖమూ ఆనందమూ అతిశయించినవారై అభివృద్ధి పొందుతారు. "ఎవరు గొప్పవాడు? ఎవడు సుఖిస్తాడు'' అనే సంశయ తర్కాలు దుఃఖాలు లేకుండడంవల్ల సుఖానందాల్ని సమృద్ధిగా పొందిన వారవుతారు. ఎవడు సుఖ దుఃఖాలలో మనస్సు నిలిపి లోకాన్ని అనుసరిస్తాడో వాడు సుఖదుఃఖాలు అనుభవిస్తూ చివరకు చిక్కులపాలవుతాడు. నారాయణ సంసేవనంవల్ల సకలదుఃఖాలూ పటాపంచ లౌతాయని మీ పాదసేవవల్ల తెలుసుకొన్నాను. ఈ ప్రపంచం సమస్తం ఉన్నట్లుగా మనకు గోచరిస్తున్నది. అటువంటి ప్రతీతి కల్గి ఉండటానికి కారణం మాత్రం తెలియడం లేదు.

**క. లలి నా మదిఁ దలఁపుదు సుమ, తులు గొనియాడంగఁ దగిన తోయజనాభుం**
**డలవడఁ డల్పతపోనిర,తుల తలపోఁతలకు మిగుల దుర్లభుఁ డనియున్. 245**

* "సుధీజన సంస్తూయమానుడైన మధుసూదనుడు అంతంత మాత్రం తపస్సు చేసేవారి ఆలోచనలకు అందరానివాడు'' అని నా మనస్సులో అనుకుంటూ ఉంటాను.

**సీ. ఇంద్రియంబులతోడ నెలమి నొప్పెడి మహదాదుల నితరేతరానుషంగ**
**ముగఁ జేసి వానియం దొగి విరాడ్దేహంబు పుట్టించి యందుఁ జేపట్టి తాను**
**వసియించు నాతఁడు వరుస సహస్ర సంఖ్యాకంబులగు మస్తకాంఘ్రిబాహు**
**కలిత సత్పురుషునిగాఁ బ్రహ్మవాదులు పలుకుదు రా విరాట్ప్రభువునందు**

**తే. భువనజాలంబు లలజడిఁ బొరయకుండుఁ, బ్రాణదశకంబు నింద్రియార్థములు నింద్రి**
**యాధిదైవతములుఁ గూడ ననఘ! త్రివిధ, మగుచు విప్రాది వర్ణము లయ్యె నందు. 246**

* భగవంతుడు ఇంద్రియాలతో కూడిన మహదాదులకు పరస్పర సంబంధం కల్పించి విరాట్ దేహాన్ని పుట్టించి అందు నివాసం చేస్తూ ఉంటాడు గదా! బ్రహ్మవేత్తలైనవారు ఆ పరాత్పరుణ్ణి సహస్రశీర్షునిగా సహస్రపాదునిగా సహస్రబాహునిగా పేర్కొంటున్నారు. ఆ విరాట్పురుషునిలో అఖిల లోకాలూ అలజడి పొందకుండా ఉంటున్నాయి. అటువంటి విరాట్ స్వరూపం నుండే పది ప్రాణాలూ, ఇంద్రియగోచరా లయిన విషయాలూ, ఇంద్రియాల కధిపతులైన దేవతలూ, మూడువిధాలైన బ్రాహ్మణాది వర్ణాలూ ఏర్పడ్డాయి.

**క. ఇలఁ బుత్రపౌత్రసంపద, గలిగిన వంశములతోడఁ గడుఁ జోద్యముగా**
**లలిఁ బ్రజ లే గతిఁ గలిగిరి?, కలిగిన యాప్రజలచే జగము లెట్లుండెన్? 247**

* అందులోనుంచి ఈ భూమిపై మహాశ్వర్యం కలిగేలా కొడుకులూ మనుమలూ అనే వంశపరంపరలతో పలురూపాల ప్రజలు ఏ విధంగా ఆవిర్భవించారు? ఆ ప్రజలతో నిండిన ఈ ప్రపంచం ఏ విధంగా ప్రవర్తిల్లుతున్నది?

**క. చతురత దీపింపఁ బ్రజా, పతులకుఁ బతి యనఁగ వెలయు పద్మావతి యే**
**గతిఁ బుట్టించెను స్రష్టు, ప్రతతులచే నవవిధప్రపంచము మఱియున్. 248**

* ప్రజాపతులకు అధిపతియైన లక్ష్మీపతి చతురమతియై తాను సృష్టించిన ప్రజాపతులచే నవనవోన్మేషమైన ఈ ప్రపంచాన్ని ఏ విధంగా సృష్టింపజేశాడు?

**తే. వానిభేదంబులును మనువంశములును, మనుకులాధీశ్వరులును దన్మనుకులాను**
**చరితములు నే విభూతి నే జాడ దీని, నింతయునుఁ బుట్టఁజేసె? నా కెఱుఁగఁ బలుకు. 249**

* ఆ సృష్టిభేదాలనూ, మనువంశాలనూ, మనువంశాల అధిపతులనూ, వంశానుచరితాలనూ భగవంతుడు ఎటువంటి మహామహిమతో ఏ విధంగా పుట్టించాడో? నాకు తెలిసేలా చెప్పు.

**క. పరవిం గ్రిందన్ మీఁదం, ధరణికిఁ గల లోకములను దత్తత్స్థితులన్**
**వరుసం బరిణామంబుల, నెఱిఁగింపఁగదయ్య నాకు నిద్ధచరిత్రా! 250**

* సుప్రసిద్ధ చరిత్రుడవైన ఓ స్వామీ! ఈ భూమికి దిగువనున్న లోకాలనూ, ఎగువనున్న లోకాలనూ వానివాని పరిస్థితులనూ వానిలో వరుసగా వచ్చిన మార్పులనూ నాకు వివరించు.

**క. సురతిర్యఙ్నరరాక్షస, గరు డోరగ సిద్ధ సాధ్య గంధర్వ నభ**
**శ్చరముఖ భవములు మునికుం, జర! గర్భస్వేదజాండజముల తెఱంగున్. 251**

* మునికుల తిలకా! దేవతలు, జంతువులు, మనుష్యులు, రాక్షసులు, గరుడులు, నాగులు, సిద్ధులు, సాధ్యులు, గంధర్వులు, ఖేచరులు మొదలైన వారంతా ఎట్లా పుట్టారు? ఇంకా గర్భజములూ, స్వేదజములూ, అండజములూ అయిన జీవులు జన్మించిన విధానం కూడా నాకు విశదీకరించు.

**క. త్రిగుణప్రధానకంబుగ, నగు నవతారములఁ బూర్ణమై వెలసిన యా**
**జగదుత్పత్తి స్థితిలయ, నిగమముల విధంబు వాని నిలుకడలు దగన్. 252**

* సత్త్వరజస్తమోగుణాలు ప్రధానంగా గల అవతారాలనూ, సమగ్రమైన ఈ జగత్తు జన్మస్థితి లయాలనూ, అవి ప్రవర్తించు విధాలనూ, వేదాలనూ వాని శాశ్వతమైన ఉనికినీ నాకు తెలుపు.

క. చక్రాయుధుసౌందర్య ప, రాక్రమముఖ గుణములును, ధరామరముఖ వ
ర్ణ క్రమములు, నాశ్రమ ధ, ర్మక్రియలును, శీలవృత్తమతభావములున్. 253

* చక్రధరుడైన జగన్నాథుని సౌందర్యం, పరాక్రమం మొదలైన సుగుణాలను వెల్లడించు. బ్రాహ్మణులు మొదలైన నాలుగువర్ణాలనూ, బ్రహ్మచర్యం మొదలైన నాలుగు ఆశ్రమాలనూ, వారివారి ఆయా ధర్మాలనూ, కర్తవ్యాలనూ, స్వభావాలనూ, నడవడులనూ నాకు ఎరిగించు.

తే. యోగవిస్తార మహిమలు యాగములును, జ్ఞానమార్గములును బరిజ్ఞాన సాధ
నములునై యొప్పు సాంఖ్యయోగములు వికచ, జలజనయన స్మృతంబులౌ శాస్త్రములును. 254

యోగ విద్యలు వాని విశేషమహిమలూ, యాగాలూ, వాని విధానాలూ, జ్ఞానమార్గాలూ, విజ్ఞానసాధనాలైన సాంఖ్య యోగాలూ, శ్రీమన్నారాయణుని స్మరణమాత్రంచే సంజాతాలైన శాస్త్రాలూ నాకు వినిపించు.

సీ. పాషండ మార్గంబుఁ బ్రతిలోమకుల విభాగములు జీవులు గుణకర్మములును
బలుకులు గతులును గలిగెడి ధర్మ మోక్షముల యందలి పరస్పరవిరోధ
ములు లేని సాధనములు భూమిపాలక నీతి వార్తలు దండనీతి జాడ
యును బృథగ్భావంబులును విధానములును బితృమేధములును దత్పితృవిసర్గ

తే. గతులుఁ దారాగ్రహంబులుఁ గాల చక్ర, మున వసించిన నిలుకడలును దపములు
దానములుఁ దత్ఫలంబులుఁ దనరు ప్రబల, ధర్మములు బ్రజ లొనరించు కర్మములును. 255

* నాస్తికు లయినవారి ప్రవర్తన లెటువంటివి? అశాస్త్రీయమైన వివాహాలవల్ల ప్రభవించినవారిని విభజించు విధాన మేది? జీవుల గుణకర్మలు, మాటల తీరుతెన్నులు ఎటువంటివి? ధర్మమోక్షాల్లో అన్యోన్యం విరుద్ధం కాని సాధనలు ఎలాంటివి? రాజనీతి, దండనీతి, వేరుపాటు విధానాలు, పితృయజ్ఞాలు, పితృతర్పణాలు, తారలు, గ్రహాలు, ఈ కాల చక్రంలో వాని నిలుకడలు, తపస్సులు, దానాలు, వాని ఫలితాలు, విశేషధర్మాలు, ప్రజలు చేసే కర్మలు, వాని ఫలితాలు నాకు తెలియజెప్పు.

చ. వదలక భూజనావళికి వచ్చు విపద్దశ ధర్మముల్, సరో
జదళనిభాక్షుఁ డేగతిని సంతస మందెడు? నెట్టివారి మేల్
వదలక కానవచ్చు, గురులం బ్రియశిష్యులు గొల్వ వారు స
మ్మదమునఁ గోరు నర్థములు మానుగ నెట్లెఱిఁగింతు రిమ్ములన్. 256

* భూప్రజలకు సంబంధించిన ఆపద్ధర్మాలు ఎట్టివి! అరవిందాక్షుడైన గోవిందుడు ఏవిధంగా సంతోషిస్తాడు? ఎటువంటివారు చేసినమేలు ఎల్లప్పుడు కనిపిస్తూ ఉంటుంది? శిష్యులు గురువులను సేవించగా వారు సంతోషంగా కోరే పరమార్థాలూ, వాటిని చక్కగా తీర్చగల మార్గాలూ నాకు బోధించు.

క. విలయాది భేదముల న, య్యలఘునిఁ బరమేశు నెవ్వ రంచితభక్తిం
గొలుతు రదెవ్వరిలో ను, త్కలికన్ సుఖియించు జీవతత్త్వము? మఱియున్. 257

* ప్రళయం ఎన్నివిధాలు? సర్వేశ్వరుడైన పరాత్పరుణ్ణి ఎవరు అచంచల భక్తితో సేవిస్తారు? జీవతత్త్వం ఎవరిలో వికాసాతిశయంతో ప్రకాశిస్తుంది?

**క. గోవిందుని రూపంబును, జీవబ్రహ్మలకు నైక్యసిద్ధియు నెటులొ?**
**భావన నుపనిషదర్థం, బై వెలసెడి జ్ఞాన మెట్టి దార్యస్తుత్యా! 258**

* మహనీయస్తవనీయా! మైత్రేయా! గోవిందుని స్వరూప నిరూపణం ఎలాగు? జీవబ్రహ్మలకు ఏకత్వం ఎలా కలుగుతుంది? ఎటువంటి జ్ఞానం కలిగితే ఉపనిషత్తుల అర్థం ఊహకు అందుతుంది?

**తే. ఉచిత మగునట్టి శిష్యప్రయోజనములు, సజ్జనులచేత విజ్ఞానసాధనములు**
**నేమి పలుకంగఁబడు, వాని నెల్ల మఱియుఁ, బొలుచు వైరాగ్యమునఁ దగు పురుషభక్తి. 259**

* ఉత్తములైన శిష్యులు కలిగినందువల్ల కలిగే ప్రయోజనాలూ, సజ్జనులు బోధించే విజ్ఞాన సాధనాలూ, వైరాగ్యం వల్ల ప్రకాశించే భగవద్భక్తి ఎటువంటివో వివరించు.

**తే. ఇన్నియుఁ దెలియ నానతి యిచ్చి నన్ను, నర్థి రక్షింపు; యజ్ఞ దానాది పుణ్య**
**ఫలము, వేదంబు సదివిన ఫలము, నార్త, జనులఁ గాచిన ఫలముతో సమము గావు. 260**

* వీటి నన్నింటినీ వివరంగా చెప్పి విపన్నుడనైన నన్ను రక్షించు. యజ్ఞాలు చేసిన ఫలం, దానాలు ఇచ్చిన ఫలం, వేదాలు చదివిన ఫలం- ఇవన్నీ కలిసి ఆర్తులైన నావంటివారిని ఆదరించిన ఫలంతో సమానం కావు.

**క. అని విదురుఁడు మైత్రేయుని, వినయంబునఁ దెలియ నడుగు విధమెల్లను వ్యా**
**సుని సుతుఁ డభిమన్యుని నం, దనున కెఱింగించి మఱియుఁ దగ నిట్లనియెన్. 261**

* అని వినయంగా విదురుడు మైత్రేయుణ్ణి అడిగినట్లు శుకమహర్షి పరీక్షిత్తునకు చెప్పి మళ్లీ ఇట్లా అన్నాడు.

**చ. ఇలఁ గల మానవావళికి నెల్ల నుతింప భజింప యోగ్యమై**
**వెలసిన పూరువంశము పవిత్రము సేయఁగఁ బుట్టి సద్గుణా**
**కలిత యశఃప్రసూన లతికాతతికిం బ్రతివాసరంబుఁ బెం**
**పలరఁగఁ బ్రోది వెట్టుదు గదయ్య! ముకుందకథామృతంబునన్. 262**

* రాజా! భూమండలంలో గల ప్రజలందరికీ ప్రశంసనీయమూ, పూజనీయమూ అయింది పూరువంశం. అటువంటి పూరువంశాన్ని మరింత పవిత్రం చెయ్యటానికి జన్మించిన వాడవు నీవు. మంచి గుణాలనే పుష్పాలతోనిండి నీ కీర్తి లతావితానానికి ప్రతిదినం కమలాక్ష కథాసుధారసం నింపి పెంపు కలిగిస్తూ ఉంటావు కదా!

తే. అల్పతరమైన సుఖముల నందుచున్న, జనుల దుఃఖంబు మాన్పంగఁ జాలునట్టి
పుండరీకాక్ష గుణకథా ప్రోతమైన, వితత నిగమార్థ మగు భాగవతము నీకు. 263

వ. ఎఱింగింతు విను మని యిట్లనియె. 264

* అల్పమైన సుఖాలకోసం అఱ్ఱులుచాస్తూ వాటిని పొంది కూడా దుఃఖాన్నే అనుభవిస్తున్నారు మానవులు. అటువంటి జనులను దుఃఖాలనుండి దూరం చేయడానికి సమర్థమైనట్టిదీ, శ్రీమన్నారాయణుని చరిత్రలనే దారాలతో అల్లబడినదీ, వేదాల అర్థాన్ని విస్తరింపజేసేదీ భాగవతం. అటువంటి భాగవతం నీకు వివరిస్తాను, విను అని శ్రీశుకుడు పరీక్షిత్తుకు ఇలా చెప్పసాగాడు.

సీ. అమ్మహాభాగవతామ్నాయ మొకనాఁడు గైకొని పాతాళలోకమందు
నప్రతిహతబుద్ధియై వాసుదేవాఖ్యఁ బొలుచు సంకర్షణమూర్తి దివ్య
పురుషుండు దనుఁదాన బుద్ధిలోఁ జూచుచు సలలితధ్యాన ముకుళితనేత్రుఁ
డై సనందాభ్యుదయార్థంబు గను విచ్చి చూచిన వారు సంస్తుతు లొనర్ప

తే. నమర గంగావగాహనులై యహీంద్ర, కన్య లార్ద్రజటా బంధకలిత లగుచు
భర్తృ వాంఛానుబుద్ధి నప్పరమపురుషుఁ, గదియ నేతెంచి తత్పాదకమలయుగము. 265

* "వాసుదేవుడు" అనే పేరుతో ప్రకాశించేవాడూ,కేవల జ్ఞానస్వరూపుడూ, దివ్యపురుషుడూ- అయిన సంకర్షణుడు ఒకనాడు వేదసారమైన భాగవతాన్ని పాతాళలోకంలోనికి తీసుకొనిపోయాడు. తన మనస్సులో తన్ను తానే చూచుకొంటూ తదేక ధ్యానంలో కొంచెంసేపు కన్నులు మూసుకున్నాడు స్వామి. సనందనాదుల అభ్యుదయం కోరిన వాడై కన్నులు విప్పి చూచాడు. సనక సనందనాదులు స్వామిని సంస్తుతులు చేశారు. అంతలో ఆకాశగంగలో స్నానం చేసిన నాగకన్యకలు తడిసిన జడచుట్టలతో అచ్చటికి వచ్చారు. ఆ నాగకన్యలు ఆ దివ్యపురుషుడే తమకు భర్త కావాలని భావించారు. ఆ పరమపురుషుని సమీపించి ఆయన పాదపద్మాలను సేవించారు.

క. సేవించి భక్తితో నా, నావిధ పూజోపహార నతి నుతులను నా
దేవుని హృదయము వడసిరి, యావేళ సనందనాదు లమ్మహితాత్మున్. 266

* అలా సేవించి భక్తితో అనేక విధాలైన పూజలు చేశారు. కాన్కలు సమర్పించారు. నమస్కరించారు. స్తోత్రాలతో ఆ దేవుని హృదయాన్ని వశపరచుకొన్నారు. ఆ సమయంలో సనందనాదులు పరమ పురుషుణ్ణి ప్రస్తుతింపసాగారు.

మ. ఘనసాహస్ర కిరీటరత్న విలసత్కాంత ప్రసిద్ధప్రభా
జనితోదగ్రరుచి ప్రకాశితఫణా సాహస్రుఁడౌ దేవతా
వనదీక్షాచణు రూపకృత్యము లొగిన్ వాంఛం బ్రశంసించి వా
రనురాగ స్ఖలితోక్తు లొప్ప నడుగన్ హర్షించి యా దేవుఁడున్. 267

* ఆ దేవదేవుడు వేలకొలది శిరస్సులు కలిగి ఉన్నాడు. ఆ శిరస్సులపై కిరీటాలు అలంకరింపబడి ఉన్నాయి. ఆ  కిరీటాలలోని రత్నాలు రమణీయమైన కాంతులు వెదజల్లుతున్నాయి. ఆ కాంతి పుంజాల వెనుక ఆదిశేషుని వేయిపడగలు సుందరంగా వెలుగొందుతున్నాయి. అటువంటి స్వామిని, దేవతలను రక్షించు ప్రభువును సనందనాదులు మిక్కిలి వేడుకతో సంస్తుతించారు. ఆయన అవతారాలను,ఆయన చేసిన ఘనకార్యాలను ప్రశంసించారు. అలా స్తుతించేటప్పుడు వారి మాటలు దేవునిపై గల అనురాగం వల్ల తడబడ్డాయి. వారి సంస్తుతులకు ఆ దేవుడు సంతోషించాడు.

**తే. భూరి నిగమార్థసార విచార మగుచుఁ, దనరు నీ భాగవతము సాదరతఁ బలికె**
**నలినభవసూతి యైన సనత్కుమార, కునకు నెఱిఁగించె సాంఖ్యాయనునకు నతఁడు. 268**

* సనక సనందనాదుల ప్రార్థనలకు ప్రసన్నుడైన భగవంతుడు సమస్తవేదసారమై పరిఢవిల్లే ఈ భాగవతాన్ని బ్రహ్మదేవుని కుమారుడైన సనత్కుమారునికి సాదరంగా ఉపదేశించాడు. ఆయన సాంఖ్యాయనునకు వెల్లడించాడు.

**క. పరఁగ నతం డంతఁ బరా, శరునకు నుపదేశ మిచ్చె సమ్మతి; నతఁడున్**
**సురగురున కొసఁగె; నాతఁడు, గర మరుదుగ నాకుఁ జెప్పెఁ; గైకొని యేనున్. 269**

* ఆ సాంఖ్యాయనుడు మంచిమనస్సుతో పరాశరునకు ఉపదేశించాడు. పరాశరుడు సురగురువైన బృహస్పతికి తెలిపాడు. ఆయన ఏకాంతంగా నాకు చెప్పాడు.

**క. నీ కిప్పుడు వివరించెద, నాకర్ణింపుము సరోరుహాక్షుం డగు సు**
**శ్లోకుని చరితామృత పరి, షేకుఁడవై ముదము గదురఁ జెలఁగుము విదురా! 270**

* ఓ విదురా! విను. నేను ఆ భాగవతాన్ని ఇప్పుడు నీకు వివరంగా చెబుతున్నాను. ఉత్తమశ్లోకుడైన పురుషోత్తముని చరిత్ర అనే అమృత వర్షంలో తడిసినవాడవై హర్షోత్కర్షంతో ఆకర్ణించు.

**వ. ఇట్లు భగవత్ప్రోక్తంబును, ఋషి సంప్రదాయానుగతంబును, పురుషోత్తమ స్తోత్రంబును, పరమ పవిత్రంబును, భవలతా లవిత్రంబును నయిన భాగవత కథా ప్రపంచంబు శ్రద్ధాళుండవు భక్తుండవు నగు నీకు నుపన్యసించెద, వినుము. 271**

* ఇట్లు భగవంతునిచే చెప్పబడినదీ, ఋషుల సంప్రదాయానుసారంగా సమాగతమైనదీ, పురుషోత్తముడైన పుండరీకాక్షుని పొగడ్త కలదీ, పరమపావన మైనదీ, భవబంధాలను తెగటార్చేదీ- ఐన భాగవత కథావిధానాన్ని భక్తుడవూ ఆసక్తుడవూ అయిన నీకు విశదీకరించుతాను. విను.

**సీ. అనఘ! యేకోదకమై యున్న వేళ నంతర్నిరుద్ధానల దారు వితతి**
**భాతిఁ జిచ్ఛక్తి సమేతుఁడై కపట నిద్రాలోలుఁ డగుచు నిమీలితాక్షుఁ**
**డైన నారాయణుం డంబు మధ్యమున భాసుర సుధా ఫేన పాండుర శరీర**
**రుచులు సహస్ర శిరో రత్న రుచులతోఁ జెలిమి సేయఁగ నొప్పు శేష భోగ**

తే. తల్పమునఁ బవ్వళించి యనల్పతత్త్వ, దీప్తిఁ జెన్నొందఁగా నద్వితీయుఁ డగుచు
నభిరతుండయ్యుఁ గోర్కులయందుఁ బాసి, ప్రవిమలాకృతి నానంద భరితుఁ డగుచు. 272

* ఓ విదురా! పూర్వం ప్రళయసమయంలో విశ్వమంతా జలమయంగా ఉన్నప్పుడు శ్రీమన్నారాయణుడు ఆదిశేషుణ్ణి పాన్పుగా చేసుకొని సముద్రమధ్యంలో పవ్వళించాడు. ఆ ఆదిశేషుడు స్వచ్ఛమైన అమృతం నురుగులవంటి శరీరం కలవాడు. అతని తెల్లనిశరీర కాంతులు అతని వేయి తలలపై తళతళలాడే రత్నాల కాంతులతో చెలిమి చేస్తున్నట్లుగా వెలుగొందాయి. నారాయణుడు తన కడుపులో అగ్నిని దాచుకొన్న దారువులా లోపల చైతన్యశక్తి కలవాడై ఉన్నాడు. అనంతమైన తత్త్వదీప్తితో అద్వితీయుడై ఆనందమయుడై కపటనిద్ర నభినయించుతూ కన్నులు మూసుకొని ఉన్నాడు. కుతూహలం కలిగి కూడా కోర్కెలు లేనివానిలా నిష్కళంకమైన స్వరూపంతో విరాజిల్లాడు.

తే. యోగమాయా విదూరుఁడై యుగసహస్ర, కాలపర్యంత మఖిలలోకములు మ్రింగి
పేర్చి మఱికాల శక్త్యుపబృంహితమున, సమత సృష్టి క్రియా కలాపములఁ దగిలి. 273

* ఈ విధంగా యోగమాయకు కూడా దూరంగా వెయ్యియుగాల పర్యంతం సమస్తలోకాలను తన కడుపులో దాచుకొని వెలుగొందుతూ ఆ పైన కాలమూ శక్తీ చక్కగా అభివ్యక్తం కాగా సమత్వం వహించి సృష్టికార్యం నిర్వహించటానికి ఆసక్తు డైనాడు.

క. తన జఠరము లోపలఁ దాఁ, చిన లోక నికాయముల సృజించుటకును సా
ధనమగు సూక్ష్మార్థము మన, మున గని కాలానుగత రజోగుణ మంతన్. 274

* తన కడుపులో దాచుకొని వున్న సకలలోకాలనూ తిరిగి సృష్టించడానికి ఉపకరణమైన సూక్ష్మపదార్థాన్ని మనస్సులో భావించి, కాలానుగుణంగా రజోగుణాన్ని పుట్టించాడు.

సీ. పుట్టించెఁ దద్గుణంబునఁ బరమేశ్వరు నాభిదేశమునందు నలిననాళ
ముదయించె మఱి యప్పయోరుహ ముకుళంబు గర్మబోధితమైన కాలమందుఁ
దన తేజమునఁ బ్రవృద్ధంబైన జలముచే జలజాప్తు గతిఁ బ్రకాశంబు నొందఁ
జేసి లోకాశ్రయస్థితి సర్వగుణ విభాసితగతి నొప్పు రాజీవమందు

తే. నిజకళా కలితాంశంబు నిలిపె, దానివలన నామ్నాయ మయుఁడును వరగుణుండు
నాత్మయోనియు నైన తోయజభవుండు, సరవిఁ జతురాననుండు నా జనన మయ్యె. 275

* ఆ విధంగా పుట్టించిన రజోగుణంవల్ల నారాయణుని నాభిలో నుండి మొగ్గతో కూడిన ఒక తామరతూడు జన్మించింది. సృష్టికార్యప్రభావితమైన కాలాన్ని అనుసరించి భగవంతుడు తన తేజస్సుచేత వృద్ధిపొందిన నీటినడుమ ఆ తామరమొగ్గను సూర్యునిలాగా వికసింపజేశాడు. లోకాలకు ఆశ్రయం ఇచ్చే స్థితినీ, సకలగుణాలతో ప్రకాశించే ప్రకృతినీ కలిగిఉన్న ఆ కమలంలో పరాత్పరుడు తన కళతోకూడిన

అంశాన్ని ప్రసరింప జేశాడు. అప్పుడు ఆ పద్మంలో నుంచి సంపన్నుడూ, స్వయంభువుడూ, చతుర్ముఖుడూ అయిన బ్రహ్మదేవుడు ఉద్భవించాడు.

**తే. అతఁడు తత్పద్మ కర్ణికయందు నిలిచి, వికచలోచనుఁడై లోకవితతి దిశలు**
**నంబరంబును నిజచతురాననములఁ, గలయఁ బరికించి చూచుచుఁ గమలభవుఁడు. 276**

* పద్మంలోనుంచి ప్రభవించిన ఆ బ్రహ్మ పద్మం పైభాగాన నిలబడి, కన్నులు బాగా తెరచి లోకాలనూ, దిక్కులనూ, ఆకాశాన్ని తన నాల్గుమోములతో పరికించి చూడసాగాడు.

**చ. అలఘుయుగాంత కాలపవనాహత సంచలదూర్మిజాల సం**
**కలిత జలప్రభూత మగు కంజముఁ దద్వనజాత కర్ణికా**
**తలమున నున్న తన్ను విశదక్రియఁ గల్గిన లోకతత్త్వమున్**
**నలిఁ దెలియంగ నోపక మనంబునఁ జాల విచార మొందుచున్. 277**

**వ. ఇట్లని వితర్కించె. 278**

* అంతులేని ప్రళయకాలం. చుట్టూ మహాజలం! ప్రచండమైన గాలులు వీస్తున్నాయి! అలలు లేచిపడుతున్నాయి! ఆ జలమధ్యంలో ఒక పద్మం! ఆ పద్మంమధ్య దుద్దుపై తాను! స్పష్టమవుతూ ఉన్నలోకాల స్వరూపం! ఇదంతా ఏమిటో అర్థంకాక-తెలుసుకోలేక చతుర్ముఖుడు తన మనస్సులోచాలా విచారాన్ని పొంది ఇలా వితర్కించాడు.

**ఉ. ఈ జలమందు నీ కమల మే గతి నుద్భవ మయ్యె? నొంటి యే**
**నీ జలజాత పీఠము నే గతి నుంటి? మదాఖ్య యెద్ది? నా**
**కీ జననంబు నొందుటకు నెయ్యది హేతువు? బుద్ధిఁ జూడ నే**
**యోజ నెఱుంగ లేనని పయోరుహగర్భుఁడు విస్మితాత్ముఁడై. 279**

* ఈ నీటిపై ఈ పద్మం ఏ విధంగా పుట్టింది? ఒంటరిగా నేను ఈ తామర గద్దెపై ఎట్లా ఉంటున్నాను. నాపేరు ఏమిటి? నాకు ఈ పుట్టుక రావడానికి కారణం ఏమిటి? ఎంత ఆలోచించినా ఈ క్రమం ఏమిటో తెలుసుకోలేక పోతున్నాను- అని బ్రహ్మదేవుడు ఆశ్చర్యచకితు డైనాడు.

**క. ఆ వనజనాళ మూలం బా, వనములలోన నర్థి నరయుట కొఱకై**
**యా వనజాత ప్రభవుం, డా వనరుహనాళ వివరమం దభిముఖుఁడై. 280**

* ఆ తామరతూడు ఎక్కడ నుంచి పుట్టిందో, దానిమొదలు ఎక్కడ వున్నదో తెలుసుకోవాలని ఆ నీటిలో వెదకడంకోసం బ్రహ్మదేవుడు పద్మనాళం వెంట లోపలికి ప్రవేశించాడు.

**మ. అతిగంభీర విశాల వారినిధితోయాంతర్నిమగ్నాంగుఁడై**
**చతురాస్యుం డొగి దివ్యవత్సరసహస్రం బబ్జమూలంబు స**

న్మతి నీక్షించియుఁ గానలేక భగవన్మాయా మహత్త్వంబు వి
స్మృతిఁ గావింప విభీతుఁడై మరలఁ జేరెం దత్సరోజాతమున్. 281

* మిక్కిలి లోతూ, మిక్కిలి విరివీ కలిగిన ఆ మున్నీటినీటిలో మునిగినవాడై ఆ బ్రహ్మ వేయిదేవతావత్సరాలు ఎంతో జాగ్రత్తగా వెదికాడు. అయినా ఆ తామరతూడు మూలాన్ని తెలుసుకోలేక పోయాడు. భగవంతుని మాయాప్రభావం మూలాన ఆయనకు ఆ మూల రహస్యం అంతు చిక్కలేదు. మతి గోల్పోయి బెదరిపోయి మళ్లీ ఆ తామర పూవు పైకే చేరాడు.

తే. అట్లు గ్రమ్మఱఁ జేరి యయ్యబ్జపీఠ, మందు నష్టాంగ యోగక్రియానురక్తిఁ
బవను బంధించి మహిత తపస్సమాధి, నుండి శతవర్షములు సనుచుండ నంత. 282

* ఆ విధంగా చతుర్ముఖుడు ఆ పద్మపీఠంపై కూర్చుండి అష్టాంగయోగంపై ఆసక్తి గలవాడైనాడు. గాలిని బంధించి, ఏకాగ్రభావంతో తపస్సు చేశాడు. ఈ విధంగా నూరేండ్లు గడిచాయి.

ఆ. అట్టి యోగజనితమైన విజ్ఞానంబు, గలిగియుండి దానఁ గమలనయనుఁ
గానలేక హృదయకమల కర్ణిక యందు, నున్నవానిఁ దన్నుఁ గన్నవాని. 283

* బ్రహ్మదేవుడు ఈ విధమైన యోగాభ్యాసం వల్ల విజ్ఞానాన్ని పొందాడు. ఆ విజ్ఞానం వల్లకూడా అతడు విష్ణువును చూడలేకపోయాడు. అప్పుడు తన ధ్యానాన్ని తన హృదయంలో నిలిపాడు. అక్కడ పరాత్పరుని దర్శించి తన హృదయంలో "ఉన్నవాడే" తనను "కన్నవా"డని తెలుసుకొన్నాడు.

మ. కనియెన్ నిశ్చలభక్తి యోగమహిమం గంజాతగర్భుండు శో
భనచారిత్రు జగత్పవిత్రు విలసత్పద్మాకళత్రున్ సుధా
శనముఖ్య స్తుతిపాత్రు దానవచమూజైత్రున్ దళత్పద్మ నే
త్రు నవీనోజ్జ్వల నీలమేఘ నిభగాత్రుం బక్షిరాట్పుత్రునిన్. 284

* ఈ విధంగా అచంచలమైన భక్తితో కూడిన యోగమాహాత్మ్యం వల్ల బ్రహ్మదేవుడు శుభచరిత్రుడూ పరమపవిత్రుడూ లక్ష్మీకళత్రుడూ అయిన శ్రీమన్నారాయణుని దర్శించాడు. ఆయన వేలుపుపెద్దల వినతులు అందుకొనే వాడు. దానవసైన్యాలను తరిమికొట్టేవాడు. వికసించిన కమలాలవంటి కన్నులు కలవాడు. క్రొత్తదై వెలిగిపోతూ ఉన్న నీలమేఘంతో సమానమైన దేహం కలవాడు గరుడధ్వజుడు.

వ. మఱియును. 285

చ. అలఘుఫణాతపత్ర నిచయాగ్ర సమంచిత నూత్న రత్న ని
ర్మల రుచిచే యుగాంత తిమిరంబు నడంచి యకల్మషోల్లస
జ్జలములఁ జేసి యందు నవసారస నాళ సితైక భోగముం
గలిగిన శేషతల్పమును గైకొని యున్న మహాత్ము నొక్కనిన్. 286

* అంతేకాదు. ఆ మహానుభావుడు గొప్పవైన పడగలనే గొడుగుల చివర గల స్వచ్ఛమైన రత్నాల కాంతులతో ప్రళయకాలంలోని చీకట్లను పోకార్చుతూ కొంగ్రొత్త తామరతూడులాంటి తెల్లని దేహసంపద కల్గిన ఆదిశేషుణ్ణి పాన్పుగా చేసికొని మిక్కిలి నిర్మలంగా ఉన్న నీళ్ళమధ్యంలో శయనించి ఉన్నాడు.

**సీ. వరపీత కౌశేయ పరిధానకాంతి సంధ్యాంబుద రుచి నిచయంబు గాఁగఁ**
**గమనీయ నవహేమకలిత కిరీటంబు రమణఁ గాంచన శిఖరంబు గాఁగ**
**మానితమౌక్తిక మాలికారుచి సాను పతితనిర్ఝర పరంపరలు గాఁగఁ**
**జెలువొందు నవతులసీ దామకములు లాలితతటజౌషధీ లతలు గాఁగ**

**తే. వరభుజంబులు నికటస్థ వంశములుగఁ, బదము లంగణపాదప ప్రచయములుగ**
**లలితగతి నొప్పు మరకతాచల విడంబి, తాత్మ దేహంబు గలుగు మహాత్ము హరిని. 287**

* కట్టుకొన్న మేలైన పట్టువస్త్రాల కాంతులు సాయంకాలపు మేఘాల కాంతులు కాగా, పెట్టుకొన్న సుందర సువర్ణ కిరీటం బంగారు శిఖరం కాగా, రొమ్ముపై వ్రేలాడే ముత్యాలహారాలు చరియలపై నుండి జాలువారే సెలయేళ్ళు కాగా, అందాలు చిందే తులసీమాలలు దరుల్లో ప్రకాశించే ఓషధీలతలు కాగా, ఉన్నతభుజాలు చెంగట ఉన్న వెదురు మొదళ్ళు కాగా, పాదాలు ముంగిట ఉన్న తరుగుల్మాలు కాగా, పచ్చని దేహంతో పచ్చల పర్వతంలాగా ప్రకాశిస్తున్నాడు ఆ పరాత్పరుడు.

**వ. మఱియు నపరిచ్ఛిన్నంబును నిరుపమానంబును నిఖిలలోక సంగ్రహంబును నతివిస్తార వర్తులాయామం బును నై వివిధ విచిత్ర దివ్యమణి విభూషణంబుల నాత్మీయనిర్మల ద్యుతిచేతం బ్రకాశంబు నొందంజేయు దివ్య దేహంబు దనర వివిధంబులగు కామంబు లభిలషించి విశుద్ధంబైన వేదోక్తమార్గంబున భజియించు పురుషశ్రేష్ఠులకుఁ గామధేను వనం దగిన పాదపద్మ యుగంబును, నలిక ఫలక లలితరుచి నిచయంబులకు నోటువడి కృపాపాత్రుండై చంద్రుండు బహురూపంబులఁ బదసరోజంబుల నాశ్రయించె నన నొప్పు పదనఖంబులును, కమలాభూకాంతలకు నుపధాన రూపంబు లనందగి నీలకదళికాస్తంభంబుల డంబు విడంబించు నూరు యుగళంబును, కనకమణిమయ మేఖలాకలాపాభిరామంబును, గదంబ కింజల్క శోభిత పీతాంబరాలం కృతంబునునై విలసిల్లు కటిమండలంబును, శృంగారవాహినీ జలావర్తంబునాఁ బొలుపొందు నాభివివరంబును, జఠరస్థనిఖిల బ్రహ్మాండ ముహుర్ముహు రుద్భవకృశీభూతం బనం దగు మధ్యభాగంబును, మహిత ముక్తాఫల మాలికా విరచితరంగవల్లీ విరాజితంబు, నవతులసీదామ కిసలయతల్పంబుఁ, గుసుమ మాలికాలంకృతంబు, ఘనసార కస్తూరికా చందనవిలిప్తంబుఁ, గౌస్తుభరత్న దీప్తప్రదీప్తంబు, శ్రీవత్సలక్షణలక్షితంబు నై యిందిరారమణికిఁ గేళీమందిరం బనం బొల్చు వక్షస్థలంబును, సుఖకేళీ సమారంభ పరిరంభణాం భోధిరాట్కన్యకా కరాంభోజ కీలిత కనక మణికంకణ నికషంబులనం బొలుపారు రేఖాత్రయ విరాజమానంబైన కంబుకంధరంబును, సుమహితానర్ఘ దివ్యమణి ప్రభావిభాసిత కేయూర కంకణ ముద్రికాలంకృతంబు లయిన బాహువులును, సకలలోకార్తి నివారక దరహాసచంద్రికా ధవళితంబులై కర్ణకుండల మండన మణిమరీచులు నర్తనంబులు సలుపం దనరి నిద్దంబులగు**

చెక్కుటద్దంబులును, బరిపక్వ బింబఫల ప్రవాళపల్లవారుణాధరంబును, నఖిలభువన పరిపాలనంబునకు నేన చాలుదు నని వివాదించు నయనయుగళంబునకు సీమాస్తంభంబును, చంపక ప్రసూనరుచి విభాసంబును నగు నాసాదండంబును, గమలకుముదంబులకుం బెంపు సంపాదించుచుఁ గరుణామృత తరంగి తాపాంగంబులై కర్ణాంత విశ్రాంతంబులై చెలువొందు నేత్రంబులును, సలలితశ్రీకారంబునకు నక్షరత్వంబు సార్థకంబయ్యె ననందగు కర్ణంబులును, నిక్షుచాప చాప ద్వయంబునాఁ జూపట్టు భ్రూయుగళంబును, నపరపక్షాష్టమీ శశాంకశంకాస్పద ఫాలఫలకంబును, నీలగిరీంద్ర శృంగసంగత బాలమార్తాండ మండల విడంబిత పద్మరాగ మణిఖచిత కాంచన కిరీటంబునం బొలుపారి సూర్యేందు పవనానల ప్రకాశంబులకు నవకాశంబు సూపక త్రిలోక వ్యాపక సమర్థంబులగు తేజోవిశేషంబులఁ జెలువొంది సంగర రంగంబుల దానవానీకంబుల హరింపంజాలు సుదర్శనాది దివ్యసాధనంబులచే దురాసదం బగు దివ్యరూపంబునుం గలిగి మఱియును. 288

* అంతేకాక ఆ మహాత్ముని దివ్యదేహం వేరుపరుపరానిది. సాటిలేనిది. సమస్త లోకాలను తనలో ఇముడ్చుకొన్నది. చాలా విశాలమై గుండ్రనై నిడివి కలిగిఉన్నది. విచిత్రమైన మనోజ్ఞమైన అనేక దివ్యభూషణాలను ధరించి వాటిని స్వచ్ఛ మైన తనకాంతులచే అలంకరిస్తున్నది. పలువిధాలైన కోర్కెలు కోరుతూ యథావిధిగా పూజించే పుణ్యాపురుషులకు కామధేనువు అనదగిన చరణ కమలద్వయం కలిగివున్నది. ఫాలఫలక కాంతులకు ఓడిపోయిన చంద్రుడు అనుగ్రహింప బడినవాడై ఆయన పాదపద్మాలను అనేకరూపాల్లో ఆశ్రయించాడా అన్నట్లు ఉన్నాయి ఆయన కాలిగోళ్లు.

శ్రీదేవికీ, భూదేవికీ తలగడలా అన్నట్లు నున్నని అరటిస్తంభాల నీలద్యుతిని అతిశయిస్తున్నాయి అతని తొడలు. ఆయన కటిప్రదేశం మణులు చెక్కిన బంగారు ఒడ్డాణంతో మనోహరమై ఉన్నది. ఆయన నడుము కడిమిపువ్వుల కేసరాల కాంతులొలికే పట్టుపీతాంబరంతో ప్రకాశిస్తున్నది. ఆయన నాభి శృంగారతరంగిణి సుడివలె ఉన్నది. ఆయన మధ్యప్రదేశం కడుపులో ఉన్న సమస్త జగత్తులూ మాటిమాటికీ పుట్టుతున్నందువల్ల కృశించిందా అన్నట్లు ఉన్నది.

ఆయన వక్షఃస్థలం మంచి ముత్యాలు కూర్చిన ముగ్గులతో ముచ్చటగా ప్రకాశిస్తూ, క్రొంగ్రొత్త తులసీమాలలనే చిగురుల పాన్పుతో ఒప్పుతూ పూలదండలతో అలంకృతమై, పచ్చకర్పూరం కస్తూరి మంచి గందం పూతలతో పరిమళిస్తూ, కౌస్తుభరత్న కాంతులతో వెలిగిపోతూ, శ్రీవత్సశోభితమై లక్ష్మీదేవి విహరించే విలాసమందిరమా అన్నట్లు ఉన్నది. శృంగార క్రీడకు ముందు గట్టిగా కౌగిలించుకొన్న లక్ష్మీదేవి చేతులందలి మణులుచెక్కిన బంగారుగాజులు ఒత్తుకున్న గుర్తులా అన్నట్లు ఆయన కంఠాన మూడురేఖలు కన్పిస్తున్నాయి.

ఆయన చేతులు వెలకట్టరాని రమణీయ రత్నకాంతులతో విరాజిల్లే భుజకీర్తులతో, కంకణాలతో, ఉంగరాలతో అలంకృతములై ఉన్నాయి. ఆయన చెక్కుటద్దాలు సమస్తలోకుల బాధలను పోగొట్టగల చిరునవ్వు వెన్నెలలతో తెల్లనై కర్ణకుండలాల మణిప్రభల నాట్యాలతో తళతళలాడుతూ ఉన్నాయి.

ఆయన క్రిందిపెదవి పండిన దొండపండులాగా, పగడంలా, చిగురుటాకులాగా అరుణారుణమై అలరారుతున్నది. ఆయన ముక్కు చక్కని సంపెంగ పువ్వులా, సమస్తలోకాలను పాలించడానికి చాలిన దానిని 'నేనంటే నే'నని వాదులాడే కన్నులకు సరిహద్దుస్తంభం అన్నట్లు ఉన్నది. ఆయన కన్నులు కమలాలకూ, కలువలకూ శోభ చేకూర్చుతూ, కరుణామృతం పొంగిపొరలే కటాక్ష వీక్షణాలతో చెవులవరకు విస్తరిల్లి ఉన్నాయి. ఆయన చెవులు శ్రీకారానికి అక్షరమైన ఆకారం చేకూరుస్తున్నాయి. ఆయన కనుబొమలు మన్మథుని ధనుస్సులా అన్నట్లు ఉన్నాయి. ఆయన నెన్నుదురు బహుళపక్షం అష్టమినాటి చంద్రుడా అన్నట్లు కన్నుల విందు చేస్తున్నది.

ఆయన శిరస్సుమీద పద్మరాగమణులు పొదిగిన బంగారు కిరీటం నీలపర్వత శిఖరంమీద ఉండే బాలసూర్యుణ్ణి తిరస్కరిస్తున్నది. సూర్యుడు, చంద్రుడు, వాయువు, అగ్ని-వీని ప్రకాశానికి కూడా అవకాశం ఇవ్వకుండా, మూడులోకాల్లోనూ వ్యాపించడానికి సమర్థమైన తేజోవిశేషంతో విరాజిల్లుతూ ఉన్న ఆ దేవదేవుడు రణరంగాలలో రాక్షసుల సమూహాన్ని చించి చెండాడ గల్గిన సుదర్శనం మొదలైన దివ్యాయుధాలు ధరించి ఉన్నాడు. అనన్యసామాన్యమైన దివ్యరూపంతో దేదీప్యమానంగా ప్రకాశిస్తూ ఉన్నాడు.

**ఉ. హారకలాప పుష్పనిచయంబులఁ జంచదనర్ఘ రత్న కే**
**యూర కరాంగుళీయక మహోజ్జ్వల బాహుసహస్రశాఖ లొ**
**ప్పారఁగఁ జూడ నొప్పి భువనాత్మకలీల నదృష్ట మూల వి**
**స్ఫారిత భోగివేష్టిత విభాసిత చందన భూరుహాకృతిన్. 289**

* ఆ మహాత్ముడు హారాది అలంకారాలు పుష్పసమూహాలుగా, వెలకట్టరాని రత్నాలు చెక్కిన భుజకీర్తులతో ఉంగరాలతో, విరాజిల్లే వేలకొలది బాహువులు శాఖోపశాఖలుగా ప్రకాశిస్తూ, భువనానికి ఆత్మయై మూలం తెలియరానిదై పడగవిప్పిన మహాసర్పం చుట్టుకున్న చందన వృక్షంలా ఉన్నాడు.

**మ. విలసత్కుండలి రాజసఖ్యమున నుర్వీభృత్సమాఖ్యన్ సము**
**జ్జ్వలితోదార శిరోవిభూషణ సహస్రస్వర్ణ కూటంబులన్**
**సలిలావాసతఁ జారుకౌస్తుభ విరాజద్రత్న గర్భంబునన్**
**నలినాక్షుండు గనుంగొనంగఁ దగె మైనాకావనీభృద్గతిన్. 290**

* పడగవిప్పిన సర్పరాజుతో కలిసి మెలసి ఉన్నందువల్లా, భూమిని మోస్తూ ఉండటంవల్లా, శిరోవిభూషణాలుగా ప్రకాశించే వేలకొలది కిరీటాలవంటి బంగారు శిఖరాలవల్లా, సముద్రజలమధ్యంలో నివసించడం వల్లా, మనోహరమైన కౌస్తుభాది రత్నాలు కలిగివుండటం వల్లా మహావిష్ణువు మైనాక పర్వతంలా చూడదగినవాడు అయ్యాడు.

**క. వితతార్థజ్ఞాన జప, స్తుతి మకరంద ప్రహృష్ట శ్రుతిజాత మధు**
**వ్రత గణ పరివృత శోభా, గత కీర్తి ప్రసవమాలికలు గలవానిన్. 291**

వ. కనుంగొని చతురాననుండు. 292

విస్తారమైన భావంతో, జ్ఞానం-జపం-స్తోత్రం అనే తేనెలు త్రాగటంచే సంతోషించే తుమ్మెదలు అనే వేదసమూహాలతో చుట్టుకొనబడి వైభవోపేతంగా ప్రకాశించే కీర్తి అనే పూలదండలు గలవానిని ఆ విష్ణుదేవుని చతుర్ముఖబ్రహ్మ చూచాడు.

సీ. అనఘు సర్వేశ్వరు నాద్యంత శూన్యుని ధన్యుని జగదేక మాన్య చరితుఁ
దన్నాభిసరసిజోద్భవ సరోజంబును నప్పుల ననిలుని నంబరమును
మానితభువననిర్మాణ దృష్టిని బొడఁగనెఁ; గాని యితరముఁ గానలేక
యాత్మీయకర్మ బీజాంకురంబును రజో గుణయుక్తుఁ డగుచు నకుంఠిత ప్ర

తే. జాభిసర్గాభిముఖత నవ్యక్త మార్గుఁ, డైన హరియందుఁ దనహృదయంబుఁ జేర్చి
య మ్మహాత్మునిఁ బరము ననంతు నభవు, నజు నమేయుని నిట్లని యభినుతించె. 293

* పుణ్యాత్ముడై సృష్టికంతటికీ ప్రభువై, ఆదీ అంతమూ లేని వాడై ధన్యుడై సకలలోకాలకూ మాన్యుడైన మహానుభావుని బ్రహ్మ దర్శించాడు. అంతేకాదు. ఆయన బొడ్డునుంచి పుట్టిన కమలాన్నీ, జలాన్నీ, అగ్నినీ, ఆకాశాన్నీ, మహాజగత్తును సృష్టించాలనే దృష్టినీ చూచాడు. ఆయనకు ఇతరం ఏమీ కనబడలేదు. తనదైన సృష్టికార్యానికి బీజాంకురమైన రజోగుణం తనలో పొడసూపింది. ప్రముఖమైన ప్రజాసృష్టికి సుముఖుడైనాడు. అంతుపట్టని-అర్థంకాని-ఆ హరియందు తన హృదయాన్ని కేంద్రీకరించాడు. మహాత్ముడూ, పురుషోత్తముడూ, అనంతుడూ, అభవుడూ, అమేయుడూ అయిన పరాత్పరుణ్ణి బ్రహ్మ ఈ విధంగా ప్రస్తుతించాడు.

సీ. నలినాక్ష! మాయాగుణ వ్యతికరమునఁ జేసి కార్యంబైన సృష్టిరూప
మునఁ బ్రకాశించు నీఘనరూపవిభవంబు రూపింప దేహధారులకు దుర్వి
భావ్యంబు దలపోయ భగవంతుఁడవునైన పద్మాక్ష! నీ స్వరూపంబుకంటె
నన్య మొక్కటి సత్యమై బోధకంబైన యది లేదు గాన నీ యతుల దివ్య

తే. మైన రూపంబు నాకుఁ బ్రత్యక్షమయ్యెఁ, నదియుఁగాక వివేకోదయమునఁ జేసి
వరద! నీ రూప మజ్ఞానగురుతమో ని, వారకం బయ్యె నాకు శశ్వత్ప్రదీప! 294

* తామర పూలవంటి కన్నులుగల స్వామీ! మాయాగుణ సంపర్కంవల్ల ఏర్పడింది ఈ సృష్టి. ఈ సృష్టి రూపంలో ప్రకాశించే నీ ఘనస్వరూపాన్ని నిరూపించటానికి మావంటి దేహధారులకు సాధ్యం కాదు. కమలాక్షా! నీ స్వరూపం కంటే మరొక్కటి సత్యమైనదీ, తెలియదగినదీ లేదు. ఓ వరదా! సాటిలేని నీ మనోహర రూపం నాకు సాక్షాత్కరించింది. నాలో వివేకం వికసించింది. జ్యోతిర్మయా! అటువంటి జ్ఞానం కలగడంచేత నీ రూపం అజ్ఞానం అనే పెనుచీకటిని పోగొట్టింది. అందువల్ల నీ రూపం నాపాలిటికి శాశ్వతమైన దీపం.

క. ఘన సత్పురుషానుగ్రహ, మునకై యమితావతారమూలం బగుచుం
దనరెడి నీరూపము శో, భనమగు భవదీయనాభిపద్మమువలనన్. 295

క. జననం బందిన నాచే, ననయము మొదలనె గృహీత మయ్యె; జగత్పా
వన! నీదు సుస్వరూపము, ఘనరుచిరంబై స్వయంప్రకాశక మగుటన్. 296

* ఉత్తమ పురుషులకు అనుగ్రహించటానికై ధరించిన ఎన్నో అవతారాలకు మూలమై వెలుగొందే నీ రూపం శుభాన్ని కలిగిస్తుంది. నీ నాభికమలం నుంచి జన్మించిన నేను నీ రూపాన్ని బాగా తెలుసుకున్నాను. లోకముల కన్నింటికీ పావనుడవైన దేవా! నీ స్వరూపం ఎంతో సుందరమైనది. స్వయంప్రకాశక మైనది.

వ. మఱియు జ్ఞానానందపరిపూర్ణ మాత్రంబును, ననావృతప్రకాశంబును, భేదరహితంబును, బ్రపంచ జనకంబును, బ్రపంచ విలక్షణంబును, భూతేంద్రియాత్మకంబును, నేకంబును, నైన రూపంబు నొందియు నెందును బొడగాన నట్టి నిన్ను నాశ్రయించెద; నదియునుంగాక జగన్మంగళ స్వరూపధరుండవై నీ యుపాసకులమైన మా మంగళంబుల కొఱకు నిరంతర ధ్యానంబుచేత నీ దివ్యరూపంబునం గానంబడితి, విట్టి నీవు నిరయభాక్కులై నిరీశ్వరవాదంబునం జేసి కుతర్కంబులు ప్రసంగించు భాగ్యరహితులచే నాదృతుండవు గావు; మఱియు కొందఱు కృతార్థులైన మహాత్ములు భవదీయ శ్రీచరణారవిందకోశ గంధంబు వేదమారుతానీతం బగుటంజేసి తమతమ కర్ణకుహరంబుల చేత గ్రహించుదురు; వారల హృదయకమలంబులయందు భక్తిపారతంత్ర్యంబున గృహీతపాదార విందంబులు గలిగి ప్రకాశింతు; వదియునుంగాక ప్రాణులకు ద్రవ్యాగార సుహృన్నిమిత్తం బయిన భయంబును దన్నాశనిమిత్తం బయిన శోకంబును, ద్రవ్యాది స్పృహయును దననిమిత్తం బయిన పరిభవంబును, మఱియు నందుఁ దృష్ణయు నది ప్రయాసంబున లబ్ధంబైన నార్తియు, తదీయంబైన వృథాగ్రహంబును నీ శ్రీపాదారవిందంబు లందు వైముఖ్యం బెంతకాలంబు గలుగు నంతకాలంబును బ్రాప్తంబు లగుంగాని మానవాత్మనాయకుండవగు నిన్ను నాశ్రయించిన భయనివృత్తి హేతువైన మోక్షంబు గలుగు; మఱియునుం గొందఱు సకలపాప నివర్తకంబయిన త్వదీయనామస్మరణ కీర్తనంబులందు విముఖులై కామ్యకర్మ ప్రావీణ్యంబునం జేసి నష్టమతులై యింద్రియ పరతంత్రులై యమంగళంబులైన కార్యంబులు సేయుచుందురు; దానంజేసి వాతాదిత్రిధాతు మూలంబైన క్షుత్తృడాదులచేతను, శీతోష్ణవర్ష వాతాది దుఃఖంబులచేతను, నతిదీర్ఘంబైన కామాగ్నిచేతను, నవిచ్ఛిన్నంబగు క్రోధంబుచేతనుం దహ్యమాను లగుదురు; వారలం గనిన నా చిత్తంబు గలంకం బొందు; జీవుండు భవదీయమాయా పరిభ్రామ్యమాణుండై యాత్మ వేఱని యెప్పుడు దెలియు, నంతకాలంబు నిరర్థకంబై దుస్తరంబైన సంసారసాగరంబు తరియింపంజాలకుండు; సన్ము నీంద్రులైనను భవదీయ నామస్మరణంబు మఱచి యితరవిషయాసక్తులైరేని వారలు దివంబులందు వృథాప్రయత్నులై సంచరించుచు, రాత్రులయందు నిద్రాసక్తులై స్వప్నగోచరంబు లయిన బహువిధసంపదకు నానందించుచు, శరీరపరిణామాది పీడలకు దుఃఖించుచుం బ్రతి హతంబులైన యుద్యోగంబుల భూలోకంబున సంసారులౌ వర్తింతురు; నిష్కామధర్ములై నిన్ను భజియించు సత్పురుషుల కర్ణమార్గంబులం బ్రవేశించి భవదీయ భక్తియోగ పరిశోధితంబైన హృత్సరోజ కర్ణికాపీఠంబున వసియింతు వదియునుంగాక. 297

* జ్ఞానంచేతా ఆనందంచేతా పరిపూర్ణమైనదీ, ఆవరణం లేని కాంతి కలదీ, భేదభావం లేనిదీ, ప్రపంచాన్ని సృష్టించేదీ, ప్రపంచంకంటె భిన్నమైనదీ, పంచభూతములకూ, ఇంద్రియాలకూ ఆత్మవంటిది, అనన్యమైనది అయిన రూపాన్ని ధరించి కూడా ఎక్కడా కనిపించని నిన్ను ఆశ్రయిస్తాను. నీవు లోకాలకంతకూ శుభాన్ని చేకూర్చే రూపం ధరించిన వాడవు. నిరంతరం నిన్ను ధ్యానించే మాకు శుభాలను కల్గించడానికై ఈ దివ్యరూపంతో కనబడినావు.

నరకభాజనులై ఈశ్వరుడు లేడని వాదిస్తూ కుతర్కాలతో కాలం గడిపే దురదృష్టవంతులు నిన్ను గుర్తింపలేరు. ధన్యజీవులైన కొందరు మహాత్ములు వేదాలనే మలయమారుతాలు కొనివచ్చిన మీ పాదపద్మాల సుగంధాన్ని వీనులవిందుగా ఆఘ్రాణిస్తారు. వారు భక్తితో పరవశించిన తమ హృదయకమలాలతో నీ పాదపద్మాలను అందుకుంటారు. నీవు ఆ భక్తుల మనస్సులతో ప్రకాశిస్తావు.

అంతేకాక ప్రాణులకు ధనం, ఇల్లు, స్నేహితులవల్ల కలిగే భయం, అవి నాశనం కావడం చేత కలిగే దుఃఖం, వానిమీద ఆశ, వాని సంపాదనలో ఎదురయ్యే అవమానం, ఇన్ని శ్రమలుపడి పొందే శోకానికి మూలమైన తృష్ణ, ఇవన్నీ నీ మంగళకరమైన చరణాబ్జాలను తలంచకుండా ఎంతకాలం ఉంటాయో అంతకాలమూ ఉంటాయి. కాని మానవుల ఆత్మలకు అధినాయకుడవైన నిన్ను ఆశ్రయించినట్లయితే భయాన్ని పోగొట్టు కోవడానికి కారణమైన మోక్షం కలుగుతుంది. కొందరు అన్ని పాపాలూ పోగొట్టగలిగే నీనామ ధ్యానసంకీర్తనలకు విముఖులై మోహసంబంధమైన పనుల్లో మతి కోల్పోయి, ఇంద్రియాలకు దాసులై అశుభాలైన కార్యాలు చేస్తూ ఉంటారు. ఇందువల్ల వాతపిత్తశ్లేష్మాలకు మూలమైన ఆకలిదప్పుల బాధల చేతా, శీతం ఉష్ణం వర్షం వాయువు మొదలైనవాని వల్ల ప్రాప్తించే దుఃఖంచేతా అవధిలేని కామ సంతాపం చేతా, ఎడతెగని కోపంచేతా, తపించి పరితపించుతారు. అటువంటి వారిని చూచి నా మనస్సు చాలా కలత పడుతుంది.

జీవుడు నీ మాయ కల్పించే భ్రమలలో కీలుబొమ్మయై దేహంకంటే ఆత్మవేరని ఎప్పటి వరకు తెలుసుకోడో అంత వరకు సారంలేని సంసార సాగరాన్ని దాటలేడు. శ్రేష్ఠులైన మునీంద్రులుకూడా, నీ నామస్మరణాన్ని మరచి, అన్యవిషయాలపై ఆసక్తి కలవారైనట్లయితే, వారు పగలంతా పనికిమాలినవారై తిరుగుతూ, రాత్రిళ్లు స్వప్నంలో కనిపించే అనేకాలైన సంపదలకు సంతోషపడుతూ, శరీరమందలి జరారోగాది వికారాలకు విచారపడుతూ, ప్రయత్నాలన్నీ భగ్నం కాగా భూలోకంలో సంసారబంధాలలో చిక్కుకొని తిరుగుతారు.

కోరికలు లేకుండా ధర్మ మార్గంలో నిన్ను సేవించే పుణ్యపురుషుల చెవులగుండా నీవు వారిలో ప్రవేశిస్తావు. నీపై భక్తిప్రపత్తుల వల్ల పరిశుద్ధమైన వారి హృదయ కమల పీఠం మీద నీవు కూర్చుంటావు.

**మ. పరయోగీంద్రులు యోగమార్గముల భావంబందు నే నీ మనో**
**హరరూపంబుఁ దలంచి యే గుణగణధ్యానంబు గావింతు, ర**
**ప్పురుషశ్రేష్ఠ పరిగ్రహంబునకునై పొల్పారఁ దద్ధ్యాన గో**
**చరమూర్తిన్ ధరియింతు గాదె పరమోత్సాహుండవై మాధవా! 298**

* ఓ మాధవా! ఉత్తములైన యోగీంద్రులు తమతమ యోగసంప్రదాయాలతో తమతమ భావాలలో ఏ నీ మనోహరరూపాన్ని భావిస్తారో; ఏ నీ గుణగణాల్ని సంభావిస్తారో; వారిని అనుగ్రహించే నిమిత్తం ఆ రూపం ధరించి అటువంటి గుణగణాలతో వారికి సాక్షాత్కరిస్తావు. ఎంతో సంతోషంగా వారిని ఆదుకుంటావు.

తే. అరయ నిష్కామధర్ములై నట్టి భక్తు, లందు నీవు ప్రసన్నుండ వైనరీతి
హృదయముల బద్ధకాములై యెనయు దేవ, గణములందుఁ బ్రసన్నత గలుగ వీవు. 299

* బాగా పరిశీలించి చూస్తే కోరికలు లేకుండా నిన్ను ఆరాధించే భక్తులను నీవు అనుగ్రహించినట్లు కోరికలతో ముడిపెట్టుకున్న హృదయం గల దేవతలనుకూడా నీవు అనుగ్రహించవు.

చ. అరయ సమస్తభూత హృదయంబులయందు వసించి యేకమై
పరఁగి సుహృత్క్రియానుగుణ భాసితధర్ముఁడవుం బరాపరే
శ్వరుఁడవునై తనర్చుచు నసజ్జనదుర్లభ మైన యట్టి సు
స్థిరమగు సర్వభూతదయచేఁ బొడఁగానఁగ వత్తు వచ్యుతా! 300

* ఓ స్వామి! నీవు సకల జీవుల హృదయాలలో అంతర్యామివై ఉంటావు. అందరిలో ఒకే ఒక రూపంతో వెలు గొందుతావు. ఆప్యాయతకు అనుగుణంగా ప్రకాశించే ధర్మ స్వరూపుడవు. అచ్యుతా! ఇహపరాలకు నీవే అధీశ్వరుడవు. సజ్జనులకు సులభమూ అసజ్జనులకు దుర్లభమూ అయిన సర్వజీవకారుణ్యం వల్ల మాత్రమే జనులు నిన్ను దర్శింప గలుగుతారు.

మ. క్రతుదానోగ్ర తపస్సమాధి జపసత్కర్మాగ్ని హోత్రాఖిల
వ్రతచర్యాదుల నాదరింప; వఖిలవ్యాపారపారాయణ
స్థితి నొప్పారెడి నీ పదాబ్జయుగళీ సేవాభిపూజాసమ
ర్పితధర్ముం డగువాని భంగి నసురారీ! దేవచూడామణీ! 301

* దనుజవిరామా! దైవతసార్వభౌమా! సమస్త వ్యాపారాలూ, నీకే సమర్పించి నీయందే మనస్సు లగ్నం చేసి, నీ పాదపద్మద్వయాన్నే నిరంతరం ఆరాధించే భక్తుణ్ణి నీవు ఎంతో అప్యాయంగా ఆదరించి ఆదుకొంటావు. యజ్ఞాలూ, దానాలూ, కఠోరతపస్సులూ, జపాలూ, అగ్నిహోత్రాలూ, వ్రతాలూ మొదలైన సత్కర్మలు ఆచరించే వారిని కూడా ఇంత ప్రేమగా ఆదరించవు.

తే. తవిలి శశ్వత్స్వరూప చైతన్యభూరి, మహిమచేత నపాస్త సమస్తభేద
మోహుఁడ వఖిల విజ్ఞానమునకు నాశ్ర, యుండవగు నీకు మ్రొక్కెద నో రమేశ! 302

* ఓ లక్ష్మీవల్లభా! నీ స్వరూపం శాశ్వతమైనది. అందలి చైతన్యమహాప్రభావం వల్ల సమస్తమైన భేద భావాలనూ, వ్యామోహాలనూ రూపుమాపుతావు. అఖండ విజ్ఞానానికి ఆశ్రయమైన నీకు నమస్కరిస్తున్నాను.

క. జనన స్థితి విలయంబుల, కనయంబును హేతు భూతమగు మాయా లీ
లను జెంది నటన సలిపెడు, ననఘాత్మక! నీ కొనర్తు నభివందనముల్. 303

* పుట్టుట, వృద్ధిపొందుట, చనిపోవుట-అనే మూడింటికీ మూలకారణమైనది నీ మాయ. అటువంటి మాయా నటనలతో, లీలా విలాసాలతో నిరంతరము క్రీడించే ఓ పవిత్ర స్వరూపా! నీ కివే నా కైమోడ్పులు.

సీ. అనఘాత్మ! మఱి భవదవతార గుణకర్మ ఘనవిడంబనహేతుకంబు లయిన
రమణీయమగు దాశరథి వసుదేవ కుమారాది దివ్యనామంబు లోలి
వెలయంగ మనుజులు వివశాత్ములై యవసానకాలంబున సంస్మరించి
జన్మ జన్మాంతర సంచిత దురితంబుఁ బాసి కైవల్యసంప్రాప్తు లగుదు

తే. రట్టి దివ్యావతారంబు లవధరించు, నజుఁడవగు నీకు మ్రొక్కెద ననఘచరిత!
చిరశుభాకార! నిత్యలక్ష్మీవిహార! భక్తమందార! దుర్భవ భయవిదూర! 304

* స్వామీ! నీవు పరమపవిత్రుడవు! సచ్చరిత్రుడవు! శాశ్వతమైన దివ్యమంగల స్వరూపం కలవాడవు! ఎల్లప్పుడూ లక్ష్మీదేవితో కూడి సంచరించేవాడవు! భక్తులకు కల్పవృక్షం వంటివాడవు! దుర్భరమైన సంసార భయాన్ని దూరంగా పోగొట్టేవాడవు! నీ అవతారాలకూ, సద్గుణాలకూ, సత్కార్యాలకూ, మహదాశయాలకూ కారణమైనవీ, మనోహరమైనవీ అయిన "దాశరథీ", "వాసుదేవా" ది దివ్యనామాలను మనుష్యులు తమ తుది గడియల్లో స్మరించి, జన్మజన్మల్లో కూడబెట్టుకొన్న పాపాలను పోగొట్టుకొని మోక్షం పొందుతారు. జన్మ లేనివాడవై కూడా అటువంటి దివ్యావతారాలతో జన్మించే నీకు మ్రొక్కుతున్నాను.

త. జనన వృద్ధి వినాశ హేతుక సంగతిం గల యేను నీ
వును హరుండుఁ ద్రిశాఖలై, మనువుల్ మరీచి ముఖామరుల్
దనర నందుపశాఖలై, భవదాత్మ దీనికి మూలమై
యనయమున్ భువన ద్రుమాకృతివైన నీ కిదె మ్రొక్కెదన్. 305

ఈ విశ్వం ఒక మహావృక్షం. సృష్టిస్థితిలయ కారకులమైన నేనూ, నీవూ, శివుడూ, ముగ్గురం ఆ వృక్షానికి మూడు శాఖలం. మనువులూ, మరీచి మొదలైన ప్రజాపతులూ, దేవతలూ దాని ఉపశాఖలు. ఆ విశ్వవృక్షానికి ఆధారమైన కూకటి వేరు నీవే. విశాలమైన దాని ఆకారం కూడా నీవే! అటువంటి నీకు కైమోడ్పులు.

మ. పురుషాధీశ! భవత్పదాబ్జయుగళీ పూజాదికర్మక్రియా
పరతం జెందని మూఢచిత్తునిఁ బశుప్రాయున్ మనుష్యాధమున్
జరయున్ నాశము నొందఁజేయు నతిదక్షంబైన కాలంబు; త
ద్గురు కాలాత్ముఁడవైన నీకు మది సంతోషంబునన్ మ్రొక్కెదన్. 306

* పురుషోత్తమా! నీ పాదపద్మాలను పూజించడం అనే మంచి పనిలో మునిగి తన్మయత్వం చెందనివాడు పరమమూఢుడు, పశువులాంటి వాడు, అధముడు. అటువంటి మానవునకు సర్వసమర్థమైన కాలం త్వరగా ముసలి తనాన్ని కల్గించి, వాని వినాశనానికి దారితీస్తుంది. అటువంటి అనంతకాలానికి ఆత్మస్వరూపుడ వయిన నీకు ఆనందంగా నమస్కరిస్తాను.

**సీ. సర్వేశ! కల్పాంతసంస్థిత మగు జలజాతమం దేను సంజనన మంది**
**భవదీయ సుస్వరూపముఁజూడ నర్థించి బహువత్సరములు దపంబు సేసి**
**క్రతుకర్మములు పెక్కు గావించియును నినుఁ బొడగానఁగా లేక బుద్ధి భీతిఁ**
**బొందిన నాకు నిప్పుడును నిర్హేతుక కరుణచే నఖిలలోకైకవంద్య**

**తే. మాన సతత ప్రసన్న కోమల ముఖాబ్జ, కలిత భవదీయ దివ్యమంగళ విలాస**
**మూర్తి దర్శింపఁ గలిగె భక్తార్తిహరణ, కరణ! తుభ్యం నమో విశ్వభరణ! దేవ! 307**

* ఓ సర్వేశ్వరా! కల్పాంతసమయంలో చెక్కుచెదరని తామర పువ్వునందు నేను పుట్టాను. నీ అత్యంతసుందర మైన ఆకారాన్ని చూడగోరి చాలా సంవత్సరాలు తపస్సు చేశాను. క్రతువులు కూడా ఎన్నో చేశాను. కాని నీ జాడ అంతు చిక్కక ఎంతో బెదరి పోయాను. అటువంటి నాకు ఎటువంటి కారణం లేకుండానే కరుణ గలవాడవై ఇప్పుడు నీవు సాక్షాత్కరించావు. అఖిలలోకాలకూ ఆరాధనీయమై, ఎల్లప్పుడూ ప్రసన్నకోమలమైన ముఖపద్మంతో విరాజిల్లే నీ దివ్య మంగళ విగ్రహాన్ని ఇప్పుడు కనులారా, కరవుదీరా దర్శింప గలిగాను. భక్తుల వేదనలను పోగొట్టే ఓ పరమాత్మా! ఈ విశాల విశ్వాన్ని భరించే దేవాదిదేవా! నీకు నమస్కారం!

**సీ. అమర తిర్యఙ్మనుష్యాది చేతనయోను లందు నాత్మేచ్ఛచేఁ జెందినట్టి**
**కమనీయ శుభమూర్తి గలవాఁడవై ధర్మసేతు వనంగఁ బ్రఖ్యాతి నొంది**
**విషయ సుఖంబుల విడిచి సంతత నిజానందానుభవ సమున్నతిఁ దనర్తు;**
**వది గాన పురుషోత్తమాఖ్యఁ జెన్నొందుదు వట్టి ని న్నెప్పుడు నభినుతింతు;**

**తే. నర్థి భవదీయపాదంబు లాశ్రయింతు; మహిత భక్తిని నీకు నమస్కరింతు;**
**భక్త జన పోష పరితోష! పరమ పురుష! ప్రవిమలాకార! సంసార భయవిదూర! 308**

* నీవు భక్తజనులను పోషించటంలో మిక్కిలి సంతోషపడేవాడివి. నిర్మలమైన ఆకారం కలవాడవై సంసారభయాన్ని దూరం చేసే పురుషోత్తముడవు! నీ సంకల్పానుసారంగా దేవతలు, జంతువులు, మనుష్యులు మొదలైన సచేతన రూపాలు ధరించి అవతరిస్తావు. మనోహరమైన మంగళ స్వరూపంతో ధర్మానికి సేతువుగా నిలుస్తావు. పేరు ప్రఖ్యాతులు గడిస్తావు. లౌకిక సుఖాలను విడచిపెట్టి ఎల్లప్పుడూ అపారమైన ఆనందాన్ని అనుభవిస్తావు. అందుకనే నీవు పురుషోత్తముడనే ప్రశస్తి గాంచావు. అటువంటి నిన్ను నిత్యమూ సన్నుతిస్తాను. ప్రీతితో నీ పాదాలను ఆశ్రయిస్తాను. అపరిమిత భక్తితో నీకు నమస్కరిస్తాను.

**సీ. తలకొని పంచభూతప్రవర్తక మైన భూరిమాయాగుణస్ఫురణఁ జిక్కు**
**వడక, లోకంబులు భవదీయ జఠరంబులో నిల్పి ఘనసమాలోలచటుల**

సర్వంకషోర్మిభీషణవార్ధి నడుమను ఫణిరాజభోగతల్పంబునందు
యోగనిద్రారతి నుండంగ నొకకొంత కాలంబు సనఁగ మేల్కనిన వేళ

తే. నలఘుభవదీయ నాభితోయజమువలన, గడఁగి ముల్లోకములు సోపకరణములుగఁ
బుట్టఁజేసితి వతులవిభూతి మెఱసి, పుండరీకాక్ష! సంతత భువనరక్ష! 309

* తెల్లదామర రేకులవంటి కన్నులు గలవాడై ఎల్లవేళలా ముల్లోకాలను చల్లగా రక్షించే స్వామీ! నీవు ముందుండి పంచభూతాలను ప్రవర్తింపజేసే మహామాయాబంధాలలో చిక్కుపడకుండా లోకాలను నీ కడుపులో నిల్పుకొంటావు. ఉవ్వెత్తుగా లేచిపడుతున్న ఉత్తుంగ తరంగాలతో పొంగిపొరలే భయంకరమైన సముద్రం నడుమ శేషతల్పం మీద శయనించి యోగనిద్రలో ఉంటావు. కొంతకాలం గడిచాక మేల్కొంటావు. అప్పుడు నీ సాటి లేని మేటి వైభవాన్ని వ్యక్తం చేస్తూ, నీనాభికమలంలోనుండి మూడు లోకాలను పుట్టింపజేస్తావు.

క. నిగమస్తుత! లక్ష్మీపతి!, జగదంతర్యామి వగుచు సర్గము నెల్లం
దగు భవదైశ్వర్యంబున, నగణిత సౌఖ్యానుభవము నందింతుఁ గదే! 310

* వేదాలచే వినుతింపబడే లక్ష్మీవల్లభా! స్వామీ! నీవు జగములలో అంతర్యామివై ఉంటూ ఈ విశ్వాని కంతటికీ భవ్యమైన నీ దివ్యవిభూతిచే లెక్కలేనన్ని ఆనందానుభూతులను అందిస్తావు కదా!

సీ. జలజాక్ష! యెట్టి విజ్ఞానబలంబునఁ గల్పింతు వఖిలలోకంబు లోలి
నతజన ప్రియుఁడవు నాకట్టి సుజ్ఞాన మర్థిమైఁ గృపసేయుమయ్య వరద!
సృష్టినిర్మాణేచ్ఛఁ జెంది నా చిత్తంబు దత్కర్మకౌశలిఁ దగిలియుండి
యును గర్మవైషమ్యమును బొందు కతమున దురితంబుఁ బొరయక తొలఁగునట్టి

తే. వెరవు నా కెట్లు గలుగు న వ్విధముఁ దలఁచి, కర్మవర్తను ననుభవత్కరుణ మెఱసి
తగఁ గృతార్థునిఁ జేయవే నిగమవినుత! సత్కృపామూర్తి! యో దేవచక్రవర్తి! 311

* తామరరేకులవంటి కన్నులు గలవాడవూ, వేదములచే పొగడబడే వాడవూ అయిన ఓ పరమకరుణార్ద్రమూర్తీ! ఓ దేవతాచక్రవర్తీ! నీవు ఏ విధమైన విజ్ఞానబలంతో ఈ సమస్తలోకాలను సృష్టిస్తున్నావో నాకు అటువంటి ఉత్తమజ్ఞానాన్ని ప్రసాదించు. నీకు నమస్కరించే జనులకు నీవు ప్రియుడవుకదా! ఓ వరదా! నా మనస్సులో సృష్టించాలనే కోరిక మిక్కుటంగా ఉన్నది. అది చేయడానికి తగిన నైపుణ్యం కూడా నాకు అనుగ్రహించి కర్మలందలి ఒడుదుడుకుల వల్ల పాపం పొందకుండా ఉండే ఉపాయం ఏమిటో నాకు తెల్పు. కర్మజీవినయిన నన్ను కనికరించి కృతార్థుణ్ణి కావించు.

చ. భవదుదర ప్రభూతమగు పద్మమునందు వసించి యున్న నే
నవిరళతావకీన కలితాంశమునం దనరార విశ్వముం
దవిలి రచించుచున్ బహువిధంబులఁ బల్కెడి వేదజాలముల్
శివతరమై ఫలింపఁ గృపసేయుము భక్తఫలప్రదాయకా! 312

* స్వామీ! నీవు భక్తులు కోరిన ఫలాన్ని పదింతలుగా ప్రసాదించే వాడివి! నీ కడుపున పుట్టిన కమలంలోనుంచి జన్మించిన నేను అపారమైన నీ అంశతో ప్రకాశించే ఈ విశ్వాన్ని సృష్టించడానికి పూనుకొన్నాను. ఈ సందర్భంలో నేను పలురీతులుగా పలికే పలుకులు ప్రాబలుకులై మంగళప్రదాలై ఫలించేటట్లు అనుగ్రహించు.

చ. అని యనుకంప దోఁప వినయంబునఁ జాఁగిలి మ్రొక్కి చారు లో
చన సరసీరుహుం డగుచు సర్వజగత్పరికల్పనారతిం
దనరిన నన్నుఁ బ్రోచుటకుఁ దా నిటు సన్నిధియైన యీశ్వరుం
డనయము నాదు దుఃఖము దయామతిఁ బాపెడు మంచు నమ్రుఁడై. 313

* అని కమల సంభవుడు కనికరం ఉట్టిపడేటట్లు విష్ణుదేవునికి విన్నవించుకొని వినయంతో సాగిలపడి మ్రొక్కాడు. "సర్వప్రపంచాన్ని సృష్టించడానికి పూనుకొన్న నన్ను అందాలు చిందే కమలాలవంటి కన్నులతో వీక్షించి రక్షించడానికై, ఈ విధంగా సాక్షాత్కరించిన పరాత్పరుడు నాదుఃఖాన్ని దూరం చేయుగాక!" అని తలవంచి నమస్కరించాడు.

క. వనరుహసంజాతుఁడు నె, మ్మనమున హర్షించె ననుచు మైత్రేయ మహా
ముని ఘనుఁడగు విదురునకున్, వినయంబున నెఱఁగ జెప్పి వెండియుఁ బలికెన్. 314

* ఈ విధంగా ప్రణమిల్లి బ్రహ్మదేవుడు తనలో తాను ఆనందముతో పొంగిపోయాడు అని మైత్రేయ మహర్షి విజ్ఞానధనుడైన విదురునకు విశేషించి చెప్పి, మళ్లీ ఇట్లా అన్నాడు.

మ. వనజాతప్రభవుండు కేవలతపో వ్యాసంగుఁడై పద్మ లో
చను గోవిందు ననంతు నాద్యుఁ దన వాక్ఛక్తిన్ నుతింపన్ సుధా
శనవంద్యుండు ప్రసన్నుఁడై నిఖిలవిశ్వస్థాపనాలోకనం
బునఁ జూచెన్ విలయప్రభూత బహువాఃపూరంబులన్ వ్రేల్మిడిన్. 315

పద్మసంభవుడైన బ్రహ్మదేవుడు కేవలం తపస్సుపై ఆసక్తి కలవాడై పద్మాక్షుడూ, గోవిందుడూ, అనంతుడూ, పురుషోత్తముడూ అయిన పరమేశ్వరుణ్ణి తనమాటల పాటవంతో ప్రస్తుతించాడు. దేవదేవుడైన ఆ స్వామి అనుగ్రహించాడు. సమస్త విశ్వాన్ని సంస్థాపించాలనే దృష్టితో ప్రళయాన్ని సృష్టించిన ఆ మహాజలప్రవాహంవైపు అలా అలవోకగా ఒకమాటు అవలోకించాడు.

తే. అట్లు వొడగని యార్తుఁడై నట్టి పద్మ, భవునివాంఛిత మాత్మఁ దీర్పంగఁ దలఁచి
యతని మోహనివారక మైనయట్టి, యమృతరస తుల్యమధుర వాక్యముల ననియె. 316

* అలా చూచి పరితపించే బ్రహ్మదేవుని కోర్కె తీర్చాలని మదిలో భావించాడు. అతనిలోని వ్యామోహాన్ని తొలగించ గలిగి అమృతముతో సమానమైన తీయని మాటలతో ఇట్లా అన్నాడు.

చ తలకొని నీ యొనర్చు పని తప్పి మదిం దలపోయు దుఃఖముం
దలఁగుము; నాదులీలకుఁ బ్రధానగుణంబగు సృష్టికల్పనం

**బలవడఁజేయు బుద్ధి హృదయంబునఁ జొన్పి తపస్సమాధి ని**
**ష్ఠల నతిభక్తులన్ ననుఁ బ్రసన్నునిఁ జేయుము చెందుఁ గోరికల్.** 317

* నీవు చేయవలసిన పని మానకు. అనవసరముగా మనస్సుకు తెచ్చి పెట్టుకొన్న దుఃఖాన్ని మాను. సృష్టినిర్మాణం నా లీలలో ప్రధానమైనది. ఈ సత్యం నీ హృదయంలో ప్రతిష్ఠించుకొని సమాధినిష్ఠుడవై భక్తితో తపస్సుచేసి నన్ను ప్రసన్నుని చేసుకో. నీ కోరికలు నేరవేరుతాయి.

**క. నీ వొనరించు తపో వి, ద్యావిభవ విలోకనీయమగు నీ సృష్టిం**
**గావింపుము లోకంబుల, లోవెలిఁగెడి నన్నుఁ గందు లోకస్తుత్యా!** 318

నీవు లోకస్తుత్యుడవు! నీ తపస్సంపదకు తగినట్లు చూడముచ్చటగా ఈ సృష్టికార్యాన్ని ప్రారంభించు. అప్పుడు అంతటా అన్ని లోకాల్లో ప్రకాశించే నన్ను నీవు చూడగలుగుతావు.

**క. నాలోని జీవకోటులు, వాలాయము నీకుఁ గానవచ్చు నిపుడు, నీ**
**వాలోకింపుము దారు వి, లోలహుతాశనుని కరణి లోకస్తుత్యా!** 319

* ఓ జగన్నుతా! కట్టెలోపల దాగివున్న అగ్నిజ్వాలల విధంగా నాలో దాగి వున్న ప్రాణిసమూహాలన్నీ నీకు తప్పకుండా కనిపిస్తాయి. ఏదీ ఇప్పుడు నీవు చూడు.

**సీ. నలు వొంద నఖిల జీవులయందుఁ గల నన్నుఁ దెలిసి సేవింపుము నలినగర్భ!**
**భవదీయదోషముల్ వాయును భూతేంద్రియాశ్రయ విరహితమై విశుద్ధ**
**మైన జీవుని విమలాంతరాత్ముఁడనైన నను నేకముగఁ జూచు నరుఁడు మోక్ష**
**పరమార్గవర్తియై భాసిల్లు, బ్రహ్మాండ మందున వివిధకర్మానురూప**

**తే. పద్ధతులఁజేసి పెక్కు రూపముల నొందు, జీవతతి రచియించు నీచిత్త మెపుడు**
**మత్పదాంబుజ యుగళంబు మరగియున్న, కతన రాజసగుణమునఁ గలుగ దఘము.** 320

* ఓ సరోజసంభవా! సకలజీవులలో అంతర్యామినై ఉన్న నన్ను చక్కగా తెలుసుకొని సేవించు. నీ దోషాలన్నీ తొలగి పోతాయి. పంచభూతాలకూ, పది ఇంద్రియాలకూ అతీతుడైన జీవుడే ఆత్మ. పరిశుద్ధుడైన ఆత్మనూ, పరమాత్ముడనైన నన్నూ ఒకే తీరున దర్శించే మానవుడు మోక్షమార్గంలో నడచే బాటసారియై ప్రకాశిస్తాడు. విశ్వగోళంలో వివిధకర్మలకూ అనురూపమైన పద్ధతుల్లో ప్రవర్తించే అనేకరూపాలు గల జీవులను నీవు సృష్టించుతున్నప్పటికీ నీ మనస్సు నిత్యం నా పాద పద్మాల మీదనే లగ్నమై ఉన్నందువల్ల నీ లోని రాజసగుణం నీకు పాపాన్ని కలిగించదు.

**క. విను మదియుఁగాక ప్రాణుల, కనయము నెఱుఁగంగరాని యనఘుఁడఁ దేజో**
**ధనుఁడఁ బరేశుఁడ నీ చే, తను గానంబడితి నిదె పితామహ! కంటే.** 321

* అది అట్లా ఉంచు. ఓ పితామహా! నేను ప్రాణులకు ఏనాడూ తెలియబడని పురాణపురుషుడను; తేజోనిధిని, పరమేశ్వరుడను. అటువంటి నేనే ఇప్పుడు నీ ముందు సాక్షాత్కరించాను. చూచావు గదా!

వ. మఱియు భూతేంద్రియ గుణాత్మ్కం డనియు జగన్మయుండ ననియు నన్ను నీ చిత్తంబునందుఁ దలంపుము; తామరసనాళ వివరపథంబు వెంటం జని జలంబులలోనం జూడం గోరినట్టి మదీయస్వరూపంబ 322

క. నీ కిప్పుడు గానంబడె, నాకులకును నురగపతి పినాకులకైనన్
వాకొనఁగం దలపోయను, రాకుండు మదీయరూప రమ్యత్వంబుల్. 323

* నేనే పంచభూతాలకూ, పది ఇంద్రియాలకూ, త్రిగుణాలకూ ఆత్మననీ, జగత్తు అంతటా వ్యాపించిన వాడననీ, నన్ను నీ మనస్సులో భావించు. అప్పుడు కమలనాళం కన్నం వెంటవెళ్ళి నీటిలో నన్ను చూడాలనుకున్న నా స్వరూపం ఇప్పుడు నీకు కన్పించింది. దేవతలూ, ఆదిశేషుడూ చివరకు ఆ పరమ శివుడుకూడా నా స్వరూపంలోని సౌందర్య విశేషాన్ని మాటలతో వర్ణింపలేరు; మనస్సున ఊహింపలేరుకూడా.

క. కావున మచ్చారిత్ర క, థా విలసితమైన సుమహితస్తవము జగ
త్పావనము విగతసంశయ, భావుఁడవై బుద్ధి నిలుము పంకజజన్మా! 324

* నళినసంభవా! నా చరిత్రతోకూడి, నా లీలా విలాసాలైన కథలతో ప్రకాశించే ఈ పరమ పవిత్రస్తోత్రం లోకాన్ని పవిత్రం చేస్తుంది. అందుకని ఏ మాత్రం సంశయం లేకుండా దీనిని నీ బుద్ధిలో స్థిరంగా నిల్పి ఉంచుకో!

క. అగుణుఁడ నై లీలార్థము, జగములఁ గల్పింపఁ దలఁచు చతురుని నన్నున్
సగుణునిఁగా నుతియించితి, తగ సంతసమయ్యె నాకుఁ దామరసభవా! 325

* సరసిజసంభవా! నిర్గుణుడనై, వినోదం కోసం జగత్తులను సృష్టించాలనుకున్న నన్ను సగుణ పరబ్రహ్మనుగా ప్రస్తుతించావు. నాకు ఎంతో సంతోషమైంది.

క. ఈ మంజుస్తవరాజము, నీ మనమునఁ జింతఁ దక్కి నిలుపుము భక్తిన్
ధీమహిత! నీ మనంబునఁ, గామించిన కోర్కు లెల్లఁ గలుగుం జుమ్మీ. 326

* మతిమంతుడా! మనోహరమైన ఈ మహాస్తోత్రాన్ని నిశ్చింతగా నిశ్చల భక్తితో నీమనస్సులో నిలుపుకో. నీ కోరికలన్నీ నిశ్చయంగా నెరవేరుతాయి.

క. అనుదినమును ద్రిజగత్పా, వన మగు నీ మంగళ స్తవంబుఁ బఠింపన్
వినినను జనులకు నేఁ బొడ, గనఁబడుదు నవాప్తసకల కాముఁడ నగుచున్. 327

* ముల్లోకాలను పవిత్రం చేసే శుభప్రదమైన ఈ స్తుతిని ప్రతిదినం ఎవరు పఠిస్తారో, వింటారో ఆజనులకు వారి కోర్కె లన్నింటినీ తీర్చువాడనై నేను దర్శనమిస్తాను.

తే. వన తటాకోపనయన వివాహ దేవ భవన, నిర్మాణ భూమ్యాది వివిధ దాన
జప తపో వ్రత యోగ యజ్ఞముల ఫలము, మామక స్తవఫలము సమంబు గాదు. 328

* ఉద్యానవనాలు నెలకొల్పటం, చెరువులు త్రవ్వించటం, వివాహమంటపాలు, ఉపనయనశాలలు, దేవాలయాలు నిర్మించడం, భూదానాలు మొదలైనవి చేయటం- జపతపాలు, వ్రతాలు, యోగాలు, యజ్ఞాలు చేయటంవల్ల ప్రాప్తించే ఫలాలు నా స్తోత్రఫలానికి ఏ మాత్రం సమానం కావు.

క. జీవావలిఁ గల్పించుచు, జీవావలిలోనఁ దగ వసించుచుఁ బ్రియ వ
స్త్వావలిలోపలఁ బ్రియ వ, స్త్వావలినై యుండు నన్ను ననిశముఁ బ్రీతిన్. 329

క. తలఁపుము మత్ప్రీతికినై, కలిగించితి నిన్ను భువనకారణ! నా లో
పల నడఁగి యేకమై ని, శ్చలగతి వసియించి యున్న జగముల నెల్లన్. 330

* జీవులను సృష్టిస్తూ, ఆ జీవ సమూహంలో అంతర్యామినై వర్తిస్తూ, ప్రియవస్తువుల్లో అత్యంత ప్రియవస్తువునై ఉండే నన్ను నిత్యమూ ప్రీతితో భావించు. ఓ జగత్కారణా! నాసంతోషార్థమే నిన్ను సృష్టించాను. నాలో లీనమై దాగి చలనం లేకుండా ఉండే లోకాలను అన్నింటిని నీవు చక్కగా సృజించు.

తే. తగ నహంకార మూలతత్త్వంబు నొంది, నీవు పుట్టింపు మనుచు రాజీవభవుఁడు
వినఁగ నానతి యిచ్చి య వ్విష్ణుఁ డభవుఁ, డంత నంతర్హితుం డయ్యె ననఘచరిత! 331

* అహంకారమే మూలతత్త్వంగా గ్రహించి నీవు సృష్టి చెయ్యి అని బ్రహ్మను ఆజ్ఞాపించి, అనంతరం భగవంతుడైన విష్ణువు అంతర్హితు డైనాడు.

క. అని చెప్పిన మైత్రేయునిఁ, గనుఁగొని విదురుండు వలికెఁ గడు ముద మొప్పన్
జననుత; నలినదళాక్షుఁడు, సనినం బద్మజుఁడు దేహసంబంధమునన్. 332

క. మానస సంబంధంబును, బూనిన యాసర్గ మెట్లు పుట్టించె? దయాం
భోనిధివై నా కింతయు, మానుగ నెఱిఁగింపవయ్య మహితవిచారా! 333

* ఈ విధంగా చెప్పిన మైత్రేయుణ్ణి చూచి విదురుడు ఎంతో సంతోషంతో ఇట్లా అన్నాడు. జనులందరికీ వందనీయుడవైన మైత్రేయా! విష్ణువు అంతర్ధానమైన అనంతరం బ్రహ్మదేవుడు దేహ సంబంధంతో మానవ సంబంధం గల ఈ సృష్టిని ఏ విధంగా చేశాడు? అమోఘమైన ఆలోచనలు కలవాడవు! దయాసముద్రుడవు! ఇదంతా నాకు చక్కగా వివరించి చెప్పు.

వ. అనవుడు నమ్మునివరేణ్యుండు విదురున కిట్లనియెఁ బుండరీకాక్షవరదాన ప్రభావంబునం బంకజాసనుండు శతదివ్య వత్సరంబులు భగవత్పరంబుగాఁ దపంబు గావించి తత్కాలవాయువుచేఁ గంపితంబగు నిజనివాసంబయిన పద్మంబును వాయువును జలంబులను గనుంగొని యాత్మీయ తపశ్శక్తిచేత నభివృద్ధిం బొందిన విద్యాబలంబున వాయువు బంధించి, తోయంబులతోడ నొక్క తోయంబ సమస్తంబునుం గ్రోలి, యంత గగనవ్యాపి యగు జలంబును గనుంగొని. 334

* అని అడుగగా ఆ మునిశ్రేష్ఠుడైన మైత్రేయుడు విదురునితో ఇట్లా అన్నాడు. విష్ణుదేవుడు అనుగ్రహించిన వరముల ప్రభావంవల్ల బ్రహ్మ నూరు దివ్యసంవత్సరాలు భగవంతుణ్ణిగూర్చి తపస్సు చేశాడు. అప్పుడు మహావాయువు వీచింది. ఆ గాలికి తన నివాసమైన పద్మం చలించింది. నీరు చలించింది. అది చూచి బ్రహ్మదేవుడు తన తపశ్శక్తిచేత వృద్ధిపొందిన బ్రహ్మ విద్యాబలంతో వాయువును నిరోధించాడు. ఆ మహాజలాన్నంతా ఒక్క పర్యాయంగా త్రాగాడు. అనంతరం పైకి చూడగా ఆకాశమంతటా నిండివున్న జలం కన్పించింది.

**ఉ. వారిజ సంభవుండు బుధవంద్యుఁడు చిత్తమునం దలంచె దై**
**త్యారిఁ బయోవిహారి సముదంచితహారి నతాఖిలామృతా**
**హారి రమాసతీహృదయహారి నుదారి విదూరభూరి సం**
**సారి భవప్రహారి విలసన్నుత సూరి నఘూరి నయ్యెడన్. 335**

* పండితులకు వందనీయుడైన పద్మసంభవుడు తన హృదయంలో రాక్షసులకు శత్రువైనవాడూ, జలాలలో విహరించువాడూ, అందమైన హారాలు ధరించినవాడూ, సమస్త దేవతలచేత నమస్కరింపబడేవాడూ, లక్ష్మీదేవి హృదయాన్ని అపహరించినవాడూ, ఉదారుడైనవాడు, సంసారదుఃఖాలను దూరంచేసేవాడూ, భవబంధాలనూ త్రెంచివేసేవాడూ, విద్వాంసులు వినుతించేవాడూ, పాపాలను పటాపంచలు గావించేవాడూ అయిన భగవంతుణ్ణి తన మనస్సులో ధ్యానించాడు.

**తే. అట్లు దలఁచి సరోజజుఁ డంబుజమును, గగనతలమునఁ జూచి యా కమలకోశ**
**లీనమై యున్న లోకవితానములను, నొయ్యఁ బొడగని హరిచే నియుక్తుఁడైన. 336**

**తే. వానిఁ గాఁ దన్నుఁ దలఁచి య వ్వనరుహంబు, లోపలికిఁ బోయి మున్నందులోన నున్న**
**ముజ్జగంబులఁ జూచి యిమ్ముల సృజించె, మఱి చతుర్దశభువనముల్ మహిమఁ జేసి. 337**

* ఇలా ధ్యానించగా, బ్రహ్మదేవునికి ఆకాశంలో ఒక పద్మం కనిపించింది. ఆ తామరరేకులలో దాగివున్న లోకాలన్నీ కన్పించాయి. అప్పుడు బ్రహ్మ తాను శ్రీహరిచే నియమింపబడిన వాడనని భావించాడు. మెల్లగా ఆ తామరపువ్వులోపలికి ప్రవేశించాడు. మున్ముందుగా అందులో ఉన్న మూడు లోకాలనూ ఆలోకించాడు. తర్వాత మహత్తరమైన తన శక్తినంతా వినియోగించి పదునాల్గు భువనాలను చక్కగా సృష్టించాడు.

**క. పరఁగ సుధాశన తిర్య, క్నర వివిధస్థావరాది నానా సృష్టి**
**స్ఫురణ నజుం డొనరించెం, బరువడి నిష్కామధర్మ ఫలరూపమునన్. 338**

* ప్రతిఫలం ఆశించిన తన పరమధర్మానికి ఫలస్వరూపంగా దేవతలు, పశుపక్ష్యాదులు, మనుష్యులు, అనేకాలైన స్థావరాలు మొదలైన వాటితో కూడిన సృష్టిని క్రమంగా బ్రహ్మదేవుడు కొనసాగించాడు.

**వ. ఇట్లు భువనంబులం బద్మజుండు గల్పించెనని మైత్రేయుండు విదురున కెఱింగించిన. 339**

* ఈ విధంగా చతుర్ముఖుడు లోకాలను సృష్టించాడని మైత్రేయుడు విదురునకు చెప్పాడు.

**క. విదురుఁడు దురితావనిభృ, ద్భిదురుఁడు మునివరునిఁ జూచి ప్రియము మనమునం**
**గదురఁగ నిట్లని పలికె న, తి దురంతం బయిన విష్ణుదేవుని మహిమన్. 340**

**తే. అమరె భువనంబు లతని కాలాఖ్యతయును, గణుతిసేయు తదీయలక్షణము లర్థి**
**నాకు నెఱిఁగింపుమయ్య వివేక చరిత!, యనిన మైత్రేయుఁ డ వ్విదురునకు ననియె. 341**

* అప్పుడు కొండల్లాంటి పాపాలను ఖండించటంలో వజ్రాయుధం వంటివాడైన విదురుడు హృదయంలో పొంగి పొరలే సంతోషంతో మైత్రేయుణ్ణి చూచి అంతుచిక్కని మహావిష్ణువు మహిమవల్లనే ఈ లోకాలన్నీ విలసిల్లాయిగదా! అటువంటి పరాత్పరుని కాలస్వరూపాన్ని, దాన్ని గణించే విధానాన్ని, దాని లక్షణాలనూ వివేకవంతుడవైన నీవు నాకు విశదీకరించు అని అడిగాడు. అప్పుడు విదురునితో మైత్రేయుడు ఇట్లా అన్నాడు.

**సీ. ఆద్యంతశూన్యంబు నవ్యయంబై తగు తత్త్వ మింతకు నుపాదాన మగుట**
**గుణవిషయములు గైకొని కాలమును మహదాది భూతములు ద న్నాశ్రయింప**
**గాలానురూపంబుఁ గైకొని యీశుండు దన లీలకై తనుఁ దా సృజించెఁ**
**గరమొప్ప నఖిలలోకములందుఁ దా నుండుఁ దనలోన నఖిలంబుఁ దనరుచుండుఁ**

**తే. గాన విశ్వమ్మునకుఁ గార్యకారణములు దాన; య మ్మహాపురుషుని తనువు వలనఁ**
**బాసి విశ్వంబు వెలియై ప్రభాస మొందె, మానితాచార! యీ వర్తమాన సృష్టి. 342**

* సదాచారసంపన్నుడవైన విదురా! విను. మొదలు తుద లేనిది, తరిగిపోనిదీ ఐన తత్త్వమే ఈ సృష్టికంతటికీ ప్రధాన కారణం. అందువల్ల గుణాలూ, ఇంద్రియార్థాలూ, మహత్తూ, పంచభూతాలు తన్ను ఆశ్రయించగా, ఈశ్వరుడు కాలానికి అనురూపమైన రూపం ధరించినవాడై వినోదానికై తనను తాన సృష్టించుకొన్నాడు. ఈ విధంగా సృష్టించిన సమస్తలోకాలందూ ఈశ్వరుడుంటాడు. ఆ యీశ్వరునియందు సమస్త లోకాలూ ప్రకాశిస్తూ ఉంటాయి. కాబట్టి విశ్వానికి కార్యమూ కారణమూ రెండూ తానే. ఆ పరమపురుషుని శరీరం నుండి విడివడి ఈ విశ్వం విరాజిల్లు తున్నది. ఈ విధంగా వర్తమాన సృష్టి ఏర్పడింది.

**క. తెఱఁగొప్ప నఖిలవిశ్వముఁ, బురుషోత్తము మాయచేతఁ బుట్టుం బెరుఁగున్**
**విరతిం బొందుచు నుండుం, గర మర్థిన్ భూత భావి కాలములందున్. 343**

* పురుషోత్తముని మాయవల్ల, ఈ జగత్తు అంతా ఒక క్రమంలో పుట్టి పెరిగి నశిస్తూ ఉంటుంది. ఇట్లాగే పూర్వ కాలంలో జరిగింది, భవిష్యత్కాలంలో గూడ ఇదే విధంగా జరుగుతుంది.

**వ. అట్టి సర్గంబు నవవిధం; బందుఁ బ్రాకృతవైకృతంబులు గాల ద్రవ్య గుణంబులను త్రివిధంబగు భేదంబులచేఁ బ్రతిసంక్రమంబు లగుచు నుండు నందు మహత్తత్త్వంబు ప్రథమసర్గం; బది**

నారాయణసకాశంబున గుణవైషమ్యంబునం బొందు. ద్రవ్యజ్ఞాన క్రియాత్మకంబైన యహంకార తత్త్వంబు ద్వితీయసర్గంబు; శబ్దస్పర్శరూప రసగంధంబు లను పంచతన్మాత్ర ద్రవ్య శక్తియుక్తంబైన పృథివ్యాది భూతసర్గంబు మూఁడవదియై యుండు; జ్ఞానేంద్రియంబులైన త్వక్చక్షు శ్రోత్ర జిహ్వాఘ్రాణంబులుఁ గర్మేంద్రియంబులైన వాక్పాణిపాదపాయూపస్థలు నను దశవిధేంద్రియ జననంబు చతుర్థ సర్గంబు; సాత్త్వికాహంకార జనితంబైన సుమనోగణసర్గం బైదవసర్గంబై యొప్పు; నది మనోమయంబై యుండు; జీవలోకంబునకు నబుద్ధికృతంబులైన యావరణ విక్షేపంబులం జేయు తామససర్గం బాఱవదై యుండు; నియ్యాఱు నీశ్వరునకు లీలార్థంబు లయిన ప్రాకృతసర్గంబు లయ్యె; నింక వైకృతసర్గంబు నేడవది మొదలుగాఁ గలుగునవి వినిపింతు, వినుము; పుష్పోత్పత్తిరహితంబులై ఫలించెడు నశ్వత్థోదుంబర పనస న్యగ్రోధాదులైన వనస్పతులును, బుష్పితంబులై ఫలపాకాంతంబులైన వ్రీహి యవ ముద్గా ద్యోషధులును, నారోహణానపేక్షంబులైన మాలతీమల్లికాది లతలును, ద్వక్సారంబులైన వేణ్వాదులును; గఠినీభూతమూలంబులును, శిఖావిస్తృతంబులు నగు లతా విశేషరూపంబులైన వీరుధంబులును; బుష్పవంతంబు లయి ఫలప్రాప్తంబులగు చూతాది ద్రుమంబు లును నవ్యక్తచైతన్యంబులు నూర్ధ్వస్రోతంబులు నంతస్స్పర్శంబులుఁ దమఃప్రాయంబులునై స్థావరంబు లయిన యీ యాఱు నేడవ సర్గంబయ్యె; నెనిమిదవ సర్గంబు తిర్యక్సర్గంబు. ఇది యిరువది యెనిమిది భేదంబులు గలిగి శ్వస్తనాది జ్ఞానశూన్యంబులయి యాహారాది జ్ఞానమాత్ర నిష్ఠంబులయి, ఘ్రాణంబువలన నెఱుంగం దగినవాని నెఱుంగుచు హృదయంబున దీర్ఘానుసంధాన రహితంబులై వర్తించు ద్విశఫంబులు గల వృషభ మహిషాజ కృష్ణ సూక రోష్ట్ర గవయ రురు మేష ముఖర నవకంబును, నేక శఫంబు గల ఖరాశ్వాశ్వతర గౌర శరభ చమర్యాది షట్కంబును, బంచనఖంబులు గల శునక సృగాల వృక వ్యాఘ్ర మార్జార శశ శల్యక సింహ కపి గజ కూర్మ గోధాముఖ భూచర ద్వాదశకంబును, మకరాది జలచరంబులును, గంక గృధ్ర బక శ్యేన భాస భల్లూక బర్హి హంస సారస చక్రవాక కాకోలూకాది ఖేచరంబులు నయ్యె, నర్వాక్స్రోతంబై యేకవిధంబగు మానుష సర్గంబు రజోగుణప్రేరితంబై కర్మకరణదక్షంబై దుఃఖంబందును సుఖంబు గోరు; నిది తొమ్మిదవ సర్గం బనందగు; నీ త్రివిధసర్గంబులు వైకృతసర్గంబు లనంబడు; నింక దేవసర్గంబు విను మదియు నెనిమిది తెఱంగులు గలిగి యుండు; నందు విబుధ పితృసురాదులు మూఁడును, గంధర్వాప్సరసలొకటియు, యక్షరక్షస్సు లేకంబును, భూతప్రేతపిశాచంబు లొకటియు, సిద్ధచారణ విద్యాధరు లేకంబును, గిన్నర కింపురుషు లొకటియు నుంగా దేవసర్గం బయ్యె; నిట్టి బ్రహ్మ నిర్మితంబులైన దశవిధసర్గంబులు నెఱింగించితి; నింక మనువులం దదంతరంబుల నెఱింగించెదఁ; గల్పాదులయందు నీ ప్రకారంబున స్వయంభూతుండును, నమోఘ సంకల్పుండును నగు నప్పుండరీకాక్షుండు రజోగుణ యుక్తుండై స్రష్ట యగుచు స్వస్వరూపంబయిన విశ్వంబు నాత్మీయ సామర్థ్యంబునం గల్పించె; నయ్యీశ్వరుని మాయావ్యాపారం బులచే నీ సృష్టియందు నద్యావర్తంబులంబడి భ్రమించుచున్న మహీరుహంబులంబోలె బూర్వాపరభావంబు లెఱుంగంబడకుండు; నీ కల్పంబునం దుండు దేవాసురాదులు ప్రతి మన్వంతరంబు నందును నిట్ల నామ రూపంబులచే నిర్దేశింపంబడుదురు; మఱియు నిం దొక్కవిశేషం బెఱింగించెదఁ. గౌమారసర్గం బనునది దేవ సర్గాంతర్భూతం బయ్యును బ్రాకృత వైకృతోభయాత్మకంబై దేవత్వ మనుష్యత్వ రూపంబైన సనత్కుమారాది సర్గం బనంబడె; నమోఘసంకల్పుండైన పుండరీకాక్షుండు దనుఁదాన యిట్లు

విశ్వభేదంబును గల్పించెనని మైత్రేయుండు విదురునకుం జెప్పి కాలలక్షణం బెఱింగించువాఁడై యిట్లనియె. 344

* అటువంటి సృష్టి తొమ్మిది విధాలు. వానిలో ప్రాకృతాలు వైకృతాలు అనేవి కాల, ద్రవ్య, గుణాలు అనే మూడు విధాలైన భేదాలచే పరస్పరం సంకర మవుతూ ఉంటాయి. అందులో మహత్తత్త్వం మొదటి సృష్టి. అది నారాయణుని సమీపంలో గుణభేదాన్ని పొందుతుంది. ద్రవ్యజ్ఞాన క్రియాత్మకమైన అహంకారతత్త్వం రెండవ సృష్టి, శబ్ద స్పర్శరూప రస గంధాలు అనే పంచతన్మాత్రల ద్రవ్యశక్తితో కూడిన పృథివి మొదలైన పంచభూతాల సృష్టి మూడవది, జ్ఞానేంద్రియాలైన చర్మము, కన్నులు, చెవులు, నాలుక, ముక్కు; కర్మేంద్రియాలైన వాక్కు, చేతులు, కాళ్ళు, పాయువు, ఉపస్థ అను పది ఇంద్రియాల పుట్టుక నాలుగవ సృష్టి, సాత్త్వికాహంకారంవల్ల పుట్టిన దేవతాగణాల సృష్టి ఐదవ సృష్టి. అది కేవలం మనోమయమై ఉంటుంది. ప్రాణిసమూహానికి అజ్ఞానకృతాలైన ఆవరణ విక్షేపాలు కలిగించే తామస సృష్టి ఆరవది. ఈ ఆరున్నూ భగవంతుని లీలా విలాసా లయిన ప్రాకృత సృష్టులు.

ఇక ఏడవది మొదలుగా వైకృత సృష్టులను వినిపిస్తాను, విను. పూలు పూయకుండానే ఫలించే రావి, మేడి, పనస, మఱ్ఱి మొదలైన వనస్పతులూ, పూచి ఫలించిన వెంటనే నశించిపోయే వడ్లూ, యవలూ, పెసలూ మొదలైన ఓషధులునూ, పైకి ఎగబ్రాకటానికి అవకాశం లేని మాలతి, మల్లె మొదలైన తీగలూ, గట్టి బెరడు కలిగిన వెదుళ్లు మొదలైనవీ, నేలలో దృఢమైన వేళ్లు గలిగి నేలపై బాగా విస్తరించే లతా విశేషాలైన దుబ్బులూ, పొదలూ, పుష్పించి ఫలాల నిచ్చే మామిడి మొదలైన వృక్షాలునూ, అవ్యక్తమైన చైతన్యంతో పైకి పెల్లుబుకుతూ తమోమయాలై లోపల మాత్రమే స్పర్శజ్ఞానం కలవై కదలిపోలేని ఈ ఆరూ ఏడవ సృష్టి.

ఇక ఎనిమిదవ సృష్టిలో ఇరవై ఎనిమిది భేదాలు ఉన్నాయి. రేపు అనే జ్ఞానం లేనివై, ఆహారం మొదలైన వాటి యందు మాత్రమే ఆసక్తి కలవై, వాసన చూచి తెలుసుకోదగిన వాటిని తెలుసుకొంటూ, మనస్సులో పెద్దగా ఆలోచన చేయలేనివై, చీలిన గిట్టలు కలవైన ఎద్దు, ఎనుము, మేక, జింక, పంది, ఒంటె, గురుపోతు, నల్లచారల దుప్పి, పొట్టేలు ఈ తొమ్మిదిన్నీ; చీలని గిట్టలు గలవైన గాడిద, గుఱ్ఱము, కంచరగాడిద, గౌర మృగం, శరభ మృగం, చమరీ మృగం ఈ ఆరున్నూ; ఐదు గోళ్లు గలవైన కుక్క, నక్క, తోడేలు, పులి, పిల్లి, కుందేలు ఏదుపంది, సింహం, కోతి, ఏనుగు, తాబేలు, ఉడుము ఈ పంద్రెండున్నూ, (ఇవన్నీ భూచరాలు) మొసలి మొదలైన జలచరాలున్నూ; రాబందు, గ్రద్ద, కొంగ, డేగ, తెల్ల పిట్ట, గబ్బిలం, నెమలి, హంస, బెగ్గురు పక్షి, జక్కవపిట్ట, కాకి, గుడ్లగూబ మొదలైన ఆకాశాన సంచరించే తిర్యక్కుల సృష్టి ఎనిమిదవ సృష్టి.

ఇక తొమ్మిదవది మానవసృష్టి. ఇది రజోగుణంతో పురికొల్పబడి కర్మలు చేయటంలో నేర్పుగల్గి, దుఃఖంలో కూడా సుఖాన్ని కోరేది. ఈమూడు విధాలైన సృష్టులు వైకృత సృష్టులు.

ఇక దేవసర్గాన్ని గూర్చి విను. అదికూడా ఎనిమిది విధాలు. అందులో విబుధులు, పితృదేవతలు, సురాదులు మూడు భేదాలూ; గంధర్వులూ, అప్సరసలూ ఒకటీ; యక్షులూ, రాక్షసులూ ఒకటీ; భూత ప్రేత పిశాచాలు ఒకటీ, సిద్ధచారణ విద్యాధరులు ఒకటీ; కిన్నర కింపురుషులు ఒకటీ- ఈ ఎనిమిది కలిసి దేవసర్గం అయింది. ఈ విధంగా బ్రహ్మదేవుడు నిర్మించిన పది విధాలైన సృష్టులనూ నీకు తెల్పాను.

ఇక మనువులనూ మన్వంతరాలనూ తెల్పుతాను. కల్పారంభాలలో ఇదేవిధంగా తన్ను తాను సృజించుకొనే వాడున్నూ,మొక్కవోని తలంపు కలవాడున్నూ, అయిన మహావిష్ణువు రజోగుణంతో కూడినవాడై సృష్టికర్తయై తన స్వరూపమే అయిన విశ్వాన్ని సామర్థ్యంవల్ల కల్పించాడు. ఆ ఈశ్వరుని మాయా విశేషంవల్ల ఈ సృష్టిలో నదులలోని నీటి సుడులలోపడి తిరిగే చెట్లలాగే ముందు వెనుకలు తెలియకుండా ఉంటాయి. ఈ కల్పంలో ఉన్న దేవతలూ, రాక్షసులూ మొదలైనవారు ఇలాగే ప్రతిమన్వంతరంలోనూ ఆయా నామ రూపాలతో వ్యహరింపబడతారు.

మళ్లీ ఇందులో ఒక విశేషముంది. అదేమంటే, కౌమారసర్గం అనేది దేవసర్గంలో ఒకభాగమే అయినా ప్రాకృత వైకృతముల రెంటి స్వభావము కలది. అందులో దైవత్వమూ మనుష్యత్వమూ కలిసి ఉంటాయి. ఇదే సనత్కుమారాది సర్గం. సఫల సంకల్పుడైన పురుషోత్తముడు తనకు తానై ఈ విధంగా వివిధ భేదాలతోకూడిన విశ్వాన్ని కల్పించాడు.

అని మైత్రేయుడు విదురునితో పలికి కాలస్వభావం వివరించాలనుకున్నవాడై ఈ విధంగా అన్నాడు.

**సీ. భువిఁ దనకార్యాంశమునకు నంతము నన్య వస్తుయోగంబు నేవలన లేక**
**ఘటపటాదిక జగత్కార్యంబునకు నిజ సమవాయకారణత్వమునఁ బరఁగి**
**జాలసూర్య మరీచి సంగతగగనస్థ మగు త్రసరేణు షడంశమరయఁ**
**బరమాణు వయ్యెఁ; దత్పరమాణువం దర్క గతి యెంత తడవు దత్కాల మగును**

**తే. సూక్ష్మకాలంబు; విను మది సూర్యమండ, లంబు ద్వాదశరాశ్యాత్మకం బనంగఁ**
**గలుగు జగమున నొక యేఁడు గడచి చనినఁ, గాల మెంతగు నది మహత్కాల మనఘ! 345**

* భగవంతుని సృష్టికార్యానికి అంతు అనేది లేదు. దానికి వేరే వస్తువులతో సంయోగంకూడా అవసరం లేదు జగత్తులో కుండలు-బట్టలు తయారయ్యే తీరు ఒకటి-సృష్టికార్యం మరియొకటి. [కుండ ఈ లోకంలో తయారు కావాలంటే (1) మట్టి (ఉపాదాన కారణం) (2) మట్టిని కుండగా రూపొందించటం (సమవాయ కారణం) (3) కుండను చేసేవాడు(నిమిత్త కారణం) అవసరం. అట్లే పట నిర్మాణం. ప్రత్తి-ఉపాదానం; దారాలు, నేత- సమవాయి; వస్త్ర నిర్మాత- నిమిత్తం. లోకంలో ఏ కార్యనికైనాపై మూడు అవసరం] భగవత్ సృష్టిలో భగవంతు డీసమవాయ కారణం కూడా అవుతాడు.

(ఇక సృష్టిని ముక్కలు ముక్కలుగా ప్రస్తరిస్తే ఏర్పడే సూక్ష్మాతి సూక్ష్మాంశానికే "పరమాణువు" అని పేరు) సూర్యుని కాంతి కిటికీలోనుండి ప్రసరించేటప్పుడు మన కంటికి కనిపించే చిన్న చిన్న రేణువులలో

ఆరవభాగానికి "పరమాణువు" అని పేరు. ఆపరమాణువుపై ఒక ప్రక్కనుండి మరియొక ప్రక్కకు సూర్యకిరణం పయనించే కాలానికి "సూక్ష్మ కాలం" అని పేరు. (సూక్ష్మ కాలాన్ని కేవలం ఊహించుకోవలసిందే. అది మిక్కిలి అత్యల్పమైన కాలపరిమాణం) సూర్యుడు-మేషం మొదలైన పంద్రెండు రాసులలో పయనించే కాల పరిమాణం పేరు మహత్కాలం (దీనికే సంవత్సరం అని పేరు. మహత్కాలానికీ-సూక్ష్మకాలానికీ మధ్యనున్న వివిధ కాల పరిమాణాలు మునుముందు వివరింపబడుతాయి.)

వ. అందుఁ బరమాణు ద్వయంబొక్క "యణు" వగు; నణుత్రితయం బొక్క "త్రసరేణు" వగు; నవి మూఁడు గూడ నొక్క "త్రుటి" యగు; నాత్రుటిశతం బొక్క "వేధ" యనంబరఁగు; నట్టి వేధలు మూఁడు గూడ నొక్క "లవం" బనందగు; నవి మూఁడైన నొక్క "నిమేషం" బనంజను; నిమేషత్రయం బొక్క "క్షణం బగు; తత్క్షణ పంచకం బొక్క "కాష్ఠ" యనం దగు; నవి పదియైన నొక్క "లఘు" వన నొప్పు; నట్టి లఘుపంచ దశకంబొక్క "నాడి" యనంబరఁగు; నట్టి నాడికాద్వయం బొక్క "ముహూర్తం" బయ్యె; నట్టి నాడిక లాఱైన-నేడైన-మనుష్యులకు నొక "ప్రహరం" బగు; నదియ "యామం" బనంజను; దివసపరిమాణ విజ్ఞేయంబగు నాడికోన్మాన లక్షణం బెఱింగింతు వినుము; షట్పల తామ్రంబునం బాత్రంబు రచియించి చతుర్మాష సువర్ణంబునం జతురంగుళాయామశలాకంబుఁ గల్పించి దానం దత్పాత్రమూలంబున ఛిద్రంబుఁ గల్పించి తచ్ఛిద్రంబునం బ్రస్థమాత్ర తోయంబు పరిపూర్ణంబు నొందునంత కాలం బొక్క "నాడిక" యగు; యామంబులు నాలుగు సన నొక్క "పగ" లగు; రాత్రియు నిప్పగిది జరగు;నట్టి యహర్నిశంబులు గూడ మర్త్యుల కొక దివసం" బగు; నవి పదునేనైన నొక్క "పక్షం" బగు; శుక్ల కృష్ణ నామంబులం బరఁగిన య ప్పక్షంబులు రెండుగూడ నొక్క 'మాసం' బగు; నది పితృదేవతలకు నొక్క "దివసం" బగు; నట్టి మాసంబులు రెండైన నొక్క "ఋతు" వగు; షణ్మాసంబు లరిగిన నొక్క 'యయనం' బగు; దక్షిణోత్తర నామంబులం బరఁగినట్టి యయనంబులు రెండుగూడి ద్వాదశ మాసంబులైన నొక్క "సంవత్సరం" బగు; నట్టి సంవత్సరశతంబు నరులకుం బరమాయు వైయుండుఁ; గాలాత్ముండును నీశ్వరుండునునైన సూర్యుండు గ్రహ నక్షత్ర తారా చక్రస్థుండై పరమాణ్వాది సంవత్సరాంతంబైన కాలంబునం జేసి ద్వాదశరా శ్యాత్మకంబైన జగంబున సౌర బార్హస్పత్య సావన చాంద్ర నాక్షత్ర మాన భేదంబులం గానంబడు చున్నవాఁడై సంవత్సర పరీవత్స రేడావత్స రానువత్సర వత్సర నామంబుల సృజ్యంబైన బీజాంకురంబుల శక్తిం గాలరూపంబైన స్వశక్తిచేత నభిముఖంబుగాఁ జేయుచుఁ బురుషులకు నాయురాది వ్యయంబులం జేసి విషయాసక్తి నివర్తింపం జేయుచుం గోరికలు గల వారికి యజ్ఞ ముఖంబులం జేసి గుణమయంబు లైన స్వర్గాది ఫలంబుల విస్తరింపంజేయుచు, గగనంబునఁ బరువువెట్టు. వత్సరపంచక ప్రవర్తకుండగు మార్తాండునకుం బూజ గావింపు మని మైత్రేయుండు పలికిన విదురుం డిట్లనియె. 346

* రెండు పరమాణువులు ఒక "అణువు". మూడు అణువులు ఒక "త్రసరేణువు". మూడు త్రసరేణువులు ఒక "త్రుటి". నూరుత్రుటులు "వేధ". మూడు వేధలు ఒక "లవం". మూడు లవాలు ఒక "నిమేషం". మూడు నిమేషాలు ఒక్క "క్షణం". ఐదు క్షణాలు ఒక "కాష్ఠ". పది కాష్ఠలు ఒక "లఘువు".

పదునైదు లఘువులు ఒక "నాడి". రెండు నాడులు ఒక ముహూర్తం. అట్టి నాడులు ఆరు కానీ ఏడు కానీ అయినచో మనుష్యునకు ఒక "ప్రహరం" అవుతుంది. దానినే "యామ" మనీ లేక "జాము" అని అంటారు.

దిన పరిమాణాన్ని తెలిపే నాడిని కొలిచే విధానం చెబుతాను విను. ఆరు పలాల రాగితో పాత్ర సిద్ధంచేసి, నాల్గు మినుపగింజల బరువు గల బంగారుతో నాల్గు అంగుళాల పొడవైన కమ్మీ తయారుచేసి, దానితో ఆ పాత్ర క్రింద రంధ్రం చేస్తే, ఆ రంధ్రంగుండా తూమెడు నీరు పూర్తిగా క్రిందకు కారడానికి ఎంత కాలం పడుతుందో అంత కాలాన్ని ఒక "నాడి" అంటారు.

నాలుగు జాములు ఒక "పగ"లవుతుంది. అదే విధంగా నాలుగు జాములు ఒక "రాత్రి" అవుతుంది. పగలు రాత్రి కలిస్తే మానవులకు ఒక "దినం". పదునైదు దినాలు ఒక "పక్షం". శుక్ల పక్షం, కృష్ణ పక్షం అని పక్షాలు రెండు. ఈ రెండు పక్షాలూ కూడి ఒక "నెల". అది పితృదేవతలకు ఒక "దినం".

రెండు నెలలు ఒక "ఋతువు". ఆరు నెలలు ఒక "అయనం". దక్షిణాయనం, ఉత్తరాయణం అని అయనాలు రెండు. ఈ రెండూ కలసిన పండ్రెండు నెలలు ఒక "సంవత్సరం". ఈ సంవత్సరం దేవతలకు ఒక్క దినం అవుతుంది. నూరు సంవత్సరాలు మానవులకు పరమాయువు.

కాలమే ఆత్మగా గల సూర్యభగవానుడు గ్రహాలతో నక్షత్రాలతో కూడిన తారాచక్రంలో ఉన్నవాడై పరమాణువు మొదలుకొని సంవత్సర పర్యంతమైన కాలంలో పండ్రెండు రాసులను చుట్టివస్తాడు. ఈవిధమైన సూర్యగమనం వల్ల సౌరమానము, చాంద్రమానము, నక్షత్రమానము అనే భేదాలతో సంవత్సరకాలం ఏర్పడుతుంది. ఇది సంవత్సరం పరీవత్సరం, ఇడావత్సరం, అనువత్సరం, వత్సరం అనే భేదాలు కలిగి ఉంటుంది. ఈ ఐదు విధాలయిన వత్సరాలను ప్రవర్తింపజేసే సూర్యుడు విత్తనాలనుండి అంకురాలు మొలకెత్తించినట్లు కాలరూపమైన తనశక్తితో జీవసృష్టిని అనుకూలం చేసుకుంటూ ఆయుస్సు మొదలైన వానిని హరిస్తూ, మానవుల విషయాసక్తిని విస్తరింపజేస్తూ; కోరికలు కలవారికి యజ్ఞాల ద్వారా స్వర్గ ఫలాన్ని సమకూరుస్తూ, ఆకాశంలో పరుగులు తీస్తుంటాడు.

పైన చెప్పిన అయిదు విధాలైన వత్సరాలనూ ప్రవర్తింపజేసే సూర్యభగవానుణ్ణి పూజించు అని మైత్రేయుడు పలుకగా విదురుడు ఈ విధంగా అన్నాడు.

**క. నర పితృసుర పరమాయుః, పరిమాణము లెఱుఁగ నాకుఁ బలికితివి, మునీ**
**శ్వర! యెఱిఁగింపు త్రిలోకో, పరిలోక విలోక నైకపరులగు వారిన్.** 347

* ఓ మునీశ్వరా! నరులు-పితృదేవతలు-దేవతలు వీరి పరమాయువుల పరిమాణాలను తెల్పావు. ముల్లోకాలూ, పై లోకాలూ దర్శించేవారి విశేషాలు వివరించు.

**ఉ. పూనిన యోగసిద్ధి దగఁ బొందిన నేత్రయుగంబునన్ బహిర్**
**జ్ఞానము గల్గి యుండి భువనంబులఁ జూచుచు నుండువారికి**
**న్మానుగఁ గల్గు కాలగతి నా కెఱిఁగింపు మునీంద్ర! నావుడు**
**న్మానయశాలి యవ్విదురు నాదర మొప్పఁగఁ జూచి యిట్లనున్.** 348

* ఓ మునీంద్రా! దృఢమైన యోగసిద్ధివల్ల ప్రాప్తించిన నేత్రాలతో బాహ్యజ్ఞానం కలిగి లోకాలను ఆలోకించే వారికి కలిగే కాలపరిమాణం ఎటువంటిదో నాకు తెల్పు అనగా మహనీయుడైన మైత్రేయుడు విదురుని ఆదరపూర్వకంగా వీక్షించి ఈ విధంగా అన్నాడు.

సీ. జననుత! కృతయుగసంఖ్య నాలుగువేల దివ్యవర్షములు; దదీయ సంధ్య
లెనిమిది నూఱేండ్లు; విను త్రేత వత్సర త్రిసహస్రము లగుఁ దదీయ సంధ్య
లాఱునూఱేఁడులు నగు; ద్వాపరము రెండు వేల వత్సరముల వెలయు సంధ్య
లోలి నన్నూఱేఁడు; లొగిఁ గలియుగము సహస్ర వర్షములు సంధ్యాంశ మరయ

తే. రెండు నూఱేఁడులును నిల్చి యుండుఁ జువ్వె?, యనఘ! సంధ్యాంశ మధ్యంబునందు ధర్మ
మతిశయించును; సంధ్యాంశమందు ధర్మ, మల్పమై కానఁబడుచుండు ననఘ చరిత! 349

* జనుల అభిమానం అందుకున్న పవిత్ర చరితా! విదురా! విను. కృతయుగం నాలుగువేల దివ్యసంవత్సరాలు ప్రమాణం కలది. దాని సంధ్యాకాలం ఎనిమిదివందల ఏండ్లు. ఒక యుగానికీ మరొక యుగానికి మధ్యకాలాన్ని "సంధ్య" అంటారు. త్రేతాయుగ ప్రమాణం మూడు వేల దివ్యసంవత్సరాలు. సంధ్యాకాలం ఆరు వందల ఏండ్లు. ద్వాపరయుగ ప్రమాణం రెండువేల దివ్యసంవత్సరాలు. సంధ్యాకాలం నాలుగు వందల సంవత్సరాలు. కలియుగ ప్రమాణం వెయ్యి దివ్య సంవత్సరాలు. సంధ్యాకాలం రెండు వందల సంవత్సరాలు. ఈసంధ్యాంశాల మధ్యకాలంలో ధర్మం అధికంగా ఉంటుంది. సంధ్యాంశంలో ధర్మం అల్పమై ఉంటుంది.

వ. మఱియు ధర్మదేవత కృతయుగంబున నాలుగు పాదంబులును, త్రేతయందు మూఁడుపాదంబులును, ద్వాపరంబునం బాదద్వయంబును, గలియుగంబున నేకపాదంబును, గలిగి సంచరించు నట్టగుటం జేసి. 350

* ధర్మదేవత కృతయుగంలో నాల్గుపాదాలతోనూ, త్రేతాయుగంలో మూడు పాదాలతోనూ, ద్వాపరయుగంలో రెండు పాదాలతోనూ, కలియుగంలో ఒక్క పాదంతోనూ నడుస్తూ ఉంటుంది.

క. పాదవిభేదంబున మ, ర్యాదలును దఱుఁగు, నధర్మ మాకొలఁదినె యు
త్పాదిల్లి వృద్ధిఁబొందు ధ, రాదివిజులు పాపబుద్ధిరతు లగుదు రిలన్. 351

ఈ పాదాల వ్యత్యాసంవల్ల ప్రజలు అదుపుతప్పి నడుస్తారు. అధర్మం ఆవిర్భవించి అభివృద్ధి పొందుతుంది. బ్రాహ్మణులు విపరీత బుద్ధులై అపమార్గాలలో అడుగు పెడతారు.

సీ. భూర్భువస్స్వర్లోకములకంటెఁ బొడువునఁ గడు నొప్పు సత్యలోకంబునందు
నుండు బ్రహ్మకుఁ జతుర్యుగ సహస్రము లేఁగ దివ మొక్కటి యగు రాత్రియును నిట్ల
చన ధాత నిద్రవో జగము లడంగు, మేల్కాని చూడ మరల లోకములు పుట్టుఁ;
దద్దినమ్మునఁ జతుర్దశమను లగుదు; రం దొక్కొక్క మనువున కొనర దివ్య

తే. యుగము లోలిని డెబ్బదియొక్క మాఱు సనిన, మనుకాల మయ్యె; న మ్మను కులంబు
సురలు మునులును సప్తర్షు లరయ భగవదంశమునఁ బుట్టి పాలింతు రఖిలజగము. 352

* భూలోకం, భువర్లోకం, స్వర్గలోకం కంటె పైన సత్యలోకం ఒకటుంది. అందుండే బ్రహ్మకు యుగ చతుష్టయాలు వేయి గడిస్తే ఒక్కదినం అవుతుంది. అట్లే రాత్రికూడా. బ్రహ్మ నిద్రపోతే లోకాలకు ప్రళయం వస్తుంది. మేల్కొని చూస్తే మళ్లీ లోకాలు ఆవిర్భవిస్తాయి. బ్రహ్మదేవుని ఆ ఒక్క దినంలో పద్నాలుగురు

మనువులు ఉద్భవిస్తారు. వారిలో ఒక్కొక్క మనువుకాలం డెబ్బై ఒక్క దివ్యయుగాలు, దీనినే "మన్వంతరం" అంటారు. దేవతలు, మునులు, సప్తర్షులు, భగవంతుని అంశంతో మనువులై పుట్టి లోకాలను పాలిస్తారు.

**క. హరి పితృ సుపర్వ తిర్యఙ్న, ర రూపములన్ జనించి నయమున మన్వం**
**తరముల నిజసత్త్వంబునఁ, బరిపాలించును జగంబుఁ బౌరుష మొప్పన్.** 353

* ఈ మన్వంతరాలలో శ్రీహరి పితృ, దేవ, పశు, పక్షి, మానవరూపాల్లో ఉద్భవించినవాడై ఆత్మశక్తితో పౌరుష ప్రతాపాలతో విశ్వాన్ని పరిపాలిస్తాడు.

**క. క్రమమునఁ ద్రైవర్గిక స, ర్గము సెప్పంబడె, సరోజగర్భుఁడు దివసాం**
**తమునఁ దమఃపిహిత పరా, క్రముఁడై శయనించు నిద్రఁ గైకొని యంతన్.** 354

* క్రమంగా మూడు వర్గాల సృష్టి విశేషాలనూ చెప్పాను. బ్రహ్మ పగలు పూర్తి కాగానే రాత్రి రాగానే నిద్రపోతాడు. ఆయన శక్తి సామర్థ్యాలు అంధకారంతో ఆవరింపబడతాయి.

**సీ. ఆ రాత్రి భువనత్రయము దమఃపిహితమై భానుచంద్రులతో విలీనమైన**
**సర్వాత్ముఁడగు హరి శక్తి రూపంబయి కడఁగి వెలుంగు సంకర్షణాగ్ని**
**భువనత్రయంబును దవిలి దహింప న య్యనలకీలలఁ బొడమిన మహోష్మ**
**మలమినఁ గమలి మహర్లోకవాసులు జనలోకమునకును జనుదు రపుడు**

**తే. విలయ సమయ సముత్కట విపుల చండ, వాత ధూతోర్మిజాల దుర్వార వార్ధి**
**భువనములు ముంచు నమ్మూఁడు భువనములను, దత్పయోరాశి మీదఁ బద్మావిభుండు.** 355

* ఆ రాత్రి మూడులోకాలూ సూర్య చంద్రులతోపాటు కటిక చీకటితో కప్పబడి ఉంటాయి. సర్వాత్ముడైన విష్ణుదేవుని శక్తిరూపమైన సంకర్షణాగ్ని విజృంభిస్తుంది. ఆ అగ్ని జ్వాలలు ముల్లోకాలను దహించి వేస్తాయి. తీక్షణమైన ఆ మంటల వేడికి తట్టుకోలేక తపించి మహర్లోక వాసులు జనలోకానికి వెళ్ళుతారు. అప్పుడు ఆ ప్రళయకాలంలో భయంకరంగా, ప్రచండ వాయువులు వీస్తాయి. ఆ వాయువేగానికి ఉత్తుంగతరంగాలతో ఉప్పొంగిన మహాసముద్ర జలాలు మూడు జగాలనూ ముంచివేస్తాయి. ఆ మహాసముద్ర మధ్యంలో శ్రీమన్నారాయణుడు శయనించి వుంటాడు.

**ఉ. చారు పటీర హీర ఘనసార తుషార మరాళ చంద్రికా**
**పూర మృణాళ హార పరిపూర్ణ సుధాకర కాశ మల్లికా**
**సార నిభాంగ శోభిత భుజంగమ తల్పమునందు యోగ ని**
**ద్రారతిఁ జెంది యుండు జఠర స్థితభూర్భువరాదిలోకుఁడై.** 356

* అందమైన మంచి గంధంలాగా, వజ్రంలాగా, కర్పూరంలాగా హిమపూరంలాగా, రాయంచలాగా, వెన్నెల వెల్లువలాగా, మృణాలవల్లరిలాగా, ముత్యాలహారంలాగా, పున్నమ చందమామలాగా, రెల్లుపూవులాగా,

మల్లె మొగ్గలాగా తెల్లని కాంతులు వెల్లివిరిసే శేషశయ్యమీద యోగనిద్రాముద్రితుడై చల్లగా శయనించివున్న ఆ నల్లనయ్య ఉదరంలో ఎల్లలోకాలూ విలసిల్లు తుంటాయి.

క. జనలోక నివాసకు లర్థిని, వినుతింపంగ నతుల దివ్యప్రభచేఁ
దనరుచు మీలిత నిజ లో, చనుఁడై వసియించు నతఁడు సముచితలీలన్. 357

* జనలోక నివాసులైన పుణ్యాత్ములు ఎన్నో విధాల సన్నుతులు చేస్తుండగా సాటిలేని మేటి వెలుగులు వెదజల్లుతూ పన్నగరాజ తల్పంమీద కన్నులుమోడ్చి స్వామి చక్కగా శయనించి వుంటాడు.

వ. ఇవ్విధంబున. 358

సీ. కైకొని బహువిధ కాలగ త్యుపలక్షితములై యహోరాత్ర తతులు జరుగ
శతవత్సరంబులు జనులకుఁ బరమాయు వైనరీతిని బంకజాసనునకుఁ
బరమాయు వగు శతాబ్దంబు;లందుల సగ మరిగిన నదియు పరార్ధ మండ్రు;
గాన పూర్వార్ధంబు గడచుటఁ జేసి ద్వితీయ పరార్ధంబు దీని పేరు;

తే. గడఁగి పూర్వపరార్ధాదికాలమందు, బ్రహ్మకల్పాఖ్య నెంతయు బరఁగు; నందు
బ్రహ్మ యుదయించుటంజేసి బ్రహ్మకల్ప, మనియు శబ్దాత్మక బ్రహ్మ మనియు నెగడు. 359

* ఈ విధంగా అనేక విధాలైన కాలగమనంతోకూడిన అహోరాత్రాలు గడిచి పోతుంటాయి. మానవుల ఆయుః ప్రమాణం నూరు సంవత్సరా లయినట్లే బ్రహ్మదేవుని పరమాయువుకూడా నూరు సంవత్సరాలే. ఆ నూరు సంవత్సరాల మొదటి సగాన్ని "పూర్వపరార్ధం" అనీ, రెండవ సగాన్ని "ద్వితీయపరార్ధ" మనీ అంటారు. ఈ విధమైన పూర్వపరార్ధ కాలం బ్రహ్మకల్పం అవుతుంది. ఆ కల్పం మొదట్లో బ్రహ్మ పుట్టడం వల్లనే దానిని "బ్రహ్మకల్పం" అన్నారు. దీనినే "శబ్ద బ్రహ్మం" అని కూడా అంటారు.

క. విను మెన్నఁడు పంకజనా, భుని నాభీసరసియందు భువనాశ్రయమై
తనరిన పద్మము వొడమును, ననఘా! యది "పద్మకల్ప" మన విలసిల్లున్. 360

* వినవయ్యా విదురా! అఖిల లోకాలకూ ఆశ్రయమై ఉండే పద్మం నళిననాభుని "నాభి" అనే సరస్సునుంచి ఉద్భవించిన కాలం "పద్మకల్పం"గా ప్రసిద్ధికెక్కింది.

వ. పూర్వపరార్ధాదినిం గలిగిన బ్రహ్మకల్పంబుఁ జెప్పితి; నింక ద్వితీయ పరార్ధంబు మొదలు నెన్నఁడేని హరి సూకరాకారంబు దాల్చు నది వరాహకల్పం బనందగు, నట్టి వరాహకల్పం బిపుడు వర్తమానం బగుచున్నది; వెండియు. 361

* పూర్వపరార్ధం ఆదిలోనిదైన బ్రహ్మకల్పాన్నిగూర్చి చెప్పగా విన్నావుగదా! ద్వితీయపరార్ధం సంగతి విను. ఈ పరార్ధం మొదట్లో హరి వరాహరూపాన్ని ఎప్పుడు ధరిస్తాడో అది "వరాహకల్పం" అనబడుతుంది. అటువంటి "వరాహకల్పం" ఇప్పుడు జరుగుతూ ఉంది.

సీ. దీపింపఁ గాలస్వరూపుఁడై నట్టి పద్మాక్షుఁ డనంతుఁ డనాదిపురుషుఁ
డఖిలవిశ్వాత్మకుఁ డగు నీశునకుఁ బరమాణ్వాది యుగ పరార్ధాంత మగుచు
జరుగు నీకాలంబు చర్చింప నొక్కనిమేషకాలం బయి మెలఁగుచుండుఁ
గాని యీశ్వరునకుఁ గర్తగాఁ జాల; ది క్కాలంబు విను మదిగాక దేహ

తే. మందిరార్థాది కర్మాభిమాన శీలు, రైనవారికి నాశ్రయం బగుటఁ జేసి
యరయ హరి తద్గుణవ్యతికరుఁడు, గానఁ కాల మమ్మేటి కెన్నఁడు గర్త గాదు. 362

* కాలస్వరూపుడై దీపించే కమలాక్షుడు ఆద్యంతాలు లేని మహాపురుషుడు. అఖిల లోకాలకూ ఆత్మ అయినవాడు. అటువంటి పరమేశ్వరునకు పరమాణువు మొదలుకొని పరార్ధం పర్యంతం గల కాలం ఒక్క నిమేషంతో సమానం అవుతుంది. కనుకనే భగవంతుడే కాలానికి కర్తగాని కాలం భగవంతునికి కర్త కాదు. అంతేకాక దేహాలూ, గేహాలూ, సంపదలూ మొదలైన వాటియందు అభిమానం కలవారికి ఆశ్రయమైనది కాలం. భగవంతుడు ఆ గుణాలకు అతీతుడు. అందుకనే ఆయన కర్తయై కాలాన్ని నడిపించుతాడు; కాని ఆయన్ని కాలం నడిపించదు.

వ. మఱియు షోడశ వికారయుక్తంబై, పృథివ్యాది పంచభూత పరివృతంబయి, దశావరణంబులు గలిగి పంచాశత్కోటి విస్తీర్ణంబై బ్రహ్మాండకోశంబు దనరుచుండు. 363

* బ్రహ్మాండకోశం పదహారు వికారాలతోకూడి, పృథ్వి మొదలైన పంచభూతాలతో ఆవరింపబడి, పది విధాలైన ఆవరణాలు కలిగి, ఏభైకోట్ల యోజనాల విస్తీర్ణమై విరాజిల్లుతుంది.

చ. హరి పరమాణురూపమున నందు వసించి విరాజమానుఁడై
సరి వెలుఁగొందు, నిమ్మల నసంఖ్యములైన మహాండకోశముల్
నెఱిఁ దనయందు డింద, నవనీరజనేత్రుఁ డనంతుఁ డాద్యుఁ డ
క్షరుఁడు పరాపరుం డఖిలకారణకారణుఁ డప్రమేయుఁడై. 364

* లెక్కలేనన్ని మహాండకోశాలు తన ఉదరంలో పదిలపరచుకొని పరమేశ్వరుడైన హరి పరమాణురూపంతో ఆ బ్రహ్మాండకోశంలో ప్రకాశిస్తూ ఉంటాడు. అప్పుడే వికసించిన కమలాలవంటి కన్నులు కలవాడూ, అంతం లేనివాడూ, ఆదిదేవుడూ, అక్షర పరబ్రహ్మమూ అయిన ఆ పరమాత్మ సమస్త కారణాలకూ కారణమైన వాడే అయినప్పటికీ వాటితో ఎటువంటి సంబంధం లేనివాడై ఉంటాడు.

క. నిరతిశయోజ్జ్వల తేజః, స్ఫురణం దనరారు పరమపురుషుని విష్ణుం
బురుషోత్తము వర్ణింపను, సరసిజభవ భవులకైన శక్యమె చెపుమా! 365

* అనుపమానమూ, అఖండమూ అయిన అద్భుత తేజస్సుతో విరాజిల్లే ఆ పరమపురుషుణ్ణి, ఆ పరాత్పరుణ్ణి, ఆ మహావిష్ణువును అభివర్ణించటానికి పద్మభవునకూ పరమశివునకూ కూడా సాధ్యం కాదు.

క. అని మైత్రేయుఁడు విదురుం, గనుఁగొని వెండియును బలికెఁ; గాలాహ్వయుఁడై
తనరిన హరి మహిమల నే, వినిపించితి సృష్టిమహిమ విను మెఱిఁగింతున్. 366

* అని మైత్రేయుడు, విదురుణ్ణి చూచి మళ్లీ ఇట్లా అన్నాడు కాలస్వరూపుడైన శ్రీహరి మహిమలను నీకు వినిపించాను. ఇంక సృష్టి విశేషాలను వినిపిస్తాను, విను.

వ. పరమేష్ఠి యీ సృష్ట్యాది నహమ్మను దేహాభిమానబుద్ధి గల మోహంబును, నంగనాసంగమ ప్రక్చందనాది గ్రామ్య భోగేచ్ఛలు గల మహామోహంబును, దత్ప్రతిఘాతజాతంబైన క్రోధంబునందుఁ గలుగు తామిస్రంబును, దన్నాశంబునం "దహ మేవ మృతోఽస్మి" యను నంధతామిస్రంబును, జిత్తవిభ్రమంబును నను నవిద్యా పంచక మిశ్రంబుగా సర్వభూతావలిం బుట్టించి యాత్మీయ చిత్తంబునం బాపసృష్టిఁ గల్పించుటకుఁ బశ్చాత్తాపంబు నొంది భగవద్ధ్యానామృత పూతమానసుండై యూర్ధ్వరేతస్కులును, బరమ పవిత్రులునునైన సనక సనందన సనత్కుమార సనత్సుజాతులను మునుల నతిసత్త్వగరిష్ఠుల ధీరజనోత్తముల నార్యుల హరిప్రపన్నులనుంగా దివ్యదృష్టిం గల్పించి వారలం జూచి మీ మీ యంశంబులం బ్రజలం బుట్టించి ప్రపంచంబు వృద్ధిఁ బొందింపుం డనిన; వారలు తద్వచనంబు లపహసించుచుఁ బద్మజుం గని మోక్షధర్ములును నారాయణ పరాయణులునై ప్రపంచ నిర్మాణంబునకుఁ బ్రతికూల వాక్యంబులు పలికిన నుదయించిన క్రోధంబు బుద్ధిచే నిగ్రహింపఁబడినను నరవింద సంభవుని భ్రూమధ్యంబువలనం గ్రోధస్వరూపంబున నీలలోహితుండు నిఖిలసురాగ్రజుండై యుదయించుచు నాక్రందనం బొనరించె నంత. 367

* బ్రహ్మదేవుడు సృష్టికి ఆరంభించి, "నేను సృష్టిస్తాను" అని సంకల్పించగానే అహంకారపూరితమైన దేహాభిమానం గల "మోహం" పుట్టింది. దేహాభిమానంవల్ల స్త్రీసంభోగం, చందనం, పూలదండలు, మొదలైన భోగాలపై ఆసక్తి గల "మహామోహం" ఉద్భవించింది. ఈ కోరికలకు విఘ్నం కలుగగా కనులు కనుపింపని గ్రుడ్డితనం ఏర్పడింది. అదే "అంధతామిస్రం". శరీర మోహంవలన, శరీరనాశన భయం, మృత్యుభీతి ఏర్పడింది. ఇది. "తామిస్రం". పై అన్నింటితో మనస్సుకు సంచలనం ఏర్పడింది. ఇది "చిత్త విభ్రమం". ఈ అయిదింటికీ "అవిద్యాపంచకం" అని పేరు. అవిద్యాపంచకంతో కలిసిన భూతకోటిని పుట్టించటం తాను చేసిన "పాపకార్య" మని బ్రహ్మ గుర్తించి మనస్సులో పశ్చాత్తాపం చెందాడు.

బ్రహ్మదేవుడు భగవంతుణ్ణి ధ్యానించాడు. భగద్ధ్యాన మనే అమృతంవల్ల ఆయన మనస్సు పావనమయింది. పవిత్రుడైన విధాత తన దివ్య దృష్టితో అస్ఖలిత బ్రహ్మచారులూ, పరమపావనులూ, సత్త్వగుణ సంపన్నులూ, ధీరవరేణ్యులూ, మాన్యులూ అయిన సనకుడు, సనందనుడు, సనత్కుమారుడు, సనత్సుజాతుడు అనే మునులను సృష్టించాడు. భగవదనురక్తులైన వారిని చూచి "మీ మీ అంశలతో ప్రజల్ని పుట్టించి ప్రపంచాన్ని వృద్ధి చేయండి" అని ఆజ్ఞాపించాడు.

చతుర్ముఖుని పలుకులు విన్నంతనే సనక సనందనాదులకు నవ్వు వచ్చింది. మోక్షాసక్తులూ, శ్రీమన్నారాయణుని పరమ భక్తులూ అయిన వారు చతురాస్యుని అపహాస్యం చేస్తూ ప్రపంచ నిర్మాణానికి ప్రతికూల వచనాలు పలికారు. వారు తన ఆజ్ఞను ఉల్లంఘించినందుకు బ్రహ్మకు ఆగ్రహం వచ్చింది. బుద్ధిబలంతో ఆ ఆగ్రహాన్ని ఎంత నిగ్రహించుకున్నా ఆయన కనుబొమ్మల నడుమ నుంచి క్రోధస్వరూపుడై సమస్త దేవతలకూ అగ్రేసరుడైన నీలలోహితుడు ఉద్భవించాడు. అతడు జన్మిస్తూనే పెద్దగా రోదనం చేశాడు.

**మ. జననం బందిన నీలలోహితుఁడు గంజాతాసనుం జూచి యి**
**ట్లను "నో దేవ! మదాఖ్య లెట్టివి? మదీయావాసముల్ వీఁక నా**
**కనయంబు న్నెఱిఁగింపవే" యనుడు నయ్యంభోజగర్భుండు లా**
**లనముం దోఁపఁ గుమార! నీజననవేళన్ రోదనం బిచ్చుటన్. 368**

**తే. రుద్రనామంబు నీకు నిరూఢ మయ్యెఁ, జంద్రసూర్యానలానిల సలిల గగన**
**పృథివి ప్రాణ తపో హృదింద్రియము లనఁగఁ, గలుగు నేకాదశస్థానములు వసింప. 369**

* ఆ విధంగా నీలం, ఎరుపు రంగుతో పుట్టిన నీలలోహితుడు బ్రహ్మను చూచి "ఓ దేవా! నేనెవరిని? నాపేరేమి? నా నివాస స్థలం ఏది?'' అంటూ వెంట వెంటనే ప్రశ్నించాడు. అప్పుడు బ్రహ్మదేవుడు మంచి మాటలతో అతనిని లాలిస్తూ "కుమారా! నీవు రుద్రుడవు. పుట్టినప్పుడు ఏడ్వడంవల్ల "రుద్రుడు'' అను పేరు నీకు రూఢ మయింది. చంద్రుడు, సూర్యుడు, అగ్ని, వాయువు, జలం, ఆకాశం, భూమి, ప్రాణం, తపస్సు, హృదయం ఇంద్రియాలు అనే పదకొండూ నీకు నివాసస్థానాలు.

**వ. అని వెండియు మన్యు మను మహాకాల మహ చ్ఛివ ఋతధ్వజోరురేతో భవ కాల వామదేవ ధృతవ్రతులను నేకాదశనామంబులు గలిగి ధీవృత్త్యశనోమానియు త్సర్పి రిలాంబి కేలావతీ సుధా దీక్షా నామ పత్నీసమేతుండవై పూర్వ నియుక్తంబు లయిన నామంబులం దత్తన్నివాసంబుల వసియించి ప్రజలం గల్పింపుమని నిర్దేశించిన భగవంతుఁడగు నీలలోహితుండు విశ్వగురుండైన పితామహునిచే నియుక్తుండై సత్త్వాకృతి స్వభావంబుల నాత్మసములైన ప్రజలం గల్పించె. 370**

* అంతేకాదు నాయనా! మన్యువు, మనువు, మహాకాలుడు, మహత్, శివుడు, ఋతధ్వజుడు, ఉరురేతస్కుడు, భవుడు, కాలుడు, వామదేవుడు, ధృతవ్రతుడు అని నీకు పదకొండు నామాలు ఉంటాయి. ధీ, వృత్తి, ఉశన, ఉమ, నియుత్, సర్పిః, ఇల, అంబిక, ఇరావతి, సుధ, దీక్ష అను పదకొండు మంది స్త్రీలు నీకు భార్యలు. పూర్వం నిర్ణయింప బడిన పేర్లతో ఆ యా స్థలాలలో ఉంటూ ప్రజల్ని సృష్టించు'' అని విశ్వగురువైన బ్రహ్మ ఆదేశింపగా ఆ నియమం మేరకు రుద్రుడు బలంలోనూ, ఆకారంలోనూ, స్వభావంలోనూ తనతో సమానులైన ప్రజలను సృష్టించాడు.

**ఉ. రుద్రునిచేత నీ గతి నిరూఢమతిన్ సృజియింపఁబడ్డ యా**
**రుద్రగణంబు లోలి నవరుద్ధత విశ్వము మ్రింగె; నమ్మహో**

పద్రవ శాంతికై యజుఁడు భర్గులఁ జూచి కుమారులార! మీ
రౌద్ర విలోకనానల భరంబునఁ గ్రాఁగె సమస్తలోకముల్. 371

* ఈ విధంగా రుద్రుడు సృష్టించిన రుద్రగణాలు ఈ విశ్వాన్నంతా అనాయాసంగ అమాంతంగ మ్రింగేశాయి. ఆ మహాప్రమాదాన్ని శాంతింపజేయడానికై బ్రహ్మ రుద్రగణాలను చేరబిలిచి "కుమారులారా, చూచారా! మీ తీక్ష్ణవీక్షణాగ్ని జ్వాలలో సమస్త లోకాలూ మండిపోయాయి."

క. మీ సృష్టి చాలు; నింకన్, ధీసత్తములార! వినుఁడు ధృతి మీరు తపో
వ్యాసంగచిత్తులై చనుఁ, డా సన్మంగళము లగు దృఢంబుగ మీకున్. 372

* "నాయనలారా! చాలు! ఇక మీ సృష్టి చాలించండి. మీరు బుద్ధిమంతులు, ధైర్యవంతులు, నామాట వినండి. చక్కగా అరణ్యాలకు వెళ్ళి ఏకాగ్రచిత్తులై తపస్సు చేసుకోండి. మీకు నిశ్చయంగా శుభం కలుగుతుంది."

మ. భగవంతుం బురుషోత్తమున్ హరిఁ గృపాపాథోధి లక్ష్మీశ్వరున్
సుగుణభ్రాజితు నచ్యుతుం బరుఁ బరంజ్యోతిం బ్రభున్ సర్వ భూ
త గుహావాసు నధోక్షజున్ శ్రితజనత్రాణైక పారీణు నా
జగదాత్మం గనుచుందు రార్యులు దపశ్శక్తిన్ స్ఫుటజ్ఞానులై. 373

* "భగవంతుడు, పురుషోత్తముడు, కరుణాసముద్రుడు, లక్ష్మీవల్లభుడు, సద్గుణసంపన్నుడు, అచ్యుతుడు, పరమాత్ముడు, పరంజ్యోతి, సర్వేశ్వరుడు, సర్వాంతర్యామి, అధోక్షజుడు, జగన్నాథుడు, ఆర్తజనరక్షా పరాయణుడు అయిన శ్రీమన్నారాయణుని సజ్జనులైనవారు తమ తపశ్శక్తివల్ల దర్శింప గలుగుతారు. మీరుకూడా తపస్సు చేసి ఆయనను దర్శించండి" అన్నాడు బ్రహ్మదేవుడు.

వ. అనిన విని. 374

ఉ. కైకొని యిట్లు పంకరుహగర్భ నియంత్రితులైన రుద్రు లు
ద్రేకము దక్కి కానలకు ధీయుతులై తపమాచరింప న
స్తోకచరిత్రు లేఁగిరి; చతుర్ముఖుఁ డంతఁ బ్రపంచకల్పనా
లోకనుఁడై సృజించె జనలోకశరణ్యుల ధీవరేణ్యులన్. 375

* రుద్రులు బ్రహ్మమాటలు విన్నారు. తమ రౌద్రావేశాన్ని అణచుకున్నారు. ఉద్రేకాన్ని తగ్గించుకున్నారు. ఆ సచ్చరిత్రులు చతుర్ముఖుని ఆజ్ఞానుసారం అరణ్యాలకు వెళ్ళి తపోనిమగ్నులైనారు. అనంతరం బ్రహ్మ ప్రపంచాన్ని సృష్టించాలనే దృష్టి కలవాడై ఈ సారి మానవ లోకానికి శరణ్యులూ మతిమంతులలో అగ్రగణ్యులూ అయినవారిని సృజించాడు.

తే వినుము! భగవద్బలాన్విత వినుతగుణులు, భువనసంతాన హేతు విస్ఫురణకరులు
పద్మసంభవ తుల్య ప్రభావయుతులు, పదురు గొడుకులు పుట్టిరి భవ్యయశులు. 376

* భగవంతుని బలంతోకూడిన సద్గుణాలు కలవారు, జీవుల అభివృద్ధికి కారణ మైనవారు, బ్రహ్మతో సమానమైన ప్రభావం కలవారు, విశాలమైన యశస్సు కలవారు- అయిన పదిమంది కొడుకులు ఉదయించారు.

సీ. అరవిందసంభవు నంగుష్ఠమున దక్షుఁ డూరువువలనను నారదుండు
నాభిఁ బులహుఁడు గర్ణములఁ బులస్త్యుండు త్వక్కున భృగువు హస్తమునఁ గ్రతువు
నాస్యంబువలన నయ్యంగిరసుఁడు ప్రాణమున వసిష్ఠుఁడు మనమున మరీచి
గన్నుల నత్రియుఁగాఁ బుత్త్రదశకంబు గలిగిరి; వెండియు నలినగర్భు

తే. దక్షిణ స్తనమువలన ధర్మమొదవె, వెన్నువలనను నుదయించె విశ్వభయద
మైన మృత్యు వధర్మంబు నంద కలిగె, నాత్మఁ గాముండు జననము నందె; మఱియు.

377

* బ్రహ్మ బొటనవ్రేలినుండి దక్షుడు, తొడనుండి నారదుడు, నాభినుండి పులహుడు, చెవులనుండి పులస్త్యుడు, చర్మం నుండి భృగువు; చేతినుండి క్రతువు, ముఖం నుండి అంగిరసుడు, ప్రాణంనుండి వసిష్ఠుడు, మనస్సునుండి మరీచి, కన్నులనుండి అత్రి ఆవిర్భవించారు. ఈ విధంగా పదిమంది కుమారులు పుట్టారు. ఇంకా బ్రహ్మదేవుని కుడి వైపు స్తనంనుండి ధర్మం జనించింది. వెన్నునుండి లోకభయంకరమైన మృత్యువూ, అధర్మమూ జనించాయి.ఆత్మ నుండి మన్మథుడు పుట్టాడు.

సీ. భ్రూయుగళంబునఁ గ్రోధంబు, నధరంబునందు లోభంబు, నాస్యమున వాణి
యును, మేఢ్రమందుఁ బయోధు, లపానంబునందు నఘాశ్రయుఁడైన నిరృతి,
లాలితచ్ఛాయవలన దేవహూతి విభుండు గర్దముఁడును, బుట్టి రంత
నబ్జజుఁడాత్మ దేహమున జనించిన భారతిఁ జూచి విభ్రాంతిఁ బొరసి

తే. పంచశర బాణ నిర్భిన్న భావుఁ డగుచుఁ, గూఁతు రని పాపమునకు సంకోచపడక
కవయఁగోరిన జనకునిఁ గని మరీచి, మొదలుగాఁ గల య మ్మునిముఖ్యు లెఱిఁగి. 378

వ. ఇట్లనిరి. 379

* బ్రహ్మదేవుని కనుబొమ్మల నుండి క్రోధం జనించింది. పెదవుల నుండి లోభం పుట్టింది. ముఖము నుండి సరస్వతి ప్రభవించింది. పురుషాంగం నుండి సముద్రాలు, అపానం నుండి పాపాశ్రయుడైన నిరృతి, నీడ నుండి దేవహూతి, ఆమె భర్తయగు కర్దముడు ఉదయించారు. అంత బ్రహ్మ తన దేహం నుండి పుట్టిన సరస్వతిని చూచి ఆమె సౌందర్యానికి మోహపరవశుడైనాడు. మన్మథుని పుష్పబాణాలు ఆయన హృదయాన్ని భేదించాయి. కన్నకూతురనే సంకోచం లేకుండా పాపానికి వెనుకాడక వ్యామోహంతో ఆమె వెంటపడ్డాడు. తమ తండ్రి దుశ్చర్యను మరీచి మొదలుగా గల మునివర్యులు తెలుసుకొని ఇలా అన్నారు.

ఉ. చాలుఁ! బురే! సరోజభవ! సత్పథవృత్తిఁ దొఱంగి కూఁతు ని
ట్లాలరి వై రమింప హృదయంబునఁ గోరుట ధర్మరీతియే?

**బేలరి వైతి, నీ తగవుఁ, బెద్దతనంబును, నేలపాలుగా**
**శీలము వోవఁదట్టి యిటు సేసినవారలు మున్ను గల్గిరే? 380**

* ఓ బ్రహ్మదేవా! చాలు చాలు! సన్మార్గాన్ని కాలదన్ని కన్న కుమార్తెపై కన్ను వేసి రమింపదలచావు. మేలు మేలు! ఇదెక్కడి ధర్మమయ్యా? ఇంతటి పాపానికి ఒడిగట్టిన నీ న్యాయం, పెద్దరికం మట్టిపాలు చేశావు. నీ శీలం నేలపాలయింది. ఈ విధంగా చేసిన ఘనులు ఇంతకు ముందెప్పుడైనా ఉన్నారా?

**ఉ. నీవు మహానుభావుఁడ వనింద్యచరిత్రుఁడ; విట్టిచోట "రా**
**జీవభవుండు దా విధినిషేధము లాత్మ నెఱుంగఁడయ్యె; నీ**
**భావభవ ప్రసూనశర బాధితుఁడై తన కూఁతుఁ బొందెఁ బో**
**వావి దలంప లే" కనుచు వారక లోకులు ప్రువ్వఁ దిట్టరే! 381**

* నీవు మహానుభావుడవే! నిర్మలమైన చరిత్ర కలవాడవే! లోకులు వింటే ఏమంటారు? విధాత విధినిషేధాలు తెలియకుండా ప్రవర్తించాడని అనుకోరా? బ్రహ్మదేవుడు వావివరుసలు వదలిపెట్టి పూవిల్తుని పూవుటమ్ములకు లొంగిపోయి కన్నబిడ్డనే కామించాడని చెడతిట్టరా?

**క. పాపము దలఁపక, నిమిషము, లోపలఁ జెడు సౌఖ్యమునకు లోనైతివె? యిం**
**తే పో ధారుణిఁ 'గామాన్ధోఽపి న పశ్యతి' యనంగఁ దొల్లియు వినమే. 382**

* పాపకృత్యమని భావించకుండా క్షణికమైన సౌఖ్యానికి ఆశించి ఈ అల్పానికి పాల్పడ్డావు. "కామాంధుడికి కళ్లు కప్పించవు" అన్న లోకోక్తి ఉండనే ఉన్నది.

**మ. అని యిబ్భంగి మునీంద్రు లాడిన కఠోరాలాపముల్ వీనుల**
**న్విని లజ్జావనతాననుం డగుచు నా నీరేజగర్భుండు స**
**య్యన దేహంబు విసర్జనీయముగఁ జేయన్ దిక్కు లేతెంచి త**
**త్తనువుం గైకొనఁ బుట్టె దిక్కలితమై తామిస్ర నీహారముల్. 383**

* అని ఈ విధంగా మునీంద్రులు పలికిన ములుకులవంటి పలుకులు విని బ్రహ్మ సిగ్గుతో తలవంచుకొన్నాడు. వెనువెంటనే తన శరీరాన్ని పరిత్యజించాడు. దిక్కులు వచ్చి ఆ శరీరాన్ని ఆక్రమించాయి. వెంటనే ఆ దిక్కులలోనుంచి చీకటీ, మంచూ ఉద్భవించాయి.

**వ. అంత. 384**

**చ. ఉడుగక పంకజాతభవుఁ డొండొక దేహముఁ దాల్చి ధైర్యమున్**
**విడువక సృష్టిపూర్వ సమవేతముగన్ సృజియించు నేర్పు దాఁ**
**బొడమమి కాత్మలోనఁ దలపోయుచు నుండఁ జతుర్ముఖంబులన్**
**వెడలె ననూనరూపముల వేదము లంచిత ధర్మ యుక్తితోన్. 385**

* అటుమీద బ్రహ్మ ధైర్యం వదలక మరొక దేహాన్ని ధరించాడు. సృష్టికి పూర్వం సంప్రాప్తమయిన సృజనశక్తి తనకు అప్పుడు లేకపోవడంతో అంతరంగంలో ఎంతగానో చింతిస్తూ ఉండిపోయాడు. అంతలో అతని ముఖంనుండి పరమధర్మ ప్రబోధకాలైన వేదాలు పరిపూర్ణ స్వరూపాలతో ఆవిర్భవించాయి.

తే. మఱియు ముఖములు, మహితకర్మములుఁ దంత్ర, ములును, నడవళ్ళు, నాశ్రమములుఁ, దదీయ
ముఖచతుష్కమునందునఁ బొడమె ననిన, విని మునీంద్రునిఁజూచి య వ్విదురుఁ డనియె. 386

* ఇంతేకాదు. యజ్ఞాలు, పుణ్యకృత్యాలు, తంత్రాలు, సదాచారాలు, బ్రహ్మచర్యాది ఆశ్రమాలు ఆయన నాలుగు మోముల నుండి జన్మించాయి అని చెప్పగా విని విదురుడు మైత్రేయుణ్ణి చూచి ఇట్లా అన్నాడు.

క. తోయజ సంభవుఁ డత్తఱి, నే యే ముఖమండలమున నే యే సృష్టిన్
ధీయుతుఁడై సృజియించెను, బాయక యత్తెఱఁగుఁ దెలియఁ బలుకుము నాకున్. 387

అయ్యా! మైత్రేయా! బ్రహ్మదేవుడు బుద్ధిమంతుడై ఏ యే ముఖం నుండి ఏ యే సృష్టి చేశాడో అదంతా నాకు తెలిసేటట్టు చెప్పు.

వ. అని యిట్లు విదురుం డడిగిన మైత్రేయుం డతనితో నిట్లనియె; ఋగ్యజుస్సామాథర్వంబులను వేదంబులును, హోతృకర్మంబు లయిన యప్రగీతమంత్రస్తోత్రంబులగు శస్త్రంబులును, నధ్వర్యు కర్మం బైన యిజ్యయు, సంప్రగీత స్తోత్రంబయిన స్తుతియును, నుద్గాతృప్రయోజ్యంబైన ఋక్సముదాయ రూపం బగు స్తోమంబును, బ్రాయశ్చిత్తంబగు బ్రహ్మకర్మంబును, నాయుర్వేద ధనుర్వేద గాంధర్వ వేదంబులను నుపవేదంబులును, విశ్వకర్మ శాస్త్రం బగు స్థాపత్యంబును, బ్రాగాది ముఖంబుల నుత్పన్నంబు లయ్యెఁ.

పంచమ వేదంబగు నితిహాస పురాణంబులు సర్వముఖంబులం గలిగె. మఱియుఁ గర్మ తంత్రంబు లయిన షోడశ్యుక్థ్యములును; జయనాగ్నిష్టోమంబులును, నాప్తోర్యామాతిరాత్రంబులును, వాజపేయగోసవంబులును, ధర్మపాదంబులైన విద్యాదాన తపస్సత్యంబులును, బ్రహ్మచర్య గృహస్థ వానప్రస్థ యత్యాశ్రమంబులును గలిగె. వీనికి నొక్కొక్కటికి జతుర్విధంబులైన వృత్తులును గలిగియుండు, నందు సావిత్రంబను బ్రహ్మచర్యంబును, ఉపనయనం బాదిగా దివసత్రయంబు గాయత్రి జపించుటయను ప్రాజాపత్యంబును, వేదవ్రత చతుష్టయంబందు బ్రతివ్రతంబును, వ్రతులు సంవత్సర పర్యంతంబుగా నాచరింపనగు బ్రాహ్మంబును, వేదగ్రహణాంతంబు నాచరింపం దగు నైష్ఠికంబును నను బ్రహ్మచారి వృత్తిచతుష్టయంబును; ననిషిద్ధకృష్యాది వృత్తియగు వార్తయు, యజనాది కర్మోపయుక్తంబైన యాజ్ఞాది రూపధన సంచయంబును, బరుల యాచింపకుండు నయాచితంబను శాలీనంబును, క్షేత్రపతిత కణిశ కణ సంగ్రహణ రూపంబగు శిలోంఛంబును, నను గృహస్థవృత్తులు నాలుగును; నకృష్ట పచ్యాహారులగు వైఖానసులును, నూతనఫలంబు లబ్ధంబైనఁ బూర్వసంచిత పదార్థత్యాగంబు గల వాలఖిల్యులును, బ్రాతఃకాలంబున నే దిక్కు విలోకింతు

రద్దిక్కునకు జని యచ్చట లభించు పదార్థంబుల భుజించి జీవించు నౌదుంబరులును, దమంత ఫలించి తరు పతితంబు లగు ఫలంబులఁ దినుచుండు ఫేనపులును నను చతుర్విధ వృత్తులు గల వానప్రస్థులును; స్వాశ్రమ విహితకర్మంబులం బ్రధానుం డగు కుటీచకుండును, గర్మం బుపసర్జనంబు సేసి జ్ఞాన ప్రధానుం డయిన బహూదుండును, గేవలజ్ఞానాభ్యాసనిష్ఠుం డగు హంసుండును, బ్రాప్తంబైన పరబ్రహ్మ తత్త్వంబుగ నిష్క్రియుండును నను సన్న్యాసి చతుర్విధ వృత్తులును, మోక్షఫలప్రదంబై యాత్మానాత్మ వివేక విద్యారూపంబగు నాన్వీక్షకియు, స్వర్గాది ఫలప్రదంబై కర్మవిద్యారూప మగు త్రయియు, జీవనఫలప్రధానంబై కృష్యాదిరూపంబగు వార్తయు, నర్థసంపాదనైక ప్రయోజనంబగు దండనీతియు నను మోక్షధర్మ కామార్థంబులైన న్యాయవిద్యా చతుష్టయంబును, "భూర్భువస్సువః" యను వ్యాహృతులును, బూర్వాది ముఖంబులవలన నుదయించె;

మఱియు నతని హృదయాకాశంబువలనం బ్రణవంబును, రోమంబులవలన నుష్ణి క్ఛందంబును, త్వగింద్రియము వలన గాయత్రీ ఛందంబును, మాంసంబువలనం ద్రిష్టుప్ఛందంబును, స్నాయువువలన ననుష్టుప్ఛందంబును, నస్థివలన జగతీఛందంబును, మజ్జవలన పంక్తిచ్ఛందంబును, బ్రాణంబువలన బృహతీ ఛందంబును, కకారాది పంచవర్గాత్మకంబు లయిన స్పర్శంబుల వలన జీవుండును, అకారాది స్వరాత్మకంబైన దేహంబును, నూష్మంబులను శషసహవర్ణ చతుష్టయ రూపంబులగు నింద్రియం బులును, నంతస్థంబులగు యరలవ లను వర్ణంబులును, షడ్జాదిసప్త స్వరూపంబు నాత్మబలంబయిన శబ్దబ్రహ్మంబును, చతుర్ముఖుని లీలా విశేషంబున నుత్పన్నంబయ్యె;

వ్యక్తావ్యక్తంబై వైఖరీ ప్రణవాత్మకంబైన శబ్దబ్రహ్మంబువలనం బరమాత్మ యవ్యక్తాత్మకుం డగుటంజేసి పరిపూర్ణుండును, వ్యక్తాత్మకుం డగుటంజేసి యింద్రాది శక్త్యుపబృంహితుండునునై కానంబడుఁ; బదంపడి యజుండు భూరివీర్యవంతు లయిన ఋషిగణంబుల సంతతి యవిస్తృతంబని తలంచి పూర్వతను పరిగ్రహంబు సాలించి యనిషిద్ధ కామాసక్తంబైన దేహాంతర పరిగ్రహంబు సేసి నిత్యంబుఁ బ్రజాసృష్టియందు వ్యాసక్తుండనైనను బ్రజ లభివృద్ధి నొందక యుండుట కేమి కారణం బగునని యచ్చెరువొంది తద్వృద్ధి యగు విధం బాలోచించుచు దైవం బిచ్చట విఘాతుకంబు గాన తదానుకూల్యం బావశ్యకం బని దాని నెదురు చూచుచు యథోచితకృత్య కరణదక్షుం డగుచుండ చతుర్ముఖుని దేహంబు ద్వివిధం బయిన నట్టి రూపద్వయవిభాగంబు స్వరాట్టగు "స్వాయంభువ" మనువును, దన్మహిషి యగు "శతరూప" యను కన్యకయుంగా మిథునంబయి జనియించె, నమ్మిథునంబు వలనం బ్రియవ్రతోత్తానపాదులను పుత్రద్వయంబు, నాకూతి దేవహూతి ప్రసూతులను కన్యకాత్రయంబును గలిగి; రందు నాకూతిని రుచికునకును, దేవహూతిం గర్దమునకును, బ్రసూతిని దక్షునకును నిచ్చె; వీరలవలనఁ గలుగు ప్రజాసంతతులచేత జగంబులు పరిపూర్ణంబు లయ్యె. 388

* ఈ విధంగా విదురుడు అడుగగా మైత్రేయుడు అతనితో ఇట్లా అన్నాడు. బ్రహ్మదేవుని తూర్పువైపు ముఖం నుండి ఋగ్వేదమూ, దక్షిణముఖం నుండి యజుర్వేదమూ, పశ్చిమముఖం నుండి సామవేదమూ, ఉత్తరముఖం నుండి అథర్వ వేదమూ ఉద్భవించాయి.

యజ్ఞానికి "హోత, అధ్వర్యుడు, ఉద్గాత, బ్రహ్మ" అని నల్గురు ఋత్విక్కు లుంటారు. హోత అనే ఋత్విక్కుకు సంబంధించినవీ, గానం చేయబడినవి, అయిన ప్రశంసాత్మక మంత్ర స్తోత్రాలు తూర్పుముఖంనుండి వెలువడ్డాయి.

అధ్వర్యునికి సంబంధించిన విధిరూపమైన ఇజ్య, గానయోగ్యాలైన మంత్రస్తోత్రాలూ దక్షిణముఖంనుంచి ఉదయించాయి.

ఉద్గాత ప్రయోగించే స్తోమాలు అనే ఋగ్వేద మంత్రాలు పశ్చిమ ముఖంనుంచి ప్రాదుర్భవించాయి.

బ్రహ్మ అనబడే నాల్గవ ఋత్విక్కు ఆచరించే ప్రాయశ్చిత్తకాండ ఉత్తరముఖంనుంచి ఉద్భవించింది.

ఉపవేదాలలో ఆయుర్వేదం ప్రాఙ్ముఖం నుంచీ, ధనుర్వేదం దక్షిణముఖం నుంచీ, గాంధర్వ వేదం పశ్చిమ ముఖం నుంచీ, విశ్వకర్మకు సంబంధించిన స్థాపత్యమనే శిల్పవేదం ఉత్తర ముఖం నుంచీ ఉత్పన్న మయినాయి.

పంచమవేద మయిన ఇతిహాస పురాణ సముచ్చయం బ్రహ్మదేవుని అన్ని ముఖాలనుంచి ఆవిర్భవించింది. ఇవి గాక కర్మతంత్రాలయిన షోడశి-ఉక్థ్యము, చయనం- అగ్నిష్టోమం, ఆప్తోర్యామం- అతి రాత్రం, వాజపేయం-గోసవం అనే నాలుగు జంటలూ, ధర్మపాదాలైన విద్య-ధనం-దానం-తపస్సు- అనేవీ క్రమంగా నలువనాలుగు ముఖాలనుంచి వెలువడినాయి.

బ్రహ్మచర్యం, గార్హస్థ్యం, వానప్రస్థం, సన్న్యాసం అనే ఆశ్రమ చతుష్టయంకూడా చతుర్ముఖుని చతుర్ముఖాల నుంచి క్రమంగా జనించాయి. పై నాలుగు ఆశ్రమాలలో ఒక్కొక్కటి నాలుగు విధాలైన విధానాలతో ఆలరారుతుంటుంది.

బ్రహ్మచర్యానికి "సావిత్రం" అని కూడా పేరు. సవిత అంటే సూర్యుడు. ఆయన్ని ఆరాధించే గాయత్రి ఇందు ప్రధానం కనుక దీనికి ఈ పేరు వచ్చింది. ఉపనయనం మొదలుకొని మూడు దినాల పర్యంతం గాయత్రీ మంత్రం జపించటం "ప్రాజాపత్యం" అంటారు. వేదవ్రతాలు నాల్గింటిలో ఒక్కొక్కటీ ఒక్కొక్క సంవత్సరం పర్యంతం ఆచరించేది "బ్రాహ్మం". వేదం పూర్తిగా నేర్చుకొన్న అనంతరం ఆచరించేది "నైష్ఠిక వ్రతం". ఇవి నాలుగూ బ్రహ్మచారి వృత్తులు.

గృహస్థ వృత్తులు నాలుగు. పొలం దున్ని పండించుకోవటమే జీవనోపాధిగా పెట్టుకోవటం "వార్త" అంటారు. యజ్ఞయాగాది కర్మలకు ఉపయోగించే సాధనాలను కూడబెట్టుకోవడం "సంచయం" అంటారు. పరులను యాచింపకుండా వుండటం "శాలీనం", పొలాల్లో రాలిన ధాన్యం కంకులు ఏరుకొని వానిని శిలలపై నూర్చుకొని జీవించటం "శిలోంఛం".

వానప్రస్థ వృత్తులు నాలుగు. దుంపలు త్రవ్వుకొని భుజించే వారు "వైఖానసులు". క్రొత్త పంట లభించగానే పూర్వం దాచిపెట్టిన పదార్థాలను మిగలకుండా ఇతరులకు పంచిపెట్టేవారు "వాలఖిల్యులు".

ప్రొద్దున లేవగానే ఏ దిక్కు కన్పిస్తుందో ఆ దిక్కుకు పోయి అక్కడ అయాచితంగా లభించిన పదార్థాలను భుజించేవారు "ఔదుంబరులు". చెట్టున పండి రాలిన ఫలాలనూ, పత్రాలనూ తిని జీవించేవారు "ఫేనపులు".

సంన్యాసులలోకూడా నాలుగు విధాలున్నారు. సొంతకుటీరం ఉండి చేయదగిన కర్మలు చేసేవాడు "కుటీచకుడు", కుటీరం లేకుండా కర్మలు అప్రధానంగా జ్ఞానియై సంచరిస్తుండేవాడు "బహూదుడు"; కేవలం జ్ఞానాభ్యాసం మాత్రం చేసేవాడు "హంసుడు"; జ్ఞానాభ్యాసం కూడా లేకుండా పరబ్రహ్మతత్త్వం అలవడినవాడు "నిష్క్రియుడు".

అన్వీక్షకీ, త్రయీ, వార్తా, దండనీతీ అనే నాలుగు న్యాయవిద్యలూ బ్రహ్మదేవుని నాలుగు ముఖాలనుండి వరుసగా పుట్టాయి. "అన్వీక్షకి" అంటే ఆత్మానాత్మ వివేకం కలిగి మోక్షాన్ని ప్రసాదించే విద్య. "త్రయి" అంటే స్వర్గాది ఫలాలను అందించే వేదకర్మానుష్ఠానం. 'వార్త' అంటే జీవనోపాధికోసం చేసే కృషి మొదలైన విద్య. "దండనీతి" అంటే అర్థ సంపాదనమే ప్రయోజనంగా గల విద్య. ఈ నాలుగు విద్యలలో అన్వీక్షకి మోక్షానికీ, త్రయి కామానికీ, వార్త ధర్మానికీ, దండనీతి అర్థానికీ సాధనాలు. "భూః, భువః, సువః" అనే వ్యాహృతులు బ్రహ్మదేవుని ముఖాలనుండి క్రమంగా ఉదయించాయి. అతని హృదయం లోని ఆకాశం నుండి ఓంకారం పుట్టింది. రోమాలనుండి ఉష్ణిక్ ఛందస్సు, చర్మం నుండి గాయత్రీ ఛందస్సు, మాంసం నుండి త్రిష్టుప్ ఛందస్సు, స్నాయువువల్ల అనుష్టుప్ ఛందస్సు, ఎముక నుండి జగతీ ఛందస్సు, మజ్జవల్ల పంక్తిచ్ఛందస్సు, ప్రాణంవల్ల బృహతీ ఛందస్సు పుట్టాయి.

హల్లుల్లో క వర్గం మొదలు ప వర్గం వరకూ అయిదు వర్గాలతో స్పర్శాత్మకుడైన జీవుడూ, అకారాది అచ్చులతో స్వరాత్మకమైన దేహమూ, శ-ష-స-హ-లతో ఊష్మవర్ణాత్మకాలైన ఇంద్రియాలూ ఏర్పడ్డాయి. య-ర-ల-వ- అనే అంతస్థాలూ; షడ్జం, ఋషభం, గాంధారం, మధ్యమం, పంచమం, ధైవతం, నిషాదం అనే సప్తస్వరాలూ, ఆత్మబలమైన శబ్ద బ్రహ్మమూ-ఇవన్నీ చతుర్ముఖుని లీలా విశేషాలవల్ల పుట్టినాయి.

పరమేశ్వరునికి వ్యక్తమూ అవ్యక్తమూ అని రెండు రూపాలు. వ్యక్తరూపం "వైఖరీ వాక్కు"; "పరా", "పశ్యంతీ" "మధ్యమా" అనే వాక్కులు అవ్యక్తరూపం. ఈ వ్యక్తావ్యక్తరూపాలు రెండింటికీ ప్రణవమే ఆత్మ. భగవంతుడు అవ్యక్తాత్ముడు కావటంవల్ల పరిపూర్ణుడు. వ్యక్తాత్ముడు కావడంచేత ఇంద్రాది శక్తిసంయుక్తుడై కనిపిస్తాడు.

అనంతరం అనంత వీర్యవంతులైన ఋషుల సంతానం సవిస్తారమై వృద్ధి కాలేదని తలంచాడు బ్రహ్మ. ఆయన తన మొదటి శరీరాన్ని వదలుకొన్నాడు. నిషిద్ధం కాని కామంపై ఆసక్తి గల మరొక్క దేహాన్ని ధరించాడు. నిత్యం ప్రజాసృష్టి యందు ఆసక్తుడైనాడు. అయినా ప్రజాభివృద్ధి జరుగలేదు. కారణం తెలియక ఆశ్చర్యపడ్డాడు. అది వృద్ధి అయ్యే విధానాన్ని గూర్చి ఆలోచించాడు. దైవం ఇచట ప్రతికూలం. కాబట్టి దైవానుకూల్యం అవసరం అనుకుంటూ దైవాన్ని ధ్యానించాడు. సందర్భోచిత కర్తవ్యాలు నిర్వర్తింపసాగాడు.

వెంటనే బ్రహ్మదేవుని దేహం రెండు భాగాలయింది. అందొకటి 'స్వరాట్టు' అయిన "స్వాయంభువ" మనువుగా, మరొక్కటి అతని భార్య "శతరూప" అనే అంగనగా రూపొందాయి. ఆదిమిథునమైన, ఆ దంపతులకు ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు అనే ఇద్దరుపుత్రులూ; ఆకూతి, దేవహూతి, ప్రసూతి అనే ముగ్గురు పుత్రికలు పుట్టారు. వారిలో ఆకూతిని రుచిప్రజాపతికీ, దేవహూతిని కర్దమ ప్రజాపతికీ, ప్రసూతిని దక్ష ప్రజాపతికీ ఇచ్చి వివాహం చేశారు. ఈ దంపతులవల్ల కలిగిన అనంత ప్రజాసంతతులవల్ల జగత్తంతా నిండి నిబిడీకృత మయింది.

## -:స్వాయంభువమనువు ప్రజావృద్ధి సేయుట:-

**క. అని మైత్రేయుఁడు పలికిన, విని మనమున హర్ష మొదవ విదురుఁడు ముని నా**
**థునిఁజూచి పలికెఁ గ్రమ్మఱ, వనజోదర పాదభక్తి వశమానసుఁడై. 389**

* అని మైత్రేయుడు చెప్పగా విదురుడు విన్నాడు. సంతోషం పొందినవాడై, హరిపాద భక్తిపరవశుడై, ముని ముఖ్యుడైన మైత్రేయుణ్ణి చూచి మళ్ళా ఇట్లా అన్నాడు.

**క. ఘనుఁడు స్వయంభువునకుఁ బ్రియ, తనయుఁడు స్వాయంభువుండు దైతేయవిభే**
**దన సేవా చతురుండును, జనవినుతుం డాదిరాజసత్తముఁడౌటన్. 390**

* స్వయంభువుడైన బ్రహ్మదేవుని కుమారుడు స్వాయంభువుడు హరిచరణ సేవా పరాయణుడు. ఆదిరాజ వరేణ్యులలో అగ్రగణ్యుడై జనుల మన్ననలు అందుకొన్నవాడు.

**క. అతని చరిత్రం బవ్యా, హతసుఖదము, నిఖిలమంగళావహము, సమం**
**చితముం గావున బుధసే, విత! నాకెఱుఁగంగఁ బలుకవే మునితిలకా! 391**

* కోవిదులచే సేవింపబడు ఓ మునికుల తిలకా! ఆ స్వాయంభువుని చరిత్ర అఖండమైన ఆనందాన్ని అందించేది. సమస్త సౌభాగ్యాలను సమకూర్చేది. మిక్కిలి యోగ్యమైంది. అందువల్ల ఆయన వృత్తాంతం నాకు అర్థమయ్యేటట్లు దయచేసి చెప్పు.

**క. అదియును గాక ముకుందుని, పదకమల మరందపాన పరవశులై పెం**
**పొదవిన వారిచరిత్రము, సదమలమతి వినిన భవము సఫలము గాదే? 392**

అంతేకాదు. శ్రీహరి పాదపద్మాల మకరందాన్ని త్రాగి, మైమరచి మహాత్ములైనవారి మహనీయ చరిత్రను పరిశుద్ధమైన బుద్ధితో విన్న వారి జన్మం సార్థకం అవుతుంది.

**చ. అని విదురుండు వల్కిన దయాన్వితుఁడై మునినాథచంద్రుఁ డి**
**ట్లను శ్రుతిశాస్త్రపార కలితాత్మకుఁడైన నరుండు పద్మ లో**

చన చరణారవింద యుగసంగము గల్గిన సజ్జనుండు వొం
దిన ఫల మొందు భాగవత దివ్యకథా శ్రవణానురక్తిచేన్. 393

ఇలా పలుకుతున్న విదురునితో సదయ హృదయుడైన మైత్రేయ మహాముని ఇలా అన్నాడు. నాయనా! వేదశాస్త్ర పఠనం చేసే మానవుడూ, శ్రీహరి చరణ కమలాల మీద అనురాగం గల సజ్జనుడూ- ఏ ఫలాన్ని పొందుతారో భగవద్భక్తుల దివ్యమైన కథలను ఆసక్తితో ఆకర్ణించడంవల్ల అటువంటి ఫలమే సంప్రాప్త మవుతుంది.

క. అని చెప్పి మునికులాగ్రణి, దనుజారికథా సుధాప్లుత స్వాంతుండై
తనువునఁ బులకాంకురములు, మొనయఁగ నానందబాష్పములు జడి గురియన్. 394

* ఇలా చెబుతున్న మైత్రేయ మహాముని హృదయం శ్రీహరి కథాసుధాలహరితో పెల్లుబికింది. ఆయన శరీరం సంతోషంతో పొంగి పులకించింది. ఆయన నయనాలు ఆనందబాష్పాలు వర్షించాయి.

సీ. వినిపింపఁ దొడఁగె నా ఘనుఁడు స్వాయంభువుఁ, డంగనాయుక్తుఁడై యబ్జగర్భు
నకు మ్రొక్కి వినయవినమితోత్తమాంగుఁడై, హస్తముల్ మొగిచి యిట్లనియెఁ బ్రీతి
జీవరాసులకు రాజీవసంభవ! నీవ, జననరక్షణ వినాశముల కరయ
హేతుభూతుఁడవు; మా కెద్ది యాచరణీయ, మైన కర్మము దాని నానతిమ్ము!
తే. ఎట్టి కర్మంబు సేసిన? నెసఁగు నీకు, నవహితంబైన సంతోష మాత్మజుండు
జనకునకు భక్తిఁ బరిచర్య సలిపి కీర్తి, నంది నుతి కెక్కి వర్తించు నందు నిందు. 395

* మైత్రేయుడు విదురునితో ఇట్లా చెప్పసాగాడు. స్వాయంభువుడు తన భార్య అయిన శతరూపతో కూడా బ్రహ్మదేవునకు నమస్కారం చేశాడు. వినయంతో తలవంచుకొని, చేతులు జోడించి ప్రీతిపూర్వకంగా ఇలా అన్నాడు.- ఓ కమలగర్భా! ఈ విశ్వంలోని సర్వప్రాణులనూ పుట్టించుటకూ, పోషించుటకూ, సంహరించుటకూ, కారణభూతమైన వాడవు నీవే! మేము చేయవలసిన పనియేమో మాకు ఆజ్ఞాపించు. ఎలాంటి పనిచేస్తే నీకు అత్యంతమైన సంతోషం కలుగుతుందో అది చేస్తాము. తండ్రికి భక్తితో సేవచేసిన తనయుడు ఈ లోకంలో ఆ లోకంలో అఖండమైన యశస్సు ఆర్జిస్తాడు. అందరి అభిమానానికీ పాత్రుడౌతాడు.

వ. కావున నెఱింగింపు మట్టి సత్కర్మంబు. 396

* కాబట్టి అట్టి మంచిపని యేదో నాకు ఆనతివ్వు.

క. అని పలికిన స్వాయంభువ, మను మృదుభాషలకు నలరి మనమునఁ గమలా
సనుఁ డనురాగము ముప్పిరి, గొనఁ బ్రియతముఁడైన సుతునకును నిట్లనియెన్. 397

* అని పలికిన స్వాయంభువుని మృదుమధుర వాక్యాలకు చతుర్ముఖుడు చాలా సంతోషించాడు. అంతరంగంలో అనురాగం పొంగిపొరలగా అనుగునందనునితో అరవిందభవుడు ఇలా అన్నాడు.

చ. మునుకొని తండ్రియాజ్ఞఁ దలమోచి నిజోచిత కృత్యమేమి పం
చినఁ దనశక్తి యుక్తి నెడసేయక చేయుట పుండరీక లో
చన పదసేవ సేయుట ప్రజాపరిపాలనశాలి యౌటయున్
జనకునకున్ సుతుండు పరిచర్య లొనర్చుట సువ్వె పుత్రకా! 398

* నాయనా! కన్నతండ్రి ఆజ్ఞను శిరసావహించి, తనకు తగినపని యని ఏ పని చెపితే దానిని దక్షతతో తత్క్షణం చేయడం శ్రీహరి పాదసేవ చేయడమే అవుతుంది. తండ్రి ఆజ్ఞానుసారం ప్రజలను పాలించడంకూడా తనయుడు తన తండ్రికి సేవ చేయటం క్రిందికే వస్తుంది.

వ. కావున 399

మ. వివరింపన్ హరి యజ్ఞమూర్తిఁ బరమున్ విష్ణున్ హృషీకేశుఁ గే
శవుఁ బద్మాక్షు గుఱించి జన్మమును శశ్వద్భక్తిఁ గావింప మా
ధవుఁ డాత్మం బరితోషమొందు; నతఁ డుద్యత్ప్రీతిఁ గైకొన్న లో
క వితానంబులు దుష్టి నొందు ననఘా; కావింపుమా యజ్ఞముల్. 400

* అందుకని పుణ్యమూర్తివైన స్వాయంభువా! యజ్ఞపురుషుడూ, పరమపురుషుడూ, హృషీకేశుడూ, కేశవుడూ, పద్మాక్షుడూ ఐన మహావిష్ణువును గూర్చి అపారమైన భక్తితో యజ్ఞాలు చెయ్యి. అలా చేస్తే ఆ కమలాకాంతుడు ఎంతగానో సంతోషిస్తాడు. ఆ దేవుడు సంతోషిస్తే లోకాలన్నీ సంతృప్తి చెందుతాయి. అందుకని నీవు యజ్ఞాలు ఆచరించు.

చ. అకుటిలభక్తిఁ గేశవసమర్పణబుద్ధిఁ గ్రతుక్రియల్ వొన
ర్పక విపరీతులై యుముకరాసులు దంచి ఫలంబు నందఁ గా
నక చెడురీతి నూరక ధనవ్యయ మౌటయ కాని మోక్ష దా
యక మగుచున్న తత్ఫలము నందరు విష్ణుపరాఙ్ముఖ క్రియుల్. 401

* పవిత్రమైన చిత్తశుద్ధితో పరమేశ్వరార్పణ బుద్ధితో యజ్ఞకార్యాలు చేయాలి. అలా కాక స్వార్థబుద్ధితో కాని పనులు చేసేవారు వట్టి వరిపొట్టును దంచి బియ్యం రాలేదని ఖేదమందేవారే అవుతారు. అందువల్ల ధననాశమేగాని లవలేశమూ లాభం ఉండదు. హరి పరాఙ్ముఖులు తాము ఆశించిన మోక్షఫలాన్ని అందుకోలేరు.

ఉ. కావున యజ్ఞముల్ హరి వికారవిదూరు గుఱించి చేయు నీ
భావము సూనృతవ్రత! శుభస్థితిఁ జెందెడు, నీకుమారులున్
నీవును నీధరాభరము నెమ్మి సహింపుము; సజ్జనావలిం
బ్రోవుము ధర్మమార్గమునఁ బుత్రక! దోషలతాలవిత్రకా! 402

* కుమారా! పాపములనే తీగలకు కొడవలివంటి వాడవై నీవు నిర్వికారుడైన సర్వేశ్వరుణ్ణిగూర్చి యజ్ఞం చేయాలని భావించు. నీ భావన సత్యస్వరూపమై శుభప్రదమౌతుంది. నీవూ, నీ కుమారులూ

సంతోషంతో భూభారం వహించండి, నిర్మలమైన ధర్మమార్గంలో సజ్జనులైన ప్రజలను పరిపాలించుతూ ఉండండి.

క. అనవుడు నతనికి నతఁ డి, ట్లనియెన్ భవదీయమైన యానతి యె ట్ల
ట్లొనరించెద నాకును నా, తనయులకు వసించి యుండఁ దగు నెల వెందున్. 403

* ఆ మాటలు విని స్వాయంభువుడు సరోజభవునితో ఇట్లా అన్నాడు. తండ్రీ! నీ ఆజ్ఞ శిరసావహించి నీవు చెప్పినట్లే చేస్తాను. అయితే నాకూ నా కుమారులకూ నివసించడానికి తగిన చోటు ఎక్కడా కానరావటం లేదు.

తే. అరయ లేదు విధాత! యీయఖిల జంతు, జాతములకెల్ల నాధారభూతమైన
ధరణి యిప్పుడు ఘనజలాంతర్నిమగ్న, మైన కతమునఁ జోటు లేదంటిఁ దండ్రి! 404

* జగద్విధాతవై న ఓ జనకా! ఈ సృష్టిలో అఖిల జంతుజాలానికి ఆధారభూతమైన భూమి ఇప్పుడు మహాసముద్ర మధ్యంలో మునిగిఉంది. అందువల్ల మాకు ఉండటానికి చోటు కన్పించటం లేదు.

క. కావున భూమ్యుద్ధరణము, గావించు నుపాయ మిపుడు గైకొని నాకున్
దేవా! నీ వెఱిఁగింపుము, నావుడుఁ బద్మజుఁడు దన మనంబునఁ దలఁచెన్. 405

* అందుకని ఓ దేవా! ఇప్పుడు భూమిని ఉద్ధరించే ఉపాయం ఆలోచించి నన్ను అనుగ్రహించు అని స్వాయంభువుడు పలుకగా బ్రహ్మదేవుడు తన మనస్సులో ఇట్లా భావించాడు.

మ. జలమధ్యంబున లీనమైన ధరణీచక్రంబునే నేర్పునన్
నిలుపన్ వచ్చును! బూర్వమందు జగముల్ నిర్మించు నాఁ డాది న
ప్పులఁ బుట్టించిన మీఁద నవ్వసుమతిం బుట్టించితి న్నట్టి య
ప్పులలోఁ గ్రుంకి రసాతలాంతరమునుం బొందెం గదా పృథ్వియున్. 406

* నీళ్లనడుమ మునిగిపోయి ఉన్న భూమండలాన్ని పైకి తీసుకొని రావటం ఎలాగా? లోకాలను సృష్టించేటప్పుడు మొదట నీళ్లను పుట్టించాను. తర్వాత భూమిని సృష్టించాను. ఆ భూమి ఇపుడు జలమధ్యంలో మునిగి పాతాళమధ్యం చేరింది. దానిని ఏ విధంగా యథాస్థితికి తీసుకొని వచ్చేది?

## -: శ్రీ యజ్ఞ వరాహావతార వర్ణనము :-

సీ. అఖిలజగత్కల్ప నాటోపమునకుఁ బాల్పడిన నాచేత నెబ్భంగి నిపుడు
దగిలి విశ్వంభరోద్ధరణంబు గావింపనగు నని సర్వభూతాంతరాత్ముఁ
బురుషోత్తముని నవపుండరీకాక్షు లక్ష్మీపతిఁ దన మనస్థితునిఁ జేసి
తలపోయుచున్నఁ బద్మజు నాసికా వివరమ్మున యజ్ఞవరాహమూర్తి

**తే. యర్థి నంగుష్ఠమాత్రదేహంబుతోడ, జననమంది వియత్తలస్థాయి యగుచు**
**క్షణములోపల భూరి గజ ప్రమాణ, మయ్యె నచ్చటి జనముల కద్భుతముగ. 407**

* "లోకాలన్నీ సృష్టించాలనే భావంతో పటాటోపంతో ఎంతో ప్రయాసపడుతున్నాను. కాని నేను ఈ భూమిని ఉద్ధరింపగలనా? ఈ మహాకార్యం నాకు సాధ్యమౌతుందా?" అని బ్రహ్మ తన మనస్సులో తలపోసి సర్వాంతర్యామీ పురుషోత్తముడూ పుండరీకలోచనుడూ అయిన లక్ష్మీవల్లభుణ్ణి భావించాడు. వెంటనే అతని ముక్కు నుండి యజ్ఞావరాహ మూర్తి బొటన వ్రేలంత పరిమాణంతో జన్మించి, ఆకాశానికి ఎగిరి , ఒక్క క్షణంలోపలనే అక్కడి జనులంతా ఆశ్చర్యచకితు లయ్యేటట్లుగా పెద్ద ఏనుగంత అయ్యాడు.

**సీ. అంతఁ బ్రజాసర్గమందు నియుక్తులై నట్టి మరీచ్యాదులైన మునులు**
**మనుకుమారకులు న మ్మనుసహితంబుగ యజ్ఞవరాహంబు నర్థిఁ జూచి**
**"యిట్టి యాశ్చర్య మెట్లెందేనిఁ గలదె నాసారంధ్ర నిర్గత స్తబ్ధరోమ**
**తోకంబు మనము విలోకింప నంగుష్ఠ మాత్రమై యీక్షణమాత్రలోన**

**తే. మహిమ దీపింప దంతి ప్రమాణమును మ, హోన్నతంబైన గండశైలోపమంబు**
**నయ్యె" ననుచు వితర్కించి; రబ్జభవుఁడు, హర్ష మిగురొత్త నిట్లని యపుడు దలఁచె. 408**

* అప్పుడు ప్రజల్ని సృష్టించడానికై నియమింపబడిన మరీచి మొదలైన మునులూ, మనువూ, మనువుకుమారులూ, యజ్ఞవరాహాన్ని చూచారు. "ఎంత ఆశ్చర్యం! నాసికారంధ్రం నుండి వెలువడ్డ వ్రేలెడు బాలవరాహం క్షణంలోనే పెద్ద ఏనుగంతయై మహాపర్వతం అంత అయింది. ఇలాంటి విచిత్రం ఎక్కడైనా ఉంటుందా?" అని తమలో తాము తర్కించుకొన్నారు. బ్రహ్మదేవుడు ఎంతో సంతోషంతో ఇట్లా అనుకున్నాడు.

**క. నా మనమునఁ గల దుఃఖ వి, రామముఁ గావించుకొఱకు రాజీవాక్షుం**
**డీ మేర "యజ్ఞపోత్రి, శ్రీమూర్తి" వహించె నిది విచిత్రము దలఁపన్. 409**

* నా మనస్సులో గల దుఃఖభారాన్ని దూరం చేయడానికై దేవాదిదేవుడైన రాజీవాక్షుడు ఈ విధంగా యజ్ఞవరాహరూపం ధరించాడు. ఇదెంత వింత అయిన విషయం.

**వ. అని వితర్కించు సమయంబున సూకరాకారుం డయిన భగవంతుండు. 410**

**తే. ప్రళయజీమూత సంఘాతభయదభూరి, గర్జనాటోప భిన్నదిగ్ఘన గభీర**
**రావ మడరింప నపుడు రాజీవభవుఁడు, మునులు నానందమును బొంది రనఘచరిత! 411**

* బ్రహ్మదేవుడు ఈ విధంగా భావిస్తూ ఉండగా యజ్ఞవరాహమూర్తి అయిన దేవతాచక్రవర్తి ప్రళయకాలంలోని మేఘ సమూహాలు భయంకరంగా గర్జించినట్లు విజృంభించి దిక్కులు పిక్కటిల్లే విధంగా గంభీరంగా గర్జించాడు. నాయనా విదురా! ఆ ఘన గంభీరధ్వని విని బ్రహ్మదేవుడూ, మునులూ అపారమైన ఆనందాన్ని పొందారు.

వ. అంత మాయామయవరాహ ఘుర్ఘురారావంబు బ్రహ్మాండకోటర పరిస్ఫోటనంబుఁ గావింప విని జనస్తపస్సత్య లోక నివాసులయిన మునులు ఋగ్యజుస్సామ మంత్రంబుల వినుతించిరి; యజ్ఞవరాహరూప ధరుం డయిన సర్వేశ్వరుండు సత్పురుష పాలన దయాపరుండు గావున దిగ్గజేంద్రలీలావిలోలుండై. 412

* అప్పుడు ఆ కుహనా వరాహమూర్తి కావించిన ఘుర్ఘురారావానికి బ్రహ్మాండభాండ మంతా దద్దరిల్లి పోయింది. ఆ శబ్దాన్ని విని జనలోకంలో, తపోలోకంలో, సత్యలోకంలో ఉండే మునులు; ఋగ్వేద, యజుర్వేద, సామవేదాలలోని మంత్రాలతో ఆ యజ్ఞవరాహమూర్తిని కీర్తించారు. యజ్ఞవరాహరూపాన్ని ధరించిన పరాత్పరుడు సజ్జనులను చక్కగా పరిపాలించే పరమదయాపరుడు కాబట్టి ఒక మహాదిగ్గజంలా క్రీడించాలని వేడుకపడ్డాడు.

సీ. కఠిన సటా చ్ఛటోత్కట జాత వాత నిర్ధూత జీమూత సంఘాత మగుచు
క్షురనిభ సునిశిత ఖుర పుటాహత చలత్ఫణిరాజ దిగ్గజ ప్రచయ మగుచుఁ
జండ దంష్ట్రోత్థ వైశ్వాన రార్చిస్స్రవద్రజత హేమాద్రి విస్రంభ మగుచు
ఘోర గంభీర ఘుర్ఘుర భూరి నిస్వనపంకిలాఖిల వార్ధి సంకులముగఁ

తే. బొరలుఁ గెరలు నటించు నంబరము దెరల, రొప్పు నుప్పర మెగయును గొప్పరించు
ముట్టె బిగియించు ముసముస మూరుకొనుచు, నడరు సంరక్షితక్షోణి యజ్ఞఘోణి. 413

* భూమిని రక్షించనున్న ఆ యజ్ఞవరాహం కర్కశమైన తన మెడమీద జూలు విదిల్చింది. దానివల్ల పుట్టిన వాయు వేగానికి మేఘమండలమంతా చెల్లాచెదరై పోయింది. చురకత్తివలె మిక్కిలి వాడియైన ఆ వరాహమూర్తి గిట్టల కొనల తాకిడులకు అడుగున ఉన్న ఆదిశేషుడూ, దిగ్గజాలూ తల్లడిల్లిపోయారు. ఆ యజ్ఞవరాహం కఠోరాలైన కరకు కోరల రాపిడివల్ల పుట్టిన అగ్ని జ్వాలలకు వెండికొండ కైలాసమూ, బంగారుకొండ మేరువూ, కరగి ద్రవించి పోతాయేమో అనిపించింది. ఆ ఆదివరాహం భయంకరమూ గంభీరమూ అయి తన ఘుర్ఘురారావంవల్ల సముద్రాలన్నీ అల్లకల్లోలం అయ్యేటట్లు చేస్తున్నది. ఈ విధంగా ఆ మహావరాహం పొరలుతూ, పొంగుతూ, సంతోషంతో గంతులువేస్తూ, రొప్పుతూ, ఆకాశానికి ఎగురుతూ, విజృంభిస్తూ, మూతి బిగిస్తూ, నేలను మూచూస్తూ- ఇలా అనేక విధాలుగా ఊగుతూ చెలరేగుతూ ఉంది.

వ. మఱియు నయ్యజ్ఞవరాహంబు. 414

సీ. తివిరి చతుర్దశ భువనంబులను దొంతు లొరగఁ గొమ్ములఁ జిమ్ము నొక్కమాటు
పుత్తడికొండ మూఁపురమను నొరగంట నొరకు రా రాపాడు నొక్కమాటు
ఖురముల సప్తసాగరముల రొంపిగా నుక్కించి మట్టాడు నొక్కమాటు
నాభిలవాల వాతాహతిచే మింటి నొరసి బ్రద్దలు సేయు నొక్కమాటు

**తే. కన్నుఁగొనలను విస్ఫులింగములు సెదర, నురుభయంకరగతిఁ దోఁచు నొక్కమాటు**
**పరమ యోగీంద్రజన సేవ్య భవ్య విభవ, యోగ్యమై కానఁగా నగు నొక్కమాటు. 415**

* మరిన్నీ ఆ యజ్ఞవరాహం ఒకసారి పదునాల్గు భువనాలూ దొంతులు దొంతులుగా దొర్లిపడిపోయేటట్లు కొమ్ములతో చిమ్ముతుంది. మరోసారి తన మూపురమనే ఒరగల్లుతో పసిడికాంతులు ప్రసరించేటట్లు మేరుపర్వతానికి రుద్దుకొంటుంది. ఇంకోసారి సప్తసముద్రాల జలాలు బురదలై పోయేటట్లు ఎగిరి గంతులువేస్తూ తిరుగుతుంది. వేరొక్క సారి మిక్కిలి భయంకరంగా తోకను త్రిప్పడంవల్ల పుట్టిన గాలితాకిడికి ఆకాశం దద్దరిల్లి బ్రద్దలయ్యేట్టు చేస్తుంది. ఒక్కొక్కమాటు కనుగొనల్లో అగ్నికణాలు కురిపిస్తూ మహాభయంకరంగా కన్పిస్తుంది. ఇంకొక్కమాటు మహాయోగులకు సేవ్యమైన భవ్యదివ్యవైభవంతో శోభిల్లుతుంది.

**వ. ఇట్లు విహరించుచుఁ బ్రాతర్మధ్యందినతృతీయ సవనరూపుం డయిన యజ్ఞవరాహమూర్తి యగు సర్వేశ్వరుండు మహాప్రళయంబునందు యోగ నిద్రావశుండై యుండు నవసరంబున నుదకస్థంబైన భూమి రసాతల గతంబైన దాని నుద్ధరించుటకు సముద్రోదరంబుఁ దఱియం జొచ్చు వేగంబు సైరింపఁజాలక సముద్రుం డూర్ములను భుజంబు లెత్తి విశీర్ణ హృదయుండై యార్తుని పగిది "యజ్ఞవరాహా! నన్ను రక్షింపు, రక్షింపు" మని యాక్రోశింప నిశిత కరాళక్షుర తీక్ష్ణంబులైన ఖురాగ్రంబుల జలంబులు విచ్ఛిన్నంబులు గావించి యపారం బయిన రసాతలంబుం బ్రవేశించి భూమిం బొడగను నవసరంబున. 416**

* ఇలా విహరిస్తూ ఉదయమూ మధ్యాహ్నమూ సాయంకాలమూ యజ్ఞస్వరూపుడై యజ్ఞవరాహరూపం ధరించిన ఆ మహావిష్ణువు మహాప్రళయ కాలంలో తాను నిద్రలో ఉన్నప్పుడు జలంలో నున్న భూమి రసాతలంలోకి చేరినందువల్ల దానిని ఉద్ధరించడానికై సముద్రంలో ప్రవేశించాడు. ఆ వేగానికి సముద్రుడు తట్టుకోలేక అల్లకల్లోలమైన మనస్సుతో అలలు అనే చేతులు పైకెత్తి "యజ్ఞవరాహా! నన్ను రక్షించు, రక్షించు" అని వేడుకొన్నాడు. ఆ వరాహమూర్తి తన వాడియై వంకరలు తిరిగిన కత్తులవంటి గిట్టల కొనలతో సముద్రజలాలను చెల్లాచెదరు చేస్తూ పాతాళం లోపలికి దూసుకొనిపోయి అక్కడ భూమిని చూచాడు.

**క. శరనిధిలోని మహోగ్రా, మరకంటకుఁ డెదురఁ గాంచె మఖమయగాత్రిన్**
**ఖురవిదళితకులగోత్రిన్, ధరణి కళత్రిన్ గవేష ధాత్రిన్ పోత్రిన్. 417**

* ఆ సమయంలో ఆ సముద్రంలో దాగివున్న ఒక భయంకర రాక్షసుడు ఎదురయ్యాడు. ఆ క్రూరదానవుడు కుల పర్వతాలను గిట్టలతో పగుల గొట్టేదీ, భూమిని ప్రియురాలుగా గ్రహించినదీ, భూమండలాన్ని వెదుకుతూ ఉన్నదీ యజ్ఞమయ మైన శరీరం కలదీ అయిన ఆ వరాహాన్ని తన యెదుట దర్శించాడు.

**వ. ఇట్లు పొడగని దైత్యుండు రోషభీషణాకారుండై. 418**

* అట్లా చూచీచూడగానే వాడికి ఆగ్రహం వచ్చింది. రోషంచే భీకరమైన ఆకారం కలవాడైనాడు.

**మ. గద సారించి యసహ్యవిక్రమ సమగ్రస్ఫూర్తితో వ్రేయఁగా**
**నది దప్పించి వరాహమూర్తి నిజదంష్ట్రాగ్రాహతిం ద్రుంచెఁ బెం**
**పొదవం గ్రోధమదాతిరేక బలశౌర్యోదార విస్తార సం**
**పదఁ బంచాస్యము సామజేంద్రుఁ జలమొప్పం ద్రుంచు చందంబునన్. 419**

*ఆ రాక్షసుడు అనివార్యమైన మహాశౌర్యంతో గిరగిరా గద త్రిప్పివేశాడు. వరాహమూర్తి అది తప్పించుకొన్నాడు. క్రోధంతో గర్వంతో అపారమైన పరాక్రమంతో విజృంభించిన మృగరాజు గజరాజును మట్టు పెట్టినట్లు ఆ వరాహమూర్తి తన వాడికోరల అంచులతో వాడిని విదలించి తుదముట్టించాడు.

**మ. దితిజాధీశుని నీ గతిం దునిమి యుద్వృత్తిం దదీయాంగ శో**
**ణిత పంకాంకిత గండభాగుఁ డగుచు న్విష్ణుండు దా నొప్పె వి**
**స్తృత సంధ్యాంబుద ధాతు చిత్రిత సముద్దీప్త క్షమాభృద్గతిన్**
**క్షితి దంష్ట్రాగ్రమునన్ ధరించి జలరాశిం బాసి యేతేరఁగన్. 420**

* ఆ రాక్షసుని ఈ విధంగా వధించి వాడి వేడి వేడి నెత్తురు ధారలతో నిండిన చెక్కిళ్లు గలవాడై వరాహమూర్తి సాయం సమయాన ఎఱ్ఱబడిన మేఘాలతో గైరికాది ధాతువులతో జాజువారిన మహాపర్వతం వలె ఒప్పుతూ భూమిని తన కోరచివర ధరించి సముద్రంలో నుండి బయటికి వచ్చాడు.

**తే. బాల శీతాంశు రేఖా విభాసమాన, ధవళ దంష్ట్రాగ్రమున నున్న ధరణి యొప్పె**
**హరికి నిత్యానపాయిని యైన లక్ష్మి, నెరయఁ బూసిన కస్తూరి నికర మనఁగ. 421**

* విదియనాటి చంద్రరేఖలా విరాజిల్లుతున్న తెల్లని కోరకొనపై నున్న ఆ భూమి, స్వామిని ఎప్పుడూ ఎడబాయని శ్రీమహాలక్ష్మి- ఆయనకు పూసిన కస్తూరీ పంకం లాగా కన్పించింది.

## -: శ్రీ యజ్ఞ వరాహమూర్తిని బ్రహ్మాదులు స్తుతియించుట :-

**వ. అట్టి యజ్ఞపోత్రిమూర్తిం జూచి కమలాసన ప్రముఖు లిట్లని స్తుతియించిరి. 422**

* అటువంటి యజ్ఞవరాహమూర్తిని చూచి బ్రహ్మాది దేవతలు ఇలా కీర్తించారు.

**సీ. "దేవ! జితం జితం తే పరమేశ్వర! జితయజ్ఞభావన! శ్రుతిశరీర!"**
**యనుచుఁ గారణసూకరాకారుఁ డగు నీకు నతిభక్తి మ్రొక్కెదమయ్య వరద!**
**భవదీయ రోమకూపములందు లీనంబు లై యుండు నంబుధు లట్టి యధ్వ**
**రాత్మకమై తనరారు నీ రూపంబు గానంగరాదు దుష్కర్మపరుల**

**తే. కట్టి నీకుఁ బ్రణామంబు లాచరింతు, మఖిలజగదేకకీర్తి! దయానువర్తి!**
**భవ్యచారిత్ర! పంకజపత్రనేత్ర!, చిరశుభాకార! యిందిరాచిత్తచోర! 423**

* దేవదేవా! జయం! జయం! పరమేశ్వరా! జయం! జయం! నీవ యజ్ఞాధిపతివి! వేదమూర్తివి! దుష్టశిక్షణ శిష్టరక్షణార్థం వరాహావతారం ధరించిన నీకు పరమభక్తితో ప్రణమిల్లుతున్నాము. నీవు వరదుడవు! ఈ మహాసముద్రా లన్నీ నీ రోమకూపాలలో ఇమిడి ఉన్నాయి. అటువంటి నీ యజ్ఞవరాహ స్వరూపాన్ని అజ్ఞులు దర్శించలేరు. విశాల విశ్వ విఖ్యాత కీర్తివీ, పరమ కరుణామూర్తివీ, పరమ పవిత్ర చరిత్రుడవూ, పద్మదళాయత నేత్రుడవూ, చిర మంగళాకారుడవూ శ్రీరమా చిత్తచోరుడవూ అయిన నీ కివే మా కైమోడ్పులు.

**వ. అని వెండియు నిట్లు స్తుతియించిరి. 424**

**సీ. త్వక్కున నఖిల వేదములు, రోమంబుల యందును బర్హిస్సు, లక్షులందు**
**నాజ్యంబు, పాదంబులందుఁ జాతుర్హోత్ర కలితంబులగు యజ్ఞకర్మములును,**
**స్రుక్కు తుండంబున, స్రువము నాసికను, నిడాపాత్ర ముదరకోటరమునందు,**
**శ్రవణాస్యబిలములఁ జమసప్రాశిత్రముల్, గళమున నిష్టిత్రికంబు, జిహ్వఁ**

**తే. దగుఁ బ్రవర్గ్యము, నగ్నిహోత్రమును నీదు, చర్వణంబును, సభ్యావసథ్య లుత్త**
**మాంగ మసువులు చయనము లగుఁ గిటీశ! యనుచు నుతియించి రత్తఱి యజ్ఞవిభుని. 425**

* అని ఇంకా ఈ విధంగా దేవతలు దేవాదిదేవుణ్ణి స్తుతించారు. “ఓ స్వామీ! నీ చర్మం నుండి సమస్త వేదాలూ జనించాయి. నీ రోమకూపాలనుండి అగ్నులు ఆవిర్భవించాయి. నీ కనులనుండి హోమద్రవ్యమైన నెయ్యీ, నీనాలుగు పాదాలనుండి నాలుగు హోత్రాలతో కూడిన యజ్ఞకర్మలూ, ముట్టె నుండి స్రుక్కూ, ముక్కునుండి స్రువమూ, ఉదరమునండి ఇడాపాత్రమూ, చెవులనుండీ ముఖం నుండీ చమసం, ప్రాశిత్రం అనే పాత్రలూ, కంఠం నుండి ఇష్టులు అనేమూడు యజ్ఞాలూ, నాలుక నుండి ప్రవర్గ్యం అనే యజ్ఞమూ పుట్టాయి. నీ చర్వణమే అగ్నిహోత్రం. సభ్యం అంటే హోమరహితాగ్నీ, అవసథ్యం అంటే ఔపాసనాగ్నీ నీ శిరస్సునుంచి జనించాయి. చయనాలు నీ ప్రాణ స్వరూపాలు. నీవు యజ్ఞాధినాథుడవు! యజ్ఞవరాహమూర్తివి!

**వ. వెండియు ముహుర్ముహు ర్భగవదావిర్భావంబు దీక్షణీయేష్టి యగు. నీదు దంష్ట్రలు ప్రాయణీయంబను దీక్షా నంతరేష్టియు, నుదయనీయం బను సమాప్తేష్టియు, యుష్మద్రేతంబు సోమంబును, ద్వదీయావస్థానంబు ప్రాత స్సవనాదులు, నీదు త్వఙ్మాంసాది సప్తధాతువు లగ్నిష్టోమోక్థ్యషోడశీ వాజపే యాతిరాత్రాప్తోర్యామంబు లను సంస్థా భేదంబులును ద్వాదశాహాదిరూపంబులైన బహు యాగ సంఘాతరూపంబులు నగు; సర్వ సత్త్రంబులు భవదీయశరీర సంధులు; ససోమాసోమంబులగు యజ్ఞక్రతు వులు నీవ; మఱియును నీవు యజనబంధనంబులచే నొప్పుచుందు వదియునుం గాక. 426**

* అంతేకాక భగవంతుడవైన నీవు మాటిమాటికి ఆవిర్భవించటం “దీక్షణీయ” మనే యజ్ఞము. “ప్రాయణీయ” మనే దీక్షానంతరం జరిపే ఇష్టీ, “ఉదయనీయము” అనే సమాప్తేష్టీ నీ కోరలు. సోమరసం

నీ రేతస్సు. నీ ఉనికియే ప్రాతఃకాలం, మధ్యాహ్నం, సాయం సమయం అనే మూడు యజ్ఞాంశాలు. నీ చర్మం మాంసం మొదలైన సప్తధాతువులూ, అగ్నిష్టోమం, ఉక్థ్యం, షోడశి, వాజపేయం, అతిరాత్రం, ఆప్తోర్యామం, ద్వాదశాహం మొదలైన యజ్ఞభేదాలు, సమస్త యజ్ఞాలు నీశరీరసంధులు సోమంతో కూడినవీ, కూడనివీ అయిన క్రతువు లన్నీ నీవే. నీవే యజ్ఞబంధాలతో అలరారుతూ ఉంటావు.

**క. హవరూపివి! హవనేతవు!, హవభోక్తవు! నిఖిలహవ ఫలాధారుఁడవున్!**
**హవరక్షకుఁడవు నగు నీ కవితథముగ నుతు లొనర్తుమయ్య ముకుందా!** **427**

* అంతేగాక నీవు యజ్ఞ స్వరూపుడవు. యజ్ఞకర్తవు. యజ్ఞభోక్తవు. యజ్ఞ ఫలప్రదాతవు. యజ్ఞ రక్షకుడవు. సమస్తము నీవే! ఓ ముకుందా! నీకు మా హృదయపూర్వకమైన అభివందనాలు.

**తే. సత్త్వగుణమున సద్భక్తి సంభవించు, భక్తియుతముగఁ జిత్తంబు భవ్య మగును**
**హృదయపద్మంబునం దోలి నెఱుఁగఁబడిన, యట్టి నీకు నమస్కారమయ్య వరద!** **428**

* సత్త్వగుణం వల్ల మంచి భక్తి ప్రాప్తిస్తుంది. భక్తితోకూడిన మనస్సు పవిత్రం అవుతుంది. అటువంటి భక్తియుక్తమైన పవిత్రహృదయ పద్మంతో భావించి సేవింపదగిన ఓ దేవదేవా! నీకు నమస్కారం.

**మ. అరవిందోదర! తావకీన సిత దంష్ట్రా గ్రావలగ్న క్షమా**
**ధర నద్యబ్ధి నదాటవీ యుత సమిద్ధక్ష్మాతలం బొప్పె భా**
**సుర కాసార జలావతీర్ణ మదవచ్ఛుండాలరాడ్దంత శే**
**ఖర సంసక్త సపత్ర పంకజము రేఖం బొల్పు దీపింపఁగన్.** **429**

పద్మనాభా! పర్వతాలతో, నదీనదాలతో, సముద్రాలతో, అరణ్యాలతో నిండిన ఈ భూమండలం నీ తెల్లని కోర చివర ప్రకాశిస్తున్నది. ఆ భూదేవి మనోహరమైన సరోవర జలాలలో దిగిన మదగజేంద్రుని దంతాగ్రాన తగుల్కొని ఉన్న ఆకుతోకూడిన తామర పువ్వులాగా చూడముచ్చటగా ఉంది.

**మ. మఱియును.** **430**

**మ. చతురామ్నాయ వపుర్విశేష ధర! చంచత్సూకరాకార! నీ**
**సితదంష్ట్రాగ్ర విలగ్నమైన ధర రాజిల్లెం గులాద్రీంద్ర రా**
**జిత శృంగోపరి లగ్నమేఘము గతిం జెల్వారి, విద్వజ్జనాం**
**చిత హృత్పల్వలలోల! భూరమణ! లక్ష్మీనాథ! దేవోత్తమా!** **431**

* అంతేకాదు, చతుర్వేద స్వరూపమైన శరీరాన్ని ధరించి ఉన్న ఓ యజ్ఞవరాహస్వామీ! నీవు జ్ఞానవంతుల అంతరంగా లనే నీటి మడుగులలో క్రీడిస్తుంటావు. భూదేవికీ శ్రీదేవికీ మనోహరుడవు. దేవతలందరికీ అగ్రేసరుడవు. స్వామీ! నీ తెల్లని దంష్ట్రాంచలాన తగులుకొన్న భూమి కొండల చక్రవర్తి వెండి శిఖరాగ్రాన విరాజిల్లుతుండే నీలమేఘంలా అందాలూ చిందుతూ ఉంది.

సీ. సమధిక స్థావరజంగమాత్మకమైవ వసుమతీచక్ర మవక్రలీల
నుద్ధరింపుము; కరుణోపేత చిత్తుండ వగుచు నస్మన్మాత యయ్యె ధరణి;
మాత యౌ టెట్లని మదిఁ దలంచెదవేనిఁ జర్చింప మాకు విశ్వమున కీవు
జనకుండ వగుట యుష్మత్పత్ని భూదేవి యగుట మాకును దల్లి యయ్యె; నిపుడు

తే. ధరకు నీతోడఁగూడ వందన మొనర్తు, మరణియందును యాజ్ఞికుఁ డగ్ని నిలుపు
కరణి మీ తేజ మీ ధరాకాంతయందు, నిలుప ధరణి పవిత్రయై నెగడుఁ గాన. 432

* కరుణారసం నిండిన హృదయం కలవాడవై సకల చరాచర సమూహంతో నిండిన ఈ భూమండలాన్ని సముద్రజలాల్లో మునిగి పోకుండా ఉద్ధరించు. ఈభూమి మాకు తల్లి. ఎలాగంటావేమో! మాకు ఈ లోకానికీ నీవు తండ్రివి. నీవు భరించుటచే భూదేవి నీ భార్య అయింది. అందుకని ఆమె మాకు తల్లియే అవుతుంది. నీతోపాటు ఈ భూమికీ నమస్కారం చేస్తాము. యజ్ఞకర్త అరణియందు అగ్నిని నిల్పిన విధంగా నీవు నీ తేజస్సును నీ భూమియందు నిల్పడంవల్ల ఈ ధరిత్రి పవిత్రమై ఒప్పుతూ ఉంది.

చ. తలఁప రసాతలాంతర గతక్షితిఁ గ్రమ్మఱ నిల్పినట్టి నీ
కలితన మెన్న విస్మయము గాదు; సమస్తజగత్తు లోలిమైఁ
గలుగఁగ జేయు టద్భుతము గాక, మహోన్నతి నీ వొనర్చు పెం
పలరిన కార్యముల్ నడప నన్యులకుం దరమే రమేశ్వరా? 433

* లక్ష్మీవల్లభా! వాస్తవంగా ఆలోచిస్తే సమస్తలోకాలను క్రమానుసారంగా సృష్టించడమన్నది అత్యద్భుతమైన విషయం. అటువంటి నీ శక్తి ముందు పాతాళంలో ఉన్న భూమిని యథాస్థితికి తెచ్చి నిల్పిన ఈ నీ సామర్థ్యం ఏమంత ఆశ్చర్యాన్ని కలిగించేదిగా లేదు. ఇటువంటి మహాకార్యాలు నిర్వహించటానికి నీవే సమర్థుడవు. ఇతరులకు ఈ కృత్యాలు అసాధ్యాలు.

చ. సకల జగన్నియామక విచక్షణలీలఁ దనర్చునట్టి నం
దకధర! తావక స్ఫురదుదారత మంత్రసమర్థు డైన యా
జ్ఞికుఁ డరణిన్ హుతాశనుని నిల్పిన కైవడి మన్నివాస మౌ
టకుఁ దలపోసి యీ క్షితి దృఢంబుగ నిల్పితివయ్య యీశ్వరా! 434

* "నందకము" అనే ఖడ్గాన్ని ధరించిన ముకుందా! నేర్పుతో సకలలోకాలను ఒక నియమబద్ధంగా ఏర్పాటుచేసిన నేర్పరివి. మంత్రసిద్ధుడైన యాజ్ఞికుడు అరణియందు అగ్నిని నిల్పినట్లు నీవు దయపూని మేము నిలబడి మనుగడ సాగించటానికి ఈ భూమిని ఈ విధంగా సుస్థిరంగా నిలబెట్టావు! ఎంతటి ఔదార్యం ప్రకటించావు స్వామీ!

చ. సలలిత వేదశాస్త్రమయ సౌకరమూర్తి దనర్చుచున్ రసా
తలముననుండి వెల్వడు నుదారత మేను విదుర్పఁ దత్సటో
చ్చలితములైన బిందువుల సాధు తపో జన సత్యలోక వా
సులమగు మేము దోఁగి పరిశుద్ధి వహించితిమయ్య మాధవా! 435

* ఓ మాధవా! ఆహ్లాదంతో వేదశాస్త్ర స్వరూపమైన ఆదివరాహమూర్తివైన నీవు పాతాళం నుండి బయటికి వస్తూ సముద్రజలాలతో తడిసిన నీశరీరాన్ని విదిలించావు. ఆ సమయంలో నీమెడమీది జూలు నుండి నీటి చుక్కలు నలుదెసలా ఎగిరిపడ్డాయి. పరమ పవిత్రాలయిన ఆ జలబిందువులలో తడిసి తపోలోకంలో, జనలోకంలో, సత్యలోకంలో నివసించే మేమంతా ఎంతగానో పరిశుద్ధులం అయినాము స్వామీ!

ఉ. విశ్వభవస్థితి ప్రళయవేళలయందు వికారసత్త్వమున్
విశ్వము నీవ యీ నిఖిలవిశ్వము లోలి సృజింతు విందిరా
ధీశ్వర! యీశ! కేశవ! త్రయీమయ! దివ్యశరీర! దేవ! నీ
శాశ్వతలీల లిట్టి వని సన్నుతి సేయఁగ మాకు శక్యమే? 436

* ఓ లక్ష్మీవల్లభా! ఈ ప్రపంచం సృష్టించేదీ, రక్షించేదీ, లయం చేసేదీ నీవే! సమస్తమూ నీవై ఈ సమస్త లోకాలనూ మళ్లీ మళ్లీ సృష్టిస్తున్నావు. ఈశ్వరా! కేశవా! వేదమయా! దివ్యస్వరూపా! దేవ దేవా! అంతులేని నీ వింత లీలలు "ఇంతటివి ఇటువంటివి'' అని వర్ణించడానికి మాకు చేతనవుతుందా?

సీ. పంకజోదర నీ వపార కర్ముండవు భవదీయ కర్మాబ్ధిపార మేద
నెఱిఁగెద నని మది నిచ్చగించిన వాఁడు పరికింపఁగా మతిభ్రష్టు గాక
విజ్ఞానియే? చూడ విశ్వంబు నీ యోగ మాయాపయోనిధి మగ్న మౌటఁ
దెలిసియుఁ దమబుద్ధిఁ దెలియని మూఢుల నే మన నఖిలలోకేశ్వరేశ!

తే. దాసజనకోటి కతి సౌఖ్యదాయకములు, వితతకరుణా సుధా తరంగితములైన
నీకటాక్షేక్షణములచే నెఱయ మమ్ముఁ, జూచి సుఖులను జేయవే సుభగ చరిత! 437

* దామోదరా! లోకకల్యాణార్థం నీవు చేసే కార్యాలు అనంతాలు. "మహాసముద్రంవంటి వాటి అంతు తెలుసుకుంటాను." అని నిశ్చయించుకునే వాడు మతి భ్రష్టుడూ, అజ్ఞానీ అవుతాడే గాని విజ్ఞాని కాడు. ఈ సమస్త ప్రపంచం నీ యోగమాయా సముద్రంలో విలీనం అయివున్నదన్న సంగతి తెలిసికూడా నీప్రభావాన్ని తెలియని ఆ మందబుద్ధులను ఏమనాలి? అఖిలలోకాధీశ్వరా! నీ చరణదాసులకు సర్వదా సమధిక సౌఖ్యాన్ని కలిగించేవీ, అపారమైన కరుణ అనే అమృతతరంగాలు పొంగి పొరలేవీ అయిన నీ కడగంటి చూపులతో మమ్ములను చక్కగా చూచి సుచరిత్రా! మాకు సుఖసంతోషాలను అనుగ్రహించు.

క. అని బ్రహ్మవాదు లగు స, న్ముని వర్యులు భక్తియోగమున వినమితులై
మనమున మోదము ముప్పిరి, గొనఁ బొగడిరి ఖుర విదళిత గోత్రిం బోత్రిన్. 438

* అని బ్రహ్మజ్ఞాన సంపన్నులైన మునివరేణ్యులు భక్తిప్రవత్తులతో వినయ వినమ్రులై తమ అంతరంగాలలో ఆనందతరంగాలు పొంగులెత్తగా గిట్టలచే కొండలను సైతం పగులగొట్టినట్టి జగజెట్టియైన వరాహస్వామిని ప్రస్తుతించారు.

ఉ. అంతట లీలఁబోలె జగదాత్ముఁడు యజ్ఞవరాహమూర్తి య
త్యంత గభీర భీషణ మహార్ణవ తోయసమూహమున్ ఖురా
క్రాంతముఁ జేసి క్రమ్మఱ ధరాతల మంబులమీఁద నిల్పి వి
శ్రాంతి వహింపఁజేసి గుణశాలి తిరోహితుఁడయ్యె నయ్యెడన్. 439

* అనంతరం పరమాత్మ స్వరూపుడైన ఆ యజ్ఞవరాహమూర్తి మహాభయంకరమూ, అత్యంత గంభీరమూ ఐన ఆ సముద్ర జలాన్నంతా తన గిట్టలతో ఆక్రమించి, మళ్లీ భూమిని ఎప్పటిలాగా సుస్థిరంగా, సుఖంగా నీళ్లమీద నిల్పాడు. అనంతరం అనంతగుణ సంపన్నుడైన ఆ స్వామి అదృశ్యమయ్యాడు.

ఉ. మంగళమైన యీ కథ సమంచితభక్తిఁ బఠింప విన్న వా
రిం గరుణార్ద్ర దృష్టిఁ గని శ్రీహరి సాలఁ బ్రసన్నుఁ డౌను, స
త్సంగతుఁడైన విష్ణుఁడు ప్రసన్నుఁడు దా నగునేని వారికిన్
మంగళముల్ లభించు; ననుమానములే దదిగాక వెండియున్. 440

* ఈ కథ శుభప్రదమైనది. ఈ కథను ఎవ్వరు భక్తితో చదువుతారో, ఎవ్వరు వింటారో వారిని కమలాక్షుడు కటాక్షిస్తాడు. అటువంటి వారి విషయంలో శ్రీహరి ప్రసన్ను డౌతాడు. ఆ విధంగా శ్రీహరి ప్రసన్నుడైన వారికి సమస్త సన్మంగళాలూ సంప్రాప్తిస్తాయి. ఇందుకు సందేహం లేదు.

చ. హరి నిజదాసకోటికి గుహాశయుఁడై రమియించు; నట్టి స
త్పురుషుల కిష్టవస్తు పరిపూర్ణ మనోరథసిద్ధి గల్గు; సు
స్థిర మగుచున్న మోక్ష మరచేతిదియై చెలువారు నన్న న
స్థిరతరతుచ్ఛ సౌఖ్యములు సేకుఱుటల్ మఱి చెప్ప నేటికిన్. 441

* తన చరణదాసుల హృదయాంతరాలలో భగవంతుడు విలాసంగా విహరిస్తూ ఉంటాడు. అటువంటి సజ్జనులు కోరిన వస్తువులన్నీ సమృద్ధిగా సిద్ధిస్తాయి. అక్షయమైన మోక్షం అరచేతిలోనిదై అలరారుతుంది. అటువంటప్పుడు అస్థిరమైన సామాన్య వస్తువుల విషయం వేరే చెప్పాలా!

ఉ. కాన సరోజలోచను జగత్ స్తవనీయ కథాసుధారసం
బానిన యట్టి జిహ్వ యసదన్య కథాలవణోదకంబులం

బానము సేయఁ జూచెనె; సుపర్వమహీజ మరందపాన లా
భానుభవంబు నొందు మధుపప్రభు వేఁగునె వేఁపచెట్లకున్? 442

* అందువల్ల సమస్త లోకాలూ సంస్తవనీయాలైన విష్ణుదేవుని కథాసుధారసాలు కమ్మగా త్రాగిన నాలుక, హితంకాని ఇతర కథలు అనే ఉప్పునీళ్ళను త్రాగడానికి ఇష్టపడుతుందా? నందనవనంలోని మందార మకరందాన్ని త్రాగటం అలవాటైన మేటి తుమ్మెద వేపచెట్లవైపు వెళ్ళాలనుకుంటుందా?

క. అని మైత్రేయ మునీంద్రుం, డనఘుఁడు విదురునకుఁ జెప్పినట్టి తెఱంగ
ర్జున పౌత్త్రునకున్ వ్యాసుని, తనయుఁడు వినిపించి మఱియుఁ దగ నిట్లనియెన్. 443

* అని మైత్రేయ మహర్షి వికార విదూరుడైన విదురునకు వినిపించిన ఈ కథా విధానాన్ని వ్యాసమునీంద్రులవారి పుత్రుడైన శుకమహర్షి అర్జునుని పౌత్రుడైన పరీక్షిన్నరేంద్రునికి వినిపించి ఇంకా ఇలా అన్నాడు.

క. అని చెప్పిన మైత్రేయునిఁ, గనుఁగొని విదురుండు పల్కు ఘనతరమగు నా
దనుజకులాంతకు చరితము, విని తనియదు నా మనంబు విమలచరిత్రా! 444

* ఈ విధంగా మైత్రేయుడు చెప్పగా విదురుడు విని ఇలా అన్నాడు. "సచ్చరిత్రా! పరమ పవిత్ర మైన విష్ణుదేవుని చరిత్రం ఎంతవిన్నా నా మనస్సుకు తనివితీరకుండా ఉంది.

చ. సవనవరాహమూర్తి కథ సర్వము నీ దయ వింటి; వెండియున్
వివరముగా వినం బలుకవే గుణసాంద్ర! మునీంద్ర చంద్ర! మా
ధవ గుణకీర్తనామృత వితానముఁ గర్ణపుటాంజలిన్ వెసం
జవిఁగొన కేల మాను జనసంతతికిన్ భవతాపవేదనల్. 445

* మునీంద్రా! సుగుణసాంద్రా! యజ్ఞవరాహమూర్తి కథ నీ దయవల్ల విన్నాను. కానీ, ఇంకా విశదంగా వివరించి చెప్పు. మానవులు మధురాతి మధురమైన మాధవకథా సుధారసాన్ని చెవులనే దోసిళ్లతో ఆస్వాదించకపోతే వారి సంసారతాపాలు ఎలా తీరుతాయి?

వ. కావున 446

సీ. శ్రీహరి యజ్ఞవరాహ రూపముఁ దాల్చి మించి హిరణ్యాక్షుఁ ద్రుంచె ననుచు
నప్పుడు మునినాథ! చెప్పితి నా తోడ నవ్వరాహంబు దంష్ట్రాగ్రమునను
ధరణి నెబ్భంగిని ధరియించె? హరికి హిరణ్యాక్షుతోడ వైరమున కేమి
కారణ? మసుర నే గతి సంహరించె దా? నింతయు నెఱిఁగింపు మిద్ధచరిత!

తే. యనిన మైత్రేయముని విదురునకు ననియె, హరికథాకర్ణనమునఁ బెంపారు నీకు
జన్మఫల సిద్ధి యగుటకు సందియంబు, వలదు; హరిమాయ విధికైన వశమె తెలియ? 447

* అందుకని అడుగుతున్నాను. శ్రీమహావిష్ణువు యజ్ఞవరాహరూపం ధరించి విజృంభించి హిరణ్యాక్షుడనే రాక్షసుణ్ణి సంహరించాడని చెప్పావు కదా! ఓ మునివరా! ఆ వరాహం తన కోరచివర ఈ ధరణీ మండలాన్ని ఎలా ధరించింది? హిరణ్యాక్షునకూ విష్ణువునకూ విరోధం రావటానికి కారణం ఏమిటి? ఆ రాక్షసుణ్ణి శ్రీహరి ఏ విధంగా వధించాడు? ఓ పవిత్ర చరిత్రా! సవిస్తరంగా ఇదంతా నాకు చెప్పు- అనగా మైత్రేయుడు విదురునితో ఇట్లా అన్నాడు. 'నాయనా! ఆ శ్రీహరి కథలు ఆకర్ణించాలి అనే ఆసక్తి గల నీకు జన్మసాఫల్యం సిద్ధించింది. ఇందుకు సందేహం లేదు. ఆ శ్రీమన్నారాయణుని మాయ తెలిసికోవడానికి బ్రహ్మకైనా తరంకాదు.

క. అనఘాత్మ! నన్ను నీ వడి, గిన యీ కథ ధ్రువుఁడు విష్ణుకీర్తన పరతం
దనరిన నారదు నడుగ న, తని కతఁ డెఱిఁగింప హరికథాశ్రవణమునన్. 448

* పుణ్యాత్ముడా! నీవు అడిగిన ఈ కథను పూర్వం ధ్రువుడు విష్ణుభక్తి విశారదుడైన నారదుణ్ణి అడిగి తెలుసుకొన్నాడు. హరికథా శ్రవణం వల్ల అత డెంతో మహిమాన్వితుడైనాడు.

తే. దండధరుఁ బెల్చ డాకాలఁ దన్ని ధ్రువుఁడు, నిందు నందును వాసికి నెక్కె; నట్టి
విష్ణుసంకీర్తనం బరవిందభవుఁడు, దివిజులకుఁ జెప్పె నది నీకుఁ దేటపఱుతు. 449

వ. ఆకర్ణింపుము. 450

* అటువంటి ప్రభావాన్ని సంపాదించిన ధ్రువుడు యమధర్మ రాజును ఎడమకాలితో తన్ని ఈ లోకంలోనూ పరలోకంలోనూ కూడా ప్రసిద్ధికెక్కి ఉత్తమపదాన్ని అందుకున్నాడు.

అటువంటి వాసుదేవుని లీలావిశేషాలను బ్రహ్మదేవుడు దేవతలకు చెప్పాడు. అదంతా నీకు విశదంగా చెబుతాను; విను.

## -: మైత్రేయ మహాముని విదురునకు హిరణ్యాక్ష హిరణ్య కశిపుల వృత్తాంతం బెఱింగించుట :-

సీ. బలిసి దక్షప్రజాపతి తనూభవ దితి సంతానరుచి మానసమునఁ బొడమ
నొకనాఁడు పుష్పసాయక శర నిర్భిన్న భావయై విరహతాపమున వచ్చి
పతి సమాగమవాంఛ ప్రభవింప నిజనాథు సన్నిధి నిలిచి యస్ఖలిత నియతి
నగ్నిజిహ్వుండును యజురధీశుండును నగు విష్ణుఁ దన చిత్తమందు నిలిపి

తే. తగఁ బయస్సున నగ్నిహోత్రంబు సేసి, కమలహితుఁ డస్తశైల సంగతుఁడు గాఁగ
హోమశాలాంగణమునఁ గూర్చున్న విభునిఁ, గశ్యపునిఁ గాంచి వినయవాక్యముల ననియె. 451

* దక్షప్రజాపతి పుత్రిక దితి. ఆమె మనస్సులో సంతానకాంక్ష పెల్లుబికింది. మన్మథుని పుష్పబాణాలు ఆమె హృదయాన్ని అల్లకల్లోలం చేశాయి. విరహవేదన భరించలేక భోగవాంఛతో తన పతి అయిన

కశ్యపప్రజాపతి దగ్గరకు వెళ్ళింది. ఆయన అప్పుడే నిశ్చల నియమంతో వేదవేద్యుడూ జ్యోతిర్మయుడూ అయిన మహావిష్ణువును ఉద్దేశించి యథావిధిగా అగ్నికార్యం నెరవేర్చి సూర్యాస్తమయ సమయంలో హోమశాల ముందర కూర్చొని ఉన్నాడు. ఆయనతో ఆమె వినయంగా ఇట్లా అంది.

చ. గజవిభుఁ డుద్ధతి న్ననఁటికంబములన్ విదళించు లీలఁ జి
త్తజుఁడు ప్రసూనసాయక వితానముచేత మదీయచిత్తమున్
గజిబిజిసేసి పెన్వగలఁ గాఱియ వెట్టఁగ నాథ! నీ పదాం
బుజములఁ గాన వచ్చితిఁ, బ్రభుత్వ మెలర్పఁగ నన్నుఁ గావవే! 452

* ప్రాణేశా! గజరాజు అరటి చెట్టును గజిబిజి చేసినట్లు, రతిరాజు తన పదునైన పూలబాణాలతో నా హృదయాన్ని కదలించి విదలించి వేస్తున్నాడు. ఆ బాధ భరింపలేక నీ పాదపద్మాల దాపుకు పరుగెత్తుకొని వచ్చాను. నీ ఆధిపత్యం పటుత్వం ప్రదర్శించి నన్ను కాపాడు.

వ. అదియునుం గాక నాతోడి సవతు లెల్లను భవత్కృపా విశేషంబున గర్భాధానంబులు వడసి నిర్భరానందంబున నుండం జూచి శోకవ్యాకులితచిత్త నై యున్న నన్ను రక్షించుట పరమధర్మంబు; నీవు విద్వాంసుండవు; నీ యెఱుంగని యర్థంబు గలదే? నీ వంటి మహానుభావు లయిన సత్పురుషు లార్తులైన వారి కోర్కులు వ్యర్థంబులు గాకుండఁ దీర్చుట ధర్మం బని వెండియు నిట్లనియె. 453

* అంతేకాక, నాతోడి సవతులు అందరు నీ కృపవల్ల గర్భవతులై ఎంతో సంతోషంతో ఉన్నారు. నేనే శోకంతో వ్యాకులమైన మనస్సుతో అలమటిస్తున్నాను. ఆర్తురాలనైన నన్ను రక్షించటం నీకు పరమధర్మము. నీవు విద్వాంసుడవు! నీకు తెలియని విషయం ఏముంది? నీ వంటి సత్పురుషులైన మహానుభావులకు నా వంటి ఆర్తులను రక్షించి వారి కోరికలు సఫలం చేయటంకంటే ధర్మం మరేముంది అని మళ్లీ ఇట్లా అన్నది.

క. పతి సమ్మానము వడసిన, సతులకు నభిమత పదార్థ సంసిద్ధియు నూ
ర్జిత యశముఁ గలిగి లోక, స్తుతమై చెలువారుచుండుఁ జువ్వె మహాత్మా! 454

* మహానుభావా! పతి గౌరవం సంపాదించిన సతులకు కోరిన కోరికలు తీరుతాయి. గొప్పకీర్తి కలుగుతుంది. అటువంటివారు లోకుల పొగడ్తలను అందుకుంటారు.

క. తన ధర్మపత్ని వలనను, మునుకొని తాఁ బుత్త్ర రూపమున నుదయించున్
విను దీపమందు ముట్టిం, చిన దీపము రెండు గావె? శిఖి యొక టయ్యున్. 455

* మహాత్మా! అగ్నిశిఖ ఒకటే అయినప్పటికీ, దీపముతో ముట్టించిన దీపము రెండు దీపములు అయినట్లు, పురుషుడు తన భార్యయందు పుత్రరూపంలో జన్మిస్తాడు.

క. కావున నీ యర్థము "యా, త్మా వై పుత్త్ర" యని వేదతతులం దోలిన్
వావిరిఁ బలుకఁగ వినవే, ధీవర! నను గావు మధికదీనం గరుణన్. 456

* ఈ విషయాన్నే "ఆత్మస్వరూపుడైన తానే కుమారుడై జన్మిస్తాడు" అని వేదాలు చెబుతున్నాయి. ఇది నీకు తెలియని విషయం కాదు. మతిమంతుడా! అతి దీనచిత్తనైన నన్ను కరుణతో కాపాడు.

**చ. వరకరుణామతిన్ దుహితృవత్సలతం దనరారు నట్టి మ**
**ద్గురుఁ డొకనాఁడు మమ్ముఁ దన కూఁతుల నందఱఁ బిల్చి మీ మనో**
**హరు నెఱిఁగింపుఁ డిత్తుఁ గమలాననలార! య టన్న నందులోఁ**
**బురుషవరేణ్య! యేము పదుమువ్వుర మర్మిలి నిన్ వరింపమే! 457**

* ఓ పురుషపుంగవా! దయాదాక్షిణ్యవంతుడైన మా తండ్రి దక్షప్రజాపతికి ఆడపిల్లలంటే ఎంతో అభిమానం. ఆయన ఒకనాడు కూతుళ్ల నందరిని పిల్చి "అమ్మలారా! మీ మనస్సుకు ఇష్టమైన భర్తలను కోరుకొనండి. ఇచ్చి పెండ్లి చేస్తాను" అని అడిగాడు. అప్పుడు మేము పదమూడుమందిమీ నీ పేరు చెప్పి నిన్నే వరించాము కదా!

**క. దితి యీ గతిఁ గామవిమో, హితమతి బహువచనముల హృదీశునిఁ బలుకన్**
**ధృతిఁ గృపణఁ బతివ్రత నిజ, సతిఁ గని కశ్యపుఁడు పలికె సల్లాపమునన్. 458**

* అంటూ, కామసమ్మోహితమతి అయిన దితి దీనంగా పలుమారులు ప్రార్థించింది. అప్పుడు ధృతిమంతుడైన కశ్యపుడు ఆర్తురాలు, పతివ్రత, ఆత్మసతి అయిన దితిని అనునయిస్తూ ఈ విధంగా అన్నాడు.

**వ. నీవు సెప్పినయట్ల పురుషులకు నంగనల వలన ధర్మార్థ కామంబులు సిద్ధించుఁ; గర్ణధారుండు నావచేతం బయోధిఁ గడచు చందంబున గృహమేధి సర్వాశ్రమవాసుల నరసి రక్షించుచు నిజాశ్రమంబున వ్యసనార్ణవంబుఁ దరియించు; భార్య పురుషునందు నర్ధంబు; భార్యయందు సకల గృహకార్య భారంబునుం జేర్చి పురుషుండు నిశ్చింతుండై సుఖియించుచుండు; మఱియు నితరాశ్రమ దుర్జయంబులైన యింద్రియశత్రు వర్గంబుల భార్యాసమేతుండైన గృహస్థుండు దుర్గాధిపతియైన రాజు శత్రు సంఘంబుల జయించు చందంబున లీలామాత్రంబునం జయించు; నిట్టి కళత్రంబునకుం బ్రత్యుపకారంబు సేయ సకల గుణాభిరాములగు సత్పురుషులు నూఱేండ్లకును జన్మాంతరం బులకునైన సమర్థులు గారనిన మముబోఁటివారలు సేయనోపుదురే? అయిన నీ మనంబునం గల దుఃఖంబు దక్కు మని యిట్లనియె. 459**

* నీవు చెప్పినట్లే పురుషులకు స్త్రీలవల్లనే ధర్మార్థకామ మోక్షాలు సిద్ధిస్తాయి. నావికుడు తన నావతో సముద్రాన్ని తాను దాటడమే కాకుండా ఇతర ప్రయాణికులనుకూడా దాటించినట్లు గృహస్థుడు తన గృహస్థాశ్రమం ద్వారా తాను తరిస్తూ ఇతర ఆశ్రమవాసులను కూడ తరింపజేస్తూ ఉంటాడు. అటువంటి గృహస్థునిలో భార్య అర్థభాగం; అటువంటి అర్ధాంగియందు తన గృహకృత్యాల భారమంతా ఉంచి పురుషుడు నిర్విచారంగా తక్కిన సుఖం అనుభవిస్తాడు.

ఇంతేకాక ఆశ్రమవాసులు జయింపలేని ఇంద్రియా లనే శత్రువులను సతీసమేతుడైన గృహస్థుడు దుర్గాధిపతియైన భూపతి శత్రుసమూహాలను జయించినట్లు అవలీలగా జయిస్తాడు. అటువంటి భార్యకు

ప్రత్యుపకారం చేసి ఋణం తీర్చుకోడానికి సమస్త సుగుణవంతులైన సత్పురుషులకు సైతం నూరేండ్లకుగానీ, జన్మజన్మాలకుగానీ సాధ్యంకాదు. అటువంటప్పుడు మావంటివాళ్ళకూ ఎట్లా సాధ్యమవుతుంది? ఇక నీ మనస్సు లోని దుఃఖాన్ని విడిచిపెట్టు అని కశ్యపుడు ఇంకా ఇట్లా అన్నాడు.

**తే. తరళలోచన! నీవు సంతానవాంఛఁ, జేసి వచ్చితి వౌఁ గులశీలవర్త**
**నములు గల భార్య మనమున నమరు కోర్కిఁ, దవిలి తీర్చుట పతికిఁ గర్తవ్య మరయ. 460**

కాంతామణీ! నీవు సంతానవాంఛతో నా చెంతకు వచ్చావు. గుణవంతురాలూ, శీలవంతురాలూ అయిన ఇల్లాలి మనస్సులోని కోర్కె తీర్చడం భర్తకు అవశ్యకర్తవ్యం.

**మ. తరుణీ! యొక్కముహూర్తముండు; మిది సంధ్యాకాల మిక్కాలమం**
**దరయన్ భూతగణావృతుం డగుచుఁ గామారాతి లీలన్ వృషే**
**శ్వరయానంబున సంచరించుట; నభావ్యంబయ్యె; నీ యుగ్ర వే**
**ళ రమింపంగ నిషిద్ధకర్మ మగు; నేలా ధర్మమున్ వీడఁగన్. 461**

* తరుణీమణీ! ముహూర్తకాలం ఆగు. ఇది సంధ్యాసమయం. ఇప్పుడు కామునికి శత్రువైన త్రినేత్రుడు వృషభేంద్ర వాహనంపై భూతగణాలతో కూడి విహరిస్తూ ఉంటాడు. కాబట్టి ఈ సమయం మంచిది కాదు. ఈ ఉగ్రవేళలో కలయిక నిషేధింపబడింది. ఎందుకు ధర్మాన్ని అతిక్రమించాలి? ఒక్క ముహూర్తకాలం ఆగు.

**మ. అరవిందానన! వీఁడె నీ మఱఁది; లీలాటోప రుద్రక్షమా**
**చర ఝంఝానిల ధూతపాంసు పటలచ్ఛన్నుండు, ధూమ్రైక దు**
**ర్భర విద్యోతిత కీర్ణ భీషణ జటా బద్ధుండు, భస్మావ లి**
**ప్త రుచిస్ఫారసువర్ణ వర్ణుఁ డగుచున్ భాసిల్లు నత్యుగ్రుఁడై. 462**

* కమలాక్షీ! అడుగో అటు చూడు! నీ మరది రుద్రుడు రుద్ర భూమినుండి సుడిగాలులవల్ల చెలరేగిన ధూళితో నిండిన నెమ్మేను కలవాడై కావిరంగుచే ప్రకాశిస్తూ భయంకరంగా చెదరి కదులుతున్న జటాజూటంతో, తెల్లని విభూతి పూతలతో బంగారుకాంతులతో వెలిగిపోతున్నాడు.

**క. అనల సుధాకర రవి లో, చనముల వికసింపఁజేసి సమధికరోషం**
**బునఁ జూచుచున్న వాఁడదె, వనితా! బంధుత్వ మరయ వలవదు సుమ్మీ! 463**

* అగ్ని, చంద్రుడు, సూర్యుడు ఆ రుద్రుని నేత్రాలు. ఆ త్రినేత్రుడు ఆ కన్నులు పెద్దవి చేసి మనవైపు అధిక రోషంతో చూస్తున్నాడు. ఆయన మన బంధువే కదా అని భావించవద్దు సుమా!

**క. అతనికిఁ దలపోయ హితా, హితులును సన్మాన్యులును విహీనులు నతి గ**
**ర్హితులును లే; రీశుఁడు సమ, మతియును నిఖిలైక భూతమయుఁడై యుంటన్. 464**

* ఆయనకు మిత్రులూ, శత్రులూ, మాన్యులూ, సామాన్యులూ, నచ్చినవారూ. నచ్చనివారూ అనే భేదం లేదు. రుద్రుడు సమబుద్ధి కలవాడు, సర్వప్రాణుల్లోనూ తానే అంతర్యామిగా ఉండేవాడు.

క. కావున మద్భ్రాత భవ, ద్దేవరుఁడని తరుణి! నీ మదిం జూడకు; మా
దేవాదిదేవుఁ ద్రిజగ, త్పావను నిఖిలైకనేత భగవంతు హరున్. 465

* తరుణీ! మా సోదరుడైన ఆ దేవదేవుని మరదిగదా అని మనస్సులో భావించకు. ఆయన సర్వేశ్వరుడు, పరాత్పరుడు. త్రిలోకపావనుడు. పాపహరుడు.

వ. ఏమును సత్పురుషులైన విజ్ఞానవంతులును భుక్తభోగంబై దూరతోన్యస్తంబైన పుష్పమాలికయుంబోలె నమ్మహాత్ముని చరణారవింద వందనాభిలాషిణియైన యవిద్యాదేవి ననుసరించి వర్తింతుము. అదియునుంగాక. 466

* మేముగాని, సత్పురుషులైన ఎటువంటి విద్వాంసులుగాని- ఆ మహాత్ముని అవిద్యారూపమైన మాయకు లోబడి ప్రవర్తిస్తుంటాము. ఆ మాయకూడా అనుభవించి విడిచిన పుష్పమాలికవలె దూరంగా ఉండి కూడా ఆ మహాత్ముని పాదపద్మాలను సేవించాలనే ఆసక్తి కలిగిఉంటుంది. అటువంటి మాయాదేవిని అనుసరిస్తూ మేము ఉంటాము. ఇంతేకాదు; ఇంకా విను.

సీ. ఎవ్వని కరుణ బ్రహ్మేంద్రాది దిక్పాలవరు లాత్మపద వైభవములఁ దనరి
రెవ్వని యాజ్ఞ వహించి వర్తించును విశ్వనేత్రి యగు నవిద్య యెపుడు
నెవ్వని మహిమంబు లిట్టి వట్టివి యని తర్కింపలేవు వేదంబు లయిన
నెవ్వని సేవింతు రెల్లవారును సమానాధికరహితుఁడై యలరు నెవ్వఁ
తే. డట్టి దేవునిఁ ద్రిపురసంహారకరుని, నస్థిమాలాధరుండు భిక్షాశనుండు
భూతిలిప్తాంగుఁ డుగ్రపరేతభూమి, వాసుఁడని హాస్య మొనరించువారు మఱియు. 467

* ఎవని అనుగ్రహంవల్ల బ్రహ్మ, ఇంద్రాది దిక్పాలకులు, తమ తమ పదవులను అధిష్ఠించి అతివైభవంగా ఉంటున్నారో, ఎవని ఆజ్ఞకు లోబడి ఈ సమస్త ప్రపంచానికీ రాణి అనదగిన మాయ ఎల్లప్పుడూ ప్రవర్తిస్తూ ఉంటుందో, ఎవరి గొప్ప దనాన్ని "ఇటువంటిది అటువంటిది" అని వేదాలు కూడా నిరూపించలేవో, ఎవనిని అందరూ సేవిస్తారో, ఎవడు తనతో సాటివారూ, తనకంటే మేటివారూ లేనివాడో- అటువంటి దేవదేవుని, త్రిపురాసుర సంహరుని, హరుని, అస్థిమాలాధరుడనీ, ఆది భిక్షువనీ, బూడిద పూసుకొనేవాడనీ, శ్మశానవాసి అనీ అపహాస్యం చేసేవారు పరమ నిర్భాగ్యులు.

క. ధర శునకభోగ్యమును నిహ, పర దూరము నైన తను వుపాదేయముగా
నెఱి నమ్మి వస్త్రమాల్యా, భరణంబు లలంకరించు పామరజనులున్. 468

క. ఘననిర్భాగ్యులుగా మదిఁ, గను మని యీ రీతిఁ బ్రియకుఁ గశ్యపుఁ డెఱిఁగిం
చిన దితి గ్రమ్మఱఁ బలికెను, మనసిజసాయక విభిన్న మానస యగుచున్. 469

* కుక్కలకూ నక్కలకూ ఆహారం కాదగినదీ, ఇహపరాలకు దూరం అయినట్టిదీ అయిన శరీరాన్ని శాశ్వతమని నమ్ముకొని, దానిని వస్త్రాలతోనూ, పూలదండలతోనూ, ఆ భరణాలతోనూ అలంకరించుకొనే

మూర్ఖులు పరమ దౌర్భాగ్యులని తెలుసుకో'' అని తన ప్రియసతి అయిన దితికి కశ్యప ప్రజాపతి తెలిపాడు. కాని ఆమె మన్మథుని బాణాలచే దెబ్బతిన్న మనస్సు కలదై మళ్ళీ కశ్యపునితో ఏమేమో అన్నది.

**క. మునుకొని లజ్జావనత వ, దనయై ప్రాణేశు కొంగుఁ దాలిమి దూలం**
**బెనఁగొనియె వారకామిని, యనువున వినిషిద్ధకర్మమం దభిముఖియై. 470**

* దితి తన పట్టు వదలకుండా సిగ్గుతో తలవంచుకొని, ఇది తగని పని అనికూడా అనుకోకుండా సహనం కోల్పోయి వారకాంతలాగా కామోత్కంఠతతో పతివస్త్రం పట్టుకొని లాగింది.

**వ. ఇట్లు చేసిన భార్యానిర్బంధంబునకుం దొలంగ నేరక యీశ్వరునకు నమస్కారం బొనరించి యేకాంతంబున నిజకాంతా సంగమంబును జేసి విరజంబును సనాతనంబునునైన బ్రహ్మగాయత్రి జపియించె నంత. 471**

* ఇట్లు ఇల్లాలు నిర్బంధింపగా వదలించుకోలేక, కశ్యపప్రజాపతి ఈశ్వరునకు నమస్కారం చేసి ఏకాంతంగా తన కాంత కోరిక తీర్చాడు. వెంటనే కాళ్లు చేతులు కడుగుకొని స్నానంచేసి ప్రాణాయామ పూర్వకంగా,శాశ్వతమూ పరమ పవిత్రమూ అయిన బ్రహ్మగాయత్రీ మంత్రాన్ని జపించాడు.

**క. దితియును నిషిద్ధకర్మ, స్థితికై మదిలోన సిగ్గు చిట్టాడఁగ నా**
**నతవదన యగుచు నా పశు, పతివలన భయంబు గల్గి పరమప్రీతిన్. 472**

**వ. కశ్యపుం గనుంగొని యిట్లనియె; సమస్త భూతపతియైన పరమేశ్వరుండు నా చేసిన యపరాధంబు సహించి మద్గర్భపరిపాలనంబు సేయుంగాక! రుద్రుండును మహాత్ముండును స్వయం ప్రకాశుండును నలంఘ్యుండును సకామజన ఫల ప్రాపకుండును నిష్కామజన మోక్షప్రదుండును న్యస్తదండుండును ధృతదండుండును దుష్ట శిక్షకుండును బరమాత్ముండును జగదంతర్యామియు నిర్గుణుండును నిష్కాముండును భక్తసులభుండును భగవంతుడును నగు నప్పరమేశ్వరునకు నమస్కరించెద మఱియు షడ్గుణైశ్వర్య సంపన్నుండును జగద్భర్తయు మహానుగ్రహశీలుండును నిర్దయ పరిపాల్య వధూరక్షకుండును సతీదేవీపతియు నైన యా సర్వేశ్వరుండు నన్ను రక్షించుంగాత మని సన్నుతించి. 473**

* దితికూడ కూడనిపని చేసినందుకు మనస్సులో సిగ్గు అగ్గలించగా తల వంచుకొన్నది. పశుపతియైన రుద్రుడు ఏమి చేస్తాడో అనే సంశయంతో భయంతో కశ్యపుణ్ణి చూచి ఎంతో ప్రియంగా ఇట్లా అన్నది. సర్వభూత సంరక్షకుడైన పరమేశ్వరుడు నేను చేసిన అపరాధాన్ని క్షమించి నా గర్భాన్ని రక్షించుగాక! రుద్రుడు దయాసముద్రుడు. మహానుభావుడు, స్వయంప్రకాశకుడు. ఆయన అనుజ్ఞ దాటరానిది. ఆయన కోరికలు కలవారికి కోరికలు తీరుస్తాడు. కోరికలు లేనివారికి మోక్షాన్ని అనుగ్రహిస్తాడు. దుండగులను దండిస్తాడు. ధర్మదండాన్ని ధరిస్తాడు. దుర్జన శిక్షకుడూ, పరమాత్ముడూ, సర్వవ్యాపకుడూ, నిర్గుణుడూ, నిష్కాముడూ, భక్తసులభుడూ, భగవంతుడూ ఐన పరమేశ్వరునికి నమస్కరిస్తున్నాను. షడ్గుణైశ్వర్య సంపన్నుడూ, జగన్నాథుడూ, అపార కృపామయ హృదయుడూ, అత్యంత చింతాక్రాంతలైన కాంతలను కటాక్షించేవాడూ, సతీదేవి వల్లభుడూ అయిన సర్వేశ్వరుడు నన్ను మన్నించుగాక అని సన్నుతించింది.

క. అర్భకులు లేని దగుటను, గర్భము నిజనాథువలనఁ గమలాసన కా
  విర్భూతమైనఁ గర్మ వి, నిర్భరపరితోష మాత్మ నెలకొని యుండెన్. 474

* దితి సంతానము లేనిది కాబట్టి తన వల్లభునివల్ల తనకు గర్భం నిలిచినందుకు మనస్సులో ఎంతగానో సంతోషించింది.

వ. అంతఁ గశ్యపుండు దత్కాలసముచిత సంధ్యావందనంబులు దీర్చి. 475

క. ఆ చెలికి గర్భచిహ్నము, లేచినఁ బరితోష మాత్మ నేపారక మా
  రీచుండు నిజతలోదరిఁ, జూచి యకర్మమున కాత్మ స్రుక్కుచుఁ బలికెన్. 476

* కశ్యప ప్రజాపతి ఆ సమయానికి చేయవలసిన సంధ్యావందనం ముగించుకున్నాడు.

తన భార్యకు గర్భం నిలిచినందుకు ఆయన ఆనందింపలేదు. చేయరాని పని చేసినందుకు మనస్సులో ఎంతగానో చింతిస్తూ తన కాంతను చూచి ఇలా అన్నాడు.

మ. సతి! నీ వే గతి నింద కోడక మనోజాతేక్షుకోదండ ని
  ర్గత నారాచ పరంపరాహత విశీర్ణ స్వాంతవై పాప సం
  గతి లజ్జాభయ ధర్మముల్ విడిచి దుష్కాలంబునందే రమిం
  చితి బల్మిన్ వెలయాలి కైవడిని దుశ్శీల క్రియాలోలతన్. 477

* సతీ! నీవు మన్మథుని చెరుకువింటి నుంచి వెలువడిన పదునైన బాణపరంపరల ధాటికి తట్టుకోలేక చెదిరిన హృదయం కలదానివై లోకనిందకు జంకక సిగ్గూ భయమూ విడిచిపెట్టి, అకాలంలో బలవంతంగా వెలయాలివలె వ్యామోహానికి లొంగిపోయి సంగమించావు.

వ. అట్లగుటం జేసి. 478

క. సతి! విను భూతగణ ప్రే, రితులై రుద్రానుచరుల పృథుశక్తి సమ
  న్వితు లుగ్రకర్ము లతిశౌ, ర్యతములు భద్రానుభద్రు లన నామములన్. 479

క. పరఁగిన దర్పోద్ధతు లి, ద్దఱు కొడుకులు నీకుఁ బుట్టి ధరణికి వ్రేఁగై
  నిరతము బుధజనపీడా, పరులై వర్తింతు రాత్మబలగర్వమునన్. 480

* అందువల్ల సుందరీ! విను. భూతగణాలచే ప్రేరేపింపబడిన వారై రుద్రుని అనుచరులు భద్రుడు-అనుభద్రుడు అనే వారిద్దరూ నీకు కుమారులై జన్మిస్తారు. మిక్కలి శక్తిసంపన్నులూ భయంకరమైన కార్యాలు చేసేవారూ మహాబలవంతులూ అతి గర్విష్ఠులూ అయిన వారిద్దరూ తమ పరాక్రమాటోపంతో నిరంతరమూ సజ్జనులను బాధించుతూ భూమికి భారభూతు లౌతారు.

**తే. అట్టి దుష్కర్మలకును మహాత్మ లలిగి, విశ్వవిదుఁడైన హరికిని విన్నవింప**
**నతఁడు కోపించి హరి కులిశాయుధమున, గిరుల నఱకిన గతి వారి ధరణిఁ గూల్చు. 481**

* అటువంటి దుష్కర్మల దుండగాలకు మహాత్ములు సహించలేక పోతారు. వారు సర్వజ్ఞుడైన హరికి వీరి క్రూరకృత్యాలు విన్నవించుకుంటారు. ఆయన ఆగ్రహించి ఇంద్రుడు వజ్రాయుధంతో కొండలను ఖండించినట్లు ఆ దుర్మార్గులను హతమారుస్తాడు.

**క. అని కశ్యపుఁ డెఱిఁగించిన, విని దితి భయమంది చాల విహ్వలమతియై**
**తన హృదయేశు ముఖాబ్జముఁ, గనుఁగొని యిట్లనియె విగతకౌతుక యగుచున్. 482**

* ఈ విధంగా తన పతి అయిన కశ్యపప్రజాపతి చెప్పగా విని దితి ఎంతో భయపడింది. చాల ఆందోళన చెందింది. వెల వెలపోతున్న ముఖంతో భర్త ముఖపద్మం వైపు చూస్తూ ఇట్లా అన్నది.

**చ. ధర సుజనాపరాధులగు తామసచిత్తుల కెందు నాయువున్**
**సిరియు నశించిపోవు; మృతి సేకుఱు శత్రులచేత; నింతయౌ**
**నరయఁగ నిక్కువంబు భవదాత్మజు లార్యుల కెగ్గుసేయ భూ**
**సురుల క్రుధాగ్నిపాల్పడక శోభనమౌ హరిచేతి పంచతన్. 483**

* స్వామీ! సజ్జనులకు అపకారం చేసే తమోగుణ ప్రవృత్తులైన మదోన్మత్తులకు తప్పకుండా ఆయువూ, సంపదలూ, నశిస్తాయి. శత్రువుల చేతులలో వారికి మృత్యువు తప్పదు. ఇది ముమ్మాటికీ వాస్తవం. మన కుమారులు ఆర్యులకు అపరాధం చేసినందువల్ల ఆ బ్రాహ్మణుల కోపాగ్నికి బలికాకుండా, భగవంతుడైన శ్రీహరి చేతులలో మరణించడ మనేది మహాభాగ్యం.

**చ. అనవుడుఁ గశ్యపుండు గమలానన కిట్లను నింతి! నీవు చే**
**సిన విపరీత కర్మమునఁ జేకుఱె నిట్టి యవస్థ; దీనికిన్**
**మనమునఁ దాప మొందకుము! మాధవు పాదసరోజయుగ్మ చిం**
**తనమునఁ జేసియున్ నను ముదంబునఁ గొల్చుటఁ జేసియుండగన్. 484**

* దితి మాటలు విని కశ్యపుడు ఆ కమలముఖితో ఇట్లా అన్నాడు. ఇంతీ నీవు చేసిన విపరీతకార్యం వల్ల ఇటువంటి దురవస్థ వచ్చింది. దీని కోసం నీ మనస్సులో పరితపించవద్దు. శ్రీపతి పాదపద్మాలను భావించు. నన్ను సంతోషంతో సేవించు.

**తే. రమణి! నీ సుతులందు హిరణ్యకశిపు, వలన నుదయించు వారిలోపల ముకుంద**
**పదసరోజాత విన్యస్తభావుఁడైన, తనయుఁ డుదయింపఁ గలఁ డతిధార్మికుండు. 485**

* రమణీ! విను. నీ కొడుకులలో హిరణ్యకశిపుడు అనే వానికి పుట్టే సంతానంలో నుంచి ధర్మబుద్ధి గలవాడూ, హరిచరణ సరోజాలమీద సంసక్తమైన భావం కలవాడూ అయిన ఒకకొడుకు జన్మిస్తాడు.

**వ. మఱియును 486**

క. ఘనపుణ్యుం డన్వయ పా, వనుఁడగు నప్పుణ్యతముని వరకీర్తి లతల్
వనజభవాండోదర మె, ల్లను నిండఁగఁ బర్వు బుధలలాముం డగుటన్. 487

* అంతేకాదు, మహాపుణ్యాత్ముడూ, వంశపావనుడూ, బుధజన శ్రేష్ఠుడూ అగుటవల్ల ఆ మహామహుని కీర్తిలతలు బ్రహ్మాండ భాండమంతటా వ్యాపిస్తాయి.

తే. వామలోచన! వినుము దుర్వర్ణ హేమ, మగ్ని పుటమునఁ బరిశుద్ధ మై వెలుంగు
నట్లు, దుష్టాత్మ సంభవుఁడయ్యు వంశ, పావనుం డగు హరిపాదభక్తుఁ డగుట. 488

* వాల్గంటీ! అతడు దుర్మార్గుడైన హిరణ్యకశిపుని పుత్రుడే అయినప్పటికీ శ్రీహరిపాద భక్తుడు కావటం వల్ల మలినవర్ణం గల బంగారు అగ్నిలో పరిశుద్ధమై సువర్ణమైనట్లు, వంశాని కంతా పరమపవిత్రు డౌతాడు.

తే. అంచితాష్టాంగయోగ క్రియాకలాపు, లైన యోగీశ్వరులు నమ్మహానుభావు
నతులశీల స్వభావ విజ్ఞాన సరణిఁ, దాముఁ జరియింప నాత్మలఁ దలఁతు రెపుడు. 489

* శ్రేష్ఠమైన అష్టాంగ యోగక్రియా ప్రయోగాలలో ఆరితేరిన మహాయోగీశ్వరులు సైతం ఆ మహానుభావుని సత్ప్రవర్తనకూ, సాధుశీలానికి మురిసిపోయి ఆయన అడుగు జాడలలో తాము కూడా నిత్యము నడవాలని మనస్సులలో కోరుకుంటారు.

ఉ. ఆ మహితాత్మకుండు సుగుణాంబుధి భాగవతోత్తముండు, ల
క్ష్మీ మహిళాధినాథుఁ దులసీ దళదాముఁ బరేశు నాత్మ హృ
త్తామరసంబునందుఁ బ్రమదంబున నిల్పి తదన్య వస్తువుం
దా మదిలో హసించు హరిదాస్య విహార వినిశ్చి తాత్ముఁడై. 490

* భగవద్భక్తులలో అగ్రగణ్యుడూ, సద్గుణాలకు సముద్రం వంటి వాడూ, మహితాత్ముడూ అయిన ఆ మహానుభావుడు తన హృదయ కమలంలో లక్ష్మీమనోహరుని, తులసీదామధరుని, పరాత్పరుని సంతోషంగా నిరంతరం నిలుపుకొని ఆ శ్రీహరి సేవామార్గంలోనే జీవితమంతా నడవాలని నిశ్చయించు కొనినవాడై లౌకికములైన వస్తువులను చులకనగా చూస్తుంటాడు.

వ. అట్టి నీ పౌత్రుండు. 491

సీ. మహిత దేహాద్యభిమానంబు దిగనాడి చిరతరాలంపట శీలుఁ డగుచుఁ
బరసమృద్ధికి నాత్మఁ బరితోష మందుచుఁ బరదుఃఖమునకుఁ దాపమును బొందు
నీ విశ్వమంతయు నే విభుమయ మని యెవ్వని కరుణచే నెఱుఁగనయ్యె
నట్టి యీశ్వరునిఁ దా నాత్మసాక్షిగ మోద మడరంగఁ జూచు ననన్యదృష్టి

తే. నతినిదాఘోగ్ర సమయంబునందు నిఖిల, జంతు సంతాప మడఁగించు చంద్రుమాడ్కి
నఖిలజగముల దుఃఖంబు లపనయించు, రూఢి నాతఁ డజాతవిరోధి యగుచు. 492

* అటువంటి నీ మనుమడు శరీరాదులపై అభిమానం లేనివాడై వైరాగ్యంతో కూడిన స్వభావం కలవాడై ఇతరుల అభివృద్ధికి సంతోషిస్తూ, అట్లే ఇతరుల దుఃఖానికి సంతాపం చెందుతూ ఉంటాడు. ఈ విశ్వం సమస్తమూ భగవన్మయ మని భావిస్తాడు. అటువంటి భావన భగవంతుని దయవల్లనే కలిగిందని విశ్వసిస్తాడు. అటువంటి భగవంతుణ్ణి సంతోషంతో తదేక దృష్టితో, ఆత్మసాక్షిగా దర్శిస్తాడు. భయంకరమయిన ఎండాకాలంలో సర్వజీవులకు తాపాన్ని పోగొట్టే చంద్రునిలా సమస్త జీవుల సంతాపాన్ని పోగొడతాడు. ఆయనకు శత్రువు అనే వాడు ఉండనే ఉండడు.

**వ. మఱియు హరిధ్యాన నిష్ఠాగరిష్ఠుం డగు నమ్మహాభాగవతాగ్రగణ్యుండు. 493**

**క. విమలాంతరంగ బహిరం, గములను స్వేచ్ఛానురూప కలితుండగు నా**
**కమలాధీశ్వరు కుండల, రమణీయ ముఖంబుఁ జూచుఁ బ్రమదం బెసఁగన్. 494**

* ఇంతేకాదు; శ్రీహరి ధ్యానంలో అత్యంతమైన నిష్ఠ కలవాడై భగవద్భక్తులలో అగ్రగణ్యుడై లోపలా వెలుపలా సృష్టి అంతటా తాను భావించిన భగవంతుని రూపాన్ని స్వేచ్ఛగా చూడగలుగుతాడు. మకరకుండలాలతో మనోహరమైన ఆ లక్ష్మీవల్లభుని ముఖాన్ని సంతోషంగా సందర్శిస్తాడు.

**తే. మఱియు నీ విశ్వ మా హరిమయము గాఁగ, మనము లోపలఁ దలఁచు నమ్మనునిభుండు**
**మను మహాత్ములలోన నీ మనుమఁడధికుఁ, డనఁగ నుతికెక్కు నంచుఁ గశ్యపుఁడు పలుక. 495**

* మనువుతో సమానుడైన ఆ మహానుభావుడు తన మనస్సులో ఈ ప్రపంచమంతా హరిమయంగా తలంచుతాడు. మరియూ మహాత్ములందరిలో నీ మనుమడు మహనీయుడై కీర్తి పొందుతాడు అని కశ్యపుడు పలికాడు.

**క. విని తన తనయులు మధుసూ, దనుచే హతు లగుదు రనుచుఁ దన మనుమఁడు స**
**జ్జననుత భాగవతుం డగు, ననుచు మదిం జాల దుఃఖహర్షము లొదవన్. 496**

* కశ్యపప్రజాపతి పలుకులు విన్న దితి తన కొడుకులు విష్ణువు చేతిలో మరణిస్తారన్న మాటకు విచారించింది. తన మనుమడు పరమభాగవతుడై సజ్జనులకు సంస్తవనీయు డౌతాడన్న మాటకు ఎంతో సంతోషించింది.

**వ. ఉండునంత నా దితియుఁ గశ్యపవీర్య సంభృతంబైన గర్భంబు దుర్భర తేజోభిరామంబును నన్య తేజో విరామంబును దినదినప్రవర్ధమానంబును నై నివ్వటిల్ల నిజోదరస్థితులైన కుమారు లమరదమనులై వర్తింపఁగల రని చింతించుచు గర్భంబు శత వర్షంబులు ధరియించి యున్న యనంతరంబ. 497**

* ఈ విధంగా కశ్యపుని వీర్యంతో నిండిన దితి గర్భం భరింపరాని తేజస్సుతో దేదీప్యమానంగా ప్రకాశించుతూ అన్యతేజస్సులను అతిశయించుతూ దినదినమూ అభివృద్ధి పొందుతూ ఉంది. దితి తన కడుపులోని కుమారులు దేవతలను తిరస్కరించగలరని తలపోస్తూ నూరేండ్ల పర్యంతం ఆమె తన గర్భాన్ని ధరించి ఉన్నది.

ఉ. ఆ దితిగర్భమందు రుచిరాకృతితో నొకతేజ మన్య తే
జో దమలీల వెల్వడి వసుంధరయున్ గగనంబు నిండి సం
ఛాదిత పద్మబాంధవ నిశాకర దీప్తులు గల్గి సూచికా
భేద మహోగ్ర సంతమస భీషణమైన భయాకులాత్ములై, 498

* ఆ దితిదేవి గర్భం నుండి అతిరమణీయమైన ఒకానొక తేజస్సు వెలువడింది. ఆ తేజస్సు ఇతర తేజస్సు లన్నింటినీ పటాపంచలు చేస్తూ నింగీ నేలా నిండి, సూర్యచంద్రుల కాంతులను సైతం కప్పివేసింది. అంతటా మిక్కిలి చిక్కని చీకటి వ్యాపించింది. అందరూ భయంతో కంపించి పోయారు.

చ. అమరగణంబు లెల్లఁ గమలాసనుపాలికి నేఁగి తత్పదా
బ్జములకు మ్రొక్కి యంజలులు ఫాలములం గదియంగఁ జేర్చి చి
త్తముల భయంబు సంభ్రమముఁ దార్కొన నిట్లని విన్నవించిరో
యమరకులాగ్రగణ్య! దురితార్ణవతారణ! సృష్టికారణా! 499

* దేవతలందరూ గుంపుగూడి బ్రహ్మసన్నిధికి వెళ్లారు. ఆయన పాదపద్మాలకు నమస్కరించారు. నుదుట చేతులు చేర్చి, మనస్సులో భయమూ, తత్తరపాటూ అతిశయింపగా ఈ విధంగా విన్నవించారు. "ఓదేవతాకుల శ్రేష్ఠా! నీవు పాపమనే సముద్రాన్ని దాటించుటకు సేతువైన వాడవు! సమస్త సృష్టికీ హేతువైన వాడవు.

ఉ. నీవు చరాచర ప్రచయ నేతవు ధాతవు సర్వలోక పా
లావళి మౌళిభూషణుఁడ వంచితమూర్తివి దేవదేవ! వా
ణీవర! యీ యజాండమున నీవు నెఱుంగని యర్థ మున్నదే
భావమునం దలంపుము విపన్నుల మమ్ము భవత్ప్రపన్నులన్. 500

* నీవు చరాచరప్రపంచానికి అధినాయకుడవు. సృష్టికర్తవు. సకలలోక పాలకులలో అగ్రగణ్యుడవు. పూజనీయుడవైన దేవదేవా! సరస్వతీ వల్లభా! ఈ బ్రహ్మాండంలో నీకు తెలియని దేమున్నది? ఆపదల పాలైనాము. నీ చరణాలనే శరణుపొందాము. మా కష్టాలను ఒక్కమాటు నీ మనస్సులో స్మరించు.

వ. దేవా! కార్యరూపంబగు చేతనాచేతనాత్మక ప్రపంచంబునకుఁ గారణుండవైన నీచేత సమస్త భువనంబులును సృజియింపఁబడియె, నీవు సర్వ భూతాత్మభావవిదుండవు, లోకనాథశిఖామణి భూతుండవు, విజ్ఞానవీర్యుండ, వవిద్యంజేసి యిట్టి స్రష్టృ రూపంబు నొందితి, గృహీతరజోగుణుండవు, నీయందుఁ బ్రపంచంబు లీనంబై యుండు, సుపక్వయోగంబు నొంది నిష్కాములై ధ్యానంబున నిన్నరయుచు నిర్జితశ్వాసేంద్రియాత్ములై భవత్ప్రసాదంబు వడసిన వారలకుం బరాభవంబు లెక్కడివి? ఎవ్వని వాగ్జాలంబులచేఁ బాశబద్ధంబులైన పశువుల చందంబున నిఖిల జీవులు వర్తింతు రట్టి నీకు నమస్కరించెద. మహోరాత్ర విభాగాభావంబున లుప్తకర్మంబులగు లోకంబులకు సేమంబు

**గావింపుము, శరణాగతులమైన మమ్ము నతిశయకరుణారస పరిపూర్ణంబులగు కటాక్షంబుల వీక్షించి రక్షింపుము. కశ్యపు వీర్యంబు దితి గర్భంబుననుండి సకల దిగ్వలయంబు నాక్రమించి దారువందు వహ్ని చందంబున లీనంబై ప్రవృద్ధం బగుచున్న" దని విన్నవించిన బృందారక సందోహంబులకు నానందంబు గందళింప నరవిందనందనుం డిట్లనియె. 501**

* ఓ దేవదేవా! కార్యరూపమైన ఈ చరాచర ప్రపంచానికి నీవే కారణ మైనవాడవు. నీవే ఈ లోకాలన్నీ సృష్టించావు. నీవు సమస్త ప్రాణుల ఆంతర్యం తెలిసినవాడవు. లోకపాలకులలో మకుటాయమానుడవు. విజ్ఞాన సంపన్నుడవు. మాయాప్రభావంతో సృష్టికర్తవై ఈ సృష్టి చేస్తున్నావు. రజోగుణాన్ని లోగొన్న నీలో ఈ విశ్వమంతా విలీనమై ఉంటుంది. యోగాభ్యాసంలో ఆరితేరి నిష్కాములైన మహాయోగులు నిన్ను ధ్యానిస్తారు. నిన్ను దర్శిస్తారు. శ్వాసను అరికట్టి ఇంద్రియాలను జయించి ఆత్మారాములై నీ అనుగ్రహం లభించినవారికి అవమానాలు కలుగనే కలుగవు. ఎవనిమాటకు తిరుగులేదో, ఎవని ఆజ్ఞకు బద్ధులై త్రాళ్లచే కట్టివేయబడిన పశువులవలె సమస్తజీవులూ ప్రవర్తిస్తారో అటువంటి నీకు నమస్కారం చేస్తున్నాము.

ఇది పగలూ, ఇది రాత్రీ అనే విభాగం లేక సమస్త కర్మలూ లోపించి చీకాకుపడే ఈ లోకానికి క్షేమం కలిగించు. శరణార్థులమై వచ్చిన మాపై నీ పరిపూర్ణ కరుణాకటాక్ష వీక్షణాలు ప్రసరింజేసి మమ్ము రక్షించు. కట్టెలో రగుల్కొనే అగ్నిలాగా దితి గర్భంలో కశ్యపుని వీర్యం విరాజిల్లుతూ అన్ని దిక్కులనూ ఆక్రమించి అంతకంతకూ అభివృద్ధి చెందుతున్నది.'' ఈ విధంగా విన్నవించుతున్న అమర సమూహానికి ప్రమోదం కలిగేటట్లు కమలసంభవుడు ఇట్లా అన్నాడు.

## -: సనక సనందనాదులు వైకుంఠమున కరుగుట :-

**క. గీర్వాణులార! యుష్మ, త్పూర్వజు లాత్మీయసుతులు పుణ్యులు విచర**
**న్నిర్వాణులు సనకాదులు, సర్వంకష శేముషీ విచక్షణు లెందున్. 502**

* ఓ దేవతలారా! సనక సనందనాదులు మీకంటే ముందే జన్మించిన వారు. వారు నాకు మానసపుత్రులు. పరమ పుణ్యాత్ములు. రూపందాల్చి నడచివస్తున్న కైవల్యం వంటివారు. సమస్త విషయాలలోనూ సమగ్రమైన జ్ఞానం గల విద్వాంసులు.

**క. వారలు నిస్స్పృహు లగుచు న, వారణ భువనంబు లెల్ల వడిఁ గ్రుమ్మరుచున్**
**ధీరు లొకనాఁడు భక్తిన్, శ్రీరమణీశ్వర పదాబ్జసేవా నిరతిన్. 503**

* ధీరులూ ఆశాదూరులూ అగు వారు లోకాలన్నీ యథేచ్ఛగా తిరుగుతూ ఒకనాడు భక్తితో పద్మనాభుని పాదపద్మాలను కొలవాలనే ఆసక్తితో బయలుదేరారు.

చ. చని చని కాంచి రంత బుధసత్తము లంచిత నిత్య దివ్య శో
భన విభవాభి రామముఁ బ్రపన్నజన స్తవనీయ నామమున్
జననవిరామమున్ సుజన సన్నుత భూమము భక్తలోక పా
లన గుణధామముం బురలలామముఁ జారువికుంఠ ధామమున్. 504

* ఆ బుధవరేణ్యులు ఆవిధంగా వెళ్ళి, వెళ్ళి, వైభవోపేతమైన వైకుంఠాన్ని చూచారు. ఆ మహాపట్టణం దివ్యమైన శోభతో దేదీప్యమానంగా వెలుగుతున్నది. అత్యంత మనోహరంగా ఉన్నది. ప్రపన్నులగు భక్తులకు భజింపదగి ఉన్నది. అక్కడ స్థానం లభించిన పుణ్యాత్ములకు పునర్జన్మం లేదు. ఆ నగరం ఆర్యజనస్తవనీయమై భక్తజనపాలనకు గణనీయమై, గుణములకు ఆస్థానమై, నగరములకెల్ల తిలకాయమానమై అలరారుతున్నది.

ఉ. ఆ మహనీయ పట్టణమునందు వసించెడివార లాత్మ ని
ష్కామఫలంబె సత్ఫలముగాఁ దలపోసి ముముక్షుధర్ములై
శ్రీమహిళాధిపాంఘ్రి సరసీరుహపూజ లొనర్చుచున్ మహో
ద్దామ తదీయరూపములఁ దాల్చి సుఖించుచు నుందు రెప్పుడున్. 505

* ఆ మహా నగరంలో నివసించే పౌరులు నిష్కామఫలమే తమ జీవిత సర్వస్వంగా భావించేవారు. కైవల్యం కాంక్షించినవారు. నిరంతరం హరిచరణ సరోజాలనే అర్చిస్తూ ఉంటారు. అపురూపాలయిన నారాయణ స్వరూపాలు ధరించి ఆనందమయులై అలరారుతూ ఉంటారు.

చ. విగతరజస్తమోగుణుఁడు విశ్రుతచారుయశుండు శుద్ధ స
త్త్వ గుణుఁ డజుం డనాది భగవంతుఁ డనంతుఁ డనంతశక్తియున్
నిగమచయాంతవేద్యుఁడు వినిశ్చల నిర్మల ధర్మమూర్తియు
న్నగు హరిపేరఁ బెంపెసఁగు నన్నగరోపవనమ్ము లిమ్ములన్. 506

* శ్రీ మహావిష్ణువు రజస్తమోగుణాలకు అతీతుడు, దిక్కుల నిండిన చక్కని కీర్తి కలవాడు, స్వచ్ఛమైన సత్త్వగుణం మూర్తీభవించినవాడు, అజుడు, ఆద్యంత రహితుడు, భగవంతుడు, అనంతశక్తి సంపన్నుడు, వేదాంతవేద్యుడు. నిశ్చలం, నిర్మలం అయిన ధర్మం రూపుదాల్చినవాడు. అటువంటి దేవదేవుని సేవలో పెంపొందుతూ హృద్యమైన ఆ నగరోద్యానం విరాజిల్లుతుంటుంది.

వ. మఱియుఁ గైవల్యంబు మూర్తీభవించిన తెఱంగునం బొలుపారుచు "నైశ్శ్రేయస" నామంబున నభిరామంబై సతతంబును సకలర్తుధర్మంబులు గలిగి యర్థిజనంబుల మనంబుల ఘనంబులగు నీరిక లెత్తిన కోరికలు సారికలు గొన నొసంగుచు నితర తరురహితంబులును గామదోహన సహితంబులును బుష్పఫల భరితంబులునునై తనర్చు సంతానవన సంతానంబులును, సమంచిత వసంత సమయ సౌభాగ్య సంపదభిశోభిత వాసంతికాకుసుమ విసర పరిమళ మిళిత గళిత

మకరంద లలితామోద ముదిత హృదయులై, యఖండతేజోనిధి యగు పుండరీకాక్షు చరిత్రంబు లుగ్గడింపలేక ఖండితజ్ఞాను లయ్యును నిరతిశయ విషయసుఖానుభవ కారణం బగుట నిందిరాసుందరీరమణ చరణ సేవా విరమణ కారియై యున్నదని తలంచి తద్గంధ ప్రాపక గంధవహునిం దిరస్కరించి నారాయణ భజనపరాయణులై చరియించు సుందరీ యుక్తులైన వైమానికులును, వైమానిక మానసోత్సేకంబుగం బారావత హంస సారస శుక పిక చాతక తిత్తిరి మయూర రథాంగ ముఖ్య విహంగ కోలాహల విరామంబుగా నరవిందనయన కథాగానంబు లనూనంబులుగా మొరయ మదవ దిందిందిర సందోహకలిత పుష్పవల్లీ మతల్లికలును, నకుంఠిత చరిత్రుండైన వికుంఠ నిలయుని కంఠంబునం దేజరిల్లు విలసిత తులసీదామంబుం గనుంగొని యీ తులసీదామంబు హరి మంగళ గళ విలగ్నంబై యుండు సౌభాగ్యంబు వడయుట కేమి తపంబు గావించెనోయని బహూకరించు చందంబున నొప్పు చందన మందార కుందారవింద పున్నాగ నాగ వకుళాశోక కురవకోత్పల పారిజాతాది ప్రసూనమంజరులును, మంజరీ పుంజ రంజిత నికుంజంబులయందు నుత్తుంగ పీన కుచ భారాకంపిత మధ్యంబులుఁ గటితట ఘటిత కనక మేఖలా కలాప నినదోపలాలిత నీల దుకూల శోభిత పృథు నితంబ భరాలసయాన హసిత కలహంస మయూర గమనంబులు, నసమశర కుసుమశర విలసితంబు నపహసించు నయన కమలంబులుం గలిగిన సుందరీ సందోహంబులం దగిలి కందర్ప కేళీ విహారంబుల నానందంబు నొందక ముకుంద చరణారవింద సేవాపరిలబ్ధ మరకత వైడూర్య హేమమయ విమానారూఢులై హరిదాసులు విహరించు పుణ్యప్రదేశంబులును, నిందిరాసుందరి త్రైలోక్య సౌందర్యఖని యైన మనోహరమూర్తి ధరియించి రమణీయ రణిత మణి నూపుర చరణారవిందయై నిజహృదయేశ్వరుండైన సర్వేశ్వరుని మందిరంబునం జాంచల్య దోష రాహిత్యంబుగ వర్తింపం గరకమల భ్రమణీకృత లీలాంబుజాతయై తన నీడ కాంచన స్ఫటికమయ కుడ్యప్రదేశంబులం బ్రతిఫలింప శ్రీనికేతనుని నికేతన సమ్మార్జన కైంకర్యంబు పరమధర్మం బని తెలుపు చందంబునం జూపట్టుచు నిజవనంబునం దనరు సౌరభాభిరామంబు లగు తులసీదళ దామంబుల నాత్మనాయకుని చరణారవిందంబుల నర్చించుచు నొసలి మృగ మదపుటసలున మసలుకొని తుంపెసలాడు కురులును, లలిత తిలప్రసూన రుచిరాభ నాసం దనరు మోముఁదామర విమల సలిలంబులఁ బ్రతిబింబింప నిజమనోనాయకుచేతం జుంబితం బగుటగాఁ దలంచి లజ్జావనతవదన యై యుండంజేయు ప్రవాళ లతికాకులంబులైన కూలంబులు గల నడబావులును గలిగి పుణ్యంబునకు శరణ్యంబును, ధర్మంబునకు నిర్మల స్థానంబును, సుకృతమూలంబునకు నాలవాలంబును నయి పొలుపొందుచుండు. 507

* ఆ ఉద్యానవనం మోక్షమే మూర్తీభవించిందా అన్నట్లుంటుంది. ఆ ఆరామం "నైశ్రేయసం"అనే నామంతో నయనాభిరామంగా ఒప్పుతుంటుంది. ఆ వనం నిండా ఎన్నెన్నో కల్పవృక్షాలు స్వేచ్ఛగా పెరిగి పూలతో పండ్లతో నిండి ఉంటాయి. అవి అన్ని వేళలందూ, అన్ని ఋతువుల వైభవంతో శోభిల్లుతూ,

అర్థిజనుల మనస్సులలో అంకురించిన కోరికలను కొరతలేకుండా తీరుస్తుంటాయి. వసంతఋతువులో కొల్లలుగా విరబూచిన మొల్లపూవుల సుగంధంతో కూడిన మకరంద బిందువులను అందలి మందమారుతాలు నలుమూలలా వెదజల్లుతుంటాయి. తమ తమ రమణీమణులతో కలిసి విమానాలలో విహరించే గంధర్వులు అటువంటి కమ్మని పూలతేనెల సోనలకు సంతోషిత స్వాంతులై మైమరచి మహానుభావుడైన విష్ణుదేవుని కథలు చెప్పుకోటం మరచిపోతుంటారు. అంతలో వారు ఆ అజ్ఞానం నుండి తేరుకొని విచ్చలవిడిగా విషయవాసనలను రెచ్చగొట్టే ఈ సువాసనలు రమారమణుని చరణ కమలారాధనకు బాధకాలని భావించి ఆ కమ్మ తెమ్మెరలను త్రోసిరాజని శ్రీమన్నారాయణ సేవాపరాయణులై సంచరిస్తుంటారు.

ఆవైమానికుల అంతరంగాలలో ఆనందం పొంగిపొరలేటట్లు ధ్వనులు చేస్తున్న పావురాళ్ళూ, హంసలూ, బెగ్గురులూ, చిలుకలూ, కోకిలలూ, వానకోయిలలూ, తీతువుపిట్టలూ, నెమిళ్ళు, చక్రవాకాలూ మొదలైన పక్షుల కోలాహలాన్ని మించి కమలాక్షుని కథాగానాలు అఖండంగా జరుపుతున్నట్లున్న గండుతుమ్మెద గుంపులతో నిండిన మేలిజాతి పూలతీవలు కన్నులవిందు చేస్తుంటాయి.

వందనీయ చరిత్రుడైన వైకుంఠధాముని కంఠంలో వనమాలికగా వెలసి విలసిల్లటానికి ఈ తులసి ఎంతటి తపస్సు చేసిందో అని ఆనందంతో అభినందిస్తున్నట్లు మంచి గందపుచెట్లు, మందారాలు, మల్లెలు, కమలాలు సురపొన్నలు, పొన్నలు, పొగడలు, అశోకాలు, గోరంటలు, కలువలు, పారిజాతాలు, గుత్తులు గుత్తులుగా పూచి తులసీవనాలపై సుగంధాలు విరజిమ్ముతుంటాయి.

ఒత్తుగా పూచిన పూలగుత్తుల నెత్తావులు గుమాయించే పొదరిండ్లున్నాయి. ఆ పొదరిండ్లలో ఎత్తైన స్తనకుంభాల భారానికి నకనకలాడు సన్నని నెన్నడుములు గల కొందరు సుందరీమణులు విహరిస్తుంటారు. ఆ లతాంగులు నీలిరంగు పట్టుచీరలు కట్టుకొని బంగారు గజ్జెల ఒడ్డాణాలు సింగారించుకొని ఉంటారు. ఆ మందయానల ఒయ్యారపు నడకల సొగసులు మరాళాలనూ, మయూరాలనూ ఎగతాళి చేస్తున్నట్లుంటాయి. ఆ అన్నులమిన్నల వాల్గన్నులు అసమశరుని కుసుమశరాలను పరిహసిస్తుంటాయి. అటువంటి అందాలరాసుల సౌందర్యానికి లోనుగాక వారితో శృంగారక్రీడా విలాసాలను ఆశించక అందలి హరిభక్తులు గోవింద చరణారవింద సంసేవనం వల్ల సంప్రాప్తించిన నవరత్నాలు చెక్కిన చక్కని బంగారు విమానాలు ఎక్కి ఆయా పుణ్యప్రదేశాలలో తిరుగుతుంటారు.

అందాలదీవి అయిన లక్ష్మీదేవి ముల్లోకాల సౌందర్యం మూర్తీభవించినట్లు మణులు చెక్కిన కాలి అందెలు ఘల్లుఘల్లున మ్రోగుతుండగా తన హృదయనాథుడైన వైకుంఠనాథుని మందిరంలో చంచలత్వం మాని సంచరిస్తుంటుంది. ఆ ఇందిరాసుందరి తన కరకమలంలోని లీలాకమలాన్ని త్రిప్పుతుండగా ఆమెనీడ ఆ మేడలోని బంగారు పాలరాతి గోడలపై ప్రతిఫలిస్తుంది. అప్పుడు అది ముకుంద మందిర సమ్మార్జనమే పరమధర్మమని ప్రకటిస్తున్నట్లుంటుంది. లక్ష్మీదేవి తన వనంలోని పరిమళాలు వెదజల్లే తులసీదళాలను దండలుకట్టి తన హృదయేశ్వరుని పదకమలాలపై అర్పించుతూ ఉంటుంది. ఆ సమయంలో శ్రమబిందువులవల్ల నుదుటనున్న కస్తూరీతిలకం కలిగి అంటుకుని కదులుతున్న ముంగురులతో

నువ్వుపువ్వువంటి చక్కదనాల ముక్కుతో ముద్దులు మూటగట్టే ఆమె ముఖపద్మం అచ్చటి కోనేటినీటిలో ప్రతిబింబిస్తుంది. అప్పుడు ఆమె నీల మేఘశ్యాముడైన పరంధాముడు తన ముఖాన్ని ముద్దాడుతున్నట్లు భ్రమించి, సిగ్గుతో తలవంచుకొంటుంది. అటువంటి దిగుడు బావుల చుట్టూ గట్టులపైన పగడాలతీవలు అల్లుకొని ఉంటాయి. ఈ విధంగా హృద్యాతి హృద్యమైన ఆ ఉద్యానవనం పుణ్యానికి ఆస్థానమై, ధర్మానికి సంస్థానమై, సుకృతాలకు మూలస్థానమై వెలుగొందుతూ ఉంటుంది.

**చ. హరివిముఖాత్ము లన్యవిషయాదృత చిత్తులుఁ బాపవర్తులున్**
**నిరయనిపాత హేతువును నింద్య చరిత్రము నైన దుష్కథా**
**నిరతిఁ జరించువారలును నేరరు పొందఁగ నిందిరా మనో**
**హర చరణారవింద భజనాత్మకు లుండెడు గొంది నారయన్.** **508**

* విష్ణుసేవకు విముఖు లైనవారూ, ఇతరములైన లౌకిక సుఖాలతో సతమతమయ్యే మనస్సు కలవారూ, పాపపు నడవడి కలవారూ, నరకహేతువులై నింద్యములైన చెడ్డకథలందు ఆసక్తి కలిగి మెలగేవారూ భగవంతుని పాదపద్మాలు సేవించే భక్తులుండే ఆ పవిత్ర ప్రదేశాన్ని ప్రవేశింప లేరు.

**వ. వెండియు.** **509**

**చ. హరిఁ బరమేశుఁ గేశవు ననంతు భజింపఁగ ధర్మతత్త్వ ధీ**
**పరిణతిసాధనం బగు స్వభావముఁ దాల్చినయట్టి మర్త్యు లా**
**సరసిజనేత్రు మాయను భృశంబుగ మోహితులై తదంఘ్రి పం**
**క రుహము లర్థిమైఁ గొలువఁ గానమిఁ బొందరు తత్పదంబునన్.** **510**

* పాపములు హరించువాడూ, పరాత్పరుడూ, కేశవుడూ, అనంతుడూ అయిన వాసుదేవుని సేవించడానికి ప్రధానసాధనం భక్తి మాత్రమే. కేవలం ధర్మశాస్త్రపరామర్శతో పండిన బుద్ధికౌశలం గల మానవులు ఆ మహనీయునిచే మరింత మోహితులై ఆ పరంధాముని పాదపద్మాలను పరమభక్తితో భజించే పద్ధతిని తెలుసుకోలేరు. అందుచే వారు ఆ వైకుంఠ స్థానాన్ని అందుకోలేకపోతున్నారు.

**చ. మఱియు సరోరుహోదరుని మంగళ దివ్యకథానులాప ని**
**ర్భర పరితోష బాష్ప కణ బంధుర చారు కపోల గద్గద**
**స్వర పులకీకృతాంగు లగువారలు నిస్స్పృహచిత్తు లత్యహం**
**కరణవిదూరు లుందురు సుకర్ముల యుండెడి పుణ్యభూములన్.** **511**

* నళిననాభుడైన నారాయణుని దివ్యమంగళ లీలావిలాసాలను పలుమార్లు భావించి ఆలపించడంవల్ల పెల్లుబికిన ఆనంద బాష్పధారలు చెక్కిళ్లపై జారి కంఠం గద్గదమై మేను పులకించిన వారూ, వైరాగ్య భావాన్ని భజించినవారూ, అహంకారాన్ని దూరంగా త్యజించినవారూ పుణ్యాత్ములకు పుట్టినిల్లైన వైకుంఠపట్టణంలో ఉంటారు.

వ. అందు. 512

మ. వరవైకుంఠము సారసాకరము, దివ్యస్వర్ణశాలాంక గో
పుర హర్మ్యావృతమైన తద్భవన మంభోజంబు, దన్మందిరాం
తర విభ్రాజిత భోగి కర్ణిక, తదుద్యద్భోగ పర్యంకమం
దిరవొందన్ వసియించు మాధవుఁడు దా నేపారు భృంగాకృతిన్. 513

* లోకోత్తరమైన ఆ వైకుంఠపురమే ఒక సరోవరం. దివ్యత్వం దీపించే బంగారు మంటపాలతో, గోపురాలతో, మేడలతో కూడిన ఆ మహా మందిరమే ఆ సరస్సు నడుమ ఉన్న పద్మం. ఆ మందిరం మధ్య భాగాన ప్రకాశించే ఆదిశేషుడే తామరదుద్దు. శేషతల్పంపై శయనించి ఉన్న మాధవుడే తుమ్మెద.

వ. అంత. 514

మ. హరిచేఁ బాలితమైన కాంచనవిమానారూఢ మైనట్టి స
త్పురుషానీకముచేఁ దనర్చి విభవాపూర్ణ ప్రభావోన్నతిం
గర మొప్పారు తదీయ ధామము జగత్కల్యాణమూర్తుల్ మునీ
శ్వరు లర్థిన్ నిజయోగశక్తిఁ బరితుష్టస్వాంతులై చెచ్చెరన్. 515

వ. డాయంజని. 516

* ఈ విధంగా శ్రీ మహావిష్ణువు పాలించేదీ, బంగారు విమానాలెక్కి విహరించే పుణ్యపురుషులతో నిండినదీ, వైభవోపేతమైన మహాప్రభావంతో శోభిల్లేదీ అయిన ఆ వైకుంఠధామాన్ని లోకకల్యాణ స్వరూపులైన సనక సనందనాదులు సంతుష్టాంతరంగులై తమ యోగశక్తి వల్ల వడి వడిగా సమీపించినవారైనారు.

చ. మరకతరత్న తోరణ సమంచిత కుడ్య కవాట దేహళీ
విరచిత షట్సుకక్ష్య లరవిందదళాక్ష విలోకనోత్సవా
దరమతి నన్యముం గనక దాఁటి యనంతరకక్ష్య యందు ని
ద్దఱను దదీయపాలుర నుదార సమాన వయో విశేషులన్. 517

* అరవిందదళాక్షుని సందర్శించాలనే ఆనందంతో ఆ మహర్షులు అనన్యదృష్టి కలవారై మరకతమణి తోరణాలతో, అలంకృతములైన గోడలతో, రత్నమయాలైన కవాటాలతో, గడపలతో ఒప్పుతున్న ఆరు మహాద్వారాలను దాటి అనంతరం ఏడవ మహాద్వారాన్ని చేరారు. అక్కడ కావలి కాస్తున్న సమానవయస్సు గల ఇద్దరు ద్వారపాలకులను చూచారు.

సీ. కాంచన నవరత్న కటకాంగుళీయక, హార కేయూర మంజీర ధరులఁ
గమనీయ సౌరభాగత మత్త మధుకర, కలిత సద్వనమాలికా విరాజి

తోరస్థ్సులుల గదాయుతులను ఘనచతు, ర్బాహుల నున్నతోత్సాహమతుల
నారూఢ రోషానలారుణితాక్షుల, భ్రూలతా కౌటిల్య ఫాలతలుల

తే. వేత్రదండాభిరాముల వెలయు నమ్ము, కుంద శుద్ధాంత మందిరాళింద భూమి
నున్న యిద్దఱ సనకాది యోగివరులు, సూచుచును వృద్ధులయ్యు నా సుభగమతులు. 518

క. ధీరతఁ బంచాబ్దముల కు, మారకులై కానఁబడుచు మనమున శంకం
గూరక చతురాత్మకు లని, వారిత గమనమున డాయ వచ్చిన నెదురన్. 519

* ఆ ద్వారపాలకు లిద్దరూ నవరత్నాలు పొదిగిన బంగారు కంకణాలు, ఉంగరాలు, హారాలు, భుజకీర్తులు, కాలి అందెలు ధరించి ఉన్నారు. ఇంపైన సువాసనలకు ఆకర్షింపబడిన గండుతుమ్మెదలు నిండిన మేలిజాతి పూలదండలను వక్షస్థలాలపై అలంకరించుకొని ఉన్నారు. గదలు పట్టుకొని చతుర్భుజాలతో ఉత్సాహం ఉరకలువేస్తూ ఉన్నారు. వారి కన్నులు రోషాగ్నితో ఎర్రబడి ఉన్నాయి. వారి ఫాలభాగాలు ముడివడిన కనుబొమలతో వంకరలు తిరిగి ఉన్నాయి. వారి హస్తాలలో పేము బెత్తాలు కదులుతున్నాయి. ఆ విధంగా వారిద్దరూ గోవిందుని శుద్ధాంతమందిరం ముందు నిలబడి ఉన్నారు. శుద్ధమతులైన సనకసనందనాదులు వృద్ధులైనప్పటికీ ఐదేండ్ల బాలకుమారులులాగా కనబడుతూ కొంచెంకూడా అనుమానించకుండా నిబ్బరంగా నిరాటంకంగా నేర్పుగా ఆ ద్వారపాలకుల సమీపానికి వచ్చారు.

క. శ్రీలలనేశ్వర దర్శన, లాలసులై యేఁగు బుధలలాముల నతి దు
శ్శీలతఁ దద్వచనప్రతి, కూలమతిం బోవకుండఁ గుటిలాత్మకులై. 520

* ఇందిరావల్లభుని సందర్శించాలనే ఆసక్తితో లోనికి వెళ్లుతున్న సాధువరేణ్యులైన సనకాదులను కటుస్వభావులూ, కుటిలబుద్ధులూ అయిన ఆ ద్వారపాలకులు ఇద్దరూ ప్రతికూలవచనాలతో నివారించారు.

క. వారించిన వారలు బ్రం, దారకు లీక్షించుచుండ దారుణపటు రో
షారుణితాంబకులై రొద, వారించుచు వారు నచటివారును వినఁగన్. 521

వ. ఇట్లనిరి. 522

* ఈ విధంగా ద్వారపాలకులు అడ్డగింపగా సనకాదులకు తీవ్రమైన కోపం వచ్చింది. వారి కన్నులు ఎర్రబడ్డాయి. ఇదంతయూ దేవతలు విస్తుపోయి చూస్తూనే ఉన్నారు. ఆ మహర్షులు అచటి కలకలాన్ని వారిస్తూ అక్కడి వారందరూ వింటూ ఉండగా ఈ విధంగా అన్నారు.

చ. పరము ననంతు భక్తపరిపాలు సుహృత్తము నిష్టు నీశ్వరే
శ్వరు భజియింపఁ గోరి యనివారణ నిం దరుదేర నిచ్చలున్

భరిత ముదాత్ములై కొలువఁ బాయక తద్భజనాంతరాయ త
త్పరమతి మాకు నిప్పు డరిపడ్డ దురాత్ముల నేఁడు గంటిరే? 523

* పరాత్పరుడు, అనంతుడు, భక్తజన పరిపాలకుడు, దీనబంధుడు, ప్రియతముడు, సర్వేశ్వరుడు అయిన శ్రీహరిని సేవించటం కోసం మేము నిత్యమూ నిరాటంకంగా ఇక్కడికి వస్తూ వుంటాము. ఎంతో సంతోషంతో నిండిన అంతరంగాలతో ఆయనను ఆరాధిస్తాము. ఈనాడు ఈ విధంగా వచ్చిన మమ్ము అడ్డగించి మా సేవకు నిరోధం కల్గించిన దురాత్ములను మీరంతా చూచారు గదా!

వ. అని మఱియు సనకసనందనాదులు జయవిజయులం జూచి యిట్లనిరి, మీ మనంబుల స్వామిహితార్థంబై నిష్కపటవర్తనుల మైన మాబోఁటులఁ గుహక వృత్తింగల యితరజనంబులు భగవత్సదనంబుఁ బ్రవేశింతురో యను శంకం జేసి కొందఱం బ్రవేశింపం జేయుటయుఁ, గొందఱ వారించుటయు దౌవారికస్వభావంబని వారింపఁ దలంచితిరేనిఁ బ్రశాంత దివ్యమంగళ విగ్రహుండును, గతవిగ్రహుండును, భగవంతుండును, విశ్వగర్భుండును నైన యీశ్వరుండు ప్రాప్యంబును, ప్రాపకంబును, బ్రాప్తియు నను భేదశూన్యుండు గావున మహాకాశంబునందు ఘటపటాద్యాకాశంబులు వేఱులేక యేకంబై తోఁచు చందంబున విద్వాంసులగు వా రమ్మహాత్ముని సకలాత్మభేదరహితునింగాఁ బొడగందు రదియునుంగాక లోకంబు నందు రాజులు సాపరాధులైన కింకర జనంబుల నాజ్ఞాపించుచందంబున నీశ్వరుండు దండించునో యను భయంబునంజేసి వారించితి మని తలంచితిరేని భూసుర వేషధారులమైన మాకును వైకుంఠనాయకుండైన సర్వేశ్వరునకును భేదంబు లేకుండుటం జేసి శంక సేయం బనిలేదు. ఇట్లగుట యెఱింగి మందబుద్ధులరై మమ్ము వారించిన యనుచితకర్ములగు మీరలు మదీయశాపార్హు లగుదురు గావున భూలోకంబునం గామక్రోధలోభంబులను శత్రువులు బాధింపం బుట్టుండని పలికిన. 524

* ఇలా పలికి సనకసనందనాదులు ద్వారపాలకులైన జయవిజయులను చూచి ఇట్లా అన్నారు. "మీరు మమ్ములను అడ్డగించుట చాలా చెడ్డపని. మనస్సుల్లో మీ యజమాని మేలుకోరువారై "కపటవర్తనులైన ఇతరులు భగవంతుని మందిరం ప్రవేశిస్తారేమో"అనే అనుమానంతో కొందరిని రానిచ్చుట, కొందరిని అడ్డగించుట ద్వారపాలకుల ధర్మం కనుక సన్మార్గుల మైన మమ్ము అడ్డగించా మంటారా అది సరికాదు. భగవంతుడు ప్రశాంతమూ, దివ్యమూ, మంగళకరమూ అయిన ఆకారం కలవాడు. ఆయనకు ఎవరితోనూ విరోధం లేదు. మీరూ, మేమూ, సమస్త విశ్వమూ ఆయనలో ఇమిడి ఉన్నవారమే. అటువంటి పరాత్పరునికి ప్రాప్యము, ప్రాపకము, ప్రాప్తి అనే భేదాలు లేనేలేవు. ఘటాకాశం, పటాకాశం, మహాకాశం లోనివే కాని వేరుకావు. అందుకనే ఎరుకగలవారు ఆ పరమాత్మ అభేదంగా అందరిలోనూ ఆత్మరూపంలో ప్రకాశిస్తున్నాడని భావిస్తారు. కాబట్టి మీరు చేసినపని సరికాదు.

లోకంలో దోషులైన భటులను రాజు దండించునట్లు భగవంతుడు దండిస్తాడనే భయంతో ఇట్లా చేశామని మీరనుకొన్నట్లయితే అది కూడా అపరాధమే. భూసురులమైన మాకూ, వైకుంఠవాసియైన

భగవంతునకూ భేదం లేదు. అందువల్ల అటువంటి సందేహానికీ, భయానికీ అవకాశమే లేదు. మీరు ఇదంతా తెలిసికూడా మందబుద్ధులై మమ్మల్ని అడ్డగించారు. ఇటువంటి చేయగూడనిపని చేసిన మీరు మా శాపానికి అర్హులవుతున్నారు. కనుక కామక్రోధలోభాది శత్రుగుణాలకు పాత్రులై భూలోకంలో పుట్టండి."

**క. వారలు విని తమ మనముల, భూరిస్ఫుట చండకాండపూగంబులచే**
**వారింపరాని భూసుర, దారుణవాక్యముల కులికి తల్లడపడుచున్. 525**

* ద్వారపాలకులు మహర్షుల మాటలు విని ఉలికిపడ్డారు. పదునైన దారుణ బాణపరంపరల చేత కూడా నివారించుటకు వీలుకాని ఆ బ్రహ్మవేత్తల భయంకర శాపవాక్యాలకు వారు తల్లడిల్లిపోయారు.

**క. పరితాపంబును బొందుచు, సరసిజలోచనుని భటులు సనకాది మునీ**
**శ్వరుల పదాంబుజములకుం, గర మర్థిన్ మ్రొక్కి నిటలఘటితాంజలులై. 526**

**వ. ఇట్టనిరి. 527**

* విష్ణుదేవుని సేవకులు భరింపరాని పరితాపం పొందినవారై ఆ సనక సనందనాది మునీశ్వరుల చరణకమలాలకు మిక్కిలి భక్తితో మ్రొక్కి నెన్నుదుట చేతులు జోడించి వారితో ఇట్లా విన్నవించుకున్నారు.

**మ. వరయోగీశ్వరులార! మమ్ము మది నొవ్వన్ మీరలిట్లన్న ని**
**ష్ఠుర వాక్యంబుల కింక మా మనములన్ శోకింపఁగా రాదు, స**
**త్పురుషశ్రేణిఁ బరాభవించిన వృథాభూతాత్ములన్ మమ్ము మా**
**దురితం బింతకుఁ దెచ్చె, మీఁద శుభముం దూఁకొందు మేమారయన్. 528**

* ఉత్తములైన యోగిసత్తములారా! మీరు మా మనస్సు నొచ్చునట్లు మమ్ములను కఠినవాక్యాలతో మందలించారు. ఇందుకు మేము మా హృదయాలలో బాధపడటం లేదు. ఏమంటారా! మీవంటి సాధుజనులను అవమానించిన మా జీవితం వ్యర్థం. మాపాపమే మీకు కోపం తెప్పించి మమ్మల్ని శాపం పాలు చేసింది. కానివ్వండి! ఇక మీఁదట మేము శుభం చేకూర్చుకోటానికి ప్రయత్నిస్తాము.

**వ. అది యెట్లంటిరేని. 529**

**ఉ. మీ కరుణావలోకన సమేతులుగా మముఁ జేయఁ జిత్తముల్**
**దూఁకొనెనేని మా చనవుఁ ద్రోయక యీఁదగు, లోభమోహముల్**
**గైకొని పుట్టు చోట నవకంజదళాక్షుని నామవిస్మృతిం**
**బై కొనకుండ దాననె శుభంబగు మీఁది మదీయజన్మముల్. 530**

* అది యే విధంగా సమకూరుతుందంటారా? మీ కరుణాకటాక్ష వీక్షణాలు మాపైన ప్రసరింపచేసి మమ్మల్ని అనుగ్రహింప సంకల్పించి నట్లైతే మమ్మల్ని ఈ మాత్రం కనికరించండి. ఏమంటే మేము మోహలోభాలు చేపట్టి పుట్టినచోట శ్రీమన్నారాయణుని నామం విస్మరింపకుండా ఉండేటట్టు అనుగ్రహించండి. అందువల్ల తర్వాతి జన్మాలలో మాకు శుభం లభిస్తుంది.

వ. అను సమయంబున. 531

మ. హరి సర్వేశుఁ డనంతుఁ డా కలకలం బాలించి పద్మాలయా
సరసాలాపవినోద సౌఖ్యరచనల్ సాలించి శుద్ధాంత మం
దిర మాణిక్య సుదేహళుల్ గడచి యేతెంచెం బ్రపన్నార్తి సం
హరుఁడై నిత్యవిభూతి శోభనకరుండై మానితాకారుఁడై. 532

* జయవిజయులు ఇట్లా అంటున్న సమయంలో సర్వేశ్వరుడైన శ్రీ మహావిష్ణువు లోపలనుంచి ఆ కలకలం విన్నాడు. వెంటనే లక్ష్మీదేవి తోడి సరససల్లాపాలూ, శృంగారకలాపాలూ చాలించి, శుద్ధాంతభవనం లోని మణులు చెక్కిన చక్కని ద్వారాలు దాటి అచటికి వచ్చాడు. శరణాగతుల కష్టాలు పోగొట్టి అనంత వైభవాలు అనుగ్రహించే ఆ అనంతుడు సంస్తవనీయమైన స్వరూపంతో సాక్షాత్కరించాడు.

వ. మఱియును. 533

చ. శరనిధికన్యకామణియు సంభ్రమ మొప్పఁగఁ దోడ రా మనో
హరనిజలీలమైఁ బరమహంస మునీశ్వరవంద్య పాద పం
క రుహములన్ వినూత్న మణికాంచన నూపుర మంజుఘోషముల్
వరుసఁ జెలంగ నార్యజన వంద్యుఁడు యోగిజనైక సేవ్యుఁడై, 534

అప్పుడు లక్ష్మీదేవికూడా తొట్రుపాటుతో విష్ణుదేవుని వెనువెంట వచ్చింది. పరమహంసలైన మునివతంసులకు సైతం వందనీయాలైన పదారవిందాల యందలి నవరత్నఖచితాలైన బంగారు అందెలు అడుగడుగుకూ మనోహరమైన శబ్దం చేస్తూ ఉండగా లీలావిలాసంగా స్వామి నడచివచ్చాడు. మహానుభావులు నమస్కరించుతుండగా, యోగివరేణ్యులు సేవించుతుండగా వాసుదేవుడు దర్శనమిచ్చాడు.

చ. కర మణి హేమ కంకణ నికాయ ఝణంకృతు లుల్లసిల్ల న
చ్చర లిడు హంసపక్ష సిత చామర గంధవహోచ్చలత్సుధా
కర రుచిరాతపత్ర సుభగప్రవిలంబిత హారవల్లరీ
సరస గళత్తుషార కణజాల విరాజిత మంగళాంగుఁడై. 535

చేతులందలి మణులు పొదిగిన బంగారు కంకణాలు గల్లుగల్లున మ్రోగుతుండగా, అప్సరసలు హంసరెక్కలవంటి తెల్లని వింజామరలతో వీస్తున్నారు. ఆ చామరాల గాలికి చంద్రబింబంలా కాంతులు వెల్లివిరిసే వెల్లగొడుగు అంచులలో వ్రేలాడుతున్న ముత్యాల జాలర్లు కదలాడుతున్నాయి. ఆ ముత్యాలహార వల్లుల నుంచి చల్లగా జారిపడుతున్న మంచు బిందువులు దేవదేవుని దివ్యమంగళ విగ్రహంమీద అందాలు చిందుతున్నాయి.

వ. మఱియును. 536

సీ. నిఖిల మునీంద్ర వర్ణిత సస్మితప్ర స, న్నాననాంబుజముచే నలరువాఁడు
విశ్రుత స్నేహార్ద్ర వీక్షణ నిజ భక్త, జన గుహాశయుఁ డనఁ దనరువాఁడు
మానిత శ్యామాయమాన వక్షమున నం, చిత వైజయంతి రాజిల్లువాఁడు
నతజనావన కృపామృత తరంగితములై, భాసిల్లు లోచనాబ్జములవాఁడు

తే. నఖిల యోగీంద్ర జన సేవ్యుఁ డైనవాఁడు, సాధుజనముల రక్షింపఁజాలువాఁడు
భువనచూడా విభూషణ భూరిమహిమ, మించు వైకుంఠపురము భూషించువాఁడు. 537

ఆయన అఖిల మునీశ్వరులు అభివర్ణించే మందహాస సుందరమైన ప్రసన్న ముఖారవిందంతో అలరారేవాడు. పెల్లుబికిన ప్రేమ వెల్లి విరిసే చూపులతో తన భక్తుల హృదయాంతరాలలో పవ్వళించేవాడు. విశాలమైన నల్లని వక్షస్థలంమీద వైజయంతీమాల విరాజిల్లేవాడు, నమస్కరించే భక్తులను లాలించి పాలించటంలో దయామృత తరంగాలు పొంగిపొరలే కమలాల వంటి కన్నులు కలవాడు, సకల యోగి పుంగవులకూ సంసేవింపదగినవాడు, సాధు జనులను సంరక్షించుటలో సమర్థుడు. అత్యంత మహిమాన్వితమై అఖిలలోకాలకూ కలికితురాయివలె అలంకారమైన వైకుంఠపురానికి కూడా అలంకార మైనవాడు.

సీ. కటివిరాజిత పీతకౌశేయ శాటితో వితత కాంచీ గుణద్యుతి నటింప
నాలంబికంఠహారావళి ప్రభలతోఁ గౌస్తుభరోచులు గ్రందుకొనఁగ
నిజకాంతి జిత తటిద్ధ్వజ కర్ణ కుండల రుచులు గండద్యుతుల్ ప్రోదిసేయ
మహనీయ నవరత్నమయ కిరీట ప్రభా నిచయంబు దిక్కుల నిండఁ బర్వ

తే. వైనతేయాంస విన్యస్త వామహస్త, కలిత కేయూర వలయ కంకణము లొప్ప
నన్య కరతల భ్రమణీకృతానుమోద, సుందరాకార లీలారవింద మమర. 538

* ఆ విష్ణుమూర్తి నడుంచుట్టూ ప్రకాశించే పచ్చని పట్టుపంచెపై బంగారు మొలనూలు వెలుగులు వెదజల్లుతున్నది. కంఠం చుట్టూ ఉన్న రత్నహారాల కాంతులు కౌస్తుభమణి కాంతులతో కలిసిపోయాయి. మెరపు తీగలవలె మిరుమిట్లు గొల్పుతున్న మకరకుండలాల ధగధగలు చెక్కిళ్ల నిగనిగలతో చెలిమి చేస్తున్నాయి. నవరత్నాలు పొదిగిన కిరీటం వెలుగు వెల్లువలు నలుదెసలా ప్రసరిస్తున్నాయి.

ఆయన గరుత్మంతుని మూపుపై తన ఎడమచేయి ఆనించి ఉన్నాడు. ఆ చేతికి అలంకరించిన భుజకీర్తీ, కడియాలూ, కంకణాలూ ముచ్చటగా వెలుగొందుతున్నాయి. స్వామి తన కుడిచేతిలో అందమైన లీలారవిందాన్ని ధరించి దానిని విలాసంగా త్రిప్పుతున్నాడు.

వ. మఱియుఁ జరణారవింద మంజు కింజల్క పుంజ ప్రభారంజిత తులసీ మరంద బంధుర గంధానుబంధ సుగంధి గంధవహాస్వాద కలిత సేవా తత్పరులై చనుదెంచు యోగీంద్రులకు మానసానందకారియు, బహిఃకరణాంతఃకరణ పరితోష ప్రకీర్ణ రోమాంచ రుచిదాయకంబును,

**ప్రభాపూర్తి యుక్తంబును నగు మూర్తితోడ నిజ సౌందర్య వర కళా వినిర్జిత శ్రీరమణీ సౌందర్య భాసమానుం డగుచుఁ బాదచారియై యఖిల విశ్వగురుం డైన సర్వేశ్వరుండు వేంచేసె నప్పుడు.539**

* ఆ శ్యామసుందరుని చరణకంజాతాలలోని కింజల్క సమూహాలవలె వెలుగులు వెలార్చుతున్నవి తులసీదళాలు. ఆ తులసీదళాలతో మిళితములైన పుష్పమంజరుల మకరంద సుగంధాలతో చల్లగా మెల్లగా వీచే కమ్మని పిల్ల వాయువులను ఆస్వాదిస్తూ సేవాభావంతో యోగీంద్రులు ఆయన వెనువెంట నడుస్తున్నారు. ఆయోగీంద్రుల మనస్సులకు విష్ణుమూర్తి దివ్య స్వరూపం ఆనందదాయకమై వెలుపలి లోపలి ఇంద్రియాలకు సంతుష్టి కలిగిస్తున్నది. ఆ అనుభవంచేత వారు గగుర్పాటు చెందుతున్నారు. ఇటువంటి పరిపూర్ణ తేజోవంతమైన మూర్తితో విష్ణుమూర్తి నడచివచ్చాడు. ఆయన ప్రక్క లక్ష్మీదేవి నడచివస్తున్నది. మిక్కిలి శ్రేష్ఠమైన ఆమె సౌందర్యం విష్ణుమూర్తి సౌందర్యమునకు లోబడి అందులో ఒక అంశంగా వెలుగొందుతున్నది. ఈ విధంగా సకల జగజ్జనకుడైన సర్వేశ్వరుడు అక్కడికి విజయం చేశాడు.

**చ. స్థిరశుభలీల నట్లరుగుదెంచిన యవ్విభు విద్రుమారుణా**
**ధర నవపల్లవ స్ఫురదుదంచిత కుంద రుచిస్మితైక సుం**
**దర వదనారవిందము ముదంబునఁ దప్పక చూచియున్ మునీ**
**శ్వరులు నిజాత్మలం దనివి సొలక వెండియుఁ జూచి రిమ్ములన్. 540**

* సుస్థిరమై శుభకరమైన శోభావైభవంతో విచ్చేసిన ఆ విష్ణుమూర్తి పగడాల పెదవి క్రొంజిగురాకువలె ఉన్నది. స్వామి చిరునవ్వు ఆ చిగురాకుపై విలసిల్లే మల్లె మొగ్గల అందాన్ని అందుకున్నది. అటువంటి గోవిందుని సుందరవదనారవిందాన్ని సనక సనందనాదులు ఆనందంగా సందర్శించారు. మనస్సులు తృప్తిచెందక వారు మరల మరల మాధవుని సందర్శించారు.

**చ. సునిశితభక్తిఁ దన్ముఖముఁ జూచిన చూడ్కులు ద్రిప్పలేకయుం**
**గనుఁగొని రెట్టకేలకు నకల్మషభక్త విధూత ఖేదముల్**
**మునిజన చిత్త మోదములు ముక్తి నివాస కవాట భేదముల్**
**వినుత వినూత్న నూపురిత వేదము లమ్మహనీయు పాదముల్. 541**

* ఆ మునీంద్రులు అచంచలమైన భక్తిచే ఆ మహనీయుని ముఖాన్ని చూచిచూచి తమ చూపులను త్రిప్పుకోలేక ఎట్లాగో త్రిప్పుకొని ఆ స్వామిపాదాలమీద కేంద్రీకరించారు. ఆ పాదాలు భక్తుల ఖేదాలను పోగొట్టేవి; ఆపాదాలు మునుల చిత్తాలకు మోదాన్ని కలిగించేవి; ఆ పాదాలు మోక్షమందిరం ద్వారాలను తెరిపించేవి. ఆ పాదాలు వేదాలను క్రొంగ్రొత్త అందెలుగా అలంకరించుకొనేవి.

చ. కని నఖపద్మరాగమణి కాంతి విభాసిత పాదపద్మముల్
మనముల యందుఁ గీల్కొలిపి లబ్ధ మనోరథ యుక్తులై పునః
పునరభివందనంబులు విభూతి దలిర్ప నొనర్చి యోగ మా
ర్గ నిరత చిత్తులున్ వెదకి కానఁగ లేని మహానుభావునిన్. 542

* సంప్రాప్త మనోరథులైన సనక సనందనాది మహర్షులు నిరంతరం యోగమార్గాసక్తులైన మహాయోగులు సైతం ఎంత వెదకినా కన్పించని వాసుదేవుని కన్నులారా కన్నారు. పద్మరాగమణుల కాంతుల వంటి కాంతులతో ప్రకాశించే ఆ భగవంతుని పాదపద్మాలను తమ హృదయాలలో పదిలపరచుకొని పదేపదే నమస్కారాలు చేశారు.

క. మానసమున నిలిపిరి త, ద్ధ్యానాస్పదుఁడైన వానిఁ దత్త్వజ్ఞులకుం
గాన నగువాని భక్తజ, నానందకరైకమూర్తి నలరిన వానిన్. 543

* తదేక చిత్తంతో ధ్యానించేవారికి మాత్రం వశమయ్యేవాడూ, తత్త్వవేత్తలకు దర్శనమిచ్చేవాడూ, భక్తులైన వారికి బ్రహ్మానందాన్ని ప్రసాదించే స్వరూపం కలవాడూ అయిన ఆ పరాత్పరుణ్ణి తమ చిత్తాలలో నిలుపుకున్నారు.

వ. మఱియుం జక్షురింద్రియ గ్రాహ్యంబగు దివ్య మంగళ విగ్రహంబు ధరియించి యున్న పురుషోత్తము నుదాత్త తేజోనిధిం జూచి సనకాదు లిట్లని స్తుతియించిరి. 544

* కన్నులవిందు కావించే దివ్యమంగళ స్వరూపాన్ని ధరించిన ఆ మహానుభావుణ్ణి - ఆ పురుషోత్తముణ్ణి - ఆ అనంత తేజోనిధిని సనకాదులు ఈ విధంగా సంస్తుతించారు.

### -: సనకాదులు నారాయణుని స్తుతించుట. :-

చ. వనజదళాక్ష! భక్తజనవత్సల! దేవ! భవత్సుతుండు మ
జ్జనకుఁడునై న పంకరుహజాతుఁడు మాకు రహస్య మొప్పఁ జె
ప్పిన భవదీయ మంగళ గభీర పరిగ్రహ విగ్రహంబు మే
మనయముఁ జూడఁ గంటిమి కృతార్థులమై తగమంటి మీశ్వరా! 545

* పద్మపత్రాలవంటి నేత్రాలు కలిగి భక్తులను పరమవాత్సల్యంతో పాలించే దేవదేవా! నీకు తనయుడూ మాకు జనకుడూ అయిన బ్రహ్మ దేవుడు నిన్ను సందర్శించే ఉపాయం మాకు ఉపదేశించాడు. అటువంటి నీ దివ్యమంగళ స్వరూపాన్ని ఈనాడు చూడగలిగాము. ధన్యులమైనాము. ఓ ప్రభూ! మా జన్మ సార్థకమైనది.

సీ. దేవ! దుర్జనులకు భావింప హృదయసంగతుఁడవై యుండియుఁ గానఁబడవు
కడఁగి నీ దివ్యమంగళ విగ్రహంబునఁ జేసి సమంచితాశ్రితుల నెల్లఁ

**జేకొని సంప్రీత చిత్తులఁ గాఁ జేయు దతిశయ కారుణ్యమతిఁ దనర్చి**
**కమలాక్ష! సర్వలోకైక నాయక! భవ త్సందర్శనాభిలాషానులాప**

**తే. విదితదృఢ భక్తియోగ ప్రవీణు లగుచు, నర్థిమై వీతరాగులైనట్టి యోగి**
**జనమనః పంకజాత నిషణ్ణమూర్తి, వని యెఱుంగుదురయ్య, నిన్నాత్మవిదులు. 546**

* దేవా! నీవు దుర్జనుల హృదయంలో కూడా ఉంటావు. అయితే వారి భావనలకు అందవు. పట్టుదలతో నీ దివ్యమంగళ విగ్రహాన్ని ఆశ్రయించి ఆరాధించేవారిని అపారకారుణ్యంతో చేరదీసి నీ వారినిగా చేసుకుంటావు. వారికి సంతుష్టి కలిగించుతావు. కమలాక్షా! సకలభువన ప్రజాధ్యక్షా! నిన్ను దర్శించాలనే అభిలాష కలగడంవల్లా మాటిమాటికి నిన్ను గూర్చి చెప్పుకొనడం వల్లా సుస్థిరమైన భక్తియోగం అవగత మవుతుంది. రాగ ద్వేషాలు తొలగినటువంటి యోగిజనుల మనఃపద్మాలలో నీవు ఆసీనుడవై ఉంటావని ఆత్మవిదులైన వారు తెలుసుకుంటారు.

**క. యుక్తిం దలఁప భవద్వ్యతి, రిక్తములై నట్టి యితర దృఢ కర్మంబుల్**
**ముక్తిదము లయిన నీ పద, భక్తులు దత్కర్మములను బాటింప రిలన్. 547**

*దేవా! నీ పాదాలపై మనస్సు లగ్నం చేసిన భక్తులు నీ భక్తికి వ్యతిరిక్తాలైన ఇతర కార్యాలను - అవి ముక్తినిచ్చేవైననూ - ఎంతటి గొప్పవైననూ - వాటిని పాటింపరు.

**ఉ. కావునఁ గీర్తనీయ గతకల్మష మంగళ తీర్థ కీర్తి సు**
**శ్రీ విభవ ప్రశస్త సుచరిత్రుఁడ వైన భవత్పదాబ్జ సే**
**వా విమలాంతరంగ బుధవర్గ మనర్గళభంగి నన్యమున్**
**భావమునం దలంచునె కృపాగుణభూషణ! పాపశోషణా! 548**

*దేవా! నీవు అపారకృపాగుణమే అలంకారంగా కలవాడవు. భక్తుల పాపాలను పటాపంచలు చేసేవాడవు. కొనియాడ తగినదై కల్మష రహితమై కల్యాణాలకు కాణాచియై విశాల యశోవిరాజితమైన పవిత్ర చరిత్ర కలవాడవు. నీ పాదపద్మాల సేవకే అంకితమై అతి నిర్మలమైన అంతరంగం కల మహానుభావులు నిన్ను తప్ప మరి దేనినీ తమ మనస్సులలో చింతింపరు.

**చ. పరమ తపోవిధూత భవపాపులమై చరియించు మాకు నేఁ**
**డరయ భవత్పదాశ్రితుల కల్గి శపించిన భూరిదుష్కృత**
**స్ఫురణ నసత్పథైక పరిభూతులమై నిజధర్మహానిఁగా**
**నిరయము నొందఁగా వలసె నేరము వెట్టక మమ్ముఁ గావవే! 549**

* అపారమైన తపస్సులు చేసి పాపాలు పోగొట్టుకొని తిరిగే మేము ఈ దినం మీ పాదాశ్రితులపై కోపించి శాపం పెట్టాము. మహాపాపానికి ఒడిగట్టాము. చెడుమార్గంలో అడుగుపెట్టి ధర్మగ్లాని తలపెట్టాము. నరకానికి జేకొట్టాము. మా తప్పు క్షమించు. మమ్మల్ని రక్షించు.

చ. కర మనురక్తిషట్పదము క్రమ సుగంధ మరంద వాంఛచేఁ
దరమిడి శాత కంటక వృతస్ఫుట నవ్యతర ప్రసూన మం
జరులను డాయుపోల్కిని భృశంబగు విఘ్నములన్ జయించి నీ
చరణ సరోజముల్ గొలువ సమ్మతి వచ్చితిమయ్య, కేశవా! 550

* పుండరీకాక్షా! గండుతుమ్మెద నిండు కౌతుకంతో కమ్మకమ్మని మకరందం కోసం వాడి ముండ్లతో కూడిన క్రొంగ్రొత్త పూలగుత్తులను సమీపించినట్లుగా అధికమైన ఆటంకాలను అధిగమించి నీ పాదపద్మాలను ఆసక్తితో అనురాగంతో ఆరాధించడానికి అరుదెంచాము.

చ. అలరు భవత్పదాంబుజ యుగార్పితమై పొలుపొందునట్టి యీ
తులసి పవిత్రమైన గతిఁ దోయజనాభ! భవత్కథాసుధా
కలితములైన వాక్కుల నకల్మషయుక్తిని విన్నఁ గర్ణముల్
విలసిత లీలమై భువిఁ బవిత్రములై విలసిల్లు మాధవా! 551

* ఓ పద్మనాభా! ఓ రమావల్లభా! నీ పాదారవిందాలపై అర్పింపబడి అందాలు చిందే ఈ తులసి పవిత్ర మైనట్లు నీ కథామృతంతో కూడిన వాక్కులను కల్మషం లేకుండా విన్న మా చెవులుకూడా పరమ పవిత్రాలై భాసిల్లుతాయి.

చ. మహితయశోవిలాస గుణమండన! సర్వశరణ్య! యింద్రియ
స్పృహులకుఁ గానరాక యతసీకుసుమద్యుతి నొప్పుచున్న నీ
సహజ శరీర మిప్పుడు భృశంబుగఁ జూచి మదీయ దృక్కు లిం
దహహ! కృతార్థతం బొరసె నచ్యుత! మ్రొక్కెద మాదరింపవే! 552

* మహనీయమైన యశోవిలాసంచే ప్రకాశించే సుగుణాలు కలవాడా, అందరికీ ఆశ్రయింప దగినవాడా, పంచేంద్రియాలకు తలవంచిన వారికి నీరూపం కనిపించదు. నల్ల అవిసెపూవువంటి కాంతితో ఒప్పే నీ సహజ స్వరూపాన్ని ఇప్పుడు మేము సంతృప్తిగా చూడ గలిగాము. మా కన్నులు ధన్యము లయ్యాయి. ఓ అచ్యుతా! నీకు నమస్కరిస్తున్నాము. మమ్ములను కటాక్షించు.

క. అని సనకాదులు దత్పద, వనజములకు మ్రొక్కి భక్తి వశమానసులై
వినుతించిన గోవిందుఁడు, మునివరులం జూచి పలికె ముదితాత్ముండై. 553

* ఈ విధంగా సనకసనందనాదులు గోవిందుని పాదారవిందాలకు మ్రొక్కి భక్తితో పరవశించిన మనస్సు గలవారై విన్నవించుకున్నారు. సంతుష్టాంతరంగుడైన ముకుందుడు మునిపుంగవులతో ఇట్లా అన్నాడు.

వ. ఈ యిరువురు జయవిజయాభిధానంబులు గల మదీయ ద్వారపాలకులు, వీరు మిమ్ముం గైకొనక మదీయాజ్ఞాతిక్రమణులయి చేసిన యపరాధంబునకుఁ దగిన దండంబు గావించితిరి, అది నాకు

**నభిమతం బయ్యె, నదియునుం గాక భృత్యవర్గంబు సేయు నపరాధంబు స్వామిదియ, కాన యీ తప్పునకు మాననీయుండనైన నన్ను మన్నించి ప్రసన్ను లగుదురుగాక యని వెండియు నిట్లనియె.554**

* ఈ యిరువురు జయుడు, విజయుడు అనుపేర్లు కలవారు. నా ద్వారపాలకులు మిమ్మల్ని లెక్కచేయక నా ఆజ్ఞను అతిక్రమించి చేసిన నేరానికి మీరు వీరికి తగినశిక్ష విధించారు. అది నాకుకూడా ఇష్టమే. అంతేకాక సేవకులు చేసే అపరాధం యజమానిదే. అయితే ఈ తప్పుకు మాననీయుడనైన నన్ను మన్నించి దయచూపండి.

ఈవిధంగా పలికి శ్రీహరి మళ్లీ ఇలా అన్నాడు.

**చ. తనువునఁ బుట్టినట్టి బెడిదంబగు కుష్ఠమహాగదంబుచే**
**వనరి తదీయచర్మము వివర్ణత నొందినరీతి భృత్యు లొ**
**ప్పని పని సేసినన్ విభులు బంధురచారుయశంబుఁ బేరుఁ బెం**
**పును జెడిపోయి దుర్యశముఁ బొందుచు నుందురు విష్టపంబులన్. 555**

* భయంకరమైన కుష్ఠరోగం దేహంలో ప్రవేశించినప్పుడు చర్మం చెడిపోయి రంగు మారినట్లుగా సేవకులు తగనిపని చేయడంవల్ల ప్రభువుల యశస్సు నశించి పేరుప్రతిష్ఠలు దెబ్బతింటాయి. లోకంలో దుష్కీర్తి వ్యాపిస్తుంది.

**చ. అలవడ నాకు మీవలన నబ్బిన తీర్థ సుకీర్తనీయ స**
**ల్లలిత వినిర్మలామృత విలాస యశో విభవాభిరామమై**
**వెలయు వికుంఠ నామ మపవిత్రమనశ్శ్వప చాధమాది లో**
**కుల చెవి సోఁకఁ దత్క్షణమ కోరి పునీతులఁ జేయు వారలన్. 556**

* మీవల్ల నాకూ లభించిన వైకుంఠమనే ఈ పుణ్యక్షేత్రం ఎంతో పవిత్రమూ, స్తుతిపాత్రమూ, అత్యంతసుందరమూ, అమృతమయమూ, కీర్తి వైభవశోభితమూ. అటువంటి వైకుంఠధామం తన నామం చెవిసోకగానే ఎటువంటి అపవిత్రులనైనా - కుక్కమాంసం తినే పరమనీచులనైనా పవిత్రులను చేస్తుంది.

**తే. అట్టి నేను దలంప మీ యట్టిసాధు, జనుల కపకార మర్థిఁజేసిన మదీయ**
**బాహుసములైనఁ ద్రుంతు నుత్సాహలీల, నన్న నితరుల మీ మ్రోల నెన్ననేల? 557**

* అటువంటి నేను మీవంటి సాధుజనులపట్ల అపరాధం చేసినవారు, నా చేతులతో సమానమైన వారైనాసరే వారిని ఖండించటానికి ఏమాత్రం వెనుకాడను. అటువంటప్పుడు ఇతరులమాట వేరే చెప్పడం ఎందుకు?

**క. ధరణి సురోత్తమ సేవా, పరిలబ్ధం బయిన యట్టి పాతక నాశం**
**కర నిఖిల భువన పూత, స్ఫురి తాంఘ్రి సరోజ తోయములు గల నన్నున్. 558**

క. అలఘుమతి విరక్తునిఁగాఁ, దలఁపక నిజ శుభ కటాక్ష దామక కలితా
ఖిల సంపద్విభవ శ్రీ, లలనా రత్నం బురస్థలంబును జెందెన్. 559

* బ్రాహ్మణ శ్రేష్ఠుల పరిచర్యవలన ప్రాప్తించి నట్టిదీ, సర్వపాపాలను శమింపజేయగలదీ, సమస్త లోకాలను పవిత్రం కావింపగలదీ అయిన గంగ నా పాదాలలో ప్రాదుర్భవించింది. అటువంటి నన్ను విరక్తుడని తేలికగా భావింపక, శుభకరమైన తన కడకంటి చూపులనే పూలదండలతో సకల సంపదలను ఆకర్షించగల లలనామణి లక్ష్మి నా వక్షస్థలాన్ని అలంకరించింది.

చ. క్రతువులు సేయుచో శిఖిముఖంబున వేలుచునట్టి తద్ఘృత
ప్లుత చరుభక్షణన్ ముదముఁ బొందదు నిస్పృహధర్మమార్గ సం
గతుఁడగు భూసురోత్తము ముఖంబున వేడ్కఁ భుజించు నయ్యవి
స్తృతకబళంబునన్ మనము తృప్తి వహించినరీతి నిచ్చలున్. 560

* ఆశారహితుడై ధర్మమార్గంలో సంచరించే బ్రాహ్మణోత్తముడు పరమేశ్వ రార్పణమని భక్షించే ఒక చిన్న అన్నంముద్ద వల్ల నా మనస్సుకు కలిగే సంతృప్తి యజ్ఞయాగాలలో నేతిలో ముంచి అగ్ని ముఖంగా వేల్చబడే హవిస్సును అందుకొని ఆరగించేటప్పుడు కూడా నాకు కలుగదు.

సీ. సతతంబు నప్రతిహత యోగమాయా విభూతిచేఁ బ్రఖ్యాతిఁ బొందు నేను
నే మహీసురుల సమిద్ధ నిర్మల పాద నళిన రజోవితానములు భక్తి
హాటక నవరత్న కోటీరమునఁ దాల్తు నట్టి నా చరణాంబుజాంబువులను
దవిలి ధరించి సద్యః పునీతాత్ములై రర్థిఁ జంద్రావతంసాది దేవ

తే. చయము, లెవ్వాఁడు బ్రాహ్మణ జనులు దమకు, నపకృతుల్ సేసిరేని మా ఱలుగఁ డతఁడు
విప్రులను నన్నుఁగాఁగ భావించు నతఁడు, ధర్మ పద్ధతి నా ప్రియతముఁడు వాఁడు. 561

* ఎదురులేని యోగమాయావైభవంతో ఎల్లప్పుడూ ప్రసిద్ధుడనైన నేను బ్రాహ్మణుల పవిత్రమైన పాదపద్మ పరాగాలను భక్తితో నా నవరత్నఖచిత సువర్ణకిరీటాన ధరిస్తాను. అటువంటి నా పాదపద్మాలలో జన్మించిన గంగాజలాన్ని తలపై ధరించి పరమశివుడు మొదలైన దేవతలు వెంటనే పవిత్రు లవుతున్నారు. ఎవడు బ్రాహ్మణులు తమకు అపకారం చేసినా తిరిగి ఆగ్రహింపడో, ఎవడు బ్రాహ్మణులను నన్నుగా భావిస్తాడో అటువంటివాడు ధర్మానుసారంగా నాకు మిక్కిలి ప్రియమైన వాడు.

ఉ. గోవితతిన్ ధరాదివిజకోటిని నన్నును దీనవర్గమున్
వావిరి భేదబుద్ధిఁ గనువార లధోగతిఁ బొంద, నందు నా
శీవిషరోషవిస్ఫురణఁ జెంది కృతాంతభటుల్ మహోగ్ర గృ
ధ్రావలిపోలెఁ జంచువుల నంగము లుద్ధతిఁ జింతు రెప్పుడున్. 562

* ఎవరైతే బ్రాహ్మణులనూ, నన్నూ, దీనజనులనూ భేదబుద్ధితో చూస్తారో వారు అధోగతి పాలవుతారు. త్రాచుపాములవలె రోషంతో బుసలు కొట్టే యమభటులు గ్రద్దలవలె భయంకరమైన ఉక్కుముక్కులతో అటువంటివారి అవయవాలను చీల్చిచెండాడుతారు.

చ. ధరణి సురోత్తముల్ బహువిధంబులఁ దమ్ముఁ బరాభవించినన్
దరహసితాస్యులై యతిముదంబున నిచ్చలుఁ బూజ సేయుచున్
సరస వచో విలాసముల సన్నుతి సేయుచుఁ దండ్రి నాత్మజుల్
గర మనురక్తిఁ బిల్చుగతిఁ గైకొని పిల్చినవారు నా సముల్. 563

* బ్రహ్మవేత్తలైన బ్రాహ్మణుల వల్ల తమకు అవమానం ప్రాప్తించినా చిరునవ్వు ముఖంతో సహించి నిత్యమూ వారిని పూజించుతూ, మంచి మాటలతో గౌరవించుతూ కన్నతండ్రిదగ్గర చిన్నబిడ్డలు ప్రవర్తించినట్లు అనురాగపూర్వకంగా వర్తించేవారు భగవంతునితో సమానులు.

క. వినుఁ డయ్యనఘచరిత్రుల, కనయముఁ బ్రియతముఁడ నగుచుఁ నమ్ముడువోదున్
మును నన్ను భృగువు దన్నినఁ, గనలక పరితోషవృత్తిఁ గైకొంటిఁ గదే. 564

* అటువంటి పుణ్యాత్ములకు నేను ఎప్పుడూ ప్రియతముడనై అమ్ముడుపోతూ ఉంటాను. పూర్వం నన్ను భృగుమహర్షి తన్నగా నేను ఆగ్రహింపక అత్యంత సంతోషంతో ఆయనను ఆదరించాను గదా!

సీ. పొలుచు నా మానసాంభోజాత భావంబుఁ దెలియంగ లేక యుద్వృత్తు లగుచుఁ
గడఁగి మీ యానతిఁ గడచినఁ దద్దోష ఫలము వీరలకు సంప్రాప్తమయ్యె,
మునులార! నా చిత్తమున నున్న రీతియు నిట్టిద, భూమిపైఁ బుట్టి వీర
లచిరకాలమున నా యంతికంబున కోలి నరుదెంచు నట్లుగా ననుమతింప

తే. వలయునని య ముకుందుండు వలుకుటయును, విని మనంబున సనకాదిముని వరేణ్యు
లమ్మహాత్ముని మృదుల భాషామృతంబుఁ, దవిలి క్రోలియు రోష సందష్టు లగుచు. 565

* "మహామునులారా! నా హృదయకమలంలోని అభిప్రాయాన్ని వీరు తెలిసికోలేక పోయారు. మిక్కిలి మిడిసిపాటుతో మీ యాజ్ఞ మీరి ప్రవర్తించినందుకు దానికి తగిన ప్రతిఫలం అనుభవించారు. నా సంకల్పం కూడా ఇదే. ఏమంటే వీరు భూమిపై పుట్టి కొలదికాలంలో తిరిగి నా సమీపానికి వచ్చునట్లు అనుమతి ఇవ్వండి''. ఈ విధంగా విష్ణువు పలుకగా విని, సనకాది మునివరేణ్యులు, ఆ మహాత్ముని సుకుమార వచనామృతాన్ని రుచిచూచి కూడా అభిమానాన్ని విడువలేక పోయారు.

సీ. మునివరుల్ తమ చిత్తములఁ దృప్తిఁ బొందక పంకజాతాక్షుఁడు పలికి నట్టి
పరిమిత గంభీర బహుళార్థ దురవగాహములును విస్ఫుర దమృత తుల్య
మాధుర్య సుగుణ సమన్వితమ్ములు వినిర్గత శబ్దదోష నికాయములును
నైన వాక్యములకు నాత్మలఁ బరితోష మంది యిట్లనిరి నెయ్యమున మనల

**తే. నొడయఁ డిప్పుడు నందించియో, తలంప, నర్థి నిందించియో, మత్కృతైక దండ**
**మునకు సంకోచ మందియో, యనుచు సంశ, యాత్మ లగుచు వివేకించి యంతలోన. 566**

* మునీశ్వరుల మనస్సులు తృప్తిచెందలేదు. పరిమితములూ, గంభీరములూ, విశేషార్థములూ, అగోచరములూ, అమృతతుల్యములూ, మాధుర్యగుణ సహితములూ, దోషరహితములూ అయిన మహా విష్ణువు మాటలకు మనస్సులో ఎంతో సంతోషించికూడా మన ప్రభువు, మనపై స్నేహభావం కలిగి మనలను అభినందిస్తున్నాడా! లేక మనలను నిందిస్తున్నాడా, మనము విధించిన శిక్షకు సంకోచంతో స్పందిస్తున్నాడా! అనే సందేహంతో క్రిందుమీదైనారు. కొంతసేపటికి ఒక నిర్ణయానికి వచ్చారు.

**క. నళినాక్షుఁడు దమదెసఁ గృప, గలిగిన భావంబుఁ దెలిసి కౌతుక మొలయం**
**బులకీకృతాంగులై యు, త్కలికన్ హర్షించి నిటల ఘటితాంజలులై 567**

* హరి తమపై పరిపూర్ణమైన అనుగ్రహం కలిగి ఉన్నాడని తెలుసుకున్నారు. ఎంతో సంతోషంతో పొంగి పులకించారు. హర్షోత్కర్షంతో నుదుట చేతులు మోడ్చి నమస్కరించారు.

**క. భరిత నిజ యోగమాయా, స్ఫురణం దనరారు నతి విభూతియు బలముం**
**బరమోత్కర్షముఁ గల యీ, శ్వరునకు నిట్లనిరి మునులు సద్వినయమునన్. 568**

* అప్పుడు స్వయంగా కల్పించుకున్న యోగమాయాప్రభావం వల్ల విలసిల్లే, దివ్యమైన ఐశ్వర్యంతో, భవ్యమైన పరాక్రమంతో, సర్వోత్కృష్టుడై ఒప్పుతున్న వాసుదేవునితో వినయ వినమ్రులైన మునులు ఇట్లా అన్నారు.

**తే. పొలుపు దీపింప నిత్యవిభూతి నాయ, కుఁడవు, భగవంతుఁడవు, ననఘుఁడవు, నీవు**
**మత్కృతం బప్డు నీ కభిమత మటంటి, వీశ! భవదీయచారిత్ర మెఱుఁగఁ దరమె? 569**

* దేవా! నీవు అత్యంత తేజోవంతుడవు. నిత్యైశ్వర్య సంపన్నుడవు. సకలభువన నాయకుడవు. భగవంతుడవు. పుణ్యస్వరూపుడవు. ఇప్పుడు మేము చేసినపని నాకు సమ్మతమే అన్నావు. స్వామీ! నీ లీలలు తెలిసికోవడం ఎవరికి సాధ్యం?

**ఉ. దేవగణాళి కెల్లఁ బరదేవతలై తనరారునట్టి వి**
**ప్రావళి కాత్మనాయకుఁడవై పెనుపొందిన నీకు నీ ధరా**
**దేవత లెల్ల నెన్న నధిదేవతలై రఁట, యెట్టి చోద్యమో**
**దేవ! సమస్త పావన! సుధీజనతావన! విశ్వభావనా! 570**

* దేవాదిదేవా! నీవు పరమపావనుడవు. సాధుజన రక్షకుడవు. సర్వజ్ఞుడవు. దేవతలందరికీ పరదేవతలైన భూసురుల ఆత్మలకు అధినాయకుడవు. దేవదేవుడవైన నీకు ఈ మహీదేవులు ఆరాధ్యదేవత లగుట ఎంతవింత?

చ. కమలదళాక్ష! నీవలనఁ గల్గిన ధర్మము తావకావతా
రముల సురక్షితం బగుఁ, దిరంబగు, నీశ్వర నిర్వికార త
త్త్వమునఁ దనర్చు నిన్నరయఁ దత్ఫల రూపముఁ దత్ప్రధాన గో
ప్యము నని పల్కుచుందురు కృపామయలోచన! పాపమోచనా! 571

* కమలలోచనా! కలుషవిమోచనా! నీనుండి ఉద్భవించిన ధర్మం నీ అవతారాలవల్ల సురక్షితమై సుస్థిరమై విలసిల్లుతుంది. ఈశ్వరా! దయామయా! మార్పుపొందని సత్యస్వరూపంలో ఉన్న నిన్ను గమనిస్తే నీవే ఆ ధర్మానికి ఫలస్వరూపమనీ, నీవే ఆధర్మంలోని ప్రధాన రహస్యమనీ పెద్దలు అంటుంటారు.

చ. మహిఁ దలపోయ నెవ్వని సమగ్రపరిగ్రహమున్ లభింప ని
స్స్పృహమతులై మనీశ్వరులు మృత్యుభయంబునఁ బాతు,రట్టి స
న్మహిత వివేకశాలి! గుణమండన! నీ కిల నన్యసత్పరి
గ్రహ మది, యెట్టి చోద్యము? జగత్పరిపాలన! నిత్యఖేలనా! 572

* సుగుణ భూషణా! భువనపోషణా! నిత్యవినోదీ! ఏ మహనీయుని సమగ్రమైన అనుగ్రహం లభింపగానే వైరాగ్యసంపన్నులైన మునీశ్వరులకు మృత్యుభయం తొలగిపోతుందో అటువంటి విశేషవివేక శాలికి జగన్నాటక సూత్రధారికి నీకు ఈ లోకంలో వేరొక్కరి అనుగ్రహమనేది ఎంతగానో వింతగా ఉన్నది.

సీ. సతతంబు నర్థార్థిజనశిరోఽలంకార పదరేణువులు గల పద్మ నేఁడు
జలజ కింజల్క నిష్యంద మరంద లోభాగత భ్రమర నాయకుని పగిది
ధన్యజనార్పితోదంచిత తులసికా దామంబునకు నిజధామ మగుచు
భాసిల్లు భవదీయ పాదారవిందముల్ విలసిత భక్తి సేవింపుచుండ

తే. కమల నయన! కృపావలోకనము లొలయ, నర్థిఁ జూడవు భాగవతానుర క్తిఁ
జేసి భవదీయ మహిమంబు చిత్ర మరయఁ, జిరశుభాకార! యిందిరా చిత్తచోర! 573

* ఆమె పాదపద్మపరాగాలు అర్థాన్ని ఆకాంక్షించే భక్తుల శిరస్సులకు అలంకారాలు. అటువంటి లక్ష్మీదేవి కమల కింజల్కాలనుండి స్రవించే మకరందం మీది ఆశతో అరుదెంచిన తుమ్మెదల రాణివలె నీచరణ కమలాలను భక్తితో సేవిస్తూ ఉంటుంది. అదే సమయంలో పరమధన్యులైన భక్తవరేణ్యులు మంచి మంచి తులసి మాలికలను కొనివచ్చి నీ పాదాలమీద ఉంచుతూ ఉంటారు. అటువంటి సందర్భంలో ఈ భక్తుల మీది అనురక్తితో ఆ లక్ష్మీదేవిని కనికరంతో కన్నెత్తి అయినా చూడవు. కమలలోచనా! శుభాకారా! రమావరా! నీ మహిమలు చిత్రాతిచిత్రాలు.

మ. చిరభాగ్యోదయ! దేవ దేవ! లలిత శ్రీవత్సలక్ష్మాంగ! యీ
వర విప్రానుపదైక పుణ్యరజ మే వర్ణింప నీ మేని కా

భరణం బంటివి, సర్వలోకులకు విప్రశ్రేణి మాహాత్మ్య మీ
వెఱుఁగం జెప్పుటకై ధరించితి గదా యెన్నం బవిత్రాకృతిన్. 574

* దేవదేవా! నీవు శాశ్వతమైన ఐశ్వర్యమును ప్రసాదించే స్వామివి! అందమైన శ్రీవత్సమనే పుట్టుమచ్చతో అలరారువాడవు, " ఈ శ్రేష్ఠులైన బ్రాహ్మణుల పాదముల నంటిన పుణ్యపరాగమే నా శరీరానికి ఆభరణం అన్నావు." సమస్త ప్రజలకూ బ్రాహ్మణుల గొప్పతనం తెలియజెప్పటానికే పవిత్రమైన ఆ రజస్సును నీవు ధరించావు.

వ. అదియునుంగాక. 575

సీ. ధర్మమూర్తివి జగత్కర్తవు నగు నీవు ప్రోవంగఁ దగువారిఁ బ్రోవవేని
నవిరళవేదోక్తమగు ధర్మమార్గ మసన్మార్గ మగుఁ, గాన, సత్త్వగుణ వి
శిష్టుండ వగుచు నీ జీవసంఘము సేమ మరసి రక్షింతు నీ దైన శక్తి
చేతను ధర్మవిఘాతుల దండించు నీకు నంచిత మైన నిగమధర్మ

తే. మార్గ నాశక విధములు మదికి నింపు, గావు, విప్రులయందు సత్కరుణ మెఱసి
ఘనతఁ బలికిన వినయవాక్యములు నీకు, యుక్త మగుచుండు సతతంబు భక్తవరద! 576

* అంతేగాక నీవు ధర్మమూర్తివి! ఈ సమస్త విశ్వానికీ కర్తవు! నీవు రక్షింపదగిన వారిని రక్షిస్తావు. అలా కాకపోతే వేదాలలో చెప్పిన ధర్మమార్గాలు అధర్మమార్గా లవుతాయి. అందువల్ల సత్త్వగుణాన్ని స్వీకరించి ఈ ప్రాణికోటుల యోగక్షేమాలు తెలుసుకొని దాక్షిణ్యంతో రక్షిస్తావు. ధర్మద్రోహులను దండించే నీ మనస్సుకు వేదధర్మానికి విరుద్ధమైన పద్ధతులు ప్రియంకావు. ధరణీసురులపై కరుణ గల్గి వినయంతో పల్కిన ఈ ఉక్తులు భక్తవరదుడ వైన నీకు యుక్తమై ఉన్నాయి.

వ. అట్లయినం బరులయెడ వినయంబులు వలికినఁ బ్రాభవహాని యగు నని తలంచితివేని. 577

* ఇతరులపట్ల ఇంత వినయంగా పలికే పలుకులవల్ల గౌరవహాని సంభవించునంటావేమో అలా కాదు.

తే. విశ్వమునకెల్లఁ గర్తవు విశ్వనిధివి, విశ్వసంరక్షకుండవై వెలయు నీకు
గడఁగి ప్రాభవహాని యెక్కడిది? దలఁప, వినయములు నీకు లీలలై వెలయుఁగాన. 578

* ఎందుచేతనంటే విశ్వకర్తవూ, విశ్వమూర్తివీ, విశ్వసంరక్షకుడవూ అయి విరాజిల్లే విభుడవు. నీవైభవానికి హాని ఎక్కడిది? ఈ వినయాలు నీ లీలావిలాసాలు, అంతే.

తే. మునులమగు మమ్ము నతిమోదమునను నీవు, సత్కరించుట లెల్ల సజ్జనపరిగ్ర
హార్థమై యుండుఁగాదె, మహాత్మ! యొకటి, విన్నవించెద మీ జయవిజయులకును. 579

తే. అలిగి మేము శపించితి మంతకంటె బెడిద మగు నాజ్ఞ సేయ నభీష్టమేనిఁ
జేయు, మదిగాక సమధికశ్రీ దనర్పఁ,జేసి రక్షించెదేని రక్షింపు మీశ! 580

* మహానుభావా! మునులమైన మమ్మలను అత్యంత సంతోషంతో ఆదరించి గౌరవించడం నీ సజ్జనానుగ్రహస్వభావం తప్ప మరొకటి కాదు. అయిన స్వామీ! ఒక చిన్నవిన్నపం. ఈ జయవిజయులపై అలిగి మేము వీరిని శపించాము. అంతకంటే కఠినంగా శిక్షింపదలచావా అలాగే శిక్షించు. అలాకాక వారికి ఇంకా ఎక్కువ సిరిసంపద లిచ్చి రక్షింపదలచావా అలాగే రక్షించు.

**వ. అట్లయిన మాకుం బ్రియం బగుం గావున ననపరాధులు నతి నిర్మలాంతఃకరణులునైన వీరలకు ననృతంబులు వలికితి మేని మమ్మయినం జిత్తంబు కొలంది నాజ్ఞాపింపుమని కరకమలంబులు మొగిచి కృతాంజలులై యున్న మునులం గరుణార్ద్ర దృష్టిం గనుంగొని. 581**

**క. అనఘుఁడు భగవంతుం డి, ట్లనియెన్ మునులార! వీర లలరన్ భువికిం**
**జని యచట నసురయోనిన్, జనియింతురు లోభమోహసంగతు లగుచున్. 582**

* నీవు అలాచేస్తే మాకు ప్రియంగా ఉంటుంది. నిరపరాధులూ, నిర్మల హృదయులూ అయిన వీరిని మేము పలుక కూడని విధంగా పలికి యుండినట్లైతే మమ్ముకూడా నీ ఇష్టం వచ్చినట్లు శాసించు అని చేతులు జోడించి నమస్కరించారు సనకాదులు. ఆ మునులను దయా దృష్టితో చూచి శ్రీహరి ఇలా అన్నాడు. ఓ మునులారా! ఈ జయవిజయు లిద్దరూ సంతోషంగా భూలోకానికి వెళ్ళుతారు. అక్కడ లోభమోహములు కలవారై రాక్షసులై జన్మిస్తారు.

**క. దేవజనావళి కుపహతిఁ, గావించుచు నిఖిల భువన కంటక వృత్తిన్**
**జీవించుచు నా యెడ సం, భావిత వైరానుబంధ భావులు నగుచున్. 583**

* ఆ లోకంలో లోలోపల నాపై విరోధభావం పూనినవారై దేవతలకూ మానవులకూ ఆపదలు కల్గిస్తూ, సర్వలోక కంటకులై జీవితం సాగిస్తారు.

**క. ఆహవముఖమున నను నతి, సాహసమున నెదిరి పోరి చక్ర నిశిత ధా,**
**రాహతిఁ దెగి వచ్చెద రు, త్సాహ మెలర్పంగ నాదు సన్నిధి కంతన్. 584**

* వీరు అతిసాహసంతో నన్ను ఎదిరించి యుద్ధం చేస్తారు. వాడియైన నా సుదర్శన చక్రంచేత ప్రాణాలు కోల్పోయినవారై ఉత్సాహంతో నా దగ్గరికి వస్తారు.

**వ. అదియునుం గాక. 585**

**క. నను వైరంబున నైనను, మనమునఁ దలఁచుటను నా సమక్షమున మదా**
**నన మీక్షించుచు నీల్గుట, ననఘాత్మకులై వసింతు రస్మత్పదవిన్. 586**

* అంతేకాక విరోధంచేతనైనా నన్ను తమ మనసులలో భావించి నందువల్లా, నా సమక్షంలో నా ముఖం చూస్తూ ప్రాణాలు విడిచినందువల్లా వీరు పాపరహితులై నా ఆస్థానంలో తమ స్థానాన్ని అలంకరిస్తారు.

క. వినుఁ డిలమీఁద నిఁ కెన్నఁటి, కిని బుట్టువు లేదు వీరికిన్, మీరలు వ
ల్కిన యట్ల నాదు చిత్తము, నను దలఁతుం గాన మీ మనంబుల నింకన్. 587

ఉ. దీనికిఁ జింతఁ దక్కుఁడు, సుధీజనపుంగవు"లన్నఁ బ్రీతులై
యా నలినాసనాత్మజు లనంతుని భావము దా మెఱింగి పెం
పూనిన వేడ్కఁ దేలి తెలివొందిన చిత్తములన్ నుతించి రం
భోనిధిశాయి నార్తజన పోషణ భూషణుఁ బాపశోషణున్. 588

* "మునులారా! ఈ మూడు జన్మల అనంతరం వీరికి జన్మలేదు. మీ మేరకే నేనుకూడా ఆలోచించాను. కాబట్టి మీ మనస్సులో దీనికై చింతించకండి. మీరు సజ్జన శ్రేష్ఠులు"అని విష్ణుమూర్తి పలుకగా బ్రహ్మ మానసపుత్రులైన సనకాదులు శ్రీహరిభావం తెలుసుకొని, అధికమైన ఆనందంలో మునిగితేలారు. వారు ప్రసన్నమైన హృదయాలతో క్షీరసాగరశయనుడూ, ఆర్తజన పోషణమే అలంకారంగా కలవాడూ, పాపాలను రూపుమాపేవాడూ అయిన శ్రీహరిని సన్నుతించారు.

వ. మఱియును. 589

ఉ. ఆ సనకాదు లంతఁ బులకాంకురముల్ నవలొత్త బాష్ప ధా
రా సుభగాక్షులై మునిశరణ్యావరేణ్యు నగణ్యు దేవతా
గ్రేసరు దివ్యమంగళ శరీరముఁ జారుతదీయ ధామమున్
భాసురలీలఁ జూచి నవపద్మ దళాక్షునకున్ వినమ్రులై. 590

* అంతట ఆ సనకాదులు నెమ్మేనులు పులకింపగా, ఆనందబాష్పధారలు కనులవెంట ప్రవహింపగా మునిజనశరణ్యులలో, వరేణ్యుడూ, దేవతాగ్రగణ్యుడూ అయిన శ్రీమన్నారాయణుని దివ్యమంగళ స్వరూపాన్నీ, వైభవోపేతమైన వైకుంఠధామాన్నీ సందర్శించి క్రొంగ్రొత్త తామర రేకులవంటి కన్నులుగల ఆ వెన్నునకు తలవంచి నమస్కరించారు.

క. తమ పలికిన భాషణములు, గమలోదరు భాషణములుగాఁ దలఁచుచు నె
య్యమునన్ వైష్ణవలక్ష్మిం, బ్రమదంబునఁ బ్రస్తుతించి పరమేశ్వరుచేన్. 591

క. ఆ మంత్రితులై తగ నిజ, ధామములకుఁ జనిరి వారు, దడయక లక్ష్మీ
కాముఁడు జయవిజయుల నభి, రామంబుగఁ జూచి పలికె రయ మొప్పారన్. 592

* సనకాదులు తమ వాక్కులు శ్రీహరి వాక్కులుగా భావించారు. విష్ణుమూర్తి అర్ధాంగలక్ష్మి అయిన లక్ష్మిని స్తుతించారు.

* అనంతరం పరమేశ్వరుని అనుమతి పొంది తమ నివాసాలకు వెళ్ళారు. లక్ష్మీ ప్రియుడు జయవిజయులను దాక్షిణ్యంతో వీక్షించి వెంటనే ఇట్లా పలికాడు.

క. మీ రసురయోనియం దని, వారితులై జనన మందవలసెను, నే దు
ర్వారబలాఢ్యుఁడ నయ్యును, వారింపఁగ నోప విప్రవచనము లెందున్. 593

* "మీరు తప్పనిసరిగా రాక్షసజాతిలో పుట్టవలసి వచ్చింది. నేను అనివార్యమైన శక్తి సామర్థ్యాలు కలవాడనే అయినా బ్రాహ్మణుల వాక్కును నివారించలేను."

క. అది గాన దనుజయోనిం, బదపడి జనియించి మద్విపక్షులరై మీ
మది నెపుడు నన్నె తలఁచుచు, వదలక నాచేతఁ జచ్చి వచ్చెద రిటకున్. 594

ఉ. పొండని యానతిచ్చి హరి ఫుల్లసరోరుహ పత్రనేత్రుఁ డా
ఖండల ముఖ్య దిగ్వర నికాయ కిరీట లసన్మణి ప్రభా
మండితపాదపీఠుఁడు రమారమణీమణి దోడ నేఁగుదే
నిండిన వేడ్కఁ నేఁగె నిజ నిర్మల పుణ్యనివాసభూమికిన్. 595

* "అందువల్ల రాక్షస జన్మ మీకు తప్పదు. మీరు రాక్షసులై జన్మించి నాకు ప్రతిపక్షులై మీ మనస్సులలో సర్వదా నన్నే తలంచుకొంటూ, నాచేత నిహతులై మళ్ళీ ఇక్కడికి వస్తారు. ఇక వెళ్లండి"అని ఆజ్ఞాపించి వికసించిన కమలపత్రాలవంటి నేత్రాలు కలవాడూ, దేవేంద్రాది దిక్పాలుర కిరీటాలలోని రత్నాలకాంతుల వల్ల ధగధగలాడే పాదపీఠం కలవాడూ అయిన మహావిష్ణువు లలనాశిరోమణి అయిన లక్ష్మీదేవి వెంటరాగా, అతిశయానందంతో నిర్మల తేజోవిరాజితమైన నిజమందిరానికి విజయం చేశాడు.

వ. అంత. 596

క. నిజతేజోహానిగ జయ, విజయులు ధరఁ గూలి రపుడు విహ్వాలు లగుచుం
ద్రిజగముల సురవిమాన, వ్రజముల హాహారవంబు గ్రందుగఁ జెలఁగన్. 597

* అనంతరం జయవిజయులు తమ తేజస్సు కోల్పోయి నిశ్చేష్టులై నేలకూలారు. అప్పుడు మూడు లోకాలనుండీ, దేవతా విమానాలనుండీ హాహాకారాలు వినిపించాయి.

క. వారలె యా దితిగర్భా, గారంబున నున్నవారు గడఁగి తదీయో
దార ఘన తేజ మిపు డని, వారణ మీ తేజ మెల్ల వమ్ముగఁ జేసెన్. 598

* ఆ జయవిజయులే ఇప్పుడు దితిగర్భంలో ఉన్నారు. వారి సాటిలేని మేటి తేజమే మీ తేజస్సు లన్నింటినీ వమ్ము చేసింది.

ఉ. ఇంతకు మూల మాహరి, రమేశ్వరుఁ డర్థి నొనర్చు కార్యముల్
వింతలె? సర్వభూత భవ వృద్ధి వినాశన హేతుభూతుఁ డా
ద్యంతవికార శూన్యుఁడు దయానిధి మీ యెడ మేలు సేయు నీ
చింతఁ దొఱంగి వే చనుఁడు, చేకుఱు మీకు మనోరథార్థముల్. 599

* దీని కంతా ప్రధాన కారణం నారాయణుడు. ఆ లక్ష్మీనాథుని లీలలు ఎంతో వింతగా ఉంటాయి. ఆయన సమస్తజీవరాసుల జన్మవృద్ధి క్షయాలకు హేతువైనవాడు, నిర్వికారుడు, దయాసముద్రుడు. మీకు తప్పక మేలు చేస్తాడు. మీ కోరికలు సిద్ధిస్తాయి. ఇక నిర్విచారంగా ఇళ్ళకు వెళ్ళండి.

**క. అని వనజాసనుఁ డాడిన, విని తద్వృత్తాంత మెఱిఁగి విబుధులు నాకం**
**బున కేఁగిరి, దితి నిజ నా, థుని మాటలు తలఁచి యపరితోషము తోడన్. 600**

* ఈ విధంగా బ్రహ్మదేవుడు పలుకగా దేవతలు ఆ వృత్తాంతమంతా తెలుసుకొని స్వర్గలోకానికి వెళ్లిపోయారు. దితి తన పతి మాటలు తలచుకొని అసంతుష్టి చెందింది.

## -: జయవిజయులు దితియందు హిరణ్యాక్ష హిరణ్యకశిపులై పుట్టుట :-

**తే. ఇంతి దనసుతుల్ సురలఁ గారింతు రనుచుఁ, దలఁచుచుండంగ నంత వత్సరశతంబు**
**సనఁగ నఁటమీఁదఁ గనియెఁ గశ్యపునిదేవి, యఖిల లోకైక కంటకు లైన సుతుల. 601**

* తన కుమారులు దేవతలను బాధిస్తారని దితి బాధపడసాగింది. క్రమక్రమంగా నూరు సంవత్సరాలు గడిచాయి. అప్పుడు దితి సకల భువన కంటకులైన ఇద్దరు కుమారులను కన్నది.

**వ. అయ్యవసరంబున. 602**

**తే. ధరణి గంపించెఁ, గులపర్వతములు వడఁకె, జలధులు గలంగెఁ, దారకావళులు డుల్లె,**
**గగన మగలెను, మ్రొగ్గె దిక్కరులు, దిశల, మిడుఁగుఱు లెగసెఁ, బిడుగులు పుడమిఁ బడియె.603**

* ఆ సమయంలో భూమి కంపించింది. కులపర్వతాలు వణకాయి. సముద్రాలు కలత చెందాయి. నక్షత్రాలు నేల రాలాయి. ఆకాశం బ్రద్దలైంది. అష్టదిగ్గజాలు ఊగసాగాయి. దిక్కులనిండా నిప్పురవ్వలు గుప్పున లేచాయి. పుడమిపైన పిడుగులు పడ్డాయి.

**సీ. హోమానలంబుల ధూమంబు లడరెను బ్రతికూల వాయువుల్ బలసి వీచెఁ**
**దరువు లెల్లెడ విటతాటంబులై కూలె గ్రహ తారకావళి కాంతి మాసె,**
**బెరసి మొగిళ్లు నెత్తురువాన గురిసెను మెఱుఁగులు దెసల మిర్మిట్లుగొలిపె**
**స్వర్భానుఁడొగి నపర్వమున భానునిఁ బట్టెఁ గైకొని చిమ్మచీఁకట్లు పర్వె,**

**తే. మొనసి కుక్కలు మొఱిఁగెను మోర లెత్తి, పగలు నక్కలు వాపోయె, ఖగము లార్త**
**రవము లిచ్చెను, దేవతాప్రతిమ లొరఁగెఁ, గన్నులను నశ్రుకణములు గ్రందు కొనఁగ. 604**

* హోమకుండాలలో అగ్నులు పొగలుగ్రక్కాయి. ఎదురుగాలులు ఎక్కువగా వీచాయి. వృక్షాలు పెళపెళ విరిగిపడ్డాయి. గ్రహాలు నక్షత్రాలు వెలవెల పోయాయి. మేఘాలు నెత్తురువాన కురిశాయి. నలుదెసలా మెరుపులు మిరుమిట్లు గొల్పాయి. గ్రహణసమయం కాకుండానే రాహువు సూర్యుణ్ణి కప్పివేశాడు. కారుచీకట్లు అంతటా వ్యాపించాయి. కుక్కలు మోరలెత్తి మొరిగాయి. పట్టపగలే నక్కలు కూశాయి. పక్షులు దీనంగా ధ్వనులు చేశాయి. దేవతావిగ్రహాలు కన్నులలో బాష్పబిందువులు జాలువారగా నేలకొరిగాయి.

క. మొదవులు నెత్తురుఁజీమును, బిదికెన్, గార్దభరవంబు భీషణ మయ్యెన్
మద ముడిగెఁ గరుల కటములఁ, బొదివెఁ దురంగముల వాలముల నిప్పు లొగిన్. 605

* పాడి ఆవులు నెత్తురుపాలు పిదికాయి. గాడిదలు భయంకరంగా ఓండ్రపెట్టాయి. ఏనుగుల గండస్థలాలమీద మదజలం ఎండిపోయింది. గుఱ్ఱాల తోకలు నిప్పులు చెరిగాయి.

క. గుహలు రొదలిచ్చెఁ, బాప, గ్రహమిత్రతఁ జెంది వక్రగతులను సౌమ్య
గ్రహములు వర్తించెను, దు,స్సహ తేజో దితి తనూజ సంభవ వేళన్. 606

* గుహలు ప్రతిధ్వనించాయి. పాపగ్రహాల మైత్రితో సౌమ్య గ్రహాలు శుక్రమార్గంలో వర్తించాయి. సహింప శక్యంకాని తేజస్సుగల దితికుమారులు జన్మించిన సమయంలో ఈ విధమైన మహోత్పాతాలు సంభవించాయి.

మ. భయదప్రక్రియ నట్లు దోఁచిన మహోత్పాతమ్ము లీక్షించి సం
క్షయకాలం బని కాని, సాధుహననోగ్రక్రూర దేవాహితో
దయ సంక్షోభముగా నెఱుంగక సమస్తప్రాణిసంఘాతముల్,
భయ మందెన్ సనకాది యోగిజనముల్ దక్కన్ బుధేంద్రోత్తమా! 607.

* విబుధవరుడవైన విదురా! వింటున్నావుగా! ఈ విధంగా విపరీతమైన అపశకునాలు తోచటం చూచి సమస్త ప్రాణికోటీ తల్లడిల్లింది.

అందరూ ఇదేదో మహాప్రళయం ముంచుకు వచ్చిందని భావించారే కాని లోకకంటకులైన భీకరరాక్షసుల జనన సమయంలో సంభవించిన సంక్షోభం అని తెలుసుకోలేక పోయారు. సర్వజ్ఞులైన సనక సనందనాదులు మాత్రం భయపడలేదు.

వ. అట్లావిర్భవించిన యనంతరంబ. 608

ఆ విధంగా దితికి సుతులు ఆవిర్భవించారు.

మ. కులశైలాభ శరీరముల్ దనర రక్షోనాథు లత్యుగ్ర దో
ర్బల మొప్పం బదఘట్టనన్ ధర చలింపన్ రత్న కేయూర కుం
డల కాంచీ కటకాంగుళీయక కిరీట స్వర్ణమంజీర ని
ర్మల కాంతుల్ దులకింప నాత్మరుచిచే మందీకృతార్కాంశులై. 609

వ. ఉన్న సమయంబునం గశ్యపుండు నిజతమాభవులఁ జూడం దలంచి దితిమందిరంబునకుఁ జనుదెంచి సుతులం గనుంగొని వారలకు నామకరణంబు సేయం దలంచి. 610

* ఆ రాక్షసవీరులు కులపర్వతాలవంటి శరీరాలతో, లోకభీకరమైన భుజబలంతో ఒప్పుతున్నారు. వారి పాదాల తాకిడికి భూమి చలించి పోతున్నది. రత్నాలు చెక్కిన బంగారు భుజకీర్తులూ, మకరకుండలాలు,

మొలనూళ్ళూ, కంకణాలూ, ఉంగరాలూ, కిరీటాలూ, కాలిఅందెలూ, స్వచ్ఛమైన కాంతులు వెదజల్లగా వారు తమమేని దీప్తులతో భానుదీప్తులను సైతం హీనపరుస్తున్నారు. ఇలా ఉన్న సమయంలో కశ్యపప్రజాపతి తన కుమారులను చూడదలచినవాడై దితి సౌధానికి విచ్చేశాడు. నందనులను సందర్శించాడు. వారికి పేర్లు పెట్టాలనుకున్నాడు.

**మ. దితి జఠరంబునందుఁ దన తేజము మున్నిడినట్టి పుత్త్రు న**
**ద్భుత చరితున్ "హిరణ్యకశిపుం"డనుపేరఁ, బ్రసూతి వేళనా**
**దితి మును గన్న పట్టి రవితేజునిఁ "గాంచనలోచనుండు" నా**
**హితమతిఁ బేరు వెట్టి చనియెన్ నిజ నిర్మల పుణ్యభూమికిన్.** 611

* కశ్యపప్రజాపతి దితిగర్భమందు తాను మొదట ఉంచిన తేజస్సువల్ల ఆవిర్భవించి అద్భుతంగా వెలిగేవానికి "హిరణ్యకశిపుడు"అనీ, కాన్పుసమయాన దితిగర్భం నుంచి మొట్టమొదట పుట్టి సూర్యతేజస్సుతో విరాజిల్లేవానికి "హిరణ్యాక్షుడు" - అనీ మంచిమనస్సుతో నామకరణం చేశాడు. అనంతరం ఆయన ప్రశాంతమూ, పవిత్రమూ అయిన తన ఆశ్రమానికి వెళ్లిపోయినాడు.

**వ. అయ్యవసరంబున నతుల తేజో విరాజితుండైన హిరణ్యకశిపుండు హిరణ్యగర్భ వరదాన గర్వంబునను, దుర్వార పరిపంథి గర్వ నిర్వాపణాఖర్వ భుజావిజృంభణంబునను నిఖిలలోక పాలాదుల జయించి స్వవశం బొనర్చి సంతుష్టాంతరంగుండై యెందునుం దనకు మృత్యుభయంబు లేక నిర్భయుండై సుఖంబుండె, తత్సోదరుండైన హిరణ్యాక్షుండు ప్రతిదివసంబుఁ జండ వేదండ శుండాదండ మండిత భుజాదండంబున గదాదండంబు ధరియించి తన్ను నెదిరి కదనంబు సేయంజాలిన యరివీరునిం గానక భూలోకం బెల్లం గ్రుమ్మరి దివంబునకు దాడివెట్టి యందు సమరవిముఖులైన బర్హిర్ముఖులం గనుంగొని వనజాసన వరప్రదానంబు జింతించి హితులు సెలంగ నహితులు గలంగ మహిత వైజయంతికాదామం బభిరామంబై వెలుంగం జరణంబుల మణినూపురంబులు మొరయ నిజదేహద్యుతి దిక్కులం బిక్కటిల్లం జనుదెంచువానిం గని భీతచిత్తులయి దేవతా గణంబులు గరుడునిం గని పఱచు నురగంబులుంబోలె నిజనివాసంబు లర్కనివాసంబులుం గాంచనావాసంబులుంగా నొనర్చి యెక్కడికేనిం జనిన.** 612

* అప్పుడు సాటిలేని తేజస్సుతో విరాజిల్లుతున్న హిరణ్యకశిపుడు బ్రహ్మదేవునివల్ల వరాలు పొందిన గర్వంతోనూ, వారింపరాని వైరివీరుల ఉక్కడగించటంలో చెక్కుచెదరని అవక్రపరాక్రమాటోపంతోనూ, సమస్త లోకపాలకులనూ జయించి తనవశం చేసుకొన్నాడు. ఇక తనకు ఎక్కడా మృత్యుభీతి లేదనే అత్యంత విశ్వాసంతో, సంతోషంతో సుఖంగా ఉన్నాడు.

అతని సోదరుడైన హిరణ్యాక్షుడు మదపుటేనుగు తొండంవంటి తన భుజాదండం మీద ప్రచండగదాదండాన్ని ధరించి కదనరంగంలో తనకు ఎదురు నిల్వగల్గిన శత్రువీరుడు ఎక్కడా కన్పించక

భూలోకమంతా గాలించి గాలించి చివరకు స్వర్గంపై దండెత్తాడు. అక్కడ సమరవిముఖులైన అమర వీరులను చూచి బ్రహ్మదేవుని వరప్రభావంగా భావించి, హితులు పొంగి పోయేటట్లూ, విరోధులు క్రుంగి పోయేటట్లూ వక్షాన వైజయంతీమాల ధరించి, కాలి గండపెండారాలు ఘల్లు ఘల్లున మ్రోగుతుండగా చిక్కని దేహకాంతులు నలుదిక్కులా పిక్కటిల్లగా నడచి వస్తూ ఉన్న హిరణ్యాక్షుణ్ణి వీక్షించి దేవతలు గుండెలు జారి గరుత్మంతుణ్ణి చూచి పరుగులుదీసే పాముల లాగా పలాయనం చిత్తగించారు. ఇళ్లూ వాకిళ్లూ జిల్లేళ్లకూ ఉమ్మెత్తలకూ అప్పజెప్పి దిక్కుతోచక ఎక్కడెక్కడికో వెళ్ళిపోయి తలదాచుకున్నారు.

ఉ. **శౌర్యము వోవఁదట్టి, నిజసాధనముల్ దిగనాడి, విక్ర మౌ**
**దార్యపరాక్రమక్రమము దప్పఁగ భీతిలి పాఱి రక్కటా,**
**కార్యముఁ దప్పి నాకు లని గైకొని యార్చి సుమేరుపర్వత**
**స్థైర్యుఁడు వార్ధిఁ జొచ్చె నతిదర్పిత భూరి భుజా విజృంభియై.** 613

* "శౌర్యం కోల్పోయి, శస్త్రాస్త్రాలు వదలిపెట్టి, పౌరుష పరాక్రమాలు మంటగలిపి, కర్తవ్యాన్ని విస్మరించి కాలికి బుద్ధిచెప్పారు పాపం పిరికిపందలు"అని సింహగర్జనం చేసి మేరుపర్వతంవంటి స్థైర్యం గల హిరణ్యాక్షుడు దుర్వారమైన గర్వాతిశయంతో విజృంభించి సముద్రంలో ప్రవేశించాడు.

వ. **ఇట్లు సొచ్చిన.** 614

క. **వరుణుని బలములు దనుజే, శ్వరుతేజముఁ దేఱిచూడఁజాలక శౌర్య**
**స్ఫురణము సెడి యెందేనియుఁ, బఱచెం దజ్జలధి మధ్యభాగము నందున్.** 615

* ఈ విధంగా ఆ రాక్షసరాజు సముద్రంలో ప్రవేశించగానే వరుణదేవుని సైనికులు రాక్షసరాజు తేజాన్ని తేరిపారచూడలేక, పౌరుషం కోల్పోయి, సాగరమధ్యంలో ఎక్కడో నక్కిపోయారు.

క. **అమరారి విపుల నిశ్వా, సములం బ్రభవించినట్టి జలనిధి కల్లో**
**లములను విపుల గదా దం, డమునం బోనడఁచె నతిదృఢం బగు శక్తిన్.** 616

* హిరణ్యాక్షుడు తన నిట్టూర్పులవల్ల అల్లకల్లోలమైన సముద్రంలో లేచే తరంగాలను సాటిలేని మగటిమితో తన చేతి గదాదండం ద్వారా అణచివేశాడు.

చ. **మఱియును నమ్మహాజలధి మధ్యమునన్ సురవైరి పెక్కు వ**
**త్సరములు గ్రీడ సల్పి రిపుసైన్య విదారణ శౌర్య ఖేలనా**
**పరతఁ జరించి యవ్వరుణ పాలితమైన లసద్విభావరీ**
**పురమున కేఁగి యందుఁ బరిపూర్ణత నున్న పయోధినాథునిన్.** 617

* ఆ సముద్రంలో హిరణ్యాక్షుడు పెక్కు సంవత్సరాలు శత్రు సైన్యాల్ని చీల్చి చెండాడే ఉత్కంఠతో వీరోచితంగా విహరించాడు. అనంతరం సముద్రాధిపతి అయిన వరుణుడు పరిపాలించే విభావరీ నగరానికి వెళ్ళి అక్కడ నిండుకొలువులో ఉన్న వరుణుని చూచాడు.

వ. మఱియును. 618

సీ. యాదోగణాధీశుఁ డగుచుఁ బాతాళ భువన పరిపాలుఁడై తనరుచున్న
వరుణునిఁ గనుఁగొని పరిహసితోక్తుల నిట్లను, విశ్వమం దెన్నఁగలుగు
సకలలోకైక పాలకులలో నతి బలాధికుఁడని జగము నుతింపఁ దగిన
శూరుండ విపుడు నీ పౌరుష మొప్పంగఁ గదనరంగమున న న్నెదిరి చూడు,

తే. నీ భుజావిక్రమంబును బ్రాభవంబు, నడఁతు నని పల్కుటయు విని యబ్ధివిభుఁడు
పగతు జయమును వృద్ధియు బలము నాత్మ, బలముఁ దలపోసి దనుజుతో బవరమునకు. 619

* ఆ రాక్షసరాజు జలచర సమూహాలకు రాజై పాతాళ లోకాన్ని పాలిస్తూ ఉన్న వరుణుని చూచి పరిహసిస్తూ " ఈ ప్రపంచం లోని సమస్త రాజులలో పేరెన్నిక గన్న మహాబలవంతుడ వట! వీరాధివీరుడవైన నీ పౌరుషం ప్రకటించి కదనరంగంలో నన్నెదిరించి చూడు. నీ బండారం బైటపడుతుంది. నీ బాహుబలాన్ని, నీ పేరుప్రతిష్ఠలనూ అణచివేస్తాను.'' అన్నాడు.

హిరణ్యాక్షుని మాటలు విని సముద్రరాజైన వరుణుడు తన బలాన్నీ విరోధి బలాన్నీ అంచనా వేసి చూసుకున్నాడు.

క. సమయము గాదని తన చి, త్తమునం గల రోషవహ్నిఁ దాలిమి యను తో
యములం దగ నార్చుచు నుప, శమితోక్తులఁ బలికె దనుజసత్తముతోడన్. 620

* ఆ రాక్షసునితో యుద్ధం చేయటానికి సమయం కాదని తెలుసుకున్నాడు. తన కోపాగ్నిని సహనం అనే జలంతో శమింపజేసి, ప్రశాంత వచనాలతో ఆనిశాచరేంద్రుని ఈ విధంగా సమాధానపరిచాడు.

చ. మనమున శాంతిఁ బూని, నియమంబున సంగర ముజ్జగించి యే
ననయము నున్నవాఁడ, నిపు డాహవకేళిఁ జరింపరాదు, నీ
ఘన భుజ విక్రమస్ఫురిత గాఢ విజృంభణమున్ జయింపఁ జా
లిన ప్రతివీరు లెవ్వరును లేరు, ముకుందుఁడు దక్కనెక్కడన్. 621

* నేను ప్రశాంతమైన అంతరంగంతో రణరంగాన్ని పరిత్యజించాలనే ఒక నియమంతో ఉన్నాను. ఇప్పుడు మనమధ్య పోరాటం పనికిరాదు. సాటిలేని నీ అపార పరాక్రమాటోపానికి సమాధానం చెప్పగల వీరుడు విష్ణువు తప్ప ఇంకొక్కడు ఎక్కడా లేడు.

చ. గొనకొని యమ్మహాత్ముఁడు వికుంఠపురంబున నున్నవాఁడు దా
నని మొనఁ బెక్కుమాఱు లభియాతుల నోలి జయించి శక్తి పెం

పున సడిసన్న వీరుఁడని భూజనకోటి నుతించు, నందు వే
చను, మతఁ డిచ్చు నీకు నని, సర్వముఁ దీఱెడు నంతమీఁదటన్. 622

* ఆ మహాత్ముడు వైకుంఠంలో ఉన్నాడు. యుద్ధంలో గొప్ప గొప్ప వీరులను ఎన్నోమారులు ఎదుర్కొని జయించాడనీ, పేరుమ్రోగిన వీరాగ్రగణ్యుడనీ, ఆయనను జగమంతా కొనియాడుతూ ఉంటుంది. వెంటనే నీవు అక్కడికి వెళ్ళు. వెళ్లినట్లయితే అతడు నీతో యుద్ధం చేస్తాడు. నీ కోరిక పూర్తిగా తీరుతుంది.

ఉ. నిందకు నోర్చి యాజిమొన నిల్వఁగ నోపక వీఁగి పాఱు నీ
పందల వెంటఁబడ్డ మగపంతమె? సర్వశరణ్యుఁడైన గో
విందుఁడు దీర్చు నీ పని వివేకవిహీన! చనంగ నోపుదే
నందుల కేఁగు, మాతఁ డమరారులఁ బోర జయించు నిచ్చలున్. 623

* నిందలకు తలనొగ్గి యుద్ధంలో నిల్వలేక, వెన్నిచ్చి పరుగుదీసే పిరికిపందల వెంటబడటం నీవంటి మగవానికి తగనిపని. బుద్ధిహీనుడా! వెళ్లగలిగినట్లైతే విష్ణువుదగ్గరకు వెళ్ళు. అందరకూ శరణ్యుడై అడిగినవన్నీ ఇచ్చే ఆ గోవిందుడు తప్పక నీపని తీరుస్తాడు. ఆతడు రాక్షసులతో నిత్యమూ పోరాడుతూ వారిని జయిస్తూనే ఉంటాడు.

వ. అదియునుం గాక. 624

క. పురుషాకృతిఁ బ్రతియుగమునఁ, బురుషోత్తముఁ డవతరించి భూరి భుజా వి
స్ఫురణన్ దుష్ట నిశాటుల, హరియించుచు నుండు మునిగణార్చితపదుఁడై. 625

* అదీకాకుండా పురుషోత్తము డైన విష్ణువు ప్రతియుగంలోను పురుషరూపం ధరించి భూమిమీద పుట్టి, అవక్రపరాక్రమంతో దుష్టులైన రాక్షసులను శిక్షించి, మునులను రక్షించి, వారిచే పూజలు అందుకుంటూ ఉంటాడు.

ఉ. కావున నా విభుం దొడరి కయ్యము దయ్య మెఱుంగఁజేసి ర
క్షోవర! నీ భుజాబలము సొంపఱి మేదినిఁ గూలి సారమే
యావళి కాశ్రయం బగుదు, వచ్చుటి కిప్పుడ యేగుదేని నీ
చేవయు లావు నేర్పడును, జెప్పఁగ నేటికి మీఁది కార్యముల్. 626

* కాబట్టి ఓ రాక్షసరాజా! అతనిని ఎదిరించు, కయ్యం సంగతి దయ్యానికి తెలుసు. బాహుబలం నశించి గర్వభంగమై నీవు నేల గరుస్తావు. కుక్కలు నిన్ను చుట్టుముట్టుతాయి. ఇదిగో! ఇప్పుడే అక్కడికి వెళ్లితే నీ పౌరుషమూ బలమూ బైటపడతాయి. తర్వాత ఏమి జరుగుతుందో వేరే చెప్పనవసరం లేదు.

చ. అని వరుణుండు వల్కిన దురాగ్రహ మెత్తి హిరణ్యలోచనుం
డనయము మానసంబున భయం బొకయింతయు లేక, సంగరా

వని నెదిరింతు నేఁ డమరవర్ధను దుష్టవిమర్దనున్ జనా
ర్దను ననుచున్ వికుంఠ నగరస్ఫుట సంచితమార్గవర్తి యై. 627

* అని వరుణుడు పల్కగా విని హిరణ్యాక్షుడు మిక్కిలి ఆగ్రహంతో మండిపడ్డాడు. వాడికి శివమెత్తింది. ఏ మాత్రం సంకోచం లేకుండా, "ఇప్పుడే యుద్ధంలో, దేవతలకు మిత్రుడూ, రాక్షసులకు శత్రుడూ అయిన అజనార్దనుణ్ణి మర్దిస్తా" నంటూ వైకుంఠంమీదకు దండయాత్ర సాగించాడు.

క. చను నవసరమున నారద, మునివరుఁ డెదు రేగుదెంచి ముదము దలిర్పన్
దనుజేంద్ర, యెందుఁ బోయెద, వని యడిగిన నారదునకు నతఁ డిట్లనియెన్. 628

* అలా వైకుంఠ మార్గం పట్టి వెళ్లుతున్న హిరణ్యాక్షుడికి నారదమునీంద్రుడు ఎదురువచ్చాడు. "ఓ రాక్షసరాజా! ఇంత అతిశయమైన ఆనందంతో ఎక్కడికి వెళ్లుతున్నావు" అని అడిగాడు. నారదమునితో హిరణ్యాక్షుడు ఇట్లా అన్నాడు.

చ. సరసిరుహోదరుం దొడరి సంగర మే నొనరించి యిందిరా
వరుని ననంతుఁ ద్రుంచి సురవైరికులంబుల కెల్ల మోద వి
స్ఫురణ ఘటింపఁ జేయుటకుఁ బూని వికుంఠపురానువర్తినై
యరిగెద నన్న నమ్మునికులాగ్రణి దానవనేత కిట్లనున్. 629

* "బొడ్డున తామర ఉన్న ఆ దామోదరుణ్ణి ఎదుర్కొని యుద్ధం చెయ్యటానికి వెళ్లుతున్నాను. అంతం లేని వాడనని విర్రవీగే ఆ లక్ష్మీకాంతుని అంతమొందించి రాక్షసజాతికంతా అంతులేని ఆనందం కల్గించాలనే పట్టుదలతో వైకుంఠం దారిపట్టిపోతున్నాను." ఆమాటలు విని నారదుడు అతనితో ఇట్లా అన్నాడు.

చ. గురుభుజుఁ డమ్మహాత్ముఁడు వికుంఠపురంబున నేఁడు లేఁడు, భూ
భరము వహింప నాదికిటి భావముఁ దాల్చి రసాతలంబునం
దిరవుగ నున్నవాఁ, డచటి కేఁగఁగ నోపుదువేని నేగు మం
దరయఁగఁ గల్గు నీకు నసురాంతకుతోడి రణం బవశ్యమున్. 630

* "వీరాధివీరుడైన ఆ విష్ణుమూర్తి ఇప్పుడు వైకుంఠంలో లేడు. ఆ మహాత్ముడు భూభారాన్ని పూనడానికై ఆదివరాహరూపం ధరించి రసాతలంలో ఉన్నాడు. అక్కడికి వెళ్లడానికి నీకు శక్తి ఉన్నట్లైతే వెళ్లు. ఆ పాతాళంలో నీకూ విష్ణుదేవునికి తప్పకుండా సమరం జరుగుతుంది."

## -: హిరణ్యాక్షుఁడు యజ్ఞవరాహంబగు హరి నెదిరించి పోరుట :-

చ. అనవుడు దానవేంద్రుఁడు హుతాశను కైవడి మండి పద్మ లో
చను నెదిరించు వేడుకలు సందడిఁగొల్ప ననల్పతేజుఁడై

ఘనగదఁ గేలఁ బూని త్రిజగద్భయదాకృతిఁ దాల్చి వ్రేల్మిడిం
జనియె రసాతలంబునకుఁ జండ భుజాబలదర్ప మేర్పడన్. 631

* ఆ మాటలు విన్న రాక్షసరాజు అగ్నివలె మండిపడ్డాడు. హరిని జయించాలనే ఆసక్తి అధికం అయింది; మహాతేజస్సుతో గదాదండం చేబూని, ముల్లోకాలకూ భయం కలిగించే రూపంతో ప్రచండబాహు పరాక్రమాన్ని ప్రకటిస్తూ చిటికెలో పాతాళలోకానికి వెళ్ళాడు.

వ. చని జలమధ్యంబున. 632

క. దివిజారి యెదురఁ దగఁ గనె, నవిరళదంష్ట్రాభిరాము నమరలలామున్
గువలయ భరణోద్దామున్, సవనమయ స్తబ్ధరోము జలదశ్యామున్. 633

* అలా వెళ్ళి సముద్రమధ్యం చేరిన హిరణ్యాక్షుడు తన యెదురుగా ఆదివరాహరూపంలో ఉన్న విష్ణువును వీక్షించాడు. ఆ ఆదివరాహం దట్టమైన కోరలు కలిగి ఉన్నది. దివ్యమైన తేజస్సుతో విరాజిల్లుతున్నది. భూభారం మోయడానికి సమర్థమై ఉన్నది. యజ్ఞమయమై ఒప్పుతున్నది. వర్షాకాలపు మేఘంలాగా నల్లగా ఉన్నది.

వ. అయ్యవసరంబున సూకరాకారుండైన హరియు. 634

క. వనజ రుచి సన్నిభము లగు, తన లోచనయుగళ దీప్తిఁ దనరఁ దదాలో
కనముల దనుజాధీశుని, తనుకాంతి హరింపఁజేసెఁ దత్ క్షణమాత్రన్. 635

* ఆ సమయంలో వారాహరూపంలో ఉన్న పరాత్పరుడు కమలములవంటి తన కన్నులకాంతులను ప్రసరింపజేస్తూ, వీక్షణ మాత్రం చేతనే ఆ రాక్షసరాజు దేహకాంతిని వెంటనే హరించివేశాడు.

వ. మఱియు నయ్యాదివరాహం బవార్యశౌర్యంబున మాఱులేని విహారంబునం జరియించునట్టి యెడ. 636

సీ. తుద మొదళ్ళకుఁ జిక్కి తునిసి పాఱఁగ మోరఁ గులశైలములఁ జిమ్ముఁ గొంత తడవు,
బ్రహ్మాండభాండంబు పగిలి చిల్లులు వోవఁ గొమ్ములఁ దాటించుఁ గొంత తడవు,
జలధు లేడును బంకసంకులంబై యింక ఖురముల మట్టాడుఁ గొంత తడవు,
ఉడురాజు సూర్యుండు నొక్క మూలకుఁ బోవఁ గుఱుచ వాలము ద్రిప్పుఁ గొంత తడవు,

తే. గునియుఁ గుప్పించు లంఘించుఁ గొప్పరించు, నెగయు ధరఁ ద్రవ్వు బొఱియఁగా నేపు రేఁగి
దానవేంద్రుని గుండెలు దల్లడిల్లఁ, బంది మెల్లన రణపరిస్పంది యగుచు. 637

* ఆ ఆదివరాహం అనివార్యమైన శౌర్యంతో నిరాటంకంగా విహరిస్తూ మొదలూ తుదా ఏకమై ముక్కలు ముక్కలయ్యేటట్లు తన ముట్టెతో కులపర్వతాలను కూలతోస్తూ కొంతసేపూ, బ్రహ్మాండభాండం పగిలి చిల్లులు పడేటట్లు కొమ్ములతో చిమ్ముతూ కొంతసేపూ, ఏడు సముద్రాలూ బురదలై ఇంకి పోయేటట్లు గిట్టలతో మట్టగిస్తూ కొంతసేపూ, సూర్యుడూ చంద్రుడూ ఒకమూలకు తోసుకుపోయేటట్లు తన పొట్టి

తోకను గిరగిర త్రిప్పుతూ కొంతసేపూ, కులుకుతూ, కుప్పించి దూకుతూ, ఠీవిగా పైకి ఎగురుతూ, బొరియలు బొరియలుగా నేలను త్రవ్వుతూ కొంతసేపూ, విజృంభించి విహరింపసాగింది. యుద్ధానికి సిద్ధమౌతున్న దానిని చూచి దానవుని గుండె తల్లడిల్లింది.

**వ. మఱియును, 638**

**క. కనుఁగవ నిప్పులు రాలఁగ, సునిశిత దంష్ట్రాగ్ర యుత వసుంధరుఁ డగుచుం**
**దన కెదురేతేఁ గని య, వ్వనచర మే రీతి నిపుడు వనచర మయ్యెన్. 639**

**క. అని యాశ్చర్యభయంబులు, దన మనమునఁ దొంగలింప దనుజాధిపుఁ డి**
**ట్టనియెన్ భీకరసూకర, తనువొంది చరించు దనుజ దర్పాపహుతోన్. 640**

* ఈ విధంగా కన్నులనుండి నిప్పులు రాల్చుతూ, వాడియైన కోరలచివర భూమిని మోస్తూ, తనకు ఎదురుగా వస్తూ ఉన్న వరాహాన్ని చూచి, నేలమీద సంచరించే ఈ జంతువు నీళ్లలో ఎలా విహరిస్తున్నదా అని హిరణ్యాక్షుడి మనస్సులో ఆశ్చర్యమూ, భయమూ అతిశయించాయి. రాక్షసుల దర్పాన్ని అపహరించగల్గిన భయంకర రూపం ధరించి ఉన్న ఆ వరాహంతో హిరణ్యాక్షుడు ఇట్లా అన్నాడు.

**క. ఘన సూకర! మూఢాత్మక!, వనరుహసంభూత దత్త వరదానమునం**
**గనిన రసాతల గత భువి, యనయంబును నా యధీనమై వర్తించున్. 641**

* బుద్ధిలేని ఓ పెద్దవరాహమా! బ్రహ్మ ఇచ్చిన వరాలనుబట్టి చూస్తే రసాతల గతమైన భూమి అంతా శాశ్వతంగా నా అధీనంలోనిదే.

**క. గొనకొని నీ వీ ధరణిం, గొని పోకుము, విడుము, కాక కొని యేగెద వేఁ**
**గొనియెద నీ ప్రాణముఁ, గ్రై, కొను నా వచనములు, చలము గొన నేమిటికిన్? 642**

* నీవు ఈ భూమిని తీసుకొని పోవద్దు. వదలిపెట్టు. అలా కాదని నీవు తీసికొనిపోతే నీ ప్రాణాలు నేను తీస్తాను. నా మాటలను పాటించకుండా ఎందుకు మొండిపట్టు పడతావు.

**క. మాయావి వగుచు నిప్పుడు, పాయక యీ పుడమిఁ జోరభావంబున నీ**
**వీ యెడఁ గొనిపోఁ జూతునె, యాయత భుజబలముచేత నడఁపక యనుచున్. 643**

* నీవు ఎవరో మాయావి వలె ఉన్నావు. ఈ భూమిని దొంగతనంగా అపహరించుకొని పోతున్న నిన్ను చూస్తూ ఊరకుంటానా? నా పొడుగు పాటిమేటి బాహువుల పాటవాన్ని ప్రదర్శించి నిన్ను అణచి వేస్తాను.

**సీ. అవిరళ యోగ మాయాబలంబునఁ జేసి యల్ప పౌరుషమున నలరు నిన్ను**
**నర్థి సంస్థాపించి యస్మత్సుహృద్భృత్య కులుల కెల్లను మోద మొలయఁ జేయుఁ**

జెలువేది మద్గదాశీర్ణుఁడ వగు నిన్నుఁ గనుఁగొని దేవతాగణము లెల్ల
నిర్మూలులై చాల నెఱి నశించెద రన్న విని యజ్ఞపోత్రియై వెలయుచున్న

తే. హరి సరోజాతభవ ముఖామరుల కెల్ల, వచ్చు దురవస్థ కాత్మలో వంత నొంది
నిశిత దంష్ట్రాగ్ర లసితయై నెగడు ధరణి, దేవితో నొప్పె నా దేవదేవుఁ డంత. 644

* యోగ మాయాబలంచే లభించిన కొద్దిపాటి పౌరుషం తప్ప నీకు నిజమైన భుజబలం లేదు. అటువంటి నిన్ను ఇక్కడ లోతుగా పాతిపెడతాను. నా స్నేహితులకూ సేవకులకూ అపారమైన ఆనందం కలుగజేస్తాను. నా గదాదండముతో నీ తల తుత్తునియలు చేస్తాను. మన్నుగరచిన నిన్ను చూచి దేవతలంతా మొదలు నరికిన చెట్లవలె నేల గూలుతారు - ఈ విధంగా హిరణ్యాక్షుడు పలుకగా విని యజ్ఞవరాహమైన శ్రీ మహావిష్ణువు బ్రహ్మాది దేవత లందరికీ వీడు కలిగించే కీడు తలచి మిక్కిలి విచారం చెందాడు. వెంటనే వాడియైన తన కోర చివర ప్రకాశిస్తున్న భూమితో నిశ్చలుడై నిబ్బరంగా నిలబడ్డాడు.

క. సురరిపు వాక్యాంకుశముల, గురుకుపిత స్వాంతుఁ డగుచుఁ గొమరారె వసుం
ధరతోడ భీతి నొందిన, కరిణిం గల కరికులేంద్రుకరణిం బెలుచన్. 645

* హిరణ్యాక్షుని మాటలనే అంకుశాల పోట్లకు మిక్కిలి ఆగ్రహించిన ఆదివరాహమూర్తి భూదేవితోకూడా సముద్రజలాలనుంచి బయటకు వచ్చాడు. అప్పుడు ఆయన భీతిల్లిన ఆడయేనుగుతో కూడిన గజేంద్రునివలె అతిశయించాడు.

తే. నిశితసితదంతరోచులు నింగిఁ బర్వఁ, గంధి వెడలి భయంకరాకారలీల
నరుగు భీషణ మఖవరాహావతార, మొనరఁ దాల్చిన పద్మలోచనుని వెనుక 646

క. కరివెనుకఁ దగులు నక్రము, కరణిం జని దైత్యవిభుఁడు గదిసి యిటు లనున్
దురిత పయోనిధి తరికిం, కిరికిన్ ఖురదళిత మేరుగిరికిన్ హరికిన్. 647

* వాడియైన తెల్లని కోరలకాంతులు ఆకాశం అంతటా వ్యాపించగా సముద్రం నుండి బయటికి వచ్చిన భీకరాకారమైన యజ్ఞవరాహావతారం ధరించిన ఆ కమలాక్షుని మదగజేంద్రాన్ని వెంబడించే మకరం మాదిరిగా హిరణ్యాక్షుడు వెంబడించాడు. అలా వచ్చిన హిరణ్యాక్షుడు, పాప మనే సముద్రాన్ని దాటించేవాడూ, వరాహరూపం ధరించినవాడూ, కాలిగిట్టలతో మేరుపర్వతాన్ని సైతం మట్టగించగలవాడూ అయిన విష్ణుదేవునితో ఈ విధంగా అన్నాడు.

క. నిందకు రోయక లజ్జం, జెందక వంచనను రణము సేసి జయంబుం
బొందెద నని తలఁచుచు నిటు, పందగతిం బాఱ బంటు పంతమె? నీకున్. 648

* నిన్ను ఎన్ని తిట్టినా నీకు రోషం రావటం లేదు. నీవు సిగ్గులేని వాడవు. మోసగాడివి. వంచనచేసి నన్ను యుద్ధంలో జయిద్దామని అనుకొన్నావు. మరి ఇప్పుడు, ఈ విధంగా పిరికిపందవై పరుగెత్తడం నీ మగతనానికి తగినపనేనా?

**వ. అని యాక్షేపించినం బుండరీకాక్షుండు గోపోద్దీపిత మానసుండై. 649**

* అని హిరణ్యాక్షుడు ఆక్షేపించాడు. ఆ మాటలకు పుండరీకాక్షుని హృదయం ఆగ్రహావేశంతో నిండిపోయింది.

**క. తోయములమీఁద భూమి న, నాయాసత నిల్పి దాని కాధారముగాఁ**
**దోయజనాభుఁడు దన బల, మాయతమతిఁ బెట్టె సురలు హర్షము నొందన్. 650**

* శ్రీ మహావిష్ణువు భూమిని నీళ్లపై నిల్పి దానికి ఆధారంగా అనంతమైన తన శక్తిని ప్రసరింపజేశాడు. అది చూచి దేవతలు ఆనందభరితులైనారు.

**తే. కుసుమముల వృష్టి బోరనఁ గురిసె, నంత, విభవ మొప్పార దేవదుందుభులు మొరసెఁ,**
**గడఁక వీతెంచె గంధర్వ గానరవము, నందితము లయ్యె నప్సరోనర్తనములు. 651**

* ఆ సమయంలో ఆకాశంనుంచి జలజల పూలవాన కురిసింది. వైభవోపేతంగా దేవదుందుభులు మ్రోగాయి. గంధర్వులు గానం చేశారు. అప్సరసలు ఆనందంతో నర్తించారు.

**వ. అయ్యవసరంబున నయ్యజ్ఞ వరాహమూర్తి ధరుండైన కమలలోచనుండు గనక కుండల కేయూర గ్రైవేయ కటకాంగుళీయక భూషణ రోచులు నింగిఁ బర్వ సమరసన్నద్ధుండై. 652**

* అప్పుడు ఆదివరాహమూర్తి అయిన మహావిష్ణువు బంగారు మకరకుండలాలు, భుజకీర్తులు, కంఠహారాలు, కంకణాలు, ఉంగరాలు మొదలైన ఆభరణాల కాంతులు ఆకాశమంతటా వ్యాపింపగా యుద్ధానికి సిద్ధమైనాడు.

**చ. ఘనగదఁ గేలఁ బూని మణికాంచన నవ్య విచిత్ర వర్మ మిం**
**పొనరఁగఁ దాల్చి దానవ నియుక్తదురుక్త నిశాత బాణముల్**
**దన ఘన మర్మముల్ గలఁప దానవహంత నితాంతశౌర్యుఁడై**
**కనలుచు వచ్చు నద్దనుజుఁ గన్గొని రోష విభీషణాకృతిన్. 653**

**వ. ఒప్పియు నగుచు నిట్లనియె. 654**

* పెద్ద గదాదండాన్ని చేతబట్టుకొని, రత్నఖచిత మైన రమణీయ కనక కవచాన్ని ధరించిన శ్రీహరి రాక్షసరాజు పలికిన పలుగాకి పలుకులనే ములుకులు తన హృదయాన్ని గాయపరచగా అవక్రవిక్రమంతో ఆగ్రహోదగ్రుడై కూడ అతణ్ణిచూచి నవ్వుతూ ఇట్లా అన్నాడు.

**మ. వినరా యోరి యమంగళాచరణ! యుద్వృత్తిన్ ననున్ నీమది**
**న్ననయంబున్ వనగోచరంబగు మృగంబంచుం దలం తౌర, నే**

నెనయన్ వన్యమృగంబ యౌదు, బలిమి న్నేతెంచు నీబోటి యీ
శునకశ్రేణి వధింతు నేఁడనిమొనన్ సోఁకోర్చి వర్తించినన్. 655

* ఓరీ! అమంగళ కార్యాలు ఆచరించే నీచుడా! విను? కండకావరంతో కనులు కనుపించక నన్ను అడవి మృగంగా భావిస్తున్నావు. ఔను, నేను అడవిజంతువునే! కదనరంగంలో కాలికి బుద్ధిచెప్పకుండా నిలబడగలిగితే నీవంటి కుక్కలను డొక్కచీల్చే వన్యమృగాన్నే నేను.

క. బలిమి గలదేని నాతోఁ, గలనను నెదిరించి పోరఁ గడఁగుము, నీ కో
ర్కులు నేఁడు దీర్తు, నూరక, తలపోయ వికత్థనంబు దగదు దురాత్మా! 656

* ఓరీ దురాత్మా! నీకు పౌరుషం ఉన్నట్లయితే నాతో యుద్ధానికి సన్నద్ధంకా! అప్పుడు నీ కోర్కెలు తీరుస్తాను. ఊరకే నిన్ను నీవు పొగడు కోవడం తగిన పని కాదు.

చ. విను, మది గాక సంగర వివేక విశారదులైన యట్టి స
జ్జనములు మృత్యుపాశములఁ జాల నిబద్ధులు నయ్యు నీవలెన్
గొనకొని యాత్మసంస్తుతులకున్ ముద మందిరె? యేల యీ విక
త్థనములు బంటుపంతములె దైత్యకులాధమ! యెన్ని చూడఁగన్. 657

* ఓ రాక్షస కులాధమా! విను. రణరంగ విశారదులైన సత్పురుషులు మృత్యుపాశాలతో బంధితులై కూడా నీలాగా తమ్ము తాము పొగడుకుంటూ మిడిసిపడిన వారు లేరు. ఎందుకురా ఈ ఆత్మస్తుతులు? కొంచెం ఆలోచించు. ఇటువంటి ప్రగల్భాలు పౌరుషవంతుని లక్షణాలు కావు.

మ. ధృతిఁ బాతాళమునందు నీవనెడి సందీప్తోగ్ర నిక్షేప మే
నతి దర్పంబునఁ గొందుఁ, జూడు మిదె దేవారాతి! నన్నెన్నె దా
గతలజ్జుండన దాఁగి యుండి రణముం గావింతు, యుష్మద్గదా
వితతద్రావితుఁడన్న నన్నెదురుమా, వే తీర్తు నీ కోరికల్. 658

* నీవు నీదిగా పేర్కొంటున్న పాతాళలోక నిక్షేపాన్ని అత్యంత దర్పంగల నేను ధైర్యంగా ఇప్పుడే పరిగ్రహిస్తాను. చూస్తూ ఉండు. ఓరి రాక్షసుడా, నన్ను సిగ్గులేనివానిగా లెక్కించావు. నేను నీతో దాగి ఉండియే యుద్ధం చేస్తాను. నీ గదాదండానికి భయపడి పారిపోతున్నానన్నావు! రా! ఎదుర్కో! నీ కోర్కెలన్నీ క్షణకాలంలో తీరుస్తాను.

ఉ. ఎన్నఁ బదాతి యూథముల కెల్ల విభుండవు, పోటుబంటవై
నన్ను రణోర్వి నేఁ డెదిరినన్ భవదీయబలంబు నాయువున్
మిన్నక కొందుఁ జూడు, మిది మేరగ మేదిని వీతదైత్యమై
వన్నెకు నెక్కఁజేసెద నవార్యపరాక్రమ విక్రమంబునన్. 659

* నీవు ఆరితేరిన సేనానాయకుడవు, సాటి లేని మేటి యోధుడవు! మగటిమి గలవాడవై సంగరరంగంలో నన్ను ఎదిరించినట్లైతే నేడే నీ బలాన్నీ ఆయుస్సునూ నీవు చూస్తూ ఉండగానే తీసుకొంటాను. అవక్రమైన పరాక్రమంతో విక్రమించి నేటినుండి లోకం రాక్షసులు లేనిదై వన్నె కెక్కేలా చేస్తాను చూడు!

**చ. నను నెదురంగఁ జాలిన ఘనంబగు శౌర్యము ధైర్యమున్ బలం**
**బును గలదేని నిల్వు రణభూమిని, నీ హితులైన వారికిం**
**గనుఁగవ బాష్పపూరములు గ్రమ్మఁగ మాన్పఁగ నోపుదేనిఁ జ**
**య్యనఁ జనుదెమ్ము దానవకులాధమ! యూరక రజ్జు లేటికిన్? 660**

* నన్ను కదనరంగంలో ఎదిరించ గలిగిన శౌర్యధైర్యాలు నీ కున్నచో యుద్ధంలో నిలు! లేదా నీ ఆప్తమిత్రులైన వారి కన్నులలో దుఃఖ బాష్పధారలు ప్రవహించకుండా నిలుపదలచినట్లైతే ఇక్కడినుండి వెంటనే వెళ్లిపో! రాక్షసాధమా! ఊరకే ప్రగల్భాలు కొట్టడ మెందుకు?

**క. నను నిట సంస్థాపించెద, నని పలికితి, వంతవాఁడ వౌదువు, నీకున్**
**నెనరైన చుట్టములఁ బొడ, గని రా యిదె యముని పురికిఁ గాఁపుర మరుగన్. 661**

* నన్ను ఇక్కడే పూడ్చిపెడతానని పలికావు. అంతవాడవే కావచ్చు కానీ నీవు యమపురంలో కాపురానికి వెళ్లబోయే ముందు నీ ప్రియమైన బంధువులను ఒక మాటు కనులారా చూచిరా! వెళ్లు.

**మ. అని యిబ్భంగి సరోరుహాక్షుఁడు హిరణ్యాక్షున్ విడంబించి ప**
**ల్కిన హాసోక్తుల కుల్కి రోషమద సంగీభూత చేతస్కుఁడై**
**కనుఁగ్రేవన్ మిడుఁగుర్లు సాలఁ బొడమంగాఁ గిన్కమైఁ దోఁక ద్రొ**
**క్కిన కృష్ణోరగ రాజు మాడ్కి మదిలోఁ గీడ్పాటు వాటిల్లఁగన్. 662**

* అని ఈ విధంగా కమలాక్షుడు హిరణ్యాక్షుడిని ఆక్షేపిస్తూ పలుకగా ఆ పరిహాసపు మాటలకు అతడికి కోపం వచ్చింది. రోషమూ, ద్వేషమూ అతడి మనస్సును ఆవరించాయి. కన్నుల అంచులు నిప్పుకణాలను వెళ్ళగక్కాయి. తోకత్రొక్కిన నల్లత్రాచులాగా ఆ నిశాచరుడు క్రోధావేశంతో క్రిందుమీదైనాడు.

**క. చలితేంద్రియుఁడై నిట్టూ, ర్పులు నిగిడించుచును బొమలు ముడివడ రోషా**
**కులమానసుఁడై గదఁగొని, జలజాక్షున కెదురు నడచె సాహస మొప్పన్. 663**

* హిరణ్యాక్షుడి శరీరమంతా కంపించింది. వేడివేడి నిట్టూర్పులు వెలువడ్డాయి. కనుబొమలు ముడిపడ్డాయి. రోషంతో మనస్సు కలత చెందింది. ఆ దానవరాజు గద తీసుకొని, సాహసంతో శ్రీహరికి ఎదురుగా నడిచాడు.

**వ. అత్తఱి హిరణ్యాక్షుం డతిభయంకరాకారుండై. 664**

* ఆ సమయాన ఆ హిరణ్యాక్షుని ఆకారం అత్యంత భయంకరంగా ఉన్నది.

మ. గద సారించి మదాసురేంద్రుఁడు సమగ్రక్రోధుఁడై మాధవున్
గుదియన్ వేసిన వ్రేటు గై కొనక రక్షోహంత శౌర్యోన్నతిన్
గదఁ గేలన్ ధరియించి దానిఁ దునుకల్ గావించినన్ దైత్యుఁ డు
న్మదుఁడై యొండు గదన్ రమావిభుని భీమప్రక్రియన్ వ్రేసినన్. 665

* మదించిన ఆ రాక్షసరాజు గదను పైకెత్తి అత్యంత కోపంతో హరిని కొట్టాడు. హరి ఆ దెబ్బను లక్ష్యపెట్టలేదు. శౌర్యంకొద్దీ ఆ గదను చేతపట్టుకొని దానిని ముక్కలు ముక్కలుగా విరిచి వేశాడు. అంతట రాక్షసుడు ఇంకొక గద తీసుకొని ఆ లక్ష్మీవల్లభుణ్ణి భయంకరంగా కొట్టాడు.

చ. అది దనుఁ దాఁకకుండ దనుజారి గదారణకోవిదక్రియా
స్పదకరలాఘవ క్రమముఁ బైకొని చూపి విరోధి పేరురం
బదరఁగ వేయ వాఁడు వివశాకుల భావము నొంది యంతలో
మదిఁ దెలివొంది వ్రేసె రిపుమానవిమర్దను నా జనార్దనున్. 666

* హరి ఆ దెబ్బ తనకు తగలకుండా, గదావిద్యాకౌశలం వెల్లడించే హస్తలాఘవంతో దానిని పట్టుకొన్నాడు. మళ్ళీ ఆ గదతోనే విరోధి అయిన హిరణ్యాక్షుని విశాలమైన వక్షఃస్థలం అదురునట్లుగా కొట్టాడు. ఆ దెబ్బకు వాడు దిమ్మరపోయి వెంటనే తెప్పరిల్లి, శత్రుమర్దను డైన జనార్దనుణ్ణి తిరుగుదెబ్బ కొట్టాడు.

వ. ఇట్లు దలపడి యన్యోన్యజయకాంక్షల నితరేతరతుంగ తరంగ తాడితంబులగు దక్షిణోత్తర సముద్రంబుల రౌద్రంబునఁ బరస్పర శుండాదండ ఘట్టితమదాంధ గంధ సింధుర యుగంబు చందంబున రోషభీషణాటోపంబులం దలపడు బెబ్బులుల గబ్బున, నతిదర్పాతిరేకంబున నెదిర్చి ఱంకెలు వైచు మదవృషభంబుల రభసంబున, నసహ్య సింహపరాక్రమంబున విక్రమించి పోరునెడ హిరణ్యాక్షుండు సవ్యమండల భ్రమణంబునం బరివేష్ఠించినం బుండరీకాక్షుండు దక్షిణ మండల భ్రమణంబునం దిరిగి విపక్షు వక్షం బశనిసంకాశంబగు గదాదండంబునం బగిల్చిన వాఁడు దెప్పిఱి తెలివొంది లేచి దనుజపరిసంథి ఫాలంబు నొప్పించె, నప్పుడమ్మేటి వీరులు శోణితసిక్తాంగులై పుష్పితాశోకంబులఁ బురుడించుచుం బాయుచు డాయుచు వ్రేయుచు రోయుచు నొండొరుల రుధిరంబు లాఘ్రాణించుచుఁ దిరస్కార పరిహాసోక్తుల నిచ్చుచుఁ బోరు సమయంబున నమ్మహాబలుల సమరంబుఁ జూచు వేడ్కఁ బద్మసంభవుండు నిఖిల మునీంద్రసిద్ధసాధ్య దేవగణంబుల తోడఁ జనుదెంచి ధరిత్రీనిమిత్తం బసుర వరునితోడం బోరు యజ్ఞవరాహున కిట్లనియె. 667

* ఇలా వాళ్ళిద్దరూ ఒకరిని మరొక్కరు జయించాలనే గట్టి పట్టుదలతో కొట్టుకోసాగారు. ఉత్తర దక్షిణ సముద్రాలు రెండూ రౌద్రావేశంతో ఉవ్వెత్తుగా లేచే తరంగాలతో పొంగి పోరాడుతున్నట్లూ, మత్తగజాలు రెండు పెద్దపెద్ద తొండాలు చాచి పరస్పరం ఢీకొంటున్నట్లూ, రోషభీషణంగా గాండ్రు గాండ్రుమని గర్జిస్తూ

రెండు బెబ్బులులు దెబ్బలాడుతున్నట్లు, రంకెలువేస్తూ పొగరుబోతు ఆబోతులజంట క్రుమ్ములాడుతున్నట్లు, దుస్సహమైన సింహ పరాక్రమంతో వారిద్దరూ కొట్టుకుంటున్నారు. అప్పుడు హిరణ్యాక్షుడు తన ఎడమ వైపుగా గిర్రున తిరిగి గదాదండంతో పుండరీకాక్షుని గుండెలపై బాదాడు. వెంటనే వరాహమూర్తి తన కుడివైపుగా గిర్రున తిరిగి రాక్షసరాజు వక్షఃస్థలాన్ని పిడుగువంటి గదతో పగులగొట్టాడు. ఆ దెబ్బకు వాడు తెలివిదప్పి తెప్పరిల్లి శ్రీహరి నొసటిపై కొట్టి నొప్పించాడు. ఆ సమయంలో ఆ మేటివీరులు రక్తంచే తడిసిన దేహం కలవారై పుష్పించిన అశోక వృక్షాలవలె ప్రకాశించారు. ఈ విధంగా వారు తారసిల్లుతూ, దూరమవుతూ, డీ కొట్టుతూ, రాకొట్టుతూ, మార్కొంటూ, ఒకరి రక్తం మరొక్కరు మూర్కొంటూ, తిరస్కారంగా వెటకారంగా మాటలాడుతూ పోరాడుతూ ఉన్నారు. ఆ మహావీరుల యుద్ధాన్ని చూడాలనే కుతూహలంతో బ్రహ్మదేవుడు మునీంద్రులతో, సిద్ధులతో, సాధ్యులతో దేవగణాలతో కూడి అక్కడికి వచ్చాడు. అలావచ్చి ధరిత్రి నిమిత్తం దానవరాజులతో పోరుతున్న యజ్ఞవరాహమూర్తితో ఇట్లా అన్నాడు.

**ఉ. అంచిత దివ్యమూర్తి! పరమాత్మక! యీ కలుషాత్ముఁడైన న**
**క్తంచరుఁ డస్మదీయ వరగర్వమునన్ భువనంబు లెల్లఁ గా**
**రించు మదించి యిట్టి విపరీత చరిత్రునిఁ ద్రుంప కిట్లుపే**
**క్షించుట గాదు, వీని బలిసేయు వసుంధరకున్ శుభం బగున్.** 668

* పవిత్ర దివ్యస్వరూపా! పరమేశ్వరా! దుష్ట చిత్తుడైన ఈ రాక్షసుడు నేనిచ్చిన వరాలవల్ల మదోన్మత్తుడై లోకాలను చీకాకు పరుస్తున్నాడు. ఈ దుశ్చరిత్రుని సంహరించకుండా అలక్ష్యం చేయడం ఏ మాత్రం తగదు. వీనిని వెంటనే పోకార్చు. భూదేవికి శుభం చేకూర్చు.

**క. బాలుఁడు గరమున నుగ్ర, వ్యాళము ధరియించి యాడువడువున రక్షః**
**పాలునిఁ ద్రుంపక యూరక, పాలార్చుట నీతియే శుభప్రద! యింకన్.** 669

* శుభప్రదా! బాలుడు చేతిలో భయంకరమైన సర్పాన్ని పట్టుకొని ఆడుకొనే విధంగా, ఈ రాక్షసుణ్ణి ఇంకా చంపకుండా ఉపేక్షిస్తూ ఉండడం మంచిపని కాదు.

**వ. అదియునుం గాక.** 670

**మ. అనఘా! యీ యభిజిన్ముహూర్తమున దేవారాతి మర్దింపవే**
**ననయంబున్ మఱి దైత్యవేళ యగు సంధ్యాకాల మే తెంచినన్**
**ఘనమాయా బలశాలియైన దనుజున్ ఖండింపఁగా రాదు గా**
**వున నీవేళన త్రుంపు సజ్జనహిత ప్రోద్యోగ రక్తుండవై.** 671

* అంతేగాదు స్వామీ, ఈ పట్టపగలు మట్టమధ్యాహ్నం అభిజిన్ముహూర్తంలో ఈ పాపాత్ముని రూపుమాపకపోతే సాయంకాలం వస్తుంది. అది రాక్షసులకు అభ్యుదయ సమయం. అప్పుడు మహామాయావి

అయిన ఈ రాక్షసుణ్ణి సంహరించడం సాధ్యంకాదు. అందుకని ఓ పుణ్యపురుషా! సాధుజన సంరక్షణ దీక్షాపరాయణుడవై నీవు ఈ పట్టపగటివేళనే వీనిని తుదముట్టించు.

**క. అని సరసిజగర్భుఁడు వ, ల్కిన వచనము లర్థి విని, నిలింపులు గుంపుల్**
**గొని చూడ సస్మితానన, వనజము చెలువొంద నసురవరు కభిముఖుఁడై. 672**

**తే. పుండరీకాక్షుఁ డయ్యును భూరిరోష, నిరతిఁ దరుణారుణాంభోజనేత్రుఁ డగుచు**
**ఘనగదాదండ మెత్తి రాక్షసుని హనువు, నుగ్రగతి మొత్తె వాఁడును నోసరించె. 673**

* ఈ విధంగా పల్కిన విరించి పల్కులు ఆలకించి గోవిందుడు మందహాస వదనారవిందుడై ఆ అసురేంద్రునకు అభిముఖంగా నిలబడ్డాడు. ఆ దృశ్యాన్ని దేవతలంతా గుమికూడి చూడసాగారు. తెల్లతామర రేకులవంటి శ్రీహరి కన్నులు మహారోషావేశంతో ఎర్రతామరరేకులుగా మారాయి. ఆయన తన పెనుగదాదండంతో ఆ దనుజుని కణత మీద పెళ్లుమని కొట్టాడు. హిరణ్యాక్షుడు తెలివిగా ఆ దెబ్బ తప్పించుకున్నాడు.

**క. పరువడి దితిసుతుఁ డతి భీ, కరగదఁ జేఁబూని చిత్రగతులను బద్మో**
**దరు డాసి చేతిగద సా, గరమునఁ బడ నడిచె బాహుగర్వ మెలర్పన్. 674**

* భయంకరమైన గదాదండం చేతపట్టుకొని విచిత్రభంగిమలతో హిరణ్యాక్షుడు హరిని సమీపించి దుర్వారమైన బాహుగర్వంతో ఒక్కదెబ్బ కొట్టాడు. ఆ దెబ్బకు శ్రీహరి చేతిలోని గదాదండం సముద్రమధ్యంలో పడింది.

**వ. అంత. 675**

**తే. హరి నిరాయుధుఁడైన, సురారి సమర, ధర్మ మాత్మను దలఁచి యుద్ధంబు దక్కి**
**నిలిచి చూచుచు నుండెను, నింగి యమర, వరుల హాహారవంబుల భరిత మయ్యె. 676**

* హరి నిరాయుధుడైనాడు. హిరణ్యాక్షుడు యుద్ధధర్మాన్ని పాటించి పోరాటం మాని మౌనంగా చూస్తూ ఉన్నాడు. ఆకాశమంతా అమరుల హాహాకారాలతో నిండిపోయింది.

**క. సరసిజనేత్రుఁడు దనుజే, శ్వరు సంగర ధర్మమునకు సమధిక శౌర్య**
**స్ఫురణకుఁ దన చిత్తంబునఁ, గర మాశ్చర్యంబు నొంది కడఁక దలిర్పన్. 677**

* కమలాక్షుడు రాక్షసరాజు రణధర్మానికి మెచ్చాడు. అతని అపారశౌర్య స్ఫూర్తికి మిక్కిలి ఆశ్చర్యచకితుడైనాడు. అయినా పట్టుదల వీడలేదు.

**మ. కుతలోద్ధర్త మనంబునం దలఁచె రక్షోరాడ్వధార్థంబుగా**
**దితి సంతాన కులాటవీ మహిత సందీప్త ప్రభాశుక్రమున్,**

**సతతోద్యజ్జయశబ్ద సమ్ముఖర భాస్వచ్చక్రమున్, సంతతా**
**శ్రిత నిర్వక్రముఁ, బాలితప్రకట ధాత్రీచక్రముం జక్రమున్. 678**

* భూమిని ఉద్ధరించిన శ్రీ మహావిష్ణువు రాక్షసరాజైన హిరణ్యాక్షుని సంహరించటంకోసం తన మనస్సులో సుదర్శన చక్రాన్ని సంస్మరించాడు. ఆ చక్రం దైత్యుల వంశమనే మహారణ్యాన్ని దహించివేసే జాజ్వల్యమానమైన దావానలం. సర్వదా జయజయశబ్దాలతో ప్రతిధ్వనించే దిక్చక్రము కలది. అనుక్షణమూ ఆశ్రయించే వారికి రక్షణ కలిగించేది. సమస్త మహీచక్రాన్ని పరిపాలించేది.

**వ. అదియునుం బ్రచండ మార్తాండ మండల ప్రభాపటల చటుల విద్యోతమానంబును, బటునట జ్జ్వాలి కాపాస్త సమస్త కుపితారాతి బలాఖర్వ దుర్వార బాహాగర్వాంధకారంబును, నసహ్యాకహ కహ నిన దాధరీకృత సాగర ఘోషంబును, సకల దేవతాగణ జేగీయ మానంబును, ననంత తేజో విరాజితంబును, నిజప్రభాపటల పూరిత బ్రహ్మాండ కటాహంబునునై రయంబునం జనుదెంచి, దనుజారి దక్షిణకర సరోజంబు నలంకరించిన నా శుభాంగుండు రథాంగపాణియై దివంబున నమరగణంబులు జయజయ శబ్దంబులు వలుక నసురవిభున కెదురు నడచిన, 679**

* ఆ సుదర్శనచక్రం ప్రచండమైన సూర్యమండలం లాగా అనంత కాంతికిరణాలతో దేదీప్యమానంగా వెలిగిపోతున్నది. చెలరేగుతున్న అగ్నిజ్వాలలతో క్రోధులగు విరోధుల అడ్డులేని అహంకారమనే అంధకారాన్ని అణచివేస్తున్నది. సహింప శక్యంకాని "రివ్వురివ్వు"మనే ధ్వనులతో సముద్ర ఘోషాన్ని సైతం క్రిందుపరుస్తున్నది. అటువంటి చక్రం సమస్త దేవతాగణాల సంస్తుతులతో శోభిల్లుతూ, అనంతకాంతులతో విరాజిల్లుతూ, తన ప్రభామండలంతో బ్రహ్మాండభాండాన్ని నింపుతూ వేగంగా వచ్చి దనుజాంతకుని దక్షిణ కరకమలాన్ని అలంకరించింది. దైత్యారి చక్రధారియై స్వర్గలోకంలోని దేవతాగణాలు జయజయ ధ్వానాలు చేస్తుండగా ఆ రాక్షస ప్రభువునకు అభిముఖంగా నడిచాడు.

**క. పొడగని దనుజుఁడు పెదవులు, దడుపుచుఁ బొలివోని బంటుతనమున బీరం**
**బుడుగక భీషణగదఁ గొని, యడిచెన్ మఖమయవరాహు నమితోత్సాహున్. 680**

* చక్రం ధరించి ఎదురుగా వస్తున్న ఆదివరాహ మూర్తిని చూచి రాక్షసుడు అదిరిపడి పెదవులు తడుపుకుంటూ, మొక్కవోని శౌర్యంతో చెక్కుచెదరని ధైర్యంతో భయంకరమైన తన గదాదండం పెకెత్తి అమితోత్సాహంతో వచ్చే ఆ యజ్ఞవరాహాన్ని ఒక్కపెట్టుపెట్టాడు.

**క. త్రిదశారి దన్ను వ్రేసిన, గదఁ బదమునఁ బోవఁ దన్ని కమలాక్షుఁడు పెం**
**పొదవఁగ మనమున మోదము, గదురఁగ లేనగవు వదనకమలముఁ బొదువన్. 681**

* అసురేంద్రుడు విసరిన ఆ గదను ఆది వారాహమూర్తియైన శ్రీహరి ఆనందంగా మందహాసం చేస్తూ అలవోకగా కాలితో పక్కకు పడేటట్లు ఒక్కతన్ను తన్నాడు.

వ. ఇవ్విధంబున గదఁ బోవం దన్ని యసురవిభునితో నిట్లనియె. 682

* ఈ విధంగా గదను దూరంగా తన్నివేసి హిరణ్యాక్షునితో వరాహమూర్తి ఇలా అన్నాడు.

చ. ఘనగదఁ గేలఁ బూని భుజగర్వ మెలర్పఁగ నన్ను సంగరా
వని నెదిరింతు రార! యనివారణ దైత్యకులేశ్వరాధమా!
యనవుడు వాఁడు నుబ్బి గద నంబుజనాభుని వ్రేసె,వ్రేసినం
దనుజవిభేది వట్టికొనెఁ దార్క్ష్యుఁ డహీంద్రునిఁ బట్టుకైవడిన్. 683

* "రాక్షసరాజులలో నీచుడవు నీవు! పెద్ద గద చేతిలో ధరించి మహాబలుడనని అహంకరించి కదనరంగంలో నన్ను ఎదిరించేందుకు కదలి వచ్చావుగా! రారా!" అని పలుకగా హిరణ్యాక్షుడు చెలరేగి మరొక గదాదండాన్ని హరిపై విసరాడు. ఆయన ఆ గదను, గరుత్మంతుడు సర్పమును పట్టినట్లుగా ఒడిసిపట్టుకొన్నాడు.

క. దితిజుఁడు దనబల మప్రతి, హతతేజుం డగు సరోరుహాక్షుని శౌర్యో
న్నతిమీఁదఁ బెట్టకుండుట, మతి నెఱిఁగియుఁ బెనఁగె దురభిమానము పేర్మిన్. 684

* హిరణ్యాక్షుడు తన శౌర్యం అనివార్యమైన హరి శౌర్యం ముందు ఎందుకూ పనికిరాదన్న సంగతి మనస్సులో తెలిసికూడ దురభిమానంతో హరిని ఎదిరించాడు.

వ. అంత. 685

సీ. కాలానలజ్వల జ్జ్వాలా విలోల క, రాళమై పెంపొందు శూల మంది
సురవైరి యజ్ఞసూకర రూపధరుఁడైన, వనజనాభుని మీఁదవైవ నదియు
సద్విజోత్తము మీఁద జపలతఁ గావించు, నభిచార కర్మంబునట్ల బెండు
పడి పఱతేఁ గని పద్మోదరుఁడు దానిఁ, జక్ర ధారాహతిఁ జండ విక్ర

తే. మమున నడుమన వడిఁ ద్రుంచె, నమరభర్త, మహిత దంభోళిచే గరుత్మంతు పక్ష
మతిరయంబునఁ ద్రుంచిన గతిఁ జెలంగి, సురలు మోదింప నసురులు సొంపు డింప. 686

* అప్పుడు ప్రళయాగ్ని జ్వాలలు నాలుకలు చాస్తున్నట్లు భగభగమండే మంటలతో భయంకరమైన శూలాన్ని సురవిరోధియైన హిరణ్యాక్షుడు, సూకరరూపధారి అయిన విష్ణుమూర్తి మీద విసరివేశాడు. అది సద్బ్రాహ్మణునిమీద ప్రయోగించబడిన "చేతబడి"లాగా నిరుపయోగమై నిస్సారమైపోయింది. దేవేంద్రుడు తన వజ్రాయుధంతో గరుత్మంతుని రెక్కలోని ఈకను త్రుంచినట్లు త్రివిక్రముడు అవక్రపరాక్రముడై తన చక్రాయుధంతో ఆ శూలాన్ని మధ్యలోనే రెండుగా ఖండించాడు. అది చూచి దేవతలంతా సంతోషించి గంతులు వేశారు. రాక్షసులు తెల్లమొగాలు వేశారు.

వ. అయ్యవసరంబున నయ్యసుర దనశూలంబు చక్రంబుచేత నిహతం బగుటం గని. 687

* అప్పుడు హిరణ్యాక్షుడు తనశూలం సుదర్శనచక్రం ధాటికి తునిగిపోవటం చూచాడు.

క. దితిజుఁడు రోషోద్ధతుఁడై, యతినిష్ఠుర ముష్టిఁ బొడిచె హరి, నా లోకో
న్నతుఁ డొప్పెఁ గుసుమమాలా, హతి దిగ్గజరాజుఁబోలె నతిదర్పితుఁడై. 688

* అతడికి ఎక్కడలేని రోషం ముంచుకు వచ్చింది. మిక్కిలి కఠోరమైన పిడికిలితో శ్రీహరిని బలంగా ఒక్కపోటు పొడిచాడు. పూలదండతాకిడికి ఐరావతంలాగా ఆ ముష్టిఘాతానికి వరాహమూర్తి కలతచెందక మరింత విరాజిల్లాడు.

మ. హరిమీఁదన్ దితిసంభవుండు ఘనమాయాకోట్లు పుట్టించినన్
ధరణీ చక్రము భూరిపాంసు పటల ధ్వాంతంబునం గప్పె, భీ
కర పాషాణ పురీష మూత్ర ఘనదుర్గంధాస్థి రక్తావళుల్
గురిసెన్ మేఘము లభ్రవీథిని మహాక్షోభ క్రియాలోలమై. 689

* రాక్షసుడు పుండరీకాక్షుని మీద కోట్లకొలది మాయలు ప్రయోగించాడు. భూమండల మంతా దుమ్ముదుమారంతో, కటిక చీకటితో నిండిపోయింది. మేఘాలు ఆకాశమంతా క్రమ్ముకొని భయంకరమైన శిలలూ, మలమూత్రాలూ, కుళ్లిన ఎముకలూ, రక్తప్రవాహాలూ కురుస్తూ గొప్ప సంక్షోభాన్ని కలిగించాయి.

వ. మఱియును. 690

చ. తవిలి విముక్త కేశపరిధానము లుగ్రకరాళదంత తా
లువులును రక్తలోచనములుం గల భూత పిశాచడాకినీ
నివహము లంతరిక్షమున నిల్చి నిజాయుధపాణులై మహా
రవముగ యక్షదైత్య చతురంగ బలంబులఁ గూడి తోఁచినన్. 691

* అదేవిధంగా భూతాలూ, పిశాచాలూ, డాకినులూ జుట్టువిరబోసుకుని దిసమొలతో, కరకు కోరలతో, భయంకరాలైన దౌడలతో, ఎర్రని కన్నులతో గుంపులు గుంపులుగా ఆకాశంలో నిలిచి ఆయుధాలు జళిపిస్తూ పెద్దపెద్ద కేకలువేస్తూ, యక్షదైత్య చతురంగబలాలతో కూడి కనిపించాయి.

వ. అంత. 692

క. త్రిసవన పాదుండగు నా, బిసరుహనేత్రుండు లోకభీకరమగు నా
యసురాధిపు మాయావి ని, రసనకరంబైన శస్త్రరాజముఁ బనిచెన్. 693

* అప్పుడు యజ్ఞస్వరూపుడైన వరాహమూర్తి లోకభీకరమైన ఆ రాక్షసరాజు మాయాజాలాన్ని నిరోధించే నిమిత్తం ఆయుధాలలో అగ్రగణ్యమైన చక్రాన్ని ప్రయోగించాడు.

క. ఆ చక్రభానుదీప్తి ధ, రా చక్రమునందు నిండి రయమున నమ్మా
యాచక్రము నడఁగించెను, నీచక్రముఁడైన యామినీచరు నెదురన్. 694

* సూర్యసన్నిభమైన సుదర్శనచక్రం కాంతిపూరం భూమండలమంతటా నిండి, నీచుడైన ఆ రజనీచరుని మాయాచక్రాన్ని మటుమాయం చేసింది.

**వ. అంత నిక్కడ. 695**

**క. దితి తన విభు వాక్యంబుల, గతి దప్పద యనుచుఁ దలఁపఁగాఁ జన్నుల శో**
**ణితధార లొలికె రక్షః, పతి యగు కనకాక్షు పతన భావము దోఁపన్. 696**

* ఆ సమయంలో ఇంటిలో ఉండి తన భర్త అయిన కశ్యప ప్రజాపతి పలికిన పలుకులు తప్పదని భావించుచున్న దితి పాలిండ్ల నుండి రక్తధారలు స్రవించాయి. అవి హిరణ్యాక్షుని పతనాన్ని స్ఫురింపజేశాయి.

**వ. అయ్యవసరంబున నసురవిభుండు దన చేసిన మాయాశతంబులు గృతఘ్నునకుం గావించిన యుపకారంబులుంబోలె హరిమీఁదఁ బనిసేయక విఫలంబు లయినం బొలివోవని బంటు తనంబునఁ బుండరీకాక్షుఁ జేరం జనుదెంచి బాహుయుగళంబు సాఁచి పూఁచి పొడిచి రక్షోవైరి వక్షంబుఁ బీడించిన నయ్యధోక్షజుండు దప్పించుకొని తలంగినం జెలంగి దైత్యుండు నిష్ఠురం బగు ముష్టిం బొడిచిన నసురాంతకుండు మిసిమింతుండు గాక రోషభీషణాకారంబున వాసవుండు వృత్రాసురుం దెగటార్చిన చందంబున వజ్రివజ్ర సన్నిభంబగు నఱచేతం గఱకు టసుర కటితటంబుఁ జటులగతి వ్రేసిన నా హిరణ్యాక్షుండు దిర్దిరం దిరిగి యుదస్త లోచనుండై సోలి యెట్టకేలకు నెదుర నిలువం బడె, నంత. 697**

* అప్పుడు కృతఘ్నునకు చేసిన మహోపకారాలులాగా హరిమీద తాను ప్రయోగించిన మాయలు విఫలం కావటం మూలాన హిరణ్యాక్షుడు మరింతక్రోధంతో మొక్కవోని పౌరుషంతో హరిని సమీపించి తన బలమంతా వెచ్చించి రెండుచేతులూ చాచి వరాహమూర్తి వక్షఃస్థలం నొక్కిపట్టి నొప్పించాడు. అప్పుడు అధోక్షజుడు రాక్షసుని పట్టు తప్పించుకొని ప్రక్కకు తొలిగాడు. మళ్ళీ దైత్యుడు మరింత పెచ్చరిల్లి బలమైన పిడికిలి పోటుతో వరాహమూర్తిని నొప్పించాడు. అప్పుడు హరి అలసిపోక రోషభీషణాకారుడై, ఇంద్రుడు వృత్రాసురుణ్ణి కొట్టిన విధంగా వజ్రాయుధంవంటి తన అరచేతితో రాక్షసుని చెంప "ఛెళ్ళు"మనేటట్లు ఒక్కచరపు చరచాడు. ఆ దెబ్బకు హిరణ్యాక్షుడు గిరగిరతిరిగి తేలిపోతూ ఉన్న కన్నులతో తూలి సోలి వ్రాలి ఎలాగో లేచి ఎదురుగా నిలబడగలిగాడు.

**క. దిట చెడి లోఁబడె దైత్యుఁడు, సటికిన్, దంష్ట్రావిభిన్న శత్రుమహోర**
**స్తటికిన్, ఖర ఖురపుటికిం, గటితటహత కమలజాండ ఘటికిం, గిటికిన్. 698**

* ఆ విధంగా లొంగిపోయిన హిరణ్యాక్షునికి మెడమీద వ్రేలాడే జూలుతో, దుండగుల గుండెలు బద్దలుకొట్టే కోరలతో, వాడి అయిన గిట్టలతో, బ్రహ్మాండ భాండాన్ని పెటపెటలాడించే కటి ప్రదేశంతో ఆ వరాహ స్వామి స్వరూపం అతిభయంకరంగా కన్పించింది.

**వ. ఇట్లు లోఁబడిన. 699**

మ. దివి నింద్రాదులు సంతసింప హరిమొత్తెం గర్ణమూలంబునం
బవి సంకాశ కఠోరహస్తమున శుంభల్లీలమై దాన దా
నవలోకేశుఁ డుదస్తనేత్రుఁ డగుచున్ దైన్యంబు వాటిల్లఁగా
భువిమీఁదన్ వడిఁగూలె మారుతహతోన్మూలావనీజాకృతిన్. 700

* ఈ విధంగా తనకు లోబడిన రాక్షసరాజు గూబమీద ఇంద్రాదులు సంతోషించేటట్లు వజ్రకఠోరమైన తన హస్తంతో ఒక దెబ్బకొట్టాడు శ్రీహరి. దానితో దానవేంద్రుడు కన్నులు తేలవేసి, జాలిగా గాలిదెబ్బకు తూలి కూకటి వేళ్లతో కూలే మహావృక్షం లాగా నేలపై పడ్డాడు.

క. బుడ బుడ నెత్తురు గ్రక్కుచు, వెడ రూపము దాల్చి గ్రుడ్లు వెలికుఱుక, నిలం
బడి పండ్లు గీటు కొనుచును, విడిచెం బ్రాణములు దైత్యవీరుం డంతన్. 701

* ఆ రాక్షసవీరుడు బుడబుడమని నెత్తురు గ్రక్కుతూ వికారమైన ఆకారంతో, కండ్లు వెలికి రాగా, పండ్లుకొరుకుతూ, ప్రాణాలు వదలాడు.

తే. పడిన దనుజేశ్వరునిఁ జూచి పద్మసంభ, వాది దివిజులు వెఱఁగంది రాత్మలందు
నితఁడు వొందుట యెట్లొకో యీ యవస్థ, నని తలంచుచు మఱియు నిట్లనిరి వరుస. 702

* పుడమిమీద పడిన రాక్షసరాజును చూచి బ్రహ్మాదిదేవతలు ఆశ్చర్యపడ్డారు. ఇతడు ఇటువంటి అవస్థను ఎల్గా పొందగలిగాడా అని తలస్తూ ఇట్లా అనుకున్నారు.

మ. వరయోగీంద్రులు యోగమార్గముల నెవ్వానిన్ మనోవీథి సు
స్థిరతన్ లింగశరీర భంగమునకై చింతింతు, రా పంకజో
దరు పాణ్యాహతిఁ దన్ముఖాంబురుహమున్ దర్శించుచుం జచ్చె దు
ర్భరితోత్తంసుని దైత్యవల్లభుని సౌభాగ్యంబు దానెట్టిదో. 703

* లింగశరీరాలను భంగం చేసుకోటానికి మహాయోగి పుంగవులు యోగమార్గాలద్వారా ఏ మహానుభావుని తమ హృదయాలలో పదిల పరచుకుంటారో ఆ దేవదేవుని చేతిదెబ్బ తిని ఆయన ముఖారవిందాన్నే సందర్శిస్తూ ప్రాణాలు విడిచిన ఈ దైత్యవల్లభుడు ఎంతటి భాగ్యవంతుడో, ఎంతటి ఉత్తమోత్తముడో!

చ. సమమతి వీరు దైత్యకులశాసను పారిషదుల్, మునీంద్ర శా
పమున నికృష్టజన్మమునఁ బైకొని పుట్టియు నేఁడు విష్ణుచే
సమయుట జేసి మీఁద నగు జన్మమునన్ జలజాక్షు నిత్య వా
సమున వసింతు రెన్నఁటికిఁ జావును బుట్టువు లేవు వీరికిన్. 704

* శ్రీమన్నారాయణుని ద్వారపాలకులు మునీంద్రుల శాపం వల్ల రాక్షసులై జన్మించారు. విష్ణువుచేతిలో మరణించి వచ్చే జన్మలో వైకుంఠంలో నిత్యనివాసం చేస్తారు. ఆ పైన వీరికి ఎన్నటికీ చావు పుట్టుకలు లేవు. (ఆ ఇద్దరిలో ఇతడొకడు).

**క. అని వెఱఁగు నొంది పావన, తను వొందిన యట్టి వికచతామరసాక్షు**
**న్ననిమిష ముని యోగిజనా, వనదక్షున్ దనుజకరటి వరహర్యక్షున్. 705**

**వ. కనుంగొని. 706**

* బ్రహ్మాదిదేవతలు ఈ విధంగా అనుకొని, ఆశ్చర్యపడి పరమపవిత్రమైన శరీరం ధరించినవాడూ, వికసించిన కమలాలవంటి కన్నులు గలవాడూ, దేవతలనూ మునులనూ యోగులనూ రక్షించటంలో సమర్థుడైనవాడూ, రాక్షసులనే ఏనుగులను శిక్షించడంలో సింహంవంటివాడూ అయిన స్వామిని సందర్శించారు.

**చ. వనజదళాక్ష! యీ జగతివారల మర్మము లీ వెఱింగి యీ**
**సునఁ బగఁబట్టు నీ దివిజసూదనుఁ జంపితి గాన యింక శోక**
**భన మగునంచు హస్తములు ఫాలములం గదియించి యందఱున్**
**వినమితులై నుతించిరి వివేక విశాలునిఁ బుణ్యశీలునిన్. 707**

* అలా దర్శించినవారై దేవతలు " ఓ కమలాక్షా! నీవు సర్వజ్ఞుడవు! ఈ లోకంలో ప్రాణుల రహస్యాలన్నీ నీకు తెలుసు. అలా తెలుసుకొని, అసూయతో పగబట్టిన ఈ సురవిరోధిని సంహరించావు. కాబట్టి ఇక అందరికీ శుభం కలుగుతుంది"అని నుదుట చేతులు చేర్చి వివేకశాలీ, పుణ్యశీలీ అయిన వనమాలిని వినయవినమ్రులై వినుతించారు.

**వ. అంత. 708**

**చ. సవన వరాహమూర్తి సురశాత్రవుఁ ద్రుంచినమీఁద భారతీ**
**ధవముఖ దేవతాముని కదంబము దన్ను నుతించునట్టి సం**
**స్తవమున కాత్మలోనఁ బ్రమదంబును బొంది సమగ్ర మంగళో**
**త్సవము దలిర్ప నందఱుఁ బ్రసాదవిలోకన మొప్పఁ జూచుచున్. 709**

* ఈ విధంగా యజ్ఞవరాహమూర్తియైన హరి, దేవతావిరోధియైన హిరణ్యాక్షుని సంహరించినందుకు బ్రహ్మాదిదేవతలూ మునులూ ఆయనను కొనియాడారు. ఆ సంస్తుతులకు భగవంతుడు అంతరంగంలో ఎంతో సంతోషించాడు. ఆ పెంపొందిన సంపూర్ణమంగళ మహోత్సవ సందర్భంలో గోవిందుడు అందరినీ కరుణార్ద్ర దృష్టులతో తిలకించాడు.

**చ. అరిగె వికుంఠ ధామమున క మ్మహితోత్సవ సూచకంబుఁగా**
**మొరసె సుపర్వదుందుభు లమోఘములై, ధరణీతలంబునం**

గురిసెఁ బ్రసూనవృష్టి, శిఖికుండము లెల్లెడఁ దేజరిల్లె, భా
స్కరశశి మండలంబులు నిజద్యుతితో వెలుఁగొందె నత్తఱిన్. 710

* అలా తిలకించి దేవదేవుడు వైకుంఠానికి విజయం చేశాడు. ఆ మహోత్సవానికి సూచకంగా ఆ లోకంలో దేవదుందుభులు మ్రోగాయి. భూలోకంలో పూలవాన కురిసింది. అంతటా హోమకుండాలలో అగ్నులు తేజరిల్లాయి ఆ శుభసమయాన సూర్యచంద్రులు సహజ కాంతులతో ప్రకాశించారు.

క. అని యీ పుణ్యచరిత్రము, వనరుహసంభవుఁడు త్రిదివవాసులకుం జె
ప్పిన యది మైత్రేయుఁడు విదు,రున కెఱిఁగించిన విధంబు రూఢము గాఁగన్. 711

క. శుకయోగి పరీక్షిత్తున, కకుటిలమతి నెఱుఁగఁజెప్పె నని సూతుఁడు శౌ
నక ముఖ్యులైన మునివరు, లకుఁ దెలియఁగఁ జెప్పె మఱియు లాలన మొప్పన్. 712

* బ్రహ్మదేవుడు దేవతలకు చెప్పినటువంటి ఈ పవిత్ర చరిత్రాన్ని మైత్రేయుడు విదురునకు వివరించాడు. దానిని శుకయోగీంద్రుడు పరీక్షిన్నరేంద్రునకు మంచి మనస్సుతో వినిపించాడు అని సూతుడు శౌనకాది మునులకు ఎంతో చక్కగా తెలియ జెప్పాడు.

వ. ఇవ్విధంబున మైత్రేయుండు సెప్పిన విని విదురుండు సంతసిల్లె నని. 713

* పై విధంగా మైత్రేయుడు చెప్పగా విని విదురుడు చాల సంతోషించాడు.

క. అనఘంబగు నీ చరితము, వినినఁ బఠించిన లభించు విశ్రుత కీర్తుల్
వనజోదరు పదభ క్తియుఁ, మునుకొని యిహపర సుసౌఖ్యములు జనములకున్. 714

* పాపాలను పారదోలే ఈ చరిత్రం వినినా చదివినా, లోకులకు విశేషకీర్తీ, విష్ణుభక్తీ, ఇహపర సుఖాలూ తప్పకుండా లభిస్తాయి.

వ. అని చెప్పి వెండియు సూతుండు మహర్షుల కిట్లనియె. నట్లు పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రుం గనుంగొని "మునీంద్రా, హిరణ్యాక్ష వధానంతరంబున వసుంధర సమస్థితిం బొందిన విధంబును, స్వాయంభువ మనువుం బుట్టించిన యనంతరంబున విరించి దిర్యగ్జాతిజంతు సృష్టినిమిత్తంబులైన మార్గంబు లెన్ని సృజించె, మహాభాగవతోత్తముం డయిన విదురుండు గృష్ణున కపకారంబు దలంచిన పాపవర్తనులగు ధృతరాష్ట్ర పుత్రులం బాసి జనకుండగు కృష్ణద్వైపాయనునకు సముం డగుచుఁ దనమనోవాక్కాయ కర్మంబులు గృష్ణునంద చేర్చి భాగవత జనోపాసకుండై పుణ్యతీర్థ సేవా సమాలబ్ధయశో విగత కల్మషుం డగుచు మైత్రేయ మహాముని నేమి ప్రశ్నంబు లడిగె? నవి యెల్లం దెలియ నానతి" మ్మనిన రాజేంద్రునకు శుకయోగీంద్రుం డిట్లనియె. 715

* అని చెప్పి మళ్లీ సూతుడు మహర్షులతో ఇట్లా అన్నాడు. హిరణ్యాక్షుని కథ విన్న పరీక్షిన్నరేంద్రుడు శుకయోగీంద్రుని చూచి "మునీంద్రా! హిరణ్యాక్షుడు వధింపబడిన తర్వాత లోకం ప్రశాంతమై సమస్థితిని

పొందిన సంగతి చెప్పు. స్వాయంభువ మనువును సృష్టించిన తర్వాత బ్రహ్మదేవుడు పశుపక్ష్యాది జంతువులను సృష్టించడానికై ఎన్ని మార్గాలను కల్పించాడో వివరించు. మహాభాగవత వరేణ్యులలో అగ్రగణ్యుడైన విదురుడు, శ్రీకృష్ణునకు అపకారం తలచిన దుందుడుకులను ధృతరాష్ట్రుని కొడుకులను విడిచిపెట్టి వెళ్లినట్లు చెప్పావుగదా. ఆయన తన తండ్రియైన వేదవ్యాసునితో సమానుడై మనస్సూ, వాక్కూ, కర్మా - సమస్తమూ శ్రీకృష్ణుని యందే సమర్పించి భగవద్భక్తులను అనురక్తితో ఆరాధించుతూ, పుణ్యతీర్థాలు సేవించుతూ ఎంతో మనోవికాసం పొంది దురితదూరుడై మైత్రేయమహామునిని ఇంకా ఏమని ప్రశ్నించాడు? అవి అన్నీ విశదీకరించు''అనగా ఆ నరేంద్రునితో మునీంద్రుడు ఇట్లా అన్నాడు.

**సీ. విమలాత్ముఁడైన యవ్విదురుండు మైత్రేయ మునివరుఁ జూచి యిట్లనియెఁ బ్రీతిఁ**
**జతురాత్మ! సకల ప్రజాపతి యైనట్టి జలజగర్భుఁడు ప్రజాసర్గమందు**
**మును ప్రజాపతులను బుట్టించి వెండియుఁ జిత్తమం దేమి సృజింపఁ దలఁచె?**
**మును సృజించిన యట్టి మును లమ్మరీచ్యాదు లబ్జజు నాదేశ మాత్మ నిలిపి**

**తే. యర్థి నెట్లు సృజించిరి యఖిల జగము?, మఱసి మఱి వారు భార్యాసమేతు లగుచు**
**నేమి సృజియించి? రదిగాక కామినులను, బాసి యేమి సృజించి రా భద్రయశులు? 716**

* పవిత్రమైన మనస్సుగల ఆవిదురుడు మైత్రేయుణ్ణి చూచి ఎంతో సంతోషంతో ఇట్లా అన్నాడు. వాక్చాతుర్యం గల ఓ మహాత్మా! సమస్తసృష్టికీ కర్తయైన చతుర్ముఖబ్రహ్మ ప్రజాసృష్టికోసం ముందుగా ప్రజాపతులను సృష్టించాడుగదా! అనంతరం ఇంకా ఏమి సృష్టించా లనుకున్నాడు? ముందుగా సృష్టించిన మరీచి మొదలగువారు బ్రహ్మదేవుని ఆదేశానుసారం లోకాలన్నింటినీ ఎట్లా సృష్టించారు? పేరెన్నికగన్న ఆ ప్రజాపతులు సతీసమేతులై ఏమేమి సృష్టించారు? ఆ తర్వాత భార్యలు లేకుండా ఏమి సృష్టించారు?

**క. అందఱుఁ దమలో నైక్యముఁ, జెందినచో నేమి దగ సృజించిరి? కరుణా**
**కందళిత హృదయ! యిన్నియుఁ, బొందుగ నెఱిఁగింపు మయ్య బుధనుత! నాకున్. 717**

కరుణార్ద్రహృదయా! బుధజన స్తవనీయా! మైత్రేయా! వారందరూ కలసికట్టుగా సమైక్యమై ఏమేమి సృజించారు. ఇవన్నీ వివరంగా నాకు చెప్పు.

### -: చతుర్ముఖుం డొనర్చు యక్షాదిదేవతాగణ సృష్టి దెలుపుట : -

**సీ. అనిన మునీంద్రుఁ డిట్లనియె జీవాదృష్ట పరుఁడు మాయాయుక్త పురుషవరుఁడుఁ**
**గాలాత్మకుఁడు నను కారణంబున నిర్వికారుఁ డైనట్టి జగన్నివాసుఁ**
**డాది జాతక్షోభుఁ డయ్యె, నమ్మేటి వలనను గుణత్రయంబును జనించె;**
**నా గుణత్రయమునం దయ్యె మహత్తత్త్వ, మది రజోగుణ హేతువైన దాని**

**తే. యం దహంకార మొగిఁ ద్రిగుణాత్మకమునఁ, బొడమె, మఱి దానివలనఁ బ్రభూత మయ్యెఁ**
**బంచతన్మాత్ర, లందు సంభవము నొందె, భూత పంచక మీ సృష్టి హేతు వగుచు. 718**

* ఇలా ప్రశ్నించిన విదురునితో మైత్రేయుడు ఇలా అన్నాడు. భగవంతుడు జీవులకు అగోచరుడు. ఆ పురుషోత్తముడు యోగమాయా సమేతుడు. కాలస్వరూపుడు. కాబట్టి అతడు నిర్వికారుడు. ఆ జగన్నివాసుడు, ఆదికాలంలో "లోకాలను ఎట్లా సృష్టించేది?" అని తీవ్రంగా ఆలోచించాడు. ఆ ఆలోచనా ఫలితంగా సత్త్వము, రజస్సు, తమము అనే మూడు గుణాలు పుట్టాయి. ఆ గుణత్రయంలో రజోగుణంనుండి మహత్తత్త్వం పుట్టింది. ఆ మహత్తత్త్వం నుండి మూడుగుణాల అంశాలు కలదైన అహంకారం పుట్టింది. ఆ అహంకారం నుండి పంచతన్మాత్రలు పుట్టాయి. వాని నుండి పంచభూతాలు పుట్టాయి. ఇవే సమస్త సృష్టికీ కారణమయ్యాయి.

**వ. అవియును దమలోనఁ బ్రత్యేకంబ భువన నిర్మాణ కర్మంబునకు సమర్థంబులు గాక యన్నింటి సంఘాతంబునఁ బాంచభౌతికంబైన హిరణ్మయాండంబు సృజియించె, నదియును జలాంతర్వర్తియై వృద్ధిఁ బొందుచుండె నంత. 719**

* ఆ పంచభూతాలలో ఏ ఒక్కదానికీ ప్రత్యేకంగా లోకాన్ని సృష్టించడం చేతకాలేదు. పైన చెప్పిన అవన్నీ ఒకగుంపుగా కలిసి పాంచభౌతికమైన ఒక బంగారు గ్రుడ్డును సృష్టించాయి. ఆ గ్రుడ్డు మహాజలాలలో తేలియాడుతూ ఉండి వృద్ధి పొందుతూ ఉన్నది.

**సీ. నారాయణాఖ్య నున్నతి నొప్పు బ్రహ్మంబు సాహస్రదివ్య వర్షంబు లోలి**
**వసియించి యుండె, నా వాసుదేవుని నాభియందు సహస్రసూర్యప్రదీప్తిఁ**
**దనరుచు సకల జీవ నికాయయుత మగు పంకజాతంబు సంభవము నొందె,**
**బరఁగంగ నందులో భగవదధిష్ఠితుండై స్వరాట్టగు చతురాననుండు**

**తే. జనన మందెను తత్పద్మసంభవుండు, నామరూప గుణాది సంజ్ఞాసమేతుఁ**
**డగుచు నిర్మాణ మొనరించె నఖిలజగము, వనజజుండు నిజచ్ఛాయవలన మఱియు. 720**

* 'నారాయణుడు'అనుపేరుతో పరబ్రహ్మం వెయ్యి దివ్యసంవత్సరాలు ఆ హిరణ్మయమైన అండాన్ని అధిష్ఠించి ఉన్నాడు. ఆ శ్రీమన్నారాయణుని బొడ్డునుండి వేయిసూర్యుల కాంతులతో వెలుగుతూ, సమస్త ప్రాణి సమూహానికీ ఆశ్రయమైన ఒకానొక పద్మం పుట్టింది. ఆ పద్మంలో నుండి భగవదంశతో చతుర్ముఖబ్రహ్మ జనించాడు. స్వయం ప్రకాశుడైన ఆ బ్రహ్మదేవుడు నామములు, రూపములు, గుణములు అనే సంకేతములు కలవాడై సమస్త జగత్తులనూ సృష్టించాడు.

**సీ. తామిస్రమును నంధతామిస్రమును దమమును మోహనము మహామోహనంబు**
**నను పంచమోహ రూపాత్మకమైన యవిద్యఁ బుట్టించి యవ్వేళఁ దనకు**
**నది తమోమయదేహ మని ధాత రోసి తత్తనువు విసర్జించె, ధాతృముక్త**
**దేహంబు సతత క్షుత్తృష్ణల కావాసమును రాత్రిమయము నయ్యెను దలంప,**

**తే. నందులో యక్షరక్షస్సు లన జనింప, వారి కప్పుడు క్షుత్తృషల్ వఱలఁ గొంద**
**ఱా చతుర్ముఖు భక్షింత మనిరి, కొందఱతని రక్షింత మని తగ నాడి రంత. 721**

* బ్రహ్మదేవుడు తన ఛాయతో అవిద్యను పుట్టించాడు. ఆ అవిద్యలో తామిస్రము, అంధతామిస్రము, తమము, మోహము, మహామోహము అనే ఐదు విధాలైన మోహస్థితు లున్నాయి. ఆ తర్వాత బ్రహ్మ మోహమయమైన తన శరీరాన్ని చూచి ఏవగించుకొన్నాడు. ఆ దేహాన్ని వదలివేశాడు. ఆ బ్రహ్మ వదలిపెట్టిన దేహం, ఆకలి దప్పులకు స్థానమూ - రాత్రిమయమూ అయినది. దానిలో నుండి యక్షులూ రక్షస్సులూ అనే ప్రాణులు పుట్టారు. వారికి ఆకలిదప్పులు అతిశయించాయి. ఆ యక్షరక్షస్సులలో కొందరు బ్రహ్మను "భక్షిద్దాం"అన్నారు; మరి కొందరు "రక్షిద్దాం"అన్నారు.

**వ. ఇట్లు వలుకుచు భక్షించువారలయి ధాత సన్నిధికిం జనిన నతండు భయవిహ్వలుండై యేను మీ జనకుండను, మీరలు మత్పుత్త్రులరు, నన్ను హింసింపకుండనుచు "మా మా జక్షత", "రక్షత" యను శబ్దంబులు వలుకం దన్నిమిత్తంబున వారలకుం గ్రమంబున యక్షరక్షోనామంబులు ప్రకటంబు లయ్యె, వెండియుం బ్రభావిభాసితంబైన యొక్క కాయంబు ధరించి సత్త్వగుణ గరిష్ఠులుం బ్రభావంతులు నగు సుపర్వులం బ్రముఖులంగా సృజియించి తత్ప్రభామయగాత్ర విసర్జనంబు సేసిననది యహోరూపంబై దేవతావళికి నాశ్రయంబయ్యె, మఱియు జఘనంబు వలన నతిలోలుపులైన యసురులం బుట్టింప వార లతికాముకు లగుటంజేసి యయ్యజునిం జేరి మిథున కర్మం బపేక్షించిన విరించి నగుచు నిర్లజ్జులయిన యసురులు దనవెంటం దగులం బఱచి ప్రసన్నార్తిహరుండును, భక్త జనానురూప సందర్శనుండును నైన నారాయణుం జేరి తత్పాదంబులకుం బ్రణమిల్లి యిట్లనియె. 722**

* ఈ విధంగా పలుకుతూ వారు బ్రహ్మ సమీపానికి వచ్చారు. అప్పుడు బ్రహ్మ భయకంపితుడై "నేను మీ తండ్రిని. మీరు నా కుమారులు. నన్ను హింసించవద్దు"అంటూ " మా జక్షత", "రక్షత"అనే శబ్దాలు ఉచ్చరించాడు. ఆ కారణంగానే వారికి యక్షులు, రక్షస్సులు అనే పేర్లు వచ్చాయి.

ఆ పిమ్మట బ్రహ్మదేవుడు తేజోవిరాజితమైన మరొక దేహం ధరించాడు. సత్త్వగుణ సంయుతులూ, ప్రకాశవంతులూ అయిన దేవతలను ప్రముఖులుగా సృష్టించాడు. అనంతరం బ్రహ్మ ఆ తేజోమయమైన దేహాన్ని వదలివేయగా అది పగలుగా రూపొంది దేవతలందరికీ ఆశ్రయమయింది. తరువాత ఆ బ్రహ్మ తన కటిప్రదేశం నుండి మిక్కిలి చంచలచిత్తులైన అసురులను పుట్టించాడు. వారు అతికాముకులు అగుటవల్ల ఆ బ్రహ్మదేవుణ్ణి చుట్టుముట్టి రతిక్రియను అపేక్షించారు. సిగ్గువిడిచిన అసురులు తన వెంటపడగా బ్రహ్మ నవ్వుతూ పరుగులు తీశాడు. అలా పరుగెత్తి శరణాగతుల కష్టాలను తొలగించే వాడూ, భక్తులు కోరిన రూపంతో దర్శనం ఇచ్చేవాడూ, అయిన శ్రీమన్నారాయణుని దగ్గరకు వెళ్లి ఆయన పాదపద్మాలకు ప్రణమిల్లి ఇలా అన్నాడు.

**క. రక్షింపుము రక్షింపు ము, పేక్షింపక వినుత నిఖిల బృందారక, వి**
**శ్వక్షేమంకర విను మిటు, దక్షత నీ యాజ్ఞ నేను దల నిడి వరుసన్. 723**

* "రక్షించు! రక్షించు" ఓ బృందారక బృందవందితా! సకల లోకాలనూ చల్లగా రక్షించే స్వామీ! ఉపేక్షింపక నన్ను రక్షించు; ఈ మాట ఆలకించు; నేను నీ ఆజ్ఞ తలదాల్చేవాడను.

**తే. ఈ ప్రజాసృష్టి కల్పనం బే నొనర్ప, నందుఁ బాపాత్ములైన యీ యసురు లిపుడు**
**నను రమింపఁగ డాయ వచ్చినఁ గలంగి, యిటకు వచ్చితి, ననుఁ గావు మిద్ధచరిత! 724**

* అలా నీ ఆజ్ఞానుసారమే ఈ ప్రజలను సృష్టించాను. పాపాత్ములైన ఈ రాక్షసులు నన్నే రమించాలనే దుర్బుద్ధితో నా వెంటపడి మీది మీదికి వస్తున్నారు. వంత చెంది నీ చెంతకు వచ్చాను. ఓ సుచరిత్రా! నన్ను రక్షించు.

**వ. అదియునుంగాక లోకంబువారలకుం గ్లేశంబు లొనరింపను, గ్లేశంబునం బొందిన వారల క్లేశంబు లపనయింపను నీవ కాక యితరులు గలరే? యని స్తుతియించినఁ బద్మజు కార్పణ్యం బెఱుంగ నవధరించి వివిక్తాధ్యాత్మదర్శనుం డగుచు గమల సంభవ! భవద్ఘోరతను త్యాగంబు సేయు మని యానతిచ్చిన నతండు నట్ల చేసెనంత నదియును. 725**

* అంతేకాక లోకంలో ఉండేవారికి క్లేశాలు కలిగించడానికీ, కష్టాలుపడే వారి కష్టాలను దూరం చేయడానికీ సమర్థు లైనవారు నీవు తప్ప వేరేవా రెవ్వరున్నారు?"అని స్తోత్రం చేయగా, బ్రహ్మదేవుని దైన్యాన్ని పూర్తిగా తెలుసుకొన్నవాడై నిస్సందేహంగా అందరి హృదయాలను సందర్శింపగల శ్రీహరి ' ఓ బ్రహ్మదేవుడా! ఘోరమైన ఈ నీ శరీరాన్ని వదలిపెట్టు" అని ఆనతిచ్చాడు. బ్రహ్మదేవుడు అలాగే నని ఆ దేహాన్ని త్యాగం చేశాడు.

**సీ. నవ్య కాంచనరణ న్మణి నూపురారావ విలసిత పాదారవింద యుగళ**
**కాంచీ కలాప సంకలిత దుకూల వస్త్రస్ఫార పులిన నితంబబింబ**
**రాజితాన్యోన్య కర్కశ పీన కరికుంభ పృథు కుచభార కంపిత వలగ్న**
**మదిరా రసాస్వాద మద విఘూర్ణిత చారు సిత నవ వికచ రాజీవ నయవ**

**తే. యపర పక్షాష్టమీ శశాంకాభ నిటల, మదవ దలికుల రుచిరోపమాన చికుర**
**లలిత చంపక కుసుమ విలాసనాస, హాసలీలావలోకన యబ్జపాణి. 726**

**క. అనఁ దగి సంధ్యారూపం, బున లలనారత్న మపుడు పుట్టిన దానిం**
**గనుఁగొని దానవు లుపగూ, హన మొగిఁ గావించి పలికి రందఱుఁ దమలోన్. 727**

* అప్పుడు ఆ దేహంలోనుంచి 'సంధ్యాసుందరి' అనే చక్కదనాల చుక్క ఉదయించింది. మణులు తాపిన క్రొంగ్రొత్త బంగారపు కాలి అందెలు ఘల్లుఘల్లున మ్రోగే పాదపద్మాలతోనూ, మెత్తని పట్టుచీరపై మిలమిల మెరుస్తున్న మొలనూలుతోనూ, ఇసుకతిన్నెలవలె కన్నుల విందుచేసే కటిప్రదేశంతోనూ, ఒకదానితో ఒకటి ఒరసికొంటున్న కుచకుంభాల బరువుకు నకనకలాడే నడుముతోనూ, మద్యపానం మత్తుతో చలిస్తూ

అప్పుడే వికసించిన అరవిందాలవంటి అందాల కందోయితోనూ, కృష్ణపక్షం అష్టమినాటి చందమామను పోలిన సుందర ఫాలభాగంతోనూ, మత్త మధుకర నికరాలకు సాటివచ్చే ఒత్తైన శిరోజాలతోనూ, సొగసైన సంపంగి మొగ్గవలె సోగదేలిన ముక్కుతోనూ, చిరునవ్వులు చిందే చూపులతోనూ, తామర పూలవంటి చేతులతోనూ సాక్షాత్కరించిన ఆ సంధ్యాసుందరిని రాక్షసులందరూ సందర్శించారు. ఆగలేక కౌగిలించుకున్నారు. తమలో తాము ఇట్లా మాట్లాడుకున్నారు.

**క. ఈ సౌకుమార్య, మీ వయ, సీ సౌందర్యక్రమంబు, నీ ధైర్యంబు,**
**న్నీ సౌభాగ్య విశేషము, నే సతులకుఁ గలదు చూడ నిది చిత్ర మగున్. 728**

* ఆహాహా! ఈ సౌకుమార్యం, ఈ నవయౌవనం, ఈ సౌందర్యం, ఈ జాణతనం, ఈ సౌభాగ్యవిశేషం లోకంలో ఏ స్త్రీలకూ లేదు. ఇది చాల చిత్రంగా ఉంది.

**చ. అని వెఱఁగంది యద్దనుజు లందఱు నిట్లని రీ తలోదరిం**
**గని మన మంతనుండియును గాముక వృత్తిఁ జరించుచుండఁగా**
**మనయెడ దీని చిత్తమున మక్కువ లేమికి నేమి హేతువో?**
**యని బహుభంగులం బలికి యా ప్రమదాకృతి యైన సంధ్యతోన్. 729**

**వ. ఇట్లనిరి. 730**

* అని ఆ అందాల రాశిని అవలోకించి అసురులంతా ఆశ్చర్యపడ్డారు. "మనమంతా ఈమెను చూచినప్పటినుండీ ప్రేమావేశంతో కామోత్కంఠులమై ఉండగా ఈమె మాత్రం మనమీద ఏమాత్రం మక్కువ చూపకుండా ఉండటానికి కారణం ఏమిటి?" అని అనేక విధాలుగా అనుకుంటూ, ఆ సంధ్యాసుందరితో ఇలా సంభాషించారు.

**క. ఓ కదళీస్తంభోరువ!, యే కుల? మే జాడదాన? వెవ్వరిసుత? వి**
**ట్లేకాంతంబున నిచ్చట, నే కారణమునఁ జరించె? దెఱిఁగింపు తగన్. 731**

* అరటి కంబాల వంటి నున్నని తొడలు కలదానా! నీది ఏ కులం? నీది ఊరు? నీ తల్లిదండ్రులు ఎవ్వరు? ఇక్కడ నీవు ఒంటరిగా తిరుగుతూ ఉండటానికి కారణం ఏమిటి? మాకు తెలియ జెప్పు.

**క. భవదీయ చారు రూప, ద్రవిణ లసత్పుణ్య భూమిఁ దగు మోహమునం**
**దవిలిన దుర్భరులను మముఁ, గవయవు పుష్పాస్త్రబాధ ఘనమయ్యెఁ గదే. 732**

* అందాల కుప్పవైన నీ సౌందర్యసంపదతో ఇంపైన ఈ భూమి ఎంత పుణ్యం చేసుకున్నదో! మేము నీ చక్కదనానికి చిక్కి నీ ఎడబాటు భరింపలేక నీ వెంటపడ్డాము. అటువంటి సమ్మోహితులమైన మమ్మల్ని నీవు ఎందుకు నీ చెంత చేర్చుకోవు. ఆ మన్మథుడున్నాడే వాడు మమ్మల్ని పూల బాణాలతో వేధించుకు తింటున్నాడు. వాడి తాకిడికి తట్టుకోలేకుండా ఉన్నాము.

వ. మఱియుఁ దదీయ సౌందర్యం బుగ్గడింప నలవిగాక చింతించుచు. 733

* అంటూ వాళ్లు ఆ సుందరి అందాన్ని అభివర్ణించడానికి అలవిగాక మాటలురాక ఆలోచింపసాగారు.

సీ. గురు కుచభార సంకుచితావలగ్నంబు దనరారు నాకాశతలము గాఁగ
లలిత పల్లవ పాణి తలమునఁ జెన్నొందు చెండు పతత్పతంగుండు గాఁగ
సలలిత నీల పేశల పృథు ధమ్మిల్ల బంధంబు ఘనతమఃపటలి గాఁగఁ
బ్రవిమలతర కాంత భావ విలోకన జాలంబు దారకాసమితి గాఁగఁ

తే. గడఁగి మైపూఁత సాంధ్యరాగంబు గాఁగ, నంగనాకృతి నొప్పు సంధ్యావధూటిఁ
గదిసి మనముల మోహంబు గడలుకొనఁగ, నసురు లందఱుఁ గూడి యిట్టనిరి మఱియు. 734

* కుచకుంభాల బరువువల్ల జవజవలాడే నడుము ఆకాశం కాగా, అందమైన చిగురుటాకువంటి హస్తమందు ప్రకాశించే పూలచెండు అస్తమించే సూర్యబింబం కాగా, నల్లగా నిగనిగమెరుస్తూ విప్పారిన గొప్ప కొప్పుముడి చీకటి రేకలు కాగా, స్వచ్ఛమైన భావాలను వెల్లడిస్తూ తళతళ మెరిసే వీక్షణాలు నక్షత్రాలు కాగా, శరీరంనిండా పూసుకున్న మంచి గంధం పూత సంధ్యారాగం కాగా, స్త్రీరూపం ధరించిన ఆ సంధ్యాదేవిని అసురులందరూ చుట్టుముట్టారు. హృదయాలలో విచ్చలవిడిగా పెచ్చరిల్లిన మోహావేశంతో ఆమెను చూచి మళ్లీ ఇట్లా అన్నారు.

క. వెలయఁగఁ బద్మం బేక, స్థలముననే యొప్పుఁ గాని త్వత్పదపద్మం
బిల బహుగతుల ననేక, స్థలములఁ దనరారుఁగాదె తరుణాబ్జముఖీ! 735

* క్రొత్తగా వికసించిన తామర పువ్వువంటి మొగం గల ఓ పిల్లా! పద్మం ఒకే స్థలంలో ఉంటుంది గదా! మరి నీ పాదాలనే పద్మాలు ఈ భూమిపై అనేక ప్రదేశాల్లో అనేక ప్రకారాలుగా ప్రకాశిస్తూ ఉన్నాయేమిటి?

క. అని దనుజులు దమ మనములఁ, ననురాగము లుప్పతిల్ల నందఱు నా సం
ధ్యను బట్టికొనిరి, వనజా, సనుఁ డప్పుడు హృదయమందు సంతస మందెన్. 736

* అని పలుకుతూ ఆ రాక్షసులు తమ మనస్సులో తమకం అధికం కాగా, ఆ సంధ్యాసుందరిని పట్టుకున్నారు. అది చూచి బ్రహ్మ హృదయంలో ఎంతగానో సంతోషించాడు.

క. సరసిజభవుఁ డయ్యెడఁ దన, కర మాఘ్రాణింప నపుడు గంధర్వులు న
ప్సరసలుఁ బుట్టిరి, ధాతయుఁ, బరువడి నాత్మీయతనువుఁబాసిన నదియున్. 737

* బ్రహ్మదేవుడు అప్పుడు తన హస్తాన్ని ఆఘ్రాణించాడు. అప్పుడు గంధర్వులూ, అప్సరసస్త్రీలూ పుట్టారు. వెంటనే బ్రహ్మ తన శరీరాన్ని వదలివేశాడు.

వ. చంద్రికారూపంబైన, దద్గాత్రంబు విశ్వావసు పురోగములగు గంధర్వాప్సరోగణంబులు గైకొనిరి. వెండియుం గమల గర్భుండు తంద్రోన్మాద జృంభికా నిద్రా రూపంబైన శరీరంబు దాల్చి పిశాచ

**గుహ్యక సిద్ధ భూత గణంబులం బుట్టించిన వారలు దిగంబరులు, ముక్తకేశులు నయినం జూచి ధాత లోచనంబులు ముకుళించి తద్గాత్రంబు విసర్జనంబు గావించిన నది వారలు గైకొనిరి, వెండియు నజుండు దన్ను నన్నవంతునింగాఁ జింతించి యదృశ్యదేహుం డగుచుం బితృ సాధ్యగణంబులం బుట్టించిన వారలు దమ్ముఁ బుట్టించిన యదృశ్య శరీరంబునకుం గార్యంబగు దేవభాగంబుఁ గైకొనినం దత్కారణంబునం బితృసాధ్యగణంబుల నుద్దేశించి శ్రాద్ధంబుల హవ్యకవ్యంబు లాచరింతురు, మఱియును. 738**

* వెన్నెల రూపాన్ని పొందిన ఆ దేహాన్ని విశ్వావసువు మున్నగు గంధర్వులూ అప్సరస్త్రీలూ గైకొన్నారు. మళ్ళీ బ్రహ్మ కునుకుపాటు, ఉన్మాదం, ఆవులింత, నిద్ర - వీటితో కూడిన శరీరాన్ని ధరించి, పిశాచాలనూ గుహ్యకులనూ, సిద్ధులనూ, భూతాలనూ పుట్టించాడు. అలా పుట్టిన వారు దిగంబరులై వెండ్రుకలు విరబోసుకొని ఉన్నారు. అదిచూచి బ్రహ్మకన్నులు మూసుకొని అప్పటి తన శరీరాన్ని వదలివేయగా దానిని పిశాచాదులు తీసుకున్నారు. అనంతరం బ్రహ్మ తనను అన్నవంతునిగా భావించి, అదృశ్య శరీరుడై, పితృదేవతలనూ, సాధ్యులనూ పుట్టించాడు. వారు దమ్ము పుట్టించిన అదృశ్యదేహానికి కార్యమైన దేవభావాన్ని అందుకున్నారు. ఆ కారణంవల్లనే శ్రాద్ధ సమయాలలో పితృగణాలనూ, సాధ్యగణాలనూ, ఉద్దేశించి హవ్యకవ్యాలను సమర్పిస్తారు.

**సీ. సజ్జనస్తుత!, విను చతురతఁ బంకజాసనుఁడు దిరోధాన శక్తి వలన**
**నర సిద్ధ విబుధ కిన్నరులను బుట్టించి తవిలి వారికిఁ దిరోధాన నామ**
**ధేయ మైనట్టి యా దేహంబు నిచ్చెను వెండియు భారతీవిభుఁడు దనకుఁ**
**బ్రతిబింబ మగు శరీరమునఁ గిన్నరులఁ గింపురుషులఁ బుట్టింపఁ బూని వారు**

**తే. ధాతృప్రతిబింబ దేహముల్ దాల్చి వరుస, నిద్ద ఱిద్దఱు గవగూడి యింపులొదవ**
**బ్రహ్మపరమైన గీతముల్ పాడుచుండి, రంతఁ బంకజ సంభవుఁ డాత్మలోన. 739**

* సజ్జనులు సంస్తుతించే ఓ పరీక్షిన్మహారాజా! విను. బ్రహ్మదేవుడు నేర్పుతో తిరోధానశక్తి వల్ల సిద్ధులనూ, విద్యాధరులనూ పుట్టించి, వారికి తిరోధానము అనేపేరుగల ఆ దేహాన్ని ఇచ్చాడు. తర్వాత బ్రహ్మ తనకు ప్రతిబింబంగా ఉన్న శరీరంనుండి కిన్నరులనూ కింపురుషులనూ పుట్టించాడు. వారు ఆ బ్రహ్మదేవుని ప్రతిబింబాలైన శరీరాలను ధరించి ఇద్దరిద్దరు జతకూడి బ్రహ్మదేవునికి సంబంధించిన గీతాలను గానం చేయసాగారు.

**క. తన సృష్టి వృద్ధి లేమికిఁ, గనలుచు శయనించి చింతఁ గరచరణాదుల్**
**గొనకొని కదలింపఁగ రా, లిన రోమము లుగ్ర కుండలి వ్రజ మయ్యెన్. 740**

* తర్వాత తాను చేసిన సృష్టి అభివృద్ధి చెందకుండా ఉన్నందుకు బ్రహ్మదేవుడు తన మనస్సులో ఎంతగానో చింతించాడు. ఆయనకు కోపం వచ్చి చేతులూ, కాళ్ళూ విదలించాడు. అలా విదిలించగా రాలిన రోమాలన్నీ పాములుగా రూపం దాల్చాయి.

క. వనజజుఁడు దన్నుఁ గృత కృ, త్యునిఁగా భావించి యాత్మఁ దుష్టి వహింపన్
మనమున నిఖిలజగత్పా, వను లగు మనులం ద్రిలోకవరుల సృజించెన్. 741

* ఆ బ్రహ్మదేవుడు తాను పూనిన పని నెరవేరినట్లుగా భావించాడు. తన అంతరాత్మ సంతోషపడునట్లుగా సమస్త జగత్తులో పవిత్రులైనవారూ, త్రిలోకాలలో శ్రేష్ఠులైన వారూ ఐన మనువులను సృష్టించాడు.

సీ. పుట్టించి వారికిఁ బురుషరూపంబైన తన దేహ మిచ్చినఁ దగిలి వారు
గనుఁగొని మున్ను పుట్టినవారిఁ గూడి యా వనజసంభవున కిట్టనిరి, దేవ!
యఖిల జగత్స్రష్టవైన నీచేతఁ గావింపంగఁబడిన యీ వితతసుకృత
మాశ్చర్యకరము, యజ్ఞాదిక్రియాకాండ మీ మనుసర్గమం దీడ్య మయ్యెఁ

తే. దద్ధవిర్భాగములు మాకుఁ దవిలి జిహ్వ, లందు నాస్వాదనములు సేయంగఁ గలిగె
ననుచు మనముల హర్షంబు లతిశయిల్ల, వినుతి సేసిరి భారతీవిభుని మఱియు. 742

* ఆ విధంగా పుట్టించి, బ్రహ్మ వారికి పురుషరూపమైన తన దేహాన్ని ఇచ్చాడు. ఆ మనువులు తమకంటే ముందుగా సృష్టింపబడిన వారితో కలిసి బ్రహ్మదేవునితో ఇట్లా అన్నారు. 'దేవా! సకల లోకాలకు సృష్టికర్తవు నీవు. నీవు చేసిన ఈ సృష్టి అత్యంత సుకృతవంతమైనది. మిక్కిలి ఆశ్చర్యకరమైనది. యజ్ఞములు మొదలైన క్రియాకాండమంతా ఈ మనువులను సృష్టించడం వల్ల ప్రశంసనీయమైనది. యజ్ఞాలలోని హవిర్భాగాలను మా నాలుకలతో ఆస్వాదించే అవకాశం మాకు లభించింది.' అని అంతరంగాలలో సంతోష తరంగాలు పెల్లుబుకుతూ ఉండగా బ్రహ్మదేవుని ప్రస్తుతించారు.

వ. వరతపోయోగ విద్యా సమాధి యుక్తం బగుచు ఋషివేష ధరుండును, హృషీకాత్ముండునునై ఋషిగణంబులం బుట్టించి సమాధి యోగైశ్వర్య తపో విద్యా విరక్తి యుక్తంబగు నాత్మీయ శరీరాంశంబు వారికిం గ్రమంబున నొక్కొక్కనికి నిచ్చెనని మైత్రేయుండు సెప్పిన విని విదురుండు పరమానందంబునం బొంది గోవిందు చరణారవిందంబులు డెందంబునం దలంచి వెండియు మైత్రేయునిం జూచి యిట్లనియె. 743

* అనంతరం బ్రహ్మ శ్రేష్ఠమైన తపస్సు, యోగము, విద్య, సమాధి వీటితో కూడినవాడై ఋషివేషాన్ని ధరించి, ఇంద్రియాలతో కలసిన ఆత్మ స్వరూపుడై ఋషిగణాలను సృజించాడు. వారికి తన శరీరాంశాలైన సమాధి, యోగం, ఐశ్వర్యం, తపస్సు, విద్య, వైరాగ్యం అనేవాటిని క్రమంగా ఒక్కొక్కరికే సంక్రమింపచేశాడు అని మైత్రేయుడు విదురునకు తెలియజేశాడు. ఆ పలుకులు విని విదురుడు మహానందం పొంది గోవిందుని పాదారవిందాలు తమ మనస్సులో స్మరించి, మళ్ళీ మైత్రేయుణ్ణి చూచి ఈ విధంగా అన్నాడు.

సీ. వరగుణస్వాయంభువ మను వంశం బిలఁ బరమసమ్మతము, దప్పదు, తలంపఁ
గొనకొని తద్వంశమున మిథునక్రియఁ జేసి ప్రజావృద్ధిఁ జెప్పి తీవు,
అదియునుగాక స్వాయంభువ మనువుకుఁ బూని ప్రియవ్రతోత్తానపాదు
లను నందనులు గల రంటివి, వారు స ప్తద్వీపవతియైన ధాత్రి నెల్ల

తే. ధర్మమార్గంబు లేమియుఁ దప్పకుండ, ననఘులై యెట్లు పాలించిరయ్య? వారి
చరిత యెల్లను సత్కృపానిరత బుద్ధి, నెఱుఁగ వినిపింపు నాకు మునీంద్రచంద్ర! 744

* ఉత్తమ గుణధౌరేయా! మైత్రేయా! భూమిమీద స్వాయంభువ మనువువంశం ధర్మమార్గాన్ని విడిచిపెట్టదనీ, ఆ వంశంలో స్త్రీ పురుషయోగంవల్ల ప్రజావృద్ధి జరిగిందనీ నీవు చెప్పావు. అదీగాక ఆ స్వాయంభువ మనువునకు ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు అనే ఇద్దరు కుమారులు ఉన్నారనీ అన్నావు. వారు ఏడు దీవులతో కూడిన భూమండలాన్ని అంతటినీ ధర్మమార్గం ఏ మాత్రమూ తప్పకుండా పుణ్యపథ ప్రవర్తులై ఎట్లా పాలించారు? ఓ మునీంద్రచంద్రా! వారి పవిత్ర చరిత్రమంతా నాకు దయార్ద్రబుద్ధితో విశదీకరించు.

వ. అదియునుంగాక తన్మనుపుత్రియు యోగలక్షణ సమేతయు నగు దేవహూతి యను కన్యకారత్నంబును స్వాయంభువుండు గర్దమునకు నే విధంబునం బెండ్లి చేసె? నా దేవహూతి యందు మహాయోగి యయిన కర్దముండు ప్రజల నేలాగునం బుట్టించె? నదియునుం గాక కర్దముండు రుచి యను కన్యను దక్షప్రజాపతి కిచ్చె నని చెప్పితివి, ఆ రుచియందు నమ్మహాత్ముం డీ సృష్టి యేలాగునం బుట్టించె? నవి యన్నియుం దెలియ నానతీయ వలయునని యడిగిన విదురునకు మైత్రేయుం డిట్లనియె. 745

* అంతేకాక ఆ స్వాయంభువమనువు సులక్షణ సంపన్నురాలైన తన కుమార్తె దేవహూతి అనే కన్యారత్నాన్ని కర్దముడనే ప్రజాపతికి ఇచ్చి వివాహం చేసిన విధానాన్ని వివరించు. ఆ దేవహూతియందు మహాయోగీశ్వరుడైన కర్దముడు ఏ విధంగా సంతానాన్ని కన్నాడో నాకు తెలుపు. అంతేకాక ఆ కర్దమప్రజాపతి తన తనయ అయిన రుచి అనే కన్యను దక్షప్రజాపతికి ఇచ్చాడని నీవు చెప్పావు. ఆ రుచి యందు దక్ష ప్రజాపతి ప్రజలను ఎట్లా సృష్టించాడు? ఇవన్నీ వివరంగా నాకు తెల్పు'' అని అడుగగా విదురునితో మైత్రేయుడు ఇట్లా అన్నాడు.

### -: కర్దముఁడు భగవదనుజ్ఞ వడసి దేవహూతిని బెండ్లి యాడుట. :-

క. విను మనఘ!, కృతయుగంబున, మునినాథుం డయిన కర్దముఁడు ప్రజల సృజిం
పను వనజసంభవునిచే, త నియుక్తుం డగుచు మది ముదము సంధిల్లన్. 746

* పుణ్యాత్ముడవైన ఓ విదురా, విను. కృతయుగంలో బ్రహ్మ దేవుడు ప్రజల్ని సృష్టించడానికి కర్దమ మునీశ్వరుని నియమించాడు. అందుకు కర్దముడు మిక్కిలి సంతోషం కలవాడైనాడు.

తే. ధీరగుణుఁడు సరస్వతీ తీరమందుఁ, దవిలి పదివేల దివ్యవత్సరము లోలిఁ
దపము సేయుచు నొకనాఁడు జపసమాధి, నుండి యేకాగ్రచిత్తుఁడై నిండు వేడ్క. 747

క. వరదుఁ బ్రసన్న మనోరథ, వరదానసుశీలు నమరవంద్యు రమేశున్
దురిత విదూరు సుదర్శన, కరుఁ బూజించిన నతండు కరుణాకరుఁడై. 748

వ. అంతరిక్షంబునం బ్రత్యక్షంబైన. 749

* ధీరుడైన ఆయన సరస్వతీనదీ తీరంలో పదివేల దేవతా సంవత్సరాలు విడువకుండా తపస్సు చేశాడు. ఒకనాడు ధ్యానతత్పరుడై, ఏకాగ్రచిత్తంతో అత్యంత సంతోషంతో ఆ కర్దమప్రజాపతి వరదుడూ, దయగలవాడూ, కోరిన కోర్కెలు తీర్చే మంచి స్వభావం కలవాడూ, దేవదేవుడూ, దురితదూరుడూ, లక్ష్మీవల్లభుడూ, చక్రహస్తుడూ అయిన మహావిష్ణువును ఆరాధించాడు. ఆ దేవుడు కర్దముని కరుణించి ఆకాశంలో ప్రత్యక్షమయ్యాడు.

సీ. తరణి సుధాకర కిరణ సమంచిత సరసీరుహోత్పల స్రగ్విలాసుఁ
గంకణ నూపుర గ్రైవేయ ముద్రికా హార కుండల కిరీటాభిరాముఁ
గమనీయ సాగర కన్యకా కౌస్తుభ మణి భూషణోద్భాసమాన వక్షు
సలలిత దరహాస చంద్రికా ధవళిత చారు దర్పణ విరాజత్కపోలు

తే. శంఖ చక్ర గదా పద్మ చారు హస్తు, నలికులాలక రుచి భాస్వదలిక ఫలకుఁ
బీత కౌశేయవాసుఁ గృపాతరంగి, త స్మితేక్షణుఁ బంకజోదరుని హరిని. 750

వ. మఱియు శబ్దబ్రహ్మ శరీరవంతుండును, సదాత్మకుండును, జ్ఞానైక వేద్యుండును, వైనతేయాంస విన్యస్త చరణారవిందుండును నయిన గోవిందునిఁ గనుంగొని సంజాత హర్ష లహరీ పరవశుండును, లబ్ధమనోరథుండును నగుచు సాష్టాంగదండ ప్రణామంబు లాచరించి తదనంతరంబ. 751

* సూర్యకిరణాలు సోకి వికసించిన తామరపూలతోనూ, చంద్రకిరణాలు సోకి వికసించిన కలువపూలతోనూ కట్టిన సుందరమైన పూలమాలను ధరించి ఉన్నాడు. చేతులకు కంకణాలనూ, పాదాలకు నూపురాలనూ, కంఠాభరణాలనూ, అంగుళీయకాలనూ, రత్నహారాలనూ, మకరకుండలాలనూ, కిరీటాన్నీ ధరించి ప్రకాశించుతున్నాడు. లావణ్యరాశియైన లక్ష్మీదేవితో కౌస్తుభమణితో ధగధగ మెరిసే వక్షస్థలం కలిగి ఉన్నాడు. సొగసైన చిరునవ్వు వెన్నెలలతో ముద్దులొలికే చెక్కుటద్దాలతో విరాజిల్లుతున్నాడు. శంఖం, చక్రం, గద, పద్మం చేతుల్లో ధరించి ఉన్నాడు. తుమ్మెదల వంటి నల్లని ముంగురులతో అందంగా ప్రకాశించే ఫాలఫలకం కలవాడై ఉన్నాడు. ఇంకా ఆ పంకజనాభుడైన హరి పచ్చని పట్టు వస్త్రం ధరించి సుందరమందహాసంతో దాక్షిణ్యం పొంగిపొరలే కటాక్ష వీక్షణాలతో అలరుతున్నాడు.

శబ్దబ్రహ్మమే శరీరంగానూ, అస్తిత్వమే ఆత్మగానూ కలిగి జ్ఞానం చేత మాత్రమే తెలుసుకోదగినవాడై గరుత్మంతుని మూపుమీద పాదపద్మాలు మోపి ఉన్న ఆ జనార్దనుని వీక్షించి కర్దమప్రజాపతి తన కోరిక నెరవేరిందని ఆనంద తరంగాలు పొంగులెత్తగా స్వామికి సాష్టాంగ నమస్కారాలు చేశాడు.

క. ముకుళిత కరకమలుం డయి, యకుటిల సద్భక్తి పరవశాత్మకుఁ డగుచున్
వికచాంభోరుహలోచను, నకు నిట్లనియెం దదాననముఁ గనుఁగొనుచున్. 752

* అనంతరం చేతులు మోడ్చినవాడై నిర్మలమైన భక్తిభావంతో మైమరచి విచ్చిన అరవిందాలవంటి కన్నులు గల ఆ వెన్నుని ముఖాన్ని అవలోకిస్తూ, ఆయనతో కర్దముడు ఇలా అన్నాడు.

సీ. అబ్జాక్ష! సకల భూతాంతరాత్ముఁడ వనఁ దనరుచుండెడి నీదు దర్శనంబుఁ
దలకొని సుకృత సత్ఫల భరితంబులైనట్టి యనేక జన్మానుసరణి
ప్రకట యోగక్రియాభ్యాస నిరూఢులైనట్టి యోగీశ్వరు లాత్మఁ గోరి
యెంతురు యోగీశ్వరేశ్వర! యే భవత్పాదారవింద సందర్శనంబుఁ

తే. గంటి, భవవార్ధిఁ గడవంగఁ గంటి మంటిఁ, గడఁగి నా లోచనంబుల కలిమి నేఁడు
దవిలి సఫలత నొందె మాధవ! ముకుంద! చిరదయాకార! నిత్యలక్ష్మీ విహార! 753

* ఓ పుండరీకాక్షా! నీవు అఖిల ప్రాణిలోకానికీ అంతరాత్మవై ప్రకాశిస్తుంటావు. అటువంటి నీ దర్శనంకోసం పురాకృత సుకృతంతో నిండిన అనేక జన్మలలో నిరంతర యోగాభ్యాస నిపుణులైన యోగీశ్వరులు, పరితపించుతూ ఉంటారు. అటువంటి యోగీశ్వరులకు ఈశ్వరుడవైన నీ పాదపద్మాల దర్శనం ఈనాడు నాకు ప్రాప్తించింది. సంసార సముద్రాన్ని దాటగలిగాను; ధన్యుడ నైనాను. మాధవా! ముకుందా! దయార్ద్రహృదయా! లక్ష్మీరమణా! నాకు కన్నులున్నందుకు ఫలం ఇప్పుడు లభించింది.

వ. అదియునుం గాక దేవా,! భవదీయ మాయావిమోహితులై హతమేధస్కులై సంసార పారావారోత్తారకంబులైన భవదీయ పాదారవిందంబులు దుచ్ఛవృత్తికాములయి సేవించి నిరయగతులైన వారికిం దత్కామ యోగ్యంబు లగు మనోరథంబుల నిత్తు, వట్టి సకాము లైనవారి నిందించు నేనును గృహమేధధేనువు నశేష మూలమును ద్రివర్గకారణమును సమాన శీలయు నయిన భార్యం బరిణయంబుగా నపేక్షించి కల్పతరుమూల సదృశంబులైన భవదీయ పాదారవిందంబులు సేవించితి, నయిన నొక్క విశేషంబు గలదు, విన్నవించెద నవధరింపుము, బ్రహ్మాత్మకుండ వయిన నీదు వచస్తంతు నిబద్ధులై లోకులు కామహతులైరఁట, యేనును వారల ననుసరించినవాఁడ. కాలాత్మకుండవైన నీకు నభిమతం బగునట్లుగాఁ గర్మ మయంబైన భవదాజ్ఞా చక్రంబు ననుసరించుటకుఁగాని మదీయ కామంబు కొఱకుఁగాదు. భవదీయ మాయావినిర్మితంబును, గాలాత్మక భూరివేగ సమాయుక్తంబును, నక్షరంబును నైన బ్రహ్మంబునందు భ్రమణశీలంబును, నధిమాససమేత త్రయోదశ మాసారంబును, షష్ట్యుత్తర శతత్రయాహోరాత్రమయ పర్వంబును, ఋతుషట్క సమాకలిత నేమియుం, జాతుర్మాస్యత్రయ విరాజిత నాభియు, నపరిమిత క్షణలవాది పరికల్పిత పత్రశోభితంబునుం, గాలాత్మక భూరివేగ సమాయుక్తంబును నైన కాలచక్రంబు సకల

**జీవనికరాయుగ్రసనతత్పరం బగుం గాని కామాభిభూత జనానుగత పశుప్రాయులగు లోకుల విడిచి భవపరితాప నివారణ కారణం బయిన భవదీయ చరణాతపత్రచ్ఛాయా సమాశ్రయులై, తావకీన గుణకథన సుధాస్వాదన రుచిరలహరీ నిరసిత సకల దేహధర్ములైన భగవద్భక్త జనాయుర్హరణ సమర్థంబు గాకుండు నని వెండియు.** **754**

* అదిగాక దేవా! నీ మాయవల్ల సమ్మోహితులై మతిమాలినవారై కొంతమంది సంసారసముద్ర సముత్తారకాలైన నీ చరణకమలాలను, తుచ్ఛమైన కోరికలు కోరి ఆరాధిస్తుంటారు. నరకగాములైన అటువంటి కాముకులు కోరిన కోర్కెలు కూడా నీవు సఫలం చేస్తుంటావు. అటువంటి కామాసక్తులను నిందిస్తూ ఉన్న నేనుకూడా పెండ్లాడాలనే ఉత్కంఠతో ఉన్నాను. గృహయజ్ఞ నిర్వహణంలో గోవువలె ఉపకరించేదీ, అన్నింటికీ మూలమైనదీ, దర్మార్థకామాలకు తావలమైనదీ, అనుగుణమైన నడవడిక గలదీ అయిన వధూమణిని వివాహం చేసుకోవలెననే ఆశయంతో భక్తజన పారిజాతాలైన నీ పాద జలజాతాలను సేవించాను.

ఐనా ఒక విశేషం ఉంది. విన్నపం చేసుకుంటాను. దయతో విను. పరబ్రహ్మస్వరూపుడవైన నీ వాక్కులు అనే త్రాళ్ళతో బంధింపబడిన ప్రజలు కామోపహతు లైనారట. నేను వివాహం చేసుకోవటం కాలాత్మకుడవైన నీకు ఇష్టమగు రీతిగా, కర్మమయమైన నీ ఆజ్ఞాచక్రాన్ని అనుసరించి దైవకార్యమైన సృష్టిని వృద్ధిచేయటానికేగాని, నా కామం కోసం మాత్రం కాదు. నీవు నీ మాయతో నిర్మించిన కాలచక్రం మహావేగం కలది. అక్షర పరబ్రహ్మాన్ని అనుసరించి తిరిగేది. అధిక మాసంతో కలిసి పదమూడు నెలలు అనే ఆకులు కలది. మూడువందల అరవై అహో రాత్రాలు అనే కణుపులు కలది, ఆరు ఋతువులు అనేచుట్టు పట్టా కలది, మూడు చాతుర్మాస్యాలు అనే నడిమిబొడ్డు కలది, క్షణాలు అనే ఆకులతో విరాజిల్లేది, కాలాత్మకమై మహావేగంతో కూడినటువంటిది.

ఈ కాలచక్రం గిరగిర పరిభ్రమిస్తూ సమస్త జీవుల ఆయుస్సును మ్రింగివేయటానికి ఆసక్తి కలదై ఉంటుంది. ఈ విధంగా అది కామోపహతులైన వారినీ, వారిని అనుసరించే పశుప్రాయులైన లోకులనూ చీకాకుపరుస్తుందే కాని సంసార తాపాన్ని శాంతింపచేసే నీ పాదాలనే గొడుగుల నీడలను ఆశ్రయించిన వారినీ, నీ గుణవర్ణనమనే అమృతరసాన్ని ఆస్వాదించుతూ దేహధర్మాలను లెక్కచేయని వారినీ అది ఏమీ చేయలేదు. అటువంటి నీ భక్తులైనవారి ఆయుస్సును హరించడానికి ఆ కాలచక్రం సమర్థం కాదు.

**మ. అనఘా! యొక్కఁడవయ్యు నాత్మకృతమాయాజాత సత్త్వాది శ**
**క్తి నికాయస్థితి నీ జగజ్జనన వృద్ధి క్షోభ హేతు ప్రభా**
**వ నిరూఢిం దగు దూర్ణనాభిగతి విశ్వస్తుత్య! సర్వేశ! నీ**
**ఘన లీలా మహిమార్ణవంబు గడవంగా వచ్చునే యేరికిన్?** **755**

* పాపాలను పారదోలే పరమాత్ముడవు, సర్వేశ్వరుడవు, విశ్వవంద్యుడవు, నీవు ఒక్కడివే అయినా నీవు నిర్మించిన మాయవల్ల సత్త్వం మొదలైన శక్తులు పుడుతున్నవి. సాలీడు సాలెగూడు సృష్టించి మళ్లీ తనలో లీనం చేసుకున్నట్లు నీవు ఆశక్తులద్వారా ఈ లోకాలు పుట్టడానికీ, వృద్ధిపొందడానికీ, నాశం కావడానికి

కారణభూతమైన మాయామహిమతో ప్రకాశిస్తూ ఉంటావు. అటువంటి నీ అపారలీలావిలాసమైన మహా సముద్రాన్ని దాటడానికి ఎటువంటి వారికైనా సాధ్యం కాదు.

**వ. దేవా! శబ్దాది విషయ సుఖకరం బగు రూపంబు విస్తరింపఁ జేయుటెల్ల నస్మదనుగ్రహార్థంబు గాని నీ కొఱకుం గా, దాత్మీయ మాయా పరివర్తితలోక తంత్రంబు గలిగి మదీయ మనోరథ సుధాప్రవర్షివైన నీకు నమస్కరించెద. 756**

* దేవా!, శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలనే విషయాలచే సుఖం కలిగించే విశ్వస్వరూపాన్ని వృద్ధిచేయడం మమ్ములను అనుగ్రహించడానికేగాని నీకోసం కాదు; నీ మాయవల్ల ఈ లోకవ్యాపారాలన్నీ ప్రవర్తింపచేస్తూ మా మనోరథసిద్ధి అనే అమృతాన్ని నిండుగా వర్షించే నీకు నా నమస్కారం.

**మ. అని యిబ్భంగి నుతించినన్ విని సరోజాక్షుండు మోదంబునన్**
**వినతానందన కంధరోపరిచర ద్విభ్రాజమానాంగుఁడై**
**యనురాగస్మిత చంద్రికా కలిత శోభాలోకుఁడై య మ్మునీం**
**ద్రునిఁ గారుణ్య మెలర్పఁ జూచి పలికెన్ రోచిష్ణుఁడై ప్రేల్మిడిన్. 757**

* ఈవిధంగా కర్దమప్రజాపతి చేసిన స్తోత్రం విష్ణుదేవుడు విన్నాడు. గరుత్మంతుని మూపుపై ఒయ్యారంగా కూర్చుండి అనురాగంతో కూడిన చిరునవ్వు వెన్నెలలు వెల్లివిరిసే చల్లని చూపులతో ఆ మునీంద్రుణ్ణి ఆలోకిస్తూ ఇట్లా అన్నాడు.

**క. మునివర! యే కోరిక నీ, మనమునఁ గామించినను సమంచిత భక్తిన్**
**నెనరునఁ బూజించితి? నీ, కనయము నా కోర్కి సఫల మయ్యెడుఁ జుమ్మీ. 758**

* ఓ కర్దమ మునీంద్రా! నీవు ఏమి కావాలని కోరి నన్ను భక్తి శ్రద్ధలతో ఆరాధించావో ఆ కోరిక నీకు అవశ్యం నెరవేరుతుంది.

**వ. అని యానతిచ్చి ప్రజాపతి పుత్త్రుండును, సమ్రాట్టును నైన స్వాయంభువ మనువు బ్రహ్మావర్త దేశంబునందు సప్తార్ణవ మేఖలామండిత మహీమండలంబుఁ బరిపాలించుచున్నవాఁ, డమ్మహాత్ముం డపరదివసంబున నిందులకు శతరూపయను భార్యా సమేతుండై భర్తృకామ యగు కూతుం దోడ్కొని భవదీయ సన్నిధికిం జనుదెంచి నీకు ననురూప వయశ్శీల సంకల్ప గుణాకరయైన తన పుత్రిం బరిణయంబు గావించు, భవదీయ మనోరథంబు సిద్ధించు, ననుం జిత్తంబున సంస్మరించుచుండు, నమ్మనుకన్యక నిను వరించి భవద్వీర్యంబు వలన నతి సౌందర్యవతు లయిన కన్యలం దొమ్మండ్రం గను, నా కన్యకా నవకంబునందు మునీంద్రులు పుత్త్రోత్పాదనంబులు సేయం గలరు, నీవు మదీయశాసనంబును ధరియించి మదర్పితాశేషకర్ముండ వగుచు నైకాంతిక స్వాంతంబున భూతాభయ దాన దయాచరితజ్ఞానివై నాయందు జగంబులు గల వనియు, నీ యందు నే గల ననియు నెఱింగి సేవింపుము, చరమకాలంబున ననుం బొందఁగలవు, భవదీయ వీర్యంబువలన నేను నీ భార్యా**

గర్భంబునఁ బ్రవేశించి మత్కళాంశంబున బుత్త్రుండనై సంభవించి నీకుం దత్త్వసంహిత నుపన్యసింతు నని జనార్దనుండు కర్దమున కెఱింగించి యతండు గనుం గొనుచుండ నంతర్హితుండై. 759

* అని పలికి శ్రీ మహావిష్ణువు ఇంకా ఇలా అన్నాడు. బ్రహ్మదేవుని కుమారుడూ, రాజాధిరాజూ అయిన స్వాయంభువ మనువు, బ్రహ్మావర్త దేశం రాజధానిగా సప్తసముద్రాల నడుమ ఉన్న భూమండలాన్నంతా పరిపాలిస్తున్నాడు. ఆయన శతరూప అనే తన భార్యతోకూడి, పెండ్లి కావలసిన కూతురును వెంటపెట్టుకుని రేపు నీ చెంతకు వస్తాడు. వయస్సులో, స్వభావంలో, సంకల్పంలో, ఉత్తమగుణాలలో నీకు తగినటువంటి తన పుత్రికను ఇచ్చి వివాహం చేస్తాడు. అందువల్ల నీ కోరిక నెరవేరుతుంది.

నన్ను మనస్సులో సర్వదా సంస్మరిస్తూ ఉంటే ఆ మనుపుత్రిక నిన్ను పెండ్లాడి, నీ వల్ల అనన్య సౌందర్యవతులైన కన్యలను తొమ్మిదిమందిని కంటుంది. తొమ్మండుగురు కన్యలకూ మునీశ్వరులవల్ల ఉత్తములైన కుమారులు జన్మిస్తారు. నా ఆజ్ఞానుసారం నీవు చేసే సమస్త కార్యాలూ నాకు అర్పిస్తూ ఉండు. ఏకాగ్రమైన మనస్సుతో, ప్రాణికోటికి అవసర మైనప్పుడు అభయం ఇస్తూ, దానాలు చేస్తూ, కరుణా మూర్తివై,సుజ్ఞానివై ప్రవర్తించు. నాలో లోకాలన్నీ ఉన్నాయనీ, నీలో నేనున్నానీ తెలుసుకొని నన్ను ఆరాధిస్తూ ఉండు. అంత్యకాలంలో నీవు నా సన్నిధికి చేరగలవు. నీ తేజస్సువల్ల నేను నీ భార్యగర్భంలో ప్రవేశించి, నా కళాంశతో నీ కుమారుడనై జన్మిస్తాను. నీకు తత్త్వవిద్యను బోధిస్తాను.

ఈవిధంగా విష్ణుదేవుడు కర్దమమునీశ్వరునకు వివరించి చెప్పి అతడు చూస్తూ వుండగానే అంతర్హితుడైనాడు.

చ. అతుల సరస్వతీ సరిదుదంచిత బాలరసాల సాల శో
భిత తట తుంగరంగమగు బిందుసరంబు వినిర్గమించి యం
చిత గరుడాధిరోహణము సేసి తదీయ గరుత్త్రభూత రు
క్ప్రతతి విలక్షణ క్రమ విరాజిత సామము వించు మోదియై. 760

చ. అరిగె వికుంఠ ధామమున కంత సకామునుఁడైన కర్దముం
డరయ విమోహియై మనమునందును ముందట వచ్చు కోరికల్
పిరిగొనుచుండఁ దత్క్షణమ బిందుసరంబున కేఁగి యిందిరా
వరుఁ దల పోయుచుండె జనవంద్యుఁడు భక్తినితాంత చిత్తుఁడై. 761

* సాటిలేని సరస్వతీనదీ జలాలతో పెంపొందిన గున్న మామిడి గుబురులతో కన్నులవిందు గావించే గట్లు గలిగిన బిందు సరోవరాన్ని అతిక్రమించి, గరుత్మంతుని అధిరోహించి, అతని చక్కని రెక్కల కదలికల చప్పుళ్ళతో సలక్షణమైన సామగానాన్ని ఆలకించుతూ హరి ఆనందంగా వైకుంఠానికి వేంచేశాడు. అనంతరం

కోరికలు కొనలు సాగుతున్న కర్దముడు ఆనంద పారవశ్యంతో రాబోవు సుఖసంతోషాలు మనస్సులో ముప్పిరిగొనగా వెంటనే బిందుసరస్సుకు వెళ్ళాడు. అక్కడ జనవంద్యుడైన ఆ మునీంద్రుడు భక్తిరసాయత్తమైన చిత్తంతో శ్రీహరిని స్మరిస్తూ కూర్చున్నాడు.

**వ. అంత స్వాయంభువుండు గనకరథారూఢుం డగుచు నిజభార్యా సమేతుండై భర్తృవాంఛాపరయైన పుత్త్రికం దోడ్కొనుచు నిజతనూజకుం దగిన వరు నన్వేషించుచు భువనంబులు గలయం గ్రుమ్మరి యెందునుం గానక వచ్చి వచ్చి. 762**

* అట్లా ఉండగా స్వాయంభువ మనువు భార్యతో కూడి బంగారు తేరెక్కి పెండ్లికి ఎదిగిన తన బిడ్డను వెంట బెట్టుకొని, ఆమెకు తగిన వరుణ్ణి అన్వేషించుతూ లోకాలన్నింటిలో ఎక్కడా అట్టివాడు కనబడక తిరిగి తిరిగి అక్కడికి వచ్చాడు.

**ఉ. ముందటఁ గాంచె నంత బుధముఖ్యుఁడు విష్ణుఁడు గర్దమున్ దయా**
**నంద మెలర్పఁజూడ నయనంబుల రాలిన బాష్పముల్ ధరన్**
**బిందువులై వెసం దొరఁగి పేర్చి సరస్వతిఁ జుట్టి పాఱుటన్**
**బిందుసరోవరం బనెడి పేరఁ దనర్చిన పుణ్యతీర్థమున్. 763**

* విష్ణువు సంతుష్టాంతరంగుడై కర్దముణ్ణి కరుణార్ద్ర దృష్టులతో చూచినప్పుడు ఆయన కన్నులనుండి రాలిన ఆనంద బాష్ప బిందువుల సమూహం నేలపై పడి, సరస్వతీ నదిని చుట్టుకొని ప్రవహించి "బిందు సరోవరం"అనే పేరు వహించింది. ఆ పుణ్యతీర్థాన్ని స్వాయంభువ మనువు తన కన్నుల ముందు సందర్శించాడు.

**ఉ. అందుఁ దమాల సాల వకుళార్జుననింబ కదంబ పాటలీ**
**చందన నారికేళ ఘనసార శిరీష లవంగ లుంగ మా**
**కంద కుచందన క్రముక కాంచన బిల్వ కపిత్థ మల్లికా**
**కుంద మధూక మంజుల నికుంజములం దనరారి వెండియున్. 764**

* ఆ బిందుసరోవరం ప్రక్కనే కర్దముని తపోవనం ఉన్నది. ఆ ఆశ్రమ వాటికలో కానుగ చెట్లూ, మద్దిచెట్లూ, పొగడచెట్లు, ఏఱుమద్దిచెట్లూ, వేపచెట్లూ ఉన్నాయి. ఇంకా కొంచెం ముందుకు పోగా కడిమిచెట్లూ, కలిగొట్టు చెట్లూ, చందనవృక్షాలూ, కొబ్బరిచెట్లూ, కర్పూర వృక్షాలూ, దిరిసెనచెట్లూ కన్పించాయి. లవంగలతలూ, మాదీఫలాలూ, మామిడిచెట్లూ, ఎర్రచందనంచెట్లూ, పోకచెట్లూ, సంపెంగపొదలూ, మారేడుచెట్లూ, వెలగచెట్లూ, ఇప్పచెట్లూ కానవచ్చాయి. ఆ ప్రక్కనే మల్లెలూ, మొల్లలూ అల్లుకొన్న చిక్కని చక్కని పొదరిండ్లు ఉన్నాయి.

క. పరిపక్వ ఫలభరానత, తరుశాఖానికర నివసిత స్ఫుటవిహగో
త్కర బహు కోలాహల రవ, భరిత దిగంతములు గలిగి భవ్యం బగుచున్. 765

* ఆ ఆశ్రమంలో బాగాపండిన పండ్ల బరువుతో చెట్ల కొమ్మలు క్రిందికి వంగి ఉన్నాయి. ఆ కొమ్మలమీద నివసించే పక్షిమూకల కలకల ధ్వనులతో దిగంతాలు ప్రతిధ్వనిస్తున్నాయి.

క. అతి నిశిత చంచు దళన, క్షత నిర్గత పక్వఫల రసాస్వాదన మో
దిత రాజశుక వచోఽర్థ, శ్రుతిఘోషము సెలఁగె శ్రవణ సుఖదం బగుచున్. 766

* పండిన పండ్లను మిక్కిలి వాడిగా ఉన్న తమ ముక్కుతో పొడిచి ఆ సందులనుండి స్రవిస్తూ ఉన్న ఫలరసాన్ని త్రాగి, రాచిలుకలు సంతోషంతో చేస్తున్న అర్థవంతాలైన వేదగానాలు వీనులవిందుగా వినిపించుతున్నాయి.

క. లలిత సహకార పల్లవ, కలితాస్వాదన కషాయ కంఠ విరాజ
త్కలకంఠ పంచమ స్వర, కలనాదము లుల్లసిల్లఁ గడు రమ్యములై. 767

* లేతలేత తియ్యమామిడి చిగుళ్లను తెగమెక్కి వగరెక్కి పొగరెక్కిన గొంతులతో కోయిలలు ఎంతో రమ్యంగా అవ్యక్త మధురంగా, కూస్తూ ఉన్నాయి.

క. అతుల తమాల మహీజ,ప్రతతి క్షణజాత జలద పరిశంకాంగీ
కృత తాండవ ఖేలన విల, సిత పింఛవిభాసమాన శిఖిసేవ్యంబై. 768

* అక్కడ ఉన్న మిక్కిలి చిక్కని తమాల వనాలను చూచి మేఘాలని భ్రాంతిపడి నెమళ్ళు ఉల్లాసంతో ఒళ్ళుమరచి పురులు విప్పి చూడముచ్చటగా ఆడుతున్నాయి.

క. కారండవ జలకుక్కుట, సారస బక చక్రవాక షట్పద హంసాం
భోరుహకైరవ నవ క, ల్హార విరాజిత సరోరుహాకరయుతమై. 769

* కన్నె లేళ్లతో, నీటికోళ్లతో, బెగ్గురు పక్షులతో, కొంగగుంపులతో, చక్రవాకాలతో, గండుతుమ్మెదలతో, కలహంసలతో, కమలాలతో, తెల్లకలువలతో, ఎర్రకలువలతో విరాజిల్లే సరోవరాలు గల ఆ ఆశ్రమవాటిక అత్యంత రమ్యంగా ఉంది.

క. కరి పుండరీక వృక కా, సర శశ భల్లూక హరిణ చమరీ హరి సూ
కర ఖడ్గ గవయ వలిముఖ, శరభ ప్రముఖోగ్ర వన్య సత్త్వాశ్రయమై. 770

* ఆ తపోవనం పరిసరాలలో ఏనుగులు, పెద్దపులులు, తోడేళ్లు, అడవిదున్నలు, కుందేళ్ళు, ఎలుగుబంట్లు, లేళ్లు, చమరీమృగాలు, ఇంకా సింహాలు, వరాహాలు, ఖడ్గమృగాలు, గురుపోతులు, కోతులు, శరభాలు మొదలైన అడవి మృగాలు సంచరిస్తున్నాయి.

**వ. ఒప్పు నప్పరమ తాపసోత్తముని యాశ్రమంబుం గనుంగొని మితపరిజనంబుల తోడం జొచ్చి యందు.771**

* అటువంటి కర్దమ మహామునీంద్రుని తపోవనాన్ని దర్శించి స్వాయంభువ మనువు పరిమిత పరివారంతో, ఆశ్రమంలోనికి ప్రవేశించాడు.

**సీ. అంచిత బ్రహ్మచర్యవ్రత యోగ్యమై విలసిల్లు ఘనతపోవృత్తిచేత**
**దేహంబు రుచిర సందీప్తమై చెలువొందఁ గడుఁ గృశీభూతాత్మకాయుఁడయ్యు**
**నలినోదరాలాప నవ సుధాపూరంబు శ్రోత్రాంజలులఁ ద్రావి చొక్కియున్న**
**కతనఁ గృశీభూతకాయుండు గాక జటావల్క లాజినశ్రీ వెలుంగఁ**

**తే. గమలపత్ర విశాల నేత్రములు దనర, నలి నసంస్కార సంచితానర్ఘ్య నూత్న**
**రత్నమును బోలియున్న కర్దమునిఁ జూచి, భక్తి మ్రొక్కెను మనువు తత్పాదములకు. 772**

* అలా ప్రవేశించి స్వాయంభువ మనువు కర్దమప్రజాపతిని దర్శించాడు. పవిత్రమైన బ్రహ్మచర్యవ్రతానికి తగినటువంటి తపోవ్యాపారంచేత ఆ ప్రజాపతి శరీరం చక్కగా ప్రకాశిస్తూ ఉన్నది. ఆయన మిక్కిలి చిక్కిపోయినప్పటికీ విష్ణు సంకీర్తనం అనే అమృత రసాన్ని దొన్నెలవంటి చెవులతో త్రాగి ఆ మాధుర్యంలో మైమరచి ఉండడంవల్ల ఆకృశత్వం కన్పించటం లేదు. ఆయన జడలూ, నారచీరలూ, జింక చర్మమూ ధరించి తామరరేకులవంటి విశాలమైన నేత్రాలతో ఒప్పుతూ సానబట్టని వెలకట్టరాని వినూత్న రత్నంలాగా వెలుగుతున్నాడు. అటువంటి కర్దమప్రజాపతిని చూచి స్వాయంభువమనువు, భక్తిభావంతో ఆయన పాదాలకు నమస్కరించాడు.

**వ. ఇట్లు వందనంబు గావించినం గర్దముండు దన గృహంబునకు విందై చనుదెంచిన య మ్మనువు నాదరించి యర్ఘ్య పాద్యాది విధులం బరితుష్టునిం గావించి పూర్వోక్తంబైన భగవదాదేశంబు సంస్మరించి స్వాయంభువున కిట్లనియె. 773**

* ఇట్లు నమస్కారం చేసిన స్వాయంభువుణ్ణి కర్దమమునీశ్వరుడు తన ఇంటికి వచ్చిన అతిథిగా భావించి సంభావించాడు. అర్ఘ్యపాద్యాదులతో ఆదరించి ఆనందింపజేశాడు. అనంతరం కర్దముడు జనార్దనుని ఆదేశాన్ని జ్ఞప్తికి తెచ్చుకొని స్వాయంభువ మనువుతో ఇట్లా అన్నాడు.

**సీ. వరగుణాకర! భగవద్భక్తియుక్తుండ వైన త్వదీయ పర్యటన మెల్ల**
**శిష్టపరిగ్రహదుష్ట నిగ్రహముల కొఱకుఁ గదా పుణ్యపురుష! మఱియు**
**వనజహితాహిత వహ్ని సమీర వైవస్వత వార్ధిప వాసవాత్మ**
**కుఁడవు హరి స్వరూపుఁడ వైన నీకును మానిత భక్తి నమస్కరింతు**

**తే. ననఘ! నీ విప్పుడే నేమి యఖిలలోక, జైత్రమగు హేమ మణిమయ స్యందనంబు**
**నెక్కి కోదండపాణివై యుద్ధసైన్య, పద విఘట్టనచే భూమిభాగ మగల. 774**

* ఉత్తమ గుణాలకు స్థానమైన రాజా! భగవద్భక్తుడవైన నీవు దుర్జనులను శిక్షించడానికీ, సజ్జనులను రక్షించడానికీ లోకంలో పర్యటిస్తూ ఉంటావు. ఓపుణ్యపురుషా! నీవు సూర్యుడు, చంద్రుడు అగ్ని, వాయువు, యముడు, వరుణుడు, దేవేంద్రుడు - వీరి అంశలు కలవాడవు. మహావిష్ణు స్వరూపుడవు. అటువంటి నీకు నేను పరమభక్తితో నమస్కరిస్తున్నాను. నీవు ఎల్లప్పుడూ సమస్త లోకాలలో జయాన్ని సంపాదించే మణులు తాపిన బంగారు తేరెక్కి విల్లు చేబూని, వీర సైనికుల పాదఘట్టనలతో ధాత్రి దద్దరిల్లగా జైత్రయాత్ర సాగిస్తుంటావు.

**మ. తరణింబోలి చరింపకున్న ఘననిద్రం బొంది యెందేని భూ**
**వర! పద్మోదర కల్పితంబులగు నీ వర్ణాశ్రమోదార వి**
**స్తర పాథోనిధి సేతుభూత మహిమాచార క్రియల్ దప్పి సం**
**కరమై చోరభయంబునన్ నిఖిలలోకంబుల్ నశించుం జుమీ!** 775

* ఓ రాజా! నీ వీ జగత్తులో సూర్యునిలాగా సంచరింపకపోతే ఈ లోకాలన్నీ నిద్రలో మునిగిపోతాయి. బ్రహ్మచే కల్పింపబడిన వర్ణాశ్రమాలు అల్లకల్లోలమైపోయి, ఆ సముద్రానికి సేతువువంటి సదాచార సంపత్తి సంకరమై పోతుంది. జాతి సాంకర్యం ఏర్పడి దొంగల భయం వల్ల లోకాలన్నీ చీకాకై నశించిపోతాయి.

**వ. అని పలికి భవదాగమనంబునకు నిమిత్తం బెయ్యది? యనవుడు సమాహిత నిత్యకర్మానుష్ఠానుండైన మునీంద్రునకు స్వాయంభువుం డిట్లనియె.** 776

* ఇలా పలికి కర్దమ ప్రజాపతి నీ రాకకు కారణం ఏమిటని స్వాయంభువుణ్ణి అడిగాడు. యథావిధిగా నిత్యకర్మానుష్ఠానాలు నిర్వర్తించిన కర్దమప్రజాపతితో స్వాయంభువ మనువు ఇట్లా అన్నాడు.

**క. సరసిజ గర్భుఁడు దనచే, విరచిత మైనట్టి వేదవితతుల నెల్లన్**
**ధర వెలయించుటకై బుధ, వర! మిమ్ముం దన ముఖంబువలన సృజించెన్.** 777

* ఓ మునివరేణ్యా! బ్రహ్మదేవుడు తాను రచించిన వేదాలను అన్నింటినీ ఈ మేదినిమీద వెలయించడానికి, మిమ్ములను తన ముఖం నుండి సృష్టించాడు.

**క. దురిత స్వరూప పాట, చ్చర పీడం బొందకుండ సకల క్షోణిం**
**బరిపాలించుటకై మము, నరవిందభవుండు భుజములందు సృజించెన్.** 778

* పాపాత్ములైన బందిపోటుదొంగల బాధలకు బలికాకుండా సమస్త భూమిని పాలించడానికి, మమ్ములను అజుడు తన భుజాల నుండి సృజించాడు.

**క. నెఱి నట్టి జలజభవునకుఁ, గర మంతఃకరణ గాత్రకములై వరుసం**
**బఱఁగిన బ్రహ్మక్షత్రము, లరయ రమాధీశ్వరునకు నవనీయంబుల్.** 779

* బ్రాహ్మణజాతి బ్రహ్మదేవునకు అంతఃకరణంగా, క్షత్రియజాతి శరీరంగా ఒప్పుతున్నది. ఇవి రెండూ లక్ష్మీవల్లభునకు అవశ్యం రక్షింపదగినవి.

వ. కావున హరిస్వరూపుండవై దుర్జనదుర్దర్శనుండ వయిన నినుం గనుట మదీయ భాగ్యంబున సిద్ధించె, భవత్పాదకంజ కింజల్కపుంజ రంజితంబైన మదీయ మస్తకంబును దావక వచనసుధా పూరితంబులైన శ్రవణంబులును మంగళకరత్వంబున సాఫల్యంబునం బొందె, నేను గృతార్థుండ నయితి దుహితృ స్నేహజదుఃఖ పరిక్లిన్నాంతః కరణుండనై సకల దేశ పరిభ్రమణ ఖిన్నుండ నయిన నా విన్నపం బవధరింపు మని యిట్లనియె. 780

* అందువల్ల విష్ణుస్వరూపుడవూ, దుర్జనులకు దుర్దర్శనుడవూ ఐన నీ దర్శనం నా భాగ్యంవల్ల నాకు ప్రాప్తించింది. నీ పాద పద్మాలలోని కేసరాలవల్ల ఎర్రనయిన నా శిరస్సూ నీ మాటలను అమృతరసంతో నిండిన నా చెవులూ, సమస్త శుభాలకూ స్థానాలై సఫలత్వాన్ని పొందాయి. నేను ధన్యుడనైనాను. కుమార్తెపై గల వాత్సల్యం వల్ల మనస్సులో ఆందోళనపడుతూ, సమస్త దేశాలూ తిరిగి అలసిపోయాను. నా ప్రార్థన ఆలకించు - అని పలికి స్వాయంభువమనువు కర్దమ మునీంద్రునితో మళ్ళీ ఇట్లా అన్నాడు.

మ. వరయోగీశ్వర! దేవహూతి యను నీ వామాక్షి మత్పుత్రి, దా
వరలావణ్య గుణాఢ్యులన్ వినియు నెవ్వారిన్ మదిం గోర, కా
తురయై నారదుపంపునన్ మిము వరింతు న్నంచు నేతెంచె, నీ
తరుణీభిక్షఁ బరిగ్రహింపుము శుభోదాత్త క్రియాలోలతన్. 781

* ఓ మహాయోగివరా! ఈ కన్యక నా కన్నకూతురు. పేరు దేవహూతి. నా కూతురు లోకంలో మిక్కిలి సౌందర్యవంతులైన పురుషులను ఎవ్వరినీ వరించడానికి ఇష్టపడక చింతాక్రాంతురాలై ఉన్నది. నారదమహర్షివల్ల నీరూపగుణాలు ఆలకించి నిన్నే వివాహమాడాలని నిశ్చయించింది. అందుకని నీవు ఈ శుభకార్యానికి అంగీకరించు, ఈ నా కుమారిని స్వీకరించు.

క. అమలిన గృహమేధిక క, ర్మములకు ననురూపగుణ విరాజిత శీల
క్రమములఁ దనరిన తరుణిం, బ్రమదమున వరింపుమయ్య భవ్యచరిత్రా! 782

* పవిత్ర చరిత్రా! అత్యంత స్తుత్యాలైన గృహస్థాశ్రమ కృత్యాలను నిత్యం నిర్వహించడానికి అనురూపమైన రూపమూ, గుణమూ, శీలమూ కల ఈ కాంతను సంతోషంతో అర్ధాంగిగా అంగీకరించు.

క. అనఘ! విరక్తులకైనం, దనయంత లభించు సౌఖ్యతతి వర్జింపం
జనదఁట, కాముకులకు న, బ్బిన మానుదురే లభించు ప్రియసౌఖ్యంబుల్. 783

* ఓ పుణ్యాత్ముడా! కర్దమ మునీంద్రా! ఎంతటి విరక్తులైనా అయాచితంగా తమంత తామే లభించిన సౌఖ్యాలను పరిత్యజింపకూడ దన్నారుగదా పెద్దలు. అటువంటప్పుడు వివాహమాడాలనే కోరిక గలవారు అనుకోకుండా లభించిన శుభంకరమైన ఇటువంటి పరమ సౌఖ్యాన్ని కాదంటారా?

**క. వినుము, ఫలారంభుఁడు గృప, ణుని నడిగినఁ దనయశంబునుం దగు మానం**
**బును జెడుఁ గావునఁ దగ నీ, వెనయ వివాహేచ్ఛఁ దగులు టెఱిఁగి యిచటికిన్. 784**

* మునీశ్వరా! ఒక పనిచేయడానికి పూనుకొన్నవాడు లోభిని అడిగినట్లైతే ఆ పని చెడడమే కాక, అతని ఆత్మగౌరవానికి కూడ భంగం వాటిల్లుతుంది. నీవు వివాహం చేసికోవాలనే తలంపుతో ఉన్నావని తెలుసుకొనే మేము ఇక్కడికి వచ్చాము.

**క. చనుదెంచితి, యస్మత్ప్రా, ర్థనఁ గైకొని మత్తనూజఁ దగ వరియింపుం**
**డని ముని స్వాయంభువునిం, గనుఁగొని మరలంగఁ బలికెఁ గడుమోదమునన్. 785**

* ఇలా వచ్చిన నా విన్నపాన్ని మన్నించి నా పుత్రికను నీ అర్ధాంగిగా అంగీకరించు.

ఆ మాటలు విని, కర్దమ మునీంద్రుడు స్వాయంభువ మనువును చూచి మిక్కిలి సంతోషంతో ఇట్లా అన్నాడు.

**సీ. అనఘ! నీ చేత నన్యదత్తముగఁ బ్రతిష్ఠితంబైన యీ తీవఁబోఁడి**
**కమనీయ రూప రేఖా విలాసంబుల మానితలక్ష్మీ సమాన యగుచు**
**నొకనాఁటి రాత్రియం దుడురాజ చంద్రికా ధవళితనిజసౌధ తలమునందు**
**మహిత హిరణ్మయ మంజీర శోభిత చరణయై నిజసఖీ సహిత యగుచుఁ**

**తే. గందుకక్రీడఁ జరియింపఁ గగనమందు, వర విమానస్థుఁ డగుచు విశ్వావసుండు**
**నాఁగఁ దనరిన గంధర్వ నాయకుండు, తరుణిఁ జూచి విమోహియై ధరణిఁ బడియె. 786**

* ఓ పుణ్యాత్ముడా! ఇతరుల నందరినీ కాదని నాకోసం తీసుకొని వచ్చిన ఈ లతాంగి లోకోత్తర సౌందర్యవతి. అందచందాలలో మహా లక్ష్మితో సమానురాలు. ఈమె ఒక నాటి రాత్రి, నిండారు పండు వెన్నెల వెలుగులతో తెల్లగా మెరసిపోతున్న తన మేడపై, పాదాలకు బంగారు అందెలు అలంకరించుకుని తన చెలికత్తెలతో బంతి ఆట ఆడుతున్నది. ఆ సమయంలో ఆకాశంలో విమానంలో వెళ్ళుతున్న విశ్వావసుడనే గంధర్వరాజు ఈ తరుణీమణి సౌందర్యాన్ని తిలకించి మోహంతో దేహం మరచి విమానంలో నుంచి తూలి భూమిమీద పడ్డాడు.

**తే. పుండరీకాక్షు నెఱుఁగని పురుషపశువు, లీ తలోదరిఁ బొడగాన రేమి సెప్ప?**
**నట్టి కొమరాలు భాగ్యోదయమునఁ దాన, వచ్చి కామింప నొల్లని వాఁడు గలఁడె? 787**

* పుండరీకాక్షుని స్మరణం ఎరుగని పురుష పశువులు ఈమెను దర్శింపలేరు. అటువంటి జవరాలు అదృష్టవశాన తనంత తాను వలచి వరించి వచ్చినప్పుడు ఇష్టపడనివాడు ఉంటాడా!

**క. ఈ కన్యారత్నమునకు, నాకును గుణరూప వర్తనంబుల యెడ నా**
**లోకింప సమము కావునఁ, గైకొని వరియింతు విగతకల్మషవృత్తిన్. 788**

* గుణం, రూపం, నడవడి - ఇవి ఈ కన్యకామణికీ నాకూ సమానంగా ఉన్నాయి. కాబట్టి ఇది పుణ్యకార్యంగా భావించి ఈమెను నేను వరించి భార్యగా స్వీకరిస్తాను.

**క. విమలాత్మ! దీని కొక సమ, యము గల దెఱిఁగింతు విను గుణాకర యగు నీ**
**రమణికి నపత్యపర్యం, తము వర్తింపుదు గృహస్థధర్మ క్రియలన్. 789**

* ఓ పుణ్యాత్ముడా! అయితే ఇందుకు ఒక నియమం ఉంది. అది చెబుతాను, విను. ఉత్తమగుణ సంపన్నురాలైన ఈమెకు సంతానం కలిగే పర్యంతం మాత్రమే నేను గృహస్థ ధర్మాన్ని నిర్వర్తిస్తాను.

**ఆ. అంతమీఁద విష్ణు నాజ్ఞ యౌఁదలఁ దాల్చి, శమదమాది యోగసరణిఁ బొంది**
**సన్న్యసించు వాఁడ జలజనేత్రుని వాక్య, కారణమునఁ జేసి ధీరచరిత! 790**

* అటు తర్వాత జితేంద్రియుడనై యోగమార్గం అవలంబించి సన్న్యాసం స్వీకరిస్తాను. ఓ సచ్చరిత్రా! ఇది భగవంతుడైన శ్రీహరి ఆజ్ఞ. శిరసావహింపక తప్పదు.

**క. శ్రీవిభుని వలన నీ లో, కావళి యుదయించుఁ బెరుఁగు నడఁగును విను రా**
**జీవభవాదుల కతఁడే, భూవర! నిర్మాణ హేతు భూతుం డరయన్. 791**

* ఆ లక్ష్మీవల్లభుని వల్లనే ఎల్లలోకాలూ పుడుతూ, పెరుగుతూ నశిస్తూ ఉన్నాయి. ఓ రాజా! బ్రహ్మాదుల అభ్యుదయానికి ఆయనే కారణభూతుడై ఉన్నాడు.

**వ. అది గావున న మ్మహాత్ముని యాజ్ఞోల్లంఘనంబు సేయరాదని కర్దముండు వలికిన విని స్వాయంభువుండు నిజభార్యయైన శతరూప తలంపును బుత్త్రియైన దేవహూతి చిత్తంబును నెఱింగినవాఁడై ముని సమయంబున కియ్యకొని ప్రహృష్ట హృదయుం డగుచు సమంచిత గుణగణాఢ్యుం డయిన కర్దమునకు దేవహూతిని విధ్యుక్తప్రకారంబున వివాహంబు సేయించెఁ, దదనంతరంబ శతరూపయును బారిబర్హ సంజ్ఞికంబులైన వివాహోచిత దివ్యాంబరాభరణంబులు దేవహూతి కర్దముల కొసంగె, నవ్విధంబున నిజకులాచార సరణిం బరిణయంబు గావించి విగత చింతాభరుండై స్వాయంభువుండు దుహితృ వియోగ వ్యాకులిత స్వాంతుండై కూఁతుం గౌఁగిలించుకొని, చుబుకంబుఁ బుడుకుచుఁ , జెక్కిలి ముద్దుగొని, శిరంబు మూర్కొని, ప్రేమాతిరేకంబున బాష్పధారాసిక్త మస్తకం జేసి తల్లీ! పోయి వచ్చెద నని చెప్పి కర్దమునిచేత నా మంత్రితుండై నిజభార్యా సమేతంబుగ రథం బెక్కి సపరివారుండై. 792**

* అందువల్ల ఆ దేవుని ఆజ్ఞ జవదాటరానిది అని కర్దమముని పలికాడు. ఆ మాటలు విని స్వాయంభువ మనువు తనభార్యయైన శతరూప అభిప్రాయాన్నీ, తన కూతురైన దేవహూతి అభిప్రాయాన్నీ అడిగి తెలుసుకొన్నాడు. కర్దమ మునీంద్రుని నియమానికి ఒప్పుకొన్నాడు. ఎంతో సంతోషంతో ఉత్తమ గుణసంపన్నుడైన ఆ మునివరేణ్యునకు తన కుమార్తెయైన దేవహూతిని ఇచ్చి యథావిధిగా వివాహం చేయించాడు.

ఆ తరువాత శతరూప "పారిబర్హము"లనే పేర్లుగల వివాహోచితాలైన దివ్యవస్త్రాలనూ, దివ్యాలంకారాలనూ, దేవహూతికీ, కర్దమునకూ బహూకరించింది. ఈ ప్రకారంగా తన కులాచారాన్ని అనుసరించి, వివాహం జరిపించి సంతుష్ట హృదయుడైన స్వాయంభువమనువు కన్న బిడ్డను ఎడబాసి పోతున్నాననే విచారంతో చిన్నబోయిన మనస్సుతో కుమార్తెను కౌగిలించుకొని, చుబుకం పుణికి, చెక్కిలి ముద్దాడి, శిరస్సు మూర్కొని ప్రేమవల్ల ఉబికిన బాష్పధారలతో ఆమె శిరస్సును తడుపుతూ "తల్లీ! వెళ్లివస్తాను" - అన్నాడు. అనంతరం అల్లుని వీడ్కోలు అందుకొని తన అర్ధాంగితో రథం అధిరోహించి సపరివారంగా బయలు దేరాడు.

**చ.** **తరళ తరంగ వీచి సముదంచిత బిందుసరస్సరస్వతీ**
**సరిదరవింద తుందిల లసత్తరు తీర నివాస సన్మునీ**
**శ్వర నికరాశ్రమాకలిత సంపదలం గనుఁగొంచు వేడ్క ము**
**ప్పిరిఁగొన నేఁగె నాత్మ పుటభేదన విస్ఫుటమార్గవర్తియై.** **793**

* కదలుతూ ఉన్న కెరటాలు గల బిందు సరస్సును దాటి, సరస్వతీనదిని అతిక్రమించి, ఆ నదీ తీరంలో తామరపూలతోనూ, దట్టమైన తరువులతోనూ ఒప్పుతూ ఉన్న మునీశ్వరుల ఆశ్రమాలను ముప్పిరిగొన్న ఆనందంతో ఆలోకిస్తూ స్వాయంభువ మనువు తన పట్టణమార్గాన్ని పట్టి వెళ్లాడు.

**వ.** **ఇట్లు సని చని బ్రహ్మావర్తదేశంబునందు.** **794**

**సీ.** **ఎందేనిఁ దొల్లి లక్ష్మీశుండు యజ్ఞసూకరమూర్తిఁ గైకొని సరభసముగ**
**నొడలు జాడించినఁ బుడమిపై రాలిన రోమజాలంబులు రుచిర హరిత**
**వర్ణమై పొలుపార వర కుశ కాశ మయంబును యజ్ఞక్రియా కలాప**
**యోగ్యంబునై చాల నొప్పారి బర్హిస్సు సంభవించిన దాన సకల ఋషులుఁ**

**తే.** **గ్రతువు లొనరించి తద్విఘ్నకారులైన, యసురులను ద్రుంచి రట్ల స్వాయంభువుండు**
**విష్ణుపరముగ మఖము గావించి రుచిర, మేధ సెలువొంది నట్టి యాత్మీయపురము.** **795**

* ఈ విధంగా పయనించి బ్రహ్మావర్తదేశం చేరాడు. పూర్వం విష్ణు దేవుడు యజ్ఞవరాహరూపం ధరించి ఒక్కసారి గట్టిగా ఒళ్లు విదిలించాడు. ఆయన శరీరం మీద బిరుసైన వెంట్రుకలు ఆ ప్రదేశంలో రాలాయి. వాటివల్ల పచ్చని దర్భలూ, రెల్లుగడ్డీ యజ్ఞాకార్యాలకు యోగ్యమైన అగ్నీ పుట్టాయి. వాటితో ఋషీశ్వరులు అక్కడ యజ్ఞాలు చేశారు. యజ్ఞాలకు విఘ్నాలు చేస్తున్న రాక్షసులను తుదముట్టించారు. అటువంటి బ్రహ్మావర్త దేశంలో అదేవిధంగా స్వాయంభువమనువు కూడా విష్ణువు నుద్దేశించి యజ్ఞం చేసి ప్రజ్ఞానిధియై విరాజిల్లాడు. అటువంటి తన పట్టణాన్ని ఆయన సమీపించాడు.

**క.** **డాయంజనఁ బురజనము లు, పాయనములు దెచ్చి యిచ్చి బహుగతుల నతుల్**
**సేయఁగ మంగళతూర్యము, లాయతగతి మ్రోయఁ జొచ్చె నంతఃపురమున్.** **796**

* అప్పుడు పురజనులు ఎదురువచ్చి కానుకలు తెచ్చి ఇచ్చారు. అనేక విధాలుగా సంస్తుతించారు. మంగళవాద్యాలు ధ్వనిస్తూ ఉండగా, స్వాయంభువ మనువు అంతఃపురం ప్రవేశించాడు.

**వ. ఇట్లు ప్రవేశించి తాపత్రయోపశమనం బగు భగవద్భక్తి వృద్ధిఁ బొందించుచుఁ బుత్త్రమిత్ర సుహృద్బాంధవ సహితుండై పరమానందంబున. 797**

* అలా ప్రవేశించి, స్వాయంభువ మనువు, ఆధ్యాత్మిక ఆధిభౌతిక ఆధిదైవికాలనే తాపత్రయాన్ని రూపుమాపే భగవద్భక్తిని పెంపొందించుకుంటూ పుత్ర, మిత్ర, కళత్ర, సజ్జన, బాంధవులతోకూడి పరమానందంగా ఉన్నాడు.

**మ. అతిభక్తిం బ్రతివాసరంబును హరి వ్యాసంగుఁడై మాధవాం**
**కిత గంధర్వ విపంచికాకలిత సంగీత ప్రబంధాను మో**
**దితుఁడై యిష్టవిభూతులందు ననురక్తిం బొంద కేప్రొద్దు న**
**చ్యుత సేవైక పరాయణుం డగుచు నస్తోక ప్రభావోన్నతిన్. 798**

* ఆయన ప్రతిదినం అతిశయించిన భక్తితో విష్ణువునందే మనస్సు నిల్పి, గంధర్వవీణను మేళవించి కమలాక్షుని కంకితముగా కమ్మని గీతాలు గానం చేస్తూ సంతుష్టాంతరంగుడై భోగభాగ్యాలమీద ఆసక్తి లేనివాడై, సర్వదా నారాయణ సేవాపరాయణుడై అనంత మహిమాన్వితుడైనాడు.

**మ. హరిపాదాంబురుహద్వ యార్పితతులస్యామోదముం గొంచుఁ ద**
**చ్చరితంబుల్ దలపోయుచుం బొగడుచుం జర్చించుచున్ వించుఁ ద**
**త్పరిచర్యావ్యతిరిక్త సంసరణ సద్ధర్మార్థ కామంబులం**
**బరిభూతంబులు సేసి మోక్షపదసంప్రాప్తి క్రియారంభుఁడై. 799**

* భగవంతుని పాదపద్మాలపై సమర్పింపబడిన తులసీదళాల పవిత్ర పరిమళాన్ని ఆఘ్రాణించుతూ, ఆ భగవంతుని లీలావిలాసాలనే స్మరిస్తూ, సంస్తుతిస్తూ, కీర్తిస్తూ, చర్చిస్తూ, ఆలకిస్తూ ఆ దేవుని సేవలకు ఆటంకాలై సంసారబంధాలైన ధర్మార్థకామాలను తిరస్కరించి మోక్షసాధనాలైన సత్కార్యాలను నిర్వహించాడు.

**క. నిగమార్థగోచరుం డనఁ, దగు హరిచరిత ప్రసంగ తత్పర చిత్తుం**
**డగు నతనికి స్వాంతరగము, లగు యామము లొగి నయాతయామము లయ్యెన్. 800**

* వేదార్థాలకు మాత్రమే గోచరమయ్యే ఆ భగవంతుని లీలలను అభివర్ణించుటయందే ఆసక్తమైన అంతరంగం కల ఆస్వాయంభువ మనువునకు ఎన్ని జాములు గడచినా గడవనట్లే ఉంది.

**సీ. వెండియు నమ్మేటి విష్ణుమంగళ కథా కర్ణన ధ్యానానుగాన నుతులు**
**సలుపుచు స్వస్వప్న జాగ్రత్సుషుప్తులఁ దలఁగించి యా పుణ్యతముఁడు దాను**

జక్రిదాసుఁడు గాన శారీర మానస దివ్యమానుష భౌతిక వ్యథలను
దగులక సమ్మునీంద్రశ్రేణికిం దగఁ, దనరు వర్ణాశ్రమ ధర్మగతులు

తే. దప్పకుండంగ నడుపుచుఁ దగిలి సర్వ, భూతహిత వృత్తి నతుల విఖ్యాతలీల
నేక సప్తతి యుగము లస్తోక చరితుఁ, డగుచు వర్తించె సమ్మోద మతిశయిల్ల. 801

* ఆ స్వాయంభువ మనువు, శ్రీమన్నారాయణుని దివ్య మంగళ చరిత్రలను వింటూ ఆయనరూపాన్ని ధ్యానంచేస్తూ, ఆయనలీలలు గానంచేస్తూ, ఆయనను ఆరాధిస్తూ తన స్వప్న, జాగ్రత్, సుషుప్తి, అవస్థలకు అతీతంగా ప్రవర్తించాడు. ఆ పుణ్యాత్ముడు, విష్ణుభక్తుడు కావున శరీరానికీ, మనస్సుకూ సంబంధించిన వ్యథలను పొందలేదు. దేవతలవల్లా, మానవులవల్లా, పంచభూతాలవల్లా కలిగే బాధలలో చిక్కుకోలేదు. ఉత్తములైన మునీశ్వరులకు సంతోషం కలిగేటట్లుగా, వర్ణాశ్రమ ధర్మాలను సక్రమంగా నడుపుతూ, సర్వప్రాణులకు మేలుచేస్తున్నవాడై, డెబ్భైయొక్క మహాయుగాలు పరిపాలించాడు. సమ్మోదంతో, సాటిలేని మేటి యశస్సుతో సచ్చరిత్రుడై విరాజిల్లాడు.

క. అని యమ్మను చరితము విదు, రున కమ్మైత్రేయమునివరుఁడు దయతోడన్
వినిపించి కర్దముని కథ, దనరఁగ నెఱిఁగింతు నని ముదంబునఁ బలికెన్. 802

* ఈ విధంగా విదురునికి మైత్రేయుడు ఆప్యాయంగా స్వాయంభువ మనువు చరిత్రను వినిపించాడు. ఆ తర్వాత "కర్దమమునీంద్రుని కథ వివరిస్తాను విను"మని సంతోషంతో పలికాడు.

**-: కర్దమ ప్రజాపతి యోగప్రభావంబుచే విమానంబు గల్పించి భార్యతోఁగూడి విహరించుట : -**

వ. ఇట్లు స్వాయంభువుండు దేవహూతిం గర్దమునికి వివాహంబుసేసి మరలి చనినం దదనంతరంబ దేవహూతియుఁ బతిభక్తి గలిగి భవునికి భవాని పరిచర్య సేయు తెఱంగునఁ బతియ తనకు నేడుగడయుంగా నెఱింగి య మ్మునీంద్రుని చిత్తవృత్తికొలఁది దినదినంబునకు భక్తి తాత్పర్య స్నేహంబులు రెట్టింపం బ్రియ శుశ్రూషణంబులు గావించుచు ననూనతేజోవిరాజిత యగుచుఁ గామ క్రోధ దంభ లోభాది గుణవిరహితయై శరీరశుద్ధి వహించి చతుర సౌహార్ద స్నేహంబులు గలిగి పతియ దైవంబుగా భావించి మృదు మధుర వచన రచనయై పతిభక్తి యేమఱక వర్తింప దైవయోగంబు నైననుం దప్పింప సమర్థుండైన కర్దముండు నిజసేవాయాస కృశీభూతదేహయై యున్న దేవహూతిం గరుణాతరంగితాపాంగుండై కనుంగొని మంజుభాషణంబుల నిట్లనియె. 803

* ఈ విధంగా స్వాయంభువమనువు తన కూతురైన దేవహూతిని కర్దమునికి ఇచ్చి, వివాహం చేసి వెళ్లిపోయాడు. అటుతర్వాత దేవహూతి అతిశయించిన పతిభక్తితో పార్వతీదేవి పరమేశ్వరునికి పరిచర్య చేసినట్లు పతి అయిన కర్దమప్రజాపతికి సేవ చేయసాగింది. భర్తయే ఏడుగడగా భావించింది. ఆ కర్దమ మునీశ్వరుని మనస్సులోని అభిప్రాయాలకు అనుగుణంగా ప్రవర్తించింది. దినదినానికి ద్విగుణీకృతమైన

భక్తితో శ్రద్ధతో అనురాగంతో భర్తకు శుశ్రూషలు చేస్తూ ఉన్నది. అధికమైన తేజస్సుతో ప్రకాశిస్తూ కామం, క్రోధం, కపటం, లోభం మొదలైన దుర్గుణాలకు దూరంగా ఉన్నది. తన సౌందర్య పోషణలో ఏమరుపాటులేక చాతుర్యంతో చనవుతో ప్రేమతో పతినే భగవంతునిగా భావించి మృదువుగా మధురంగా ఆయనతో మాటలాడుతూ పతివ్రతయై ప్రకాశించింది.

దైవయోగాన్ని సైతం తప్పించటానికి సమర్థుడైన కర్దమప్రజాపతి పతిశుశ్రూషలో మిక్కిలి కష్టపడుతూ చిక్కిపోయిన ప్రియసతిని దేవహూతిని చూచి జాలిపడ్డాడు. కరుణారసం పొంగిపొరలే కడకన్నులతో ఆ తలోదరిని విలోకించి ఇలా అన్నాడు ముద్దుగా -

**ఉ. మానిత ధర్మమార్గ మహిమస్ఫుట భూరి తపస్సమాధి వి**
**ద్యా నిభృతాత్మ యోగ సముపార్జిత విష్ణుకటాక్ష లబ్ధ శో**
**భానఘ దివ్యభోగ బహుభద్ర వితానము లస్మదీయ సే**
**వా నిరతిన్ లభించు ననివారణ నిత్తును దివ్యదృష్టియున్. 804**

* దేవీ! మాననీయమైన ధర్మమార్గం వల్ల మహిమ ప్రాప్తిస్తుంది. ఆ మహిమాతిశయం వల్ల గొప్పతపస్సూ దానివల్ల ఏకాగ్రత సిద్ధిస్తాయి. వాటివల్ల ఆత్మజ్ఞానం కలుగుతుంది. దానివల్ల ఆత్మయోగం లభిస్తుంది. ఆ ఆత్మయోగం భవత్కటాక్షాన్ని ప్రసాదిస్తుంది. ఆ విష్ణుకటాక్షం కారణంగా భవ్యములైన అవ్యయ దివ్యభోగాలు, అనంతములైన శుభాలు సమకూరుతాయి. ఈ విధంగా నాకు సమకూడిన సమస్త సంపదలూ నిరంతరం నన్ను సేవించిన నీకూ సంప్రాప్తిస్తాయి. అంతేకాదు, నీకు తిరుగులేని దివ్యదృష్టిని కూడా అనుగ్రహిస్తున్నాను.

**తే. నెలఁత! తద్దివ్యదృష్టి నన్నియును నీకుఁ, గానవచ్చు, విలోకింపు, కమలపత్ర**
**నయను బొమముడి మాత్రాన నాశమందు, నితరమగు తుచ్ఛభోగంబు లేమి సెప్ప. 805**

* ఓ సుందరీ! ఆదివ్యదృష్టివల్ల ఈ సృష్టిలోని సర్వమూ నీకు కానవస్తుంది, ఆలోకించు. ఇక భగవద్దత్తములు కాని ఇతరములైన తుచ్ఛభోగాల విషయం వేరే చెప్పటం దేనికి? ఆ పురుషోత్తముడు కనుబొమలు చిట్లించినంతమాత్రాన నశించిపోతాయి.

**సీ. అనుపమ రాజ్య దర్పాంధ చేతస్కులై పాపవర్తనులైన పార్థివులకు**
**ధృతిఁ బొందరాని యీ దివ్యభోగంబులు నీదు పాతివ్రత్యనిష్ఠఁ జేసి**
**సంప్రాప్తములు నయ్యెఁ, సమత భోగింపుము కార్యసిద్ధియు నగుఁగాక నీకు**
**ననుటయు నతివయు ననుపమయోగ మాయా విచక్షణ శాలియైన కర్ద**

**తే. మునిఁ గనుంగొని విగతాధియును నపాంగ, కలితలజ్జానతాస్య పంకజయు నగుచు**
**వినయ సౌహార్దములఁ జేసి విహ్వలంబు, లయిన పలుకులఁ బతికి నిట్లనియెఁ బ్రీతి. 806**

* సాటిలేని రాజ్యవైభవాలతో గర్వాంధులైన రాజులు కనులు గానక పాపమార్గంలో ప్రవర్తిస్తారు. అటువంటివారికి అందరాని ఈ దివ్యభోగాలు నీ పాతివ్రత్య మహిమవల్ల నీకు లభించాయి. ఈ సుఖాలను నీవు సమబుద్ధితో అనుభవించు. నీకు కార్యసిద్ధి కలుగుతుంది.

ఈ విధంగా కర్దముడు పలుకగానే దేవహూతి కడకన్నులలో సిగ్గుచిందులు త్రొక్కింది. మనోవ్యథ మాయమయింది. ఆమె మోము వంచుకొని వినయంతో చనవుతో పారవశ్యంతో యోగమాయా విశారదుడైన తన విభుని వంక చూస్తూ ముద్దుముద్దుగా ఇట్లా పలికింది.

**వ. అనఘా!, యమోఘ యోగమాయా విభుండవు, సమర్థుండవు నయిన నీయందు నీ యనుపమ దివ్యభోగంబులు గలుగుట నిక్కం బని యెఱుంగుదు, భవత్సంగతి నన్నియు నాకుం గలుగు, నయినను దేవా! నీ వానతిచ్చిన సంతాన పర్యంతంబైన శరీర సంగమ సమయంబు చిత్తంబునం దలంచి భవదంగ సంగమంబుఁ గృపసేసి మన్నింపుము, భవదీయ సంయోగవాంఛా పరతం గృశీభూతం బయిన యీ దేహం బే విధంబున మజ్జన భోజన పాన సుఖంబులం బరితుష్టిం బొందు నట్టి మన్మనోరథంబుఁ దీర్ప రతి రహస్య ప్రకాశకంబగు కామశాస్త్ర ప్రకారం బుపశిక్షించి యందులకు నుచితంబు లయిన వివిధాంబరాభరణ మాల్యానులేపన మందిరారామ ప్రముఖ నిఖిల వస్తువిస్తారంబు గావించి నన్నుం గరుణింపు మనిన న మ్మహాత్ముండు నిజయోగమాయా బలంబునం దత్క్షణంబ - 807**

* ఓ పుణ్యస్వరూపా, నీవు అమోఘమైన యోగమాయకు అధిపతివి, అత్యంత సమర్థుడవు. అటువంటి నీయందు సాటిలేని దివ్యభోగాలు తప్పకుండా ఉన్నాయని నాకు తెలుసు. నీ సాంగత్యంవల్ల అవన్నీ నాకు తప్పక లభిస్తాయి. అయినప్పటికీ దేవా! నీవు సంతానం కలిగే అంతవరకు శరీరసంగమం కలిగి ఉంటామని ఒక నియమం ఆనాడు ఆనతిచ్చావు. ఆమాట మనస్సులో పెట్టుకొని నీ సాంగత్యాన్ని నాకు దయతో అనుగ్రహించు. నన్ను మన్నించు. నీ సంయోగాన్ని అభిలషిస్తూ కృశించిన ఈ శరీరం స్నానపాన భోజనాదులవల్ల ఎట్లా తృప్తి పొందుతుంది? అటువంటి నా మనోరథాన్ని తీర్చటానికి రతిరహస్యాన్ని ప్రకాశింపజేసే కామశాస్త్రాన్ని నాకు నేర్పు. అందుకు తగిన నానావిధాలైన వస్త్రాలూ, అలంకారాలూ, పూలదండలూ, మైపూతలూ, శయనమందిరాలూ, ఉద్యానవనాలూ మొదలైన సమస్త వస్తువులనూ సమకూర్చి నన్ను కనికరించు. ఇలా పలుకుతున్న దేవహూతిమాటలు విని మహాత్ముడైన ఆ కర్దమ మునీశ్వరుడు తన యోగమాయాబలంతో ఆ క్షణంలోనే ఒక దివ్యవిమానాన్ని సృష్టించాడు.

**సీ. దివ్యమణి స్తంభదీప్తిఁ జెన్నొందుచు మరకతస్థలముల మహిమ దనర**
**వరవజ్ర కుడ్య కవాట శోభితములై విద్రుమ దేహళీ వీథు లమరఁ**
**గొమరొప్ప నవశాత కుంభ కుంభములపై, హరినీల శకల విస్ఫురణ మెఱయఁ**
**దగఁ బద్మరాగంపు మొగడలఁ జెలువొందు వైదూర్య వలభులు వన్నెఁజూపఁ**

**తే. దరళతర ధూతకేతు పతాక లొలయ, మంజు శింజత్సమంచిత మధుప కలిత**
**సురుచిరాలంబమాన ప్రసూన రాజి, మాలికల నొప్పు వివిధ గృహాళిఁదనరి. 808**

* ఆ విమానంలో అందమైన మందిరాలు కనువిందు చేస్తున్నాయి. ఆ మందిరాలన్నీ మణిమయ స్తంభాలతో, గరుడపచ్చలు పరచిన నడవలతో, వజ్రాల తలుపులు గల గోడలతో, పగడాల గడపలతో, ఇంద్రనీల మణిఖండాలతో నిండి, తళతళ మెరిసే క్రొంగ్రొత్త బంగారు కలశాలతో, అంచులలో పద్మరాగాల మొగ్గలు చెక్కిన చక్కని వైడూర్యపు చూరులతో, గాలికి రెపరెపలాడుతున్న జెండాగుడ్డలతో, మధుర మధురంగా ఝంకారం చేసే మధుకర నికరాలతో కూడి, వ్రేలాడుతున్న పూలదండల తోరణాలతో అత్యంత మనోహరంగా అలరారుతున్నాయి.

**క. మఱియును దుకూల చీనాం, బర కౌశేయాది వివిధపట పరివృత మం**
**దిర సుభగాకారంబై, యరుదార విచిత్రపట్టికాలంకృతమై. 809**

* అందలి గదులలో జిలుగు దువ్వలువలు, చీనాంబరాలు, పట్టుచీరలు మొదలైన పలువిధాలైన వస్త్రాలు శోభిల్లు తున్నాయి. అపురూపమైన రంగురంగుల పట్టె మంచాలు అమర్చబడి ఉన్నాయి.

**మ. లలితోద్యాన వనాంత సంచరణ లీలాలోల హంసాళి కో**
**కిల పారావత చక్రవాక శుక కేకి వ్యూహ మంచత్సము**
**త్కలికం గృత్రిమపక్షులన్ నిజవిహంగశ్రేణి యంచుం గుతూ**
**హలియై పల్కుచు నాడుచుండుఁ బ్రతిశాఖారోహణ వ్యాప్తులన్. 810**

* అందలి సుందరమైన ఉద్యానవనాలలో విలాసంగా విహరిస్తున్న రాజహంసలు, కోయిలలు, పావురాలు, చక్రవాకాలు, చిలుకలు, నెమళ్ళు మొదలైన పక్షులు మందిరాల గోడలమీద చెక్కబడిన కృత్రిమ పక్షులను చూచి తమజాతికి చెందిన నిజమైన పక్షులుగానే భావించి ఎంతో ఉత్కంఠలతో వాటిని పలుకరిస్తూ అక్కడి చెట్లకొమ్మలపై కేరింతలు కొడుతూ ఆడుతుంటాయి.

**వ. వెండియు. 811**

**క. ఘన సాంధ్రాంతరశయ్యా, సన కేళీగేహ కృతక జగతీధర శో**
**భన చంద్రకాంతచారు భ, వన ఫల భరితావనీజవంతము నగుచున్. 812**

* ఇంకా ఆ విమానం మెత్తని శయ్యలతో, మేలైన గద్దెలతో, కేళీ గృహాలతో, క్రీడాపర్వతాలతో, పాలరాతి భవనాలతో, పండ్లచెట్లతో నిండిన వనాలతో నిండి ఉన్నది.

**క. సకలర్తు శోభితంబును, సకల శుభావహము సకలసంపత్కరమున్**
**సకలోపభోగ యోగ్యము, సకలేప్సిత కామదంబు సదలంకృతమున్. 813**

* ఈ విధంగా ఆ విమానం సమస్త ఋతుశోభలతో, సకల శుభాలతో, సర్వసంపదలతో పెంపొందుతూ అన్ని సుఖాలూ అనుభవించటానికి యోగ్యమై, అన్నికోరికలూ అందింపగలదై, అందమైన అలంకారాలతో ఒప్పుతున్నది.

**వ. అగుచు నొప్పు దివ్యవిమానంబుఁ గల్పించి తదీయ సుషమా విశేషచిత్రంబులు నిర్మించిన తానునుం దెలియం జాలని యద్భుత కర్మంబయిన విమానంబు దేవహూతికిం జూపినం జూచి యమ్ముద్దియ సంతసింపకుండుట యెఱింగి సర్వభూతాంతరాశయాభిజ్ఞుండును, సంతుష్టాంత రంగుండును నైన కర్దముం డిట్లనియె. 814**

* అటువంటి భవ్యమైన ఒక దివ్యవిమానాన్ని సృష్టించిన కర్దమ ప్రజాపతి అందలి శోభావిశేషాలను నిర్మాణం చేసిన తానుకూడా తెలుసుకో లేనంతటి ఆ అత్యద్భుత విమానాన్ని దేవహూతికి చూపించాడు. అయితే ఆ విమానాన్ని చూచి ఆమె సంతోషపడలేదు. ఆ సంగతి తెలుసుకొని సమస్త ప్రాణుల అంతరంగాలలో గల అభిప్రాయాలను గ్రహించే వాడూ, సంతుష్టహృదయుడూ అయిన కర్దమ మునీంద్రుడు దేవహూతితో ఇట్లా అన్నాడు.

**తే. అతివ, భగవత్కృతంబును నఖిల మంగ,ళాకరంబును నగు నీ జలాశయమునఁ**
**దవిలి గ్రుంకిన జంతు వితానములకుఁ, గామ్యఫలసిద్ధి సేకుఱుఁ గాన నీవు. 815**

* ఓ సుందరీ! ఇదుగో బిందుసరోవరం. దీనిని భగవంతుడు నిర్మించాడు. ఇది సమస్త శుభాలకూ ఆకరమైనది. ఈ సరస్సులో స్నానం చేసినవారికి కోరిన కోరిక లన్నీ సిద్ధిస్తాయి.

**క. ఇజ్జలముల నతిభక్తి ని, మజ్జన మొనరించి యీ విమానము వేడ్కన్**
**లజ్జావతి! యెక్కవె యని, బుజ్జవ మొనరంగఁ గర్దముఁడు వల్కుటయున్. 816**

* చెలీ! సిగ్గుపడకు, ఈ సరోవరజలాలలో శ్రద్ధాభక్తులతో స్నానం చేసి సంతోషంతో ఈ విమానాన్ని ఆరోహించు అని కర్దమ ప్రజాపతి దేవహూతిని బుజ్జగిస్తూ పలికాడు.

**వ. విని యా కువలయాక్షి పతిసేవాయాస మలినాంబరయు, వేణీ భూతశిరోజయు, ధూళి ధూసరితాతి కృశీభూతాంగియు, శబల స్తనయునై భర్తృ నియోగంబున సరస్వతీ సలిల సంభూత జలచరాశ్రయం బగు బిందుసరోవరంబుఁ బ్రవేశించి తజ్జలంబులఁ గ్రుంకులిడు సమయంబునఁ దద్వాఃపూర మధ్యంబున రుచిర సూక్ష్మాంశుక ధారిణులుఁ, గిశోరవయః పరిపాకశోభితలు, నుత్పల గంధులు నగు కన్యాసహస్రంబులు దేవహూతిం గనుంగొని యిట్లనిరి. 817**

* కలువరేకులవంటి కన్నులు గల ఆ చెలువ పతి పలుకులు విన్నది. ఆమె పతిసేవలో బాగా అలసిపోయి ఉన్నది. చీర బాగా మాసిపోయింది. శిరోజాలు జడలు కట్టాయి. శరీరం ధూళిధూసరితమై కృశించింది. వక్షస్థల మంతా వివర్ణమైపోయి ఉంది.

దేవహూతి తన భర్త ఆజ్ఞానుసారం సరస్వతీనదీ జలాలతోనూ, జలచరాలతోనూ నిండిన ఆ బిందుసరోవరంలో స్నానం చెయ్యడానికి దిగింది. అలా ఆమె స్నానం చేసే సమయంలో ఆ జలప్రవాహంలో నుంచి నాజూకైన సన్నని పట్టువస్త్రాలు కట్టుకున్నవారూ, నవయౌవనములో ఉన్నవారూ, కలువ పూల పరిమళం కలవారూ అయిన పెక్కుమంది కన్యలు దేవహూతికి కన్పించారు. వారు ఆమెతో ఇట్లా అన్నారు.

**క. తరుణీ! సంచితధర్మా, చరణల మగు మేము నీకు సదమలభక్తిం**
**బరిచర్య సేయనేర్తుము, కరుణాకలితేక్షణములఁ గనుఁగొను మమ్మున్. 818**

* ఓ యువతీ! మేము అమోఘమైన ధర్మకార్యాలు ఆచరించే వాళ్లం. నిర్మలమైన భక్తితో నీకు సేవలు చేయగలం. నీవు మమ్ములను కరుణతో కూడిన కడగంటి చూపులతో కనికరించు.

**సీ. అని పల్కి డాసి యయ్యతివకు నభ్యంజ నోద్వర్తనములు పెంపొనరఁ జేసి**
**మలయజ కర్పూర మహితవాసిత హేమ కలశోదకంబుల జలకమార్చి**
**ధవళ వస్త్రంబులఁ దడియొత్తి సర్వాంగ ధూపంబు లొసఁగి కస్తూరి యలఁది**
**మంజుశింజన్మణి మంజీర కింకిణీ కలరావ కలిత మేఖలలు రత్న**

**తే. ఖచిత తాటంక ముద్రికా కంకణాది, సముచితానర్ఘ హేమభూషణము లొసఁగి**
**భవ్యమాల్యాను లేపనాంబరము లిచ్చి, షడ్రసోపేత వివిధాన్న సమితిఁ దనిపి. 819**

* ఇలా అని వారంతా ఆమె సమీపానికి చేరారు. దేవహూతికి తలంటి, నలుగుపెట్టి, చందన కర్పూర సుగంధాలు వెదజల్లే బంగారు బిందెల జలాలతో స్నానం చేయించారు. తెల్లని వస్త్రాలతో తడి ఒత్తారు. శరీరమంతా అగరు ధూపాలు వేశారు. కస్తూరిపూతలు పూశారు. మధురంగా ధ్వనించే మణిమంజీరాలు పాదాలకు తొడిగారు. చిరుగంటల సవ్వడితో ఒప్పే ఒడ్డాణం నడుముకు అలంకరించారు. రత్నాలు చెక్కిన కర్ణాభరణాలూ, ఉంగరాలూ, కంకణాలూ మొదలైన విలువగల బంగారు సొమ్ములు కైసేశారు. పూలదండలు సింగారించారు. షడ్రసోపేత భోజనాలతో సంతృప్తి పరచారు.

**వ. మఱియుం గనక పాత్రరచితంబు లయిన కర్పూర నీరాజనంబుల నివాళించి రుచిరాసనంబునఁ గూర్చుండఁబెట్టి దర్పణంబు సేతి కిచ్చినం దత్ప్రతిఫలిత నిజదేహంబుఁ గనుంగొని కర్దముని మనంబునం దలంచిన నతండునుం గన్యకాసహస్రంబును దత్క్షణంబునఁ దనసన్నిధి నుండుటం జూచి నిజభర్తృ యోగ మాయా ప్రభావంబునకు నద్భుతంబు నొందె, నంతఁ గర్దముండు కృతస్నానయైన దేవహూతిం గనుంగొని వివాహంబునకు ముందట నేచందంబునఁ దనరుచుండె నా చందంబునఁ జెన్నొందు చుండుటకు నానంద భరితుండై భార్యా సహితంబుగఁ దత్కన్యకా సహస్రంబు గొలువ నిజ విమానారూఢుండై తారాగణ పరివృత రోహిణీయుక్తుం డగు సుధాకరుండునుంబోలె నొప్పుచుం దదనంతరంబ. 820**

* బంగారు పళ్లెరాలలో కర్పూరం వెలిగించి హారతులు ఇచ్చారు. రమణీయమైన రత్నపీఠంమీద కూర్చోబెట్టి అద్దం చేతికిచ్చారు. దేవహూతి ఆ అద్దంలో ప్రతిఫలించిన తన రూపాన్ని చూచుకొని తనపతి అయిన కర్దమ ప్రజాపతిని మనస్సులో భావించింది. మరుక్షణంలో కర్దముడూ, వేలకొలది కన్యకలూ తనచెంత సాక్షాత్కరించారు. ఆమె తన భర్తగారి యోగమాయా ప్రభావానికి ఆశ్చర్యచకితురా లయింది. అప్పుడు కర్దముడు స్నానంచేసి ఆసీనురాలై ఉన్న దేవహూతిని చూచాడు. వివాహానికి ముందు ఆమె ఎట్లా

ఉన్నదో అట్లాగే అంతటి చెక్కుచెదరని చక్కదనంతో ఉన్నందుకు మహానందం పొందాడు. కన్యలందరూ తమ్ము సేవిస్తూ ఉండగా సతీసమేతుడై విమానం ఎక్కి చుక్కలతో చుట్టబడిన రోహిణీ సహితుడైన చంద్రునిలా ప్రకాశించాడు.

చ. చిరశుభమూర్తి యమ్ముని యశేషదిగీశ విహార యోగ్యమున్,
సురుచిర మంద గంధవహ శోభితమున్, నికటప్రధాతు ని
ర్ఝర సరిదంబుశీతల తుషారమునై తనరారు మేరు కం
దరమున కేగి దేవవనితాయుతుఁడైన కుబేరు చాడ్పునన్. 821

* నిత్యమంగళ స్వరూపుడైన ఆ కర్దముడు విమానారూఢుడై సమస్త దిక్పాలురూ విహరించడానికి యోగ్యమైనదీ, మెల్లగా చల్లగా వీచే మలయమారుతాలతో కూడినదీ, సమీపంలో ప్రవహించే సెలయేళ్ళనీటి తుంపురుల చల్లదనం కలదీ అయిన మేరుపర్వతం శిఖరాలమీద సురసుందరీ సమేతుడైన కుబేరునిలా విహరించాడు.

వ. మఱియును. 822

మ. అమరోద్యానవన ప్రదేశములు, నవ్యారామభూముల్, దళ
త్కుముదాంభోజవిభాసి మానససరః కూలంబులున్, మంజు కుం
జములుం, జైత్రరథంబు విస్ఫురిత విస్రంభంబునం జూచె నె
య్యమునం గర్దమయోగి కామగ విమానారూఢుఁడై చెచ్చెరన్. 823

* ఇంకా కామగమనం గల ఆ విమానాన్ని అధిరోహించి భార్యాసమేతుడైన కర్దముడు అందమైన నందనవన ప్రదేశాలను సందర్శించాడు. నవనవోన్మేషాలైన క్రొంగ్రొత్త పూదోటలను చూచాడు. వికసించిన కలువలతో, పద్మాలతో విరాజిల్లుతూ ఉన్న మానస సరోవర తీరాలను తిలకించాడు. అందాలు చిందే పొదరిండ్లను అవలోకించాడు.చైత్రరథం అనే పేరుగల కుబేరుని ఉద్యానాన్ని ఎంతో సంతోషంతో ఆలోకించాడు.

వ. ఇవ్విధంబున సమస్త భూభాగంబును వాయు వేగంబునం గలయం గ్రుమ్మరి నిఖిల వైమానికలోకంబు నతిశయించి లోకంబులం జరించె, మోక్షదాయకుండుఁ, దీర్ఘపాదుండు నగు పుండరీకాక్షుని సన్నుతించి సేవించు పుణ్యాత్ములకుం బొందరాని పదార్థంబులు గలవే? యిట్లు కర్దముఁడు దేవహూతికి నిఖిల ధరాచక్రం బంతయుం జూపి మరల నిజనివాసంబునకుం జనుదెంచి, కామకేళీ వినోదాత్మికయై యున్న భార్య నుపలక్షించి రతిప్రసంగ వ్యాసంగంబు గైకొని బహువిధంబు లయిన యిష్టోపభోగంబుల బహువత్సరంబు లొక్కముహూర్తంబుగా జరుపుచు నన్యోన్యసర సావలోకనంబుల సముచితాలింగన సంభాషణంబులం గాలనిరూపణంబు సేయనేరక శతవత్సరంబులు గడపి తదనంతరంబ. 824

* ఈ విధంగా కర్దముడు వివిధప్రదేశాలలో విమానంమీద వాయువేగంతో విహరించి సమస్తదేవతలనూ అతిశయించినవాడై నేల నాలుగు చెరగులూ సంచరించాడు.

మోక్షప్రదాతా, పరమపూజ్యుడూ అయిన విష్ణుదేవుని భావించి, సేవించే పుణ్యాత్ములు పొందజాలని వస్తువు లుంటాయా? ఇలా కర్దముడు తన అర్ధాంగి అయిన దేవహూతికి సమస్త భూమండలాన్నీ చూపించి, మళ్ళీ తన నివాసానికి తీసుకొనివచ్చాడు. అనంతరం శృంగారకేళీ విలాసాలకు అభిముఖురాలైన ఇల్లాలి హృదయాన్ని గుర్తించిన కర్దముడు రతిక్రీడా పరాయణు డైనాడు. ఆ దంపతులు అనేకవిధాలైన అభీష్ట సుఖభోగాలు అనుభవిస్తూ, పెక్కుసంవత్సరాలు ఒక్క క్షణంగా గడిపారు. అన్యోన్యం తియ్యనైన చూపులతో విడిపోని కౌగిలింతలతో సరసమైన సంభాషణలతో కలిసిమెలసి కాలగమనం గమనించకుండా నూరేండ్లు గడిపారు.

**క. మునివరుఁ డొకనాఁ డిమ్ములఁ, దన నిజదేహంబు నవవిధంబులు గావిం**
**చి నయంబునఁ దద్వీర్యము, దన సతిగర్భమునఁ నవవిధంబుల నిలిపెన్. 825**

* ఒకనాడు కుతూహలంతో కర్దముడు తొమ్మిది విధాలైన వేరు వేరు దేహాలు ధరించి క్రమంగా తన వీర్యాన్ని తన అర్ధాంగియైన దేవహూతి గర్భంలో తొమ్మిది విధాలుగా నిలిచేటట్లు చేశాడు.

**క. అది కారణంబుగాఁ బెం, పొదవిన మునివలన దేవహూతియుఁ గూఁతుల్**
**ముదమునఁ గనెఁ దొమ్మండ్రన్, ముదితయు మది సంతసించె, మునివరుఁ డంతన్. 826**

* ఆ కారణంగా కర్దమమునివల్ల దేవహూతి తొమ్మిదిమంది పుత్రికలను కన్నది. ఆ మగువ తన మనస్సులో ఎంతో సంతోషించింది.

**తే. సన్న్యసింపంగఁ గోరిన సతి యెఱింగి, యాత్మఁ బొడమిన సంతాప మగ్గలింపఁ**
**జింత వాటిల్లఁ జెక్కిటఁ జేయి సేర్చి, పదములను నేల వ్రాయుచుఁ బలికెఁ బతికి. 827**

* అనంతరం కర్దమ మునీంద్రుడు సన్న్యసింపదలిచాడు. ఆ విషయం అతని భార్య తెలిసికొన్నది. మనస్సులో పుట్టిన ఆవేదన అధికం కాగా, చింతతో చెక్కిలిమీద చేయిచేర్చి కాలివ్రేలితో నేలపై వ్రాస్తూ, ఆ దేవహూతి భర్తతో ఇట్లా అన్నది.

**సీ. అనఘ సంతాన పర్యంతంబు ననుఁ గూడి, వర్తింతు ననుచుఁ బూర్వమునఁ బలికి**
**కూఁతుల నిచ్చితి కొమరారఁ, నిప్పు డీ, తరుణులు పతులను దమకుఁ దార**
**యరసి వర్తింతురో యని భీతి నొందెదఁ, గావున నీపుత్రికలకుఁ దగిన**
**వరుల సంపాదించి, పరిణయంబులు సేసి, తత్త్వసంహిత నాకుఁ దవిలి తెలుపు**

**తే. సుతునిఁ గృపసేసి ననుఁ గావు సుజనవినుత! యర్థి సంసారదుఃఖంబు నపనయింప**
**నర్హుఁడవు నీవ, కామమోహమున నింత, కాల మూరక పోయె నే గతియు లేక. 828**

* ఓ పుణ్యాత్ముడా! సంతానం కలిగే పర్యంతం నాతో ఉంటానని పూర్వం నీవు చెప్పావు. అనుగు పుత్రికలను అనుగ్రహించావు. ఈ యువతులు తమకు తగిన భర్తలను తామే ఎట్లా వెదుకుకో గలరు -

అనే భీతి నా మనస్సుకు కలుగుతూ వుంది. అందుకని ఈ కూతుళ్లకు తగిన వరులను అన్వేషించి వారికి వివాహం చేసి, నాకు వేదాంత విషయాలను తెలియజెప్పగల కుమారుణ్ణి ప్రసాదించి నన్ను కటాక్షించు. సాధుజన సంస్తవనీయా! సంసార దుఃఖాన్ని తొలగించడానికి సకల విధాలా సమర్థుడవు నీవే కదా! ముక్తి మార్గాన్ని వ్యక్తీకరించే వారు లేక మోహం వల్ల ఇంతకాలం వ్యర్థంగా గడిచిపోయింది.

**చ. ఉపరతి పుట్టె నైహిక సుఖోపగతానుభవంబులందు, నేఁ**
**జపలతఁ గామభోగరతి సంగముఁగోరి మహాత్మ! నిన్ను న**
**చ్ఛపుఁ దలఁ పొప్పఁ గాఁ దెలియఁజాలక యే వరియించుటన్ భవ**
**త్కృప ఫలియించె, ముక్తి నినుఁ గేవలభక్తి భజింపఁగల్గదే? 829**

* ఓ మహాత్మా! నాకు ఈలోక సంబంధాలైన సుఖాలను అనుభవించాలనే ఆసక్తి నశించింది. భోగాలపై విరక్తి కలిగింది. ఇంతకు ముందు చంచలభావంతో కామోపభోగాలను అభిలషించిన దానినై, స్వచ్ఛమైన నీ భావాన్ని తెలుసుకోలేక ఏవేవో అర్థించాను. నా పట్ల నీ అనుగ్రహం ఫలించింది. నిన్ను నిర్మల భక్తితో సేవించడం చేత ముక్తి లభిస్తుంది గదా!

**వ. అదియునుం గాక 830**

**చ. సమమతి నొప్పు సత్పురుషసఖ్యము సద్గతికారణంబు, నీ**
**చమతి విలోల దుష్పురుషసఖ్యము దుర్గతిహేతు వంచుఁ జి**
**త్తమునఁ దలంచి యోగిజనతానుత! మిమ్ము భజింతుఁ, బ్రాణి సం**
**గమమునఁ బుణ్య పాపములు గైకొని పొందవె యెట్టి వారలన్? 831**

* అంతేగాక అందరిపట్ల సమానబుద్ధి గల సజ్జనుల మైత్రి ఉత్తమగతి కలిగిస్తుంది. నీచమైన బుద్ధిగల్గి, చంచలచిత్తులైన దుర్జనుల స్నేహం వల్ల దుర్గతి కలుగుతుంది. ఈ సంగతి మనస్సులో భావించి, యోగిజన సన్నుతుడవైన నిన్ను నేను సేవిస్తాను. ప్రాణుల సమాగమం వల్లనే ఎట్టివారికైనా పుణ్యాలో లేక పాపాలో ప్రాప్తిస్తాయి.

**క. అని యిట్లు వేదనాభర, మున మునుకుచుఁ బలుకఁ గర్దముఁడు మనుపుత్రిం**
**గనుఁగొని సరసిజనయను వ, చనములు మది సంస్మరించి సతి కిట్లనియెన్. 832**

* ఈ విధంగా దేవహూతి మిక్కిలి వేదనతో పరితపించుతూ పలికింది. ఆమె పలుకులు ఆలకించి కర్దమ మునీంద్రుడు విష్ణుదేవుని వాక్యాలు స్మరించుకొని మనుపుత్రి అయిన దేవహూతిని చూచి ఆమెతో ఇట్లా అన్నాడు.

**క. మనుసుత! నీ మది దుఃఖం, బును బొందకు, మచిరకాలమున భగవంతుం**
**డనఘుం డక్షరుఁడు జనా, ర్దనుఁడు భవద్గర్భమందుఁ దగ వసియించున్. 833**

* ఓ మనునందినీ! నీవు మనస్సులో దుఃఖించవద్దు. అనఘుడూ అక్షరుడూ అయిన విష్ణుభగవానుడు కొలది కాలంలోనే నీ గర్భంలో ప్రవేశిస్తాడు.

క. వర నియమ వ్రత నిష్ఠా, చరణ నియుక్తాంతరంగ సమధికవై సం
భరిత తపోధన దాన, స్ఫురిత శ్రద్ధానుభక్తి పూర్వము గాఁగన్. 834

* నీవు ఉత్తమ నియమాలతో వ్రతాలతో నిష్ఠతో చరించు. నిగ్రహంతో కూడిన మనస్సు కలదానివై నిండైన తపస్సూ, శ్రద్ధా భక్తులతో కూడిన దానధర్మాలూ ఆచరించు.

మ. మఱి నారాయణు పాదపద్మములు సమ్యగ్భక్తిఁ బూజించు త
త్పురుష శ్రేష్ఠుఁడు మానసంబున భవత్పూజా సుసంప్రీతుఁడై
కర మర్థిం దరుణీశిరోమణి! భవద్గర్భస్థుఁడై యుండి తాఁ
గరుణం జేయు భవన్మనోజనిత శంకాగ్రంథి విచ్ఛేదమున్. 835

* శ్రీ మన్నారాయణుని పాదపద్మాలను నిండైన భక్తితో పూజించు. పురుషోత్తముడైన ఆ విష్ణుదేవుడు నీ పూజలకు సంతృప్తి చెంది నీ గర్భములో నివసిస్తాడు. నీ మనస్సులో పుట్టిన సందేహాల ముడులను విడదీస్తాడు.

## -: దేవహూతి గర్భంబున విష్ణుండు గపిలాచార్యుండుగా నుదయించుట :-

చ. అనవుడు దేవహూతి హృదయంబున సంతసమంది యమ్మునీం
ద్రుని వచన క్రమంబునఁ బరున్ భగవంతు ననంతుఁ బద్మలో
చను హరి విష్ణు నర్చనము సల్పుచు నుండఁగఁ గొన్ని యబ్దముల్
సనునెడ దానవాంతకుఁడు సమ్మతిఁ గార్దమమైన తేజమున్. 836

క. ధరియించి యమ్మునీంద్రుని, తరుణీ గర్భంబువలన దనుజారి శమీ
తరు కోటరమున వైశ్వా, నరుఁ డుదయించిన విధంబునన్ జనియించెన్. 837

* అని కర్దముడు చెప్పగా దేవహూతి విని తన మనస్సులో ఎంతో సంతోషపడింది. మునీంద్రునిమాటల ప్రకారం భగవంతుడు, అనంతుడు, కమలలోచనుడు, పాపమోచనుడు అయిన మహావిష్ణువును పూజిస్తూ ఉండగా కొన్నేండ్లు గడిచాయి. అప్పుడు భగవంతుడు కర్దమ మునీశ్వరుని తేజస్సును ధరించి జమ్మిచెట్టు తొఱ్ఱలో నుంచి అగ్ని పుట్టినట్లుగా దేవహూతి గర్భంలోనుంచి ఆవిర్భవించాడు.

సీ. అయ్యవసరమున నాకాశమున దేవ తూర్య ఘోషంబులు తుముల మయ్యె,
నందిత దేవతాబృందంబు లందంద, కురిసిరి మందారకుసుమవృష్టి,
గంధర్వకిన్నరగానంబు వీతెంచె నప్సరోగణముల యాట లొప్పె,
వావిరి దిక్కులఁ గావిరి విరిసెను దవిలి వార్దుల కలంకువలు మానె,

**తే. సాధుజనముల మనములు సంతసిల్లె, హోమవహ్నులు ప్రభలఁ జెన్నొంది వెలిఁగెఁ**
**గుసుమఫలభారముల నొప్పెఁ గుజములెల్ల, సర్వసస్యాళి చెన్నొందె జగతిలోన. 838**

* ఆ శుభసమయంలో ఆకాశంలో దివ్యమంగళ వాద్యాలు ధ్వనించాయి. బృందారకబృందాలు హర్షంతో మందార పుష్పవర్షం కురిపించారు. గంధర్వులూ, కిన్నరులూ పాటలు పాడారు. అప్సరసలు ఆడారు. దిక్కుల్లో క్రమ్మిన పొగమంచు మాయమయింది. సముద్రాలు ప్రశాంతములైనాయి. సజ్జనుల మనస్సులకు సంతోషం కలిగింది. హోమాగ్నులు మిక్కిలి తేజస్సుతో వెలిగాయి. వృక్షాలన్నీ ఫలపుష్పభరితాలు అయినాయి. పొలాలలో నానావిధాలైన పైరులు నవనవోన్మేషంగా ప్రకాశించాయి.

**వ. ఇట్టి మహోత్సవంబున దేవహూతికిం దత్త్వబోధంబుఁ గావించుకొఱకుఁ దదీయగర్భంబున నుదయించిన పరబ్రహ్మ స్వరూపుండైన నారాయణుని దర్శించుకొఱకు మరీచి ప్రముఖ మునిగణ సమేతుండై చతుర్ముఖుండు సనుదెంచి యమ్మహాత్ముని దర్శించి కర్దమదేవహూతులం గనుంగొని యిట్లనియె. 839**

* ఆ మహోత్సవ సమయంలో దేవహూతికి తత్త్వజ్ఞానాన్ని బోధించడానికై ఆమె గర్భంలో పుట్టిన పరబ్రహ్మ స్వరూపుడైన శ్రీ మహావిష్ణువును దర్శించడంకోసం మరీచి మొదలైన మునీశ్వరులతోకూడి బ్రహ్మదేవుడు విచ్చేశాడు. ఆయన ఆ మహాత్ముని దర్శనం చేసికొన్న అనంతరం కర్దమ దేవహూతులను చూచి ఇలా పలికాడు.

**క. నుతచరితులార! మీరలు, కృతకృత్యులు, విష్ణుపూజఁ గేవలభక్తిన్**
**మతి నిష్కపటులరై చే, సితిరి తదర్చన ఫలంబు సేకుఱె మీకున్. 840**

* ధన్యచరితులైన ఓ దంపతులారా! మీరు కృతార్థులు. నిజమైన భక్తితో, నిష్కపటమైన మనస్సుతో విష్ణుదేవుని సేవించారు. మీ పూజకు తగిన ఫలం మీకు చేకూరింది.

**క. శ్రిత భయహరణుఁడు, మునిజన, నుత చరితుఁడు, పరుఁడు, మీ మనోరథసిద్ధిన్**
**వితతంబుగఁ గావించుటఁ, జతురత మీ జన్మ మింక సఫలతఁ బొందెన్. 841**

* ఆశ్రయించినవారి భయాన్ని పోగొట్టేవాడు, మునీశ్వరులు జయపెట్టే చరిత్ర కలవాడూ అయిన పరాత్పరుడు మీ కోర్కెను చక్కగా నెరవేర్చినాడు. అందువల్ల మీ జన్మ సార్థకం అయింది.

**క. వినుఁడు సకాములునై హరి, ననుపమభక్తిన్ భజించునదె ముక్తికిఁ జా**
**లును, మీ పుణ్యం బే మని, కొనియాడఁగ వచ్చు నీతికోవిదులారా! 842**

* నీతి పారంగతులైన దంపతులారా! వినండి. ఆసక్తితో, అద్వితీయమైన భక్తితో విష్ణువును పూజిస్తే అదే మోక్షాన్ని ప్రసాదిస్తుంది. భగవంతుడు మీకు కొడుకై పుట్టాడు. అగణ్యమైన మీ పుణ్యాన్ని ఎంతని పొగడగలను.

వ. అని వెండియుం గర్దమునిం గనుంగొని యిట్లను, "భవదీయ తనూభవలం బ్రకటశీలవ్రతాచార సంపన్నులైన ముని వరేణ్యులకుం బెండ్లిసేయు, మట్లయిన వారివలనం బ్రజాసృష్టి బహువిధంబుల వృద్ధిం బొందు"నని చెప్పి మఱియు నిట్లనియె. 843

* అని మళ్లీ కర్దముని చూచి, బ్రహ్మ ఇట్లా అన్నాడు. మునీంద్రా! నీ పుత్రికలను ఉత్తమ స్వభావులూ, సదాచార సంపన్నులూ అయిన మునిశ్రేష్ఠుల కిచ్చి వివాహం చెయ్యి. అలా అయితే వారివల్ల ప్రజాసృష్టి అనేక విధాలుగా అభివృద్ధి పొందుతుంది అని మళ్లీ ఇట్లా అన్నాడు.

చ. అనఘ! భవత్సుతుండు సముదంచిత తేజుఁడు నైన యిమ్మహా
త్మునిఁ బరమేశు నీశు నజితున్ నలినాక్షు నమేయు నచ్యుతున్
ఘనుని ననంతు నాద్యు నవికారుని నక్షరుఁగాఁ దలంపు, మీ
ఘనుఁడు సమస్త చేతన నికాయహృదీప్సితదాయి గావునన్. 844

* ఓ పుణ్యాత్ముడా! మహాత్ముడూ, మహా తేజోవిరాజితుడూ అయిన ఈ నీ సుతుడు సమస్త ప్రాణుల హృదయాలలోని మనోరథాలను నెరవేర్చే ఘనుడు, కాబట్టి నీ పట్టిని - ఈశుడు, పరమేశ్వరుడు అపరాజితుడు, అమేయుడు, అచ్యుతుడు, అనంతుడు, ఆద్యుడు, అవికారుడు, అక్షరుడు అయిన పుండరీకాక్షునిగా భావించు.

సీ. మానిత జ్ఞాన విజ్ఞాన యోగంబులు నను నుపాయంబుల నొనరఁ జేసి
యలవుమైఁ గర్మజీవుల నుద్ధరించుట కొఱకు నమ్మహితాత్మకుఁడు సమగ్ర
హాటకరుచి జటాజూటుండు నుత్ఫుల్ల పంకజనేత్రుండు పద్మపత్ర
హల కులిశాంకుశ లలిత రేఖాంకిత చరణతలుండును సత్త్వగుణుఁడు

తే. నగుచు నిప్పుడు సరసీరుహాక్షి, నీదు, గర్భమం దుదయించెను ఘనుఁడు, నీకుఁ
దత్త్వబోధంబుఁ గావించుఁ, దావకీన, హృదయ సంగత సంశయ మెల్లఁ బాపు. 845

* అమ్మా! దేవహూతీ! మాననీయాలైన జ్ఞానవిజ్ఞాన యోగాలనే ఉపాయాలచే కర్మజీవుల్ని ఉద్ధరించడానికై కమలాక్షుడు నీ కడుపున ఉదయించాడు. బంగారు రంగు గల్గిన జటాజూటం కలవాడూ, వికసించిన కమలాలవంటి కన్నులు కలవాడూ; పద్మం, హలం, వజ్రం, అంకుశం - ఈ రేఖలు గల అరికాళ్ళతో విరాజిల్లేవాడూ, సత్త్వగుణసంపన్నుడూ అయి ఇప్పుడు నీ గర్భాన జన్మించిన ఈ మహాత్ముడు నీకు తత్త్వ బోధ చేస్తాడు. దాంతో నీ హృదయంలోని సంశయాలన్నీ తీరి పోతాయి.

వ. మఱియును. 846

క. నుతికెక్కి సిద్ధగణ సే, వితుఁడై ఘనసాంఖ్యయోగ విలసిత తత్త్వ
స్థితి నిరతుఁ డగుచుఁ గపిలా, ఖ్యతఁ దనరి చరించు నీ జగత్త్రయ మెల్లన్. 847

* ఇంతేకాదు. ఈ మీ కన్నవాడు పేరెన్నిక గన్నవాడై ప్రసిద్ధులైన సిద్ధపురుషులచే సేవింప బడుతూ మహనీయమైన సాంఖ్యయోగంతో ప్రకాశించే పరతత్త్వమందు సుస్థిరుడై "కపిలుడు"అనే పేరుతో ఈ మూడు లోకాలలోనూ సంచరిస్తాడు.

**క. అని పలికి యమ్మరీచిం, గని యుద్వాహోర్థ మునిచి కమలజుఁ డంతం**
**దన నందను లగు నారద, సనకాదులఁ గూడి యాత్మ సదనము కరిగెన్. 848**

* ఈ విధంగా పలికి బ్రహ్మదేవుడు వివాహం నిమిత్తం మరీచి మహర్షిని అక్కడే నిలిపి, తన కుమారులగు నారదుడు సనకుడు మొదలైన వారితో కలిసి తన నివాసస్థానానికి వెళ్ళాడు.

**వ. అంత నా కర్దముండు గమలసంభవచోదితుం డగుచుఁ యథోచితంబుగా నాత్మీయ దుహితల వివాహంబు సేయందలంచి మరీచికిం గళయను కన్యకను, నత్రికి ననసూయను, నంగిరసునకు శ్రద్ధను, బులస్త్యునకు హవిర్భువును, బులహునకు గతినిఁ, గ్రతువునకుఁ గ్రియను, భృగునకు ఖ్యాతిని, వసిష్ఠునకు నరుంధతిని, నథర్వునకు శాంతినింగా నిజకులాచారసరణిం బరిణయంబు గావించిన వారును గృతదారపరిగ్రహులును, గర్దమ కృతసంభావనా సంభావితులును నగుచు నతనిచేత ననుజ్ఞాతులై జాయాసహితు లగుచు నిజాశ్రమ భూములకుం జనిరి. అనంతరంబు కర్దముండు దేవోత్తముండగు విష్ణుండు దన మందిరంబున నవతరించి వసించియుంటం దన చిత్తంబున నెఱింగి వివిక్త స్థలంబునకుం జని యచ్చటఁ గపిలునికి వందనం బాచరించి యిట్లనియె. 849**

* తర్వాత కర్దముడు బ్రహ్మదేవుని ఆదేశానుసారం తన కుమార్తెలకు పెండిండ్లు చేయాలని నిశ్చయించినవాడై కళను మరీచి మహర్షికీ, అనసూయను అత్రిమహర్షికీ, శ్రద్ధను అంగిరసునకూ, హవిర్భువును పులస్త్యునకూ, గతిని పులహువునకూ, క్రియను క్రతువునకూ, ఖ్యాతిని భృగువునకూ, అరుంధతిని వసిష్ఠునకూ, శాంతిని అధ్వర్యునకూ ఇచ్చి తన కులాచారం ప్రకారం యథావిధిగా వివాహం చేశాడు. ఆ తొమ్మిదిమంది మహామునులూ కర్దమ కన్యలను పెండ్లాడి కర్దమ మునీంద్రుని సత్కారాలు అందుకొని ఆయన అభ్యనుజ్ఞతో సతీసమేతంగా తమ తమ ఆశ్రమాలకు వెళ్ళారు.

అనంతరం దేవదేవుడైన వాసుదేవుడు తన ఇంట్లో పుట్టి, పెరుగుతున్న విషయాన్ని మనస్సుకు తెచ్చుకొని కర్దముడు ఏకాంతప్రదేశంలో కపిలునకు నమస్కారం చేసి ఇట్లా అన్నాడు.

**సీ. చతురాత్మ! విను మాత్మకృతము లైనట్టి యమంగళ భూత కర్మంబు లనెడి**
**దావాగ్ని శిఖలచే దందహ్యమానులై నట్టి జీవులు దుదముట్ట లేక**
**పాయక సంసారబద్ధులై యుందురు తద్భవ హేతుభూతంబు లయిన**
**సకల దేవతలు బ్రసన్నులు నగుదురు బహుజన్మ పరిచిత ప్రాప్తయోగ**

**తే. చిరసమాధి తపోనిష్ఠచే వివిక్త, దేశముల యోగిజనములు ధృతుల నే మ**
**హానుభావు విలోకింతు రట్టి దివ్య, పురుషరత్నంబ నా యింటఁ బుట్టి తీవు. 850**

* ఓ మహాత్మా! పూర్వం తాము చేసిన అమంగళకరాలైన కార్యాలు అనే కార్చిచ్చు మంటల్లో గనగన కాలిపోతూ ఉన్న జీవులు, బైటపడలేక ఎడతెగని సంసార బంధాలలో బంధింపబడిన వారై ఉంటారు. చాలా కాలం ఇలా గడిచిపోతుంది. దేవతల అనుగ్రహం వల్లనూ, బహుజన్మల పరిచయం వల్లనూ ప్రాప్తించిన యోగసమాధితో నిష్ఠాగరిష్ఠులైన యోగి శ్రేష్ఠులు ఏకాంతప్రదేశంలో ఏమరుపాటు లేక ఏ మహానుభావుణ్ణి దర్శిస్తారో అటువంటి దేవాదిదేవుడవు నీవు నాయింటిలో జన్మించావు.

**వ. మఱియు సంసారచక్ర పరిభ్రామ్యమాణుల మగుచు గ్రామ్యుల మయిన మా వర్తనంబులను గణింపక మదీయ గృహంబునం బూర్వంబునం బ్రతిశ్రుతంబు లయిన భవదీయ వాక్యంబులు దప్పకుండ ననుగ్రహింప నుదయించి తని వెండియు నిట్లనియె.** 851

* సంసారచక్రంలో గిరగిర త్రిప్పబడుతూ, పరమ పామరులమైన మా ప్రవర్తన లెక్కింపక, పూర్వం ఆనతి ఇచ్చిన మేరకు మాట తప్పకుండా నన్ను అనుగ్రహించటానికై నాకుమారుడవై పుట్టావు అని మళ్ళీ ఇట్లా అన్నాడు.

**క. తలపోయఁగ నప్రాకృత, బలయుక్త చతుర్భుజాది భవదవతారం**
**బులు నీ కనురూపములై, పొలుపొందుం గాదె పరమ పురుష! మహాత్మా!** 852

* ఓ పరమ పురుషా! మహాత్మా! ప్రకృతికి అతీతమైన బలపరాక్రమాలు గల నాలుగుచేతులతో ప్రకాశించే నీ అనేకావతారాలు అన్నివిధాలా నీకు అనుగుణంగా అలరారుతున్నాయి.

**వ. అదియునుం గాక.** 853

**క. అనయము భవదీయాశ్రిత, జన సంరక్షణము కొఱకు సమ్మతితోఁ దా**
**ల్చిన మానవ రూపంబులు, ననురూపము లగును గాదె హరి! నీ కెపుడున్.** 854

* అంతేగాక ఓహరీ! అనవరతమూ నిన్ను ఆశ్రయించే ఆర్తులను ఆదుకోడానికై నీవు అంగీకరించే రూపాలు నీకు అనురూపాలే అవుతుంటాయి.

**క. సుమహిత తత్త్వజ్ఞానా, ర్థము విద్వజ్జనగణంబు దవిలి నమస్కా**
**రము లోలిఁ జేయు పదపీ, ఠము గల నినుఁ బొగడ వశమె! ఠవణిల్లంగన్.** 855

* పరమపవిత్రమైన తత్త్వజ్ఞానం ప్రాప్తించటంకోసం విద్వాంసులైనవారు విడువకుండా నమస్కరించే పాదపీఠం గల నిన్ను వర్ణించడానికి ఎవరికి సాధ్యం?

**సీ. సమధిక షడ్గుణైశ్వర్య కారణుఁడవు పరమేశ్వరుండవు, ప్రకృతి పురుష**
**మహదహంకార తన్మాత్ర తత్క్షోభక హేతు కాలాత్మ విఖ్యాత ధృతివి,**
**జగదాత్మకుఁడవు చిచ్ఛక్తివి నాత్మీయ జఠర నిక్షిప్త విశ్వప్రపంచ**
**మును గల సర్వజ్ఞ మూర్తివి, స్వచ్ఛంద శక్తియుక్తుండవు, సర్వసాక్షి**

తే. వగుచుఁ గపిలాఖ్యఁ దనరారు నట్టి నీకు, ననఘ! మ్రొక్కెదఁ, బుత్త్రుండ వగుచు నీవు
నాకుఁ బుట్టిన కతన ఋణత్రయంబు, వలనఁ బాసితి, నిఁక భక్తవరద! నేను. 856

* ఓ భక్తవరదా! అపారమైన షడ్గుణైశ్వర్యాలకు నీవు కారణభూతుడవు! పరమేశ్వరుడవు! ప్రకృతి, పురుషుడు, మహత్తు, అహంకారం, పంచతన్మాత్రలు అన్నీ నీవే! వీనిని క్షోభింప చేయడానికి కారణమైన కాలం కూడ నీ స్వరూపమే! నీవు స్థిరమూర్తివి. జగదంతర్యామివైన స్వామివి! చిచ్ఛక్తి యుక్తుడవు! సమస్త విశ్వాన్నీ ఉదరంలో పదిలపర్చుకున్న సర్వజ్ఞుడవు! స్వతంత్రుడవు, సర్వసాక్షివి! అటువంటి నీవు "కపిలుడు"అనే పేరుతో వెలుగుతూ ఉన్నావు. ఓ పుణ్యపురుషా! నీకు నమస్కరిస్తున్నాను. నీవు నాకు పుత్త్రుడవై పుట్టడం వల్ల నేను దేవ, ఋషి, పితృ ఋణాలు మూడింటి నుండీ విముక్తి పొందాను.

తే. మానితవ్రత యోగసమాధి నియతిఁ, జెంది భవదీయ పాదారవింద యుగము
డెందమునఁ జేర్చి శోకంబులందుఁ దొలఁగి, సంచరించెద నంచితస్థలము లందు. 857

* ఉత్తమ వ్రతాలలో యోగాలలో ధ్యానాలలో నియమం కలవాడినై, నీ పాదపద్మద్వయం నా హృదయంలో పదిల పరుచుకొని దుఃఖాలన్నింటినీ దూరం చేసుకొని, పుణ్యప్రదేశాలలో సంచరిస్తాను.

క. అని యిట్లు విన్నవించిన, మునిపుంగవుఁ డైన కర్దముని వచనంబుల్
విని భగవంతుం డగు న, య్యనఘుఁడు గపిలుండు వలికె నర్మిలి దోఁపన్. 858

* అని ఈ ప్రకారంగా విన్నవించుకుంటున్న కర్దమ మునీంద్రుని మాటలు ఆలకించి భగవంతుడైన కపిలుడు ఆయనను చూచి అనురాగ పూర్వకంగా ఇలా అన్నాడు.

సీ. నా చేతఁ బూర్వంబునం బ్రతిశ్రుతమైన వచనముల్ దప్పక వరమునీంద్ర!
నీ యింటఁ బుట్టితి, నిర్హేతుకస్థితి భూరిదయా గుణంబున నవాప్త
సకలకాముఁడ, నేను సన్మునివేషంబు ధరియించుటెల్ల నా కొఱకుఁ గాదు,
విను మహాత్మకులైన మునులకుఁ బరమాత్మ, గురు సద్వివేకంబు నరసి చూపు

తే. తత్త్వబోధంబు కొఱకును దాల్పఁబడిన, యంచిత వ్యక్తమార్గ మైనట్టి దేహ
మని తలంపుము, మత్పదధ్యాన భక్తి, ధీపరాయణ మహిమంబు దేజరిల్ల. 859

* ఓ కర్దమమునీశ్వరా! నేను ఇంతకుముందు నీకు ఇచ్చిన వాగ్దానం మేరకు అవ్యాజమైన అనుగ్రహంతో నీ యింట పుట్టాను. అవాప్తకాముడ నైన నాకు కోరిక లంటూ ఏవీ లేవు. నేను ఈ మునివేషం ధరించడం నాకోసం కాదు. మహాత్ములైన మునులకు, పరమాత్మ సంబంధమైన - పరమవివేకంతో కూడిన - తత్త్వజ్ఞానాన్ని ప్రబోధించటం కోసం ధరించిన దేహంగా దీన్ని తెలుసుకో. భక్తి పూర్వకంగా నా పాదాలను ధ్యానించు. మహిమతో విరాజిల్లే నీ బుద్ధిని నాయందు లగ్నం చెయ్యి.

క. సమధిక నిష్ఠం గృతయో, గమునన్ సన్న్యస్త సకల కర్ముఁడవై మో
హముఁ బాసి భక్తిచే మో, క్షముకై భజియింపు నను వికారరహితుఁడై, 860

* నీవు అధికమైన నిష్ఠ కలవాడివై యోగమార్గాన్ని అనుసరించు. సమస్త కర్మలనూ నాకే అర్పించు. మోహానికి లోబడకు. మనోవికారాలు త్యజించు. మోక్షం కోసం నన్ను భక్తితో భజించు.

**క. ననుఁ బరమేశుఁ బరంజ్యో, తిని ననఘు ననంతు దేవదేవు సకలభూ**
**తనికాయ గుహాశయు నా, ద్యుని నజు నాద్యంతశూన్యు దురితవిదూరున్. 861**

**క. తిరముగ భవదీయాంతః, కరణ సరోజాత కర్ణికాతలమున సు**
**స్థిరుఁ జేసి యింద్రియంబుల, నిరసించి మనోఽంబకమున నెఱిఁ గను మనఘా! 862**

* పరమేశ్వరుడనూ, పరంజ్యోతినీ, అనఘుడనూ, అనంతుడనూ, దేవదేవుడనూ, సమస్త ప్రాణుల హృదయాంతరాలలో నివసించే వాడనూ, ఆద్యుడనూ, అజుడనూ, ఆద్యంత రహితుడనూ, దురితదూరుడనూ అయిన నన్ను కదలకుండా నీహృదయ కమలమధ్యంలో పదిలంగా నిలిపి జితేంద్రియుడవై మనోనేత్రంతో సూటిగా దర్శించు.

**వ. అట్లేని. 863**

**క. తనరిన మోక్షము నొందెద, వని పలికినఁ గర్దముండు నమ్మని కుల చం**
**ద్రుని వలగొని వందనములు, ఘనముగ నతిభక్తిఁ జేసి కౌతుక మలరన్. 864**

* ఆ విధంగా ఆచరిస్తే నీవు మోక్షాన్ని పొందుతావు అని పలుకగా కర్దముడు మునికుల తిలకుడైన కపిలునకు ప్రదక్షిణం చేసి అత్యంత భక్తితో నమస్కరించాడు. మిక్కిలి కౌతుకం కలవాడైనాడు.

**క. మునిగణ సేవిత మగు వన, మునకుం జని యందు మౌనమున నిస్సంగుం**
**డును వహ్నిరహితుఁ డనికే, తనుఁడై యాత్మైక శరణ తత్పరుఁ డగుచున్. 865**

**వ. పరబ్రహ్మంబుఁ జిత్తంబున నిల్పి యహంకారంబు విడిచి మమత్వంబు నిరసించి దయాగుణంబునం జేసి సకల భూతంబులందు సమత్వంబు భజియించి శాంత శేముషీగరిష్ఠుం డగుచు నిస్తరంగంబగు వార్ధి చందంబున ధీరుండై నిఖిల ప్రపంచంబును వాసుదేవమయంబుఁగాఁ దలంచుచు భక్తి యోగంబున భాగవతగతిం బొందె నని చెప్పి వెండియు మైత్రేయుండు విదురునిం గనుంగొని కర్దముండు వనంబునకుం జనిన యనంతరంబ మాతృవత్సలుం డయిన కపిలుండు బిందుసరంబున వసియించి యుండ దేవహూతి తత్త్వమార్గాగ్రదర్శకుం డయిన సుతునిం గనుంగొని బ్రహ్మవచనంబులు దలంచుచు నిట్లనియె. 866**

* కర్దమ మునీంద్రుడు మునిజన నివాసయోగ్యమైన అరణ్యానికి వెళ్ళాడు. అక్కడ మౌనం వహించి ఈ లోకసంబంధాలన్నీ త్యజించి హోమాది అగ్నికార్యాలు విడిచి ఒకచోట నిలువక అంతటా తిరుగుతూ తనలోని పరమాత్మనే శరణుజొచ్చినవాడై ఆ పరబ్రహ్మనే చిత్తంలో పాదుకొల్పి, "నేను నాది" అనే భావాన్ని వదలి మమకారాన్ని విడిచి దయామయ హృదయంతో సమస్త ప్రాణులనూ తనతో సమానంగా చూస్తూ,

ప్రశాంత స్వభావం కలవాడై, అలలు లేని సముద్రంలాగా చాంచల్యరహితుడై సమస్త ప్రపంచాన్నీ విష్ణుమయంగా భావిస్తూ భక్తియోగంతో భాగవతులు పొందే పరమపదాన్ని అందుకున్నాడు.

ఈ విధంగా చెప్పి మైత్రేయమహాముని విదురునితో ఇంకా ఇలా అన్నాడు.

కర్దముడు వనానికి వెళ్లిన అనంతరం దేవహూతి బిందుసరోవరం దగ్గర ఉన్న కపిలుని దర్శించింది. మాతృవత్సలుడూ, తత్త్వమార్గాన్ని ప్రదర్శించేవాడూ అయిన కుమారుణ్ణి చూచి దేవహూతి బ్రహ్మ చెప్పిన వాక్యాలను జ్ఞప్తికి తెచ్చుకొని ఇలా అన్నది.

### -: దేవహూతి పుత్త్రుడైన కపిలాచార్యుని వలన తత్త్వజ్ఞానంబు వడయుట. :-

క. అసదింద్రియ ఘర్షణమున, వసుమతి నిర్విణ్ణ నగుచు వసరెడి నా కీ
**యసదృశ మోహ తమో విని, రసనం బనఘాత్మ! యే వెరవున ఘటించున్?** 867

* ఓ సచ్చరిత్రుడా! పెచ్చరిల్లిన ఇంద్రియ సంఘర్షణం వల్ల ఖిన్నురాలనై విచారిస్తున్న నాకు ఈ అంతులేని అజ్ఞానాంధకారంలోనుంచి బయటపడే అవకాశం ఏ ఉపాయం వల్ల కలుగుతుంది?

క. పటు ఘన నీరంధ్ర తమః, పటల పరీవృత జగత్ప్రపంచమునకు నె
**క్కటి లోచనమై మహితో, త్కటరుచి వెలుఁగుదువు భానుకైవడి నవఘా!** 868

* ఓ పుణ్యాత్ముడా! దట్టమైన కారుమేఘాల కటికచీకట్లతో ఆవరింపబడిన ఈ మహాప్రపంచానికి నీవు ఒక్కడివే ఏకైక నేత్రమై సూర్యునివలె విరాజిల్లుతూ ఉంటావు.

ఉ. భూరి మదీయ మోహతమముం బెడఁబాప సమర్థులన్య లె
వ్వారలు నీవ కాక? నిరవద్య! నిరంజన! నిర్వికార! సం
సారలతా లవిత్ర! బుధ సత్తమ! సర్వశరణ్య! ధర్మ వి
స్తారక! సర్వలోక శుభదాయక! నిత్యవిభూతి నాయకా! 869

* ఓ నిష్కళంకా! నిరంజనా! నిర్వికారా! వ్యామోహమనే కారు చీకటిని పారదోలడానికి నీవు గాక మరెవ్వరు శక్తిమంతులు? సంసారబంధాలనే తీగలను కొడవలివలె కోసివేయువాడవు నీవు. జ్ఞానవంతులలో అగ్రగణ్యుడవు; సర్వశరణ్యుడవు; ధర్మవిస్తారకుడవు; నిఖిలలోకాలకూ శుభదాయకుడవు; అఖిల సౌభాగ్యాలకూ అధినాయకుడవు.

చ. నిను శరణంబు సొచ్చెద ననింద్యతపోనిధి! నన్నుఁ గావవే
యని తను దేవహూతి వినయంబున సన్నుతిసేసి వేఁడఁగా
ననుపమ సత్కృపాకలితుఁడై కపిలుం డనురాగ మొప్ప స
జ్జన నిచయాపవర్గ ఫలసాధనమై తగు తల్లి వాక్యముల్. 870

* ఓ మహాతపస్సంపన్నా! నిన్ను శరణు వేడుచున్నాను. నన్ను కాపాడు అని దేవహూతి వినయంగా తన తనయుడైన కపిలుణ్ణి ప్రార్థించింది. కపిలుడు సాటిలేని మేటికారుణ్యంతో నిండినవాడై సజ్జనులకు మోక్షాన్ని ఇవ్వడానికి తగిన సాధనమైన అనుగుతల్లి మాటలను అనురాగ పూర్వకంగా ఆలకించాడు.

**క. విని మందస్మిత లలితా, నన కమలుం డగుచు నెమ్మనమునఁ బ్రమోదం**
**బనయంబుఁ గడలుకొన నిజ, జననికి నిట్లనియెఁ బరమశాంతుం డగుచున్. 871**

* అలా ఆలకించి, మందహాస సుందర వదనారవిందుడై, అంతరంగంలో సంతోషం అతిశయింపగా పరమశాంతుడై, కన్నతల్లితో కపిలుడు ఇట్లా అన్నాడు.

**క. విను జీవుని చిత్తము దా, ఘన భవబంధాపవర్గ కారణ, మది యే**
**చినఁ ద్రిగుణాసక్తం బయి, నను సంసృతి బంధకారణం బగు, మఱియున్. 872**

**తే. అదియు నారాయణాసక్త మయ్యె నేని, మోక్షకారణ మగు నని మునికులాబ్ధి**
**చంద్రుఁ డన నొప్పు కపిలుండు జననితోడ, నర్థి వినఁ జెప్పి మఱియు నిట్లనియెఁ బ్రీతి. 873**

* "అమ్మా! విను. గాఢమైన సంసారబంధానికీ మోక్షానికీ జీవుని చిత్తమే కారణం. అది సత్త్వరజస్తమో గుణాలతో సమ్మేళనం పొందినప్పుడు సంసారబంధానికి హేతు వవుతుంది. ఆ చిత్తమే శ్రీమన్నారాయణుని మీద సంసక్త మైనప్పుడు మోక్షానికి హేతు వౌతుంది." ఈ విధంగా మునికుల జలనిధి సుధానిధి అయిన కపిలుడు తల్లికి వినిపించి మళ్ళీ అప్యాయంగా ఇట్లా అన్నాడు.

**వ. మఱియుఁ జిత్తం బహంకార మమకార రూపాభిమాన జాతంబులగు కామలోభాది కలుషవ్రాతంబుల చేత నెప్పుడు విముక్తంబై పరిశుద్ధం బగు నప్పుడు సుఖదుఃఖ వివర్జితంబు నేకరూపంబునై ప్రకృతికంటెఁ బరుండును బరమపురుషుండును నిర్భేద్యుండును స్వయంజ్యోతియు సూక్ష్మస్వరూపుండును నితర వస్త్వంత రాపరిచ్ఛిన్నుండును నుదాసీనుండును నైన పరమాత్మునిం దన్మయంబును హతౌజస్కంబునునైన ప్రపంచంబును జ్ఞాన వైరాగ్య భక్తి యుక్తంబగు మనంబుచేఁ బొడగాంచి యోగిజనులు పరతత్త్వ సిద్ధికొఱకు నిఖిలాత్మకుండైన నారాయణునందు సంయుజ్య మానంబయిన భక్తిభావంబు వలన నుదయించిన మార్గంబునకు నితర మార్గంబులు సరి గావండ్రు; విద్వాంసులు సంగం బింద్రియార్థాద్యసద్విషయంబుగ నొనరింపంబడి జీవునకు నశిథిలంబగు బంధంబునకుఁ గారణం బగుననియు, నదియె సద్విషయంబైన నంతఃకరణ సంయమన హేతుభూతం బగుచు సాధుజనులకు ననర్గళ మోక్షద్వారం బగుననియుఁ దెలియుదురు; సహనశీలురును, సమస్త శరీరధారులకు సుహృత్తులును, బరమశాంతులును, గారుణికులునునై మదర్థంబుగాఁ బరిత్యక్త కర్మఫల స్వభావులును విసృష్టస్వజన బంధు జనులును నై మత్పదాశ్రయులును మద్గుణధ్యానపారీణులును మత్కథా ప్రసంగ సంభరిత శ్రవణానందులును నగుచు మదీయ కథల నొడువుచు వినుచు నుండు పరమభాగవతోత్తముల నాధ్యాత్మికాది తాపత్రయంబు దపింపఁజేయంజాల, దట్టి సర్వసంగ**

వివర్జితులగు పరమభాగవత జనుల సంగం బపేక్షణీయం, బది సకల దోషనివారకం బగు, నట్టి సత్సంగంబున సర్వప్రాణి హృత్కర్ణ రసాయనంబులగు మదీయ కథా ప్రసంగంబులు గలుగు, మద్గుణాకర్ణనంబునంజేసి శీఘ్రంబుగఁ గ్రమంబునం గైవల్య మార్గదంబులగు శ్రద్ధాభక్తులు దయించు; నదియునుం గాక యే పురుషుండైన నేమి, మద్విరచిత జగత్కల్పనాది విహార చింతచే నుదయించిన భక్తింజేసి యింద్రియ సుఖంబుల వలనను దృష్టశ్రుతంబులైన యైహికాముష్మికంబుల వలనను విముక్తుం డగుచుఁ జిత్త గ్రహణార్థంబు బుజువులైన యోగమార్గంబులచే సంయుక్తుం డగునట్టి యోగి ప్రకృతి గుణసేవనంబుచేత వైరాగ్య గుణవిజృంభితంబైన జ్ఞానయోగంబుచేతను మదర్పిత భక్తియోగంబు చేతను బ్రత్యగాత్మకుండనైన నన్ను నంతఃకరణ నియుక్తునిం గావించు నని చెప్పిన విని దేవహూతి కపిలున కిట్లనియె. 874

* "నేను నాది"అనే అహంకార మమకార రూపమైన అభిమానం వల్ల కామం క్రోధం లోభం మొదలైన దోష సమూహాలు ఆవిర్భవిస్తాయి. చిత్తం వానికి లోనుగాకుండా వానినుండి విడివడినప్పుడు పరిశుద్ధ మవుతుంది. చిత్తము పరిశుద్ధ మైనప్పుడు సుఖమూ దుఃఖమూ అనేవి ఉండక ఒకే రూపంగా వెలుగొందుతుంది. ఏకరూపమైన అటువంటి చిత్తంలోనే పరమాత్మ సాక్షాత్కరిస్తాడు.

ఆపరమాత్మ ప్రకృతికంటే అతీతుడు; అభేద్యుడు; స్వయంప్రకాశుడు; సూక్ష్మస్వరూపుడు, అపరిచ్ఛిన్నుడు. ఉదాసీనుడు. అటువంటి పరమాత్మనూ, ఆ పరమాత్మ తేజస్సువల్ల నిస్తేజమైన ప్రపంచాన్నీ యోగివరేణ్యులు భక్తిజ్ఞాన వైరాగ్యయుక్తమైన చిత్తంతో దర్శించినవారై మోక్షప్రాప్తికి సర్వాంతర్యామి అయిన శ్రీమన్నారాయణునియందు సమర్పింపబడిన భక్తి మార్గమే ఉత్తమోత్తమ మైనదనీ, తక్కిన మార్గాలు దానికి సాటిరావనీ చాటిచెప్పారు.

ఇంద్రియార్థాలయిన శబ్దస్పర్శరూపరస గంధాలతోడి సంగం అసద్విషయమై దృఢమైన బంధానికి కారణం అవుతుంది. ఆ సంగమే భగవంతుని సంబంధమై సద్విషయ మైనప్పుడు మనస్సు, బుద్ధి, చిత్తం, అహంకారం అనే అంతఃకరణాల సంయమనానికి హేతుభూతమై సత్పురుషులకు తెరచిన మోక్షద్వారం అవుతుంది అని విద్వాంసుల అభిప్రాయం.

సహన స్వభావం కలిగి అఖిలజీవులకూ ఆప్తబాంధవులై శాంతమూర్తులై, కరుణార్ద్రహృదయులై, కర్మఫలాలను పరిత్యజించి, తనవారు బంధువులు అనే అభిమానం విడిచి నన్ను చక్కగా ఆశ్రయించినవారై నా గుణగణాలను ధ్యానిస్తూ నా చరిత్రలను వీనులవిందుగా ఆలకించి ఆనందిస్తూ నా కథలే చెప్పుకొంటూ నా కథలే వింటూ ఉండేవారు పరమభాగవతోత్తములు. అటువంటివారిని ఆధ్యాత్మికం ఆధిదైవికం ఆధిభౌతికం అనే తాపత్రయాలు ఏమీ చేయలేవు. అటువంటి సర్వసంగ పరిత్యాగులైన పరమభాగవతుల సాంగత్యం మాత్రమే కోరదగింది. అదే సకల దోషాలనూ నివారిస్తుంది.

అటువంటివారి స్నేహంవల్ల సర్వప్రాణుల హృదయాలలో చెవులలో సుధారసం చిందించే నా కథాప్రసంగాలు ప్రాప్తిస్తాయి. నా గుణాలు వినడంవల్ల, క్రమమార్గంలో శీఘ్రంగా మోక్షాన్ని ప్రసాదించే శ్రద్ధాభక్తులు ఉద్భవిస్తాయి.

ఎవడు నేను కావించిన ఈ విశ్వసృష్టినీ నా లీలావిహారాలనూ తలపోస్తూ అందువల్ల ప్రభవించిన భక్తిచేత ఇంద్రియ సుఖాలకూ, కనిపించేవీ వినిపించేవీ అయిన ఇహలోక పరలోక సుఖాలకూ లోనుకాకుండా, మనోనిశ్చలత్వం కోసం చక్కని యోగమార్గాన్ని అవలంబిస్తాడో అతడు "యోగి"అని చెప్పబడతాడు. అటువంటి యోగి ప్రకృతిగుణాలను అనుసరించడటం వల్లనూ, వైరాగ్యాన్ని పెంపొందించే జ్ఞానయోగం వల్లనూ, ఆత్మార్పణరూపమైన భక్తియోగం వల్లనూ సాక్షాత్కరించిన ఆత్మస్వరూపం గల నన్ను తన హృదయాంతరంలో నిల్పుకొంటాడు - అని చెప్పగా విని దేవహూతి కపిలునితో ఇట్లా ఉన్నది.

**క. ఏ భక్తి భవద్గుణపర, మై భవపాపప్రణాశమై ముక్తి శ్రీ**
**లాభము రయమునఁ జేయునొ, యా భక్తి విధంబుఁ దెలియ నానతి యీవే! 875**

* ఏ భక్తి నీ గుణగణాలకు అంకితమై ఉంటుందో, ఏ భక్తి సంసార తాపాలనూ పాపాలనూ పోగొడుతుందో, ఏ భక్తి శీఘ్రంగా మోక్షలక్ష్మిని చేకూరుస్తుందో ఆ భక్తి స్వరూపాన్ని నాకు బాగా తెలిసేటట్లు దయచేసి చెప్పు.

**వ. అదియునుం గాక భవదుదితంబయిన యోగంబును దదంగంబులును తద్గత తత్త్వావబోధంబును ససాకల్యంబుగ మందబుద్ధినైన నాకు స్ఫుటంబుగాఁ దెలియ నానతిమ్మనినఁ గపిలుం డిట్లనియె.876**

* అంతేకాక నీచే పేర్కొనబడిన యోగ విద్యనూ, అందలి విభాగాలనూ, అందులోగల తత్త్వార్థాలనూ సంపూర్ణంగా, సుస్పష్టంగా మందబుద్ధినైన నాకు తెలిసేలా వెల్లడించు - అనగా కన్నతల్లితో కపిలుడు ఇట్లా అన్నాడు.

**సీ. జనయిత్రి! విను, మఱి సకల పదార్థ పరిజ్ఞాన తత్త్వపారీణ మగుచు**
**నామ్నాయ విహిత కర్మాచారములు గల్గి తివుటమై వర్తించు దేవగణము**
**పూని నైసర్గికంబైన నిర్హేతుక మగు భగవత్సేవ మిగుల ముక్తి**
**కంటెఁ గరిష్ఠంబు, గావున నదియు భుక్తాన్నంబు జీర్ణంబు నందఁజేయు**

**తే. దీప్తజఠరాగ్ని గతి లింగదేహ నాశ, కంబు గావించు, నదియును గాక విష్ణు**
**భక్తి వైభవములఁ దేటపఱతు, వినుము, సద్గుణవ్రాత! యోగలక్షణ సమేత! 877**

* మాతా! సద్గుణపూతా! యోగలక్షణ సమేతా! విను. జగత్తులోని సకల పదార్థాలకూ సంబంధించిన యథార్థస్వరూపాన్ని పూర్తిగా తెలియజేసేవి వేదాలు. వేదసంబంధమైన సత్కర్మలకూ సదాచారాలకూ దేవతలు సంతృప్తులౌతారు.

సహజమూ నిర్హేతుకమూ అయిన భగవంతుని సేవారూపమైన భక్తి, ముక్తికంటె గొప్పది. జీర్ణాశయమందలి జఠరాగ్ని తిన్న అన్నాన్ని జీర్ణం చేసినట్లుగా భగవద్భక్తి జీవులు కావించిన కర్మలనూ

కర్మఫలాలను లోగొంటుంది. అందువల్ల జీవుని లింగమయ శరీరం నశిస్తుంది. విష్ణు భక్తి విశేషాలను వివరిస్తాను విను.

**చ. అమలిన భక్తిఁ గొందఱు మహాత్ములు మచ్చరణార వింద యు**
**గ్మము హృదయంబునన్ నిలిపి కౌతుకులై యితరేతరానులా**
**పముల మదీయదివ్యతను పౌరుషముల్ గొనియాడుచుండి మో**
**క్షము మదిఁ గోర నొల్ల రనిశంబు మదర్పిత సర్వకర్ములై. 878**

* కొందరు మహాత్ములు నిర్మలమైన భక్తిభావంతో నా పాదపద్మాలను తమ హృదయ పద్మాలలో పదిలపరచుకొని ఎంతో కుతూహలంతో పరస్పరం సంభాషించుకుంటూ ఆ సంభాషణల్లో నా దివ్యస్వరూపాన్నీ నా లీలావిశేషాలనూ కొనియాడుతుంటారు. వారు సర్వదా తమ సమస్త కర్మఫలాలనూ నాకే అర్పించి భక్తి పరవశులై ముక్తిని కూడా వాంఛింపరు.

**సీ. పరికింపఁ గొందఱు భాగవతోత్తముల్ ఘనత కెక్కిన పురాతనములైన**
**చారు ప్రసన్న వక్త్రారుణ లోచనములు గల్గి వరదాన కలితములుగఁ**
**దనరు మద్దివ్యావతార వైభవములు మది నొప్పఁ దమయోగమహిమఁ జేసి**
**యనుభవించుచుఁ దదీయాలాపముల సన్నుతించుచుఁ దివుటఁ దద్దివ్యవిలస**

**తే. దవయవోదార సుందర నవ విలాస, మందహాస మనోహర మధుర వచన**
**రచనచే నపహృత మనః ప్రాణు లగుచు, నెలమి నుందురు నిశ్శ్రేయసేచ్ఛ లేక. 879**

* మరికొందరు భాగవతోత్తము లుంటారు. వారు ప్రసిద్ధి కెక్కిన నా పురాణ స్వరూపాలను స్మరిస్తూ ఉంటారు. అందాలు చిందే ముఖమూ కరుణారసం విరజిమ్మే అరుణారుణ నేత్రాలూ కలిగి భక్తులకు వరాలు ప్రసాదించే నా దివ్యావతారాలనూ వాని వైభవవిశేషాలనూ మనస్సులో నిలుపుకుంటారు. తమ భక్తి యోగమహత్త్వం వల్ల అలనాటి నా సంలాపాలను స్మరించుకొని కొనియాడుతుంటారు. నవనవోన్మేషమైన నా అవయవ సౌభాగ్యాన్నీ, సుందరమైన నా మందహాసాన్నీ, మనోహరాలైన నా మధురవాక్కులనూ మాటిమాటికీ మననం చేసుకుంటూ మనస్సూ, ప్రాణమూ పరవశింపగా మోక్షంమీద అపేక్ష లేకుండా ఉంటారు.

**మ. కణఁకన్ వారలు వెండి మోక్షనిరపేక్షస్వాంతులై యుండి తా**
**మణిమాద్యష్ట విభూతి సేవితము నిత్యానంద సంధాయియున్**
**గణనాతీతము నప్రమేయము సమగ్రశ్రీకమున్ సర్వ ల**
**క్షణ సంయుక్త వికుంఠలోక పదవిం గైకొందు రత్యున్నతిన్. 880**

* అలా మోక్షాసక్తి లేని వాళ్ళై కూడా వారు అణిమాది అష్టసిద్ధి సంసేవితమూ, శాశ్వతానంద సంధాయకమూ, వర్ణనాతీతమూ, మహనీయమూ, మహోన్నతమూ, సంపూర్ణ వైభవోపేతమూ, సకలలక్షణ సముల్లసితమూ, మహోన్నతమూ అయిన వైకుంఠధామాన్ని అందుకుంటారు.

వ. ఇట్లు వొంది. 881

క. తనరుదు రప్పుణ్యాత్ములు, జనయిత్రి! మదీయ కాలచక్ర గ్రసనం
బును నొందక నిత్యం బగు, ననుపమ సుఖవృత్తి నుందు, రది యెట్లన్నన్. 882

* అమ్మా! ఈ విధంగా పరమపదాన్ని అందుకున్న ఆ పుణ్యాత్ములు నా కాలచక్రానికి మ్రింగుడు బడనివారై నిరుపమానమైన నిత్య సౌఖ్యాలతో అలరారుతుంటారు.

మ. సమతన్ స్నేహముచే సుతత్వమును, విశ్వాసంబుచేతన్ సఖి
త్వముఁ, జాలన్ హితవృత్తి చేతను సుహృత్త్వంబున్, సుమంత్రోపదే
శముచేతన్ నిజదేశికుం డనఁగ నిచ్చల్ పూజ్యుఁడౌ నిష్ట దై
వమునై వారికిఁ గాలచక్రభయముల్ వారింపుదుం గావునన్. 883

* అదేమంటే, సర్వసముడనైన నేను స్నేహంవల్ల కుమారుని వలెనూ, విశ్వాసంవల్ల చెలికానివలెనూ, హితం కూర్చడంవల్ల ఆత్మీయుని వలెనూ, మంత్రం ఉపదేశించడంవల్ల ఆచార్యునివలెనూ, ఉంటూ వారికి నిత్యమూ పూజింపదగిన ఇష్టదైవాన్నై, కాలచక్రం వల్ల భయం కలుగకుండా వారిని కాపాడుతూ ఉంటాను.

వ. అని యిట్లు దెలుపుచు మఱియు నిట్లనియె. 884

ఈ విధంగా చెప్పి కపిలాచార్యుడు దేవహూతితో మళ్ళీ ఇట్లా అన్నాడు.

చ. విను మది గాక యీ భువిదివిం బలుమాఱుఁ జరించు నాత్మఁదా
ధన పశు పుత్త్ర మిత్ర వనితాతతి పైఁ దగులంబు మాని న
న్ననఘుని విశ్వతోముఖు ననన్యగతిన్ భజియించెనేని వా
నిని ఘనమృత్యురూప భవనీరధి నేఁ దరియింపఁ జేయుదున్. 885

* జననీ! విను. ఆత్మ దివికీ భువికీ నడుమ పలుసారులు తిరుగుతూనే ఉంటుంది. మానవుడు ధనం, పశువులు, పుత్రులు, మిత్రులు మగువలు మొదలైన తగులాలపై వ్యామోహం విడిచిపెట్టి పాపాలను పరిహరించేవాడనూ, ప్రపంచమంతటా వ్యాపించిన వాడనూ ఐన నన్ను ఏకాగ్రచిత్తంతో ఆరాధించినట్లైతే, వానిని మృత్యుమయమైన సంసార సముద్రం నుండి దరిజేరుస్తాను.

సీ. రూఢిఁ బ్రధాన పూరుష నాయకుండను, భగవంతుఁడను, జగత్ప్రభుఁడ నైన,
నా కంటె నన్యులఁ గైకొని తగిలిన, యాత్మలు భవభయం బందు నెపుడుఁ
గావున నా యాజ్ఞఁ గడవంగ నోడుటఁ, జేసి వాయువు వీచు, శిఖి వెలుంగు,
నినుఁడు దపించుఁ, దా నింద్రుండు వర్షించు, భయమంది మృత్యువు పరువువెట్టుఁ,

తే. గాన విజ్ఞాన వైరాగ్య కలిత మైన, భక్తియోగంబునం జేసి పరమపదము
కొఱకు నయ్యోగి వరులు మచ్చరణభజను, లగుచుఁ జరియింపుదురు నిర్భయాత్ము లగుచు.886

* ప్రధానమనే మూలప్రకృతికీ పురుషునకూ అధీశ్వరుడనూ, భగవంతుడనూ, జగదీశ్వరుడనూ అయిన నన్ను గాక ఇతరులను ఎన్నుకొన్నవారు సంసారభయంలో పడిపోతారు.

నా ఆజ్ఞ జవదాటలేక భయంతో గాలి వీస్తుంది. అగ్ని మండుతుంది. సూర్యుడు ఎండ కాస్తాడు. ఇంద్రుడు వర్షిస్తాడు. మృత్యువు భయపడి పారిపోతుంది. అందువల్ల ఈ సృష్టి విజ్ఞానంతోపాటు వైరాగ్యంతో కూడిన భక్తి యోగంతో యోగివరు లైనవారు వైకుంఠాన్ని ఆశించి నా చరణకమలాలను సంస్మరిస్తూ ఏ భయమూ లేకుండా ఉంటారు.

క. గురుభక్తిం జిత్తము మ, త్పరమై విలసిల్లు నంత పర్యంతము స
త్పురుషుల కిహలోకంబునఁ, జిరతర మోక్షోదయంబు సేకుఱుచుండున్. 887

* సత్పురుషు లైనవారు ఎంత పర్యంతం అత్యంత భక్తితో తమ చిత్తాన్ని నాయందే లగ్నం చేసి ఉంటారో అంత పర్యంతం వారికి ఈ లోకంలోనే మోక్షం సంప్రాప్తిస్తుంది.

క. అని యిట్లు నమ్మునీంద్రుఁడు, జననికి హరిభక్తి యోగ సంగతి నెల్లన్
వినిపించి వెండియును ని, ట్లనియెన్ సమ్మోదచిత్తుఁ డగుచుఁ గడంకన్. 888

* ఇలా కపిలాచార్యుడు విష్ణు సంబంధమైన భక్తియోగ స్వరూపాన్ని తల్లికి వినిపించి ఎంతో సంతోషంతో మళ్ళీ ఇట్లా అన్నాడు.

వ. అవ్వా! యివ్విధంబున భక్తియోగ ప్రకారంబు సెప్పితి, నింకఁ దత్త్వలక్షణంబు వేఱు వేఱ యెఱింగింతు ఏ తత్త్వగుణంబుల నెఱింగి నరులు ప్రకృతి గుణంబుల వలన విముక్తు లగుదురు, హృదయగ్రంథి విచ్ఛేదకంబు నాత్మదర్శన రూపంబు నగు నా జ్ఞానం బాత్మనిశ్శ్రేయస కారణంబు; గావున దాని నెఱింగింతు, నందు నాత్మస్వరూపం బెట్టి దనిన ననాదియుఁ బురుషుండును సత్త్వాదిగుణ శూన్యుండును బ్రకృతి గుణవిలక్షణుండును బ్రత్యక్స్వరూపుండును స్వయంప్రకాశుండును నెవ్వండు? మఱియు నెవ్వనితోడ నీ విశ్వంబు సమన్వితం బగు నతండు గుణత్రయాత్మకత్వంబు నవ్యక్తంబును భగవత్సంబంధియు నగు ప్రకృతియందు యదృచ్ఛచే లీలావశంబునం బ్రవేశించిన నా ప్రకృతి గుణత్రయ మయంబై సరూపం బయిన ప్రజాసర్గంబుఁ జేయం గనుంగొని యప్పుడు మోహితుండయి విజ్ఞాన తిరోధానంబునం జేసి గుణత్రయాత్మకం బయిన ప్రకృత్యధ్యాసంబున నన్యోన్యమేళనం బగుటయు నంతం బ్రకృతిగుణంబుఁ దనయందు నారోపించుకొని క్రియమాణంబులగు కార్యంబులవలనం గర్తృత్వంబు గలిగి సంసారబద్ధుండై పారతంత్ర్యంబు గలిగియుండుఁ, గర్తృత్వశూన్యుండగు నీశ్వరుండు సాక్షి యగుటం జేసి యాత్మకుం గార్యకారణ కర్తృత్వంబులు ప్రకృత్యధీనంబులనియు, సుఖ దుఃఖ భోక్తృత్వంబులు ప్రకృతి విలక్షణుం డయిన పురుషుని

**వనియు నెఱుంగుదు,రని చెప్పిన విని దేవహూతి గపిలున కిట్లనియెఁ, బురుషోత్తమా! ప్రకృతి పురుషులు సదసదాత్మక ప్రపంచంబునకుఁ గారణభూతులు గావున వాని లక్షణంబు సదసద్వివేక పూర్వకంబుగా నానతిమ్మనిన భగవంతుం డైన కపిలుం డిట్లనియె. 889**

* తల్లీ! ఇంతవరకు నీవు అడిగిన భక్తియోగ స్వరూపం నీకు తెల్పాను. ఇక తత్త్వజ్ఞాన లక్షణాలను వేర్వేరుగా తెల్పుతాను. ఈ తత్త్వలక్షణాలను తెలుసుకొన్న మానవులు ప్రకృతి గుణాలనుండి విముక్తు లవుతారు. మనస్సులోని సందేహాలు విడిపోతాయి. తన స్వరూపం తనకు తెలుస్తుంది. ఈ తత్త్వజ్ఞానం కైవల్య ప్రాప్తికి కారణం అవుతుంది. అందుకని దానిని తెలియజేస్తాను.

అమ్మా! ఆత్మస్వరూపాన్ని చెబుతాను ఆలకించు. అనాదియైన వాడూ, పురుషశబ్ద వాచ్యుడూ సత్త్వరజస్తమోగుణాలు లేనివాడూ, ప్రకృతి గుణాలకంటే విలక్షణమైన గుణాలు కలవాడూ, ప్రత్యక్షస్వరూపం కలవాడూ, తనంతతాను వెలుగువాడూ, విశ్వమంతటా ఉన్నవాడూ ఎవడో అతడు ఆ పరమాత్మ గుణత్రయాత్మకమూ, అవ్యక్తమూ, భగవంతుని అంటిపెట్టుకున్నదీ అయిన ప్రకృతిలో అప్రయత్నంగా అలవోకగా లీలగా ప్రవేశించాడు. అప్పుడు ఆ ప్రకృతి గుణత్రయ మయమైన స్వరూపంతో సాకారమైన ప్రజాసృష్టి చేయటం ప్రారంభించింది. అదిచూచి పురుషుడు వెంటనే మోహాన్ని పొందాడు. విజ్ఞానం మరుగుపడింది. గుణత్రయాత్మకమైన ప్రకృతిని ఆశ్రయించాడు. ప్రకృతి పురుషులు పరస్పరం మేళనం పొందారు. అప్పుడు పురుషుడు ప్రకృతి గుణాలను తనయందే ఆరోపించుకొని జరుగుతున్న కార్యాలన్నింటికీ తానే కర్తగా భావించుకొని సంసారబంధాలలో కట్టుబడి పరాధీనతకు లోనౌతాడు.

ఈశ్వరుడు కర్త కాకున్నా జరుగుతున్న కర్మలకు సాక్షిభూతుడు కావటంవల్ల ఆత్మకు కార్యకారణ కర్తృత్వాలు లేవనీ, అవి ప్రకృతికీ అధీనమైనవనీ సుఖదుఃఖాలు అనుభవించడం ప్రకృతికంటే విలక్షణుడైన పురుషునివనీ అనుభవజ్ఞులు తెలుసుకుంటారు -

అని చెప్పగా విని దేవహూతి కపిలునితో "మహాత్మా! ప్రకృతి పురుషులు అస్తిత్వం కలదీ, అస్తిత్వం లేనిదీ అయిన ప్రపంచానికి కారణభూతులు. కాబట్టి ఆ ప్రకృతి పురుషుల లక్షణాలు సదసద్వివేక పురస్సరంగా సెలవీయ కోరుతున్నాను''అన్నది. అప్పుడు భగవంతుడైన కపిలాచార్యుడు దేవహూతితో ఇట్లా అన్నాడు.

**క. క్రమమునఁ ద్రిగుణము నవ్య,క్తము నిత్యము సదసదాత్మకము మఱియుఁ బ్రధా**
**నము ననఁగాఁ బ్రకృతి విశే, షము లదియు విశిష్ట మనిరి సద్విదు లెలమిన్. 890**

* త్రిగుణాత్మకం, అవ్యక్తం, నిత్యం, సదసదాత్మకం, ప్రధానం అనేవి ప్రకృతి విశేషాలు. ఈ విశేషాలతో కూడి ఉన్నది కనుక ప్రకృతిని "విశిష్టం'' అని ప్రాజ్ఞులు పేర్కొన్నారు.

**వ. అందుఁ బ్రకృతి చతుర్వింశతి తత్త్వాత్మకంబై యుండు, నది యెట్లనినం బంచమహాభూతంబులును, బంచతన్మాత్రలును, జ్ఞానకర్మాత్మకంబు లయిన త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణంబులును, వాక్పాణి పాద పాయూపస్థంబులు నను దశేంద్రియంబులును, మనోబుద్ధి చిత్తాహంకారంబులను నంతః**

కరణ చతుష్టయంబును నను చతుర్వింశతి తత్త్వాత్మకంబునునై సగుణ బ్రహ్మసంస్థానంబు సెప్పితి, నిటమీఁదఁ గాలం బను పంచవింశక తత్త్వంబు సెప్పెద, నది గొందఱు పురుషశబ్ద వాచ్యుండైన యీశ్వరుని పౌరుషంబు గాల శబ్దంబునఁ జెప్పంబడునందు, రందు నహంకార మోహితుండై ప్రకృతి నొందు జీవుండు భయంబుఁ జెందుఁ, బ్రకృతి గుణసామ్యంబునం జేసి వర్తించు నిర్విశేషుం డగు భగవంతుని చేష్టా విశేషంబు దేనివలన నుత్పన్నం బగు నదియ కాలం బని చెప్పంబడు నదియు జీవరాశ్యంతర్గతం బగుటం జేసి పురుషుండనియు, వాని బహిర్భాగవ్యాప్తిం జేసి కాలం బనియుఁ జెప్పంబడు, నాత్మ మాయం జేసి తత్త్వాంతర్గతుం డయిన జీవుని వలన క్షుభితంబయి జగత్కారణం బగు ప్రకృతియందుఁ బరమపురుషుండు దన వీర్యంబు వెట్టిన నా ప్రకృతి హిరణ్మయంబైన మహత్తత్త్వంబు పుట్టించె, నంత సకల ప్రపంచ బీజభూతుండును, లయవిక్షేప శూన్యుండును నగు నీశ్వరుండు దన సూక్ష్మవిగ్రహంబునందు నాత్మగతంబైన మహదాది ప్రపంచంబుల వెలిఁగించుచు స్వతేజోవిపత్తిం జేసి యాత్మప్రస్వాపనంబు సేయునట్టి తమంబును గ్రసించెనని చెప్పి వెండియు నిట్లనియె. 891

* అమ్మా! ప్రకృతి ఇరవై నాలుగు తత్త్వాలు కలదై ఉంటుంది. ఎలాగంటే పృథివి, జలం, అగ్ని, వాయువు, ఆకాశం అనే పంచభూతాలూ; శబ్దం, స్పర్శం, రూపం, రసం, గంధం అనే పంచ తన్మాత్రలూ; చర్మం, కన్ను, ముక్కు, చెవి, నాలుక అనే పంచ జ్ఞానేంద్రియాలూ; వాక్కు, చేతులు, కాళ్లు, మలావయవం, మూత్రావయవం అనే పంచ కర్మేంద్రియాలూ; మనస్సు, బుద్ధి, చిత్తం, అహంకారం అనే అంతఃకరణ చతుష్టయమూ కలిసి ఇరవైనాలుగు తత్త్వాలు కలిగి సగుణబ్రహ్మకు సంస్థానం అయిన ప్రకృతిని వివరించాను.

ఇక కాలం అనబడే ఇరవై ఐదవ తత్త్వాన్ని గురించి చెబుతాను, విను. కొందరు పురుష శబ్ద వాచ్యుడైన ఈశ్వరుని స్వరూపమే కాలంగా చెప్పబడుతున్నదంటారు. అహంకార మోహితుడై ప్రకృతితో సంబంధం పెట్టుకున్న పురుషుడు జీవుడై భయాదులను అనుభవిస్తాడు. ప్రకృతి గుణాలన్నింటిలో సమానంగా అంతర్యామియై నిర్విశేషుడై ప్రవర్తించేవాడు భగవంతుడు. ఆ భగవంతుని చేష్టా విశేషాలను కలుగచేసేదే కాలం అనబడుతుంది. అదికూడా జీవరాసులలో అంతర్యామిగా ఉన్నప్పుడు పురుషుడు అనీ, వానికీ వెలుపల వ్యాపించి ఉన్నప్పుడు కాలం అనీ అనబడుతుంది. ఆత్మమాయ కారణంగా ప్రకృతి తత్త్వాలలో విలీనమైన జీవునివల్ల కుదిలింపబడినదీ, జగత్తుకు కారణమైనదీ అయిన ప్రకృతియందు భగవంతుడు సృజనాత్మకమైన తన వీర్యాన్ని ఉంచాడు. అప్పుడు ఆ ప్రకృతి తనలోనుంచి హిరణ్మయమైన మహత్త్వాన్ని పుట్టించింది. అనంతరం సకల ప్రపంచానికి మూలమైనవాడూ, లయవిక్షేప శూన్యుడూ అయిన ఈశ్వరుడు తన సూక్ష్మవిగ్రహంలో ఆత్మగతమైన మహదాది ప్రపంచాన్ని వెలిగిస్తూ, తన తేజఃప్రసారంచేత తనను నిద్రింపజేసే తమస్సును హరించి వేశాడు అని చెప్పి కపిలాచార్యుడు మళ్లీ ఇట్లా అన్నాడు.

క. దివ్యమగు వాసుదేవా, ది వ్యూహ చతుష్టయంబు త్రిజగములందున్
సేవ్యం బని చెప్పంబడు, భవ్యగుణా! దాని నెఱుఁగఁ బలికెద నీకున్. 892

* వాసుదేవం, సంకర్షణం, ప్రద్యుమ్నం, అనిరుద్ధం అనే దివ్యమైన ఈ నాలుగు వ్యూహాలూ ముల్లోకాలలోనూ సేవింపదగినవి. సుగణవతీ! వానిని నీకు వివరించి చెబుతాను.

**సీ. సత్త్వ ప్రధానమై స్వచ్ఛమై శాంతమై యూర్మిషట్కంబుల నోసరించి**
**సురుచిర షాడ్గుణ్య పరిపూర్ణమై నిత్యమై భక్తజన సేవ్యమై తనర్చి**
**వలనొప్పుచుండు న వ్వాసుదేవ వ్యూహ మంత మహత్తత్త్వమందు నోలి**
**రూఢిఁ గ్రియాశక్తి రూపంబు గల్గు నహంకార ముత్పన్నమయ్యె, నదియు**

**తే. సరవి వైకారికంబుఁ దైజసముఁ దామ, సంబు నా మూఁడు దెఱఁగుల జరుగు, నందుఁ**
**దనరు వైకారికము మనస్సునకు నింద్రి, యములకును గగనముఖ భూతముల కరయ. 893**

**వ. అది దేవతారూపంబున నుండుఁ, దైజసాహంకారంబు బుద్ధి ప్రాణంబులుం గలిగి యుండుఁ, దామసాహంకారం బింద్రియ మేళనంబున నర్థమాత్రంబై యుండు మఱియును. 894**

* వాసుదేవవ్యూహం ఆకలిదప్పులు, శోకమోహాలు, జరామరణాలు అనే ఆరు ఊర్మ్మలనుండి విడివడినదై;, ఐశ్వర్యం, వీర్యం, యశస్సు, శ్రీ, జ్ఞానం, వైరాగ్యం అనే షడ్గుణాలతో పరిపూర్ణమై;, సత్త్వగుణ ప్రధానమై, నిర్మలమై, శాంతమై, నిత్యమై, భక్తజన సంసేవ్యమై అలరారుతుంటుంది. మహత్తత్త్వం నుండి క్రియాశక్తి రూపమైన అహంకారం పుట్టింది. ఆ అహంకారం వైకారికం, తైజసం, తామసం అని మూడు విధాలుగా విడివడింది.

వానిలో వైకారికాహంకారం అనేది మనస్సుకూ, పంచేంద్రియాలకూ, ఆకాశాది పంచభూతాలకూ ఉత్పత్తి స్థానమై దేవతారూపమై ఉంటుంది.

తైజసాహంకారం బుద్ధిరూపాన్నీ, ప్రాణరూపాన్నీ కలిగి ఉంటుంది. తామసాహంకారం ఇంద్రియార్థాలతో సమ్మేళనం పొంది ప్రయోజనమాత్రమై ఉంటుంది.

**సీ. అట్టి యహంకారమం దధిష్ఠించి సాహస్ర ఫణామండలాభిరాముఁ**
**డై తనరారు ననంతుఁడు సంకర్షణుం డనఁ దగు పురుషుండు ఘనుఁడు,**
**మహిత భూతేంద్రియ మానస మయుఁడు నై కర్తృత్వ కార్యత్వ కారణత్వ**
**ప్రకట శాంతత్వ ఘోరత్వ మూఢత్వాది లక్షణ లక్షితోల్లాసి యగుచు**

**తే. నుండు నమ్మేటి రెండవ వ్యూహ మనఁగ, ఘన వికారంబుఁ బొందు వైకారికంబు**
**వలన వినుము మనస్తత్త్వ మెలమిఁ బుట్టె, మఱియు వైకారికంబును మాత! వినుము. 895**

* వైకారికమైన సాత్త్వికాహంకారాన్ని అధిష్ఠించి సంకర్షణ వ్యూహం ఒప్పుతుంటుంది. వేయిపడగలతో ప్రకాశించేవాడూ, అనంతుడూ అయిన సంకర్షణ పురుషుడు, మహానుభావుడు, పంచభూతాలతో పంచేంద్రియాలతో మనస్సుతో నిండి ఉంటాడు. కర్త, కార్యం, కారణం అనే రూపభేదాలు కలిగి శాంతత్వం,

ఘోరత్వం, మూఢత్వం ఇత్యాది లక్షణాలతో ఉల్లాసంగా ఉంటాడు. ఈ మేటి వ్యూహమే రెండవదైన సంకర్షణ వ్యూహం. దీనినుంచే మనస్తత్త్వం పుట్టింది.

వ. అది యెట్టు లంటేని సామాన్యచింతయు విశేషచింతయు ననం దగు సంకల్ప వికల్పంబులం జేసి కామసంభవం బనంబడు నెద్ది యనిరుద్ధాఖ్యం బయిన వ్యూహం, బదియ హృషీకంబులకు నధీశ్వరంబయి సకల యోగీంద్ర సేవ్యం బగుచు శరదిందీవరశ్యామం బయి యుండు, వెండియుం దైజసంబువలన బుద్ధి తత్త్వంబు పుట్టె, దాని లక్షణంబులు ద్రవ్య ప్రకాశకంబైన జ్ఞానంబును, నింద్రియానుగ్రహంబును, సంశయంబును, మిథ్యాజ్ఞానంబును, నింద్రియ నిశ్చయంబును, స్మృతియు ననం దగియుండు, మఱియుఁ దైజసాహంకారంబు వలన జ్ఞానేంద్రియ కర్మేంద్రియంబులును గ్రియాజ్ఞాన సాధనంబులును గలిగియుండుఁ, బ్రాణంబునకుం గ్రియాశక్తియు బుద్ధికి జ్ఞానశక్తియు నగుటం జేసి యింద్రియంబులకుఁ దైజసత్వంబు గలిగియుండు, భగవద్భక్తి ప్రేరితం బయిన తామసాహంకారంబు వలన శబ్దతన్మాత్రంబు పుట్టె, దానివలన నాకాశంబును, నాకాశంబువలన శ్రోత్రేంద్రియంబును బుట్టె, శ్రోత్రంబు శబ్దగ్రాహి యయ్యె, శబ్దం బర్థంబునకు నాశ్రయంబై శ్రోతకు జ్ఞానజనకం బయ్యె, మఱియు శబ్దతన్మాత్రంబు వలన నాకాశం బయి యా యాకాశంబు భూతంబులకు బాహ్యాభ్యంతరంబుల నవకాశం బిచ్చుటయు, నాత్మ ప్రాణేంద్రియాదులకు నాశ్రయం బగుటయు నను లక్షణంబులు గలిగియుండుఁ, గాలగతిచే వికారంబు నొందు, శబ్ద తన్మాత్ర లక్షణంబగు నభంబువలన స్పర్శంబును స్పర్శంబువలన వాయువును వాయువుచే స్పర్శ గ్రాహియైన త్వగింద్రియంబును బుట్టె, మృదుత్వంబును గఠినత్వంబును శైత్యంబును నుష్ణత్వంబును నననివి స్పర్శంబునకు స్పర్శత్వం బని చెప్పంబడు, మఱియు వాయువునకుఁ జాలనంబును పరస్పర విభాగకరణంబును దన్మేళనంబును ద్రవ్యశబ్ద నేతృత్వంబును నగు, నందు గంధవంతంబగు ద్రవ్యంబును ఘ్రాణేంద్రియంబు నొందించుట ద్రవ్యనేతృత్వంబు, దూరస్థం బగు శబ్దంబును శ్రోత్రేంద్రియ గ్రాహ్యమగు నట్లొనరించుట శబ్ద నేతృత్వంబు, సర్వేంద్రియాత్మకత్వంబు నననివి లక్షణంబులై యుండు, దైవ ప్రేరితంబై స్పర్శతన్మాత్ర గుణకంబగు వాయువు వలన రూపంబును దాని వలనఁ దేజంబును బుట్టె, రూపంబు నేత్రేంద్రియ గ్రాహకం బయ్యె, నేత్రగతంబయిన రూపంబునకు నుపలంభకత్వంబును ద్రవ్యాకార సమత్వంబును ద్రవ్యంబునకు నుపసర్జనం బగుటయు ద్రవ్యపరిణామ ప్రతీతియు నివి రూపవృత్తు లనంబడు, దైజసంబునకు సాధారణంబులగు ధర్మంబులు ద్యోతనం బనం బ్రకాశంబు, పచనంబనఁ దండులాదుల పాకంబు, పిపాసానిమిత్తంబైన పానంబు, క్షున్నిమిత్తంబైన యోదనంబు, హిమమర్దనంబగు శోషణంబు నను నివి వృత్తులై యుండు, రూపతన్మాత్రంబు వలన దైవచోదితంబై వికారంబు నొందు, తేజస్సు వలన రసతన్మాత్రంబు పుట్టె, రసతన్మాత్రంబు వలన జలంబు పుట్టె, జిహ్వ యను రసనేంద్రియంబు రసగ్రాహకం బయ్యె, నా రసం బేకంబై యుండియు భూతవికారంబునంజేసి కషాయ తిక్త కట్వామ్ల మధురాది భేదంబుల

ననేక విధంబయ్యె. వెండియు సాంసర్గిక ద్రవ్య వికారంబునం జేసి యార్ద్రం బగుటయు, ముద్దగట్టుటయుఁ, దృప్తి దాతృత్వంబును, జీవనంబును, దద్వైక్లబ్యనివర్తనంబును, మృదూకరణంబును, దాపనివారణంబును, గూపగతంబైన జలంబు దివియ మఱియు నుద్గమించుటయు నను నివి జలవృత్తు లనంబడు, రసతన్మాత్రంబు వలన దైవచోదితంబై వికారంబునం బొందిన జలంబు వలన గంధతన్మాత్రంబు పుట్టె, దాని వలనం బృథ్వియుఁ గలిగె, ఘ్రాణంబు గంధ గ్రాహకం బయ్యె, నందు గంధం బేకంబయ్యు వ్యంజనాది గతంబయి హింగ్వాది నిమిత్తంబయిన మిశ్ర గంధంబును, కరంభంబును, గృంజనాది గతంబైన పూతిగంధంబును, ఘనసారాది నిమిత్తంబైన సుగంధంబును, శతపత్రాది గతంబగు శాంత గంధంబును, లశునాది గతంబైన యుగ్రగంధంబును, బర్యుషిత చిత్రాన్నాదిగతం బయిన యామ్లగంధంబును, ద్రవ్యావయ వైషమ్యంబునం జేసి యనేక విధంబై యుండు; నదియునుంగాక ప్రతిమాది రూపంబులంజేసి సాకారతాపాదనం బగు భావంబును, జలాదివిలక్షణ త్రయాంతర నిరపేక్షంబైన స్థితియు, జలాద్యాధారత యను ధారణంబును, నాకాశా ద్యవచ్ఛేదకత్వంబును, సకల ప్రాణి పుంస్త్వాభి వ్యక్తీకరణంబును నను నివి పృథ్వీవృత్తు లనంబడు నని చెప్పి వెండియు నిట్లనియె; నభోఽసాధారణ శబ్ద విశేష గ్రాహకంబు శ్రోత్రంబును, వాయ్వసాధారణ గుణ విశేష గ్రాహకంబు స్పర్శంబును, దేజోఽసాధారణ గుణ విశేష గ్రాహకంబు చక్షురింద్రియంబును, నంభోఽసాధారణ గుణ విశేషగ్రాహకంబు రసనేంద్రియంబును, భూమ్యసాధారణ గుణ విశేషగ్రాహకంబు ఘ్రాణేంద్రియంబును, నాకాశాది గుణంబులగు శబ్దాదులు కార్యంబు లగు వాయ్వాదులందుఁ గారణాన్వయంబున ఁజూపట్టనన్నిటికిం బృథ్వీ సంబంధంబు గలుగుటం జేసి భూమియందు శబ్ద స్పర్శరూప రసగంధంబులు గలుగు. మహదాది పృథివ్యతంబులగు నీ యేడు తత్త్వంబులు పరస్పర మిళితంబులై భోగాయతనంబగు పురుషునిం గల్పింప నసమర్థంబులై యున్నం జూచి కాలాదృష్ట సత్త్వాదులం గూడి జగత్కారణుండును, త్రైగుణ్య విశిష్టుండును, నశేష నియామకుండును, నిరంజనాకారుండును నగు సర్వేశ్వరుం డందుఁ బ్రవేశించు నంత నన్యోన్యక్షుభితంబులై మిళితంబులైన మహదాదుల వలన నధిష్ఠాతృ చేతనరహితం బగు నొక యండంబు వుట్టె నందు. 896

* ఈ మనస్తత్త్వానికి చింతనం సహజం. ఆ చింతనం రెండు విధాలు, సామాన్య చింతనం, విశేషచింతనం, వీనికే క్రమంగా సంకల్పం వికల్పం అని పేర్లు. ఈ సంకల్పవికల్పాల వల్లనే సృష్టిలోని వస్తువులు వేరువేరు లక్షణాలతో మనకు కన్పించుతాయి. వీనివల్లనే వివిధ కామాలు ఉత్పన్నమౌతాయి. కనుకనే ఇది ప్రద్యుమ్న వ్యూహం అని చెప్పబడుతుంది. ఇక అనిరుద్ధమనే వ్యూహం సంగతి చెబుతాను. ఇదే ఇంద్రియా లన్నింటికీ అధీశ్వరమై, యోగీంద్రు లందరకు సంసేవ్యమై శరత్కాలమందలి నల్లకలువవలె శ్యామల వర్ణంతో విరాజిల్లుతుంటుంది.

తైజసాహంకారం వల్ల బుద్ధితత్త్వం పుట్టింది. ద్రవ్యాన్ని ప్రకాశింపజేసే జ్ఞానం, ఇంద్రియానుగ్రహం, సంశయం, మిథ్యాజ్ఞానం, నిద్ర, నిశ్చయం, స్మృతి అనేవి బుద్ధితత్త్వ లక్షణాలు.

ఈ తైజసాహంకారం వల్లనే ఐదు జ్ఞానేంద్రియాలూ, ఐదు కర్మేంద్రియాలూ, క్రియాజ్ఞాన సాధనములూ ఏర్పడుతాయి.

ఈ తైజసాహంకారం వల్లనే ప్రాణానికి సంబంధించిన క్రియాశక్తీ, బుద్ధికి సంబంధించిన జ్ఞాన శక్తీ కలుగుతాయి. ఈ రెండు శక్తులూ కర్మేంద్రియాలనూ జ్ఞానేంద్రియాలనూ పనిచేయిస్తాయి.

భగవద్భక్తివల్ల ప్రేరేపింపబడిన తామసాహంకారంనుండి శబ్దతన్మాత్రం పుట్టింది. ఈ శబ్ద తన్మాత్రం నుండి ఆకాశం పుట్టింది. ఆకాశం నుండి శ్రోత్రేంద్రియం (చెవి) పుట్టింది. శ్రోత్రం శబ్దాన్ని గ్రహిస్తుంది. అదే శబ్దం అర్థానికి ఆశ్రయమై శబ్దం వినేవానికి జ్ఞానజనకం అగుతున్నది.

ఈ శబ్దతన్మాత్రం వల్ల ఆకాశం ఏర్పడింది. ఈ ఆకాశం సకల జీవులకూ, లోపలా వెలుపలా అవకాశం ఈయటమే కాక ఆత్మకూ, ప్రాణాలకూ, ఇంద్రియాలకూ ఆశ్రయంగా ఉంటుంది.

కాలగమనం వల్ల మార్పుచెందే, శబ్దతన్మాత్ర లక్షణమైన ఆకాశం వల్ల స్పర్శమూ, స్పర్శంవల్ల వాయువూ ఆ వాయువు వల్ల స్పర్శను గ్రహించగల చర్మమూ పుట్టి స్పర్శజ్ఞానాన్ని కలిగించింది. మెత్తదనం, గట్టిదనం, చల్లదనం, వెచ్చదనం ఇవి స్పర్శ జ్ఞానానికి లక్షణాలు.

వాయువునకు కదలుట, కదలించుట, వేరుచేయుట, కలుపుట, ద్రవ్యనేతృత్వం, శబ్దనేతృత్వం, సర్వేంద్రియాత్మకత్వం అనేవి లక్షణాలు. గంధంతో కూడిన ద్రవ్యాలను ఆఘ్రాణింపజేయటం ద్రవ్యనేతృత్వం. దూరంగా ఉన్న శబ్దాన్ని చెవికి వినిపింప జేయటం శబ్దనేతృత్వం.

భగవత్ప్రేరణతో స్పర్శతన్మాత్రం వల్ల పుట్టిన వాయువువల్ల రూపం పుట్టింది. ఈ రూపం వలన తేజస్సు కలిగింది. నేత్రేంద్రియం వల్ల గ్రహింపదగింది రూపం. నేత్రాన్ని పొందిన రూపానికి అనగా కనుపించునటువంటి ఆకారానికి వృత్తులు- ఉపలంభకత్వం (అనుభవం కలుగుట), ద్రవ్యాకారసమత్వం (ద్రవ్యముయొక్క ఆకారమును ఉన్న దున్నట్లుగా చూపుట), ద్రవ్యోపసర్జనము (ద్రవ్యము అప్రధాన మగుట), ద్రవ్యపరిణామ ప్రతీతి. (ద్రవ్యం యొక్క మార్పు తెలియుట)

ఇక తేజస్సుకు సాధారణాలైన ధర్మాలు ద్యోతం, పచనం, పిపాస, ఆకలి, చలి. ద్యోతానికి ప్రకాశం, పచనానికి బియ్యం మొదలైన పాకం, పిపాసకు పానం, ఆకలికి ఆహారం, చలికి శోషణం - ఇవి వృత్తులు

దైవప్రేరితమై మార్పుచెందిన తేజస్సు వల్ల రసతన్మాత్రం పుట్టింది. ఈ రసతన్మాత్ర వల్ల జలం పుట్టింది. "జిహ్వ"అనే పేరుగల రసనేంద్రియం రసాన్ని గ్రహించేది అయింది. ఆ రసం ఒకటే అయినా ద్రవ్యాల కలయికలోని మార్పువల్ల వగరు, చేదు, కారం, పులుపు, తీపి, ఉప్పు అనే రుచులుగా మారి వాటి కలయిక వల్ల ఇంకా అనేకవిధాలుగా మార్పు చెందింది.

ఇక ఈ జలవృత్తులు: ఇవి తనలో చేరిన ద్రవ్యాల మార్పులనుబట్టి ఆర్ద్రం కావడం, ముద్ద గట్టడం, తృప్తి నివ్వడం, జీవనం, అందలి మాలిన్యాన్ని నివారించడం, మెత్తపరచడం, తాపాన్ని పోగొట్టడం, బావిలో జెలలు ఏర్పడి అడుగున ఉన్న జలం పై కెగయడం అనేవి.

రసతన్మాత్రంవల్ల దైవప్రేరణతో మార్పుచెందిన జలంనుండి గంధ తన్మాత్రం పుట్టింది. ఈ గంధతన్మాత్రం వలన పృథ్వి (భూమి) ఏర్పడింది, ఘ్రాణేంద్రియం (ముక్కు) గంధాన్ని గ్రహించే దయింది.

ఈ గంధం ఒకటే అయినా ఇంగువ మొదలైన పదార్థాలతో కలసిన కారణంగా "మిశ్రమ గంధం'' అనీ, నిలువ ఉన్న పెరుగుముద్ద జంతుమాంసం మొదలైన వానితో కలసినప్పుడు 'దుర్గంధం'అనీ, కర్పూరం మొదలైన వానితో కలిసినప్పుడు 'సుగంధం'అనీ తామరపూలు మొదలైన వానితో కలిసినప్పుడు 'శాంతగంధం' అనీ, వెల్లుల్లి మొదలైన వానితో కలిసినప్పుడు ' ఉగ్రగంధం' అనీ, పాసిపోయిన చిత్రాన్నం వంటి వాటితో కలిసినపుడు ఆమ్లగంధం అనీ వేరు వేరు పదార్థాలతో కలసినప్పుడు మరెన్నో విధాలుగానూ పేర్కొనబడుతుంది.

భూమికి సంబంధించిన సాధారణధర్మాలు ఏవనగా ప్రతిమల రూపాన్నీ వాటి ఆకారాలనూ నిలుపుకోటం, జలం మొదలైన వాటితో అవసరం లేకుండా స్వతంత్రంగా నిలబడగలగటం, జలాదులకు తాను ఆధారమై ఉండటం, ఆకాశం, వాయువు, తేజస్సు, జలం వీనిని విభజించడం; సకలజీవరాసులకూ దేహంగా పనిచేయటం అనేవి పృథ్వీవృత్తులని చెప్పి కపిలాచార్యుడు తల్లితో మళ్లీ ఇలా అన్నాడు.

అమ్మా! పంచభూతాలకు సాధారణ ధర్మాలు విన్నావు. ఇవిగాక వానికి సంబంధించిన అసాధారణ ధర్మాలు విను. ఆకాశానికి అసాధారణగుణం శబ్దం, దీనిని శ్రవణేంద్రియం గ్రహిస్తుంది. వాయువుకు అసాధారణగుణం స్పర్శం, దీనిని త్వగింద్రియం గ్రహిస్తుంది. తేజస్సుకు అసాధారణ గుణం రూపం. దీనిని నేత్రేంద్రియం గ్రహిస్తుంది. జలానికి అసాధారణ గుణం రసం. దీనిని జిహ్వేంద్రియం గ్రహిస్తుంది. పృథివికి అసాధారణ గుణం గంధం. దీనికి గ్రాహకం ఘ్రాణేంద్రియం (ముక్కు). ఆకాశం మొదలైనవాని అన్నింటితో సంబంధం ఉండటం వల్ల భూమికి శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు అసాధారణ గుణాలు అయినాయి.

మహత్తు, అహంకారం, పంచతన్మాత్రలు - ఈ యేడు తత్త్వాలు ఒక దానితో ఒకటి కలిసి భోగాను భవానికి పాత్రుడైన పురుషుని కల్పించటానికి అసమర్థంగా ఉన్న ఆ సమయంలో కాలస్వరూపుడూ అంతుపట్టని అస్తిత్వం కలవాడూ, జగత్కారణుడూ, సత్త్వరజస్తమోగుణాలకు అతీతుడూ, సమస్తాన్ని నియమించేవాడూ, నిరంజనాకారుడూ అయిన సర్వేశ్వరుడు పైన చెప్పబడిన పురుషునిలో ప్రవేశించాడు. అప్పుడు ఒక దానితో ఒకటి కలగాపులగమై ఘర్షణ పొంది కలిసిపోయిన మహదాదులవలన, అధిష్ఠాతయైన భగవంతుని చైతన్యం కోల్పోయిన ఒక అండం (గ్రుడ్డు) పుట్టింది.

**సీ. గురుశక్తితో విరాట్పురుషుండు సంభవం బయ్యె, నయ్యండంబు నర్థిఁ బొదివి**
**యంబు ముఖావరణంబు లొక్కొకటికి దశగుణితంబులై తవిలి యావ**
**రణములై యుండును, గ్రమమున లోకంబులకు "మేలుకట్ల" పోలికఁ దనర్చి**
**పంకజోదరుని రూపము విలసించును, లోలత జలములోఁ దేలుచున్న**

తే. హేమ మయమైన యండంబులో మహాను, భావుఁ డభవుండు హరి దేవదేవుఁ డఖిల
జేత నారాయణుఁడు ప్రవేశించి యపుడు, విష్ణుపద భేదనంబు గావించి యందు. 897

* ఆ అండంలో మహత్తరమైన శక్తితో విరాట్ పురుషుడు విరాజిల్లు తుంటాడు. ఆ అండాన్ని పొదువుకొని పృథివి, జలం, అగ్ని, వాయువు, ఆకాశం, అహంకారం, మహత్తు అనే ఆవరణాలు ఒకదానికంటె ఒకటి పదింతల ప్రమాణం కలిగి ఉంటాయి. లోకాలకు మేల్కట్టు చాందినీలవలె ఒప్పియున్న ఆ పొరలలో నుంచి విష్ణుదేవుని తేజస్సు ప్రకాశిస్తూ ఉంటుంది. జలంలో తేలుతూ ఉన్న బంగారుమయమైన ఆ అండంలో మహానుభావుడు అభవుడు, శ్రీహరి, దేవదేవుడు, విశ్వవిజేత అయిన నారాయణుడు ప్రవేశించి గగనమండలాన్ని భేదించి వేస్తాడు.

సీ. కరమొప్పఁగా విరాట్పురుషుండు వెలుఁగొందు నా విరాట్పురుషుని యాననంబు
వలనను వాణియు, వాణితో వహ్నియు, నాసంబు వలనఁ బ్రాణములఁగూడి
ఘ్రాణేంద్రియం బయ్యె, ఘ్రాణంబు వలనను వాయువులును బ్రాణవాయువులును
నందు నక్షులు చక్షువందు సూర్యుండును, నం దభిధ్యానంబు నర్థిఁ జేయఁ

తే. గర్ణములు జాత మయ్యెఁ, దత్కర్ణసమితి, వలన శ్రోత్రేంద్రియంబు దిక్కులును గలిగెఁ,
ద్వక్కుచే శ్మశ్రురోమ వితానకములు, నోషధి వ్రాతమును భవ మొందె మఱియు. 898

* ఆ అండంలో వెలుగుతూ ఉన్న ఆ విరాట్పురుషుని ముఖం నుండి వాణి, వాణితోపాటు అగ్ని పుట్టాయి. ముక్కునుండి ప్రాణాలు, ఘ్రాణేంద్రియం పుట్టాయి. ఘ్రాణేంద్రియం నుంచి వాయువులు, ప్రాణవాయువులు ఆవిర్భవించాయి. ప్రాణవాయువుల వల్ల కన్నులు, కన్నులవల్ల సూర్యుడు ప్రభవించారు. వానియందు ధ్యానమేర్పడగా చెవులు పుట్టాయి. వానివల్ల శ్రోత్రేంద్రియం దిక్కులూ పుట్టాయి. చర్మంనుండి గడ్డం, మీసాలు మొదలగు రోమసమూహమూ, ఓషధులూ జనించాయి.

తే. దాని వలనను మేఢ్రంబు గానఁ బడియెఁ, బరఁగ రేతంబు వలన నాపంబు వుట్టె
గుదము వలన నపానంబు నుదయమయ్యె, దాని వలనను మృత్యువు దగ జనించె. 899

* ఆ తర్వాత మూత్రావయవం పుట్టింది. దానినుండి రేతస్సు పుట్టింది. రేతస్సువల్ల జలం పుట్టింది. దానివల్ల అపానం పుట్టింది. దానివల్ల మృత్యువు పుట్టింది.

క. కరముల వలనను బలమును, నిరవుగ నా రెంటివలన నింద్రుఁడుఁ బాదాం
బురుహంబుల వలన గతియు, నరుదుగ నా రెంటి వలన హరియునుఁ గలిగెన్. 900

* విరాట్పురుషుని చేతులవల్ల బలం, చేతుల బలంవల్ల ఇంద్రుడు, పాదాలవల్ల గమనం, పాదగతులవల్ల ఉపేంద్రుడు ఉద్భవించటం జరిగింది.

క. ఘన నాడీ పుంజము వల, నను రక్తము, దాని వలన నదులును జఠరం
బున నాఁకలియును దప్పియు, ననయము నా రెంటివలన నబ్ధులు వుట్టెన్. 901

* విరాట్పురుషుని నాడులవల్ల రక్తమూ, రక్తంవల్ల నదులూ, జఠరం వల్ల ఆకలిదప్పులూ, ఈ రెండింటివల్ల సముద్రాలూ పుట్టాయి.

క. విను హృదయము వలనను మన, మును, మనమునఁ దుహినకరుఁడు బుద్ధియుఁ జిత్తం
బును బ్రహ్మయు క్షేత్రజ్ఞం, డును గలిగిరి యవ్విరాజుఁడుం బూరుషతన్. 902

* విరాట్పురుషుని హృదయంవల్ల మనస్సూ, మనస్సువల్ల చంద్రుడూ, బుద్ధీ; చిత్తంవల్ల బ్రహ్మ, క్షేత్రజ్ఞుడు కలిగారు. ఇలా ఆ అండం నుండి సృష్టికారకుడైన పురుషుడు పుట్టాడు.

వ. మఱియు విరాట్పురుషునం దుదయించిన వ్యష్టిరూపంబులగు నాకాశాది భూతంబులును శబ్దంబు మొదలగు భూతతన్మాత్రంబులును వాగాదీంద్రియ జాతంబును దదధిదేవతలును దమంతన సమష్టి రూపుండగు క్షేత్రజ్ఞుం బ్రవృత్తి ప్రవర్తకుంజేయ నసమర్థంబు లయ్యె, నెట్టనిన దేవాధిష్ఠితంబులగు నింద్రియంబులు దాము వేర్వేఱ యయ్యీశ్వరుం బ్రవృత్త్యున్ముఖుం జేయనోపక క్రమంబునం దత్తదధిష్ఠానాదుల నొందె, నందు నగ్ని వాగింద్రియంబుతోడ ముఖంబు నొంది ప్రవర్తించిన విరాట్కార్యంబగు వ్యష్టి శరీరజాతం బనుత్పన్నంబయ్యె, నంత నాసయు ఘ్రాణేంద్రియంబుతోడ వాయువుం గూడిన నట్టిద యయ్యె, నాదిత్యుండు చక్షురింద్రియంబుతోడ నేత్రంబుల నొందిన వృథాభూతంబయ్యె, దిగ్దేవతాకంబగు కర్ణంబు శ్రోత్రేంద్రియంబుతోఁ గూడిన విరాట్కార్య ప్రేరణాయోగ్యంబయ్యె, నోషధులు రోమంబులం ద్వగింద్రియంబుఁ జెంద విఫలం బయ్యె, నద్దైవంబగు మేఢ్రంబు రేతంబు నొందినఁ దత్కార్య కరణాదక్షంబయ్యెఁ, బదంపడి గుదంబు మృత్యువుతోడ నపానేంద్రియంబుఁ జేరిన నది హైన్యంబు నొందె, విష్ణుదేవతాకంబులగు చరణంబులు గతితోఁ గూడిన ననీశ్వరంబు లయ్యెఁ, బాణీంద్రియంబు లింద్రదైవతంబు లగుచు బలంబు నొందిన శక్తి హీనంబు లయ్యె, మఱియు నాడులు సనదీకంబులై లోహితంబు వొందిన నిరర్థకంబు లయ్యె, నుదరంబు సింధువులతోడం జేసి క్షుత్పిపాసలం బొందిన వ్యర్థంబయ్యె, హృదయంబు మనంబుతోడం జంద్రు నొందిన నూరకయుండె, బుద్ధి బ్రహ్మాధిదైవతంబై హృదయంబు నొందిన నిష్ఫలంబయ్యెఁ, జిత్తం బభిమానంబుతో రుద్రునిం జెందిన విరాట్కార్యజాతం బనుద్భూతం బయ్యె, నంతఁ జైత్యుండగు క్షేత్రజ్ఞుండు హృదయాధిష్ఠానంబు నొంది చిత్తంబుతోడం బ్రవేశించిన విరాట్పురుషుండు సలిల కార్యభూత బ్రహ్మాండంబు నొంది ప్రవృత్త్యున్ముఖ క్షముండయ్యె, సుప్తుండగు పురుషునిఁ బ్రాణాదులు దమబలంబుచే భగవదప్రేరితంబు లగుచు నుత్థాపనాసమర్థంబు లగు చందంబున నగ్న్యాదులు స్వాధిష్ఠానభూతంబులగు నింద్రియంబులతోడ దేవాదిశరీరంబుల నొందియు నశక్తంబులయ్యె నని మఱియు నవ్విరాట్పురుషుని ననవరతభక్తింజేసి విరక్తులై

**యాత్మలయందు వివేకంబు గల మహాత్ములు చింతింపుదు రనియుఁ బ్రకృతి పురుష వివేకంబున మోక్షంబును, బ్రకృతి సంబంధంబున సంసారంబును గలుగు ననియుఁ జెప్పి మఱియు నిట్టనియె.903**

* విరాట్పురుషునిలో జన్మించిన ఆకాశం మొదలైన పంచభూతాలూ, శబ్దం మొదలైన పంచతన్మాత్రలూ, వాక్కు మొదలైన ఇంద్రియాలూ, ఆ ఇంద్రియాల అధిదేవతలూ వేరువేరుగా ఉండి పోయాయి. అవి తమలో తాము సమైక్యం పొందనందువల్ల జీవుణ్ణి ప్రవర్తింపజెయ్యలేక పోయాయి. ఆ యా దేవతలు అధిష్ఠించిన ఇంద్రియాలు, తాము ప్రత్యేకంగా క్షేత్రజ్ఞుని లోకవ్యవహారానికి ప్రేరేపింపజాలక వరుసగా ఆయా స్థానాలలో ఉండిపోయాయి.

విరాట్పురుషుని ముఖాన అగ్ని వాగింద్రియంతో కూడి వర్తించి నప్పటికీ విరాట్‌పురుషుని కార్యమైన ఇతరేతర జీవుల శరీరోత్పత్తి కలుగలేదు. అట్లే విరాట్పురుషుని నాసికలో వాయువు జ్ఞానేంద్రియంతో వర్తించినప్పటికీ జీవోత్పత్తి కాలేదు. అదే విధంగా కన్నులలో సూర్యుడు చక్షురింద్రియంతో కూడి వర్తించినా వ్యర్థమే అయింది. అలాగే చెవులలో దిక్కులు శ్రోత్రేంద్రియంతో కూడినప్పుడకూడ విరాట్ పురుషుని కార్యం సాధించటంలో వృథా అయినాయి. రోమాలలో త్వగింద్రియంతో ఓషధులు వర్తించి విఫలములైనాయి.

అలాగే జలం అధిదేవతగా కల పురుషాంగం రేతస్సును పొందికూడా సృష్టికి సమర్థం కాలేదు. మలావయవం మృత్యువుతోకూడి అపానేంద్రియాన్ని చేరి నిరర్థకమే అయింది. హరిదేవతాకాలైన పాదాలు గతితో కూడి శక్తి హీనాలు అయినాయి. ఇంద్రదేవతాకాలైన చేతులు బలాన్ని పొంది కూడా నిరుపయోగాలైనాయి. నదీ దేవతాకాలైన నాడులు రక్తంతో కూడినప్పటికీ నిరర్థకాలైనాయి. కడుపు సముద్రాలతో కూడి ఆకలిదప్పులను పొందినప్పటికీ నిష్ప్రయోజనమైంది. హృదయం మనస్సుతో చంద్రుణ్ణి పొందికూడా ఊరక ఉంది.అట్లే బుద్ధి హృదయాన్ని పొందినప్పటికీ, చిత్తం రుద్రుణ్ణి చెందినప్పటికీ విరాట్‌పురుషుని కార్యాలు ఉత్పన్నం కాలేదు.

అనంతరం అన్నిటికీ సమైక్యం కుదుర్పగల క్షేత్రజ్ఞుడు హృదయాన్ని అధిష్ఠించి, చిత్తంలో ప్రవేశించాడు. అప్పుడు విరాట్‌పురుషుడు, జలాలలో తేలుచున్న బ్రహ్మాండాన్ని అధిష్ఠించి సృష్టికార్యాన్ని ప్రవర్తింప గలిగాడు.

నిద్రించిన జీవుని ప్రాణాలు మొదలైనవి తమ సొంతబలంతో కదలాడలేవు. లేవటానికి సమర్థములు కావు. ఆ విధంగా అగ్ని మొదలైనవి తమకు అధిష్ఠానాలైన ఇంద్రియాలతో దేవాది శరీరాలు పొందికూడా, అవి శక్తి హీనాలైనాయి. క్షేత్రజ్ఞుడు ప్రవేశించగానే మెలకువ వచ్చినట్లు ఆ యా శరీరభాగాలు పనిచేయటం ప్రారంభించాయి.

అటువంటి విరాట్‌పురుషుని ఎడతెగని భక్తితో వివేకం గలిగి విరక్తులైన మహాత్ములు ధ్యానిస్తారనీ, ప్రకృతి, పురుషుల యథార్థజ్ఞానం వల్ల మోక్షమూ, కేవలం ప్రకృతి సంబంధంతో సంసారబంధమూ కలుగుతుందనీ చెప్పి కపిలాచార్యుడు దేవహూతితో మళ్లీ ఇట్లా అన్నాడు.

సీ. జననుత! సత్త్వరజ స్తమో గుణమయ మైన ప్రకృతికార్య మగు శరీర
గతుఁడయ్యుఁ బురుషుండు గడఁగి ప్రాకృతములు నగు సుఖదుఃఖ మోహముల వలనఁ
గర మనురక్తుండు గాఁడు, వికార వి హీనుఁడు త్రిగుణ రహితుఁడు నగుచు
బలసి నిర్మల జల ప్రతిబింబితుండైన దినకరుభంగి వర్తించునట్టి

తే. యాత్మ ప్రకృతి గుణంబులయందుఁ దగులు, వడి యహంకార మూఢుఁడై తొడరి యేను
గడఁగి నిఖిలంబునకు నెల్ల గర్త నని ప్ర, సంగవశతను బ్రకృతి దోషములఁ బొంది. 904

* పూజనీయవైన జననీ! విను. ఈ దేహం సత్త్వ రజస్తమో గుణాలతో నిండింది. ప్రకృతి వల్ల ఏర్పడినటువంటిది. పురుషుడు అటువంటి శరీరాన్ని ఆశ్రయించిన వాడైనప్పటికీ ప్రకృతి సంబంధమైన సుఖదుఃఖాలకు లోనుగాకుండా ఎటువంటి వికారాలూ లేకుండా, త్రిగుణాలకు అతీతుడై ప్రవర్తిస్తాడు. అప్పుడు తేటనీటిలో ప్రతిబింబించిన సూర్య బింబాన్ని ఆ జలం అంటని విధంగా సత్త్వరజస్తమో గుణాలు పురుషుణ్ణి స్పృశింపలేవు. అలా కాకుండా జీవుడు ప్రాకృతిక గుణాలలో చిక్కుకున్నట్లయితే ఈ జరుగుతున్న అన్ని సన్నివేశాలకూ నేనే కర్తనని అహంకారంతో వ్యామోహంతో ప్రవర్తిస్తాడు. అతిశయమైన సంగం వల్ల అతణ్ణి ప్రకృతి దోషాలు ఆవహిస్తాయి.

క. సురతిర్యఙ్మనుజ స్థా, వరరూపము లగుచుఁ గర్మవాసన చేతం
బరఁపైన మిశ్ర యోనులఁ, దిరముగ జనియించి సంసృతిం గైకొని తాన్. 905

* ఈ విధంగా ప్రకృతి దోషాలకు లోనై సుర నర పశు పక్షి వృక్షాది నానావిధ యోనులందు జన్మించి కర్మవాసనలను విస్తరింపజేసుకుని సంసార బంధాలలో చిక్కుపడతాడు.

క. పూని చరించుచు విషయ, ధ్యానంబునఁ జేసి స్వాప్ని కార్థాగమ సం
ధానము రీతి నసత్పథ, మానసుఁ డగుచున్ భ్రమించు మతిలోలుండై. 906

* ఈ విధంగా చిక్కుపడి చరించుతూ, విషయసుఖాలను స్మరించుతూ, కలలో కనబడే ఐశ్వర్యాలవంటి ఆ సుఖాలలో మునిగి తేలుతుంటాడు. అతని మనస్సు చెడుమార్గాలలో ప్రవర్తిస్తుంది. అతడు చంచలబుద్ధితో భ్రమిస్తుంటాడు.

వ. అట్లు గావున. 907

తే. పూని మోక్షార్థి యగు వాఁడు దీనిఁ దీవ్ర, భక్తియోగంబుచేత విరక్తిఁ బొంది
మనము వశముగఁ జేసి యమ నియమాది, యోగమార్గక్రియాభ్యాసయుక్తిఁ జేసి 908

* అందువల్ల మోక్షంపై ఆసక్తి కలవాడు అఖండమైన భక్తి యోగాన్ని అవలంబించాలి. విషయ సుఖాలమీద విరక్తుడు కావాలి. యమం నియమం మొదలైన యోగమార్గాలను అభ్యసించి మనసును వశపరచుకోవాలి.

సీ. శ్రద్ధాగరిష్ఠుఁడై సత్యమైనట్టి మ ద్భావంబు మత్పాదసేవనంబు
వర్ణిత మత్కథాకర్ణనంబును సర్వ భూత సమత్వ మజాత వైర
మును బ్రహ్మచర్యంబు ఘనమౌన మాదిగాఁ గల నిజధర్మ సంగతులఁ జేసి
సంతుష్టుఁడును మితాశనుఁడు నేకాంతియు మననశీలుఁడు వీతమత్సరుండు

తే. నగుచు మిత్రత్వమునఁ గృపఁ దగిలి యాత్మ, కలిత విజ్ఞానియై బంధకంబు లైన
ఘన శరీర పరిగ్రహోత్కంఠ యందు, నాగ్రహము సేసి వర్తింప నగును మఱియు. 909

*మోక్షాసక్తుడు చలించని శ్రద్ధాసక్తులతో నా సత్యస్వరూపాన్ని తెలుసుకోవాలి. నా పాదాలు సేవించాలి. నా కథలను ఆకర్ణించాలి. సర్వజీవులయందూ సమబుద్ధితో వర్తించాలి. ఎవ్వరితోనూ వైరంలేకుండా ఉండాలి. బ్రహ్మచర్యం, మౌనం మొదలైన ఆత్మధర్మాలను అవలంబించాలి. సంతతమూ సంతోషంగా ఉండాలి. మితంగా భుజించాలి. ఏకాంతంగా ఉండాలి. మననశీలుడై ఉండాలి. మాత్సర్యాన్ని దూరం చేసుకోవాలి. మైత్రి, కరుణ అభ్యసించాలి. ఆత్మజ్ఞానం అలవరుచుకోవాలి. తన శరీరం మీదా, ఆత్మీయులైన వారిమీదా ఆసక్తి తగ్గించుకోవాలి. అవి బంధనానికి హేతు వవుతాయి.

వ. జీవేశ్వర తత్త్వజ్ఞానంబునం జేసి వివృత్తంబయిన బుద్ధి తదవస్థానంబునుం గలిగి దూరీభూతేతర దర్శనుండై జీవాత్మ జ్ఞానంబునం జేసి చక్షురింద్రియంబున సూర్యుని దర్శించు చందంబున; నాత్మనాయకుం డయిన శ్రీమన్నారాయణుని దర్శించి నిరుపాధికంబై మిథ్యాభూతం బగు నహంకారంబున సద్రూపంబుచేఁ బ్రకాశమానం బగుచుఁ బ్రధానకారణంబునకు, నధిష్ఠానంబును, గార్యంబునకుఁ జక్షువుంబోలెఁ బ్రకాశకంబును, సమస్త కార్యకారణానుస్యూతంబును, బరిపూర్ణంబును, సర్వవ్యాపకంబును నగు బ్రహ్మంబుఁ బొందునని చెప్పి వెండియు నిట్లనియె. 910

*జీవేశ్వరుల యథార్థస్వరూపం (త్రిగుణాత్మకమైన ప్రకృతిలో చిక్కుకొన్నవాడు జీవుడనీ, త్రిగుణాలకు అతీతుడై వానిని నడిపించేవాడు ఈశ్వరుడనీ) తెలుసుకోవడంవల్ల బుద్ధి అంతర్ముఖ మౌతుంది. అందువల్ల బుద్ధియందలి సంకల్పవికల్పాల క్రమం తెలుస్తుంది. అప్పుడు ఇతర పదార్థాలేవీ కన్పించవు. జీవాత్మజ్ఞానంతో కంటితో సూర్యుణ్ణి చూచినంత సూటిగా ఆత్మనాయకుడైన శ్రీమన్నారాయణుని దర్శనం లభిస్తుంది. అప్పుడు అహంకారానికి తావుండదు. అది మిథ్యాభూతమై తొలగిపోతుంది. సత్యం ప్రకాశమాన మవుతుంది. అందువల్ల ప్రధానకారణమైన మూలప్రకృతికి ఆధారమూ, సమస్త సృష్టినీ దృష్టివలె ప్రకాశింపచేసేదీ, విశ్వంలోని సమస్త కార్యకారణాలకూ మూలభూతమూ, పరిపూర్ణమూ, సర్వాంతర్యామీ అయిన పరబ్రహ్మాన్ని పొందగలుగుతాడు అని చెప్పి కపిలాచార్యుడు మళ్ళీ ఇట్లా అన్నాడు.

సీ. విను మాత్మ వేత్తకు విష్ణుస్వరూపంబు నెఱుఁగంగఁబడు, నది యెట్లటన్న
గగనస్థుఁ డగు దినకరు కిరణచ్ఛాయ జలముల గృహకుడ్య జాలకముల

**వలనఁ దోఁచిన ప్రతిఫలితంబు చేత నూహింపంగఁ బడిన య య్యినుని పగిది**
**నర్థి మనోబుద్ధ్యహంకరణత్రయ నాడీ ప్రకాశమునను నెఱుంగ**

**తే. వచ్చు నాత్మస్వరూపంబు వలఁతి గాఁగఁ, జిత్తమునఁ దోఁచు నంచితశ్రీ దనర్చి**
**య మ్మహామూర్తి సర్వభూతాంత రాత్ముఁ, డగుట నాత్మజ్ఞులకుఁ గాన నగును మఱియు. 911**

* ఆత్మస్వరూపం తెలిసినవానికి పరమాత్మ స్వరూపం తెలుస్తుంది. ఎలాగంటే - ఆకాశంలోని సూర్యుని కిరణాలు నీళ్లలోనూ, ఇంటిగోడలలోని కిటికీసందులలోనూ, ప్రసరించటం వల్ల సూర్యుడున్నట్లు మనం తెలుసుకుంటాము. మనస్సు బుద్ధి అహంకారం అనే ఈ మూడింటిలో ప్రసారమయ్యే ప్రకాశం ద్వారా పరమాత్మ స్వరూపాన్ని పరిపూర్ణంగా గుర్తించవచ్చు. చరాచర ప్రపంచంలో అంతర్యామిగా ఉండే ఆ మహామూర్తి ఆత్మవేత్తలైన మహాత్ముల అంతరంగాలలో అఖండశోభా వైభవంతో దర్శనమిస్తాడు.

**వ. జీవుండు సుషుప్త్యాద్యవస్థలయందుఁ బరమాత్మానుషక్తుండైన భూతాది తత్త్వంబులు లీనంబులై ప్రకృతియందు వాసనామాత్రంబు గలిగి యకార్యకారణంబులై యున్న సుషుప్తి సమయంబునం దాను నిస్తంద్రుం డగుచు నితరంబుచేతఁ గప్పం బడని వాఁడై పరమాత్మానుభవంబు సేయుచుండు నని చెప్పిన విని దేవహూతి యిట్లనియె. 912**

* జీవుడు సుషుప్తి (గాఢనిద్ర)లో భగవంతునితో ప్రగాఢమైన సంబంధం కలిగి ఉంటాడు. వానియందలి పంచభూతాలు మొదలైన తత్త్వాలు ప్రకృతిలో విలీనాలై సంస్కార మాత్రంగా ఉంటూ, తమ పనులను చేయలేని స్థితిలో ఉంటాయి. ఆ సమయంలో సాధకుని ఆత్మ తానుమాత్రం మేల్కొనిఉండి ఎటువంటి అవరోధమూ లేనిదై పరమాత్మను భావన చేస్తూ ఉంటుంది అని చెప్పగా విని దేవహూతి కపిలునితో ఇట్లా అన్నది.

**సీ. విమలాత్మ! యీ పృథివికిని గంధమునకు సలిలంబునకును రసంబునకును**
**నన్యోన్య మగు నవినాభావ సంబంధ మైన సంగతిఁ బ్రకృత్యాత్మలకును**
**సతతంబు నన్యోన్యసంబంధమై యుండు ప్రకృతి దా నయ్యాత్మఁ బాయు టెట్లు?**
**దలపోయ నొకమాటు తత్త్వబోధముచేత భవభయంబుల నెల్లఁ బాయు టెట్లు?**

**తే. చచ్చి క్రమ్మఱఁ బుట్టని జాడ యేది?, యిన్నియుఁ దెలియ నానతి యిచ్చి నన్నుఁ**
**గరుణ రక్షింపవే! దేవగణ సుసేవ్య!, భక్తలోకానుగంతవ్య! పరమపురుష! 913**

* నిర్మల స్వరూపా! పంచభూతాలలో పృథివికీ, గంధానికీ, జలానికీ, రసానికీ అన్యోన్యమైన అవినాభావ సంబంధం ఎలా ఉన్నదో అదే విధంగా ప్రకృతికీ ఆత్మకూ ఎల్లప్పుడూ పరస్పర సంబంధం ఉందికదా! అటువంటప్పుడు ప్రకృతి ఆత్మను ఎట్లా విడిచి పెట్టగలుగుతుంది? ఒక్క సారి సంభవించిన తత్త్వజ్ఞానంవల్ల సంసారభయాలు ఎట్లా తొలగిపోతాయి? చచ్చిన తర్వాత మళ్ళీ పుట్టకుండా ఉండే మార్గం ఏది? ఇవన్నీ నాకు బాగా తెలిసేటట్లు చెప్పు. ఓ దేవదేవా! భక్తజనశరణ్యా! పరమపురుషా! కనికరించి ఈ జ్ఞానం నాకు కటాక్షించు! నన్ను రక్షించు!

వ. అనిన భగవంతుం డిట్లనియె, అనిమిత్తం బయిన స్వధర్మంబునను నిర్మలాంతఃకరణంబునను సునిశ్చితంబైన మద్భక్తి యోగంబునను సత్కథా శ్రవణ సంపాదితంబైన వైరాగ్యంబునను దృష్టప్రకృతి పురుషయాథాత్మ్యంబగు జ్ఞానంబునను బలిష్ఠంబయి కామానభిష్వంగంబగు విరక్తివలనఁ దపోయుక్తంబయిన యోగంబునను సుతీవ్రంబయిన చిత్తైకాగ్రతం జేసి పురుషుని దగుప్రకృతి దందహ్యమానంబై తిరోధానంబును బొందు, నదియునుంగాక యరణిగతంబైన వహ్నిచే నరణి దహింపఁబడు చందంబున, జ్ఞానంబునం దత్త్వ దర్శనంబునంజేసి నిరంతరంబు బలవంతంబును దృష్టదోషంబును నగు ప్రకృతి జీవునిచేత భుక్తభోగయై విడువంబడు నని చెప్పి. 914

* దేవహూతి ఇలా ప్రార్థింపగా భగవంతుడైన కపిలుడు ఇట్లా అన్నాడు. అమ్మా! నీ ప్రశ్నలకు సమాధానం చెబుతాను విను. సాధకుడైన పురుషుడు ఎటువంటి ఫలాన్ని కోరకుండా తన ధర్మాలను తాను నిర్వర్తిస్తూ ఉండాలి. తన మనస్సును ఎల్లప్పుడూ నిర్మలంగా ఉంచుకోవాలి. నాయందు అచంచలమైన భక్తి కలిగి ఉండాలి. మంచి మంచి పుణ్యకథలను ఆసక్తితో ఆకర్ణించాలి. ప్రకృతి పురుష సంబంధమైన యథార్థజ్ఞానాన్ని అవగతం చేసుకోవాలి. కోరికలను దూరంగా పారదోలి వైరాగ్యాన్ని పెంపొందించుకోవాలి. తపస్సుతో కూడిన యోగాభ్యాసం చెయ్యాలి. అఖండమైన ఏకాగ్రతను అవలంబించాలి. ఈ సాధనవల్ల పురుషుని అంటుకొని ఉన్న ప్రకృతి దందహ్యమానమై అదృశ్యమైపోతుంది. అరణినుంచి ఉదయించిన అగ్ని అరణిని కాల్చి వేసినట్లు జ్ఞానం వల్లనూ, తత్త్వదర్శనం వల్లనూ, పటిష్ఠమూ బలిష్ఠమూ దోషభూయిష్ఠమూ అయిన ప్రకృతిని అనుభవిస్తున్న జీవుడు సగంలోనే మొగం మొత్తి పరిత్యాగం చేస్తాడు.

క. విను ప్రకృతి నైజమహిమం, బునఁ దనలో నున్నయట్టి పురుషునకు మహే
శునకు నశుభ విస్ఫురణం, బనయముఁ గావింపఁజాల, దది యెట్లనినన్. 915

* ప్రకృతి ఎంత బలం కలదైనా తన ప్రభావం వల్ల తనకు అధీశ్వరుడై తనలో ప్రవర్తించే పురుషునకు అమంగళాన్నీ, అనార్థాన్నీ ఆచరించలేదు.

చ. పురుషుఁడు నిద్రవోఁ గలలఁ బొందు ననర్థకముల్ ప్రబోధమం
దరయఁగ మిథ్యలై పురుషునందు ఘటింపని కైవడిం, బరే
శ్వరునకు నాత్మనాథునకు సర్వశరీరికిఁ గర్మసాక్షికిం
బరువడిఁ బొందవెన్నఁటికిఁ బ్రాకృతదోషము లంగనామణీ! 916

* మానవుడు నిద్రపోతాడు. ఆ నిద్రలో ఏవో స్వప్నాలు వస్తాయి. పీడకలలో ఎన్నో కష్టాలూ నష్టాలూ ప్రాప్తిస్తాయి. కాని కల కరిగిపోయి మేలుకోగానే అవన్నీ అసత్యాలని తెలుసుకుంటాడు. అవేవీ అతనికి బాధాకరాలు కావు! అదే విధంగా ఆత్మనాథుడూ, సర్వశరీరీ, కర్మసాక్షీ అయిన పరమేశ్వరునకు ప్రకృతికి సంబంధించిన దోషాలు ఎన్నటికీ అంటవమ్మా!

వ. అని వెండియు నిట్లనియె. 917

సీ. అధ్యాత్మతత్పరుం డగువాఁడు పెక్కు జన్మంబులఁ బెక్కు కాలంబులందు
బ్రహ్మపదప్రాప్తి పర్యంతమును బుట్టు సర్వార్థ వైరాగ్యశాలి యగుచుఁ
బూని నా భక్తులచే నుపదేశింపఁ బడిన విజ్ఞానసంపత్తి చేతఁ
బరఁగఁ బ్రబుద్ధుఁడై బహువారములు భూరి మత్ప్రసాదప్రాప్తిమతిఁ దనర్చు

తే. నిజ పరిజ్ఞాన విచ్ఛిన్న నిఖిల సంశ, యుండు, నిర్ముక్తలింగదేహుండు నగుచు
ననఘ! యోగీంద్రహృద్గేయ మగు మదీయ, దివ్యధామంబు నొందు సందీప్తుఁ డగుచు. 918

* అని చెప్పి కపిలాచార్యుడు మళ్ళీ ఇట్లా అన్నాడు. పుణ్యాత్మురాలా! ఆత్మజ్ఞాన సంపన్ను డైనవాడు బ్రహ్మపదం ప్రాప్తించే పర్యంతం ఎంతకాలమైనా ఎన్నిజన్మలైనా ఎత్తుతూనే ఉంటాడు. వాని వైరాగ్యం చెక్కు చెదరదు. నా భక్తులు ఉపదేశించిన విజ్ఞాన సంపదవల్ల ప్రబోధం పొందినవాడై ఎన్నో మారులు నా అనుగ్రహానికి పాత్రుడవుతూ ఉంటాడు. తాను పొందిన ఆత్మజ్ఞానంతో తన సందేహా లన్నింటినీ విముక్తి చేసుకుంటాడు. లింగదేహాన్ని విడిచిపెట్టి, యోగిపుంగవుల అంతరంగాలకు సంభావ్యమైన నా దివ్యధామాన్ని తేజస్వియై చేరుకొంటాడు.

వ. మఱియు నణిమాద్యష్టైశ్వర్యంబులు మోక్షంబున కంతరాయంబులు, కావున వాని యందు విగత సంగుండును మదీయచరణ సరోజస్థిత లలితాంతరంగుండును నగువాఁడు మృత్యుదేవత నపహసించి మోక్షంబు నొందు నని చెప్పి వెండియు యోగలక్షణ ప్రకారంబు వినిపింతు విను మని భగవంతుం డైన కపిలుండు నృపాత్మజ కిట్లనియె. 919

* అణిమ గరిమ మొదలైన అష్టసిద్ధులు మోక్షానికి విఘ్నాన్ని కల్గిస్తాయి. అందువల్ల వాటిమీద మమకారాన్ని వదలిపెట్టి మదీయ పదకమలాలను హృదయంలో పదిలపరచుకున్నవాడు మృత్యువును తిరస్కరించి మోక్షాన్ని పొందుతాడు అని చెప్పి ఇంకా యోగలక్షణ విధానాలను వివరించుతాను, విను మని భగవంతుడైన కపిలుడు దేవహూతితో ఇట్లా అన్నాడు.

క. ధీనిధులై యే యోగ వి, ధానంబునఁ జేసి మనము దగ విమలంబై,
మానిత మగు మత్పదముం, బూనుదు, రా యోగ ధర్మముల నెఱిఁగింతున్. 920

* సహజంగా బుద్ధిమంతులే అయినప్పటికీ ఏ యోగమార్గం వల్ల తమ మనస్సును మరింత పరిశుద్ధం చేసుకొని మాననీయమైన నా సన్నిధిని చేరుకుంటారో ఆయోగధర్మాలు చెబుతాను విను.

వ. అది యెట్లనిన శక్తికొలఁది స్వధర్మాచరణంబును, శాస్త్రవినిషిద్ధధర్మ కర్మంబులు మానుటయు, దైవికంబై వచ్చిన యర్థంబువలన సంతోషించుటయు, మహాభాగవత శ్రీపాదార్చనంబును, గ్రామ్యధర్మ నివృత్తియు, మోక్షధర్మంబులయందు రతియు, మితంబై శుద్ధంబయిన యాహారసేవయు,

విజనంబయి నిర్బాధకం బయిన స్థానంబున నుండుటయు, హింసారాహిత్యంబును, సత్యంబును, నస్తేయంబును దన కెంత యర్థం బుపయోగించు నంత యర్థంబ స్వీకరించుటయు, బ్రహ్మచర్యంబును, దపశ్శౌచంబులును, స్వాధ్యాయపఠనంబును, పరమపురుషుండైన సర్వేశ్వరుని యర్చనంబును, మౌనంబును, ఆసనజయంబును, దానంజేసి స్థైర్యంబును, ప్రాణవాయు స్వవశీకరణంబును, ఇంద్రియ నిగ్రహరూపం బైన ప్రత్యాహారంబును, మనంబుచే నింద్రియంబుల విషయంబుల వలన మరలించి హృదయమందు నిలుపుటయు, దేహగతంబైన మూలాధారాది స్థానంబులలో నొక్క స్థానంబునందు హృదయగతంబయిన మనస్సుతోడంగూడఁ బ్రాణధారణంబును, వైకుంఠుం డైన సర్వేశ్వరుండు ప్రవర్తించిన దివ్యలీలా చరిత్ర ధ్యానంబును, మానసైకాగ్రీకరణంబును, బరమాత్మ యగు పద్మనాభుని సమానాకారతయును నివియునుం గాక తక్కిన వ్రతదానాదులం జేసి, మనోదుష్టం బయిన యసన్మార్గంబును బరిహరించి, జితప్రాణుండై మెల్లన యోజించి, శుచియైన దేశంబునం బ్రతిష్ఠించి విజితాసనుండై, యభ్యస్తకుశాజిన చేలోత్తరాసనంబైన యాసనంబు సేసి, ఋజుకాయుండై ప్రాణమార్గంబును గుంభక రేచక పూరకంబులం గోశశోధనంబు సేసి, కుంభక పూరకంబులచేతం బ్రతికూలంబు గావించి, చంచలం బయిన చిత్తంబు సుస్థిరంబు గావించి, తీవ్రంబయిన యమంబునం బ్రతప్తంబయి విగత సమస్త దోషం బగు చామీకరంబు కరణి విరజంబు సేసి జితమారుతుం డగు యోగి క్రమ్మఱం బ్రాణాయామం బను పావకునిచేత వాతపిత్తశ్లేష్మంబులను దోషంబుల భస్మీకరణంబు సేసి ధారణంబుచేతఁ గిల్బిషంబులను బ్రత్యాహారంబుచేత సంసర్గంబులను దహనంబుసేసి, ధ్యానంబుచేత రాగంబుల సత్త్వాది గుణంబులను నివారించి, స్వనాసాగ్రావలోకనంబు సేయుచు. 921

* అది ఎట్లాగంటే తన శక్తి వంచనలేకుండా తన ధర్మాలను తాను ఆచరించడం, శాస్త్రాలలో నిషేధింపబడిన కర్మలను మానడం, దైవికంగా అనగా తన ప్రయత్నం లేకనే లభించిన ధనంతో సంతోషించడం, మహాత్ములైన భగవద్భక్తుల దివ్యపాదపద్మాలను సేవించడం, ఇతరులకు ఏవగింపు కలిగించే పనులను మానుకోవడం, మోక్షధర్మాలైన శాంతి అహింస మొదలైన విషయాలపైన ఆసక్తి కలిగి ఉండటం, పరిశుద్ధమైన ఆహారాన్ని మితంగా తినడం, ప్రశాంతమై ఇబ్బందిలేని ఏకాంతప్రదేశంలో నివాసం చేయడం, హింసచేయకుండా ఉండడం, సత్యమార్గాన్ని తప్ప కుండడం, ఇతరుల వస్తువులను దొంగలించకుండా ఉండడం, తనకు ఎంత అవసరమో అంతవరకే ధనం గ్రహించడం, బ్రహ్మచర్యాన్ని పాటించడం, తపశ్శౌచాలు కలిగి ఉండడం, సద్గ్రంథాలు చదవడం, సర్వేశ్వరుణ్ణి పూజించడం, మౌనంగా ఉండడం, ఎక్కువకాలం అనుకూలమైన పద్ధతిలో భగవంతుని ధ్యానిస్తూ కూర్చోవడం, ఈ ఆసనవిజయం వల్ల స్థిరత్వం సంపాదించడం, ప్రాణవాయువును స్వాధీనం చేసుకోవడం, ఇంద్రియాలను విషయాలనుండి నిగ్రహించడం, ఇంద్రియాల నుండి మరలిన మనస్సునందు హృదయాన్ని నిల్పడం, దేహమందున్న మూలాధారం మొదలైన స్థానాలలో ఏదో ఒక స్థానమందు హృదయంలో గల మనస్సుతో కూడా ప్రాణధారణ చేయడం, శ్రీమన్నారాయణుని

దివ్య చరిత్రంలోని లీలలను ధ్యానించడం, మనస్సును ఏకాగ్రంగా ఉంచుకోవడం, పరమాత్మ అయిన పద్మనాభుడు అంతటా నిండి ఉన్నాడని విశ్వసించడం ఇత్యాదులు యోగధర్మాలు.

వీని నన్నింటినీ ఆచరించడమేకాక మిగిలిన వ్రతాలూ దానాలూ మొదలైనవి ఆచరించాలి. మనోమాలిన్యంతో కూడిన చెడుమార్గాలను విడిచిపెట్టాలి. ప్రాణాయామపరుడై, చక్కగా ఆలోచించి, శుచియైన ప్రదేశంలో ఎటువంటి ఆటంకం లేకుండా, దర్భాసనంపై ఒక జింకచర్మాన్ని, దానిపైన వస్త్రాన్ని పరచిన సుఖాసనంపై కూర్చోవాలి. శరీరాన్ని నిటారుగా నిలుపుకొని, కుంభక పూరక రేచక రూపమైన ప్రాణాయామంతో అన్నమయ ప్రాణమయాది కోశాలను శుద్ధి చేసుకొని చంచలమైన చిత్తాన్ని సుస్థిరం చేసుకొని, తీవ్రమైన సాధనతో, బాగా కాచి కరగించి మాలిన్యం పోగొట్టిన బంగారాన్ని వలె మనస్సును స్వచ్ఛం చేసుకోవాలి. ఈ విధంగా వాయువును వశం గావించుకొన్న యోగికి, ప్రాణాయామం అనే అగ్నిచేత వాతపిత్తశ్లేష్మాలనే దోషాలు నశిస్తాయి. ఏకాగ్రత వల్ల పాపాలు రూపుమాసిపోతాయి. మనోనిగ్రహం వల్ల చెడు సంసర్గాలు విడిపోతాయి. అటువంటి యోగి ధ్యానంవల్ల రాగద్వేషాలకూ, త్రిగుణాలకూ అతీతుడై స్వనాసాగ్రాన (తన ముక్కు చివరిభాగాన) తన దృష్టిని కేంద్రీకరించాలి.

**సీ. దళదరవింద సుందర పత్ర రుచిరాక్షు, సలలిత శ్రీవత్స కలిత వక్షు,**
**నీలనీరదనీల నీలోత్పల శ్యాము, నలికులాకులమాలికాభిరాముఁ,**
**గౌస్తుభరుచిర ముక్తాహార యుతకంఠు, యోగిమానస పంకజోపకంఠు,**
**సతత ప్రసన్న సస్మిత వదనాంభోజు, దినకర కోటిసందీప్త తేజు,**

**తే. సలలితానర్ఘ రత్నకుండల కిరీట, హార కంకణ కటక కేయూర ముద్రి**
**కా తులాకోటిభూషు, భక్తప్రపోషుఁ, గింకిణీయుత మేఖలాకీర్ణజఘను,** 922

* అలా దృష్టి నిలిపినవాడై, అప్పుడే వికసించుతున్న అరవిందాలవంటి అందమైన కందోయి కలవాడు, వక్షస్థలాన సొగసైన శ్రీవత్సం అనే పుట్టుమచ్చ కలవాడు, ఆషాఢ మేఘంలా నల్లకలువలా శ్యామలవర్ణం కలవాడు, తుమ్మెదలకు విందుచేసే వైజయంతీ మాలికతో విరాజిల్లేవాడు, కౌస్తుభ మణితో శోభించే ముత్యాల హారం కంఠమందు ధరించినవాడు, యోగిజనుల హృదయకమలాలకు దగ్గరైనవాడు, ఎప్పుడును ప్రసన్నమైన చిరునవ్వు చిందులాడే ముఖపద్మం కలవాడు, కోటి సూర్యుల తేజస్సుతో దేదీప్యమానంగా ప్రకాశించేవాడు, విలువైన రమణీయ రత్నకుండలాలు, కిరీటం, హారాలు, కంకణాలు, కటకాలు, భుజకీర్తులు, అంగుళీయకాలు, అందెలు మొదలైన అలంకారాలతో విలసిల్లే వాడు, కటి ప్రదేశమందు ఘల్లు ఘల్లుమనే గజ్జెల మొలనూలు అలంకరించుకొన్నవాడు, భక్తులను లాలించి పాలించేవాడు అయిన శ్రీమన్నారాయణుని ధ్యానం చెయ్యాలి.

**వ. మఱియు.** 923

**సీ. కంజాత కింజల్క పుంజ రంజిత పీత కౌశేయవాసు, జగన్నివాసు,**
**శత్రుభీకర చక్ర శంఖ గదాపద్మ విహిత చతుర్బాహు విగతమోహు,**

నుత భక్త లోక మనోనేత్ర వర్ధిష్ణు, లాలిత సద్గుణాలంకరిష్ణు,
వరకుమారక వయః పరిపాకు, సుశ్లోకు, సుందరాకారు, యశోవిహారు,

తే. సకలలోక నమస్కృత చరణ కమలు, భక్తలోక పరిగ్రహ ప్రకట శీలు,
దర్శనీయ మనోరథ దాయిఁ, గీర్త, నీయ తీర్థయశో మహనీయమూర్తి. 924

* పద్మకేసర వర్ణంతో మిసమిసలాడే పసుపుపచ్చని పట్టుపుట్టం కట్టుకున్నవాడు, లోకాలను తనలో పెట్టుకున్నవాడు, శత్రుభయంకరాలైన శంఖ చక్ర గదా పద్మాలను చతుర్బాహువులలో ధరించేవాడు, మోహాన్ని హరించేవాడు, స్తోత్రం చేసే భక్తులకు జ్ఞాన నేత్రాన్ని అనుగ్రహించేవాడు, సుగణాలనే సురుచిర భూషణాలను పరిగ్రహించేవాడు, నిత్యయౌవనుడు, భువనపావనుడు, సౌందర్యశీలుడు, యశోవిశాలుడు, సమస్త లోకాలూ నమస్కరించే చరణ రాజీవాలు కలవాడు, భక్త జనులను ఆదరించే భావాలు కలవాడు, కోరిన కోర్కెలను ప్రసాదించేవాడు, మహనీయ కీర్తితో ప్రకాశించేవాడు అయిన శ్రీహరిని స్మరించాలి.

వ. వెండియు. 925

క. అనుపమ గుణ సంపూర్ణుని, ననఘుని సుస్థితుని గతుని నాసీను శయా
నుని భర్తహృద్గుహాశయు, నుని సర్వేశ్వరు ననంతు నుతసచ్చరితున్. 926

* ఇంకా ఆ భగవంతుని సాటిలేని మేటి సుగుణాలతో నిండి యున్న వానినిగా, పాపాలను చెండాడే వానినిగా, స్థిరమైన వానినిగా, నడచివచ్చుచున్న వానినిగా, వచ్చి కూర్చుండిన వానినిగా, సుఖంగా పరుండిన వానినిగా, హృదయాంతరాలలో నివసించిన వానినిగా, సర్వేశ్వరునిగా, శాశ్వతమైన వానినిగా, సంస్తుతింపదగిన సచ్చరిత్ర కలవానినిగా సంభావించాలి.

మ. విమలం బై పరిశుద్ధమై తగు మనోవిజ్ఞాన తత్త్వ ప్రబో
ధ మతిన్ నిల్పి తదీయమూర్తి విభవధ్యానంబు గావించి చి
త్తము సర్వాంగ విమర్శన క్రియలకుం దార్కొల్పి ప్రత్యంగమున్
సుమహాధ్యానము సేయఁగా వలయుఁబో శుద్ధాంతరంగంబునన్. 927

* ఈ విధంగా పరిశుభ్రమూ, పరిశుద్ధమూ అయిన మనస్సుతో, విజ్ఞాన తత్త్వ ప్రబోధకమైన సంకల్పంతో ఆ దివ్యమూర్తి రూపవైభవాన్ని ధ్యానించి అన్ని అవయవాలను విడమరచి చూచేటట్లు చిత్తాన్ని తదాయత్తం చేసి ఆ పరాత్పరుని ఒక్కొక్క శరీర భాగాన్నే పరిశుద్ధమైన అంతరంగంలో అనుసంధానం చేసుకుని ధ్యానించాలి.

వ. అది యెట్టి దనిన. 928

సీ. హల కులి శాంకుశ జలజ ధ్వజ చ్ఛత్ర లాలిత లక్షణ లక్షితములు
సలలిత నఖ చంద్ర చంద్రికా నిర్ధూత భక్త మానస తమః పటలములును

సురుచిరాంగుష్ఠ నిష్ఠ్యూత గంగా తీర్థ మండిత హర జటా మండలములు
సంచిత ధ్యాన పారాయణ జన భూరి కలుష పర్వత దీప్త కులిశములును

తే. దాసలోక మనోరథ దాయకములుఁ, జారు యోగి మనః పద్మ షట్పదములు
ననఁగఁ దనరిన హరిచరణాబ్జములను, నిరుపమ ధ్యానమున మది నిలుపవలయు. 929

* అది ఏ విధంగానంటే హలం, వజ్రం, అంకుశం, కమలం, ధ్వజం ఛత్రం మొదలైన మంగళకరమైన రేఖలు కలవీ, చిన్నారి జాబిల్లి వెన్నెల వెలుగులవంటి గోళ్లకాంతులతో భక్తుల మనస్సులలోని అజ్ఞానాంధకారాన్ని దూరం చేసేవీ, మనోజ్ఞమైన కాలి బొటనవ్రేలినుండి పుట్టిన గంగా తీర్థంచే శివుని జటాజూటాన్ని అలంకరించేవీ; భక్తితో, ఆసక్తితో ధ్యానించే భక్తుల పాపాలనే పర్వతాలను వజ్రాయుధంలా పటాపంచలు చేసేవీ, దాసులకోర్కెలు తీర్చేవీ, యోగుల హృదయాలనే పద్మాలలో విహరించే తుమ్మెదల వంటివీ అయిన హరిచరణ సరోజాలను నిరంతరం హృదంతరంలో స్మరిస్తూ ఉండాలి.

చ. కమలజు మాతయై సురనికాయ సమంచిత సేవ్యమానయై
కమలదళాభ నేత్రములు గల్గి హృదీశ్వరభక్తి నొప్పు న
క్కమల నిజాంక పీఠమునఁ గై కొని యొత్తు పరేశు జాను యు
గ్మము హృదయారవిందమున మక్కువఁ జేర్చి భజింపఁగాఁ దగున్. 930

* బ్రహ్మదేవునకు తల్లియై, దేవతలందరికీ ఆరాధ్యురాలై, కమల దళాలవంటి కన్నులుగల లక్ష్మీదేవి తన హృదయేశ్వరుడైన శ్రీహరి మోకాళ్లను ఎంతో భక్తితో ఒడిలో చేర్చుకొని ఒత్తుతూ ఉన్న మనోహర దృశ్యాన్ని మనస్సులో మననం చేసుకోవాలి.

ఉ. చారు విహంగవల్లభు భుజంబులమీఁద విరాజమాన సు
శ్రీ రుచి నుల్లసిల్లి యతసీ కుసుమద్యుతిఁ జాల నొప్పు పం
కేరుహనాభు నూరువు లకిల్బిషభక్తి భజించి మానసాం
భోరుహమందు నిల్పఁ దగుఁ బో మునికోటికి నంగనామణీ! 931

* సొగసైన గరుత్మంతుని భుజాలమీద కాంతి సంపదలతో పెంపొందుతూ, విరిసిన దిరిసెనపువ్వు వన్నెలతో కన్నులవిందు చేసే గోవిందుని అందమైన ఊరుయుగ్మాన్ని అచంచలమైన భక్తితో భావిస్తూ మునులైనవారు తమ మనఃకమలాలలో నిల్పుకోవాలి.

క. పరిలంబిత మృదు పీతాం, బర కాంచీగుణ నినాద భరితం బగు న
ప్పురుషోత్తముని నితంబము, దరుణీ! భజియింపవలయుఁ దద్దయుఁ బ్రీతిన్. 932

* అమ్మా! ఒయ్యారంగా అంచులు వ్రేలాడుతూ ఉండే మెత్తని పట్టుపీతాంబరం కట్టుకొని మొలనూలు మువ్వల సవ్వడి నివ్వటిల్లే కమలాక్షుని కటిప్రదేశాన్ని భక్తితో భజించాలి.

క. విను భువనాధారత్వం, బునఁ దగి విధి జనన హేతుభూతంబగు న
వ్వనజాతముచేఁ గడు మిం, చిన హరినాభీ సరస్సుఁ జింతింపఁ దగున్. 933

* అఖిల లోకాలకూ ఆధారభూతమై, బ్రహ్మపుట్టుకకు హేతుభూతమైన సరోజాతంతో విరాజిల్లే సరోవరం వంటి విష్ణుమూర్తి నాభీ మండలాన్ని సంస్మరించాలి.

తే. దివ్య మరకతరత్న సందీప్త లలిత, కుచములను మౌక్తికావళి రుచులఁ దనరి
యిందిరాదేవి సదనమై యెసకమెసఁగు, వక్ష మాత్మను దలపోయ వలయుఁజుమ్ము, 934

* దివ్యమైన మరకతమాణిక్య దీప్తులతో మెరసిపోతూ, అత్యంత సుందరమై, ముత్యాలహారాల కాంతులతో నిండి, లక్ష్మీదేవికి నివాసమైన వనజాక్షుని వక్షస్థలాన్ని ఆత్మలో భావిస్తూ ఉండాలి.

మ. నిరతంబున్ భజియించు సజ్జన మనో నేత్రాభిరామైక సు
స్థిర దివ్యప్రభ గల్గు కౌస్తుభ రుచిశ్లిష్టంబునై యొప్పు నా
వర యోగీశ్వర వంద్య మానుఁడగు సర్వస్వామి లక్ష్మీశు కం
ధర మాత్మం గదియించి తద్గుణగణధ్యానంబు సేయం దగున్. 935

* తనను సర్వదా సంసేవిస్తూ ఉండే సజ్జనుల హృదయాలకూ, చూపులకూ, విరాజిల్లే వైకుంఠ వాసుని కంఠాన్ని చిత్తంలో చింతించాలి. యోగీంద్రవంద్యమానుడూ, లక్ష్మీవల్లభుడూ, సర్వాంతర్యామీ అయిన ఆ స్వామి గుణగణాలను మనస్సులో ధ్యానించాలి.

క. ఘన మందర గిరి పరివ, ర్తన నికషోజ్జ్వలిత కనక రత్నాంగదముల్
దనరార లోకపాలకు, లను గలిగిన బాహు శాఖలను దలఁపఁదగున్. 936

* క్షీరసాగర మథన సమయంలో గిరగిర తిరుగుతున్న బరువైన మందర పర్వతం రాపిడికి ధగధగ ప్రకాశించే రత్నాల భుజకీర్తులు గలిగి లోకపాలకులకు అండదండలైన విష్ణుదేవుని బాహుదండాలను సంస్మరించాలి.

వ. మఱియు విమత జనాసహ్యంబులైన సహస్రారంబులు గలుగు సుదర్శనంబును, సరసిజోదర కరసరోరుహంబందు రాజహంస రుచిరంబయిన పాంచజన్యంబును, నరాతిభట శోణిత కర్దమలిప్తాంగంబై భగవత్ప్రీతికారిణి యగు కౌమోదకియును, బంధురసుగంధ గంధానుబంధ మంథర గంధవహాహూయమాన పుష్పంధయ ఝంకారనాద విరాజితంబైన వైజయంతీ వనమాలికయును, జీవ తత్త్వంబైన కౌస్తుభ మణియును, బ్రత్యేకంబ ధ్యానంబు సేయందగు, వెండియు భక్త సంరక్షణార్థం బంగీకరించు దివ్య మంగళ విగ్రహంబున కనురూపంబును, మకరకుండల మణి నిచయమండిత ముకురోపమాన నిర్మల గండ మండలంబును, సంతత శ్రీనివాసంబు లయిన లోచన పంకజంబులును గలిగి లాలితభ్రూలతాజుష్టంబును, మధుకర సమాన రుచి చికుర విరాజితంబును నైన ముఖ

**కమలంబును ధ్యానంబు గావింపవలయు, మఱియు శరణాగతుల కభయ ప్రదంబు లగుచు**
**నెగడు పాణిపంకేరుహంబుల మనంబునఁ దలఁప వలయు. 937**

* శత్రుసమూహాలకు సహింపరాని వేయంచుల సుదర్శన చక్రాన్నీ, సరోజనాభుని కరసరోజంలో రాజహంసవలె విరాజిల్లే పాంచజన్య శంఖాన్నీ, నిశాచరుల నెత్తురు చారికలతోకూడి దామోదరునికి ఆమోద దాయకమైన కౌమోదకీగదనూ, హృదయంలో పదిలపరచుకోవాలి.

గప్పుమంటున్న క్రొంగ్రొత్త నెత్తావులు గుబుల్కొన్న కమ్మ తెమ్మరల పిలుపు లందుకొని సంగీతాలు పాడే కోడె తుమ్మెదలతో కూడిన వైజయంతీ వనమాలికనూ, అఖిలలోకాలకూ ఆత్మస్వరూపమైన కౌస్తుభమణినీ, వైకుంఠనాథుని కంఠసీమలో వేర్వేరుగా ధ్యానించాలి.

భక్త రక్షణ పరాయణుడైన నారాయణుని దివ్యమంగళ స్వరూపానికి అనురూపమై మకరకుండలాల మణికాంతులు జాలువారే చక్కని చెక్కుటద్దాలతో ఎల్లవేళలా జయశ్రీకి మందిరాలైన అందాల కందమ్ములతో వంపులు తిరిగిన సొంపైన కనుబొమలతో, ఎలదేటి కదుపులవంటి నల్లని ముంగురులతో ముద్దులు మూటగట్టే ముకుందుని ముఖకమలాన్ని ధ్యానం చేయాలి. ఆర్తులై శరణాగతులైన భక్తులకు అభయ మిచ్చే చక్రపాణి పాణిపద్మాలను హృదయపద్మంలో భావన చేయాలి.

**క. గురు ఘోర రూపకంబై, పరఁగెడు తాపత్రయం బుపశమింపఁగ శ్రీ**
**హరిచేత నిసృష్టము లగు, కరుణా లోకములఁ దలఁపఁగాఁ దగు బుద్ధిన్. 938**

* ఆధ్యాత్మికం, ఆధిదైవికం, ఆధిభౌతికం అనే అతిభయంకరమైన తాపత్రయాన్ని శాంతింప జేసుకోటానికి కమలాక్షుని కరుణాకటాక్ష వీక్షణాలను స్మరణం చెయ్యాలి.

**క. ఘనరుచి గల మందస్మిత, మున కనుగుణ మగు ప్రసాదమును జిత్తమున**
**న్ననిచియు ధ్యానము సేయం, జను యోగిజనాళి కెపుడు సౌజన్యనిధీ! 939**

* సౌజన్యఖనీ! జననీ! భక్తియోగాన్ని అవలంబించినవారు కమనీయ కాంతులు ప్రసరించే స్వామి ముసిముసినవ్వులలోని ప్రసన్నతను మలినంలేని మనస్సులో మాటిమాటికీ మననం చేసుకోవాలి.

**తే. పూని నతశిరు లైనట్టి భూజనముల, శోక బాష్పాంబుజలధి సంశోషకంబు**
**నత్యుదారతమము హరి హాస మెపుడుఁ, దలఁపఁగావలె నాత్మలోఁ దవిలి వినుము. 940**

* శిరస్సులు వంచి నమస్కారం చేసే దాసుల శోకబాష్ప వారాసులను ఎండించి కోరికలు పండించే గోవిందుని సుందరదరహాసాన్ని ఎడతెగకుండా భావించాలి.

**సీ. మునులకు మకరకేతనునకు మోహనం బైన స్వకీయమాయా విలాస**
**మున రచితంబైన భ్రూమండలంబును ముని మనఃకుహర సమ్మోద మానఁ**

**డగు నీశ్వరుని మందహాసంబు నవపల్ల వాధరకాంతిచే నరుణమైన**
**మొల్లమొగ్గల కాంతి నుల్లసం బాడెడు దంత పంక్తిని మదిఁ దలఁపవలయు**

**తే. వెలయ నీ రీతి నన్నియు వేఱు వేఱ, సంచితధ్యాన నిర్మల స్థానములుగ**
**మనములోఁ గనుమని చెప్పి మఱియుఁ బలికె, దేవహూతికిఁ గపిలుండు దేటపడఁగ. 941**

* మహా మునులకే కాకుండా మన్మథునకు సైతం మరులు రేకెత్తించే మాధవుని మాయావిభ్రమ విరచితమైన భ్రూమండలాన్నీ, మునీంద్రుల మనస్సులకు ఆనందాన్ని అందించే మందహాసాన్నీ, క్రొంగ్రొత్త చిగురు తొగరు పెదవులనూ, ఆ పెదవులకాంతికి జాజువారి మొల్ల మొగ్గల చెలువాన్ని పరిహసించే పలువరుసనూ తలపోయాలి.

ఈ విధంగా అన్ని అవయవాలనూ వేర్వేరుగా మనస్సులో నిలిపి ధ్యానం చేసుకోవాలి అని దేవహూతికి తేటతెల్లంగా తెలిపి కపిలుడు మళ్ళీ ఇలా అన్నాడు.

**సీ. ఈ ప్రకారమున సర్వేశ్వరునందును బ్రతిలబ్ధ భావసంపన్నుఁ డగుచుఁ**
**జిరతర సద్భక్తిచేఁ బ్రవృద్ధం బైన యతి మోదమునఁ బులకితశరీరుఁ**
**డగుచు మహోత్కంఠ, నానంద బాష్పముల్ జడిగొనఁ బరితోషజలధిఁ గ్రుంకి**
**భగవత్స్వరూపమై భవగుణగ్రాహక మగుచు మత్సంబంధ మనుకరించి**

**తే. సుమహిత ధ్యానమునఁ బరంజ్యోతి యందు, మనముఁ జాల నియోగించి మహిమఁ దనరు**
**మోక్షపద మాత్మలోన నపేక్షసేయు, ననఘవర్తనుఁడైన మహాత్ముఁడెపుడు. 942**

* నిష్కళంకజీవనుడైన మహాత్ముడు ఈ విధంగా సర్వేశ్వరునిపై నిల్పిన భావ సంపద గలవాడై సమధికమైన సద్భక్తితో అత్యంతమైన మోదంతో పులకించిన శరీరం గలవాడై ఎంతో కుతూహలంతో సంతోష బాష్పాలు పొంగిపొరలగా ఆనందం అనే సముద్రంలో మునిగితేలుతూ ఉంటాడు. విషయ బంధాల నుండి విముక్తి కలిగించే నా స్వరూప సంబంధాన్ని చేకూర్చుకొని ఉత్తమ ధ్యానంతో అన్నింటిని మించిన వెలుగునందు మనస్సు నిల్పగలుగుతాడు. హృదయ పూర్వకంగా మోక్షాన్ని అపేక్షిస్తాడు.

**వ. అది గావున ముక్తి నపేక్షించు మహాత్ముఁడగు వాని చిత్తంబు విముక్తంబైన భగవద్వ్యతిరిక్తాశ్రయంబు గలిగి విషయాంతరశూన్యంబై విరక్తిం బొందుటంజేసి పురుషుండు శరీర భావంబుల ననన్యభావంబగు నిర్వాణపదంబు సూక్ష్మంబగు తేజంబు దనకంటె నధికంబగు తేజంబుతోడి సమానాకారంబగు చందంబున నిచ్చగించు వెండియు. 943**

* అందువల్ల మోక్షాన్ని అపేక్షించే మహానుభావుని మనస్సు సంసారబంధాలనుండి విముక్త మవుతుంది. దానిలో భగవంతునికంటె వ్యతిరిక్తమైన భావానికి తావులేదు. భగవంతునికంటె అన్యం కన్పించదు. ఇటువంటి వైరాగ్యం వల్ల పురుషునకు అనన్యస్థితి ప్రాప్తిస్తుంది. చిన్న వెలుగు తనకంటే పెద్దదైన వెలుగుతో కలిసినప్పుడు

తన అస్తిత్వాన్ని కోల్పోతుంది. అదే విధంగా జీవుడు తన శరీరం, మనస్సు మొదలగు వానియందు వేరుభావన లేక సర్వం భగవన్మయంగా సంభావిస్తాడు. ఆ అనన్యభావమే మోక్షం.

**సీ. పురుషుండు చరమమై భువి నన్యవిషయ నివృత్తమై తగ నివర్తించు చిత్త**
**వృత్త్యాదులను గల్గి వెలయంగ నాత్మీయ మగు మహిమ సునిష్ఠుఁడై లభించు**
**సుఖదుఃఖముల మనస్సునఁ దలంపక యహంకార ధర్మంబులుగాఁ దలంచి**
**యనయంబు సాక్షాత్కృతాత్మ తత్త్వము గల్గు నతఁడు జీవన్ముక్తుఁ డండ్రు ధీరు**

**తే. లతఁడు నే చందమున నుండు ననిన వినుము, తన శరీరంబు నిలుచుటయును జరించు**
**టయును గూర్చుండుటయు నిఁకేమియు నెఱుంగ, కర్థి వర్తించు విను తల్లి, యతఁడు, మఱియు.944**

* ఏ పురుషుడు తన జీవితానికి అంతిమ గమ్యాన్ని భావిస్తూ అన్యవిషయాలనుండి నివృత్తమైన చిత్తంతో ఆత్మజ్ఞానమందు నిశ్చలమైన నిష్ఠగలవాడై సుఖదుఃఖాలను లక్ష్యపెట్టక అవి అహంకార ధర్మాలని గుర్తించి వర్తించుతాడో ఆ పురుషునికి ఆత్మతత్త్వం సాక్షాత్కరిస్తుంది. అటువంటివానినే "జీవన్ముక్తుడు"అని ప్రాజ్ఞులంటారు. అటువంటివాడు తన శరీరం నిలుచుండటం, కూర్చుండటం, తిరగడం - ఏమీ తెలియకుండా ఉంటాడు తల్లీ!

**వ. మదిరాపానంబునం జేసి మత్తుం డగువాఁడు దనకుఁ బరిధానంబగు నంబరంబు మఱచి వర్తించు చందంబునఁ దన శరీరంబు దైవాధీనంబని, నశ్వరంబని, తలంచి యాత్మతత్త్వ నిష్ఠుండై యుపేక్షించు, నదియునుంగాక సమాధియోగంబునం జేసి సాక్షాత్కృతాత్మ తత్త్వంబు గలవాఁడయి స్వాప్నిక శరీరంబు చందంబున యావత్కర్మ ఫలానుభవ పర్యంతంబు పుత్రదార సమేతం బగు ప్రపంచంబు ననుభవించి యటమీఁదఁ బుత్రదారాది సంబంధంబు వలనం బాసి వర్తించు. 945**

* మద్యపానం చేసి మైకంలో ఉన్న మనుష్యుడు పై బట్టను మరచిపోయి ప్రవర్తించిన విధంగా, జీవన్ముక్తుడైన వాడు తన శరీరం దైవాధీనమనీ, అది ఎప్పుడో నశించి పోయ్యేదనీ భావించి ఆత్మతత్త్వాన్ని అవగతం చేసుకొని ఉపేక్షాభావంతో ఉంటాడు. అంతేకాకుండా ఏకాగ్రభావంతో ఆత్మ సాక్షాత్కారం పొందినవాడై కర్మఫలం అనుభవింప వలసి నంతవరకూ భార్యపుత్రులతోకూడిన ఈ సంసారాన్ని స్వప్నంలో లాగా అనుభవిస్తాడు. తర్వాత కలనుండి మేల్కొన్నవానిలాగా ఆ సంసార సంబంధాలన్నీ వదలిపెట్టి వర్తిస్తాడు.

**సీ. సుతదార మిత్రానుజుల కంటె మర్త్యుండు భిన్నుఁడై వర్తించుచున్నరీతి**
**విస్ఫులింగోల్మక విపుల ధూమములచే హవ్యవాహనుఁడు వేఱయిన రీతి**
**వలనొప్ప దేహంబువలన నీ జీవాత్మ పరికింప భిన్నరూపమున నుండుఁ**
**దవిలి భూతేంద్రియాంతఃకరణంబుల భాసిల్లుచున్న యా ప్రకృతిరూప**

తే. బ్రహ్మమున కాత్మ దాఁ బృథగ్భావ మగుచు, ద్రష్టయయి బ్రహ్మసంజ్ఞచేఁ దనరు చుండు
నఖిల భూరి ప్రపంచంబులందుఁ దన్నుఁ, దవిలి తనయందు నఖిల భూతములఁ గనుచు. 946

* పుత్రమిత్ర కళత్రాదులకంటే మానవుడు వేరైనట్లు; మిణుగురుల కంటే, కొరవులకంటే, పొగకంటే అగ్నివేరైనట్లు దేహం కంటే జీవాత్మ వేరై ఉంటుంది. పంచభూతాలు, ఇంద్రియాలు, అంతఃకరణమూ - వీటితో భాసించే ఈ ప్రకృతి కంటే ఆత్మ వేరుగా ఉంటుంది. ఆ ఆత్మ బ్రహ్మ సంజ్ఞతో ద్రష్టయై ఒప్పుతూ అఖిల భూతాలలో తననూ, తనలో అఖిల భూతాలనూ కనుగొంటుంది.

వ. వెండియు. 947

సీ. వరుస ననన్యభావంబులఁ జేసి భూతావళియందుఁ దదాత్మకత్వ
మునఁ జూచు నాత్మీయఘనతరోపాదానములయందుఁ దవిలి యుమ్మల వెలుంగు
నిట్టి దివ్యజ్యోతి యేక మయ్యును బహుభావంబులను దోఁచు ప్రకృతి గతుఁడు
నగుచున్న యాత్మయుఁ బొగడొందు దేవ తిర్యఙ్మనుష్య స్థావరాది వివిధ

తే. యోనులను భిన్నభావంబు నొందుటయును, జాలఁ గల్గు నిజగుణ వైషమ్యమునను
భిన్నుఁడై వెల్గుఁ గావునఁ బేర్చి యదియు, దేహసంబంధి యగుచు వర్తించుచుండు. 948

* ఇంతేకాకుండా సర్వభూతాలలోనూ అనన్యభావంతో, సర్వత్ర ఆత్మగా వెలుగుతూ ఉంటుంది. ఆ దివ్యజ్యోతి ఒక్కటే అయినా పెక్కింటి వలె కనిపించుతుంది. ప్రకృతిగతమైన ఆ ఆత్మ దేవతలు, మనుష్యులు, జంతువులు, స్థావరాలు మొదలైన వేరు వేరు యోనుల్లో వేరువేరు భావాన్ని పొందుతూ, భిన్నగుణాలతో భిన్నంగా వెలుగుతూ ఉంటుంది. నిజానికి దేహాలు మాత్రమే వేరు కాని వెలుగు ఒకటే.

క. భావింప సదసదాత్మక, మై వెలయుచు దుర్విభావ్య మగుచు స్వకీయం
బై వర్తించుచుఁ బ్రకృతిని, భావమునఁ దిరస్కరించు భవ్యస్ఫూర్తిన్. 949

* ఆత్మ సదసదాత్మకమై, భావాతీతమై, ఆత్మీయ భావంతో వర్తిస్తూ తన ఉజ్జ్వల తేజస్సుతో ప్రకృతిని తిరస్కరించి లోబరుచుకుంటుంది.

వ. ఈ యాత్మ నిజస్వరూపంబునం జేసి వర్తించునని కపిలుం డెఱింగించిన విని దేవహూతి వెండియు నిట్లనియె, మహాత్మా! మహదాది భూతంబులకుం బ్రకృతి పురుషులకుం గల్గిన పరస్పర లక్షణంబులను దత్స్వరూపంబులను నెఱింగించితి, వింక నీ ప్రకారంబున సాంఖ్యంబునందు నిరూపింపంబడినట్టి ప్రకారంబును, భక్తియోగ మాహాత్మ్యంబును, బురుషుండు భక్తి యోగంబునంజేసి సర్వలోక విరక్తుం డగునట్టి యోగంబును, బ్రాణిలోకంబునకు సంసారం బనేక విధంబయి యుండుఁ గావునఁ బరాపరుండవై కాల స్వరూపివైన నీ స్వరూపంబును, ఏ నీవలని భయంబునం జేసి జనులు పుణ్యకర్మంబులు సేయుచుండుదురు, మిథ్యాభూతం బైన దేహంబునందు నాత్మాభిమానంబు సేయుచు మూఢుండై కర్మంబులందు నాసక్తంబైన బుద్ధింజేసి విభ్రాంతుండై సంసార స్వరూపంబగు

**మహాంధకారంబునందుఁ జిరకాల ప్రసుప్తుండైన జనునిఁ బ్రబోధించు కొఱకు యోగభాస్కరుండవై యావిర్భవించిన పుణ్యాత్ముండవు గావున నాకు నిన్నియుం దెలియ సవిస్తరంబుగా నానతీయ వలయు ననిన దేవహూతికిఁ గపిలుం డిట్లనియె. 950**

* ఆత్మ స్వరూపంతో విరాజిల్లుతుంది - అని కపిలుడు చెప్పగా విని దేవహూతి మళ్లీ ఇట్లా అన్నది. "అసత్యమైన దేహంపై ఆత్మాభిమానం పెంచుకొని మూర్ఖుడై, కర్మలపై ఆసక్తి కల్గిన బుద్ధితో భ్రమించి, సంసారమనే పెనుచీకటిలో చాలాకాలం నిద్రామత్తుడైన జనుని మేల్కొల్పడం కోసం యోగభాస్కరుడవై పుట్టిన పుణ్యాత్ముడవు నీవు. కాబట్టి ఓ మహాత్మా! మహదాది భూతాలకూ, ప్రకృతి పురుషులకూ, ఉన్న వేరు వేరు లక్షణాలను చెప్పావు. వాటి వాటి స్వరూపాలను వివరించావు. అదే విధంగానే సాంఖ్యయోగాన్ని అనుసరించి భక్తియోగ మహత్త్వాన్ని వెల్లడించు పురుషుడు భక్తియోగం ద్వారా సమస్త ప్రపంచంనుండీ విరక్తుడయ్యేవిధం వివరించు. ప్రాణిలోకానికి అనేక విధాలుగా ఉండే సంసారానికి పరాపరుడవై కాలస్వరూపుడవై ఉన్న నీ స్వరూపాన్ని ఎరిగించు. కాలస్వరూపుడవైన ఏ నీ భయం వల్ల మానవులు పుణ్య కర్మలు చేస్తారో వానిని సవిస్తరంగా తెలిసేలా చెప్పు. "

అని అడుగగా దేవహూతితో కపిలుడు ఇట్లా అన్నాడు.

## -: కపిలుండు దేవహూతికి భక్తి యోగమును తెలియఁజేయుట :-

**క. నలినాయతాక్షి! విను జన, ముల ఫల సంకల్ప భేదమునఁ జేసి మదిం
గల భక్తియోగ మహిమం, బలవడఁగ ననేకవిధము లనఁదగు నవియున్. 951**

* తామర రేకులవంటి విశాలమైన కన్నులుగల తల్లీ! విను. ప్రజల సంకల్పాలనుబట్టి ఆశయాలనుబట్టి భక్తియోగం సిద్ధిస్తుంది. అది కూడా అనేకవిధాలుగా ఉంటుంది.

**వ. వివరించెదఁ. దామస రాజస సాత్త్విక భేదంబులం ద్రివిధంబై యుండు, నందు దామస భక్తి ప్రకారం బెట్టిదనిన. 952**

* వానిని వివరిస్తాను విను. భక్తి తామసం, రాజసం, సాత్త్వికం - అని మూడు విధాలు. వానిలో తామసభక్తి ఎలాంటిదో చెబుతాను.

**తే. సతత హింసాతి దంభ మాత్సర్య రోష, తమములను జేయుచును భేదదర్శి యగుచుఁ
బరఁగ నాయందుఁ గావించు భక్తి దలఁపఁ, దామసం బనఁదగు, వాఁడు తామసుండు, 953**

* ఇతరులను హింసపెడుతూ ఆడంబరం, అసూయ, రోషం, అజ్ఞానం, భేదబుద్ధి కలిగి నన్ను భజించేవాడు తామసుడు. అట్టివానిది తామసభక్తి.

క. ఘన విషయ ప్రావీణ్యము, లను సుమహైశ్వర్యయశములను బూజాద్య
ర్హుని నను నర్థి భజించుట, చను రాజసయోగ మనఁగ సౌజన్యనిధీ! 954

* సౌజన్యఖనీ! జననీ! విను. లక్షలు వెచ్చించి ఆడంబరంతో కూడిన పూజాద్రవ్యాలతో అష్టైశ్వర్యాలకోసం, పేరుప్రతిష్ఠలకోసం, పూజనీయుడనైన నన్ను పూజించుట రాజసభక్తి అవుతుంది.

చ. అనుపమ పాపకర్మ పరిహారముకై భజనీయుఁడైన శో
భన చరితుం డితం డనుచు భావమునం దలపోసి భక్తిచే
ననితర యోగ్యతన్ భగవదర్పణబుద్ధి నొనర్చి కర్మముల్
జనహితకారియై నెగడ సాత్త్వికయోగ మనంగఁ జొప్పడున్. 955

* పూర్వం తెలియక చేసిన పాపాలను పరిహారం చేసేది భగవద్భక్తి ఒక్కటే అనే విశ్వాసంతో భజింపదగిన పవిత్ర చరిత్రుడు భగవంతుడే అని మనస్సులో భావిస్తూ, సమస్త కార్యాలూ భగవదంకితంగా ఆచరిస్తూ, లోకులకు మేలు చేకూర్చే పనులు చేస్తూ ఉండటం సాత్త్వికభక్తి.

చ. మనుసుత! మద్గుణ శ్రవణమాత్ర లభించినయట్టి భక్తిచే
ననఘుఁడ సర్వశోభన గుణాశ్రయుఁడం బరమేశ్వరుండనై
తనరిన నన్నుఁ జెందిన యుదాత్తమనోగతు లవ్యయంబులై
వననిధిగామి యైన సురవాహినిఁ బోలె ఫలించు నిమ్ములన్. 956

* మనుపుత్రివైన జనయిత్రీ! నా గుణాలను ఆలకించిన మాత్రాన ప్రాప్తమైన భక్తితో ఉదాత్తచిత్తులైన కొందరు సముద్రాన్ని సంగమించిన గంగానది మాదిరిగా అఘరహితుడనూ, అనంతకల్యాణ గుణసహితుడనూ, పరమేశ్వరుడనూ అయిన నన్ను ఆశ్రయిస్తారు. అటువంటి ఉత్తముల మనోభావాలు చక్కగా సఫల మౌతాయి.

క. హేయ గుణ రహితుఁ డనఁగల, నాయందుల భక్తి లక్షణముఁ దెలిపితి, నన్
బాయక నిర్హేతుకముగఁ, జేయు మదీయవ్రతైక చిరతర భక్తిన్. 957

* నిందనీయగుణములు లేక వందనీయుడనైన నాయందు నిలుపవలసిన భక్తి లక్షణాలమా, దాని స్వరూపాన్నీ నిరూపించాను. నన్ను వదలకుండా, హేతువులు వెదకకుండా, అవ్యాజంగా నాకై చేసే వ్రతమే అచంచలమైన భక్తి అని భావించు.

వ. నిష్కాములయిన మదీయ భక్తులను నట్టి భక్తి యోగంబు సాలోక్య సామీప్య సారూప్య సాయుజ్యంబులకు సాధనంబు, కావున మహాత్ములగు వారు నిజమనోరథ ఫలదాయకంబు లయినను మదీయ సేవావిరహితంబు లయిన యితర కర్మంబు లాచరింప నొల్లరు, దీని నాత్యంతిక భక్తి యోగంబని చెప్పుదురు, సత్త్వరజస్తమో గుణహీనుం డయిన జనుండు మత్సమానాకారంబుఁ బొందునని చెప్పి మఱియు నిట్లనియె. 958

* కోరికలు లేకుండా నన్ను భజించే నా భక్తులకు పైన చెప్పిన భక్తియోగంవల్ల సమస్త ఫలితాలూ ప్రాప్తిస్తాయి. సాలోక్యం, సామీప్యం, సారూప్యం, సాయుజ్యం అనే ముక్తులు లభిస్తాయి. అందువల్ల మహాత్ములైనవారు తమ కోర్కెలు తీర్చేవే అయినా నా ఆరాధనకు దూరమైన ఏ సాధనలూ చేయరు. దీనినే "ఆత్యంతిక భక్తియోగం" అని అంటారు. సత్త్వరజస్తమోగుణాలకు అతీతమైన ప్రవర్తనగల మానవుడు నాతో సమానమైన రూపాన్ని పొందుతాడు అని చెప్పి కపిలాచార్యుడు తల్లితో మళ్ళీ ఇట్లా అన్నాడు.

సీ. **నిత్యనైమిత్తిక నిజధర్మమున గురు శ్రద్ధా గరిష్ఠతఁ జతుర పాంచ**
**రాత్రోక్త హరి సమారాధన క్రియలను నిష్కామనంబున నెఱి మదీయ**
**విగ్రహ దర్శన వినుతి పూజా వందన ధ్యాన సంశ్రవణములఁ గర్మ**
**సంగి గాకుండుట, సజ్జన ప్రకరాభిమానంబు నొందుట, హీనులందుఁ**

తే. **జాల ననుకంపఁ జేయుట, సములయందు, మైత్రి నెఱపుట యమనియమ క్రియాది**
**యైన యోగంబుచేత నాధ్యాత్మికాధి, భౌతికాదులఁ దెలియుట పలుకుటయును.** 959

* నాభక్తుడైన వాడు స్నాన సంధ్యాది నిత్యకర్మలందూ, జగత్కల్యాణార్థం చేసే యజ్ఞ యాగాది నైమిత్తిక కర్మలందూ అత్యంత శ్రద్ధాసక్తులు గల్గి ఉండాలి. గురువులనూ పెద్దలనూ గౌరవించాలి. పాంచరాత్రాగమంలో చెప్పబడిన ప్రకారం శ్రీహరిని నిష్కామ బుద్ధితో ఆరాధించాలి. ఇంకా ఉత్సాహంతో నా రూపాన్ని దర్శించడం, కీర్తించడం, పూజించడం, నమస్కరించడం, స్మరించడం, నా చరిత్రలు వినడం, కర్మల్లో చిక్కుకోకుండా ఉండడం, తనకంటె గొప్పవారిపైన ఆదర గౌరవాలూ, తనకన్న తక్కువ వారిపైన దయాదాక్షిణ్యాలూ, తనతో సమానులపైన స్నేహానురాగాలూ కలిగి ఉండడం, యమ నియమాలను పాటించడం మొదలైన సుగుణాలను అలవరచుకోవాలి. యోగాభ్యాసం చెయ్యాలి. ఆధ్యాత్మిక, ఆధిదైవిక, ఆధిభౌతికాలను తాను తెలుసుకొని ఇతరులకు తెలియజేస్తూ ఉండాలి.

వ. **మఱియును.** 960

క. **హరి మంగళ గుణకీర్తన, పరుఁడై తగ నార్జవమున భగవత్పరులం**
**గర మనురక్తి భజించుట, నిరహంకారముగ నుంట నిశ్చలుఁ డగుటన్.** 961

* ఇంతేకాక కల్యాణకరాలైన హరిగుణాలను కీర్తించుతూ ఉండాలి. చిత్తశుద్ధితో అనురక్తితో భగవద్భక్తులను సేవిస్తుండాలి. అహంకారం లేకుండా నిశ్చల హృదయంతో జీవించాలి.

క. **ఇవి మొదలు గాఁగ గలుగు భ, గవదుద్దేశ స్వధర్మ కలితుండై వీ**
**ని వలనఁ బరిశుద్ధగతిం, దవిలిన మది గలుగు పుణ్యాతముఁ డెయ్యెడలన్.** 962

* ఈ మొదలైన సుగుణాలతో భగవంతుని ఉద్దేశించి చెప్పిన ఇటువంటి ధర్మాలతో కూడిన పుణ్యాత్ముడు పవిత్రమైన మార్గంలో ఆసక్తమైన మనస్సు కలవాడు అవుతాడు.

తే. గురుతరానేక కల్యాణ గుణ విశిష్టుఁ, డనఁగ నొప్పిన నముఁ బొందు నండ గొనక
పవన వశమునఁ బువ్వుల పరిమళంబు, ఘ్రాణమున నావరించిన కరణి మెఱసి. 963

* పైన చెప్పిన సుగుణములు కలవాడు అనంత కల్యాణగుణ సంపన్నుడనైన నన్ను పొందుతాడు. గాలి ద్వారా పువ్వుల సుగంధం ఘ్రాణేంద్రియాన్ని ఆశ్రయించిన విధంగా ఇతరమైన ఎటువంటి అండదండలు లేకుండానే అటువంటి భక్తులు అనాయాసంగా నన్ను చేరుకుంటాడు.

చ. అనిశము సర్వభూత హృదయాంబుజవర్తి యనం దనర్చు నీ
శు నను నవజ్ఞ సేసి మనుజుం డొగి మత్ప్రతిమార్చనా విడం
బనమున మూఢుఁడై యుచిత భక్తిని నన్ను భజింపఁడేని న
మ్మనుజుఁడు భస్మకుండమున మానక వేల్చిన యట్టివాఁ డగున్. 964

* అమ్మా! అఖిల జీవుల హృదయ కమలాలలో అంతర్యామినై నేను ఉన్నాను. అటువంటి సర్వేశ్వరుడనైన నన్ను అలక్ష్యం చేసి కేవలం నా విగ్రహాలను మాత్రమే ఆడంబరంగా పూజిస్తూ లోకాన్ని మోసగించే వాడు మూర్ఖుడు. అచంచలమైన భక్తితో నన్ను ఆరాధించని వాని పూజలు బూడిదలో పోసిన హోమద్రవ్యాలవలె నిరర్థకాలు.

సీ. అబ్జాక్షి! నిఖిల భూతాంత రాత్ముఁడ నైన నాయందు భూతగణంబునందు
నతిభేదదృష్టి మాయావులై సతతంబుఁ బాయక వైరానుబంధ నిరతు
లగు వారి మనములఁ దగులదు శాంతి యెన్నటి కైన నేను నా కుటిల జనుల
మానక యెపుడు సామాన్యాధిక ద్రవ్య సమితిచే మత్పదార్చన మొనర్ప

తే. నర్థి నా చిత్తమున ముదం బందకుందు, ననుచు నెఱిఁగించి మఱియు నిట్లనియెఁ గరుణఁ
గలిత సద్గుణ జటిలుఁ డక్కపిలుఁ డెలమిఁ, దల్లితోడ గుణవతీమతల్లితోడ. 965

* తామరరేకులవంటి కన్నులుగల తల్లీ! నేను సమస్త జీవులలో అంతర్యామినై ఉన్నాను. అటువంటి నాయందూ, మిగిలిన జీవరాసుల యందూ, భేదదృష్టి కలిగి మాయావులై విరోధభావంతో మెలగేవారికి మనశ్శాంతి దొరకదు. అటువంటి కుటిలాత్ములు ఎంతో ద్రవ్యం వెచ్చించి అట్టహాసంగా, ఆడంబరంగా నాకు పాదపూజలు చేసినా నేను తృప్తిపడను. సంతోషించను అని చెప్పి సతీమతల్లియైన తల్లితో ఉత్తమగుణధుర్యుడైన కపిలాచార్యుడు ఇలా అన్నాడు.

సీ. తరళాక్షి! విను మచేతన దేహములకంటెఁ జేతన దేహముల్ శ్రేష్ఠ, మందుఁ
బ్రాణవంతంబులై స్పర్శనజ్ఞానంబు గలుగు చైతన్యవృక్షములకంటె
ఘనరసజ్ఞాన సంకలిత చేతను లుత్తములు, రసజ్ఞానంబు గలుగువాని
కంటె గంధజ్ఞాన కలిత బృందంబులు గడు శ్రేష్ఠములు, వానికంటె శబ్ద

తే. వేదు లగుదురు శ్రేష్ఠులై, వెలయు శబ్ద, విదుల కంటెను సద్రూప వేదులైన
వాయసాదులు శ్రేష్ఠముల్, వానికంటె, వరుస బహుపాదు లుత్తముల్, వానికంటె. 966

* తల్లీ! విను. చైతన్యం, లేని రాళ్లురప్పలకంటే చైతన్యంగల చెట్లుచేమలు శ్రేష్ఠమైనవి. స్పర్శజ్ఞానంగల చెట్లకంటే, రసజ్ఞానం అనగా రుచిచూచేశక్తి గల క్రిమికీటకాలు శ్రేష్ఠమైనవి. వీనికంటే గంధజ్ఞానం అంటే వాసనచూచే శక్తి కలవి మరీశ్రేష్ఠం. వీని కంటే శబ్దజ్ఞానం అంటే వినగల శక్తికలవి గొప్పవి. ఇలాంటి శబ్దజ్ఞానం గలవానికంటే కూడా రూపజ్ఞానం అంటే చూడగల శక్తికల కాకులు మొదలైనవి ఎంతో శ్రేష్ఠమైనవి. వానికంటే కూడా అనేక పాదాలు కలజెర్రులు మొదలైనవి శ్రేష్ఠం.

క. తలఁపఁ జతుష్పదు లధికులు, బలకొని మఱి వానికంటెఁ బాదద్వయముం
గల మనుజు లలఘుతము, లి,మ్మల వారలయందు వర్ణములు నాల్గరయన్. 967

* ఆ బహుపాద జంతువులకంటే చతుష్పాత్తులు అంటే నాలుగు పాదాలుగల ఆవులు మొదలైన జంతువులు గొప్ప, వీనికంటే రెండు పాదాలుగల మానవులు చాలగొప్ప. వీరిలో నాలుగుతెగలు ఉన్నాయి.

వ. అందు. 968

సీ. తలఁప బ్రాహ్మణ లుత్తములు, వారికంటెను వేదవేత్తలు, వేదవిదులకంటె
విలసిత వేదార్థ విదులు, వారలకంటె సమధిక శాస్త్ర సంశయము మాన్పు
మీమాంసకులు, మఱి మీ మాంసకులకంటె నిజధర్మ విజ్ఞాననిపుణు, లరయ
వారికంటెను సంగవర్జిత చిత్తులు దగ వారికంటె సద్ధర్మపరులు,

తే. ధార్మికుల కంటె నుత్తమోత్తముఁడు వినుము, మత్సమర్పిత సకల ధర్మ స్వభావ
మహిమములు గల్గి యితర ధర్మములు విడిచి, సమత వర్తించు నప్పుణ్యతముఁడు ఘనుఁడు.969

* అందులో బ్రాహ్మణులు ఉత్తములు. వీరికంటే వేదవేత్తలు శ్రేష్ఠులు. వీరికంటే వేదార్థం తెలిసినవాళ్లు గొప్పవారు. వీరికంటే శాస్త్ర సంబంధమైన సందేహాలను చక్కగా తీర్చగల్గిన మీ మాంసకులు అధికులు. వీరికంటే స్వధర్మపరాయణులు ఉత్తములు. వీరికంటే కూడా దేనిపైనా ఆసక్తిలేని నిస్సంగులు గొప్పవారు. వీరికంటే సద్ధర్మం ఆచరించేవారు అధికులు. అటువంటి ధార్మికులకంటే సర్వధర్మాలనూ, సర్వసంపదలనూ, సర్వబాధ్యతలనూ నాకే అర్పించి, అనన్యభావంతో సర్వత్ర సమవర్తనుడై జీవితం గడిపే పుణ్యాత్ముడు ఎంతో గొప్పవాడు.

వ. అట్టివాని. 970

క. కని సకలభూత గణములు, మనమున నానంద జలధి మగ్నము లగుచున్
ఘన బహుమాన పురస్సర, మనయముఁ బాటిల్ల వినుతు లర్థిం జేయున్. 971

* అటువంటి పుణ్యపురుషుని సమస్త ప్రాణికోటి ఎంతో గౌరవ బుద్ధితో చూస్తూ, ఎప్పుడూ అభినందిస్తూ సంతోష సముద్రంలో మునిగి తేలుతుంటారు.

వ. అంత నీశ్వరుండు జీవస్వరూపానుప్రవిష్టుండై యుండు, నట్టి భగవంతుం జూచి భక్తి యోగంబున నేని, యోగంబున నేనిఁ బురుషుండు పరమాత్మం బొందుఁ, బ్రకృతి పురుషాత్మకంబును దద్వ్యతిరిక్తంబును నైన దైవంబునై కర్మవిచేష్టితం బగుచు నుండు, నదియ భగవద్రూపం, బిట్టి భగవద్రూపంబు రూపభేదాస్పదం బగుచు నద్భుత ప్రభావంబు గల కాలం బనియుఁ జెప్పంబడు, నట్టి కాలంబు మహదాది తత్త్వంబులకును మహత్తత్త్వాభి మానులగు జీవులకును భయావహం బగుటంజేసి సకల భూతంబులకు నాశ్రయం బగుచు నంతర్గతంబై భూతంబులచేత భూతంబుల గ్రసించుచు యజ్ఞఫలప్రదాత గావున వశీకృత భూతుండై ప్రభుత్వంబుల భజియించి విష్ణుండు ప్రకాశించుచుండు, నతనికి మిత్రుండును శత్రుండును బంధుండును లేఁ, డట్టి విష్ణుండు సకల జనంబులయం దావేశించి యప్రమత్తుండై ప్రమత్తులయిన జనంబులకు సంహారకుండై యుండు, నతనివలన భయంబునంజేసి వాయువు వీచు, సూర్యుండు దపియించు, నింద్రుండు వర్షించు, నక్షత్రగణంబు వెలుంగుఁ, జంద్రుండు ప్రకాశించుఁ, దత్తత్కాలంబుల వృక్షలతాదు లోషధులతోడం గూడి పుష్పఫల భరితంబు లగు, సరిత్తులు ప్రవహించు, సముద్రంబులు మేరలు దప్పకయుండు, నగ్ని ప్రజ్వలించు, భూమి గిరులతోఁగూడ బరువునఁ గ్రుంగ వెఱచు, నాకాశంబు సకలజనంబులకు నవకాశం బిచ్చు, మహత్తత్త్వంబు జగత్తునకు నంకుర స్వరూపంబు గావున సప్తావరణావృతం బగు లోకం బను స్వదేహంబు విస్తరింపంజేయు గుణాభిమానులగు బ్రహ్మాదులు సర్వేశ్వరునిచేత జగత్సర్గంబునందు నియోగింపంబడి ప్రతిదినంబు నయ్యయి సర్గంబు సేయ నప్రమత్తులై యుండుదురు. పిత్రాదులు పుత్త్రోత్పత్తిఁ జేయుదురు, కాలుండు మృత్యుసహాయుండై మారకుండై యుండు, చరాచరాత్మకంబగు సకల ప్రపంచంబు భగవదధీనంబై యుండునని చెప్పి కపిలుండు వెండియు నిట్లనియె. 972

* దేవుడు జీవుని స్వరూపాన్ని ఏర్పరచుకొని అందులో ప్రవేశించి ఉంటాడు. అటువంటి జీవునిలో ఉన్న దేవుని యోగమార్గంతో గానీ, భక్తిమార్గంతో గాని పురుషుడు పొందగలుగుతాడు. ఆ పరమాత్మ ప్రకృతి పురుషులతోకూడి కర్మలను చేస్తూ ఉంటాడు. ఆ పరమాత్మయే ప్రకృతినుండి వేరై కర్మలు చేయనివాడై కూడా ఉంటాడు. ఇదే భగవంతుని రూపం. ఇది జీవులందుగల పరస్పర భేదాలకు ఆధారమై అత్యంత శక్తి మంతమై ఉంటుంది. అదే "కాలం" అనబడుతుంది. అటువంటి కాలం మహదాది తత్త్వాలకూ, మహత్తత్త్వాభిమానులకూ భీతి గొల్పుతుంది. అందుకనే అది అన్ని జీవులకు ఆశ్రయమై, ఆ జీవులలో ఉంటూ, ఒక ప్రాణిచేత మరొక ప్రాణిని గ్రసింపజేస్తుంది.

భగవంతుడైన విష్ణువు యజ్ఞఫల ప్రదాతయై, ఆ జీవులను స్వాధీనంలో ఉంచుకొని, వాటిని పాలించే మహారాజుగా ప్రకాశిస్తూ ఉంటాడు. అతనికి "ఇతడు మిత్రుడు", " ఇతడు శత్రుడు", " ఇతడు బంధుడు" అంటూ లేదు. అట్టి విష్ణువు అందరిలోను ఆవేశించి అప్రమత్తుడై ఉంటాడు. ప్రమత్తులైన వారిని అణచివేస్తుంటాడు. ఆ పరమాత్మునివలని భయంచేతనే వాయువు వీస్తుంది. సూర్యుడు ఎండ కాస్తాడు.

ఇంద్రుడు వాన కురిపిస్తాడు. నక్షత్రాలు వెలుగుతాయి. చంద్రుడు వెన్నెలలు వెదజల్లుతాడు. ఆయా కాలాలలో చెట్లూ, తీగలూ మొదలైనవి ఓషధులతో కూడి పూలతో, పండ్లతో నిండి ఉంటాయి. నదులు ప్రవహిస్తాయి. సముద్రాలు హద్దు మీరకుండా వుంటాయి. అగ్ని మండుతుంది. భూమి కొండల బరువుకు క్రుంగకుండా ఉంటుంది. ఆకాశం అందరికీ చోటిస్తుంది.

మహత్తత్త్వమే ఈ లోకానికి మూలభూతమైనది. ఏడు ఆవరణాలు గల ఈ లోకం అనే తన దేహాన్ని విస్తరింపచేస్తుంది. బ్రహ్మ మొదలైనవాళ్ళు, సర్వేశ్వరుని ద్వారా ఈలోక సృష్టినిమిత్తం నియమింపబడినవారై ప్రతిదినం ఆ యా సృష్టికార్యక్రమంలో జాగరూకులై ఉంటారు. తండ్రులు కుమారులకు జన్మనిస్తారు. కాలస్వరూపుడైన యముడు మృత్యుదేవత సాయంతో జీవులను చంపుతూ ఉంటాడు. స్థావర జంగమాత్మకమైన ఈ ప్రపంచం అంతా భగవంతుని కట్టడలో ఉంటుంది అని చెప్పి కపిలుడు కన్నతల్లితో మళ్ళీ ఇట్లా అన్నాడు.

**క. నెఱి నిట్టి నిఖిలలోకే, శ్వరుని పరాక్రమముఁ దెలియ సామర్థ్యం బె**
**వ్వరికిని గలుగదు! మేఘము, గరువలి విక్రమముఁ దెలియఁగా లేని గతిన్. 973**

* తల్లీ! గాలిలో ఎగిరే మేఘానికి గాలిశక్తిని తెలుసుకొనే శక్తి ఉండదు. అదేవిధంగా సకల లోకేశ్వరుడైన భగవంతుని శక్తిని గుర్తించే శక్తి ఎవ్వరికీ ఉండదు.

**క. మగువా! విను సుఖహేతుక, మగు నర్థము దొరకమికి మహాదుఃఖమునం**
**దగులుదు, రిది యంతయు నా, భగవంతుని యాజ్ఞఁజేసి, ప్రాణులు మఱియున్. 974**

* అమ్మా! దేనివల్ల సుఖం దొరకుతుందో అది దొరకకపోవడం వల్ల జనులు దుఃఖాలపాలు అవుతున్నారు. ఇదంతా భగవంతుని ఆజ్ఞానుసారం జరుగుతుంటుంది.

**సీ. పూని యనిత్యంబులైన గృహక్షేత్ర పశుధనసుత వధూబాంధవాది**
**వివిధ వస్తువులను ధ్రువముగా మది నమ్మి వఱలు దుర్మతి యగువాఁడు జంతు**
**సంఘాత మగు దేహసంబంధమున నిల్చి యర్థి నయ్యై యోనులందుఁ జొరఁగ**
**ననుగమించును వానియందు విరక్తుండు గాక యుండును నరకస్థుఁడైన**

**తే. దేహి యాత్మీయదేహంబు దివిరి వదల, లేక తన కది పరమసౌఖ్యాకరంబు**
**గాఁగ వర్తించు నదియునుగాక యతఁడు, దేవమాయా విమోహిత భావుఁ డగుచు. 975**

* దుష్టబుద్ధియైన మానవుడు అశాశ్వతములైన ఇల్లు, పొలం, పశువులు, ధనం, సంతానం, భార్య, బంధువులు మొదలైన వస్తువులే శాశ్వతం అని నమ్ముతాడు. అటువంటి మూర్ఖుడు అనేకప్రాణుల శరీరాలను పొందుతూ వివిధ యోనుల్లో జన్మిస్తూ ఉంటాడు. అయినా వానిపట్ల విరక్తి చెందడు. నరకం అనుభవించిన తర్వాతకూడా దేహి తన దేహాన్ని వదలలేడు. అదే ఎంతో సుఖమైందిగా భావించి దానినే అంటిపెట్టుకొని ఉంటాడు. అంతేకాకుండా అతడు దేవుని మాయకు లొంగిపోయిన వాడౌతాడు.

**క. ఘనమగు తనయ వధూ పశు, ధన గృహ రక్షణమునందుఁ దత్త్రిక్రియలన్**
**మనమునఁ దలపోయుచు దిన, దినమున్ దంధహ్యమాన దేహుం డగుచున్. 976**

* అలా లొంగిపోయి కుమారులు, భార్య, పశువులు, ధనం, ఇల్లు వీనిని రక్షించుకొనే ఆలోచనలతో అహోరాత్రాలూ వేగిపోతూ క్రాగిపోయిన దేహంతో క్రుంగి కృశిస్తాడు.

**క. అతిమూఢ హృదయుఁ డగుచు దు, రిత కర్మారంభమునఁ జరించుచుఁ దరుణీ**
**కృత గోప్యభాషణములను, సుతలాలన భాషణములఁ జొక్కుచు మతియున్. 977**

* అతడు తెలివిలేనివాడై, పాపకార్యాలు ఆచరిస్తాడు. ఇల్లాలి సరససల్లాపాలతోనూ, పిల్లల జిలిబిలి పలుకులతోనూ మురిసిపోతూ ఉంటాడు.

**క. విను మింద్రియ పరవశుఁడై, మునుకొని తత్కూట ధర్మముల గల దుఃఖం**
**బనయము సుఖరూపంబుగ, మనమునఁ దలపోసి తదభిమానుం డగుచున్. 978**

* వాడు ఇంద్రియాలకు వశుడై, పరవశుడై వాని కుటిల గుణాలవల్ల కలుగుతూ ఉన్న దుఃఖాన్నే పరమసుఖంగా భావిస్తాడు. ఆ ఇంద్రియాలపై మరింత అభిమానాన్ని పెంచుకుంటాడు.

**క. సతతముఁ దమతమ సంపా,దిత మగు నర్థములచేత ధృతిఁ బరులకుఁ గు**
**త్సితమతి హింసలు సేయుచు, నతిమూఢమనస్కుఁ డగుచు నాత్మజనములన్. 979**

* తాను సంపాదించుకొన్న ధనరాసులను చూచి పొంగిపోతూ ఏ మాత్రం వెనుకాడకుండా, కుటిల బుద్ధి గలవాడై ఇతరులను హింసిస్తూ చాలా అడ్డదిడ్డంగా ప్రవర్తిస్తూ ఉంటాడు.

**తే. పూని రక్షించుచును వారి భుక్త శేష, మనుభవించుచు నంత జీవనము వోక**
**గడఁగి మఱిమఱి యపరార్థకాముఁ డగుచు, సత్త్వ మెడలి కుటుంబ పోషణమునందు. 980**

* తనవాళ్లను పోషించుకుంటూ, వారు తినగా మిగిలింది తాను తింటూ, అప్పటికీ సంసారాన్ని ఈదలేక బ్రతుకుబరువు భరించలేక స్వార్థపరుడై జవసత్త్వాలు కోల్పోతాడు.

**సీ. బలిమి సాలక మందభాగ్యుఁడై కుమతియై పూని యప్పుడు క్రియాహీనుఁ డగుచుఁ**
**దవిలి వృథాప్రయత్నంబులు సేయుచు మూఢుఁడై కార్పణ్యమునఁ జరించు**
**నట్టి యకించనుఁ డగువానిఁ జూచి త ద్దారసుతాదు లాత్మలను వీఁడు**
**గడు నశక్తుఁడు, ప్రోవఁగాఁ జాలఁ, డితఁ డని సెగ్గింతు రర్థిఁ, గృషీవలుండు**

**తే. బడుగు ముసలెద్దు రోసిన పగిది, నంత, నతఁడు నే వెంటలను సుఖం బందలేక**
**తాను పోషించు జనులు దన్ దనరఁ బ్రోవ, బ్రదుకు ముదిమియు మిక్కిలి బాధ పఱుప. 981**

* కుటుంబాన్ని పోషించడం చేతకాక, అదృష్టం సన్నగిల్లి, కుటిల బుద్ధితో ఏ విధమైన పనులూ చేయలేని సోమరిపోతై పనికిరాని ప్రయత్నాలు చేస్తూ, పరమ మూర్ఖుడై దీనంగా తిరుగుతూ ఉంటాడు.

రైతు బక్కచిక్కిన ముసలి ఎద్దును అసహ్యించుకొన్నట్లు ఆ దరిద్రుణ్ణి చూచి అతని ఆలుబిడ్డలు “ఇతడు అశక్తుడు; ఈ పనికిమాలినవాడు మనలను పోషించలేడు”అని ఏవగించుకొంటారు.

ఈ విధంగా అతడు ఎక్కడా ఏ విధంగానూ సుఖంలేక ఇన్నాళ్ళూ తాను ఎవరినైతే తిండిపెట్టి పోషించాడో వారు పెట్టే తిండి తింటూ, ముసలి తనంతో మూలుగుతూ, బాధగా బ్రతుకు బరువుగా ఈడుస్తూ ఉంటాడు.

క. వెడరూపుఁ దాల్చి బాంధవు, లడలఁగ నిర్యాణమునకు నభిముఖుఁడై యి
ల్లెడలఁగఁ జాలక శునకము, వడువునఁ గుడుచుచును మేను వడవడ వడఁకన్. 982

* అంత్యకాలం సమీపిస్తుంది. రూపం మారి పోతుంది. బంధువు లందరూ ఏడుస్తుంటారు. మృత్యుదేవత వాకిట్లో కాచుక్కూచుంటుంది. గడపదాటి వెళ్ళలేడు. కుక్కలా పడి ఉంటాడు. శరీరంలో గడగడ వణకు పుట్టుకు వస్తుంది.

సీ. అతిరోగపీడితుండై మంద మగు జఠరాగ్నిచే మిగుల నల్పాశి యగుచు,
మెఱసి వాయువుచేత మీఁదికి నెగసిన కన్నులు, కఫమునఁ గప్పఁబడిన
నాళంబులను గంఠనాళంబునను ఘురఘుర మను శబ్దంబు దొరయ బంధు
జనులమధ్యంబున శయనించి బహువిధములఁ దన్నుఁ బిలువంగఁ బలుకలేక,

తే. చటులతర కాలపాశ వశంగతాత్ముఁ, డగుచు బిడ్డలఁ బెండ్లాము నరసి ప్రోచు
చింత వికలములైన హృషీకములను, గలిగి విజ్ఞానమును బాసి కష్టుఁ డగుచు. 983

* నానావిధాలైన వ్యాధులు బాధిస్తాయి. జఠరాగ్ని మందగిస్తుంది. తిండి పడిపోతుంది. ఆయాసం అతిశయిస్తుంది. మిడిగ్రుడ్లు పడతాయి. కంఠనాళం మూసుకుపోతుంది. గొంతులో గురక పుడుతుంది. బంధువుల అందరిమధ్య పండుకొని, వారు తనను పలుకరిస్తూంటే బదులు పలకాలంటే నోరు పెకలదు. భయంకరాలైన యమపాశాలు శరీరానికి చుట్టుకుంటాయి. పెండ్లామునూ పిల్లలనూ ఎవరు పోషిస్తారా అనే దిగులుతో శిథిలమై పోయిన ఇంద్రియాలతో తెలివి గోల్పోయినవాడై గిలగిలలాడుతాడు.

వ. అంత మరణావస్థం బొందు సమయంబున నతి భయం కరాకారులు సరభసేక్షణులు నగు యమదూత లిద్దఱు దన ముందఱ నిలిచినం జూచి త్రస్తహృదయుండై శకృన్మూత్రంబులు విడుచుచు, యమపాశంబులచే గళంబున బద్ధుండై శరీరంబువలన నిర్గమించి యాతనాశరీరంబు నవలంబించి బలాత్కారంబున దీర్ఘంబై దుర్గమం బగు మార్గంబును బొంది రాజభటులచే నీయమానుం డగుచు దండనంబున కభిముఖుండై చను నపరాధి చందంబునఁ జనుచుండి.984

* అంతలో మృత్యువు ముంచుకు వస్తుంది. మిక్కిలి భయంకరమైన రూపులతో తీక్ష్ణమైన చూపులతో ఇద్దరు యమదూతలు తనముందు వచ్చి నిలబడతారు. వాళ్లను చూచి గుండెలు పగిలి మలమూత్రాలను

విడుస్తాడు. యమపాశాలు కంఠాన్ని బంధిస్తాయి. ఈ శరీరాన్ని విడిచి పెట్టి యాతనా శరీరంలో ప్రవేశిస్తాడు. పొడవైె నడవడానికి వీలులేని మార్గంలో యమభటులు బలవంతంగా ఈడ్చుకొని వెళ్లుతుంటే శిక్షలు అనుభవించటానికి సంసిద్ధుడై రాజభటులవెంట వెళ్ళుతున్న అపరాధిలాగా అలమటిస్తాడు.

**చ. అనయము మూర్ఛనొందు శునకావలిచేతను భక్ష్యమాణుఁడై,**
**యనుపమ కాలకింకర భయంకర తర్జన గర్జనంబులన్**
**మనము గలంగ, దేహము సమస్తము గంపము వొందఁ గాఁ, బురా**
**తన భవ పాపకర్మ సముదాయముఁ జిత్తములోఁ దలంచుచున్. 985**

* అక్కడ కుక్కలు మీదపడి పీక్కుతింటుంటే మూర్ఛపోతాడు. యమభటులు భయంకరంగా అరుస్తూ చేసే అదలింపులకూ, బెదరింపులకూ మనస్సు కలత చెందగా, శరీరమంతా కంపించిపోగా, పూర్వజన్మంలో చేసిన పాపాలన్నీ జ్ఞప్తికి తెచ్చుకొని పరితపిస్తాడు.

**సీ. అనుపమక్షుత్తృష్ణ లంతర్వ్యథలఁ జేయ ఝంఝానిలజ్వలజ్జ్వలన చండ**
**భానుప్రదీప్తితప్తంబైన వాలుకా, మార్గానుగత తప్యమానగాత్రుఁ**
**డై వీఁపుఁ గశలచే నడువంగ వికలాంగుఁ, డగుచు మార్గమునందు నచట నచటఁ**
**జాల మూర్ఛిల్లు చాశ్రయశూన్యమగు నీళ్ల, మునుఁగుచు లేచుచు మొనసి పాప**

**తే. రూప మయిన తమముచే నిరూఢుఁ డగుచు, వెలయఁ దొంబది తొమ్మిదివేల యోజ**
**నముల దూరంబు గల యమనగరమునకుఁ, బూని యమభటుల్ గొంపోవఁ బోవునంత. 986**

* ఎడతెగని ఆకలి దప్పులతో లోలోపల వ్యాకులపడుతూ, సుడిగాలుల మధ్య సోలిపోతుంటాడు. భగభగమండే సూర్యకిరణాలకు వేడెక్కి మాడిపోతున్న ఇసుక ఎడారుల్లో కాళ్ళుకాలుతూ నడవలేక నడుస్తుంటాడు. కొరడా దెబ్బలకు బొబ్బలెక్కిన వీపుతో శిథిలమైన అవయవాలతో మార్గమధ్యంలో అచ్చటచ్చటా మూర్ఛిల్లుతుంటాడు. దిక్కుమాలిన నీళ్ళలో మునిగితేలుతుంటాడు. పాపంలా క్రమ్ముకొన్న చిమ్మచీకటిలో నుంచి తొంబది తొమ్మిదివేల యోజనాల దూరంలో ఉన్న యమపట్టణానికి యమకింకరులు వాడిని ఈడ్చుకొని పోతారు.

**వ. ఇట్లు మహాపాపాత్ముం డైనవాఁడు ముహూర్తత్రయ కాలంబునను సామాన్య దోషి యగువాఁడు ముహూర్తద్వయంబునను నేఁగి యాతనం బొందు నందు. 987**

* ఈ విధంగా మహాపాపి యైనవాడు మూడుముహూర్తాల కాలంలోనూ, సామాన్యదోషి అయినవాడు రెండుముహూర్తాల కాలంలోనూ వెళ్ళి ఆ యమలోకంలో యాతనలు అనుభవిస్తారు.

**క. పట్టుదురు కొఱవులను వడిఁ, బెట్టుదు రసిపుత్రికలను బెనుమంటలయం**
**దొట్టుదురు నొడలు నలియఁగ, మట్టుదు రప్పాపచిత్తు మత్తుం బెలుచన్. 988**

* అక్కడ యమభటులు ప్రమత్తుడైన ఆపాపచిత్తుణ్ణి కొరవులతో కాలుస్తారు. చురకత్తులు గ్రుచ్చుతారు. భగభగమండే మంటలో పడవేస్తారు. ఒళ్లంతా చిల్లులు పడేటట్లు చితుకబొడుస్తారు.

ఉ. ముంతురు తప్తతోయముల మొత్తుదు రుగ్ర గదాసిధారలన్
ద్రెంతురు పొట్టప్రేవులు, వధింతురు, మీఁద నిభేంద్రపంక్తి ఁతొ
ప్పింతురు, ఘోరభంగిఁ గఱపింతురు పాములచేత, బిట్టు ద్రొ
బ్బింతురు మీఁద గుండ్లు, తినిపింతురు దేహము గోసి కండలన్. 989

* సలసలకాగే వేడినీళ్ళలో ముంచుతారు. పెద్ద గదలతోనూ, కత్తులతోనూ మొత్తుతారు. పొట్టలోని ప్రేవులను త్రెంచివేస్తారు. మదపుటేనుగులతో త్రొక్కిస్తారు. పాములచే క్రూరంగా కరిపిస్తారు. బండరాళ్లు మీదికి విసరుతారు. అతని దేహాన్ని కోసి ఆ కండల్ని ఆ పాపాత్ముని చేతనే తినిపిస్తారు.

వ. మఱియుఁ గుటుంబపోషణంబునఁ గుక్షింభరుం డగుచు నధర్మపరుండై భూతద్రోహంబున నతిపాపుండై నిరయంబునం బొంది, నిజధనంబులు గోలుపడి మొఱవెట్టు నాపన్నుని చందంబునఁ బరస్పర సంబంధంబునఁ గల్పింపంబడిన తామిస్రాంధతామిస్ర రౌరవాదు లగు నరకంబులం బడి, తీవ్రంబులైన బహుయాతనల ననుభవించి, క్షీణపాపుండై పునర్నరత్వంబునుం బొందు నని చెప్పి వెండియు నిట్లనియె. 990

* ఈ ప్రకారంగా పాపాత్ముడు సంసార పోషణకై పడరానిపాట్లు పడుతూ, తన పొట్టను నింపుకొంటూ, అధర్మమార్గాన నడుస్తూ, ప్రాణులను హింసిస్తూ మహాపాపం మూటకట్టుకొని యమలోకానికి పోతాడు. అక్కడ తన సొమ్ము పోగొట్టుకొని మొరపెట్టుకునే దిక్కులేని దీనునివలె ఆక్రోశిస్తూ ఒక దానివెంట ఒకటిగా తామిస్రం, అంధతామిస్రం, రౌరవం మొదలైన నరకాలలో పడి సహింపరాని పెక్కుబాధలను అనుభవిస్తూ, తన పాపాలన్నీ తరిగిపోయిన తరువాత మళ్లీ మనుష్యజన్మాన్ని పొందుతాడు అని చెప్పి తిరిగి కపిలాచార్యుడు ఇట్లా అన్నాడు.

## -: కపిలుండు దేవహూతికిఁ బిండోత్పత్తి క్రమంబుఁ దెలుపుట :-

సీ. కైకొని మఱి పూర్వకర్మానుగుణమున శశ్వత్ప్రకాశకుం డీశ్వరుండు
ఘటకుండు గావునఁ గ్రమ్మఱ జీవుండు దేహసంబంధంబుఁ దివిరి తాల్ప
దొరకొని పురుష రేతోబిందు సంబంధి యై వధూగర్భంబునందుఁ జొచ్చి
కైకొని యొక రాత్రి గలిలంబు పంచరాత్రముల బుద్బుదమును దశమదివస

తే. మందుఁ గర్కంధు వంతయౌ నంతమీఁదఁ, బేశియగు నంతమీఁదటఁ బేర్చి యుండ
కల్పమగు నొక్క నెల మస్తకమును మాస, యమళ మైనను గరచరణములుఁ బొడము. 991

* ఈశ్వరుడు శాశ్వతంగా ప్రకాశించేవాడు, సర్వమూ, సంఘటిత పరచేవాడు, కాబట్టి జీవుడు తన పూర్వకర్మలను అనుసరించి మళ్ళీ దేహాన్ని పొందగోరుతాడు. జీవుడు పురుషుని వీర్యబిందు సంబంధంతో స్త్రీ గర్భంలో ప్రవేశిస్తాడు. ఒక్క రాత్రికి కలిలమై (శుక్రశోణితాల ద్రవమై), తర్వాత ఐదురాత్రులకు బుద్బుదమై, ఆపైన పదవదినానికి రేగుపండంతయై అనంతరం మాంసపిండమై గ్రుడ్డు ఆకారం పొందుతాడు. ఒక్క నెలకు శిరస్సు ఏర్పడుతుంది. రెండు నెలలకు కాళ్లుచేతులు వస్తాయి.

**వ. మఱియు మాసత్రయంబున నఖ రోమాస్థి చర్మంబులు లింగచ్ఛిద్రంబులును గలిగి నాల్గవమాసంబున సప్త ధాతువులును బంచమ మాసంబున క్షుత్తృష్ణలును గలిగి, షష్ఠమాసంబున మావిచేతం బొదువంబడి తల్లికుక్షిని దక్షిణ భాగంబునం దిరుగుచు, మాతృభుక్తాన్న పానంబులవలనఁ దృప్తిం బొందుచు నేధమాన ధాతువులు గల్గి జంతుసంకీర్ణంబగు విణ్మూత్ర గర్తంబందుఁ దిరుగుచుఁ గ్రిమిభక్షిత శరీరుండై మూర్ఛలం బొందుచుఁ దల్లి భక్షించిన కటుతిక్తోష్ణ లవణ క్షారామ్లా ద్యుల్బణంబులైన రసంబులచేతఁ బరితప్తాంగుం డగుచు జరాయువునఁ గప్పంబడి బహిఃప్రదేశంబునందు నాంత్రంబులచేత బద్ధుండై కుక్షియందు శిరంబు మోపికొని భుగ్నంబైన పృష్ఠగ్రీవోదరుండై స్వాంగచలనంబునందు నసమర్థుం డగుచుఁ బంజరంబునందుండు శకుంతంబు చందంబున నుండి దైవకృతంబైన జ్ఞానంబునం బూర్వ జన్మ దుష్కృతంబులం దలంచుచు దీర్ఘోచ్ఛ్వాసంబు సేయుచు నే సుఖలేశంబునుం బొందక వర్తించుచు, నంత నేడవనెల యందు లబ్ధజ్ఞానుండై చేష్టలు గలిగి విట్క్రిమిసోదరుండై యొక్క దిక్కున నుండక సంచరించుచుం బ్రసూతి మారుతంబుల చేత నతివేపితుం డగుచు యాచమానుండును దేహాత్మదర్శియుఁ బునర్గర్భవాసంబునకు భీతుండు నగుచు బంధన భూతంబగు సప్తధాతువులచే బద్ధుండై కృతాంజలి పుటుండు దీనవదనుండునై జీవుండు దా నెవ్వనిచే నుదరంబున వసియింప నియమింపంబడె నట్టి సర్వేశ్వరుని నిట్లని స్తుతియించు. 992**

* మూడు నెలలకు గోళ్ళు, వెంట్రుకలు, ఎముకలు, చర్మం, నవరంధ్రాలు ఏర్పడుతాయి. నాల్గవ నెలకు సప్తధాతువులు శుక్లం, శోణితం, మాంసం, చీము, మెదడు, ఎముక, చర్మం కలుగుతాయి. ఐదవనెలకు ఆకలిదప్పులు సంభవిస్తాయి. ఆరవ నెలలో మావిచేత కప్పబడి, తల్లి కడుపులో కుడివైపున తిరుగుతూ ఉంటాడు. తల్లితిన్న అన్నంతో త్రాగిన నీటితో తృప్తి పొందుతుంటాడు. ధాతువులు (వాత, పిత్త, శ్లేష్మాలు) అభివృద్ధి చెందుతూ ఉంటాయి. మల మూత్రాల గుంటలలో పొర్లుతూ, అందలి క్రిములు శరీరమంతా ప్రాకి బాధపెట్టగా మూర్ఛపోతూ ఉంటాడు.

తల్లి తిన్న కారం, చేదు, ఉప్పు, పులుపు, మొదలైన తీవ్రరసాలు అవయవాలను తపింపచేస్తాయి. మావిచే కప్పబడి, బయట ప్రేగులచే కట్టివేయబడి తల్లిపొట్టలో తలదూర్చి, వంగి ముడుచుకొని పండుకొని ఉంటాడు. తన అవయవాలు కదలించటానికి శక్తిలేక పంజరంలో చిక్కిన పక్షివలె బంధితుడై ఉంటాడు. దైవదత్తమైన తెలివితో, వెనుకటి జన్మలలోని పాపాలను తలంచుకొని, నిట్టూర్పులు విడుస్తాడు. కించిత్తుకూడా సుఖాన్ని పొందలేకుండా ఉంటాడు.

ఏడవ నెలలో జ్ఞానం కలుగుతుంది. కదలికలు కలుగుతాయి. మలంలోని క్రిములతో కలసి మెలసి ఒకచోట ఉండలేక కడుపులో అటూ ఇటూ తిరుగుతూ ఉంటాడు. గర్భవాయువులకు కంపించిపోతూ దేహాత్మ దర్శనం కలిగి, విమోచనాన్ని యాచించుతూ మళ్ళీ గర్భవాసం కలిగినందుకు భయపడుతూ బంధనరూపాలైన సప్తధాతువులతో బంధితుడై చేతులు జోడించి దీనముఖుడైన జీవుడు ఏ దేవుడు తనకు ఈ గర్భవాసం కలిగించాడో ఆ సర్వేశ్వరుని ఈ విధంగా సంస్తుతిస్తాడు.

## -: గర్భస్థుం డగు జీవుండు భగవంతుని స్తుతించుట :-

**క. అనయమును భవనరక్షణ, మునకై స్వేచ్ఛానురూపమునఁ బుట్టెడి వి**
**ష్ణుని భయవిరహిత మగు పద, వనజయుగం బర్థిఁ గొల్చు వారని భక్తిన్. 993**

* సర్వదా లోకాలను సంరక్షించడానికై తన ఇచ్ఛానుసారంగా జన్మమెత్తుతూ ఉండే భగవంతుని పాదపద్మయుగళాన్ని అనురక్తితో అచంచల భక్తితో ఆరాధిస్తాను. ఆ పాదాలు నా భయాన్ని పటాపంచలు చేస్తాయి.

**వ. అదియునుంగాక పంచభూత విరహితుం డయ్యుం బంచభూత విరచితంబైన శరీరంబునందుఁ గప్పంబడి యింద్రియ గుణార్థ చిదాభాస జ్ఞానుండనైన నేను. 994**

* ఆత్మస్వరూపుడనైన నాకు పంచభూతాలు లేవు. అయినా నేను పంచభూతాలతో ఏర్పడిన శరీరంతో కప్పబడి ఉన్నాను. ఇంద్రియాలు ఇంద్రియ గుణాలు, ఇంద్రియార్థాలు - వీని అస్తిత్వం తెలిసీ తెలియని ఆభాసజ్ఞానం కలిగి ఉన్నాను.

**సీ. ఎవ్వఁడు నిఖిల భూతేంద్రియ మయ మగు మాయావలంబన మహిత కర్మ**
**బద్ధుఁడై వర్తించు పగిది దందహ్యమానంబగు జీవచిత్తంబునందు**
**నవికారమై శుద్ధమై యఖండ జ్ఞానమున నుండు వానికి ముఖ్యచరితు**
**నకు నకుంఠిత శౌర్యునకుఁ బరంజ్యోతికి సర్వజ్ఞునకుఁ గృపాశాంతమతికిఁ**

**తే. గడఁగియుఁ బ్రకృతి పురుషులకంటెఁ బరముఁ, డైనవానికి మ్రొక్కెద నస్మదీయ**
**దుర్భరోదగ్ర భీకర గర్భనరక, వేదనలఁ జూచి శాంతిఁ గావించుకొఱకు. 995**

* ఏ దేవుడు సమస్త జీవరాసులలో పంచేంద్రియాలతో పంచభూతాలతో నిండిన మాయను అంగీకరించి కర్మబంధాలకు లోబడి ఉన్నట్లు కన్పించుతాడో, దహించుకొని పోతున్న జీవుని చిత్తంలో అవికారుడై, పరిశుద్ధుడై, అఖండజ్ఞాన స్వరూపుడై భాసిస్తుంటాడో, ఆ ఉదాత్త చరితునికి, ఆ మొక్కవోని శౌర్యం కలవానికి, ఆ పరంజ్యోతికి, ఆ సర్వజ్ఞునికి, ఆ దయామయునికి, ఆ శాంతమూర్తికి, ప్రకృతి పురుషులకంటె అతీతుడైన ఆ భగవంతునికి ఈ భరింపరాని భయంకరమైన గర్భనరకంలో నున్న నన్ను రక్షించి శాంతి కలిగించమని నమస్కరించుతున్నాను.

సీ. అనపుడు సుతునకు జనని యిట్లనుఁ దగ మహితాత్మ! యెవ్వని మాయచేత
ఘనమోహులై గుణకర్మ నిమిత్త సాంసారిక మార్గ సంచారములను
ధృతి సెడి యలసి యే దిక్కు నెఱుంగక హరి పదధ్యానంబు నాత్మ మఱచి
యుండు వారలకు నే యుక్తియు నమ్మహా పురుషు ననుగ్రహ బుద్ధి లేక

తే. తద్గుణ ధ్యాన తన్మూర్తి దర్శనములు, గోచరించుట యెట్లు? నాకును బ్రబోధ
కలితముగఁ బల్కు మనవుడుఁ గపిలుఁ డనియె, నంబతోడను సుగణకదంబతోడ. 996

* ఈ విధంగా చెబుతున్న కొడుకుతో తల్లి ఇట్లా అన్నది. ఓ మహానుభావా! ఎవని మాయవల్ల మానవులు వ్యామోహంలోపడి గుణకర్మ నిమిత్తంగా ఏర్పడ్డ ఈ సంసార మార్గంలో ప్రయాణిస్తూ ధైర్యం చాలక, అలసిపోయి దిక్కుతెలియక చీకాకు పడుతూ, చివరకు ఆ దేవుని పాదాలను ధ్యానించాలనే విషయాన్ని కూడా మనస్సులో మరచిపోతారో, ఆ పురుషోత్తముని అనుగ్రహం లేనిదే, ఆ మానవులకు ఆయన గుణగణాలను ధ్యానించాలనీ, ఆయన రూపాన్ని దర్శించాలనీ బుద్ధిపుడుతుందా? ఈ సంగతి నాకు కనువిప్పు కలిగేలాగా విప్పి చెప్పు - ఇలా అడిగిన సద్గుణవల్లియైన తల్లితో కపిలుడు ఇట్లా అన్నాడు.

వ. అట్టి యీశ్వరుండు గాలత్రయంబునందును జంగమస్థావరాంతర్యామి యగుటం జేసి జీవ కర్మమార్గంబులం బ్రవర్తించు వారు తాపత్రయ నివారణంబు కొఱకు భజియింతురని చెప్పి మఱియు నిట్లనియె. 997

* అమ్మా! విను. భగవంతుడు మూడు కాలాల్లోనూ చరాచర ప్రపంచంలోని సమస్త జీవరాసులలో అంతర్యామిగా ఉంటాడు. అందుచేత బ్రతుకు తెరువున పయనించేవారు తాపత్రయాలు తప్పించుకోవడానికై ఆ భగవంతుణ్ణి ఆరాధిస్తారు అని చెప్పి మళ్లీ ఇట్లా అన్నాడు.

క. జనయిత్రి! గర్భమందును, ఘన క్రిమివిణ్మూత్ర రక్త గర్తములోనన్
మునుఁగుచు జఠరాగ్నిని దిన, దినమును దంతప్యమానదేహుం డగుచున్. 998

* తల్లీ! జీవుడు తల్లి గర్భంలో, క్రిములతో నిండిన మలమూత్రాల నెత్తురు గుంటలో మునుగుతూ, ఆకలి మంటలతో దినదినం తపింపబడే దేహం కలవాడు అవుతాడు.

ఆ. దీనవదనుఁ డగుచు దేహి యీ దేహంబు, వలన నిర్గమింపఁ దలఁచి చనిన
నెలల నెన్నుకొనుచు నెలకొని గర్భంబు, వలన వెడలఁ ద్రోయువారు గలరె? 999

* దైన్యంతో నిండిన ముఖం కలవాడై, ఆ గర్భనరకంనుండి బయటపడాలని భావిస్తూ, గడచిన నెలలు లెక్కించుకుంటూ ఉంటాడు. నన్ను ఈ గర్భంనుండి వెలువరించే వాళ్లు ఎవరైనా ఉన్నారా? అని తలపోస్తూ ఉంటాడు.

**వ. అని తలంచుచు దీనరక్షకుండయిన పుండరీకాక్షుండు దన్ను గర్భనరకంబువలన విముక్తునిం జేయ నమ్మహాత్మునికిఁ బ్రత్యుపకారంబు సేయలేమికి నంజలి మాత్రంబు సేయందగు, నట్టి జీవుండ నైన నేను శమదమాది యుక్తంబైన శరీరంబునందు విజ్ఞాన దీపాంకురంబునం బురాణపురుషు నిరీక్షింతునని మఱియు నిట్లనియె. 1000**

* దీనులను రక్షించే పుండరీకాక్షుడు ఒక్కడే తనను ఈ గర్భనరకం నుండి, విముక్తుణ్ణి చేయగలడు. అయితే ఆ మహాత్మునకు నేను ప్రత్యుపకారం ఏమీ చేయలేను. చేతులు జోడించి నమస్కారం మాత్రమే చేయగల్గుతాను. నేను కేవలం జీవుడను. శమ, దమాది గుణాలతో కూడిన రాబోవు జన్మంలో విజ్ఞాన దీపాంకురాన్ని వెలిగించుకొని ఆ వెలుగులో పురాణ పురుషుణ్ణి చూస్తాను అని మళ్లీ ఇట్లా అనుకుంటాడు.

**సీ. నెలకొని బహు దుఃఖములకు నాలయమైన యీ గర్భనరకము నేను వెడలఁ**
**జాల బహిః ప్రదేశమునకు వచ్చిన ననుపమ దేవమాయా విమోహి**
**తాత్ముండనై ఘోరమైనట్టి సంసార చక్రమందును బరిభ్రమణ శీలి**
**నై యుండ వలయుఁ దా, నది గాక గర్భంబు నందుండు శోకంబు నపనయించి.**

**తే. యాత్మ కనయంబు సారథియైన యట్టి, రుచిర విజ్ఞానమునఁ దమోరూపమైన**
**భూరి సంసార సాగరోత్తారణంబు, సేసి యీ యాత్మ నరసి రక్షించుకొందు. 1001**

* ఎన్నెన్నో దుఃఖాలకు నిలయమైన ఈ గర్భనరకం నుండి నేను బయట పడలేను. ఒకవేళ బయటకు వచ్చినా దేవమాయలకు లోనై, వ్యామోహంతో భయంకరమైన సంసార వలయంలో చిక్కుకొని పరిభ్రమిస్తూ ఉండవలసిందే. అందుకని ఈ గర్భశోకాన్ని పోగొట్టేదీ, ఆత్మను సారథియై నడిపించేదీ అయిన విజ్ఞానాన్ని ఆశ్రయించి అంధకార బంధురమైన సంసార సాగరాన్ని దాటి ఆత్మను రక్షించుకుంటాను.

**వ. మఱియును. 1002**

**చ. పరఁగుచు నున్న దుర్వ్యసనభాజనమై ఘనదుఃఖమూలమై**
**యరయఁగఁ బెక్కు తూంట్లు గలదై క్రిమిసంభవ మైనయట్టి దు**
**స్తర బహుగర్భవాసముల సంగతి మాన్పుటకై భజించెదన్**
**సరసిజనాభ భూరి భవ సాగర తారక పాదపద్మముల్. 1003**

* ఈ గర్భనరకం అనేక వ్యసనాలకు నిలయమైనది. కడలేని దుఃఖాలకు మూలమైనది. ఎన్నో రంధ్రాలు గలది. క్రిములకు జన్మ స్థానమైనది. ఇటువంటి గర్భవాసాలు ఇంకా ఎన్ని భరించవలసి ఉన్నదో! ఈ ఆపదను పోగొట్టడానికై కమలనాభుని చరణకమలాలను ఆశ్రయిస్తాను. అవి సంసార సాగరాన్ని తప్పక తరింపజేస్తాయి.

**క. అని కృతనిశ్చయుఁ డయి యే, చిన విమలజ్ఞాని యగుచు జీవుఁడు గర్భం**
**బున వెడల నొల్లకుండం, జనియెడు నవమాసములును జననీ! యంతన్. 1004**

* ఈ విధంగా నిశ్చయించుకొని అతిశయించిన నిర్మలజ్ఞానం కలవాడై, జీవుడు గర్భం నుండి వెడలి రాకుండా తొమ్మిది నెలలు అట్లాగే గడుపుతాడు తల్లీ!

వ. దశమ మాసంబున వాని నధోముఖుం గావించిన నుచ్ఛ్వాస నిశ్వాసంబులు లేక ఘనదుఃఖభాజనుండు విగతజ్ఞానుండు రక్తదిగ్ధాంగుండునై విష్ఠాస్థ క్రిమియుంబోలె నేలంబడి యేడ్చుచు జ్ఞానహీనుండై జడుఁడునుం బోలె నుండి యంత నిజభావనానభిజ్ఞులగు నితరులవలన వృద్ధిం బొందుచు నభిమతార్థంబులం జెప్ప నేరక యనేక కీటసంకులం బయిన పర్యంకంబునందు శయానుండై యవయవంబులు గండూయమానంబు లైన గోఁకనేరక యాసనోత్థాన గమనంబుల నశక్తుండై తన శరీరచర్మంబు మశక మత్కుణ మక్షికాదులు వొడువఁ గ్రిములచే వ్యథంబడు క్రిమియుంబోలె దోదూయమానుండై రోదనంబు సేయుచు విగతజ్ఞానుండై మెలంగుచు శైశవంబునం దత్తత్క్రియానుభవంబు గావించి పౌగండవయస్సునఁ దదనురూపంబులగు నధ్యయనాది దుఃఖంబు లనుభవించి తదనంతరంబ యౌవనంబు ప్రాప్తంబైన నభిమతార్థ ఫలప్రాప్తికి సాహసపూర్వంబు లగు వృథాగ్రహంబులు సేయుచు పంచమహాభూతార్థంబగు దేహంబందుఁ బెక్కుమాఱు లహంకార మమకారంబులం జేయుచుఁ దదర్థంబులైన కర్మంబు లాచరించుచు సంసారబద్ధుం డగుచు దుష్పురుష సంగమంబున శిశ్నోదర పరాయణుండై వర్తించుచు నజ్ఞానంబునం జేసి వర్ధిష్యమాణరోషుఁ డగుచుఁ దత్ఫలంబులగు దుఃఖంబు లనుభవించుచుఁ గాముకుండై నిజనాశంబునకు హేతువులగు కర్మంబులం బ్రవర్తించుచుండు మఱియును. **1005**

* అనంతరం పదోమాసం వస్తుంది. అప్పుడు జీవుడు తలక్రిందుగా తిరుగుతాడు. ఉచ్ఛ్వాస నిశ్వాసాలు లేక ఊపిరాడక ఉక్కిరి బిక్కిరౌతాడు. ఎంతో బాధపడుతూ జ్ఞానరహితుడై నెత్తురు పులుముకొన్న దేహంతో భూమిమీద పడతాడు.

అలా క్రిందపడి, ఏడుస్తూ, ఎరుకలేనివాడై ఉంటాడు. తన ఉద్దేశ్యం అర్థంచేసికోలేని ఇతరులచే పోషింపబడు తుంటాడు. తనకు కావలసిన దేదో చెప్పలేడు. పెక్కు కీటకాలతో నిండిన ప్రక్కమీద పండుకొంటాడు. శరీరం దురదపుట్టినా గోకుకోటం చేతకాదు. కూర్చోటానికీ లేవటానికీ నడవటానికీ శక్తి చాలదు. తన ఒంటి నిండా దోమలూ నల్లులూ ఈగలూ మొదలైనవి ప్రాకి కుడుతూ ఉంటే వారింపలేక క్రిములచే పీడింపబడే క్రిమిలాగా బాధపడుతూ, ఏడుస్తూ జ్ఞానం లేనివాడై మెలగుతుంటాడు.

ఈ విధంగా జీవుడు శైశవంలో ఆ యా అవస్థలు అనుభవిస్తూ బాల్యంలో విద్యాభ్యాసం మొదలైన వాటితో శ్రమపడుతూ, ఆ తర్వాత యౌవనంలో తన కోర్కెలు తీర్చుకోవడం కోసం సాహసంతో కూడిన పనికి మాలిన పంతాలూ పట్టుదలలూ పూనుతూ, కామోద్రేకంతో ప్రవర్తిస్తూ, పంచభూతాత్మకమైన తన దేహంమీద మాటిమాటికీ అహంకార మమకారాలు పెంచుకుంటూ, తదనుగుణమైన పనులు చేస్తూ, సంసార బంధాలలో కట్టుబడి, దుష్టుల స్నేహంవల్ల కామం పండించుకోవడం, కడుపు నిండించుకోవడంతోనే

సతమతమౌతూ, అజ్ఞానియై పెచ్చు పెరిగిపోతున్న మచ్చరంతో దానికి ఫలమైన దుఃఖాన్ని అనుభవిస్తూ, కామాంధుడై, తన నాశనానికి మూలకారణమైన చెడుపనులను చేస్తూ ఉంటాడు.

**సీ. జనయిత్రి! సత్యంబు శౌచంబు దయయును ధృతియు మౌనంబు బుద్ధియును సిగ్గు,**
**క్షమయును యశమును శమదమ భగములు, మొదలుగాఁగల గుణంబులు నశించు**
**జనుల కసత్సంగమున నని యెఱిఁగించి, వెండియు నిట్లను వినుము మూఢ**
**హృదయులు శాంతివిహీనులు దేహాత్మ, బుద్ధులు నంగనామోహ పాశ**

**తే. బద్ధ కేళీమృగంబుల పగిదిఁ గలిగి, పరవశస్వాంతమున శోచ్యభావులైన**
**వారి సంగతి విడువంగవలయు, నందు, నంగనా సంగమము దోష మండ్రుగాన. 1006**

* అమ్మా! దుర్మార్గుల సాంగత్యంవల్ల సత్యం, శుచిత్వం, దయ, ధైర్యం, మితభాషణం, బుద్ధి, సిగ్గు, ఓర్పు, కీర్తి, శమం, దమం మొదలైన గుణాలన్నీ నశిస్తాయి అని చెప్పి కపిలుడు తల్లితో మళ్ళీ ఇట్లా అన్నాడు.

మూఢ హృదయులు, శాంతి లేనివాళ్ళు, దేహమే ఆత్మ అని భావించేవాళ్ళు, స్త్రీ వ్యామోహంలో చిక్కుకొని గొలుసులతో బంధించిన పెంపుడు మృగాలలాగా పరవశించిపోయేవాళ్ళు - వీరంతా శోచనీయులు. ఇటువంటివాళ్ల సాంగత్యం వదలిపెట్టాలి. అందులోనూ స్త్రీ సాంగత్యం బలీయమైన దోషం అని ప్రాజ్ఞులంటారు.

**వ. దీని కొక్క యితిహాసంబు గలదు. తొల్లి యొక్కనాఁడు ప్రజాపతి దన కూఁతురయిన భారతి మృగీరూప ధారిణియై యుండం జూచి తదీయరూపరేఖా విలాసంబులకు నోటువడి వివశీకృతాంతరంగుండును, విగతత్రపుండునునై తానును మృగరూపంబు నొంది తదనుధావనంబు హేయంబని తలంపక ప్రవర్తించె. కావున నంగనా సంగమంబు వలవ దస్మదీయ నాభీ కమల సంజాత చతుర్ముఖ నిర్మిత మరీచ్యాద్యుద్భూత కశ్యపాది కల్పిత దేవమనుష్యాదులందు మాయాబలంబునం గామినీజన మధ్యంబున విఖండిత మనస్కుండు గాకుండఁ బుండరీకాక్షుం డైన నారాయణఋషికిం దక్క నన్యులకు నెవ్వరికిం దీరదని వెండియు నిట్లనియె. 1007**

* తల్లీ! దీనికి ఒక ప్రాచీన కథ ఉంది. పూర్వం ఒకనాడు బ్రహ్మదేవుడు తన కూతురైన సరస్వతి ఆడులేడి రూపం ధరించి ఉండగా చూచాడు. ఆమె సౌందర్యలావణ్యాలకు మురిసిపోయి పరవశించిన హృదయంతో సిగ్గు విడిచి, తానుకూడ మగలేడి రూపం ధరించి నీచమని అనుకోకుండా ఆమె వెంటబడి పరుగులెత్తాడు.

కాబట్టి పురుషునకు పరస్త్రీ సాంగత్యం తగదు. నా నాభికమలం నుండి పుట్టిన బ్రహ్మ, అతనిచే సృష్టింపబడిన మరీచి ప్రముఖులు, వారికి పుట్టిన కశ్యపాదులు, వీరిచే కల్పింపబడిన దేవతలు, మనుష్యులు, వీరి అందరిలోనూ చక్కదనాల చుక్కలైన రమణీమణుల మాయలకు చిక్కకుండా మొక్కవోని మనస్సు

కలిగి ఉండడం అనేది, పుండరీకాక్షుడైన ఒక్కనారాయణ మహర్షికే తప్ప ఇతరులకు ఎవ్వరికీ సాధ్యం కాదు అని కపిలుడు కన్న తల్లితో మళ్లీ ఇట్లా అన్నాడు.

**తే. రూఢి నా మాయ కామినీ రూపమునను, బురుషులకు నెల్ల మోహంబుఁ బొందఁ జేయుఁ**
**గాన పురుషులు సతులు సంగంబు మాని, యోగవృత్తిఁ జరించుచు నుండవలయు. 1008**

* అమ్మా! నా మాయయే స్త్రీరూపంలో, పురుషులకు మోహాన్ని కలిగిస్తుంది. కాబట్టి పురుషులు పరస్త్రీ సాంగత్యాన్ని పరిత్యజించి యోగమార్గంలో చరిస్తుండాలి.

**క. ధీరతతో మత్పదసర, సీరుహ సేవానురక్తిఁ జెందిన వారల్**
**నారీసంగము నిరయ, ద్వారముగా మనములందుఁ దలఁపుదు రెందున్. 1009**

* స్థిరబుద్ధితో నా పాదపద్మాలను సేవించడంలో ఆసక్తి గలవారు నారీ సాంగత్యాన్ని నరకద్వారంగా మనస్సులలో భావిస్తారు.

**క. హరిమాయా విరచితమై, తరుణీ రూపంబుఁ దాల్చి ధరఁ బర్విన బం**
**ధురతృణ పరివృతకూపము, కరణి నదియు మృత్యురూపకం బగు మఱియున్. 1010**

* నా మాయచేత కల్పింపబడిన కామినీ రూపం దట్టమైన గడ్డిచే కప్పబడిన కూపానికి అనురూపమై, మృత్యు స్వరూపమై ఉంటుంది.

**చ. ధన పశు పుత్త్ర మిత్ర వనితా గృహ కారణభూతమైన యీ**
**తనువున నున్న జీవుఁడు పదంపడి యట్టి శరీర మెత్తి న**
**న్ననుగతమైన కర్మఫల మందక పోవఁగరాదు, మింటఁ బో**
**యిన భువిఁ దూఱినన్ దిశల కేఁగిన నెచ్చటనైన దాఁగినన్. 1011**

* ధనధాన్యాలు పశువులు, పుత్రులు, మిత్రులు, స్త్రీలు, గృహాలు మొదలైన వాటికి కారణ భూతమైనది ఈ శరీరం. ఈ శరీరంలో ఉన్న జీవుడు ఇవన్నీ అనుభవించి మళ్ళీ ఈ జన్మలోని కర్మఫలాన్ని అనుభవించడం కోసం ఇటువంటి శరీరాన్ని తిరిగి ధరిస్తాడు. అమ్మా! ఆకాశంలోకి ఎగిరిపోయినా, భూమిలో దూరినా, దిక్కులకు పారిపోయినా, ఎచ్చట దాగినా కర్మఫలాన్ని అనుభవింపక తప్పదు.

**వ. అట్టి పురుషరూపంబు నొందిన జీవుండు నిరంతర స్త్రీ సంగంబుచే విత్తాపత్య గృహాది ప్రదంబగు స్త్రీత్వంబు నొందు, నీక్రమంబున నంగనారూపుండగు జీవుండు మన్మాయచేఁ బురుష రూపంబు నొంది ధనాది ప్రదుండగు భర్తను నాత్మబంధ కారణంబగు మృత్యువునుగ నెఱుంగవలయు, మఱియు జీవోపాధి భూతంబగు లింగదేహంబుచే స్వావాసభూతలోకంబున నుండి లోకాంతరంబు నొందుచుం బ్రారబ్ధకర్మఫలంబుల ననుభవించుచు మరలఁ గర్మాదులం దాసక్తుం డగుచు మృగయుండు గాననంబున ననుకూల సుఖ ప్రదుండైనను మృగంబునకు మృత్యువగు చందంబున**

**జీవుండు భూతేంద్రియ మనోమయం బైన దేహంబు గలిగి యుండు, నట్టి దేహనిరోధంబె మరణంబు, ఆవిర్భావంబె జన్మంబు, కాన సకల వస్తు విషయజ్ఞానంబు కలుగుటకు జీవునకు సాధనంబు చక్షురింద్రియంబ. ద్రష్టు దర్శనీయ యోగ్యతా ప్రకారంబున జీవునకు జన్మమరణంబులు లేవు గావున భయ కార్పణ్యంబులు విడిచి సంభ్రమంబు మాని జీవప్రకారంబు జ్ఞానంబునం దెలిసి ధీరుండై ముక్తసంగుం డగుచు యోగ్యవైరాగ్య యుక్తంబైన సమ్యగ్జ్ఞానంబున మాయావిరచితంబైన లోకంబున దేహాదులం దాసక్తి మాని వర్తింపవలయు నని చెప్పి వెండియు నిట్లనియె. 1012**

* పురుషరూపం ధరించిన జీవుడు ఎడతెగని స్త్రీ సాంగత్యంవల్ల భోగభాగ్యాలు పిల్లలు ఇల్లు మొదలైన వాటిపై ఆసక్తి పెంచుకొని వచ్చే జన్మలో స్త్రీగానే జన్మిస్తాడు. ఇలా స్త్రీత్వాన్ని పొందిన జీవుడు, నా మాయవల్ల పురుషరూపాన్ని పొంది ధనాదులను ఇచ్చే భర్తను సంసారబంధనానికి కారణంగా తెలుసుకోవాలి. ఈ సంసారబంధమే మృత్యువు. జీవునకు ఆధారంగా లింగమయ దేహం నిలిచి ఉంటుంది. ఆ లింగమయ దేహంతో తనకు నివాసమైన ఈ లోకంనుండి వేరు లోకాలను పొందుతూ పూర్వకర్మలయొక్క ఫలితాన్ని అనుభవిస్తూ, తిరిగి కర్మలపై ఆసక్తుడు అవుతూ ఉంటాడు. మనస్సు పంచభూతాలు పంచేంద్రియాలు - వీటితో ఏర్పడి సుఖ సాధనమైన దేహం క్రమంగా శుష్కించి నశిస్తుంది. అడవిలో వేటగాడు, మృగాలకు గానాదులతో అనుకూలమైన సదుపాయాలు కూర్చి ఆకర్షణలు అమర్చుతాడు. అవే మృగాలపాలిటికి మృత్యువుగా పరిణమిస్తాయి. అట్టి దేహాన్ని చాలించడమే మరణం. దానిని పొందడమే జననం.

సకల వస్తువులకూ సంబంధించిన జ్ఞానాన్ని పొందడానికి, జీవునకు సాధనం కన్ను. ద్రష్ట చూడదగిన దానిని చూచుట అనే యోగ్యత సంపాదించుకున్నప్పుడు, జీవునకు పుట్టుట గిట్టుట అనేవి ఉండవు. కాబట్టి మానవుడు పిరికితనాన్నీ, దైన్యభావాన్నీ వదలిపెట్టి, తొందరలేని వాడై, జీవుని స్వరూపాన్ని జ్ఞానం ద్వారా తెలుసుకొని, ధైర్యం వహించి బంధనాలు లేనివాడై యోగ్యమైన వైరాగ్యంతో కూడిన చక్కని జ్ఞానాన్ని అలవరచుకోవాలి. మాయాకల్పితమైన ఈ లోకంలో దేహం మొదలైన వానిపై ఆసక్తి లేకుండా ఉండాలి అని చెప్పి కపిలాచార్యుడు మళ్ళీ ఇట్లా అన్నాడు.

**సీ. గృహమందు వర్తించు గృహమేధు లగువారు మహిత ధర్మార్థ కామముల కొఱకు**
**సంప్రీతు లగుచుఁ దత్సాధనానుష్ఠాన నిరతులై వేదనిర్ణీత భూరి**
**భగవత్సుధర్మ తద్భక్తి పరాఙ్ముఖు లై దేవగణముల ననుదినంబు**
**భజియించుచును భక్తిఁ బైతృక కర్మముల్ సేయుచు నెప్పుడు శిష్టచరితు**

**తే. లగుచుఁ దగ దేవపితృసువ్రతాఢ్యు లయిన, కామ్యచిత్తులు ధూమాదిగతులఁ జంద్ర**
**లోకమును జెంది పుణ్యంబు లుప్త మయిన, మరలి వత్తురు భువికి జన్మంబు నొంద. 1013**

* సంసారానికి కట్టువడిన గృహస్థులు ధర్మార్థకామాలపై ప్రీతి కలిగి - వాటితోనే సంతుష్టులై వాటిని సాధించడంలోనే మునిగి తేలుతూ ఉంటారు. వేదాలలో నిర్ణయింపబడిన భాగవత ధర్మాలకూ భగవద్భక్తికీ

విముఖులై ఉంటారు. దేవగణాలను నిత్యం ఆరాధిస్తుంటారు. పితృకార్యాలను భక్తితో చేస్తూ సదాచార సంపన్నులై ఉంటారు. కానీ ఇట్లా దేవతలకూ పితరులకూ సంబంధించిన సత్కర్మలను ఆచరించడంలోనే నేర్పరులై, కోర్కెలు నిండిన చిత్తం గలవారు మోక్షాన్ని అందుకోలేరు. వారు ధూమ్రాది మార్గాలలో చంద్రలోకం చేరి అచ్చట సుఖాలు అనుభవించి పుణ్యం తరిగి నశింపగా మళ్ళీ జన్మ ఎత్తడం కోసం భూలోకానికి వస్తారు.

**వ. అదియునుంగాక. 1014**

**తే. ప్రవిమలానంత భోగితల్పంబునందు,యోగనిద్రాళువై హరి యున్నవేళ**
**నఖిల లోకంబులును విలయంబు నొందు, నట్టి సర్వేశ్వరునిఁ గూర్చి యలఘుమతులు, 1015**

* అంతేగాక, అత్యంత నిర్మలమైన ఆదిశేషుని పానుపుమీద శ్రీమన్నారాయణుడు యోగనిద్రలో మునిగి ఉన్న సమయంలో సమస్త లోకాలూ ప్రళయాన్ని పొందుతాయి. అటువంటి సర్వేశ్వరుణ్ణి బుద్ధిమంతులైనవారు ధ్యానిస్తారు.

**మ. పరికింపన్ నిజభక్తియుక్తి గరిమం బాటిల్లు పంకేరుహో**
**దర విన్యస్త సమస్త ధర్మముల శాంత స్వాంతులై సంగముం**
**బరివర్జించి విశుద్ధచిత్తు లగుచుం బంకేజపత్రేక్షణే**
**తర ధర్మైక నివృత్తులై సతతమున్ దైత్యారిఁ జింతించుచున్. 1016**

* వారు అచంచలమైన భక్తిప్రపత్తులతో తమతమ ధర్మాలన్నీ కమలనాభునికే సమర్పించి, ప్రశాంత చిత్తులై, సర్వసంగ పరిత్యాగులై, పుండరీకాక్షుని ఆరాధన తప్ప, తదితర ధర్మాలనుండి దూరంగా ఉంటూ, నిత్యం ఆ దైత్యారినే భావిస్తూ ఉంటారు.

**సీ. మఱియు నహంకార మమకార శూన్యులై యర్థి వర్తించుచు నర్చిరాది**
**మార్గ గతుండును మహనీయ చరితుండు విశ్వతోముఖుఁడును విమలయశుఁడు**
**జగదుద్భవస్థానసంహార కారణుం డవ్యయుం డజుఁడుఁ బరాపరుండుఁ**
**బురుషోత్తముఁడు నవ పుండరీకాక్షుండు నైన సర్వేశ్వరునందుఁ బొంది**

**తే. మానితాపునరావృత్తిమార్గ మయిన, ప్రవిమలానంద తేజోవిరాజమాన**
**దివ్యపదమున సుఖియించు ధీరమతులు, మరలిరా రెన్నటికిని జన్మముల నొంద. 1017**

* అంతేకాక "నేను" అనే అహంకారం గానీ, "నాది"అనే మమకారంగానీ, లేకుండా ఉంటారు. వెలుగు త్రోవల పయనించువాడు, ఉన్నతోన్నతమైన చరిత్ర కలవాడు, లోకమంతట నిండియున్నవాడు, పవిత్రమైన యశస్సు కలవాడు, జగత్తులు పుట్టుటకు, నిలుకడకు, నాశనానికి కారణ మైనవాడు, నాశం లేనివాడు, జన్మ లేనివాడు, శ్రేష్ఠులలో శ్రేష్ఠుడు, పురుషోత్తముడు, నవపుండరీక నయనుడు అయిన సర్వేశ్వరునిపై బుద్ధి నిలిపి, మళ్ళీ జన్మంటూ లేని మహనీయ మార్గంలో స్వచ్ఛమై ఆనందమయమై

తేజోవిరాజితమైన దివ్య ధామాన్ని శాశ్వతంగా చూరగొని సుఖించే ధీరులు పునర్జన్మ కోసం పుడమిపైకి ఎన్నటికీ తిరిగిరారు.

**వ. మఱియుఁ బరమేశ్వర దృష్టిచే హిరణ్యగర్భు నుపాసించు వారు సత్యలోకంబున ద్విపరార్ధావసానంబగు ప్రళయంబుఁ దనుకఁ బరుండగు చతురాననుం బరమాత్మ రూపంబున ధ్యానంబు సేయుచు నుండి పృథివ్యప్తేజో వాయ్వాకాశమాన సేంద్రియ శబ్దాది భూతాదులతోడంగూడ లోకంబును బ్రకృతియందు లీనంబు సేయ సర్వేశ్వరుండు సకల సంహర్తయగు సమయంబున గతాభిమానంబులు గలిగి బ్రహ్మలోకవాసులగు నాత్మలు బ్రహ్మతోడం గూడి పరమానంద రూపుండును సర్వోత్కృష్టుండు నగు పురాణపురుషుం బొందుదురు, కావున నీవు సర్వభూతహృదయ పద్మనివాసుండును శ్రుతానుభావుండును నిష్కళంకుండును నిరంజనుండును నిర్ద్వంద్వుండును నగు పురుషుని భావంబుచే శరణంబు నొందు మని చెప్పి మఱియును నిట్లనియె. 1018**

* కొందరు తెలియనివారు పరమేశ్వరుడనే దృష్టితో సృష్టికర్త అయిన బ్రహ్మదేవుణ్ణి ఉపాసిస్తారు. వారు బ్రహ్మతోపాటు సత్యలోకంలో ఉంటారు. రెండు పరార్ధాల కాలం పూర్తికాగానే బ్రహ్మకు ప్రళయం వస్తుంది. పృథివి, జలం, అగ్ని, వాయువు, ఆకాశం అనే పంచభూతాలు, మనస్సు, పంచేంద్రియాలు, పంచతన్మాత్రలు, వానితోకూడిన సమస్త ప్రకృతీ, సకలలోకాలు సర్వసంహర్త అయిన సర్వేశ్వరునిలో విలీన మవుతాయి. అప్పుడు సత్యలోక వాసు లయినవారు బ్రహ్మలోకంపై అభిమానం వదలి బ్రహ్మతోకూడ పరమానంద స్వరూపుడూ, సర్వోత్కృష్టుడూ, అయిన పురాణ పురుషునిలో కలిసిపోతారు. కాబట్టి తల్లీ నీవు సకల ప్రాణుల హృదయ పద్మాల్లో నివాసం చేస్తూ ఉండేవాడూ, మహానుభావుడూ, నిష్కలంకుడూ, నిరంజనుడూ, అద్వితీయుడూ అయిన పురుషోత్తముణ్ణి మనసారా శరణుపొందు - అని చెప్పి కపిలుడు మళ్ళీ ఇట్లా అన్నాడు.

**మ. సకలస్థావర జంగమ ప్రతతికిం జర్చింపఁ దా నాధ్యుఁడై**
**యకలంక శ్రుతి గర్భుఁడుం బరముఁడు న్నైనట్టి యీశుండు సే**
**వక యోగీంద్ర కుమార సిద్ధముని దేవశ్రేణి యోగ ప్రవ**
**ర్తకమై తన్ను భజింపఁజూపు సగుణ బ్రహ్మంబు లీలాగతిన్. 1019**

* తల్లీ! సమస్త చరాచర ప్రాణికోటికీ అధీశ్వరుడు, పవిత్రాలైన వేదాల పుట్టుకకు కారణభూతుడు, సర్వశ్రేష్ఠుడు, అయినవాడు పరమేశ్వరుడు.

యోగీంద్రులూ, సనకసనందనాది కుమారులూ, సిద్ధులూ, మునులూ, దేవతలూ అందరూ భక్తియోగంతో ఆ పరాత్పరుణ్ణే భజిస్తారు. అటువంటి వారికీ ఆయన సగుణ స్వరూపంతో దర్శనమిస్తాడు.

**సీ. అట్టి సర్వేశ్వరుం డయ్యయికాలంబు లందును దద్గుణవ్యతికరమున**
**జనియించుచుండు, నీ చాడ్పున ఋషి దేవ గణములు దమ తమ కర్మ నిర్మి**

తైశ్వర్య పారమేష్ఠ్యములందుఁ బురుషత్వమునఁ బొంది యధికారములు వహించి వర్తించి క్రమ్మఱ వత్తురు, మఱి కొంద ఱారూఢ కర్మానుసారమైన

తే. మనములను జాలఁ గలిగి ధర్మములయందు, శ్రద్ధతోఁ గూడి యప్రతిషిద్ధమైన నిత్యనైమిత్తికాచార నిపుణు లగుచుఁ, దగి రజోగుణ కలిత చిత్తములు గలిగి. 1020

వ. సకాములై యింద్రియ జయంబు లేక పితృగణంబుల నెల్లప్పుడుఁ బూజించుచు గృహంబులయందు వర్తించి హరి పరాఙ్ముఖు లగువారు త్రైవర్గిక పురుషులని చెప్పంబడుదురు. 1021

* అటువంటి సర్వేశ్వరుడు ఆ యా సమయాలలో తన మహనీయ గుణగణాల కలయికచే అనేక రూపాలలో అవతరిస్తూ ఉంటాడు. ఈ విధంగా అతని అంశలు పంచుకొని పుట్టిన ఋషులూ దేవతలూ తమ కర్మఫలాన్ని అనుసరించి పౌరుషంతో ఐశ్వర్యం, పారమేష్ఠ్యం మొదలైన అధికారాలు చేపట్టి కొంతకాలం అనుభవించి, యథాస్థానానికి తిరిగి వస్తారు. మరికొందరు కర్మానుసారమైన మనస్సు కలవారై, ధర్మమందు శ్రద్ధ కలవారై, ధర్మానికి విరుద్ధం కాకుండునట్లుగా, నిత్యమూ తాము చేయదగిన ఆచారాలను నిర్వర్తిస్తూ, రజోగుణంతో నిండిన మనస్సు కలవారై కామ ప్రవృత్తికి లోబడి ఇంద్రియాలను జయింపలేక పితృదేవతలను అనుదినం ఆరాధిస్తూ గృహాలలో పడి సంసార నిమగ్నులై జీవిస్తూ, హరిపరాఙ్ముఖులై ధర్మార్థకామాలను మాత్రమే నమ్ముకొని వర్తిస్తారు. అటువంటివారు. "త్రైవర్గిక పురుషు''లని పిలువబడతారు.

చ. వినుత గుణోత్తరుండు నురువిక్రముఁడైన హరిన్ భజించి త
న్మనన లసత్కథామృతము మానుగఁ గ్రోలుట మాని దుష్కథల్
విని ముద మందుచుందురు, వివేకవిహీనత నూరఁబంది యా
త్మను మధురాజ్యభక్ష్యములు మాని పురీషముకేగు చాడ్పునన్. 1022

* అనంత కల్యాణగుణ విశిష్టుడూ, అద్వితీయ పరాక్రముడూ అయిన త్రివిక్రముని భజిస్తూ ఆయన మహిమలనే మననం చేస్తూ ఆయన మధుర కథాసుధను తనివితీరా త్రాగడం ఉత్తమలక్షణం. అలాకాక మరికొందరు ఊరబంది అవివేకంతో తీయ తీయని నేతివంటకాలను కాలదన్ని మలభక్షణకై పరువెత్తినట్లుగా, అడ్డమైన చెడ్డ కథలూ వింటూ ఆనందిస్తూ ఉంటారు.

చ. అలవడ ధూమమార్గగతులై పితృలోకముఁ బొంది పుణ్యముం
బొలసినవారు దొంటి తమ పుత్త్రులకుం దగఁ దాము పుట్టి వి
హ్వల మతి గర్భగోళ పతనాది పరేత ధరాగతాంతమై
వెలసిన కర్మ మిం దనుభవింతురు గావున నీవు భామినీ! 1023

* ఓ అమ్మా! ధూమమార్గాలగుండా వెళ్లి, పితృలోకం చేరి సుఖించేవారు తమ పుణ్యం తరిగిపోగానే మళ్లీ ఈ పుడమిమీద దమ బిడ్డలకే బిడ్డలై జన్మిస్తారు. వశం తప్పిన మనస్సుతో, మాతృ గర్భం నుండి బయటపడింది మొదలుగా, శ్మశాన భూమికి చేరే పర్యంతం ఆ యా కర్మఫలాలను ఇక్కడే అనుభవిస్తారు.

క. విను సర్వభావములఁ బర, ముని ననఘు ననంతు నీశుఁ బురుషోత్తము స
న్మనమున భజియింపుము ముద, మునఁ, బునరావృత్తి లేని ముక్తి లభించున్. 1024

* అందువల్ల ఓ జననీ! సర్వశ్రేష్ఠుడూ, పాపరహితుడూ, అనంతుడూ, అధీశ్వరుడూ, పురుషోత్తముడూ అయిన పరమేశ్వరుణ్ణి సమస్తరీతులా సద్బుద్ధితో సంతోషంగా సేవింపు. అలా చేస్తే పునర్జన్మం లేని కైవల్యం నీకు లభిస్తుంది.

వ. అని చెప్పి వెండియు నిట్లనియె: భగవంతుండగు వాసుదేవునియందుం బ్రయుక్తంబగు భక్తియోగంబు బ్రహ్మసాక్షాత్కార సాధనంబు లగు వైరాగ్యజ్ఞానంబులం జేయు, నట్టి భగవద్భక్తి యుక్తంబైన చిత్త బింద్రియ వృత్తులచే సమంబులగు నర్థంబులందు వైషమ్యంబును ప్రియా ప్రియంబులును లేక నిస్సంగంబు సమదర్శనంబు హేయోపాదేయ విరహితంబునై యారూఢంబైన యాత్మపదంబు నాత్మచేఁ జూచుచుండు, జ్ఞానరూపుండును బరబ్రహ్మంబును బరమాత్ముండును నీశ్వరుండును నగు పరమపురుషుం డేకరూపంబు గలిగి యుండియు దృశ్యద్రష్టృకరణంబులచేతం బృథగ్భావంబును బొందుచుండు, నిదియ యోగికి సమగ్రంబగు యోగంబునం జేసి ప్రాప్యంబగు ఫలంబు, కావున విషయవిముఖంబు లగు నింద్రియంబులచేత జ్ఞానరూపంబును హేయగుణ రహితంబును నగు బ్రహ్మంబు మనోవిభ్రాంతిం జేసి శబ్దాది ధర్మంబగు నర్థరూపంబునం దోఁచు, అది యెట్టు లర్థాకారంబునం దోఁచు నని యడిగితివేని నహంకారంబు గుణరూపంబునం జేసి త్రివిధంబును, భూతరూపంబునం బంచ విధంబును, నింద్రియరూపంబున నేకాదశ విధంబునై యుండు, జీవరూపుం డగు విరాట్పురుషుండు జీవవిగ్రహంబైన యండంబగు జగంబునం దోఁచుచుండు, దీని శ్రద్ధాయుక్తం బయిన భక్తిచేత యోగాభ్యాసంబునం జేసి సమాహిత మనస్కుండై నిస్సంగత్వంబున విరక్తుండైన వాఁడు వొడగను చుండు, నది యంతయు బుధజన పూజనీయ చరిత్రవు గావున నీకుం జెప్పితి, సర్వయోగ సంప్రాప్యుండును నిర్గుణుండును భగవంతుండని చెప్పిన జ్ఞానయోగంబును, మదీయ భక్తి యోగంబును నను రెండు నొక్కటియ, యింద్రియంబులు భిన్నరూపంబులు గావున నేకరూపంబయిన యర్థం బనేక విధంబు లగున ట్లేకం బగు బ్రహ్మం బనేక విధంబులుగఁ దోఁచు, మఱియును. 1025

* కపిలాచార్యుడు ఈ విధంగా చెప్పి మళ్లీ ఇట్లా అన్నాడు. అమ్మా! పరమేశ్వరుడైన వాసుదేవుని యందు అభివ్యక్తమైన భక్తియోగం జ్ఞానాన్నీ వైరాగ్యాన్నీ కలుగజేస్తుంది. ఈ జ్ఞాన వైరాగ్యాలే బ్రహ్మసాక్షాత్కారానికి సాధనాలు. అటువంటి భగవద్భక్తితో కూడిన చిత్తం ఇంద్రియ వ్యాపారాలయందు సమంగా వర్తిస్తుంది. అటువంటి మనస్సు కలవానికి హెచ్చుతగ్గు లుండవు. ప్రియాప్రియము లుండవు. విషయ లాలస ఉండదు. గ్రహింప దగినవీ, తిరస్కరింప తగినవీ ఉండవు. సర్వత్ర సమదర్శన మేర్పడుతుంది. తనలో ఉన్న ఆత్మ స్వరూపాన్ని తాను చూడగలుగుతాడు.

జ్ఞాన స్వరూపుడు, పరబ్రహ్మ, పరమాత్ముడు, ఈశ్వరుడు అయిన పరమేశ్వరుడు ఒకే రూపం కలవాడై ఉండికూడా, కనబడే రూపాన్ని బట్టీ, చూచేవారినిబట్టీ, చూడటానికి ఉపయోగ పడే సాధనాలనుబట్టీ, వేరువేరు రూపాలలో గోచరిస్తాడు. ఇదియే యోగి అయినాడు సంపూర్ణ యోగంవల్ల పొందదగిన ఫలం.

విషయాలనుండి వెనుకకు మరలిన ఇంద్రియాలవల్ల జ్ఞాన స్వరూపమూ, హేయగుణ రహితమూ అయిన పరబ్రహ్మ దర్శనం లభిస్తుంది. ఆ పరబ్రహ్మమే మనస్సుయొక్క భ్రాంతి వలన శబ్దం స్పర్శం మొదలైన వాని ధర్మాలైన అర్థాల స్వరూపంతో గోచరిస్తున్నది.

" ఆ పరబ్రహ్మం అర్థస్వరూపంతో ఎట్లా కనిపిస్తుంది?" అని నీవు అడుగుతావేమో, చెబుతాను విను. అహంకారం గుణరూపం ధరించి సత్త్వరజస్తమస్సులై మూడు విధాలుగానూ, భూత రూపం ధరించి పృథివ్యాపస్తేజో వాయ్వాకాశాలనే అయిదు విధాలుగానూ, ఇంద్రియరూపం ధరించి పదకొండు విధాలుగానూ ఉంటుంది. ఈ విధంగా అహంకారమే నానావిధాలుగా భాసిస్తుంది.

విరాట్పురుషుడు జీవస్వరూపుడు. జీవరూపమైన ఈ జగత్తు అనే గ్రుడ్డులో అతడు నిండి ఉంటాడు. ఈ పరమ రహస్యాన్ని శ్రద్ధా సహితమైన భక్తితోనూ, యోగాభ్యాసంతోనూ, నిశ్చల చిత్తం కలవాడై, వైరాగ్యం పొందినవాడు దర్శిస్తాడు. అమ్మా! నీవు జ్ఞాన సంపన్నులైన పెద్దలు పూజింపదగిన చరిత్ర గలదానవు. కాబట్టి నీకు ఈ విషయమంతా వెల్లడించాను.

సమస్త యోగసాధనలవల్ల పొందదగిన పరబ్రహ్మను నిర్గుణుడని జ్ఞానయోగులు పలుకుతున్నారు. నేను చెప్పిన భక్తియోగం ఆ పరమాత్మను సగుణుడుగా పేర్కొంటున్నది. వాస్తవానికి జ్ఞానయోగం భక్తియోగం రెండూ ఒక్కటే.

ఇంద్రియాలు వేరువేరు రూపాలతో ఉంటాయి. అందువల్లనే ఒకే రూపంలో ఉండే వస్తువు అనేక విధాలుగా తోచినట్లు, ఒకే పరమాత్మ అనేక విధాలుగా గోచరిస్తున్నాడు.

**సీ. అంబ! నారాయణుం డఖిల శాస్త్రములను సమధికానుష్ఠిత సవనతీర్థ**
**దర్శన జపతపోఽధ్యయన యోగక్రియా దాన కర్మంబులఁ గానఁబడఁడ,**
**యేచిన మనము బాహ్యేంద్రియంబుల గెల్చి సకల కర్మత్యాగ సరణి నొప్పి**
**తలకొని యాత్మ తత్త్వజ్ఞానమున మించి యుడుగక వైరాగ్యయుక్తిఁ దనరి**

**తే. మహిత ఫల సంగరహిత ధర్మమునఁ దనరు, నట్టి పురుషుండు దలపోయ, నఖిల హేయ**
**గుణములను బాసి కల్యాణ గుణవిశిష్టుఁ, డైన హరి నొందుఁ బరమాత్ము ననఘుఁ డగుచు.1026**

* అమ్మా! ఆ శ్రీమన్నారాయణుడు సమస్త శాస్త్రాలను చక్కగా చదివినందు వల్లనూ; అనుష్ఠానాలూ, యజ్ఞాలూ, తీర్థయాత్రలూ, జపతపాలూ ఆచరించినందువల్లనూ కనిపించదు. వేదాలు అధ్యయనం చేయడం వల్లనూ, యోగాభ్యాసాల వల్లనూ; దానాలూ, వ్రతాలూ చేసినందువల్లనూ భగవంతుడు గోచరించడు. చంచలమైన మనస్సును లోగొని చెలరేగిన ఇంద్రియాలను జయించి, కర్మ లన్నింటినీ భగవదర్పితం చేసి, ఆత్మస్వరూపాన్ని గుర్తించి, తరగిపోని వైరాగ్యంతో ఫలితాలను అపేక్షించకుండా ప్రవర్తించే పురుషుడు మాత్రమే దుర్గుణాలను దూరం చేసుకొని పాపాలను పటాపంచలు గావించి అనంత కళ్యాణ గుణ విశిష్టుడైన ఆ హరిని - ఆ పరమాత్మను - చేరగలుగుతాడు.

వ. అది గావున నీకుం జతుర్విధ భక్తియోగ ప్రకారంబుఁ దేటపడ నెఱింగించితి, నదియునుం గాక కామరూప యగు మదీయ గతి జంతువులయందు నుత్పత్తి వినాశరూపంబుల నుండు, నవిద్యా కర్మ నిర్మితంబులైన జీవుని గతు లనేక ప్రకారంబులై యుండు, నదియు జీవాత్మ వానియందుం బ్రవర్తించి యాత్మగతి యిట్టిదని యెఱుంగక యుండు - నని చెప్పి మఱియు నిట్లనియె - ఇట్టి యతి రహస్యంబగు సాంఖ్యయోగ ప్రకారంబు ఖలునకు, నవినీతునకు, జడునకు, దురాచారునకు, డాంబికునకు, నింద్రియలోలునకుఁ, బుత్ర దారాగారాద్యత్యంతాసక్త చిత్తునకు, భగవద్భక్తిహీనునకు, విష్ణు దాసులయందు ద్వేషపడువానికి నుపదేశింపవలవదు, శ్రద్ధా సంపన్నుండును, భక్తుండును, వినీతుండును, ననూయారహితుండును, సర్వభూతమిత్త్రుండును, శుశ్రూషాభిరతుండును, బాహ్యార్థజాత విరక్తుండును, శాంత చిత్తుండును, నిర్మత్సరుండును, శుద్ధాత్ముండును, భక్తులయందుఁ బ్రేమ గల వాఁడును, నన్యకాంతా విముఖుండును, నిష్కాముండును నగు నధికారికి నుపదేశింప నర్హం బగు, ఈ యుపాఖ్యానం బే పురుషుండేనిఁ బతివ్రత యగు నుత్తమాంగన యేని శ్రద్ధాభక్తులు గలిగి మదర్పిత చిత్తంబున న్వినుఁ బఠియించు నట్టి పుణ్యాత్ములు మదీయ దివ్యస్వరూపంబుం బ్రాపింతు రని చెప్పెనని మైత్రేయుండు విదురునకు వెండియు నిట్లనియె, ఈ ప్రకారంబునం గర్దమదయితయైన దేవహూతి గపిలుని వచనంబుల విని నిర్ముక్త మోహపటల యగుచు సాష్టాంగ దండ ప్రణామంబు లాచరించి తత్త్వ విషయాంకిత సాంఖ్యజ్ఞాన ప్రవర్తకం బగు స్తోత్రంబు సేయ నుపక్రమించి కపిలున కిట్లనియె. 1027

* అందువల్ల అమ్మా! నీకు నేను ఆర్తులకూ, జిజ్ఞాసువులకూ, అర్థార్థులకూ, జ్ఞానులకూ సంబంధించిన నాలుగు విధాలైన భక్తి మార్గాలను విశదంగా తెలియజెప్పాను. అంతేకాక స్వేచ్ఛారూపమైన నా సంకల్పం ప్రాణులందు జనన మరణ రూపాలతో ఉంటుంది. అజ్ఞానంచే ఆచరించే కర్మల మూలంగా కలిగే జీవుని ప్రవర్తనలు అనేక విధాలుగా ఉంటాయి. జీవాత్మ అటువంటి అకర్మలు ఆచరిస్తూ ఆత్మస్వరూపం ఇటువంటిది అని తెలియని స్థితిలో ఉంటాడు - అని చెప్పి కపిలుడు మళ్ళీ ఇట్లా అన్నాడు.

ఇటువంటి అతిరహస్యమైన సాంఖ్యయోగ పద్ధతి దుష్టునకూ, నీతి హీనునకూ, మూర్ఖునకూ, దురాచారునకూ, డంబాలు కొట్టేవానికి, ఇంద్రియసుఖాలకు లోబడిన వానికీ; పిల్లలు, ఇల్లాలు, ఇల్లు మొదలైన వానిపై అపరిమితమైన ఆసక్తి గలవానికీ, భగవంతునిపై భక్తి లేనివానికీ, విష్ణు భక్తులను ద్వేషించే వానికీ ఉపదేశింప కూడదు. శ్రద్ధాసక్తుడు, భక్తుడు, వినయసంపన్నుడు, ద్వేషరహితుడు, సర్వప్రాణులను మైత్రీభావంతో చూచేవాడు, విజ్ఞాన విషయాలను వినాలనే ఆసక్తి కలవాడు, ప్రాపంచిక విషయాలపై విరక్తుడు, శాంతచిత్తుడు, మాత్సర్యం లేనివాడు, స్వచ్ఛమైన మనస్సు కలవాడు, భక్తులందు ప్రేమ కలవాడు, పరస్త్రీలను మంచి భావంతో చూచేవాడు, చెడు కోరికలు లేనివాడు అయినవానికి మాత్రమే ఈ సాంఖ్యయోగం ఉపదేశింప తగింది. అటువంటివాడే ఇందుకు అర్హుడైన అధికారి.

ఈ ఉపాఖ్యానాన్ని ఏ పురుషుడైనా, పతివ్రత అయిన ఏ ఉత్తమ స్త్రీ అయినా శ్రద్ధాభక్తులతో నాపై మనస్సు నిలిపి వినినా, చదివినా అటువంటి పుణ్యాత్ములు నా దివ్య స్వరూపాన్ని పొందుతారు అని కపిలుడు దేవహూతితో చెప్పాడని చెప్పి మైత్రేయుడు విదురుణ్ణి చూచి ఇంకా ఇట్లా అన్నాడు.

ఈ విధంగా కర్దమమహర్షి అర్ధాంగి అయిన దేవహూతి కపిలాచార్యుని ఉపదేశం ఆలకించింది. ఆమె మోహం తొలగిపోయింది. కన్నతల్లి కపిలాచార్యునికి సాష్టాంగ దండ ప్రణామాలు చేసింది. పరబ్రహ్మానికి సంబంధించిన తాత్త్వికమైన సాంఖ్య జ్ఞానంతో కపిలుణ్ణి ఇలా స్తోత్రం చేయడం ప్రారంభించింది.

**సీ. అనయంబు విను మింద్రియార్థ మనోమయంబును భూతచయమయంబును నశేష**
**భూరి జగద్బీజ భూతంబును గుణప్రవాహ కారణమును వలను మెఱయు**
**నారాయణాభిఖ్య నాఁ గల భవదీయ దివ్యమంగళమూర్తిఁ దేజరిల్లు**
**చారు భవద్గర్భ సంజాతుఁ డగునట్టి కమల గర్భుండు సాక్షాత్కరింప**

**తే. లేక మనమునఁ గనియె ననేకశక్తి, వర్గములు గల్గి సుగుణప్రవాహరూప**
**మంది విశ్వంబు దాల్చి సహస్రశక్తి, కలితుఁడై సర్వకార్యముల్ గలుగఁజేయు. 1028**

* ఇంద్రియాలు, ఇంద్రియార్థాలు, మనస్సు, పంచభూతాలు - వీనితో నిండి, సమస్తజగత్తుకూ బీజభూతమై సత్త్వరజస్తమోగుణ ప్రవాహానికి మూలకారణమై "నారాయణుడు" అనే నామంతో నీ దివ్యమంగళ విగ్రహం తేజరిల్లుతూ ఉంటుంది. అటువంటి నీ కల్యాణమూర్తిని నీ నాభికమలంనుండి జన్మించిన చతుర్ముఖుడే సాక్షాత్తుగా సందర్శించలేక ఎలాగో తన మనస్సులో కనుగొన గలిగాడు. అలా చూచి నీ అనుగ్రహంవల్ల అనేక శక్తులను తనలో వ్యక్తీకరించుకొని వేలకొలది శక్తులతో కూడినవాడై ప్రవాహరూపమైన ఈ విశ్వాన్ని సృజింప కలుగుతున్నాడు. సృష్టి సంబంధమైన సర్వకార్యాలనూ నిర్వహింప గలుగుతున్నాడు.

వ. అంత. 1029

**తే. అతుల భూరి యుగాంతంబునందుఁ గపట, శిశువవై యొంటి కుక్షి నిక్షిప్త నిఖిల**
**భువన నివహుండవై మహాంభోధి నడుమఁ, జారు వటపత్ర తల్పసంస్థాయి వగుచు. 1030**

* మహాప్రళయ సమయంలో సమస్త భువన సముదాయాన్నీ నీ ఉదరంలో పదిలంగా దాచుకొని మహాసాగర మధ్యంలో మర్రి ఆకు పాన్పుమీద మాయాశిశువవై ఒంటరిగా శయనించి ఉంటావు.

**తే. లీల నాత్మీయ పాదాంగుళీ వినిర్గ, తామృతము గ్రోలినట్టి మహాత్మ! నీవు**
**గడఁగి నా పూర్వభాగ్యంబు కతన నిపుడు, పూని నాగర్భమున నేఁడు పుట్టితయ్య! 1031**

* మహానుభావా! అలా వటపత్రశాయివైన నీవు లీలగా నీ కాలిబొటన వ్రేలిని నోటిలో నుంచుకొని అందలి అమృతాన్ని ఆస్వాదిస్తూ ఉంటావు. అటువంటి ఆదినారాయణమూర్తి వైన నీవు నా పూర్వపుణ్య విశేషంవల్ల ఇప్పుడు నా కడుపున పుట్టావు.

వ. అట్టి పరమాత్ముండ వయిన నీవు. 1032

సీ. వరుస విగ్రహ పారవశ్యంబునను జేసి రఘురామ కృష్ణ వరాహ నార
సింహాది మూర్తు లంచితలీల ధరియించి దుష్టనిగ్రహమును శిష్టపాల
నమును గావించుచు నయమున సద్ధర్మ నిరత చిత్తులకు వర్ణింపఁ దగిన
చతురాత్మతత్త్వ విజ్ఞాన ప్రదుండవై వర్తింతు వనఘ! భవన్మహత్త్వ

తే. మజున కయినను వాక్రువ్వ నలవి గాదు, నిగమ జాతంబు లయిన వర్ణింపలేవ
యెఱిఁగి సంస్తుతి సేయ నే నెంత దాన?, వినుత గుణశీల! మాటలు వేయు నేల? 1033

* పరమాత్మ స్వరూపుడవైన నీవు అవతారాల మీద ముచ్చటపడి రఘురామచంద్రుడుగా, శ్రీకృష్ణ ప్రభువుగా, వరాహస్వామిగా, నరసింహమూర్తిగా ఆకారాలు ధరించి దుష్టశిక్షణం, శిష్టరక్షణం చేస్తావు. ఉత్తమ ధర్మమునందు ప్రవృత్తమైన చిత్తం గల భక్తులకు జ్ఞానదృష్టిని ప్రసాదించటం కోసం వాసుదేవ సంకర్షణ అనిరుద్ధ ప్రద్యుమ్న వ్యూహాలను అవలంబించి ప్రవర్తిస్తావు. అనఘుడవు, అనంతకల్యాణగుణ సంపన్నుడవు అయిన నీ మహత్త్వాన్ని అభివర్ణించడం చతుర్ముఖునకూ, చతుర్వేదాలకు కూడా సాధ్యం కాదంటే ఇక నే నెంత దాన్ని? వెయ్యి మాట లెందుకు! నిన్ను తెలుసుకొని సన్నుతించటం నాకు శక్యం గాని పని.

వ. అదియునుం గాక. 1034

క. ధీమహిత! భవన్మంగళ, నామస్మరణానుకీర్తనము గల హీనుల్
శ్రీమంతు లగుదు, రగ్ని, ష్టోమాదికృదాళికంటె శుద్ధులు దలఁపన్. 1035

* అంతేకాదు; ఓ జ్ఞానస్వరూపా! మంగళకరమైన నీ నామాన్ని స్మరించినా, పదిమందితో కలిసి పాడినా దరిద్రులు సైతం శ్రీమంతులౌతారు. అంతేకాదు. అటువంటి వారు అగ్నిష్టోమం మొదలైన యజ్ఞాలు చేసిన వారికంటే పరిశుద్ధు లవుతారు.

వ. అదియునుం గాక. 1036

క. నీ నామస్తుతి శ్వపచుం, డైనను జిహ్వాగ్రమందు ననుసంధింపన్
వానికి సరి భూసురుఁడుం, గానేరఁడు చిత్ర మిది జగంబుల నరయన్. 1037

* ఆ మాత్రమే కాదు, ధరిత్రిలో మరో విచిత్రమైన విషయ మేమిటంటే భక్తి పూర్వకంగా నీ నామాన్ని జిహ్వాగ్రాన నిలుపుకొని జపించినట్లయితే వాడు కుక్క మాంసము తినే చండాలుడైనా సరే వానితో బ్రాహ్మణుడు కూడా సాటి కాలేడు.

ఉ. ఈవిధ మాత్మలం దెలిసి యెప్పుడు సజ్జనసంఘముల్ జగ
త్పావనమైన నీ గుణకథామృత మాత్మలఁ గ్రోలి సర్వ తీ

**ర్థావళిఁ గ్రుంకినట్టి ఫల మందుదు రంచు సమస్త వేదముల్**
**వావిరిఁ బల్కుఁ గావునను వారలు ధన్యులు మాన్యు లుత్తముల్.** **1038**

* ఈ పరమార్థాన్ని చక్కగా తెలుసుకొన్న సజ్జనులు సర్వదా లోకపావనమైన నీ మధుర కథా సుధారసాన్ని తనివితీరా మనసారా త్రాగుతారు. అటువంటి వారికి సమస్త పుణ్యతీర్థాలలో స్నానం చేసిన ఫలం ప్రాప్తిస్తుంది. ఈ విధంగా వేదాలన్నీ గొంతెత్తి చాటుతున్నాయి. అందువల్ల అటువంటి మహనీయులే మాననీయులు, ఉత్తములు, సాధుసత్తములు.

**వ. అది గావునఁ బరబ్రహ్మంబవును, బరమ పురుషుండవును, బ్రత్యఙ్మనో భావ్యుండవును, సమస్త జన పాపనివారక స్వయం ప్రకాశుండవును, వేదగర్భుండవును, శ్రీ మహావిష్ణుండవును నగు నీకు వందనంబు లాచరించెద నని స్తుతియించినం బరమ పురుషుండును. మాతృవత్సలుండును నగు కపిలుండు గరుణారసార్ద్ర హృదయ కమలుండై జనని కిట్లనియె.** **1039**

* అందువల్ల పరబ్రహ్మవూ, పరమపురుషుడవూ, వెలుపలా లోపలా భావించి సంభావించ తగినవాడవూ, సకల జీవుల పాపాలను పటాపంచలు చేసేవాడవూ, స్వయంప్రకాశుడవూ, వేదమూర్తివీ, మహావిష్ణు స్వరూపుడవూ అయిన నీకు నమస్కరిస్తున్నాను.

ఈ విధంగా దేవహూతి స్తుతించగా మాతృప్రేమతో నిండిన కపిలుడు కరుణారసార్ద్ర హృదయుడై కన్నతల్లితో ఇట్లా అన్నాడు -

**తే. తవిలి సుఖరూపమును మోక్షదాయకంబు, నైన యీ యోగమార్గ మే నంబ! నీకు**
**నెఱుఁగ వివరించి చెప్పితి, నిది దృఢంబు, గాఁగ భక్తి ననుష్ఠింపు కమలనయన!** **1040**

* కమల దళాలవంటి కన్నులుగల తల్లీ! సుఖస్వరూపమూ, మోక్షప్రదమూ అయిన ఈ యోగమార్గాన్ని నీకు తేటతెల్లంగా వెల్లడించాను. దీనిని నీవు దృఢమైన భక్తితో అనుష్ఠించు.

**క. జీవన్ముక్తి లభించుం, గావున నేమఱక తలఁపు కైకొని దీనిన్**
**వావిరి నొల్లని వారికిఁ, దావల మగు మృత్యుభయము, దవ్వగు సుఖమున్.** **1041**

* దీనిని ఏకాగ్రచిత్తంతో ఏమరుపాటు లేకుండా ఆచరించేవారికి జీవన్ముక్తి లభిస్తుంది. ఈ మార్గాన్ని ఇష్టపడని వారికి మృత్యుభీతి కలుగుతుంది. సుఖం దూరమవుతుంది.

**క. అని యిట్లు దేవహూతికి, మన మలరఁగఁ గపిలుఁ డాత్మ మార్గం బెల్లన్**
**వినిపించి చనియె నని విదు, రునకున్ మైత్రేయమునివరుం డెఱిఁగించెన్.** **1042**

* ఈ విధంగా కపిలాచార్యుడు కన్నతల్లి అయిన దేవహూతికి మనస్సు సంతోషించేటట్లు ఆత్మ తత్త్వాన్ని ఉపదేశించి వెళ్ళిపోయినాడని మైత్రేయ మహర్షి విదురునికి వెల్లడించాడు.

వ. అట్లు కపిలుం డేగిన పిదప దేవహూతియుం బుత్రుండు సెప్పిన యోగమార్గంబున విజ్ఞానంబు గలిగి యుండియుం బెనిమిటియైన కర్దమునిం దనయుండైన కపిలునిం బాసి నష్టవత్సయగు గోవు చందంబునం దల్లడిల్లుచుఁ గపిలమహామునిం దలంచుచుం గర్దమ తపస్సామర్థ్యంబున నైనయట్టి.1043

* కపిలుడు వెళ్ళిపోయిన అనంతరం దేవహూతి తన పుత్రుని ఉపదేశం వల్ల జ్ఞానోదయం కలిగినదైనా కొంత వంత చెందక తప్పలేదు. పతి అయిన కర్దమ ప్రజాపతి ముందే వెళ్లాడు. ఇప్పుడు కన్న కొడుకైన కపిలుడు కూడా తన్ను విడిచిపోయినందున దూడను పోగొట్టుకొన్న గోమాత రీతిగా ఆ తల్లి తల్లడిల్లింది. మాటిమాటికీ కపిలుణ్ణీ, ఆయన మాటలనూ తలచుకోసాగింది.

ఉ. మానిత సౌరభప్రసవ మంజుల పక్వ ఫలప్రవాళ భా
రానత చూత పోత విటపాగ్ర నికేతన రాజకీర స
మ్మాని సుఖానులాప పరిమండిత కర్దమతాపసాశ్రమో
ద్యాన వన ప్రదేశ కమలాకర తీర నికుంజ పుంజముల్. 1044

* దేవహూతి ఈ విధంగా విచారించుతూ కర్దమ ప్రజాపతి తన తపఃప్రభావంవల్ల కల్పించిన తపోవనం వైపు చూచింది. నలు దెసలా పరిమళాలు విరజిమ్మే, విరిగుత్తులతో, చక్కగా పండిన పండ్లతో, చెంగావి చివుళ్లతో, వంగిన కొమ్మలతో, గున్నమామిళ్లు కన్నుల విందుగా కన్పించాయి. ఆ మామిడి చెట్ల చిటారు కొమ్మలపై కూర్చున్న రాచిలుకలు వీనుల విందుగా పలుకుతున్నాయి. మరికొంచెము ముందుకు నడువగా తామరకొలనులు కన్పించాయి. వాటి చుట్టూ దట్టంగా అల్లుకొన్న పొదరిండ్లు గోచరించాయి.

వ. వెండియు. 1045

సీ. అంచిత స్ఫటిక మయ స్తంభ దీప్తిచేఁ గొమరారు మరకత కుడ్యములను
సజ్జాతి వజ్రాల సజ్జాలరుచులచే భాసిల్లు నీల సోపానములను
దీపించు చంద్రకాంతోపలవేదుల విద్రుమ దేహళీ విలసితముల
హాటక రత్న కవాట శోభితముల నలరిన సౌధశాలాంగణముల

తే. వర పయః ఫేన పటల పాండుర కరీంద్ర, దంత నిర్మిత ఖట్వాతి ధవళ పట్ట
రచిత శయ్యాళులును జతురంతయాన, కనక పీఠాది వస్తు సంఘముల నెల్ల. 1046

* ఆ ప్రక్కనే అందమైన భవనం ఉన్నది. ఆ భవనం స్ఫటిక స్తంభాలతో, పచ్చలు చెక్కిన గోడలతో, మేలిజాతి వజ్రాల గవాక్షాలతో, నిగనిగలాడే నీల కాంత మణి సోపానాలతో, పాలరాతి అరుగులతో, పగడాల గడపలతో, పొదిగిన బంగారు తలుపులతో అలరారుతున్నది.

ఆ సౌధాంగణాలలో పాలనురుగు వంటి ఏనుగు దంతాలతో చేయబడిన పట్టెమంచాలపై తెల్లని పట్టు పరుపులు పరచి ఉన్నాయి. ఒక ప్రక్క ముత్యాల పల్లకీలూ, మరొక ప్రక్క సువర్ణపీఠాలూ పడి ఉన్నాయి. అటువంటి వైభవోపేతమైన వస్తు సంపద నంతా పరిత్యజించి దేవహూతి ముందుకు సాగింది.

వ. మఱియు వికచకమల కుముద సౌగంధిక బంధుర సుగంధానుబంధి గంధవహ శోభితంబును నరవింద నిష్యంద కందళిత మరంద రసపాన మదవదిందిందిర సందోహ ఝుంకార సంకులంబునునై చెలువారు బావులు గలిగి, పురందర సుందరీ నందితంబైన కర్దమాశ్రమంబుఁ బరిత్యజించి కుటిలంబులైన కుంతలంబులు జటిలంబులుగా ధరియించి సరస్వతీ బిందు సరోవరంబులం ద్రిషవణ స్నానంబు గావించుచు నుగ్రతపోభారంబునం గృశీభూత శరీరయై నిజకుమారుండును బ్రసన్న వదనుండును గపిల నామధేయుండును నగు నారాయణుని సమస్త వ్యస్త చింతనలచే ధ్యానంబు సేయుచుఁ బ్రవాహరూపం బైన భక్తి యోగంబునను నధికవైరాగ్యంబునను యుక్తానుష్ఠాన జాతంబై బ్రహ్మత్వాపాదకంబగు జ్ఞానంబును విశుద్ధ మనంబును గలిగి. 1047

* విచ్చిన తామరపూలూ, వికసించిన కలువ పూలూ, విప్పారిన సౌగంధిక పుష్పాలూ గుప్పు గుప్పున సుగంధాలను వెలజల్లుతున్నాయి. దిగుడు బావులలో పూచిన పద్మాలలో పొంగిపొరలే తియ్యని పూదేనెలు కడుపు నిండా త్రాగి గండు తుమ్మెదలు ఝుంకారాలు చేస్తున్నాయి. అటువంటి అందాలతో నిండి సురసుందరులకు సైతం ఆనందాన్ని అందించే కర్దమాశ్రమాన్ని వదలిపెట్టి దేవహూతి తపోదీక్ష వహించింది. ఆమె నొక్కుల నొక్కుల చిక్కని శిరోజాలు జడలు గట్టాయి. సరస్వతీ నదిలోని బిందు సరోవరంలో ముప్పూటలా మంత్రపూర్వకంగా స్నానం చేయసాగింది. తపోనియమంవల్ల ఆమె శరీరం బాగా చిక్కి కృశించి పోయింది.

దేవహూతి తన కడుపున కపిలమూర్తియై అవతరించిన శ్రీమన్నారాయణుని ఏకాగ్రచిత్తంతో అనేక విధాలుగా ధ్యానం చేయడం మొదలు పెట్టింది. ఆమెభక్తి అఖండమై ప్రవాహరూపం వహించింది. ఆమె ఎదలో వైరాగ్యం కుదురుకుంది. పరిశుద్ధ మనస్కురాలైన దేవహూతికి సుయోగ్యమైన అనుష్ఠానంతో బ్రహ్మజ్ఞానం ప్రాప్తించింది.

సీ. అనయంబు నాత్మనాయకుఁడును విశ్వతో ముఖుఁ డనంతుఁడుఁ బరముఁడు నజుండు
చతురుండు నిజపరిజ్ఞాన దీపాంకుర మహిమ నిరస్త సమస్త భూరి
మాయాంధకారుఁ డమేయుఁ డీశ్వరుఁ డగు నా పరబ్రహ్మంబునం దవిరత
బద్ధతత్త్వ జ్ఞాన పరతచే నిర్ముక్త జీవ భావమున విశిష్టయోగ

తే. భవ్యసంప్రాప్త నిర్మల బ్రహ్మభావ, ములను గలిగి సమాధిచే నెలమిఁ దనరు
నపునరావృత్త మగు త్రిగుణప్రధాన, తత్త్వముల నొప్పి సంతతోదారనియతి. 1048

* దేవహూతి అనుక్షణమూ ఆత్మలకు అధీశ్వరుడూ, సర్వాంతర్యామీ, అనంతుడూ, అద్వితీయుడూ, అజుడూ, లీలావినోదీ, విజ్ఞానదీపకాంతుల మహిమతో అజ్ఞానాంధకారాన్ని పారదోలేవాడూ, అమేయుడు, అఖిలేశ్వరుడూ అయిన పరబ్రహ్మమందు మనస్సు లగ్నం చేసింది. నిరంతరమైన నిష్ఠతో ఆమెకు నిర్మలమైన తత్త్వజ్ఞానం అలవడింది. జీవభావం తొలగింది. దైవభావం కలిగింది. పరబ్రహ్మతో సమాధి సిద్ధించింది. పునరావృత్తి రహితమైన ప్రవృత్తి ఏర్పడింది.

తే. కలలఁ దోఁచిన వస్తుసంఘముల, మేలు, కొని కనుంగొనఁగా లేని మనుజు పోల్కిఁ
బొలఁతి తన యాత్మ మఱచి యిమ్ముల సధూమ, మైన పావకుగతి నుండె నంతలోన. 1049

* కలలో కనుగొన్న వస్తువులన్నీ మేలుకొన్న అనంతరం కనుగొనలేని మానవునిలాగా దేవహూతి తన అస్తిత్వాన్ని మరచి పోయింది. పొగలేని అగ్నిలాగా ప్రకాశించింది.

క. గురుయోగ శక్తి చే నం, బర తలమున కెగసి సత్కృపామయుఁడగు నా
పరవాసుదేవు చరణాం, బురుహ యుగన్యస్త చిత్తము గలది యగుచున్. **1050**

* అఖండమైన యోగప్రభావం వల్ల ఆమె మనస్సు ఆకాశానికి ఎగసి పరమ కరుణామయుడైన పరవాసుదేవుని చరణకమలాలలో విలీన మయింది.

వ. ఇట్లు కపిలోక్తమార్గంబున దేవహూతి శ్రీహరియందుఁ గలసె, నయ్యంగనారత్నంబు మోక్షంబునకుం జనిన క్షేత్రంబు "సిద్ధిపదం" బనుపేరం బరఁగి ప్రసిద్ధి వహించె, అంత నక్కడఁ గపిలుండు తల్లిచేత ననుజ్ఞాతుండై సిద్ధ చారణ గంధర్వాప్సరోముని నివహ సంస్తూయమానుం డగుచు సముద్రునిచేత దత్తార్హణ పూజా నికేతనంబులు వడసి సాంఖ్యాచార్యాభిష్టుతంబగు యోగంబు నవలంబించి లోకత్రయ శాంతి కొఱకు సమాహితుండై స్వపిత్రాశ్రమంబు విడిచి యుదగ్భాగంబునకుం జనియె నని మైత్రేయ మహాముని విదురున కిట్లనియెఁ - దండ్రీ! యీ యుపాఖ్యానంబును నాకు గోచరించిన రీతి నీకుం జెప్పితి, నిది కపిల "దేవహూతి సంవాదం" బత్యంత పావనంబు, గపిల ప్రణీతంబు నయిన యోగంబు, దీనిం బరమభక్తి యుక్తుండై యెవ్వండు పఠించు, నెవ్వండు విను, నట్టి పుణ్యాత్ములు విగతపాపులై గరుడ ధ్వజుండయిన పుండరీకాక్షుని శ్రీచరణారవిందంబులం బొందుదురని మైత్రేయుండు విదురున కెఱింగించిన విధంబున శుక యోగీంద్రుండు పరీక్షన్నరేంద్రునకుం జెప్పెనని సూతుండు శౌనకాది మహామునులకు నీ కథా వృత్తాంతంబు సెప్పిన విని ప్రహృష్ట హృదయులై మునికులోత్తమా! భవద్వాక్పూరం బగు భగవత్కథామృతంబు గ్రోలుచుండ మా మనంబులం దనివోవ, దింకను దరువాతి వృత్తాంతాలు మాకు విశదంబులుగ వినిపింప నీవ యర్హుండ వని యడుగుటయు. **1051**

* ఈ విధంగా కపిలమాత దేవహూతి కపిలుని ఉపదేశానుసారంగా విష్ణుదేవునిలో విలీనమైంది. ఆ సతీమతల్లి మోక్షాన్ని అందుకొన్న పవిత్ర క్షేత్రం 'సిద్ధిపదం'అనే పేరుతో ప్రసిద్ధి వహించింది.

కపిలుడు కన్న తల్లి అనుజ్ఞ గైకొని సిద్ధులు చారణులు గంధర్వులు అప్సరసలు మునులు చేసే వందనాలు అందుకుంటూ సముద్రతీరానికి చేరాడు. అక్కడ సముద్రుడు సమర్పించిన కానుకలు పూజలు గ్రహించాడు. సాంఖ్యాచార్యులచే సంస్తూయమానమైన యోగ మార్గాన్ని అవలంబించాడు. ముల్లోకాలకు శాంతిని ప్రసాదించడంకోసం తండ్రిగారి తపోవనాన్ని వదలి నిశ్చల చిత్తంతో ఉత్తర దిక్కుగా ప్రయాణం చేశాడు.

ఇలా చెప్పి మైత్రేయ మహాముని విదురునితో ఇట్లా అన్నాడు.

నాయనా! ఈ ఉపాఖ్యానం నాకు తోచిన విధంగా నీకు చెప్పాను. ఈ "కపిల దేవహూతి సంవాదం" అత్యంత పవిత్రమైంది. దీనినే కపిలప్రోక్తమైన యోగశాస్త్రం అంటారు.

ఈ "కపిల దేవహూతి సంవాదాన్ని" ఎవడు అత్యంత భక్తితో పఠిస్తాడో, ఎవడు వింటాడో - అటువంటి పుణ్యాత్ముల పాపాలు పటాపంచలౌతాయి. వారు గరుడధ్వజుడైన కమలాక్షుని శ్రీపాద కమలాలను చేరుకుంటారు.

ఈ ప్రకారంగా మైత్రేయుడు విదురునకు వివరించిన విషయాన్ని శుకయోగీంద్రుడు పరీక్షిన్నరేంద్రునకు విశదీకరించాడని సూతుడు శౌనకాది మహామునులకు వెల్లడించాడు.

ఈ వృత్తాంతం విన్న శౌనకాది మునీంద్రులు సంతుష్టాంతరంగులై "మునీంద్రచంద్రా' నీ వాక్ప్రవాహరూపమైన భగవత్కథాసుధారసం ఎంత త్రాగినా మా మనస్సులకు తృప్తి కలగటం లేదు. తనివి తీరునట్లు తరువాతి వృత్తాంతం వివరంగా వినిపించవలసిందిగా విన్నవించుకుంటున్నాము. అందుకు నీవే తగిన వాడవు" అన్నారు.

**చ. జనకసుతా మనో విమల సారస కోమల చంచరీక! చం**
**దన శరదిందు కుంద హర తార మరాళ పటీర చంద్రికా**
**వినుత యశోవిశాల! రఘువీర! దరస్మిత పద్మపత్ర లో**
**చన! నిటలాంబక ప్రకట చాపవిఖండన! వంశమండనా!** **1052**

* రఘుకుల లలామా! శ్రీరామా! నీవు జానకీదేవి అమలమైన హృదయకమలంలో విహరించే భ్రమరానివి. చందనంవలె, శరచ్చంద్రునివలె, మొల్లపువ్వువలె, పరమశివునివలె, పులుగడిగిన ముత్యంవలె, రాయంచవలె, మంచిగంధంవలె, వెన్నెల వెల్లువవలె తెల్లనై ఎల్లవైపులా వ్యాపించిన కీర్తిగలవాడవు. చిరునవ్వు లొలికే కమల దళాలవంటి కన్నులు గలవాడవు. ముక్కంటి వింటిని విరచినవాడవు. సూర్య వంశాన్ని అలంకరించినవాడవు.

**తరలము :**

**పరమపావన! విశ్వభావన! బాంధవ ప్రకరావనా!**
**శరధిశోషణ! సత్యభాషణ! సత్కృపామయ భూషణా!**
**దురిత తారణ! సృష్టికారణ! దుష్టలోక విదారణా!**
**ధరణిపాలన! ధర్మశీలన! దైత్యమర్దన ఖేలనా!** **1053**

* దేవా! నీవు పరమపావనుడవు. విశ్వభావనుడవు. బంధు జనావనుడవు. నీవు సముద్రజల శోషణుడవు. సత్యభాషణుడవు! అపారకృపాగుణ భూషణుడవు. నీవు దురితాలనుంచి గట్టెక్కిస్తావు. సకలలోకాలను సృష్టిస్తావు. దుండగులను చీల్చి చెండాడుతావు. నీవు ధరిత్రిని పాలించేవాడివి. ధర్మాన్ని లాలించేవాడివి. దైత్యులను నిర్మూలించే వాడివి.

**మాలిని :**

**దివిజగణవరేణ్యా! దీపితానంతపుణ్యా!**
**ప్రవిమల గుణజాలా! భక్తలోకానుపాలా!**

భవ తిమిర దినేశా! భానుకోటి ప్రకాశా!
కువలయ హితకారీ! ఘోరదైత్య ప్రహారీ! 1054

* నీవు అమరులకు శరణ్యుడవు. పుణ్య పురుషులలో అగ్రగణ్యుడవు. నీ సుగుణాలు నిర్మలమైనవి. నీవు భక్తులను వెంటనుండి కాపాడుతుంటావు. సంసారమనే అంధకారాన్ని రూపుమాపుతావు. కోటి సూర్యులకాంతితో వెలుగుతుంటావు. లోకాలకు మేలు చేకూరుస్తావు. దుష్టులైన రాక్షసులను పోకారుస్తావు.

గద్యము : ఇది శ్రీ పరమేశ్వర కరుణాకలిత కవితా విచిత్ర కేసనమంత్రి పుత్ర సహజపాండిత్య పోతనామాత్య ప్రణీతం బయిన శ్రీమహాభాగవతం బను మహాపురాణంబునందు విదురనీతియు, విదురుని తీర్థాగమనంబును, నుద్ధవ సందర్శనంబును, గౌరవయాదవ కృష్ణాది నిర్యాణంబును, గంగాద్వారంబున విదురుండు మైత్రేయునిం గనుటయు, విదురమైత్రేయ సంవాదంబును, జగదుత్పత్తి లక్షణంబును, మహదాదుల సంభవ ప్రకారంబును, మహదాదులు నారాయణు నభినందించుటయు, విరాడ్విగ్రహ ప్రకారంబును, శ్రీ మహాభాగవత భక్తి కారణంబగు పద్మ సంభవు జన్మప్రకారంబును, బ్రహ్మతపంబును, బరమేష్ఠికిఁ బుండరీకాక్షుండు బ్రత్యక్షం బగుటయు, బ్రహ్మకృతం బయిన విష్ణు స్తోత్రంబును, గమలసంభవుని మానససర్గంబును, బరమాణువుల పుట్టువును, భూర్భువస్సువరాది లోకవిస్తారంబును, గాల దివస మాస వత్సరాది నిర్ణయంబును, నాయుః పరిమాణంబును, జతుర్యుగ పరిమాణంబును, బద్మసంభవు సృష్టిభేదనంబును, సనకాదుల జన్మంబును, స్వాయంభువ మనువు జన్మంబును, శ్రీహరి వరాహావతారంబును, భూమ్యుద్ధరణంబును, సూకరాకారుండైన హరిని విధాత స్తుతియించుటయు, దితి కశ్యప సంవాదంబును, గశ్యపుండు రుద్రునిం బ్రశంసించుటయు, గశ్యపువలన దితి గర్భంబు ధరియించుటయుఁ, దత్ప్రభావంబునకు వెఱచి దేవతలు బ్రహ్మసన్నిధికిం జని దితిగర్భప్రకారంబు విన్నవించుటయు, సనకాదులు వైకుంఠంబున కరుగుటయు, నందు జయవిజయుల కలిగి సనకాదులు శపించుటయు, శ్రీహరి దర్శనంబును, బ్రాహ్మణ ప్రశంసయు, సనకాదులు హరిని నుతించుటయు, హిరణ్యకశిపు హిరణ్యాక్షుల జన్మప్రకారంబును, హిరణ్యాక్షుని దిగ్విజయంబును, సవన వరాహ హిరణ్యాక్షుల యుద్ధంబును, బ్రహ్మస్తవంబును, హిరణ్యాక్ష వధయు, నమర గణంబులు శ్రీహరి నభినందించుటయు, హరి వరాహావతార విసర్జనంబు సేయుటయును, దేవతిర్యఙ్మనుష్యాదుల సంభవంబును, గర్దమ మహాముని తపంబునకు సంతసించి శ్రీహరి ప్రత్యక్షం బగుటయుఁ, గర్దముండు స్వాయంభువ మనుపుత్రియైన దేవహూతిం బరిణయం బగుటయు, దేవహూతి పరిచర్యలకు సంతసిల్లి కర్దముండు నిజయోగ కల్పితంబగు విమానంబునందు నిలిచి సహస్రదాసీ పరివృతయైన దేవహూతింగూడి భారతాది వర్షంబులు గలయం గ్రుమ్మరుటయు, దేవహూతి కర్దముని వలన గన్యకానవకంబును గపిలునిం గనుటయుఁ, దత్కన్యకా వివాహంబులును, కర్దముని తపోయాత్రయు, కపిల దేవహూతి సంవాదంబును, శబ్దాది పంచతన్మాత్రల జన్మప్రకారంబును, బ్రహ్మాండోత్పత్తియు, విరాట్పురుష కర్మేంద్రియ పరమాత్మ ప్రకారంబును, బ్రకృతి పురుష వివేకంబును, నారాయణుని సర్వాంగ స్తోత్రంబును, సాంఖ్యయోగంబును, భక్తియోగంబును, జీవునకైన

**గర్భసంభవ ప్రకారంబును, జంద్రసూర్య మార్గంబును, బితృమార్గంబును, దేవహూతి నిర్యాణంబును, గపిల మహాముని దపంబునకుం జనుటయు నను కథలు గల తృతీయస్కంధము. 1055**

* శ్రీమద్ భాగవతమనే ఈ మహాపురాణాన్ని పరమేశ్వర కరుణా కలిత కవితా విచిత్రుడూ, కేసన మంత్రిగారి పుత్రుడూ, సహజ పాండిత్యుడూ అయిన పోతనామాత్యుడు రచించాడు.

ఈ మహాగ్రంథంలో విదురనీతి, విదురుని తీర్థయాత్ర, ఉద్ధవ సందర్శనం, కౌరవ యాదవ నిర్యాణం, శ్రీకృష్ణ నిర్యాణం, విదురుడు మైత్రేయ మహామునిని దర్శించడం, విదుర మైత్రేయ సంవాదం, జగదుత్పత్తి లక్షణం, మహదాదుల సంభవ ప్రకారం, మహదాదులు నారాయణుని అభినందించడం, విరాడ్విగ్రహ ప్రకారం, బ్రహ్మదేవుని జన్మప్రకారం, బ్రహ్మదేవుని తపస్సు, బ్రహ్మకు విష్ణుదేవుడు ప్రత్యక్షం కావడం, బ్రహ్మదేవుడు విష్ణుదేవుని స్తుతించడం, చతుర్ముఖుని మానససృష్టి, పరమాణువుల జన్మం, భూలోకం, భువర్లోకం, సువర్లోకం మొదలైనవాని విస్తారం; దిన, మాస, సంవత్సరాది కాల నిర్ణయం, ఆయుఃపరిమాణం, చతుర్యుగాల పరిమాణం, బ్రహ్మదేవుని సృష్టిభేదనం, సనక సనందనాదుల జననం, స్వాయంభువ మనువు జననం, శ్రీహరి వరాహావతార ధారణం, భూమిని ఉద్ధరించడం, యజ్ఞ వరాహ మూర్తియైన హరిని బ్రహ్మదేవుడు స్తుతించడం, దితి కశ్యపుల సంవాదం, కశ్యపుడు రుద్రుణ్ణి ప్రశంసించడం, దితి గర్భధారణం,

దేవతలు భయపడి బ్రహ్మదేవునితో విన్నవించుకోవటం, సనక సనందనాదుల వైకుంఠాగమనం, జయ విజయులు నిరోధించడం, శాపప్రాప్తి, శ్రీహరి సందర్శనం, బ్రాహ్మణ ప్రశంస, సనకాదులు శ్రీహరిని సంస్తుతించడం, హిరణ్యకశిపు హిరణ్యాక్షుల జననం, హిరణ్యాక్షుని దిగ్విజయం, యజ్ఞవరాహ హిరణ్యాక్షుల యుద్ధం, బ్రహ్మస్తవం, హిరణ్యాక్ష సంహారం, దేవతలు శ్రీహరిని అభినందించడం, వరాహావతార విసర్జనం, దేవతిర్యఙ్మనుష్యాదుల సంభవం, కర్దమమహాముని తపస్సు, శ్రీహరి సాక్షాత్కారం, కర్దముడు దేవహూతిని వివాహమాడడం, కర్దముడు దేవహూతితో కలిసి తన తపః ప్రభావంచేత నిర్మితమైన విమానంమీద విహరించడం, దేవహూతికి తొమ్మిది మంది కన్యకలు, కపిలుడనే కుమారుడు జన్మించడం, కన్యకల వివాహం, కర్దముని తపోయాత్ర, కపిల దేవహూతి సంవాదం, పంచతన్మాత్రల జన్మప్రకారం, బ్రహ్మాండోత్పత్తి, విరాట్పురుషుని స్వరూపం, కర్మేంద్రియ పరమాత్మల స్వరూపం, ప్రకృతి పురుష వివేకం, శ్రీహరి సర్వాంగ స్తోత్రం, సాంఖ్యయోగం, భక్తియోగం, జీవుని గర్భసంభవ ప్రకారం, చంద్ర సూర్యమార్గం, పితృమార్గం, దేవహూతి పరమపద ప్రాప్తి, కపిలుని తపోవనగమనం అనే కథలతో కూడిన తృతీయ స్కంధ మిది.

**శ్రీ కృష్ణార్పణ మస్తు.**

**T.T.D. Religious Publications Series N0.639 - A**
**Price : Rs. 255/-**

విష్ణుకథలు కల్యాణాత్మకమైనవి. అంటే శుభాలను ప్రసాదించేవి. అవి ఎన్ని మార్లు విన్నా, ఎప్పటికప్పుడు కొత్తవిగానే ఉంటాయి. భాగవతం అలాంటి పవిత్ర కథలకు నిలయం. ఈ పురాణరత్నం సహజకవి పోతన అమృతహస్తం నుండి మధుర భక్తిమయ కావ్యంగా తెలుగులో అవతరించిన నాటినుండీ ఎందరో భక్తులకు, కవులకు, వాగ్గేయకారులకు ఉపాదేయమై, అనేకవిధాల మార్గదర్శకమై అలరారుతోంది.

"పోతన్న తెనుగుల పుణ్యపేటి" అన్న విశ్వనాథ వారి మాటలు అక్షరసత్యాలు. పోతన తెలుగులో భాగవతాన్ని శ్రీకైవల్యపదాన్ని చేరడానికి రచించినా, ఆ గ్రంథాన్ని చదివినవాళ్లందరికీ కూడా మోక్షాన్ని సిద్ధింపజేశారు. భాగవతంలోని ప్రతిపద్యం ఎంతో హృద్యం. తెలుగునాట పోతన గారి పద్యం నోటికి రాని పండితుడు గాని, పామరుడు గాని లేడంటే అతిశయోక్తి కాదు.

అలాంటి ఉత్తమగ్రంథమైన భాగవత సందేశాన్ని, పోతనకవితా వైశిష్ట్యాన్ని, ఎన్నో వ్యాపకాలతో సతమతమయ్యే నేటి 'సగటుమనిషి'కి ప్రత్యేకించి యువతరానికి వీలైనంత సమగ్రంగా, సరళంగా అందించాలనే ఉదారాశయంతో తిరుమల తిరుపతి దేవస్థానం ఆంధ్రమహాభాగవతాన్ని కరుణశ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి గారి ప్రధాన సంపాదకత్వంలో తాత్పర్యసహితంగా ప్రచురించింది. ఈ సంపుటాలకు అనేకమంది పండితులు చక్కటి తాత్పర్యాన్ని సమకూర్చారు. ఇప్పటికి ఐదుసార్లు ముద్రితమైన ఈ సంపుటాలు పరిష్కరింపబడి పునర్ముద్రితమై వెలువడ్డాయి. పాఠకులు యథాపూర్వం ఆదరించగలరు!

"భాగవతపురాణఫలరసాస్వాదన
పదవిఁ గనుఁడు! రసికభావ విదులు!"

**Published by I.Y.R.Krishna Rao, I.A.S., Executive Officer, T.T.Devasthanams, Tirupati and Printed at Prajasakti Daily Printing Press, Hyderabad - 500 020.**

# పోతన భాగవతము

(చతుర్థ, పంచమ, షష్ఠ స్కంధములు)

## రెండవ సంపుటము



తిరుమల తిరుపతి దేవస్థానములు,
తిరుపతి

# పోతన భాగవతము

*(సరళ గద్యానువాద సహితము)*

## రెండవ సంపుటము

### 4, 5, 6 స్కంధములు


*అనువాదకులు*

**శ్రీ శనగన నరసింహస్వామి**

**డా|| కె. సర్వోత్తమరావు**

**శ్రీ తలమర్ల కళానిధి**

*ప్రధాన సంపాదకులు*

**డా|| జంధ్యాల పాపయ్యశాస్త్రి**



*ప్రచురణ*

**కార్యనిర్వహణాధికారి**

**తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి**

**POTANA BHAGAVATAMU,** with Lucid Prose
Second Volume - 4, 5 & 6 Skandhas

**Author :** Potana Mahakavi

**Prose Rendering :** Sri Sanagana Narasimha Swami
Dr. K. Sarvottama Rao
Sri Talamarla Kalanidhi

**Edited by :** Dr. Jandhyala Papaiah Sastry. "Karuna Sri"



T.T.D Religious Publication Series No. 639-B

**First Edition** : 1987
**Re-prints** : 1998, 2004, 2005, 2008, 2010
**Revised Edition** : 2015

**Copies :** 5,000

**Published by**

**Dr. D.Sambasiva Rao ,** I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati.

**D.T.P**

Sri Asangananda Graphics
Sri Vyasasramam, Yerpedu.
Ph:08578-287528

**Printed at**

# ముందుమాట

బ్రహ్మదేవుని చతుర్ముఖాలనుండి పురాణాలు, తరువాత వేదాలు వినిస్సృతాలైనట్లు తెలుస్తుంది. కాగా పురాణాల అనాదిత్వం పావనత్వం విద్యోతిత మవుతుంది. ఏనాటినుంచో సజీవంగా వెలిగేదే పురాణమంటారు. 'పురాపి నవం పురాణం'- ఎంత పాతదైనా పురాణం సరికొత్తగానే ఉంటుందన్నమాట!

సర్గం, ప్రతిసర్గం, వంశం, మన్వంతరం, వంశానుచరితం - అని పురాణాలు అయిదు లక్షణాలు కలిగి ఉంటాయి. ఈ లక్షణాలతో కూడిన పురాణాలు పద్దెనిమిది. ఉపపురాణాల సంఖ్యకూడా అంతే. ఈ పురాణాలన్నీ వేదవ్యాస మహర్షి విరచితాలే అని ప్రతీతి. ఇవి భిన్న కర్తృకాలు అనే ప్రవాదం కూడా ఉన్నది. ఏమైనా పురాణాలు ప్రాచీన సంస్కృతి సంప్రదాయాలకు ఆదర్శం లాంటివే కాకుండా, పూర్వ రాజవంశాలను గురించికూడ తెలపడంవల్ల ఒక విధంగా చరిత్రగ్రంథాలుగా కూడా ఉపకరిస్తాయి.

కథలద్వారా ప్రజలకు నీతి ధర్మాలు ఉపదేశించడం వీటి పరమాశయంగా కనిపిస్తుంది. భాగవత రచనవల్ల వ్యాసభగవానుడికి మనశ్శాంతి చేకూరిందనడంలో పురాణ ప్రభావం ఏమిటో విదిత మవుతుంది.

అష్టాదశ పురాణాలలో ప్రశస్తి వహించిన శ్రీమద్భాగవతాన్ని బమ్మెరపోతనామాత్యులు తెలుగులోనికి అనువదించి ఆంధ్రలోకానికి మహోపకారం చేశారు. పరమభాగవతోత్తముడైన పోతనగారు తన సహజ పాండిత్యముతో అనితరభక్తితో భాగవతాన్ని రచించారు. మహాతపస్వి పోతరాజుగారి లేఖిని నుండి జాలు వారిన కవితా ప్రవంతి ఆంధ్ర జనహృదయ కేదారాలను తడుపుతూ తాపత్రయాన్ని హరిస్తున్నదనడం సత్యం. భాగవతంలోని ప్రతి పద్యం ఎంతో హృద్యం. తెలుగునాట పోతనగారి పద్యం నోటికి రాని పండితుడు గాని, పామరుడుగాని లేడంటే అతిశయోక్తి కాదు.

ఇలా తెలుగునాట ప్రముఖస్థానాన్ని అలంకరించిన ఆంధ్రమహాభాగవతం అక్షరాస్యులందరికీ సులభ గ్రాహ్యం అయ్యేందుకు తి.తి.దేవస్థానంవారు ప్రముఖ విద్వాంసులచేత సులభశైలిలో తాత్పర్యాలు వ్రాయించి, ముద్రించారు.

ప్రధాన సంపాదకులైన డా॥ జంధ్యాల పాపయ్యశాస్త్రి (కరుణశ్రీ) గారికి, ఆయా సంపుటాల తాత్పర్య రచయితలకును మా అభినందనలు. తి.తి.దేవస్థానం వారు ప్రచురించిన పోతన భాగవత సంపుటాల ప్రతులన్నీ చెల్లిపోయినందున పాఠకుల సౌకర్యార్థమై పరిష్కరించి పునర్ముద్రించటం జరిగింది. పాఠకులు యథాపూర్వం ఆదరించగలరు.

శ్రీనివాసుని కృపతో తిరుమల తిరుపతి దేవస్థానంవారు చేస్తున్న ధార్మిక గ్రంథ ప్రచురణలపట్ల తెలుగునాట బహుళామోదం లభిస్తున్నందుకు సంతోషం.

**కార్యనిర్వహణాధికారి,**

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

## అనువాదకులు

శ్రీ శనగన నరసింహస్వామి ( చతుర్థ స్కంధము)

డాక్టర్ కె. సర్వోత్తమ రావు ( పంచమ స్కంధము)

శ్రీ తలమర్ల కళానిధి ( షష్ఠ స్కంధము)

# పోతన భాగవతము

| అనువాదకులు | | స్కంధములు |
|---|---|---|

### మొదటి సంపుటము

| | | | |
|---|---|---|---|
| 1. | డా॥ జంధ్యాల పాపయ్య శాస్త్రి | --- | ప్రథమ స్కంధము |
| 2. | డా॥ సముద్రాల లక్ష్మణయ్య | --- | ద్వితీయ స్కంధము |
| 3. | డా॥ ఆశావాది ప్రకాశరావు | --- | తృతీయ స్కంధము |

### రెండవ సంపుటము

| | | | |
|---|---|---|---|
| 4. | శ్రీ శనగన నరసింహస్వామి | --- | చతుర్థ స్కంధము |
| 5. | డా॥ సర్వోత్తమరావు | --- | పంచమ స్కంధము |
| 6. | శ్రీ తలమర్ల కళానిధి | --- | షష్ఠ స్కంధము |

### మూడవ సంపుటము

| | | | |
|---|---|---|---|
| 7. | శ్రీ జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రి | --- | సప్తమ స్కంధము |
| 8. | శ్రీ జి. చెన్నయ్య | --- | అష్టమ స్కంధము |
| 9. | డా॥ బి. భాస్కర చౌదరి | --- | నవమ స్కంధము |

### నాల్గవ సంపుటము

| | | | |
|---|---|---|---|
| 10. | డా॥ ఎక్కిరాల కృష్ణమాచార్య | --- | దశమ స్కంధము (పూర్వభాగం 1- 725 పద్యములు) |
| 11. | శ్రీమాన్ ముదివర్తి కొండమాచార్యులు | --- | దశమ స్కంధము (పూర్వభాగం 726 - 1791 పద్యములు) |

### ఐదవ సంపుటము

| | | | |
|---|---|---|---|
| 12. | డా॥ అమరేంద్ర | --- | దశమస్కంధము - ఉత్తరభాగము ( 1- 535 పద్యములు) |
| 13. | శ్రీ డి. నాగసిద్ధారెడ్డి | --- | దశమస్కంధము - ఉత్తరభాగము (536 - 1342 పద్యములు) |
| 14. | డా॥ ప్రసాదరాయ కులపతి | --- | ఏకాదశ స్కంధము |
| 15. | శ్రీ టి. భాస్కర రావు (స్ఫూర్తిశ్రీ) | --- | ద్వాదశ స్కంధము |

# ప్రవేశిక

**"ఖ్యాతి గడించు కొన్న కవు లందరు లేరె! అదేమి చిత్రమో**

**పోతన యన్నచో కరిగిపోవు నెడంద; జొహారు సేతకై**

**చేతులు లేచు; ఈ జనవశీకరణాద్భుతశక్తి చూడగా**

**నాతని పేరులో గలదొ! ఆయన భాగవతాన నున్నదో!"**

రాజు కాని మహారాజు, రాజ్యంలేని కవిరాజు, రాజభోగాలు ఆశించని రాజరాజు, ఆడంబరాలకూ అహంకారాలకూ త్రోసిరాజు మన బమ్మెరపోతరాజు.

**"గుడులు కట్టించె కంచెర్ల గోపరాజు**

**రాగములు కూర్చె కాకర్ల త్యాగరాజు**

**పుణ్యకృతి చెప్పె బమ్మెరపోతరాజు**

**రాజు లీ ముప్పురును భక్తి రాజ్యమునకు."**

అన్నట్లు గోపన్న కొండల్లో బండల్లో రాముడికి గుళ్ళు కట్టిస్తే పోతన్న తెలుగు గుండెల్లో కృష్ణుడికి గుళ్లు కట్టించాడు. త్యాగరాజు తన తంబూరా తీగెలమీద "రఘుకుల తిలకుణ్ణి" ఊరేగిస్తే పోతరాజు తన నవపల్లవ కోమల శయ్యల మీద యదుకుల తిలకుణ్ణి ఉయ్యాల లూగించాడు.

**"మధుమయ ఫణితీనాం మార్గదర్శీ మహర్షిః"** అన్న సుకవి సూక్తికి సంస్కృతంలో వాల్మీకిలాగా తెలుగులో పోతన్న ఉజ్జ్వలమైన ఉదాహరణం. "కవిత్వ" మనే పాలలో "భక్తి" అనే పంచదార కలిపి భాగవత రసాయ నాన్ని పాకంచేసి లోకానికి అందించిన అమృతహస్తం పోతన్నగారిది. ఆయన కావ్యకన్యక తెలుగు వారి గుండెల్లో "మందార మకరందాలు" చిందించింది. తెలుగు జాతిని "నిర్మల మందాకినీ వీచికల్లో" ఓలలాడించింది.

**"విద్యావతాం భాగవతే పరీక్షా"** అనే కొమ్ములు తిరిగిన పండితులకుకూడా "కొరకరాని కొయ్య" అయిన సంస్కృత భాగవతం సహజ పాండిత్యుని హస్తస్పర్శతో "బాలరసాలం" గా పరిణమించి పల్లవించి పుష్పించి ఫలించి ఆబాలగోపాలానికీ రసానందాన్ని అందించింది.

మహాభక్తుడైన పోతన్నగారు పొంగి పులకించిన హృదయంతో గజేంద్రమోక్షంలో, వామన చరిత్రలో, ప్రహ్లాద వృత్తాంతంలో, రుక్మిణీ కల్యాణంలో, నరకాసురవధలో, కృష్ణలీలల్లో, గోపికా గీతాల్లో, కుచేలోపా

ఖ్యానంలో తన ప్రతిభా పాండిత్యాలను ప్రకటించి మూలాన్ని పెంచి సర్వాంగసుందరంగా సాహిత్యమందిరంగా ఆ యా ఘట్టాలను తీర్చిదిద్దాడు. కొన్ని చోట్ల మూలంలోని మూడు శ్లోకాలను ముప్పై మూడు పద్యాలుగా ప్రపంచీకరించాడు.

భాగవత కవిత్వం నిత్యనూతనం. సత్యసనాతనం. అయిదు వందల సంవత్సరాలు గడచిపోయినా బమ్మెరవారి భాగవత బాలరసాల నవపల్లవాలు పసివాడలేదు. కనుగంద లేదు, భాగవతం కోసమే పోతన్న గారు పుట్టారు. పోతన్నగారి కోసమే పూర్వకవు లెవ్వరూ ముట్టుకోకుండా భాగవతాన్ని అట్టిపెట్టారు. తనకు వ్యాసులవారి భాగవతం ప్రాప్తించటం తన పురాకృత సుకృత విశేషం అన్నారు పోతన్నగారు. మనకు పోతన్నగారి భాగవతం లభించటం మన జన్మ జన్మాల పుణ్యవిశేషం అంటాను నేను.

పోతన్నగారు మనలో ఎంతగానో కలిసిపోయారు! మనసులో, మాటలో, పాటలో, పద్యంలో, నుడికారాలలో, ఆచారాలలో వెలుగులా వెన్నెలలా మలయమారుతంలా కలిసిపోయారు! తెలుగువారి నిత్యజీవితాలలో, నిండు హృదయాలలో, ఉచ్ఛ్వాస నిశ్వాసాలలో ఆయన నిండి ఉన్నాడు.

ఉదయభానుని కిరణాలలో, యదుకిశోరుని మృదుచరణాలలో చల్లలమ్మే గొల్లభామల్లో, విలుపట్టిన సత్యభామలో, వల్ల వాంగనల వలపుల్లో, పిల్లనగ్రోవి పిలుపుల్లో ఆయన కనిపిస్తాడు- వినిపిస్తాడు- "ఆహా" అనిపిస్తాడు.

భాగవతం విప్పితే చాలు- పుటలు తిప్పితే చాలు-

**"నీకున్ మ్రొక్కెద త్రెంపవే భవలతల్ నిత్యానుకంపానిధీ!"** అంటూనో,

**"ఒక సూర్యుండు సమస్తజీవులకు తా నొక్కొక్కఁడై తోఁచు పోలిక....."** అంటూనో-

**"రావే ఈశ్వర! కావవే వరద! సంరక్షించు భద్రాత్మకా!"** అంటూనో-

**"కమలాక్షు నర్చించు కరములు కరములు శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ....."** అంటూనో-

**"ఘనుఁ డా భూసురుఁ డేగెనో! నడుమ మార్గశ్రాంతుఁడై చిక్కెనో!....."** అంటూనో-

**"వనితా! ఏమి తపంబు చేసెనొకొ ఈ వంశంబు వంశంబులోన్....."** అంటూనో-

కుంతీదేవిగా, ఆచార్యభీష్ముడుగా, గజేంద్రుడుగా, ప్రహ్లాదుడుగా, రుక్మిణీ కన్యగా, వ్రేపల్లె గోపికగా వేషాలు మార్చి గొంతులు మార్చి పోతన్నగారు మనకు దర్శనమిస్తూనే ఉంటారు. భాగవత పాత్రలతో ఆయన తాదాత్మ్య మటువంటిది.

"నా తోడన్ ప్రతిభాష లాడెదు, జగన్నాథుండు, నా కంటె నీ, భూతశ్రేణికి రాజు లేఁడొకడు" అని కన్నకొడుకును గద్దించే హిరణ్యకశిపుడూ,

**"తిరుగ న్నేరదు నాదు జిహ్వ వినుమా ధీవర్య! వేయేటికిన్"** అని పలికే దానవీరుడు బలి చక్రవర్తీ,

**"అమ్మా! మన్ను దినంగ నే శిశువనో! ఆఁకొంటినో! వెఱ్ఱినో!"** అని తల్లి దగ్గర ముద్దులు గురిసే బాలగోపాలుడూ,

**"తాటంకాచలనంబుతో భుజనటద్దమ్మిల్ల బంధంబుతో"** పతివెంట పరువెత్తుకొని వస్తున్న శ్రీదేవీ,

**"మన సారథి మన సచివుఁడు... మనలను విడనాడి చనియె మనుజాధీశా!"** అని కన్నీళ్లు తుడుచు కొంటూ అన్నగారికి కృష్ణ నిర్యాణ వార్త విన్నవిస్తున్న అర్జునుడూ,

**"ఆసుర కృత్యంబు ధర్మ మగునే తండ్రీ?"** అని పుత్రఘాతి అయిన అశ్వత్థామను ప్రశ్నిస్తున్న పాంచాల రాజపుత్రీ,

**"అన్న శమింపుమన్న! తగ దల్లుఁడు గాడిది మేనకోడలా మన్నవసేయగదన్న!"** అని అన్నగారిని బతిమాలే దేవకీదేవీ-- మన హృదయ ఫలకాలమీద చెరగని ముద్రవేసి మన కన్నుల ముందు కలకాలం కదలాడుతూనే ఉంటారు.

ప్రాచీన కవుల పద్యాలతో సంవదించే పద్యాలు కొన్ని పోతన్న గారి భాగవతంలో అక్క డక్కడ గోచరిస్తాయని ఒక ఆక్షేపణ ఉంది. అది వాస్తవంగా ఆలోచిస్తే పోతన్నకు ఉత్కర్షేకాని అపకర్ష ఏ మాత్రం కాదు. అలా వ్రాసినందువల్ల పోతన్న గారికి తనకంటే పూర్వకవులమీద ఉండే పూజ్యభావమూ, ఆదరాభి మానాలూ అభివ్యక్త మవుతాయి. అటువంటి విధంగా సంవదించే పద్యాలు పూర్వకవుల పద్యాలతో సరి సమానంగానూ, కొన్ని చోట్ల పూర్వకవి పద్యాలకు మెరుగులు దిద్దేవిగానూ ఉన్నాయి.

నన్నయ భట్టారకులు ఆదిపర్వంలో మహాభారతాన్ని పారిజాతంతో పోలుస్తూ ఈ క్రింది పద్యం వ్రాశారు-

అమితాఖ్యానకశాఖలం బొలిచి, వేదార్థామలచ్ఛాయమై
సుమహావర్గచతుష్కపుష్పవితతిన్ శోభిల్లి, కృష్ణార్జునో
త్తమ నానాగుణకీర్తనార్థ ఫలమై, ద్వైపాయనోద్యాన జా
త మహాభారత పారిజాత మమరున్ ధాత్రీసుర ప్రార్థ్యమై. **(ఆది. 1-64)**

నన్నయ్యగారిమీది గౌరవంతో ఆయన భావాన్నే స్వీకరించి పోతన్న తన భాగవతాన్ని కల్పతరువుతో పోలుస్తూ అటువంటి మత్తేభాన్నే నడిపించారు. చిత్తగించండి-

**లలిత స్కంధము, కృష్ణమూలము, శుకాలాపాభిరామమ్ము, మం**

**జులతా శోభితమున్, సువర్ణ సుమనస్సుజ్ఞేయమున్, సుందరో**

**జ్జ్వలవృత్తంబు, మహాఫలంబు, విమల వ్యాసాలవాలంబు నై**

**వెలయున్ భాగవతాఖ్య కల్పతరు వుర్విన్ సద్ద్విజశ్రేయమై.** **(భాగ. 1-20)**

నన్నయ్యగారి పారిజాతాన్నీ పోతన గారి కల్పవృక్షాన్నీ పోల్చిచూడండి. నన్నయ్యగారి పద్యంలో రూపకాలంకారంతో కూడిన విశేషణాలు ఆరు ఉంటే పోతన్న గారి పద్యంలో పది విశేషణాలు ఉన్నాయి. పైగా శ్లేషాలంకార సమాశ్లేషంతో రూపకాలంకారంతో రూపు దిద్దుకుంది. నన్నయ్యగారి అడుగుజాడల్లో నడచిన చక్కదనాల పద్యమిది. హృద్యానవద్యమైన ఈ పద్యంవంటి పద్యం ఆంధ్రసాహిత్యంలో మరొక్కటి లేదనటంలో అతిశయోక్తి లేదు. ఈ పద్యాన్ని నన్నయ్యగారే వింటే "నాకంటే బాగా వ్రాశావోయి నాయనా!" అని పోతన్నగారి వీపు తట్టి ఆశీర్వదించి ఉండేవారు.

సంధికార్యంకోసం రాయబారియై పాండవుల పంపున హస్తినాపురానికి విచ్చేసిన శ్రీకృష్ణుణ్ణి పౌరకాంతలు సౌధాగ్రాలమీది నుంచి సందర్శించే సందర్భంలో తిక్కన సోమయాజి ఈ పద్యం వ్రాశాడు-

**ప్రాణంబుతోఁ గూడ రక్కసి చన్నుల పాలు ద్రావిన ప్రౌఢబాలుఁ డితఁడె!**

**వ్రేల్మిడి చాణూరు విఱిచి లోకముల మెచ్చించిన యా జగజెట్టి యితఁడె!**

**దుర్వృత్తుఁడగు కంసుఁ దునిమి యాతని తండ్రిఁ బట్టంబు గట్టిన ప్రభు వితండె!**

**సత్యభామకుఁ బారిజాతంబుపైఁ గలకోర్కి దీర్చిన రసికుం డితండె!**

**వెన్నలును గోపికా చిత్తవృత్తములును, నరసి ముచ్చిల నేర్చిన హరి యితండె!**

**శ్రుతి శిరోభాగములఁ దన సుభగచరణ సరసి, జామోదమును గూర్చు చతురుఁడితఁడె!!**

(ఉద్యో. 3-175)

తిక్కనగారి ఈ సీసానికి సమానంగా పోతన్నగారు మరొక సీసపద్యం వ్రాశారు. కంసుని ఆహ్వానం అందుకొని మధురా నగరానికి విజయం చేసిన శ్రీకృష్ణుని అక్కడి స్త్రీలు మేడలమీద నుంచి చూస్తున్న దృశ్య మిది.

**వీఁడటే! రక్కసి విగతజీవగఁజన్నుఁ బాలు ద్రావిన మేటి బాలకుండు**

**వీఁడటే! నందుని వెలఁదికి జగ మెల్ల ముఖమందుఁ జూపిన ముద్దులాఁడు**

**వీఁడటే మందలో వెన్నలు దొంగిలి దర్పించి మెక్కిన దాఁపరీఁడు**

**వీఁడటే! యలయించి వ్రేతల మానంబు సూఱలాడిన లోక సుందరుండు**

**వీఁడు లేకున్న పుర మటవీస్థలంబు, వీనిఁ బొందని జన్మంబు విగత ఫలము**

**వీనిఁ బలుకని వచనంబు విహగ రుతము, వీనిఁ జూడని చూడ్కులు వృథలు వృథలు.**

(దశమ.1-1248)

ఇరువురు మహాకవుల సీసాలూ రసోల్లసితాలే. హస్తినాపుర కాంతలకు కనిపిస్తున్నవాడు ప్రౌఢ వయస్కుడైన శ్రీకృష్ణుడు. మధురానగర నారీమణులకు  కనువిందు చేస్తున్నవాడు నవయౌవనంతో నవనవలాడే గోపాలకృష్ణుడు. అందువల్ల పోతన్నగారి పద్యం కొంచెం శృంగారం వైపు మొగ్గింది. తిక్కన్న గారి పద్యంలో అర్థగాంభీర్యం, భావవైవిధ్యం అతిశయంగా ఉన్నమాట వాస్తవం. అయితే పోతన్న గారి పద్యంలో పాదాల మొదట "వీఁడటే వీఁడటే" అన్న దీర్ఘాంత పదాలు పౌరకాంతల ఆశ్చర్యాన్నీ, ఆనందాన్నీ, ఉత్కంఠనూ, ఉత్సాహాన్నీ వెల్లడిస్తున్నాయి. మునివేళ్ళపై నిలిచి, చేతులు చాచి, వేలు పెట్టి చూపిస్తున్నట్లు ఈ పద్యంలోని ఎత్తుగడలు స్ఫురింపజేస్తున్నాయి. ఈ పద్యాన్ని తిక్కన్నగారు తిలకిస్తే "నీ పద్యం అభినయయోగ్యమై దర్శనకుతూహలాన్ని అతిశయింపజేస్తున్నది తమ్ముడూ"! అంటూ పోతన్నను అభినందించి ఆలింగనం చేసుకుంటాడేమో!

ఇక ఒకే సందర్భంలో నడచిన ఎఱ్ఱన్న పోతన్నల పద్యాలను పరిశీలించండి.

**ఊషరబీజముల్, భసితయోగ్య ఘృతంబులు, షండకన్యకా**

**న్వేషణముల్, పయోధిగత వృష్టితతుల్, మృగతృష్ణికాంబు గం**

**డూషలు, దుర్గకానన కఠోరితచంద్రిక, లేడమూక స**

**ద్భాషలు విష్ణుమంగళ కథావిముఖాత్ముల దుష్టజన్మముల్.** (నృసింహ. 5-24)

**అంధేందూయముల్, మహాబధిర శంఖారావముల్, మూక స**

**ద్గ్రంథాఖ్యాపనముల్, నపుంసక వధూకాంక్షల్, కృతఘ్నావళీ**

**బంధుత్వంబులు, భస్మహవ్యములు, లుబ్ధద్రవ్యముల్, క్రోడ స**

**ద్గంధంబుల్ హరిభక్తి వర్జితుల రిక్తవ్యర్థ సంసారముల్.** (భాగ. 7-168)

పై రెండు పద్యాలు హరిభక్తి విముఖుల శుష్కజీవితాలను గురించి చెప్పినవే. పోతన్నగారు ఎఱ్ఱన్న గారి పద్యం చూచి తన పద్యం దిద్దితీర్చారనటంలో సందేహం లేదు. అయితే ఏ పద్యం ఏ పద్యంకన్న మిన్నగా ఉందో సహృదయ పాఠకులే తేల్చాలి.

పాల్కురికి సోమనాథుని ఈక్రింది ద్విపద పంక్తులు పరికించండి-

**క్షీరాబ్ధి లోపలఁ గ్రీడించు హంస, గోరునే పడియల నీరు ద్రావంగఁ?**

**జూత ఫలంబులఁ జుంబించు చిలుక, బ్రాతి బూరుగు మ్రాని పండ్లు గొనునె?**

**రాకామల జ్యోత్స్నఁ ద్రావు చకోర, మాకాంక్ష సేయునే చీఁకటిఁ ద్రావ?**

**విరిదమ్మి వాసన విహరించు తేటి, పరిగొని సుడియునే ప్రబ్బలి విరుల?** (బసవ. 3-82 పుట)

పాల్కురికివారి పై పంక్తుల భావాన్ని మనస్సులో పెట్టుకొనే పోతన్నగారు ఆంధ్ర సాహిత్యంలో అత్యంత ప్రసిద్ధమైన ఈ క్రిందిసీస పద్యాన్ని సంతరించారు.

**మందార మకరంద మాధుర్యమునఁ దేలు మధుపంబు వోవునే మదనములకు?**

**నిర్మల మందాకినీ వీచికలఁ దూఁగు రాయంచ చనునె తరంగిణులకు?**

**లలితరసాల పల్లవ ఖాదియై చొక్కు కోయిల చేరునే కుటజములకు?**

**పూర్ణేందు చంద్రికా స్ఫురిత చకోరకం బరుగనే సాంద్రనీహారములకు?**

**నంబుజోదర దివ్యపాదారవింద, చింతనామృత పాన విశేషమత్త**

**చిత్తమే రీతి నితరంబుఁ జేరనేర్చు వినుత గుణశీల! మాటలు వేయునేల?** (భాగ. 7-150)

ఇద్దరి రచనల్లో ఏది ముద్దులు మూటగట్టుతున్నదో, అందాలు చిందుతున్నదో ప్రత్యేకించి చెప్పవలసిన పనిలేదు.

నరకాసురుణ్ణి సంహరించటం కోసం శ్రీకృష్ణుడు సత్యభామా సమేతుడై వెళ్లాడు. వీర సాత్రాజితి శ్రీకృష్ణుని చేతి విల్లందుకొని నరకునిపై శరపరంపరలు కురిపిస్తున్నది. ఈ సందర్భంలో నాచన సోమనాథుని ఉత్తర హరివంశంలో ఈ పద్యం ఉన్నది.

**అరిఁ జూచున్ హరిఁ జూచుఁ జూచుకములం దందంద మందార కే**

**సర మాలా మకరందబిందు సలిలస్యందంబు లందంబులై**

**తొరఁగన్, బయ్యెదకొంగు గొంకింత తొలఁగన్, దోర్దోః శరాసారమున్**

**దరహాసామృతపూరమున్ గురియుచున్ దన్వంగి లీలాగతిన్.** **(ఉ.హ. 1-162)**

సరిగా ఇదే సందర్భాన్ని పురస్కరించుకొని పోతన్నగారు భాగవతంలోపై పద్యంలాంటి పద్యాన్నే వ్రాశారు.

**పరుఁ జూచున్ వరుఁజూచు, నొంప నలరింపన్, రోషరాగోదయా**

**విరత భ్రూకుటి మందహాసములతో, వీరంబు శృంగారమున్**

**జరగన్, గన్నులఁ గెంపు సొంపు బరఁగన్, జండాస్త్రసందోహమున్**

**సరసాలోక సమూహమున్ నెఱపుచున్ జంద్రాస్య హేలాగతిన్.** **(భాగ. 10-2-178)**

ఇద్దరు కవుల పద్యాల్లోని సన్నివేశం సమానమే. ఇద్దరూ మత్తేభవృత్తంలోనే వ్రాశారు. ఇద్దరూ వీరనారీమణి సత్యభామా స్వరూపాన్నే అభివర్ణించారు. కాని చిత్రీకరణంలో భేదం ఉన్నది.

నాచన సోమనాథుని సత్యభామ కుచాగ్రములయందు ఆమె మెడలోని మందారమాల నుంచి మకరంద బిందువులు అందంగా చింది పడుతున్నాయి. పైటకొంగు రవంత జారింది. ఆమె వెంట వెంటనే శరపరంపరలనూ, చిరునవ్వులనూ వర్షిస్తూ నరకాసురుణ్ణి శ్రీకృష్ణుణ్ణి విలాసంగా చూస్తున్నది.

ఎదురుగా ఉన్న అరినీ, ప్రక్కనే ఉన్న హరినీ శరాసారం ప్రయోగిస్తూ, దరహాసామృతపూరం ప్రసరిస్తూ చూడటం వరకు బాగానే ఉన్నది. ఆమె మెడలోని మందారమాల యందలి మకరంద బిందువులు అందంగా ఆమె చూచుకములందు పడుతున్నాయనటం రణరంగంలో వీరావేశంతో విల్లెక్కుపెట్టిన సాత్రాజితిని కేవల శృంగారదేవతగా చిత్రించటంలో కొంత అనౌచిత్యం గోచరిస్తున్నది. "అందంద మందార కేసరమాలా మకరంద బిందు సలిల స్యందంబులు" ఎంత అందంగా ఉన్నా హరిని చూడటంలో సహజంగా ఉంటాయి కాని అరిని చూచేటప్పుడు చాలా అసహజంగా ఉంటాయి. అందుకనే పోతన్నగారు సోమన్న పద్యంలోని అనౌచిత్యాన్ని పరిహరిస్తూ సత్యభామలోని వీరశృంగారాలను సరిసమానంగా స్ఫురింపజేసే పద్యం వ్రాశారు.

పోతన్నగారి సత్యభామకూడ పరుణ్ణీ వరుణ్ణీ చూచింది. అయితే ఆమె చూపులలో అటు అణచివేయాలనే భావమూ, ఇటు అలరించాలనే భావమూ; అటు రోషోదయమూ, ఇటు రాగోదయమూ; అటు కన్నుల

కెంపూ, ఇటు కన్నుల సొంపూ, అటు చండాస్త్రపరంపరా, ఇటు సరసాలోక పరంపరా విరాజిల్లుతూ ఉన్నాయి. సోముని పద్యంలో శరాసారమూ, దరహాసామృతపూరమూ ప్రసరిస్తుంటే అటువంటి జంటలు పోతన పద్యములో ఆరు కనిపిస్తున్నాయి. ఈ విధంగా సాత్రాజితీ చిత్రణంలో బమ్మెరవారి మత్తేభం నాచన సోమన మత్తేభంకంటె నాలుగైదడుగులు ముందుకు వేసింది.

భాస్కర రామాయణంలోని పద్యాలకు సంవదించే పద్యాలుకూడా పోతన్న భాగవతంలో కనిపిస్తాయి. భాస్కరుడు చేసిన ఈ క్రింది దండకారణ్య వర్ణనం చూడండి.

**పుణ్యచరిత్రుఁ డత్రిముని పుంగవు వీడ్కొని రాముఁ డంచితా**

**గణ్యగుణాభిరాముఁ డుపకంఠమునం జని కాంచె దండకా**

**రణ్యము, సిద్ధసంయమి విరాజిత, చారు తపోనుజాత స**

**త్పుణ్యము, నిర్మలాంబువర పుష్కరపూర్ణసరోవరేణ్యమున్.** **(భా.రా. అరణ్య.1-2)**

ఇదే సందర్భంలో పోతన్న దండకారణ్యాన్ని ఈ విధంగా వర్ణించాడు.

**పుణ్యుఁడు రామచంద్రుఁడట వోయి మందంబునఁ గాంచె దండకా**

**రణ్యముఁ దాపసోత్తమ శరణ్యము నుద్ధత బర్హిబర్హ లా**

**వణ్యము గౌతమీ విమలవాఃకణ పర్యటన ప్రభూత సా**

**ద్గుణ్యము నుల్లసత్తరు నికుంజవరేణ్యము నగ్రగణ్యమున్.** **(భాగ. 9-267)**

ఇరువురు మహాకవులూ ఒకే వృత్తం ఒకే ప్రాస ఒకే అంత్యాను ప్రాస స్వీకరించారు. భాస్కరుడు దండ కారణ్యానికి రెండు విశేషణాలు వేస్తే పోతన ఐదు విశేషణాలు వేశాడు. అయితే ఉద్ధత బర్హిబర్హ లావణ్యము (మదించిన మయూరాల పింఛాలలోని నిగనిగలతో కూడినది) అన్న విశేషణమూ, ఉల్లసత్తరు నికుంజవరేణ్యము ( చక్కగా వికసించిన చెట్లతో పొదరిండ్లతో నిండినది) అన్న విశేషణమూ అరణ్యాశోభను మరింత వెల్లడిస్తున్నాయి. అంతేకాకుండా స్వచ్ఛమైన గోదావరీనది శీతలశీకరాలతో నిండి ఉన్నదనటం పోతన్నగారి ఆంధ్రాభిమానాన్ని అభివ్యక్తం చేస్తున్నది.

ఈ విధంగా పోతన్నగారి పద్యాలతో పూర్వకవుల పద్యాలతో సంవదించేవి ఉన్నప్పటికీ అవి సొంత విలువలు సంతరించుకొన్నవనీ, అది గ్రంథచౌర్యం కాదనీ, అందువల్ల పోతన్నగారి కవిత్వానికి ఎటువంటి లోటూ వాటిల్లదనీ మనకు అర్థమౌతుంది.

ప్రస్తుతం మీ కరకమలాలను అలంకరించిన గ్రంథం పోతన భాగవతం చతుర్థస్కంధం. ఈ స్కంధంలో ఐదు ప్రధానమైన ఘట్టాలు- దక్షాధ్వర ధ్వంసం, ధ్రువోపాఖ్యానం, పృథుచక్రవర్తి చరిత్రం, ప్రచేతసుల వృత్తాంతం, పురంజనోపాఖ్యానం అనేవి ఉన్నాయి.

దక్షాధ్వర ధ్వంసంలో శివద్రోహియైన దక్షునితో సతీదేవి ఇలా అంటుంది-

**నీలగళాపరాధియగు నీకుఁ దనూభవ నౌట చాలదా!**

**చాలుఁ గుమర్త్య! నీదు తనుజాత ననన్ మది సిగ్గు పుట్టెడి**

**న్నేల ధరన్ మహాత్ములకు నెగ్గొనరించెడి వారి జన్మముల్**

**గాలుపనే తలంప జనకా! కుటిలాత్మక! యెన్ని చూడఁగన్.**

**వరవృషకేతనుండు భగవంతుఁడు నైన హరుండు నన్ను నా**

**దర పరిహాసవాక్యముల దక్షతనూభవ! యంచుఁ బిల్వ నేఁ**

**బురబురఁ బొక్కుచున్ ముదముఁ బొందక నర్మవచః స్మితంబులన్**

**దొఱఁగుదు నీ తనూజ నను దుఃఖము కంటెను జచ్చు టొప్పగున్.** **(4-95,96)**

కోపోద్రిక్తుడైన నిటలాక్షుని జటనుంచి ఉద్భవించిన వీరభద్రుని రౌద్రస్వరూపం ఈ విధంగా వర్ణింప బడింది.

**అభ్రం లిహోదభ్ర విభ్రమాభ్రభ్రమ కృష్ణనీల దీర్ఘ శరీర మమరఁ**

**బ్రజ్వలజ్జ్వలన దీప్త జ్వాలికాజాల జాజ్వల్యమాన కేశములు మెఱయఁ**

**జండదిగ్వేదండ శుండాభ దోర్దండ సాహస్ర ధృత హేతిసంఘ మొప్ప**

**వీక్షణత్రయలోక వీక్షణద్యుతిలోక వీక్షణతతి దుర్నిరీక్ష మగుచుఁ**

**గ్రకచ కఠిన కరాళ దంష్ట్రలు వెలుంగ, ఘన కపాలాస్థి వనమాలికలును దనర**

**నఖిలలోక భయంకరుఁ డగుచు వీర, భద్రుఁ డుదయించె మాఱట రుద్రుఁ డగుచు.** **(4-108)**

పినతల్లి చేసిన పరాభవానికి పరితపించి తపస్సు చేయటంకోసం అడవికి వచ్చిన ధ్రువకుమారునికి నారద మహర్షి నారాయణమూర్తిని ఈ సీసపద్యంలో పరిచయం చేస్తాడు.

**హారకిరీట కేయూర కంకణ ఘన భూషణుఁ డాశ్రిత పోషణుండు**

**లాలిత కాంచీకలాప శోభిత కటి మండలుం డంచిత కుండలుండు**

**మహనీయ కౌస్తుభమణి ఘృణి చారుగ్రైవేయకుం డానంద దాయకుండు**

**సలలిత ఘనశంఖ చక్ర గదా పద్మ హస్తుఁడు భువనప్రశస్తుఁ డజుఁడుఁ**

**గమ్రసౌరభ వనమాలికాధరుండు, హతవిమోహుండు నవ్యపీతాంబరుండు**

**లలిత కాంచన నూపురాలంకృతుండు, నిరతిశయ సద్గుణుఁడు దర్శనీయతముఁడు** (4-251)

గోరూపధారిణియైన భూదేవి నుంచి పృథుచక్రవర్తి సమస్త సస్యములను పితికిన విషయ మీక్రింది పద్యంలో తెలుపబడింది.

**మనువును దూడఁజేసి గరిమన్ నిజపాణితలంబు లీల దో**

**హనముగఁ జేసి యందు సకలౌషధులం బితికెం గ్రమంబునన్**

**దనరఁగఁ దద్విధంబునను దత్పృథువత్సలయైన భూమియం**

**దనయము వారు వారును బ్రియంబగు కోర్కులఁ బొంది రున్నతిన్.** (4-501)

ప్రణయకోపం వహించిన తన ప్రియురాలిని పురంజనుడు ఈ విధంగా బతిమాలుకుంటాడు-

**సరసోదారసుధార సోపమవచశ్చాతుర్య సౌభాగ్యమై,**

**హరినీలోపమ కోమలాలకయుతంబై, విభ్రమ భ్రూలతా**

**పరిపుష్ట స్మిత సద్విలోకనమునై భాసిల్లు యుష్మన్ముఖాం**

**బురుహంబున్ భవదీయదాసునకుఁ బూఁబోణీ! గృపం జూపవే!** (4-791)

ప్రచేతసులు శ్రీ మహావిష్ణువును స్తుతించిన తీరు చిత్తగించండి.

**పూని భవత్పదాంబురుహ మూలనివాసులమైన మేము మే**

**ధానిధి! నీ విలోకనముఁ దక్కఁగ నన్యముఁ గోరనేర్తుమే?**

**మానిత పారిజాతకుసుమ స్ఫుట నవ్యమరంద లుబ్ధ శో**

**భానయశాలియైన మధుపంబు భజించునె యన్యపుష్పముల్?** (4-985)

ఈ ప్రకారంగా చక్కని సన్నివేశాలతోకూడి భక్తి ప్రపత్తులను ప్రబోధించే చతుర్థస్కంధంలోని కథలన్నిటినీ మైత్రేయుడు విదురునికి వినిపించినట్లు శుకమహర్షి పరీక్షిన్మహారాజుకు వినిపించాడు.

పోతన భాగవతం అక్షరాస్యు లందరికీ అందుబాటులో ఉండే నిమిత్తం సరళ గద్యానువాద సహితంగా

ప్రకటించాలని తిరుమల తిరుపతి దేవస్థానములవారు సంకల్పించారు. ఈ సదుద్దేశంతోనే పోతన భాగవతం ప్రాజెక్టు ప్రారంభింపబడింది. ఈ మహాకార్యంలో నాకు అవకాశం కల్పించిన కార్యనిర్వహణాధికారి శ్రీ ఎన్. లక్ష్మీనారాయణ, ఐ.ఏ,ఎస్., గారికి నా నమస్సుమాంజలులు సమర్పిస్తున్నాను.

అనువాద భాగాలన్నింటినీ పరిశీలించి పరిష్కరించి ఏకసూత్రత కల్పించే భారం నా మీద ఉంచిన డాక్టర్ రావుల సూర్యనారాయణమూర్తి, పి.ఆర్.ఓ., గారికి నా అభివందనాలు. ఈ సందర్భంలో నాకు సంపూర్ణంగా సహకరిస్తున్న శ్రీ కె. సుబ్బారావు, ఎడిటర్ గారికి నా కృతజ్ఞతా పూర్వక అభివాదాలు.

ఈ స్కంధాన్ని సరళగద్యంలో అనువదించినవారు శ్రీ శనగన నరసింహస్వామి, ఎం,ఏ., గారు. శ్రీశనగనవారు సుప్రసిద్ధ కవులు. మంచివక్తలు. ప్రస్తుతం వీరు విజయవాడ ఆంధ్ర లయోలా కళాశాలలో ఆంధ్రోపన్యాసకులుగా ఉన్నారు. శ్రీ నరసింహస్వామిగారి గద్యానువాదం సరసంగా సరళంగా మూలవిధేయంగా కొనసాగింది.

ఈ గ్రంథాన్ని ముచ్చటగా ముద్రించిన దేవస్థానం ప్రెస్ మేనేజర్ శ్రీ విజయకుమార్‌రెడ్డి గారికీ,, వారి సిబ్బందికీ నా సాధువాదాలు.

ముద్రారాక్షసాలు దొరలకుండా సహస్రాక్షులై ప్రూఫులు సరిదిద్దిన పూజ్యమిత్రులు శ్రీముదివర్తి కొండమాచార్యులవారికీ, శ్రీములుకుట్ల రామకృష్ణ శాస్త్రిగారికినీ ధన్యవాదాలు. ముద్రణకు తగినట్లు ప్రెస్ కాపీ సిద్ధంచేసి యిచ్చిన చిరంజీవి కోరాడ రామకృష్ణ ఎం.ఏ., ఎం.ఫిల్. కు నా ఆశీర్వాదాలు.

భవదీయుడు

***కరుణశ్రీ***

తిరుపతి, ప్రధాన సంపాదకుడు

10-2-86 పోతన భాగవతము

# విషయసూచిక

## నాల్గవ స్కంధము (1-238)

## ఐదవ స్కంధము (239-364)

### ప్రథమాశ్వాసము



### ద్వితీయాశ్వాసము



## ఆరవ స్కంధము (365-536)

# పోతన భాగవతము

(చతుర్థ, పంచమ, షష్ఠ స్కంధములు)

## రెండవ సంపుటము

శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః

# పోతన భాగవతము

## (సరళ గద్యానువాద సహితము)

## నాల్గవ స్కంధము

శ్రీవిలసితధరణీతన
యావదన సరోజ వాసరాధిప! సిత రా
జీవదళనయన! నిఖిల ధ
రావర నుత! సుగుణధామ! రాఘవరామా! 1

* అందమైన సీతాదేవి ముఖమనే పద్మమునకు సూర్యునివంటి వాడా! తెల్ల తామరపూరేకులవంటి కన్నులు కలవాడా! సమస్తరాజుల చేత పొగడబడే సద్గుణాలకు స్థానమయినవాడా! రఘువంశలలామా! శ్రీరామా!

వ. మహనీయగుణగరిష్ఠులగు నమ్మునిశ్రేష్ఠులకు నిఖిల పురాణ వ్యాఖ్యాన వైఖరీసమేతుండైన సూతుం డిట్లనియె: నట్లు ప్రాయోపవిష్టుండైన పరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుం డిట్లనియె. 2

* గొప్ప గుణములు కలిగిన ఆ మునీశ్వరులతో సమస్త పురాణాలను వివరించటంలో నేర్పరియైన సూతుడు ఇలా అన్నాడు.

అతడు ప్రాయోపవేశం చేసి పరీక్షిత్తుతో ఇలా చెప్పసాగాడు.

### -: మైత్రేయుండు విదురునకు స్వాయంభువ మనుపుత్రికల వంశవిస్తారంబు దెలుపుట :-

సీ. జననాథ! విను విదురునకును మైత్రేయ మునినాథచంద్రుఁ డిట్లనియె మరల
స్వాయంభువున కర్థి శతరూపవలనను గూఁతులు మువ్వు రాకూతి దేవ
హూతి ప్రసూతులు నొనరఁ బ్రియవ్రతోత్తానపాదులు నను తనయయుగము
జనియించి రం దగ్రసంభవయైన యాకూతిని సుమహిత భ్రాతృమతిని

తే. దనకు సంతానవిస్తరార్థంబుగాఁగఁ, బుత్రికాధర్మ మొంది యా పువ్వుఁబోఁడిఁ
బ్రకటమూర్తి రుచిప్రజాపతికి నిచ్చె, మనువు ముద మొంది శతరూప యనుమతింప. 3

* రాజా విను. విదురునితో మైత్రేయముని మళ్ళీ ఇలా అన్నాడు. స్వాయంభువ మనువునకు శతరూప అనే భార్యవల్ల ఆకూతి, దేవహూతి, ప్రసూతి అనే ముగ్గురు కుమార్తెలూ; ప్రియవ్రతుడు,

ఉత్తానపాదుడు అనే ఇద్దరు కొడుకులూ జన్మించారు. వారిలో పెద్ద దైన ఆకూతిని మనువు పుత్రికాధర్మాన్ని ఆశ్రయించి "రుచి" అనే ప్రజాపతికి ఇచ్చి పెండ్లి చేశాడు. ఆకూతికి సోదరులు ఉన్నప్పటికీ తన సంతానం విస్తరిల్లటం కోసం స్వాయంభువమనువు పుత్రికా ధర్మాన్ని పాటించాడు. అందుకు మనువు భార్య శతరూప ఆనందంతో అంగీకరించింది.

**వ. అట్లు వివాహంబైన రుచిప్రజాపతి బ్రహ్మవర్చస్వియుఁ బరిపూర్ణ గుణుండును గావునఁ జిత్తైకాగ్రతం జేసి యాకూతి యందు శ్రీవిష్ణుండు యజ్ఞరూపధరుం డగు పురుషుండుగను జగదీశ్వరి యగు నాది లక్ష్మి య మ్మహాత్మునకు నిత్యానపాయిని గావునఁ దదంశంబున దక్షిణ యను కన్యకా రత్నంబుగను మిథునంబు సంభవించె; నందు స్వాయంభువుండు సంతుష్టాంతరంగుం డగుచుఁ బుత్రికాపుత్త్రుండును, వితతతేజోధనుండును, శ్రీ విష్ణుమూర్తి రూపుండును నగు యజ్ఞునిఁ దన గృహంబునకుఁ దెచ్చియునిచె; రుచియుఁ గామగమన యైన దక్షిణ యను కన్యకాలలామంబును దన యొద్దన నిలిపె; నంత సకల మంత్రాధి దేవత యగు శ్రీయజ్ఞుండు దనుఁ బతిగం గోరెడు దక్షిణయను కన్యకం బరిణయంబయ్యె; వార లాదిమిథునంబు గావున నది నిషిద్ధంబు గాకుండె నని చెప్పి మైత్రేయుండు వెండియు నిట్లనియె.4**

* రుచి ప్రజాపతి బ్రహ్మ తేజస్సు కలవాడు. సద్గుణ సంపన్నుడు. మనస్సును భగవంతునియందే లగ్నం చేసినవాడు. అందువల్ల అతనికి ఆకూతియందు శ్రీమహావిష్ణువు "యజ్ఞుడు" అను పుత్రుడుగా జన్మించాడు. జగన్మాత అయిన ఆదిలక్ష్మి విష్ణువును ఎప్పుడూ విడిచి ఉండదు గనుక తన అంశతో "దక్షిణ" అను కన్యకగా జన్మించింది. స్వాయంభువుడు ఎంతో సంతోషించి తన కూతురి కుమారుడూ, అత్యంత తేజోవంతుడూ, శ్రీ విష్ణుదేవుని అవతారమూ, అయిన యజ్ఞుని తన యింటికి తెచ్చుకున్నాడు. రుచిప్రజాపతి కామగమన అయిన దక్షిణను తన దగ్గరనే నిలుపుకున్నాడు. పిమ్మట యజ్ఞుడు తన్ను భర్తగా కోరిన దక్షిణను చేపట్టాడు. వారు ఇద్దరూ ఆదిదంపతులు కావటంచేత ఆ అన్నా చెల్లెళ్ల పెళ్ళి లోకవిరుద్ధం కాలేదు.

**క. ధీమహిత! యంతవారల, యామాఖ్యలు గలుగు దేవతావళి గడఁకన్**
**వేమఱు నభినందించుచు. నా మిథునమువలనఁ బుట్టె నతిబలయుతమై. 5**

* ఇలా చెప్పి మైత్రేయుడు మళ్ళీ చెప్పసాగాడు. దంపతులైన దక్షిణకూ యజ్ఞునకూ "యామ" నామకులైన దేవతలు పుత్రులుగా జన్మించారు. వారు మహాబలవంతులు.

**వ. వారు తోషుండును బ్రతోషుండును సంతోషుండును భద్రుండును శాంతియు నిడస్పతియు నిధ్మండును గవియు విభుండును వహ్నియు సుదేవుండును రోచనుండును ననం బన్నిద్దఱు సంభవించిరి; వారలు స్వాయంభువాంతరంబునం "దుషితు" లను దేవగణంబులై వెలసిరి; మఱియు మరీచి ప్రముఖులైన మునీశ్వరులును యజ్ఞుండును దేవేంద్రుండును మహాతేజస్సంపన్ను లయిన ప్రియవ్రతోత్తానపాదులుం గలిగి పుత్త్రపౌత్త్ర నప్తృవంశంబులచే వ్యాప్తంబయి యా మన్వంతరంబు పాలితం బగుచు వర్తిల్లె; మనువు ద్వితీయ పుత్రియైన దేవహూతిం గర్దమున కిచ్చి తద్వంశ విస్తారంబు గావించెనని మున్న యెఱింగించితి; వెండియు నమ్మనువు మూఁడవదూలైన ప్రసూతి యను కన్యకను బ్రహ్మపుత్త్రుండగు దక్షప్రజాపతికి నిచ్చె; నా దక్షునకుఁ బ్రసూతివలన నుదయించిన**

**ప్రజాపరంపరలచేత ముల్లోకంబులు విస్తృతంబు లయ్యె; మఱియుఁ గర్దమపుత్రికా సముదయంబు బ్రహ్మర్షి భార్య లగుటం జేసి వారి వలనం గలిగిన సంతాన పరంపరల వివరించెద. 6**

* ఆ పుత్రులు పన్నెండుమంది. వరుసగా వారి పేర్లు ఇవి- తోషుడు, ప్రతోషుడు, సంతోషుడు, భద్రుడు, శాంతి, ఇడస్పతి, ఇధ్మండు, కవి, విభుడు, వహ్ని, సుదేవుడు, రోచనుడు. ఈ పన్నెండు మందినీ "తుషితులు" అనికూడ అంటారు. స్వాయంభువ మన్వంతరంలో తుషితులు దేవత లయ్యారు. మరీచి మొదలైన మునీశ్వరులు సప్తర్షులు అయ్యారు. యజ్ఞుడు దేవేంద్రు డయ్యాడు. మనువు పుత్రులైన ప్రియవ్రతుడూ, ఉత్తానపాదుడూ, వారి కొడుకులూ, మనుమలూ, మునిమనుమలూ- వీరందరితోనూ స్వాయంభువ మన్వంతరం నిండి కొనసాగింది.

మనువు తన రెండవ కూతురయిన దేవహూతిని కర్దమ ప్రజాపతి కిచ్చాడు. ఆ దేవహూతి కర్దముల సంతానం పెంపొందిన వృత్తాంతం ఇది వరకే చెప్పాను కదా? మనువు తన మూడవ కూతురైన ప్రసూతిని దక్షప్రజాపతికి భార్యగా ఇచ్చాడు. ఆ దక్షునికి ప్రసూతికి పుట్టిన సంతతితో మూడు లోకాలూ నిండిపోయాయి. కర్దముని పుత్రికలు బ్రహ్మర్షులకు భార్య లయ్యారు. వారివల్ల కలిగిన సంతానాన్ని వివరిస్తాను, విను.

## -: కర్దమప్రజాపతి సంతతి :-

**సీ. ఘనుఁడౌ మరీచికిఁ గర్దమాత్మజయగు కళ యను నంగనవలనఁ గశ్య**
**పుం డను కొడుకును బూర్ణిమ యను నాఁడుబిడ్డయుఁ బుట్టిరి; పేర్చి వారి**
**వలనఁ బుట్టిన ప్రజావళిపరంపరలచే భువనంబు లెల్ల నాపూర్ణ మగుచు**
**జరగెను; బూర్ణిమ జన్మాంతరంబున హరిపద ప్రక్షాళితాంబువులను**

**తే. గంగ యనుపేరఁ బుట్టి యక్కన్య "దేవ, కుల్య" యనుదాని నొక్కతెఁ గూఁతు నఖిల**
**విష్టపవ్యాపకుం డగు "విరజుఁ" డనెడి, తనయు నొక్కనిఁ గాంచె మోదంబు తోడ. 7**

మరీచి మహర్షికి కర్దముని కూతురైన "కళ" అను భార్యవల్ల కశ్యపుడు అను కొడుకూ, పూర్ణిమ అను కూతురూ పుట్టారు. ఆ కశ్యపుని సంతానము, పూర్ణిమ సంతానము లోకాలన్నిటా నిండిపోయాయి. పూర్ణిమ "విరజుడు" అను కొడుకునూ, "దేవకుల్య" అను కూతురినీ కన్నది. ఈమెయే శ్రీమన్నారాయణుని పాదప్రక్షాళన జలాలతో స్వర్గంగా జన్మాంతరం పొందింది.

**క. అనఘుం డత్రిమహాముని,యనసూయా దేవివలన నజ హరి పుర సూ**
**దనుల కళాంశంబుల నం, దనులను ముప్పురను గాంచెఁ దద్దయుఁ బ్రీతిన్. 8**

* పవిత్రచరిత్రు డయిన అత్రిమహాముని, తన అర్ధాంగియైన అనసూయాదేవివల్ల ముగ్గురు కొడుకులను పొందాడు. ఆ కొడుకులు ముగ్గురూ బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల అంశలచేత జన్మించారు.

**క. అనవుడు విదురుఁడు మైత్రే, యునిఁ గనుఁగొని పలికె మునిజనోత్తమ! జగతిన్**
**జననస్థితిలయకారణు, లన వెలసిన పద్మగర్భహరిహరు లెలమిన్. 9**

క. ఏమి నిమిత్తం బత్రి మ, హాముని మందిరమునందు ననసూయకు ను
ద్దామగుణు లుదయమై రన, నా మైత్రేయుండు పలికె నవ్విదురునితోన్. **10**

ఈ విధంగా మైత్రేయుడు చెప్పగానే విదురుడు "మునీంద్రా! బ్రహ్మ, విష్ణువు, శివుడు- జగత్తు పుట్టుటకూ, ఉనికికి, వినాశమునకూ కారణమైన వారుగదా! ఆ మహానుభావులు ఏ కారణంచేత అత్రిమహర్షి యింట అనసూయాదేవికి తనయులై జన్మించారు?" అని ప్రశ్నించాడు. అప్పుడు మైత్రేయుడు విదురునికి ఆ కథ యిలా వివరించాడు.

సీ. సుచరిత్ర! విను విధిచోదితుండై యత్రి దప మాచరింపఁ గాంతాసమేతుఁ
డయి ఋక్షనామ కులాద్రి తటంబున ఘుమఘుమారావ సంకులవిలోల
కల్లోల జాల సంకలిత నిర్వింధ్యా నదీ జల పరిపుష్ట రాజిత ప్ర
సూన గుచ్ఛ స్వచ్ఛ మానితాశోక పలాశ కాంతారస్థలమున కెలమి

తే. నరిగి యచ్చట నిర్ద్వంద్వుఁ డగుచుఁ బ్రాణ, నియమము ననేక పదమున నిలిచి గాలిఁ
దివుటఁ గ్రోలి కృశీభూతదేహుఁ, డగుచుఁ దపము గావించె దివ్యవత్సరశతంబు. **11**

* విదురా! విధిప్రేరణంవల్ల అత్రిమహర్షి తపస్సు చేయటానికి పూనుకున్నాడు. భార్య అయిన అనసూయాదేవితో కూడి "ఋక్షం" అనే కులపర్వతానికి వెళ్ళాడు. అక్కడ నిర్వింధ్యానది ఉత్తుంగ తరంగాలతో పొంగి పొరలి ప్రవహిస్తున్నది. ఆ నదీ ప్రవాహంవల్ల అక్కడి అడవిలోని అశోకవృక్షాలూ, మోదుగుచెట్లూ ఏపుగా పెరిగి పూలగుత్తులతో నిండి కన్నులపండువు చేస్తున్నాయి. అటువంటి ప్రదేశంలో అత్రిమహర్షి జితేంద్రియుడై ప్రాణాలను నియమించి ఒంటికాలిపై నిలుచుండి శీతోష్ణ సుఖదుఃఖాది ద్వంద్వాలను జయించి గాలిని మాత్రమే ఆహారంగా స్వీకరిస్తూ నూరు దివ్యసంవత్సరాలు తపస్సు చేశాడు. అతని శరీరం బాగా కృశించిపోయింది.

వ. ఇట్లుతి ఘోరంబైన తపంబు సేయుచుఁ దన చిత్తంబున. **12**

క. ఏ విభుఁడు జగదధీశ్వరుఁ, డా విభు శరణంబు సొత్తు నతఁడాత్మ సమం
బై వెలసిన సంతతిని ద, యావరమతి నిచ్చుఁగాక యని తలఁచు నెడన్. **13**

"ఈ సమస్త లోకాలకూ అధీశ్వరుడైన వానిని శరణుగోరుతున్నాను. ఈ ప్రభువు దయతో తనతో సమానమైన సంతానమును నాకు ప్రసాదించు గాక!" అని అత్రి మహర్షి తన మనస్సులో భావింపసాగాడు.

చ. మునుకొని యత్తపోధనుని మూర్ధజమైన తపఃకృశానుచే
తను త్రిజగంబులుం గరఁగి తప్తములై నను జూచి బంకజా
సన మురశాసన త్రిపురశాసను లచ్చటి కేగి రప్సరో
జనసురసిద్ధ సాధ్యమునిసన్నుత భూరియశోభిరాములై. **14**

* మహాతపస్వి అత్రిమహాముని శిరస్సునుండి ఆవిర్భవించిన అగ్ని జ్వాలలవల్ల మూడు లోకాలూ కరగి వేడెక్కాయి. అప్పుడు అప్సరసలు, దేవతలు, సిద్ధులు, సాధ్యులు, మునులు, తమ యశోగానం చేస్తూ వుండగా బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు అత్రి మహాముని ముందు సాక్షాత్కరించారు.

**వ. అట్లు మునీంద్రు నాశ్రమంబు డాయం జను నవసరంబున. 15**

**చ. అనఘుతపోభిరాముఁడగు నత్రిమునీంద్రుఁడు గాంచెఁ దప్త కాం**
**చన ఘన చంద్రికా రుచిర చారుశరీరుల హంస నాగ సూ**
**దన వృషభేంద్రవాహుల నుదారకమండలు చక్ర శూల సా**
**ధనుల విరించి విష్ణు పురదాహుల వాక్కమలాంబికేశులన్. 16**

* ఈ విధంగా సరస్వతీ లక్ష్మీ గౌరీ వల్లభులైన త్రిమూర్తులు అత్రి ఎదుట నిలిచారు. బ్రహ్మ మేలిమి బంగారువలె పసుపుపచ్చగా ఉన్నాడు. విష్ణువు మేఘంవలె నల్లగా ఉన్నాడు. శివుడు వెన్నెలవలె తెల్లగా ఉన్నాడు. బ్రహ్మ హంసను, హరి గరుత్మంతుని, శివుడు వృషభాన్ని అధిష్ఠించి ఉన్నారు. బ్రహ్మ కమండలువును ధరించాడు. విష్ణువు చేతిలో చక్రం ఉన్నది. శివుని చేతిలో త్రిశూలం ఉన్నది.

**వ. మఱియుఁ గృపావలోకన మందహాస సుందర వదనార విందంబులు గల మహాత్ముల సందర్శించి యమందానంద కందళిత హృదయారవిందుండై సాష్టాంగదండ ప్రణామంబు లాచరించి పుష్పాంజలి గావించి నిటలతట ఘటిత కర పుటుండై దుర్నిరీక్ష్యం బైన తత్తేజోవిశేషంబుఁ దేఱి చూడంజాలక ముకుళిత నేత్రుండై తత్పదాయత్త చిత్తుం డగుచు సర్వలోక ప్రశంస్యంబు లైన మృదుమధుర గంభీర భాషణంబుల నిట్లని స్తుతియించె. 17**

* త్రిమూర్తులు అత్రివైపు కరుణాకటాక్షవీక్షణాలు ప్రసరింపజేశారు. వారి ముఖాలలో చిరునవ్వులు చిందులాడుతున్నవి. అత్రిమహర్షి ఆ మహాత్ములను చూచి పట్టరాని ఆనందంతో పొంగిపోయాడు. సాగిలపడి నమస్కరించాడు. దోసిలినిండా పూలు నింపుకొని పుష్పాంజలి సమర్పించాడు. నుదుట చేతులు మోడ్చి నిలబడ్డాడు. కన్నులకు మిరుమిట్లు గొలిపే త్రిమూర్తుల దివ్య తేజస్సును చూడజాలక కన్నులు మూసుకున్నాడు. వారిపాదములందే తన మనస్సును లగ్నం చేసి మృదువుగా, మధురంగా, గంభీరంగా ఇలా స్తుతించాడు.

**సీ. ప్రతి కల్పమందు సర్వప్రపంచోద్భవ స్థితి వినాశంబులఁ జేయునట్టి**
**మహిత మాయాగుణమయ దేహములఁ బొల్చు నజ వాసుదేవ శివాభిధాన**
**ములు గల్గు మీ పాదజలజాతములకు నే నతిభక్తి వందనం బాచరింతు;**
**నఖిల చేతన మానసాగమ్య మన నొప్పు మూర్తులు గల్గు మీ ముప్పురందుఁ**

**తే. బరఁగ నాచేతఁ బిలువంగఁ బడిన ధీరుఁ, డెవ్వఁడే నొక్కరునిఁ బిల్వ నిపుడు మీరు**
**ముప్పు రేతెంచుటకు నాదు బుద్ధి విస్మ, యంబు గదిరెడిఁ జెప్పరే యనఘులార! 18**

* ఓ మహనీయులారా! ప్రతికల్పంలోను మీరు సర్వప్రపంచాన్నీ సృజిస్తారు, పోషిస్తారు, నాశనం చేస్తారు, మీరు మాయాగుణ స్వరూపులు. బ్రహ్మ విష్ణు మహేశ్వర స్వరూపులైన మీ పాదపద్మాలకు నేను

భక్తిపూర్వకంగా ప్రణామం చేస్తున్నాను. చైతన్యవంతా లయిన మానవుల స్వాంతాలకు కూడ మీతత్త్వం అందదు. మీ ముగ్గురిలో నేను పిల్చిన మహాత్ముడు ఎవరు? నేను ఒక్కరినే పిలిచాను. మీరు ముగ్గురూ వేంచేశారు. నాకు వింతగా ఉన్నది.

**వ. అదియునుం గాక సంతానార్థంబు నానావిధ పూజలు గావించి నాచిత్తంబున ధరియించిన మహాత్ముం డొక్కరుండ యనిన నమ్ముమ్వురు విబుధశ్రేష్ఠులు నతనిం గనుంగొని సుధామధురంబు లయిన వాక్యంబుల నిట్లనిరి.** 19

* నేను సంతానము కోసం పెక్కువిధాలైన పూజలు చేశాను. అయితే మనస్సులో నేను నిలుపుకున్న మహాత్ముడు ఒక్కడు మాత్రమే అని అత్రిమహర్షి పలుకగా అప్పుడు త్రిమూర్తులు అమృతము వలె తియ్యనైన మాటలతో ఇలా అన్నారు.

**క. విను మేము ముగుర మయ్యును, ననుపమమతిఁ దలఁప నేకమై యుందుము; నీ**
**మనమందు నేమి గోరితి, వనయము నా కోర్కి సఫల మయ్యెడుఁ జుమ్మీ!** 20

* మేము లెక్కకు ముగ్గురం అయినా వాస్తవానికి ఒక్కరమే. అందుకే నీవు ఒక్కరినే పిల్వగా మేము ముగ్గురమూ వచ్చాము. మేము ముగ్గురమూ వేరుకాదు. నీ మనసులోని కోరిక తప్పక నెరవేరుతుంది.

**క. మా ముఫ్వుర యంశంబుల, ధీ మంతులు సుతులు పుట్టి త్రిభువనములలో**
**నీ మంగళగుణకీర్తిన్, శ్రీమహితము సేయఁగలరు సిద్ధము సుమ్మీ!** 21

* మా ముగ్గురి అంశాలతో బుద్ధిమంతులైన ముగ్గురు కుమారులు నీకు జన్మిస్తారు. వారు మంగళమయమైన నీ సత్కీర్తిని మూడులోకాలలో వ్యాపింప జేస్తారు. ఇది జరిగి తీరుతుంది.

**క. అని మునిచంద్రుఁడు తన మన, మునఁ గామించిన వరంబు బుధవరులు ముదం**
**బున నొసఁగి యతనిచేఁ బూ, జనములఁ బరితృప్తు లగుచుఁ జనిరి యథేచ్ఛన్.** 22

* ఈ విధంగా పలికిన వారై త్రిమూర్తులు మునీంద్రుడైన అత్రి తన మనస్సులో కోరుకున్న వరము ఆయనకు అనుగ్రహించారు. ఆ మహర్షి చేసిన పూజలకు సంతుష్టులై అంతర్ధానం చెందారు.

**ఉ. ఆ సుచరిత్ర దంపతు లుదంచితలీలఁ గనుంగొనంగ న**
**బ్జాసను నంశమందు నమృతాంశుఁడు, విష్ణుకళన్ సుయోగ వి**
**ద్యాసుభగుండు దత్తుఁడు, పురాంతకు భూరికళాంశమందు దు**
**ర్వాసుఁడునై జనించి రనవద్యపవిత్ర చరిత్రు లిమ్ములన్.** 23

* పూతచరిత్రులై ఆ పుణ్యదంపతులకు బ్రహ్మదేవుని అంశ వల్ల చంద్రుడు జన్మించాడు. విష్ణుదేవుని అంశ వల్ల దత్తుడు పుట్టాడు. మహాదేవుని అంశ వల్ల దుర్వాసుడు కలిగాడు. ఆ ముగ్గురు పుత్రులు ఉత్తమగుణ సంపన్నులు.

క. అంగిరసుఁ డనెడు మునికిఁ గు, లాంగన యగు శ్రద్ధయందు నంచిత సౌంద
ర్యాంగులు గూఁతులు నలువురు, మంగళవతు లుదయమైరి మాన్యచరిత్రా! 24

* మాననీయుడవైన విదురా! విను! అంగిరసుడు అను మునీంద్రునికి అర్ధాంగియైన శ్రద్ధయందు సుగుణవతులూ, సుందరాంగులూ అయిన నలుగురు కుమార్తెలు కలిగారు.

క. వారు సినీవాలి యునుఁ గు, హూ రాకానుమతు లనఁగ నొప్పిరి; మఱియు
గోర సుతయుగము గలిగెను, స్వారోచిషమనువువేళ శస్త్రఖ్యాతిన్. 25

ఆ నలుగురి పేర్లు సినీవాలి, కుహువు, రాక, అనుమతి. వీరుగాక అంగిరసునికి ఇద్దరు కొడుకులు కూడా కలిగారు!

వ. వార లెవ్వ రనిన భగవంతుం డగు నుచథ్యుండును బ్రహ్మనిష్ఠుండగు బృహస్పతియు ననం బ్రసిద్ధి వహించిరి; పులస్త్యుండు హవిర్భుక్కను నిజభార్యయందు నగస్త్యునిం బుట్టించె; నా యగస్త్యుండు జన్మాంతరంబున జఠరాగ్ని రూపంబై ప్రవర్తించె; వెండియు నా పులస్త్యుండు విశ్రవసునిం గలిగించె; నావిశ్రవసునకు "నిలబిల" యను భార్యవలనం గుబేరుండును, "గైకసి" యను దానివలన రావణ కుంభకర్ణ విభీషణులునుం బుట్టిరి; పులహునకు గతియను భార్యవలనఁ గర్మశ్రేష్ఠుండును వరీయాంసుండును సహిష్ణుండును నను ముగ్వురు గొడుకులు జనియించిరి. మఱియుఁ గ్రతువునకుఁ "గ్రియ" యను భార్యయందు బ్రహ్మతేజంబున జ్వలించుచున్న షష్టిసహస్ర సంఖ్యలు గల వాలఖిల్యులను మహర్షులు గలిగిరి; వసిష్ఠుం డూర్జయను భార్యయందుఁ జిత్రకేతుండును సురోచియు విరజుండును మిత్రుండును నుల్బణుండును వసుభృద్యానుండును ద్యుమంతుండును నను సప్తఋషులను, భార్యాంతరంబున శక్తి ప్రముఖపుత్రులనుం బుట్టించె; నథర్వుం డనువానికిఁ "జిత్తి" యను భార్యయందు ధృతవ్రతుండు నశ్వశిరస్కుండు నయిన దధ్యంచుండు పుట్టె; మహాత్ముండగు భృగువు "ఖ్యాతి" యను పత్నియందు ధాతయు విధాతయు నను పుత్రద్వయంబును భగవత్పరాయణయగు "శ్రీ" యను కన్యకం బుట్టించె; నా ధాతృవిధాతృలు మేరు వనువాని కూఁతు లయిన "యాయతి" "నియతు" లను భార్యలవలన మృకండప్రాణు లను కొడుకులం బుట్టించి; రందు మృకండునకు మార్కండేయుండును, బ్రాణునకు వేదశిరుం డను మునియు బుట్టిరి; భార్గవునకు నుశన యను కన్యయందుఁ గవి యనువాఁడు పుట్టె; నిట్లు కర్దమ దుహిత లయిన కన్యకా నవకంబువలనం గలిగిన సంతానపరంపరలచే సమస్తలోకంబులును బరిపూర్ణంబు లయ్యె; నట్టి సద్యః పాపహరంబును శ్రేష్ఠతమంబును నైన కర్దమదౌహిత్రసంతాన ప్రకారంబు శ్రద్ధాగరిష్ఠ చిత్తుండవగు నీకుం జెప్పితి; నింక దక్షప్రజాపతివంశం బెఱింగింతు, వినుము. 26

* జ్ఞానవంతుడైన ఉచథ్యుడు, బ్రహ్మణ్యుడైన బృహస్పతి అను ఆ కుమారు లిరువురూ చాలా ప్రసిద్ధులు, పులస్త్యునికి "హవిర్భుక్కు" అనే భార్యవల్ల అగస్త్యుడు, విశ్రవసుడు అనే ఇద్దరు పుత్రులు జన్మించారు. విశ్రవసునికి "ఇలబిల" అనే భార్యవల్ల కుబేరుడూ, 'కైకసి' అనే భార్యవల్ల రావణుడు, కుంభకర్ణుడు, విభీషణుడు జన్మించారు. పులహునికి 'గతి' అనే భార్యవల్ల కర్మశ్రేష్ఠుడు వరీయాంసుడు, సహిష్ణుడు అనే

ముగ్గురు కొడుకులు ఉద్భవించారు. క్రతువుకు 'క్రియ' అనే భార్యవల్ల బ్రహ్మతేజోనిధులైన వాలఖిల్యులు అనే మహర్షులు కలిగారు. వారు అరవైవేలమంది.

వసిష్ఠునికి "ఊర్జ" అనే భార్యయందు చిత్రకేతుడు, సురోచి, విరజుడు, మిత్రుడు, ఉల్బణుడు, వసుభృద్యానుడు, ద్యుమంతుడు అను ఏడుగురు ఋషులు జన్మించారు. మరొక భార్యయందు శక్తి మొదలైన కొడుకులు కలిగారు అథర్వునికి "చిత్తి" అనే భార్య యందు ధృతవ్రతుడూ అశ్వశిరస్కుడూ అయిన దధ్యంచుడు జన్మించాడు. భృగువునకు 'ఖ్యాతి' అనే భార్యయందు ధాత, విధాత అనే ఇద్దరు కొడుకులూ, భగవద్భక్తురాలైన 'శ్రీ' అనే కుమార్తె ఉదయించారు. భృగువు పుత్రులయిన ధాత, విధాత అనువారు మేరుపు కుమార్తెలయిన "ఆయతి" "నియతి" అనే వారిని పెండ్లాడారు. ధాతకు "ఆయతి" వల్ల మృకండుడు పుట్టాడు. విధాతకు 'నియతి' వల్ల ప్రాణుడు జన్మించాడు. మృకండునకు మార్కండేయుడు జన్మించారు. ప్రాణునకు వేదశిరుడు పుట్టాడు. భార్గవునికి 'ఉశన' అనే భార్యవల్ల కవి జన్మించాడు. ఈ విధంగా కర్దముని తొమ్మండుగురు కూతుండ్రవల్ల కలిగిన సంతాన పరంపరలతో లోకాలన్నీ నిండిపోయాయి. కర్దముని కూతుండ్ర సంతాన వృత్తాంతం నీకు చెప్పాను. ఈ వృత్తాంతం విన్నవారికి వెంటనే పాపాలు తొలగిపోతాయి. ఇక దక్షప్రజాపతి వంశాన్ని వివరిస్తాను. విను.

### -: దక్షప్రజాపతి సంతతి :-

**క. వనజజునివలన భవ మం, దిన యా దక్ష ప్రజాపతికి మను నిజ నం**
**దన యగు "ప్రసూతి" సతియం, దనఘా! పదియార్వు రుదయ మందిరి కన్యల్. 27**

* బ్రహ్మదేవుని నందనుడైన దక్షప్రజాపతికి స్వాయంభువ మనువుకూతు రయిన ప్రసూతి వల్ల పదహారుమంది కుమార్తెలు కలిగారు.

**వ. ఇట్లావిర్భవించిన కన్యకలందు శ్రద్ధయు మైత్రియు దయయు శాంతియుఁ దుష్టియుఁ బుష్టియుఁ బ్రియయు నున్నతియు బుద్ధియు మేధయుఁ దితిక్షయు హ్రీయు మూర్తియు నను నామంబులు గల పదుముప్వురను ధర్మరాజున కిచ్చె, నొక్కకన్యక నగ్నిదేవునకును నొక్కతెం బితృదేవతలకును నొక్కతె జన్మమరణాది నివర్తకుండగు నభవునకుం బెండ్లి సేసె; నంత నాధర్మపత్నులయందు శ్రద్ధవలన శ్రుతంబును, మైత్రివలనఁ బ్రసాదంబును, దయవలన నభయంబును, శాంతివలన సుఖంబును, దుష్టి వలన ముదంబును, బుష్టివలన స్మయంబును, గ్రియవలన యోగంబును, నున్నతివలన దర్పంబును, బుద్ధివలన నర్థంబును, మేధవలన స్మృతియుఁ, దితిక్షవలన క్షేమంబును, హ్రీవలనఁ బ్రశ్రయంబును, మూర్తివలన సకలకల్యాణ గుణోత్పత్తి స్థానభూతులగు నరనారాయణ లను ఋషు లిద్దఱును సంభవించిరి; వారల జన్మకాలంబున. 28**

* దక్షుడు తన పదహారుమంది పుత్రికలలో పదముగ్గురిని శ్రద్ధ, మైత్రి, దయ, శాంతి, తుష్టి, పుష్టి, ఉన్నతి, బుద్ధి, మేధ, తితిక్ష, హ్రీ, మూర్తి అనే వారిని ధర్మునికి కిచ్చి వివాహం చేశాడు. అగ్నిదేవునికి ఒక

కుమార్తెను ఇచ్చాడు. పితృదేవతలకు ఒక కొమార్తెను ఇచ్చాడు. ఆద్యంతరహితుడైన శివునికి ఒక పుత్రికను సమర్పించాడు. ధర్ముని భార్యలలో శ్రద్ధ వల్ల శ్రుతం, మైత్రి వల్ల ప్రసాదం, దయవల్ల అభయం, శాంతివల్ల సుఖం, తుష్టి వల్ల ముదం, పుష్టివల్ల స్మయం, క్రియవల్ల యోగం, ఉన్నతి వల్ల దర్పం, బుద్ధివల్ల అర్థం, మేధవల్ల స్మృతి, తితిక్షవల్ల క్షేమం, హ్రీవల్ల ప్రశయం, మూర్తివల్ల సకల కల్యాణగుణ సంపన్నులైన నరనారాయణులను ఇరువురు ఋషులు జన్మించారు.

**సీ. గంధవాహుఁడు మందగతి ననుకూలుఁడై వీచె; నల్దిక్కులు విశద మయ్యెఁ;**
**నఖిలలోకంబులు నానందమును బొందెఁ; దుములమై దేవదుందుభులు మ్రోసెఁ;**
**గర మొప్ప జలధుల కలఁక లడంగెను; మించినగతిఁ బ్రవహించె నదులు,**
**గంధర్వ కిన్నర గానముల్ వీతెంచె; నప్సరోజనుల లాస్యములు సెలఁగె;**
**తే. సురలు గురియించి రందంద విరులవాన, మునిజనంబులు సంతోషమునఁ జెలంగి**
**వినుతు లొనరించి; ర వ్వేళ విశ్వమెల్లఁ, బరమమంగళమై యొప్పె భవ్యచరిత! 29**

* ఆ నరనారాయణు లుద్భవించిన శుభసమయంలో అనుకూల వాయువు చల్లగా మెల్లగ వీచింది. నాలుగు దిక్కులు ప్రకాశించాయి. అఖిల లోకాలు ఆనందం పొందాయి. గగనాన దేవ దుందుభులు మ్రోగాయి. సముద్రాలు కలతలు లేకుండా ప్రశాంతంగా ఉన్నాయి. నదులు వేగంగా ప్రవహించాయి. గంధర్వులూ, కిన్నరులూ గానం చేశారు. అప్సరలు నాట్యం చేశారు. సురలు విరులవాన కురిపించారు. మునులు సంతోషంతో స్తుతించారు. ప్రపంచమంతా పరమ మంగళోపేతమై భాసించింది.

**వ. ఆ సమయంబున బ్రహ్మాది దేవత లమ్మహాత్ముల కడకుం జనుదెంచి యిట్లని స్తుతియించిరి. 30**

* అప్పుడు బ్రహ్మ మొదలైన దేవతలు, మహాత్ములయిన నరనారాయణుల దగ్గరకు వచ్చి యిలా సంస్తుతించారు.

**సీ. గగనస్థలిం దోఁచు గంధర్వనగరాది రూప భేదము లట్టు రూఢి మెఱసి**
**యే యాత్మయందేని నేపారు మాయచే నీ విశ్వమిటు రచియింపఁ బడియె**
**నట్టియాత్మప్రకాశార్థమై మునిరూపముల ధర్మగృహమునఁ బుట్టినట్టి**
**పరమపురుష! నీకుఁ బ్రణమిల్లెద; మదియుఁ గాక యీ సృష్టి దుష్కర్మవృత్తి**
**తే. జరగనీకుండు కొఱకునై సత్త్వగుణము, చే సృజించిన మ మ్మిట్లు శ్రీనివాస**
**మైన సరసీరుహప్రభ నపహసించు, నీ కృపాలోకనంబుల నెమ్మిఁజూడు. 31**

* ఆకాశంలో గంధర్వనగరం పెక్కురూపాలు పొందుతుంది. గంధర్వనగరం వంటి ఈ విశ్వం నీమాయచేత సృజింపబడింది. నిన్ను నీవు లోకమునకు తెలియజేయుటకు నరనారాయణుల రూపాలతో ధర్ముని యింట అవతరించావు. అటువంటి మహాపురుషుడ వయిన నీకు నమస్కారం. సృష్టిలో దుష్కర్మలు జరుగకుండా ఉండటానికి సత్త్వగుణంతో నీవే మమ్ము సృజించావు. అటువంటి మమ్ము శ్రీదేవికి నివాసమైన పద్మశోభను పరిహసించే నీ కరుణార్ద్రవీక్షణాలతో వీక్షించు.

క. అని యిట్లు దేవగణములు, వినుతింపఁ గృపాకటాక్ష వీక్షణములచేఁ
గని వారు గంధమాదన, మున కేగిరి తండ్రి ముదము ముప్పిరిగొనఁగన్. 32

* ఆ విధంగా స్తుతించిన దేవతలపై తమ కరుణాకటాక్ష వీక్షణములు ప్రసరింపజేసి నరనారాయణులు ధర్మప్రమోద పరాయణులై గంధమాదన పర్వతానికి వెళ్ళిపోయారు.

క. ధరణీభర ముడుపుట కా, నరనారాయణులు భువి జనన మనయము నొం
దిరి యర్జున కృష్ణాఖ్యలఁ, గురుయదువంశముల సత్త్వగుణయుతు లగుచున్. 33

* ఆ నరనారాయణులే భూభారాన్ని తగ్గించటంకోసం "అర్జునుడు", "కృష్ణుడు" అనే పేర్లతో కురు యదు వంశాలలో సత్త్వగుణ సంపన్నులై జన్మించారు.

వ. మఱియు నగ్నిదేవునకు దక్షపుత్రియైన "స్వాహాదేవి" యను భార్యయందు హుతభోజను లగు పావకుండును, బవమానుండును, శుచియు నను మువ్వురు కొడుకులు గలిగిరి: వారివలనం బంచచత్వారింశత్సంఖ్య గల యగ్ను లుత్పన్నంబు లయ్యె; నిట్లు పితృపితామహ యుక్తంబుగా నేకోనపంచాశత్సంఖ్యలు గల యగ్నులు బ్రహ్మావాదులచే యజ్ఞకర్మంబులం దగ్నిదేవతాకంబులైన యిష్టులు దత్తన్నామంబులచేతఁ జేయంబడుచుండు; నా యగ్ను లెవ్వ రనిన నగ్నిష్వాత్తులు బర్హిషదులు సౌమ్యులుఁ బితలు నాజ్యపులు సాగ్నులు నిరగ్నులు నన నేడు దెఱంగులై యుందురు. దాక్షాయణి యగు స్వధ యను ధర్మపత్నియందు వారల వలన "వయున" యు, "ధారిణి" యు నను నిద్దఱు కన్య లుదయించి జ్ఞానవిజ్ఞానపారగ లగుచు బ్రహ్మనిష్ఠ లయి పరఁగిరి; వెండియు. 34

* అగ్నిదేవునకు దక్షుని కూతురయిన స్వాహాదేవి అను భార్యవల్ల పావకుడు, పవమానుడు, శుచి అను ముగ్గురు కొడుకులు కలిగారు. ఆ ముగ్గురివల్ల నలభైఐదు విధాలైన అగ్నులు ఉద్భవించాయి. తాత తండ్రులతో కూడి మొత్తం నలభై తొమ్మిది అగ్నులు అయినాయి. అగ్నిష్వాత్తులు, బర్హిషదులు, సౌమ్యులు, పితలు, ఆజ్యపులు, సాగ్నులు, నిరగ్నులు అని ఏడువిధాలైన ఆ అగ్నుల నామాలతో బ్రహ్మావాదులైన వారు యజ్ఞకర్మలలో ఇష్టులు నిర్వహిస్తుంటారు. దక్ష ప్రజాపతి పుత్రికయైన "స్వధ" అను భార్యవల్ల ఆ అగ్నులకు వయునయు, ధారిణి అను ఇద్దరు కన్యలు పుట్టారు. వారిరువురూ జ్ఞాన విజ్ఞాన పరాయణలు. బ్రహ్మ నిష్ఠ కలవారు.

## -: ఈశ్వరునకు దక్షప్రజాపతికిని విరోధము సంభవించుట :-

సీ. దక్షప్రజాపతి తనయ యా భవుని భార్యయు ననఁదగు 'సతి' యను లతాంగి
సతతంబుఁ బతిభక్తి సలుపుచుండియుఁ దనూజాతలాభము నందఁ జాలదయ్యె;
భర్గుని దెసఁ జాలఁ బ్రతికూలుఁ డైనట్టి తమ తండ్రిమీఁది రోషమునఁ జేసి
వలనేది తా ముగ్ధవలె నిజయోగ మార్గంబున నాత్మదేహంబు విడిచె;

తే. నని మునీంద్రుండు వినిపింప న మ్మహాత్ముఁ, డైన విదురుండు మనమున నద్భుతంబు
గదురఁ దత్కథ విన వేడ్క గడలుకొనఁగ, మునివరేణ్యునిఁ జూచి యిట్లనియె మఱియు. 35

* సతీదేవి దక్షప్రజాపతి కూతురు. పరమశివుని భార్య. ఆ సతి అతిభక్తితో ప్రతినిత్యమూ పతిని సేవించింది. ఆమెకు సంతానం కలుగలేదు. పరమేశ్వరునిపట్ల పగబూనిన తన తండ్రిమీద కోపించి ఆ ఉత్తమ ఇల్లాలు యోగమార్గంలో తన శరీరాన్ని పరిత్యజించింది.

అని మైత్రేయుడు విదురునితో చెప్పగానే విదురుడు ఆశ్చర్యపడి ఆ వృత్తాంత మంతా తెలుసుకోవాలనే కుతూహలంతో మునీంద్రుని ఇలా ప్రశ్నించాడు.

సీ. చతురాత్మ! దుహితృవత్సలుఁడైన దక్షుండు దన కూఁతు సతి ననాదరము సేసి
యనయంబు నఖిలచరాచర గురుఁడు ని ర్వైరుండు శాంతవిగ్రహుఁడు ఘనుఁడు
జగముల కెల్లను జర్చింప దేవుండు నంచితాత్మారాముఁ డలఘుమూర్తి
శీలవంతులలోన శ్రేష్ఠుండు నగు నట్టి భవునందు విద్వేషపడుట కేమి

తే. కారణము? సతి దా నేమి కారణమున, విడువరానట్టి ప్రాణముల్ విడిచె? మఱియు
శ్వశుర జామాతృ విద్వేష సరణి నాకుఁ, దెలియ నానతి యిమ్ము సుధీవిధేయ! 36

* సుధీజనవిధేయా! మైత్రేయా! దక్షునికి తన పుత్రికలపై ప్రేమ ఎక్కువ కదా! అటువంటి దక్షుడు కూతురైన సతీదేవిని అవమానించటానికీ కారణం ఏమిటి? శంకరుడు సమస్త చరాచరాలకు గురువు. ఎవరినీ ద్వేషింపనివాడు. ప్రశాంతమూర్తి, మహానుభావుడు. ఎల్లలోకాలకూ దేవుడు. ఆత్మారాముడు. విశ్వేశ్వరుండు. శీలవంతులలో అగ్రేసరుడు. అటువంటి మహాదేవుని దక్షుడు ద్వేషించటానికి కారణం ఏమిటి? ఏ హేతువుచేత సతీదేవి ఏమీ చేయలేని అమాయకు రాలివలె తన నిండు ప్రాణాలు విడిచింది. మామయైన దక్షునికీ, అల్లుడైన శివునికీ విరోధం ఎలా సంభవించింది? నాకు ఈ కథ వినాలని వేడుకగా ఉన్నది. దయచేసి సెలవీయండి.

క. అని యడిగిన నవ్విదురునిఁ, గనుఁగొని మైత్రేయుఁ డనియెఁ గౌతుక మొప్పన్
విను మనఘ! తొల్లి బ్రహ్మలు, జననుతముగఁ జేయునట్టి సత్త్రముఁ జూడన్. 37

చ. సరసిజగర్భ యోగిజన సర్వ సుపర్వమునీంద్ర హవ్య భు
క్పరమఋషి ప్రజాపతులు భక్తి మెయిం జనుదెంచియుండ న
త్తరణిసమాన తేజుఁడగు దక్షుఁడు వచ్చినఁ దత్సదస్యు లా
దరమున లేచి; రప్పుడు పితామహభర్గులు దక్క నందఱున్. 38

* అప్పుడు మైత్రేయ మహర్షి విదురునితో ఇలా చెప్పసాగాడు.

అయ్యా! విను. పూర్వం బ్రహ్మవేత్తలు గొప్ప యజ్ఞం ప్రారంభించారు. ఆ మహాయజ్ఞాన్ని చూడటానికి శివుడు, బ్రహ్మదేవుడు, యోగీశ్వరులు, దేవతలు, మునీంద్రులు, మహర్షులు, ప్రజాపతులు మొదలైన వారంతా పరమాసక్తితో వచ్చారు. అప్పుడు అక్కడికి ప్రభాకర తేజోవిరాజితుడైన దక్షుడు కూడ అరుదెంచాడు. దక్షుని చూడగనే సభలోనివారు లేచి నిలబడ్డారు. బ్రహ్మ, శివుడు మాత్రం లేవలేదు.

**క. చనుదెంచిన యా దక్షుఁడు, వనజజునకు మ్రొక్కి భక్తివశులై సభ్యుల్**
**దన కిచ్చిన పూజలు గై, కొని యర్హాసనమునందుఁ గూర్చుండి తగన్. 39**

* అప్పుడు దక్షుడు బ్రహ్మకు నమస్కరించాడు. సభ్యులు భక్తితో తనకు చేసిన పూజలను అందుకున్నాడు. తనకు తగిన పీఠంపై కూర్చున్నాడు.

**తే. తన్నుఁ బొడగని సభ్యు లందఱును లేవ, నాసనము దిగనట్టి పురారివలను**
**గన్ను గొనలను విస్ఫులింగములు సెదరఁ, జూచి యిట్లను రోషవిస్ఫురణ మెఱయ. 40**

* తనను చూచి సభ్యులందరూ లేచి గౌరవించారు. కాని తన అల్లుడైన శివుడు మాత్రం తన పెద్దరికం గుర్తించి గద్దె దిగలేదు. దక్షుడికి తలకొట్టినట్లయింది. అతడు తన కంటి కొనలనుండి మంటలు విరజిమ్ముతూ ముక్కంటిని చూపించుతూ కోపంతో ఇలా అన్నాడు.

**తే. వినుఁడు మీరలు రొదమాని విబుధ ముని హు, తాశనాది సురోత్తములార! మోహ**
**మత్సరోక్తులు గావు! నా మాట లనుచు, వారి కందఱ కా పురవైరిఁ జూపి, 41**

* "దేవతలారా! మునులారా! అగ్నిభట్టారకులారా! మీరందరూ సద్దుచేయకుండా వినండి. నా మాటలు అజ్ఞానంతో అసూయతో పలికేవి కానే కావు" అని వారందరి ముందూ ఇందుశేఖరుని ఇలా నిందించాడు.

**సీ. పరికింప నితఁడు దిక్పాలయశోహాని కరుఁ డీ క్రియాశూన్యపరుని చేతఁ**
**గరమొప్ప సజ్జనాచరితమార్గము దూషితం బయ్యె; నెన్న గతత్రపుండు**
**మహితసావిత్రీ సమానను సాధ్వి నస్మత్తనూజను మృగశాబనేత్ర**
**సకల భూమీసుర జనసమక్షమున మర్కటలోచనుఁడు కరగ్రహణ మర్థిఁ**

**తే. జేసి తా శిష్యభావంబుఁ జెందు టాత్మ, దలఁచి ప్రత్యుద్గమాభివందనము లెలమి**
**నడపకుండిన మాననీ; నన్నుఁ గన్న, నోరిమాటకుఁ దన కేమి గోరువోయె. 42**

* ఈ శివుడు దిక్పాలకుల కీర్తిని నేలపాలు చేస్తున్నాడు. ఇతడు క్రియాశూన్యుడు. సత్పురుషులు నడిచే మార్గం ఇతనివల్ల చెడిపోయింది. ఇతనికి సిగ్గు లేదు. సావిత్రీదేవివంటి సాధ్వీశిరోమణి అయిన నా కుమార్తెను, ఆకర్ణాంత విశాలనేత్రను ఈ కోతికన్నులవాడు పెద్దల సమక్షంలో కోరి పెండ్లి చేసుకున్నాడు. అందుచేత గొప్పవాడు అయ్యాడు. అది గ్రహించి మర్యాదగా నాకు ఎదురు వచ్చి నమస్కరించకపోతే పోనీయండి. నన్ను చూచి పలుకరిస్తే తన నోటి ముత్యాలు రాలిపోతాయా?

సీ. అనయంబు లుప్తక్రియా కలాపుఁడు మానహీనుఁడు మర్యాద లేనివాఁడు
మత్తప్రచారఁ డున్మత్తప్రియుఁడు దిగంబరుఁడు భూతప్రేత పరివృతుండు
దామసప్రమథ భూతములకు నాథుండు భూతిలిప్తుం డస్థిభూషణుండు
నష్టశౌచుండు నున్మదనాథుఁడును దుష్టహృదయుఁ డుగ్రుఁడును బరేతభూ ని

తే. కేతనుఁడు వితతస్రస్తకేశుఁ డశుచి, యయిన యితనికి శివనాముఁ డను ప్రవాద
మెటులు గలిగె? నశివుఁడగు నితని నెఱిఁగి, యెఱిఁగి వేదంబు శూద్రున కిచ్చినటులు. 43

వ. ఇతనికి సన్మత్తనూజను విధిప్రేరితుండనై యిచ్చితి. 44

* ఈ శివుడు వేదాలలో చెప్పబడిన కర్మలు చేయడు. ఇతనికి మానాభిమానాలు లేవు. మట్టు మర్యాదలు తెలియవు. మదించి తిరుగుతాడు. పిచ్చివారికి ప్రియమైనవాడు, దిసమొలవాడు. ఇతనిని భూతాలూ, ప్రేతాలూ చుట్టు ముట్టి కొలుస్తుంటాయి. ఇతడు తామసులైన ప్రమథగణాలకూ భూతగణాలకూ ప్రభువు. ఒడలంతా బూడిద పూసుకుంటాడు. ఎముకల దండలు ధరిస్తాడు. శుచిలేనివాడు. మతిలేనివారికి అధిపతి. మలిన మనస్కుడు. భయంకర మైనవాడు. వల్లకాటిలో కాపుర ముంటాడు. జుట్టు విరబోసుకొని తిరుగుతాడు. ఇతడు అపవిత్రుడు. ఇతనికి "శివు" డనే మంచి పేరును ఎవరు ఇచ్చారు? తెలిసి తెలిసి అశివుడయిన ఈ శివునికి బ్రహ్మమాట విని, వేదమును శూద్రునకు ఇచ్చినట్లు నా పుత్రికను ఇచ్చాను.

క. అని యిట్టుల ప్రతికూల వ, చనములు దక్షుండు పలికి 'శపియింతును శ
ర్వుని' నని జలములు గొని కర, మున, నిలిచిట్లనియె, రోషమున ననఘాత్మా! 45

* అని ఈ విధంగా దక్షుడు నిటలాక్షుణ్ణి నిందించి శంకరుని శపించటంకోసం శాపజలాలను చేతిలో గ్రహించి రోషావేశంతో ఈ విధంగా అన్నాడు.

క. ఇతఁ డింద్రోపేంద్రపరీ, వృతుఁడై మఖసమయమున హవిర్భాగము దే
వతలం గూడఁగ మహిత ని, యతిఁ బొందక యుండుఁగాక యని శపియించెన్. 46

* "ఈ శివుడు ఇంద్రుడు, విష్ణువు మొదలగు దేవతలతోపాటు యజ్ఞంలో హవిర్భాగం పొందకుండు గాక!"

వ. ఇట్లు దక్షుండు పల్కిన గర్హితవాక్యంబులు వినిందితంబులుగ నుండియును నర్థాంతరంబున వాస్తవంబు లగుచు భగవంతుండగు రుద్రునందు ననిందితంబులై స్తుతి రూపంబుల నొప్పెఁ; దదనంతరంబ రుద్రునకు శాపం బిచ్చిన కారణంబున దక్షుండు సదస్యముఖ్యులచే నకృత్యం బని నిషేధింప బడి ప్రవృద్ధంబయిన క్రోధంబుతోడ నిజనివాసంబునకుం జనియె; నంత గిరిశానుచరాగ్రేసరుం డగు నందికేశ్వరుండు దక్షుండు నిటలాక్షుని శపియించిన శాపంబు; నతనిఁ బల్కిన యనర్థ వాక్యంబులును విని కోపారుణిత లోచనుండై యిట్లను; నీ దక్షుండు మర్త్యశరీరంబు శ్రేష్ఠంబు గాఁదలంచి యప్రతిద్రోహియైన భగవంతునందు భేదదర్శియై యపరాధంబు గావించె; నిట్టి మూఢాత్ముండు దత్త్వవిముఖుండగు; మఱియుం గూట ధర్మంబు లయిన నివాసంబుల

**గ్రామ్యసుఖ కాంక్షలం జేసి సక్తుండై యర్థవాదంబు లయిన వేదంబులచే నష్టమనీషం గలిగి కర్మతంత్రంబు విస్తృతంబు సేయు; వెండియు దేహాదికంబు లుపాదేయంబులుగాఁ దలంచుచు బుద్ధిచేత నాత్మతత్త్వంబు మఱచి వర్తించుచుఁ బశుప్రాయుండై స్త్రీకాముండు నగు నిదియునుం గాక దక్షుం డచిరకాలంబున మేషముఖుండగు నని మఱియు. 47**

* దక్షుని నిందావాక్యాలు పైకి అనుచితాలుగా తోచినా మరొక అర్థంలో వాస్తవాలై, సముచితాలై పూజ్యుడైన శివునికి పొగడ్తలే అయ్యాయి. శివుని శపించిన దక్షుణ్ణి చూచి సభ్యులు "నీవు చేసినది చెడ్డపని" అని అడ్డుకున్నారు. దానితో దక్షుడు ఆగ్రహోదగ్రుడై చెరచెర లేచి తన గృహానికి వెళ్ళిపోయాడు. ఆ తరువాత శివుని సేవకులలో శ్రేష్ఠుడైన నందికేశ్వరుడు దక్షుడు పరమేశ్వరుణ్ణి నిందించటం శపించటం విని కోపంతో కన్నులెర్రవారగా ఇలా అన్నాడు. ఈ దక్షుడు తన మర్త్యశరీరం గొప్పది అని భావించాడు. తనకు తిరిగి కీడుచేయకుండా శాంతుడై ఉన్న దేవదేవునికి అపరాధం చేశాడు. వీడు భేదదర్శి. ఇటువంటి మూర్ఖునికి తత్త్వదర్శనం లభించదు. వీడు కుటిల ధర్మాలను ఆశ్రయించి నీచసుఖాలపై కోర్కెలు పెంచుకున్నాడు. వేదాలలోని అర్థవాదాలను నిజమని నమ్మాడు. దేహమునే ఆత్మగా భావిస్తాడు. అందుచేత వీడు సత్యమైన ఆత్మతత్త్వాన్ని విస్మరించి పశువుతో సమానమౌతాడు. వీడు స్త్రీలోలుడై చెడిపోతాడు. అంతేకాదు. ఈ దక్షుడు తొందరలోనే "గొర్రెతలవాడు" అగుగాక!

**మ. అనయంబుం దనమానసంబున నవిద్యల్ ముఖ్యతత్త్వంబుగాఁ**
**గని గౌరీశుఁ దిరస్కరించిన యసత్కర్మాత్ము నీ దక్షుని**
**న్ననువర్తించినవారు సంసరణకర్మారంభులై నిచ్చలున్**
**జననం బందుచుఁ జచ్చుచున్ మరల నోజం బుట్టుచున్ వర్తిలున్. 48**

ఈ దక్షుడు అజ్ఞానాన్నే జ్ఞానంగా భ్రమించే దేవదేవుడైన మహాదేవుని నిందించాడు. వీడు మహాపాపి. వీనిని అనుసరించే వారు సర్వదా సంసారంలో చిక్కుకుని పుట్టుతూ చస్తూ మళ్ళీ పుట్టుతూ ఉందురుగాక!

**వ. అదియునుంగాక యీ హరద్వేషులై న ద్విజు లర్థవాదబహుళంబులైన వేద వాక్యంబుల వలన మధుగంధ సమంబైన చిత్తక్షోభంబుచేత విమోహిత మనస్కులయి కార్మాసక్తు లగుదురు; మఱియును భక్ష్యాభక్ష్య విచారశూన్యులై దేహాదిపోషణంబుకొఱకు ధరియింపఁ బడిన విద్యాతపోవ్రతంబులు గల వారలై ధనదేహేంద్రియంబుల యందుఁ బ్రీతిం బొంది యాచకులై విహరింతు రని నందికేశ్వరుండు బ్రాహ్మణ జనంబుల శపియించిన వచనంబులు విని భృగుమహాముని మరల శపియింపం బూని యిట్లనియె. 49**

* అంతేకాదు శివుని ద్వేషించే ఇందలి బ్రాహ్మణులు అర్థవాదాలతో నిండిన వేదవాక్యాలవల్ల కల్లు కైపువంటి మనోమాలిన్యంతో కలతచెంది మోహపడి అసత్కర్మలపై ఆసక్తి పెంచుకుంటారు. "తినదగినవి", "తినదగనివి" అనే ఆలోచన నశించి అన్నింటిని ఆరగిస్తారు. విద్యనూ, తపస్సునూ, వ్రతాలనూ పొట్టకోసమే అవలంబిస్తారు. ధనంమీదా, దేహంమీదా, ఇంద్రియాలమీదా ఆదరాభిమానాలు కలవారై యాచకులై సంచరించుతారు అని నందికేశ్వరుడు అచ్చటి బ్రాహ్మణులను శపించాడు. నందీశ్వరుని శాపవాక్కులు విని భృగుమహాముని తిరిగి యిలా శపించాడు.

తే. వసుధ నెవ్వారు ధూర్జటివ్రతులు వారు, వారి కనుకూలు రగుదు రెవ్వారు వారు
నట్టి సచ్ఛాస్త్ర పరిపంథు లైనవారు, నవనిఁ "బాషండు" లయ్యెద రని శపించె. 50

* ఈ లోకంలో ఎవరు శివదీక్షాపరాయణులో, ఎవరు వారిని అనుసరించేవారో వారంతా శాస్త్రాలకు విరోధులై పాషండులు అగుదురు గాక!

సీ. సకల వర్ణాశ్రమాచార హేతువు లోకమునకు మాంగళమార్గమును, సనాత
నముఁ, బూర్వఋషి సమ్మతము, జనార్దనమూలమును, నిత్యమును, శుద్ధమును, శివంబు,
నార్యపథానుగం బగు వేదమును విప్రగణము నిందించిన కారణమున
నే శివదీక్ష యందేని మద్యము పూజ్యుఁ డై భూతపతి దైవ మగుచు నుండు

తే. నందు మీరలు భస్మజటాస్థిధార, ణములఁ దగి మూఢబుద్ధులు నష్టశౌచు
లై నశింతురు పాషండు లగుచు ననుచు, శాప మొనరించె నా ద్విజసత్తముండు. 51

వ. ఇట్లన్యోన్యంబును శాపంబులం బొందియు భగవదనుగ్రహంబు గలవార లగుటం జేసి నాశంబు నొందరై; రట్టియెడ విమనస్కుం డగుచు ననుచరసమేతుండై భవుండు సనియె నంత. 52

* ఎందువల్లనంటే వినండి. సమస్తమైన వర్ణాశ్రమాచారాలను విధించేది వేదం. వేదం లోకాలకు క్షేమం కలిగిస్తుంది. అది సనాతనమైనది. దానిని పూర్వఋషిపుంగవు లందరూ అంగీకరించారు. వేదం విష్ణువునుండి ఆవిర్భవించింది. అది శాశ్వతమైనది. పరిశుద్ధమైనది. మంగళప్రదమైనది. దానిని ఆర్యులైనవారు అనుసరిస్తారు. అటువంటి వేదాన్నీ బ్రాహ్మణులనూ నీవు నిందించావు. అందుచేత శివదీక్షను గొనువారికి మద్యం పూజ్యమగుగాక! శివవ్రతులు భస్మమునూ, జడలనూ, ఎముకలనూ ధరింతురు గాక! మూర్ఖులై శుచిత్వము లేని వారై పాషండులై నశింతురుగాక!

ఈ విధంగా నందీశ్వరుడూ, భృగుమహర్షీ ఒకరినొకరు శపించుకున్నారు. అయినా దైవానుగ్రహంవల్ల వారు నశింపలేదు. అప్పుడు వ్యాకుల హృదయుడై శివుడు అనుచరులతో అక్కడనుండి వెళ్ళిపోయాడు.

సీ. అనఘాత్మ! యే యజ్ఞమందు సర్వశ్రేష్ఠుఁడగు హరి సంపూజ్యుఁడై వెలుంగు
నట్టి యజ్ఞంబు సమ్యగ్విధానమున సహస్రవత్సరములు నజుఁ డొనర్చెఁ
గరమొప్ప నమర గంగాయమునా సంగమావనిఁ గలుగు ప్రయాగయందు
నవభృథస్నానంబు లతిభక్తిఁ గావించి గతకల్మషాత్ములై ఘనత కెక్కి

తే. తగ నిజాశ్రమభూములఁ దలఁచి వార, లందఱును వేడ్కతోఁ జని రనుచు విదురు
నకును మైత్రేయుఁడను మునినాయకుండు, నెఱుఁగ వినిపించి వెండియు నిట్టు లనియె. 53

* సర్వశ్రేష్ఠుడైన నారాయణుడు యజ్ఞంలో పూజనీయుడు. అటువంటి యజ్ఞాన్ని బ్రహ్మణ్యులు వేయి సంవత్సరాలు యథావిధిగా చేశారు. గంగానదీ, యమునానదీ సంగమించు ప్రయాగక్షేత్రంలో సదస్యులు దీక్షా స్నానాలు చేసి పాపాలు పోగొట్టుకొని తమ తమ ఆశ్రమాలకు వెళ్ళిపోయారు అని మైత్రేయ మహర్షి విదురునితో మళ్లీయిలా చెప్పసాగాడు.

## -: దక్షప్రజాపతి యజ్ఞము చేయునపుడు దాక్షాయణి యచ్చటికిఁ బోవుట :-

వ. అంత శ్వశురుండగు దక్షునకు జామాతయైన భర్గునకు నన్యోన్య విరోధంబు వెరుఁగుచుండ నతిచిరంబగు కాలం బరిగెనంత దక్షుండు రుద్రవిహీనంబగు యాగంబు లేనిది యైనను శర్వుతోడి పూర్వవిరోధంబునను బరమేష్ఠి కృతంబైన సకల ప్రజాపతి విభుత్వగర్వంబుననుం జేసి బ్రహ్మనిష్ఠులగు నీశ్వరాదుల ధిక్కరించి యరుద్రకంబుగా వాజపేయ సవనంబు గావించి తదనంతరంబ బృహస్పతిసవన నామకంబైన మఖంబు సేయ నుపక్రమించిన నచ్చటికిం గ్రమంబున. 54

* మామయైన దక్షునికీ, అల్లుడైన శివునికీ పరస్పర వైరం నానాటికీ పెరిగింది. ఇలా చాలా కాలం గడచింది. బ్రహ్మ దక్షుణ్ణి ప్రజాపతు లందరికీ అధ్యక్షుణ్ణి చేశాడు. ఆ అధికారగర్వంచేతనూ, పరమేశ్వరునిపై ఉన్న పగచేతనూ దక్షుడు బ్రహ్మవేత్తలనూ పరమేశ్వరుణ్ణీ ధిక్కరించి రుద్రహీనమైన "వాజపేయము" అనే యజ్ఞం చేశాడు. శివుడు లేనిది యజ్ఞం ఉండదు. అయినా దక్షుడు ఆ విధంగా చేశాడు. వాజపేయం చేసిన తరువాత "బృహస్పతి సవనం" అనే యజ్ఞాన్ని చేయటానికి దక్షుడు పూనుకున్నాడు.

చ. కర మనురక్తి న మ్మఖము గన్గొను వేడుక తొంగలింపఁగా
బరమముని ప్రజాపతి సుపర్వ మహర్షి వరుల్ సభార్యులై
పరువడి వచ్చి యందఱు శుభస్థితి దీవన లిచ్చి దక్షుచేఁ
బొరిఁ బొరి నచ్చటన్ విహిత పూజల నొందిరి సమ్ముదంబున్. 55

* ఆ "బృహస్పతి సవనం" చూడాలని వేడుకతో మునులూ, ప్రజాపతులూ, దేవతలూ, మహర్షులూ భార్యాసహితులై వచ్చారు. దక్షుణ్ణి దీవించారు. దక్షుడు చేసిన పూజలను సంతోషంగా అందుకున్నారు.

తే. దక్షతనయ సతీదేవి దవిలి యాత్మ, సదనమున నుండి జనకుని సవనమహిమ
గగన చరులు నుతింప నా కలకలంబు, విని కుతూహలిని యయి విన్వీథిఁ జూడ. 56

వ. అయ్యవసరంబునఁ దదుత్సవ దర్శన కుతూహలులై సర్వ దిక్కులవారును జనుచుండి; రా సమయంబున. 57

* దక్షుని యజ్ఞ వైభవాన్ని కొనియాడుతూ దేవతలు ఆకాశంలో వెళ్లుతున్నారు. ఆ కలకలాన్ని కైలాసంలో ఉన్న దక్షుని కూతురైన సతీదేవి ఆలకించి కుతూహలంతో పైకి చూచింది.

అప్పుడు తన తండ్రి దక్షప్రజాపతి చేసే యజ్ఞాన్ని చూడాలనే ఉత్సాహంతో సమస్త దిక్కులలోనూ ఉండేవారు వెళ్తున్నారు.

సీ. తనరారు నవరత్న తాటంక రోచులు చెక్కుటద్దములతోఁ జెలిమిసేయ
మహనీయ తపనీయమయ పదకద్యుతు లంసభాగంబుల నావరింప
నంచిత చీని చీనాంబర ప్రభలతో మేఖలాకాంతులు మేలమాడఁ
జంచల సారంగ చారు విలోచన ప్రభలు నల్దిక్కులఁ బ్రబ్బికొనఁగ

తే. మించు వేడుక భర్తృసమేత లగుచు, మానితంబుగ దివ్యవిమానయాన
లగుచు నాకాశపథము నరుగుచున్న, ఖచర గంధర్వ కిన్న రాంగనలఁ జూచి. 58

* ఉరకలు వేసే ఉత్సాహంతో తమ తమ భర్తలతో గూడి దివ్యవిమానాలు అధిరోహించి దేవతాస్త్రీలు ఆకాశంలో వెళ్లుతూ ఉంటే సతీదేవి చూచింది. ఆ స్త్రీలు చెవి కమ్మలు నవరత్నాలు దాపినవి. ఆ చెవికమ్మల కాంతులు అద్దాలవంటి చెక్కిళ్లపై పడుతున్నవి. మేలిమి బంగారుతో చేయబడిన కాంతులు మూపులపై వ్యాపిస్తున్నవి. చీని చీనాంబరాల కాంతులు మొలనూళ్ళ కాంతులతో కలిసి మెరుస్తున్నవి. లేడి కన్నులవంటి కన్నుల వెలుగులు నాలుగు దిక్కులకూ ప్రసరిస్తున్నవి.

క. సతి దన పతి యగు నా పశు, పతిఁ జూచి సముత్సుకతను భాషించె; ప్రజా
పతి మీ మామ మఖము సు, వ్రతమతి నొనరించుచున్న వాఁడఁట వింటే; 59

* అప్పుడు సతీదేవి అతిశయించిన కుతూహలంతో తన ప్రాణపతియైన పరమేశ్వరుని చూచి ఇలా అన్నది. “విన్నారా! మీ మామగారైన దక్షప్రజాపతి దీక్షాపరుడై యజ్ఞం చేస్తున్నాడట.

క. కావున నయ్యజ్ఞమునకు, నీ విబుధగణంబు లర్థి నేగెద; రదిగో;
దేవ! మన మిప్పు డచటికిఁ, బోవలె నను వేడ్క నాకుఁ బుట్టెడు నభవా! 60

* ఆ యజ్ఞాన్ని చూడాలనే వేడుకతో అదుగో ఆ దేవతలంతా గుంపులుగా వెళ్లుతున్నారు. చూడండి! స్వామీ! మనమూ అక్కడికి వెళ్ళాలి అనే కోరిక నాకు కలుగుతుంది.

క. ఆ యజ్ఞముఁ గనుఁగొనఁగా, నా యనుజలు భక్తిఁ బ్రాణనాథుల తోడం
బాయక వత్తురు;మనముం, బోయిన నే వారి నచటఁ బొడగనఁ గల్గన్. 61

* నాయనగారి యజ్ఞాన్ని చూడటానికి నా తోబుట్టిన వాళ్ళంతా తమ తమ భర్తలతో తప్పకుండా వస్తారు. మనమూ వెళ్ళినట్లయితే అక్కడ వారందరినీ చూచే అవకాశం నాకు కలుగుతుంది.

క. జనకుని మఖమున కర్థిం, జని నీతోఁ బారిబర్హ సంజ్ఞికతఁ గడుం
దనరిన భూషణములఁ గై, కొన వేడ్క జనించె నీశ! కుజనవినాశా? 62

* శంకరా! దుష్టజన నాశంకరా! నా తండ్రి చేసే యజ్ఞానికి మీతో కలిసి వెళ్ళి అక్కడ నగలూ నాణ్యాలూ మొదలైన కానుకలను స్వీకరించాలని నాకు కోరిక ఉన్నది.

క. నాతోడను స్నేహము గల, మాతను దత్సోదరీ సమాజము ఋషి సం
ఘాతకృత మఖసమంచిత, కేతువుఁ గన వేడ్క గగనకేశ! జనించెన్. 63

* నా పై అనురాగం గల తల్లినీ, అక్కచెల్లెండ్రనూ, ఋషులు జరిపించే ఆ మహాయజ్ఞాన్ని చూడాలని వేడుక పడుతున్నాను.

వ. అదియునుంగాక! దేవా! మహాశ్చర్యకరంబై గుణత్రయాత్మకంబగు ప్రపంచము భవదీయ మాయా వినిర్మితం బగుటం చేసి నీకు నాశ్చర్యకరంబుగా; దయినను భవదీయ తత్త్వం బెఱుంగఁ జాలక కామినీస్వభావంబు గలిగి కృపణురాలనై మదీయ జన్మభూమిఁ గనుంగొన నిచ్ఛగించితి నని వెండియు నిట్లనియె; 64

* స్వామీ సత్త్వరజస్తమో గుణాత్మకమైన ఈ ప్రపంచం చాల ఆశ్చర్యకర మైనది. మీరు దీనిని మీ మాయచేత సృజించారు. కాబట్టి మీకు ఆశ్చర్యం కలిగించదు, కాని నేను స్త్రీని. మీ సృష్టిరహస్యం తెలిసికోలేనిదాన్ని, ఒక్కమాటు నా పుట్టిల్లు చూడాలని అనుకుంటున్నాను. మిమ్మల్ని దీనంగా వేడుకుంటున్నాను- అని మళ్లీ ఇలా అన్నది.

చ. ముదమునఁ దన్మఖోద్భవ విభూతిఁ గనుంగొన నన్యకామినుల్
పదువులు గట్టి భూషణవిభాసితలై నిజనాథయు క్తలై
మదకలహంస పాండుర సమంచిత దివ్యవిమానయానలై
యదె చనుచున్నవారు గను మభ్రపథంబున నీలకంధరా! 65

* పరమేశ్వరా! మా తండ్రి మహావైభవోపేతంగా చేసే యజ్ఞాన్ని సందర్శించే నిమిత్తం సంతోషంతో దేవతాస్త్రీలు గుంపులు గుంపులుగా వెళ్లుతున్నారు. వారంతా పలువిధాలైన ఆభరణాలు అలంకరించుకొని భర్తలతో కలిసి, రాజహంసల వలె తెల్లని రెక్కలతో కూడిన దివ్య విమానాలు ఆరోహించి ఆకాశమార్గంలో వెళ్లుతున్నారు. అదిగో! అటు చూడండి!

క. అనఘా! విను లోకంబుల, జనకుని గేహమునఁ గలుగు సకల సుఖంబుల్
తనయలు సని సంప్రీతిన్ గనుఁగొన కే రీతి నిలుచుఁ గాయము లభవా! 66

* మహాత్మా! లోకంలో తమ తండ్రి యింట జరిగే శుభకార్యాలను చూడటానికి వెళ్లకుండా ఏ ఆడు బిడ్డల ప్రాణాలు నిలుస్తాయి. మీరే చెప్పండి స్వామీ!

క. అనయముఁ బిలువక యుండం, జన ననుచిత మంటివేని జనక గురు సుహృ
జ్జననాయక గేహములకుఁ, జనుచుందురు పిలువకున్న సజ్జను లభవా! 67

* మహానుభావా! "ఎవరి ఇంటికికూడా పిలువకుండా వెళ్ళటం తగదు" అని మీరు అనవచ్చు. తండ్రి, గురువు, మిత్రుడు, రాజు మొదలగు వారియిండ్లకు పిలువకపోయినా సజ్జనులైనవారు వెళ్లడం సదాచారమే కదా!

వ. అని మఱియు నిట్లనియె; దేవా! నాయందుఁ బ్రసన్నుండవై మదీయ మనోరథంబుం దీర్ప నర్హుండవు; సమధిక జ్ఞానంబు గల నీచేత నేను భవదీయ దేహంబునం దర్ధంబున ధరియింపం బడితి; నట్టి నన్ను ననుగ్రహింప వలయునని ప్రార్థించిన మందస్మిత వదనారవిందుం డగుచు జగత్స్రష్టల సమక్షంబున దక్షుండు తన్నాడిన మర్మభేదంబులైన కుహక వాక్యసాయకంబులం దలంచుచు నిట్లనియె. 68

* ఈ విధంగా ప్రార్థించి సతీదేవి శంకరునితో మళ్ళీ ఇల్లా అన్నది. "నేను మీ అర్ధాంగిని. మీరు మీ శరీరంలో సగం భాగంలో ప్రేమతో నన్ను ధరించారు. కాబట్టి స్వామీ! నన్ను అనుగ్రహించి నా కోరిక సఫలం చేయండి".

సతీదేవి ఈ ప్రకారం ప్రార్థించే సరికి శివుడు చిరునవ్వు నవ్వాడు. పూర్వం సృష్టికర్తలైన ప్రజాపతుల సన్నిధిలో దక్షుడు తనను పలికిన ములుకులవంటి పలుకులను జ్ఞప్తికి తెచ్చుకున్నాడు. మనస్సులో నాటుకున్న ఆ దూషణ వాక్కులు మరువలేక సతీదేవితో ఇలా అన్నాడు.

**సీ. కల్యాణి! నీ మాట గడునొప్పు; బంధువుల్ పిలువకుండినను సంప్రీతిఁ జనుదు**
**రంటి; విదియు లెస్సయైనను దేహాభిమాన మదమున నమర్షమునను**
**గడఁగి యారోపిత ఘనకోప దృష్టులు గారేనిఁ బోఁదగుఁగాని వినుము**
**వినుత విద్యా తపో విత్త వయో రూప కులములు సుజనులకును గుణంబు;**

**తే. లివియ కుజనులయెడ దోషహేతుకంబు, లై వివేకంబు సెఱుచు; మహాత్ములైన**
**వారి మాహాత్మ్యమాత్మ గర్వమునఁ జేసి, జడులు పొడగానఁ జాలరు జలజనేత్ర! 69**

* దేవీ! నీ మాటలు ఎంతో యుక్తంగా ఉన్నాయి. బంధువులు పిలువకపోయినా ప్రాజ్ఞులైనవారు ప్రీతితో వెళ్ళుతారని నీవు చెప్పింది కూడా బాగుంది. దేహాభిమానంవల్ల కలిగిన మదం చేతనూ, ఆగ్రహావేశంచేతను వారు ద్వేష రోషాలను ప్రదర్శించకపోతే వెళ్లవచ్చు. కాని నీ తండ్రి సరసుడు కాడు విను! విద్య, తపస్సు, ధనం, వయస్సు, రూపం, కులం- ఇవి మంచివారికి సుగుణములేకాని చెడ్డవారి విషయంలో ఇవే గుణాలు దోషకారణాలై వారి బుద్ధిని పాడు చేస్తాయి. సుందరీ! మంద బుద్ధులు మదోన్మత్తులై మహాత్ముల గొప్పతనాన్ని గుర్తింపలేరు.

**క. విను; మట్టి కుటిలు లగు దు, ర్జనుల గృహంబులకు బంధుసరణిని బోవం**
**జనదు! వినీతుల కది గడు, ననుచిత మైయుండు నింతి! యది యెట్లనినన్. 70**

* కల్యాణీ! అటువంటి కపట బుద్ధులగు దుర్జనుల యిండ్లకు చుట్టరికాన్ని పాటించి వెళ్లటం వివేకవంతులైన వారికి తగని పని.

**ఆ. కుటిలబుద్ధు లయిన కుజనుల యిండ్లకు, నార్యు లేగ, వా రనాదరమున**
**బొమలు ముడివడంగ భూరి రోషాక్షులై, చూతు రదియుఁగాక సుదతి! వినుము. 71**

* కుటిల స్వభావంగల కుజనుల గృహాలకు సుజనులు వెళ్లరు. అలా వెళ్లి నట్లయితే ఆ కలుషాత్ములు కనుబొమలు చిట్లించి ద్వేషంతో రోషంతో ఉరిమి ఉరిమి చూస్తారు. అంతేకాదు. విను!

చ. సమద రిపుప్రయుక్త పటుసాయక జర్జరితాంగుఁ డయ్యు దుః
ఖమును దొఱంగి నిద్రఁ గనుఁ గాని కృశింపఁడు మానవుండు; నో
యుమ! విను మిష్ట బాంధవదురుక్తులు మర్మము లంట నాటఁ జి
త్తమున నహర్నిశంబుఁ బరితాపము నొంది కృశించు నెప్పుడున్. 72

* బలవంతుడైన శత్రువు ప్రయోగించిన బాణాలచేత శరీరం తూట్లుపడినా ఆ బాధను భరించి వ్యక్తి ఎలాగో నిద్రపోతాడేకాని, క్రుంగి కృశించిపోడు. దాక్షాయణీ! దగ్గరి చుట్టాల దురహంకారంతో కూడిన దుర్భాషలంటావా అవి గుండెల్లో లోతుగా గ్రుచ్చుకొంటాయి. వ్యక్తిని నిద్రపోనియ్యవు. మాటిమాటికి బాధకలిగిస్తూ అహర్నిశం కృశింపజేస్తాయి.

క. విను లోకోత్కృష్టుఁడు ద, క్షునికిఁ దనూభవలలోనఁ గూరిమిసుత వై
నను నా సంబంధంబున, జనకునిచేఁ బూజఁ బడయఁజాలవు తరుణీ! 73

* తరుణీ! గొప్పవాడైన నీ తండ్రి దక్షుడు కుమార్తె లందరి కంటే నిన్నే ఎక్కువ ప్రేమిస్తాడు. అయినా ఇప్పుడు నా సంబంధం వల్ల నీవు నీ తండ్రి యింట్లో ఏ మాత్రమూ గౌరవం పొందలేవు.

వ. అదియె ట్లతనిచేత భవత్సంబంధంబునం జేసి పూజఁ బడయమికి నతనికి నీకు విరోధంబునకు హేతు వెట్టిదని యంటివేని. 74

* "మీ భార్యను కావటంవల్ల నాకు సత్కారం జరగదని అంటున్నారు. మీ ఇద్దరికి అంతటి విరోధం ఎలా సంభవించింది?" అని నీవు ప్రశ్నింపవచ్చు. వివరిస్తాను, విను.

మ. నిరహంకార నిరస్తపాప సుజనానింద్యోల్లస త్కీర్తిఁ గొం
దఱు కామించి యశక్తులై మనములన్ దందహ్య మానేంద్రియా
తురులై యూరక మచ్చరింతురు; మహోత్కుం డీశ్వరుండైన యా
హరితో బద్ధ విరోధముం దొడరు దైత్యశ్రేణిచందంబునన్. 75

* అహంకారమూ, దోషములూ లేనివారు కావటంచేత సజ్జనులకు గొప్ప కీర్తి లభిస్తుంది. అట్టి కీర్తి తమకూ దక్కాలి అని కొందరు కోరుకుంటారు. కాని వారు అసమర్థులు కావటంవల్ల వారికి కీర్తిరాదు. అందుచేత మనస్సులో కుతకుత ఉడికిపోతారు. భగవంతుడైన విష్ణుమూర్తిపై రాక్షసులు పగను పెంచుకున్నట్లు, కారణం లేకుండానే దుర్జనులు సజ్జనులపై అసూయ పెంచుకుంటారు.

వ. అదియునుం గాక నీ వతనికిం బ్రత్యుత్థానాభివందనంబులు గావింపకుండుటం జేసి యతండు తిరస్కృతుండయ్యె నంటివేని లోకంబున జను లన్యోన్యంబును బ్రత్యుత్థానాభి వందనంబులు గావింతు, రదియు ప్రాజ్ఞు లయినవారు సర్వభూతాంతర్యామియైన పరమపురుషుండు నిత్యపరిపూర్ణుండు గావునఁ గాయిక వ్యాపారం బయుక్తంబని తదుద్దేశంబుగా మనంబునంద నమస్కారాదికంబులు గావింతురుగాని దేహాభిమానంబులు గలుగు పురుషులందుఁ గావింపరు, గాన

**నేనును వాసుదేవ శబ్దవాచ్యుండు, శుద్ధ సత్త్వమయుండు, నంతఃకరణంబునందు నావరణ విరహితుండును నయి ప్రకాశించు వాసుదేవునకు నా హృదయంబున నెల్లప్పుడు నమస్కరించు చుండుదు; నిట్లనపరాధినైన నన్నుఁ బూర్వంబున బ్రహ్మలు సేయు సత్త్రంబు నందు దురుక్తులం జేసి పరాభవించి మద్ద్వేషియై దక్షుండు భవజ్జనకుండైన నతఁడు దదనువర్తు లయిన వారలును జూడఁదగరు; కావున మద్వచనాతిక్రమంబుం జేసి యరిగితివేని నచట నీకుఁ బరాభవంబు సంప్రాప్తం బగు; లోకంబున బంధుజనంబులవలనఁ బూజ వడయక తిరస్కారంబు వొందుట చచ్చుటయ కాదే; యని పలికి మఱియు నభవుండు, పొమ్మని యనుజ్ఞ యిచ్చిన నచ్చట నవమానంబునం జేసి యశుభంబగు ననియు, నిచ్చటఁ బొమ్మనక నివారించిన మనోవేదన యగు ననియు మనంబునం దలపోయుచు నూరకుండె; నంత. 76**

* “మీరు ఆయన్ని చూచి లేచి ఎదురు వెళ్ళి నమస్కరించలేదు. అందువల్ల అవమానం భరించలేక పగ పెంచు కున్నాడు” అని నీవు అనవచ్చు. లోకంలో సామాన్యజనులు ఒకరినొకరు ఎదురువెళ్ళి నమస్కారం చేస్తారు. ప్రాజ్ఞులైన వారు భగవంతుడు సర్వాంతర్యామి కాబట్టి శరీర నమస్కారం తగదని ఆయనను ఉద్దేశించి మనస్సులోనే నమస్కారం మొదలైనవి చేస్తారు; అంతేకాని, దేహాభిమానంగల పురుషులకు శరీర నమస్కారం చేయరు. అందువల్ల నేనుకూడా భగవంతుడూ, కేవల సత్త్వగుణ సంపన్నుడూ, అంతరంగంలో నిరంతరం నిండి ఉండేవాడూ అయిన వాసుదేవునకు నా హృదయంలోనే నమస్కరిస్తుంటాను. ఏ పాపమూ ఎరుగని నన్ను పూర్వం ప్రజాపతులు చేసే యజ్ఞంలో నీ తండ్రి నిందించి పరాభవించాడు. అందువల్ల నీ తండ్రి దక్షుడు నాతో విరోధం కొనితెచ్చుకున్నాడు. నన్ను ద్వేషించే దక్షుడూ, అతని అనుచరులూ నీకు చూడదగనివారు. నా మాట కాదని వెళ్ళినట్లయితే అక్కడ నీకు అవమానం జరిగి తీరుతుంది. లోకంలో బంధువులచేత గౌరవం పొందకుండా అవమానం పొందటం మరణంతో సమానం!” ఈ విధంగా శంకరుడు సతీదేవిని హెచ్చరించాడు. పొమ్మని అనుజ్ఞ యిస్తే అక్కడ అవమానం జరిగి హాని కలుగుతుందని, పోవద్దని అడ్డుపెట్టితే సతీదేవి మనస్సుకి కష్టం కలుగుతుందనీ తన మనస్సులో భావించి, ఎటూ చెప్పకుండా మహాదేవుడు మౌనం వహించాడు.

**సీ. సతి సుహృద్దర్శనేచ్ఛాప్రతికూల దుఃఖస్వాంత యగుచు నంగములు వడఁక**
**నందంద తొరఁగెడు నశ్రుపూరంబులు గండభాగంబులఁ గడలుకొనఁగ**
**నున్నత స్తనమండలోపరిహారముల్ వేఁడి నిట్టూర్పుల వెచ్చఁ గంద**
**నతిశోకరోషాకులాత్యంత దోదూయమానమై హృదయంబు మలఁగుచుండ**

**తే. మఱియుఁ గుపితాత్మయై స్వసమానరహితు, నాత్మ దేహంబు సగ మిచ్చినట్టి ధవుని**
**విడిచి మూఢాత్మ యగుచు నవ్వేలఁది సనియె, జనకుఁ జూచెడు వేడుక సందడింప. 77**

* తన బంధుమిత్రులను దర్శించాలనే కుతూహలం సఫలం కాక పోవటం వల్ల సతీదేవి మనస్సులో దుఃఖం పొంగి పొరలింది. అవయవాలు కంపించాయి. కన్నీళ్లు చెక్కిళ్ళపై జాలువారాయి. వక్షఃస్థలం మీది ముత్యాలహారాలు నిట్టూర్పుల వేడికి కందిపోయాయి. శోకంతో కోపాతిరేకంతో సతీదేవి మనస్సు చలించి

కలత చెందింది. ఆ కోపంలో ఆమె వివేకం కోల్పోయింది. తనతో సరిసమానుడు లేని స్వామిని, తన శరీరంలో సగమిచ్చిన స్వామిని, తన స్వామిని పరమేశ్వరుణ్ణి విడిచి పెట్టి తండ్రిని చూడాలనే కుతూహలం అతిశయించగా ఒంటరిగా పుట్టింటికి బయలుదేరింది.

**వ. ఇట్లతిశీఘ్రగమనంబున. 78**

**సీ. మానిని చనుచుండ మణిమన్మదాది సహస్ర సంఖ్యాత రుద్రానుచరులు**
**యక్షులు నిర్భయులై వృషభేంద్రుని మున్నిడి కొనుచు నమ్ముదిత దాల్చు**
**కందుకాంబుజశారికా తాళవృంత దర్పణ ధవళాతపత్ర ప్రసూన**
**మాలికా సౌవర్ణమణివిభూషణ ఘనసార కస్తూరికా చందనాది**

**తే. వస్తువులు గొంచు నేగి శర్వాణిఁ గదిసి, శంఖదుందుభి వేణు నిస్వనము లొప్ప**
**మానితంబైన వృషభేంద్రయానఁ జేసి, యజ్ఞభూమార్గులై యర్థి నరిగి యరిగి. 79**

* అలా అతివేగంగా వెళ్ళిపోతున్న సతీదేవి వెనుక మణిమంతుడు మొదలైన వేలకొలది ప్రమథులూ, యక్షులూ బయలుదేరారు. నందీశ్వరుడు వారి ముందున నడుస్తున్నాడు. సతీదేవికి కావలసిన పూబంతులు, పద్మాలు, గోరువంకలు, విసనకర్రలు, అద్దాలు,వెల్లగొడుగు, పూలదండలు, మణులు కూర్చిన బంగారు నగలు, పచ్చకర్పూరం, కస్తూరి, మంచిగంధం మొదలైన వస్తువులను వెంటతీసుకొని వెళ్ళి ఆమెను కలుసుకున్నారు. సతీదేవిని వృషభవాహనంపై కూర్చుండబెట్టి శంఖాలు, నగారాలు, పిల్లంగ్రోవులూ మ్రోగిస్తూ యజ్ఞం జరిగే ప్రదేశంవైపు ప్రయాణం సాగించారు.

**వ. ముందట. 80**

**చ. మనమున మోదమందుచు నుమా తరుణీమణి గాంచె దారు మృ**
**త్కనక కుశాజినాయస నికాయ వినిర్మిత పాత్ర సీమము**
**న్ననుపమ వేదఘోష సుమహత్పశు బంధన కర్మభూమమున్**
**మునివిబుధాభిరామము సముజ్జ్వల హోమము యాగధామమున్. 81**

* సతీదేవీ, ప్రమథగణాలూ తమముందు యజ్ఞశాలను చూశారు.ఆ యజ్ఞశాలలో కొయ్యతో, మట్టితో, బంగారంతో, లోహంతో చేసిన పాత్రలూ; దర్భలతో, జింకతోళ్లతో చేసిన వస్తువులూ ఉన్నాయి. వేదఘోషలు మిన్నుముట్టుతున్నాయి. ఒకచోట యజ్ఞ పశువును బంధించారు. మునులూ, దేవతలూ తమతమ స్థానాలలో కూర్చుని ఉన్నారు. హోమాలు చేస్తున్నారు. యజ్ఞం వైభవోపేతంగా జరుగుతున్నది.

**వ. ఇట్లు గనుంగొని యజ్ఞశాలం బ్రవేశించిన. 82**

**క. చనుదెంచిన య మ్మగువను, జననియు సోదరులుఁ దక్క సభఁ గల జను లె**
**ల్లను దక్షువలని భయమున, ననయము నవు డాదరింపరైరి మహాత్మా! 83**

* సతిదేవీ, ప్రమథగణాలూ యజ్ఞశాలలో అడుగు పెట్టారు. సతీదేవిని చూడగానే తల్లీ, తోబుట్టువులూ అనురాగంతో ఆదరించారు. సభలో ఉన్న తక్కినవారు దక్షునికి భయపడి ఆమెను గౌరవించకుండా ఊరకున్నారు.

క. నెఱిఁ దల్లియుఁ బినతల్లులుఁ, బరిరంభణ మాచరింపఁ బరితోషాశ్రుల్
దొరఁగఁగ డగ్గుత్తికతో, సరసిజముఖి సేమ మరయ సతి దా నంతన్. 84

* తల్లీ, పినతల్లులూ సతీదేవిని కౌగిలించుకొని ఆనంద బాష్పాలు కారుస్తూ గద్గద స్వరంతో "అమ్మా! క్షేమమా" అని అడిగారు.

క. జనకుం డవమానించుట, యును సోదరు లర్థిఁ దనకు నుచిత క్రియఁ జే
సిన పూజల నందక శో, భన మరసిన మాఱుమాటఁ బలుకక యుండెన్. 85

* తండ్రి తనవైపు తలెత్తి చూడకుండా అవమానించటం వల్ల తోబుట్టువులు చేసిన గౌరవమును సతీదేవి అందుకోలేదు. వారి మాటలకు బదులు చెప్పలేకపోయింది.

వ. ఇట్లు తండ్రిచే నాదరింపబడనిదై విభుండైన యీశ్వరునందు నాహ్వాన క్రియాశూన్యత్వ రూపంబైన తిరస్కారంబును, నరుద్ర భాగంబైన యజ్ఞంబునుం గనుంగొని నిజరోషానలంబున లోకంబులు భస్మంబు సేయంబూనిన తెఱంగున నుద్రేకించి రుద్రవిద్వేషియుఁ గ్రతుకర్మాభ్యాస గర్విష్ఠుండునగు దక్షుని వధియింతు మనుచు లేచిన భూతగణంబుల నివారించి రోషావ్యక్త భాషణంబుల నిట్లనియె; లోకంబున శరీరధారులైన జీవులకుఁ బ్రియాత్మకుండైన యీశ్వరునకుఁ బ్రియాప్రియులును నధికులును లే; రట్టి సకల కారణుండును నిర్మత్సరుండును నైన రుద్రునందు నీవు దక్క నెవ్వండుప్రతికూలం బాచరించు? నదియునుంగాక మిముబోఁటి వారలు పరులవలని గుణంబు లందు దుర్గుణంబులన యాపాదింతురు; మఱియుం గొందఱు మధ్యస్థులైన వారలు పరుల గుణంబులయందు దోషంబుల నాపాదింపరు; గొందఱు సాదువర్తనంబు గలవారలు పరుల దోషంబులనైన గుణంబులుగా ననుగ్రహింతురు. మఱియుం గొంద ఱుత్తమోత్తములు పరులయందు దోషంబుల నాపాదింపక తుచ్ఛగుణంబులు గలిగినను సద్గుణంబులుగాఁ గై కొందు, రట్టి మహాత్ముల యందు నీవు పాపబుద్ధి గల్పించితివి అని వెండియు నిట్లను; మహాత్ములగు వారల పాదధూళిచే నిరస్తప్రభావులై జడస్వభావంబు గల దేహంబు నాత్మ యని పల్కు కుజనులగు వారు మహాత్ముల నిందించు టాశ్చర్యంబుగా; దదియు వారి కనుచితం బగు నని వెండియు నిట్లనియె. 86

* తండ్రి తన భర్తను యజ్ఞానికి ఆహ్వానించకుండా అవమానించాడనీ, శివునికి భాగం కల్పించకుండా యజ్ఞం జరిపిస్తున్నాడనీ సతీదేవి గ్రహించింది. తన కోపాగ్ని జ్వాలలతో లోకాలను బూడిద చేయాలన్నంత ఉద్రేకం వచ్చింది. అప్పుడు ప్రమథ గణాలు శివుని ద్వేషించి యజ్ఞం చేస్తున్నాననే దురహంకారంతో మిడిసి పడుతున్న దక్షుణ్ణి హత మారుస్తాం అని ముందుకు దూకారు. సతీదేవి వారిని వారించింది. రోషా వేశంతో తండ్రివైపు చూచి యిలా అన్నది. పరమేశ్వరుడు లోకంలోని ప్రాణులందరికీ ఎంతో యిష్టమైవాడు. ఆ మహాదేవునికి ఇష్టమైనవారు గానీ, ఇష్టం లేనివారు గానీ ఎవరూ లేరు. ఈ విశ్వంలో ఆయనకంటే అధికులు లేరు. సకల విశ్వానికి కారణము ఈశ్వరుడే. ఆయనకు ఎవరియందూ ద్వేషం లేదు. అలాంటి దేవదేవుని

నీవు తప్ప లోకంలో ఇంకెవ్వడూ ద్వేషించడు. అవమానించటానికి పూనుకోడు. అంతేకాదు. కొందరు నీవంటివారు ఇతరుల గుణాలలో దోషాలను ఆరోపిస్తారు. కొందరు మధ్యస్థు లుంటారు. వారు పరుల గుణాలనే గ్రహిస్తారు. దోషాలను గ్రహించరు. సత్పురుషులు కొంద రుంటారు. వారు దోషాలను గూడ గుణాలుగా గ్రహిస్తారు. ఇక ఉత్తమోత్తము లైనవారు కొంద రుంటారు. వారు పరులయందు దోషాలను ఆపాదింపరు. వారి నీచ గుణాలను సైతం సద్గుణాలుగా పెద్ద చేసి గౌరవిస్తారు. అటువంటి మహాత్ములపై నీవు ద్వేష బుద్ధితో దోషాలను ఆరోపిస్తున్నావు. జడపదార్థమైన దేహమునే ఆత్మ అని వాదించు దుర్జనులు సజ్జనులై వారిని నిందించుటలో వింతలేదు. మహాత్ముల పాదధూళి ముందు వెలవెలబోయిన తేజముగల వారు అంతకంటే చేసేది ఏముంటుంది?

**సీ. అనయంబు "శివ" యను నక్షరద్వయ మర్థి వాక్కునఁ బలుక భావమునఁ దలఁప**
**సర్వజీవులు పాపసంఘముల్ సెడు; నట్టి మహితాత్మునందు నమంగళుండ**
**వగు నీవు విద్వేషి వగుట కాశ్చర్యంబు నందెద, వినుము నీ వదియుఁ గాక**
**చర్చింప నెవ్వని చరణపద్మంబుల నరసి బ్రహ్మానంద మను మరంద**

**తే. మతుల భక్తిని దమ హృదయంబు లనెడి, తుమ్మెదలచేతఁ గ్రోలి సంతుష్టచిత్తు**
**లగుదు రత్యంత విజ్ఞాను; లట్టి దేవు, నందు ద్రోహంబు సేసి; తే మందు నిన్ను? 87**

* 'శివ' అను రెండు అక్షరాలను ఆసక్తితో నోటితో పలికిన మనస్సులో తలచినా సమస్త ప్రాణుల సర్వ పాపాలూ నశిస్తాయి. అలాంటి మంగళ స్వరూపుడూ, మహానుభావుడూ అయిన శివుణ్ణి, అమంగళ మనస్కుడవయిన నీవు ద్వేషించుట విచిత్రంగా ఉన్నది. గొప్ప విజ్ఞానులు అయినవారు ఆ పరమ శివుని పాదారవిందాలను ధ్యానిస్తూ బ్రహ్మానందమనే మకరందాన్ని తమ మనస్సులనే తుమ్మెదల ద్వారా భక్తిపారవశ్యంతో త్రాగి ధన్యులౌతారు. అలాంటి దేవదేవునికి నీవు ద్రోహం చేశావు. నిన్ను ఏమనాలి?

**క. మఱియును న మ్మహితాత్ముని, చరణ సరోజాత యుగము సకలజగంబుల్**
**నెఱిఁ గొలువఁ గోరు కోర్కులు, దరమిడి వర్షించ నతనిఁ దగునే తెగడన్? 88**

* అదీగాక ఆ పరమేశ్వరుని చరణకమల ద్వయం, కొలిచేవారికి కోరిన కోర్కెలన్నీ కురిపిస్తుంది. అటువంటి మహానుభావుణ్ణి నిందించటం న్యాయమా?

**చ. పరఁగఁ జితాస్థిభస్మ నృకపాలజటాధరుఁడుం బరేత భూ**
**చరుఁడు పిశాచయుక్తుఁడని శర్వు నమంగళుగాఁ దలంప రె**
**వ్వరు; నొకఁ డీవు దక్క, మఱి వాక్పతి ముఖ్యులు నమ్మహాత్ము స**
**చ్చరణ సరోజ రేణువులు సమ్మతిఁ దాల్తురు మస్తకంబులన్. 89**

* శ్మశానంలో వసించినా, ఎముకలనూ బూడిదనూ కపాలాలనూ ధరించినా, భూతాలతో కలిసి చరించినా శివుడు మంగళస్వరూపుడే. నీవంటి మూర్ఖులు తప్ప శివుణ్ణి "అమంగళు"డని మరెవ్వరూ భావింపరు.

బ్రహ్మదేవుడు మొదలైనవారు ఆ మహాత్ముని పాదపద్మపరాగాలను తమ శిరస్సులపై పరమానందంతో ధరిస్తారు.

చ. నెలకొని ధర్మపాలన వినిర్మలు భర్గుఁ దిరస్కరించు న
క్కలుషుని జిహ్వఁ గోయఁ దగుఁ గా; కటు సేయఁగ నోపఁడేని దాఁ
బొలియుట యొప్పు; రెంటికిఁ బ్రభుత్వము సాలమిఁ గర్ణరంధ్రముల్
బలుపుగ మూసికొంచుఁ జనఁ బాడి యటందురు ధర్మవర్తనుల్. 90

* ధర్మ రక్షణ దీక్షాపరుడైన హరుని అవమానించే పాపాత్ముని నాలుక పరపర కోసివేయాలి. అలా చేయటానికి శక్తి లేకపోతే శివనిందను వహించిన తానే చావాలి. రెండూ చేతకాని పక్షంలో చెవులు రెండూ గట్టిగ మూసుకొని అక్కడి నుంచి వెంటనే వెళ్ళి పోవటం న్యాయమని ధర్మజ్ఞులు చెబుతారు.

వ. అది గావున. 91

మ. జనుఁ డజ్ఞానమునన్ భుజించిన జుగుప్సంబైన యన్నంబు స
య్యన వెళ్ళించి పవిత్రుఁడైన గతి దుష్టాత్ముండవై యీశ్వరున్
ఘను నిందించిన నీ తనూభవ ననం గా నోర్వ, నీ హేయ భా
జన మైనట్టి శరీరమున్ విడిచి భాస్వచ్ఛుద్ధిఁ బాటిల్లెదన్. 92

* అందువల్ల దుష్టబుద్ధితో ఈశ్వరుని నిందించిన నీకు కుమార్తెను అనిపించుకొనుట నాకు ఇష్టం లేదు. తెలియక తిన్న దుష్టాన్నాన్ని మానవుడు కక్కివేసి పరిశుద్ధుడు అవుతాడు కదా! అలాగే నేనూ నీవల్ల ప్రాప్తించిన ఈ పాడు శరీరాన్ని పరిత్యజించి పవిత్రురాలను అవుతాను.

వ. అదియునుం గాక దేవతల కాకాశ గమనంబును, మనుష్యులకు భూతల గమనంబును, స్వాభావికంబు లయినట్లు ప్రవృత్తినివృత్తి లక్షణ కర్మంబులు రాగవైరాగ్యాధికారంబులుగా వేదంబులు విధించుటం జేసి రాగయుక్తులై కర్మతంత్రు లయిన సంసారులకు వైరాగ్యయుక్తులయి యాత్మారాము లయిన యోగిజనులకు విధి నిషేధరూపంబు లయిన వైదిక కర్మంబులు గలుగుటయు లేకుండుటయు నైజంబు లగుటంజేసి స్వధర్మ నిష్ఠుం డగువాని నిందింప జన; దా యుభయకర్మ శూన్యుండు బ్రహ్మభూతుండు నయిన సదాశివునిఁ గ్రియాశూన్యుండని నిందించుట పాపం బగు, తండ్రీ! సంకల్పమాత్ర ప్రభవంబు లగుటం జేసి మహాయోగి జనసేవ్యంబు లయిన యస్మదీయంబు లగు నణిమాద్యష్టైశ్వర్యంబులు నీకు సంభవింపవు; భవదీయంబులగు నైశ్వర్యంబులు ధూమ మార్గ ప్రవృత్తులై యాగాన్న భోక్తలైన వారిచేత యజ్ఞశాలయందె చాల నుతియింపంబడి యుండుఁగాన నీ మనంబున నే నధిక సంపన్నుండ ననియుఁ, జితాభస్మాస్థిధారణుండైన రుద్రుండు దరిద్రుం డనియును గర్వింపం జన దని వెండియు నిట్లనియె. 93

* సంసారులకు అగ్నిహోత్రాలు మొదలైన ప్రవృత్తికర్మలనూ, విరక్తులకు శమదమాది నివృత్తి కర్మలనూ వేదాలు విధించాయి. దేవతలకు ఆకాగమనమూ, మానవులకు భూగమనమూ సహజమైనట్లు సంసారులకూ, విరక్తులకూ వేరు వేరు ధర్మాలు సహజాలు. విధినిషేధ రూపాలైన వైదిక కర్మలు ధర్మాసక్తులైన సంసారులకేగాన ఆత్మారాములైన యోగులకు కాదు. అందుచేత స్వధర్మపరులైన వారిని నిందింపకూడదు. శివుడు బ్రహ్మస్వరూపుడు. ప్రవృత్తి నివృత్తి కర్మలకు అతీతుడు.

అందువల్ల క్రియాశూన్యుడని సదాశివుని నిందించటం మహాపాపం. తండ్రీ! సంకల్పమాత్రం చేతన ప్రాప్తించే అణిమాది అష్టైశ్వర్యాలు మేము పొందగలం. మహాయోగీంద్రులకు సైతం ఆరాధింపదగిన ఆ మహాసిద్ధులను తలక్రిందుగా తపస్సు చేసినా నీవు పొందలేవు. నీ భోగభాగ్యాలను యజ్ఞశాలలో హోమధూమాలు రేపుతూ, యజ్ఞాన్నాలను భుజించేవారు మాత్రమే స్తోత్రం చేస్తారు. మా సంపదలు అలాంటివి కావు, అణిమాది సంపదలు, కోరిన మాత్రాననే మేము పొందగలము. మహాయోగులు మాత్రమే వాటిని పొందగలరు. అందువల్ల నేను చాలా సంపన్నుడననీ, చితాభస్మధారియైన రుద్రుడు దరిద్రుడనీ గర్వపడకు.

**ఉ. నీలగళాపరాధి యగు నీకుఁ దనూభవ నౌట చాలదా!**
**చాలుఁ గుమర్త్య! నీదు తనుజాత ననన్ మది సిగ్గు పుట్టెడి**
**న్నేల ధరన్ మహాత్ములకు నెగ్గొనరించెడి వారి జన్మముల్**
**గాలుపనే? తలంప జనకా! కుటిలాత్మక! యెన్ని చూడఁగన్! 94**

* సకలలోక శుభంకరుడైన శంకరునికి క్షమింపరాని అపరాధం చేసిన నీకు నేను పుత్రికను కావటం నా దురదృష్టం. ఇక చాలు. నీచుడా! నీ కూతుర్ని అని చెప్పుకోటానికి కూడా నేను సిగ్గుపడుతున్నాను. మాననీయులైన మహాత్ములకు కీడు తలపెట్టే వారి పుట్టుకలు పూడ్చిపెట్టనా? మంట పెట్టనా?

**చ. వరవృషకేతనుండు భగవంతుఁడు నైన హరుండు నన్ను నా**
**దర పరిహాస వాక్యముల "దక్షతనూభవ!" యంచుఁ బిల్వ నేఁ**
**బురపురఁ బొక్కుచున్ ముదముఁ బొందక నర్మవచస్స్మితంబులం**
**దొఱఁగుదు? నీ తనూజ నను దుఃఖముకంటెను జచ్చు టొప్పగున్. 95**

* ఇకముందు నందివాహనుడూ భగవంతుడూ అయిన పరమేశ్వరుడు ఆదరంగానో పరిహాసంగానో "దాక్షాయణీ" అని నన్ను పిలిచినప్పుడు నేను దుఃఖంతో కుమిలిపోతాను. కాని పూర్వం లాగా ఆనందించలేను. చిరునవ్వులు చిందించలేను. నీకు కూతురునై పుట్టానే అని వాపోవటంకంటే చచ్చిపోవటం చాల మంచిది.

**వ. అని యిట్లు యజ్ఞ సభామధ్యంబునం బ్రతికూలుండగు దక్షు నుద్దేశించి పలికి కామక్రోధాది శత్రువిఘాతిని యగు సతీదేవి యుదఙ్ముఖియయి జలంబుల నాచమనంబు సేసి శుచియై మౌనంబు ధరియించి జితాసనయై భూమియం దాసీన యగుచు యోగమార్గంబునం జేసి శరీరత్యాగంబు సేయం దలచి. 96**

* ఈ విధంగా సతీదేవి యజ్ఞసభామండప మధ్యంలో నిలబడి ప్రతిపక్షుడైన దక్షుణ్ణి వీక్షించి పలికింది. అరిషడ్వర్గాన్ని జయించి ఉత్తరదిక్కు మొగమై, ఆచమించి, శుచియై, మౌనం తాల్చి, నేలపై కూర్చుండి యోగమార్గం ద్వారా శరీరాన్ని విడిచిపెట్టాలని నిశ్చయించుకొన్నది.

**సీ. వరుసఁ బ్రాణాపాన వాయునిరోధంబు గావించి వాని నేకముగ నాభి**
**తలమునఁ గూర్చి యంతట నుదానముదాక నెగయించి బుద్ధితో హృదయపద్మ**
**మున నిల్పి వాని మెల్లన కంఠమార్గము నను మఱి భ్రూమధ్యమున వసింపఁ**
**జేసి శివాంఘ్రి రాజీవ చింతనముచే నాథునిఁ దక్క నన్యంబుఁ జూడ**

**తే. కమ్మహాత్ముని యంక పీఠమ్మునందు, నాదరంబున నుండు దేహంబు దక్షు**
**వలని దోషంబునను విడువంగఁ దలఁచి, తాల్చెఁ దనువున ననిలాగ్ని ధారణములు. 97**

* ప్రాణాపానాలను నిరోధించి వాటిని నాభిప్రదేశంలో ఏకం చేసింది. ఆ తరువాత ఉదానం వరకు పైకి కొనిపోయి బుద్ధితో కలిపి భ్రూమధ్యభాగానికి చేర్చింది. ఏకాగ్రమైన మనస్సుతో పరమశివుని పాదపద్మాలను ధ్యానించింది. ఆ దేవ దేవుడు ప్రేమాంకంలో ఉంచుకొని ఆదరించే తన దేహాన్ని దక్షుని ద్రోహానికి ప్రతీకారంగా పరిత్యజించటం కోసం తనలో యోగాగ్నిని రగుల్కొల్పింది.

**వ. ఇట్లు ధరియించి గత కల్మషంబైన దేహంబు గల సతీదేవి నిజయోగ సమాధి జనితం బయిన వహ్నిచేఁ దత్క్షణంబ దగ్ధ యయ్యె నంత. 98**

* ఈ విధంగా గతకల్మషమైన సతీదేవి దేహం ఆ త్యాగమయి యోగసమాధి నుండి పుట్టిన అగ్నిలో భగ్గుమని భస్మమైపోయింది.

**క. అది గనుఁగొన హాహాధ్వని, వొదలఁగ నిట్లనిరి మానవులుఁ ద్రిదశులు నీ**
**మదిరాక్షి యకట! దేహము, వదలెఁ గదా! దక్షుతోడి వైరము కతనన్. 99**

* అదిచూచి అక్కడ ఉన్న మానవులూ, దేవతలూ హాహాకారాలు చేశారు. "అయ్యో! పాపం! ఈ సతీదేవి దక్షునిమీది కోపంతో శరీరాన్ని పరిత్యజించిందిగదా!" అని అన్నారు.

**వ. మఱియు నిట్లనిరి. 100**

**సీ. సకల చరాచర జనకుఁడై నట్టి యీ దక్షుండు దనకూర్మి తనయ మాన**
**వతి పూజనీయ యీసతి దనచే నవమానంబు నొంది సమక్షమందుఁ**
**గాయంబు దొఱఁగంగఁ గనుఁగొను చున్నవాఁడిట్టి దురాత్ముఁ డెందేనిఁ గలఁడె?**
**యనుచుఁ జిత్తంబుల నాశ్చర్యములఁ బొంది, రదియునుఁగాక యిట్లనిరి యిట్టి**

**తే. దుష్టచిత్తుఁడు బ్రహ్మబంధుండు నయిన, యీతఁ డనయంబుఁ దా నపఖ్యాతిఁ బొందు**
**నిందఁబడి మీఁద దుర్గతిఁ జెందుగాక, యనుచు జనములు వలుకు న య్యవసరమున. 101**

* పరమేశ్వరుని సతి అయిన ఈ సతి అభిమానవతి అత్యంత పూజ్యురాలు. సకల చరాచరాలను సృష్టించిన ఈ దక్షుడు తన అనుగు పుత్రికను అవమానించాడు. తన తనయ తన యెదుటనే తన తనువు త్యజిస్తూ ఉంటే నివారించకుండా గ్రుడ్లప్పగించి చూస్తూ ఊరకున్నాడు. ఇలాంటి పాపాత్ముడు ప్రపంచంలో ఎక్కడైనా ఉన్నాడా? అని ఆశ్చర్యపడ్డారు. వీడు దుష్టుడు, నికృష్టుడు; పేరుకు మాత్రమే బ్రాహ్మణుడు, వీడి ప్రతిష్ఠ మట్టిలో కలిసిపోతుంది. వీడి బ్రతుకు నిందాలపా లవుతుంది. వీడికి నరకం తప్పదు అంటూ దూషించారు.

**క.** **దేహము విడిచిన సతిఁ గని, బాహాబల మొప్ప రుద్ర పార్షదులును ద**
**ద్ద్రోహిం ద్రుంచుటకై యు, త్సాహంబున లేచి రసిగదాపాణులునై.** **102**

* సతీదేవీ దేహాన్ని విడిచి పెట్టడం చూచిన ప్రమథగణాలూ అవక్రపరాక్రమంతో కత్తులూ, గదలూ, ధరించి శివద్రోహియైన దక్షుణ్ణి శిక్షించడానికి ఉత్సాహంతో ముందుకు దూకారు.

**క.** **ఆ రవ మపు డీక్షించి మ, హారోషముతోడ భృగుమహాముని క్రతు సం**
**హారక మారక మగు నభి, చారకహోమం బొనర్చె సరభసవృత్తిన్.** **103**

* ఆ సందడిని చూచి అధ్వర్యుడు అయిన భృగుమహర్షి అగ్రహోదగ్రుడై యజ్ఞనాశకులను నశింపజేసే అభిచార హోమం వెంటనే ప్రారంభించాడు.

**వ.** **ఇట్లు దక్షిణాగ్ని యందు వ్రేల్చిన నందుఁ దపం బొనర్చి సోమలోకంబున నుండు సహస్ర సంఖ్యలు గల “ఋభు” నామధేయులైన దేవత లుదయించి బ్రహ్మతేజంబునం జేసి దివ్యవిమానులై యుల్ముకంబులు సాధనంబులుగా ధరియించి రుద్రపార్షదులయిన ప్రమథ గుహ్య గణంబులఁ బాఱందోలిన వారును బరాజితులైరి, తదనంతరంబ నారదువలన నభవుండు దండ్రిచే నసత్కృతురా లగుటం జేసి భవాని పంచత్వంబు నొందుటయుం బ్రమథగణంబులు ఋభునామక దేవతలచేఁ బరాజితు లగుటయు విని.** **104**

* భృగుమహర్షి దక్షిణాగ్ని యందు వేల్వగానే, తపస్సుచేసి సోమలోకాన్ని పొందిన ‘ఋభువులు’ అనే దేవతలు వేలకొలది అందులో నుండి వెంటనే పుట్టారు. బ్రహ్మతేజస్సుతో వెలిగిపోతూ, దివ్యవిమానాలు ఎక్కి కొరవులు ఆయుధాలుగా పూని, ప్రమథ గణాలనూ, గుహ్యక గణాలనూ పారదోలారు.

తండ్రిచే అవమానితురాలై దాక్షాయణి తనువు చాలించడమూ, ప్రమథగణాలు ఋభువుల చేతిలో ఓడిపోవటమూ పరమేశ్వరుడు నారదుని వల్ల విన్నాడు.

**శా.** **ఆద్యుం డుగ్రుఁడు నీలకంఠుఁ డిభదైత్యారాతి దష్టోష్ఠుఁడై**
**మాద్యద్భూరి మృగేంద్ర ఘోషమున భీమప్రక్రియన్ నవ్వుచున్**
**విద్యుద్వహ్ని శిఖాసముచ్చయరుచిన్ వెల్గొందు చంచజ్జటన్**
**సద్యః క్రోధముతోడఁ బుచ్చి వయిచెన్ క్ష్మాచక్రమధ్యంబునన్.** **105**

* అప్పుడు దేవాదిదేవుడూ మహోగ్రస్వభావుడూ, నీలగ్రీవుడూ, గజాసుర గర్వాపహారియైన శివుడు ఔడు గరచి మదించిన సింహంవలె గర్జించాడు; భయంకరంగా నవ్వాడు. మెరుపు తీగవలె అగ్నిజ్వాలా మాలిక వలె ప్రకాశించే జడను ఒక దానిని మహాకోపంతో పెరికి భూమి మీద విసరికొట్టాడు.

వ. ఇట్లు పెఱికివైచిన రుద్రుని జటయందు. 106

* అలా పెరికివేసిన జటయందు.

## -: శివుఁడు వీరభద్రుచే దక్షయజ్ఞంబు ధ్వంసంబు సేయించుట. :-

సీ. అభ్రంలిహాదభ్ర విభ్ర మాభ్ర భ్రమ కృన్నీలదీర్ఘ శరీర మమరఁ
ప్రజ్వలజ్జ్వలన దీప్త జ్వాలికా జాల జాజ్వల్యమాన కేశములు మెఱయఁ
జండ దిగ్వేదండ శుండాభ దోర్దండ సాహస్రధృతి హేతిసంఘ మొప్ప
వీక్షణత్రయ లోకవీక్షణద్యుతి లోక వీక్షణతతి దుర్నిరీక్షముగను

తే. గ్రకచ కఠిన కరాళ దంష్ట్రలు వెలుంగ, ఘన కపాలాస్థి వనమాలికలును దనర
నఖిలలోక భయంకరుఁ డగుచు "వీర, భద్రుఁ" డుదయించె మాఱట రుద్రుఁ డగుచు. 107

* ఆ విధంగా పరమేశ్వరుడు పెరికివైచిన జడనుండి సకల లోకాలకూ భయం కలిగిస్తూ, రెండవరుద్రుని వలె వీరభద్రుడు ఉదయించాడు. ఆయన సుదీర్ఘమైన నల్లని దేహం ఆకాశాన్ని అంటి కాలమేఘ మేమో అనే భ్రాంతి కలిగిస్తున్నది. ఆయన తలవెంట్రుకలు భగభగమండే అనలజ్వాలామాలలవలె ప్రకాశిస్తున్నాయి. ఆయన దిగ్గజాల తొండాల వంటి వేయి బాహుదండాలలో అసంఖ్యాకా లయిన ఆయుధాలు మెరుస్తున్నాయి. ఆయన మూడుకన్నులనే చండమార్తాండ ప్రకాశం లోకుల కన్నులకు తేరిపార జూడరాకుండా ఉంది. ఆయన కోరలు రంపాలలాగా కఠినంగా కర్కశంగా భయంకరంగా ఉన్నాయి. మెడనిండా కపాలమాలలు వ్రేలాడుతున్నాయి.

తే. వీరభద్రుండు విహత విద్వేషి భద్రుఁ, డగుచుఁ దన వేయి చేతుల మొగిచి వినయ
మెసఁగ నే నేమి సేయుదు? నెఱుఁగ నాకు, ఆనతిమ్మన్న నతని క య్యభవుఁ డనియె. 108

* వీరభద్రుడు శత్రు సంహారం తలపెట్టినవాడై తన వేయి చేతులను మోడ్చి వినయ వినమ్రుడై "స్వామీ'' నేను ఏమి చేయాలి? ఆజ్ఞాపించండి!'' అని అడిగాడు. అప్పుడు ఈశ్వరుడు ఇలా అన్నాడు.

చ. గురుభుజశౌర్య! భూరిరణకోవిద! మద్భటకోటి కెల్ల నీ
వరయ వరూధినీవరుఁడవై చని యజ్ఞము గూడ దక్షునిన్
బరువడిఁ ద్రుంపు; మీ వచట బ్రాహ్మణతేజ మజేయ మంటి వే
నరిది మదంశసంభవుఁడవై తగు నీకు నసాధ్య మెయ్యెడన్? 109

వ. అని కుపిత చిత్తుండై యాజ్ఞాపించిన నట్లకాక యని. 110

* "యుద్ధ విద్యా విశారదుడవైన వీరాధివీరుడా! మన ప్రమథ గణాల కందరికీ నీవు సేనాధిపతివై సాగిపో! యజ్ఞంతో కూడా దక్షుణ్ణి హతమార్చు. బ్రాహ్మణ తేజం అజేయమని సందేహింపకు. శివాంశ సంభవుడవైన నీకు ముల్లోకాలలో అసాధ్యమైనది లేనేలేదు" అని రుద్రుడు కోపోద్రేకంతో వీరభద్రుణ్ణి ఆజ్ఞాపించాడు. వీరభద్రుడు, "చిత్తం అలాగే చేస్తాను." అన్నాడు.

**చ. అనఘుఁడు రుద్రుఁ జేరి ముదమారఁ బ్రదక్షిణ మాచరించి వీ**
**డ్కొని యనివార్య వేగమునఁ గుంభిని గ్రక్కదలన్ ఝుళంఝుళ**
**ధ్వని మణినూపురంబులు పదంబుల మ్రోయఁగ భీషణ ప్రభల్**
**దనరఁ గృతాంతకాంతక శితస్ఫుట శూలముఁ బూని చెచ్చెరన్. 111**

* అప్పుడు వీరభద్రుడు సంతోషంతో పరమశివునికి ప్రదక్షిణం చేసి ఆయన దగ్గర సెలవు తీసుకున్నాడు. కాలయముణ్ణి సైతం నేలగూల్చ జాలిన వాడిశూలాన్ని చేతపట్టాడు. చరణయుగళాన తాల్చిన మణినూపురాలు ఝుళం ఝుళ ధ్వనులు చేస్తుండగా బయలుదేరాడు. అనివార్యమైన ఆయన గమన వేగానికి ధరిత్రి దద్దరిల్లింది.

**చ. సరభసవృత్తి నట్లరుగు సైన్యపదాహత ధూత ధూళి ధూ**
**సరిత కుబేరదిక్తటము సభ్యులు దక్షుఁడుఁ జూచి "యెట్టి భీ**
**కరతమ?" మంచనం, 'దమము గాదు, రజఃపటలం' బటంచు ని**
**వ్వెఱపడి పల్కి రాత్మల వివేకవిహీనతఁ బొంది వెండియున్. 112**

* మహావేగంతో వస్తున్న సైన్యం కాళ్ల త్రొక్కిళ్ల వల్ల ఎగరగొట్టబడిన ధూళికి కావిరి క్రమ్మిన ఉత్తరపుదిక్కును యజ్ఞశాలలోని సభ్యులూ దక్షుడూ చూచారు. "అబ్బా! ఎంత భయంకరమైన కారుచీకటి!" అని అనుకున్నారు. "కారు చీకటి కాదు, కాళ్ల దుమ్ము!" అని మళ్లీ భయపడ్డారు. వివేకం గోల్పోయారు. ఇలా అనుకోసాగారు.

**సీ. ఈ ధూళి పుట్టుట కెయ్యది హేతువో? విలయ సమీరమా? పొలయ దిపుడు;**
**ప్రాచీనబర్హి ధరాపతి మహితోగ్రశాసనుఁ డిపుడు రాజ్యంబు సేయఁ**
**జోర సంఘములకో రారాదు; మఱి గోగణాళి రాకకు సమయంబు గాదు;**
**కావున నిప్పుడు కల్పావసానంబు గాఁబోలు; గా కటు గాక యున్న**

**తే. నిట్టి యౌత్పాతిక రజ మెందేనిఁ గలదె?, యనుచు మనముల భయమంది రచటి జనులు**
**సురులు దక్షుఁడు; నంతఁ బ్రసూతి ముఖ్య, లయిన భూసురకాంత లిట్లనిరి మఱియు. 113**

* ఈ విధంగా దుమ్ము రేగటానికి కారణం ఏమిటబ్బా! ప్రళయ కాల ప్రభంజనమా! ఇది కల్పాంత సమయం కాదే. దొంగల గుంపు వస్తున్నదేమో అంటే చండశాసనుడైన ప్రాచీనబర్హి రాజ్యం చేస్తున్నాడు. కాబట్టి చోర సంఘాలకు అవకాశం లేదే! పోని ఆవుల మందలు వస్తున్నా యందామా, ఇది సాయం సమయం కాదే; కాకపోతే కల్పాంతమే వచ్చిందేమో! లేకపోతే యిలాంటి దుశ్శకునాలను సూచించే ధూళి ఎలా

వస్తుంది? అని అక్కడ ఉన్న జనులూ, దేవతలూ, దక్షుడూ భయపడ్డారు. "ప్రసూతి" మొదలైన బ్రాహ్మణ స్త్రీలు ఇలా అన్నారు.

**క. తన కూఁతులు సూడఁగ జని, తనయను సతి ననపరాధఁ దగవఱి? యి ట్లె**
**గ్గొనరించిన యీ దక్షుని, ఘనపాప విపాక మిదియుఁ గాఁదగు ననుచున్. 114**

* దక్షుడు తన కుమార్తెలు అందరూ చూస్తుండగా ఏ అపరాధమూ ఎరుగని తన కూతురు సతీదేవిని అవమానించాడు. ఆమెకు అన్యాయంగా కీడు చేశాడు. ఈ ధూళి ఆ మహాపాపానికి ఫలితం అయి ఉంటుంది.

**వ. వెండియు నిట్లనిరి: కుపితాత్ముండైన దక్షుండు దనకూఁతుతో విరోధంబు సాలక జగత్సంహార కారణుం డయిన రుద్రునిం గ్రోధింపఁజేసె; న మ్మహాత్ముం డెంతటివాఁ డన్నం బ్రళయకాలంబున. 115**

* అలిగి తన కూఁతుతో విరోధం పెట్టుకున్నాడు. అది చాలక సకల లోక ప్రళయం కరుడైన హరునికి ఆగ్రహం కలిగించాడు. ఆ మహాత్ముడు ఎంతటివాడో తెలుసుకోలేకపోయాడు.

**సీ. సుమహిత నిశిత త్రిశూలాగ్ర సంప్రోత నిఖిల దిక్కరి రాజనివహుఁ డగుచుఁ**
**జటులోగ్రనిష్ఠుర స్తనిత గంభీరాట్టహాస నిర్భిన్నాఖిలాశుఁ డగుచు**
**భూరి కరాళవిస్ఫార దంష్ట్రాహతి పతిత తారాగణ ప్రచయుఁ డగుచు**
**వివిధహేతి వ్రాత విపుల ప్రభాపుంజ మండిత చండదోర్దండుఁ డగుచు**

**తే. వికట రోష భయంకర భ్రుకుటి దుర్ని, రీక్ష్య దుస్సహ తేజోమహిమఁ దనర్చి**
**ఘన వికీర్ణ జటాబంధ కలితుఁ డగుచు, నఖిల సంహార కారణుం డయి నటించు. 116**

* ఆ పరమశివుడు ప్రళయ కాలంలో మహోగ్రమైన తన త్రిశూలాగ్రాన దిగ్గజాలను గుదిగ్రుచ్చుతాడు. దిక్కులన్నీ దద్దరిల్లి బీటలువారు విధంగా ఉరుము ఉరిమినట్లు గంభీరంగా అట్టహాసం చేస్తాడు. తన వికట కఠోర దంష్ట్రా ఘాతములతో నక్షత్ర మండలాన్ని జలజల నేల రాలుస్తాడు. తన భీకర కరాలలో ధగధగ మెరిసే నానా విధాలైన ఆయుధాలను ధరిస్తాడు. ప్రచండ క్రోధంతో భయంకరంగా కనుబొమలు ముడివేసి తేరిచూడరాని తేజస్సుతో విరాజిల్లుతాడు. విశాల జటాజూటం ముడి వీడిపోయేటట్లు విలయ తాండవం చేస్తూ సర్వమును సంహరిస్తాడు.

**తే. అట్టి దేవునిఁద్రిపుర సంహార కరునిఁ, జంద్రశేఖరు సద్గుణసాంద్రు నభవు**
**మనము రోషింపఁ జేసిన మంగళములఁ, బొంద వచ్చునె పద్మగర్భునకునైన? 117**

అటువంటి దేవదేవునికి, మహాదేవునికి, త్రిపురసంహారునికి, చంద్రకళాధరునికి, సకల సద్గుణ విభవునికి, అభవునికి ఆగ్రహం తెప్పించి బ్రహ్మదేవుడు కూడ శుభములు పొందలేడు.

**వ. అని యి వ్విధంబున భయవిహ్వలలోచనలై పలుకుచున్న సమయంబున మహాత్ముండైన దక్షునకు భయావహంబులై సహస్ర సంఖ్యాతంబులైన మహోత్పాతంబులు భూనభోంతరంబులఁ గానంబడు చుండె; నా సమయంబున రుద్రానుచరులు నానావిధాయుధంబులు ధరియించి కపిల పీత వర్ణంబులు గలిగి వామనాకారులు, మకరోదరాననులునై యజ్ఞశాలా ప్రదేశంబునం బరువులు**

వెట్టుచుఁ గదియం జనుదెంచి దక్షాధ్వర వాటంబులు విటతాటంబులు సేయుచుం గొందఱు ప్రాగ్వంశంబు, గొందఱు పత్నీశాలయుఁ, గొందఱు సదస్యశాలయుఁ, గొంద ఱాగ్నీధ్రశాలయుఁ, గొందఱు యజమానశాలయుఁ, మహానస గృహంబును విధ్వంసంబులు గావించిరి; మఱియుఁ గొందఱు యజ్ఞపాత్రంబుల నగ్నులం జెఱచిరి; వెండియుఁ గొందఱు హోమాగ్ను లార్చిరి; పదంపడి కొందఱు హోమకుండంబులయందు మూత్రంబులు విడిచిరి; కొంద ఱుత్తరవేదిక మేఖలలు ద్రెంచిరి; కొందఱు మునుల బాధించిరి; కొందఱు తత్పత్నుల వెఱపించిరి; మరికొందఱు దేవతా నిరోధంబు గావించిరి; అంత మణిమంతుండు భృగువును, వీరభద్రుండు దక్షునిఁ, జండీశుండు పూషుని, భృగుని నందీశ్వరుండును బట్టిరి. ఇవ్విధంబున సదస్యదేవర్త్విక్సికాయంబుల శిలల ఱువ్వియు, జానువులఁ బొడిచియు, నఱచేతుల నడిచియు, కూర్పరంబులఁ బొడిచియు, వివిధబాధలం బఱచిన వారు కాందిశీకులై యెక్కడెక్క డేనియుం జనిరి. మఱియును- 118

* అని ఈ విధంగా భయంతో వెర్రి చూపులు చూస్తూ పలికారు. అప్పుడు దక్షునికి భయం కలిగిస్తూ వేలకొలది అపశకునాలు భూమిపైనా ఆకాశంపైనా కన్పించాయి. గోరోజనంవంటి వర్ణంకలవారూ, పసుపు పచ్చని వర్ణం కలవారూ, పొట్టివారూ, మొసలిపొట్టవంటి ముఖాలు కలవారూ అయిన ప్రమథగణాలు పెక్కురకాలైన ఆయుధాలు ధరించి యజ్ఞశాలలోకి పరుగులు పెట్టారు. దక్షుని యజ్ఞ ప్రదేశాలను చెల్లాచెదరు చేశారు. కొందరు ప్రాగ్వంశమునూ, కొందరు పత్నీశాలనూ, కొందరు సదస్యశాలనూ, కొందరు ఆగ్నీధ్రశాలనూ, కొందరు యజమానశాలనూ, కొందరు పాకశాలనూ భగ్నం చేశారు. మరికొందరు యజ్ఞపాత్రలనూ అగ్నులనూ ధ్వంసం చేశారు. ఇంకా కొందరు హోమాగ్నులను ఆర్పివేశారు. కొందరు హోమకుండాలను అల్లకల్లోలం చేసి అపవిత్రం చేశారు. కొందరు ఉత్తరవేదికా మేఖలలను త్రెంచివేశారు. కొందరు మునులను బాధించారు. కొందరు ముని భార్యలను భయపెట్టారు. కొందురు దేవతలను కాలు కదలనీయకుండా అడ్డుకున్నారు. అటు తర్వాత మణిమంతుడు భృగువునూ, వీరభద్రుడు దక్షుణ్ణి, చండీశ్వరుడు పూషుణ్ణీ, నందీశ్వరుడు భగుణ్ణీ పట్టుకున్నారు. ఈ విధంగా సదస్యులనూ, దేవతలనూ, ఋత్విక్కులనూ రాళ్లతో రువ్వి, మోకాళ్లతో క్రుమ్మి, అరచేతులతో చరిచి, మోచేతులతో పొడిచి పెక్కు బాధలు పెట్టగా వారు భయపడి దిక్కు తెలియక ఎక్క డెక్కడికో పారిపోయారు.

క. మును దక్షుఁ డభవుఁ బలుకఁగఁ, గను గీఁటిన భగునిఁ బట్టి కన్నులు పెకలిం
చెను నందీశ్వరుఁ డచ్చటి, జనముల హాహారవంబు సందడి గొలుపన్. 119

* పూర్వం దక్షుడు శివుణ్ణి నిండు సభలో నిందించేటప్పుడు కన్ను గీటిన భగుణ్ణి పట్టుకొని నందీశ్వరుడు కన్నులు పీకివేశాడు. అప్పుడు అక్కడి జనం అయ్యో! అయ్యో! అని గగ్గోలు పెట్టారు.

తే. కుపితుఁడై నాఁడు భవుని దక్షుఁడు శపింపఁ, బరిహసించిన పూషుని పండ్లు డుల్లఁ
గొట్టె బలభద్రుఁ డాకళింగుని రదంబు, లెలమి డులిచిన పగిదిఁ జండీశ్వరుండు. 120

* పూర్వం దక్షుడు కోపంతో శివుణ్ణి శపించినప్పుడు పకపక నవ్విన పూషుని పండ్లు, కళింగుని పండ్లు బలరాముడు రాలగొట్టినట్లు చండీశ్వరుడు రాలగొట్టాడు.

క. తగవేది దక్షుఁ డా సభ, నగచాపుఁ దిరస్కరించునాఁ డట శ్మశ్రుల్
నగుచుం జూపుట నా భృగు, పగనై శ్మశ్రువులు వీరభద్రుఁడు వెఱికిన్. 121

* దక్షుడు అన్యాయంగా ఆనాడు సభలో శివుని అవమానించి నప్పుడు నవ్వుతూ మీసమూ గడ్డమూ దువ్విన భృగుణ్ణి పట్టుకొని వాని మీసమూ గడ్డమూ వీరభద్రుడు పెరికివేశాడు.

సీ. అతుల దర్పోద్ధతుండై వీరభద్రుండు గైకొని దక్షువక్షంబుఁ ద్రొక్కి
ఘనశితధారాసిఁ గొని మేను వొడిచియు మంత్రసమన్విత మహిత శస్త్ర
జాలావినిర్భిన్న చర్మంబు గల దక్షుఁ జంపఁగా లేక విస్మయము నొంది
తద్వధోపాయంబు దన చిత్తమునఁ జూచి కంఠనిష్పీడనగతిఁ దలంచి

క. మస్తకము ద్రుంచి యంచితామర్షణమున, దక్షిణానలమున వేల్చెఁ దదనుచరులు
హర్షమును బొంద, నచటి బ్రాహ్మణజనంబు, లాత్మలను జాల దుఃఖంబు లందుచుండ. 122

* వీరభద్రుడు సాటిలేని దర్పంతో విజృంభించిన వాడై దక్షుణ్ణి క్రింద పడవేసి రొమ్ముమీద ఎక్కి త్రొక్కిపట్టి వాడి అంచు కలిగిన కత్తితో ఒడలంతా తూట్లు పొడిచాడు. కాని మంత్ర పూతాలయిన అనేక శస్త్రాస్త్రాలతో గట్టిపడిన చర్మం గల అతణ్ణి హతమార్చలేక ఆశ్చర్యపడ్డాడు. చివరకు అతణ్ణి చంపే ఉపాయాన్ని మనస్సులో ఆలోచించి మెడ నులిమి శిరస్సు తునిమి మహాకోపంతో భగభగ మండే దక్షిణాగ్ని కుండంలో పడవేసి భస్మం చేశాడు. ఆ వీర విజృంభణానికి వీరభద్రుని అనుచరులు ఆనందించారు. అక్కడి బ్రాహ్మణులు మనస్సులో చాలా బాధ పడ్డారు.

వ. ఇట్లు వీరభద్రుండు దక్షునియాగంబు విధ్వంసంబు గావించి నిజవాసంబైన కైలాసంబునకుఁ జనియె న య్యవసరంబున. 123

* ఈ విధంగా వీరభద్రుడు దక్షుని యజ్ఞాన్ని ధ్వంసంచేసి తన నివాసమైన కైలాసానికి వెళ్లిపోయాడు.

### -: దేవతలు వీరభద్రాదులచేఁ బరాజితులై బ్రహ్మతో విన్నవించుట. :-

చ. హరభటకోటిచేత నిశి తాసి గదా కరవాల శూల ము
ద్గర ముసలాది సాధన విదారిత జర్జరితాఖిలాంగులై
సురలు భయాకులాత్ము లగుచున్ సరసీరుహజాతుఁ జేరి త
చ్చరణ సరోరుహంబులకు సమ్మతిఁ జాఁగిలి మ్రొక్కి నమ్రులై. 124

* శివభటుల చేతులలోని వాడి కత్తులు, గదలు, శూలాలు, ఇనుప గుదియలు, రోకళ్లు మున్నగు ఆయుధాల దెబ్బలకు అవయవాలన్నీ నులినులి కాగా, దేవతలు భయంతో గుండె చెదరి బ్రహ్మదేవుణ్ణి సమీపించి ఆయన పాదపద్మాలపైబడి సాష్టాంగ నమస్కారాలు చేశారు.

క. తము ధూర్జటి సైనికు లగు, ప్రమథులు దయమాలి పెలుచ బాధించుట స
ర్వముఁ జెప్పి రనుచు మైత్రే, య మునీంద్రుండు విదురుతోడ ననియెన్; మఱియున్. 125

* ఈ విధంగా చతురాస్యుని శరణుజొచ్చిన దేవతలు తమను శివుని సైనికులైన ప్రమథులు నిర్దాక్షిణ్యంగా నిరోధించి బాధించి వేధించిన విషయమంతా ఆయనకు విన్న వించుకున్నారు అని మైత్రేయ మహర్షి విదురునితో చెప్పి మళ్లీ ఇలా అన్నాడు.

తే. ఇంతయును మున్ను మనమున నెఱిఁగి యున్న, కతన విశ్వాత్మకుండును గమలలోచ
నుండు నన నొప్పు నారాయణుండు నజుఁడుఁ, జూడ రారైరి తాము దక్షుని మఖంబు. 126

* ఇదంతా ముందే మనస్సులో తెలుసుకొని ఉండటం చేత విశ్వస్వరూపుడు అయిన నారాయణుడు, బ్రహ్మదేవుడూ దక్షుని యజ్ఞాన్ని చూడటానికి రాలేదు.

వ. అని చెప్పి సుర లిట్లు విన్న వించినఁ జతుర్ముఖుండు వారల కిట్లనియె. 127

క. ఘన తేజోనిధి పురుషుం, డనయంబుఁ గృతాపరాధుఁ డయినను దా మ
ల్లన ప్రతికారముఁ గావిం, చిన జనులకు లోకమందు సేమము గలదే? 128

* దేవతలు ఈ విధంగా చెప్పగా బ్రహ్మ దేవతలతో ఇలా అన్నాడు. మహాతేజస్సంపన్నుడైనవాడు ఒక వేళ పొరపాటు పని చేసినప్పుడు అతనికి తిరిగి అపకారం చేసేవాడు ఈ లోకంలో క్షేమంగా బతకలేడు.

వ. అని మఱియు నిట్లనియె. 129

క. క్రతుభాగార్హుం డగు పశు, పతి నీశ్వరు నభవు శర్వు భర్గుని దూరీ
కృత యజ్ఞభాగుఁ జేసిన, యతి దోషులు దుష్టమతులు నగు మీరింకన్. 130

* యజ్ఞంలో హవిర్భాగం అందుకోటానికి అన్ని విధాలా యోగ్యుడైన పశుపతి, పరాత్పరుణ్ణి, పరమేశ్వరుణ్ణి యజ్ఞ భాగానికి దూరం చేసిన దుష్టులు, దుర్మార్గులు, ధూర్తులు మీరు.

సీ. పూని యే దేవుని బొమముడి మాత్రాన లోకపాలకులును లోకములును
నాశ మొందుదుదు; రట్టి యీశుండు ఘన దురుక్త్యస్త్ర నికాయ విద్ధాంతరంగుఁ
డును బ్రియా విరహితుండును నైనవాఁ డమ్మహాత్మునిఁ ద్రిపుర సంహారకరుని
మఖపునస్సంధానమతి నపేక్షించు మీరలు సేరి శుద్ధాంతరంగు లగుచు

తే. భక్తి నిష్ఠలఁ దత్పాద పద్మ యుగళ, ఘన పరిగ్రహ పూర్వంబు గాఁగ నతని
శరణ మొందుఁ డతండు ప్రసన్నుఁ డయినఁ దివిరి మీ కోర్కి సిద్ధించు దివిజులార! 131

* దేవాదిదేవుడైన ఆ మహాదేవుడు ఒక్క మాటు కోపంతో కనుబొమలు ముడివేస్తే చాలు, లోకపాలకులూ నశిస్తారు; లోకాలూ నశిస్తాయి. ఆ మహనీయుని మనస్సు దక్షుని దురుక్తులు అనే బాణాలు గ్రుచ్చుకొని ఇదివరకే నొచ్చింది. ఇప్పుడు ఆ మహాత్మునికి పత్నివియోగం కూడా ప్రాప్తించింది. తిరిగి యజ్ఞాన్ని సక్రమంగా పూర్తి చేయాలనే కోర్కె మీకు ఉన్నట్లయితే త్రిపుర సంహారుడైన ఆ హరుని,

ఆ మహాదేవుని, ఆ మహానుభావుని నిండుహృదయంతో, నిర్మల భక్తితో ఆశ్రయించండి. ఆయన పాదపద్మాల పైబడి శరణు వేడండి. ఆ దయామయుడు దయదలిస్తే మీ కోర్కె నెరవేరుతుంది.

**వ. అని మఱియు నిట్లనియె; న ద్దేవుని డాయం జన వెఱతు మని తలంపకుం; డతనిఁ జేరు నుపాయం బెఱింగింపు మంటిరేని నేను నింద్రుండును మునులును మీరలును మఱియు దేహధారు లెవ్వరేని న మ్మహాత్ముని రూపంబు నతని బలపరాక్రమంబుల కొలఁదియు నెఱుంగం జాల; మతండు స్వతంత్రుండు గావునఁ దదుపాయం బెఱింగింప నెవ్వఁడు సమర్థుండగు? నయిన నిపుడు భక్తపరాధీనుండును శరణాగత రక్షకుండును నగు నీశునిఁ జేరంబోవుద మని పలికి పద్మసంభవుండు దేవ పితృగణ ప్రజాపతులం గూడి కైలాసాభిముఖుండై చని చని. 132**

* మేము ఆయనను సమీపించటానికి భయపడుతున్నాము- అని భావించకండి. ఆయన దగ్గరకు పోయే ఉపాయము నన్ను చెప్పమంటారా! చెబుతాను వినండి. నేనూ, దేవేంద్రుడూ, మునులూ, మీరు, దేహధారులూ ఎవరుకూడా ఆ మహాత్ముని స్వరూపాన్నీ, ఆయన బలపరాక్రమాల పరిమాణాన్నీ తెలుసుకోలేము. ఆయన సర్వస్వతంత్రుడు. కాబట్టి ఆయనను సమీపించే ఉపాయం చెప్పటానికి ఎవ్వరూ సమర్థులు కారు. అయిన ఆయన భక్తులకు అధీనుడు. శరణు జొచ్చిన వారిని రక్షించేవాడు. అందుచేత ఆయన వద్దకు మనము అందరమూ కలిసి వెళ్లటం మంచిది అని చెప్పి బ్రహ్మ దేవుడు దేవతలనూ, పితృదేవతలనూ, ప్రజాపతులనూ వెంటబెట్టుకొని బయలుదేరాడు.

**ఉ. భాసురలీలఁ గాంచిరి సుపర్వులు భక్తజనైక మానసో<br>ల్లాసముఁ గిన్నరీజన విలాసము నిత్యవిభూత మంగళా<br>వాసము సిద్ధ గుహ్యక నివాసము రాజత భూవికాసి కై<br>లాసముఁ గాంతి నిర్జిత కులక్షితిభృత్సుమహద్విభాసమున్. 133**

* అలా వెళ్లినవారై భక్తుల మనస్సుకు అపరిమితమైన ఆనందం కల్గించేది, కిన్నరాంగనలు విలాసంగా విహరించేదీ, శాశ్వతాలయిన ఐశ్వర్యాలకూ శుభాలకూ స్థానమైనదీ, సిద్ధులూ యక్షులూ నివసించేదీ, వెండి వెలుగులతో నిండినదీ, తన అనంతకాంతులతో కుల పర్వతాల శోభావైభవాన్ని పరాభూతం చేసేదీ అయిన కైలాస శైలాన్ని బ్రహ్మాది దేవతలు కనులపండువుగా దర్శించారు.

**సీ. ధాతు విచిత్రితోదాత్త రత్న ప్రభా సంగతోజ్జ్వల తుంగ శృంగములను<br>గిన్నర గంధర్వ కింపురుషాప్సరో జన నికరాకీర్ణ సానువులును<br>మానిత నిఖిల వైమానిక మిథున స ద్విహరణైక శుభ ప్రదేశములును<br>గమనీయ నవమల్లికా సుమనోవల్లికా మతల్లీ లసత్కందరములు**

**తే. నమర సిద్ధాంగనా శోభితాశ్రమములు, విబుధజన యోగ్య సంపన్నివేశములును<br>గలిగి బహువిధ పుణ్యభోగముల నొప్పు వినుత సుకృతములకు దండ వెండికొండ. 134**

* ధాతు ద్రవాలతో పలురంగులు కలిగిన రత్నాల కాంతులతో ఆ వెండి కొండ ఎత్తైన శిఖరాలు ప్రకాశిస్తున్నాయి. ఆ కొండచరియలు కిన్నరులు, గంధర్వులు, కింపురుషులు, అప్సరసలు మున్నగువారితో నిండి ఉన్నాయి. దేవతలు భార్యలతో కూడి విమానాలపై ఆ యా ప్రదేశాలలో విహరిస్తున్నారు. గుహలచుట్టూ చిక్కని విరజాజి పూలతీగలు అల్లుకొని ఉన్నాయి. అక్కడి ఆశ్రమాలలో దేవతాస్త్రీలు సిద్ధస్త్రీలూ ఉంటున్నారు. దేవతలు సంచరించటానికి అక్కడి చోట్లన్నీ తగి ఉన్నాయి. చేసిన పుణ్యాలను పెక్కురకాల భోగాలను అక్కడ అనుభవిస్తున్నారు. ఆ వెండి కొండ "పుణ్యాల పూలదండగా" ఉన్నది.

వ. అది మఱియును మందార పారిజాత సరల తమాల సాల తాల తక్కోల కోవిదార శిరీ షార్జున చూత కదంబ నీప నాగ పున్నాగ చంపక పాటలాశోక వకుళ కుంద కురవక కన కామ్ర శతపత్ర కింశు కైలా లవంగ మాలతీ మధూక మల్లికా పనస మాధవీ కుటజోదుంబ రాశ్వత్థ ప్లక్ష వట హింగుళ భూర్జ పూగ రాజపూగ జంబూ ఖర్జూ రామ్రాత ప్రియాళు నారికేళేంగుద వేణు కీచక ముఖర తరుశోభితంబును, గలకంఠ కాలకంఠ కలవింక రాజకీర మత్తమధుకర నానా విహంగ కోలాహల నినదబధిరీభూత రోదోంతరాళంబును, సింహ తరక్షు శల్య గవయ శరభ శాఖామృగ వరాహ వ్యాఘ్ర కుర్కుర రురు మహిష వృక సారంగ ప్రముఖ వన్యసత్త్వ సమాశ్రయ విరాజితంబును, గదళీషండ మండిత కమల కహ్లార కైరవ కలిత పులినతల లలిత కమలాకర విహరమాణ కలహంస కారండవ సారస చక్రవాక బక జలకుక్కుటాది జలవిహంగకుల కూజిత సంకులంబును, సలిల కేళీవిహరమాణ సతీరమణీ రమణీయ కుచమండల విలిప్తమృగమద మిళిత హరిచందన గంధ సుగంధి జలపూరిత గంగా తరంగిణీ సమావృతంబును నైన కైలాస పర్వతంబు వొడగని యరవింద సంభవ పురందరాది దేవగణంబు లత్యద్భుతానందంబులం బొంది ముందటఁ దారహీర హేమమయ విమాన సంకులంబును; బుణ్యజన మానినీ శోభితంబును నైన యలకాపురంబుఁ గడచి తత్పుర బాహ్య ప్రదేశంబునం దీర్ఘపాదుండైన పుండరీకాక్షు పాదారవింద రజః పావనంబును, రతికేళీ వ్యాసంగ పరిశ్రమ నివారక సలిల కేళీవిలోల దేవ కామినీ పీనవక్షోజ విలిప్తకుంకుమ పంక సంగత పిశంగవర్ణ వారిపూర విలసితంబునునై, నందాలక నందాభిధానంబులు గల నదీద్వితయంబు దాఁటి తత్పురోభాగంబున వనగజ సంఘృష్ట మలయజ పరిమిళిత మలయపవ నాస్వాదన ముహుర్ముహు రున్మదిత మానస పుణ్యజనకామినీ కదంబంబును, వైదూర్యసోపాన సమంచిత కనకోత్పల వాపీ విభాసితంబును, గింపురుష సంచార యోగ్యంబును నగు సౌగంధిక వన సమీపంబు నందు. 135

* ఆ వెండికొండ మందారాలు, పారిజాతాలు, తెల్లతెగడలు, కానుగు, మద్ది, తాడి ,తక్కోల, ఎఱ్ఱకాంచనం, దిరిసెనం, ఏరుమద్ది, తియ్యమామిడి, కడిమి, మంకెన, నాగకేసరం, సురపొన్న, సంపెంగ, పాటలం, అశోకం, పొగడ, మొల్ల, గోరింట, మామిడి, తామర, మోదుగ, ఏలకి, లవంగం, జాజి, ఇప్ప, మల్లె, పనస, పూవుల గురివెంద, కొండ మల్లె, మేడి, రావి, జువ్వి, మఱ్ఱి, ఎర్రగన్నేరు, బుజపత్తిరి, పోక, రాజపూగం, నేరేడు, ఖర్జూరం, ఆమ్రాతకం, మోరటి, కొబ్బరి, గారవెదురు, బొంగు వెదురు మున్నగు పెక్కురకాల చెట్లతో చెలువొందుతున్నది.

కోయిలలు, నెమళ్లు, పిచ్చుకలు, రాచిలుకలు, గండుతుమ్మెదలు మున్నగు పలురకాల పక్షుల కలకల ధ్వనులతో భూమ్యాకాశాల మధ్యప్రదేశం ప్రతిధ్వనిస్తున్నది. సింహాలు, సివంగులు, వనవరాహాలు, గురుపోతులు, శరభమృగాలు, కోతులు, వరాహాలు, పెద్ద పులులు, కుక్కలు, నల్లచారల దుప్పులు, ఎనుబోతులు, తోడేళ్లు, తేళ్లు మొదలైన అడవి జంతువులు అక్కడ విహరిస్తున్నాయి.

అరటి చెట్లతోనూ, తామరపూలతోనూ, ఎఱ్ఱకలువలతోనూ, తెల్లకలువలతోనూ నిండి ఇసుక ప్రదేశాలలో విరాజిల్లే సరోవరాలలో రాయంచలూ, కన్నె లేళ్లు, బెగ్గురులూ, జక్కవలూ, కొంగలూ, నీటి కోళ్లు మొదలైన నీటి పక్షులు ఇంపుగా కూస్తూ గుంపులు గుంపులుగా విహరిస్తున్నాయి.

కైలాస పర్వతం చుట్టూ గంగానది ప్రవహిస్తున్నది. ఆ గంగానదిలో యువతులు జలక్రీడలాడు తున్నారు. వారు అందమైన చనుదోయికి అలదుకొన్న కస్తూరి కలిసిన మంచి గంధపు తావితో గంగానది లోని నీరు సువాసనలు వెదజల్లు తున్నది. అటువంటి గంగానదిని చూచి బ్రహ్మ, ఇంద్రుడు మున్నగు దేవతలు గొప్ప ఆశ్చర్యమునూ, ఆనందమునూ పొందారు. దేవతలకు ఎదుట అలకాపురం కనిపించింది. ఆ పురం ముత్యాలూ, వజ్రాలు పొదిగిన బంగారంతో నిర్మించబడిన విమానాలతో వెలుగులు చిమ్ముతూ ఉన్నది.

వారు అలకానగరం దాటి, ఆ నగరం వెలుపల "నంద", "అలకనంద" అను పేర్లుగల రెండు నదులను చూశారు. ఆ నదులు పూజ్యపాదు డయిన శ్రీమన్నారాయణుని పాదపద్మాల ధూళితో పవిత్ర మయ్యాయి. రతికేళిచేత కలిగిన శ్రమను తొలగించుకోటానికి దేవతా స్త్రీలు ఆ నదీ జలాలలో స్నానం చేస్తున్నారు. వారు వలుద చన్నులపై అలదుకున్న కుంకుమ ద్రవముతోకూడి ఆ నదులలోని నీళ్లు గోరోజనపు రంగుకు తిరిగాయి.

ఆ రెండు నదులును అతిక్రమించి వారు తమ ముందు సౌగంధికవనాన్ని చూశారు.ఆ సౌగంధిక వనంలో అడవి ఏనుగులు రాచుకొనుటవల్ల మంచి గంధపు చెట్లనుండి వెలువడే సువాసనతో కలిసిన గాలి వీస్తున్నది. ఆ గాలిని మాటి మాటికి అనుభవిస్తూ అక్కడి యక్షకన్యలు సంతోషిస్తున్నారు. ఆ సౌగంధిక వనంలో బంగారు కలువలు వికసించిన దిగుడు బావులు ఉన్నాయి. వాటి మెట్లు పచ్చలతో నిర్మింపబడ్డాయి. ఆ వనంలో కింపురుషులు సంచరిస్తున్నారు.

### -: బ్రహ్మాదులు దక్షిణామూర్తి రూపుం డగు నీశ్వరుని స్తుతించుట :-

సీ. ఉజ్జ్వలంబయి శతయోజనంబుల పొడ వొగిఁ బంచసప్తతి యోజనముల
పఱపును గల్గి యేపట్టునఁ దఱుఁగని నీడ శోభిల్ల నిర్ణీత మగుచుఁ
బర్ణ శాఖాసమాకీర్ణమై మాణిక్యములఁ బోలఁగల ఫలములఁ దనర్చి
కమనీయ సిద్ధయోగ క్రియామయ మయి యనఘ ముముక్షు జనాశ్రయంబు

తే. భూరిసంసార తాప నివారకంబు, నగుచుఁ దరురాజ మనఁగఁ బెం పగ్గలించి
భక్తజనులకు నిచ్చలుఁ బ్రమద మెసఁగ, వలయు సంపద లందు నావటము వటము. 136

వ. ఆ వృక్షమూల తలంబున. 137

* ఆ సౌగంధిక వనానికి సమీపంలో దేవతలు ఒక మర్రిచెట్టును చూచారు. ఆ చెట్టు పొడవు వందయోజనాలు. విరివి డెబ్బదియైదు యోజనాలు. ఆ చెట్టు నీడ సందులేకుండా అంతటా నిండి ఉన్నది. ఆ చెట్టు ఆకులతో, కొమ్మలతో అలరారుతూ మాణిక్యాలకు సాటివచ్చే పండ్లతో నిండి ఉన్నది. అది సిద్ధ యోగ క్రియలకు ఆలవాలమై దోషరహితమై మోక్షం కోరేవారికి ఆశ్రయమై అలరారుతున్నది. అది సంసార తాపాన్ని తొలగిస్తుంది. ఆ మేటిమ్రాను భక్తులకు ఆనందం కలిగించే ఐశ్వర్యాలకు పుట్టినిల్లు. బ్రహ్మాది దేవతలు ఆ మర్రిచెట్టు క్రింద మహేశ్వరుణ్ణి దర్శించారు.

సీ. ఇద్ధ సనందాది సిద్ధ సంసేవితు శాంతివిగ్రహుని వాత్సల్యగుణునిఁ
గమనీయ లోక మంగళదాయకుని శివు విశ్వబంధుని జగద్వినుత యశుని
గుహ్యక సాధ్య రక్షో యక్ష నాథ కుబేర సేవితుని దుర్వారబలుని
నుదిత విద్యా తపోయోగ యుక్తుని బాల చంద్రభూషణుని మునీంద్రనుతునిఁ

తే. దాపసాభీష్టకరు భస్మదండలింగ, ఘనజటాజినధరుని భక్తప్రసన్ను
వితత సంధ్యాభ్రరుచి విడంబిత వినూత్న, రక్తవర్ణు సనాతను బ్రహ్మమయుని. 138

* ప్రసిద్ధులైన సనందుడు మొదలైన సిద్ధులు ఆ శివుని సేవిస్తున్నారు. ఆ శివుడు శాంతమూర్తి, వాత్సల్యగుణం కలవాడు. లోకాలకు శుభం కలిగించేవాడు. విశ్వానికి చుట్టము. జగత్తు పొగడే కీర్తికలవాడు. గుహ్యకులు, సాధ్యులు, రాక్షసులు, యక్షరాజైన కుబేరుడు మున్నగు వారిచేత సేవింపబడేవాడు. ఎదురులేని శక్తి సామర్థ్యాలు కలవాడు. విద్యతో తపస్సుతో యోగంతో కూడినవాడు. జటాజూటంలో చంద్రరేఖను అలంకరించుకొన్నవాడు. మునీంద్రులు స్తుతించేవాడు. తపోధనుల కోర్కెలను తీర్చేవాడు. విభూతినీ, దండమునూ, జడలనూ, గజచర్మమునూ ధరించినవాడు. భక్తులను అనుగ్రహించేవాడు. సంధ్యాకాలంలోని మేఘకాంతిని పోలిన నవనవారుణ ప్రభలతో వెలిగేవాడు. శాశ్వతుడు. బ్రహ్మస్వరూపుడు.

వ. మఱియును. 139

సీ. అంచిత వామపాదాంభోరుహము దక్షిణోరుతలంబున నొయ్య నునిచి
సవ్యజానువుమీఁద సవ్యబాహువు సాఁచి వలపలి ముంజేత సలలితాక్ష
మాలిక ధరియించి మహనీయ తర్క ముద్రాయుక్తుఁ డగుచుఁ జిత్తంబులోన
నవ్యయం బయిన బ్రహ్మానంద కలిత సమాధి నిష్ఠుఁడు వీత మత్సరుండు

తే. యోగపట్టాభిరాముఁడై యుచిత వృత్తి, రోషసంగతిఁబాసి కూర్చున్న జముని
యనువునను దర్భరచిత బ్రుస్యాసనమున, నున్న మునిముఖ్యు నంచిత యోగనిరతు, 140

క. అలఘుని నభవుని యోగీం, ద్రులు వినుచుండంగ నారదునితోఁ బ్రియ భా
షలు జరుపుచున్న రుద్రుని, సలలిత పన్నగ విభూషు సజ్జనపోషున్. 141

* ఇంకా ఆ మహేశ్వరుడు కుడితొడపై ఎడమకాలు మోపి, ఎడమ మోకాలిపై ఎడమచేయి చాచి కూర్చున్నాడు. కుడి ముంజేతిలో జపమాల ధరించాడు. మహనీయమైన ధ్యానముద్ర ధరించి బ్రహ్మానందంతో నిండిన మనస్సు కలవాడై సమాధి నిష్ఠలో ఉన్నాడు. అనురాగమూర్తి. యోగ పట్టంతో ఒప్పుతున్నాడు. కోపం విడిచిపెట్టి కూర్చున్న యమునివలె దర్భాసనంమీద కూర్చున్నాడు. యోగనిమగ్నుడై ఉన్నాడు. ఆద్యుడు, అభవుడు, అహిభూషణుడు, ఆర్తజన పోషణుడు- ఇటువంటి కరుణా సముద్రుని రుద్రుని దేవత లంతా చూచారు. అప్పుడు శివుడు యోగీంద్రులు వింటుండగా నారదునితో తియ్యనిమాటలు మాటాడు తున్నాడు.

**క. కని లోకపాలురును ముని, జనులును సద్భక్తి నతని చరణంబులకున్**
**వినతు లయి, రప్పు డబ్జా సనుఁ, గని యయ్యభవుఁ డధిక సంభ్రమ మొప్పన్. 142**

**క. అనఘ! మహాత్ముం డగు వా, మనుఁ డా కశ్యపున కొగి నమస్కారము సే**
**సిన గతి నజునకు నభివం, దన మొగిఁ గావించె హరుఁడు దద్దయుఁ బ్రీతిన్. 143**

* లోకపాలకులూ, మునులూ పరమ భక్తితో శివుని పాదాలకు నమస్కరించారు. అప్పుడు శివుడు మహాత్ముడైన వామనుడు కశ్యప మహర్షికి నమస్కరించినట్లు మిక్కిలి ప్రీతితో ధాతకు ప్రణామం చేశాడు.

**తే. అంత రుద్రానువర్తులైనట్టి సిద్ధ, గణ మహర్షి జనంబులు గని పయోజ**
**గర్భునకు మ్రొక్కి, రంతన కమలభవుఁడు, శర్వుఁ గని పల్కె మందహాసంబుతోడ. 144**

* అప్పుడు రుద్రుని అనుచరులైన సిద్ధగుణాలూ, మహర్షులూ బ్రహ్మకు మ్రొక్కారు. అనంతరం శివుని చూచి విరించి చిరునవ్వుతో ఇలా అన్నాడు.

**తే. జగములకు నెల్ల యోనిబీజంబులైన, శక్తి శివకారణుండవై జగతి నిర్వి**
**కార బ్రహ్మంబ వగు నిన్నుఁ గడఁగి "విశ్వ, నాథుఁ" గా నెఱిఁగెద నామనమున నభవ! 145**

* ఓ మహేశ్వరా! లోకాల కన్నింటికీ ఉత్పత్తి స్థానం అయిన శక్తివి నీవే. జగత్తుల కన్నింటికీ బీజమైన శివుడు నీవే. నీవు నిర్వికార పరబ్రహ్మవు. నిన్ను విశ్వనాథునిగా నా మనస్సులో తెలుసుకున్నాను.

**తే. సమత నది గాక తావకాంశంబులైన, శక్తిశివ రూపములఁ గ్రీడసలుపు దూర్ణ**
**నాభి గతి విశ్వ జనన వినాశ వృద్ధి, హేతుభూతుండ వగుచుందు వీశ! రుద్ర! 146**

ఓ రుద్రా! ఈశ్వరా! నీవు నీ సమాంశములైన శివ శక్తి స్వరూపాలతో క్రీడిస్తావు. సాలెపురుగువలె విశ్వసృష్టికీ, వృద్ధికీ వినాశానికీ నీవే హేతువు అవుతుంటావు.

**సీ. అనఘ! లోకంబులయందు వర్ణాశ్రమ సేతువు లనఁగఁ బ్రఖ్యాతి నొంది**
**బలిసి మహాజన పరిగృహీతంబులై యఖిల ధర్మార్థదాయకములైన**

**వేదంబులును మఱి వృద్ధి నొందించుట కొఱకునై నీవు దక్షుని నిమిత్త**
**మాత్రునిఁ జేసి య మ్మఖముఁ గావించితి; వటుగాన శుభమూర్తివైన నీవు**

**తే. గడఁగి జనముల మంగళకర్ము లయిన, వారి ముక్తి, నమంగళాచారు లయిన**
**వారి నరకంబు, నొందింతు భూరిమహిమ, భక్తజనపోష! రాజిత ఫణి విభూష! 147**

* ఓ భక్తజన పోషణా! పన్నగరాజి భూషణా! లోకాలలో వర్ణాశ్రమాచారాలను, వేదాలు నిర్ణయిస్తాయి. గొప్పవారు వేదాలను గౌరవిస్తారు. వేదాలు సర్వధర్మార్థాలనూ ప్రసాదిస్తాయి. ఆ వేదాలను వృద్ధి చేయటం కోసం నీవు దక్షుణ్ణి నిమిత్తమాత్రుణ్ణిగా చేసి ఆ యజ్ఞం చేయించావు. నీవు మంగళ స్వరూపుడవు. నీవు నీ మహిమచేత శుభకర్మలు చేసేవారికి ముక్తినీ, అశుభకర్మలు చేసేవారికి నరకాన్నీ కలిగిస్తావు.

**వ. అట్లగుటం దత్కర్మంబు లొకానొకనికి విపర్యాసంబ నొందుటకుఁ గారణం బెయ్యదియో? భవదీయ రోషంబు హేతువని తలంచితినేనిఁ ద్వదీయపాదారవింద నిహిత చిత్తులై సమస్త భూతంబులయందు నిమం గనుంగొనుచు భూతంబుల నాత్మయందు వేఱుగాఁ జూడక వర్తించు మహాత్ములయందు నజ్ఞులైన వారి యందుంబోలె రోషంబు దఱుచు వొరయ దఁట! నీకుఁ గ్రోధంబు గలదే? యని.148**

* అయినప్పుడు ఒకరి విషయంలో ఆ కర్మలు తల్లక్రిందులుగా కావటానికి నీ కోపం కారణం అని అనుకుందామా! నీ పాదపద్మాలపై మనస్సు నిల్పి సమస్త ప్రాణులలోనూ నిన్ను చూస్తూ ఇతర ప్రాణులను తనకంటే వేరుగా ఉండకుండా మహాత్ములు ప్రవర్తిస్తారు. అటువంటి మహాత్ములకు మూర్ఖులకు కలిగినట్లు కోపం కలుగదు గదా! మహానుభావుడవైన నీకు కోపం ఎక్కడిది?

**సీ. మఱి భేదబుద్ధిఁ గర్మప్రవర్తనముల మదయుతు లయి దుష్టహృదయు లగుచుఁ**
**బరవిభవాసహ్య భవ మనో వ్యాధులఁ దగిలి మర్మాత్మ భేదకము లయిన**
**బహు దురుక్తుల చేతఁ బరుల బీడించుచు నుండు మూఢులను దైవోపహతులుఁ**
**గాఁ దలపోసి య క్కపట చిత్తులకు నీ వంటి సత్పురుషుఁ డేవలననైన**

**తే. హింసఁ గావింపకుండు సమిద్ధచరిత!, నీలలోహిత! మహితగుణాలవాల!**
**లోకపాలన! కలిత గంగాకలాప!, హర! జగన్నుతచారిత్ర! యదియుఁ గాక. 149**

* ఓ భవ్యచరితా! పావనగుణ భరితా! నీలలోహితా! మూర్ఖులు మదించి, దుష్ట చిత్తులై భేదబుద్ధితో ప్రవర్తిస్తారు. పరుల సంపదను చూచి ఓర్వలేరు. మనోవ్యాధితో క్రుంగిపోతారు. మర్మ స్థానాలను భేదించే పరుష వాక్కులతో ఇతరులను బాధిస్తారు. నీవు వారిని దైవానుగ్రహానికి దూరమైన వారినిగా భావిస్తావు. ఓ హరా! గంగాధరా! సకలలోక పరిపాలా! జగన్నుతలీలా! ఆ కపటాత్ములకు నీవంటి సత్పురుషుడు ఏ విధంగానూ హింస కావించడు.

**సీ. అమర సమస్తదేశములందు నఖిల కాలములందుఁ దలఁప దుర్లంఘ్య మహిముఁ**
**డగు పద్మనాభు మాయా మోహితాత్మకు లై భేదదర్శనులైన వారి**

వలనను ద్రోహంబు గలిగిన నైనను నది దైవకృత మని యన్యదుఃఖ
ముల కోర్వలేక సత్పురుషుండు దయసేయు గాని హింసింపఁడు గాన నీవు

తే. నచ్యుతుని మాయ మోహము నందకుంటఁ, జేసి సర్వజ్ఞుఁడవు; మాయచేత మోహి
తాత్ములై కర్మవర్తను లయినవారి, వలన ద్రోహంబు గలిగిన వలయుఁ బ్రోవ. 150

* సమస్త దేశాలలోనూ, సర్వకాలాలలోనూ హరిమహిమ అనుల్లంఘ్యమైనది. విష్ణుమాయకు చిక్కినవారు భేద దృష్టితో ప్రవర్తిసారు. వారు ద్రోహం చేసినట్లయితే సత్పురుషుడు అది దైవకృతంగా భావిస్తాడు. ఆ మహితాత్ముడు ఇతరుల దుఃఖం చూచి ఓర్చుకోలేడు. వారిమీద జాలిపడతాడు. అంతేకాని వారిని హింసింపడు. నీవు విష్ణుమాయకు అతీతుడవు. అందుచేత నీవు సర్వజ్ఞుడవు. విష్ణుమాయకు వశులై కర్మలు ఆచరించేవారు అపరాధం చేసినట్లయితే నీవు క్షమించి వారిని కాపాడాలి.

వ. అది గావున యజ్ఞభాగార్హుండ వయిన నీకు సవనభాగంబు సమర్పింపని కతన నీచేత విధ్వస్తంబయి పరిసమాప్తి నొందని దక్షాధ్వరంబు మరల నుద్ధరించి దక్షునిఁ బునర్జీవితుం జేయుము; భగుని నేత్రంబులును, భృగుముని శ్మశ్రువులును, బూషుని దంతంబులును గృపసేయుము. భగ్నాంగు లయిన దేవఋత్విక్జన కాయంబులకు నారోగ్యంబు గావింపుము; ఈ మఖావశిష్టంబు యజ్ఞ పరిపూర్తి హేతుభూతం బయిన భవదీయభాగం బగుంగాక. 151

* యజ్ఞభాగానికి అర్హుడవైన నీకు యజ్ఞభాగం ఇవ్వకపోవటంచేత నీవు దక్షుని యజ్ఞాన్ని ధ్వంసం చేశావు. అది అసంపూర్ణంగా మధ్యలో ఆగిపోయింది. అటువంటి దక్షయజ్ఞాన్ని నీవు పునరుద్ధరించు. దక్షుని బ్రతికించు. భగునికి కన్నులు అనుగ్రహించు. భృగుమునికి మీసాలు గడ్డాలూ ప్రసాదించు. పూషునికి దంతాలను కనికరించు. అవయవాలు తుత్తునియలైన దేవతలకూ, ఋత్విక్కులకూ ఆరోగ్యం అనుగ్రహించు. మిగిలిన యజ్ఞకార్యం సమస్తమూ పూర్తిగావించి ఈ యాగాన్ని నీ భాగంగా స్వీకరించు.

### -: ఈశ్వరుండు బ్రహ్మాదులచేఁ బ్రార్థితుండై దక్షాదుల ననుగ్రహించుట. :-

చ. అని చతురాననుండు వినయంబున వేఁడిన నిందుమౌళి స
య్యనఁ బరితుష్టిఁ బొంది దరహాసమునన్ గృప దొంగలింప ని
ట్లను హరిమాయచేత ననయంబును బామరు లైనవారు సే
సిన యపరాధ దోషములు చిత్తములో గణియింప నెన్నఁడున్. 152

* అని బ్రహ్మదేవుడు వినయంతో ప్రార్థింపగా మహాదేవుడు వెంటనే సంతోషించి చిరునవ్వు నవ్వుతూ కనికరంతో ఇలా అన్నాడు. విష్ణుమాయకు వశులై పామరులు చేసిన దోషాలను నేను మనస్సులో ఎప్పుడూ లెక్కచేయను.

వ. అట్లయ్యును. 153

క. బలియుర దండించుట దు, ర్బలజన రక్షణము ధర్మపద్ధతి యగుటం
గలుషాత్ముల నపరాధము, కొలఁదిని దండించుచుందుఁ గొనకొని యేనున్. 154

* అయినా, బలవంతులను శిక్షించడమూ, దుర్బలులను రక్షించడమూ ధర్మమార్గం కదా! కాబట్టి నేను దుష్టులను వారు చేసిన దోషాలకు తగినట్లుగా శిక్షిస్తూ ఉంటాను.

వ. అని దగ్ధశీర్షుండయిన దక్షుం డజముఖుం డగు! భగుండు బర్హిస్సంబంధ భాగంబులు గలిగి మిత్ర నామధేయచక్షుస్సునం బొడగాంచుఁ; బూషుండు పిష్టభుక్కగుచు యజమాన దంతంబులచే భక్షించు; దేవతలు యజ్ఞావశిష్టంబు నా కొసంగుటంజేసి సర్వావయవ పూర్ణులై వర్తింతురు. ఖండితాంగులైన ఋత్విగాది జనంబు లశ్వినీదేవతల బాహువులచేతను బూషుని హస్తంబుల చేతను లబ్ధబాహుహస్తులై జీవింతురు; భృగువు బస్తశ్మశ్రువులు గలిగి వర్తించు నని శివుం డానతిచ్చిన సమస్త భూతంబులును సంతుష్టాంతరంగంబులై "తండ్రి! లెస్సయ్యె" యని సాధువాదంబుల నభినందించిరి. అంత నా శంభుని యామంత్రణంబు వడసి సునాసీర ప్రముఖులగు దేవతలు ఋషుల తోడంగూడి రా నజుండును రుద్రునిం బురస్కరించుకొని దక్షాధ్వరవాటంబునకుం జనియె నంత. 155

* శిరస్సు దహింపబడిన దక్షుడు గొర్రె ముఖం కలవాడు అవుతాడు. భగుడు దర్భలతో సంబంధించిన యజ్ఞ భాగాన్ని పొంది మిత్రనామకమైన నేత్రాలతో చూస్తాడు. పూషుడు పిండిపదార్థాలను యజమానుని దంతాలద్వారా తింటాడు. దేవత లందరూ యజ్ఞశేషాన్ని నాకు సమర్పించడంవల్ల మునుపటివలె అన్ని అవయవాలూ కలవారై సంచరిస్తారు. అవయవాలు ఖండింపబడిన ఋత్విక్కులు మున్నగువారు అశ్వినీ దేవతల బాహువులచేతనూ, పూషుని హస్తాలచేతనూ తమ తమ బాహువులనూ, హస్తాలనూ పొందినవారై బ్రతుకుతారు. భృగువు చింబోతు మీసాలు గడ్డమూ పొందుతాడు అని శివుడు ఆజ్ఞ ఇచ్చాడు.

అప్పుడు సమస్తప్రాణులూ సంతోషించి, "తండ్రీ! తండ్రీ! పరమేశ్వరా! బాగు! బాగు! అని మెచ్చుకున్నారు. అనంతరం శివుని దగ్గర సెలవు తీసుకొని దేవేంద్రుడు మొదలైన దేవతలు ఋషులతో కూడి బయలుదేరారు. బ్రహ్మదేవుడు మహాదేవుని ముందుంచుకొని యజ్ఞం జరిగిన ప్రదేశానికి వచ్చాడు.

క. శర్వుని యోగ క్రమమున, సర్వావయవములుఁ గలిగి సమ్మని ఋత్వి
గ్గీర్వాణముఖ్యు లొప్పిరి, పూర్వతను శ్రీల నార్యభూషణ! యంతన్. 156

* శివుని ఆజ్ఞానుసారంగా మునులూ, ఋత్విక్కులూ దేవతలు మొదలైన వారందరూ తమ తమ పూర్వ శరీర శోభలను పొంది చక్కగా ప్రకాశించారు.

క. విను దక్షు నంత మేషము, ఖునిఁ జేసిన నిద్ర మేలుకొని లేచిన పో
ల్కిన నిలిచె దక్షుఁ, డభవుఁడు, గనుఁగొనుచుండంగ నాత్మఁ గౌతుక మొప్పన్. 157

* అప్పుడు దక్షునికి గొఱ్ఱెతల సంప్రాప్తింపగా అతడు నిద్రనుండి మేల్కొని లేచినట్లు లేచాడు. అది చూచి శివుడు సంతోషించాడు.

వ. ఇట్లు లేచి నిలిచి ముందఱ నున్న శివునిం గనుంగొనిన మాత్రాన శరత్కాలంబున నకల్మషం బైన సరస్సునుంబోలెఁ బూర్వరుద్రవిద్వేష జనితంబులైన కల్మషంబులం బాసి నిర్మలుండై యభవుని నుతియింపం దొడంగి మృతిఁ బొందిన సతీతనయం దలంచి యనురాగోత్కంఠ బాష్పపూరిత లోచనుండును, గద్గదకంఠుండు నునై పలుకంజాలక యెట్టకేలకు దుఃఖంబు సంస్తంభించికొని ప్రేమాతిరేక విహ్వలుం డగుచు సర్వేశ్వరుండగు హరున కిట్లనియె. 158

* దక్షుడు ఎదుట ఉన్న ఫాలాక్షుని చూచినంతనే శరత్కాలంలో బురదలేని సరస్సువలె నిర్మలు డయ్యాడు. పూర్వం రుద్రుని ద్వేషించడం వల్ల కలిగిన దోషాలు తొలగి పోయాయి. పరమేశ్వరుణ్ణి ప్రస్తుతించాలని పూనుకున్నాడు. కాని చనిపోయిన కూతురు జ్ఞాపకం వచ్చింది. ప్రేమతో, తహతహపాటుతో అతని కన్నులు నీళ్లతో నిండి పోయాయి. డగ్గుత్తికతో మాటలాడలేకపోయాడు. చివరికి అతి కష్టం మీద దుఃఖాన్ని దిగమ్రింగుకొని ప్రేమాతిరేకంతో ఒడలు మరచి భగవంతుడైన పరమశివునితో ఇలా అన్నాడు.

క. వినుమ! నీ కపరాధుఁడ నగు, నను దండించు టది దండనము గాదు మది
న్నను రక్షించుటగా మన, మున దలఁతును దేవ! యభవ! పురహర! రుద్రా! 159

* దేవా! మహాదేవా! రుద్రా! హరా! పురహరా! నేను నీపట్ల అపరాధం చేశాను. కాబట్టి నీవు నన్ను శిక్షించావు. కాని నేను దీనిని శిక్షించడంగా భావించటం లేదు. నన్ను రక్షించటమే అని భావిస్తాను.

సీ. అనఘాత్మ! తగ నీవు నబ్జనాభుండును బరికింపఁ బాహ్మణాభాసు లయిన
వారల యెడల నె వ్వలన నుపేక్షింప రఁట! దృఢవ్రత చర్యులైనవారి
యెడ నీ కుపేక్ష యెక్కడిది? సర్గాదిని నామ్నాయ సంప్రదాయ ప్రవర్త
నము నెఱింగించుట కమర విద్యాతపో వ్రత పరాయణులైన బ్రాహ్మణులను

తే. వరుసఁ బుట్టించితివి; కాక వారి నెపుడు, గేల దండంబుఁ బూని గోపాలకుండు
బలసి గోవుల రక్షించు పగిది నీవు, నరసి రక్షించుచుందు గదయ్య రుద్ర! 160

* స్వామీ! నీవూ విష్ణుదేవుడూ కపట బ్రాహ్మణులను క్షమింపరు. దృఢమైన వ్రతం గల బ్రాహ్మణులను నిర్లక్ష్యం చేయరు. సృష్టి ఆరంభంలో వేదసంప్రదాయాలను ప్రవర్తింపజేయటం కోసం నీవు బ్రాహ్మణులను సృష్టించావు. విద్య, తపస్సు, వ్రతం బ్రాహ్మణుల ధర్మాలు. కాబట్టి కఱ్ఱ చేతబూని గోపాలుడు గోవులను కాపాడునట్లు నీవు బ్రాహ్మణులను నిత్యమూ శ్రద్ధగా కాపాడుతుంటావు.

సీ. తలపోయ నవిదిత తత్త్వవిజ్ఞానుండ నైన నాచేత సభాంతరమున
నతిదురుక్త్యంబకక్షతుఁడ వయ్యును మత్కృతాపరాధము హృదయంబునందు
దలఁపక త్ర్యక్ష! నిందాదోషమున నధోగతిఁ బొందుచున్న దుష్కర్మ నన్నుఁ
గరుణఁ గాచిన నీకుఁ గడఁగి ప్రత్యుపకార మెఱిఁగి కావింప నే నెంతవాఁడ?

తే. నుత చరిత్ర! భవత్పరానుగ్రహాను, రూప కార్యంబుచేత నిరూఢమైన
తుష్టి నీ చిత్తమందు నొందుదువుగాక, క్షుద్రసంహార! కరుణాసముద్ర! రుద్ర! 161

* క్షుద్రులను సంహరించే రుద్రా! దయాసముద్రా! నేను తత్త్వజ్ఞానం తెలియని మూర్ఖుడను. మహాసభలో నేను పలికిన చెడ్డ పలుకులు అనే ములుకులచేత నీవు గాయపడ్డావు. అయినా నేను చేసిన నేరాన్ని నీవు మనస్సులో పెట్టుకోలేదు. మహానుభావుణ్ణి నిందించిన పాపంచేత అధోగతికి పోవలసిన పాపాత్ముణ్ణి నన్ను దయతో కాపాడావు. నీకు తిరిగి ఉపకారం చేయటానికి నే నెంతవాణ్ణి? ఓ సచ్చరిత్రా త్రినేత్రా! ఇతరులను అనుగ్రహించే కార్యాల మూలంగా కలిగే ఆనందాన్ని నీవు పొందుదువు గాక!

**వ. అని యిట్లు రుద్ర క్షమాపణంబు గావించి పద్మసంభవుచేత ననుజ్ఞాతుండై దక్షుం డుపాధ్యాయ ఋత్విగ్గణ సమేతుం డగుచుఁ గ్రతుకర్మంబు నిర్వర్తించు సమయంబున బ్రాహ్మణజనంబులు యజ్ఞంబులు నిర్విఘ్నంబులై సాగుటకుఁ బ్రమథాది వీర సంసర్గకృత దోష నివృత్త్యర్థంబుగా విష్ణుదేవతాకంబును ద్రికపాల పురోడాశ ద్రవ్యకంబును నైన కర్మంబుఁ గావింప నధ్వర్యుకృత్య ప్రవిష్టుండగు భృగువుతోడం గూడి నిర్మలాంతః కరణుం డగుచు దక్షుఁడు ద్రవ్యత్యాగంబుఁ గావింపఁ బ్రసన్నుండై సర్వేశ్వరుండు. 162**

* ఈ విధంగా దక్షుడు క్షమింపుమని రుద్రుణ్ణి వేడుకున్నాడు. అనంతరం బ్రహ్మదేవుడు ఆజ్ఞాపింపగా ఉపాధ్యా యులతోనూ, ఋత్విక్కులతోనూ కూడి యజ్ఞం చేయటం ప్రారంభించాడు. అప్పుడు బ్రాహ్మణులు యజ్ఞం విఘ్నాలు లేకుండా కొనసాగటానికి, ప్రమథ వీరుల సంబంధంవల్ల కలిగిన దోషం నివారించటానికి విష్ణుమూర్తి దేవతగా కలిగినదీ, పురోడాశ ద్రవ్యము కలిగినదీ అయిన కర్మమును నిర్వర్తించారు. అధ్వర్యుకార్యాన్ని స్వీకరించిన భృగువుతో గూడి నిర్మల మైన మనస్సు గలవాడై దక్షుడు ద్రవ్యత్యాగం చేశాడు. అప్పుడు శ్రీమన్నారాయణుడు అనుగ్రహించి సాక్షాత్కరించాడు.

**సీ. మానిత శ్యామాయమాన శరీర దీధితులు నల్దిక్కుల దీటుకొనఁగఁ**
**గాంచన మేఖలా కాంతులతోడఁ గౌ శేయ చేలద్యుతుల్ సెలిమి సేయ**
**లక్ష్మీసమాయుక్త లలిత వక్షంబున వైజయంతీప్రభల్ వన్నె సూప**
**హాటకరత్న కిరీట కోటి ప్రభల్ బాలార్క రుచులతో మేలమాడ**

**తే. లలితనీలాభ్రరుచిఁ గుంతలములు దనరఁ, బ్రవిమలాత్మీయ దేహజప్రభ సరోజ**
**భవ భవామర ముఖ్యుల ప్రభలు మాప, నఖిలలోకైక గురుఁడు నారాయణుండు. 163**

* ఎల్లలోకాలకూ మూలమైన శ్రీ వల్లభుని నల్లని మేని కాంతులు నాల్గు దిక్కులందు వ్యాపించుతున్నాయి. బంగారు మొలనూలి కాంతులతో పట్టు వలువ కాంతులు కలిసిపోయాయి. లక్ష్మీదేవికీ కాపురమైన వక్షఃస్థలంపై వైజయంతీ మాలికాకాంతులు ప్రసరించుతున్నాయి. రత్నాలు పొదిగిన బంగారు కిరీట కాంతులు బాలసూర్యుని ద్యుతులను అతిశయించుతున్నాయి. ఆయన శిరోజాలు నీలమేఘ కాంతులతో ఒప్పుతున్నాయి. ఆయన దేహం నుంచి వెలువడే దివ్య ప్రభలు బ్రహ్మ, శివుడు మొదలైన దేవతా శ్రేష్ఠుల దేహకాంతులను క్రిందుపరుస్తున్నాయి.

చ. సలలిత శంఖచక్ర జలజాత గదా శరచాప ఖడ్గ ని
ర్మల రుచులన్ సువర్ణ రుచిమన్మణి కంకణ ముద్రికా ప్రభా
వళులును దేజరిల్లు భుజవర్గ మనర్గళ కాంతియుక్తమై
విలసిత కర్ణికార పృథివీరుహముం బురుడింపఁ బిట్టుగన్. 164

* చూడ ముచ్చటైన శంఖం, చక్రం, పద్మం, గద, విల్లమ్ములు, ఖడ్గం-వీని నిర్మల ద్యుతులతోనూ, కాంచనమణి కంకణ కాంతులతోనూ, రత్నాంగుళీయక దీప్తులతోనూ, ప్రకాశించే భుజ సమూహంతో ఆయన దేహం పూచిన కొండ గోగుచెట్టువలె అలరారుతున్నది.

క. సరసోదార సమంచిత, దరహాస విలోకనములఁ దగ లోకములం
బరితోషము నొందించుచుఁ, బరమోత్సవ మొప్ప విశ్వబంధుం డగుచున్. 165

* చల్లని తెల్లని చిరునవ్వులతో కూడిన కడగంటి చూపులు ప్రసరింపజేస్తూ లోకాలకు సంతోషం కలిగిస్తూ విశ్వబంధువైన విష్ణువు కన్నుల పండువుగా సాక్షాత్కరించాడు.

చ. మఱియును రాజహంస రుచిమద్భ్రమణీకృత తాలవృంత చా
మరముల వీవఁగా దివిజమానిను లచ్ఛసుధామరీచి వి
స్ఫురణ సితాతపత్ర రుచిపుంజము దిక్కులఁ బిక్కటిల్ల ఁగాఁ
గరివరదుండు వచ్చె సుభగస్తుతి వర్ణ సువర్ణయానుఁడై. 166

* దేవతాస్త్రీలు రాజహంసలవలె తెల్లనైన విసనకర్రలతో వింజామరలతో వీస్తూ వుండగా పున్నమనాటి చంద్రబింబం వంటి శ్వేతచ్ఛత్రం కాంతులు దిక్కులందు పిక్కటిల్లగా కరివరదుడైన హరి గరుడవాహన మెక్కి అక్కడికి వేంచేశాడు.

చ. ఘనరుచి నట్లు వచ్చిన వికారవిదూర ముకుందుఁ జూచి బో
రన నరవిందనందన పురందర చంద్రకళాధరామృతా
శనముఖు లర్థి లేచి యతిసంభ్రమ మొప్ప "నమో నమో దయా
వన నిధయే" యటంచు ననివారణ మ్రొక్కిరి భక్తియుక్తులై. 167

* నీలమేఘ కాంతితో అలా సాక్షాత్కరించిన వికారవిదూరుడైన విష్ణుమూర్తిని వీక్షించి బ్రహ్మ ఇంద్రుడు, శివుడు మొదలైన దేవతలు తటాలున లేచి, "దయాసముద్రునకు నమస్కారం! నమస్కారం!" అని భక్తితో ప్రణామాలు చేశారు.

వ. అట్లు కృత ప్రణాములైన యనంతరంబ. 168

ఉ. ఆ నలినాయతాక్షుని యనంత పరాక్రమ దుర్నిరీక్ష్య తే
జో నిహతస్వదీప్తులగుచు న్నుతిసేయ నశక్తులై భయ

గ్లాని వహించి బాష్పములు గ్రమ్మఁగ దగ్గదకంఠులై తనుల్
గ్రామనుపడంగ న వ్విభుని మన్ననఁ గై కొని యెట్టకేలకున్. 169

* ఆ విధంగా నమస్కారం చేసి ఆ విష్ణుదేవుని అఖండమైన పరాక్రమంవల్లా, తేరిచూడరాని తేజస్సువల్లా దేవతలు నిర్ఘాంతపోయారు. అందుచేత ఆయనను నుతించటానికి అశక్తులైనారు. భయకంపితులై కన్నీరు కారుస్తూ, డగ్గుత్తికతో నిశ్చేష్టులై నిలబడి ఉన్న వారినందరినీ కమలాక్షుడు కటాక్షించాడు.

## -: దక్షాదులు విష్ణువును స్తుతించుట :-

**వ. నిటలతట ఘటిత కరపుటులై య మ్మహాత్ముని యపారమహిమం బెఱింగి నుతియింప శక్తులు గాక యుండియుఁ, గృతానుగ్రహనిగ్రహుం డగుటం జేసి తమ తమ మతులకు గోచరించిన కొలంది నుతియింపఁ దొడంగి, రందు గృహీతంబు లగు పూజాద్యుపచారంబులు గలిగి బ్రహ్మాదులకు జనకుండును, సునందనందాది పరమభాగవతజన సేవితుండును, యజ్ఞేశ్వరుండును నగు భగవంతుని శరణ్యునింగాఁ దలంచి దక్షుం డిట్లనియె.**

**దేవా! నీవు స్వస్వరూపంబునం దున్న యప్పు డుపరతంబులు గాని రాగాద్యఖిల బుద్ధ్యవస్థలచే విముక్తుండవును, నద్వితీయుండవును, జిద్రూపకుండవును, భయరహితుండవును నై మాయం దిరస్కరించి మఱియు నా మాయ ననుసరించుచు లీలామానుష రూపంబుల నంగీకరించి స్వతంత్రుండ వయ్యును మాయా పరతంత్రుండవై రాగాది యుక్తుండునుంబోలె రామకృష్ణా ద్యవతారంబులఁ గానంబడుచుందువు; గావున నీ లోకంబులకు నీవ యీశ్వరుండ వనియు నితరులైన బ్రహ్మరుద్రాదులు భవన్మాయా విభూతు లగుటం జేసి లోకంబులకు నీశ్వరులు గారనియును భేద దృష్టి గల నన్ను రక్షింపు; మీ విశ్వకారణులైన ఫాలలోచనుండును బ్రహ్మయు దిక్పాలురును సకల చరాచర జంతువులును నీవ; భవద్వ్యతిరిక్తంబు జగంబున లేదని విన్నవించినఁ దదనంతరంబ ఋత్విగ్జనంబు లిట్లనిరి.** 170

* దేవతలు ఆ మహాత్ముని మహిమను తెలుసుకొని స్తుతించటానికి అసమర్థులైనప్పటికీ ఆయన అనుగ్రహాన్ని పొంది, నుదుట చేతులు ఉంచుకొని తమకు చేత నయినట్లు కొనియాడసాగారు. భక్తుల పూజలు పరిగ్రహించేవాడూ, బ్రహ్మాదులకు జనకుడూ, సునందుడు నందుడు మొదలైన పరమభక్తులచేత సేవింపబడేవాడూ, యజ్ఞేశ్వరుడూ అయిన భగవంతుణ్ణి రక్షకుణ్ణిగా భావించి దక్షుడు ఇలా స్తుతించాడు.

దేవా! నీవు స్వస్వరూపంతో ఉన్నప్పుడు నీకు రాగద్వేషాలు ఏమీ ఉండవు. నీవు అద్వితీయుడవు. నిర్భయుడవు. ఒకసారి మాయను నిరసిస్తావు. ఒక్కొకసారి ఆయమను అనుసరిస్తావు. లీలామానుష రూపాలను ధరిస్తావు. నీవు స్వతంత్రుడవు. అయినా మాయకు లొంగి రాగాదులు ఉన్నవానివలె రాముడు, కృష్ణుడు మొదలైన అవతారాలను ధరించి దర్శనమిస్తావు. ఈ లోకానికి నీవే ప్రభుడవనీ, తక్కిన బ్రహ్మరుద్రాదులు నీ మాయా వైభవ మూర్తులనీ, అందువల్ల లోకాలకు ప్రభువులుకా రనీ భేద దృష్టితో

ఉన్న నన్ను మన్నించు. ఈ విశ్వానికి హేతువులైన శివుడూ, బ్రహ్మదేవుడూ, దిక్పాలకులూ, సకల చరాచర జీవకోటీ అన్నీ నీవే. నీకంటే వేరయినది ఈ విశ్వంలో లేదు.

**సీ. వామదేవుని శాపవశమునఁ జేసి కర్మానువర్తులము మేమైన కతన**
**బలసి వేద ప్రతిపాద్య ధర్మోపలక్ష్యంబైన యట్టి మఖంబునందు**
**దీపింప నింద్రాది దేవతా కలిత రూపవ్యాజమునఁ బొంది పరఁగు నిన్ను**
**యజ్ఞస్వరూపుండ వని కాని కేవల నిష్కించనుండవు నిర్మలుఁడవు**

**తే. నరయ ననవద్య మూర్తివి యైన నీదు, లలితతత్త్వ స్వరూపంబుఁ దెలియఁజాల**
**మయ్య! మాధవ! గోవింద! హరి! ముకుంద! చిన్మయాకార! నిత్యలక్ష్మీవిహార! 171**

* ఆ తరువాత ఋత్విక్కులు ఇలా స్తుతించారు. స్వామీ! మేము నందీశ్వరుని శాపం వల్ల యజ్ఞాది కర్మలయందు ఆసక్తుల మైనాము. వేదాలలో ప్రతిపాదింపబడిన ధర్మలక్షణాలు కలది యజ్ఞం. ఆ యజ్ఞంలో ఇంద్రాది దేవతల రూపంతో నీవే సాక్షాత్కరిస్తుంటావు. నీవు యజ్ఞస్వరూపుడవు. నిష్కించనుడవు. నిర్మలుడవు. నిరవద్యుడవు. మాధవా! గోవిందా! హరీ! ముకుందా! నీవు చిన్మయమూర్తివి. నిత్యసౌభాగ్యశాలివి. నీ యథార్థస్వరూపాన్ని మేము గ్రహింపలేము.

**వ. సదస్యు లిట్లనిరి. 172**

**సీ. శోకదావాగ్ని శిఖాకులితంబు పృథు క్లేశఘన దుర్గ దుర్గమంబు**
**దండధర క్రూర కుండలిశ్లిష్టంబు, పాపకర్మ వ్యాఘ్ర పరివృతంబు**
**గురు సుఖ దుఃఖ కాకోల పూరిత గర్త మగుచు నవాశ్రయ మైనయట్టి**
**సంసార మార్గ సంచారులై మృగతృష్ణికలఁ బోలు విషయ సంఘము నహ మ్మ**

**తే. మేతి హేతుక దేహ నికేతనములు, నయి మహాభారవహు లైనయట్టి మూఢ**
**జనము లేనాఁట మీ పదాబ్జములు గానఁ, జాలు వారలు? భక్తప్రసన్న! దేవ! 173**

* సదస్యులు ఇలా స్తుతించారు.

భక్తులను అనుగ్రహించే దేవదేవా! సంసారమార్గం శోకమనే కారుచిచ్చు మంటలచే చీకాకైనది. కష్టాలు అనే గొప్ప కోటలతో దాటరానిది. యముడనే క్రూర సర్పంతో కూడింది. దుర్జనులనే పెద్ద పులులతో నిండినది. అంతులేని సుఖదుఃఖా లనే కాలకూట విషంతో నిండిన గుంట వంటిది. దిక్కులేనిది. అటువంటి సంసార మార్గంలో సంచరిస్తూ ఎండమావులవంటి ఇంద్రియ వాంఛలలో పడి కొట్టుమిట్టాడుతూ "నేను, నాది" అనే భావాలకు కారణా లయిన దేహం గేహం వంటి గొప్ప బరువును మోస్తూ ఉండే పరమమూర్ఖులైన మానవులు నీ పాదపద్మాలను ఎప్పుడూ చూడలేరు.

**వ. రుద్రుం డిట్లనియె. 174**

చ. వరద! నిరీహ యోగిజన వర్గ సుపూజిత! నీ పదాబ్జముల్
నిరతము నంతరంగమున నిల్పి సమగ్ర భవత్పరిగ్రహ
స్ఫురణ దనర్చు నన్ను నతిమూఢులు సంతతము న్నమంగళా
చరణుఁ డటంచుఁ బల్క నది సమ్మతి నే గణియింప నచ్యుతా! 175

* రుద్రుడు ఇలా స్తుతించాడు.

వరదా! పరమయోగిపూజితుడ వైన అచ్యుతా! యోగులు నిన్ను పూజిస్తారు. నీ పాదపద్మాలను నిత్యమూ మనస్సులో నిలుపుకొని నీ సంపూర్ణదయను పొందిన నన్ను చూచి బుద్ధిహీనులు “అమంగళమూర్తి” అని నిందిస్తారు. అయినా ఆనిందను నేను లెక్కచేయను.

వ. భృగుం డిట్లనియె. 176

మ. అరవిందోదర! తావకీన ఘన మాయామోహిత స్వాంతులై
పరమంబైన భవన్మహామహిమముం బాటించి కానంగ నో
పరు బ్రహ్మాది శరీరు లజ్ఞు లయి; యో పద్మాక్ష! భక్తార్తి సం
హరణాలోకన! నన్నుఁ గావఁదగు నిత్యానందసంధాయివై. 177

* భృగుడు ఇలా వేడుకున్నాడు.

ఓ పద్మనాభా! నీ మాయకు జిక్కి బ్రహ్మ మొదలైన శరీరధారులు కూడా నీ మహామహిమను గ్రహింప లేరు. చూపులచేతనే నీవు భక్తుల ఆపదలను తొలగింపగల పద్మాక్షుడవు. నాకు నిత్యానందాన్ని ప్రసాదించి నన్ను కాపాడు.

వ. బ్రహ్మ యిట్లనియె. 178

సీ. తవిలి పదార్థభేద గ్రాహకములైన చక్షురింద్రియముల సరవిఁ జూడఁ
గలుగు నీ రూపంబు గడఁగి మాయామయం బగు; నసద్వ్యతిరిక్త మగుచు మఱియు
జ్ఞానార్థ కారణ సత్త్వాది గుణముల కాశ్రయభూతమై యలరుచున్న
నిరుపమాకారంబు నీకు విలక్షణ మైయుండు ననుచు నే నాత్మఁ దలఁతు

తే. నిర్వికార! నిరంజన! నిష్కళంక!, నిరతిశయ! నిష్క్రియారంభ! నిర్మలాత్మ!
విశ్వసంబోధ్య! నిరవద్య! వేదవేద్య!, ప్రవిమలానంద! సంసారభయవిదూర! 179

* బ్రహ్మదేవుడు ఇలా స్తుతించాడు.

ఎదురుగా నున్న పదార్థాలను మాత్రమే గ్రహించే శక్తి నేత్రాది ఇంద్రియములతో పురుషుడు నీ మాయామయ రూపాన్ని మాత్రమే చూడగలడు. సంపూర్ణమై జ్ఞానార్థాలకూ, సత్త్వం మొదలైన గుణాలకూ నెలవై అసత్తుల కంటె వేరై, సాటిలేనిదై, విలక్షణమైన నీ రూపాన్ని జీవులు చూడలేరు. నీవు నిర్వికారుడవు.

నిరంజనుడవు. నిష్కళంకుడవు. సర్వేశ్వరుడవు. క్రియారహితుడవు. విమలాత్ముడవు. విశ్వవిధాతవు. నిరవద్యుడవు. వేదవేద్యుడవు. ఆనందస్వరూపుడవు. భవబంధాలను పటాపంచలు చేసే వాడివి.

వ. ఇంద్రుం డిట్లనియె. 180

మ. దితి సంతాన వినాశ సాధన సముద్దీప్తాష్ట బాహా సమ
న్వితమై యోగిమనోనురాగ కరమై వెల్గొందు నీ దేహ మా
యత మైనట్టి ప్రపంచముం బలెను మిథ్యాభూతముం గామి శా
శ్వతముంగా మదిలోఁ దలంతు హరి! దేవా! దైవచూడామణీ! 181

* ఇంద్రుడు ఇలా స్తుతించాడు.

రాక్షసులను సంహరించే ఆయుధాలతో దేదీప్యమానంగా ప్రకాశించే ఎనిమిది బాహువులతో కూడినదీ, యోగుల అంతరంగాలకు ఆనందం కల్గించేదీ అయిన నీ దేహం శాశ్వతమైనది. ఈ ప్రపంచం వలె అశాశ్వత మైనది కాదు. ఓ శ్రీహరీ! దేవదేవా! దేవతాచక్రవర్తీ! అటువంటి నీ స్వరూపాన్ని నేను నా మనస్సులో భావిస్తున్నాను.

వ. ఋత్విక్పత్ను లిట్లనిరి. 182

చ. కడఁగి భవత్పదార్చనకుఁ గా నిటు దక్షునిచే రచింపఁగాఁ
బడి శితికంఠరోషమున భస్మము నొంది పరేతభూమియై
చెడి కడు శాంత మేధమునఁ జెన్నఱియున్న మఖంబుఁ జూడు మే
ర్పడ జలజాభ నేత్రములఁ బావన మై విలసిల్లు నచ్యుతా! 183

* ఋత్విక్కుల భార్యలు ఇలా విన్నవించారు.

నీ పాదాలను ఆరాధించడంకోసం దక్షప్రజాపతి ప్రారంభించిన యజ్ఞం పరమశివుని ఆగ్రహంవల్ల భస్మీపటలమై పోయింది. సవనభూమి శ్మశానభూమిగా మారి కళాహీనంగా కన్పట్టుతుంది. యజ్ఞవైభవ మంతా నేలపాలయింది. ప్రభూ! పద్మపత్రాలవంటి నీ నేత్రాలు విప్పి ఒక్కమాటు చూస్తే ఈ యజ్ఞం పవిత్రమై యథారూపాన్ని పొందుతుంది.

వ. ఋషు లిట్లనిరి. 184

మ. అనఘా! మాధవ! నీవు మావలెనె కర్మారంభివై యుండియున్
విను తత్కర్మ ఫలంబు వొందవు; వితరుల్ విశ్వంబునన్ భూతికై
యనయంబున్ భజియించు నిందిర గరం బర్థిన్ నినుం జేరఁ గై
కొన; వే మందుము నీ చరిత్రమునకున్ గోవింద; పద్మోదరా! 185

* ఋషులు ఇలా స్తుతించారు.

మాధవా! పుణ్యస్వభావా! నీవూ మాలాగే కర్మలు చేస్తావు. అయిన ఆ కర్మఫలం నిన్ను పొందదు. సంపదలకోసం లోకులు సేవించే లక్ష్మీదేవి ఎంతో ప్రీతితో నిన్ను వరించి దరి చేరినప్పటికీ ఆమెను ఆదరింపవు. గోవిందా! కమలనాభా! విచిత్రమైన నీ చరిత్రం వర్ణించటానికి మాకు సాధ్యం కాదు గదా!

వ. సిద్ధు లిట్లనిరి. **186**

**చ. హరి! భవ దుఃఖ భీషణ దవానల దగ్ధతృషార్త మన్మనో**
**ద్విరదము శోభనంబును బవిత్రము నైన భవత్కథా సుధా**
**సరి దవగాహనంబునను సంసృతి తాపము వాసి క్రమ్మఱం**
**దిరుగదు బ్రహ్మముం గనిన ధీరుని భంగిఁ బయోరుహోదరా!** **187**

* సిద్ధులు ఇలా స్తుతించారు.

సంసార దుఃఖం అనే భయంకరమైన కారుచిచ్చుకు చిక్కి మా మనస్సు అను ఏనుగు తపించి దప్పిగొనినది. ఇప్పుడు నీ పవిత్ర గాథలనే అమృత స్రవంతిలో మునిగి తేలి సంసార తాపాన్ని పోగొట్టుకున్నది. పరబ్రహ్మతో ఐక్యాన్ని సంపాదించిన ధీరునివలె ఆ నదిలో నుండి తిరిగి బయటికి రావటం లేదు.

**వ. యజమాని యగు ప్రసూతి యిట్లనియె.** **188**

**చ. కర చరణాదికాంగముల గల్గియు మస్తము లేని మొండెముం**
**బరువడి నొప్ప కున్న గతిఁ బంకజలోచన! నీవు లేని య**
**ధ్వరము ప్రయాజలం గలిగి తద్దయు నొప్పక యున్న దీ యెడన్**
**హరి! యిటు నీదు రాక శుభ మయ్యె రమాధిప! మమ్ముఁ గావవే!** **189**

* యజమానుని భార్యయైన ప్రసూతి ఇలా వేడుకున్నది.

కాళ్ళు, చేతులు మొదలైన అవయవాలు అన్నీ ఉన్నా తలలేని మొండెము శోభిల్లదు. అలాగే ప్రయాజలు మున్నగు ఇతరాంగాలెన్ని ఉన్నా నీవు లేని యజ్ఞం శోభిల్లలేదు. ఇప్పటి నీ రాక శుభదాయకం. మాధవా! మమ్ము కాపాడు.

**వ. లోకపాలకు లిట్లనిరి.** **190**

**సీ. దేవాదిదేవ! యీ దృశ్యరూపంబు సుమహిత విశ్వంబుఁ జూచు ప్రత్య**
**గాత్మభూతుండ వైనట్టి నీవు నసత్ప్రకాశ రూపంబులై గలుగు మామ**
**కేంద్రియంబులచేత నీశ్వర! నీ మాయ వొందించి పంచభూతోపలక్షి**
**తంబగు దేహివిధంబునఁ గానంగఁ బడుదువు గాని యేర్పడిన శుద్ధ**

**తే. సత్త్వగుణ యుక్తమైన భాస్వత్స్వరూప, ధరుఁడవై కానఁబడవుగా? పరమపురుష!**
**యవ్యయానంద! గోవింద! యట్లు గాక, యెనయ మా జీవనము లింక నేమి కలవు?** **191**

* లోకపాలకులు ఇలా స్తుతించారు.

దేవాదిదేవా! ఈ కనిపించు విశ్వాన్ని నీవు వేరుగా ఉండి చూస్తావు. నీవు బహిర్ముఖాలైన మా యింద్రియాలకు పంచభూతోపలక్షితమైన జీవివలె కన్పిస్తావు. ఇదంతా నీ మాయా విలాసం. ఓ అవ్యయానందా! గోవిందా! పురుషోత్తమా! శుద్ధ సత్త్వ గుణంతో కూడిన నీ రూపాన్ని మాకు చూపించవు. ఏమి బ్రతుకులయ్యా మావి?

**వ. యోగీశ్వరు లిట్లనిరి. 192**

**సీ. విశ్వాత్మ! నీయందు వేఱుగా జీవులఁ గనఁ డెవ్వఁ; డటు వానికంటెఁ బ్రియుఁడు**
**నీకు లేఁ; డయినను నిఖిల విశ్వోద్భవ స్థితి విలయంబుల కతన దైవ**
**సంగతి నిర్భిన్న సత్త్వాది గుణవిశిష్టాత్మీయ మాయచే నజ భవాది**
**వివిధ భేదము లొందుదువు స్వస్వరూపంబు నందుండుదువు; వినిహత విమోహి**

**తే. వగుచు నుందువు గద! నిన్ననన్యభక్తి, భృత్యభావంబు దాల్చి సంప్రీతిఁ గొల్చు**
**మమ్ము రక్షింపవే? కృపామయ! రమేశ! పుండరీకాక్ష! సంతత భువన రక్ష! 193**

* యోగీశ్వరులు ఇలా స్తుతించారు.

విశ్వస్వరూపా! ఈ విశ్వంలోని జీవులను నీకంటె వేరుగా చూడనివాడు నీకు మిక్కిలి యిష్టుడు. నీవు లోకాల సృష్టి, స్థితి, లయాలకోసం బ్రహ్మ, విష్ణువు, శివుడు మొదలైన అనేక భేదాలను పొందుతావు. రజస్సత్త్వ తమస్సులనే వేరు వేరు గుణాలతో కూడిన నీ మాయవల్ల యిలా చేస్తూ స్వస్వరూపాన్ని ధరిస్తూ ఉంటావు. ఓ కరుణామయా! కమలాప్రియా! కంజాక్షా! నిరంతర నిఖిల భువనరక్షా! భృత్యభావంతో, అత్యంతానురక్తితో అనన్య భక్తితో నిన్ను సేవించే మమ్ము కాపాడు.

**వ. శబ్ద బ్రహ్మ యిట్లనియె. 194**

**చ. హరి భవదీయ తత్త్వము సమంచితభక్తి నెఱుంగ నేను నా**
**సరసిజ సంభవాదులును జాలము, సత్త్వగుణాశ్రయుండవున్**
**బరుఁడవు నిర్గుణుండవును బ్రహ్మమునై తగు నీకు నెప్డు నిం**
**దఱముఁ జతుర్విధార్థ ఫలదాయక! మ్రొక్కెద మాదరింపవే! 195**

* శబ్దబ్రహ్మ ఇలా స్తుతించారు.

హరీ! నీ అసలైన రహస్యాన్ని గ్రహించటానికి ఉత్తమ భక్తియుక్తులమైన నేనుగానీ, బ్రహ్మ మొదలైన వారుగానీ సమర్థులం కాదు. నీవు సత్త్వగుణానికి నిలయ మైనవాడవు. పరాత్పరుడవు. నిర్గుణుడవు. పరబ్రహ్మ స్వరూపుడవు. ధర్మార్థ కామ మోక్షాలనే నాలుగు విధాలైన పురుషార్థ ఫలాలను నీవు ప్రసాదిస్తావు. అటువంటి నీకు మేమంతా సంతతమూ నమస్కరిస్తున్నాము. మమ్ము లాలించి పాలించు.

**వ. అగ్నిదేవుం డిట్లనియె. 196**

మ. హవరక్షా చరణుండ వై నెగడు దీ; వయ్యగ్నిహోత్రాది పం
చవిధంబున్ మఱి మంత్రపంచక సుస్పష్టంబై తగం బొల్చు నా
హవ రూపంబగు నీకు మ్రొక్కెదను; నీ యాజ్ఞన్ భువిన్ హవ్యమున్
సవన వ్రాతములన్ వహింతు హరి యుష్మత్తేజముం బూనుచున్. 197

* అగ్నిదేవుడు ఇలా అన్నాడు.

దేవా! నీవు యజ్ఞాలను రక్షిస్తావు. అయిదు అగ్నిహోత్రాలూ, అయిదు మంత్రాలు గల యజ్ఞమూర్తివి నీవే. నీవు హోమ స్వరూపుడవు. నీ తేజస్సును దాల్చి నీ ఆజ్ఞానుసారం నేను యజ్ఞాలలో హోమద్రవ్యాలైన హవ్యాలను ధరిస్తున్నాను.

వ. దేవత లిట్లనిరి. 198

మ. మును కల్పాంతమునందుఁ గుక్షి నఖిలంబున్ దాఁచి యేకాకివై
జనలోకోపరి లోకవాసులును యుష్మత్తత్త్వమార్గంబు చిం
తనముం జేయఁ బయోధియందు నహిరాట్తల్పంబునం బవ్వళిం
చిన నీ రూపము నేఁడు సూపితివి లక్ష్మీ నాథ! దేవోత్తమా! 199

* దేవతలు ఇలా స్తుతించారు.

పూర్వం ప్రళయకాలంలో సర్వాన్నీ కడుపులో దాచుకొని నీవు ఒంటిరిగా ఉన్నప్పుడు జనలోకానికన్నా పైలోకాలలో ఉండే సిద్ధపురుషులు నీ సత్య స్వరూపాన్ని మనస్సులో మననం చేస్తారు. ఆనాడు పాలసముద్రం మధ్యలో పన్నగరాజు తల్పంపై పవ్వళించి ఉన్న నీ దివ్య స్వరూపాన్ని ఈనాడు మళ్లీ మాకు చూపించావు.

వ. గంధర్వు లిట్లనిరి. 200

మ. హరపంకేజభవామరాదులు మరీచ్యాది ప్రజానాథు లో
యరవిందాక్ష! రమాహృదీశ! భవదీయాంశాంశ సంభూతులై
పరఁగం దావకలీలయై నెగడు నీ బ్రహ్మాండమున్, దేవ! యీ
శ్వర! నీ కే మతి భక్తి మ్రొక్కెదము దేవాధీశ! రక్షింపుమా! 201

* గంధర్వులు ఇలా స్తవం చేశారు.

దేవా! ఈశ్వరా! ఇందిరా హృదయేశ్వరా! బృందారకాధీశ్వరా! అరవిందాక్షా! శివుడు, బ్రహ్మ, మొదలైన దేవతలూ, మరీచి మొదలైన ప్రజాపతులూ, నీ అంశాంశములచేత జన్మించారు. ఈ బ్రహ్మాండం నీ క్రీడా మందిరం. నీకు పరమ భక్తితో ప్రణమిల్లు తున్నాము. పాలించు మమ్ముల్ని.

వ. విద్యాధరు లిట్లనిరి. 202

సీ. నలినాక్ష! విను భవన్మాయా వశంబున దేహంబు దాల్చి తద్దేహమందు
నాత్మ "నహ మ్మ" మేత్యభిమానమును బొంది పుత్ర జాయాగృహక్షేత్ర బంధు
ధన పశు ముఖ వస్తుతతుల సంయోగ వియోగ దుఃఖంబుల నొందుచుండు
ధృతి విహీనుఁడు నసద్విషయాతిలాలసుఁ డతి దుష్టమతియు నైనట్టివాఁడు

తే. దవిలి భవదీయ గుణ సత్కథా విలోలుఁ, డయ్యె నేనియు నాత్తమోహంబు వలనఁ
బాసి వర్తించు విజ్ఞానపరతఁ దగిలి, చిరదయాకార! యిందిరా చిత్తచోర! 203

* విద్యాధరులు ఇలా సంస్తుతించారు.

నళినాక్షా! నీ మాయకు వశుడై, దేహం ధరించి, ఆ దేహంపై "నేను, నాది" అని మానవుడు ఆసక్తి పెంచుకుంటాడు. కొడుకు, భార్య, యిల్లు, పొలము, చుట్టాలు, ధనము, పశువులు మొదలైన వారి సంయోగ వియోగాలవల్ల దుఃఖిస్తాడు. దయామయా! రమాప్రియా! అలాంటి ధైర్యహీనుడు ఇంద్రియార్థాలలో మిక్కిలి ఆసక్తి కలవాడు; చెడ్డ మనస్సు కలవాడు కూడా నీ గుణాలకు సంబంధించిన సత్కథలను వింటే ఆ అజ్ఞానం తొలగిపోయి విజ్ఞానం పొందుతాడు.

వ. బ్రాహ్మణ జనంబు లిట్లనిరి.

దేవా! యీ క్రతువును, హవ్యంబును, నగ్నియు, మంత్రంబులును, సమిద్దర్భపాత్రంబులును, సదస్యులును, ఋత్విక్కులును, దంపతులును, దేవతలును, నగ్నిహోత్రంబులును, స్వధయు, సోమంబును, నాజ్యంబును, బశువును నీవ; నీవు దొల్లి వేదమయ సూకరాకారంబు ధరియించి దంష్ట్రాదండంబున వారణేంద్రంబు నళినంబు ధరియించు చందంబున రసాతల గతయైన భూమి నెత్తితి; వట్టి యోగిజన స్తుత్యుండవును, యజ్ఞక్రతురూప కుండవును నైన నీవు పరిభ్రష్టకర్ములమై యాకాంక్షించు మాకుం బ్రసన్నుండ వగుము; భవదీయ నామకీర్తనంబుల సకల యజ్ఞ విఘ్నంబులు నాశంబు నొందు; నట్టి నీకు నమస్కరింతుము. 204

* బ్రాహ్మణులు ఇలా స్తుతించారు.

దేవా! ఈ యజ్ఞం, ఇందులోని హవ్యం, అగ్ని, మంత్రాలు, సమిధలు, దర్భలు, పాత్రలు, సదస్యులు, ఋత్విజులు, దంపతులు, దేవతలు, అగ్నిహోత్రాలు, స్వధ, సోమరసం, నెయ్యి, యజ్ఞ పశువు- అన్నీ నీవే. నీవు పూర్వం వేదస్వరూపమైన ఆదివరాహరూపం ధరించి ఏనుగు తన దంతంతో పద్మాన్ని పైకి ఎత్తినట్లు నీ కోరకొనతో పాతాళం నుండి భూమిని పైకి లేవనెత్తావు. యోగులు నిన్ను స్తుతిస్తారు. నీవు యజ్ఞస్వరూపుడవు! వేదకర్మలు ఆచరింపక భ్రష్టులమైన మాయందు దయ చూపు. నీ నామాన్ని సంస్తుతిస్తే యజ్ఞాలలో సంప్రాప్తించే సమస్త విఘ్నాలూ సమసిపోతాయి. అటువంటి నీ కివే మా నమస్కారాలు.

క. అని తన్ను సకల జనములు, వినుతించిన హరి భవుండు విఘ్నము గావిం
చిన యా దక్షుని యజ్ఞము, ఘనముగఁ జెల్లించెఁ గొఱఁత గాకుండంగన్. 205

* ఈ విధంగా సమస్త ప్రజలూ విష్ణుమూర్తిని స్తుతించారు. అప్పుడు విష్ణుమూర్తి ప్రసన్నుడై శివుడు ధ్వంసం చేసిన దక్ష ప్రజాపతి యజ్ఞాన్ని ఏ కొరతా లేకుండా చక్కగా పూర్తిచేయించాడు.

**క. సకలాత్ముఁడు దా నగుటను, సకల హవిర్భోక్త యయ్యు జలజాక్షుండుం**
**బ్రకట స్వభాగమున న, య్యకలంకుఁడు దృప్తిఁ బొంది యనె దక్షునితోన్.** **206**

* విష్ణుదేవుడు తాను సకలాంతర్యామి. అందుచేత ఆయనే సకల హవిస్సులను భుజిస్తాడు. అయినా తన భాగం అయిన "త్రికపాల పురోడాశం" మంత్రంతోనే తృప్తి చెంది దక్షునితో ఇలా అన్నాడు.

**వ. అనఘా! యేనును బ్రహ్మయు శివుండును నీజగంబులకుఁ గారణభూతుల; మందు నే నీశ్వరుండను నుపద్రష్టను స్వయంప్రకాశకుండను నై గుణమయం బయిన యాత్మీయమాయం బ్రవేశించి జనన వృద్ధి విలయంబులకు హేతు భూతంబు లగు తత్తత్క్రియోచితంబులైన బ్రహ్మరుద్రాది నామధేయంబుల నొందు చుండుదు; నట్టి యద్వితీయ బ్రహ్మరూపకుండ నైన నా యందు నజ భవాదులను భూతగణంబులను మూఢుం డగువాఁడు వేఱుగాఁ జూచు; మనుజుండు శరీరంబునకుఁ గరచరణాదులు వేఱుగాఁ దలంపని చందంబున మద్భక్తుం డగువాఁడు నా యందు భూతజాలంబు భిన్నంబుగాఁ దలంపండు. గావున మా ముువ్వుర నెవ్వండు వేఱు సేయకుండు వాఁడు కృతార్థుం డని యానతిచ్చిన దక్షుండును.** **207**

* పుణ్యాత్ముడా! నేనూ, బ్రహ్మ, శివుడూ ముువ్వురం ఈ లోకాలకు హేతుభూతులం. నేను ఈశ్వరుడను. సాక్షిని స్వయంప్రకాశుడను. నేను త్రిగుణాత్మకమైన నా మాయను ప్రవర్తింపజేసి సృష్టి స్థితి లయ కార్యాలను నిర్వహిస్తూ ఆ యా పనులకు తగిన బ్రహ్మరుద్రాది నామాలను పొందుతుంటాను. నాకంటె వేరగు పరబ్రహ్మరూపం లేదు. బ్రహ్మ, శివుడు మొదలగు వారినీ, జీవకోటినీ బుద్ధిహీనుండు నాకంటె వేరుగా చూస్తాడు. మనుష్యుడు తన చేతులు, కాళ్లు మొదలగు అవయవాలను తన శరీరంకంటె వేరుగా చూడడు గదా! అలాగే నాభక్తుడు జీవులను నాకంటె వేరుగా భావింపడు. హరిహర బ్రహ్మలమైన మా ముగ్గురనూ వేరుగా చూడని వాడు ధన్యుడు.

**క. విని విష్ణు దేవతాకం, బనఁగాఁ ద్రికపాలకలిత మగు నా యాగం**
**బునఁ దగ న వ్విష్ణునిపద, వనజంబులు పూజసేసి వారని భక్తిన్.** **208**

* విష్ణుమూర్తి ఇలా ఉపదేశింపగా విని దక్షుడు విష్ణు దేవతాకమైన "త్రికపాల పురోడాశ" మనే యజ్ఞాన్ని చేసి విష్ణు మూర్తి పాదపద్మాలను పరమభక్తితో పూజించాడు.

**వ. మఱియును.** **209**

**సీ. అంగప్రధానక యాగంబులను జేసి యమరుల రుద్రుని నర్థిఁ బూజ**
**సేసి విశిష్టేష్ట శిష్టభాగమున నుదవసాన కర్మంబు దవిలి తీర్చి**

తాను ఋత్విక్కులుఁ దగ సోమపులఁ గూడి యవభృథ స్నానంబు లాచరించి
కడఁక నవాప్త సకల ఫలకాముఁడై తనరు దక్షునిఁ జూచి ధర్మబుద్ధి

తే. గలిగి సుఖవృత్తి జీవింతుఁగాక యనుచుఁ, బలికి దివిజులు మునులును బ్రాహ్మణులును
జనిరి నిజమందిరముల; కా జలజనయన, భవులు వేంచేసి రాత్మీయ భవనములకు. 210

* అనంతరం దక్షుడు అంగప్రధానకా లయిన యాగాలను చేశాడు. దేవతలనూ, మహాదేవుణ్ణీ యథావిధిగా శ్రద్ధా భక్తులతో పూజించాడు. వారివారి భాగాలను వారికి సమర్పించాడు. తరువాత తాను ఋత్విక్కులతో, సోమపానం చేసినవారితో కలిసి అవభృథస్నానం చేశాడు. యజ్ఞ ఫలాన్ని సమగ్రంగా పొందాడు. అప్పుడు దేవతలూ, మునులూ, బ్రాహ్మణులూ దక్షుణ్ణి చూచి ధర్మ బుద్ధి కలిగి సుఖంగా జీవింతువు గాక! అని దీవించి తమ తమ గృహాలకు వెళ్ళారు. విష్ణువూ, శివుడూ తమ తమ మందిరాలకు వేంచేశారు.

వ. అంత దాక్షాయణి యయిన సతీదేవి పూర్వకళేబరంబు విడిచి హిమవంతునకు మేనకయందు జనియించి విలయకాలంబున బ్రసుప్తం బయిన శక్తి సృష్టికాలంబున నీశ్వరునిఁ బొందు చందంబునఁ బూర్వదయితుండగు రుద్రుని వరియించె నని దక్షాధ్వర ధ్వంసకుం డగు రుద్రుని చరిత్రంబు బృహస్పతి శిష్యుడయిన యుద్ధవునకు నెఱింగించె; నతండు నాకుం జెప్పె; నేను నీకుం జెప్పితి నని మైత్రేయుండు వెండియు విదురున కిట్లనియె. 211

* అనంతరం దక్ష పుత్రికయైన సతీదేవి పూర్వం శరీరాన్ని పరిత్యజించినదై హిమవంతునికీ, మేనకకూ "పార్వతి" అనే పేరుతో కుమార్తెగా జన్మించింది. ప్రళయకాలంలో ప్రసుప్తమైన శక్తి, సృష్టికాలంలో ఈశ్వరుణ్ణి చేరే విధంగా పూర్వం తన హృదయేశ్వరుడైన పరమేశ్వరుణ్ణి వరించింది.

ఈ విధంగా దక్షుని యజ్ఞాన్ని ధ్వంసం చేసిన పరమశివుని కథను బృహస్పతి తన శిష్యుడైన ఉద్ధవునకు చెప్పాడు; ఆ ఉద్ధవుడు నాకు చెప్పాడు; నేను నీకు వినిపించాను- అని పలికి మైత్రేయ మహాముని విదురునితో మళ్ళీ యిలా అన్నాడు.

క. ఈ యాఖ్యానముఁ జదివిన, ధీ యుతులకు విననయట్టి ధీరుల కైశ్వ
ర్యాయుః కీర్తులు గలుగును; బాయును దురితములు; దొలఁగు భవబంధంబుల్. 212

వ. అని వెండియు నిట్లనియె. 213

* బుద్ధిమంతులై ఈ కథ చదివినవారికి విన్నవారికీ ఐశ్వర్యమూ, ఆయుస్సూ, కీర్తి లభిస్తాయి. ఆ ధీరుల పాపాలు పటాపంచ లవుతాయి. సంసార బంధాలు తొలగిపోతాయి అని పలికి మైత్రేయుడు మళ్ళీ యిలా అన్నాడు.

క. విను సనకాదులు నారదుఁ, డును హంసుఁడు నరుణియు ఋభుఁడు యతియుఁ గమలా
సనజులు నైష్ఠికు లనికే, తను లగుటన్ సాగవయ్యెఁ దద్వంశంబుల్. 214

* విదురా! విను. సనకుడు మొదలైనవారూ-నారదుడు, హంసుడు, అరుణి, ఋభుడు, యతి- ఈ బ్రహ్మ పుత్రులందరూ నైష్ఠికులై గృహస్థులు కాకపోవటంవల్ల వారి వంశాలు కొనసాగలేదు.

**వ. మఱియు నధర్మునకు "మృష" యను భార్యయందు దంభుండును, "మాయ" యను నంగనయుం బుట్టిరి; అధర్మసంతానం బగుట వారిరువురును మిథునం బైరి; వారిని సంతానహీనుండగు నిర్ఋతి గైకొనియె; వారలకు లోభుండును నికృతియను సతియునుం గలిగి మిథునం బయిరి; ఆ మిథు నంబునకుఁ గ్రోధుండు హింస యను నంగనయుం బుట్టి మిథునం బయిరి; ఆ మిథునంబునకుఁ గలియు దురుక్తియను నతివయు జన్మించి దాంపత్యంబు గైకొనిరి; ఆ దంపతులకు భయమృత్యువు లను మిథునంబు గలిగె; దాని వలన యాతనయు నిరయంబునుం బుట్టిరి; వీరలు సంసార హేతు వగు నధర్మతరుశాఖ లయి నెగడిరి; వీని శ్రేయస్కాముండగు జనుం డీష న్మాత్రంబు ననువర్తింపం జనదు; ఇవ్విధంబునం బ్రతి సర్గంబును సంగ్రహంబున వినిపించితి; ఇప్పుణ్య కథ నెవ్వండేని మున్మాఱు వినిన నతండు నిష్పాపుం డగునని చెప్పి మఱియు నిట్లనియె. 215**

* అధర్మునికి "మృష" యను భార్యయందు దంభుడు అనే కుమారుడు, మాయ అనే కుమార్తె జన్మించారు. అధర్మ సంతానమైన వారిద్దరూ దంపతు లయ్యారు. ఆ దంపతులను సంతానం లేని నిర్ఋతి దత్తు చేసుకున్నాడు. దంభునికీ, మాయకు 'లోభుడు' అనే పుత్రుడు, 'నికృతి' అనే పుత్రిక కలిగారు. వారిద్దరు ఆలుమగ లయ్యారు. వారికి క్రోధుడు అనే కొడుకూ, "హింస" అనే కూతురు పుట్టి భార్యా భర్తలయ్యారు. ఆ జంటకు 'కలి' అనే పురుషుడూ, "దురుక్తి" అనే కన్యకా జన్మించి దంపతు లయ్యారు. వారికి "భయం" అనే పురుషుడూ, "మృత్యువు" అనే స్త్రీ జన్మించి ఆలుమగ లయ్యారు. వారిద్దరికీ "యాతన", "నిరయం" అనే జంట జన్మించి దంపతు లయ్యారు.

సంసారానికి హేతువైన "అధర్మం" అనే వృక్షానికి వీరంతా శాఖలై వ్యాపించారు. మేలుకోరే మానవు డెవ్వడూ ఏ మాత్రమూ వీరిని అనుసరింపకూడదు.

ఈ విధంగా ప్రతిసర్గాన్ని నీకు సంగ్రహంగా వినిపించాను. ఈ పుణ్యకథను మూడుసార్లు వినినవాడు పాపాలన్నీ నశించి పుణ్యాత్ముడౌతాడు అని చెప్పి మళ్లీ యిలా అన్నాడు.

## -: ధ్రువోపాఖ్యానము :-

**క. విను మఖిల భువన పరిపా, లనమునకై చక్రధరకళా కలితుండై**
**వనజజునకు స్వాయంభువ, మను వపు డుదయించెఁ గీర్తిమంతుం డగుచున్. 216**

* విష్ణుదేవుని అంశతో బ్రహ్మదేవునికి స్వాయంభువ మనువు పుట్టి సకల లోకాలనూ పరిపాలించి విశేషమైన యశస్సు గడించారు.

**తే. రూఢి న మ్మనువుకు శతరూపవలన, భూనుతులగు ప్రియవ్రతోత్తానపాదు**
**లనఁగ నిద్దఱు పుత్త్రులై రందులోన, భవ్యచారిత్రుఁ డుత్తానపాదునకును. 217**

* ఆ స్వాయంభువ మనువుకు శతరూప అనే భార్యవల్ల "ప్రియవ్రతుడు", "ఉత్తానపాదుడు" అనే ఇద్దరు కొడుకులు కలిగారు.

**క. వినుము సునీతియు సురుచియు, నను భార్యలు గలరు; వారియందును ధ్రువునిం**
**గనిన సునీతియు నప్రియయును, సురుచియుఁ బ్రియయు నగుచు నున్నట్టి యెడన్.** 218

వారిలో ఉత్తానపాదునికి "సునీతి", "సురుచి" అని ఇద్దరు భార్యలు. సునీతిపై రాజుకు ప్రీతిలేదు. సురుచి అంటే రాజుకు మిక్కిలి మక్కువ. సునీతి కొడుకు పేరు ధ్రువుడు. సురుచి కొడుకు పేరు ఉత్తముడు.

**సీ. ఒకనాఁడు సుఖలీల నుత్తానపాదుండు నెఱిఁ బ్రియురాలైన సురుచి గన్న**
**కొడుకు నుత్తముఁ దన తొడలపై నిడికొని యుపలాలనము సేయుచున్న వేళ**
**నర్థిఁ దదారోహణాపేక్షితుం డైన ధ్రువునిఁ గనుంగొని తివక యాద**
**రింప కుండుటకు గర్వించి యా సురుచియు సవతి బిడ్డండైన ధ్రువునిఁ జూచి**

**తే. తండ్రి తొడ నెక్క వేడుక దగిలెనేనిఁ, బూని నాగర్భమున నాఁడు పుట్ట కన్య**
**గర్భమునఁ బుట్టఁ గోరినఁ గలదె నేఁడు, జనకు తొడ యెక్కు భాగ్యంబు సవతి కొడుక!** 219

* ఒకనాడు ఉత్తానపాదుడు ఆనందంగా ఉత్తముణ్ణి తన తొడలపై కూర్చుండ బెట్టుకొని ముద్దాడుతున్నాడు. అప్పుడు ధ్రువుడు తానుకూడా తన తండ్రి తొడలపైకి ఎక్కటానికి ఉబలాట పడ్డాడు. కాని ఉత్తానపాదుడు ధ్రువుని దగ్గరకు తీసుకోలేదు. ఆప్యాయంగా ఆదరింప లేదు. అందుకు సురుచి గర్వించి, సవతి కొడుకైన ధ్రువుణ్ణి చూచి ఇల్లా అన్నది. "నా కడుపున పుట్టినవాడే తండ్రి తొడ ఎక్కటానికి అర్హుడు. మరియొక స్త్రీ గర్భాన పుట్టిన నీకు తండ్రి తొడ ఎక్కే అదృష్టం ఎలా కలుగుతుంది?"

**క. అది గాన నీ వధోక్షజు, పదపద్మము లాశ్రయింపు; పాయక హరి నా**
**యుదరమునఁ బుట్టజేయును, వదలక యట్లయిన ముదము వడసెద వనఘా!** 220

* "కాబట్టి ధ్రువకుమారా! నీవు విష్ణుదేవుని పాదపద్మాలను ఆశ్రయించు. ఆయన నిన్ను నా కడుపున పుట్టేటట్లు అనుగ్రహిస్తాడు. అప్పుడు నీ కోరిక నెరవేరుతుంది."

**క. అని యీ రీతి నసహ్య వ, చనములు పినతల్లి యపుడు జనకుఁడు వినఁగాఁ**
**దను నాడిన దుర్భాషా, ఘనశరములు మనము నాఁటి కాఁటియవెట్టన్.** 221

* తండ్రి వింటూ ఉండగా పినతల్లి సురుచి పలికిన వాక్యాలు ధ్రువుడు భరించలేకపోయాడు. ఆమె వేడిపలుకులు వాడిములుకుల వలె అతని మనస్సులో గాటంగా నాటుకొని పీడింపసాగాయి.

**క. తను నట్లుపేక్ష సేసిన, జనకునికడఁ బాసి దుఃఖ జలనిధిలోనన్**
**మునుఁగుచును దండతాడిత, ఘనభుజగముఁబోలె రోషకలితుం డగుచున్.** 222

* ఆ విధంగా తనను నిర్లక్ష్యం చేసిన తండ్రి దగ్గర నుంచి ధ్రువుడు పట్టరాని దుఃఖంతో కర్రదెబ్బ తిన్న పాములాగ రోషంతో రోఁజుతూ వచ్చేశాడు.

**క. ఘనరోదనంబు సేయుచుఁ, గనుఁగవలను శోకబాష్ప కణములు దొరఁగన్**
**జనని కడ కేగుటయు నిజ, తనయునిఁ గని యా సునీతి దద్దయుఁ బ్రేమన్. 223**

**వ. తొడలపై నిడికొని. 224**

* బిగ్గరగా ఏడుస్తూ, కన్నులనుండి దుఃఖ బాష్పాలు జలజల రాలుతూ ఉండగా కన్న తల్లిని సమీపించాడు. సునీతి కన్నకొడుకును బుజ్జగించి మిక్కిలి ప్రేమతో ఒడిలో కూర్చుండ బెట్టుకున్నది.

**క. కర మనురక్తిని మోము ని, విరి తద్వృత్తాంత మెల్ల వెలఁదులు నంతః**
**పురవాసులుఁ జెప్పిన విని, పఱపుగ నిట్టూర్పు లెసఁగ బాష్పాకులయై. 225**

* ఎంతో గారాబంగా కొడుకు ముఖం నిమిరింది. జరిగిన విషయం ఆ అంతఃపుర కాంతలు చెప్పగా విన్నది. నిట్టూర్పులు నిగుడించుతూ కన్నీరు కార్చింది.

**తే. సవతి యాడిన మాటలు సారెఁ దలఁచి, కొనుచుఁ బేర్చిన దుఃఖాగ్నిఁ గుములుచుండె**
**దావపావక శిఖలచేఁ దగిలి కాంతి, వితతిఁ గందిన మాధవీలతికవోలె. 226**

* సవతి అయిన సురుచి తన కొడుకును అన్నమాటలు సునీతి మాటి మాటికీ తలచుకున్నది. కారుచిచ్చు మంటల వేడికి కంది కళదప్పిన మాధవీలతలాగా శోకాగ్నితో కుమిలి కుమిలిపోయింది.

**వ. అంత నా సునీతి బాలకునిం జూచి తండ్రీ! దుఃఖింపకుమని యిట్లనియె. 227**

**క. అనఘా! యీ దుఃఖమునకుఁ, బనిలే దన్యులకు సొలయ బలవంతంబై**
**తన పూర్వ జన్మ దుష్కృత, ఘనకర్మము వెంట నంటఁగా నెవ్వలనన్. 228**

* కన్న తల్లి చిన్ని కుమారునితో ఇలా అన్నది. "నాయనా! ఏడువకు! మన దుఃఖానికి ఇతరులను అనవలసిన పనిలేదు. పూర్వజన్మంలో చేసిన పాపం మానవులను వెంబడించి వస్తుంది. దానిని అనుభవింపక తప్పదు.

**వ. కావున. 229**

**క. పెనిమిటి చేతను బెండ్లా, మని కాదు నికృష్టదాసి యనియును బిలువం**
**గను జాలని దుర్భగురా, లనఁగల నా కుక్షి నుదయ మందినకతనన్. 230**

* అందుకే నన్ను మీ నాన్నగారు భార్యగానే కాదు, చివరకు దాసిగా కూడ చూడటం లేదు. అటువంటి నిర్భాగ్యు రాలినైన నా కడుపున పుట్టిన కారణం చేత నీకూ అవమానం తప్పలేదు.

**క. నిను నాడిన యా సురుచి వ, చనములు సత్యంబు లగును; సర్వశరణ్యుం**
**డనఁగల హరిచరణంబులు, గను జనకుని యంక మెక్కఁగాఁ దలఁ తేనిన్. 231**

* నీ సవతి తల్లి సురుచి నీతో పలికిన పలుకులు వాస్తవమే. నిజంగా నీకు తండ్రి తొడలపై కూర్చోవాలనే ఆశ ఉన్నట్లయితే అందరకూ దిక్కు అయిన హరిపాదాలను ఆరాధించు.

**వ. కావునం బినతల్లియైన యా సురుచి యాదేశంబున నధోక్షజు నాశ్రయింపు మని వెండియు నిట్లనియె.232**

* నీ పినతల్లియైన సురుచి ఆజ్ఞను తలదాల్చి నారాయణుని శరణు పొందు'' అని తల్లి మళ్ళీ యిలా అన్నది.

**సీ. పరికింప నీ విశ్వపరిపాలనమునకై యర్థి గుణవ్యక్తుఁ డైనయట్టి**
**నారాయణుని పాదనలినముల్ సేవించి తగ బ్రహ్మ బ్రహ్మపదంబు నొందె;**
**ఘనుఁడు మీ తాత యా మనువు సర్వాంతర యామిత్వ మగు నేకమైన దృష్టిఁ**
**జేసి యాగముల యజించి తా భౌమ సుఖములను దివ్యసుఖముల మోక్ష**

**తే. సుఖములను బొందె నట్టి యచ్యుతునిఁ బరుని, వితత యోగీంద్ర నికర గవేష్యమాణ**
**చరణ సరసిజ యుగళు శశ్వత్ప్రకాశు, భక్తవత్సలు విశ్వసంపాద్యు హరిని. 233**

* "లోకాలను రక్షించటం కోసం శ్రీమన్నారాయణుడు సగుణ స్వరూపం గ్రహించాడు. ఆ నారాయణుని పాదపద్మాలను ఆరాధించి బ్రహ్మదేవుడు బ్రహ్మపదాన్ని అందుకున్నాడు. మీ తాతయైన స్వాయంభువ మనువు భగవంతుని సర్వాంతర్యామిత్వాన్ని గుర్తించి ఏకాగ్రతతో యజ్ఞాలను చేసి ఆ దేవదేవుని సేవించాడు. ఆందువల్ల ఆయన ఇహలోక సుఖాలూ, పరలోక సుఖాలూ అనుభవించి పరమపదం ప్రాపించాడు.

హరి నాశం లేనివాడు. ఆయన పాదపద్మాలు యోగీంద్రులు అన్వేషించి ఆరాధిస్తారు. ఆయన అనంత కాంతి స్వరూపుడు, భక్తవత్సలుడు, విశ్వసంసేవ్యుడు. ఆయనను ఆశ్రయించు''.

**వ. మఱియును. 234**

**క. కరతల గృహీత లీలాం, బురుహ యగుచుఁ బద్మగర్భముఖ గీర్వాణుల్**
**పరికింపం గల లక్ష్మీ, తరుణీమణిచేత వెదకఁదగు పరమేశున్. 235**

* "బ్రహ్మదేవుడు మొదలయిన దేవతలు వెదకినా కనిపించని లక్ష్మీదేవి తన కరతలంలో లీలా కమలాన్ని ధరించి ఆ కమలాక్షుని కోసరం వెదకుతూ ఉంటుంది.''

## -: ధ్రువుఁడు నారదోపదేశంబు వడసి తపంబు సేయుట :-

**వ. నిజధర్మపరిశోభితంబైన యేకాగ్రచిత్తంబున నిలిపి సేవింపు; మమ్మహాత్ముని కంటె నీ దుఃఖం బపన యించువాఁ డన్యుం డొక్కరుండు గలండే? యని పలికినఁ బరమార్థ ప్రాప్తి హేతుకంబులైన తల్లి వాక్యంబులు విని తన్నుఁ దాన నియమించుకొని పురంబువెడలి చను నవసరంబున నారదుండు దద్వృత్తాంతం బెఱింగి యచ్చటికిం జనుదెంచి యతని చికీర్షితంబుఁ దెలిసి పాపనాశకరంబైన తన**

**కరతలంబున ధ్రువుని శిరం బంటి మానభంగంబునకు సహింపని క్షత్రియుల ప్రభావం బద్భుతంబు గదా? బాలకుండయ్యుఁ బినతల్లి యాడిన దురుక్తులు చిత్తంబునం బెట్టి చనుచున్నవాఁడని మనంబున నాశ్చర్యంబు నొంది "యోబాలక! సకల సంపత్సమృద్ధంబగు మందిరంబు దెగడి యొంటి నెందు నేగెదవు? స్వజనకృతం బగు నవమానంబుచే నిను సంతప్తుంగాఁ దలంచెద" ననిన ధ్రువుం డిట్లనియె; సపత్నీ మాతృ వాగిషు క్షతంబగు వ్రణంబు భగవద్ధ్యానయోగ రసాయనంబున మాపికొందు ననిన ధ్రువునికి నారదుం డిట్లనియె. 236**

* "కాబట్టి ధర్మాయత్తమై ఏకాగ్రమైన చిత్తంలో శ్రీమన్నారాయణుని నిలిపి ఆరాధించు. నీ దుః ఖాన్ని తొలగింప గలిగినవాడు అత డొక్కడే'' అన్నది సునీతి. కార్యసిద్ధికి కారణా లయిన కన్నతల్లి మాటలను ధ్రువుడు ఆలకించాడు. మనస్సును గట్టిపరచుకున్నాడు. పట్టణమునుండి బయటికి నడిచాడు.

అప్పుడు నారదమహర్షి ఆ వృత్తాంతాన్ని దివ్యదృష్టిచేత గ్రహించి అతని దగ్గరకు వచ్చాడు. అతని కోర్కె తెలిసి కొని ఎల్ల పాపాలను పారదోలే తన చల్లని చేతితో ధ్రువకుమారుని శిరస్సును స్పృశించాడు. క్షత్రియులు గౌరవహానిని సహించరు. వారి తేజస్సు అద్భుతమైనది కదా! ఇతడు పసివాడు. అయినప్పటికీ పినతల్లి పలికిన దుర్వాక్కులు మనస్సులో ఉంచుకొని నగరం నుంచి బయటికి వెళ్ళిపోతున్నాడు''- అని మనస్సులో ఆశ్చర్యపడి యిలా అన్నాడు. "నాయనా! సకల సంపదలు కలిగిన గృహాన్ని విడిచి ఒంటరిగా ఎక్కడికి పోతున్నావు? బంధువులు చేసిన అవమానంచేత బాధపడుతున్న ట్లున్నావు.'

నారదుని మాటలు విని ధ్రువుడు "మహాత్మా! సవతి తల్లి పలికిన ములుకుల వంటి పలుకులవల్ల నా మనస్సు గాయపడింది. ఆ పుండును భగవద్ధ్యానం అనే ఔషధంచేత నయం చేసుకుంటాను'' అన్నాడు. ఆ మాటలు విని నారదుడు ధ్రువునితో ఇట్లా అన్నాడు.

**క. విను పుత్రక! బాలుఁడవై, యనయంబును గ్రీడలందు నాసక్తమనం
బునఁ దిరిగెడు నిక్కాలం, బున నీ కవమాన మానములు లే వెందున్. 237**

* బిడ్డా! విను. నీవు పసివాడవు. ఆట పాటలతో ఎక్కువ మక్కువ చూపే వయస్సు నీది. ఈ వయస్సులో గౌరవాగౌరవాలు పట్టించుకొనే పనిలేదు.

**తే. కాన మనమునఁ దద్వివేకంబు నీకుఁ, గలిగెనేనియు సంతోషకలితు లయిన
పురుషు లాత్మీయకర్మ విస్ఫురణఁ జేసి, వితత సుఖదుఃఖము లనుభవింతు రెపుడు. 238**

* ఒక వేళ మంచీ చెడూ నిర్ణయించే అలాంటి వివేకం నీకు ఉన్నప్పటికీ, నీవు దుఃఖపడకూడదు. సుఖదుఃఖాలు మానవులకు పూర్వం తాము చేసిన కర్మలను బట్టి కలుగుతూ ఉంటాయి. వాటిని అనుభవింపక తప్పదు.

**వ. కావున వివేకంబు గల పురుషుండు దనకుం బ్రాప్తంబులగు సుఖదుఃఖంబులు దైవవశంబులుగాఁ దలంచి తావన్మాత్రంబునం బరితుష్టుండగు; నీవును దల్లి చెప్పిన యోగమార్గ ప్రకారంబున సర్వేశ్వరానుగ్రహంబుఁ బొందెద నంటివేని. 239**

* కాబట్టి, తెలివిగలవాడు తనకు కలిగిన సుఖదుఃఖాలు దైవసంకల్పం వల్ల కలిగినవే అని భావిస్తాడు. దైవం ఇచ్చిన దానితోనే తృప్తిపొందుతాడు. మీ తల్లి చెప్పిన యోగమార్గాన్ని అనుసరించి భగవంతుని అనుగ్రహం పొందాలని నీవు అనుకుంటున్నావు. ఆ యోగమార్గం చాల కష్టంతో కూడుకున్నది.

**సీ. అనఘాత్మ! యోగీంద్రు లనయంబు ధరఁ బెక్కు జన్మంబులందు నిస్సంగమైన**
**మతిని బ్రయోగ సమాధినిష్ఠలఁ జేసి యైనను దెలియ లే రతని మార్గ;**
**మది గాన యతఁడు దురారాధ్యుఁ డగు నీకు; నుడుగుము నిష్ఫలోద్యోగ మిపుడు**
**గాక నిశ్శ్రేయస కాముండ వగుదేనిఁ దంద్రి వర్తించు తత్కాలమందుఁ**

**తే. బూని సుఖదుఃఖముల రెంటిలోన నెద్ది, దైవ వశమునఁ జేకుఱు దానఁజేసి**
**డెందమునఁ జాల సంతుష్టి నొందువాఁడు, విమల విజ్ఞాని యన భువి వెలయుచుండు. 240**

* కలుష మెరుగని చిట్టి తండ్రీ! యోగీంద్రులు పెక్కు జన్మలలో నిస్సంగులై తీవ్రమైన సమాధి యోగాన్ని అభ్యసించారు. అయినప్పటికీ ఆ దేవుని స్వరూపాన్ని తెలుసుకోలేకుండా ఉన్నారు. ఆ హరిని ఆరాధించటం చాల కష్టం. కాబట్టి వ్యర్థమైన ఈ ప్రయత్నాన్ని విరమించుకో. మోక్షమందు నీకు కోరిక ఉన్నట్లయితే ముసలితనంలో అందుకోసం ప్రయత్నించు. దైవ వశాన సుఖదుఃఖాలు రెంటిలో ఏది కలిగినా మనస్సులో సంతోషించేవాడు "విజ్ఞాని" అనిపించుకుంటాడు.

**వ. మఱియు గుణాఢ్యుం డగువానిం జూచి సంతోషించుచు నాభాసుం డగు వానిం జూచి కరుణించుచు సమానునియెడ మైత్రి సలుపుచు వర్తించుచున్నవాఁడు తాపత్రయాదికంబులం దొఱంగునని నారదుండు పలికిన విని ధ్రువుం డిట్లనియె; ననఘా; యీ శమంబు సుఖదుఃఖ హతాత్ము లగు పురుషులకు దుర్గమం బని కృపాయత్తుండ వైన నీచేత వినంబడె; నట్లయినం బరభయంకరంబగు క్షాత్రధర్మంబు నొందిన యవినీతుండ నగు నేను సురుచి దురుక్తిబాణ వినిర్భిన్న హృదయుండ నగుట మదీయ చిత్తంబున శాంతి నిలువదు; కావునం ద్రిభువనోత్కృష్టంబు ననన్యాధిష్ఠితంబు నగు పదంబును బొంద నిచ్చించిన నాకు సాధుమార్గంబు నెఱింగింపుము; నీవు భగవంతుండగు నజుని యూరుపు వలన జనించి వీణావాదన కుశలుండవై జగద్ధితార్థంబు సూర్యుండునుంబోలె వర్తింతు వనిన విని. 241**

* గుణవంతుని చూచి సంతోషించాలి. గుణహీనుని చూచి జాలిపడాలి. తనతో సమానుడైన వానితో స్నేహం చేయాలి. తాపత్రయాలు ఇలా ప్రవర్తించే వాని దరిచేరవు.

నారదుని మాటలు విని ధ్రువుడు ఇలా అన్నాడు. "స్వామీ సుఖదుఃఖాలవల్ల తెలివి కోల్పోయిన వారికి శాంతి దుర్లభం అని నీవు చెప్పావు. శత్రువులకు భయం కలిగించే క్షాత్ర ధర్మాన్ని నేను అవలంబించాను. కాబట్టి నాకు వినయం ఎక్కడిది? అందుచేత సురుచి పలికిన దుర్భాషలు అను బాణాలచేత బద్దలైన నా హృదయంలో శాంతికి చోటులేదు. కాబట్టి మూడు లోకాలలోనూ శ్రేష్ఠమైనదీ, ఇతరు లెవ్వరూ పొందనిది అయిన స్థానాన్ని నేను పొందాలని ఆశపడుతున్నాను. అందుకు నాకు చక్కని ఉపాయాన్ని ఉపదేశించు.

నీవు బ్రహ్మదేవుని ఊరువు నుండి ఉదయించావు. నేర్పుతో వీణను మ్రోగిస్తూ లోకాలకు మేలు కలిగించే నిమిత్తం సూర్యభగవానునివలె సంచరించే మహానుభావుడివి.''

**క. నారదుఁ డిట్లను ననఘ! కు, మారక! విను నిన్ను మోక్షమార్గంబునకున్**
**బ్రేరేచినవాఁ డిప్పుడు, ధీరజనోత్తముఁడు వాసుదేవుం డగుటన్. 242**

**వ. నీవు నమ్మహాత్ముని నజస్రధ్యాన ప్రవణ చిత్తుండవై భజియింపుము. 243**

*** అప్పుడు ధ్రువుని మాటలు విని నారదుడు ఇలా అన్నాడు.**

* కుమారా! నీవు నిర్మల హృదయుడవు. నిన్ను మోక్షమార్గాన్ని పొందటానికి ప్రేరేపించినవాడు పురుషోత్తముడైన శ్రీమన్నారాయణుడే. సందేహం లేదు. కాబట్టి ఏకాగ్రమైన చిత్తంతో ఆ మహానుభావుణ్ణి సేవించు.

**క. పురుషుఁడు దవిలి చతుర్విధ, పురుషార్థశ్రేయ మాత్మఁ బొందెద ననినన్**
**ధరఁ దత్ప్రాప్తికి హేతువు, హరిపదయుగళంబు దక్క నన్యము గలదే? 244**

* ధర్మార్థ కామ మోక్షాలు అనే నాలుగు విధాలైన పురుషార్థాలను పొందాలి అని అనుకునేవాడు హరి పాదపద్మాలను సేవించాలి. అంతే తప్ప మరొక మార్గం లేదు.

**వ. కావున. 245**

**క. వర యమునానదితటమున, హరి సాన్నిధ్యంబు శుచియు నతిపుణ్యమునై**
**పరఁగిన మధువనమునకును, సరసగుణా! చనుము మేలు సమకుఱు నచటన్. 246**

* కాబట్టి యమునానది ఒడ్డున ఉన్న మధువనానికి వెళ్ళు. అది హరికి నివాసస్థానం. ఆ ప్రదేశం పవిత్రమైంది. పుణ్యప్రద మైనది. సుగుణనిధీ! అక్కడికి వెళ్లితే నీకు మేలు కలుగుతుంది.

**క. ఆ యమునా తటినీ శుభ, తోయములం గ్రుంకి నిష్ఠతో నచ్చట నా**
**రాయణునకును నమస్కృతు, లాయతమతిఁ జేసి చేయు యమనియమములన్. 247**

* శుభప్రదాలయిన ఆ యమునాదీజలాలలో స్నానం చేసి నిశ్చలమైన బుద్ధితో నారాయణునకు నమస్కరించు. యమ నియమాలను అవలంబించు.

**వ. మఱియు బాలుండ వగుటంజేసి వేదాధ్యయనాద్యుచిత కర్మానర్హుండ వయ్యు నుచితంబులగు కుశాజినంబులం జేసి స్వస్తిక ప్రముఖాసనంబులం గల్పించికొని త్రివృత్ప్రాణాయామంబులచేతం బ్రాణేంద్రియ మనోమలంబు లను చాంచల్య దోషంబుల హరించి స్థిరం బయిన చిత్తంబున. 248**

* నీవు పసివాడవు. అందుచేత వేదాలను పఠించే అర్హత నీకు లేదు. అయినప్పటికీ దర్భలతోనూ, జింక చర్మంతోనూ స్వస్తికం మొదలయిన ఆసనాలను కల్పించుకో. పూరకమూ, రేచకమూ, కుంభకమూ అనే ఈ మూడు విధా లయిన ప్రాణాయామాలను అభ్యసించు. ప్రాణేంద్రియ మనోమలాలను పోగొట్టుకొని చాంచల్య దోషాలను తొలగించుకో. స్థిరమైన మనస్సుతో హరిని ధ్యానించు.

**సీ. ఆశ్రిత సత్ప్రసాదాభి ముఖుండును నిద్ధప్రసన్నాననేక్షణుండు**
**సురుచిర నాసుండు సుభ్రూయుగుండును సుకపోలతలుఁడును సుందరుండు**
**హరినీల సంశోభితాంగుండుఁ దరుణుండు నరుణావలోక నోష్ఠాధరుండు**
**గరుణాసముద్రుండుఁ బురుషార్థ నిధియును బ్రణతాశ్రయుండు శోభనకరుండు**

**తే. లలిత శ్రీవత్సలక్షణ లక్షితుండు, సర్వలోక శరణ్యుండు సర్వసాక్షి**
**పురుష లక్షణ యుక్తుండుఁ బుణ్యశాలి, యసిత మేఘనిభశ్యాముఁ డవ్యయుండు.** 249

* శ్రీహరి ఆశ్రితులందు అపారమైన కృపారసం చూపేవాడు. సుప్రసన్నమైన ముఖమూ, చల్లని చూపులూ కలవాడు. అందమైన ముక్కు కలవాడు. సొగసైన కనుబొమలు కలవాడు. చిక్కని చెక్కిళ్లు కలవాడు. చక్కనివాడు. ఇంద్రనీల మణులవలె ప్రకాశించు మేను కలవాడు. పడుచువాడు. ఎఱ్ఱని నేత్రాలు, పెదవులు కలవాడు. దయా సముద్రుడు. పురుషార్థాలను ప్రసాదించేవాడు. నమస్కరించే వారికి ఆశ్రయ మిచ్చేవాడు. శుభాలను కలిగించేవాడు. శ్రీవత్సం అనే అందమైన పుట్టుమచ్చ కలవాడు. సర్వలోక రక్షకుడు. సర్వమునూ చూచేవాడు. ఉత్తమ లక్షణాలు గల పురుషోత్తముడు. పుణ్యస్వరూపుడు. నీలమేఘశ్యాముడు. అవ్యయుడు.

**వ. మఱియును.** 250

**సీ. హార కిరీట కేయూర కంకణ ఘన భూషణుం డాశ్రిత పోషణుండు**
**లాలిత కాంచీకలాప శోభిత కటి మండలుం డంచిత కుండలుండు**
**మహనీయ కౌస్తుభమణి ఘృణిచారు గ్రైవేయకుం డానంద దాయకుండు**
**సలలిత ఘన శంఖ చక్ర గదా పద్మ హస్తుండు భువన ప్రశస్తుఁ డజుఁడు**

**తే. గమ్ర సౌరభ వనమాలికా ధరుండు, హతవిమోహుండు నవ్యపీతాంబరుండు**
**లలిత కాంచన నూపురాలంకృతుండు, నిరతిశయసద్గుణుఁడు దర్శనీయతముఁడు.** 251

* ఆ హరి హారాలు, కిరీటం, భుజకీర్తులు, మొదలైన అలంకారాలతో అలరారుతుంటాడు. ఆయన కటిప్రదేశం అందమైన మొలనూలు చేత ప్రకాశిస్తుంటుంది. ఆయన చెవులకు మకరకుండలాలు ధరిస్తాడు. కౌస్తుభం అనే గొప్ప మణి కాంతులతో కమనీయమైన కంఠమాలికను ధరిస్తాడు. ఆయన ఆనందాన్ని కలిగించేవాడు. శంఖం, చక్రం, గద, పద్మం అనే నాల్గింటినీ నాల్గు చేతులతో పట్టుకొని ఉంటాడు. ఆయన లోకాలలో ప్రశస్తి కెక్కినవాడు. పుట్టుక లేనివాడు. కమ్మని సువాసనగల వనమాలను మెడలో వేసుకుంటాడు. ఆ హరి అజ్ఞానాన్ని పోగొట్టేవాడు. సరిక్రొత్త పచ్చని పట్టు వస్త్రాన్ని కట్టుకుంటాడు. మేలిమి బంగారు అందెలు ఆయన కాళ్లకు అలంకరింపబడి ఉంటాయి. గొప్ప సద్గుణాలు కలవాడు. చూడదగిన వారిలో అగ్రగణ్యుడు. భక్తజన శరణ్యుడు.

క. సరసమనోలోచన ము, త్కరుఁడును హృత్పద్మకర్ణికా నివసిత వి
స్ఫుర దురునఖ మణిశోభిత, చరణ సరోజాతుఁ డతుల శాంతుఁడు ఘనుఁడున్. 252

* ఆ శ్రీహరి ఆశ్రితుల మనస్సులకూ, కన్నులకూ ఆనందం కలిగించేవాడు. భక్తుల హృదయ పద్మాలలో ప్రకాశించే పాదపద్మాలు కలవాడు. సాటిలేని శాంత స్వభావుడు, మహానుభావుడు.

**వ. అయిన పురుషోత్తముం బూజించుచు హృదయగతుండును, సానురాగ విలోకనుండును, వరదశ్రేష్ఠుం డును నగు నారాయణు నేకాగ్రచిత్తంబున ధ్యానంబు సేయుచుఁ బరమ నివృత్తి మార్గంబున ధ్యాతుండైన పురుషోత్త ముని దివ్య మంగళ స్వరూపంబు చిత్తంబునం దగిలిన మరల మగుడ నేర దదియునుంగాక యేమంత్రంబేని సప్తవాసరంబులు పఠియించిన ఖేచరులం గనుంగొను సామర్థ్యంబు గలుగు; నట్టి ప్రణవయుక్తంబగు ద్వాదశాక్షర కలితంబును దేశకాల విభాగ వేది బుధానుష్ఠితంబును నయిన వాసుదేవ మంత్రంబునం జేసి. 253**

* అటువంటి పురుషోత్తముని పూజించు. హృదయంలో కుదురుకున్న వాడునూ, అనురాగమయ వీక్షణాలు వెదచల్లే వాడునూ, వరాలు ఇచ్చే పరాత్పరుడునూ అయిన నారాయణ దేవుని అచంచలమైన మనస్సుతో ధ్యానించు. అప్పుడు ఆ పురుషోత్తముని దివ్యమంగళ విగ్రహం మనస్సులో సాక్షాత్కరించి స్థిరంగా నిలిచిపోతుంది. వాసుదేవ మంత్రం ఓంకారంతో కూడినది. పన్నెండు అక్షరాలు కలిగినది. దేశకాల విభాగాలు తెలుసుకొని ఆ మంత్రాన్ని జపించాలి. "ఓం నమో భగవతే వాసుదేవాయ" అనే ఆ వాసుదేవ మంత్రాన్ని ఏడు దినాలు జపించి నట్లయితే దేవతలను దర్శించే శక్తి కలుగుతుంది.

**సీ. దూర్వాంకురంబుల దూర్వాంకురశ్యాము జలజంబులను జారుజలజనయనుఁ
దులసీ దళంబులఁ దులసికా దాముని మాల్యంబులను వినిర్మల చరిత్రుఁ
బత్త్రంబులను బక్షిపత్త్రుని గడు వన్య మూలంబులను నాది మూలఘనుని
నంచిత భూర్జత్వగాది నిర్మిత వివిధాంబరంబులను బీతాంబరధరుఁ
తే. దనరు భక్తిని మృచ్ఛిలాదారు రచిత, రూపములయందుఁ గాని నిరూఢమైన
సలిలములయందుఁ గాని సుస్థలములందుఁ, గాని పూజింప వలయు న క్కమలనాభు. 254**

* గరికపోచల వలె శ్యామల వర్ణం గల వాసుదేవుణ్ణి గరికపోచలతో పూజించాలి. పద్మాలవంటి కన్నులు కలవాడు కాబట్టి పద్మాలతో పూజించాలి. తులసిదండలు ధరిస్తాడు. కాబట్టి తులసీ దళాలతో పూజించాలి. మాలిన్యం లేని శీలం కల ఆ స్వామిని పూలమాలలతో సేవించాలి. ఆ ఖగరాజగమనుణ్ణి, చిగురాకులతో ఆరాధించాలి. లోకాలకు మూలమైన వాడు, కాబట్టి వనమూలికలతో అర్చించాలి. పచ్చని పట్టు పుట్టాలు కట్టుకునే పరమాత్ముణ్ణి చెట్టు పట్టలతో నేసిన నార బట్టలతో సేవించాలి. భగవంతుణ్ణి మృణ్మయ, శిలామయ, దారుమయ ప్రతిమలలో కానీ నిర్మల జలాలలోకానీ, పవిత్ర స్థలాలోకానీ ఆరాధించాలి.

క. ధృత చిత్తుఁడు శాంతుండు ని, యత పరిభాషణుఁడు సుమహితాచారుఁడు వ
ర్ణిత హరిమంగళ గుణుఁడును, మితవన్యాశనుఁడు నగుచు మెలఁగఁగ వలయున్. 255

* మనో నిగ్రహం కలవాడై, శాంతుడై, మితభాషియై, సదాచార సంపన్నుడై, కందమూలాశనుడై శ్రీహరి కల్యాణగుణ గణాలను ధ్యానించాలి.

వ. ఉత్తమశ్లోకుండగు పుండరీకాక్షుండు నిజమాయాస్వేచ్ఛావతార చరితంబులచేత నచింత్యంబుగా నెద్ది సేయు నద్ది హృదయగతంబుగా ధ్యానంబు సేయందగు. మఱియుఁ గార్య బుద్ధింజేసి చేయంబడు పూజావిశేషంబులు వాసుదేవమంత్రంబున సర్వేశ్వరునికి సమర్పింప వలయు; నిట్లు మనోవాక్కాయ కర్మంబులచేత మనోగతం బగునట్లుగా భక్తి యుక్తంబు లయిన పూజలచేతఁ బూజింపంబడి, సర్వేశ్వరుండు మాయాభిభూతులు గాక సేవించు పురుషులకు ధర్మాది పురుషార్థంబులలోన నభిమతార్థంబు నిచ్చు; విరక్తుం డగువాఁడు నిరంతరభావం బయిన భక్తియోగంబునం జేసి మోక్షంబుకొఱకు భజియించు నని చెప్పిన విని ధ్రువుండు నారదునకుం బ్రదక్షిణ పూర్వకంబుగా నమస్కరించి మహర్షిజన సేవ్యంబై సకాల సిద్ధుల నొసంగుచు భగవత్పాద సరోజాలంకృతంబైన మధువనంబునకుం జనియె నంత. 256

* పురుషోత్తముడైన పుండరీకాక్షుడు తన మాయామహిమ వల్ల ఇచ్ఛానుసారంగా పెక్కు అవతారాలను ధరించి కావించిన లీలావిశేషాలను మనస్సులో భావించాలి. ఆత్మార్పణ బుద్ధితో చేసే పూజలను ద్వాదశాక్షర మంత్రంతో వాసుదేవునకు సమర్పించాలి. ఈ విధంగా త్రికరణ శుద్ధిగా భక్తితో పూజించేవారు విష్ణుమాయలో చిక్కుకొనరు. వారికి భగవంతుడు ధర్మార్థ కామ మోక్షాలు అనే పురుషార్థాలలో కోరిన దానిని అనుగ్రహిస్తాడు. విరక్తితో ముక్తిని గోరి, భక్తితో ధ్యానించే వానికి మోక్షాన్ని ప్రసాదిస్తాడు అని నారదుడు చెప్పాడు. ఈ విధంగా నారదుడు ధ్రువునకు ఉపదేశించగా ధ్రువుడు నారదునకు ప్రదక్షిణంచేసి, నమస్కరించి, మధువనానికి బయలుదేరాడు. ఆ మధువనంలో మహర్షులు నివసిస్తారు. అది కోరిన కోర్కెలను ప్రసాదిస్తుంది. అది భగవంతుని పాదపద్మాలచేత అలంకరింపబడింది.

క. పద్మభవ సూనుఁ డుత్తానపాదుకడకు, నరిగి యా రాజుచే వివిధార్చనముల
నంది సంప్రీతుఁడై యున్నతాసనమున, నెలమిఁ గూర్చుండి యాతని వలను చూచి. 257

వ. ఇట్లనియె. 258

* తరువాత నారదమహర్షి ధ్రువుని తండ్రి అయిన ఉత్తానపాదుని దగ్గరకు వెళ్ళాడు. ఆ భూనాథుడు చేసిన నానావిధా లయిన పూజలను అందుకొని ఆనందంతో ఉన్నతాసనం పైన కూర్చున్నవాడై, ఆ రాజు వంక చూచి యిలా ప్రశ్నించాడు.

క. భూనాయక! నీ విపు డా, మ్లానాస్యుఁడ వగుచుఁ జాల మదిలో జింతం
బూనుట కేమి కతం? బన, నా నారదుతోడ నాతఁ డనియెన్ మరలన్. 259

* "రాజా ! నీ వదన సరోజం పసివాడి ఉన్నది. నీ మనస్సు లోని విచారానికి కారణం ఏమిటి"? అని నారదుడు అడిగాడు. అందుకు ఉత్తానపాదుడు ఇలా ఉత్తర మిచ్చాడు.

**క. మునివర! వివేకశాలియు, ననఘుఁడు నైదేండ్ల బాలుఁ డస్మత్ప్రియ నం**
**దనుఁ డదయుఁడ నగు నాచే, తను బరిభవ మొంది చనియెఁ దల్లియుఁ దానున్. 260**

* మునీంద్రా! నా ప్రియపుత్రుడు ధ్రువుడు అనే వాడు తెలివి గలవాడు. పాపం ఎరుగనివాడు. అయిదేండ్ల పసివాడు. దయమాలి వానిని నేను అవమానించాను. అందుకు వాడు అలిగి తల్లితో పాటు వెళ్లిపోయాడు.

**మ. చని యుగ్రాటవిఁ జొచ్చి యచ్చటఁ బథిశ్రాంతుండు క్షుత్పీడితుం**
**డును సంమ్లానముఖాంబుజుండు ననఘుండున్ బాలకుండైన మ**
**త్తనయున్ ఘోరవృకాహిభల్ల ముఖసత్త్వశ్రేణి భక్షించెనో**
**యని దుఃఖించెద నాదు చిత్తమున నార్యస్తుత్య! యిట్లౌటకున్. 261**

* ఆ విధంగా వెళ్ళిపోయిన మా ధ్రువుడు భయంకరమైన అడవిలో ప్రవేశించాడేమో! మార్గాయాసంతో, ఆకటి బాధతో వాని ముఖపద్మం వాడిపోయి ఉంటుంది. పసివాడిన ఆ పసివాణ్ణి ఏ పాపం ఎరుగని వాణ్ణి తోడేళ్లు, సర్పాలు, ఎలుగుబంట్లు మొదలయిన క్రూరజంతువులు పొట్టను పెట్టుకున్న వేమో! అనే భయంతో, బాధతో లోలోపల కుమిలి పోతున్నాను. మహానుభావా! ఇలా జరిగినందుకు దుఃఖిస్తున్నాను.

**తే. అట్టి యుత్తమబాలు నా యంకపీఠ, మందుఁ గూర్చుండనీక నిరాకరించి**
**యంగనాసక్త చిత్తుండ నైన యట్టి, నాదు దౌరాత్మ్య మిది మునినాథచంద్ర! 262**

* అటువంటి మంచి పిల్లవానిని "నా ఒడిలో కూర్చోవద్దు" అని అవమానించాను. మునీంద్రచంద్రా! నా చిన్న భార్యయైన సురుచి మీది వలపుతో ఈ దుర్మార్గపు పని చేశాను.

**ఉ. నా విని నారదుండు నరనాథున కిట్లను నీ కుమారుఁ డా**
**దేవకిరీట రత్నరుచిదీపిత పాదసరోజుఁడైన రా**
**జీవదళాక్ష రక్షితుఁ డశేష జగత్పరికీర్తనీయ కీ**
**ర్తీ విభవ ప్రశస్త సుచరిత్రుఁడు; వానికి దుఃఖ మేటికిన్? 263**

* ఉత్తానపాదుని మాటలు విని నారదుడు ఇలా అన్నాడు. రాజా! నీ నందనుణ్ణి నారాయణుడు రక్షించాడు. ఆ నారాయణుడు దేవతల కిరీటాలయందలి రత్నకాంతులతో ప్రకాశించే పాదపద్మాలు కలవాడు. ఇక నీ కొడుకంటావా! సమస్తలోకాలూ ప్రస్తుతించే కీర్తి సంపద గలవాడు. ప్రసిద్ధికెక్కిన మంచి ప్రవర్తన గలవాడు. అటువంటి వానికోసం నీవు వగవ వలసిన పనిలేదు.

ఉ. కావున న మ్మహాత్ముఁడు సుకర్మము చేత సమస్తలోక పా
లావళి కందరాని సముదంచిత నిత్యపదంబునం బ్రభు
శ్రీవిల్లసిల్లఁ జెందుఁ దులసీదళదాము భజించి; యా జగ
త్పావనుఁడైన నీ సుతు ప్రభావ మెఱుంగవు నీవు భూవరా! 264

* ఆ మహానుభావుడు విష్ణుదేవుని సేవించి సమస్త దిక్పాలకులకూ పొందరాని నిత్యపదానికి అధీశ్వరుడు అవుతాడు. లోకపావను డయిన నీ కొడుకు ప్రభావం నీకు తెలియదు రాజా!

వ. అదియునుం గాక. 265

క. నీ కీర్తియు జగముల యం, దాకల్పము నొందఁజేయు నంచితగుణ ర
త్నాకరుఁ డిట కేతెంచును, శోకింపకు మతనిఁగూర్చి సుభగచరిత్రా! 266

* అంతేకాదు; అతడు నీ కీర్తిని కల్పాంతం వరకూ సుస్థిరంగా ఉంటేటట్లు చేస్తాడు. అతడు సుగుణ రత్నా కరుడు. అచిర కాలంలో నీ దగ్గరకు వస్తాడు. సచ్చరిత్రా! నీ పుత్రుని కోసం నీవు విచారింపవద్దు.

క. అని నారదుండు పలికిన, విని మనమున విశ్వసించి విభుఁడును బ్రియ నం
దనుఁ జింతించుచు నాదర, మునఁ జూడం డయ్యె రాజ్యమును బూజ్యముగన్. 267

* నారదుడు చెప్పిన మాటలను రాజు తన మనస్సులో విశ్వసించాడు. ప్రియపుత్రుని తలంచుకొంటూ పూజ్యమైన రాజ్యభోగాల మీదకూడ ఆదరం తగ్గించుకున్నాడు.

వ. అంత నక్కడ నా ధ్రువుండు. 268

క. చని ముందటఁ గనుఁగొనె మధు, వనమును ముని దేవ యోగి వర్ణిత గుణ పా
వనమును దుర్భవ జలద ప, వనమును నిఖిలైక పుణ్యావరభవనంబున్. 269

* నారదునివల్ల వాసుదేవ మంత్రాన్ని ఉపదేశం పొందిన ధ్రువుడు "మధువనం" చేరుకున్నాడు. ఆ మధువనం మునులు, దేవతలు, యోగులు మొదలయినవారి పొగడ్తలకు పాత్రమైనది. సంసారం అనే మబ్బును చెదరగొట్టటంలో ప్రభంజనం వంటిది. సమస్త పుణ్యాలకూ ఉనికి పట్టైనది.

వ. అట్లు గని డాయంజని యమునానదిం గృతస్నానుండై నియతుండును, సమాహిత చిత్తుండును నై సర్వేశ్వరుని ధ్యానంబు సేయుచుం ద్రిరాత్రంబుల కొక్కమాఱు కృత కపిత్థ బదరీ ఫలసారణుం డగుచు దేహస్థితి ననుసరించి యొక్క మాసంబు హరిం బూజించి, యంత నుండి యాఱేసి దినంబుల కొక్కపరి కృత జీర్ణతృణ పర్ణాహారుం డగుచు, రెండవ మాసంబున విష్ణుసమారాధనంబు సేసి, యంతనుండి నవరాత్రంబుల కొకమా ఱుదక భక్షణంబు సేయుచు, మూఁడవ మాసంబున మాధవు నర్చించి. యంతనుండి ద్వాదశదినంబుల కొకమాఱు వాయుభక్షణుం డగుచు; జితశ్వాసుండై నాలవ మాసంబునం, బుండరీకాక్షుని భజియించి యంత నుండి, మనంబున నలయక నిరుచ్ఛ్వాసుండై

**యేక పదంబున నిలిచి, పరమాత్మం జింతించుచు, నచేతనంబైన స్థాణువుంబోలె నైదవ మాసంబును జరపె నంత. 270**

* ధ్రువుడు మధువనంలో ప్రవేశించి యమునా నదిలో స్నానం చేశాడు. నియమంతో ఏకాగ్ర చిత్తంతో భగవంతుణ్ణి ధ్యానింపసాగాడు. శరీర స్థితినిబట్టి మూడు దినాల కొకసారి వెలగపండ్లనూ, రేగుపండ్లనూ ఆరగిస్తూ ఒక్క నెల హరిని అర్చిస్తూ, గడిపాడు. ఆరేసి దినాలకు ఒకసారి జీర్ణతృణపర్ణాలను తింటూ విష్ణు పూజలో రెండవ నెల జరిపాడు. తరువాత తొమ్మిదేసి దినాలకు ఒకమారు నీటిని త్రాగి మాధవ సమారాధనంతో మూడవ నెల నడిపాడు. అనంతరం పన్నెండేసి దినముల కొకసారి గాలిని ఆరగిస్తూ, ఉచ్ఛ్వాస నిశ్వాసాలను నిరోధించి నాల్గవమాసంలో శ్రీహరిని సేవించాడు. ఆవల ఒంటికాలిపై నిలిచి పరమాత్ముని భజించుతూ ప్రాణం లేని మ్రోడువలె నిశ్చలంగా అయిదవ నెల గడిపాడు.

**సీ. సకల భూతేంద్రి యాశయ మగు హృదయంబు నందు విషయములఁ జెందనీక**
**మహదాది తత్త్వ సమాజమ్ములకును నాధార భూతమును బ్రధాన పూరు**
**షేశ్వరుఁ డైనట్టి శాశ్వత బ్రహ్మంబుఁ దనదైన హృదయ పద్మమున నిలిపి**
**హరి రూపమున కంటె నన్యంబు నెఱుఁ గక చిత్త మవ్విభునందుఁ జేర్చియున్న**

**తే. కతన ముల్లోకములు సాలఁ గంప మొందె;, వెండియును బేర్చి యయ్యర్భకుండు ధరణి**
**నొక్కపాదంబు చేర్చి నిల్చున్న వేళఁ, బేర్చి య బ్బాలు నంగుష్ఠపీడఁ జేసి. 271**

**తే వసుమతీతల మర్ధము వంగఁజొచ్చె, భూరిమద దుర్నివారణ వారణేంద్ర**
**మెడనుఁ గుడి నొరగఁగ నడుగడుగునకును, జలన మొందుచు నడఁగెడు కలముఁ బోలె. 272**

* ధ్రువుడు చాంచల్య రహితమైన తన హృదయంలో ఇతర విషయాలను చొరనీయలేదు. మహత్తు మొదలైన తత్త్వాలకు ఆధారభూతుడూ, ప్రకృతి పురుషులకు అధీశ్వరుడూ, శాశ్వతుడూ ఆయిన భగవంతుణ్ణి తన హృదయ పద్మంలో నిలుపుకున్నాడు. శ్రీహరి రూపాన్ని తప్ప మరిదేనినీ మనస్సులో స్మరించకుండా తన చిత్తాన్ని తదాయత్తం చేశాడు. ఈ విధంగా ధ్రువుడు తీవ్రమైన తపస్సు సాగించాడు.

అతని తపః ప్రభావాన్ని సహింపలేక ముల్లోకాలు కంపించాయి.

ధ్రువుడు భూమిపై ఒంటికాలు మోపి నిలుచున్నాడు. అతని కాలి బొటనవ్రేలి ఒత్తిడికి పుడమి అటూ ఇటూ ఊగింది. మదపుటేనుగు కుడి ఎడమలకు ఒరిగినపుడు అడుగడుగునా కంపించే పడవలాగా సగం భూమి వంగి క్రుంగింది.

**చ. అతఁడు ననన్యదృష్టిని జరాచర దేహిశరీర ధారణా**
**స్థితి గల యీశునందుఁ దన జీవితమున్ ఘటియింపఁ జేసి యే**

**కతఁ గనఁ దన్నిరోధమునఁ గైకొని కంపము నొందె నీశ్వరుం;**
**డతఁడు చలింప నిజ్జగము లన్నియుఁ జంచల మయ్యె భూవరా! 273**

* ధ్రువుడు ఏకాగ్ర దృష్టితో చరాచర విశ్వానికి అధీశ్వరుడైన భగవంతుని ధ్యానించాడు. తదేకచిత్తంతో తన ప్రాణ వాయువును నిరోధించి పరమేశ్వరునితో అనుసంధానం చేశాడు. ఈ విధంగా శ్వాసను నిరోధించటం వల్ల శ్రీహరి కంపించాడు. ఆయన కంపించగానే అఖిలలోకాలూ ప్రకంపించాయి.

**క. ఆలోకభయంకరమగు, నా లోకమహావిపద్దశాలోకనులై**
**యా లోకపాలు రందఱు, నా లోకశరణ్యుఁ గాన నరిగిరి భీతిన్,. 274**

* చూడటానికి భయంకరమై లోకాలకు సంభవించిన ఆ మహావిపద్దశను ఆలోకించి అష్ట దిక్పాలకులు మొదలైన లోకపాలు రందరూ లోకరక్షకుడైన పుండరీకాక్షుని శరణు జొచ్చారు.

**వ. అట్లరిగి నారాయణు నుద్దేశించి కృతప్రణాములై కరంబులు ముకుళించి యిట్లనిరి. 275**

**చ. హరి! పరమాత్మ! కేశవ! చరాచర భూతశరీర ధారివై**
**పరఁగుదు వీవు, నిట్టులుగఁ బ్రాణనిరోధ మెఱుంగ మెందు ముం**
**దిరవుగ దేవదేవ, జగదీశ్వర! సర్వశరణ్య! నీ పదాం**
**బురుహము లర్థిమై శరణుఁ బొందెద మార్తి హరించి కావవే! 276**

* దేవత లందరూ నారాయణునకు నమస్కరించి చేతులు మోడ్చి యిలా విన్నవించారు. "పరమాత్మా! నీవు సర్వప్రాణి శరీరాలలో అంతర్యామిగా ఉండే స్వామివి. పూర్వము ఎప్పుడూ ఈ విధంగా మాకు ప్రాణనిరోధం ప్రాప్తించ లేదు. ఊపిరాడక ఉక్కిరి బిక్కిరౌతున్నాము. ఓ హరీ! కేశవా! జగదీశ్వరా! సర్వశరణ్యా! నీ చరణ కమలాలను శరణు పొందుతున్నాము. ఆపదను తొలగించి కాపాడు ప్రభూ!

**వ. అని దేవతలు విన్నవించిన నీశ్వరుండు వారల కిట్లనియె; నుత్తానపాదుం డనువాని తనయుండు విశ్వరూపుండ నయిన నాయందుఁ దన చిత్తం బైక్యంబు సేసి తపంబు గావించుచుండ దానం జేసి భవదీయ ప్రాణనిరోధం బయ్యె! నట్టి దురత్యయంబైన తపంబు నివర్తింపఁజేసెద; వెఱవక మీ మీ నివాసంబులకుం జనుండని యానతిచ్చిన నా దేవతలు నిర్భయాత్ములై యీశ్వరునకుం బ్రణామంబు లాచరించి త్రివిష్టపంబునకుం జనిరి; తదనంతరంబ. 277**

* దేవతల విన్నపం విన్న నారాయణుడు వారిని ఇలా ఓదార్చాడు. ఉత్తానపాదుని కొడుకు, ధ్రువుడు అనేవాడు విశ్వస్వరూపుడైన నాయందు తన మనస్సును సంధానపరచి తపస్సు చేస్తున్నాడు. అందువల్ల మీకు ప్రాణనిరోధం కల్గింది. తపస్సునుండి ఆ బాలుని విరమింప జేస్తాను. భయపడకండి. మీ మీ యిండ్లకు వెళ్లండి.'

ఇలా పలుకుతున్న శ్రీహరి ఆనతిని శిరసావహించి భయం తొలగి దేవతలు వాసుదేవునకు నమస్కరించి తమ లోకానికి బయలుదేరి వెళ్ళారు.

సీ. హరి యీశ్వరుండు విహంగ కులేశ్వర యానుఁడై నిజభృత్యుఁడైన ధ్రువునిఁ
గనుఁగొను వేడుక జనియింప నా మధువనమున కప్పుడు సని ధ్రువుండు
పరువడి యోగవిపాక తీవ్రంబైన బుద్ధిచే నిజమనోంబురుహ ముకుళ
మందుఁ దటిత్ప్రభాయత మూర్తి యటఁ దిరోధానంబునను నొంది తత్క్షణంబ

తే. తన పురో భాగమందు నిల్చినను బూర్వ, సమధిక జ్ఞాన నయన గోచర సమగ్ర
మూర్తిఁ గనుఁగొని సంభ్రమమునను సమ్మ, దాశ్రువులు రాలఁ బులకీకృతాంగుఁ డగుచు. 278

* ఆ తరువాత భగవంతుడైన హరి గరుడవాహన మెక్కి తన భక్తుడైన ధ్రువుణ్ణి అవలోకించే ఉత్సాహంతో మధువనానికి విచ్చేశాడు. అప్పుడు ధ్రువుడు ధ్రువమైన భక్తియోగంతో, నిశ్చలమైన బుద్ధితో తన మనస్సులో ప్రకాశిస్తున్న శ్రీహరిని, చూస్తూ ఉండటం చేత బయట ఉన్న శ్రీహరిని చూడలేక పోయాడు. ఇంతలో అతని మనస్సులోని మూర్తి మాయమై పోయింది. అప్పుడు ధ్రువుడు తనముందు సాక్షాత్కరించిన కరుణామూర్తిని కొనుగొన్నాడు. త్రొటుపాటు చెందాడు. చెక్కిళ్లపై స్రవించే ఆనంద బాష్పాలతో స్వామిని తిలకించి పులకించాడు.

## -: సాక్షాత్కరించిన భగవంతుని ధ్రువుండు స్తుతించుట :-

తే. నయనముల విభు మూర్తిఁ బానంబుసేయు, పగిదిఁ దన ముఖమునను జుంబనము సేయు
లీలఁ దగ భుజములను నాలింగనంబు, సేయుగతి దండవన్నమస్కృతు లొనర్చె. 279

* తన కందోయితో స్వామి సౌందర్యాన్ని త్రాగుతున్నట్లు, తన ముఖంతో స్వామిని ముద్దు పెట్టుకుంటున్నట్లు, తన చేతులతో స్వామిని కౌగిలించుకుంటున్నట్లు అనుభూతి పొందుతూ సాగిలపడి సాష్టాంగ నమస్కారాలు చేశాడు.

వ. ఇట్లు దండప్రణామంబు లాచరించి కృతాంజలియై స్తోత్రంబు సేయ నిశ్చయించియు స్తుతిక్రియా సమర్థుండు గాక యున్న ధ్రువునకును సమస్త భూతంబులు నంతర్యామి యైన యీశ్వరుం డాతని తలం పెఱింగి వేదమయంబయిన తన శంఖంబు చేత నబ్బాలుని కపోలతలం బంటిన జీవేశ్వర నిర్ణయజ్ఞుండును, భక్తిభావ నిష్ఠుండును నగు ధ్రువుండు నిఖిలలోక విఖ్యాత కీర్తి గల యీశ్వరుని భగవత్ప్రతిపాదితంబు లగుచు వేదాత్మకంబులైన తన వాక్కుల నిట్లని స్తుతియించె; దేవా! నిఖిలశక్తి ధరుండవు, నంతఃప్రవిష్టుండవు నైన నీవు లీనంబు లైన మదీయ వాక్యంబుల బ్రాణేంద్రియంబులం గరచరణ శ్రవణత్వగాదులను జిచ్ఛక్తిచేఁ గృపంజేసి జీవింపం జేసిన భగవంతుడవును, బరమపురుషుం డవును నైన నీకు నమస్కరింతు; నీ వొక్కరుండవయ్యు మహదాద్యంబైన యీ యశేష విశ్వంబు మాయాఖ్యం బయిన యాత్మీయ శక్తిచేతం గల్పించి యందుం బ్రవేశించి యింద్రియంబు లందు వసించుచుఁ దత్తద్దేవతారూపంబులచే నానాప్రకారంబుల దారువులం దున్న వహ్ని చందంబునం బ్రకాశింతు వదియునుం గాక. 280

* ధ్రువుడు ఈ విధంగా శ్రీహరికి సాష్టాంగ దండ ప్రణామం చేసి, దోసిలి ఒగ్గి స్తుతించటానికి పూనుకున్నాడు. కాని స్తుతి విధానం అతనికి తెలియక పోవటంచేత తడబడ్డాడు. సర్వాంతర్యామియైన భగవంతుడు ధ్రువుని తలంపు గ్రహించి వేదమయమైన తన చేతి పాంచజన్య శంఖంతో ఆ బాలుని చెక్కిలి స్పృశించాడు. ఆ ప్రభావం వల్ల జీవేశ్వర నిర్ణయాన్ని గుర్తించిన ధ్రువుడు భక్తిభావంతో భగవంతుడు ప్రసాదించిన వేదవాక్కులతో విశ్వవిఖ్యాతుడైన ఈశ్వరుణ్ణి యిలా స్తుతించాడు.

దేవా! నీవు అఖిల శక్తి సంపన్నుడవు, అంతర్యామివి, స్తంభించిపోయిన నా హక్కులనూ, ప్రాణాలనూ, నా కరచరణాది సకలేంద్రియాలనూ దయతో జ్ఞానాత్మకమైన నీ శక్తివల్ల తిరిగి బ్రతికించిన భగవంతుడవు. పరమ పురుషుడవైన నీకు నమస్కారం. నీవు ఒక్కడవే అయినప్పటికీ నీ మాయాశక్తిచేత ఈ సమస్త లోకాన్ని సృజిస్తావు. లోకంలో ప్రవేశిస్తావు. ఇంద్రియములలో నివసిస్తావు. అగ్ని ఒక్కడే అయినప్పటికీ పెక్కు దారువులలో ప్రకాశించునట్లు నీవు ఆ యా దేవతా రూపాలలో ప్రవేశించి ప్రకాశిస్తావు.

**చ. వరమతి నార్తబాంధవ! భవద్ఘన బోధసమేతుఁడై భవ**
**చ్చరణముఁ బొంది నట్టి విధి సర్గము సుప్తజనుండు బోధమం**
**దరయఁగఁ జూచురీతిఁ గనునట్టి ముముక్షు శరణ్యమైన నీ**
**చరణములం గృతజ్ఞుఁడగు, సజ్జనుఁ డెట్లు దలంపకుండెడున్. 281**

* దీనబంధూ! నిద్రనుండి మేల్కొన్నవాడు మళ్లీ ప్రపంచాన్ని చూస్తాడు. అలాగే బ్రహ్మదేవుడు నిన్ను శరణు పొంది నీవు ప్రసాదించిన జ్ఞానంచేత ఈ సమస్త ప్రపంచాన్నీ సందర్శించాడు. మోక్షం కోరేవారికి శరణాలైన నీ చరణాలను కృతజ్ఞుడైన సజ్జనుడు ఎలా మరచిపోగలడు?

**సీ. మహితాత్మ! మఱి జన్మమరణ ప్రణాశన హేతు భూతుండవు నిద్దకల్ప**
**తరువవు నగు నిన్నుఁ దగ నెవ్వరే నేమి పూని నీ మాయా విమోహితాత్ము**
**లగుచు ధర్మార్థ కామాదుల కొఱకుఁ దా మర్చించుచును ద్రిగుణాభమైన**
**దేహోపభోగ్యమై దీపించు సుఖముల నెనయంగ మదిలోన నెంతు; రట్టి**

**తే. విషయ సంబంధ జన్యమై వెలయు సుఖము, వారికి నిరయమందును వఱలు దేవ!**
**భూరి సంసార తాప నివార గుణ క, థామృతాపూర్ణ! యీశ! మాధవ! ముకుంద! 282**

* మహానుభావా! దేవదేవా! ఈశ్వరా! మాధవా! ముకుందా! జన్మ మరణాలను తొలగించి నీవు ప్రాణులను రక్షిస్తావు. తమ తమ కోర్కెలు నెరవేరటం కోసం నిన్ను సేవించేవారు నీ మాయచేత మోసగింపబడినవారే. భక్తజన కల్పవృక్షం అయిన నిన్ను దైహికాలై ఐహిక సుఖాల కోసం కొందరు సేవిస్తారు. విషయ సంబంధమైన సుఖం నరకంలో కూడా లభిస్తుంది. శౌర్యం. ఔదార్యం మొదలైన సుగుణాలతో కూడిన కథాసుధాపూరం అపారమైన సంసార తాపాలను నివారిస్తుంది.

**మ. అరవిందోదర! తావకీన చరణ ధ్యానానురాగోల్లస**
**చ్చరితాకర్ణనజాత భూరిసుఖముల్ స్వానందక(బహ్మ మం**
**దరయన్ లే వఁట! దండ భృద్ధత విమానాకీర్ణులై కూలు నా**
**సురలోకస్థులఁ జెప్ప నేల సుజనస్తోమైక చింతామణీ! 283**

* పద్మనాభా! నీవు సాధుజన చింతామణివి! నీ పాదసంస్మరణం వల్లను, అనురాగసుధలు చిందే నీ కథలను వినటంవల్లనూ ప్రాప్తించే పరమ సుఖం స్వాత్మానందభూతమైన మోక్షంలో కూడ లభించదంటారు. ఇక దండధరుని కాలదండం చేత విరిగిపడే విమానాల నుండి కూలిపోతున్న వేలుపుల మాట వేరే చెప్పటం దేనికి?

**చ. హరి! భజనీయ మార్గనియతాత్మకులై భవదీయ మూర్తిపై**
**వఱలిన భక్తియుక్తు లగువారల సంగతి! గల్గఁజేయు స**
**త్పురుష సుసంగతిన్ వ్యసన దుస్తరసాగర మప్రయత్నతన్**
**సరస భవత్కథామృత రసంబున మత్తుఁడనై తరించెదన్? 284**

* శ్రీహరీ! నిర్మలాత్ములై నీ సేవయం దాసక్తులైన భక్తులతో నాకు మైత్రి చేకూర్చు. ఆ సత్పురుషుల సాంగత్యం చేత నీ కథాసుధారసాన్ని మనసారగ్రోలి, దుఃఖాలతో నిండిన సంసార సాగరాన్ని సులభంగా తరిస్తారు.

**చ. నిరతముఁ దావకీన భజనీయ పదాబ్జ సుగంధలబ్ధి యె**
**వ్వరి మది వొందఁగాఁ గలుగు, వారలు తత్ప్రియ మర్త్యదేహము**
**న్నరయఁ దదీయదార తనయాది సుహృద్గృహ బంధు వర్గమున్**
**మఱతురు విశ్వతోముఖ! రమాహృదయేశ! ముకుంద! మాధవా! 285**

* మాధవా! ముకుందా! రమామనోహరా! విశ్వతోముఖా! నీ పాదపద్మాల సుగంధాన్ని అనుభవించిన వారు మరణ శీలమైన శరీరాన్ని లెక్కచేయరు. భార్యా పుత్రులనూ, మిత్రులనూ, భవనాలను, బంధువులనూ మరచిపోతారు.

**సీ. పరమాత్మ! మర్త్య సుపర్వ తిర్యఙ్మృగ దితిజ సరీసృప ద్విజగణాది**
**సంవ్యాప్తమును సదసద్విశేషంబును గైకొని మహదాది కారణంబు**
**నైన విరాడ్విగ్రహంబు నే నెఱుఁగుదుఁ గాని తక్కిన సుమంగళము నైన**
**సంతత సుమహితైశ్వర్య రూపంబును భూరిశబ్దాది వ్యాపార శూన్య**

**తే. మైన బ్రహ్మస్వరూప మే నాత్మ నెఱుఁగఁ, బ్రవిమలాకార! సంసార భయవిదూర!**
**పరమ మునిగేయ! సంతత భాగధేయ!, నలిన నేత్ర! రమా లలనా కళత్ర! 286**

* పరమాత్మా! మానవులు, దేవతలు, మృగాలు, రాక్షసులు, పాములు, పక్షులు మొదలయిన పలు విధాల ప్రాణులతో నిండి ప్రకృతి పురుషులతో కూడి మహదాదులకు కారణమైన నీ స్థూల రూపాన్ని నేను

ఎరుగుదును. కాని నిత్యకల్యాణమూ, నిరంతర మహైశ్వర్య సంపన్నమూ అయి, శబ్ద వ్యాపారానికి గోచరం కాని నీ పరబ్రహ్మ స్వరూపాన్ని మాత్రం నేను ఎరుగను. రాజీవనేత్రా! రమాకళత్రా! నీవు నిర్మలాకారుడవు. భవభయదూరుడవు. మునిజన సంస్తవనీయుడవు. పరమ భాగ్యధౌరేయుడవు.

**సీ. సర్వేశ! కల్పాంత సమయంబు నందు నీ యఖిల ప్రపంచంబు నాహరించి**
**యనయంబు శేషసహాయుండవై శేష పర్యంక తలమునఁ బవ్వళించి**
**యోగనిద్రా రతి నుండి నాభీసింధుజస్వర్ణ లోక కంజాత గర్భ**
**మందుఁ జతుర్ముఖు నమరఁ బుట్టించుచు రుచి నొప్పు బ్రహ్మస్వరూపివైన**

**తే. నీకు మ్రొక్కెద నత్యంత నియమ మొప్ప, భవ్యచారిత్ర! పంకజ పత్త్రనేత్ర!**
**చిరశుభాకార! నిత్యలక్ష్మీ విహార!, యవ్యయానంద! గోవింద! హరి ముకుంద!** 287

* సర్వేశ్వరా! నీవు కల్పాంత కాలంలో సర్వప్రపంచాన్ని నీలో విలీనం చేసుకుంటావు. ఆదిశేష తల్పం మీద శయనిస్తావు. యోగనిద్ర పొందుతావు. అప్పుడు నీ నాభి అనే సముద్రంలో నుండి ఉద్భవించిన హిరణ్మయమైన తామర పువ్వులోనుండి చతుర్ముఖ బ్రహ్మను పుట్టిస్తావు. అటువంటి తేజోమయమైన నీ పరబ్రహ్మస్వరూపానికి నిశ్చల నియమంతో నమస్కారం చేస్తున్నాను.

**వ. అట్లు యోగనిద్రా పరవశుండ వయ్యును జీవులకంటె నత్యంత విలక్షణుండవై యుండుదు; వది యెట్లనిన బుద్ధ్యవస్థాభేదంబున నఖండితం బయిన స్వశక్తిం జేసి చూచు లోకపాలన నిమిత్తంబు యజ్ఞాధిష్ఠాతవు గావున నీవు నిత్యముక్తుండవును, బరిశుద్ధుండవును, సర్వజ్ఞుండవును, నాత్మవును, గూటస్థుండవును, నాది పురుషుండవు, భగవంతుండవు, గుణత్రయాధీశ్వరుండవునునై వర్తింతువు; భాగ్యహీనుండైన జీవునియందు నీ గుణంబులు గలుగ; వే సర్వేశ్వరునం దేమి విరుద్ధగతులై వివిధశక్తి యుక్తంబులైన యవిద్యాదు లానుపూర్వ్యంబునం జేసి ప్రలీనంబు లగు చుండు నట్టి విశ్వకారణంబు నేకంబు ననంతంబు నాద్యంబు నానందమాత్రంబు నవికారంబు నగు బ్రహ్మంబునకు నమస్కరించెద; మఱియు దేవా! నీవ సర్వవిధఫలం బని చింతించు నిష్కాము లయిన వారికి రాజ్యాది కామితం బులలోనఁ బరమార్థం బయిన ఫలంబు సర్వార్థరూపుండవైన భవదీయ పాదపద్మ సేవనంబ; యిట్లు నిశ్చితంబ యైనను సకాములైన దీనులను గోవు వత్సంబును స్తన్యపానంబు సేయించుచు వృకాది భయంబు వలన రక్షించు చందంబునం గామప్రదుండవై సంసార భయంబువలన బాపుదు వని యిట్లు సత్యసంకల్పుండును, సుజ్ఞానియు నయిన ధ్రువునిచేత వినుతింపంబడి భృత్యానురక్తుండైన భగవంతుండు సంతుష్టాంతరంగుండై యిట్లనియె.** 288

* ఆ విధంగా యోగనిద్రలో మైమరచి ఉన్నప్పటికీ నీవు జీవుల కంటే మిక్కిలి విలక్షణంగా ఉంటావు. అవస్థా భేదాన్ని పొందిన బుద్ధితో, చెక్కుచెదరని దృష్టితో జగత్తును రక్షించటానికి విష్ణురూపాన్ని గైకొంటావు. నీవు నిత్యముక్తుడవు. పరిశుద్ధుడవు. సర్వజ్ఞుడవు. ఆత్మవు. కూటస్థుడవు. ఆది పురుషుడవు. భగవంతుడవు. మూడు

గుణాలకూ అధిపతివి. జీవుడు భాగ్యహీనుడు, అతనియందు నీ గుణములు ఉండవు. ఏ సర్వేశ్వరుని యందైతే విరుద్ధగమనం గలిగి వివిధ శక్తులతో కూడిన అవిద్యాదులు ఒక దాని వెంట ఒకటి విలీనం అవుతుంటాయో అటువంటి జగత్కారణమూ, అద్వితీయమూ, అనంతమూ, ఆద్యమూ, ఆనంద మాత్రమూ, అవికారమూ అయిన పరబ్రహ్మవు నీవు. నీకు నమస్కారం. దేవా! నిష్కాము లైనవారు నిన్నే సర్వతోముఖ ఫలంగా భావిస్తారు. వారికి రాజ్యం మొదలయిన వాంఛలలో పరమార్థమైన ఫలం సర్వాంతర్యామివైన నీ పవిత్ర పాదసేవనమే. ఇది నిశ్చయం. అయినప్పటికీ ఆవు తన దూడకు చన్నిచ్చుచూ తోడేళ్లు మొదలగు క్రూర మృగాల బారినుండి రక్షించు విధంగా సకాములైన వారి కోర్కెలు తీరుస్తూనే సంసార భయాలను తొలగిస్తావు.

ఈ విధంగా సత్సంకల్పుడు, సుజ్ఞాని అయిన ధ్రువుడు శ్రీహరిని స్తుతించాడు. అప్పుడు భృత్యులపై అత్యంత ప్రేమగల భగవంతుడు మనస్సులో సంతోషించి ఇలా అన్నాడు.

**క. ధీరవ్రత! రాజన్యకు, మారక! నీ హృదయమందు మసలిన కార్యం**
**బారూఢిగా నెఱుంగుదు, నారయ నది వొందరాని దైనను నిత్తున్. 289**

**వ. అది యెట్టి దనిన నెందేని మేధియందుఁ బరిభ్రామ్యమాణ గోచక్రంబునుంబోలె గ్రహనక్షత్ర తారాగణ జ్యోతిశ్చక్రంబు నక్షత్ర రూపంబు లయిన ధర్మాగ్ని కశ్యప శక్రులును, సప్తర్షులును, దారకా సమేతులై ప్రదక్షిణంబు దిరుగుచుండుదు; రట్టి దురాపంబును నన్యాధిష్ఠితంబును లోకత్రయ ప్రళయకాలంబు నందు నశ్వరంబు గాక ప్రకాశమానంబును నయిన ధ్రువక్షితి యను పదంబు ముందట నరువది యాఱువేలేండ్లు సనం బ్రాపింతువు; తత్పదప్రాప్తి పర్యంతంబు భవదీయ జనకుండు వనవాస గతుండైనం దద్రాజ్యంబు పూజ్యంబుగా ధర్మమార్గంబున జితేంద్రియుండవై చేయుదువు; భవదనుజుం డగు నుత్తముండు మృగయార్థంబు వనంబునకుం జని మృతుం డగుఁ; దదన్వేషణార్థంబు తదాహిత చిత్తయై తన్మాతయు వనంబునకుం జని యందు దావ దహన నిమగ్నయగు; వెండియు, 290**

* రాజకుమారా! నీ వ్రతదీక్ష అచంచల మైనది. నీ మనస్సు లోని అభిప్రాయాలు చక్కగా గ్రహించాను. అయితే అది దుర్లభమయినది. అయినప్పటికీ, నీ కోరిక తీరుస్తాను. కట్టు కొయ్య చుట్టూ పశువుల మంద తిరిగినట్లుగా గ్రహాలూ, నక్షత్రాలూ, తారాగణాలూ, జ్యోతిశ్చక్రమూ, నక్షత్ర స్వరూపా లయిన ధర్ముడు, అగ్ని, కశ్యపుడు, శుక్రుడు, సప్తర్షులు, తారకలతో కూడి దేనికి ప్రదక్షిణం చేస్తూంటారో అటువంటి "ధ్రువక్షితి" అనే మహోన్నత స్థానాన్ని ఇక పైన అరవై ఆరువేల సంవత్సరాల అనంతరం నీవు పొందుతావు. అది ఎవ్వరికీ అందరానిది. ఇదివరకు ఎవ్వరూ దానిని పొందలేదు. మూడు లోకాలూ నశించేటప్పుడు కూడా అది నశింపక ప్రకాశిస్తూ ఉంటుంది. అటువంటి స్థానాన్ని నీవు అలంకరిస్తావు. అంతవరకూ నీ తండ్రి రాజ్యాన్ని నీవు సర్వజన రంజకంగా ధర్మమార్గాన పరిపాలిస్తావు. ఇంద్రియాలను జయిస్తావు. నీ తండ్రి అడవికి పోయి వానప్రస్థాశ్రమం స్వీకరిస్తాడు. నీ తమ్ముడయిన ఉత్తముడు వేటకై అడవికి వెళ్ళి మరణిస్తాడు. అతనిని వెదుకుతూ అతనియందే మనస్సు చేర్చిన అతని తల్లి అరణ్యంలో ప్రవేశిస్తుంది. ఆమె అడవిలో కార్చిచ్చులో పడి కాలిపోతుంది.

**సీ. అనఘాత్మ! మఱినీవు యజ్ఞరూపుం డనఁ దగు నన్ను సంపూర్ణ దక్షిణంబు
లగు మఖంబులచేత నర్చించి సత్యంబు లగు నిహసౌఖ్యంబు లనుభవించి
యంత్యకాలమున నన్నాత్మఁ దలంచుచు మఱి సర్వలోక నమస్కృతమును
మహిఁ బునరావృత్తి రహితంబు సప్తర్షి మండలోన్నత మగు మామకీన**

**తే. పదము దగఁ బొందఁగల వని పరమపురుషుఁ, డతని యభిలషితార్థంబు లర్థి నిచ్చి
యతఁడు గనుఁగొను చుండంగ నాత్మపురికి, గరుడగమనుఁడు వేంచేసెఁ గౌతుకమున. 291**

* పుణ్యపురుషా! నీవు యజ్ఞ పురుషుడనైన నన్ను సంపూర్ణ దక్షిణలతో కూడిన యజ్ఞాలచేత ఆరాధిస్తావు. ఈ లోకంలోని అనంత సౌఖ్యాలను అనుభవిస్తావు. మరణ కాలంలో నన్ను మనస్సులో స్మరిస్తూ, సకల లోకాలకూ వందనీయమై, పునరావృత్తి రహితమై సప్తర్షి మండలానికి పైన ఉండే నా స్థానాన్ని పొందుతావు అని భగవంతుడు ధ్రువుడు కోరిన కోర్కెలను ప్రసాదించి, అతడు చూస్తూ ఉండగానే గరుత్మంతుణ్ణి ఆరోహించి ఆనందంగా తన పట్టణమైన వైకుంఠానికి వేంచేశాడు.

**తే. అంత ధ్రువుఁడునుఁ బంకేరుహాక్ష పాద, కమల సేవోపపాదిత ఘన మనో ర
థములఁ దనరియుఁ దనదు చిత్తంబులోనఁ, దుష్టిఁ బొందక చనియె విశిష్టచరిత! 292**

* అప్పుడు ధ్రువుడు పద్మాక్ష పాదపద్మ పరిచర్యవల్ల సమధిక మనోరథాలు సంప్రాప్తించినప్పటికీ, సంతృప్తి పొందక చింతిస్తూ వెళ్ళి పోయాడు.

**క. అని మైత్రేయుఁడు ధ్రువుఁ డ, ట్లనయము హరిచేఁ గృతార్థుఁ డైన విధం బె
ల్లను వినిపించిన విదురుఁడు, విని మునివరుఁ జూచి పలికె వినయం బెసఁగన్. 293**

* ఈ విధంగా మైత్రేయ మహర్షి ధ్రువుడు శ్రీహరి నుండి వరాలు పొందిన విధం అంతా విదురునికి వినిపించాడు. అప్పుడు విదురుడు మహర్షితో సవినయంగా ఇలా అన్నాడు.

**క. ముని నాయక! విను కాముక, జనదుష్ప్రాపంబు విష్ణు చరణాంబురుహా
ర్చన మునిజన సంప్రాప్యము, ననఁగల పంకేరుహాక్షు నవ్యయ పదమున్. 294**

**వ. పెక్కు జన్మంబులం గాని పొందరాని పదంబు దా నొక్కజన్మంబుననే పొందియుం దన మనంబునం దప్రాప్త మనోరథుండ నని పురుషార్థవేది యైన ధ్రువుం డెట్లు దలంచె ననిన మైత్రేయుం డిట్లనియె.295**

* "మునీంద్రా! కాముకులకు పొందరానిది, విష్ణు భక్తులకు పొందగల్గినదీ అయిన నారాయణుని శాశ్వతస్థానాన్ని ధ్రువుడు పొందాడు గదా! పెక్కు జన్మలెత్తిగాని పొందరాని స్థానాన్ని ఒక్క జన్మలోనే పొందికూడా తన కోర్కె సిద్ధించ లేదు అని ధ్రువుడు ఎందుకు భావించాడు? అతడు పురుషార్థాలను చక్కగా ఎరిగిన వాడు కదా!"

**తే. అనఘ! పినతల్లి దన్నుఁ బల్కిన దురుక్తి, బాణవిద్ధాత్ముఁ డగుచుఁ దద్భాషణములు
చిత్తమందుఁ దలంచుటఁ జేసి ముక్తిఁ, గోరమికి నాత్మలో వగఁ గూరుచుండె. 296**

* అప్పుడు మైత్రేయ మహర్షి విదురునితో ఇలా అన్నాడు. పినతల్లి ఆడిన దుర్భాషలు అనే బాణాలచేత ధ్రువుని మనస్సు బాగా గాయపడింది. అందుచేత ఆ దుర్భాషలనే అతడు మాటిమాటికీ స్మరిస్తున్నాడు. ఆ కారణంచేత హరి ప్రత్యక్ష మైనప్పుడు ముక్తిని కోరలేక పోయాడు. అందుకే మనస్సులో పరితపిస్తున్నాడు.

**వ. అంత నా ధ్రువుండు. 297**

**చ. అనఘ! జితేంద్రియుల్ సుమహితాత్ములు నైన సనందనాదు లెం**
**దనయ మనేక జన్మ సముపార్జిత యోగ సమాధిఁ జేసి యె**
**వ్వని చరణారవిందములు వారని భక్తి నెఱుంగుచుందు, రా**
**ఘనుఁ బరమేశు నీశు నవికారు నమేయు నజేయు నాద్యునిన్. 298**

**వ. ఏను షణ్మాసంబులు భజియించి తత్పాద పద్మచ్ఛాయం బ్రాపించియు భేదదర్శనుండ నైతి; నక్కటా! యిట్టి భాగ్యహీనుండనైన యేను భవనాశకుండైన యతనిం బొడఁగనియు నశ్వరంబులైన కామ్యంబు లడిగితి; నిట్టి దౌరాత్మ్యం బెందేనిం గలదే? తమ పదంబులకంటె నున్నత పదంబు నొందుదునో యని సహింపజాలని యీ దేవతలచేత మదీయ మతి గలుషితం బయ్యెంగాక! నాఁడు నారదుం డాడిన మాట తథ్యం బయ్యె; నతని వాక్యంబు లంగీకరింపక యే నసత్తముండనై స్వప్నావస్థలం బొందిన వాఁడు దైవికంబైన మాయం జెంది భిన్నదర్శనుండగు చందంబున నే నద్వితీయుండ నైనను భ్రాతయను శత్రువుచేఁ బ్రాప్తంబైన దుఃఖంబు నొంది జగదాత్మకుండును, సుప్రసాదుండును, భవనాశకుండును నైన యీశ్వరు నారాధించి తత్ప్రసాదంబు వడసియు నాయుర్విహీనుండైన రోగికిం బ్రయోగించు నౌషధంబుం బోలె నిరర్థకంబులైన, నశ్వరంబులైన యీ కామితంబులు గోరితి నని వెండియు. 299**

* అప్పుడు ధ్రువుడు ఇలా చింతించాడు. జితేంద్రియులూ, మహాత్ములూ అయిన సనందనుడు మొదలయిన మునీంద్రులు మిక్కిలి భక్తితో పెక్కు జన్మల సమాధి యోగం ద్వారా ఏ మహానుభావుని చరణకమలాలను దర్శించ గలుగుతారో అటువంటి అమేయుడు, అవికారుడు, అజయ్యుడు, ఆద్యుడు, పరమేశ్వరుడు, అయిన శ్రీహరిని నేను ఆరునెలలు సేవించి ఆయన పాదపద్మాల నీడలో నిలిచి కూడా భేద దృష్టి కలవాడను అయ్యాను. నేను దురదృష్టవంతుడను. సంసారబంధాలను హరించే హరిని దర్శించి కూడ అనిత్యాలైన కోర్కెలను కోరుకున్నాను. ఇలాంటి దౌర్భాగ్యం ఎక్కడన్నా ఉంటుందా? తమ స్థానాలకంటె ఉన్నతమైన స్థానాన్ని నేను పొందుతానేమో అని ఓర్వలేక దేవతలు నా బుద్ధిని కలతపరచి ఉంటారు. అనాడు నారదుడు ఆడిన మాట యథార్థమైనది. ఆయన మాటలను నేను సరకు గొనలేదు. నేను అధముడను. నిద్రించేవాడు కలలో దైవమాయకు చిక్కి తా నొక్కడే అయినా, తనకంటె వేరుగా అనేకులను తనయందు చూస్తాడు. అలాగే నేను ఒక్కడనే అయినప్పటికీ తమ్ముడనే శత్రువును కల్పించుకొని దుఃఖం పొందాను. జగత్ స్వరూపుడూ, దయామయుడూ, సంసార వినాశకుడూ అయిన హరిని ఆరాధించి, ఆయన అనుగ్రహం పొంది కూడా ఆయుస్సు చాలని రోగికి ఔషధాలవలె కొరగాని కోర్కెలు కోరుకున్నాను.

మ. ధనహీనుండు నృపాలుఁ జేరి మిగులన్ ధాటిన్ ఫలీకార మి
మ్మని యర్థించిన రీతి ముక్తి ఫలదుం డైనట్టి పంకేజ లో
చనుఁడే చాలఁ బ్రసన్నుఁడైన నతనిన్ సాంసారికం బర్థిఁ గో
రిన నావంటి విమూఢమానసులు ధాత్రిం గల్గిరే యెవ్వరున్? 300

* పేదవాడు మహారాజును సమీపించి ఊకతో కూడిన నూకలను ఇమ్మని కోరినట్లు మోక్షప్రదాత అయిన పుండరీకాక్షుడు సాక్షాత్కరింపగా నేను సంసారాన్ని అర్థించాను. నావంటి మందబుద్ధులు ఈ లోకంలో మరెవ్వరూ ఉండరు అని ధ్రువుడు విచారించాడు.

## -: ధ్రువుండు మరల దన పురంబునకు వచ్చుట. :-

సీ. అని యిట్లు చింతించె ననుచు న మ్మైత్రేయ ముని విదురునకు నిట్లనియెఁ దండ్రి!
కమనీయ హరిపాద కమల రజోభి సంస్కృత శరీరులును యాదృచ్ఛికముగ
సంప్రాప్తమగు దాన సంతుష్టచిత్తులై వఱలుచు నుండు మీ వంటి వారు
దగ భగవత్పాద దాస్యంబు దక్కంగ నితర పదార్థంబు లెడఁదలందు

తే. మఱచియును గోర నొల్లరు మనుచరిత్ర!, తవిలి యిట్లు హరిప్రసాదంబు నొంది
మరలి వచ్చుచు నున్న కుమారు వార్తఁ, జారుచే విని యుత్తానచరణుఁ డపుడు. 301

వ. మనమున నిట్లని తలంచె. 302

* అని చెప్పి మైత్రేయ మహర్షి విదురునితో మళ్ళీ ఇలా అన్నాడు. నాయనా! పరమ పవిత్రమైన శ్రీహరి పాదపరాగంతో అలంకృతమైన శరీరంగల మీవంటివారు తనంత తాను దొరికే దానితోనే సంతృప్తి పొందుతుంటారు. భగవంతుని చరణ సేవ తప్ప మరొకటి వాంఛింపరు. హరి అనుగ్రహం అందుకున్న కన్న కుమారుడు తిరిగి వస్తున్నాడు అనే వార్త ఉత్తానపాదుడు చారుల వల్ల విని యిలా తలంచాడు.

క. చచ్చిన వారలు గ్రమ్మఱ, వచ్చుటయే కాక యిట్టి వార్తలు గలవే?
నిచ్చలు నమంగళుఁడ నగు, నిచ్చట మఱి నాకు శుభము లేల ఘటించున్. 303

క. అని విశ్వసింపకుండియు, మనమున నా నారదుఁడు "గుమారుఁడు వేగం
బునఁ రాఁగలఁ" డనుచును బలి, కిన పలుకులు దలఁచి నమ్మి కృతకృత్యుండై. 304

* "చచ్చిన వాళ్లు మళ్లీ తిరిగి వస్తారా? ఇటువంటి చోద్యం ఎక్కడన్నా ఉందా? అన్ని విధాలా నిర్భాగ్యుడనైన నాకు అంతటి భాగ్యం ఎలా లభిస్తుంది?'' అని ముందు నమ్మలేకపోయాడు. "నీ కొడుకు తొందరలోనే తిరిగివస్తాడు'' అని పూర్వం నారదముని చెప్పిన మాటలు జ్ఞప్తికి తెచ్చుకొని అటువంటి అదృష్టం లభించవచ్చునని కొంత కొంత విశ్వసించాడు.

క. తన సుతుని రాక సెప్పిన, ఘనునకు ధనములును మౌక్తికపు హారములున్
మన మలర నిచ్చి తనయునిఁ గనుఁగొను సంతోష మాత్మఁ గడలుకొనంగన్. 305

* తన తనయుడు వస్తున్నాడని శుభవార్త చెప్పిన చారునికి ధనం మూటలూ, ముత్యాల దండలూ బహుమానంగా ఇచ్చాడు. కొడుకును చూడాలనే ఉత్సాహం ఆయన అంతరంగంలో పొంగి పొరలింది.

సీ. వలను మీఱిన సైంధవంబులఁ బూన్చిన కనక రథంబు నుత్కంఠ నెక్కి
బ్రాహ్మణ కుల వృద్ధ బంధు జనామాత్య పరివృతుం డగుచు విస్ఫురణ మెరసి
బ్రహ్మనిర్ఘోష తూర్య స్వన శంఖ కాహళ వేణు రవము లందంద చెలఁగ
శిబిక లెక్కియు విభూషితలై సునీతి సురుచు, లుత్తముండు నారూఢి నడవఁ

తే. గరిమ దీపింప నతిశీఘ్రగమన మొప్ప, నాత్మనగరంబు వెలువడి యరుగుచుండి
బలసి నగరోపవన సమీపంబునందు, వచ్చు ధ్రువుఁ గని మేదినీశ్వరుఁడు నంత. 306

* వడిగల గుఱ్ఱాలను పూన్చిన బంగారు రథం అధిరోహించాడు. బ్రాహ్మణులతో, కులవృద్ధులతో, బంధు మిత్రులతో, మంత్రులతో కలసి కుతూహలంతో కూడినవాడై ఎంతో వైభవంగా బయలుదేరాడు. వేదఘోషలు, వాద్య ధ్వనులూ, శంఖ కాహళ వేణు నాదాలూ అతిశయించాయి. పెద్ద భార్య సునీతి, చిన్న భార్య సురుచి బంగారు పల్లకీలు ఎక్కి ఉత్తమునితో కూడినవారై అనుసరించారు. అలా గబ గబ ముందుకు సాగి వెళ్లుతూ పురం వెలుపల ఉపవనం సమీపంలో అల్లంత దూరాన వస్తున్న ధ్రువ కుమారుణ్ణి ఉత్తానపాద మహారాజు చూచాడు.

చ. అరదము డిగ్గి ప్రేమ దొలఁకాడ ససంభ్రముఁడై రమామనో
హరు చరణారవింద యుగళార్చన నిర్దళితాభిలాషు నీ
శ్వర కరుణావలోకన సుజాత సమగ్ర మనోరథున్ సుతుం
గర మనురక్తి డాసి పులకల్ నవలొత్తఁ బ్రమోదితాత్ముఁడై 307

* మహారాజు ఆత్రంగా అనురాగం పొంగి పొరలగా రథం దిగాడు. ధ్రువునికి ఎదురుపోయాడు. రమారమణుని చరణకమలాలను సేవించి పాపాలు పోగొట్టుకొన్నవాడూ, భగవంతుని కరుణాకటాక్షం వల్ల కోరిన కోరికలన్నీ తీరినవాడూ అయిన కుమారుణ్ణి తిలకించి ప్రేమతో పులకించి మైమరచి పోయాడు.

తే. బిగియఁ గౌఁగిటఁ జేర్చి నెమ్మొగము నివిరి, శిరము మూర్కొని చుబుకంబు చేతఁబుణికి
యావ్యయానంద బాష్ప ధారాభిషిక్తుఁ, జేసి యాశీర్వదింప నా చిరయశుండు. 308

* కన్న కొడుకును గట్టిగా కౌగిలించుకున్నాడు. ముఖమంతా నిమిరాడు. శిరస్సు మూర్కొన్నాడు. గడ్డం పుణికాడు. జలజల ప్రవహించే ఆనంద బాష్ప ధారలతో పుత్రుని శిరస్సు అభిషేకించి ఆశీర్వదించాడు.

క. జనకుని యాశీర్వచనము, లనయముఁ గైకొని ప్రమోదియై తత్పదముల్
దన ఫాలతలము సోఁకఁగ, వినతులు గావించి భక్తి విహ్వలుఁ డగుచున్. 309

* చిరయశస్వి అయిన ధ్రువుడు జనకుని దీవనలు అందుకొని ఆనందించాడు. కన్న తండ్రి అడుగులపై నెన్నుదురు మోపి భక్తి తన్మయుడై నమస్కరించాడు.

**తే.** **అంత నా సజ్జనాగ్రణి యైన ధ్రువుఁడు, దల్లులకు భక్తి వినతులు దగ నొనర్చి**
**సురుచికిని మ్రొక్క నర్భకుఁ జూచి యెత్తి, నగు మొగంబున నాలింగనంబు సేసి.** 310

* తరువాత వినయశీలుడై ధ్రువుడు తల్లులకు భక్తితో నమస్కరించాడు. సురుచి తనకు మ్రొక్కిన ధ్రువుణ్ణి లేవనెత్తి నవ్వుతూ అక్కున చేర్చుకున్నది.

**సీ.** **కరమొప్పు నానంద గద్గద స్వరమున జీవింపు మనుచు నాశీర్వదించె;**
**భగవంతుఁ డెవ్వనిపై మైత్రి వాటించు సత్కృపానిరతిఁ బ్రసన్నుఁ డగుచు**
**నతనికిఁ దమయంత ననుకూలమై యుండు సర్వభూతంబులు సమతఁ బేర్చి;**
**మహిఁ దలపోయ నిమ్న ప్రదేశమునకు ననయంబుఁ జేరు తోయముల పగిదిఁ**

**తే.** **గాన ఘను న మ్మహాత్ముని గారవించె, సురుచి పూర్వంబు దలఁపక సుజన చరిత!**
**విష్ణు భక్తులు ధరను బవిత్రు లగుట, వారి కలుగరు ధరణి నెవ్వారు మఱియు.** 311

* సురుచి ఆనందాతిశయంతో వణుకుతున్న కంఠస్వరంతో "చిరంజీవ!" అని దీవించింది. పల్లానికి నీళ్ళు ప్రవహించిన విధంగా భగవంతుని దయకు పాత్రుడైన వాని వద్దకు తమంత తాము అందరూ అనుకూల భావంతో చేరుకొంటారు. అందుకనే సురుచి గతాన్నంతా మరచిపోయి మహనీయుడైన ధ్రువుణ్ణి గౌరవించింది. నాయనా, విదురా! విష్ణు భక్తులు పరమ పవిత్రులు; వారికి శత్రువు లంటూ ఎవరూ ఉండరు. వారిపై ఎవ్వరూ కోపించరు.

**వ.** **కావున నుత్తముండును ధ్రువుండును బ్రేమ విహ్వలు లగుచు నన్యోన్యాలింగితులై పులకాంకురాలంకృత శరీరులై యానంద బాష్పముల నొప్పి; రంత సునీతియుం దన ప్రాణంబుల కంటెఁ బ్రియుండైన సుతు నుపగూహనంబు సేసి తదవయవ స్పర్శనంబు చేత నానందంబు నొంది విగతశోక యయ్యె; నప్పుడు సంతోష బాష్ప ధారాసిక్తంబులై చనుఁబాలునుం గురిసె నంత.** 312

* ఉత్తముడూ, ధ్రువుడూ ప్రేమతో ఒడలు మరచి ఒకరి నొకరు కౌగిలించుకున్నారు. వారి శరీరాలు పులకరించాయి. కనులలో ఆనంద బాష్పాలు నిండాయి. అప్పుడు సునీతి తన ప్రాణాలకంటె అధిక ప్రేమాస్పదుడైన కొడుకును గట్టిగా కౌగిలించుకొని అతని తనూ స్పర్శ వల్ల కలిగిన సంతోషంతో తన దుఃఖాన్ని మరచి పోయింది. ఆనంద బాష్ప ధారలతో తడిసిన ఆ తల్లి పాలిండ్లు పొంగులెత్తాయి.

**సీ.** **ఉన్నత సంతోష ముప్పతిల్లఁగఁ బౌర జనము లా ధ్రువుతల్లి నెనయఁ జూచి**
**తొడరిన భవదీయదుఃఖనాశకుఁ డైన యిట్టి తనూజుఁ డెందేని పెద్ద**
**కాలంబు క్రిందటఁ గడఁగి నష్టుం డైన వాఁడిప్డు నీ భాగ్యవశము చేతఁ**
**బ్రతిలబ్ధుఁ డయ్యెను; నితఁడు భూమండల మెల్లను రక్షించు నిద్ధమహిమఁ;**

**తే. గమల లోచనుఁ జింతించు ఘనులు లోక, దుర్జయం బైన యట్టి మృత్యువును గెల్తు;**
**రట్టి ప్రణతార్తి హరుఁడైన యబ్జనాభుఁ, డర్థి నీచేతఁ బూజితుం డగుట నిజము. 313**

* అప్పుడు పురప్రజలు ధ్రువుని తల్లియైన సునీతిని చూచి అంతులేని సంతోషంతో ఇలా పొగడారు. చాలా కాలం క్రిందట కనిపించకుండా పోయిన నీ కొడుకు నీ అదృష్టం వల్ల మళ్లీ తిరిగి వచ్చాడు. నీ దుఃఖాన్ని తొలగించాడు. ఇతడు సాటిలేని పరాక్రమంతో సర్వభూమండలాన్నీ పరిపాలిస్తాడు. విష్ణుదేవుని సేవించే మహాత్ములు అజేయమైన మృత్యువును కూడా జయిస్తారు. ప్రసన్నులైన భక్తుల దుఃఖాన్ని తొలగించే నారాయణుని నీవు నిజంగా ఆరాధించావు.

**వ. అని ప్రశంసించి, రట్లు పౌరజనంబులచేత నుపలాల్యమానుండగు ధ్రువుని నుత్తాన పాదుం డుత్తమ సమేతంబుగా గజారూఢునింజేసి సంస్తూయమానుండును, ప్రహృష్టాంతరంగుండును నగుచుఁ బురాభిముఖుండై చనుదెంచి. 314**

* ఈ విధంగా పురప్రజలచే ఉపలాలింప బడుతున్న ధ్రువుణ్ణి ఉత్తానపాదుడు ఉత్తమునితోకూడా ఏనుగుపైన కూర్చుండ బెట్టి ప్రజల ప్రస్తుతు లందుకుంటూ అంతరంగంలో పొంగిపొరలే సంతోషంతో పురము వైపు బయలు దేరాడు.

**సీ. స్వర్ణ పరిచ్ఛద స్వచ్ఛ కుడ్య ద్వార లాలిత గోపురాట్టాలకంబు**
**ఫల పుష్ప మంజరీ కలిత రంభా స్తంభ పూగ పోతాది విభూషితంబు**
**ఘనసార కస్తూరికా గంధ జలబంధు రాసిక్తవిపణి మార్గాంచితంబు**
**మానిత నవరత్న మయ రంగ వల్లీ విరాజిత ప్రతిగృహ ప్రాంగణంబు**

**తే. శుభ నదీజల కుంభ సంశోభితంబు, తండుల స్వర్ణ లాజాక్షత ప్రసూన**
**ఫల బలివ్రాత కలిత విభ్రాజితంబు, నగుచు సర్వతోఽలంకృత మైన పురము. 315**

**వ. ప్రవేశించి రాజమార్గంబునఁ జనుదెంచు నప్పుడు. 316**

* గోడలు, తలుపులు, గోపురాలు, చంద్రశాలలు, బంగారు పూతతో తళతళ మెరుస్తున్నాయి. పండ్లతోనూ, పూలగుత్తులతోనూ నిండిన అరటి కంబాలూ, చిన్న చిన్న పోక మ్రాకులు వీథికి ఇరువైపులా కనువిందు చేస్తున్నాయి. అంగళ్ల ముందు పచ్చ కర్పూరం, కస్తూరి, చందనం కలిపిన నీళ్లు చల్లారు. ప్రతి ఇంటి ముంగిట్లోనూ నవరత్నాలతో ముగ్గులు దిద్ది తీర్చారు. పవిత్ర నదీ జలాలతో నిండిన మంగళ కలశాలు నిలిపారు. తండులాలు, బంగారు లాజలు, అక్షతలు, పూలు, పండ్లు, పూజా ద్రవ్యాలు సిద్ధపరిచారు. ఈ విధంగా అంతటా అలంకరింపబడిన పట్టణంలో ప్రవేశించి రాజమార్గం గుండా ఊరేగింపు సాగిపోతున్నది.

**మ. హరిమధ్యల్ పురకామినీ తతులు సౌధాగ్రంబులందుండి భా**
**స్వర సిద్ధార్థ ఫలాక్షత ప్రసవ దూర్వా వ్రాత దధ్యంబువుల్**

గరవల్లీ మణి హేమ కంకణ ఝణత్కారంబు శోభిల్లఁ జ
ల్లిరి యా భాగవతోత్తమోత్తమునిపై లీలానుమేయంబుగన్. 317

* అప్పుడు సన్నని నడుములు గల పురస్త్రీలు ఒయ్యారంగా మేడలపై నిలబడి, చేతులకు ధరించిన మణులు తాపిన బంగారు గాజులు ఝణఝణ ధ్వనులు చేస్తుండగా ఆ ఉత్తమ భక్తశిరోమణిపై తెల్లావాలు, పండ్లూ, పూలు, అక్షతలూ, దూర్వాంకురాలు, పెరుగు కలిపిన నీళ్లూ చల్లారు.

వ. ఇట్లు వాత్సల్యంబునం జల్లుచు సత్యవాక్యంబుల దీవించుచు సువర్ణ పాత్ర రచితమణి దీప నీరాజనంబుల నివాళింపం బౌరజానపద మిత్రామాత్య బంధుజన పరివృతుండై చనుదెంచి. 318

* ఇలా చల్లుతూ చల్లని యథార్థ వాక్కులతో దీవించారు. బంగారు పాత్రలతో మణిదీపాలు ఉంచి హారతు లిచ్చారు. ఈ విధంగా ధ్రువుడు పౌరులతో, జానపదులతో, మిత్రులతో, మంత్రులతో, చుట్టాలతో కలిసి ముందుకు సాగాడు.

సీ. కాంచన మయ మరకత కుడ్య మణిజాల సంచయరాజిత సౌధములను
వరసుధా ఫేన పాండుర రుక్మపరికరోదాత్త పరిచ్ఛదతల్పములను
సురతరు శోభిత శుక పిక మిథునాళి గాన విభాసితోద్యానములను
సుమహిత వైదూర్య సోపాన విమల శోభిత జలపూర్ణ వాపీచయముల

తే. వికచ కహ్లార దర దరవింద కైర, వ ప్రదీపిత బక చక్రవాక రాజ
హంస సారస కారండ వాది జల వి, హంగ నినదాభిరామ పద్మాకరముల. 319

* అప్పుడు ధ్రువుడు నగరులో ప్రవేశించాడు. అక్కడి మేడలు పచ్చలు తాపిన బంగారు గోడలతోనూ, మణి ఖచితములైన గవాక్షాల తోనూ మెరిసిపోతున్నాయి. పట్టెమంచాల పరపులపై పాలనురుగుల వలె తెల్లనైన బంగారు జరీ అంచుల దుప్పట్లు పరచబడి ఉన్నాయి. ఉద్యాన వనాలు కల్పవృక్షాలతో నిండి చిలుకలు, కోయిలలు, తుమ్మెదల జంటలు పాడే పాటలతో మారుమ్రోగుతున్నాయి. దిగుడు బావులు వైదూర్యములతో కట్టిన మెట్లతో నిర్మలమైన జలంతో నిండి ప్రకాశిస్తున్నాయి. వికసించిన కలువలతోనూ కమలాలతోనూ విరాజిల్లుతూ కొక్కెరలు, జక్కవలు, రాయంచలు, బెగ్గురు పక్షులు, కన్నెలేళ్లు మొదలైన నీటి పక్షుల కలకల ధ్వనులతో అక్కడి దొరువులూ చెరువులూ అలరారుతున్నాయి.

వ. మఱియును. 320

తే. చారు బహువిధ వస్తువిస్తార మొప్ప, నంగనాయుక్త మగుచుఁ బెంపగ్గలించి
యర్థిఁ దనరారు జనకు గృహంబు సొచ్చె, నెలమిఁ ద్రిదివంబు సొచ్చు దేవేంద్రు పగిది 321

* ఇంకా ఎన్నెన్నో సుందర వస్తువులతోనూ, సుందరీమణులతోనూ కలకలలాడుతూ కనులవిందు చేస్తున్న రాజప్రాసాదంలో స్వర్గంలో దేవేంద్రుడు ప్రవేశించినట్లు ధ్రువుడు ప్రవేశించాడు.

వ. ఇట్లు ప్రవేశించిన రాజర్షియైన యుత్తానపాదుండు సుతుని యాశ్చర్యకరంబైన ప్రభావంబు వినియుం జూచియు మనంబున విస్మయంబు నొంది ప్రజానురక్తుండును బ్రజాసమ్మతుండును నవయౌవన పరిపూర్ణుండును నైన ధ్రువుని రాజ్యాభిషిక్తుంజేసి వృద్ధవయస్కుండైన తన్నుం దాన యెఱింగి యాత్మగతిఁ బొంద నిచ్చయించి విరక్తుండై వనంబునకుం జనియె; నంత నా ధ్రువుండు శింశుమార ప్రజాపతికూఁతురైన భ్రమి యనుదాని వివాహంబై దాని వలనఁ గల్ప వత్సరు లను నిద్దఱు గొడుకులం బడసి వెండియు వాయు పుత్రియైన యిల యను భార్య యందు నుత్కలనామకుండైన కొడుకు నతి మనోహర యైన కన్యారత్నంబును గనియె; నంతఁ దద్భ్రాతయైన యుత్తముండు వివాహంబు లేకుండి మృగయార్థంబు వనంబున కరిగి హిమవంతంబున యక్షుని చేత హతుం డయ్యె; నతని తల్లియుఁ దద్దుఃఖంబున వనంబున కేఁగి యందు గహన దహనంబున మృతిం బొందె; ధ్రువుండు భ్రాతృమరణంబు విని కోపామర్ష శోకవ్యాకులిత చిత్తుండై జైత్రంబగు రథంబెక్కి యుత్తరాభిముఖుండై చని హిమవద్ద్రోణియందు భూతగణసేవితంబును గుహ్యక సంకులంబును నైన యలకాపురంబు వొడగని య మ్మహాబాహుండు. 322

* రాజర్షియైన ఉత్తానపాదుడు అద్భుతమైన కొడుకు ప్రభావానికి ఎంతో ఆశ్చర్యపడ్డాడు. ధ్రువునకు ప్రజలపై గల అనురాగమునూ ప్రజలకు ధ్రువునిపై గల అభిమానమునూ పరికించి నవయౌవనవంతుడైన ధ్రువుణ్ణి రాజ్యానికి పట్టాభిషిక్తుణ్ణి చేశాడు. తనకు ముసలితనం వచ్చిందని తెలుసుకొని, సుగతిని పొందటానికి నిశ్చయించుకొని విరక్తుడై తపోవనానికి వెళ్లాడు.

ఆ తరువాత ధ్రువుడు శింశుమార ప్రజాపతి కూతురయిన భ్రమిని వివాహమాడి ఆమెవల్ల కల్పుడు, వత్సరుండు అను ఇద్దరు కొడుకులను పొందాడు. వాయు పుత్రికయైన ఇలను పెండ్లాడి ఆమెవల్ల ఉత్కలుడు అను కొడుకునూ, సౌందర్యవతియైన కూతురునూ పొందాడు.

ధ్రువుని తమ్ముడైన ఉత్తముడు పెండ్లి కాకముందే వేటాడటానికి హిమవత్పర్వత ప్రాంతంలోని అడవికి వెళ్లి అక్కడ ఒక యక్షుని చేతిలో నిహతుడైనాడు. ఉత్తముని తల్లియైన సురుచి పుత్ర దుఃఖంతో అరణ్యానికి వెళ్లి అక్కడ కారుచిచ్చు మంటలలో చిక్కి మరణించింది.

ధ్రువుడు తమ్ముని మరణవార్త విని కోపంతోనూ, దుఃఖంతోనూ కలత చెందిన మనస్సు కలవాడై జయశీలమైన రథాన్ని అధిరోహించి ఉత్తర దిక్కుగా వెళ్ళాడు. అక్కడ మంచుకొండ లోయలో భూత గణాలతోనూ, యక్షులతోనూ నిండిన అలకాపురాన్ని అవలోకించాడు.

## -: ధ్రువుండు కుబేరానుచరులైన గుహ్యకులతో యుద్ధము సేయుట. :-

మ. ఘనశౌర్యోన్నతి తోడ సర్వ కకుభాకాశంబులందుం బ్రతి
ధ్వను లోలిన్ నిగుడంగ శంఖము మహోద్యల్లీలఁ బూరింపఁ ద

న్నినదంబున్ విని యక్షకాంతలు భయాన్వితాత్మలై; రుగ్ర సా
ధనులై యక్షభటుల్ పురిన్ వెడలి రుత్సాహంబు సంధిల్లఁగన్. 323

వ. ఇట్లు వెడలి యా ధ్రువునిం దాఁకిన. 324

* మహావీరుడైన ధ్రువుడు ప్రతాపాతిశయంతో సర్వదిశలూ, ఆకాశమూ మారుమ్రోగేటట్లు శంఖాన్ని పెద్దగా పూరించాడు. ఆ శంఖధ్వనిని విని యక్షకాంతలు భయపడి పోయారు. యక్ష వీరులు భయంకరాలైన ఆయుధాలను ధరించి ఉత్సాహంతో పురి వెడలి ధ్రువుణ్ణి ఎదుర్కొన్నారు.

చ. కరము మహారథుండు భుజగర్వ పరాక్రమశాలియున్ ధను
ర్ధరుఁడును శూరుఁడౌ ధ్రువుఁడు దన్ను నెదిర్చిన యక్షకోటిఁ జె
చ్చెరఁ బదుమూఁడువేల నొకచీరికిఁ గైకొన కొక్కపెట్ట భీ
కరముగ మూఁడు మూఁడు శితకాండములం దగఁ గ్రువ్వనేసినన్. 325

* అప్పుడు మహారథుడు వీరాధివీరు డైన ధ్రువుడు అవక్రపరాక్రమంతో వింటిని ఎక్కుపెట్టి తనను ఎదిరించిన పదమూడు వేల యక్షవీరులనూ మూడు వాడి బాణాలతో గాయపరిచాడు.

ఉ. వారు లలాటముల్ వగిలి వారక సోలియుఁ దేఱి యమ్మహో
దారు పరాక్రమ ప్రకట ధైర్యముఁ దత్కర లాఘవంబుఁ బ
ల్మాఱు నుతించుచుం గుపితమానసులై పదతాడితప్రదు
ష్టోరగకోటి వోలెఁ జటులోగ్ర భయంకర రోషమూర్తులై. 326

* ధ్రువుడు ప్రయోగించిన బాణాలవల్ల నొసళ్లు పగిలి యక్షులు మూర్ఛ పోయారు. వారు తిరిగి తేరుకొని, ఆ మహా వీరుని పరాక్రమమునూ, ధైర్యమునూ, చేతి నేర్పునూ పలుసార్లు మెచ్చుకున్నారు. కాళ్లచేత త్రొక్కబడిన కాలసర్పాలవలె పట్టరాని రోషంతో భయంకరాకారాలతో విజృంభించారు.

ఉ. ఆ రథికోత్తముం దొడరి యందఱు నొక్కటఁ జుట్టు ముట్టి యా
ఱాఱు శిలీముఖంబులఁ దదంగములన్ బగిలించి వెండి వి
స్ఫారగదా శర క్షురిక పట్టిస తోమర శూల ఖడ్గముల్
సారథియుక్తుఁడైన రథిసత్తముపైఁ గురిపించి రేపునన్. 327

* యక్షు లందరూ ఒక్క సారిగా మహాయోధుడైన ధ్రువుణ్ణి చుట్టుముట్టారు. ఆరేసి బాణాలతో ధ్రువుని అవయవాలను భేదించారు. పెద్ద పెద్ద గదలనూ, అమ్ములనూ, చురకత్తులనూ, పట్టిసాలనూ, చిల్లకోలలనూ, శూలాలనూ, ఖడ్గాలనూ ధ్రువునిపైనా, అతని సారథిపైనా ఎడతెగకుండా విసిరారు.

వ. అట్లు గురియించిన నతండు. 328

క. పెంపఱి యుండెను ధారా, సంపాతచ్ఛన్నమైన శైలము భంగిన్
గుంపులు గొని యాకసమునఁ, గంపించుచు నపుడు సిద్ధగణములు వరుసన్. 329

* అప్పుడు ధ్రువుడు ఎడతెగని వర్షధారలతో కప్పబడిన కొండవలె యక్షుల ఆయుధ వర్షంలో మునిగి పోయాడు. అది చూచి ఆకాశంలోని సిద్ధులు వణికిపోయారు.

క. హాహాకారము లెసఁగఁగ, నోహో యీ రీతి ధ్రువపయోరుహహితుఁ డు
త్సాహము సెడి యిటు దైత్యస, మూహార్ణవమందు నేఁడు మునిఁగెనె యకటా! 330

వ. అని చింతించు సమయంబున. 331

* భయంకంపితులై సిద్ధులు హాహాకారాలు చేశారు. "ధ్రువుడు అనే సూర్యుడు యక్షరాక్షస సమూహం అనే సముద్రంలో మునిగి పోయాడు" అని ఆక్రోశించారు.

క. తా మాతని గెలిచితి మని, యా మనుజాశనులు పలుక నట నీహార
స్తోమము సమయించు మహో, ద్ధాముండగు సూర్యుఁబోలి తద్ధయుఁ దోఁచెన్. 332

* అప్పుడు రాక్షసులు ధ్రువుని జయించా మనుకుంటూ గంతులు వేస్తూ గప్పాలు కొట్టసాగారు. అంతలో దట్టమైన మంచును పటాపంచలు వేస్తూ బయటపడిన సూర్యుడువలె ధ్రువుడు కన్పించాడు.

వ. అట్లు దోఁచిన. 333

మ. అరి దుఃఖావహమైన కార్ముకము శౌర్యస్ఫూర్తితోఁ దాల్చి భీ
కర బాణావళిఁ బింజపింజ గరవంగా నేసి ఝుంఝూనిలుం
డురు మేఘావళిఁ బాఱఁ దోలుగతి నత్యుగ్రాహిత క్రూర బం
ధుర శస్త్రావళి రూపుమాపె విలసద్దోర్లీల సంధిల్లఁగన్. 334

* ధ్రువుడు శత్రువుల మనస్సులకు సంతాపాన్ని కలిగించే ధనుస్సును చేపట్టాడు. భయంకరాలైన బాణపరంపరలను ఎడతెగకుండా కురిపించాడు. పెనుగాలి మేఘాలను పారదోలునట్లు అవక్రమైన భుజవిక్రమంతో శత్రు వీరుల శస్త్రాస్త్రాలను చెల్లాచెదరు చేశాడు.

చ. మఱి యపు డమ్మహాత్ముఁ డసమానబలుండు మహోగ్రబాణముల్
గఱకరిఁ దాఁక నేసి భుజగర్వ మెలర్ప విరోధి వర్మముల్
పఱియలు సేసి యంగములు భంగము నొందఁగఁ జేసి వ్రేల్మిడిన్
గిఱికొని పర్వతంబుల నొగిం దెగఁగొట్టెడు నింద్రుకైవడిన్. 335

* సాటిలేని మేటి వీరుడైన ధ్రువుడు భయంకరాలైన బాణాలను ప్రయోగించి శత్రువుల కవచాలను ముక్కలు చేశాడు. వారి అవయవాలను తునాతునకలు గావించాడు. పర్వతాలను బ్రద్దలు గొట్టే ఇంద్రునివలె ధ్రువుడు శత్రువులను చుట్టుముట్టి క్షణంలో మట్టుపెట్టాడు.

వ. అయ్యవసరంబున. 336

చ. అలఘు చరిత్రుఁ డమ్మనుకులాగ్రణిచే వికలాంగులైన వా
రల సకిరీట కుండల విరాజిత మస్తక కోటిచే సము
జ్జ్వల మణికంకణాంగద లసద్భుజవర్గముచేత సంగర
స్థల మతిరమ్యమై తనరె సంచిత వీరమనోహరాకృతిన్. 337

* మనువంశంలో శ్రేష్ఠుడైన ధ్రువుడు సంహరించిన యక్షరాక్షస సైనికుల కిరీటాలతో కుండలాలతో ప్రకాశించే శిరస్సులూ, మణికంకణాలతో భుజకీర్తులతో ప్రకాశించే బాహువులూ నిండి ఉన్న ఆ యుద్ధభూమి వీరమనోహరంగా విరాజిల్లింది.

వ. అంత హతశేషులు. 338

క. వరబలుఁడగు మను మనుమని, శరసంభిన్నాంగు లగుచు సమరవిముఖులై
హరిరాజముఁ గని పఱచెడు, కరిబృందముఁ బోలెఁ జనిరి కళవళపడుచున్. 339

* అప్పుడు చావగా మిగిలినవారు స్వాయంభువ మనువు మనుమడైన ధ్రువుని శరపరంపరలచేత శరీరాలు తూట్లు పడి యుద్ధం మానుకొని సింహాన్ని చూచి పరుగెత్తే ఏనుగుల గుంపువలె భయపడి పారిపోయారు.

క. అప్పుడు రాక్షసమాయలు, గప్పిన ధ్రువుఁ డసురవరుల కార్యం బెఱుఁగం
జొప్పడక వారిఁ బొడగన, దెప్పర మగుటయును సారథిం గని యంతన్. 340

* అప్పుడు రాక్షసుల మాయలు ధ్రువుణ్ణి కప్పివేశాయి. రాక్షసుల మాయాకృత్యాలను అతడు తెలుసుకోలేక పోయాడు. వారు ఆయన కంటికి కన్పించలేదు. అందుచేత ధ్రువుడు తన సారథితో ఇలా అన్నాడు.

క. తల పోయఁగ భువి మాయా, వుల కృత్యం బెఱుఁగ నెవరు వోలుదు రనుచుం
బలుకుచుఁ దత్పురిఁ జొరఁగాఁ, దలఁపఁగ నదిగాన రాక తద్దయు మానెన్. 341

* "ఈ మహీతలంలో మాయావుల మాయలను తెలుసుకొనటం ఎవరికీ సాధ్యం కాదు" అని పలుకుతూ శత్రుపురంలో ప్రవేశించాలని ఉత్సాహపడ్డాడు. కాని శత్రువుల పట్టణం ఎక్కడా ధ్రువుని కంటికి కన్పించలేదు.

వ. అట్లు పురంబున కరుగుట మాని చిత్రరథుండైన యాధ్రువుండు సప్రయత్నుఁ డయ్యును బర ప్రతియోగ శంకితుండై యుండె నయ్యెడ మహాజలధి ఘోషంబు ననుకరించు శబ్దంబు వినంబడె; నంత సకలదిక్తటంబుల వాయుజనితం బయిన రజఃపటలంబు దోఁచె; దత్క్షణంబ యాకాశంబున విస్ఫురత్తటిత్ప్రభాకలిత గర్జారవయుక్త మేఘంబు లమోఘంబులై భయంకరాకారంబులై తోఁచెనంత.342

* అందువల్ల ధ్రువుడు శత్రుపట్టణంలో ప్రవేశించే ప్రయత్నం మానుకున్నాడు. అప్పుడు మహాసముద్రం ధ్వనివంటి ధ్వని వినిపించింది. సకల దిక్కులూ పెనుగాలి రేపిన ధూళితో కప్పబడ్డాయి. ఆకాశంలో మెరుపులు తళతళ మెరిశాయి. మేఘాలు భయంకరంగా గర్జించాయి.

**మ. అనయంబున్ ధ్రువుమీఁద దైత్యకృతమాయాజాల మట్లేఁచి బో**
**రన మస్తిష్కపురీష మూత్ర పల దుర్గంధాస్థి మేదశ్శరా**
**సన నిస్త్రింశ శరాసి తోమర గదా చక్ర త్రిశూలాది సా**
**ధన భూభృ ద్భుజగావళిం గురిసె నుద్దండ క్రియాలోలతన్. 343**

* రాక్షసులు ప్రయోగించిన మాయాజాలాలు ధ్రువునిమీద మెదడు, మలము, మూత్రము, మాంసము, కుళ్లిన ఎముకలు, క్రొవ్వు కురిపించాయి. విండ్లు, కత్తులు, బాణాలు, కటారులు, చిల్లకోలలు, గదలు, చక్రాలు, త్రిశూలాలు మొదలయిన ఆయుధాలు, కొండలు, సర్పాలు ఎడతెగకుండా ధ్రువునిపై వర్షించాయి.

**వ. మఱియు మత్తగజ సింహవ్యాఘ్ర సమూహంబులును నూర్మిభయంకరంబై సర్వతఃప్లవనం బయిన సముద్రంబును గానంబడియె; వెండియుం గల్పాంతంబునందుంబోలె భీషణంబైన మహాహ్రదంబునుం దోఁచె; న వ్విధంబున నానా విధంబులు ననేకంబులు నవిరళభయంకరంబులు నయిన యసురమాయలు గ్రూర ప్రవర్తనులగు యక్షులచేత సృజ్యమానంబులై యడరు నా సమయంబున.344**

* మదపుటేనుగులూ, సింహాలూ, పెద్ద పులులూ చుట్టుముట్టాయి. కెరటాలతో భయంకరంగా పొంగిపొరలుతున్న సముద్రం కన్పించింది. ప్రళయకాలంలో వలె భయంకరమైన గొప్ప మడుగు కన్పించింది. ఈ విధంగా క్రూరులైన యక్షులు అనేకవిధాలైన భయంకరాలైన రాక్షస మాయలను సృజించారు.

**క. అనయంబును నయ్యక్షుల, ఘనమాయ నెఱింగి మునినికాయము వరుసన్**
**మనుమనుమని మను మను మని, మనమునఁ దలఁచుచును దత్సమక్షంబునకున్ 345**

**వ. చనుదెంచి యాధ్రువుం గని యిట్లనిరి. 346**

* అప్పుడు యక్షుల మాయలు గ్రహించి మహామునులు మనువు మనుమడైన ధ్రువుణ్ణి "మనుము! మనుము!" అని దీవిస్తూ ఆయన ముందుకు వచ్చి యిలా అన్నారు.

**సీ. అనఘాత్మ! లోకు లెవ్వని దివ్య నామంబు సమత నాకర్ణించి సంస్మరించి**
**దుస్తరంబైన మృత్యువునైన సుఖవృత్తిఁ దరియింతు; రట్టి యీశ్వరుఁడు పరుఁడు**
**భగవంతుఁడును శార్ఙ్గ పాణియు భక్తజనార్తిహరుండును నైన విభుఁడు**
**భవదీయ విమతులఁ బరిమార్చుఁగా కని పలికిన మునుల సంభాషణములు**

**తే. విని కృతాచమనుఁడు రమావిభుని పాద, కమలముఁ దలంచి రిపుభయంకరమహోగ్ర**
**కలిత నారాయణాస్త్రంబుఁ గార్ముకమునఁ, బూనఁ దడవఁ దదీయ సంధానమునను. 347**

* "ఓ పుణ్యాత్ముడా! శ్రీహరి దివ్యనామాన్ని విన్నా, స్మరించినా దాటరాని మృత్యువును కూడా లోకులు దాటగలరు. భక్తుల బాధలను తొలగించే ఆ శ్రీహరి, ఆ భగవంతుడు, ఆ పరాత్పరుడు, ఆ జగన్నాథుడు నీ శత్రువులను సంహరించుగాక!" ఇలా పలుకుతున్న మునుల మాటలు విని ధ్రువుడు ఆచమించి శ్రీహరి పాదపద్మాలను స్మరించి శత్రు భయంకరమైన నారాయణాస్త్రాన్ని వింట సంధించాడు.

తే. కడఁగి గుహ్యక మాయాంధకార మపుడు, వెరవు సెడి దవ్వుదవ్వుల విరిసిపోయె
విమలమైన వివేకోదయమునఁ జేసి, సమయు రాగాదికంబుల సరణి నంత. 348

* ఆ విధంగా ధ్రువుడు నారాయణాస్త్రాన్ని సంధించగానే అచ్చమైన జ్ఞానం ఉదయించగానే అజ్ఞానం సమసిపోయినట్లు యక్షుల మాయలు అనే కారుచీకట్లు క్షణంలో చెదరిపోయాయి.

మ. వరనారాయణ దైవతాస్త్ర భవదుర్వార ప్రభాహేమ పుం
ఖ రుచిస్ఫార మరాళ రాజసిత పక్ష క్రూరధారాపత
చ్చర సాహస్రము లోలి భీషణ విపక్షశ్రేణిపై వ్రాలె భీ
కరరావంబునఁ గానఁ జొచ్చు శిఖిసంఘాతంబు చందంబునన్. 349

* వారింప శక్యం కాని ఆ నారాయణాస్త్రం నుండి బంగారు అంచులూ, రాయంచ రెక్కలవంటి రెక్కలూ కల వాడి బాణాలు వేలకొలది పుట్టి అడవిని చుట్టిన అగ్ని జ్వాలల వలె భయంకర ధ్వనితో శత్రుసైనికుల పైన ఎడతెగకుండా వచ్చి పడ్డాయి.

వ. అట్లేసిన. 350

చ. ఖర నిశిత ప్రదీప్తఘన కాండపరంపర వృష్టిచేఁ బొరిం
బొరి వికలాంగులై యడరి పుణ్యజనుల్ పృథుహేతిపాణులై
గరుడునిఁ జూచి భూరిభుజగ ప్రకరంబు లెదిర్చి పేర్చి చె
చ్చెర నడతెంచు చందమునఁ జిత్రరథున్ బలుపూని తాఁకినన్. 351

* నారాయణాస్త్రంనుండి ఉద్భవించిన తళతళ మెరిసే వాడి బాణాలు, రాక్షసులను వికలాంగులను చేశాయి. వారు రెచ్చిపోయి పెద్ద పెద్ద కత్తులను చేతుల్లో ధరించి గరుత్మంతుణ్ణి సర్ప సమూహాలు ఎదిరించినట్లు ధ్రువుణ్ణి ఎదుర్కొన్నారు.

ఉ. వారలఁ జండతీవ్ర శరవర్గము చేత నికృత్తపాద జం
ఘోరు శిరోధరాంబక కరోదర కర్ణులఁ జేసి యోగి పం
కేరుహమిత్ర మండల సకృద్భిద నెట్టి పదంబుఁ జెందు నా
భూరిపదంబునం బెలుచఁ బొందఁగఁ బంపె భూజావిజృంభియై. 352

* అప్పుడు ధ్రువుడు పదునైన భయంకర బాణాలు ప్రయోగించి యక్షుల పాదాలనూ, పిక్కలనూ, తొడలనూ, మెడలనూ, చేతులనూ, చెవులనూ ఖండించాడు. కన్నులను పెకలించాడు. పొట్టలను చీల్చాడు. సూర్యమండలాన్ని భేదించుకొని యోగులు పొందే ఉత్తమ లోకానికి వారిని పంపించాడు.

వ. ఇవ్విధంబున నా చిత్రరథుండగు ధ్రువునిచేత నిహన్య మానులును నిరపరాధులును నయిన గుహ్యకులం జూచి యతని పితామహుండైన స్వాయంభువుండు ఋషిగణ పరివృతుండై చనుదెంచి

ధ్రువునిం జూచి యిట్లనియె; వత్సా! నిరపరాధులైన యీ పుణ్యజనుల నెట్టి రోషంబున వధియించితి, వట్టి నిరయహేతువైన రోషంబు సాలు; భ్రాతృవత్సల! భ్రాతృవధాభితప్తుండవై కావించు నీ యత్నం బుడుగుము. 353

* ఈ విధంగా ధ్రువుడు సంహరిస్తున్న నిరపరాధులైన యక్షులను చూచి ధ్రువుని తాతగారైన స్వాయంభువ మనువు ఋషులతో కూడి వచ్చి ధ్రువునితో ఇలా అన్నాడు. "బిడ్డా! తప్పు చేయని యక్ష రాక్షసులను కోపంతో వధించావు. నరక కారణమైన ఆగ్రహాన్ని చాలించు. తమ్ముని చావునకు పరితపించి చేస్తున్న ఈ ప్రయత్నాన్ని విరమించు.

క. అనఘా! మనుకులమున కిది, యనుచిత కర్మంబ; యొకనికై పెక్కం డ్రి
ట్టని మొనఁ ద్రుంగిరి; యిది నీ, కనయంబును వలవ; దుడుగు మయ్య కుమారా! 354

* ధ్రువకుమారా! మను కులంలో పుట్టిన అనఘుడవు. నీకు ఇది తగనిపని. ఒక్కనికోసం పెక్కుమందిని వధించావు. ఇట్టి కార్యం నీవు చేయరాదు, విరమించు.

వ. అదియునుం గాక దేహాభిమానంబునం బశుప్రాయులై భూతహింస గావించుట హృషీకేశానువర్తనులైన సాధులకుం దగదు; నీవు సర్వభూతంబుల నాత్మభావంబునఁ దలంచి సర్వభూతావాసుండును దురారాధ్యుండును నైన విష్ణుని పదంబులఁ బూజించి తత్పరమపదంబును బొందితి; వట్టి భగవంతుని హృదయంబున ననుధ్యాతుండవు; భాగవతుల చిత్తంబులకును సమ్మతుండవు, మఱియు సాధువర్తనుండ వన నొప్పు నీ వీ పాపకర్మం బెట్లు సేయ సమకట్టితి? వే పురుషుం డైన నేమి మహాత్ములయందుఁ దితిక్షయు, సములయందు మైత్రియు, హీనులయందుఁ గృపయు నితరంబులగు సమస్త జంతువులయందు సమత్వంబును గలిగి వర్తించు వానియందు సర్వాత్మకుండైన భగ వంతుండు ప్రసన్నుం డగు; నతండు ప్రసన్నుం డయిన వాఁడు ప్రకృతి గుణంబులఁ బాసి లింగ శరీర భంగంబు గావించి బ్రహ్మానందంబునుం బొందు; నదియునుంగాక కార్యకారణ సంఘాత రూపంబైన విశ్వం బీశ్వరునందు నయస్కాంత సన్నిధానంబు గలిగిన లోహంబు చందంబున వర్తించు; నందు సర్వేశ్వరుండు నిమిత్తమాత్రంబుగాఁ బరిభ్రమించు; నట్టి యీశ్వరుని మాయాగుణ వ్యతికరంబున నారబ్ధంబులైన పంచభూతంబుల చేత యోషిత్పురుషవ్యవాయంబు వలన యోషిత్పురుషాదిరూప సంభూతి యగు నవ్విధంబునఁ దత్సర్గంబు దత్సంస్థానంబుఁ, దల్లయంబు నగుచు నుండు; నిట్లు దుర్విభావ్యం బైన కాలశక్తింజేసి గుణక్షోభంబున విభజ్యమాన వీర్యుండు ననంతుండు ననాదియు నైన జనంబులచేత జనంబులం బుట్టించుచుండుటం జేసి యాదికరుండును, మృత్యుహేతువున జనంబుల లయంబు నొందించుటం జేసి యంతకరుండును, ననాది యగుటం జేసి యవ్యయుండును నైన భగవంతుండు జగత్కారణుండగుం; గావున నీ సృష్టిపాలన విలయంబులకుం గర్త గానివాని వడువున దానిఁ జేయుచుండు, నిట్లు మృత్యు రూపుండును బరుండును సమవర్తియు నైన యీశ్వరునికి స్వపక్ష పరపక్షంబులు లేవు;

**కర్మా ధీనంబులైన భూతసంఘంబులు రజంబు మహావాయువు ననుసరించు చాడ్పున నస్వ తంత్రంబు లగుచు నతని ననువర్తించు; నీశ్వరుండును జంతుచయాయు రుపచయాపచయ కరణంబులం దస్పష్టుండును నగు జీవుండు గర్మబద్ధుం డగుటం జేసి కర్మంబు వానికి నాయు రుపచయాపచయంబులం జేయుచుండు; మఱియు సర్వజగత్కర్మసాక్షి యగు సర్వేశ్వరుని. 355**

**క. కొందఱు స్వభావ మందురు, కొందఱు కర్మం బటంద్రు, కొందఱు కాలం**
**బందురు, కొందఱు దైవం, బందురు, కొంద ఱొగిఁ గామ మంద్రు మహాత్మా! 356**

* దేహం మీది అభిమానంతో పశువులవలె ప్రాణి హింసచేయటం శ్రీహరి భక్తులైన సజ్జనులకు తగదు. నీవు సర్వప్రాణులనూ, నీవలె భావించి సర్వప్రాణి స్వరూపుడైన శ్రీహరిని కొలిచి ఆయన స్థానాన్ని సాధించావు. ఆయన మనస్సునకు ఎక్కావు. హరిభక్తులను మెప్పించావు. నీవు మంచి నడవడి కలవాడవు. ఈ పాపపు పని చేయటానికి ఎలా పూనుకున్నావు?

తనకంటే గొప్పవారియందే సహనభావం, తనతో సమానుల యందు స్నేహభావం, తనకంటే తక్కువవారి యందు దయ, మిగిలిన సమస్త ప్రాణులయందు సమభావం కలిగి వర్తించే వానిని సర్వాంతర్యామి అయిన భగవంతుడు కరుణిస్తాడు. భగవంతుడు కరుణిస్తే మానవుడు ప్రాకృత గుణాలనుండి విముక్తుడై లింగ శరీరాన్ని విడిచి బ్రహ్మానందాన్ని పొందుతాడు.

అయస్కాంత సన్నిధిలో లోహం భ్రమించినట్లు పరమాత్ముని సన్నిధిలో కార్యకారణ స్వరూపమైన ప్రపంచం భ్రమిస్తుంటుంది. సర్వేశ్వరుడు నిమిత్తమాత్రంగా ఉంటాడు. అటువంటి భగవంతుని మాయాగుణ సంబంధంవల్ల పంచభూతాల వల్ల దేహాది ఆకారాలను పొందిన స్త్రీ పురుషుల కలయికచేత స్త్రీ, పురుషుల ఉత్పత్తి జరుగుతుంది. ఈ విధంగా సృష్టీ, స్థితీ, నాశమూ జరుగుతూ ఉంటాయి. ఊహింప శక్యంకాని కాలశక్తి ద్వారా జనములనుండి జనములను పుట్టించటం వల్ల ఆద్యుడు, నశింపజేయటంవల్ల అంతకుడు, అనాది కావటంవల్ల అవ్యయుడు అయి భగవంతుడు జగత్తుకు కారణం అవుతాడు. అందువల్ల సృష్టి స్థితి లయాలను చేయనట్లే ఉండి చేస్తుంటాడు.

ఈ విధంగా మృత్యుస్వరూపుడు, పరుడు, సమవర్తి అయిన భగవంతునకు తనవారనీ, పరులనీ భేదం లేదు. కర్మములకు లోబడిన జీవులు స్వతంత్రత లేనివారై ధూళికణాలు గాలిని అనుసరించిన విధంగా భగవంతుని అనుసరిస్తారు. ఉపచయమూ, అపచయమూ అనేవి లేకుండా స్వస్థుడైన భగవంతుడు ప్రాణుల ఆయుస్సుకు ఉపచయమూ, అపచయమూ కలిగిస్తాడు. సర్వేశ్వరుడు కర్మసాక్షి. ఆయనను కొందరు "స్వభావం" అంటారు. కొందరు "కర్మం" అంటారు. కొందరు "కాలం" అంటారు. కొందరు "దైవం" అంటారు. మరి కొందరు "కామం" అని కూడా అంటారు.

**వ. ఇట్టు లవ్యక్తరూపుండును, నప్రమేయుండును, నానాశక్త్యుదయ హేతుభూతుండును నైన భగవంతుండు సేయు కార్యంబుల బ్రహ్మరుద్రాదు లెఱుంగరన నతని తత్త్వంబు నెవ్వరెఱుంగ**

**నోపుదురు? కావునం బుత్రా! యిట్లుత్పత్తి నాశంబులకు దైవంబ కారణం బై యుండుఁ గాన నిధ్ధనదానుచరులు భవదీయ భ్రాతృహంత లగుదురే? భూతాత్మకుండు భూతేశుండు భూత భావనుండు సర్వేశ్వరుండు పరాపరుండు నగు నీశుండ మాయాయుక్తుండై స్వశక్తిచే సృష్టిస్థితి లయంబులం జేయు. ఐన ననహంకారంబునంజేసి గుణకర్మంబులచే నస్పృశ్యుం డగుచు వర్తించు. అదియునుం గాక యీ ప్రజాపతులు విశ్వసృణ్ణామంబుల నియంత్రితులై ముకుఁద్రాళ్ళు వెట్టిన పశువులం బోలి యెవ్వని యాజ్ఞాధీనకృత్యులై వర్తింతు రట్టి దుష్టజన మృత్యువు, సుజనామృత స్వరూపుండు, సర్వాత్మకుండు, జగత్పరాయణుండు నైన యీశ్వరుని సర్వ ప్రకారంబుల శరణంబుఁ బొందుము. అదియునుం గాక. 357**

* నిర్గుణుడు, అప్రమేయుడు అనేక శక్తులకు హేతుభూతుడు అయిన భగవంతుడు చేసే పనులను బ్రహ్మ రుద్రాదులు సైతం తెలుసుకోలేరు. ఇక అతని తత్త్వాన్ని ఎవరు తెలుసుకోగలరు? కాబట్టి నాయనా! పుట్టుకకూ మరణానికీ దైవమే కారణం. అందుచేత ఈ కుబేరుని భటులు నీ తమ్ముణ్ణి చంపారు అని తలపవద్దు. భూతాత్మకుడు, భూతేశుడు, భూతభావనుడు, సర్వేశ్వరుడు, పరాత్పరుడు అయిన భగవంతుడు తన మాయచేత సృష్టి, స్థితి లయాలను చేస్తూ ఉంటాడు. అయినా అహంకార రాహిత్యంవల్ల గుణకర్మలకు అంటరానివాడై ఉంటాడు. ముక్కుత్రాళ్ళతో కట్టబడిన పశువులలాగా, ఈ ప్రజాపతులు భగవంతుని ఆజ్ఞలను పాటించి ప్రవర్తిస్తారు. కాబట్టి దుష్టులకు మృత్యుస్వరూపుడూ, శిష్టులకు అమృతస్వరూపుడూ, సర్వాత్మకుడూ, జగత్పరాయణుడూ అయిన భగవంతుణ్ణి అన్ని విధాల శరణు పొందు.

**సీ. అనఘాత్మ! నీవు పంచాబ్ద వయస్కుండ వై పినతల్లి నిన్నాడినట్టి
మాటల నిర్భిన్నమర్ముండ వగుచును జనయిత్రి దిగనాడి వనము కేగి
తప మాచరించి యచ్చపు భక్తి నీశ్వరుఁ బూజించి మహితవిభూతి మెఱసి
రమణఁ ద్రిలోకోత్తరంబైన పదమును బొందితి, వది గాన భూరిభేద**

**తే. రూప మైన ప్రపంచంబు రూఢి నే మ, హాత్మునందుఁ బ్రతీతమై యలరు నట్టి
యగుణుఁ డద్వితీయుండును నక్షరుండు, నైన యీశ్వరుఁ బరమాత్ము ననుదినంబు. 358**

**సీ. కైకొని శుద్ధంబు గతమత్సరంబును నమలంబు నగు హృదయంబునందు
సొలయ కన్వేషించుచును బ్రత్యగాత్ముండు భగవంతుఁడును బరబ్రహ్మమయుఁడు
నానందమాత్రుండు నవ్యయుఁ డుపపన్న సకల శక్తియుతుండు సగుణుఁ డజుఁడు
నయిన సర్వేశ్వరునం దుత్తమంబైన సద్భక్తిఁ జేయుచు సమత నొప్పి**

**తే. రూఢి సోఽహమ్మ మేతి ప్రరూఢ మగుచు, ఘనత కెక్కు నవిద్యయన్ గ్రంథి నీవు
ద్రెంచి వైచితి; కావున ధీవరేణ్య! సర్వశుభహాని యైన రోషంబు వలదు. 359**

* నాయనా! నీవు అయిదేండ్ల వయస్సులో పినతల్లి నిన్నాడిన మర్మాంతకాలైన మాటలచేత లోలోపల ఎంతో నొచ్చుకొని కన్న తల్లిని విడిచి అడవికి పోయి తపస్సు చేశావు. అచ్చమైన భక్తితో భగవంతుణ్ణి

పూజించి మూడు లోకాలకూ మీదిదైన ధ్రువ పదాన్ని పొందావు. భేదరూపమైన ఈ ప్రపంచం ఏ మహాత్మునియందు ప్రతీతమై ఉంటుందో, అక్షరుడూ అద్వితీయుడూ అయిన ఆ భగవంతుని కోసం ప్రతిదినమూ పవిత్రమైన మనస్సుతో అన్వేషించు. ఈ విధంగా సకలశక్తి సంపన్నుడైన సర్వేశ్వరుణ్ణి పూజించినట్లయితే "నేను", "నాది" అనే అవిద్యా రూపమైన గ్రంథిని త్రెంచుకోగలవు. కాబట్టి సర్వశుభాలను హరించే కోపాన్ని విడిచిపెట్టు.

**క. విను రోషహృదయుచేతను, ననయము లోకము నశించు; నౌషధములచే**
**ఘన రోగములు నశించిన యనువున; నది గాన రోష మడఁపు మహాత్మా! 360**

* మందులవల్ల రోగాలు నశించినట్లు కోపం గలవాని మూలాన లోకం నశిస్తుంది. కాబట్టి ఆగ్రహాన్ని అణచి వేసుకో.

**తే. అనఘ! నీదు సహోదరహంత లనుచుఁ, బెనచి యీ పుణ్యజనులఁ జంపితి కడంగి**
**పరఁగ నిదియె సదాశివభ్రాత యైన , యర్థవిభునకు నపరాధ మయ్యెఁ గాన. 361**

* తమ్ముని చంపినవారు అని తలచి ఈ యక్షులను నీవు వధించావు. శివుని సోదరుడైన కుబేరునిపట్ల అపరాధం చేశావు.

**క. నతి నుతులచేత నీ విపుడతనిఁ బ్రసన్నునిఁగఁ జేయు మని మనువు దయా**
**మతిఁ జెప్పి ధ్రువునిచే స, త్కృతుఁడై నయ మొప్పఁ జనియె ఋషి యుక్తుండై. 362**

* కనుక నతులచేతనూ, నుతులచేతనూ కుబేరుని అనుగ్రహం పొందు అని చెప్పి ధ్రువునిచే పూజితుడై స్వాయం భువమనువు ఋషులతో కలిసి అక్కడనుండి వెళ్ళిపోయాడు.

**వ. అంత. 363**

**తే. యక్షచారణసిద్ధ విద్యాధరాది, జనగణస్తూయమానుఁడై ధనదుఁ డంతఁ**
**బుణ్యజన వైశస నివృత్తు భూరిరోష, రహితుఁ డైనట్టి ధ్రువునిఁ జేరంగ వచ్చె. 364**

* ధ్రువుడు శాంతచిత్తుడై యక్షులను సంహరించడం విరమించాడు. అప్పుడు కుబేరుడు యక్షులు, చారణులు, సిద్ధులు, విద్యాధరులు మొదలయినవారు స్తోత్రాలు చేస్తుండగా ధ్రువుని దగ్గరకు వచ్చాడు.

**సీ. చనుదెంచి వెసఁ గృతాంజలియైన ధ్రువుఁ జూచి తివుట నిట్లనియె క్షత్రియ కుమార!**
**తగ భవదీయ పితామహాదేశంబునను దుస్త్యజంబైన ఘనవిరోధ**
**ముడిగితి; వటు గాన నొనరంగ నిపుడు నీ యందుఁ బ్రసన్నుండనైతి, భూత**
**జనన లయంబుల కనయంబుఁ గాలంబు కర్తయై వర్తించుఁగాన యుష్మ**

తే. దనుజుఁ జంపినవారు లీ యక్షవరులు, గారు; తలపోయ నీ యక్షగణము నిట్లు
నెఱి వధించిన వాఁడవు నీవు గావు, వినుతగుణశీల! మాటలు వేయునేల? **365**

* కుబేరుడు దోసిలి ఒగ్గి, ధ్రువునితో ఇలా అన్నాడు. "రాజకుమారా! నీ తాతగారి ఉపదేశాన్ని మన్నించి విడవటానికి శక్యంగాని విరోధాన్ని విడిచి పెట్టావు. అందువల్ల నాకు ఎంతో సంతోషం కల్గింది. జీవుల పుట్టుకకూ, నాశనానికీ కూడా కాలమే కారణం. ఓ సుగుణనిధీ! పలుమాట లెందుకు? నీ తమ్ముణ్ణి చంపినవారు యక్షులూ కాదు; ఈ యక్షులను చంపినది నీవూ కావు."

వ. అదియునుంగాక యే బుద్ధింజేసి కర్మ సంబంధ దుఃఖాదికంబులు దేహాత్మాను సంధానంబునం జేసి సంభవించు, నట్టి యహం త్వమ్మను నపార్థజ్ఞానంబు స్వప్నమందుంబోలెఁ బురుషునకుం దోఁచు నది గావున సర్వభూతాత్మ విగ్రహుండును, నధోక్షజుండును, భవచ్ఛేదకుండును, భజనీయ పాదారవిందుండును, ననంతామేయ శక్తి యుక్తుండును గుణమయియగు నాత్మమాయచే విరహితుండును నైన యీశ్వరుని సేవింపుము; నీకు భద్రం బయ్యెడు; భవదీయ మనోగతం బైన వరంబుఁ గోరుము; నీ వంబుజనాభ పాదారవింద సేవనంబుఁ దిరంబుగఁ జేయుదు వని యెఱుంగుదు నని రాజరాజుచేత నట్లు మహామతియు, భాగవతోత్తముండునైన ధ్రువుండు ప్రేరేపింపంబడి యే హరిస్మరణంబు చేత నప్రయత్నంబున దురత్యయంబైన యజ్ఞానంబుం దరియింతు రట్టి హరిస్మరణం బచలితం బగున ట్లొసంగుమని యడిగిన నట్లకాక యని యంగీకరించి యంతం గుబేరుండును సంప్రీతచిత్తుండయి, ధ్రువునికి శ్రీహరిస్మరణం బట్ల యనుగ్రహించి యంతర్ధానంబు నొందె; నంత ధ్రువుండు యక్ష కిన్నర కింపురుష గణ సంస్తూయమాన వైభవుం డగుచు నాత్మీయపురంబునకు మరలి చనుదెంచి. **366**

* దేహాభిమానం కారణంగా, స్వప్నంలో లాగా "నేను, నీవు" అనే భేదబుద్ధి పురుషునికి అజ్ఞానం వల్ల కలుగుతుంది. దానివల్ల బంధము దుఃఖము మొదలైనవి సంభవిస్తాయి. కాబట్టి అధోక్షజుడు, సర్వభూత స్వరూపుడు, సంసార బంధ విమోచకుడు అయిన భగవంతుని సేవించు. ఆయన పాదపద్మాలు భజింపతగినవి. ఆయన త్రిగుణాత్మకమైన మాయకు అతీతుడు. నీకు మేలు కలుగుతుంది. నీ మనస్సులో ఉన్న కోర్కెను కోరుకో!! నీవు శ్రీహరి పాదసేవను స్థిర బుద్ధితో చేస్తావు. కాబట్టి వరాలు పొందటానికి అర్హుడవు." కుబేరుని ప్రోత్సాహ వాక్యాలు విని బుద్ధిమంతుడూ, భాగవతోత్తముడూ ఆయిన ధ్రువుడు ఏ హరి స్మరణం వల్ల దురంతమూ, దుస్తరమూ అయిన అజ్ఞానాన్ని అవలీలగా తరింప గలుగుతామో ఆ శ్రీహరి స్మరణం నా మనస్సులో సుస్థిరంగా ఉండేటట్లు వరం ఇమ్మని అర్థించాడు. కుబేరుడు సంతోషించి ధ్రువునికి ఆ వరాన్ని అనుగ్రహించి అంతర్ధానం అయ్యాడు. ఆ తరువాత ధ్రువుడు యక్షులూ, కిన్నరులూ, కింపురుషులూ తన వైభవాన్ని కీర్తిస్తుండగా నిజరాజధానికి మరలి వచ్చాడు.

సీ. గణుతింప భూరిదక్షిణలచేఁ గడునొప్పు యజ్ఞముల్ సేయ న య్యజ్ఞ విభుఁడు
ద్రవ్యక్రియా దేవతాఫల రూప సత్కర్మఫల ప్రదాత యయి యొప్పు

**పురుషోత్తముని నర్థిఁ బూజించి మఱియు స ర్వోపాధివర్జితుం డుత్తముండు**
**సర్వాత్మకుఁడు నగు జలజాక్షునందుఁ దీవ్రంబై ప్రవాహరూపంబు నైన**

**తే. భక్తి సలుపుచు నఖిల ప్రపంచమందు, నలరఁ దనయందు నున్న మహాత్ము హరిని**
**జిదచిదానందమయుని లక్ష్మివరుఁ బరము, నీశ్వరేశ్వరుఁ బొడఁ గనె నిద్ధచరిత! 367**

* ధ్రువుడు గొప్ప గొప్ప యజ్ఞాలు చేశాడు. మిక్కిలిగా దక్షిణలు ఇచ్చాడు. యజ్ఞవిభుడు, కర్మఫలప్రదాత అయిన పురుషోత్తముణ్ణి పూజించాడు. పరాత్పరుడు, సర్వాత్మకుడు, సర్వోపాధివర్జితుడైన భగవంతునిపై తీవ్రమైన భక్తిని ప్రవాహరూపంగా ప్రసరింపజేశాడు. సర్వజీవులయందూ, తనలో ఉన్న భగవంతుణ్ణి, ఈశ్వరుణ్ణి, ఆనందమయుణ్ణి సందర్శించాడు.

**వ. ఇట్లు సుశీల సంపన్నుండును, బ్రహ్మణ్యుండును, ధర్మసేతురక్షకుండును, దీనవత్సలుండు నయి యవనిఁబాలించు ధ్రువుండు దన్నుఁ బ్రజలు దండ్రి యని తలంప నిరువది యాఱువేలేండ్లు భోగంబులచేతం బుణ్యక్షయంబును, నభోగంబులైన యాగాదులచే నశుభక్షయంబునుం జేయుచు బహుకాలంబు దనుకఁ ద్రివర్గ సాధనంబుగ రాజ్యంబుసేసి కొడుకునకుం బట్టంబుగట్టి యచలి తేంద్రియుండై యవిద్యారచిత స్వప్నగంధర్వ నగరోపమం బయిన దేహాదికంబగు విశ్వంబు భగవ న్మాయారచితంబని యాత్మం దలంచుచు వెండియు. 368**

* ఈ విధంగా ధ్రువుడు శీలసంపన్నుడు, బ్రహ్మణ్యుడు, ధర్మసేతు రక్షకుడు, దీనబాంధవుడు అయి రాజ్యాన్ని పరిపాలించాడు. ప్రజలు అతనిని తండ్రిగా భావించారు. పుణ్యంకొలదీ భోగాలు అనుభవించాడు. అశుభశాంతి కోసం దేవతలను ఉద్దేశించి యాగాలు ఆచరించాడు.

ఈ విధంగా ధ్రువుడు ఇరువది ఆరువేల ఏండ్లు రాజ్యం చేశాడు. ధర్మార్థకామాలు అనే త్రివర్గాన్ని సాధించాడు. కొడుకుకు రాజ్య పట్టం గట్టాడు. ప్రపంచం భగవంతుని మాయవల్ల సృజింపబడిందనీ అవిద్యచేత కల్పింప బడిన స్వప్నంలోని గంధర్వ నగరంతో తుల్యమైనదనీ భావించాడు.

**చ. మనునిభుఁ డంత భృత్యజనమంత్రి పురోహితబంధుమిత్ర నం**
**దన పశువిత్త రత్న వనితాగృహ రమ్యవిహారశైల వా**
**రినిధి పరీత భూతల హరిద్విపముఖ్య పదార్థజాలముల్**
**ఘనమతిచే ననిత్యములుగాఁ దలపోసి విరక్తచిత్తుఁడై. 369**

* మనుసన్నిభుడైన ధ్రువుడు, సేవకులూ, మంత్రులూ, పురోహితులూ, బంధుమిత్రులూ, సంతానమూ, పశువులూ, ధనాలు, రత్నాలూ, స్త్రీలూ, గృహాలు, క్రీడాపర్వతాలూ, విశాలమైన రాజ్యమూ, గుర్రాలూ, ఏనుగులూ మొదలైన పదార్థాలు అన్నీ అనిత్యాలు అని బుద్ధికౌశలంతో భావించి విరక్తి చెందాడు.

సీ. పురము వెల్వడి చని పుణ్యభూ బదరికా ఘన విశాలానదీకలిత మంగ
ళాంబుపూరంబుల ననురక్తిమైఁ గ్రుంకి కమనీయ పరిశుద్ధ కరణుఁ డగుచు
బద్మాసనస్థుఁడై పవనుని బంధించి నెలకొని ముకుళితనేత్రుఁ డగుచు
హరిరూపవైభవ ధ్యానంబు సేయుచు భగవంతు నచ్యుతుఁ బద్మనేత్రు

తే. నందు సతతంబు నిశ్చల మైనయట్టి, భక్తిఁ బ్రవహింపఁ జేయుచుఁ బరమమోద
బాష్పధారాభిషిక్తుండు భవ్యయశుఁడుఁ, బులకితాంగుండు నగుచు నిమ్ములఁ దనర్చి. 370

* విరక్తుడైన ధ్రువుడు తన నగరాన్ని వదలి పుణ్యభూమి అయిన బదరికాశ్రమంలో ప్రవేశించాడు. పవిత్రమైన విశాలా నదీజలాలలో ఆసక్తితో స్నానం చేశాడు. శుచియై ఆసనం కల్పించుకొని వాయువును బంధించి కనులు మూసుకొని భగవంతుని రూపాన్ని ధ్యానించాడు. ఆ విశాల యశోధనుడు ఆనందబాష్పాలలో తడిసిపోతూ మేను పులకించగా ఆచంచలమైన భక్తితో పద్మనేత్రుడైన భగవంతుని ఆరాధించాడు.

వ. మఱియు విగతక్లేశుండును, ముక్తలింగుండునునై, ధ్రువుండు తన్నుఁదా మఱచియుండు సమయంబున దశదిక్కుల నుద్యద్రాకానిశా నాయకుండునుంబోలె వెలిఁగించుచు నాకాశంబున నుండి యొక్క విమానంబు సనుదేర నందు దేవశ్రేష్ఠులును, జతుర్భుజులును, రక్తాంబుజేక్షణులును, శ్యామలవర్ణులును, గదా ధరులును, సువాసస్సులును, గిరీటహారాంగదకుండల ధరులును, గౌమార వయస్కులును, నుత్తమశ్లోక కింకరులు నయినవారల నిద్దఱం గని సంభ్రమంబున లేచి మధుసూదన నామంబులు సంస్మరించుచు వారల భగవత్కింకరులంగాఁ దలంచి దండ ప్రణామంబు లాచరించినం గృష్ణపాదారవింద విన్యస్తచిత్తుండుం, గృతాంజలియు, వినమిత కంధరుండు నైన ధ్రువునిం గనుంగొని పుష్కరనాభభక్తులైన సునందనందులు ప్రీతియుక్తులై మంద స్మితు లగుచు నిట్లనిరి. 371

* దుఃఖాన్ని విస్మరించి, శరీరాభిమానాన్ని విడిచి తన్ను తాను మరచి ధ్రువుడు పరమానందాన్ని పొందాడు. అప్పుడు ఉదయించు చున్న పున్నమనాటి చంద్రునివలె పది దిక్కులనూ ప్రకాశింప జేస్తూ, ఒక విమానం ఆకాశం నుండి ధ్రువుని దగ్గరకు దిగి వచ్చింది. ఆ విమానంలో ఇద్దరు విష్ణుకింకరులు ఉన్నారు. వారు కౌమార వయస్సులో ఉన్నారు. వారు చతుర్భుజులు, అరుణ నేత్రులు. శ్యామవర్ణులు. గదాధరులు. వారు మంచి వలువలు ధరించారు. కిరీటాలు, హారాలు, భుజకీర్తులు, కుండలాలు ధరించారు.

ధ్రువుడు ఆ విష్ణుకింకరులను చూచి తటాలున లేచి విష్ణుదేవుని నామాలను స్మరిస్తూ వారికి నమస్కరించాడు. శ్రీహరి పాదపద్మములందే మనస్సు నిల్పి వినయంతో తలవంచి, దోసిలి ఒగ్గి నిలుచున్న ధ్రువుణ్ణి చూచి విష్ణుభక్తులైన, నంద సునందులు ఆనందంతో చిరునవ్వు నవ్వుతూ యిలా అన్నారు.

ఉ. ఓ నృప! నీకు భద్ర మగు నొప్పగుచున్న మదీయ వాక్యముల్
వీనులయందుఁ జొన్పుము; వివేకముతో నయిదేండ్లనాఁడు మే
ధానిధివై యొనర్చిన యుదాత్త తపోవ్రతనిష్ఠచేతఁ దే
జోనయశాలి యైన మధుసూదనుఁ దృప్తి వహింపఁజేయవే! 372

* రాజా! నీకు శుభమగు గాక! మా హిత వాక్యాలు శ్రద్ధగా ఆకర్ణించు. అయిదేండ్ల చిరుత ప్రాయంలో నీవు ఎంతో గొప్ప తపస్సు చేసి భగవంతుడైన శ్రీహరికి సంతృప్తి కలిగించావు.

**ఆ. అట్టి శార్ఙ్గపాణి యఖిల జగత్కర్త, దేవదేవుఁ డతుల దివ్యమూర్తి**
**మమ్ముఁ బనుప మేము మాధవ పదమున, కర్థి నిన్నుఁ గొనుచు నరుగుటకును. 373**

* మేము సర్వజగత్కర్తయైన దేవదేవుని సేవకులం. ఆ స్వామి ఆజ్ఞానుసారం నిన్ను పరమపదానికి తోడ్కొని పోవటానికై వచ్చాము.

**వ. వచ్చితిమి; యే పదంబునేని సూరిజనంబులు సర్వోత్తమంబని పొందుదురు; దేనిఁ జంద్రదివాకర గ్రహనక్షత్ర తారాగణంబులు ప్రదక్షిణంబుగాఁ దిరుగుచుండు; మఱియు నీదు పితరుల చేతను నన్యుల చేతను ననధిష్ఠితంబును, జగద్వంద్యంబును, నభక్త జనాతిదుర్జయంబును నయిన నట్టి విష్ణుపదంబుం బొందుదువు; రమ్మిదె విమానశ్రేష్ఠం; బుత్తమశ్లోక జనమౌళియైన శ్రీహరి పుత్తెంచె; దీని నెక్క నర్హుండ వనిన నురుక్రమప్రియుం డయిన ధ్రువుండు తన్మధుర వాక్యంబులు విని కృతాభిషిక్తుం డయి యచ్చటి మునులకుం బ్రణమిల్లి తదాశీర్వాదంబులు గైకొని విమానంబునకుం బ్రదక్షిణార్చనంబులు గావించి హరి పార్షదులైన సునందనందులకు వందనం బాచరించి భగవద్రూపవిన్యస్త చక్షురంతఃకరణాదికుం డగుచు విమానాధిరోహణంబు గావించుటకు హిరణ్మయ రూపంబు ధరియించె నప్పుడు. 374**

* ఏ స్థానాన్ని పండితులు అన్నిటికంటే శ్రేష్ఠమైనది అని భావిస్తారో; సూర్యచంద్రులూ, గ్రహాలూ, నక్షత్రాలూ, తారాగాణాలూ ఏ పదానికి ప్రదక్షిణం చేస్తూంటాయో; దేనిని మీ తండ్రితాతలూ, ఇతరులూ పొందలేక పోయారో, ఏది జగద్వంద్యమో; దేనిని భక్తులు కానివారు పొందలేరో- ఆ విష్ణుపదాన్ని నీవు పొందబోతున్నావు. రావయ్యా రా! ఇదిగో! ఈ విమాన రాజాన్ని నీకోసం దేవాదిదేవుడైన శ్రీహరి పంపించారు. దీనిని ఎక్కటానికి నీవు అర్హుడవు అని విష్ణుదూతలు చెప్పగా అప్పుడు ధ్రువుడు వారి మధుర వాక్కులకు ఆనందించి స్నానం చేసి వచ్చి, అక్కడి మునులకు నమస్కరించాడు. వారి దీవెనలు పొందాడు. విమానానికి ప్రదక్షిణం చేసి పూజించాడు. విష్ణుకింకరులైన నందసునందులకు నమస్కరించాడు. భగవంతుని స్వరూపంలో తన దృష్టినీ, మనస్సునూ నిలిపి విమానాన్ని ఆరోహించటానికి తేజోమయమైన రూపం ధరించాడు.

**క. సురదుందుభి పణ వానక, మురజాదులు మొరసె విరుల ముసురు గురిసెఁ గి**
**న్నర గంధర్వుల పాటలు, భరితములై చెలఁగె నపుడు భవ్యచరిత్రా! 375**

* అప్పుడు దేవతలు నగారాలు, డోళ్ళు, తప్పెటలు, మద్దెలలు మ్రోగించారు; పూలవానలు కురిపించారు. కిన్నరులూ, గంధర్వులూ మంగళగీతాలు పాడారు.

**వ. అట్టి సమయంబున ధ్రువుండు దుర్గమంబగు త్రివిష్టపంబునకు నేగువాఁ డగుచు దీన యగు జననిం దిగనాడి యెట్లు వోవుదు? నని చింతించువానిం బార్షదు లవలోకించి యగ్రభాగంబున విమానారూఢయై యేగుచున్న జననిం జూపిన సంతుష్టాంతరంగుం డగుచు. 376**

* అప్పుడు ధ్రువుడు ఇతరులకు ప్రవేశింప సాధ్యం కాని దేవలోకానికి పోతూ, ఖిన్నురాలైన కన్నతల్లిని ఎలా విడిచిపోవడం అని విచారించాడు. అప్పుడు విష్ణుభక్తులు ధ్రువునికి విమానంలో కూర్చుండి ముందుపోతున్న అతని తల్లిని చూపించారు. ధ్రువుడు పరమానందభరితు డయ్యాడు.

**క. జనని సునీతిని మును గనుఁ, గొని యవల విమాన మెక్కి గొనకొని విబుధుల్**
**దనమీఁదఁ బుష్పవర్షము, లనయముఁ గురియింప ధ్రువుఁడు హర్షముతోడన్. 377**

**క. చని చని వెస గ్రహమండల, మునుఁ ద్రైలోక్యంబు సప్తమునిమండలమున్**
**ఘనుఁ డుత్తరించి యవ్వలఁ, దనరెడు హరిపదము నొందెఁ దద్దయుఁ బ్రీతిన్. 378**

* తన ముందు విమానంలో కూర్చున్న తల్లియైన సునీతిని చూచి ధ్రువుడు విమానమెక్కి దేవతలు ఎడతెగకుండా పూలవానలు కురిపించుతుండగా సంతోషంతో చాల దూరం ప్రయాణం చేసి గ్రహమండలాన్నీ, మూడు లోకాలనూ, సప్తర్షి మండలాన్నీ దాటి ఆ పైన ఉన్న విష్ణుపదాన్ని చేరుకున్నాడు.

**వ. అది మఱియు నిజకాంతిచేతం ద్రిలోకంబులం బ్రకాశింపం జేయుచు నిర్దయాగమ్యంబును శాంతులు సమదర్శనులు శుద్ధులు సర్వభూతానురంజనులు నచ్యుత భక్త బాంధవులు నయిన భద్రాచారులకు సుగమ్యంబును నయి గంభీర వేగంబు ననిమిషంబు నగు జోతిశ్చక్రంబు సమాహితంబై గోగణంబు మేధియందుంబోలె నెందుఁ బరిభ్రమించుచుండు, నట్టి యచ్యుత పదంబునుం బొంది విష్ణు పరాయణుండైన ధ్రువుండు త్రిలోకచూడామణియై యొప్పుచుండె. అప్పుడు భగవంతుడైన నారదుండు ధ్రువుని మహిమం గనుంగొని ప్రచేతస్సత్త్రంబునందు వీణవాయించుచు. 379**

* ఆ విష్ణుపదం తన కాంతిచేత మూడు లోకాలనూ వెలిగిస్తున్నది. కరుణాదూరులైనవారు దానిని పొందలేరు. శాంత స్వభావులూ, సమదర్శనులూ, పవిత్రులూ, సర్వజీవులను సంతోషింపజేసేవారు, విష్ణుభక్తులకు బంధువులైనవారూ, ఆ స్థానాన్ని సులభంగా పొందగలుగుతారు. కట్టుగుంజ చుట్టూ పశుగణం తిరిగినట్లు ఆ విష్ణుపదం చుట్టూ అంతు తెలియని వేగంతో రెప్పపాటు కాలం కూడ ఆగకుండా జ్యోతిశ్చక్రం తిరుగుతుంటుంది. అలాంటి విష్ణుపదాన్ని పొంది విష్ణుభక్తుడైన ధ్రువుడు త్రిలోకాలకు శిరోమణియై ప్రకాశించాడు. అప్పుడు పూజ్యుడైన నారదమహర్షి ధ్రువుని మహిమను అవలోకించి ప్రచేతసుల సత్త్రయాగంలో వీణపై ఇలా గానం చేశాడు.

**సీ. పతియె దైవంబుగా భావంబులోపలఁ దలఁచు సునీతినందను తపః ప్ర**
**భావము క్రియ ధర్మభవ్య నిష్ఠలఁ బొందఁ జాలరు బ్రహ్మర్షి జనము లనిన**
**క్షత్త్రియకులు నెన్నఁగా నేల? యెవ్వఁడు పంచసంవత్సర ప్రాయమునను**
**సురుచి దురుక్త్యుగ్ర శరభిన్న హృదయుఁడై మద్వాక్యహిత బోధమతిఁ దనర్చి**

**తే. వనమునకు నేగి హరిభక్తివశత నొంది, యజితుఁ డగు హరిఁదనవశుఁడై చరింపఁ**
**జేసి వెసఁ దత్పదంబును జెందె, నట్టి హరిపదంబును బొంద నె వ్వరికిఁ దరము? 380**

* పరమసాధ్వి అయిన సునీతి కొడుకు ధ్రువుడు తపస్సు చేసి సాధించిన మహాఫలాన్ని బ్రహ్మర్షులు కూడా పొందలేరంటే ఇక క్షత్రియుల మాట చెప్పే దేముంది? ఈ ధ్రువకుమారుడు అయిదేండ్ల లేతవయస్సులో సవతి తల్లి అయిన సురుచి పలికిన దుర్వాక్కులు అనే బాణాలు మనస్సును నొప్పించగా అప్పుడు నా ఉపదేశాన్ని పాటించి అరణ్యాలకేగి భక్తిపారవశ్యంతో శ్రీహరిని మెప్పించాడు. విష్ణుస్థానాన్ని అందుకున్నాడు. ఆ విధంగా హరిపదం సాధించటం ఎవరితరమూ కాదు.

**క. అని పాడె ననుచు విదురున, కనఘుఁడు మైత్రేయుఁ డనియె సంచిత భక్తిన్**
**వినుతోద్దామయశస్కుం, డనఁగల యా ధ్రువుని చరిత మార్యస్తుత్యా! 381**

ఈ విధంగా నారదమహర్షి ధ్రువుని యశస్సు గానం చేశాడు అని చెప్పి మైత్రేయ మహర్షి విదురునితో మళ్ళీ యిలా అన్నాడు.

**సీ. మహితసత్పురుష సమ్మతమును ధన్యంబు స్వర్గప్రదంబు యశస్కరంబు**
**నాయుష్కరంబుఁ బుణ్యప్రదాయకమును మంగళకర మఘమర్షణంబు**
**సౌమనస్యముఁ బ్రశంసాయోగ్యమును బాప హరమును ధ్రువపదప్రాపకంబు**
**నై యొప్పు నీ యుపాఖ్యానంబుఁ దగ నీకు నెఱిఁగించితినిఁ దీని నెవ్వఁడేని**

**తే. తివుట శ్రద్ధాగరిష్ఠుఁడై తీర్థపాద, చరణ సరసీరుహద్వయాశ్రయుఁడు నగుచు**
**భవ్యచరితు దినాంత ప్రభాతవేళ, లను సినీవాలి పూర్ణిమ లందు మఱియు 382**

**తే. ద్వాదశిని పద్మ బాంధవ వాసరమున, శ్రవణ నక్షత్రమున దినక్షయమునందుఁ**
**బరఁగ సంక్రమణ వ్యతీపాతలందు, సభల భక్తిని వినునట్టి సజ్జనులకు. 383**

**వ. క్లేశనాశంబును మహాప్రకాశంబును నైన భగవద్భక్తియు శీలాదిగుణంబులును గలుగు; మఱియుఁ దేజఃకామునకుఁ దేజంబును, మనఃకామునకు మనంబును, నిష్కామునకుఁ దత్త్వవిజ్ఞానంబును గలుగు. దీని వినిపించు వారికి దేవతానుగ్రహంబు గలుఁగు; నిట్టి యుపాఖ్యానంబు నీ కెఱింగించితి నని మైత్రేయుండు విదురునకుఁ జెప్పిన క్రమంబున శుకయోగి పరీక్షిత్తున కెఱింగించిన తెఱంగున సూతుండు శౌనకాదులకు వినిపించి వెండియు నిట్లనియె; నట్లు సెప్పిన మైత్రేయునిం గని విదురుం డిట్లనియె. 384**

* ధ్రువుడు ప్రశంసనీయమైన యశస్సు కలవాడు. సజ్జన సమ్మతమూ, ధన్యమూ, స్వర్గప్రదమూ, యశస్కరమూ, ఆయుష్కరమూ, పుణ్యప్రదమూ, మంగళకరమూ, అఘమర్షణమూ, సౌమనస్యమూ, ప్రశంసాయోగ్యమూ, పాపహరమూ, ధ్రువపదప్రాపకమూ అయిన ధ్రువుని పుణ్యచరిత్రను నీకు చెప్పాను. ఈ ధ్రువోపాఖ్యానాన్ని మిక్కిలి శ్రద్ధతో ఉదయ, సాయంకాలములందూ, సినీవాలీ పూర్ణిమలందూ, ద్వాదశినాడూ, ఆదివారమునాడూ, శ్రవణ నక్షత్రమునందూ, శూన్య తిథియందూ, వ్యతీపాతములందూ, సంక్రమణములందూ, సభలోనూ పఠించే సజ్జనులకూ, ఆకర్ణించే సత్పురుషులకూ సమస్త క్లేశాలు నశించి పరమపవిత్రమైన భగవద్భక్తి

ఉదయిస్తుంది. మంచి శీలం అలవడుతుంది. తేజస్సు కోరే వానికి తేజస్సూ, నిష్కామునకు తత్త్వజ్ఞానమూ లభిస్తాయి. ఈ కథ వినిపించేవారికి దేవతానుగ్రహం కలుగుతుంది. ఇటువంటి పవిత్రమైన కథను నీకు చెప్పాను అని మైత్రేయుడు విదురునికి చెప్పిన విధంగా శుకయోగి పరీక్షిత్తుకు చెప్పాడని సూతుడు శౌనకాది మునీంద్రులకు వినిపించాడు. అప్పుడు విదురుడు మైత్రేయ మహర్షిని చూచి ఇలా అన్నాడు.

సీ. అనఘాత్మ! నారద మునిపతి ధ్రువ చరిత్రము ప్రచేతసుల సత్త్రంబునందు
నర్థిమైఁ గీర్తించె నంటి; ప్రచేతసు లన నెవ్వ రెవ్వరి తనయు? లెట్టి
వంశజుల్? సత్త్ర మె వ్వలనను జేసి? రధ్వరమందు నిజకులధర్మశీలు
రగు ప్రచేతసులచే యజియింపఁగాఁబడె యజ్ఞపురుషుఁ డెట్టు లచ్యుతాంఘ్రి

తే. భక్తియుక్తుఁడు విదిత సద్భాగవతుఁడు, దివిరి హరిపాదసేవా విధి ప్రయుక్త
దేవదర్శనుఁ డగు నట్టి దివ్యయోగి, నారదుం డెట్లు గొనియాడె శౌరికథలు? 385

క. నాకిపు డెఱిఁగింపుము సుశ్లోకుని చరితామృతంబు శ్రోత్రాంజలులం
బైకొని జుఱ్ఱియుఁ దనివిం, గైకొనకున్నది మనంబు గరుణోపేతా! 386

క. అని యడిగిన విదురునిఁ గనుఁ, గొని మైత్రేయుండు పలికె గొనకొని ధ్రువుఁడున్
వనమునకుఁ జనిన నాతని, తనయుం డగు నుత్కలుండు దళితాఘుండై. 387

* మునీంద్రా! నారదమహర్షి ప్రచేతసుల యజ్ఞంలో ధ్రువచరిత్రాన్ని ఎంతో కుతూహలంతో గానం చేశాడు అని చెప్పావు. ఎవ రా ప్రచేతసులు? వారు ఎవ్వరి పుత్రులు? ఏ వంశంలో పుట్టారు? వారు ఎక్కడ యజ్ఞం చేశారు? స్వధర్మ శీలురైన ప్రచేతసులు యజ్ఞ పురుషుడైన శ్రీహరిని ఏ విధంగా అర్చించారు? శ్రీమన్నారాయణ పాదారవిందాలను భక్తితో భజించేవాడూ, ప్రసిద్ధ భాగవతోత్తముడూ, శ్రీహరిని సేవించే విధానం తెలిసినవాడూ, దివ్యదర్శనుడూ, దేవఋషి అయిన నారదుడు ప్రచేతసులకు చెప్పిన విష్ణు కథలను నాకు వినిపించు. ఆ సుశ్లోకుని కథామృతం చెవులు అనే దోసిళ్ళతో ఎంత త్రాగినప్పటికీ నాకు తృప్తి కలగటం లేదు.

సీ. చతురుఁ డాజన్మ ప్రశాంతుండు నిస్సంగుఁడును సమదర్శనుండును ఘనుండు
నై యాత్మయందు లోకావళి, లోకంబు లందు నాత్మను జూచు చనఘమైన
యనుపమయోగక్రియా పావకాదగ్ధ కర్మ మలాశయ కలనఁ బేర్చి
జడుని కైవడి జీఁకుచందంబునను మూకు పగిది నున్మత్తుని భంగిఁ జెవిటి

తే. వడువునను గానఁబడుచు సర్వజ్ఞుఁడై ప్ర, శాంతకీల హుతాశను సరణిఁ బొల్చి
సతత శాంతంబు నంచిత జ్ఞానమయము, నైన బ్రహ్మస్వరూపంబు నాత్మఁ దలఁచి 388

క. తనకంటె నితర మొక టెఱుఁ, గని కతమున సార్వభౌమకశ్రీఁ బొందన్
మనమునఁ గోరక యుండుటఁ, గని కులవృద్ధులును మంత్రిగణములు నంతన్. 389

* అప్పుడు మైత్రేయ మహర్షి విదురుణ్ణి చూచి యిలా అన్నాడు. ధ్రువుడు తపోవనానికి వెళ్ళాడు కదా! ధ్రువుని పెద్ద కొడుకైన ఉత్కలుడు నిష్కళంకుడు. పుట్టుకతోనే శాంతమూర్తి. నిస్సంగుడు. సమదర్శనుడు. తనలో లోకాలనూ, లోకాలలో తననూ చూస్తూ యోగాభ్యాసం అనే అగ్నిలో కర్మవాసనలను దహింపజేశాడు. మందబుద్ధివలె, గ్రుడ్డివానివలె, మూగవలె, వెర్రివానివలె, చెవిటివానివలె ప్రవర్తించాడు. అతడు సర్వజ్ఞుడు కావటంచేత మంటలు చల్లారి నివురు గప్పిన నిప్పువలె ఉండేవాడు. శాంతమూ, జ్ఞానమయమూ అయిన బ్రహ్మ స్వరూపాన్ని మనస్సులో భావిస్తూ తనకంటే ఇతర పదార్థాన్ని ఎరుగని కారణంచేత అతడు సార్వభౌమ పదాన్ని ఆశింపలేదు. కులంలోని పెద్దలు, మంత్రులు అది గమనించారు.

**వ. అతని నున్మత్తునిం గాఁ దెలిసి తదనుజుండైన వత్సరునికిఁ బట్టంబు గట్టి; రా వత్సరునికి సర్వర్థి యను భార్యయందుఁ బుష్పార్ణుండును జంద్రకేతుండును నిషుండును నూర్జుండును వసువును జయుండును నన నార్వురు తనయులు గలిగి; రందుఁ బుష్పార్ణుండను వానికిఁ బ్రభయు దోషయు నను నిద్దఱు భార్యలై; రందుఁ బ్రభ యనుదానికిం బ్రాతర్మధ్యందిన సాయంబు లను సుతత్రయంబును దోషయను దానికిఁ బ్రదోషనిశీథ వ్యుష్టు లనువారు ముగ్గురును బుట్టి; రందు వ్యుష్టుం డను వానికిఁ బుష్కరిణి యను పత్నియందు సర్వతేజుండను సుతుండు వుట్టె; వానికి నాకూతి యను మహిషివలనఁ జక్షుస్సంజ్ఞుండయిన మనువు జనియించె; వానికి నడ్వల యను భార్యయందుఁ బురువును, గుత్సుండును, ద్రితుండును, ద్యుమ్నుండును, సత్యవంతుండును, ఋతుండును, వ్రతుండును, నగ్నిష్టోముండును, నతిరాత్రుండును, ప్రద్యుమ్నుండును, శిబియును, నుల్ముకుండును నను పన్నిద్దఱు తనయులు గలిగి, రందు నుల్ముకునికిఁ బుష్కరిణియను దానివలన నంగుండును, సుమనసుండును, ఖ్యాతియుఁ, గ్రతువును, నంగిరసుండును, గయుండును నను నార్వురు కొడుకులు పుట్టి; రందు నంగునికి సునీథ యనుధర్మపత్నివలన వేనుం డను పుత్రుం డుదయించిన. 390**

* వారు ఉత్కలుణ్ణి పిచ్చివానిగా భావించి అతని తమ్ముడైన వత్సరునకు పట్టం కట్టారు. ఆ వత్సరునకు "సర్వర్థి" అనే భార్యవలన పుష్పార్ణుడు, చంద్రకేతుడు, ఇషుడు, ఊర్జుడు, వసువు, జయుడు అనే ఆరుగురు కొడుకులు కలిగారు. వారిలో పుష్పార్ణునకు ప్రభ, దోష అనే వారు ఇద్దరు భార్య లయ్యారు. అందులో ప్రభకు ప్రాతర్మధ్యందిన సాయములు అను ముగ్గురు కొడుకులు జన్మించారు. దోషకు ప్రదోషుడు, నిశీథుడు, వ్యుష్టుడు అను ముగ్గురు కొడుకులు పుట్టారు. అందులో వ్యుష్టుడనే వానికి పుష్కరిణి అనే భార్య వల్ల సర్వతేజుడు అనే కొడుకు పుట్టాడు.

ఆ సర్వతేజునకు "ఆకూతి" అనే ఆమె భార్య అయింది. ఆ దంపతులకు "చక్షుస్సు" అను పేరుగల మనువు జన్మించాడు. చక్షుస్సునకు "నడ్వల" అనే భార్యయందు పురువు, కుత్సుడు, త్రితుడు, ద్యుమ్నుడు, సత్యవంతుడు, ఋతుడు, వ్రతుడు, అగ్నిష్టోముడు, అతిరాత్రుడు, సుద్యుమ్నుడు, శిబి, ఉల్ముకుడు అనే పన్నెండు మంది పుత్రులు కల్గారు. వారిలో ఉల్ముకునికి పుష్కరిణి అనే భార్యవల్ల అంగుడు, సుమనసుడు, ఖ్యాతి, క్రతువు, అంగిరసుడు, గయుడు అనే ఆరుగురు కొడుకులు ఆవిర్భవించారు. అందులో అంగునికి "సునీథ" అనే భార్యవల్ల వేనుడు అనే కొడుకు ఉదయించాడు.

మ. క్షితినాథోత్తముఁ డాత్మనందనుని దుశ్శీలంబు వీక్షించి దుః
ఖితుఁడై యొంటిగఁ దత్పురిన్ వెడలి యేగెన్ వేగ నెందేని త
ద్గతి వీక్షించి మునీశ్వరుల్ గుపితులై దంభోళిసంకాశ వా
క్యతతిం జావ శపింప వాఁ డపుడు వీఁకం గూలె, న మ్మేదినిన్. 391

* అంగ రాజేంద్రుడు తన కొడుకైన వేనుని చెడు స్వభావాన్ని చూచి దుఃఖించి ఒంటరిగా పురము వెడలి వెళ్ళి పోయాడు. రాజు వెళ్ళిపోయిన సంగతి విని మునీశ్వరులు వేనునిపై కోపించి వజ్రసన్నిభాలైన వాక్కులతో వానిని శపించారు. వేనుడు వెంటనే నేల కూలాడు.

సీ. కైకొని యపుడు లోకం బరాజకమైనఁ బ్రజలు దస్కరపీడఁ బల్లటిల్లఁ
గనుఁగొని దుఃఖించి మునులు గతాసుఁడై పడిన వేనుని వలపలి భుజంబు
నర్థి మథింప నారాయణాంశంబున నాదిరాజన నొప్పునట్టి పృథుఁడు
జనియించె ననవుడు విని విదురుఁడు మునిఁ గనుఁగొని పలికె నో యనఘచరిత!

తే. సాధువు సుశీలనిధియును సజ్జనుండు, నలఘు బ్రహ్మణ్యుఁడును నైనయట్టి యంగ
ధరణివిభునకు దుష్టసంతాన మెట్లు, గలిగె? న య్యంగపతి యేమి కారణమున. 392

వ. విమనస్కుం డగుచుఁ బురంబు విడిచె? ధర్మకోవిదులైన మునులు దండవ్రతధరుండును, రాజును నగు వేనునియందు నే పాపంబు నిరూపించి బ్రహ్మదండం బొనర్చి రదియునుంగాక లోకంబున రాజులు లోకపాల తేజోధరులుఁ, బ్రజాపాలనాసక్తులుఁ గావునఁ గల్మషంబు గలిగినం బ్రజలచేత నవజ్ఞార్హులై యుందురు గావున నా వేనుని చరిత్రంబు శ్రద్ధాగరిష్ఠుండు భక్తుండునైన నాకుం బరాపరవిదగ్రేసరుండ వయిన నీ వెఱింగింప నర్హుండ వనిన మైత్రేయుం డతని కిట్లనియె. 393

* అప్పుడు లోకం రాజులేనిది అయింది. ప్రజలు దొంగల బాధతో తల్లడిల్లి పోయారు. అది చూచి మునులు విచారించినవారై మరణించిన వేనుని కుడిభుజాన్ని మథించారు. వేనుడి కుడి భుజం నుండి నారాయణాంశతో మొదటి చక్రవర్తియైన పృథుడు జన్మించాడు.

అని మైత్రేయ మహర్షి చెప్పగా విని విదురుడు ఇలా ప్రశ్నించాడు.

మహాత్మా! సజ్జనుడు, సుశీలుడు, బ్రహ్మణ్యుడు అయిన అంగభూపతికి చెడ్డ సంతానం ఎందుకు కలిగింది? అంగరాజు ఏ కారణం చేత వ్యాకుల హృదయంలో పట్టణాన్ని పరిత్యజించి వెళ్ళాడు? ధర్మజ్ఞులయిన మునులు చండశాసనుడూ, రాజూ అయిన వేనుని యందు ఏ పాపాన్ని గమనించి బ్రహ్మదండం ప్రయోగించారు? రాజులు దిక్పాలకుల తేజస్సుతో జన్మిస్తారు కదా! ప్రజలను రక్షించే రాజులు ఏదైన తప్పు చేసినప్పటికీ వారిని అవమానించటం ప్రజలకు తగదుకదా! కాబట్టి ఆ వేనుని కథను శ్రద్ధావంతుడనూ, భక్తుడనూ అయిన నాకు వివరించి చెప్పు. నీవు ఇహపరాలు తెలిసిన వారిలో మేటివికదా! అని అడిగిన విదురునితో మైత్రేయమహర్షి ఇట్లా అన్నాడు.

## -: అంగపుత్రుండగు వేనుని చరిత్ర :-

సీ. అనఘాత్మ! రాజర్షి యైనట్టి య య్యంగ మేదినీ విభుఁ డశ్వమేధమఖము
గావింప ఋత్విజ్నికాయంబు చేత నా హూత మయ్యును సురవ్రాత మందు
నాత్మ హవిర్భాగ మంద రాకుండిన నప్పుడు ఋత్విక్కు లద్భుతంబు
నందుచు యజమానుఁడైన య య్యంగ మహీవరుఁ జూచి రాజేంద్ర; యిట్లు

తే. త్రిదశు లిదె పిల్వఁబడియును దివిరి యాత్మ, భాగములఁ బొంద రారైరి భవ్యచరిత!
యేమిహేతువొ యిది మాకు నెఱుఁగఁబడదు;, కనఁగ హోమంబు దుష్టంబు గాదు మఱియు.394

వ. శ్రద్ధాయుక్తులై ధృత వ్రతులైన యీ బ్రహ్మవాదులచేత సంప్రయుక్తంబులైన యీ ఛందస్సులు వీర్యవంతంబు లయియున్నవి; యిందు దేవతాపరాధం బణుమాత్రం బైన నెఱుంగ; మిట్టిచోటం గర్మసాక్షు లయిన దేవతలు స్వకీయ భాగంబు లంగీకరింపకుండుటకుఁ గతం బెయ్యదియో యనిన నయ్యంగుండు దుఃఖితస్వాంతుండై తన్నిమిత్తంబు సదస్యుల నడుగం దలంచి వారల యనుమతిం బడసి మౌనంబు మాని యిట్లనియె. 395

* ఒకసారి రాజర్షి అయిన అంగభూపతి అశ్వమేధ యజ్ఞం చేస్తున్నాడు. ఋత్విజులు ఆహ్వానించి నప్పటికీ దేవతలు హవిర్భాగాలను అందుకోటానికి రాలేదు. అప్పుడు ఋత్విక్కులు ఆశ్చర్యపడుతూ యజమానుడైన అంగభూపాలుణ్ణి చూచి "మహారాజా! ఆహ్వానించి నప్పటికీ హవిర్భాగాలను అందుకోటానికి దేవతలు రాలేదు. కారణం మాకు తెలియడం లేదు. హోమవిధానంలో ఏ దోషమూ లేదు. బ్రహ్మవేత్తలు శ్రద్ధతో, దృఢనియమాలతో సారవంతాలైన మంత్రాలను పఠించారు. దేవతలకు ఏ మాత్రమూ అపరాధం జరగలేదు. అయినప్పటికీ కర్మసాక్షులయిన దేవతలు తమతమ భాగాలను గ్రహింపకుండా ఉండటానికి కారణం ఏమిటో మాకు తెలియడం లేదు'' అని అన్నారు.

అప్పుడు అంగుడు మనస్సులో దుఃఖిస్తూ కారణం సదస్యులను అడిగి తెలుసుకొనగోరి వారి ఆజ్ఞను పొంది, మౌనమును విడిచిపెట్టి యిలా అన్నాడు.

ఆ. అనఘ చరితులార! యాహూతు లయ్యు సు, పర్వగణము లాత్మభాగములను
స్వీకరింప; రేను జేసిన యపరాధ, మెట్టి దనిన వార లిట్టు లనిరి. 396

* పుణ్యచరిత్రులారా! పిలిచినప్పటికీ దేవతలు వచ్చి తమ హవిర్భాగాలను స్వీకరింప లేదు. నేను చేసిన అపరాధం ఏమిటి?

అప్పుడు సదస్యులు ఇలా అన్నారు.

క. నరనాథ! యిదియు నిప్పుడు, వొరసిన దుష్కృతము గాదు పూర్వభవమునం
బరఁగిన దురితం బిది యా, దరమున నెఱిఁగింతు మింత ధన్యచరిత్రా! 397

రాజా! ఇది ఈ జన్మలో ఇప్పుడు చేసిన పాపం కాదు. ఇది పూర్వజన్మలో చేసిన పాపం. దానిని తెలియజేస్తాము. విను.

క. నీ వింతవాఁడ వయ్యును, భూవర! సంతానలాభమును బొందమి నా
దేవతలు యాగభాగము లీ వేళ భుజింప రైరి యిందుకు నీవున్. 398

తే. పుత్రకామేష్టిఁ గావించి పుత్రుఁ బడయు, మట్లొనర్చిన దేవత లాత్మభాగ
మర్థి నంగీకరింతు; ర య్యజ్ఞ పురుషు, హరి భజించిన సకలకార్యములుఁ గలుగు. 399

* నీవు గొప్పవాడవే అయినప్పటికీ నీకు సంతానం లేదు. అందుచేత దేవతలు హవిర్భాగాలను భుజించటానికి రాలేదు. కాబట్టి నీవు పుత్రకామేష్టిని చేసి పుత్రుణ్ణి పొందాలి. అలా చేస్తే దేవతలు సంతోషపూర్వకంగా తమ భాగాలను గ్రహిస్తారు. యజ్ఞపురుషుడైన శ్రీహరిని సేవించి నట్లయితే సకల కార్యాలూ చక్కగా నెరవేరుతాయి.

వ. అనిన నాతండు సంతానార్థంబు శిపివిష్ట దేవతాకం బయిన పురోడాశంబుచే హోమంబు గావించినం దదీయ హోమకుండంబు నందు హేమమాల్యాంబరాభరణుం డయిన పురుషుండు హిరణ్మయ పాత్రంబున సిద్ధపాయసంబు గొనుచు నుదయించిన నప్పుడు విప్రానుమతంబున నా రాజు దత్పాయసంబు నంజలిచే గ్రహించి సంతోషయుక్తుం డగుచు భార్య కొసంగె నంత. 400

* అప్పుడు అంగభూపతి సంతానం కోసం శిపివిష్ట దేవతాకం అయిన పురోడాశంతో హోమం చేశాడు. ఆ హోమ కుండం నుంచి బంగారు హారాలూ, పట్టువలువలూ ధరించిన ఒక పురుషుడు పాయసంతో నిండిన పసిడి పాత్రను చేత పట్టుకొని ఉదయించాడు. అప్పుడు బ్రాహ్మణుల ఆజ్ఞచేత ఆ రాజు ఆ పాయస పాత్రాన్ని దోసిలితో అందుకొని సంతోషంతో భార్యకు ఇచ్చాడు.

చ. కమలదళాక్షి పాయసము గౌతుక మొప్ప భుజించి భర్తృ సం
గమమునఁజేసి తత్క్షణము గర్భముఁ దాల్చి కుమారుఁ గాంచె న
క్కొమరుఁడు నంత మాతృజనకుం డగు మృత్యువుఁ బోలి తా నధ
ర్మమునఁ జరించుచుండె గుణమండన! వేనుఁ డనంగ నిచ్చలున్. 401

* అంగరాజు భార్య సునీథ పాయసాన్ని ఆనందంతో ఆరగించింది. పతి సంయోగం వల్ల ఆమె వెంటనే గర్భం ధరించి కుమారుణ్ణి కన్నది. ఆ కుమారుని పేరు వేనుడు. ఆ వేనుడు తన తల్లితండ్రియైన మృత్యుదేవతకు సరిపోలి ఆధర్మ మార్గంలో సంచరింపసాగాడు.

చ. ఎనయఁగ బాల్యమందుఁ దన యీడు కుమారులఁ గ్రీడఁబోలె నె
మ్మనమున భీతి లేక కృపమాలి పశుప్రకరంబు నొంచు పో
ల్కిని నరికట్టి చంపుచును గిల్బిషలుబ్ధక వృత్తిమై శరా
సన శరముల్ ధరించి మృగజాతి నసాధు గతిన్ వధించుచున్. 402

* వేనుడు చిన్నతనంలో ఆటలాడుతూ తన ఈడు పిల్లలను ఈడ్చుకొని వచ్చి జాలి లేకుండా పశువులను చంపి నట్లు చంపేవాడు. అదే అతనికి ఒక ఆట అయింది. క్రూర కిరాతుని వలె ధనుర్బాణాలు ధరించి సాధు మృగాలను వధించేవాడు. వేనుని తల్లి సునీథ మృత్యువుకూతురు. మనుమడైన వేనునికి తాతగారి గుణాలు వచ్చాయి.

**వ. ఇట్లు మాతామహ దోషంబునం బాపవర్తనుండై చరియించు కొడుకుం జూచి యంగుండు వివిధ శాసనంబుల దండించియు నతని దుశ్చేష్టితంబులు మానుపం జాలక దుఃఖితాత్ముండై మనంబున.403**

* తాతగారి దోషంవల్ల పాపమార్గంలో సంచరించుతున్న కొడుకును అంగరాజు పెక్కు విధాలుగా దండించాడు. అయినా అతని చెడుచేతలను మాన్పలేక దుఃఖిస్తూ యిలా అనుకున్నాడు.

**క. అనయము నిట్టి కుపుత్త్రునిఁ, గని పరితాపంబుఁ బొందుకంటెను ధరలో**
**ననపత్యుం డగు టొప్పును, వనజాక్షు భజించునట్టి వాఁ డగువాఁడున్. 404**

* ఇటువంటి చెడ్డ కొడుకును కని దుఃఖించడంకంటే సంతానం లేకుండా ఉండడమే ఎంతో మేలు. అప్పుడు భక్తితో భగవంతుణ్ణి భజించటానికైనా వీలు కలుగుతుంది.

**వ. అని వెండియు నిట్లనియె. 405**

**సీ. జనులకు దుష్పుత్త్రకునిచేత నపకీర్తి యు నధర్మమును సర్వజనవిరోధ**
**మును మనోవ్యథయును ననయంబుఁ బ్రాప్తించు నట్టి కుపుత్త్రమోహంబు విడువఁ**
**జాలక బహుమాన సంగతిఁ గను నెవ్వఁ డతని గేహంబు దుఃఖాలయంబు**
**నగునని మఱియు నిట్లను మనుజుండు శోక స్థాన మగు పుత్త్రుకతనఁ జేసి**

**తే. యనుపమక్లేశ భాజనం బయిన గృహము, విడుచుఁ గావున నిట్టి వివేకహీనుఁ**
**డగు కుపుత్త్రు సుపుత్త్రుఁగా నాత్మఁ దలఁతు, ననుచు నా రాజు బహుదుఃఖితాత్ముఁ డగుచు. 406**

* చెడ్డ కొడుకువల్ల జనులకు అపకీర్తి, అధర్మం, అందరితో విరోధం, మనోవ్యథ కలుగుతాయి. అటువంటి పుత్రునిపై వ్యామోహం విడువలేని వాని యిల్లు దుఃఖానికి నెల వవుతుంది అని మళ్లీ యిలా అనుకున్నాడు. శోకం కలిగించే పుత్రుని వల్ల అనేక కష్టాలు సంభవిస్తాయి. అప్పుడు కన్నతండ్రి గృహాన్ని కూడా విడిచిపెట్టి వెళ్ళి పోతాడు. అందుచేత జ్ఞానహీనుడైన చెడ్డ కొడుకునే మంచి కొడుకుగా భావిస్తున్నాను అని ఆ రాజు మిక్కిలిగా దుఃఖించాడు.

**క. తగు సుమహైశ్వర్యోదయ, మగు గృహమును బ్రజల నిద్ర నందిన భార్యన్**
**దిగవిడిచి యెక్క డేనియు, జగతీశుఁడు సనె నిశీథ సమయమునందున్. 407**

* ఇలా విచారించి ఒకనాడు గొప్ప ఐశ్వర్యంతో కూడిన గృహాన్ని, ప్రజలనూ, నిద్రలో ఉన్నభార్యను విడిచి పెట్టి అంగరాజు అర్ధ రాత్రి ఒక్కడే ఎక్కడికో వెళ్లిపోయాడు.

వ. అంతఁ దద్వృత్తాంతం బంతయు సుహృద్బాంధవ పురోహితామాత్య ప్రభృతు లయిన ప్రజ లెఱింగి దుఃఖించుచున్న సమయంబున భూమియం దెల్లయెడలఁ దదన్వేషణం బాచరించి గూఢుం డయిన పరమ పురుషునిం గానలేని కుయోగి చందంబున నా రాజుం బొడగానలేక విఫలోద్యోగులయి మగిడి పురంబునకు వచ్చిరి. తదనంతరంబ. 408

* అంగుడు రాజ్యాన్ని విడిచివెళ్ళిన సంగతి మిత్రులు, చుట్టాలు, పురోహితులు, మంత్రులు మొదలయినవారు తెలుసుకొని దుఃఖించారు. నేల నలుమూలలా వెదికారు. నిగూఢుడు అయిన భగవంతుని చూడలేని కుయోగులవలె ఆ రాజును కనుగొన లేక తమ ప్రయత్నాలు వ్యర్థం కాగా తమ పట్టణానికి తిరిగి వచ్చారు.

సీ. సమధిక బ్రహ్మనిష్ఠాతిగరిష్ఠులౌ భృగ్వాది మౌనీంద్ర బృంద మపుడు
లోకావనైకావలోకనోత్సుక మౌట జనులు స్వరక్షక జనవిభుండు
లేమిఁ బశుప్రాయులై మెలంగుటఁగని యంత వేనుని మాత యగు సునీథ
యనుమతి నఖిల ప్రజావళి కప్రియుండైన న వ్వేనుఁ బట్టాభిషిక్తుఁ

తే. జేసి; రంతట మహితోగ్రశాసనుఁ డగు, వేనుఁ బట్టంబు గట్టుట విని సమస్త
తస్కరులు సర్పభీతిచేఁ దలఁగు మూష, కముల కైవడి నడఁగిరి గహనములను. 409

* ఆ తరువాత బ్రహ్మనిష్ఠాగరిష్ఠులైన భృగువు మొదలయిన మునీంద్రులు రక్షకుడైన రాజు లేకపోవడంచేత పశువులవలె ప్రవర్తిస్తున్న ప్రజలను చూచి, లోకక్షేమం కోరినవారై వేనుని తల్లి అయిన సునీథ అనుజ్ఞ పొంది ప్రజల కెవ్వరికీ యిష్టుడు కాకపోయినప్పటికీ వేనుడికి పట్టం కట్టారు. చండశాసనుడైన వేనుడు రాజగుట విని పాములకు భయపడి తొలగిపోవు ఎలుకలవలె దొంగలు అడవులలో దాగుకున్నారు.

వ. అంత నతండు. 410

చ. పరుపడి నష్ట లోకపరిపాలక ముఖ్య విభూతియుక్తుఁడై
పరఁగి నృపాసనంబున విభాసితుఁడౌట స్వభావసిద్ధమై
వఱలు మహావలేపమున వారక సంతత మాననీయ స
త్పురుషుల నెల్ల నెందుఁ బరిభూతులఁ జేయుచునుండె నిచ్చలున్. 411

* అప్పుడు అష్టదిక్పాలకుల సంపదను ధిక్కరించే ఐశ్వర్యమును పొంది, సింహాసన మెక్కినా వేనరాజు స్వభావ సిద్ధమైన గర్వాతిశయంతో పూజ్యులైన సజ్జనుల ననుదినమూ అవమానింపసాగాడు.

చ. మఱియు నతండు భూగగనమార్గములం దొకవేళ నొక్కఁ డే
యరదము నెక్కి క్రుమ్మరు నిరంకుశవృత్తిఁ జరించు మత్త సిం
ధురవిభు పోల్కి సత్పురుషదూషిత వర్తన నొప్పుచున్ నిరం
తర సుజనాపరాధకృతి తత్పర మానసుఁడై క్రమంబునన్. 412

* ఒక్కొకసారి ఒక్కడే రథమెక్కి భూమిమీదా, ఆకాశం మీదా తిరిగేవాడూ. మదించిన గజరాజువలె నిరంకుశంగా సంచరించేవాడు. పెద్దలైనవారు తన ప్రవర్తనను దూషిస్తుండగా ఎల్లప్పుడూ సజ్జనులకు అపకారం చేసేవాడు.

**క. దివ్యులు వెఱఁగందఁగఁ బ్ర, థ్వీవ్యోమము లగల భేరి వ్రేయించె "న యష్టవ్య మదాతవ్య మహో, తవ్యం విప్రాయ" యనుచు దాత్త ధ్వనులన్. 413**

* బ్రాహ్మణులారా! "యజ్ఞాలు చేయవద్దు", "దానాలు ఈయవద్దు", అగ్నిలో వేల్చవద్దు"- అని భూమీ, ఆకాశమూ, బ్రద్ధలయ్యే టట్లు చాటింపు వేయించాడు. ఆ చాటింపు విని దేవతలు భయపడ్డారు.

**క. అని యిట్టుల భేరీరవ, మునఁ జేసి సమస్త ధర్మములు వారింపన్ మును లవినీతుండగు వేనుని దుశ్చరితంబు జనమనోభయ మగుటన్. 414**

**తే. కని కృపాయత్తు లగుచు నిట్లనిరి యిట్టి రాజచోర భయంబు లీ భూజనులను బలసి యిరువంకలను బాధపఱుపఁ జొచ్చె, దారువందుల వహ్ని చందనమునఁ బెలుచ. 415**

* ఇలా చాటింపు వేయించి సమస్త ధర్మాలను అడ్డగిస్తున్న వేనుని చెడునడవడి ప్రజలను భయం కలిగించింది. అది చూచి మునులు దయామయులై తమలో ఇలా అనుకున్నారు. కట్టెకు రెండు ప్రక్కలనూ అగ్ని అంటుకున్నట్లు రాజ భయమూ, చోరభయమూ రెండు వైపులా ప్రజలను పీడిస్తున్నాయి.

**చ. అరయ నరాజకంబగు మహాభయముం దొలఁగింపఁగోరి యి
ట్లెఱుఁగక యీ యనర్హుని మహీపతిఁ జేసినయట్టి దోషముం
బరువడిఁ జెందె దుగ్ధరస పానమునం బరివృద్ధి నొందు న
య్యురగ భయంబు పోషకుని నొందినరీతి ననర్థహేతువై. 416**

* రాజు లేకపోవటం వలన కలిగిన భయాన్ని తొలగించడం కోసం, అనర్హు డయిన వేనుణ్ణి ఆలోచించకుండా రాజును చేసిన దోషం దేశాన్ని కట్టికుడుపుతున్నది. పాముకు పాలు పోసి పెంచితే ఆ పాము పాలు పోసిన వానిని కరచి చంపకుండా ఊరకుంటుందా?

**వ. అదియునుం గాక 417**

**క. మునుకొని సునీథ గర్భం, బున జనియించియు స్వభావమున దుర్జనుఁడై యెనయఁ బ్రజాపాలనమున, కును బాల్పడి ప్రజల మన్ని గొనఁ జొచ్చెఁగదే. 418**

* పరమ సాధ్వియైన సునీథ కడుపున పుట్టినప్పటికీ, వీడు స్వభావంచేత దుష్టుడు. కాబట్టి తన్ను రాజును చేసిన ప్రజలను పాలించడం మాని హింసిస్తున్నాడు.

**వ. అదిగాక యీ వేనుండు పూర్వంబున జ్ఞాన సంపన్నులఁమైన మనచేత రాజుగాఁ జేయంబడియెఁ, గావున నిట్టివాని మన మందఱమును గూడి ప్రార్థింతము; లోకరక్షణార్థం బగుటఁ దద్దోషంబు మనల**

స్పృశింపదు; సమీచీ నోక్తులంజేసి వీని ననునయింప వాని గ్రహింపకుండెనేని మున్న లోకధిక్కారాగ్ని సందగ్ధుండగు వీని మన తేజోమహాగ్ని చేత భస్మీభూతుం జేయుద మని యాలోచించి గూఢమన్యు లగుచు వేనునిం గదియం జని యతని కిట్లనిరి. 419

* ఈ వేనుణ్ణి పూర్వం జ్ఞానవంతులై పెద్దలు రాజును చేశారు. కాబట్టి ఇతణ్ణి మన మందరమూ కలిసి వేడుకుందాము. లోకరక్షణ కోసం ప్రార్థించటంలో తప్పులేదు. ఒక వేళ ఉన్నా ఆ దోషం మనలను అంటదు. మంచి మాటలతో వీనిని బతిమాలుకుందాము. మన మాటలను పెడ చెవిని బెట్టినట్లయితే మన తేజోగ్ని జ్వాలల చేత ఇతణ్ణి బూడిద చేద్దాం. వీడు ఇంతకుముందే లోక ధిక్కారం అనే అగ్నిలో కాలిపోయినవాడే కదా! అని ఆలోచించి కోపాన్ని దిగమింగుకొని మునులు వేనుని సమీపించి యిలా అన్నారు.

క. నరపాలక! నీ కాయువు, సిరియును బలమును యశంబుఁ జేకుఱు, వృద్ధిం
బొరయుదుగా కనుచు మనో, హరముగ నాశీర్వదించి యతివినయమునన్. 420

* రాజా! నీకు ఆయుస్సూ, ఐశ్వర్యమూ, బలమూ, కీర్తి చేకూరు గాక! నీకు జయమగుగాక!" అని మనస్సునకు ఆనందం కలుగునట్లుగా దీవించి మిక్కిలి వినయంతో మళ్లీ ఇలా అన్నారు.

వ. ఇట్లనిరి! నరేంద్రా! యే మొక్కటి విన్నవించెద! మవధరింపుము; పురుషులకు వాఙ్మనఃకాయ వృత్తుల వలన నాచరించు ధర్మంబు సమస్త లోకంబులను విశోకంబులం జేయు; నసంగు లయినవారికి మోక్షంబు నిచ్చు, నట్టి ధర్మంబు ప్రజలకు క్షేమకారణంబు గావున నీయందుఁ జెడకుండుంగాక యని పలికి మఱియు ధర్మంబు నాశంబు నొందిన నైశ్వర్యంబుచే రాజు విడువంబడు నని చెప్పి వెండియు నిట్లనిరి; దుష్టచిత్తులగు సమాత్యుల వలనను దస్కరుల వలనను బ్రజలు నాశంబు నొందకుండ రక్షించుచు యథాన్యాయంబుగ వారలచేఁ గరంబు గొనుచునుండు మహీపతి యిహపర సౌఖ్యంబుల నందు; నదియునుం గాక యెవ్వని రాష్ట్రంబున నే పురంబున యజ్ఞేశ్వరుండయిన పురుషోత్తముండు నిజవర్ణాశ్రమోచితం బయిన ధర్మంబు గల వారిచేత యజింపంబడు, నట్టి నిజశాసనవర్తియగు రాజువలన సర్వభూతభావనుండును, మహాభాగుండును, భగవంతుండును నగు సర్వేశ్వరుండు సంతోషించిన రాష్ట్రాధిపతికి సర్వసౌఖ్యంబులుఁ బ్రాపించు; లోకపాలకు లగువారు సర్వేశ్వరుని కొఱకు బలిప్రదానంబులు సేయుదురు; సమస్తలోక దేవతా యజ్ఞాది సంగ్రహుండును, వేదమయుండును ద్రవ్యమయుండును, దపోమయుండును నగు నారాయణుని విచిత్రంబులైన యజ్ఞంబులచేత యజనంబు నేసిన నీకు నభయంబగు; మోక్షంబునుం గలుగు కావున నీ రాజ్యంబున ముఖంబులు సేయుమని యాజ్ఞాపింపుము. నీ దేశంబునం జేయంబడిన యజ్ఞంబులచేత హరికళా యుక్తంబులగు దేవగణంబులు స్విష్టంబులై, తుష్టంబు లగుచు భవదీయవాంఛితార్థంబుల నిత్తురు; కావున దేవతాతిరస్కారంబు నీకు యుక్తంబు గాదు; వేదచోదితంబులగు ధర్మంబులం దాసక్తుండవు గమ్మనిన వేనుం డిట్లనియె. 421

* రాజా! మా విన్నపాన్ని శ్రద్ధగా విను. పురుషులు త్రికరణ శుద్ధిగా ఆచరించే ధర్మం లోకాల దుఃఖాన్ని తొలగిస్తుంది. నిష్కాము లైనవారికి మోక్షాన్ని ఇస్తుంది. అలాంటి ధర్మం ప్రజలకు మేలు కలిగిస్తుంది.

కాబట్టి అది నీ వల్ల చెడకుండా ఉండాలి. ధర్మం నశించినట్లయితే సంపదలు రాజును విడిచి పెడతాయి. దుష్టులైన మంత్రుల నుండీ, దొంగలనుండీ ప్రజలను రక్షిస్తూ న్యాయమైన పన్నుగైకొనే రాజు, ఈ లోకంలోనూ, పరలోకంలోనూ సుఖాలు పొందుతాడు. ఏ రాజు దేశంలో యజ్ఞేశ్వరుడైన విష్ణువు తమ తమ వర్ణాశ్రమాలకు తగిన ధర్మాలను నిర్వర్తించే ప్రజలచేత పూజింపబడతాడో ఆ రాజును చూచి సర్వేశ్వరుడు, సర్వాంతర్యామి, మహామహిమాన్వితుడు అయిన భగవంతుడు సంతోషిస్తాడు. సర్వేశ్వరుడైన భగవంతుడు సంతోషిస్తే రాజుకు సర్వసౌఖ్యాలు కలుగుతాయి. లోకపాలకులు సర్వేశ్వరునికి పూజలు సమర్పిస్తారు. కాబట్టి నీవు యజ్ఞాలలో సమస్తలోకాధినాథుడు, దేవాదిదేవుడు, యజ్ఞస్వరూపుడు, వేదమయుడు, సర్వవ్యాపి, తపోమయుడు అయిన నారాయణుని ఆరాధిస్తే శుభంతోపాటు నీకు మోక్షం సిద్ధిస్తుంది. కాబట్టి నీ రాజ్యంలో యజ్ఞాలు జరిపించు. యజ్ఞాలవలన హరి అంశ కలిగిన దేవతలు ప్రహృష్టులై సంతుష్టులై నీ కోర్కెలు నెరవేరుస్తారు. దేవతలను తిరస్కరించడం మంచిది కాదు. వేదచోదితాలైన ధర్మాలయందు ఆసక్తి చూపించు అని మునులు పలుకగా విని వేనుడు వారితో ఇలా అన్నాడు.

**క. మునులారా! మీర లిప్పుడు, నను నీగతిఁ బడుచుఁదనమునం బలికితి; రై**
**నను నది యధర్మ; మందుల నెనయఁగ ధర్మమనఁ గలదె? యెచ్చట నైనన్. 422**

* మునులారా! మూర్ఖత్వంలో మీరు ఈ విధంగా నాకు ఏమేమో బోధచేశారు. మీరు చెప్పిందంతా కేవలం అధర్మం. అసలు ధర్మమంటూ ఏదైనా ఎక్కడైనా ఉన్నదా?

**వ. అదియునుంగాక. 423**

**చ. ఎనయఁగ జారకామిని నిజేశుని ముచ్చిలి జారపూరుషుం**
**దనపతిఁ గాఁ దలంచు గతిఁ దద్దయు మూఢమనస్కులై తన**
**ర్చిన నరపాలరూపము ధరించిన యీశ్వరు నన్నెఱుంగ క**
**న్యుని భజియింప మీ రిహపరోన్నత సౌఖ్యము లంద రెన్నఁడున్. 424**

* జారిణి అయిన స్త్రీ తన భర్తను మోసగించి జారపురుషుని తన భర్తగా భావిస్తుంది. అలాగే మీరు మూర్ఖత్వంతో రాజరూపం ధరించిన భగవంతుడనైన నన్ను తెలుసుకొనకుండా యితరుణ్ణి సేవిస్తున్నారు. ఇటువంటి మీకు ఇహపర సుఖాలు లభించనే లభించవు.

**వ. అని మఱియు నిట్లనియె; యజ్ఞ పురుషుం డన నెవ్వం; డెవ్వనియందు మీకు భక్తి స్నేహంబు లుదయించె? భర్తృస్నేహవిదూరంబులై కుయోషిద్గణంబులు జారునందుం జేయు భక్తిచందంబునఁ బలికెద; రదియునుంగాక. 425**

* యజ్ఞపురుషు డంటే ఎవడు? ఎవనిపై మీకు భక్తి, రక్తి కలిగాయి? మగని మీద మమత లేని దుష్టస్త్రీలు రంకుమగనిపై వలపు ఒలక బోస్తారు. అలాగే మీరు రాజునైన నన్ను విడిచి మరెవ్వని పైననో భక్తి ప్రకటిస్తున్నారు.

**క. హరి హర హిరణ్యగర్భ, స్వరధీశ్వర వహ్ని శమన జలధిపతి మరు**
**న్నర వాహన శశి భూ రవి, సురముఖ్యులు నృపశరీర సూచకు లగుటన్. 426**

* త్రిమూర్తులైన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులూ, దిక్పాలకులైన ఇంద్రుడు, అగ్ని, యముడు, వరుణుడు, వాయువు, కుబేరుడు, చంద్రుడు, భూమి, సూర్యుడు మొదలయిన దేవత లందరూ రాజు శరీరంలో నివసిస్తారు. కాబట్టి రాజే భగవంతుడు.

**క. పరికించి నను భుజింపుఁడు, ధరణీశుఁడు సర్వదేవతామయుఁ డగు, మ**
**త్సర ముడుగుఁడు నాకంటెను, బురుషుఁడు మఱి యెవ్వఁ డగ్రపూజార్హుఁ డిలన్? 427**

* బాగా ఆలోచించుకొనండి. రాజును సర్వదేవతా స్వరూపునిగా భావించండి. నన్ను సేవించండి. అసూయ విడిచి పెట్టండి. అగ్రపూజకు తగినవాడు నాకంటే లోకంలో మరెవ్వడూ లేడు.

**వ. అది గాక మీరు నాయందు బలివిధానంబులు సేయుండని పాపకర్ముండు నసత్ప్రవర్తకుండు నష్ట మంగళుండు విపరీతజ్ఞానుండు నగు వేనుండు పండితమాని యగుచుం బలికి మునుల వచనంబులు నిరాకరించి యూరకున్న న మ్మునులు భగ్నమనోరథులై తమలో నిట్లని; రీ దారుణకర్ముం డయిన పాతకుండు హతుం డగుంగాక! వీఁడు జీవించెనేని వీని చేత నీ జగంబులు భస్మంబులు గాఁగల; విది నిశ్చయంబు; దుర్వృత్తుండగు వీఁడు మహారాజ సింహాసనంబున కర్హుండు గాఁడు; వీఁడు మున్నే సర్వేశ్వరు ననుగ్రహంబున నిట్టి విభూతి యుక్తుం డయ్యె నట్టి యజ్ఞపతియైన శ్రీకృష్ణుని నిందించుచున్నవాడు; గావున నిర్లజ్జుండైన హరిదూషకుని హననంబు సేయవలయునని మును లుద్యోగించి యాత్మప్రకాశితంబైన క్రోధంబునంజేసి హుంకారమాత్రంబున నా యీశ్వర నిందాహతుం డగు వేనునిం బొలియఁ జేసి రంత. 428**

* కాబట్టి మీ పూజలూ, పురస్కారాలూ, బలులూ సమస్తమూ నాకే సమర్పించండి అని పాపాత్ముడు, దుర్మార్గుడు, అమంగళుడు, అజ్ఞాని అయిన వేనుడు విపరీతబుద్ధితో మునుల మాటలను నిరాకరించి పలికాడు. అప్పుడు మునులు తమ ప్రయత్నం వ్యర్థం కాగా పరస్పరం ఇలా అనుకున్నారు. భయంకర కృత్యాలకు పాల్పడుతున్న ఈ పాపాత్ముడు నశించిపోవాలి. వీడు బ్రతికి ఉన్నట్లయితే వీని వల్ల ఈ లోకాలన్నీ నశిస్తాయి. దురాచారుడైన వీడు గద్దె నెక్కటానికి అర్హుడు కాడు.

ఏ సర్వేశ్వరుని అనుగ్రహంవల్ల వీడు ఇటువంటి ఐశ్వర్యాన్ని పొందాడో ఆ యజ్ఞపతి అయిన శ్రియః పతినే వీడు నిందిస్తున్నాడు; కాబట్టి సిగ్గు మాలి శ్రీహరిని నిందించే వీనిని హతమార్చాలి అని మునులు తమలో పెల్లుబికిన కోపంతో హుంకరించారు. ఆ మహర్షులు హుంకారానికి భగవన్నిందకుడైన వేనుడి ప్రాణాలు ఎగిరిపోయాయి.

**క. అరసి సునీథయు శోకా, తురయై తన సుతుఁడు దనువుఁ దొఱఁగిన దదనం**
**తరమునను యోగశక్తిం బరువడి నిజ తనయు తనువుఁ బరిపాలించెన్. 429**

* అప్పుడు సునీథ తన కొడుకు మరణానికి దుఃఖించింది. యోగశక్తిచేత అతని శరీరాన్ని చెడిపోకుండా కాపాడింది.

**వ. అంత నొక్కనాఁడు. 430**

**సీ. మునివరేణ్యులు భక్తి దనర సరస్వతీ సలిలంబులను గృతస్నాను లగుచు**
**మునుకొని తత్తీరమున నగ్నిహోత్రముల్ విలసిల్ల నియతిఁ గావించి యచటఁ**
**దవిలి సత్పురుషకథా వినోదంబులు సలుపుచు నుండంగ సకలలోక**
**భయదంబు లగు మహోత్పాతముల్ దోఁచిన మసలి లోకంబు లమంగళములు**

**తే. వొరయకుండెడుఁగా కని బుద్ధిలోనఁ, దలఁచుచుండఁగఁ బెలుచ నుదగ్ర మగుచు**
**సర్వదిశలను బాంసువర్షంబు గురిసెఁ; దస్కరులు సర్వజనుల విత్తములు గొనిరి. 431**

* ఇలా ఉండగా ఒకనాడు మునీంద్రులు భక్తితో సరస్వతీ నదీ జలాలలో స్నానం చేసి ఆ నదీ తీరాన యథావిధిగా అగ్ని కార్యాలు నిర్వర్తించుకొని ఎంతో ఆసక్తితో సత్పురుషుల కథలు చెప్పుకుంటూ వినోదిస్తున్నారు.

అప్పుడు సకల లోకాలకూ భయం కలిగించే గొప్ప అపశకునాలు గోచరించాయి. ఆ మహోత్పాతాలు చూచి మునీంద్రులు " లోకాలకు అశుభాలు కలుగకుండు గాక!" అని అనుకున్నారు. ఇలా అనుకుంటూ ఉండగానే ప్రచండంగా దుమారం చెలరేగింది. సర్వదిక్కులా ధూళి వర్షం కురిసింది. దొంగలు విజృంభించి ప్రజల సంపదలను దోచుకున్నారు.

**వ. ఇట్టి లోకోపద్రవం బెఱింగి జననాథుం డుపరతుం డగుటం జేసి జనపదంబు లరాజకంబులై యన్యోన్య హింసల నొందుచుం దస్కర బాధితంబు లగుచు నుండుట యెఱింగియుఁ దన్నివారణం బునకు సమర్థు లయ్యును జోరాదిబాధలం గనుంగొనుచు మునులు వారింపక యుండిరి; మఱియు సమదర్శనుండును శాంతుండును మననశీలుండును నగు బ్రాహ్మణుండు దీనుల నుపేక్షించిన నతని తపంబు భిన్నభాండగతం బయిన క్షీరంబు చందంబున స్రవించుం గావున నంగ వసుధాధీశ వంశోద్భవులు హరిపదాశ్రయు లగుటం జేసియు వీరల వంశంబు విచ్ఛిత్తి నొందింప నవర్హంబు గాన స్థాపనీయం బని నిశ్చయించి మృతుండైన వేనుని కళేబరంబు డగ్గఱ వచ్చి తదూరుమథనంబు గావింప నందు. 432**

* ఈ విధంగా లోకానికి ఉపద్రవం కలగటం మునులు గ్రహించారు. రాజు లేకపోవటం మూలాన దేశమంతా అరాజకమై ఒకరి నొకరు హింసించు కోవడం, దోపిళ్లు ఎక్కువ కావటం జరిగిందని వారు తెలుసుకున్నారు. ఆపడానికి సమర్థు లయినప్పటికీ వారించకుండా ఊరకున్నారు.

సమదర్శనుడూ, శాంత స్వభావుడూ, లోకజ్ఞుడూ అయిన బ్రాహ్మణుడు దీనులను ఉపేక్షించి నట్లయితే అతని తపస్సు పగిలిన కుండలోని పాలవలె నశిస్తుంది. కాబట్టి ఈ ఆపదను తప్పకుండా నివారించాలి.

అంగవంశంలో పుట్టిన రాజులు హరి భక్తులూ, మహావీరులూ కావటం వల్ల వీరి వంశం ఇంతటితో తుదముట్టకూడదు. ఈ వంశాన్ని నిలబెట్టాలి అని మళ్ళీ నిశ్చయించుకున్నారు. వేనుని శవాన్ని సమీపించి మునీంద్రులు అతని తొడను మథించారు.

**సీ. ఘన కాక కృష్ణ సంకాశ వర్ణుండును హ్రస్వావయవుఁడు మహాహనుండు**
**హ్రస్వబాహుండును హ్రస్వపాదుండును నిమ్న నాసాగ్రుండు నెఱియు రక్త**
**నయనుండుఁ దామ్రవర్ణశ్మశ్రు కేశుండు నతి దీన వదనుండు నైన యట్టి**
**యొక్క నిషాదకుం డుదయించి యేమి సే యుదు నని పలుకుచు నున్నఁ జూచి**

**తే. వరమునులు నిషీద యనుచుఁ బలుకుటయును, దాన వాఁడు నిషాదాభిధానుఁ డయ్యె,**
**నతని వంశ్యులు గిరికాననాళి వేను, కల్మషముఁ దెల్పుచుండిరి కడఁక మఱియు. 433**

* అప్పుడు వేనుని తొడనుండి ఒక బోయవాడు పుట్టాడు. వాడు కాకివలె నల్లగా ఉన్నాడు. పొట్టిగా ఉన్నాడు. పెద్దపెద్ద చెక్కిళ్లు, కురుచ చేతులు, కురుచ కాళ్ళు, చిట్టిముక్కు, ఎర్రని కళ్ళు, రాగిమీసాలు, రాగి గడ్డం, రాగి తల వెంట్రుకలు గల ఆ మరుగుజ్జువాడు దీనముఖంతో "నేను చేయవలసిన పని ఏమిటి?" అని ప్రశ్నించాడు. అప్పుడు మునులు 'నిషీద' అనగా 'కూర్చుండు' అన్నారు. అందుచేత వాని పేరు 'నిషాదుడు'అయింది. అతని కులంలో పుట్టిన వాళ్లంతా నిషాదులై పర్వతాలలో అడవులలో సంచరిస్తూ వేనుని దుష్కీర్తి వెల్లడిస్తున్నారు.

**క. కని వా రనపత్యుం డగు, మనుజేంద్రుని బాహు లంత మథియించిన నం**
**దనఘం బగు నొక మిథునము, జనియించెను సకలజనులు సమ్మదమందన్. 434**

* ఆ తరువాత మునులు సంతానహీనుడైన వేనుని హస్తాలను మథించారు. అప్పుడు ఆ చేతుల నుండి ఒక స్త్రీపురుషుల జంట జన్మించింది. అది చూచి సమస్త ప్రజలూ సంతోషించారు.

**వ. అందు లోకరక్షణార్థంబుగా నారాయణాంశంబున నొక పురుషుండును, హరికి నిత్యానపాయిని యగు లక్ష్మీకళా కలితయు గుణంబులకు భూషణంబులకు నలంకార ప్రదాత్రియు నగు కామినియు జనియించె, నందుఁ బృథుశ్రవుండును పృథుయశుండు నగుట పృథు చక్రవర్తియను పేరం బ్రసిద్ధుం డయ్యె; న య్యంగనయు నర్చి యను నామంబునం దనరుచు నతని వరియించె, నా సమయంబున.435**

* వేనరాజు బాహువుల నుండి లోకసంరక్షణార్థం శ్రీమన్నారాయణాంశతో ఒక పురుషుడు ఆయనను ఎప్పుడూ విడిచి ఉండని లక్ష్మీదేవి అంశతో ఒక కన్యక ఉదయించారు. ఆ కన్యక సుగుణాలే ఆమెకు సహజ భూషణాలు. ఆమె అలంకారాలకు అలంకారం. పెద్ద చెవులు, పెద్ద యశస్సుకల ఆ పురుషుడే "పృథు చక్రవర్తి" అనే పేరుతో సుప్రసిద్ధు డయ్యాడు. ఆ స్త్రీ పేరు అర్చి. ఆమె పృథు చక్రవర్తిని వరించింది.

సీ. అందంద కురియించి రమరులు మునినాథ వితతి మోదం బంద విరులవానఁ;
బరమానురక్తి శుంభల్లీలఁ జూపట్టె సురపతివీట నచ్చరలయాట;
కర్ణ రసాయన క్రమమున వీతెంచెఁ బఱపైన తేటకిన్నరులపాట;
యనిమిషకరహతం బై చాలఁ జెలఁగెను విభవోత్సవంబు దుందుభిరవంబు;

తే. మునినుతి సెలంగె శిఖి గుండముల వెలింగె, నంత నచటికి సరసీరుహాసనుండు
గరుడ గంధర్వ కిన్నర గణముతోడ, నర్థిఁ జనుదెంచి సమ్మోద మతిశయిల్ల. 436

* ఈ విధంగా వేనుని కుడిచేతి నుండి "పృథువూ", ఎడమ చేతి నుండి "అర్చి" పుట్టి దంపతులైన శుభ సమయంలో దేవతలు పూలవానలు కురిపించారు. మునులు సంతోషించారు. స్వర్గంలో అప్సరసలు కనుల విందుగా నాట్యం చేశారు. కిన్నరులు వీనుల విందుగా గానం చేశారు. దేవదుందుభి ధ్వనులు చెలరేగాయి. ప్రజలు సన్నుతించారు. అగ్నిహోత్రాలు హేమకుండాలలో బాగా వెలిగాయి.

అప్పుడు అక్కడికి బ్రహ్మదేవుడు గరుడ గంధర్వ కిన్నరులతో వేంచేశాడు.

వ. అంత. 437

కవిరాజ విరాజితము.
అరయఁగ వైన్యుని దక్షిణహస్తము నందు రమారమణీసుమనో
హరు లలితాయుధ చిహ్నము లంఘ్రులయందు సమగ్రహలాంకుశ భా
స్వర కులిశధ్వజ చాప సరోరుహశంఖ విరాజిత రేఖలు వి
స్ఫురగతి నొప్పఁ బితామహముఖ్యులు చూచి సవిస్మయులైరి తగన్. 438

* అలా వేంచేసిన బ్రహ్మాది దేవతలు పృథుని కుడిచేతిలో విష్ణుదేవుని ఆయుధమైన చక్ర చిహ్నమూ, పాదాలలో హలం, అంకుశం, వజ్రం, ధ్వజం, ధనుస్సు, పద్మం, శంఖం ఇత్యాది రేఖలు విరాజిల్లుతూ ఉండడం చూచి ఎంతో ఆశ్చర్యపడ్డారు.

వ. ఇతండు నారాయణాంశ సంభూతుండు నితని యంగన రమాంశ సంభూతయుం గానోపుదు రని తలంచి ర య్యవసరంబున బ్రహ్మవాదులగు బ్రాహ్మణోత్తము లతనికి విధ్యుక్త ప్రకారంబున రాజ్యాభిషేకంబు గావించిరి; తదనంతరంబ. 439

* ఈ పృథువు నారాయణాంశతో జన్మించాడు. ఇతని భార్య లక్ష్మీదేవి అంశతో పుట్టింది అని నిశ్చయించారు. అనంతరం బ్రహ్మవేత్తలైన బ్రాహ్మణోత్తములు పృథువుకు యథాశాస్త్రంగా రాజ్యాభిషేకం చేశారు.

క. సరిదంభోనిధి ఖగమృగ, ధరణీ సురవర్త్మ పర్వత ప్రముఖములై
పరఁగిన భూతశ్రేణులు, నరవరునకుఁ దగు నుపాయనము లిచ్చె నొగిన్. 440

* నదులు, సముద్రాలు, పక్షులు, మృగాలు, భూమి, ఆకాశం, పర్వతాలు మొదలయిన సర్వభూతాలు పృథు మహారాజునకు చక్కని కానుకలు సమర్పించాయి.

**తే. సమధికఖ్యాతి నా పృథు చక్రవర్తి, దేవి యగు నర్చితోఁ గూడ దివ్యవస్త్ర**
**గంధ మాల్య విభూషణ కలితుఁ డగుచుఁ, బావకుఁడుఁ బోలె సత్ప్రభాభాసి యయ్యె. 441**

* పృథు చక్రవర్తీ, అతని దేవేరి అయిన అర్చీ, దివ్య వస్త్రాలు కట్టుకున్నారు. తావులు వెదజల్లే పుష్పమాలికలు తాల్చారు. భూషణాలు ధరించారు. అర్చితో కూడిన పృథువు ప్రభతోకూడిన అగ్నివలె ప్రకాశించాడు.

**సీ. రాజరా జాపృథురాజుకు హేమమయంబైన వీరవరాసనంబు**
**జలపతి జలకణ స్రావకం బగు పూర్ణ చంద్ర సన్నిభ సితచ్ఛత్రకమును**
**బవమానుఁ డతులశోభన మగు వాలవ్యజన సమంచిత సితచామరములు**
**ధర్ముండు నిర్మలోద్యత్కీర్తిమయమగు మహనీయ నవ పుష్పమాలికయును**

**తే. జంభవైరి కిరీటంబు శమనుఁ డఖిల, జన నియామక దండంబు జలజభవుఁడు**
**నిగమమయ కవచంబు వాణీలలామ, స్వచ్ఛ మగు నవ్యహార మొసఁగిరి మఱియు. 442**

* పృథు చక్రవర్తికి కుబేరుడు బంగారు సింహాసనం ఇచ్చాడు. వరుణదేవుడు పూర్ణచంద్రునివలె ప్రకాశించే చల్లని వెల్లగొడుగు ఇచ్చాడు. వాయుదేవుడు స్వచ్ఛమైన తెల్లని వింజామరలనూ, ధర్మదేవత విశాల యశోరూపమైన పుష్పమాలికనూ, ఇంద్రుడు కిరీటమునూ, యముడు రాజదండమునూ, బ్రహ్మదేవుడు వేదమయ కవచమునూ, సరస్వతీ దేవి క్రొంగ్రొత్త ముత్యాల హారమునూ బహూకరించారు.

**సీ. దామోదరుండు సుదర్శన చక్రంబు నవ్యాహతై శ్వర్య మబ్జపాణి**
**చంద్రార్ధధరుఁ డర్ధచంద్ర రేఖాంకిత కమనీయ కోశసంకలిత ఖడ్గ**
**మంబిక శతచంద్ర మను ఫలకముఁ జంద్రుఁ డమృతమయ శ్వేతహయచయంబుఁ**
**ద్వష్ట రూపాశ్ర యోదాత్త రథంబును భానుండు ఘృణిమయ బాణములును**

**తే. శిఖియు నజగోవిషాణసంచిత మహాజ, గవ మనందగు చాపంబు నవనిదేవి**
**యోగమయమైన పాదుకాయుగము గగన, చరులు గీతంబు లిచ్చిరి సంతసమున. 443**

* విష్ణువు సుదర్శన చక్రమునూ, లక్ష్మీదేవి తరగిపోని సంపదనూ, పరమేశ్వరుడు అర్ధచంద్రాకారంగల ఒరతోకూడిన కరవాలమునూ, పార్వతీదేవి "శతచంద్రం" అనే డాలునూ, చంద్రుడు అమృతమయాలైన శ్వేతాశ్వాలనూ, త్వష్ట అందమైన వెండి రథమునూ, సూర్యుడు వెలుగులు వెదజల్లే బాణాలనూ, అగ్ని "అజగవం" అనే ధనుస్సునూ, భూదేవి యోగమయా లయిన పాదుకలనూ బహూకరించారు. దేవతలు యశోగీతాలు సంతోషంతో సమర్పించారు.

వ. వెండియుం బ్రతిదివసంబు నాకాశంబు పుష్పంబులు గురియింప, మహర్షులు సత్యంబులైన యాశీర్వచనంబులు సలుప, సముద్రుండు శంఖంబును, నదంబులు పర్వతంబులు నదులును రథమార్గంబు నొసంగెఁ; దదనంతరంబ సూత మాగధ వంది జనంబులు దన్ను నుతియించినం బ్రతాపశాలి యగు నవ్వైన్యుండు మందస్మిత సుందర వదనారవిందుండై చతురవచన రచనుండగుచు మేఘగంభీర భాషణంబుల వారల కిట్లనియె. 444

* ఆకాశం ప్రతిదినమూ పృథు చక్రవర్తి మీద పుష్పవర్షం కురిపించింది. మహర్షులు అమోఘమైన ఆశీర్వాదాలు చేశారు. సముద్రుడు శంఖాన్ని కానుకగా ఇచ్చాడు. నదీనదములూ, పర్వతములూ, పృథు చక్రవర్తి రథానికి మార్గం ఇచ్చాయి.

అనంతరం వందిమాగధులూ, సూతులూ ప్రతాపవంతుడయిన పృథు చక్రవర్తిని పరిపరివిధాల ప్రస్తుతించారు. పృథు చక్రవర్తి వారి స్తోత్ర పాఠాలను అలకించి చిరునవ్వు నవ్వుతూ మేఘగర్జనంవంటి గంభీరమైన కంఠస్వరంతో వారితో ఇలా పలికాడు.

సీ. వందిమాగధ సూతవరులార! నా యందుఁ గమనీయగుణములు గలిగెనేని
యర్థంబు నుతిసేయ; నవి లేవు నాయందు; నది గాన మీ నుతి వ్యర్థ మయ్యెఁ;
నిటమీద గుణముల నేపారి యుండిన నపుడు నుతించెద రగుట మీద
సభ్యనియుక్తులై చతురత నుత్తమ శ్లోకుని గుణము లస్తోకభూ ప్ర

తే. సిద్ధములు గాన సన్నుతి సేయుఁ డజుని, నతని బహువిధ భావంబు లభినుతింప
నలవిగాకయె యుండుదు; రదియుఁగాక చతురమతులార! మాగధ జనములార! 445

* ఓ వందిమాగధులారా! నాలో సద్గుణాలు ఉన్నట్లయితే మీరు పొగడవచ్చు. కాని అటువంటివి ఏవీ నాలో లేవు. కాబట్టి మీపొగడ్త వ్యర్థం. ఇక ముందు నాయందు సద్గుణాలు సమృద్ధిగా కన్పిస్తే అప్పుడు మీరు ఎక్కువగా పొగడుదురు గాని, విష్ణుదేవుని సుగుణాలు సర్వలోకాలలో సుప్రసిద్ధాలు కాబట్టి యిప్పుడు మీరు సభ్యుల అభ్యనుజ్ఞను పొంది ఆయన గుణాలను అభివర్ణించండి. విష్ణుదేవుని అనంత కల్యాణ గుణగణాలను పొగడటానికి అసాధ్యమే. అయినా మీరు నేర్పరులు కాబట్టి కొనియాడటానికి ఉపక్రమించండి.

వ. మఱియు మహాత్ముల గుణంబులు దనయందు సంభావితంబులు సేయ సామర్థ్యంబు గలిగిన నందు మహాత్ముల గుణంబులు ప్రసిద్ధంబులు గావునం దత్సమంబుగా నెట్లు నుతింపవచ్చు? నెవ్వండే నొకండు శాస్త్రాభ్యాసంబునం దనకు విద్యా తపోయోగ గుణంబులు గలుగు నని పలికిన వానిం జూచి సభ్యులు పరిహసింతు; రది కుమతి యగువాఁ డెఱుంగం; దదియునుంగాక. 446

* అంతే కాదు! మహాత్ముల గుణాలు తనయందు లేకపోయినా ఉన్నట్లు స్తుతి పాఠకులు వర్ణించుతారు. మహాత్ముల గుణాలు సుప్రసిద్ధాలు కాబట్టి వారు పొగడ గలరు. పొగడే శక్తి వారికి ఉన్నప్పటికీ లేని గుణాలు ఆరోపించి మహాత్ములను పొగడినట్లు ఎలా పొగడగలరు? “శాస్త్రాలు చదవడం వల్ల తాను విద్యా తపోయోగ

గుణాలను పొందుతాను" అని ఎవడైనా అనవచ్చు. అటువంటి వానిని చూచి సభ్యులైన వారు నవ్వుకుంటారు. ఆ మందమతి ఆ సంగతి గ్రహింపలేడు.

**క. అతివిశ్రుతులు సులజ్జా, న్వితులు మహోదారు లధిక నిర్మలు లాత్మ**
**స్తుతిపరనిందలు దోషము, లతి హేయము లని తలంతు రాత్మల నెపుడున్. 447**

* సుప్రసిద్ధులైనా గొప్పవారు నిర్మల మనస్సూ, లజ్జాభిమానాలూ కలిగి ఉంటారు. ఉదాత్తచిత్తులైనవారు ఆత్మస్తుతినీ, పరనిందలనూ అసహ్యించుకుంటారు.

**క. వంది జనంబులు లోకము, లందు నవిదిత వరకర్ములగు భూపతులన్**
**నందించు టవశ్యంబై, నం దగదు నుతింప శిశుజనంబుల పగిదిన్. 448**

* ఉత్తమ కార్యాలు ఏవీ చేయకపోయినా లోకంలో రాజులను స్తుతిపాఠకులు స్తుతిస్తూనే ఉంటారు. అయినా మరీ పసిపిల్లలవలె స్తోత్రం చెయ్యటం మంచిపని కాదు.

**క. అన సూత వంది మాగధ. జను లా నరనాయకుని వచనములు వినియున్**
**మునిచోదితులై క్రమ్మఱ, ననురాగము లుప్పతిల్ల న మ్మనుజేంద్రున్. 449**

**వ. అమృతోపమానంబు లయిన మధుర వాక్యంబుల నిట్లనిరి. 450**

* ఇలా పలుకుతున్న ఆ పృథు చక్రవర్తి వచనాలు వినికూడా సూత వందిమాగధులు మునులచే ప్రేరేపింపబడినవారై అమృతం చిలికే తీయని పలుకులతో ఇలా అన్నారు.

**క. వేనాంగ సంభవుండవు, శ్రీనాథ కళాంశజుఁడవు చిరతరగుణ స**
**మ్మానార్హుండ వతర్కిత, మైన భవన్మహిమఁ బొగడ నలవియె మాకున్. 451**

* మహారాజా! నీవు వేనుని శరీరం నుండి జన్మించావు. శ్రీమన్నారాయణాంశ సంభవుడవు. కనుక నీలోని సుగుణాలు ప్రశంసనీయాలు. ఐనా నీ గొప్పతనాన్ని కొనియాడటం మాకు శక్యం కాదు.

**క. అని వెండియు నిట్ల ని; రై , నను నొకమార్గంబు గలదు నందింప భవ**
**ద్ఘనచరితామృతపానం, బునఁ జేసియు మునులవచనములఁ జేసి తగన్. 452**

**వ. శ్లాఘ్యంబులైన భవదీయచరిత్రంబుల స్తుతియించెద మని యిట్లనిరి. 453**

* అయినప్పటికి నిన్ను అభివర్ణించటానికి, మా కొక మార్గం చిక్కింది. నీ చరిత్ర మనే అమృతం త్రాగటం వల్లనూ, మహామునుల ప్రేరణ వల్లనూ మాకు అటువంటి శక్తి లభించింది. శ్లాఘనీయాలైన నీ చరిత్రలను సంస్తుతిస్తాము అని పలికి ఇలా కొనియాడారు.

సీ. ఈ వైన్యుఁ డఖిలలోకావళి ధర్మానువర్తనముల నెప్డు వఱలఁ జేసి
ఘనధర్మమార్గ వర్తనులలో ధన్యుఁడై ధర్మ సేతువుఁ బ్రీతిఁ దగిలి బ్రోచు;
ధర్మ శాత్రవులను దండించు నష్ట ది క్పాలకమూర్తి సంకలితుఁ డగుచు;
నయ్యయి కాలంబులందు భాషణదానములఁ బ్రజారంజనములఁ దనర్చు;

తే. సవన సద్వృష్టి కరణాదిసక్తుఁ డగుట, నుభయలోకంబులకుఁ బ్రీతి నొదవఁ జేయు;
న్యాయమార్గంబునను భూజనాళి ధనముఁ, బుచ్చుకొను నిచ్చు సూర్యుండుఁ బోలె నితఁడు. 454

* ఈ పృథు చక్రవర్తి సమస్త లోకాలను ధర్మ మార్గంలో నడిపిస్తాడు. ధర్మప్రభువులకు తలమానికమై ధర్మసేతువును రక్షిస్తాడు. ధర్మ విరోధులను శిక్షిస్తాడు. ఈయన అష్టదిక్పాలకుల స్వరూపం ధరించి ఆయా కాలాలలో మంచి మాటలతోనూ, దానాలతోనూ ప్రజలను సంతోషపెడతాడు. ఈయన చేసే యజ్ఞాలకు సంతుష్టులై దేవతలు వర్షాలు కురిపించుతారు. ఈ విధంగా ఈ మహారాజు ఉభయ లోకాలకూ ప్రీతికలిగిస్తాడు. సూర్యుడు భూమిమీద జలాలను పీల్చి మేఘంగా మార్చి వాన కురిపించు విధంగా ఈయన న్యాయమార్గంలో ప్రజల నుండి పన్నులు పుచ్చుకొని సరి అయిన సమయంలో ఆ ధనాన్ని మళ్లీ వారికి ఇచ్చి రక్షిస్తాడు.

వ. మఱియును. 455

సీ. సర్వభూతములకు సముఁడును బర్యతిక్రమమున లోకాపరాధములను
నతిశాంతి సంయుక్తుఁడై సహించుచు నార్తు లగువారి యెడఁ గృపాయత్తుఁ డగుచు
నరరూపధారియౌ హరిమూర్తి గావున నింద్రుండు వర్షించి యెల్ల ప్రజల
రక్షించుగతిఁ దాను రక్షించు; నమృతాంశు సన్నిభ వదనాబ్జ సస్మితాను

తే. రాగ మిళితావలోకన రాజిఁజేసి, సకల జనులకు సంప్రీతి సంభవింపఁ
జేయు సంతతమును గూఢచిత్తుఁ డగుచు, శత్రువరుల కగమ్యుఁడై సంచరించు. 456

* ఈ చక్రవర్తి సర్వప్రాణులనూ సమానంగా చూస్తాడు. ప్రజల నేరాలను శాంతంతో సహిస్తాడు. ఆర్తులయందు దయ చూపుతాడు. ఈ మహామహుడు మానవ రూపం ధరించిన మహావిష్ణువు. కాబట్టి ఇంద్రుడు వాన కురిపించి ఎల్ల ప్రజలనూ రక్షించే విధంగా తాను రక్షిస్తాడు. అమృతం చిందే చందమామ వంటి ముఖంతో ఎప్పుడూ చిరునవ్వులు విరజిమ్ముతూ చల్లని దయార్ద్ర వీక్షణాలు వెదజల్లుతూ సర్వజనులకూ సంతోషం కలిగిస్తాడు. నిగూఢ చిత్తుడై శత్రువులకు అగమ్యుడై సంచరిస్తాడు.

వ. అని వెండియుఁ బ్రవేశ నిర్గమ శూన్యమార్గ నిరూఢ కార్యుండును, నపరిమిత మహత్త్వాది గుణగణైక ధాముండును, సముద్రునిభంగి గంభీర చిత్తుండును, సుగుప్తవిత్తుండును, వరుణుండునుంబోలె సంవృతా త్ముండును శాత్రవాసహ్య ప్రతాప యుక్తుండును, దురాసదుండును, సమీపవర్తి యయ్యును దూరస్థునిభంగి వర్తించుచు వేనారణిజనిత హుతాశనుండు గావున హుతాశను చందంబున ననన్యదుస్స్పర్శనుండునై, చారుల వలన సకలప్రాణి బాహ్యాభ్యంతర కర్మంబులం దెలియుచు;

దేహధారులకు నాత్మభూతుండై సూత్రాత్మకుండైన వాయువు భంగి వర్తించుచు, నాత్మస్తుతి నిందలవలన నుదాసీనుం డగుచు, ధర్మపథంబున వర్తించుచు, నాత్మీయ సుహృద్బంధువుల వలనం దప్పు గలిగినను దండించుచు, నాత్మ శత్రువులనైన నదండ్యుల దండింపక ధర్మమార్గ గతుం డగుచుం, దన యాజ్ఞాచక్రం బప్రతిహతం బగుచు మానసాచలపర్యంతంబు వర్తింప సూర్యుండు నిజకిరణంబులచేత నెంత పర్యంతంబు భూమిం బ్రకాశింపంజేయునంత పర్యంతంబు నిజగుణంబులచేత లోకంబుల రంజిల్లంజేయు; నదియునుం గాక ప్రకృతి రంజకంబులైన గుణంబులచేత దృఢవ్రతుండును, సత్య సంధుండును, బ్రహ్మణ్యుండును, సర్వభూతశరణ్యుండును, వృద్ధసేవకుండును, మాన ప్రదుండును, దీనవత్సలుండును, బరవనితా మాతృభావనుండును, దన పత్ని నర్ధశరీరంబుగాఁ దలచువాఁడును నగుచుం బ్రజల యెడఁ దండ్రివలెఁ బ్రీతి సేయుచు రక్షించుచుండు మఱియును. 457

* ఈ పృథు చక్రవర్తి తన రాకపోకలు ఎవరికీ తెలియకుండా సమస్త కార్యాలూ సాధిస్తాడు. ఈయన అపరిమితమైన మహత్త్వాది గుణగణాలకు ఆటపట్టు. సముద్రుని వలె లోతైన మనస్సు కలవాడు. సంపదను భద్రంగా వృద్ధి చేస్తాడు. వరుణుని వలె సంయతమూర్తి. శత్రువులకు సహింపరాని ప్రతాపం కలవాడు. ఎవరికీ తేరిపార చూడరానివాడు. దగ్గరనే ఉంటూ దూరంగా ఉన్నట్లు ప్రవర్తిస్తాడు. వేన రాజు అనే అరణి నుండి పుట్టిన అగ్నిహోత్రుడు కాబట్టి అగ్నివలె ఇతరులకు స్పృశింపరానివాడు. చారచక్షువై రాజ్యం లోపలా, వెలుపలా జరిగే చర్యలను తెలుసుకుంటాడు. శరీరధారు లందరికీ ఆత్మవంటివాడై పువ్వులలో దారంలా ఉంటూ వాయువువలె సంచరిస్తాడు. తనను ఇతరులు పొగడినా, తెగడినా పట్టించుకోడు. దగ్గరిచుట్టాలైనా సరే తప్పక శిక్షిస్తాడు. తన శత్రువులైనా సరే శిక్షింప దగని వారిని శిక్షింపడు. ఏ మాత్రం పక్షపాతం లేకుండా ధర్మంగా ప్రవర్తిస్తాడు. ఇతని ఆజ్ఞ ఎదురులేనిదై లోకాలోక పర్వతం వరకూ చెల్లుతుంది. సూర్యుడు తన కిరణాలతో భూమిని ఎంత వరకు ప్రకాశింప జేస్తాడో, అంతవరకూ తన గుణాలచేత ప్రజలను రంజింపజేస్తాడు. దృఢవ్రతుడై, సత్యసంధుడై, బ్రహ్మణ్యుడై, సర్వభూత శరణ్యుడై పెద్దలను గౌరవిస్తూ, దీనులను కనికరిస్తూ, ప్రజానీకాన్ని తన సద్గుణ సముదాయం వల్ల సంతోషింపజేస్తాడు. అందరి గౌరవమునూ కాపాడుతాడు. పరస్త్రీలను తల్లులుగా భావిస్తాడు. తన భార్యను అర్ధశరీరంగా ఆదరిస్తాడు. ప్రజలను కన్న తండ్రివలె గారవించి రక్షిస్తాడు.

సీ. తలపోయ బ్రహ్మవిద్యానిష్ఠ జనముల కనయంబుఁ గింకరుం డైనవాఁడు
నఖిలశరీరగుఁ డా ప్తసుహృజ్జన తానంద కరుఁడన నలరువాఁడు
సంసారఘనకర్మ సంగహీనులయందు సంగసంప్రీతుఁడై జరుగువాఁడు
దుర్మార్గమనుజ సందోహంబునకు నుగ్ర దండధరుం డనఁ దనరువాఁడు

తే. ప్రకృతి పురుషావేశుఁడై పరఁగువాఁడు, భగవదవతార యుక్తుఁడై నెగడువాఁడు
నగుచు వర్తించు సమ్మోద మతిశయిల్లఁ జారుతర మూర్తి యీ రాజచక్రవర్తి. 458

* సౌందర్యమూర్తి అయిన ఈ చక్రవర్తి బ్రహ్మ విద్యాపారంగతులైన పెద్దలను ఆరాధిస్తాడు. సమస్త శరీరాలలోనూ తానే ఉన్నట్లు బంధుమిత్రులకు సంతోషం కలిగిస్తాడు. సంసార లంపటులు కానివారితో

సాంగత్యం చేస్తాడు. దుర్మార్గులకు యమధర్మరాజువలె భయంకరు డౌతాడు. ప్రజలకు ఉత్సాహం కలిగిస్తాడు. సాక్షాత్తూ భగవంతుని అవతారం అని సమస్త జనులూ భావించేటట్లు ఈ పృథుచక్రవర్తి ప్రవర్తిస్తాడు.

**వ. మఱియుం ద్ర్యధీశుండు గూటస్థుఁడుఁ బరమాత్మయు బ్రహ్మకళారూపుండు నగువాఁడునునై యుదయించెం గావున నితనియందు నవిద్యారచితంబైన భేదంబు నిరర్థకం బగు నని పెద్ద లగువారలు చూతురు, మఱియును. 459**

* ఈ పృథు చక్రవర్తి త్రిగుణాతీతుడై సర్వాంతర్యామి అయిన భగవంతుని అంశతో జన్మించాడు. ఈయన బ్రహ్మజ్ఞాన స్వరూపుడు. ఈయన ఎవరినీ వేరుగా చూడడు. ఈయనను ఎవరూ వేరుగా చూడరాదు అని పెద్దలు గ్రహిస్తారు.

**సీ. ఉదయాద్రి పర్యంత ముర్వీతలం బేక వీరుఁడై రక్షించి వెలయు నీతఁ**
**డొకనాఁడు విజయ యాత్రోత్సవం బేపార సన్నద్ధుఁడై మణి స్యందనంబు**
**నెక్కి చాపముఁ బూని దిక్కుల సూర్యుని పగిదిని శత్రుభూపాలతమము**
**విరియింతు నని చాల వెలుఁ గొందుచును ధరా చక్ర ప్రదక్షిణశాలి యగుచుఁ**

**తే. దిరుగునెడ సర్వ దిక్పాలవర సమేత, పార్థివోత్తమ నికర ముపాయనంబు**
**లిచ్చి తనుఁ జక్రపాణికి నెనయు నాది, ధరణివిభుఁ డని నుతియించి తలఁతు రెదల. 460**

* ఈ పృథుచక్రవర్తి ఉదయపర్వతం వరకూ సమస్త భూమండలాన్ని ఏకైక వీరత్వంతో రక్షిస్తాడు. ఒకనాడు రత్నఖచితమైన రథాన్ని అధిరోహించి శరశరాసనాలు ధరించి, జైత్ర యాత్రకు బయలుదేరుతాడు. దిక్కులందున్న శత్రురాజు లనే కారుచీకట్లను సూర్యునివలె పటాపంచలు చేస్తాడు. దేదీప్యమానంగా వెలుగుతూ భూచక్రమంతా చుట్టివస్తాడు. ఆ సమయంలో సర్వదిక్పాలకులూ, రాజేంద్రులూ ఈయనకు కానుకలు చెల్లిస్తారు. చక్రపాణికి సాటి వచ్చే ఆదిమహారాజుగా భావించి సేవిస్తారు.

**క. ఈ నృపతి ధరాచక్రము, ధేనువుగాఁ జేసి పిదుకు ధృతి నఖిల పదా**
**ర్థానీకము విబుధులు స, న్మానింపఁగఁ బ్రజకు జీవనప్రదుఁ డగుచున్. 461**

* ఈ మహారాజు భూమిని గోవుగా చేసి సమస్త వస్తువులనూ పిదుకుతాడు. ప్రజలకు నవజీవనాన్ని ప్రసాదించి మహనీయులైన విబుధుల మన్ననలు పొందుతాడు.

**చ. అమరవరేణ్యుఁ బోలి యనయంబు నితండును గోత్ర భేదన**
**త్వమునఁ జెలంగుఁ దా నజగవప్రదరాసన శింజినీ నినా**
**దమును విరోధిభూపతులు దల్లడ మంద నసహ్యసింహ వి**
**క్రమమున సంచరించు నని కౌతుక మొప్పఁగఁ బల్కి వెండియున్. 462**

* ఈ నరేంద్రుడు సురేంద్రునివలె గోత్రాలను భేదిస్తాడు. "అజగవం" అనే ధనుస్సును ధరించి నారి మ్రోగించి శత్రురాజులను సింహవిక్రమంతో సంహరిస్తాడు.

వ. ఇట్లనిరి. 463

చ. సకలజగన్నుతుం డితఁడు చారుయశోనిధి యశ్వమేధముల్
ప్రకటముగా శతంబు దగఁ బావనమైన సరస్వతీతటీ
నికటధరిత్రిఁ జేయుతఱి నేర్పున నంతిమ యాగమందుఁ గొం
జక మఖసాధనాశ్వమును జంభవిరోధి హరించు నుద్ధతిన్. 464

* ఈ చక్రవర్తి సర్వలోక సంస్తూయమానుడై విశాలమైన యశస్సు గడిస్తాడు. పరమ పవిత్రమైన సరస్వతీ నదీ తీరంలో వంద అశ్వమేధ యాగాలు చేస్తాడు. నూరో అశ్వమేధం చేసేటప్పుడు ఈ రాజేంద్రుని యజ్ఞాశ్వాన్ని అమరేంద్రుడు అహంకారంతో అపహరిస్తాడు.

సీ. ఒకనాఁడు నిజమందిరోపాంత వనముకుఁ జని యందు సద్గుణశాలి యైన
ఘనుని సనత్కుమారునిఁ గాంచి య మ్మునివరు బ్రహ్మ తనయుఁగా నెఱిఁగి భక్తిఁ
బూజించి విజ్ఞానమును బొందు నచ్చట బ్రహ్మవేత్తలు మునిప్రవరు వలన
మానిత లబ్ధవిజ్ఞానులై వర్తింతు, రి మ్మహారాజు మహీతలంబు

తే. నందు విశ్రుతవిక్రముఁ డగుచు మిగులఁ దన కథావళి భూ ప్రజాతతి నుతింప
నక్కడక్కడ వినుచు శౌర్యమున నఖిల, దిక్కులను గెల్చి వర్తించు ధీరయశుఁడు. 465

* ఒకనాడు ఈయన రాజభవనానికి సమీపంలో ఉపవనానికి వెళ్లి అక్కడ బ్రహ్మ మానసపుత్రుడూ, పవిత్ర చరిత్రుడూ అయిన సనత్కుమారుణ్ణి సందర్శించి, భక్తితో పూజిస్తాడు. ఆయన వల్ల ఉత్తమ జ్ఞానాన్ని సంపాదిస్తాడు. అక్కడ ఉన్న బ్రహ్మవేత్తలందరూ ఆ సనత్కుమారుని ఉపదేశంవల్ల తత్త్వజ్ఞానులై ప్రవర్తిస్తారు. ఈ మహారాజు మహీ మండలంలో సుప్రసిద్ధ వీరుడై తన వీరగాథలను లోకులు వినుతింపగా వీనుల విందుగా వింటాడు. శౌర్యాతిశయంతో సర్వదిక్కులనూ జయించి శాశ్వతమైన యశస్సు గడిస్తాడు.

వ. ఇట్లు విపాటిత విరోధి శల్యుండు, సురాసుర జేగీయమాన నిజవైభవుండునై ధరాచక్రంబున కితండు రాజయ్యెడి నని యివ్విధంబున స్తోత్రంబు సేసిన వంది మాగధ సూతజనంబులం బృథుచక్రవర్తి పూజించి మఱియుం బ్రాహ్మణ భృత్యామాత్య పురోహిత పౌరజానపద తైలిక తాంబూలిక ప్రముఖాశేష జనంబులం దత్తదుచిత క్రియలం బూజించె నని మైత్రేయుండు సెప్పిన విని విదురుం డిట్లనియె.466

* ఈయన కంటక ప్రాయులైన విరోధులను పెకలించి వేస్తాడు. సురాసురులు కొనియాడుతున్న వైభవం కలవాడై, ధరామండలాని కంతటికీ రాజు అవుతాడు అని వందిమాగధులు పృథు చక్రవర్తిని పరిపరి విధాల ప్రస్తుతించారు. పృథు చక్రవర్తి వా రందరినీ యథోచితంగా సత్కరించాడు. బ్రాహ్మణులు, భృత్యులు, అమాత్యులు, పురోహితులు, పుర ప్రజలు, గ్రామవాసులు, తైలసేవకులు, తాంబూలవాహకులు మొదలైన సమస్త పరివారాన్నీ వారివారికి తగినట్లుగా ఆదరించాడు అని మైత్రేయ మహర్షి విదురునితో చెప్పాడు.

## -: పృథు చక్రవర్తి గోరూపిణి యగు భూమివలన, నోషధులఁ బిదుకుట :-

సీ. ఏమి నిమిత్తమై భూమి గోరూపిణి యయ్యె? దానికి వత్స మయ్యె నెద్ది?
గొనకొని దోహనమునకు నర్హంబైన పాత్ర మెయ్యది? దలఁపంగ దోగ్ధ
యైన యా పృథు వే పదార్థముల్ పిదికెను? బరికింప నవని స్వభావమునను
విషమమై యుండియు వెలయంగ నే రీతి సమగతిఁ జెందెను? జంభవైరి

తే. క్రతుహయంబును గొనిపోవఁ గార్య మెద్ది?, ధీరనిధి యాతఁడు సనత్కుమారు వలనఁ
గలిత విజ్ఞానుఁ డగుచు నే గతిని బొందె?, ననఘచారిత్ర! మైత్రేయ! యదియుఁగాక. 467

* విదురుడు మైత్రేయ మహామునిని ఇలా ప్రశ్నించాడు. పుణ్యచరిత్రుడా! భూమి ఎందుకు గోరూపం ధరించింది? గోరూప ధారిణి అయిన ధరణికి ఏది దూడ అయింది? పిదుకుటకు తగిన పాత్రయేది? దోగ్ధయైన పృథుచక్రవర్తి ఏ పదార్థాలను పిదికాడు? భూమి సహజంగా మిట్ట పల్లాలతో విషమంగా ఉంటుంది కదా! అది సమరూపం ఎలా పొందింది? ఇంద్రుడు యజ్ఞాశ్వాన్ని ఎందుకు దొంగిలించాడు? సనత్కుమారుని వల్ల విజ్ఞానమును పొందిన పృథుచక్రవర్తి ఎటువంటి సుగతిని పొందాడు?

వ. మఱియుఁ బరబ్రహ్మంబును భగవంతుండును బుణ్యశ్రవణ కీర్తనుండును సర్వనియామకుండును నగు కృష్ణుని యవతారాంతరాశ్రయం బగు దివ్య కథలను భగవంతుండైన పుండరీకాక్షుండు పృథ్వ్యవతారంబు ధరియించి గోరూపిణి యగు పృథివిం బిదికినది మొదలగు కథలన్నియు నీకు నధోక్షజునకు దాసుండ నయిన నాకు నెఱింగింపు మనిన వాసుదేవ కథాసంప్రీత చేతస్కుండగు విదురుం బ్రశంసించి మైత్రేయుం డిట్లనియె, నట్లు బ్రాహ్మణ జనంబులచే రాజ్యంబునం దభిషిక్తుండై పృథువు రాజ్యంబు సేయుచుండు నంత నీరస యగు ధరిత్రియం దన్న రహితు లగుచుం బ్రజలు క్షుత్పీడా క్షీణదేహులై వైన్యునిం జూచి యిట్లనిరి. 468

* మైత్రేయ మహర్షీ! నీకునూ విష్ణుదేవునకునూ భక్తుడనైన నాకు పరబ్రహ్మస్వరూపుడూ, పుణ్యశ్రవణ కీర్తనుడూ, సర్వేశ్వరుడూ, భగవంతుడైన కృష్ణుని ఇతర అవతార పుణ్యకథలను, పుండరీకాక్షుడు పృథుచక్రవర్తి అవతారం ధరించి గోరూపం ధరించిన భూమిని పిదకడం మొదలైన వాటిని అన్నింటినీ వివరంగా చెప్పు అని విదురుడు ప్రశ్నించాడు. అప్పుడు వాసుదేవుని కథలయందు ఆసక్తిగల విదురుని కొనియాడుతూ మైత్రేయుడు ఇలా చెప్పసాగాడు. ఆ విధంగా బ్రాహ్మణుల చేత పట్టాభిషిక్తుడై ప్రజాపరిపాలన కార్యంలో నియుక్తుడైన పృథుచక్రవర్తి రాజ్యం చేస్తున్నాడు. ఆ సమయంలో సారహీనమైన భూమి నుండి అన్నం లభింపక పోవడం చేత, ఆకటి బాధతో ప్రజలు కృశించిపోయి పృథుచక్రవర్తి వద్దకు వెళ్లి యిలా మొరపెట్టుకున్నారు.

క. అరయఁగ నేము బుభుక్షా, పరిపీడం బడితి మయ్య! పైకొని తరు కో
టర జనిత వహ్నిచేతను, దరికొను వృక్షములఁ బోలె ధరణీనాథా! 469

* రాజా! చెట్టు తొర్రలో పుట్టి అగ్ని చేత దహింపబడే చెట్లవలె మేము ఆకలిబాధతో మలమల మాడి పోతున్నాము.

క. శరణ శరణ్యుఁడ వగు నిను, శరణము వేఁడెదము మాకు సత్కృప నన్నం
బరసి కృపసేసి ప్రోవుము, నరనాయక! యనుచుఁ బ్రజలు నతులై పలుకన్. 470

* కాబట్టి నీవే మాకు దిక్కు. శరణాగతులకు శరణ్యుడవైన నిన్ను శరణు వేడుకుంటున్నాము. ధరణీనాథా! దయతో మాకు అన్నం పెట్టి రక్షించు అని ప్రజలు ప్రభువు కాళ్లపై పడ్డారు.

క. విని దానికి సదుపాయము, జననాయకుఁ డాత్మఁ దలఁచి సక్రోధుండై
ధనువున బాణముఁ దొడిగెను. ఘనరౌద్రుండైన త్రిపుర ఘస్మరు పగిదిన్. 471

* అప్పుడు పృథుచక్రవర్తి ప్రజల దీనాలాపాలను ఆలకించాడు. అందుకు తగిన మంచి ఉపాయాన్ని ఆలోచించాడు. వెంటనే త్రిపుర సంహారుడైన హరుని వలె రౌద్రమూర్తియై వింట బాణాన్ని సంధించాడు.

వ. ఇట్లు దొడిగిన. 472

క. మహిపతి నప్పుడు గనుఁగొని, మహి గోరూపమునఁ గంప్యమానయు నగుచుం
గుహకుం డగు లుబ్ధకుఁ గని, గహనంబునఁ బాఱు హరిణికైవడిఁ బాఱెన్. 473

* ఆ విధంగా వింట బాణం తొడిగిన పృథుచక్రవర్తిని చూచి భూమి గోరూపం ధరించి గజగజ వణకి పోతూ పోటుగాడైన వేటగాణ్ణి చూచి అడవిలో పరుగెత్తే ఆడులేడి వలె పరుగెత్తింది.

వ. ఇట్లు ధరణి వాఱిన నతండు కుపితారుణేక్షణుండై వెంటఁ దగిలి దిక్కులను విదిక్కులను భూభాగ నభోభాగంబుల నెక్కడం జనియె, నక్కడికి వెనుదగిలి యుద్యతాయుధుండై చనుచుండ నవ్వైన్యునిం గని మృత్యు గ్రస్తులగు ప్రజల చందంబున ననన్య శరణ్యయై యతిభయంబునం బరితప్యమాన హృదయ యగుచు వైన్యా! ధర్మవత్సలుండవును, నాపన్న రక్షకుండవును, మహాత్ముండవును, సకల ప్రాణి పరిపాలనావస్థితుం డవును నయిన నీ వీ దీనయుం బాపరహితయుం గామినియు నగు నన్ను వధియింపం బూని యేల వెనుదగులుచున్న వాఁడవు? ధర్మతత్త్వం బెఱుంగువారు సతీజనంబులు గృతాపరాధలైనం దీనవత్సలతం జేసి వధింప రని పలికి మఱియు నా ధరణీదేవి పృథు చక్రవర్తి కిట్లనియె. 474

* ఆ విధంగా గోరూపిణియై భూమి పరుగెత్తగా పృథుచక్రవర్తి జేవురించిన కన్నులతో వెంబడించాడు. అది దశదిశలలో ఎక్కడికి పోతే అక్కడికి వింటిని ఎక్కుపెట్టి వెంటనంటి పరుగెత్తాడు. అప్పుడు మరొక్క దిక్కులేక మృత్యువుకు భయపడే ప్రజవలె భయపడుతూ పరితపించుతూ భూదేవి పృథువుతో ఇలా అన్నది. "వేనపుత్రా! నీవు ధర్మం తెలిసినవాడవు. ఆపదలో ఉన్న వారిని ఆదుకొనేవాడవు. మహానుభావుడవు. సకల ప్రాణులనూ రక్షించుటకు నియమింపబడిన వాడవు. అటువంటి నీవు ఆడదాననైన నన్ను చంపుటకు ఎందుకు పూనుకున్నావు? నేను దిక్కు లేనిదానను. ఏ తప్పూ చేయని దానను. నా వెంట ఎందుకు పడ్డావు? ధర్మ రహస్యం తెలిసి దీనవత్సలులైన వారు, స్త్రీలు తప్పు చేసిననూ చంపరుకదా!" అని పలికి భూదేవి పృథుచక్రవర్తితో మళ్లీ ఇలా అన్నది.

**క. జననాథచంద్ర! యీ భూ, జనకోటికి యాన పాత్ర సదృశస్థితితో**
**ఘనదృఢశరీర యగు నే, ననయము నాధారభూత నగుచుఁ జరింతున్. 475**

* భూపాలచంద్రా! నేను మిక్కిలి దృఢ శరీరం కలిగినదానిని. ఈ సమస్త భూప్రజలకు నావ వలె ఎప్పుడూ ఆధారభూతనై ఉంటాను.

**తే. ఇట్టి నన్నుఁ గృపామతి యెడలి యిటు వి, పాటనము సేసి త్రుంచెదు? ప్రజలు నీట**
**మునుఁగకుండంగ నే రీతి ననఘ చరిత!, యరసి రక్షింతు వన నతం డవని కనియె. 476**

* ఓ పుణ్యచరిత్రా! అఖిల ప్రజలకు ఆధారమైన నన్ను దయమాలి ఖండఖండాలు చేసి చంపుతానంటున్నావు. నా మీద ఉన్న ప్రజలు నీటిలో మునిగిపోకుండా వారిని ఎలా కాపాడుతావు అని భూదేవి పలుకగా రాజు ఇలా అన్నాడు.

**వ. ధరిత్రీ! మదీయాజ్ఞోల్లంఘనంబు సేయు చున్నదాన! వదియునుంగాక నీవు యజ్ఞంబులందు హవిర్భాగంబుల ననుభవించుచు ధాన్యాదికంబుల విస్తరింపం జేయక గోరూపంబు ధరియించి యనయంబుఁ దృణ భక్షణంబు సేయుచుఁ బాలం బిదుకక నీయంద యడంచికొంటివి; నీ యందున్న యోషధీ బీజంబులు బ్రహ్మచేతం బూర్వంబునందె కల్పింపంబడినయవి, వానిని నీ దేహంబునంద యడంచికొని యిప్పుడీయక మూఢ హృదయవు, మందమతివియునై యపరాధంబు చేసిన దురాత్మురాలవగు నిను నా బాణంబులచే జర్జరీభూత శరీరం జేసి వధియించి నీ మేని మాంసంబునం జేసి క్షుద్బాధితులు దీనులు నగు నీ ప్రజల యార్తి నివారించెద, నీవు కామిని నంటివి, స్త్రీ పురుష నపుంసకులలో నెవ్వరేని భూతదయ లేక స్వమాత్ర పోషకులగుచు నిరనుక్రోశంబుగ భూతద్రోహులై వర్తింతురు, వారిని రాజులు వధించినన్ వధంబు గాదు, గాన దానఁ బాపంబు వొరయదు, నీవు కామిని వైనను దుర్మదవు స్తబ్ధవు నగుచు మాయాగోరూపంబునం బాఱి పోవుచున్న నిన్నుఁ దిలలంతలు ఖండంబులు సేసి నా యోగ మహిమం బ్రాణికోటి నుద్ధరించెద నని పలికి రోషభీషణాకారంబు ధరియించి దండధరుని వడువున వర్తించు పృథునింజూచి వడంకుచు మేదిని ప్రాంజలియై యిట్లని నుతింపందొడంగె. 477**

* ఓ వసుంధరా! నీవు నా ఆజ్ఞను అతిక్రమించుతున్నావు. అంతేకాదు, యజ్ఞాలలో హవిర్భాగాలను అందుకొంటూ ధాన్యం మొదలయిన వానిని పెంపొందింపకుండా ఉన్నావు. గోరూపం ధరించి తృణభక్షణం చేస్తూ పాలు ఇవ్వకుండా నీలోనే దాచి ఉంచుకున్నావు. పూర్వం బ్రహ్మదేవుడు నీలో సృజించిన ఓషధీ బీజాలను నీ దేహమందే అణచి పెట్టుకొని వెలుపలకు రానీయకుండా ఉన్నావు. నీవు మూర్ఖురాలవు. మందబుద్ధివి. ఈ విధంగా తప్పు చేసిన నీ శరీరాన్ని నా అమ్ములతో తూట్లు పొడిచి నిన్ను వధిస్తాను. నీ మాంసంతో ఆకలితో మలమల మాడిపోతున్న ఈప్రజల ఆర్తిని తొలగిస్తాను. స్త్రీవధ దోషం కదా అని అన్నావు. స్త్రీ పురుష నపుంసకులలో భూత దయ లేకుండా తమ పొట్టను మాత్రమే నింపుకొనే ఎవ్వరినైనా సరే రాజులు చంపవచ్చు. అది వధకాదు. కాబట్టి దానివల్ల పాపం రాదు. నీవు స్త్రీవైనా గర్వాంధురాలవై

కొయ్యబారి ఉన్నావు. మాయా గోరూపం ధరించి పారిపోతున్న నిన్ను నువ్వుగింజలంత ముక్కలుగా నరికి నా యోగప్రభావంతో జీవులను రక్షిస్తాను అంటూ యమునివలె రోష భీషణాకారుడైన పృథుచక్రవర్తిని చూచి భూమి వణకి పోతూ దోసిలి ఒగ్గి ఈ విధంగా ప్రార్థించింది.

**క. ఓ నాథ! పరమపురుషుఁడ, వై నిజ మాయా గుణంబు లందినకతనన్**
**నానావిధ దేహములం, బూనుదు సగుణుండ వగుచు బుధనుత చరితా! 478**

* ఓ భూనాథా! నీవు సాక్షాత్తుగా భగవంతుడవు. స్వకీయమైన మాయా గుణంచేత నానావిధాలైన శరీరాలను ధరించి సగుణుడవుగా కన్పిస్తావు. నీ చరిత్ర సంస్తవనీయమైనది.

**వ. అట్టి నీవు. 479**

**క. నను సకల జీవతతికిని, మును నీ వాధార భూతముగ నిర్మింపన్,**
**విను నాయందుఁ జతుర్విధ, ఘన భూతవిసర్గ మర్థిఁ గైకొన వలసెన్. 480**

* భగవంతుడవైన నీవు నన్ను సకల ప్రాణికోటికీ ఆధారంగా పూర్వం సృజించావు. అందువల్లనే నేను నానావిధాలైన ప్రాణికోటిని భరిస్తున్నాను.

**వ. అట్లయి యుండ. 481**

**క. నను నుద్యతాయుధుఁడవై, మనుజేంద్ర! వధింపఁబూని మసలెదు, నీకం**
**టెను నన్యుని నెవ్వని నే, ఘనముగ శరణంబు సొత్తుఁ గరుణాభరణా! 482**

* మనుజేంద్రా! సృజించిన నీవే ఆయుధమెత్తి నన్ను అంతం చేయటానికి పూనుకున్నావు. ఓ కరుణా సముద్రా! ఇంక నేను ఎవరిని శరణు వేడుకుంటాను?

**వ. అదియునుం గాక. 483**

**సీ. అనఘ! స్వకీయంబునై యతర్క్యతమునై మహిమ నొప్పిన భవన్మాయచేత**
**సకల చరాచర సర్గంబు నిర్మించి ధర్మపరుండవై తనరు దీశ!**
**నీ విక్రమము నవనీరజలోచన! సకల లోకులకు దుర్జయము; దలఁపఁ**
**దగు నట్టి నీవు స్వతంత్రుఁడ వగుటను బ్రహ్మఁ బుట్టించి యా బ్రహ్మచేత**

**తే. సకల జగములఁ జేయింతు సమతఁ బేర్చి, యేక మయ్యు మహాత్మ! యనేక విధము**
**లగుచు వెలుఁగొందు చుందు వీ యఖిల మందుఁ, జారుతరమూర్తి! యో పృథుచక్రవర్తి! 484**

* ఓ పుణ్యపురుషా! ఊహింపరాని మహిమతో కూడిన నీ మాయచేత ఈచరాచర ప్రపంచాన్ని సృజించావు. నీవు ధర్మ రక్షకుడవు. వికసించుచున్న తామరరేకులవంటి కన్నులు గల ఓ ప్రభూ! నీ మాయను లోకు లెవ్వరూ జయింపలేరు. నీవు స్వతంత్రుడవు. బ్రహ్మను పుట్టించావు. ఆ బ్రహ్మచేత సకలలోకాలను సృజింప జేశావు. సౌందర్య మూర్తివైన ఓ పృథుచక్రవర్తీ! నీవు ఒక్కడవే అయినా పెక్కు విధాలుగా సమస్త మందూ వెలుగొందుతావు.

వ. మఱియు మహాభూతేంద్రియకారక చేతనాహంకారంబులను శక్తులం జేసి యీ జగంబుల కుత్పత్తి స్థితిలయంబులం గావించుచు సముత్కట విరుద్ధ శక్తులు గల పురుషునకు నమస్కరించెద, నట్టి పరమపురుషుండ వయిన నీవు నిజనిర్మితంబును భూతేంద్రియాంతఃకరణాత్మకంబును నైన యీ విశ్వంబు సంస్థాపింపం బూని. 485

* మహాభూతాలు, ఇంద్రియాలు, బుద్ధి, అహంకారం అనే శక్తుల చేత ఈలోకాలను సృజించి, పెంచి, త్రుంచుతున్నావు. విరుద్ధాలైన శక్తులతో నిండి ఉండే నీకు నమస్కారం చేస్తున్నాను. అటువంటి భగవంతుడవైన నీ చేత నిర్మింపబడిన ఈ విశ్వాన్ని సంస్థాపించాలని పూర్వం పూనుకున్నావు.

సీ. ఆది వరాహంబ వగుచు రసాతల గతనైన నన్ను నక్కటికతోడ
నుద్ధరించితి, వట్టి యుదకాగ్ర భాగంబు నం దర్థి నున్న నే ననెడి నావ
యందున్న నిఖిల ప్రజావళి రక్షింపఁ గోరి యీ పృథురూపధారి వైతి,
వట్టి భూభరణుండ వైన నీ విపుడు పయో నిమిత్తంబుగా నుగ్రచరుఁడ

తే. వగుచు నన్ను వధించెద ననుచు బుద్ధిఁ, దలఁచుచున్నాఁడ, విది విచిత్రంబుగాదె!
విశ్వసంపాద్య! నిరవద్య! వేదవేద్య!, భవ్య గుణసాంద్ర! వైన్య భూపాలచంద్ర! 486

* అలా పూనుకొని ఆదివరాహ రూపాన్ని ధరించి పాతాళంలో ఉన్న నన్ను దయతో పైకి లేవనెత్తావు. అలా ఎత్తి మహాజలాలపైన నావవలె నన్ను నిలిపావు. నాపైన ప్రాణులను నిలిపావు. నాపై నున్న ప్రజలను రక్షించటం కోసం "పృథు" రూపం ధరించావు. ఈ విధంగా భూభారం వహించి ప్రజలను రక్షిస్తున్న నీవు కేవలం పాలకోసం నన్ను సంహరించాలని భావిస్తున్నావు, భూపాలచంద్రా! పుణ్యగుణ సాంద్రా! అనవద్యుడవూ, వేదవేద్యుడవూ, విశ్వరక్షకుడవూ అయిన నీ కిది విచిత్రంగా లేదూ!

వ. కావున నీశ్వరగుణ సర్గరూపంబైన మాయచే మోహితాంతః కరణులమైన మా వంటి వారలచేత హరిభక్తుల చేష్టితం బెఱుంగఁ బడదన్న హరిచేష్టితం బెట్లెఱుంగంబడు? నట్టి జితేంద్రియ యశస్కరు లయిన వారలకు నమస్కరింతు ననుచు నవ్విధంబునం గోపప్రస్ఫురితాధరుండైన పృథుని నభినుతించి ధైర్యం బవలంబించి వెండియు నిట్లనియె. 487

* భగవంతుని మహిమోపేతమైన మాయచేత మోహం పొందిన మనస్సుగల మా వంటి వారికి హరిభక్తుల చర్యలు తెలుసుకోవటం శక్యం కాదు. ఇక శ్రీహరి చర్యలను ఎలా తెలుసుకొనగలం? అటువంటి యశోనిధులైన జితేంద్రియులకూ, మహాత్ములకూ మ్రొక్కుతున్నాను, అని ఈ విధంగా కోపంచేత పెదవులు అదురుతున్న పృథుచక్రవర్తిని సంస్తుతించి ధైర్యం తెచ్చుకొని భూమి మళ్లీ యిలా అన్నది.

క. విమలాత్మ! నాకు నభయము, సమకూరెడు నట్లుగాఁగ సన్మతి నీ క్రో
ధము నుపశమించి కరుణిం, పుము, నా విన్నపము వినుము పురుషనిధానా! 488

* నిర్మలమైన మనస్సుకల రాజా! నాకు అభయం ప్రసాదించు. ఆగ్రహాన్ని చాలించు. నన్ను మన్నించి దయతో నా విన్నపం ఆలించు.

క. ధర విరులు గందకుండఁగ, సరసగతిం బూవుఁదేనెఁ జవిగొను నిందిం
దిరవిభు కైవడి బుధుఁడగు, పురుషుఁడు సారాంశ మాత్మఁబూని గ్రహించున్. 489

* పువ్వులు కందిపోకుండా లోపలి తేనెను మృదువుగా త్రాగే తుమ్మెదలాగా పండితుడైన మానవుడు దేనినీ నొప్పించకుండా అన్నిటి నుండి సారాంశాన్ని నేర్పుగా గ్రహిస్తాడు.

సీ. వినవయ్య! తత్త్వదర్శనులైన యట్టి స న్మునులచే నైహికాముష్మికంబు
లైన ఫలప్రాప్తి కర్థిఁ గృష్యాద్యగ్ని హోత్రాద్యుపాయంబు లుర్విమీఁద
దృష్టంబులును నాచరితములు నగుచుఁ దా నెనయంగఁ దదుపాయ మెవ్వఁ డాచ
రించును వాఁడు ప్రాపించుఁ దత్ఫలమును విద్వాంసుఁడైనను వెలయ దీని

తే. నాదరింపక తనయంత నాచరించె, నేని నాయాసమే యగుఁ గాని తత్ఫ
లమును బొందఁడు బహుళ కాలమునకైన, వినుత గుణశీల! మాటలు వేయునేల? 490

* తత్త్వదర్శనులైన మునులు ఈ లోకంలోనూ పరలోకంలోనూ పురుషులకు ఫలం చేకూర్చేకృషి, అగ్నిహోత్రం మొదలైన ఉపాయాలను దర్శించి ఆచరించారు. ఆ విధంగా ఆ ఉపాయాలను అనుష్ఠించేవాడు ఆ ఫలాన్ని పొందుతాడు. అటువంటి ఉపాయాన్ని లెక్కసేయకుండా తనకు తోచినట్లు చేసేవాడు, ఎంత పండితుడై నప్పటికీ అతనికి ఆయాసమే తప్ప ఫలం సిద్ధించదు. వెయ్యిమాటలెందుకు? ఎంత కాలం గడిచినా వాని స్థితి అంతే.

వ. అని మఱియు మహి యిట్లనియె. 491

చ జలరుహగర్భుచేత మును చాల సృజింపఁగఁ గఁబడ్డ యోషధుల్
కలుషమతిన్ ధృతవ్రతులు గాని యసజ్జనభుజ్యమానమై
వెలయుటఁ జూచి యే నృపతివీరులు మాన్పమిఁ జోరబాధలం
బలుమఱుఁ బొంది యే నపరిపాలితనై కృశియించి వెండియున్. 492

* నిజమే. పూర్వం బ్రహ్మదేవుడు పెక్కు ఓషధులను సృష్టించాడు. అయితే వాటిని కలుషాత్ములు, నియమభ్రష్టులు అయిన దుష్టులు భుజించారు. రాజులు అది చూచికూడా వారిని అడ్డగింపలేదు. అందుచేత నేను పెక్కుసార్లు దొంగల బాధకు గురియై రక్షణలేని దాననై క్రుంగి కృశించిపోయాను.

క. అనుపమ మఖ కర్మ క్రియ, లనయము లేకుంట నే ననాదృత నగుచున్
జననాయక! యీ లోకము, ఘనచోరీభూత మగుటఁ గనుఁగొని యంతన్. 493

* మహారాజా! యజ్ఞ కర్మలు అడుగంటాయి. లోకంలో నాకు ఆదరం లేకుండా పోయింది. మానవులంతా దొంగలుగా మారారు. ఈ పరిస్థితి నేను చూచాను.

క. సవనాది సిద్ధి కొఱకై, తవిలి తదీయౌషధీ వితతులను ధరణీ
ధవ! యే నపుడు గ్రసించితి, నవియును నా యందు జీర్ణమయ్యెఁ గడంకన్. 494

* మహీపాలా! యజ్ఞాలు మొదలైన సత్కర్మలకు ఉపయోగపడే ఆ ఓషధులను చోరులు దొంగిలించకుండా నేను వాటిని మ్రింగాను. అవి నాలో జీర్ణమైపోయాయి.

**క. విను వాని నొక యుపాయం, బునఁ గ్రమ్మఱఁ బడయవచ్చు భూవర చంద్రా!**
**విను మది యెఱిఁగించెద నీ, కును వత్సలురాల నగుట గురుతర చరితా! 495**

* రాజేంద్రా! విను. ఆ ఓషధులును ఒక ఉపాయంచేత మళ్ళీ పొందవచ్చు. ఓ సుచరిత్రా! నీ మీద ఉండే ప్రేమచేత ఆ ఉపాయం నీకు వివరిస్తాను.

**క. అనయము నా కొక వత్సము, ననురూప సుదోహనమ్ము ననురూపక దో**
**గ్ధను గల్పింపుమ యట్లయి, నను నీ భూతముల కవనినాయక! దానన్. 496**

**క. పరఁగ నభీప్సితములు బల, కరములు నగు, నన్నదుగ్ధకలితము లగు భా**
**సురకామంబులఁ బిదికెద, నరనాయక చంద్ర! వినుము నా వచనంబుల్. 497**

* నరనాథా! నీవు నాకు తగిన దూడనూ, తగిన పాత్రనూ, తగిన దోగ్ధనూ సమకూర్చు. అలా నీవు సమకూర్చినట్లయితే ఈ ప్రాణులకు ఇష్టమైనవీ, బలకరమైనవీ, దుగ్ధాన్న రూపమైనవీ అయిన కోరికలను ప్రసాదిస్తాను. నా మాటలు నమ్ము.

**చ. మనుజవరేణ్య! యేను విషమస్థలినై యిపు డున్నదాన, నొ**
**య్యన జటదాగమోదిత పయః ప్రకరంబు తదాగమంబు వో**
**యినను దదంబువుల్ పుడమి నింకక యంతట నిల్చునట్లుగా**
**మనునిభ! నన్ను నిప్పుడు సమస్థలినై పెనుపొందఁ జేయవే. 498**

* మహారాజా! యిప్పుడు నేను మిట్టపల్లాలతో విషమంగా ఉన్నాను. వానకారులలో కురిసిన నీరు, ఆ వానకారు గడచిపోయిన తరువాత కూడా భూమిలో ఇంకకుండా అంతటా నిలిచిపోవటానికి వీలుగా నన్ను సమంగా చదును చేయి. మనుసన్నిభా! నా విన్నపం మన్నించు.

**క. అని యి వ్విధమున నా భూ, వనితామణి పలుకు మధుర వచనంబులు దా**
**విని యనురాగము దన మన, మునఁ గడలుకొనంగ రాజముఖ్యుం డంతన్. 499**

* ఈ విధంగా భూదేవి పలికిన తియ్యని మాటలను పృథుచక్రవర్తి విన్నాడు. ఆయన మనస్సులో ప్రేమ పొంగులెత్తింది.

**చ. మనువును దూడఁ జేసి గరిమన్ నిజపాణితలంబు లీల దో**
**హనముగఁ జేసి యందు సకలౌషధులం బిదికెం గ్రమంబునం**
**దనరఁగఁ దద్విధంబునను దత్పృథు వత్సల యైన భూమియం**
**దనయము వారువారును బ్రియంబగు కోర్కులు వొంది రున్నతిన్. 500**

* అప్పుడు పృథుచక్రవర్తి మనువును గోవత్సంగానూ, తన చేతిని పాత్రంగాను చేసి తాను దోగ్ధయై భూమి నుండి సకలమైన ఓషధులను పిదికాడు. ఈ విధంగా పృథుచక్రవర్తి యందు వాత్సల్యం కల్గిన గోరూపధారిణయైన భూమి నుండి ఇతరులుకూడా తమ అభిమతార్థాలను ఆవిష్కరించుకున్నారు.

సీ. బలసి ఋషుల్ బృహస్పతి వత్సకంబుగా నర్థించి తమయింద్రియంబులందు
నంచిత చ్ఛందోమయ క్షీరమున దేవతలు సురరాజు వత్సంబు గాఁగఁ
గనక పాత్రమునందుఁ దనరు నోజోబల వీర్యామృతంబునై వెలయు పయసు
దైత్య దానవులు దైత్య శ్రేష్ఠుఁడగు గుణశాలిఁ బ్రహ్లాదు వత్సంబుఁ జేసి

తే. ఘన సురాసవరూప దుగ్ధంబు వరుస, నప్సరోజన గంధర్వు లలరి యపుడు
దనర విశ్వావసును వత్సమునుగఁ జేసి, పద్మమయ నిర్మితంబైన పాత్రమందు. 501

వ. మాధుర్య సౌందర్య సహిత గాంధర్వక్షీరంబును బితృదేవతలు సూర్యవత్సకంబుగా నామ పాత్రంబునందుఁ గవ్యంబును దుగ్ధంబును, సిద్ధులు గపిల వత్సకంబుగా నాకాశ పాత్రమందు సంకల్పనా రూపాణిమాది సిద్ధియను క్షీరంబును, విద్యాధరాదులు తద్వత్సకంబును తత్పాత్రకంబునుగా ఖేచరత్వాదివిద్యా వ్యాపారరూప క్షీరంబును, గింపురుషాదులు మయవత్సకంబుననాత్మ పాత్రంబునుంగా సంకల్పమాత్ర ప్రభవంబును నంతర్ధానాద్భుతాత్మ సంబంధియు నగు మాయ యను క్షీరంబును, యక్షరక్షోభూత పిశాచంబులు భూతేశ వత్సకంబుగాఁ గపాల పాత్రకంబునుగా రుధిరాసవంబను క్షీరంబును, నహిదందశూక సర్పనాగంబులు దక్షకవత్సంబును బిలపాత్రంబునుంగా విషరూపక్షీరంబును, బశువులు గోవృషవత్సకంబు నరణ్య పాత్రంబునుంగాఁ గ్రవ్యంబను దుగ్ధంబును, విహంగంబులు సుపర్ణవత్సకంబు నిజకాయ పాత్రంబునుంగాఁ గీటకఫలాదికంబను దుగ్ధంబును, వనస్పతులు వటవత్సకంబుగా భిన్నరోహరూప పయస్సును, గిరులు హిమవద్వత్సకంబును నిజసాను పాత్రకంబునుంగా నానాధాతువులను దుగ్ధంబునుంగా నవ్విధంబున సమస్తచరాచర వర్గంబు స్వముఖ్యవత్సకంబును స్వస్వపాత్రకంబునుంగా భిన్నరూపంబులైన క్షీరంబులం బిదికె నని చెప్పి మఱియును. 502

* ఋషులు బృహస్పతిని దూడగా చేసుకొని ఇంద్రియాలనే పాత్రలో వేదమయమైన క్షీరమునూ, దేవతలు ఇంద్రుడు దూడగా బంగారు పాత్రలో ఓజోబల వీర్యామృతమయమైన క్షీరమునూ, దైత్య దానవులు గుణవంతుడైన ప్రహ్లాదుడు దూడగా, ఇనుప పాత్రలో సురాసవమయమైన క్షీరమునూ, అప్సరసలు, గంధర్వులు, విశ్వావసువు దూడగా పద్మమయమైన పాత్రంలో మాధుర్య సౌందర్యములతో కూడి "గాంధర్వ"మనే క్షీరమునూ పిదుకుకొన్నారు. పితృదేవతలు సూర్యుడు దూడగా ఆమపాత్రంలో "కవ్య"మనే క్షీరమునూ, సిద్ధులు కపిలుడు దూడగా ఆకాశ పాత్రంలో సంకల్పనా రూపమైన "అణిమాదిసిద్ధి" అనే క్షీరమునూ, విద్యాధరులు మొదలైనవారు కపిలుడు దూడగా, ఆకాశపాత్రంలో ఖేచరత్వాది విద్యామయమైన క్షీరమునూ, కింపురుషాదులు మయుడు దూడగా ఆత్మపాత్రంలో సంకల్ప మాత్ర ప్రభవమూ అంతర్ధాన రూపమూ అద్భుతాత్మకమూ అయిన

"మాయ"అనే క్షీరమునూ, యక్షరక్షోభూత పిశాచాలు రుద్రుడు దూడగా కపాలపాత్రలో రుధిరాస్వరూపమైన క్షీరమునూ, అహిదందశూక సర్పనాగాలు తక్షకుడు దూడగా బిలపాత్రలో విషరూపమైన క్షీరమునూ; పశువులు ఆబోతు దూడగా అరణ్యపాత్రలో తృణమనే క్షీరమునూ; క్రూర మృగాలు సింహం దూడగా స్వకళేబర పాత్రంలో "మాంసం"అనే క్షీరమునూ, పక్షులు గరుత్మంతుడు దూడగా స్వదేహ పాత్రంలో కీటకాలు ఫలాదులూ అనే క్షీరమునూ, వనస్పతులు వటవృక్షం దూడగా సానువులనే పాత్రంలో కీటకాలు ఫలాదులూ అనే క్షీరమునూ; వనస్పతులు వటవృక్షం దూడగా భిన్నరోహ రూపమైన క్షీరమునూ; పర్వతాలు హిమవంతుడు దూడగా సానువులనే పాత్రలో నానాధాతువులు అనే క్షీరమునూ - ఈ విధంగా సమస్త చరాచర ప్రపంచం తమలో శ్రేష్ఠులు దూడలుగా, తమకు దగిన పాత్రలలో, తమకు తగిన క్షీరాలను భూమినుండి పిండు కున్నారు.

**క. క్రమమున నిటు పృథ్వ్యాదులు, దమతమ కామితము లనఁగఁ దగు భిన్న క్షీ**
**రము దోహన వత్సక భే, దమునం దగఁ బిదికి, రంత ధరణీధవుఁడున్. 503**

* ఈ ప్రకారం క్రమక్రమంగా పృథువు మొదలైనవారు వేరు వేరు వత్సములనూ, పాత్రలనూ కల్పించుకొని తమ తమ కోర్కెలు అనే వేరువేరు క్షీరాలను పిదుకు కొన్నారు.

**తే. సముచితానందమును బొంది సర్వకామ, దుఘ యనం దగు భూమిని దుహిత గాఁగఁ**
**గోరి కైకొని నిజధనుఃకోటిచేత, భూరిగిరి కూటములఁ జూర్ణములుగఁ జేసి. 504**

**తే. చండ దోర్దండలీల భూమండలంబు, సమతలంబుగఁ జేసి శశ్వత్ప్రసిద్ధి**
**నొంది య వ్విభుఁడీ లోకమందు నెల్ల, బ్రజకుఁ దండ్రియు జీవనప్రదుఁడు నగుచు. 505**

* అప్పుడు పృథుచక్రవర్తి ఎంతో సంతోషించి సర్వకామప్రదాత్రి అయిన ధరిత్రిని తన పుత్రిగా స్వీకరించాడు. తన వింటికొప్పుతో పెద్ద పెద్ద పర్వతాల శిఖరాలను పొడి పొడి చేసి తన బాహుబలంతో భూమండలాన్నంతా సమతలంగా చేసి శాశ్వతమైన యశస్సు గడించాడు. తండ్రివలె తన ప్రజలకు బ్రతుకు తెరువు కల్పించాడు.

**తే. అక్కడక్కడఁ బూర్వంబునందు లేని, గ్రామ పట్టణ దుర్గ ఖర్వట పుళింద**
**ఖేట శబరాలయ వ్రజవాట ఘోష, వివిధ నిలయము లర్థిఁ గావించె నంత. 506**

* అక్కడక్కడ పూర్వం లేని జనపదాలు, పట్టణాలు, దుర్గాలు, కొండపల్లెలు, బోయపల్లెలు, శబరాలయాలు, వ్రజవాటికలు, ఘోషవాటికలు మొదలగు పెక్కు విధాలైన నివాస స్థానాలను కల్పించాడు.

**క. వారును భయవిరహితులై, బోరనఁ దత్తన్నివాసముల యందు సుఖ**
**శ్రీరుచి నొప్పుచు నుండిరి, వారక యా పృథునిఁ బొగడ వశమె ధరిత్రిన్? 507**

* ప్రజలు భయం తొలగి ఆ యా నివాసాలలో సుఖసంపదలతో తులతూగుతూ బ్రతుకుతున్నారు. అటువంటి ధర్మమూర్తి అయిన పృథుచక్రవర్తిని కీర్తించడం ఎవరికీ శక్యం కాదు.

సీ. అని చెప్పి మునినాథుఁడైన మైత్రేయుఁ డవ్విదురున కిట్లను వేడ్కతోడ
ననఘాత్మ! రాజర్షి యైన వైన్యుం డశ్వమేధ శతంబు సన్మేధతోడఁ
గావింతు నని దీక్ష గైకొని వ్రతనిష్ఠఁ దివిరి బ్రహ్మావర్త దేశమందు
నలరు మనుక్షేత్ర మందు సరస్వతీ నది పొంతఁ దా మహోన్నతి నొనర్చు

తే. సవన కర్మ క్రియకు నతిశయ విశేష ఫలము గలిగెడి నని బుద్ధిఁ దలఁచి యచట,
వరుసఁ గావించు నతిశయాధ్వర మహోత్స, వము సహింపక యుండె న య్యమర విభుఁడు.508

* అని చెప్పి మైత్రేయ మహర్షి విదురునితో ఇలా అన్నాడు. రాజర్షియైన పృథుచక్రవర్తి నూరు అశ్వమేధ యాగాలు చేయటానికి దీక్ష పూనాడు. మహానిష్ఠతో బ్రహ్మావర్త దేశంలోని మనుక్షేత్రంలో సరస్వతీనదీ తీరంలో మహావైభవంగా యజ్ఞాలు చేయటంవల్ల విశేషఫలం కలుగుతుంది అని భావించాడు. ఆ విధంగా ఆయన అక్కడ సాగిస్తున్న యాగవైభవాన్ని చూచి ఇంద్రుడు ఓర్వలేకపోయాడు.

## -: పృథుచక్రవర్తి యశ్వమేధంబు సేయునెడ నింద్రుం డశ్వము నపహరించుట. :-

సీ. అట్టి యధ్వర కర్మమందు సాక్షాద్భగవంతుఁడు హరి రమేశ్వరుఁడు లోక
గురుఁడును సర్వాత్మకుండును విభుఁడును నీరజభవ భవాన్వితుఁడు లోక
పాలక నిఖిల సుపర్వానుగుండును యజ్ఞాంగుఁ డఖిలాధ్వరాది విభుఁడు
గంధర్వ ముని సిద్ధగణ సాధ్య విద్యాధ రాప్సరో దైత్య గుహ్యాళి దాన

తే. వాది జేగీయ మానుఁ డత్యలఘుయశుఁడు, ప్రకట నందసునందాది పార్షదుండు
కపిల నారద సనకాదిక ప్రముఖ్య, మహిత యోగీంద్ర సంస్తూయమానుఁ డజుఁడు. 509

* పృథుచక్రవర్తి చేస్తున్న అశ్వమేధ యజ్ఞానికి సాక్షాత్తూ భగవంతుడూ, యజ్ఞ స్వరూపుడూ యజ్ఞేశ్వరుడూ, విశ్వగురుడూ, విశ్వాత్మకుడూ, విశ్వవిభుడూ, విశాలయశోవిరాజితుడు, లక్ష్మీవల్లభుడూ అయిన విష్ణుదేవుడు గంధర్వులు, మునులు, సిద్ధులు, సాధ్యులు, విద్యాధరులు, అప్సరసలు, దైత్యులు, యక్షులు, దానవులు, మొదలైనవారు సంకీర్తించుతూ ఉండగా కపిలుడు, నారదుడు, సనకుడు మొదలైన యోగీంద్రులు కొనియాడుతూ ఉండగా, నందుడు సునందుడు మొదలైన పార్షదులతోనూ, బ్రహ్మతోనూ పరమశివునితోనూ, అష్టదిక్పాలకులతోనూ కూడి వేంచేశాడు.

వ. మఱియుం బరమ భాగవత సేవితుండును నారాయణాంశ ప్రభవుండును నైన పృథు చక్రవర్తికి భూమి హవిరాదిదోగ్ధ్రియయ్యును సర్వకామదుఘయై సమస్త పదార్థంబులం బిదుకుచుండె, మఱియుఁ దరువులు ఘనతరాకారంబులు గలిగి మకరందస్రావు లగుచు నిక్షుద్రాక్షాది రసంబులును దధిక్షీరాజ్య తక్ర పానకాదికంబులును వర్షింప నవి యెల్ల నదులు వహించె, సముద్రంబులు హీరాది రత్న విశేషంబుల నీనుచుండెఁ, బర్వతంబులు భక్ష్యభోజ్యలేహ్య చోష్యంబు లను చతుర్విధాన్నంబులం గురియుచుండె, లోకపాల సమేతులైన సకలజనంబులు నుపాయనంబులు దెచ్చి యిచ్చుచుండి,

**రట్టి పరిపూర్ణ విభవాభిరాముండై యధోక్షజ సేవాపరాయణుండగు పృథు చక్రవర్తి యేకోన శతాశ్వమేధంబులు సన్మేధంబునం గావించి నూఱవయాగంబు నందు యజ్ఞపతి యైన పుండరీకాక్షుని యజించుచుండం దదీయ పరమోత్సవంబు సహింపం జాలక. 510**

* పరమభక్తులచేత సేవింపబడువాడునూ, నారాయణాంశతో పుట్టినవాడునూ అయిన పృథుచక్రవర్తికి హవిస్సులు మొదలగు వానిని సమకూర్చునది అయినప్పటికినీ భూదేవి సర్వ కామితములనూ పిదుకునదై సమస్త పదార్థములనూ సమకూర్చింది. చెట్లు తమ ఆకారాన్ని పెంపొందించి తేనెలను కురుస్తూ చెఱకు, ద్రాక్ష మొదలైన రసములనూ; పెరుగు, పాలు, నెయ్యి, మజ్జిగ, పానకం మొదలగు వానిని వర్షింపగా అవి నదులై ప్రవహించాయి. సముద్రాలు వజ్రాలు మొదలైన వివిధ రత్నాలను సమర్పించాయి. పర్వతాలు భక్ష్య, భోజ్య, లేహ్య, చోష్యాలు అనే నాల్గు విధాలైన పదార్థాలను సిద్ధపరిచాయి. లోకపాలకులతో కూడి సకల జనులు కానుకలు తెచ్చి సమర్పించారు.

* ఈ విధంగా విష్ణుభక్తుడైన పృథుచక్రవర్తి మహావైభవంతో తొంబదితొమ్మిది అశ్వమేధయాగాలను బుద్ధి కౌశలంతో పూర్తిచేసి నూరో యాగాన్ని ప్రారంభించి యజ్ఞేశ్వరుడైన శ్రీహరిని ఆరాధింపసాగాడు. ఇంద్రుడు ఆ మహాయజ్ఞ వైభవాన్ని చూచి అసూయపడ్డాడు.

**క. అమరేంద్రుఁడు ఘనరోషో, ద్గముఁడై పాషండ వేషకలితతిరో భా**
**వమునం దన్మఖపశువుం, గ్రమ మేది హరించి చనియె గగనంబునకున్. 511**

* రోషం పట్టలేని దేవేంద్రుడు పాషండ వేషం ధరించి, ఎవరికీ కనుపించకుండా యజ్ఞశాలకు వచ్చి యజ్ఞపశువును అపహరించి ఆకాశమార్గం పట్టాడు.

**వ. అట్లు సనునప్పుడు. 512**

**క. అనఘుండగు నత్రి మహా, మునిచోదితుఁ డగుచుఁ బృథుని పుత్రుఁడు బాణా**
**సనతూణీర ధరుండై, యనిమిషపతి వెనుకఁ జనియె నతిదర్పమునన్. 513**

* అప్పుడు అత్రిమహాముని అది గ్రహించి పృథుచక్రవర్తి యొక్క కొడుకుతో చెప్పాడు. అతడు వింటిని అమ్ముల పొదులను ధరించి దర్పాతిశయంతో దేవేంద్రుని వెంబడించాడు.

**వ. అట్లు సని చని ముందట. 514**

**సీ. యజ్ఞ సాధన పశుహరణుని వధియించు ధర్మంబునందు నధర్మమనెడి**
**బుద్ధిఁ బుట్టఁగఁ జేయ భూరి మాయావేషధారియై యరుగు సుత్రాముఁ గదిసి**
**నిలు నిలు మని యార్చి నిజగుణధ్వని సేసి ఘన జటాభస్మాస్థి కలిత మయిన**
**మూర్తిఁ గనుంగొని మూర్తీభవించిన ధర్మంబ కా బుద్ధిఁ దలఁచి యమర**

**తే. నాయకుని మీఁద సాయక మేయఁ జాల, కున్నఁ గనుఁగొని యత్రి విద్వన్నుతుండు**
**వైన్యజున కనె వాసవు వలను సూపి, మనములోపల రోషంబు మల్లడింప. 515**

క. విను మితఁడు యజ్ఞహంతయు, ననిమిషనికరాధముండు నగు నింద్రుఁడు గా
వున నితని జయింపుము నీ, వని ముమ్మా ఱుచ్చరింప న వ్వైన్యజుఁడున్. 516

* పృథు చక్రవర్తి కుమారుడు ధర్మమందు అధర్మబుద్ధి పుట్టించే మాయావేషం ధరించి యజ్ఞపశువును హరించికొనిపోతున్న ఇంద్రుని సమీపించి "నిలు! నిలు" అని అరచి వింటి నారి మ్రోగించాడు. కాని జడలు ధరించి, బూడిద పూసికొని, ఎముకలను తాల్చిన ఆతని రూపం చూచి, ఆకారం ధరించిన ధర్మ మేమో అని భ్రమించాడు. యజ్ఞసాధనమైన పశువును దొంగిలించువానిని చంపటం ధర్మమైనా అధర్మం అని అనిపించింది. అందుచేత పృథుకుమారుడు ఇంద్రునిపై బాణము విడువలేక పోయాడు. అది చూచి మహాత్ముడైన అత్రిముని రోషంతో ఇంద్రుణ్ణి చూపిస్తూ పృథుపుత్రునితో " ఈ ఇంద్రుడు యజ్ఞ ఘాతకుడు, దేవతలలో పరమపాతకుడు. కాబట్టి నీవు ఇతణ్ణి జయించు" అని మూడు సార్లు పలికాడు.

మ. విను వీథిం జను దేవవల్లభునిపై వీరుండు గ్రోధాంతరం
గ నిరూఢిన్ మృగరాట్కిశోరము మహాగంధద్విపేంద్రంబు మీఁ
దను లంఘించు విధంబునం బడిన నాతం డశ్వచౌర్యైక సా
ధన రూపంబుఁ దదశ్వమున్ విడిచి యంతర్ధానముం బొందినన్. 517

* అప్పుడు పృథుచక్రవర్తి పుత్రుడు కోపంతో, సింహకిశోరం మదపుటేనుగు మీదికి లంఘించినట్లు ఆకాశంలో వెళ్లే ఇంద్రునిపైకి దుమికాడు. ఇంద్రుడు దొంగవేషాన్నీ, గుర్రాన్నీ విడిచిపెట్టి అదృశ్యమయ్యాడు.

క. వీరుఁడు పృథు భూపాల కు, మారుఁడు నిజ యజ్ఞపశువు మరలం గొని దు
ర్వారబలుఁ డగుచు జనకుని, భూరి సవనరాజపుణ్యభూమికి వచ్చెన్. 518

* మహావీరుడైన పృథుకుమారుడు దుర్వారమైన పరాక్రమంతో యజ్ఞాశ్వాన్ని మరలించుకొని పుణ్యభూమియైన జనకుని యజ్ఞభూమికి చనుదెంచాడు.

వ. అయ్యవసరంబున నచ్చట నున్న పరమర్షిపుంగవు లతని యద్భుత కర్మంబు గనుంగొని యాశ్చర్యంబు నొంది యతనికి జితాశ్వుండను నన్వర్థ నామంబు వెట్టియున్న సమయంబున. 519

* అప్పుడు అక్కడ ఉన్న మహర్షివరేణ్యులు అతని అద్భుత కృత్యాన్ని ఆలోకించి ఆశ్చర్యపడి, అతనికి "జితాశ్వుడు" అనే సార్థకమైన పేరు పెట్టారు.

చ. మఱియును దేవతాపతి తమః పటలంబు జనింపఁజేసి యె
వ్వరుఁ దనుఁ గానకుండ ననివారణఁ గాంచనపాశ బద్ధ మై
సురుచిరయూపదారు పరిశోభితమైన హయంబుఁ గొంచుఁ జె
చ్చెర వినువీథి నేగఁగ ఋషి ప్రవరుం డగు నత్రి సెప్పినన్. 520

క. విని పృథు భూవర తనయుఁడు, ఘన బలమునఁ జని కపాలఖట్వాంగము లో
లిని ధరియించి రయంబునఁ, జను నింద్రునిఁ గాంచి నొంపఁజాలక యంతన్. 521

* ఇంద్రుడు చిమ్మచీకటిని కల్పించి అదృశ్యరూపంలో మళ్ళీ వచ్చి బంగారు త్రాళ్లతో యూపస్తంభానికి కట్టివేసి ఉన్న గుర్రాన్ని దొంగిలించి వేగంగా నింగివైపు వెళ్లాడు. అది చూచి అత్రిమహర్షి చెప్పగా రాజపుత్రుడు జితాశ్వుడు ఇంద్రుని వెన్నంటాడు. కాని పుఱ్ఱెనూ, ఖట్వాంగాన్నీ ధరించి కపటవేషంలో ఉన్న ఇంద్రుణ్ణి చంపటానికి అతడు సందేహించాడు.

ఉ. క్రమ్మఱ నత్రిచేఁ దెలుపఁగాఁబడి వైన్యతనూభవుండు రో
షమ్మునఁ దోఁకఁ ద్రొక్కిన భుజంగమపుంగవుఁ బోలి యుగ్రుఁడై
య మ్మరిఁబోసినం గని సురాధిపుఁ డెప్పటి యట్లఁ బాఱె న
శ్వమ్మును రూపమున్ విడిచి చాలఁ దిరోహితుఁడై రయంబునన్. 522

వ. అట్లు సనినం బశువుం గొని మరలి య వ్వీరో త్తముండు పితృ యజ్ఞశాలకుం జనుదెంచె నంత. 523

* అప్పుడు అత్రిమహర్షి రాజపుత్రుని మళ్లీ పురికొల్పాడు. పృథుపుత్రుడు తోకత్రొక్కిన సర్పం వలె కోపించి బాణాన్ని సంధించాడు. ఇంద్రుడు కపటరూపాన్ని అశ్వాన్నీ విడిచి మళ్లీ అంతర్ధాన మయ్యాడు. వీరశిరోమణి పృథుపుత్రుడు అశ్వరాజాన్ని తండ్రిగారి యజ్ఞశాలకు తోడ్కొని వచ్చాడు.

సీ. హరిహయుం డధ్వర హయ హరణార్థమై మించి కైకొని విసర్జించి నట్టి
భూరి యమంగళ భూత మాయారూపములను ధరించిరి మూఢజనులు,
పాషండ చిహ్నముల్ పరఁగుట వారలు జగతిపై నగ్న వేషములు గలుగు
జైనులు భూరి కాషాయ వస్త్రంబులు ధరియించు బౌద్ధులుఁ దగ జటాస్థి

తే. భస్మధారులు నయిన కాపాలికాదు, లనఁగ వెలసిరి లోకంబులందుఁ జాలఁ
దలఁప ధర్మోపమం బనఁదగు నధర్మ, మందు నభిరతి వొడమిన యజ్ఞజనులు. 524

వ. తదీయ చిహ్నంబులు పారంపర్యంబుగా ధరియింపం దొడంగిరి, తద్వృత్తాంతంబు భగవంతుం డయిన పృథు చక్రవర్తి యెఱింగి కుపితుండై యుద్యతకార్ముకుం డగుచు నింద్రునిమీఁద బాణంబు నేయ నుద్యమించిన ఋత్విక్కులు శక్రవధోద్యుక్తుండు నసహ్యారంహుండు నయిన పృథుచక్రవర్తిం గనుంగొని యిట్లనిరి.525

* ఇంద్రుడు యజ్ఞాశ్వాన్ని దొంగిలించటం కోసం ధరించి, విడిచిన అమంగళకరాలైన మాయారూపాలను మూర్ఖులైన మానవులు గ్రహించారు. ఆ రూపాలు పాషండ చిహ్నాలు. దిసమొలలతో తిరిగే జైనులు; కావిగుడ్డలు కట్టే బౌద్ధులు, జడలు, ఎముకలు, భస్మం ధరించే కాపాలికులు మొదలైనవారు పాషండులు. ఈ విధంగా లోకంలో అధర్మమందు ఆసక్తి కల్గిన మూర్ఖులు ఆ పాషండ చిహ్నములను పరంపరగా ధరించడం మొదలు పెట్టారు.

ఇంద్రుడు హయాన్ని అపహరించిన సంగతి పృథుచక్రవర్తి తెలుసుకొని కోపంతో విల్లెక్కు పెట్టి అపరాధి అయిన అమరేంద్రుని మీద బాణాన్ని ప్రయోగించడానికి సిద్ధపడ్డాడు. అప్పుడు ఋత్విక్కులు ఇంద్ర సంహారానికి పూనుకున్న పృథుచక్రవర్తిని చూచి యిలా అన్నారు.

**క. జననాయక! యజ్ఞములం, దనుపమ విధిచోదితంబు లనఁదగు పశు బం**
**ధన హింసల కా కితరుల, ఘనదీక్షితునకు వధింపఁ గాదండ్రు బుధుల్. 526**

* మహారాజా! యజ్ఞాలలో యజ్ఞదీక్షితుడైనవాడు యజ్ఞపశువును తప్ప మరి ఎవ్వరినీ వధించరాదని విద్వాంసులు అంటారు.

**వ. కావున నీ విపు డింద్రవధోద్యోగం బుపసంహరింపుము, భవదీయ ధర్మ విరోధి యైన యింద్రుని.527**

**క. జనపాల! వీర్యవంతము, లనఁదగు మంత్రములచేత నాహ్వానము సే**
**సిన నతఁ డిచటికి వచ్చును, జనుదెంచిన యమర విభుని సరభసతఁ దగన్. 528**

**క. ధృతి సెదరఁ బట్టి శిఖి కా, హుతిఁ గా వేల్చెదము, దాన నుర్వీవర! నీ**
**వితత మహో హత వీర్యో, న్నతుఁడై చెడిపోవు నమరనాథుం డంతన్. 529**

* కాబట్టి నీవు ఇంద్రుణ్ణి సంహరించే ప్రయత్నాన్ని విరమించు. నీకు విరోధియైన ఇంద్రుణ్ణి శక్తిమంతాలైన మంత్రాలచే మేము ఇక్కడికి రావించి అతణ్ణి అగ్నికి ఆహుతి చేస్తాము. అప్పుడు ఇంద్రుడు నీ మహాతేజస్సుచేత శక్తి కోల్పోయి నశిస్తాడు.

**వ. అని పృథుని వారించి ఋత్విగ్జనంబులు గుపితస్వాంతులై హస్తంబుల స్రుక్స్రువంబులు ధరియించి వేల్చు సమయంబునం జతుర్ముఖుండు సనుదెంచి ఋత్విజులం గనుంగొని యిట్లనియె: యజ్ఞంబులందు యజింపంబడు దేవత లెవ్వని యంశంబు, లెవ్వండు యజ్ఞనామకంబగు భగవదంశంబగు, నట్టి యింద్రుండు మీచేత వధార్హుండుగాఁ డితండు భగవదంశసంభవుం డగుట నీ యజ్ఞకర్మ విధ్వంసనేచ్ఛుం డయి కావించు ధర్మ వ్యతికరంబులు సూచుచుండ వలయుంగాని ప్రతీకారంబులు గర్తవ్యంబులు గా, వీ పృథుకీర్తియగు పృథునకు నేకోనశతంబగు నధ్వర ప్రయోగ ఫలంబు సిద్ధించుం గాక యని పృథుచక్రవర్తి కిట్లనియె. 530**

* ఋత్విక్కులు ఈ విధంగా పృథు చక్రవర్తిని ఆపి, కోపంతో చేతులలో స్రుక్కులూ, స్రువములూ ధరించి వేల్చుటకు పూనుకున్నారు. అప్పుడు బ్రహ్మదేవుడు అక్కడికి వచ్చి ఋత్విక్కులను చూచి యిలా అన్నాడు. "యజ్ఞాలలో పూజింపబడే దేవతలు ఇంద్రుని అంశాలు. ఈ యింద్రుడు "యజ్ఞుడు"అనే పేరు కల్గిన భగవంతుని అంశం కాబట్టి ఇతడు చంపదగినవాడు కాదు. భగవంతుని అంశంవల్ల పుట్టటం మూలాన యజ్ఞాన్ని పాడు చేయాలనే కోరికతో ఇతడు చేసిన ధర్మవ్యతికరాన్ని ఉపేక్షించి చూస్తూ ఉండవలెనే కాని ప్రతీకారం చేయరాదు. ఈ పృథు చక్రవర్తికి తొంభై తొమ్మిది యజ్ఞాలు చేసిన ఫలం సిద్ధించుతుంది!" అని చెప్పి బ్రహ్మదేవుడు పృథుచక్రవర్తి వంక తిరిగి యిలా అన్నాడు.

**సీ. మనుజేంద్ర! మోక్షధర్మము నెఱింగిన నీకు సవనముల్ సేయుట సాలు మఱియు**
**నే విధంబున నైన దేవేంద్రు మనమునఁ గై కొని రోషంబు గదురకుండ**

**వర్తింప వలయును, వాసవుండును నీవుఁ బూని సుశ్లోకులు గాన మీకు**
**మంగళం బగుఁగాక! మానవనాథ! నీ చిత్తంబులోపలఁ జింతఁ దొఱఁగి**

**తే. మించి మద్వాక్యముల నాదరించి వినుము, దైవ హతమగు యజ్ఞంబుఁ దగిలి చేయు**
**కొఱకు భవదీయ చిత్తంబు గుంది రోష, కలుషితంబైన నజ్ఞానకలిత మగును. 531**

* రాజా! నీకు మోక్షధర్మం తెలుసు కదా! ఇక ఇంతటితో యజ్ఞాలు చేయటం విరమించు. ఇంతవరకు చేసిన యజ్ఞాలు చాలు. మోక్షధర్మం తెలిసినవాడవు కాబట్టి శతయజ్ఞాలు చేయటం వలన వచ్చేఫలం నీవు కోరరానిది. ఏ విధంగానైనా సరే ఇంద్రుడు నిన్ను ద్వేషించకుండా చూడు. నీవు ఇంద్రునిపై రోషం విడిచిపెట్టు. ఇంద్రుడు, నీవు - మీ యిద్దరూ శ్రీహరి అంశం వల్ల పుట్టినవారు. కాబట్టి మీరు కలిసి ఉండాలి కాని కలహింపకూడదు. మీకు శుభం కలుగుతుంది. రాజా! నీవు యజ్ఞం భంగమయిందని చింతింపకు. నా మాటలు జాగ్రత్తగా విను. దైవోపహతమైన యజ్ఞాన్ని చేయటానికి నీవు పూనుకున్నావు, అది నెరవేరలేదు. అందుకని నీవు కోపంతో ఉడికిపోరాదు. కోపంవల్ల అజ్ఞానం పెంపొందుతుంది.

**వ. భవదీయ యజ్ఞహననార్థం బశ్వహరణుండైన యింద్రుండు దేవతలలోనన్ దురాగ్రహుం డగుటం జేసి యతనిచేత నిర్మింపంబడి చిత్తాకర్షకంబులైన యీ పాషండ ధర్మంబులచేత ధర్మ వ్యతికరంబు కలుగుం గాన యీ యజ్ఞంబు సాలింపుమని మఱియు నిట్లనియె. 532**

* నీ యజ్ఞాన్ని చెడగొట్టడం కోసం ఇంద్రుడు తురంగాన్ని దొంగిలించాడు. ఇంద్రుడు దేవతలలో చాల పట్టుదల కలవాడు. అతనివల్ల నిర్మింపబడిన పాషండ ధర్మాలవల్ల ధర్మానికి హాని కలుగుతుంది. కాబట్టి నీ యజ్ఞాన్ని చాలించు అని మళ్ళీ యిలా అన్నాడు.

**సీ. అది గాక వినుము వేనాపచారంబునఁ బూని విలుప్తంబు లైన యట్టి**
**యలఘు నానా సమయానుధర్మంబులఁ బరిపాలనము సేయఁ బరఁగి వేను**
**దేహంబు వలనను దివిరి జనించి యున్నాఁడవు, నారాయణాంశజుఁడవు,**
**గావున నీ నరకలితలోకంబునఁ బుట్టిన తెఱఁగు నీ బుద్ధిఁ దలఁచి**

**తె. యెవరిచే నేమిటికి సృజియింపఁబడితి, వట్టి యా బ్రహ్మసంకల్ప మవనినాథ!**
**తప్పకుండంగఁ బాలింపు ధర్మగతిని, జారు శుభమూర్తి! యో పృథు చక్రవర్తి! 533**

* అంతేకాదు. మీ తండ్రియైన వేనుడు చేసిన అత్యాచారాలవల్ల నశించిన ధర్మాలను తిరిగి రక్షించు నిమిత్తం విష్ణుదేవుని అంశంవల్ల వేనుని శరీరం నుండి నీవు జన్మించావు. ఈ విశ్వం ఎవరివల్ల పుట్టిందో ఆలోచించు. ఈ విశ్వంలో ఎవరు ఎందుకోసం నిన్ను సృష్టించారో విచారించు. నిన్ను సృజించిన ఆ పరబ్రహ్మ సంకల్పాన్ని నెరవేర్చు. భువనకల్యాణమూర్తీ! పృథుచక్రవర్తీ! ధర్మాన్ని రక్షించు.

వ. అని మఱియు నిట్లనియె; నుపధర్మ మాతయుం బ్రచండ పాషండ మార్గంబు నైన యీ యింద్రకృతం బగు మాయను జయింపు మని వనజసంభవుం డానతిచ్చినం బృథు చక్రవర్తియు దదాజ్ఞాపితుండై దేవేంద్రునితోడ బద్ధ సఖ్యుం డయ్యె; నంత నవభృథానంతరంబున. 534

* అధర్మదాయిని అయిన ఇంద్రుని మాయచేత కల్పితమైన ప్రచండ పాషండ మార్గాన్ని నిరోధించు - అని బ్రహ్మదేవుడు అనుశాసించాడు. పృథుచక్రవర్తి బ్రహ్మ ఆజ్ఞను తలదాల్చి యింద్రునితో మైత్రి చేసుకున్నాడు. యజ్ఞాంతంలో చేయవలసిన అవభృథ స్నానం చేశాడు.

చ. సురుచిర లబ్ధ దక్షిణల సొంపునఁ బొంపిరి వోయి భూసురుల్
వరుసను బెక్కు దీవన లవారణ నిచ్చిరి, సర్వదేవతల్
భరిత ముదంతరంగములఁ బాయని వేడ్క వరంబు లిచ్చి రా
నరవరుఁ డైన వైన్యునకు నందిత కీర్తికిఁ బుణ్యమూర్తికిన్. 535

* యజ్ఞంలో పృథుచక్రవర్తివల్ల భూరి దక్షిణలను పొంది, మిక్కిలి తృప్తి చెందిన బ్రాహ్మణులు పెక్కు దీవెనలు ఇచ్చారు. దేవత లందరూ ప్రీతిచెంది పుణ్యమూర్తియైన పృథుచక్రవర్తికి అనేక వరాలు ప్రసాదించారు.

వ. అంత నచటి జనంబు లిట్లనిరి. 536

తే. అనఘ! నీ చేత నాదృతులైరి సర్వ, జనులు మఱి దానమానోపచారములను
బితృ సుదేవర్షి మానవ వితతి పూజ, నొంది యంచితమోదంబు నొందె నయ్య! 537

* అప్పుడు అక్కడి ప్రజలు ఇలా అన్నారు. "మహారాజ! నీచేత సర్వజనులు సత్కరింపబడ్డారు. పితృదేవతలు, దేవతలు, ఋషులు, మానవులు, దానమానోపచారాలచేత పూజింప బడ్డారు, సంతోషించారు.'

## -: నారాయణుండు ప్రసన్నుండై పృథు చక్రవర్తి ననుగ్రహించుట. :-

వ. అని పలుకు సమయంబున యజ్ఞభోక్తయు యజ్ఞవిభుండును భగవంతుండునైన సర్వేశ్వరుం డింద్రసమేతుండై యచ్చటికిం జనుదెంచి యా పృథున కిట్లనియె. 538

క. జనవర! భవదీయంబై, జననుతమగు నశ్వమేధ శతమున కిపు డీ
యనిమిషపతి భంగము సే, సిన కతన క్షమాపణంబు సేసెడిఁగంటే! 539

* ఆ సమయంలో యజ్ఞేశ్వరుడు, యజ్ఞభోక్త అయిన శ్రీహరి యింద్రునితో కూడి అక్కడికి వచ్చి పృథుచక్రవర్తితో "రాజా! నీ శతాశ్వమేధ దీక్షను భంగం చేసినందుకు నీముందు క్షమాపణం చెప్పుకోవటం కోసం ఇంద్రుడు వచ్చాడు. చూడు'' అన్నాడు.

వ. కావున నితని క్షమింపుము, సత్పురుషు లగువారు దేహాభిమానులు గాకుండుటం జేసి భూతంబులయెడ ద్రోహం బాచరింప, రట్లగుటం జేసి నీవంటి మహాత్ములు దేవమాయా మోహితులై పరోపతాపంబులు సేసిరేని దీర్ఘతరంబైన వృద్ధజన సేవ వ్యర్థంబు గాదె! యదియునుం గాక యీ

**శరీరం బవిద్యాకామ కర్మంబులు చేత నారబ్ధం బని తెలిసిన భూతద్రోహి గాని పరమజ్ఞాని యీ దేహంబునందు ననుషక్తుండు గాకుండుట సహజం బన, దేహోత్పాదితంబులైన గృహదారాదుల యందు మమత్వంబు లేకుండుటం జెప్పనేల? యిట్టి దేహంబునందున్న యాత్మ యేకంబును, శుద్ధ స్వరూపంబును, స్వయంజ్యోతియు నిర్గుణంబును, గుణాశ్రయంబును, వ్యాప్య వ్యాపకంబును, నసంవృతంబును, సాక్షిభూతంబును, నిరాత్మంబును నగు, దీని దేహంబుకంటె వేఱుగా నెవ్వండు దెలియు వాఁడు మత్పరుం డగుటం జేసి దేహధారియై యుండియుఁ దద్గుణంబులం బొరయక వర్తించు. మఱియు నెవ్వండేని స్వధర్మాచార పరుండును, నిష్కాముండును, శ్రద్ధాయుక్తుండునై నన్నెల్లప్పుడు భజియించు నట్టివాని మనంబు క్రమంబునఁ బ్రసన్నంబగు, నట్లు ప్రసన్న మనస్కుండును, త్రిగుణాతీతుండును సమ్యగ్దర్శనుండును నైన యతండు మదీయ సమవస్థాన రూపశాంతి నొందు, నదియు కైవల్యపదం బనంబడుఁ, గూటస్థం బైన యీ యాత్మ యుదాసీనభూతం బైనను దీని ద్రవ్యజ్ఞాన క్రియామనంబులకు నీశ్వరుంగా నెవ్వండు దెలియు, వాఁడు భవంబు నొందకుండు, నీ సంసారంబు ద్రవ్య క్రియా కారక చేతనాత్మకం బగుటం జేసి ప్రభిన్న దేహోపాధికంబు గావునఁ బ్రాప్తంబు లైన యావత్సంపదలయందు మత్పరులైన మహాత్ములు వికారంబు నొందరు, గావున నీవు సుఖ దుఃఖంబుల యందు సమచిత్తుండవును, సమానోత్తమ మధ్యమాధముండవును, జితేంద్రియాశ యుండవునై వినిష్పాదితాఖి లామాత్యాది సంయుతుండవై, యఖిలలోక రక్షణంబు సేయు మని వెండియు నిట్లనియె. 540**

* అందువల్ల ఇతనిని క్షమించు, సత్పురుషులకు దేహాభిమానం ఉండదు. కాబట్టి వారు జీవులకు ద్రోహం చేయరు. అందువల్ల నీ వంటి మహాత్ములు దేవమాయకు వశులై ఇతరులకు బాధ కల్గింపకూడదు. అలా పరులకు బాధ కల్గించినట్లయితే వారు చాల కాలంనుండి చేసిన వృద్ధజన సేవ వ్యర్థం అయిపోతుంది.

అంతేకాక ' ఈ శరీరం అవిద్యవల్ల పుట్టింది'' అని తెలిసిన పరమజ్ఞాని దేహంపై ఆసక్తి పెంచుకోడు. దేహంపైని ఆసక్తిలేని వానికి ఇంటిమీదా, భార్యాపుత్రులమీదా మమకారం ఉండదు అని చెప్పనక్కరలేదు కదా! దేహమునందలి ఆత్మ పరిశుద్ధమైనది. స్వయంగా ప్రకాశిస్తుంది. సాక్షీభూతమైనది. కాబట్టి ఆత్మను దేహంకంటె వేరని భావించేవాడు నాయందు భక్తి పెంచుకుంటాడు. అందువల్ల దేహధారి అయినప్పటికీ దేహ గుణాలను పొందడు. స్వధర్మాచారములందు ఆసక్తి కలిగి నిష్కాముడై శ్రద్ధతో నన్ను సేవించువాని మనస్సు క్రమంగా నిర్మలం అవుతుంది. ఆ విధంగా నిర్మల మనస్కుడు అయిన వాడు మోక్షాన్ని పొందుతాడు.

కూటస్థమైన ఆత్మ ఉదాసీన మైనప్పటికీ, దానిని ద్రవ్యజ్ఞాన క్రియా మనస్సులకు ఈశ్వరునిగా తెలిసికొనువాడు సంసార బంధాల్లో చిక్కుకొనడు. ఈ సంసారం ద్రవ్యక్రియాకారక చేతనాత్మకం కాబట్టి వేరువేరు దేహాలు ఉపాధులు కలిగి ఉంటుంది. అందువల్ల ఆపదలూ, సంపదలూ ప్రాప్తించినప్పుడు మహాత్ములైన నా భక్తులు వికారం పొందరు. కాబట్టి నీవు సుఖదుఃఖాలను సమంగా చూడు. ఉత్తమ, మధ్యమ, అధమ విషయాలలో సమానుడవై ప్రవర్తించి ఇంద్రియాలను జయించి మంత్రులు మొదలగువారి సాయంతో సమస్త ప్రజలనూ సంరక్షించు.

సీ. పార్థివోత్తములకుఁ బ్రజల రక్షించుట పరమ ధర్మం బగు నరవరేణ్య!
ధరణీశులకుఁ బ్రజాపరిపాలనంబునఁ బూని లోకులు సేయు పుణ్యమందు
షష్ఠాంశ మర్థిని సంప్రాప్త మగు నట్లు ప్రజలఁ బ్రోవని రాజు ప్రజలచేత
నపహృత సత్పుణ్యుఁడై వారు గావించు ఘనపాప ఫలముఁ దా ననుభవించుఁ

తే. గాన నీవును విప్రవరానుమతము, సంప్రదాయక విధమునై జరుగు ధర్మ
మహిమఁ జేపట్టి యర్థకామములయందు, సమత న మ్మూఁటియందు నా సక్తిలేక. 541

* ఓ నరవరేణ్యా! ప్రజలను రక్షించడం రాజులకు పరమ ధర్మం. ప్రజలు చేయు పుణ్యంలో రాజులకు ఆరో పాలు లభిస్తుంది. ప్రజలను రక్షింపని రాజుల పుణ్యాన్ని ప్రజలు అపహరిస్తారు. ఆ ప్రజల పాపాన్ని రాజు అనుభవిస్తాడు. కాబట్టి నీవు బ్రాహ్మణులు సమ్మతించిన ధర్మాన్ని ప్రధానంగా చేసుకో. అర్థకామాలను ఆనుషంగికాలుగా భావించు. ధర్మార్థ కామాలు మూడింటియందునూ ఆసక్తి వీడు.

వ. ఇవ్విధంబున. 542

క. జనులకు ననురక్తుఁడవై, జననాయక! నీవు ధరణి సమచిత్తుఁడవై
యనయముఁ బరిపాలించిన, సనకాదులఁ గాంతు వాత్మసదనమునందున్. 543

* రాజా! ఈ విధంగా నీవు ప్రజల అనురాగాన్ని పొంది సమచిత్తంతో పరిపాలించు. ఇలా చేస్తే నీ యింటిలోనే సనకాది యోగీంద్రులను సందర్శిస్తావు.

సీ. భూవర! యోగ తపో మఖంబుల చేతఁ, గై కొని సులభుండఁ గాని యేను
సమచిత్తులైన సజ్జనుల చిత్తంబుల, వర్తించుచుండెడివాఁడ నగుటఁ
జేసి తావక శమ శీల విమత్సర, కీర్తనముల వశీకృతుఁడ నైతి;
నే నీకు నొక వరం బిచ్చెద వేఁడుము, నావుడు విని మేదినీ వరుండు

తే. లోక గురుఁడైన యప్పుండరీక నయనుఁ, డానతిచ్చిన మృదులలితామృతోప
మాన వాక్యము లాత్మీయ మస్తకమునఁ, దాల్చి సమ్మోదితాత్ముఁడై ధరణి విభుఁడు, 544

క. తన పాదములకు భక్తిన్, వినతుండై యాత్మకర్మ వితతికి లజ్జం
దనరుచు నున్న సురేంద్రుని, గనుఁగొని సత్ప్రేమ మొదవఁ గౌఁగిటఁ జేర్చెన్. 545

* నృపవరేణ్యా! తపోయోగ యజ్ఞాలచేత నేను సులభంగా లభించను. కాని సమచిత్తులయిన సత్పురుషులకు సులభంగా లభిస్తాను కాబట్టి నీ శమశీలాలకూ, అసూయారాహిత్యానికీ, నీ సంస్తుతులకూ వశుడనయ్యాను. నీకొక వరం ప్రసాదిస్తాను, కోరుకో'' అని అన్నాడు. పృథుచక్రవర్తి భగవంతుడైన పుండరీకాక్షుడు అందంగా సున్నితంగా పలికిన అమృతం వంటి తీయని పలుకులను తలపై ధరించి మనస్సులో మహానందం పొందాడు. తన అడుగులకు భక్తితో నమస్కరించి తాను చేసిన నీచపు పనులకు సిగ్గుపడుతున్న సురేంద్రుణ్ణి పృథునరేంద్రుడు ప్రేమతో కౌగిలించుకొన్నాడు.

వ. ఇట్లు గౌఁగిటం జేర్చి గతద్వేషుండై యున్న యనంతరంబ. 546

మ. భగవంతుండును విశ్వరూపకుఁడునై భాసిల్లు నవ్విష్ణుఁ డా
జగతీనాథకృతార్చనా నతులచే సంప్రీత చేతస్కుఁడున్
నిగృహీతాంఘ్రి సరోరుహద్వయుఁడునై నిల్చెం బ్రయాణాభి ము
ఖ్యగరిష్ఠాత్మకుఁ డయ్యు నా పృథునిపైఁ గారుణ్య మేపారఁగన్. 547

వ. ఇట్లు దనమీఁది యనుగ్రహంబునం జేసి విలంబితుం డగుటయు న య్యాది రాజన్యుండైన పృథుచక్రవర్తి య ముకుంద సందర్శనానంద బాష్పజలబిందు సందోహ కందళిత నయనార విందుండై య వ్విభుమూర్తిం గనుంగొని కనుంగొన లేక గద్గద కంఠుండై పలుకలేక యుండియు నెట్టకేలకుఁ దన హృదయంబున నద్దేవుని నుపగూహనంబు గావించి తన్మూర్తి ధరియించి కన్నులం దొరఁగు నానంద బాష్పంబులు దుడిచికొని విలోకనంబు సేయుచు, నతృప్తదృగ్గోచరుండును, గరుడస్కంధ విన్యస్త హస్తుండును, వసుధాతలస్థిత పాదకమలుండును నై యొప్పు న ద్దివ్య పురుషున కిట్లనియె. 548

* ఈ విధంగా పృథువు ఇంద్రునిపై ద్వేషం మాని ఆదరించిన తరువాత భగవంతుడైన విష్ణుదేవుడు పృథుచక్రవర్తి చేసిన పూజా నమస్కారములు గ్రహించి సంతుష్టి చెందాడు. పృథుభూపాలుని భక్తిబంధాలు తన పాదాలను చుట్టుకొని కదలనీయకుండా పట్టుకొనటం వల్ల కనికరంతో ఆగిపోయాడు. తనపైనిగల అనుగ్రహంతో శ్రీహరి జాగుచేస్తున్నాడు అని పృథుచక్రవర్తి గమనించాడు. ఆ రాజుకన్నులు ఆనందాశ్రువులతో నిండిపోయాయి. కన్నులను బాగుగా విప్పి శ్రీహరిని చూడాలనుకున్నాడు. కాని పొంగిపొరలే కన్నీళ్లవల్ల తనివితీరా చూడలేకపోయాడు. డగ్గుత్తికతో పలుకలేకపోయాడు. చివరకు మనస్సులోనే ఆ దేవదేవుని కౌగిలించుకుని కన్నీటిని తుడుచుకున్నాడు. పాదపద్మాలను నేలపై ఉంచి గరుడుని మూపుపై కేలూది నిలిచిన ఆ పురాణ పురుషునితో పృథుచక్రవర్తి ఇలా అన్నాడు.

క. వరదా! యీశ్వర నిను స, త్పురుషుఁడు దేహాభిమాన భోగములకు నీ
వరమెట్లు గోరు నిహసుఖ, వరములు నారకులకైన వఱలవె చెపుమా. 549

* వరదుడవైన వాసుదేవా! సత్పురుషుడైనవాడు దేహాభిమానులు కోరుకునే సుఖాలను ఆశించి నిన్ను వరం ఇమ్మని ఎలా వేడుకుంటాడు? పరమపాతకులకు సైతం ఈ సుఖాలు లభిస్తాయి కదా!

చ. ఘన మగు దేవ! యీ వరమె కాదు మహాత్మక! వాగ్వినిర్గతం
బనఁదగు తావకీన చరణాంబుజ చారు మరందరూపమై
తనరిన కీర్తియున్ విని ముదంబును బొందఁగ లేని మోక్ష మై
నను మదిఁ గోర నొల్ల నఘనాశ! రమేశ! సరోజలోచనా! 550

* దేవా! పాపహరణా! రమారమణా! పద్మనయనా! ఈ గొప్ప వరాన్నే కాదు. నీ పాదారవిందాల మకరందమై మహాత్ముల వాక్కులనుండి వెలువడే నీ కథాకీర్తనం విని ఆనందం పొందలేని మోక్షాన్ని కూడ నేను అభిలషించను.

**క. అది గాన పద్మలోచన!, సదమల భవదీయ ఘనయశము వినుటకునై**
**పదివేల చెవులు కృప ని, మ్మిదియే నా యభిమతంబు నిపుడు ముకుందా! 551**

* కాబట్టి కమలలోచనా! నీ నిర్మల కీర్తిగాథలను ఆలకించటానికి నాకు పదివేల చెవులను ప్రసాదించు. ముకుందా! ముమ్మాటికీ ఇదే నా అభిలాష.

**చ. అనఘ! మహాత్మ! వాగ్గళితమైన భవత్పద పంకజాత సం**
**జనిత సుధాకణానిల వశంబునవిస్మృత తత్త్వమార్గ వ**
**ర్తనులగు దుష్టయోగులకుఁ గ్రమ్మఱఁ దత్త్వముఁ జూపఁజాలు ని**
**ట్లొనరుట దక్క నన్యవర మొల్లఁ బయోరుహ పత్త్రలోచనా! 552**

* మాలిన్యరహితులైన మహాత్ముల వాక్కుల నుండి ప్రసరించే నీ పాదపద్మ సుధాకణాలను మోసికొని వచ్చే మలయమారుతం ద్వారా, ఆత్మ జ్ఞానాన్ని మరచిపోయిన అభాగ్యులకూ, అజ్ఞానులకూ మళ్లీ ఆత్మ జ్ఞానాన్ని చూపించగలిగే వరం అనుగ్రహించు. తామరరేకులవంటి కన్నులు గల స్వామీ! నాకు ఈ వరం తప్ప మరొక వరం అక్కరలేదు.

**సీ. వినుత మంగళ యశోవిభవ! సర్వేశ్వర! యిందిర గుణసంగ్రహేచ్ఛఁజేసి**
**యే నీదుశివతరం బైన సత్కీర్తిని నర్థియై వరియించె నట్టి కీర్తి**
**చతుర సత్పురుష సంగతము గల్గుచు నుండ ధృతి నెవ్వఁడేని యాదృచ్ఛికతను**
**జేసియు నొకమాటు చెవులార విన్నవాఁ డనయంబును గుణజ్ఞుఁ డయ్యేనేని**

**తే. విరతి నేరీతిఁ బొందును ధరణిఁ బశువుఁ, దక్కఁ దక్కిన తద్జ్ఞుండు దనుజ భేది**
**గాన యుత్సుక మతి నైన యేను లక్ష్మి, కరణి నిన్ను భజింతు నో పరమపురుష! 553**

* సకల జగదీశ్వరియై మహనీయ మంగళ యశోమందిర అయిన ఇందిరాదేవి గుణగ్రహణ పారీణ బుద్ధితో కల్యాణకరమైన నీ సత్కీర్తిని వరించింది. అటువంటి నీ యశోగాథలను సత్పురుషుల సహవాసం వల్ల ఒక్కసారి యాదృచ్ఛికంగానైనా సరే చెవులారా విన్న వాడు పశువు కాకుండా గుణజ్ఞుడైనట్లయితే అంతతో తృప్తి పొందక యింకా యింకా వినాలని కోరుకుంటాడు. కనుక ఓ పరమపురుషా! దనుజమర్దనా! నిన్ను నేను లక్ష్మీ దేవివలె సేవిస్తాను.

**వ. ఇట్లు భవదీయ సేవాతత్పరులమైన యిందిరయు నేను నేక పదార్థాభిలాషం జేసి స్పర్ధమానుల మగుచున్న మా యిద్దఱకును బర్యాయ సేవంజేసి కలహంబు లేకుండ ని మ్మట్లు గాక భవదీయ చరణసరోరుహ సేవాసక్త మనోవిస్తారుల మగుటం జేసి యేన యేన మున్ను భజియింతు నను తలంపులం గలహం బయిననుం గానిమ్ము, దేవా యని వెండియు నిట్లయె. 554**

* దేవదేవా! నీ భక్తులమూ, సేవాసక్తులమూ అయిన లక్ష్మీదేవీ, నేను ఒకే వస్తువును అభిలషించి పోటీపడుతున్నాం. కాబట్టి మాకు కలహం కలుగకుండా ఒకరి తరువాత ఒకరికి నీ సేవాభాగ్యం అనుగ్రహించు లేదా నిన్ను సేవించాలనే ఉత్కంఠతో "నేను ముందంటే నేను ముందు"అని మాలో మాకు కలహం కలిగినా కలుగనీ! సంతోషమే.

**సీ. జగదీశ! దేవ! యుష్మత్పద కైంకర్య పరతఁ దనర్చు సాగరతనూజ**
**కృత్యంబునందు నకిల్బిష బుద్ధినేఁ బ్రీతిఁ గోరుట జగన్మాత యైన**
**యా రమాసతితోడి వైర మవశ్యంబుఁ గల్గు నైనను దయాకార! నీవు**
**దీనవత్సలుఁడవు గాన స్వల్పం బైన నధికంబు సేయుదు, వట్లుగాన**

**తే. భవ్యచరిత! నిజస్వరూపంబునందు, నభిరతుఁడ వైన నీవు నన్నాదరించు**
**పగిది నిందిర నాదరింపవు మహాత్మ!, భక్తజనలోక మందార! భవవిదూర! 555**

* దేవా! జగన్నాథా! నీ పాదాలను సేవించాలని లక్ష్మీదేవి తహతహ లాడుతున్నది. నేను కూడ ఆమెచేసే పనినే చేయాలనే సద్బుద్ధితో తొందర పడుతున్నాను. కాబట్టి జగన్మాత అయిన లక్ష్మీదేవితో నాకు వివాదం తప్పదు. దయామయా! నీవు దీనవత్సలుడవు. కాబట్టి కొంచెమైనా గొప్ప చేస్తావు. అందుచేత మహాత్ముడవూ, సర్వాంతర్యామివీ, భవభంజనుడవూ, భక్తజన రంజనుడవూ అయిన నీవు నన్ను ఆదరించినంతగా లక్ష్మీదేవిని ఆదరించవు.

**వ. ఇట్లగుటం జేసి సత్పురుషు లైనవారలు నిరస్తమాయా గుణ సముదయంబు గల నిన్ను భజియింతురు. వారలు భవత్పాదాను స్మరణరూపంబయిన ప్రయోజనంబు దక్క నితర ప్రయోజనంబుల నెఱుంగరు, దేవా! సేవక జనంబులను వరంబులు వేఁడు మని జగద్విమోహనంబు లైన వాక్యంబులు వలుకుదు, వట్టి భవదీయ వాక్య తంత్రీ నిబద్ధులు లోకులు గాకుండి రేని ఫలకాములై కర్మంబుల నెట్టు లాచరింతు? రీశా! భవదీయ మాయావిమోహితులై జను లేమి కారణంబున నీకంటె నితరంబులఁ గోరుచుందు? రిట్లగుటం జేసి తండ్రి దనంతన బాలహితం బాచరించు నట్లు మాకు నీవ హితాచరణం బాచరింప నర్హుండ వని పలికిన నాదిరాజర్షియైన పృథుచక్రవర్తి యర్థవంతంబులయిన వచనంబులు విని విశ్వద్రష్ట యగు నారాయణుండు సంతుష్టాంతరంగుండై యిట్లనియె? "మహారాజా! దైవ ప్రేరితుండవై నాయెడ నిట్టి బుద్ధి గలుగుటం జేసి యచలాచలం బగు భక్తి వొడము, దానిచే దుస్తరం బగు మదీయమాయం దరింతువు, నీవు నాచే నాదిష్టంబగు కృత్యం బప్రమత్తుండ వగుచు నాచరించిన సకలశుభంబులం బొందుదువు, మదీయ భక్తజనంబులు స్వర్గాపవర్గ నరకంబులం దుల్యంబులుగా నవలోకింతురు, గావున నీ యధ్యవసాయంబు నట్టిదియ, మఱియు మదీయాదేశంబున దుస్త్యజం బగు రోషంబును ద్యజించి నా యెడ భక్తి సలిపితివి గాన నిదియె నాకుఁ బరమహర్షదం బగు, నని యభినందించి యనుగ్రహించి యతండు గావించు పూజలు గయికొని గమనోన్ముఖుం డయ్యె, న య్యవసరంబున. 556**

* అందుకనే సజ్జనులు మాయాతీతుడవైన నిన్ను సేవిస్తారు. వారు నీ పాదస్మరణ రూపమైన ఫలాన్ని తప్ప యింకొక ఫలాన్ని కోరుకోరు. దేవదేవా! సేవకులను వరాలు కోరుకొండని జగత్తును మోసగించే వాక్యాలను పలుకుతున్నావు. లోకులు నీ వాక్యాలనే త్రాళ్లతో కట్టుబడిన వారై ఫలాలను ఆశించి కర్మాసక్తు లవుతారు. నీ మాయా విమోహితులు కాకపోతే జనులు నీ భక్తికంటే యితర వరాలను ఎందుకు కోరుకుంటారు? కాబట్టి తండ్రి తనంతతాను పిల్లలకు మేలుచేసే విధంగా నీవు మాకు హితం చేకూర్చు.

ఇలా పలికిన ఆదిరాజర్షియైన పృథుచక్రవర్తి అర్థవంతాలైన మాటలు వినీ సర్వజ్ఞుడైన నారాయణుడు సంతోషించి యిలా అన్నాడు. "మాహారాజా! దైవప్రేరణ వల్లనే నాయందు నీకు ఇటువంటి బుద్ధి కలిగింది. అందువల్ల కొండవలె నిశ్చలమైన నిండు భక్తి మీకు ప్రాప్తిస్తుంది. ఆ నిశ్చల భక్తివల్ల దాటటానికి శక్యంగాని నా మాయను నీవు దాటగలవు. నేను ఆజ్ఞాపించిన కార్యాన్ని నీవు జాగరూకుడవై ఆచరించి నట్లయితే సకల శుభాలూ పొందుతావు. నా భక్తులు స్వర్గమునూ మోక్షమునూ, నరకమునూ సమానంగా చూస్తారు. నీ భావన కూడ అంతే. నా ఆజ్ఞను తలదాల్చి విడువరాని రోషాన్ని విడిచిపెట్టి నా యందలి నీ భక్తిని వెల్లడించావు. ఇదే నాకు పరమానందం అని అభినందించి పృథుచక్రవర్తి చేసిన పూజలు గైకొని శ్రీహరి వైకుంఠానికి బయలుదేరాడు.

**సీ. నర సిద్ధ చారణ సుర ముని గంధర్వ కిన్నర పితృ సాధ్య పన్నగులును**
**నఖిల జనంబులు హరి పార్శ్వవర్తులు నానంద మగ్నాంగు లగుచు వేడ్క**
**యజ్ఞేశ చింతనుం డైన యా పృథువుచే సత్కారమును( బొంది సమ్మదమున(**
**జనిరి నిజాధివాసములకు, భగవంతు( డైన నారాయణుం డచ్యుతుండు**

**తే. దగ నుపాధ్యాయ సహితు(డై తనరు పృథుని, విమలమతు లయి చూచుచు నమరవరులు**
**దన్ను జయజయ కలిత శబ్దముల( బొగడ(, జనియె నప్పుడు వైకుంఠ సదనమునకు. 557**

* నరులు, సిద్ధులు, చారణులు, దేవతలు, మునులు, గంధర్వులు, కిన్నరులు, పితృదేవతలు, సాధ్యులు, పన్నగులు, విష్ణుకింకరులు అందరూ విష్ణుభక్తుడైన పృథుచక్రవర్తి చేసిన సత్కారాలు అందుకొని సంతోషంతో తమ తమ నివాసాలకు వెళ్లారు. ఋత్విక్కులతో కూడిన పృథుచక్రవర్తిని ఆనందంగా అవలోకిస్తూ దేవతలందరూ తనను జయజయ ధ్వనులతో సంస్తుతిస్తూండగా శ్రీహరి వైకుంఠధామానికి వేంచేశాడు.

**వ. అంత( బృథుచక్రవర్తియు నింద్రియాగోచరుం డయ్యును దర్శితాత్ముండును దేవదేవుండును నయిన వాసు దేవునకు నమస్కరించి నిజపురంబునకుం జనుదెంచు సమయంబున మౌక్తిక కుసుమ మాలికా దుకూల స్వర్ణతోరణాలంకృతంబును, లలిత సుగంధ ధూపవిలసితంబును, రత్నమయ రంగ వల్లికా విరాజితంబును, ఫలపుష్ప లాజాక్షత దీపమాలికా స్తంభ పూగపోతాభిరామ ప్రతిగృహ ప్రాంగణంబును, మృగమద ఘనసార చందనాగరు వాఃపూర సంసిక్త రథ్యావళీ విభాసితంబును, దరుపల్లవాభి శోభితంబును నైన పురంబు( బ్రవేశించి రాజమార్గంబునం జనుదేర మండిత**

**రత్నకుండలమణి మరీచులు గండ ఫలకంబులం దాండవంబులు సలుపం బరకామినులు గనక పాత్ర విరచితంబు లయిన యశేష మంగళ నీరాజనంబుల నివాళింప, శంఖ దుందుభి ప్రముఖ తూర్య ఘోషంబులును, ఋత్విక్జ్నికాయాశీర్వచనంబులును జెలంగ వందిమాగధ జనసంస్తూయమానుం డగుచు విగత గర్వుండై యంతఃపురంబుం బ్రవేశించి యనంతరంబ. 558**

* ఆ తరువాత పృథుచక్రవర్తి కన్నులకు కనిపించకపోయినా మనస్సులో నెలకొని ఉన్న దేవదేవుడైన వాసుదేవునకు వందనం చేసి తన నగరానికి బయలుదేరాడు. పట్టణంలో ఎక్కడ చూచినా ముత్యాల సరాలు, పూలదండలు, తెలిపట్టు చాందినీలు, బంగారు తోరణాలు అలంకరించారు. కమ్మని సుగంధ ధూపాలు పరిమళాలు వెదజల్లుతున్నాయి. రత్నాలతో ముగ్గులు తీర్చారు. ప్రతిగృహంముందూ పండ్లు, పుష్పాలు, లాజలు, అక్షతలు, దీపమాలికలు, అరటికంబాలు, పోకచెట్లు కనువిందు చేస్తున్నాయి. రాజవీథులలో కస్తూరి, పచ్చకర్పూరం, మంచిగంధం, అగరు కలిపిన జలాలు చల్లి, చివురాకు గుత్తులు కైసేశారు. రత్నకుండలాల రమణీయ కాంతులు చెక్కుటద్దాలపై నాట్యం చేస్తుండగా పురస్త్రీలు బంగారు పళ్లెరములలో మంగళహారతులు వెలిగించి రాజమార్గంలో విచ్చేస్తున్న మహారాజుకు నివాళు లిచ్చారు. శంఖ దుందుభి ధ్వానాలు మిన్ను ముట్టాయి. ఋత్విక్కుల ఆశీర్వాద ధ్వనులతో, వంది మాగధుల కైవారాలతో ప్రశాంత హృదయుడైన పృథుచక్రవర్తి అంతఃపురంలో ప్రవేశించాడు.

**సీ. సమధికమతిఁ బౌరజన జానపదులచేఁ దనరారు వివిధ పూజనము లొంది**
**రాజు సంతుష్టాంతరంగుండుఁ బ్రియవర ప్రదుఁడునై వారల బహువిధములఁ**
**బూజించె, నవ్విధంబున మహత్తరములై నట్టి కర్మంబుల నాచరించు**
**చును నిరవద్య చేష్టుండై మహత్తముఁ డన నొప్పు నా పృథు మనుజ విభుఁడు**

**తే. మించి భూమండలంబుఁ బాలించి విశద, యశము సర్వధరాచక్రమందు నిలిపి**
**చారు శుభమూర్తి రాజన్యచక్రవర్తి, పరమ మోదమునఁ బరమ పదము నొందె. 559**

* పురజనులూ, జానపదులూ, మహారాజును అనేక విధాలుగా ఆదరాభిమానాలతో అర్చించి ఆరాధించారు. వారి పూజలకు రాజు సంతోషించాడు. వారి కోర్కెలను ప్రసాదించాడు. ఈ విధంగా పెక్కు ఘనకార్యములను ఆచరిస్తూ నిష్కళంక చరిత్రతో నిరుపమాన మహిమతో సమస్త భూమండలాన్నీ చక్కగా పరిపాలించి స్వచ్ఛమైన సత్కీర్తిని భూమిపై నలుమూలలా నెలకొల్పి పుణ్యామూర్తి అయిన పృథుచక్రవర్తి పరమానందంతో పరమపదం చేరుకున్నాడు.

**క. అని మైత్రేయ మహాముని, యనఘుఁడు విదురునకుఁ జెప్పె నని శుకుఁ డభి మ**
**న్యుని సుతునకుఁ జెప్పిన తెఱఁ, గని సూతుఁడు సెప్పె శౌనకాదుల తోడన్. 560**

* అని మైత్రేయమహర్షి విమలహృదయుడైన విదురునకు వినిపించినట్లు శుకుఁడు పరీక్షిత్తునకు వివరించాడని సూతుఁడు శౌనకాది మహర్షులకు చెప్పాడు.

## -: పృథుచక్రవర్తి సభాసదులకు సద్ధర్మముల నుపదేశించి బ్రాహ్మణ ప్రశంస సేయుట :-

వ. అట్లెఱింగించి వెండియు నిట్లనియె, ని వ్విధంబున నశేష గుణ విజృంభితంబును, నిర్దోషంబును, సత్పురుష సత్కృతంబును నగు పృథుచక్రవర్తి యశంబును బ్రకటంబుగాఁ జేయంజాలు మైత్రేయునిం జూచి మహాభాగవతుండైన విదురుం డిట్లనియె. **561**

* ఈ విధంగా అనంత గుణవంతమునూ, నిర్దోషమునూ, సజ్జన సంస్తుతమునూ అయిన పృథుచక్రవర్తి కీర్తిని వెల్లడింపగలిగిన మహనీయుణ్ణి మైత్రేయుణ్ణి చూచి విష్ణుభక్తుడైన విదురుడు ఇలా అన్నాడు.

సీ. మునినాథ! విను పృథు జనపాల చంద్రుండు సొబగొప్ప మేదినీసురులచేత
రాజ్యాభిషేక సంపూజ్యుఁడై దేవతా గణముచే లబ్ధార్హ గుణుఁడు నగుచు
వైష్ణవతేజంబు వలనొప్ప ధరియించి యర్థి నే యే కర్మ మాచరించె
నది నాకు నెఱిఁగింపు మనఘాత్మ! భూమి యే రూఢి గవాకృతి రూఢ యెవని

తే. విక్రమోద్దీప్తయై యొప్పి వెలయునట్టి, కర్మమున నిప్డు రాజన్య గణము బ్రదుకు
నట్టి పృథుకీ ర్తి ధరలోన నతి వివేకి, దవిలి యెవ్వఁడు వినకుండు ధన్యచరిత! **562**

* మునీంద్రా! మహీసురులచేత మహారాజుగా పట్టాభిషిక్తుడై దేవతలవల్ల యోగ్యమైన వరాలు పొంది వైష్ణవతేజంతో విరాజిల్లుతున్న పృథుచక్రవర్తి చేసిన పనులను నాకు వివరించి చెప్పు. గోరూపం ధరించిన భూదేవినుండి కోరికలను పిదికిన పృథుచక్రవర్తి పరాక్రమోపేతమైన అనుగ్రహాన్ని ఆధారం చేసికొని కదా ఇప్పుడు రాజులు బ్రతుకుతున్నారు? అటువంటి పృథుచక్రవర్తి కీర్తి గాథలను వివేకి అయిన వాడు ఎవ్వడూ వినకుండా ఉండలేడు.

క. నావుడు విని మైత్రేయుం, డా విదురునిఁ జూచి పలికె నతి వినయమునం
బావన చరితుఁడు పృథుఁడు ధ, రావర నుతుఁ డలఘు యశుఁడు ప్రమదం బలరన్. **563**

* అప్పుడు మైత్రేయ మహర్షి విదురునితో మృదు మధురంగా ఇలా అన్నాడు.

సీ. రంగ దుత్తుంగ తరంగ గంగా యమునా మధ్యమందు నున్నతి వసించి
కైకొని ప్రారబ్ధ కర్మ క్షయార్థమై యఖిల పుణ్యంబుల ననుభవించు
చును సర్వదేశంబులను దనయాజ్ఞ యప్రతిహత సత్ప్రతాపమునఁ జెల్లఁ
బూని సప్తద్వీపములకుఁ దానొక్కండ వైష్ణవ భూసురావళికిఁ దక్కఁ

తే. దక్కఁ గల్గిన ప్రజకెల్ల దండధరునిఁ, బోలి వర్తించుచును గొంతకాల మరుగఁ
దవిలి యొకనాఁడు దీర్ఘ సత్త్రంబు సేయ, నర్థిఁ గైకొని దీక్షితుం డయ్యె, నందు. **564**

* పవిత్రచరిత్రుడూ, ప్రభువులకు ప్రశంసాపాత్రుడూ, విశాల యశస్వంతుడు అయిన పృథుచక్రవర్తి ఉత్తుంగ తరంగాలు పొంగి పొరలే గంగా యమునా నదుల మధ్యప్రదేశమందు మహోన్నత స్థానంలో

విరాజిల్లాడు. పురాకృత సుకృతంవల్ల సంప్రాప్తమైన భోగభాగ్యాలను అనుభవించాడు. అప్రతిహతమైన ప్రతాపంతో అన్ని ప్రదేశాలలో తన ఆజ్ఞ చెల్లించుకుంటూ బ్రాహ్మణులకూ, విష్ణు భక్తులకూ తప్ప దుండగు లందరికీ దండధరుడై సప్తద్వీప పరీతమైన రాజ్యాన్ని పరిపాలించాడు. ఇలా కొంత కాలం జరిగిన అనంతరం ఒకనాడు దీర్ఘసత్రమనే యాగం చేయాలని సంకల్పించి దీక్ష వహించాడు.

**తే. రాజఋషి దేవఋషి పితృ బ్రహ్మ ఋషులు, జనవరునిచేత విహిత పూజనము లొంది**
**సమధికైశ్వర్యగతి నున్న సమయమునను, జిరశుభాకారుఁ డారాజశేఖరుండు. 565**

* ఆ దీర్ఘ సత్రంలో రాజ ఋషులను, దేవఋషులను, బ్రహ్మర్షులను, పితృదేవతలను మహారాజు చక్కగా పూజించాడు. ఆ సమయంలో నిత్యమంగళాకారుడైన ఆ రాజశేఖరుడు మహా తేజస్సుతో విరాజిల్లాడు.

**సీ. ఉన్నతోన్నతుఁడు సముత్తుంగ భుజుఁడు సన్మహనీయతర శోభమాన ముఖుఁడుఁ**
**జారుసంపుల్ల కంజారుణేక్షణుఁడు సునాసాపుటుండు మందస్మితుండు**
**వక్రసూక్ష్మ స్నిగ్ధ వరనీల కేశుండుఁ గమనీయరుచి కంబు కంధరుండు**
**సుభగ విశాల వక్షుండును ద్రివళి శోభిత మధ్యభాగుండుఁ బృథునితంబ**
**తే. మండలుండు నావర్త సమాననాభి, వివరుఁడును గాంచనస్తంభ విలసదూరు**
**రాజితుండును నరుణచరణుఁడును ధృత, నవ దుకూలోత్తరీయుఁ డున్నతయశుండు. 566**

* పృథుచక్రవర్తి మిక్కిలి పొడవైనవాడు. ఎగుబుజాలవాడు. మహత్తర శోభావైభవంతో ప్రకాశించే ముఖం కలవాడు. చక్కగా వికసించిన కమలదళాలవంటి ఎర్రని కన్నులు కలవాడు. అందమైన ముక్కుకలవాడు. ఎప్పుడూ చిరునవ్వు నవ్వుతుండే పెదవులు కలవాడు. ఉంగరాలు తిరిగి నునుపుదేరిన నల్లని తల వెంట్రుకలు కలవాడు. శంఖంవంటి సొగసైన మెడ కలవాడు. వెడద రొమ్మువాడు. మూడుముడతలతో శోభిల్లే నడుము కలవాడు. బలసిన పిరుదులు కలవాడు. సుడిగుండంవలె లోతైన పొక్కిలి కలవాడు. బంగారు స్తంభాలవంటి తొడలు గలవాడు. అరుణకాంతులుగల చరణాలు కలవాడు. నిగనిగ మెరిసే క్రొత్త పట్టువలువను ఉత్తరీయంగా ధరించినవాడు. అన్ని చోట్లా పేరెన్నిక గన్నవాడు.

**వ. మఱియు నియమ నిమిత్తంబునం బరిత్యక్త భూషణుం డగుటం జేసి వ్యక్తాశేష గాత్రశ్రీకుండును, గృష్ణాజినధరుండును, శ్రీమంతుండును, గుశహస్తుండును, గృతోచితుండును, శిశిరస్నిగ్ధ తారాక్షుండును నైన పృథుచక్రవర్తి సభామధ్యంబునం దారాగణ మధ్య విభాసితుండును, సకల జనాహ్లాదకరుండును నగు సుధాకరుండునుంబోలె వెలుంగుచు లేచి నిలుచుండి సదస్య సంతోషదాయకంబులును, జిత్రపదవిరా జితంబులును, బ్రసన్నంబులును, పరిశుద్ధంబులును, గంభీరార్థంబులును, నవ్యాకులంబులును నైన భాషణంబుల నిట్లనియె. 567**

* ఆ మహారాజు యాగదీక్షితుడై ఉన్నందువల్ల ఆభరణాలు ధరింపలేదు. అందుచేత సహజమైన శరీరశోభ వెల్ల డవుతున్నది. జింకతోలు ధరించినా శ్రీమంతుడై విలసిల్లుతున్నాడు. చల్లని చూపులు గల పృథుచక్రవర్తి దర్భలు చేత పట్టుకొని సభా మధ్యంలో నక్షత్రగణాల నడుమ విలసిల్లే చంద్రునివలె సకల జనాహ్లాదకరుడై ప్రకాశిస్తూ లేచి నిలబడ్డాడు. సదస్యులకు సంతోషం కలిగించేవీ, చిత్రపదాలతో ప్రకాశించేవీ, ప్రసన్నా లయినవీ, పరిశుద్ధా లయినవీ, గంభీరమైన అర్థములు కలవీ, తడబాటు లేనివీ అయిన మాటలతో ఇలా పలికాడు.

**క. వినుఁడీ సభ్యులు ధర్మము, ననయము నెఱుఁగంగఁ గోరునట్టి జనుఁడు దాఁ**
**దన తలఁపునఁగల యర్థముఁ, జను నెఱిఁగింపంగ ధీరసత్పురుషులకున్. 568**

* సభ్యులారా! దయచేసి వినండి. ధర్మము తెలియగోరేవాడు తన మనస్సులోని అభిప్రాయాన్ని ధీరులైన సత్పురుషులకు నివేదించటం లెస్స.

**సీ. ఏను నీ లోకవితానంబు నెల్లను శాసించి భూప్రజా సంతతులను**
**దత్త ద్విహిత వృత్తి దానంబులను జేసి రక్షింప వివిధ మర్యాదఁ దప్పి**
**పోకుండ నిలుపుటకై కమలజుచే నియోగింపఁ బడితి, ని ట్లొనరియుండ**
**నట్టి ప్రజాపాలనా ద్యనుష్ఠాన వశంబునఁ బ్రాక్కర్మ సాక్షి యీశుఁ**

**తే. డెట్టివానికి సంతుష్టి నెసఁగుచుండు, నట్టివానికి నే లోకమంద్రు బుధులు**
**కామదుఘములు నైన లోకములు నాకు, సరవిఁ గలుగు ననుష్ఠానపరుఁడ నగుట. 569**

* లోకాల నన్నిటినీ పరిపాలిస్తూ ప్రజానీకానికి వారి వారికి తగిన వృత్తులను ఒడగూర్చి రక్షించడానికీ, ధర్మం దెబ్బతినకుండా నిలబెట్టడానికీ బ్రహ్మదేవుడు నన్ను నియోగించాడు. ఇటువంటి ధర్మబద్ధమైన ప్రజాపాలనం సమర్థంగా ఆచరించేవానికి కర్మసాక్షి అయిన భగవంతుడు సంతోషించి ఏ లోకాలను అనుగ్రహిస్తాడో అటువంటి అభీష్టదాయకాలైన పుణ్యలోకాలు సదాచారపరుడనైన నాకు లభిస్తాయి.

**వ. ఇట్లు ప్రజలను ధర్మంబులయందు ననుశాసింపక యర్థ కాముండై వారివలన నప్పనంబులు గొనెనేని వారల పాపంబు దనకుఁ బ్రాపింపం దేజోహీనుండై భూవిభుండు సెడుం, గావునం బ్రజలు భూపతిహితార్థంబునకు స్వార్థంబునకు ననూయా రహితులై వాసుదేవార్పణ బుద్ధిం జేసి ధర్మంబు నెప్పుడు నాచరింపవలయు, నిదియ నన్ను ననుగ్రహించుట, యదియునుం గాక పితృదేవర్షి తుల్యులగు మీర లనుమోదించి కర్తయు ననుశాసకుండు ననుజ్ఞాతయు నయిన నాకుఁ బరలోకంబున నే ఫలంబు గలుగు నట్టి ఫలంబునకు సదృశంబైన కర్మం బాచరింపవలయు, నట్లయిన సంతోషంబు నొందుదు ననిన వార లా రాజేంద్రున కిట్లనిరి. 570**

* ప్రజలను ధర్మమార్గాన పరిపాలింప అర్థకాంక్షతో ప్రజలనుండి పన్నులు గుంజుకొన్న రాజునకు ప్రజల పాపం సంక్రమిస్తుంది. అందుచేత ఆ రాజు తేజోహీనుడై నశిస్తాడు. కాబట్టి ప్రజలు రాజు మేలుకొరకూ

తమ మేలుకొరకూ అసూయారహితులై పరమేశ్వరార్పణ బుద్ధితో ధర్మాన్ని ఎల్లప్పుడూ ఆచరించాలి. మీరు ఇలా చేయడమే నన్ను అనుగ్రహించడమని భావిస్తాను. మీరు నాకు తండ్రులవంటివారు. దేవతలవంటివారు. ఋషులవంటివారు. అటువంటి మీరు దీనికి సమ్మతించి మీ నాయకుడనైన నాకు పరలోకంలో ఏఫలం కలుగుతుందో అటువంటి ఫలానికి తగిన మంచి కార్యాలను ఆచరించాలి. మీరు అలా చేసినట్లయితే నేను సంతోషిస్తాను అని పృథుచక్రవర్తి పలుకగా సభ్యులు ఇలా అన్నారు.

**క. జననాయక! ప్రజ లిర వొం, దిన ధర్మము లెల్ల వాసుదేవార్పణ బు**
**ద్ధిని జేయవలయు నంటివి, యనయంబును వాసుదేవుఁడనఁ గలఁడె మహిన్? 571**

* మహారాజా! వాసుదేవార్పణ బుద్ధితో ప్రజలు ధర్మకార్యాలను ఆచరించాలని నీవు చెప్పావు. అసలు వాసుదేవు డనేవాడంటూ ఒకడున్నాడా?

**సీ. అన విని వారికి మనుజేశుఁ డను నర్థ, తములార! వినుఁడయ్య తవిలి మీరు**
**యజ్ఞాధిపతియైన యఖిలేశ్వరుఁడు గొన్ని, మతములఁ గలఁడు ధీమంతులార!**
**యట్లైన మీరలు నందుకు విప్రతి, పత్తి గల్గుట నుపపన్న మరయఁ**
**గా దంటిరేని యా ఘనునిచే రచితమై, కాంతిమంత మగు జగంబు గానఁ**

**తే. బడుచు నున్నది! యిట్టి ప్రపంచ రచిత, కర్మ వైచిత్ర్య మ మ్మేటి గలుగకున్న**
**నమర నది తదుక్తు లుపపన్నములు గావు!, కాన న వ్వాసుదేవుండు గలఁడు మఱియు. 572**

* ఇలా ప్రజలు ప్రశ్నించగా అప్పుడు పృథు చక్రవర్తి సభ్యులతో ఇలా అన్నాడు. పరమ యోగ్యులైన బుద్ధిమంతులారా! వినండి. యజ్ఞాధిపతియైన సర్వేశ్వరుడు ఉన్నాడు. మీరు అందుకు అంగీకరింపకపోతే ఆయన సృజించిన లోకం కన్నుల ముందు స్పష్టంగా కనిపిస్తున్నది కదా! వాసుదేవుడు లేకపోతే ఈ చిత్రవిచిత్రమైన జగత్తు ఎలా పుట్టింది? అందువల్ల ఈశ్వరుడు ఉన్నాడని ఒప్పుకోక తప్పదు.

**వ. అదియునుం గాక యీజగద్వైచిత్ర్యంబు కర్తయైన యీశ్వరుండు లేకున్నం గర్మవశంబునం జేసి యుపపన్నంబగు నంటి రేని. 573**

* కర్త అయిన ఈశ్వరుడు లేకున్నప్పటికీ ఈజగత్తు కర్మవశాన పుడుతుంది అని మీరు అనవచ్చు.

**సీ. పూని ప్రియవ్రతోత్తానపాద ధ్రువ మనుల కస్మత్పితామహుఁ డనంగఁ**
**దగు నంగ మేదినీధవునకు మఱియును వినుతి కెక్కిన పృథివీపతులకుఁ**
**బద్మసంభవ భవ ప్రహ్లాద బలిచక్రవర్తి ప్రముఖ భాగవతుల కర్థి**
**వర్గసుస్వర్గాపవర్గంబులకు ననుగతకారణుం డన ఘనత కెక్కి**

**తే. హీను లగు మృత్యుదౌహిత్రుఁడైన వేన, ముఖ దురాత్ములు ధర్మవిమోహితులును**
**దక్కఁ దక్కిన వారికిఁ దాఁ బ్రసన్న, వరదుఁడై యిచ్చు నభిమతావళుల నతఁడు. 574**

వ. ఇట్టి విద్వ దనుభవంబున భువనహితుండగు వాసుదేవుండు లేఁ డనుట యుపపన్నంబుగా, దదియునుంగాక. 575

* మృత్యుదేవత మనుమడైన వేనుడు మొదలైన ధర్మహీనుల మాట తీసివేయండి. ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు, ధ్రువుడు, మనువు, మా పితామహుడైన అంగభూపతి మొదలైన వారికీ, ఇంకా ప్రముఖులైన రాజన్యులకూ; బ్రహ్మ, శివుడు, ప్రహ్లాదుడు, బలి చక్రవర్తి మొదలైన భాగవతులకూ వాసుదేవుడు ప్రసన్నుడై వరప్రదాతయై కోరిన కోరికలను ప్రసాదించాడు. స్వర్గాది పుణ్యలోకాలనూ, పరమపదమైన మోక్షాన్నీ అనుగ్రహించేవాడుగా ప్రసిద్ధికెక్కాడు. ఇటువంటి పెద్దల అనుభవాలనుబట్టి విచారిస్తే భగవంతుడు లేడనడం పొసగనిమాట.

ఉ. భూరి తపోభిరామ ముని పూజన మెవ్వని పాదపద్మ సే
వారతి వృద్ధిఁ బొంది యనివారణఁ బూర్వభవానుసార సం
సార మహోగ్రతాపము భృశంబుగఁ బాపఁగ నోపుఁ దత్పదాం
భోరుహజాత దేవనదిఁ బోలి యశేష మనోఘ హారియై. 576

* గొప్ప తపస్సంపన్నులైన మహర్షులను పూజించటం వల్ల ప్రాప్తించిన శ్రీహరి పాదసేవ ఆయన పాదపద్మాల నుండి పుట్టిన పవిత్ర గంగానదివలె జన్మజన్మాంతరాలలో చేసిన పాపాలనూ, సంసార తాపాలనూ పూర్తిగా పోగొడుతుంది. అది సమస్త మనోమాలిన్యాలనూ తుడిచి పెడుతుంది.

వ. మఱియు. 577

చ. అనుపమ భక్తి నెవ్వని పదాంబుజమూలము మందిరంబుగా
ననయముఁ బొందు వాఁడు నిహతాఖిల భూరి మనోమలుండు స
ద్వినుత విరక్తి బోధ ధృతి వీర్య విశేష సమన్వితుండు దా
ననఁ దగి భూరి సంసృతి మహత్తర దుఃఖము నందఁ డెన్నఁడున్. 578

* భక్తితో భగవంతుడైన నారాయణుని పాదపద్మాలను అనవరతమూ ఆశ్రయించుకొన్న వానికి సమస్త మనోదోషాలూ తొలగిపోతాయి. గొప్ప వైరాగ్యం ప్రాప్తిస్తుంది. విజ్ఞానమూ, ధైర్యమూ, శక్తీ లభిస్తాయి. అటువంటివాడు ఏనాడూ అపారమైన సంసార దుఃఖాన్ని పొందడు.

క. నారాయణుండు జగదా, ధారుండగు నీశ్వరుండు, దలఁప నతనికిన్
లే రెందు సములు నధికులు, ధీరోత్తముఁ డతఁడు నద్వితీయుం డగుటన్. 579

* నారాయణుడు జగత్తునకు ఆధారమైన భగవంతుడు. ఆయనతో సమానులు కానీ, ఆయనకంటే అధికులైనవారు కానీ లేరు. ఆయన మహాధీరుడు, అద్వితీయుడు.

వ. అదియునుంగాక. 580

ఉ. కర్మవశంబునన్ జగము గల్గును హెచ్చు నడంగు నన్నచోఁ
గర్మము బుద్ధిఁ జూడ జడకార్యము! గాని ప్రపంచ కల్పనా

కర్మమునందుఁ గర్త యనఁగా విలసిల్లఁగఁ జాల, దీ జగ
త్కర్మక కార్య కారణము గావున నీశుఁడు విష్ణుఁ డారయన్. 581

* కర్మవంశంచేతనే ఈ లోకం జన్మిస్తుంది. పెంపొందుతుంది; నశిస్తుంది అని మీరంటారేమో! అది కుదరని మాట. కర్మ జడ పదార్థం. కాబట్టి ప్రపంచ సృష్టికి అది కర్త కాజాలదు. ఈ జగత్తు అనే కార్యానికి విష్ణువు కారణం. అందువల్ల ఆయన భగవంతుడు, పరమేశ్వరుడు.

వ. కావున మీర ల వ్వాసుదేవుని నధికారానుసారంబున నిశ్చితార్థ ఫలసిద్ధి గలవారలై మనో వాక్కాయ కర్మంబుల నిష్కపట వృత్తిం దగిలి వినుతి నతిపరిచర్యా పూర్వకంబుగాఁ గామ దుఘంబు లయిన యతని పాదపంకజంబులు భజియింపుం; డదియునుంగాక. 582

* కాబట్టి మీరు మీ మీ శక్తికి తగినట్లుగా నిశ్చితమైన ఫలసిద్ధీ, త్రికరణశుద్ధీ, నిష్కపటమైన బుద్ధీ కలవారలై స్తుతి నమస్కార సేవల ద్వారా భక్తాభీష్టప్రదాలైన ఆ దేవదేవుని పాద పద్మాలను సేవించండి.

సీ. రూఢి నీశ్వరుఁడు స్వరూపంబునం జేసి పూని విశుద్ధ విజ్ఞానఘనుఁడు
నగుణుండు నయినఁ దా నరయని కర్మ మార్గమునందు వ్రీహ్యాది ద్రవ్యములను
శుక్లాదిగుణము విస్ఫుర దవఘాతాది సత్క్రియలును మంత్రసంచయంబు
సంకల్పమును యాగసాధ్యమైనట్టి యఖండోపకారంబు ఘనపదార్థ

తే. శక్తియు మఱి జ్యోతిష్టోమ సవనముఖ్య, నామత బహు విశేష గుణతను మెఱయు
నట్టి యధ్వరరూపమై యఖిల జగము, నందు ననిశంబుఁ బ్రఖ్యాతి నొందుచుండు. 583

* ఈశ్వరుడు స్వచ్ఛమైన విజ్ఞానమే స్వరూపంగా కలవాడు. ఆయన నిర్గుణుడే అయిన నానావిశేష గుణాలు కలిగిన యజ్ఞం భగవంతుని స్వరూపమే. కర్మ మార్గంలోనే వ్రీహి మొదలైన ద్రవ్యాలూ, తెలుపు మొదలైన గుణాలూ, దంచుట మొదలైన క్రియలూ, మంత్రసమూహమూ, సంకల్పమూ, సాధింపదగిన మహోపకారమూ, గొప్ప పదార్థాలూ, శక్తీ, జ్యోతిష్టోమం మొదలైన నామాలూ ఇటువంటి అనేక గుణాలతో ఏర్పడే యజ్ఞం భగవంతుని స్వరూపంగా సమస్త జగత్తులో ప్రఖ్యాతి గాంచింది.

వ. అదియునుం గాక దారుస్థితంబైన యనలంబు తద్దారు గుణంబు లయిన దైర్ఘ్య వక్రత్వాదికంబుల ననుసరించు చందంబున నవ్యక్తంబు తత్క్షోభకం బయిన కాలంబును వాసనయు నదృష్టంబు నను కారణంబులచేతం బుట్టిన శరీరంబునందు విషయాకారం బయిన బుద్ధి నొంది తద్విషయాభి వ్యంగ్యంబైన యానంద స్వరూపుం డగుచుఁ గ్రియాఫలంబునం బ్రసిద్ధి నొందునని చెప్పి వెండియు నిట్లను: మదీయజనంబు లి మ్మేదినీ తలంబున దృఢవ్రతులై యజ్ఞభుగీశ్వరుండును గురుండును నయిన సర్వేశ్వరుని, హరిని నిరంతరంబును స్వధర్మయోగంబునం బూజించుచున్నవారలు, వారు నన్నాశ్చర్యకరంబుగా ననుగ్రహించువారని హరిభక్తిరతులైన య మ్మహాత్ముల నుతియించి వెండియు నిట్లనియె. 584

* కట్టె తగులబడుతున్నప్పుడు దాని పొడవు, పొట్టి, వంకర మొదలైన గుణాలు కట్టెలోని నిప్పునకు కూడా సంక్రమిస్తాయి. అలాగే దేహలక్షణాలు దేహమందలి జీవునకూ సంక్రమిస్తాయి. అందుచేత అంతర్యామి దేహధర్మాలను అనుసరించియే వ్యక్త మవుతాడు. దేహం పుట్టుకకు కాలమూ, సంస్కారమూ, అదృష్టమూ కారణాలు. ఇటువంటి దేహంలో అంతర్యామిగా ఉండేవాడు ఆనందమయుడు. అతడే యజ్ఞేశ్వరుడు. యోగఫలం కూడా అతడే అని చెప్పి మహారాజు మళ్లీ ఇలా అన్నాడు.

ఈ లోకంలోని నా ప్రజలు దృఢనియమంతో యజ్ఞ భోక్తలైన దేవతలకు అధీశ్వరుడూ, సర్వగురుడూ, సర్వేశ్వరుడూ అయిన శ్రీహరిని సర్వదా స్వధర్మానుసారం పూజిస్తున్నారు. ఈ విధంగా వారు ఎంతగానో నన్ను అనుగ్రహిస్తున్నారు అని విష్ణుభక్తి పరాయణులైన మహానుభావులను కొనియాడి పృథుచక్రవర్తి మళ్ళీ ఇలా అన్నాడు.

**మ. వరసంప ద్విభవ ప్రతాప సుమహైశ్వర్యంబులం బొల్చు నీ**
**ధరణీనాథులతేజ మంచిత తపోదాంతి క్షమావిద్యలం**
**గర మొప్పారు ధరాసుపర్వహరిభక్త శ్రేణులం దెప్పుడున్,**
**ధరలోనం బ్రభవింప కుండునని యద్ధాత్రీవిభుం డిట్లనున్. 585**

* గొప్ప సిరిసంపదలతోనూ, మహత్తరమైన ప్రతాపంతోనూ, అఖండమైన వైభవంతోనూ ప్రకాశించే రాజుల తేజస్సు తపస్సుతోనూ, శమదమాదులతోనూ, క్షమాగుణంతోనూ విరాజిల్లే బ్రాహ్మణులపైనా, విష్ణు భక్తుల పైనా ఏ మాత్రం తన ప్రభావాన్ని చూపించలేదు.

**చ. అరయఁగ నే ధరామర పదాంబుజరేణువు లర్థిఁ దాల్చి య**
**ప్పరమ పురాణ పూరుషుఁడు బ్రాహ్మణదేవుఁడు నైనయట్టి యీ**
**శ్వరుఁడు సదానపాయినిని సాగరకన్యను సర్వలోక వి**
**స్ఫురిత పవిత్రకీర్తియును బొంది విభూతిఁ దనర్చెఁ గావునన్. 586**

* శ్రీ మన్నారాయణుడు బ్రాహ్మణులను దైవములుగా భావిస్తాడు. బ్రాహ్మణుల పాదపద్మ పరాగాలను ప్రీతితో ధరిస్తాడు. అందుచేత తనను ఎప్పుడునూ విడిచి ఉండని లక్ష్మీదేవినీ, సర్వలోకాలలో పరివ్యాప్తమై ప్రకాశించే పవిత్ర కీర్తిని అందుకొని ఆయన విరాజిల్లు తున్నాడు.

**సీ. ఏ వసుధామర సేవను జేసి యశేషగుణాన్విత స్థితిఁ దనర్చు**
**సర్వేశ్వరుఁడు మఱి సంతుష్టుఁడగు నట్టి ధరణిదివిజులఁ దద్ధర్మపరులు**
**నలఘు వినీతులునై యవశ్యంబును సేవింపరే? ధరాదేవ నిత్య**
**సేవచేఁ బురుషుఁడు చిరతర జ్ఞానవిద్యాభ్యాసి గాకున్న నైన నతఁడు**

**తే. వేగమున నంతరంగంబు విశద మగుటఁ, జేసి కైవల్య పదమును జెందు, నట్లు**
**గాన లోకులు భూదేవతానికరముఁ, దగిలి భజియింప వలయు నుదాత్త మతిని. 587**

* బ్రహ్మవేత్తలైన బ్రాహ్మణులను సేవిస్తే సకల గుణ సంపన్నుడైన సర్వేశ్వరుడు సంతోషిస్తాడు. కాబట్టి అటువంటి బ్రాహ్మణులను ధర్మపరులై వినయ వినమ్రులై అవశ్యం సేవించండి. బ్రాహ్మణులను నిత్యమూ సేవించేవాడు గొప్ప జ్ఞానీ, పండితుడూ కాకపోయినా నిర్మల హృదయం కలవాడై మోక్షాన్ని పొందుతాడు. కాబట్టి లోకులు ఉదాత్త బుద్ధితో భూదేవులను సేవించాలి.

వ. మఱియు. 588

సీ. విజ్ఞాన ఘనుఁడన వెలయు నీశ్వరుఁడు త త్త్వజ్ఞాన యుతులైన వారిచేత
దీపింప నింద్రాది దేవతోద్దేశంబు నను భూమిసుర ముఖంబున హుతంబు
లగు హవిస్సులఁ దృప్తి నందిన గతి నచేతనమైన యా హుతాశన ముఖంబు
వలన వేల్చిన హవిస్సుల చేతఁ దృప్తుండు గాకుండు గావున లోకమందు

తే. నగ్ని ముఖమునకంటె ధరామరేంద్ర, ముఖము పరిశుద్ధ మత్యంతముఖ్య మనఁగఁ
దనరునది గాన భూసురార్చనము సకల, జనులుఁ గావింపఁ దగు నార్యజనములార! 589

* ఆర్య మహాజనులారా! తత్త్వజ్ఞాన సంపన్నులైన వారు ఇంద్రాది దేవతలను ఉద్దేశించి బ్రాహ్మణముఖంగా అర్పించే అన్నం వల్ల తృప్తి చెందినట్లు, అచేతనమైన అగ్నిలో వేల్చిన హవిస్సులవల్ల ఈశ్వరుడు తృప్తి పొందడు. కాబట్టి లోకంలో అగ్నిముఖం కంటె బ్రాహ్మణుల ముఖం పరిశుద్ధమైనది. అత్యంత ప్రధానమైనది. అందువల్ల సకల జనులూ బ్రాహ్మణులకు సమర్పించాలి.

వ. అదియునుం గాక. 590

సీ. ఏ వేదమందేని నీ విశ్వ మెల్లను దర్పణ ప్రతిబింబిత ప్రభూష
నివహంబు కైవడిఁ దివిరి ప్రకాశించు నట్టి విరజమును నవ్యయంబు
నగుచు సనాతనం బగు వేద మే ధరా దేవతాజన మనుదినముఁ దగిలి
మహిత శ్రద్ధాతపో మంగళ మౌన సంయమ సమాధులఁ బొలుపారుచుండి

తే. యర్థి సదసద్విచారులై యధికరింతు, రట్టివారల పదరజం బర్థిఁ దాల్చు
నలఘులకు సర్వపాపక్షయంబు నఖిల, సద్గుణావాప్తియును నగుఁ జతురు లార! 591

* బుద్ధిమంతులారా! అద్దంలో ప్రతిబింబించే భూషణసముదాయం వలె ఈ విశ్వమంతా వేదంలో ప్రకాశిస్తుంది. కళంకం లేనిదీ, నాశం లేనిదీ, సనాతనమైనదీ అయిన వేదాన్ని ఏ బ్రాహ్మణులు ప్రతిదినమూ శ్రద్ధాతపోమౌన సంయమ సమాధులతో సదసద్విచారంతో అధ్యయనం చేస్తారో అటువంటి బ్రహ్మవేత్తల పాదధూళిని తలదాల్చే మహనీయులకు సర్వపాపాలూ నశిస్తాయి. సమస్త సద్గుణాలూ లభిస్తాయి.

వ. కావున నట్టి విప్రపాద సరోజరేణువు లేనును గిరీటంబున ధరియింతు, నిట్లు బ్రాహ్మణ భజనంబునం జేసి యవాప్త సకల గుణుండును శీలధనుండును గృతజ్ఞుండును శ్రద్ధాయుక్తుండును నైన మహాత్ము నఖిల సంపదలుఁ బ్రాపించుం గావున గోబ్రాహ్మణ కులంబును ననుచర సమేతుం డయిన

జనార్దనుండును నా యెడం బ్రసన్ను లయ్యెదరు గాక యని పలుకుచున్న పృథు చక్రవర్తిం గనుంగొని పితృదేవద్విజ సత్పురుషులు సంతుష్టాంతరంగులై సాధువాదంబుల నభినందించి యిట్లనిరి. 592

* కాబట్టి అటువంటి బ్రాహ్మణుల పాదపద్మ పరాగాన్ని నేను సైతం నా కిరీటంపై ధరిస్తాను. బ్రాహ్మణులను సేవించే వానికి సకల గుణాలూ సంప్రాప్తిస్తాయి. శీలవంతుడూ, కృతజ్ఞుడూ, శ్రద్ధాళువూ అయిన అతణ్ణి సకల సంపదలూ వరిస్తాయి. కాబట్టి గోవులూ, బ్రాహ్మణులూ, పరివార సమేతు డయిన శ్రీమన్నారాయణుడూ నన్ను అనుగ్రహింతురు గాక!

ఇలా పలుకుతున్న పృథుచక్రవర్తి మాటలు విని పితరులూ, దేవతలూ, బ్రాహ్మణులూ, సత్పురుషులూ సంతోషంతో 'మేలు, మేలు' అని అభినందించి యిలా అన్నారు.

క. మనుజేంద్ర! నీ కతంబున, ననుపమ ఘన బ్రహ్మదండహతుఁ డత్యఘ వ
ర్తనుఁడు నగునట్టి వేనుం, డనయము నరకంబు వలన నర్థిఁ దరించెన్. 593

వ. కావునం 'బుత్రేణ లోకాన్ జయతి' యను వేదవచనంబు నిశ్చయం, బదియునుం గాక 594

* మహారాజా! పాపవర్తనుడై బ్రాహ్మణశాపంచేత నిహతుడైన నీ తండ్రి వేనుడు నిన్ను పుత్రునిగా పొందటంచేత నరకలోకంనుండి తరించాడు. కాబట్టి "పుత్రుని వల్ల తండ్రి సర్వలోకాలనూ జయిస్తాడు" అనే వేద వాక్యం యథార్థ మయింది.

చ. పురుషవరేణ్య! హేమకశిపుండు రమా లలనేశు నిందచే
నరకమునొందఁ గోరియు గుణజ్ఞుఁడు భాగవతుండునైన యా
వర తనయ ప్రభావమున వాసికి నెక్కి విధూత పాపుఁడై
నిరయముఁ బొందఁడయ్యె, నతి నిర్మల కీర్తిఁ దనర్చెఁ గావునన్. 595

* పురుషోత్తమా! హిరణ్యకశిపుడు శ్రీహరిని నిందించి నరకాన్ని పొందటానికి అర్హుడయ్యాడు. కాని సుగుణయుక్తుడూ విష్ణుభక్తుడూ అయిన తన కొడుకు ప్రహ్లాదుని ప్రభావంచేత పాపాలన్నీ తొలగి నరకానికి పోకుండా మిక్కిలి స్వచ్ఛమైన యశస్సుతో విరాజిల్లాడు.

క. అని పలికి వీరవర్యుం, డనఁదగు పృథుచక్రవర్తి నయుతాబ్దంబుల్
దనరఁగ జీవింతువు గా, కని తగ నాశీర్వదించి యభిమత మొప్పన్. 596

వ. వెండియు నిట్లనిరి, దేవా! నీకు సకల లోక భర్తయగు నారాయణునందు నిట్టి భక్తి వొడముటం జేసియు బ్రహ్మణ్య దేవుండు నుత్తమ శ్లోకుండునైన సర్వేశ్వరుని సత్కథాజాలంబు వ్యక్తంబు సేయుచున్న నీవు మాకు నాథుండ వగుటం జేసియు నేము ముకుంద దాసులమైతిమి, భవదీయ ప్రజానుశాసనంబు ప్రజానురాగంబు కారుణ్యమూర్తులైన మహాత్ములకు స్వభావంబులు, గావున నాశ్చర్యంబు గాదు, దైవసంజ్ఞితంబులయిన కర్మంబులచేత వినష్టజ్ఞానులమై పరిభ్రమించు మాదగు తమఃపారంబుఁ గంటి, మే సర్వేశ్వరుండు బ్రాహ్మణజాతి నధిష్ఠించి క్షత్త్రియులను, క్షత్త్రియజాతి

**నధిష్ఠించి బ్రాహ్మణులను నీ యుభయంబు నధిష్ఠించి విశ్వంబును భరియించు, నట్టి వివృద్ధ సత్త్వుండు సర్వరూపుండు మహాపురుషుండునైన పృథునకు నీశ్వర బుద్ధింజేసి యేము నమస్కరింతు మను సమయంబున. 597**

* ఇలా పలికి సదస్యులందరూ ఓ పృథుచక్రవర్తీ! నీవు చిరకాలం జీవింతువుగాక! అని దీవించి మళ్ళీ ఇలా అన్నారు. రాజా! సర్వేశ్వరుడైన శ్రీహరియందలి భక్తిచే నీవు ఉత్తమశ్లోకుడైన భగవంతుని సత్కథలను కొనియాడుతున్నావు. నీవు మాకు అధీశ్వరుడవు కావడంచేత మేముకూడా హరిభక్తుల మైనాము. ఇలాంటి అనుశాసనం ప్రజానురాగం కల దయామయులైన మహాత్ములకు సహజగుణం కాబట్టి ఇందులో ఆశ్చర్యం ఏమీ లేదు. దైవ సంజ్ఞితాలైన కర్మలచేత జ్ఞానం నశించి చీకటిలో పరిభ్రమిస్తున్న మమ్ములను ఒడ్డుకు చేర్చావు. బ్రాహ్మణజాతిని ఆశ్రయించి క్షత్రియులనూ, క్షత్రియజాతిని ఆశ్రయించి బ్రాహ్మణులనూ - వీరిద్దరినీ, విశ్వాన్నీ భరిస్తున్న సత్త్వగుణ సంపన్నుడవూ, సత్యస్వరూపుడవూ, మహాపురుషుడవూ అయిన నిన్ను ఈశ్వరునిగా భావించి నమస్కరిస్తున్నాము అని పృథుచక్రవర్తికి నమస్కరించారు.

## -: పృథు చక్రవర్తి యొద్దకు సనకాదు లరుగుదెంచుట :-

**క. వినువీథినుండి మెల్లన, చనుదెంచిరి బాలసూర్య సంకాశ తనుల్**
**జనవినుత! సిద్ధ వర్యులు, సనకాదులు శేముషీ విచక్షణు లంతన్. 598**

**వ. ఇట్లు సనుదెంచి 599**

* ఆ సమయంలో బాలసూర్యుని వలె ప్రకాశించే దేహాలతో పరిణత బుద్ధులైన సనకసనందనాది మహాసిద్ధులు ఆకాశంనుండి దిగి మెల్లగా అచ్చటికి విచ్చేశారు.

**క. అనఘాత్ము లతిథి రూపం, బున రా గృహమేధి ప్రాణములు నుద్గతి చేఁ**
**దనరిన ప్రత్యుద్గతి వం, దనముల మరలం బ్రతిష్ఠితము లగు ననుచున్. 600**

**క. వినఁబడు వచన న్యాయం, బున నుద్గతములగు ప్రాణముల గ్రమ్మఱఁ బొం**
**దను గోరువాఁడునుం బలె, ననుచర ఋత్విక్సదస్యుఁడై పృథుఁ డంతన్. 601**

**తే. ఇంద్రియేశుఁడు గంధాదికేష్ట గుణము, గూర్చి యుద్గమన క్రియఁ గోరి చేయు**
**పగిదిఁ బృథుచక్రవర్తి సంభ్రమముతోడ, మహితభక్తిని బ్రత్యుద్గమంబు సేసె. 602**

* పూజ్యులు అతిథులుగా అరుదెంచినప్పుడు వారిని చూడగానే గృహస్థు ప్రాణాలు లేచి వస్తాయి. వారికి ఎదురేగి నమస్కరించినప్పుడు తిరిగి యథాస్థానంలోనికి వస్తాయి అని శాస్త్రకారుల వచనం.

ఆ మాట చొప్పున పైకి లేచిన ప్రాణాలను మళ్ళీ పొందగోరిన వానివలె పృథుచక్రవర్తి ఋత్విక్కులతోనూ, సదస్యులతోనూ కూడి లేచి ఎదురు వెళ్ళాడు. ఇంద్రియాధిపతి అయిన జీవుడు గంధం మొదలైన అభీష్టగుణాలకోసం ఉద్గమించినట్లు పృథుచక్రవర్తి అత్యంత భక్తితో ససంభ్రమంగా సనకాదులకు ప్రత్యుద్గమనం చేశాడు.

**క. ఘనగౌరవమున న మ్మని, జనచిత్త వశీకృతుండు సభ్యుఁడుఁ బ్రియుఁడున్**
**వినయానతకంధరుఁడై, జనవరుఁ డా పరమయోగిచంద్రుల నెలమిన్. 603**

* మునీంద్రుల మనస్సులను లోగొన్నవాడూ, సభ్యత ఎరిగిన వాడూ అయిన మహారాజు వినయ వినమ్రుడై ఆ పరమయోగీంద్రులకు నమస్కరించి తోడ్కొని వచ్చాడు.

**సీ. పూని యర్హాసనాసీనులఁ గావించి కర మర్థి విధివత్ప్రకారమునను**
**బూజించు తత్పదాంభోరుహక్షాళన సలిలంబు లాత్మమస్తమునఁ దాల్చి**
**హాటక కలిత సింహాసనాసీనులై విహితాగ్నులను బోలి వెలుఁగుచున్న**
**శర్వాగ్రజన్ముల సనకాదులను జూచి యతుల శ్రద్ధాసంయమాన్వితుండుఁ**

**తే. బరమ సంప్రీత మతియునై పలికె రాజు, గోరి 'యో మంగళాయనులార! పూర్వ**
**భవమునం దెద్ది మంగళప్రద సుకర్మ, మేను జేసితి? మిముఁ జూడ నిపుడు గలిగె'. 604**

* వారిని తగిన ఆసనములపై కూర్చుండబెట్టి యథావిధిగా పూజించాడు. వారి పాదపద్మాలను కడిగిన జలాలను తన తలపై చల్లుకున్నాడు. బంగారు గద్దెల మీద ఆసీనులై అగ్నులవలె ప్రకాశిస్తున్న బ్రహ్మమానసపుత్రులను జూచి పృథుచక్రవర్తి పరమసంతోషంతో శ్రద్ధాసక్తులతో ఇలా అన్నాడు. మంగళమూర్తులైన మహాత్ములారా! పూర్వజన్మలో నేను చేసిన పుణ్యవిశేషం వల్ల మిమ్ములను ఇప్పుడు దర్శింప గలిగాను.

**వ. అని వెండియు. 605**

**క. భువి నెవ్వని యెడ విప్రులు, భవుఁడును విష్ణుఁడు దదీయభక్తులును బ్రస**
**న్న వదను లగుదురు వానికి, భువి దివిని నసాధ్యకర్మములు లే వరయన్. 606**

* లోకంలో బ్రాహ్మణులూ, శివుడూ, విష్ణువూ, విష్ణుభక్తులూ ఎవరిని అనుగ్రహిస్తారో వారికి భూలోకంలో కానీ, స్వర్గలోకంలో కానీ సాధింపరాని కార్యాలు ఉండవు.

**వ. అని మఱియు ననఘాత్ములార! లోకంబుల నీక్షించుచుం బర్యటనంబు సేయు మిమ్ము సర్వదర్శనుం డయిన యాత్మనుం గనుంగొనంజాలని సర్వదృశ్యంబు చందంబున నీ లోకంబు గనుంగొనంజాలకుండు నట్టి మహాత్ముల రయిన మీ దర్శనంబునం జేసి యేను ధన్యుండనైతి, నదియునుంగాక. 607**

* పుణ్యాత్ములారా! సర్వదర్శనుడైన ఆత్మను సర్వదృశ్యం చూడలేనట్లు లోకాలన్నింటినీ చూస్తూ సంచరించే మిమ్ము లోకులు చూడజాలరు. అటువంటి మహానుభావులైన మీ దర్శనం వల్ల నేను కృతార్థుణ్ణి అయినాను.

**చ. అరయ ధరిత్రి నెవ్వనిగృహంబు మహార్హజనోపయోగ్య వి**
**స్ఫురిత తృణాంబు భృత్య గృహభూముల సొరెఁదనర్చు నట్టి మం**

దిరపతి పేద యైన జగతిం గడు ధన్యుఁ డటండ్రు గాన సు
స్థిరమతి మీరు వచ్చుట నశేషశుభంబుల నేను బొందెదన్. 608

* ఎవని గృహంలోని తృణకణాలూ, జలమూ, స్థలమూ, భృత్యవర్గమూ పూజ్యులైన వారి సేవకు ఉపయోగ పడతాయో ఆ గృహస్థు పేదవాడు అయినప్పటికీ పరమ ధన్యుడైన భాగ్యవంతుడే. మీ రాకవల్ల నాకు సర్వశుభాలూ సంప్రాప్తిస్తాయి.

వ. అదియునుం గాక. 609

చ. వరమతులార! యెవ్వని నివాసముఁ దీర్థపదాంతరంగులై
పరఁగినయట్టి భాగవత పాదజలంబులు సోఁక వేని త
త్పురుషుఁడు భూరి సంపదలఁ బొంపిరిపోయిననైన వాని మం
దిర మురగ ప్రకీర్ణ జగతీజముఁ బోలు నటండ్రు కోవిదుల్. 610

* మహాత్ములారా! పరమ పవిత్రులై భగవద్భక్తుల పాదజలం సోకనివాని గృహం ఎంతటి సిరిసంపదలతో తులతూగుతున్నా అదిపాములు చుట్టుకున్న చెట్టువలె భయం కలిగిస్తుంది అని పండితులు చెబుతారు.

వ. అని పలికి వెండియు నిట్లనియె. 611

సీ. పరమ పావనులార! బాల్యంబునందుండి, మానిత శ్రద్ధా సమన్వితులును
గుణనిధుల్ ధైర్యయుక్తులు ముముక్షువులునై, యధిక వ్రతంబుల నాచరింతు
రట్టి పుణ్యులు భవదాగమనంబు స్వా, గతమయ్యె! సత్కృపాకలితులార!
యనివారిత వ్యసనార్ణవం బయినట్టి, భూరి దుర్లంఘ్య సంసారమందు

తే. మతి విహీన స్వకీయ కర్మములఁ జేసి, యడరి మగ్నులమై యింద్రియార్థములనె
తివిరి పురుషార్థములు గాఁగఁ దెలియు మాకుఁ, గుశల మున్నదె లోకైక కుశలులార! 612

* ఈ విధంగా పలికి పృథుచక్రవర్తి సనకాదులతో మళ్ళీ ఇట్లా అన్నాడు. పవిత్రచరిత్రులారా! మీరు బాల్యం నుండీ మోక్షాన్ని కాంక్షించి శ్రద్ధతో, పట్టుదలతో గొప్ప వ్రతాలు చేస్తున్న పుణ్యాత్ములు. మీ రాక మాకు శుభప్రదం! మీకు స్వాగతం! కృపానిధులారా! మీరు లోకక్షేమంకరులు, స్వకర్మలవల్ల దుఃఖమయమై దాటరాని సంసార సాగరంలో మునిగిపోయి ఇంద్రియార్థాలనే పురుషార్థాలుగా భావించే మాకు ఈ లోకంలో కుశల మెక్కడిది?

వ. మీర లాత్మారాము లగుటం జేసి మీయందుఁ గుశలాకుశల రూపంబులయిన మతివృత్తులు సంభవింపవు గావునం గుశల ప్రశ్నం బుపపన్నంబు గాదు, కాన నేను గృతవిశ్వాసుండనై సంతప్తులయిన వారలకు సుహృత్తులైన మిమ్ము నాకు నీ సంసారంబునందు నేమిట వేగంబ క్షేమంబు గలుగు నని యడిగెద! నాత్మవంతులకు నాత్మయు నాత్మభావనుండు నయిన యీశ్వరుండు భక్తానుగ్రహంబు

**కొఱకు నీ లోకంబుల మీ వంటి సిద్ధరూపంబున వర్తించుచుండు నని పలికిన యతని గంభీరార్థ గౌరవంబులును, శుభకరంబులును, న్యాయ సహితంబులును, మితాక్షరంబులును, శ్రోత్ర ప్రియం బులును నయిన  వచనంబులు విని సంప్రీత చేతస్కుండును, మందస్మితుండునై సనత్కుమారుం డిట్లనియె. 613**

* మీరు ఆత్మారాములు. అందుచేత మీకు "కుశలం", "అకుశలం" అనేవి సంభవింపవు. కాబట్టి మిమ్మల్ని కుశలప్రశ్న చేయటం సముచితం కాదు. మీరు దుఃఖంలో ఉన్నవారికి మిత్రులు. మిమ్మ విశ్వాస పూర్వకంగా అడుగుతున్నాను. సంసారంలో మునిగి ఉన్న నాకు వేగంగా క్షేమం కలిగే ఉపాయం చెప్పండి. పరమాత్మ, విశ్వాత్మ అయిన భగవంతుడు భక్తులను రక్షించటం కోసం మీ వంటి సిద్ధస్వరూపాలతో ఈ భూమిపై సంచరిస్తుంటాడు అని పృథుచక్రవర్తి అన్నాడు.

తక్కువ అక్షరాలతో, ఎక్కువ అర్థం కలిగి వీనుల విందు చేస్తూ శుభకరాలూ న్యాయసమ్మతాలూ అయిన పృథుచక్రవర్తి మాటలు విని, సంతోషించి చిరునవ్వు నవ్వుతూ సనత్కుమారుడు ఇలా అన్నాడు.

**మ. ధరణీశోత్తమ! సర్వభూతహిత చేతస్కుండవై ధర్మ సు**
**స్థిర భాగ్యోదయశాలివై యెసఁగు నీచే సాధులోకోత్తరో**
**త్తర సంప్రశ్నము సేయఁగాఁబడె మహాత్మా! సాధులోకైక స**
**చ్చరితంబున్ దలపోయ నిట్టిద కదా! చర్చింప లోకత్రయిన్. 614**

* రాజోత్తమా! నీవు సర్వప్రాణుల హితాన్ని కోరే మనస్సు కల వాడవు. ధర్మమార్గమందు సుస్థిరమైన మహాభాగ్యం కలవాడవు. సాధుజన సమ్మతంగా ప్రశ్నించావు. నీకు తెలిసినప్పటికీ తెలియనట్లు అడిగావు. పుణ్యపురుషా! లోకంలో సత్పురుషుల స్వభావం ఇలాగే ఉంటుంది. కదా!

**తే. ధరణి సజ్జన సంగంబు దలఁప నుభయ, సమ్మతంబగు వారలు సలుపు నట్టి**
**సరస సంభాషణ ప్రశ్న సరణి నిఖిల, జనములకు సుఖకర మగు జనవరేణ్య! 615**

* జనవరేణ్యా! సాధుసంగమం ఉభయ సమ్మతమై సకలార్థ సాధనం అవుతుంది. ఎందుకంటే సజ్జనుల సరస సంభాషణములూ, సంప్రశ్నములూ సమస్తజనులకూ మేలు కలిగిస్తాయి.

**వ. అని యభినందించి మోక్షసాధనోపదేశ కాముండైన పృథు చక్రవర్తికి వెండియు నిట్లనియె. 616**

* ఈ విధంగా అభినందించి మోక్షసాధనమైన ఉపదేశాన్ని కోరిన పృథుచక్రవర్తితో సనత్కుమారుడు మళ్ళీ యిలా అన్నాడు.

**సీ. ధరణీశ! మధునిషూదనుఁ డైనయట్టి నారాయణు లలిత పాదారవింద**
**వరగుణ ధ్యాన ధీపరిణత త్వంబున సకలాత్మ మల విమోచనములైన**
**రతియును నిత్యవైరాగ్యంబు మొదలుగా లోకోత్తరుఁడవైన నీకుఁ గలవు;**
**సమ్యగ్విచార శాస్త్రములందు జనులకు సేమంబునకును నిశ్చితము లయిన**

తే. యాత్మవ్యతిరిక్త వస్తువులందు వీత, రాగతఁ దలంప నిర్గుణ బ్రహ్మ మయిన
యాత్మయందుల రతియును నన(గ నివియ, హేతువులు బుద్ధిఁ జింతింప నిద్ధచరిత!. 617

* రాజేంద్రా! మధుసూదనుడైన మహా విష్ణుని పరమ సుందర పాదారవింద సంస్మరణంలో పరిణతి చెందిన వాడవు. మనస్సులోని మాలిన్యాన్ని కడిగివేసి చిత్తశుద్ధి కలిగించే భగవద్రతీ, వైరాగ్యమూ నీకు ముందే ఉన్నాయి. నీ చరిత్ర లోకోత్తరమైనది. ఆత్మ కంటే వేరయిన దేహాదులపై విరక్తీ, నిర్గుణ బ్రహ్మమైన ఆత్మయందు అనురక్తీ జనులకు క్షేమం కలిగిస్తాయని చక్కగా చర్చించి శాస్త్రాలు నిర్ణయించాయి.

వ. కావున శ్రద్ధయు భగవద్ధర్మ చర్యయుఁ దద్విశేష జిజ్ఞాసయు నాధ్యాత్మిక యోగ నిష్ఠయు యోగేశ్వరోపాస్తియుఁ బుణ్యోపాశ్రయుండును, బుణ్యశ్రవణుండునునైన నారాయణ కథాలాపంబులు నర్థేంద్రియారాములైన వారలతోడి సంగతియందు విరక్తియు వారల కభిమతంబులైన యర్థకామంబులందు ననాకాంక్షయు, సర్వేశ్వరుని గుణకీర్త నామృతపానంబు దక్క నితర పదార్థంబులందు వైరాగ్యంబు నొంది యాత్మారామత గలిగి విజనస్థలంబులందుల రుచి గలుగుటయు, నహింసయు, శమాది ప్రధాన వృత్తియు నాత్మ హితానుసంధానంబును భగవత్కథానుస్మరణంబును నకామ్యంబు లయిన యమ నియమంబులును, నితర భక్తిమార్గాగర్హణంబును, యోగక్షేమార్థ క్రియారాహిత్యంబును, శీతోష్ణాది ద్వంద్వ సహిష్ణుతయు, భాగవత కర్ణాలంకార భూతంబులగు భగవద్గుణాభిధానంబులు నను వీనిచేత విజృంభమాణంబయిన భక్తి యోగంబునం జేసి యనాత్మయందు నసంగంబును, గార్యకారణరూపంబుగ నిర్గుణ బ్రహ్మము నందు రతియును, నెప్పుడు గలుగు నప్పుడ సదాచార్యానుగ్రహ వంతుండయిన పురుషుండు బ్రహ్మనిష్ఠులతోడఁ జెలిమిసేయుచు నీషణత్రయంబు వర్జించి ప్రకృతిం జేరక జ్ఞానవైరాగ్య వేగంబునం జేసి. 618

* మహారాజా! శ్రద్ధ, భాగవత ధర్మాలను ఆచరించడం, ఆ యా ధర్మవిశేషాలందు జిజ్ఞాస; ఆధ్యాత్మిక యోగనిష్ఠ, యోగీశ్వరులను ఉపాసించడం, నిరంతరం శ్రీహరి పుణ్యకథలను ఆలకించడం, అర్థ లుబ్ధులూ ఇంద్రియలోలురూ అయినవారికి దూరంగా ఉండడం, వారికి అభిమతాలైన అర్థకామాల మీద ఆసక్తి లేకుండడం, హరిగుణామృత రసాస్వాదనం తప్ప ఇతర వస్తువులందు విరక్తి, ఆత్మారామస్థితి, ఏకాంత వాసమందు అభిరుచి, అహింస, ఇంద్రియ నిగ్రహం, ఆత్మ హితానుసంధానం, సంతత భగవత్కథాచింతనం, యమనియమాలు, ఇతర భక్తి మార్గాలను నిందింపకుండా ఉండడం, తన యోగక్షేమాలకోసం ఎటువంటి కార్యాలూ చేయకుండడం, శీతోష్ణాది ద్వంద్వాలను సహించడం, హరిభక్తుల చెవులకు అలంకారాలైన భగవంతుని సుగుణాలను అభివర్ణించడం - వీనివల్ల భక్తియోగం పెంపొందుతుంది. అటువంటి భక్తి యోగం వల్ల దేహాదుల మీద విరక్తీ, నిర్గుణ పరబ్రహ్మం మీద అనురక్తీ కలుగుతాయి. అవి కలిగిననాడు వెను వెంటనే ఉత్తములైన ఆచార్యుల అనుగ్రహానికి పాత్రుడౌతాడు. అటువంటి పురుషుడు బ్రహ్మనిష్ఠులైన మహాత్ములతో స్నేహం చేసి దారేషణ, ధనేషణ, పుత్రేషణ - అనే ఈషణత్రయాన్ని పరిత్యజిస్తాడు. సంసార బంధాలనుండి విడివడతాడు.

సీ. అనఘ! సాక్షాత్కార మగు భక్తి యోగాగ్నిఁ గడఁగి జీవాధారకమును బంచ
భూతాత్మకంబునై పొలుచు హృద్గ్రంథిని బూని స్వకారణభూత మయిన
యరణి దహించు హుతాశను కైవడి నిర్దహించిన నిట్లు నెఱపి దగ్ధ
చిత్తుఁడై ముక్తనిశ్శేషాత్మ గుణుఁడు సద్ధర్ముఁడు నైన యతండు మిగుల

తే. నర్థి బాహ్యంబు లయిన ఘటాదికములు, నాంతరములైన సౌఖ్యదుఃఖాదికములు
నను విభేదము లాత్మ భేదనము లగుట, న య్యుపాధి వినాశంబు నందఁ గలఁడు 619

* రాజా! ఈ విధంగా అతడు జ్ఞానవైరాగ్యాల వల్ల సాక్షాత్కరించిన భక్తియోగ మనే అగ్నితో పంచ భూతాత్మకమైన అహంకారాన్ని, తన పుట్టుకకు కారణమైన అరణిని అగ్ని దహించినట్లు దహిస్తాడు. ఈ విధంగా హృదయగ్రంథిని దహించడం వల్ల ఉపాధి గుణములైన కర్తృత్వ భోక్తృత్వముల నుండి విముక్తుడై బాహ్యాలైన ఘటాదికాలకూ, అంతరాలైన సుఖదుఃఖాదికాలకూ అతీతు డవుతాడు.

వ. అది యెట్లనిన. 620

చ. పురుషుఁడు నిద్రవోఁ గలలఁ బొందిన యాత్మ సుఖైక హేతువై
పరఁగిన రాజభృత్యజన భావగుణంబులు సంప్రబోధమం
దరయఁగ మిథ్య యైనగతి నాంతర బాహ్యగుణ ప్రభేదముల్
పరువడిఁ గానకుండు జనపాలన శీలన! నిత్యఖేలనా! 621

* ప్రజలను పరిపాలించటంలో నేర్పరివైన మహారాజా! విను. మానవుడు నిద్రపోతాడు. ఆ నిద్రలో కలగంటాడు. ఆ కలలో తాను రాజై రాజ్యాలు ఏలినట్లూ, సిరిసంపదలతో తులతూగినట్లూ, ఏవేవో ఆనందాలు అనుభవిస్తాడు. కల కరిగిపోయి మేలుకోగానే అవన్నీ అసత్యాలు అని తెలుసుకుంటాడు. అదే విధంగా లింగదేహం నశించి ఉపాధి రహితుడైన పురుషునికి బాహ్యవిషయాలైన శబ్దస్పర్శాదులూ, అంతర్విషయాలైన శోకమోహాదులూ ఏవీ అనుభూతాలు కావు.

వ. మఱియును ద్రష్టయైన యాత్మయు దృశ్యంబయిన యింద్రియార్థంబు నను వీనికి నహంకారంబు సంబంధ హేతు వగుటం జేసి యది యంతఃకరణంబునం గలుగుచుండు జాగ్రత్స్వప్నంబులయం దీ భేదంబు గనుంగొను చుండు, నిట్టి యంతఃకరణంబు లేనిది యగు సుషుప్తికాలంబునం బురుషుండు జలదర్పణాది నిమిత్తాభావం బగునప్పుడు బింబప్రతిబింబ భేదంబు గనుంగొనని చందంబున దృశ్యభేదంబు గనుంగొనకుండుఁ, గావున నంతఃకరణ విలయంబు నొందిన బాహ్యాంతర భేదంబు కనకుండుట నిశ్చయం బని వెండియు నిట్లనియె. 622

* ఉపాధి అయిన అంతఃకరణం ఉన్నప్పుడు ద్రష్ట అయిన ఆత్మకూ, దృశ్యమైన ఇంద్రియార్థానికీ అహంకారం సంబంధ హేతు వవుతుంది. అందువల్ల ఉపాధితో కూడిన జీవుడు మేలుకొన్నప్పుడూ కలగన్నప్పుడూ సుఖదుఃఖాలను అనుభవిస్తాడు. అంతఃకరణం లేని సుషుప్తిలో (గాఢ నిద్రలో) పురుషుడు - జల దర్పణాది నిమిత్తాలు లేనప్పుడు బింబ ప్రతిబింబ భేదాన్ని చూడలేనట్లే - దృశ్యభేదాలను దర్శింపలేడు. అందువల్ల అంతఃకరణం నశించినప్పుడు బాహ్యాభ్యంతర భేదాలు గోచరింపవు.

సీ. భువి విషయా కృష్ట భూతంబు లయిన యింద్రియముల చేతను దివిరి మనము
దగ విషయాస క్తిఁ దగిలి యాంతరమైన మహిత విచార సామర్థ్యమెల్ల
శరకుశాది స్తంబజాలంబు హ్రదతోయములు గ్రోలుగతిఁ గ్రమంబున హరించు
నీ రీతి నంతర్విచార సామర్థ్యంబు నపహృతం బయినఁ బూర్వాపరాను

తే. మేయ సంధానురూప సంస్మృతి నశించు, నది నశించిన విజ్ఞాన మంతఁ దొలఁగు,
నట్టి విజ్ఞాన నాశంబు నార్యజనులు, స్వాత్మ కది సకలాపహ్నవం బటంద్రు, 623

* విషయ చింతాపరాయణులైన వ్యక్తుల మనస్సు ఇంద్రియాల ప్రభావం వల్ల విషయాలలోనే ఆసక్త మవుతుంది. ఒడ్డున పుట్టిన రెల్లు, దర్భ మొదలయిన దుబ్బులు తమ వ్రేళ్లతో మడుగులోని నీటిని హరించి వేసినట్లు అటువంటి మనస్సు బుద్ధియొక్క విచారశక్తిని క్రమంగా హరిస్తుంది. అంతర్విచార సామర్థ్యం అపహరింప బడినట్లయితే పూర్వాపరాలను సంధానం చేసే స్మృతి చెడుతుంది. స్మృతి నశిస్తే విజ్ఞానం నశిస్తుంది. అటువంటి విజ్ఞాన నాశనాన్నే పెద్దలు "ఆత్మనాశనం" అని అంటారు.

వ. అదియునుం గాక "ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి"యను వేదవచనంబునం జేసి విషయంబులకుం బ్రియతమత్వంబై యాత్మోపాధికంబు నొంది యాత్మాపహ్నవంబునం బాటిల్లు స్వార్థనాశం బెద్ది గలుగు దాని కంటె లోకంబున నధికంబైన స్వార్థనాశంబు లే, దది యెట్లనిన సర్వార్థ నాశంబునకు స్థైర్యంబు నొందించునట్టి యర్థకామాభిధ్యానంబునం దద్దేతుకంబైన స్వార్థనాశంబునం బరోక్షాపరోక్షరూపజ్ఞానంబు నశించుం గావున నాత్మాపహ్నవంబునకంటె నధికతరంబైన సర్వార్థ నాశంబు లేదని వెండియు నిట్లనియె. 624

* "ఆత్మను ప్రేమించిన వానికి జగత్తులోని సమస్తమూ ప్రియమె అవుతుంది,"అని వేదం చెపుతున్నది. విషయ వాంఛలపై ప్రీతి ఆత్మజ్ఞానాన్ని మరుగుపరుస్తుంది. ఆత్మజ్ఞానం అపహ్నవ మైనందువల్ల కలిగే స్వార్థనాశాన్ని మించిన స్వార్థనాశం మరొక్కటి లేదు. సర్వనాశనాన్ని భరించటానికి కావలసిన స్థైర్యం అర్థకామాలను ధ్యానించుటవల్ల కలుగుతుంది. ఇందువల్ల పురుషుడు పరోక్షాపరోక్షానుభూతులనుండి భ్రష్టుడై నశిస్తాడు. కావున ఆత్మజ్ఞానం మరుగుపడటం కంటె మించిన సర్వనాశం వేరొకటి లేదు.

సీ. అనఘ! యీ సంసార మతిశయంబునఁ దరియింపంగ మది నిశ్చయించువాఁడు
గై కొని ధర్మార్థకామమోక్షములకు నతి విఘాతుక మెద్ది యట్టి దాని
వలన సంగము సేయ వలవ; దా ధర్మాదులందుఁ ద్రివర్గంబు నంతకోగ్ర
భయయుతం బగుటను బరమమోక్షంబె ముఖ్యార్థమై విలసిల్లునంద్రు బుధులు,

తే. భువి గుణవ్యతికరమునఁ బుట్టి నట్టి, యబ్జజాతాదులకు నస్మదాదులకును
గాల విధ్వంసితాఖిల క్రమము గల్గుఁ, గలుగ దెన్నఁడు సేమంబు గాన వినుము. 625

* పుణ్యమూర్తివైన పృథుచక్రవర్తీ! సంసార సముద్రాన్ని జాగ్రత్తగా దాటగోరేవాడు ధర్మార్థ కామమోక్షాలను నిర్మూలనం చేసే ఎటువంటి దుస్సంగమునూ చేయకూడదు. ధర్మార్థకామమోక్షాలలో ధర్మార్థకామాలు మూడున్నూ అనిత్యాలైనందువల్ల యమభయంతో కూడి ఉంటాయి. "మోక్షం ఒక్కటే పరమ పురుషార్థం" అని పండితులు చెపుతారు. గుణ సంబంధం వల్ల సంభవించిన బ్రహ్మాదులకునూ, మాబోటి వారికినీ కరాళకాలప్రభావం చేత ఎప్పటికైనా వినాశమేకాని క్షేమం అనేది ఎన్నడూ కలుగదు.

**వ. మోక్షంబె పరమ పురుషార్థం బని చెప్పి వెండియు నిట్లనియె. నరేంద్రా! దేహేంద్రియ ప్రాణ బుద్ధ్యహంకార పరివృతంబు లయిన యీ స్థావర జంగమంబుల హృదయంబులందు వ్యాపకుండుఁ బ్రత్యక్షభూతుండుఁ బ్రత్యగ్రూపుండు భగవంతుండు నయిన యీశ్వరుం డంతర్యామిరూపంబునం బ్రకాశించుచుండు, నిది నారాయణుని సద్రూపంబుగాఁ దెలియు మని వెండియు నిట్లనియె. 626**

* కాబట్టి మోక్షమే పరమ పురుషార్థం అని చెప్పి మళ్ళీ ఇలా అన్నాడు. సనత్కుమారుడు మహారాజుతో రాజేంద్రా! దేహం, ఇంద్రియాలు, ప్రాణం, బుద్ధి, అహంకారం అనే వానిచేత ఆవృతాలయిన స్థావర జంగమాల హృదయాలలో సర్వవ్యాపీ, సాక్షిభూతుడూ, ప్రత్యగ్రూపుడూ అయిన భగవంతుడు అంతర్యామియై ప్రకాశిస్తుంటాడు. అటువంటి నారాయణుని స్వరూపాన్ని చక్కగా తెలుసుకో!

**ఉ. భూవర! యే మహాపురుష భూషణు నందుల నీ సమస్త వి**
**శ్వావళి లీనమై సదసదాత్మక భావము నొంది భూరి మా**
**యా విభవంబులం దగి సమగ్ర వివేక నిరోధి స్రగ్భనా**
**శీవిషబుద్ధి దోఁచుచు విశేషగతిన్ వెలుఁగొందు నెప్పుడున్. 627**

* రాజేంద్రా! ఈ సమస్త విశ్వమూ పరమేశ్వరునియందు లీనాలీనభావంతో, మాయాప్రభావంతో, వివేకాన్ని నిరోధించే సర్పరజ్జు భ్రాంతితో విశేషంగా ప్రకాశిస్తూ ఉంటుంది.

**చ. సుమహిత నిత్యముక్త పరిశుద్ధ విబుద్ధ సుతత్త్వుఁడై యురు**
**క్రముఁ డభిభూత సత్ప్రకృతి కర్మకళంకుఁడు నైనయట్టి యు**
**త్తమచరితుం గృపాకరు నుదాత్తగుణోన్నతు నీశ్వరేశుఁ జి**
**త్తమునఁ దలంపుమయ్య! జనతా పరిరక్షణ! దుష్ట శిక్షణా! 628**

* అటువంటి నిత్యముక్తుడూ, సత్యస్వరూపుడూ, విశుద్ధసత్త్వుడూ, ఉరుక్రముడూ, ప్రాకృతకర్మకళంక భంజనుడూ, కృపారంజనుడూ, ఉత్తమచరితుడూ, ఉదాత్తగుణోన్నతుడూ అయిన పరమేశ్వరుణ్ణి దుష్టజన శిక్షణుడవూ శిష్ట జనరక్షణుడవూ అయిన రాజా! నీవు నీ మనస్సులో స్మరించు.

**సీ. వసుమతీనాథ! యెవ్వని పాదపద్మ పలాశ విలాస సల్లలిత భక్తి**
**సంస్మరణంబుచే సజ్జన ప్రకరంబు ఘనకర్మ సంచయ గ్రథితమగు న**

హంకార మను హృదయగ్రంథిఁ జెఱుతురు; వివరింప నిట్లు నిర్విషయమతులు
మహి నిరుద్ధేంద్రియ మార్గులు నైనట్టి యతులకుఁ జేరంగ నలవి గాని

తే. యట్టి పరమేశుఁ గేశవు నాదిపురుషు, వాసుదేవుని భువనపావన చరిత్రు
నర్థి శరణంబుగాఁ దత్పదాంబుజములు, భక్తి సేవింపు గుణసాంద్ర! పార్థివేంద్ర! 629

* మహారాజా! ఆ మహానుభావుని పాదపద్మాలను భక్తితో సంస్మరించి సజ్జనులైనవారు కర్మవాసనామయమైన అహంకార మనే హృదయ గ్రంథిని నిర్మూలిస్తారు. ఇటువంటి కార్యం ఇంద్రియాలను నిగ్రహించిన వారూ, విషయాసక్తులు కానివారూ అయిన యతులకు కూడా సాధ్యం కాదు. సుగుణసాంద్రుడవైన నరేంద్రా! భక్తిమాత్రసాధ్యుడూ, భువన పావన చరిత్రుడూ, ఆదిపురుషుడూ, దేవాదిదేవుడూ అయిన వాసుదేవుని శరణుజొచ్చి ఆ పరమేశ్వరుని చరణపద్మాలను భక్తితో సేవించు.

మ. అరిషడ్వర్గ మహోర్మినక్ర నికర వ్యాకీర్ణ సంసార సా
గర మబ్జోదర కీర్తనా తరణి సాంగత్యంబునం బాసి తా
మరుదారంగ నఘాపహప్రకట యోగాది క్రియాయు క్తిచేఁ
దరియింపన్ మదిఁ గోరువారలకు దుర్దాంతం బగుం గావునన్. 630

* అరిషడ్వర్గం అనే మహోగ్రతరంగాలతోనూ, పెద్దపెద్ద మొసళ్ళతోనూ నిండిన సంసార సముద్రాన్ని పరమేశ్వర సంకీర్తనం అనే నావలేకుండా దాటటం సాధ్యం కాదు. అత్యంత కష్టసాధ్యాలైన హఠయోగాదులవల్ల ఈ మహాసాగరాన్ని తరించటం అసంభవం.

మ. ధరణీశోత్తమ! నీవు కేవలసముద్యద్భక్తి ధీయుక్తివై
వరగోవింద పదారవింద యుగభాస్వన్నావ సంధించి దు
స్తర భూరివ్యసనాకరోల్లసిత దుర్దాంతోగ్ర గంభీర సం
సరణాంభోధిఁ దరింపవయ్య పరమోత్సాహంబు దీపింపఁగన్. 631

* రాజోత్తమా! నీవు కేవలం అచంచలమైన భక్తియుక్తితో గోవింద పదారవింద వందనం అనే అందమైన నావను ఆశ్రయించు. దాని సాయంతో దుస్తరమూ, దురంతమూ, దుఃఖమయమూ, కఠోరమూ, గంభీరమూ అయిన ఈ సంసార సముద్రాన్ని పరమసంతోషంతో తరించు.

క. అని యీ గతిఁ బంకరుహా, సనసుతుఁడును బ్రహ్మబోధశాలియు నగు నా
ఘన యోగివల్లభునిచే, తను దెలియఁగఁ బడిన బ్రహ్మతత్త్వం డగుచున్. 632

* అని ఈ విధంగా బ్రహ్మపుత్రుడునూ, బ్రహ్మవిదుడునూ పరమ యోగీంద్రుడునూ అయిన సనత్కుమారుడు పృథుచక్రవర్తికి బ్రహ్మ తత్త్వాన్ని చక్కగా బోధించాడు.

క. జనపతి మునిఁ బొగడి ముదం, బున నిట్లనుఁ బూర్వజన్మమున నే దీనా
వనుఁడైన యీశ్వరుని చే, తను నిక్క మనుగ్రహింపఁ దగితి మునీంద్రా! 633

* అప్పుడు పృథుచక్రవర్తి సనత్కుమారుని కొనియాడుతూ సంతోషంతో ఇలా అన్నాడు. మునీంద్రా! పూర్వజన్మంలో దీనరక్షకుడైన భగవంతుని అనుగ్రహం నా మీద బాగా ప్రసరించి ఉంటుంది.

**క. వినుఁ డట్టి యనుగ్రహ సా, ధనమునకై మీర లిపుడు దగ నిచ్చటికిం**
**జనుదెంచితిరి దయాళురు, ననఘులు భాగవతవరులు నగు నుత్తములున్. 634**

* ఆ అనుగ్రహాన్ని సార్థకం చేయటంకోసం మీరు ఇచ్చటకు విచ్చేశారు. మీరు దయామయులు. పాపరహితులు. మునిసత్తములు. పరమ భాగవతోత్తములు.

**సీ. నిరతంబు నాయందు నిష్పాదితములగు దేహసమేత మదీయరాజ్య**
**సర్వసంపదలును సద్ద్విజ దత్తముల్ గావునఁ బ్రాణకాంతా విభూతి**
**మందిర సుత రాజ్య మహి బల కోశ పరిచ్ఛదంబుల నెల్ల ధృతిఁ దలంప**
**రాజుకు భృత్యుండు రాజకీయములగు తాంబూలముఖ పదార్థములఁ జేసి**

**తే. రమణ సంతర్పణోపచారములు నడపు, గతిని వారల కవి నివేదితము లయ్యెఁ!**
**గాన మీ కుపచార మేగతి నొనర్తు, నతులగుణసాంద్ర! యోగికులాబ్ధి చంద్ర! 635**

* అటువంటి మీరు బ్రహ్మజ్ఞానాన్ని ప్రబోధించారు. ఇందుకు మీకు దక్షిణగా నేను ఏ మీయగలను? నా దేహమూ, నా రాజ్యమూ, నా సర్వసంపదలూ ఉత్తమ బ్రాహ్మణులు నాకు అనుగ్రహించినవే. అటువంటి నా ప్రాణాలూ, సిరిసంపదలూ, గృహాలూ, సుతులూ, రాజ్యాలూ, భూములూ, సైన్యాలూ, ధనాగారాలూ, సమస్త పదార్థాలూ, సేవకుడు రాజుకు తాంబూలాదులు సమర్పించి సేవించిన విధంగా నేను బ్రాహ్మణోత్తములకే అర్పించి వేశాను. కాబట్టి సద్గుణసాంద్రులూ, సంయమి చంద్రులూ అయిన మీకు నేను ఇప్పుడు ఏమి సమర్పించుకోగలను?

**వ. అది యెట్లు బ్రాహ్మణాధీనం బంటిరేని సేనాధిపత్య రాజ్యదండనేతృత్వ సర్వలోకాధిపత్యంబులు వేదశాస్త్రవేది యైన బ్రాహ్మణునక కాని యితరులకు యోగ్యంబులు గావు! కావున బ్రాహ్మణులకు భోజన వసనదానంబులు స్వకీయంబులై యుండు, క్షత్త్రియాదులకు బ్రాహ్మణానుగ్రహంబున నన్న మాత్రంబు దక్కం దక్కిన వస్తుస్వాతంత్ర్యంబు లేదు, గావున మీకు గురుదక్షిణ యేమి సమర్పించు వాఁడ? నదియునుం గాక స్వాతంత్ర్యంబు గలిగిన నిట్టి యధ్యాత్మ విచారులు వేదాంతవేదులు నై భగవద్భక్తి నుపదేశించెడు, మీ వంటి పుణ్యాత్ములకుం బరిహాసాస్పదుండు దక్కఁ దక్కినవా డెవ్వం డంజలి మాత్రంబు దక్కఁ దక్కిన ప్రత్యుపకారంబు సేయం దలంచు? నది గావున దయాళువులైన మీరలు స్వకృతోపచారంబులం జేసి సంతుష్టాంతరంగు లగుదురు గా కని పలుకుచున్న యాదిరా జయిన పృథుచక్రవర్తి చేతం బూజితులై యాత్మ యోగనిష్ఠులైన సనకాదు లతని స్వభావంబుం బ్రశంసించుచు సమస్త జనంబులుఁ జూచుచుండ నాకాశ గమనంబునం జని రయ్యవసరంబున. 636**

* సేనాపతిత్వమూ, రాజ్యాధికారమూ, దండనాయకత్వమూ, సర్వలోకాధిపత్యమూ, వేదశాస్త్రవేత్త లయిన బ్రాహ్మణులకే తప్ప ఇతరులకు గ్రాహ్యాలు కావు. అన్న వస్త్రదానాలు బ్రాహ్మణుల స్వకీయాలు.

బ్రాహ్మణుడు తన అన్నమే తాను భుజిస్తాడు. తన వస్త్రమే తాను ధరిస్తాడు. తన సొమ్మే తాను దానం చేస్తాడు. క్షత్రియాదులు బ్రాహ్మణుల అనుగ్రహం చేతనే అన్నపానీయాలు అనుభవిస్తున్నారు. అంతేకాని తక్కిన వస్తువులమీద వారికి స్వాతంత్ర్యం లేదు. అందుచే అస్వతంత్రుడనైన నేను మీకు గురుదక్షిణగా ఏమి సమర్పించుకోగలను? మీరు వేదాంతవేత్తలు, అధ్యాత్మ తత్త్వవిదులు. సర్వస్వతంత్రులు. నాకు భగవద్భక్తిని ఉపదేశించారు. మీ వంటిపుణ్యాత్ములకు భక్తితో చేతులు మోడ్చి నమస్కరించటం తప్ప మరేమీ చేయలేను. మీకు ఏదయినా ప్రత్యుపకారానికి పూనుకోటం నవ్వుల పాలు కావటమే కాబట్టి దయామయులైన మీరు మీ ఉపకారానికి బదులు నా నమస్కారం అందుకొని ఆనందం పొందుదురు గాక! అని చక్రవర్తి విన్నవించి వారిని సన్నుతించాడు. దివ్యజ్ఞానమహనీయులైన సనకాది మునీంద్రులు ఆయన పూజలు అందుకొని ఆయన స్వభావాన్ని ప్రశంసిస్తూ, ప్రజలందరూ చూస్తుండగా ఆకాశగమనంతో వెళ్లిపోయారు.

## -: పృథు చక్రవర్తి జ్ఞాన వైరాగ్య వంతుండై ముక్తినొందుట :-

**ఆ. విను మహాత్మ, ముఖ్యుఁడన నొప్పు వైన్యుఁ డే, కాగ్రచిత్తుఁ డగుచు నాత్మనిష్ఠుఁ**
**డైనయట్టి తను నవాప్త కామునిఁ గాఁగ, బుద్ధిలోనఁ దలఁచె భూవరుండు. 637**

* విదురా! విను. మహాత్ములలో ముఖ్యు డనదగిన పృథుచక్రవర్తి అధ్యాత్మ శిక్షచేత ఏకాగ్రత పొందాడు. ఆ ఏకాగ్రత వలన ఆత్మ నిష్ఠుడయ్యాడు. తనను అవాప్తకామునిగా భావించుకున్నాడు.

**వ. అంత. 638**

**సీ. కర్మంబులను యథాకాల దేశోచిత బలవిత్తములు గాఁగఁ బరఁగు ధర్మ**
**ములను బ్రహ్మార్పణ బుద్ధిని జేసి కర్మాసక్తుఁ డగుచు సమాహితుండు**
**ప్రకృతికంటెను దన్నుఁ బరమైన యాత్మను గర్మసంచయ సాక్షిగాఁగ బుద్ధి**
**నర్థిఁ దలంచుచు నాచరించుచు నట్ల మెఱసి సామ్రాజ్యలక్ష్మీ సమేత**

**తే. మందిరోద్యాన వనభూములందు రాజ్య, గరిమ వర్తింపఁగా నహంకార రహితుఁ**
**డగుచుఁ దన చిత్తమున నింద్రియార్థములను, దగులకయ యుండె సన్మహోదారుఁ డగుచు.639**

* అనంతరం దేశ కాల బల విత్తములకు తగినట్లు బ్రహ్మార్పణ బుద్ధితో సత్కర్మములనూ ధర్మములనూ ఆచరించాడు. ఫలాన్ని బ్రహ్మార్పణం చేసి కర్మలందు అనాసక్తు డయ్యాడు. ప్రకృతికంటె పరమైన తనను కర్మసాక్షిగా భావించి కర్మలను ఆచరించాడు. సామ్రాజ్య లక్ష్మీ సమేతుడై సుందర మందిరోద్యాన భూములలో తిరుగుతూ ఉన్నప్పటికీ అహంకార రహితుడై తన చిత్తం ఇంద్రియార్థాలలో చిక్కుకొనకుండా సూర్యునిలాగా ప్రవర్తించాడు.

వ. ఇట్లధ్యాత్మయోగనిష్ఠుండై కర్మంబుల నాచరించుచు నర్చి యను భార్యయందు విజితాశ్వుండు, ధూమ్రకేశుండు, హర్యశ్వుండు, ద్రవిణుండు, వృకుండు నను నాత్మసములైన పుత్త్రుల నేవురం గనియె నంత. 640

* ఈ విధంగా పృథుచక్రవర్తి అధ్యాత్మయోగ పరాయణుడై ఆ యా కర్మలను ఆచరిస్తూ భార్యయైన అర్చిమహాదేవి వల్ల తనతో సమానులయిన విజితాశ్వుడు, ధూమ్రకేశుడు, హర్యశ్వుడు, ద్రవిణుడు, వృకుడు అనే ఐదుగురు పుత్రులను పొందాడు.

క. జనవినుత! భూమివలనను, ధనముల మర్యాదఁ గొనుచు దాననిమిత్తం
బునఁ గ్రమ్మఱఁ దా నిచ్చుచు, దిననాయకుఁ బోలి వసుమతీపతి యొప్పెన్. 641

* సూర్యుడు భూమినుంచి నీటిని గ్రహించి అవసర మైనప్పుడు వర్షించు విధంగా పృథుచక్రవర్తి ప్రజలనుండి పన్నులు గ్రహిస్తూ, అవసర మైనప్పుడు తిరిగి ప్రజలకే దానరూపంలో పంచి ఇచ్చేవాడు.

వ. అతండు మఱియు నగ్ని చందంబునం దేజోదుర్ధర్షుండును. మహేంద్రుని పగిది దుర్జయుండును, ధరణి కరణి సతతక్షమా యుక్తుండును, స్వర్గంబునుం బోలె నభీష్టదుండును, బర్జన్యుని భాతిఁ గామిత ప్రవర్షణుండును, సముద్రు రీతి గాంభీర్య యుక్తుండును, మేరువు పోలికి సత్త్వవంతుండును, ధర్మరాజు కైవడి ననుశాసకుండును, మహేంద్రుని విధంబున నైశ్వర్య వంతుండును, గుబేరుని మాడ్కి ధనవంతుండును, వరుణుని సరణి గుప్తార్థుండును, సర్వాత్మకుండగు వాయువు చెలువున బలౌజస్తేజోయుక్తుండును, రుద్రుని పగిది నసహ్యతేజుండును, గందర్పుని యనువున సౌందర్య వంతుండును, మృగరాజు నోజ నధిక శౌర్యోపేతుండును, మనువు ననువున వాత్సల్య యుక్తుండును, నజుని చందంబునం బ్రభుత్వ సమేతుండును, బృహస్పతి గరిమ బ్రహ్మవాదియు, సర్వేశ్వరుని జాడ జితేంద్రియుండునునై విష్వక్సేనానువర్తనులైన గోగురు విప్రజనంబులందు భక్తి గలిగి లజ్జా వినయశీలంబులందును, బరోపకారంబు నందును నిరుపముండై యివ్విధంబున సర్వలోక పాలక పృథగ్విధ గుణంబుల నన్నింటినిం దానొక్కరుండు ధరియించి. 642

* ఆ పృథుచక్రవర్తి అగ్నివలె చెనకరాని తేజస్సు కలవాడు. ఇంద్రునివలె జయింపరానివాడు. భూమివలె ఓర్పు కలవాడు. స్వర్గం వలె ప్రజల కోర్కెలను తీర్చేవాడు. మేఘునివలె వాంఛితాలను వర్షిస్తాడు. సముద్రం వలె గంభీరుడు. మేరుపర్వతం వలె ధీరుడు. యముని వలె శాసించేవాడు. కుబేరునివలె ధనవంతుడు. వరుణునివలె గుప్తార్థుడు, సర్వాంతర్యామి అయిన వాయువువలె బలము, ఓజస్సు, తేజస్సు కలవాడు. రుద్రునివలె సహింపరాని ప్రతాపం కలవాడు. మన్మథుని వలె సుందరుడు. సింహం వలె శౌర్యవంతుడు. మనువు వలె వాత్సల్యం కలవాడు. బ్రహ్మవలె ప్రాభవం కలవాడు. బృహస్పతి వలె బ్రహ్మవాది. శ్రీహరివలె జితేంద్రియుడు. విష్ణుభక్తులైన గోవులందు, గురువులందు, బ్రాహ్మణులయందు భక్తి గలవాడు. లజ్జాశీలుడు. వినయ వినమ్రుడు. మంచి నడవడి గలవాడు. పరోపకార పరాయణుడు. ఈ విధంగా సకల లోకపాలకుల సుగుణాల నన్నింటినీ పృథుచక్రవర్తి తనవశం చేసుకున్నాడు.

క. అనఘాత్మక! లోకత్రయ, మున సజ్జన కర్ణరంధ్రముల వినఁబడు నా
   వినుత యశోమహనీయుఁడు, జనవినుతుం డైన రామచంద్రుని మాడ్కిన్. 643

* ముజ్జగాలలోని సజ్జనులకూ వీనులవిందు చేసే విశాల యశోవిరాజితుడైన ఆ రాజచంద్రుడు జనులు తన విజయగాథలను గానం చేస్తుండగా రామచంద్రునివలె ప్రకాశించాడు.

చ. సరస వచోఽర్థ సత్పురుష సంఘు సమంచిత గీయమాన సు
   స్థిర వరకీర్తి పూరము సుధీజన కర్ణములందు నించి తా
   నిరుపమ సౌమ్య భాషణ మనీషల చేతఁ బ్రజానురక్తుఁడై
   ధరణిని రాజనామమునఁ దాఁదగు రెండవ చంద్రుఁడో యనన్. 644

* ఆ రాజేంద్రుడు రసవంతాలై రమణీయార్థాలైన వాక్కులు కలిగిన సత్పురుషులు చక్కగా గానంచేసే తన కీర్తిలహరులు విద్వాంసుల వీనులకు విందుచేయగా తన మృదుమధుర వాక్కుల చేతనూ, బుద్ధి వైభవం చేతనూ ప్రజలకు అనురాగ పాత్రుడై రెండవ చంద్రుడేమో అన్నట్లు "రాజ" శబ్దాన్ని సార్థకం చేసుకున్నాడు.

వ. మఱియు న మ్మహాత్ముండు విజ్ఞానియు, వర్ధితాశేష స్వానుసర్గుండును, ప్రజాపాలకుండును. స్థావర జంగమ వృత్తి దాయకుండును, సత్పురుష ధర్మవర్తనుండును, నిష్పాది తేశ్వరాదేశుండును నైన పృథుం డొక్కనాఁడు దన వార్ధకంబు వీక్షించి నిజాత్మజ నాత్మజుల యందు నిలిపి ప్రజలు చింతాతు రచిత్తు లగుచుండ నిజ భార్యాసమేతుండై యప్రతిహత నియమంబున వైఖానస సమ్మతంబైన యుగ్రతపంబు నందుఁ బూర్వంబున దిగ్విజయ ప్రవృత్తుండగు చందంబునం బ్రవృత్తుండై తపోవనంబునకుం జని యందు. 645

* మహానుభావుడూ, విజ్ఞానవంతుడూ అయిన పృథుచక్రవర్తి పట్టణాలనూ పల్లెలనూ వృద్ధిపొందించాడు. చక్కగా ప్రజలను రక్షించాడు. అందరికీ వృత్తులు ఏర్పాటు చేశాడు. ధర్మాన్ని సంస్థాపించాడు. ఈ విధంగా ఈశ్వరాదేశమైన తన కర్తవ్యాన్ని నిర్వర్తించాడు. ఒకనాడు ఆ మహారాజు తనకు వార్ధక్యం వచ్చినదని గ్రహించి తన ప్రియపుత్రి వంటిదైన ధరిత్రిని కొడుకులకు అప్పగించాడు. ప్రజలు విచారంతో వీక్షిస్తూ ఉండగా భార్యాసహితుడై తపోవనానికి వెళ్ళాడు. పూర్వం దిగ్విజయం చేయటానికి ఉత్సాహంతో ముందడుగు వేసినట్లే నిశ్చల నియమంతో వానప్రస్థులకు ఉచితమైన ఉగ్రతపస్సు ఆచరించటానికి ఉత్సాహంతో ముందంజ వేశాడు.

మత్త. కందమూల ఫలాశియై బహుకాల ముగ్ర తపః పరి
   స్పందుఁడై యటమీఁదటం దృణపర్ణ భక్షణసేసి యా
   చంద మేది జలాశి యై నృపసత్తముం డది మాని తా
   మంద గంధవహాశి యయ్యెఁ గ్రమంబునన్ దృఢచిత్తుఁడై 646

* ఆ మహారాజు అరణ్యంలో కందమూలాలనూ, పండ్లనూ ఆరగిస్తూ ఆరగిస్తూ బహుకాలం ప్రచండమైన తపస్సు చేశాడు. ఆపైన తృణపర్ణాలను భక్షించాడు. ఆ తర్వాత నీళ్లు మాత్రమే స్వీకరించాడు. ఆ మీద కేవలం వాయుభక్షణం చేయసాగాడు. ఈ విధంగా మహోగ్రమైన తపస్సుచేసి మనస్సును గట్టి చేసుకున్నాడు.

**వ. ఇట్లు వర్తించుచు. 647**

**సీ. మెండుగా మిటమిట మండు వేసవి యందుఁ, దప్త పంచాగ్ని మధ్యమున నిలిచి**
**మానక జడిగొన్న వానకాలంబునఁ, బైఁగోక వేయక బయట నిలిచి**
**జనులు హూహూ యను చలివేళఁ గుత్తుక, బంటి తోయముల లోపల వసించి**
**శిశిరంబు సాల నల్దిశలఁ బర్విసవేళ, వెలయ భూశయనుఁడై విశ్రమించి**

**తే. మహిత నియతిఁ దితిక్షాసమన్వితుండు, నియత పరిభాషణుఁడు జితానిలుఁడు దాంతుఁ**
**డిద్ధమతి యీశ్వరార్పిత బుద్ధి యనఘుఁ, డూర్ధ్వరేతస్కుఁడునునై క్రమోచితముగ. 648**

* ఈ విధంగా పృథుచక్రవర్తి ప్రచండమైన మండు వేసవిలో పంచాగ్నుల మధ్యలో నిలబడి తపస్సు చేశాడు. జోరున వర్షించే వానకారులో మీద బట్టలేకుండా బయట నిలిచి తడుస్తూ తపస్సు చేశాడు. వడవడ వణకించే చలిలో కుత్తుకబంటి నీటిలో నివసించి తపించాడు. శిశిర ఋతువులో ముదిరిన చలిలో కటిక నేలమీద పరుండి ధ్యాననిమగ్నుడైనాడు. గొప్పనియమంతో, ఓర్పుతో జితేంద్రియుడై మౌనవ్రతం అవలంబించి ఊర్ధ్వరేతస్కుడై వాయువును నిరోధించి ఈశ్వరార్పిత బుద్ధితో ఆ మహారాజు అత్యంత ఘోరమైన తపస్సు ఆచరించాడు.

**వ. అతిఘోరం బయిన తపం బాచరించె, నివ్విధంబునం గ్రమానుసిద్ధం బయిన తపంబున విధ్వస్తాశేష కర్మమలాశయుండును బ్రాణాయామంబులచే జితారిషడ్వర్గుండును ఛిన్నబంధనుండునునై పురుషశ్రేష్ఠుండైన పృథుచక్రవర్తి భగవంతుండైన సనత్కుమారుం డెఱింగించిన యోగ మార్గంబున సర్వేశ్వర భజనంబు గావించె, నిట్లు భగవద్ధర్మపరుండును సాధువర్తనుండును శ్రద్ధాసమన్వితుండును నైన పృథునకు నారాయణునందు భక్తి, యనన్యవిషయంబై ప్రవృద్ధం బయ్యె, న వ్విధంబున. 649**

* ఈ విధంగా క్రమంగా ప్రాప్తించిన తపోమహిమవల్ల సమస్త కర్మమాలిన్యాన్నీ తొలగించుకొని చిత్తశుద్ధి పొందాడు. ప్రాణాయామం చేత అరిషడ్వర్గాన్ని జయించాడు, బంధ విముక్తుడైనాడు. పరమ యోగి వరేణ్యుడైన సనత్కుమారుడు ఉపదేశించిన యోగమార్గాన్ని సంభావించి భగవంతుని సేవించాడు. ఈ విధంగా భగవద్భక్తిపరుడు, సాధువర్తనుడు, శ్రద్ధాసమన్వితుడు అయిన పృథుచక్రవర్తికి నానాటికీ భగవంతునిపై అనన్యమైన భక్తి పరిఢవిల్లింది.

**క. నరలోకోత్తర భగవ, త్పరిచర్యారాధనమునఁ బరిశుద్ధాంతః**
**కరణుండగు నా పృథునకు, సరసిరుహోదరు కథానుసంస్మరణమునన్. 650**

క. పరిపూర్ణంబగు భక్తిని, గర మనిశము సంశయాత్మకంబై చాలన్
వఱలిన హృదయగ్రంథిని, నిరసించు విరక్తి యుత మనీష జనించెన్. 651

* విదురా! భగవత్పరిచర్యచేతా, ఆరాధనంచేతా పృథుచక్రవర్తి అంతఃకరణం పరిశుద్ధమయింది. నిరంతర హరికథా సంస్మరణంచేత పరిపూర్ణమైన భక్తి ప్రభవించింది. ఆ భక్తి ప్రభావంవల్ల సంశయాలకు ఆశ్రయమైన హృదయగ్రంథి విచ్ఛిన్నమై విరక్తితో కూడిన విజ్ఞానం ఉదయించింది.

వ. దానంజేసి యతండు సంఛిన్న దేహాత్మజ్ఞానుండు నధిగతాత్మ స్వరూపుండునై గదాగ్రజుం డయిన శ్రీకృష్ణుని కథాసక్తి నొంది సమస్త యోగ సిద్ధులందు నిస్పృహుం డగుటను హృదయ గ్రంథి విచ్ఛేదకం బయిన జ్ఞానయోగంబును విడిచి యాత్మయందు నాత్మయోగంబుఁ గావించి బ్రహ్మభూతుండయి నిజకళేబరంబు విడువ నిశ్చయించి. 652

* అటువంటి జ్ఞానోదయంవల్ల ఆయనకు దేహాత్మబుద్ధి నశించింది. ఆత్మ స్వరూపం అవగతం అయింది. శ్రీహరి కథలలో ఆసక్తి కలిగిన వారికి యోగసిద్ధులందు ఆసక్తి ఉండదు. హృదయగ్రంథి విచ్ఛేదకమైన జ్ఞానయోగం ప్రాప్తించిన తరువాత ఆత్మయందు ఆత్మానుసంధానం చేసి కేవలం బ్రహ్మభూతుడై నిజశరీరాన్ని విడిచిపెట్టటానికి నిశ్చయించుకున్నాడు.

సీ. కోరి మడమలచే గుదపీడనము సేసి పూని ముక్తాసనాసీనుఁ డగుచుఁ
దనరు మూలాధారమున నుండి వాయువు నొయ్యన నెగయించి యొనర నాభి
కలితంబు గావించి క్రమమున హృద్వత్స కంఠ శిరః కోష్ఠకములఁ జేర్చి
కైకొని మూర్ధభాగములకు నెగయించి ప్రాణముల్ విడిచి యా పవనుఁ బవనుఁ

తే. నందు నాకాశ మాకాశమందుఁ దేజ, మందుఁ దేజంబు నుదకంబునందు నుదక
మర్థిఁ గాయంబు మేదినియందుఁ గలిపెఁ, బూని వాని యథోచితస్థానములుగ. 653

* పృథుమహారాజు చీలమండలచే గుదస్థానాన్ని పీడించి ముక్తాసనంలో ఆసీను డయ్యాడు. మూలాధారం నుండి వాయువును మెల్లగా పైకి లేపి నాభిస్థానంలోని మణిపూరక చక్రంలో నిలిపాడు. అక్కడి నుండి క్రమంగా హృదయస్థానంలోని అనాహత చక్రంలోనికి, అక్కడి నుండి కంఠానికి దిగువ ఉన్న విశుద్ధ చక్రంలోనికి అక్కడినుండి భ్రూమధ్యంలో ఉన్న ఆజ్ఞాచక్రంలోనికి ప్రవేశపెట్టాడు. అనంతరం క్రమంగా మూర్ధభాగంలోని బ్రహ్మరంధ్రంలోనికి చేర్చాడు. ఆ తర్వాత పంచభూతాలను విభజించి ప్రాణవాయువును బాహ్యవాయువునందు ఏకం చేశాడు.

వ. మఱియు భూమి నుదకంబునందును, నుదకంబును దేజమందు, దేజంబును వాయువున, వాయువు నాకాశంబునందు, నాకాశంబును మనంబున, మనంబు నింద్రియంబుల, నింద్రియంబులఁ దన్మాత్రలఁ, దన్మాత్రల భూతాదియైన యహంకారంబునందు, నహంకారంబు మహత్తత్త్వంబు నందును గూర్చి జీవోపాధి భూతంబయిన ప్రకృతియందుఁ గలిపి జీవభూతుం డయిన పృథుండు

**జ్ఞానవైరాగ్యంబుల చేత బ్రహ్మనిష్ఠుండై మాయోపాధిం బాసి ముక్తుం డయ్యె నని చెప్పి వెండియు నిట్లనియె. 654**

* అదే విధంగా ఆకాశాన్ని ఆకాశమందూ, తేజస్సును తేజస్సునందూ, జలాన్ని జలమందూ, పార్థివ శరీరాన్ని పృథివియందూ కలిపి వేశాడు. పంచభూతాల ఉత్పత్తి క్రమానుసారం భూమిని జలంలోనూ, జలాన్ని తేజస్సులోనూ, తేజస్సును వాయువులోనూ, వాయువును ఆకాశంలోనూ, ఆకాశాన్ని మనస్సులోనూ, మనస్సును ఇంద్రియాలలోనూ, ఇంద్రియాలను తన్మాత్రలలోనూ, తన్మాత్రలను అహంకారంలోనూ, అహంకారాన్ని మహత్తత్త్వంలోనూ ఏకం చేశాడు. ఆ మహత్తత్త్వాన్ని ప్రకృతిలో కలిపివేశాడు. ఈ ప్రకారం పృథుచక్రవర్తి జ్ఞానవైరాగ్యాల ప్రభావంతో మాయోపాధిని విడిచిపెట్టి బ్రహ్మనిష్ఠుడై ముక్తుడైనాడు.

**సీ. అంత నా పృథుని భార్యామణి యగు నర్చి పుడమిపై వడి నడుగిడినఁ గందు**
**సుకుమారపాదాబ్జ సుందరీరత్నంబు నతుల పతివ్రత యగుటఁజేసి**
**యాత్మేశకృత సువ్రతాచరణంబును సుమహిత భక్తి శుశ్రూషణమును**
**నార్షేయ మగు దేహయాత్రయు నను వీని చేత మిక్కిలి కృశీభూత దేహ**

**తే. యయ్యుఁ బ్రియనాథ కృత కరుణావలోక, కరతల స్పర్శనాది సత్కారములను**
**నబల సుఖవృత్తిఁ జెంది య య్యడవులందుఁ, గృశత మదిఁ దోఁపకుండఁ జరించు నపుడు.655**

* పృథుచక్రవర్తి భార్య అర్చిమహాదేవి. ఆమె పుడమిపై అడుగు ఉంచితే కందిపోయే పాదారవిందాలు, సౌందర్య సౌకుమార్యాలు కల ముద్దరాలు, సాటిలేని మహాపతివ్రత. భర్తగారి వ్రత నియమాలతో, పతిశుశ్రూషతో, తపోమయ జీవనంతో ఆమె కోమల శరీరం కృశించిపోయింది. అయినప్పటికీ ప్రాణనాథుని ప్రసన్న వీక్షణాలూ, అనురాగమయ కరస్పర్శలూ మొదలైన ఆదరాభిమానాల వల్ల ఆనందపడుతూ ఆ అడవిలో కష్టాలన్నీ మరచిపోయి కాలం గడిపింది.

**క. తన మనమున నే దుఃఖము, ననయంబు నెఱుంగనట్టి యర్చి నిజాధీ**
**శుని ప్రాణరహిత దేహము, గనుఁగొని విలపించి విగతకౌతుక యగుచున్. 656**

* ఏనాడూ ఆమె దుఃఖం అన్నమాట ఎరుగదు. ఈనాడు ప్రాణం లేని భర్త శరీరాన్ని చూచి గోడుగోడున విలపించింది. ఆమె సంతోషం అంతరించింది.

**సీ. మానిత మందర సానుప్రదేశంబు నందుఁ జితారోప మర్థిఁజేసి**
**లలిత మహానదీ సలిల సుస్నాతయై కలిత మహోదార కర్ముఁడయిన**
**నాథున కుదకదాన క్రియల్ గావించి యతిభక్తి సురలకు నతు లొనర్చి**
**వహ్నికి ముమ్మాటు వలగొని పతిపాద కమల యుగంబుఁ జిత్తమున నిలిపి**

**తే. వీరవరుఁడైన పృథు పృథివీతలేశు, నందు ననుగమనము సేయునట్టి సాధ్వి**
**నర్చిఁ గనుఁగొని దేవాంగనా సహస్ర, మాత్మనాథులఁ గూడి నెయ్యంబుతోడ. 657**

* ఆ మహాసాధ్వి మందరపర్వతం చరియలలో చితిని సిద్ధపరచింది. నదీజలాలలో స్నానం చేసి వచ్చింది. పతికి ఉదక తర్పణం కావించింది. మిక్కిలి భక్తితో దేవతలకు నమస్కరించింది. చితికి అగ్ని ముట్టించింది. మండుతున్న అగ్నికి మూడుసార్లు ప్రదక్షిణం చేసింది. మహావీరుడైన పతిదేవుని పాదపద్మాలను మనస్సులో ధ్యానిస్తూ సహగమనం చేసింది. పతితో చితిమీద సహగమనం చేస్తున్న ఆ పరమ సాధ్విని వేలకొలది దేవతాకాంతలు తమ భర్తలతో గూడి తిలకించి పులకించారు.

క. పరమోత్కంఠను న మ్మం, దరగిరి సాను ప్రదేశతలమున వరుసం
గురియించిరి నవ సురభిత, వర మందార ప్రసూన వర్షము లంతన్. 658

* అతిశయించిన కుతూహలంతో మందరపర్వత సానుప్రదేశాలనిండా క్రొత్త నెత్తావులు వెదజల్లే మందారపుష్ప వర్షాన్ని ఎడతెగకుండా కురిపించారు.

క. తరమిడి యచ్చర లాడిరి, మొరయించిరి శంఖతూర్యములు దివిజులు పా
డిరి కిన్నరజనులు పర, స్పరనుతు లొనరించి రా సుపర్వాంగనలున్. 659

* అప్సరసలు నాట్యం చేశారు. దేవతలు శంఖాలు పూరించి మంగళ వాద్యాలు మ్రోగించారు. కిన్నరులు గానం చేశారు. సురసుందరులు స్తుతించారు.

వ. మఱియు నిట్లనిరి. 660

సీ. చర్చింప నిట్టి యాశ్చర్య మెందేనియుఁ, గనుఁగొంటిరే యర్చి యను లతాంగి
ధన్యాత్మురాలు గదా తన విభుఁ గూడి, యిందిరా రమణి యజ్ఞేశుఁ గూడి
వెనుచను కైవడి ననుగమనము సేసె, ని య్యమ నిజహృదయేశుఁ డయిన
ఘను వైన్యు నూర్ధ్వలోకమ్మును బొందును, నేఁ డింతవట్టును నిశ్చితంబు

తే. పరమ యోగీంద్రులకు దుర్విభావ్యమైన, దృఢ సుకర్మమువలన నతిక్రమించి
వైన్య భూమీశు వెనుచని వరుస నూర్ధ్వ, గామినియు నయ్యె నీ యింతి ఘనత నొంది. 661

* ఇంతటి వింత మనము ఎక్కడా చూడలేదు. ఈ అర్చి పుణ్యాత్మురాలు. లక్ష్మీదేవి విష్ణుదేవుని అనుసరించినట్లు తన పతిని ఈ మహాసాధ్వి అధిగమించింది. తన భర్తతోపాటు పుణ్యలోకాలకు ఈమె తప్పకుండా వెళ్లుతుంది. ఇది ముమ్మాటికీ నిజం. పరమ యోగీంద్రులకు కూడా సాధ్యంకాని పవిత్ర ప్రవర్తనం వల్ల ఈ వధూమణి పృథు చక్రవర్తిని అనుసరించి అనన్య సామాన్యంగా ఊర్ధ్వలోకములకు వెళ్లిపోతున్నది.

వ. కాన పతివ్రతలకు నసాధ్యం బెందునుం గలదే యని మఱియును. 662

క. పరికింపఁగ నే మనుజుఁడు, హరి పదమును బొందఁ జేయు నట్టి వివేక
స్ఫురణం దనర్చు వానికిఁ, బరువడి నిలఁ బొందరాని పదముం గలదే! 663

* పతివ్రతలకు సాధ్యం కానిది ఎక్కడా ఏదీ ఉండదు. శ్రీహరి స్థానాన్ని అందించే ఉత్తమ జ్ఞానాన్ని సంపాదించిన పుణ్యాత్ములకు పొందరాని స్థానం అంటూ లేదు.

**తే. అట్టి యపవర్గ సాధన మైన మనుజ, భావ మొందియు విషయ సంబద్ధు డగుచు**
**వసుధ నెవ్వఁడు వర్తించు వాఁడు ధరణి, ననయము నిజాత్మ వంచకుఁ డనఁగఁ బరఁగు. 664**

* అటువంటి మోక్షానికి సాధనమైన మనుష్యజన్మ ఎత్తి కూడా విషయ బంధాలలో తగుల్కొని ప్రవర్తించే వాడు తనను తాను మోసగించుకొని ఆత్మవంచకు డౌతున్నాడు.

**క. అని వారలు ద న్నర్థిని, వినుతింపఁగ నర్చి యాత్మవిభుఁడగు పృథుఁ డొం**
**దిన యచ్యుతలోకంబున, ననుపమ విభవమును బొందె నని విదురునకున్. 665**

* ఈ విధంగా దేవతలు తనను కొనియాడుతుండగా అర్చిమహాదేవి తన పతియైన పృథుచక్రవర్తి పొందిన విశేష వైభవోపేతమైన విష్ణులోకాన్ని పొందింది.

**క. మునివరుఁడగు మైత్రేయుఁడు, వినయంబున నెఱుఁగఁ జెప్పి వెండియుఁ దగ ని**
**ట్లను న మ్మహాను భావుం, డనఘుఁడు భగవత్తముండు నగుఁ బృథుఁ డనఘా! 666**

**క. ఏ నీ కిప్పుడు సెప్పితి, మానుగ నీ పుణ్యకథను మహితశ్రద్ధా**
**ధీనుండై విస్ఫుర దవ, ధానుండై యెవ్వఁడేని తనరిన భక్తిన్. 667**

**క. వినినఁ బఠించిన వ్రాసిన, వినిపించిన వాఁడు పృథుఁడు విమల గతిం బొ**
**దిన క్రియ హరిపద మొందెడు, ననయము నిర్ధూతపాపుఁ డగుచు మహాత్మా! 668**

* ఈ విధంగా మైత్రేయ మహర్షి విదురునికి వివరించి చెప్పి మళ్ళీ ఇలా అన్నాడు. పృథుచక్రవర్తి మహానుభావుడు. పాపరహితుడు. పరమభాగవతుడు. ఆ పృథుచక్రవర్తి చరిత్రను నీకు చెప్పాను. ఈ పుణ్యకథను గొప్ప శ్రద్ధతో, భక్తితో వినేవారూ, చదివేవారూ, వ్రాసేవారూ, వినిపించేవారూ పాపాలు తొలగి పృథుచక్రవర్తివలె పరమ పదాన్ని అందుకుంటారు.

**సీ. బ్రాహ్మణుం డంచిత భక్తిఁ బఠించిన బ్రహ్మవర్చసము సంప్రాప్త మగును,**
**క్షత్త్రియుం డర్థిమైఁ జదివిన విన్నను జగతీ విభుత్వంబు సంభవించు,**
**వైశ్యుండు విని ధనవంతుఁడై యొప్పును శూద్రుండు వినిన సుశ్లోకుఁ డగును**
**మఱియును భక్తి ముమ్మాఱు పఠించిన విత్తవిహీనుండు విత్తపతియు**
**తే. నప్రసిద్ధుఁడు ప్రఖ్యాత యశుఁడు ప్రజలు లేని యధముఁడు వితత సంతానయుతుఁడు**
**మూర్ఖచిత్తుండు విజ్ఞాన బోధమతియు, నగుచు నుతి కెక్కుదురు మహితాత్మ! మఱియు. 669**

* ఈ పుణ్యకథను భక్తితో పఠించిన బ్రాహ్మణుడు బ్రహ్మవర్చసమునూ, క్షత్రియుడు అఖండ రాజ్యమునూ, వైశ్యుడు అపార ధనమునూ, శూద్రుడు అత్యంత కీర్తినీ పొందుతారు. ఈ పుణ్యచరిత్రను భక్తితో ముమ్మారు చదివితే దరిద్రుడు ధనవంతు డౌతాడు. అప్రసిద్ధుడు సుప్రసిద్ధ డౌతాడు. సంతానహీనుడు సంతానవంతు డౌతాడు. అజ్ఞాని విజ్ఞానవంతుడై విశేషఖ్యాతిని ఆర్జిస్తాడు.

వ. ఈ లోకంబునం బురుషులకు స్వస్త్యయనంబును నమంగళ నివారణంబును ధనప్రదంబును యశస్కరంబును నాయుష్కరంబును స్వర్గదాయకంబును గలిమలాపహంబును నైన యీ పుణ్యచరిత్రంబు చతుర్విధ పురుషార్థ కాములైన వారికిఁ జతుర్విధ పురుషార్థ కారణం బగుం గావున వినం దగు, సంగ్రామాభిముఖుండైన రా జీ చరిత్రంబు ననుసంధించి విరోధి నెదిర్చిన న వ్విరోధి పృథునకుం బోలెఁ గప్పంబు లిచ్చు, ముక్తాన్యసంగుండును భగవద్భక్తుండును నైన వాఁడు పుణ్యంబును వైన్యమాహాత్మ్య సూచకంబును నైన యీ చరిత్రంబు వినుచుం బఠియించుచుం గృతమతియై దినదినంబును నాదరంబునం బ్రకటంబు సేయువాఁడు భవసింధు పోత పాదుండైన సర్వేశ్వరుని యందు నచలం బయిన భక్తి గలిగి పృథుచక్రవర్తి వొందిన విష్ణుపదంబుం బొందునని యిప్పుణ్య చరిత్రంబు మైత్రేయుండు విదురున కెఱింగించి వెండియు నిట్లనియె. 670

* ఈ పుణ్య చరిత్ర శుభాలను కలిగిస్తుంది. అశుభాలను తొలగిస్తుంది. ధనాన్ని ఇస్తుంది. కీర్తి చేకూరుస్తుంది ఆయుస్సును పెంచుతుంది. స్వర్గాన్ని అందిస్తుంది. కలిదోషాన్ని హరిస్తుంది. చతుర్విధ పురుషార్థాలను కోరేవారికి ధర్మార్థకామ మోక్షాలను సిద్ధింపజేస్తుంది. అందువల్ల ఈ చరిత్ర వినదగినది. యుద్ధమునకు పోయేముందు రాజు ఈ చరిత్రను విని శత్రువును ఎదుర్కొంటే పృథుచక్రవర్తికి శత్రువులు చెల్లించినట్లు, శత్రువులు ఆరాజుకు కప్పాలు సమర్పిస్తారు. ఇతరసంగం మాని భగవంతునిపై మనస్సు నిలిపినవాడై ఈ పుణ్యచరిత్రను విని, చదివి, ప్రతిదినము పలువురికి చెప్పే ధన్యాత్మునికి సంసార సముద్రాన్ని దాటించే నావవంటి శ్రీహరిపాదాల మీద నిశ్చలమైన భక్తి కలుగుతుంది. అతడు పృథుచక్రవర్తి పొందిన విష్ణుపదాన్ని పొందుతాడు.

ఈ విధంగా పుణ్యచరిత్రను మైత్రేయ మహర్షి విదురునికి చెప్పి మళ్ళీ ఇలా అన్నాడు.

క. పృథునకు నర్చికిఁ బుట్టిన, పృథు కీర్తిధనుండు ఘనుఁడు పృథుతుల్యుండై
పృథుశౌర్య ధైర్య ధుర్యుఁడు, పృథివిన్ విజితాశ్వుఁ డొప్పెఁ బృథివీపతియై 671

* పృథుచక్రవర్తికీ అర్చి మహాదేవికి పుట్టిన కుమారుడు విజితాశ్వుడు. ఇంద్రుణ్ణి జయించి అశ్వాన్ని తీసుకొనిరావడంవల్ల అతని కాపేరు సార్థక మయింది. విజితాశ్వుడు వీరాధివీరుడై, విశాల యశోవిరాజితుడై, శౌర్య ధైర్యాది గుణసంపన్నుడై, తండ్రికి తగిన తనయుడై, పృథుచక్రవర్తి అనంతరం పృథివిని పరిపాలించాడు.

క. విను మంతర్ధానగతిం, దనరు సునాసీరు వలనఁ దగ విజితాశ్వుం
డును మఱి యంతర్ధానుం, డనుపేరఁ బ్రసిద్ధుఁ డయ్యె నతి చతురుండై. 672

* ఇంద్రుడు అంతర్ధానం చెంది అశ్వాన్ని అపహరించిన సందర్భంలో తానుకూడా అంతర్ధాన విద్యతో ఇంద్రుణ్ణి జయించినందువల్ల 'విజితాశ్వుడు', 'అంతర్ధానుడు' అనే బిరుదనామంతో ప్రసిద్ధుడైనాడు.

సీ. స్థిరమతి రాజ్యాభిషిక్తుఁడై య మ్మేటి సమమతి న య్యనుజన్ములైన
హర్యశ్వునకు సమాదరమునఁ దూర్పు, దక్షిణదిశఁ దగ ధూమ్రకేశునకును,

బరఁగంగ వృకునకుఁ బశ్చిమభాగంబు ద్రవిణున కర్థి నుత్తరపు దిశను,
గొమ రొప్ప నలువురకును బంచి యిచ్చి స్వకాంత యైనట్టి శిఖండినికిని

తే. మనుజ యోనిని జనియింపుఁ డనుచు మున్ను, పలికినట్టి వసిష్ఠు శాపమునఁ జేసి
పూని త్రేతాగ్ను లతనికిఁ బుత్త్రు లగుచు, జనన మొందిరి సజ్జనస్తవ్య చరిత! 673

* విజితాశ్వుడు మహారాజైన తరువాత తన నలుగురు తమ్ములలో హర్యశ్వునకు తూర్పు దిక్కునూ, ధూమ్రకేశునకు దక్షిణ దిక్కునూ, వృకునకు పడమటిదిక్కునూ, ద్రవిణునకు ఉత్తర దిక్కునూ, సమంగా పంచి యిచ్చాడు. విజితాశ్వుని భార్యపేరు శిఖండిని. "మనుష్యులై పుట్టండి"అని పూర్వం వసిష్ఠుడు ఇచ్చిన శాపంచేత గార్హపత్యము, ఆహవనీయము, దక్షిణాగ్ని అనే త్రేతాగ్నులు విజితాశ్వునికీ, శిఖండినికీ పుత్రులై జన్మించారు.

వ. వారలు పావకుండుఁ బవమానుండు శుచియు నను నామంబుల మనుష్య యోనిం బుట్టియు నాత్మప్రభావంబునం గ్రమ్మఱ నగ్నులయి చనిరి తదనంతరంబ. 674

* పావకుడు, పవమానుడు, శుచి అని వారి పేర్లు. వారు మనుష్యులై పుట్టినప్పటికీ తమ ప్రభావంచేత మళ్ళీ అగ్నులుగా రూపొంది యథాస్థానాలకు వెళ్లిపోయారు.

క. అతఁడు నభస్వతి యనియెడి, ద్వితీయ పత్ని వలనను హవిర్ధానుఁడు నా
సుతుఁగని విజితాశ్వుం డా, నతవిమతుఁడు రాజ్యవర్తనము దలపోయన్. 675

* విజితాశ్వుడు "నభస్వతి" అనే రెండవ భార్యవల్ల "హవిర్ధానుడు" అనే పుత్రుణ్ణి కన్నాడు. శత్రురాజులను లోబరచుకున్నాడు. కొంతకాలం చక్కగా రాజ్యపాలనం చేశాడు.

క. విమలాత్మ! కరాదానము, దమశుల్కాదికము గరము దారుణ మని ధై
ర్యమునన్ దీర్ఘమఖ వ్యా, జమునం దద్వర్తనంబు సమమతి విడిచెన్. 676

వ. ఇట్లు విడిచి. 677

క. అతఁ డాత్మదర్శనుం డయి, చతురతఁ బరమాత్ము హంసు సర్వేశ్వరుఁ ద
త్క్రతువున యజించి కుశలా, ద్భుత యోగసమాధి ముక్తిఁ బొందె మహాత్మా! 678

* విదురా! విను. ప్రజలను పీడించి పన్నులూ, కప్పములూ, సుంకములూ పుచ్చుకోవటం క్రూరకృత్యమని విజితాశ్వుడు భావించి ఆ పద్ధతిని పరిత్యజించాడు. సమదర్శనుడై దీర్ఘసత్రం అనే మహాయజ్ఞాన్ని ప్రారంభించాడు. ఆ యజ్ఞంలో సర్వేశ్వరుడూ హంస స్వరూపుడైన భగవంతుణ్ణి ఆరాధించి అత్యద్భుతమైన యోగసమాధి ద్వారా ముక్తిని పొందాడు.

వ. అంత విజితాశ్వుండు పరలోకగతుం డయిన హవిర్ధానుండు హవిర్ధాని యను భార్యవలన బర్హిష్మదుండు గయుండు శుక్లుండుఁ గృష్ణుండు సత్యుండు జితవ్రతుండు నను పుత్రుల నార్వురం గాంచె, నందు బర్హిష్మదుండు. 679

* విజితాశ్వుని అనంతరం అతని కొడుకైన హవిర్ధానుడికి, "హవిర్ధాని"అనే భార్యవల్ల బర్హిష్మదుడు, గయుడు, శుక్రుడు, కృష్ణుడు, సత్యుడు, జితవ్రతుడు అనే ఆరుగురు పుత్రులు కలిగారు.

**సీ.** **సంతత సవన దీక్షాశాలి యగుచు ధరాతలం బెల్లను గ్రతువులకును**
**విలసిల్లు యజనశాలలు వేఱువేఱ కల్పించి యజ్ఞములు గావించుచుండి**
**చిరకీర్తి యతఁడు ప్రాచీనాగ్రకుశలచే క్షితితలం బెల్ల నాస్తృతము సేయ**
**వసుధ యెల్లను యజ్ఞవాటమై విలసిల్ల సత్క్రియాకాండ నిష్ణాతుఁ డగుచు**

**తే.** **సుభగయోగ సమాధి నిష్ఠుఁడు ప్రజాప, తి యగునని తన్ను జనము నుతింప వెలయు**
**నట్టి ఘనుఁడు హవిర్ధాని యఖిల జగతిఁ, బఱపి కుశలను బ్రాచీనబర్హి యయ్యె.** **680**

* హవిర్ధానుని పుత్రులలో బర్హిష్మదుడు నిత్య యజ్ఞదీక్షతో భూమండలము అంతా యజ్ఞశాలలతో నింపాడు. సమస్త భూమినీ యజ్ఞవాటం చేశాడు. ప్రాచీనాగ్రాలై (తూర్పు దిక్కుకు కొనలు గల) దర్భలను భూమండలమంతా పరచి "ప్రాచీనబర్హి" అనే పేరు పొందాడు. అతని ధర్మకార్యాలకు జనులంతా మెచ్చుకొని అతణ్ణి యోగ సమాధి నిష్ఠుడనీ, ప్రజాపతి అనీ వేనోళ్ల సంస్తుతించి సంతోషించారు.

**వ.** **మఱియు నతండు.** **681**

**చ.** **అలవడ నే సతీమణి సమంచితలీల వివాహవేళ ను**
**త్కలికఁ బ్రదక్షిణంబు లిడఁగాఁ గని హవ్యవహుండు దొల్లి యి**
**మ్ముల శుకిఁజూచి మోహమును బొందినరీతి విమోహి యయ్యె నా**
**లలిత వినూత్న భూషణ యలంకృత చారు శుభాంగి వెండియున్.** **682**

* ఆయన సముద్రుని కూతురైన శతధృతి అనే అమ్మాయిని వివాహమాడాడు. శరీరమంతా నగలతో చక్కగా అలంకరించుకొని పెండ్లినాడు ప్రదక్షిణం చేస్తున్న శతధృతిని చూచి పూర్వం అగ్ని దేవుడు శుకిని మోహించినట్లే ప్రాచీనబర్హి విమోహితుడైనాడు.

**చ.** **సురుచిర భంగి నా సతి కిశోర వయఃపరిపాకయై రణ**
**ద్వరమణి హేమనూపుర రవంబు సెలంగఁగ నాడుచున్ దివా**
**కరరుచి రేఖ నొప్పెసఁగఁ గాంచి వినిర్జితులైరి దేవ కి**
**న్నర నర సిద్ధ సాధ్య ముని నాగ నభశ్చరముఖ్యు లందఱున్.** **683**

* సూర్యకాంతివలె మెఱసిపోతూ కాళ్లయందలి బంగారు అందెలు ఘల్లు ఘల్లుమని మనోహరంగా మ్రోగుతుండగా తిరుగుతున్న నవయౌవనవతియైన శతధృతి సౌందర్య వైభవం దేవతలు, కిన్నరులు, నరులు, సిద్ధులు, సాధ్యులు, మునులు, నాగులు, ఖేచరులు మున్నగు వారి నందరినీ మంత్రముగ్ధులను చేసింది.

**వ.** **అట్టి సౌందర్యఖనియు సముద్రపుత్రియు నయిన శతధృతి యను కన్యం బ్రహ్మోదేశంబునం బాణిగ్రహణంబు సేసె, నా శతధృతి వలనం బ్రాచీనబర్హికిఁ బదుగురు కొడుకులు జనియించిరి,**

**వారలు తుల్యనామ వ్రతులును ధర్మపారగులును నయిన ప్రచేతసులు, వారు ప్రజాసర్గంబునందుఁ దండ్రిచేత నాజ్ఞాపితులయి తపంబు గావింప వనంబునకుం జను సమయంబునం దన్మార్గంబునఁ బ్రసన్నుం డగుచు దృశ్యమానుండైన రుద్రునిచేత నేది యుపదేశింపంబడె దాని జపధ్యాన పూజా నియమంబుల సేవించుచుఁ దపఃపతి యైన నారాయణుం బదివేల దివ్య వత్సరంబులు పూజించి రని చెప్పిన విని విదురుండు మైత్రేయున కిట్లనియె. 684**

* అంతటి సౌందర్యవతీ, సముద్రపుత్రీ అయిన ఆ శతధృతిని బ్రహ్మదేవుని ఆజ్ఞానుసారం ప్రాచీనబర్హి పెండ్లి చేసుకున్నాడు. శతధృతివల్ల ప్రాచీనబర్హికి పదిమంది కొడుకులు జన్మించి 'ప్రచేతసులు' అని ప్రఖ్యాతి గాంచారు. వారు సమవ్రతులు, సమనాములు, ధర్మజ్ఞులు. ఆ ప్రచేతసులు తండ్రి ఆజ్ఞ తలదాల్చి ప్రజలను సృజించటం కోసం తపస్సు చేయటానికి అడవికి బయలుదేరారు. త్రోవలో వారికి రుద్రుడు సాక్షాత్కరించి దయతో నారాయణ మంత్రం ఉపదేశించాడు. ప్రచేతసులు ఆ ఉపదేశానుసారం జపధ్యాన పూజానియమాలతో నారాయణుని పదివేల సంవత్సరాలు ఆరాధించారు అని చెప్పగా విని విదురుడు మైత్రేయ మహర్షిని ఇలా ప్రశ్నించాడు.

**సీ. తాపసోత్తమ! ప్రచేతసులకు నా వన మార్గంబునందు నా భర్గుతోడ**
**సంగ మెట్లయ్యెఁ? బ్రసన్నుఁడై హరుఁ డెద్ది తివుట వారల కుపదేశ మిచ్చె?**
**జీవరాసులకు నా శివుతోడి సంగంబు గడు దుర్లభం, బీ జగంబునందుఁ**
**జర్చింప న మ్మేటి సన్మునీంద్రులకును సంచిత ధ్యానగోచరుఁడు గాని**

**తే. పుడమిఁ బ్రత్యక్షమునఁ గానఁ బడఁడు, మఱియు, నంచితాత్మ సదారాముఁ డఖిల లోక**
**రక్షణార్థంబుగా విరూపాక్షుఁ డాత్మ, శక్తితోఁ గూడి జగతిపై సంచరించు. 685**

* మునీంద్రా! ప్రచేతసులు వనమార్గంలో శివుని ఎలా కలుసుకున్నారు? శివుడు ప్రసన్నుడయి వారికి ఏమి ఉపదేశించాడు? ప్రాణులకు శివసాక్షాత్కారం ఈ లోకంలో దుర్లభం కదా! గొప్ప గొప్ప మునీంద్రులకు కూడా ఆయన ధ్యానంలోనే తప్ప ప్రత్యక్షంగా కన్పించడు కదా! అంతేగాక ఆత్మారాముడైన ఆ విరూపాక్షుడు అఖిలలోక సంరక్షణార్థమై స్వయంశక్తి సంపన్నుడై సర్వత్ర సంచరిస్తుంటాడు.

## -: రుద్రుండు ప్రచేతసులకు యోగాదేశ మను స్తోత్రముం దెల్పుట :-

**క. కావున భగవంతుండును, దేవాధీశుండు నయిన దేవుని సంగం**
**బే వెరవున ఘటియించెనో, యా విధ మంతయును దెలియ నానతి యీవే. 686**

* అటువంటి భగవంతుడూ, దేవాదిదేవుడూ అయిన మహాదేవునితో ప్రచేతసులకు సమాగమం ఎలా కలిగింది? ఈ విషయమంతా నాకు వివరించి చెప్పు.

**క. అనవుడు విదురున కమ్ముని, జననాయకుఁ డనియె నట్టి సాధుమనీషం**
**దనరు ప్రచేతసులును నిజ, జనకుని సద్భాషణములు సమ్మతి తోడన్. 687**

క. శిరమున వహించి పడమటి, కరిగెడి సమయమున నెదుర నంబుధికంటెం
బఱ పగు నొక సరసి మనో, హర నిర్మల సలిల పూర్ణమై యది మఱియున్. 688

* ఈ విధంగా ప్రశ్నించిన విదురునితో మైత్రేయమహాముని యిలా చెప్పాడు. జ్ఞానసంపన్నులయిన ప్రచేతసులు తమ తండ్రి మాటను తలదాల్చి తపస్సు చేయటానికి పశ్చిమ దిశగా వెళ్ళుతూ సముద్రంకంటే విశాలమైన ఒక పెద్ద సరస్సును చూచారు. ఆ చక్కని సరస్సు స్వచ్ఛమైన నీటితో నిండి వారి మనస్సుకు ఆనందం కలిగించింది.

సీ. రక్తోత్ప లేందీవరప్రఫుల్లాంభోజ కమనీయ కహ్లార కలిత మగుచుఁ
గంజాత కింజల్క పుంజ విక్షేపక మందగంధానిలానంద మగుచు
రమణీయ హంస సారస చక్రవాక కారండవ నినదాభిరామ మగుచు
వర మత్త మధుప సుస్వర మోద పల్లవాంకురిత లతా తరు భరిత మగుచు

తే. సిద్ధచారణ గంధర్వ సేవ్య మగుచుఁ, బుణ్యముల కాలయం బయి పొలుపు మిగిలి
లలితమై చూడ నొప్పగు లక్షణములఁ, బరఁగి శుచి లఘు మధురాంబు భవ్య మగుచు. 689

* ఆ కొలనిలో ఎర్రకలువలు, నల్లకలువలు, కమలాలు, కల్హారాలు చక్కగా వికసించి ఉన్నవి. మదించిన తుమ్మెదల మధుర ధ్వనులకు సంతోషంతో పులకరించినట్లుగా ఒడ్డున ఉన్న తీగలూ, చెట్లూ చిగురు తొడిగాయి. పద్మాలలోని పరాగాలను దిక్కులకు విరజిమ్ముతూ ఆనందంగా మందమలయానిలాలు వీస్తున్నవి. ముద్దులుమూట గట్టే హంసలూ, బెగ్గురు పక్షులూ, చక్రవాకాలూ, కన్నెలేడి పిట్టలూ వీనులవిందుగా కూస్తున్నవి. సిద్ధులు, చారణులు, గంధర్వులు అక్కడ విహరిస్తున్నారు. పుణ్యాలకు ఆలవాలమైన ఆ కొలనిలోని నీరు శుచిగా తేటగా తియ్యగా ఉన్నది.

తే. సజ్జనుని హృదయముఁ బోలి స్వచ్ఛ మగుచు, హరిపదాకృతి దివిజవిహార మగుచు
ఘనుని సిరి భంగి సర్వజీవనము నగుచు, మానవతి వృత్తి గతిని నిమ్నంబు నగుచు. 690

* ఆ సరస్సు సజ్జనుని మనస్సువలె నిర్మలంగా ఉన్నది. వైకుంఠంవలె దేవతల సంచారం కలిగి ఉన్నది. గొప్పవాని సంపదవలె యోగ్యమైన జీవనంతో ఒప్పుతున్నది. స్త్రీ స్వభావంవలె గంభీరమై ఉన్నది.

తే. శశికరంబులుఁ బోలి విశదము లగుచు, హరికథలఁ బోలి కల్మషహరము లగుచు
వహ్నులనుబోలి భువన పావనము లగుచుఁ, బొగడఁదగు నీరములచేఁ బ్రపూర్ణ మగుచు. 691

* ఆ కొలనులోని నీళ్ల చంద్రకిరణాలవలె తెల్లనివి. హరికథలవలె కల్మషాలను హరించేవి. అగ్నులవలె భువనపావనము లైనవి. అటువంటి ప్రశస్తములైన జలాలలో ఆ సరస్సు పరిపూర్ణమై ఉన్నది.

వ. ఒప్పునట్టి సరోవరంబుఁ బొడగని యందు నొక్క దివ్య పురుషునిం గని రతండును వారు. 692

మ. సమదశ్రీక మృదంగ వేణుముఖ భాస్వన్నాదమై దివ్య మా
ర్గ మనోరంజకమై తనర్చు విలసద్గాంధర్వగానంబు నె
య్యము సంధిల్లఁగ వించుఁ దన్మహిమ కత్యాశ్చర్యముం బొంది వే
గమునం దత్కమలాకరంబు వెడలెం గౌతూహలోల్లాసియై. 693

* ప్రచేతసులు ఆభవ్యమైన సరస్సులో ఒక దివ్యపురుషుణ్ణి చూచారు. వారు వీనులవిందుగా మృదంగ, వేణునాదాలతో కూడి మనోరంజకమైన గంధర్వగానాన్ని ఆలకించి ఆ సంగీత మాధుర్యానికి ఆశ్చర్య చకితు లగుచుండగా ఆ కొలనులో నుండి ఆ దివ్యపురుషుడు సంతోషంతో తటాలున వెడలి వచ్చాడు.

వ. ఇట్లు వెడలివచ్చిన. 694

మ. కని రా తాపసపుంగవుల్ దివిజలోక శ్రేష్ఠునిం దప్తకాం
చన వర్ణున్ సనకాది యోగిజన భాస్వద్గీయమానుం ద్రిలో
చను భక్తానుగుణానుగున్ సుమహితైశ్వర్యుం బ్రసాదాభిశో
భనవక్త్రున్ నిహతాఘకర్తృజన సంపద్భద్రునిన్ రుద్రునిన్. 695

* కొలనులోనుండి బయటకు వచ్చిన కారుణ్యసముద్రుడైన రుద్రుణ్ణి ఆ ప్రచేతసులు చూచారు. ఆ శంకరుడు దేవతలలో అగ్రగణ్యుడు. మేలిమి బంగారుచాయ గలవాడు. సనకాది యోగివర్యులచే సంస్తుతింప బడుతున్నవాడు. నెన్నుదుట కన్నుగలవాడు. భక్తులను వెంబడించువాడు. మహైశ్వర్య సంపన్నుడు. ప్రసన్నవదనం గలవాడు. సజ్జనులకు సంపదలు అనుగ్రహించేవాడు.

క. కని వారలు దమ మనముల, ననురాగము నద్భుతంబు ననయము వొడమన్
వినయము దోఁపఁగఁ దత్పద, వనజములకు మ్రొక్కి భక్తి వశగతు లగుచున్. 696

* ప్రచేతసులు పరమేశ్వరుణ్ణి చూచి తమ మనస్సులలో అనురాగం, అద్భుతం కలుగఁగా భక్తి పరవశులయి సవినయంగా ఆయన పాదపద్మాలకు మ్రొక్కారు.

వ. భగవంతుండును నఖిల ధర్మజ్ఞుండును గృపాళుండును భక్తవత్సలుండును దర్శనంబున నఖిల పాపహరుండును నయిన హరుండు ప్రీతుం డగుచుఁ బ్రసన్నాంతఃకరణులు ధర్మజ్ఞులు శీల సంపన్నులు సంప్రీతులు నయిన వారల కిట్లనియె. 697

* భగవంతుడూ, సకలధర్మము లెఱిగినవాడూ, దయామయుడూ, భక్తులయందు వాత్సల్యము కలవాడూ, దర్శనమాత్రంతో అన్ని పాపాలనూ తొలగించువాడూ అయిన శంకరుడు సంతోషించి పరిశుద్ధములైన మనస్సులు కలిగిన ప్రచేతసులతో ఇలా అన్నాడు.

సీ. వినుఁడు నృపాల నందనులార! మీ మదిఁ గల తలం పెల్లను గానవచ్చె,
మీకు భద్రం బగు, మీ యెడ నే ననుగ్రహబుద్ధిచే నిటు గానఁబడితిఁ,

గైకొని యిపుడు సూక్ష్మముఁ ద్రిగుణాత్మకము నగు నా ప్రకృతి కంటెను ధరణిని
బరఁగు జీవుని కంటెఁ బరుఁడైన వాసుదేవుని చరణాబ్జముల్ దనరు భక్తి

తే. నర్థి నెవ్వరు భజియింతు రట్టివారు, నాకుఁ బ్రియతముల్, వారికి నయచరిత్రు
లార! యేను బ్రియుండనై భూరి మహిమ, వెలయు చుండుదు, నది గాక వినుఁడ మీరు. 698

*రాజపుత్రులారా! మీ మనస్సులోని అభిప్రాయాన్ని గ్రహించి, మీకు మేలు చేయటం కోసం దర్శనం ఇచ్చాను. భగవంతుడైన శ్రీహరి పాదపద్మాలను భక్తితో సేవించేవారు నాకు మిక్కిలి ఇష్టులు. వారికి నేను ఇష్టుడను.

వ. స్వధర్మ నిరతుండైన పురుషుం డనేక జన్మాంతరసుకృత విశేషంబులం జతుర్ముఖత్వంబు నొంది, తదనంతరంబునం బుణ్యాతిరేకంబున నన్నుం బొంది యధికారాంతంబున నేనును దేవతా గణంబులును నవ్యాకృతంబైన యే హరిపదంబును బొందుదు, మట్టి పదంబు భాగవతుండు దనంతనె పొందుం, గావున మీరు భాగవతత్వంబు నొందుటం జేసి నాకు బ్రియంబు ఘటియింపుఁడు, భాగవత జనంబులకు నా కంటె నధిక ప్రియుండు లేఁడు, గాన వివిక్తంబును జప్యంబును బవిత్రంబును మంగళంబును నిశ్శ్రేయస కరంబును నైన నా వచనంబు నాకర్ణింపుఁడు, సర్గాదిని బ్రహ్మ నిజనందనుల కెఱింగించిన శ్రీహరి స్తోత్రంబు మీకు నెఱింగింతు, వినుం డది యెట్టిదనిన. 699

* పెక్కు జన్మాలలో స్వధర్మాన్ని ఆచరించిన పుణ్యంచేత పురుషుడు బ్రహ్మత్వమును పొందుతాడు. అంతకంటె ఎక్కువ పుణ్యం చేసినవాడు నన్ను పొందుతాడు. నేను బ్రహ్మాది దేవతలు అధికారాంతంలో పొందే విష్ణుపదాన్ని హరిభక్తుడు తనంతతానే పొందగలడు. మీరు భాగవతులు కాబట్టి నాకు సంతోషం కలిగించండి. భక్తులకు నాకంటే ఇష్టుడు మరొకడు లేడు. కాబట్టి రహస్యం, పవిత్రం, శుభప్రదం, మోక్షప్రదం అయిన నా ఉపదేశాన్ని విని జపించండి. సృష్టి మొదట బ్రహ్మ తన పుత్రులకు చెప్పిన శ్రీహరి స్తోత్రాన్ని మీకు ఇప్పుడు చెపుతాను.

క. వనజాసనుఁ డాత్మజు లగు, సనకాదులఁ జూచి పలికె సమ్మతితోడన్
వినుఁడు కుమారకులారా!, వనజోదరు మంగళ స్తవం బెఱిఁగింతున్. 700

* బ్రహ్మ పుత్రులయిన సనకాదులను చూచి యిలా అన్నాడు. పుత్రులారా! వినండి. మీకు శుభప్రదమైన నారాయణ స్తోత్రాన్ని చెపుతాను.

వ. అని హరి నుద్దేశించి వారలు విన నిట్లనియె, ' నో యీశా! యాత్మవేదులైన వారలకు భవదీ యోత్కర్షంబు స్వానందలాభకరంబు గావున నట్టి స్వానందలాభంబు మాకుం గలుగ వలయు, నీవు పరిపూర్ణానంద స్వరూపుండ, విట్టి సర్వాత్మకుండవైన నీకు నమస్కరింతు నని వెండియు నిట్లనియె.701

* బ్రహ్మ తన పుత్రులు వింటుండగా శ్రీహరిని తలచి ఇలా అన్నాడు. ~~ఈశ్వరా!~~ ఆత్మజ్ఞానులకు నీ ఉత్కర్షం ఆనందం కలిగిస్తుంది. కాబట్టి అట్టి ఆనందం మాకు కలుగుగాక! నీవు సంపూర్ణానంద స్వరూపుడవు. నీకు నమస్కారం అని మళ్ళీ ఇలా అన్నాడు.

సీ. పంకజనాభాయ సంకర్షణాయ శాం, తాయ విశ్వప్రబోధాయ భూత
సూక్ష్మేంద్రియాత్మనే సూక్ష్మాయ వాసుదే, వాయ పూర్ణాయ పుణ్యాయ నిర్వి
కారాయ కర్మనిస్తారకాయ త్రయీ, పాలాయ త్రైలోక్యపాలకాయ
సోమరూపాయ తేజోబలాఢ్యాయ స్వ, యం జ్యోతిషే దురంతాయ కర్మ

తే. సాధనాయ పురాపురుషాయ యజ్ఞ, రేతసే జీవతృప్తాయ పృథ్వీరూప
కాయ లోకాయ నభసేఽన్తకాయ విశ్వ యోనయే విష్ణవే జిష్ణవే నమోఽస్తు. 702

* లోకాత్మకమైన పద్మము నీ బొడ్డున ఉంటుంది. అహంకారానికి అధిష్ఠాత వయిన సంకర్షణుడవు నీవు. నీవు శాంతుడవు. విశ్వమునకు ఉపదేశకుడవు. తన్మాత్రలకు, ఇంద్రియాలకు నీవే ఆశ్రయము. నీవు అవ్యక్తుడవు. చిత్తమునకు అధిష్ఠాత వయిన వాసుదేవుడవు నీవు. నీవు విశ్వమెల్లా నిండినవాడవు. పుణ్యశరీరుడవు. నిర్వికారుడవు. కర్మముల నుండి దాటించువాడవు. వేదసంరక్షకుడవు. ప్రాణరూపంలో ముల్లోకాలను కాపాడే వాయురూపుడవు. నీవు సోమరూపుడవు. తేజో బలములు కలవాడవు. స్వయంగా ప్రకాశిస్తావు. నీవు అంతములేని వాడవు. కర్మములకు సాధనమైనవాడవు. పురాణ పురుషుడవు. యజ్ఞఫల రూపుడవు. జీవ తృప్తుడవు. భూ స్వరూపుడవు. లోక స్వరూపుడవు. ఆకాశం నీవే. నీవు ముఖాగ్నిచేత లోకాన్ని దహిస్తావు. నీవు సృష్టికర్తవు. విష్ణుడవు. జిష్ణుడవు. నీకు నమస్కారం.

సీ. స్వర్గాపవర్గ సుద్వారాయ సర్వ ర, సాత్మనే పరమహంసాయ ధర్మ
పాలాయ సద్ధిత ఫలరూపకాయ కృ, ష్ణాయ ధర్మాత్మనే సర్వశక్తి
యుక్తాయ ఘన సాంఖ్య యోగీశ్వరాయ హి, రణ్య వీర్యాయ రుద్రాయ శిష్ట
నాథాయ దుష్ట వినాశాయ శూన్య ప్ర, వృత్తాయ కర్మణే మృత్యవే వి

తే. రాట్ఛరీరాయ నిఖిల ధర్మాయ వాగ్వి, భూతయే నివృత్తాయ సత్పుణ్య భూరి
వర్చసేఽఖిల ధర్మదేహాయ చాత్మ, నేఽ నిరుద్ధాయ నిభృతాత్మనే నమోఽస్తు. 703

* స్వర్గాన్ని, మోక్షాన్ని పొందటానికి నీవే సాధనం. నీవు జలరూపుడవు. సూర్యుడవు. ధర్మరక్షకుడవు. మంచివారికి హితమైన ఫలాలను ప్రసాదిస్తావు. నీవు కృష్ణుడవు. ధర్మాత్ముడవు. సర్వశక్తి యుక్తుడవు. నీవు కపిలుడవు. హిరణ్యగర్భుడవు. అగ్నిరూపుడవు. రుద్రుడవు. శిష్టరక్షకుడవు. దుష్టశిక్షకుడవు. శూన్యప్రవృత్తుడవు. నీవు కర్మ స్వరూపుడవు. నీవు మృత్యుదేవతవు. నీవు విరాట్ శరీరాన్ని ధరిస్తావు. నీవు సర్వధర్మ స్వరూపుడవు. వాక్ స్వరూపుడవు. నివృత్తుడవు. గొప్ప వర్చస్సు కలవాడవు. సకల ధర్మదేహుడవు. ఆత్మ స్వరూపుడవు. అనిరుద్ధుడవు. వృద్ధిక్షయాలు లేనివాడవు. నీకు నమస్కారం.

తే. సర్వ సత్తాయ దేవాయ సన్నియామ, కాయ బహిర న్తరాత్మనే కారణాత్మ
నే సమస్తార్థ లిఙ్గాయ నిర్గుణాయ, వేధసే జితాత్మక సాధవే నమోఽస్తు. 704

* నీవు సర్వ సత్త్వుడవు. దేవుడవు. నియామకుడవు. బయటా లోపలా వ్యాపించి ఉంటావు. నీవు సమస్తార్థచిహ్న స్వరూపుడవు. నిర్గుణుడవు. సృష్టికర్తవు. జితాత్మక సాధు స్వరూపుడవు. నీకు నమస్కారం.

**వ. అని మఱియుఁ బ్రద్యుమ్నుం డవు నంతరాత్మవు సమస్త శేషకారణుండవు చాతుర్హోత్రరూపుండవు నంతకుండవు సర్వజ్ఞుండవు జ్ఞాన క్రియా రూపుండవు నంతఃకరణ వాసివియు నైన నీకు నమస్కరింతునని. 705**

* నీవు ప్రద్యుమ్నుడవు. నీవు అంతరాత్మవు. సమస్త శేషకారణుండవు. నాలుగు హోత్రములు నీవే. నీవు సర్వము తెలిసినవాడవు. నీవు జ్ఞానక్రియా స్వరూపుడవు. అంతఃకరణమందు నివసిస్తావు. నీకు నమస్కారం.

**క. అనఘా! దేవ! భవత్పద, వనరుహ సందర్శనేచ్ఛ వఱలిన మాకున్**
**విను వైష్ణవ సత్కృతమై, యెనయు భవద్దర్శనంబు నీవె మహాత్మా! 706**

* మేము నీ పాదపద్మాలను చూడగోరుతున్నాము. పరమ భక్తులు పూజించిన నీ దర్శనాన్ని మాకు ప్రసాదించు.

**వ. అది యెట్టి దనిన. 707**

**క. అనఘ! సకలేంద్రియగుణాం, జనమును భక్త ప్రియంబు జలదశ్యామం**
**బును సౌందర్య సమగ్రము, ననుపమమును నిత్య మంగళావహ మగుచున్. 708**

* నీ రూపం సర్వేంద్రియాలకు ఆనందం కల్గిస్తుంది. భక్తులకు ప్రియమైనది. సంపూర్ణమైన సౌందర్యం కలది. సాటిలేనిది. శాశ్వతమైన శుభాలను సమకూరుస్తుంది.

**వ. మఱియును. 709**

**సీ. అళికులోపమ లసదలక శోభిత మగు, నమృతాంశు రేఖానిభాననమును**
**సమకర్ణ దివ్య భూషా ప్రభాకలితంబు, సుందర భ్రూనాస సురుచిరంబు**
**సలలిత కుంద కుట్మల సన్నిభ ద్విజ, పూరిత స్నిగ్ధ కపోల యుగముఁ**
**బద్మ పలాశ శోభన లోచనంబును, మందస్మితాపాంగ సుందరమును**

**తే. సస్మితాలోక సతత ప్రసన్న ముఖముఁ, గంబు సుందర రుచిర మంగళ గళంబు**
**హారమణి కుండల ప్రభాపూర కలిత, చారు మృగరాజ సన్నిభ స్కంధ యుతము. 710**

* తుమ్మెదల గుంపువలె నీ తలవెంట్రుకలు నల్లగా శోభిస్తాయి. నీ ముఖం చంద్రునికి సాటి వస్తుంది. దివ్య భూషణాల కాంతులతో నీ చెవులు ప్రకాశిస్తాయి. నీ కనుబొమలు, ముక్కు మిక్కిలి సొగసైనవి. నీ దంతాలు మొల్ల మొగ్గలవలె తెల్లగా ఉంటాయి. నీ చెక్కిళ్లు నిగ్గు దేరుతుంటాయి. నీ కన్నులు కలువరేకులవలె ప్రకాశిస్తాయి. నీ కడకన్నులు చిరునవ్వులను చిందుతాయి. నీ ముఖం ఎప్పుడూ చిరునవ్వుతో ప్రసన్నంగా ఉంటుంది. నీ కంఠం శంఖానికి సాటి. మణికుండలాల కాంతులతో నీ మేను జిగేలుమంటుంది. నీ నడుము సింహం నడుములాగా సన్నగా ఉంటుంది.

వ. వెండియు శంఖ చక్ర గదా పద్మ కలితాయత బాహు చతుష్టయంబును, వైజయంతీ వనమాలికా కౌస్తుభమణి శ్రీవిరాజితంబును, నిత్యానపాయిని యయిన యిందిరా సుందరీ రత్న పరిస్పందంబునం దనరి తిరస్కృత నికషోపల వక్షస్థలంబును, నుచ్ఛ్వాస నిశ్వాసంబులం జంచలంబులైన వళిత్రయ రుచిర ప్రకాశమాన దళోదరంబును, బూర్వవినిర్గత నిఖిల విశ్వంబునుం బ్రవిష్టంబుఁ జేయురీతి నొందు సలిలావర్త సన్నిభ గంభీరనాభీ వివరంబును, బంకజ కింజల్క విభాసిత దుకూలనిబద్ధ కనక మేఖలా కలాప శోభితశ్యామ పృథు నితంబ బింబంబును, నీల కదళీ స్తంభరుచిరోరు యుగళంబును, సమచారు జంఘంబును, నిమ్నజాను యుగళంబును, బద్మపత్ర భాసుర పాదద్వయంబును, మదీయాంతరంగ తమోనివారక నిర్మల చంద్రశకల సన్నిభనఖంబును, గిరీట కుండల గ్రైవేయహార కేయూర వలయ ముద్రికా మణి నూపురాది వివిధ భూషణ భూషితంబును, నిరస్త సమస్త నతజన సాధ్వసంబును, భక్తజన మనోహరంబును సర్వమంగళాకరంబును నైన భవద్దివ్య రూపంబుఁ దామసజన సన్మార్గ ప్రదర్శకుండవైన నీవు మాకుఁ జూపి మమ్ముఁ గృతార్థులం జేయుమని వెండియు నిట్లనియె. 711

* నీ నాల్గుచేతులలో శంఖం, చక్రం, గద, పద్మం ఉంటాయి. "వైజయంతి"అనే వనమాలికను, "కౌస్తుభం"అనే మణిని, లక్ష్మీదేవి అనే రత్నపుటద్దమును నీవు రొమ్మున ధరిస్తావు. అందుచేత నీ రొమ్ము గీటురాయివలె ఉంటుంది. రావి ఆకువంటి నీ పొట్ట మీద ఏర్పడిన మూడుముడుతలు నీ ఉచ్ఛ్వాస నిశ్వాసాలకు కదలుతుంటాయి. నీటి సుడిగుండంవలె లోతైన నీ నాభిరంధ్రం పూర్వం బయటికి వచ్చిన సర్వప్రపంచమునూ మరల లోపలికి తీసుకొనునట్లు ఉంటుంది. నీ నల్లని బలిష్ఠమైన కటిప్రదేశంపై పద్మకేసరాల రంగుగల పట్టుపీతాంబరం, బంగారు మొలనూలూ ప్రకాశిస్తుంటాయి. నీ తొడలు నల్లని అరటి బోదెలవలె మెరుగులు చిమ్ముతాయి. నీ పిక్కలు సమంగా అందంగా ఉంటాయి. నీ మోకాళ్ళు పల్లంగా ఉంటాయి. నీ పాదాలు తామరరేకులవలె ఉంటాయి. నీ గోరు నా మనస్సులోని చీకటిని పారదోలు నెలవంకవలె ఉంటుంది. కిరీటం, కుండలాలు, కంఠహారాలు, ముత్యాల దండలు, భుజకీర్తులు, కంకణాలు, ఉంగరాలు, మణులు తాపిన అందెలు మొదలైన నానావిధాల నగలతో నీ శరీరం అలంకరింపబడి ఉంటుంది. నీ దివ్య రూపం భక్తుల సమస్త పాపాలనూ పోగొడుతుంది. భక్తుల మనస్సులకు ఆనందం కలిగిస్తుంది. నీ రూపం సర్వశుభాలకు నిలయం. నీవు అజ్ఞానులకు మంచి మార్గాన్ని చూపిస్తావు. నీవు మాకు నీ దివ్య రూపాన్ని చూపి మమ్మల్ని ధన్యుల్ని చేయవలసినదిగా వేడుకుంటున్నాము.

సీ. ఆత్మకుఁ బరిశుద్ధి నర్థించు వారికి ధ్యేయ వస్తువు భవద్దివ్యమూర్తి!
యంచిత స్వర్గరాజ్యాభిషిక్తున కైన సమధిక స్పృహణీయతముఁడ వీవు,
సద్భక్తియుత భక్తజన సులభుండవు దుష్టాత్ములకుఁ గడు దుర్లభుండ.
వాత్మదర్శనులకు నరయ గమ్యుండవు నై యర్థి విలసిల్లు దనఘచరిత!

తే. యిట్టి నిఖిల దురారాధ్య నీశు నిన్ను, నెఱయ సుజనులకైన వర్ణింపరాదు,
వఱల నెవ్వఁడు పూజించుఁవాడు విడువఁ, జాలునే పద్మదళ నేత్ర! సచ్చరిత్ర! 712

* ఆత్మ పరిశుద్ధిని కోరే వారికి నీ దివ్యమూర్తి ధ్యానింపదగినది. స్వర్గాధిపతికి అయిననూ నీవు కోరదగినవాడవే. నీవు భక్తులకు సులభుడవు. దుష్టులకు దుర్లభుడవు. ఆత్మదర్శనులు నిన్ను పొందగలరు. నీవు దురారాధ్యుడవు. నిన్ను సజ్జనులు కూడ వర్ణింపలేరు. నిన్ను పూజించువాడు నిన్ను విడువలేడు.

**చ. ఎనసిన భక్తి యోగమున నే భవదీయపదాబ్జ మొందఁగా**
**ననయముఁ గోరువాఁడు చటులాగ్రహభీషణ వీర్యశౌర్య త**
**ర్జనములచే ననూనగతి సర్వజగంబులు సంహరించు న**
**య్యనుపముఁడైన కాలుని భయంబును బొందఁడు సుమ్ము కావునన్. 713**

* భక్తియోగంచేత నీ పాదపద్మాలను ఆశ్రయించినవాడు తీవ్రకోపంతో బెదరిస్తూ సర్వలోకాలనూ ధ్వంసం చేసే యమునికి కూడా భయపడడు.

**తే. ఇట్టి నీ పాదమూలంబు లెవ్వఁడేని, పొంది ధన్యాత్ముఁడౌ నట్టి పుణ్యుఁ డొందు**
**మనము లోపలఁ గోరునే మఱచియైన, నవ్యయానంద! గోవింద! హరి! ముకుంద! 714**

* నీ పాదమూలాన్ని ఆశ్రయించిన పుణ్యాత్ముడు మరచిపోయి అయినా మనస్సులో మరొకటి కోరుకొనడు.

**క. హరి! నీ భక్త జనులతో, నిరుపమగతిఁ జెలిమిసేయు నిమిషార్ధముతో**
**సరిగాదు మోక్ష మనిన న, చిరశుభ మగు మర్త్య సుఖముఁ జెప్పఁగ నేలా? 715**

* నీ భక్తులతో చెలిమి చేసే అరనిముసంతో మోక్షం కూడా సమానం కాదు. ఇక క్షణికాలయిన లౌకిక సుఖాలను గూర్చి చెప్పేదేమిటి?

**క. దురిత వినాశక పదపం, కరుహ! భవత్కీర్తి తీర్థకణచయ బాహ్యాం**
**తర సేక ధూత కల్మష, పురుషులు ధరమీఁదఁ దీర్థభూతులు గారే! 716**

* పాపాలను నశింపజేసే పాదపద్మాలు కల పరమ పురుషా! నీ కీర్తి అనే జలకణాలతో లోపలి, బయటి మాలిన్యాన్ని తొలగించుకొన్నవారు పవిత్రులు :

**వ. అట్టి భూతదయా సమేతులును రాగాది విరహిత చిత్తులును నార్జవాది గుణ యుక్తులును నయిన భాగవత జనుల సంగంబు మాకుం గలుగంజేయు, మిదియ మమ్మనుగ్రహించుట యని వెండియు నిట్లనియె. 717**

* ప్రాణులయందు దయకలవారూ, రాగద్వేషాలు లేని మనస్సు కలవారూ, కపటం లేనివారూ అయిన సద్భక్తుల సహవాసాన్ని మాకు కలుగచెయ్యి. ఇదే మమ్ములను అనుగ్రహించడం.

**చ. సరసిజనాభ! సత్పురుష సంగసమంచిత భక్తి యోగ వి**
**స్ఫురణ ననుగ్రహింపఁబడి శుద్ధము నొందినవాని చిత్త మ**
**స్థిర బహిరంగముం గనదు, చెందదు భూరితమస్స్వరూపసం**
**సరణ గుహం జిరంబు గనఁజాలు భవన్మహనీయతత్త్వమున్ 718**

* సత్పురుష స్నేహం వల్ల సంప్రాప్తమైన భక్తియోగంచేత పరిశుద్ధుడయిన వాని మనస్సు అస్థిరాలైన బాహ్య విషయాలలో చిక్కుకొనదు. తమోరూపమైన సంసారగుహలో ప్రవేశించదు (వినాశం పొందదు). అది స్వరూపాన్ని చక్కగా తెలుసుకోగలదు.

**వ. అది యెట్టిదనిన. 719**

**సీ. అరయంగ నేమిటి యందు నీ విశ్వంబు విదితమై యుండు నీ విశ్వమందు**
**నేది ప్రకాశించు? నెప్పుడు నట్టి స్వయంజ్యోతి నిత్యంబు నవ్యయంబు**
**నాకాశమును బోలి యవిరళ వ్యాపక మగు నాత్మతత్త్వంబు నధిక మహిమ**
**నమరు పరబ్రహ్మ మగు నని పల్కి యి ట్టనియె నవిక్రియుండైన వాఁడు**

**తే. నెవ్వఁ డాతఁడు దనయందు నెపుడు నాత్మ, కార్యకరణ సమర్థంబు గాని భేద**
**బుద్ధి జనకంబు నాఁదగు భూరిమాయఁ, జేసి విశ్వంబు సత్యంబుగా సృజించె. 720**

* దేనిలోపల ఈ విశ్వం ప్రకాశిస్తుందో ఈ విశ్వం లోపల ఏది ప్రకాశిస్తుందో అటువంటి స్వయంప్రకాశమూ, శాశ్వతమూ అయిన ఆత్మతత్త్వమే పరబ్రహ్మం. ఆ పరబ్రహ్మం వికారం లేనిది. అతడు భేద బుద్ధిని కలిగించే మాయచేత విశ్వాన్ని సృజించాడు.

**ఆ. మరలఁ మరలఁ బెక్కుమాఱు లీ విశ్వంబు, జనన వృద్ధి విలయ సంగతులను**
**నందఁ జేయుచుండు నట్టి యీశ్వరుఁడవై, తనరు నిన్ను నాత్మ తత్త్వముగను. 721**

మాటిమాటికీ ఈ విశ్వాన్ని పుట్టించి, పోషించి, ధ్వంసం చేసే ఈశ్వరుడవు నీవే అని తెలుసుకున్నాము.

**వ. తెలియుదు మని వెండియు నిట్లనియె, యోగపరాయణు లగువారు శ్రద్ధా సమన్వితులై క్రియాకలాపంబుల నంతఃకరణోపలక్షితం బయిన భవదీయ రూపంబు యజింతురు, వారు వేదాగమతత్త్వ జ్ఞానులు, నీ వాద్యుండవును ననాదియు నద్వితీయుండవును మాయాశక్తి యుక్తుండవునునై విలసిల్లుచుండుదు వట్టి మాయాశక్తిచేత. 722**

* శ్రద్ధతో స్వకర్మలను ఆచరిస్తూ నీ రూపాన్ని ఆరాధించే యోగులే వేదాగమ తత్త్వజ్ఞానులు. నీవు ఆద్యుడవు. అద్వితీయుడవు.

**సీ. చతురాత్మ! సత్త్వరజస్తమోగుణములు వరుస జనించెను, వాని వలన**
**మహదహంకార తన్మాత్రనభోమరు దనల జలావని ముని సుపర్వ**

భూతగణాత్మక స్ఫురణ నీ విశ్వంబు భిన్న రూపమున నుత్పన్న మయ్యె,
దేవ! యీ గతి భవదీయ మాయను జేసి రూఢిఁ జతుర్విధ రూపమైన

తే. పురము నాత్మాంశమునఁ జెందు పురుషుఁ డింద్రి, యములచే విషయ సుఖము లనుభవించు
మహిని మధుమక్షికాకృత మధువుఁ బోలి, యతనిఁ బురవర్తి యగు జీవుఁ డండ్రు మఱియు.723

* నీ మాయాశక్తిచేత సత్త్వ రజస్తమో గుణాలు వరుసగా జన్మించాయి. ఆ త్రిగుణాలవల్ల మహత్తూ, అహంకారము, పంచతన్మాత్రలు, ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి, ఋషులు, దేవతలు, భూతగణాలు మున్నగు విశ్వం పుట్టింది. ఈ విధంగా మాయచేత నీవు సృజించిన చతుర్విధ రూపమైన పురాన్ని (దేహాన్ని) ఆత్మాంశలో పురుషుడు ప్రవేశించి తేనెను త్రాగునట్లు ఇంద్రియాలతో విషయ సుఖాలను అనుభవిస్తాడు. అతనిని జీవుడు అని అంటారు.

వ. ఇట్టి జగత్స్రష్టకుండవైన నీవు. 724

క. భూత గణంబుల చేతనె, భూతగణంబులను మేఘ పుంజంబుల ని
ర్ధూతముగఁ జేయు ననిలుని, భాతిని జరియింపఁ జేసి పౌరుష మొప్పన్. 725

* నీవు జగత్తుకు సృష్టికర్తవు. మేఘాలను చెదరగొట్టే పెనుగాలిలాగా నీవు ప్రాణులచేతనే ప్రాణులను నశింపజేస్తావు.

తే. రూఢిఁ దత్తత్క్రియాలబ్ధ రూపుఁ డవును, సుమహిత స్ఫురదమిత తేజుఁడవుఁ జండ
వేగుఁడవు నయి ఘన భుజా విపుల మహిమ, విశ్వసంహార మర్థిఁ గావింతు వీశ! 726

* ఆయా కార్యాలకు ఆయా రూపాలను పొంది, గొప్ప తేజస్సుతో, తీవ్రవేగంతో, గొప్ప భుజబలంతో నీవు విశ్వసంహారం చేస్తావు.

వ. అది యెట్లనిన. 727

క. ఇతి కర్తవ్య విచారక, మతిచేఁదగ నెప్పుడుం బ్రమత్తంబును సం
చిత విషయ లాలసము నూ,ర్జిత లోభము నైన యట్టి సృష్టి గడంకన్. 728

తే. అప్రమత్తుండ వగుచుఁ బద్మాక్ష! నీవు, మ్రింగుదువు చాల నాఁకట వ్రేఁగు చుండి
నాలుకలు గ్రోయు భూరిపన్నగము వాతఁ బడిన యెలుకను భక్షించు పగిది ననఘ! 729

* ఆకలి బాధతో నాలుకలు చాచుపాము తన నోటబడిన ఎలుకను తిన్నట్లు విషయ సుఖాలలో తగుల్కొని మదించి కర్తవ్యాన్ని ఎరుగని సృష్టిని నీవు మెలకువతో మ్రింగివేస్తావు.

చ. అనిశము నస్మదీయగురుఁడైన సరోరుహ సంభవుండు న
మ్మనువులు నాత్మసంశయము మాని భజించు భవత్పదాబ్జముల్

మనమున నిల్పి యుష్మదవమాన మహావ్యథఁ జెందునట్టి స
జ్జనుఁడు పరిత్యజించునె? భుజంగమతల్పక! భక్త కల్పకా! 730

క. కావున నాకును సూరి జ, నావళికిని సర్వసంశయంబులు వాపం
గావను బ్రోవను దగు గతి, నీవని వినుతించు నట్టి యీ స్తవ మెలమిన్. 731

* నా తండ్రియైన బ్రహ్మదేవుడు, మనువులు దృఢ విశ్వాసంతో నిత్యమూ కొలిచే పాదపద్మాలను సజ్జనుడు విడిచి పెట్టడు.

నీ నిరాదరణవల్ల అతడు గొప్ప వ్యథకు గురి అవుతాడు. కాబట్టి నాకూ, పండితులకూ సర్వసందేహాలను తొలగించి కాపాడగలవాడవు నీవే!

వ. రుద్రుండు ప్రచేతసుల కెఱింగించి వెండియు నిట్లనియెఁ, బ్రచేతసులారా! యిట్టి యోగాదేశ నామకంబైన యీ స్తోత్రంబు బహువారావృత్తిచేఁ బఠించి మనంబున ధరియించి సమాహిత చిత్తులై మీరందఱు నాదరంబున విశ్వాసయుక్తులును, స్వధర్మాచార వంతులును భగవదర్పితాశయులును నై జపియించుచు సర్వభూతావస్థితుండు నాత్మారాముండు నైన సర్వేశ్వరుని నుతించుచు ధ్యానయుక్తంబుగాఁ బూజించుచుండుఁడు, తొల్లి యీ స్తోత్రంబు భగవంతుండైన పద్మసంభవుండు సిసృక్షు వగుచు నాత్మజులమైన మాకును సృజియింప నిచ్చగించు భృగ్వాదులకును నెఱింగించె, మేము నా భృగ్వాదులును ప్రజాసర్గంబునందు బ్రహ్మ చోదితులమై యీ స్తోత్రంబునం జేసి విధ్వస్త సమస్త తమోగుణులమై వివిధ ప్రజాసర్గంబు గావించితిమి, కావున నీ స్తోత్రంబు నెల్లప్పుడు నేకాగ్ర చిత్తుండును వాసుదేవ పరాయణుండునై యెవ్వండు జపియించు, వాఁడు వేగంబె శ్రేయస్సును బొంది తదీయ జ్ఞాన ప్లవంబున వ్యసనార్ణవ రూపంబయిన సంసారంబును సుఖతరంబుగఁ దరియించు, నిట్టి మదుపదిష్టంబయిన శ్రీహరి స్తవంబు నెవ్వండు సదువుచు దురారాధ్యుండైన శ్రీహరిం బూజించు వాఁడు మదుక్త స్తోత్ర గాన సంతుష్టుండును శ్రేయస్సులకు నేకాశ్రయ భూతుండును నగు, శ్రీమన్నారాయణుని వలన సమస్తాభీష్టంబులం బొందు, నెవ్వండు ప్రభాతంబున లేచి ప్రాంజలియు శ్రద్ధా సమన్వితుండునై యీ మంగళస్తవరాజంబును విను, వినుపించు వాఁడు కర్మబంధ విముక్తుండగు నని మఱియు నిట్లనియె. 732

* అని కొనియాడినట్టి స్తవమును రుద్రుడు ప్రచేతసులకు చెప్పి మళ్లీ యిలా అన్నాడు. ప్రచేతసులారా! ఈ స్తోత్రం పేరు 'యోగాదేశము''. దీనిని పలుమారు వల్లించి మనస్సులో నిలిపి విశ్వాసంతో జపిస్తూ హరిని పూజించండి. ఈ స్తోత్రాన్ని ప్రజా సృష్టిచేయ గోరి పుత్రులమయిన మాకూ, భృగ్వాదులకూ బ్రహ్మ ఉపదేశించాడు. ప్రజాసృష్టి చేయుటకు బ్రహ్మ పురికొల్పగా మేమూ, ఆ భృగ్వాదులూ ఈ స్తోత్రాన్ని జపించాము. అందువల్ల మా తమోగుణం నశించింది. వివిధ ప్రజలను సృష్టించాము. కాబట్టి ఏకాగ్రతతో శ్రీహరిపై మనస్సు నిల్చి ఈ స్తోత్రాన్ని జపించేవాడు కొద్ది కాలంలోనే శ్రేయస్సును పొందుతాడు. ఆ జ్ఞానం అనే నావచేత దుఃఖమయమైన సంసార సముద్రాన్ని మిక్కిలి తేలికగా దాటగలడు. నేను మీకు ఉపదేశించిన

శ్రీహరి స్తవాన్ని పఠిస్తూ శ్రీహరిని పూజించేవాడు శ్రేయస్సులకు ఏకాశ్రయమైన నారాయణునివల్ల కోరిన కోర్కెలను పొందుతాడు. వేకువయందు శ్రద్ధతో ఈ స్తోత్రాన్ని వినినా లేక యితరులకు వినిపించినా, కర్మబంధాలనుండి విముక్తుడౌతాడు.

**క. నరదేవతనయులారా!, పురుషాధీశుండుఁ బరమపురుషుఁడు నగు నీ**
**శ్వరు సుస్తోత్రము మీ కా, దరమునఁ దెలిపితిని, మీరు దద్దయు భ క్తిన్. 733**

**క. ఏకాగ్రచిత్తులును సు, శ్లోకులునై జపము సేయుచును ఘనతపముం**
**గైకొని చేసిన మీకును, జేకుఱు మహితేప్సితార్థ సిద్ధి గడంకన్. 734**

**క. అని యీ గతి నుపదేశం, బొనరించి సదాశివుండు నొగి వారలచే**
**తను బూజితుఁడై వారలు, గన నంతర్ధానుఁ డయ్యెఁ గౌతుక మొప్పన్. 735**

* రాజపుత్రులారా! పురుషోత్తముడైన శ్రీహరి స్తోత్రమును మీకు ఎరిగించాను. మీరు ఏకాగ్రతతో ఈ స్తోత్రమును జపిస్తూ గొప్ప తపస్సు చేయండి. మీ కోర్కెలు సిద్ధిస్తాయి అని ఉపదేశించి ప్రచేతసులు చేసిన పూజలను గ్రహించి శివుడు అంతర్ధాన మయ్యాడు.

**వ. అంత. 736**

**తే. తివుట వారలు రుద్రోపదిష్టమైన, యచ్యుత స్తవము జపించు చయుత సంఖ్య**
**వత్సరము లుగ్ర తపము దుర్వార వారి, మధ్యమునఁ జేయుచున్న సమయమునందు. 737**

* రుద్రుడు ఉపదేశించిన నారాయణ స్తోత్రమును జపిస్తూ ప్రచేతసులు పదివేల సంవత్సరాలు నీటి నడుమ నిలబడి భయంకరమైన తపస్సు చేశారు.

## -: నారదుండు ప్రాచీన బర్హికి జ్ఞాన మార్గమును దెలియఁ జేయుట :-

**వ. ఘనకర్మాసక్త చిత్తుండై యున్న ప్రాచీనబర్హి కడకు నధ్యాత్మవేదియుం గృపాళువు నైన నారదుండు సనుదెంచి యా రాజునకు జ్ఞాన బోధంబు సేయుకొఱకు నతనితో నిట్లనియె, రాజా! యీ కర్మంబునం జేసి యెట్టి శ్రేయస్సు నభిలషించుచున్న వాఁడవట్టి యనిష్ట నిరసనంబును నభీష్ట ప్రాప్తి కరంబు నయిన శ్రేయం బీ కర్మంబు వలన లభింప దనినం బ్రాచీనబర్హి నారదున కిట్లనియె. 738**

* ఒకనాడు కర్మాసక్తుడయిన ప్రాచీనబర్హి వద్దకు అధ్యాత్మ తత్త్వవేత్త అయిన నారదమహర్షి దయతో విచ్చేసి ఈ విధంగా జ్ఞానబోధ చేశాడు. 'రాజా! దుఃఖమును తొలగించి, కోర్కెలను ప్రసాదించు శ్రేయస్సును నీవు కోరుతున్నావు. కాని అట్టి శ్రేయస్సు నీకు ఈ కర్మలవల్ల లభించదు'. అనగా విని ప్రాచీనబర్హి నారదునితో ఇలా అన్నాడు.

**సీ. అనఘ! మునీంద్ర! మహాభాగ! యేను గర్మాపహత జ్ఞాని నగుచు మోక్ష**
**మెఱుఁగంగ లే నైతి నిట్టి నా కిప్పుడు గడు విమలంబును గర్మబంధ**

**నాశకంబును నగు జ్ఞానోపదేశంబు గావింపు మతిదయాకార! కూట**
**ధర్మంబులగు గేహతతులందుఁ జెంది జా, యా తనూజాత ధనాదికములె**

**తే. భూరి పురుషార్థములు గాఁగ బుద్ధిఁ దలఁచు, మతివిహీనుండు సంసార మార్గములను**
**దగఁ బరిభ్రామ్యమాణుఁడై యొగిని మోక్ష, పదము నొందంగఁ జాలఁడు భవ్యచరిత! 739**

* మహానుభావా! కర్మాసక్తివల్ల నాకు జ్ఞానం నశించింది. అందుచేత నేను శ్రేయస్సును (మోక్షాన్ని) తెలుసుకోలేక పోయాను. కాబట్టి నాకు ఇప్పుడు కర్మబంధాలను నిర్మూలించే నిర్మలమైన జ్ఞానాన్ని ఉపదేశించు. దయామూర్తీ! కపట ధర్మాలకు ఆలవాలాలైన గృహాలలో భార్యాపుత్రులూ ధనధాన్యాలే గొప్ప పురుషార్థాలుగా భావించి సంసార బంధాలలో బద్ధుడైన బుద్ధిహీనుడు మోక్షాన్ని పొందలేడు.

**క. అనవుఁడు నతనికి నతఁ డను, ననఘా! యీ యధ్వరంబులందును గృప మా**
**లిన నీచే విశసింపం, జని కూలిన పసుల వేల సంఖ్యలఁ గనుమా! 740**

**వ. కావునం బశువ్రాతంబులు త్వదీయవైశసంబును స్మరించు చున్నవై లోహయంత్రమయ శృంగంబులచేత నెప్పుడు నీవు పరలోకంబు నొందెద వప్పుడు నిన్ను హింసింతు మని భవదీయమృతికి నెదురుచూచు చున్న, విట్టి సంకటంబు నొందం గల నీకు నిస్తారకం బయిన యొక్క యితిహాసంబు గల దెఱింగింతు విను మని యిట్లనియె. 741**

* ఆ మాటలు విని నారదమహర్షి ప్రాచీనబర్హితో ఇలా అన్నాడు. నీవు యజ్ఞాలలో దయమాలి వేలకొలది పశువులను చంపావు. అవి నీ హింసాకార్యాన్ని స్మరిస్తూ నీవు పరలోకం చేరినపుడు లోహయంత్ర మయా లయిన కొమ్ములతో నిన్ను పొడిచి హింసించాలని నిశ్చయించి నీ చావు కోసం ఎదురు చూస్తున్నాయి. ఇటువంటి గొప్ప ప్రమాదాన్ని పొందబోతున్న నీకు నిస్తారకమైన ఒక ఇతిహాసాన్ని వినిపిస్తాను విను మని ఇలా అన్నాడు.

## -: పురంజనోపాఖ్యానము :-

**సీ. భూమీశ! విను మయ్య పూర్వకాలమునఁ బురంజనుం డను నొక్క రాజు గలఁడు,**
**అతని కవిజ్ఞాతుఁ డనుపేరఁ దగిలి విజ్ఞాత చేష్టితుఁ డగు సఖుఁడు కలఁడు,**
**ఆ పురంజనుఁడు పురాన్వేషియై ధరాచక్రంబుఁ గలయంగ సంచరించి**
**తన కనురూపమై పెనుపొందు పుర మెందు వీక్షింపఁ జాలక విమనుఁ డగుచు**

**తే. నే పురము లుర్విఁ బొడఁగనె నా పురములు, గామములఁ గోరు తనకు న క్కామములను**
**బొందుటకు వానిని ననర్హములుగఁ దన మ, నమునఁ దలఁచి యొకానొకనాఁ డతండు. 742**

* పూర్వకాలంలో పురంజనుడు అనే ఒక రాజు ఉండేవాడు. అతనికి అవిజాతుడు అనే పేరు కలిగిన మిత్రుడు ఉండేవాడు. అతడు విజ్ఞాత చేష్టితుడు. ఆ పురంజనుడు తాను సకల భోగాలనూ

అనుభవించటానికి తగిన పురాన్ని వెదకుతూ భూమండలమంతా తిరిగాడు. కాని అతనికి అలాంటి పురము కన్పించలేదు. అందుకు అతడు దిగులు పడ్డాడు. తాను భూమిమీద చూచిన పురములు, తాను కోరిన కోర్కెలను పొందటానికి అనువైనవి కావని మనస్సులో భావించాడు.

**వ. చనుచున్న సమయంబున హిమవత్పర్వత దక్షిణ సానువులందు. 743**

**సీ. వరనవ ద్వార కవాట గవాక్ష తోరణ దేహళీగోపురముల నొప్పి**
**ప్రాకార యంత్రవప్రప్రతోళీ పరిఖాట్టాల కోపవనాళిఁ దనరి**
**సౌవర్ణ రౌప్యాయస ఘన శృంగంబుల రమణీయ వివిధ గేహముల మించి**
**రథ్యాసభా చత్వరధ్వజ క్రీడాయతన సుచైత్యాపణతతిఁ దనర్చి**

**తే. మరకత స్ఫటిక విదూర మణి వినూత్న, మౌక్తికాయుత ఖచిత హర్మ్యములు గలిగి**
**విద్రుమ ద్రుమ వేదుల వెలయు నొక్క, పురముఁ గనియె భోగవతినిఁ బోలు దాని. 744**

* ఒకనాడు పురంజనుడు హిమవత్పర్వతం దక్షిణసానువులలో ఒక పురమును చూశాడు. తొమ్మిది ద్వారాలు, తలుపులు, కిటికీలు, బయటి ద్వారం, గుమ్మాలు, గోపురాలు, ప్రహరిపై యంత్రాలు, కోటగోడలు, పెద్ద వీథులు, కోట బురుజులు, ఉద్యానవనాలు, బంగారు వెండి యినుముతో చేసిన పెద్ద శిఖరాలతో మెరిసే సుందర గృహాలు, రాజమార్గాలు, కొలువు కూటాలు, చతుష్పథాలు, జెండా స్తంభాలు, జూదగృహాలు, రచ్చబండలు, అంగళ్ళు; పచ్చలు, స్ఫటికాలు, రత్నాలు, మణులు, క్రొత్త ముత్యాలు తాపిన మేడలు, పగడాలు కూర్చికట్టిన తిన్నెలు మున్నగు సర్వలక్షణాలు కలిగి ఆ పురము నాగులపురమైన పాతాళంలాగా ఉన్నది.

**వ. ఇట్లు గనుంగొని యనంతరంబ ముందటం బురబాహ్యాంతరంబున దివ్యద్రుమ లతాకుంజ పుంజంబును, సమద నదద్విహంగ మత్త మధుకర కుల కోలాహల సంకుల జలాశయ శోభితంబును, హిమనిర్ఝ రబిందు సందోహ పరిస్పంద కందళిత మందమలయ మరుదుచ్చలిత ప్రవాళ విటప నళినీతటంబును, బాంథజన మనోరంజనాహ్వాన బుద్ధిజనక కలహంస రాజకీర కోకి లాలాప విరాజమానంబును, మునివ్రత నానావిధ వనమృగవ్రాత బాధా రహితంబును, నైన పురబాహ్యోద్యాన వనంబునందు యాదృచ్ఛికంబుగ నేకైక శతనాయకంబైన యనుచర దశకంబును, బంచమస్తకసర్ప ప్రతీహారుండును దోడరా! జనుదెంచుచున్న భర్త్రన్వేషిణియుం గామరూపిణియు నప్రౌఢయు నయినయట్టి. 745**

* ఆ పురము వెలుపల దివ్య వృక్షాలతో పొదరిండ్లతో నిండిన ఉద్యానవనం ఉన్నది. అక్కడ పక్షులు, తుమ్మెదలు చేసే ధ్వనులతో సరస్సులు కోలాహలంగా ఉన్నాయి. సెలయేళ్లలోని మంచునీటి మీదుగా వచ్చే పిల్లగాలులకు, కొలనుల ఒడ్డున ఉన్న చెట్ల కొమ్మలూ, చిగురులూ ఊగుతున్నాయి. బాటసారులను పిలుస్తున్నవేమో అన్నట్లుగా రాజహంసలు, చిలుకలు, కోయిలలు తియ్యగా కూస్తున్నాయి. పెక్కురకాల వన్యమృగాలు ఎవ్వరికీ హానిచేయకుండా తిరుగుతున్నాయి. ఆ తోటలో పురంజనుడు ఒక యువతిని

చూశాడు. పదిమంది అనుచరులు అమెతో వస్తున్నారు. వారిలో ఒక్కొక్కడు నూరుమందికి నాయకుడు. ఆమెకు కావలిగా ఐదు తలలపాము ముందు నడుస్తున్నది. ఆ స్త్రీ కామరూపిణి, వరునికోసం వెదకుతున్నది.

సీ. ఘన సమవిన్యస్త కర్ణ కుండల రుచుల్ గండభాగంబుల నిండి పర్వఁ
దమ్మిరేకులసిరిఁ దటమటింపఁగ జాలు మెఱుఁగుఁ గన్నులు దలఁ దిరిగి రాఁగ
జఘన సంకలిత పిశంగ నీవీద్యుతి కనక కాంచీరుచిఁ గరము పెనుపఁ
జరణ సరోజ భాసుర చలన్నూపుర ఝణ ఝణ ధ్వని నర్మ సరణిఁ జూప

తే. లలిత యౌవన లక్ష్మీ విలాస భాసు, రోదయ వ్యంజిత ప్రభాయుక్త పీన
సమ నిరంతర కుచకుట్మలముల వ్రీడఁ, జెంది పయ్యెదఁ గప్పు బాలేందుముఖిని. 746

వ. మఱియును బాలయు సుదతియు గజగామినియు నయిన యొక్క ప్రమదోత్తమం గాంచి. 747

* ఆమె చెవికుండలాల కాంతి చెక్కిళ్లపై వ్యాపిస్తున్నది. ఆమె కన్నులు తామరపూల రేకులవలె సోగలై తలను చుట్టి వస్తున్నాయి. ఆమె పిరుదులపై ధరించిన పసుపు పచ్చని వలువ బంగారు మొలనూలి కాంతిని అధికం చేస్తున్నది. ఆమె కాలి అందెల ఝణఝణ ధ్వనులు మేలమాడు తున్నట్లుగా ఉన్నాయి.

యౌవనం రావటం వల్ల నిండుగా అందంగా ఉన్న చందోయి సిగ్గుపడుతూ పైటతో కప్పుతున్నది. ఆమె దంతాలు తళ తళ మెరుస్తున్నవి. ఆ గజగమన మెల్లగా వస్తున్నది.

క. తరమిడి ప్రేమోద్గమమై, మరువిండ్లం బోలు కన్బొమలు గల తరుణీ
సరసాపాంగ విలోకన, శరపరివిద్ధాంగుఁ డగుచు జనవిభుఁ డనియెన్. 748

* ఆమె కనుబొమలు మన్మథుని ధనుస్సులాగా ఉన్నాయి. ఆమె కడకంటి చూపులు బాణాలలాగా ఉన్నాయి. ఆమె చూపులు తన శరీరానికి తగిలి వలపు కలిగిన రాజు ఇలా అన్నాడు.

క. 'ఎవ్వరి దానవు? జనకుం, డెవ్వఁడు? పేరేమి? భృత్యు లీ పది యొక రిం
దెవ్వరు? సతు లెవ్వరు? మఱి, యివ్వనమున నుండఁ గార్య మెద్ది మృగాక్షీ! 749

క. భవదీయ పురస్సరుఁ డగు, పవనాశనుఁ డెవ్వఁ డతికృపామతి నాకున్
వివరింపు మనుచు వెండియు, ధవళేక్షణఁ జూచి ధరణిధవుఁ డిట్లనియెన్. 750

* "నీవు ఎవరి దానవు? నీ తండ్రి ఎవరు? నీ పేరేమిటి? ఈ పది మంది సేవకులూ ఎవరు? ఈ స్త్రీలు ఎవ్వరు? ఈ అడవిలో ఎందుకు ఉంటున్నావు? నీ ముందు నడుస్తున్న ఈ పాము ఎవరు? నాకు వివరించు" అని రాజు మళ్లీ ఇలా అన్నాడు.

సీ. తరళాక్షి! పతి యగు ధర్ము నన్వేషింపఁ జరియించు హ్రీ యను సతివొ, కాక
రుద్రు నన్వేషించు రుద్రాణివో కాక బ్రహ్మను వెదకు భారతివొ, కాక,

నారాయణుని భక్తిఁ గోరి యన్వేషించు నిందిరవో, కాక యెవ్వరీవు?
త్వత్పాద కామనత్వమునను సంప్రాప్త సకల కాముండగు సరసు నెట్టి

తే వాని వెదకెదు? తరుణీ? భవత్కరాగ్ర, పద్మకోశంబు నేఁడెందుఁ బతిత మయ్యె?
నాకు నెఱిఁగింపఁ దగుదు వివేక చరిత, యని నృపాలుఁడు మఱియు నిట్లనియె సతికి. 751

* నీవు ధర్ముని భర్తగా కోరి వెదకుచున్న హ్రీవా! లేక పరమశివుని వెదకు పార్వతివా? బ్రహ్మను వెదకు భారతివా? శ్రీహరిని వెదకు శ్రీదేవివా? నీ వెవరవు? నీ పాదములను కోరిన రసికుడు సకల కామములను పొందుతాడు కదా! నీవు వెదికే సరసు డెవరు?

క. కర మొప్పఁగ నీ విటు భూ, చర వగుటను హ్రీవి శివవు శారదవును సా
గర కన్యవుఁ గాకుండుటఁ, దరుణీ? పొడగంటి నని పదంపడి పలికెన్. 752

* నీవు నేలపై అడుగులు మోపి తిరుగుతున్నందువల్ల నీవు హ్రీవి, పార్వతివి, సరస్వతివి, లక్ష్మివి కావు అని నేను గ్రహించాను.

సీ. మొనసి యదభ్రకర్ముఁడ నైన నాచేత నిపుడు పాలితమైన యీ పురంబు
సరసిజోదరుని భుజాపాలితోదాత్త లలిత వైకుంఠ మలంకరించు
నిందిరా సుందరి చందంబునను నీ వ లంకరింపఁ గడంగు పంకజాక్షి!
యది గాక తావకీనాపాంగరుచి మోహితాంతరంగుండ నైనట్టి నన్ను

తే. మహిత సవ్రీడ భావ సన్మందహాస, చారు విభ్రమ భ్రూలతా ప్రేరితుఁడుగఁ
దనరు భగవంతుఁ డగునట్టి మనసిజుండు, పడఁతి! యుడుగక పీడింపఁ దొడఁగె నిపుడు. 753

* విష్ణువు పాలించే వైకుంఠాన్ని లక్ష్మీదేవి అలంకరించునట్లు నేను పరిపాలించే ఈ పురాన్ని నీవు అలంకరించు. నీ కడగంటి చూపుల కాంతికి నా మనస్సు లొంగిపోయింది. నీ సిగ్గు, చిరునవ్వు, విలాసాలు వెదజల్లే కనుబొమలు - వీటిచేత పురికొల్పబడి మన్మథుడు నన్ను బాధిస్తున్నాడు.

వ. కావున 754

చ. తరుణి! సుతారలోచన యుతంబును మంజుసుధాసమాన భా
సుర మృదువాక్యయుక్తమును శోభిత కోమల లంబమాన సుం
దర చికురాభిరామము నుదారము నైన భవన్ముఖాబ్జమున్
సురుచిరలీల నెత్తి ననుఁ జూడుము, సిగ్గను జెంద నేటికిన్? 755

* కమనీయమైన కనీనికలు గల కన్నులతో, అమృతంలాగా తీయనైన పలుకులతో, పొడవైన తలవెంట్రుకలతో, సొగసులు విరజిమ్మే నీ ముఖ పద్మాన్ని ఎత్తి నా వంక చూడు. సిగ్గుపడకు.''

వ. అని యి వ్విధంబున నధీరుం డై పలుకు పురంజనుం జూచి యా ప్రమదోత్తమ వీరమోహితయై
సస్మితానన యగుచు నానందంబు నొంది యిట్లనియె. 756

* ఇలా ధైర్యం కోల్పోయి పలుకుతున్న వీరుడైన పురంజనుని చూచి వలచి, చిరునవ్వు చిందిస్తూ ఆమె ఇలా అన్నది.

క. **పురుషవర! నాకు నీకును, గురువును నామమును గులముఁ గోరి యెఱుఁగ నీ**
**పురమున నుండుదుఁగా, కీ, పురమును నిర్మించి నట్టి పురుషు నెఱుంగన్.** 757

* "పురుష వరేణ్యా! నన్ను, నిన్ను ఎవరు సృష్టించారో నాకు తెలియదు. నీకూ, నాకూ, కులమూ, పేరూ ఏర్పరచిన వారెవరో నాకు తెలియదు. నేను ఈ పురంలో ఉంటాను. కాని ఈ పురాన్ని ఎవరు నిర్మించారో నాకు తెలియదు.

క. **వీరుల నా సఖు లీలల, నారత్నము లార్యవినుత! నా చెలు! లీ వ్ప**
**ద్ధోరగ మే నిద్రింపఁగ, ధీరత మేల్కాంచి పురము ధృతిఁ బాలించున్.** 758

* ఈ పురుషులు నా స్నేహితులు. ఈ స్త్రీలు నా చెలికత్తెలు, ఈ ముసలి పాము నేను నిద్రించినప్పుడు మేల్కొని ఉండి పురాన్ని రక్షిస్తుంది.

వ. **వెండియు నిట్లనియె.** 759

సీ. **మనుజ నాయక! నీవు మద్భాగ్య వశమున నిటకు నేతెంచితి, విపుడు నీకు**
**మంగళంబగు, నీవు మహితేంద్రియగ్రామ భోగ్యంబు లగు కామపుంజములను**
**నర్థి సంపాదింతుఁ వనఘాత్మ! యీ నవ ద్వార ప్రయుక్తమై తనరు పురము**
**నీవు గైకొని యేలు, నీ కంటె దీనికి నధిపుఁ డన్యుండు లేఁ డనఘ! యందు**

తే. **మదుపనీతములైన కామముల ననుభ, వింపఁగ సమాశత మధిష్ఠింపు మెలమిఁ,**
**గోరి నీకంటెఁ బ్రియులు నెవ్వారు నాకు? నరసి చూడంగ మనుజేంద్ర! యదియుఁగాక.** 760

* రాజేంద్రా! నా అభీష్టం వల్ల నీవు ఇక్కడికి వచ్చావు. నీకు శుభం కలుగుతుంది. నీవు ఇంద్రియాలచేత అనుభవింపదగిన సుఖములను పొందుతావు. తొమ్మిది ద్వారములు కలిగిన ఈ పురమును నీవు స్వీకరించి పరిపాలించు. ఇందుకు నీకంటె తగిన రాజు మరొకడు లేడు. నేను అందించే సౌఖ్యాలను ఈ పురములో నూరేండ్లు అనుభవించు. నీకంటే నాకు ఇష్టులయిన వారు లేరు.

వ. **మఱియు రతిజ్ఞాన విహీనుండు నకోవిదుండు నిహపరచింతా శూన్యుండుఁ బశుప్రాయుండుఁ ద్వదన్యుండు నైన వాని నెవ్వని వరియింతు? గృహస్థాశ్రమమందు ధర్మార్థ కామ మోక్ష ప్రజానందంబులును యశంబును యతి వేద్యంబులు గాని రజస్తమో విహీన పుణ్యలోకంబులును గలుగుఁ, బితృదేవర్షి మర్త్యభూత గణంబులకుం దనకు నీ లోకంబున గృహస్థాశ్రమంబు సర్వక్షేమార్థం బయిన యాశ్రమం బండ్రు, గావున వదాన్యుండవు, వీర విఖ్యాతుండవు, ప్రియదర్శనుండవు, స్వయం ప్రాప్తుండవు నయి భోగి భోగ సదృశ భుజాదండంబులచే నొప్పు భవాదృశుం దగిలి మాదృశయగు కన్య వరియింపకుండునే యని వెండియు.** 761

* నిన్ను కాదని రతిజ్ఞానము లేనివాడూ, అపండితుడూ, ఇహపరచింతా శూన్యుడూ, పశుప్రాయుడూ అయిన మరొకనిని ఎలా వరిస్తాను? గృహస్థాశ్రమంలో ధర్మార్థకామ మోక్షాలు, సంతాన సుఖం, కీర్తి, రజస్తమస్సులు లేని పుణ్యలోకాలు లభిస్తాయి. పితృదేవతలకు దేవర్షులకు, మానవులకు, భూతగణాలకు తనకు గృహస్థాశ్రమం ఈ లోకంలో సర్వక్షేమాలూ కలిగించే ఆశ్రమం అని అంటారు. కాబట్టి దాతవు, వీరుడవు, సుందరుడవు, స్వయంగా లభించిన వాడవు, సర్పాలవంటి భుజదండాలు కలిగినవాడవు అయిన నిన్ను నావంటి కన్య వరించకుండా ఎలా ఉండగలదు?

**క. కరుణారస పరిపూర్ణ, స్ఫురిత స్మిత రుచి విలోక పుంజముచేతం**
**గర మర్థి దీన జన భయ, హరణుఁడవై సంచరింపు మఖిల జగములన్. 762**

* కరుణా రసంతో నిండి, చిరునవ్వు కాంతులు విరజిమ్ము చూపులతో దిక్కులేనివారి భయాన్ని తొలగిస్తూ సర్వలోకాలలో విహరించు''.

**క. అని యీ గతిఁ బలికిన యా, వనజాక్షిఁ బురంజనుండు వరియించి ముదం**
**బున నన్యోన్య ప్రీతిం, దనరుచుఁ దత్పురము సొచ్చి ధన్యుం డగుచున్. 763**

* అని యీ విధంగా పల్కిన ఆ స్త్రీని పురంజనుడు వరించాడు. వారిద్దరూ ఒకరిపై నొకరు ప్రీతిగలవారై ఆ పట్టణంలో ప్రవేశించారు.

**చ. శతసమకాల మప్పురి నజస్రము భూరి సమస్త సౌఖ్య సం**
**గతులఁ దనర్చి వందిజన గాయక సద్వినుతోరు గాన మో**
**దిత మతి నొప్పి సుందరసతీ జనసేవితుఁడై నృపాల కో**
**చిత లలితస్థలంబుల వసించుచుఁ గ్రీడలు సల్పుచుండఁగన్. 764**

* పురంజనుడు ఆ పురంలో సర్వసౌఖ్యాలూ పొంది వందిగాయకుల గానాలను విని సంతోషిస్తూ, అందగత్తెల సేవలు అందుకుంటూ, రాజులకు తగిన సుందర ప్రదేశాలలో నివసిస్తూ వందసంవత్సరాలు క్రీడించాడు.

**క. నరనాథుఁడు లోకభయం, కరగతి వర్తించు గ్రీష్మకాలము దోఁపం**
**దరళ లహరీ మనోహర, వరహ్రదిని సలిలమందు వసియించెఁ దగన్. 765**

* అంతలో లోకభీకరమైన వేసవి కాలం వచ్చింది. పురంజనుడు తళతళ మెరుస్తున్న కెరటాలతో మనస్సునకు విందు చేస్తున్న ఏటినీటిలో ప్రవేశించాడు.

**వ. ఇట్లు వసియించి కతిపయ దినంబు లగు సమయంబున. 766**

**సీ. అవనీశ్వరో త్తమ! య ప్పురంబున నాల్గు వంకలనున్న గవఁకులు వినుము**
**తూర్పు దిక్కునను నై దును దక్షిణోత్తరంబుల రెండుఁ బశ్చిమంబునను రెండుఁ**

గాఁగ నా తొమ్మిది గవఁకుల నుపరి దిక్కున నేడుఁ గ్రింది దిక్కునను రెండు
నయి యుండు, మఱి వానియందుఁ బృథగ్విధ విషయ గత్యర్థమై వెలయు నీశ్వ

తే. రుం డొకం డరయఁ గలండు రూఢిఁ దత్పు, రంబుఁ బాలించునట్టి పురంజనుండు
నా పురద్వార నవకంబు, నందులోన, నర్థిఁ బ్రాగ్ద్వార పంచకమందు వరుస. 767

వ. ఖద్యోతయు హావిర్ముఖియు నను నామంబులు గల ద్వార యుగంబున ద్యుమత్సఖుఁడై విభ్రాజితాఖ్య జనపదంబును బొందు, వెండియు నళినియు నాళినియు నను పేళ్లు గల వాకిళ్లు రెంటియందు నవధూతసఖుండై సౌరభరూపంబులయిన విషయంబులం బొందు, మఱియు ముఖ్యానామకం బైన ప్రధానప్రాగ్ద్వారంబున రసజ్ఞ విపణాన్వితుండై యాపణబహూదనంబులను విషయంబులనొందుఁ, బితృహూ నామకం బయిన దక్షిణద్వారంబున శ్రుతధరాన్వితుండై దక్షిణ పాంచాలంబను రాష్ట్రంబు నొందు, దేవహూ నామకం బైన యుత్తరపు వాకిట శ్రుతధరాన్వితుండై యుత్తర పాంచాలంబను రాష్ట్రంబు నొందు, వెండియుం బడమటి వాకిళ్లు రెంటియందు నాసురీ నామకంబైన వాకిట దుర్మద సమేతుండై గ్రామక నామకంబైన విషయంబును, నిర్ఋతి నామకం బయిన వాకిటియందు లుబ్ధకయుక్తుండై వైశసంబను విషయంబు నొందుచుండు, వెండియుం బురంజను డప్పురంబునం బౌరజనంబులందు నిర్వా క్పేశస్కరులను నిద్దఱంధులు గలరు. వారలచేత గమన కరణంబులను క్రియలనొందుచు నంతః పురగతుండగు నప్పుడు విషూచీన సమన్వితుండై జాయాత్మ జోద్భవంబులైన మోహ ప్రసాద హర్షంబుల నొందుచుండు, నివ్విధంబునం గర్మాసక్తుఁడు గామాత్మకుండునై బుద్ధియను మహిషిచేత వంచితుం డయ్యె, న క్కామినియు. 768

* ఆ పురములో తూర్పున ఐదు, దక్షిణమున ఒకటి, ఉత్తరమున ఒకటి, పడమట రెండు - ఈ విధంగా నాల్గు దిక్కులలో మొత్తం తొమ్మిది ద్వారాలు ఉన్నాయి.

ఆ తొమ్మిది ద్వారాలలో పై భాగంలో ఏడు, క్రింది భాగంలో రెండు ఉన్నాయి. అందులో వేరువేరుగా విషయాలను పొందటానికి ఒక పురుషుడు ఉన్నాడు. అతడు ఆ పురాన్ని పరిపాలిస్తూ ఉంటాడు. అతని పేరు పురంజనుడు. ఖద్యోత, హావిర్ముఖి అనే పేర్లు గల రెండు తూర్పు ద్వారాలు ఒక్కచోట ఉంటాయి.

ఆ పురుషుడు ద్యుమంతుడు అనే చెలికాని తోడ్పాటుతో ఆ ద్వారాలలో నుండి విభ్రాజితము అనే జనపదానికి వెళ్లుతుంటాడు. నళిని, నాళిని అనే రెండు తూర్పు ద్వారాలు ఒక్కచోట ఉంటాయి. వాటి నుండి అవధూత అనే స్నేహితుని తోడ్పాటుతో సౌరభము అనే విషయమునకు వెళ్లుతుంటారు. తూర్పున ఉన్న ప్రధాన ద్వారం పేరు ముఖ్య. అది ఒక్కటే ఒకచోట ఉంటుంది. ఆ పురరాజు రసజ్ఞుడు, విపణుడు అనే మిత్రుల తోడ్పాటుతో ఆపణ బహూదనములు అనే విషయాలకు పోతుంటాడు.

దక్షిణ ద్వారం పేరు పితృహువు. శ్రుతధరునితో గూడి దాని నుండి దక్షిణ పాంచాలం అనే రాష్ట్రానికి పోతుంటాడు. ఆసురి అనే పడమటి వాకిలినుండి దుర్మదునితో గూడి గ్రామకము అనే దేశానికి పోతుంటాడు.

నిర్ఋతి అనే పడమటి వాకిలి నుండి లుబ్ధకునితో గూడి వైశసము అనే విషయానికి వెళ్లుతుంటాడు. దేవహువు అనే పేరు కల్గిన ఉత్తరపు వాకిలినుండి శ్రుతధరునితో గూడ ఉత్తర పాంచాలం అనే రాష్ట్రానికి పోతుంటాడు.

ఆ పురంజనుడు ఆ పురంలోని పౌరులలో ఉండే నిర్వాక్కు, పేశస్కరుడు అనే ఇద్దరు గ్రుడ్డివారి సాయంతో గమనము, కరణము అనే పనులను నెరవేరుస్తాడు. అంతఃపురంలో ఉన్నప్పుడు విషూచీనముతో కలిసి భార్యాపుత్రులవల్ల కలిగిన మోహ ప్రసాద హర్షములను పొందుతుంటాడు. ఈ విధంగా పురంజనుడు కామాసక్తుడై కామసాధనములైన కర్మములలో తగుల్కొని బుద్ధి అనే పట్టపుదేవిచేత మోసగింపబడ్డాడు.

**సీ. పానంబు సేసినఁ దానుఁ బానముఁ జేయుఁ గుడిచినఁ దానును గుడుచు మఱియు**
**భక్షింపఁ దానును భక్షించు, నడచిన నడచును, నవ్విన నవ్వు, నేడ్వ**
**నేడుచుఁ, బాడినఁ బాడు, విన్నను వినుఁ, జూచినఁ జూచు, గూర్చున్న నుండు,**
**దుఃఖింప దీనుఁడై దుఃఖించు, నిలిచిన నిలుచు, నిద్రింపఁగ నిద్రవోవు**

**తే. ముట్టినను ముట్టు, మూర్కొన్న మూరు కొనును, బలుకఁ బలుకును, బవళింపఁ బవ్వళించు**
**హర్షమును బొంద నాత్మను హర్ష మొందు, మోదమును బొంద దానును మొద మందు. 769**

* పురంజనుడు రాణి త్రాగితే తాను త్రాగుతాడు. ఆమె భుజిస్తే తాను భుజిస్తాడు. నడిస్తే నడుస్తాడు. నవ్వితే నవ్వుతాడు. ఏడిస్తే ఏడుస్తాడు. పాడితే పాడుతాడు. వింటే వింటాడు. చూస్తే చూస్తాడు. కూర్చుంటే కూర్చుంటాడు. దుఃఖిస్తే దుఃఖిస్తాడు. నిలబడితే నిలబడతాడు. నిద్రిస్తే నిదురిస్తాడు. ముట్టుకుంటే ముట్టుకుంటాడు. వాసన చూస్తే వాసన చూస్తాడు. పలికితే పలుకుతాడు. పవళిస్తే పవళిస్తాడు. ఆమె సంతోషిస్తే సంతోషిస్తాడు.

**వ. ఇవ్విధంబున నతండు మహిషీ విప్రలబ్ధుండును వంచిత స్వభావుండునునై పారవశ్యంబునం జేసి యజ్ఞుండును నితరేచ్ఛా విరహితుండునునై క్రీడామృగంబు చాడ్పున వర్తించుచు నా పురంబునఁ గాపురం బుండఁ గొన్ని దినంబుల కా పురంజనుం డొకానొక దినంబున ధనుర్ధరుండై. 770**

* ఈ విధంగా అతడు రాణి చేత మోసగింపబడ్డాడు. మరే కోరిక లేనివాడై అజ్ఞతతో ఆటబొమ్మవలె ఆ పురంలో నివసిస్తున్నాడు.

**సీ. పంచాస్య యుక్తంబుఁ బంచ బంధనముఁ జక్రద్వితయములు యుగద్వయంబు**
**నాశు వేగంబు నేకాక్షంబుఁ గూబర ద్వయముఁ బతాకాత్రితయ యుతంబు**
**నేక రశ్మియుతంబు నేకసారథికంబు సప్తవరూథంబు స్వర్గ భూష**
**మును బంచ విక్రమమును నేక నీడంబుఁ బ్రకట పంచ ప్రహరణము నయిన**

**తే. రథము కాంచన రచిత వర్మము ధరించి, విలస దక్షయ తూణీర కలితుఁ డగుచుఁ**
**గడఁక దీపింప నెక్కి యేకాదశ ప్ర, సంఖ్య సేనాసమేతుఁడై సరభసముగ. 771**

* ఒకనాడు పురంజనుడు బంగారు కవచాన్నీ, అక్షయతూణీరాలనూ, ధనుస్సునూ ధరించాడు. ఐదు గుర్రాలు, ఐదు బంధనాలు, రెండు చక్రాలు, రెండు యుగాలు, ఒక అక్షం, రెండు నొగలు, మూడు జెండాలు, ఒక పగ్గం. ఒక సారథి, ఏడు పై కప్పులు, బంగారు నగలు, ఐదు గతిప్రకారాలు, ఒక గూడు, అయిదు ఆయుధములు, ఆశువేగం కలిగిన రథాన్ని ఎక్కి పదకొండు మంది సేనాధిపతులతో కూడి వేగంగా పురం వెడలి బయలుదేరాడు.

**వ. పురంబు వెడలి పంచప్రస్థంబను వనంబునకుం జని యందు విడువరాని మహిషిని విడిచి మృగయాసక్తుండై దృప్తుం డగుచు ధనుర్బాణంబులు ధరియించి సంచరించుచు నాసురవర్తనంబునం దగిలి ఘోరాత్ముండు నదయుండునై నిశాతసాయకంబుల చేత నమృ్గగ వ్రాతంబులం బరిమార్చె, రాజులకు మృగయా వినోదంబు విహితానుష్ఠానం బగుచుండ నాసురవృత్తి యెట్లయ్యె? నని యంటి వే? నిది రాగప్రాప్తం బగుటను విహితంబు గాదు, వినుము. శ్రాద్ధాదులందే ప్రఖ్యాత శ్రాద్ధ దివసంబుల యందే, రాజైన వాఁడే, మేధ్యంబులయిన పశువులనే, వనంబునందే యథోపయుక్తంబుగానే వధియింపం జను నను నియమ మాత్రంబు గలదు, గావున జ్ఞానియైన విద్వాంసుం డాచరింపండు గాన యాచరించినం గర్మానుష్ఠానజనితం బయిన జ్ఞానంబునం జేసి యందుఁ బొరయం, డట్లుగాక నియమోల్లంఘనంబునం గర్మాచరణుం డగువాఁ డభిమానంబు నొంది కర్మబద్ధుండై గుణప్రవాహ పతితుండును, నష్టప్రజ్ఞుండునునై యధోగతిం గూలు, నిట్లగుటం జేసి సాధుజనులకు సర్వప్రకారంబుల నాసురవృత్తి మానందగు నని వెండియు నిట్లనియె. నంతం బురంజనుం డవ్వనంబున. 772**

* పురంజనుడు పంచప్రస్థము అనే అడవికి వెళ్లాడు. ఆ అడవిలో విడువదగని రాణిని విడిచి పెట్టాడు. వేటాడే కోర్కెతో ధనుర్బాణాలు ధరించి మదించి విహరించాడు. ఆసురవృత్తిని అవలంబించి పాపాత్ముడై దయమాలి వాడి బాణాలతో అడవిలోని మృగ గణాలను చంపాడు. రాజులకు వేట విధింపబడిన ఆచారమే. అయినా లాలసతతో వేటాడరాదు. సామాన్య నిత్యశ్రాద్ధాది సమయాలలో కాక, ప్రఖ్యాతములైన శ్రాద్ధ దినాలలో మాత్రమే మేధ్యపశువులను మాత్రమే, వనములందు మాత్రమే, రాజు మాత్రమే, కావలసి నన్నిటిని మాత్రమే చంపాలి అని నియమం ఉన్నది. కాబట్టి జ్ఞాని అయిన విద్వాంసుడు నియమాన్ని బట్టి నడచుకుంటాడు. కర్మాచరణవల్ల పుట్టిన జ్ఞానంచేత ఆ కర్మను పొందడు. అలా కాకుండా నియమం మీరి నడిచేవాడు, కర్తృత్వాభిమానాన్ని పొంది కర్మబద్ధుడై ప్రజ్ఞ చెడి సంసారప్రవాహంలోపడి అధోగతిపాలు అవుతాడు. అందుచేత సత్పురుషులు అన్ని విధాలా రాక్షస ప్రవర్తనను మానుకోవాలి.

**క. వర చిత్ర పక్ష సునిశిత, శరములచే శశ వరాహ చమరీ రురు కా<br>సర గవయ శల్య హరిణీ, కరి హరి వృక పుండరీక కపి ఖడ్గములన్. 773**

**వ. వధియించి మఱియును. 774**

* ఆ అడవిలో పురంజనుడు కుందేలు, పంది, ఆడు సవరపు మెకం, నల్ల చారల దుప్పి, కారెనుపోతు, గురుపోతు, ఏదుపంది, ఆడుజింక, ఏనుగు, సింహం, తోడేలు, పెద్దపులి, కోతి, ఖడ్గమృగం మొదలైన మృగాలను తన వాడి బాణాలకు ఎరచేశాడు.

సీ. వరుస మేధ్యామేధ్య వనమృగంబుల ఘృణ సన దుస్సహ క్రీడ సంహరించి
శ్రమయుక్తుఁడై వేఁట సాలించి మరలి మం దిరమున కర్థి నే తెంచి యందు
సముచిత స్నాన భోజన కృత్యములు దీర్చి యతి పరిశ్రాంతి శయానుఁ డగుచుఁ
బరిమళ మిళిత ధూపవ్రాత వాసిత సర్వాంగుఁ డగుచు స్రక్చందనములు

తే. వివిధ భూషణ చేలముల్ వెలయఁ దాల్చి, తుష్టుఁడును హృష్టుఁడున్ మతి ధృష్టుఁడై య
నన్యజాకృష్ట చిత్తుండునై రతి ప్ర, సంగ కౌతుక మాత్మను దొంగలింప. 775

వ. అంత స్వకీయ ప్రాణవల్లభ యగు మహిషియందు మనంబు నునిచిన యా వరారోహయు గృహమేధినియు నయిన గృహిణిం గానక విమనస్కుండై నిజాంతఃపుర కామినులం గనుంగొని యిట్లనియె. 776

* ఈ విధంగా పురంజనుడు మేధ్యామేధ్య విచారం లేకుండా అడవిలోని జంతువులను నిర్దయుడై వేటాడి అలసిపోయి, వేటమాని ఇంటికి తిరిగి వచ్చాడు. ఉచితములైన స్నాన భోజనాలను నిర్వర్తించి, అలసట తీర్చుకున్నాడు. శరీరానికి గంధం పూసుకున్నాడు. దండలు ధరించాడు. పలురకాల నగలు, వలువలు ధరించాడు. ధూపములచేత దేహం ఘుమఘుమ లాడుతుండగా, సంతోషంతో సెజ్జపై చేరాడు. అప్పుడు అతనికి నిలుపరాని రతివాంఛ కలిగి రాణిపై మనస్సు నిలిపాడు. కాని రాణి కనిపించలేదు. అందుచేత మనస్సు కలత చెంది అంతఃపురంలోని స్త్రీలను చూచి ఇలా అన్నాడు.

క. రామాజన సంఘము లా, రా, మానవతీ లలామ రామామణి నా
రామకృప వడసి మెలఁగుదు, రా? మానుగఁ గుశలమా? పరామర్శింపన్. 777

ఉ. సార వివేకలారా! గృహసంపద లీ యెడఁ బూర్వరీతిచే
నారయఁగా రుచింపవు గృహస్థునకుం గృహమందు మాతగా
నీ రమణానుకూల రమణీ మణియై తనురారు భార్య గా
నీ రుచి నొందకున్నఁ గన నేర్చునె తద్గృహమేధి సౌఖ్యముల్. 778

* కాంతలారా! రాణి మానవతి. ఆమె దయను పొంది సంచరిస్తున్నారా? మీకు సేమమా? పూర్వంలాగా గృహంలోని సంపదలు నాకు ఆనందం కల్గించడం లేదు. ఇంట్లో తల్లిగాని, అనుకూలవతి అయిన భార్యగాని లేకపోతే గృహస్థునికి సౌఖ్యం లేదు గదా!

వ. అదియునుం గాక. 779

క. పొగ డొందు జనని గానీ, తగవున వర్తించునట్టి దయితయ కానీ
తగ నుండని గృహమున నుం, టగుఁ జక్ర విహీన రథమునందుం టరయన్. 780

* ప్రేమమూర్తి అయిన తల్లిగాని, అనుకూలవతి అయిన భార్యగాని లేని యింటిలో నివసించటం చక్రాలు లేని రథంపై కూర్చోవటం వంటిది.

**వ. కావున. 781**

**చ. తలకొని నాకుఁ దాననుపదంబును బ్రజ్ఞ జనింపఁజేసి సం**
**చల దురు దుర్భర వ్యసన సాగరమగ్నుఁడ నైన నన్ను ని**
**శ్చలమతి నుద్ధరించి యనిశంబును మత్ప్రియయైన భార్య యే**
**వలనఁ జరించుచున్న దనివారణ నా కెఱిఁగింపరే దయన్. 782**

* తెలివి నేర్పి కష్ట సముద్రంలో మునిగిన నన్ను పైకి లేవనెత్తి నిత్యమూ నాకు సంతోషం కలిగించే నా భార్య ఎక్కడ ఉన్నదో నాకు దయతో చెప్పండి'' అని వేడుకున్నాడు.

**క. అనవుడు విని య క్కాంతలు, జనపతి కిట్లనిరి రాజసత్తమ! యిదిగోఁ**
**దన కొంగైనను బఱపుగ, నొనరింపక నేలఁ బొరలుచున్నది వగలన్. 783**

**తే. ఏమి కతమున నున్నదో యెఱుఁగ మేము, నీవు సూడు మటన్న నా భూవరుండు**
**నేలఁ బడి పొరలెడు భార్యఁ బోలఁ జూచి, మనములో దుఃఖ తాపంబు మల్లడింప. 784**

* అప్పుడు రాణి చెలికత్తెలు రాజుతో ఇలా అన్నారు. రాజేంద్రా! ఇదిగో రాణి! నేలమీద కొంగైనా పరచుకొనకుండా దుఃఖంతో పొర్లాడుతున్నది. కారణం మాకు తెలియదు, చూడు - అని అన్నారు. అప్పుడు రాజు నేలమద పొరలాడుతున్న భార్యను చూచి దుఃఖించాడు.

**వ. అంత. 785**

**ఆ. జలజనేత్ర! ప్రణయ సంజాత రోష భా, వమున నయిన యట్టి వక్రదృష్టి**
**జన విభుండు సూచి యనునయ కోవిదుఁ, డగుచు నప్పయోరుహాక్షిఁ జేరి. 786**

**క. పొలఁతుకఁ దన యుత్సంగం, బుల నిడి తత్పాద యుగళమును నంటుచు మం**
**జుల మృదు భాషణముల నా, లలనామణిఁ జూచి పలికె లాలన మొప్పన్. 787**

* ప్రణయ కోపంతో రాణి చూచిన వంకర చూపులను గమనించి నేర్పుతో ఓదార్చటం కోసం ఆమెను సమీపించి తన ఒడిలో ఆమె పాదాలను ఉంచుకొని తాకుతూ మృదు మధుర వాక్కులతో ఇలా బుజ్జగించాడు.

**చ. రమణిరో! భృత్యులందు నపరాధము గల్గిన నాయకుల్ స్వప**
**క్షముఁ దలపోసి యుగ్రతర శాసనముం దెగిచేయ రట్లు గా**
**క మనసులోని కిన్కఁ దమకంబున నాజ్ఞ యొనర్చి రేని ని**
**క్కముగ ననుగ్రహించుటయ కాక తలంపగ నాజ్ఞ సేయుటే? 788**

* రమణీ! సేవకులు నేరం చేసినప్పుడు ప్రభువులు తమవారు అని దయ తలచి గట్టిగా శిక్షించరు. అలా కాకుండా కోపంతో శిక్ష విధిస్తే అది సేవకులను అనుగ్రహించటమే. అంతేకాని శిక్షించటం కాదు.

**క. కమలానన! బాంధవ కృ, త్యముఁ దలఁపక రోషచిత్తుఁడగు కుటిలాత్మున్**
**సమదామర్షుఁడు నీతి, క్రమరహితుఁడు నైన బాలుఁగా నెన్నఁదగున్. 789**

* కాబట్టి శిక్ష విధించకుండా భృత్యులమీద కోపం ప్రకటించే వానిని అజ్ఞాని అని చెప్పాలి.

**వ. అని వెండియు నిట్లనియె. సుదతీ హృదయేశ్వరి వైన నీవు. 790**

**మ. సరసోదార సుధా రసోపమ వచశ్చాతుర్య సౌభాగ్యమై**
**హరినీలోపమ కోమలాలక యుతంబై విభ్రమ భ్రూలతా**
**పరిజుష్ట స్మిత సద్విలోకనమునై భాసిల్లు యుష్మన్ముఖాం**
**బురుహంబున్ భవదీయ దాసునకుఁ బూఁబోఁడీ, కృపం జూపవేఁ 791**

* సుందరీ! అమృతం లాగా తీయనైన చతుర వాక్కులతోనూ, ఇంద్రనీలాల లాగా నల్లనైన నెఱి వెంట్రుకలతోనూ, విలాసాలు విరజిమ్మే కనుబొమలతోనూ, చిరునవ్వులు చిందించే చూపుతోనూ ప్రకాశించే నీ ముఖ పద్మాన్ని దయతో నీ దాసునికి చూపించు.

**క. విను వీరపత్ని నీ యెడ, ననయంబును బ్రాహ్మణులును హరి భక్తులుఁ ద**
**క్కను నితరు లెగ్గు సేసిన, వనితా! శిక్షింతు నెంతవారల నయినన్. 792**

**క. ఈ ముల్లోకము లందును, నా మనమున రోష మొదవినన్ భయ రహితుం**
**డై మదిలోఁ బరితోషము, తో మెలఁ గెడువానిఁ గానఁ దోయజనేత్రా! 793**

* నీవు వీరపత్నివి. నీకు బ్రాహ్మణులు, విష్ణుభక్తులు తప్ప ఇతరులు అపకారం చేసినట్లయితే వారు ఎంతటి వారైనా నేను దండిస్తాను. నేను కోపిస్తే భయపడకుండా సంతోషంగా తిరగ గల్గిన వాడు ఈ ముల్లోకాలలో ఒక్కడైనా ఉండడు.

**సీ. ఇందీవరేక్షణ! యే నెందు భవదీయ తిలక విరహితము మలినయుతము**
**హర్ష శూన్యంబు మనోప్రకాశకమునై యత్యమర్షయుతంబు నయిన ముఖము**
**గళితాశ్రుబిందు సంకలిత సంచిత శోభ మాన పీనస్తన మండలమును**
**రమణీయ తాంబూలరాగ విహీన మై నట్టి సుపక్వ బింబాధరంబుఁ**

**తే. గాన నిట్లుంట కిపుడేమి కతము? నాకు, నర్థి నెఱిఁగింపవే మృగయాతిసక్తి**
**నబల! నీ కెఱిఁగింపక యరిగి నట్టి, తప్పు సైరించి కావంగఁ దగుదు నేను. 794**

* కాంతా! నీవు బొట్టు పెట్టుకోలేదు. నీ ముఖం వాడిపోయింది. కోపంగా ఉన్నది. నీ ముఖంలో సంతోషం కనపడడంలేదు. కారిన కన్నీటి బిందువులు పడి స్తనద్వయం శోభాశూన్యంగా ఉన్నది.

దొండపండువంటి నీ పెదవి తాంబూలరాగం లేకుండా ఉన్నది. నీవు ఈ విధంగా ఉండటం నేనెప్పుడూ చూడలేదు. ఇందుకు కారణం ఏమిటి? నాకు చెప్పు. వేట తమకంతో నీకు చెప్పకుండా వెళ్లిపోయాను. ఆ తప్పును క్షమించి నన్ను కాపాడు.

క. **వనితాజన పరవశుఁడై, మనసిజ శర బాధ్యమాన మానసుఁ డగు వా**
**నిని దగఁ గర్తవ్యార్థము, లను భజియింపక తొలంగు లలనలు గలరే?** 795

* కాంతలకు వశుడై మన్మథుని బాణాలు మనస్సున నాటి తపించే వానిని తగిన ఉపచారాలతో సేవించకుండా ఉపేక్షించే స్త్రీలు ఉండరు గదా!"

వ. **అనుచుం దదీయ విభ్రమ వశంగతుండై పలికిన విని.** 796

క. **కంజాతపత్ర నేత్రపు, రంజను దెస రోష ముడిగి రమణీయశ్రీ**
**మంజుల మృదూక్తుల మనము, రంజించుచుఁ బలికె సదనురాగ మెలర్పన్.** 797

* ఈ విధంగా పురంజనుడు ఆమె విలాసములకు లొంగిపోయి వేడుకున్నాడు. అప్పుడు రాణి అలుకమాని ప్రేమతో మృదుమధురంగా మాటలాడి పురంజనుని మనస్సును సంతోష పెట్టింది.

వ. **అంత.** 798

సీ. **ఆ మ్మహాదేవి నెయ్యంబున మంగళ, స్నాతయై మృదుల వస్త్రములు గట్టి**
**స్రక్చందనాది భూషణములు ధరియించి, కమనీయ మోహనాకార యగుచుఁ**
**బతికడ నిలిచిన నతఁడు సంతుష్టాంత, రంగుఁడై యభ్యంతరమున నుండి**
**యన్యోన్య సరస గాఢాలింగనంబులు, గావించి గోప్య వాక్యముల చేత,**

తే. **నతఁడు ప్రమదా పరిగ్రహ వ్యసనమునకు, గడఁక నపకృష్టఘన వివేకంబు గలిగి**
**పగలు రేయని ప్రొద్దు లేర్పఱుప రాక, యెనసి యా యుర్వ్యయంబు దా నెఱుఁగఁ డయ్యె.** 799

* రాణి స్నానం చేసి సన్నని పలువలు కట్టింది. పూలదండలు ధరించింది. గంధం అలదుకొన్నది. నగలు పెట్టుకొన్నది. ఈ విధంగా అలంకరించుకొని మోహనాకారంతో మగనిని సమీపించింది. అతడు పొంగిపోయాడు. వారిద్దరూ అంతఃపుర మందిరంలో ఒకరి నొకరు గట్టిగా కౌగిలించుకున్నారు. రహస్యపు మాటలు చెప్పుకున్నారు. ఈ విధంగా పురంజనుడు స్త్రీ వ్యసనంచేత వివేకాన్ని కోల్పోయి ఇది పగలని, ఇది రాత్రని లేక రాణితో గడుపుతూ తన ఆయుస్సు క్షీణించటం తెలిసికోలేక పోయాడు.

వ. **మఱియు నతం డున్నద్ధమదుండును మహామనుండును నర్ఘశయ్యా శయానుండును మహిషీ భుజోపధానుండునునై యజ్ఞానాభిభూతుం డగుటం జేసి స్వరూప భూత పరమ పురుషార్థంబు నెఱుంగక నిజమహిషియె పరమ పురుషార్థంబుగాఁ దలంచుచు రమించుచుం గామ కశ్మలచిత్తుం డైన యతనికి నవయౌవనంబైన కాలంబు క్షణార్ధంబునుం బోలె గతం బయ్యె, నంత.** 800

* అతడు మదించి పాన్పుపై రాణి భుజమే తలగడగా చేసుకొని, ఆమెనే పరమ పురుషార్థంగా భావించాడు. అతని యౌవనకాలమంతా అరక్షణం లాగా గడచిపోయింది.

క. విశద యశోజలనిధి యా, శశిముఖి యగు భార్య వలన సమ్మతి నేకా
దశ శత పుత్రుల రణక, ర్కశ దేహులఁ గాంచి కౌతుకంబున మఱియున్. 801

క. గురు శీలౌదార్య గుణో, త్తరలను సల్లలిత గుణ కదంబలఁ బ్రియలన్
వరకుల పావనల దశో, త్తర శత దుహితలను గాంచెఁ దత్సతి వలనన్. 802

* ఆ పురంజనుడు భార్యవల్ల పదకొండు వందలమంది పుత్రులను పొందాడు. వారంతా గొప్ప యుద్ధవీరులు. నూటపదిమంది కుమార్తెలను కూడా కన్నాడు. వారు గుణవతులు.

వ. ఇట్లు పుత్ర పుత్రికా జనంబు గని యున్నంత. 803

క. విను మాతని యాయువులో, నను నర్ధం బరిగె, నంత నరపతి కుల వ
ర్ధను లగు సుతులకుఁ బరిణయ, మొనరించెన్ సదృశ లయిన యువిదల తోడన్. 804

క. నరనాథుఁ డాడు బిడ్డల, వరరూప వయో విలాస వైభవములచేఁ
బరఁగిన నిజతనయల సమ, వరులకు సంప్రీతితో వివాహము చేసెన్. 805

* ఇంతలో అతని ఆయుస్సు సగం తరిగిపోయింది. కొడుకులకు తగిన కన్యలతో వివాహం చేశాడు. రూపవతులు, విలాసవతులు, యౌవనవతులు అయిన తన పుత్రికలకు తగిన వరులతో వివాహం జరిపించాడు.

వ. అట్లు వివాహంబులు గావించి యున్న సమయంబున. 806

క. విను, తత్సుతు లొక్కొకనికి, ననయముఁ బాంచాల దేశమందులఁ బౌరం
జన కులవర్ధను లగుచున్, జనియించిరి నూర్వురేసి శౌర్య బలాఢ్యుల్. 807

* పురంజనుని కొడుకులకు ఒక్కొక్కనికీ నూరుగురేసి కొడుకులు జన్మించారు. వారంతా మహాశూరులు. వారివల్ల పాంచాల దేశంలో పురంజనుని వంశం తామర తంపరగా వర్ధిల్లింది.

ఆ. అనఘ! యట్టి రిక్తహారుల గేహకో, శానుజీవ యుతులు నయిన యట్టి
నందనాదులందుఁ జెందిన మమత ని, బద్ధుఁడయ్యె నంతఁ బార్థివుండు. 808

చ. తిరమగు నిష్ఠతో నతఁడు దీక్షితుఁడై పశుమారకంబులున్
సరవి భయంకరంబులగు సన్మఖముల్ దగఁ బెక్కు సేసి యా
దరమున నీవునుం బలెను దత్తదనూన ఫలాప్తి కాముఁడై
సురపితృ భూత సంఘము నసూయ దనర్ప భజించె భూవరా! 809

* అతని కొడుకులూ, మనుమలూ ధనాన్ని దొంగిలిస్తున్నారు. ఇంటిలో ఉన్న ధనంమీద ఆధారపడి బ్రతుకుతున్నారు. అయినా వారిమీద పురంజనుడు మమత పెంచుకున్నాడు. అందుచేత అతడు

విషయబద్ధుడై నీవలె ఆ యా కోర్కెలను పొందగోరి దీక్షపూని పశుమారకాలు అయిన పెక్కు యజ్ఞాలను చేసి దేవతలనూ, పితృదేవతలనూ, భూతగణాలనూ పూజించాడు.

**వ. ఇట్లాత్మహితంబు లైన కర్మంబులయం దనవహితుండును గుటుంబాసక్త మానసుండునునై యున్న యతనికి విరోధియై ప్రియాంగనాజనంబులకు నప్రియంబగు కాలంబు సంభవించినం జండవేగ విఖ్యాతుండును గంధర్వాధీశుండు షష్ట్యుత్తర శతత్రయ సంఖ్యాకులైన గంధర్వులును నందఱ గంధర్విజనంబులును సితాసిత వర్ణంబులు గలిగి మిథునీభూతు లగుచు ననుగమింపం జనుదెంచి స్వపరిభ్రమణంబుచేతనే సర్వకామంబుల నిర్మితంబగు నా పురంబు నిరోధించిన నప్పు డా చండవేగానుచరులైన గంధర్వు లా పురంజను పురంబు వ్యాకులత్వంబు నొందించుచు నపహరింప నుపక్రమించు సమయంబునఁ బురంజన పురాధ్యక్షుండైన ప్రజాగరుం డనువాఁడు వింశత్యుత్తర సప్తశతంబులైన గంధర్వ గంధర్వీ జనంబుల నివారించి బలవంతుడై నవత్సరశతంబు యుద్ధంబు గావించి యొక్కరుం డయ్యు నప్పెక్కండ్రతో నిట్లు పోరి క్షీణుండైనం బురంజనుండు దాన నిలిచి తత్పురంబున నల్పసుఖంబు లనుభవించుచుం బాంచాల దేశంబులందు నిజపార్షదులచేత నానీతంబులైన పదార్థంబుల నొందుచుం గామినీ జన సమేతుండై భయపర్యాలోచనంబు సేయ నేరక రాష్ట్ర పురబాంధవ సమేతుండై యార్తి నొంది చింతాక్రాంతుండై యుండె: నంత, 810**

* ఈ విధంగా ఆత్మకు హితం కలిగించే కర్మలపై శ్రద్ధ విడిచి, కుటుంబంపై ఆసక్తి పెంచుకొన్న పురంజనునికి శత్రువై ప్రియకాంతలకు అప్రియమైన కాలం (ముసలితనం) వచ్చింది. అప్పుడు చండవేగుడు అనే గంధర్వరాజు మూడువందల అరవైమంది గంధర్వులును, అంతే సంఖ్యగల గంధర్వ స్త్రీలును తెలుపు నలుపు రంగులు గలిగి జంటలై వెంటరాగా వచ్చి ఆ పురాన్ని ముట్టడించాడు. ఆ సమయంలో పురంజన పురమునకు అధ్యక్షుడయిన ప్రజాగరుడు ఏడువందల యిరవైమంది గంధర్వ, గంధర్వీజనాలను అడ్డుకొని నూరేండ్లు ఒక్కడే యుద్ధం చేసి క్షీణబలుడు అయ్యాడు. కాని పురంజనుడు, పురములోనే ఉండి పోయి నీచ సుఖములను అనుభవిస్తూ స్త్రీలతో వినోదిస్తూ సంభవించిన ఆపదను గురించి ఆలోచించలేదు. అందుచేత రాష్ట్ర పుర బాంధవ సమేతంగా చింతాక్రాంతు డయ్యాడు.

**క. అనయంబుఁ గాల పుత్రిక, యను నొక కామిని వరేచ్ఛ నఖిల జగంబుం**
**దనయంతఁ గలయఁ దిరుగుచుఁ, జని చని యొకనాఁడు రాజసత్తమ! వింటే. 811**

**సీ. అనఘాత్మ! రాజర్షి యైన యయాతి కుమారకుం డయినట్టి పూరుచేత**
**వరియింపఁగాఁ బడి వలనొప్ప నతనికి వర మిచ్చి దౌర్భాగ్యవశత నొంది**
**ప్రఖ్యాతి గనుట దుర్భగ యనుపేరను బరఁగు న క్కాంత నే పురుషవరుఁడు**
**వరియింపఁ డయ్యె, నా తరుణియు నొక నాఁడు గర మొప్ప బ్రహ్మలోకమున నుండి**
**తే. వసుధ కేతెంచి విను బృహద్వ్రతుఁడ నయిన, నన్ను వరియింపఁ గోరి మనమునఁ గామ**
**శరవిమోహిత యై వేఁడఁ గరము నేను, సమ్మతింపక యున్న రోషమున నలిగి. 812**

వ. ఇట్లను, మునీంద్రా! మదీయాశా విముఖుండవైన నీకు నేకత్రావస్థానంబు లేక యుండుంగాక! యని శపించి విహత సంకల్పయై మదుపదేశంబునం జని యవనేశ్వరుండును భయ నామకుండును నయిన వానిం గదిసి యిట్లనియె. 813

* కాలుని పుత్రిక అయిన ఒక కన్య వరుని కోరి తనంత తానే అన్ని లోకాలలోనూ తిరిగింది. రాజర్షి అయిన యయాతి కొడుకు పూరుడు ఆమెను వరించాడు. ఆమె సంతోషించి అతనికి వరమును ప్రసాదించింది. తన దౌర్భాగ్యవశంచేత ఆమె దుర్భగ అని పేరుపొందింది. ఆ తరువాత ఆమెను ఏ పురుషుడూ వరింపలేదు. ఒకనాడు బ్రహ్మలోకం నుండి భూలోకమునకు వచ్చిన నన్ను వరింపగోరి మన్మథుని బాణాలకు తాళలేక వేడుకున్నది. నేను అంగీకరించలేదు. అందుకు ఆమె కోపించి "మునీంద్రా! నా కోర్కెను నీవు నెరవేర్చలేదు. కాబట్టి ఒక చోట నిలువక నీవు నిత్యమూ తిరుగుతూ ఉంటావు" అని శపించింది. నా ఉపదేశం వల్ల యవనేశ్వరుడైన భయుడు అనే వాని వద్దకు వెళ్లి ఇలా అన్నది.

క. అవనీపతి! భయనామక, యవనకులాధీశ్వరుండ వగు నినుఁ బతిఁగాఁ
దవిలి వరింపఁగ వచ్చితి, సవినయముగ వినుము భూత సంకల్పమునన్. 814

వ. కలుగు మత్కామితంబు వృథ గాదు, లోకంబున వేదంబులందు దేయగ్రాహ్యరూపం బైన వస్తువు యాచ్యమానం బగుచుండ నెవ్వం డొసంగం, డెవ్వం డిందు దీయమానం బగు చుండం గోరం డట్టి వీర లిద్దఱును జడ స్వభావు లని సత్పురుషులు శోకంబు నొందుదురు! గావున నిన్ను భజియించుచున్న నన్నుం గరుణార్ద్ర చిత్తుండవై భజియింపు మిట్టి యార్తానుకంపయుఁ బురుషధర్మం బని పలికిన నక్కాలపుత్రిక వచనంబులు విని యవనేశ్వరుండు దేవగుహ్యచికీర్షు వగు దానిం గనుంగొని మందస్మిత వదనుం డగుచు నిట్లనియె. 815

* "రాజా! నిన్ను భర్తగా వరింప వచ్చాను. భూత సంకల్పం చేత నాకు కల్గిన కోర్కె వ్యర్థం కాదు. ఇవ్వదగిన వస్తువును అడిగినప్పుడు ఇవ్వనివాడూ, గ్రహింప దగిన వస్తువును ఇచ్చినప్పుడు కోరుకోనివాడూ- వీరు ఇద్దరూ మంద బుద్ధులు. కాబట్టి నన్ను దయతో గ్రహించు. దీనులపై దయచూపటం పురుషధర్మం" అని వేడుకున్నది. అప్పుడు యవనేశ్వరుడు దేవరహస్యాన్ని (మరణం) చేయబూనిన ఆ కాల కన్యకను చూచి చిరునవ్వుతో ఇలా అన్నాడు.

క. విను తరణి! యాచ్యమానం, బనఁదగు నీ లోకమందు నత్యశుభవు స
జ్జనముల కసమ్మతవు నగు, నిను నభినందింపకుండ్రు నెఱి నెవ్వారున్. 816

* "తరుణీ! ఈ లోకంలో నీవు కోరినవారు అందరూ నీవు దుర్భగవు కావటంచేత నిన్ను మెచ్చుకోవటం లేదు.

వ. కావున నేను జ్ఞానదృష్టిం జేసి నీకుం బతి నిరూపణంబు సేసెద, నది యెట్లనిన మదీయసేనా సాహాయ్యంబు వడసి ప్రజానాశం బొనరించునట్టి నీ వవ్యక్తగతివై కర్మనిర్మితంబైన లోకంబు

**ననుభవింపు, మీ ప్రజ్వారుం డనువాఁడు నాకు సహోదరుండు, నీవు మదీయ భగినివి. మీ యిద్దఱం గూడి యీ లోకంబునందు నవ్యక్తుండును భీమసైనికుండును నై యేను వర్తింతు ననిన నా భయనామకుం డయిన యవనేశ్వరుని దిష్టకారులైన సైనికులు ప్రజ్వార కాలకన్యాయుక్తులై భూమండలం బెల్ల దిరుగుచు నొక్కనాఁ డతివేగంబున భౌమ భోగాఢ్యంబును జరత్పన్నగ పాలితంబును నయిన బురంజను పురంబు నావరించి యున్నంత స్వాభిభూతుం డయిన పురుషునకు నిస్సారత్వంబు గలిగించునట్టి కాలకన్యక బలాత్కారంబున నా పురంజను పురంబు ననుభవించె, నట్లు కాలకన్య కోపభుజ్యమానంబైన పురంబు సర్వద్వారంబులందును సర్వతోఽధికంబుగా న య్యవనులు ప్రవేశించి తత్పురంబు సమస్తంబును బీడింప నిట్లు పురంబు ప్రపీడ్యమానం బగుచుండ నభిమానియైన పురంజనుండు. 817**

* కాబట్టి నేను జ్ఞానదృష్టితో నీకు భర్తను నిర్ణయిస్తాను. నీవు అవ్యక్తగతివై లోకమంతటా తిరుగుతూ కర్మనిర్మితమైన లోకమును అనుభవించు. నా సేవను నీకు తోడుగా పంపిస్తాను. ఆ సాయంతో ప్రజానాశమును చేయగలవు. ఈ ప్రజ్వారుడు అనే వాడు నాకు సోదరుడు. నీవు నాకు చెల్లెలివి. మీ యిద్దరితో కూడి నేను అవ్యక్తుడనై, భీమ సైనికుడనై ఈ లోకంలో సంచరిస్తాను"అని అన్నాడు. ఆ యవన రాజు ఆజ్ఞను నెరవేర్చటం కోసం సైనికులు ప్రజ్వారునితోను, కాలకన్యకతోను కూడి లోకమంతా తిరుగుతూ ఒకనాడు లౌకిక సంపదలతో నిండి ముసలి పాముచేత రక్షింపబడుతున్న పురంజనుని పురాన్ని ముట్టడించారు. తనచేత ఆక్రమింపబడిన పురుషుడికి నిస్సారత్వం కలిగించే కాలకన్యక బలవంతంగా ఆ పురంజనుని పురాన్ని అనుభవించింది. కాలకన్యక చేత అనుభవింపబడుతున్న పురంలో యవనులందరూ సర్వద్వారాలలో నుండి ప్రవేశించి ఆ పురాన్ని పీడింపసాగారు.

**సీ. అనఘ! యెంతయు మమతాకుల చిత్తుఁడై బహువిధ భూరితాపములఁ బొందె,
ఘనకుటుంబియుఁ గాలకన్యోపగూఢుండు నష్టసంపదుఁడు వినష్టమతియు
విషయాత్మకుండును వినిహతైశ్వరుండుఁ గృపణుండు సాల నకించనుండు
నగు పురంజనుఁడు శోకావిలభావుఁడై, గంధర్వ యవన సంఘములచేత**

**తే. నోజ సెడి వికలత నొందు నైజపురముఁ, దవిలి ప్రతికూలురును ననాదరణయుతులు
నయిన పుత్త్రులఁ బౌత్త్రుల ననుచరులను, సచివ పౌరోహితుల నిజసతినిఁ జూచి. 818**

**వ. మఱియుఁ గాలకన్యాగ్రస్తుం డయిన తన్నును నరిదూషితంబులైన పాంచాల బలంబులనుం జూచి యపార చింత నొంది తత్ప్రతీకారంబు సేయ నెఱుంగక కాలకన్యాపహృతవీర్యంబు లయినం గామంబుల నభిలషించుచు దీనుండును విగతాత్మగతికుండును స్నేహంబునం జేసి పుత్రదారోపలాలన పరుండునునై కాలకన్యోపమర్దితంబును గంధర్వ యవనాక్రాంతంబును నైన పురంబు విడువ నిచ్చ లేకయు విడువ నుపక్రమించె, నప్పుడు. 819**

* అప్పుడు పురంజనుడు మమకారంచేత వ్యాకులపాటు చెంది దుఃఖించాడు. కాలకన్య కౌగిలిలో నలిగి సిరి తొలగి, ప్రజ్ఞ చెడి దరిద్రుడయిన పురంజనుడు వాపోయాడు. గంధర్వ యవనులు ఆక్రమించటం

చేత కాంతిని కోల్పోయిన తన పురాన్నీ, ఎదురు తిరిగి అవమానిస్తున్న కొడుకులనూ, మనుమలనూ, పరిజనమునూ, మంత్రులనూ, పురోహితులనూ, భార్యనూ, కాలకన్యచేత కబళింపబడిన తననూ, శత్రువులచే ధ్వంసం చేయబడ్డ పాంచాల సైన్యాలనూ చూచి అంతులేని శోకంతో అలమటించాడు. అతనికి ప్రతిక్రియ తోచలేదు. కాలకన్య కారణంగా నిస్సారా లైనప్పటికీ కామాలను కోరుకుంటూ, ప్రేమబంధాన్ని త్రెంచుకోలేక పుత్రులనూ, భార్యనూ బుజ్జగించాడు. గంధర్వులు, యవనులు ముట్టడించిన పురాన్ని విడవటం ఇష్టం లేక పోయినా విడవటానికి పూనుకున్నాడు.

**క. అనఘా! భయనామాగ్రజుఁ, డనఁగల ప్రజ్వారుఁ డపుడ యరుదెంచి పురం**
**బును సకలంబును భయనా, మునికిం బ్రీతిగ దహించె మునుకొని యంతన్. 820**

* అప్పుడు యవనేశ్వరుడైన భయనాముని అన్న ప్రజ్వారుడు వచ్చి పురంజనుని పురాన్ని పూర్తిగా కాల్చి భయునికి ప్రీతి కలిగించాడు.

**వ. అట్లు పురంబు దహ్యమానం బగుచుండఁ బౌరభృత్యవర్గాది సమన్వితుండును, గౌటుంబికుండును, పుత్త్రాది సమన్వితుండును, యవనోపరుద్ధాలయుండును, గాలకన్యాగ్రస్తుండును నయిన పురంజనుం డప్పురంబునందుఁ బ్రజ్వార సంస్పృష్టుండై యనుతాపంబునొంది తత్పురపాలనంబు నందు సమర్థుండు గాక పురకృచ్ఛ్రోరువేపథుండయి యం దుండ నశక్తుం డయ్యె, నంత 821**

**క. దవశిఖియుత తరుకోటర, నివసిత పన్నగము పగిది నిజపురి వెడలం,**
**దివురుచు నతఁడు శిథిల దవ, యవుఁడును గంధర్వ గణ విహత శౌర్యుండున్. 822**

* కాలిపోతున్న పురమును రక్షించే శక్తిలేక పురంజనుడు దుఃఖించాడు. వణకి పోయాడు. గంధర్వ దాడి చేత బలం కోల్పోయాడు. అతని అవయవాలు శిథిలత్వం పొందాయి. కార్చిచ్చు చుట్టుముట్టిన చెట్టు తొఱ్ఱ నుండి వెలువడటానికి ప్రయత్నించే పాములాగా ఆ పట్టణం నుండి వెలువడటానికి ప్రయత్నించాడు.

**సీ. అయి చాల ఘుర ఘుర మనుశబ్ద మడరంగ మనమునఁ జింతానిమగ్నుఁ డగుచుఁ**
**గొడుకులఁ గోడండ్రఁ గూఁతుల నల్లుర మనుమల నాప్తుల ననుచరాళి**
**ననయంబు నల్పమాత్రావశిష్టం బైన గృహకోశనివహ పరిచ్ఛదముల**
**మసలు నహంకార మమకారములఁ జేసి మతిహీనుఁ డగుచు నెమ్మనములోనఁ**

**తే. గడఁకఁ దలఁచుచు విప్రయోగమునఁ దాను, గటకటా! యిట్లు పరలోక గతుఁడ నైన**
**నిట్టి భార్య యనాథయై యీ కుమార, వరుల నేరీతిఁ బ్రోచునో యరసి యనుచు. 823**

* అతని గొంతులో గురగురమనే శబ్దం బయలుదేరింది. దుఃఖంలో మునిగి పోయాడు. కొడుకులను, కోడండ్రను, కూతుండ్రను, అల్లుండ్రను, మనుమలను, చుట్టాలను, సేవకులను తలచుకున్నాడు. తన మందిరంలో కొద్దిగా మిగిలిన ధనాన్ని, వస్త్రాలనూ తలచుకున్నాడు. అహంకారం వల్ల మమకారంవల్ల అతని బుద్ధి చెడింది. తన ఎడబాటు వల్ల అనాథగా మారే తన భార్య కొడుకులను కాపాడగలదో లేదో అని విలపించాడు.

వ. మఱియు నిట్లని తలంచు. 824

సీ. పడఁతి యే మును భుజింపక భుజింపదు నేను, నిద్ర వోవక మఱి నిద్ర వోదు,
నేను నీళ్లాడక నీళ్లాడ నొల్లదు పదరి యేఁ గోపింప భయము నొందు,
భర్జించినను మాఱుపలుకక వాయోడు బుద్ధిహీనుఁడనైన బుద్ధి సెప్పు!
లలి మీఱ నిట్టి కళత్రంబుతో నేను గడఁగి దేహాంతరగతుఁడ నైన

తే. ననయమును దాను బుత్త్రిణి యగుటఁ జేసి, యాత్మశోచిని యగుచు గృహస్థ ధర్మ
మాచరించుచు నుండునో? యనుగమనము, సేయునో యని మనమునఁ జింత నొంది. 825

* నాకంటే ముందు భుజింపదు. నిద్ర పోదు. స్నానం చేయదు. నేను కోపిస్తే భయపడుతుంది. అదలిస్తే బెదరి ఎదురాడదు. నేను తెలివి తక్కువతో ఏ పనికైనా పూనుకుంటే నాకు బుద్ధి చెపుతుంది. ఇటువంటి అనుకూలవతి అయిన భార్య నేను మరణించిన తరువాత బిడ్డలను రక్షించటానికి బ్రతికి ఉంటుందో లేక సహగమనం చేస్తుందో'' అని చింతించాడు.

క. తన పుత్త్రులుఁ దన పౌత్త్రులు, ననయముఁదాఁ జనినయెడ నిరాశ్రయు లగుచున్
వననిధి మధ్యంబున నవి, సిన కలముం బోలి యెట్లు జీవించెదరో? 826

* తన మరణానంతరం తన పుత్రులు, మనుమలు దిక్కులేని వారై నడి సముద్రంలో పగిలిపోయిన ఓడలాగా చెల్లాచెదరై పోతారని దుఃఖించాడు.

క. అని యి వ్విధమునఁ గృపణుని, యనువున ఘనదుఃఖ విహ్వలానర్హుం డ
య్యును దుఃఖించు పురంజను, ననయముఁ గొనిపోవ నిశ్చితాత్ముం డగుచున్. 827

క. చనుదెంచెను భయనామ్ముం, డనువాఁ డప్పుడు పురంజనాఖ్యుఁడు పెలుచన్.
వినుతాత్మ! పశువు భంగిని, మనము గలఁగ యవన నీయమానుం డయ్యెన్. 828

* ఈ విధంగా దీనుడిలాగా దుఃఖించే పురంజనుని కొని పోవటానికి నిశ్చయించుకొని, భయనాముడు వచ్చాడు. పురంజనుని పట్టుకొని పశువును కట్టినట్లు కట్టి ఈడ్చుకొని పోయాడు.

వ. అనుచర వర్గంబు భృశాతురులును దుఃఖితులునై వెనుచనుచుండ నుపరుద్ధంబగు భుజంగమం బప్పురంబు నెప్పుడు వాసె నప్పు డాపురంబు పురంజనుం బాసి విశీర్ణంబై ప్రకృతిం బొందె, బలవంతుం డయిన యవనునిచేత బలాత్కారంబున వికృష్యమాణుండైన పురంజనుండు దమఃపిహితుండై పూర్వ సుహృత్తగు సఖు నీశ్వరు నెఱుంగకుండె, నంతం బరలోకగతుండైన పురంజనుం గదిసి పూర్వంబున నదయుండైన యతనిచేత హింసింపంబడిన యజ్ఞపశువులు క్రోధోద్రేకంబునఁ గుఠారంబుల నతని నఱకె, నవ్విధంబునఁ బ్రమదా సంగ దోష దూషితుండును, నపార తమోనిమగ్నుండును, నష్ట జ్ఞానుండును నయి పురంజనుం డనేక కాలంబు పరలోకంబున నార్తి

**ననుభవించి తద్భార్యయైన ప్రమదోత్తమం జిత్తంబున నశ్రాంతంబును దలంచుచుండం దదీయ సంస్మరణంబునం జేసి తరువాతి జన్మంబున విదర్భరాజ గృహంబునం బ్రమదో త్తమయై జన్మించె నంత. 829**

* అప్పుడు పురంజనుని పరిజనులు దుఃఖిస్తూ వెంబడించారు. పురాన్ని రక్షించే పాము విడిచిపోగానే ఆ పురము పురంజనుని విడిచి పంచభూతాలలో కలిసిపోయింది. శక్తిశాలి అయిన యవనునిచేత బలవంతంగా లాగుకొని పోబడుతున్న పురంజనుడు అజ్ఞానంతో తన మిత్రుడైన ఈశ్వరుని తెలిసికోలేక పోయాడు. పరలోకంలో పూర్వం అతడు దయమాలి చంపిన యజ్ఞపశువులు మహాకోపంతో గొడ్డళ్లతో అతనిని నరికివేశాయి. స్త్రీ సంగ దోషంచేత దూషితుడై జ్ఞానం కోల్పోయిన పురంజనుడు చాలకాలం పరలోకంలో దుఃఖాన్ని అనుభవించాడు. భార్యను మనస్సులో ఎల్లప్పుడూ స్మరిస్తూ ఉండటంచేత తరువాతి జన్మలో విదర్భరాజు కుమార్తెగా జన్మించాడు.

**సీ. అవనీశ! వీర్యపణాత్త యైనట్టి వైదర్భిని మలయకేతనుఁ డనంగఁ**
**బరపురంజయుఁడైన పాండ్య భూమీశుండు దారుణ సంగర స్థలమునందు**
**శక్తి ననేక రాజన్యుల నిర్జించి పరిణయం బయ్యె, నా గురుభుజుండు**
**నా విదర్భాత్మజయం దసితేక్షణ యైన కూఁతును ద్రావిడాధినాథు**

**తే. లైన కొడుకుల నేడ్వుర నర్థిఁ గనియె, వారలకు నెల్ల నొక్కొక్క వరుస నర్బు**
**దార్బుద సుతులు సంజాతు లైరి యతని, సుత ధృతవ్రత నా యగస్త్యుఁడు వరించె. 830**

* పాండ్యరాజైన మలయధ్వజుడు యుద్ధంలో ఎందరో రాజులను గెలిచి ఆ విదర్భరాజు పుత్రికను వీర్యశుల్కంగా పొందాడు. ఆమెవల్ల అతనికి ఒక కుమార్తె, ఏడుగురు కుమారులు కలిగారు. ఆ కుమారులకు ఒకొక్కరికి పదికోట్లమంది కొడుకులు జన్మించి ద్రవిడ దేశాన్ని నేర్పుతో పరిపాలించారు. మలయధ్వజుని కుమార్తె అగస్త్యుని వరించింది.

**క. అతఁ డా కన్యక వలనను, జతురుండై యిధ్మవాహజనకుఁ డగు దృఢ**
**చ్యుతుఁడను మునీంద్రుఁ గనియెను, మతి నంత విరుక్తుఁ డగుచు మలయధ్వజుఁడున్. 831**

**తే. క్ష్మాతలం బెల్ల నిజతనూజాతులకును, బంచి యిచ్చి సరోజాక్ష పాదపంక**
**జార్చనాయత్తుఁ డగుచుఁ గులాద్రి కరుగ, నంత మదిరాక్షి సతి యగు నా విదర్భి 832**

**తే. కడఁగ గృహములు నఖిల భోగములు విడిచి, చంద్రు వెనుచను చంద్రిక చందమునను**
**భక్తి దళుకొత్తఁ బాండ్య భూపాలుఁ డయిన, మలయకేతను వెనుకొని మగువ సనియె. 833**

* అగస్త్యుడు మలయధ్వజుని కుమార్తెవల్ల దృఢచ్యుతుడు అనే పుత్రుని పొందాడు. ఆదృఢచ్యుతునకు ఇధ్మవాహుడు జన్మించాడు. అప్పుడు మలయధ్వజుడు విరక్తి చెంది భూమినంతటినీ తన కొడుకులకు

పంచియిచ్చి శ్రీహరిని కొలువబూని కులపర్వతం వద్దకు వెళ్లాడు. మలయధ్వజుని భార్య వైదర్భి గృహాలనూ, సర్వభోగాలనూ విడిచి పెట్టి చంద్రుని వెన్నంటి వెళ్లే వెన్నెలలాగా భక్తితో భర్తను అనుసరించింది.

**వ. ఇట్లు ధర్మపత్ని వెంట రాఁ జని యందుఁ జంద్రమసా తామ్రపర్ణీ నవోదక లను నదుల పుణ్య జలంబుల సుస్నాతుండయి ప్రక్షాళిత బాహ్యాభ్యంతరుండును గందమూల ఫలబీజ పుష్ప పర్ణతృణ తోయాహారుండునై కాయకర్శనంబైన తపం బాచరించుచు శీతోష్ణ వర్ష వాతంబులు క్షుత్పిపాసలుఁ బ్రియా ప్రియంబులు సుఖదుఃఖంబులు నను ద్వంద్వంబుల సమదర్శనుండై జయించి తపో విద్యాయమ నియమంబులం జేసి పక్వకషాయుండై బ్రహ్మంబునందు నిజాత్మ ననుసంధించి విజి తేంద్రియ ప్రాణచిత్తుండై స్థాణువుంబోలె దివ్యవర్షశతంబు దపంబు సేసి భగవంతుం డయిన వాసుదేవుని యందుఁ బ్రీతి వహించుచు నన్యం బెఱుంగక వర్తించుచుఁ దన్ను స్వప్నమందు 'మమేదం శిర శ్ఛిన్న మిత్యాది' ప్రతీతియందుం బలె వ్యతిరిక్తునిఁగ వ్యాపకునిఁగ నంతఃకరణవృత్తి సాక్షిగా నెఱింగి. 834**

* మలయధ్వజుడు భార్యతో చంద్రమస, తామ్రపర్ణి, నవోదకము లనే నదులలో తీర్థమాడి మనసులోని మాలిన్యాన్నీ, దేహంలోని మాలిన్యాన్నీ తొలగించుకున్నాడు. కందమూలాలను, పండ్లను, విత్తనాలను, పువ్వులను, ఆకులను, గడ్డిని, నీళ్లను ఆహారంగా తీసుకొని గొప్ప తపస్సు చేసాడు. శీతోష్ణాలు, వర్షపాతాలు, ఆకలి దప్పులు, ప్రియా ప్రియాలు, సుఖదుఃఖాలు అనే ద్వంద్వాలను సమానంగా భావించాడు. తపోవిద్యలచేత, యమ నియమాలచేత, కామాది వాసనలను దహించి బ్రహ్మములో తన ఆత్మను కూర్చి, ఇంద్రియాలను, ప్రాణాన్ని, మనస్సును గెలిచాడు. మోడులాగా నిలిచి నూరు దివ్యసంవత్సరాలు తపస్సు చేశాడు. భగవంతుడైన శ్రీహరిపై ప్రీతి తప్ప మరొకటి తెలియక ప్రవర్తించాడు. తనను దేహానికి భిన్నంగా సాక్షిగా తెలిసికొన్నాడు.

**సీ. సాక్షాత్కృతుండును సర్వేశ్వరుండును భగవంతుఁడును గృపాపరుఁడునైన**
**హరి యను లోకైక గురునిచే నుక్తమై సర్వతోముఖమును స్వప్రకాశి**
**తము నగు మహిత శుద్ధ జ్ఞానదీప ప్రభాతతిచేఁ బరబ్రహ్మమందుఁ**
**దన్నును, దనయందుఁ దగఁ బరబ్రహ్మంబు నెనయఁ గన్గొనుచు దగ్ధేంధనాగ్ని**

**తే. భంగి నీషణములఁ, బెడఁబాసి భూరి, వ్యసన సాగర సంసృతి వలనఁ జాల,**
**నుపరతుం డయ్యె, నా మహితోన్నతుండు, నవని నాయక! విను మప్పు డతని భార్య. 835**

* దయామయుడైన శ్రీహరి అనే ఆచార్యుడు అనుగ్రహించిన జ్ఞానం అనే దీపపు కాంతిచేత పరబ్రహ్మలో తనను, తనలో పరబ్రహ్మను దర్శించాడు. కాలిన కట్టెలను అగ్ని విడిచినట్లు, ఈషణ త్రయాన్ని విడిచిపెట్టాడు. దుఃఖ సముద్రమైన సంసారం నుండి వైదొలగాడు.

**క. పతిదైవత శీల సమం, చిత వేణీ భూత చికుర చీరాంబర సు**
**వ్రత చర్య క్షామాంగి వి, గతదోష విదర్భరాజ కన్యక యచటన్. 836**

* మలయధ్వజుని భార్య వైదర్భి పతినే దైవంగా భావించి, జడలు తాల్చి, నారవస్త్రాలు కట్టి, వ్రతని యమాలచేత బాగా చిక్కిపోయింది.

తే. కమలలోచన నిఖిలభోగముల దొఱఁగి, మలయకేతనుఁ బరమ ధర్మజ్ఞుఁ జేరి
నిరుపమైన పతివ్రతా నియమ మొప్ప, సాధ్వియై భక్తిఁ బరిచర్య సలుపుచుండె. 837

క. విమలమతి నిజేశు సమీ, పమునన్ సతి ధూమరహిత పవమానసఖా
గ్రమున వెలుఁగొందు కీల వి, ధమునఁ బ్రకాశించు చుండెఁ దద్దయు వేడ్కన్. 838

* సర్వభోగాలను విడిచి భర్తను భక్తితో సేవించింది. పొగలేని అగ్నిని శుద్ధమైన జ్వాల విడువనట్లు పతిని ఎడబాయక పరిచర్యలు చేసింది.

క. సతి దన ప్రాణేశ్వరుఁ డుప, రతుఁ డగుట మనంబులో నరయకయె పూర్వ
స్థితి నుపచార క్రియ లం, చితమతిఁ గావింపఁ దలఁచి చిరతరభక్తిన్. 839

క. అనుపమ సుస్థిర నియమా, సనుఁడగు నిజనాథు డాయఁ జని పూర్వగతిన్
వినమితయై సతి తత్పద, వనజము లర్చించునపుడు వరుపాదములన్. 840

క. విను మూష్మత లేకున్నను, గని యూథభ్రష్ట హరిణి కైవడి సతి నె
మ్మనమున బెగడుచు దీనత, ననయంబును బంధురహితయై శోకించెన్. 841

* భర్త మరణించటం తెలియని వైదర్భి పూర్వంలాగా సేవించాలని కదలకుండా కూర్చున్న భర్తను సమీపించి నమస్కరించింది. భర్త పాదాలలో వేడి లేకపోవటం గమనించి గుంపునుండి తప్పిపోయిన ఆడులేడి లాగా భయపడుతూ పలవించింది.

చ. అనయము నిట్లు శోకవిపులాశ్రుపయః కణసిక్త మానిత
స్తనయుగయై వియోగపరితాపమునన్ హృదయంబు మాఁడ శో
భన లలితాధరోష్ఠ నవపద్మము గందఁగ సుస్వరంబుగా
వనజదళాక్షి యేడ్చె ననివారణఁ దద్విపినాంతరంబునన్. 842

* చనుదోయి కన్నీటితో తడిసిపోగా, విరహ వేదనతో హృదయం దహించుకొనిపోగా, సుకుమారమైన పద్మంవంటి పెదవి కందిపోగా నిర్జనమైన అడవిలో వైదర్భి ఎలుగెత్తి ఏడ్చింది.

ఉ. హా! నరనాథ! హా! సుమహితాత్మక! హా! గుణశాలి! యింక నం
భోనిధి మేఖలాకలిత భూమి యధార్మిక రాజ చోర పీ
డా నిరతిం గృశింప నకటా! తగునయ్య యుపేక్షసేయ! శో
భా నయశాలి! నీవు పరిపాలన సేయుము, లెమ్ము భూవరా!' 843

చ. అని విలపించుచున్ సరసిజాక్షి నిజేశు పదారవిందముల్
దన నిటలంబు సోఁకఁ బరితాపమునం బడి బిట్టు చాల రో
దన మొనరించుచుం దగిలి దారువులం జితిఁబేర్చి యందులోఁ
బెనుపగు తత్కళేబరముఁ బెట్టి శిఖిం దరికొల్చి యుమ్మలన్. 844

* " ఓరాజా! ఓ మహాత్మా! ఓ సద్గుణమూర్తీ! దొంగలైన క్షత్రియాధముల పీడ చేత కృశించిన భూమండలాన్ని రక్షించకుండా ఉపేక్షించటం నీకు తగదు. లేచి వచ్చి రక్షించు'' అని పతి పాదపద్మాలపై తన నుదురు మోపి విలపించింది. కట్టెలు తెచ్చి, చితిపేర్చి ఆ చితిలో పతి కళేబరాన్ని పెట్టి నిప్పు ముట్టించింది.

క. **తా ననుగమనము సేయం, బూనుటయును నంతలోనఁ బూర్వసఖుఁడు వి**
**జ్ఞాన స్వరూపకుండును, నైన ధరాదివిజుఁ డొక్కఁ డబలం గదియన్.** 845

క. **చనుదెంచి య త్తలోదరి, సునయోక్తుల ననునయించుచుం దగ ననియెన్**
**వనితా! నీ వెవ్వతె? వె, వ్వని దాన? వితం డెవండు? వగచెద వేలా?'** 846

క. **అని యడిగి వెండియును ని, ట్లనియెను నీ సృష్టి పూర్వమందును నీ వె**
**వ్వనితోడ సఖ్య సౌఖ్యము, లనవరతము ననుభవించి తట్టి సఖుండన్.** 847

క. **న న్నెఱుఁగు దేని మనమున, న న్నెఱుఁగక యున్న నై న నలినదళాక్షీ!**
**నన్నుఁ బురాతన సఖుఁగా, నెన్నంగలదాన; వై న నెఱుఁగవె చెపుమా!** 848

* తాను భర్తతో సహగమనం చేయటానికి పూనుకున్నది. అంతలో పూర్వజన్మలో పురంజనునకు మిత్రుడయిన అవిజ్ఞాతుడు అనే బ్రాహ్మణుడు అక్కడకి వచ్చి ఆమెను చూచి, మంచి మాటలతో ఓదారుస్తూ ఇలా అన్నాడు. "వనితా! నీవు ఎవతెవు? ఎవని భార్యవు? ఇత డెవ్వడు?ఎందుకు దుఃఖిస్తున్నావు? నన్ను ఎరుగుదువా? నేను నీ మిత్రుడను. పూర్వం మనం ఇద్దరమూ స్నేహ సుఖాన్ని నిత్యమూ అనుభవించాము. నీవు నన్ను ఎరిగినా, ఎరుగక పోయినా, పూర్వమిత్రునిగా తెలుసుకో.

వ. **కావున నీవును నేనునుం బూర్వంబునందు మానస నివాసులమైన హంసలమై యుండి గృహంబుఁ బాసి సహస్రవత్సరంబులు సఖులమై వర్తించు నంత నీవు ననుం బాసి భౌమభోగ రతుండవై పదంబు నిచ్ఛగించుచు మహీమండలంబు గలయం గ్రుమ్మరునప్పు డొక్క కామినీ నిర్మితంబుం బంచా రామంబు నవద్వారసమేతంబు నేకపాలకంబుఁ ద్రికోష్ఠంబు షట్కులంబుఁ బంచవిపణంబుఁ బంచ ప్రకృతియు స్త్రీ నాయకంబు నైన యొక్క పురంబు వొడగంటి, వది యెట్టి దనినం బంచారామంబు లనం బంచేంద్రియార్థంబులు, నవద్వారంబు లన నాసికాది ద్వారంబు, లేకపాలకం బనం బ్రాణపాలనంబు, త్రికోష్ఠంబు లనం దేజోభిన్నంబులు, షట్కులంబు లన నింద్రియ సంగ్రహంబు, విపణంబులనం గర్మేంద్రియంబులు, పంచ ప్రకృతి యనం బంచ భూతంబులు, ప్రకృతి యను కామిని యన బుద్ధి, యిట్టి పురంబునం బ్రవిష్టుండైన పురుషం డంగనా పరతంత్రుఁడు నజ్ఞుండు. నైన నీవ య ప్పురంబునం గామినీ సంస్పృష్టుండవై రమియించుచుఁ దత్సంగమంబున నష్టస్మృతివై వైదర్భీ జనసంభావిత సుఖాభాసంబులగు దుఃఖంబులచే నిట్టి పాపిష్ఠంబైన దశం బొందితివి, గావున.** 849

* పూర్వం నీవూ నేనూ మానస సరస్సులో నివసించే హంసలం. మనం మిత్రులం. నివాసాన్ని విడిచిపెట్టి వేయి సంవత్సరాలు సంచరించాము. నీవు నన్ను విడిచిపెట్టి క్షుద్రసుఖాలను, అధికారాన్ని కోరి భూమండలంలో తిరిగావు. కామినీ నిర్మితం. పంచారామం, నవద్వారం, ఏకపాలకం, త్రికోష్ఠకం, షట్కులం, పంచవిపణం,

పంచప్రకృతి, స్త్రీనాయకం అయిన ఒక పురాన్ని చూశావు. అది ఎలాంటిదో వివరిస్తాను విను. పంచారామములు అంటే పంచేంద్రియార్థములైన శబ్దం, స్పర్శం, రూపం, రసం, గంధం అనేవి ఐదు. నవద్వారాలు అంటే ముక్కు మొదలైన తొమ్మిది రంధ్రాలు. ఏకపాలకము - అంటే ప్రాణం: త్రికోష్ఠాలు - అంటే భూమి, జలం అగ్ని అనేవి మూడు. షట్కులములు - అంటే నాలుక, కన్ను, చెవి, ముక్కు, చర్మం, మనస్సు అనే జ్ఞానేంద్రియాలు - అనేవి ఆరు. విపణములు - అంటే వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థ అనే కర్మేంద్రియాలు, పంచ ప్రకృతి అంటే "పృథివి, జలం, అగ్ని, వాయువు, ఆకాశం అనే పంచభూతాలు. కామిని అంటే బుద్ధి. ఇటువంటి పురం (దేహం)లో, స్త్రీకాముకుడవు, అజ్ఞుడవు అయి నీవు ప్రవేశించావు. నీవు ఆ కామినికి చిక్కి ఆమెతో క్రీడిస్తూ, ఆమె సంగమంచేత స్మృతిని కోల్పోయి ఈ మహాపాపదశను పొందావు.

**సీ. నీవు వైదర్భివి గావు, వీరుఁ డితండు వివరింపఁగాఁ గాఁడు విభుఁడు నీకు**
**నొగి మున్ను పురమున నుపరుద్ధుఁ జేసిన యా పురంజన పతి వరయఁ గావు**
**మఱియు నీ వన్య సీమంతిని యనియును జర్చింపఁగాఁ బూర్వ జన్మమందు**
**బురుషుండ వనియును బుద్ధిఁ దలంచుట యరయంగ నీ యుభయము నసత్య**

**తే. మింతయును మామకీనమై యెసఁగు మాయఁ జేసి కల్పిత మయ్యెఁ జర్చింప మనము**
**పూర్వమున హంసలమ యని పూని యెఱుఁగఁ, బలికితిఁ దెలియు మనల రూపంబుఁ జూడు.850**

* కాబట్టి నీవు విదర్భరాజు పుత్రికవు కావు. ఈ మలయధ్వజుడు నీకు మగడు కాదు. నీకు పూర్వం పురంలో నివసించిన ఆ పురంజనరాజువు కావు. నీవు ఈ జన్మంలో ఇతరుని భార్యను అని, పూర్వజన్మలో పురుషుడను అని అనుకోవటం కూడా అసత్యమే. ఇదంతా నేను నా మాయచేత సృష్టించాను. మనం ఇరువురం పూర్వం హంసలం (పరమ పరిశుద్ధులం) అని చెప్పాను కదా! మన స్వరూపాన్ని చూడు.

**వ. నేనే నీవు గాని యన్యుండవు గావు, నీవే నేఁ గాని యన్యుండం గా, నిట్లని యెఱుంగుము, విద్వాంసులు మన యిద్దఱయందు నంతరంబు నీక్షింపరు, పురుషుండు ద న్నొక్కనినె యాదర్శ చక్షువులందు భిన్న రూపునింగాఁ దలంచు చందంబున మన యిద్దఱికిని భేదంబు గలిగిన యట్ల దోఁచు, నని యివ్విధంబున నతం డతని చేత నీవు పూర్వంబున మదీయసఖుండవైన హంస వని తెలుపం బడి స్వస్థుండై తద్వియోగ నష్టంబైన జ్ఞానంబు గ్రమ్మఱం బొందె నని చెప్పి నారదుండు ప్రాచీన బర్హింజూచి యీ యధ్యాత్మ తత్త్వంబు రాజకథామిషంబున నీకు నెఱింగించితి ననిన. 851**

* నేనే నీవు. నీవే నేను. అంతేకాని వేరుకాదు. పండితులు మనలో తేడాను చూడరు. దేహం ఒక్కటే అయిన అద్దంలో ప్రతిబింబించే రూపమూ బింబరూపమూ వేరుగా తోచినట్లు మన యిద్దరికీ భేదం లేకున్నా, భేదం ఉన్నట్లు కన్పిస్తుంది.'' ఈ విధంగా అ విజ్ఞాతుడు చేసిన బోధవల్ల తేరుకొని అతని యెడబాటువల్ల తాను కోల్పోయిన జ్ఞానాన్ని వైదర్భి రూపంలో ఉన్న పురంజనుడు పొందాడు అని చెప్పి నారదుడు ప్రాచీనబర్హిని చూచి " ఈ అధ్యాత్మతత్త్వాన్ని రాజుకథ నెపంతో నీకు చెప్పాను''అని అన్నాడు.

క. విన భూమీశుఁడు నారద, ముని కను భవదీయ వచనములు సూరులు ద
క్కను గర్మ మోహితులమై, వనరెడు నే మెట్లు దెలియు వారము చెపుమా! 852

* అప్పుడు ప్రాచీనబర్హి నారదమహర్షితో ఇలా అన్నాడు. "నీ మాటలు పండితులు తప్ప కర్మబద్ధులమై దుఃఖించు మేము తెలిసికో లేముకదా! కాబట్టి నాకు వివరించి చెప్పు'' అని వేడుకున్నాడు. నారదుడు ఇలా చెప్పసాగాడు.

వ. అనిన యోగీంద్రుండు రాజేంద్రున కిట్లనియె. నరేంద్రా! యేమి కతంబున నాత్మచేత నేక ద్విత్రి చతుష్పాదం బును బహుపాదంబును నపాదంబు నగుచుఁ బురంజను దేహంబు ప్రకటం బగుచుండు, నా కతంబునం బురంజనుండును బురుషుం డయ్యె, నట్టి పురుషునకు నామ క్రియా గుణంబుల విజ్ఞాతుండు గాకుండుటం జేసి యవిజ్ఞాత శబ్దంబునం జెప్పంబడు. సఖుం డీశ్వరుండు, పురుషుండు సాకల్యంబునం జేసి దేహపరిగ్రహంబు సేయ నిచ్ఛించునప్పుడు నవద్వార కలితంబన ద్విహస్తచరణ యుక్తంబును నయిన పురం బేది గల, దదియ లెస్స యని తలంచి య ప్పురంబన దేహంబునందుఁ బురుషుం డింద్రియంబులం జేసి యే బుద్ధి నధిష్ఠించి విషయంబుల ననుభవించు, నహంకార మమకారంబులకు నే బుద్ధితత్త్వంబు గారణంబగు నట్టి బుద్ధి ప్రమదోత్తమ యనంబడె, దానికి సఖులు జ్ఞానకర్మ కారణంబులైన యింద్రియ గుణంబులు, సఖీజనంబులు దదీయ వృత్తులు, పంచముఖోరగం బనం బంచవృత్తియైన ప్రాణంబు, నేకాదశ మహాభటులన బృహద్బలుండు నుభయేంద్రియ నాయకుండునైన మనంబు, నవద్వార సమేతంబైన యప్పురంబు చుట్టివచ్చిన పాంచాలదేశంబు లనం బంచ విషయంబులు, నవద్వారంబులన నాసికాకర్ణముఖ గుదశిశ్నంబులు, నందు నక్షినాసాస్యంబు లైదునుం బ్రాగ్ద్వారపురస్కృతంబులు, దక్షిణోత్తర కర్ణంబులు దక్షిణోత్తర ద్వారంబులు, గుద శిశ్నంబులు పశ్చిమ ద్వారంబు, లందు నేకస్థల నిర్మితంబు లయిన ఖద్యోతా విర్ముఖులు నేత్రంబులు, విభ్రాజితంబన రూపంబు,ద్యుమంతుం డనం జక్షురింద్రియంబు, నళినీ నాళిను లన నాసికా ద్వారంబులు, సౌరభం బనం గంధంబు, నవధూత యన ఘ్రాణేంద్రి యంబు, ముఖ్య యన నాస్యంబు, విపణం బనవాక్కు, రసజ్ఞుం డన రసనం, బాపణం బన వ్యవహారంబు, బహూదనం బన వివిధాన్నంబు, పితృహు వన దక్షిణ కర్ణంబు, దేవహు వన నుత్తర కర్ణంబు, చండవేగుం డనం గాలోపలక్షకంబైన సంవత్సరంబు, గంధర్వు లన దివంబులు, గంధర్వీ జనంబు లన రాత్రులు, పరీవర్తనం బన నాయుర్హరణంబు, గాలకన్యక యన జర, యవనేశ్వరుం డన మృత్యు, వతని సైనికులన నాధివ్యాధులు, ప్రజ్వారుం డనం బ్రాణిహింసయందు శీఘ్రవేగంబు గలిగి శీతోష్ణభేదంబులం ద్వివిధంబైన జ్వరంబు, దక్షిణ పాంచాలం బనం బితృలోక ప్రాపకంబును బ్రవృత్తి రూపకంబునైన శాస్త్రం, బుత్తర పాంచాలం బన దేవలోక ప్రాపకంబు నివృత్తి సంజ్ఞికంబు నయి శాస్త్రంబు, శ్రుతధరుం డన శ్రోత్రంబు, నాసురీ నామకం బనం బశ్చాద్ద్వారంబయిన మేఢ్రంబు, గ్రామకం బన సురత సుఖంబు, దుర్మదుం డన గుహ్యేంద్రియంబు, నిర్ఋతినామకంబైన పశ్చిమ ద్వారం బన గుదంబు, వైశసం బన నరకంబు, లుబ్ధకుం డనం బాయువు, నంధు లన హస్తపాదంబు, లంతఃపురం బన హృదయంబు, విషూచి యన మనం బని వెండియు నిట్లనియె. 853

* రాజేంద్రా! ఒకటి, రెండు, మూడు, నాలుగు పాదాలు కలదై, పెక్కు పాదాలు కలదై, పాదాలు లేనిదై ఈ విధంగా పెక్కురకాలుగా చేతనతో కూడిన జీవునివల్ల దేహం వ్యక్తమవుతుంది. కాబట్టి పురంజనుడు అంటే పురుషుడు (జీవుడు). ఆ పురుషునికి నామ క్రియాగుణములచే తెలియబడిన అవిజ్ఞాతుడు అనే మిత్రుడే ఈశ్వరుడు. పురుషుడు తొమ్మిది ద్వారాలతోను, రెండు చేతులతోను, పాదాలతోను కూడిన దోషరహితమైన దేహంలో ప్రవేశించాలని కోరుకుంటాడు. కాబట్టి పురం అంటే దేహం. పురుషుడు బుద్ధిని ఆశ్రయించి ఇంద్రియాలచేత విషయసుఖాలను అనుభవిస్తాడు. అహంకార మమకారాలను పొందుతాడు. కాబట్టి ఉత్తమస్త్రీ అంటే బుద్ధి. ఆ బుద్ధికి స్నేహితులు అంటే జ్ఞాన, కర్మ కారణాలయిన ఇంద్రియ గుణాలు. చెలికత్తెలు అంటే ఇంద్రియ వ్యాపారాలు. అయిదు తలల పాము అంటే పంచవృత్తి అయిన ప్రాణం. పదకొండుమంది మహాభటులు అంటే జ్ఞాన కర్మేంద్రియాలు పది, వాటిని ప్రేరేపించే మనస్సు (బృహద్బలుడు). తొమ్మిది ద్వారాలతో కూడిన ఆ పురాన్ని చుట్టి వచ్చిన పాంచాల దేశములు అంటే శబ్దం మొదలైన పంచ విషయాలు. నవద్వారాలు అంటే రెండు కన్నులు, రెండు ముక్కు రంధ్రాలు, ఒక నోరు, రెండు చెవులు, గుదం, మగగురి. అందులో రెండు కన్నులు, రెండు ముక్కు రంధ్రాలు, ఒకనోరు - ఈ ఐదూ తూర్పున ఉండే ద్వారాలు. కుడి చెవి దక్షిణ ద్వారం. ఎడమచెవి ఉత్తర ద్వారం. గుదం, శిశ్నం అనేవి రెండూ పడమటి వాకిళ్లు. అందులో ఒకే చోట నిర్మింపబడిన ఖద్యోత, ఆవిర్ముఖి అంటే కన్నులు. విభ్రాజితం అంటే రూపం. ద్యుమంతుడు అంటే నేత్రేంద్రియం. నళిని, నాళిని అంటే ముక్కు రంధ్రాలు. సౌరభం అంటే గంధం. అవధూత అంటే ఘ్రాణేంద్రియం. ముఖ్య అంటే నోరు. విపణం అంటే వాగింద్రియం. రసజ్ఞుడు అంటే రసనేంద్రియం. ఆపణం అంటే సంభాషణం. బహూదనం అంటే పలురకాలైన అన్నం. పితృహువు అంటే కుడి చెవి. దేవహువు అంటే ఎడమ చెవి. చంద్రవేగుడు అంటే కాలాన్ని సూచించే సంవత్సరం. గంధర్వులు అంటే పగళ్లు. గంధర్వీజనులు అంటే రాత్రులు. పరీవర్తనం అంటే ఆయుఃక్షయం. కాలకన్యక అంటే ముసలితనం. యవనేశ్వరుడు అంటే మృత్యువు. అతని సైనికులు ఆధి వ్యాధులు. ప్రజ్వారుడు అంటే వేగంగా చావును కలిగించే జ్వరం; శీతం, ఉష్ణం అని ఈ జ్వరం రెండు రకాలు. దక్షిణ పాంచాలం అంటే పితృలోకాన్ని పొందించేదీ, ప్రవృత్తి రూపకమూ అయిన శాస్త్రం. ఉత్తర పాంచాలం అంటే దేవలోకాన్ని పొందించేదీ, నివృత్తి రూపకమూ అయిన శాస్త్రం. శ్రుతధరుడు అంటే చెవి. ఆసురి అనే పేరుకల్గిన పడమటి ద్వారం శిశ్నం. గ్రామకం అంటే రతి. దుర్మదుడు అంటే యోని. నిర్ఋతి అనే పేరు కలిగిన పడమటి ద్వారం గుదం. వైశసం అంటే నరకం.లుబ్ధకుడు అంటే మలద్వారం. సంధులు అంటే చేతులు, కాళ్ళు. అంతఃపురం అంటే హృదయం. విషూచి అంటే మనస్సు.

**సీ. అనఘాత్మ! వినుము జాయాత్మజులును గుణా క్తం బగు మతి బుద్ధితత్త్వ మర్థి**
**వెలయ నే యే గతి వికృతి సేయం బడు నే యే తెఱంగుల నింద్రియములు**
**వికృతిని బొందు నా విధమునఁ దద్గుణాన్వితుఁడును వరుసఁ దద్వృత్తులకును**
**ఘనుఁడు నుపద్రష్టయును దగు నాత్మయుఁ దద్వృత్తులను బలాత్కారమునను**

**తే. ననుకరింపంగ నర్థిఁ జేయంగఁ బడుట, ననయమును నాత్మమహిషిని ననుసరించు**
**టయు నెఱుఁగఁ జెప్పి యిట్టు లనియెను మఱియు, జనవరేణ్యునితో యోగిసత్తముండు. 854**

* భార్యాపుత్రులు అనే గుణలిప్తమైన బుద్ధి తత్త్వం ఏయే విధంగా వికారాన్ని పొందుతుందో, ఏయే విధాలుగా ఇంద్రియాలు వికారాన్ని పొందుతాయో ఆ గుణాలు కలిగి ఆ వృత్తులను అనగా తమ స్వత్త్వరజోధర్మాలయిన మోహ, ప్రసాదహర్షాలను బలవంతంగా పురంజనుడు అనుకరించేవాడు.

వ. 'మఱియు నరదం బన దేహంబు, దురంగంబులన నింద్రియంబు, లీషాద్వయం బన సంవత్సరంబును దత్కృత వయస్సును, జక్రద్వయం బనం బుణ్యాపాప కర్మద్వయంబు, వేణుత్రయం బన గుణత్రయంబు, పంచబంధనం బనం బంచప్రాణంబులు, రశ్మి యన మనంబు, సారథి యన బుద్ధి, రథికోపవేశస్థానం బన హృదయంబు, గూబరంబు లన శోకమోహంబులు, పంచ ప్రహరణంబు లనం బంచేంద్రియార్థప్రక్షేపంబు, పంచవిక్రమం బనం గర్మేంద్రియంబులు, సప్త వరూథంబు లన ధాతువులు, హైమోపస్కరం బన రజోగుణం, బక్షయతూణీరం బన ననంత వాసనాహంకారోపాధి, యేకాదశ చమూపతి యన నేకా దశేంద్రియంబైన మనం, బాసురీవృత్తి యనం బాహ్యావిక్రమంబు, పంచేంద్రియంబులచేత మృగయా వినోదంబు చందంబున హింసాదులం జేసి విషయంబు లనుభవించుటయ మృగయాచరణం, బీ విధంబున నుండ జీవుండు దేహంబున స్వప్న సుషుప్తి జాగ్రదవస్థలయందు నాధ్యాత్మి కాధిదైవి కాధిభౌతికంబులైన బహువిధ దుఃఖంబులం జేసి క్లేశంబుల ననుభవించుచు నజ్ఞానావృతుండయి వర్షశతంబు నిర్గుణుం డయ్యును బ్రాణేంద్రియ మనోధర్మం బులం దనయందు నధ్యవసించి కామలవంబుల ధ్యానంబు సేయుచు నహంకార మమకార సహితంబుగాఁ గర్మాచరణంబు సేయుచుండు. 855

* రథం అంటే శరీరం. గుఱ్ఱాలు అంటే ఇంద్రియాలు. రెండు యుగాలు అంటే సంవత్సరం, వయస్సు, రెండు చక్రాలు అంటే పుణ్యాపాప కర్మాలు. మూడు జెండాలు అంటే త్రిగుణాలు. పంచబంధనాలు అంటే పంచ ప్రాణాలు. పగ్గం అంటే మనస్సు. సారథి అంటే బుద్ధి. గూడు అంటే హృదయం. రెండు నొగలు అంటే శోకమోహాలు. పంచ ప్రహరణాలు అంటే ఐదు ఇంద్రియార్థాలు. పంచవిక్రమాలు అంటే కర్మేంద్రియాలు. సప్తవరూధాలు అంటే రసం, రక్తం, మాంసం, మేదస్సు, అస్థి, మజ్జ, శుక్రం అనే ఏడు ధాతువులు. స్వర్ణాభరణం అంటే రజోగుణం. అక్షయ తూణీరం అంటే అనంత వాసనాహంకార ఉపాధి. ఏకాదశ సేనాపతి అంటే పది ఇంద్రియాలూ, మనస్సూ; ఆసురీవృత్తి అంటే బాహ్యావిక్రమం. పంచేంద్రియాలచేత హింసాదులను చేసి విషయాలను అనుభవించుటయే వేట. పురుషుడు దేహంతో స్వప్న సుషుప్తి జాగ్రదవస్థలతో ఆధ్యాత్మిక, ఆధిదైవిక, ఆధిభౌతికాలైన బహువిధ దుఃఖాలచేత కష్టాలను అనుభవిస్తాడు. అజ్ఞానం చేత కప్పబడి నిర్గుణుడు ఐనా ప్రాణేంద్రియ మనోధర్మాలను తన యందు ఆరోపించి కామలేశాలను ధ్యానిస్తూ అహంకార మమకారాలతో గూడ వందయేండ్లు కర్మలను ఆచరిస్తాడు.

క. పురుషుఁడు నిజప్రకాశతఁ, బరఁగియు నలఘుఁడుఁ బరుండు భగవంతుండున్
గురుఁడును నగు న య్యాత్మను, బరువడి నెఱుఁగంగ లేక ప్రకృతి గుణములన్. 856

క. విను మెపుడు దగులు నప్పుడ, యొనరంగ గుణాభిమానియును గర్మవశుం
డనఁ దగు నా పురుషుఁడు దా, ఘనమగు త్రైగుణ్య కర్మకలితుం డగుచున్. 857

* పురుషుడు తాను స్వయంప్రకాశుడనీ, ప్రకృతికి పరుడైన పరమాత్ముడనీ, గురుడనీ, తెలుసుకోలేక ప్రకృతి గుణాలలో ఆసక్తుడయితే, గుణాభిమానియై కర్మవశుడై త్రిగుణాలకు సంబంధించిన కర్మలలో మునిగి తేలుతుంటాడు.

సీ. ధృతి నొప్పుచున్న సాత్త్విక కర్మమునను బ్రకాశ భూయిష్ఠ లోకముల భూరి
రాజస ప్రకట కర్మమున దుఃఖోదర్క లోలక్రియాయాస లోకములను
గైకొని తామస కర్మంబునను దమ శ్శోక మోహోత్కట లోకములను
బొందుచుఁ బుంస్త్రీ నపుంసక మూర్తుల దేవతిర్యఙ్మర్త్య భావములను

తే. గలుగుఁ గర్మానుగుణములు గాఁగ జగతిఁ, బుట్టి చచ్చుచుఁ గ్రమ్మఱఁ బుట్టు చిట్లు
దివిరి కామాశయుండైన దేహి యెప్డు, నున్నతానతపదముల నొందుచుండు. 858

* సాత్త్విక కర్మలవల్ల ప్రకాశ భూయిష్ఠములైన లోకాలను, రాజసకర్మలవల్ల దుఃఖ భూయిష్ఠములైన లోకాలను, తామస కర్మలవల్ల తమ శ్శోక మోహ భూయిష్ఠములైన లోకాలను పొందుతాడు. ఒకప్పుడు పురుషుడై ఒకప్పుడు స్త్రీయై, ఒకప్పుడు నపుంసకుడై ఆయా కర్మలకు తగినట్లు దేవ, మనుష్య, తిర్యక్ రూపాలతో జన్మిస్తాడు. ఈ విధంగా కామాసక్తుడయిన పురుషుడు పుట్టుతూ, చస్తూ, మళ్ళీ పుట్టుతూ ఉన్నత స్థానాలను, నీచస్థానాలను పొందుతూ ఉంటాడు.

వ. అని మఱియు నిట్లనియె. 859

మ. ఎనయన్ క్షుత్పరిపీడఁ గుంది శునకం బింటింటికిం బోవఁ బూ
నినఁ దద్దైవిక మైన దండహతి గానీ, కాక చౌర్యాన్నమై
నను గానీ తగఁ బొందు చందమున నెన్నన్ దైవయోగంబు పెం
పున నీ జీవుఁడు దాఁ బ్రియా ప్రియములం బొందుం ద్రిలోకంబులన్. 860

* ఆకటి బాధతో కుక్క యింటింటికి తిరిగి దైవికంగా కఱ్ఱ దెబ్బలనో, దొంగకూడునో తిన్నట్లు జీవుడు దైవికంగా ప్రాప్తించిన ప్రియా ప్రియాలను మూడు లోకాలలోను అనుభవిస్తాడు.

చ. గొనకొని యిట్టి దుఃఖములకుం బ్రతికారము మానవేంద్ర! క
ల్గిన విను తత్ప్రతిక్రియ నకించనవృత్తి జనుండు మస్తకం
బున నిడుమోపు మూఁపునను బూనినఁ దద్భర దుఃఖ మాత్మఁ బా
యని గతి జీవుఁడుం ద్రివిధమై తగు దుఃఖముఁ బాయఁ డెన్నఁడున్. 861

* ఇటువంటి దుఃఖాలకు ప్రతిక్రియ లేదు. ఒకవేళ ఉన్నా అది తాత్కాలికమే. బరువు మోసే నిరుపేదవాడు తలమీద బరువును భుజం మీదికి మార్చుకున్నప్పటికీ దాన్ని మోయటం వల్ల కలిగే దుఃఖాన్ని తప్పించుకోలేడు. అలాగే జీవుడు మూడురకాలైన దుఃఖాన్ని తప్పించుకోలేడు.

**క. ఘన దుఃఖ హేతుకర్మం, బును దత్ప్రతికార కర్మమును నివి మాయా**
**జననము లగుటను బురుషుఁడు, గనుఁ గలలోఁ దోఁచి నట్టి కల చందమునన్. 862**

**వ. సవాసనోచ్ఛేదకంబు గా దని వెండియు నిట్లనియె. 863**

* కలలో మళ్ళీ కల వచ్చినట్లు, దుఃఖాన్ని కలిగించే కర్మం, ప్రతీకార కర్మం అవిద్యచేత కలుగుతాయి.

**సీ. నరనాథ! వినుము స్వప్నంబు చందంబున నజ్ఞాన విలసితం బగుటఁ జేసి**
**తివిరి మిథ్యాభూత దేహాదికమునకు నరయ నివర్తనాయాస మేటి**
**కని యంటివేనియు నర్థంబు లేకున్న నర్థి సోపాధికం బైన మనము**
**వాంఛతో స్వప్నము వర్తింపఁ బురుషునిఁ బూని జాగ్రద్బోధచే నుపాధి**

**తే. చెడక స్వాప్నిక సంస్కృతి విడువనట్లు, తత్త్వ విజ్ఞానమున నవిద్యా నివృత్తి**
**దారదేహాదిక నివృత్తి దగులకున్నఁ, దివుట సంసృతి దా నివర్తింప కుండు. 864**

* రాజా! దేహం స్వప్నంవలె అజ్ఞానంవల్ల ప్రాప్తిస్తుంది. కాబట్టి అసత్యమైనదే కదా! దానిని ప్రయాసపడి తొలగించుకోవటం ఎందుకు అని అనరాదు. ప్రయోజనం లేకపోయినా కలలో ఉపాధితో కూడిన మనస్సు పురుషుని ఆశ్రయించి మెలకువ వచ్చిన తరువాత కూడా స్వప్న సంసారాన్ని విడిచిపెట్టదు. అలాగే వైరాగ్యంచేత అజ్ఞానాన్ని తొలగించుకోలేకపోయినా; భార్యను, శరీరాన్ని విడిచిపెట్ట లేక పోయినా, సంసారం నుండి విడుదల లేదు.

**చ. ఘన పురుషార్థభూత మనఁగాఁ దగు నాత్మకు నే నిమిత్తమై**
**యొనర ననర్థహేతు వన నూల్కొను సంసృతి సంభవించు న**
**ట్లనయముఁ దన్నిమిత్త పరిహారక మర్థి జగద్గురుండు నాఁ**
**దనరిన వాసుదేవ పద తామరస స్ఫుటభక్తి యారయన్. 865**

* పరమ పురుషార్థం అనదగిన ఆత్మకు ఏకారణంవల్ల అనర్థాలను కలిగించే సంసారం కలుగుతుందో, ఆ కారణాన్ని జగద్గురుడైన వాసు దేవుని పాదపద్మాలమీద భక్తి నశింప జేస్తుంది.

**క. పూనిన తద్భక్తి సమీ, చీనగతిం దెలియ ననఘ! చిరవైరాగ్య**
**జ్ఞాన జనక మగు భక్తిని, ధానము గోవింద వరకథాశ్రయమ యగున్. 866**

**వ. కావున నది తత్కథాకర్ణన గాన నిరతుండు, విశ్వాస సంయుక్తుండు నైన వానికి సంభవించు, మఱియును 867**

* వాసుదేవుని యందలి భక్తి శాశ్వతములైన వైరాగ్య జ్ఞానాలను కలిగిస్తుంది. ఆ భక్తి గోవిందుని సత్కథలను వినటం వల్లనే కలుగుతుంది.

క. ధర సాధులు విమలాంతః, కరణులు భగవద్గుణానుకథన శ్రవణ
స్ఫురిత స్వాంతులు ననఘులు, వరధిషణులు నైన భాగవత జనుల సభన్. 868

క. సరసోదార మహాత్మము, ఖరితము లగు మధు విరోధి కమనీయ గుణో
త్కర సురుచిర చరితామృత, పరిపూరిత వాహినులను బరమ ప్రీతిన్. 869

క. మన మలరఁగ శ్రోత్రాంజలు, లను బానము సేయు పుణ్యులకు క్షుత్తృష్ణా
ఘన భయ శోకవిమోహము, లనయంబును సోఁకకుండు నవనీనాథా! 870

* భగవంతుని గుణాలను కీర్తించటంచేత, వినటంచేత పరిశుద్ధమైన మనస్సు కలిగిన భక్తుల సభలకు వెళ్ళి అక్కడ హరికథామృత ప్రవాహాలను చెవులు అనే దోసిళ్లతో తనివితీరా త్రాగేవారికి ఆకలీ, దాహమూ, భయమూ, శోకమూ, విమోహమూ సోకవు.

వ. కావున నిట్టి భాగవత సహవాసంబు లేక తనంతన భగవద్భాగవత గుణాభివర్ణన కథానుచింత నాదులయందుం బ్రవర్తించిన నాలస్యాది దోషంబు లొంది యీ జీవలోకంబు సహజక్షుధాదికంబున నుపద్రుతంబై సర్వేశ్వరకథామృత వాహిని యందు రతిం జేయ, దిది నిశ్చితం బని మఱియు నిట్లనియె. 871

* సత్సంగం లేకుండా స్వయంగా హరికథా చింతనాదులవల్ల భక్తి కలుగదు. సహజములైన ఆకలిదప్పులచేత బాధపడే జీవులకు, సోమరితనంవల్ల, రసావేశం లేనందువల్ల హరికథామృతపానంలో ఆసక్తి కలుగదు.

సీ. పద్మసంభవుఁడును భవుఁడును మనుకుల సమితి దక్షాది ప్రజాపతులును
నైష్ఠికులైన సనకముఖ్య మునులుఁ బులస్త్యుండు భృగువుఁ బులహుఁడుఁ గ్రతువు
నత్రి మరీచియు నంగిరసుండు నరుంధతీ విభుఁడును రూఢి మెఱయఁ
బహుపుణ్యు లేఁ గడపలఁ గాఁగఁ గల బ్రహ్మ వాదులు నందఱు వాక్కులకును

తే. నెనయ నీశ్వరులై యుండియును సమగ్ర, మతిఁ దపో యోగ విద్యా సమాధి వర వి
చారులై యుండియును సర్వసాక్షి యైన, యీశ్వరుని వెదకియుఁ గాన రిద్ధచరిత! 872

* బ్రహ్మ, మహేశ్వరుడు, మనువులు, దక్షుడు మొదలైన ప్రజాపతులు, సనకాదిమునులు, పులస్త్యుడు, భృగువు, పులహుడు, క్రతువు, అత్రి, మరీచి, అంగిరసుడు, వసిష్ఠుడు, నేను (నారదుడు) వేదాంతులం, వాచస్పతులం, తపోయోగవిద్యా సమాధులు అనే ఉపాయాలతో ఆలోచించేవారం, అయినా సర్వసాక్షి అయిన పరమాత్ముని చూడలేము.

వ. అది యెట్లంటేని. 873

మ. ఘనవిస్తార మపార మద్వయ మనంగా నొప్పు వేదంబు దా
మనువర్తించుచు మంత్రయుక్తి వివిధంబై నట్టి దేవాఖ్య శో
భనసామర్థ్యముచేత నింద్ర ముఖరూపం బిష్టదైవంబుగాఁ
గని వేడ్కన్ భజియించువారలు గనంగా నేర్తురే యీశ్వరున్. 874

* ఏమంటే మిక్కిలి విస్తారమైనదీ, అంతులేనిదీ, అద్వితీయమైనదీ అయిన వేదాన్ని అనుసరించి మంత్రాలచేత పెక్కు దేవతలను ఆరాధిస్తూ ఇంద్రాది దేవతలను ఇష్టదైవతాలుగా భజించేవారు సర్వేశ్వరుడైన పరమాత్మను దర్శింపలేరు.

క. విను మాత్మ భావింతు డన, నెనసిన భగవంతుఁ డెప్పు డెవ్వనిఁ గరుణం
దనరుచు ననుగ్రహించును, మనుజేశ్వర! యపుడు వాఁడు మహితాత్మకుఁడై, 875

క. ధీరత నీ లోకవ్యవ, హారంబును వైదికంబు ననఁదగు కర్మా
చారములందు వినిష్ఠిత, మై రూఢిఁ దనర్చు బుద్ధి నర్థిన్ విడుచున్. 876

* భగవదనుగ్రహానికి పాత్రుడైనవాడు మహితాత్ముడై ఆత్మభావం పొంది లోకవ్యవహారంలోనూ, వైదిక కర్మాచరణంలోనూ నెలకొన్న బుద్ధిని త్యజిస్తాడు.

సీ. కావున రాజేంద్ర! నీవును బరమార్థ, రూపంబు లగుచుఁ బ్రరోచమాన
ములును గర్ణప్రియంబులును నస్పృష్ట వ, స్తువులును నైన యీ వివిధ కర్మ
ములయందుఁ బురుషార్థ బుద్ధి గావింపకు, మతిఘన స్వాంతు లైనట్టివారు
పరఁగు జనార్దన ప్రతిపాదకంబైన, శ్రుతిఁ గర్మపర మని చూపుచుండు

తే. వారు వేదజ్ఞు లనఁదగువారు గారు, రూఢి మఱివారు నిత్యస్వరూపభూత
మైన యీ యాత్మతత్త్వంబు నలరు వేద, కలిత తాత్పర్యమని యాత్మఁ దెలియలేరు. 877

* కాబట్టి రాజేంద్రా! పరమార్థాలలాగా కనిపిస్తూ, ఆసక్తి కల్పిస్తూ, వినటానికి ఇంపై, అవాస్తవములైన ఈ వివిధ కర్మలను పరమార్థాలు అని అనుకోకు. మలిన బుద్ధులు జనార్దనుని ప్రతిపాదించే వేదాన్ని కర్మపరమని వాదిస్తారు. వారు వేదతత్త్వం తెలిసినవారు కారు.

వ. కావునం బ్రాగగ్రంబులైన దర్భలచేత సకలక్షితిమండలాస్తరణంబు గావించి యహంకార యుక్తుండవు నవినీతుండవు పెక్కుపశువులఁ జంపనే కాని కర్మస్వరూపంబును విద్యాస్వరూపంబును నెఱుంగ, వా కర్మ విద్యాస్వరూపంబు లెట్టి వనిన సర్వేశ్వర పరితోషకం బేది, యదియ కర్మం, బా సర్వేశ్వరునియందు నేమిట మతి సంభవించు నదియ విద్య, యతండే దేహులకు నాత్మయు నీశ్వరుండు నగుచుండుఁ, గావునఁ బురుషులకు క్షేమ కరంబైన యాశ్రయంబు తద్పాద మూలంబ, యతండు ప్రియతముండును సేవ్యమానుండును నగుచుండ నణుమాత్రం బయిన దుఃఖంబులే, దట్టి యా భగవత్స్వరూపం బెవ్వం డెఱుంగు, వాఁడు విద్వాంసుండును గురుండును హరియు నని చెప్పి వెండియు నిట్లనియె. 878

* ప్రాచీనాగ్రములైన (తూర్పువైపు కొనలుగల) దర్భలను భూమండలమంతా పరచి అహంకారంతో, అవినయంతో అనేక పశువులను చంపావు. కర్మ స్వరూపాన్ని విద్యాస్వరూపాన్ని తెలిసికోలేక పోయావు. ఆ కర్మ విద్యాస్వరూపాలను గురించి చెపుతాను విను. హరికి సంతోషాన్ని కలిగించేదే కర్మము.

భగవంతునిపై మతిని నెలకొల్పేదే విద్య. హరియే దేహులకు ఆత్మ. హరియే పరమాత్మ. భద్రతను కోరేవారికి హరిపాదమూలమే శరణము. హరిని పరమ ప్రియునిగా భావించి కొలిచే వారికి ఆవంతయైనా దుఃఖం కలుగదు. భగవత్ స్వరూపాన్ని తెలిసికొన్నవాడే విద్వాంసుడు. అతడే గురువు. అతడే హరి.

**క. అవనీశ! యీ విధంబున, భవదీయ ప్రశ్న మిట్లు పరిహృత మయ్యెం,**
**దవిలి యిఁక నొక్క గోప్యము, వివరించెదఁ జిత్తగింపు విమలచరిత్రా! 879**

* రాజేంద్రా! నీ ప్రశ్నకు పూర్తిగా సమాధానం చెప్పాను. ఇక ఒక రహస్యం వివరిస్తాను. సావధానంగా విను.

**సీ. లలి సుమనో వాటికల యందు నల్ప ప్రసూన మరంద గంధానుమోద**
**సంచారియును మృగీసహితముఁ దన్నివేశిత చిత్తమును మధువ్రత నినాద**
**మేదుర శ్రవణానుమోదితమును బురోభాగ చరన్నిజ ప్రాణహారి**
**దీపిత వృక గణాధిష్ఠితమును లుబ్ధక క్రూర ఘన సాయక ప్రభిన్న**

**తే. పృష్ఠభాగంబునై తగ నెదను మృత్యు, భీతి వాటిల్ల నొండు దప్పింప వెరవు**
**గాన కడవిఁ జరించు మృగంబు పగిది, భూవరోత్తమ! వినవయ్య! పురుషుఁ డెపుడు. 880**

* అందమైన పూలతోటలో హాయిగా విహరిస్తూ చిన్నారి పూలతీయని తేనెలకు, కమ్మని సువాసనలకు జుమ్మనే తుమ్మెదపాటలకు ప్రీతి చెందుతూ ఒక మగలేడి ఆడులేడితో కలిసి నెమ్మదిగా సంచరిస్తున్నది. దాని మనస్సు ఆడులేడిమీదనే నిమగ్నమై ఉన్నది. ఆ మగలేడికి ముందుభాగంలో ప్రాణాలకు హాని కలిగించే తోడేళ్ల గుంపు తిరుగుతున్నది. ఇంతలో వెనుక నుండి బోయవాడు విడిచిన వాడి బాణం లేడి పృష్ఠభాగాన్ని చీల్చి వేసింది. తప్పించుకొనే దారిలేక ఆ మగలేడి అడవిలో మృత్యువుపాలయింది. రాజేంద్రా! పురుషుడు ఆ మగలేడివంటి వాడే సుమా!

**వ. అంగనా నివాసంబుల యందు క్షుద్రతమంబగు కామ్య కర్మ పరిపాక జనితంబైన జిహ్వోపస్థాది కామజనిత సుఖలేశంబుల నన్వేషించుచుఁ, గామినీయుక్తుండును, దన్నివేశిత మానసుండును నతిమనోహర వనితాజనాలాప శ్రవణ తత్పర చిత్తుండును, బ్రత్యక్షంబున నాయుర్హరణ కారణా హోరాత్రాది కాలవిశేషగణనా పరుండునుగాక పరోక్షంబునం గృతాంత శరనిర్భిన్న గాత్రుండును నగుచు నీ జీవుండు విహరించు చుండుం, గావున నీవు నీ జీవుని మృగచేష్టితునిఁగా విచారించి శ్రోత్రాదులందున్న శబ్దాదులం బోలె బాహ్య వృత్తులగు శ్రౌతస్మార్తాది రూప కర్మంబును హృదయంబునందు నియమించుచు నసజ్జనయూథ వార్తాసహితం బైన గృహాశ్రమంబు విడువుము, సకల జీవాశ్రయుండైన యీశ్వరుని భజియింపు, మిట్లు సర్వతో విరక్తుండవు గమ్మని నారదుండు వలికినం బ్రాచీనబర్హి యిట్లనియె. 881**

* పురుషుడు పూలవంటి స్త్రీల యిండ్లను ఆశ్రయిస్తాడు. పూల తేనెలలాగా సువాసనలలాగా మిక్కిలి క్షుద్రమై, కామ్యకర్మ పరిపాకము నుండి పుట్టిన జిహ్వా, ఉపస్థ మొదలైన కామ జనిత సుఖలేశాన్ని అన్వేషిస్తాడు. స్త్రీయందే మనస్సు నిల్పుతాడు. తుమ్మెద పాటలలాగా మనస్సును కొల్లగొట్టే స్త్రీల మాటలను వినగోరుతాడు. కనులముందే తోడేళ్ల గుంపులాగా ఆయుస్సును హరించే రాత్రింబవళ్ళను లెక్కచేయడు. వెనుకనుండి బోయవాని వంటి యముడు శరీరాన్ని చీల్చివేస్తుండగా జీవుడు విహరిస్తాడు. కాబట్టి నీవు ఈ జీవుని లేడివంటి చేష్టలు కల వానినిగా భావించు. బాహ్యవ్యాపారాలైన శ్రౌతస్మార్తాది రూపకర్మలను హృదయంలో నిగ్రహించు. అతి కాముకుల గాథలతో కూడిన సంసారాన్ని విడిచిపెట్టి, సర్వజీవులకు దిక్కైన భగవంతుని సేవించు, సంపూర్ణ విరక్తిని పొందు'' అని నారదుడు బోధించాడు. ప్రాచీనబర్హి ఇలా అన్నాడు.

**క. మునివర! భగవంతుండవు, ననుపమ విజ్ఞాననిధివి నన(దగు నీచే**
**తను వివరింపంగా( దగి, యెనసిన యీ యాత్మతత్త్వ మిట నా చేతన్. 882**

**వ. శ్రుతంబును విచారితంబును నయ్యె(, గర్మనిష్ఠు లగు నుపాధ్యాయు లైనవార లీ యాత్మ తత్త్వంబును నెఱుంగ, రెఱింగిరేని యుపదేశింపరు. కావున( దద్కృతంబయిన మహా సంశయంబు నీ చేత నివృత్తం బయ్యెనని వెండియు నిట్లనియె. 883**

* "మునీంద్రా! మేటి విజ్ఞానివి అయిన నీవు చెప్పిన ఆత్మ తత్త్వాన్ని విన్నాను. బాగా ఆలోచించాను. నాకు కర్మమును బోధించిన ఆచార్యులకు ఈ ఆత్మ తత్త్వము తెలియదు. తెలిస్తే కర్మను ఉపదేశించరు కదా! ఆ ఆచార్యులు ఉపదేశంచేత నాకు ఆత్మతత్త్వం విషయంలో కల్గిన మహాసంశయం నీ వల్ల పటాపంచ లయింది'' అని ఇంకా ఇలా అన్నాడు.

**సీ. అనఘాత్మ! యేమిటి యందు నీ యింద్రియ వృత్తులు దగ( బ్రర్తింపకుండు**
**టను జేసి ఋషులైన ఘనముగ మోహింతు రట్టి యర్థము నందు నాత్మ సంశ**
**యము గల్గుచున్నది, యది యెట్టి దనినను బురుషు( డే యే దేహమునను జేసి**
**కర్మముల్ సేసి తత్కాయంబు నీ లోక మందునే విడిచి తా నన్యదేహ**

**తే. మర్థితో ఘటియించి లోకాంతరమును, బొంది తత్కర్మఫలమును బొందు ననుచు(**
**బ్రకటముగ వేదవేత్తలు వలుకు చుందు, రన్న నది యెట్లు విన నుపపన్న మగును? 884**

* ఇంద్రియ వృత్తులయందు అప్రవృత్తులై ఋషులు మోహించే అర్థం గురించి నాకు సంశయం కలుగుతున్నది. పురుషుడు ఏ దేహం చేత కర్మలు చేస్తాడో ఆ దేహాన్ని ఈ లోకంలోనే విడిచి పెట్టి తాను మరొక దేహాన్ని ధరించి మరొక లోకాన్ని చేరి అక్కడ కర్మఫలాన్ని అనుభవిస్తాడని వేదవేత్తలు చెపుతారు. ఇది యెట్లా పొసగుతుంది?

**వ. అదియునుం గాక యాచరితంబైన కర్మంబు తత్‌క్షణంబు వినష్టం బగుటంజేసి జీవుండు దేహాంతర లోకాంతర భావి యయిన ఫలం బెట్లు సంభవించు ననిన ప్రాచీనబర్హికి నారదుం డిట్లనియె.**

నరేంద్రా! స్వప్నావస్థయందు లింగశరీరాధిష్ఠాతయైన జీవుండు జాగ్రద్దేహాభిమానంబు విడిచి తాదృశంబ కాని యతాదృశంబ కాని యైన శరీరాంతరంబు నొంది మనంబునందు సంస్కార రూపంబున నాహితంబైన కర్మంబు ననుభవించు చందంబునం బురుషుం డే లింగశరీరంబునం జేసి కర్మంబు నాచరించు, నా లింగశరీరంబుననే లోకాంతరంబున దేహవిభేదంబు నొందక తత్ఫలం బనుభవించు, నదియునుం గాక దాన ప్రతిగ్రహాదుల యందు స్థూలదేహంబునకుం గర్తృత్వంబు గల దంటివేని నహంకార మమకార యుక్తుండైన పురుషుండు మనంబునం జేసి యే యే దేహంబు పరిగ్రహించు, నా యా దేహంబున సిద్ధంబైన కర్మం బా జీవుం డనుభవించు, నట్లు గాకున్నఁ గర్మంబు పునర్భవ కారణం బగుట యుపపన్నంబు గాకుండుఁ, గావున మనఃప్రధానం బైన లింగశరీరంబునకే కర్తృత్వం బుపపన్నం బగునని వెండియు నిట్లనియె. 885

* అంతే కాదు. చేసిన వేదోక్తమైన కర్మ ఆ క్షణంలోనే నశిస్తుంది కదా! ఇంక జీవుడు మరొక దేహం పొంది లోకాంతరంలో ఎలా అనుభవించగలడు?" అని ప్రశ్నించాడు. అప్పుడు నారదుడు ప్రాచీన బర్హితో ఇలా అన్నాడు. "రాజా! లింగశరీరాన్ని ఆశ్రయించి ఉండే జీవుడు కలలో జాగ్రద్దేహాభిమానాన్ని విడిచి, అటువంటిదో లేక అటువంటిది కానిదో అయిన మరొక శరీరం పొందుతాడు. మనస్సులో సంస్కార రూపంలో  ఆ హితమైన కర్మను ఆచరిస్తాడు. అలాగే జీవుడు ఏ లింగ శరీరం చేత కర్మను చేస్తాడో ఆ లింగశరీరం చేతనే లోకాంతరంలో ఆ ఫలాన్ని అనుభవిస్తాడు. భిన్న దేహాన్ని పొందడు. ఇవ్వటం, పుచ్చుకొనటం మొదలైన వానియందు స్థూల దేహానికి కర్తృత్వం ఉన్నది అని భ్రమించకూడదు. జీవుడు అహంకారంతోను మమకారంతోను కూడిన వాడు. ఆ జీవుడు మనస్సు చేత ఏ దేహాన్ని పొందుతాడో, ఆ దేహం చేతనే ప్రాప్తించిన కర్మను అనుభవిస్తాడు. అలాకాకుంటే కర్మ పునర్జన్మకు కారణం కావటం పొసగదు. కాబట్టి మనః ప్రధానమైన లింగశరీరానికే కర్తృత్వం పొసగుతుంది.

క. క్షితి నుభయేంద్రియ కర్మ, స్థితు లనుభవ మందఁబడిన చిత్తము పగిదిన్
ధృతిఁ జిత్తవృత్తులను ల, క్షిత మగుఁ దత్పూర్వ దేహకృత కర్మంబుల్. 886

* జ్ఞానరూపాలు, కర్మరూపాలు అయిన ఇంద్రియాల కర్మ ప్రవృత్తులచేత చిత్తాన్ని ఊహించవచ్చు. అలాగే చిత్త వృత్తులను బట్టి పూర్వదేహంచేత చేయబడిన కర్మలను ఊహించవచ్చు.

వ. అది యెట్లనిన నీ దేహంబునం జేసి యే రూపంబు నే ప్రకారంబున నెప్పు డెచట నగు, నది యనను భూతంబును నదృష్టంబును నశ్రుతంబునునై యుండు, నట్టిది యొకానొక కాలంబున వాసనాశ్రయుం డయిన పురుషునకుఁ దదనుభవాది యుక్తం బగు పూర్వదేహంబున ననుభూతంబును దృష్టంబును శ్రుతంబును నని విశ్వసింపు, మీ మనంబున అననుభూతార్థంబు గోచరింపఁజాల, దీ మనంబు పురుషులకు శుభాశుభ నిమిత్తంబులైన పూర్వాపర దేహంబులం బ్రకాశింపం జేయుచుండు, నీ మనంబునందు నదృష్టంబు నశ్రుతంబు నైన యర్థంబు స్వప్నాదికమందుం దోఁచు నంటివేని నది దేశకాల క్రియాశ్రయంబని తలంపం దగు, నీ సమస్త విషయంబులఁ గ్రమానురోధంబున మనంబునం జేసి భోగ్యంబులగు నని మఱియు నిట్లనియె. 887

* దేహం చేత అనుభవింపబడనిది, చూడబడనిది, వినబడనిది అయినటువంటిది వాసనాశ్రయుడైన జీవునికి పూర్వ దేహంలో అనుభవింప బడినది, చూడబడినది, వినబడినది అవుతుంది. అనుభవింపబడిన విషయం మనస్సులో స్ఫురించదు. ఈ మనస్సే జీవులకు శుభాశుభములకు కారణమైన పూర్వాపరదేహాలను తెలుపుతుంది. ఈ మనస్సులో చూడబడనిది, వినబడనిది అయిన విషయం కలలో కనిపించే మాట నిజమే. కాని ఆ కల దేశకాల క్రియలను ఆశ్రయించి ఉంటుంది. సమస్త విషయాలు క్రమాన్ని అనుసరించి మనస్సుచేత అనుభవింపబడతాయి.

**చ. సుమహిత శుద్ధ సత్త్వగుణ శోభితమున్ సరసీరుహోదరో**
**త్తమ గుణచింతనాపరము ధన్యము నైన మనంబునందు భూ**
**రమణ! సుధాంశునందు నుపరాగమునన్ దివిఁ దోఁచు రాహు చం**
**దమునను గోచరంబగు నుదారత నీ యఖిల ప్రపంచమున్.** 888

* శుద్ధ సత్త్వ గుణం కలిగి వాసుదేవుని ఉత్తమ గుణాలను ధ్యానించటంలో నిమగ్నమైన మనస్సులో, గ్రహణం నాడు చంద్రమండలంలో రాహువు కనిపించినట్లు ప్రపంచ సర్వమూ కనిపిస్తుంది.

**వ. అని వెండియు నిట్లనియె. లింగదేహమునకు గర్తృత్వ భోక్తృత్వంబులు స్థూలదేహద్వారకంబు లగుటంజేసి స్థూలదేహ వినాశంబు గలుగం జీవునకుఁ గర్తృత్వ భోక్తృత్వంబులు లేకుండుటం జేసి ముక్తి గలుగు నంటివేని నీ స్థూలదేహ సంబంధంబు జీవునియందు బుద్ధి మనోమోక్షార్థ గుణవ్యూహ రూపాది లింగ శరీరభంగ పర్యంతంబు గలుగుచుండును, సుషుప్తి మూర్ఛాదులందు నిష్టవియోగాది దుఃఖమందు నహంకారంబు గలిగియుండు, నది యింద్రియోపహతింజేసి యమావాస్య యందలి చంద్రుండునుంబోలెఁ దరుణపురుషునకు గర్భ బాల్యావస్థలయందు నింద్రియ పౌష్కల్యంబు లేకుండుటం జేసి యేకాదశేంద్రియ స్ఫురణ సమర్థం బయిన యహంకారంబు గర్భాదులకుఁ బ్రకాశింపని చందంబుం దోఁపకుండుఁ గావున స్థూలదేహ విచ్ఛేదంబు లేకుండుటం జేసి వస్తుభూతార్థంబు లేకున్న నీ సంసారంబు విషయంబులయం దాసక్తుండగు జీవునకు స్వాప్ని కానర్థాగమనంబునుంబోలె నివర్తింప, దీ తీరునం బంచతన్మాత్రాత్మకంబును ద్రిగుణాత్మకంబును షోడశ వికారాత్మకంబునునై విస్తృతంబు నయిన లింగ శరీరంబు నధిష్ఠించి చేతనాయుక్తుండైన జీవుండని చెప్పంబడు, మఱియును.** 889

* స్థూల దేహం ద్వారానే లింగదేహం కర్తృత్వ భోక్తృత్వాలు పొందటంచేత స్థూలదేహం నశించగానే జీవునికి కర్తృత్వ భోక్తృత్వాలు ఉండవు. కాబట్టి ముక్తి కలుగుతుంది అని చెప్పటం సరికాదు. లింగశరీరం ఎందాకా ఉంటుందో అందాకా స్థూలదేహంతో జీవునికి సంబంధం ఉంటుంది. గాఢనిద్ర, మూర్ఛ మొదలైన వానిలో అహంకారం ఉన్నప్పటికీ ప్రకాశించదు. అమావాస్యనాడు చంద్రునిలాగా బాల్యంలో అహంకారం

స్పష్టపడదు. స్థూలదేహంతో ఎడబాటు ఉండదు. కాబట్టి అర్థం లేకపోయినా విషయాసక్తుడైన వానికి కలలో అనర్థ దర్శనం కలిగినట్లు సంసారం (జన్మ) ఉడుగదు. ఈ విధంగా లింగ శరీరాన్ని ఆశ్రయించి చైతన్యాన్ని కలిగించే పురుషుడే జీవుడు అని చెప్పబడతాడు.

సీ. **తివిరి యప్పురుషుండు దేహంబుననుజేసి, యనయంబుఁ బెక్కు దేహాంతరముల**
**నంగీకరించుచు నవి విసర్జించుచు, సుఖ దుఃఖ భయ మోహ శోకములను**
**బొలుపొందు తద్దేహములనె పొందుచు నుండు, నది యెట్టు లన్నను నగ్రభాగ**
**తృణ మూఁది మఱి పూర్వతృణ పరిత్యాగంబు, గావించు తృణజలూకయును బోలె**

ఆ. **జీవుఁడవనిఁ గొంత జీవించి మ్రియమాణు, డగుచు నొండు దేహ మర్థిఁ జెంది**
**కాని పూర్వమైన కాయంబు విడువఁడు, గాన మనమె జన్మకారణంబు.** **890**

* పురుషుడు ఈ లింగదేహంచేత ఒక స్థూలదేహాన్ని విడిచి, మరొక దేహాన్ని పొందుతూ, తిరిగి దానిని విడిచిపెడుతూ సుఖ, దుఃఖ, భయ, మోహ, శోకాలను ఈ లింగదేహం చేతనే అనుభవిస్తాడు. జలగ ముందున్న తృణాన్ని పట్టుకొని ఆ తరువాతనే వెనకటి తృణాన్ని విడిచిపెడుతుంది. అలాగే జీవుడు కొంతకాలం బ్రతికి చనిపోతూ, మరొక దేహం పొందిన తరువాతనే పూర్వదేహాన్ని విడిచిపెడతాడు. కాబట్టి మనస్సే జన్మకు హేతువు.

**తరలము**

**నరవరోత్తమ! యట్లు గాన మనంబె జీవులకెల్ల సం**
**సరణకారణ, మట్టి కర్మవశంబునన్ సకలేంద్రియా**
**చరణుఁడౌట నవిద్య గల్గును, సంతతంబు నవిద్యచేఁ**
**బరఁగుటన్ బహుదేహకర్మనిబంధముల్ గలుగుం జుమీ!** **891**

* మనస్సే జీవులకు అందరికీ జన్మకారణం. కర్మవశాన అవిద్య కలుగుతుంది. అవిద్యచేత దేహానికి కర్మబంధం కలుగుతుంది. కర్మ బంధం వల్ల బహు జన్మలను పొందక తప్పదు సుమా!

చ. **విను మది గాన భూవర! యవిద్య లయించుటకై రమాపతిన్**
**ఘనజనన స్థితి ప్రళయకారణ భూతునిఁ బద్మపత్త్ర లో**
**చనుఁ బరమేశు నీశ్వరుని సర్వజగంబుఁ దదాత్మకంబుగాఁ**
**గనుఁగొనుచుం దదీయపదకంజము లర్థి భజింపు మెప్పుడున్.** **892**

* కాబట్టి రాజా! వాసుదేవుడే సృష్టి స్థితి లయాలకు కారణమనీ, ఈ జగమంతా వాసుదేవాత్మకమనీ తలపోసి ఈశ్వరుడైన వాసుదేవుని సేవించు. నీ అవిద్య నశిస్తుంది.''

క. **అని యీ గతి భగవంతుం, డనఘుఁడు భాగవతముఖ్యుఁడగు నారదుఁ డా**
**ఘనునకు జీవేశ్వర గతి, ఘనకృప నెఱిఁగించి సిద్ధ గతిఁ జనిన యెడన్.** **893**

* ఈ విధంగా భక్తులలో శ్రేష్ఠుడైన నారదుడు ప్రాచీనబర్హికి జీవేశ్వరుల తత్త్వాన్ని తెలిపి సిద్ధలోకానికి వెళ్ళాడు.

సీ. రాజర్షి యైనట్టి ప్రాచీనబర్హి దాఁ దగఁ బ్రజాపాలనార్థంబు సుతుల
ధరకు నియోగించి తపము సేయుటకునై కపిలాశ్రమంబున కపుడు వోయి
యచ్చట నియతి నేకాగ్రచిత్తుండును ముక్తసంగుండును భూరిధైర్య
యుక్తుండు నగుచు సద్భక్తి యోగంబున ననఘ! గోవిందపదారవింద

తే. చింతనామృత పాన విశేషచిత్తుఁ, డగుచు విధిరుద్ర ముఖ్యుల కందరాని
యవ్య యానందమయ పద మందె నప్పు, డనుచు మైత్రేయముని విదురునకుఁ జెప్పి. 894

* అప్పుడు రాజర్షి అయిన ప్రాచీనబర్హి ప్రజారక్షణకు కొడుకులను నియోగించి, తపస్సు చేయటానికి కపిలాశ్రమానికి వెళ్ళాడు. ఆ కపిలాశ్రమంలో ముక్తసంగుడై, ఏకాగ్రమైన చిత్తంతో సద్భక్తియోగంతో, గోవిందుని పాదపద్మాలను ఆరాధించాడు. బ్రహ్మరుద్రాదులకు పొందశక్యం కాని అవ్యయానందమయమైన పదాన్ని పొందాడు అని మైత్రేయముని విదురునితో చెప్పి మళ్లీ ఇలా అన్నాడు.

వ. వెండియు నిట్లనియె, నిట్లు ముకుందయశంబునం జేసి భువనపావనంబు, మనశ్శుద్ధికరంబు సర్వోత్కృష్ట ఫలప్రదాయకంబు, దేవర్షివర్య ముఖ వినిస్సృతంబునైన యీ యధ్యాత్మ పారోక్ష్యంబు నెవ్వండు పఠియించు, నెవ్వఁడు విను, నట్టివాఁడు లింగ శరీర విధూననంబు గావించి ముక్తసమస్త బంధుండయి విదేహకైవల్యంబు నొంది సంసారంబునందుఁ బరిభ్రమింపం డనిన మైత్రేయునకు విదురుం డిట్లనియె. 895

* "నారదముని బోధించిన హరికీర్తిని కొనియాడే ఈ అధ్యాత్మ పారోక్ష్యం లోకాన్ని పవిత్రం చేస్తుంది. మనశ్శుద్ధిని కలిగిస్తుంది. అన్నిటికంటే గొప్పదైన ఫలాన్ని ఇస్తుంది. కాబట్టి దీనిని చదివేవాడు, విన్నవాడు లింగశరీరాన్ని విడిచి సమస్తబంధాలను త్రెంచుకొని విదేహ కైవల్యాన్ని పొందుతాడు. సంసారంలో భ్రమించడు" అని చెప్పిన మైత్రేయునితో విదురుడు ఇలా అన్నాడు.

క. మునినాథ! ప్రచేతసు లా, ఘన మగు రుద్రోపదిష్ట కమలోదర కీ
ర్తనమున నే గతిఁ బొందిరి, వనజాక్షుఁడు సంతసింప వా రనఘాత్మా! 896

"మునీంద్రా! ప్రచేతసులు శివుడు ఉపదేశించిన శ్రీహరి స్తోత్రాన్ని జపించి ఏ గతిని పొందారు?

### -: ప్రచేతసుల తపంబునకు భగవంతుండు మెచ్చి వరంబు లిచ్చుట. :-

తే. కడఁగి మఱివారు యాదృచ్ఛికమునఁ జేసి, హరికి నిత్యప్రియుండగు హరునిఁ గాంచి
యతని వలన ననుగ్రహ మంది మోక్ష, మంది రని చెప్పి, తది నిశ్చయంబు మఱియు. 897

* వారు అప్రయత్నంగా శ్రీహరికి ఇష్టుడైన శివుని దర్శించి ఆయన అనుగ్రహం వల్ల మోక్షం పొందారు అని చెప్పావు కదా! అది నిజమే!

క. హరి దర్శన పూర్వం బిహ, పరలోకములందు నా నృపాల తనయు లం
దిరి యే ఫలముల నందఱు, నిరతి నెఱింగింపు మన మునివరుఁడు పలికెన్. 898

* శ్రీహరిని దర్శించటానికి ముందు ఈ లోకంలోనూ, పరలోకం లోనూ ఈ రాజపుత్రులు ఏ ఫలాలను పొందారు నాకు చెప్పు'' అని విదురుడు అడిగాడు. అప్పుడు మైత్రేయ మహర్షి ఇలా అన్నాడు.

క. విను జనకాదేశము ముద, మునఁ దాల్చి నృపాత్మజులు సముద్రోదరమం
దనుపమ జపయజ్ఞంబున, నొనరఁ దపం బూని ముదము నొందుచు నుండన్. 899

* "తండ్రి ఆనతిని తలదాల్చి ప్రచేతసులు సముద్రమధ్యంలో రుద్రగీతమును జపిస్తూ తపస్సును ప్రారంభించారు.

క. పదివే లేఁడులు నిష్ఠను, వదలక తప మాచరింప వారల కర్థిన్
సదయాంతరంగుఁ డభయ, ప్రదుఁడు సనాతనుఁడు నైన పద్మోదరుఁడున్. 900

క. అనుపమ శాంతము లగు నిజ, తను రశ్మలచే నృపాల తనయ తపో వే
దనలు శమింపఁగఁ జేయుచు, ననయముఁ బ్రత్యక్ష మయ్యె, నచ్యుతుఁ డంతన్. 901

* వారు పదివేల యేండ్లు నిష్ఠతో తపస్సు చేశారు. అప్పుడు దయామయుడైన శ్రీహరి తన శరీరకాంతులచేత వారి తపఃక్లేశాన్ని శమింపజేస్తూ ప్రత్యక్షమయ్యాడు.

సీ. ఘనమేరు శృంగ సంగత నీల మేఘంబు, నెఱి గరుడస్కంధ నివసితుండుఁ
గమనీయ నిజదేహకాంతి విపాటితాభీలాఖి లాశాంతరాళ తముఁడు
సుమహితాష్టాయుధ సుమనో మునీశ్వర, సేవక పరిజన సేవితుండు
మండిత కాంచన కుండల రుచిరోప, లాలిత వదన కపోలతలుడుఁ

తే. జారు నవరత్న దివ్య కోటీరధరుఁడుఁ, గౌస్తుభప్రవిలంబ మంగళ గళుండు
లలిత పీతాంబర ప్రభాలంకృతుండు, హారకేయూర వలయ మంజీర యుతుఁడు. 902

* ఆయన మేరుపర్వత శిఖరంపై నల్లని మేఘం వలె గరుడుని మూపుపై కూర్చున్నాడు. తన శరీరకాంతులతో నలు దిక్కుల నడుమ వ్యాపించిన చీకటిని తొలగిస్తున్నాడు. అష్టాయుధములు మూర్తి మంతములై ఆయనను సేవిస్తున్నవి. దేవతలు, మునీశ్వరులు సేవకులై కొలుస్తున్నారు. ఆయన చెవులకు ధరించిన బంగారు కుండలాల కాంతి ముఖం మీద, చెక్కిళ్లమీద వ్యాపిస్తున్నది. నవరత్నమయమైన కిరీటాన్ని ధరించాడు. కౌస్తుభమణి కంఠంలో వ్రేలాడుతున్నది. బంగారు వలువను కట్టుకున్నాడు. ముత్యాలహారాలు, భుజకీర్తులు, కడియాలు, అందెలు ధరించాడు.

క. లలితాయతాష్ట భుజ మం, డల మధ్య స్ఫురిత రుచి విడంబిత లక్ష్మీ
లలనా కాంత స్పర్ధా, కలిత లసద్వైజయంతికా శోభితుఁడున్. 903

* లక్ష్మీదేవితో పోటీపడుతూ ఆయన ఎనిమిది భుజాల మధ్య వైజయంతిక అనే వనమాల ప్రకాశిస్తున్నది.

క. సురగరుడ యక్షకిన్నర, నిరుపమ జేగీయ మాన నిఖిలాశా సం
భరిత యశోమహనీయ, స్ఫురణుఁడు నగు న ప్పురాణ పురుషుం డెలమిన్. 904

* సురలు, గరుడులు, యక్షులు, కిన్నరులు దిక్కుల నడుమ నిండిన శ్రీహరి కీర్తిని గానం చేస్తున్నారు.

క. కరుణావలోకనంబులు, నిరవొంద నృపాలసుతుల నీక్షించి రమా
వరుఁ డంబుద గంభీర మ, ధుర భాషలఁ బలికెఁ బ్రియము దూఁకొనుచుండన్. 905

* అప్పుడు ఆ పురాణపురుషుడు దయను వెలార్చే చూపులతో ప్రచేతసులను చూచి, మేఘ గంభీర మధుర వాక్కులతో ఇలా అన్నాడు.

తే. తాపసోత్తములగు ప్రచేతసులు! వేడ్క, వినుఁడు మీరలు సౌహార్దమున నభిన్న
ధర్మ లగుట భవత్సౌహృదమున కేను, జాలఁ బరితోష మందితి సమత నేఁడు. 906

* తాపసశ్రేష్ఠులారా! ప్రచేతసులారా! మీరు అందరూ కలిసి మెలిసి ఒకే ధర్మాన్ని ఆచరిస్తున్నారు. మీ స్నేహానికి నేను చాల తృప్తి చెందాను.

క. అనయమును మీ మనోరథ, మొనరింతు, నెఱుంగఁ బలుకుఁ డుత్తములగు మి
మ్మనుదినము నెవ్వఁడు సుఖశ, యనుఁడై మదిలోనఁ దలఁచు నా నరుఁ డెపుడున్. 907

క. భ్రాతృజన సౌహృదంబును, భూతదయాగుణము విమల బుద్ధియు సుజన
ప్రీతియుఁ గల్గి సుఖించును, వీత సమస్తాఘుఁ డగుచు విశ్వములోనన్. 908

* కాబట్టి మీకు వరం ఇస్తాను అడగండి. మిమ్ము నిత్యమూ నిద్రపోయే ముందు మనస్సులో స్మరించేవాడు సోదర స్నేహాన్ని, భూతదయను, నిర్మల బుద్ధిని, సజ్జనుల ప్రేమను పొంది సుఖిస్తాడు. అతని సమస్త పాపాలూ నశిస్తాయి.

వ. మఱియు రుద్రగీతం బయిన మదీయస్తవం బెవ్వ రనుదినంబును స్తోత్రంబు సేయుదురు, వారల కభిమత వరంబులు, శోభన కరంబగు ప్రజ్ఞయు నిత్తు, మీరలు ముదన్వితులై జనకాదేశం బంగీకరించుటం జేసి మీ కీర్తి లోకంబుల విస్తరిల్లు, మీకు ననూన బ్రహ్మగుణుండు నాత్మసంతతిం జేసి లోకత్రయ పరిపూర్ణ గుణాకరుండు నైన పుత్రుండు సంభవింపంగలండు, కండు మహాముని తపోవినాశార్థంబుగా నింద్రునిచేతఁ బ్రేషిత యగు ప్రమ్లోచయను నప్సరస గర్భంబు దాల్చి య మ్మునీంద్రుని వీడ్కొని దివంబునకుం జను సమయంబునం బ్రసూతయై తత్పుత్రిని వృక్షంబులందుఁ బెట్టి చనిన. 909

* రుద్రునిచే గానం చేయబడిన నా స్తోత్రాన్ని నిత్యమూ జపించే వారికి కోరిన వరాలను, శుభకరమైన ప్రజ్ఞను ప్రసాదిస్తాను. మీరు జనకుని ఆనతిని సంతోషంగా తలపై ధరించారు. కాబట్టి మీ కీర్తి లోకంలో వ్యాపిస్తుంది. గుణాలలో బ్రహ్మకు తక్కువ కానివాడు, తన సంతతివల్ల మూడు లోకాలలోనూ వ్యాపించే కీర్తి కలవాడూ అయిన పుత్రుడు మీకు జన్మిస్తాడు. పూర్వం కండుమహాముని చేస్తున్న తపస్సును భగ్నం చేయటానికి ఇంద్రుడు ప్రమ్లోచ అనే అప్సరసను పంపించాడు. ప్రమ్లోచ కండుమునివల్ల గర్భం ధరించి పుత్రికను ప్రసవించి చెట్లయందు ఉంచి స్వర్గానికి వెళ్లిపోయింది.

సీ. ఆ శిశు వపుడు పేరాఁకలిచేఁ గుంది వావిచ్చి బిట్టు వాపోవుచుండ
నాలించి యటకు రాజైన సోముఁడు వచ్చి వలనొప్ప నవసుధావర్షి యైన
యాత్మీయ తర్జని నర్థిఁ బానమ్ము సేయింపంగఁ బెరిఁగి య య్యిందువదనఁ
గన్య వరారోహఁ గడఁక మారిషయను చెలువఁ బుణ్యుండు ప్రాచీనబర్హి

తే. యన్నృపునిచేఁ బ్రజావిసర్గావసరము, నందు వేడ్కఁ దదాదిష్టు లైన మీర
లందఱును నెయ్యమున వివాహంబు గండ, యని సరోరుహనయనుఁ డిట్లనియె మఱియు. 910

* ఆ శిశువు ఆకలి బాధతో నోరు తెరచి గట్టిగా ఏడ్వసాగింది. ఆ ఏడ్పు విని రాజైన చంద్రుడు వచ్చి అమృతం స్రవించే తన చూపుడు వ్రేలిని శిశువు నోటిలో ఉంచాడు. శిశువు అమృతం త్రాగి పెరిగింది. యౌవనవతి అయింది. ఆమె పేరు మారిష. మీ తండ్రి ప్రాచీనబర్హి ఆజ్ఞచేత ప్రజాసృష్టి చేయటానికి పూనుకొన్న మీరు అందరూ ప్రేమతో ఆమెను పెండ్లాడండి.

వ. అనఘాత్ములారా! యభిన్న ధర్మశీలు రయిన మీకు నందఱకు నా సుమధ్యమయైన కన్య యభిన్న ధర్మశీలయు భవ దర్పితాశయయు నయిన భార్య యగు, మీర లప్రతిహత తేజస్కులై దివ్యవర్ష సహస్రంబులు భౌమ దివ్యభోగంబులు మదనుగ్రహులై యనుభవించెద, రంత నా యందుల భక్తిం జేసి నిర్మలాంతఃకరణులై యీ భోగంబులు నిరయ ప్రాయంబులుఁ గాఁ దలంచి మదీయ స్థానంబు నొందెద రని వెండియు నిట్లనియె. 911

* పుణ్యాత్ములారా! మీరు అభిన్నమైన ధర్మశీలం కలవారు. ఆమెకూడా అభిన్న ధర్మశీలయై మిమ్మ నందరినీ సమానమైన ప్రేమతో సేవింపగలదు. మీరు గొప్ప బలవంతులై వేలకొలది దివ్య సంవత్సరాలు భూలోక సుఖాలు, స్వర్గలోక సుఖాలు నా అనుగ్రహం చేత అనుభవిస్తారు. ఆ తరువాత నాయందుండే భక్తివల్ల చిత్తశుద్ధిని పొంది ఆ సుఖాలను నరకంతో సమానంగా భావించి నా స్థానాన్ని చేరుకుంటారు.

చ. అరయ గృహస్థు లయ్యును మదర్పిత కర్ములు నస్మదీయ సుం
దర చరితామృత శ్రవణ తత్పరమానస యాతయాములున్
సరస గుణాఢ్యులై తనరు సాధుల కీ గృహముల్ దలంప దు
ష్కరభవబంధ హేతువులు గావు, నృపాత్మజులార! యెన్నఁడున్. 912

* గృహస్థు లైనప్పటికీ కర్మలను నాకు సమర్పించి అమృతం వంటి నా కథలను వింటూ కాలాన్ని గడిపే సజ్జనులకు గృహాలు బంధాలు కానే కావు.

వ. అది యెట్లంటిరేని. 913

చ. అనుపమ బ్రహ్మవాదు లగు నంచిత యోగిజనానుగీయమా
న నిజకథా సముత్సుకుఁ డనందగు నేను మదీయులంద నూ
తనముగ నుందుఁ గావున నుదారత వారికి నీ గృహావళుల్
ఘనభవబంధ హేతువులు గా, విది యంతయు నిక్కమారయన్. 914

* బ్రహ్మవాదులైన యోగిజనులు నా కథలను గానం చేస్తారు. అందుచేత నేను నా కథాగానాన్ని వినేవారి హృదయాలలో ఎప్పటికప్పుడు క్రొత్తగా నివసిస్తాను కాబట్టి నా భక్తులకు గృహాలు బంధాలు కానేకావు.

క. సరసుఁడ నగు ననుఁ బొందిన, పురుషులు ఘనశోక మోహమోదంబులఁ బొం
దరు, గావున నెనయఁగను త్రి, పురుషాధీశ్వరుఁడ బ్రహ్మభూతుఁడ నగుదున్. 915

* నన్ను మనస్సులో నిల్పుకొన్నవారు శోకాన్ని గాని, మోహాన్ని గాని, మోదాన్ని గాని పొందరు. నేను త్రిపురుషులకు అధిపతిని, నేను బ్రహ్మను."

వ. అని యిట్లు పలుకుచున్న పురుషార్థ భాజనుండగు జనార్దనుని దర్శించి తద్దర్శన విధ్వస్త రజస్తమోగుణు లయిన ప్రచేతసులు. 916

చ. కరసరసీరుహంబు లెసకం బెసఁగన్ ముకుళించి గద్గద
స్వరములఁ జేసి యిట్లనిరి, సర్వశరణ్యు నగణ్యు నిందిరా
వరు నజితున్ గుణాఢ్యు ననవద్య చరిత్రుఁ బవిత్రు నచ్యుతుం
బరుఁ బరమేశు నీశు భవబంధవిమోచనుఁ బద్మలోచనున్. 917

* అని పలుకుతున్న శ్రీహరిని దర్శించి, ఆయన దర్శనం వలన రజస్తమో గుణాలు తొలగిన ప్రచేతసులు చేతులు మోడ్చి సంతోషంతో నోటమాట రాక వణకుతున్న స్వరంతో ఆ శ్రీహరిని ఇలా స్తుతించారు.

సీ. కేశవ! సంతత క్లేశనాశనుఁడవు గురుసన్మనో వాగగోచరుఁడవు
నిద్ధమనోరథ హేతుభూతోదార గుణనాముఁడవు సత్త్వగుణుఁడ వఖిల
విశ్వోద్భవ స్థితి విలయార్థ ధృతనిత్య విపుల మాయాగుణ విగ్రహుఁడవు
మహితాఖిలేంద్రియ మార్గ నిరధిగత మార్గుండ వతిశాంతమానసుఁడవు

తే. తవిలి సంసార హారిమేధస్కుఁడవును, దేవదేవుఁడవును వాసుదేవుఁడవును
సర్వభూత నివాసివి సర్వసాక్షి, వైన నీకు నమస్కారమయ్య! కృష్ణ! 918

* "కేశవా! నీవు దుఃఖాన్ని తొలగిస్తావు. భక్తుల మనస్సునకు, మాటలకు అందవు. సకల శ్రేయస్సులను కలిగించే ఉదారగుణాలు, పేర్లు కలవాడవు. సత్త్వగుణం కలవాడవు. ప్రపంచసృష్టి, స్థితి, విలయాల కోసం మాయామయమైన బ్రహ్మాది గుణ విగ్రహాన్ని ధరిస్తావు. నీవు సర్వేంద్రియ మార్గాలచేత తెలియబడని మార్గం కలవాడవు. ప్రశాంతమైన మనస్సు కలవాడవు. సంసారాన్ని హరించే జ్ఞానం కలవాడవు. దేవదేవుడవు వాసుదేవుడవు. నీవు సర్వప్రాణులలో నివసిస్తావు. నీవు సర్వసాక్షివి. కృష్ణా! నీకు నమస్కారం.

వ. మఱియును. 919

**ఉ. తోయరుహోదరాయ! భవదుఃఖహరాయ! నమో నమః పరే**
**శాయ! సరోజకేసర పిశంగ వినిర్మల దివ్య భర్మ వ**
**స్త్రాయ! పయోజ సన్నిభ పదాయ! సరోరుహ మాలికాయ! కృ**
**ష్ణాయ! పరాపరాయ! సుగుణాయ! సురారిహరాయ! వేధసే!** 920

* కమలనాభా! నీవు సంసార దుఃఖాన్ని హరిస్తావు. నీవు పరానికి నాథుడవు. తమ్మి పుప్పొడి వలె పసుపు పచ్చని రంగుగల బంగారు వస్త్రాన్ని ధరిస్తావు. పద్మమాలికలు ధరిస్తావు. నీవు సుగుణవంతుడవు. నీవు సృష్టికర్తవు. నీవు రాక్షసులను సంహరిస్తావు. నీకు నమస్కారం.

వ. అని వినుతించి. 921

**చ. కమలదళాక్ష! దుఃఖలయ కారణమై తగు తావకీన రూ**
**పము ననివార్య దుర్భర విపద్దశ దుఃఖము నొందు మాకు నీ**
**సుమహిత సత్కృపాగరిమఁ జూపుట కంటె ననుగ్రహంబు లో**
**కమునఁ దలంప నొండొకటి గల్గునె? భక్త ఫల ప్రదాయకా!** 922

* భక్తుల కోర్కెలను తీర్చే పద్మపత్ర నేత్రా! దుఃఖాన్ని నశింపజేసే నీ రూపాన్ని భరించరాని కష్టాలతో విచారించే మాకు చూపించావు. ఇంతకంటే అనుగ్రహం మరొకటి లోకంలో ఉండదు.

**ఉ. భూరి శివేతరాపహవిభూతి సమేత! మహాత్మ! దీన ర**
**క్షా రతి నొప్పు నీవు చిరకాలమునన్ సుఖవృత్తి వీరు మా**
**వార లటంచు బుద్ధి ననవద్య! తలంచిన యంతమాత్ర స**
**త్కారమె చాలు నట్లగుట గా కిటు సన్నిధి వైతి వీశ్వరా!** 923

* నీవు అశుభాలను తొలగిస్తావు. నీవు మహాత్ముడవు. దీనరక్షణ నీ దీక్ష. వీరు మావారు అని భావిస్తున్నావు. అందుచేతనే మాకు సాక్షాత్కరించావు. ఆ మాత్రం గౌరవం మాకు చాలు.

**చ. అరయఁగ క్షుద్రభూత హృదయంబుల యందుల నంతరాత్మవై**
**తిరముగ నుండు నీవు భవదీయ పదాంబురుహ ద్వయార్చనా**

పరమతు లైన మాకును శుభప్రద భూరి మనోరథంబు లీ
వెఱుఁగవె? భక్తలోక హృదయేప్సిత దాయక! ముక్తినాయకా! 924

* నీవు నీచ ప్రాణుల హృదయాలలోకూడా అంతర్యామివై స్థిరంగా ఉంటావు. నీ పాదపద్మాలను పరమభక్తితో పూజించే మాకు శుభాన్ని కలిగించే వరాలేవో నీకు తెలియవా? నీవు ముక్తినాథుడవు. భక్తుల హృదయాలలోని కోర్కెలను నెరవేరుస్తావు.

సీ. అయినను విను సరోజాయత లోచన! వర మోక్ష మార్గ ప్రవర్తకుఁడవుఁ.
బురుషార్థ భూత విస్తరుఁడవు నగు నీవు దగిలి ప్రసన్నుఁడ వగుట మాకు
నర్థి మనోభీష్ట మైన వరం బయ్యె నైనను నాథ! పరాపరుండ
వై న నిన్నొక వరం బర్థింతు మని నను భువిఁ దావకీన విభూతు లెన్న

తే. నంత మెఱుఁగంగ రామి ననంతుఁ డనుచుఁ, బలుకుదురు నిన్ను, నది గానఁ బరమ పురుష!
యే వరం బని కోరుదు మేము? దప్పి, గొన్న బాలకుఁ డబ్ధి నీ ళ్లెన్ని గ్రోలు? 925

* భగవంతుడవైన నీవు మాకు ప్రసన్నుడవు కావటమే మాకు ఇష్టమైన వరం. ఒకవేళ నిన్ను ఒక వరాన్ని అడుగదలచినా అదీ కష్టమే. ఎందుకంటే నీవు అనంతుడవు. నీ విభూతులు అనంతాలు. అందుచేత నిన్ను అనంతు డంటారు. కాబట్టి నిన్ను ఏ వరమని కోరగలం? దప్పికొన్న బాలుడు సముద్రంలోని నీళ్లను ఎన్ని త్రాగగలడు?

వ. ఇదియునుం గాక. 926

ఉ. పూని భవత్పదాంబురుహ మూల నివాసులమైన మేము మే
ధానిధి! నీ విలోకనముఁదక్కఁగ నన్యముఁ గోర నేర్తుమే?
మానిత పారిజాత కుసుమ స్ఫుట నవ్యమరందలుబ్ధ శో
భా నయశాలి యైన మధుపంబు భజించునె యన్యపుష్పముల్? 927

* నీ పాదాలను ఆశ్రయించుకున్న మేము నీ దర్శనం తప్ప మరొకటి కోరగలమా? పారిజాత పుష్పం లోని తేనెను రుచి మరగిన తుమ్మెద మరొక పుష్పం దగ్గరికి వెళ్లదు కదా!

చ. హరి! భవదీయమాయ ననయంబును జెందిన నేము నిచ్చలుం
గర మనురక్తి నేది తుదిగా భవకర్ములమై ధరిత్రి పైఁ
దిరుగుదు, మంతదాఁక భవదీయజనంబులతోడి సంగతిన్
గురుమతి జన్మజన్మములకున్ సమకూరఁగఁజేయు మాధవా! 928

* నీ మాయకు చిక్కి మేము కర్మమార్గంలో ఎంతకాలం నిత్యమూ తిరుగుతూ ఉంటామో అంతవరకూ మాకు నీ భక్తులతో సహవాసాన్ని జన్మ జన్మలలోనూ సమకూర్చు.

మ. కమలాధీశ్వర! తావకీన వర భక్తి వ్రాత సంసర్గ లే
శముతోడన్ సరిగాఁ దలంప, మెలమిన్ స్వర్గాపవర్గాది సౌ
ఖ్యము లన్నన్ విను మానుషంబు లగు నీ కామంబులం జెప్ప నే
ల! మునీంద్ర స్తుత పాదపద్మ! సుజనాలాపానుమోదాత్మకా! 929

* స్వర్గ సౌఖ్యాలుగాని, అపవర్గ సౌఖ్యాలుగాని, భక్తి సంసర్గంతో కొంచెమైనా సాటి రావు. ఇక మానవ లోకంలోని క్షణికాలైన క్షుద్రసౌఖ్యాల మాట చెప్పటం దేనికి?

వ. మఱియు భగవద్భక్త సంగంబుల యందుఁ దృష్ణా ప్రశమనంబులైన మృష్ట కథలు చెప్పంబడుటచే భూతంబులయందు వైరంబును నుద్వేగంబును లేకుండు నని. 930

* భగవద్భక్తుల సభలలో పేరాసలను నశింపజేసే నీ మధుర గాథలను కీర్తిస్తారు. ఆ కథలను ఆలకించటం వల్ల ప్రాణులయందు ద్వేషమూ, భయమూ, నశిస్తాయి.

చ. వనముల ముక్తసంగు లగువారు నుతింపఁ దనర్తు వీవు, గా
వున నిలఁ బుణ్యతీర్థములఁ బోలఁ బవిత్రము సేయఁ బూని య
ర్థిని బదచారులై ధరఁ జరించు భవత్పద భక్త సంగమం
బనుపమభూరి సంసృతి భయస్థుని బుద్ధి రుచింపకుండునే? 931

* అడవులలో ముక్తసంగు లైనవారు నిన్ను నుతిస్తారు. కాబట్టి పుణ్యతీర్థాలలాగా పవిత్రం చేయటానికి పూనుకొని పాదచారులై భూమిపై సంచరించే నీ భక్తులతోడి సహవాసం సంసార భీతుడైన వాని మనస్సుకు ఎలా రుచించకుండా ఉంటుంది?

వ. కావున. 932

చ. వనరుహ పత్త్రలోచన! భవత్సఖుఁడైన సుధాంశుమౌళి తో
డి నిమిషమాత్ర సంగతిఁ గడింది వ్రణంబును దుశ్చికిత్సము
న్ననఁ దగు జన్మరోగమున కర్మిలి వైద్యుఁడ వైన నిన్ను నే
మనయముఁ జూడఁ గంటిమి, కృతార్థులమై తగ మంటి మీశ్వరా! 933

సర్వేశ్వరా! కమలనయనా! నీ మిత్రుడైన శివునితో ఒక్కక్షణకాలం మాకు కలిగిన సమాగమం వల్ల పెద్ద పుండు అనదగినదై చికిత్సకు అసాధ్యమైన జన్మరోగాన్ని మాన్పే మేటి వైద్యుడవైన నిన్ను దర్శించి కృతార్థులం అయ్యాము.

వ. దేవా! మదీయ స్వాధ్యాయాధ్యయనంబులును, గురుప్రసాదంబును విప్రవృద్ధానువర్తనంబును, నార్యజన నమస్కరణంబును, సర్వభూతానసూయయు, నన్నవిరహితంబుగా ననేకకాలం బుదకంబులయందు సుతప్తంబయిన తపంబు సేయుటయు, నివి యన్నియును బురాణ పురుషుండవైన భవదీయ పరితోషంబు కొఱకు నగుంగాక యని విన్నవించెద మని వెండియు నిట్లనిరి. 934

* స్వామీ! మా వేదాధ్యయనం, గురుప్రసాదం, విప్రవృద్ధసేవ, ఆర్యజన వందనం, సకల జీవులయందు అసూయ లేకపోవటం, అన్నం లేకుండా చాలకాలం నీటిలో ఉగ్రతపం చేయటం - ఇవి అన్నీ పురాణ పురుషుడ వయిన నీకు సంతోషాన్ని కలిగించుగాక!

**మ. మను పద్మాసన ధూర్జటి ప్రముఖ ధీమంతుల్ తపోజ్ఞాన స**
**త్త్వ నిరూఢిం దగువారు నీ మహిమమున్ వర్ణింపఁ బారం బెఱుం**
**గని వారయ్యును నోపినంత వినుతుల్ గావింతు, రట్లౌట నే**
**మును నిన్నర్థి నుతింతు మీశ! వరదా! బుద్ధ్యాది మూలంబుగన్. 935**

* తపోజ్ఞాన సత్త్వ సంపన్నులైన మనువు, బ్రహ్మ, శివుడు మొదలైనవారే నీ మహామహిమను వర్ణించలేరు. అయినా శక్తికొలది నుతిస్తారు. అందుచేత మేము కూడా మా శక్తికొలది నిన్ను నుతిస్తాము.

**వ. అని మఱియు సముండవు, నాదిపురుషుండవుఁ, బరుండవు, శుద్ధుండవు, వాసుదేవుండవు, సత్త్వమూర్తివి, భగవంతుండవు నైన నీకు నమస్కరించెద మని యిట్లు ప్రచేతసుల చేత నుతింపంబడి శరణ్యావత్సలుం డగు హరి సంతుష్టాంతరంగుండై వారలు కోరినయట్ల వరంబు లిచ్చిన. 936**

* నీవు అందరియందు సముడవు. ఆదిపురుషుడవు, పరుడవు, రాగాదులు లేని పరిశుద్ధుడవు. వాసుదేవుడవు, సత్త్వమూర్తివి, భగవంతుడవు. నీకు నమస్కారం.'' ఈ విధంగా ప్రచేతసులు నుతించారు. భక్తవత్సలుడైన శ్రీహరి సంతృప్తి పొంది వారు కోరినట్లు వరాలు ప్రసాదించారు.

**తరలము. అనయ మా నృపనందనుల్ ముదమార సన్నుతిఁ జేయఁగా**
**మనములోఁ బరితోషమంది రమాహృదీశుఁడు భక్త పా**
**లన కరుండు తదీయ దర్శన లాలసాత్మకు లాత్మలం**
**దనివి సొలక చూడ నాత్మపదంబు కేఁగె రయంబునన్. 937**

* రాజపుత్రులైన ప్రచేతసులు సంతోషంతో చేసిన నుతిని మెచ్చి, భక్తరక్షకుడైన శ్రీహరి ఎంత చూచినా తనివితీరక వారు తనవంక చూస్తుండగా తన స్థానానికి వేంచేశాడు.

**వ. తదనంతరంబ ప్రచేతసులు భగవదాజ్ఞ శిరంబుల ధరియించి సముద్ర సలిల నిర్గతు లయి.938**

**క. భూరి సమున్నతి నాక, ద్వార నిరోధంబు గాఁగఁ దగఁ బెరిఁగిన యా**
**భూరుహ సంఛన్నాఖిల,ధారుణి నీక్షించి రాజతనయులు వరుసన్. 939**

* ఆ తరువాత ప్రచేతసులు శ్రీహరి ఆనతిని తలదాల్చి, మున్నీటి నీటిలో నుండి వెలువడ్డారు. మిక్కిలి పొడవుగా పెరిగి స్వర్గద్వారాన్ని అడ్డగించిన చెట్లతో కప్పబడిన భూమిని చూశారు.

**చ. ఘనకుపితాత్ములై విలయకాల భయంకర హవ్యవాహ లో**
**చను గతి నుగ్రులై ధరణీ చక్రము నిర్వసుధారుహంబుగా**

ననయముఁ జేయఁ బూనిన జనాధిపసూనుల మోముఁదమ్ముల
న్ననల సమీరముల్ జనన మంది కుజంబులఁ గాల్చఁ జొచ్చినన్. 940

* వారికి పట్టరాని ఆగ్రహం కలిగింది. ప్రళయకాలంలోని కాలాగ్ని రుద్రునివలె భయంకరులై భూమండలం మీది సర్వవృక్షాలనూ నాశనం చేయటానికి పూనుకున్నారు. ఆ రాజపుత్రుల ముఖాలనుండి అగ్గిగాలులు పుట్టి ఆ చెట్లను దహింపసాగాయి.

క. నలినభవుఁ డా మహీజ, ప్రళయముఁ గని వచ్చి ధరణిపాల తనూజా
తుల మధురోక్తుల నుపశాం, తులఁ గావించుచును బ్రియము దూఁకొనఁ బలికెన్. 941

* చెట్లకు కలిగిన వినాశనాన్ని చూచి బ్రహ్మ దిగివచ్చి, తియ్యని మాటలతో ప్రచేతసులను శాంతింప జేశాడు.

వ. అట్లు పలికి వారల నుపశమితక్రోధులం జేసిన యనంతరంబ. 942

సీ. అవశిష్ట ధరణీరుహంబులు భయ మంది తివిరి చతుర్ముఖాదేశమునను
మారిష యను సతీమణిఁ దమ కూఁతును నా ప్రచేతసులకు నర్థి నిచ్చె,
నా నరపాలక సూనులు దక్షున కరయంగ మున్నీశ్వరాపరాధ
మునఁ బ్రాప్త మైనట్టి జనపాల జన్మంబునకుఁ గారణం బైన నలిననయన

తే. నాదరంబునఁ గమలజు నాజ్ఞఁ జేసి, కడఁక దీపింప విధివత్ప్రకారమునను
వరుస నందఱుఁ గూడి వివాహ మైరి, గడవ వచ్చునె దైవ సంకల్ప మెందు? 943

* కాలగా మిగిలిన చెట్లు భయపడి బ్రహ్మ ఆజ్ఞచేత మారిష అనే తమ పుత్రికను ఆ ప్రచేతసులకు సమర్పించాయి. బ్రహ్మ ఆజ్ఞచేత ప్రచేతసు లందరూ విధియుతంగా ఆమెను పెండ్లి చేసుకున్నారు. దైవ సంకల్పాన్ని ఎవరూ దాటలేరు కదా!

క. కలదే జగతిం బదురు నృ, పుల కిల నొక భార్య యందుఁ బొసఁగునె? వినఁగా
నలినోదరు ఘనమాయా, కలితాద్భుతములకు నతులు గావింపఁదగున్. 944

* పదిమంది రాజులకు ఒక్కతె భార్య కావటం లోకంలో ఎక్కడా లేదు. విష్ణుమాయవల్ల అనేక అద్భుతాలు జరుగుతుంటాయి. ఆ అద్భుతాలకు మనం నమస్కరించటమే మంచిది.

వ. అంతఁ జాక్షుషమన్వంతరంబున దైవచోదితుండై యిష్ట ప్రజాసర్గంబు గావించుచుఁ ప్రతిశుద్ధుండైన దక్షుండు పూర్వ దేహంబు గాల విద్రుతం బగుచుండం బ్రచేతసులకు న మ్మారిష యను భార్యయందు సంభవించి నిజకాంతిం జేసి సమస్త తేజోధనుల తేజంబును బిహితంబుగాఁ జేయుచుఁ గర్మ దాక్ష్యంబున దక్షుండను నామంబు వహించి బ్రహ్మచేతం బ్రజాసర్గ రక్షయందు నియోగింపంబడి మరీచ్యాదులం దత్త ద్వ్యాపారంబులందు నియోగించి యుండె, నంత. 945

* పూర్వం చాక్షుష మన్వంతరంలో శివదూషణం చేసిన కారణం చేత దక్షుడు మనుష్యుడై ప్రచేతసులకు మారిషకు పుట్టాడు. కర్మలో దక్షు డవటం చేత దక్షుడు అనే పేరు అతడు ధరించాడు. బ్రహ్మచేత ప్రజాసృష్టి చేయటానికి నియోగింపబడిన దక్షుడు, మరీచుడు మొదలైన వారిని ఆ యా పనులలో నియోగించాడు.

**సీ. ఒనరఁ బ్రచేతసు లుత్పన్న విజ్ఞాను లగుచు వేగంబ నారాయణోక్తిఁ**
**దలఁచుచు నాత్మనందను కడ నిజభార్య నిడి వనవాసులై కడఁగి మున్ను**
**జాబాలి యను మునీశ్వరుఁడు సిద్ధుండైన భూరి పశ్చిమ వార్ధి తీరమునను**
**సర్వభూతాత్మ విజ్ఞానంబు గల యాత్మ ఘన విమర్శకృత సంకల్పులైరి**

**తే. యంత నచటికి సమ్మోద మతిశయిల్ల, నరసురాసుర యక్ష కిన్నర వరేణ్య**
**మానితోన్నత సంపూజ్య మానుఁడైన, నారదుండు వివేక విశారదుండు. 946**

* విజ్ఞానాన్ని పొందిన ప్రచేతసులు భార్యను కొడుకు దగ్గర ఉంచి, సన్న్యసించి, పశ్చిమ సముద్ర తీరంలోని జాబాలి ఆశ్రమానికి వెళ్లారు. సర్వభూతాత్మ భావనతో ఆత్మ విచారం చేయటానికి సంకల్పించారు. అప్పుడు వారిదగ్గరకు నారదుడు వేంచేశాడు.

**వ. చనుదెంచి నిర్జితప్రాణ మనో వాగ్దర్శనులును జితాసనులును శాంతులును నసమాన విగ్రహులును నిర్మలంబైన పరబ్రహ్మంబు నందు నియోజితంబైన యంతఃకరణంబును గలవారును నైన రాజనందనుల కడ నిలిచిన. 947**

* ఇంద్రియాలను నిగ్రహించి, మనస్సును నిర్జించి, ప్రాణములను కుదించి, ఆసనమును జయించి శాంతమూర్తులై పరబ్రహ్మలో ఆత్మను కూర్చిన రాజపుత్రులను చూశాడు.

**క. చనుదెంచిన నారదమునిఁ, గనుఁగొని నృపసుతులు లేచి కౌతుక మొప్పన్**
**వినమితులై సముచిత పూ, జనములఁ బరితుష్టుఁ జేసి సద్వినయమునన్. 948**

* నారదమునిని చూచి రాజపుత్రులు లేచి భక్తితో నమస్కరించారు. తగిన పూజలు చేసి తృప్తి కలిగించి ఆయనతో వినయంగా ఇలా అన్నారు.

**చ. అనఘ! మునీంద్ర చంద్ర! భగవదాగమనంబు సమస్త లోక శో**
**భన మగు, నస్మదీయమగు భాగ్యవశంబున నేఁడు విశ్వ పా**
**వన! నినుఁ జూడఁగంటి మనివార్య భవద్భ్రమణంబు లోక లో**
**చనుగతి వోలెఁ బ్రాణులకు సర్వ భయాపహరంబు గావునన్. 949**

* "మునీంద్రా! నీ రాక సమస్త లోకాలకూ శుభం కలిగిస్తుంది. మా అదృష్టవశాన నేడు నిన్ను చూడగలిగాము. సూర్యుని సంచారం లాగా నీ సంచారం ప్రాణులకు సర్వ భయాలనూ తొలగించి శుభాలను కలిగిస్తుంది.

వ. అని మఱియు నిట్లనిరి. 950

సీ. 'అనఘాత్మ! భగవంతులైన కేశవ వామదేవులచే నుపదిష్టమైన
యాత్మతత్త్వంబు గృహస్థుల మగు మాకు ననయంబు విస్మృతం బయ్యె నట్టి
కలిత తత్త్వార్థ ప్రకాశకంబును భూరి ఘోర సంసారాబ్ధి తారకంబు,
నై కర మొప్పారు నాత్మతత్త్వము నేఁడు చిరదయామతిఁ బ్రకాశింపఁ జేయు'

తే. మని ప్రచేతసు లర్థిఁ బల్కినఁ జెలంగి, భగవదాయత్త చిత్తుండు భవ్యగుణుఁడు
నఖిలలోక విహారుండు నైన యట్టి, నారదుఁడు పల్కె నా రాకుమారులకును. 951

* పుణ్యాత్మా! పూజ్యులైన నారాయణుడు, రుద్రుడు ఉపదేశించిన ఆత్మజ్ఞానాన్ని సంసారంలో మునిగి మేము మరచిపోయాము. భయంకరమైన సంసార సముద్రాన్ని దాటించే ఆత్మ తత్త్వాన్ని నేడు మాకు మరల ప్రసాదించు'' అని ప్రచేతసులు ప్రార్థించారు. అందుకు సంతోషించి శ్రీమన్నారాయణ చరణాయత్త చిత్తుడు, సద్గుణ సంపన్నుడు, త్రిలోక విహారుడు అయిన నారదమహర్షి ప్రచేతసులతో ఇలా అన్నాడు.

సీ. చర్చింప నరుల కే జన్మ కర్మాయుర్మనో వచనంబుల దేవదేవుఁ
డఖిల విశ్వాత్మకుం డైన గోవిందుండు విలసిల్లు భక్తి సేవింపఁబడెడు
నవియ పో, జన్మ కర్మాయుర్మనో వచనములను ధరణి నెన్నంగఁ దగును
వనరుహనాభ సేవా రహితము లైన జననోపనయన దీక్షాకృతంబు

తే. లైన జన్మంబు లేల? దీర్ఘాయు వేల? వేద చోదిత యగు కర్మవితతి యేల?
జప తపశ్శ్రుత వాగ్విలాసంబు లేల?, మహిత నానావధాన సామర్థ్య మేల? 952

* దేవదేవుడైన గోవిందుని సేవించే జన్మయే జన్మ, అదే కర్మ, అదే ఆయుస్సు, అదే మనస్సు, అదే వాక్కు, హరిని సేవించని జన్మ వృథా. ఉపనయనం మొదలైన సంస్కారాలు వృథా, దీర్ఘాయువు వ్యర్థం, వేదకర్మలను ఆచరించటం వల్ల ప్రయోజనం లేదు. జపం, తపం, పాండిత్యం, వాక్చమత్కారం మొదలైనవి నిష్ఫలములు.

వ. మఱియు హరి విరహితంబైన యింద్రియ పాటవంబును నిపుణయైన బుద్ధియుఁ బ్రాణాయామాది యోగంబును దేహాది వ్యతిరిక్తాత్మ జ్ఞానంబును సన్న్యాసాధ్యయనంబులును దక్కిన వ్రతవైరాగ్యాది శ్రేయస్సాధనంబులును నేల? సర్వేశ్వరుండు సమస్త శ్రేయస్స్వరూపుండును సమస్త శ్రేయోఽవధిభూతుండును సర్వభూతావాసుండును సర్వభూతాత్మప్రదుండును సర్వభూత ప్రియుండును సర్వవ్యాపకుండునుం గావున. 953

* హరిని సేవించకపోతే ఇంద్రియశక్తి, నిపుణ బుద్ధి, ప్రాణాయామాది యోగం, ఆత్మజ్ఞానం, సన్న్యాసం, వేదాధ్యయనం, వైరాగ్యం మొదలైన శ్రేయస్సును కలిగించే సాధనాలు నిష్ప్రయోజనాలు. హరిని మించిన శ్రేయస్సు లేదు.

మ. కమలాధీశ్వరుఁ బూజ సేయుట సమగ్ర ప్రీతిఁ బ్రాణోపహా
రము సర్వేంద్రియ తృప్తి హేతువును సర్వక్ష్మాజమూలాభిషే
కము శాఖాభుజపుష్టిదంబు నగు రేఖన్ సర్వదేవార్హణ
క్రమమై యొప్పు ధరావరేణ్య సుతులారా! బుద్ధి నూహించినన్. 954

* చెట్టు మొదటికి నీళ్లుపోస్తే కొమ్మలకూ, రెమ్మలకూ పత్రపుష్పములకూ పుష్టి కలుగుతుంది. అలాగే శ్రీహరిని పూజిస్తే సర్వేంద్రియాలకూ తృప్తి కలుగుతుంది. శ్రీహరిని సేవిస్తే సర్వభూతాలనూ సేవించినట్లే. శ్రీహరిని సేవించటంకంటే ప్రాణులకు మరొక కానుక లేదు.

వ. అదియునుం గాక. 955

క. పెను పగు వర్షాకాలం, బున దిననాయకుని వలనఁ బొడమిన సలిలం
బనయముఁ గ్రమ్మఱ గ్రీష్మం, బున సూర్యునియందు డిందుపోలిక మఱియున్. 956

క. ధరణిఁ జరాచర భూతము, లరయఁగ జనియించి యందె యణఁగిన పగిదిన్
హరిచేఁ బుట్టిన విశ్వము, హరియందె లయంబు నొందు, నది యెట్లన్నన్. 957

* వర్షాకాలంలో సూర్యుని కిరణాలవల్ల ఆవిరై మేఘంగా మారిన నీరు తిరిగి గ్రీష్మకాలంలో ఆ సూర్యునియందే లయమైనట్లు, పుడమి యందు జన్మించిన చరాచర భూతాలు తిరిగి పుడమి యందే అణగి పోయినట్లు శ్రీహరి నుండి జన్మించిన ఈ మహావిశ్వం తిరిగి శ్రీహరి లోనే లయమవుతుంది.

మ. అరుదౌ నభ్ర తమః ప్రభల్ మును నభంబం దొప్పఁగాఁ దోఁచి క్ర
మ్మఱ వీక్షింపఁగ నందె లేనిగతి బ్రహ్మంబందు నీ శక్తులుం
బరికింపం ద్రిగుణ ప్రవాహమున నుత్పన్నంబులై క్రమ్మఱన్
విరతిం బొందుచు నుండుఁ గావున హరిన్ విష్ణున్ భజింపం దగున్. 958

* ఆకాశంలో మేఘాలు, తమస్సులు, ప్రకాశాలు ఒకప్పుడు కనిపిస్తాయి. మళ్ళీ చూద్దామంటే కనిపించవు. అదేవిధంగా విశ్వసృష్టికి, రక్షణకు, విలయానికి కారణాలైన త్రిగుణశక్తులు పరబ్రహ్మంలోనే ఒకప్పుడు ఆవిర్భవిస్తూ వెంటనే అణగిపోతూ ఉంటాయి. కాబట్టి శ్రీహరిని సేవించాలి.

వ. మఱియును సమస్త దేహులకు నాత్మయు, నిమిత్త భూతుండును, నద్వితీయుండును శశ్వత్ప్రకాశుండును, బ్రధాన పురుషుండును, స్వతేజో విధ్వస్త గుణప్రవాహుండును, మానస బుద్ధి సుఖేచ్ఛా ద్వేషాది వికల్పరహితుండును, నగుణుండును దేహాత్మ భ్రమ నివృత్త్యుపలభ్యుండును, నాది మధ్యాంత రహితుండును, నిత్యానంద స్వరూపుండును, సర్వజ్ఞుండును, బరమేశ్వరుండు నైన నారాయణు నభేదబుద్ధిఁజేసి భజింపుం, డతండు సర్వభూత దయాళువులును నెంతమాత్రంబు సంభవించు నంతమాత్రంబున సంతుష్ట చిత్తులును, సర్వేంద్రియోపశాంతులును నగు పురుషులయెడ సంతుష్టుం డగు నని వెండియు నిట్లనియె. 959

* శ్రీహరి సమస్త శరీరాలకు ఆత్మ, అద్వితీయుడు. ఆదిమధ్యాంతరహితుడు. నిత్యానంద స్వరూపుడు. సర్వజ్ఞుడు. పరమేశ్వరుడు. ఆయనను అభేద బుద్ధితో సేవించండి. సర్వభూతదయ, దొరికిన దానితో తృప్తి పడడం, సర్వేంద్రియాల ఉపశాంతి - ఇవి కలవారిని చూచి హరి సంతుష్టి పొందుతాడు.

చ. చతురత నట్టి యీశ్వరుఁడు సజ్జనలోక నిరస్త సర్వ కా
మిత విమలాంతరంగమున మిశ్రిత భావనఁ జేసి సన్నిధా
పితుఁ డగుచున్ దయాకర గభీర గుణంబులఁ జాల నొప్పి యా
శ్రిత జన పారతంత్ర్యమును జేకొని పాయక యుండు నిచ్చలున్. 960

* భగవంతుడు ఆశ్రితజన వత్సలుడు. కాబట్టి పరిశుద్ధమైన సజ్జనుల మనస్సులో చేరి విడువకుండా నిత్యమూ అక్కడే ఉంటాడు.

క. శ్రుత ధన కుల కర్మ సము, న్నత మదములఁ జేసి సజ్జన ప్రతతికి సం
తతమును నెగ్గొనరించు కు, మతు లర్థిం జేయు పూజ మతిఁ గొనఁ డెందున్. 961

* విద్యా ధన కుల కర్మలవల్ల మదించి సజ్జనులకు కీడు చేసే దుర్జనుల పూజను ఆయన స్వీకరింపడు.

వ. అది యెట్లనిన. 962

సీ. వలనొప్పఁ దను ననువర్తించు నిందిరా కామినీ మణిఁ దదాకాంక్షు లగుచు
ధృతి ననువర్తించు దేవేంద్రముఖ్యుల నే ననువర్తింప కెప్పు డాత్మ
నిత్య స్వతంత్రుని నిజభక్త వరదుని దీనవత్సలు గుణాధీశు నజునిఁ
బురుషోత్తముని జగద్భరితు సర్వేశ్వరు నారాయణునిఁ జిదానందమయుని

తే. నజితు నచ్యుతుఁ బుండరీకాయతాక్షుఁ, దవిలి సేవింపకుండునే? ధర రసజ్ఞుఁ
డైన పురుషుండు సమ్మోదితాత్ముఁ డగుచుఁ, జారుమతులార! రాజకుమారులార! 963

* తనను కోరి అనుసరించే లక్ష్మీదేవిని ఐశ్వర్యంకోసం అనుసరించే దేవేంద్రుడు మున్నగువారిని కూడా శ్రీహరి ఆదరింపడు. తన భక్తులను మాత్రమే ఆదరిస్తాడు. రసజ్ఞు డయినవాడు ఆ హరిని సేవించ కుండా విడిచి పెట్టగలడా!

వ. అని మఱియు నిట్లనియె, భవదీయ వంశ ధుర్యుండుఁ జిత్రరథుండు నగు ధ్రువుండు సపత్నీమాతృ వాగ్బాణ భిన్న హృదయుండై పంచవర్షార్భకుం డగుచుఁ దపోవనంబున కరుగు నపుడు మార్గంబున నాచే నుపదిష్టంబైన క్రమంబున భగవంతుండగు పుండరీకాక్షు నారాధించి యితరులచే నొందరాని సర్వోత్తమంబగు పదంబు నొందెఁ గాన మీరును రుద్రోపదేశ క్రమంబున సర్వభూతాంతర్యామి యగు నీశ్వరు భవచ్ఛేదంబునకై భజయింపుండు. 964

* మీ వంశంలో ప్రసిద్ధుడైన ధ్రువుడు సవతి తల్లి వాగ్బాణాలచేత మనస్సునొచ్చి అయిదేండ్ల వయస్సులో తపోవనానికి బయలుదేరాడు. దారిలో నేను ఉపదేశించిన విధంగా హరిని సేవించాడు. అందువల్ల ఇతరులు పొందరాని సర్వోత్తమ మైన ధ్రువపదాన్ని పొందాడు. కాబట్టి మీరు కూడా రుద్రుని ఉపదేశాన్ని అనుసరించి సర్వాంతర్యామి అయిన నారాయణుని భజించి సంసారాన్ని తరించండి.

**క. అని యివ్విధమున నారద, ముని రాజకుమారులకును ముదము దలిర్పన్**
**వనజోదరు సచ్చరితము, వినిపించి సరోజభవుని వీటికిఁ జనియెన్. 965**

* ఈ విధంగా నారదమహర్షి రాజపుత్రులైన ప్రచేతసులకు నారాయణుని సచ్చరిత్రాన్ని వినిపించి బ్రహ్మలోకానికి వెళ్ళాడు.

**వ. అట్లు నారదుండు సనిన యనంతరంబ. 966**

**చ. నరవర నందనుల్ గడఁక నారద వక్త్ర వినిర్గతంబు సుం**
**దరమును మంగళావహము ధన్యము లోకమలాపహంబునై**
**పరఁగిన విష్ణు సద్యశము భక్తి నుతించి ముకుంద చింతనా**
**నిరుపమ భక్తిఁజెంది హరినిత్య పదంబును బొంది రున్నతిన్. 967**

* రాజపుత్రులైన ప్రచేతసులు నారదముని వర్ణించిన లోకమాలిన్యాన్ని తొలగించే నారాయణుని కీర్తి మహిమను పొగడి ఆయనను భక్తితో సేవించి హరిపదాన్ని పొందాడు.

**వ. అని మైత్రేయుండు విదురున కిట్లనియె. మహాత్మా! నీవు నన్నడిగిన ప్రచేతో నారద సంవాద రూపంబైన హరికీర్తనంబు మను పుత్త్రుండైన యుత్తానపాదుని వంశప్రకారంబును జెప్పితి నని వెండియు నిట్లనియె. నారదు వలనం బ్రియవ్రతుం డాత్మ విజ్ఞానంబు నొంది మహీమండలంబుఁ బరిపాలించి యనంతరంబునఁ బుత్త్రులకు రాజ్యంబుఁ బంచి యిచ్చి పరలోకగతుం డయ్యె, ననిన. 968**

* అని చెప్పి మైత్రేయ మహర్షి విదురునితో ఇలా అన్నాడు. "మహాత్మా! నీవు అడిగిన ప్రచేతో నారదసంవాదాన్నీ మనుపుత్రుడయిన ఉత్తానపాదుని వంశపద్ధతినీ నీకు వినిపించాను. నారదునివల్ల ప్రియవ్రతుడు అధ్యాత్మ విద్యను గ్రహించి భూమిని పరిపాలించి ఆ తరువాత పుత్రులకు రాజ్యాన్ని పంచియిచ్చి పరమపదించాడు అని ముగించాడు.

**క. విని విదురుం డా మునివరు, ఘన చరణము లాత్మమస్తకంబున మధు సూ**
**దను చరణాంభోరుహములు, మనమునఁ దగఁ దాల్చి పలికె మైత్రేయునితోన్. 969**

* అప్పుడు విదురుడు మైత్రేయమహర్షి పాదాలను తలయందు, శ్రీహరి పాదాలను మనస్సునందు ధరించి మైత్రేయునితో ఇలా అన్నాడు.

క. మునినాథ చంద్ర! కరుణా, వననిధి! నీ చేత భక్త వత్సలుఁడగు నా
వనజాక్షు తత్త్వ మెఱిఁగితి, నని తత్పదములకు వినతుఁడై వినయమునన్. 970

క. ఆ మునిచే నా మంత్రితుఁ, డై మనమున బంధు దర్శనాకాంక్షితుఁడై
ధీ మహితుఁడైన విదురుఁడు, సామజ పురమునకుఁ జనియె సమ్మద మొప్పన్. 971

* మునీంద్రా! కరుణాసముద్రుడవైన నీవల్ల భక్తవత్సలుడు అయిన శ్రీహరి తత్త్వాన్ని తెలుసుకున్నాను అని వినయంతో ఆయన పాదాలకు నమస్కరించి ఆయన దగ్గర సెలవు తీసుకొని బంధువులను చూచే కోరికతో జ్ఞానసంపన్నుడైన విదురుడు హస్తినాపురమునకు వెళ్లాడు.

క. అని శుకుఁడు పరీక్షిత్తున, కనుకంపం జెప్పె నీ యుపాఖ్యానంబున్
వినువాఁ డైశ్వర్యాయు, ర్ధన కీర్తి స్వస్తి గతులఁ దగఁ బ్రాపించున్. 972

* అని శుకమహర్షి పరీక్షిత్తుకు చెప్పాడు. ఈ కథను విన్నవారు ఐశ్వర్యాన్ని, ఆయుస్సును, ధనాన్ని, కీర్తిని, శుభాలను పొందుతారు.

క. అని శుకయోగి పరీక్షి, జ్జనపాల సుధాపయోధి చంద్రున కర్థిన్
వినిపించిన కథ మోదం, బున సూతుఁడు శౌనకాది మునులకుఁ జెప్పెన్. 973

* శుకయోగి పరీక్షిన్మహారాజుకు చెప్పిన కథను సూతుడు శౌనకాది మునులకు వినిపించాడు.

చ. సరస వచో విలాస! గుణసాగర! సాగర మేఖలా మహీ
భరణ ధురంధర ప్రకట భవ్య భుజా భుజగేంద్ర! రాజ శే
ఖర! ఖర దూషణ ప్రముఖ గాఢ తమః పటల ప్రచండ భా
స్కర! కఱకంఠ కార్ముక విఖండన ఖేలన! భక్త పాలనా! 974

* రసవంతమైన వాక్కులను పలికేవాడా! గుణసముద్రుడా! సముద్రాలవరకు వ్యాపించిన భూభారాన్ని, మోసే పటిష్ఠమైన బాహుదండములు కలవాడా! రాజచూడామణీ! ఖరదూషణాదుల దురహంకారమనే గాఢాంధకారాన్ని పటాపంచలు చేసే ప్రచండమార్తాండుడా! అలవోకగా హరధనుస్సును విరిచినవాడా! భక్తులను రక్షించేవాడా!

క. శర విదళిత సారంగా!, సరస దయాపాంగ! భక్త జలధితరంగా!
దురిత ధ్వాంత పతంగా!, వర జనకసుతానుషంగ! వననిధి భంగా! 975

* స్వామీ! నీవు అలవోకగా ఒక్క బాణంతో మాయామారీచుణ్ణి సంహరించావు. ప్రసన్నమైన కడగంటి చూపులు కలవాడవు. భక్తుల హృదయాలలో భక్తి తరంగాలను పొంగిపొరలించేవాడవు. పాపమనే అంధకారాన్ని అణచివేయటంలో సూర్యునివంటివాడవు. సముద్రుని అహంకారాన్ని అణచివేసినవాడవు. శ్రీ సీతాభిరామా! శ్రీరామా!

మాలిని.

సుర విమత విదారీ! సుందరీ శంబరారీ!
సరస వినుత సూరీ! సర్వలోకోపకారీ!
నిరుపమ గుణ హారీ! నిర్మలానంద కారీ!
గురుసమర విహారీ! ఘోర దైత్య ప్రహారీ! 976

* స్వామీ! నీవు రాక్షసులను సంహరించినవాడవు. జగన్మోహనాకారుడవు. విద్వాంసులు కొనియాడేవాడవు. సర్వలోకాలకు మేలు చేసేవాడవు. సాటిలేని సుగుణాలతో ఒప్పేవాడవు. స్వచ్ఛమైన ఆనందాన్ని అందించేవాడవు. మహారణరంగంలో విహరించేవాడవు. భయంకర రాక్షసులను ప్రహరించినవాడవు.

గద్యము.

ఇది శ్రీ పరమేశ్వర కరుణాకలిత కవితా విచిత్ర కేసన మంత్రిపుత్ర సహజ పాండిత్య పోతనామాత్య ప్రణీతంబైన శ్రీ మహాభాగవతం బను మహాపురాణంబునందు స్వాయంభువ మనువునకు నాకూతి, దేవహూతి, ప్రసూతి, ప్రియవ్రతోత్తాన పాదులు జన్మించుటయు, నందు నాకూతిని రుచి ప్రజాపతికి నిచ్చుటయు, నా రుచి ప్రజాపతికి నాకూతి దేవియందు శ్రీ విష్ణు మూర్త్యంశజుండైన యజ్ఞుండును, లక్ష్మీ కళాంశజ యగు దక్షిణ యను కన్యకయు నుద్భవించుటయు, మనుపుత్రియైన దేవహూతిని గర్దమున కిచ్చుటయుఁ, బ్రసూతిం దక్ష ప్రజాపతి కిచ్చుటయుఁ, బ్రసూతి దక్షుల వలనం బ్రజాపరంపరలు గలుగుటయు, మఱియుం గర్దమ ప్రజాపతి పుత్రికా సముదయంబును క్షత్ర బ్రహ్మర్షుల కిచ్చుటయుఁ గర్దమ పుత్త్రి యైన కళవలన మరీచికిం గశ్యపుం డను పుత్రుండును బూర్ణిమ యను కూఁతురుం బుట్టుటయును, బూర్ణిమవలన గంగయు విరజుం డనెడు కుమారుండును జన్మించుటయు, గశ్యప ప్రజాపతివలన నయిన ప్రజా పరంపరలచే ముల్లోకంబు లాపూర్ణంబు లగుటయు, నత్రిమహాముని తపంబును, నతనికి హరిహర బ్రహ్మలు ప్రత్యక్షం బగుటయు, ననసూయా పాతివ్రత్య మాహాత్మ్యంబు వలన ననసూయాత్రులకుం ద్రిమూర్తుల కళాంశజు లయిన చంద్ర దత్తాత్రేయ దుర్వాసుల జన్మంబును, దక్షాత్మజల జన్మంబును, భృగువువలన ఖ్యాతి యను నంగనకు శ్రీమహాలక్ష్మి జన్మించుటయును, భృగుపౌత్రుం డయిన మార్కండేయు జన్మంబును, ధర్మునకు మూర్తివలన నర నారాయణులు సంభవించు టయును, సత్త్రయాగంబునందు దక్షుండు శివుని నిందించుటయును, దక్షాధ్వర ధ్వంసంబును, బ్రహ్మచేఁ బ్రార్థితుండై శివుండు దక్షాదుల ననుగ్రహించుటయును, దక్షాదికృత శ్రీహరి స్తవంబును, శ్రీహరి ప్రసన్నుండై దక్షుని యజ్ఞంబు సఫలంబుగా ననుగ్రహించుటయును, సతీదేవి హిమవంతునకు జనించి హరునకుం బ్రాప్తించుటయు, నుత్తానపాదుని వృత్తాంతంబును, ధ్రువోపాఖ్యానంబును, ధ్రువుండు దండ్రిచేత నవమానితుండై నారదోపదేశంబున మధువనంబునకుం జని తపంబు సేయుటయును, హరి ప్రసన్నుండై యతని మనోరథంబు లిచ్చుటయును, నతండు మరలఁ బురంబునకు వచ్చుటయు, గుబేరానుచరులైన యక్షులతోడి యుద్ధంబును, ధ్రువుండు యజ్ఞంబులు సేయుచు రాజ్య భోగంబులం దనిసి తనయు నుల్కలునిం బట్టంబు గట్టి హరియనుగ్రహంబున ధ్రువక్షితిని నిలుచుటయు, నుల్కలుండు వత్సరుం డను తన సుతనిఁ బట్టంబు గట్టి హరిం జేరుటయు, వత్సరుని వంశపరంపరయు, నందు నంగుని సుతుండయిన వేను కళేబరంబున

లక్ష్మీనారాయణుల యంశంబున నర్చియు బృథుండును జన్మించుటయుఁ, బృథుండు భూమిం గామధేనువురీతి నఖిల వస్తువులుం బిదుక నియమించి నిమ్నస్థలిం జేసి యింద్రుండు వశవర్తియై యుండ బహు యజ్ఞంబులు సేసిన నతనికి హరి ప్రత్యక్షం బగుటయు, నధ్యాత్మ ప్రబోధంబును, నింద్రుని వలనఁ బాషండ సంభవంబును, నింద్రుని జయించిన విజితాశ్వుని నతని తమ్ములను బృథివీపాలనంబునకు నిలిపి పృథుండు నర్చియుం బరమపదప్రాప్తు లగుటయు, విజితాశ్వునకు వసిష్ఠ శాపంబునం ద్రేతాగ్నులు దనయులై జనించుటయుఁ, బృథునిపౌత్రుండయిన ప్రాచీనబర్హి రాజ్యంబును నతని యజ్ఞంబు లసంఖ్యాతంబులైన నారదుండు మాన్పందలంచి పురంజను కథ నధ్యాత్మ ప్రపంచంబుగాఁ దెలుపుటయుఁ, బ్రాచీనబర్హి సుతులయిన ప్రచేతసులు పదుపురకు శ్రీ మహాదేవుండు ప్రత్యక్షంబై హరి స్తవంబుపదేశించుటయుఁ, బ్రచేతసుల తపంబునకు మెచ్చి హరి ప్రత్యక్షం బగుటయు, వారికి మారిష వలన దక్షుండు పూర్వకాలంబున శివవిద్వేష ప్రయుక్త శాపంబునం బుత్రుండై జనియించుటయును, బ్రచేతసులు ముక్తికిం జనుటయును, విదురుండు మైత్రేయుని వీడ్కొని హస్తి పురంబున కరుగుటయు నను కథలు గల చతుర్థ స్కంధము. 977

* ఇది పరమశివుని దయవల్ల కలిగిన కవితావైభవం కలవాడు. కేసనామాత్యుని కుమారుడు, సహజమైన పాండిత్యం కలవాడు అయిన పోతనామాత్యుడు వ్రాసిన మహాభాగవతం అనే గొప్ప పురాణంలోని నాల్గవ స్కంధం. స్వాయంభువ మనువుకు ఆకూతి, దేవహూతి, ప్రసూతి, ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు అనేవారు జన్మించటం, వారిలో ఆకూతిని రుచి ప్రజాపతి వివాహం చేసుకొనటం, ఆ దంపతులకు విష్ణ్వంశతో యజ్ఞుడు అనే కొడుకు, లక్ష్మీదేవి అంశతో దక్షిణ అనే కూతురు కలగటం, దేవహూతి కర్దముల వివాహం, ప్రసూతి దక్షప్రజాపతుల వివాహం, వీరికి ప్రజాసంతతులు కలగటం, కర్దమప్రజాపతి తన పుత్రికలను రాజులకు బ్రహ్మర్షులకు ఇచ్చి పరిణయం చేయటం, కర్దముని పుత్రిక అయిన కళవల్ల మరీచికి కశ్యపుడనే కొడుకు, పూర్ణిమ అనే కూతురు కలగటం, పూర్ణిమకు గంగ అనే కూతురు విరజుడనే కొడుకు జన్మించటం, కశ్యప ప్రజాపతి వల్ల జన్మించిన జనప్రవాహంతో మూడు లోకాలు నిండిపోవటం, అత్రిమహాముని తపస్సు, ఆయనకు త్రిమూర్తులు సాక్షాత్కరించటం, అనసూయాదేవి సాధ్వీత్వ మహిమవల్ల ఆమెకు త్రిమూర్తుల అంశలతో చంద్రుడు, దత్తాత్రేయుడు, దుర్వాసుడు జన్మించటం, దక్షుని పుత్రికల జననం, భృగువువల్ల ఖ్యాతి అనే వనితకు లక్ష్మీదేవి కలగటం, భృగువు మనుమడైన మార్కండేయుని ఉద్భవం, ధర్మునికి మూర్తికి నరనారాయణులు జన్మించటం, సత్రయాగంలో దక్షుడు శివనింద చేయటం, దక్షయజ్ఞ విధ్వంసనం, బ్రహ్మ ప్రార్థించినందువల్ల శివుడు దక్షుడు మొదలైనవారిని మన్నించటం, దక్షాదులు విష్ణుస్తుతి చేయటం, విష్ణువు ప్రసన్నుడై దక్షయజ్ఞం సఫలమయ్యేలా చేయటం, సతీదేవి హిమవంతునికి పుత్రికగా పుట్టి శివుని వివాహమాడటం, ఉత్తానపాదుని వృత్తాంతం, ధ్రువుని ఉదంతం, ధ్రువుడు తండ్రిచేత అవమానింపబడి నారదుని ఉపదేశంవల్ల మధువనంలో తపస్సు చేయటం, విష్ణువు అతనికి సాక్షాత్కరించి వరాలు ఇవ్వటం, ధ్రువుడు తిరిగి తన నగరానికి రావటం, కుబేరుని సైనికులైన యక్షులతో ధ్రువుడు యుద్ధం చేయటం, అనేక యజ్ఞాలు చేసి రాజభోగాల వల్ల విరక్తిచెంది తన కొడుకైన ఉల్కలునికి రాజ్యం అప్పగించి విష్ణుని దయతో ధ్రువభూమిపై నిలవటం, ఉల్కలుడు వత్సరుడనే తన తనయునికి రాజ్యాభిషేకం చేసి విష్ణువును

చేరటం, వత్సరుని వంశం, ఆ వంశంలో అంగుని పుత్రుడైన వేనుని దేహంనుండి లక్ష్మీనారాయణుల అంశలతో అర్చి అనే అమ్మాయి, పృథువు అనే అబ్బాయి జన్మించటం, పృథుడు భూమిని కామధేనువులాగా సకల వస్తువులను పిదుకుమని చెప్పి సమస్థలిగా చేయటం, దేవేంద్రుని లోబరచుకొని ఎన్నో యాగాలు చేయటం, అందుకు విష్ణువు సాక్షాత్కరించటం, వేదాంతప్రబోధం, దేవేంద్రుని జయించిన విజితాశ్వుని పట్టాభిషిక్తుని చేసి పృథుడు, అర్చి పుణ్యలోకానికి పోవటం, వసిష్ఠుని శాపంవల్ల ఆహవనీయం, గార్హపత్యం, దక్షిణాగ్ని అనే అగ్నులు మూడూ విజితాశ్వునికి పుత్రులై పుట్టటం, పృథువు మనుమడైన ప్రాచీనబర్హి రాజ్యాన్ని అతని అనంతమైన యజ్ఞాలను నారదుడు ఆపివేయాలని నిశ్చయించుకొని పురంజనుని కథను వేదాంతపరంగా చెప్పటం, ప్రాచీనబర్హి పుత్రులైన ప్రచేతసులు పదిమందికి పరమేశ్వరుడు ప్రత్యక్షమై విష్ణుస్తుతిని తెలపటం, ప్రచేతసుల తపస్సుకు సంతోషించి విష్ణువు వారికి సాక్షాత్కరించటం, ప్రచేతసులకు మారిషవల్ల దక్షుడు కుమారుడై జన్మించటం, ప్రచేతసులు మోక్షాన్ని పొందటం, విదురుడు మైత్రేయుని వీడ్కొని హస్తినాపురానికి వెళ్లటం అనేవి ఈ చతుర్థ స్కంధం లోని కథలు.

**శ్రీ కృష్ణార్పణ మస్తు.**

# ప్రవేశిక

ప్రాచీన సాహిత్య సర్వస్వాలుగానూ భారతీయ సంస్కృతి భాండారాలు గానూ పేరెన్నిక గన్న మహాగ్రంథాలు భారత భాగవత రామాయణాలు. ఈ మూడు గ్రంథాలూ సమగ్రంగా సర్వాంగ సుందరంగా సంస్కృత భాషలో నుంచి తెలుగుభాషలోకి అనువదింపబడటం అదృష్టం.

అయితే విచిత్ర విషయం ఏమిటంటే ఆంధ్రీకరింపబడిన ఈ మూడు గ్రంథాలలో ఏ ఒక్కటీ, ఏ ఒక్క కవి చేతి మీదుగా పూర్తి కాలేదు. పదునెన్మిది పర్వాల భారతంలో నన్నయగారు ఆది సభా పర్వాలూ, అరణ్య పర్వంలో కొంత భాగమూ రచించారు. తరువాత రెండువందల ఏండ్లకు తిక్కన గారు విరాటపర్వం మొదలుకొని స్వర్గారోహణ పర్వం వరకూ పదిహేను పర్వాలూ నిర్వహించారు. ఆ తరువాత వంద సంవత్సరాలకు ఎర్రన గారు అరణ్యాపర్వశేషాన్ని పూరించారు. ఈ విధంగా ముగ్గురు మహాకవులు పూనుకొని మూడు వందల సంవత్సరాల కాలంలో అష్టాదశ పర్వాలతో కూడిన ఆంధ్ర మహాభారతాన్ని మనకు అందించారు.

రామాయణాలలో సుప్రసిద్ధమైన "భాస్కర రామాయణం" విషయంలో కూడా దాదాపు అంతే జరిగింది. భాస్కరుడూ, ఆయన పుత్రుడైన మల్లికార్జున భట్టూ, ఛాత్రుడైన కుమార రుద్రదేవుడూ, మిత్రుడైన అయ్యలార్యుడూ నలుగురూ కలిసి నాలుగు చేతులు వేస్తేనే గాని షట్కాండలతో కూడిన భాస్కరరామాయణం సంపూర్తి కాలేదు. నలుగురు కవులు కలిసి రచించినా ప్రధానవ్యక్తి భాస్కరుడే కావటం వల్ల దీనికి "భాస్కర రామాయణం" అనే ప్రసిద్ధి రావటం న్యాయం గానే ఉంది.

తెలుగులో భారత రామాయణాలకు ప్రాప్తించిన బహుకర్తృకత్వం భాగవతానికి కూడా తప్పలేదు. భాగవతం పన్నెండు స్కంధాలలోనూ ప్రథమ ద్వితీయ తృతీయ చతుర్థ స్కంధాలూ, సప్తమ అష్టమ నవమ స్కంధాలూ పోతన్నగారే దిద్ది తీర్చారనీ, పంచమస్కంధం బొప్పరాజు గంగనార్యుడు, షష్ఠస్కంధం ఏల్చూరి సింగయగారూ, ఏకాదశ ద్వాదశ స్కంధాలు వెలిగందల నారయగారూ తెనిగించారనీ ఆయా స్కంధాల చివర ఉన్న గద్యలు వెల్లడిస్తున్నాయి. అయినా మొత్తం మీద ఈ మహాగ్రంథం "పోతనభాగవతం" గానే ప్రసిద్ధి కెక్కింది. పోతన తెనిగించిన స్కంధాలు ఇతర కవులు రచించిన స్కంధాలన్నింటి కంటే అన్ని విధాలా మిన్నగా ఉండటమే అందుకు కారణం. భాగవతరచనలో ఇతర కవుల చేతులు కలవటానికి కారణం ఇదమిత్థమని చెప్పటం కష్టం. ఈ విషయంలో మూడు విధాలైన అభిప్రాయాలు ఉన్నాయి.

1. ఇంత పెద్ద గ్రంథాన్ని ఒక్కచేతి మీదుగా ఆంధ్రీకరించటం కష్టమని భావించి స్వయంగా పోతన్న గారే స్కంధాలు తన శిష్యులకు అప్పగించారనీ; ఆ విధంగా చతుర్థం గంగనగారూ, పంచమం సింగనగారూ, ఏకాదశ ద్వాదశాలు నారయగారూ అనువదించారని మిగిలిన భాగవత మంతా పోతన్న గారు ఆంధ్రీకరించారనీ కొంతమంది అభిప్రాయం.

2. భాగవతాన్ని తనకు అంకితం ఇయ్యలేదన్న కోపంతో సర్వజ్ఞ సింగమనీడు ఆగ్రంథాన్ని భూమిలో పాతి పెట్టించాడనీ, తర్వాత కొంత కాలానికి పోతనగారి శిష్యులు త్రవ్వి తీశారనీ, అప్పటికే ఆ గ్రంథం

క్రిమిదష్టమై కొంత భాగం నష్టమైనదనీ ఆ నష్టమైన భాగాలను నారయాదులు పూర్తి చేశారనీ కొందరి అభిప్రాయం.

3. పోతన్నగారే భాగవతం పన్నెండు స్కంధాలూ సంపూర్ణంగా తెనిగించారనీ అవసాన కాలంలో ఆ గ్రంథాన్ని పూజామందిరంలో భద్రపరచి కుమారుడైన మల్లన్నకు చెప్పి కన్ను మూశారనీ, ఆయన మరణానంతరం తీసి చూడగా కొన్ని స్కంధాలు చెదలు పట్టి నష్టమైనాయనీ, ఆ భాగాలను పోతన్నగారి శిష్యులు తెనిగించారనీ మరి కొందరి అభిప్రాయం.

ఈ మూడు విధాలైన అభిప్రాయాలలో మూడవదే వాస్తవానికి కొంత దగ్గరగా ఉంది. పోతన్న గారికి సాక్షాత్కరించిన శ్రీరామభద్రుడు 'మన్నా మాంకితంబుగా నీవు శ్రీమన్మహాభాగవతంబు తెనుంగు సేయుము'' అన్నాడే కాని "నీవు నీ శిష్యులూ కలిసి తెలుగు చేయండి'' అని కానీ, నీవు "కొన్ని స్కంధాలు మాత్రమే తెనుగు చేయు'' మని కానీ అనలేదు.

నన్నయ్య తిక్కనాది మహాకవులు భారత రామాయణాలను మాత్రమే తెనిగించి భాగవతాన్ని తనకోసం అట్టి పెట్టటం తన పురాకృత పుణ్య విశేషంగా భావించి పొంగి పులకించి పోయిన పోతన్న గారు -

**"దీనిం దెనిగించి నా జననంబున్ సఫలంబు సేసెద పునర్జన్మంబు లేకుండఁగన్''** అని భాగవతరచనా దీక్షితుడైన పోతన్నగారు-

**"పలికెడిది భాగవతమఁట, పలికించెడివాడు రామభద్రుండఁట''** అన్న దృఢ విశ్వాసంతో గంటం పట్టిన పోతన్నగారు- తానే స్వయంగా, సర్వాంగ సుందరంగా, సమగ్రంగా భాగవతాన్ని తెనుగు చేయాలని పూనుకుంటాడు. కానీ అందులో కొన్ని స్కంధాలు మాత్రమే తాను తీసుకొని కొన్ని స్కంధాలు పూరించమని శిష్యుల కీయటం జరుగదు.

సర్వజ్ఞ సింగమనీడు ఎందరో కవి పండితులను ఆదరించి గౌరవించిన రసజ్ఞ ప్రభువు. కవితా మర్మజ్ఞుడు . అలంకారశాస్త్ర నిష్ణాతుడు. అటువంటి వాడు తనకు అంకితం ఇవ్వకపోయినా భగవంతునికి అంకితం చేస్తున్నందుకు సంతోషిస్తాడే కాని పోతన్న గారిమీద ఆగ్రహిస్తాడా? ఆ మహాగ్రంథాన్ని భూమిలో పాతి పెట్టిస్తాడా? ఇది అభూతకల్పన. మరి ఈ పరిస్థితి భాగవతానికి ఎందుకు వచ్చింది?

పన్నెండు స్కంధాల భాగవతాన్ని పరిపూర్ణంగా బమ్మెర పోతన్న గారే ఆంధ్రీకరించి ఉంటారనటంలో ఏమీ సందేహంలేదు. అవసానకాలంలో పూజామందిరంలో భద్రపరిచి కన్ను మూసి ఉంటారు. పోతన్న గారి మరణానంతరం ఆ పూరింటి పూజామందిరంలో ఉంచిన తాళపత్ర సంపుటాలకు చెదలు పట్టి కొంత భాగం శిథిలమయింది. ఆ భాగాలను ఆయన ప్రియశిష్యులు సింగన మొదలైనవారు పూర్తి చేసి ఉంటారు.

ఇక్కడ మరొక ప్రశ్న ఉంది. పన్నెండు స్కంధాలు ఒకే సంపుటంగా సమకూర్చబడిన భాగవతంలో తక్కిన స్కంధాలన్నీ సరిగా ఉండి, 5,6,11,12 స్కంధాలు మాత్రమే కచ్చితంగా చెదలుపట్టి శిథిలం కావటం ఎలా సంభవిస్తుంది. అని-

దానికి సమాధానం మనవి చేస్తాను. తాళపత్రాలలో వ్రాయబడి ఉన్న పన్నెండు స్కంధాల భాగవతాన్నీ ఒకే సంపుటంగా పేర్చి కట్టటం ఎంతమాత్రం కుదరని పని. పన్నెండు స్కంధాలూ పన్నెండు సంపుటాలుగా అయినా వ్రాసి ఉండటం సంభవం. వానిని 1,2,3,4,5,6, స్కంధాలు ఒక కట్టగానూ 7,8,9,10,11,12 స్కంధాలు ఒక కట్టగానూ చేసి ఈ రెండు కట్టలనూ ఒకటిగా కట్టి భద్రపరచి ఉంటారు. ఇలా ఉంచిన రెండు కట్టలలో అడుగున ఉన్న 5,6,11,12 స్కంధాలు చెదలు పట్టి నష్టం కావటం స్పష్టం. అడుగునుంచి పట్టిన చెదలు అడుగున ఉన్న ఆ స్కంధాలను బాగా తిని అక్కడక్కడ కన్నాల ద్వారా పై స్కంధాలలో కూడా కొంత కొంత తిని ఉండటమూ సహజం. ఈ విధంగా నష్టమైన భాగవతంలో 5వ స్కంధం బొప్పరాజు గంగన్న, 6 వ స్కంధం ఏర్చూరి సింగన్న, 11,12 స్కంధాలు వెలిగందల నారయగార్లు పూర్చిచేసి ఉంటారు. 3,4 స్కంధాలలోనూ, 10 వ స్కంధం ఉత్తరభాగంలోనూ అక్కడక్కడ ఇతరుల శైలి మనకు కనిపించటానికి కూడా ఇదే కారణం.

ఇప్పుడు తమ చేతిలో ఉన్న భాగవతం పంచమ స్కంధం. తెనిగించినవారు బొప్పరాజు గంగనార్యుడు. ఈ స్కంధంలో 349 గద్య పద్యాలు మాత్రమే ఉన్నాయి. ఇంత చిన్న స్కంధాన్ని రెండు ఆశ్వాసాలుగా ఎందుకు గంగన్న గారు విభజించారో ఊహించలేము. ఈ స్కంధంలోని ప్రథమాశ్వాసంలో స్వాయంభువ మనువు కుమారుడైన ప్రియవ్రతుని వంశం వర్ణించబడింది.

ప్రియవ్రతుడు విశ్వకర్మ ప్రజాపతి పుత్రిక అయిన బర్హిష్మతిని వివాహం చేసుకున్నాడు. ఆయనకు పదిమంది కుమారులు కలిగారు. ప్రియవ్రతుడు రాత్రు లన్నింటినీ పగళ్లుగా మారుస్తానని రెండవ సూర్యుని వలె వెలిగిపోతూ తన రథాన్ని నడిపించాడట. ఆయన రథ చక్రాల ఒత్తిడికి సప్త సముద్రాలూ, సప్త ద్వీపాలూ ఏర్పడ్డాయట.

ప్రియవ్రతుని పెద్దకుమారుడు ఆగ్నీధ్రుడు. ఆయన సంతానం కోసం బ్రహ్మదేవుణ్ణి గురించి తపస్సు చేశాడు. బ్రహ్మ తన సన్నిధిలో సంగీతం పాడే " పూర్వ చిత్తి" అనే అమ్మాయిని పంపించాడు. ఆగ్నీధ్రుడికీ పూర్వచిత్తి" వల్ల తొమ్మిది మంది కొడుకులు పుట్టారు. వారిలో పెద్దవాడైన నాభిరాజు మేరుపుత్రిక అయిన మేరు దేవిని పెండ్లాడాడు. నాభిరాజు శ్రీమన్నారాయణుని ప్రార్థించి ప్రసన్నుని చేసుకొని "నీవంటి కుమారుడు కావాలి" అని కోరుకున్నాడు. "నావంటి వాణ్ణి నేనే కదా!" అని భగవంతుడు మేరుదేవి గర్భాన "ఋషభుడు" అనే పేరుతో జన్మించిచాడు. ఆ ఋషభుని భార్య జయంతి. ఆ దంపతులకు ఉదయించిన కుమారులలో భరతుడు పెద్దవాడు. తండ్రి అనంతరం పట్టాభిషిక్తుడైనాడు. ఆ భరతుడు పాలించటం వల్లనే ఈ భూభాగానికి "భారత వర్షం" అని పేరు వచ్చింది.

భరతుడు తన రాజ్యాన్ని కుమారుడైన సుమతికి అప్పగించి రాజ్యభోగాలు పరిత్యజించి పులహాశ్రమంలో గండకీ నదీతీరాన తపస్సు చేయ సాగాడు. ఒకనాడు భరతుడు స్నానం చేస్తూ ఉండగా పూర్ణగర్భిణి అయిన ఒక ఆడులేడి నదిలో నీరు త్రాగటం కోసం వచ్చింది. అది నీరు త్రాగుతున్న సమయంలో ఒక భయంకరమైన సింహగర్జన వినిపించింది. లేడి తత్తరపాటుతో ఎగిరి దూకటంలో దాని గర్భంలో ఉన్న శిశువు నదీ జలాలలో పడిపోయింది. తల్లిలేడి వేగంగా దూకటంలో ఒక బండ మీద పడి చచ్చిపోయింది. నీళ్లలో పడి విలవిల

కొట్టుకుంటున్న తల్లిలేని లేడి పిల్లను భరతుడు చూశాడు. దాన్ని జాగ్రత్తగా తీసుకొని పోయి తన ఆశ్రమంలో ఉంచుకొని పెంచి పెద్దచేశాడు. క్రమంగా భరతునికి జపతపాలు దూరమైనాయి. ఆ లేడిపిల్లే సర్వస్వమయింది. చివరకు అవసానకాలంలో కూడా ఆ లేడిపిల్లనే చూస్తూ ప్రాణం విడిచాడు.

అందువల్ల అతడు మరుజన్మలో లేడిగా పుట్టాడు. అయితే పూర్వ స్మృతి ఉన్నందువల్ల భగవద్ధ్యానంతోనే జీవితమంతా గడిపి ఆ పుణ్య విశేషం వల్ల ఒక ఉత్తమ బ్రాహ్మణుని యింట భరతుడనే పేరుతో జన్మించాడు. పూర్వజన్మ సంస్కారం వల్ల ప్రాపంచిక విషయాలకు దూరంగా ఉన్నాడు. అతని సవతి కుమారులు ఆతనికి జడభరతుడని పేరు పెట్టి చాలా హీనంగా చూశారు. ఇంటి పనులన్నీ చేయించారు. చివరకు పంటపొలానికి కాపలా కాయించారు. వెర్రిబాగులవాడుగా ఉన్న భరతుణ్ణి ఆ ఊరి కాపు నాయకుడు కాళికాదేవికి బలి యివ్వాలని పట్టుకు వెళ్ళాడు. భరతుని బ్రహ్మ తేజస్సు చూచి కాళికాదేవి అతణ్ణి అనుగ్రహించింది. అతడు యథాప్రకారం పొలం కాపలా కాస్తున్నాడు.

రహూగణుడు అనే సింధు దేశపు రాజు తత్త్వోపదేశం కోసం కపిలమహర్షి దగ్గరకు పల్లకీలో బయలుదేరాడు. పల్లకీ బోయీలు భరతుణ్ణి తీసుకొనిపోయి రాజుగారి పల్లకీ మోయించారు. పల్లకీ సరిగా నడవక పోవటం వల్ల రాజుగారికి ఇబ్బంది కలిగింది. అతడు భరతుణ్ణి నానా మాటలూ అన్నాడు. చివరకు భరతుని సమాధానం విని సాష్టాంగ నమస్కారం చేశాడు. భరతుడు సింధురాజును కరుణించి అతని సందేహాలు తీర్చి తత్త్వజ్ఞానం ఉపదేశించాడు. ఇది ప్రథమాశ్వాస కథ.

ద్వితీయాశ్వాసంలో సప్త ద్వీపాలూ, సప్త సముద్రాలూ, సరిహద్దు పర్వతాలూ, ద్వీపాలలో ఉన్న భూభాగాలూ, నదులూ వర్ణితములైనాయి. తరువాత సూర్యచంద్రాది నవగ్రహాలూ, శింశుమార చక్రమూ సప్త పాతాళాలూ వర్ణింపబడ్డాయి. అనంతరం నానావిధాలైన నరక లోకాల స్వరూపం నిరూపింపబడింది.

గంగన్న గారి శైలికి ఈ క్రింది పద్యాలు ఉదాహరింపవచ్చు - దిక్కులేని లేడిపిల్లను గురించి భరతుడు తన మనస్సులో అనుకుంటాడు.

**"అక్కట ! తల్లిఁ బాసి హరిణార్భక మాప్తులు లేమిఁజేసి యే**
**దిక్కును లేకయున్న నిటఁ దెచ్చితి నాయెడ నీ మృగార్భకం**
**బెక్కుడు ప్రేమఁజేసి చరియింపుచు నున్నది నాదు సన్నిధిన్,**
**మక్కువ చేసి దీనిఁ గడు మన్ననలం దగఁ బ్రోతు నెంతయున్."** **5-1-103**

మరుజన్మలో లేడిగా పుట్టిన భరతుడు ఇలా పరితపిస్తాడు-

**రాజులు ప్రస్తుతింప సురరాజసమానుఁడనై తనూజులన్**
**రాజులఁజేసి తాపసుల రాజఋషీంద్రుఁ డటంచుఁ బల్కఁగాఁ**
**దేజము నొంది యీ హరిణ దేహము నందలిఁ బ్రీతిఁ జేసి నా**
**యోజ చెడంగ నేఁ జెడితి యోగిజనంబులలోన బేలనై.** **5-1-117**

గంగన కవిత్వము పోతన కవిత్వమంత మృదుమధురముగా, రసబంధురముగా లేకపోయినా ధారాళమైన శైలితో సాగుతుంది. పోతన్నగారు స్కంధాలలోని ఆద్యంత పద్యాలు శ్రీరాముణ్ణి సంబోధిస్తూ వ్రాశారు. గంగన్నగారు పంచమస్కంధంలో ఆద్యంత పద్యాలు శ్రీకృష్ణుణ్ణి సంబోధిస్తూ వ్రాశారు.

సహజ సుందరమైన సహజ పాండిత్యుని భాగవతం సరళ గద్యానువాద సహితంగా ప్రకటించాలనే సంకల్పం తిరుమల తిరుపతి దేవస్థానముల వారికి కలిగింది. ఆ సదుద్దేశంతోనే "పోతన భాగవతం ప్రాజెక్టు" ప్రారంభింపబడింది. ఈ సందర్భంలో అనువాద భాగాలన్నింటినీ పరిశీలించి ఏకసూత్రత కల్పించే కార్యం నా మీద ఉంచిన డాక్టర్ రావుల సూర్య నారాయణమూర్తి, పి.ఆర్. ఓ. గారికి నా అభినందనాలు. ఈ సాహిత్య మహాయజ్ఞంలోనూ నాకు అవకాశం కల్పించిన కార్యనిర్వహణాధికారి శ్రీ సి.హెచ్. వేంకటపతిరాజు, ఐ.ఏ.యస్. గారికి నా కృతజ్ఞతాపూర్వక ధన్యవాదాలు. ఈ సందర్భంలో ఎంతో ఆదరాభిమానాలతో నన్ను ప్రోత్సహిస్తున్న శ్రీ కాట్రపాటి సుబ్బారావు, ఎం.ఎ. (సప్తగిరి సంపాదకులు) గారికి సాధువాదాలు.

ఈ పంచమ స్కంధాన్ని సరళగద్యంలో అనువదించినవారు డాక్టరు, కె. సర్వోత్తమరావుగారు. వీరు శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో ఆంధ్రోపన్యాసకులుగా పనిచేస్తున్నారు. శ్రీ సర్వోత్తమరావు గారు సహృదయులు, సాహిత్యవేత్తలు, ప్రసిద్ధ రచయితలు. వీరి అనువాదం చక్కగా సరళంగా సాగింది.

ఈ గ్రంథంలో అక్షర దోషాలు దొర్లకుండా సహస్రాక్షులై ప్రూఫులు సరిదిద్దిన పూజ్యమిత్రులు శ్రీ ముదివర్తి కొండమాచార్యులు వారికీ, శ్రీ ములుకుట్ల రామకృష్ణశాస్త్రి గారికీ నా నమస్సుమనస్సులు. ముద్రణకు తగిన విధంగా ప్రెస్ కాపీ సిద్ధంచేసి యిచ్చిన చిరంజీవి కోరాడ రామకృష్ణ ఎం.ఏ., ఎం. ఫిల్‌కు నా శుభాశీస్సులు.

ఈ సంపుటాన్ని ఇంత త్వరగా, ఇంత ముచ్చటగా ముద్రించి యిచ్చిన దేవస్థానం ప్రెస్ మేనేజరు శ్రీ విజయకుమార్ రెడ్డి గారికీ, ప్రెస్ సిబ్బందికి నా అభినందనాలు.

భవదీయుడు

**జంధ్యాల పాపయ్య శాస్త్రి**

ప్రధానసంపాదకుడు
పోతన భాగవతం.

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# పోతన భాగవతము

## (సరళ గద్యానువాద సహితము)

## అయిదవ స్కంధము

### మొదటి ఆశ్వాసము

**శ్రీకర కరుణా సాగర!, ప్రాకటలక్ష్మీకళత్ర భవ్య చరిత్రా !**
**లోకాతీతగుణాశ్రయ!, గోకులవిస్తార ! నందగోపకుమారా !** 1

* సంపదలను ప్రసాదించేవాడవూ, దయకు సముద్రంవంటి వాడవూ, లక్ష్మీదేవిని గృహలక్ష్మిగా కలవాడవూ, పవిత్రమయిన చరిత్రం కలవాడవూ, లోకాతీతమయిన గుణాలకు ఆశ్రయం అయినవాడవూ, ఆల మందలను విస్తరింపజేసిన వాడవూ, నందగోపుని కుమారుడవూ అయిన కృష్ణా! అవధరించు.

**వ. సకల పురాణార్థజ్ఞాన విఖ్యాతుండగు సూతుండు శౌనకాది మహామునుల కిట్లనియె.** 2

అన్ని పురాణాల్లోని పరమార్థ జ్ఞానాన్ని విశదం చేయడంలో విఖ్యాతుడయిన సూతుడు శౌనకాది మహామునులతో ఈవిధంగా చెప్పాడు.

### -: ప్రియవ్రతుని చరిత్రము :-

**క. భూ నాథుఁ డుత్తరాత్మజుఁ, డైన పరీక్షిన్నరేంద్రుఁ డభిమన్యు సుతుం**
**డానందమంది ఘన సు, జ్ఞానుండగు శుకుని గాంచి సరసతఁ బలికెన్.** 3

మునులారా ! ఉత్తరాభిమన్యుల కుమారుడయిన పరీక్షిన్న రేంద్రుడు మహాజ్ఞాని అయిన శుకుణ్ణి చూచి సంతోషంతో సరసంగా ఇలా ప్రశ్నించాడు.

**వ. మునీంద్రా ! పరమభాగవతుండు నాత్మారాముండునైన ప్రియవ్రతుండు గృహంబున నుండి యెట్లు రమించెఁ? గర్మ బంధంబు లయిన పరాభవంబులు గల గృహంబులయందు ముక్త సంబంధులైన పురుషులకు సంతోషంబు గా నేర; దుత్తమ శ్లోకుండైన పుండరీకాక్షుని పాదచ్ఛాయం జేసి నిర్వృత చిత్తులైన మహాత్ములు గుటుంబంబునందు నిస్పృహత సేయుదురు; గాన ప్రియవ్రతునికి సంసారంబునందుఁ దగులంబు గలుగు టెట్లు? దారాగారసుతాదులందుఁ దగులంబు గలుగ వానికి నెట్లు సిద్ధి గలుగు? శ్రీహరియం దస్ఖలితమతి యెట్లు గలుగు? నీ సంశయంబుఁ దేట పఱపు మని పరీక్షిన్నరేంద్రుఁ డడిగిన శుక యోగీంద్రుం డిట్లనియె.** 4

* మునీంద్రా! ప్రియవ్రతుడు పరమభాగవతుడు, ఆత్మారాముడు కదా! అటువంటివాడు ఇంట్లోనే ఉంటూ సుఖభోగాదులను ఎలా అనుభవించాడు? గృహస్థధర్మం పాటించేవారికి కర్మబంధాలూ, వాటివల్ల కలిగే అవమానాదులూ తప్పవుకదా! బంధాలు తెంచుకున్న వారు సంతోషంగా ఎలా ఉంటారు? ఉత్తములు నిరంతరం కీర్తించే ఆ విష్ణుభగవానుని అడుగుజాడల్లో పయనిస్తూ చిత్తశాంతిని పొందినవారు కుటుంబ జీవితం పట్ల అనాసక్తులుగా ఉంటారు. ఇల్లు, ఇల్లాలూ, పిల్లలంటే మమకారం పెంచుకున్న వాడికి మోక్షసిద్ధి ఎలా కలుగుతుంది? శ్రీహరిమీద గురి ఎలా కుదురుతుంది? ఈ సందేహాన్ని తీర్చు స్వామీ! అని పరీక్షిత్తు అడిగినంత శుకయోగి ఈ విధంగా వివరించాడు.

**క. హరిచరణాంబుజ మకరం, ద రసావేశిత మనః ప్రధానుండగు స**
**త్పురుషుఁ డొకవేళ విఘ్నముఁ, బొరసినఁ దన పూర్వ మార్గమును విడువఁ డిలన్. 5**

* రాజా! విను. విష్ణుమూర్తి పాదపద్మాలలోని మకరంద రసపానంలో లీనమై పరవశించిన మనసు కలిగిన మంచి మనుష్యుడు, ఒకవేళ ఆటంకాలు అడ్డుతగిలినా పూర్వ మార్గాన్ని సుతరామూ వదిలి పెట్టడు.

**క. ధరణీవల్లభ! విను మా, నరవరుఁడు ప్రియవ్రతుండు నారదముని స**
**చ్చరణోపసేవఁ జెందుచు, నరుదుగ నధ్యాత్మ సత్త్ర యాగంబందున్. 6**

* ఓ రాజా! విను, ప్రియవ్రతుడు ఒక రాజు. అతడు నారద మహర్షి పాదసేవ చేసుకుంటున్నవాడు. అత డొకసారి అధ్యాత్మ సత్త్రయాగం చేపట్టాడు.

**సీ. దీక్షితుండై ధరిత్రీపాలనముఁ దండ్రి పనిచిన సుజ్ఞాన భంగ మనుచు**
**నంగీకరింపమి నంతయుఁ దెలిసి పద్మాసనుఁ డతనికి నతుల రాజ్య**
**మందుల మిక్కిలి యాసక్తిఁ బుట్టింతు ననుచును దన చిత్తమందుఁ దలఁచి**
**తారకాద్యనుసృత తారాధిపుని మాడ్కి శ్రుతులతోఁ గూడి యచ్యుత విభూతి**

**తే. హంసవాహనుఁ డగుచు నింద్రాదు లెల్లఁ, గదిసి సేవింప బ్రహ్మలోకమున నుండి**
**సన్మునీంద్రులు దన్నుఁ బ్రశంససేయ, నల్ల నల్లన యుడువీథి నరుగు దెంచె. 7**

* రాజ్యపాలన చేపట్టవలసిందిగా తండ్రి ఆజ్ఞాపించినా, అటువంటి లౌకిక వ్యవహారాలు తన జ్ఞానానికి ఆటంకాలని ప్రియవ్రతుడు భావించుకొని రాజ్యపాలనం అంగీకరించలేదు. ఇవన్నీ తెలుసుకున్న బ్రహ్మదేవుడు ప్రియవ్రతునికి రాజ్యపాలనం పట్ల ఆసక్తి కలిగించడానికి సంకల్పించాడు. ఇంద్రాదులు తన్ను సేవిస్తుండగా, సన్మునీంద్రులు సన్నుతించుతుండగా చుక్కలతో కూడిన సుధాకరునిలాగా వేదాలతో కూడి వెలిగిపోతూ బ్రహ్మదేవుడు హంసవాహన మెక్కినవాడై సత్యలోకం నుండి మెల్ల మెల్లగా తారాపథంలో బయలుదేరాడు.

**వ. మఱియు నయ్యై మార్గంబులయందు సిద్ధ సాధ్య గంధర్వ చారణ గరుడ కింపురుషు లిరు దెసల స్తోత్రంబులు సేయుచుండ గంధమాదనద్రోణులం బ్రకాశంబు నొందించుచుఁ జనుదెంచిన**

**పద్మాసనునకు నారదుండు స్వాయంభువ ప్రియవ్రతులతోఁ గూడి ముకుళిత కరకమలుండై యెదురు చనుదెంచి సంస్తుతి స్తబకంబులం బూజించిరి; విరించి సంతసించి ప్రియవ్రతునిం జూచి నవ్వుచు నిట్లనియె. 8**

* చతుర్ముఖుడు మానవలోకం వైపు వస్తున్నప్పుడు ఆయా మార్గాలలో అటూ ఇటూ నిలుచుండి సిద్ధులూ, సాధ్యులూ, గంధర్వులూ, చారణులూ, గరుడులూ, కింపురుషులూ స్తుతించడం మొదలుపెట్టారు. గంధ మాదన పర్వతం చరియలు కాంతు లీనేటట్టు బ్రహ్మదేవుడు వస్తుండగా నారదుడు స్వాయంభువ ప్రియవ్రతులతో పాటు చేతులు జోడిస్తూ ఎదురేగాడు. వారు ముగ్గురూ స్తుతులనే పూలగుత్తులతో చతుర్ముఖుణ్ణి పూజించారు. విరించి సంతోషించి ప్రియవ్రతుణ్ణి వీక్షించి నవ్వుతూ ఇలా అన్నాడు.

**క. హరి నా ముఖమున నీకును, గర మెఱిఁగింపంగఁ బనిచెఁ గావున నిదె సు**
**స్థిర మతి విను మంతయు శ్రీ, హరి వాక్యముగా నెఱింగి యవనీ నాథా! 9**

* "ఓ రాజా! విష్ణుమూర్తి నా నోటితో నీకు చెప్పమన్న విషయాన్ని చెబుతున్నాను. అందుచేత నా మాటలు శ్రీహరి పలుకులుగానే భావించి నిశ్చలమైన మనస్సుతో ఆలకించు.

**ఆ. కోరి వేడ్క నీవు నారదుండును నేను, నందఱమును నీశ్వరాజ్ఞఁ బూని**
**యుడుగ కెపుడు సేయనున్న వారము గాన, నతని యాజ్ఞఁదప్ప నలవి గాదు. 10**

* నీవుగానీ, నారదుడు గానీ, నేనుగానీ అందరం ఆ నారాయణుని ఆజ్ఞానుసారం నడిచేవాళ్లమే. అందువల్ల ఆయన ఆజ్ఞ కాదని స్వతంత్రంగా ప్రవర్తించడం మనకు సాధ్యం కాని పని.

**వ. మఱియు శ్రీహరి యాజ్ఞను జీవుండు తపోవిద్యలను యోగవీర్యజ్ఞానార్థ ధర్మంబులను దనచేత నొరులచేతం దప్పింప సమర్థుండు గాఁడుత్పత్తి స్థితి నాశంబులకు శోకమోహభయ సుఖదుఃఖంబులకు నీశ్వరాధీనుండె కాని జీవుండు స్వతంత్రుండు గాఁడు; శ్రీహరి వాగ్రూపంబు లయిన శ్రుతులందు గుణత్రయంబను రజ్జువున బంధింపంబడిన యస్మదాదులము ముకుఁద్రాటిచేఁ బశువు మనుష్యులకు వశంబయిన చందంబున నీశ్వరాజ్ఞం బ్రవర్తించుచుందుము; నరుండు సుఖదుఃఖానుభవంబులకు నీశ్వరాధీనుండు; నేత్రంబులు గలవానిచేతఁ దివియంబడిన యంధుండునుం బోలె నీశ్వరుం డిచ్చిన సుఖదుఃఖంబు లనుభవించుచున్న వారము; స్వప్నంబునం గన్న పదార్థంబు మేల్కాంచి మిథ్యగాఁ దలంచిన చందంబున మోక్షార్థియైన సుజ్ఞానవంతుండు ప్రారబ్ధ సుఖ దుఃఖంబు లనుభవించుచు దేహాంతరారంభ కర్మంబులం బాయనొల్లఁడు; వననాసి యైనను జితేంద్రియుండు గాకుండెనేనిఁ గామాది సహితుం డగుటంజేసి సంసారబంధంబులు గలుగు; గృహస్థాశ్రమంబందును జితేంద్రియుండై యాత్మ జ్ఞానంబుగల పురుషునకు మోక్షంబు సిద్ధించు, శత్రువులఁ గెలువ నిచ్ఛయించిన పురుషుండు దుర్గం బాశ్రయించి శత్రువుల జయించిన మాడ్కిని మోక్షార్థియగు నీవును గృహాశ్రయుండ వగుచు శ్రీ నారాయణ చరణారవిందంబు లను దుర్గం బాశ్రయించి యరిషడ్వర్గంబు జయించి ముక్త సంగుండవై యీశ్వర కల్పితంబులగు భోగంబుల ననుభవించి ముక్తిం జెందు**

**మనిన(బ్రియవ్రతుండు త్రిభువన గురుండయిన చతురానను వాక్యంబులవనత మస్తకుండై బహుమాన పూర్వకంబుగ నంగీకరించె నంత. 11**

* శ్రీహరి ఆజ్ఞానుసారం జీవుడు తపస్సు చేయడం, విద్యలు నేర్చుకోవడం, యోగాన్ని అభ్యసించడం, శౌర్యాన్ని ప్రదర్శించడం, జ్ఞానాన్ని ఆర్జించడం, ఆర్థిక వసతులను సమకూర్చుకోవడం, ధర్మం పాటించడం వంటి కర్మలు చేస్తాడు. ఈ కర్మాదులకు కర్త దేవుడు కాని జీవుడు కాడు. అలాంటప్పుడు వీటి నుండి ఎవ డయినా తప్పుకోవడంగానీ మరొకరిని తప్పించడంగానీ శక్యం కాని పని. పుట్టడానికిగానీ, చావడానికి గానీ, భయానికి గాని, సుఖానికి గానీ, దుఃఖానికి గానీ, ఈశ్వరుడు కర్తగాని జీవుడు కానే కాడు.

శ్రీహరి వాక్కులే వేదాలు. సత్త్వరజస్తమో గుణాలనే ముప్పేటల త్రాటితో కట్టబడిన వాళ్లం మన మందరం. ముకుతాడు వేసిన పశువులు యజమాని చెప్పుచేతలలో ఎలా ఉంటాయో అలాగే మన మందరమూ ఈశ్వరాజ్ఞకు లోబడి ఉంటాము. మనిషి సుఖ దుఃఖాలకు ఈశ్వరుడే కర్త. కళ్ళున్న వాడు గుడ్డివాణ్ణి ఎలా నడిపిస్తాడో అలాగే ఈశ్వరుడు మనలను నడిపిస్తాడు. ఆయనకు లోబడి, ఆయన ప్రసాదించిన సుఖదుఃఖాలను అనుభవిస్తున్నాము. కలలో చూచిన పదార్థాలను నిద్ర మేల్కొన్న తర్వాత అంతా అబద్ధమని అనుకున్నట్టు ముక్తి కోసం ప్రయత్నించే జ్ఞాని తాను పొందవలసిన సుఖదుఃఖాలను అనుభవిస్తూ ఇక రాబోయే కర్మఫలాలకు దూరంగా ఉంటాడు. అడవికి పోయిన ఇంద్రియ వ్యాపారాలను జయించలేక కామాదులకు లోనయిన వాడికి సంసార బంధాలే మిగులుతాయి. గృహస్థాశ్రమంలో ఉన్నా ఇంద్రియాలను జయించి ఆత్మజ్ఞానం కలిగిన పురుషునికి మోక్షం తప్పక సిద్ధిస్తుంది.

విరోధులను గెలవడానికి సిద్ధమయిన మేటి కోటలోనే ఉండి శత్రువులను జయించినట్టుగా మోక్షం కోరే పురుషుడు గృహస్థాశ్రమంలో ఉంటూ శ్రీమన్నారాయణుని చరణారవిందా లనే కోటను ఆశ్రయించి కామక్రోధాదు లనే అరిషడ్వర్గాన్ని జయిస్తాడు. అలాగే నీవు కూడా ఈశ్వర కల్పితాలయిన భోగాదులను అనుభవిస్తూ ముక్త సంగుడవై ముక్తి దక్కించుకోవయ్యా'' అన్నాడు. అపుడు ప్రియవ్రతుడు ముల్లోకాలకూ గురు వయిన బ్రహ్మదేవుని వాక్యాలను తలవంచి గౌరవపూర్వకంగా అంగీకరించాడు.

**ఆ. సరసిజాసనుండు స్వాయంభువుని చేత, నధికమైన పూజలంది నార**
**దుండు నా ప్రియవ్రతుండును జూడంగ(, జనియెఁ దనదు పూర్వ సదనమునకు. 12**

* చతుర్ముఖుడు స్వాయంభువ మనువు శ్రద్ధాభక్తులతో చేసి పూజలందుకున్నాడు. అనంతరం ప్రియవ్రతుడూ నారదుడూ చూస్తుండగా బ్రహ్మదేవుడు తన లోకానికి బయలుదేరాడు.

**ఆ. సత్యసంధుఁడైన స్వాయంభువుం డను, మనువు బ్రహ్మచేత మన్ననఁ దగ**
**నంది యంత నారదానుమతంబునఁ, దనదు సుతుని రాజ్యమునను నిలిపె. 13**

* బ్రహ్మ సంకల్పంతో నారదుని అనుమతితో సత్యసంధుడైన స్వాయంభువ మనువు తన కుమారుడైన ప్రియవ్రతునికి రాజ్యభారాన్ని అప్పగించాడు.

**వ. ఇట్లు స్వాయంభువ మనువు భూచక్ర పరిపాలనంబునకుఁ బ్రియవ్రతునిఁ బట్టంబు గట్టి విషమంబులగు విషయంబుల వలన విముక్తుండై వనంబునకుం జనియె; నంత. 14**

* స్వాయంభువ మనువు భూలోక పరిపాలనకోసం ప్రియవ్రతునికి పట్టాభిషేకం చేసి జంజాటాల నుండి బయటపడి తాను అరణ్యాలకు వెళ్లిపోయాడు.

**మ. ధరణీవల్లభుఁ డా ప్రియవ్రతుఁడు మోదం బందుచున్ లీల నీ**
**శ్వర వాక్యంబునఁ గర్మతంత్ర పరుఁడై సంగంబులం బాపు శ్రీ**
**హరిపాదాంబుజ చింతనం దగిలి నిత్యానందముం బొంది దు**
**ర్భర రాగాదులఁ బాఱఁదోలి ప్రజలం బాలించె నత్యున్నతిన్. 15**

* ధరణీవల్లభుడైన ప్రియవ్రతుడు భగవంతుని ఆదేశంతో కర్మ తంత్రపరుడయినా, శ్రీహరి పాదపద్మాలను స్మరిస్తూ, రాగద్వేషాదులను వదలిపెట్టి అనుదినమూ అనిర్వచనీయ మయిన ఆనందం అనుభవిస్తూ ప్రజలను చాల చక్కగా పరిపాలించాడు.

**వ. ఇట్లు ప్రియవ్రతుండు రాజ్యంబు సేయుచు విశ్వకర్మ ప్రజాపతి పుత్రిక యగు బర్హిష్మతి యనుదానిం బత్నిగాఁ బడసి, యా సతివలన శీల వృత్త గుణ రూప వీర్యౌదార్యంబులం దనకు సమానులైన యాగ్నీ ధ్రేధ్మజిహ్వ, యజ్ఞబాహు, మహావీర, హిరణ్యరేతో, ఘృతపృష్ఠ, సవన, మేధాతిథి, వీతిహోత్ర, కవులను నామంబులు గల పుత్రదశకంబును, నూర్జస్వతి యను నొక్క కన్యకను గాంచె నందుఁ గవి మహావీర సవనులు బాలకులయ్యు నూర్ధ్వ రేతస్కులై బ్రహ్మవిద్యా నిష్ణాతులై యుపశమనశీలు రగుచుం బారమహంస్య యోగం బాశ్రయించి, సర్వ జీవనికాయావాసుండును, భవభీతజన శరణ్యుండును, సర్వాంతర్యామియు భగవంతుండునగు వాసుదేవుని చరణారవిందావిరత స్మరణానుగత పరమభక్తి యోగానుభావంబున విశోధితాంతః కరణు లగుచు నీశ్వరు తాదాత్మ్యంబుఁ బొంది రంత. 16**

* ప్రియవ్రతుడు రాజ్యాన్ని పరిపాలిస్తూ విశ్వకర్మ ప్రజాపతి కుమార్తె "బర్హిష్మతి" అనే యువతిని పెళ్లాడినాడు. ఆమెవల్ల గుణశీల రూప పరాక్రమములలో తనతో సమానులైన పదిమంది కొడుకులనూ, ఒక కుమార్తెనూ కన్నాడు. వారు ఆగ్నీధ్రుడు, ఇధ్మజిహ్వుడు, యజ్ఞ బాహువు, మహావీరుడు, హిరణ్యరేతసుడు, ఘృతపృష్ఠుడు, సవనుడు, మేధాతిథి, వీతిహోత్రుడు, కవి అనేవారు. కుమార్తె పేరు ఊర్జస్వతి, వారిలో కవి, మహావీరుడు, సవనుడు అనేవారు ముగ్గురూ చిన్న వారయినా బ్రహ్మచర్యం అవలంబించి బ్రహ్మవిద్యా నిష్ణాతు లయినారు. వారు శాంతమే తమ స్వభావంగా మలచుకొని "పరమహంస యోగము" నవలంబించి సన్న్యాసాశ్రమం స్వీకరించారు. వారు సమస్త జీవులకూ ఆవాసమయినవాడూ, సంసారభయభ్రాంతులకు శరణ్యమైనవాడూ, సర్వాంతర్యామీ, భగవంతుడూ అయిన వాసుదేవుని పద్మాలవంటి పాదాలను సర్వదా సంస్మరిస్తూ అందువల్ల ప్రాప్తించిన భక్తియోగ ప్రభావంతో మనస్సు మరింత పరిశుద్ధం కాగా ఈశ్వర తాదాత్మ్యం పొందారు.

సీ. వసుధేశ! యా ప్రియవ్రతుఁ డొండు కాంతయం దధికుల మన్వంతరాధిపతుల
మఱియు నుత్తముఁడు తామసుఁడు రైవతుఁ డను సుతులను బుట్టించె సుమహితులను;
మున్ను జన్మించిన మువ్వురు పుత్రులు నవ్యయ పదవికి నరుగుటయును
నంతఁ బ్రియవ్రతుఁ డఖిల శాత్రవకోటిఁ దన బాహుబలముచేతను జయించి.

తే. యతఁడు బర్హిష్మతీ కాంతయందుఁ బ్రీతి, గలిగి యౌవన లీలా వికాస హాస
హేలనాదులఁ జిత్తంబు గీలుకొల్పి, గత వివేకుండువోలె భోగములఁ బొందె. 17

* అనంతరం ప్రియవ్రతుడు మరొక్క భార్యవల్ల ముగ్గురు కుమారులను కన్నాడు. వారే ఉత్తముడు, తామసుడు, రైవతుడు అనేవారు. వారందరూ చాలా గొప్పవారు. వారు మనువులై మన్వంతరాలకు అధిపతులయ్యారు. ముందు పుట్టిన కవి, మహావీర, సవనులు అక్షయమైన మోక్షపదాన్ని అందుకున్నారు. అనంతరం ప్రియవ్రతుడు తన బాహుబలంతో సమస్త శత్రుసమూహాన్నీ జయించాడు. బర్హిష్మతిమీద అతిశయించిన అనురాగంతో యౌవనవికాసాలైన హాసలీలావిలాసాలలో మనస్సు లగ్నంచేసి వివేకం గోల్పోయిన వానిలాగా అఖండభోగాలు అనుభవించాడు.

వ. ఇట్లు ప్రియవ్రతుం డేకాదశార్బుద పరివత్సరంబులు రాజ్యంబుసేసి యొక్కనాఁడు మేరునగ ప్రదక్షిణంబు సేయు సూర్యునకు నపరభాగంబునం బ్రవర్తించు నంధకారంబు నివర్తింపంబూని భగవదుపాసనా జనితాతిపురుష ప్రభావుండై సవితృరథసదృక్ష వేగంబు గలిగి తేజోమయంబైన రథంబు నారోహణంబు సేసి రాత్రుల నెల్ల దినంబు లొనర్తునని సప్త వారంబులు ద్వితీయ తపనుండునుం బోలె నరదంబు వఱపుటయు నా రథనేమి మార్గంబులు సప్తసముద్రంబులును నా మధ్య భూసంధులు సప్త ద్వీపంబులు నయ్యె నందు. 18

* ఈ విధంగా ప్రియవ్రతుడు పదునొకండు అర్బుద సంవత్సరాలు రాజ్యం పరిపాలించాడు. ఒకనాడు మేరు పర్వతానికి ప్రదక్షిణం చేస్తున్న సూర్యునికి ఆవలి భాగంలో కనిపించే చీకటిని రూపు మాపాలని అనుకున్నాడు. సూర్యుని రథంతో సమానమై తేజోమయమయిన రథం ఎక్కాడు. అతనికి ఆ శక్తి భగవంతుణ్ణి నిరంతరం ధ్యానించడం వల్లనే కలిగింది. రాత్రులను పగళ్లుగా మారుస్తానని ప్రియవ్రతుడు రథారూఢుడై రెండవ సూర్యునిలాగా వెలిగిపోతూ ఏడుమార్లు సూర్యుని చుట్టూ ప్రదక్షిణం చేశాడు. అప్పుడు బ్రహ్మదేవుడు వచ్చి ఆయనను వారించాడు. ప్రియవ్రతుని రథచక్రాలు గాళ్ళ పడ్డదారులు సప్త సముద్రాలు అయ్యాయి. ఆ గాళ్ళకు నడుమ నున్న భూమి సప్తద్వీపా లయ్యాయి.

సీ. సరస జంబూప్లక్ష శాల్మలిద్వీప కుశ క్రౌంచ శాక పుష్కరము లనఁగ
నలరు నా ద్వీపంబులందు జంబూద్వీప మొనరంగ లక్షయోజనము లయ్యె;
నట యుత్తరోత్త రాయత సంఖ్యఁ దా ద్విగుణిత మయి యొండొంటి కతిశయిల్లు
క్షారేక్షురస సురాజ్యక్షీర దధ్యుదకంబులు గలుగు సాగరము లేడు.

**తే. ద్వీప పరిమాణములు గల్గి విస్తరిల్లు, సంధి సంధిని బరిఖల చందమునను**
**గ్రమము దప్పక యొండొంటిఁ గలయకుండు, సకల జీవుల కెల్ల నాశ్చర్యముగను. 19**

* జంబూద్వీపం, ప్లక్షద్వీపం, శాల్మలీద్వీపం, కుశద్వీపం, క్రౌంచద్వీపం, శాకద్వీపం, పుష్కరద్వీపం అనేవి సప్తద్వీపాలు. వాటిలో జంబూద్వీపం ఒక లక్ష యోజనాల విస్తీర్ణం కలిగి ఉంటుంది. ఈలాగే ఒక దాని కొకటి రెట్టింపు వైశాల్యం కలిగి వరుసగా ఏడు ద్వీపాలూ ఉన్నాయి. వాటి నడుమ ఉప్పు సముద్రం, చెరకు సముద్రం, మద్య సముద్రం, ఘృత సముద్రం, పాల సముద్రం, పెరుగు సముద్రం, మంచినీటి సముద్రం అనే ఏడు సముద్రాలున్నాయి. ఒక ద్వీపంతో ఇంకొక ద్వీపం కలిసిపోకుండా ఉండడానికి సముద్రాలు ఏర్పడ్డాయి. అవి ద్వీపాల చుట్టూ అగడ్తల లాగా ఉన్నాయి. ఈ ద్వీప సముద్ర నిర్మాణాలు సకల జీవులకూ ఆశ్చర్యం గొలిపే అద్భుత దృశ్యాలు.

**వ. అట్టి ద్వీపంబుల యందుఁ బరిపాలనంబునకుం బ్రియవ్రతుం డాత్మభవులు నాత్మసమాన శీలురునైన యాగ్నీ ధ్రేధ్మజిహ్వ యజ్ఞబాహు హిరణ్యరేతో ఘృతపృష్ఠ మేధాతిథి వీతిహోత్రుల నొక్కొక్కని నొక్కొక ద్వీపంబునకుం బట్టంబు గట్టి యూర్జస్వతి యను కన్యకను భార్గవున కిచ్చిన నా భార్గవునకు నూర్జస్వతి యందు దేవయాని యను కన్యారత్నంబు జనించె; నట్టి బలపరాక్రమవంతుండైన ప్రియవ్రతుండు విరక్తుండై యొక్కనాఁడు నిజ గురువగు నారదుని చరణానుసేవానుపతిత రాజ్యాది ప్రపంచ సంసర్గంబుఁ దలంచి యిట్లనియె. 20**

* ప్రియవ్రతుడు తనంతటి వారైన తన కుమారులను - ఆగ్నీధ్రుడు, ఇధ్మజిహ్వుడు, యజ్ఞబాహువు, హిరణ్యరేతసుడు, ఘృతపృష్ఠుడు, మేధాతిథి, వీతిహోత్రుడు అనేవారిని ఒక్కొక్క ద్వీపానికి ఒక్కొక్కరిని పట్టం కట్టించాడు. "ఊర్జస్వతి" అనే కన్యను భార్గవుని కిచ్చి పెళ్లి చేశాడు. ఆ దంపతులకు "దేవయాని" అనే కన్యారత్నం పుట్టింది. ఆ తరువాత మహా పరాక్రమవంతుడయిన ప్రియవ్రతుడు విరక్తు డయ్యాడు. ఒకనాడు నారదుని పాదసేవవల్ల ప్రాప్తించిన రాజ్యసంపదలనూ, సంసార బంధాలనూ తలచుకొని ఈలా విచారించాడు.

**సీ. అక్కట! యే నింద్రియములచేఁ గట్టంగఁ బడియుండి యందులఁ బాయలేక**
**యజ్ఞాన విరచితం బగు సర్వవిషయములను నంధకూపంబులందు నడఁగి**
**తరుణుల కే వినోదమృగంబనై యుండి యవి యెల్ల నే నొల్ల ననుచు రోసి**
**హరికృపచే నప్పు డబ్బిన యాత్మ విద్యను గల్గి తనవెంట నరుగుదెంచు**

**తే. కొడుకులకు నెల్ల రాజ్యము గుదురుపఱిచి, తనదు పత్నుల దిగనాడి ధనము విడిచి**
**హరివిహారంబు చిత్తంబునందు నిలిపి, పరఁగ నల్లన నారదపదవి కరిగె. 21**

* "అయ్యో! నేను పంచేంద్రియాలకు బందీనై ఆ బంధనాల నుండి తప్పించుకోలేక అజ్ఞానంతో నిండిన విషయసుఖాలనే చీకటినూతిలో పడిపోయాను. విలాసవతులగు సతులకు వినోదమృగంలా

అయినాను. ఇక ఇటువంటి సుఖాలకు నే నే మాత్రం ఇష్టపడను" అని నిశ్చయించుకున్నాడు. శ్రీహరి అనుగ్రహంవల్ల అబ్బిన ఆత్మవిద్యను అందుకున్నాడు. తన వెంట వచ్చిన కుమారులందరినీ రాజ్యంలో కుదురుగా పదిలపరిచాడు. భార్యలను పరిత్యజించాడు. ధనాన్ని వదులుకున్నాడు. చిత్తంలో శ్రీహరిని నిలుపుకున్నాడు. నారదుని అడుగుజాడలలో బయలుదేరాడు.

**వ. ఇట్లు దన రథమార్గంబులు సప్తద్వీపసాగరంబులుగాఁ జేసి సూర్యునకుఁ బ్రతిసూర్యుండై సరిద్గిరివనాదులచే భూత నిర్వృతి కొఱకుఁ బ్రతిద్వీపంబునకు నవధులు గల్పించి ద్వీపవర్ష నిర్ణయంబులం బుట్టించి పాతాళ భూ స్వర్గాది సుఖంబులు నరకసమానంబులుగాఁ దలంచి విరక్తిం బొంది నిరంతర భగవద్ధ్యాన విమలీకృతాశయుం డగుచు హరిభక్తి ప్రియుండయిన ప్రియవ్రతు చరిత్రంబు లీశ్వరునకుఁ దక్క నన్యుల కెఱుంగఁ దరంబుగా; దతని మహిమంబులు నేఁడునుం గొనియాడుదురని శుకుండు మఱియు నిట్లనియె. 22**

* ఈ విధంగా ప్రియవ్రతుడు తన రథమార్గాలతో ఏడు ద్వీపాలనూ, ఏడు సముద్రాలను ఏర్పరచాడు. సూర్యునికి ప్రతిసూర్యుడుగా ప్రకాశించాడు. నదులను, కొండలను, వనములను సరిహద్దులుగా నిర్ణయించి, జీవరాసులకు తృప్తి కలిగించాడు. ద్వీపాలలో దేశవిభాగం కల్పించాడు. భూలోక, స్వర్గలోక, నాగలోక సుఖాలను నరక సమానంగా భావించాడు. విరక్తి పొందాడు. నిరంతరం భగవంతుని ధ్యానించడంతో, నిర్మల మయిన ఆశయాలు కలిగిన వా డయ్యాడు. అలాంటి హరి భక్తి పరాయణు డయిన ప్రియవ్రతుని పవిత్ర చరిత్రలోని ఆధిక్యం తెలుసుకోవడం ఈశ్వరునికి తప్ప మరెవ్వరికీ శక్యం కాదు. ఆ ప్రియవ్రతుని మహిమలను జనులు నేటికీ కొనియాడుతున్నారు అని చెప్పి శుక మహర్షి ఇంకా అన్నాడు.

**క. హరిసేవనాప్రియవ్రతుఁ, డరయఁగఁ గైవల్యపదవి నందుట యరుదే?**
**ధరఁ జండాలుం డైనను, హరి నామస్మరణఁ జెందు నవ్యయపదమున్. 23**

* ప్రియవ్రతుడు హరిసేవా ప్రభావంవల్ల ముక్తి పదవిని అందుకొన్నాడంటే అందులో ఆశ్చర్యం ఏముంది? చండాలు డయినా సరే హరి చరణ స్మరణం వల్ల అక్షరమైన మోక్షపదవిని చేరుకోగలడు.

**వ. అని పలికి శుకుండు మఱియు నిట్లనియె. 24**

* అని చెప్పి శుకుడు మరలా ఈలా అన్నాడు.

**మ. జనకుం డిట్లు విరక్తుఁ డైనను దదాజ్ఞం జేసి యాగ్నీధ్రుఁ డే**
**పున ధర్మ ప్రతిపాలనుం డగుచు జంబూద్వీపము న్నేలుచుం**
**దన సత్పుత్రులమాడ్కి నెల్ల ప్రజలం దాత్పర్య చిత్తంబునన్**
**ఘనతం బ్రోచె ననేకకాల మిలఁ బ్రఖ్యాతంబుగా భూవరా! 25**

* రాజా! ఆ తరువాత వృత్తాంతం విను. తండ్రి అయిన ప్రియవ్రతుడు విరక్తుడు కాగా అతని ఆజ్ఞప్రకారం అతని కుమారుడు ఆగ్నీధ్రుడు జంబూద్వీపాన్ని ధర్మమార్గంలో పరిపాలించాడు. అతడు ప్రజలందరినీ కన్న కొడుకుల లాగా లాలిస్తూ చాలా కాలం రాజ్యం చేశాడు. ప్రఖ్యాతి గడించాడు.

వ. ఇట్లాగ్నీధ్రుండు రాజ్యంబు సేయుచు నొక్కనాఁడు పుత్త్రకాముండై మందరాద్రి సమీపంబున నఖిలోపచారంబుల నేకాగ్రచిత్తుండై యర్చించినం గమలసంభవుండు సంతసిల్లి తన సమ్ముఖంబున సంగీతంబు సేయు పూర్వచిత్తియను నప్సరోంగనం బంపుటయు, నా యప్సరోంగన చనుదెంచి రమణీయ వివిధ నిబిడ విటపి విటప సమాశ్లిష్ట సమీప సువర్ణ లతికారూఢస్థల విహంగమ మిథునోచ్చార్యమాణ షడ్జాది స్వరంబులచే బోధ్యమాన సలిల కుక్కుట కారండవ బక కలహంసాది విచిత్ర కూజిత సంకులంబు లయిన నిర్మలోదక కమలాకరంబులు గల తదాశ్రమోపవనంబు నందు విహరించుచు విలాస విభ్రమ గతి విశేషంబులం జలనంబు నొందు స్వర్ణ చరణాభరణస్వనం బ న్నరదేవ కుమారుం డాలించి యోగసమాధింజేసి ముకుళిత నేత్రుండై యుండి యల్లన కనువిచ్చి చూచి తన సమీపంబున మధుకరాంగనయుంబోలెఁ బుష్పాఘ్రాణంబు సేయుచు దేవమానవుల మనోనయనంబుల కాహ్లాదంబు బుట్టించుచున్న గతి విహార వినయావలోకన సుస్వరావయవంబుల మన్మథ శరపరంపరల నొందించుచు ముఖకమల విగళితామృత సమానహాస భాషణామోద మదాంధంబు లయిన మధుకర మిథునంబుల వంచించి, శీఘ్ర గమనంబునం జలించు కుచకచమేఖలలు గల దేవిం గనుంగొని చిత్తచలనంబు నొంది మన్మథపరవశుండై జడుని చందంబున నిట్లనియె. 26

* ఈ విధంగా ఆగ్నీధ్రుడు జంబూద్వీపాన్ని పరిపాలిస్తూ ఒకనాడు సంతానంకోసం మందర పర్వత సమీపానికి వెళ్లి అక్కడ అచంచలమైన మనస్సుతో అఖిలోపచారాలతో బ్రహ్మదేవుణ్ణి ఆరాధించాడు. ఆగ్నీధ్రుని భక్తి ప్రపత్తులకు బ్రహ్మదేవుడు పరమానందభరితుడై సత్యలోకంలో సమక్షంలో సంగీతం ఆలపించే "పూర్వచిత్తి"అనే అప్సరసను ఆయన దగ్గరకు పంపాడు. ఆ అమరకాంత ఆగ్నీధ్రుడు ఉన్న ఆశ్రమ వాటికకు వచ్చింది.

అక్కడ రకరకాల రంగురంగుల పూలతీగెలు దట్టమైన చెట్లకొమ్మలను గట్టిగా పెనవేసుకున్నాయి. ఆ తీగలమీద ఊగే నెమళ్లు మొదలైన పక్షుల జంటలు షడ్జాది స్వరాలతో సందడి చేస్తున్నాయి. ఆ ధ్వనులకు మేల్కొన్న నీటికోళ్ళూ, బాతులూ, కొంగలూ కలకల ధ్వనులు చేస్తున్నాయి. అటువంటి విహంగాలతో నిర్మల జలాలతోనూ, నిండిన సరస్సులు కన్నులవిందు చేస్తున్నాయి.

ఆశ్రమవాటికను ఆనుకొని ఉన్న ఉపవనంలో ఆ అప్సరస విహరించడం మొదలు పెట్టింది. వంపుసొంపులతో ఒయ్యారంగా నడిచే ఆ సురసుందరి నడకలకు తగినట్టుగా కదులుతున్న ఆమె బంగారు అందియల రవళిని ఆగ్నీధ్రుడు ఆలకించాడు. యోగసమాధిలో కన్నులు మోడ్చి ఉన్న అతడు మెల్లగా కన్నులు విప్పి ఆ వన్నెలాడిని చూశాడు. ఆ సమయంలో ఆడు తుమ్మెద వలె "పూర్వచిత్తి" పూలసౌరభాన్ని ఆఘ్రాణిస్తున్నది. ఆమె అందచందాలు దేవతలకూ మానవులకూ కనులవిందులై మనస్సులను పరవశింప చేస్తున్నాయి. పూర్వచిత్తి ఒయ్యారపు నడకలూ, విభ్రమ విహారాలు, వాలుచూపులూ, కంఠమాధుర్యమూ, అంగసౌష్ఠవమూ మన్మథుని శరపరంపరలను కురిపించుతున్నాయి. ఆమె ముఖపద్మం నుండి మకరందం

వంటి మందహాసం చిందుతున్నది. ఆమె పలుకులు పరిమళాలు విరజిమ్ముతున్నాయి. ఆ సుగంధాలకు ముసురుకొని మై మరచిన తుమ్మెద జంటలను తప్పించుకొని ఆ సురసుందరి చరచరా నడుస్తుంటే ఆ గమన వేగానికి ఆమె చనుగవ, జుట్టుముడి, మొలనూలు చలిస్తున్నాయి. అటువంటి పూర్వచిత్తిని చూచి ఆగ్నీధ్రుడు కామపరవశుడై చలించిన చిత్తంతో మూర్ఛనిలాగా ఆవిడతో ఈ విధంగా సంభాషణ మొదలు పెట్టాడు.

**క. సతి! నీ వెవ్వతె వీ ప, ర్వతమున కేమేనిఁ గోరివచ్చిన వన దే**
**వతవో, శారదవో రతి, పతి పంచిన మాయవో, తపస్సారమవో!** 27

* నెచ్చెలీ? ఎవరు నీవు? ఈ కొండ దగ్గరకు ఏ పనిమీద వచ్చావు? నీవు వనదేవతవా! సరస్వతీ దేవివా? లేకపోతే మన్మథుడు పంపిన మాయామూర్తివా? కాకపోతే ఫలించిన నా తపస్సంపదవా?

**ఉ. అంగజుఁ డెక్కుడించిన శరాసనమున్ ధరియించి యంత నా**
**యంగజు వేఁట మానవమృగావళిఁ జూచుచు నున్న దానవో!**
**రంగగు నీ నిజాకృతి తెఱం గెఱుఁగంగ నిజంబు వల్కుమా**
**యంగన నిన్నుఁ గన్గొనిన యంత ననంగుఁడు సందడించెడున్.** 28

* ఓ మగువా! మదనుడు ఎక్కుపెట్టి దించిన విల్లును చేతపట్టుకుని మన్మథుని వెంబడి ఈ అడవిలోని క్రొత్త మృగాలను (మానవ మృగాలను) వేటాడుతున్నావా? నీ అసలు స్వరూపం నాకు స్పష్టంగా తెలిసే లాగా చెప్పు. నిన్ను చూస్తుంటే మదనుడు నాలో కోలాహలం చేస్తున్నాడు.

**క. పొలుపగుచున్న విలాసం, బుల నంగజు బాణములను బోలెడి నీచం**
**చల సత్కటాక్షవీక్షణ, ముల నెవ్వని నింతి చిత్తమునఁ గలఁచెదవే!** 29

* ఓ కోమలాంగీ! నీ కులుకులతో, తళుకు బెళుకులతో మన్మథుని వాడితూపులవంటి కడగంటి చూపులతో ఎవరి మనసును చీకాకు పరుస్తున్నావు?

**చ. చెదరఁగ వేదముల్ సదువు శిష్యులపైఁ దగఁ బుష్పవృష్టి స**
**మ్మదమున నంతలోఁ గురియు మాడ్కిని మన్మథసామగానముల్**
**సదివెడు శిష్యులో యనఁగ షట్పదపంక్తులు సేరి మ్రోయఁగాఁ**
**బదపడి మీఁద రాలు గచభారము నందుల జాఱు క్రొవ్విరుల్.** 30

* మన్మథ సామగానాలు ఆలపించే శిష్యులేమో అన్నట్టు తుమ్మెదల గుంపులు నీకు వంత పాడుతున్నాయి. వేదాలు చదివే శిష్యులపయిన విరులవాన కురిసే విధంగా ఆ తుమ్మెదల మీద నీ వాలుజడ నుండి పూలు జలజల రాలుతున్నాయి.

**క. అందియల వెలయు రత్నము, లందంబుగ లలిత పదములన్ సుభగములై**
**యందంద మ్రోయుచును నా, డెందంబునఁ దగిలి సందడించెడిఁ దరుణి! 31**

* ఓ తరుణి! నీవు వడివడిగా అడుగులు పెడుతూ నడుస్తుంటే నీ కాలి అందియలు కంగుకంగున మ్రోగుతున్నాయి. దుందుభులవంటి ఆ అందెల సవ్వడులు నా మనస్సును తాకి ప్రతిధ్వనిస్తూ సందడి చేస్తున్నాయి.

**క. పాయక కదంబ పుష్ప, చ్ఛాయం గల వస్త్రకాంతి సల్లెడుఁ గంటే**
**యా యెడ నితంబరోచులు, గాయుచు నెడతెగక తటిమి కప్పెడుఁ దన్వీ! 32**

* ఓ తన్వీ! కడిమి పువ్వుల కాంతులను పుణికి పుచ్చుకునే నీ చీర నిగనిగలు ఎడతెగకుండా బయటకు ప్రసరించే నీ కటి కాంతులను కప్పివేస్తున్నవి కదా!

**క. నిరతము నీ తనుమధ్యముఁ, గర మరుదుగ నరసి చూడఁ గానంబడ, దీ**
**కరికుంభంబులఁ బోలెడి, గురుకుచముల నెట్లు నిలుపు కొంటి లతాంగీ! 33**

* ఓ లతాంగీ! చూద్దామన్నా నీ నడుము కనబడదు? అలాంటప్పుడు ఏనుగు కుంభస్థలం లాంటి స్తనద్వయాన్ని ఏలా మోస్తున్నావు?

**క. పొంకములగు కుచములపైఁ, గుంకుమ పంకంబుఁ బూసికొని వాసనలం**
**గొంకక వెదచల్లెడు నీ, బింకం బగు చన్నుదోయి పెంపో సొంపో. 34**

* పువ్వుబోణీ! పొంకమయిన నీ స్తనాలమీద కుంకుమ సుగంధం పూసుకున్నావు. పరిమళాలు వెదచల్లే బింకమయిన నీ చందోయి పెంపునూ, సొంపునూ, వర్ణించడం నాకు చేతనవుతుందా?

**శా. ఏ లోకంబున నుండి వచ్చితివి? నీ విచ్ఛోటికిన్ మున్ను నే**
**నే లోకంబునఁ జెప్పఁ జూప నెఱుఁగన్ నీ సుందరాకారమున్**
**నీ లాలిత్యము లీ వినోదములు నీ కిట్లొప్పునే? కామినీ?**
**భూలోకంబున కెట్టు వచ్చితివి నా పుణ్యం బగణ్యంబుగన్? 35**

* కామినీ! ఏ లోకం నుండి ఇక్కడికి వచ్చావు? నీలాంటి అందగత్తెను గురించి ఎక్కడా చెప్పుకోవడం నేను వినలేదు. లోకంలో ఎవరూ నీలాంటి సుందరిని చూచినట్టూ చెప్పలేదు. అందమైన నీ ఆకారమూ, నీ లావణ్యమూ, నీ లీలావిలాసమూ, ఎంత గొప్పగా ఉన్నాయో! నేను చేసుకున్న అంతులేని పుణ్యం ఫలించినట్లు ఈ భూలోకానికి ఎలా దిగి వచ్చావు?

**క. హాసావలోకనంబుల, భాసిల్లెడు నీ ముఖంబు పలుమఱు నిపు డే**
**యాసలు పుట్టింపఁగ నే, నాసగొనెద నిన్నుఁ జూచి యంబుజనేత్రా. 36**

* కమల దళాలవంటి కన్నులు కలదానా! చిరునవ్వులతో వాల్చూపులతో శోభించే నీ సుందరవదనాన్ని చూస్తున్న కొద్దీ నాలో ఎన్నో కోరికలు చివురించుతున్నాయి. నీ కోసం నేను ఆశపడుతున్నాను.

ఆ. కందులేని యిందుకళ మించి నెమ్మోము, కాంతి యుక్త మగుచుఁ గానుపించెఁ
గాన విష్ణుకలయుఁ గాఁబోలు నని నా మ, నంబునందుఁ దోఁచె నళినవేత్ర! 37

* నళిన నయనా! మచ్చలేని చంద్రకళ చందాన నీ ముద్దుల మొగం వెలుగులు వెదజల్లుతున్నది. ఆహా! అందుకనే కాబోలు, అది నిజంగా "విష్ణుకళ" అని మనస్సులో భావిస్తున్నాను.

మ. పటుతాటంక రథాంగ యుగ్మమునకుం బల్మాఱు భీతిల్లుచున్
నటనం బందెడు గండుమీనములతో నాసన్న నీలాలకో
త్కట భృంగావళితో ద్విజావళి లసత్కాంతిన్ విడంబించు మా
ఱట కాసారముఁ బోలి నెమ్మొగము దా రంజిల్లు నత్యున్నతిన్. 38

* ఓ ముద్దుగుమ్మా! నీ చెవుల దుద్దులు రెండూ చక్రవాకాలయితే, నీ కన్నులు వాటిని చూసి భయపడుతున్న చేపల్లాగ కదలుతుంటే నీ నల్లని ముంగురులు క్రమ్ముకొన్న తుమ్మెదల గుంపులయితే, ద్విజపంక్తులతో తేజరిల్లుతున్న నీ ముద్దుముఖం చక్కని సరోవరం లా ఉన్నదనడం చాల సముచితంగా ఉంటుంది.

చ. కరువలిఁ బాయువస్త్రమును గట్ట నెఱుంగవు, చూడ్కి దిక్కులం
బఱపుచుఁ జంచరీకముల భాతిఁ జెలంగెడు కంధరంబునం
బొరలెడు ముక్తకేశభరముం దుఱుమంగఁ దలంప, విప్పు డి
ట్లరుదుగ రత్నకందుక విహారము సల్పెదు సంభ్రమంబునన్. 39

* ఓ యువతీ! నవరత్నాల బంతితో ఆడుకొనే సంబరంలో నీవు కట్టుకున్న చీర గాలికి తొలగినా నీవు పట్టించుకోవడం లేదు. దిక్కులు పరికిస్తూ తుమ్మెదలవంటి శిరోజాలు ముడి విడిపోయి మెడపై పడుతున్నా నీవు సవరించుకోవడం లేదు. ఎంత మైమరపో!

వ. మఱియు నిట్లనుఁ దపోధనులగు వారల తపంబులను నీ రూపంబున నపహ్నవించిన దాన, వీ చక్కఁదనం బేమి తపంబున సంపాదించితివి? నా తోడం గూడి తపంబు సేయుము; సంసారంబు వృద్ధిఁ బొందం జేయుము; పద్మాసనుండు నాకుం బ్రత్యక్షంబై నిన్ను నిచ్చిన వాఁడు; గావున నిన్ను విడువంజాలను; నీ సఖీజనంబులు నా వాక్యంబులకు ననుకూలింతురు గాక! నీవు చను చోటికి నన్నుం దోడ్కొని చనుమని స్త్రీలకు ననుకూలంబుగాఁ బలుక నేర్చిన యాగ్నీధ్రుండు పెక్కు భంగులం బలికిన నా పూర్వచిత్తియు నతని యనునయ వాక్యంబులకు సమ్మతించి వీర శ్రేష్ఠుండగు నా రాజవర్యుని బుద్ధిరూపశీలౌదార్య విద్యావయశ్శ్రీలచేఁ బరాధీనచిత్త యగుచు జంబూద్వీపాధిపతి యగు నా రాజశ్రేష్ఠునితోడం గూడి శతసహస్ర సంవత్సరంబులు భూస్వర్గభోగంబు లనుభవించె; నంత నాగ్నీధ్రుం డా పూర్వచిత్తివలన నాభి కింపురుష హరివర్షేలావృత రమ్యక హిరణ్మయ కురు భద్రాశ్వ కేతుమాల సంజ్ఞలు గల కుమారులఁ బ్రతిసంవత్సరంబు నొక్కొక్కనిగఁ దొమ్మండ్రంగాంచె;

**నంత నా పూర్వచిత్తి యా యర్భకుల గృహంబున విడిచి యాగ్నీధ్రుం బాసి బ్రహ్మలోకంబునకుం జనిన నా యాగ్నీధ్రపుత్రులు మాతృసామర్థ్యంబునం జేసి స్వభావంబునన శరీరబలయుక్తు లగుచుఁ దండ్రిచేత ననుజ్ఞాతులై తమ నామంబులఁ బ్రసిద్ధంబు లయిన జంబూద్వీపాది వర్షంబులం బాలించు చుండి; రంత నాగ్నీధ్రుండు నా పూర్వచిత్తి వలనం గామోపభోగంబులం దృప్తి బొందక పూర్వచిత్తిం దలంచుచు వేదోక్తంబులగు కర్మంబులం జేసి తత్సలోకంబగు బ్రహ్మలోకంబునకుం జనియె; నిట్లు దండ్రి పరలోకంబునకుం జనిన నాభిప్రముఖులగు నాగ్నీధ్రకుమారులు దొమ్మండ్రును మేరుదేవియుఁ బ్రతిరూపయు, నుగ్రదంష్ట్రయు, లతయు, రమ్యయు, శ్యామయు, నారియు, భద్రయు, దేవవతియు నను నామంబులు గల మేరు పుత్రికలగు తొమ్మండ్రు కన్యకలను వివాహంబై రంత.40**

* ఆగ్నీధ్రుడు ఆ అప్సరసతో ఇంకా ఇలా అన్నాడు. "తలోదరీ! తపస్సు చేస్తున్న తపోధనుల తపస్సునంతా నీవు నీ అందచందాలతో కప్పిపుచ్చుతున్నట్టుంది. ఈ చక్కదనమంతా ఏ తపస్సు వల్ల దక్కించుకున్నావు? నాతోపాటు నీవుకూడా తపస్సు సాగించు. నా సంసారాన్ని పెంచు. బ్రహ్మదేవుడు ప్రత్యక్షమై నిన్ను నాకు ప్రసాదించాడు. అందుచేత నిన్ను వదలిపెట్టను. నీ చెలికత్తెలు నేను చెప్పే మాటలకు తప్పక అంగీకరిస్తారు. నీవు వెళ్లే చోటికి నన్ను కూడా పిలుచుకొనిపో!" అంటూ స్త్రీల మనస్తత్త్వానికి అనుగుణంగా పలుకనేర్చిన ఆగ్నీధ్రుడు పరిపరివిధాల తన భావాన్ని ప్రకటించాడు. పూర్వచిత్తి కూడా అతని అనునయ వాక్యాలకు సమ్మతించింది. వీరశ్రేష్ఠుడైన ఆ రాజేంద్రుని బుద్ధికీ, రూపానికీ, శీలానికీ, ఔదార్యానికీ, విద్యకూ, వయస్సుకూ, సంపదకూ లొంగిపోయింది. జంబూద్వీపాధిపతియైన ఆ ఆగ్నీధ్రునితో గూడి నూరువేల సంవత్సరాలు భూలోకంలో స్వర్గసౌఖ్యాలు అనుభవించింది.

ఆగ్నీధ్రుడు పూర్వచిత్తివల్ల వరుసగా నాభి, కింపురుషుడు, హరివర్షుడు, ఇలావృతుడు, రమ్యకుడు, హిరణ్మయుడు, కురువు, భద్రాశ్వుడు, కేతుమాలుడు అనే నామాలుగల తొమ్మండుగురు కొడుకులను కన్నాడు. ఆ తరువాత పూర్వచిత్తి పిల్లలను ఇంట్లో వదలిపెట్టి ఆగ్నీధ్రుణ్ణి విడిచి బ్రహ్మలోకానికి వెళ్లిపోయింది. ఆగ్నీధ్రుని కుమారులు తల్లి సామర్థ్యం వల్ల స్వభావసిద్ధంగానే గొప్ప బలిష్ఠులయ్యారు. తండ్రి అనుమతితో జంబూద్వీపాన్ని వర్షాలుగా విభజించుకొని పరిపాలించారు. వారు పరిపాలించిన ప్రదేశాలు వారివారి నామాలతో ప్రసిద్ధ మయినాయి.

పూర్వచిత్తితో ఆగ్నీధ్రుడు ఎంతోకాలం కామోపభోగాలు అనుభవించినా అతనికి తృప్తి కలగలేదు. ఆ తరువాత ఆగ్నీధ్రుడు భార్యను తలచుకొంటూ వేదోక్తకర్మలు ఆచరిస్తూ చివరకు భార్య ఉన్న లోకానికి చేరుకున్నాడు. ఈ విధంగా తండ్రి పరలోకగతుడు గాగా నాభి మొదలైన ఆగ్నీధ్రుని కుమారులు మేరు కుమార్తె లయిన మేరుదేవి, ప్రతిరూప, ఉగ్రదంష్ట్ర, లత, రమ్య, శ్యామ, నారి, భద్ర, దేవి అనువారిని వరుసగా వివాహమాడారు.

## -: భగవంతుండగు నారాయణుండు ఋషభావతార మెత్తుట :-

ఆ. నరవరేణ్యుఁడైన నాభి సంతానార్థ, మంగనయును దాను యజ్ఞ పురుషుఁ
డయిన వాసుదేవు నతులభక్తి శ్రద్ధ, లను జెలంగి పూజ లొనరఁజేసి. 41

* నరవరేణ్యుడైన నాభి భార్య మేరుదేవి. నాభి సంతానార్థం భార్యాసమేతంగా శ్రద్ధాభక్తులతో యజ్ఞపురుషుడయిన వాసుదేవుణ్ణి పూజించాడు.

వ. మఱియుం బ్రవర్గ్యసంజ్ఞికంబు లగు ధర్మంబులు శ్రద్ధా విశుద్ధ ద్రవ్యదేశకాల మంత్రర్త్విగ్దక్షిణా విధాన యోగంబులం బరమేశ్వరుని మెప్పించిన, నెవ్వరికిం బ్రసన్నుండు గాని పుండరీకాక్షుండు భక్తవత్సలుండై సురుచిరావయవంబులతో యజనశీలం బయిన యాతని హృదయంబునందుఁ బాయని రూపంబు గలిగి మనోనయనానంద కరావయవంబులు గల తన స్వరూపం బాతనికిఁ జూపం దలంచి. 42

* నాభి ప్రవర్గ్యమనే ధర్మక్రతువును శ్రద్ధతో, పరిశుద్ధమయిన ద్రవ్యాలతో, ఉచిత ప్రదేశంలో దేశకాలానుగుణంగా, విధివిహితంగా మంత్రవేత్తలయిన ఋత్విక్కులతో భూరిదక్షిణలతో ఆరంభించాడు. ప్రకాశవంతమయిన అవయవ సౌష్ఠవంతో నాభి హృదయంలో తాను సదా నెలకొని ఉన్నప్పటికినీ భక్తవత్సలు డయిన పుండరీకాక్షుడు ప్రత్యక్షరూపంలో కనులకు పండువుగా మనసుకు నిండుగా తన స్వరూపాన్ని అతనికి చూపా లనుకున్నాడు.

సీ. అంత నావిష్కృత కాంత చతుర్భుజంబులును బీతాంబరంబును వెలుంగ
శ్రీవత్సకౌస్తుభ శ్రీరమా చిహ్నంబు లురమందు రమ్యమై యురవు పడఁగ
శంఖ చక్రగదాంబుజాత ఖడ్గాది దివ్యాయుధంబులు సేతులందు మెఱయ
నతులిత నవ రత్నహాట కాంకిత నూత్న ఘనకిరీటద్యుతుల్ గడలుకొనఁగఁ

తే. గర్ణ కుండల కటి సూత్ర కనకరత్న, హారకేయూర వర నూపురాది భూష
ణముల భూషితుఁడైన శ్రీనాయకుండు, దంపతుల కప్పు డెదురఁ బ్రత్యక్షమయ్యె. 43

* ప్రకాశమానములైన చతుర్భుజాలతో, పట్టుపీతాంబరంతో, రమణీయమయిన శ్రీవత్సం, కౌస్తుభమణి, శ్రీదేవి విరాజిల్లే వక్షఃస్థలంతో; శంఖం, చక్రం, గద, పద్మం, ఖడ్గం మొదలయిన దివ్యాయుధాలతో; సాటిలేని నవరత్నాల కాంతుల వెదజల్లే బంగారు కిరీటంతో; మకర కుండలాలూ, మొలనూలూ, మణులు చెక్కిన స్వర్ణహారాలూ; బాహుపురులూ, కాలి అందెలూ ప్రకాశింపగా లక్ష్మీరమణుడు ఆ దంపతుల ముందు ప్రత్యక్షమైనాడు.

తే. ఇట్లు ప్రత్యక్ష మగు పరమేశ్వరునకుఁ, బెన్నిధానంబుఁ గనుఁగొన్న పేద మాడ్కి
హర్షమున ఋత్విగాదికు లవనతాస్యు,లగుచు నభినుతి సేసి రిట్లనుచు నపుడు. 44

* ఈ విధంగా ప్రత్యక్షమయిన భగవంతుణ్ణి ఋత్విక్కులూ చూచారు. పెన్నిధిని దర్శించిన పేదలలాగ సంతోషంతో వారందరూ తలలు వంచి ఈ విధంగా స్తోత్రాలు చేశారు.

**క. పరిపూర్ణుఁ డవై యుండియు, మఱవక మా పూజ లెల్ల మన్నింతువు; నీ**
**చరణార వింద సేవయు, ధరఁ బెద్దలు వినిచినటులు దగఁ జేసెదమో. 45**

* "స్వామీ! నీవు పరిపూర్ణుడవు. అయినా మమ్మల్ని మరచిపోకుండా మా పూజలను స్వీకరిస్తున్నావు. పెద్దలు మాకు చెప్పినట్టు నీ చరణారవిందములను సేవిస్తాము.

**క. ఏ మిపుడు సేయు సంస్తుతి, నీ మహిమ నెఱింగి కాదు; నిరతముఁ బెద్దల్**
**దా మెది యుపదేశించిరొ, యా మతమునఁ బ్రస్తుతింతు మయ్య మహాత్మా! 46**

* మహాత్మా! మేము నీ మహిమలు తెలిసి సంస్తుతి చేయడం లేదు. పెద్దలు మాకు ఏ విధంగా ఉపదేశించారో ఆ విధంగా ప్రస్తుతి చేస్తున్నాము.

**వ. మఱియు నీవు సంసారాసక్త మతి గలిగిన వారికి వశ్యుండవుగా; నీశ్వరుండవును బ్రకృతి పురుష వ్యతిరిక్తుండవును బరమ పురుషుండవును నయిన నిన్నుఁ బొందని ప్రపంచాంతర్గతంబు లయిన నామరూపంబులు గల యస్మదాదులచేత నిరూపింప నశక్యం బగుఁ; సర్వజీవులం జెందిన దురిత సంఘంబుల నిరసించు స్వభావంబు గల నీ యుత్తమ గుణంబులయందు నేకదేశంబ గాని సర్వగుణ నిరూపణంబు సేయ శక్యంబు గా నేరదు; నీ భక్తులు మిక్కిలి భక్తింజేసి సంస్తుతించు గద్గదాక్షరంబులను సలిల శుద్ధ పల్లవ తులసీదళ దూర్వాంకురంబులను సంపాదించిన పూజచే సంతసిల్లెడి నీకు బహువిధ ద్రవ్య సంపాదనంబు గలిగి విభవ యుక్తంబు లయిన యశ్వమేధాదులును దృప్తికరంబులు గా నేరవు; స్వభావంబున సర్వకాలంబులందును సాక్షాత్కరించి యతిశయంబై వర్తించుచు నశేషపురుషార్థ స్వరూపంబు బరమానంద రూపంబు నైనవాఁడ వగుటం జేసి యజ్ఞాదుల యందు నీకుఁ దృష్టి లేకయున్న నస్మదాదుల కోరికల నాపాదించు కొఱకు యజ్ఞాదుల నొనరింతు మని మఱియు నిట్లనిరి. 47**

* సంసారంలో మునిగి తేలేవారికి నీవు పట్టువడవు. నీవు ఈశ్వరుడవు. ప్రకృతికన్నా జీవునికన్నా భిన్నమయినవాడవు. పరమ పురుషుడవు. అయితే మేము పంచభూతాల సృష్టికి లోనయిన నామరూపాలు ధరించిన వాళ్లం. అటువంటి మాకు నీ తత్త్వాన్ని నిరూపించడం సాధ్యం కాదు. సకలజీవరాసుల పాపసమూహాలను తొలగించడం నీ స్వభావం. అటువంటి నీ ఉత్తమ గుణాలలో ఏదో ఒక అంశమే గాని సమస్త గుణాలను నిరూపించడం ఎవరికీ ఏ మాత్రం శక్యం కాదు. నీ భక్తులు భక్తితో డగ్గుత్తికతో సంస్తుతిస్తూ, నీ కర్పించే నిర్మల జలం, చిగురుటాకులు, తులసీ దళాలు, దూర్వాంకురాలు మొదలైన వాటితో నీవు సంతృప్తి పడతావు. అంతేకాని నానావిధ ద్రవ్యాలు సంతరించుకొని మహావైభవంతో చేసే అశ్వమేధాది యాగాలుకూడా నీకు సంతృప్తి కలిగించవు. స్వాభావికంగానే నీవు సర్వకాలాలలోనూ సాక్షాత్కరిస్తావు. నీవు సర్వాతిశాయివి. సమస్త పురుషార్థాలు నీవే. పరమానంద స్వరూపుడవైన నీకు యజ్ఞయాగాదుల వల్ల తృప్తిలేకున్నా మా కోరికలను తీర్చుకోవడం కోసం మేము యజ్ఞాలు చేస్తున్నాము.

**క. బాలిశుల మగుచు మిక్కిలి, మే లెఱుఁగని మమ్ము నీదు మించిన దయచేఁ**
**బాలించి యిత్తు వెప్పుడుఁ, జాలఁగ నిహపరములందు సకల సుఖంబుల్. 48**

* దయానిధీ! మేము మూర్ఖులం. మా కేది మంచిదో ఏది కాదో మాకే తెలియదు. అయినా ఎంతో దయతో మమ్మల్ని కాపాడి ఇహపరాలకు తగిన సకల సుఖాలను నీవు మాకు ప్రసాదిస్తున్నావు.

**ఆ. ఇపుడు మేము నీకు నిష్టంబు లగు పూజ, లాచరింపకున్న నైన నధిక**
**మయిన నీ కృపాకటాక్ష వీక్షణములఁ, జక్కఁ జూచి తగఁ బ్రసన్నుఁ డగుచు. 49**

* ఇపుడు మేము నీకు సంతుష్టి కలిగేటట్లు ఇష్టమైన పూజలు చేయకపోయినా మా మీద కరుణాకటాక్ష వీక్షణాలను ప్రసరింపజేసి ప్రసన్నుడవైనావు.

**క. వర మీయఁ దలఁచి మమ్ముం, గరుణించితి గాక! నిన్నుఁ గనుఁగొనుటకునై**
**యరసి నుతింపఁగ మాకుం, దర మగునే? వరద! నీరదశ్యామాంగా! 50**

* కోరిన కోరికలను అనుగ్రహించేవాడా! నీలమేఘంలాంటి శరీర చ్ఛాయ కలవాడా! వరమివ్వడంకోసం నీవు మా ముందు సాక్షాత్కరించావు. నిన్ను సందర్శించడానికి గానీ మరి సంస్తుతించడానికి గానీ మాకు సాధ్యమవుతుందా?

**వ. మఱియు నిస్సంగులై నిశితజ్ఞానంబునం జేసి దోషరహితులై భగవత్స్వభావులు నాత్మారాములు నగు మునులకు స్తుతియింపఁ దగిన గుణంబులు గలవాఁడ వగుచుండియుఁ బ్రసన్నుండవు, స్ఖలన క్షుత పతన జృంభణాది దురవస్థలందును జ్వరమరణాది దుర్దశలందును వివశుల మగు మాకుఁ గల్మష నాశకరంబులయిన భవ ద్దివ్యనామంబులు మా వచనగోచరంబు లగుంగాక, మఱియు నీ రాజర్షి పుత్రకాముండై నీ తోడ సమానుండయిన కుమారునిం గోరి కామంబుల స్వర్గాపవర్గంబుల నీ నోపిన నినుం బూజించి ధనకాముం డైనవాఁడు ధనవంతునిం జేరి తుషమాత్రం బడిగిన చందంబున మోక్షనాథుండవైన నీవలన సంతానంబు గోరుచున్న వాఁడు; జయింపరాని నీ మాయచేత నెవ్వండు మోహంబు నొంది విషయాసక్తుండుగాక యుండు? నర్థకాములము మదాంధులము నగు మేము నిన్ను నాహ్వానంబు సేసిన యపరాధంబు సర్వాత్మకుండ వగుటంజేసి సామ్యంబుచే మన్నింపం దగుదువు; మమ్ము దయఁ జూడుమని ప్రణమిల్లిన దేవతాశ్రేష్ఠుండైన సర్వేశ్వరుండు వర్షాధిపతియగు నాభిచేతను, ఋత్విక్కుల చేతను వంద్యమానుండై దయాకలితుం డగుచు నిట్లనియె. 51**

* మునులు కోరికలు లేనివారు సునిశ్చితమైన జ్ఞానం కలవారు. దోషరహితులు. భగవంతుని ప్రతిరూపాలు. ఆత్మారాములు. అలాంటి మునులకు స్తోత్రార్హుడ వయినప్పటికినీ అందరిపట్ల అనుగ్రహం చూపుతున్నావు. కాలు జారినప్పుడూ, కింద పడ్డప్పుడూ, తుమ్మినప్పుడూ, ఆవులించి నప్పుడూ, జ్వరంతో పీడింపబడుతున్నప్పుడూ, చావుకు చేరువ అయినప్పుడూ, మా మీద మాకే అధికారం తప్పినప్పుడూ మా పాపాలను పోగొట్టే నీ దివ్యనామాలు మా నోటివెంట వెడలునట్లు అనుగ్రహించు!

ఈ రాజర్షి అయిన నాభి నీకు సమానమైన సంతానం కావాలని నిన్ను పూజించాడు. కోరిన కోరికలనూ, స్వర్గాన్నీ మోక్షాన్ని సైతం ఇవ్వగల నిన్ను ఈలా అడగడం ధనం కోసం ధనవంతుని దగ్గరికి వెళ్లి ఊక అడిగినట్టుంది. మోక్ష ప్రదాత వయిన నిన్ను సంతానం కోసం ప్రార్థిస్తున్నాడు. మీ మాయ దాటరానిది.

అలాంటి మాయకు లోబడి ఇంద్రియకాంక్షలకు లోనుకాని వా డెవడు? ప్రతి పనిని ప్రయోజనం దృష్టిలో పెట్టుకొని చేసేవాళ్లం మేము. గర్వాంధులము. అయినా నిన్ను ఆహ్వానించిన మా అపరాధాన్ని మన్నించు. "మమ్ము అనుగ్రహించు'' అని నమస్కరించారు. అపుడు సర్వేశ్వరుడు జంబూద్వీపంలోని ఒక వర్షానికి అధిపతి అయిన నాభి, ఋత్విక్కులతో కలిసి చేసిన వందనాలు అందుకొంటూ దయతో ఈలా అన్నాడు.

**క. మునులార! వేదవాక్యము, లను బ్రస్తుతి సేసి సర్వలక్షణముల నా**
**కెన యగు పుత్త్రుని నిమ్మని, వినఁ బలికితి రిపుడు మిగుల వేడుకతోడన్. 52**

* మునులారా! నన్ను వేదమంత్రాలతో ప్రస్తుతి చేశారు. సకల శుభలక్షణాలు కలిగి, నాకు సాటి రాదగిన కొడుకును ప్రసాదించవలసిందిగా ఎంతో కుతూహలంతో మీరు నన్ను కోరారు.

**క. నాకాది లోకములలో, నాకున్ సరివచ్చునట్టి నందను నెటు నా**
**లోకింప లేరు; గావున, నాకున్ సరి నేన కా మనమున నెఱుఁగుఁడీ! 53**

* స్వర్గాది లోకాలలో నాకు సాటి రాదగ్గ కుమారుడు ఎక్కడా కనుపింపడు. నాకు సాటి నేనే. ఈ విషయం మీరు తెలుసుకోండి.

**వ. అదియునుంగాక భూసురోత్తములు నా ముఖం బగుటంజేసి విప్రవాక్యంబు దప్పింపరాదు; మీరు నా యీడు కుమారు నడిగితిరి గావున నాభిపత్ని యగు మేరుదేవియందు నేన పుత్త్రుండనై జనియించెదనని పలికి పరమేశ్వరుం డాగ్నీధ్రీయపత్ని యగు మేరుదేవి సూచుచుండ నా యజ్ఞంబున నంతర్ధానంబు నొంది యా నాభి మీఁది దయంజేసి దిగంబరులును దపస్వులును జ్ఞానులును నూర్ధ్వరేతస్కులును నగు నైష్ఠికులకు యోగధర్మంబుల నెఱింగింపం దలంచి పుండరీకాక్షుండు నాభి పత్ని యగు మేరుదేవి గర్భాగారంబునం బ్రవేశించె నంత. 54**

* అంతేగాక బ్రాహ్మణులు నాకు ముఖంలాంటి వారు, బ్రాహ్మణ వాక్యం దాటడానికి వీలుకానిది. నాకు సమానుడయిన కుమారుణ్ణి మీరు కోరారు. అందుచేత నాభిరాజేంద్రుని పత్ని అయిన మేరుదేవికి నేనే కొడుకునై పుడతాను'' అని రాజదంపతులు చూస్తుండగా అంతర్ధాన మయ్యాడు. ఆ తర్వాత దిగంబరులూ, తాపసులూ, జ్ఞానులూ, ఊర్ధ్వరేతస్కులూ, అయిన నైష్ఠికులకు యోగధర్మాలు బోధించటం కోసం నాభి మీద దయతో నారాయణుడు మేరుదేవి గర్భంలో ప్రవేశించాడు.

**ఆ. మేరుదేవియందు మేరుధీరుం డగు, హరి సమస్త లక్షణాన్వితుండు**
**శమదమాది గుణ విశారదుం డుదయించె, సకలజనుల కపుడు సంతసముగ. 55**

* సమస్త శుభలక్షణాలు కలవాడూ, శమదమాది గుణ సంపన్నుడూ మేరుధీరుడైన శ్రీహరి మేరుదేవికి కుమారుడుగా అవతరించాడు. సమస్త జనులూ సంతోషించారు.

**ఆ. ధవళ కాంతియుక్తిఁ దనరు దేహంబును, మహిత బలపరాక్రమంబు వీర్య**
**మును దలంచి చూచి జనకుండు పేరిడె, సుతుని ఋషభుఁ డనుచు సొంపుతోడ. 56**

* నరనాథుడైన నాభి, పుట్టిన శిశువు వెలుగు వెదజల్లుతూ ఉండడం గుర్తించాడు. శిశువు వైఖరినిబట్టి అతడు బలవంతుడనీ, పరాక్రమవంతుడనీ, శౌర్యం కలవాడనీ అర్థం చేసుకున్నాడు. అందువల్ల తన కుమారునికి 'ఋషభుడు' అని పేరు పెట్టాడు.

**క. ధరణీసురులును మంత్రులుఁ, బరివారము హితులుఁ బ్రజలు బాంధవులును సు**
**స్థిరమతి నా బాలకునిం, గర మనురాగమున రాజుగాఁ జూచి రిలన్. 57**

* బ్రాహ్మణులు, మంత్రులు, రాజపరివారం, హితులు, ప్రజలు, బంధువులు అనురాగాతిశయంతో ఆ ఋషభుని తమ రాజుగానే భావించారు.

**క. పురుహూతుఁ డతని మహిమలు, సరగున విని చిత్తమునకు సహ్యము గామిం**
**బరికించి ఋషభుఁ దేలెడి, ధరణి ననావృష్టి మిగుల దట్టము సేసెన్. 58**

* ఋషభుని మహిమలు విని ఇంద్రుడు లోలోపల కుళ్ళుకున్నాడు, అందుచేత ఋషభుడు పరిపాలించే రాజ్యంలో వానచినుకు పడకుండా చేశాడు.

**ఆ. అది యెఱింగి ఋషభుఁ డంతట యోగ మా, యా బలంబుకతన నఖిల రాజ్య**
**మందుఁ గురియఁ జేసె నత్యంత సంపూర్ణ, వృష్టి దినదినంబు వృద్ధిఁ బొంద. 59**

* ఇంద్రుని దౌష్ట్యాన్ని ఋషభుడు గుర్తించాడు. తన యోగ మాయాబలంతో దినదినాభివృద్ధిగా సర్వసమృద్ధిగా వర్షం కురిపించాడు.

**వ. ఇట్లు ఋషభుండు పురందరుండు సేయు దౌష్ట్యంబునకు నవ్వి యజనాభం బను తన మండలంబు సుభిక్షంబుగాఁ జేసె, నాభియుం దన కోరిన చందంబునం బుత్త్రుండు జనియించి వర్ధిల్లుటకు సంతసిల్లి తనచేత నంగీకరింపబడు నరలోక ధర్మంబు గల పుండరీకాక్షుని మాయావిలసిత మతింజేసి బాలకు, నా తండ్రి యని మోహంబున నుపలాలించుచుఁ బ్రజానురాగంబున సర్వసమ్మతుం డయిన పుత్త్రుని సమయసేతు రక్షణంబునకుఁ బూజ్యం బైన రాజ్యంబునం దభిషిక్తుంజేసి భూసురులకుఁ బ్రధానవర్గంబునకు నప్పగించి మేరుదేవిం గూడి నరనారాయణ స్థానంబయిన బదరికాశ్రమంబునకుం జని, యచ్చట మహాయోగ సమాధిచే నర నారాయణాఖ్యుండుఁ బురుషోత్తముండు నగు వాసుదేవు నారాధించి క్షీణదేహుండై యా నాభి హరి తాదాత్మ్యంబు నొందె నంత. 60**

* దేవేంద్రుని దుర్బుద్ధికి ఋషభుడు నవ్వుకున్నాడు. "అజనాభ" మనే పేరుతో వ్యవహరింపబడే తన భూమండలాన్ని సుభిక్షం చేశాడు. తాను కోరినట్టు కొడుకు పుట్టడం, పెరగడం చూచి నాభి చాల సంబరపడ్డాడు. పుండరీకాక్షుని మాయ కారణంగానూ భూలోక ధర్మాల కనుగుణంగానూ నాభి తన ప్రియనందనుణ్ణి "నాయనా! నా తండ్రీ!" అంటూ వ్యామోహంతో ముద్దాడాడు. ప్రజల అభిమానం చూరగొన్న వాడున్నూ, అన్ని వర్గాల వారికీ ఆమోద యోగ్యుడూ అయిన తన కుమారుడు రాజ్యపాలనకు తగినవాడని భావించి పట్టం కట్టాడు. బ్రాహ్మణులకూ, మంత్రి వర్గానికీ అతణ్ణి అప్పగించాడు. ఆ తరువాత భార్య మేరుదేవితో

కూడి నరనారాయణులకు నిలయ మయిన బదరికాశ్రమం చేరుకున్నాడు. అక్కడ నరనారాయణ స్వరూపుడూ, పురుషోత్తముడూ అయిన వాసుదేవుని తదేక ధ్యానంతో ఆరాధించాడు. క్రమంగా శరీరం పట్టు తప్పుతుంటే చివరకు సతీసమేతుడైన నాభి శ్రీహరితో తాదాత్మ్యం పొందాడు.

చ. సరసత నే నృపాలకుని జన్మము నందును భూసురోత్తముల్
సరసిజనాభునిం దగఁ బ్రసన్నతఁ బెట్టిన నంత మెచ్చి యీ
శ్వరుఁడు దనంత గర్భమున వచ్చి తనూభవుఁడై జనించె, నా
నరపతి నాభికిన్ సరి యనం దగునే నరనాథ! యన్యులన్. 61

* ఏ రాజు యజ్ఞంలో బ్రాహ్మణోత్తములైన ఋత్విక్కులు విష్ణుమూర్తిని ప్రార్థించి ప్రసన్నం చేసుకున్నారో, ఏ రాజు భార్య గర్భంలో నుంచి ఈశ్వరుడు తనంత తాను కొడుకుగా పుట్టాడో అలాంటి మహారాజుకు నాభికి సాటికాగల రాజు లెవరూ భూమండలంలో లేరు.

వ. అంత 62

* ఆ తరువాత కథ విను

సీ. భూవరుఁ డగు ఋషభుఁడు దన రాజ్యంబుఁ గర్మభూమిగ నాత్మఁ గాంచి జనుల
కందఱకును బ్రియం బగునట్లు కర్మతంత్రంబెల్లఁ దెలుపంగఁ దలఁచి కర్మ
ములు సేయుటకు గురువుల యొద్ద వేదంబు సదివి వారల యనుజ్ఞను వహించి
శతమన్యుఁ డిచ్చిన సతి జయంతీ కన్యఁ బరిణయంబై యట్టి పడఁతి వలన

తే. భరతుఁ డాదిగ సుతుల నూర్వురను గాంచె, నట్టి భరతుని పేరను నవనితలము
పురవరాశ్రమ గిరితరుపూర్ణ మగుచు, నమరి భారత వర్ష నామమున మించె. 63

* రాజైన ఋషభుడు తన రాజ్యాన్ని కర్మభూమిగా భావించాడు.

జనుల కందరికీ ప్రియ మయ్యేటట్టు కర్మతంత్రం తెలియ జేయాలనుకున్నాడు. అందుచేత కర్మలు ఆచరించడానికి తానే స్వయంగా గురువులవద్ద వేదాలు చదివాడు, వారి ఆజ్ఞ శిరసావహించి దేవేంద్రుడు ఇచ్చిన "జయంతి" ని ఋషభుడు వివాహం చేసుకున్నాడు. ఆ జయంతి వల్ల భరతుడు మొదలయిన నూర్గురు కొడుకులను కన్నాడు. పట్టణాలతో, ఆశ్రమాలతో, కొండలతో, చెట్టుచేమలతో నిండిన భూమండలం భరతుని పేరుమీదుగా "భరతవర్ష" మనే ప్రశస్తి గడించింది.

వ. ఆ మహాభారతవర్షంబునందుఁ దమతమ పేరంబరఁగు భూములకుఁ గుశావర్తేలావర్త బ్రహ్మావర్తార్యావర్త మలయకేతు భద్రసే నేంద్రస్పృ గ్విదర్భ కీకటులను తొమ్మండ్రు కుమారులను దక్కంగల తొంబండ్రు పుత్త్రులకుఁ బ్రధానులంజేసె; నంతం గవి హర్యంతరిక్ష ప్రబుద్ధ పిప్పలాయ నావిర్హోత్ర ద్రమీళ చమస కరభాజను లను వారు దొమ్మండ్రును భాగవత ధర్మప్రకాశకులైరి; భగవ న్మహిమోపబృంహితంబు లగు వారల చరిత్రంబులు ముంద రెఱింగించెదఁ; దక్కిన యెనుబది యొక్క కుమారులు

**పిత్రాదేశకరులు నతివినీతులు మహాశ్రోత్రియులు యజ్ఞశీలురుఁ గర్మనిష్ఠులు నయిన బ్రాహ్మణోత్తము లైరి; ఋషభుండు స్వతంత్రుండై సంసారధర్మంబులం బొరయక కేవలానందానుభవుం డయిన యీశ్వరుండై యుండియు బ్రాకృతుండునుం బోలెఁ గాలానుగతంబులగు ధర్మంబుల నాచరించుచు ధర్మ ప్రవర్తకులకు సముండును నుపశాంతుండును మైత్రుండును గారుణికుండునునై ధర్మార్థయశః ప్రజానందామృతావరోధంబుచే గృహస్థాశ్రమంబులం బ్రజల నియమించుచుఁ గొంత కాలంబు నీతి మార్గంబు దప్పక ప్రజాపాలనంబు సేయుచు వేద రహస్యంబులగు సకల ధర్మంబులును స్వవిదితంబులైనను బ్రాహ్మణోపదేశ పూర్వకంబుగా ద్రవ్యదేశకాల వయశ్శ్రద్ధర్త్విగ్విధోద్దేశోపచితంబులుగా నొక్కొక్క క్రతువును శతవారంబు యథావిధిగఁ జేసి సుఖం బుండె నంత. 64**

* భారతవర్షమనే పేరుతో ప్రసిద్ధి పొందిన భూమండలంలోని ఆయా భాగాలకు భరతుడు తన తొంబది తొమ్మిదిమంది సోదరులలో కుశావర్తుడు, ఇలావర్తుడు, బ్రహ్మావర్తుడు, ఆర్యావర్తుడు, మలయకేతువు, భద్రసేనుడు, ఇంద్రస్పృశుడు, విదర్భుడు, కీకటుడు అనే తొమ్మిదిమందిని ప్రధానులుగా నియమించాడు. వారి కప్పగించిన భూభాగాలు వారివారి పేర్లతో ప్రసిద్ధి పొందాయి. కవి, హరి, అంతరిక్షుడు, ప్రబుద్ధుడు, పిప్పలాయనుడు, ఆవిర్హోత్రుడు, ద్రమీఢుడు, చమసుడు, కరభాజనుడు అనే తొమ్మండుగురు భాగవత ధర్మాన్ని ప్రకాశింపజేశారు. దేవుని మహిమల్ని వ్యాప్తిచేసే వారి చరిత్రలు నీకు తరువాత చెబుతాను. తక్కిన ఎనభైయొక్క మంది కుమారులు తమ తండ్రియైన ఋషభుని మాట జవదాటనివారు. వారందరు మహావినయ సంపన్నులు. వేదధర్మాలు అనుష్ఠించేవారు. యాగాలన్నా, కర్మలన్నా శ్రద్ధ కలవారు. అందుచేత వారు బ్రాహ్మణోత్తములుగా పేరెన్నిక గన్నారు.

ఋషభుడు సాంసారిక బంధాలలో చిక్కుకోలేదు. స్వతంత్రుడయి మెలిగాడు. తాను ఆనందానుభూతి కలిగిన ఈశ్వరు డయినా సామాన్యునిలా ప్రవర్తించాడు. ఆ యా కాలాలలో చేయవలసిన ధర్మాలను ఆచరించేవాడు. ధర్మ ప్రవర్తకులపట్ల సమబుద్ధి కలిగి ఉండేవాడు. శాంతస్వభావంతో జీవులపట్ల కరుణ గలిగి మైత్రీభావంతో ఉండేవాడు. ధర్మం, అర్థం, కీర్తి, సంతతి, ఆనందం, అమృతత్వం చక్కగా సాగడం కోసం గృహస్థాశ్రమం పాటించ వలసిందిగా ప్రజలను అనుశాసించేవాడు. ఈ విధంగా ఋషభుడు నీతిమార్గం తప్పకుండా ప్రజాపాలనం చేశాడు. వేదాలలోని ధర్మరహస్యాలు తనకు అవగత మయినా బ్రాహ్మణులు బోధించినట్లు ఋత్విక్కులు ఉపదేశించినట్లు వస్తు సంభారాలతో, దేశకాలానుగుణంగా శ్రద్ధాపూర్వకంగా తన వయస్సుకు తగినట్టు ఒక్కొక్క యాగాన్ని నూరు పర్యాయాలు యథావిధిగా చేసి సుఖజీవనం సాధించాడు.

**క. జనవర! ఋషభుని రాజ్యం, బున నైహిక ఫలముఁ గోరు పురుషుని నొకనిం**
**గనుఁగొనఁ నెఱుంగ మెన్నఁడు, నినతేజుం డతని మహిమ లేమని చెప్పన్. 65**

* రాజా! ఆ ఋషభదేవుని రాజ్యంలో పారలౌకిక ఫలమే తప్ప ఇహలోకఫలం కోరేవాడు ఒక్కడూ కనబడడు. అతడు సూర్యుని వంటి తేజస్సు కలవాడు. అతని మహిమలను ఏమని వర్ణించేది?

సీ. ఆ ఋషభుండు రాజ్యంబు సేయుచునుండి యంతట నొక్కనాఁ డాత్మయందుఁ
దలపోసి భూలోక ఫల మపేక్షింపక మోహంబు దిగనాడి పుత్త్రులకును
దనరాజ్యమెల్ల నప్పన చేసి వెనువెంటఁ గొడుకులు మంత్రులుఁ గొలిచి రాఁగ
నల్లన యరిగి బ్రహ్మావర్త దేశంబు నందుల నపుడు మహాత్ములయిన

తే. యట్టి మునిజన సమ్ముఖంబందుఁ జేరి, తనదు పుత్రుల నందఱ దాయఁ బిలిచి
పరమ పుణ్యుండు ఋషభుండు ప్రణయ మొప్ప హర్ష మందుచు నప్పు డిట్లనుచుఁ బలికె. 66

* ఋషభుడు ఈ ప్రకారంగా కొంతకాలం రాజ్యపరిపాలన సాగించాడు. అతడు ఇహలోక ఫలాన్ని ఏ మాత్రం అపేక్షించలేదు. సంసార వ్యామోహాన్ని వదలిపెట్టాడు. కొడుకులకు రాజ్యమంతా అప్పగించాడు. ఆ తరువాత మెల్లగా బ్రహ్మావర్త దేశానికి పయనించాడు. కొడుకులూ, మంత్రులూ ఆ ఋషభుని అనుసరించారు. అక్కడ బ్రహ్మావర్త దేశంలో మహాత్ములయిన మునిజనుల సమక్షంలో కుమారుల నందరినీ దగ్గరికి పిలిచాడు. మహాపుణ్యాత్ముడైన ఆ ఋషభదేవుడు సంతోషంతో ఈలా అన్నాడు.

ఆ. తనయులార! వినుఁడు ధరలోనఁ బుట్టిన, పురుషులకును శునకములకు లేని
కష్టములను దెచ్చుఁ గానఁ గామంబుల, వలన బుద్ధి సేయవలదు మీరు. 67

* బిడ్డలారా! ఈ గడ్డమీద పుట్టిన మనుష్యులు కామానికి లొంగిపోతే కుక్కలకు కూడా రాని కష్టాలు వారికి ఎదురవుతాయి. అందువల్ల కోరికలకు మీరు దూరంగా ఉండాలి.

చ. నరులకు నే తపంబున ననంతసుఖంబులు గల్గుచుండు, శ్రీ
కరమతి నా తపంబుఁ దగఁ గైకొని చేసిన బ్రహ్మసౌఖ్యముం
దిరముగఁ గల్గు, వృద్ధులను దీనులఁ బ్రోవుఁడు; దుష్ట వర్తనన్
జరుగుచునుండు కాముకుల సంగతిఁ బోకుఁడు; మీఁద మేలగున్. 68

* తపస్సువల్ల మానవులకు తరగని సుఖం కలుగుతుంది. ఆలాంటి తపస్సు అవలంబించితే బ్రహ్మానందం తప్పక సిద్ధిస్తుంది. వృద్ధులనూ, దీనులనూ దయతో కాపాడండి. చెడుమార్గాలలో నడిచే కాముకుల సహవాసం పూర్తిగా వదలిపెట్టండి. మీకు శుభం కలుగుతుంది.

వ. మఱియు నంగనాసక్తులగు కాముకుల సంగంబు నిరయరూపం బయిన సంసారంబగు; మహత్సంగంబు మోక్షద్వారం బగు; నట్టి మహాత్ము లెవ్వరనిన శత్రు మిత్రవివేకంబు లేక సమచిత్తులును శాంతులును గ్రోధరహితులును సకలభూత దయాపరులును సాధువులును నగు వారలు మహాత్ములనం దగుదు; రట్టి మహాత్ములు నా యందలి స్నేహంబె ప్రయోజనంబుగాఁ గలిగి యుండుటం జేసి విషయవార్తా ప్రవృత్తులగు కుజనులందుఁ దమ దేహగృహమిత్ర దారాత్మజాదులందుఁ బ్రీతిలేక యుండుదురు; విషయాసక్తుఁ డయినవాఁడు వ్యర్థ కర్మంబులం జేయు; నట్టి దుష్కృత కర్మంబులం జేయువాఁ డెప్పుడును బాపకర్ముం డగుచుం గ్లేశదంబగు దేహంబు నొందుచుండుఁ; గావునఁ బాపమూలంబు లయిన కామంబులు గోరకుఁ; డీ జ్ఞానం బెంతకాలంబుఁ లేకయుండు నంతకాలంబు

నాత్మతత్త్వం బెఱుంగంబడ; దా తత్త్వం బెఱుంగ కుండుటం జేసి దేహికి దుఃఖం బధికంబై యుండు; లింగదేహం బెంత దడవుండు నంత దడవును మనంబు కర్మ వశంబై జ్ఞానవంతంబుగాక యవిద్యం బాయకుండు, శరీరంబు గర్మమూలం బగుటవలనఁ గర్మంబులు సేయఁజనదు; వాసుదేవుం డగు నాయందుఁ బ్రీతి యెంతదడవు లేక యుండు నంతదడవును దేహ ధర్మంబులు బాధించు, విద్వాంసుడైనను దేహేంద్రియాదులయందుఁ బ్రీతిసేసిన మిథునీభావసుఖ ప్రధానంబగు గృహస్థాశ్రమంబు నంగీకరించి స్వరూప స్మృతిశూన్యుండై మూఢుం డగుచు, నందు సంసార తాపంబులఁ బొందు; బురుషుండు స్త్రీతోడం గూడి యేకీభావంబు నొందుట దనకు హృదయ గ్రంథియై యుండు; నందు జనునకు గృహ క్షేత్ర సుతాప్త విత్తంబులందు 'నేను నాయది' యనియెడి మోహంబు గలుగు; నట్టి స్త్రీ పురుష మిథునీ భావంబుచే సంతానంబు గలుగు; నా సంతాన కారణంబున గృహ క్షేత్ర విత్తాదులు సంపాదింపఁబడు; నందు మోహం బధికం బగుటంజేసి మోక్షమార్గంబు దవ్వగు; నిట్లు సంసారంబునం దుండియు మనంబున నెప్పుడు ముక్తిచింతం జేయు నప్పుడు సంసారంబును బాయు; మోక్షోపాయంబులు పరమ గురుండనైన నా యందుల భక్తి సేయుటకు విగతతృష్ణయు, ద్వంద్వ తితిక్షయు, సర్వలోకంబులందుల జంతు వ్యసనావగతియు, నీశ్వరవిషయక జ్ఞానాపేక్షయుఁ , దపంబును, విగతేచ్ఛయు, మత్కృతకర్మంబులు, మత్కథలు వినుటయు, నన్నె దైవంబుగా నెఱుంగుటయు, నస్మద్గుణ కీర్తనంబులును, నిర్వైరత్వ సామ్యోపశమంబులును, దేహ గేహంబులందు నాత్మ బుద్ధి జిహాసయు, నధ్యాత్మ యోగంబును, నేకాంత సేవయుఁ, బ్రాణేంద్రియాత్మల గెలుచు టయుఁ, గర్తవ్యాపరిత్యాగంబును, సచ్ఛ్రద్ధయు, బ్రహ్మచర్యంబును, గర్త వ్యకృత్యంబులందుల నప్రమత్తుం డగుటయు, వాఙ్నియమనంబును, సర్వంబు నన్న కాఁదలంచుటయు, జ్ఞానంబును, విజ్ఞాన విజృంభితంబైన యోగంబును, ధృత్యుద్యమంబును, సాత్త్వికంబును నాదిగాఁ గల తెఱంగులచేత లింగదేహంబు జయించి దేహి కుశలుం డగుచు నుండవలయు. 69

* ఆడువారంటే మోజుపడి కామవాంఛ తీర్చుకోవడమే ప్రధాన మనుకొన్నవారికి సంసారం సాక్షాత్తు నరకమే అవుతుంది. పెద్దల సహవాసం మోక్షానికి దారి తీస్తుంది. పెద్దలయిన మహాత్ములు ఎవరని అంటారా? వినండి. వీడు విరోధి, వీడు స్నేహితుడు- అనే భేదభావం లేకుండా సమదృష్టి కలవారునూ, శాంతస్వభావులూ, ఏ మాత్రం కోపం లేనివారూ, సమస్తజీవులపట్ల పరమ కారుణ్యస్వభావం కలవారూ, కపటం లేని వారూ, మహాత్ములని పిలువబడతారు. అలాంటి మహానుభావులకు నా యందే పరిపూర్ణభక్తి ఉంటుంది. అందువల్ల వారు విషయ లంపటు లయిన దుర్మార్గులపట్ల ప్రీతి కలిగి ఉండరు. తమ ఇల్లన్నా, దేహమన్నా, మిత్రులన్నా, భార్యాపుత్రులన్నా వారికి వ్యామోహం ఏ మాత్రం ఉండదు.

ఇంద్రియ సుఖాలకు లోనయినవాడు పనికిరాని పాడుపనులు చేస్తుంటాడు. చెడ్డపనులు చేసేవాడు పాపం కొనితెచ్చుకుంటాడు. దుఃఖకారణమయిన దేహాన్ని మోస్తుంటాడు. అందువల్ల మీరు పాపాలకు మూలమయిన కోరికలను కోరకండి. యథార్థ జ్ఞానం ప్రాప్తించనంత వరకూ మీకు ఆత్మతత్త్వం బోధపడదు. ఆ తత్త్వం తెలియని కారణం వల్ల దేహికి దుఃఖం మిక్కుట మవుతుంది. లింగదేహ మెంతకాలం ఉంటుందో

అంతకాలం మనస్సు కర్మవశమై ఉంటుంది. జ్ఞానం లభించదు. అవిద్య వదలదు. శరీరం కర్మమూలం. అందుచేత కర్మలు చేయడం తగదు. వాసుదేవుడినైన నా మీద ఆసక్తి కుదరనంతవరకూ మిమ్మల్ని దేహధర్మాలు బాధిస్తాయి. ఎంత చదువుకున్న వాడయినా, దేహేంద్రియ సుఖములందు ఆసక్తుడై సంభోగ సుఖప్రధాన మయిన గృహస్థాశ్రమం స్వీకరిస్తాడు. మూఢుడై సంసార క్లేశాలకు లోనౌతాడు.

సంసారికి ఇల్లన్నా, పొలాలన్నా, కొడుకులన్నా, ఆప్తులన్నా, ధనమన్నా, "నేను, నాది" అనే వ్యామోహం పెరుగుతుంది. స్త్రీ పురుషుల కలయిక వల్ల సంతానం కలుగుతుంది. ఆ సంతానం కోసం ఇల్లు కట్టడమో, పొలాలు కొనడమో, ధనం సంపాదించడమో జరుగుతుంది. వాటిపట్ల మోహం పెంచుకోవడంతో వానికి మోక్షమార్గం దూరమవుతుంది. సంసారంలో మునిగి ఉన్నవానికి ఎపుడయితే మోక్షాసక్తి కలుగుతుందో అపుడే అతడు సంసారాన్ని వదలిపెడతాడు.

మోక్షోపాయాలు చెబుతాను! పరమేశ్వరుడనైన నా మీద భక్తి కలిగి ఉండడం, కోరికలు లేకపోవడం, సుఖ దుఃఖాలలో సహనం, సమస్తజీవుల కష్టాలపట్ల సానుభూతి కలిగి ఉండడం, భగవద్విషయమైన జ్ఞానంపట్ల ఆసక్తి, తపస్సు, నా కథలనూ లీలలనూ ఆలకించడం. నన్నే దైవంగా భావించడం, నాగుణాలను కీర్తించడం, ఎవరితోనూ విరోధ భావం లేకుండడం, సర్వత్ర సమబుద్ధి కలిగి ఉండడం, శాంతితో జీవించడం, " నా గేహం, నా దేహం" అనే బుద్ధిని వదలిపెట్టడం, ఆధ్యాత్మయోగం అవలంబించడం, ఏకాంత భక్తిభావం, ఇంద్రియాలను జయించడం, కర్తవ్య పరాయణత్వం, సత్కార్యములందు శ్రద్ధ, బ్రహ్మచర్యం, జాగరూకత, వాక్కులను సంయమనంతో వాడడం, అన్నిటిలో నన్నే చూడడం - ఇవి ముక్తి మార్గాలు. జ్ఞానంతో విజ్ఞాన విజృంభిత మయిన యోగంతో, గుండెదిటవుతో, సాత్త్విక ప్రవృత్తితో లింగదేహాన్ని జయించి మానవుడు శాశ్వత సుఖం సంపాదించాలి.

**ఆ. అరయఁ గర్మరూప మగు నవిద్యాజన్మ, మైన హృదయబంధనాది లతల**
**నప్రమత్తయోగ మను మహాఛురికచేఁ, ద్రెంపవలయు నంతఁ దెంపుతోడ. 70**

* అజ్ఞానం నుండి పుట్టిన హృదయ బంధన మనే తీగను యోగం అనే చురకత్తితో ధైర్యంగా తెంపివేయాలి.

**ఆ. ఒనర నిట్లు యోగయుక్తుండు గురుఁడైన, భూపుఁడైన శిష్యపుత్ర వరుల**
**యోగయుతులఁ జేయ నొప్పుగా వలయును, గర్మపరులఁ జేయఁగాదు కాదు. 71**

* అటువంటి యోగం అనుష్ఠించే వ్యక్తి గురువయితే శిష్యులనూ, తండ్రి అయితే బిడ్డలనూ, రాజయితే ప్రజలనూ, తాను నేర్చిన యోగ మార్గంలో పెట్టవలెనేగాని కర్మఫలాలపై ఆసక్తులను చేయకూడదు.

**సీ. జనులెల్ల నర్థ వాంఛలఁ జేసి యత్యంత మూఢులై యైహికంబులు మనంబు**
**లందును గోరుదు; రల్ప సౌఖ్యములకు నన్యోన్య వైరంబు లంది దుఃఖ**
**ములఁ బొందుదురు; గాన మునుకొని గురుఁడైన వాఁడు మాయామోహవశుఁడు నెంత**
**జడుఁడు నైనట్టి యా జంతువులందును దయ గల్గి మిక్కిలి ధర్మబుద్ధిఁ**

ఆ. గన్నులున్నవాఁడు గానని వానికి, దెరువుఁ జూపి నట్లు దెలియఁ బలికి
యతుల మగుచు దివ్యమైన యా మోక్ష మా, ర్గంబుఁ జూప వలయు రమణతోడ. 72

* ప్రజలందరూ ఏవో ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకుని పనులు చేస్తుంటారు. మూర్ఖులయి ఎల్లప్పుడూ మనసులో ఐహిక ఫలాలను కోరుతుంటారు. అల్పసౌఖ్యంకోసం ఒకరిపై మరొకరు వైరం పెంచుకుంటారు. అంతులేని దుఃఖంలో మునిగిపోతారు. అందుచేత గురువయినవాడు తానే ముందు నడిచి మాయామోహాలకు లోబడి మూర్ఖులయిన జీవులపట్ల సానుభూతి చూపాలి. కళ్లున్నవాడు గ్రుడ్డివానికి దారి చూపిన విధంగా అజ్ఞానులకు బోధించి సహాయపడాలి. సాటిలేనిదీ, దివ్యమయినదీ, అయిన మోక్షానికి మార్గం చూపాలి.

వ. మఱియుఁ బితృ గురుజననీ బంధు పతి దైవతంబులలో నెవ్వరైననూ సంసార రూప మృత్యురహితం బైన మోక్షమార్గంబుం జూపకుండిరేని వా రెవ్వరును హితులు గానేరరు; నాదు శరీరంబు దుర్విభావ్యంబు; నాదు మనంబు సత్త్వయుక్తంబును, ధర్మసమేతంబును, బాపరహితంబు నగుటంజేసి పెద్దలు నన్ను ఋషభుం డంద్రు; గావున శుద్ధ సత్త్వమయంబైన శరీరంబునం బుట్టిన కుమారులైన మీర లందఱును సోదరుండును మహాత్ముండును నగ్రజుండును నైన భరతు నన్నెకాఁజూచి యక్లిష్టబుద్ధిచే భజింపుం; డదియ నాకు శుశ్రూషణంబు; ప్రజాపాలనంబు సేయుట మీకును బరమ ధర్మంబని మఱియు నిట్లనియె. 73

* అంతేగాదు. తండ్రిగానీ, తల్లిగానీ, గురువుగానీ, బంధువుగానీ చివరకు భర్త అయినా సరే అక్షయమైన మోక్షమార్గం చూపలేక పోతే వారెవరూ హితులు కారు.

నా శరీరం ఎలా ఏర్పడిందో మీ రేమాత్రం ఊహించలేరు. నా మనస్సు సత్త్వగుణంతో కూడింది. ధర్మంతో కూడింది. పాపరహితమైంది. అందువల్లనే ఆర్యులు నన్ను, 'ఋషభు'డన్నారు. శుద్ధసాత్త్విక మయిన నా శరీరం నుండి పుట్టినవారే మీరందరూ, కుమారులారా! తోడబుట్టినవాడూ, మీ అందరికీ పెద్దవాడూ, మహాత్ముడూ అయిన భరతుణ్ణి నాలాగే భావించి సద్బుద్ధితో సేవించండి. అదే మీరు నాకు చేసే శుశ్రూష, ప్రజలను పరిపాలించడమే మీకు పరమ ధర్మం- అని బోధించి ఋషభదేవుడు మరల ఈలా అన్నాడు.

సీ. భూతజాలములందు భూజముల్ వర్యముల్ భూరుహముల కంటె భోగి కులము
భోగి సంతతి కన్న బోధనిష్ఠులు బోధ మాన్యుల కన్నను మనుజవరులు
వీరి కన్నను సిద్ధ విబుధ గంధర్వులు వారి కన్న ను సురుల్ వారికన్న
నింద్రాది దేవత లిందఱి కన్నను దక్షాది సన్మునుల్ దలఁప నెక్కు

తే. డంతకన్నను భర్గుఁ డా యభవుకన్నఁ, గనులభవుఁ డెక్కుఁ; డాతని కంటె విష్ణుఁ
డధికుఁ డాతఁడు విప్రుల నాదరించుఁ, గాన విప్రుండు దైవంబు మానవునకు. 74

* సమస్త జీవరాసులలో వృక్షములు శ్రేష్ఠమైనవి. చెట్లకంటె సర్పములు శ్రేష్ఠములు. పాములకంటే మేధావులు ఉత్తములు. బుద్ధిమంతులకంటే భూపతులు గొప్పవారు. రాజులకంటే సిద్ధులు, కిన్నరులు గంధర్వులు శ్రేష్ఠులు, వారికంటే దేవతలు గొప్పవారు. వారిని మించి ఇంద్రాది దిక్పాలకులు, వీరికంటే దక్షుడు, రుద్రునికంటే బ్రహ్మ, బ్రహ్మ కంటే విష్ణువు అధికులు. ఆయన బ్రాహ్మణులను ఆదరిస్తాడు. అందుచేత మానవులకు బ్రాహ్మణుడే దైవం.

**క. భూసురులకు సరిదైవం, బీ సచరాచరమునందు నెఱుఁగను; నాకున్**
**భూసురులు గుడుచునప్పటి, యా సంతోషంబు దోఁప దగ్నులయందున్. 75**

* ఈ చరాచర ప్రపంచంలో నాకు తెలిసినంతవరకు బ్రాహ్మణులకు సాటి అయిన దైవం లేదు. విధి విహితంగా అగ్నులలో వేల్చే హవిస్సు కంటే బ్రాహ్మణులు భోజనం చేస్తుంటే నాకు ఎక్కువ సంతోషం కలుగుతుంది.

**సీ. మంగళం బైన బ్రహ్మస్వరూపంబును వేదరూపంబు ననాది రూప**
**మగుచున్న నాదు దేహము బ్రాహ్మణోత్తముల్ ధరియింతు రెప్పుడుఁ దత్త్వబుద్ధి**
**శమదమానుగ్రహ సత్యతపస్తితిక్షలు గల్గు విప్రుండు సద్గురుండు;**
**గాన మిక్కిలి భక్తి గల్గి యకించను లైన భూసురుల దేహముల వలన**

**తే. నందుచుండును నాదు దేహంబు గాఁగ, నెఱిఁగి వరులగు విప్రులనెల్ల భక్తిఁ**
**బూజసేయుటయే నన్నుఁ బూజసేయు, టనుచు వినిపించి మఱియు నిట్లనుచుఁ బలికె. 76**

* నాదేహం పరబ్రహ్మం స్వరూపం, వేదమయం. దీనికి ఆదిలేదు. అలాంటి వేదరూపమైన నాదేహాన్ని బ్రాహ్మణోత్తములు ధరిస్తారు. సత్త్వగుణం కలవాడూ, జితేంద్రియుడూ, దయాళువూ, సత్యసంధుడూ, తపస్వీ, సహనశీలీ అయిన బ్రాహ్మణుడే మంచి గురువు. అందుచేత నేను పరమభక్తులూ, మహానుభావులూ అయిన బ్రాహ్మణుల దేహంతో కనిపిస్తుంటాను. పైన చెప్పిన గుణాలు కలిగన బ్రాహ్మణులను నా రూపంగా భావించుకుని పూజసేయడం నన్ను పూజ చేయడమే అవుతుంది అని మళ్లీ ఈలా అన్నాడు.

**క. ఈ తెఱఁగు దెలిసి భూసుర, జాతిం బూజించునట్టి జనుఁడును మాయా**
**తీతుండై నిక్కంబుగ, భూతలమున మోక్షమార్గమును బొడగాంచున్. 77**

* ఈ రహస్యం తెలుసుకొని బ్రహ్మవేత్తలైన విప్రులను పూజించే మానవుడు మాయాతీతు డవుతాడు. భూలోకంలోనే మోక్షానికి మార్గం గుర్తిస్తాడు.

**వ. ఇట్లు సదాచారు లగు కుమారులకు లోకానుశాసనార్థం బాచారంబు లుపదేశించి మహాత్ముండును బరమసుహృత్తును నగు భగవంతుండు ఋషభాపదేశంబునం గర్మత్యాగంబు సేసి యుపశమ శీలురగు మునులకు భక్తిజ్ఞానవైరాగ్య లక్షణంబులు గల పారమహంస్య ధర్మం బుపదేశింపంప గలవాఁడగుచుఁ బుత్త్రశతంబునం దగ్రజుండును బరమ భాగవతుండును భగవజ్జన పరాయణుండును**

**నగు భరతుని ధరణీపాలనంబునకుఁ బట్టంబు గట్టి తాను గృహమందె దేహమాత్రావలంబనంబు సేసి దిగంబరుండై యున్మత్తాకారుం డగుచుం బ్రకీర్ణ కేశుండై యగ్నుల నాత్మారోపణంబు సేసి బ్రహ్మావర్తదేశంబును బాసి జడాంధ బధిర మూక పిశాచోన్మాదులుం బోలె నవధూత వేషంబు నొంది జనులకు మాఱు పలుకక మౌన వ్రతంబునం బుర గ్రామాకర జనపదారామ శిబిర వ్రజఘోష సార్థగిరి వనాశ్రమాదుల యందు వెంటంజనుదెంచు దుర్జన తర్జన తాడనావమాన మేహన నిష్ఠీవన పాషాణశకృద్రజః ప్రక్షేపణపూతి వాత దురుక్తులం బరిభూతుం డయ్యును గణనం బెట్టక వనమదేభంబు మక్షికాది కృతోపద్రవంబునుం బోలెఁ గై కొనక దేహాభిమానంబునం జిత్త చలనంబు నొందక యేకాకియై చరియించు చుండ నతి సుకుమారంబులగు కరచరణోరస్థ్సలంబులు విపులంబులగు బాహ్వంసకంఠ వదనాద్యవయవ విన్యాసంబులుం గలిగి ప్రకృతి సుందరం బగుచు స్వతస్సిద్ధదరహాసరుచిర ముఖారవిందంబై, నవ నళిన దళంబులంబోలి శిశిర కనీనికలం జెలువొంది, యరుణాయతంబులగు నయనంబులచే నొప్పి యన్యూనాధికంబులగు కపోల కర్ణ కంఠ నాసాదండంబులచేఁ దేజరిల్లుచు నిగూఢస్మితవదన విభ్రమంబులం బ్రకాశించు తన దివ్య మంగళ విగ్రహంబుచేఁ బుర సుందరుల మనంబుల కత్యంత మోహంబు గలుగఁజేయుచు. 78**

* సదాచార సంపన్నులైన కుమారులకు, లోకానికి వెల్లడించు నిమిత్తం అవసరమైన ఆచారాలను ఋషభదేవుడు ఉపదేశించాడు. మహానుభావుడూ లోక బాంధవుడూ అయిన భగవంతుడు ఋషభుని రూపంలో కర్మపరిత్యాగం కావించి శాంతస్వభావులైన మునులకున్నూ భక్తి జ్ఞాన వైరాగ్యాలతో కూడిన పరమహంస ధర్మాలను ఉపదేశించాలని ఉద్దేశించాడు. ఆయన తన నూరుమంది కొడుకులలో పెద్దవాడు. పరమ భాగవతుడు అయిన భరతునికి పట్టంగట్టి రాజ్యభారం అప్పగించాడు. అనంతరం శరీరమాత్ర సహాయుడై, దిగంబరుడై చింపిరి జుట్టుతో పిచ్చి వానిలాగా ప్రవర్తిస్తూ అగ్నుల్ని తనలో ఆరోపించుకొని కొంతకాలం గడిపాడు. తర్వాత బ్రహ్మావర్తదేశాన్ని వదలిపెట్టి వెళ్ళిపోయాడు. జడుని లాగా, చెవిటివానిలాగా, మూగవానిలాగా, పిశాచం ఆవహించినట్టులగా పిచ్చివాని విధంగా అవధూత వేషం ధరించాడు. ఎవరయినా పలకరించినా బదులు చెప్పకుండా మౌనవ్రతం చేపట్టాడు.

నగరాలు, గ్రామాలు, పల్లెలు, తోటలు, శిబిరాలు, బిడారాలు, గొల్లపల్లెలు, గొడ్లపాకలు, కొండలు, తపోవనాలు, ఋష్యాశ్రమాలు దాటి పోసాగాడు. అక్క డక్కడ కొందరు వెంటపడేవారు. దుండగులు కొడుతున్నా, తిడుతున్నా, రాళ్ల విసురుతున్నా, దుమ్ము చల్లుతున్నా, తనపై మూత్ర విసర్జనం చేసినా, ఉమ్మివేసినా, కుళ్ళిన వస్తువులు పైకి విసిరి వేసినా, బూతుకూతలు కూస్తున్నా ఏ మాత్రం పట్టించుకోకుండా జోరీగలను లెక్కపెట్టని అడవి యేనుగు లాగా ముందుకు నడచి పోతున్నాడు. ఏ మాత్రం దేహాభిమానం లేకుండా నిశ్చలమైన చిత్తంతో ఏకాకిగా సంచరిస్తున్నాడు.

అతని చేతులు, కాళ్ళు ఉరోభాగం చాలా సుకుమారంగా ఉన్నాయి. భుజాలు, కంఠసీమ, ముఖం మొదలయిన అవయవాలు విశాలంగా తీర్చినట్లున్నాయి. అతని రూపం సహజ సుందరంగా ఉంది. పద్మంవంటి ముఖంలో స్వతస్సిద్ధమైన చిరునవ్వులు చిందుతున్నాయి. కొంగ్రొత్త తామర రేకులలాగా

చల్లని కనుపాపలు కనిపిస్తున్నాయి. విస్ఫారిన కళ్లల్లో ఎర్రదనం ప్రకాశిస్తున్నది. చెక్కిళ్ళుగాని, చెవులుగాని, మెడభాగంగాని, ముకు పుటాలుగాని ఏ మాత్రం లోపం లేకుండా దిద్ది తీర్చినట్లున్నాయి. అతని పెదవుల లోపలి చిరునవ్వు ఇతరులను భ్రమింపజేసే లాగా ఉంది. అటువంటి అతని దివ్య మంగళ విగ్రహం ముద్దుగుమ్మలను మోహంలో ముంచెత్తుతున్నది.

**ఆ. ధూళిచేత మిగుల ధూసరితంబునై, జడలు గట్టి కడుఁ బిశంగవర్ణ**
**ము నగు కేశపాశమును వెలిఁగించుచు, నితరు లెవరుఁ దన్ను నెఱుఁగకుండ. 79**

* ఋషభుని జుట్టు దుమ్ముకొట్టుకొని ధూసరవర్ణం ధరించింది. వెంట్రుకలు జడలుకట్టి గోరోచనం రంగుతో మెరిసి పోతున్నాయి. అటువంటి వేషంలో అతడు ఎవరూ గుర్తుపట్టకుండా తిరుగుతున్నాడు.

**క. అవధూత వేషమున ని, ట్లవనిన్ మలినంబులైన యవయవములతో**
**దవిలి చరించుచు నుండును, భువి భూతాక్రాంతుఁ డయిన పురుషుని మాడ్కిన్. 80**

*నా ఋషభుడు పిశాచాక్రాంతుడైన వానిలాగా మురికిపట్టిన అవయవాలతో అవధూత వేషంలో సంచరింప సాగాడు.

**ఆ. జనుల కిట్లు యోగసంచార మెల్ల వి, రుద్ధ మనుచు నాత్మ బుద్ధిఁ జూచి**
**యజగరంబు మాడ్కి నవనిపై నుండె బీ, భత్సకర్మమునకుఁ బాలు పడుచు. 81**

* తన అవధూత వేషం, తన యోగవిధానం ప్రజలకు వింతగా ఉంటుందని ఋషభుడు గ్రహించి ఒకేచోట 'అజగరం' లాగా పొరల సాగాడు.

**వ. ఇట్లు బీభత్సరూపంబున వసుంధరం బడియుండి యన్నంబు భుజించుచు నీరు ద్రావుచు మూత్రపురీషంబులు విడుచుచు నవి శరీరంబున నంటం బొరలుచుండు, మఱియు దత్పురీష సౌగంధ యుక్తంబగు వాయువు దశదిశలన్ దశయోజన పర్యంతంబు బరిమళింపం జేయుచుండ గోమృగకాక చర్యలం జరియించుచు భగవదంశంబైన ఋషభుండు మహానందంబు ననుభవించుచుం దనయందు సర్వభూతాంతర్యామి యగు వాసుదేవునిం బ్రత్యక్షంబుగాఁ గనుంగొనుచు సిద్ధిం బొందిన వైహాయస మనోజవ పరకాయ ప్రవేశాంతర్ధాన దూర గ్రహణ శ్రవణాది యోగ సిద్ధులు దమంత వచ్చినం గైకొనక యుండె నని పలికిన శుకయోగీంద్రునకుం బరీక్షిన్నరేంద్రుం డిట్లనియె. 82**

* ఈ విధంగా ఆయన జుగుప్స కలిగించే తీరున నేలమీద పరుండి ఉండేవాడు. అన్నం తింటూ, నీరు తాగుతూ, మల మూత్రాదులలో పొరలుతుండేవాడు. అతని మల సుగంధంతో కూడిన వాయువు పది దిక్కులలోనూ పది ఆమడల దూరం పరిమళిస్తుండగా భగవదంశ సంభూతుడైన ఋషభుడు వృషభం వలె, మృగం వలె, వాయసం వలె ప్రవర్తిస్తూ మహదానందం పొందేవాడు. సర్వాంతర్యామి అయిన వాసుదేవుణ్ణి తనలో ప్రత్యక్షంగా దర్శించుకుంటూ యోగసిద్ధుడైనాడు. అపుడు ఆకాశగమనం, మనోవేగం, పరకాయ ప్రవేశం, అంతర్ధానం, దూర దర్శనం, దూరశ్రవణం మొదలయిన సిద్ధులు తమంత తాము ఋషభుణ్ణి ఆశ్రయించాయి.

అయినా ఋషభుడు ఆ సిద్ధులను స్వీకరించలేదు- అని శుకయోగి ఋషభుని వృత్తాంతం చెప్పగా పరీక్షిత్తు తన సందేహం ఇలా వెలిపుచ్చాడు.

**క. మునివర! యోగజ్ఞానం, బునఁ జెఱుపంబడ్డ కర్మములు గల పెద్దల్**
**గని యుండెడి యైశ్వర్యం, బును ఋషభుం డెఱిఁగి యేల పొందక యుండెన్? 83**

* మునివరేణ్యా! యోగాభ్యాసం వల్ల జ్ఞానం కలుగుతుంది, కర్మలు నశిస్తాయి. అలాంటి మహనీయులకు మహాసిద్ధులు ప్రాప్తిస్తాయి. అయినా తమంత తాము వచ్చిన ఐశ్వర్యాలను ఋషభు డెందుకు స్వీకరించలేదు. స్వామీ!

**వ. అనిన శుకుం డిట్లనియె. 84**

* తనకు కలిగిన సందేహం వెలిపుచ్చిన పరీక్షిత్తుకు శుకయోగి ఈలా సమాధాన మిచ్చాడు.

**మ. ధరణీవల్లభ! నీదు వాక్యములు దథ్యం బింతయుం దప్పు, దె**
**ట్లరయన్ వన్యమృగంబు పట్టుపడి తా నా వేళ నాలుబ్ధకున్**
**ధర వంచించిన మాడ్కి నింద్రియములన్ దండించి చిత్తంబు ని**
**ర్భరకామాదుల కాస యిచ్చుఁ గడు సంరంభంబుతోఁ గ్రమ్మఱన్. 85**

* ఓ రాజా! నీ వన్నది నిజమే. అడవిలోని మృగాలు వేటగానికి పట్టువడుతాయి. అయినా ఏదో విధంగా వాణ్ణి వంచించి తప్పించుకొని బయట పడతాయి. అలాగే ఇంద్రియాలను లొంగదీసుకున్నా మనస్సు మరల ఏదో విధంగా విజృంభించి కోరికలకు అవకాశమిస్తుంది.

**క. చిరకాల తపము నైనను, హరియింపఁగ నోపుఁ జిత్త మని పెద్దలు న**
**మ్మరు జారులకున్ జారిణి, కరణిని నడరించు మనసు కామాదులకున్. 86**

* మహీనాథా! మనసు చాల చిత్ర మయినది. చాలాకాలం శ్రమపడి సాధించుకున్న తపస్సు నయినా అది హరిస్తుంది. అందుచేత పెద్దలు మనస్సును నమ్మరు. విటులను ఆకర్షించే జారిణిలాగా మనస్సు నిలకడ కోల్పోయి కామక్రోధాదులను ఆహ్వానిస్తుంది.

**క. కామక్రోధాదికముల్, భూమీశ్వర! కర్మబంధములు మఱియును జే**
**తో మూలము లగుటను దా, రీ మహిలో మనసు నమ్మ రెప్పుడుఁ బెద్దల్. 87**

* నరేంద్రా! కామక్రోధాది అరిషడ్వర్గాలకూ, కర్మబంధాలకూ మనస్సే మూలకారణం. అందుచేత ఆర్యులు మనస్సును సుతరామూ విశ్వసింపరు.

**సీ. అదిగాన నెన్నఁడు నైశ్వర్యములను జే పట్టఁ జూడుఁడు, లోకభవ్యులైన**
**వారలచే నభివందనంబులు వొంది వెలయంగ నవధూతవేష భాష**
**ణంబుల నెఱిఁగికొనఁగరాని భగవత్స్వరూపంబు గలిగి యా రూపమందుఁ**
**బరమ యోగధ్యాన పరులకు నెల్ల దేహత్యాగ సమయంబు నంతలోనఁ**

తే. జూపు చుండియు దేహంబుఁ బాప నిచ్చ, గించె; నచ్చట దివ్య యోగీంద్రుఁ డాద్యుఁ
డతుల దివ్యప్రకాశకుఁ డమర గురుఁడు, పరమపురుషుండు ఋషభుండు పార్థివేంద్ర! 88

* ఓ రాజా! మనసు గతులు తెలిసినవాడు కావడం బట్టే తమంత తాము వచ్చినా సిద్ధులను ఋషభుడు చేపట్టలేదు. కనీసం వాటివంక చూడనయినా చూడలేదు. లోకాలకు శుభం కోరే వారి అభివందనాలను ఆ మహాత్ముడు అందుకున్నాడు. వేషంలోని గాని, మాటల్లోగాని ఋషభుడని గుర్తుపట్టడానికి వీలులేనట్టుగా భగవత్స్వరూపంతో ఋషభుడు వెలిగిపోతున్నాడు. పరమయోగాన్ని ధ్యానించే వారి కందరికి దేహత్యాగం చేయదగ్గ సమయాన్ని ఋషభుడు సూచిస్తున్నాడు. మహాయోగులలో శ్రేష్ఠుడయినవాడు, మహాత్ములలో అగ్రేసరుడు, సాటిలేని దివ్య తేజస్సుతో ప్రకాశించేవాడు, దేవతలకు గురు వయినవాడు, పరమ పురుషుడు అయిన ఋషభుడు శరీరం విడవడానికి నిశ్చయించాడు.

వ. అంత విముక్తలింగుండు భగవంతుండునగు ఋషభుండు మనంబున దేహాభిమానంబు విసర్జించి కులాల చక్రంబు కులాలుని చేత భ్రమియింపంబడి విస్పష్టంబయ్యు భ్రమియించు గతిం బ్రాచీన సంస్కార విశేషంబగు నభిమానాభాసంబున దేహచలనాదికంబుల నొప్పి యుండియు, యోగమాయా వాసనచే యుక్తుండయ్యె; మఱియు నా ఋషభుం డొక్క దినంబునం గోంకణవంక పట కుటకంబులను దక్షిణ కర్ణాట దేశంబులకు యదృచ్ఛం జని కుటకాచలోపవనంబున నిజాస్యకృతశిలా కబళుం డగుచు నున్మత్తుని చందంబున వికీర్ణ కేశుండు, దిగంబరుండునై సంచరింప, వాయువేగ విధూత వేణుసంఘర్షణ సంజాతంబగు నుగ్రదావానలంబు తద్వనంబు దహింప నందు దగ్ధుండయ్యె; నంత నతని కృత్యంబులు తద్దేశవాసులగు జనంబులు సెప్ప నర్హన్నామకుండగు దద్రాష్ట్రాధిపతి విని, నిజధర్మంబులం బరిత్యజించి స్వదేశస్థులతోడం గూడి, దా నా యాచారంబుల నంగీకరించి, యధర్మ బహుళం బగు కలియుగంబున భవితవ్యతచే విమోహితుండై మనుజుల నసమంజసం బగు పాషండ మతాభినివేశులం జేసె; మఱియును గలియుగంబునందు మనుజాధములు దేవమాయా మోహితులై శాస్త్రోక్త శౌచాచారంబులు విడిచి నిజేచ్ఛం జేసి దేవతా హేళనంబులు సేయుచు, నస్నానాచమనాశౌచ కేశోల్లుంఛనాది కాపవిత్ర వ్రతంబులం జేయుచు నధర్మ బహుళం బగు కలియుగంబునం బెఱుపంబడ్డ బుద్ధి ధర్మంబులం గలిగి వేద బ్రాహ్మణ యజ్ఞపురుషుల దూషించుచు లోకంబులం దమ తమ మతంబులకుం దామే సంతసిల్లుచు నవేద మూలంబగు స్వేచ్ఛం జేసి ప్రవర్తించి యంధపరంపరచే విశ్వాసంబు సేసి తమంతన యంధ తమసంబునం బడుచు నుండుదు; రీ ఋషభుని యవతారంబు రజోవ్యాప్తులగు పురుషులకు మోక్ష మార్గంబు నుపదేశించుటకు నయ్యె; నదియునుంగాక సప్త సముద్ర పరివృతంబులగు నీ భూద్వీప వర్షంబులందలి జనంబులు దివ్యావతార ప్రతిపాదకంబు లతిశుద్ధంబులు నగు నెవ్వని కృత్యంబులు గీర్తింతురు, మఱియు నెవ్వని యంశంబున నతికీర్తిమంతుండగు ప్రియవ్రతుండు గలిగె, నెందు జగదాద్యుండగు పురాణపురుషుం డవతారంబు నొంది కర్మహేతుకంబులుగాని మోక్ష ధర్మంబులం దెలిపె, వెండియు నెవ్వండు యోగమాయా సిద్ధుల నసద్భూతంబు లగుటం జేసి నిరసించె, నట్టి ఋషభునితోడఁ దత్సిద్ధికృత ప్రయత్నుల

**నితర యోగీశ్వరులు మనోరథంబుననైన నెట్లు సరియగుదు? రిట్లు సకల వేదలోక దేవబ్రాహ్మణులకు గోవులకుం బరమ గురుండు, భగవంతుండు నగు ఋషభుని చరిత్రంబు వినినవారలకు దుశ్చ రితంబులు దొలంగు; మంగళంబులు సిద్ధించు; మిక్కిలి శ్రద్ధతోడ నెవ్వండు విను, వినిపించు, వానికి హరిభక్తి దృఢం బగు; నట్టి హరి భక్తి తాత్పర్యంబునం బెద్దలు భాగవతు లగుటం జేసి సంప్రాప్త సర్వపురుషార్థు లగుచు వివిధ వృజిన హేతుకంబగు సంసారతాపంబును బాసి యవిరతంబుఁ దద్భక్తియోగామృత స్నానంబు సేసి పరమ పురుషార్థంబయిన మోక్షంబును జెందుదురని సప్తద్వీపంబులవారు నేఁడునుం గొనియాడుచుండుదురు. 89**

* భగవంతుని అవతారమైన ఋషభుడు మనసులో దేహాభిమానాన్ని వదలుకున్నాడు. కుమ్మరివాడు సారెచక్రమును వేగంగా త్రిప్పి విడిచిపెట్టిన తర్వాతకూడా ఆ చక్రం కొంతసేవు తిరుగుతున్నట్లే, పూర్వసంస్కార విశేషంవల్ల ఆయన దేహ సంచలనం పూర్తిగా ఆగిపోదు. ఋషభుడు లింగదేహాన్ని వదలిపెట్టినా యోగమాయా వాసనల కారణంగా లౌకికంగా దేహధారిగా చరించాడు. అతడు కోంకణం, వేంకటం, కుటక పర్వత సమీపంలోని ఉపవనం చేరుకున్నాడు. అక్కడ శిలాఖండాలను నోటిలో పెట్టుకొని పిచ్చివానిలాగా జుట్టు విరియబోసుకొని దిగంబరుడై సంచరించాడు. అపుడు వీచిన సుడిగాలి విసురుకు దుమ్ము రేగింది, దుమ్ముతో కూడిన గాలికి అడవిలో నిప్పంటుకుంది. ఆనిప్పు కార్చిచ్చులాగా అడవినంతా అలముకుంది. ఆ కార్చిచ్చు మంటలలో ఋషభుడు కాలిపోయాడు. ఋషభుని చేతలను ఆ ప్రాంతంవారు చెప్పుకోగా "అర్హతుడు" అనే పేరుగల ఆ రాష్ట్రాధికారి ఆలకించాడు. అతడు స్వధర్మం వదలిపెట్టి స్వదేశస్థులతో ఆ ఆచారానికి ఆమోదం తెలిపాడు. అధర్మ బహుళమయిన కలియుగంలో భవిష్యత్తుకు లోబడి పోయి తన రాష్ట్రంలోని మానవులను అయోగ్యమయిన వేద బాహ్యమతంపట్ల మొగ్గేటట్లు చేశాడు.

కలియుగంలో అధములైన మానవులు దేవమాయవల్ల మోహితు లవుతారు. శాస్త్రాలలో ప్రవచనం చేయబడ్డ శౌచాలనూ ఆచారాలనూ వదలిపెడతారు. తమకు ఇష్టం వచ్చినట్లు దేవతలను పరిహసిస్తారు. స్నానం చేయరు. ఆచమనం అసలే లేదు. శుచిత్వం సున్న. జుట్టు గొరిగించుకొంటారు. అపవిత్ర వ్రతాలను పాటిస్తారు. అధర్మాలు పెచ్చు పెరిగిన కలియుగంలో బుద్ధి చెడిపోగా వేదాలనూ, బ్రాహ్మణులనూ, యజ్ఞ పురుషులనూ నోటికి వచ్చినట్టు అనరాని మాటలంటారు. తమ తమ అభిప్రాయాలకు తామే తెగ మురిసిపోతారు. వేదవిరుద్ధంగా ప్రవర్తిస్తారు. గుడ్డిగా వ్యాపించే దురాచారాలపట్ల నమ్మకం పెంచుకుంటారు. చివరకు అంధ తమసంలో పతన మవుతారు.

రజోగుణంతో నిండిన పురుషులకు మోక్షమార్గం ఉపదేశించడం కోసమే ఋషభుని అవతారం. ఏడు సముద్రాలతో కూడిన ఈ ద్వీపాలలోని జనులు దివ్యమైన ఎవని అవతార లీలలను కీర్తిస్తారో, ఎవడు ఎంతో కీర్తి గడించిన ప్రియవ్రతుని వంశంలో జన్మించాడో, ఎవడు లోకాలకు ఆది అయిన పురాణపురుషుడో అలాంటి ఋషభ దేవుడు భూలోకంలో అవతరించి కర్మ సంబంధం లేని మోక్షధర్మాన్ని ప్రబోధించాడు.

యోగమాయవల్ల తమకు తామై లభించిన సిద్ధులన్నిటినీ తృణీకారభావంతో తిరస్కరించాడు. అలాంటి మహావ్యక్తికి సిద్ధులకోసం ప్రయత్నించే యోగీశ్వరులు ఏ విధంగా సాటి అవుతారు?

అన్ని వేదాలకూ, అన్ని లోకాలకూ, సమస్త దేవతలకూ, బ్రాహ్మణులకూ, గోవులకూ పరమ గురువయినవాడు, భగవంతు డయినవాడు ఋషభుడు. ఆయన చరిత్రం వింటే దుశ్చరిత్రుల దురితం తొలగిపోతుంది. శుభాలు చేకూరుతాయి. ఎవరయితే ఋషభుని చరిత్రం మిక్కిలి శ్రద్ధతో వింటారో, ఎవరు ఇతరులకు వినిపిస్తారో వారికి సుదృఢమైన భక్తి లభిస్తుంది. అటువంటి హరిభక్తి పట్ల తత్పరత కలిగిన పెద్దలైన భాగవతులు హరికృపవల్ల ధర్మ, అర్థ, కామ, మోక్షాలనే పురుషార్థాలను సాధించుకుంటారు. నానావిధ పాపకారణమయిన సంసార తాపాన్ని పోగొట్టుకుంటారు. హరిభక్తి యోగమనే అమృతస్నానం చేసి పవిత్రు లవుతారు. పరమ పురుషార్థమైన మోక్షాన్ని సిద్ధింపజేసుకుంటారు. ఈ విధంగా సప్తద్వీపాలలోని జనులు నేడుకూడా ఋషభుని మహిమను పొగడుతుంటారు.

**ఆ. యాదవులకు మీకు నత్యంత కులగురు, వైన కృష్ణుఁ డెచట నైన గలఁడు;**
**కొలుచువారి కెల్ల సులభుఁడై మోక్షంబు, నిచ్చుఁ జింతసేయ నేల నీకు? 90**

* పరీక్షిన్మహారాజా! యాదవులకున్నూ, మీకున్నూ (పాండవులకు) కులగురువయిన శ్రీకృష్ణుడు ఈ చోట ఆ చోట అనకుండా అన్ని చోట్లా ఉన్నాడు. కొలిచే వారికి అతడు కొంగుబంగారమై తప్పక మోక్షం ప్రసాదిస్తాడు. నీ వే మాత్రం దిగులు పడవద్దు.

**సీ. నిత్యానుభూతమౌ నిజరూపలాభ నివృత్తమై తగు మహాతృష్ణ గలిగి**
**యతులిత విపుల మాయారచితంబైన లాభంబునకుఁ దగులంబు లేని**
**మతి గల్గి లోకుల నతి వేడ్కఁ గరుణించి యభయదానం బిచ్చి యందఱ కిల**
**నవ్యయంబై దివ్యమై మహానందమై యత్యంత సేవ్యమై యతులమైన**

**తే. తనదు లోకంబు చూపంగఁ దగిన యట్టి, మోక్షమార్గంబు నెఱిఁగించి ముక్త దేహుఁ**
**డగుచుఁ దాదాత్మ్య మొందెఁ బ్రత్యక్ష విష్ణు, వైన ఋషభుండు జనులకు నద్భుతముగ. 91**

* ఋషభదేవుడు నిత్యానుభూతమైన స్వస్వరూప లాభంవల్ల తృష్ణను నివారింపజేశాడు. యోగమాయా ప్రాప్తములైన మహాసిద్ధుల చేత ఆయన బుద్ధి ఆకర్షింపబడలేదు. ఆ మహానుభావుడు లోకులందరినీ కనికరించి అభయమిచ్చాడు. నిత్యమైనదీ, దివ్యమయినదీ, ఆనంద ప్రదమైనదీ, సేవింప దగినదీ, సాటిలేనిదీ, అయిన వైకుంఠ లోకాన్ని అందింపగల మోక్షమార్గాన్ని అందరికీ ఉపదేశించాడు. ఆ తరువాత దేహమును వదలి జనులంతా ఆశ్చర్యచకితు లయ్యేటట్లు విష్ణుమూర్తితో తాదాత్మ్యం పొందాడు. ఋషభుడు సామాన్యుడు కాడు. ఆయన సాక్షాత్తుగా విష్ణువు.

## -: భరతోపాఖ్యానము :-

**మ. భరతుం డంత ధరాతలంబుఁ గడఁకం బాలించుచున్ ధారుణీ**
**శ్వరచంద్రుండగు విశ్వరూపునకు మున్ సంజాతయై యుండి ని**
**ర్భరకాంతిన్ విలసిల్లు పంచజని పేరం గల్గు కాంతామణిం**
**గర మర్థిన్ ధరఁ బెండ్లియాడె శుభలగ్నం బందు భూవల్లభా! 92**

* పరీక్షిత్తుతో శుకుడు చెప్పసాగాడు. రాజా! ఋషభుని అనంతరం ఆయన పెద్దకుమారుడైన భరతుడు భూమండలాన్ని ఎంతో దీక్షతో పరిపాలించాడు. అతని కాలంలో విశ్వరూపుడనే రాజుండేవాడు. అతడు రాజులలో చంద్రునివంటివాడు. అతనికి 'పంచజని' అనే కుమార్తె ఉంది. ఆమె అత్యంత కాంతిమతి అయిన కాంతామణి. అటువంటి 'పంచజని' ని భరతుడు సుముహూర్తంలో కోరి పెళ్ళిచేసుకున్నాడు.

**వ. ఇట్లు వివాహితుండై యా పంచజని వలన నహంకారంబునం బంచతన్మాత్రలు జనించిన తెఱంగున సుమతి రాష్ట్ర భృత్సుదర్శనాచరణ ధూమ్రకేతువులను నేవురు పుత్రులం బుట్టించె; నటమున్న యజనాభంబను పేరం బరఁగు వర్షంబు భరతుండు పాలించు కతంబున భారత వర్షంబు నాఁ బరగె నంత. 93**

* అహంకారానికి శబ్ద, స్పర్శ, రూప, రస గంధాలనే పంచతన్మాత్రలు పుట్టినట్లు మహారాజైన భరతునికి 'పంచజని' వల్ల సుమతి, రాష్ట్రభృత్తు, సుదర్శనుడు. ఆచరణుడు, ధూమ్రకేతువు అనే అయిదుగురు కొడుకులు పుట్టారు. ఇంతకుముందు 'అజనాభ' మనే పేరుతో పిలువబడే ఈ భూభాగాన్ని భరతుడు పాలించడం వల్ల దీనికి 'భరతవర్షం'' అనే పేరు రూఢమయింది.

**క. భరతుఁడు నిజపిత లేలిన, కరణిని గర్మముల నెల్లఁగైకొని ప్రజలన్**
**హరికృప నొందుచు నేలెను, ధరణీసురవరులు వొగడ ధరణీనాథా! 94**

* మహారాజైన భరతుడు తన పూర్వులు పాలించిన విధంగానే శ్రీహరి అనుగ్రహంతో బ్రాహ్మణోత్తముల ఆశీర్వాదంతో సత్కర్మలు ఆచరిస్తూ ప్రజలను పరిపాలించాడు.

**సీ. భగవంతుఁడగు జగద్భరితు నల్పంబులు నధికంబు లైన పెక్కధ్వరముల**
**దర్శపూర్ణిమలచేఁ దగను జాతుర్మాస్యముల నగ్నిహోత్రము వలనఁ గడఁకఁ**
**బశుసోమములచేతఁ బలుమాఱుఁ బూజించి వేదోక్తమైన యా విమల కర్మ**
**ములఁ గల్గు ధర్మంబు బురుషోత్తమార్పణంబుగఁ జేయుచును మఖంబులను మంత్ర**

**తే. ములను బలికెడు నా దైవములను శ్రీశు, నవయవంబులు గాఁగ భూధవుఁడు ప్రేమ**
**ననుదినంబును బాయక ఘనత దలఁచి యఖిల రాజ్యానుసంధానుఁ డగుచు నుండె. 95**

* భరతుడు అండపిండ బ్రహ్మాండాది లోకాలను భరించే భగవంతుణ్ణి చిన్నవీ, పెద్దవీ అయిన యజ్ఞాలతో ఆరాధించాడు. అమావాస్య పూర్ణిమలలో చేసే సత్కర్మలనూ, చాతుర్మాస్యల కాలంలో చేసే

అగ్నిహోత్రాదులనూ ఆచరించాడు. ఇంకా పశుయాగాలు, సోమయాగాలు నిర్వర్తించాడు. వేదోక్తంగా నిర్వహించిన ఆ సత్కర్మ ఫలాన్ని పరమేశ్వరార్పణం చేశాడు. యాగాలలోను మంత్రాలలోను పలికే దేవతలను వాసుదేవుని అవయవాలుగా భావించాడు. ఆ మహారాజు భగవంతుని గొప్పతనాన్ని తలచుకుంటూ భక్తి మయమైన హృదయంతో శ్రద్ధతో సమస్త రాజ్యాన్ని పరిపాలించాడు.

**క. ఈ రీతిఁ గర్మసిద్ధుల, నారయ నత్యంత శుద్ధ మగు చిత్తముతో**
**నారాచపట్టి భరతుఁడు, ధారుణిఁ బాలించె నధిక ధర్మాన్వితుఁడై. 96**

* ఈ విధంగా పరిశుద్ధమయిన చిత్తంతో, ధర్మదీక్షతో, తాను చేస్తున్న కర్మలు ఫలించేలాగా రాజకుమారు డయిన భరతుడు భూమండలాన్ని ఏలాడు.

**వ. మఱియు నా భరతుడు శ్రీవత్స కౌస్తుభ వనమాలాలంకృతుండును, సుదర్శనాద్యాయుధోపలక్షితుండును, నిజభక్తజన హృదయారవింద నివాసుండును, బరమ పురుషుండును నైన వాసుదేవుని యందు నధికభక్తి ననుదినంబును జేయుచుఁ నేఁబది లక్షల వేలేండ్లు రాజ్యంబు సేసి పితృ పితామహాద్యాయాతంబగు నా ధనంబును యథార్హంబుగఁ బుత్రులకుఁ బంచి యిచ్చి బహువిధ సంపదలు గల గృహంబును బాసి పులహాశ్రమంబున కరిగె; నంత. 97**

* శ్రీవత్సం, కౌస్తుభం, వనమాల అలంకరించుకొన్నవాడూ; సుదర్శనం మొదలైన పంచాయుధాలను ధరించినవాడూ; ఆత్మీయ భక్తుల హృదయ పద్మాలలో నివసించేవాడూ, పరమపురుషుడూ అయిన వాసుదేవుని పట్ల భక్తి ప్రపత్తులతో భరతుడు యాభై లక్షల వేల సంవత్సరాలు రాజ్యపరిపాలన సాగించాడు. తాత తండ్రులకాలం నుండి తరతరాలుగా సంక్రమించిన ధనరాశిని తగినట్లు తన తనయులకు పంచియిచ్చి భోగభాగ్యాలనూ, అపార సంపదనూ, రాజసౌధాలనూ వదలిపెట్టి తాను పులహాశ్రమానికి వెళ్ళిపోయాడు.

**సీ. ఏ యాశ్రమంబున నిందిరాధీశ్వరుఁ డచ్చటివారల నాదరించి**
**ప్రత్యక్షమున నుండుఁ బాయక యెప్పుడు నట్టి రమ్యంబైన యాశ్రమమున**
**నిలిచి సాలగ్రామములు గల గండకీ నది యెందు నెంతయుఁ గదిసి యుండు**
**నచ్చోట నేకాకి యగుచును భరతుండు బహువిధ నవపుష్ప పల్లవముల**

**తే. నతుల తులసీ దళంబుల నంబువులను, గందమూలాది ఫలములఁ గంజములను**
**ఘనత నర్పించు నిచ్చలుఁ దనివిలేక, సేవ సేయుచు నుండె నా శ్రీశు హరిని. 98**

* ఆ ఆశ్రమంలో శ్రీమన్నారాయణుడు ఆశ్రమవాసులను వాత్సల్యంతో ఆదరిస్తూ ప్రత్యక్ష రూపంలో నిలిచి ఉంటాడు. సాలగ్రామాలకు ఆలవాలమైన గండకీనది ఆ ఆశ్రమ సమీపంలో ప్రవహిస్తూ ఉంటుంది. అటువంటి రమణీయమైన ఆశ్రమంలో భరతుడు ఒంటరిగా ఉంటూ శ్రీహరిని నానావిధాలైన పువ్వులతో, చిగుళ్ళతో, తులసీ దళాలతో, తీర్థ జలాలతో, కమలాలతో, కందమూల ఫలాలతో అర్చిస్తూ తనివితీరా సేవ చేస్తున్నాడు.

వ. దానం జేసి విగత విషయాభిలాషుండై శమదమాది గుణంబులు గలిగి యథేచ్ఛం జేసి యెడతెగక పరమపురుషుని పరిచర్యాభక్తి భరంబున శిథిలీకృత హృదయగ్రంథిం గలిగి సంతోషాతిశయంబునం బులకితాంగుండు, నానంద బాష్పనిరుద్ధావలోక నయనుండు నగుచు నిజస్వామియైన హరిచరణారవిందానుధ్యాన పరిచిత భక్తి యోగంబునం బరమానంద గంభీర హృదయంబను నమృత హ్రదంబున నిమగ్నుం డగుచుఁ దా నపుడు పూజించు పూజ నెఱుంగక యిట్లు భగవద్వ్రతంబు ధరియించి యేణాజిన వాసస్త్రిషవణ స్నానంబుల నార్ద్రకుటిల కపిశవర్ణ జటాకలాపంబులు గలిగి మార్తాండాంతర్గతుం డయిన పరమేశ్వరుని హిరణ్మయ పురుషునిగాఁ దలంచుచు నిట్లనియె. 99

* ఇటువంటి హరిసేవవల్ల భరతునికి విషయవాంఛలు నశించాయి. శమదమాది గుణసంపత్తి అలవడింది. పరమపురుషుణ్ణి భక్తి భావంతో ఎడతెగకుండా భజిస్తుంటే అహంకారమనే ముడి విడిపోయి ఆనందానుభూతి కలిగింది. ఆయన మేను పులకించింది. ఆయన కన్నులలో ఆనందాశ్రువులు పొంగిపొరలాయి.

ఇష్టదైవమైన పరంధాముని పాదపద్మాలను ధ్యానించడంవల్ల ప్రాప్తమైన భక్తియోగం కారణంగా ఆయన హృదయం పరమానందంతో నిండింది. ఆ ఆనందానుభవం అమృత సరోవరంలో అవగాహనం చేసినట్టుగా అనిపించింది. ఈ అనుభూతితో భరతునికి తాను చేస్తున్న పూజ కూడా తెలియనంత తన్మయత్వం కలిగించింది. ఈ విధంగా భగవంతుని సేవావ్రతంలో మునిగిపోయిన భరతుడు జింక చర్మం ధరించాడు. మంత్ర పూర్వకంగా మూడు వేళలా స్నానం ఆచరించాడు. నిత్యమూ స్నానంచేయడం మూలాన తల వెంట్రుకలు తడిసి వంపులు తిరిగి జడలు గట్టి రాగి రంగుతో మెరువసాగాయి.

మార్తాండ మండల మధ్యవర్తి అయిన పరమేశ్వరుణ్ణి హిరణ్మయ పురుషునిగా భావిస్తూ భరతుడు ఈలా ప్రస్తుతించాడు.

సీ. కర్మఫలంబులఁ గడఁక నిచ్చుచు మనో వ్యాపారమున నిట్టి యఖిలలోక
ములఁజేసి యా లోకములకు నంతర్యామి యగుచుఁ బ్రవేశించి యంత మీఁద
నానంద రూప మైనట్టి బ్రహ్మముఁ గోరు చున్న జీవునిఁ దనలోని యోగ
శక్తిచేఁ దగ ననిశంబుఁ బాలన సేయు చుండి యంతటను మర్తాండమధ్య

ఆ. వర్తి యగుచు నిట్లు వఱలుచు జగముల, యందు నుండి ప్రకృతిఁ బొంద కంత
నతుల దివ్యమూర్తియైన యానంద రూ, పమును శరణ మొందె భరతవిభుఁడు. 100

* పరమేశ్వరా! జీవులకు కర్మఫలాలను ప్రసాదించేవాడవు. కేవలం సంకల్ప మాత్రంతో ఈ లోకాలను సృష్టించావు. మరి నీవే ఈ లోకాలలో అంతర్యామివై ఉన్నావు. ఆనంద స్వరూప మయిన బ్రహ్మాన్ని అందుకోవాలనే జీవులను నీ యందలి యోగశక్తితో కాపాడుతున్నావు. సూర్య మండలం మధ్యభాగంలో ప్రకాశిస్తూ సమస్త లోకాలలో నిండి ప్రకృతికి అందకుండా ప్రకాశిస్తున్నావు- అంటూ ఆనందమయుడూ దివ్యమంగళ స్వరూపుడూ అయిన భగవానుణ్ణి భరతుడు శరణు వేడాడు.

వ. అంత నాభరతుం డొక్కనాఁ డా మహానదిం గృతాభిషేకుండయి ముహూర్త త్రయం బంతర్జలంబు లందుఁ బ్రణవోచ్చారణంబు సేయుచుండు సమయంబున నిర్భరగర్భిణియగు నొక్క హరిణి జలార్థినియై యొంటి జలాశయ సమీపంబునకు వచ్చి, జలపానంబు సేయునెడ నా సమీపంబున మృగపతి గర్జించి లోకభయంకరంబుగ నాదంబు సేయ నాహరిణి స్వభావంబున భీత యగుటం జేసి బెగ్గడిలి హరివిలోకనవ్యాకుల చిత్తయై దిగ్గన నదరి గగనంబునకు నెగిరి , యపగత తృష యగుచు నది నుల్లంఘించు నెడ నధిక భయంబునం జేసి యా గర్భంబు యోని ద్వారంబున గళితంబై జలంబులం బడియె; నా హరిణి యుల్లంఘునాది భయంబునం జేసి తత్తీరంబున నుండు గిరిదరింబడి శరీరంబుఁ బాసె; నంత నా హరిణపోతంబు జలంబులం దేలుచున్న భరతుండు గను విచ్చి చూచి కరుణార్ధ్ర చిత్తుండై మృత జనని యగు నా హరిణపోతంబును దన యాశ్రమంబునకుం గొంపోయి మిక్కిలి ప్రీతిం జేసి యుపలాలనంబు సేయుచుండఁ బోషణ పాలనప్రీణన లాల నానుధ్యానంబుల భరతునకు నాత్మనియమంబు లైన అష్టాంగయోగంబులును బరమ పురుష పూజా పరిచర్యాదులు నొక్కొక్కటిగఁ గ్రమక్రమంబునం గొన్ని దినంబులకు సమస్తంబును నుత్సన్నం బయ్యె; నంత. 101

* ఒకనాడు భరతుడు గండకీ నదిలో స్నానంచేసి మూడు మహూర్తాలకాలం నీటిలో నిలబడి ప్రణవం జపిస్తున్నాడు. అపుడు నిండు చూలాలయిన లేడి ఒకటి నీరు తాగాలని ఒంటరిగా నదీతీరానికి వచ్చింది. అదినీరు త్రాగుతుండగా ఆ నదీ సమీపంలో ఒక సింహం దిక్కులు దద్దరిల్లేటట్లు భయంకరంగా గర్జించింది. పుట్టుకతోనే భయ స్వభావం గలిగిన ఆ లేడి ఆ ధ్వనిని విని అదిరిపడింది. ఆ హరిణాంగన తత్తరపాటుతో దప్పిక తీర్చుకోకుండానే ఆకాశంవైపు అమాంతం ఎగిరి ఆవలకు ఒక్క దూకు దూకింది. అలా అకస్మాత్తుగా కలిగిన భయంతో లంఘించడంలో దాని గర్భంలోని పిల్ల జారి నదీ జలాలలో పడింది. ఆందోళనతో ఒక్కసారిగా దూకటంలో తల్లి జింక ఆ నదీ తీరంలోని కొండరాతి మీద పడి ప్రాణాలు విడిచింది. అపుడు ఆ నదీజలాలలో విలవిలలాడుతూ మునిగి తేలుతున్న లేడి పిల్లను చూచిన భరతుని హృదయం తల్లడిల్లింది. దయార్ధ్రచిత్తుడైన భరతుడు ఆ తల్లి లేని పిల్లను తన ఆశ్రమంలోనికి తీసుకొని వచ్చాడు. ఆ బాలకురంగాన్ని ఎంతో గారాబంతో సాకడం మొదలు పెట్టాడు. దానిని లాలించడం పాలించడంలో, దానిని ముద్దుగా పెంచి పెద్ద చేయడంలో ఆసక్తుడై క్రమంగా భరతుడు తన నిత్యకృత్యాలయిన అష్టాంగ యోగాలనూ, భగవంతుని పూజాకైంకర్యాలనూ మరిచిపోయాడు. క్రమక్రమంగా అతని నిత్యనైమిత్తిక క్రియాకలాపాలు ఒక్కొక్కటే మూలబడ్డాయి.

క. ఘనతపము చలన మొందుట, యును భరతుం డెఱుఁగ కాత్మయోగంబునఁ జ
యానఁ బాసె హరిణపోతముఁ, దన మదిలో నిల్పి ప్రీతిఁ దప్పక పలికెన్. 102

* తాను తపస్సుకు దూరం కావడాన్ని అతడు గుర్తించలేదు. తన ఆత్మ యోగానికి విఘ్నం వాటిల్లిందని అతడు గమనించలేదు. అస్తమానం ఆ జింకపిల్లతో ఆడుతూ పాడుతూ దానిమీది గారాబంతో తన మనస్సులో ఈలా అనుకున్నాడు.

ఉ. అక్కట! తల్లిఁ బాసి హరిణార్భక మాప్తులు లేమిఁజేసి యే
దిక్కును లేకయున్న నిటఁ దెచ్చితి, నాయెడ నీ మృగార్భకం
బెక్కుడు ప్రేమఁ జేసి చరియించుచు నున్నది; నాదు సన్నిధిన్
మక్కువ చేసి దీనిఁ గడు మన్ననలం దగఁ బ్రోతు నెంతయున్. 103

* పాపం ! ఆ జింక పిల్లకు తల్లిలేదు. ఆప్తులా అసలు లేరు. దిక్కెవ్వరూ లేని కారణం వల్ల ఈ జింక పిల్లను ఇక్కడికి తీసుకొని వచ్చాను. నే నంటే దీనికి ఎంతో ప్రేమ. నా దగ్గరే నన్నంటి పెట్టుకొని తిరుగుతుంది. అందుచేత నేను నాచేత నయినంత వరకు ఈ తల్లిలేని పిల్లను తప్పక కాపాడుతాను.

క. శరణని వచ్చిన జంతువుఁ, గరుణం గను విచ్చి చూచి కాచినఁ బుణ్యం
బరయఁగ నధికం బని మున్, కర మెఱిఁగించెను మునీంద్రగణములు ప్రేమన్. 104

* నీవే దిక్కంటూ కాళ్లబడ్డ ఏ జంతువు నయినా సరే కనికరంతో కన్నెత్తి చూచి కాపాడడం కంటే మహాపుణ్యం మరేదీ లేదని సన్మునీంద్రులు చెప్పారు.

వ. అని యిట్లు హరిణపోతంబుం దన యాశ్రమంబున నత్యాసక్తిం జేసి యాసన శయనాటనస్నాన సమిత్కుశ కుసుమ ఫల పలాశ మూలోదకాహరణ దేవపూజాజపాదుల యెడం దన యొద్దన యునిచి కొనుచు, వృక సాలా వృకాది క్రూరమృగంబుల వలని భయంబున వనంబుల వెనువెంటం దిరుగుచు నధిక ప్రణయభర పరీతహృదయుం డగుచు నతి స్నేహంబునం జేసి కొంతసేపు స్కంధంబుల వహించుచు, మఱి కొంత తడ వురంబున నుత్సంగంబున నుంచికొని లాలించుచు సంతసంబు నొందు; మఱియు నా భరతుండు నిత్య నైమిత్తికాది క్రియాకలాపంబు నిర్వర్తించు నెడ నంత నంత లేచి హరిణకుణకంబుం జూచుచుఁ గించిత్స్వస్థ హృదయుండై దాని నాశీః పరంపరల నభిసంధించుచుఁ జుంబనాదులం బ్రీతి సేయుచు నతిమోహంబునం బెంచుచుండునెడ. 105

* ఇలా భావించినవాడై భరతుండెంతో ఆసక్తితో అనురాగంతో లేడి పిల్లను సాకడం మొదలు పెట్టాడు. కూర్చున్నప్పుడు, పడుకున్నప్పుడు, ఎక్కడికయినా వెళ్ళినప్పుడు, స్నానం చేసేటప్పుడు, సమిధలు ఏరి తెచ్చుకొనేటప్పుడు, దర్భలు నీళ్ళ తెచ్చుకొనేటప్పుడు, దుంపలు త్రవ్వి తెచ్చుకొనేటప్పుడు, నీళ్ళు తెచ్చుకొనేటప్పుడు దేవతార్చన చేసేటప్పుడు చివరకు జపం చేసేటప్పుడు కూడా అతడు ఆ బాలహరిణాన్ని తన ప్రక్కనే అట్టిపెట్టుకొనేవాడు. తోడేళ్ళు, నక్కలు మొదలైన క్రూరమృగాలు జింక పిల్లను ఏం చేస్తాయో అని దాని వెనువెంట అడవులకు వెళ్ళేవాడు. రానురాను ఆ జింకపై మమకారం ఎక్కువవుతుంటే దాన్ని భుజాలపై కెక్కించుకొనే వాడు. గుండెలపై పడుకోబెట్టుకొనేవాడు. ఒడిలో చేర్చుకుని బుజ్జిగించేవాడు. నిత్యనైమిత్తిక కర్మలు ఆచరించేటప్పుడు కూడా అప్పుడప్పుడు లేచి జింక పిల్ల ఏమయిందో అని చూచేవాడు. ఆ జింకపిల్ల కనబడఁగానే మనసు కుదుటపరచుకొనేవాడు. ఒక్కొక్కప్పుడు ఆ లేడిపిల్లను దీవించేవాడు. నానాటికి ముద్దు మురిపాలతో పెంచుకుంటూ దానిమీద మోహం పెంచుకున్నాడు భరతుడు.

**చ. గురువులు వాఱి బిట్టుఱికి కొమ్ములఁ జిమ్ముచు నంత నంత డ**
**గ్గఱుచును గాలు ద్రవ్వుచు నఖంబుల గీఱుచు గాసి సేయుచున్**
**నొఱగుచు ధారణీశ్వరుని యూరువులన్ శయనించి యంతలో**
**నఱకడ యెక్కుచుం బొదలి యాడుచు నా హరిణంబు లీలతోన్. 106**

* ఆ బాలకురంగం చెంగుచెంగున పరుగులు తీస్తూ దుముకుతూ ఉన్నట్టుండి ఆ రాజర్షిని రాచుకొనేది. కొమ్ములతో గోకేది. దగ్గరికి వస్తూ కాళ్లు రాస్తూ గిట్టలతో గీకుతూ మారాం చేసేది. ఒక్కోసారి భరతుని తొడలపై హాయిగా పడుకుని చెంగుమంటూ లేచి భుజాల మీదికి ఎక్కి ఆడుకునేది.

**తే. గరిమ నీ రీతి మెల్లన కెరలు వొడిచి, చెలఁగి యాడంగ భరతుండు చిత్తమందు**
**సంతసిల్లుచునుండె నాశ్రమముఁ బాసి, హరిణడింభక మంతలో సురిఁగి చనిన. 107**

* పరీక్షిన్నరేంద్రా! ఆ జింక పిల్ల ఈ విధంగా తనపై బడి ఆట లాడుతున్నా రాజర్షి భరతుడు సంతోషించేవాడేగాని ఏ మాత్రం ఆగ్రహించే వాడు కాడు. పైగా ఎంతో మురిసిపోయేవాడు. ఇలా ఉండగా ఒకనాడు ఆ లేడిపిల్ల ఆశ్రమం విడిచి పారిపోయింది.

**వ. భరతుండంతం దన్మృగశాబకంబు గానంబడమికి వ్యాకులచిత్తుం డగుచు నష్టధనుండునుం బోలె నతిదీనుండై కరుణతోడం గూడి తద్విరహవిహ్వల మతియై దానిన తలంచుచు నతిశోకంబుతో మనంబున దుఃఖించి యిట్లనియె. 108**

* ఆ లేడిపిల్ల కనిపించక పోయేసరికి భరతునికి మనసు చెదరి పోయింది. ధనం పోగొట్టుకొన్న వానిలాగ అతడు దిగాలు పడ్డాడు. బెంగతో బాధతో మనస్సులో తహతహలాడుతూ మాటి మాటికి జింకను తలచుకొంటూ వాపోయాడు.

**తే. హరిణపోతంబ! నీకు వనాంతమందుఁ, గ్రూరమృగబాధ లేకుండఁ గోరుచుండఁ,**
**దలఁగి పోయితె యనుచుఁ జిత్తంబునందు, రాజవృషభుఁడు భరతు డారాట మొంది. 109**

* " ఓ జింకపిల్లా! అడవిలోని క్రూరమృగాల బాధ నీ కే మాత్రం లేకుండా నేను జాగ్రత్తపడ్డాను. అయినా నీవు నా కనులు గప్పి వెళ్ళి పోయావా" అంటూ భరతుడు ఎంతగానో ఆరాటపడ్డాడు.

**తే. తల్లి చచ్చిన హరిణపోతంబు వచ్చి, పుణ్య హీనుండ నగు నన్నుఁ బొంది పాసె,**
**నేమి సేయుదు? నే నింక నెట్లు గందుఁ?, జేరి యే రీతిఁ గాంచి రక్షించుకొందు? 110**

* "అయ్యో! తల్లి చచ్చిన ఈ జింకపిల్ల దురదృష్టవంతుడ నయిన నా పాలబడింది. ఇప్పుడు తప్పించుకొని పోయింది. ఇంక నేనేమి చేయాలి? అసలు ఆ జింకపిల్లను ఈ జన్మలో మళ్ళీ చూస్తానా? దాన్ని ఇదివరకు లాగా గారాబంగా కాపాడుకోగలనా?"

**క. కట్టా! యీ యాశ్రమమునఁ, బుట్టిన తృణచయము మేసి పొదలిన హరిణం**
**బిట్టట్టుఁ దిరుగు చుండఁగఁ, బట్టి మృగేంద్రుండు గొట్టి బాధించె నొకో! 111**

* "అయ్యో! ఈ ఆశ్రమంలో మొలిచిన పచ్చిగడ్డి పరకలు తిని నవనవలాడుతూ అటునిటూ తిరుగుతున్న నా లేడిపిల్లను ఏ సింహం పొట్టనపెట్టుకుందో!"

వ. **ఇట్లు భరతుండు హరిణకుణక క్షేమంబు గోరుచు నెప్పుడు వచ్చి నన్ను సంతోషపఱచు? నానా ప్రకారంబులైన తన గతులచేత నన్ను నెప్పుడానందంబు నొందించు? ధ్యానసమాధి నున్నప్పుడు నన్నుఁ గొమ్ముల గోకుచు నుండు; నట్టి వినోదంబు లెప్పుడు గనుఁగొందు? దేవ పూజా ద్రవ్యంబులు ద్రొక్కి మూర్కొనినం గోపించి చూచినం గుమారుండునుంబోలె దూరంబునకుం జని నిలిచి మరల నేఁ బిలిచిన వెనుక నిలిచియుండు; నిట్టి మెలఁకువ స్వభావంబు గలుగుట యెట్టు? లీ భూదేవి యెంత తపంబు చేసినదియో? ఏ హరిణ పాదస్పర్శంబులం బవిత్రమైన భూమి స్వర్గాపవర్గకాములైన మునులకు యజ్ఞార్హయగు నట్టి హరిణ పోతంబు నెట్లు గనుఁగొందు? నదియునుంగాక భగవంతుడగు చంద్రుండు మృగపతిభయంబున మృత జననియు, స్వాశ్రమపరిభ్రష్టంబునైన మృగశాబకంబును గొనిపోయి పెంచుచున్నవాఁడో! మున్ను పుత్ర వియోగతాపంబును జంద్రకిరణబులం బాపుదు; నిపుడు హరిణపోతంబు దన శరీర స్పర్శంజేసి చంద్రకిరణంబులకన్న నధికం బగుచుం బుత్ర వియోగతాపంబు నివర్తింపఁజేసె ననుచుం బెక్కు భంగుల హరిణ నిమిత్తంబులైన మనోరథంబుల చేతం బూర్వకర్మవశంబున యోగభ్రష్టుండగు భరతుండు భగవదారాధనంబు వలన విభ్రంశితుం డగుచు నితరజాతింబుట్టిన హరిణపోతంబు మీఁది మోహం బగ్గలం బగుచుండ నుండెనని పలికి శుకయోగీంద్రుండు మఱియు నిట్లనియె.** **112**

* ఇలా అనుకుంటూ, లేడిపిల్ల క్షేమంగా ఉండాలని భరతుడు మనసులో కోరుకుంటూ మళ్ళీ ఈ విధంగా తహతహలాడాడు. ఆ జింక పిల్ల ఎపుడు నా దగ్గరకు వచ్చి నన్ను సంతోషపెడుతుందో! నానావిధాలయిన తన నడకల హొయలుతో నన్నెపుడు మురిపిస్తుందో!

నేను ధ్యానం చేసుకొనేటప్పుడు నన్ను కొమ్ములతో గోకేదికదా! మరల ఆలాంటి మనోవినోదాలు నేనెపుడు అనుభవిస్తానో! దేవపూజకని తెచ్చిన వస్తువులను తొక్కి వాసన చూసినపుడు నేను కోపంగా చూస్తే చప్పున చిన్న బిడ్డలాగా దూరంగా పోయి, ఆ తరువాత నేను పిలువగానే మెల్లగా వచ్చి నా వెనుక నిలుచుండేది. ఇంత తెలివితేటలతో మసలుకొనే స్వభావం దాని కెలా అబ్బిందో! ఈ భూదేవి ఎంత పుణ్యం చేసుకుందో; ఇటువంటి జింక పిల్ల పాదస్పర్శవల్ల ముక్తి కాములైన మునుల యజ్ఞవాటిక కావటానికి యోగ్యత సంపాదించుకుంది.

ఇప్పు డా హరిణ శాబకం కోసం నే నెక్కడని వెదకను? తల్లిని పోగొట్టుకుందనీ, ఆశ్రమంనుండి పారిపోయి వచ్చిందనీ, జాలిపడి సింహాల నోట్లో పడకుండా భగవంతుడయిన చంద్రుడు ఆ జింకపిల్లను ఎత్తుకునిపోయి పెంచుకుంటున్నాడేమో!"

"పూర్వం నేను పుత్ర వియోగ తాపాన్ని చంద్ర కిరణాలతో శాంతింప జేసుకుండే వాణ్ణి. తర్వాత ఈ జింకపిల్ల చంద్రకిరణాలకంటే చల్లనైన తన శరీర స్పర్శతో ఆ సంతాపాన్ని పోగొట్టింది" అని హరిణ

శాబకాన్ని గురించి పరిపరివిధాలుగా భావించి పరితపించుతున్న భరతుడు యోగభ్రష్టు డయ్యాడు. భగవంతుణ్ణి ఆరాధించడం మానుకున్నాడు. మృగజాతిలో పుట్టిన జింకపిల్ల మీద మమకారం పెంచుకున్నాడు. అని శుక యోగీంద్రుడు పరీక్షిన్నరేంద్రునికి భరతుని కథ చెబుతూ మళ్లీ ఈలా అన్నాడు.

సీ. జననాథ! మున్ను మోక్షవిరోధ మని పాయఁగా రాని పుత్రాదికంబునెల్లఁ
బాసి తపస్వియై భరతుండు హరిణ శాబక పోషణంబునఁ బాలనమున
నతి లాలనప్రీణనానుషంగంబుల మూషకబిల మతిరోషమునను
సర్పంబు సొచ్చిన చందంబునను యోగ విఘ్నంబు మిక్కిలి విస్తరిల్లెఁ

ఆ. గాన నెంతవానికైనను గాలంబు, గడవ రామి నట్లు గాక పోదు
పరమమునుల కైనఁ బాయవు కర్మంబు, లొరు లనంగ నెంత? నరవరేణ్య! 113

* ఓ రాజా! పూర్వం భరతుడు ముక్తి మార్గానికి ఆటంకమనే భావనతో ఇల్లు, ఇల్లాలు, పిల్లలు మొదలైన సమస్తమూ వదలిపెట్టి తపస్వి అయ్యాడు. అయితే ఇంతలో ఒక జింకపిల్ల అతనికి తటస్థ పడింది. దానిని లాలించి పాలించాడు. బుజ్జగించడం, పెంచడంలో నిమగ్నమైనాడు. కోడెత్రాచు ఎలుక కన్నంలో ప్రవేశించినట్లు వారింప రాని విఘ్నం అతనిలో చోటుచేసుకుంది. భ్రష్టుణ్ణి చేసింది. ఎటువంటి వారికయినా విధిని దాటడం ఏమాత్రం సాధ్యం కాదు. మహర్షుల కయినా కర్మబంధాలను తప్పుకోవడం సాధ్యం కాదు; అటువంటప్పుడు సామాన్యుల సంగతి చెప్పేదేముంది.

వ. ఇట్లు భరతుండు మృగవియోగ తాపంబు నొందుచుండు నెడ నా మృగశాబకంబు సనుదెంచిన సంతసిల్లుచుండె; నంత నొక్కనాఁడు. 114

* ఈ విధంగా భరతుడు బాధపడుతున్న సమయంలో ఆ జింకపిల్ల తిరిగి వచ్చింది. దానిని చూచి భరతుడెంతో సంబరపడ్డాడు. ఇలా కొంతకాలం గడిచి పోయింది.

మ. భరతుం డల్లన నంత్యకాలము వెసం బ్రాపింపఁగా నప్పు డా
హరిణంబుం గడుభక్తిఁ బుత్రుగతి నత్యాసక్తి వీక్షింప నా
హరిణంబుం దన యాత్మలో నిలిపి దేహం బంతటం బాసి తా
హరిణీగర్భమునన్ జనించి హరిణంబై యొప్పెఁ బూర్వస్మృతిన్. 115

* భరతునికి చివరి క్షణం రానే వచ్చింది. ఆ అంత్యకాలంలో కన్నకొడుకు వైపు చూస్తున్నట్టు ఆ జింకవైపు ఆసక్తితో చూస్తూ మనసులో ఆ జింకనే భావించుకుంటూ భరతుడు ప్రాణాలు విడిచాడు. అయినా అతనికి పూర్వస్మృతి మాత్రం పోలేదు.

వ. ఇట్లు భరతుండు హరిణీగర్భంబునం బుట్టియు భగవ దారా ధన సామర్థ్యంబునం దన మృగత్వకారణంబుఁ దెలిసి కడుందాపంబు నొందుచు నిట్లనియె. 116

* ఈ విధంగా భరతుడు లేడికడుపున పుట్టినా, పూర్వజన్మంలో భగవంతుణ్ణి ఆరాధించిన పుణ్యపరిపాకం చేత తానెందుకు జింకగా పుట్టవలసి వచ్చిందో తెలుసుకుని బాధపడుతూ ఈ లాగున అనుకున్నాడు.

ఉ. రాజులు ప్రస్తుతింప సురరాజసమానుఁడనై తనూజులన్
రాజులఁ జేసి తాపసులు రాజఋషీంద్రుఁ డటంచుఁ బల్కఁగాఁ
దేజము నొంది యా హరిణ దేహమునందలి ప్రీతిఁజేసి నా
యోజ సెడంగ నేఁ జెడితి యోగిజనంబులలోన బేలనై. 117

* రాజు లందరూ నన్ను తెగ పొగిడారు. నేను దేవేంద్ర వైభవాలను తనివితీరా అనుభవించాను. నా కుమారులను రాజులుగా చేసి రాజ్యభారం అప్పగించి, అడవికి వచ్చి తపస్వినైనాను. తాపసు లందరూ నన్ను గొప్ప రాజర్షి అని గౌరవించారు. చివరకు ఒక జింకపిల్ల మీద మోహం పెంచుకుని నా గత వైభవమంతా పోగొట్టుకొని సాటి యోగులలో భ్రష్టుడ నయిపోయాను.

వ. ఇట్లు శ్రీహరి శ్రవణ మనన సంకీర్తనారాధనానుస్మరణాభియోగంబులం జేసి యశూన్య సకలయామంబగు కాలంబు గల నాకు హరిణపోతస్మరణంబు కతంబున యోగవిఘ్నంబు ప్రాప్తంబయ్యె; మోక్షదూరుండనైతి నని నిగూఢ నిర్వేదుం డగుచుఁ దల్లిం బాసి క్రమ్మఱ నుపశమశీల మునిగణ సేవితంబయి భగవత్క్షేత్రంబైన సాలతరునిబిడ తమ గ్రామసమీపపులస్త్య పులహాశ్రమంబునకుం గాలాంజన పర్వతంబు వలనఁ జనుదెంచి యందు మృగదేహత్యాగావసానంబు గోరుచు సంగంబు విడిచి యేకాకి యగుచు శుష్క పర్ణ తృణవీరు దాహారుండై మృగత్వనిమిత్తం బగు నా నదీతీర్థంబు నందు దత్తీరోదక క్లిన్నంబగుచు నుండు శరీరంబు విడిచె నని శుక యోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రునకు వినిపించి మఱియు నిట్లనియె. 118

* హరికథలను వినడం, హరిని తలచుకోవడం, హరినామ కీర్తనం చేయడం, హరిపూజలు చేయడం, హరిభక్తుల ననుసరించడం, మొదలైన సత్కర్మలలో క్షణకాలం కూడా వ్యర్థం చేయని నాకు ఈ లేడి పిల్లవల్ల విఘ్నం కలిగింది. మోక్షానికి దూరమయ్యాను అని లోలోపల మథన పడ్డాడు. ఆ తర్వాత తన జన్మకు కారణమయిన తల్లి జింకను వదలి కాలాంజన పర్వతాన్ని విడిచిపెట్టి దట్టమైన సాల వృక్షములచే నిండిన సాలగ్రామ సమీపంలో ఉన్న పులస్త్య పులహాశ్రమం చేరుకున్నాడు. ఆ ఆశ్రమంలో శాంతస్వభావులైన మునీశ్వరు లున్నారు. అది ఒక భగవత్ క్షేత్రం. అక్కడికి వచ్చి తనకు ప్రాప్తించిన హరిణ దేహాన్ని వదలిపెట్టడానికి తగిన సమయం కోసం ఎదురు చూడసాగాడు. ఎవరితోనూ సంబంధం లేకుండా ఒంటరిగా ఉండి ఎండిన ఆకులూ, గడ్డిపరకలూ, తీగదుబ్బలూ తింటూ తన జింక జన్మకు కారణ మయిన ఆ నదీ తీర్థంలోనే బ్రతుకు ముగించాలని కోరుతూ కాలం గడిపాడు. చివరకు ఆ పుణ్యనదిలో స్నానం చేస్తూనే తన హరిణ శరీరం వదలిపెట్టాడు- అని శుకయోగీంద్రుడు పరీక్షిత్తునకు చెప్పి ఆ తరువాతి వృత్తాంతం ఈలా వినిపించాడు.

సీ. హరిణ దేహముఁ బాసి యంత నాంగిర సాహ్వయుండు శుద్ధుఁడుఁ బవిత్రుండు ఘనుఁడు
శమదమఘనతపస్స్వాధ్యాయ నిరతుండు గుణగరిష్ఠుఁడు నీతికోవిదుండు

**నైన బ్రాహ్మణునకు నాత్మజుండై పుట్టి సంగంబు వలనను జకితుఁ డగుచుఁ**
**గర్మ బంధంబుల ఖండింపఁ జాలు నీశ్వరుని నచ్యుతు నజు శ్రవణ మనన**

**తే. ములను హరిచరణధ్యానములను విఘ్న, భయమునను జేసి మనమందుఁ బాయనీక**
**నిలిపి సంస్తుతి సేయుచు నిలిచి యుండె, భరితయశుఁడైన భరతుండు పార్థివేంద్ర! 119**

* మహారాజా! భరతుడు లేడి దేహాన్ని వదలిపెట్టి తరువాతి జన్మలో ఆంగిరస గోత్రుడైన ఒక బ్రాహ్మణునికి కుమారుడుగా పుట్టాడు. ఆ బ్రాహ్మణుడు పవిత్రుడు. సద్వంశ సంభవుడు. శమదమాది గుణ సంపన్నుడు. తపోనిరతుడు. వేదాధ్యయనం చేసేవాడు. సుగుణ గరిష్ఠుడు. నీతి కోవిదుడు. అటువంటి బ్రాహ్మణునికి భరతుడు పుత్రుడుగా జన్మించాడు. పుట్టినది. మొదలు సంసార బంధాలకు దూరంగా ఉన్నాడు. కర్మ బంధాలను త్రెంపి వేసేవాడూ, సర్వేశ్వరుడూ, అచ్యుతుడూ, జననం లేనివాడూ అయిన విష్ణుమూర్తి పాదాలను నిరంతరం ధ్యానిస్తూ ఆయన కథలను ఆలకిస్తూ మళ్లీ ఎటువంటి ఆటంకమూ రాకుండా ఆయనను సంస్తుతిస్తూ యశోభరితుడైన భరతుడు కాలం గడప సాగాడు.

**వ. ఇట్లాంగిరసుండు ప్రథమభార్యయందుఁ బుత్రనవకంబును, గనిష్ఠ భార్యయందు స్త్రీపురుషుల నిద్దఱను గలుగం జేసిన నందుఁ బురుషుండు పరమ భాగవతుండును రాజర్షి ప్రవరుండును నుత్సృష్ట మృగశరీరుండను జరమశరీరంబునం బ్రాప్తవిప్రశరీరుండును నగు భరతుండయ్యె; నతం డా జన్మంబున నన్యజన సంగంబు జన్మపరంపరలకుఁ గారణం బని యత్యంత భయంబు నొంది కర్మబంధ విధ్వంసన శ్రవణస్మరణాదుల శ్రీహరి యనుగ్రహంబునం బూర్వజన్మపరంపరల సంస్మరించుచుఁ దన స్వరూపంబు నున్మత్తజడాంధబధిర రూపంబుల లోకులకుం జూపుచుండె, నంత. 120**

* ఆ బ్రాహ్మణునికి ఇద్దరు భార్యలు. పెద్ద భార్యకు తొమ్మిది మంది పుత్రులు పుట్టారు. చిన్న భార్యకు ఒక కుమార్తె, ఒక కుమారుడు జన్మించారు. ఆ చిన్న భార్య కుమారుడే మన భరతుడు. పరమ భాగవతుడూ, రాజర్షిపుంగవుడూ అయిన భరతుడు తన హరిణ శరీరాన్ని పరిత్యజించి ఈ జన్మలో బ్రాహ్మణుని ఇంట జన్మించాడు. ఇతరులతోడి సాంగత్యం జన్మపరంపరలకు కారణ మౌతుందని భయపడిన భరతునికి శ్రీహరి అనుగ్రహంవల్ల పూర్వజన్మ స్మృతి కలిగింది. అందువల్ల అతడు బంధవిముక్తి కోసం ఉన్మత్తుడుగా, జడుడుగా, అంధుడుగా, చెవిటి వాడుగా లోకులకు కనిపిస్తూ జీవితం గడుపుతున్నాడు.

**మ. జనకుండాంగిరసుండు నాత్మజుని వాత్సల్యంబునం బెంచుచుం**
**దనరం జౌలముఖాగ్ర్య కర్మముల చేతన్ సంస్కృతుం జేసి పా**
**యని మోహంబున నిచ్చలుం గడఁక శౌచాచారముల్ సెప్పినన్**
**ఘనుఁ డా భాగవతుం డసమ్మతిని దత్కర్మంబులం గైకొనెన్. 121**

* భరతుని తండ్రి చిన్న కుమారుణ్ణి ఎంతో గారాబంగా పెంచాడు. పుట్టు వెంట్రుకలు తీయించడం మొదలైన సంస్కారాలు చేయించాడు. కుమారునిమీద ఉన్న అనురాగాతిశయంతో నిత్యమూ శౌచసదాచారాలు నేర్పాడు. అవి ఏ మాత్రం తనకు ఇష్టం లేకున్నా భరతుడు విధేయతతో వాటిని నేర్చుకున్నాడు.

వ. ఇట్లు బ్రాహ్మణకుమారుండు గర్మంబులయందు నిచ్ఛలేక యుండియును బితృనియోగ నిర్బంధంబునం బితృసన్నిధి యందు యసమీచీనంబుగా వ్యాహృతి ప్రణవ శిరస్సహితం బగునట్లు గాయత్రీ మంత్రోపదేశంబు నొంది చైత్రాది చతుర్మాసంబుల సమవేతంబుగ వేదంబుల నధ్యయనంబు సేయుచుండె; జనకుండాత్మజుని శిష్టాచారంబుచే శిక్షింపవలయు నను లోకాచారంబు ననువర్తించి యాత్మభూతుండగు నాత్మజునందు నభినివేశిత చిత్తుం డగుచు శౌచాచమనాధ్యయన వ్రత నియమగుర్వనల శుశ్రూషణాదికంబుల ననభియుక్తంబు లయినం బుత్త్రునిచే నొనరింపించుచు నప్రాప్తమనోరథుం డయ్యె; నంత. 122

* బ్రాహ్మణ కుమారుడయిన భరతునికి కర్మలంటే ఏ మాత్రం ఆసక్తి లేకపోయినా, బోధించేవాడు తండ్రి కావడం వల్ల వాటిని పాటించడం తప్పనిసరి అయింది. తండ్రి దగ్గర ప్రణవం వ్యాహృతులతో కూడిన 'గాయత్రి' మంత్రోపదేశం పొందాడు. ప్రతి సంవత్సరం తప్పకుండా చైత్ర, వైశాఖ, జ్యేష్ఠ, ఆషాఢ మాసాలలో ఇతరులతో కలిసి వేదాధ్యయనం చేశాడు. తండ్రి కుమారునకు శిష్టాచారం నేర్పాలనే లోకాచారం మేరకు తన కుమారుడైన భరతునికి అతని తండ్రి శౌచవిధి, ఆచమనవిధి, అధ్యయనవిధి, వ్రతవిధి మొదలైన నియమాలను అగ్ని ఆరాధనం గురు శుశ్రూషవంటి సత్కార్యాలను నేర్పాడు. అయినా కుమారునికి వాటిపట్ల అభినివేశం లేకుండటం గుర్తించి తన ప్రయత్నం యావత్తూ వ్యర్థమయిందనీ, తన కోరిక నెరవేరలేదనీ నిరాశ పడ్డాడు.

క. ఈ రీతిని గొడుకున కా, చారంబులు గఱపి చింత సద్గ్రహమున సం
సారి యగుచుండి విప్రుడు, బోరన దేహంబుఁ బాసి పోయినమీఁదన్. 123

* ఈ విధంగా తన తనయునికి సదాచారాలు నేర్పే ప్రయత్నం చేసి కొంతకాలం సంసార జీవితం సాగించి ఆంగిరస గోత్రజుడైన ఆ విప్రుడు ఆకస్మికంగా పరలోకగతుడైనాడు.

ఆ. తల్లి తండ్రితోడఁ దా నగ్నిఁ జొచ్చిన, నతని మహిమ లెఱుఁగ కంతలోన
సవతి తల్లి కొడుకు లవినీతు లగుచును, శాస్త్రవిద్య లతనిఁ జదువనీక. 124

* తండ్రి చనిపోగానే తల్లి భర్తతో సహగమనం చేసింది. సవతి తల్లి కొడుకులు అవినీతిపరులు. అందుచేత వారు భరతుని గొప్పతనాన్ని తెలుసుకోలేకపోయారు. వారు భరతుని శాస్త్రాదులు కూడా చదువనీయలేదు.

వ. ఇట్లు బ్రాహ్మణకుమారుని సవతితల్లి కొడుకులు వేద విద్యల వలనం బాపి గృహకర్మంబుల నతని నియమించిన. 125

* ఈ విధంగా తండ్రి మరణానంతరం సవతి తల్లి కొడుకులు భరతుణ్ణి వేదవిద్యలు చదువనీయకుండా ఇంటి పనులు చేయమని శాసించారు.

;



**క. ధరణీసురోత్తముఁడు దా, నరుదుగఁ దమవారు సెప్పినవి యెల్లను నే**
**మఱ కందుఁ బ్రీతిసేయక, నిరతము గృహకర్మ మట్లు నెఱపుచు నుండెన్. 126**

* అయినా భరతుడు వారు చెప్పిన పనులను ఏ మాత్రం కాదన కుండా, పనులలో ఏమాత్రం ఏమరుపాటు లేకుండా చేస్తున్నాడు. అయితే ఆ పనులపట్ల అతనికి ఆసక్తి మాత్రం లేకపోయింది.

**వ. ఇట్లు గృహకర్మ ప్రవర్తనుం డగుచు నుండ మూఢులగు ద్విపాత్పశువులచే నున్మత్తజడబధిర యని యూహాయమానుం డగునపుడు తదనురూపంబులగు సంభాషణంబుల నొనర్చుచుఁ బరేచ్ఛాయదృచ్ఛలం జేసి విష్టివేతన యాచ్ఞాదులవలన నియుక్త కర్మంబులం బ్రవర్తించుచు. 127**

* భరతుడు ఇంటిపనులన్నీ చెప్పినట్లు చేస్తున్నాడు. నీచ స్వభావులూ మూర్ఖులూ పశుప్రాయులూ అయిన జనులు భరతుని చిత్తవృత్తిని తెలుసుకోలేక "ఒరే పిచ్చివాడా! మొద్దూ! చెవిటివాడా" అని గద్దించే వారు, ఈసడించుకునేవారు. భరతుడుకూడా అందుకు తగినట్టు వారితో సంభాషించుతూ తలవంచుకొని వారి ఆజ్ఞమేరకు నడచుకునేవాడు. బరువులు మోసేవాడు. కూలిపని చేసేవాడు. బిచ్చమెత్తేవాడు. ఈలాగు భరతుడు కాలం గడపసాగాడు.

**తే. అతుల మృష్టాన్నమైనఁ గదన్నమైన, నెద్ది వెట్టిన జిహ్వకు హితముగానె**
**తలఁచి భక్షించుఁగా; కొండు దలఁచి మిగులఁ, బ్రీతి సేయఁడు రుచులందుఁ బెంపుతోడ. 128**

* షడ్రసోపేతమైన అన్నం పెట్టినా, పాసిపోయిన అన్నం పెట్టినా కాదనకుండా ఒకే విధంగా స్వీకరించేవాడు. అదీ ఇదీ కావాలని రుచుల కోసం అర్రులు సాచేవాడు కాడు.

**వ. మఱియు నా విప్రుం డాత్మనిత్యానంద సుఖలాభంబు గలిగి సుఖదుఃఖంబులందు దేహాభిమానంబు సేయక శీతోష్ణ వాత వర్షాతపంబులకు నోడి పై చీరగప్పక వృషభంబునుం బోలెఁ బీనుండును గఠినాంగుండును నగుచు స్థండిలశాయియై రజఃపటలంబునం గప్పంబడిన దివ్యమాణిక్యంబునుం బోలె ననభివ్యక్త బ్రహ్మవర్చసుండై మలినాంబర పరీతకటితటుండు నతి మషీలిప్త యజ్ఞోపవీతుండు నగుటం జేసి యజ్ఞజనంబు లతండు బ్రాహ్మణాభాసుండు మందుండునని పలుక సంచరించుచుండం గర్మమూలంబునం బరులవలన నాహారంబు గొనునపుడు దమవారును వ్యవసాయకర్మంబునందు నియమించిన క్షేత్ర విహిత సమవిషమ న్యూనాధికంబుల నెఱుంగక ప్రవర్తిల్లుచు నూఁక తవుడు తెలికపిండి పొట్టు మాఁడు ద్రబ్బెడ యాదిగాఁ గల ద్రవ్యంబుల యందు నమృతంబు పగిది రుచిసేసి భక్షించుచుం జేని కావలి యుండునెడ నొక్కనాఁడు. 129**

* భరతుడెప్పుడూ ఆత్మానుభూతి పొంది ఆనందంగా ఉండేవాడు. అతనికి సుఖదుఃఖాలు తెలియవు. దేహంపై ఏ మాత్రం శ్రద్ధలేదు. చలి, వేడి, గాలి, వానలకు భయపడేవాడు కాదు. ఒంటిమీద బట్ట కప్పుకునేవాడు కాదు. ఆబోతులాగా బలసి గట్టిపడిన దేహంతో వట్టి కటిక నేలపై పడుకునేవాడు. మట్టి గొట్టుకున్న మాణిక్యంలాగా ప్రకాశిస్తూ బ్రహ్మవర్చస్సుతో కనిపించే వాడు. ఒక్కొక్కసారి మాసిన బట్టలతో, మడ్డిపట్టిన యజ్ఞోపవీతంతో తిరిగేవాడు. ఆలాంటి వాణ్ణి చూచి అజ్ఞాను లైనవారు వీడు వేషానికి బ్రాహ్మణుడు గాని

వట్టి పనికిమాలిన మొద్దని అనుకునేవారు. ఏదయినా పనిచేసి గాని భరతుడు ఊరక ఇతరులనుండి స్వీకరించేవాడు కాడు.

ఇదంతా చూచి సవతి తల్లికొడుకులు కొంతకాలం అతనికి పొలం పనులు అప్పజెప్పారు. అయినా ఆ పనులేవీ అతనికి తెలియవు. మంచివా చెడ్డవా, చిన్నవా పెద్దవా అనే ఆలోచన లేకుండా చెప్పిన పనులు చేసేవాడు. అతని సోదరులు నూకలు, తవుడు, తెలికపిండి, ఊక, పొట్టు, మాడు చెక్కలు- ఏవి పెట్టినా వద్దనకుండా తినేవాడు. వాటిని అమృతంలాగా భావించుతూ ఆప్యాయంగా భక్షించుతూ పొలానికి కాపలా కాస్తుండేవాడు.

### -: వృషల రాజభృత్యులు కాళిబలికి భరతునిఁ గొంపోవుట :-

క. పురిలోన వృషలపతి దా, నరుదుగ సంతాన కాముఁడై వేడుకతోఁ
పురుషుఁడగు పశువుఁ గాళికిఁ, దఱుముక కొనిపోవఁ బశువు దలఁగిన భృత్యుల్. 130

* భరతుడు కాపలా కాస్తున్న పొలానికి దగ్గర్లో ఒక నగరం ఉంది. ఆ నగరానికి నాయకుడైన భిల్లరాజుకు పిల్లలు లేరు. అందు చేత ఆయన కాళికాదేవికి నరబలి ఇవ్వడం కోసం ఒక మనుష్యుణ్ణి వెంట బెట్టుకొని పోతున్నాడు. అయితే మార్గమధ్యంలో ఆ బలిపశువు తప్పించుకుని పారిపోయాడు. సేవకులు వాని కోసం గాలించారు.

ఆ. అరసి కానలేక యా రాత్రి వీరాస, నమునఁ జేనికాపు విమల బుద్ధి
నున్న విప్రయోగి నొయ్యనఁ బొడగాంచి, పశువు మంచి దనుచుఁ బట్టి రతని. 131

* ఆ రాత్రి ఎంత వెదకినా ఆ వ్యక్తి కనబడలేదు. చేలో ఒక చోట వీరాసనం వేసికొని పొలానికి కావలి కాస్తున్న బ్రాహ్మణ కుమారుడు భరతుడు భటులకు కన్పించాడు. నరబలికి తగిన పశువు దొరికిందికదా అని భటులు ఆ బ్రాహ్మణ యోగిని పట్టుకున్నారు.

క. ఆ రీతిని భూసురవరు, నారయ నా కాళికాగృహమునకు భృత్యుల్
బోరనఁ గొని చని సల్పిరి, చారుత రాభ్యంజనాది సంస్కారంబుల్. 132

* ఆ సేవకులు ఆ బ్రాహ్మణ శ్రేష్ఠుని వెంటనే కాళికాలయానికి గొనిపోయారు. బాగా తలంటిపోశారు.

వ. ఇట్లభ్యంజనాది కృత్యంబులు దీర్చి నూతన వసనంబు గట్టనిచ్చి గంధపుష్పాభరణాక్షతాలంకృతునిం జేసి మృష్టాన్నంబులు భుజియింపంబెట్టి ధూపదీప మాల్యలాజకిసలయాంకుర ఫలోపహారాదులు సమర్పించి పంచ మహావాద్య ఘోషంబులతోడ నా పురుషపశువుం గాళికాదేవి సమ్ముఖంబున నాసీనుం గావించి యా వృషలపతి పురుషపశువు రక్తంబున భద్రకాళి సంతోషపెట్టం దలంచి కాళికామంత్రాభి మంత్రితంబు నతికరాళంబు నైన ఖడ్గంబంది నిజాభీష్ట సిద్ధికి హింసింపం దలంచిన. 133

* ఈ విధంగా భరతుణ్ణి అభ్యంజనస్నానం చేయించి కొత్తబట్టలు కట్టించారు. ఒంటినిండా గంధం పూశారు. మెడనిండా పూలదండలు చుట్టారు. ఆభరణాలు అలంకరించారు. అక్షతలు చల్లారు. విందు భోజనం పెట్టారు. అమ్మవారికి ధూపం వేశారు. దీపం వెలిగించారు. పుష్పమాలలు, పేలాలు, చివుళ్ళు, పండ్లు, ఉపహారాలు సమర్పించారు. డప్పులు డోళ్ళు, తప్పెటలు మ్రోగించారు. బలిపశువును కాళికాదేవికి ఎదురుగా కూర్చోపెట్టారు. భిల్లరాజు నరబలితో వేడిరక్తంతో అమ్మవారిని సంతోషపెట్ట తలచాడు. కాళికా మంత్రంతో పవిత్రమై భయంకరమయిన కత్తి పట్టుకుని తన కోరిక నెరవేరడం కోసం భరతుణ్ణి నరికి బలివ్వటానికి సిద్ధమయ్యారు.

**సీ. సర్వభూతములకు సఖుఁడును బ్రహ్మభూతాత్ముఁడు నిర్వైరుఁ డయిన బ్రహ్మ**
**సుతుని తేజం బంతఁ జూడ దుస్సహమైన భయమంది వడఁకుచు భద్రకాళి**
**క్రోధంబు ముమ్మడి గొనఁగ హుంకారంబు సలుపుచు నట్టహాసంబు సేసి**
**పాపాత్ములును దౌష్ట్యపరులును రాజస తామస కర్మ సంధాను లగుచు**

**తే. విప్రవరు నట్లు హింసించు వృషలపతిని, భృత్యవర్గంబుతోఁ దలల్ పృథ్విఁ గూల్చి**
**యవుడు వృషలాధిపుని శిరమంది లీలఁ, బాడి యాడుచు నందంద క్రీడ సలిపె. 134**

* భరతు డే మాత్రం తొణకలేదు. బెదరలేదు. అతడు పరబ్రహ్మ స్వరూపుడు. సర్వజీవరాసులకు మిత్రుడయినవాడు. ఎవరిపట్ల కూడా వైరభావం లేనివాడు. అటువంటి బ్రాహ్మణోత్తముడైన భరతుని తేజస్సును చూడలేక కాళికాదేవి భయపడింది. వెంటనే కాళికాదేవి ముప్పిరి గొన్న క్రోధంతో కంపించిపోతూ హుంకారంతో వికటాట్టహాసం చేసింది. పాపాత్ములూ, దౌష్ట్యానికి తలపడినవారూ, రజోగుణ తమోగుణాల ప్రేరణలతో బ్రాహ్మణహింసకు పూనుకున్న వారూ అయిన ఆ బోయరాజు మీదా అతని పరిచారకుల మీదా విజృంభించింది. వారి శిరస్సులు నేలకూల్చింది. నాయకుడైన భిల్లరాజు శిరస్సు చేతపట్టుకుని ఆడుతూ పాడుతూ ఆనంద తాండవం చేసింది.

**క. ధరలోన నెవ్వరేనియు, ధరణీసురవరుల కెగ్గు దగఁ దలఁచిన వా**
**రరయఁగఁ జెడుదురు, నిక్కము, హరి ధరణీసురవరేణ్యులం దుండుటచేన్. 135**

* విప్రులలో అంతర్యామిగా విష్ణువు ఉంటాడు. కనుక లోకంలో ఎవరయినా సరే బ్రాహ్మణులకు అపకారం తలపెడితే వారే తప్పక చెడిపోతారు.

**వ. మఱియును. 136**

**ఉ. అచ్చట విప్రసూనుఁడు భయం బొకయించుక లేక చంపఁగా**
**వచ్చిన వారియందుఁ గరవాలమునందును గాలియందుఁ దా**
**నచ్యుత భావ ముంచి హృదయంబునఁ బద్మదళాక్షు నెంతయున్**
**మచ్చికతోడ నిల్పి యనుమానము నొందక యుండె నత్తఱిన్. 137**

* తన్ను చంపడానికి వచ్చినవారన్నా, మరి జళిపించి పై కెత్తిన కత్తి అన్నా, సాక్షాత్కరించిన కాళికాదేవి అన్నా బ్రాహ్మణకుమారు డయిన భరతునికి ఏ మాత్రం భయం కలుగలేదు. అన్నిట్లోనూ, అందరిలోనూ అచ్యుత భావమే ఆయనకు తోచింది. శ్రీమన్నారాయణుని చిత్తంలో నిలుపుకొని ఏలాంటి అనుమానం లేకుండా నిశ్చలంగా భరతుడు నిలబడ్డాడు.

**వ. మఱియు నా విప్రవరుండు చండికాగృహంబు వెలువడి క్రమ్మఱం జని కావలి యుండు నెడ.138**

* తర్వాత బ్రాహ్మణవరుడైన భరతుడు కాళికాలయం వదలిపెట్టి మరల పొలం దగ్గరికి వచ్చి ఎప్పటిలాగా కాపలా కాస్తున్నాడు.

**సీ. అంతటఁ గొన్ని హాయనములు సన సింధు భూపాలనము సేయు భూవరుండు**
**ధీరత నిక్షుమతీ తీరమున నున్న కపిల మహామునిఁ గాంచి తత్త్వ**
**విజ్ఞాన మెఱిఁగెడు వేడ్క తోడుత శిబికారోహణము సేసి యరుగుచుండ**
**నాలోన నా శిబికావహు లా చేనఁ గాపున్న విప్రునిఁ గాంచి తెచ్చి**

**తే. శిబిక మోపింత మీతని చేత ననుచుఁ, బట్టి మూఁపునఁ బల్లకిఁ బెట్టి మోవు**
**మనుచు మోపించునంత ధరామరుండు, శిబిక మూఁపున నిడి యందుఁ జింత లేక. 139**

* ఇలా కొన్ని సంవత్సరాలు గడిచిపోయాయి. ఒకసారి సింధుదేశాన్ని పరిపాలించే "రహూగణు" డనే రాజుకు "అధ్యాత్మ విద్య" తెలుసుకోవాలని బుద్ధి పుట్టింది. అందువల్ల ఇక్షుమతీనదీ తీరంలోని కపిల మహామునిని దర్శించడానికి పల్లకి ఎక్కి బయలుదేరాడు. పల్లకి మోసే బోయీలు పొలానికి కావలి ఉన్న భరతుణ్ణి చూశారు. పల్లకీ మోయటానికి వీడు చాలా బలంగా ఉన్నాడు అని అనుకున్నారు. భరతుని తీసుకొని వచ్చి ఒకవైపు పల్లకి బొంగును అతని భుజంమీద పెట్టారు. అయినా భరతుడు ఎదురు చెప్పకుండా చీకూచింతా లేకుండా మోస్తున్నాడు.

**క. తన మనసు కొలఁది నప్పుడు, మునుకొని యట్ల ప్రయత్నమున నడవఁగ నా**
**జనపతి నిమ్నోన్నతమై, చనుట యెఱిఁగి శిబిక మోయు జనులకు ననియెన్. 140**

* అలవాటులేని భరతుడు మనసుకు తోచినట్టు మామూలు ప్రకారం నడుస్తున్నాడు. కాని పల్లకి సరైన పద్ధతిలో సాగడం లేదు. అందువల్ల తక్కిన బోయీల నడకతో అతని నడక కుదరలేదు. పల్లకి ఎగుడు దిగుడుగా ఊగుతుంటే రాజు బోయీలను చూచి ఈలా అన్నాడు.

**ఆ. మీర లిప్పు డిచటఁ జేరి మిక్కిలి ప్రయ, త్నంబుతోడఁ దగిలి నడుచుచుండ**
**విషమ మగుచు గమన వేగంబు నను బాధఁ, బెట్టుచున్న దనిన బెస్త లనిరి. 141**

* "మీ రేమో ఎంతో శ్రమ తీసుకుని పల్లకి మోస్తున్నారు. కాని మీ నడకలలో కుదురు కనిపించడం లేదు. మీ ఎగుడు దిగుడు నడకవల్ల కుదుపు ఎక్కువై నాకు బాధగా ఉన్నది." అని అనగానే బోయీలు రాజు గారికి ఈలా సమాధాన మిచ్చారు.

**వ. దేవా! యీ విషమగమనంబు మావలన నైనది గా; దీ తురీయవాహకుండు సుఖగమనంబుగా నడువ నేరండు; వీనితోడ మేమును నడువనేర మనిన రహూగణుండను నా రాజుపాసితవృద్ధజనుండైనను బలాత్కారంబునం బుట్టిన కోపంబునం గోపించి విమర్శ దప్పి నీఱు గప్పిన నిప్పునుం బోలె నెఱుంగ రాని బ్రహ్మతేజంబు గల బ్రాహ్మణునికిం గంటకంబుగా నిష్ఠురవాక్యంబుల నిట్లనియె. 142**

* "మహాప్రభూ! ఈ ఎగుడుదిగుడు నడక మాది కాదు. ఈ నాల్గవ బోయీవాడు సరిగా నడవడం లేదు. వీనితో పాటు మేము సరిగా నడవలేకున్నాం" అన్నారు. ఆ మాటలు వినగానే సింధురాజయిన రహూగణునికి ఉన్నట్టుండి కోపం కట్టలు తెంచుకొని ప్రవహించింది. అతడు మంచివాడే . పెద్దలను సేవించినవాడే. అయినా కోపాన్ని దిగమింగు కోలేకపోయాడు. నివురుగప్పిన నిప్పులాగా కనిపించని బ్రహ్మతేజస్సుతో ఉన్న బ్రాహ్మణుని చూచి పరుషవాక్కులతో ఇలా గద్దించాడు.

**చ. అలసితి, వెంతయున్ ముసలి, వాఁకట డస్సితి, వెన్ను మిక్కిలిం**
**బలుచన యున్న దీ శిబిక భారము; దూరము మోసి తేగతిన్**
**నిలిచెద? వంచు భూవరుఁడు నిష్ఠురముల్ దగఁ బల్క నా యెడం**
**బలుకక మోసె నా శిబిక బ్రాహ్మణవర్యుఁడు పార్థివేశ్వరా! 143**

* "ఓయీ! నీవు బాగా అలసిపోయావు. పైగా ముసలివాడివి. పాపం! ఆకలితో నకనకలాడుతున్నావు. నీ వెన్నెముక చాల పలుచగా ఉంది. ఈ పల్లకి ఏమో బరువయింది. ఎంతో దూరం మోశావు. ఎలా నిలబడగలుగుతున్నావో"! అని రాజు ఎత్తి పొడుపుగా మాట్లాడినా బ్రహ్మణకుమారుడైన భరతుడు ఏమీ బదులాడకుండా పల్లకిని అలా మోస్తూనే ఉన్నాడు.

**వ. అప్పు డావిప్రవరుండు దనకుం గడపటిదియగు కళేబరంబునందు నహంకార మమకారంబులం బొరయక మిథ్యాజ్ఞాన రహితుండై బ్రహ్మభూతుండై మౌనవ్రతంబున నా శిబిక మోయు చున్న విషమగమనంబుఁ జూచి యతికుపితుం డగుచు నా భూవరుండు వెండియు నిట్లనియె. 144**

* భరతునికి ఇదే తన కడపటి జన్మమని తెలుసు. అందువలన అహంకార మమకారాలకు మనసులో అవకాశం ఇవ్వలేదు. పైగా అతడు జ్ఞాని, పరబ్రహ్మస్వరూపుడు. అందుచేత ఏమీ ఎదురు చెప్పక మౌనంగా పల్లకిని మోస్తూనే ఉన్నాడు. పల్లకి యథాతథంగా ఎగుడు దిగుడుగా పోతూ ఉంటే రహూగణుడు పిచ్చి కోపంతో ఈలా అరిచాడు.

**సీ. ఓరి దుర్మద! విన రోరి జీవన్మృత! నా యాజ్ఞఁ దప్పించి నడిచె దీవు,**
**ఈ వక్రమార్గంబు లిన్నియు విడిపించి నడపింతు నిన్ను సన్మార్గమందు**
**నని రాజగర్వాంధుఁ డగుచు గుణత్రయంబున వృద్ధిఁ బొందిన భూవరుం డ**
**బద్ధ ప్రలాపముల్ పల్కఁ చుండినఁ జూచి శమదమాదులచేఁ బ్రశస్తుఁ డగుచు**

**తే. జగతి బ్రహ్మస్వరూపమై సకల భూత, ములకు నత్యంత హితుఁడైన భూసురుండు**
**యోగి వర్తన దెలియ లేకున్న రాజు, నంత వీక్షించి యల్ల ని ట్లనుచుఁ బలికె. 145**

* ఓరీ! పొగరుబోతా! నడపీనుగా! నేను చెప్పింది అసలు వినిపించుకోకుండా నడుస్తున్నావు. నీ కుంటి నడకలను వదిలించి సరి అయిన మార్గంలో నడిపిస్తాను అని అధికారమదంతో తమోగుణ ప్రకోపంతో కారుకూతలు కూశాడు. అపుడు శమదమాది గుణసంపన్నుడూ, బ్రహ్మస్వరూపుడూ, సమస్త జీవరాసుల హితం కోరేవాడూ అయిన ఆ బ్రాహ్మణుడు యోగుల స్వభావం బొత్తిగా తెలియని ఆ రాజును చూచి ఈలా అన్నాడు.

## -: భరతుండు రహూగణుని మాటలకుఁ బ్రత్యుత్తరంబు లిచ్చుట :-

**వ. నరేంద్రా! నీవు సెప్పినది సత్యంబు; భారం బీ శరీరంబునకే కాని నాకుం గలుగనేర; దైనను స్థౌల్యకార్శ్యంబులు వ్యాధులు నాధులు క్షుత్తృష్ణలు నిచ్ఛావిరోధభయంబులు జరామరణంబులు రోషనిద్రా జాగరణంబులు నహంకార మమకార మదశోషణాదులును దేహంబు తోడన జనియించుంగాని నాకుం గలుగనేరవు; జీవన్మృతుండ నేన కా దాద్యంతంబులు గలుగుటం జేసి యందఱియందును గలిగియుండు; స్వామిభృత్య సంబంధంబులు విధికృతంబు లగుచు వ్యవహారంబులం జేసి శరీరంబులకుం గలుగుంగాని జీవునికి లేక యుండు; నదియునుం గాక రాజాభిమానంబున నీవు నన్నాజ్ఞాపించెద వేనియుం బ్రమత్తుండవైన నీకుం బూర్వస్వభావం బెట్లుండె నట్లుగాక యే నేమి సేయుదు? నెఱింగింపు; మున్మత్తమూకాంధ జడులుంబోలె సహజ స్వభావంబునుం బొందిన నా యందు నీ శిక్షయేమి లాభంబుఁ బొందింప నేర్చు? నదియునుంగాక స్తబ్ధుండు మత్తుండునైన నాకు నీ శిక్ష వ్యర్థంబగు నని పలికి యుపశమ శీలుండైన మునివరుండు పూర్వకర్మ శేషంబునం గల్గు భారవాహకత్వంబుం దలంగం ద్రోయుటకు భారంబు వహించి శిబిక మోచుచుం జనునెడ నా రాజవల్లభుండు దత్త్వజ్ఞానాపేక్షితుండై చనియెడి వాఁడగుటం దన హృదయ గ్రంథి విమోచకంబులును బహుయోగ గ్రంథ సమ్మతంబులును నగు బ్రాహ్మణవాక్యంబులును విని యా శిబిక దిగ్గన డిగ్గ నుఱికి యా విప్రునికి సాష్టాంగదండ ప్రణామంబు లాచరించి సర్వగర్వవర్జితుండై ముకుళితహస్తుం డగుచు నిట్లనియె. 146**

* ఓ రాజా! నీవు చెప్పింది ముమ్మాటికి నిజం. బరువు శరీరానికే గాని నాకే మాత్రం కాదు. మనిషి బలిసి పోవడం చిక్కిపోవడం, శరీరానికి మనసుకూ సంబంధించిన జబ్బులు, ఆకలి దప్పులూ, ఇష్టపడడం, ద్వేషించడం, భయపడడం, వార్ధక్యం, మరణం, రోషం, నిద్ర, మెలకువ, అహంకార మమకారాలు, మదమాత్సర్యాలు దేహంతో పుడుతాయి. కాని నాకు లేవు. జీవన్మృతుడను నేను మాత్రమే కాదు. జనన మరణాలు కలిగిఉన్న వారందరూ జీవన్మృతులే. యజమాని సేవకుడు అనే సంబంధం కర్మవల్ల కలిగినది. కనుక అది శరీరానికే గాని జీవునికి సంబంధించినది కాదు. 'నేను రాజును కదా' అనే అభిమానంతో నీవు నన్ను ఆజ్ఞాపించావు. అంటే నీవు మదోన్మత్తుడవై ఉన్నావన్నమాట. అది నీ వెనుకటి స్వభావం గాని మరేం కాదు. అందుకు నేనేం చేయగలను? పిచ్చివాడూ, మూగవాడూ, గుడ్డివాడూ, తెలివిలేనివాడూ, ఎంతో నేనూ అంతే. అందుచేత నన్ను శిక్షించడంలో నీకు కలిగే లాభం ఏమీ లేదు. అంతే గాకుండా జడుడనూ మత్తుడనూ అయిన నాకు శిక్ష విధించిన నీ శ్రమ వ్యర్థం." ఇలా పలికి శాంతస్వభావు డయిన ఆ మునిశ్రేష్ఠుడైన భరతుడు

పూర్వకర్మఫలాన్ని అనుభవించక తప్పదనే భావంతో దండె వదలిపెట్టకుండా ఎప్పటిలాగే పల్లకిని మోయసాగాడు. శాస్త్ర సమ్మతాలైన బ్రాహ్మణుని వాక్యాలను రాజు విన్నాడు. ఆ మాటలు తత్త్వజ్ఞానాపేక్షతో పోతున్న ఆ రాజేంద్రుని హృదయానికి సూటిగా తగిలాయి. అతనిలోని అహంకారం తొలగింది. ఆ రాజు వెంటనే పల్లకి నుండి దిగాడు. బ్రాహ్మణునికి సాష్టాంగ దండ ప్రణామం చేశాడు. వినయ వినమ్రుడై చేతులు జోడిస్తూ ఈలా అన్నాడు.

**సీ. ధరణీసురులలోనఁ దలఁప నెవ్వఁడవు నీ వవధూతవేషివై యవని యందు**
**నేమిటికై చరియింపంగ వచ్చి? తిచ్చటికి నొక్కఁడ వొంటి ననుట నేఁడు**
**ననుఁ గృతార్థునిఁ జేయ ననుకూలుఁ డగుచున్న యట్టి యా కపిల మహామునీంద్రుఁ**
**డవొ? నీ మహత్త్వంబు దవిలి విచారింప నెఱుఁగక చేసితిఁ; గరుణఁ జూడు**

**తే. తప్పు సైరింపు; నే యమదండమునకు, హరుని శూలంబునకును వజ్రాయుధమున**
**కనల చంద్రార్క ధనదశస్త్రాస్త్రములకు వెఱవ విప్రుని కే మది వెఱచినట్లు. 147**

* "నీవు సామాన్య బ్రాహ్మణుడవు కాదు. అవధూతలా కనిపిస్తున్నావు. అయితే ఎందుకు ఈ వేషంలో ఒంటరిగా తిరుగుతున్నావు? నన్ను ధన్యుణ్ణి చేయడం కోసం దయతో వచ్చిన కపిల మహామునీంద్రుడవు కావు గదా! నీ మహిమలు తెలుసుకోలేక నేను అపచారం చేశాను. నన్ను దయతో చూడు. నా తప్పును క్షమించు. నేను బ్రాహ్మణునకు భయపడినట్లు యమధర్మరాజు కాలదండానికి గానీ, శివుని శూలాయుధానికి గానీ, ఇంద్రుని వజ్రాయుధానికి గానీ, అగ్ని చంద్ర సూర్య వరుణుల శస్త్రాస్త్రాలకు గానీ ఏ మాత్రం భయపడను సుమా!

**వ. మఱియు నిస్సంగుండవయి జడుడుంబోలె నిగూఢ విజ్ఞానంబు గలిగి చరియించుచు నున్న వాఁడవు; నీ వచనంబులు యోగశాస్త్ర సమానంబులై వాఙ్మనసంబులకు నభేద్యంబులయి యున్నవే; నవ్విష్ణుకళావతీర్ణుండు సాక్షాద్ధరియునగు కపిలమహామునివలన బ్రహ్మవిద్య దెలియంగోరి చనుచున్నవాఁడ; నీవు లోక నిరీక్షణార్థం బవ్యక్తలింగుండవై చరియించుచున్న కపిల మహామునీంద్రుండవు గాఁబోలుదువు; మందుండైన గృహస్థుండు యోగీశ్వర చరిత్రంబు లెట్టు లెఱుంగనేర్చుఁ? గర్మవశంబున దృష్టంబై శ్రాంతి వహించుచు నడుచుచున్న యీ యాత్రమంబు నాకునుంబోలె నీకు నగునని తోఁచుచున్న; దది యెట్లనిన ఘటంబు లేక జలంబు దేనేరని తెఱంగున లేనిది గలుగ నేరదు; గావునం బ్రమాణమూలం బయిన లోకవ్యవహారంబు సత్పథంబున సమ్మతంబై యుండుటం జేసి నీ వాడు వాక్యంబులు నాకు సమ్మతంబు గానేర వని సింధు దేశాధీశ్వరుండు వినిపించిన నా విప్రుండు లోక వ్యవహారంబునకు నిత్యత్వం బౌపాధికం బగుఁ గాని నిత్యంబు గా నేరదని దృష్టాంత నిదర్శనంబుగా నిట్లనియె. 148**

* నీవు కోరికలు లేనివాడవై కూడా పైకి జడునివలె కనిపిస్తున్నావు. నిగూఢమయిన విజ్ఞాన రహస్యాలు నీకు తెలిసినట్టే ఉంది. నీ మాటలు యోగశాస్త్రాలలోని వాక్యాలకు దీటుగా ఉన్నాయి. నీ వాక్యాలు వాక్కుకు గాని మనసుకుగాని విడదీయడానికి వీలు లేనట్టుగా ఉన్నాయి.

నే నిపుడు విష్ణుదేవుని అంశతో అవతరించినవాడూ, సాక్షాత్ విష్ణు స్వరూపుడూ అయిన కపిలమహాముని వల్ల బ్రహ్మవిద్యోపదేశం పొందాలని వెళుతున్నాను. నీవు లోకులను పరీక్షించడంకోసం, ఇతరులు గుర్తించడానికి వీలులేని ఆకారంలో తిరుగుతున్న సాక్షాత్ కపిల మహామునీంద్రుడవే అనుకుంటున్నాను. మూర్ఖుడైన నా వంటి గృహస్థుడు మీ వంటి యోగీశ్వరుల చరిత్రలను ఎలా తెలుసుకోగలుగుతాడు? ఈ గృహస్థాశ్రమం బాదరబందీ నాకు లాగా నీకు ఉన్నట్టుంది. కుండ లేకపోతే నీరు తీసుకురావడం కుదరదు. అందువల్ల అసలు లేనిది అనుభవానికి రానేరాదు. ప్రమాణాలనుబట్టి "లోకవ్యవహారాన్ని నమ్ముతున్నాము. అందువల్ల నీ మాటలు నాకు సరిపడుటలే దనిపిస్తున్నది" అని సింధుదేశమునకు అధిపతి యయిన రహూగణుడు అన్నాడు. ఆ మాటలు విని బ్రాహ్మణ కుమారుడైన భరతుడు లోకవ్యవహారంలోని నిత్యత్వం ఉపాధిపై ఆధారపడి ఉంటుందే గాని అది సత్యం కానేకాదు" అని ఉదాహరణాలతో ఈలా విశదీకరించాడు.

**సీ. పావన శిఖలచే భాండంబు దాఁ దప్త మగుఁ; దప్తఘటముచే నందు నున్న**
**జలము తపించు; నా జలముచేఁ దండులంబులు తప్తమొంది యప్పుడు విశిష్ట**
**మైన యన్నం బగు; నా చందమునను దా దేహేంద్రియంబులఁ దెలివితోడ**
**నాశ్రయించుక యున్న యట్టి జీవునకు దేహంబునఁ బ్రాణేంద్రియాదికమున**

**ఆ. జరుగుచుండు నిట్లు సంసారఘట శిక్ష, రక్షకుండు నయిన రాజు దుష్ట**
**కర్మములకుఁ బాసి కంజాక్షపద సేవఁ, జేసెనేని భవముఁ జెందకుండు. 149**

* అగ్ని జ్వాలలతో కుండ కాలుతుంది. కాలిన కుండ కారణంగా అందులో పోసిన నీరు వేడెక్కుతుంది. ఆ నీటిలో వేసిన బియ్యపు గింజలు బాగా ఉడికి పక్వమయి అన్నం సిద్ధమవుతుంది. అలాగే దేహాన్నీ ఇంద్రియాలనూ ఆశ్రయించుకుని జీవుడున్నాడు. దేహం లోనే ప్రాణం ఇంద్రియాలు ఉన్నాయి. అందువల్ల దేహేంద్రియాలకు సంబంధించిన వన్నీ జీవునకూ సంక్రమిస్తాయి.

ప్రజల శిక్షణ, రక్షణల కోసం రాజున్నాడు. ఆ రాజు చెడు కర్మలు వదలిపెట్టి విష్ణుపాదాలను సేవిస్తే, సంసార బంధాలనుండి విముక్తు డవుతాడు.

**ఆ. అనుచు ధారుణీసురాత్మజుఁ డీ రీతిఁ, బలుకుటయును రాజు పరిణమించి**
**వినయవాక్యములను వినుతించి క్రమ్మఱఁ, బుణ్యుఁడైన సింధు భూవరుండు. 150**

* బ్రాహ్మణ కుమారుడయిన భరతుడు ఈలా పలుకగానే రాజులో మార్పు కలిగింది. ఆ తరువాత వినయోక్తులతో స్తుతించి భరతునితో సింధురాజు ఈలా అన్నాడు.

**వ. మహాత్మా! నేను రాజు ననియెడి యభిమాన మదాంధుండనై మహాత్ములం దిరస్కరించిన నన్నుం గరుణింపుము; నీ వార్త బంధుండవు; నీ కృపాదృష్టింజేసి మహాత్ముల నవమానంబు సేసిన**

**దురితంబువలన విముక్తుండ నయ్యెద. విశ్వసుహృత్త వైన నీకుం గోపంబు గలుగనేర; దసమర్థు లయిన మాబోఁటి వారలు మహాజనావమానంబున శీఘ్రంబె నశింతురు; గావున నీవు దయాళుండ వయి నన్ను మన్నింపు మనిన నా విప్రుం డిట్లనియె. 151**

* మహాత్మా! నేను రాజుననే దురహంకారంతో కన్నులు గానక మహాత్ముడవైన నిన్ను తిరస్కరించాను. అపరాధినైన నన్ను కరుణించు. నీవు నా వంటి దీనులకు దగ్గరి చుట్టానివి. నీవు నాపై నీ కృపాకటాక్ష వీక్షణం ప్రసరింపజేస్తే, మహాత్ములను అవమానం చేసిన పాపం నుండి నేను విముక్తుణ్ణి అవుతాను. నీవు లోకానికి ఆప్తమిత్రుడవు. అందువల్ల నీకు అసలు కోపమనేదే ఉండదు. మేము ఏమీ చేతగాని వాళ్ళం గొప్ప వారిని అవమానించడమనే పాపకర్మవల్ల తొందరగా వినాశనం కొని తెచ్చుకుంటాము. అందువల్ల దయాదృష్టితో నన్ను క్షమించు'' అని క్షమాభిక్ష వేడిన రాజును జూచి బ్రాహ్మణుడైన భరతుడు ఈలా అన్నాడు.

**క. కడువేడ్క నీ వవిద్వాం, సుఁడవై యుండియును మిగులఁ జోద్యము విద్వాం**
**సుఁడుఁ బోలెను బలికెద వి, ప్పుడు మే లనవచ్చుఁ గొంత పురుషులలోనన్. 152**

* "నీవు విద్వాంసుడవు కావు. అయినా విద్వాంసునిలాగా మాట్లాడుతున్నావు. ఇది చాలా చిత్రంగా ఉంది. అయినా నిన్ను కొంత మెచ్చుకోవచ్చు.

**ఆ. పరఁగఁ బెద్ద లీ ప్రపంచమంతయుఁ దథ్య, మనరు; నీవు తథ్య మనుచుఁ బలికి;**
**తట్లుగాన నిన్ను నధికుండ వని పల్క, రాదు నాకుఁ జూడ రాజచంద్ర? 153**

* "రాజచంద్రా! పెద్ద లెవరుగాని ఈ ప్రపంచం సత్యమని చెప్పరు. అయితే నీవు సత్య మంటున్నావు. వ్యవహార సత్యం అసలు సత్యం కాదు. అందువల్ల నీ ఆధిక్యాన్ని అంగీకరించడానికి వీలులేదు.

**సీ. యజ్ఞాదికములందు నామ్నాయములయందుఁ దఱచుగాఁ దత్త్వవాదంబు లేదు**
**స్వప్నంబులందుల సౌఖ్యమాకారంబు నందుల నిత్యమై యంతలేని**
**యట్టి చందమున వేదాంత వాక్యంబులు తత్త్వంబు నెఱిఁగించి తలఁగుఁగాని**
**నిత్యంబులై యుండనేరవు; పురుషుని చిత్తంబు గుణములఁ జెంది యెంత**

**తే. కాలముండును మరి యంత కాలమందు, నరయ విజ్ఞాన కర్మేంద్రియముల చేత**
**మరగి ధర్మంబులను నధర్మంబులట్లు, దగిలి పుట్టించుచుండు నత్యంత మహిమ. 154**

* యజ్ఞాల్లోగానీ, వేదాలలో గానీ, స్వస్వరూప స్థాపనమనేది లేదు. కలలో అనుభవించిన సౌఖ్యాలకు ఆకారాలు ఉన్నాయి. కలలో అవి సత్యాలే. అయితే మెలకువలో అవి అసత్యాలు. అలాగే వేదాంత వాక్యాలనేవి తత్త్వస్వరూపం అనుభవమయ్యే వరకూ సత్యాలుగా భాసిస్తాయి. కాని అవి నిత్యాలుకావు. జీవుని చిత్తం ఎంతకాలం త్రిగుణాలతో కూడి ఉంటుందో అంతకాలం జ్ఞానేంద్రియాలతోను, కర్మేంద్రియాలతోనూ సన్నిహితత్వం కలిగి ఉంటుంది. ఈ అలవాట్లు ధర్మాలో, అధర్మాలో మనసులో పుడుతుంటాయి.

వ. మఱియు ధర్మాధర్మ వాసనాయుక్తంబు విషయానురక్తంబునైన చిత్తంబు గుణ ప్రవాహంబులచేత వికారంబు నొంది దేవతిర్యఙ్మనుష్యరూపంబు లయిన దేహంబులం బుట్టించుచుఁ గాల ప్రాప్తంబులైన సుఖదుఃఖ తదుభయ ఫలంబుల ననుభవించుచు ననవరతంబు జీవునికిం బ్రత్యక్షం బగుచు స్థూల సూక్ష్మరూపంబుల నుండు; స్వాంతంబు గుణరహితంబైన ముక్తి కారణంబగు; ఘృతవర్తులు గల దీపంబు సధూమశిఖలం బుట్టించు; ఘృతవర్తులు నాశంబు నొందిన స్వరూపంబుఁ బొందు; నీ తెఱంగున మనంబు గుణకర్మానుబంధంబైన జన్మాదులం బుట్టించు, గుణకర్మంబులం బాసెనేనిం బరతత్త్వంబు నొందు; జ్ఞానేంద్రియంబు లేనును విషయంబుల మీఁదఁ దోఁచు; బుద్ధు లేనును నభిమానంబు నను నేకాదశవృత్తులం గూడిన మనంబు జీవుని నసంఖ్యంబు లయిన జన్మంబులం బొందించు; మనోవృత్తుల నతిక్రమించిన జీవుండు పరంజ్యోతియైన నారాయణ స్వరూపంబుగా నెఱుంగుము; స్థావర జంగమంబు లయిన జీవులకుం బవనుండు ప్రాణంబై యున్న చందంబున నీశ్వరుండు సర్వభూతాంతర్యామి యగుచు జీవాత్మ స్వరూపంబున నుండు; జీవాత్ముండు జ్ఞానోదయంబునం జేసి మాయ నెంత కాలంబు గెలువకుండు నంతకాలంబు ముక్తసంగుండు గాఁ; డరిషడ్వర్గంబును జయించి పరతత్త్వంబు నెఱింగిన నీశ్వరుం డగుఁ; జిత్తం బెంతకాలంబు విషయాసక్తం బగు నంతదడవు సంసారచక్రంబునందు సంచరించుం గావున మహావీరుం డయినను దనకు శత్రువైన మనంబు నప్రమత్తుండయి యుపేక్షా బుద్ధిఁజేసి యిచ్ఛా విహారంబున జరగనీక పరమగురుండైన శ్రీహరి చరణోపాసనాస్త్రంబునం జిత్తంబు గెలిచినం బరతత్త్వంబు నొందునని విప్రుండు పలికిన నతని మహిమకు వెఱఁగంది బ్రాహ్మణునకు నమస్కారంబు సేయుచు భూవరుం డిట్లనియె. 155

* మనసుకు ఒక సంస్కారం ఉంది. ఆ సంస్కారం ధర్మ, అధర్మాల రూపంలో ఉంటుంది. ఆ మనస్సు ఇంద్రియ వ్యసనాలపట్ల అనురక్తి కలిగి ఉంటుంది. సత్త్వ రజస్తమోగుణాల ప్రవాహాలతో వికారం పొందుతుంది. ఈ సంస్కారాన్ని బట్టి జీవుడు దేవతలు, జంతువులు, మానవులు అనే రూపాలను ధరిస్తుంటాడు. అటువంటి దేహాలలోని మనస్సు ఆయా కాలాలలో ప్రాప్తించే సుఖ దుఃఖఫలాలను అనుభవిస్తూ జీవునికి ఎల్లప్పుడూ ప్రత్యక్షమవుతూ స్థూలసూక్ష్మ రూపాలతో ఉంటుంది.

మనసు గుణరహిత మయినపుడు కలుగు అనుభవమే ముక్తి. నేతిలో వత్తులు పెట్టి దీపం వెలిగిస్తే పొగలతో కూడిన జ్యోతి పుడుతుంది. నేయీ వత్తీ రెండూ లేకపోతే స్వస్వరూపాన్ని పొందుతుంది. అలాగే గుణకర్మాల సంబంధం కలిగిన మనస్సు ఆయా గుణాలకూ, కర్మలకూ తగిన జన్మలకు కారణమవుతుంది. గుణాలూ, కర్మలూ అసలు లేకపోతే మనసు అనేదే ఉండదు. కేవలం పరతత్త్వంగా మిగులుతుంది.

జ్ఞానేంద్రియాలు ఐదు. ఇంద్రియార్థాలమీద పనిచేసే ప్రజ్ఞలైదు. అభిమానం అనే పదుకొండున్నూ, మనసుకు ఏర్పడే వృత్తులు . ఈ పదకొండు వృత్తులతో కూడిన మనస్సు, ఈ జీవునికి లెక్కలేనన్ని జన్మలను కలిగిస్తుంది. పైని చెప్పిన మనోవృత్తులను దాటిన జీవుడు పరంజ్యోతి అయిన నారాయణ స్వరూపమే అవుతాడు. చరములూ అయిన జీవులకు వాయువు ప్రాణంగా ఉన్నట్టు, ఈశ్వరుడు అన్ని ప్రాణులలోను ఉంటూ జీవాత్మ స్వరూపుడుగా గోచరించుతాడు. మనస్సు ఎంతకాలం ఇంద్రియలంపటత్వంలో

సంచరింపక తప్పదు. అందుచేత మహావీరుడయిన వా డెవ్వడైననూ తనకు శత్రువయిన మనోవృత్తులపట్ల ఏ మాత్రం ఏమరుపాటు లేకుండా ఉండాలి. మనస్సును తోచినట్లు తిరుగనీయరాదు. జీవుడు శ్రీహరి పాదధ్యానమనే ఆయుధంతో మనస్సును గెలిచినట్లయితే పరతత్త్వాన్ని అందుకుంటాడు'' - అని బ్రాహ్మణుడయిన భరతుడు పలుకగానే, అతని మహిమకు ఆశ్చర్యపడి అతనికి నమస్కారం చేసి రాజయిన రహూగణుడు ఈలా అన్నాడు.

**ఉ. కారణ విగ్రహంబు నురుకాయము నీ యవధూతవేషమున్**
**భూరిధరామరత్వమును బూర్వసమాగమ మాత్మభావముం**
**జారువిహార మత్యతుల శాంతి గుణంబును గూఢవర్తనం**
**బారయఁగల్గు నీకు ననయంబును మ్రొక్కెదఁ బెక్కుభంగులన్. 156**

* కారణ జన్మమయిన ఈ నిండైన విగ్రహం ఈ అవధూత వేషం, ఈ బ్రాహ్మణత్వం, జన్మాంతర సమాగతమైన ఈ ఆత్మజ్ఞానం, ఈ స్వేచ్ఛా విహారం, సాటిలేని ఈ శాంతగుణం, ఈ విధమైన రహస్య ప్రవర్తనం కలిగిన నీకు సదా నమస్కరిస్తున్నాను.

**మ. జ్వరితార్తుండగు రోగి కౌషధ మతీష్టంబైన చందంబునన్**
**ధరలో నాతపతప్త దేహి గడు శీతంబైన తోయంబునున్**
**గరిమం గోరినరీతి నెంతయు నహంకారాహి దష్టుండనై**
**పరఁగున్ నాకును నీ వచోఽమృతము దప్పన్ మందు వేఱున్నదే? 157**

* జ్వరంతో బాధపడే రోగికి రుచికరమయిన మందు దొరికినట్టు ఎండలో తపించిన వానికి చల్లని నీరు సమకూరినట్లు, అహంకారమనే పాముకాటుకు గురి అయిన నాకు నీ మాటలనే అమృతం ప్రాప్తించింది. ఇంతకంటే నాకు ఇంకో మందు ఏమి కావాలి?

**ఆ. విప్రవర్య! నేను వేడ్కతో నా సంశ, యంబులెల్ల నిన్ను నడిగి తెలియఁ**
**దలఁచి యున్నవాఁడఁ; దప్పక యెఱిఁగింపు, ముచితవృత్తిఁ దత్త్వయోగమెల్ల. 158**

* బ్రాహ్మణ శ్రేష్ఠుడా! నా సందేహ లన్నిటినీ నివారించుకోవాలని కుతూహలపడుతున్నాను. దయచేసి నాకు అధ్యాత్మ తత్త్వాన్ని సమగ్రంగా వివరించు.

**వ. అని యడిగిన యా రాజునకు విప్రుం డిట్లనియె. 159**

* ఈ విధంగా అడిగిన రాజుతో భరతుడు ఇలా అన్నాడు-

**తే. కానవచ్చిన ఫలములు కర్మమూల, ము లగుటను జేసి సంసారములను జిత్త**
**మెపుడు వర్తించుచుండఁగా నెఱుఁగలేవు, తత్త్వయోగంబు మిగుల నిత్యం బటంచు. 160**

* రాజా! పూర్వ జన్మలలో చేసిన కర్మలను బట్టే ఫలితాలు కలుగుతుంటాయి. ఆ ఫలితాలనే మానవుడు ఈ జన్మలో తన యుక్తి శక్తుల వల్ల కలిగాయని భావిస్తుంటాడు. మనస్సు సంసారబంధంలో చిక్కుకొని ఉన్నంత వరకు తత్త్వయోగం నిత్యమైనదని తెలుసుకోలేవు.

**వ. మఱియు నీ వసుంధర నున్న చరణంబులకు నెక్కుడు జంఘలు నా మీఁద జానువులా పొడవున నూరువు లందులకు నుపరిప్రదేశంబున మధ్యం బట మీఁద నుర మందులకు నెక్కువ కంఠం బఁట మీఁద స్కంధం బందుల దారు వా దారువున శిబిక శిబిక యందు రాజు ననియెడి యభిమానంబు గలిగి నీ వున్న వాఁడ విట్టి శోచ్యులై కష్టదశం బొందిన జనుల దయలేక నిగ్రహించి నీవు ప్రజాపాలనంబు సేయుచున్నవాఁడ; వను గర్వంబున మా వంటి మహాత్ముల సభలలోనం బూజ్యుండవుగాక యున్నవాఁడ; వీ స్థావరజంగమంబులకు నివాసస్థానంబు వసుంధరయైన చందంబున సత్క్రియలచేత నెఱుంగం దగిన జగత్కారణంబైన తత్త్వంబు నెఱింగించెదఁ; బరమాణు సముదయం బీ ధరిత్రియైన చందంబున నవిద్యామనంబులచేతం గల్పితంబయిన కృశస్థూల బృహ దణుసద సజ్జీవాజీవ ద్రవ్య స్వభావాశయ కాలనామబుద్ధి రూపంబైన మాయచే జగత్తు రెండవదియై కల్పింపంబడియె; బాహ్యాభ్యంతరంబులం గలిగి స్వప్రకాశంబై భగవచ్ఛబ్ద వాచ్యంబును విశుద్ధంబును బరమార్థంబును జ్ఞానరూపంబునునైన బ్రహ్మం బొకటియే సత్యంబు; జగత్తసత్యం బగు నని పలికి మఱియును. 161**

* ఈ భూమి ఆధారంగా నా పాదాలు ఉన్నాయి. పాదాలకు పై భాగంలో పిక్కలు, ఆ పైన మోకాళ్లు, ఆ పైన తొడలు, ఆ పైన నడుము, ఆ పైన వక్షం, ఆ పైన కంఠం, ఆ దాపున మూపు, ఆ మూపుపైన పల్లకి బొంగు ఉన్నది. ఆ బొంగు ఆధారంగా పల్లకి ఉన్నది. పల్లకిలో నీవున్నావు. నేను రాజుననే అహంకారం నీలో ఉన్నది. కష్టపడే వారిని చూచి వారిపట్ల దయ చూపడం మాని వారిని బెదరించి, పీడించి ప్రజాపాలనం చేస్తున్నావు. 'నేను పరిపాలిస్తున్నాను, ఇతరు లందరు నాచేత పరిపాలింపబడుతున్నా'' రనే అహంకారం నీ కుండడం వల్ల మావంటి వారున్న సభలలో నీకు పూజ్యత లేదు.

ఈ సమస్త జీవరాసులకు భూమి నివాసస్థానం. అందువల్ల ప్రపంచ సృష్టికి కారణమయిన తత్త్వం తెలియజేస్తున్నాను. ఈ భూమి పరమాణువుల సమూహంతో ఏర్పడింది. అవిద్య మనస్సుల కలయికచే ఈ జగత్తు పుట్టింది. ఈ అవిద్య కారణంగా జగత్తు రెండవది అయింది. ఇట్లొకటి రెండుగా కల్పింపబడడం మాయ. ఈ కల్పన అనేక విధాలు, సన్నము లావు, పెద్దది చిన్నది, ఉన్నది లేనిది. ఇట్లే జీవుడు, ద్రవ్యము, అణు భేదాలూ, నామ భేదాలు, బుద్ధి భేదాలున్నూ, లోపల వెలుపల అనే భేదాలు కలిగిందీ, తనంతట తాను ప్రకాశించేదీ, భగవంతుడనే మాటతో పిలుపబడేదీ, పరిశుద్ధ మయినదీ, జ్ఞానరూప మయినదీ బ్రహ్మమొకటే సత్యం; జగత్తు అసత్యం అని విశదీకరించి మరల భరతుడు ఈలాగున అన్నాడు.

**సీ. ధరలోన బ్రహ్మంబుఁ దపమున దానంబు లను గృహధర్మంబులను జలాగ్ని**
**సోమసూర్యులచేత శ్రుతులచే నైనను బరమ భాగవతుల పాదసేవఁ**

**బొందిన మాడ్కిని బొందంగ రాదని పలుకుదు రార్యులుఁ బరమమునులు**
**ఘనతపోబాహ్య సౌఖ్యములకు విముఖులు నైపుణ్యులు హరిగుణానువాద**

**తే. మోదితాత్ములు నగు బుధపాదసేవ, ననుదినంబును జేసిన నంత మీఁద**
**మోక్ష మార్గంబునకును బద్మాక్షునందుఁ, బట్టువడి యుండు నెప్పుడుఁ బరఁగ బుద్ధి. 162**

* పరమ భాగవతుల పాదసేవవల్ల లాభించనంత సులభంగా పరబ్రహ్మ తపస్సువల్లగానీ, దానంవల్లగానీ, గృహస్థాశ్రమ ధర్మం వల్లగానీ, స్నానాలవల్లగానీ, హోమాలవల్ల గానీ, సూర్య చంద్రోపాసనం వల్లగానీ, వేదాధ్యయనం వల్లగానీ లభించదు. భగవద్భక్తుల చరణ సేవయే పరబ్రహ్మప్రాప్తికి సులభమార్గం అని ఆర్యులంటారు. బాహ్య సౌఖ్యాలకు విముఖులై శ్రీమన్నారాయణుని సద్గుణ కీర్తనలో సంతోష మనుభవించే భాగవతులను అనుదినమూ ఆరాధించితే మన బుద్ధి మోక్షమార్గంవైపు పయనిస్తుంది. నారాయణుని యందు నెలకొంటుంది.

**వ. నరేంద్రా! యేను పూర్వంబున భరతుండను రాజును; సర్వసంగపరిత్యాగంబు సేసి భగవదారాధనంబు సేయుచు మృగంబుతోడి స్నేహంబు కతన మృగంబనై పుట్టియు నందును హరిభక్తి దప్పకుండిన కతంబున నిప్పుడు మనుష్యుండనై మనుష్య సంసర్గంబును బాసి యేకాకినై చరియుంచుచున్నవాఁడ; నరుండు వృద్ధసంసేవం జేసి సంసారమోహంబును బాసి హరిధ్యాన కథలచే లబ్ధజ్ఞానుండై పుండరీకాక్షునిం బూజించుచుం బరలోకంబునుం బొందునని పలికి విప్రుండు మఱియు నిట్లనియె. 163**

* నరేంద్రా! నేను పూర్వజన్మలో భరతుడనే రాజును. నేను సర్వసంగ పరిత్యాగం చేశాను. తరువాత భగవంతుని భక్తితో భజించాను. చివరకు ఒకానొక జింకపిల్లమీద మమత పెంచుకొన్నాను. ఆ కారణంగా లేడిగా జన్మమెత్తాను. అయితే ఆ జన్మలో కూడా హరిభక్తి విడనాడలేదు. ఆ పుణ్యవిశేషంతో నాకు మరల మానవజన్మ లభించింది. నేను సర్వసంగ పరిత్యాగినై ఇపుడు ఒంటరిగా తిరుగుతున్నాను. నరుడయినవాడు పెద్దలను సేవించడం వల్ల క్రమంగా సంసారం మీది వ్యామోహాన్ని వదలిపెడతాడు. శ్రీహరిని సదా ధ్యానించడం వల్లనూ, శ్రీహరి కథలు వినడం వల్లనూ అతడు జ్ఞానవంతు డవుతాడు. చివరకు శ్రీమన్నారాయణుని పూజిస్తూ పరమపదం చేరుకొంటాడు అని పలికి పరమభాగవతుడైన భరతుడు మరలా ఈ లాగున అన్నాడు.

**సీ. ధరణీశ! మాయచేతను దాఁటఁగా రాని పథమునఁ బెట్టంగఁ బడ్డ జీవుఁ**
**డెలమిమై గుణకర్మములఁ జేయుచును లాభ మాశించి తిరుగు బేహారి మాడ్కి**
**ఫల మపేక్షించుచుఁ బాయక జీవుండు సంసారగహన సంచారి యగుచు**
**నవవరతము నుండు నా మహావనమందుఁ గామలోభాది తస్కరులు గూడి**

**తే. ధరణి విజితేంద్రియుఁడు గాని నరునిఁబట్టి, ధర్మ మనియెడి యా మహాధనము నెల్ల**
**నరసి కొనిపోవుచుండుదు రనుదినంబుఁ, గాన సంసారమందు నాకాంక్ష వలదు. 164**

* భూపాలా! మాయ వల్ల దృఢమైన సంసార బంధాలలో బంధింపబడిన జీవుడు ప్రయోజనం ఆశించిన వర్తకుని లాగా లాభదృష్టితో కర్మలు ఆచరిస్తూ సంచరిస్తాడు. సంసారం ఒక పెద్ద అడవి వంటిది.

ఆ అడవిలో కామం, లోభం మొదలైన దొంగలు తిరుగుతుంటారు. ఆ తస్కరులు ఇంద్రియాలను జయించలేని మనిషిని చుట్టుముట్టి పట్టుకొంటారు. వాడు దాచుకున్న ధర్మమనే మహాధనాన్ని దోచుకు పోతారు. అందువల్ల సంసారం పట్ల కోరికలు పెంచుకోకూడదు.

**క. అరయఁగ సంసారాటవిఁ, దరలక యీ పుత్త్రమిత్త్ర దారాదు లనం**
**బరఁగుచు నుండెడు వృకములు, పరువడి నరబస్తములను భక్షించు వడిన్. 165**

* సంసారం అడవి వంటిదని చెప్పాను. ఆ అడవిలో కొడుకులూ, స్నేహితులూ, భార్యలూ మొదలయిన వారందరూ తోడేళ్ళు మేకలను భక్షించి నట్లు పురుషుణ్ణి పీక్కుతింటారు.

**తరలము.**

**మలసి సంసృతి ఘోరకానన మందిరమ్ముల నెల్లచోఁ**
**జెలఁగి గుల్మలతాతృణాదులచేత గహ్వరమైన ని**
**శ్చలనికుంజములందు దుర్జన సంజ్ఞలం గల మక్షికం**
**బుల నిరోధము దన్ను సోఁకినఁ బొందు చుందురు దుర్దశన్. 166**

* సంసార మనేది భయంకర మయిన అడవిలోని మందిరం వంటిది. ఆ మందిరం చుట్టూ తీగలూ, పొదలూ, దట్టంగా అల్లుకుని ఉన్నట్లు జీవి చుట్టూ ఆపద లుంటాయి. దుర్జనులనే కందిరీగలు జీవులను బాధిస్తుంటాయి. ఆ కారణంగా జీవులు ఆపదలకు లోనవుతారు.

**ఆ. మఱియు నీ గృహస్థమార్గంబునం దెల్ల, విషయములను బొంది విశ్వమెల్ల**
**గడఁకతోడ నిట్లు గంధర్వనగరంబుఁ, గాఁ దలంచి మిగుల మోదమందు. 167**

* గృహస్థాశ్రమంలో ఉన్నవాఁడు ఇంద్రియ సుఖాలకు అలవాటు పడతాడు. వాడికి విశ్వమంతా ఒక గంధర్వనగరంగా కన్పించుతుంది. ఆ సుఖాలన్నీ శాశ్వత మనుకుంటూ సంతోషపడుతుంటాడు.

**ఆ. మరగి కాననమునఁ గొఱవిదయ్యముఁ గాంచి, యగ్నిఁ గోరి వెంట నరుగు మాడ్కిఁ**
**గాంచనంబు గోరి కలవారి యిండ్ల పం, చలను దిరుగు నరుఁడు చలనమంది. 168**

* అడవిలో రాత్రిపూట కొరవిదయ్యాన్ని చూచి ఏదో నిప్పు అనే భ్రాంతితో దాని కోసం దానివెంట బడి తిరిగినట్లు ధనం కోసం భాగ్యవంతుల ఇళ్ల చుట్టూ ఊరకే రాకపోకలు చేస్తూ నరుడు వ్యథలకు లోనవుతాడు.

**ఆ. బహుకుటుంబి యగుచు బహుధనా పేక్షచే, నెండ మావులఁగని యేఁగు మృగము**
**కరణిఁ బ్రేమఁజేసి పరువులు వాఱుచు, నొక్కచోట నిలువకుండు నెపుడు. 169**

* పెరుగుతున్న కుటుంబాన్ని పోషించుకోవడం కోసం ధనం సంపాదించాలనే ఆరాటంతో ఎండమావుల వెంబడి పరుగెత్తే మృగం లాగున నరుడు పరుగులు పెడుతూ తిరుగుతుంటాడు.

ఆ. మఱియు నొక్క చోట మత్తుఁడై పవన ర, జో హతాక్షుఁ డగుచుఁ జూపు దప్పి
దిక్కెఱుంగ కొండుదిశ కేగు పురుషుని, కరణిఁ దిరుగు నరుఁడు నరవరేణ్య! 170

* రాజేంద్రా! అడవిలో పోతున్నవాడు ఒకచోట మైమరచి ఆగిపోయి సుడిగాలి వల్ల రేగిన దుమ్ము కనుల నిండాపడి చూపు తప్పి దిక్కు తెలియక మరొక దిక్కుకు పోయిన విధంగా నరుడు సంసారంలో త్రోవతప్పి అక్కడక్కడే తిరుగుతుంటాడు.

వ. మఱియు నొక్కటోట నులూక ఝిల్లీస్వనంబులతోడ సమానంబు లయిన శత్రురాజి తిరస్కారంబులకు దుఃఖపడుచు, నొక్క చోట క్షుధార్దితుండై యపుణ్య ఫలవృక్షంబుల నాశించు మాడ్కిఁ బాపకర్ములు ద్రవ్యహీనులు నగు వారి నాశ్రయించుచు, నొక్క యెడం బిపాసాతురుండై జలహీనంబయిన నదికిఁ జనినరీతి నిహపరదూరులైన పాషండుల సేవించుచు, మఱియు నొక్క ప్రదేశంబునం దగ్నిచేతం దప్తుండయిన వాఁడు దావాగ్నిం జేరి వ్యథ నొందురీతి నన్నార్థి యగుచు దాయాదులం జేరి దుఃఖించుచు, మఱియు నొక్కచోట పరబాధం జేసి మున్ను గానక రాజ్యాభిలాషం బ్రాణసఖులైన పితృపుత్త్రభ్రాతృ జ్యేష్ఠుల నైనను వధియించుచు, మఱియు శూరులచేతం గొట్టువడి సర్వధనంబును బోనాడి చింతాపరవశుండై దుఃఖించుచు నున్నంత గంధర్వనగర ప్రాయంబైన సంసార సుఖంబు ననుభవించి మోదించుచు, మఱియు నగారోహణంబు సేయు నరుండు కంటక పాషాణాదుల వలనం బాధాపీడితుం డగుచు దుఃఖించు చందంబున గృహాశ్రమోచిత మహానుష్ఠానంబునకు నుపక్రమించి వ్యసన కంటక శర్కరాపీడితుండై దుఃఖించుచు, నొక్కచోటన్ జఠరాగ్ని పీడితుండై కుటుంబంబు మీఁద నాగ్రహించుచు వనంబున నజగర గృహీతుండై నిగీర్ణుండైన చందంబున రాత్రి గృహాటవియందు నిద్రాపరవశుండై యెఱుంగక వర్తించుచు మఱియును వనంబునఁ దృణచ్ఛన్న కూపపతితుం డగుచు సర్పదష్టుండైన తెఱంగున సంసారియై దుర్జనుల చేత వ్యథిత హృదయుం డగుచు నంధుండై యజ్ఞానాంధ కూపంబునం బడుచు, నొక్కయెడ జుంటి తేనియకునై మక్షికాబాధ నత్యంత దుఃఖితుండయిన మాడ్కిని సంసారకాముండై పరదార ద్రవ్యాభిలాషి యగుచు భూపాలకుల చేతనైనను గృహపతిచేతనైనం దాడితుండయి నరకంబునం బడుచు, యౌవనంబున సంపాదించిన ద్రవ్యంబులు పరులచేతం బోనాడిన విధంబున శీతవాతాద్యనేక ప్రయాసలబ్ధంబైన ధనంబు వోనాడి సంసారి యతిచింతా క్రాంతుండై యుండు; మఱియును వనంబున లుబ్ధకులు సంసృష్టంబయిన యల్పామిషంబునకు నన్యోన్య వైషమ్యంబునం గలహించిన విధంబున సంసృష్టవ్యవహారియై యల్పద్రవ్యంబులకుం బోరాడుచుండు నని భూపాలునకు విప్రుండు సంసారాటవి తెఱంగెఱింగించి వెండియు నిట్లనియె. 171

* అయ్యా! నరుడు పడే నానావిధాలైన పాట్లు ఎన్నని చెప్పను, అడవిలో సంచారం చేసేటప్పుడు గుడ్లగూబల కూతలకూ, కీచురాళ్ల రొదలకూ లాగే సంసారి విరోధుల తిరస్కారాలకు భయపడతాడు; బాధపడతాడు. అడవిలో ఏమీ దొరక్కపోతే చివరకు ఏ పిచ్చిచెట్ల పళ్లనో తినడానికి సిద్ధమయినట్లు పాపాత్ములైన ధనవంతులను ఆశ్రయిస్తుంటాడు. దప్పికకు ఏ మాత్రం తట్టుకోలేక విసిగివేసారి చివరకు

ఎక్కడయినా కాసంత నీరు దొరుకుతుందేమోననే ఆశతో వట్టిపోయిన నది దగ్గరికి వెళ్ళినట్లు ఇహానికి పరానికి దూరులయిన పాషండులను సేవిస్తుంటాడు.

మంటలు చుట్టుకోగా తప్పించుకుందామని ప్రయత్నించి కారుచిచ్చులో చిక్కుకొన్నట్టు అన్నంకోసం దాయాదుల పంచజేరి వంచింపబడుతుంటాడు. ఒక్కొక్కసారి ఇతరులు తనకు కలిగించే బాధలకు తట్టుకోలేక రాజ్యాభిలాషతో తండ్రినీ, కొడుకునూ, అన్ననూ, చివరకు ప్రాణమిచ్చిన మిత్రుణ్ణి కూడ నామరూపాలు లేకుండా చేస్తాడు. చివరకు బలవంతు లయిన వారిచేత చావుదెబ్బలు తిని, డబ్బు యావత్తూ పోగొట్టుకొని దిగులుతో క్రుంగిపోతాడు.

గగనంలోని గంధర్వనగరంలోని గాలి మేడలను ఊహించుకుని మురిసిపోయినట్లు సారంలేని సంసార సుఖాలు అనుభవిస్తూ అందులో ఏదో ఆనందాన్ని జుర్రుతూ జీవిస్తాడు. కొండలెక్కేవాడు ముళ్ళూ, రాళ్లూ గుచ్చుకొని పాదాలు బొబ్బలెక్కి బాధపడుతున్నట్టుగా గృహస్థాశ్రమంలో చేపట్టవలసిన కార్యక్రమాలలో నానావిధాలైన బాధలతో వ్యసనాలతో పీడింపబడతాడు. ఒక్కొక్కసారి ఆకలి మంటలకు తట్టుకోలేక ఇంట్లో అందరిమీదా అనవసరంగా విసుగుకొని కసురుకుంటాడు. అడవిలో కొండచిలువ వాతబడి మెలికలు తిరిగి స్పృహ గోల్పోయినట్టుగా ఇల్లనే అడవిలో రాత్రివేళ ఎలా తోచక నిద్రలో మైమరచి పొరలుతుంటాడు.

అరణ్యంలో గడ్డితో కప్పబడిన పాడు బావిలో పడిపోయి పాము కాటుకు గురి అయినట్టు సంసారంలో దుర్జనులు పెట్టే బాధలకు మనస్సు కల్లోలపడి కనులు గానక అజ్ఞానమనే చీకటిగోతిలో పడతాడు. ఒక్కొక్క సారి తేనెకోసం తేనె తెట్టెను రేపి తేనెటీగల బారిపడినట్లు సంసారసుఖాన్ని కోరి ఇతరుల భార్యలనూ, ఇతరుల వస్తువులనూ అభిలషించి ఇంటి యజమానుల చేతనో లేదా రాజులచేతనో తన్నులు తిని నరకయాతన అనుభవిస్తాడు. యౌవనంలో ఎంతో కష్టపడి సంపాదించిన ఆస్తిని ముసలితనంలో పరులపాలు చేసినట్లు సంసారి అయినవాడు చలికీ గాలికీ వానకూ ఓర్చుకొని సంపాదించిన సొమ్ము ఇతరులు హరింపగా దిగులుతో క్రుంగిపోతాడు. అంతే గాకుండా అడవిలో ప్రాప్తించిన అల్ప జంతువుల మాంసానికి బోయలు కొట్లాడుకున్నట్లు సంసారంలో కుట్రలు కుతంత్రాలు పన్నుతూ అల్పవిత్తాల కోసం తన్నులాడుకొంటారు.

ఈ విధంగా రహూగణుడనే సింధురాజుకు పరమభాగవతుడైన భరతుడు సంసారమనే అడవిలోని అగచాట్లను విశదపరచి మళ్లీ ఇలా అన్నాడు.

**ఆ. అల్పధనుఁడు విశ్రమాస్థానములఁ దృప్తిఁ, బొంద కొరుల ధనముఁ బొందఁ గోరి**
**యరిగి వారివలన నవమానములఁ బొంది, యధికమైన దుఃఖ మనుభవించు. 172**

* రాజా! ఏదో కొంతధనం సంపాదించుకున్నవాడు తాను సంపాదించుకొన్న ఇల్లువాకిలితో సంతోషపడక ఇతరుల ఆస్తి కాజేయాలని ప్రయత్నం చేస్తాడు. ఈ దుశ్చర్యవల్ల వాడు చివరకు చీవాట్లు తిని అవమానం పొంది ఎంతో దుఃఖాన్ని కొని తెచ్చుకొంటాడు.

**ఆ. అంతఁ గొందఱల్ల నన్యోన్య విత్తాది, వినిమయమునఁ గడుఁ బ్రవృద్ధమైన**
**వైరములను బొంది పోరాట నొందుదు, రాత్మచింత లేక యనుదినంబు. 173**

* ఇంకా కొందరు వస్తువులనూ, డబ్బునూ మార్పిడి చేసుకోవడంలో పట్టుదలలు పెంచుకొని వైరభావంతో ఆత్మచింత లేక అనుదినమూ అలమటిస్తారు.

**సీ. సంసారమార్గ సంచారుఁడై యధిక ప్రయాసంబునన గూర్చు నర్థములను**
**విహరించుచును గొంద ఱిహలోక ఫలములఁ గోరుచు మోక్షంబు గోర కంతఁ**
**జెడిపోవుచుందు; రెప్పుడు గాని యందుకుఁ గడపటి యోగంబుఁ గాన లేరు;**
**మానవంతులు నసమానశౌర్యులు నగు వారు మిక్కిలియైన వైరబుద్ధి**

**తే. నాహవంబున మడియుదు; రంతెకాని, మోక్షమార్గంబు గానరు మూఢవృత్తి**
**ననుచు సంసార గహన విహారమెల్లఁ, దెలిపి క్రమ్మఱ ననియె ధాత్రీసురుండు. 174**

* మరికొందరు సంసారంలో సంచరించుతూ ఆ సంసార పోషణకు అంతులేని ప్రయాసపడుతూ అందుకుగాను వస్తుసంభారాలను సమకూర్చుకొంటూ ఇహలోక సుఖాలకే అలవాటు పడతారు. అవే ఇంకా కావాలనీ కోరుతారు. అంతేకాని మోక్షమంటూ ఉందనీ ఆ ముక్తి వల్ల కలిగే ఆనందం శాశ్వతమనీ తెలుసుకోలేరు. అందుకు అవసరమైన అధ్యాత్మ యోగాన్ని అవలంబించక చెడిపోతుంటారు.

అభిమానవంతు లయిన వారూ, సాటిలేని శౌర్యవంతులైన వారూ పరస్పరం వైరం పెంచుకొని సమరంలో ఒకరినొకరు చంపుకొంటారు. అంతేకాని ఆ మందబుద్ధులు మోక్షమార్గాన్ని అసలు దర్శించనే లేరు. ఈ విధంగా సంసారమనే అరణ్యంలో విహరించేవారి వృత్తాంతాన్ని భరతుడు తెలియజేసి మరలా సింధురాజుతో ఈలా అన్నాడు.

**వ. మఱియుం గాలచక్రనియంత్రితుండై చక్రాయుధునిం గొల్వక కాక గృధ్ర బకసమానులైన పాషండులతోడి సఖ్యంబునం జేసి వారలచేత వచింతుండై బ్రాహ్మణకులంబునం జేసి శ్రౌతస్మార్త కర్మానుష్ఠానపరుండై విషయసుఖంబులందుఁ దగులువడి కాలంబుతుద నెఱుంగక వృక్షంబులుంబోలె నైహికార్థంబుల యందుఁ దృష్ణ గలిగి మైథున నిమిత్తంబు సుతదారాదుల యందు స్నేహంబు సేయుచుఁ బథికుండు మాతంగంబులయందు భయంబున దీర్ఘనిమ్న కూపంబునం బడిన తెఱంగున సంసారమృత్యుగజ భయంబున గిరికందర ప్రాయంబయిన యజ్ఞాన తమంబునం బడుం గావున మాయచేత సంసార మార్గంబైన రాజభావంబు విడిచి సర్వభూతమైత్రి గలిగి జితేంద్రియుండవై జ్ఞానాసిచే మార్గంబు కడపల గనుమని పలికిన భూపాలుం డిట్లనియె. 175**

* కొందరు కాలచక్రమునే నియమించిన ఆ చక్రాయుధుని కొలువక కాకుల్లాంటివారూ, గ్రద్దలాంటివారూ, కొంగల్లాంటివారూ అయిన పాషండులతో స్నేహం పెంచుకొంటారు. వారి వలలోపడి వంచింపబడతారు. కొందరు బ్రాహ్మణకులంలో పుట్టి శ్రౌతం, స్మార్తం మొదలయిన వైదిక కర్మలు నియమ

నిష్ఠలతో చేస్తున్నా విషయసుఖాలకు లోబడి పోతారు. చెట్టులాగా వయసు పెరుగుతుంది గాని నరుడు మనసా పెరుగడు. అంత్యకాలం సమీపించుతున్నా ఇహలోక సుఖాల మీద ఆశ పెంచుకొంటాడు. స్త్రీపురుష సంగమాభిలాషకు లోనై భార్యాపుత్రులందు స్నేహం పెంచుకొంటాడు. ఏనుగులకు భయపడ్డ బాటసారి తెలియక ఏనుగుల కోసం తవ్విన గోతులలో పడ్డట్టు సంసారి మృత్యువనే ఏనుగు భయంతో కొండగుహలాంటి అజ్ఞానమనే చీకటిలో పడతాడు. అందుచేత మాయను తొలగించుకొని, సంసార కారణమయిన నీ రాజభావాన్ని వదలిపెట్టు. అన్ని ప్రాణులపట్ల మైత్రి పెంచుకొని, ఇంద్రియాలను జయించు, జ్ఞానమనే కత్తి చేబట్టి మార్గం చేసుకొని భయంకరమైన ఆ అడవినుండి బయటపడు- అని బోధించగా రహూగణుడు భరతునితో ఇలా అన్నాడు.

**క. అక్కట, మానుష జన్మము, పెక్కువయై యుండు నెపు డభేదమతిం బెం**
**పెక్కిన యోగిసమాగము, మక్కజముగఁ గలిగెనేని యఖిలాత్ములకున్. 176**

* భూలోకంలో అన్ని జన్మలలో మానవ జన్మం శ్రేష్ఠమని అంటారు. ఇది నిజమని ఏలాగున నమ్మాలి. మీ వంటి సర్వసములైన మహానీయుల సందర్శనం కలిగినప్పుడే ఇది సత్యమవుతుంది.

**క. ధరణీసురవర! నీ శ్రీ, చరణాంబుజ యుగళ రేణు సంస్పర్శము నా**
**దురితంబు లడఁచె; నింతట, హరిభక్తియు నంతకంత కధికం బయ్యెన్. 177**

* భూసుర శ్రేష్ఠా! నీ శ్రీపాదపద్మపరాగాల సంస్పర్శనం నా పాపాలన్నింటినీ పటాపంచలు చేసింది అంతకంతకూ నాలో హరిభక్తి అతిశయించింది.

**వ. మఱియు విప్రవరులయందు యోగేశ్వరు లవధూత వేషంబునం జరియింపు చుందురు; గావున విప్రులు పిన్నలు పెద్దలనక యందఱకు నమస్కారం బని స్తుతియించిన నా యోగీశ్వరుండును సింధుపతికిఁ గరుణాన్వితుం డగుచుఁ దత్త్వజ్ఞానం బుపదేశించి యా రాజుచేత వందితచరణుండై పూర్ణార్ణవంబునుం బోలె సంపూర్ణ కరుణారసపూరిత స్వాంతుండై వసుంధరం జరియించు చుండె; సింధుభూపతియును సుజన సమాగమంబున లబ్ధతత్త్వ జ్ఞానుండయి దేహాత్మ భ్రమం బాసె నని పలికిన శుకయోగీంద్రునకుం బరీక్షిన్నరేంద్రుం డిట్లనియె. 178**

* యోగీశ్వరులు పరివ్రాజక వేషంలో బ్రాహ్మణరూపంలో తిరుగు తుంటారు. వారికి వయసుతో నిమిత్తం లేదు. అందుచేత చిన్న పెద్ద తేడాలు చూడకుండా బ్రహ్మజ్ఞానం కలిగిన వారికందరికీ నా నమస్కారం అంటూ సింధుదేశాధిపతి భరతుణ్ణి స్తుతించాడు. కరుణా సముద్రుడైన ఆ యోగీశ్వరుడు సింధుపతి అయిన రహూగణునికి తత్త్వజ్ఞానం ఉపదేశించాడు. సింధుపతి మ్రొక్కులు అందుకొని భరతుడు పొంగి పొరలే మహాసముద్రంలా దయారస పరిపూర్ణమైన హృదయంతో భూమి మీద సంచరిస్తున్నాడు. సింధుభూపతి కూడ సత్పురుష సాంగత్యం కారణంగా తత్త్వజ్ఞానం పొందాడు. అతనికి దేహమే ఆత్మ అనే భ్రమ నశించింది అని చెప్పిన శుకయోగీంద్రునితో పరీక్షిన్నరేంద్రుడు ఈ విధంగా అన్నాడు.

**చ. అరయఁగ మక్షికంబు వినతాత్మజుఁ గూడఁగలేని రీతి యీ**
**భరతుని సచ్చరిత్రములు ప్రస్తుతి సేయఁగ నీ వసుంధరన్**
**నరపతు లెల్ల నోపరు మనంబున నైనను నెంచ, నింక నా**
**భరతుని పుణ్యవర్తనముఁ బ్రస్తుతి సేయఁగ నాకు శక్యమే? 179**

* మహానుభావా! ఈగ ఎంత ఎగిరినా గరుత్మంతుని చేరుకోగలుగుతుందా? అలాగే రాజులందరూ కలసినా భరతుని సచ్చరిత్రం కొనియాడడం శక్యం గాదు. మనస్సుతో కూడా ఊహించలేరు. అందువల్ల భరతుని పవిత్ర చరిత్రం ప్రస్తుతించడం నాకు సాధ్యం కాని పని.

**వ. నరేంద్రా! భరతుండు సుతదారరాజ్యాదులను బూర్వ కాలంబునంద విడిచి భగవత్పరుండగుచు యజ్ఞరూపంబును ధర్మస్వరూపంబును సాంఖ్యయోగంబును బ్రకృతి పురుష స్వరూపంబును బాసె, నట్టి భరతుని చరిత్రం బెవ్వరు సెప్పిన నెవ్వరు వినిన నట్టివారలఁ బుండరీకాక్షుండు రక్షించు, నాయు రభివృద్ధి యగు; ధనధాన్య సమృద్ధియు నగుచుండ స్వర్గోపభోగంబులం బొందుదురని. 180**

* నరేంద్రా! భరతుడు పూర్వమందే పుత్రులనూ, భార్యలనూ, రాజ్యవైభవాన్ని వదలిపెట్టాడు. భగవంతునిపట్ల నిష్ఠ పెంచుకొన్నాడు. యజ్ఞమయుడూ, ధర్మ స్వరూపుడూ, సాంఖ్య యోగీశ్వరుడూ, ప్రకృతి పురుషాత్మకుడూ అయిన నారాయణునికి నమస్కారమంటూ హరిణరూపాన్ని పరిత్యజించాడు. అటువంటి పుణ్యపురుషుడైన భరతుని చరిత్రాన్ని వినిపించిన వారినీ, విన్నవారినీ శ్రీమన్నారాయణుడు తప్పక రక్షిస్తాడు. వారికి ఆయురభివృద్ధీ, ధనధాన్య సమృద్ధీ సిద్ధిస్తుంది. ఆ తరువాత వారు స్వర్గసౌఖ్యాలు అనుభవిస్తారు.

**మ. నరదేవాసుర యక్షరాక్షస మునీంద్రస్తుత్య! దివ్యాంబరా**
**భరణాలంకృత! భక్త వత్సల! కృపాపారీణ! వైకుంఠ మం**
**దిర! బృందావన భాసుర ప్రియధరిత్రీనాథ! గోవింద! శ్రీ**
**కర! పుణ్యాకర! వాసుదేవ! త్రిజగత్కల్యాణ! గోపాలకా! 181**

* మానవులూ దేవతలూ యక్షులూ రాక్షసులూ మహామునులూ స్తుతించేవాడవూ; దివ్య వస్త్రాలూ, దివ్యభూషణాలూ అలంకరించుకున్న వాడవూ, భక్తులంటే అవ్యాజమయిన వాత్సల్యం ప్రదర్శించేవాడవూ, వైకుంఠం నివాసంగా కలవాడవూ, బృందావనంలో ప్రకాశించేవాడవూ, భూదేవికి ప్రియమైన వాడవూ, గోవులను సంతోషపెట్టువాడవూ, సంపదలను ప్రసాదించేవాడవూ, ముల్లోకాలకూ శుభం అందించే వాడవూ, అయిన శ్రీకృష్ణా! నీకు నమస్కారం.

**క. పరమపదవాస! దుష్కృత, హర!కరుణాకర! మహాత్మ! హతదితిసుత! భా**
**సురగోపికామనోహర!, సరసిజదళనేత్ర! భక్త జననుతగాత్రా! 182**

* ఉత్తమోత్తమ మయిన పరమపదం నీ నివాసం. భక్తుల పాపాలను హరించుతావు. దయకు నిలయమయినవాడవు. మహానుభావుడవు. రాక్షసులను సంహరించినవాడవు. అందమైన గోపికల మనస్సులను చూరగొన్న వాడవు. కమల దళాలవంటి కన్నులు కలవాడవు; భక్తజనులచే స్తుతింపబడే దివ్యదేహం కల శ్రీకృష్ణా! నీకు నమస్కారం.

మాలిని.

**సరస హృదయవాసా! చారులక్ష్మీ విలాసా!, భరితశుభచరిత్రా! భాస్కరాబ్జారినేత్రా!**
**నిరుపమఘనగాత్రా! నిర్మలజ్ఞానపాత్రా!, గురుతరభవదూరా! గోపికాచిత్తచోరా!** 183

* సరసుల హృదయాలలో నివసించేవాడవు, భువనమోహిని అయిన లక్ష్మీదేవితో విహరించేవాడవూ, శుభప్రదమయిన చరిత్ర కలవాడవు, సూర్యచంద్రులు కన్నులుగా కలవాడవు, పోలికకు అందని నీలమేఘచ్ఛాయగల అవయవాలు కలవాడవు. స్వచ్ఛమైన జ్ఞానముచే ఒప్పువాడవు, భారమైన సంసార బాధలను దూరం చేసేవాడవూ, గోపికల హృదయాలను అపహరించిన వాడవూ అయిన శ్రీకృష్ణా! నీకు నమస్కారం.

గ. **ఇది సకల కవిజనానందకర బొప్పనామాత్యపుత్రగంగ నార్య ప్రణీతంబైన శ్రీమహాభాగవత పురాణంబు నందుఁ బ్రియవ్రతుని సుజ్ఞానదీక్షయు, బ్రహ్మదర్శనంబును, నాగ్నీధ్రాదుల జన్మంబును, నుత్తమతామస రైవతుల జన్మంబును, బ్రియవ్రతుండు వనంబునకుం జనుటయు, నాగ్నీధ్రుం డప్సరసం బరిగ్రహించుటయు, వర్షాధిపతుల జన్మంబును, నాగ్నీధ్రుండు వనంబునకుం జనుటయును, నాభిప్రముఖుల రాజ్యంబును, నాభియజ్ఞంబును, ఋషభుని జన్మంబును, ఋషభుని రాజ్యాభిషేకంబును, భరతుండు వనంబునకుఁ జనుటయు, భరతుండు హరిణపోతంబునందలి ప్రీతింజేసి హరిణగర్భంబున జనియించుటయు, మరల విప్రసుతుండై జనియించుటయు, విప్రుండు చండికా గృహంబున బ్రదికి వచ్చుటయు, సింధుపతి విప్రసంవాదంబును నను కథలు గల పంచమ స్కంధంబునందుఁ బ్రథమాశ్వాసము.**

* సకల సుకవుల సమూహానికి ఎంతో సంతోషం కలిగించేవాడయిన బొప్పనామాత్యుని కుమారుడు గంగనార్యుడు రచించిన శ్రీమహాభాగవత పురాణం పంచమ స్కంధంలోని ప్రథమాశ్వాసమిది.

ఈ ఆశ్వాసంలో ప్రియవ్రతుడు పొందిన సుజ్ఞానదీక్ష, బ్రహ్మదేవుని సాక్షాత్కారం, ఆగ్నీధ్రుడు మొదలయినవారి జన్మవృత్తాంతం, ఉత్తమ తామస రైవత మనువుల పుట్టుక, ప్రియవ్రతుడు వనములకు వెళ్ళడం, ఆగ్నీధ్రుడు అప్సరస స్త్రీని వివాహ మాడడం, వర్షాధిపతుల జననం, ఆగ్నీధ్రుడు అడవికి వెళ్ళడం నాభిరాజు మొదలయినవారి రాజ్యపరిపాలనం, నాభిరాజు యజ్ఞం, ఋషభుని జననం, ఋషభుని రాజ్యపాలనం, భరతుని పుట్టుక, ఋషభుడు తపస్సు నిమిత్తం వనాలకు వెళ్ళుతూ కుమారులకు విశిష్ట జ్ఞానం ఉపదేశించడం, భరతుని పట్టాభిషేకం, భరతుడు అరణ్యాలకు పోవడం, భరతుడు జింకపిల్ల మీద మమకారం పెంచుకొని జింక కడుపున పుట్టడం, అనంతరం బ్రాహ్మణునికి కుమారుడై జన్మించడం, బలిపశువుగా బంధితుడై చండికాలయం నుండి తప్పించుకొని బయటపడడం, సింధుదేశాధిపతి అయిన రహూగణుని ప్రశ్నలకు సమాధానం చెప్పడం మొదలయిన సన్నివేశాలు వర్ణింపబడ్డాయి.

# పోతన భాగవతము

## అయిదవ స్కంధము

### రెండవ ఆశ్వాసము

**శ్రీకాంతాహృదయప్రియ! లోకాలోకప్రచార! లోకేశ్వర సు**
**శ్లోక! భవభయనివారక!, గోకులమందార! నందగోపకుమారా! 1**

* లక్ష్మీదేవి మెప్పు పొందినవాడవూ, సమస్త లోకాలలో పేరెన్నిక గన్నవాడవూ, లోకాలన్నింటికీ ప్రభువయిన వాడవూ, మంచి యశస్సు కలవాడవూ, సంసారభయాలను నివారించేవాడవూ, గోకులంలోని వారికి కల్పవృక్షం వంటివాడవూ, నందగోపుని కుమారుడవూ అయిన శ్రీకృష్ణా! అవధరించు!

**వ. సకల పురాణార్థ జ్ఞాన విఖ్యాతుండయిన సూతుం డిట్లనియె. 2**

* సకల పురాణ గాథల రహస్యాలను తెలుసుకోవడంలో విఖ్యాతుడైన సూతుడు శౌనకాది మహామునులతో ఈ విధంగా చెప్పాడు.

**క. మునులార! బాదరాయణి, యనఘాత్మకుఁడైన యుత్తరాత్మజునకు స**
**ద్వినయోక్తి భరతుచరితము, వినిపించుచు మఱియు నిట్లు వినిపించెఁ దగన్. 3**

* మునులారా! బాదరాయణుని కుమారుడయిన శ్రీశుకుడు పుణ్యాత్ముడూ ఉత్తరానందనుడూ అయిన పరీక్షిత్తుకు భరతుని చరిత్రం చక్కగా వినిపించి ఈలా అన్నాడు.

**ఆ. పార్థివేంద్ర! యట్లు భరతాత్మజుండైన, సుమతి, ధర్మవర్తనమునఁ దిరుగ**
**నది యెఱింగి దుష్టులైన పాషండులు, దమమతంబు మిగులఁ దలఁచి పొగడి. 4**

* రాజేంద్రా! భరతుని కుమారుడయిన సుమతి ధర్మయుక్తంగా పరిపాలన సాగిస్తున్న సమయంలో దుర్మార్గులయిన పాషండులు తమ మతాన్ని స్థాపించాలనే ఉద్దేశంతో అతని దగ్గరకు వచ్చి ఈ విధంగా పొగడసాగారు.

**క. ధరణీవల్లభ! నిన్నును, నిరతంబును బుద్ధదేవుని గొలిచిన యా**
**తెఱఁగునఁ గొలిచెద మని భా, సురమతి బోధించి రపుడు సుమతిం బ్రీతిన్. 5**

* “ఓ మహారాజా! మేము నిత్యమూ బుద్ధ దేవుణ్ణి కొలిచినట్లుగా నిన్ను సేవిస్తాం” అంటూ ప్రియోక్తులు పలికి ఎంతో తెలివితేటలు ప్రదర్శిస్తూ తమ ధర్మాలను సుమతికి బోధింపసాగారు.

వ. ఇట్లు పాషండబోధితుండైన సుమతికి ధ్రువసేనయందు దేవతాజిత్తను పుత్త్రుండు జనించె వానికి దేవద్యుమ్నుండను సత్పుత్రుం డాసురియం దుదయించె; న మ్మహాత్మునకు ధేనుమతియందుఁ బరమేష్ఠి జనియించె, నతనికి సువర్చలయందుఁ బ్రతీహుం డనువాఁడు సుతుండయ్యె, నప్పరమ పురుషుండు సకల జనులకు బ్రహ్మోపదేశంబు సేసి తాను శుద్ధాత్ముండై హరి స్మరణ సేయుచు యజ్ఞకరణ నిపుణులగు ప్రతిహర్త ప్రస్తోత యుద్గాత యను సత్పుత్రులం గాంచె, నా ప్రతిహర్తకు స్తుతి యందు వ్యోమభూమనామక పుత్త్రద్వయం బుత్పన్నంబయ్యె; నందు భూమునకు ఋషికుల్యయందు నుద్గీథుం డను సుతుండు జనియించె, నతనికి దేవకుల్య యందుఁ బ్రస్తోత గలిగె; నా ప్రస్తోతకు వరరుత్సయందు విభుండను తనయుం డుద్భవించె; నతనికి భారతియందుఁ బృథుషేణుం డుదయించె; నతనికి నాకూతియందు నక్తుండు గలిగె; నా నక్తునకు రాజర్షి శ్రేష్ఠుండగు గయుం డను మహాకీర్తి సంపన్నుం డుదయించె. 6

* వేదనిందకు లయిన పాషండులు క్రమంగా సుమతిని ప్రోత్సహిస్తూనే ఉన్నారు. అటువంటి సమయంలోనే సుమతి భార్య అయిన దేవసేనకు "దేవతాజిత్తు" అనే కొడుకు పుట్టాడు. అతడికి "ఆసురి" అనే భార్యవల్ల "దేవద్యుమ్ను" డనే సుపుత్రుడు జన్మించాడు. మహాపురుషుడైన ఆ దేవద్యుమ్నునికి ధేనుమతివల్ల 'పరమేష్ఠి' పుట్టాడు. సత్యసంధుడైన అతనికి సువర్చల వల్ల 'ప్రతీహుడు' కలిగాడు. అతడు చాల గొప్పవాడు. అందువల్ల జనుల కందరికీ బ్రహ్మోపదేశం చేశాడు. పరిశుద్ధ మయిన మనస్సుతో హరిస్మరణ చేస్తుండేవాడు. ఆ ప్రతీహుడికి ప్రతిహర్త, ప్రస్తోత, ఉద్గాత అనే ముగ్గురు కుమారులు పుట్టారు. వారు ముగ్గురూ యజ్ఞాలు చేయడంలో నిపుణులు. వారిలో ప్రతిహర్తకు 'స్తుతి' అనే భార్యవల్ల వ్యోముడు, భూముడు అనే ఇద్దరు కొడుకులు పుట్టారు. వారిలో భూమునికి 'ఋషికుల్య' అనే భార్యవల్ల ఉద్గీథుడు అనే కొడుకు పుట్టాడు. అతనికి దేవకుల్యవల్ల 'ప్రస్తోత' అనే కుమారుడు జనించాడు. ఆ ప్రస్తోతకు 'వరరుత్స' వల్ల 'విభు'డనే కొడుకు పుట్టాడు. అతనికి 'భారతి' వల్ల పృథుషేణుడు కలిగాడు. పృథుషేణునికి 'ఆకూతి' వల్ల 'నక్తుడు' జనించాడు. ఆ నక్తుని కుమారుడే గయుడు రాజర్షులలో చాల గొప్పవాడై ఎంతో కీర్తి గడించాడు.

ఆ. అట్టి గయునివలన నఖిల జీవులఁ బ్రోవఁ, దలఁచి సాత్త్విక ప్రధాన మయిన
యట్టి మేను దాల్చి యాత్మతత్త్వ జ్ఞానుఁ, డగుచు నుండె హరి నిజాంశమునను, 7

* సకల జీవరాసులనూ రక్షించడం కోసం, విష్ణువు సత్త్వ ప్రధానమయిన దేహం ధరించి ఆత్మ తత్త్వాన్ని తెలసిన వాడుగా గయుని రూపంలో అవతరించాడు అని పెద్దలు చెబుతారు.

వ. ఇట్టి మహనీయ సుగుణాకరుండగు గయుని గాథానువర్ణనంబు పురావిదులగు మహాత్ములచే నీ తెలుంగున నుతింపఁబడు చున్నది, సావధాన మనస్కుండవై యాలకింపు మని యిట్లనియె. 8

* రాజా! గయుడు మహాసద్గుణ సంపన్నుడు. అతని కథలన్నీ పురాణవేత్తలయిన మహాత్ములకు బాగా తెలుసు. వారందరూ గయుణ్ణి ఏ విధంగా స్తుతిస్తున్నారో చెబుతాను. నీవు శ్రద్ధగా విను.

సీ. ధర్మమార్గంబున ధారుణీ జనులను బ్రేమతోఁ బోషణ ప్రేషణోప
లాలనశాసనలక్షణాదులచేతఁ బోషించుచును యజ్ఞములను యజ్ఞ
పురుషు నీశ్వరు జిత్తమున నిల్పి సేవించి స్వాంతమందున్న యీశ్వరునిఁ గాంచి
యఖిలజీవతతికి నానంద మొసఁగుచు నిరభిమానతమెయి ధరణినేలె

ఆ. సత్యమందు మిగుల సత్సేవయందును, ధర్మమందు యజ్ఞకర్మమందు
గయుడు వసుధలోనఁ గంజాక్షుఁడే కాని, మానవుండు గాఁడు మానవేంద్ర! 9

* పరీక్షిన్నరేంద్రా! గయుడు ధర్మమార్గానుసారంగా ప్రజలను సత్కర్మలలో నియోగిస్తూ, మంచి మాటలతో బుజ్జగిస్తూ మంచి పనులకు ప్రోత్సహిస్తూ, అవసర మయినపుడు గట్టిగా మందలిస్తూ, ఎంతో సంతోషిస్తూ పరిపాలించాడు. యజ్ఞసమయాలలో తన మనస్సులో యజ్ఞపురుషుడయిన ఈశ్వరుణ్ణి నిలిపి సేవించాడు. హృదయస్థుడైన ఈశ్వరుణ్ణి సందర్శించాడు. సకల జీవరాశికి ఆనందం కలిగేలాగున స్వాభిమానం లేకుండా భూమిని పరిపాలించాడు. సత్య విషయంలో నేమి, మంచివారిని సేవించడంలో నేమి, ధర్మసంబంధంలో నేమి, యజ్ఞ కర్మల విషయంలో నేమి గయుడు సాక్షాత్తు విష్ణుస్వరూపుడే గాని మానవమాత్రుడు కానేకాడు.

వ. అట్టి మహాపురుషగుణగణ పరిపూర్ణుండగు గయునికి దక్ష కన్యకలగు శ్రద్ధామైత్రిదయాదులు దమయంతన వచ్చి కోరిక లొసంగ, నతని ప్రజలకు వసుంధర కామధేనువై పిదుక, వేదంబులు సకల కామంబుల నిచ్చుచుండ, సంగరమున భంగంబు నొందిన రాజు లప్పనంబు సేయ, విప్రులు ధర్మం బాఱవపాలు పంచియిడ, నిరంతర సోమపానంబును శ్రద్ధాభక్తి యోగంబులు గలిగి యొనర్చు యజ్ఞంబుల నింద్రాదిదేవతలు తృప్తులై యజ్ఞఫలంబుల నొసంగ, బ్రహ్మాది తృణగుల్మలతా పర్యంతంబు సకల లోకంబుల వారినిం దృప్తిం బొందించుచు, శ్రీహరిం దృప్తిం బొందఁజేయుచు, గయుండు పెక్కుకాలంబు రాజ్యంబు సేసె; నట్టి గయునికి జయంతి యందుఁ జిత్రరథ స్వాత్యవరోధను లను ముప్వురు గొడుకులు పుట్టిరి; నా చిత్రరథునికి నూర్ణయందు సమ్రాట్టును, వానికి నుత్కళయందు మరీచియు, నా మేటికి బిందుమతియందు బిందుమంతుండును, నా బిందుమంతునకు సరఘయందు మధువును, మధువునకు సుమనస యను దాని యందు వీరవ్రతుండును, నా వీరవ్రతునకు భోజయందు మన్యు ప్రమన్యువులను నిరువురును, నందు మన్యువునకు సత్యయందు భువనుండును, నతనికి దోషయందుఁ ద్వష్టయు, నా త్వష్టకు విరోచనయందు విరజుండనువాఁడును జనియించిరంత. 10

* మహాపురుషులకు ఎటువంటి గుణాలు ఉండవలెనో అటువంటి గుణాలు కలిగినవాడు గయుడు. అందుచేత దక్షప్రజాపతి పుత్రికలయిన శ్రద్ధ, మైత్రి, దయ మొదలయిన దేవతలు తమంత తాముగా వచ్చి వరాలు ప్రసాదించారు. భూదేవి ఆయన ప్రజలపాలిటి కామధేను వయింది. వేదాలు కోరిన కోరికలు అనుగ్రహిస్తున్నాయి. యుద్ధంలో ఓడిపోయిన రాజులు కప్పం చెల్లిస్తున్నారు. బ్రాహ్మణులు తమ

పుణ్యసంపదలో ఆరవభాగం పంచియిస్తున్నారు. ఎడతెగని సోమపానంతో, శ్రద్ధా భక్తులతో చేసే యజ్ఞాలతో ఇంద్రాది దేవతలు సంతృప్తి పడుతూ యజ్ఞఫలాన్ని ప్రసాదిస్తున్నారు. బ్రహ్మ మొదలు గడ్డిపరక పర్యంతం అన్ని లోకాల ప్రాణులనూ గయుడు సంతృప్తి పరిచాడు. ఇందువల్ల శ్రీహరికూడా సంతుష్టుడైనాడు ఈ విధంగా గయుడు చాలా కాలం రాజ్యపరిపాలన సాగించాడు.

అటువంటి గయునికి 'జయంతి' అనే భార్యవల్ల చిత్రరథుడు, స్వాతి, అవరోధనుడు అనే ముప్పురు కొడుకులు పుట్టారు. చిత్రరథునికి 'ఊర్ణ' వల్ల సమ్రాట్టు పుట్టాడు. ఆ సమ్రాట్టుకు 'ఉత్కళ' వల్ల మరీచి కలిగాడు. మరీచికి 'బిందుమతి' వల్ల బిందుమంతుడు పుట్టాడు. ఆ బిందుమంతునికి 'సరఘ' వల్ల మధువు జన్మించాడు. మధువునకు 'సుమనస' వల్ల వీరవ్రతుడు ఉదయించాడు. ఆ వీరవ్రతునికి 'భోజ' వల్ల మన్యు ప్రమన్యువులనే ఇద్దరు కుమారులు కలిగారు. వారిలో మన్యువుకు 'సత్య' వల్ల భువనుడు పుట్టాడు. భువనునికి 'దోష' వల్ల త్వష్ట జనించాడు. ధర్మాత్ముడైన త్వష్టకు విరోచనవల్ల 'విరజు' డనే వాడు జన్మించాడు.

**క. ఆ విరజున కుదయించిరి, భూవినుత విషూచియందుఁ బుత్త్ర శతంబు**
**న్నావల నొక కన్యకయు, న్నావేళ సమస్త జనులు హర్షం బందన్. 11**

* ఓ రాజా! ఆ విరజునికి 'విషూచి' వల్ల నూరుగురు కొడుకులు పుట్టారు. వారందరూ శత్రువులను జయించగలవారు. వారికి ఒక చెల్లెలు కూడా పుట్టింది. విరజునికి కలిగిన సంతాన సంపత్తికి ప్రజలు చాలా సంతోషించారు.

**క. ఘనుఁడు ప్రియవ్రతు వంశం, బునకుం దుదరై విరజుఁడు భూవిభువంశం**
**బును దా నలంకరించెను, విను మింద్రావరజుఁ డయిన విష్ణుని మాడ్కిన్. 12**

* విరజుడు ప్రియవ్రతుని వంశంలో చివరివాడు, ఇంద్రుని తమ్ముడయిన ఉపేంద్రుని లాగున అతడు రాజవంశంలో రాణించాడు.

**క. అని పలికిన శుకయోగిం, గనుఁగొని యభిమన్యు సుతుఁడు గడు మోదముతో**
**వనజదళాక్షుని మహిమలు, విని సంతస మంది యనియె వేడుక మతియున్. 13**

* ఈ విధంగా విష్ణుమూర్తి శుకమహర్షి మాటలకు పరీక్షిత్తు చాల సంతోషించాడు. తానింకా విష్ణుమూర్తి మహిమలను వినాలనే కుతూహలంతో మరల ఈ విధంగా ప్రశ్నించాడు.

**వ. మునీంద్రా! సూర్యరశ్మి యెందాఁకం బ్రవర్తిల్లు, నక్షత్ర యుక్తంబులైన చంద్రకిరణంబు లెంతమేరఁ దిరుగు, నంత దూరంబు ప్రియవ్రతుని రథనేమి ఘట్టనలచేత సప్తద్వీపంబులును, సప్తసముద్రంబులు నయ్యెనని పలికితి వా ద్వీపసముద్రంబుల పరిమాణంబులు సవిస్తరంబులుగా నెఱింగింపుము; గుణమయంబును స్థూలరూపంబును నయిన శ్రీహరి శరీరంబగు నీ లోకంబునందు నిలిపిన చిత్తం బగుణంబును, సూక్ష్మంబును, నాత్మ జ్యోతియు బ్రహ్మంబును నైన వాసుదేవుని యందు నిల్చుం గావున, ద్వీపవర్షాదివిస్తారంబు వినిపింపు మనిన శుకయోగీంద్రుం డిట్లనియె. 14**

* మునీంద్రా! ఎందాకా సూర్యరశ్మి ప్రసరిస్తుందో, ఎందాకా నక్షత్రాలతో కూడిన చంద్రుని కిరణాలు వ్యాపిస్తుంటాయో, అందాకా ప్రియ వ్రతుని రథచక్రాల ఒరిపిడివల్ల సప్తద్వీపాలూ, సప్త సముద్రాలూ ఏర్పడ్డాయని చెప్పావు గదా! ఆ ద్వీపాల పరిమాణాలనూ సముద్రాల పరిమాణాలనూ సవిస్తరంగా వివరించి చెప్పు. ఈ లోకమంతా గుణమయమైన శ్రీహరి స్థూల స్వరూపమే. అందువల్ల అటువంటి భావనము లోక మందు నిలిపి నట్లయితే నిర్గుణమూ, సూక్ష్మమూ, స్వయంప్రకాశమూ, బ్రహ్మస్వరూపమూ, అయిన వాసుదేవుని యందు మనస్సు సుస్థిరంగా లగ్న మవుతుంది. అందుచేత ద్వీపాలకూ, వర్షాలకూ, సముద్రాలకూ సంబంధించిన విశేషాలను సవిస్తరంగా వెల్లడించు'' - అని ప్రార్థింపగా శుకయోగి పరీక్షిత్తుతో ఈలా అన్నాడు.

**క. ధరణీ వల్లభ! విను శ్రీ, హరిమాయా గుణవిభూతు లగు జల నిధులుం**
**బరఁగిన దీవులు వర్షము, లరయంగాఁ గొలఁది వెట్ట నలవియె జగతిన్? 15**

* "రాజా! నీ వడిగినదానికి సమాధానం చెబుతాను విను. ఈ సముద్రాలూ; ఈ ద్వీపాలు, ఈ వర్షాలూ అన్నీ కూడా శ్రీహరి మాయవల్ల పుట్టిన వైభవాలే. వాటిని సంపూర్ణంగా వర్ణించి చెప్పడం ఎవరికి చేతనవుతుంది?

**ఆ. తెలిసినంత వట్టు దెలిపెద సంక్షేప, మునను జిత్త గించి వినుము దెలియ**
**ననుచుఁ జెప్పఁ దొడఁగె నభిమన్యుసుతునకు, నింపుగాను శుకమునీంద్రుఁ డిట్లు. 16**

* "రాజేంద్రా! నాకు తెలిసినంతవరకు సంక్షేపంగా వర్ణించి చెబుతాను. నీవు ఏకాగ్రచిత్తంతో విను'' - అని శుకమునీంద్రుడు పరీక్షిన్నరేంద్రునకు ఈ విధంగా చెప్పసాగాడు.

## -: శుకయోగి యుపదేశమునఁ దెల్పు భూగోళ నిర్ణయము :-

**వ. నరేంద్రా! జంబూద్వీపంబు భూపద్మంబునకు మధ్యప్రదేశంబున లక్షయోజనంబుల వెడల్పు నంతియ నిడుపునుం గలిగి కమలపత్రంబునుం బోలె వర్తులాకారంబయి నవసహస్రయోజన పరిమితాయా మంబు గల నవవర్షంబులు నష్ట మర్యాదా గిరులునుం గలిగి విభక్తంబయి యుండు; నందు మధ్య వర్షం బిలావృతవర్షంబగు; నందు మధ్యప్రదేశంబున సువర్ణమయంబయి. 17**

* నరేంద్రా! భూమి పద్మాకారంగా ఉంది. ఆ పద్మాకారమయిన భూమిలో జంబూద్వీపం తామరరేకు లాగున గుండ్రంగా కనిపిస్తుంది. అది లక్షయోజనాల పొడవూ లక్షయోజనాల వెడల్పూ కలిగి ఉంటుంది. దానిలో గుండ్రటి ఆకారాలతో తొమ్మిది వేల యోజనాల విస్తీర్ణం గల తొమ్మిది వర్షాలు ఉన్నాయి. వాటి నన్నిటినీ విభజించే సరిహద్దులుగా ఎనిమిది పర్వతాలున్నాయి. ఆ తొమ్మిది వర్షాలలో నట్టనడుమ 'ఇలావృత' మనే వర్షం ఉంది. దాని నడుమ బంగారు రంగుతో కూడిన పర్వతం ఉంది.

క. భూపద్మమునకు మేరువు, దీపించుచుఁ గర్ణికాకృతిని బెం పగుచుం
బ్రాపై కులగిరిరాజుగఁ, జూపట్టును సురగణాళి చోద్యం బందన్. 18

* అదే సువర్ణమయమైన సుమేరు పర్వతం, భూమి పద్మ మయితే సుమేరు పర్వతం దాని కర్ణిక లాగున ప్రకాశిస్తుంది. సుమేరువు సామాన్య మయినది కాదు. అది కులగిరులకే రాజు వంటిది. దేవత లందరూ ఆ పర్వతాన్ని చూచి ఆశ్చర్యచకితు లవుతుంటారు.

సీ. మఱియును నా మేరుగిరి లక్షయోజనో న్నత మగుచుండి యా నడిమి దళము
విదితమై పదియాఱువేల యోజనములు నంతియ పాఁతునై యతిశయిల్లు;
నామీఁద విస్తార మరయ ముప్పది రెండు వేల యోజనముల వెలసి యుండు;
నా గిరి కుత్తరంబందు నీల శ్వేత శృంగ పర్వతములు నింగి ముట్టి

ఆ. యుండు; రెండువేల యోజనంబుల దాఁకఁ, బఱపు గలిగి పూర్వపశ్చిమాయ
తంబు దక్షిణోత్తరంబును విస్తార, మగుచు మిగుల రమ్యమై నరేంద్ర ! 19

* నరేంద్రా! ఆ మేరుగిరి లక్షయోజనాల ఎత్తు కలిగి ఉంది. దాని పాదప్రదేశం పదారువేల యోజనాల విస్తృతి గలిగి అంతే కొలత గల లోతు కలిగి ఉంది. అది పైన ముప్పది రెండువేల యోజనాల విస్తృతి కలిగి ఉంది. దానికి ఉత్తరపు దిక్కులో నీలము, శ్వేతము, శృంగవంతయు అనే పర్వతాలు ఆకాశాన్ని అంటుతూ నిలిచి ఉన్నాయి. వీని విస్తారము రెండువేల యోజనాలు. ఇవి తూర్పు నుండి పడమర వరకూ, ఉత్తరం నుండి దక్షిణానికి విస్తరించి ఉంటాయి. ఈ దృశ్యం చాల రమణీయంగా ఉంటుంది.

వ. ఇట్లు పూర్వపశ్చిమంబులు లవణ సాగరాంతంబులై యున్న సీమాపర్వతంబులయందు నీలశ్వేతశృంగవ త్పర్వతంబులు నిడివిని యథాక్రమంబున దశమాంశ న్యూనప్రమాణ యోజనంబులు గలవిగా నుండు; వీని మధ్య ప్రదేశంబున రమ్యక హిరణ్మయ కురువర్షంబు లను నామంబులు గల వర్షంబు లుండు; వాని విస్తారంబులు నవ సహస్ర యోజనంబులు గలిగి లవణ సముద్రాంతంబులై క్రమంబున నీలాది పర్వత దీర్ఘ పరిమాణంబుల నుండు; నిలావృత వర్షంబునకు దక్షిణంబున నిషధ హేమకూట హిమవత్పర్వతంబులును సీమా పర్వతంబులును, బూర్వ పశ్చిమంబులు నిడుపును, దక్షిణోత్తరంబులు విశాలంబును నగుచు, నా నీలాదిపర్వతంబుల తీరున నుండు; నా గిరుల మధ్య ప్రదేశంబున హరివర్ష కింపురుషవర్ష భారతవర్షంబులను నామంబులు గల వర్షంబు లుండు; నా యిలా వృతవర్షంబునకుఁ బశ్చిమంబున మాల్యవత్పర్వతంబును, బూర్వ భాగంబున గంధమాదనంబను సీమా పర్వంతంబులు; పూర్వపశ్చిమంబులు నిడుపును, దక్షిణోత్తరంబులు విశాలంబును నగుచు నీలపర్వత నిషధపర్వతంబులం గదిసి, ద్విసహస్ర యోజనంబుల విస్తారంబై యుండు; మాల్యవత్పర్వతంబు పశ్చిమ సముద్రాంతంబై కేతుమాలవర్షంబును, గంధమాదన పర్వతంబునకుఁ బూర్వ భాగంబున సముద్రాంతం బగుచు భద్రాశ్వవర్షంబును, మేరువునకుం దూర్పున మందరపర్వతంబును, దక్షిణంబున మేరుమందర పర్వతంబులును, బడమటి పార్శ్వంబుల నుత్తరమునం గుముద పర్వతంబులు నను నామంబులు గలిగి యయుత యోజనోన్నతంబులయి

**మేరునగం బను మధ్యోన్నత మేధిస్తంభంబునకుం జతుర్ముఖంబుల హ్రస్వస్తంభములుం బోలె నుండు; నా చతుస్స్తంభంబుల యందును బర్వతశిఖరంబుల వెలుఁగొందు కేతువులునుంబోలెఁ జూతజంబు కదంబ న్యగ్రోధంబు లను వృక్షరాజంబులు గ్రమంబున నొండొంటికి నేకాదశశత యోజనాయతంబును శతయోజనవిస్తారంబును గలిగియుండు; మఱియు నా పర్వత శిఖరంబులఁ గ్రమంబునం బయో మ ధ్విక్షురస మృష్ట జలంబులు గలిగి శతయోజన విస్తారంబులయిన సరోవరంబులు దేజరిల్లు; నందు సుస్నాతు లగువారలకు యోగైశ్వర్యంబులు స్వభావంబునం గలుగు; మఱియు నందన చైత్ర రథ వైభ్రాజిక సర్వతోభద్రంబులను నామంబులు గల దేవోద్యానంబు లా పర్వత శిఖరంబుల వెలుఁగొందుచుండు; నందు దేవతాగణంబులు దేవాంగనలం గూడి గంధర్వుల గీతనృత్యంబులు గనుంగొనుచు విహరింతు రంత. 20**

* తూరుపు పడమరలలో ఉప్పునీటి సముద్రం వరకూ ఉన్న సరిహద్దు పర్వతాలలో నీలశ్వేత శృంగవత్పర్వతాలు క్రమంగా ఒకదాని కంటె ఒకటి పదియోజనాలు తక్కువ పొడవు కలిగి ఉంటాయి. ఈ మూడు పర్వతాల నడిమి ప్రదేశంలో రమ్యక, హిరణ్మయ, కురునామాలు గల మూడు వర్షాలు ఉన్నాయి. అవి ఒక్కొక్కటి తొమ్మిది వేలయోజనాల విస్తృతి కలిగి ఉన్నాయి . అవన్నీ సముద్రం దాకా వ్యాపించి ఉన్నాయి. ఆ మూడు వర్షాల పొడవు నీలశ్వేత శృంగవత్పర్వతాల పొడవుతో సమానంగా ఉంటుంది.

ఇలావృత వర్షానికి దక్షిణంగా మూడు సరిహద్దు పర్వతాలు ఉన్నాయి. అవే నిషధ పర్వతం, హేమకూట పర్వతం, హిమవత్పర్వతం. ఇవి తూర్పు నుండి పడమటి వరకూ పొడవూ, ఉత్తరం నుండి దక్షిణం వరకూ వెడల్పూ కలిగి ఉన్నాయి. వీని నిడివి నీలశ్వేత శృంగవత్ పర్వతాలతో సమానంగా ఉంటుంది. ఈ మూడు కొండల నడుమ మూడు భూప్రదేశాలున్నాయి. అవే హరివర్షం, కింపురుషం, భారతవర్షం అనేవి.

ఇలావృత వర్షానికి పశ్చిమంలో మాల్యవంతం, తూర్పున గంధమాదనం అనే సరిహద్దు పర్వతాలున్నాయి. అవి తూర్పు పడమరలకు పొడవూ, ఉత్తర దక్షిణాలకు వెడల్పూ కలిగి నీలపర్వత నిషధ పర్వతాలను ఆనుకొని ఉన్నాయి. వాని విస్తృతి రెండువేల యోజనాలు. మాల్యవంతం, గంధమాదనం అనే ఈ రెండూ కేతుమాల భద్రాశ్వ వర్షాలకు సరిహద్దు పర్వతాలుగా ఉన్నాయి. సుమేరు పర్వతానికి తూర్పున మందర పర్వతం, దక్షిణాన మేరుమందర పర్వతం, పడమట సుపార్శ్వ పర్వతం, ఉత్తరాన కుముద పర్వతం ఉన్నాయి, ఈ నాలుగు పర్వతాలు పదివేల యోజనాలు ఎత్తు కలిగి ఉన్నవి.

ఇన్నిటికీ నడుమ మేరుపర్వతం ఎత్తుగా పొడుగైన స్తంభంలాగా ఉంటే మిగిలిన పర్వతాలు నాలుగు పక్కల నాటిన పొట్టి గుంజల లాగున ఉన్నాయి.

ఈ నాలుగు పర్వత శిఖరాలమీద పతాకాల లాగున క్రమంగా పెద్ద పెద్ద మామిడి చెట్లూ, నేరేడు చెట్లూ, కడిమి చెట్లూ, మర్రి చెట్లూ ఉంటాయి. ఈ వృక్షరాజాలు ఒక్కొక్కటి పదకొండు వందల యోజనాల పొడవూ, నూరు యోజనాలు వెడల్పూ కలిగి ఉంటాయి. ఇంతే గాక ఆ నాలుగు పర్వత శిఖరాలమీద

శతయోజన విస్తీర్ణము లయిన నాలుగు పెద్ద పెద్ద సరోవరాలు ఉన్నాయి. క్రమంగా వాటి పేర్లు క్షీర సరస్సు, మధు సరస్సు, ఇక్షురస సరస్సు, నిర్మల జల సరస్సు. ఆ సరస్సులలో స్నానం చేసేవారికి స్వభావం చేతనే యోగ నిష్ఠా, అణిమాది సిద్ధులూ సిద్ధిస్తాయి. ఇంకా ఆ పర్వత శిఖరాలపైన నందనం, చైత్రరథం, వైభ్రాజకం, సర్వతోభద్రం- అనే దేవోద్యానాలు ఉన్నాయి. ఈ ఉద్యాన వనాలలో దేవతలు దేవకాంతలతో కూడి గంధర్వుల ఆటపాటలను ఆలకించుతూ ఆలోకించుతూ ఆనందంగా విహరిస్తారు.

**ఉ. మందరపర్వతంబు తుది మామిడి పం డ్లమృతోపమానమై**
**మందరశైల శృంగక సమానములై గిరిమీఁద వ్రాల మా**
**కందఫలామృతంబు గలఁగం బడి జాతి మహాప్రవాహమై**
**యం దరుణోదనామమున నద్భుతమై విలసిల్లు నెంతయున్. 21**

* మందర పర్వతం మీద మామిడి చెట్లు ఉన్నాయి. ఆ చెట్ల పండ్లు పర్వత శిఖరాలంత పెద్దవి. ఆ పండ్ల రుచి అమృతంతో సమానంగా ఉంటుంది. బాగా మాగిన ఆ పండ్లు చెట్ల నుండి ఆ కొండమీద రాలుతాయి. ఆ పండ్లు పడి పగిలినపుడు ఆ పండ్లరసం అద్భుతమైన మహాప్రవాహమై "అరుణోదం" అనే నదిగా ప్రవహిస్తుంది.

**చ. కడు మధురంబునన్ సురభిగంధముచే నరుణ ప్రకాశతన్**
**వడిగొని మందరాచలము వంతల చెంతల జాఱి యంతలోఁ**
**దొడితొడి నాయిలావృత్తముఁ దోఁచుచు వింతగఁ బూర్వవాహియై**
**యడరుఁ దరంగ సంతతుల నందఱి నచ్చటఁ జేయు ధన్యులన్. 22**

* ఆ నదీరసాలు చాలా తియ్యనివి. సుగంధంతో కూడినవి. ఎర్రని రంగు గలవి. ఆ నది మందరాచలం నుండి బయల్వెడలి తూర్పు వైపుగా ఇలావృత వర్షాన్ని ఒరుసుకుంటూ సాగిపోతుంది. ఆ నదీ తరంగాలు అందరినీ పవిత్రం చేస్తుంటాయి.

**ఆ. ఆ నదీజలంబు లాడిన యచ్చటి, యంబికానుచరుల యంగగంధ**
**మంది పవనుఁ డంత మనుజేశ! పదియోజ, నములు సుట్టుఁ బరిమళముల నింపు. 23**

* ఓ రాజా! ఆ నదీజలాలలో పార్వతీదేవి చెలికత్తెలు స్నానం చేస్తారు. వారి శరీరమందలి దివ్యపరిమళాన్ని గ్రహించిన వాయువు పదివేల యోజనాల పర్యంతమూ సుగంధాలు వెదజల్లుతుంది.

**ఆ. మేరు మందరముల మీఁద జంబూఫలం, బులు మహాగజోపములుగ వ్రాలి**
**యవిసి యంతఁ దద్రసామృతం బల్లన, య మ్మహానగంబునందుఁ బొడమి. 24**

* మేరుమందర పర్వతం మీద నేరేడు పండ్లున్నాయి. ఆ పండ్లు పెద్ద ఏనుగులంత ఉంటాయి. చెట్ల నుండి రాలిపడి పగిలిన ఆ పండ్ల రసమే ప్రవాహంగా ఆ కొండమీద జాలు వారుతుంది.

క. అనుపమ మగు జంబూనది, యను పేరను వెలసి లీల నరుగుచు నంతన్
ఘనత నిలావృత వర్షము, పనుపడఁ దడుపుచును ధరణిఁ బ్రవహించుఁ దగన్. 25

* ఆ నేరేడు పండ్ల రసం నదిగా ప్రవహిస్తుంది. ఆ నది పేరు జంబూనది. సాటిలేని ఆ నది ఇలావృత వర్షప్రదేశాన్ని తడుపుతూ ఆ భూభాగం మీద ప్రవహిస్తుంది.

ఉ. ఆ నదినీటఁ దోఁగి పదనై యటు మృత్తని లార్కసంగతిం
బూని కడున్ విపాకమునఁ బొందుచు శుద్ధసువర్ణజాతి జాం
బూనద నామమొంది సురముఖ్యుల కెల్లను భూషణార్హమై
మానుగ వన్నె మించి కడు మంచిదియై విలసిల్లు నెంతయున్. 26

* ఆ జంబూనదీ జలంతో బాగా నానిన మట్టి వాయు సూర్యసంపర్కంవల్ల పరిపక్వమై బంగారంలాగా మారిపోతుంది. ఆ కారణంగా బంగారానికి "జంబూపదం" అనే పేరు వచ్చింది. మంచి వన్నె గల ఆ శుద్ధ సువర్ణాన్ని దేవతలు భూషణాలుగా చేసుకొని  అలంకరించుకుంటారు.

వ. మఱియు సుపార్శ్వ నగాగ్రంబునందుఁ బంచవ్యామపరీణాహ బంధురంబులగు నైదు మధుధారా ప్రవాహంబులు పంచముఖంబులు వెడలి సుపార్శ్వనగ శృంగంబులం బడి యిలావృత వర్షంబు పశ్చిమభాగంబుఁ దడుపుచుం బ్రవహించు, నా తేనియ ననుభవించువారల ముఖమారుత సుగంధంబు శతయోజన పర్యంతంబుఁ బరిమళించు. 27

* సుపార్శ్వమనే పర్వతం మీద పెద్ద కడిమి చెట్టున్నది. ఆ వృక్ష కోటరముల నుండి ఐదు మధుధారా ప్రవాహాలు ఐదు దిక్కులా ప్రవహిస్తూ ఉంటాయి.

ఒక్కొక్క ప్రవాహం ఐదు బారల వెడల్పు కలిగి చిన్న నదిగా ఉంటుంది. ఈ ఐదు ప్రవాహాలూ సుపార్శ్వ పర్వత శిఖరం మీద నుండి కిందికి ప్రవహిస్తూ ఇలావృత వర్షం పడమటి భాగాన్ని తడుపు తుంటాయి. ఆ ఐదు తేనె ప్రవాహాలనూ ఆస్వాదించినవారి ముఖాల నుండి వెలువడిన పరిమళం నూరు యోజనాల పర్యంతం వ్యాపిస్తుంది.

సీ. కుముద పర్వత శిఖాగ్రమున నుత్పన్నమై కనుపట్టు వటతరు స్కంధమునను
నుదయించునట్టి పయో దధి ఘృత మధు గుడ విశిష్టాన్నంబు లుడుగ కెపుడు
నంబర శయ్యాసనాభరణాది వస్తువులు గోరికలు దీర్చుచును గుముద
పర్వతాగ్రంబునఁ బడి యిలావృతవర్షమున జనులకు నెల్ల భోగ్యములను

ఆ. వదల కొసఁగు, వారి వళిపలితంబులు, దలఁగు దుష్టగంధములను బాయు
మరణభయము ముదిమి పొరయ దెన్నఁడును శీ, తోష్ణబాధ సెందకుండు నధిప! 28

* ఓ రాజా! కుముద పర్వత శిఖరం మీద బాగా పెరిగిన పెద్ద మర్రిచెట్టు ఉన్నది. ఆ మర్రి మాను నుండి పాలు, పెరుగు, నేయి, తేనె, బెల్లం ఇంకా రకరకాల రుచులు కలిగిన ఆహారపదార్థాలు ఎప్పుడూ

ఉత్పన్న మవుతుంటాయి. వస్త్రాలు, పాన్పులు, ఆసనాలు, నగలు మొదలయిన వస్తువులను ఆ వటవృక్షం ప్రసాదిస్తుంది. ఆ మర్రిమాను కోరిన కోరికలు తీరుస్తూ ఇలావృత వర్షంలో నివసించే ప్రజల కందరికీ సమస్త విధాలయిన సుఖ సంపత్తిని ప్రసాదిస్తుంది. ఆ ఆహార పదార్థాలు వాడడం వల్లనూ ఆ ప్రదేశంలో అయాచితంగా దక్కే సుఖభోగానుభవం వల్లనూ అక్కడ ఎవరికీ ముసలితనం రాదు. చర్మం ముడుతలు పడదు. జుట్టు నరిసిపోదు. శరీర దుర్గంధం ఉండదు. మరణభయం అసలు లేదు. చలి, ఎండ బాధలు ఉండనే ఉండవు.

**ఆ. దేవదానవులును దివ్యమునీంద్ర గం, ధర్వు లాదిగాఁగఁ దగిలి యాశ్ర**
**యించి యుందు, రా గిరీంద్ర మూలమునందు, హర్షమంది ఘన విహార లీల. 29**

* దేవతలు, రాక్షసులు, దివ్యమునీంద్రులు, గంధర్వులు మొదలయిన వారందరూ ఆ కుముద పర్వతాన్ని ఆశ్రయించి పట్టరాని సంతోషంతో విహరిస్తుంటారు.

**వ. నరేంద్రా! కురంగ కురర కుసుంభ వైకంకత త్రికూట శిశిర పతంగ రుచక నిషధ శితివాస కపిల శంఖాదులయిన పర్వతంబులు మేరుపర్వతకర్ణికకుఁ గేసరంబులయి పరివేష్టించి యుండు, నామేరు నగేంద్రంబునకుఁ బూర్వభాగంబున జఠర దేవకూటంబులును, బశ్చిమంబునం బవనపారియాత్రంబులు నను పర్వతంబులు నాలుగు, నొండొంటికి దక్షిణోత్తరంబుల నష్టాదశ సహస్ర యోజనంబుల నిడుపును బూర్వ పశ్చిమంబుల ద్విసహస్ర యోజనంబుల వెడల్పును నగుచు దక్షిణంబునఁ గైలాసకర వీరంబులును, నుత్తరంబునఁ ద్రిశృంగమకరంబులను నామంబులు గల పర్వతంబులు నాలుగును, బూర్వపశ్చిమంబుల నష్టాదశసహస్ర యోజనంబుల నిడుపును, దక్షిణోత్తరంబులు ద్విసహస్రయోజనంబుల వెడల్పును నగుచు నగ్నిపురుషునకుం బ్రదక్షిణం బగుచున్న పరిస్తరణంబుల చందంబున మేరువునకుం బ్రదక్షిణంబుగా నష్ట నగంబులు నిలిచియుండు, మేరు శిఖరంబున దశసహస్ర యోజనంబుల నిడుపు నంతియ విస్తారంబు నగుచు సువర్ణమయంబయిన బ్రహ్మపురంబు దేజరిల్లుచుండు, నా పట్టణంబునకు నష్టదిక్కుల యందును లోక పాలుర పురంబు లుండు. 30**

* నరేంద్రా! మేరుపర్వతం తామరదుద్దు; దానిచుట్టూ కురంగం, కురరం, కుసుంభం, వైకంకతం, త్రికూటం, శిశిరం, పతంగం, రుచకం, విషధం, శితివాసం, కపిలం, శంఖం మొదలయిన పర్వతాలు కేసరాలుగా ఉన్నాయి. ఆ మేరుపర్వతానికి తూర్పుభాగంలో జఠరగిరి, దేవకూటంఅనే కొండలున్నాయి. పడమట పవనగిరి, పారియాత్రం అనే పర్వతాలున్నాయి. ఈ నాలుగు పర్వతాలు ఒక్కొక్కటి దక్షిణం నుంచి ఉత్తరం వరకూ పద్దెనిమిది వేల యోజనాలు పొడవు, తూర్పు నుండి పడమటి వరకూ రెండువేల యోజనాల వెడల్పు కలిగి ఉంటాయి. ఆ కొండలు ఒక్కొక్క దానికి తూర్పు నుండి పడమరకు పద్దెనిమిది యోజనాల పొడవూ, దక్షిణం నుండి ఉత్తరానికి రెండువేల యోజనాల వెడల్పూ ఉంటుంది. మేరువు చుట్టూ ఉన్న ఎనిమిది కొండలు అగ్నిహోత్రునికి ప్రదక్షిణం చేస్తున్న జ్వాలల లాగున నిలిచి ఉన్నాయి. మేరు పర్వతశిఖరంలో బ్రహ్మపురం ఉన్నది. అది పదివేల యోజనాల పొడవు, అంతే వెడల్పు కలిగిన ప్రదేశం. ఇదంతా బంగారు భూమి. ఆ బ్రహ్మపురానికి ఎనిమిది దిక్కుల లోనూ అష్టదిక్పాలకుల పట్టణాలున్నాయి.

క. పరమేష్ఠి పట్టణంబున, హరి మున్ను త్రివిక్రమణము లందన్ సర్వే
శ్వర చరణాగ్ర నఖాహతిఁ, బరువడి నూర్ధ్వాండ మంతఁ బగిలె నరేంద్రా! 31

* ఓ రాజా! బ్రహ్మపట్టణంలో నారాయణుడు త్రివిక్రమత్వాన్ని ప్రదర్శించాడు. అప్పుడాయన కాలిగోటి దెబ్బకు బ్రహ్మాండం పై భాగం చిట్లి బద్దలయింది.

వ. ఇట్లు చరణనఖస్పర్శంజేసి భేదింపంబడ్డ యూర్ధ్వకటాహ వివరంబు వలన నంతః ప్రవేశంబు సేయుచున్న బాహ్యజలధార శ్రీహరిపాదస్పర్శం జేయుచుఁ, జనుదెంచి సకలలోకజనంబుల దురితంబులు వాపుచు భగవత్పాది యనుపేరం దేజరిల్లుచు దీర్ఘ కాలంబు స్వర్గంబున విహరించుచు, విష్ణుపదంబున నుత్తానపాద పుత్త్రుండును బరమ భాగవతుండునైన ధ్రువుండు తన కులదేవతయైన శ్రీహరి పాదోదకంబుఁ బ్రతిదినంబును భక్తియోగంబున నిమీలితనేత్రుండై యానందబాష్పంబుల రోమాంచితగాత్రుండై యత్యాదరంబున నేఁడును శిరంబున ధరియించుచున్నవాఁ; డతనికి నధోభాగంబున నుండు మండలాధిపతులైన సప్తర్షులును హరిపాదోదక ప్రభావంబు నెఱింగి తాము పొందు తపశ్శుద్ధి యాకాశగంగాజలంబుల స్నాతు లగుటయే యని సర్వభూతాంతర్యామి యగు నీశ్వరునియందు భక్తి సలిపి యితర పదార్థాపేక్ష సేయక మోక్షార్థి ముక్తి మార్గంబు బహుమానంబు సేయు తెఱంగున బహుమానయుక్తంబుగాఁ దమ జటాజూటంబుల యందు నేఁడును ధరియించుచుండుదురు. 32

* త్రివిక్రమావతారం ప్రదర్శించిన శ్రీమన్నారాయణుని వామపాదాంగుష్ఠనఖంచేత బ్రహ్మాండం పై కప్పు బద్దలు కాగా ఒక రంధ్రం ఏర్పడింది. అపుడు అంతవరకూ వెలుపలి వైపు ప్రవహిస్తున్న జలధార అంతర్వాహినియై త్రివిక్రమదేవుని పాదాన్ని స్పృశిస్తూ ప్రవహించింది. ఆ ప్రవాహమే 'భగవత్పాది' అనే పేరుతో సకల లోకాల పాపాలను పరిహరిస్తూ చాలకాలం స్వర్గంలో విహరించింది. ఉత్తానపాదుని కుమారుడూ, భాగవతులలో అగ్రేసరుడూ అయిన ధ్రువుడు తన ఇలవేల్పయిన శ్రీహరి పాదోదకాన్ని ప్రతిదినం నిమీలితనేత్రుడై భక్తితో స్వీకరిస్తూ, ఆనంద బాష్పాలతో, పులకించిన దేహంతో, ఎంతో ఆదరంతో నేటికీ తలపై చల్లుకొంటున్నాడు. ఆ ధ్రువునికి దిగువ భాగంలోనే మండలాధి పతులయిన సప్తర్షులున్నారు. వారు శ్రీమన్నారాయణుని పాదోదక ప్రభావం తెలుసుకొని ఆకాశగంగలో స్నానం చేయడమే తమ తపస్సిద్ధి అని భావిస్తారు. అలా స్నానం చేయడం వల్ల తమ జన్మ చరితార్థ మవుతున్నట్టు విశ్వసిస్తారు. అఖిల జగత్తులో అంతర్యామిగా ఉన్న శ్రీమన్నారాయణునిపై భక్తి దృఢంగా నిలిపి, వేరే ప్రాపంచిక మయిన వస్తువులపై అపేక్ష లేకుండా, మోక్షం కోరే వ్యక్తి, ముక్తి మార్గాన్ని గౌరవించినట్లు భక్త గౌరవాలతో సప్తమహర్షులు ఆ ఆకాశగంగా జలాన్ని తమ జటాజూటాలలో ఈ నాటికీ ధరిస్తుంటారు.

సీ. అంత నసంఖ్యంబులైన దివ్య విమాన సంకులంబుల సువిశాలమైన
దేవమార్గంబున దిగి వచ్చి చంద్రమండలముఁ దోఁచుచు మేరునగ శిఖాగ్ర
మునను నా బ్రహ్మదేవుని పట్టణమునకు వచ్చి యందులఁ జతుర్ద్వారములను
వరుసతో దీర్ఘ ప్రవాహంబు లగుచును బ్రవహించి యమల ప్రభావములను

ఆ. నరుగు లవణసాగరాంతంబులుగ నాల్గు, మోములందు నాల్గు నామములను
దన్నుఁ గన్నవారిఁ దన వారిఁదోఁగిన, వారికెల్ల నమృతవారి యగుచు. 33

* విష్ణుమూర్తి పాదం నుండి వినిర్గతమైన ఆకాశగంగ లెక్కలేనన్ని దివ్యవిమానాలతో నిండి సువిశాలమయిన దేవమార్గం గుండా వచ్చి చంద్రమండలాన్ని ఒరుసుకుంటూ మేరుపర్వత శిఖరాగ్రానికి చేరుకుంటుంది. అక్కడి ఆ బ్రహ్మపట్టణం నాలుగు ద్వారాలగుండా సీత, చక్షువు, భద్ర, అలకనంద అనే నాలుగు నామాలతో నాలుగు విధాలుగా ప్రవహించి చివరకు లవణ సముద్రంలో కలిసిపోతుంది. ఆ గంగా జలాలు తమను దర్శించే వారికినీ, తమలో స్నానం చేసేవారికినీ అమృతత్వం ప్రసాదిస్తూ ఉంటాయి.

వ. ఇట్లు సీత యను పేర వినుతి నొందిన యమ్మహానదీప్రవాహంబు బ్రహ్మసదన పూర్వ ద్వారంబున వెడలి కేసరావలయంబుఁ దడుపుచు గంధమాదనాద్రికిం జని భద్రాశ్వవర్షంబుం బావనంబు సేయుచుఁ బూర్వ లవణసాగరంబునం బ్రవేశించుఁ; జక్షు వనుపేరం దేజరిల్లెడు దీర్ఘ ప్రవాహంబు పశ్చిమ ద్వారంబున వెడలి మాల్యవత్పర్వతంబు నుత్తరించి కేతుమాలవర్షంబుం బవిత్రంబు సేయుచుఁ బశ్చిమ లవణార్ణవంబునం గలియు, భద్ర యను పేర వెలుఁగొందిన యతుల ప్రవాహం బుత్తర ద్వారంబున వెడలి కుముదనీల శ్వేతాఖ్య పర్వత శిఖరంబులం గ్రమంబునం బ్రవహించుచు శృంగనగరంబునకుం జని మానసోత్తరంబు లగు నుత్తర కురుభూములఁ బవిత్రంబు సేయుచు నుత్తర లవణ సాగరంబు జేరు, నలకనంద యనం బ్రఖ్యాతిఁ గాంచిన యమ్మహానదీ ప్రవాహంబు బ్రహ్మసదన దక్షిణద్వారంబున వెడలి యత్యంత దుర్గమంబు లైన భూధరంబులఁ గడచి హేమకూట హిమకూట నగంబుల నుత్తరించి యతివేగంబునఁ గర్మక్షేత్రంబగు భారత వర్షంబుఁ బావనంబు సేయుచు దక్షిణ లవణాంబుధిం గలయు నంత. 34

* 'సీత' అనే పేరుతో ప్రఖ్యాతమయిన నదీ ప్రవాహం బ్రహ్మపురం తూర్పుద్వారం నుంచి ప్రవహించి కేసరగిరి శిఖరాలను తడుపుతూ గంధమాదన పర్వతం మీదుగా సాగి 'భద్రాశ్వ వర్షాన్ని' పవిత్రం చేస్తూ తూర్పువైపున లవణ సముద్రంలో ప్రవేశిస్తుంది.

బ్రహ్మపురం పడమటి ద్వారం నుండి వెలువడిన ప్రవాహం పేరు 'చక్షువు'. ఆ ప్రవాహం మాల్యవంత మనే పర్వతాన్ని దాటి కేతుమాల వర్షాన్ని పవిత్రంచేస్తూ పడమటి సముద్రంలో సంగ మిస్తుంది.

బ్రహ్మపట్టణం ఉత్తరద్వారం గుండా వెలువడిన ప్రవాహం పేరు 'భద్ర'. అది కుముదం, నీల, శ్వేతం అనే పర్వత శిఖరాల మీదుగా ప్రవహిస్తూ, శృంగనగరం చేరుకొని, అక్కడ నుండి మానసోత్తరాలైన కురుభూములను పవిత్రం చేస్తూ ఉత్తర సముద్రంలో కలుస్తుంది.

బ్రహ్మనగరం దక్షిణద్వారం నుండి వెలువడిన నది పేరు 'అలకనంద'. అది మిక్కిలి దుర్గమాలైన పర్వత పంక్తులగుండా ప్రవహించి హేమకూటం, హిమకూటం అనే పర్వత ప్రాంతాలను దాటి వచ్చి చాల ఉరవడితో కర్మక్షేత్రమయిన భారత వర్షాన్ని పవిత్రం చేస్తుంది. ఆ తరువాత దక్షిణ సముద్రంలో కలిసిపోతుంది.

సీ. జగతిలో మేరు వాదిగఁ బర్వతములకుఁ బుత్రిక లైనట్టి పుణ్యతీర్థ
ములు వేల సంఖ్యలు గలవు; జంబూద్వీప మందు భారతవర్ష మరయఁ గర్మ
భూమి; దక్కిన వర్షముల దివంబున నుండి భువికి వచ్చినవారు పుణ్యశేష
ములు భుజించుచు నుండ్రు; భూస్వర్గ మనఁదగు నా వర్షముల నుండునట్టి వార

ఆ. లయుత సంఖ్య వత్సరాయువు లయుత మా, తంగబలులు దేవతాసమాను
లతులవజ్రదేహు లధిక ప్రమోదితు, లప్రమత్తు లార్యు లనఘు లధిప! 35

* ఓ రాజా! ప్రపంచంలో మేరువువంటి పర్వతాలు ఎన్నో ఉన్నాయి. వాటికి పుత్రిక లేమో అన్నట్లుగా పుణ్యతీర్థాలు ఉన్నాయి. వాటిని లెక్కపెట్టడం వీలుకాని పని. అవి వేల సంఖ్యలో ఉన్నాయి. జంబూద్వీపంలో భారతవర్షం కర్మభూమి. తక్కిన వర్షాలు భోగభూములు. స్వర్గం నుండి భూమికి దిగివచ్చినవారు, అక్కడ పుణ్యఫలాలు అనుభవిస్తుంటారు. భూలోక స్వర్గం వంటి ఆ వర్షాలలో జీవించే వారు పదివేల సంవత్సరాల ఆయుర్దాయం కలిగి ఉంటారు. పదివేల ఏనుగుల బలం కలిగి ఉంటారు. దేవతలతో సమానులుగా ఉంటారు. వజ్రాలవంటి దృఢమయిన దేహాలు కలిగి ఉంటారు. వారు ఎంతో సంతోషంతో జీవిస్తారు. వారి ప్రవర్తనలో ఎటువంటి పొరపాట్లు ఉండవు. వారు పూజ్యులు; అంతే కాదు పుణ్యాత్ములు.

వ. మఱియు సురతసుఖానందంబున మోక్షంబునైనం గైకొనక సకృత్ప్రసూతు లగుచు ననవరతంబును త్రేతాయుగ కాలంబు గలిగి ప్రవర్తింతు; రీ యష్టవర్షంబులయందు దేవతాగణంబులు దమ భృత్యవర్గంబు లత్యుపచారంబులు సేయుచుండ నెల్ల ఋతువుల యందుం గిసలయ కుసుమ ఫల భరితంబులైన లతాదుల శోభితంబు లగు వనంబులు గల వర్ష నిధిగిరి ద్రోణుల యందును, వికచ వివిధ నవ కమలామోద ముదిత రాజహంస కలహంసలు గల సరోవరంబుల యందును జలకుక్కుట కారండవ సారస చక్రవాకాది వినోదంబులు గలిగి మత్తాళిఝుంకృతి మనోహరంబులై నానా విధంబులైన కొలంకులయందును దేవాంగనల కామోద్రేకజంబు లయిన విలాస హాస లీలావలోకనంబులం దివియుంబడిన మనోదృష్టులు గలిగి విచిత్ర వినోదంబులం దగిలి యిచ్ఛావిహారంబులు సలుపుచుండుదురు. 36

* ఈ ఎనిమిది వర్షాలలో ఉన్నవారు సురత సుఖానంద పరవశులై మోక్షాన్ని సైతం కోరరు. అక్కడి స్త్రీలు ఒక్క పర్యాయం మాత్రమే బిడ్డలను కంటారు. అక్కడ ఎల్లప్పుడూ త్రేతాయుగమే ప్రవర్తిస్తుంది. ఈ ఎనిమిది వర్షాలలోనూ దేవతలు తమ సేవకులు చేసే ఉపచారాలు గ్రహిస్తూ విహరిస్తుంటారు. అన్ని ఋతువులందూ చివుళ్లతో, పువ్వులతో, ఫలాలతో నిండిన తీగెలు, వృక్షాలూ గల వనాలు అక్కడ ఉంటాయి. సరోవరాలలో వికసించిన పద్మాలు ఉంటాయి. ఆ పద్మాల పరిమళం ఆఘ్రాణిస్తూ రాజహంసలు, కలహంసలు విహరిస్తుంటాయి. నీటి కోళ్ళు, కొక్కెరలు, బెగ్గురుపక్షులు, జక్కవలు కొలకులలో ఈదులాడుతుంటాయి. మత్తెక్కిన తుమ్మెదలు ఝుంకారాలు చేస్తుంటాయి. అటువంటి వనాలలో, సరస్సులలో కొండ లోయలలో దేవతా స్త్రీలు విహరిస్తూ విలాసంగా ఆడుతూ, పాడుతూ, పకపక నవ్వుతూ,

పక్కచూపులు చూస్తూ కామోద్రేకం కలిగిస్తూ సంచరిస్తూంటారు. వారి విలాస చేష్టలకు ఆకర్షితులైన పురుషులు అక్కడ స్వేచ్ఛావిహారాలు చేస్తుంటారు.

**క. ఈ నవవర్షంబులయం, దా నారాయణుఁడు వచ్చి యనవరతము లో**
**కానుగ్రహమునకై సు, జ్ఞానం బీఁ దలఁచి లీలఁ జరియించుఁ దగన్. 37**

* ఈ తొమ్మిది వర్షాలలోనూ జీవులకు సరియైన జ్ఞానం అనుగ్రహించడంకోసం నారాయణుడు అనేక లీలావిలాసాలు ప్రదర్శిస్తూ సంచరిస్తుంటాడు.

**సీ. వసుధ నిలావృత వర్షాధిపతియైన పురహరుం డా వర్షమున వనంబు**
**నందు నుండుటకు నా యంబికాశాప వశంబును నా వనస్థలములందు**
**నెవ్వరు వచ్చిన నింతులై యుందు రా వనమందుఁ బార్వతి యనుదినంబు**
**నంగనాజన సహస్రార్బుదంబులతోడ నసమలోచనుఁ గొల్చు నతులభక్తి**

**ఆ. నట్టి శివునిఁ గోరి యా యిలావృతవర్ష,మునఁ జరించు జనులు మోదమునను**
**గదిసి తత్ప్రకాశకములైన మంత్ర తం, త్రములఁ బూజఁ జేసి తలఁతు రెపుడు. 38**

* ఇలావృత వర్షానికి త్రిపురాసుర సంహారకుడైన శివుడు అధిపతి'. ఆ ఇలావృత వర్షంలో పార్వతీదేవి విహరించే ఉద్యానవనం ఉంది. ఆ వనంలోకి పురుషు లెవరయినా ప్రవేశిస్తే వారందరూ స్త్రీలవుతారని జగజ్జనని శాపం. అక్కడ పార్వతీదేవి వేలకొలది చెలికత్తెలతో వచ్చి ప్రతినిత్యమూ పరమేశ్వరుణ్ణి పరమభక్తితో సేవిస్తుంటుంది. ఆ ఇలావృతవర్షంలోని జనులు ఎంతో సంతోషంతో ఆయా మంత్ర తంత్రాలతో పరమేశ్వరుణ్ణి పూజించి సదా సంస్మరించి తరిస్తుంటారు.

**క. భద్రాశ్వవర్షమందుల, భద్రశ్రవుఁ డనెడి పేరఁ బరఁగుచుఁ దపనీ**
**యాద్రి సమధైర్యుఁ డగుచు స, ముద్రాంతంబైన జగతిఁ బొలుపుగ నేలున్. 39**

* భద్రాశ్వ వర్షానికి భద్రశ్రవుడు అధిపతి. అతడు మేరుపర్వతం వంటి ధైర్యం కలవాడు. అతడు సముద్రాలు హద్దుగా కలిగిన భూమిని పరిపాలించాడు.

**క. ఆ నరవరునకుఁ బ్రియతముఁ, డైన హయగ్రీవమూర్తి ననవరతంబున్**
**ధ్యానస్తోత్రజపాను, ష్ఠానాదులఁ బూజసేసి సజ్జను లంతన్. 40**

* ఆ భద్రశ్రవునికి హయగ్రీవుడు ఇష్టదైవం, ఆ హయగ్రీవమూర్తిని ధ్యానాలతో, జపాలతో, స్తోత్రాలతో, అనుష్ఠానాలతో సజ్జనులు సేవించి తరిస్తుంటారు.

**ఆ. తత్ప్రకాశకప్ర త్ప్రధాన మంత్రార్థ సం, సిద్ధిఁ జేసి ముక్తిఁ జెంది రప్పు**
**డట్టి వర్షమందు నా హయగ్రీవునిఁ, దలఁచి కొలిచి మిగుల ధన్యు లగుచు. 41**

* ఆ హయగ్రీవ తత్త్వాన్ని ప్రకాశింపజేసే ప్రధాన మంత్రాలు ఉన్నాయి. ఆ మంత్రాలు మహిమతో ఆ వర్షంలోని వారు హయగ్రీవుణ్ణి అర్చించి, స్తుతించి, ధ్యానించి ముక్తి పొందుతున్నారు.

**సీ.** **హరివర్ష పతియైన నరహరి ననిశంబు నందున్న జనులు మహాత్ములయిన**
**దైత్యదానవ కులోత్తములు ప్రహ్లాదాది వృద్ధులఁగూడి సంప్రీతితోడ**
**సుస్నాతులై భక్తిఁ జూచుచు నుందురు రమ్యదుకూలాంబరములు దాల్చి**
**తత్ప్రకాశక మంత్ర తంత్రజపస్తోత్ర పఠన సుధ్యానతపః ప్రధాన**

**గీ.** **మైన సత్పూజలను జేసి యచల బుద్ధి, శ్రీ నృసింహునిఁ జేరి పూజించి యతని**
**కరుణ నొందుచు నతుల ప్రకాశు లగుచు, భుక్తిముక్తులఁ గైకొంద్రు భూపవర్య!** 42

* ఓ రాజా! హరివర్షంవారికి 'నరసింహుడు' ఇష్టదైవం. అక్కడున్న జనులు దైత్య, దానవ వంశాలలో ఉత్తము లయినవారు. వారు ప్రహ్లాదుడు మొదలయిన పెద్దలతో కలిసి స్నానం చేసి శుచులై నరసింహుణ్ణి సేవిస్తుంటారు. రమణీయము లయిన పట్టుబట్టలు కట్టుకొని ఆ నరసింహతత్త్వాన్ని ప్రకాశింపజేసే మంత్రం జపిస్తూ, ఆ మంత్రానికి సంబంధించిన తంత్ర కార్యాలను నిర్వహిస్తూ నరసింహునికి ప్రీతిపాత్ర మయిన ధ్యానాలూ, జపాలూ, తపాలూ, స్తోత్రాలూ చేస్తూ నిలుకడ గల బుద్ధితో స్వామిని సేవిస్తుంటారు. ఆ స్వామి కరుణకు పాత్రులై ఇహపర సుఖాలను అనుభవిస్తుంటారు.

**వ.** **మఱియుఁ గేతుమాల వర్షంబునందు భగవంతుండు శ్రీదేవికి సంతోషంబు నొసంగుటకుఁ గామ దేవరూపంబున నుండు; నమ్మహాపురుషుని యస్త్రతేజః ప్రకాశంబునఁ బ్రజాపతి దుహితలగు రాత్ర్యధి దేవతల గర్భంబులు సంవత్సరాంతంబున నిర్జీవంబులై స్రవించు, నా కామదేవుండును దన గతి విలాసలీలావిలోకన సుందర భ్రూమండల సుభగ వదనారవింద కాంతులం జేసి శ్రీరమాదేవిని రమింపంజేయు; భగవన్మాయారూపిణి యగు శ్రీదేవియుఁ బ్రజాపతి పుత్రికలును బుత్త్రులునైన రాత్రులం బగళ్లం గూడి కామదేవుని స్తోత్రపఠన పూజాధ్యానాదులం బూజించు చుండు; మఱియును.** 43

* కేతుమాల వర్షంలో భగవంతుడు శ్రీదేవిని సంతోషపెట్టడం కోసం మన్మథరూపంలో సాక్షాత్కరిస్తాడు. ఆ కామదేవుని అస్త్ర ప్రభావంవల్ల ధాత్రీదేవతల గర్భాలు సంవత్సరకాలం సంరక్షింపబడి నప్పటికీ నిర్జీవములై స్రవిస్తాయి. తన నడకల సొగసులతో, విలాస వీక్షణాలతో, అందమైన కనుబొమలతో, పద్మాలవంటి మనోహర ముఖకాంతులతో ఆ కామదేవుని రూపంలో ఉన్న శ్రీహరి రమాదేవిని సంతోషపెడతాడు. భగవంతుని మాయకు ప్రతిరూపమయిన ఆ శ్రీదేవికూడా ప్రజాపతి పుత్రికలూ, పుత్రులూ అయిన రాత్రులతో , పగళ్ళతో కామదేవుణ్ణి స్తుతిస్తూ పూజలు చేస్తూ ధ్యానిస్తూ, ఆరాధిస్తూ ఉంటుంది.

**క.** **విమలమతిఁ జిత్తగింపుము, రమణీయంబైన విమలరమ్యక మను వ**
**ర్షమునకు నధిదేవత దా, నమరంగా మత్స్యరూపుఁడగు హరి దలఁపన్.** 44

* ఓ పరీక్షిన్నరేంద్రా! పరిశుద్ధమయిన మనసుతో శ్రద్ధగా విను. రమణీయమైన 'రమ్యక' మనే వర్షానికి మత్స్యరూపుడయిన హరి అధిదేవత.

ఆ. అట్టి వర్షమునకు నధిపతి యగుచున్న, మనువు పుత్త్రపౌత్త్ర మంత్రివరులఁ
గూడి మత్స్యమైన కుంభినీధరుఁ జిత్త, మతుల భక్తియుక్తి హత్తఁ గొలుచు. 45

* ఆ రమ్యక వర్షానికి మనువు అధిపతి. అతడు కొడుకులతో, మనుమలతో, మంత్రివరులతో మత్స్యరూపుడయిన శ్రీహరిని అనుపమానమైన భక్తితో ఆరాధిస్తుంటాడు.

ఆ. తత్ప్రకాశ కృత్ప్రధాన మంత్రస్తోత్ర, ములను ధర్మకర్మములను హోమ
ములను జనులు సేసి పుణ్యులై భుక్తి ము, క్తులను బొందుచుందు రెలమితోడ. 46

* ఆ రమ్యక వర్షంలోని వారు అధిదేవత అయిన మత్స్యమూర్తిని ప్రకాశింపజేసే మంత్రాలతో, స్తోత్రాలతో అర్చిస్తూ, ధర్మకార్యాలు నిర్వహిస్తూ అగ్నికార్యాలు నెరవేరుస్తూ పుణ్యాత్ములై భక్తి ముక్తులను ఆనందంగా అనుభవిస్తారు.

క. వినుము; హిరణ్మయ వర్షం, బునకుం గూర్మావతారమును దాల్చిన యా
వనజోదరుఁ డధిదేవత, యనఘుఁడు పితృపతి మహాత్ముఁ డర్యముఁడు నృపా! 47

* హిరణ్మయ వర్షానికి కూర్మావతారం ధరించిన ఆ శ్రీహరి అధిదేవత. పాపరహితు డయినవాడూ పితృదేవతలకు అధిపతి అయినవాడూ మహాత్ముడూ అయిన అర్యముడు ఆ భూభారాన్ని పరిపాలిస్తుంటాడు.

క. ఆ వర్షమందు నర్యముఁ, డా వర్షజనంబుఁగూడి హరిఁ జిత్తముతో
భావించి సంస్తవంబులు, గావించుచు భుక్తి ముక్తి గాంతు గడంకన్. 48

* అర్యముడు హిరణ్మయ వర్షంలోని జనులందరితో కూడా కలిసి కూర్మరూపుడయిన శ్రీహరిని మనసులో ధ్యానిస్తూ స్తోత్రాలతో సంస్తుతిస్తూ భుక్తి ముక్తులు అందుకుంటాడు.

క. ఉత్తర కురుభూములఁ దను, హత్తుకొని వరాహదేవుఁ డధిపతియైనన్
సత్తుగ భూసతి యతనిం, జిత్తములో నిలిపి పూజ సేయుచు నుండున్. 49

* ఉత్తర కురువర్షానికి వరాహదేవుడు అధిపతి. అక్కడ భూదేవి వరాహదేవుడయిన శ్రీహరిని మనసులో నిలుపుకొని పూజలు చేస్తుంటుంది.

క. ఆ వర్షమందులను బ్రజ, లా విపులవరాహమూర్తి ననవరతంబున్
సేవించి కొలిచి సంస్తుతిఁ, గావించుచుఁ గాంతు రంతఁ గైవల్యంబున్. 50

* ఆ ఉత్తర కురువర్షంలోని ప్రజలు వరాహమూర్తిని అనుదినమూ సేవిస్తూ, సంభావిస్తూ, సంస్తుతులు గావిస్తూ, మోక్షపదాన్ని చేరుకొంటారు.

క. అరయఁగ సీతాలక్ష్మణ, పరివృతుఁడై వచ్చి రామభద్రుఁడు గడిమిం
బరఁగు నధిదేవతగఁ గిం, పురుష మహావర్షమునకు భూపవరేణ్యా! 51

* పరీక్షిన్మహారాజా! కింపురుష వర్షానికి సీతా లక్ష్మణ సమేతుడయిన శ్రీరామభద్రుడు అధిదేవత.

ఆ. అట్టి రామభద్రు నంజనీసుతుఁడు గిం, పురుషగణముఁ గూడి పూజ సేసి
తత్ప్రకాశ కృత్ప్రధానమంత్ర స్తోత్ర పఠనములను దగ నుపాస్తి సేయు. 52

* ఆ కింపురుష వర్షంలో అంజనాదేవి కుమారుడయిన ఆంజనేయుడు కింపురుషగణాలతోకూడి మహనీయములైన మంత్రస్తోత్రాదులతో శ్రీరామచంద్రుణ్ణి ఆరాధిస్తుంటాడు.

సీ. భారతవర్షాధిపతియైన బదరికాశ్రమమున నున్న నారాయణుండు
భూనాథ! యా మహాత్ముని నారదాదులు భారతవర్షంబు ప్రజలఁ బ్రేమఁ
బాయక చేరి యుపాస్తి సేయుచు సాంఖ్య యోగంబు నుపదేశ ముచితవృత్తి
నంది యందఱును గృతార్థులై యట్టి నారాయణదేవు నారాధనంబు

ఆ. సేసి యాత్మఁ జాలఁ జింతించి తత్ప్రకా, శకము లయిన మంత్ర సంస్తవములఁ
బూజసేసి ముక్తిఁ బొందుచు నుండుదు, రచలమైన భక్తి ననుదినంబు. 53

* భారతవర్షానికి బదరికాశ్రమవాసి అయిన నారాయణుడు అధిపతి. ఈ భారత వర్షంలోని వారు మహాత్ములయిన నారదాది మునుల సాంగత్యంతో సాంఖ్యయోగాన్ని ఉపదేశంగా పొంది తమ జన్మలను సార్థకం చేసుకొంటారు. నారాయణ దేవుణ్ణి ఆరాధించి ఆ దేవునికి ప్రియమైన మంత్ర స్తోత్రాదులతో పూజలు చేస్తారు. భక్తితో మ్రొక్కి ముక్తి దక్కించుకొంటారు.

క. భారతవర్షమునందుల, సారాంశములైన పుణ్యశైలంబులు గం
భీర ప్రవాహములుఁ గల, వారయ నెఱిఁగింతు వాని నవనీనాథా! 54

* ఓ రాజా! భారత వర్షంలో లెక్కలేనన్ని పుణ్య పర్వతాలున్నాయి. అంతే గాకుండా లోతయిన నదీప్రవాహాలుకూడా ఉన్నాయి. వాటి విశేషాలను నేను వినిపిస్తాను.

వ. మలయపర్వతంబును, మంగళ ప్రస్థంబును, మైనాకంబును, త్రికూటంబును, ఋషభపర్వతంబును, గూటరంబును, గోల్లంబును, సహ్యపర్వతంబును, వేదగిరియు, ఋష్యమూక పర్వతంబును, శ్రీశైలంబును, వేంకటాద్రియును, మహేంద్రంబును, వారిధరంబును, వింధ్య పర్వతంబును, శుక్తిమత్పర్వతంబును, ఋక్షగిరియును, బారియాత్రంబును, ద్రోణపర్వతంబును, జిత్రకూటంబును గోవర్ధనాద్రియును, రైవతకంబును, గుకుంభంబును, నీలగిరియును, గాకముఖంబును, నింద్రకీలంబును, రామగిరియు నాదిగాఁగల పుణ్యపర్వతంబు లనేకంబులుగల, వా పర్వతపుత్రికలైన చంద్రపటయుఁ, దామ్రపర్ణియు, నవటోదయుఁ, గృతమాలయు, వైహాయసియుఁ, గావేరియు, వేణియుఁ, బయస్వినియుఁ, బయోదయు, శర్కరావర్తయుఁ, దుంగభద్రయుఁ, గృష్ణవేణియు,

**భీమరథియు, గోదావరియు, నిర్వింధ్యయుఁ బయోష్ణియుఁ, దాపియు, రేవానదియు, శిలానదియు, సురుసయుఁ, గౌశికియు, మందాకినియు, యమునయు, సరస్వతియు, దృషద్వతియు, గోమతియు, సరయువును, భోగవతియు, సుషమయు, శతద్రువును, జంద్రభాగయు, మరుద్వృథయు, వితస్తయు, నసిక్నియు, విశ్వయు నను నీ మహానదులును; నర్మద, సింధువు, శోణయను నదంబులును నైన మహాప్రవాహంబు లీ భారత వర్షంబునఁ గల; వందు సుస్నాతులైన మానవులు ముక్తిం జెందుదురు; మఱియు నీ భారత వర్షంబున జన్మించిన పురుషులు శుక్ల లోహిత కృష్ణవర్ణ రూపంబులగు త్రివిధ కర్మంబులంజేసి క్రమంబుగ దేవ మనుష్య నరకగతులను త్రివిధ గతులం బొందుదురు; వినుము; రాగద్వేషాది శూన్యుండు నవాఙ్మానసగోచరుండు, ననాధారుండునగు శ్రీవాసుదేవమూర్తి యందుఁ జిత్తంబు నిలిపి భక్తియోగంబున నారాధించెడు మహాత్ము లవిద్యాగ్రంథి దహనంబు గావించుటం జేసి పరమభాగవతోత్తములు పొందెడు నుత్తమగతిం జెందుదురు; కావున భారతవర్షంబు మిగుల నుత్తమం బని మహాపురుషు లిట్లు స్తుతింపుచుండుదురు.** **55**

* భారతవర్షంలోని పుణ్యపర్వతాలలో మలయం, మంగళప్రస్థం, మైనాకం, త్రికూటం, ఋషభం, కూటరం, గోల్లం, సహ్యాద్రి, వేదాద్రి, ఋశ్యమూకం, శ్రీశైలం, వేంకటాద్రి, మహేంద్రగిరి, మేఘపర్వతం, వింధ్యపర్వతం, శుక్తి మంతం, ఋక్షగిరి, పారియాత్రం, ద్రోణగిరి, చిత్రకూటం, గోవర్ధనం, రైవతకం, కుకుంభం, నీలగిరి, కాకముఖం, ఇంద్రకీలాద్రి, రామగిరి మొదలయినవి ప్రసిద్ధ పర్వతాలు.

ఆ పర్వతాలకు పుత్రికల వంటివయిన చంద్రవట, తామ్రపర్ణి, అవటోద, కృతమాల, వైహాయసి, కావేరి, వేణి, పయస్విని, పయోద, శర్కరావర్త, తుంగభద్ర, కృష్ణవేణి, భీమరథి, గోదావరి, నిర్వింధ్య, పయోష్ణ, తాపి, రేవా, శిలా, సురస, చర్మణ్వతి, వేదస్మృతి, ఋషికుల్య, త్రిసమ, కౌశికి, మందాకిని, యమున, సరస్వతి, దృషద్వతి, గోమతి, సరయువు, భోగవతి, సుషమ, శతద్రువు, చంద్రభాగ, మరుద్వృథ, వితస్త, అసిక్ని, విశ్వ మొదలయినవి ప్రధానమైన నదులు. నర్మద, సింధు, శోణ అనునవి నదములు. ఇట్టి మహానదులు భారతవర్షంలో ఎన్నో ఉన్నాయి. వీటిలో స్నానం చేసిన మానవులకు ముక్తి కరతలామలకం.

ఈ భారతవర్షంలో పుట్టిన మానవులు మూడు విధాలయిన కర్మలు చేస్తుంటారు. కొన్ని తెల్లనివి, కొన్ని ఎర్రనివి, కొన్ని నల్లనివి. తెల్లనివి సత్త్వగుణ ప్రధానమైన కర్మలు. ఎర్రనివి రజోగుణ ప్రధానమైన కర్మలు. నల్లనివి తమోగుణ ప్రధానమైన కర్మలు. ఇట్టి కర్మల కారణంగా భారతవర్షంలో పుట్టిన ప్రజలు క్రమంగా దేవలోకం, మానవలోకం, నరకలోకం చేరుకొంటారు. ఇంతేగాదు- మరొక్క విశేషం విను.

రాగం, ద్వేషం మొదలైనవి లేనివాడూ, వాక్కులకు గానీ, మనసుకుగానీ అందనివాడూ, సర్వమునకూ తానే ఆధారమైనవాడూ అయిన శ్రీవాసుదేవమూర్తియందు హృదయం పదిలంగా నిలుపుకొని భక్తితో ఆరాధించేవారు. ఉత్తమగతి తప్పక పొందుతారు. అటువంటి మహాత్ములు అజ్ఞానం రూపుమాసిపోగా పరమభాగవతులు పొందే పుణ్యలోకాలకు యోగ్యు లవుతారు. అందువలన మహాపురుషులు, 'భారతవర్షం' ఉత్తమోత్తమ మైనదని ఈ విధంగా కొనియాడుతుంటారు.

ఉ. భారతవర్ష జంతువుల భాగ్యము లేమని చెప్పవచ్చు? నీ
భారతవర్షమందు హరి పల్మఱుఁ బుట్టుచు జీవకోటికిన్
ధీరతతోడఁ దత్త్వ ముపదేశము సేయుచుఁ జెల్మి సేయుచు
న్నారయ బాంధవాకృతిఁ గృతార్థులఁ జేయుచు నుండు నెంతయున్. 56

* భారతవర్షంలో పుట్టిన జీవుల అదృష్టమే అదృష్టం. ఈ భారతవర్షంలోనే శ్రీమన్నారాయణుడు ఎన్నో అవతారాలు ఎత్తాడు. ఇందలి మానవులకు తత్త్వం ఉపదేశించాడు. వారితో స్నేహం చేశాడు. ఆత్మ బంధువు లాగున జీవుల కష్టసుఖాలలో భాగం పంచుకొని వారిని కృతార్థులను చేశాడు.

క. తన జన్మ కర్మములనుం, గొనియాడెడి వారికెల్లఁ గోరిన వెల్లం
దనియఁగ నొసఁగుచు మోక్షం, బనయముఁ గృపసేయుఁ గృష్ణుఁ డవనీనాథా! 57

* ఓ రాజా! కృష్ణుని మహిమ లేమని వర్ణించేది? ఆయన తన అవతారాలనూ, లీలా విలాసాలనూ కొనియాడే వారి కందరికీ కోరిన వరాలన్నీ ప్రసాదిస్తాడు. అంతే కాదు; మోక్షం కూడ అనుగ్రహిస్తాడు.

వ. ఇట్లు భారత వర్షంబునందుల జనంబులకు నెద్దియు నసాధ్యంబు లేదు. నారాయణ స్మరణంబు సకల దురితంబుల నడంచుఁ; దన్నామస్మరణ రహితంబులైన యజ్ఞ తపో దానాదులు దురితంబుల నడంపలేవు, బ్రహ్మకల్పాంతంబు బ్రతికెడి యితర స్థానంబునం బునర్జన్మ భయంబున భీతిల్లుచు నుండుటకన్న భారత వర్షంబునందు క్షణమాత్రంబు మనంబున సర్వసంగ పరిత్యాగంబు సేసిన పురుషశ్రేష్ఠునకు శ్రీమన్నారాయణ పదప్రాప్తి యతి సులభంబుగ సంభవించుం; గావున నట్టి యుత్తమంబగు నీ భారత వర్షంబె కోరుచుండుదురు; మఱియు నెక్కడ వైకుంఠుని కథావాసన లేకుండు, నే దేశంబున సత్పురుషులైన పరమభాగవతులు లేకుండుదు, రే భూమిని యజ్ఞేశ్వరుని మహోత్సవంబులు లేక యుండు, నది సురేంద్రలోకంబైన నుండందగదు; జ్ఞానానుష్ఠాన ద్రవ్య కలాపంబుచేత మనుష్యజాతిం బొంది తపంబున ముక్తిం బొందకుండెనేని మృగంబుల మాడ్కి నతండు దనుకుం దానె బంధనంబు నొందు; భారతవర్షంబునందుఁ బ్రజలచేత శ్రద్ధాయుక్తంబుగా ననుష్ఠింపంబడిన యజ్ఞములయందు వేల్వంబడు హవిస్సులను బెక్కునామంబులం బుండరీకాక్షుం డంది తనమీఁది భక్తి యధికంబుగాఁ జేయు; నట్టి భారతవర్షంబు నందలి ప్రజమీఁదం గరుణించి సర్వేశ్వరుం డిహపర సౌఖ్యంబుల నొసంగుచుండు; జంబూద్వీపంబున సగరాత్మజు లశ్వమేధాశ్వంబు నన్వేషింపంబూని భూఖననంబు సేయుటం జేసి స్వర్ణప్రస్థ చంద్రశుక్లావర్తన రమణక మందేహారుణ పాంచజన్య సింహళ లంకాద్వీపంబులను నెనిమిది యుపద్వీపంబులు గలిగె. 58

* భారతవర్షంలో పుట్టిన జనులకు సాధ్యం కాని దంటూ లేనేలేదు. శ్రీమన్నారాయణుని సంస్మరణం సమస్త పాపాలను పటాపంచలు చేస్తుంది. ఆ శ్రీమన్నారాయణుని స్మరణంలేని యజ్ఞాలూ, తపస్సులూ, దానాలూ, నిరర్థకాలు. వాటివల్ల పాపాలు పోవు.

పునర్జన్మ మరల వస్తుందేమో అన్న భయంతో ఇతర ప్రదేశాలలో బ్రహ్మకల్పం చివరిదాకా జీవించడం కంటే భారతవర్షంలో క్షణకాలం జీవించి సర్వసంగ పరిత్యాగం చేసినట్టయితే అటువంటి పురుషశ్రేష్ఠునికి

శ్రీమన్నారాయణ పదప్రాప్తి చాల సులభంగా దక్కుతుంది. అందుచేత అందరూ భారతవర్షంలో జన్మించాలని కోరుకుంటారు. అదీగాక ఏ స్థలంలో వైకుంఠనిలయుని పుణ్యకథల వాసన ఆవంత అయిన ఉండదో, ఏ ప్రదేశంలో పుణ్య పురుషులైన భాగవతోత్తములు ఉండరో, ఏ స్థలంలో యజ్ఞేశ్వరుని ఉత్సవాలు జరుగుతుండవో అటువంటి ప్రదేశం దేవేంద్ర లోకమైనా ఆ చోట నివసింప కూడదు.

మానవజన్మ ఎత్తి జ్ఞానమూ, సదనుష్ఠానమూ, ద్రవ్యసంపత్తీ అన్నీ ఉండికూడా తపస్సు ద్వారా ముక్తి అందుకోలేని మానవులు పశువులలాగా తమకు తామే బంధనాల పాలవుతారు. భారతవర్షంలోని ప్రజలు శ్రద్ధతో యజ్ఞాలు నిర్వహించినట్లయితే, ఆ హోమాలలోని హవిస్సును అనేక నామాలతో ఆ పుండరీకాక్షుడు అందుకొని ప్రసన్నుడై వారికి తన మీది భక్తిని అతిశయింప జేస్తాడు. భారత వర్షంలోని ప్రజలమీద అపరిమితమయిన అనుగ్రహం ప్రకటిస్తూ ఆ భగవంతుడు ఇహలోక సౌఖ్యాన్నీ పరలోక సౌఖ్యాన్నీ వారికి ప్రసాదిస్తాడు. జంబూద్వీపంలో సగరుని కుమారులు అపహరింపబడిన అశ్వమేధాశ్వాన్ని అన్వేషించుతూ నలువైపులా భూమిని త్రవ్వినపుడు ఎనిమిది ఉపద్వీపాలు ఏర్పడ్డాయి. అవే స్వర్ణప్రస్థం, చంద్రశుక్లం, ఆవర్తనం, రమణకం, మందేహారుణం, పాంచజన్యం, సింహళం, లంక అనేవి.

**సీ. లక్షయోజనములు లవణాబ్ధి పరివృత మగుచు జంబూద్వీప మతిశయిల్లు;**
**విను రెండు లక్షలు విస్తృతముగను బ్లక్షద్వీపముండు నా క్షార సాగ**
**రముఁ జుట్టి, యందుల రమ్యమై యొప్పెడు వృక్షంబు ప్లక్షంబు విదితముగను;**
**దనరు నా ద్వీపంబు దరునామ మహిమచే మిగులఁ బ్లక్షం బన మించి రహిని;**

**ఆ. నందు సంచరించు నట్టి వారల కగ్ని, దేవుఁ డమరు నాదిదేవతయుఁగ,**
**నందులోన నా ప్రియవ్రత సుతుఁడగు, నిధ్మజిహ్వుఁడను మహీవరుండు.** 59

* రాజా! జంబూద్వీపం లక్షయోజనాల వైశాల్యం కలిగి ఉంది. దాని చుట్టూ అంతే ప్రమాణం లవణ సముద్రం ఉంది. ఆ తర్వాత ప్లక్షద్వీపం రెండు లక్షల యోజనాల విస్తృతి కలిగి ఉంది. దానిని అంతటి పరిమాణం గల చెరకు రస సముద్రం పరివేష్టించి ఉంటుంది.

ఆ ప్లక్షద్వీపం నట్టనడుమ ఒక పెద్ద జువ్వి చెట్టున్నది. ఆ చెట్టు కారణంగానే ఆ ద్వీపానికి "ప్లక్షద్వీప" మని పేరు వచ్చింది. ఆ ద్వీపంలో నివసించే వారికి అగ్నిదేవుడు అధిదేవత. ఆ ద్వీపాన్ని ఇధ్మజిహ్వుడు పరిపాలిస్తున్నాడు. అతడు ప్రియవ్రతుని కుమారుడు.

**వ. నరేంద్రా! యా యిధ్మజిహ్వుం డా ప్లక్షద్వీపంబు నేడు వర్షంబులుగ విభజించి యందు నా వర్ష నామధారులుగ నుండు తన పుత్త్రులగు శివ యశస్య సుభద్ర శాంత క్షేమాభయామృతు లనియెడు నేడుగుర నేడు వర్షంబుల కధిపతులం గావించి తపంబునకుం జనియె, నా వర్షంబులయందు మణికూట వజ్రకూటేంద్ర సేన జ్యోతిష్మద్ధూమ్రవర్ణ హిరణ్యగ్రీవ మేఘమాలంబులను నామంబులు గల సప్త కులపర్వతంబులను, నరుణయు నృమణయు నంగిరసియు సావిత్రియు సుప్రభాతయు**

ఋుతంభరయు సత్యంభరయు నన సప్త మహానదులును, నా నదుల యందు సుస్నాతు లగుచు గత పాపులైన హంసపతం గోర్ధ్వాయన సత్యాంగులను నామంబులుగల చాతుర్వర్ణ్యంబును గలిగి యుండు, నందుఁ బురుషులు సహస్ర వత్సర జీవులును దేవతాసములును దృష్టిమాత్రంబునం గ్లమస్వేదాది రహితంబగు నపత్యోత్పాదనంబు గలవార లగుచు వేదత్రయాత్మకుండును, స్వర్గద్వారభూతుండును, భగవత్స్వరూపియు నగు సూర్యుని వేదత్రయమున సేవింపుదురు; ప్లక్షద్వీపం బాదిగా మీఁదటి ద్వీపపంచకంబు నందలి పురుషులకు నాయు రింద్రియ పటుత్వంబులను దేజో బలంబులును దోడనే జనియించుచుండు. 60

* పరీక్షిన్నరేంద్రా! ఇధ్మజిహ్వుడు ప్లక్షద్వీపాన్ని ఏడు వర్షాలుగా విభజించాడు. ఆ వర్షముల పేర్లు గల తన కుమారులు ఏడుగురుని శివుడు, యశస్యుడు, సుభద్రుడు, శాంతుడు, క్షేముడు, అభయుడు, అమృతుడు- అనే వారిని ఆ ఏడు వర్షాలకూ అధిపతులను జేశాడు. ఆ తరువాత ఇధ్మజిహ్వుడు నిస్సంగుడై తపస్సుకై అడవికి వెళ్ళిపోయాడు. విభజింపబడిన ఒక్కొక్క వర్షంలో ఒక్కొక్క కులపర్వతమూ, ఒక్కొక్క మహానదీ ఉన్నాయి. ఆవిధంగా ఆ సప్త వర్షాలలో వరుసగా మణికూటం, వజ్రకూటం, ఇంద్రసేనం, జ్యోతిష్మంతం, ధూమ్రవర్ణం, హిరణ్యగ్రీవం, మేఘమాలం- అనే ఏడు కులపర్వతాలు ఉన్నాయి. అరుణ, నృమణ, అంగిరసి, సావిత్రి, సుప్రభాత, ఋుతంభర, సత్యంభర- అనే పేర్లు గల ఏడు మహానదులున్నాయి ఆ నదులలో స్నానం చేసి నాలుగు వర్ణాలవారును పాపం పోగొట్టుకొంటారు. ఆ నాలుగు వర్ణాలవారు హంసులు, పతంగులు, ఊర్ధ్వాయనులు, సత్యాంగులు- అని వ్యవహరింపబడతారు. ప్లక్షద్వీపంలో నివసించే పురుషుల ఆయుర్దాయం వేయి సంవత్సరాలు. వారు దేవతలతో సమానమైన వారు. కేవలం చూపుతోనే శ్రమస్వేదాదులు లేని సంతానాన్ని అనుగ్రహింపగలవారు. వేదస్వరూపుడూ, స్వర్గానికి ద్వారమైనవాడూ, భగవంతుడూ అయిన సూర్యుణ్ణి వారు ఋుగ్యజుస్సామ వేదమంత్రాలతో సేవిస్తుంటారు. ప్లక్షద్వీపం మొదలయిన ముందు చెప్పబోయే ఐదు ద్వీపాలలోని పురుషులకూ ఆయుర్బలం, ఇంద్రియపటుత్వం, తేజోబలం పుట్టుకతోనే సంక్రమిస్తాయి.

క. ప్లక్షద్వీపము, ద్విగుణిత, లక్షేక్షురసాబ్ధి సుట్టిరా విలసిల్లు;
న్నిక్షురసోదద్విగుణం, బక్షయముగ శాల్మలీ మహాద్వీప మిలన్. 61

* ప్లక్షద్వీపం చుట్టూ రెండు లక్షల యోజనాల విస్తృతి కలిగిన చెరకురస సముద్రం ఉంది. దీనికి రెట్టింపు విస్తృతితో శాల్మలీ ద్వీపం ఉంది.

వ. అందు శాల్మలీ వృక్షంబు ప్లక్షాయామంబై తేజరిల్లు; నా వృక్షరాజంబునకు నధోభాగంబునం బతత్త్రిరాజుగా నుండు గరుత్మంతుండు నిలుకడగా వసించు; నా శాల్మలీ వృక్షంబు పేర నా ద్వీపంబు శాల్మలీ ద్వీపంబన విలసిల్లు; నా ద్వీపపతియైన ప్రియవ్రతాత్మజుండగు యజ్ఞబాహువు దన పుత్రులగు సురోచన సౌమనస్య రమణక దేవబర్హ పారిబర్హాప్యాయ నాభిజ్ఞాతు లనియెడు వారిపేర నేడు వర్షంబుల నేర్పఱచి యా వర్షంబులయం దేడ్వురఁ గుమారుల నభిషిక్తులంజేసె; నా వర్షంబులయందు స్వరస, శతశృంగ,

**వాసుదేవ, కుముద, ముకుంద, పుష్పవర్ష, శతశ్రుతులను పర్వత సప్తకంబును ననుమతియు, సినీవాలియు, సరస్వతియుఁ, గుహువును, రజనియు, నందయు, రాకయునను సప్తమహానదులును గల; వందు శ్రుతధర, విద్యాధర, వసుంధ, రేధ్మధర, సంజ్ఞులగు నా వర్ష పురుషులు భగవత్స్వరూపుండును, వేదమయుండు, నాత్మ స్వరూపుండునగు సోముని వేదమంత్రంబులచే నారాధింపుదు; రాద్వీపంబు లక్షచతుష్టయ పరిమిత యోజన విస్తృతం బయిన సురాసముద్రంబుచే నా వృతంబై తేజరిల్లు; నందు.62**

* ఈ ద్వీపంలో ఉన్న శాల్మలీవృక్షం వల్లనే దీనికి "శాల్మలీ ద్వీప" మనే పేరు వచ్చింది. ఈ శాల్మలీ వృక్షం (బూరుగు చెట్టు) కూడా ప్లక్షద్వీపంలో ఉన్న జువ్వి చెట్టంత ఉంది. ఈ బూరుగు చెట్టు దిగువ భాగంలో పక్షులకు రాజయిన గరుత్మంతుడు స్థిరనివాసం చేస్తుంటాడు. ఈ ద్వీపాన్ని పరిపాలించేవాడు ప్రియవ్రతుని పుత్రుడైన యజ్ఞబాహువు. అతడు తాను పాలించే భూభాగాన్ని ఏడు వర్షాలుగా విభజించాడు. ఒక్కొక్క వర్షంలో ఒక్కొక్క పర్వతమూ, ఒక్కొక్క నదీ ఉన్నాయి. ఆ వర్షాలకు తన ఏడుగురు కుమారులను అభిషిక్తులను చేశాడు. వారి పేర్లతోనే ఆ వర్షాలు వ్యవహరింపబడుతున్నాయి. వారి పేర్లు సురోచనుడు, సౌమనస్యుడు, రమణకుడు, దేవబర్హుడు, వారిబర్హుడు, ఆప్యాయనుడు, అభిజ్ఞాతుడు.

ఈ ఏడు వర్షాలలో స్వరసం, శతశృంగం, వామదేవం, కుముదం, ముకుందం, పుష్పవర్షం, శతశ్రుతి అనే పర్వాతాలున్నాయి. వరుసగా అనుమతి, సినీవాలి, సరస్వతి, కుహువు, రజని, నంద, రాక అనే ఏడు మహానదు లున్నాయి. ఆ వర్షంలోని పురుషులు శ్రుతధరులు,విద్యాధరులు, ఇధ్మధరులు అని పిలువబడతారు. వారు భగవత్ స్వరూపుడూ, వేదమయుడూ, ఆత్మస్వరూపుడూ అయిన సోముణ్ణి వేదమంత్రాలతో ఆరాధిస్తారు. ఆ ద్వీపం చుట్టూ నాలుగు లక్షల యోజనాల విస్తృతి కలిగిన సురా (కల్లు) సముద్రం ఉంది.

**సీ. భూనాథ! యా సురాంభోధికిఁ జుట్టుగా నుండు కుశద్వీప ముర్విమీఁదఁ;**
**దోరమై తా ద్విచతుర్లక్ష యోజనంబులను విస్తారమై పొలుపు మిగులు;**
**నందుఁ గుశస్తంబ మనిశంబు దేవతా కల్పితం బైనట్టి కాంతిచేత**
**దిక్కులు వెలిఁగించు ద్వీపంబునకుఁ దన పేర సత్కీర్తి పెంపుసేయు;**

**తే. నట్టి దీవికి నధిపతి యగు ప్రియవ్ర, త తనయుండు హిరణ్యా రేతసుఁ డనం ద**
**నరెడి భూపతి తన సుతనామములను, వర్షములు సేసె నత్యంత హర్షమునను. 63**

* ఓ రాజా! ఆ సురా సముద్రం ఆవల "కుశద్వీప" ముంది. అది ఎనిమిది లక్షల యోజనాల విస్తృతి కలిగింది. ఆ ద్వీపం మధ్య ఒక పెద్ద కుశస్తంబం (దర్భదుబ్బు) మొలిచి ఎత్తుగా పెరిగి ఉంది. అది దివ్యకాంతులతో జిగేలుమంటూ దిక్కులను వెలిగింపచేస్తుంది. ఈ కారణం వల్లనే దీనికి "కుశద్వీప" మనే పేరు కలిగింది.

వ. ఇట్లు హిరణ్యరేతుసుండు వసుదాన దృఢరుచి నాభి గుప్త సత్యవ్రత విప్ర వామదేవులను నామంబులు గల పుత్త్రుల నామంబుల సప్తవర్షంబులం గావించి యా కుమారుల నందు నిలిపి తాను దపంబునకుం జనియె; నా వర్షంబునందు బభ్రు చతుశ్శృంగ కపిల చిత్రకూట దేవానీకోర్ధ్వరోమ ద్రవిణంబులను నామంబులు గల సప్తగిరులును; రసకుల్యయు, మధుకుల్యయు, శ్రుతవిందయు, మిత్రవిందయు, దేవగర్భయు, ఘృతచ్యుతయు, మంత్రమాలయు నను సప్త మహానదులును గల; వా నదీ జలంబులఁ గృతమజ్జను లగుచు భగవంతుండగు యజ్ఞపురుషునిఁ గుశల కోవిదాభియుక్తకులక సంజ్ఞలు గల వర్షపురుషు లారాధించు చుందురు. 64

* ఈ కుశద్వీపానికి ప్రియవ్రత కుమారుడైన హిరణ్యరేతసుడు అధిపతి. వసుదానుడు, దృఢరుచి, నాభి, గుప్తుడు, సత్యవ్రతుడు, విప్రుడు, వామదేవుడు అనువారు హిరణ్యరేతసుని కుమారులు, తండ్రి అయిన హిరణ్యరేతసుడు తన తనయుల పేర్లతో విభజించిన కుశద్వీపంలోని ఏడు వర్షాలలో ఏడుగురు కుమారులను నియమించాడు. అనంతరం తపస్సు చేయడానికి అడవికి వెళ్లాడు. ఆ కుశవర్షంలో బభ్రువు, చతుశ్శృంగం, కపిలం, చిత్రకూటం, దేవానీకం, ఊర్ధ్వరోమం, ద్రవిణం అనే పేర్లు గల ఏడు పర్వతాలున్నాయి. అలాగే రసకుల్య, మధుకుల్య, శ్రుతవింద, మిత్రవింద, దేవగర్భ, ఘృతచ్యుత, మంత్రమాల- అనే పేర్లుగల ఏడు మహానదులున్నాయి. కుశలులు, కోవిదులు, అభియుక్తులు, కులకులు అనే పేర్లు గల నాలుగు వర్ణాలవారు ఆ పవిత్ర నదీజలాలలో స్నానం చేసి శుచులై భగవంతుడయిన యజ్ఞపురుషుని ఆరాధిస్తుంటారు.

సీ. ఆ కుశద్వీపంబు నరికట్టుకొని యుండు నెనిమిది లక్షల ఘనఘృతాబ్ధి;
యా ఘృతసాగరం బవ్వల షోడశ లక్షయోజనముల లలిత మగుచు
నుండుఁ గ్రౌంచద్వీప, ముర్వీశ యందు మధ్యప్రదేశంబున నట్టి దీవి
పేరుగాఁ దన పేరఁ బెద్దగాఁ జేసిన క్రౌంచాద్రి గల; దా నగంబు మున్ను

ఆ. షణ్ముఖుండు దివ్య శరమున ఘననితం, బంబు దూయ నేయఁ బాలవెల్లి
గరిమఁ దడుపుచుండు వరుణుండు రక్షింప, నందు మిగుల భయము నొందకుండె. 65

* ఆ కుశద్వీపం చుట్టూ ఎనిమిది లక్షల యోజనాల పరిమాణం కలిగిన ఘృత (నేతి) సముద్రం ఉన్నది. ఆ నేతి సముద్రం ఆవల పదునారు లక్షల యోజనాల విస్తృతి కలిగిన అందమయిన "క్రౌంచద్వీపం" ఉన్నది. ఆ ద్వీపం మధ్యభాగంలోనే "క్రౌంచాద్రి" ఉన్నది. ఆ పర్వతంమూలంగానే ఆ ద్వీపానికి ఆ పేరు వచ్చింది. ఒకసారి ఆరు మొగముల స్వామి దివ్యశరం ప్రయోగించగా అది ఆ క్రౌంచపర్వతానికి కన్నం చేస్తూ దూసుకుపోయింది. ఆ కన్నంగుండా పాలవెల్లి ప్రవాహం వెలువడింది. ఆ ప్రవాహమే ఆ క్రౌంచద్వీపాన్ని తడపుతూ ఉంది. వరుణదేవుడు ఆ ప్రదేశాన్ని కాపాడుతూ ఏమాత్రం ఎవరికీ భయం లేకుండేటట్లు చూస్తుంటాడు.

వ. నరేంద్రా! యా క్రౌంచద్వీపపతియగు ఘృతపృష్ఠుండు దన కుమారుల నాపేళ్ళు గల యామోద మధు వహ మేఘపృష్ఠ సుదామ ఋషిజ్య లోహితార్ణ వనస్పతులను వర్షంబుల కభిషిక్తులం జేసి,

**పరమకల్యాణగుణ యుక్తుండయిన శ్రీహరి చరణారవిందంబుల సేవించుచుం దపంబునకుం జనియె, నా వర్షంబులయందు శుక్ల వర్ధమాన భోజనోపబర్హణానంద నందన సర్వతోభద్రంబులను సప్త సీమాపర్వతంబులును నభయయు నమృతౌఘయు నార్యకయుఁ దీర్థవతియు, దృప్తిరూపయుఁ బవిత్రవతియు, శుక్లయు నను సప్తనదులును గల, వందులఁ బవిత్రోదకంబు లనుభవించుచు గురు ఋషభ ద్రవిణక దేవక సంజ్ఞలు గలిగి వరుణ దేవుని నుదకాంజలులం బూజించుచున్న చాతుర్వర్ణ్యంబుండు. 66**

* నరేంద్రా! క్రౌంచద్వీపానికి అధిపతి ప్రియవ్రతుని కుమారుడైన ఘృతపృష్ఠుడు, అతనికి ఏడుగురు కొడుకులు- వారే ఆమోదుడు, మధువహుడు, మేఘపృష్ఠుడు, సుదాముడు, ఋషిజ్యుడు, లోహితార్ణుడు, వనస్పతి అనువారు. తన కుమారుల పేరు మీదుగా క్రౌంచద్వీపాన్ని ఘృతపృష్ఠుడు ఏడు వర్షాలుగా విభాగంచేసి ఒక్కొక్క భూభాగానికి ఒక్కొక్క కుమారుని రాజుగా నియమించాడు. తాను మంగళ గుణ నిలయు డయిన శ్రీహరి పాదపద్మాలను సేవిస్తూ తపం చేయడానికి కానలకు కదలి వెళ్లాడు. ఆ క్రౌంచద్వీపంలోని ఏడు వర్షాలలో శుక్లం, వర్ధమానం, భోజనం, ఉపబర్హణం, ఆనందం, నందనం, సర్వతోభద్రం అనే ఏడు కొండలూ వరుసగా అభయ, అమృతౌఘ, ఆర్యక, తీర్థపతి, తృప్తిరూప, పవిత్రవతి, శుక్ల- అనే ఏడు నదులూ ఉన్నాయి. ఆ నదీజలాలలో స్నానం చేసి గురువులు ఋషభులు, ద్రవిణకులు, దేవకులు- అనే నాలుగు వర్ణాలవారున్నూ జలాంజలులు సమర్పిస్తూ వరుణదేవుని సేవిస్తుంటారు.

**సీ. జగతీశ! వినుము క్రౌంచద్వీపమును జుట్టి యుండు షోడశ లక్ష యోజనముల**
**విస్తారమై పాలవెల్లి, యందునను శాకద్వీప మతుల ప్రకాశ మొందు,**
**దండిమై ముప్పది రెండు లక్షల యోజనముల విస్తారమై యమరి యుండు,**
**నందుల శాకవృక్షామోద మా ద్వీపమును సుగంధంబునఁ బెనఁగఁ జేసి**

**తే. యంతఁ దనపేర దీవి ప్రఖ్యాత మగుటఁ, జేసి యందుల మిగులఁ బ్రసిద్ధి కెక్కె;**
**నందు మేధాతిథియుఁ గర్త యగుచునుండెఁ, దవిలి వేడుకఁ దనదు నందనులఁజూచి. 67**

* పరీక్షిన్నరేంద్రా! విను. క్రౌంచద్వీపం చుట్టూ పదునారు వేల యోజనాల విస్తృతిలో పాలసముద్రం ఉంది. క్రౌంచద్వీపానికి ఆవల "శాకద్వీపం" ప్రసిద్ధి పొందిన ద్వీపం. ఆ ద్వీపం ముప్పదిరెండు లక్షల యోజనాల విస్తృతి కలిగింది. ఆ ద్వీపంలో ఒక పెద్ద శాకవృక్షం ఉన్నది. దాని సుగంధంవల్ల ఆ ద్వీపమంతా పరిమళవంతంగా ఉంటుంది. ఆ కారణంగానే ఆ ద్వీపానికి 'శాకద్వీప' మనే పేరు వచ్చింది. ఆ ద్వీపానికి ప్రియవ్రతనందనుడైన మేధాతిథి అధీశ్వరుడు.

**వ. మఱియు నా ప్రియవ్రతపుత్త్రుం డయిన మేధాతిథి దనపుత్రుల పేరం గల పురోజన మనోజవ వేపమాన ధూమ్రానీక చిత్రరథ బహురూప విశ్వచారంబులను సంజ్ఞలు గల సప్తవర్షంబుల యందు వారలకుఁ బట్టంబు గట్టి శ్రీహరి పాదసేవ సేయుచుఁ దపోవనంబుకుఁ జనియె, నా శాకద్వీపంబునందు నీశానోరుశృంగ బలభద్ర శతకేసర సహస్రస్రోతో దేవపాల మహానస నామంబులు గల సీమాగిరులును,**

ననుఘాయుర్దోభయ సృష్ట్యపరాజిత పంచపరీ సహస్రస్రుతి నిజధృతులను సప్తనదులును గల, వా నదీ జలంబు లుపయోగించి యచ్చటి వారలు ప్రాణాయామంబు సేసి విధ్వస్తరజ స్తమోగుణులయి పరమ సమాధిని వాయురూపంబైన భగవంతుని సేవింతురు; ఋతవ్రత సత్యవ్రత దానవ్రత సువ్రత నామంబులుగల చాతుర్వర్ణ్యం బందుఁ గలిగి యుండు. 68

* మేధాతిథికి పురోజనుడు, మనోజనుడు, వేపమానుడు, ధూమ్రానీకుడు, చిత్రరథుడు, బహురూపుడు, విశ్వచారుడు అనే కొడుకులున్నారు. వారికి వారి పేర్లతో ప్రసిద్ధాలైన శాకద్వీపంలోని ఏడు భూభాగాలు (వర్షాలు) పంచియిచ్చి పట్టంగట్టి మేధాతిథి శ్రీహరి పాదసేవచేస్తూ తపోవనానికి వెళ్ళాడు. ఆ ఏడు వర్షాలలో క్రమంగా ఈశానం, ఉరుశృంగం, బలభద్రం, శతకేసరం, సహస్ర స్రోతం, దేవపాలం, మహానసం అనే సరిహద్దు పర్వతాలూ; అనఘ, ఆయుర్ద, ఉభయస్పృష్టి, అపరాజిత, పంచపరి, సహస్ర సృతి, నిజధృతి అనే ఏడు నదులూ ఉన్నాయి. ఆ ద్వీపవాసులు ఆ నదీ జలాలు సేవిస్తూ ప్రాణాయామం చేస్తూ రజోగుణ, తమోగుణాలను నశింపజేసుకొని సమాధి నిష్ఠులయి వాయురూపు డయిన భగవంతుని ఆరాధిస్తారు. అక్కడ ఋతవ్రతులు, సత్యవ్రతులు, దానవ్రతులు, సువ్రతులు- అనే నాలుగు వర్ణాల వారున్నారు.

సీ. అట్టి శాకద్వీప మరికట్టి తత్ప్రమాణంబున దధిసముద్రంబు వెలుఁగు,
నందుకుఁ బరివృతంబై పుష్కరద్వీప మిలఁ జతుష్షష్టి లక్షల విశాల;
మ మ్మహాద్వీపమం దయుత కాంచన పత్రములు గల్గి కమల గర్భునకు నాస
నంబగు పంకేరుహంబుండు, నా ద్వీప మధ్యంబునను నొక్క మానసోత్త

ఆ. రం బనంగఁ బర్వతం; బుండుఁ దనకుఁ బూ, ర్వాపరముల నుండునట్టి వర్ష
ములకు రెంటి కిట్లు నిలిచిన మర్యాద, నగ మనంగఁ జాలఁ బొగడ నెగడు. 69

* శాకద్వీపం చుట్టూ అంతే పరిమాణం కలిగిన దధి (పెరుగు) సముద్రం ఉంది. దాని తర్వాత అరవైనాలుగు లక్షల యోజనాల విస్తారం కలిగిన "పుష్కరద్వీపం" ఉంది. ఆ మహాద్వీపంలో పదివేల బంగారు రేకులు కలిగి బ్రహ్మదేవుని ఆసనమైన పద్మం ఉన్నది. ఆ ద్వీపం నడుమ 'మానసోత్తర' మనే పెద్ద పర్వతం ఉంది. తూర్పు పడమరలలో గల వర్షాల రెండింటికి ఆ మానసోత్తరం సరిహద్దు కొండ.

వ. ఇట్లు దనకు లోపలి వెలుపలి వర్షంబులు రెంటికి మర్యాదాచలంబునుంబోలె నున్న మానసోత్తర పర్వతం బయుత యోజన విస్తారంబును, నంతియ యౌన్నత్యంబును గలిగి యుండు, నా నగంబునకు నలుదిక్కులయందు నాలుగు లోకపాలుర పురంబులుండు, నా మానసోత్తర పర్వతంబు తుద సూర్యరథ చక్రంబు సంవత్సరాత్మకంబయి యహోరాత్రంబులయందు మేరు ప్రదక్షిణంబు సేయు, నందు నా పుష్కరద్వీపాధిపతి యగు వీతి హోత్రుండు రమణక ధాతకనామంబులు గల పుత్త్రుల నిరువుర వర్షద్వయంబునందు నభిషిక్తులం జేసి తాను బూర్వజు లేగిన తెఱంగున భగవత్కర్మశీలుం డగుచుఁ దపంబునకుం జనియె; నంత 70

* ఈ విధంగా లోపల వెలుపల ఉన్న వర్షాలకు సరిహద్దుగా ఉన్న మానసోత్తర పర్వతం పదివేల యోజనాల విస్తీర్ణమూ, అంతే ఎత్తు కలది. ఆ పర్వతానికి నాలుగు దిక్కులలోనూ నలుగురు లోకపాలకుల పట్టణాలు ఉన్నాయి. ఆ మానసోత్తర పర్వత శిఖరాన సంవత్సరాత్మకమైన సూర్యరథచక్రం తిరుగుతూ రాత్రింబగళ్ళు మేరువునకు ప్రదక్షిణం చేస్తుంటుంది. ఆ పుష్కర ద్వీపాధిపతి వీతిహోత్రుడు. అతనికి రమణకుడు, ధాతకుడు- ఇద్దరు కుమారులు, వీతిహోత్రుడు పుష్కరద్వీపాన్ని రెండు వర్షాలుగా విభజించి, ఆ భూభాగాలకు తన కొడుకులను రాజులను చేశాడు. తన అన్నల అడుగుజాడల్లో వీతిహోత్రుడు భగవత్ప్రీతికరాలైన కార్యాలు ఆచరిస్తూ తపోవనానికి వెళ్ళిపోయాడు.

**క. మనుజేశ్వర! యా వర్షం, బున నప్పుడు సంచరించు పురుషులు పద్మా**
**సను దగ సకర్మకారా, ధన సేయుదు రచల బుద్ధి తాత్పర్యమునన్. 71**

* ప్రజలకు రక్షకుడ వయిన పరీక్షిన్నరేంద్రా! ఈ పుష్కర ద్వీపంలో సంచరించేవారు వేదోక్త కర్మలను ఆచరిస్తూ చతుర్ముఖుణ్ణి కొలుస్తుంటారు. వారు నిశ్చలమయిన బుద్ధిబలం, నియమ నిష్ఠలు కలిగిన వారు.

**క. ధరణీవల్లభ! విను పు, ష్కర మను ద్వీపమున లేరు చాతుర్వర్ణ్యుల్,**
**పరగఁగ భేదము లేకే, సరసత సము లగుదు రందు సకల జనంబుల్. 72**

* ధరణీనాథా! పుష్కరమనే ద్వీపంలో నాలుగు వర్ణాల విభాగం లేదు. అక్కడి వారందరూ భేదభావం లేకుండా సమభావంతో కలిసి మెలిసి సంచరిస్తారు.

**వ. మఱియు పుష్కరద్వీపంబు చతుష్షష్టి లక్షయోజన విస్తారంబైన శుద్ధోదక సముద్రముద్రితం బగుచుండు, నవ్వల లోకాలోక పర్వతంబుండు, శుద్ధోదక సముద్ర లోకాలోకపర్వతంబుల నడుమ రెండుకోట్ల యోజన విస్తారంబయిన నిర్జన భూమిదర్పణోదర సమానంబై దేవతావాస యోగ్యంబుగా నుండు, నా భూమిం జేరిన పదార్థంబు మరలఁ బొంద నశక్యంబుగ నుండు; నట మీఁద లోకాలోకపర్వతం బెనిమిది కోట్ల యోజనంబులు సువర్ణభూమియు సూర్యాది ధ్రువాంతంబు లగు జ్యోతిర్గణంబులు మధ్యంబున నుండుటం జేసి లోకాలోక పర్వతం బనందగి యుండు; బంచాశత్కోటి యోజన విస్తృతంబగు భూమండల మానంబునకుఁ దురీయాంశ ప్రమాణంబు గల యా లోకాలోకపర్వతంబు మీఁద నఖిల జగద్గురువగు బ్రహ్మచేతఁ జతుర్దిశలయందు ఋషభ పుష్కర చూడ వామ నాపరాజిత సంజ్ఞలు గల దిగ్గజంబులు నాలుగును లోకరక్షణార్థంబు నిర్మితంబై యుండు; మఱియును. 73**

* ఆ పుష్కరద్వీపం అరవై నాలుగు లక్షల యోజనాల విస్తృతి కలిగి ఉంటుంది. దాని చుట్టూ అంతే విస్తీర్ణం కలిగి పరిశుద్ధమయిన జలంతో నిండిన సముద్రం ఉంది. ఆ సముద్రానికి ఆవల లోకాలోక పర్వతముంది. సముద్రానికీ, ఆ పర్వతానికీ మధ్యగల ప్రదేశం రెండు కోట్ల యోజనాల విస్తీర్ణం కలిగి ఉంటుంది. అక్కడ మానవసంచారం లేదు. ఆ భూమి అద్దంలాగా స్వచ్ఛంగా నున్నగా ఉంటుంది. అది దేవతలు నివసించడానికి ప్రయత్నించినా చేతికందదు. ఆ పైన ఎనిమిది కోట్ల యోజనాల ప్రదేశం

బంగారుభూమిలాగా ప్రకాశిస్తుంటుంది. సూర్యుని నుండి ధ్రువతార వరకు వ్యాపించిన జ్యోతిర్గణం మధ్య ఉండడం వల్ల ఆ పర్వతానికి లోకాలోక పర్వతమనే పేరు సార్థకం అవుతున్నది. ఈ భూమండలమంతా యాభైకోట్ల యోజనాల విస్తృతి కలిగింది. అందులో నాల్గవవంతు లోకాలోక పర్వతం. ఆ పర్వతం మీద సకలలోక గురుడైన బ్రహ్మదేవుడు ఋషభం, పుష్కరచూడం, వామనం, అపరాజితం అనే దిగ్గజాలను లోకరక్షణార్థం నిలిపి ఉంచాడు.

**సీ. తనదు విభూతులై తనరిన యా దేవ బృందతేజశ్శౌర్య బృంహణార్థ**
**మై భగవంతుండు నాదిదేవుండును నైన జగద్గురుం డచ్యుతుండు**
**సరిలేని ధర్మవిజ్ఞాన వైరాగ్యాదు లయిన విభూతుల నలరి యున్న**
**యట్టి విష్వక్సేనుఁ డాదిగాఁ గలుగు పార్షదులతోఁ గూడి ప్రశస్తమైన**

**గీ. నిజవరాయుధ దోర్దండ నిత్య సత్త్వ, డగుచు నా పర్వతంబుపై నఖిల లోక**
**రక్షణార్థంబు కల్పపర్యంత మతఁడు, యోగమాయా పరీతుఁడై యొప్పుచుండు. 74**

* ఆ లోకాలోక పర్వతం మీద ఆదిదేవుడూ, జగద్గురుడూ, భగవంతుడూ అయిన శ్రీమన్నారాయణుడు లోకాలను రక్షించడం కోసం యోగ మాయా సహితుడై కల్పాంత పర్యంతం ఉంటాడు. దేవతల సమూహమంతా శ్రీమన్నారాయణుని వైభవస్వరూపమే. ఆ దేవతల తేజస్సూ, పరాక్రమమూ విస్తరింపజేయడం కోసం విష్ణుభగవానుడు ధర్మం, జ్ఞానం, వైరాగ్యం అనే విభూతులతో ప్రకాశించే విష్వక్సేనుడు మొదలయిన పార్షదులతో కూడి చతుర్బాహువులలో శ్రేష్ఠమయిన ఆయుధాలు ధరించి ఆ పర్వతం మీద ప్రకాశిస్తాడు.

**వ. ఇట్లు వివిధమంత్ర గోపనార్థం బా నగాగ్రంబున నున్న భగవంతుండు దక్క లోకాలోక పర్వతంబునకు నవ్వల నొరులకు సంచరింప నశక్యంబయి యుండు; బ్రహ్మాండంబునకు సూర్యుండు మధ్యగతుండై యుండ; నా సూర్యునకు నుభయ పక్షంబుల యందు నిరువదేనుకోట్ల యోజనపరిమాణంబున నండకటాహం బుండు; నట్టి సూర్యుని చేత నాకాశదిక్స్వర్గాపవర్గంబులును నరకంబులును నిర్ణయింపంబడు; దేవతిర్య జ్మనుష్య నాగ పక్షి తృణగుల్మలతాది సర్వజీవులకును సూర్యుం డాత్మ యగుచు నుండు. 75**

* ఆ లోకాలోక పర్వతంమీద భగవంతుడు వివిధ మంత్రాలను రహస్యంగా రక్షిస్తుంటాడు. ఆ భగవంతునికి తప్ప ఆ లోకాలోక పర్వతానికి ఆవల ఎవరికిగానీ సంచరించడానికి శక్యం గాదు. బ్రహ్మాండానికి మధ్య భాగంలో సూర్యుడు ఉన్నాడు. ఆ సూర్యునికి ఇరువైపులా ఇరవై అయిదుకోట్ల యోజనాల దూరంలో బ్రహ్మాండ కటాహం ఉంది. ఆ సూర్యభగవానుడే ఆకాశం, దిక్కులు, స్వర్గనరకాలు, మోక్షం అనే వాటిని నిర్దేశిస్తాడు. దేవతలకూ, మనుష్యులకూ, జంతువులకూ, సర్పాలకూ, పక్షులకూ, గడ్డిపోచలకూ, తీగలకూ, పొదలకూ, సర్వజీవరాసులకూ సూర్యుడే ఆత్మ.

**క. కరమనురాగంబున నీ, ధరణీమండలము సంవిధానం బెల్లన్**
**నరవర! యెఱుఁగం జెప్పితి, మఱి చెప్పెద వినుము దివ్యమాన మ్మెల్లన్. 76**

* ఓ రాజా! నీవంటే నాకున్న ప్రీతి కారణంగా భూమండల నిర్మాణానికి సంబంధించిన విశేషాలన్నీ తెలియజేశాను. ఇంతే కాదు; ఇపుడు సృష్టి కొలతలను కూడ చెబుతాను విను.

## -: భగణ విషయము :-

**ఆ. కమలజాండ మధ్యగతుఁడైన సూర్యుండు, భరితమైన యాతపంబుచేత**
**మూఁడు లోకములను ముంచి తపింపంగఁ, జేసి కాంతి నొందఁ జేయుచుండు. 77**

* బ్రహ్మాండం మధ్యలో ప్రకాశించే సూర్యుడు తన వెలుగుతో, వేడిమితో ముల్లోకాలనూ ముంచెత్తుతూ ప్రకాశింప జేస్తాడు.

**వ. అట్టి భాస్కరుం డుత్తరాయణ దక్షిణాయన విషువులను నామంబులు గల మాంద్య తీవ్ర సమానగతుల నారోహణావరోహణ స్థానంబుల యందు దీర్ఘ హ్రస్వ సమానంబులుగాఁ జేయుచుండు. 78**

* సూర్యునికి ఉత్తరాయణం, దక్షిణాయనం, విషువత్తు అనే మూడు గమనాలు ఉన్నాయి. ఉత్తరాయణంలో ఆ గమనం మందకొడిగా , దక్షిణాయనంలో తీవ్రంగా, విషువత్తులో సమానంగా ఉంటుంది. సూర్యుని ఈ మూడు గమనాలను అనుసరించి ఆరోహణ అవరోహణ సమస్థానాలలో రాత్రింబవళ్లు దీర్ఘములుగా హ్రస్వములుగా సమానములుగా మారుతుంటాయి.

**ఆ. మేషతులలయందు మిహిరుం డహోరాత్రు, లందుఁ దిరుగు సమవిహారములను,**
**బరఁగఁగ వృషభాది పంచ రాసులను, నొక్కొక్క గడియ రాత్రి దక్కి నడచు. 79**

* మేషరాశిలోనూ, తులారాశిలోనూ సూర్యుడు సంచరించుతున్నప్పుడు పగలు రాత్రీ సమానంగా ఉంటాయి. వృషభం మిథునం, కర్కాటకం, సింహం, కన్య ఈ ఐదు రాసులలో సంచరించే సమయంలో ఒక్కొక్క గడియ ప్రకారం రాత్రి కాలం తగ్గుతూ వస్తుంది. పగలు పెరుగుతూంటుంది.

**ఆ. మించి వృశ్చికాది పంచరాసులను నొ, క్కొక్క గడియ రాత్రి నిక్కి నడుచు,**
**దివములందు నెల్ల దిగజాఱు నొక్కొక్క, గడియ నెలకుఁ దత్ప్రకారమునను. 80**

* అలాగే సూర్యుడు వృశ్చికం, ధనుస్సు, మకరం, కుంభం, మీనం అనే ఐదు రాసులలో ఉన్నప్పుడు ఒక్కొక్క గడియ ప్రకారం రాత్రి పెరుగుతుంటుంది. పగటి కాలం తగ్గిపోతుంది.

**వ. మఱియు ని వ్విధంబున దివసంబు లుత్తరాయణ దక్షిణాయనంబుల వృద్ధిక్షయంబుల నొంద నొక్క యహోరాత్రంబున నేకపంచాశదుత్తర నవ కోటియోజనంబుల పరిమాణంబు గల మానసోత్తర పర్వతంబునందుఁ దూర్పున దేవధాని యను నింద్రపురంబును, దక్షిణంబున సంయమని యను యమనగరంబును, బశ్చిమంబున నిమ్లోచని యను వరుణ పట్టణంబును, నుత్తరంబున విభావరి**

**యను సోముని పుటభేదనంబును దేజరిల్లుచుండు; నా పట్టణంబుల యందు నుదయ మధ్యాహ్న సమయ నిశీథంబు లనియెడు కాలభేదంబులను భూతప్రవృత్తి నివృత్తి నిమిత్తం బచ్చటి జనులకుఁ బుట్టించుచుండు, సూర్యుం డెపుడింద్ర నగరంబున నుండి గమనించు నది యాదిగాఁ బదియేను గడియలను రెండుకోట్ల ముప్పదియేడు లక్షల డెబ్బదియైదువేల యోజనంబులు నడుచు, ని వ్విధంబున నింద్ర యమ వరుణ సోమపురంబుల మీఁదఁ జంద్రాది గ్రహ నక్షత్రంబులంగూడి సంచరించుచుఁ బండ్రెండంచులు, నాఱు కమ్ములును, మూడు దొలులుం గలిగి సంవత్సరాత్మ కంబయి యేకచక్రం బయిన సూర్యుని రథంబు ముహూర్తమాత్రంబున ముప్పది నాలుగు లక్షలు నెనమన్నూఱు యోజనంబులు సంచరించు. 81**

* ఈ ప్రకారంగా అహోరాత్రాలను ఉత్తరాయణ దక్షిణాయనములలో పెంచుతూ తగ్గించుచు ఒక్క దినంలో తొమ్మిదికోట్ల యాభైఒక్క లక్షల యోజనాల పరిమాణం కలిగిన దూరం మానసోత్తర పర్వతం నలువైపులా సూర్యరథం తిరుగుతుంటుంది. ఈ పర్వతం తూర్పున "దేవధాని" అనే ఇంద్రుని పట్టణం, దక్షిణంలో "సంయమని" అనే యముని పట్టణం, పశ్చిమంలో 'నిమ్లోచని' అనే వరుణుని పట్టణం, ఉత్తరంలో 'విభావరి' అనే సోముని పట్టణం ఉన్నాయి. ఈ నాలుగు పట్టణాలలోనూ సూర్యుడు క్రమంగా ఉదయం మధ్యాహ్నం, అస్తమయం, అర్ధరాత్రం అనే కాలభేదాలను కల్పిస్తుంటాడు. ఈ ఉదయాదులు అచ్చటి జీవుల ప్రవృత్తి నివృత్తులకు కారణా లవుతుంటాయి. సూర్యుడు ఇంద్రనగరం నుండి యమనగరానికి పయనించేటప్పుడు పదునైదు గడియలలో రెండు కోట్ల ముప్పదిఏడు లక్షల డెబ్బది ఐదువేల యోజనాలు అతిక్రమించి యమనగరానికీ, ఇదేవిధంగా అక్కడి నుంచి వరుణ, సోమనగరాలకూ, చంద్రాది గ్రహాలతో, నక్షత్రాలతో, సంచరిస్తాడు. పన్నెండు ఆకులూ, ఆరు కమ్ములూ, మూడు కుండలూ, (నాభి ప్రదేశాలూ) కలిగి ఏకచక్రంతో కూడి సంవత్సరాత్మకమైన సూర్యుని రథం ఒక ముహూర్త కాలంలో ముప్పది నాలుగు లక్షల ఎనిమిది వందల యోజనాలు ప్రయాణం చేస్తుంది.

**సీ. ఇనురథంబున నున్న యిరుసొక్కటియ మేరు శిఖరంబునందును జేరి యుండు;**
**నొనరఁ జక్రము మానసోత్తర పర్వతం బందులఁ దిరిగెడు నా రథంబు**
**నిరుసున నున్న రెం డిరుసులు దగులంగఁ బవన పాశంబుల బద్ధ మగుచు**
**ధ్రువమండలంబునందుల నంటి యుండఁగా సంచరించుచు నుండు సంతతంబు;**

**గీ. నట్టి యరదంబు ముప్పది యాఱులక్ష, లందు నంటిన కాఁడియు నన్ని యోజ**
**నముల విస్తారమై తురంగముల కంధ, రములఁ దగులుచు వెలుఁగొందు రమణతోడ. 82**

* సూర్యరథ చక్రానికి ఒక ఇరుసు అమర్చబడి ఉన్నది. ఆ ఇరుసుకు ఒకవైపు మేరుపర్వతమూ, రెండవవైపు మానసోత్తర పర్వతమూ ఉన్నాయి. రెండువైపులూ వాయుపాశాలతో గట్టిగా బిగింపబడి ఉన్నాయి. ఇవి భూమి రెండు ధ్రువాలకూ అంటి ఉన్నాయి. అటువంటి సూర్యరథానికి అమర్చబడిన కాడి ముప్పయి ఆరు లక్షల యోజనాల పొడవు ఉంటుంది. ఆ కాడి సూర్యరథానికి కట్టిన గుర్రాల మెడలపై మోపబడి ఉంటుంది.

**వ. ఆ రథంబునకు గాయత్రీచ్ఛందం బాదిగా సప్తచ్ఛందంబులు నశ్వంబులై సంచరించు, భాస్కరునకు నగ్రభాగంబున నరుణుండు నియుక్తుండై రథంబు గడపుచుండు; వెండియు నంగుష్ఠపర్వమాత్ర శరీరంబులు గల యఱువదివేల వాలఖిల్యాఖ్యులగు ఋషివరులు సూర్యుని ముందట సౌరసూక్తంబుల స్తుతియింప, మఱియు ననేక మునులును గంధర్వ కిన్నర కింపురుష నాగాప్సరః పతంగాదులును నెలనెల వరుసక్రమంబున సేవింపం దొమ్మిదికోట్ల నే బదియొక లక్షయోజనంబుల పరిమాణంబు గల భూమండలంబునందొక క్షణంబున సూర్యుండు రెండువేల యేఁబది యోజనంబులు సంచరించుచు, నొక యహోరాత్రంబునందె యీ భూమండలం బంతయు సంచరించు, ననిన శుకయోగీంద్రునకుఁ బరీక్షిన్నరేంద్రుం డిట్లనియె. 83**

* ఆ సూర్యరథానికి గాయత్రి, బృహస్పతి, ఉష్ణిక్, జగతి, త్రిష్టుప్, అనుష్టుప్, పంక్తి అనబడే ఏడు ఛందస్సులు గుర్రాలుగా ఉన్నాయి. సూర్యునికి అరుణుడు సారథి. అతడు సూర్యుని ముందు భాగంలో కూర్చుండి రథాన్ని నడుపుతుంటాడు. బొటనవ్రేలి కణుపు పరిమాణం దేహం కలిగిన వాలఖిల్యులనే ఋషిపుంగవులు అరవై వేల మంది జ్యోతిర్మయ స్వరూపాలు ధరించినవారు సూర్యుని ముందుండి వేద సూక్తాలతో స్తోత్రం చేస్తుంటారు. ఎందరో మునులు, గంధర్వులు, కిన్నరులు, కింపురుషులు, నాగులు, అప్సరసలు, గరుడులు మొదలయినవారు క్రమం తప్పకుండా సూర్యుణ్ణి సేవిస్తుంటారు. తొమ్మిది కోట్ల ఏబది యొక్క లక్షల యోజనాల పరిమాణం కలిగిన భూమండలం చుట్టూ సూర్యుడు క్షణానికి రెండువేల యాభై యోజనాల చొప్పున అహోరాత్రంలో సంచరిస్తాడు" అని చెప్పిన శుకయోగీంద్రుని చూచి పరీక్షిత్తు కుతూహలంతో ఈ విధంగా ప్రశ్నించాడు.

**క. మునివర! మేరుధ్రువులకు, నొనరఁ బ్రదక్షిణము దిరుగుచుండెడు నజుఁ డా**
**యినుఁ డభిముఖుఁడై రాసుల, కనుకూలత నేగునంటి; వది యెట్లొప్పున్? 84**

* మునీంద్రా! సూర్యుడు మేరువుకూ, ధ్రువునికి ప్రదక్షిణంగా తిరుగుతుంటాడని చెప్పావు కదా! బ్రహ్మ స్వరూపుడయిన సూర్యుడు పండ్రెండు రాసులలోనూ అభిముఖుడై తిరుగుతాడని కూడా అన్నావు. అది ఎలా పొసగుతుంది? నా సందేహాన్ని తీర్చు.

**క. అని పలికిన భూవరునిం, గనుఁగొని శుకయోగి మిగులఁ గరుణాన్వితుఁడై**
**మనమున శ్రీహరిఁ దలఁచుచు, విను మని క్రమ్మఱఁగ నిట్లు వినిపించెఁ దగన్. 85**

* పరీక్షిత్తు కుతూహలంతో కూడిన సందేహాన్ని విన్న శుకయోగి ఒకమారు కళ్ళు మూసుకొని శ్రీహరిని తలచుకొని ఈ విధంగా సమాధానం చెప్పాడు.

**వ. నరేంద్రా! యతివేగంబునం దిరుగుచుండు కులాల చక్రంబునందుఁ జక్రభ్రమణంబునకు వేఱైన గతి నొంది బంతిసాగి తిరిగెడు పిపీలికాదుల చందంబున నక్షత్రరాసులతోడం గూడిన కాలచక్రంబు ధ్రువమేరువులం బ్రదక్షిణంబు దిరుగునపు డా కాలచక్రంబు వెంట సంచరించు సూర్యాదిగ్రహంబు లకు నక్షత్రాంతరంబులయందును రాశ్యంతరంబులయందును నునికి గలుగుటం జేసి సూర్యాది**

గ్రహంబులకుఁ జక్రగతి స్వగతులవలన గతిద్వయంబు గలుగుచుండు; మఱియు నా సూర్యుండాది నారాయణమూర్తి యగుచు లోకంబుల యోగక్షేమంబులకు వేదత్రయాత్మకంబై కర్మసిద్ధి నిమిత్తంబై దేవర్షి గణంబులచే వేదాంతార్థంబుల ననవరతంబు వితర్క్యమానం బగుచున్న తన స్వరూపంబును ద్వాదశ విధంబులుగ విభజించి వసంతాది ఋతువుల నా యా కాలవిశేషంబులయందుఁ గలుగఁ జేయుచుండు; నట్టి పరమపురుషుని మహిమ నీ లోకంబున మహాత్ములగు పురుషులు దమ తమ వర్ణాశ్రమాచారంబుల చొప్పున వేదోక్త ప్రకారంబుగా భక్త్యతిశయంబున నారాధించుచు క్షేమంబు నొందుచుందు; రట్టి యాదినారాయణమూర్తి జ్యోతిశ్చక్రాంతర్వర్తియై స్వకీయతేజః పుంజదీపితాఖిల జ్యోతిర్గణంబులు గలవాఁడై ద్వాదశరాసులయందు నొక సంవత్సరంబున సంచరించుచుండు; నట్టి యాదిపురుషుని గమన విశేషకాలంబును లోకు లయన ఋతు మాస పక్ష తిథ్యాదులచే వ్యవహరించు చుందురు; మఱియు నప్పరమ పురుషుం డా రాసులయందు షష్ఠాంశ సంచారంబు నొందిన సమయంబును ఋతువని వ్యవహరింపుదు; రా రాసులయందు నర్ధాంశ సంచారమ్మన రాశిషట్క భోగం బొందిన తఱి యయనం బని చెప్పుదురు; సమగ్రంబుగా రాసుల యందు సంచార మొందినయెడల నట్టి కాలంబును సంవత్సరం బని నిర్ణయింపుదు; రిట్టి సమగ్రరాశి సంచారంబునందు శీఘ్రగతి మందగతి సమగతు లనియెడు త్రివిధగతి విశేషంబుల వలన వేఱుపడెడు నా వత్సరంబును సంవత్సరంబు పరివత్సరం బిడావత్సరం బనువత్సరం బిద్వత్సరంబని బంచ విధంబులఁ జెప్పుదురు, చంద్రుండు నీ తెఱంగున నా సూర్యమండలంబు మీఁద లక్షయోజనంబుల నుండి సంవత్సర పక్ష రాశి నక్షత్ర భుక్తులు గ్రహించుచు నగ్రచారియై శీఘ్రగతిం జరించునంత వృద్ధిక్షయ రూపంబునం బితృగణంబులకుఁ బూర్వపక్షాపరపక్షంబులచే నహోరాత్రంబుఁ గలుగఁ జేయుచు సకల జీవ ప్రాణంబై యొక్క నక్షత్రంబు త్రింశన్ముహూర్తంబు లనుభవించుచు షోడశ కళలు గలిగి మనోమయాన్నమ యామృతమయ దేహుండై దేవ పితృ మనుష్య భూత పశు పక్షి సరీసృప వీరుత్ప్రభృతులకుఁ బ్రాణాప్యాయన శీలుం డగుటం జేసి సర్వసముం డనంబడు. 86

* నరేంద్రా! కుమ్మరి సారె వేగంగా గిరగిరా తిరుగుతుంటుంది. ఆ సారెమీద చీమల బారులు తిరుగుతుంటాయి. అయితే వాటి గమనం ఆ చక్ర భ్రమణానికి భిన్నంగా ఉంటుంది. అదే విధంగా నక్షత్రాలతో రాసులతో కూడిన కాలచక్రం తిరుగుతున్నది. ఆ కాలచక్రం ధ్రువ మేరువుల్ని ప్రదక్షిణం చేస్తూ తిరిగేటప్పుడు ఆ కాలచక్రం వెంట తిరిగే సూర్యాది గ్రహాలు నక్షత్రాలలోనూ, రాసులలోనూ సంచరిస్తుంటాయి. అందువల్ల సూర్యాది గ్రహాలకు కాలచక్ర గమనమూ స్వగమనమూ అనే రెండు రకాల గమనాలు కలుగుతున్నాయి. అంటే తమంత తాము తిరగడమున్ను, కాలచక్ర గమనముతో పాటు తిరగడమున్నూ. ఆదినారాయణుడే సూర్యుడుగా ప్రకాశిస్తున్నాడు. ఆ సూర్యభగవానుడు సమస్త లోకవాసుల యోగక్షేమాలు కోరేవాడు. అతడు ఋగ్యజుస్సామ వేదస్వరూపుడు. మానవులు నిర్వహించే కర్మలకు సిద్ధి ప్రదాత. ఆ దేవుని స్వరూపాన్ని దేవర్షి గణాలు వేదాంతపరంగా భావించి సంభావిస్తుంటారు. అటువంటి సూర్యుడు తన స్వరూపాన్ని పన్నెండు విధాలుగా విభజించి వసంతం గ్రీష్మం మొదలయిన ఋతువులను

ఆయా కాలాలలో కలుగ జేస్తుంటాడు. అటువంటి పరమ పురుషుని మహిమను అర్థం చేసుకొన్న మహాత్ములు వర్ణాశ్రమాచారాలు పాటిస్తూ వేదాలలో చెప్పబడ్డట్టు, అతిశయమయిన భక్తితో ఆయనను ఆరాధిస్తూ క్షేమంగా ఉంటారు.

సూర్యరూపు డయిన ఆదినారాయణమూర్తి జ్యోతిశ్చక్రంలో తిరుగుతూ తన తేజస్సుతో గ్రహగోళాదులను వెలిగిస్తూ ద్వాదశరాసులలో ఒక సంవత్సరకాలం సంచరిస్తాడు. ఆ ఆదిపురుషుని గమనవిశేషాన్ని లోకులు అయనాలు, ఋతువులు, మాసాలు, పక్షాలు, తిథులు- అనే పేర్లతో వ్యవహరిస్తుంటారు. రాసులలో ఆరవభాగం సంచారంచేసే కాలాన్ని 'ఋతు' వని వ్యవహరిస్తారు. ఆ రాసులలో సగభాగం సంచరిస్తూ ఆరు రాసులలో తిరిగే కాలాన్ని "అయన" మంటారు. రాసులన్నిటిలోనూ పూర్తిగా తిరిగిన కాలాన్ని "సంవత్సర" మని నిర్ణయిస్తారు. ఆ సమగ్ర రాశి సంచారంలో మూడు రకాలయిన గమనాలు ఉంటాయి. మొదటిది శీఘ్రగతి. రెండవది మందగతి. మూడవది సమగతి. ఈ గతుల కారణంగా సంవత్సరంలో కలిగిన మార్పులను వరుసగా వత్సరం, పరివత్సరం, ఇడావత్సరం, అనువత్సరం, ఇద్వత్సరం అని ఐదు విధాలుగా చెబుతారు. ఇదే పద్ధతిలో చంద్రుడు సూర్యమండలం మీద లక్షయోజనాల దూరం నుండి సంవత్సరం పక్షాలు, రాసులు, నక్షత్రాలు భుక్తులను గ్రహిస్తూ ముందుండి వేగంగా సంచరిస్తాడు. చంద్రుని వృద్ధిక్షయాల వల్ల పితృగణాలకు పూర్వపక్షం, అపరపక్షం అనేవి ఏర్పడతాయి. వీటి వల్లనే పగలు రాత్రులు కలుగుతాయి. చంద్రుడు ఒక్కొక్క నక్షత్రంలో ముప్పది ముహూర్తాల కాలం సంచరిస్తాడు. పదునారు కళలతో మనోమయ, అన్నమయ, అమృతమయ దేహంతో ఒప్పుతుంటాడు. దేవతలకూ, పితృగణానికి, మానవులకూ, భూతాలకూ, జంతువులకూ, పక్షులకూ, పాములు మొదలైన వాటికీ, తీగలకూ, పొదలకూ ప్రాణప్రదమైన తన స్పర్శవల్ల సంతృప్తి కలిగిస్తూ చంద్రుడు సర్వసముడుగా ప్రకాశిస్తాడు.

**క. చందురునకు మీఁదై యా, నందంబున లక్షయోజనంబులఁ దారల్**
**గ్రందుకొని మేరుశైలం, బంది ప్రదక్షిణము దిరుగు నభిజిధ్భముతోన్. 87**

* చంద్రుని పైన లక్షయోజనాలు ఎత్తు ప్రదేశంలో నక్షత్ర మండలం ఉంది. అందలి నక్షత్రాలన్నీ అభిజిత్తుతో కూడా కలిసి మేరు శైలానికి ప్రదక్షిణం చేస్తుంటాయి.

**సీ. అట మీఁదఁ దారల కన్నిటి కుపరియై రెండు లక్షల శుక్రుఁడుండి భాస్క**
**రుని ముందఱం బిఱుందను సామ్యమ్మదు శీఘ్ర సంచారములను భాస్కరుని మాడ్కిఁ**
**జరియించుచుండును జనులకు ననుకూలుఁ డై వృష్టి నొసఁగుచు నంతనంతఁ**
**జతురత వృష్టి విష్కంభక గ్రహశాంతి నొనరించువారల కొసఁగు శుభము**

**తే. లుండు నామీఁద సౌమ్యుండు రెండు లక్ష, లను జరించుచు రవిమండలంబుఁ బాసి**
**కానఁబడినను జనులకు క్షామ డాంబ, రాది భయములఁ బుట్టించు నతుల మహిమ. 88**

* నక్షత్రమండలానికి రెండులక్షల యోజనాల ఎత్తున శుక్రుడు సంచరిస్తుంటాడు. ఈతడు సూర్యునికి ముందూ, వెనుకా ఉదయిస్తూ సూర్యునిలాగే సంచారం చేస్తాడు. ఈతని గమనం కొన్నిసార్లు మెల్లగా కొన్నిసార్లు మృదువుగా మరికొన్ని సార్లు తొందరగా సాగుతుంటుంది. ఈ శుక్రుడు ప్రజల కందరికీ అనుకూలుడై వర్షం కురిపిస్తాడు. వర్షాలకు ఆటంకం కలిగించే గ్రహాలకు శాంతి చేసినట్లయితే శుక్రుడు సంతుష్టి పొంది శుభం కలుగజేస్తాడు. శుక్రునికంటె పైన రెండు లక్షల యోజనాల దూరంలో బుధుడు తిరుగుతుంటాడు. అతడు సూర్యమండలాన్ని వదలి దూరంగా కనిపించినా ప్రజలందరికీ కరువు కాటకాలు, దోపిడీల భయం కలిగిస్తాడు.

**సీ. ధరణీతనూజుఁ డంతటిమీఁద రెండు లక్షల నుండు మూఁడు పక్షముల నొక్క**
**రాశి దాఁటుచు నుండుఁ; గ్రమమున ద్వాదశ రాసులు భుజియించు రాజసమున;**
**వక్రించియైన నవక్రత నైనను దఱచుగాఁ బీడలు నరుల కొసఁగు;**
**నంగారకుని కెంకి కావల రెండు లక్షల యోజనంబుల ఘనత మించి**

**ఆ. యొక్క రాశినుండి యొక్కొక్క వత్సరం, బనుభవించుచుండు నమరగురుఁడు**
**వక్రమందునైన వసుధామరులకును, శుభము నొసఁగు నెపుడు నభినవముగ.** 89

* బుధునికన్న పైన రెండు లక్షల యోజనాల దూరంలో అంగారకు డున్నాడు. అతడు మూడు పక్షాలకాలంలో ఒక్కొక్క రాశి దాటుతూ సంచారం చేస్తాడు. ఈవిధంగా అంగారకుడు పంద్రెండు రాసులలో రాజసంతో సంచరిస్తుంటాడు. వక్రగతిలో గానీ, వక్రగతిలో లేనప్పుడు గానీ అంగారకుడు ప్రజలకు పీడలే కలిగిస్తాడు. అతనికి రెండులక్షల యోజనాల దూరంలో బృహస్పతి సంచరిస్తున్నాడు. ఆ అమర గురుడు ప్రతిఒక్క రాశిలో ఒక్కొక్క సంవత్సరం చరిస్తుంటాడు. ఈ గురుడు వక్రగతిలో ఉన్నా బ్రాహ్మణులకు ఎప్పటి కప్పుడు శుభపరంపరలను ప్రసాదిస్తుంటాడు.

**క. సురగురునకు మీఁదై భా, స్కరసుతుఁ డిరు లక్షలను జగములకుఁ బీడల్**
**జరపుచుఁ ద్రింశన్మాసము, లరుదుగ నొక్కొక్క రాశి యందు వసించున్.** 90

* బృహస్పతికన్న రెండు లక్షల యోజనాలకు పైన శని తిరుగుతుంటాడు. ఇతడు ప్రతిరాశిలోను, ముప్పయి మాసాలు చరిస్తాడు. ఈ ముప్పయి మాసాలలోనూ శని ప్రజలకు కష్టాలే కలిగిస్తాడు.

**క. ప్రాకటముగ రవి సుతునకు, నేకాదశ లక్షలను మహీసురులకు నీ**
**లోకులకు మేలు గోరుచు, జోకగ మునిసప్తకంబు సొంపు వహించెన్.** 91

* శనికి పదునొకండు లక్షల యోజనాలు దూరంలో సప్తర్షి మండలం ఉంది. ఈ మండలంలోని ఋషులు బ్రాహ్మణులకూ, ప్రజలకూ మేలు కోరుతుంటారు.

**క. మునిసప్తకమున కెగువం, దనరుచు నా మీఁదఁ ద్రియుత దశలక్షలఁ బెం**
**పున శింశుమారచక్రం, బనఁగా నిన్నిటికి నుపరి యగుచుండు నృపా!** 92

* రాజా! సప్తఋషులకన్న పదుమూడు లక్షల యోజనాల ఎత్తులో శింశుమారచక్రం ఉంది. ఇదే ఆకాశంలో అన్నిటికన్న పైన ఉన్న చక్రం.

సీ. ఆ శింశు మారాఖ్యమగు చక్రమున భాగవతుఁడైన ధ్రువుఁ డింద్ర వరుణ కశ్య
ప ప్రజాపతి యమ ప్రముఖులతోఁ గూడి బహుమానముగ విష్ణుపదముఁజేరి
కణఁక నిచ్చలుఁ బ్రదక్షిణముగాఁ దిరుగుచుఁ జెలఁగి యుండును గల్పజీవి యగుచు;
ననఘుఁ డుత్తాన పాదాత్మజుఁ డార్యుఁడు నయిన యా ధ్రువుని మహత్త్వమెల్లఁ

తే. దెలిసి వర్ణింప బ్రహ్మకు నలవిగాదు, నే నెఱింగిన యంతయు నీకు మున్న
తెలియఁ బలికితిఁ; గ్రమ్మఱఁ దలఁచికొనుము, జితరిపువ్రాత! శ్రీపరీక్షిన్నరేంద్ర! 93

* పరీక్షిన్మహారాజా! ఆ శింశుమారచక్రంలో పరమ భక్తాగ్రేసరు డయిన ధ్రువుడు ఉన్నాడు. అతడు ఇంద్రుడు, వరుణుడు, కశ్యపుడు,యముడు మొదలగు దేవతలతో, ప్రజాపతులతో విష్ణుపదానికి ప్రతినిత్యం ప్రదక్షిణం చేస్తుంటాడు. అతడు కల్పం చివరిదాకా జీవిస్తాడు. ఉత్తానపాదుని కుమారుడైన ఆ ధ్రువుడు పూజ్యుడు, మహాత్ముడు. ఆయన మహిమలను బ్రహ్మకూడా వర్ణించలేడు. నాకు తెలిసిన విశేషాలన్నీ నీకు ముందే తెలియజేశాను. ఒకసారి ఆ కథలన్నీ గుర్తుకు తెచ్చుకో,

వ. మఱియు నా ధ్రువుండు గాలంబుచేత నిమిషమాత్రం బెడ లేక సంచరించు జ్యోతిర్గ్రహ నక్షత్రంబులకు నీశ్వరునిచేత ధాన్యాక్రమణంబునఁ బశువులకై యేర్పఱచిన మేధిస్తంభంబు తెఱంగున మేటిగాఁ గల్పింపంబడి ప్రకాశించుచుండు; గగనంబు నందు మేఘంబులును శ్యేనాదిపక్షులును వాయు వశంబునం గర్మ సారథులై చరించు తెఱంగున జ్యోతిర్గణంబులును బ్రకృతిపురుష యోగ గృహీతాశులై కర్మ నిమిత్తగతి గలిగి వసుంధరం బడకుందురు. 94

* ధాన్యం నూర్చే కళ్లంలో పశువులను కట్టడం కోసం మధ్యలో పాతిన స్తంభలాగున ధ్రువుడు ఆ శింశుమారచక్రం నడుమ ప్రకాశిస్తూ ఉన్నాడు. అతని చుట్టూ గ్రహాలూ, నక్షత్రాలూ ఉన్నాయి. అవన్నీ కాలవిభాగంలో నిమేషమాత్రం కూడా ఏమరుపాటులేక ధ్రువుని చుట్టూ ప్రదక్షిణంగా తిరుగుతుంటాయి. ఆకాశంలో మేఘాలూ, డేగలు మొదలయిన పక్షులూ కర్మానుసారంగా గాలికి లోబడి ఆకాశంలో ఏలా పరిభ్రమిస్తున్నాయో అలాగే జ్యోతిర్గణాలు కర్మను అవలంబించి ప్రకృతి పురుషులకు లోబడి గగనాన తిరుగుతూ ఉంటాయి. ఈ కారణంవల్లనే ఆ గ్రహాలు నేలమీద పడడం లేదు.

క. పొందుగ జ్యోతిర్గణముల, నందఱ నా శింశుమారమందుల నుండం
గొందఱు దఱచుగఁ జెప్పుచు, నుందురు; వినిపింతు, విను మనూనచరిత్రా! 95

* సచ్చరిత్రుడవైన రాజా! జ్యోతిర్గణాలన్నీ శింశుమారచక్రంలో ఉన్నాయని కొందరు చెబుతుంటారు. ఆ శింశుమారచక్ర స్వరూపం నీకు వివరిస్తాను, విను.

క. తలక్రిందై వ్రట్టువయై, సలలితమగు శింశుమార చక్రము నందున్
నెలకొని పుచ్ఛాగ్రంబున నిలిచి ధ్రువుం డుండు నెపుడు నిర్మల చరితా. 96

* నిర్మల చరిత్రా! శింశుమారచక్రం తలక్రిందుగా, గుండ్రంగా అందంగా ఉంటుంది. ఆచక్రం తోక చివర ధ్రువుడు సర్వదా ప్రకాశిస్తూ ఉంటాడు.

**వ. మఱియు నా శింశుమార చక్రపుచ్ఛంబునఁ బ్రజాపతియు నగ్నీంద్ర ధర్ములును, బుచ్ఛమూలంబున ధాతృవిధాతలును, గటి ప్రదేశంబున ఋషి సప్తకంబును, దక్షిణావర్త కుండలీభూత శరీరంబునకు నుదగయన నక్షత్రంబులును, దక్షిణపార్శ్వంబున దక్షిణాయన నక్షత్రంబులును, బృష్ఠంబున దేవమార్గంబును, నాకాశగంగయు, నుత్తరభాగంబునఁ బునర్వసు పుష్యంబులును, దక్షిణాయనంబున నార్ద్రాశ్లేషలును, దక్షిణ వామపాదంబుల నభిజి దుత్తరాషాఢలును, దక్షిణ వామ నాసారంధ్రంబుల శ్రవణ పూర్వాషాఢలును, దక్షిణ వామలోచనంబుల ధనిష్ఠామూలలును, దక్షిణ వామకర్ణంబుల మఘాద్యష్ట నక్షత్రంబులును, వామపార్శ్వంబున దక్షిణాయనంబును, దక్షిణపార్శ్వంబునఁ గృత్తికాది నక్షత్ర త్రయంబును, నుత్తరాయణంబును. వామదక్షిణ స్కంధంబుల శతభిషజ్జ్యేష్ఠలును, నుత్తరహనువున నగస్త్యుండును, నపర హనువున యముండును, ముఖంబున నంగారకుండును, గుహ్యంబున శనైశ్చరుండును, మేఢ్రంబున బృహస్పతియును, వక్షంబున నాదిత్యుండను, నాభిని శుక్రుండును, మనంబునం జంద్రుండును, స్తనంబుల నశ్వినులును, బ్రాణాపానంబుల బుధుండును, గళంబున రాహువును, సర్వాంగంబులఁ గేతుగ్రహంబును, రోమంబులఁ దారలును నుండు; నది సర్వదేవతామయంబైన పుండరీకాక్షుని దివ్యదేహంబు ధ్రువునింగా నెఱుంగుము. 97**

* ఆ శింశుమారచక్రం తోకభాగంలో ప్రజాపతి, అగ్ని, ఇంద్రుడు, ధర్ముడు అను వా రుంటారు. తోక ముందు భాగంలో ధాత, విధాత ఉన్నారు. నడుము భాగంలో సప్తర్షులున్నారు. దక్షిణావర్తమై (కుడివైపుకు చుట్టుకొని) కుండలీ భూతంగా ఉన్నదానికి ఉత్తర భాగంలో ఉత్తరాయణ నక్షత్రాలూ, దక్షిణ భాగంలో దక్షిణాయన నక్షత్రాలూ, వీపుమీద దేవమార్గం అనబడే తారకాసముదాయమూ అక్కడే ఆకాశగంగ కూడా ఉన్నాయి. ఉత్తర భాగంలో పునర్వసు, పుష్యమి నక్షత్రాలు, దక్షిణభాగంలో ఆర్ద్ర, ఆశ్లేషలు, కుడిపాదంలో అభిజిత్తు, ఎడమపాదంలో ఉత్తరాషాఢ, కుడివైపు ముక్కుపుటంలో శ్రవణం, ఎడమవైపున పూర్వాషాఢ ఉన్నాయి. కుడి ఎడమ నేత్రాలలో ధనిష్ఠ మూల ఉన్నాయి. కుడి ఎడమ చెవులలో మఘ, పుబ్బ, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, విశాఖ, అనూరాధ నక్షత్రాలు ఉన్నాయి. ఎడమ ప్రక్క దక్షిణాయన నక్షత్రాలు, కుడిప్రక్క కృత్తిక, రోహిణి, మృగశిర అనే మూడు నక్షత్రాలు ఉన్నాయి. ఇవి గాక ఉత్తరాయణ నక్షత్రాలు కూడ అక్కడే ఉన్నాయి. ఎడమ కుడివైపుల మూపులయందు శతభిషం, జ్యేష్ఠం నక్షత్రాలున్నాయి. పై దవడ ప్రదేశంలో అగస్త్యుడు, క్రింది దవడ స్థానంలో యముడు, ముఖమందు అంగారకుడు, మర్మావయవ స్థానంలో శని, పురుషాంగంగా బృహస్పతి ఉన్నారు. వక్షోభాగంలో సూర్యుడు, నాభిలో శుక్రుడు, మనసులో చంద్రుడు, స్తనాలందు అశ్వినులు, ప్రాణాపానము లందు బుధుడు, కంఠభాగంలో రాహువు ఉన్నారు. అయితే కేతువు మాత్రం అన్నీ అవయవాలు ఆవరించి వుంటాడు. ఈ శింశుమార చక్రానికి రోమాలుగా ఇంకా ఎన్నో నక్షత్రాలున్నాయి. ఇది సర్వదేవతామయ మయిన నారాయణుని దివ్య స్వరూపం. ఇది స్థిరమైనది. ధ్రువమైనది.

సీ. ఇట్టి దివ్యశరీర మెవ్వఁడు ప్రతిదినం బందు సంధ్యాకాల మతుల భక్తి
మనమందు నిలిపి యేమఱక మిక్కిలి ప్రయత్నంబున నియతుఁడై తత్త్వబుద్ధి
మౌనవ్రతంబునఁ బూని వీక్షించుచు నీ సంస్తవంబు దానెంతొ ప్రేమ
జపియించి కడుఁ బ్రశస్తమును మునీంద్ర సేవ్యమును జ్యోతిస్స్వరూపమున వెలుఁగు

ఆ. విపుల శింశుమార విగ్రహంబునకు వం, దనము వందనంబు లనుచు నిలిచి
సన్నుతించెనేని సకలార్థ సిద్ధులఁ, బొందు మీఁద ముక్తిఁ జెందు నధిప! 98

* రాజేంద్రా! ఈ దివ్య శరీర సందర్శనం వల్ల కలిగే ఫలితాలను చెబుతాను- విను. ఈ శింశుమారచక్రం శ్రీమన్నారాయణుని దివ్య శరీరం. ఎవరు ప్రతిదినమూ సంధ్యాకాలంలో ఈ దివ్య శరీరాన్ని మనసులో నిలుపుకొని దీక్షతో, నియమంతో, భక్తితో స్మరిస్తారో; తత్త్వాన్ని గ్రహించి మౌనవ్రతం చేపట్టి ఈ చక్రదర్శనంచేస్తూ ఎవరు ఈ స్తోత్రాన్ని ప్రీతితో జపించి నమస్కరిస్తారో; ఎవరు ప్రశస్తమూ, మునీంద్ర సేవ్యమూ, జ్యోతిస్స్వరూపమూ అయిన శింశుమారచక్రానికి "వందనం, వందనం'' అంటూ మొక్కులు చెల్లిస్తారో అటువంటి వారికి ఇహలోకంలో సకల సిద్ధులూ లభిస్తాయి, పరలోకంలో ముక్తీ ప్రాప్తిస్తుంది.

క. ఇనమండలంబునకుఁ గ్రిం, దను దశసాహస్ర యోజనంబుల స్వర్భా
నుని మండలంబు గ్రహమై, ఘనముగ నపసవ్యమార్గగతి నుండు నృపా! 99

* ఓ రాజా! సూర్యమండలానికి దిగువ పదివేల యోజనాల దూరంలో రాహుమండలం ఉన్నది. ఈ రాహువు అపసవ్యంగా నడుస్తుంటాడు.

క. అసురాధముఁడగు రాహువు, బిసరుహసంభవుని వరము పెంపున నెంతో
పసయగు నమరత్వంబున, నసమానంబైన గ్రహవిహారముఁ బొందెన్. 100

* రాహువు రాక్షసులలో అధముడు. అయితే అతనికి బ్రహ్మదేవుని వరం ఉంది. ఆ వరం కారణంగా అతడు అమరత్వం పొంది గ్రహములతో పాటు తా నొక గ్రహమై విహరిస్తుంటాడు.

సీ. జననాథ! రాహువు జన్మకర్మంబులు వినిపింతు ముందఱ విస్తరించి
యయుత యోజన విస్తృతార్క మండలము ద్వి షట్సహస్ర విశాల చంద్రమండ
లముఁ బర్వకాలంబులను ద్రయోదశ సహస్ర విశాలమై మీఁద రాహు గప్పు
నది చూచి యుపరాగ మనుచును బలుకుదు రెల్ల వారును స్వధర్మేచ్ఛ లగుచు.

ఆ. నంతలోన నినశశాంక మండలములఁ, గరుణఁ బ్రోవఁదలఁచి హరిసుదర్శ
నంబు వచ్చునను భయంబున నై దాఱు, గడియలకును రాహు నడఁకి తొలఁగు. 101

* రాజా! రాహువు యొక్క జన్మ, కర్మాలనుగూర్చి సవిస్తరంగా చెబుతాను. ఈ రాహువు సామాన్యుడు కాదుసుమా! పదివేల యోజనాల విస్తృతి కలిగిన సూర్యమండలాన్నీ, పండ్రెండు వేల యోజనాల విస్తృతి కలిగిన చంద్రమండలాన్నీ రాహువు కప్పేస్తాడు. రాహుమండలం పదమూడువేల యోజనాలు వైశాల్యం

కలిగింది. పూర్ణిమ పర్వదినంలో చంద్రుణ్ణి, అమావాస్య పర్వదినంలో సూర్యుణ్ణీ రాహువు మాటు పరుస్తాడు. దీనినే "గ్రహణం" అని అంటారు. ఆ గ్రహణకాలంలో జనులందరూ తమతమ జపతపో రూపాలయిన ధర్మాలను చక్కగా ఆచరించుకొంటారు. అయితే దయామయుడైన శ్రీహరి సుదర్శనచక్రం సూర్య చంద్రమండలాలను రక్షించడానికి వస్తుందేమో అనే భయంతో ఐదారు గడియలలోనే రాహువు వారిని వదలిపెట్టి తొలగిపోతాడు.

**క. నరవర! యా రాహువునకు, సరసత నాక్రింద సిద్ధచారణవిద్యా**
**ధరు లయుత యోజనంబులఁ, దిరముగ వసియించి లీలఁ దిరుగుదు రచటన్. 102**

* నరేంద్రా! రాహువుకు దిగువ పదివేల యోజనాల దూరంలో సిద్ధులు, చారణులు, విద్యాధరులు స్థిరనివాస మేర్పరచుకొని తిరుగుతుంటారు.

**క. పరికింప సిద్ధ విద్యా, ధరులకుఁ బదివేలు క్రిందఁ దరలక యక్షుల్**
**మఱియును భూత ప్రేతలు, చరియింతురు రాక్షసులు పిశాచులు గొలువన్. 103**

* సిద్ధ విద్యాధరుల నివాసస్థానానికి క్రింద పదివేల యోజనాల దూరంలో రాక్షసులు, పిశాచాలు సేవిస్తుంటే యక్షులూ, భూత ప్రేతాలూ తిరుగుతుంటారు.

**ఆ. వారిక్రిందఁ దగిలి వాయువశంబున, మలయుచుండు మేఘమండలంబు**
**మేఘమండలంబు మీఁ దగుచుండు భూ, మండలంబు క్రిందనుండు నధిప! 104**

* వారి క్రింద మేఘమండలం ఉంది. ఆ మబ్బులన్నీ గాలికి చలిస్తూ ఉంటాయి. మేఘమండలం పై భాగంలో ఉంటే దానికి క్రింది భాగంలో భూమండలం ఉన్నది.

**వ. అట్టి భూమండలంబు క్రింద యోజనాయుతాంతరంబున నండ కటాహాయామంబు గలిగి క్రమంబున నొండొంటికిఁ గ్రిందగుచు నతల వితల సుతల రసాతల తలాతల మహాతల పాతాళ లోకంబు లుండు; నట్టి బిల స్వర్గంబులయందు నుపరి స్వర్గంబున కధికంబైన కామభోగంబుల నైశ్వర్యానందంబులను సుసమృద్ధ వనోద్యాన క్రీడా విహారస్థానంబుల ననుభవించుచు దైత్యదానవ కాద్రవేయాది దేవయోనులు నిత్య ప్రముదితానురక్తు లగుచుఁ గళత్రాపత్య సుహృద్బంధు దాసీదాస పరిజనులతోఁ జేరుకొని మణిగణఖచితంబులగు నతి రమణీయ గృహంబులయందు నీశ్వరుని వలనం జేటులేని కాయంబులు గలిగి వివిధ మాయా విశేష వినిర్మిత నూతన కేళీసదన విహరణ మండప విచిత్రోద్యానాదులయందు గేళీవినోదంబులు సలుపుచుఁ జరియింతు; రంత. 105**

* ఆ భూమండలం క్రింద ఒకదాని క్రింద ఒకటిగా అతలం, వితలం, సుతలం, తలాతలం, రసాతలం, మహాతలం, పాతాళం అనే లోకాలున్నాయి. ఈ లోకాలలో ఒక్కొక్కదానికీ మధ్య పదివేల యోజనాలదూరం ఉంటుంది. ఇవి క్రింద ఉన్నా స్వర్గం వంటివే. నిజం చెప్పాలంటే ఈ క్రింది స్వర్గాలు పైనున్న స్వర్గంకంటే ఎంతో గొప్పవి. ఇక్కడ దైత్యులూ, దానవులూ, నాగులూ మొదలయిన దేవజాతికి చెందినవారు ఉంటారు.

వారందరూ ఐశ్వర్యం వల్ల సంక్రమించిన ఆనందానుభవంతో సుఖభోగాలతో తులతూగుతూ జీవిస్తారు. సర్వాంగసుందరాలైన ఉద్యానవనాలలో, క్రీడా ప్రదేశాలలో విహరిస్తుంటారు. దైత్యులూ, దానవులూ, నాగులూ మొదలయిన దేవజాతి విశేషాలు భార్యలతో, బిడ్డలతో, చెలికాండ్రతో, చుట్టాలతో, దాసదాసీజనంతో మణులు చెక్కిన రమణీయమయిన గృహాలలో సర్వదా సంతోషం అనుభవిస్తుంటారు. ఈశ్వరుని కరుణవల్ల వారికి దైహికమయిన ఎటువంటి వ్యాధులూ లేవు. మాయలతో నిర్మింపబడ్డ కొంగ్రొత్త కేళీగృహాలలో, విహార మంటపాలలో, చిత్ర విచిత్ర మయిన ఉద్యానవనాలలో క్రీడా వినోదాలతో సంచరిస్తుంటారు.

**సీ. అట్టి పాతాళంబులందును మయకల్పితములగు పుటభేదనములయందు**
**బహురత్న నిర్మిత ప్రాకార భవన గోపుర సభా చైత్య చత్వర విశేష**
**ములయందు నాగాసురుల మిథునములచే శుక పిక శారికా నికర సంకు**
**లముల శోభిల్లు కృత్రిమ భూములును గల గృహములచే నలంకృతము లగుచు**

**ఆ. గుసుమచయ సుగంధి కిసలయ స్తబక సం, తతులచేత ఫలవితతులచేత**
**నతులరుచిర నవలతాంగ నాలింగిత, విటపములను గలుగు విభవములను.** **106**

* అటువంటి పాతాళలోకాలలో మయుడు సృష్టించిన మాయా పట్టణాలు ఎన్నో ఉన్నాయి. ఆ పట్టణాలలో నానావిధ రత్నాలతో నిర్మించిన ప్రాకారాలూ, గోపురాలు, సౌధాలూ, విశాలమయిన సభాసమావేశ స్థలాలూ, చైత్యాలూ ఉన్నాయి. వాటియందూ దైత్య దానవ నాగ దంపతులు విహరిస్తుంటారు. మాయతో వారు నిర్మించుకున్న విహార ప్రదేశాలలో చిలుకలూ, కోకిలలూ, గోరువంకలూ కలకలారావాలు చేస్తుంటాయి. పూల వాసనలు, చిగురుటాకుల గుత్తుల బొత్తులు, రకరకాల ఫలాలు సమృద్ధిగా గల ఆ ఉద్యానాలలో లతాసుందరులు పెనవేసుకున్న తరుశాఖలు కన్నుల పండువు చేస్తుంటాయి.

**వ. మఱియు మానసేంద్రియంబుల కానందకరంబులైన నానావిధ జలవిహంగమ మిథునంబులు గలిగి నిర్మల జలపూరితంబులై మత్స్యకుల సంచర క్షుభితంబులైన కుముదకువలయ కహ్లార లోహిత శతపత్త్రాదికంబులఁ దేజరిల్లెడు సరోవరంబులు గల యుద్యాన వనంబుల యందుఁ గృతనికేతనులై స్వర్గభూముల నతిశయించిన వివిధ విహారంబులు గలిగి యహోరాత్రాది కాల విభాగ భయంబులు లేక మహాహిప్రవరులయిన శేషాదుల శిరోమణి దీధితులచే నంధకారోపద్రవంబు లేక యెల్లప్పుడు దివసాయమానంబుగా నుండు; నా లోకంబునందు నఖిల జనులు దివ్యౌషధి రస రసాయనంబుల ననవరతంబు నన్న పానంబులుగా సేవించుటం జేసి యచ్చటివారలకు నాధివ్యాధులును, వలిత పలితంబులును, జరారోగంబులును, శరీర వైవర్ణ్యంబులును, స్వేదదౌర్గంధ్యంబులును గలుగక పరమకల్యాణ మూర్తు లగుచు హరిచక్రభయంబు దక్క నన్యంబగు మృత్యుభయంబు నొందక యుందు; రదియునుంగాక.** **107**

* మనసుకు, ఇంద్రియాలకూ ఆహ్లాదం కలిగించే సరస్సులు కూడ అక్కడ ఉన్నాయి. ఆ సరోవరాలలో రకరకాలయిన నీటి పక్షుల జంటలు విహరిస్తుంటాయి. అక్కడ నీరు నిర్మలంగా ఉంటుంది. చేపలు

ఈదుతూ కోనేటిలో  కదలికలు కలిగిస్తాయి. ఆ సరోవరాలలో తెల్లకలువలూ, నల్ల కలువలూ, ఎర్రకలువలూ, రంగు రంగుల తామర పూలూ ఉన్నాయి. అటువంటి సరస్సులు గలిగిన ఉద్యానవనాలలో వారు ఇళ్ళు ఏర్పరచుకొంటారు. స్వర్గ భోగాలను మించిన భోగాలు వారికి అందుబాటులో ఉంటాయి. వారికి పగలు, రాత్రి అనే కాలభేదాలు ఉండవు. శేషుడు మొదలయిన సర్పరాజుల పడగలమీద ఉన్న మణులవల్ల వారికి చీకట్లు ఉండవు. అక్కడ ఎప్పుడూ పట్టపగలు లాగా ఉంటుంది. అక్కడి వారు దివ్యమయిన మూలికలనూ రసరసాయనములనూ ఆహారంగా స్వీకరించడంవల్ల దేహవ్యాధులు గానీ మనోవ్యాధులుగానీ వారికి ఉండవు. దేహం పాలిపోదు. ముడతలు పడదు. జుట్టు నరసిపోదు. ముసలితనం రాదు. రోగాలు లేవు. చెమట, దుర్వాసనలు ఉండవు. ఆకర్షణీయ మయిన ఆకారాలు కలిగి ఉంటారు. వారికి సుదర్శనచక్రభయం తప్ప మరే మృత్యుభయమూ లేదు.

**తే. అట్టి పాతాళలోకంబునందు విష్ణు, చక్ర మెప్పుడేని బ్రవేశంబు నొందు**
**నప్పుడెల్లను దైత్యకులాంగనలకు, గర్భసంపద లందంద కరఁగుచుండు. 108**

* అటువంటి పాతాళలోకంలో విష్ణుభగవానుని సుదర్శన చక్రం ఎపుడు ప్రవేశిస్తుందో అపుడే రాక్షస స్త్రీలకు గర్భస్రావం కలుగుతుంటుంది.

**చ. అతలమునందు నమ్మయుని యాత్మజుఁడైన బలాసురుండు స**
**మ్మతిఁ జరియించు షణ్ణవతి మాయలఁ గూడి వినోద మందుచుం**
**గుతలములందు నేఁడు నొక కొందఱు నచ్చటి మాయఁ జెంది సం**
**తతముఁ జరించుచుండుదురు దప్పక మోహనిబద్ధ చిత్తులై. 109**

* 'అతల' మనే లోకంలో మయుని కుమారుడయిన బలాసురుడు స్వేచ్ఛగా విహరిస్తుంటాడు. అతడు తొంభై యారు విధాలైన మాయలతో వినోదిస్తుంటాడు. ఈ మాయలకు భూలోకంలోని వారు కొందరు లొంగిపోయి సమ్మోహితాత్ములై చరిస్తుంటారు.

**వ. అట్టి బలుని యావలింతలను స్వైరిణులు కామినులు పుంశ్చలు లను స్త్రీ గణంబులు జనియించి; రా కామినీ జనంబులు పాతాళంబుఁ బ్రవేశించిన పురుషునికి హాటక రసం బనియెడు సిద్ధరసఘుటిక నిచ్చి రససిద్ధునిం గావించి యతని యందు స్వవిలాసావలోక నానురాగస్మిత సల్లాపోపగూహనాదుల నిచ్ఛా విహారంబులు సలుపుచుండ నా పురుషుండు మదాంధుండై తానే సిద్ధుండ ననియును నాగాయుత బలుండ ననియును దలంచి నానావిధ రతిక్రీడలఁ బరమానందంబు నొందుచుండు. 110**

* బలాసురుని ఆవులింతల నుండి స్వైరిణులూ, కామినులూ, పుంశ్చలులూ అనే స్త్రీ సమూహాలు పుట్టారు. ఆ స్త్రీలు పాతాళంలో ప్రవేశించిన పురుషునికి "హాటకరస" మనే సిద్ధరసఘుటికను ఇచ్చి అతనిని శృంగారరస సిద్ధుణ్ణి చేస్తారు. తమ తళుకు  బెళుకు చూపులతో, అనురాగ ప్రదర్శనలతో, చిరునవ్వులతో, సరససల్లాపాలతో, కౌగిలింతలతో అతనిని లోబరచుకొంటారు. తమకు నచ్చిన రీతిలో ఆ పురుషునితో విహారం సాగిస్తారు. అపుడు పాతాళం ప్రవేశించిన ఆ పురుషుడు తానే సిద్ధపురుషుడని భావిస్తాడు. దర్పంతో

అతని కళ్ళు నెత్తి కెక్కుతాయి. తాను పదివేల ఏనుగుల బలం కలవాడనని భావించుకొని రకరకాల రతిక్రీడలతో పరమానందం అనుభవిస్తుంటాడు.

సీ. హాటకేశ్వరుఁడైన యంబికాధీశుండు వితలంబునందున వేడ్క నిలిచి
తనదు పార్షదభూతతతులతో బ్రహ్మ సర్గోపబృంహణమున నొక్క చోటఁ
బార్వతీ సంభోగపరుఁ డగుచుండఁగా వారల వీర్యంబు వలనఁ బుట్టి
నట్టిది హాటకి యనియెడు నది యనిలాగ్నులు భక్షించి యంద నుమియ

తే. నదియు హాటక మనుపేర నతిశయిల్లి, వన్నె మీఱుచు శుద్ధసువర్ణమయ్యె
నా సువర్ణంబు నాలోకమందు నున్న, జనులకెల్లను వినుతభూషణము లయ్యె. 111

* 'వితల' మనే లోకానికి హాటకేశ్వరుడనే పేరుగల వాడూ, పార్వతీ పతీ అయిన శివుడు అధి దేవత. భూతగణ సమేతుడైన శివుడు బ్రహ్మసృష్టిని వృద్ధిపొందించటం కోసం పార్వతీ సంభోగ పరవశు డవుతాడు. అపుడు వారి వీర్యం నుండి 'హాటకి' అనే నది పుట్టింది. ఆ నదిలోని జలరూపమైన వీర్యాన్ని వాయువుతో కూడ అగ్ని ఆహారంగా తీసుకొని ఉమియగా 'హాటకం' అనే పరిశుద్ధ మయిన బంగారం పుట్టింది. అ వితలలోకంలోని వారి కందరికినీ ఆ బంగారం భూషణ రూపంలో ఉపయోగ పడుతున్నది.

సీ. ఆ క్రింద సుతలంబు నందు మహాపుణ్యుఁ డగు విరోచనపుత్త్రుఁడైన యట్టి
బలిచక్రవర్తి యా పాకశాసనునకు ముద మొసంగఁగఁ గోరి, యదితిగర్భ
మున వామనాకృతిఁ బుట్టి యంతటఁ ద్రివిక్రమ రూపమునను లోకత్రయంబు
నాక్రమించిన దానవారాతిచేత ముందటన యాఁబడిన యింద్రత్వ మిట్లు

ఆ. గలుగువాఁడు పుణ్యకర్మసంధానుండు, హరిపదాంబుజార్చ నాభిలాషుఁ
డగుచుఁ శ్రీరమేశు నారాధనము సేయు, చుండు నెపుడు నతిమహోత్సవమున. 112

* 'వితలం' క్రింద సుతలం ఉంది. సుతలంలో బలిచక్రవర్తి ఉన్నాడు. అతడు పుణ్యావంతుడయిన విరోచనుని కుమారుడు. శ్రీమన్నారాయణుడు ఇంద్రుణ్ణి సంతోషపెట్టాలనుకొని అదితిగర్భంలో వామనుడై పుట్టాడు. త్రివిక్రమరూపం ప్రదర్శించి ముల్లోకాలను ఆక్రమించాడు. చివరకు విష్ణువు బలిచక్రవర్తికి సుతలంలో ఇంద్రత్వం అనుగ్రహించాడు. ఆ బలిచక్రవర్తి ఎన్నో పుణ్యకర్మలు చేశాడు. శ్రీహరి పాదపద్మాలను సేవించవలెననే అభిలాష కలవాడు. అతడు ఎంతో ఉత్సాహంతో లక్ష్మీశుడయిన శ్రీమన్నారాయణుని ఆరాధిస్తుంటాడు.

వ. నరేంద్రా! సకల భూతాంతర్యామియుఁ దీర్ఘభూతుండును నయిన వాసుదేవుని యందుఁ జిత్తంబు గలిగి యిచ్చిన భూదానంబునకు సాక్షాత్కరించిన మోక్షంబు ఫలం బగుం; గాని పాతాళ స్వర్గరాజ్యంబులు ఫలంబులు గానేర వయిన నెవ్వరికిని మోక్షంబు సాక్షాత్కృతంబు గాకుండుటంజేసి

లోక ప్రదర్శనార్థంబు పాతాళ స్వర్గరాజ్యంబుల నిచ్చె; క్షుత పతన ప్రస్ఖల నాదులందును వివశుండైన యెడల నామస్మరణంబు సేయు పురుషుండు గర్మబంధంబు వలన విముక్తుం డగుచు సుజ్ఞానంబునం బొందు; నట్టి వాసుదేవుం డాత్మజ్ఞాన ప్రపోషణంబు సేయు మాయామయంబు లయిన భోగైశ్వర్యంబుల నెల్ల నెట్లొసంగు ననవలదు; భగవంతుండు యాచనచేసి సకల సంపదలఁ జేకొని శరీరమాత్రావశిష్టునిం జేసి వారుణపాశంబులం గట్టి విడిచినప్పుడు బలీంద్రు డిట్లనియె.113

* ఓ రాజా! వాసుదేవుడు అన్ని ప్రాణులలోను అంతర్యామిగా ఉండేవాడు. పైగా పుణ్యతీర్థం లాగున పవిత్రుడు. అటువంటి వాసు దేవుని మనసులో నిలుపుకొని బలిచక్రవర్తి భూదానం చేశాడు. ఇటువంటి భూదానానికి శ్రీమన్నారాయణుడు మెచ్చుకొని సాక్షాత్కరించాడు. ఆ సాక్షాత్కారానికి మోక్షమే ఫలం. అంతేగాని స్వర్గరాజ్యం గానీ, పాతాళరాజ్యం గానీ ఫలాలు కావు. అయితే ముక్తి అన్నది ఎవరికీ కనిపించేది కాదు. అందువల్ల శ్రీహరి బలిచక్రవర్తికి లోక ప్రదర్శనార్థం పాతాళ స్వర్గరాజ్యాలు ఇచ్చాడు.

తుమ్మినపుడూ, పడినప్పుడూ, కాలుజారినపుడూ, తెలివి తప్పి నపుడూ శ్రీమన్నారాయణుని నామస్మరణం చేసే పురుషునికి కర్మబంధాలు ఉండవు. ఆ బంధాల నుండి విముక్తి పొంది సుజ్ఞానవంతు డవుతాడు. ఆత్మజ్ఞానం అనుగ్రహించే వాసుదేవుడు మాయామయమయిన ఇహలోక భోగాలనూ, అశాశ్వతమయిన ఐశ్వర్యాలనూ ఏ విధంగా ప్రసాదిస్తాడనే సందేహం వద్దు. శ్రీహరి యాచన నెపంతో బలిచక్రవర్తి సర్వసంపదలను హరించాడు. బలిని కేవలం శరీరమాత్రావశిష్టుణ్ణి చేశాడు. వారుణ పాశాలతో బంధించి చివరకు వదలిపెట్టినపుడు బలిచక్రవర్తి ఈ విధంగా అన్నాడు-

సీ. పరమేశ్వరునకు నెప్పటి పదార్థములందు దృష్ణ లేకుండుట దెలిసినాఁడ
నింద్రాదులెల్ల నుపేంద్రునిఁ బ్రార్థించి యడిగిరి గాని శ్రీహరికిఁ గోరి
కలు లేవు; మిక్కిలి గంభీరమగు మహాకాలస్వభావంబు గలుగుచుండు
నరయఁగ మన్వంత రాధిపత్యమును లోకత్రయంబును నెంత గానఁ దలఁప

ఆ. మత్పితామహుండు మానవంతుండు ప్ర, హ్లాదవిభునిఁ జూచి హర్షమంది
యెద్దియైనఁ గోరు మిచ్చెద ననుటకు, నంతలోన నీశ్వరాజ్ఞఁ దెలిసి. 114

* భగవంతునికి ఎటువంటి పదార్థాలపైనా కాంక్ష లేదని నాకు తెలుసు. ఇంద్రుడు మొదలయిన దేవతలు ఉపేంద్రుని ప్రార్థించడం వల్ల ఆ స్వామివచ్చి నన్ను యాచించాడు. అంతేకాని అసలు శ్రీహరికి కోరికలనేవి లేవు. అదే గంభీరమైన ఆయన స్వభావం. దృష్టి ఉన్న వారికి మన్వంతరాధిపత్య మెంత? త్రిలోకాధిపత్య మెంత! మా పితామహుడు ప్రహ్లాదుడు అభిమానవంతుడు నరసింహావతారంలో ఆ స్వామి ఎంతో సంతోషంతో మా తాతను చూచి ఏది అడిగితే అది ఇస్తానని అన్నాడు. అప్పుడు మహానుభావుడైన ప్రహ్లాదుడు ఈశ్వరాజ్ఞలోని అంతరార్థాన్ని తెలుసుకొన్నాడు.

వ. ఇట్లకుతోభయంబు, పిత్ర్యంబయిన రాజ్యంబు నొల్లక పరమేశ్వరు దాస్యంబ కోరె, నా ప్రహ్లాద చరిత్ర కథనావసరమ్మున నీ తండ్రికిని నీకును విశేషంబుగానే పురుషుండు భగవదనుగ్రహంబుఁ బొంద నోపు

**నని పుండరీకాక్షుం డానతిచ్చిన వాక్యంబులు వక్ష్యమాణగ్రంథంబున విస్తరించెద! నా బలిచక్రవర్తి గృహద్వారంబున నఖిల లోకగురుండైన శ్రీమన్నారాయణుండు గదా పాణియును నిజజనాను కంపితుండును శంఖచక్రాద్యాయుధ ధరుండును నగుచు నిప్పుడును దేజరిల్లుచుండు; నట్టి బలిద్వారంబున లోకంబుల గెలువ నిచ్చగొన్న దశగ్రీవుం డుల్లంఘిత శాసనుండై ప్రవేశంబు గావింప నయ్యాదిపురుషుండు దన పాదాంగుష్ఠంబున యోజనాయుతాయుతంబులం బాఱఁజిమ్మె, వినుము.115**

* అందువలన ఆయన ఎవరివల్లా భయములేని తన తండ్రి రాజ్యం కావాలని కోరలేదు. పరమేశ్వరుని దాస్యాన్నే కోరాడు. అప్పుడు "నీ తండ్రికంటే నీకంటే విశేషంగా ఏ పురుషుడు భగవదనుగ్రహం పొందగలుగుతాడు?" అంటూ ఆ పుండరీకాక్షుడు పలికిన పలుకుల సారాన్ని తరువాతి భాగంలో (సప్తమస్కంధంలో) విస్తరించి చెబుతాను. సకల జగద్గురుడైన శ్రీమన్నారాయణుడు తనవారిపట్ల దయ కలిగినవాడై శంఖం, చక్రం మొదలయిన ఆయుధాలతో గదను ధరించి ఆ బలిచక్రవర్తి గృహద్వారంలో ఇప్పటికి కూడా కాపలా కాస్తున్నాడు. అటువంటి బలిచక్రవర్తి ఉండే సుతలలోకాన్ని జయించాలనే వాంఛ గొన్న రావణుడు అనుజ్ఞలేకుండా సుతలంలోనికి ప్రవేశించినపుడు ఆ శ్రీమన్నారాయణుడు తన కాలిబొటన వ్రేలితో లంకేశ్వరుణ్ణి పదికోట్ల యోజనాల దూరంలో పడేటట్లు చిమ్మివేశాడు.

**క. ఆ సుతలమునకుఁ గ్రిందై, భాసిల్లుఁ దలాతలంబు; ప్రభువందు మయుం**
**డాసురపుర నిర్మాతగ, వాసిగఁ బొగడంది యేలు వసుధాధీశా! 116**

* ఆ సుతలానికి క్రింది భాగంలో తలాతలం ఉంది. ఆ తలాతలానికి మయుడు ప్రభువు. రాక్షసుల పట్టణాల నిర్మించిన మహాశిల్పిగా ప్రసిద్ధుడయిన మయుడు తలాతలాన్ని పాలిస్తుంటాడు.

**చ. పురహరుచే రమేశ్వరుఁడు భూతహితార్థముగాఁ బురత్రయం**
**బరుదుగ నీఱుసేసె; శరణాగతు నా మయుఁ గాంచి యెంతయుం**
**గరుణఁ దలాతలంబునకుఁ గర్తఁగ నిల్పిన నున్నవాఁడు శ్రీ**
**ధరుని సుదర్శనంబునకుఁ దప్పి విముక్తభయుండుఁగాఁ దగన్. 117**

* శ్రీమహావిష్ణువు ముల్లోకాలకు హితం కలిగించడం కోసం శివుని చేత త్రిపురాలను బూడిద చేయించాడు. అప్పుడు మయుడు విష్ణువును శరణుపొందాడు. శ్రీహరి మయుణ్ణి కనికరించి తలాతలానికి రాజుగా చేశాడు. అతనికి విష్ణుదేవుని సుదర్శన చక్రం వల్ల తప్ప మరిదేని వల్లనూ మరణభయం లేదు.

**క. తలఁపఁగ నా క్రింద మహా, తలమునఁ గద్రువవధూటి తనయులు సర్పం**
**బులు గలవు పెక్కు శిరములు, నలరంగాఁ గ్రోధవశగణావళి యనఁగన్. 118**

* తలాతలానికి క్రింద మహాతలం ఉంది. ఆ మహాతలంలో కద్రువ కొడుకులయిన సర్పరాజులు ఉన్నారు. వారికి ఒక్కొక్కరికి పెక్కు పడగ లున్నాయి. ఆ సర్పగణం కోపోద్రేకంతో ప్రవర్తిస్తుంటారు.

**వ. మఱియును గుహక తక్షక కాళియ సుషేణాది ప్రధాను లయినవార లతులశరీరంబులు గలిగి యాదిపురుషుని వాహనంబైన పతగరాజభయంబున ననవరతంబు నుద్వేజితు లగుచు స్వకళ**

**త్రాపత్య సుహృద్బాంధవ సమేతు లయి యుండుదు; రా క్రింద రసాతలంబున దైత్యులు దానవులు నగు నివాతకవచ కాలకేయులను హిరణ్యపుర నివాసులగు దేవతాశత్రువులు మహాసాహసులును దేజోఽధికులును నగుచు సకల లోకాధీశ్వరుండైన శ్రీహరితేజంబునం బ్రతిహతులై వల్మీకంబులందు నడంగియున్న సర్పంబుల చందంబున నింద్రదూతి యగు సరమచేఁ జెప్పఁబడెడు మంత్రాత్మక వాక్యంబులకు భయంబు నొందు చుండుదురు. 119**

* ఆ మహాతలంలో కుహకుడు, తక్షకుడు, కాళియుడు, సుషేణుడు మొదలయిన సర్ప ముఖ్యులున్నారు. సాటిలేని మేటిరూపం కలవారు. ఆదిపురుషుడయిన నారాయణుని వాహనమయిన గరుత్మంతుని భయంవల్ల కలవరపడుతూ ఎల్లప్పుడూ భార్యలతో, బిడ్డలతో, మిత్రులతో బాంధవులతో కలసి ఉంటారు.

మహా తలం కింద రసాతలం ఉన్నది. ఆ రసాతలంలో దైత్యులు, దానవులూ అయిన 'హిరణ్యపురవాసులు, నివాతకవచులు, కాలకేయులు అనేవారు నివాసం చేస్తుంటారు. వారు దేవతలపట్ల శత్రుత్వం వహించి ఉంటారు. మహాసాహసవంతులు. తేజస్సు కలవారు. అయినా అన్ని లోకాలకూ ప్రభువైన శ్రీహరి తేజస్సుకు లొంగిపోయినవారై పుట్టలలో దాగిన సర్పాలమాదిరిగా భయంతో బతుకుతుంటారు. ఇంద్రుని దూతి అయిన సరమ ఉచ్చరించే మంత్రాలకు బద్ధులై దిగులుగా జీవిస్తారు.

**క. ఇందుకులోద్భవ! వినుమా, క్రిందటి పాతాళమునను గ్రీడించుచు నా**
**నందము నొందుచు నుండును, సందడిఁబడి నాగకులము చతురతతోడన్. 120**

* చంద్రవంశంలో పుట్టిన మహారాజా! విను, అన్నిటికన్నా దిగువ పాతాళలోకముంది. ఆ పాతాళలోకంలోని నాగజాతివారు ఎంతో తెలివిగలవారై ఎంతో ఉత్సాహంగా తిరుగుతుంటారు.

**వ. ఇట్లు వాసుకి ప్రముఖులైన శంఖ కుళిక మహాశంఖ శ్వేత ధనంజయ ధృతరాష్ట్ర శంఖచూడ కంబ ళాశ్వతర దేవదత్తాదు లయిన మహానాగంబు లై దాతేడు పదియు నూఱు వేయు శిరంబులు గలిగి ఫణామణికాంతులం జేసి పాతాళ తిమిరంబును బాపుచుండుదురు. 121**

* వాసుకి, శంఖుడు, కుళికుడు, మహాశంఖుడు, శ్వేతుడు, ధనంజయుడు, ధృతరాష్ట్రుడు. శంఖచూడుడు, కంబళుడు, అశ్వతరుడు, దేవదత్తుడు మొదలయినవారు పాతాళలోక వాసులైన మహానాగులు. వారిలో కొందరు ఐదు తలలవారు, కొందరు నూరుతలలవారు, వేయి తలలవారు కూడా ఉన్నారు. వారి పడగలమీద మణులు మెరుస్తుంటాయి. ఆ మణుల కాంతులు పాతాళంలోని చీకట్లను పారదోలుతుంటాయి.

**సీ. పాతాళలోకంబు పాఁతున శేషుండు వెలయంగ ముప్పది వేల యోజ**
**నంబుల వెడలుపునను దోఁకఁ జుట్టఁగాఁ జుట్టుకయుండు; విష్ణుని మహోగ్ర**
**మైన శరీరంబు; దానై యనంతాఖ్య సంకర్షణుం డుండు సంతతంబు,**
**నట్టి యనంత నామాభిధానుని మస్తకమున సిద్ధార్థంబు కరణి ధరణి**

ఆ. యంత నా విభుండు నఖిలలోకంబుల, సంహరింపఁగోరి చండకోప
వశత సృజనఁ జేయు వరుస నేకాదశ రుద్రమూర్తు లనెడు రౌద్రమతుల. 122

పాతాళలోకం అడుగున ఆదిశేషుడు ఉన్నాడు. అతడు ముప్పది వేల యోజనాల వెడల్పున చుట్టచుట్టుకొని ఉంటాడు. విష్ణుదేవుని మహత్తర శరీరమైన ఆ ఆదిశేషునికే అనంతుడు, సంకర్షణుడు అని పేర్లు. అనంతుడని పేరు కలిగిన ఆదిశేషుని తలమీద ఆవగింజలాగున ఈ భూమండలం ఉన్నది. ప్రళయకాలంలో లోకాలను సంహరించే నిమిత్తం ఈ ఆదిశేషుడు ప్రచండమయిన కోపంతో పదునొకండు మంది రుద్రులను సృష్టిస్తాడు.

ఆ. అట్టి రుద్రమూర్తు లతులత్రినేత్రులు, నఖిలశూల హస్తు లగుచు నుందు;
రందు నున్న ఫణికులాధిపుల్ శేషుని, పాదపంకజముల భక్తిఁ జేరి. 123

* ఆరుద్రమూర్తులందరూ మూడు కన్నులు కలవారు, అందరూ త్రిశూలధారులు. ఆలోకంలోని సర్పరాజులు ఆదిశేషుని పాదపద్మాలపై భక్తి కలిగి ఉంటారు.

ఆ. నమ్రు లగుచు ననుదినంబును మౌళి ర, త్నములచేతఁ గడు ముదంబు నొంది
కోరికలు దలిర్ప నీరాజనంబుల, నిచ్చుచుందు రెపుడు మచ్చికలను. 124

* ఆ సర్ప రాజులు ఆదిశేషునిపట్ల వినమ్రత కలవారై ప్రతిదినమూ తమ పడగలమీది రత్నాల కాంతులతో ఆయనకు నీరాజనాలు అర్పిస్తుంటారు.

వ. మఱియు నా సంకర్షణమూర్తిం జేరి నాగకన్యకలు కోరికలు గలవార లగుచు నొప్పెడి శరీర విలాసంబులంజేసి యగురు చందన కుంకుమ పంకంబు లను లేపనంబులు సేయుచు, సంకర్షణ మూర్తి దర్శన స్పర్శనాదుల నుద్బోధిత మకరధ్వజావేశిత చిత్తంబులు గలిగి చిఱునవ్వు లొలయ నధికాభిలాషం జేసి స్మితావలోకనంబుల సవ్రీడితలై యవలోకించుచుండ ననంత గుణంబులు గల యనంత దేవుం డుపసంహరింపఁ బడిన క్రోధంబు గలిగి లోకంబులకు క్షేమంబు గోరుచు సురాసుర సిద్ధ గంధర్వ విద్యాధర మునిగణంబు లనవరతంబు ధ్యానంబు సేయ సంతత సంతోషాతిశయంబున మ్రాఁగన్ను వెట్టుచు, సలలిత గీతావాద్యంబుల నానందంబు నొందుచుఁ, దన పరిజనంబుల నతి స్నేహంబున నవలోకించుచు, నవతులసీగంధ పుష్పరసామోదిత మధుకర వ్రాత మధుర గీతంబులు గల వైజయంతీ వనమాలికల ధరియించుచు నీలాంబరధరుండును, హలధరుండును నగుచు నితండు మహేంద్రుడొ హరుండొ యనుచు జనంబులు వలుకుచుండఁ గాంచనాంబరధరుండై ముముక్షువులు ధ్యానంబులు సేయ నధ్యాత్మ విద్యాయుక్తంబయిన యానంద హృదయ గ్రంథిని భేదించు నట్టి శేషుని స్వాయంభువుండగు నారదుండు తుంబురు ప్రభృతులగు ఋషి శ్రేష్ఠులతోఁ జేరుకొని కమలాసనుని సభాస్థానంబునందు నిట్లు స్తుతియించుచుండు. 125

* సంకర్షణమూర్తి అయిన ఆ ఆదిశేషుని దగ్గరికి తమ కోరికలు తీర్చుకోడానికి నాగకన్యకలు వస్తుంటారు. ఆయన సమక్షంలో తమ శరీరవిలాసాలు ప్రదర్శిస్తుంటారు. అగరు, చందనం, కుంకుమ

పువ్వు కలిపిన సుగంధలేపనాలతో ఆయనను అర్చిస్తారు. ఆ తరువాత ఆ అనంతుని ఆపురూపమయిన రూపాన్ని తనివితీరా చూడడం వల్లనూ, ఆ మూర్తిని తాకడం వల్లనూ, కామోద్రేకం కలిగినవారవుతారు. ఆ కారణంగా చిరునవ్వును చిందిస్తూ, సిగ్గు లొలకబోస్తు, క్రీగంటి చూపులు ప్రసరింపజేస్తూ ఆయనవంక చూస్తుంటారు. అప్పుడు అనంత గుణ సంపన్నుడైన అనంతుడు తన సహజ కోపాన్ని వదలిపెట్టి శాంతుడవుతాడు. లోకాలన్నింటికి క్షేమాన్ని కాంక్షిస్తాడు. దేవతలు, అసురులు, సిద్ధులు, గంధర్వులు, విద్యాధరులు, మునులు అనంతుని సదా ధ్యానం చేస్తుంటారు. అపుడు అనంతుడు సంతోషంతో అరగన్ను మోడ్పులతో, లలితగీతాలతో కూడిన మనోహరమైన వాద్యధ్వనులకు ఆనందిస్తుంటాడు. తన పరిజనాన్ని ప్రీతితో కటాక్షిస్తుంటాడు. వైజయంతీ వనమాలికలను ధరిస్తుంటాడు. ఆ మాలికలు అపుడే కూర్చిన తులసీ మంజరులతో కూడినవై ఉంటాయి. ఆ మంజరుల మకరంద సుగంధాలకు క్రమ్ముకొన్న తుమ్మెదలు జుంజుమ్మని పాటలు పాడుతుంటాయి. అతడెప్పుడూ నల్లని వస్త్రాలు ధరించి నాగేటిని ఆయుధంగా పట్టుకుని ఉంటాడు. అతణ్ణి మహేంద్రుడో, శివుడో అని జనులు భావిస్తుంటారు. ఆ శేషుడు మోక్షార్థులై తనను ధ్యానించే వారి హృదయ గ్రంథిని తొలగించి అధ్యాత్మవిద్యతో కూడిన ఆనందాన్ని కలిగిస్తాడు. అందువల్లనే ముక్తిని కోరేవారు అనంతుని భక్తితో ఆరాధిస్తుంటారు.ఇన్ని మహిమలు కలిగినవాడు కావడం వల్లనే బ్రహ్మమానసపుత్రుడైన నారదుడు, తుంబురుడు మొదలైన ఋషి పుంగవులతో కూడి బ్రహ్మదేవుని పేరోలగంలో అనంతుణ్ణి ఈ విధంగా స్తుతిస్తుంటాడు.

**సీ.** **ఓలిమై నెవ్వని లీలా వినోదముల్ జన్మ సంరక్షణ క్షయములకును**
**హేతువు లగుచుండు, నెవ్వని చూపుల జనియించె సత్త్వరజస్తమంబు,**
**లెవ్వని రూపంబు లేకమై బహువిధంబులను జగత్తులఁ బ్రోచుచుండు,**
**నెవ్వని నామంబు లెఱుగఁక తలఁచిన యంతన దురితంబు లడఁగుచుండు**

**తే.** **నట్టి సంకర్షణాఖ్యుండు నవ్యయుండు, నైన శేషుని వినుతి సేయంగఁ దరమె?**
**తలఁప నెప్పుడు వాఙ్మనంబులకు నింక, మూఁడు లోకంబులందును భూతతతికి.** 126

* "ఎవని లీలావినోదాలు సృష్టిస్థితి సంహారాలకు హేతువు లవుతాయో, ఎవని చూపులవల్ల సత్త్వరజస్తమో గుణాలు పుట్టాయో, ఎవని రూపం లోకాలను అనేక విధాలుగా కాపాడుతుంటుందో, ఎవరి పేరును తెలియక పలికినా పాపాలు పటాపంచలవుతాయో, అటువంటి సంకర్షణుడూ, అవ్యయుడూ అయిన ఆదిశేషుని పొగడడం ఎవరికీ సాధ్యంకాని పని. ఆ అనంతుడు వాక్కుకూ, మనస్సుకూ అందనివాడు. ముల్లోకాల వారికి అంతు చిక్కని వాడు.''

**ఆ.** **మఱియుఁ బెక్కు గతుల మాబోఁటి వారలఁ, బ్రోవఁ దలఁచి శేషమూర్తి సాత్త్వి**
**క స్వభావ మొందెఁ గడఁకతో నట్టి శే, షునకు మ్రొక్కుచుందు ననుదినంబు.** 127

* "మావంటి వారిని కాపాడడంకోసం ఆ ఆదిశేషుడు సాత్త్విక స్వరూపుడయి ఉన్నాడు. అటువంటి అనంతునికి ప్రతి దినమూ నమస్కరిస్తాము.

వ. మఱియు నా శేషుని నెవ్వండేని నాకస్మికంబుగ నయినను నార్తుండగుచు నయినను స్మరించిన మాత్రాన యఖిలపాపంబులం బాసి సకల శ్రేయస్సులం బొందు, నట్టి శేషుని నే ముముక్షువు లాశ్రయించి ధ్యానం బొనర్చి భవబంధ నిర్ముక్తు లగుదు, రతని ఫణంబుల యందు భూగోళం బణుమాత్రం బగుచు నుండు; నతని మహామహిమలు గణుతింప సహస్ర జిహ్వలు గల పురుషుండైన నోపండని పలుకుచుందు; రా యనంతుండు పాతాళంబున నుండి సకలలోకహితార్థంబు భూమిని ధరియించునని లోకతిర్యఙ్మనుష్య గతులను లోకస్థితియును శుకయోగీంద్రుండు వినిపించి యింకనేమి వినిపింతు నెఱింగింపు మనినం బరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రున కిట్లనియె. 128

* ఆ ఆదిశేషుణ్ణి ఎవరయినా సరే అకస్మాత్తుగా తలచుకొన్నా, బాధలలో చిక్కుకొని మొరపెట్టినా, అటువంటి వ్యక్తుల పాపాలను పోగొడతాడు. సకల శ్రేయస్సులూ ప్రసాదిస్తాడు. అందువలన ముక్తి కోరేవారు అనంతుని ఆశ్రయించి ధ్యానించి భవబంధాలకు దూరమవుతారు. అతని పడగలమీద భూగోళం అణుమాత్రంగా నిలిచి ఉంటుంది. ఆ అనంతుని మహిమలు లెక్కించడం వేయి నాలుకలున్న వానికి కూడ అలవిగాని పని.

ఆ అనంతుడు పాతాళంలో నివసిస్తూ అన్ని లోకాలకూ మేలు కోరువాడై భూమిని ధరిస్తాడు- అంటూ లోకాల స్వరూపాలు, జంతువుల స్వభావాలూ, మానవుల నైజాలనూ శుకుడు పరీక్షిత్తుకు విశదంగా బోధించి 'ఇంకా ఏమేమి వినదలచుకొన్నావో అడుగవలసిందని పలికాడు. అప్పుడు పరీక్షిన్నరేంద్రుడు శుకయోగీంద్రునితో ఈ విధంగా అన్నాడు.

క. మునివర! లోక చరిత్రం, బనుపమము మహావిచిత్ర మగునట్లుగ నా
కును వినిపించితి వంతయుఁ, బనుపడి నా చిత్తమందుఁ బాయక నిలిచెన్. 129

* మునీంద్రా! అతల వితలాది లోకాల స్వరూపాలను నా మనసులో నాటే విధంగా నీవు విశదీకరించావు. ఆ లోకాలన్నీ ఒక దానికొకటి సాటిలేనివి. పైగా చాల చిత్ర విచిత్రమైనవి.

వ. అనిన శుకయోగీంద్రుం డిట్లనియె. 130

* పరీక్షిత్తు ఈ విధంగా పలుకగా శుకమహర్షి మరల ఈలా అన్నాడు.

ఆ. జంతుజాలములకు శ్రద్ధలు త్రిగుణాత్మ, కములు గాన వారి కర్మ గతుల
తారతమ్యములును దగిలి యిన్నియు వివి, ధంబు లగుచు సంతతంబు నుండు. 131

* రాజా! ఈ లోకంలోని జీవులకు సత్త్వ రజస్తమో గుణాలను అనుసరించి శ్రద్ధలు వేరువేరుగా ఉంటాయి. సాత్త్విక శ్రద్ధ, రాజస శ్రద్ధ, తామస శ్రద్ధ అనే వానికి అనుగుణంగా వారి కార్యకలాపాలు కూడా వివిధంగా ఉంటాయి. ఈ తారతమ్యాలు ఎల్లప్పుడూ ఉంటూనే ఉంటాయి.

వ. నరేంద్రా! ప్రతిషిద్ధలక్షణంబగు నధర్మం బాచరించు నరుని శ్రద్ధ విపరీతంబుగాఁ బ్రవర్తిల్లు నట్టి వానికిఁ గలిగెడి కర్మఫలంబును విపరీతంబుగానె యుండుం గావున ననాద్యవిద్యాకామ ప్రవర్తనల

వలనఁ బెక్కు తెఱంగులఁ గలిగెడి కర్మగతుల సంగ్రహంబుగ నెఱింగించెద ననిన శుకునితోఁ బరీక్షిన్నరేంద్రుం డిట్లనియె. 132

* నరేంద్రా! 'ఇది తగదు అని చెప్పడం' ప్రతిషిద్ధం. తగదని చెప్పిన పనులను చేయడం అధర్మం. అటువంటి ప్రతిషిద్ధ లక్షణమైన అధర్మాన్ని ఆచరించే మానవుని శ్రద్ధ విపరీతంగా ఉంటుంది. శ్రద్ధయే భిన్నంగా ఉండడంవల్ల కర్మఫలాలు కూడా భిన్నంగానే ఉంటాయి. అందు వల్ల అనాదికాలం నుంచీ ఉన్నవీ, అజ్ఞానంవల్ల ఏర్పడేవీ, స్వేచ్ఛా ప్రవర్తనవల్ల కలిగేవీ అయిన నానావిధ కర్మగతులనూ సంగ్రహంగా చెబుతాను విను, అనగానే పరీక్షిత్తు శుకునితో ఈ విధంగా అన్నాడు.

ఆ. మునివరేణ్య! నరకములు ముజ్జగంబుల, యందొ యంతరాళమందొ వెలినొ
యదియుఁ గాక దేశమందుండు భూవిశే, షముల యందొ తెలుపు సంతసమున. 133

* "మునులలో శ్రేష్ఠుడవయిన శుకయోగీంద్రా! నరకాలు ఉన్నాయని అంటారు. అవి ఎక్కడ ఉన్నాయి? ముల్లోకాలలోనా? లేక రెండు లోకాల నడుమనా? ఈ రెండు గాక వెలుపల వేరే ప్రదేశంలోనా? ఎక్కడ ఉన్నాయి? నరకాలకంటూ ప్రత్యేకంగా ఏవైనా లోకాలు ఉన్నాయా? నాకు వివరించి చెప్పు. వినాలని చాలా కుతూహల పడుతున్నాను."

వ. అనిన శుకయోగీంద్రుం డిట్లనియె. 134

* పరీక్షిత్తు కోరికను విన్న శుకుడు నరకాల స్వరూపాల్ని విశదం చేయడానికి ప్రారంభించాడు.

## -: శుకయోగి పరీక్షిత్తునకుఁ దెలిపెడి నరకలోక వర్ణనము :-

క. ఎడతెగక ముజ్జగంబుల, కడపల నయ్యామ్యదిశను గదలక నిలుచుం
గడు ఘోరములుగ నరకము, లడరంగా నంతరాళమందుల నధిపా! 135

* ఓ రాజా! విను ముల్లోకాలకు ఆవల, దక్షిణ దిక్కులో, భూమ్యాకాశాల నడుమ మహాభయంకర మయిన నరకాలు ఏర్పడి ఉన్నాయి.

వ. మఱియును దక్షిణంబున నగ్నిష్వాత్తాది పితృగణంబులు దమ గోత్రజులకు మేలు గలుగుట కొఱకు సత్యంబులగు నాశీర్వాదంబులు నొసంగుచుండుదు; రచ్చటి పితృపతియగు శమనుండు దన లోకంబునకుం జనుదెంచు జంతువుల కర్మంబులకుం దగిన ఫలంబుల నిచ్చి శిక్షించుచు నుండు; నందుఁ దామిస్రంబును నంధతామిస్రంబును రౌరవంబును మహారౌరవంబును గుంభీ పాకంబును గాలసూత్రంబును నసిపత్రవనంబును సూకరముఖంబును నంధకూపంబును గ్రిమి భోజనంబును సందంశంబును దప్తోర్మియు వజ్రకంటకశాల్మలియు వైతరణియుఁ బూయో దంబును బ్రాణరోధంబును విశసనంబును లాలాభక్షణంబును సారమేయాదరంబును నవీచిర యంబును రేతః పానంబును నను నేకవింశతి మహా నరకంబులును, మఱియును క్షారకర్దమంబును రక్షోగణ

**భోజనంబును శూలప్రోతంబును దందశూకంబును నవట నిరోధనంబును నపర్యావర్తనంబును సూచీముఖంబు నన సప్త విధ నరకంబుల తోడఁ గూడి యష్టావింశతి నరకంబులు గల వని కొందఱు నొడువుదు, రందు. 136**

* అంతేగాకుండా దక్షిణంలోనే ఉన్న అగ్నిష్వాత్తులు మొదలయిన పితృదేవతలుకూడా తమ తమ గోత్రాలలో పుట్టిన వారికి శుభం కలగడం కోసం సత్యమైన దీవెన లిస్తుంటారు. అక్కడ పితృపతి అయిన యముడుకూడా తనలోకం చేరుకొనే జీవులకు జీవితకాలంలో వారు వారు చేసిన కర్మలకు తగినట్టు ఫలం ప్రసాదిస్తూ శిక్షిస్తుంటాడు. ఆ యమలోకంలో తామిస్రం అంధతామిస్రం, రౌరవం, మహారౌరవం, కుంభీపాకం, కాలసూత్రం, అసిపత్రవనం, సూకరముఖం, అంధకూపం, క్రిమిభోజనం, సందంశం, తప్తోర్మి, వజ్రకంటకశాల్మలి, వైతరణి, పూయోదం, ప్రాణరోధం, విశసనం, లాలాభక్షణం, సారమేయోదనం, అవీచిరయం, రేతఃపానం అనే ఇరవై యొక్క నరకాలున్నాయి. అవేగాకుండా క్షారకర్దమం, రక్షోగణభోజనం, శూలప్రోతం, దందశూకం, అవటనిరోధనం, అపర్యావర్తనం, సూచీముఖం అనే మరి ఏడునరకాలున్నాయి. వెరసి దక్షిణంలో ఇరవై ఎనిమిది నరకాలున్నాయని కొందరు చెబుతారు.

**క. పరపుత్త్ర కళత్రంబులఁ బరికింపక యపహసించు పాపాత్ముఁడు దు**
**ష్కరపాశ బద్ధుఁడై యమ, పురుషులచే నధిక బాధఁ బొందుచు నుండున్. 137**

* ఇతరుల బిడ్డలూ, భార్యలూ అనే ఆదరభావం ఏ మాత్రం లేకుండా అకారణంగా వారిని అపహసించే పాపాత్ముణ్ణి యమకింకరులు తాళ్లతో బంధించి పరిపరివిధాలుగా బాధిస్తారు.

**వ. మఱియు నవ్విధంబున బాధితుం డగుచుఁ దామిస్ర నరకంబునంబడి యనశనాద్రిపాతన దండతాడన తర్జనాది బాధలం జెంది కడు భయంబున మూర్ఛలం బొందుచుండు. 138**

* అంతేగాకుండా వారిని 'తామిస్ర'మనే నరకంలో పడవేస్తారు. అన్నం పెట్టక, కొండపై నుండి దొరలిస్తూ, కర్రతో చావమోదుతూ, బెదరిస్తూ యమకింకరులు నానావిధాలుగా శిక్షిస్తారు. ఆ బాధలకు తాళ లేక జీవులు భయకంపితులై మూర్ఛ పోతుంటారు.

**క. పరకాంత నెవ్వఁడేనిం, బురుషుం డుండంగ మొఱఁగి పొందిన యమ కిం**
**కరు లతనిఁ బట్టి వడిఁ ద, త్తరమునఁ బడవైతు రంధ్రతామిస్రమునన్. 139**

* మగడు ఉండగానే అతణ్ణి మోసగించి అతని ఇల్లాలిని కామించి అనుభవించిన వాణ్ణి పట్టుకొని యమకింకరులు సంకోచం లేకుండా అతణ్ణి పట్టరాని కోపంతో "అంధతామిస్రం" అనే నరకంలో తోస్తారు.

**వ. నరేంద్రా! యెవ్వఁడేనిం గుటుంబ పోషణార్థంబు పరులకు ద్రోహంబు సేయు, నా నరుండు రౌరవ నరకంబునం బడు; నెవ్వం డిహలోకంబునందు స్వేచ్ఛా విహారంబున సంచరించుచుఁ బరోపద్రవ పరాఙ్ముఖంబు లయియుండు పశుపక్షి మృగాదుల బాధించు, నా యామృగంబులు రురురూపంబులఁ దాల్చి యట్టి పాపజనుల నానా విధ యాతనల బాధించుటం జేసి రౌరవ మహా రౌరవ నరకంబులం**

**బడు; నెవ్వండేని దేహపోషణార్థంబు మూషకాదుల బిలనిరోధంబు సేసి వధించు, నా నిష్కరుణుండైన పురుషుని గుంభీపాక నరకంబుల యందుఁ గల తప్త తైలంబులం బెక్కు బాధలం బొందింతురు140.**

* ఓ రాజా! ఎవరయితే తన కుటుంబపోషణకోసం ఇతరులకు ద్రోహం చేస్తారో అటువంటి వారు రౌరవ నరకంలో పడతారు. ఎవరయితే ఈ లోకంలో ఇష్టం వచ్చినట్టు తిరుగుతూ, ఇతరులకు ఏ మాత్రం అపకారం తలపెట్టని పశుపక్షి మృగాదులను బాధిస్తారో అటువంటి పాపాత్ములను ఆయా మృగాలు భయంకర రూపాలతో నానాబాధలు పెడతాయి. అటువంటివారు రౌరవ మహారౌరవ నరకంలో పడతారు. ఎవరయితే తమ కడుపు నింపుకోవడం కోసం ఎలుకల కన్నాలు మూసి వాటిని చంపుతారో అటువంటి నిర్దయులను కుంభీపాక నరకంలో పడవేసి హింసిస్తారు.

**సీ. తల్లిదండ్రులకును ధరణీ సురులకును నహితంబు సేసిన యట్టివాఁడు**
**కాలసూత్రం బను కడుఁదీవ్రనరకంబు నందును నందంద యయుత యోజ**
**నాయతపాత్రాదులందుల సూర్యుఁ డా మీఁద గ్రిందను వహ్ని మిగుల మండ**
**నత్యంత క్షుత్పిపాసాదులచేతను బాధితుం డగుచుండుఁ బాయ కెపుడుఁ**

**ఆ. బరువు వెట్టుచున్నఁ బడియున్న నిలిచినఁ, గదలకున్నఁ జాల నొదిఁగియున్న**
**బాధఁ బొందుచుండుఁ బశురోమముల లెక్క, వరుస నపరిమేయ వత్సరములు. 141**

* తల్లిదండ్రులకూ, బ్రాహ్మణులకూ కీడు తలపెట్టేవాడు 'కాలసూత్ర' మనే భయంకర నరకంలో పడతాడు. అక్కడ పదివేల యోజనాల పొడవుగల లోహపాత్రలమీద అతణ్ణి నడిపిస్తారు. పైన ఎండ మండిపోతుంటుంది. కింద మంటలు భగభగ మండుతుంటాయి. ఆ పాత్రల మీద పరుగెత్తుతూ పడుతూ లేస్తూ నిలబడుతూ పక్కకు తప్పుకుంటూ ఆకలితో దప్పికతో అలమటిస్తుంటాడు. ఆవు ఒంటిమీద ఎన్ని రోమాలున్నయో అన్ని సంవత్సరాలు అక్కడ యమకింకరులు వాణ్ణి బాధిస్తారు.

**వ. మఱియు వేదమార్గంబు విడిచి పాషండమార్గంబు లాచరించు పురుషుని నసిపత్రవనంబునందు యమకింకరులు తఱట్ల నడచుచుఁ బరిహసించుచుం దోలు నెడ యసిపత్త్రంబు లిరుగెలంకుల శరీరంబుం ద్రెంచుచుండ నడుగడుగున బిట్టు మొఱవెట్టుచుండ బాధించుచుండుదురు. 142**

* వేదమార్గాన్ని వదలిపెట్టి పాషండమార్గం అవలంబించే పురుషుణ్ణి "అసిపత్రవన' మనే నరకంలో పడవేస్తారు. అక్కడ కత్తుల చెట్ల నడుమ ఇరుపక్కల కత్తుల వంటి చెట్ల ఆకులు తగిలి శరీరభాగాలు తెగిపోతుంటాయి. అపు డా జీవుడు అడుగడుగునా మొరపెడుతున్నా వినకుండా యమకింకరులు వాణ్ణి వేధిస్తుంటారు.

**క. దండింపఁ దగని వారల, దండించిన విప్రవరుల తనువులు ముట్టం**
**దండించిన దుర్మతులం, దండింతురు కాలసూత్ర నరకము లందున్. 143**

* దండించ తగని సాధువులను దండించి, బ్రాహ్మణ శ్రేష్ఠులను శారీరకంగా హింసించినా అటువంటి దుర్మార్గుణ్ణి 'కాలసూత్ర నరకం' లో పడవేసి కఠినంగా దండిస్తారు.

ఆ. మఱియు నట్టి దుష్టమానవుఁ గింకరుల్, విఱిచి చెఱకుఁగోల విఱచినట్లు
బాధపెట్టుచుండఁ బడి మూర్ఛఁ జెందుచు, మొఱలు వెట్టుచుండు భూపవర్య! 144

* అక్కడ ఆ దుర్మార్గుణ్ణి పట్టుకొని యమభటులు చెరకుగడ విరిచినట్టుగా నడిమికి విరిచి హింస పెడుతుంటే వాడు అరుస్తూ, ఆక్రోశిస్తూ మూర్ఛపోతూ మొరపెడుతూ ఉంటాడు.

వ. నరేంద్రా! యెవ్వండేని నీశ్వరకల్పితవృత్తి గల జంతువుల హింసించు నట్టివాని నంధకూపంబను నరకంబునఁ బడవైచిన నందు నతండు దొల్లి తాను జేసిన భూత ద్రోహంబున నచ్చట వివిధక్రూర పక్షి మృగ పశు సర్ప మశక మత్కుణ మక్షికాదుల చేత హింసం బొందుచు, మహాంధకారంబునందు నిద్రానుభవసుఖ లేశంబును లేక కుశరీరంబు నందుల జీవుండునుంబోలె మృతప్రాయుండై యుండు; నంత. 145

* నరేంద్రా! విధి నియమించిన విధంగా తమ బతుకు తాము గడుపుతున్న జంతువులను హింసించేవాణ్ణి అంధకూప నరకంలో పడతోస్తారు. అక్కడ తాము చేసిన ద్రోహం కారణంగా ఆ నరక కూపంలో దొర్లుతూ ఏ జీవుల నయితే తాను బాధించాడో క్రూరములయిన ఆ పక్షులు, మృగాలూ, పశువులూ, పాములూ, దోమలూ, నల్లులూ, ఈగలూ వాణ్ణి పీక్కుతింటాయి. కటిక చీకటిలో నిదురకు నోచుకోక తిండికి మొగం వాచి, కుత్సిత శరీరంలోని జీవునిలాగా సగం చచ్చిపడి ఉంటాడు.

క. తన కలిమి నెవ్వఁడేనియుఁ, దన బాంధవవరులఁగూడి తగఁ గుడువక తా
నును వాయసంబు భక్షిం, చిన మాడ్కిం దిన్నవాఁడు శీఘ్రమె యచటన్. 146

క. క్రిమిభోజన మనియెడి నర, కమునం బడి క్రిములె కూడుగాఁ గుడుచుచుఁ దాఁ
గ్రిమి యగుచు లక్షపరిమా, ణము గల క్రిమికుండ మందు నాటుక యుండున్. 147

* రాజా! తాను కూడ బెట్టిన సంపదలో ఏ కొంచెం కూడా తనవారికి పెట్టకుండా, తా నొక్కడే కాకిలాగా భక్షించినవాణ్ణి "క్రిమిభోజన" మనే నరకంలో తోస్తారు. అక్కడ వాడు పురుగై సుమారు లక్షయోజనాల విస్తీర్ణం కలిగిన పురుగుల గుంటలో కూరుకపోయి పురుగులను ఆహారంగా తింటూ ఉంటాడు.

వ. మఱియు నీ భూలోకంబున నెవ్వఁడేనియు నవిపన్నుండై చౌర్యవృత్తిచే బ్రాహ్మణాదుల హిరణ్య రత్నాది ద్రవ్యంబుల నపహరించు, నట్టి పురుషుని నగ్ని వర్ణంబులగు నయః పిండంబుల నగ్ని తప్తంబులగు శూలంబుల నతని శరీరంబునం దివియుచుండుదురు; మఱియును మదనాతురు లగుచు స్త్రీపురుషు లగమ్యాగమనంబులు సేసిరేని నట్టివారిని యమలోకంబున నతితీక్ష్ణ కశాతాడితులంజేసి యగ్నిమయంబు లయిన యుక్కు ప్రతిమల నాలింగనంబు సేయింతురు.148

* ఈ భూలోకంలో ఎవడయితే తనకు ఎటువంటి కష్టమూ లేక పోయినా దొంగతనంగా బ్రాహ్మణాదుల బంగారాన్నీ, రత్నాలనూ, విలువ అయిన వస్తువులనూ అపహరిస్తాడో అటువంటివాణ్ణి "అగ్నితప్త" నరకంలో

పడవేస్తారు. ఎఱ్ఱగా కాలిన ఇనుపచువ్వలు గుచ్చుతారు. మోహంతో కామంతో కళ్ళు కనబడక వావివరుసలు లేకుండా ప్రవర్తించిన స్త్రీ పురుషులను యమలోకంలో తీవ్రమయిన కొరడాలతో కొట్టి గనగన మండుతున్న ఉక్కుబొమ్మలను కౌగిలించుకోమని ఆజ్ఞాపిస్తారు.

**ఆ. సర్వజంతుజాల సంగమ మొందెడు, వానిఁ బట్టి కట్టి వజ్ర దంష్ట్ర**
**కముల గలుగునట్టి ఘనతర శాల్మలీ, తరువులందుఁ జేర్చి దంతు రెపుడు. 149**

* జంతువులతో సంగమం చేసినవాణ్ణి పట్టుకొని వజ్రాల మేకులు గల బూరుగుచెట్టుకు కట్టి చితుక కొడుతారు.

**ఆ. పార్థివేంద్ర! నరుఁడు పాషండదర్శనుఁ, డగుచు ధర్మమార్గ మడఁచెనేని**
**వాఁడు నరకమందు వైతరణీనది, నుడుగ కెపుడుఁ బొరలి పడుచునుండు. 15౦**

* ఓ రాజేంద్రా! ఎవడయితే పాషండమతంపట్ల ఆసక్తి పెంచుకొని ధర్మమార్గాన్ని పరిత్యజిస్తాడో అటువంటివాడు నరకలోకంలో వైతరణీ నదిలోపడి పొరలుతుంటాడు.

**వ. మఱియు నట్టి వైతరణీనది యందు జలగ్రాహంబులు దిగిచి భక్షింపం బ్రాణంబులు నిర్గమింపఁ దన పాపంబు లుచ్చరించుచు విణ్మూత్రపూయ శోణిత కేశ నఖాస్థి మేదోమాంస వసావాహిని యందుఁ దప్తుం డగుచు నుండు; విప్రుండు శూద్రకామినులం బొంది శౌచాచారంబులం బాసి గతలజ్జుండై పశువుంబోలెఁ జరియించెనేని నతండు నరకంబునుం బొంది యందుఁ బూయ విణ్మూత్రలాలాశ్లేష్మ పూర్ణార్ణవమందు ద్రొబ్బంబడి యతిబీభత్సితంబులగు నా ద్రవ్యంబుల భుజియించుచుండు. 151**

* ఆ వైతరిణీనదిలోని మొసళ్ళు పాషండమతంపట్ల మోజు పెంచుకొన్న వాణ్ణి పీక్కుతింటాయి. అటువంటి పాషండులు ప్రాణాలు పోతుంటే తాము చేసిన తప్పుల్ని తలచుకుంటూ మలమూత్రాలూ, చీమూ, నెత్తురు, వెంట్రుకలూ, గోళ్ళూ, ఎముకలూ, కొవ్వూ, మాంసమూ, కలిసిన ప్రవాహంలో మునుగుతూ తేలుతూ పడి కొట్టుకొంటుంటారు. ఎవడయితే బ్రాహ్మణుడై కూడా శుచిత్వం, సదాచారం వదలిపెట్టి సిగ్గు బిడియం లేకుండా శూద్రస్త్రీలతో పశువువలె ప్రవర్తిస్తాడో అటువంటివాడు నరక లోకంలో మలమూత్రాలు, లాలాజలం, కఫంతోకూడిన ప్రవాహంలో త్రోయబడి అసహ్యమయిన ఆ వస్తువులనే భుజించుతూ కాలం గడుపుతాడు.

**క. శునకములఁ బెంచి యెవ్వం, డనయంబును వేఁట సలిపి యాత్మార్థముగా**
**వనమృగములఁ జంపును నా, మనుజాధము నస్త్రములను మర్దింతు రొగిన్. 152**

* ఎవడయితే వేటకుక్కల్ని పెంచి ఎప్పుడు పడితే అపుడు వేటకు పోతూ మాంసం కోసం అడవిలోని మృగాలను హింసించుతాడో అటువంటి నీచుణ్ణి యమలోకంలో పదునైన ఆయుధాలతో నలగ పొడుస్తారు.

**ఆ. జృంభణమున నెవఁడు దంభార్థమై పశు, వులను జంపి జన్నములను జేయు**
**వానిఁబట్టి యమునివారలు గోయుచు, నుందు రెపుడు మిగుల సందడిలుచు. 153**

* ఎవడయితే డాబు దర్పంకోసం పశువులను చంపి ఆడంబరంగా యాగాలు నిర్వహిస్తాడో అటువంటి వాణ్ణి యమకింకరులు పొలికేకలు వేస్తూ రంపాలతో పరపర కోస్తుంటారు.

**వ. కామమోహితుండై యెవ్వండేనియుఁ దన భార్యచేత రేతఃపానంబు సేయించు నా పాపాత్ముని రేతోహ్రదంబునం ద్రోచి యా రేతంబునే పానంబు సేయించుదురు; రాజభటులైనను జోరులైనను ధనికుల గ్రామంబులపైఁ బడి యందు గృహదాహంబు సేయువారలను, విషాదుల వలన నన్యులఁ జంపెడు వారలను, వజ్ర దంష్ట్రలు గల వింశత్యుత్తర సప్త శతశునకంబు లెడతెగక తిగిచి భక్షించుచుండు. 154**

* ఎవడయితే కామంతో కళ్ళు మూసుకపోయి తన భార్య చేత రేతఃపానం చేయిస్తాడో ఆ పాపాత్ముణ్ణి రేతస్సుతో కూడిన మడుగులో త్రోసి ఆ రేతస్సునే వానిచేత త్రాగిస్తారు. రాజభటులయినా, దొంగలయినా గ్రామాలపై పడి ఇళ్లకు నిప్పు అంటించేవారినీ, మందుమాకు పెట్టి ఇతరుల్ని చంపేవారినీ వజ్రాల కోరలున్న ఏడువందల ఇరవై కుక్కలు ప్రతిదినమూ చుట్టుముట్టి పీక్కొని తింటాయి.

**సీ. లంచంబుఁ గొని సాక్షి వంచించి యనృతంబు పలికెడు పాపాత్ముఁ బట్టి కట్టి
యంత మానక వీచి యను నరకమునందు శతయోజనోన్నత శైల శిఖర
మునఁ దలక్రిందుగా నునిచి యధోముఖంబుగఁ బడద్రొబ్బిన బొబ్బలిడుచుఁ
గల్లోలములు లేని కమలాకరముఁబోలెఁ జదరమైయున్న పాషాణమందుఁ**

**తే. బడిన యంతన దేహంబు పగిలి పెక్కు, తునుకలై పాసి యది గూడికొనుచు నుండ
దండి యాకులతను బొందుచుండుఁగాని, చావు లేకుండు నా దుష్టజంతువునకు. 155**

* లంచం పుచ్చుకొని దొంగసాక్ష్యం చెప్పి ఎదుటివారిని మోసగించిన పాపాత్ముణ్ణి "వీచి" అనే నరకంలో పడవేస్తారు. అక్కడ వాణ్ణి పట్టుకొని బంధించి నూరు యోజనాల ఎత్తయిన కొండ శిఖరం నుండి తలకిందుగా క్రిందికి విసిరివేస్తారు. అపుడు వాడు పెడబొబ్బలు పెడుతూ అలలు లేని కొలనువలె నున్నగా నున్న చట్రాతి మీదపడి పోతాడు. అట్ల పడి శరీరం ముక్కలు ముక్కలై మరల అవి కలుసుకొంటుంటే చావురాక బ్రతుకలేక ఆకులపాటుతో అవస్థ పడుతుంటాడు

**ఆ. సోమయాజిభార్యఁ గామించి పొందిన, వానిఁ గపట మద్యపాన సోమ
పాన మనుదినంబుఁ బానంబు సేయు విట్, క్షత్రియులను బట్టి సంభ్రమమున. 156**

* సోమయాజి పెళ్లాన్ని కామించి అనుభవించినవాణ్ణీ, సోమపానమంటూ దొంగచాటుగా మద్యపానం చేసే వైశ్యులనూ, క్షత్రియులనూ, బ్రహ్మణులనూ వదలిపెట్టరు.

**ఆ. ఱొమ్ముఁ ద్రొక్కి మోము ఱిమ్మవట్టఁగ మోఁది, యనలముఖమునందు నగ్నివర్ణ
ముగను గాఁచి వక్త్రమున నిండఁగా నుక్కు, నీరు వోతు రేచి నిష్ఠురముగ. 157**

* అటువంటి వారిని యమదూతలు పట్టి బంధించి రొమ్ము త్రొక్కి పట్టి దిమ్మ తిరిగేటట్లు ముఖం మీద మొత్తుతూ, స్పృహ రాగానే ఎర్రగా సలసల కాచిన ఉక్కు నీటిని నోటినిండా పోస్తారు.

**వ. మఱియు నీచవర్ణుండు నిష్ఠ సలుపుచుం దపో దాన విద్యాచారంబులఁ బెద్దల కవమానంబు సేయువాఁడు క్షారకర్దమంబను నరకంబునందు నధోముఖుం డగుచు బాధలం బొందు; స్త్రీ పురుషులెవ్వరేని శరీర రక్షణార్థంబు పశువుల మానవుల బలి యిచ్చి రేని వారలను నిరయంబునందు యమకింకరులు సురియలం దునిమి తద్రక్తంబు పానంబు సేయుచుం బాఱాడుచుందురు; గ్రామారణ్యంబులయందు జంతువుల శూలప్రోతంబులఁ గావించి హింసించుచు హర్షించుచున్న వారలను శూలప్రోతంబను నరకంబునందు శూలప్రోతుల జేసిన క్షుత్పిపాసాపరు లగుచుండఁ గంకగృధ్రాదులు దీక్ష్ణతుండాగ్రంబులం దిగిచి భక్షించుచుండు; మఱియు ధూర్త స్వభావంబునం జంతుపీడనంబుఁ గావించెడు పాపాత్ముల దందశూకంబను నరకంబునందు నైవ నైదు నేడు ముఖంబుల సర్పంబులు గఱచుచుండు. 158**

* తక్కువ వర్ణంవాడు ఆడంబరంతో కూడిన నిష్ఠలతో తపస్సు, దానం, విద్య; ఆచార వ్యవహారాలతో అహంకరించి పెద్దలను అవమానించినట్లయితే అటువంటి వాణ్ణి 'క్షారకర్దమం' అనే నరకంలో తలకిందుగా వేలాడదీసి బాధలు పెడతారు.

ఆడవాళ్ళుగాని లేదా మగవాళ్ళు గాని తమ ప్రాణాలు కాపాడు కోవడానికి క్షుద్రదేవతకు జంతువులనూ, మనుష్యులనూ బలిఇస్తే అటువంటి దుర్మార్గులను యమకింకరులు చురకత్తులతో పొడిచి రక్తం తాగుతారు.

ఊళ్లలోనూ అడవులలోనూ ఉండే జంతువుల కడుపులలో శూలాలు గ్రుచ్చి హింసిస్తూ ఆ జంతువులు గిలగిల తన్నుకుని బాధ పడుతుంటే గంతులువేస్తూ సంతోషించేవారిని యమకింకరులు "శూలప్రోత" మనే నరకంలో త్రోసి శూలాలతో గ్రుచ్చుతారు. అక్కడివారు ఆకలిదప్పులతో నకనకలాడుతుంటే రాబందులూ, గ్రద్దలూ పదునైన ఉక్కుముక్కులతో వారి దేహాలను పొడుచుకొని తింటాయి.

ఇంతేకాక నిర్దాక్షిణ్యంగా నోరులేని జంతువులను పీడించే పాపాత్ములను "దందశూక" మనే నరకంలో పడవేస్తారు. అక్కడ ఐదు తలలూ, ఏడుతలలూ గల సర్పాలు వాళ్లను కరుస్తుంటాయి.

**ఆ. ఎనయ దొడ్లలోన నిండ్లలో నైనను, బశుపతంగ హరిణ పంక్తి నెల్లఁ**
**బట్టి హింససేయు పాపాత్ము విషవహ్ని, ధూమశిఖల ద్రొబ్బుదురు నృపాల! 159**

* నరేంద్రా! ఇళ్లలో గానీ, పెరళ్లలోగానీ తిరిగే పశువుల్నీ, పక్షుల్నీ లేళ్లనూ పట్టి హింసించే పాపాత్ములను విషంతోనూ, నిప్పుతోనూ, పొగల సెగలతోనూ నిండిన నరకాలలో విసిరివేస్తారు.

**క. తన యింటికి వచ్చిన మను, జుని నతిథిం గ్రోధదృష్టిఁ జూచినవానిం**
**గనుఁగవల వజ్రదంష్ట్రలఁ, దనరిన యా కంక గృధ్రతతి భక్షించున్. 160**

* తన ఇంటికి అతిథిగా అరుదెంచిన మానవుణ్ణి ఆదరించకుండా చీదరించుకొని కోపోద్రేకంతో చూచిన దుర్మార్గుల కన్నులను వజ్రాల కోరలు గల రాబందులూ గద్దలూ పొడుచుకొని తింటాయి.

**మ. ధనవంతుండగు మానవుండు గడఁకన్ ధర్మోపకారంబులన్**
**ఘనతం జేయక యుండెనేని యమలోకంబందు సూచీముఖం**
**బను నా దుర్గతిఁ బట్టి త్రోచి నిధికా పై యున్న భూతం బటం**
**చును బాశంబులఁ బట్టి కట్టి వడితో నొప్పింతు రత్యుగ్రులై. 161**

* రాజా! ధనరాసులున్న భాగ్యవంతుడు ధర్మకార్యాలు చేయకుండా ఇతరులకు ఏ మాత్రం ఉపకారం చేయకుండా ధనం కూడబెట్టడమే తన ధ్యేయంగా భావించినవాడు చనిపోతే వాణ్ణి యమభటులు "సూచీ ముఖ" మనే నరకంలో పడతోస్తారు. అక్కడ భయంకరులైన యమకింకరులు "డబ్బుకు కాపలా ఉన్న దయ్యమా" అంటూ వాణ్ణి పట్టి తాళ్లతో కట్టి నానాబాధలు పెడతారు.

**ఆ. నరవరేణ్య! యిట్టి నరకముల్ యమలోక, మందుఁ గలవు మఱి సహస్ర సంఖ్య,**
**లందు శమనదూత లనిశంబు బాధింతు రవని ధర్మదూరు లయిన నరుల. 162**

* నరవరేణ్యా! ఇటువంటి నరకాలు యమలోకంలో వేలసంఖ్యలో ఉన్నాయి. ఆ నరకాలలో యమదూతలు అధర్మపరులను ఎల్లప్పుడూ బాధిస్తుంటారు.

**ఆ. ధర్మవంతులెల్లఁ దప్పక స్వర్గంబునందు భోగసమితిఁ బొందుచుందు;**
**రెలమిఁ బుణ్యపాపముల శేషములవల్లఁ బుట్టుచుందు రవనిఁ బుణ్యచరిత. 163**

* పుణ్యచరితా! ధర్మపరులైన మానవులందరూ స్వర్గంలో సుఖ భోగాలు అనుభవిస్తారు. వారు వారు చేసుకొన్న పుణ్యపాపాలను బట్టి భూలోకంలో పుడుతూ ఉంటారు.

**వ. నరేంద్రా! మోక్షమార్గంబు మున్నె వినిపించితి; నిప్పుడు నీ కెఱింగించిన వెల్లను బ్రహ్మాండ కోశంబునం జతుర్దశ కోశంబులు గలవని పురాణంబులు పలుకుచుండు; నట్టి బ్రహ్మాండంబు శ్రీమన్నారాయణుని స్థూలశరీరం బగుటం జేసి బ్రహ్మాండం బెవ్వరు వర్ణింతు రెవ్వరు విందురు వారలకు సకల శ్రేయస్సులుం గలుగు; నీశ్వర స్థూలశరీరంబుఁ దెలిసినవారికి శ్రద్ధాభక్తులం జేసి సూక్ష్మదేహంబు నెఱుంగ వచ్చు; భూద్వీప వర్ష సరి దద్రి నభస్సముద్ర పాతాళ దిఙ్నరక తారాగణ లోకసంస్థితం బయిన సకల జీవనికాయ్యంబై యద్భుతంబైన శ్రీహరి స్థూలశరీర ప్రకారంబు వినిపించితిని. 164**

* ఓ రాజా! మోక్షమార్గం నీకు ముందే వినిపించాను. ఈ బ్రహ్మాండంలో పదునాల్గు లోకాలు ఉన్నాయని పురాణాలు చెబుతున్నాయి. అటువంటి బ్రహ్మాండం శ్రీమన్నారాయణుని స్థూల శరీరం. అందువల్ల బ్రహ్మాండ వర్ణన చేసేవారూ, అది విన్న వారూ అన్ని రకాల శుభాలను అనుభవిస్తారు. ఈశ్వరుని స్థూలశరీరం తెలిసిన వారికి శ్రద్ధ వల్లనయితేనేమి, భక్తి వల్ల నయితేనేమి భగవానుని సూక్ష్మరూపం తెలుసుకోవడానికి వీలుంది. భూగోళం అందలి సప్తద్వీపాలు, తొమ్మిది వర్షాలు, వాటిలోని నదులు, పర్వతాలు, ఆకాశం, సముద్రం, పాతాళం, దిక్కులు, నరకం, నక్షత్ర సముదాయం మొదలైన సకల జీవరాసులతోకూడి అత్యద్భుతమైన శ్రీమన్నారాయణుని స్థూలశరీర స్వరూపాన్ని నీకు వినిపించాను.

**చ. జలజభవాదిదేవ మునిసన్నుత తీర్థపదాంబుజాత! ని**
**ర్మల నవరత్న నూపురవిరాజిత! కౌస్తుభ భూషణాంగ! యు**

**జ్జ్వల తులసీ కురంగ మదవాసన వాసిత దివ్యదేహ! శ్రీ**
**నిలయ శరీర! కృష్ణ! ధరణీధర! భాను శశాంకలోచనా! 165**

* బ్రహ్మ మొదలయిన దేవతలూ, ఋషులూ స్తుతించేవి, పుణ్య తీర్థాలవలె పవిత్రమైనవీ అయిన పాదపద్మాలు కలవాడవూ, నవరత్నాలతో ప్రకాశించే కాలి అందెలు గలవాడవూ, కౌస్తుభమణిని భూషణంగా ధరించినవాడవూ, వెల్లివిరిసే తులసీదళాల పరిమళాలూ, కస్తూరీ సుగంధాలూ, గుబాళించే దివ్యదేహం కలవాడవూ, లక్ష్మీదేవికి నివాసమయిన వక్షఃస్థలం కలవాడవూ, భూభారాన్ని వహించేవాడవూ, సూర్యచంద్రులే కన్నులుగా కలవాడవూ అయిన శ్రీకృష్ణా! నీకు నమస్కారం.

**క. శ్రీ తరుణీ హృదయస్థిత!, పాతకహర! సర్వలోకపావన! భువనా**
**తీత గుణాశ్రయ! యతి వి, ఖ్యాత! సురార్చిత పదాబ్జ! కంసవిదారీ! 166**

* లక్ష్మీదేవి హృదయంలో నిత్యం నివసిస్తూ జీవుల పాపాలనూ హరిస్తూ, లోకా లన్నింటినీ పవిత్రం చేస్తూ, అలౌకిక గుణాలకు ఆశ్రయమయిన వాడవై, ప్రసిద్ధు లయిన దేవతలచే అర్చింపబడే పాదపద్మాలు కలవాడవై, కంసుణ్ణి సంహరించిన వాడవైన శ్రీకృష్ణా! నీకు నమస్కారం.

**మత్తకోకిలము.**

**దండితారిసమూహ! భక్తినిధాన! దానవిహార! మా**
**ర్తాండ మండల మధ్య సంస్థిత! తత్త్వరూప! గదాసి కో**
**దండ శంఖ సుదర్శనాంక! సుధాకరార్క సునేత్ర! భూ**
**మండలోద్ధరణార్త పోషణ! మత్తదైత్య నివారణా! 167**

* శత్రుబృందాలను రూపుమాపేవాడవూ, భక్తులపాలి పెన్నిధివీ, దానశీలుడవూ, సూర్య మండలం మధ్యలో ప్రకాశించుతున్న వాడవూ, సత్యస్వరూపుడవూ; గద, ఖడ్గం, ధనుస్సు, శంఖం, చక్రం అనే పంచాయుధాలు ధరించిన వాడవూ, సూర్యచంద్రులు కన్నులుగా కలిగిన వాడవూ, భూమండలాన్ని ఉద్ధరించిన వాడవూ, ఆర్తులను ఆదుకొనే వాడవూ, మదోన్మత్తులైన రాక్షసులను అణగద్రొక్కే వాడవూ అయిన శ్రీకృష్ణా! నీకు నమస్కారం.

గద్యము-ఇది శ్రీ సకల సుకవిజనానందకర బొప్పనామాత్యపుత్ర గంగనార్య ప్రణీతంబైన శ్రీమద్భాగవత **మహాపురాణంబునందు భరతాత్మజుండయిన సుమతికి రాజ్యాభిషేకంబును, బాషండ దర్శనంబును, సుమతి పుత్త్ర జన్మ విస్తారంబును, గయుని చరిత్రంబును, గయుని సంస్తుతియు, భూద్వీప వర్ష సరిదద్రి నభస్సముద్ర పాతాళ దిఙ్నరక తారకాగణ సంస్థితియు నను కథలు గల పంచమ స్కంధంబునందు ద్వితీయాశ్వాసము.**

* ఇది సకల సుకవులకూ ఎంతో సంతోషం కలిగించేవాడూ, బొప్పనామాత్యుని కుమారుడూ అయిన గంగనార్యుడు రచించిన శ్రీమహాభాగవత పురాణం పంచమ స్కంధంలో రెండవ ఆశ్వాసం.

ఈ ఆశ్వాసంలో భరతుని కుమారుడయిన సుమతి రాజ్యాభిషేకమూ, పాషండదర్శనమూ, సుమతి పుత్రుల జన్మమూ, గయుని చరిత్రమూ, గయుని సంకీర్తనమూ, భూగోళం, ద్వీపాలు, వర్షాలు, నదులు, కొండలు, ఆకాశం, సముద్రాలు, పాతాళాలు, నక్షత్రాలు- వీని స్థితులూ, నానావిధ నరకాల స్వరూపాలు మొదలైన వృత్తాంతాలు అభివర్ణింపబడ్డాయి.

**శ్రీ కృష్ణార్పణమస్తు**

## ప్రవేశిక

సహృదయపాఠకుల కరకమలాలను అలంకరించిన ఈ గ్రంథం ఆంధ్రమహాభాగవతంలోని షష్ఠస్కంధం. ఈ స్కంధాన్ని అనువదించిన కవి ఏర్చూరి సింగయగారు. వీరిది శ్రీవత్సగోత్రం. ఆపస్తంబసూత్రం. తల్లిపేరు ముమ్మడమ్మ, తండ్రిపేరు కసువయమంత్రి.

సింగయగారి నివాసస్థానం ఓరుగల్లు మండలంలో ఉన్న ఏర్చూరు. గ్రామ నామమే గృహనామంగా మారింది.

సింగయగారికి పోతన్న గారంటే వల్లమాలిన భక్తి. ఆయన కవిత్వమంటే ఎంతో ఇష్టం, ఎంతో గౌరవం. అందుకనే పోతన్న గారి భాగవతానికి సమగ్రత సమకూర్చటం కోసం షష్ఠస్కంధాన్ని అనువదించటానికి పూనుకొన్నారు.

పోతనగారివలెనే సింగయగారు కూడా గ్రంథారంభంలో ఇష్టదేవతా వందనమూ, కవిస్తుతీ, స్వప్నవృత్తాంతమూ, కవివంశవర్ణనమూ, షష్ఠ్యంతాలూ రచించారు. సంస్కృత కవీంద్రులనూ, నన్నయ తిక్కన ఎర్రనలనూ, భాస్కరుణ్ణీ, నాచనసోమనాథుణ్ణీ, శ్రీనాథుణ్ణీ ఒకే ఒక సీసపద్యంలో సంస్తుతించిన తర్వాత సింగయగారు బమ్మెరవారికోసం ప్రత్యేకంగా ఒక ఉత్పలమాలను కూర్చి సమర్పించి మ్రొక్కు చెల్లించారు. చిత్తగించండి-

**ఎమ్మెలు సెప్పనేల? జగమెన్నఁగఁ బన్నగరాజ శాయికిన్**<br>
**సొమ్ముగ వాక్యసంపదలు సూఱలు చేసినవాని భక్తిలో**<br>
**నమ్మినవాని భాగవత నైష్ఠికుఁడై తగువానిఁ బేర్మితో**<br>
**బమ్మెరపోతరాజు కవిపట్టపురాజుఁ దలంచి మ్రొక్కెదన్.** **(షష్ఠ. స్కం. 12)**

ఈ పద్యంలో పోతరాజుగారిని కవి పట్టపురాజుగా అభివర్ణించడమూ భాగవత నైష్ఠికునిగా పేర్కొనడమూ సింగయగారికి బమ్మెరవారి పట్లగల భక్తి ప్రపత్తులకు చక్కని నిదర్శనం.

పోతన్నగారు చెప్పుకున్నట్లే సింగయగారు తమ పూర్వులు శివభక్తియుక్తులనీ తాను "శివపూజందనరినవాఁడ"ననీ చెప్పుకున్నారు. పోతన్నగారికి శ్రీరామచంద్రుడు సాక్షాత్కరించినట్లే సింగయ్యగారికి స్వప్నంలో దేవవాణి సరస్వతీదేవి సాక్షాత్కరించింది - ఆ జగన్మాతను ఆయన ఇలా వర్ణించారు -

**ఉరవడి ప్రాగ్వీథి నుదయించి మార్తాండ కోటిబింబచ్ఛాయ గూడినట్లు**<br>
**హరి హర బ్రహ్మల యాత్మలలో నుబ్బి కరుణ యొక్కట మూర్తి బెరసినట్లు**<br>
**ఖరకర కర తీవ్ర గతినిఁ గరంగుచు హేమాద్రి సోగ పెల్లెగసినట్లు**<br>
**ఫణిరాజ ఫణరాజి మణిగణ విస్ఫూర్తి సుషిరంపు వెలిదల చూపినట్లు**

**ఉట్టిపడ్డట్లు కట్టెట్టి నూఁదినట్లు, తేజ మెసఁగంగ నా(మ్రోల దివ్యవాణి**

**పూని సాక్షాత్కరించి సంపూర్ణదృష్టిఁ, జూచి యిట్లని పలికె మంజులముగాను. (షష్ఠ. స్కం.17)**

పోతనగారు తమ తల్లిగారైన లక్కాంబ గుణగణాలను ఈ విధంగా వెల్లడించారు -

**నడవదు నిలయము వెలువడి, తడవదు పరపురుషుగుణముఁ దనపతి నుడువుం**

**గడవదు వితరణ కరుణలు, విడువదు లక్కాంబ విబుధ విసరము వొగడన్.**

సింగయ్యగారు కూడా తమ మాతృదేవి ఐన ముమ్మడమ్మను గూర్చి ఇటువంటి పద్యమే వ్రాశారు-

**ఆడదు భర్తమాట కెదురాడదు వచ్చినవారి వీడఁగా**

**నాడదు పెక్కుభాష లెడనాడదు వాకిలి వెళ్లి కల్ల మా**

**టాడదు మిన్నకేని సుగుణావళి కిందిరగాక సాటి యే**

**చేడియ లేదు చూరికులశేఖరు కస్వయముమ్మడమ్మకున్. (షష్ఠ. స్కం. 27)**

ఈ పద్యం నాలుగో పాదంలో చిన్నపేచీ ఉన్నది. వావిళ్లవారి ప్రతిలోనూ, వేమూరివారి ప్రతిలోనూ కూడా ఈ పద్యం ఈ విధంగానే ముద్రితమైనది.

ముమ్మడమ్మకు ఇందిరగాక సాటి ఏ చేడియ లేదు అని విడదీసి అర్థం చెప్పవచ్చుగాని తర్వాత ఉన్న "చూరికులశేఖరు" అన్నదానికి సరైన అర్థం కుదరదు. కొందరు పెద్దలు 'చూరి'ని 'సూరి'గా మార్చి 'సూరి కులశేఖరు' అని అర్థం చెబుతామన్నారు గాని అది సరసమూ సముచితమూ కాదు.

సాహిత్య అకాడమీ వారి ప్రతిలోకూడా పై పద్యం పై విధంగానే ముద్రించి అధోజ్ఞాపికలో "చేడియ లేరుచూరి కులశేఖరు" అని యుండనగును - అని సూచించారు. నిజానికి దే సరసమైన పాఠం.

ఇదంతా ' ఏరుచూరి' అన్నది సింగయ్యగారి ఇంటిపేరని గుర్తించక పోవడం వల్ల వచ్చిన గందరగోళం. సింగయ్యగారు తన ముత్తాత గారిని "ఏర్చూరిశాసను" డని స్పష్టంగా పేర్కొన్నారు.

'చేడియ' ఏకవచనం కనుక 'లేదు' అనే క్రియకూడా ఏకవచనం లోనే భ్రాంతి మూలకంగానో 'రు' 'దు' అక్షరాల రూపసాదృశ్యం వల్లనో, లేఖక ప్రమాదం వల్లనో అసంగతమైన పాఠం అన్ని ప్రతులలో చోటు చేసుకున్నది.

"చేడియ లేరుచూరికులశేఖరు కస్వయ ముమ్మడమ్మకున్"అన్నదే సరైన పాఠం. ఇందిరగాక సాటియే చేడియలు ఏరుచూరికులశేఖరు కస్వయ ముమ్మడమ్మకున్ - అని విడదీసి చెప్పుకుంటే పద్యం హృద్యంగా ఉంటుంది. అర్థం సుసంగత మౌతుంది.

పోతన్నగారి వలెనే సింగయకూడా భాగవతాన్ని అనువదించే సందర్భంలో తన వినయ వినమ్రతలను ప్రదర్శించాడు -

**"భాగవతము తెలిసి పలుకుట చిత్రంబు, శూలికైన తమ్మి చూలికైన**
**విబుధవరుల వలన విన్నంత కన్నంత, తెలియ వచ్చినంత తేటపఱుతు."** **(ప్రథ. స్కం.17)**

అన్న పోతన్నగారి పద్యానికి ప్రతిగా సింగయ్య ఇలా వ్రాశారు -

**భాగవతము తేటపఱుప నెవ్వఁడు సాలు, శుకుఁడు దక్క నరుని సఖుఁడు దక్క**
**బుద్ధిఁ దోఁచినంత బుధులచే విన్నంత, భక్తి నిగిడి నంత పలుకువాఁడ.** **(షష్ఠ.స్కం.23)**

సింగయ్య కవితాధార ధారాళంగా గంగాప్రవాహంలాగా సాగిపోతుందనటానికి ఈ క్రింది పద్యం మచ్చుతునుక -

**ఆడించున్ హరి దివ్యనాటక గుణవ్యాపార నృత్యంబులం**
**బాడించున్ జలజాతనేత్ర బిరుద ప్రఖ్యాత గీతంబులం**
**గూడించున్ సతతంబు జిహ్వాలతుదిన్ గోవిందనామావళుల్**
**క్రీడిం గిన్నర యక్ష కామినులచేఁ గృష్ణార్పిత స్వాంతుఁడై.** **(షష్ఠ. స్కం. 484)**

చిన్న చిన్న పదాలతో భావాన్ని ప్రస్ఫుటం చేయటంలో ఈయన అందెవేసిన చెయ్యి. వృత్రాసురుడు రణరంగంలో జబ్బచరచి బొబ్బపెట్టిన సందర్భాన్ని వర్ణించాడు చూడండి -

**కూడె జగంబు లన్నియును, గ్రుంకిరి సూర్య సుధాంశు, లద్రు లూ**
**టాడె, నభస్థలం బగిలె, నంబుధు లింకె, నుడుగ్రహాళి స**
**ట్టాడె, వడిందిశల్ వగిలె, నుర్వర గ్రుంగె. నజాండభాండ మ**
**ల్లాడె, విధాత బెగ్గడిలె నార్చుచు వృత్రుఁడు బొబ్బవెట్టినన్.** **(షష్ఠ. స్కం. 384)**

సంస్కృతమూలాన్ని ఉన్నది ఉన్నట్లుగా చక్కగా సరసంగా సింగయ తెనిగించడంలో కృతకృత్యుడైనా డనటంలో సందేహం లేదు -

**అజాత పక్షా ఇవ మాతరం ఖగాః, స్తన్యం యథా వత్సతరా క్షుధార్తాః,**
**ప్రియం ప్రియేవ వ్యుషితం విషణ్ణా, మనోరవిందాక్ష! దిదృక్షతే త్వామ్.** **(భాగ. షష్ఠ. 11.26)**

**ఆఁకలిగొన్న క్రేపులు, రయంబున నీఁకలురాని పక్షులుం**
**దీకొని తల్లికిన్, మఱి విదేశగతుం డగు భర్త కంగజ**
**వ్యాకుల చిత్తయైన జవరాలును దత్తఱమందు భంగి, నో**
**శ్రీకర! పంకజాక్ష! నినుఁ జేరఁగ నా మది గోరెడుం గదే!** **(షష్ఠ-స్కం -400)**

పోతన్నగారివలెనే అక్కడక్కడ మూలాన్ని రసవంతంగా పెంచి వ్రాయటంకూడా సింగయ కవిత్వంలో మనం చూడవచ్చు. విద్యాధర చక్రవర్తి ఐన చిత్రకేతువు భగవంతుడైన ఆదిశేషుణ్ణి సందర్శించిన సందర్భం మూలంలో ఇలా ఉన్నది -

**మృణాలగౌరం శితివాససం స్ఫురత్, కిరీటకేయూర కటిత్ర కంకణమ్।**
**ప్రసన్న వక్త్రారుణలోచనం వృతం, దదర్శ సిద్ధేశ్వర మండలైః ప్రభుమ్.॥**

ఈ శ్లోక భావాన్ని సింగయ్యగారి సీసపద్యంలో చిత్తగించండి -

**తార హార పటీర ధవళదేహము వాని రమణీయ నీలాంబరంబు వాని**
**మణి కిరీట స్ఫురన్మస్తకంబుల వాని కంకణ కేయూరకముల వాని**
**కర్బుర మయదీప్త కటిసూత్రముల వాని తరళ యజ్ఞోపవీతముల వాని**
**అతి సుప్రసన్న వక్త్రాంబుజంబుల వాని తరుణ వివృత్త నేత్రముల వాని**

**సిద్ధమండలంబు సేవింపఁ బుణ్య ప్ర, సిద్ధి వెలసినట్టి యిద్ధచరితు**
**పద్మలోచనునకుఁ బాద పీఠంబై న, ఘనునిఁ బన్నగేంద్రుఁ గాంచె నతఁడు. (షష్ఠ. స్కం. 476)**

శబ్దసౌందర్యానికి పేరెన్నికగన్న పోతన్నగారి అంత్యప్రాస నియమాలనూ, యమక గమకాలనూ పుణికి పుచ్చుకున్నారు సింగయ్యగారు -

**ఆ విద్యాధరభర్త గాంచె హరనీహారామృతాహాసమున్**
**శ్రీవిభ్రాజితమున్ నిర స్తగిరిజా సేవాగతాయాసమున్**
**దేవానీక వికాసమున్ శుభమహాదేవాంఘ్రిసంవాసమున్**
**భూవిఖ్యాత విలాసమున్ ద్రిభువనీ పూతంబుఁ గెలాసమున్. (షష్ఠ.స్కం.487)**

**కింకరుల, ధర్మరాజ వ, శంకరుల, దురంత దురిత సమధికజన నా**
**శంకరుల, సకలలోక భ, యంకరులం గనియె నింద్రియాకులుఁ డగుచున్. (షష్ఠ.స్కం.68)**

**హరి భక్తులతో మాటలు, ధర నెన్నఁడుఁ జెడని పుణ్యధనముల మూటల్**
**వర ముక్తికాంత తేటలు, నరిషడ్వర్గంబు సొరని యరుదగు కోటల్. (షష్ఠ.స్కం.153)**

నవయౌవనంలో అడుగుపెట్టిన అజామిళుని మీసాలను కనులకు కట్టించే ఈ అందమైన కందంలోని ఔపమ్యం రమ్యంగా ఉంది -

**తమ్మివిరి మీఁదవ్రాలిన, తుమ్మెద పంక్తులునుబోలెఁ దోరపు లీలం**
**గ్రమ్ముకొని విప్రతనయుని, నెమ్మొగమునఁ గానఁ బడియె నెఱి మీసమ్ముల్. (షష్ఠ.స్కం. 93)**

వీరాధి వీరుడైన వృత్రాసురుని అవక్రపరాక్రమానికి పరాజితులైన ఇంద్రాది దిక్పాలురు వాసుదేవునితో తమ భంగపాటు విన్నవించుకొన్న సన్నివేశం చాలా చమత్కారంగా చిత్రించాడు సింగయ.

**మొదలాఱిన రక్కసులకు, మొదలై, మా కాపదలకు మూలం బగుచున్**
**దుది మొదలు లేని రక్కసు, తుదిఁ జూపఁగదయ్య! తుదకుఁ దుదియైన హరీ!** (ష.స్కం. 338)

మొదలాఱుట చక్కని జాతీయం. తిట్టేటప్పుడు "ఓరీ నీ మొదలార!" అంటారు. దిక్కులేనివారం దిక్కుమాలిన వారమైనా మంటున్నారు -

**అకట దిక్కులకెల్ల దిక్కైన మాకు, నొక్కదిక్కును లేదు కాలూన నైన;**
**దిక్కుగావయ్య! నేఁడు మాదిక్కుఁజూచి, దిక్కులేకున్న వారల దిక్కునీవ.** (షష్ఠ. స్కం. 339)

ఈ క్రింది పద్యంలోని తెనుగుదనం తిలకించండి -

**ఎన్నఁడుఁ దెలియఁగ నేరరు పన్నగపతిశాయి తత్త్వభావము, మేనం**
**గన్నులవేల్పును, డాపలఁ జన్నమరినవేల్పు, ముదుక చదువుల వేల్పున్.** (షష్ఠ. స్కం. 117)

తీయ తీయని జాతీయాలు సింగయ కవితలో కుప్పలు తెప్పలు -

**చదువు చట్టువడియె; శాస్త్రంబు మన్నయ్యెఁ; బుద్ధి పరువు మేసె; పుణ్యమడఁగె;**
**నీతి మట్టు వడియె; నిర్మల జ్ఞానంబు, ముట్ట నుడిగె, బోధ మూరిఁబోయె.** (షష్ఠ. స్కం.135)

ఈ విధంగా చెప్పుకుంటూపోతే గ్రంథమంతా ఉదాహరించ వలసి వస్తుంది. షష్ఠస్కంధంలో అజామిళోపాఖ్యానం, వృత్రాసుర జన్మ వృత్తాంతం, దధీచి మహర్షి త్యాగం, దేవాసురయుద్ధం, చిత్రకేతూపాఖ్యానం మొదలైనవి చాలా రసవత్తర ఘట్టాలు. సింగయగారు వీటిని ఎంతో సమర్థంగా అనువదించారు.

పోతన్నగారి కవిత్వమంత ప్రసన్న మధురమూ సర్వాంగ సుందరమూ కాకపోయినా సింగయ్యగారి రచన దాదాపు సహజ పాండిత్యుని అడుగు జాడలలో నడచిందనటంలో సంశయం లేదు.

ఏర్చూరి సింగయ్యగారే కాక నంది మల్లయ, ఘంట సింగయ అనే జంటకవులు "శృంగారషష్ఠం" అనే పేరుతో భాగవతషష్ఠస్కంధాన్ని తెనిగించారు. కాని ఆ గ్రంథం నేడు ఉపలబ్ధం కాదు. అందలి కొన్ని పద్యాలు మాత్రం అప్పకవీయంలోనూ, కూచిమంచి తిమ్మకవి "సర్వలక్షణ సారసంగ్రహం" లోనూ ఉదాహృతాలైనాయి.

16వ శతాబ్దం వాడైన హరిభట్టుకూడా షష్ఠస్కంధాన్ని ఆంధ్రీకరించాడు. ఇది అముద్రితం. దీని తాళపత్రప్రతులు లభిస్తాయి.

ఎందరు కవులు అనువాదం చేసినా సింగయ్యగారి అనువాదమే పోతన్నగారి భాగవతంలో చోటు చేసుకోటం విశేషం. అది సింగయ్య గారి జన్మాంతర సుకృత విశేషం.

సహజ సుందరమైన సహజపాండిత్యుని భాగవతం ప్రతిపద్య భావార్థ సహితంగా ప్రకటితం కావడం ఆంధ్రులందరికీ ఆనందకరమైన విషయం.

ఈ షష్ఠస్కంధాన్ని సరళ సుందరంగా గద్యంలో అనువదించిన వారు విద్వాన్ శ్రీ తలమర్ల కళానిధిగారు.

ఈ షష్ఠస్కంధాన్ని ముచ్చటగా ముద్రించి ఇచ్చిన దేవస్థానం ప్రెస్ మేనేజరు శ్రీ విజయకుమార్‌రెడ్డి గారికి, వారి సిబ్బందికీ నాసాధువాదాలు. అక్షరదోషాలు దొర్లకుండా సహస్రాక్షులై ప్రూఫులు సరిదిద్దిన పూజ్యమిత్రులు మహాకవులు శ్రీముదివర్తి కొండమాచార్యులవారికి నాధన్యవాదాలు. ముద్రణకు తగునట్లు ప్రెస్‌కాపీ సిద్ధంచేసి ఇచ్చిన చిరంజీవి కోరాడ రామకృష్ణ ఎమ్.ఏ., ఎమ్,ఫిల్.,కు నా ఆశీర్వాదాలు.

భవదీయుడు

**కరుణశ్రీ**

ప్రధాన సంపాదకుడు

పోతన భాగవతం

గుంటూరు

మకర సంక్రాంతి, ప్రభవ

శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః

# పోతన భాగవతము

## *(సరళ గద్యానువాద సహితము)*

## ఆరవ స్కంధము

**శ్రీవత్సాంకిత కౌస్తుభస్ఫురిత లక్ష్మీచారు వక్షస్థల**
**శ్రీవిభ్రాజితు నీలవర్ణు శుభరాజీవాక్షుఁ గంజాత భూ**
**దేవేంద్రాది సమస్తదేవ మకుటోద్దీప్తోరు రత్నప్రభా**
**వ్యావిద్ధాంఘ్రిసరోజు నచ్యుతుఁ గృపావాసుం బ్రశంసించెదన్.** 1

* శ్రీవత్సమనే పుట్టుమచ్చతో ముచ్చట గొల్పుతూ కౌస్తుభమనే మణితో ముద్దులు మూటగడుతూ లక్ష్మీదేవికి నెలవైన చెలువైన వక్షస్థలంతో విరాజిల్లేవాడూ, శ్యామసుందర స్వరూపుడూ, లోకాలకు శుభం చేకూర్చేవాడూ, తామరరేకులవంటి కన్నులు గలవాడూ, బ్రహ్మేంద్రాది సకల సురాధినాథుల కిరీటాలలోని చిరత్నరత్నకాంతులతో దేదీప్యమానమైన పాదపద్మాలు గలవాడూ, దయకు పెన్నిధీ అయిన శ్రీమన్నారాయణుణ్ణి సన్నుతిస్తాను.

**ఉ. నిండుమతిం దలంతుఁ గమనీయ భుజంగమ రాజమండలీ**
**మండనుఁ జంద్రఖండ పరిమండితమస్తకుఁ దారమల్లికా**
**పాండురవర్ణుఁ జండతరభండను హేమగిరీంద్రచారు కో**
**దండు మహేశు గంధగజదానవభంజను భక్తరంజనున్.** 2

* అందమైన నాగరాజులను భూషణాలు ధరించుకొని, తలమీద నెలవంకను అలంకరించుకొని, పులు గడిగిన ముత్యంవలె మొల్లపువ్వువలె తెల్లని మైచాయ కలవాడూ, సంగరరంగంలో వీరాధివీరుడై మేరుపర్వతాన్ని చాపంగా చేపట్టినవాడూ, గజాసుర గర్వభంజనుడూ, భక్తజనరంజనుడూ అయిన పరమేశ్వరుణ్ణి నిండుమనస్సుతో సంస్మరిస్తాను.

**ఉ. హంసతురంగముం బరమహంసము నంచితదేవతా కులో**
**త్తంసము నాగమాంత విదిత ధ్రువపుణ్య రమావతంసముం**
**గంసజిఘాంసు నంశమును గర్బురసూత్ర సమావృతాంసమున్**
**హింస నడంచు బ్రహ్మము నహీనశుభంబులకై భజించెదన్.** 3.

* హంసవాహనంమీద చరించేవాడూ, పరమహంస స్వరూపంతో గోచరించేవాడూ, మాననీయులైన దేవతలకు తలమానిక మైనవాడూ, ఉపనిషత్తులలో నిక్షిప్తమైన అక్షయ పుణ్యసంపదలకు సాక్షిభూతుడైన వాడూ, వాసుదేవుని అంశావతార మైనవాడూ, కాంచన యజ్ఞోపవీతాలు కైసేసిన భుజాగ్రం కలవాడూ, హింసాప్రవృత్తిని నివృత్తి చేసేవాడూ అయిన బ్రహ్మదేవుణ్ణి అనంత శుభాలు అందుకొనేటందుకు ఆరాధిస్తాను.

**ఉ. మోదకహస్తునిన్ సమదమూషకవాహను నేకదంతు లం**
**బోదరు నంబికాతనయు నూర్జితపుణ్యు గణేశు దేవతా**
**హ్లాదగరిష్ఠు దంతిముఖు నంచిత భక్తఫల ప్రదాయకున్**
**మోదముతోడ హస్తములు మోడ్చి భజించెద నిష్టసిద్ధికిన్. 4**

* అమరులకు ఆనంద సంధాయకుడూ, ఆశ్రితులకు అభీష్టఫల ప్రదాయకుడూ అయిన గణనాయకుణ్ణి ప్రీతిపూర్వకంగా చేతులు మోడ్చి సేవిస్తాను. ఆ మోదకహస్తుడు, ఆ మూషికవాహనుడు, ఆ ఏకదంతుడు, ఆ సౌభాగ్యవంతుడు, ఆ గజాననుడు, ఆ గౌరీనందనుడు, ఆ పెద్దబొజ్జ గుజ్జువేలుపు మా కోరికలు తీర్చాలి, మా కార్యాలు నెరవేర్చాలి.

**ఉ. కల్లతనంబు గాక పొడగట్టిన పూర్వపురీతి నేఁడు నా**
**యుల్లమునందు నుండుము సమున్నత తేజముతోడ భక్తి రం**
**జిల్లిన చూపుగూడ విధిఁ జెందిన ప్రోఢ బుధాళి నీడ మా**
**తల్లి దయామతల్లి ప్రణతద్రుమకల్పకవల్లి భారతీ! 5**

* అమ్మా! భారతీ! ఆనాడు నిజంగానే నీవు నాకు సాక్షాత్కరించావు. ఈనాడుకూడా అదే విధంగా వెలుగులు వెదజల్లే రూపుతో, రమ్యత్వం రంజిల్లే చూపుతో నా హృదయంలో కదలకుండా ఉండు. విధాతను చెట్టబట్టిన ప్రోఢవు. బుధాళికి తోడునీడవు. నీవు మా తల్లివి. దయామతల్లివి. ఆశ్రితజన కల్పవల్లివి.

**క. విలస త్కంకణరవరవ, కలితం బగు నభయ వరద కరములు బెరయం**
**జెలరేఁగి భక్తులకు నల, కలుములు దయసేయు జలధికన్యకఁ దలఁతున్. 6**

* తళతళలాడే కంకణాలు గలగలలాడగా, అభయ హస్తంతో భయం తీర్చి, వరదహస్తంతో కోరిన వరాలు చేకూర్చి, భక్తులకు భాగ్యాలు ప్రసాదించే సముద్రుని కుమార్తె అయిన లక్ష్మీదేవిని భావించి సేవిస్తాను.

**క. కాళికి బహుసన్నుత లో, కాళికి కమనీయ వలయ కరకీలిత కం**
**కాళికిఁ దాపస మానస, కేళికి వందనము సేసి కీర్తింతు మదిన్. 7**

* కమనీయ కనకకంకణాలు కై సేసిన కరకమలంలో కపాలం ధరించునదీ, లోకాలన్నీ సాగిలపడి నమస్కరించునదీ, మహామునుల మనస్సులలో విహరించునదీ అయిన కాళీమాతను హస్తాలు మోడ్చి ప్రస్తుతిస్తాను.

**వ. అని యిష్టదేవతా ప్రార్థనంబు సేసి. 8**

చ. పరమసమాధిధుర్యుఁ బటు పావనకర్మ విధేయ దేవతా
వర నర వంద్యు సద్విమలవాక్కు జనార్దన కీర్తన క్రియా
భరణ సమర్థు వేద చయ పారగు భవ్యుఁ ద్రికాలవేది భా
సురమతిఁ గొల్చు టొప్పు బుధశోభితుఁ బుణ్యుఁ బరాశరాత్మజున్. 9

క. వ్యాసుని భగవ త్పదసం, వాసుని నాగమ పురాణ వర విష్ణుకథా
వాసుని నిర్మల కవితా, భ్యాసుని పదపద్మయుగము భావింతు మదిన్. 10

* ఈ విధంగా ఇష్టదేవతలను ప్రార్థించిన అనంతరం పరమపుణ్యాచరిత్రుడూ, పరాశర మహర్షి పుత్రుడూ అయిన వేదవ్యాసుని పాదపద్మాలను పవిత్రమైన మనస్సుతో భావిస్తాను. ఆ మహానుభావుడు మిక్కిలి నిశ్చలమైన అంతరంగం కలవాడు. అత్యంత పావనములైన సత్కృత్యములు ఆచరించేవాడు. నరులకేకాక సురలకు సైతం నమస్కరింపదగిన వాడు. మాలిన్యం లేని మంచివాక్కులు కలవాడు. విష్ణుసంకీర్తనంలో నిష్ణాతుడు. వేదవేత్త. భూతభవిష్యద్వర్తమానాలు గుర్తించినవాడు. భవ్యుడు. బుధజన సంసేవ్యుడు. ఇంకా ఆ మహనీయుడు భగవత్పదకమల విధేయుడు. ఆగమ పురాణ ధురీణుడు. హరికథా పారీణుడు. కమనీయ కవితా ప్రవీణుడు.

సీ. వరకవిత్వోద్రేకి వాల్మీకిఁ గొనియాడి భాగవతార్థ వైభవముఁ బలుకు
శుకమంజులాలాపు శుకయోగిఁ బ్రార్థించి బాణ మయూరుల ప్రతిభ నొడివి
భాస సౌమిల్లక భారవి మాఘుల ఘన సుధా మధుర వాక్యములఁ దలఁచి
కాళిదాసుఁ గవీంద్రకల్పవృక్షము గొల్చి నన్నపాచార్యు వర్ణనలఁ బొగడి

తే. వెలయఁ దిక్కన సోమయాజుల భజించి, యెఱ్ఱనామాత్యు భాస్కరు నిచ్చ నునిచి
సుకవిసోముని నాచన సోము నెఱఁగి, కవిమనోనాథు శ్రీనాథు ఘనత మెచ్చి. 11

* ఉత్తమ కవితావేశం ఉరకలువేసే వాల్మీకి మహర్షికి వందనం చేస్తాను. భాగవత పరమార్థాన్ని చక్కగా వివరించి చెప్పిన శుకయోగిని స్తుతిస్తాను. ప్రతిభానిధులైన భట్టభాణుణ్ణీ, మయూరకవినీ కొనియాడుతాను. సుధామధురోక్తులకు పేరెన్నికగన్న భాసుణ్ణీ, సౌమిల్లకుణ్ణీ, భారవినీ, మాఘుణ్ణీ సంస్మరిస్తాను. కవులపాలిటి కల్పవృక్షమైన కాళిదాసుణ్ణి కైవారం చేస్తాను. నన్న పార్యుణ్ణీ, తిక్కన సోమయాజినీ, ఎఱ్ఱాప్రెగ్గడనూ, భాస్కరుణ్ణీ ప్రస్తుతిస్తాను. సుకవి లలాముడైన నాచనసోమునికి నమస్కరిస్తాను. కవిజన మనోనాథుడైన శ్రీనాథునికి కై మోడ్పులు ఘటిస్తాను.

ఉ. ఎమ్మెలు సెప్పనేల? జగ మెన్నఁగఁ బన్నగరాజ శాయికిన్
సొమ్ముగ వాక్యసంపదలు సూఱలు చేసినవాని భక్తి లో
నమ్మినవాని భాగవత నైష్ఠికుఁడై తగువానిఁ బేర్మితో
బమ్మెర పోతరాజు కవిపట్టపురాజుఁ దలంచి మ్రొక్కెదన్. 12

* మొగ మిచ్చకాలు కాదు; జగమంతా మెచ్చగా పన్నగరాజు శయ్యపై పవళించే భగవంతునికి తన కవితాసంపదలనే భూషణాలను కోకొల్లలుగా సమర్పించుకొన్నవాడూ, భక్తి విశ్వాసాలతో, పరమ నిష్ఠతో భాగవత మహాగ్రంథాన్ని రచించినవాడూ, కవిరాజులకు పట్టపురాజూ అయిన బమ్మెరపోతరాజును తలంచి తలవంచి నమస్కరిస్తాను.

**వ. అని సకల సుకవి నికరంబులకు ముకుళిత కరకమలుండనై.** 13

**ఉ. ఎయ్యది కర్మబంధముల నెల్ల హరించు విభూతి కారణం**
**బెయ్యది సన్మునీంద్రులకు నెల్లఁ గవిత్వసమాశ్రయంబు ము**
**న్నెయ్యది సర్వమంత్రముల నేలిన దెయ్యది మోక్షలక్ష్మి రూ**
**పెయ్యది దానిఁ బల్కెద సుహృద్యము భాగవతాఖ్య మంత్రమున్.** 14

* ఈ విధంగా సకల సత్కవుల సమూహానికీ చేతులు జోడించిన వాడనై కర్మబంధా లన్నింటినీ నశింపజేసేదీ, మహైశ్వర్యాన్ని ప్రసాదించేదీ, పూర్వం నుంచీ మునిశ్రేష్ఠుల కవితాసంపదకు సమాశ్రయమైనదీ, మంత్రాలన్నింటికీ పెన్నిధియై పరిపాలించేదీ, మోక్షలక్ష్మీ స్వరూపమైనదీ అయిన భాగవతమనే మనోహర మంత్రాన్ని పల్కుతాను.

**వ. అని శ్రీమహాభాగవత పురాణంబునందు షష్ఠస్కంధం బాంధ్రభాష రచియింపంబూని మదీయ కవితామహాలక్ష్మికి నారాయణుండె నాథుఁడగుటంజేసి యీ కృతి కృష్ణార్పణంబుఁ జేసితి. అది యెట్లనిన, నేను విద్యాభ్యాసంబునం దగిలి కొండుక నై యుండ నొక్కనాఁడు దివంబున.** 15

* ఇప్పుడు శ్రీ మహాభాగవత పురాణంలోని షష్ఠస్కంధాన్ని ఆంధ్రభాషలో రచించటానికి సంకల్పించాను. ఈ నా కృతికన్యకు పతిగా ఏ దేవు డున్నాడా? అని దీర్ఘంగా ఆలోచించాను. నాకు కవితా సంపద సంప్రాప్తమైన ఆనాటి సంగతిని గుర్తుచేసుకొన్నాను. చివరకు నా కృతికి శ్రీమన్నారాయణుడే అధిపతి అని నిశ్చయించుకొన్నాను. నా కోరిక సఫలమయింది కదా అని సంతోషించి ఈ కృతికన్యకను భగవంతుడైన శ్రీకృష్ణునకే అర్పించాను. నేను విద్య నేర్చుకొనే దినాలవి. బాల్యంలో ఉన్నాను. ఆ నాటి సన్నివేశాన్ని విన్నవించుకొంటాను. ఒకనాటి పట్టపగలు ఒక దృశ్యాన్ని చూచాను.

**చ. కలిత విశేషవస్త్రములు గట్టి హిమాంబు సుగంధ చందనం**
**బలఁది వినూత్న భూషణము లారయఁ దాల్చి వినోదలీల నిం**
**పుల మృదుశయ్య నిద్రఁ దగఁ బొందినచోఁ గనుపట్టెఁ బల్మఱుం**
**గలయఁ దటిద్విలాసములు గట్టిగ నొక్కట నిల్చు పోలికన్.** 16

* విలువైన వస్త్రాలు ధరించి పన్నీరు కలిపిన సుగంధాన్ని పూసుకొని అభినవాలైన ఆభరణాలు అలంకరించుకొని వినోదంగా సరిక్రొత్త మెత్తని శయ్యపై నిద్రిస్తున్నాను. ఆ నిద్రలో ఒక కల వచ్చింది. ఆ కలలో దట్టమైన క్రొమ్మెరుపులు దండాకృతి ధరించినట్లు ఒకానొక తేజోమయ రూపం నా ముందు సాక్షాత్కరించింది.

సీ. ఉరవడి ప్రాగ్వీథి నుదయించు మార్తాండ కోటిబింబచ్ఛాయ గూడినట్లు
హరిహర బ్రహ్మల యాత్మలలో నుబ్బి కరుణ యొక్కట మూర్తి బెరసినట్లు
ఖరకర కర తీవ్ర గతినిఁ గరంగుచు హేమాద్రి సోగ పెల్లెగసినట్లు
ఫణిరాజ ఫణరాజి మణిగణ విస్ఫూర్తి సుషిరంపు వెలిదల చూపినట్లు

తే. ఉట్టిపడ్డట్లు కట్టెల్ట నూఁదినట్లు, తేజ మెసఁగంగ నా మ్రోల దివ్యవాణి
పూని సాక్షాత్కరించి సంపూర్ణదృష్టిఁ, జూచి యిట్లని పలికె మంజులముగాను. 17

* ఒక్కమాటుగా కోటి సూర్యబింబాలు తూర్పు దిక్కున ఉదయించిన విధంగా, బ్రహ్మ విష్ణు మహేశ్వరుల అంతరంగాలలోని అనురాగ తరంగాలు పొంగిపొరలినట్లుగా, సూర్యకిరణాల వేడికి కరగిన మేరు పర్వతం నా చెంగట బంగారు నీరు క్రుమ్మరించిన రీతిగా, నాగరాజైన ఆదిశేషుని పడగలమీది రత్నసమూహాల రమణీయ దీప్తులు పుట్టరంధ్రాల నుంచి వెలువడినట్లుగా, కట్టెర్ర కాంతులు ఉట్టిపడే దివ్యవాణి నా యెదుట ప్రత్యక్షమై సంపూర్ణ దృష్టితో నన్ను వీక్షించి మృదుభాషణాలతో ఈ విధంగా అన్నది.

ఉ. ఆటలు పాటలుం జదువు లద్భుతముల్ వినవొప్పు వాద్యముల్
సాటి దలంపరాని బలుసాములు మున్నగు విద్యలెల్ల నీ
కాటలు పాట లయ్యె విను మన్నిటికిన్ మెఱుఁగిడ్డ భంగి నా
చాటునఁ జాటుకారపద సాధుకవిత్వముఁ జెప్పు మింపుగన్. 18

* నీ ఆటపాటలూ చదువుసంధ్యలూ అద్భుతంగా సాగాయి. వీనుల విందైన వాద్యాలు సాటిలేని సాముగరిడీలు మొదలైన విద్యలన్నీ నీకు అలవోకగా అలవడ్డాయి. ఇదిగో విను. వీటి అన్నింటికీ మెరుగు పెట్టే రీతిగా మృదుపదాలతో కమ్మని కవిత్వాన్ని చెప్పు. నా అండదండలు నీకుంటాయి.

వ. అని యానతిచ్చు జగన్మాతృ కృపావలోకన సుశ్లోకుండనై యే నొక శ్లోకంబు నా క్షణంబు నొడివితి. అది యెట్టి దనిన. 19

* ఈ ప్రకారంగా ఆజ్ఞాపించిన జగన్మాత కరుణాకటాక్ష వీక్షణంవల్ల కృతార్థుడనై ఆ క్షణంలోనే నేనొక శ్లోకాన్ని రచించాను. అది యిది.

శ్లో. హంసాయ సత్త్వనిలయాయ సదాశ్రయాయ, నారాయణాయ నిఖిలాయ నిరాశ్రయాయ ।
స త్సంగ్రహాయ సగుణాయ నిరీశ్వరాయ, సంపూర్ణ పుణ్యపతయే హరయే నమస్తే ॥ 20

* "పరమహంస స్వరూపుడూ, సత్త్వగుణ సంపూర్ణుడూ, సుజనులకు ఆశ్రయభూతుడూ, సర్వాంతర్యామీ, మంచిని గ్రహించేవాడూ, తాను అందరికీ ఆశ్రయమైనవాడూ, మహాప్రభువైనవాడూ, పుణ్యలోకాలకు నాయకుడూ అయిన నారాయణునకు నమస్కారం''.

వ. ఈ శ్లోకం బద్దేవి యంగీకరించె. అంత మేలుకాంచి యానంద భరితుండ నై నాఁటనుండి, చంద్రానుగత యగు చంద్రికయుం బోలె, నారాయణాంకితం బైన కవిత్వ తత్త్వ జ్ఞానంబు గోచరం బయ్యె. దానికి ఫలంబుగా గోపికావల్లభుని నుల్లంబున నిడుకొని. 21

ఆ. పలుకఁ గలిగె మొదలు భాగవతార్థంబు, భర్త కృష్ణుఁ డాయె భాగ్య మొదవె
నమృతరసము గోర నలరు చింతామణి, పాత్ర సంభవించు భంగి నిపుడు. 22

* మొదటిది - భాగవతాన్ని పలికే భాగ్యం ప్రాప్తించింది. రెండవది - ఆ భాగవతానికి కృతిభర్త శ్రీకృష్ణుడైనాడు. ఎంత అదృష్టం. అమృతరసాన్ని త్రాగటానికి చింతామణి పాత్ర లభించిన విధంగా ఉన్నది.

ఆ. భాగవతము తేటపఱుప నెవ్వఁడు సాలు, శుకుఁడు దక్క నరుని సఖుఁడు దక్క
బుద్ధిఁ దోఁచినంత బుధులచే విన్నంత, భక్తి నిగిడినంత పలుకువాఁడ. 23

* భాగవత పరమార్థాన్ని తేటతెల్లంగా వెల్లడించడానికి శ్రీశుకుడైనా కావాలి లేదా శ్రీకృష్ణుడైనా రావాలి. అంతేకాని నా వంటి వాడికి సాధ్యం కాదు. అయితే నా బుద్ధికి తోచినంతగా, పండితులవల్ల విన్నంతగా, నా భక్తికి సాధ్యమైనంతగా పలుకుతాను.

ఉ. పుట్టిననాఁట నుండియును బుట్టద యెట్టియ దట్టు నైనఁ జే
పట్టి నుతింపఁ జిత్తము శుభం బగు మద్వరవాక్యసీమకుం
బట్టము గట్టినాఁడ హరిఁ బాయక తత్కథనామృతంబు నే
నుట్టిపడంగఁ జెప్పుదు బుధోత్తము లానుఁడు శ్రోత్రపద్ధతిన్. 24

* పుట్టిననాటి నుంచి ఏలాంటి గర్వమూ నాలో పుట్టి ఎరుగను. శ్రీహరిని చేపట్టి కొనియాడితే చిత్తం నిర్మలం అవుతుంది. అందుకని రమ్యమైన నా కవితారాజ్యానికి శ్రీహరిని పట్టంగట్టాను. ఆ మధుసూదనుని కథలు సుధలు చిందిపడే చందాన చెబుతాను. పండితవరేణ్యులు వీనులవిందుగా గ్రోలండి.

వ. అని, 25

సీ. శ్రీవత్స గోత్రుండు శివభక్తి యుక్తుఁ డాపస్తంబ సూత్రుఁ డపార గుణుఁడు
నేర్చూరి శాసనుం డెఱ్ఱన ప్రెగ్గడ పుత్రుండు వీరన పుణ్యమూర్తి
కాత్మజుం డగు నాదెయామాత్యునకుఁ బోలమాంబకు నందను లమితయశులు
కసువనామాత్యుండు ఘనుఁడు వీరనమంత్రి సింగధీమణియు నంచితగుణాఢ్యు

తే. లుద్భవించిరి తేజంబు లూర్జితముగ, సొరిది మూర్తిత్రయం బన శుభ్రకీర్తిఁ
బరఁగి రందులఁ గసువన ప్రభువునకును, ముమ్మడమ్మను సాధ్వి యిమ్ములను వెలసె. 26

* ఇప్పుడు నా వంశాన్ని అభివర్ణిస్తాను. శ్రీవత్సగోత్రుడు, శివభక్తుడు, ఆపస్తంబ సూత్రుడు, సుగణ సంపన్నుడు అయిన ఎర్రన్న ఏర్చూరుకు శాసకుడు. ఎర్రన్న కుమారుడు వీరన్న. ఆ పుణ్యమూర్తి నందనుడు

నాదయామాత్యుడు ఆయన భార్య పోలమ్మ. ఈ దంపతులకు కసువన్న, వీరన్న సింగన్న అనే ముగ్గురు పుత్రులు త్రిమూర్తుల వలె వరుసగా జన్మించారు. ఈ ముగ్గురు నిర్మల కీర్తిమంతులై సుగుణవంతులై వర్ధిల్లారు. వారిలో కసువన మంత్రికి ముమ్మడమ్మ అనే సాధ్వి అనుకూలవతి అయిన సతిగా అలరారింది.

**ఉ. ఆడదు భర్తమాట కెదురాడదు వచ్చినవారి వీఁడగా**
**నాడదు పెక్కుభాష లెడనాడదు వాకిలి వెళ్ళి, కల్ల మా**
**టాడదు మిన్నకేని సుగుణావళి కిందిరగాక సాటి యే**
**చేడియ లేదు చూరికుల శేఖరు కస్వయ ముమ్మడమ్మకున్.** 27

* ముమ్మడమ్మ భర్తమాటకు ఎదురాడదు. ఇంటికి వచ్చిన వారిని వెళ్లిపోవునట్లు తెగనాడదు. అవసరమైన దానికంటె అధికంగా మాటలాడదు. ఇల్లు విడిచి తిరుగాడదు. హాస్యానికైనా అసత్యమాడదు. ఏరుచూరి కులశేఖరుడైన కసువన్న భార్యయైన ఆ ముమ్మడమ్మకు, ఆ సుగణాలదీవికి లక్ష్మీదేవియే సాటి. ఆమె కాక మరి ఏ బోటియున్నూ ఆమెకు సాటి కాదు.

**క. ఆ కసువయమంత్రికిఁ బు, ణ్యాకల్పశుభాంగి ముమ్మడమ్మయు మము న**
**వ్యాకుల చిత్తుల నిరువుర, శ్రీకర గుణగణులఁ బుణ్యశీలురఁ గాంచెన్.** 28

* ఆ కసువన మంత్రికి, పుణ్యశీల అయిన ముమ్మడమ్మకు మేము ఇరువురం కుమారులం పుట్టాము. మేము చీకాకు లేని చిత్తం కలవారం. సద్గుణ సంపన్నులం. సాధువర్తనులం.

**క. అంగజసమ లావణ్య శు, భాంగుల హరి దివ్యపద యుగాంబుజ విలస**
**ద్భృంగాయమాన చిత్తులు, సింగయ తెలగయలు మంత్రిశేఖరు లనఁగన్.** 29

* మేము మన్మథుని సౌందర్యాన్ని మించిన సౌందర్యంతో మంగళకరమైన శరీరాలు కలవారం. మా మనస్సులు తుమ్మెదలవలె శ్రీహరి పాదకమలాలను ఆశ్రయించాయి. నా పేరు సింగయ్య. నా తమ్ముని పేరు తెలగయ్య.

**క. అం దగ్రజుండ శివపూ, జం దనరినవాఁడ విష్ణుచరితామృత ని**
**ష్యంది పటు వాగ్విలాసా, నందోచిత మానసుఁడను నయకోవిదుఁడన్.** 30

* మా యిద్దరిలో నేను పెద్దవాడను. శివపూజా పరాయణుడను. శ్రీహరిచరితమనే అమృతం స్రవించే వాక్యసంపద కలవాడను. ఆ ఆనందంలో మునిగితేలే మనస్సు కలవాడను.

**వ. కావునం గృష్ణపాదారవింద సందర్శ నాదర్శతలాయమాన చిత్తుండ నై.** 31

* అటువంటి నేను నందనందనుని పాదారవిందాలను సందర్శించటానికి నా హృదయాన్ని అద్దంలాగా దిద్ది తీర్చు కొన్నాను.

## -: షష్ఠ్యంతములు :-

క. శ్రీపతికి మత్పతికి నుత, గోపతికిఁ ద్రిలోకపతికి గురుజనబుధ సం
తాప నివారణ మతికినిఁ, బ్రాపితసనకాది తతికి బహుతర ధృతికిన్. 32

* లక్ష్మీదేవి ప్రాణేశ్వరుడూ, నా జీవితానికి అధీశ్వరుడూ, దేవేంద్రునిచే స్తుతింపబడేవాడూ, ముల్లోకాలకు అధినాథుడూ పెద్దలైన పండితుల సంతాపాన్ని నివారించేవాడూ, సనకసనందనాది మహర్షులకు ఆశ్రయమైనవాడూ, మేరునమాసధీరుడూ అయిన శ్రీకృష్ణునకు (ఈకృతిని సమర్పిస్తున్నాను)

క. హరికి గురు కలుషకుంజర, హరికి బలాభీలహరికి నంతస్స్థిత గ
హ్వరికి నరహరికి రక్షిత, కరికిఁ గరాగ్రస్థగిరికి ఘనతరకిరికిన్. 33

* భక్తుల పాపాలు పోగొట్టేవాడూ, భయంకరాలైన దురితాలనే ఏనుగులను సింహంవలె చీల్చి చెండాడేవాడూ, తనశక్తిచేత ఇంద్రుని గర్వం హరించినవాడూ, సజ్జనుల హృదయాంతరాలలో నివసించేవాడూ, నరసింహస్వరూపుడూ, గజేంద్రుని కాపాడినవాడూ, కొనగోటితో గోవర్ధనం ఎత్తినవాడూ, ఆదివరాహావతారుడూ అయిన శ్రీకృష్ణునకు (ఈ కృతిని సమర్పిస్తున్నారు)

క. గుణికి సమాశ్రిత చింతా, మణికి మహేంద్రాది దివిజమండల చూడా
మణికిఁ బ్రకల్పితశయ్యా, ఫణికి నురోభాగ కౌస్తుభ ప్రియమణికిన్. 34

* సుగుణవంతుడూ, సగుణస్వరూపుడూ, ఆశ్రితులకు కోరిన కోర్కులు ఇచ్చే చింతామణి వంటివాడూ, దేవేంద్రాది దేవతలకు శిరోరత్నమైనవాడూ, ఆదిశేషుని పాన్పుగా అమర్చుకొన్నవాడూ, వక్షఃస్థలంమీద ప్రకాశించే కౌస్తుభమణి కలవాడూ అయిన శ్రీకృష్ణునకు (ఈకృతిని సమర్పిస్తున్నాను).

క. కంసాసుర సంహారున, కంసాంచిత కర్ణకుండ లాభరణునకున్
హింసాపర పరమస్తక, మాంసకరాళిత గదాభిమత హస్తునకున్. 35

* జగత్కంటకుడైన కంసుణ్ణి సంహరించినవాడూ, బుజాలు తాకే కర్ణకుండలాలు ధరించినవాడూ, హింసాపరులైన విరోధుల శిరస్సులను చితుకబాదినవాడూ, ఆ మాంసఖండాలతో నిండిన గదాదండాన్ని చేతిలో ధరించినవాడూ అయిన శ్రీకృష్ణునకు (ఈకృతిని సమర్పిస్తున్నాను).

క. వరయోగిమానసాంతః, కరణ సుధాంభోధి భావకల్లోల లస
త్పరతత్త్వ శేషశాయికిఁ, జిరదాయికి సకలభక్త చింతామణికిన్. 36

* పరమయోగీంద్రుల అంతరంగమనే పాలసముద్రంలో భావతరంగాలలో తేలియాడే శేషతల్పంపై శయనించి ఉన్న పరతత్త్వమూ, శాశ్వతమైన మేలు కలిగించేవాడు, భక్తులపాలి చింతామణి అయిన శ్రీకృష్ణునకు (ఈకృతిని సమర్పిస్తున్నాను).

## -: కథా ప్రారంభము :-

వ. సమర్పితంబుగా నా యొనర్పం బూనిన షష్ఠస్కంధంబునకుం గథా ప్రారంభక్రమం బెట్టిదనిన, హరి చరణస్మరణ పరిణామ వినోదు లయిన శౌనకాదులకు నిఖిల పురాణేతిహాస నిర్ణయ విఖ్యాతుండైన సూతుం డిట్లనియె. 37

* శ్రీకృష్ణదేవునకు అంకితంగా నేను రచింప దలచిన మహాభాగవతంలోని షష్ఠస్కంధాన్ని ప్రారంభిస్తున్నాను. శ్రీహరి చరణకమల సంస్మరణంవల్ల హర్షోత్కర్షులైన శౌనకాది మహర్షులతో సమస్త పురాణాలలోని ఇతిహాస విశేషాలను వివరించి చెప్పటంలో విఖ్యాతుడైన సూతుడు ఈ విధంగా అన్నాడు.

క. శ్రీరమణీ రమణ కథా, పారాయణ చిత్తుఁడగుచుఁ బలికెఁ బరీక్షి
ద్భూరమణుఁ డాదరంబున, సూరిజనానందసాంద్రు శుకయోగీంద్రున్. 38

* శ్రీమన్నారాయణుని కథలను పారాయణం చేయటంలో పరవశించిన చిత్తం కల పరీక్షిన్నరేంద్రుడు ఆనందసాంద్రుడైన శుకయోగీంద్రుణ్ణి ఈప్రకారంగా అడిగాడు.

సీ. షడ్గుణైశ్వర్య శాశ్వతమూర్తి వైనట్టి మునినాథ! దయతోడ ముక్తిపదము
మున్నుగా నే మార్గమును వినిపించితి వారయ నపవర్గ భూరిమహిమఁ
గ్రమ యోగసంభవ బ్రహ్మంబు తోడన యనువొంద నగు నవి వినుతి కెక్క
మఱియు సత్త్వరజ స్తమః ప్రభావంబులఁ గడిఁదియై యున్నట్టి కర్మచయము

తే. నప్పటప్పటి కణఁగని యట్టి ప్రకృతిఁ, గలుగు పురుషుని భోగార్థఘటన దేహ
కారణారంభరూప మార్గంబు మొదలు, మాటిమాటికి నన్నియుఁ దేటపడఁగ. 39

* ఐశ్వర్యం, ధైర్యం, కీర్తి, తేజస్సు,జ్ఞానం, వైరాగ్యం అనే షడ్గుణ సంపత్తితో నిరంతరం వెలుగొందే మునిచంద్రా! మునుముందుగా ముక్తి మార్గాన్ని గూర్చి నాకు చక్కగా వివరించి చెప్పావు. నివృత్తి మార్గాన్ని అనుసరించిన మానవుడు క్రమంగా జ్ఞానయోగం ద్వారా బ్రహ్మసాయుజ్యాన్ని పొందుతాడని వెల్లడించావు. మానవుడు సత్త్వరజస్తమో గుణాల ప్రభావంవల్ల ప్రకృతికి లొంగిపోయి అనేక దుష్కర్మలు ఆచరిస్తాడు. ఆ దుష్కర్మల ఫలితంగా మాటిమాటికీ దేహాలు ధరించి సంసార బంధాల్లో చిక్కుకొంటాడు. దీనినే ప్రవృత్తిమార్గం అంటారు. ఈ మార్గాన్నికూడా నాకు తేటతెల్లంగా తెలిపావు.

వ. మఱియు ననేక పాపలక్షణంబులగు నానావిధ నరకంబులును వాని కాద్యంతంబులును, స్వాయంభువ సంబంధియగు మన్వంతరంబును, ప్రియవ్రతోత్తానపాదుల వంశంబును, దచ్చరిత్రంబును, ద్వీప వర్ష సముద్రాద్రి న ద్యుద్యాన వనస్పతులును, భూమండల సంస్థానంబును, వాని పరిమాణంబును, జ్యోతిశ్చక్రచలన ప్రకారంబును, విభుండైన పరమేశ్వరుం డె ట్విధంబున నిర్మించె, నా విధం బంతయు నెఱింగించినాఁడవు. ఇప్పుడు. 40

* ఇంతేకాకుండా అనేక పాపాలకు ఫలస్వరూపాలైన నానావిధనరకాలనుకూడ ఆద్యంతం అభివర్ణించావు. బ్రహ్మమానస పుత్రుడైన స్వాయంభువ మనువు చరిత్రం వివరించావు. ఆ మన్వంతర వృత్తాంతం కూడ విశదీకరించావు. స్వాయంభువమనువు కుమారులైన ప్రియవ్రత ఉత్తానపాదుల వంశాలనూ, వారి వారి చరిత్రలనూ అభివర్ణించావు. ఇంతేకాకుండా సప్తద్వీపాలనూ, సప్తసముద్రాలనూ, నవవర్షాలనూ, నదులనూ, ఉద్యానాలనూ, వృక్షవిశేషాలనూ, కులపర్వతాలనూ వర్ణించి చెప్పావు. సకల లోకాధీశ్వరుడైన భగవంతుడు ఈ భూమండలాన్ని ఎలా సంస్థాపించాడో, జ్యోతిశ్చక్రం ఉనికినీ చలనాన్నీ ఏ విధంగాఏర్పాటు చేశాడో ఆయా సంగతులన్నీ వ్యక్తం చేశావు.

**తే. కడిఁది వేదనలకుఁ గారణంబై యుండు, గుఱుతు లేని నరక కూపరాశి**
**పాలుగాక నరుఁడు బ్రతికెడు మార్గంబు, పరమపుణ్య! తెలియఁ బలుకవయ్య! 41**

* మహానుభావా! శుకదేవా! ఇప్పుడు నాకు ఈ విషయం వివరించి చెప్పు. ఈ ప్రపంచంలోని మానవుడు భరింపరాని బాధలతో నిండిన నానా విధ నరకకూపాలలో పడిపోకుండా సుఖంగా జీవించే మార్గం ఏదైనా ఉందా! ఉంటే దానిని నాకు విశదీకరించు.

**వ. అనినం బరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుం డిట్లనియె. 42**

* ఈ విధంగా ప్రశ్నించిన పరీక్షిన్నరేంద్రునితో శుకయోగీంద్రుడు ఇలా అన్నాడు.

**క. కట్టా! త్రికరణములచేఁ, బుట్టిన దురితముల నపుడు పొలియింపని యా**
**కట్టఁడి దేహం బుడిగినఁ, గొట్టాడును బిట్టు నరకకూపంబులలోన్. 43**

* రాజా! మనస్సూ, వాక్కూ, శరీరం అనే ఈ మూడింటినీ త్రికరణము లంటారు. ఈ మూడూ సమైక్యంగా ఉండి పనిచేయాలి. అటువంటి త్రికరణశుద్ధి లేని మానవుడు ఎన్నో పాపకర్మలు చేస్తాడు. ఆ పాపాలకు ప్రతిక్రియలు చెయ్యకుండా చనిపోయిన ఆ మూర్ఖుడు నరక కూపాలలో పడి నానాబాధలు అనుభవిస్తాడు.

**ఉ. కావునఁ గాలకింకర వికారముఁ గానకమున్న మృత్యు దు**
**ర్భావన చిత్తమున్ వెడఁగుపాటును జెందకమున్న మేనిలో**
**జీవము వెల్గుచుండి తన చెల్వము దప్పకమున్న మున్నుగాఁ**
**బావనచిత్తుఁడై యఘముఁ బాయుతెఱం గొనరింపఁగాఁదగున్. 44**

* అందువల్ల యమకింకరుల భయంకర స్వరూపాలు కంటిముందు కన్పించకముందే, చచ్చిపోతామనే భావంతో చిత్తం చీకాకుపడక ముందే, తనలోని ప్రాణశక్తి ఆరిపోకముందే, దేహం పటుత్వాన్ని కోల్పోకముందే నిర్మలమైన మనస్సుతో పాపాలను పరిహారం చేసుకొనే మార్గం అవలంబించాలి.

**క. కాలం బెడగని పాపము, మూలముఁ బెఱుపంగవలయు మును రోగములన్**
**దేలిన దోషము నెఱుఁగుచు, వాలాయము దాని నడఁచు వైద్యుని భంగిన్. 45**

* తెలివిగల వైద్యుడు రోగాలకు మూలకారణాన్ని కనిపెట్టి దాన్ని చక్కబరచటానికి వైద్యం చేసి వ్యాధులను పోగొట్టిన విధంగా మానవుడు తన పాపాలకు హేతువును తెలుసుకొని కాలాతీతం కాకుండా దీనిని నశింపజేసుకోవాలి.

**సీ. అనవుడు నాతని కనియె భూకాంతుండు కనుకలి వినుకలి గలిగినట్టి**
**పాపము దనకు నొప్పని దని కని చాలఁ బరితప్తుండయ్యుఁ గ్రమ్మఱ నొనర్చు**
**మూఢాత్మునకు దోషమోచనం బెయ్యది యారయ నెఱిఁగింపు మదియుఁగాక**
**కలుష మొక్కొకచోటఁ గావించు నొకచోటఁ గావింపకుండుఁ దత్కర్మమెఱిఁగి**

**తే. యట్టి జనుఁడు పుణ్య మేరీతిఁ జేసిన, నది ఫలింపనేర దని తలంతు**
**సలిలమందు మేలి మలినంబు వోవంగ గజము గ్రుంకువెట్టు గతియుఁ బోలె. 46**

* ఆ మాటలు విని పరీక్షిత్తు శుకునితో ఇలా అన్నాడు - పాపకృత్యాలను కన్నులారా కనీ, వీనులారా వినీ మానవుడు పాపాలు చేయటం నరక హేతువని తెలుసుకొంటాడు. చేసిన పాపాలకు పశ్చాత్తాపం చెందుతాడు. అట్లా పశ్చాత్తప్తుడై కూడా అలవాటు ప్రకారం మళ్ళీ పాపకృత్యాలు ఆచరిస్తాడు. అటువంటి పరమమూఢుని పాపాలకు పరిహారమంటూ ఉంటుందా? అదీకాక జీవుడు ఒక్కొక్క సందర్భంలో దుష్కర్మలు చేస్తాడు. ఒక్కొక్క సందర్భంలో దుష్కృత్యాలు చెయ్యడానికి వెనుకాడతాడు. ఇటువంటి చంచల హృదయుడు పుణ్యకార్యాలు చేయనే చేయడు. ఒక వేళ చేసినా లాభం ఉండదని నా నమ్మకం. అది గజస్నానం లాగా నిరర్థకమే అవుతుంది. ఏనుగు నీళ్లలో మునిగి వచ్చినా దాని ఒంటిమీది బురద అలాగే ఉంటుంది. అది చాలక తొండంతో మరింత దుమ్ము పైన చల్లుకొంటుంది.

**వ. అనిన శుకుం డిట్లనియె. 47**

**క. కర్మము కర్మముచేతను, నిర్మూలము గాదు తెలియనేరక తా నే**
**కర్మము సేసినఁ ద త్ప్రతి, కర్మం బొనరింప వలయుఁ గలుషవిదూరా! 48**

* పరీక్షిత్తు పలుకులు విని శుకమహర్షి ఇలా అన్నాడు - పుణ్యాత్ముడా! ఒక కర్మం మరొక కర్మం చేసినందువల్ల నిర్మూలనం కాదు. అంటే తెలిసి చేసిన దుష్కర్మదోషం తర్వాత చేసిన సత్కర్మ వల్ల పరిహారం కాదు. చేసిన దుష్కర్మ ఫలం దానికి తగిన ప్రాయశ్చిత్తం చేసి నప్పుడే నశిస్తుంది. పశ్చాత్తాపపడి ప్రాయశ్చిత్తం చేసుకొంటేనేగాని పాపాలు పరిహారం గావు.

**క. హితము గల కుడుపు మఱి రు, గ్వితతులఁ బొడమంగ నీని విధమున నతి స**
**ద్వ్రతుఁ డైనవాఁడు నిర్మల, మతిచే నఘరాశి నెల్ల మట్టము సేయున్. 49**

* హితకరమైన భోజనం రోగాలను పారద్రోలి మానవునకు ఆరోగ్యం కలిగించిన విధంగా పెద్దల ఉపదేశానుసారంగా సత్ప్రవర్తనం అలవరచుకొన్నవాడు నిర్మలమైన హృదయం కలిగి పాపాల నన్నింటిని పటాపంచలు చేసి ప్రశాంత జీవనం గడుపుతాడు.

చ. తపమున బ్రహ్మచర్యమున దానములన్ శమ సద్దమంబులన్
జపముల సత్యశౌచముల సన్నియమాది యమంబులన్ గృపా
నిపుణులు ధర్మవర్తనులు నిక్కము హృత్తను వాక్యజంపుఁ బా
పపు గుదిఁ ద్రుంతు రగ్ని శతపర్వ వనంబుల నేర్చుకైవడిన్. 50

* దయార్ద్ర హృదయులూ, ధర్మవర్తనులూ అయినవారు తపస్సు, బ్రహ్మచర్యం, దానం, అంతరింద్రియనిగ్రహం, బాహ్యేంద్రియ నిగ్రహం, జపం, సత్యం, శుచిత్వం, యమనియమాలు మొదలైన ఉత్తమగుణాలను అలవరచుకొని మనోవాక్కాయ కర్మలకు సంబంధించిన పాపసమూహాన్ని అగ్నిదేవుడు వెదురు పొదలను దహించివేసి నట్లు దహించి వేస్తారు.

వ. అదియునుం గాక. 51

ఉ. కొందఱు పుణ్యవర్తనులు గోపకుమార పదారవింద జా
నంద మరందపాన కలనారత షట్పదచిత్తు లౌచు గో
వింద పరాయణుల్ విమల వేషులు దోష మడంతు రాత్మలం
జెందిన భక్తిచేత రవి చేకొని మంచు నడంచు కైవడిన్. 52

* అంతేకాదు, నంద నందన పాదారవింద మకరందాన్ని ఆస్వాదించటంలో తుమ్మెదలవంటి హృదయాలు గల కొందరు పుణ్యాత్ము లుంటారు. నిరాడంబర వేషులైన ఆ నారాయణ భక్తి పరాయణులు తమ హృదయాలలో పెంపొందిన భక్తిచేత మార్తాండుడు మంచును హరించి నట్టు సమస్త దోషాలను రూపుమాపుతారు.

క. మరి భక్తి చేతఁ గొందఱు, బరిమార్తురు. మొదలు ముట్టఁ బాపంబుల ని
ష్ఠురతర కరముల సూర్యుం, డరుదుగఁ బెనుమంచుఁ బించ మఱఁచిన భంగిన్. 53

* మరికొందరు హరిభక్తులు తమ భక్తి ప్రభావంచేత ప్రభాకరుడు తన ప్రచండ కిరణాలతో కారు చీకట్లను పారద్రోలినట్లు ఘోరమైన పాపసమూహాన్ని మొదలంటా నిర్మూలిస్తారు.

క దంతిపురనాథ! విను మొక, మంతన మెఱిఁగింతు శమ దమంబులు నంహో
వంతు శుభవంతుఁ జేయవు, కంతుని గురుభక్తి ముక్తిఁ గలిగించుగతిన్. 54

* హస్తినాపురాధినాథుడవైన పరీక్షిన్మహారాజా! ఒక రహస్యం చెబుతాను విను. శ్రీహరి భక్తి పాపాత్ముడి పాపాలను పటాపంచలు చేసి అతడికి మోక్షాన్ని ప్రసాదిస్తుంది. శమదమాది సద్గుణాలు కూడ హరి భక్తివలె పాపాత్మున్ణి పుణ్యాత్మున్ణిగా మార్చలేవు.

సీ. హరికి నర్థముఁ బ్రాణ మర్పితంబుగ నుండు వాని కైవల్య మెవ్వనికి లేదు
వనజలోచను భక్తచరుల సేవించిన వాని కైవల్య మెవ్వనికి లేదు
వైకుంఠ నిర్మల వ్రతపరుం డై నట్టి, వాని కైవల్య మెవ్వనికి లేదు
సరసిజోదరు కథాశ్రవణ లోలుండైన వాని కైవల్య మెవ్వనికి లేదు

**తే. లేదు తపముల బ్రహ్మచర్యాది నిరతి, శమ దమాదుల సత్యశౌచముల దాన**
**ధర్మసుఖముల సుస్థిర స్థానమైన, వైష్ణవజ్ఞాన జనిత నిర్వాణపదము. 55**

* రాజా! ఎవరైతే శ్రీహరికి తమ అర్థమూ, ప్రాణమూ సమర్పిస్తారో, ఎవరైతే పుండరీకాక్షుని భక్తులను సేవిస్తారో, ఎవరైతే నారాయణ వ్రత పరాయణులో, ఎవరైతే మాధవ కథలను ఆసక్తితో వింటారో అటువంటివారికి లభించే మోక్షం మరెవ్వరికీ లభించదు. విష్ణుభక్తి వల్ల సంప్రాప్తించే సుస్థిరమైన కైవల్యపదం తపస్సుల వల్లకాని, బ్రహ్మచర్యాది నియమాల వల్లకాని, అంతరింద్రియ బాహ్యేంద్రియ నిగ్రహం వల్లకాని, సత్యపరిపాలనం వల్లకాని, శుచిత్వం వల్లకాని, దానధర్మాలవల్లకాని, యజ్ఞాలు చేయటం వల్లకాని ప్రాప్తించదు.

**తే. అరయ నెన్నఁడుఁ జేటు లేనట్టి ముక్తి, వర్మ మీ లోకమందు నెవ్వనికిఁ గలదు?**
**సాధులును బుణ్యశీలురు సజ్జనులును, హరిపరాయణ తత్పరు లగుటఁ గాక. 56**

* సాధు స్వభావులు, పుణ్యమూర్తులు, హరిభక్తి పరాయణులైన సత్పురుషులకే తప్ప పునరావృత్తి రహితమైన శాశ్వత మోక్షమార్గం ఈ లోకంలో మరెవ్వరికీ లభ్యం కాదు.

**క. అరుదుగ నరహరి భక్తిం, బొరయని యా పురుషు సుకృతి పుంజంబులు వే**
**మఱు పుణ్యుఁ జేయ నేరవు, నరవర! మధుఘటముఁ బెక్కునదులుం బోలెన్. 57**

* ఎన్ని, పుణ్యాలు చేసినా హరిభక్తి లేనినాడు అన్నీ నిరుపయోగములే. ఎన్నినదులు కలిసినా మద్య భాండాన్ని పవిత్రం చేయలేనట్లు హరిభక్తి వినా, పుణ్యసమూహాలు వేలకు వేలైనా పాపాత్ముడైన నరుణ్ణి పవిత్రుణ్ణి చేయలేవు.

**చ. సతతముఁ గృష్ణపాద జలజంబులయందు మనంబు నిల్పు సు**
**వ్రతులు తదీయ శుద్ధ గుణరాగులు కాలుని యుగ్రపాశ సం**
**హతుల ధరించు తత్సుభటవర్గములం గలలోనఁ గానరే**
**గతులను దుష్టకర్మములు గైకొని వారలఁ జెందనేర్చునే? 58**

* రాజా! ఎల్లప్పుడూ శ్రీకృష్ణదేవుని పాదపద్మాలపై మనస్సు లగ్నంచేసిన మహాభక్తులూ, ఆ వాసుదేవుని సుగుణముల యందు అనురక్తులూ యముణ్ణి కానీ యమపాశములు ధరించిన యమభటుల సమూహాలను కానీ కలలోకూడా కనగొనరు. అటువంటి మహానుభావులను మహాభక్తులను ఎటువంటి పాపకర్మములూ ఏ మాత్రమూ ఆవహించవు.

**వ. కావున నీ యర్థంబునకుం బురాతనంబగు నొక్క యితిహాసంబు గలదు. అది విష్ణుదూత యమదూతల సంవాదం బనంబడు. దాని నెఱింగింతు. ఆకర్ణింపుము. 59**

* పరీక్షిన్నరేంద్రా! ఈ విషయాన్ని వివరించే ఒకానొక పురాతనమైన ఇతిహాసం ఉన్నది. దానిని విష్ణుదూత యమదూతల సంవాదం అంటారు. ఆ ఇతిహాసాన్ని నీకు వినిపిస్తాను విను.

## -: అజామిళోపాఖ్యానము :-

సీ. నరనాథ! వినుము కన్యాకుబ్జపురమునఁ గలఁడు బ్రాహ్మణుఁ డజామిళుఁ డనంగ
బాతకుం డతుల నిర్భాగ్యుం డవజ్ఞుండు నష్టసదాచారి కష్టరతుఁడు
జూదంబులందు దుర్వాదంబు లందును జౌర్యంబునందు మచ్చరము గలిగి
తొత్తును బత్నిగా మత్తుఁడై వరియించి కొడుకులఁ బదుగురం బడసి చాల

తే. మోహజలధిలోన మునిఁగి ముచ్చట దీర, బాల లాలనాది లీలఁ దగిలి
పెద్దకాల మతఁడు పెంపార సుఖియించి, బలిత మెల్లఁ దొలఁగి పలితుఁడయ్యె. 60

* మహారాజా! పూర్వం కన్యాకుబ్జమనే పట్టణంలో అజామిళుడు అనే ఒక బ్రాహ్మణుడు ఉండేవాడు. అతడు మహాపాపాత్ముడు. పరమదరిద్రుడు. నింద్యచరిత్రుడు. అజ్ఞాని. దురాచారపరుడు. నికృష్ట జీవనుడు. జూదాలన్నా, వివాదాలన్నా ఆదరం మెండు. దొంగతనానికి పెట్టింది పేరు. అతడు యౌవనపు మత్తులో ఒక దాసీదానిని భార్యగా చేసుకొన్నాడు. దానియందు పదిమంది కొడుకులను కన్నాడు. ఆతడు ఆ వ్యామోహసముద్రంలో మునిగిపోయాడు. ఆ పిల్లల లాలన పాలనలో, ముద్దుముచ్చట్లలో చాలాకాలం గడిపాడు. సంసారలంపటుడై ఆనందంలో మైమరచాడు. ఆ మురిపాలన్నీ ముగిసి ముసలివాడైనాడు.

సీ. నిర్మలం బనఁ జాలనెఱయు చిత్తం బన నల్లని వెంట్రుకల్ తెల్లనయ్యెఁ
దగు మోహపాశ బంధంబు జాఱిన మాడ్కిఁ బొదలిన యంగంబు వదల వ్రాలె
నింద్రియంబుల కోర్కులిఁక నొల్ల ననుభంగి నుడుగక తల చాల వడఁకఁ జొచ్చెఁ
దమకంబు ప్రాయంబు దగిలిపోయిన మాడ్కి లోచనంబుల చూడ్కి నీచమయ్యె

తే. వగరు పుట్టె నంతఁ బెగలె దంతంబులు, నుక్కిసయును దగ్గుఁ బిక్కటిల్లె
శిరసు నొవ్వఁదొడఁగెఁ జెదరె మనం బంతఁ, గడిఁది యైన ముప్పుకాలముననను. 61

* మలినమైన మనస్సు ఎప్పటికైనా నిర్మల మవుతుందన్నట్లుగా అజామిళుని నల్లనివెంట్రుకలు తెల్లబడినాయి. మోహబంధాలు జారిన రీతిగా బలం సన్నగిల్లి అవయవాలు పట్టుదప్పి వ్రేలాడాయి. ఇంద్రియ వాంఛలు ఇక నాకు అక్కరలేదు అన్నట్లు తల అడ్డంగా వణకసాగింది. కామోద్రేకం వయస్సుతోపాటు తరిగి పోయిన విధంగా కంటిచూపు కుంటుపడింది. రొప్పు పుట్టింది. పండ్లు ఊడిపోయాయి. దగ్గు, ఆయాసం పెచ్చరిల్లాయి. తలనొప్పి మొదలయింది. మనస్సు చెదరిపోయింది. ముసలితనం ముంచుకు వచ్చింది.

తే. ఎనయ నతని కెనుబ దెనిమిది వర్షంబు, లంత నరుగుటయును భ్రాంతుఁ డగుచుఁ
గోరి పిన్నకొడుకు నారాయణాఖ్యుండు, బాలుఁ డగుట మిగుల భక్తిఁ జేసి. 62

* ఆ బ్రాహ్మణునికి ఎనభై యెనిమిదేండ్లు నిండటం వల్ల మతి చలించింది. అయినా భ్రాంతి పోలేదు. అతని చిన్నకొడుకు పేరు నారాయణుడు. అతడంటే అజామిళుడికి ప్రాణం.

క. తన సతియుఁ దానుఁ గూరిమి, మనమునఁ బెనఁగొనఁగ న క్కుమారుని ననిశం
బును ముద్దు సేయుచుండెను, జనవర! వాత్సల్య మాత్మ సందడిఁ గొనఁగన్. 63

* రాజా! పుత్రవాత్సల్యం ఆత్మలో పొంగిపొరలగా అజామిళుడూ, అతని భార్యా ఆ కుమారుణ్ణి సదా ముద్దుచేస్తూ ఉండేవారు.

క. బాలునిఁ ముగ్ధవచోబుజు, ఫాలుని నిజ జనక బంధు పరిణామ కళా
శీలుని లోలతఁ గనుఁగొని, యాలరి బ్రాహ్మణుఁడు నందితాత్ముం డగుచున్. 64

* అమాయకపు మాటలాడుతూ అందమైన కనుముక్కు తీరుగలిగి చక్కటి ఫాలభాగం గల ఆ పిల్లవాణ్ణి జూచి ఆ దుష్ట బ్రాహ్మణుడు సంతుష్టాత్ముడై మురిసిపోతూ ముద్దులాడసాగాడు.

క. అత్యంత పాన భోజన, కృత్యంబులఁ బొత్తు గలిగి క్రీడలఁ దత్సాం
గత్యంబు వదల కాగత, మృత్యువుఁ గన నేరఁ డయ్యె మిక్కిలి జడుఁడై. 65

* నారాయణుడు ప్రక్కన కూర్చుండనిదే భోజనం చేయడు. నీళ్లు తాగడు. ఆటపాటలలో సైతం వాడితో కలిసి ఆడుతూ పాడుతూ కాలం గడపసాగాడు. ఆ పారవశ్యంలో అజామిళుడు రాబోవు మరణాన్ని కూడా తెలుసుకోలేక పోయాడు.

తే. తెలియ కీ రీతి నతఁడు వర్తింపుచుండ, భయద మగు మృత్యుకాలంబు ప్రాప్తమైన
భూరి వాత్సల్య వృత్తి న ప్పుత్త్రుఁ దలఁచి, యాత్మఁ బ్రలపించు నారాయణా యటంచు. 66

* ఈ విధంగా ఆ భూసురుడు కాలచక్రగమనాన్ని గమనించ కుండా కాలక్షేపం చేస్తుండగా అతడికి భయంకరమైన మరణకాలం ప్రాప్తించింది. అప్పుడు అతడు ప్రేమాతిశయంతో తన కుమారుణ్ణి తలచుకొని "నారాయణా!"అంటూ పెద్దగా కేక పెట్టాడు.

వ. అప్పుడు. 67

క. కింకరుల ధర్మరాజ వ, శంకరుల దురంత దురిత సమధిక జన నా
శంకరుల సకలలోక భ, యంకరులను గనియె నింద్రియాకులుఁ డగుచున్. 68

* ఆ సమయంలో అత్యంత పాపాత్ములను పట్టి బంధించి బాధించటానికి వచ్చిన సకలలోక భయంకరులైన యమకింకరులు అతడికి కన్పించారు. వాళ్లను చూడగానే వాడిగుండెలు చెదరిపోయాయి.

క. ఘాతకుల దండ దండిత, పాతకుల మహోగ్ర కర్మ భర నిష్కరుణా
జాతకులఁ బ్రేతనాయక, దూతక సంతతుల నతఁడు దూరమునందున్. 69

మ. కనియెన్ బ్రాహ్మణుఁ డంత్యకాలమున వీఁకన్ రోషనిష్ఠ్యూతులన్
ఘనపీనోష్ఠ వికారవక్త్ర విలస ద్గర్వేక్షణోపేతులన్
జన సంత్రాస కరోద్యతాయత సుపాశ శ్రేణికా హేతులన్
హననవ్యాప్తి విభీతులన్ మువుర నాత్మానేతలన్ దూతలన్. 70

* జీవులను హింసించేవారూ, పాపులను భయంకరంగా దండించేవారూ, దయాదాక్షిణ్యాలు లేనివారూ, ఉగ్రస్వరూపులూ అయిన యమకింకరులను అజామిళుడు దూరంగా చూచాడు. అంత్యకాలంలో అతడికి ముగ్గురు దూతలు కన్పించారు. వాళ్ళు కోపంతో నిప్పులు గక్కుతున్నారు. లావుపాటి పెదవులతో వికారమైన ముఖాలతో క్రూరమైన చూపులతో మీదికి దూకుతున్నారు. వారిచేతుల్లో భయంకరాలైన త్రాళ్లూ కత్తులూ కటారులూ పైకిలేస్తూ ప్రాణాలు తీయటానికి సిద్ధంగా ఉన్నాయి.

వ. ఇట్లతివికృత తుండ గండభాగ విషమ వివృత్త నేత్రులు, నతి పుష్ట నిష్ఠుర తనుయష్టి సంవేష్టిత మహోర్ధ్వరోములు, నభ్యస్త సమస్త జీవాపహరణ కరణ ప్రశస్త హస్త విన్యస్త పాశధారులు నగు యమభటుల మువ్వురం గనుంగొని యజామిళుండు వికలేంద్రియుండును, వికంపిత ప్రాణుండును వికృతలోచనుండును, విహ్వలాత్మకుండు నై. 71

* మిక్కిలి వికారమైన ముక్కులూ, తెగబలిసిన బుగ్గలూ, వికృతంగా తిరుగుతున్న మిడిగ్రుడ్లూ, కండలు తిరిగిన కర్కశదేహాలూ, నిక్కపొడుచుకొన్న రోమాలూ గల యమకింకరులు అజామిళునికి కన్పించారు. వారి చేతులలో ప్రాణుల ప్రాణాలను బలవంతంగా అపహరించే భయంకర కాలపాశాలు ఉన్నాయి. అటువంటి యమభటులను చూడగానే అజామిళుని ఇంద్రియాలు పట్టుతప్పాయి. ప్రాణాలు కంపించాయి. నిలువుగ్రుడ్లు పడ్డాయి. అతడి ఆత్మ గిలగిల లాడింది.

క. దూరమున నాడు బాలుఁడు, బోరనఁ దన చిత్తసీమఁ బొడగట్టిన నో
నారాయణ! నారాయణ!, నారాయణ! యనుచు నాత్మనందను నొడివెన్. 72

* ఆ క్షణంలో దూరంగా ఆడుకొంటూ ఉన్న అతడి చిన్న కుమారుడు అతడి హృదయసీమలో గోచరించాడు. వెంటనే "నారాయణా! నారాయణా! నారాయణా!"అంటూ తన కుమారుణ్ణి పిలిచాడు.

చ. మరణపువేల న ద్దనుజమర్దను సంస్మరణంబు సేయఁ ద
త్పరిసరవర్తు లాత్మపరిపాలకు నామము నాలకించి ని
ష్ఠురగతి నేగుదెంచి పొడసూపి యదల్చిరి కాలుదాసులన్
ఖరతరభాషులన్ వికట కల్పిత వేషుల దీర్ఘ రోషులన్. 73

* ఆ విధంగా అజామిళుడు మరణసమయంలో నారాయణ నామస్మరణ చేస్తూండగా ఆ పరిసరాలలో తిరుగుతున్న దేవదూతలు తమ ప్రభువు నామాన్ని విన్నారు. మిక్కిలి వేగంతో అక్కడికి వచ్చారు. వికృతవేషాలతో అధికరోషాలతో పెద్దగా కేకలు వేస్తున్న యమకింకరులను అడ్డగించారు.

క. దాసీభర్త నజామిళ, భూసురుఁ దత్తనువువలన బోరన వెలికిం
దీసెడు యమభటులను బోఁ, ద్రోసిరి శ్రీవరుని కూర్మిదూతలు కడిమిన్. 74

* దాసీ భర్త అయిన అజామిళుని శరీరంనుండి పాశాలతో ప్రాణాలను బయటికి గుంజుతున్న యమభటులను భగవంతుని దూతలు బలవంతంగా పడద్రోశారు.

## -: విష్ణుదూత యమదూతల సంవాదము. :-

వ. ఇట్లు విష్ణుదూతల వలన నిర్ధూత ప్రయత్నులై యమదూత లిట్లనిరి. 75

* ఈ విధంగా తమ ప్రయత్నాన్ని భగ్నం చేసిన విష్ణుదూతలతో యమదూతలు ఇట్లా అన్నారు.

క. ఎవ్వనివారలు? మాతోఁ, జివ్వకుఁ గత మేమి? యిట్లు చిక్కినవానిం
గ్రొవ్వున విడిపించితి; రిఁక, నవ్వులకో? జముని శాసనంబులు జగతిన్. 76

* అయ్యా! మీరెవ్వరి భటులు? మాతో కలహానికి తలపడ్డా రెందుకు? మా చేతిలో చిక్కినవాణ్ణి మీరు వీరావేశంతో విడిపించారు. ప్రపంచంలో ఇక యముని శాసనాలు నవ్వులాటకే నన్నమాట!

వ. అదియునుం గాక. 77

సీ. ఎవ్వరు మీ రయ్య! యీ భవ్యరూపముల్ కన్నుల కద్భుతక్రమ మొనర్చె;
దివిజులో భువిజులో? దేవతాప్రవరులో? సిద్ధులో? సాధ్యులో? చెప్పరయ్య!
దళిత పాండుర పద్మదళ దీర్ఘ నేత్రులు వర పీత కౌశేయ వాసు లరయ
గండమండల నటత్కుండల ద్వయులును బటు కిరీటప్రభా భాసితులును

తే. భూరి పుష్కర మాలికా చారువక్షు, లమిత కోమల నవయౌవ నాధికులును
బాహు కేయూర మణిగణ భ్రాజమాన, ఘన చతుర్భుజు లభ్రసంకాశ రుచులు. 78

* ఆ మాట అట్లా ఉంచండి. ఇంతకూ మీరెవ్వరో చెప్పండి? మీ శుభకరమైన రూపాలు మా కన్నులకు ఆశ్చర్యాన్ని కల్గించాయి. మీరు నింగిలోని వారా? నేలమీది వారా? దేవతలా! సిద్ధులా? సాధ్యులా! వికసించిన తెల్ల తామర రేకులవంటి విశాల నేత్రాలు కలవారూ, శ్రేష్ఠమైన పసుపు పచ్చని పట్టు వస్త్రాలను ధరించిన వారూ, చెక్కిళుల యందు నాట్యమాడే కుండలాలు ధరించినవారూ, కిరీటాలతో ప్రకాశించేవారూ, మెట్టదామర మాలలతో అందమైన రొమ్ములు కలవారూ, మిక్కిలి సుకుమారమైన యౌవన ప్రాయంలో ఉన్నవారూ, రత్న ఖచితాలైన భుజకీర్తులతో విరాజిల్లే నాలుగు భుజాలు కలిగినవారూ, నీలమేఘాల వంటి దేహచ్ఛాయలు కలవారూ అయిన మీరు ఎవ్వరు?

క. ధనువులు నిషంగచయములు, కన దంబుజ శంఖ చక్ర ఖడ్గ గదా సా
ధనములు ధరయించిన మీ, తనువులు లోకముల కద్భుతం బొనరించెన్. 79

* ధనుస్సులూ, అమ్ములపొదులూ, పద్మం, శంఖం, చక్రం, ఖడ్గం, గద మొదలైన ఆయుధాలూ ధరించిన మీ స్వరూపాలు లోకాలకు అచ్చెరువు గొల్పుతూ ఉన్నాయి.

**క. శాంతంబు లైన మీ తను, కాంతులు జగములను దిశలఁ గలిగిన బహుళ**
**ధ్వాంతములఁ బాఱఁదోలుచు, సంతస మొనరించె నిపుడు సర్వంకషమై. 80**

* శాంతంతో కూడిన మీ శరీరకాంతులు లోకమంతటా నిండి దిగంతాలు వ్యాపించే కారుచీకటులను పారదోలుతూ సంతోషాన్ని కల్గించుతున్నాయి.

**వ. ఇట్లఖిల లోకానందకర కమ్రాకారులు, నఖిల విభ్రాజమాన తేజో దుర్నిరీక్ష్యమాణులును, నిఖిలధర్మ పాలురునగు మీరు ధర్మ పరిపాలుర మమ్ము నడ్డపెట్టం గతం బేమి? యనిన మందస్మిత కందళిత ముఖారవిందులై గోవిందుని కందువ మందిరంబు కావలి వారలు వారివాహ గంభీర నిర్ఘోష పరిపోషణంబులైన విశేషభాషణంబుల నిట్లనిరి. 81**

* లోకాలన్నింటికి ఆనందాన్ని కలిగించే సుందర విగ్రహాలు కలవారూ, చూచుటకు సాధ్యం కాని తేజస్సుతో విరాజిల్లుతున్న వారూ, సర్వధర్మాలను పాలించు వారైన మీరు యమధర్మరాజు దూతలమైన మమ్ములను అడ్డగించడానికి కారణ మేమిటని ప్రశ్నించిన యమదూతలను చూచి చిరునవ్వు చిందుతున్న ముఖారవిందాలు కలవారై గోవిందుని దూతలు మేఘగంభీర భాషణాలతో ఇలా అన్నారు.

**ఉ. మీరు పరేతనాయకుని మేలిమి దూత లటేనిఁ బల్కుఁ డా**
**తోరపుఁ బుణ్యలక్షణము, దుష్కృతభావము, దండకృత్యమున్**
**బీరముతోడ నీతని కభీష్టనివాసము, పూని దండ్యు లె**
**వ్వారలు? సర్వభూతములొ? వారక కొందఱు పాపకర్ములో? 82**

* ఐతే మీరు పరేతనాయకుడైన యముని కింకరు లన్నమాట. మంచిది! అలా అయితే పుణ్య లక్షణాలనూ పాపస్వరూపాన్నీ వివరించండి. ఎవరు దండింప తగినవారో ఎవరు కారో తెల్పండి. వీని నివాస స్థానమెక్కడో వెల్లడించండి. జగత్తులోని సర్వప్రాణులూ దండనీయులో లేక పాపకర్ములు మాత్రమే దండనీయులో విశదీకరించండి.

**వ. అనిన యమభటు లి ట్లనిరి 83**

* విష్ణుదూతల పలుకులు విని యమదూతలు ఈ విధంగా అన్నారు.

**క. వేద ప్రణిహితమే యను, మోదంబుగ ధర్మ మయ్యె మున్ను, త దన్యం**
**బేది యగు నది యధర్మం, బాదియు హరిరూపు వేద మన విను కతనన్. 84**

* వేదాలలో ఏది కర్తవ్యమని చెప్పబడిందో అదే అందరికీ ఆమోదకరమైన ధర్మం. అంతకంటే వేరైనది అధర్మం. వేదం సాక్షాత్తూ నారాయణ స్వరూపమని పెద్దలు చెప్పగా విన్నాము.

**సీ. ఎవ్వనిచేఁ దన యిరవొందు త్రిగుణ స్వభావమైనట్టి యీ ప్రాణిచయము**
**లనుగుణ నామక్రియా రూపములచేత నెంతయుఁ దమయంత నెఱుఁగఁబడును**
**నర్యముం డనలంబు నాకాశమును ప్రభంజనుఁడు గోచయమును శశధరుండు**
**సంధ్యలు దినములు శర్వరీచయములు కాలంబు వసుమతీ జాలములును**

**తే. దేహధారికి సాక్షులై తెలుపుచుండ, దండన స్థాన విధము సద్ధర్మగతియుఁ**
**దగుల మీ రీ క్రమానురోధనము చేసి, యఖిల కర్ములు దండార్హు లరయ నెపుడు. 85**

* ఎవని వలన సత్త్వరజస్తమో గుణమయులైన జీవులు ఏర్పడు తున్నారో, ఎవని వలన ఈ జీవులు తమకు అనుగుణమైన గుణాలనూ, నామాలనూ, ప్రవర్తనలనూ, ఆకారాలనూ పొందుతున్నారో, ఎవని వలన ఈ విషయం తెలియబడుతున్నదో ఆ నారాయణు డంతర్యామియై సర్వప్రాణులందూ నిండి ఉన్నాడు. సూర్యుడు, అగ్ని, ఆకాశం, వాయువు, చంద్రుడు, సంధ్యలు, పగళ్లు, రాత్రులు, కాలం, భూమి- ఇవన్నీ ఈ దేహధారులైన జీవుల సర్వకర్మలకూ సాక్షులు. వీని సాక్ష్యాన్ని అనుసరించే ధర్మాధర్మాల నిర్ణయం జరిగి అధర్మపరులు దండింప బడతారు. ఇప్పుడు మీరు ఈ క్రమపద్ధతికి అడ్డు తగిలారు. కర్మబద్ధులైన జీవులందరూ దండింప దగినవారే అవుతున్నారు.

**తే. కోరి కర్మంబు నడపెడువారి కెల్లఁ, గలిత శుభములు నశుభముల్ గలుగుచుండు!**
**నరయఁగా దేహి గుణసంగి యైన యపుడె, పూని కర్మంబు సేయక మానరాదు. 86**

* విధివిహితములైన కర్మలు తప్పక చేయవలసిందే. కాని చేయవలసిన కర్మలు కాకుండా, కావలెనని కోరి కొన్ని కర్మలను చేసే వారు కొందరున్నారు. అటువంటివారికి ఆ కర్మల ననుసరించి శుభాలు కానీ అశుభాలు కానీ ప్రాప్తిస్తూ ఉంటాయి. దేహధారులకు సత్త్వరజస్తమో గుణ సంపర్కం తప్పదు. అందువల్ల దేహి అయిన ప్రతిజీవీ కర్మ చేయకుండా ఉండలేడు.

**క. ప్రకృతమునఁ దా నొనర్చిన, సుకృతము దుష్కృతము నెంత చూడఁగ నంతే**
**వికృతిఁ గని యనుభవించు, న్నకృతమతిన్ ద త్ఫలంబు నతి నిపుణుండై. 87**

* ఈ జన్మలో ప్రస్తుతం తాను ఎంత సుకృతం చేస్తాడో, ఎంత దుష్కృతం చేస్తాడో ఆ పుణ్యాపాపాల పరిమాణాన్ని అనుసరించే భవిష్యత్తులో ఫలాలు ప్రాప్తిస్తాయి. ఆ జన్మలో ఆయా సుకృత దుష్కృత ఫలితాలను తప్పనిసరిగా అనుభవిస్తాడు.

**వ. మఱియు వినుండు, జన్మంబు శాంత ఘోర మూఢ గుణంబులచేత నైనను, సుఖదుఃఖ గుణంబుల చేత నయినను, ధార్మికాది గుణంబులచేత నైనను, సకల భూతంబులు త్రైవిధ్యంబు నే ప్రకారంబునం బొందు, నా ప్రకారంబున జన్మాంతరంబునం బొందుచుండు, దేవుండైన యముండు సర్వ జీవాంతర్యామియై ధర్మాధర్మయుక్తంబైన పూర్వరూపంబులను మనస్సుచే విశేషంబుగఁ జూచుచుండి,**

వాని కనురూపంబులఁ జింతింపుచుండు. అవిద్యోపాధి జీవుండు తమోగుణయుక్తుండై ప్రాచీన కర్మంబుల నేర్పడ్డ వర్తమాన దేహంబు, నే నని తలంపుచుండి, నష్ట జన్మస్మృతి గలవాఁడై పూర్వాపరంబు లెఱుంగం జాలకుండు. మఱియుఁ గర్మేంద్రియములచేతఁ గర్మంబులఁ జేయుచుండి, జ్ఞానేంద్రియంబుల చేతఁ దమోవిషయంబు లయిన శబ్దస్పర్శ రూప రసగంధంబుల నెఱుంగుచుండి, పదియాఱవది యైన మనంబుతోఁ గూడి, పదియేడవవాఁ డగుచుండి, షోడశోపాధ్యంతర్గతుం డై యొక్కరుం డైన జీవుండు, సర్వేంద్రియ విషయ ప్రతి సంధానంబు కొఱకు జ్ఞానేంద్రియ కర్మేంద్రియ మనోవిషయంబులం బొందుచుండి, షోడశ కళలం గలిగి, లింగ శరీరం బనంబరఁగి, గుణత్రయకార్యం బను నిమిత్తంబున హర్షశోక భయంబుల నిచ్చుచున్న సంసారంబు ధరియింపుచుండు. అజిత షడ్వర్గుండైన దేహి కర్మంబు లొల్లని బుద్ధి నెఱింగియు, వినియుఁ, గర్మంబులు సేయుచుండి, తన సంచార కర్మంబునం జుట్టుకొన్న పసిరికాయ పురువునుం బోలె నిర్గమోపాయం బెఱుంగక నాశంబు నొందుచుండు. వర్తమాన వసంతాది కాలంబు, భూత భావి వసంతకాల యోగ్యం బైన పుష్ప ఫలాదులు తత్కాల జ్ఞాపకంబు నెట్లు సేయు, నట్లు భూత భావి జన్మంబులకు ధర్మాధర్మంబులు నిదర్శనంబులు సేయుచుండు. ఒక్కనరుండు నొక క్షణంబును గర్మంబుఁ జేయకుండువాఁడు లేఁడు. పూర్వసంస్కారంబులం గల గుణంబుల చేతఁ బురుషుం డవశుండు గావునఁ బలిమిఁ గర్మంబులు సేయింపబడుచుండు. అవ్యక్తనిమిత్తంబు నొంది తదనురూపంబు లైన స్థూల సూక్ష్మ శరీరంబులు మాతా పితృ సదృశంబు లగుచుండు. ఇట్టి విపర్యయంబు పురుషునికిఁ బ్రకృతి సంగమంబునం గలుగుచుండు. ఆ ప్రకృతి పురాణ పురుషుం డైన య ప్పరమేశ్వరుని సేవించినఁ దలంగుచుండు. 88

* ఇంకా వినండి. ఈ లోకంలో ప్రాణులు గుణత్రయ సంబంధంచేత మూడు విధాలుగా ఉంటారు. శాంతస్వభావులు, ఘోర స్వభావులు, మూఢస్వభావులు అని. వీరిలో శాంతస్వభావులు ధర్మమార్గంలో ప్రవర్తిస్తూ సుఖపడతారు. ఘోరస్వభావులు కూడని మార్గాలలో నడచి నానాకష్టాల పాలవుతారు. మూఢ స్వభావులు కొంతమంచిగా కొంత చెడుగా ప్రవర్తిస్తూ సుఖ దుఃఖాలను కొని తెచ్చుకుంటారు. వారి ప్రవర్తనలకు అనుగుణంగానే వారికి రాబోవు జన్మలు ప్రాప్తిస్తాయి.

ధర్మస్వరూపుడైన యముడు సమస్త జీవులలో అంతర్యామిగా ఉంటాడు. అలా ఉండి ఆ యా జీవుల ధర్మాధర్మాల స్వరూపాలను విశేష దృష్టితో గమనిస్తూ వాటికి అనురూపమైన మార్గాలను కల్పిస్తుంటాడు. అజ్ఞానము ఉపాధిగా గల జీవుడు తమోగుణంతో కూడినవాడై పూర్వకర్మలచేత ఏర్పడిన ఇప్పటి ఈ దేహమే తానని భావిస్తాడు. అందువల్ల పూర్వజన్మ స్మృతిని కోల్పోతాడు. కాళ్లు, చేతులు మొదలైన కర్మేంద్రియాలతో ఏవేవో కర్మలు చేస్తుంటాడు. కన్నులు, చెవులు మొదలైన జ్ఞానేంద్రియాల ద్వారా జ్ఞానాన్ని సముపార్జించకుండా కేవలం శబ్దస్పర్శ రూపరసగంధాలను మాత్రమే గ్రహిస్తుంటాడు.

అయిదు కర్మేంద్రియాలు, అయిదు జ్ఞానేంద్రియాలు, అయిదు తన్మాత్రలు, ఒక మనస్సు మొత్తం పదునారు, జీవుడు పదునేడవవాడై ఈ పదునారు ఉపాధులతో సంబంధ సంస్పర్శలు కలిగి సంసార బంధాలలో చిక్కుకొని ఉక్కిరి బిక్కిరి అవుతుంటాడు. పది ఇంద్రియాలు పంచ తన్మాత్రలు, మనస్సు అనే పదునారు కళలతోకూడి గుణత్రయ విశిష్టమైన లింగశరీరం సత్త్వగుణంవల్ల హర్షాన్నీ, రజోగుణంవల్ల శోకాన్నీ, తమోగుణంవల్ల భయాన్నీ జీవునికి కలిగిస్తుంది.

ఈ విధంగా కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాలనే అరిషడ్వర్గాన్ని జయించలేక సంసార బద్ధుడైన జీవుడు కర్మలు బంధహేతువు లని తెలిసి కూడా పూర్వజన్మ సంస్కార ప్రాబల్యం వల్ల ఇష్టం లేక పోయినా బలవంతంగా కర్మలు చేస్తున్నాడు. పట్టుపురుగు తన నోటిలో నుండి వచ్చిన దారాలతోనే తన చుట్టూ ఒక గూడు అల్లుకొని దానిలో నుండి బయటపడే మార్గంలేక నశించినట్లే జీవుడు స్వయంగా తనచుట్టూ ఏర్పరచుకొన్న కర్మబంధాలలో చిక్కి స్రుక్కి సురిగి పోతున్నాడు.

వర్తమానకాలంలో మనముందు నడుస్తున్న వసంతం మొదలైన ఋతువుల స్వరూపస్వభావాలను బట్టి జరిగిపోయిన, జరుగనున్న వసంతాదులలోని పుష్పాలను, ఫలాలను, శీతోష్ణ స్థితులను ఊహిస్తాము. అదే విధంగా జీవుని వర్తమాన జీవితంలోని నడవడిని బట్టి అతడు పూర్వ జన్మంలో ఎట్లా ఉండేవాడో, రాబోవు జన్మలో ఎట్లా ఉంటాడో నిర్ణయింపవచ్చు.

ఏ జీవి అయినా ఒక్క క్షణకాలం కూడా కర్మచేయకుండా ఉండలేడు. పూర్వజన్మ సంస్కారానికి అనుగుణంగానే పురుషుని గుణాలు ఉంటాయి. ఆ గుణాలు అతణ్ణి లొంగతీసుకొని అతనిచేత బలవంతంగా కర్మలు చేయిస్తుంటాయి. అవ్యక్తమైన ఆ పూర్వజన్మ సంస్కారం నుండి జీవుని స్థూల సూక్ష్మ శరీరాలు ఏర్పడుతుంటాయి. అవి అప్పటి తల్లిదండ్రుల పోలికలను సంతరించుకుంటాయి.

పురుషునికి విచిత్రమైన ఈ విపర్యయం ప్రకృతి సంబంధంవల్ల కలుగుతుంది. సంసార కారణమైన ఈ ప్రకృతిని తొలగించుకోవాలంటే పురాణ పురుషుడైన పరమేశ్వరుని సంసేవనం తప్ప మరోమార్గం లేదు.

**సీ. కావున నితఁడు సత్కర్మ వర్తనమున భూదేవకులమునఁ బుట్టినాఁడు**
**దాంతుఁడై శాంతుఁడై ధర్మసంశీలుఁడై సకల వేదంబులఁ జదివినాఁడు**
**అనయంబు గురువుల నతిథులఁ బెద్దలఁ జేరి శుశ్రూషలు చేసినాఁడు**
**సర్వభూతములకు సమబుద్ధియై చాల బహు మంత్ర సిద్ధులఁ బడసినాఁడు**

**తే. సత్యభాషణ నియమంబు జరపినాఁడు, నిత్యనైమిత్తికాదుల నెఱపినాఁడు**
**దండి లోభాది గుణములఁ దరపినాఁడు, మంచిగుణములు దనయందు మరపినాఁడు. 89**

* ఈ అజామిళుడు పూర్వజన్మంలో మంచిపనులు చేసి చక్కగా ప్రవర్తించినవాడై బ్రాహ్మణకులంలో జన్మించినాడు. ఇంద్రియాలను జయించి శాంతచిత్తుడై ధర్మమార్గాన నడచుకుంటూ వేదాలన్నింటినీ

పఠించాడు. సర్వదా గురువులనూ, అతిథులనూ, పెద్దలనూ ఆశ్రయించి సేవలు చేశాడు. సర్వజీవులయందును సమబుద్ధి గలవాడై ఎన్నెన్నో మంత్రసిద్ధులను పొందినాడు. సత్యసంధుడై నియమంగా నిత్యకృత్యాలను నైమిత్తిక కర్మలనూ నెరవేర్చాడు. లోభం మొదలైన దుర్గుణాలను విడిచి సద్గుణాలనే తన యందు నిల్పుకున్నాడు.

క. సతతాచార సమంచిత, మతియై సుజ్ఞానములకు మరగెడి తఱి నా
యతగతి నాతని కంగజ, మతమై నవయౌవనాగమం బెడ సొచ్చెన్. **90**

* సంతతమూ సదాచారాన్ని పాటించే బుద్ధిగలవాడై ఉత్తమమైన జ్ఞానమార్గాన్ని అవలంబించే సమయంలో మదనోన్మాదాన్ని కలిగించే నవయౌవనం అతడి హృదయంలో జొరబడింది.

సీ. కడకంట యౌవనగర్వంబు వొడ గట్టె మదిలోన నుద్రేకమదము దొట్టెఁ
గడు మేనఁ గామవికారంబు దలసూపె ముఖమునఁ జిఱునవ్వు మొలకలెత్తె
నతిపుష్టి నిష్ఠురం బయ్యె దేహం బెల్లఁ గచభారమున నెఱికప్పు మెఱసె
కటిభారమున నూరుకాండముల్ జిగి మీఱె బాహుశాఖలు దీర్ఘభంగిఁ దోఁచె
తే. నురము విపుల మయ్యె నుల్లసద్వరకాంతి, పూర మంగకమునఁ బొందుపడియె
భూరితేజుఁ డైన భూసురాన్వయునకు నభినవైక యౌవ నాగమమున. **91**

* అభినవమైన యౌవనం ఆవిర్భవించిన సమయంలో అజామిళుడి కడకన్నుల్లో యౌవన గర్వం కానుపించింది. మనస్సులో ఉద్రేకం ఉప్పొంగింది. శరీరమంతటా కామవికారం తలచూపింది. మోముపై చిరునవ్వు మొలకెత్తింది. బాగా బలిసి దేహమంతా గట్టిపడింది. వెంట్రుకలు నల్లగా నిగనిగ మెరిశాయి. నడుము పెద్దదయింది. తొడలు నున్నపడ్డాయి. బాహువులు పొడవైనాయి. రొమ్ము విశాలమయింది. అవయవములన్నీ నవ నవ కాంతులతో మెరుస్తూ కుదురుకున్నాయి. ఈ విధంగా ఆ బ్రాహ్మణుడు యౌవనంలో అడుగుపెట్టి అధికతేజోవంతు డైనాడు.

క. హృదయమునఁ బొడము యౌవన, మదము వెలిం దోఁచుభంగి మానితరుచిఁ ద
ద్వదనమున నూఁగుమీసలు, పొదలుచుఁ గప్పడరి చూడఁ బొంకం బయ్యెన్. **92**

* హృదయంలో మొలకెత్తిన యౌవనమదం బయటికి ఉబికి వచ్చిన విధంగా అందమైన ఆతని ముఖంపై నూనూగు మీసాలు మొలకెత్తి నల్లగా చూడముచ్చటగా కన్పించాయి.

వ. మఱియును. **93**

క. తమ్మివిరిమీఁద వ్రాలిన, తుమ్మెద పంక్తియును బోలెఁ దోరపులీలం
గ్రమ్ముకొని విప్రతనయుని, నెమ్మొగమునఁ గానఁబడియె నెఱిమీసంబుల్. **94**

* తామరపుష్పంమీద వ్రాలిన తుమ్మెదల బారులాగా ఆ బ్రాహ్మణ కుమారుని నెమ్మోముపై అందమైన మీసాలు క్రమ్ముకొని కానవచ్చాయి.

వ. అంత ననంగ బ్రహ్మతంత్రంబునకు వసంతుం డొనర్చు నంకురార్పణారంభంబునుం బోలె లలిత కిసలయ విసర ప్రసార భాసుర బహు పాదపాది పురోపవన పవన జవనప్రభావ పరికంపిత విట విటీజన హృదయ ప్రఫుల్ల పల్లవ భల్లంబును, ననూన ప్రసూన నిర్భర గర్భావిర్భూత సురభి పరాగపటల పటఘటిత నభోమండలంబును. నమంద నిష్యంద మరంద బిందుసందోహ కందళిత చిత్తమత్త మధుప సంకుల ఝంకార ముఖరిత సకల దిశావలయంబును, నిరంతర ధారాళ రసభరిత పరిపక్వ ఫలానుభవ ప్రభవ సమ్మోదవాద శుకప్రముఖ పతంగ కోలాహలంబు నైన మధుమాసంబు సర్వజన మనోహరంబునై నిఖిల వనపాదపంబుల నలంకరించె. అయ్యవసరంబున నజామిళుండు పితృనిర్దేశం బునం గుశ సమిత్పుష్ప ఫలార్థంబు వనంబున కరిగి, తిరిగి వచ్చు సమయంబున నొక్క లతాభవనంబున. 95

* ఇంతలో వసంత ఋతువు వచ్చింది. మన్మథుడనే బ్రహ్మదేవుడు ప్రారంభించిన యజ్ఞానికి వసంతుడనే పురోహితుడు అంకురారోపణం చేసినట్లు ఉద్యానవనాలలోని చెట్లకొమ్మలు క్రొత్తచిగుళ్లు తొడిగాయి. వాయువేగానికి కదలుతున్న ఆ చిగురాకులు కంపించుతున్న జారజారిణీ జనహృదయాలలో గ్రుచ్చుకొనే బాకులు లాగా ఉన్నవి. చక్కగా వికసించిన పువ్వులలో నుండి చేలరేగిన పుప్పొడి దుమారాలు ఆకాశాన వ్రేలాడగట్టిన చాందినీలవలె ప్రకాశిస్తున్నాయి. పూలలో చిందుతున్న మకరంద బిందువుల విందులతో మైమరచిన మధుకరాల మధుర ఝంకార నాదాలతో దిక్కులన్నీ పిక్కటిల్లు తున్నాయి. బాగా పండి పగిలిన ఫలాలను ఆరగిస్తూ ఆనందంతో చిలుకలు మొదలైన పక్షులు కలకల ధ్వనులు చేస్తున్నాయి. ఈ విధంగా అందరికీ ఆనంద దాయకమైన మధుమాసం చెట్లన్నింటికీ క్రొత్తసొగసులు చేకూర్చింది. ఆ సమయంలో అజామిళుడు తన తండ్రి ఆజ్ఞానుసారం దర్భలూ, సమిధలూ, పుష్పాలూ, పండ్లూ తీసుకొని రావటం కోసం తోటలోనికి వెళ్లి తిరిగివస్తూ ఒక దట్టమైన పొదరింట్లో ఒక దృశ్యాన్ని తిలకించాడు.

క. బద్ధానురాగయై స్మర, యుద్ధంబున కలరు బుద్ధి నురు కామకళా
సిద్ధ యగు వృషలితోఁ బ్రియ, వృద్ధిం దగఁ గూడియున్న విటు నొరుఁ గాంచెన్. 96

* ఆ పువ్వుటీరంలో పొంగిపొరలే కామోద్రేకంతో, అంతకంతకు అతిశయించుతున్న ఆసక్తితో రతిక్రీడలలో చతురురాలైన తన ప్రియురాలితో ఆనందిస్తున్న ఒకానొక కాముకుణ్ణి అజామిళుడు అవలోకించాడు.

క. భటునిన్ రతిశాస్త్ర కళా, ర్భటునిన్ వర యౌవనానుభవ మదవిభవో
ద్భటునిన్ సురతేచ్ఛా సం, ఘటునిన్ విగతాంబరోరుకటునిన్ విటునిన్. 97

* ఆ జారుడు రతిశాస్త్రంలో ఆరితేరినవీరుడు. నవయౌవనంలో కామోన్మత్తుడై ఉన్నాడు. సంభోగకాంక్షతో తహతహ లాడుతున్నాడు. మొలమీద గుడ్డ జారిపోవడం కూడా తెలియనంత మత్తులో ఉన్న ఆ జారపురుషుణ్ణి అజామిళుడు చూచాడు.

శా. హాలా ఘూర్ణిత నేత్రతో మదన తంత్రారంభ సంరంభతో
ఖేలాపాలన యోగ్య భూవిభవతోఁ గీర్ణాలకాజాలతో
హేలాలింగన భంగి వేషవతితో నిచ్ఛావతీ మూర్తితోఁ
గేళిం దేలుచునున్న వానిఁ గనెఁ బుంఖీభూత రోమాంచుఁడై 98

* వాడితో క్రీడిస్తున్న ఆడది కల్లుతాగిన మైకంలో కనుగ్రుడ్లు త్రిప్పుతూ మళ్ళీ మళ్ళీ సంభోగం కోసం పై పైకి విజృంభిస్తున్నది. కనుబొమలు నాట్యం చేస్తున్నాయి. నుదుటిమీద ముంగురులు చెదురుతున్నాయి. ఆలింగనం కోసం వేగిర పడుతు వివిధ భంగిమలు ప్రదర్శిస్తున్నది. మూర్తీభవించిన కామవాంఛలాగున ఉన్న ప్రియురాలితో శృంగారకేళిలో తేలియాడుతున్న అతణ్ణి తిలకిస్తున్న అజామిళుడికి శరీరం పులకించింది.

క. కలికి వగ మదన కదనపుఁ, బలుకుల కలకలము బెడఁగు వడు మేఖల ము
వ్వల రవళిఁ దగిలి గతిగొనఁ, గలకంఠి రతంబు సలుపు గమకముఁ గనియెన్. 99

* రతి పారవశ్యంలో ఆ సొగసుకాని కంఠంలోనుండి ఏవేవో అవ్యక్త మధురధ్వనులు వినిపించుతున్నాయి. ఆ శబ్దాలకు ఆ అందకత్తె నడుమున కదులుతున్న ఒడ్డాణపు మువ్వ సవ్వడి లయ తప్పకుండా తాళం వేస్తున్నది. ఈ విధంగా తన ప్రియునితో సురత క్రీడలో ఆసక్తురాలై ఉన్న ఆ వెలయాలి తమకాన్నీ గమకాన్నీ అజామిళుడు కనుగొన్నాడు.

క. కవకవనై పదనూపుర, రవరవ లాగుబ్బుకొన్న రతిపతి గతులం
జివచివనై విటు చెవులకు, రవళిన్ రతిసల్పు రతుల రవరవఁ గనియెన్. 100

* ఆ వెలయాలి కాలి అందెలు ఘల్లు ఘల్లుమని ఒకదానితో ఒకటి పోటీపడి ధ్వనిస్తూన్నాయి. ఆ అందెల చప్పుళ్లు విటునికి వీనుల విందుగా వినిపించుతున్నాయి. ఇలా ఒకరిపైకి ఒకరు ఎగబడి సాగించుతున్న సంభోగ చమత్కారాలను అజామిళుడు ఆలోకించాడు.

చ. కురు లళికంబుపై నెగయఁ గ్రొమ్ముడి వీఁడగ గుబ్బదోయిపై
సరములు చౌకళింపఁ గటిసంగతి మేఖల తాళగింప స
త్కర వర కంకణావళులు గర్జిలఁ గౌ నసియాడ మీఁదుగా
మరుని వినోదముల్ సలిపె మానిని యౌవన గర్వరేఖతోన్. 101

* కురులు కనుబొమలపై ఎగురుతుండగా, కొప్పుముడి వీడగా, వక్షోజాలపై ముత్యాల సరాలు నాట్యమాడగా, మొలనూలు చిరుగంటలు తాళం వేయగా అందాల కరకంకణాలు ధ్వనింపగా నడుం తూగాడగా యౌవనగర్వంతో ప్రియుని పైకొని ఆ మగువ మన్మథకేళి సల్పింది.

క. మవ్వపు సుకుమారాంగిని, జవ్వని నుపగూహనాది సముచిత రతులన్
నివ్వటిలుదానిఁ గని మది, నువ్విళ్ళూరంగ మన్మథోద్దీపనుఁడై 102

* మిస మిస లాడే మృదువైన శరీరంగల దానిని నవయౌవన వతిని - కౌగిలింతలు మొదలైన శృంగార క్రీడలలో ఆరితేరిన దానిని ఆ వెలయాలిని చూచి అజామిళుడు కామోద్రేకంతో ఉవ్విళ్లూరాడు.

తరలము.
బహుళ దృక్పరిపాక మోహ నిబద్ధుఁ డౌచు మనంబులో
సహజ కర్మము వేదశాస్త్రము సాత్త్వికంబుఁ దలంచి త
న్నిహిత చిత్తము వట్టి పట్టఁగ నేరఁడయ్యె సదా మనో
గహనమందు మరుండు పావకు కైవడిన్ జరియింపఁగాన్. 103

* తేప తేపకూ ఏపుమీరిన ఆమె చూపులనే మోహపాశాలలో చిక్కుకొన్న ఆ బ్రాహ్మణ కుమారుడు నిత్యకృత్యాలైన వైదిక కర్మలనూ శాస్త్రపాఠాలనూ జపతపాలనూ మరచిపోయాడు. అతడి మనస్సనే అరణ్యంలో కామోద్రేకమనే కార్చిచ్చు చెలరేగ సాగింది. నియమబద్ధమైన అతడి చిత్తం పట్టు తప్పిపోయింది.

శా. ఆ లీలావతి గండపాళికలపై హాస ప్రసాదంబు పై
నాలోలాలక పంక్తిపై నొసలిపై నాకర్ణ దృగ్భూతి పై
హేలాపాది కుచద్వ యోరు కటిపై నిచ్చల్ పిసాళింపఁగా
జాలిం బొందుచు నాత్మఁ గుందుచు మనోజాతానలోపేతుఁడై 104

* అజామిళుడు ఆ క్షణం మొదలు ఆ అందాల భామ చిక్కని చెక్కిళ్లనూ, చక్కని చిరునవ్వునూ, కదలుతున్న ముంగురులనూ, నున్నని నుదురునూ, చెవులదాకా వ్యాపించిన వాల్గన్నులనూ, బిగువైన కుచాలనూ, విశాలమైన కటిప్రదేశాన్నీ, మాటి మాటికీ స్మరింపసాగాడు. అతడి మనస్సులో ఆమెను పొందాలనే కోరిక చెలరేగింది. దిగులుతో క్రుంగిపోయాడు. విచారించాడు. కామావేశానికి లోనైనాడు.

గీ. మఱి కులాచార వర్తన మాటు చేసి, పరగు పిత్రర్థములు దాని పాలు చేసి
సాధు లక్షణ గుణవృత్తిఁ జాలు చేసి, లోలలోచన పసఁ జెంది లోలుఁ డయ్యె. 105

* కులాచార మర్యాదలను కూలద్రోశాడు. తండ్రిగారు సంపాదించిన ఆస్తి నంతటినీ దానిపాలు చేశాడు. సాధులక్షణాలైన సద్గుణాలను విడనాడాడు. బాగా రుచి మరగి ఆ వాలుగన్నుల వెలయాలి అందచందాలకు లొంగిపోయాడు.

క. శ్యామఁ గుసుమాస్త్ర ఖేలన, కామఁ గులస్త్రీలలామఁ గమనీయగుణ
స్తోమ నిజభామ నొల్లక, ధామంబున డించి క్రించుఁదనమునఁ బొడవై. 106

* ఇంటి వద్ద తనభార్య ఉన్నది. ఆమె ఎంతో సౌందర్యవతి. సుగుణవతి. సౌభాగ్యవతి. నవయౌవనవతి. అటువంటి అందాలరాశిని విడిచిపెట్టి ఆ పరమ మూర్ఖుడు సిగ్గుఎగ్గులు వదలి ఆ వెలయాలి ఇంటిలోనే కాపురం పెట్టాడు.

ఉ. బంధులఁ దిట్టి సజ్జనుల బాధలఁ బెట్టి యనాథకోటిఁ బెన్
బందెలు సుట్టి యీరములు పట్టి పథంబులు గొట్టి దిట్టయై
నిందల కోర్చి సాధులకు నిందితుఁడై గడియించు విత్త మా
సుందరి కిచ్చి మచ్చికలు సొంపెదఁ గూర్చి వసించెఁ దత్కృపన్. 107

* ఈ విధంగా అజామిళుడు చుట్టపక్కాలను దూషించాడు. సజ్జనులను ద్వేషించాడు. దిక్కులేని దీనులను చిక్కులపాలు చేశాడు. చిట్టచివరకు ధనం కోసం దారులు కాచి వచ్చేపోయ్యే జనాన్ని దోచుకున్నాడు. దొంగతనంలో ఆరితేరాడు. ఎవరు ఏ మనుకొన్నా ఎన్ని తిట్టినా లెక్కచెయ్యకుండా దారులకొట్టి సంపాదించిన ధనమంతా ఆ పడుపుకత్తె చేతుల్లో పోసి దానికి దాసుడై దాని దయా దాక్షిణ్యాలపై జీవింపసాగాడు.

సీ. సముచిత శ్రుతిచర్చ చర్చింప నొల్లక సతి కుచద్వయచర్చఁ జర్చసేయుఁ
దర్క కర్కశ పాఠ తర్కంబు గాదని కలికితోఁ బ్రణయ తర్కంబు సేయు
స్మృతి పదవాక్య సంగతిఁ గాక తత్సతి పదవాక్య సంగతిఁ బరఁగఁ జేయు
నాటకాలంకార నైపుణం బుడిగి త న్నాటకాలంకార పాటిఁ దిరుగుఁ

గీ. బరఁగఁ జిరకాల మీ రీతిఁ బాపనియతి, రమణ దాసీ కుటుంబ భారము వహించి
యది కుటుంబిని గాఁగఁ బాపాత్ముఁ డగుచు, నశుచియును దుష్టవర్తనుఁడై మెలంగె. 108

* సముచితమైన వేదాలను గూర్చి చర్చించడం మానివేసి ప్రియురాలి పాలిండ్లజంటపై చందనచర్చ సాగించాడు. తర్కశాస్త్ర పాఠాలను మాని ఉంచుకొన్న దానితో ప్రణయతర్కాలు ప్రారంభించాడు. ధర్మశాస్త్రాలలోని పదాలనూ వాక్యాలనూ చర్చింపక ఆమె పదాలనూ వాక్యాలనూ మెచ్చుకొని ముచ్చటించటం మొదలు పెట్టాడు. నాటకాలలోని అలంకారాలలోని నైపుణ్యాన్ని విడిచి ప్రియురాలి నటనలనూ అలంకారాలనూ వర్ణిస్తూ తిరుగ సాగాడు. చాలాకాలం ఈ ప్రకారంగా అజామిళుడు భ్రష్టాచారుడై ఆ వేశ్యకుటుంబ భారాన్ని మోస్తూ అదియే భార్యగా భావిస్తూ పాపచిత్తుడై మలినదేహుడై చెడు మార్గంలో ప్రవర్తింప సాగాడు.

క. అటు గానఁ బాపకర్ముని, గుటిలుని సుజనార్తు ధూర్తుఁ గ్రూరుని నే మా
రటమునఁ గొని యేగెద మం, తట దండమువలన నితఁడు ధన్యత నొందున్. 109

* అందువల్ల ఈ పాపాత్ముణ్ణి ఈ కుటిల చిత్తుణ్ణి, ఈ సజ్జన కంటకుణ్ణి - ఈ ధూర్తుణ్ణి - ఈక్రూరుణ్ణి మేము బలవంతంగా బంధించి తీసుకొని పోతున్నాము. ఇటు పిమ్మట ఇతడు తగిన దండనంవల్ల ధన్యుడౌతాడు.

వ. ఇట్లు పలుకుచున్న యమదూతల వారించి, నయకోవిదులైన భగవద్దూత లిట్టనిరి. 110

* అని పల్కుతున్న యమభటులను నివారించి నీతి శాస్త్రపండితులైన భగవంతుని దూతలు ఈ విధంగా అన్నారు.

క. అవురా! ధర్మవివేక, ప్రవరుల పస గానఁ బడియెఁ బాపము పుణ్యో
ద్భవుల నదండ్యుల దండన, వివరం బొనరింపఁ బడియె విధి యెఱుఁగమిచేన్. 111

* ఆహాహా! ఏమి మీ తెలివితేటలు! మీయుక్తాయుక్త వివేకం, మీ ధర్మనిర్ణయ పాండిత్యం తెలిసిపోయింది. అదండ్యులైన పుణ్యపురుషులను దండించే మీ అజ్ఞానం వెల్లడయింది.

చ. సములును సాధులున్ విహితశాసనులున్ సుదయాళురున్ శుభో
త్తమగుణులైన యట్టి తలిదండ్రులు బిడ్డల కెగ్గు సేయుచోఁ
గ్రమమున వార లెవ్వరికిఁ గైకొని కుయ్యిడఁ జాలువారు సం
భ్రమమున మీ మనంబులఁ దిరంబుగఁ జర్చ యొనర్చి చూడుఁడా! 112

* సమబుద్ధి గలవారు, సాధువర్తనులు, నియమబద్ధులు, మంచి దయాపరులు, గొప్ప సుగుణాలు కల్గిన తల్లి దండ్రులే తమ బిడ్డలకు కీడు చేయ తలపెట్టితే ఇక ఆ బిడ్డలు ఎవరితో మొర పెట్టుకోగలరు? మీ మనస్సులలో మీరే కొంచెం ఆలోచించి చూడండి.

గీ. ఎఱుక గలుగు నాతఁ డేది యొనర్చిన, నదియ చేతు రితరు లైన వార
లతఁడు సత్య మిట్టి దనె నేని లోకంబు, తత్ప్రవర్తనమునఁ దగిలి యుండు. 113

* లోకంలో జ్ఞానం కలవాడు ఏది చేస్తే ఇతరులుకూడా దానినే చేస్తారు. ఆతడు దేనిని సత్యం అని నిర్ణయం చేస్తాడో లోకం దానినే నమ్మి అదే విధంగా ప్రవర్తించుతుంది.

గీ. నెమ్మిఁ దొడలమీఁద నిద్రించు చెలికాని, నమ్మఁదగినవాఁడు నయము విడిచి
ద్రోహబుద్ధిఁ జంపఁ దొడరునే? యెందైనఁ, బ్రీతి లేక ధర్మదూతలార! 114

* మీరు ధర్మదేవత దూతలుగదా! నమ్మి తన తొడలపై నిద్రించే మిత్రుణ్ణి నీతిని విడిచి ప్రీతిలేక ద్రోహబుద్ధితో ఎక్కడైనా ఎవ్వడైనా చంపపూనుకుంటాడా! మీరే చెప్పండి.

గీ. చిత్తమెల్ల నిచ్చి చెలితనంబున వచ్చి, నచ్చి కలయ మెచ్చి నమ్మువానిఁ
గరుణ గలుగువాఁడుఁ గడుసౌమ్యుఁ డగువాఁడుఁ, జింతసేయ కెట్లు సెఱుప నేర్చు? 115

* స్నేహభావంతో వచ్చి, హృదయమంతా ఇచ్చి, తనకు బాగా నచ్చి, తనను మెచ్చి నమ్ముకున్న వ్యక్తికి దయాదాక్షిణ్యాలు గల బుద్ధిమంతుడు ఏ మాత్రం ఆలోచనలేకుండా అపకారం చేస్తాడా?

వ. అదియునుం గాక. 116

ఉ. ఈతఁడు కోటి సంఖ్యలకు నెక్కుడు పుట్టువులందుఁ జెంది యా
యాతము లైన పాప నివహంబుల నన్నిటిఁ బాఱఁ దోలెఁ బ్ర
ఖ్యాత మతిన్ మహామరణ కాలమునన్ హరిపుణ్యనామ సం
భూత సుధామయాద్భుత విభూతికరాక్షర సంగ్రహంబునన్. 117

* అంతే కాకుండా ఇతడు కోటి కంటే ఎక్కువ జన్మాలలో చేసిన పాపసమూహాలను ఈ జన్మలో ఇప్పుడు బుద్ధిమంతుడై పారద్రోలాడు. మరణ సమయంలో అమృతంవంటి భగవంతుని పుణ్యనామ సంకీర్తనం చేసిన మహాభాగ్యం ఇతడికి అబ్బింది.

సీ. బ్రహ్మహత్యానేక పాపాటవుల కగ్ని కీలలు హరినామ కీర్తనములు
గురుతల్ప కల్మష క్రూర సర్పములకుఁ గేకులు హరినామ కీర్తనములు
తపనీయ చౌర్య సంతమసంబునకు సూర్య కిరణముల్ హరినామ కీర్తనములు
మధుపాన కిల్బిష మదనాగ సమితికిఁ గేసరుల్ హరినామ కీర్తనములు

గీ. మహిత యోగోగ్ర నిత్యసమాధి విధుల, నలరు బ్రహ్మాది సురులకు నందరాని
భూరి నిర్వాణ సామ్రాజ్య భోగభాగ్య, ఖేలనంబులు హరినామ కీర్తనములు. 118

* భగవంతుని నామసంకీర్తనలు బ్రహ్మహత్య మొదలైన పాపాలనే అడవులకు అగ్నిజ్వాలలు. హరినామ కీర్తనలు గురుద్రోహమనే ఘోర సర్పాలకు నెమళ్లు. భగవన్నామ కీర్తనలు బంగారాన్ని దొంగిలించడమనే మహా పాపరూపమైన చీకట్లను పోగొట్టే సూర్యకిరణాలు. హరినామ సంకీర్తనలు మధుపాన మహాపాపమనే మదపుటేనుగులను సంహరించే సింహాలు. మహిమతోగూడిన యోగసమాధి విధులతో ఒప్పే బ్రహ్మ మొదలగు దేవతలకు కూడా అందరాని మోక్ష సామ్రాజ్య వైభవ విలాసాలు హరినామ కీర్తనలు.

సీ. ముక్తికాం తైకాంత మోహన కృత్యముల్ కేలిమై హరినామ కీర్తనములు
సత్యలోకానంద సౌభాగ్యయుక్తముల్ కేలిమై హరినామ కీర్తనములు
మహిత నిర్వాణ సామ్రాజ్యాభిషి క్తముల్ కేలిమై హరినామ కీర్తనములు
బహుకాల జనిత తపఃఫల సారముల్ కేలిమై హరినామ కీర్తనములు

గీ. పుణ్యమూలంబు లనపాయ పోషకంబు, లభిమతార్థంబు లజ్ఞాన హరణ కరము
లాగమాంతోపలబ్ధంబు లమృతసేవ, లార్తశుభములు హరినామ కీర్తనములు. 119

* నారాయణ నామసంకీర్తనలు ముక్తికాంత ఏకాంత మోహన విహారాలు, బ్రహ్మలోక నివాసాన్ని ప్రసాదించే ఆనందసౌభాగ్య విలాసాలు, మోక్షసామ్రాజ్య పట్టాభిషేక స్వరూపాలు, అనేకజన్మలలో ఆర్జించిన తపఃఫలాల సారాంశాలు, నారాయణ నామసంస్మరణాలు పుణ్యాలకు పుట్టినిండ్లు, సర్వదా సంరక్షకాలు,

అభిమతార్థ ప్రదాయకాలు, అజ్ఞాన భంజకాలు, ఆర్తజన రంజకాలు. వేదాంతసారమైన అమృత పూరాన్ని అందించి శుభాన్ని చేకూర్చేవి హరినామ సంకీర్తనలు.

**క. కామంబు పుణ్యమార్గ, స్థేమంబు మునీంద్ర సాంద్ర చేతస్సరసీ**
**ధామంబు జిష్ణు నిర్మల, నామంబుఁ దలంచువాఁడు నాథుఁడు గాఁడే? 120**

* వాసుదేవుని నామంకంటే వాంఛనీయం మరేమున్నది? అది నిఖిల పుణ్యమార్గాలకూ నిలయం. అఖిల మునీంద్రుల అంతరంగాలనే సరోవరాలే దానికి ఆలయం. అటువంటి పరమ పురుషుని పవిత్ర నామం స్మరించేవాని ప్రాభవం చెప్పేదేముంది?

**క. డెందంబు పుత్రు వలనన్, జెందిన దని తలఁప వలదు శ్రీపతి పే రే**
**చందమున నైనఁ బలికిన, నందకధరుఁ డందె కలఁడు నాథుం డగుచున్. 121**

* ఈతడు "నారాయణా"అని పిలిచినప్పుడు ఇతని హృదయం కుమారుని మీద ఆసక్తమై ఉన్నదని మీరు తలంపవద్దు. భగవంతుని పేరును ఏ విధంగా పలికినప్పటికీ వాసుదేవుడు రక్షకుడై అందులో ఉండనే ఉంటాడు.

**గీ. బిడ్డపేరుఁ బెట్టి పిలుచుట విశ్రామ, కేళి నైన మిగుల గేలి నైన**
**పద్య గద్య గీత భావార్థముల నైనఁ, గమలనయనుఁ దలఁపఁ గలుషహరము. 122**

* కుమారుని పేరు పెట్టి పిలిచినా, విశ్రాంతి వేళలోనైనా, ఆటలోనైనా, పరిహాసంగానైనా పద్య-వచన-గీత- భావార్థాలతోనైనా సరే కమలాక్షుణ్ణి స్మరిస్తే చాలు, పాపం పరిహరింప బడుతుంది.

**ఉ. కూలినచోటఁ గొట్టుపడి కుందినచోట మహాజ్వరాదులం**
**బ్రేలినచోట సర్పముఖ పీడల నందినచోట నార్తులై**
**తూలినచోట విష్ణు భవదూరునిఁ బేర్కొనిరేని మీఁద న**
**క్కాలుని యాతనావితతిఁ గానరు పూనరు దుఃఖభావముల్. 123**

* నేలమీద తూలి కూలి పడినప్పుడుగానీ, దెబ్బలు తిని దుఃఖపడి నప్పుడుగానీ, భయంకరాలైన జ్వరాలతో ఏవేవో పిచ్చిమాటలు ప్రేలేటప్పుడుగానీ, పాము మొదలైన విషజంతువుల బాధ కలిగినప్పుడుగాని, ఆర్తితో అలమటించు నప్పుడుగానీ అమ్మో! బాబో! అనకుండా ఆ వాసుదేవుని నామం ఒక్కమాటు ఉచ్చరించితే చాలు, అటువంటి వారికి ఎటువంటి యమబాధలూ ఉండవు, సంసార దుఃఖాలూ దరిజేరవు.

**సీ. అతిపాపములకుఁ బ్రయత్న పూర్వకముగఁ దనుపాపములకు మితంబుగాఁగ**
**సన్ముని వరులచే సంప్రోక్తమై యుండు నిర్మలం బగు పాప నిష్కృతములు**
**క్రమరూపమున నుపశమనంబులగుఁ గాని తత్క్షణంబున నవి దరువలేవు**
**సర్వకర్మంబుల సంహార మొనరించి చిత్తంబునకుఁ దత్త్వసిద్ధి నొసఁగు**

గీ. నొనర నీశుసేవ యోగిమానస సరో, వాసుసేవ హేమవాసు సేవ
వేదవేద్యుసేవ వేదాంత విభుసేవ, పరమపురుష పాదపద్మ సేవ. 124

* పెద్ద పాపాలకు పెద్దప్రాయశ్చిత్తాలనూ, చిన్న పాపాలకు చిన్న ప్రాయశ్చిత్తాలనూ మహానుభావులైన మునులు నిర్ణయించే ఉన్నారు. కాని ఆప్రాయశ్చిత్తాలవల్ల ఆ పాపాలు తాత్కాలికంగా ఉపశమిస్తాయి తప్ప పూర్తిగా పరిహారం కావు. సమస్త పాపాలనూ సంపూర్ణంగా సంహరించి మనస్సును పరిశుద్ధం చెయ్యాలంటే భగవంతుని సేవ ఒక్కటే సరి అయిన త్రోవ. ఆ పరమేశ్వరుణ్ణి, ఆ యోగిమానస వాసుణ్ణి, ఆ కనకాంబరధారుణ్ణి, ఆ వేదవేద్యుణ్ణి, ఆ పురుషోత్తముణ్ణి సంస్మరిస్తూ ఆయన పాదాలు సేవిస్తే మోక్షం సిద్ధిస్తుంది.

క. హరి నెఱుఁగని యా బాలుఁడు, హరి భక్తులతోడఁ గూడి హరియను వాఁడున్
సరియై దోషము లడఁచును, గరువలితో నగ్ని తృణముఁ గాల్చిన భంగిన్. 125

* భగవంతు డంటే ఏమిటో ఎరుగని బాలుడు కూడా హరిభక్తులలో జేరి హరిహరి అని పలుకుతూ ఉంటే చాలు అగ్నిగాలితో కూడి గడ్డిని కాల్చి వేసినట్లు హరినామస్మరణం పాపా లన్నింటినీ పటాపంచలు చేస్తుంది.

ఉ. ఆరయ వీర్యవంత మగు నౌషధమెట్లు యదృచ్ఛఁ గొన్నఁ ద
చ్చారు గుణంబు రోగములఁ జయ్యనఁ బాపినమాడ్కిఁ బుణ్య వి
స్ఫారుని నంబుజోదరునిఁ బామరుఁ డజ్ఞుఁ డవజ్ఞఁ బల్కినన్
వారక తత్ప్రభావము ధ్రువంబుగ నాత్మగుణంబుఁ జూపదే! 126

* సారవంతమైన ఔషధం అనుకోకుండా పొరపాటున సేవించినప్పటికి దాని గుణం వృథాగా పోదు. దాని ప్రభావం రోగాలను పోగొట్టి తీరుతుంది. అదే విధంగా పరమపావనుడైన భగవంతుని నామం తెలియక పలికినమా, తిరస్కారభావంతో పలికినమా దాని ప్రభావం ఊరకే పోదు. దాని మహత్తర గుణాన్ని అది తప్పకుండా చూపించి తీరుతుంది.

క. ధృతి దప్పిన తఱినిఁ బురా, కృతమునఁ గాకెట్లు దోఁచుఁ గేశవుఁడు మదిన్
మితిలేని జగముఁ దాల్చిన, యతఁ డొక్కని మనములోన నణఁగెఁడు వాఁడే? 127

* అంత్యకాలం సమీపించి ధైర్యం సన్నగిల్లినప్పుడు ఏదో పూర్వ జన్మపుణ్య విశేషం ఉంటేనేగాని పరాత్పరుడు మనస్సులోకి రాడు. ముజ్జగాలను బొజ్జలో ధరించిన ఆ అనంతుడు ఆభగవంతుడు ఒకానొక మానవుని పరిమితమైన మనస్సులో ఊరకనే ఎలా ఇముడుతాడు? మరణకాలంలో మతి తప్పినప్పుడు పురాకృత సుకృతం ఉంటేనేగాని నారాయణ నామస్మరణం చేసే భాగ్యం ప్రాప్తించదు.

**మ. నిరతంబై నిరవద్యమై నిఖిల చిన్నిర్మాణమై నిత్యమై**
**నిరహంకార గుణాఢ్యమై నియమమై నిర్దోష మైనట్టి శ్రీ**
**హరి నామస్మర ణామృతం బితఁడు ప్రత్యక్షంబు సేవించెఁ దా**
**మరణాంతంబున నిట్టి సజ్జనుని ధర్మంబేల వ్యర్థం బగున్? 128**

* ఇక ఈ అజామిళుని విషయమంటారా! మరణకాలంలో ఈ మహనీయుడు శ్రీహరినామస్మరణం అనే అమృతాన్ని ప్రత్యక్షంగానే ఆస్వాదించాడు. శాశ్వతమైనదీ, నిర్దోషమైనదీ సమస్తమైన చైతన్యానికి ఆలవాల మైనదీ, నిత్యసత్యమైనదీ, అహంకార రహితములైన సుగుణాలతో కూడినదీ, నియమబద్ధ మైనదీ, నిర్మలమైనదీ అయిన నారాయణ నామస్మరణం వ్యర్థంగా ఎందుకు పోతుంది? బాహాటంగా భగవంతుని నామం ఉచ్చరించిన ఈ సత్పురుషుని జీవితం ఎందుకు వృథా అవుతుంది?

**వ. అని యిట్లు భగవద్దూతలు భాగవత ధర్మంబు నిర్ణయించి, యీ యర్థంబున మీకు సంశయంబు గలదేని మీ రాజు నడుగుఁడు. పొండు అని పలికి బ్రాహ్మణుని నతిఘోరం బైన యామ్యపాశ బంధ నిర్ముక్తునిం గావించి, మృత్యువు వలని యెడరు వాపిరి. అంత నా యమదూతలు చేయునది లేక యమ లోకంబునకుం జని, పితృపతికి సర్వంబును నెఱింగించిరి. అంత. 129**

* ఈ విధంగా దేవదేవుడైన వాసుదేవుని దూతలు భాగవత ధర్మాన్నీ, భగవన్నామ మహత్త్వాన్నీ నిర్ణయం చేశారు. వెంటనే ఆ బ్రాహ్మణుణ్ణి పరమభయంకరమైన యమపాశాల నుండి విముక్తుణ్ణి చేశారు. యమకింకరులను చూచి భయపడుతున్న అతనికి ధైర్యం కలిగించారు. అనంతరం యమదూతలు దేవదూతలతో జరిగిన సంభాషణంవల్ల ప్రభావితులైనవారై తమ మనస్సులలోని ఆగ్రహావేశాలను శాంతింపజేసుకున్నారు. భగవంతుని తత్త్వం తమకు పూర్తిగా తెలియదనీ, తెలుసుకో వలసింది ఇంకా ఉన్నదన్న సంగతి వారికి పూర్తిగా అర్థమైంది. అప్పుడు వారు ఏమీ చేయలేక నిరాకరింపబడినవారై వట్టి చేతులతో యమలోకానికి వెళ్ళారు. తమ ప్రభువైన యమధర్మరాజుకు జరిగిన సంగతి సమస్తమూ విన్నవించారు.

**క. అతఁడును బాశచ్యుతుఁడై, గతభయుఁడై ప్రకృతి నొంది కడు నుత్సవ సం**
**గతిఁ జూచి మ్రొక్కి మదిలో, నతులిత ముద మొదవి పొదలి హరిదాసులకున్. 130**

* ఇక్కడ అజామిళుడు యమపాశబంధాలు వీడిపోయినందువల్ల భయం తొలగిపోయి ధైర్యం వహించాడు. ఎదుట నున్న విష్ణుదూతలకు ఎంతో ఆనందంతో చేతులెత్తి నమస్కరించాడు.

**తే. నిలిచి కేలు మొగిచి పలుక నుద్యోగించి, చెలఁగుచున్న లోనితలఁపుఁ దెలిసి**
**చక్రధరుని కూర్మిసహచరు లరిగి ర దృశ్యు లగుచు దేవదేవు కడకు. 131**

* నిలుపబడి నమస్కరించి అజామిళుడు దేవదూతలతో ఏదో పలుక బోతున్నాడు. అతని మనస్సులోని భావం తెలుసుకున్న విష్ణుదూతలు అంతర్ధానం చెంది దేవదేవుడైన వాసుదేవుని సన్నిధికి వెళ్లిపోయారు.

క. వేదత్రయ సంపాద్యము, మోదంబు గుణాశ్రయంబు మును భగవ ద్ధ
ర్మాదేశంబగు తద్భట, వాదంబు నజామిళుండు వదలక వినుచున్. 132

* మూడు వేదాలసారమూ, ఆనందదాయకము, కల్యాణ గుణాలకు ఆలవాలమూ, భగవంతుని ధర్మాన్ని ప్రబోధించేదీ అయిన ఆ విష్ణుదూతల యమదూతల సంవాదాన్ని అజామిళుడు సమగ్రంగా ఆలకించాడు.

క. శ్రీమన్నారాయణ పద, తామరస ధ్యానసలిల ధౌత మహౌఘ
స్తోముండై సద్భక్తికి, ధామం బగుచుండెఁ దెలిసి తత్క్షణ మాత్రన్. 133

* శ్రీమన్నారాయణుని చరణకమల స్మరణమనే నిర్మల జలం అతని మహాపాతక సమూహా లన్నింటినీ కడిగివేసింది. అతని హృదయం నిశ్చల భక్తికి నిలయమై క్షణమాత్రంలో అతనికి జ్ఞానోదయ మయింది.

క. బరవసమున నరికట్టిన, దురితంబులఁ దలఁచి తలఁచి తుదిఁ దాపమునన్
హరి నీశు నాశ్రయింపుచుఁ, బరితాపము నొంది పలికె బ్రాహ్మణుఁ డాత్మన్. 134

* తాను ఎన్నెన్నో పాపాలు చేశాడు. అవన్నీ అతడి మనస్సులో బలవంతంగా అణచిపెట్టబడి ఉన్నాయి. ఇప్పుడు అవి మాటిమాటికీ తలంపుకు వచ్చాయి. అతడి మనస్సు పరితాపంతో క్రుంగిపోయింది. పరమేశ్వరుడైన శ్రీహరికి శరణాగతుడైనాడు. పశ్చాత్తాపంతో ఈ విధంగా అనుకున్నాడు.

సీ. వృషలియం దనురాగ వృద్ధి బిడ్డలఁ గని కులము గోదావరిఁ గూలఁ ద్రోచి
రచ్చల కెక్కి పెన్ రజ్జుసేతల సరి వారిలోపలఁ దలవంపు చేసి
కట్టిఁడిముదుక నై కర్మబంధంబుల పుట్టనై నిందల ప్రోవ నగుచుఁ
దరుణుల రోఁతల దవిలి భోగించిన కడిఁది నా జన్మంబు గాలిపోయెఁ

ఆ. జదువు చట్టుపడియె శాస్త్రంబు మన్నయ్యెఁ, బుద్ధి పురువు మేసెఁ బుణ్య మణఁగె
నీతి మట్టుపడియె నిర్మలజ్ఞానంబు, మొదలి కుడిగె బోధ మూరిఁబోయె. 135

* నేను ఆ శూద్రకాంతమీద అనురాగం పెంచుకున్నాను. ఆ జారిణియందు సంతానాన్ని కన్నాను. కులగౌరవాన్ని గోదావరిలో కలిపి వేశాను. నా బ్రతుకు రచ్చల కెక్కించాను. సిగ్గుమాలిన పనులకు పాల్పడి సాటివారిలో తలవంపులు తెచ్చుకొన్నాను. వార్ధక్యం పైనబడి నప్పటికీ సంసార బంధాలనుంచి బయటపడలేక లోకనిందలను లెక్క చేయకుండా వారకాంతా పరాయణుండనై ఆ రోత సుఖాల రొచ్చులో మునిగి తేలుతూ నా బ్రతుకంతా పాడుచేసుకున్నాను. పవిత్రమైన జీవితం భస్మమైపోయింది. నా చదువు చట్టుబండలైంది. నా శాస్త్రజ్ఞానమంతా శూన్యమై పోయింది. నా బుద్ధి పురువు మేసింది. పుణ్యం బుగ్గి అయింది. నీతి అడుగంటింది. నియమం మరుగుపడింది. నా తెలివి తెల్లవారింది.

క. చిక్కని చక్కని చన్నుల, మక్కువ యిల్లాలి విడిచి మాయలు గల యీ
వెక్కసపు మద్యపానపు, డొక్కపసం దగిలి దుర్విటుఁడనై చెడితిన్. 136

* నేనెంత పొరపాటుచేశాను! నా ధర్మపత్నిని, నవయౌవనంతో మిసమిసలాడే చక్కని చుక్కను, నేనంటే మక్కువగల దానిని లెక్కచేయక ధిక్కరించాను. త్రాగి తైతక్కలాడే ఈ డొక్కుముండ మాయలో చిక్కుకున్నాను. అన్ని విధాలా చెడిపోయాను.

ఉ. అక్కట! ఘోర దుష్కృత మహానలకీలలు నన్ను ముట్టి పే
రుక్కణఁగింప కిట్లు ధృతి నుండఁగ నిచ్చెనహో! దురాత్మునిం
గ్రక్కునఁ దల్లిదండ్రుల నకల్మషచిత్తులఁ బెద్దలన్ మఱే
దిక్కును లేనివారిఁ బెనుతిప్పులఁ బెట్టుచుఁ బాఱఁ దోలితిన్. 137

* అయ్యయ్యో! నే నెంత దుర్మార్గుణ్ణి! అమాయకులైన నా తల్లి దండ్రులను ముసలివారిని నేను తప్ప మరోదిక్కు లేని వారిని ఎన్నెన్నో బాధలు పెట్టాను. ఇంట్లోనుంచి వెళ్లగొట్టాను. నా భయంకర పాపాగ్ని జ్వాలలు నన్ను చుట్టుముట్టి కాల్చి భస్మం చెయ్యకుండా ఎందుకు విడిచి పెట్టాయో గదా!

క. అకృతజ్ఞుఁడ నై విడిచితిఁ, బ్రకృతిం గల బంధువులను బాల్యమున నమున్
వికృతిఁ జనకుండఁ బెంచిన, సుకృతుల మజ్జనకవరుల శోభనకరులన్. 138

* నే నెంత కృతఘ్నుణ్ణి! నా కెంతో మేలు చేసినవారిని. ఆత్మీయులైన చుట్టపక్కాలను పరిత్యజించాను చిన్నప్పుడు ఏ లోటూ లేకుండా నన్ను పెంచి పెద్దచేసిన పుణ్యాత్ములను, నా మేలు కోరేవారిని తండ్రి వైపు దాయాదులను వదలివేశాను.

వ. అప్పుడు 139

తే. పెక్కు పాతకముల భృశదారుణం బైన, దొడ్డ నరకమందుఁ బడ్డ నన్ను
నాపదలకుఁ బాపి యరికట్టి రక్షించి, రిట్టి ధర్మపురుషు లెందు వారొ? 140

* అటువంటి సందర్భంలో ఎన్నెన్నో పాపాలకు ఒడిగట్టి అత్యంత భయంకరమైన నరకకూపంలోపడి కొట్టుకొనిపోతున్న నన్ను దయతలచి అడ్డుకొని ఆపదలు బాపి రక్షించిన ఆపుణ్యపురుషు లెవరో! ఎక్కడివారో!

శా. చోద్యంబై కలవోలె నీ క్షణమునం జూడంగఁ బ్రత్యక్షమై
వేద్యం బయ్యెను నన్ను నీడ్చిన మహావీరుల్ భృశోదగ్రు లా
యుద్యోగంబుల వారు పాశధరు లీ యుత్సాహముల్ మాని సం
పాద్యానేక వికారరూప కుటిల ప్రఖ్యాతు లెం దేఁ గిరో? 141

* ఇది చాలా ఆశ్చర్యంగా ఉన్నది. ముందు ఏదో కలలాగు అనిపించింది. మరుక్షణంలో ప్రత్యక్షంగా కనిపించింది. నన్ను మృత్యుపాశాలతో బంధించి ఈడ్చుకొని వచ్చిన ఆ భయంకర స్వరూపాలు ఆ మహావీరులు ఆ వికృతాకారులు ఆ వక్రమార్గసంచారులు తమ ఉద్రేకాన్నీ ఉత్సాహాన్నీ వదలిపెట్టి ఎక్కడికి వెళ్లారో!

ఉ. దారుణ పాశబంధన విధానములన్ నరకార్ణవంబులోఁ
గూరినవాని నన్నుఁ జెడకుండ నొనర్చిన పుణ్యవంతు లం
భోరుహనేత్రు లుజ్జ్వల నభోమణితేజులు లోచనోత్సవుల్
చారుదయా సమంచిత విచారులు నల్వురు నెందుఁ బోయిరో? 142

* భయంకరమైన పాశబంధాలతో నరక సముద్రంలోబడిన నన్ను నాశనం గాకుండా రక్షించిన పుణ్యమూర్తులు కమలనేత్రులు, సూర్యుని వంటి తేజస్సు గలవారు, కనుపండువు చేయువారు, దయాసముద్రులు, అయిన ఆ నల్వురు ఎందుబోయారో!

మ. నను రక్షించిన పుణ్యవంతులు కన న్నాళీకపత్రాక్షు లం
జనసంకాశులు శంఖచక్రధరు లాజానూరుబాహుల్ స్మితా
నను లాలంబిత కర్ణవేష్టన సువర్ణచ్ఛాయ దివ్యాంబరుల్
ఘన కారుణ్య రసైక పూర్ణులు సమగ్రస్ఫూర్తి నెం దేఁగిరో? 143

* నన్ను రక్షించిన ఆ పుణ్యమూర్తులు, పద్మాక్షులు, నీలవర్ణులు, శంఖచక్రాలను ధరించినవారు, ఆజానుబాహులు, బంగారు రంగు వలువలను దాల్చినవారు, చిరునవ్వు లొలుకబోయు ముఖాలవారు, భుజాల పర్యంతం వ్రేలాడే మకర కుండలాలు గలవారు, కరుణారస పరిపూరితులు, పూర్ణశోభతో కూడిన ఆ మహాత్ములు ఎక్కడి కేగినారో!

వ. పాతకుండ నగు నాకు ని వ్విబుధోత్తమ దర్శనంబు పురాకృత మదీయ పుణ్య విశేషంబునం గాని పొంద శక్యంబు గాదు. త త్సందర్శనం బాత్మకు నతిసుప్రసన్నంబై యొప్పు. అట్లు గాకుండె నేనిఁ గలుషవర్తనంబుల వృషలీభర్తనై యుండి మృతిం బొందుచున్న నాదు జిహ్వకు శ్రీమన్నారాయణ నామ గ్రహణంబు సంభవింపనేరదు. మఱియును. 144

* పాపాత్ముడనగు నాకు ఆ దేవతా శ్రేష్ఠుల సందర్శనం పూర్వ జన్మంలో చేసిన పుణ్యవిశేషం వల్లకాని ప్రాప్తం కాదు. వారి దర్శనం నా ఆత్మకు ఎంతో ఆనందాన్ని చేకూర్చింది. అలా కానిచో పాపవర్తనంతో కూడి శూద్రస్త్రీకి భర్తనై మరణిస్తున్న సమయంలో నా నాలుకకు భగవంతుని నామాన్ని ఉచ్చరించే భాగ్యం ఎట్లా అబ్బుతుంది?

ఆ. పాతకుఁడను జడుఁడ బ్రహ్మఘాతుకుఁడను, మాన లోభ మోహ మత్సరుండ
నాకు నెట్లు దొరకు? నారాయణుని దివ్య, నామ విమల కీర్తనంబు మదికి. 145

* పాపాత్ముడను, మూర్ఖుడను, బ్రహ్మహత్య చేసినవాడను, దురభిమానం - పిసినిగొట్టుతనం - మోహం- మాత్సర్యం గలవాడను. అటువంటి నాకు ఆ భగవంతుని దివ్యనామ సంకీర్తనం ఎలా దొరుకుతుంది?

సీ. దారుణ మోహాంధకార పూరితుఁడను హరి విస్మయ స్మరణార్హ మతినె?
పంచ మహాతీవ్ర పాతకోపేతుఁడ హరి విస్మయ స్మరణార్హ మతినె?
కౌటిల్య కితవ వికార పారీణుండ హరి విస్మయ స్మరణార్హ మతినె?
అఖిల దుఃఖైక ఘోరార్ణవ మగ్నుండ హరి విస్మయ స్మరణార్హ మతినె?

తే. నిందలకు నెల్ల నెలవైన నిర్గుణుండ, మందభాగ్యుండ నే నేడ? మధువిదారి
దివ్య గుణనామ కీర్తన తెలఁగదేడ?, పూర్వ సుకృతంబు లే కెట్లు పొందఁ గలుగు? 146

* భయంకరమైన మోహమనే చీకటితో నిండిన నేను భగవన్నామస్మరణ చేయడానికి యోగ్యుడనా? తీవ్రమైన పంచమహాపాపాలతో గూడిన నేను హరిని స్మరించడానికి యోగ్యుడనా? కుటిల స్వభావుడను, జూదగాడను ఐన నేను భగవంతుని ధ్యానించడానికి అర్హుడనా? నానావిధ దుఃఖసముద్రంలో మునిగి తేలుతున్న నేను నారాయణ నామస్మరణ చేయడానికి అర్హుడనా? నిందలకు నిలయ మైనవాడను, గుణహీనుడను, దురదృష్టవంతుడను, నేనెక్కడ? భగవంతుని పవిత్ర నామాన్ని ఆలపించు టెక్కడ? ఇదంతా పూర్వపుణ్యఫలం లేనిదే ఏ విధంగా సాధ్యమవుతుంది?

వ. అని వితర్కించి. 147

మ. యతచిత్తేంద్రియ మారుతుండ నగుచున్ యత్నం బొనర్తున్ హరి
వ్రత సంపత్తికిఁ బుణ్యవృత్తికిఁ జిదావాసోన్ము ఖాసక్తికిన్
యుత నిర్వాణ పదానురక్తికి సుఖోద్యోగ క్రియాశక్తికిన్
ధృతి లబ్ధో త్తమ ముక్తికిన్ సకల ధాత్రీధుర్య సద్భక్తికిన్. 148

* ఈ విధంగా ఆలోచించి అజామిళుడు ఒక నిర్ణయానికి వచ్చాడు. నేను నా చిత్తాన్ని లొంగదీసుకుని. ఇంద్రియాలను జయించి, శ్వాసను నియమించి శ్రీమన్నారాయణుని శరణు పొందుతాను. శ్రీహరి భక్తి సమస్త విశ్వానికి ఆధారమైనది. పుణ్యప్రవృత్తికి మూలమైనది ఆత్మజ్ఞానానికి ఆలవాలమైనది. మోక్షమార్గానికి సాధనమైనది. సుఖంగా సుముఖంగా ముందుకు నడిపించేది. ధైర్యాన్ని చేకూర్చి దైన్యాన్ని పోకార్చేది.

క. విడిచితి భవబంధంబుల, నడఁచితి మాయావిమోహ మయిన తమంబు
న్నొడిచితి నరివర్గంబులఁ, గడచితి నా జన్మ దుఃఖ కర్మార్ణవమున్. 149

* ఇదిగో భవబంధాలను విడిచి వేశాను. మాయతో గూడిన అజ్ఞానాంధకారాన్ని అణచివేశాను. కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాలు అనే ఆర్గురు శత్రువులనూ జయించాను. జనన మరణాలనే సముద్రాన్ని తరించాను.

క. యోషి ద్రూపంబున నను, నేషణ ముఖగహ్వరమున నెగ్రమింగి కడున్
ద్వేషమునఁ గోఁతిఁ జేసిన, దోషద యగు నాత్మ మాయఁ దొలఁగం గంటిన్. 150

* జారస్త్రీ రూపంతో ఎదురువచ్చి కోరికలనే నోరుతెరచి మాయ నన్ను మ్రింగివేసింది. ద్వేషంతో నన్ను గోతిలోకి దించింది. కోతిని చేసి ఆడించింది. అటువంటి దోషభూయిష్ఠమైన మాయనుండి తొలగి బైటపడ్డాను.

వ. అని యిట్లు వైష్ణవ జ్ఞానదీపం బాత్మస్నేహంబునం దోఁచిన బ్రాహ్మణుండు. 151

మ. భగవద్ధర్మపరాయ ణోత్తముల సంభాషైక మంత్రంబులన్
మిగులన్ జ్ఞానము పుట్ట మోహ భవ సమ్మిశ్రాత్మబంధంబులన్
దెగ ఖండించి సబంధు మిత్ర సుత పత్నీ మోహ విశ్రాంతుఁడై
జగతీనాథు రమేశుఁ గృష్ణుని దయైశ్వర్యంబులం గోరుచున్. 152

* ఈ విధంగా ఆ బ్రాహ్మణుని హృదయంలో ఆత్మజ్ఞానమనే తైలంతో నిండిన బ్రహ్మజ్ఞానమనే దీపం ప్రకాశించింది. అప్పుడు అతడు భగవద్భక్తులైన ఉత్తమ పురుషులతో స్నేహం చేశాడు. వారితో జరిపిన సంభాషణలే మంత్రాలై అతనికి జ్ఞానాన్ని చేకూర్చాయి. మోహం వల్ల కలిగిన సంసారబంధాలన్నీ తెగిపోయాయి. చుట్టాలు, స్నేహితులు, కుమారులు, భార్యలు అనే వ్యామోహం నశించింది. జగన్నాథుడూ, లక్ష్మీనాథుడూ అయిన వాసుదేవుని దయాదాక్షిణ్యాలనే మహాభాగ్యాన్ని అతడు వాంఛించాడు.

క. హరిభక్తులతో మాటలు, ధర నెన్నఁడుఁ జెడని పుణ్యధనముల మూటల్
వర ముక్తికాంత తేటలు, నరిషడ్వర్గంబు చొరని యరుదగు కోటల్. 153

* "హరి భక్తులతో మాటలాడే మాటలు ఎన్నటికినీ చెడని పుణ్యధనాల మూటలు, మోక్షలక్ష్మి విహరించే పూలతోటలు. ఆర్గురు శత్రువులకూ ప్రవేశింపరాని అద్భుతమైన కోటలు" అని అజామిళుడు భావించాడు.

సీ. అనుచు నా బ్రాహ్మణుం డతి తత్త్వవేదియై భవబంధముల నెల్లఁ బాఱఁదోలి
మొనసి గంగాద్వారమున కేగి యచ్చటఁ బ్రబ్బిన దేవతాభవనమందు
నాసీనుఁడై యోగ మాశ్రయించి చెలంగు దేహేంద్రియాదుల తెరువువలన
దనుఁ బాపుకొని పరతత్త్వంబుతోఁ గూర్చి మానుగా యోగసమాధిచేత

ఆ. గుణగణంబుఁ బాసి కొమ రొప్పిన భగవ, దనుభవాత్మయందు నాత్మఁ గలిపి
రమణఁ దన్ను మొదల రక్షించినట్టి యా, పురుషవరులఁ గాంచి పొసఁగ మ్రొక్కె. 154

* ఈ విధంగా భావించి ఆ విప్రుడు గొప్ప తత్త్వజ్ఞానియై సంసార బంధాలన్నింటినీ పారద్రోలి గంగా ద్వారానికి వెళ్లిపోయాడు. అక్కడ ఒక దేవాలయంలో కూర్చుండి యోగమార్గాన్ని ఆశ్రయించాడు. దేహం ఇంద్రియాలు మొదలైన వాని మార్గం నుండి విడివడి తనను యోగ సమాధిద్వారా పరతత్త్వంతో జోడించాడు.

గుణాతీతుడైన తన ఆత్మను పరమాత్మలో లీనంచేశాడు. అప్పుడు అతనికి మొదట తనను రక్షించిన ఆ దివ్యపురుషులు కన్పించారు. అతడు వారికి నమస్కరించాడు.

**వ. అ ట్లజామిళుండు యోగమార్గంబున దేహంబు విడిచి పుణ్య శరీరుండై యగ్రభాగంబునం బ్రాగుపలబ్ధులైన మహా పురుష కింకరులం గాంచి, సముంచిత రోమాంచిత చల చ్ఛటా పింజరిత స్వేదబిందు సందోహ మిష నిష్యంద మహానందవల్లికా మతల్లికాంకుర సంకుల పరిశోభిత తనుండును, హర్ష నికర్షమాణ మానసోద్యోగ యోగప్రభా వోత్సాహ విస్మయ మందస్మిత ముఖారవింద కందళితుండును, నిఖిల జగజ్జేగీయమానాఖండ శుభప్రద శుభాకార సందర్శన సమాసాదిత కుతూహల మానసుండును నై, ప్రణామంబు లాచరించుచు భాగీరథీ తీరంబునఁ గళేబరంబు విడిచి, తత్క్షణంబున హరిపార్శ్వవర్తను లైన దాసవరుల స్వరూపంబుఁ దాల్చి, యా విష్ణుసేవకులతోఁ గూడి దివ్య మణి గణ ఖచితంబగు సువర్ణమయం బయిన యసమాన విమానం బెక్కి, నిఖిలానంద భోగభాగ్యానుభ వాకుంఠితం బైన వైకుంఠంబున శ్రీమన్నారాయణ పాదారవింద సేవాచరణ పరిణామ స్థితికిం జనియె. ఇట్లు విప్లావిత సర్వధర్ముండైన దాసీపతి, గర్హిత కర్మంబులచేతఁ బతితుండును, హతవ్రతుండును నై నరకంబునం గూలుచుండి, భగవన్నామ గ్రహణంబున సద్యోముక్తుం డయ్యెఁ గావున. 155**

* ఈ ప్రకారంగా అజామిళుడు యోగమార్గం ద్వారా తన శరీరాన్ని పరిత్యజించి దివ్యదేహం ధరించినవాడై మున్ను తన్ను రక్షించిన విష్ణుకింకరులను తన కనులముందు సందర్శించాడు. వారిని తిలకించగానే అతని దేహం ఆనందంతో పులకించింది. పారవశ్యంతో ఒడలంతా చెమర్చింది. ఆనందవల్లి చిగిర్చింది. హృదయం హర్షంతో నిండింది. యోగప్రభావం ప్రకాశించింది. విస్మయంతో ఉత్సాహంతో కూడిన మందహాసం అతని ముఖారవిందం మీద చిందులు త్రొక్కింది. సమస్తలోకాలనూ ప్రకాశింపజేసేదీ, మంగళ ప్రదమైనదీ అయిన భగవంతుని శుభాకారాన్ని సందర్శించాలనే కుతూహలం మనస్సులో కలిగింది. అజామిళుడు విష్ణుదూతలకు చేతులు మోడ్చుతూ గంగాతీరంలో శరీరం విడిచాడు. వెనువెంటనే అతనికి నారాయణ పార్శ్వచరులైన మహాభక్తుల స్వరూపం ప్రాప్తించింది. అనంతరం అతడు విష్ణుదూతలతో కలిసి రత్నాలు చెక్కిన బంగారు విమానాన్ని అధిష్ఠించి ఆనందమయమూ, భోగ భాగ్య నిలయమూ అయిన వైకుంఠ నగరంలో ప్రవేశించి శ్రీమన్నారాయణుని చరణారవిందాలను సేవించే పరిణత దశకు చేరుకున్నాడు. ఈ విధంగా అజామిళుడు. సర్వధర్మాలనూ ఉల్లంఘించినవాడూ, దాసీపుత్రిని పెండ్లాడినవాడూ, దుష్కర్మలచేత భ్రష్టుడైన వాడూ అయి నరకంలో పడబోతూ నారాయణ నామస్మరణం వల్ల క్షణమాత్రంలో మోక్షాన్ని అందుకున్నాడు.

**క. కర్మంబు లెల్లఁ బాయను, మర్మము దలఁపంగ లేదు మధురిపు పేరే**
**పేర్మిని నొడువుటకంటెను, దుర్మదమునఁ జిత్త మెన్ని త్రోవలఁ జన్నన్. 156**

* కర్మాలన్నీ విడిపోవటానికి వేరే ఉపాయం ఏదీ లేదు. చెప్పిన మాట వినకుండా ఎదురుతిరిగి మనస్సు ఎన్నిమార్గాల్లో పోయినా సర్వదా నారాయణ నామాన్ని ఉచ్చరించటమే సరైన ఉపాయం.

ఉ. పాండవ వంశపావన నృపాలక! యీ యితిహాస మెవ్వఁ డే
నొండొక భక్తి లేక విను నొప్పుమెయిం బఠియించు నాతఁ డు
ద్దండత ముక్తికామినికిఁ దానకమై దనుజారిలోకమం
దుండు మహావిభూతి యమదూతల చూడ్కి కగోచరాకృతిన్ 157

* పాండవ కులతిలకా! పరీక్షిన్మహారాజా! ఈ యితిహాసాన్ని ఎవడైనా సరే ఏకాగ్రచిత్తంతో ఆలకించినా, చదివినా, అతడు ముక్తికాంతకు నెలవై యమదూతలకు కనబడని రూపంతో, విష్ణులోకంలో మహావైభవంతో ఉంటాడు.

తే. అరయ పుత్రోపచారిత మైన విష్ణు, నామ మవసానకాలంబునను భజించి
శార్ఙ్గినిలయంబుఁ జేరె నజామిళుండు, నిట్లు సద్భక్తిఁ దలఁచిన నేమి చెప్ప? 158

* అజామిళుడు అవసానకాలంలో కుమారుని పేరు పెట్టి పిలిచాడు. కాని శ్రీహరిని పిలువలేదు. అయిన పుత్రుని పేరుతో విష్ణునామాన్ని మరణకాలమందు ఉచ్చరించినందువల్ల హరిసాన్నిధ్యాన్ని చేరగలిగినాడు. ఇక భక్తిపూర్వంగా భగవంతుని నామాన్ని పలికితే చెప్పేదేముంది?

క. కోరినవారల కెల్లను, జేరువ కైవల్యపదము సిరివరుని మదిం
గోరనివారల కెల్లను, దూరము మోక్షాప్తి యెన్ని త్రోవలనైనన్. 159

* మనసారా కోరినవారికి అందరకూ మోక్షమార్గం సమీపంలోనే ఉంటుంది. ఆ విధంగా శ్రీమన్నారాయణుని కోరిన వారికి ఎన్ని విధాల ప్రయత్నించినా మోక్షమార్గం చాలా దూరంగా పోతుంది.

వ. అనినం బరీక్షిన్న రేంద్రుం డిట్లనియె. మునీంద్రా! ఆజ్ఞా భ్రష్టుం డై యమధర్మరాజు శ్రీవిష్ణు నిర్దేశకులచేత నిహతు లైన భటులచేత వర్ణింపంబడ్డ నారాయణుని నామప్రభావం బాకర్ణించి, వారల కే మనియె? మఱియు, నెన్నఁడేనియు యమదండంబు విఫలం బై పోయిన తెఱంగు గలదేని వినవలయు. ఈ సందేహంబుఁ బాప మహాత్మా! నీవు దక్కఁ దక్కినవారలు సమర్థులు గారని తలంచుచున్నవాఁడ. చిత్తంబును బ్రసాదాయత్తంబుగా భవదీయ వచన సుధాధారలఁ బ్రసాదింప వలయు అనిన శుకుం డిట్లనియె. 160

* ఆ మాటలు విని పరీక్షిన్నరేంద్రుడు శుకయోగీంద్రునితో ఇట్లా అన్నాడు. మునీంద్రా! తన ఆజ్ఞ వ్యర్థమైనందుకు యమధర్మరాజు ఏమని భావించాడు? విష్ణుదూతలచే ఎదిరింప బడిన తన భటులు వర్ణించిన భగవంతుని నామ ప్రభావాన్ని విని వారితో ఏ మన్నాడు? ఇదిగాక మరి ఎన్నడైనా యమదండనం వ్యర్థమై పోయిన సందర్భం ఉన్నదా? ఉంటే వినాలని ఉంది. ఈ సందేహాన్ని తొలగించటానికి మహాత్మా! నీవుకాక సమర్థులు మరెవ్వరున్నారు? నా హృదయం ఆనందమయం అయ్యేటట్లు నీ వచనామృతధారలు ప్రసాదించాలి. ఈ విధంగా అడిగిన నరేంద్రునితో మునీంద్రు డిట్లా అన్నాడు.

**క. శ్రీకృష్ణభటులచేత ని, రాకృతులయి యామ్యభటులు యమునకు నాత్మ**
**స్వీకృత విప్రకథాక్రమ, మీ క్రియ మున్ దెలిపి రదియు నెఱిఁగింతుఁ దగన్. 161**

* విష్ణుదూతలచే తిరస్కరింప బడినవారైన యమదూతలు తమ చేతులలో నుండి విముక్తుడైన విప్రుని కథాక్రమాన్ని యముని ముందు విన్నవించిన విధానాన్ని విశదంగా చెపుతాను విను.

**తే. చేరి త్రివిధకర్మలఁ జేయు జీవతతికిఁ, గర్మ ఫలములఁ దెలిపెడు కారణంబు**
**నగుచు శిక్షించువారు లీ యవనిమీఁద, దేవ! యెందఱు గలరయ్య? తెలియవలయు. 162**

* యమదూతలు తమ నాయకునితో ఇట్లా అన్నారు. ఓ దేవా! సాత్త్విక రాజస తామస స్వభావాలతో మూడు విధాలుగా ఉన్న జీవసమూహానికి వారి వారి కర్మఫలాలకు తగినట్లు శిక్షించువారలు ఎందరు గలరో తెలపండి.

**క. దక్షిణదిశాధినాయక!, శిక్షం దగఁ జేయువారు క్షితిఁ బెక్కం డ్రే**
**నీ క్షయము న్నక్షయమును, సాక్షాత్తుగ రెండు నెందు సంపన్న మగున్? 163**

* దక్షిణదిశాధీశ్వరా! నిజమైన శిక్షాధికారివి నీవొక్కడవేయని మా ఉద్దేశం. అట్లా కాకుండా శిక్షించువారు భూమిపై చాలమంది ఉన్నట్లయితే నాశనం - నాశనం జెందని (క్షయ అక్షయములు) దాన్ని ప్రత్యక్షంగా లోకంలో జీవుల చావుపుట్టుకలు రెండూ ఎట్లా సంపన్న మవుతాయి?

**తే. దట్టమైనట్టి కర్మబంధముల నెల్ల, నాజ్ఞ పెట్టెడువారు పెక్కైనచోట**
**నకట! శాస్తృత్వ ముపచార మయ్యెఁ గాదె!, శూరులై నట్టి మండలేశులకుఁ బోలె. 164**

* తరుగని కర్మబంధాల ననుసరించి శిక్షలను నిర్ణయించేవాడు ఒక్కడే ఉండాలి. అలాకాక అధికమైనచో "శాసకుడు" అనే మాట కేవలం మర్యాదకోసమే. మండలాధిపతులను పరిపాలకు లన్నట్లు నామమాత్రమే అవుతుంది.

**ఉ. కావున నీవ యొక్కఁడవ కర్తవు మూఁడు జగంబులందు సం**
**భావిత భూతకోటిఁ బరిపాకవశంబున శిక్ష సేయఁగా**
**నీ వర శాసనం బఖిలనిర్ణయమై తనరారుచుండ నేఁ**
**డీవలఁ గ్రమ్మఱింప మఱి యెవ్వఁడు శక్తుఁడు ? ధర్మపాలకా! 165**

* ముల్లోకాలలో జన్మించిన ప్రాణికోటినీ కర్మఫలాలను అనుసరించి శిక్షించటానికి నీ వొక్కడవే కర్తవు. నీ శ్రేష్ఠమైన శాసనం సర్వవిధాలా తిరుగులేనిది. ఓ ధర్మపాలకా! నీ శాసనాన్ని మరలించటానికి ఈ లోకంలో ఎవడికి సాధ్య మవుతుంది?

క. చండ కర తనయ! యొరులకు, దండధరత్వంబు గలదె! తన జగమున ను
ద్దండధరవృత్తి నొత్తిలి, దండింతువు నిన్ను దండధరుఁ డని పొగడన్. 166

* కర్మసాక్షి అయిన సూర్యభగవానుడు నీ తండ్రి. నీకు గాక దండించే అధికారం లోకంలో మరెవ్వరికీ లేదు. దండింప తగినవారిని ఉద్దండంగా దండిస్తావు. అందుకనే నిన్ను అందరూ దండధరుడని స్తుతిస్తారు.

సీ. ఇట్టి నీ దండంబ యీ మూఁడు జగములఁ దెగువమై నేఁడు వర్తిల్లుచుండ
మనుజలోకంబుల మహితాద్భు తాకార సిద్ధుల మిగులఁ బ్రసిద్ధు లైన
వారు నల్వురు వేగ వచ్చి నిర్దేశంబు భంగించి మ మ్మంతఁ బాఱఁదోలి
మీ శాసనంబున మే మీడ్చి కొని వచ్చు క్రూరచిత్తునిఁ బుచ్చి కొని యదల్చి

తే. పాశబంధంబు లీసునఁ బట్టి త్రెంచి, బలిమి మిగులంగ మమ్మునుఁ బాఱఁ దోలి
యిచ్చఁ జనినారు వారు దా మెచటివార, లాదరమ్మున నేఁడు మా కానతిమ్ము. 167

* ఇలాంటి శాసనం ముల్లోకాలలో నేడు నిరాటంకంగా వర్తిస్తున్నది. అటువంటప్పుడు మానవలోకంలో ఇందుకు భిన్నంగా ఒక విచిత్రం జరిగింది. ఎవరో దివ్యపురుషులు నల్గురు త్వరితంగా వచ్చి నీ శాసనం మేరకు మేము ఈడ్చుకొని వస్తున్న క్రూరాత్ముణ్ణి బలవంతగా తీసుకొని పోయారు. మీ ఆజ్ఞను భంగం చేశారు. మమ్ములను పారద్రోలారు. వాడికి కట్టి ఉన్న పాశ బంధాలను ఈర్ష్యతో తెంచి పారవేశారు. మమ్ములను తరిమికొట్టి ఇష్టం వచ్చినట్లు పోయారు. వారెచ్చటివారో ఎవ్వరో దయచేసి ఆనతీయండి.

వ. అనిరి. అని మఱియు శుకుం డిట్లనియె. అట్లు దూతలు పరితాప సమేతులై పలికిన, దండధరుండు పుండరీకాక్షుని చరణ కమలంబుల మానసంబున సన్నిహితంబులుగఁ జేసి, వందనం బాచరించి, పరమ భక్తిపరుండై వారల కిట్లనియె. 168

* యమదూతలు యముణ్ణి ఇలా అడిగారని ఇంకా శుకుడు ఇలా అన్నాడు. ఆ విధంగా పరితప్త హృదయులై పలికిన దూతల పలుకులు విని యముడు దేవదేవుని పాదపద్మాలను తన హృదయంలో సన్నిహితం చేసుకొని నమస్కరించి భక్తిపరవశుడై తన భటులతో ఇట్లా అన్నాడు.

సీ. కలఁడు మదన్యుండు ఘనుఁ డొక్కఁ డతఁ డెందు వెలికిఁ గానఁగరాక విశ్వమెల్ల
నతిలీనమై మహాద్భుత సమగ్రస్ఫూర్తి నుండును గోక నూలున్నభంగి
దామెనఁ బశువులు దగిలి యుండెడుమాడ్కి నామసంకీర్తన స్థేమగతుల
విహరించు నెవ్వఁడు విలసిత మత్ప్రజ లెవ్వని పదముల నివ్వటిల్లుఁ

ఆ. గనుట మనుట చనుట గల్గు నెవ్వనిలీల, లందు లోక మెవనియందుఁ బొందు
నెన్నఁబడుచుఁ బుడమి నెవ్వని నామముల్, కర్మబంధనముల పేర్మి నడఁచు. 169

* ఉన్నాడు. నాకంటే ఘనుడైనవాడు ఒకడున్నాడు. అతడు బయటికి కానరాకుండా ప్రపంచమంతటా నిండి ఉన్నాడు. అత్యద్భుతంగా సమగ్రంగా చీరలో దారాల రీతిగా వ్యాపించి ఉన్నాడు.

అతని ఆజ్ఞానుసారం జీవులందరూ త్రాళ్లతో అంటగట్టబడిన పశువుల మాదిరిగా ఆ యా నామాలతో సంకేతాలతో గిరగిర తిరుగుతున్నారు. నేను చేసే పూజలన్నీ ఆయన పాదాలకే అంకితం. జనం పుట్టటం బ్రతకటం మరణించటం అన్నీ ఆయన లీలావిలాసాలే. ఈ సమస్త జగత్తూ ఆయనలోనే లీనమై ఉంటుంది. ఆయన నామాలు ఉచ్చరించితే చాలు సమస్త కర్మబంధాలూ నిర్మూలమైపోతాయి.

**తరళము**

**వినుఁడు నేను మహేంద్రుఁ డప్పతి వీతిహోత్రుఁడు రాక్షసుం**
**డనిలుఁ డర్కుఁడు చంద్రుఁడుం గమలాసనుండు మరుద్గణం**
**బును మహేశుఁడు రుద్రవర్గము భూరి సంయమి సిద్ధులున్**
**మొనసి కన్గొనఁజాల రెవ్వని మూర్తి విశ్రుతకీర్తిమై. 170**

* దూతలారా! వినండి. నేను, ఇంద్రుడు, వరుణుడు, అగ్ని దేవుడు, నైఋతి, వాయుదేవుడు, సూర్యచంద్రులు, బ్రహ్మదేవుడు, దేవగణాలు, శివుడు, ప్రమథ గణాలు, సిద్ధిబొందిన మునీంద్రులు అందరమూ కలిసికూడా సుప్రసిద్ధమైన ఆయన మూర్తిని కనుగొనజాలము.

**క. సత్యేతర గుణ పాశ వ, శత్వంబునఁ బొంద వీరు జలజాక్షు సదై**
**కత్వంబు గాన నోపరు, సత్త్వ ప్రాధాన్యు లితర జనులకుఁ దరమే? 171**

* లోకంలో రజస్తమోగుణాలనే పాశాలతో బద్ధులైన మానవులు అంతర్యామి అయిన భగవంతుని సర్వవ్యాపకత్వాన్ని గుర్తింపలేరు. సత్త్వగుణ ప్రధానులైన వారు మాత్రం కొంత కొంత మాత్రమే గుర్తిస్తారు. ఇక ఇతరుల సంగతి చెప్పేదేముంది? భగవంతుణ్ణి గుర్తించటం వారి వశం కాదు.

**చ. అభవు నమేయు నవ్యయు ననంతు ననారతుఁ బూని మేనిలో**
**నుభయము నై వెలుంగు పురుషోత్తముఁ గానరు చిత్తకర్మ వా**
**గ్విభవ గరిష్ఠులై వెదకి వీఁడి ప్రాణులు; సర్వవస్తువుల్**
**శుభగతిఁ జూడనేర్చి తనుఁ జూడఁగ నేరని కంటిపోలికన్. 172**

* భగవంతుడు పుట్టుక లేనివాడు. కొలతలకు అందనివాడు. అనంతుడు. శాశ్వతుడు. మానవుల శరీరంలో క్షరపురుషుడు, అక్షర పురుషుడూకూడా తానే అయి ప్రకాశించే పురుషోత్తముడు, మనోవాక్కాయ కర్మల వైభవంలో ఆరితేరిన మానవులుకూడా అంతర్యామియైన పరమాత్మను దర్శింపలేరు. చూచేవాడిలో భగవంతుడు అంతర్యామిగా ఉన్నాడు గదా! మరి ఎందుకు దర్శింపలేడు అనే సందేహం సరికాదు. ఏమంటే సమస్త వస్తువులనూ సందర్శించే కన్ను తన్ను తాను చూచుకోలేదు గదా!

చ. పరముని భక్తలోక పరిపాలన శీలుని దుష్టలోక సం
హరుని పతంగపుంగవ విహారుని కూరిమి దూతలా మనో
హరులు సురేంద్రవందితులు నా హరిరూప గుణ స్వభావులై
తిరుగుచునుందు రెల్లెడల దిక్కులఁ దేజము పిక్కటిల్లఁగన్ 173

* ఆయన పరమాత్ముడు. భక్తులను పరిపాలించేవాడు. దుష్టులను సంహరించేవాడు. గరుత్మంతునిపై అధిష్ఠించి సమస్త లోకాలలో విహరించుతూ ఉంటాడు. ఆ మహానుభావుని ప్రియమైన దూతలుకూడా ఆకారములో గుణాలలో స్వభావంలో ఆ శ్రీహరినే పోలి ఉంటారు. ఆ దేవుని దూతలకు దేవేంద్రుడు సైతం చేతులు మోడ్చి నమస్కరిస్తాడు. అటువంటి విష్ణుదూతలు తమ దేహకాంతులు దిక్కులనిండా వ్యాపింపగా లోకమంతటా సంచరిస్తుంటారు.

ఉ. లెక్కకు నెక్కువై కసటులేని మహాద్భుత తేజ మెల్లెడం
బిక్కటిలం జరింతు రతి భీమబలాఢ్యులు విష్ణుదూత లా
చక్కని ధర్మశాంతు లతిసాహసవంతులు దేవపూజితుల్
గ్రక్కఁతి నీ జగంబునను గేశవసేవక రక్షణార్థమై. 174

* లెక్కకు మిక్కుటంగా విష్ణుదూతలు ఈ జగత్తులో సర్వత్రా శ్రీ హరి భక్తులను రక్షించటం కోసం తిరుగుతుంటారు. వారి తేజస్సు మిక్కిలి అద్భుతమైనది. కళంకము లేనిది. వారు మహాబలాఢ్యులు. ధర్మసహితమైన శాంతస్వభావం కలవారు. ధైర్యసాహసాలతోకూడిన వారు. వారిని చూచి దేవతలు సైతం చేతులెత్తి నమస్కరిస్తారు.

క. నా వలనను మీ వలనను, దేవాసుర గణమువలనఁ ద్రిజగంబులలో
నే వగలఁ బొందకుండఁగఁ, గావం గలవారు పుడమిఁ గల వైష్ణవులన్. 175

* నా వలనా, మీ వలనా, దేవరాక్షస సమూహంవలనా, మూడు లోకాలయందూ ఏలాంటి దుఃఖాన్ని పొందకుండా భూమిపై గల విష్ణు భక్తులను వారు కాపాడుతూ ఉంటారు.

క. భగవ త్ర్పణిహిత ధర్మం, బగపడ దెవ్వారి మతికి ననిమిష గరుడో
రగ సిద్ధ సాధ్య నర సుర, ఖగ తాపస యక్ష దివిజ ఖచరుల కైనన్. 176

* దేవతలు, గరుడులు, ఉరగులు, సిద్ధులు, సాధ్యులు, మానవులు, పక్షులు, మునులు, యక్షులు, విద్యాధరులు, ఖేచరులు మొదలైన వారు ఎవ్వరుకూడా భగవంతుని దైవత్వాన్ని గుర్తింపలేరు. భగవత్తత్త్వం వీరి బుద్ధికి అగుపించదు.

క. ఎన్నఁడుఁ దెలియఁగ నేరరు, పన్నగపతిశాయి తత్త్వభావము మేనం
గన్నుల వేల్పును డాపలఁ, జన్నమరిన వేల్పు ముదుక చదువుల వేల్పున్. 177

* పన్నగశాయి అయిన ఆ వెన్నుని మహత్త్వాన్ని సహస్రాక్షుడైన ఇంద్రుడుగానీ, అర్ధనారీశ్వరుడైన శివుడుగానీ, వేదవేత్త అయిన బ్రహ్మదేవుడు గానీ ఎన్నడూ ఏ మాత్రమూ తెలుసుకోలేరు.

**సీ. వర మహాద్భుత మైన వైష్ణవజ్ఞానంబు తిరముగా నెవ్వరు తెలియఁగలరు?**
**దేవాదిదేవుండు త్రిపుర సంహరుఁ డొండెఁ గమలసంభవుం డొండెఁ గార్తికేయ**
**కపిల నారదు లొండె గంగాత్మజుండొండె మను వొండె బలి యొండె జనకుఁ డొండెఁ**
**బ్రహ్లాదుఁ డొండె నేర్పాటుగా శుకుఁడొండె భాసురతర మతి వ్యాసుఁ డొండెఁ**

**తే. గాక యన్యుల తరమె? యీ లోకమందు, నీ సుబోధంబు సద్బోధ మీ పదార్థ**
**మీ సదానంద చిన్మయ మీ యగమ్య, మీ విశుద్ధంబు గుహ్యంబు నీ శుభంబు.** 178

* దేవాదిదేవుడైన పరమశివుడు, బ్రహ్మ, కుమారస్వామి, కపిలుడు, నారదుడు, భీష్ముడు, మనువు, బలిచక్రవర్తి, జనకమహారాజు, ప్రహ్లాదుడు, శ్రీశుకుడు, వేదవ్యాసుడు అనువారు మాత్రమే కొంతవరకు అత్యద్భుతమైన వైష్ణవతత్త్వాన్ని తెలుసుకోగలరేమో! వీరుగాక ఇతరులైన వారికి మరెవ్వరికీ ఈ ఉత్తమ జ్ఞానం, ఈ విశేషజ్ఞానం, బ్రహ్మ పదార్థమూ, సదానంద చిన్మయమూ, అగమ్యమూ, పరిశుద్ధమూ, పరమ రహస్యమూ, శుభంకరమూ అయిన ఈ వైష్ణవజ్ఞానం సాధ్యమయ్యేది కాదు.

**క. ఈ పన్నిద్దఱు దక్కఁగ, నోపరు తక్కొరులు తెలియ నుపనిష దుచిత**
**శ్రీపతినామ మహాద్భుత, దీపిత భాగవత ధర్మ దివ్యక్రమమున్.** 179

* పైన చెప్పిన పన్నెండుమంది తప్ప తక్కిన వారెవ్వరూ ఉపనిషద్రహస్యమైన నారాయణ నామ మహత్త్వాన్ని వివరించి చెప్పలేరు. వారికి భాగవత ధర్మమూ దాని దివ్యత్వమూ ఏ మాత్రం గోచరం కాదు.

**తే. ఏది జపియింప నమృతమై యెసఁగుచుండు, నేది సద్ధర్మపథ మని యెఱుఁగఁ దగిన**
**దదియె సద్భక్తి యోగంబు నలవరించు, మూర్తిమంతంబు దా హరికీర్తనంబు.** 180

* ఏ నామం జపించినకొలదీ అమృతమై అతిశయమై అలరారుతుంటుందో, ఏది ఉత్తమమైన ధర్మమార్గమో అదియే హరినామ సంకీర్తనం. మూర్తీభవించిన భక్తియోగమే హరినామ కీర్తనం.

**తే. కంటిరే మీరు సుతులార! కమలనేత్రు, భవ్య మగు నామకీర్తన ఫలము నేఁడు**
**తవిలి మృత్యువు పాశబంధములవలన, జాణతనమున వీడె నజామిళుండు.** 181

* నాయనలార! భగవంతుని పవిత్రనామ సంకీర్తన ఫలాన్ని నేడు మీరు కనులారా కన్నారుగదా! మృత్యుదేవత పాశబంధాలలో చిక్కుకున్న అజామిళుడు ఎంతో నేర్పుగా బయటపడ్డాడు.

**ఉ. ఏటికి జాలిఁ బొంద? నరు లీ క్రియఁ, గృష్ణుని కీర్తనంబు పా**
**పాటవులం దహింపఁ గల దౌటకు సందియ మేల? యిప్పు డీ**

తూఁటరి దోసకారి పెనుదోషి యజామిళుడంత మొందుచుం
బాటిగ విష్ణునామమును బల్కుచుఁ గేవలముక్తి కేగఁడే? 182

* ఈ విధంగా మానవులు దిగులు చెందటం దేనికి? ''భగవంతుని నామసంకీర్తనం పాపాటవులను కాల్చి వేస్తుంది'' అనడానికి సందేహం ఎందుకు? ఇప్పు డీ తుంటరి, దుష్టుడు, పాపాత్ముడు - అజామిళుడు మరణం చెందుతూ భగవంతుని పేరు ఉచ్చరించాడు. అదికూడా తన కుమారుని పేరనుకొని పిలిచాడుగాని భగవంతుని పేరని భావించి కాదు. అటువంటి సందర్భంలో ఆ విధంగా పిలిచిన అజామిళుడే మోక్షాన్ని చూరగొన్నాడు. ఇంతకంటే ఉదాహరణం ఏమి కావాలి?

క. ఇంతయును దథ్య మని మది, నెంతయుఁ దెలియంగ లేరు హీనాత్ములు దు
ర్దాంతతర ఘటిత మాయా, క్రాంతాత్యంత ప్రకాశ గౌరవ జడులై. 183

* బుద్ధిహీనులైన మానవులు ఈ యథార్థమైన విషయాన్ని తమ మనస్సులో కొంచెమైననూ ఆలోచించి తెలుసుకోలేరు. దాటశక్యం కాని మహామాయలో చిక్కుకొని తమ తెలివిని గోల్పోతున్నారు. మందబుద్ధు లౌతున్నారు.

మంగళ మహాశ్రీవృత్తము.

ఈ విధమునన్ విబుధు లేకతమ చిత్తముల నేకతము లేక హరి నీశున్
భావమున నిల్పి తగు భాగవతయోగ పరిపాకమున నొందుదురు వారిన్
దేవలదు దండనగతిన్ జనదు మాకు గుఱుతింప నఘముల్ దలఁగు మీఁదన్
శ్రీవరుని చక్రము విశేషగతిఁ గాఁచు సురసేవితులు ముక్తిఁ గడుఁ బెద్దల్. 184

* ఈ విధంగా జ్ఞానవంతులు ఏకాంతంగా భగవంతుణ్ణి అనన్యమైన భావంతో తమ మనస్సులో నిల్పుకొని యోగ సాధనతో పరమభాగవతులై పొలుపొందుతున్నారు. ఓ దూతలారా! అటువంటివారిని తీసుకొనిరావలదు. వారిని దండించటం సరికాదు. ఆ పని మా వల్లకాదు. అటువంటి భక్తులను గుర్తించినచో పాపాలు మాయమైపోతాయి. అదీగాక విష్ణుదేవుని చక్రం విశేషంగా వారిని రక్షించుతూ ఉంటుంది. దేవుని సేవించు పెద్దలు తప్పక మోక్షాన్ని పొందుతారు.

ఉ. ఎవ్వరు సిద్ధసాధ్య ఖచరేశ లస త్పరిగీత గాథలం
దెవ్వరు ముక్తిభోగతల హేమ మనోహర చంద్రశాలలం
దెవ్వరు శంఖచక్ర గురుహేతి గదా రుచిరోగ్రపాణు లా
మవ్వపు రూపవంతు లసమానులు వో ధరలోని వైష్ణవుల్. 185

* విష్ణుభక్తులైన మహానుభావుల కీర్తిని సిద్ధులు, సాధ్యులు, ఖేచరులు లలితగీతాలతో గానం చేస్తుంటారు. అటువంటి భాగవతులు ముక్తి సౌధంలో అందమైన చంద్రశాలలలో నివసిస్తుంటారు. సాటిలేనివారూ సౌందర్యవంతులూ ఐన వైష్ణవోత్తముల అరచేతులలో రేఖాకారంలో శంఖచక్రాలూ గదాఖడ్గాలూ విరాజిల్లుతుంటాయి.

సీ. శ్రుత్యంత విశ్రాంత మత్యనుక్రమణీయ భగవ త్ప్రసంగతుల్ భాగవతులు
సనకాదిముని యోగిజన సదానందైక పరమ భాగ్యోదయుల్ భాగవతులు
కృష్ణ పద ధ్యాన కేవ లామృతపాన పరిణామ యుతులు శ్రీభాగవతులు
బహుపాత కానీక పరిభవ ప్రక్రియా పరుషోగ్ర మూర్తులు భాగవతులు
తే. భావ తత్త్వార్థ వేదులు భాగవతులు, బ్రహ్మవా దానువాదులు భాగవతులు
సిరులు దనరంగ నెన్నఁడుఁ జేటులేని, పదవి నొప్పారువారు వో భాగవతులు. 186

* భగవద్భక్తుల మనస్సు ఎల్లప్పుడూ వేదాంత వీథులలో విహరిస్తుంటుంది. వారు సర్వదా భగవంతునికి సంబంధించిన ప్రసంగాలే చేస్తుంటారు. భగవద్భక్తు లైనవారు సనకసనందాది మహాయోగులు అనుభవించే బ్రహ్మానందాన్ని అందుకోగల అదృష్టవంతులు. భాగవతులు శ్రీకృష్ణ చరణకమల స్మరణమనే మధుర సుధారసాన్ని తనివితీరా పానంచేసి బ్రతుకులు పండించుకుంటారు. భగవద్భక్తులు బహువిధాలైన భయంకర పాపసమూహాలను చించి చెండాడుతారు. పరతత్త్వాన్ని గుర్తించి బ్రహ్మస్వరూపాన్ని ఆరాధించుతూ ఉండే పరమైశ్వర్య సంపన్నులే భాగవతులు. వారు తమ మహోన్నతస్థానం నుంచి ఏ మాత్రం చలించరు.

క. అదిగాన విష్ణుభక్తులఁ, గదియఁగఁ జనవలదు మీరు కరివరదు లస
త్పదపద్మ వినతి విముఖులఁ, దుది నంటఁగఁ గట్టి తెండు ధూర్తులు వారల్. 187

* దూతలారా! అటువంటి విష్ణుభక్తుల దరిదాపులకు మీరు పొరపాటునకూడా వెళ్లవద్దు. శ్రీహరి పాదపద్మారాధనకు విముఖులైన ధూర్తులను పట్టి బంధించి తీసుకొనిరండి.

సీ. ఎకసక్కెమున కైన నిందిరా రమణునిఁ బలుకంగలేని దుర్భాషితులను
గలలోన నైన శ్రీకాంతుని సత్పాద కమలముల్ సూడని కర్మరతుల
నవ్వుచు నైనఁ గృష్ణప్రశంసకుఁ జెవిఁ దార్చనేరని దుష్కథా ప్రవణుల
యాత్రోత్సవంబుల నైన నీశుని గుడి త్రోవఁ ద్రొక్కఁగలేని దుష్టదులను
ఆ. బరమ భాగవతుల పాదధూళి సమస్త, తీర్థసార మనుచుఁ దెలియలేని
వారి వారివారి వారిఁ జేరినవారిఁ, దొలుతఁ గట్టి తెండు దూతలార! 188

* సేవకులారా! నవ్వులాటకైనా నారాయణుని నామం ఉచ్చరించని వదరుబోతులనూ, కలలోనైనా కమలాక్షుని పాదకమలాలను దర్శించని పొగరుబోతులనూ, పరిహాసానికైనా పద్మనాభుని యశోగాథలను వీనులవిందుగా వినని సోమరిపోతులను, ఉత్సవదినాలలో సైతం దేవాలయాల ప్రక్కనుంచికూడా నడచి పోలేని తిరుగుబోతులనూ పట్టి కట్టి లాగుకొనిరండి. అంతేకాదు; భగవద్భక్తుల పాదధూళి పరమ పవిత్ర మైనదని భావింపలేని వారిని, వారికి సంబంధించిన వారినీ, వారిని ఆశ్రయించినవారినీ పాశాలతో బంధించి పట్టుకొని రండి.

ఆ. ఎల్లపాపములకు నిల్లైన యింటిలో, బద్ధతృష్ణు లగుచు బుద్ధిఁ దలఁగి
పరమహంసకులము గుఱితప్పి వర్తించు, ధూర్తజనులఁ దెండు దూతలార! 189

* కింకరులారా! తమ గృహాన్నే సమస్త పాపాలకూ స్థావరంగా చేసుకొని ఆశకు దాసులై తెలివిమాలినవారై మహాత్ములైన పెద్దలను అగౌరవపరిచే మోసగాండ్రను తీసుకొని రండి.

ఆ. అరయఁ దనదు జిహ్వ హరిపేరు నుడువదు, చిత్త మతని పాదచింతఁ జనదు,
తలఁపఁ దమకు ముక్తి తంగేటి జున్నొకో?, సకల విష్ణు భక్తులకును బోలె. 190

* వీళ్ల నాలుక భగవంతుని నామాలను పలుకదు. వీరి చిత్తం శ్రీహరి పాదపద్మాలను చింతింపదు. వాస్తవానికి విష్ణుభక్తులకు మోక్షం లభించినట్లు వీళ్లకు ఎందుకు లభిస్తుంది? అట్లా తేరగా లభించటానికి అదేమన్నా దొడ్డిలోని తంగేటి చెట్టుకు పట్టిన తేనెపట్టా?

ఆ. పద్మనయను మీఁది భక్తి యోగం బెల్ల, ముక్తియోగ మనుచు మొద లెఱుంగు
వారి వారివారి వారిఁ జేరినవారి, త్రోవఁ బోవ వలదు దూతలార! 191

* దూతలారా! పద్మాక్షుని మీది భక్తి యోగమే ముక్తి యోగమని భావించే తత్త్వవేత్తలైన వారినీ, వారికి సంబంధించిన వారినీ, వారిని ఆశ్రయించిన వారినీ మీరు కన్నెత్తి కూడా చూడవద్దు. వారి దిక్కుకు పోవద్దు.

వ. అని పలికెనని చెప్పి మఱియు శుకుం డిట్లనియె. శ్రీకృష్ణనామ సంకీర్తనంబు జగన్మంగళం బనియును, జగన్మోహనం బనియును, జగజ్జేగీయమానం బనియును, నిఖిల మాయాగుణ విచ్ఛేదకం బనియును, ఉద్దామంబు లగు హరి వీర్యంబుల నాకర్ణించు వారల చిత్తంబు లతినిర్మలంబులగు భంగిం దక్కిన వ్రతాచరణంబులుం గావనియు, శ్రీకృష్ణ పదపద్మంబులు హృత్పద్మంబుల నిలుపువారలన్య పాపకర్మంబు లగు నవిద్యావ్యసనంబులం బొరయనేర రనియును, నిజస్వామి యైన యమధర్మ రాజుచేత గీర్తింపఁబడ్డ భగవ న్మహత్త్వంబు నాకర్ణించి, విస్మితులై కాలకింకరులు నాఁటనుండియు వైష్ణవజనంబులం దేఱిచూడ వెఱతురు. నరేంద్రా! పరమగుహ్యంబగు నీ యితిహాసంబును బూర్వకాలంబున సకల విజ్ఞాన గోచరుండైన కుంభసంభవుండు సకల దుఃఖవిలయంబును, సకల పుణ్యనిలయంబును నైన మలయంబునఁ బురాణ పురుషుండైన పురుషోత్తము నారాధనంబు సేయుచుండి నా కెఱింగించెను అని చెప్పిన విని విస్మయానంద హృదయుండై పరీక్షిజ్జనపాలుం డిట్లనియె. 192

* ఈ విధంగా చెప్పి శుకమహర్షి పరీక్షిత్తుతో ఇంకా ఇట్లా అన్నాడు. శ్రీకృష్ణనామ సంకీర్తనం లోకాలకు శుభాలను ప్రసాదిస్తుందనీ, లోకాలను సమ్మోహింపజేస్తుందనీ, లోకులందరిచేతా విశేషంగా గానం చేయబడుతుందనీ, పలువిధాలైన మాయాబంధాలనూ త్రెంపివేస్తుందనీ, అమోఘాలయిన హరిపరాక్రమ గాథలను ఆకర్షించేవారి అంతరంగాలు అత్యంత నిర్మలంగా ఉంటాయనీ, ఈ విధంగా వ్రతాలవల్ల గానీ

నియమాలవల్ల గానీ మనస్సులు నిర్మలాలు కావనీ, శ్రీకృష్ణదేవుని పాదపద్మాలను హృదయపద్మంలో నిలుపుకొని ఆరాధించే వారిని ఇతర పాపాలుగానీ, అజ్ఞానంగానీ, వ్యసనాలుగానీ అంటనేరవని యమధర్మరాజు తన కింకరులకు ఉపదేశించాడు. తమ ప్రభువుచేత కీర్తింపబడిన దేవదేవుని మహామహిమలను విని కాలకింకరులు ఆశ్చర్యచకితులైనారు. వారు ఆనాటి నుంచీ విష్ణుభక్తుల వైపు కన్నెత్తి చూడటానికి సైతం భయపడసాగారు. ఓ పరీక్షిన్మరాజా! పరమరహస్యమైన ఈ ఇతిహాసాన్ని సర్వజ్ఞుడైన అగస్త్య మహర్షి నాకు వెల్లడించాడు. ఆ మహానుభావుడు సమస్త దుఃఖాలనూ విలయం చేసేదీ, సమస్త పుణ్యాలకూ నిలయమైనదీ అయిన మలయపర్వతంమీద దేవాదిదేవుడైన వాసుదేవుణ్ణి ఆరాధిస్తూ నాకీ వృత్తాంతాన్ని ఎరిగించాడు. శుకయోగీంద్రుని మాటలు విని పరీక్షిన్నరేంద్రుడు ఆశ్చర్యానందాలు నిండిన హృదయంతో ఇలా అన్నాడు.

**క. స్వాయంభువ మనువేళల, నో యయ్య! సురాసురాండ జోరగ నర వ**
**ర్గాయత సర్గముఁ దెలిపితి, పాయక యది విస్తరించి పలుకం గదవే.** 193

* అయ్యా! శుకమహర్షీ! ఇంతకుముందు స్వాయంభువ మనువు వృత్తాంతం చెప్పావు. ఆయన పరిపాలించే కాలంలో దేవతలు, రాక్షసులు, పక్షులు, పాములు, మానవులు మొదలైన ప్రాణుల సృష్టిక్రమాన్ని గూర్చి కొంతకొంత చెప్పావు. ఆ విషయాన్నే ఇంకా విస్తారంగా వివరించి చెప్పు.

**క. ఉత్తర కొడు కిట్లడిగిన, యుత్తరమును న మ్మునీంద్రుఁ డుత్తమ చేతో**
**వృత్తి ముదమంది పలికెను, దత్తరపా టుడిగి వినుఁడు తాపసులారా!** 194

* ఉత్తరానందనుడైన పరీక్షిత్తు అడిగిన దానికి సంతోషించిన వాడై శుకమహర్షి ఈ విధంగా సమాధానం చెప్పాడని శౌనకాది మహర్షులను సంబోధించి సూతుడు ఇలా పలుక సాగాడు.

**సీ. పూని ప్రచేతసుపుత్రులు పదుగురు ప్రాచీనబర్హిష ప్రాఖ్య గలుగు**
**వారు మహాంభోధి వలన వెల్వడి వచ్చి తగ వృక్ష వృతమైన ధరణిఁ జూచి**
**మేదినీజములపై మిక్కిలి కోపించి మదిలోన దీపితమన్యు లగుచు**
**వక్త్రంబులను మహావాయు సంయుతమైన యనలంబుఁ గల్పించి యవనిజములఁ**

**తే. బెల్లువడఁ గాల్పఁ దొడఁగినఁ దల్లడిల్లి, వారి కోపంబు వారించువాఁడ పోలెఁ**
**బలికెఁ జందురుఁ డో మహాభాగులార!, దీనములు వృక్షములమీఁదఁ దెగుట తగునె?** 195

* "ప్రాచీన బర్హిషు"లని పేరెన్నిక గన్నవారూ, సముద్ర గర్భంలో తపస్సుచేస్తున్న వారూ అయిన ప్రచేతసుని పుత్రులు పదిమంది తపస్సు చాలించి సముద్రంలో నుండి వెలుపలికి వచ్చి నలుదిక్కులూ చూచారు. భూమి సమస్తమూ వృక్షములతో నిండి ఉన్నది. ఆ విధంగా సందు లేకుండా భూమిని ఆక్రమించి ఉన్న చెట్లమీద వారికి ఆగ్రహం వచ్చింది. ప్రాచేతసులు క్రోధావేశంతో తమ కోపాగ్ని జ్వాలలను మహావాయువుతో ప్రసరింపజేశారు. ఆ మంటలకు వృక్ష సముదాయమంతా కాలి భస్మమై పోసాగింది. ఈ భయంకర దృశ్యాన్ని సోముడు చూచి సహింపలేకపోయాడు. ఆయన ప్రాచేతసుల క్రోధాన్ని శాంతింపజేసి

వృక్షజాతిని రక్షించాలనుకున్నాడు. వారిని సమీపించి సోముడు ఈ విధంగా అన్నాడు. ఓ మహానుభావులారా! నోరులేని చెట్లమీద మీ కింత ఆగ్రహ మెందుకు కలిగింది?

**తే. మొదల వర్ధిష్ణు లగు మిమ్ము సదయ హృదయు, లగు ప్రజాపతు లనుచు సర్వాత్ముఁ డనియె,**
**నట్టి మీరు ప్రజాసృష్టి కైన వార, లీ వనస్పతి తతుల దహింపఁ దగునె? 196**

* వర్ధమానులయిన మిమ్ములను సదయ హృదయులైన ప్రజాపతులుగా భగవంతుడు వాక్రుచ్చినాడు. వాస్తవానికి ప్రజాసృష్టికోసమే మిమ్ములను సృష్టించినాడు. అటువంటి మీరే ఈ విధంగా ఆగ్రహోదగ్రులై అమాయికములైన మహీరుహాలను దహించటం ధర్మమా చెప్పండి?

**సీ. ఆదికాలంబున నా ప్రజాపతి పతి యయిన లోకేశ్వరుం డచ్యుతుండు**
**పద్మనేత్రుఁడు వనస్పతుల నోషధి ముఖ్య జాతంబు నిషము నూర్జంబుఁ గోరి**
**కల్పించె; నందు ముఖ్యంబైన యన్నంబు నచరంబు లైనట్టి యపద మెల్ల**
**బాదచారులకును బాల్పెట్టి యిరుగాళ్ళు చేతులు గలిగిన జీవతతికి**

**తే. హస్తములు లేని యా చతుష్పాదు లెల్ల, నన్నముగఁ బూని కావించె నదియుఁగాక**
**యా మహాభాగుఁ డచ్యుతుఁ డాదరమున, మీకు ననఘాఖ్య విఖ్యాతి జోకపఱిచె. 197**

* ఓ ప్రచేతసులారా! సృష్టికి ప్రారంభంలో ప్రజాపతులకు అధిపతి అయిన శ్రీమన్నారాయణుడు వనస్పతులనూ ఓషధులనూ సృష్టించాడు. అఖిలలోకాధినాథుడూ అచ్యుతుడూ అయిన ఆ పద్మలోచనుడు జీవులకు ఆహారంగా ఇష్టమైన రుచుల కోసమూ, శరీరానికి శక్తి ఇయ్యటం కోసమూ ఈ వృక్షాలను ఏర్పాటు చేశాడు. చరములూ పాదచారులూ అయిన జీవులకు అచరములూ, పాదరహితములూ అయిన వానిని ఆహారంగా కల్పించాడు. రెండుచేతులు, రెండుకాళ్లు గల ప్రాణులకు నాలుగు కాళ్ళ జంతువులనూ, వృక్షాలనూ ఆహారంగా ఏర్పాటు చేశాడు. అందువలన మీరు ఈ విధంగా చెట్లను కాల్చివేయటం న్యాయం కాదు. అదీగాక తపస్సుచేసి పుణ్యవంతులై వెలువడుటకు ఆ దయామయుడైన నారాయణుని అనుగ్రహమే గదా కారణం. ఆ మహానుభావుడైన అచ్యుతుడేగా మీకు లోకమంతటా "అనఘులు" అనే ప్రఖ్యాతి కల్పించింది.

**క. నిజముగ దేవాధీశ్వరుఁ, డజుఁడు ప్రజాసర్గమునకు ననఘుల మిమ్మున్**
**సృజియించె నిట్టివారికిఁ, గుజదహనము సేయ నెట్లు కోరిక వొడమెన్? 198**

* నిజానికి దేవదేవుడైన బ్రహ్మదేవుడు ప్రజాసృష్టికోసం పాపరహితులైన మిమ్మల్ని సృష్టించాడు. అటువంటి మీకు వృక్షాలను దహించాలనే ఇటువంటి క్రూరమైన కోరిక ఎట్లా పుట్టింది?

చ. సతత మహత్త్వ సత్త్వగుణ సత్పురుష స్తృతిఁ బొందరయ్య! మీ
పితరులునుం బితామహులుఁ బెద్దలు నెన్నఁడుఁ బొందనట్టి దు
ష్కృతమతమైన కోపమునఁ గిల్బిషభావము మానరయ్య! సం
భృత కరుణావలోకమున భీత తరుప్రకరంబుఁ జూచుచున్. 199

* సద్గుణాలు సంపాదించుకొని సత్పురుషులుగా జగత్తులో ప్రశస్తి గాంచాలనే పవిత్రభావంతో ప్రకాశించండి. మీ తండ్రులూ, తాతలూ, పెద్దలూ ఎవ్వరూ ఎన్నడూ అవలంబించని కోపతాపాలకు లోనై పాపం గట్టుకోకండి. భయంతో గడగడ వడకుతున్న ఈ తరుసమూహాన్ని దయార్ద్ర దృష్టులతో దర్శించండి.

ఉ. తప్పక యర్భకావళికిఁ దల్లియుఁ దండ్రియు నేత్రపంక్తికిన్
ఱెప్పలు నాతికిం బతి నరేంద్రుఁడు లోకుల కెల్ల నర్థికి
న్నొప్ప గృహస్థు మూఢులకు నుత్తము లెన్నఁగ వీరు బంధువుల్
ముప్పునఁ గావలేని కడుమూర్ఖులు గారు నిజాల బంధువుల్. 200

* పిల్లలకు తల్లిదండ్రులు సంరక్షకులు, అట్లాగే కన్నులకు రెప్పలు రక్షకములు. అదే విధంగా సతికి పతీ, ప్రజకు ప్రభువూ సంరక్షకులు. యాచకులకు గృహస్థులూ, మందబుద్ధులకు బుద్ధిమంతులూ సంరక్షకులు. వారే వారికి నిజమైన ఆప్తబాంధవులు. అంతేకాని ఆపద సమయాలలో ఆదుకోలేని కఠినచిత్తులు బంధువులు కానేకారు.

సీ. అఖిల భూతముల దేహాంతస్థు మగు నాత్మ యీశుఁ డచ్యుతుఁడని యెఱుఁగవలయు,
నెఱిఁగి సర్వం బైన యిందిరారమణు లో చూపునఁ దనివిగాఁ జూడవలయుఁ,
జూచిన చిద్రూప శుద్ధాత్మ లగు మిమ్ము నెనసిన వేడ్కతో నిచ్చ మెచ్చు,
మెచ్చిన సర్వాత్ము మీ రెఱింగినచోటఁ గోపగుణంబులఁ బాపవలయుఁ;

ఆ. బాపి దగ్ధశేష పాదపజాలంబుఁ, దియ్య మెసఁగ బ్రతుకనీయవలయు;
ననఘులార! మీర లస్మదీయ ప్రార్థ, నంబు పరఁగఁ జేకొనంగవలయు. 201

* ఇంకా సోముడు ప్రాచేతసులను ఇట్లా వేడుకొన్నాడు - సమస్త జీవరాసుల దేహాలలోపల సర్వేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు ఆత్మ స్వరూపంలో ఉన్నాడని మీరు తెలుసుకోవాలి. అట్లా తెలుసుకొని సర్వత్ర నిండి ఉన్న ఆ ఇందిరారమణుడైన గోవిందుని లోచూపులతో తనివితీరా చూడాలి. అట్లా చూచినట్లయితే పరిశుద్ధాత్ములూ జ్ఞానస్వరూపులూ అయిన మిమ్మల్ని ఆ భగవంతుడు ఎంతో మెచ్చుకుంటాడు. అట్లా మెచ్చుకొన్న పరాత్పరుడు మీరు చూచే ప్రదేశమంతటా అన్నిట్లోనూ ఉన్నాడని తెలుసుకొని మీరు మీ కోపాన్ని శాంతింపజేసుకోవాలి. ఆగ్రహాన్ని త్యజించినవారై మీరు దహింపగా మిగిలిన వృక్షాలను ఇకనైనా సంతోషంగా బ్రతుకనీయాలి. ఓ పుణ్యాత్ములారా! మీరు నా ప్రార్థనను అంగీకరించాలి.

క. ఇదె వృక్ష సముద్భవ యగు, మది రేక్షణ నాప్సరసిఁ గుమారిక నిత్తున్
వదలక పత్నిఁగఁ జేకొని, ముద మందుఁడు పాదపముల మోసము వాయన్. 202

* ఇదిగో! ఈ అమ్మాయిని చూడండి. ఈమె అప్సరస పుత్రిక. ఈమె పేరు మారిష. ఈ వృక్షాల నడుమ జన్మించిన ఈ సుందరిని మీకు ఇస్తున్నాను. ఈ లతాంగిని అర్ధాంగిగా స్వీకరించండి. సంతోషంగా ఉండండి. ఈ తరువులను ఆపదనుండి కాపాడండి.

వ. అని యి ట్లామంత్రణంబు సేసి, మారిష యను కన్యకను వారల కిచ్చి చంద్రుండు సనియె. నప్పుడు 203

* ఈ విధంగా ప్రాచేతసులకు నచ్చజెప్పి ఒప్పించి మారిషను వారికి అప్పగించి సోముడు వెళ్లిపోయాడు.

క. వారలు పర్యాయంబున, నీరేజముఖిన్ వరించి నెఱి రమియింపన్
ధీరుఁడు ప్రాచేతసుఁడై, వారక దక్షుండు పుట్టె వనజజ సముఁడై. 204

* ప్రాచేతసులు క్రమంగా ఆమెను వివాహమాడారు. ఎంతో సంతోషంతో ఆమెతో విహరించారు. అప్పుడు వారికి మారిషయందు ధీరస్వభావుడూ, బ్రహ్మదేవునితో సమానుడూ అయిన దక్షుడు జన్మించాడు.

క. ఎవ్వని సంతానంబులు, నివ్వటిలెన్ వసుధ నెల్ల నెఱి నా దక్షుం
డి వ్వలన జగము లన్నిటఁ, బ్రవ్వ జలము నిలిపినట్లు ప్రజఁ బుట్టించెన్. 205

* నేల నాలుగు చెరగులా నిండిఉన్న జీవరాసులన్నీ ఈ దక్షుని సంతానమే. ఈ విధంగా దక్షప్రజాపతి కుండలో జలం నింపినట్లు భూమి నంతా తన సంతానంతో నింపివేశాడు.

ఉ. వారని వేడ్కతో దుహితృ వత్సలదక్షుఁడుఁ దక్షుఁడాత్మచేఁ
గోరి సృజించెఁ గొన్నిటి నకుంఠిత వీర్యముచేతఁ గొన్నిటిం
బోరన ఖేచరంబులను భూచరముఖ్య వనేచరంబుల
న్నీరచర వ్రజంబు రజనీచరజాల దివాచరంబులన్. 206

* ఆడపిల్లలంటే వేడుకపడే దక్షుడు కొంత మందిని తన ఆత్మశక్తితో పుట్టించాడు. మరి కొంత మందిని తన వీర్యం ద్వారా సృష్టించాడు. ఈ విధంగా జనించిన జీవరాసులలో కొందరు ఖేచరులు; కొందరు భూచరులు; కొన్ని వనచరాలు; మరికొన్ని జలచరాలు; కొన్ని రాత్రిళ్లు సంచరించేవి; ఇంకా కొన్ని పగటిపూట సంచరించేవి.

క. నరసుర గరు డోరగ కి, న్నర దానవ యక్ష పక్షి నగ వృక్షములం
దరమిడి సృష్టి యొనర్చెను, దిరముగ దక్షప్రజాపతి వితతకీర్తిన్. 207

* దక్షప్రజాపతి మానవులనూ, దేవతలనూ, గరుడులనూ, ఉరగులనూ, కిన్నరులనూ, రాక్షసులనూ, యక్షులనూ, పక్షులనూ, వృక్షాలనూ, పర్వతాలనూ వరుసగా సృష్టించి విశాలమైన యశస్సును సంపాదించాడు.

క. బహువిధముల బహుముఖముల, బహురూపము లైన ప్రజల బహులోకములన్
బహుళముగఁ జేసి మదిలో, బహుమానము నొందఁ డయ్యెఁ బ్రఖ్యాతముగన్. 208

* ఈ విధంగా అనేక రూపాలతో కూడిన జీవులను అనేకవిధాలుగా అపారంగా సృష్టించికూడా దక్షప్రజాపతికి సంతుష్టి కలుగలేదు.

తే. అప్రజాసర్గ బృంహితం బైన జగము, దక్షుఁ డీక్షించి మదిలోనఁ దాప మొంది
మఱియు జననంబు నొందించు మతము రోసి, పరమపురుషుని నాశ్రయింపంగఁ దలఁచె. 209

* నానావిధాలైన ప్రాణులతో నిండి ఉన్న లోకాన్ని ఆలోకించి దక్షప్రజాపతి అంతరంగంలో ఎంతో సంతాపం చెందాడు. సృష్టించాలనే కుతూహలాన్ని విసర్జించాడు. పరమపురుషుణ్ణి శరణు పొందాలనే నిశ్చయానికి వచ్చాడు.

వ. ఇట్లు దక్షప్రజాపతి ప్రజాసర్గంబు చాలక చింతించి మంతనంబున లక్ష్మీకాంతుని సంతుష్టుం జేయువాఁడై 210

* దక్షప్రజాపతికి తాను చేసిన సృష్టి సంతుష్టి కలిగించలేదు. ఆయన ఏకాంతంగా చింతించి శ్రీకాంతుణ్ణి సంతుష్ట స్వాంతుణ్ణి చేయాలని సంకల్పించాడు.

క. మోదం బై పరిదూషిత, ఖేదం బై శాబరీద్ధ కిలికించిత దృ
గ్భేదం బై బహుసౌఖ్యా, పాదం బై యొప్పు వింధ్యపాదంబునకున్. 211

* దక్షప్రజాపతి తపస్సు చేయటంకోసం వింధ్య పర్వతానికి వెళ్లాడు. ఆ వింధ్యగిరి మనస్తాపాన్ని పోకార్చి ఆనందాన్ని చేకూర్చేదిగా ఉన్నది. ఆ కొండచరియల మీద శబరస్త్రీలు తమ విలాసవీక్షణాలు ప్రసరింపజేస్తూ విహరిస్తుంటారు. ఆ కొండలోయలు అపారమైన ఆనందానికి ఆలవాలాలై ఉంటాయి.

వ. అరిగి, యం దఘమర్షణం బను తీర్థంబు సర్వ దురితహరం బై యొప్పుదాని ననుసవనంబు సేవించి, యతిఘోరం బైన తపంబు సేయుచు హరిం బ్రసన్నుంజేసి, హంసగుహ్యం బను స్తవరాజంబున నిట్లని స్తుతించె. 212

* ఆ వింధ్యపర్వతం లోయలలోకి దక్షుడు ప్రవేశించాడు. అక్కడ సమస్త పాపాలనూ శాంతింపజేసే "అఘమర్షణం"అనే తీర్థం ఉన్నది. ఆ తీర్థంలో నిత్యమూ స్నానం చేస్తూ దక్షప్రజాపతి అతిఘోరమైన తపస్సుచేసి శ్రీమన్నారాయణుని ప్రసన్నం చేసుకొన్నాడు. తనముందు సాక్షాత్కరించిన శ్రీహరిని "హంసగుహ్యం" అనే స్తోత్రంతో దక్షుడు ఈ విధంగా సంస్తుతించాడు.

## -: దక్షుఁడు కావించిన హంసగుహ్యం బను స్తవరాజము :-

తే. పరమునికి వందనము సేతుఁ బరిభవించి, ము న్నవితథానుభూతికి మ్రొక్కికొందు,
మెఱయు గుణములఁ దేలు నిమిత్తమాత్ర, బంధుఁడై నట్టి వానికిఁ బ్రణుతి సేతు. 213

* సర్వేశ్వరుడైన వానికి నమస్కారం చేస్తున్నాను. అమోఘమైన అనుభూతియే ఆకారమైన వానికి నమస్కారం. గుణవంతుడై విరాజిల్లుతూ నిమిత్తమాత్రంగా బంధుమిత్రుల రూపంతో వెలుగొందే పరమాత్మకు ప్రణామం చేస్తున్నాను.

ఆ. తవిలి గుణముచేతఁ దత్త్వబుద్ధులచేత, నిగిడి కానరాని నెలవువాని
మొదలఁ దాన కలిగి ముక్తి మానావధి, రూపమైనవాని ప్రాపుఁ గందు. 214

* గుణాలలో చిక్కుకున్నవారికీ, కేవలం తాత్త్విక బుద్ధితో అన్వేషించే వారికీ నీ ఉనికి తెలియరానిది. మొదటినుండి ఉన్నవాడవు నీవు! మోక్షానికి పరమావధివై ప్రకాశించు వాడవు నీవు! అటువంటి అంతర్యామివైన స్వామిని నిన్ను ఆశ్రయిస్తున్నాను.

తే. ఎల్ల తనువులందు నిరవొంది తనతోడఁ, బొందు సేసినట్టి పొందుకాని
పొందు వొందలేఁడు పురుషుండు గుణముఁదా, గుణినిఁ బోలె నట్టి గుణి భజింతు. 215

* సమస్త జీవుల దేహములందును ఆత్మరూపంలో నివసిస్తున్నావు. కాని ఆ జీవులు అంతర్యామిగా ఉన్న నిన్ను గుర్తించటం లేదు. వారు తమలో తాము స్నేహం చేస్తున్నారేకాని పరమాత్మవైన నీతో పొందుచేయటం లేదు. గుణములలో చిక్కుకున్న ఈ జీవులు గుణములకు అధీశ్వరుడవైన నిన్ను దర్శింపలేకున్నారు. అటువంటి గుణవంతుడవైన భగవంతుణ్ణి సన్నుతిస్తున్నాను.

ఉ. పూని మనంబులుం దనువు భూతములున్ మఱి యింద్రియంబులున్
బ్రాణములున్ వివేక గతిఁ బాయక యన్యముఁ దమ్ము నెమ్మెయిం
గానఁగ నేర వా గుణనికాయములం బరికించునట్టి స
ర్వానుగతు న్సమస్తహితు నాదిమపూరుషు నాశ్రయించెదన్. 216

* మనస్సు, దేహం, పంచభూతాలు, పంచేంద్రియాలు, పంచప్రాణాలు కలిగి యున్న జీవులు ఈ దేహమే తాము అనుకుంటున్నారు. ఆ భావంతోనే అంతర్యామివైన నిన్ను గుర్తింప లేకున్నారు. వారికి వివేకబుద్ధి ప్రాప్తించినప్పుడు ఇంద్రియాదులు వేరనీ, జీవుడు వేరనీ తెలుసుకుంటున్నారు. ఈ సృష్టి నంతటినీ పరికించువాడూ సమస్తమునకూ మూలమైనవాడూ విశ్వహితుడైన ఆదిపురుషుడు ఒకడున్నాడు. అటువంటి పరమ పురుషుడవైన నిన్ను ఆశ్రయిస్తున్నాను.

వ. మఱియు బహువిధ నామ రూప నిరూప్యంబగు మనంబునకు దృష్టస్మృతుల నాశంబువలన గలిగెడు నుపరామం బగు సమాధియందుఁ గేవల జ్ఞానస్వరూపంబునఁ దోఁచు నిర్మల ప్రతీతిస్థానంబైన హంసస్వరూపికి నమస్కరింతు. దారువందు నతిగూఢంబైన వీతిహోత్రుని బుద్ధిచేతం బ్రకాశంబు నొందించు భంగి బుద్ధిమంతులు హృదంతరంబున సన్నివేశుం డైన పరమపురుషుని నాత్మశక్తిత్రయం బుల చేతం దేజరిల్లం జేయుదురు. అట్టి దేవుండు సకల మాయావిచ్ఛేదకం బైన నిర్వాణ సుఖాను భవంబులం గూడి యుచ్చరింపం గొలఁదిగాని శక్తిగల విశ్వరూపి నాకుం బ్రసన్నుండగుం గాక.

వాగ్బుద్ధీంద్రియ మానసంబులచేతం జెప్పను, నిట్టి దని నిరూపింపను, నలవిగాక ఎవ్వని గుణరూపం బులు వర్తించు, నెవ్వఁడు నిర్గుణుండు, సర్వంబు నెవ్వని వలన నుత్పన్నంబగు, నెవ్వని వలన స్థితిం బొందు, నెవ్వని వలన లయంబగు, నట్టి పరాపరంబులకుఁ బరమంబై, యనన్యంబై సర్వవ్యాప కంబై, యదియ బ్రహ్మంబై, యాదికారణంబై యున్న తత్త్వంబు నాశ్రయింతు. ఎవ్వని ప్రభావంబు మాటలాడెడు వారలకు, వాదంబు సేయువారలకు వివాదస్థలం బగుచు, నప్పటప్పటికి మోహంబు నొందింపుచుండు, నట్టి యనంతగుణంబులు గల మహాత్మునకుం బ్రణామంబు సేయుచు నస్తి నాస్తి యను వస్తుద్వయ నిష్ఠలం గలిగి, యొక్కటనఁ గలిగియుండి, విరుద్ధ ధర్మంబులుగ నుపాసనా శాస్త్ర సాంఖ్యశాస్త్రంబులకు సమంబై, వీక్షింపఁదగిన పరమంబు నాకు ననుకూలంబగుం గాక, ఎవ్వఁ డు నామరూపంబులు లేకుండియు, జగదనుగ్రహంబు కొఱకు జన్మకర్మంబులచేత నామరూపం బులు గల్గి తేజరిల్లు, నట్టి యనంతుండైన భగవంతుండు సుప్రసన్నుండగుఁగాక. ఎవ్వఁడు జనుల పురాకృత జ్ఞాన పదంబుచేత నంతర్గతుండై, మేదినిం గలుగు గంధాది గుణంబుల నాశ్రయించిన వాయువుభంగి మెలంగుచుండు నా పరమేశ్వరుండు మదీయ మనోరథంబు సఫలంబు సేయుంగాక అనుచు భక్తి పరవశుండై యుక్తి విశేషంబున స్తుతియింపుచున్న దక్షునికి భక్తవత్సలుం డైన శ్రీవత్సలాంఛనుండు ప్రాదుర్భావంబు నొంది ప్రత్యక్షం బయ్యె నంత. 217

* మనస్సు అనునది నానావిధాలైన నామరూపాలను నిరూపించుటకు ఏర్పడినది. ఆ మనస్సుచేత గమనింపబడినవీ, స్మరింపబడినవీ అయిన విషయాలు మాటి మాటికీ అదృశ్యమవుతూ ఉంటాయి. ఆ విధముగా అవి తొలగిపోయినప్పుడు మనస్సు అనేది ఉండదు. కేవలం జ్ఞానస్వరూపమైన ఆత్మమాత్రమే గోచరించుతుంది. ఈ అనుభవాన్నే 'సమాధి'అంటారు. అటువంటి సమాధికి ఆశ్రయభూతుడవైన హంస స్వరూపుడవు నీవు. అటువంటి నీకు ప్రణమిల్లుతున్నాను.

బుద్ధిమంతు లైనవారు తమ బుద్ధి విశేషం చేత ఎండుకట్టెలో దాగి ఉన్న అగ్నిని రగుల్కొల్పి ప్రకాశింపజేస్తారు. అదే విధంగా వివేకవంతులు తమ హృదయాంతరాలలో అంతర్యామిగా ఉన్న పరమపురుషుణ్ణి తమలోని శక్తిత్రయం చేత ప్రకాశింపజేస్తారు. అటువంటి భగవంతుడు సమస్త విధాలైన మాయలకు అతీతమైన మోక్షసంబంధమైన ఆనందానుభూతితో విలసిల్లుతుంటాడు.

మాటలకు అందని మహత్తరశక్తితో కూడి ఉన్న ఆ విశ్వరూపుడు నన్ను అనుగ్రహించుగాక! వాక్కు, బుద్ధి, ఇంద్రియాలు, మనస్సు మొదలైనవి ఆ పరమాత్ముని స్వరూపాన్ని వెల్లడించలేవు. అది ఇటువంటిదని నిరూపింపనూ లేవు. ఇంద్రియాదులకు అతీతములైన గుణరూపాలతో వర్తించుతూ ఉన్న ఆ నిర్గుణ స్వరూపునికి నమస్కరిస్తున్నాను.

ఈ సమస్త విశ్వం ఏ మహాశక్తి వలన సృష్టింప బడుతున్నదో, ఏ మహాశక్తివలన రక్షింపబడుతున్నదో, ఏ మహాశక్తి వలన లయం పొందుతున్నదో అటువంటి పరమాత్మ స్వరూపం పరాపరములకంటే ఉత్తమమైనది.

అనన్యమైనది. అనాది కాలం నుండీ ప్రసిద్ధమైనది. అంతటా వ్యాపించి ఉన్నది. అన్నిటికీ మూలకారణమైనది. ఆ పరబ్రహ్మను ఆశ్రయిస్తున్నాను. ఆ పరమాత్మ ప్రభావం వల్లనే ప్రాణులు మాటలాడుతున్నారు. వాదోపవాదాలు చేస్తున్నారు. వివాదాలు పడుతున్నారు. అన్నింటికీ కారణం ఆ పరమాత్ముని అనంతగుణాలే. జీవులను ఎప్పటి కప్పుడు మోహంలో ముంచితేల్చే ఆ భగవంతునికి ప్రణామం చేస్తున్నాను.

ఉన్నది లేదు అనే వస్తుద్వయానికి ఆలవాలాలై పైకి విరుద్ధ ధర్మాలుగా కనబడుతున్న యోగసాంఖ్య దర్శనాలను రెంటికీ సమత్వం సమకూర్చే పరమాత్మ నన్ను అనుగ్రహించును గాక!

ఏ దేవుడు మానవుల పురాకృత పుణ్యవిశేషాలచేత సుగంధాన్ని ఆశ్రయించిన వాయువువలె అంతర్యామియై ఈ భూమిమీద ఉద్భవిస్తుంటాడో ఆ పరమేశ్వరుడు నా మనోరథాన్ని సఫలం చేయుగాక!

ఈ విధంగా దక్షప్రజాపతి భక్తిపరవశుడై తన ఉక్తివిశేషాలను వ్యక్తీకరిస్తూ భగవంతుణ్ణి సంస్తుతించాడు. అప్పుడు భక్తవత్సలుడైన శ్రీమన్నారాయణుడు దాక్షిణ్యంతో దక్షుని ముందు సాక్షాత్కరించాడు.

సీ. భర్మాచలేంద్ర ప్రపాతద్వయంబునఁ గలిగిన నీలంపుఁ గను లనంగ
మొనసి తార్క్ష్యుని యిరుమూఁపుపై నిడినట్టి పదముల కాంతులు పరిఢవింపఁ
జండ దిఙ్మండల శుండాల కరముల క్రైవడి నెనిమిది కరము లమరఁ
జక్ర కోదండాసి శంఖ నందక పాశ చర్మ గదాదుల సరవిఁబూని

ఆ. నల్లమేను మెఱయ నగుమొగం బలరంగఁ, జల్లచూపు విబుధ సమితిఁబ్రోవ
బసిఁడికాసెఁ బూని బహు భూషణ కిరీట కుండలముల కాంతి మెండు కొనఁగ. 218

* శ్రీమన్నారాయణుడు గరుత్మంతుని మీద ఆసీనుడై ఉన్నాడు. గరుడుని రెండు భుజాలమీద చాచిన ఆ స్వామి పాదాలు మేరు పర్వతం చరియకు రెండుప్రక్కలా ప్రకాశించే ఇంద్రనీలమణుల గనులవలె ఉన్నాయి. ఆయన అష్టబాహువులూ అందంగా పైకి చాచిన అష్టదిగ్గజాల తొండాలవలె ప్రకాశిస్తున్నాయి. ఎనిమిది చేతులలోనూ చక్రమూ, ధనుస్సూ, పద్మమూ, శంఖమూ, ఖడ్గమూ, పాశమూ, డాలూ, గదా దండమూ విరాజిల్లుతున్నాయి. నల్లని దేహంతో నగుమొగంతో సాధుజనులను సంరక్షించే చల్లని చూపులతో బంగారు రంగు పట్టుపీతాంబరంతో మణిమయ కిరీటంతో నలుమూలలా కాంతులు విరజిమ్మే భూషణాలతో మకర కుండలాలతో పుండరీకాక్షుడు దక్షుని ముందు ప్రత్యక్షమైనాడు.

సీ. కుండల మణి దీప్తి గండస్థలంబులఁ బూర్ణేందురాగంబుఁ బొందుపఱుప
దివ్యకిరీట ప్రదీప్తు లంబర రమా సతికిఁ గౌసుంభవస్త్రంబు గాఁగ
వక్షస్థలంబుపై వనమాల మాలికల్ శ్రీవత్స కౌస్తుభ శ్రీల నొఱయ
నీలాద్రిఁ బెనఁగొని నిలిచిన విద్యుల్లతలభాతిఁ గనకాంగదములు మెఱయ

ఆ. నఖిలలోక మోహనాకార యుక్తుఁడై, నారదాది మునులు చేరి పొగడఁ
గదిసి మునులు పొగడ గంధర్వ కిన్నర, సిద్ధ గానరవము సెవుల నలర. 219

* ఆయన కర్ణకుండలాల కాంతులు ప్రసరించి చెక్కిళ్లు చంద్రబింబాలలాగా తళతళ లాడుతున్నాయి. తలమీద ధరించిన కిరీటం తన దివ్యదీప్తులతో గగనలక్ష్మికి కుంకుమరంగు చీరను అలంకరిస్తున్నది. ఆయన వక్షస్థలంమీద విరాజిల్లే వనమాలిక శోభలు శ్రీవత్సంతోనూ కౌస్తుభంతోనూ పోటీపడుతున్నాయి. బాహువులకు చుట్టకొని ఉన్న భుజకీర్తులు నీలగిరికి చుట్టుకొన్న మెరపు తీగలవలె మెరుస్తున్నాయి. ఆ స్వామి సౌందర్యం సమస్తలోకాలనూ మోహంలో ముంచి తేలుస్తున్నది. నారదాది మహర్షులు చుట్టూ చేరి సేవిస్తున్నారు. దేవతా బృందాలు కైవారాలు సలుపుతున్నారు. గంధర్వులు, కిన్నరులు, సిద్ధులు వీనులవిందుగా గానం చేస్తున్నారు.

క. సర్వేశుఁడు సర్వాత్ముఁడు, సర్వగతుం డచ్యుతుండు సర్వమయుండై
సర్వంబు చేరి గొలువఁగ, సర్వదుఁడై దక్షునకుఁ బ్రసన్నుం డయ్యెన్. 220

* సర్వేశ్వరుడు, సర్వాత్ముడు, సర్వాంతర్యామీ, సర్వమయుడూ అయిన శ్రీమహావిష్ణువు సమస్తపరివార సమేతుడై దక్షప్రజాపతి దయతో దర్శన మిచ్చాడు.

వ. ఇట్లు ప్రసన్నుండైన సర్వేశ్వరుని సర్వంకషంబై మహదాశ్చర్యధుర్యంబై తేజరిల్లు దివ్యరూపంబుం గాంచి, భయంబును, హర్షంబును, విస్మయంబును జిత్తంబున ముప్పిరిగొని చొప్పు దప్పింపం దెప్పిఱి, కప్పరపాటునఁ బుడమిపై నిడుసాగిలంబడి, దండప్రణామంబు లాచరించి, కరకమలంబులు మొగిడ్చి సెలయేఱులతోఁ గొట్టువడి, యిట్టట్టు పట్టుచాలక నిట్టవొడిచి, మున్నీరు దన్ని నిలిచిన పెన్నీరునుంబోలె, సర్వాంగంబులుం దొంగలింపఁ, జిత్తంబు నాత్మాయత్తంబు సేసి, పిక్కటిల్లిన సంతోషంబుచేత భగవంతుం బలుకను, నత్యంత మంగళసందోహోపాదకంబు లైన తన్నామంబు లుగ్గడింపను, నతి నిర్మలంబులైన తదీయ కర్మంబులు దడవను, విబుధ హర్షకరంబులైన తత్పౌరుషంబులు పొగడను, నాత్మీయ మనోరథంబు వాక్రువ్వను నోపక ప్రజాకాముండై యూరకున్న ప్రజాపతిం జూచి, సర్వజీవ దయాపరుండును, సర్వసత్త్వ హృదంతరస్థుండును, సర్వజ్ఞుండునుం గావున నతని భావంబు దెలిసి, జగన్నాథుం డార్త పోషణంబుల భాషణంబుల నిట్లనియె. 221

* ఈ విధంగా సాక్షాత్కరించిన సర్వేశ్వరుని దివ్యరూపం సర్వదిక్కులనూ వెలిగిస్తూ మహాశ్చర్యాన్ని కలిగించింది. అలా ప్రకాశించే ఆ దేవదేవుని తేజోమయమూర్తిని వీక్షించి దక్షుని హృదయంలో భయమూ, ఆనందమూ, ఆశ్చర్యమూ ముప్పిరి గొన్నాయి. ఎలాగో ఆ తన్మయత్వంలో నుంచి తెప్పరిల్లి తొట్రుపాటుతో దక్షుడు స్వామికి సాష్టాంగ దండ ప్రణామం చేశాడు. చేతులు మోడ్చి నిలుచున్నాడు. సెలయేళ్లు కలయికతో దరులొరసి పొంగి మిన్నంటి సముద్రాన్ని దరిసిన మహానదీ ప్రవాహంవలె దక్షప్రజాపతి పులకించిన దేహంతో భగవంతుని ముందు నిలిచాడు. ఆయన పరవశించిన తన హృదయాన్ని ఎలాగో స్వాధీనం చేసుకొని

పొంగిపొరలే ఆనందంతో ఆ పరమేశ్వరునితో ఏమేమో పలుకవలె ననుకొన్నాడు. పరమ మంగళ దాయకాలైన ఆయన పవిత్రనామాలను ఉచ్చరించాలనుకొన్నాడు. పరమ పవిత్రాలైన ఆయన లీలలను అభివర్ణించాలను కొన్నాడు. విబుధులకు సంతోషాన్ని కలిగించే ఆయన పరాక్రమాన్ని ప్రస్తుతించాలనుకొన్నాడు. తన మనస్సులోని కోరికను వెల్లడించాలనుకొన్నాడు. కానీ పాపం! ఏమీ చేయలేక పోయాడు. ఆ విధంగా మైమరచి నోట మాటరాక మౌనం వహించి ఉన్న ప్రజాకాముడైన ప్రజాపతిని చూచి సర్వజ్ఞుడూ సర్వప్రాణి హృదయాంతర్యామీ అయిన ఆ స్వామి ఆతని అభిప్రాయాన్ని గ్రహించి ఆర్తజన పరిపోషణాలైన భాషణాలతో ఇలా అన్నాడు.

**క. మెచ్చితి ప్రాచేతస ! తప, మిచ్చుట ఫలసిద్ధి మయ్యె నిట్లతిభక్తిన్**
**హెచ్చగు మద్వరవిభవము, నచ్చుపడం బొంద నెవ్వఁ డర్హుఁడు? జగతిన్. 222**

* ఓ దక్షప్రజాపతీ! నిన్ను మెచ్చుకొన్నాను. నీ తపస్సు ఫలించింది. ఈ విధంగా అచంచలమైన భక్తితో నన్ను సేవించి నా నుంచి వైభవోపేతమైన వరాలను అందుకోటానికి నీ కంటే అర్హుడైన వాడు ఈ జగత్తులో మరెవ్వడున్నాడు?

**ఆ. తపము చాలు నింకఁ దగ భూతతతికి వి, భూతు లొనరుఁ గాక పొందుపడఁగ,**
**నిదియ సుమ్ము మాకు నిచ్చలోఁ గలకోర్కి, పొసఁగ నీదువలనఁ బొందుపడియె. 223**

* ఇక నీ తపస్సు చాలించు! సకల ప్రాణికోటికి సమస్త శుభాలూ చక్కగా సమకూరుగాక! నీవు సృష్టిచేయాలనే కోరికతో నన్ను గూర్చి తపస్సు చేశావు. నా మనస్సులోని సంకల్పంకూడా ఇదే. నా సంకల్పం ఈ విధంగా నెరవేరింది.

**వ. వినుము, బ్రహ్మయు, భర్గుండును, బ్రజాపతులును, మనువులును, నింద్రులును, వీరలు నిఖిల భూతంబులకు భూతి హేతువులైన మద్భూతి విభవంబులు. మఱియు నాకు యమ నియమాది సహిత సంధ్యావందనాది రూపంబగు తపంబు హృదయంబు. సాంగ జపవ ద్ధ్యానరూపం బగు విద్య శరీరంబు. ధ్యానాది విషయ పుంవ్యాపారంబుగా నుండు భావనాది శబ్దవాచ్యంబగు క్రియ యాకృతి. క్రతు జాతంబు లంగంబులు. ధర్మం బాత్మ. దేవతలు ప్రాణంబులు. నిగమంబు మత్స్వరూపంబు. జగదుత్పత్తికి నాదియందు నే నొక్కండన తేజరిల్లుచుంటి. బహిరంతరంబుల వేఱొక్కటియు లేదు. సుషుప్త్యవస్థయందు సర్వంబు లీనం బగుటం జేసి సంజ్ఞామాత్రుండును, నవ్యక్తుఁడునుఁగా నుండు జీవునిభంగి నొక్కఁడన యుండుదు. అనంతుండ నయి యనంత గుణంబు వలన గుణవిగ్రహం బగు బ్రహ్మాండంబును, నయోనిజుఁడు స్వయంభవుం డగు బ్రహ్మయును నుదయించిరి. మదీయ వీర్యోపబృంహితుండై మహాదేవుం డగు నా బ్రహ్మ యసమర్థునిఁబోలె నకృతార్థమ్మన్యమాన మనస్కుఁడై, సృజింప నుద్యమించు తఱి తపం బాచరించుమని నాచేత బోధితుండై, యఘోరంబైన తపం బాచరించి తొలుత సృష్టికర్తృత్వము వహించిన మిమ్ము సృజించె. అంతఁ బంచజనుం డను**

ప్రజాపతి తనూజ యగు నసిక్ని యను పేరిట వినుత నొందియున్న యిక్కన్యకను నీ కిచ్చితి. దీనిం బత్నిగాఁ గైకొని మిథునవ్యవాయ ధర్మంబు గలవాఁడవై, మిథునవ్యవాయ ధర్మంబుగల యీ నాతియందుఁ బ్రజాసర్గంబు నతి విపులంబుగ గావింపం గలవాఁడవు. మఱియు నీకుఁ బిదప నిదే క్రమంబున నిఖిల ప్రజలును మన్మాయా మోహితు లయి, మిథునవ్యవాయ ధర్మంబునఁ బ్రజావృద్ధి నొందించి మదారాధనపరులై యుండఁ గలవారు అని పల్కి, విశ్వభావనుండైన హరి, స్వప్నోపలబ్ధార్థంబునుం బోలె నంతర్ధానంబు నొందె. అప్పుడు దక్షుండు విష్ణుమాయోపబృంహితుండై పాంచజని యగు నసిక్ని యందు హర్యశ్వ సంజ్ఞల వినుతిఁ జెందియున్న యయుత సంఖ్యా పరిగణితులైన పుత్త్రులం గాంచె. అప్పు డా ధర్మశీలురైన దాక్షాయణులు, పితృనిర్దేశంబునం బ్రజాసర్గంబు కొఱకుఁ దపంబు సేయువారై పశ్చిమదిశకుం జని, యచ్చట సింధు సముద్ర సంగమంబున సమస్త దేవ ముని సిద్ధగణ సేవితంబై, దర్శనమాత్రంబున నిర్ధూత కల్మషులను, నిర్మల చిత్తులం జేయుచున్న నారాయణ సర స్సనం బరఁగు తీర్థరాజంబున నవగాహనంబుఁ జేసి, నిర్మలాంతరంగులై పరమహంస ధర్మంబు నందు నుత్పన్న మతులై ప్రజాసర్గంబు కొఱకుఁ దండ్రి యనుమతంబున నుగ్రతపంబు సేయుచుండ. వారికడకు నారదుండు వచ్చి యిట్లనియె. 224

* ప్రజాపతీ! విను. బ్రహ్మదేవుడు, శివుడు, ప్రజాపతులు, మనువులు, ఇంద్రులు మొదలైన సమస్త భూతజాలాలూ నా మహాశక్తి వలన జన్మించినవారే! ఇంద్రియ నిగ్రహం, నియమం సంధ్యావందనం మొదలైన వానితో కూడిన తపస్సే నా హృదయం. అంగోపాంగ సహితమై ధ్యానరూపమైన విద్యయే నా దేహం. ధ్యానం మొదలైన విషయాలలో ప్రవర్తించే భావనాది క్రియయే నా ఆకారం. యజ్ఞాలే నా అవయవాలు. ధర్మమే నా ఆత్మ. దేవతలే నా ప్రాణాలు వేదమే నా స్వరూపం.

ఈ జగత్తు ఉద్భవించటానికి పూర్వం నేను ఒక్కడినే ఉన్నాను. వెలుపలగానీ, లోపలగానీ వేరొక పదార్థం లేదు. అప్పుడు ఈ సమస్త విశ్వమూ సుషుప్తి అవస్థలో ఉండగా నే నొక్కడనే సంజ్ఞామాత్రంగా అవ్యక్తంగా ఉండి ఉన్నాను. నేను అనంతుడనే. అనంతగుణాలతో కూడిన నా మాయవల్ల గుణశరీరమైన ఈ బ్రహ్మాండాన్ని అయోనిజుడైన బ్రహ్మనూ సృష్టించాను. నా తేజస్సుతో నిండిన ఆ చతుర్ముఖ బ్రహ్మ సృష్టికార్యాన్ని చేపట్టికూడా తనను కృతార్థుడైన వానినిగా తలపలేదు. అసమర్థతతో ఈ సృష్టి తన వల్లకాదని భావించాడు. అప్పుడు తపస్సు చేయమని బ్రహ్మను నేను ప్రబోధించాను. చతుర్ముఖుడు నా చేత ప్రబోధితుడై ఘోరమైన తపస్సు ఆచరించి మొట్టమొదటిసారిగా సృష్టి కర్తలైన మిమ్మల్ని ప్రజాపతులను సృష్టించాడు.

దక్షప్రజాపతీ! ఇప్పుడు పంచజన ప్రజాపతి పుత్రిక అయిన "అసిక్ని"అనే పేరుగల ఈ కన్యను నీకు ఇస్తున్నాను. నీవు ఈమెను భార్యగా పరిగ్రహించు. ఈమెయందు దాంపత్యధర్మంతో ప్రవర్తించి విస్తారంగా ప్రజలను సృష్టించు. అనంతరం ప్రజలందరూ నా మాయచే మోహితులై దాంపత్యధర్మాన్ని అవలంబించి ప్రజాభివృద్ధి కావించి నన్ను సేవించ గలరు.

ఈ విధంగా దక్షప్రజాపతిని ఉద్దేశించి పలికినవాడై శ్రీమన్నారాయణుడు కలలో కన్పించిన పదార్థంలాగా అంతర్ధాన మైనాడు. అనంతరం దక్షప్రజాపతి విష్ణుదేవుని మాయచేత విమోహితుడై పంచజనుని పుత్రి అయిన 'అసిక్ని"అనే పత్నియందు "హర్యశ్వులు"అను పేరుగల వారిని పదివేలమంది కుమారులను కన్నాడు. ధర్మస్వభావులైన ఆ దక్షుని కుమారులు పదివేలమందీ తమ తండ్రిగారి ఆజ్ఞానుసారంగా ప్రజలను సృష్టించే నిమిత్తం తపస్సు చేయాలని నిశ్చయించారు. ఆ హర్యశ్వులు పశ్చిమదిశగా ప్రయాణం చేశారు. అక్కడ సింధునది సముద్రంలో సంగమించే ప్రదేశంలో "నారాయణ సరస్సు"అనే తీర్థ రాజాన్ని చూచారు. ఆ పుణ్యతీర్థం సమస్త దేవతలచేతా, మునీశ్వరులచేతా, సిద్ధపురుషులచేతా సేవింపబడుతూ ఉంటుంది. ఆ తీర్థాన్ని దర్శించినవారు సమస్తపాపాల నుండీ విముక్తులై నిర్మల హృదయులౌతారు. అటువంటి పవిత్ర తీర్థంలో ఆ హర్యశ్వులు స్నానం చేశారు. పరిశుద్ధమైన మనస్సులు కలవారై ప్రజాసర్గం నిమిత్తం పరమాత్మను ఉద్దేశించి భయంకరమైన తపస్సును ప్రారంభించారు. ఇలా ఉండగా నారదుడు ఒకనాడు వారి దగ్గరకు వచ్చి వారితో ఇలా అన్నాడు.

**సీ. మీ రతిమూఢులు మీఁదటి గతి గాన రెన్నంగఁ బసిబిడ్డ లన్నలార!**
**పుడమిఁ దా నింతని కడ పరికింపరు ప్రజలఁ బుట్టించ నే ప్రతిభ కలదు?**
**అట్లైన నొక్క మహాత్ముఁడు పురుషుండు బహురూపములు గల భామ యొకతె**
**పుంశ్చలీ భర్తయుఁ బురణింప నుభయ ప్రవాహంబు గల నది వఱలఁ గదల**

**ఆ. నంచ యొకటి యిరువదై దింటి మహిమలఁ, గలిగియుండు తెరువు గానరాక**
**వజ్రనిబిడ మగుచు వరుసఁ దనంతన, తిరుగు, రాష్ట్రబిలము దేటపడఁగ. 225**

* నాయనలారా! మీరు మిక్కిలి మూఢులుగా కన్పించుతున్నారు. మీ భవిష్యత్తును విచారించుకొనలేకున్నారు. మీరు పసిబిడ్డలు. ఈ భూమి పరిమాణమెంతో తెలియనివారు. ఇక జీవులను ఏ విధంగా సృష్టింపగలరు? సర్వాంతర్యామియైన ఆత్మస్వరూపుడు పురుషుడు ఒక డున్నాడు. స్త్రీరూపిణియై అనేక రూపాలు ధరించిన ప్రకృతి ఒకటున్నది. మాయలమారి అయిన ఆ ప్రకృతి పురుషుణ్ణి లోబరచుకుంటుంది. ప్రకృతీ పురుషుడూ కలిసి సంసార ప్రవాహాన్ని సాగిస్తారు. ఈ సంసారమనే నది రెండువైపుల నుండీ ప్రవహించుతూ ఉంటుంది. ఆ ప్రవాహాన్ని అనుసరించి ఒక హంస విహరిస్తూ ఉంటుంది. ఆ హంసకు ఇరవై అయిదు మహిమ లుంటాయి. అయినప్పటికీ ఆ హంస సరియైన మార్గం కానరాక వజ్రకాంతులతో మెరుస్తున్న జలప్రవాహం పడే గోతిచుట్టు తిరుగుతుంటుంది. ఆ గోతిలో పడితే మళ్ళీ బయటపడటమంటూ లేదు.

**క. వినుఁ డందుల యనురూపము, నను వొందఁగ నెఱుఁగ కాత్మ నాత్మగురూక్తిం**
**గొనసాగించెద మను మి, మ్మన నేమియు లేదు మూఢు లని తెలిసి తగన్. 226**

* హరిదశ్వులారా! వినండి. ఈ సంగతులను గుర్తించండి. ఇందుకు తగ్గట్టుగా ప్రవర్తించండి. ఈ సృష్టి రహస్యాన్ని ఏ మాత్రమూ తెలుసుకోకుండా కేవలం మీ తండ్రిగారి ఆజ్ఞలను కొనసాగించటానికి పూనుకొన్నారు. అటువంటి మిమ్ములను ఇంత తెలివి తక్కువ వాళ్లను ఏమనాలి?

**వ. అని నారదుండు బోధించిన హర్యశ్వులు సహజబుద్ధిచేత నారద వాక్యంబులను దమలో నిట్లని వితర్కించిరి. 227**

* ఈ విధంగా నారదమహర్షి హెచ్చరించాడు. హర్యశ్వులు నారదుని ప్రబోధవాక్యాలు ఆలకించి తమ బుద్ధితో విమర్శించుకొని తమలో తాము ఇలా తర్కించు కొన్నారు.

**తే. సొరిది క్షేత్రజ్ఞుఁ డన నతిసూక్ష్మ బుద్ధి, నరయ నజ్ఞానబంధనం బగుచు లింగ**
**దేహమున నెద్ది గల దది దెలియకున్నఁ, గలదె? మోక్షంబు దుష్కర్మ గతులచేత. 228**

* ముందు క్షేత్రజ్ఞుడు అంటే ఎవరో మనం సూక్ష్మబుద్ధితో తెలుసుకోవాలి. తర్వాత అజ్ఞానబంధనరూపమైన లింగదేహమంటే ఏమిటో గ్రహించాలి. ఆత్మ, దేహం ఈ రెండింటి స్వరూపాన్ని తెలుసుకోకుండా కేవలం నిరుపయోగాలైన కర్మలు ఆచరించిన మాత్రాన మోక్షం ప్రాప్తించదు.

**తే. కలఁడు జగదేక సన్నుత కారణుండు, స్వామి భగవంతుఁ డభవుండు స్వాశ్రయుండు**
**పరముఁ డాతనిఁ జూడక బ్రహ్మకైనఁ, గలుగునే? ముక్తిపదము దుష్కర్మగతుల. 229**

* ఈ సమస్త లోకాలకూ మూలకారణమైన భగవంతు డొక డున్నాడు. ఆయన సర్వేశ్వరుడు. పుట్టుక లేనివాడు. ఆత్మాశ్రయుడు. పురుషోత్తముడు. అటువంటి అంతర్యామి అయిన స్వామిని దర్శింప లేనిచో బ్రహ్మదేవునికైనా మోక్షం లభించదు.

**ఆ. పురుషుఁ డెట్టులేని పూని బిల స్వర్గ, గతుఁడు వోలె వర్తకంబు మాను**
**నట్టి బ్రహ్మ మెఱుఁగు నయ్యకు స్వర్భోగ, కర్మగతుల నేమి కానఁబడును? 230**

* ఈ లోకంలో జీవుడు సంసారమనే పాతాళ కూపంలో కూరుకొని పోయి గిలగిలలాడుతున్నాడు. ఈ సంసార బంధం నుండి బయట పడకుండా అతడు పరబ్రహ్మస్వరూపాన్ని ఎట్లా గుర్తించగలుగుతాడు? కర్మలు ఆచరించటం వల్ల స్వర్గఫలాలు ప్రాప్తిస్తాయి. కాని కైవల్యం చేకూరదు.

**శా. త న్నిష్ఠాగతి లేనివారికి నసత్కర్మ ప్రచారంబుచే**
**మున్నేమయ్యెడి నాత్మబుద్ధి గుణసమ్మోహంబునం దోఁచుచున్**
**వన్నెల్ వెట్టుక వింతబాగుల తఱిన్ వర్తించు దౌర్గుణ్య సం**
**పన్న స్త్రీయునుబోలె నెల్లగతులం బ్రఖ్యాతమై యుండఁగన్ 231**

* జీవునికి దేవునియందు ఆసక్తి ఉండటం ఎంతో అవసరం. భగవన్నిష్ఠ లేకుండా ఎన్నెన్నో దుష్కర్మలు చేసుకుంటూ పోయేవానికి ఏమీ ఉపయోగం ఉండదు. మానవుని బుద్ధి ఎంతో చంచలమైనది. అది చెడుగుణాల వ్యామోహానికి లొంగిపోయి రంగులు పులుముకొని వింత వింత వేషాలు వేస్తూ ఉంటుంది. అటువంటి దుర్గుణాల వలయంలో చిక్కుకొని దిక్కుతోచని వానికి మోక్షం అందనే అందదు.

సీ. అనుహొంద సృష్టి నవ్యయముగఁ జేయుచుఁ బ్రచుర ప్రవాహ సంపతిత మైన
నెఱయఁ గూలం బను నిర్గమ స్థానంబు నందు వేగముగల క్రందు మాయఁ
గదలి యహంకార గతివశంబునఁ జాల వివశుఁ డై బోధకు విపరి యైన
వానికి నీరీతి వలవంత కర్మ ప్రచారంబులను మీఁదఁ జక్కనైన

ఆ. జన్మ మరణ ముఖ్య జాడ్యంబుతోఁ బాసి, యఖిల సౌఖ్య పదవి నరసి కర్మ
మార్గ మైన యట్టి మహనీయ ధామంబు, చిత్త మార నెట్లు చేరఁ గలఁడు! 232

* లేని అవకాశం కల్పించుకొని మానవుడు ఎడతెరిపి లేకుండా సంతతిని సృష్టించుతూ ఆ ప్రవాహంలో పడి కొట్టుకు పోతుంటాడు. అల్లంతదూరంలో గట్టు కనిపిస్తున్నా దానిని అందుకోలేడు. మాయ వల్ల అతిశయించిన ప్రవాహవేగాన్ని తట్టుకోలేక క్రిందా మీదా పడుతుంటాడు. అహంకారం అతణ్ణి వివశుణ్ణి చేసి జ్ఞానమార్గానికి దూరం చేస్తుంది. బలవంతంగా వానిచేత దుష్కర్మలు చేయిస్తుంది. ఈ విధంగా పుట్టుక, చావు, రోగం అనే దురవస్థలలో మునిగి తేలే జీవుడు ఆ బంధాలలో నుండి బయటపడి సకల సౌఖ్యాలకూ ఆకరమూ, పరమ సుందరమూ ఐన మోక్షమార్గాన్ని ఎలా అందుకోగలడు?

తే. దాని సంసర్గ గుణములు దప్పి నడచు, కుచ్ఛితపు భార్యఁ జేకొన్న కుమతివోలె
తివిరి సుఖదుఃఖములఁ గూడి తిరుగు జీవ, రూప మెఱుఁగని వారికిఁ బ్రాపు గలదె? 233

* దుర్బుద్ధిగల పురుషుడు వక్రబుద్ధిగల స్త్రీని పెండ్లాడినట్లయితే ఆ సంసారం సరసంగా నడవదు. ఆ భార్యభర్తలు ఒకరిమాట మరొకరు వినిపించుకోకుండా కాపురాన్ని కడగండ్లపాలు చేసుకుంటారు. అటువంటి హీనమైన దుఃఖమయమైన సంసారంలో పడిన జీవునికి తిరిగి స్వస్వరూపాన్ని తెలుసుకోటం సాధ్యం కాదు. అటువంటి వానికి మోక్షం ప్రాప్తించదు.

మత్తకోకిల.
పంచవింశతి తత్త్వరాశి కపారదర్పణ మయ్యుఁ దాఁ
గొంచెమై పురుషుండు తత్త్వముఁ గోరి పట్టఁగ నేర కే
మంచుఁ గించుఁ దలంచువార లమార్గ కర్మము సేయఁగా
మంచిలోకము వారి కేటికి మానుగా సమకూరెడిన్? 234

* పంచజ్ఞానేంద్రియాలూ, పంచకర్మేంద్రియాలూ, పంచతన్మాత్రలూ, పంచభూతాలు, మనసూ, బుద్ధీ, చిత్తమూ, అహంకారమూ, పురుషుడూ- ఈ ఇరవైయైదు తత్త్వాలూ ప్రతిబింబించే అద్దం వంటిది పరతత్త్వం. అటువంటి పరతత్త్వాన్ని పట్టుకొనే ఉపాయం తెలుసుకోవాలి. అది లేకుండా జీవుడు ఏవేవో పనికిమాలిన కర్మలు చేస్తూ కూర్చుంటే అటువంటి వానికి ఉత్తమ మయిన ముక్తి మార్గం ఎందుకు అందుతుంది?

**క. బంధానుమోక్షణ క్రమ, సంధా నైశ్వర్యధుర్య శాస్త్ర సమగ్ర**
**గ్రంథంబు మాను చిద్రూ పాంధునకు నకర్మ గతుల నగునే శుభముల్. 235**

* సంసారబంధంలో చిక్కుకొన్న వారికి మోక్షాన్ని అనుసంధానం చేసేది ఆధ్యాత్మిక విద్య. అటువంటి పరతత్త్వ విద్యను పరిత్యజించి కర్మ కలాపంలో పడిన అజ్ఞానాంధుడైన అభాగ్యునికి శుభం కలుగుతుందా?

**మత్త కోకిల.**
**చూడ నీ జగమంతయున్ వెసఁ జుట్టి పుట్టుక లీల నే**
**జోడులేక రయంబునం గుడి చుట్టినట్టి స్వతంత్రముం**
**గూడి యుండిన కాలచక్రముఁ గోరిచూడని వారి కే**
**జాడఁ గల్గు నకర్మ సంగతిఁ జారుమోక్ష పదం బిలన్? 236**

* ఈ కాలచక్రం చాలా శక్తిమంతమైనది. ఈ సమస్త జగత్తునూ చుట్టచుట్టి పట్టుకొని సున్న చుట్టి మటుమాయం చేసే కిటుకులు దానికి తెలుసు. అటువంటి కాలస్వరూపాన్ని తెలుసుకోకుండా ఊరకే కర్మలు చేస్తూ కూర్చుంటే వానికి అక్షయమైన మోక్షపదం ఎట్లా దక్కుతుంది?

**ఆ. జన్మ హేతు వైన జనకునిర్దేశంబు, తనకుఁజేయ రాని దనుచుఁ దెలిసి**
**గుణమయ ప్రవృత్తి ఘోరాధ్వ నిశ్వాస, నిరతుఁ డగుచుఁ జేయ నేరఁ డతఁడు. 237**

* ఇంతకూ అసలు సంగతేమంటే ఈ సృష్టికార్యాన్ని మనతండ్రి అయిన దక్షప్రజాపతికి అయిన తండ్రి బ్రహ్మదేవుడు అప్పగించాడు. అతి భయంకరమైన ప్రవృత్తి మార్గాన్ని అవలంబించటం ఇష్టం లేక మన తండ్రి తన తండ్రి చెప్పిన పనిని మనకు అప్పగించాడు.

**వ. అని తనలో వితర్కించి యా కుమారు లప్పుడు- 238**

**సీ. వినవయ్య! భూపాల! మునివరేణ్యుని మాట లనువొందఁ దలపోసి వినయ మలర**
**వలగొని యతనికి వందనం బొనరించి తిరిగి యెన్నఁడు రాని తెరువు వట్టి**
**చయ్యన నేగిరి సహజస్వర బ్రహ్మ మయమైన పంకజనయను పాద**
**పద్మ మరందంబు పానంబు సేయుచు మత్తిల్లి నిలిచిన మానసాళి**

**తే. పరిణమింప విష్ణుఁ బాడుచుఁ దత్కీర్తి, సరణిమ్రోయు మహతి సంఘటించి**
**నారదుండు గుణవిశారదుం డెందేనిఁ జనియె జగము దన్ను సన్నుతింప. 239**

* ఈ విధంగా దక్షుని కుమారులైన హర్యశ్వులు తమలో తాము తర్కించుకొని నారదమునీంద్రుని హితోపదేశాన్ని శిరసావహించారు. ఆయనకు భక్తితో ప్రదక్షిణ నమస్కారాలు ఆచరించి తత్క్షణమే మోక్ష మార్గాన్ని అవలంబించి కృతార్థులైనారు. సహజ మధురమైన శ్రీమన్నారాయణుని పాదకమల మకరందాన్ని పానంచేసి తన మనోమధుకరం పరవశింపగా గుణవిశారదుడైన నారదుడు శ్రీహరి లీలలు మహతీ వీణపై మ్రోగిస్తూ యథేచ్ఛగా వెళ్లిపోయినాడు.

క. అప్పుడు దక్షుఁడు తనయులు, దప్పి మహాపథము గనుట తగ నారదుఁడే
చెప్పినఁ గప్పిన శోకము, ముప్పిరిగొని చిత్తవృత్తి మూరిం బోవన్. 240

* నారదమహర్షి పనికట్టుకొని దక్షప్రజాపతి దగ్గరకు పోయి "నీ కుమారులు హర్యశ్వులు ప్రవృత్తి మార్గాన్ని పరిత్యజించి నివృత్తి మార్గాన్ని స్వీకరించి మోక్షప్రవృత్తులైనా"రని చెప్పాడు. ఆ మాటలు విని దక్షునికి దుఃఖం పొంగివచ్చింది. ఆయన హృదయం వ్యాకుల మయింది.

చ. అడలుచు నున్న వచ్చి కమలాసనుఁ డూఱడిలంగఁ బల్కె మున్
పడసిన లీలఁ బుత్రుల నపార గుణాఢ్యులఁ గాంచుమన్న నా
పడఁతుక వల్లఁగ్రమ్మఱను బల్వురఁ దా శబళాశ్వ సంజ్ఞలం
బెడఁగగు వారి పుణ్యములఁ బేర్చినవారి సహస్ర సంఖ్యలన్. 241

* దక్షప్రజాపతి దుఃఖిస్తూ ఉండగా అక్కడికి బ్రహ్మదేవుడు వచ్చి ఓదార్చి ధైర్యం చెప్పాడు. వెనుకటిలాగానే అపార గుణాఢ్యులైన ఆత్మజులను పుట్టించవలసిందిగా ప్రోత్సహించాడు. దక్షుడు తన తండ్రి ఆజ్ఞానుసారం తన భార్య అయిన "అసిక్ని"యందు వేలకొలది పుత్రులను కన్నాడు. వారి పేరు శబలాశ్వులు. వారు చక్కనివారు. మిక్కిలి పుణ్యపురుషులు.

క. పుట్టించిన జనకుని మదిఁ, బుట్టిన తలఁపెఱిఁగి వారు పూనిక ప్రజలం
బుట్టించు వ్రతము గై కొని, గట్టిగఁ దప మాచరింపఁగాఁ జనిరి వెసన్. 242

* ఆ శబలాశ్వులు తమ తండ్రిగారి సంకల్పం తెలుసుకొన్నారు. ప్రజలను సృష్టించటానికి దీక్ష వహించారు. అందు నిమిత్తం తపస్సు చేయటానికి బయలుదేరి వెళ్లారు.

వ. ఇట్లు శబళాశ్వులు ప్రజాసర్గంబు కొరకుఁ దండ్రి పంపునం దపంబు సేయువారై యే తీర్థంబు తీర్థరాజం బై సకల తీర్థఫలంబులు నాలోకన మాత్రంబున ననుగ్రహించుచు సకలపాపంబుల నిగ్రహించు, నే తీర్థప్రభావంబున నగ్రజన్ములు ఫలసిద్ధిం బొందుదు, రట్టి నారాయణ సరస్సను పుణ్యతీర్థంబునకుం జని, త దుపస్పర్శ మాత్రంబున నిర్ధూత మలాశయులై, 243

* ఆ శబలాశ్వులు తండ్రి ఆజ్ఞానుసారం సృష్టికాములై తపస్సు చేయటం కోసం పరమపావనమైన నారాయణసరోవరం చేశారు. ఆ పుణ్యతీర్థం దర్శనమాత్రంచేతనే సమస్త పుణ్యతీర్థాలలో స్నానం చేసిన ఫలాన్ని అనుగ్రహిస్తుంది. సకల పాతకాలనూ నిగ్రహిస్తుంది. అటువంటి తీర్థరాజాన్ని దర్శించి ఆపుణ్యజలాలను సంస్మరించి పరమ పవిత్రులైనారు.

శా. బ్రహ్మేంద్రాదులు నందనేరని పరబ్రహ్మంబుఁ జింతింపుచున్
బ్రహ్మానందముఁ బొంది జిహ్వికలపై బ్రహ్మణ్యమంత్రంబు స
ద్బ్రహ్మలోకన వాంఛతో నిలుపుచున్ బ్రహ్మం బితం డంచు మున్
బ్రహ్మజ్ఞాన గురున్ హరిం దపమునం బాటించి ర బ్బాలకుల్. 244

* శబలాశ్వులు ఆ పుణ్యతీర్థంలో స్నానంచేసి బ్రహ్మ, ఇంద్రుడు మొదలైన దేవతలు సైతం అందుకోలేని పరబ్రహ్మాన్ని బ్రహ్మానందంతో ధ్యానం చేశారు. ఆ బాలకులు తమ నాలుకలతో పరమాత్మకు సంబంధించిన మంత్రాలను ఉచ్చరిస్తూ భగవంతుణ్ణి దర్శించాలనే కుతూహలంతో సమస్తమూ ఆ పరబ్రహ్మ స్వరూపంగా భావించి ఆనందమయుడైన ఆ దేవదేవుణ్ణిగూర్చి తపస్సు చేశారు.

**సీ. ఏకపాదాంగుష్ఠ మిలమీఁద సవరించి నిశ్చల కాయులై నిక్కి నిలిచి**
**కరములు గీలించి సరవి మీఁదికి నెత్తి గుఱుతుగాఁ బెనుబయల్ గుట్టి పట్టి**
**నిడివిగాఁ గ్రూరమై నిగిడిన చూడ్కులఁ గడు తీవ్రభానునిఁ బొదివిపట్టి**
**వడిఁ గొంతకాలంబు వాయువు భక్షించి యంతనుండియు నిరాహారు లగుచు**

**తే. సకల లోకములకు సంహారకరమును బేర్చి దేవతలకు భీతికరముఁ**
**గాఁగ ఘోరతపముఁ గావింపఁ దొడఁగిరి, మహిత చిత్తు లక్కుమారవరులు, 245**

* దక్షుని కుమారులు ఒంటికాలి బొటనవ్రేలు నేలమీద మోపి నిక్కి నిశ్చలదేహులై నిలబడ్డారు. రెండు చేతులూ జోడించి పైకెత్తి ఆకాశంలోకి చూచారు. సూటిగా ప్రసరించే చురుకైన చూపులతో సూర్యుణ్ణి చూస్తూ కొంతకాలం వాయుభక్షణం చేస్తూ మరికొంతకాలం నిరాహారులై తీవ్రమైన తపస్సు కొనసాగించారు. నిర్మల చిత్తులైన ఆ శబలాశ్వుల తపస్సుకు లోకాలన్నీ కంపించాయి. దేవతలుకూడా భయపడ్డారు.

### -: నారదుండు శబళాశ్వులకు నివృత్తి మార్గంబు నుపదేశించుట :-

**వ. ఇట్లతిభయంకరంబైన తపంబు సేయుచు, నెడతెగక భగవన్మంత్రంబుల నొడువుచుఁ, బ్రజాసర్గ కాములై యున్న యచ్చిన్ని బాలుర కడకు నారదుండు సనుదెంచి, పూర్వవిధంబునం బలుకుచు నిట్లనియె. భ్రాతృవత్సలులై యున్న మీరలు వేదాంతసారంబు వలుకుచున్న నా వచనంబు లాదరించి తోఁబుట్టువులు సనిన మార్గంబునఁ జనుండు. ఎవ్వఁడేనియుఁ దన యగ్రజులు గన్న మార్గంబునం దానునుం దప్పక వర్తించు, నట్టివాని విశేషధర్మం బెఱింగిన వాఁడంద్రు, సతతంబును బుణ్య బంధువులైన దేవతలంగూడి సుఖం బుండుం. డని పల్కి నారదుండు సనియె. వారలు సర్వకర్మంబులయందు నిర్మోహితులై పరమ పదంబునకు నాస్పదంబులైన దేవర్షి వాక్యంబుల నాశ్రయించి. 246**

* ఈ ప్రకారం ఘోరమైన తపస్సు చేస్తూ ఎడతెగకుండా భగవన్మంత్రాలను ఉచ్చరిస్తూ సృష్టి చేయాలనే కోరికతో ఉన్న ఆ కుమారుల దగ్గరకు మళ్లీ నారదమహర్షి వచ్చి మునుపటిలాగానే ఇలా పలికాడు.

"మీరు మీ అన్నలమీద ఎంతో ఆదరాభిమానాలు కలవారు. వేదాంతసారం ఒలుకుతున్న నా పలుకులు శ్రద్ధగా ఆలకించండి. మీ తోబుట్టువులు వెళ్లిన మంచి మార్గంలోనే మీరుకూడా నడవండి. లోకంలో అన్నల మార్గం అవలంబించినవారు విశేష ధర్మజ్ఞులుగా ప్రశంసలు అందుకుంటారు. దేవతలు పుణ్యపురుషులైన వారికి ఆత్మబంధువులు. మీరు ఆ దేవతల లోకానికి వెళ్లి సుఖంగా ఉండండి".

ఈ విధంగా బోధించి నారదమహర్షి వెళ్లి పోయాడు. శబలాశ్వులు సృష్టిచేయాలనే కర్మ వ్యామోహాన్ని వదలిపెట్టి పరమపదానికి ఆస్పదమైన నారదుని హితోపదేశాన్ని ఆమోదించారు.

**ఉ. అప్పుడు లజ్జతోడ శబళాశ్వులు పూర్వజు లేగినట్టి యా**
**చొప్పున నెన్నఁడుం దిరిగి చూడని త్రోవ విశేష పద్ధతిం**
**దప్పక పోయిరయ్య! గుణధాములు, నేఁడును మళ్ళరేమి నేఁ**
**జెప్పెదఁ గాక రాక కడఁజేరిన రాత్రులఁబోలి భూవరా. 247**

* సద్గుణవంతులైన శబలాశ్వులు తమ నడవడికి సిగ్గుపడినవారై తమ అన్నలు చన్న మార్గాన్ని అనుసరించారు. పునరావృత్తి రహితమైన మోక్షాన్ని కాంక్షించారు. పరీక్షిన్నరేంద్రా! జరిగిపోయిన రాత్రులు తిరిగిరానట్లు వారు తిరుగులేని పరమపదాన్ని అందుకొన్నారు.

**క. దక్షున కా కాలంబున, లక్షిత మై యుండెఁ బెక్కు లాగుల నుత్పా**
**త క్షోభంబులు వానికి, రూక్షవ్యథ నొంది యా పురుష నాశమునున్. 248**

**క. నారదకృత మని యెఱిఁగి మ, హా రోషముతోడ నేగి యాతనిఁ గని దుః**
**ఖారూఢ చిత్తుఁడై మది, నూఱడిలం దెరువు లేక యుగ్రుం డగుచున్. 249**

* అప్పుడు దక్షప్రజాపతికి అనేక విధాలైన ఉత్పాతాలు గోచరించాయి. ఆయన మనస్సు అధికమైన వ్యథతో క్షోభించింది. తన కుమారులు ప్రజాసృష్టికి పరాఙ్ముఖులై పోయారని తెలుసుకున్నాడు. ఇదంతా నారదుడు నడిపించిన నాటకమని గ్రహించాడు. పట్టరాని దుఃఖావేశంతో ఆగ్రహోదగ్రుడై ఆ దేవర్షిమీద నిప్పులు గ్రక్కాడు.

**తే. మోము జేవుఱింప ముడివడ బొమదోయి, చూపు వెంట మంట సుడిగొనంగఁ**
**బెదవు లదరఁ బండ్లు పెటపెటఁ గొఱుకుచు, దక్షుఁ డాగ్రహించి తపసిఁ బలికె. 250**

* దక్షుని ముఖం ఎర్రబడింది. కనుబొమలు ముడివడ్డాయి. చూపులవెంట మంటలు చెలరేగాయి. పెదవులు అదరాయి. పండ్లు పటపట కొరకుతూ నారదునితో ఇట్లా అన్నాడు.

**చ. నెరయఁగ సాధురూపమున నీ వతి బాలుర కాత్మజాళికిం**
**గఱకున భిక్షుమార్గ మగు కందువ సెప్పితి వేల? ధూర్తవై**
**మఱుఁగక యుండవచ్చునె? కుమారుల నీ దురితంబు వొంద, ని**
**న్నొఱలఁగఁద్రోతు నాదు సమదోగ్ర మహాగ్రహ శాపవహ్నులన్. 251**

* "నీవు పరమ ధూర్తుడవు. పరమసాధువు లాగా వచ్చి మోసం చేశావు. చిన్ని బిడ్డలకు మోక్షధర్మాన్ని ఉపదేశించి సన్న్యాసులనుగా మార్చావు. ఈ కడుపుకోతను నేను సహించలేను. నిన్ను నా భయానక శాపాగ్ని జ్వాలలకు ఆహుతి చేస్తాను.''

## -: దక్షుండు నారదుని శపియించి ప్రజాసర్గం బొనరించుట :-

వ. అది యెట్లంటేని, దేవర్షి పితృ ఋణంబులు దీర్చక అమీమాంసిత కర్మంబులు గల బాలురకు బుద్ధిఁ జెఱచి వారలకు నుభయ లోకంబుల శ్రేయోహాని నొనర్చితివి. ఇట్లీ పాతకంబున భాగవతోత్తములలో లజ్జాహీనుండవై యశోహానిం బొంది చరింపుదువు గాక! నిరపరాధులై వైరంబులేని నా పుత్రుల పట్ల ద్రోహకృత్యం బొనర్చిన నీవు తప్పఁ దక్కిన భాగవతోత్తములు సకల భూతానుగ్రహ పరవశులు. అతి కుతూహలంబున నీ చేత స్నేహపాశ నికృంతనం బైన మిత్రభేదంబె కాని తదుపశమనంబు గాకుండెడు. ఇంతనుండియుఁ బురుషుండు విషయ తీక్ష్ణత్వంబు లనుభవింపక కాని తెలియ కుండెడు. జ్ఞానంబు తనంతనె కాని యొరులచే బోధింపఁబడి తెలియరాకుండెడి. నిరంతరంబును లోకసంచారియైన నీకు నే లోకంబున నునికిపట్టు లేకుండుఁ గాక అని నిర్దయుండై శాపం బిచ్చె. అంత నారదుండు త ్క్రోధవాక్యంబుల కలుగక యట్ల కానిమ్మని సమ్మతించి చనియె. ఇట్టి శాంతభావం బెవ్వనివలనం గలుగు, నతండు సర్వాతీతుండై సర్వేశ్వరుం డనంబడు.

మఱియు, దక్షుండు తన మనోరథంబు విఫలం బగుటం జేసి యతి దుఃఖిత మనస్కుండై పొగులుచున్న పితామహుండు చనుదెంచి, మఱియుఁ బ్రజాసర్గోపాయం బుపదేశించిన, నా ప్రజాపతి ప్రియభామ యైన యసిక్నియందుఁ బిత్రృ వత్సల లైన పుత్రికల నఱువదుండ్రం బుట్టించి వారిలో ధర్మునకుం బదువురను, గశ్యపునకుం బదుముగ్గురను, జంద్రునకు నిరువదేడ్గురను; భూతునకు, నాంగిరసునకుఁ, గృశాశ్వునకు నిద్దరేసి చొప్పున నార్గురును, తార్క్ష్యుఁడను నామాంతరము దాల్చిన కశ్యపునకు మరలఁ గడమ నల్గుర నీ్ని క్రమంబున నిచ్చె. వారి నామంబు లాకర్ణింపుము. 252

* "ఇదిగో! విను. దేవఋణం, ఋషిఋణం, పితృఋణం- ఈ మూడు ఋణాలూ అవశ్యం తీర్చవలసినవి గదా! అటువంటి ఋణాలు తీరనివారూ కర్మలలో ఆరితేరనివారూ అయిన నా కుమారులను ఐహిక సుఖాలకు విముఖులను గావించావు. వారికి ప్రవృత్తి మార్గం మీద వెగటు పుట్టించి నివృత్తి మార్గం ఉపదేశించి ఇహపర సుఖాలకు దూరం చేశావు. నా బిడ్డల శ్రేయస్సును నాశనం చేశావు. కనుక దీనికి ఫలితంగా ఉత్తములైన భగవద్భక్తులమధ్య సిగ్గుమాలినవాడవై తిరుగుతూ అప్రతిష్ఠపొందుదువుగాక! ఎంటువంటి లోపం లేనివారూ, ఏ పాపం ఎరుగని వారూ, ఎవరితోనూ వైరం పెట్టుకోనివారూ అయిన నా కుమారులకు ద్రోహం చేసినందుకు లోకానుగ్రహబుద్ధిగల తక్కిన భాగవతోత్తములవలె గాక లోకసంచారివై ఒకచోట నిలుకడ లేకుండా ఉందువు గాక!"

ఈ విధంగా దక్షుడు నిర్దాక్షిణ్యంగా నారదుణ్ణి శపించాడు. నారద మహర్షి దక్షుని క్రోధవచనాలకు కోపం తెచ్చుకోకుండా శాపాన్ని పరిగ్రహించి మౌనంగా వెళ్లిపోయాడు. ఇటువంటి శాంతస్వభావం గల వారే పరమేశ్వర స్వరూపులుగా భావింపబడతారు.

తన మనోరథం సిద్ధించనందుకు దక్షుడు మిక్కిలి విచారించాడు. ఆ సమయంలో బ్రహ్మదేవుడు వచ్చి ప్రజాసృష్టికి తగిన శక్తిని అతనికి అనుగ్రహించాడు. అనంతరం దక్షప్రజాపతి తన అర్ధాంగి అయిన "అసిక్ని" యందు అరువది మంది పుత్రికలను పుట్టించాడు. వారందరూ తమ తండ్రిమీద అమితమైన ఆదరాభిమానాలు కలవారే.

దక్షుడు తన కుమార్తెలలో ధర్మునికి పదిమందినీ, కశ్యపప్రజాపతికి పదముగ్గురినీ, చంద్రునికి ఇరవైఏడుగురినీ ఇచ్చి వివాహం చేశాడు. మిగిలిన కుమార్తెలలో భూతునికి ఇద్దరినీ, ఆంగిరసునికి ఇద్దరినీ, కృశాశ్వునికి ఇద్దరినీ, తార్క్ష్యకశ్యపునికి నలుగురినీ ఇచ్చి పెండ్లి చేశాడు.

**ఆ. ఎట్టి పుణ్యవతులొ? యీ చేడియలు సెప్ప, సవతు లేనియట్టి సవతులయ్యుఁ**
**గడుపు వడసి రెట్టి కడుపునఁ బుట్టిరో, కడిఁది త్రిజగ మెల్లఁ గడుపు గాఁగ. 253**

* దక్షప్రజాపతి తనయలు ఎంతటి పుణ్యసతులో చెప్పలేను. సవతులై కూడా సాటిలేని సతీమతల్లులై సంసారం చక్కదిద్దుకొన్నారు. వారి తల్లి కడుపు చల్లగా ముల్లోకాలనూ కడుపున మోసి కన్నారు.

**వ. వార లెవ్వరనిన భానువును, లంబయుఁ, గకుప్పును, జామియు, విశ్వయు, సాధ్యయు, మరుత్వతియు, వసువును, ముహూర్తయు, సంకల్పయు ననంబదుగురు ధర్మునకుఁ బత్నులై కొడుకులం బడసిరి. వారెవ్వ రంటేని భానువునకు వేదఋషభుండు పుట్టె. ఆతనికి నింద్రసేనుండు నుదయించె. లంబకు విద్యోతుండు గలిగె. అతనికి స్తనయిత్నువు లనువారు పుట్టిరి. కకుబ్దేవికి సంకుటుండు పుట్టె, సంకుటునకుం కీకటుండు పుట్టె. కీకటునకు దుర్గాభిమానినులైన దేవతలు జన్మించిరి. జామిదేవికి దుర్గభూముల కధిష్ఠాన దేవతలు జనియించిరి. వారికి స్వర్గుండును, నందియు జన్మించిరి. విశ్వ యనుదానికి విశ్వేదేవతలు జన్మించిరి. వార లపుత్త్రకు లనం బరఁగిరి. సాధ్యయను దానికి సాధ్యగణంబులు పుట్టె. వానికి నర్థసిద్ధి యను వాఁడు పుట్టె. మరుత్వతి యనుదానికి మరుత్వతుండు, జయంతుం డనువార లుదయించిరి. అందు జయంతుండు వాసుదేవాంశజుండైన యుపేంద్రుం డనంబడి, వినుతి నొందె. ముహూర్త యనుదానికి సకల భూతంబులకు నా యా కాలంబులఁ గలిగెడు నా యా ఫలంబుల నిచ్చు మౌహూర్తికు లనియెడు దేవగణంబులు పుట్టిరి. సంకల్పయను దానికి సంకల్పుం డుదయించె. ఆ సంకల్పునకు కాముండు జనించె. వసు వను దానికి ద్రోణుండును, బ్రాణుండును, ధ్రువుండును, నర్కుండును, నగ్నియును, దోషుండును, వస్తువును, విభావసు వను నెనమండ్రు వసువు లుదయంబు నొందిరి. అందు ద్రోణునకు నభిమతి యను భార్యయందు హర్ష శోక భయాదులు పుట్టిరి. ప్రాణునకు భార్యయైన యూర్జస్వతియందు సహుండును, నాయువును, బురోజవుఁడను వారును గలిగిరి, ధ్రువుని భార్యయగు ధరణియందు వివిధంబులగు పురంబులు పుట్టె. అర్కునికి భార్యయగు వాసనయందు తర్షాదులుదయించిరి. అగ్నికి భార్యయైన వసోర్ధారయందు ద్రవిణ కాదులు పుట్టిరి. మఱియుఁ గృత్తికలకు స్కందుండు గలిగె. ఆ స్కందునకు విశాఖాదు**

లుదయించిరి. దోషునకు శర్వరి యను భార్యయందు హరికళయగు శింశుమారుం డుదయించె. వస్తువునకు నాంగిరసయందు విశ్వకర్మ యనుశిల్పాచార్యుం డుదయంబందె. ఆ విశ్వకర్మకు నా కృతి యను సతియందు చాక్షుషుం డను మనువు జనించె. ఆ మనువువలన విశ్వులు, సాధ్యులు ననువారలు వుట్టిరి. విభావసునకు నుష యను భార్యయందు వ్యుష్టియు, రోచిస్సును, నాతపుండును జనించిరి. అందు నాతపునికిఁ బంచ యాముండను దివసాభిమాన దేవత జనించె. శంకరాంశజుండైన భూతునకు సురూప యను భార్యయందుఁ గోట్ల సంఖ్యలైన రుద్రగణంబు లుదయించిరి. మఱియు రైవతుండు, నజుండు, భవుండు, భీముండు, వాముండు, నగ్రుండు, వృషాకపియు, నజైకపాత్తును, నహిర్బుధ్న్యుండును, బహురూపుండును. మహాంతుండును ననువారలును, రుద్రపారిషదులును నతిభయంకరులైన ప్రేతలును, వినాయకులును బుట్టిరి. అంగిరసుండను ప్రజాపతికి స్వధ యను భార్యయందుఁ బితృగణంబులు వుట్టిరి. సతియను భార్యకు నథర్వవేదాభిమాన దేవతలు వుట్టిరి. కృతాశ్వునకు అర్చిస్సను భార్యయందు ధూమ్రకేశుం డను పుత్రుం డుదయించె. వేదశిరస్సుకు ధిషణ యను భార్యయందు దేవలుండును, వయునుండును. మనువునుం బుట్టిరి. తార్క్ష్యునకు వినత కద్రువ, పతంగి యామిని యను నలువురు భార్యలు. అందుఁ బతంగికిఁ బక్షులు వుట్టె, యామినికి శలభంబులు వుట్టె. వినతకు సాక్షాత్కరించిన యజ్ఞాధిపతికి వాహనం బైన గరుడుండును. సూర్యునకు సారథియైన యనూరుండును జనియించిరి. కద్రువకుఁ బెక్కు తెఱంగుల భుజంగమంబులు వుట్టె. చంద్రునకుఁ గృత్తికాది నక్షత్రంబులు భార్యలు. వారలయందుఁ జంద్రుఁడు రోహిణియందు మాత్రము మోహితుం డగుటంజేసి దక్షశాపంబున క్షయ రోగగ్రస్తుండై సంతానంబు వడయనేరఁడయ్యె. అంత దక్షప్రసాదంబున క్షయపీడితంబు లగు కళల మరలం బొందె. మఱియును.

* దక్షప్రజాపతి తన కుమార్తెలలో ధర్మునికి పదిమందిని ఇచ్చాడు గదా! వారిపేర్లు ఇవి - భానువు, లంబ, కకుబ్దేవి, జామిదేవి, విశ్వ, సాధ్య, మరుత్వతి, వసువు, ముహూర్త, సంకల్ప.

వీరిలో "భానువు"కు వేదఋషభుడు జన్మించాడు; అతడికి ఇంద్రసేనుడు పుట్టాడు. "లంబ"కు విద్యోతుడు జనించాడు. అతనికి స్తనయిత్నువులు కలిగారు. "కకుబ్దేవి"కి సంకుటుడు పుట్టాడు; ఆ సంకుటుడికి కీకటుడు జన్మించాడు; ఆ కీకటుడికి దుర్గాభిమానులైన దేవతలు ఉదయించారు. "జామిదేవి" కి కోటలకు అధిష్ఠాన దేవతలు పుట్టారు; వారికి స్వర్గుడు, నంది జనించారు. "విశ్వ"కు విశ్వదేవతలు కలిగారు; వీరికి సంతానం కలుగలేదు. "సాధ్య"అనే ఆమెకు సాధ్యులు జన్మించారు; వీరికి అర్థసిద్ధి పుట్టాడు. "మరుత్వతి"కి మరుత్వంతుడు, జయంతుడు అనే వారు జనించారు; వారిలో జయంతుడు వాసుదేవాంశతో ఉపేంద్రుడుగా ప్రసిద్ధికెక్కాడు. "ముహూర్త"అనే ఆమెకు మౌహూర్తికు లనే దేవగణాలు పుట్టారు. "సంకల్ప"అనే ఆమెకు సంకల్పుడు జన్మించాడు; ఆ సంకల్పుడికి కాముడు ఉద్భవించాడు. వసువు అనే ఆమెకు ఎనిమిది మంది కుమారులు కలిగారు; వారి పేర్లు ఇవి - ద్రోణుడు, ప్రాణుడు, ధ్రువుడు, అర్కుడు, అగ్ని, దోషుడు, వస్తువు, విభావసువు. వీరు వసువులుగా పేరెన్నిక గన్నారు.

వీరిలో ద్రోణుని భార్య అభిమతి. ఆమె హర్షం, శోకం, భయం అనే బిడ్డలను కన్నది. ప్రాణునికి ఊర్జస్వతి అనే భార్యయందు సహుడు, ఆయువు, పురోజవుడు అనే కొడుకులు పుట్టారు.

ధ్రువుని భార్యపేరు ధరణి; నానావిధపురాలను ప్రసవించింది. అర్కుని భార్య వాసన; ఈ దంపతులకు తర్షుడు మొదలైన వారు పుట్టారు. అగ్నికి వసోర్ధార అనే భార్యయందు ద్రవిణకుడు మొదలైన వారు జన్మించారు; మరియూ కృత్తిక అనే భార్యయందు స్కందుడు ఉదయించాడు; ఆ స్కందునికి విశాఖుడు మొదలైన వారు పుట్టారు.

దోషుని భార్య శర్వరి. ఆమెకు శ్రీహరి అంశతో శింశుమారుడు ఉదయించాడు. వస్తువు అనేవానికి అంగీరస అనే భార్యయందు విశ్వకర్మ అనే శిల్పాచార్యుడు జనించాడు; ఆ విశ్వకర్మకు ఆకృతి అనే భార్యయందు చాక్షుషమనువు జన్మించాడు; ఆ మనువుకు విశ్వులు, సాధ్యులు ఉదయించారు.

విభావసువు అనే వాని భార్య ఉష; ఆ దంపతులకు వ్యుష్టి, రోచి, ఆతపుడు అనేవారు పుట్టారు. వీరిలో ఆతపుడికి దినాధిదేవత అయిన పంచయాముడు అనేవాడు ఉదయించాడు.

దక్షప్రజాపతి కుమార్తెలలో ఇద్దరు భూతు డనే వానికి భార్యలైనారు. వారిలో సురూప అనే ఆమెకు కోట్ల కొలది రుద్రగణాలు పుట్టారు. మఱియు రైవతుడు, అజుడు, భవుడు, భీముడు, వాముడు, ఉగ్రుడు, వృషాకపి, అజైకపాదుడు, అహిర్బుధ్న్యుడు, బహురూపుడు, మహాంతుడు అనేవారు రుద్రపారిషదులు, ఇంకను అతిభయంకరులైన ప్రేతలు, వినాయకుడును పుట్టారు.

దక్షుని పుత్రికలలో ఇద్దరు అంగిరసునికి భార్యలైనారు. వారిలో స్వధ అనే ఆమెకు పితృగణాలు జన్మించారు. సతి అనే ఆమెకు అథర్వవేదాభిమానులైన దేవతలు ఉద్భవించారు.

దక్షుని తనయులలో ఇద్దరు కృశాశ్వుని భార్యలైనారు. వారిద్దరిలో అర్చి అనే ఆమెకు ధూమ్రకేతువు జనించాడు. ధిషణ అనే ఆమెకు దేవలుడు, వయునుడు, మనువు అనే కుమారులు పుట్టారు.

దక్షుని పుత్రికలలో నలుగురు తార్క్ష్యకశ్యపునికి భార్యలైనారు గదా! వారి పేర్లు వినత, కద్రువ, పతంగి, యామిని- వీరిలో పతంగికి పక్షులు పుట్టాయి. యామినికి మిడుతలు మొదలైన కీటకాలు జన్మించాయి.

వినతకు అనూరుడు, గరుత్మంతుడు అనే ఇరువురు కుమారులు ఉద్భవించారు. వీరిలో అనూరుడు సూర్యునికి సారథియైనాడు. గరుత్మంతుడు యజ్ఞేశ్వరుడైన శ్రీ మహావిష్ణువుకు వాహన మైనాడు. కద్రువ అనే ఆమె నానా విధాలైన నాగులను కన్నది.

దక్షుని కుమార్తెలలో ఇరవై ఏడుగురిని చంద్రుడు పెండ్లాడినాడు. కృత్తిక మొదలైన మిగిలిన భార్యలందరూ ఉన్నప్పటికీ రోహిణి మీదనే వ్యామోహం కలిగి ఉన్నందువల్ల చంద్రుడు మామగారైన దక్షుని శాపానికి గురి అయి క్షయరోగగ్రస్తుడైనాడు. అందువల్ల అతనికి సంతానం కలుగలేదు. మళ్లీ దక్షుని అనుగ్రహంవల్ల శాపం తొలగి షోడశకళాపూర్ణుడైనాడు.

**సీ. కామిత ప్రదుఁడైన కశ్యపు కౌఁగిట ముచ్చట దీర్తురే ముద్దరాండ్రు,**
**అఖిల లోకములకు నవ్వలై జగమెల్లఁ బూజింప నుందురే పూవుఁబోండ్లు,**
**బలియురై పుత్త్రులుఁ బౌత్త్రులుఁ ద్రిజగంబు లేలంగఁ జూతురే యిందుముఖులు,**
**ముంగొంగు పసిఁడియై మూల్గు పుణ్యంబుల విఱ్ఱవీఁగుదు రెట్టి వింతరాండ్రు,**

**తే. వారి కలగంప కడుపుల నేరుపఱుప, నరిది బిడ్డలఁ బడసిన బిరుదుసతుల**
**నామములు నన్వయంబులు నీ మనంబు, పూనఁజెప్పుదు వినవయ్య! మానవేంద్ర! 255**

* పరీక్షిన్నరేంద్రా! దక్షుని కుమార్తెలలో పదముగ్గురు కశ్యప ప్రజాపతి భార్యలన్న సంగతి విన్నావుగదా! ఆ ఒప్పుల కుప్పల గొప్ప దనం చెప్పటం నాకు శక్యం కాదు.

ఏ ముద్దరాండ్రు కామితార్థప్రదాత అయిన కశ్యప ప్రజాపతి ప్రేమానురాగాలు చూఱఁగొన్నారో, ఏ పువ్వుబోండ్లు ఎల్లజగత్తుకూ తల్లులై లోకుల పూజలు అందుకున్నారో, ఏ యిందుముఖులు తమ కొడుకులూ, మనుమలూ ముజ్జగాలను పాలిస్తూ ఉంటే చూచి మురిసిపోతారో, ఏ అంగనామణులు ముంగొంగు బంగారమైన పుణ్యరాసులతో పొంగి పులకించి పోతుంటారో, ఆ సతీమతల్లుల అంతులేని సంతాన సౌభాగ్యాలను లెక్కించి చెప్పటం సాధ్యం కానిపని. ఆ పుణ్యకాంతల నామధేయాలూ, వంశాలూ మాత్రం వివరిస్తాను.

**తరల.**

**అదితియుం దితి కాష్ఠయుం దను వ య్యరిష్టయుఁ దామ్రయు**
**న్నదనఁ గ్రోధవశాఖ్యయున్ సురసాఖ్యయున్ సురభిన్ మునిన్**
**మొదలుగాఁ దిమియు న్నిళప్రియముఖ్య యా సరమాదిగా**
**ముదిత లెన్నఁగఁ గన్నసంతతి ముజ్జగంబుల భూవరా! 256**

* అదితి, దితి, కాష్ఠ, దనువు, అరిష్ట, తామ్ర, క్రోధవశ, సురస, సురభి, ముని, తిమి, ఇల, సరమ అనే పదముప్పురు కశ్యప ప్రజాపతి భార్యలు. వీరి సంతానంతోనే ముల్లోకాలూ నిండిపోయాయి.

**సీ. చాలంగఁ దిమికిని జలచరంబులు వుట్టె శ్వాపదంబులు వుట్టె సరమయందు,**
**సురభికి మహిషాది సురభులు జనియించెఁ, దామ్రకు శ్యేన గృధ్రములుఁ గలిగె**
**మునికి నప్సరసల మూఁకలు జనియించె, నిళ గనె భూరుహములను, గ్రోధ**
**వశ కుద్భవిల్లె దుర్వార సర్పంబులు, సరి యాతుధానులు సురస కరయ**

తే. నప్పతిల్లిరి గంధర్వు లొక్క మొగి న, రిష్టకు సుతుల్, దనువునకుఁద్రిదశ రిపులు
పదియు నెనమండ్రునై నట్టి విదితబలులు, వారి నామాన్వయంబులఁ గోరి వినుము. 257

* వీరిలో తిమికి తిమింగలాలు మొదలైన జలచరాలు జన్మించాయి. సరమకు శునకాలు (సారమేయాలు) పుట్టాయి. సురభికి గోవులు ఉద్భవించాయి. తామ్రకు డేగలూ, గద్దలూ జనించాయి. ముని అనే ఆమెకు అప్సరసలు అవిర్భవించారు. ఇల వృక్షాలను ప్రసవించింది. క్రోధవశకు భయంకరమైన సర్పాలు జనించాయి. సురస యాతుధానులను కన్నది. అరిష్టకు గంధర్వులు జనించారు. దనువు అనే ఆమెకు బలాఢ్యులై న దానవులు పదునెనిమిది మంది పట్టారు. వారి పేర్లూ వంశాలు విను.

వ. ద్విమూర్ధుండును, శంబరుండును, అరిష్టుండును, హయగ్రీవుండును, విభావసుండును, అయోముఖుండును, శంకుశిరుండును, స్వర్భానుండును, కపిలుండును, అరుణియును, పులోముండును, వృషపర్వుండును, ఏకచక్రుండును, అనుతాపకుండును, ధూమ్రకేశుండును, విరూపాక్షుండును, విప్రచిత్తియు, దుర్జయుండు నను వారలు. వీరలలోన స్వర్భానునకు సుప్రభయను కన్యక పుట్టె. దాని నముచి వివాహం బయ్యె. వృషపర్వునకు శర్మిష్ఠ యను కూఁతురు పుట్టె. దాని నహుష పుత్త్రుండైన యయాతి పెండ్లియయ్యె. వైశ్వానరునకు నుపదానవి, హయశిర, పులోమ, కాలక యను నలువురు పుత్రిక లుదయించిరి. అందు నుపదానవి హిరణ్యాక్షునకుం బత్ని యయ్యె. హయశిరను గ్రతువు వివాహం బయ్యె. పులోమ, కాలక లను నిరువురకును గశ్యప ప్రజాపతి చతుర్ముఖుని వాక్యంబునం గైకొనియె. ఆ యిరువురకును సమరకోవిదు లైన దానవులు పౌలోమ కాలకేయులనం బుట్టిరి. మఱియు నా యిరువురకు నఱువదివేల రాక్షసులు జన్మించిరి. వారు యజ్ఞకర్మంబులకు విఘాతుకులై వర్తింప, వారి నింద్రునకుం బ్రియంబుగా నీ పితామహుం డగు నర్జునుండు వధించె. మఱియు, విప్రచిత్తి, సింహిక యను దానియందు రాహుప్రముఖంబుగాఁ గల కేతు శతంబును బడసె. వారలు గ్రహత్వంబుఁ గైకొనిరి. మఱియుం బురాణపురుషుండైన శ్రీమన్నారాయణుండు దన యంశంబునఁ బరమ భాగ్యవతియైన యదితి గర్భంబున నుదయించె. ఆ యదితి వంశంబును విదితంబుగా వినిపించెద. సావధానుండవై వినుము. వివస్వంతుండును, అర్యముండును, పూషుఁడును, త్వష్టయు, సవితయు, భగుండును, ధాతయు, విధాతయు, వరుణుండును, మిత్రుండును, శక్రుండును, ఉరుక్రముండును నను ద్వాదశాదిత్యులు జన్మించిరి. అందు వివస్వంతునకు శ్రాద్ధదేవుం డను మనువు సంజ్ఞాదేవియందు నుదయించె. మఱియు యముండు, యమియు నను నిరువురు మిథునంబుగా నుదయంబు నొందిరి. మఱియు నా సంజ్ఞాదేవి బడబాస్వరూపంబు నొంది యశ్వినీ దేవతలం గనె. ఛాయాదేవి యందు శనైశ్చరుండును, సావర్ణి యను మనువును, దపతియను కన్యకయుం బుట్టిరి. ఆ తపతిని సంవరణుండు వరియించె. అర్యమునకు మాతృక యను పత్నియందు చర్షణు లుదయించిరి. వారి మూలంబున మనుష్యజాతి యీ లోకంబున స్థిరంబుగా నుండునట్లు బ్రహ్మదేవునిచేఁ గల్పింపంబడె. పూషుండు భర్గునిం

**జూచి దంతంబులు వివృతంబులుగా నగిన, నతండు క్రోధించి దంతంబు లూడనడిచిన, నాఁటినుండియు భగ్నదంతుండై, యనపత్యుండై పిష్టాదులు భక్షింపుచుండె. త్వష్టకు దైత్యానుజ యైన రచన యను కన్యకకు నధిక బలాఢ్యుండగు విశ్వరూపుండు పుట్టె. అంత నా దేవతలు బృహస్పతిం గోపింప, నతఁడు తలఁగిపోయినం దమకు నా విశ్వరూపుని నాచార్యునింగా వరియించిరి అని చెప్పిన విని శుకయోగీంద్రునకుం బరీక్షిన్నరేంద్రుం డిట్లనియె. 258**

* ద్విమూర్ధుడు, శంబరుడు, అరిష్టుడు, హయగ్రీవుడు, విభావసుడు, అయోముఖుడు, శంకుశిరుడు, స్వర్భానుడు, కపిలుడు, అరుణి, పులోముడు, వృషపర్వుడు, ఏకచక్రుడు, అనుతాపకుడు, ధూమ్రకేశుడు, విరూపాక్షుడు, విప్రచిత్తి, దుర్జయుడు అనేవి వారి నామధేయాలు.

వీరిలో స్వర్భానుడికి సుప్రభ అనే కూతురు పుట్టింది; ఆమెను నముచి పెండ్లాడాడు. వృషపర్వుడికి శర్మిష్ఠ అనే పుత్రిక పుట్టింది; ఈమెను నహుషుని కుమారుడైన యయాతి వివాహమాడాడు.

దనువు కుమారుడైన వైశ్వానరుడికి ఉపదానవి, హయశిర, పులోమ, కాలక అనే నలుగురు కుమార్తెలు పుట్టారు. వీరిలో ఉపదానవిని హిరణ్యాక్షుడు వివాహ మాడాడు. హయశిరను క్రతువు పెండ్లాడాడు. పులోమను, కాలకను బ్రహ్మదేవుని ఆజ్ఞానుసారం కశ్యప ప్రజాపతి వివాహం చేసుకున్నాడు. పులోమకు పౌలోములూ, కాలకకు కాలకేయులూ పుట్టారు. వారికి అరవై వేలమంది రాక్షసులు జన్మించారు. యజ్ఞాలను ధ్వంసం చేస్తున్న పౌలోమ కాలకేయులను మీ తాతగారైన అర్జునుడు సంహరించి ఇంద్రునికి సంతోషం కల్గించాడు.

విప్రచిత్తి సింహికను వివాహమాడాడు. వారికి రాహువు మొదలైన నూరుగురు కుమారులు జన్మించారు. వారంతా గ్రహాలుగా మారారు.

పరమ సౌభాగ్యవతి అయిన అదితి అనే సతీమణికి పురాణపురుషుడైన శ్రీమన్నారాయణుడు వామనుడై ఉద్భవించాడు. ఆ అదితిదేవి వంశాన్ని గురించి వివరంగా చెబుతాను. సావధానంగా విను.

అదితి దేవి వివస్వంతుడు, అర్యముడు, పూషుడు, త్వష్ట, సవిత, భగుడు, ధాత, విధాత, వరుణుడు, మిత్రుడు, శుక్రుడు, ఉరుక్రముడు అనే కుమారులను కన్నది.

వారిలో వివస్వంతుడు సంజ్ఞాదేవిని వివాహమాడాడు. ఆ దంపతులకు శ్రాద్ధదేవుడు అనే మనువు జనించాడు. అంతేకాక ఆమెకు యముడు, యమి అనే కవలలుకూడా పుట్టారు. ఆ సంజ్ఞాదేవి ఆడుగుఱ్ఱం రూపం ధరించి అశ్వినీదేవతలను కన్నది.

వివస్వంతునికి ఛాయాదేవి అనే మరియొక భార్య ఉన్నది. ఆమెకు శనైశ్చరుడు, సావర్ణి అనే మనువు తపతి అనే కన్యకు ఉద్భవించారు. తపతిని సంవరణుడు వివాహమాడాడు.

అర్యముడికి మాతృక అనే భార్య యందు చర్షణులు ఉదయించారు. ఆ చర్షణుల మూలాన మనుష్యజాతి భూలోకంలో స్థిరంగా ఉండేటట్లు బ్రహ్మదేవుడు ఏర్పాటు చేశాడు.

పూషుడు దక్షయజ్ఞంలో పరమశివుణ్ణి చూచి పరిహసిస్తూ పండ్లు బయటిపెట్టి వెక్కిరించాడు. అందుకు కోపించి పరమేశ్వరుడు వాని పండ్లు రాలతన్నాడు. ఆ నాటినుంచీ భగ్నదంతుడైన పూషుడు పిండి ముద్దలే తింటూ సంతానహీనుడైనాడు.

త్వష్ట అనే వాడు దైత్యుల చెల్లెలైన రచన అనే కన్యను వివాహమాడాడు. ఆ దంపతులకు మహాబలాఢ్యుడైన విశ్వరూపుడు జన్మించాడు.

ఒకప్పుడు దేవగురువైన బృహస్పతి దేవేంద్రునిపై కోపించి వెళ్లిపోయాడు. అప్పుడు దేవతలు విశ్వరూపుణ్ణి తమకు గురువుగా ఎన్నుకున్నారు. ఈ మాట వినగానే పరీక్షిన్నరేంద్రుడు శుకయోగీంద్రుణ్ణి ఇలా ప్రశ్నించాడు.

**సీ. అరయంగ యోగీంద్ర! యద్భుతం బయ్యెడు సురలపై నేటికి సురగురుండు**
**కోపించె? నీతండు గురుభావమున దేవతల కేమి యాపదఁ దలఁగఁ జేసె?**
**నెఱిఁగింపు మనవుడు నింద్రుండు త్రిభువ నైశ్వర్య మదంబున సత్పథంబు**
**గానక వసు రుద్ర గణములు నాదిత్య మరు దశ్విదేవాది మండలములు**
**తే. సిద్ధ చారణ గంధర్వ జిహ్మగాది, సురులు మునులును రంభాది సుందరాంగు**
**లాడఁ బాడంగ వినుతి సేయంగఁ గొలువ, నొక్క భద్రాసనంబున నుక్కుమీఱి.** 259

* "యోగీంద్రా! దేవగురువైన బృహస్పతికి దేవతలమీద కోపం దేనికి వచ్చింది? అందువల్ల దేవతలకు ఎటువంటి ఆపద వాటిల్లింది? అది ఏ విధంగా తొలగిపోయింది? అదంతా నాకు వివరించి చెప్పండి. ఈ విధంగా అడిగిన పరీక్షిత్తుకు శుకయోగి ఇలా చెప్పాడు.

ఒకమాఱు ఇంద్రుడు ముల్లోకాలకు నేనే ప్రభువుననే అహంకారంతో మై మరచి సన్మార్గం అతిక్రమించాడు. వసువులు, రుద్రులు, ఆదిత్యులు, మరుత్తులు, అశ్విదేవతలు, సిద్ధులు, చారణులు, గంధర్వులు, ఉరగులు, మొదలైన ముక్కోటి దేవతలతో కొలువు తీర్చాడు. మునీంద్రులు స్తుతిస్తున్నారు. రంభాది అప్సరసలు ఆడుతూ పాడుతూ ఉన్నారు.

**సీ. నిండు పున్నమనాఁడు గండరించిన చంద్ర మండల శ్రీలతో మాఱుమలయ**
**భద్రవిద్యోతాతపత్రంబు గ్రాలంగ మిన్నేటి తరఁగల మేలుకొలుపఁ**
**గలిత దివ్యాంగనా కరతల చాతుర్య చామర శ్రేణులు జాడపడఁగఁ**
**జింతామణి స్ఫుట కాంత రత్నానేక ఘటిత సింహాస నాగ్రంబునందు**

తే. నూరుపీఠంబుపై శచి యుండ నుండి, వరుస దిక్పాలకాది దేవతలు గొలువ
సాటి చెప్పంగరాని రాజసముతోడ, నింద్రుఁ డొప్పారె వైభవసాంద్రుఁ డగుచు. 260

* నిండు పూర్ణిమనాటి చంద్రమండలం వలె విరాజిల్లుతున్న శ్వేతచ్ఛత్రం కన్నులపండువు చేస్తున్నది. ఆకాశగంగా తరంగాలవంటి వింజామరాలతో దేవకాంతలు బంగారు కంకణాలు జారుతుండగా ఒయ్యారంగా వీస్తున్నారు. నవరత్న ఖచితమైన సింహాసనం మీద శచీదేవితో కూడి ఇంద్రుడు కూర్చున్నాడు. దేవతల పరివారం కైవారం చేస్తున్నారు. దిక్పాలకులు సేవిస్తున్నారు. ఈ విధంగా సాటిలేని రాజసముతో ఇంద్రుడు వైభవసాంద్రుడై నిండుకొలువై ఉన్నాడు.

వ. అ య్యవసరంబున. 261

క. గురుతర ధర్మక్రియ నయ, గురుఁడు మరున్మంత్ర విషయ గురుఁడు వచశ్శ్రీ
గురుఁడు సమస్తామరగణ, గురుఁడు గురుం డరుగుదెంచెఁ గొల్వునకు నృపా! 262

* ఈ విధంగా దేవేంద్రుడు కొలువుతీర్చి ఉన్న సమయంలో గొప్పధర్మశాస్త్రవిదుడూ, నీతివిద్యావిశారదుడూ, మంత్రాలోచనపరుడూ, సమస్త దేవతలకు గురుడూ అయిన బృహస్పతి ఇంద్రుని కొలువు కూటంలో ప్రవేశించాడు.

చ. అమిత తపః ప్రభావుఁ గరుణాత్ముని గీష్పతిఁ జూచి రాజ్య దు
ర్దమ మదరేఖ నింద్రుఁడు వృథా తనగద్దియ లేవకుండె నె
య్యమున నెదుర్కొనం జనక యాసన మీయక గౌరవోప చా
రములఁ బ్రసన్నుఁ జేయక తిరంబుగ దివ్యసభాంతరంబునన్. 263

* ఆ విధంగా సభలోకి వచ్చిన బృహస్పతిని చూచి దేవేంద్రుడు తన సింహాసనం దిగలేదు. ఆదరంగా ఎదురు పోలేదు. కూర్చుండటానికి ఆసనం చూపలేదు. గౌరవపురస్సరంగా స్వాగతం పలుకలేదు. త్రిలోక సామ్రాజ్యమదాంధుడై ఆ మహాతపస్వికి, ఆ దయామయునికి, ఆ దేవగురువుకు తగిన మర్యాద చేయలేదు. అలాగే కదలకుండా కూర్చున్నాడు.

క. అప్పుడు సురపతి కన్నులఁ, గప్పిన సురరాజ్య మదవికారంబునకుం
జప్పుడు సేయక గృహమున, క పుణ్యుఁడు దిరిగిపోయె నతిఖిన్నుండై 264

* అప్పుడు దేవేంద్రుని కన్నులగప్పిన రాజ్యాధికార దురహంకారాన్ని గమనించి దేవగురుడు మిక్కిలి ఖిన్నుడై, అప్రసన్నుడై తన గృహానికి తిరిగి వెళ్లాడు.

చ. ఎఱుఁగమిఁ జేసినట్టి గురుహేళన మంత నెఱింగి యింద్రుఁ డ
చ్చెరుపడి భీతినొంది యతిచింతితుఁడై తలపోసి పల్కె న
ప్పరమపవిత్రు లోకనుతభవ్యచరిత్రు విశేష పాద పం
క రుహముఁ బూజసేయక యకర్మముఁ జేసితి నల్పబుద్ధి నై. 265

* తెలియక చేసిన గురుధిక్కారాన్ని తెలుసుకొన్న ఇంద్రుడు తాను చేసిన దానికి ఆశ్చర్యపడి, భయపడి పశ్చాత్తాపం పొంది ఇలా అనుకున్నాడు. ఆ పరమపవిత్రుని లోకంచే కొనియాడబడే భవ్యచరిత్రుని నా గురుదేవుని - గౌరవించి ఆయన పాదపద్మాలను పూజింపక ఉపేక్షించాను. అల్పబుద్ధినై చేయరాని కార్యం చేశాను.

**క. త్రిభువన విభవ మదంబున, సభలో మద్గురువునకుఁ బ్రసన్నునకు లస**
**త్ప్రభువునకు నెగ్గు సేసితి, శుభములు దొలఁగంగ నే నసురభావమునన్. 266**

* ముల్లోకాల ఐశ్వర్యమదం కనులుగప్పి కరుణామయుడైన నా గురువునకు నా ఆచార్యదేవునకు రాక్షసభావంతో ఎగ్గుచేశాను. ఇక నాకు శుభం ఎలా కలుగుతుంది?

**ఆ. పారమేష్ఠ్య మయిన పదవి నొందిన భూపు లెట్టివారి కైన లేవవలదు,**
**విబుధులిట్లు సెప్పు విధమెన్న వారలు, ధర్మవేత్త లనుచుఁ దలఁపఁబడరు. 267**

* బ్రహ్మాండమైన పదవిని అధిష్ఠించిన మహారాజులు ఎటువంటివారు వచ్చినప్పటికీ లేవవలసిన పనిలేదని చెప్పే పండితులు ధర్మవేత్తలుగా తలంపబడరు.

**తే. కుపథవర్తు లగుచుఁ గుత్సిత దుర్వచో, నిపుణు లైనవారు నిడివి దెలిసి**
**తొలఁగలేక తా రధోగతిఁ బడుదురు, తప్పులేక రాతితెప్ప భంగి. 268**

* చెడుమార్గంలో నడుస్తూ కుత్సిత బుద్ధిచే దుర్భాష లాడుటయందు నేర్పరులైన వారు నీతిమార్గాన్ని తెలుసుకొనలేక రాళ్లపడవమాదిరిగా అధోగతిపాలై మునిగిపోతారు.

**ఉ. కావున లోకవందితుని కార్యవిచారుని యింటి కేగి త**
**త్పావన పాదపద్మములపై మకుటంబు ఘటిల్ల మ్రొక్కి త**
**త్సేవ యొనర్చి చిత్తము వశించి ప్రసన్నునిఁ జేతు నంచు న**
**ద్దేవవిభుండు వోయె నతితీవ్రగతిం గురుధామ సీమకున్. 269**

* కాబట్టి లోకవందితుడూ, కార్యవిజ్ఞుడూ అయిన గురుదేవుని ఇంటికిపోయి ఆ మహాత్ముని పవిత్ర పాదపద్మాలపై కిరీటం సోకునట్లు నమస్కరించి చక్కగా సేవించి నా చిత్తాన్ని కుదుటపరుచుకుంటాను. అంటూ ఇంద్రుడు అతిత్వరితంగా గురుదేవుని గృహానికి పోయాడు.

**సీ. ఈ రీతిఁ దనయింటి కేతెంచు దేవతా పతి రాక యా బృహస్పతి యెఱింగి**
**యధ్యాత్మమాయచే నడఁగి యదృశ్యుఁడై పోయె నప్పుడు దేవపుంగవుండు**
**సకలంబుఁ బరికించి జాడ గానక గురుఁ జింతించి తలపోసి చిన్న వోయెఁ**
**బోయిన విధమెల్ల దాయలు రాక్షస వీరులు వేగులవారివలనఁ**
**తే. దెలిసి మిక్కిలి తమలోనఁ దెలివి నొంది, యందఱును గూడి భార్గవు నాశ్రయించి**
**తత్కృపాదృష్టిఁ దమశక్తి దట్టమైన, దేవతలమీఁది దాడికిఁ దెరువు వెట్టి. 270**

* ఈ విధంగా తన ఇంటికి దేవేంద్రుడు వస్తున్న సంగతి గుర్తించి బృహస్పతి అధ్యాత్మ మాయచే అదృశ్యు డయ్యాడు. అప్పుడు సురేంద్రుడు అంతటా పరిశీలించి చూచి గురువర్యుని జాడ కనుగొనలేక చిన్నవోయాడు. ఇట్లు సురేంద్రుడు వెళ్లిన విధమంతయూ వేగులవారి వలన రాక్షసులు తెలుసుకొన్నారు. తెలివి తెచ్చుకొని అందరూ గుమికూడి శుక్రుని ఆశ్రయించారు. ఆయన దయా దృష్టివలన తమ శక్తిని పెంపొందించుకొని దేవతలమీదికి దండయాత్ర చేయడానికి మార్గం కనిపెట్టారు.

## -: దేవాసుర యుద్ధ ప్రారంభము :-

క. ధూర్తులు సమస్త కల్బిష, మూర్తులు వర ధర్మ కర్మ మోచిత మార్గా
వర్తులు దుర్ణయ నిర్మిత, కీర్తులు దానవులు సనిరి గీర్వాణులపై. 271

* వంచకులు, పాపాత్ములు, అవినీతిపరులు, ధర్మమార్గాన్ని విడిచినవారు అయినట్టి రాక్షసులు దేవతలపైకి యుద్ధానికి సన్నద్ధులైనారు.

స్రగ్ధర.
దండిం గోదండ కాండోద్ధత రథ హయ వేదండ తండంబుతోడన్
దండెత్తెన్ మెండుగా న ద్దనుజనికరముల్ దైవవర్గంబు మీఁదం
జండ బ్రహ్మాండభే ద్యోచ్ఛ్రయ జయరవముల్ సర్వదిక్ క్షోభగా ను
ద్దండ ప్రఖ్యాతలీలన్ దలపడిరి సురల్ దర్పులై వారి తోడన్. 272

* గొప్ప ధనుస్సు, బాణాలూ ధరించిన వారై; రథాలూ, గుఱ్ఱాలూ, ఏనుగులూ కదలి రాగా దానవ సముదాయం దేవతాగణాలపై దండెత్తింది. దేవతలుకూడా తీవ్రంగా బ్రహ్మాండం బ్రద్దలయ్యే వీరాలాపాలతో, జయజయ ధ్వనులతో, సర్వదిశలూ సంక్షోభం జెందగా వీరావేశంతో విజృంభించి రాక్షసులతో తలపడ్డారు.

చ. మదమున దేవదానవులు మచ్చరముల్ గడుఁ బిచ్చలింప సం
పదలను గోరి పోరునెడ భార్గవ మంత్రకళా విశేషులై
యెదురులు వాలి యస్త్రమున నేయ మహాసురు లేచియేచి పెం
గుదులుగఁ గ్రువ్వ దేవతలు కోల్తల కోర్వక పాటి రయ్యెడన్. 273

* ఈ విధంగా దేవతలూ రాక్షసులూ పెచ్చు పెరిగిన మచ్చరాలతో పరస్పరం పోరాడారు. రాక్షస వీరులు శుక్రాచార్యులవారి మంత్రశక్తితో మహాబల సంపన్నులై దేవతలమీద శస్త్రాస్త్రాలు ప్రయోగించారు. సురలు అసురుల పరాక్రమానికీ, శరపరంపరలకూ తాళలేక పారిపోసాగారు.

ఆ. దనుజవీరు లేయు దారుణ దివ్యాస్త్ర, దళితదేహు లగుచుఁ దలలు వీడ
నోడి పాటి రద్భుతోపేత బలులైన, త్రిదశవరులు బిట్టు దిట్టినట్లు. 274

* దానవవీరులు ప్రయోగించే దారుణమారణాస్త్రాలకు తట్టుకోలేక దేవతలు దేహాలు చిల్లులుపడి చీకాకుపడి తలలువీడి ఓడి పరువెత్తారు. అపార బలాఢ్యులైన సుపర్వులు శపించినట్లు కకావికలైనారు.

క. ఒక మొగము గాక దివిజులు, తికమక గొని వైరులెల్ల దీకొనఁ దమ్ముం
బకపకలై నకనక లై, లుకలుకఁ బరువెత్తి రోడి లోఁగొను భీతిన్. 275

* దేవతలు కలత జెంది రాక్షసులను ఢీకొనలేక చెల్లాచెదరుగా తొట్రుపడుతూ భయంతో పలాయనం చిత్తగించారు.

చ. దనుజుల గర్వరేఖయును దానవవీరుల యంపజోకయున్
మనుజవిశేష భోజనుల మచ్చరికంబు నిశాటకోటి యే
చిన బల శౌర్యముం దమకు సిగ్గును హాని మహాభయంబు ని
ర్గుణతను జేయు నుమ్మలికఁ గోల్తల కోపక పాఱి రార్తులై. 276

* దనుజుల గర్వరేఖయును దానవుల శరపరంపరా, రక్కసుల వీర విజృంభణమూ, రాక్షసుల బల పరాక్రమాలూ చూచి వేల్పులు సిగ్గుతో, బాధతో, భయంతో నిశ్చేష్టులైనారు. నిలువలేక యుద్ధభూమినుండి ఆర్తులై తొలగి పోయారు.

క. అమరులు విసృష్ట దానవ, సమరులు శరభిన్న దేహ సంతాపగుణ
భ్రమరులు దైత్య కిరాతక, చమరులు కమలజుని కడకుఁ జనిరి భయార్తిన్. 277

* సమరం చాలించి పారిపోయిన అమరులు వేటకాండ్రు వెంటబడిన చమరీమృగాలవలె క్షతగాత్రులై బ్రహ్మదేవుని సన్నిధికి చేరుకున్నారు.

ఉ. ధాతకు దేవతా విభవదాతకుఁ బుణ్యజనానురాగ సం
ధాతకు సర్వలోక హితదాతకు వైదిక ధర్మమార్గ ని
ర్ణేతకు నుల్లస ద్విభవ నేతకు సర్వజగ జ్జయాంగజ
భ్రాతకుఁ బుణ్య యోగిజన భావవిజేతకు మ్రొక్కి రయ్యెడన్. 278

* దేవతలందరూ బ్రహ్మదేవునికి తలవంచి నమస్కరించారు. ఆయన దేవతలకు క్షేమం కలిగించేవాడు. రాక్షసు లన్నా అనురాగం కలవాడు. సర్వలోకాలకు హితం చేకూర్చేవాడు. వేదధర్మాలను నిర్ణయించేవాడు. జగత్త్రయాన్ని జయించిన మన్మథునికి అన్నగారు. యోగీంద్రుల హృదయాలను లోగొన్నవాడు. అటువంటి విధాతకు విబుధులు ప్రణమిల్లారు.

క. ఆఖండలుండు మొదలుగ, లేఖానీకముల బ్రహ్మ లేనగవున ని
త్యాఖండ సత్కృపారస, శేఖర వాక్యముల వారి సేదలు దేర్చెన్. 279

* ఇంద్రుడు మొదలుగా దేవతల సమూహాన్ని చూచి బ్రహ్మ దేవుడు చిరునవ్వు నవ్వాడు. అఖండమైన దయారసం పొంగిపొరలే ఓదార్పు మాటలతో వారిని సేద తేర్చాడు.

వ. ఇట్లు బ్రహ్మదేవుండు దేవేంద్రప్రముఖులైన దేవతల కనుకంపాతివిభవంబున నభయం బొసంగి యిట్లనియె. 280

* ఈ విధంగా బ్రహ్మ దేవేంద్రాది దేవతలకు విశేష కరుణా వైభవంగా అభయమిచ్చి వారితో ఇలా అన్నాడు.

ఉ. నెట్టనఁ బాపకర్మమున నేరమిఁ జేసితి రేమి చెప్ప! మీ
పుట్టిన నాఁటనుండియును బుద్ధులు సెప్పి జగంబు లేలఁగాఁ
బట్టముఁ గట్టి పెంచిన కృపానిధి బ్రహ్మకళా విధిజ్ఞుఁ జే
పట్టక గుట్టు జాతి సిరిపట్టునఁ దొట్టిన పొట్ట క్రొవ్వునన్. 281

* బలవంతంగా మీరు చేయగూడని పాపకృత్యం చేశారు. మిమ్మల్ని ఏమనాలి? మీరు పుట్టినప్పటినుండీ బుద్ధులు చెప్పి లోకాలను పరిపాలింపమని పట్టంగట్టి మిమ్మల్ని అభివృద్ధికి తెచ్చిన దయాసముద్రుణ్ణి, బ్రహ్మజ్ఞాన సంపన్నుణ్ణి దరిజేర్చు కోకుండా ఐశ్వర్యమదంతో మితిమీరిన పొట్టక్రొవ్వుతో మీ గుట్టు బట్టబయలు చేసుకున్నారు.

వ. బ్రహ్మిష్ఠుఁడైన బ్రాహ్మణు నాచార్యుం గైకొనక గురు ద్రోహంబుఁ జేసితిరి. తద్దోషం బిపుడు మీకుఁ జేసేఁత శత్రుకృతం బై యనుభవింపం జేసె. అతి బలవంతులైన మిమ్ము నతిక్షీణులైన రాక్షసులు జయించుట, తమ యాచార్యుండైన శుక్రు నారాధించి తన్మంత్ర ప్రభావంబునఁ బునర్లబ్ధవీర్యు లగుటచేతనే ఇప్పుడు మదీయం బైన నిలయంబు నాక్రమింపం గలవారై మదోద్రేకంబున నెదురులేక వర్తిల్లుచున్న రక్షోనాయకులకుఁ ద్రిదివంబుఁ గొనుట తృణప్రాయంబు. అభేద్య మంత్రబలంబు గల భార్గవునకు వారు శిష్యులగుటం జేసి విప్రగోవింద గవేశ్వరానుగ్రహంబు గలవారలకుఁ దక్కం దక్కిన రాజుల కరిష్టం బగు. కావున మీరిప్పుడు త్వష్ట యను మను పుత్రుం డగు విశ్వరూపుండను ముని నిశ్చల తపో మహత్త్వ సత్త్వస్వభావుం డగు నతని నారాధించిన, మీకు నభీష్టార్థంబు నతండు సంఘటిల్లఁజేయు. ఎట్టి దుర్దశల నైన నతం డడంచు అని చెప్పిన దిక్పాలకాదులు డెందంబులు డిందుపడి, కమలగర్భుని వీడ్కొని, విశ్వరూపు కడకుం జని యిట్లనిరి. 282

* బ్రహ్మనిష్ఠుడైన గురువును గౌరవింపక గురుద్రోహం చేశారు. చే సేతులా చేసిన ఆ దోష మిప్పుడు మీకు శత్రురూపంలో అనుభవానికి వచ్చింది. మిక్కిలి బలవంతులైన మిమ్ములను బలహీనులైన రాక్షసులు జయించడం అసాధ్యమైన విషయం. వారు తమగురువైన శుక్రాచార్యుణ్ణి పూజించి ఆయన మంత్రశక్తిచే మరల అపారశక్తి సంపన్నులైనారు. ఇప్పుడు వారు గర్వంతో ఎదురులేక తిరుగుతూ బ్రహ్మపదాన్నే ఆక్రమించటానికి సిద్ధంగా ఉన్నారు. అటువంటి రాక్షసనాయకులకు స్వర్గాన్ని గైకొనడం తృణాప్రాయమయిన పని. అభేద్యమైన మంత్రబలం గల శుక్రునికి వారు శిష్యులు. ఇప్పుడు గోబ్రాహ్మణ భక్తులకూ, గోవిందభక్తులగు వారికీ తప్ప తక్కిన రాజులకు కీడుమూడినట్లే. అందువల్ల మీరిపుడు "త్వష్ట"అనే మనువు కుమారుడైన

విశ్వరూపుణ్ణి ఆశ్రయించండి. ఆయన మహాతపస్వి, సత్త్వగుణ సంపన్నుడు. అతనిని పూజించినచో మీ కోర్కెలను సిద్ధింపచేస్తాడు. ఎటువంటి కష్టాల నైనా అణచి వేస్తాడు అని బ్రహ్మదేవుడు చెప్పగా దేవతల హృదయాలు కుదుట పడ్డాయి. వారు తెప్పరిల్లి బ్రహ్మ దగ్గర సెలవు తీసుకుని విశ్వరూపుని సన్నిధికి వెళ్లి ఇలా అన్నారు.

**తే.** **అన్న! మేలగు నీకు ని న్నడుగఁ గోరి, వచ్చినారము భవదీయ వనమునకును**
**దండ్రులకు నేఁడు సమయోచితంబు లైన, కోర్కు లొనఁగూడఁజేసి చేకొనుము యశము. 283**

* అన్నా! నీకు మేలగు గాక! నిన్ను అర్థించటంకోసం నీ తపోవనానికి వచ్చాము. నీ తండ్రులమైన మా కోర్కెలను సమయోచితంగా తీర్చి యశస్సు గడించుకో!

**క.** **సుతులకుఁ బితృశుశ్రూషణ, మతిపుణ్యము సేయుచుండు నాత్మజులు గుణో**
**న్నతి బ్రహ్మచారు లైనను, మతితో గురుసేవకన్న మఱియుం గలదే? 284**

* తండ్రికి సేవలు చేసే కుమారులకు చాలా పుణ్యం కల్గుతుంది. ఆ కుమారులు గుణవంతులూ, బ్రహ్మచారులూ అయితే వారికి గురుసేవ కంటే కావలసినది మరేముంది?

**వ.** **అదియునుం గాక. 285**

**సీ.** **అరయ నాచార్యుండు పరతత్త్వరూపంబు, దండ్రి తలంపంగ ధాతరూపు,**
**రూపింప భ్రాత మరుత్పతి రూపంబు, దెలియంగఁ దల్లి భూదేవిరూపు**
**భగిని కరుణరూపు, భావంబు ధర్మ స్వరూపంబు దా నర్థిరూపు మొదల**
**నభ్యాగతుఁడు మున్న యగ్ని దేవుని రూపు సర్వభూతములుఁ గేశవుని రూపు**

**తే.** **గానఁ దండ్రి! వేగఁ గడు నార్తులగు పితృ, జనుల మైన మమ్ముఁ జల్లఁ జూచి**
**పరభయంబు వాపి నిరుపమం బగు తపో, మహిమచేత మెఱసి మనుపవయ్య! 286**

* అదీగాక గురువు పరమాత్మ స్వరూపుడు. తండ్రి బ్రహ్మ స్వరూపుడు. అన్న దేవేంద్ర స్వరూపుడు తల్లి భూదేవి రూపం. సోదరి దయాస్వరూపిణి. భావం ధర్మస్వరూపం. తాను అర్థి స్వరూపం. అభ్యాగతుడు అగ్నిదేవుని రూపం. సర్వప్రాణులూ భగవంతుని స్వరూపం. కాబట్టి తండ్రీ! అధికమైన ఆపదలో ఉన్న పితృజనులమైన మమ్మల్ని కాపాడు. చల్లనిచూపు జూచి శత్రుభయాన్ని పోగొట్టి సాటిలేని నీ తపో మహిమతో దరిజేర్చి రక్షించు.

**వ.** **ఇప్పుడు బ్రహ్మనిష్ఠుండ వైన నిన్ను నా చార్యునిఁగా వరించి, భవదీయ తేజో విశేషంబుచేత వైరివీరులం బరిమార్చెదము. ఆత్మీయార్థంబైన యవిష్ఠ పాదాభివందనంబు నిందితంబు గాదని వేదవాక్యంబు గలదు. కావున నీవు నమస్కరించుచున్న దేవతలం గైకొని పౌరోహిత్యంబు సేయుము అనినఁ బ్రహసిత వదనుండై య మ్మునీశ్వరుం డిట్లనియె. 287**

* బ్రహ్మనిష్ఠుడవైన నిన్నిపుడు మేము మా గురువుగా స్వీకరిస్తున్నాము. నీ తేజోవిశేషం వల్ల శత్రువీరులను సంహరిస్తాము. ఆత్మ రక్షణకోసం చిన్నవాని పాదాలకు వందనం చేయటం దోషం కాదని వేదాలు చెబుతున్నాయి. అందువల్ల నీకు నమస్కరిస్తున్న దేవతలను మమ్ములను చేరదీసి పౌరోహిత్యం చేయవలసిందిగా కోరుతున్నాము. ఇలా అంటున్న దేవతలను చూచి చిరునవ్వు మోముపై నాట్యమాడగా ఆ మునిశ్రేష్ఠుడైన విశ్వరూపుడు ఇలా పలికాడు.

**ఆ. బ్రహ్మతేజంబు వోయెడి ప్రార్థనంబు, ధర్మగుణ గర్హితం బని తా నెఱింగి**
**సొరిది ననుబోఁటి తపసి యీ సురల చేతఁ, బ్రకట మధురోక్తి నేటికిఁ బలుకఁబడియె. 288**

* మీరు కోరిన విధంగా నేను పౌరోహిత్యాన్ని అంగీకరిస్తే నా బ్రహ్మతేజస్సు నశిస్తుంది. మీ ప్రార్థన ధర్మవిరుద్ధం. నా వంటి ఒక తపస్విని గూర్చి మీ వంటి పెద్దలు ఇంత తీయని పలుకులతో పొగడటం సరికాదు.

**వ. విశేషించి. 289**

**క. గురుధనముఁ గూర్పనేటికి, గురుశిక్షం దగిలి మంత్రకోవిదులై స**
**ద్గురుధర్మ నిరతు లేనియు, గురువులకును శిష్యవరులె కూర్చిన ధనముల్. 290**

* అంతేకాక గురువునకు వేరుగా ధనాన్ని కూడబెట్టడం దేనికి? గురుశిక్షకు లోనై మంత్రకోవిదులై ధర్మనిరతులైన శిష్యులే కూడబెట్టిన ధనం. దానికి మించిన ధనం గురువులకు వేరే ఏముంటుంది?

**సీ. అరయ నకించను లై నట్టివారికిఁ దగు శిలోంఛనవృత్తి ధనము సుమ్ము,**
**దానిచే నిర్వర్తిత ప్రియసాధు సత్క్రియ గలవారలై ప్రీతినొందె**
**దరు గాన సద్గర్హితాచారమైన యాచార్యత్వ మిపుడు మీ శాసనమునఁ**
**గైకొంటి, గురువుల కామంబు బ్రాణార్థ వంచనములు లేక వడి నొనర్తు**

**ఆ. ననుచు విశ్వరూపుఁ డనియెడి ముని ప్రతి జ్ఞోక్తిఁ బలికె వారి నూఱడించి**
**మహిత మైన తత్సమాధిచే గురుభావ, మమరఁ జేసె దేవసమితి కపుడు. 291**

* ఏమీలేని వారికి కళ్ళంలో చెదరి పడిన గింజలను ఏరుకుని తిని జీవించే ఉంఛవృత్తియే ధనం. ఆ వృత్తితో బ్రదుకుతూ సత్కార్యాలు చేస్తూ వారు సంతుష్టి చెందుతారు. అటువంటివారు తిరస్కరించే పౌరోహిత్యాన్ని అంగీకరిస్తున్నారు. స్వార్థం, వంచన లేకుండా మీ కోరిక నెరవేర్చి మీకు మేలు చేకూరుస్తాను అంటూ విశ్వరూప మునీంద్రుడు ప్రతిజ్ఞచేసి వారి నోదార్చాడు. తదేక నిష్ఠతో దేవసమూహానికి ఆచార్యత్వాన్ని అంగీకరించాడు.

**క. భార్గవవిద్యా గుప్త, స్వర్గశ్రీ ద్విగుణ దనుజ సమధిక సంప**
**ద్వర్గముల విష్ణుమాయా, నర్గళగతిఁ దెచ్చి యింద్రునకు నిచ్చె నృపా! 292**

* రాజా! శుక్రాచార్యుల మంత్రప్రభావం వల్ల రాక్షసుల సిరిసంపదలు దేవతల సంపదల కంటే రెండింతలైనాయి. అటువంటి రాక్షసుల ఐశ్వర్యానికి మించిన రాజ్యసంపదలను విశ్వరూపుడు విష్ణుమాయవలన దేవేంద్రునికి సాధించి పెట్టాడు.

**క. ఏ విద్యచేత రక్షితుఁ, డై వజ్రి దురంబులోన నసురులఁ ద్రుంచెన్**
**భావింప నట్టి విద్యను, శ్రీవరమాయామతంబుఁ జెప్పెను హరికిన్. 293**

* ఇంద్రుడు రణరంగంలో రాక్షసులను ఓడించి సురక్షితంగా తన రాజ్యం సంపాదించగల విద్యను విష్ణుమాయాతత్త్వాన్ని విశ్వరూపుడు ఇంద్రునికి ఉపదేశించాడు. ఆ నారాయణకవచం వల్ల దేవేంద్రుడు తిరిగి రాజ్యాన్ని పొంద గలిగాడు.

**ఉ. నావుడు ఁబాండవాన్వయుఁడు నమ్మినభక్తి జగన్నివాసు రా**
**జీవదళాక్షుఁ గృష్ణుఁ దన చిత్తమునన్ భజియించి పల్కె నో**
**దేవగణార్చితాంఘ్రియుగ! దివ్య మునీశ్వర! విశ్వరూపుఁ డ**
**ప్పావనమైన విద్య సురపాలున కే క్రియ నిచ్చెఁ? జెప్పవే! 294**

* ఇలా చెప్పిన శుకుని మాటలు విని పరీక్షిత్తు పద్మదళాక్షుడూ, జగన్నివాసుడూ ఐన శ్రీకృష్ణుణ్ణి నిండు మనస్సుతో స్మరించి ఇలా ప్రశ్నించాడు.

దేవతలు పూజించే పాదాలు గల ఓ మునీంద్రా! విశ్వరూపమునీంద్రుడు ఇంద్రునకు ఉపదేశించిన ఆ విద్యను ఏ విధంగా ఉపదేశించాడో వివరించు!

**ఉ. ఎందును రక్షితుం డగుచు నింద్రుఁడు లీలయ పోలె వైరి సే**
**నం దునుమాడి దేవతలు నమ్మి సుఖింపఁగ నిష్టసంపదం**
**జెంది సమస్తలోకములఁ జేకొని యేలె మునీంద్ర! దాని నే**
**విందు సుఖంబుఁ గందు నిఁక వీనులు సంతస మందఁ బల్కవే? 295**

* ఏ విద్యవల్ల ఇంద్రుడు సురక్షితుడై అవలీలగా శత్రువులను నిర్జించి దేవతలు ఆనందించగా కోరిన సంపదలను ఆర్జించి, సర్వలోకాలనూ స్వాధీనం చేసుకొని పరిపాలించాడో ఆ విద్యాస్వరూపాన్ని వినగోరుతున్నాను. వీనుల విందుగా వినిపించు.

## -: శ్రీమన్నారాయణ కవచ ప్రారంభము. :-

**క. వర నారాయణ కవచము, నరిభీకర వజ్రకవచ మాశ్రిత సంప**
**త్పరిణామ కర్మసువచము, పురుహూతున కెట్లు మౌని బోధించెఁ? దగన్. 296**

* శత్రువుల నుండి సంరక్షించే వజ్రకవచమూ, ఆశ్రయించిన వారిని ఆదుకొనే రక్షాకవచమూ, అయిన ఆ నారాయణకవచాన్ని విశ్వరూపమునీంద్రుడు సురేంద్రునకు బోధించిన విధం వెల్లడించు.

వ. అనినం బరీక్షి జ్జనపాలునకు మునినాథుం డిట్లనియె. 297

సీ. వినవయ్య! నారనాథ! మునినాథుఁ డింద్రున కనువొంద నారాయణాఖ్య మైన
కవచంబు విజయ సంకల్పంబు నప్రమేయ స్వరూపంబు మహాఫలంబు
మంత్రగోప్యము హరిమాయావిశేషంబు సాంగంబుతోడ నెఱుంగఁజేసె!
దాని నే వినిపింతుఁ బూని తదేకాగ్ర చిత్తంబుతోడుతఁ జిత్తగింపు,

తే. మొనర ధౌతాంఘ్రిపాణి యై యుత్తరంబు, ముఖముగా నుత్తమాసనమున వసించి
కృత నిజాంగ కరన్యాస మతిశయిల్ల, మహిత నారాయణాఖ్య వర్మము నొనర్చె. 298

* ఈ విధంగా ప్రశ్నించిన పరీక్షిన్నరేంద్రునితో శుకయోగీంద్రుడు ఇలా అన్నాడు. రాజా! విను. విశ్వరూపుడు ఇంద్రునికి అనుగ్రహించిన నారాయణ కవచం విజయాన్ని చేకూర్చేది. ఊహించుటకు వీలుకాని ప్రభావం కలది. మహాఫలాన్ని ప్రసాదించేది. రహస్యంగా కాపాడుకోదగింది. అటువంటి వైష్ణవీ మాయాస్వరూపమైన కవచాన్ని విశ్వరూపుడు మహేంద్రునికి సాంగోపాంగంగా ఉపదేశించాడు. దాని విధానాన్ని నేను నీకు వినిపించుతాను. ఏకాగ్రచిత్తంతో ఆకర్ణించు.

ముందుగా కాళ్లు చేతులు కడుగుకొని ఉత్తర ముఖంగా ఉత్తమాసనంమీద కూర్చోవాలి. అంగన్యాస కరన్యాసాలు చేసి మహిమాన్విత మైన ఈ కవచాన్ని ప్రయోగించాలి.

వ. ఇట్లు నారాయణకవచంబు ఘటియించి పాదంబులను, జానువులను, ఊరువులను, ఉదరంబునను, హృదయంబునను, ఉరంబునను, ముఖంబునను, శిరంబునను నిట్లష్టాంగంబులం బ్రణవపూర్వకం బైన యష్టాక్షరీ మంత్రరాజంబు విన్యాసంబుఁ జేసి, ద్వాదశాక్షర విద్యచేత కరన్యాసంబు చేసి, మంత్రమూర్తియై భగవచ్ఛబ్ద వాచ్యంబైన ప్రణవాది యకారాంతమగు మహామంత్రంబు చేత నంగుళ్యంగుష్ఠ సర్వసంధులయందు న్యసించి, మఱియు హృదయంబున ఓంకారము, వికారంబు మూర్ధంబున, షకారంబు భ్రూమధ్యంబునందు, ణకారంబు శిఖయందు, వేకారంబు నేత్రంబుల యందు, నకారంబు సర్వసంధులయందు, మఱియు నస్త్రము నుద్దేశించి మకారంబు నుపన్యసించె నేని మంత్రమూర్తియగు. మఱియును అస్త్రాయ ఫట్ అను మంత్రంబున దిగ్బంధనంబు చేసి, పరమేశ్వరునిఁ దన భావంబున నిల్పి విద్యామూర్తియుఁ, దపోమూర్తియు నగు షట్ఛక్తి సంయుతం బైన నారాయణ కవచాఖ్య మైన మంత్రరాజంబు నిట్లని పఠించె. 299

* ఈ విధంగా నారాయణ కవచాన్ని అనుసంధానం చేసుకొని "ఓం నమో నారాయణాయ"అనే ప్రణవపూర్వకమైన అష్టాక్షరీమంత్ర రాజంలోని ఎనిమిది అక్షరాలనూ పాదాలు, జానువులు, ఊరువులు, ఉదరం, హృదయం, వక్షఃస్థలం, ముఖం, శిరస్సు అనే అష్టాంగాలయందూ విన్యాసం చెయ్యాలి. తర్వాత " ఓం నమో భగవతే వాసుదేవాయ"అనే ద్వాదశాక్షరీ మంత్రంతో కరన్యాసం చెయ్యలి. అంటే మంత్రలోని పన్నెండు అక్షరాలతో రెండు చేతులు వ్రేళ్ల కణుపులయందు న్యాసం చెయ్యాలి. ఈ విధంగా అంగన్యాస

కరన్యాసాలు చేసి సాధకుడు మంత్రమూర్తియై వెలుగొందిన అనంతరం " ఓం విష్ణవే నమః"అనే మంత్రాన్ని గ్రహించి హృదయాన 'ఓం 'కారాన్నీ, శిరస్సున 'వి' కారాన్నీ, కనుబొమల నడుమ 'ష' కారాన్నీ, శిఖయందు 'ణ'కారాన్నీ, నేత్రాలయందు 'వే' కారాన్ని న్యాసం చెయ్యాలి. మిగిలిన శరీర సంధి ప్రదేశాలలో 'న' కారాన్ని విన్యాసం చెయ్యాలి. మరియు అస్త్రముద్రతో 'మ' కారాన్ని విన్యసించి సాధకుడు మంత్రస్వరూపుడు కావాలి. అనంతరం "అస్త్రాయఫట్"అనే మంత్రంతో దిగ్బంధంచేసి భగవంతుణ్ణి మనస్సులో ధ్యానించినట్లయితే విద్యామూర్తిగా, తపోమూర్తిగా రూపొందుతాడు. షట్చక్రాలతో కూడిన 'నారాయణ కవచం' అనే మంత్రరాజాన్ని ఈ విధంగా పఠించాలి.

**చ. గరుడుని మూఁపుపై పదయుగంబు ఘటిల్లఁగ శంఖచక్ర చ**
**ర్మ రుచిర శార్ఙ్గ ఖడ్గ శర రాజితపాశ గదాది సాధనో**
**త్కర నికరంబు లాత్మకరకంజములన్ ధరియించి భూతి సం**
**భరిత మహాష్టబాహుఁడు కృపామతితో నను఼ గాచుఁ గావుతన్.** 300

* గరుత్మంతుని భుజాగ్రాలపై రెండు పాదాలు ఉంచి కూర్చున్న వాడూ, తన యెనిమిది చేతులయందు శంఖం, చక్రం, కవచం, ధనుస్సు, ఖడ్గం, బాణం, పాశం, గద అనే ఆయుధాలు ధరించినవాడూ అయిన భగవంతుడు కరుణార్ద్ర దృష్టితో నన్ను కాపాడునుగాక!

**ఆ. ప్రకట మకర వరుణ పాశంబులందుల, జలములందు నెందుఁ బొలయ కుండఁ**
**గాచుఁగాక నన్ను ఘనుఁడొక్కఁ డైనట్టి, మత్స్యమూర్తి విద్యమానకీర్తి.** 301

* ప్రళయకాలంలో తాను ఒక్కడే మిగిలి అనుపమానకీర్తితో ప్రకాశించే మత్స్యావతారమూర్తి అయిన మహానుభావుడు నన్ను వరుణ పాశాలలో పడకుండా జలాలయందు సర్వదా సంరక్షించునుగాక!

**క. వటుఁడు సమాశ్రిత మాయా, నటుఁడు బలి ప్రబల శోభన ప్రతిఘటనో**
**ద్భటుఁడు త్రివిక్రమదేవుఁడు, చటుల స్థలమందు నన్ను సంరక్షించున్.** 302

* మాయావటుడై నటించి బలిచక్రవర్తి సంపదను అపహరించిన త్రివిక్రమ దేవుడు నన్ను అన్ని స్థలాలయందూ కాపాడుగాక!

**చ. అడవుల సంకటస్థలుల నాజిముఖంబుల నగ్ని కీలలం**
**దెడరుల నెల్ల నాకు నుతి కెక్కఁగ దిక్కగుఁగాక శ్రీనృసిం**
**హుఁడు సురశత్రుయూథప వధోగ్రుఁడు విస్ఫురి తాట్టహాస వ**
**క్త్రుఁడు ఘన దంష్ట్ర పావక విధూత దిగంతరుఁ డప్రమేయుఁడై.** 303

* దేవతా ప్రతిపక్షులైన రాక్షసులను శిక్షించినవాడూ, అత్యంత భయంకరమైన అట్టహాసంతోకూడిన ముఖం కలవాడూ, తన కోరలనుండి బయలు వెడలిన అగ్ని జ్వాలలచే చెదరగొట్టబడిన దిగంతాలు కలవాడూ,

ఊహింప శక్యంకాని మహిమ కలవాడూ అయిన నృసింహదేవుడు అడవులయందూ ప్రమాదస్థలాలయందూ, రణ భూములందూ, నిప్పులమంటల యందూ అన్ని యిక్కట్టులయందూ నాకు దిక్కగునుగాక!

చ. అరయఁగ నెల్ల లోకములు నంకిలి నొంద మహార్ణవంబులో
నొరగి నిమగ్న మైన ధర నుద్ధతిఁ గొమ్మున నెత్తినట్టి యా
కిరిపతి యగ్ని కల్పుఁ డురుఖేలుఁడు నూర్జిత మేదినీ మనో
హరుఁడు కృపావిధేయుఁడు సదాధ్వముల న్ననుఁ గాచుఁగావుతన్ 304

* సమస్త లోకాలూ మహాజలమధ్యంలో మునిగి పోయినప్పుడు సముద్రగర్భంలో నిమగ్నయై ఉన్న భూదేవిని ఉద్ధరించి తన కోరకొన యందు ధరించిన ఆదివరాహమూర్తి. ఆ అగ్నిసదృశుడు, ఆ క్రీడావినోది, ఆ ధరణీమనోహరుడు, ఆ కారుణ్యానిధి నన్ను ఎల్లప్పుడూ మార్గమధ్యంలో రక్షించునుగాక.

క. రాముఁడు రాజకులైక వి, రాముఁడు భృగు సత్కులాభిరాముఁడు సుగుణ
స్తోముఁడు నను రక్షించును, శ్రీమహితోన్నతుఁడు నద్రిశిఖరములందున్. 305

* క్షత్రియకుల విరాముడు, భృగువంశ లలాముడూ, సద్గుణ స్తోముడూ, మహామహిమాభిరాముడూ అయిన పరశురాముడు పర్వతశిఖరాలందు నన్ను కాపాడునుగాక!

సీ. తాటక మర్దించి తపసి జన్నముఁ గాచి, హరివిల్లు విఱిచి ధైర్యమున మెఱసి
ప్రబలు లైనట్టి విరాధ కబంధోగ్ర ఖరదూషణాది రాక్షసులఁ దునిమి
వానరవిభు నేలి వాలిఁ గూలఁగ నేసి జలరాశి గర్వంబుఁ జక్కఁజేసి
సేతువు బంధించి చేరి రావణ కుంభ కర్ణాది వీరులఁ గడిమిఁ ద్రుంచి

తే. యలవిభీషణు లంకకు నధిపుఁ జేసి, భూమిసుతఁ గూడి సాకేత పురము నందు
రాజ్యసుఖములు గైకొన్న రామవిభుఁడు, వరుస ననుఁ బ్రోచుచుండుఁ బ్రవాసగతుల. 306

* శ్రీరామచంద్రుడు తాటకను సంహరించాడు. విశ్వామిత్రుని యజ్ఞాన్ని కాపాడాడు. శివుని విల్లు విరిచాడు. ధైర్యసంపన్నుడై బలాఢ్యులైన విరాధుడు, కబంధుడు, ఖరుడు, దూషణుడు మొదలైన రాక్షసులను తుదముట్టించాడు. వానరరాజైన సుగ్రీవుణ్ణి చేరదీశాడు. వాలిని నేలకూల్చాడు. సముద్రుడి అహంకారాన్ని అణచివేశాడు. సేతువును బంధించాడు. లంకానగరంపై దాడిచేసి వీరాధివీరులైన రావణకుంభకర్ణాది రాక్షసులను రూపుమాపాడు. విభీషణుని లంకకు రాజుగా చేశాడు. సీతా సమేతుడై సాకేతపురానికి విచ్చేసి అచ్చట పట్టాభిషిక్తుడైనాడు. సుఖంగా రాజ్యాన్ని పరిపాలించాడు. అటువంటి శ్రీరామ భద్రుడు దూరదేశాలయందు నన్ను రక్షించునుగాక!

వ. మఱియు నఖిల ప్రమాదంబులైన యభిచార కర్మంబు వలన నారాయణుండును, గర్వంబువలన నరుండును, యోగ భ్రంశంబు వలన యోగనాథుం డైన దత్తాత్రేయుండును, గర్వబంధమువలన

గణేశుం డైన కపిలుండును, గామదేవుని వలన సనత్కుమారుండును, మార్గంబుల దేవహేళనంబుఁ జేయుటవలన శ్రీహయగ్రీవమూర్తియును, దేవతానమస్కార తిరస్కార దేవపూజా చ్ఛిద్రంబుల వలన నారదుండును, నశేష నిరయంబుల వలనఁ గూర్మంబును, నపథ్యంబువలన భగవంతుండైన ధన్వంతరియును, ద్వంద్వంబువలన నిర్జితాత్ముండైన ఋషభుండును. జనాపవాదంబువలన నగ్ని దేవుండును, జనన మరణాదులం గలుగఁ జేయు కర్మంబులవలన బలభద్రుండును, గాలంబువలన యముండును, సర్పగణంబుల వలన శేషుండును, అప్రబోధంబువలన ద్వైపాయనుండును, బాషండ సమూహంబు వలన బుద్ధ దేవుండును, శనైశ్చరునివలనఁ గల్కియునై, ధర్మరక్షణ పరుండైన మహా వతారుండు నన్ను రక్షించుఁగాత! ప్రాత స్సంగమ ప్రాహ్ణ మధ్యాహ్నా పరాహ్ణ సాయంకాలంబులను ప్రదో షార్ధరాత్రాపర రాత్ర ప్రత్యూ షానుసంధ్యలను ప్రభాతంబు గదాద్యాయుధంబుల ధరియించి కేశవ, గోవింద, నారాయణ, విష్ణు, మధుసంహర, త్రివిక్రమ, వామన, హృషీకేశ, పద్మనాభ, శ్రీవత్స ధామ, సర్వేశ్వరేశ, జనార్దన, విశ్వేశ్వర, కాలమూర్తులను నామరూపంబులు గల దేవుండు నన్ను రక్షించుఁగాక. ప్రళయకాలాన లాతితీక్ష్ణసంభ్రమ భ్రమణ నిర్వక్రవిక్రమ వక్రీకృత దనుజచక్రంబైన సుదర్శన నామ చక్రంబ! మహావాయు ప్రేరితుండై హుతాశనుండు నీరస తృణాటవుల భస్మీభూతంబు సేయు భంగి భగవత్ప్రయుక్తంబవై మద్వైరి సైన్యంబుల దగ్ధంబు గావింపుము. జగత్సంహారకాల పటు ఘటిత చటుల మహోత్పాత గర్జారవ తర్జన దశదిశాభి వర్జిత ఘనఘనాంతర నిష్క్రాత నిష్ఠుర కోటి శతకోటి సంస్పర్శస్ఫుర ద్విస్ఫులింగ నిర్గ మానర్గళ భుగ భుగాయమాన మూర్తి విస్ఫూర్తి! నారాయణ కరకమలవర్తి! గదాయుధోత్తమ! మదీయ వైరితండోపతండంబుల భండనంబులం జండ గతిం బిండిపిండిగాఁ గూశ్మాండ వై నాయక యక్ష రక్షోభూత గ్రహంబులు చూర్ణంబులుగాఁ గొండొక వినోదము సలుపుము. దరేంద్రంబ వైన పాంచజన్యంబ! సర్వలోక జిష్ణుండైన శ్రీకృష్ణుని నిఖిల పుణ్యైక సదన వదన నిష్క్రాత నిశ్వా సాధర వేణు పరిపూతంబవై యున్మత్త భూత, ప్రేత, పిశాచ, విప్రగ్రహాది క్రూర దుర్గ్రహంబులు విద్రావణం బులుగా, నస్మత్ప్రవీర మండలంబుల గుండియలతో దదీయమానినీ దుర్భర గర్భంబులు గర్భ స్థార్భక వివర్జితంబులుగా నవియ, బ్రహ్మాండ భాండ భీకరంబైన భూరి నాదంబున మోదింపుము. అతి తీవ్రధారా దళిత నిశాటకోటి కఠోర కంఠ కరాళ రక్తధారా ధౌత మలీమస విసరంబ వైన నందక మహాసి శేఖరంబ! జగదీశ ప్రేరితంబవై మద్విద్వేషి విషమ వ్యూహంబులు బెండువడ మెండు గడికండలుగ ఖండించి చెండా డుము. నిష్కళంక నిరాతంక నిశ్శంక సాంద్ర చంద్ర మండల పరిమండిత సర్వాంగ లక్షణ విచక్షణ ధర్మ నిర్మితంబ వైన చర్మంబ! దుర్మద మద్వైరిలోక భీకరాలోకంబులను సమాకుల నిబిడ నీరంధ్ర నిష్ఠుర తమఃపటల పటు ఘటనంబులం గుటిల పఱుపుము. నిఖిల పాప గ్రహంబుల వలనను, సకల నర మృగ సర్ప క్రోడ భూతాదులవలనను నగు భయంబులు భగవన్నామ రూప యాన దివ్యాస్త్రంబుల వలనం బొందకుండుఁ గాక! బృహ ద్రథంతరాది సామంబులచేత స్తోత్రంబు చేయంబడుచున్న ఖగేంద్రుండు రక్షణ దక్షుండై నన్ను రక్షించుంగాక. శ్రీహరి నామ రూప వాహన దివ్యాయుధ పారిష దోత్తమ ప్రముఖంబు లస్మదీయ బుద్ధీంద్రియ మనః ప్రాణంబుల సంరక్షించు

**భగవంతుండైన శేషుండు సర్వోపద్రవంబుల నాశంబు సేయు. జగదైక్యభావంబైన ధ్యానంబు గలవానికి వికల్పరహితుండై, భూషణాయుధ లింగాఖ్య లగు శక్తులం దన మాయచేత ధరియించి తేజరిల్లుచుండు లక్ష్మీకాంతుండు వికల్ప విగ్రహంబులవలన నన్ను రక్షించుఁ గాక. లోకభయంక రాట్టహాస భాసుర వదన గహ్వరుం డగుచు, సమస్త తేజోహరణ ధురీణ తేజః పుంజ సంజాత దివ్య నృసింహావతారుం డగు నప్పరమేశ్వరుండు, సర్వ దిగ్భాగంబుల వలన, సమస్త బహిరంతరంబులవలన నన్ను రక్షింపు చుండుఁ గాక అని నారాయణాత్మక కవచ ప్రభావం బితిహాస రూపంబున నింద్రుండు దెలిసి కొని, ధ్యానంబు చేసి, తద్విద్యాధారణ మహిమవలన నరాతుల నిర్జించె. కావున, నెవ్వరేని నిర్మలాత్ము లగు వార లేతద్విద్యా ధారణులై యనుదినంబును బఠియించిన, నతిఘోర రణంబుల నత్యుత్కట సంకటంబులను, సర్వగ్రహ నిగ్రహ కర్మ మారణ కర్మాది దుష్కర్మజన్య క్లేశంబులను వదలి, అవ్యాకుల మనస్కులై విజయంబు నొందుదురు. మఱియును, సర్వరోగంబులకు నగమ్య శరీరులై సుఖంబు నొందుదురు. అదియునుంగాక. 307**

* అన్ని ఆపదలకూ మూలమైన అభిచార ప్రయోగాలనుండి నారాయణుడు నన్ను రక్షించునుగాక! గర్వపడుటనుండి నరుడు రక్షించునుగాక! యోగభ్రంశం నుండి యోగాధినాథుడైన దత్తాత్రేయుడు రక్షించునుగాక! మన్మథుని బారినుండి సనత్కుమారుడు రక్షించునుగాక! మార్గంలో నడుస్తూ దేవతలను అవహేళనం చేసిన అపరాధం నుండి శ్రీహయగ్రీవస్వామి రక్షించునుగాక! వేలుపులకు నమస్కారం చేయకుండా తిరస్కరించినందుకూ, పూజలో లోపం చేసినందుకూ నారదమహర్షి నన్ను రక్షించునుగాక!

నానావిధాలైన నరకాలనుండీ కూర్మమూర్తి నన్ను కాపాడునుగాక! అపథ్యం వల్ల కలిగిన బాధలనుండి ధన్వంతరి కాపాడునుగాక! శీతోష్ణాది ద్వంద్వాలనుండి జితేంద్రియుడైన ఋషభుడు కాపాడునుగాక! జనాపవాదం నుండి అగ్నిదేవుడు రక్షించునుగాక! జనన మరణాదులు కలిగించే అసత్కర్మలనుండి బలభద్రుడు కాపాడునుగాక! కాలప్రభావం నుండి యముడు కాపాడుగాక! సర్పసమూహంనుండి ఆదిశేషుడు కాపాడునుగాక! అజ్ఞానం నుండి కృష్ణద్వైపాయనుడు కాపాడునుగాక! పాషండుల నుండి బుద్ధదేవుడు కాపాడునుగాక! కలిరూపుడైన శనినుండి కల్కిమూర్తి నన్ను కాపాడునుగాక! ధర్మరక్షణ పరాయణుడైన శ్రీమన్నారాయణుని అవతారాలు నన్ను చల్లగా రక్షించునుగాక!

ప్రాహ్ణం, మధ్యాహ్నం, అపరాహ్ణం, సాయంకాలం, ప్రదోషం, అర్ధరాత్రం, అపరరాత్రం, ప్రత్యూషం, సంధికాలాలు, ప్రభాతం అనే సమయాలలో గదాది ఆయుధాలు ధరించిన కేశవుడు, నారాయణుడు, గోవిందుడు, విష్ణువు, మధుసూదనుడు, త్రివిక్రముడు, వామనుడు, హృషీకేశుడు, పద్మనాభుడు, శ్రీవత్సధాముడు, సర్వేశ్వరుడు, జనార్దనుడు, విశ్వేశ్వరుడు, కాలమూర్తి అనే నామరూపాలు గల భగవంతుడు నన్ను రక్షించునుగాక!

ఓ సుదర్శన చక్రమా! ప్రళయకాలానల జ్వాలలతో అతి తీవ్రంగా తిరుగుతూ, అవక్రపరాక్రమంతో రాకాసి మూకలను చీకాకు పరచే నీవు పెనుగాలికి పెచ్చరిల్లిన చిచ్చు ఎండుగడ్డితో నిండిన అడవులను భస్మం చేసినట్లు భగవంతునిచే ప్రయోగింపబడిన దానవై నా శత్రుసైన్యాలను నిశ్శేషంగా దహించు.

ఓ కౌమోదకీగదాదండమా! కల్పాంతకాలంలో పిక్కటిల్లిన మహోత్పాతాలతో గర్జించుతూ పదిదిక్కులలో క్రమ్మిన కారు మబ్బులు వెలిగ్రక్కే కోటాను కోట్ల పిడుగులనుండి వెడలే అగ్నికణాల భుగభుగ ధ్వనులతో నిండి శ్రీమన్నారాయణుని కరకమలంలో చండప్రచండంగా వెలుగుతుండే నీవు తండోప తండాలైన నా విరోధులను పిండి పిండి కావించు, కూశ్మాండాలు, వైనాయకాలు, యక్షులు, రక్షస్సులు, భూతాలు, గ్రహాలు మొదలైన దుష్టశక్తులను పొడిపొడి చేసి వినోదించు.

ఓ పాంచజన్యశంఖరాజమా! సకలలోక జయశీలుడైన శ్రీకృష్ణ దేవుని పుణ్యసదనమైన వదనం నుండి పూరింపబడి ఉన్మత్తములైన భూతాలు, ప్రేతాలు, పిశాచాలు, బ్రహ్మరక్షస్సులు మొదలైన వాటిని పారద్రోలు నా విరోధి వీరుల గుండెలతోపాటు వారి ఇల్లాండ్ర కడుపులలోని పిండాలు అవిసేటట్లు - బ్రహ్మాండభాండం బ్రద్దలయ్యేటట్లు పెద్దగా ధ్వనించు.

ఓ నందక మహాఖడ్గమా! మిక్కిలి పదునైన అంచుతో రాత్రించరుల కఠోర కంఠాలను తెగనరకి ఆ కరాళరక్తధారలలో మునిగి తేలే నీవు నారాయణునిచే ప్రయోగింపబడి నా శత్రువ్యూహాలను ఖండ ఖండాలుగా చించి చెండాడు.

నిష్కళంకాలూ, నిరాటంకాలూ అయిన శత చంద్రమండలాలతో అలంకృతమై, శుభలక్షణ విలక్షణమై ధర్మస్వరూపమైన ఓ చర్మాయుధమా (ఓ డాలా!) దుర్మదులైన నా వైరి సమూహాలను కన్నులు మిరుమిట్లు గొలిపే కాంతులు ప్రసరింపజేసి మిక్కిలి చిక్కని చిమ్మచీకట్లలో చిక్కు పడేటట్లు చెయ్యి!

భగవంతుని నామాలు, రూపాలు, వాహనాలు దివ్యాయుధాలు - పాపగ్రహాల వలనా కుజనుల వలనా క్రూర మృగాల వలనా సర్పాల వలనా అడవి పందుల వలనా సంభవించే ఉపద్రవాలను తొలగించి నన్ను రక్షించును గాక.!

నానా విధాలైన సామగానాలతో స్తోత్రం చేయబడే గరుత్మంతుడు రక్షాదక్షుడై నన్ను కటాక్షించును గాక! శ్రీ మన్నారాయణుని నామ రూప వాహనాలు దివ్యాయుధాలు మొదలైనవి నా బుద్ధినీ, ఇంద్రియాలను మనస్సునూ, ప్రాణాలనూ సంరక్షించునుగాక!

భగవంతుడైన శేషుడు ఉపద్రవాలన్నింటినీ దూరంగా తొలగించునుగాక! ఈ విశ్వం సమస్తమూ భగవంతుని స్వరూపంగా భావించి ధ్యానించే వారిని మాయామయుడై అలంకారాలూ, ఆయుధాలూ ధరించి తిరుగులేనివాడై విరాజిల్లే మహావిష్ణువు అవశ్యం కాపాడునుగాక!

అఖిలలోక భయంకరమైన అట్టహాసంతో ప్రకాశించే వదన గహ్వరంతో తేజోవిరాజమానుడైన శ్రీ నృసింహదేవుడు లోపలా వెలుపలా అన్నిదిక్కులనుండీ నన్ను రక్షించుగాక!

ఆ ప్రకారంగా శ్రీమన్నారాయణ స్వరూపమైన కవచాన్ని విశ్వరూపుడు దేవేంద్రునికి ఉపదేశించాడు. దేవేంద్రుడు ఆ కవచాన్ని గ్రహించి దాని ప్రభావం వల్ల తన శత్రువులైన రాక్షసులను జయించాడు.

లోకంలో ఎవరైనా సరే మాలిన్యంలేని మనస్సుతో ఈ నారాయణ కవచాన్ని స్వీకరించి ప్రతిదినమూ పఠించుచున్నట్లయితే అతిభయంకరమైన యుద్ధాల వలనా, అత్యంత దుర్భరాలైన కష్టాలవలనా, ఘోరాతి ఘోరమైన దుష్టగ్రహాలవలనా, క్రూరమైన మారణకర్మలవలనా ఏ విధమైన బాధలూ పొందకుండా సుఖంగా ఉంటారు. ఎటువంటి మనోవ్యథలూ లేకుండా విజయం సాధించి చక్కని ఆరోగ్యంతో ఆనందిస్తారు.

**సీ.** **అతిభక్తిఁ గౌశికుం డను బ్రాహ్మణుఁడు దొల్లి యీ విద్య ధరియించి యెలమి మించి**
**మరుభూమియందు నిర్మలచిత్తుఁడై యోగ ధారణంబున బిట్టు తనువు విడిచె**
**దానిపై నొకఁడు గంధర్వవరేణ్యుండు చిత్రరథాఖ్యుఁ డఁజేయుఁ డొంటిఁ**
**జదలఁ జనంగఁ దచ్ఛాయ తదస్థిపైఁ గదిసిన నాతఁడు గళవళించి**

**ఆ.** **యువిద పిండుతోడ నవ విమానముతోడఁ దనదు విద్యతోడ ధరణిఁ ద్రెళ్లి**
**తిరిగి లేవలేక తికమక గుడువంగ, వాలఖిల్యమౌని వానిఁ జూచి.** 308

* పూర్వం కౌశికుడు అనే బ్రాహ్మణుడు ఎంతో భక్తితో ఈ నారాయణ కవచాన్ని ఉపాసించాడు. అతడు నిర్మలమైన హృదయంతో యోగమార్గాన్ని అవలంబించి ఒక ఎడారి ప్రదేశంలో తన దేహాన్ని విడిచిపెట్టాడు. చిత్రరథుడు అనే ఒకానొక గంధర్వరాజు తన రాణులతో కలిసి విమానంలో ఆకాశమార్గాన విహారానికి బయలుదేరాడు. ఆ విమానం నీడ కౌశికుని అస్థిపంజరం మీద పడగానే అతడి విమానం ముందుకు కదలకుండా ఆగిపోయి నేలమీదకు వచ్చిపడింది. చిత్రరథుడు తన రాణులతో క్రిందపడిపోయాడు. అవయవాలు స్తంభించిపోయిన ఆ గంధర్వుడు లేవలేక తికమకపడ్డాడు. ఆ సమయంలో వాలఖిల్యుడు అనే మునీంద్రుడు గంధర్వునితో ఇలా అన్నాడు.

**క.** **నారాయణ కవచ సమా, ధారణ పుణ్యాస్థి దీని దగ్గఱ నీకుం**
**గూరెడినె? విష్ణుభక్తుల, వారక చేరంగ నెట్టివారికిఁ దరమే?** 309

* ఓయీ! ఇది నారాయణ కవచ ప్రభావం. దానిని ధరించి దేహం విడిచిన పుణ్యాత్ముని అస్థికలివి. వీని దగ్గర నీ గంధర్వ మహిమలు ఏ మాత్రమూ పనిచేయవు. విష్ణుభక్తులైన మహాత్ములను అతిక్రమించి పోవటానికి ఎటువంటి వారికీ సాధ్యం కాదు.

**ఇంద్రవజ్రము.**

**సంధించి నీ యంగక సంధు లెల్లన్, బంధించి తన్మంత్రబలంబు పేర్మి**
**న్నందంబు మాన్పింపఁ ద దన్య మేదీ? సింధుప్రవా హోన్నతి చేతఁ దీరున్.** 310

* నారాయణ కవచ ప్రభావంవల్లనే నీ విమానం నిరోధింపబడింది. నీ అవయవ సంధులన్నీ బంధింపబడ్డాయి. నీవు నీ విమానంతో తలక్రిందుగా నేలమీద పడిపోయావు. ఈ ఆపద తొలగటానికి ఒకటే మార్గం ఉన్నది. ఈ పుణ్యాత్ముని ఎముకలను నీవు నదీజలాలలో కలిపినట్లయితే నీ కష్టాలు తీరిపోతాయి.

**వ. కావున నీ పుణ్యశల్యంబులు భక్తియుక్తుండవై కొనిపోయి ప్రాఙ్ముఖంబునఁ బ్రవహించెడు సరస్వతీ జలంబుల నిక్షేపణంబు సేసి కృతస్నానుండ వై యాచమనంబు చేసిన, నీ సర్వాంగ బంధనంబు లుడుగు ననిన నతం డట్లుచేసి, తన విమానం బెక్కి నిజస్థానంబున కరిగెం గావున. 311**

* ఈ మహానుభావుని పవిత్రశల్యాలను భక్తియుక్తుడవై మూటగట్టుకొనిపోయి తూర్పుదిక్కుగా ప్రవహించే సరస్వతీ నదిలో నిక్షేపించు. ఆ నదీజలాలలో స్నానంచేసి ఆచమనం చెయ్యి. అప్పుడు నీ సర్వాంగ బంధాలూ విడిపోతాయి అని వాలఖిల్య మహర్షి చెప్పిన మాటలు విని గంధర్వరాజైన చిత్రరథుడు ఆ విధంగా ఆచరించి బంధవిముక్తుడై భార్యలతో విమానం ఆరోహించి తన లోకానికి వెళ్లిపోయాడు.

**క. అనుదినము దీని నెవ్వరు, వినిరేనిఁ బఠించిరేని విస్మయ మొదవన్**
**ఘన భూతజాల మెల్లను, మునుకొని వారలను గాంచి మ్రొక్కుచు నుండున్. 312**

* పరీక్షిన్మహారాజా! ఈ నారాయణ కవచాన్ని ఎవ్వరైతే ప్రతినిత్యమూ వింటారో, పఠిస్తారో అటువంటివారిని దర్శించగానే సమస్త జీవకోటి భక్తితో చేతులు మోడ్చుతుంది.

**ఆ. విశ్వరూపువలన నైశ్వర్యకరమైన, యిట్టి విద్యఁ దాల్చి యింద్రుఁడపుడు**
**మూఁడు లోకములకు ముఖ్యమైనట్టి శ్రీ, ననుభవించి మించె నధికమహిమ. 313**

* ఈ విధంగా ఐశ్వర్యప్రదమైన మహావిద్యను విశ్వరూపుడు ఇంద్రునకు బోధించాడు. ఆ విద్యను గ్రహించిన దేవేంద్రుడు ముల్లోకాలకు ప్రభువై మహైశ్వర్యాన్ని అనుభవించాడు. మహాప్రభావంతో ప్రకాశించాడు.

**సీ. భూపాల! యా విశ్వరూపున కరుదైన తలలు మూఁ డనువొందఁ దగిలియుండు**
**సొరిది సురాపాన సోమపానంబులు నన్నాద మనఁగను నమరవరుల**
**తోఁగూడి భుజియించి తూకొని వారితో యజ్ఞభాగంబు ప్రత్యక్ష మొంది**
**కై కొనుచుండి దుష్కర్ముఁడై యా యజ్ఞ భాగంబు రాక్షస ప్రవరులకును**

**ఆ. దల్లి మీఁదఁ గలుగు తాత్పర్యవశమున, దివిజవరుల మొఱఁగి తెచ్చి యిచ్చె**
**నది యెఱింగి యింద్రుఁ డతిభీతచిత్తుఁడై, తనకుఁగాని యతని తలలు ద్రుంచె. 314**

* మహారాజా! సురపురోహితుడైన విశ్వరూపునకు మూడు శిరస్సులు. వానిలో మొదటి తల సురాపానం చేస్తుంది. రెండోతల సోమపానం చేస్తుంది. మూడో తల అన్నం భుజిస్తుంది. విశ్వరూపుడు దేవతలకు ఆచార్యుడై యజ్ఞాలు చేయిస్తూ వారితో కలసి మెలసి ఉంటూ వారితోపాటు హవిర్భాగాలు అందుకుంటూ

ఉండేవాడు. ఇలా ఉండగా అతని బుద్ధిలో మార్పు వచ్చింది. అతడు ఒక చెడ్డపని చేశాడు. విశ్వరూపుని తల్లి రచన. ఆమె రాక్షసుల ఆడపడుచు. విశ్వరూపుడు యజ్ఞాలలోని హవిర్భాగాలను తన తల్లివైపు వారైన రాక్షస ప్రముఖులకు పరోక్షంగా పంచిపెట్టటం మొదలు పెట్టాడు. దేవతల కనులు గప్పి రహస్యంగా రాక్షసులకు హవిస్సులు అందిస్తున్న సంగతి దేవేంద్రుడు తెలుసుకున్నాడు. భయభ్రాంతుడైన ఇంద్రుడు, తన శ్రేయోభిలాషి కాని విశ్వరూపుని మూడు శిరస్సులను ఖండించాడు.

క. భూసురుఁ డనక మహాత్మా, గ్రేసరుఁడన కతఁడు పూర్వకృత కర్మగతిన్
వేసరఁ డనక మహేంద్రుఁడు, భూసురు తల లపుడు రోషమునఁ దెగ నడిచెన్. 315

* బ్రాహ్మణుడని భావించకుండా, మహానుభావులలో మహనీయుడని తలంచకుండా, విధివైపరీత్యంవల్ల ఇలా జరిగిందని అనుకోకుండా మహేంద్రుడు రోషావేశంతో విశ్వరూపుని తలలు తెగగొట్టాడు.

వ. ఇట్లయ్యింద్రుండు క్రోధంబు సహింపంజాలక విశ్వరూపుతలలు ఖడ్గంబునం దెగనడిచిన సోమ పానంబు చేయు శిరంబు కపింజలం బయ్యె. సురాపానంబు చేయు శిరంబు గలవింకంబయ్యె. అన్నంబు భక్షించు శిరంబు తిత్తిరి యయ్యె. ఇట్లు త్రివిధ పక్షి స్వరూపంబు దాల్చి, బ్రహ్మహత్య యేతెంచి, యింద్రునిఁ జుట్టుకొని తమ్ముఁ బరిగ్రహింపు మని నిర్బంధింప నపుడింద్రుం డతి భీతచిత్తుండై త్రిలోకనాయకుండైనం దానిం దప్పించుకొనఁజాలక యంజలి యొగ్గి, య మ్మహా దోషంబుగైకొని, తద్దోషం బొక్క సంవత్సరం బనుభవించి, యంతం బాపుకొనువాఁడై భూ జల వృక్ష స్త్రీలం బ్రార్థించి, మద్దురితంబు చతుర్విధంబులం బుచ్చుకొనుం డనిన, భూమి తనయందుఁ జేయంబడిన ఖాతంబు తనంతన పూడునట్టి వరంబును, జలంబు సర్వంబు దనయందుఁ బ్రక్షాళితం బైనం బావనం బగు నట్టి వరంబును, వృక్షంబులు ఛేదింపంబడి పునఃప్రరోహంబు గలుగునను వరంబును, స్త్రీ లెల్లప్పుడుం దమకుఁ గామసుఖంబు గలుగు నను వరంబును గోరిన, నతండట్లుగాక యని యొసంగిన, నతని దుష్కృతంబు ధరణి యిరిణ విధంబునను, నుదకంబు బుద్బు దఫేన రూపంబునను, మహీరు హంబులు నిర్యాసభావంబునను, నింతులు రజోవికారంబు నను నిట్లు చతుర్భాగంబులం బంచికొనిరి. అంత. 316

* దేవేంద్రుడు కోపాన్ని అపుకోలేక విశ్వరూపుని తలలు ఖండించగా సోమపానంచేసే శిరస్సు కౌజు పిట్టగా మారిపోయింది. సురాపానం చేసే శిరసు కలవింకమయింది. అన్నం భక్షించే శిరస్సు తీతువుపిట్ట అయింది. ఈ విధంగా బ్రహ్మహత్యా మహాపాతకం మూడు విధాలైన పక్షి రూపాలు ధరించి ఇంద్రుణ్ణి చుట్టుముట్టి మమ్మల్ని పరిగ్రహించమని నిర్బంధింప సాగింది. అది చూచి ఇంద్రుడు చాల భయపడ్డాడు. త్రిలోకాలకు అధీశ్వరుడైనప్పటికీ ఆ బ్రహ్మహత్యను తప్పించుకొనలేక పోయినాడు. చేతులొగ్గి ఆ మహాపాపాన్ని స్వీకరించాడు. ఒక సంవత్సర పర్యంతం దాన్ని అనుభవించాడు. అనంతరం ఆ పాపాన్ని భరించలేక ఎలాగైన

వదలించుకోవాలని నిశ్చయించి భూదేవినీ, జలాలనూ, వృక్షాలనూ, స్త్రీలనూ పిలిచి ఆ మహాపాపాన్ని నాలుగు విధాలుగా చేసి మీరు పుచ్చుకోండి అని ప్రార్థించాడు. అందుకు బదులుగా భూమి తనయందు చేయబడిన గోయి దానంతట అదే పూడి పోయేటట్లుగా ఇంద్రుని వల్ల వరం పొందింది. జలాలు సమస్తమూ తమయందు ప్రక్షాళనం కాగానే పవిత్రం అయేటట్లుగా వరం పొందాయి. వృక్షాలు ఎన్నిసార్లు ఛేదించినా తిరిగి చిగురించేటట్లు వరం అందుకున్నాయి. స్త్రీలు ఎల్లప్పుడూ తమకు పురుషులకంటే అధికంగా కామసుఖం ప్రాప్తించేటట్లు వరం కోరారు. దేవేంద్రుడు ఆ యా వరాలు ప్రసాదించి తన దుష్కృతాన్ని నాలుగు భాగాలు చేసి వారికి పంచిపెట్టాడు. భూమి ఆ పాపప్రభావం వల్ల ఉప్పురియటం, చౌడు కురియటం రూపంలో ఆ దోషాన్ని ప్రకటించింది. జలాలు బుడగల రూపంలోనూ నురుగు రూపంలోనూ ఆ పాపాన్ని స్వీకరించాయి. చెట్లు జిగురురూపంలో ఆ పాపాన్ని అందుకొన్నాయి. స్త్రీలు రజోవికారం రూపంలో ఆ పాపాన్ని పంచుకొన్నారు.

## -: వృత్రాసుర వృత్తాంతము. :-

**మ.** **హతపుత్రుం డగు విశ్వరూపజనకుం డా త్వష్ట దుఃఖాయతో**
**ద్ధత రోషానల దహ్యమానుఁ డగుచుం దా నింద్రుపై మారణ**
**క్రతు హోమంబు నొనర్ప నందుఁ బొడమెం గల్పాంతకాకార వి**
**శ్రుత కీలానల నిష్ఠు రేక్షణ గుణ క్షుభ్య త్రిలోకోగ్రుఁడై.** **317**

* విశ్వరూపుని తండ్రి అయిన త్వష్ట అనే ప్రజాపతి తన కుమారుణ్ణి ఇంద్రుడు సంహరించినందుకు దుఃఖంతోనూ, రోషంతోనూ దహ్యమానుడైనాడు. ఇంద్రుణ్ణి సంహరించటం కోసం మారణహోమం ప్రారంభించాడు. ఆయజ్ఞకుండంలో నుంచి ప్రళయకాలంలోని అగ్ని జ్వాలల వంటి భయంకరమైన చూపులతో ముల్లోకాలనూ వెలిగింపచేస్తూ ఒక మహాభూతం ఉదయించింది.

**సీ.** **యుగము గ్రుంగెడునాఁడు జగములు వొలియించు నంతకు మూర్తిపై నింత యగుచుఁ**
**బఱపును నిడుపును బ్రతిదినంబును నొక్క శరపాత మంగంబు విరివిఁగొనుచుఁ**
**గడుదగ్ధశైలసంకాశ దేహమునందుఁ గరము సంధ్యారాగకాంతిఁ బెరయ**
**మును గాఁక రాగిచేఁ గను మించు మించులఁ గఱకు మీసలు కచాగ్రములు మెఱయఁ**

**తే.** **జండ మధ్యాహ్న మార్తాండ మండలోగ్ర, చటుల నిష్ఠుర లోచనాంచల విధూత**
**దశ దిశాభాగుఁ డుజ్జ్వలతర కరాళ, భిదుర సునిశిత దంష్ట్రోరు వదనగుహుఁడు.** **318**

* కల్పాంతకాలంలో లోకాలన్నింటినీ అంతంచేసే యమధర్మరాజుకంటే భయంకరంగా ఉంది ఆ స్వరూపం. ప్రతిదినమూ ఒక్కొక్క కోలవేటు ప్రమాణంలో పొడుగూ, వెడల్పూ పెరుగుతున్న అవయవాలతో కూడి ఉంది. చెట్లూ, గుట్టలూ కాలిపోయిన కొండవంటి ఆ దేహంలో నుంచి ఎర్రని సంధ్యాకాంతులు

వెలువడుతున్నాయి. ఎర్రగా కాల్చిన రాగిరేకులవంటి కరుకైన మీసాలూ, శిరోజాలూ మెరుస్తున్నాయి. మధ్యాహ్న కాలంలో భగభగమండే మార్తాండ మండలంలాగా భయంకరాలూ, మిక్కిలి కఠోరాలూ అయిన చూపులతో పదిదిక్కులనూ బద్దలుచేస్తూ ధగధగ మెరిసే వజ్రాయుధంవంటి పదునైన కోరలతో కూడిన నోరు తెరుచుకొని వృత్రాసురుడు జన్మించాడు.

**ఉ. నింగికి నేలకుం బొడవు నిట్టలమై శిఖలందుఁ బర్వు ను**
**త్తుంగ త రాగ్నిజాలములఁ దొ్రటిలుచుం గ్రహపంక్తి జాఱ ని**
**స్సంగ కరాళశాత ఘన సద్ఘృణి మండల చండ శూల ము**
**ప్పొంగుచుఁ గేల లీలఁగొని భూమిచలింపఁగ సోలియాడుచున్. 319**

* వాని విగ్రహం నేలనుండి ఆకాశానికి అంటుతూ ఉన్నది. వాని శిఖలమీది భయంకరమైన అగ్నిజ్వాలలకు గ్రహాలు పెటిల్లుమని రాలిపడుతున్నాయి. చిందరవందరై మిక్కిలి కఠోరమైన పదనైన కాంతులతో మిలమిల మెరిసే శూలాన్ని అవలీలగా కేల ధరించి భూమి చలింపగా తూలి సోలి ఆడుతున్నాడు వృత్రాసురుడు.

**సీ. వదలక విరివిగా వదనంబు దెఱచుచు నాకాశమంతయు నప్పళించుఁ,**
**గడునాల్క నిగుడించి గ్రహతారకంబుల నయమెల్ల దిగజాఱ నాకి విడుచు,**
**నలవోకయును బోలె నట్టహాసము చేసి మెఱసి లోకములెల్ల మ్రింగఁ జూచుఁ,**
**దనదు దిగ్దంతి దంతములు చెక్కలువాఱ నుగ్రదంష్ట్రలు ద్రిప్పు నుక్కుమిగిలి,**

**తే. త్వష్ట బలితంపుఁ దపమునఁ బుష్టినొంది, యఖిల లోకంబు లెల్లఁ దా నాక్రమించి**
**వృత్రనామాఖ్య దేవతాశత్రుఁ డగుచు, దారుణాకారుఁ డఖిల దుర్దముఁడు మెఱసె. 320**

* ఆ వృత్రాసురుడు త్వష్టప్రజాపతియొక్క తపశ్శక్తివల్ల పుష్టినొందినవాడై లోకాలన్నింటినీ ఆక్రమించుతున్నాడు. భయంకరమైన ఆకారంతో ఎవరినీ లెక్కచేయకుండా ఉన్నాడు. ఒక్కొక్కమాటు పెద్దగా నోరు తెరచి ఆవులించి ఆకాశమంతా చప్పరిస్తాడు. ఒకమాటు పొడుగైన నాలుగ చాచి గ్రహాలనూ, నక్షత్రాలనూ క్రిందికిలాగి నాకి విడుస్తాడు. ఒకమాటు అలవోకగా అట్టహాసం చేసి లోకాలన్నింటినీ మింగబోతాడు. ఒకమాటు దిగ్గజాల దంతాలు పగిలి బీటలు వారేటట్లుగా అహంకారంతో భీకరమైన కోరలు త్రిప్పుతాడు. ఈ విధంగా వృత్రాసురుడు సమస్త దేవతలకూ శత్రువై అవక్రవిక్రమంతో పరాక్రమించాడు.

**మత్తకోకిల.**

**అట్టి వృత్రునిమీఁద దేవత లల్కతోఁ బెనుమూఁక లై**
**చుట్టుముట్టి మహాస్త్రవిద్యలు సూపి యేపున నేయ నా**
**గొట్టువీరుఁడు వార లేసిన క్రూరశస్త్రము లన్నియుం**
**జుట్టి పట్టుక మ్రింగి శూరతఁ జోక నార్చె మహోగ్రుఁడై. 321**

* అటువంటి భయంకరాకారం గల వృత్రాసురుని మీదికి దేవతలంతా గుంపులు గుంపులై దూకారు. ఆగ్రహావేశంతో అతన్ని చుట్టుముట్టి అస్త్రశస్త్రాలు ప్రయోగించారు. వీరాధివీరుడైన ఆ వృత్రాసురుడు ఆయా శస్త్రాలను అన్నింటినీ చుట్టచుట్టి పట్టుకొని నోటిలో పెట్టుకొని గుటుక్కున మ్రింగివేసి మహాభయంకరంగా గర్జించాడు.

**క. భక్షిత దివ్యాస్త్రుం డగు, రక్షోనాయకుని నమరరాజ ప్రముఖుల్**
**వీక్షింప వెఱచి పఱచిరి, రక్షకుఁ జింతించి కొనుచు రయ మొప్పారన్. 322**

* ఈ విధంగా తమ అస్త్రాలను భక్షించిన రాక్షసరాజును వీక్షించి దేవేంద్రాది దిక్పాలకులు భయపడినారు. పారిపోయినారు. తమకు దిక్కు ఎవరా అని చింతస్తూ దిక్కులవెంట పరుగులెత్తారు.

**వ. ఇట్లు సర్వసాధనంబులతోడ సాధుజనంబుల వృత్రాసురుండు మ్రింగిన, నచ్చెరువడి చేయునది నేరక త త్తేజోవిశేష విభవంబునకు భయంబు నొంది. కందిన డెందంబునం గుందుచుఁ, బురందర ప్రముఖు లార్తరక్షకుండగు పుండరీకాక్షునకుం గుయ్యిడు వారలై. 323**

* ఈ విధంగా తాము ప్రయోగించిన సర్వ శస్త్రాస్త్రములనూ వృత్రాసురుడు మ్రింగివేయగా ఆశ్చర్యచకితులై ఇంద్రాది దేవతలు ఏమీచేయలేక పోయినారు. అతని తేజోవిశేషాన్ని చూచి బెదరి చెదరిన హృదయాలతో ఆత్మరక్షకుడైన పండరీకాక్షుణ్ణి శరణు పొందుదా మనుకొన్నారు.

**లయగ్రాహి.**

**వీఁడు కడు దుర్దముఁడు వాఁడి మన కైదువులు, పోఁడి సెడఁగా మెసఁవి యీడు గనకున్నాఁ**
**డేడ బ్రతుకింకఁ? బెనుకీడు వొడమెన్ మనకుఁ, దోడుపడ నొక్కరుఁడు లేఁడు హరి దక్కన్.**
**వేఁడుదము శ్రీధరునిఁ, గూడుదము సద్భటులఁ, బాడుదము గీతములఁ జాడఁబడు నంతన్**
**వీఁడు చెడుత్రోవ దయతోడ నెఱిఁగించు ఘనుఁ డోడక సురాలయము పాడువడ దింకన్. 324**

* ఈ వృత్రాసురుడు మనకు అజేయుడు. మన పదునైన ఆయుధాలన్నీ మ్రింగివేశాడు. వీనికి సాటి అయిన మేటి ఎక్కడా లేడు. ఇక మన బ్రతుకులు పాడై పోయినాయి. మనకు కీడు మూడింది. ఇప్పుడు శ్రీహరి తప్ప మనకు తోడుపడేవాడు ఎవ్వడూ లేడు. అందువల్ల ఆ శ్రీమన్నారాయణుణ్ణే రక్షింపుమని వేడుకొందాము. ఆయన భక్తులతో చెలిమి చేద్దాము. ఆయనకు జాలి కలిగేటట్లు సంకీర్తనలు చేద్దాము. మనం అలా చేస్తే ఆ స్వామి కరుణించి వీడు నాశనమయ్యే విధానము మనకు దయతో వెల్లడిస్తాడు. అప్పుడు మన స్వర్గం పాడుపడకుండా ఉంటుంది.

**క. అని తలపోయుచుఁ దమలో, మునుకుచుఁ దికమకలు గొనుచు మురరిపు కడకున్**
**గునుకుచుఁ గునుకుచు నేగిరి, ఘనరాక్షసుఁ గన్న కన్నుఁగవ బెగ్గిలఁగన్. 325**

* ఈ విధంగా దేవతలు ఆలోచిస్తూ తమలో తాము తికమకలు పడుతూ సందేహిస్తూ ఎలాగో పోలేక పోలేక విష్ణువు సన్నిధికి వెళ్ళారు. దారి పొడుగునా ఎక్కడ చూచినా వారి కన్నులకు వృత్రాసురుని భయంకర రూపమే కనిపించింది.

వ. ఇట్లు భయార్తులైన యమర్త్యవ్రాతంబు సనిచని, ముందట నభంగ భంగ రంగ దుత్తుంగ డిండీర మండల సముద్దం డాడంబర విడంబిత నారాయణ నిరంతర కీర్తి లతా కుసుమగుచ్ఛ స్వచ్ఛంబును, అనవరత గోవింద చరణారవింద సేవా సమాకుల కలితఫలిత మహాపుణ్యా ఫలాయమాన సముద్దీపి తావర్తవర్తిత దక్షిణావర్త రుచిర శంఖమండల మండితంబును, నతి నిష్ఠుర కఠిన పాఠీన పృథురోమ రాజీవ శకుల తిమి తిమింగిల కర్కట కమఠ కచ్ఛప మకర నక్ర వక్రగ్రహ గ్రహణ ఘుమ ఘుమారావ దారుణగమన విషమిత విషమ తరంగఘట్టన ఘట్టిత సముద్ధూత శీకర నికర నీరంధ్ర తారకిత తారాపథంబును,మహోచ్ఛ్రయ శిలోచ్చయ శిఖరాగ్ర ప్రవహిత దుగ్ధనిర్ఝర సమ్మార్జిత పురాణపురుష విశుద్ధ శుద్ధాంత విహరణధురీణ నవసుధాధౌత ధావళ్య ధగద్ధగాయమాన రమ్య హర్మ్య నిర్మాణ కర్మంబును, అతిపవిత్రగుణ విచిత్ర నిజకళత్ర ప్రేమానంద సందర్శిత ముకుంద పరిస్రవ దంతరంగ కరుణారస పరిమిళిత భావబంధుర విద్రుమ వల్లీమతల్లి కాంకుర శోభితంబును, ప్రసిద్ధ సిద్ధరసాంబువాహ సంగమ సముత్థిత గంభీర ఘోష పరిపూరిత సకల రోదోఽంతరాళంబును, సముద్రమేఖ లాఖిలప్రదేశ విలసిత నవీన దుకూలాయమానంబును, హరిహర ప్రముఖ దేవతానిచయ పరిలబ్ధామృత మహైశ్వర్య దానధౌరేయ మహానిధానంబును, వైకుంఠపుర పౌరవార మనోహర కామ్యఫలఫలిత మందార పారిజాత సంతాన కల్పవృక్ష హరిచందన ఘన వనానుకూల కూలంబునునై యొప్పుచుఁ గుబేరు భాండాగారంబునుం బోలె బద్మ, మహాపద్మ, శంఖ, మకర, కచ్ఛప, ముకుంద, కుంద, నీల, వర సమగ్రంబై, విష్ణు కరకమలంబునుం బోలె సుదర్శనావర్త ప్రగల్భంబై, కైలాస మహీధరంబునుం బోలె నమృతకళాస్థాన శేఖరపదార్పణంబై, యింద్రవైభవంబునుం బోలె కల్పవృక్ష కామధేను చింతామణి జనిత విశేషంబై, సుగ్రీవసైన్యంబునుంబోలె నపరిమితనిబిడ హరిసంచారంబై, నారాయణోదరంబునుంబోలె నిఖిల భువన భారభరణ సమర్థంబై, శంకరు జటాజూటంబునుం బోలె గంగాతరంగిణీ సమాశ్రయం బై, బ్రహ్మలోకంబునుం బోలెఁ బరమహంసకుల సేవ్యంబై, పాతాళ లోకంబునుంబోలె ననంత భోగి భోగ్యయోగ్యంబై, నందనవనంబునుం బోలె నైరావత మాధవీరంభాది సంజననకారణంబై, సౌదామినీ నికరంబునుం బోలె నభ్రంకషంబై, విష్ణునామకీర్తనంబునుం బోలె నిర్మల స్వభావం బై, క్రతుశత గతుండునుంబోలె హరిపదభాజనంబై, యొప్పుచున్న దుగ్ధవారాశి డాసి, శ్వేతద్వీపంబున వసియించి, యందు సకల దిక్పాలకాది దేవతలు దేవదేవు నాశ్రయించి యిట్లని స్తుతియించిరంత. 326

* భయార్తులైన దేవతలు పాలసముద్రం దగ్గరకు వెళ్ళారు. ఆ క్షీరసాగరం నిండా ఎత్తుగా ఎగిరి పడుతున్న తరంగాల మీద నురుగు ముద్దలు కనిపిస్తున్నాయి. అవి శ్రీమన్నారాయణుని కీర్తిలతలు పూచిన

తెల్లని పూలగుత్తులవలె ప్రకాశిస్తున్నాయి. ఆ పాలకడలిలో నిరంతరమూ గోవింద చరణారవిందాల సేవలో ఆసక్తులైన భక్తుల పుణ్యఫలాలవలె సుడులలో తిరుగుతున్న దక్షిణావర్తశంఖాలు విరాజిల్లుతున్నాయి. ఆ పాలసముద్రంలో మిక్కిలి కఠినములైన పాఠీనములూ, పృథురోమములూ, రాజీవాలూ, శకులాలూ, తిమి తిమింగిలాలూ మొదలైన మహా మత్స్యాలూ, ఎండ్రకాయలూ, తాబేళ్లూ, మొసళ్లూ ఇత్యాది జలచరాలూ గిరగిర గుండ్రంగా తిరుగుతున్నాయి. వాటి వక్రగమనం వల్ల సముద్ర తరంగాలు పైకి లేస్తున్నాయి. ఆ తరంగాలనుంచి మీదికి ఎగిరిన పాలతుంపురులు ఆకాశంనిండా నక్షత్రాలలాగ మెరుస్తున్నాయి. ఆ దుగ్ధ మహోదధిలో పెద్ద పెద్ద పర్వతాలున్నాయి. ఆ పర్వతశిఖరాలపై సముద్రతరంగాలు ఎగిరిపడి క్రిందికి ప్రవహిస్తున్నాయి. అవి మిక్కిలి పరిశుద్ధమైన అంతఃపురాలలో విహారాలలో క్రొత్తగా సున్నం కొట్టబడిన తెల్లని కాంతులతో ధగధగలాడే అందమైన మేడలలాగా, మందిరాల లాగా ప్రకాశిస్తున్నాయి. ఆ పయోనిధిలో పగడాలతీగలు తన రమణీమణులతో క్రీడించే గోవిందుని ఆనందాన్ని ప్రదర్శిస్తూ కరిగిపోయిన ఆయన అంతరంగం నుండి కరుణారసంతో కూడిన అనురాగ తరంగాలవలె అలరారుతున్నాయి. సిద్ధరసాలైన మేఘాలు ఆ సముద్రంలో నుంచి నీరు నింపుకొంటున్నాయి. ఆ మేఘాలు పరస్పరం ఒరుసుకోవటం వల్ల సంభవించిన గంభీరమైన ఉరుములతో భూమ్యాకాశాలు దద్దరిల్లు తున్నాయి. సముద్రమేఖల అయిన భూమికి ఈ సముద్ర జలాలు క్రొంగ్రొత్త పట్టుచీరలాగా ఒప్పుతున్నాయి. విష్ణువు, శివుడు మొదలైన దేవతలకు అమృతాన్ని అందించే మహైశ్వర్యంలో కూడిన ఔదార్యసంపదకు ఆ పాలసముద్రం నిధానంగా ఉన్నది.

వైకుంఠనగరంలోని పౌరులకు కోరిన కోర్కులన్నీ పండించే మందారం, పారిజాతం, సంతానం, కల్పవృక్షం, హరిచందనం వంటి దేవతావృక్షాలు ఆ సముద్రం ఒడ్డులమీద కనువిందు చేస్తున్నాయి. ఆ పాలసముద్రం పద్మం, మహాపద్మం, శంఖం, మకరం, కచ్ఛపం మొదలైన వాటితో కూడి నవనిధులతో కూడిన కుబేరుని ధనాగారంలాగా ఉన్నది. సుదర్శన పరిశోభితమైన ఆ సముద్రం సుదర్శనంతో కూడిన విష్ణుదేవుని కరకమలం లాగా ఉన్నది. అమృతకిరణుడైన చంద్రుని కళలకు ఆస్థానమైన ఆ సముద్రం చంద్రకళాశేఖరుని కైలాసపర్వతం లాగా ఉన్నది. కల్పవృక్షమూ, కామధేనువూ, చింతామణీ మొదలైన వానికి జన్మస్థానమైన ఆ సముద్రం దేవేంద్రవైభవాన్ని పుణికిపుచ్చుకున్నట్లు ఉన్నది. అపరిమితమైన హరి సంచారంతోకూడిన ఆ పారావారం అపరిమిత హరి (కోతుల) సంచారం గల సుగ్రీవుని సైన్యంలాగా ఉన్నది. సమస్త లోకాలభారాన్నీ భరించటానికి సమర్థమైన ఆ సముద్రం విష్ణుదేవుని ఉదరంలాగా ఉన్నది. పరమహంస సమూహాలకు సేవింపదగిన ఆ సముద్రం బ్రహ్మలోకంలాగా ఉన్నది. అనంత భోగ భాగ్యాలకు యోగ్యమైన ఆ సముద్రం పాతాళలోకంలాగా ఉన్నది. ఐరావతం, లక్ష్మీదేవి, రంభ మొదలైనవారి పుట్టుకకు కారణమైన ఆ సముద్రం ఐరావతంతో మాధవీలతలతో రంభాతరువులతో కూడిన నందన వనంలాగా ఉన్నది. ఆ సముద్రం మెరపుతీగల సమూహంలాగా మేఘాలను అంటుతున్నది. హరినామకీర్తనంలాగా నిర్మలస్వభావం కలిగి ఉన్నది. నూరు యజ్ఞాలు చేసినవానిలాగా దేవేంద్రపదవికి తగిఉన్నది.

అటువంటి పాలసముద్రాన్ని దేవతలు సమీపించారు. ఆ పాలసముద్రంలో ఉన్న శ్వేతద్వీపాన్ని చేరారు. ఆ ద్వీపంలో నివసించే దేవదేవుడైన వాసుదేవుణ్ణి ఇంద్రాదిదేవతలు ఈ విధంగా స్తోత్రం చేశారు.

**సీ. పంచమహాభూత పరినిర్మితంబైన ముజ్జగంబుల కెల్ల నొజ్జ యైన**
**బ్రహ్మయు నేమును బరఁగ నందఱుఁ గూడి యెవ్వనికై పూజలిత్తు మెపుడు**
**నట్టి సర్వేశ్వరుం డాగమ వినుతుండు సర్వాత్మకుఁడు మాకు శరణ మగును**
**అతిపూర్ణకాము నహంకారదూరుని సముని శాంతునిఁ గృపాస్పదుని గురుని**

**తే. మాని యన్యుని సేవింపఁ బూనునట్టి, కపట శీలుని నతి పాపకర్మబుద్ధి**
**శునక వాలంబు పట్టుక ఘనతరాబ్ధిఁ, దరియఁ జూచుట గాదె! తాఁ దామసమున. 327**

* పంచమహాభూతాలతో ఈ ముల్లోకాలనూ నిర్మించిన బ్రహ్మ దేవుడు మాకందరికీ గురుదేవుడు. ఆయనా మేమూ కలిసి ఏ మహానుభావుణ్ణి సేవిస్తామో ఆ సర్వేశ్వరుడు ఆ సర్వాంతర్యామి ఆ వేదవేద్యుడు మాకు రక్షకుడు కావాలి. పరిపూర్ణుడూ నిరహంకారుడూ సర్వసముడూ శాంతస్వరూపుడూ కరుణామయుడూ అయిన ఆ జగద్గురువును కాదని అన్యులను సేవించేవాడు కపటశీలుడు, దొంగ. అటువంటి ధూర్తుడు కుక్కతోక పట్టుకొని మహాసముద్రాన్ని దాటడానికి ప్రయత్నించే బుద్ధిహీనుని వంటివాడు.

**చ. ఉదకమయంబునన్ వసుధ నోడఁగఁ జేసి తనర్చు కొమ్మునన్**
**వదలక యంటఁగట్టి మనువల్లభుఁ గాచిన మత్స్యమూర్తి స**
**మ్మదమున మమ్ముఁబ్రోచు ననుమానము మానఁగ వృత్రుచేతి యా**
**పదఁ దొలఁగించి నేఁడు సురపాలుర పాలిటి భాగ్యదైవమై. 328**

* పూర్వం ప్రళయకాలంలో సమస్తసృష్టీ జలమయ మైనప్పుడు భగవంతుడు మత్స్యావతారం ధరించి ఈ భూమిని ఓడగా చేసి తన ముట్టెపై నున్న కొమ్ముకు కట్టుకొని సత్యవ్రతుడనే మనువునూ, మమ్ముల నందరినీ కాపాడాడు. ఆ కరుణాసముద్రుడు మా పాలిటి భాగ్యదేవతయై ఈనాడు ఈ వృత్రాసురుని బారి నుండి సమ్మోదంతో మమ్ములను రక్షించునుగాక!

**మత్తకోకిల**

**రంతు సేయుచు వాతధూత కరాళ భంగుర భంగ దు**
**ర్దాంత సంతత సాగరోదక తల్ప మొంది వసించు బ్ర**
**హ్మాంతవానిని బొడ్డుఁదమ్మిని నాఁచి కాచిన నేర్ప రిం**
**తంతవాఁ డనరాని యొంటరి యాదరించు మముం గృపన్. 329**

* ప్రళయకాల ప్రభంజనాలతో అల్లకల్లోలమైన ఉత్తుంగ సముద్ర తరంగాలనే శయ్యగా చేసుకొని పవళించిన వాడూ, ఆ మహాసాగరంలో పడిపోకుండా బ్రహ్మాంతవాడిని తన నాభికమలంలో దాచి కాచిన సమర్థుడూ, ఇంతవాడు అంతవాడు అనే నిర్ణయాలకు అందని వాడూ, అయిన ఆ అద్వితీయుడు మమ్ములను అనురాగంతో ఆదరించుగాక!

తే. దేవతల మైన మే మిట్టి దేవదేవు, సర్వలోక శరణ్యుని శరణు చొచ్చి
బలిత మైనట్టి వీని యాపదలఁబాసి, మీఁది శుభములఁ జే కొనువార మిపుడు. 330

* దేవతలమైన మేము ఆ దేవదేవుని ఆశ్రయించ వచ్చినాము. శరణాగతులమైన మేము సర్వలోక శరణ్యుడైన ఆ భగవంతుని శరణుజొచ్చినాము. ఇక ఆ వృత్రాసురుని విపత్తు నుండి విముక్తి పొంది సమస్త శుభాలూ అందుకోగలము.

వ. ఇట్లు స్తుతియించుచున్న దేవతలకు భక్తవత్సలుండైన వైకుంఠుండు ప్రసన్నుండయ్యె. అప్పుడు.331

* ఈ విధంగా ప్రార్థిస్తున్న దేవతలకు భక్తవత్సలుడైన భగవంతుడు ప్రసన్నుడై దర్శన మిచ్చాడు.

సీ. తగు శంఖ చక్ర గదా ధరుం డగు వాని శ్రీవత్స కౌస్తుభ శ్రీల వాని
గమనీయ మాణిక్య ఘన కిరీటమువాని దివ్యవిభూషణ దీప్తివాని
మండిత కోటీర కుండలంబులవాని, సిరి యురస్థ్సలమునఁ జెలఁగు వానిఁ
దనుఁబోలు సేవకతండంబు గలవాని, జిలుఁగైన పచ్చని వలువవానిఁ

ఆ. దెల్లఁ దమ్మివిరులఁ దెగడు కన్నులవాని, నవసుధా ద్రవంపు నవ్వువానిఁ
గనియె వేల్పుపిండు కప్పరపాటుతోఁ, గన్నులందు నున్న కఱవు దీఱ. 332

* బృందారక బృందాలు ఇందిరా వల్లభుని దివ్యసుందర స్వరూపాన్ని కన్నుల విందుగా కరవుదీరా సందర్శించారు. స్వామి శంఖమూ చక్రమూ గదా ధరించి ఉన్నాడు. ఉరోభాగాన శ్రీవత్సమూ కౌస్తుభమూ శోభిస్తున్నాయి. శిరస్సున రమణీయమైన రత్నకిరీటం విరాజిల్లుతున్నది. చేతులందు భుజకీర్తులూ, చెవులందు మకరకుండలాలూ ప్రకాశిస్తున్నాయి. లక్ష్మీదేవి వక్షఃస్థలాన విలసిల్లు తున్నది. దేహమంతా దివ్యాభరణాలతో తేజరిల్లు తున్నది. బంగారు పట్టు పీతాంబరం వెలుగులు వెదజల్లు తున్నది. కన్నులలో తెల్లదామరరేకుల సోయగాలు వెల్లివిరుస్తున్నవి. మందహాసంలో మధుర సుధారసాలు పొంగిపొరలు తున్నవి. ఆయన ఆకారాన్ని పుణికి పుచ్చుకొన్న పార్షదులు ఆయనను సేవిస్తున్నారు.

సీ. తన సేవకులలోనఁ దడబడు రూపంబు శ్రీవత్స కౌస్తుభశ్రీలు దెలుప
వికచాబ్జములతోడ వీడ్వడు కన్నుల కడల దై వాఱెడు కరుణ దెలుప
నెల్ల లోకములకు నిల్లైన భాగ్యంబుఁ గాఁపురం బుండెడు కమల దెలుప
మూఁడు మూర్తులకును మొదలైన తేజంబు ధాతఁ బుట్టించిన తమ్మి దెలుప

ఆ. బుద్ధిఁ బోల్పరాని పుణ్యంబుఁ దత్పాద, కమల జనిత యైన గంగ దెలుప
నప్రమేయుఁ డభవుఁ డవ్యక్తుఁ డవ్యయుఁ, డాదిపురుషుఁ డఖిలమోది యొప్పె. 333

* తక్కిన రూపురేఖలన్నీ ఒక్కటిగా ఉన్న స్వామి వక్షఃస్థలాన విలసిల్లే శ్రీదేవి, శ్రీవత్సం, కౌస్తుభం, సేవకుల కంటే ఆయన ప్రత్యేకతను వెల్లడిస్తున్నాయి. ఆయన పేరురమున కాపురమున్న లక్ష్మీదేవి

అఖిలలోకాలకూ ఆలవాలమైన ఐశ్వర్యాన్ని వెల్లడిస్తున్నది. నలువకు నెలవైన ఆయన నాభికమలం ముమ్మూర్తులకు మూలభూతమైన తేజస్సును వెల్లడిస్తున్నది. ఆయన పాదపద్మాల నుండి ప్రభవించిన గంగా తరంగిణి బుద్ధికి అగణ్యమైన పుణ్యాన్ని వెల్లడిస్తున్నది. ఆ విధంగా అభవుడూ, అవ్యయుడూ అప్రమేయుడూ, అవ్యక్తుడూ, ఆదిపురుషుడూ అయిన శ్రీమన్నారాయణుడు అందరికీ ఆనందం కలిగించుతూ అలరారు తున్నాడు.

**వ. ఇట్లు జగన్మోహనాకారుండైన నారాయణుని కృపావలోకనాహ్లాద చకిత స్వభావ చరితులై సాష్టాంగదండ ప్రణామంబు లాచరించి, ఫాలభాగాన పరికీలిత కరకమలులై యిట్లనిరి. 334**

* ఈ విధంగా భువన మోహనాకారుడైన పురుషోత్తముడు దేవతలముందు సాక్షాత్కరించాడు. ఆయన కరుణాకటాక్ష వీక్షణాలతో సంతుష్టచిత్తులైన వేల్పులు స్వామికి సాష్టాంగ దండ ప్రణామాలు ఆచరించి ఫాలభాగాన కేలుదోయి గీలించి ఇలా స్తుతించారు.

**ఆ. దుర్గమంబు లైన స్వర్గాది ఫలములఁ, బుట్టఁ జేయఁ జాలునట్టి గుణము**
**గలిగి మెలఁగుచున్న ఘనుఁడ వైనట్టి నీ, కరయ మ్రొక్కువార మాదిపురుష! 335**

* యజ్ఞాది సత్కర్మలు చేసేవారికి దుర్గమములైన స్వర్గాది పుణ్యఫలాలు ప్రాప్తింపచేసే మహానుభావుడవు నీవే. అది నీ సహజగుణం. అటువంటి పురాణపురుషుడవైన నీకు నమస్కారం.

**సీ. దండంబు యోగీంద్రమండల నుతునకు దండంబు శార్ఙ్గకోదండునకును,**
**దండంబు మండిత కుండల ద్వయునకు దండంబు నిష్ఠుర భండనునకు,**
**దండంబు మత్తవేదండ రక్షకునకు దండంబు రాక్షసఖండనునకు,**
**దండంబు పూర్ణేందు మండల ముఖునకు, దండంబు తేజః ప్రచండునకును,**

**తే. దండ మద్భుత పుణ్యప్రధానునకును, దండ ముత్తమ వైకుంఠధామునకును**
**దండ మాశ్రిత రక్షణ తత్పరునకు, దండ మురు భోగినాయక తల్పునకును. 336**

* యోగీంద్ర బృందవందితుడవూ, శార్ఙ్గమనే ధనుస్సు ధరించిన వాడవూ అయిన నీకు నమస్కారం, గజరాజును రక్షించినవాడవూ, రాక్షసులను శిక్షించినవాడవూ, చంద్రబింబంవంటి ముఖం గలవాడవూ, ప్రచండమైన తేజస్సు గలవాడవూ అయిన నీకు ప్రణామం. అగణ్యాపుణ్య స్వరూపుడవూ వై కుంఠధాముడవూ ఆర్తజన రక్షణ తత్పరుడవూ అహిరాజతల్ప శయనుడవూ అయిన నీకు వందనం.

**ఉ. చిక్కిరి దేవతావరులు చిందఱ వందఱలైరి ఖేచరుల్,**
**స్రుక్కిరి సాధ్యసంఘములు, సోలిరి పన్నగు లాజి భూమిలో,**
**మ్రక్కిరి దివ్యకోటి, కడు మ్రగ్గిరి యక్షులు వృత్రుచేత నీ**
**చిక్కినవారి నైన దయసేయుము నొవ్వకయుండ నో హరీ! 337**

* ఓ దేవాదిదేవా! వృత్రాసురుని ధాటికి తట్టుకోలేక దేవతలు చిక్కులలో చిక్కుకున్నారు. కిన్నరులు చిందరవందరైనారు. సాధ్యులు అలసిపోయారు. పన్నగులు సొమ్మసిల్లారు. సిద్ధులు వెలవెలపోయారు. యక్షులు మూర్ఛిల్లారు. ఎలాగో ప్రాణాలతో బయటపడిన మమ్ములనైనా నీవు కటాక్షించు, వారి బారిపడకుండా రక్షించు.

**క. మొదలాఁటిన రక్కసులకు, మొదలై మా కాపదలకు మూలం బగుచుం**
**దుద మొదలు లేని రక్కసు, తుదిఁ జూపఁగదయ్య! తుదకుఁ దుదియైన హరీ! 338**

* మొదలంటా దానవులందరూ నశించా రనుకుంటే వీడు మళ్ళీ మొదలైనాడు. మాకు కష్టాలు తిరిగి మొదలైనాయి. తుదీ మొదలూ లేకుండా విజృంభిస్తున్న ఈ రాక్షసుణ్ణి తుదముట్టించు స్వామీ! నీవు అంతమునకు అంతమైన అనంతుడవు కదా!

**తే. అకట! దిక్కుల కెల్ల దిక్కైన మాకు, నొక్క దిక్కును లేదు కా లూన నైన,**
**దిక్కుగావయ్య! నేఁడు మా దిక్కుఁ జూచి, దిక్కు లేకున్నవారల దిక్కు నీవ. 339**

* దిక్కులకు అధినాథులమైన మాకు ఈనాడు దిక్కులేకుండా పోయింది. నిలబడటానికి దిక్కులేని మా దిక్కుచూడు. మాకు దిక్కుచూపించు దిక్కులేని దీనులకు నీవే దిక్కు.

**క. నీ దిక్కు గానివారికి, నే దిక్కును వెదక నుండ దిహపరములకున్**
**మోదింపఁ దలఁచువారికి, నీ దిక్కే దిక్కుసుమ్ము! నీరజనాభా! 340**

* నీ దిక్కుచూచి నీవే దిక్కని మ్రొక్కని వారికి ఈ ప్రపంచంలో ఏ దిక్కూ లేదు. ఇహపరాలలో కూడా వారు దిక్కుమాలినవారే. ఓ కమలనాభా! లోకంలో సురక్షితంగా ఉండి సుఖపడాలనుకొనే వారికి నీ దిక్కే సరైన దిక్కు.

**తే. అరయ మా తేజములతోడ నాయుధములు, మ్రింగి భువన త్రయంబును మ్రింగుచున్న**
**భీకరాకారు వృత్రునిఁ బీఁచ మణఁచి, యెల్ల భంగుల మా భంగ మీఁగు మభవ! 341**

* ఓ దేవదేవా! వీడు, ఈ వృత్రాసురుడు మా తేజస్సులనే కాదు మా ఆయుధాలను కూడా మ్రింగివేశాడు. ఈ భీకరాకారుడు ముందు ముందు ముల్లోకాలను సైతం దిగమ్రింగేటట్లున్నాడు. ఈ రాక్షసుని అహంకారం అణచివేయాలి! మా భంగపాటుకు ప్రతీకారం చేయాలి!

**ఆ. పరమపురుష! దుఃఖభంజన! పరమేశ!, భక్తవరద! కృష్ణ! భవవిదూర!**
**జలరుహాక్ష! నిన్ను శరణంబు వేఁడెద, మభయ మిచ్చి కావు మయ్య! మమ్ము. 342**

* ఓ పరమపురుషా! ఓ పరమేశ్వరా! నీవు దుఃఖభంజనుడవు! భక్తరంజనుడవు! సంసార బాధలను దూరం చేసే సరోజాక్షుడవు. ఓ శ్యామసుందరా! నిన్ను శరణు జొచ్చినాము. ప్రభూ! అభయమిచ్చి మమ్ములను ఆదుకో.

వ. నమస్తే భగవన్నారాయణ! వాసుదేవ! ఆదిపురుష! మహానుభావ! పరమమంగళ! పరమకళ్యాణ! దేవ! పరమ కారుణికు లైన పరమహంసలగు పరివ్రాజకులచేత నాచరితంబు లగు పరమసమాధి భేదంబులం బరిభావిత పరిస్ఫుటం బైన పరమహంస ధర్మంబుచేత నుద్ఘాటితం బగు తమః కవాటద్వారంబున నపావృతం బైన యాత్మలోకంబున నుపలబ్ధిమాత్రుండవై, నిజసుఖానుభవుండవై యున్న నీ వాత్మ సమవేతంబులై యుపేక్షింపం బడని యీ శరీరంబులకు నుత్పత్తి స్థితి లయ కారణుండ వై యుండుదువు. గుణసర్గ పతితుండవై యపరిమిత గుణగణంబులున్న నీవు, దేవదత్తుని మాడ్కిఁ బారతంత్ర్యంబున స్వకృతంబులైన కుశలా కుశల ఫలంబుల ననుభవింతువు. షడ్గుణైశ్వర్య సంపన్నుండ వైన నీ వాత్మారామ స్వభావుండ వై, యపరిమిత గుణగణంబులు గలిగి, యీశ్వ రాహ్వయానవగాహ్య మాహాత్మ్యంబందు నర్వాచీన వికల్ప వితర్క విచార ప్రమాణాభాసంబులగు కుతర్కశాస్త్రంబులఁ గర్కశంబులైన ప్రజ్ఞలు గలిగి, దురవగ్రహవాదు లయిన విద్వాంసుల వివాదా వసరంబుల యందు నుపరతంబులగు అస్తి నా స్తీత్యాది వాక్యంబుల సమస్త మాయామయుం డవై నిజమాయచేతఁ గానంబడని యుక్తి గోచరుండవై, సమ విషమ రూపంబులఁ బ్రవర్తింతువు. దేవా! రజ్జువునందు సర్పభ్రాంతి గలుగునట్లు, ద్రవ్యాంతరంబులచేత బ్రహ్మంబైన నీ యందుఁ బ్రపంచ భ్రాంతి గలుగుచుండు. సర్వేశ్వరా! సర్వ జగత్కారణ రూపంబవైన నీవు సర్వభూత ప్రత్యగాత్మ వగుటం జేసి సర్వగుణావభాసోపలక్షితుండవై కానంబడుచుందువు. లోకేశ్వరా! భవ న్మహిమ మహామృత సముద్ర విప్రు ట్సకృత్పాన మాత్రంబున సంతుష్టచిత్తులై, నిరంతర సుఖంబున విస్మారిత దృష్ట శ్రుత విషయసుఖ లేశాభాసులైన పరమ భాగవతులు, భవచ్చరణ కమల సేవాధర్మంబు విడువరు. త్రిభువనాత్మ భవన! త్రివిక్రమ! త్రిణయన! త్రిలోక మనోహరానుభావ! భవదీయ వైభవ విభూతి భేదంబు లైన దనుజాదులకు ననుపక్రమ సమయం బెఱింగి, నిజమాయాబలంబున సుర నర మృగ జలచరాది రూపంబులు ధరియించి, తదీయావతారంబుల ననురూపంబైన విధంబున శిక్షింతువు. భక్తవత్సలా! భవన్ముఖ కమల నిర్గత మధుర వచనామృత కళావిశేషంబుల, నిజదాసులమైన మా హృదయతాపం బడంగింపుము. జగదుత్పత్తి స్థితి లయ కారణ ప్రధాన దివ్య మాయా వినోదవర్తివై సర్వ జీవనికాయంబులకు బాహ్యాభ్యంతరంబులయందు బ్రహ్మ ప్రత్యగాత్మ స్వరూప ప్రధాన రూపంబుల దేశకాల దేహావస్థాన విశేషంబులఁ, దదుపాదానానుభవంబులు గలిగి, సర్వప్రత్యయ సాక్షివై, సాక్షాత్పరబ్రహ్మ స్వరూపుండవై యుండెడి నీకు నేమని విన్నవించు వారము? జగదాశ్రయంబై, వివిధ వృజిన సంసార పరిశ్రమోపశమనం బైన భవదీయ దివ్యచరణ శతపలాశచ్ఛాయ నాశ్రయిం చెదము అని పెక్కువిధంబుల వినుతించి యిట్లనిరి. 343

* భగవానుడా! శ్రీమన్నారాయణా! ఆదిపురుషా! మహానుభావా! పరమమంగళ స్వరూపా! పరమకల్యాణమూర్తీ! దేవదేవా! కరుణాపరిపూర్ణులూ పరమ హంసలూ అయిన పరివ్రాజకులు సమాధియోగాన్ని అనుష్ఠించినవారై చిత్తైకాగ్రతను సంపాదిస్తారు. అప్పుడు పరిశుద్ధమైన అంతఃకరణంలో పారమహంస్య ధర్మం

ఆవిర్భవిస్తుంది. మనస్సులోని తమోరూపమైన తలుపు తెరుచుకుంటుంది. ఆత్మలోకం ప్రకాశిత మౌతుంది. ఆ సమయంలో కలిగే ఆత్మసుఖస్వరూపమైన ఆనందానుభూతి ఏదైతే ఉన్నదో అదే నీవు.

నీవు అపేక్షింపక పోయినా ఈ శరీరాల సృష్టిస్థితి సంహారాలకు నీవే కారణం అవుతుంటావు. స్వయంగా నిర్గుణుడవై బ్రహ్మస్వరూపుడవూ ఐనప్పటికీ నీవు అనంతమైన గుణగణాలతో కూడి ఉంటావు. దేవదత్తుడు మొదలైన సామాన్య మానవుల వలె కాలకర్మాదుల కధీనుడవై స్వయంకృతాలైన శుభాశుభాలను అనుభవిస్తావు. షడ్గుణైశ్వర్య సంపన్నుడవైన నీవు ఆత్మారాముడ వయ్యును అపరిమిత గుణగణాలకు ఆశ్రయ మైనవాడవు. ఈశ్వరుడవైన నీ మాహాత్మ్యం ఇతరులకు అనూహ్యం. అనవగాహ్యం.

ఆధునికాలైన వికల్పం, వితర్కం, విచారం మొదలైన ప్రమాణాభాసాలతో కూడి జటిలమైన కుతర్కాలలోపడి కర్కశబుద్ధులైన విద్వాంసులు వ్యర్థమైన శాస్త్రవాదాలలో క్రిందుమీదు లౌతుంటారు. "దేవుడు ఉన్నాడు - లేడు" అనే తెలిసీ తెలియని వాదోపవాదాలతో కీచులాడుకుంటారు. మాయామయుడవైన నీవు నిజమాయా ప్రభావంవల్ల వారికి కాన్పింపవు. అంతర్యామివైన నీవు సమవిషమ రూపాలతో ప్రవర్తిస్తూ యుక్తి మాత్ర గోచరుడవగు తున్నావు.

దేవదేవా! త్రాడును చూచి పామను భ్రాంతి కలిగినట్లు అంతర్యామివైన నీయందు అన్యవస్తుభ్రాంతి కలుగుతున్నది. సర్వేశ్వరా! సమస్త విశ్వానికీ కారణమైన నీవు సర్వభూతాలలో అంతర్యామిగా ఉన్నందువల్ల సకలగుణగణాలతో ప్రకాశిస్తున్నట్లు కన్పించుతావు.

జగదీశ్వరా! నీ మహిమ అపారమైన అమృత సముద్రం వంటిది. ఆ అమృతసాగరంలోని ఒక చిన్న బిందువును రుచి చూచిన భాగవతోత్తములు సంతుష్టాంతరంగులై అఖండమైన ఆనందాన్ని అనుభవిస్తారు. ఆ పరమభాగవతులు ఆ ఆనందంతో పరవశించి కన్నవాటివల్ల విన్నవాటివల్లా కలిగే సుఖలేశాన్ని విస్మరిస్తారు. వారు నీ చరణ కమల సేవా వ్రతాన్ని వదలిపెట్టరు. నీవు ముల్లోకాలలో నిండి ఉన్నావు. ముల్లోకాలనూ ఆక్రమించిన త్రివిక్రముడవు. ముల్లోకాలనూ దర్శించే త్రినేత్రుడవు. ముల్లోకాల ఆత్మలను ఆకర్షించే మహామహిమాన్వితుడవు. నీ విభూతి భేదాలైన దానవులు మొదలైన వారికి అంత్యకాలం ఆసన్నం అయిందని తెలుసుకొని నీ మాయా ప్రభావంవల్ల వామనాది దేవతా రూపాలనూ, రామకృష్ణాది మానవ రూపాలనూ, వరాహాది మృగరూపాలనూ, మత్స్యకూర్మాది జలచర రూపాలనూ ధరించి తగిన విధంగా శిక్షిస్తుంటావు.

భక్తవత్సలా! నీ ముఖకమలంనుండి వెలువడిన మధుర వాక్కులనే అమృతతరంగాలతో మా అంతరంగాలలోని సంతాపాన్ని చల్లార్చు. ఈ జగత్తుయొక్క సృష్టి స్థితి లయాలకు కారణభూతమైన మూలప్రకృతి మాయ నీకు వశవర్తినియై ఉంటుంది. ఈ సృష్టిలోని సమస్త ప్రాణిసమూహాలకూ లోపల వెలుపల "ప్రత్యగాత్మ"గా, "పరమాత్మ"గా నీవు వర్తిస్తుంటావు. దేశం కాలం దేహం మొదలైన వాని

స్థితిగతులకూ, అనుభవాలకూ, సర్వవిషయాలకూ సాక్షివై సాక్షాత్ పరబ్రహ్మ స్వరూపుడవైన నీకు మా గోడు ఏమని విన్నవించుకోగలము!

సమస్త విశ్వానికీ ఆశ్రయమై, నానావిధ పాపాలనూ, సంసార తాపాలనూ ఉపశమింపజేసే భవదీయ పవిత్ర పాదపద్మాల ఛాయను సమాశ్రయిస్తున్నాము.

అని అనేక విధాలుగా ప్రార్థించి దేవతలు వాసుదేవునితో ఇంకా ఇలా అన్నారు.

**క. తేజంబు నాయువును వి, భ్రాజిత దివ్యాయుధములఁ బరువడి వృత్రుం**
**డాజిముఖంబున మ్రింగెను, మా జయ మిం కెందుఁ? జెప్పుమా! జగదీశా! 344**

* ఓ జగదీశ్వరా! ఆ రాక్షసరాజు మా తేజస్సులనూ ఆయుస్సులనూ ఆయుధాలనూ రణరంగంలో బలవంతంగా కబళించి వేశాడు. ఇక మాకు జయమనేది ఎక్కడున్నదో నీవే చెప్పు స్వామీ!

**వ. అని యిట్లతిమనోహర చతుర వచనంబుల భక్తిపరవశులై వినుతి సేయుచున్న దేవతలం జూచి, యప్పరమేశ్వరుం డమృత ప్రాయంబు లగు గంభీరభాషణంబుల నిట్లనియె. 345**

* ఈ ప్రకారంగా భక్తిపరవశులైన త్రిదశులు పరమ రమణీయములైన వచనాలతో నేర్పుగా ప్రార్థింప ఆ దేవతలను తిలకించి శ్రీమన్నారాయణుడు అమృతం చిలికే పలుకులతో గంభీరంగా ఇలా అన్నాడు-

**క. మ దుపస్థానం బగు మీ, సదమల సుజ్ఞానమునకు సంతోషమునం**
**బొదలెె మది ప్రీతి నొందితి, వదలక నా భక్తి వొడమి వ్యర్థం బగునే! 346**

* నా సాన్నిధ్యం సంపాదించుకొన్న స్వచ్ఛమైన మీ జ్ఞానానికి నా అంతరంగం ఎంతో సంతోషించింది. నాకు మీమీద చాలా ప్రీతి కలిగింది. నా యందలి ఎడతెగని భక్తి ఎప్పటికీ వ్యర్థం కాదు.

**వ. మఱియు, నతిప్రీతుండనైన నాయందు భక్తులకుం బొంద రాని యర్థంబు లేదు. విశేషించి నాయందు నేకాంతమతి యైన తత్త్వవిదుం డన్యంబులం గోరకుండు. గుణంబులయందుఁ దత్త్వ జ్ఞానగోచరుం డైనవాఁడు విషయ నివృత్త చిత్తుండై సంసార మార్గంబు నిచ్ఛయింపఁడు. కావున మీకు శుభం బయ్యెడు. దధీచియను ఋషిసత్తముండు గలండు. అతని శరీరంబు మద్విద్యాతిశయ మహత్త్వంబునం దేజో విశేషంబున సారం బై యున్నయది. అతని నడిగి, తచ్ఛరీరంబుఁ బుచ్చికొనుండు. అతండు పూర్వ కాలంబున నశ్వినీ దేవతలకు నశ్వశిరోనామం బను బ్రహ్మ స్వరూపం బగు నిష్కళంకం బైన విద్య నుపదేశించిన, వారలు జీవన్ముక్తిత్వంబు నొందిరి. మఱియుఁ ద్వష్టృ పుత్త్రుండైన విశ్వ రూపునకు మదాత్మకం బైన యభేద్య కవచంబు నిచ్చె. కావున నతం డతివదాన్యుండు. అశ్వినీదేవతలచేత యాచింపంబడి, దేహంబు వంచింపక మీ కిచ్చు. అతని శల్యంబులు విశ్వకర్మ నిర్మితంబు లై, శతధారలు గల యాయుధ శ్రేష్ఠం బై, మత్తేజోపబృంహితంబై వృత్రాసుర శిరోహరణ కారణంబై యుండు. దానంజేసి మీరు పునర్లబ్ధ తేజోఽస్త్రాయుధ సంపదలు గలిగి వెలింగెదరు. విశేషించియు**

**మద్భక్తవరు లైనవారలే లోకంబుల నెవ్వరికి నజేయులు. కావున మీకు భద్రంబయ్యెడు అని భూతభావనుండైన భగవంతుం డదృశ్యుం డయ్యె. అప్పుడు దేవతలు దధీచిముని కడకుం జనిన నత్తఱి యింద్రుం డిట్లనియె. 347**

* నేను తృప్తిపొందితే నా భక్తులకు దుర్లభమైనది ఉండనే ఉండదు. అదీగాక నాయందు అనన్యమైన భక్తిశ్రద్ధలు గలవాడు నన్ను తప్ప మరి దేనినీ వాంఛింపడు. తత్త్వమును దర్శించి తెలుసుకొన్నవాడు. విషయసుఖాలనుండి విరక్తుడౌతాడు. సంసారబంధాలను తృణీకరిస్తాడు. అందువల్ల మీకు శుభం కలుగుతుంది.

దేవతలారా! దధీచి అనే పేరుగల మహర్షి ఉన్నాడు. ఆ ఋషి పుంగవుని దేహం నారాయణకవచ ప్రభావంవల్ల మహాతేజోవంతమై సార వంతమై ఉంటుంది. మీరందరూ ఆ మహర్షి దగ్గరకు వెళ్ళి ఆయనను ప్రార్థించి ఆయన దేహాన్ని పుచ్చుకొనండి. ఆ మహర్షి పూర్వం బ్రహ్మ స్వరూపమూ నిష్కళంకమూ అయిన "అశ్వశిరం" అనే విద్యను అశ్వినీ కుమారులకు ఉపదేశించాడు. వారు ఆ విద్యను ఉపాసించి జీవన్ముక్తులైనారు. ఆ మహర్షి అంతేగాకుండా త్వష్ట అనే ప్రజాపతికి అభేద్యమూ మన్నామాంకితమూ అయిన నారాయణ కవచాన్ని అనుగ్రహించాడు. త్వష్ట దానిని తన కుమారుడైన విశ్వరూపప్రజాపతికి ఉపదేశించాడు.

ఆ దధీచి మహర్షి దాతలలో మేలుబంతి. మీరు అశ్వినీ కుమారులను ముందుంచుకొని ఆ మహర్షిని ప్రార్థించండి. ఆయన తన దేహాన్ని తప్ప కుండా మీకు ఇస్తాడు. విశ్వకర్మ ఆ మహర్షి ఎముకలతో నూరంచుల వజ్రాయుధాన్ని సిద్ధం చేస్తాడు. నా తేజోవిశేషంతో నిండిన ఆ వజ్రాయుధం వృత్రాసురుని శిరస్సును ఖండించుతుంది. అప్పుడు మీ మీ తేజస్సులు, మీ మీ శస్త్రాస్త్రాలూ మళ్ళీ మీకు సంప్రాప్తిస్తాయి. మీరు మునుపటిలాగా ప్రకాశిస్తారు. ముఖ్యంగా నా భక్తవరేణ్యులు ఏ లోకంలో ఉన్నా వారిని ఎవ్వరూ జయించలేరు. మీకు మేలు కలుగుగాక!

ఇలా ఆజ్ఞాపించినవాడై శ్రీమన్నారాయణుడు అంతర్ధానమైనాడు. అనంతరం దేవతలు అశ్వినీదేవతలను ముందుంచుకొని దధీచి మహర్షిని దర్శించి ఈ విధంగా అర్థించారు.

**ఆ. దేహి సుఖముఁ గోరు దేహంబు ఘటియించి, దేహి విడువలేఁడు దేహ మెపుడు,**
**దేహి! యస్మదీయ దేహంబుకొఱకునై, దేహ మీఁగదయ్య! దేవతలకు. 348**

* మహాత్మా! ఈ లోకంలో జీవుడు సౌఖ్యాన్ని ఆశించి దేహాన్ని స్వీకరిస్తాడు. అందుకనే ఏ పరిస్థితిలోనూ దేహి అయినవాడు తన దేహాన్ని వదలిపెట్టలేడు. ఇప్పుడు దేవతలమైన మేము "దేహి"అని నీ దేహాన్ని అడగటానికి వచ్చాము. దయచేసి నీ దేహాన్ని మాకు ఇవ్వు!

ఉ. ఎక్కడ నెల్లలోకముల నెవ్వరుఁ గోరని కోర్కి నేఁడు మా
తెక్కలిపాటుకై తివిరి దేహము వేఁడఁగఁ వచ్చినార, మే
మెక్కడ! తీవ్ర కర్మగతి యెక్కడ! దైవకృతంబుగాక! యీ
త్రొక్కుడు దాన మీ వరుస రోయక వేఁడుదురే జగంబులన్? 349

* ఎక్కడకూడా ఎప్పుడుకూడ ఎవ్వరుకూడా కోరని కోరిక యిది. నేడు మేము మా కష్టాలు గట్టెక్కటానికి నీ శరీరాన్ని అర్థించటానికి వచ్చాము. దేవతలమైన మేము ఇటువంటి కోరరాని కోర్కె కోరుకునే తీవ్రస్థితికి దిగజారామంటే ఇదంతా విధివైపరీత్యం గాక మరేమిటి? లోకంలో ఎక్కడైనా ఇటువంటి కక్కుర్తి దానాన్ని ఎవరైనా సిగ్గు విడిచి అడుగుతారా?

క. నీచగతి యెల్లభంగుల, యాచన యని తెలిసి తగని దడుగుదు రేనిన్
యాచక వర్గము లోపల, నీచకు లనఁబడరె? యెంత నేర్పరులైనన్. 350

* వాస్తవానికి "యాచన" అనేది అన్నివిధాలా నీచమైన కృత్యం. ఈ సంగతి తెలిసికూడా తగనిదానిని యాచించటానికి సిద్ధమైన యాచకులు పరమనీచులు అనటంలో సందేహం లేదు. ఈ విషయంలో ఎంత నేర్పరులైనా నీచాతినీచులే!

క. అడుగంగరాని వస్తువు, లడుగరు బతిమాలి యెట్టి యర్థులు నిను నే
మడిగితిమి దేహ మెల్లను, గడు నడిగెడు వారికేడ కరుణ? మహాత్మా! 351

* ఓ మహానుభావా! లోకంలో యాచకు లున్నారంటే వారు అర్థింపదగిన వస్తువునే అర్థిస్తారుగాని అడుగరాని వస్తువును అడుగరు. ఇప్పుడు మేము అడుగరాని దానిని నీ దేహాన్ని మా కివ్వమని అడుగుతున్నాము. బతిమాలుతున్నాము. నిజానికి దాతలముందు చేతులు దాచే యాచకులకు దయాదాక్షిణ్యాలు ఉండవు. యుక్తాయుక్త వివేకం ఉండనే ఉండదు.

ఉ. నావుడు నా దధీచియు మనంబు సంతసమంది నవ్వి సం
భావిత వాక్య పద్ధతులఁ బల్కుచు నిట్లనెఁ బేర్మితోడ నో
దేవతలార! ప్రాణులకుఁ దెక్కలి మృత్యు భయంబు పూనుటే
భావములం దలంపరు కృపామతి నెన్నఁడు మీ మనంబులన్. 352

* దేవతల మాటలు ఆలకించి దధీచి లోలోపల సంతోషించాడు. చిరునవ్వు నవ్వుతూ గౌరవపురస్సరంగా అమరులను అవలోకించి ఆప్యాయంగా ఇలా అన్నాడు. అమర్త్యులారా! ఈ మర్త్యలోకంలోని మానవులకు మృత్యుభయం సహజంగా ఉంటుందన్న సంగతి మీకు ఎలా తెలుస్తుంది. మీరు దేవతలు కదా! అందువల్లనే నిర్దాక్షిణ్యంగా మీ కోరిక వెల్లడించారు.

ఆ. ఎలమి బ్రతుక నిచ్చయించిన వారికి, దేహ మెల్లభంగి దీపు గాదె?
యచ్యుతుండు వచ్చి యర్థించె నేనియు, తన్ను నిచ్చునట్టి దాత గలఁడె? 353

* లోకంలో జీవులకు జీవించాలనే భావం ఎక్కువగానే ఉంటుంది. అటువంటి వారికి తమ ప్రాణాలన్నా తమ శరీరమన్నా ఎంత తీపియో చెప్పలేము. భగవంతుడు వచ్చి చేజాచి యాచించి నప్పటికీ తన దేహాన్ని ఇచ్చేదాత ఈ భూలోకంలో ఎవడూ ఉండడు.

**వ. అదియునుం గాక. 354**

**సీ. అర్థంబు వేఁడెడు నర్థులు గలరు గా కంగంబు వేఁడెడి యర్థి గలఁడె?**
**తగఁ గోరికల నిచ్చు దానశీలుఁడు గల్గుఁ దన దేహ మీ నేర్చు దాత గలఁడె?**
**యీ నేర్చువాఁడు దన్నిచ్చిన రోయక చంపెడునట్టి యాచకుఁడు గలఁడె?**
**చంపియుఁ బోవక శల్యంబు లన్నియు నేఱి పంచుక పోవువారు గలరె?**

**ఆ. రమణ లోకమెల్ల రక్షించు వారికి, హింస సేయుబుద్ధి యెట్టు వొడమె?**
**బ్రాఁతి యైనయట్టి ప్రాణంబుపైఁ దీపు, తమకుఁ బోలె నెదిరిఁ దలఁప వలదె? 355**

* ఈ జగత్తులో ధనధాన్యాలు ఇమ్మని అడిగే యాచకులు ఉంటారుగాని దేహం ఇమ్మని అర్థించేవారు ఎక్కడైనా ఉంటారా? అర్థించిన వస్తువులను ఇచ్చే దాతలు ఉంటారు గాని ప్రాణాలు దానంగా ఇచ్చే దాతలు ఉంటారా? ఒకవేళ అలా దేహమిచ్చే దాత ఉన్నప్పటికీ సిగ్గుమాలినవాడై స్వీకరించే యాచకు డుంటాడా? ఈ విధంగా దాతను చంపి దేహాన్ని పుచ్చుకొన్నా ఎముకలన్నీ ఏరి మూట గట్టుకొని పంచుకొనే వంచకు లుంటారా? మీరు లోకాలను దయతో రక్షించే దేవతలు కదా! మీకు ఈ హింసాత్మకమైన బుద్ధి ఎలా పుట్టింది? మీ ప్రాణాలు మీ కెంత తీపో ఎదుటివాళ్ల ప్రాణాలు కూడా వాళ్లకు అంతతీపి అన్న సంగతి మీ తలంపునకు రాలేదా!

**వ. అనిన దేవత లిట్లనిరి. 356**

**తే. సర్వ భూతదయాపర స్వాంతులకును, బుణ్యవర్తను లగు మిమ్ముబోఁటి వారి**
**కమిత సత్కీర్తి కాముల కలఘుమతుల, కియ్యరాని పదార్థంబు లెవ్వి గలవు? 357**

* దధీచి మహర్షి మాటలు విని దేవతలు ఆయనతో ఇలా అన్నారు. స్వామీ! మీరు సర్వభూతములందూ దయాదాక్షిణ్యాలు గలవారు. విశేషించి వివేకవంతులు. అటువంటి మీకు ఇతరులకు ఈయరాని పదార్థాలంటూ ఏముంటాయి?

**ఆ. అడుగరాని సొమ్ము లడుగ రాదని మానఁ, డడుగువాని మాట లడుగ నేల?**
**భ్రాంతి నడుగుచోటఁ బ్రాణంబు లేనియు, నిచ్చువాఁడు దాపఁ డిచ్చుఁగాని. 358**

* అవసరంకొద్దీ అడుగ వచ్చినవాడు అడుగరాని వస్తువునైనా అడిగి తీరుతాడు. ఇచ్చేదాత ఈయరాని వస్తువునైనా ఇచ్చి తీరుతాడు. ఆశపడి ఎవరైనా అర్థిస్తే ప్రాణాలైనా దాచుకోకుండా ఇచ్చేస్తాడు.

వ. అని పరసంకటంబు దలంపక నిలింపులు కార్యపరత సవినయ వాక్యపరంపరలం బ్రార్థించిన, నతండు దరహసితవదనుండై, యఖిల లోకధర్మం బెఱింగియు నొక్కింత కాలంబు ప్రతివాక్యం బిచ్చితి, దీని సహింపందగుదురు. మీ యట్టి వారలకుం బ్రియం బగునేని నెప్పుడైన న్విడువందగిన శరీరంబు విడుచుట యేమి దుర్లభంబు? అధ్రువంబైన యీ దేహంబుచేతం గీర్తి సుకృతంబుల నెవ్వం డార్జింపకుండు నతండు పాషాణాదులకంటె నతి కఠినుండు. మీ యట్టి పుణ్యశ్లోకులచేత నాకాంక్షింపంబడిన యీ శరీరం బప్రమేయ ధర్మార్జితంబు. ఏ దేహంబుచేతనైనను సకల భూతంబులు శోకానుభవంబున శోకించు, హర్షానుభవంబున హర్షించునట్టి మహాకష్టదైన్యాకరం బైన యీ శరీరంబు కాక శునక సృగాలాదులపాలు గాకుండ మే లయ్యె' అని నిశ్చితాత్ముండై దధీచి, తత్త్వావలోకనంబుచేత నిరసిత బంధనుండై, బుద్ధీంద్రియ మానసంబులతోఁగూడిన క్షేత్రజ్ఞుని పరబ్రహ్మ స్వరూపంబైన భగవంతునందు నేకీభూతంబుఁ జేసి, యోగజ్ఞానంబున శరీరంబు విడిచె, అప్పుడింద్రుఁ డతని శల్యంబుల విశ్వకర్మ నిర్మితంబై, నిశిత శతధారా సమావృతం బై వెలుంగు వజ్రాయుధంబుగైకొని, భగవత్తేజోపబృంహితుండై, యైరావతారూఢుండై, సకలదేవోత్తమ గరుడ గంధర్వ ఖచర కిన్నర కింపురుష సిద్ధ సాధ్య విద్యాధర పరిసేవితుండై, సకల మునిజనంబులు వినుతింపఁ ద్రిలోక హర్షకారియై, భగవ దనుగ్రహ సంప్రాప్త మహోత్సాహ వికసిత వదనారవిందుండై వృత్రాసురు పై నడచె. అప్పుడు. 359

* ఈ ప్రకారంగా దేవతలు ఎదుటివారి కష్టాలు విచారించకుండా తమ పనులు నెరవేర్చుకోవాలనే భావంతో వినయంతో కూడిన వాక్యాలతో దధీచిమహర్షిని ప్రార్థించారు. దధీచి మందహాస వదనారవిందుడై దేవతలను చూచి ఇలా అన్నాడు -

"సురలారా! నాకు లోకస్వభావం బాగా తెలుసు. అయినా కొంచెంసేపు మీతో వినోదంగా సంభాషించాను. ఇందుకు మరొక విధంగా అనుకోవద్దు. ఈ శరీరం ఎప్పుడైనా విడిచి పెట్టవలసిందే. అటువంటప్పుడు మీ అంతవారికి ఈ దేహం అవసరమైతే దీనిని మీకు అర్పించటానికి నాకు అభ్యంతరం ఏముంటుంది? అశాశ్వతమైన ఈ శరీరంవల్ల శాశ్వతమైన యశస్సూ పుణ్యమూ సంప్రాప్తిస్తుంటే అంతకంటే కావలసింది ఏమున్నది? ఇటువంటి సదవకాశాన్ని జారవిడుచుకున్న వాడు పాషాణంతో సమానుడు. మీరు పుణ్యమూర్తులు. మీ వంటి మహానుభావులు కావలెనని కాంక్షించిన ఈ నా దేహం అపరిమితమైన ధర్మాన్ని ఆర్జిస్తున్నది. లోకంలోని జీవులకు కష్టాలు ప్రాప్తించి నప్పుడు ఈ దేహం దుఃఖపడుతుంది. సుఖాలు సంభవించినప్పుడు ఈ దేహం సంతోషిస్తుంది. దీనికి స్వతంత్రత అంటూ లేదు. ఇటువంటి కష్టాలకు కాపురమై దైన్యాలకు నిలయమైన ఈ దేహం కాకులకూ గద్దలకూ కుక్కలకూ నక్కలకూ గురి కాకుండా మీ వంటి వారికి ఉపకరించటం ఎంత ఉత్తమమైన సంగతి! ఇంతకంటే మేలైన విషయం ఏముంటుంది!"

అని పలుకుతూ దధీచి ఆత్మావలోకనం చేసుకున్నాడు. సమస్త బంధాలు త్రెంపుకున్నాడు. మనస్సు బుద్ధి ఇంద్రియములతో కూడిన జీవుణ్ణి భగవంతునిలో ఐక్యం చేశాడు. యోగమార్గం ద్వారా శరీరాన్ని పరిత్యజించాడు. అనంతరం విశ్వకర్మ దధీచిమహర్షి ఎముకలతో నూరంచులతో ప్రకాశించే పదునైన

వజ్రాయుధాన్ని తయారుచేశాడు. దేవేంద్రుడు ఆ వజ్రాయుధాన్ని ధరించి దివ్యతేజోవిరాజితుడై ఐరావతాన్ని అధిరోహించి యుద్ధానికి బయలుదేరాడు. దేవతలు, గరుడులు, గంధర్వులు, ఖేచరులు, కిన్నరులు, కింపురుషులు, సిద్ధులు, సాధ్యులు, విద్యాధరులు మొదలైన వారంతా ఆయనను అనుసరించారు. మునీంద్రులు కొనియాడారు. ముల్లోకాలు హర్షించాయి. ఈ విధంగా భగవంతుని అనుగ్రహం వల్ల ప్రాప్తించిన మహోత్సాహంతో వికసించిన ముఖారవిందం గల సంక్రందనుడు వృత్రాసురుని మీద దాడి సాగించాడు.

**ఉ. వృత్రుఁడు దాన వాన్వయ పవిత్రుఁడు లోక జిఘాంసక క్రియా**
**సూత్రుఁడు నిగ్రహాగ్రహణ సుస్థిర వాక్య వివేక మాన చా**
**రిత్రుఁడు దేవతోరగ దరీకృత వక్త్రుఁడు రోష దూషితా**
**మిత్రుఁడు శత్రురాకఁ గని మిక్కిలియైన యుగాంతకాకృతిన్. 360**

* దానవ వంశంలో ఉత్తమోత్తముడై పుట్టినవాడూ, శత్రులోకాన్ని సంహరించటానికి కంకణం కట్టిన వాడూ, నిగ్రహానుగ్రహాలకు తగిన వాక్యాలు ప్రయోగించటంలో ఆరితేరినవాడూ, దేవతలనే సర్పాలను మ్రింగే గుహవంటి నోరుగలవాడూ అయిన వృత్రుడు శత్రువులు దండెత్తి వస్తున్నారని తెలుసుకొని రోషభాషణాలతో దూషిస్తూ ప్రళయ కాల యమునివలె భయంకరాకారంతో బయలుదేరాడు.

**క. మెండు గల దనుజ నాయక, మండలములు గొల్వ నడచె మహిమోద్ధతి వే**
**దండముల నడుమఁ జను నడ, గొండయునుం బోలె నిబిడ కోపోద్ధతుఁడై. 361**

* తండోపతండాలుగా దనుజమండలాలు తన వెంట రాగా వృత్రాసురుడు రణరంగానికి బయలుదేరాడు. ఆగ్రహావేశంతో ఉద్ధతుడై రాక్షససేనానాయకుల మధ్య నడచి వస్తున్న వృత్రుడు మదపుటేనుగుల మధ్య కదలి వస్తున్న మహాపర్వతం వలె కనిపించాడు.

**క. కాలగళుఁ డడరి కడువడిఁ, గాలుని పైఁ గవయు మాడ్కి ఖరతర రవ సం**
**చాలిత పూర్వ దిగంతరుఁ, డై లీల మహేంద్రుమీఁద నతఁ డరిగె నృపా! 362**

* శివుడు రౌద్రావేశంతో యమధర్మరాజు మీదికి లంఘించినట్లు వృత్రాసురుడు తూర్పుదిక్కు దద్దరిల్లేటట్టు పెద్దగా గర్జిస్తూ దేవేంద్రుని మీదికి దూకినాడు.

**వ. ఇట్లు రుద్రగణంబులు, మరుద్గణంబులు, నాదిత్యగణంబులు, నశ్వినీదేవతలు, పితృదేవతలు, విశ్వేదేవులు, వహ్నియు; యమ, నైరృతి, వరుణ, వాయు, కుబే, రేశానాదులు; సిద్ధ, సాధ్య, కిన్నర, కింపురుష, గరుడ, గంధర్వ, ఖేచర, ప్రముఖంబులగు నింద్ర సైన్యంబులతోడ నముచియు, శంబరుం డును, ననర్వుండును, ద్విమూర్ధుండును, వృషభుండును, నంబరుండును, హయగ్రీవుండును,శంకు శిరుండును, విప్రచిత్తియు, నయోముఖుండును, పులోముండును, వృషపర్వుండును,హేతియు, ప్రహేతియు, నుత్కటుండును, ధూమ్రకేశుండును. విరూపాక్షుండును, కపిలుండును, విభావ సుండును, నిల్వలుండును, పల్వలుండును, దందశూకుండును, వృషధ్వజుండును, గాలనాభుండును,**

**మహానాభుండును, భూత సంతాపనుండును, వృకుండును, సుమాలియు, మాలియు మున్నగు దైతేయ దానవ యక్షరాక్షసా ద్యసంఖ్యంబులగు వృత్రాసురు బలంబులు దలపడి సమరంబుం జేసిరి. అప్పుడు. 363**

* ఇటువైపు దేవేంద్రుని సైన్యంలో రుద్రగణాలు, మరుద్గణాలు, ఆదిత్యగణాలు, అశ్వినీదేవతలు, పితృదేవతలు, విశ్వేదేవులు, అగ్ని, యముడు, నైరృతి, వరుణుడు, వాయుదేవుడు, కుబేరుడు, ఈశానుడు, సిద్ధులు, సాధ్యులు, కిన్నరులు, కింపురుషులు, గరుడులు, గంధర్వులు, ఖేచరులు మొదలైన వారున్నారు. అటువైపు వృత్రాసురుని సైన్యంలో నముచి, శంబరుడు, అనర్వుడు, ద్విమూర్ధుడు, వృషభుడు, అంబరుడు, శంకుశిరుడు, విప్రచిత్తి, అయోముఖుడు, పులోముడు, వృషపర్వుడు, హేతి, ప్రహేతి, ఉత్కటుడు, ధూమ్రకేశుడు, విరూపాక్షుడు, కపిలుడు, విభావసుడు, ఇల్వలుడు, పల్వలుడు, దందశూకుడు, వృషధ్వజుడు, కాలనాభుడు, మహానాభుడు, భూతసంతాపనుడు, వృకుడు, సుమాలి, మాలి మొదలైన దైత్యదానవ యక్ష రాక్షసులు అంసఖ్యాకంగా ఉన్నారు. ఉభయపక్షాల వీరులు కలియబడి ఘోరమైన సంగ్రామం సాగించారు.

**చ. అసురులకున్ సురావలికి నయ్యె మహారణ మప్పు డొండొరుల్**
**ముసల గదాసి కుంత శర ముద్గర తోమర భిండివాల ప**
**ట్టస పటుశూల చక్రముల డంబము చూపి యదల్చి యార్చుచున్**
**మసలక కప్పి రస్త్రముల మార్కొని మంటలు మింట నంటఁగన్. 364**

* సురాసురుల మధ్య భయంకరమైన మహాసమరం జరిగింది. రోకళ్లతో, గదలతో, ఖడ్గాలతో, ఈటెలతో, బాణాలతో, తవ్వకొలలతో, చిల్లకోలలతో, గుదియలతో, అడ్డకత్తులతో, శూలాలతో, చక్రాలతో ఒకరినొకరు కొట్టుకున్నారు. ఒకరిపైకి ఒకరు లంఘించి కొట్టుకున్నారు. ఒకరిపైకి ఒకరు లంఘించి అగ్నిజ్వాలలు ఆకాశాన్ని అంటగా శస్త్రాస్త్రాలతో శత్రుసైన్యాలను కప్పివేశారు.

**క. ఒండొరులఁ గడవ నేసిన, కాండము లాకాశపథముఁ గప్పి మహోల్కా**
**దండములఁ బోలి నిష్ఠుర, భండన ముఖ మొప్పెఁ జూడఁ బ్రళయోచితమై. 365**

* ఈ విధంగా ఒకరికంటె ఒకరు విజృంభించి ప్రయోగించిన బాణాలు ఆకాశమంతా నిండి నిప్పులు చిమ్మాయి. యుద్ధరంగం మహాప్రళయంగా మారిపోయింది.

**చ. సురవరు లేయు బాణములు సూడ్కి కగోచర మై నభస్థలం**
**బరిమురిఁ గప్పి రేసి దివసాంతముఁ జేసిన లీల నా సురే**
**శ్వర బలయూథ వీరు లురు సాయక పంక్తుల చేత వాని రూ**
**పఱ శతధూళి సేసి పఱపైన తమం బొనరించి రార్చుచున్. 366**

* కంటికి కన్పించనంత వేగంగా దేవతావీరులు ప్రయోగించే శరపరంపరలు ఆకాశమంతా కప్పివేసి సంధ్యాసమయాన్ని కల్పించాయి. దానవ సేనానాయకులు తమ బాణపంక్తులతో దేవతల బాణాలను నుగ్గునుగ్గు చేసి కేకలు వేస్తూ రణరంగమంతా దట్టమైన చిమ్మ చీకట్లు క్రమ్మేటట్లు చేశారు.

చ. సమరమదాంధు లై సుర నిశాచర వీరులు సైనికాంఘ్రి సం
క్రమిత మహీపరాగములు గ్రమ్మిన నుమ్మలికంపుఁ జీఁకటుల్
దమ కనుదోయి కడ్డముగఁ దార్కొనినం జల మూఁది పోరి రా
క్రమిత నిజాంతరంగ పరిఘట్టిత రోష మహాగ్ని పెంపునన్. 367

* దేవదానవ యోధులు రణావేశంతో కనులు గానక పరస్పరం పోరాడుతుంటే వారి కాళ్ల త్రొక్కిళ్లకు పైకి లేచిన దుమ్ముతో ఆ ప్రదేశమంతా అంధకారబంధుర మయింది. ఆ చీకట్లలో తమకు ఏమీ కన్పించక పోయినా తమ హృదయాలలో చెలరేగిన రోషానల జ్వాలల బలంతో వారు పట్టు విడువకుండా యుద్ధం చేశారు.

క. అతిగళిత రక్తధారా, క్షతములతోఁ గానఁబడిరి సైనికులు మహో
ద్ధత రోషవహ్ని కీలలు, వితతం బై పిక్కటిల్లి వెడలెడు భంగిన్. 368

* ఉభయ సైన్యాల సైనికుల శరీరాల - నిండా గాయాలైనాయి. క్షతగాత్రులైన వీరుల నెమ్మేనుల నుండి పొంగి ప్రవహించే రక్తధారలు వారిలో భగ భగ మండుతూ ఉవ్వెత్తుగా లేచే క్రోధాగ్ని జ్వాలల వలె గోచరించాయి.

సీ. రవణించు శింజినీ టంకార రవములు భట సింహనాదంబుఁ బరిభవింప
భీషణోత్తమ హయ హేషావిఘోషంబు కరి బృంహిత స్ఫూర్తిఁ గ్రందుకొలుప
సమర నిశ్శంకాంక శంఖ నినాదంబు నేమి స్వనంబుల నిహ్నవింపఁ
దుములమై చెలఁగెడు దుందుభి ధ్వానంబు లట్టహాసంబుల నాక్రమింప

తే. ఘటిత శస్త్రాస్త్ర నిష్ఠుర ఘట్టనోత్థ, ఖర కఠో రోరు విస్ఫులింగంబు లడరి
దివ్య కోటీర మణిఘృణి ధిక్కరింప, సమర మొనరించి రసురులు నమరవరులు. 369

* ఆ సంగరరంగంలో పెద్దగా ధ్వనించే వీరుల ధనుష్టంకారాలు వారి సింహనాదాలను మించు తున్నాయి. అశ్వరాజముల భీషణహేషారావాలు ఏనుగుల ఫీంకారాలను ఆక్రమిస్తున్నాయి. విశృంఖలంగా మ్రోగుతున్న శంఖధ్వానాలు రథచక్రధ్వనులను క్రిందు పరుస్తున్నాయి. సంకులంగా చెలరేగిన దుందుభి నినాదాలు వీరుల వికటాట్టహాసాలను మరుగు పరుస్తున్నాయి. శస్త్రాస్త్రాల పరస్పర ఘర్షణ వల్ల ఉద్భవించిన అగ్ని కణాల కాంతులు వారి కిరీటాలలోని రత్నాల కాంతులను తిరస్కరిస్తున్నాయి.

వ. ఇట్లు ప్రళయసంరంభ విజృంభిత సముత్తుంగ రంగత్తరంగిత భైరవారావ నిష్యూత నిష్ఠుర మహా ర్ణవంబునుం బోలె, యుగాంతర సంక్రాంత ఝంఝూపవన పరికంపిత దీర్ఘ నిర్ఘాత నిబిడ నిష్ఠుర నీరదంబులుం బోలె, నుభయసైన్యంబులుం గలసి సంకుల సమరంబు సలుపు సమయంబున, యుగాంత కృతాంత సకలప్రాణి సంహార కారణలీలయుంబోలెఁ, బదాతి రాహుత్త గజారోహక రథిక మహారథిక వీరు లొండొరులు చండగతిం గాండంబులుఁ బఱపుచుఁ గదలం జదుపుచుఁ, గత్తులఁ గత్తళంబులఁ జినుఁగం బొడుచుచు, నడిదంబుల నడఁచుచుఁ, గుంతంబులం గ్రుచ్చుచుఁ,

**గుతారంబుల వ్రచ్చుచు, ముసలంబుల మోఁదుచు, ముద్గరంబులం బాఁదుచుఁ, జక్రంబులం ద్రుంచుచు, సబళంబుల నొంచుచు, సురియల మెఱముచుఁ, శూలంబులఁ దుఱుముచు, వాజుల కుఱికియు, వాలంబుల నఱికియుఁ, దొడలు తుండించియుఁ, దొండంబుల ఖండించియు, మెడ లెడయించియు, మొదళ్ళు గెడయించియు, నడుములు ద్రుంచియు, నాసికలుఁ ద్రెంచియుఁ, బదంబులు విఱిచియుఁ, బార్శ్వంబులం జెఱిచియు, గజంబులఁ బఱిపియు, గాత్రంబుల నుఱిపియు, గుంభం బులఁ బగిలించియుఁ, గొమ్మల నగిలించియు, హస్తంబులఁ ద్రెంచియు, నంగంబులఁ జించియు, రథంబుల నలియించియు, రథికులం బొలియించియు, సారథులం జంపియు, సైంధవులం దంపియు, శిరంబులు నొగిలించియు, సీసకంబు లగిలించియు, ఛత్రములం దుఱు మాడియుఁ, జామరంబులం దునుమాడియు, సైన్యం బులఁ జదిపియు, సాహసుల మెదిపియు, నడుములు ద్రుంచియు మఱియును బరస్పర గుణవిచ్ఛేదనంబును, నన్యోన్య కోదండ ఖండన పటుత్వంబులు, నుభయ సైంధవ ధ్వజ సారథి రథిక రథ వికలనంబును, నొండొరుల పాద జాను జంఘా హస్త మస్తక నిర్దళనంబును, రక్తమాంసమేదః పంకసంకలిత సమరాంగణంబునై యతిఘోర భంగిం బెనంగిరి, అప్పుడు. 370**

* ఈ ప్రకారం రణరంగమంతా పొంగి పొరలే ఉత్తుంగ తరంగాల భీషణ ఘోషలతో భయంకరమైన ప్రళయకాల మహాసముద్రంలాగా హోరెత్తు తున్నది. కల్పాంతకాలంలో విజృంభించి వీస్తున్న పెనుగాడ్పులకు కంపించిపోతూ పిడుగులు వర్షించే కారు మేఘాలవలె ఉభయ సైన్యాలు సంకులసమరం సాగిస్తున్న ఆదృశ్యం యుగాంత సమయంలో సమస్త ప్రాణులను సంహరించే యమధర్మరాజు క్రీడావిహారంలాగ ఉన్నది. ఆ యుద్ధభూమిలో కాలిబంట్లు, గుఱ్ఱపు రౌతులు, గజారోహకులు, రథికులు, మహారథికులు - ఒకరిపై ఒకరు భయంకరంగా బాణాలు ప్రయోగించుకొంటున్నారు. గదలతో కొట్టుకొంటున్నారు. ఖడ్గాలతో కవచాలను చీల్చివేస్తున్నారు. ఈటెలతో పొడుచుకొంటున్నారు. గొడ్డళ్లతో నరుకుకొంటున్నారు. రోకళ్లతో బాదుకొంటున్నారు. ఇనుప గుదియలతో మోదుకొంటున్నారు. చక్రాలను విరుస్తున్నారు. బరిసెలతో కుమ్ముకొంటున్నారు. శూలాలతో గుచ్చుకొంటున్నారు. కొందరు గుఱ్ఱాలపై కురికి తోకలు నరుకుతున్నారు. కొందరు ఏనుగుల మీదికి దూకి తొండాలు ఖండిస్తున్నారు. మెడలు, మెదడులు, నడుములు, నాసికలు త్రెంచివేస్తున్నారు. పాదాలు విరుస్తూ, ప్రక్కలు చరస్తూ, చేతులు త్రెంచివేస్తూ, అవయవాలను త్రుంచివేస్తూ, రథాలను నుగ్గునుగ్గు చేస్తూ, రథికులను నేలకూలుస్తూ, సారథులను చంపుతూ, ఛత్రాలను నురుమాడుతూ, చామరాలను తురుమాడుతూ పరస్పరం సంకులసమరం సాగించారు. వింటినారులను త్రెంపివేశారు. ధనుస్సులను విరుగ గొట్టారు. ఉభయసైన్యాలలో గుఱ్ఱాలు, ధ్వజాలు, సారథులు, రథికులు, రథాలు, నేలకూలుతున్నాయి. పాదాలు, మోకాళ్ళు, పిక్కలు, చేతులు, తలకాయలు తెగిపోతున్నాయి. రణరంగమంతా నెత్తురుతో మాంసంతో మేదస్సుతో తడిసి బురద అయింది.

చ. సమజయమున్ సమాపజయ సామ్య పరిశ్రమమున్ సమోరు వి
క్రమము సమాస్త్రశస్త్రబల గర్వము నై కడు ఘోరభంగి నా
నముచి విరోధి సైన్య గణనాథులతోడ నిశాచరేశ్వ రో
త్తములు దురంబు సేసి రొగిఁ దార్కొని వృత్రుబలంబు ప్రాపునన్. 371

* దేవదానవుల సైన్యాలు రెండూ సమానమైన పరాక్రమం కలవి. సమానమైన యుద్ధనైపుణ్యం కలవి. సమానమైన శస్త్రాస్త్ర సముదాయం కలవి. అందువల్ల జయాపజయాలుకూడా సరిసమానంగానే ఉన్నాయి. దేవేంద్రుని సేనానాయకులతో తలపడి వృత్రాసురుని అండదండలు గల రాక్షస సేనానాయకులు ఘోరాతి ఘోరంగా పోరాడసాగారు.

వ. అప్పుడు. 372

లయగ్రాహి.

మొత్తముగఁ బాఱు పెనునెత్తురు మహానదులఁ, దత్తఱముతో నుఱికి కుత్తుకలు మోవన్
జిత్తముల నుబ్బి వెస నెత్తుకొను భూతముల, నత్తుకొని శాకినులు జొత్తిలెడి మాంసం
బుత్తలముతో మెసఁగి నృత్తములు సేయు మద, మత్తఘన డాకినులు నృత్తగతిఁ బ్రేవుల్
బిత్తరములం దిగిచి మెత్తమెదడుల్ మొనసి, గుత్తగొనుచుండ భయవృత్తిఁ గల నొప్పెన్. 373

* ఆ సమయంలో రణరంగమంతటా రక్తనదులు ప్రవహించాయి. పెనుభూతాలు కుత్తుకలోతు నెత్తురు ప్రవాహాలలో దుమికి విచ్చలవిడిగా విహరింపసాగాయి. శాకినులు మాంసం కండలు కడుపులనిండా భుజిస్తూ నృత్యం చేశాయి. మదంతో మైమరచిన డాకినులు ప్రేవుల దండలు మెడలనిండా ధరించి మెత్తని మెదళ్లు మెక్కుతూ మిక్కిలి భయంకరంగా గంతులు వేశాయి.

వ. ఇట్లు దేవదానవులు నర్మదాతీరంబునఁ గృతయుగంబునం దలపడి, త్రేతాయుగంబుఁ జొచ్చునంత కాలంబుఁ బోరు దారుణంబుగాఁ జేయుచుండ, నంత వృత్రాసురు భుజబలంబు పెంపునఁ దెంపుఁజేసి కంపింపక నిలింపులపై రక్కసులు గుంపులై సొంపుపెంపు చూపి, మహావృక్ష పాషాణ గిరిశిఖరంబులు వర్షించిన. 374

* ఈ విధంగా నర్మదానదీతీరంలో కృతయుగంలో ప్రారంభమైన దేవదానవుల పోరాటం త్రేతాయుగం ప్రవేశించే పర్యంతమూ భయంకరంగా సాగుతూనే ఉంది. వృత్రాసురుని బాహుబలసంపదతో పెంపొందిన రక్కసి గుంపులు తెంపుచేసి విజృంభించి దేవతలమీద పెద్ద పెద్ద వృక్షాలూ, బండలూ, కొండ శిఖరాలూ కురిపించాయి.

మ. గిరి పాషాణ మహీజముల్ గురియఁగా గీర్వాణు లన్నింటి ని
ష్ఠుర నారాచపరంపరల్ పఱపుచున్ జూర్ణంబుఁ గావింప ని
ర్భరలీలం దమచేయు సత్త్వములు దోర్భంగంబులై పోవఁగాఁ
దెరలెన్ రాక్షస యోధవీరుల మదోద్రేకంబు సంఛిన్నమై. 375

* రాక్షసులు కొండలూ బండలూ చెట్లు తమమీద వర్షిస్తూ ఉంటే దేవతలు కఠోరమైన బాణసమూహాలు ప్రయోగించి వాటిని ముక్కలు ముక్కలుగా ఖండించారు. ఈ విధంగా తమ బల ప్రయోగాలన్నీ భగ్నం కాగా దానవసేనాపతులు మదోద్రేకంతో మరింత చెలరేగారు.

**క. ప్రచురముగ రాక్షసావళి, ఖచరులపై నేయు నిబిడకాండావళి దు**
**ర్వచనుఁ డెడ నాడు మాటలు, సుచరిత్రుని యందుఁ బోలెఁ జౌరవయ్యె నృపా! 376**

* సురసైన్యాల మీద అసురవీరులు ఎడతెరిపి లేకుండా శరపరంపరలు కురిపించారు. ఐతే సజ్జనుల విషయంలో దుర్జనుల దూషణలు లాగా రాక్షసుల బాణాలు దేవతలను స్పృశింపలేక వృథా అయిపోయాయి.

**వ. అప్పుడు. 377**

**వనమయూరము.**

**అంత సురలేయు నిబిడాస్త్రములపాలై, పంతములు దక్కి హత పౌరుషముతో ని**
**శ్చింతగతి రక్కసులు సిగ్గుడిగి భూమిం, గంతుగొని పాఱి రపకారపరు లార్వన్. 378**

* ఆ సమయంలో మళ్లీ దేవతలు దానవులమీద నిర్విరామంగా శస్త్రాస్త్రాలు గుప్పించారు. ఆ దెబ్బకు రాక్షసులు తట్టుకోలేక పంతాలూ పౌరుషాలూ వదలి సిగ్గువిడిచి తోకలు ముడిచి పరాజితులై పారిపోయారు. వారిని చూచి దేవతలు అవహేళనగా కేకలు వేశారు.

**క. కొండలఁ బోలెడు రక్కసు, లొండొరులం గడవఁ బాఱి రుక్కఱి పటు కో**
**దండముఖ సాధనంబులు, భండనమున వైచి దివిజపతు లార్వంగన్. 379**

* కొండలవంటి ఉద్దండులైన రాక్షసులు పౌరుషం కోల్పోయి ధనుర్బాణాలు వదలిపెట్టి కదనరంగం నుంచి పారిపోవటం చూచి వేల్పులు వేళాకోళం చేస్తూ పెద్దగా అట్టహాసాలు చేశారు.

**వ. ఇట్లు సమరతలంబు వాసి తన ప్రాపు మాసి, తీసి పఱచుచుండు దండనాయకులం జూచి, యకుటిలమతిం బకబక నగి, వృత్రాసురుం డిట్లనియె. 380**

* ఈ ప్రకారంగా తన అధీనంలోని దానవ సేనానాయకులు రణరంగాన్ని పరిత్యజించి పారిపోవటం చూచి వృత్రాసురుడు పకపక నవ్వుతూ ఇలా అన్నాడు.

**ఉ. క్షుల్లకవృత్తి మీ కగునె? శూరుల కిమ్మెయి కీర్తి భోగముల్**
**గిల్లగఁ జేయు చావు మదిఁ గోరినవారల కైనఁ గల్గునే?**
**తల్లడ మంది యీ సమరధర్మము మాని తలంగఁ బాడియే?**
**మల్లుఁడు దుర్దమ ప్రథనమత్తుని వృత్రుని ప్రాపెఱుంగరే? 381**

* మీరు వీరాధివీరులు. ఈ విధంగా పారిపోవటం నీచమైన కార్యం. ఇది మీకు తగనిపని. యశస్సునూ భోగాన్నీ కోకొల్లలుగా ఇచ్చే ఇటువంటి వీరమరణం ధీరులైనవారికి మాత్రమే ప్రాప్తిస్తుంది. కాని ఇతరులు

కావాలని కోరిన వచ్చేది కాదు. యుద్ధధర్మాన్ని త్రోసి పుచ్చి ఈ విధంగా పిరికిపందలై రణరంగం నుంచి పారిపోవటం వీరోచితమైన కార్యం కాదు. సంగర రంగంలో సాటిలేని మేటివీరుడైన ఈ వృత్రుని శక్తి సామర్థ్యాలు మీకు తెలియవా?

**క. చావు ధ్రువమైన ప్రాణికిఁ, జావులు రెం డరసికొనుఁడు సమరమునందున్**
**భావింప యోగమందును, జావంగా లేని చెడుగుచావుం జావే? 382**

* ఈ ప్రపంచంలో పుట్టిన ప్రతిఒక్కడూ ఎప్పుడో ఒకప్పుడు మరణించక తప్పదు. కాని రెండు విధాలైన చావులే ఉత్తమమైనవి. ఒకటి రణరంగంలోనూ, రెండవది యోగమార్గంలోనూ. ఈ రెండూ కాక మరొక విధమైన చావు చావటం నీచాతి నీచం.

**వ. అని వాసుదేవ తేజోవిశేష విశేషితులై దావానలకీలలం బోలె వెలుంగుచు వెఱచి వెన్నిచ్చి పాటెడు నసురుల వెనుకొని తఱుము సురవీరులం జూచి హుంకరించి, స్వర్గానుభవంబున నిచ్చలేకుండె నేని మదవలోకన స్పర్శన మాత్రంబు ముందర నిలుతురుగాక అని యేచి కల్పాం తానల్ప ఘనఘనా టోపంబునుం బోలెఁ గఠోర కంఠ హుంకార తర్జనంబులం గర్జిల్లుచుఁ, బ్రళయకాల పవనపరిభాసిత మహాశిఖి శిఖావళులం దృణీకరించు కుటిలావలోకనంబుల నాలోకించుచుం, గాల పరిపక్వ లీలా లోలుండైన శూలిపోలిక నాభీలమూర్తియై సకల జీవభార భరణ దుర్భర భగ్న బ్రహ్మాండ భాండ మహాధ్వానంబు భంగి నాస్ఫోటించిన. 383**

* ఈ విధంగా వాసుదేవుని తేజోవిశేషం వల్ల దావాగ్నిజ్వాలలవలె వెలుగుతూ అసురసైనికుల వెంటబడి తరుముతున్న అమర వీరులను ఆలోకించి వృత్రాసురుడు అహంకారముతో హుంకారం చేసి ఇలా అన్నాడు. "ఓరీ! మీకు నాలుగు కాలాలపాటు స్వర్గంలో సుఖంగా జీవించాలని కోరిక లేకపోతే రండి. నా ముందుకు వచ్చి నిలబడండి. నన్ను మార్కొనండి" అంటూ ఆ దానవవీరుడు కల్పాంత కాలమేఘం లాగా గంభీర కంఠస్వరంతో కఠోరంగా గర్జించాడు. ప్రళయకాల ప్రభంజనంవల్ల భగభగ మండే అగ్నికీలలను తృణీకరించే కుటిల వీక్షణాలు ప్రసరింపజేస్తూ లయకాల మహారుద్రునివలె రౌద్రాకారం ధరించి మహోద్రేకంతో బ్రహ్మాండ భాండం బద్దలయ్యేటట్లు భుజాస్ఫాలనం చేశాడు.

**ఉ. కూడె జగంబు లన్నియును గ్రుంకిరి సూర్య సుధాంశు; లద్రు లూ**
**టాడె, నభస్థలం బగిలె, నంబుధు లింకె, నుడుగ్రహాళి ప**
**ట్టాడె, వడిం దిశల్వగిలె, నుర్వర గ్రుంగె, నజాండభాండ మ**
**ల్లాడె, విధాత బెగ్గడిలె నార్చుచు వృత్రుఁడు బొబ్బవెట్టినన్. 384**

* ఈ విధంగా వృత్రాసురుడు భుజం చరిచి పెద్దగా అరిచాడు. ఆ మహాధ్వనికి లోకాలన్నీ చీకాకు పడ్డాయి. సూర్యచంద్రులు అస్తమించారు. పర్వతాలు ఊగిసలాడాయి. గగనం బద్దలైంది. సముద్రాలు అల్లకల్లోల మయ్యాయి. నక్షత్రాలూ, గ్రహాలూ, పట్టుతప్పాయి. దిక్కులు దద్దరిల్లాయి. భూమి క్రుంగింది. బ్రహ్మాండభాండం అల్లాడింది. విధాత తల్లడిల్లాడు.

లయగ్రాహి.

కూలిరి వియచ్చరులు, సోలిరి దిశాధిపులు, వ్రాలి రమరవ్రజము, దూలి రురగేంద్రుల్,
ప్రేలిరి మరుద్గణము, జాలిగొని రశ్వినులు, కాలుడిగి రుద్రు లవలీలఁ బడి రార్తిన్
వ్రేలిరి దినేశ్వరులు, కీ లెడలి నట్లు సుర, జాలములు పెన్నిదుర పాలగుచు ధారా
భీల గతితోడఁ దమ కేలిధనువు ల్విడిచి, నేలఁబడి మూర్ఛలను దేలిరి మహాత్మా! 385

* ఆ రాక్షసరాజు పెనుబొబ్బకు వియచ్చరులు నేల కూలారు. దిక్పాలకులు సోలారు. వేలుపులు వ్రాలారు. నాగులు తూలారు. మరుద్గణాలు ప్రేలారు. అశ్వినీ కుమారులు దిగులుపడ్డారు. రుద్రగణాలు కాలు కదపలేక జారిపడ్డారు. ద్వాదశాదిత్యులు కీలూడి వ్రేలాడారు. సురసైనికులు పెద్దనిద్దుర ముసించినట్లు చేతిలోని విల్లంబులు జారవిడిచి పుడమిపై బడి మూర్ఛిల్లారు.

వ. ఇట్లు కఠోర కంఠనాదం బొనర్చిన నశనిపాతంబునం గూలు ప్రాణిచయంబు భంగి నంగంబు లెఱుంగక రణరంగంబునం బడి మూర్ఛిల్లిన, దివిజరాజసైన్యంబుల వృత్రాసురుండు సంగరరంగ దుర్దముండై మహీవలయంబు పదాహతంబుల గజగజ వడంక, నిశితశూలంబు కేల నంకింపుచు, మదించిన భద్రమాతంగంబు కమలవనంబు సొచ్చి, మట్టిమల్లాడు విధంబున నిమీలితాక్షుం డగుచుఁ , బదతలంబుల రూపంబులు మాయం జమురుచు, వెక్కసంబుగఁ గ్రీడించు వానింగని వజ్రి వజ్ర శతోపమ నిష్ఠుర గదాదండం బాభీల భంగిఁ బ్రళయకాల మార్తాండ చండపరివేష ఘోరంబుగాఁ ద్రిప్పి వైచిన. 386

* ఈ ప్రకారంగా కర్ణకఠోరమైన వృత్రాసురుని కంఠస్వరాన్ని విని పిడుగుపాటున నేలగూలిన ప్రాణి సమూహంలాగా దేవేంద్రుని సైన్యాలు ఒడలు తెలియక రణరంగంలోపడి మూర్ఛిల్లాయి. సాటిలేని సమర వీరుడైన వృత్రుడు కేల శూలం ధరించి మదపుటేనుగు కమల వనంలో ప్రవేశించినట్లు సంగర రంగంలో సంచరించాడు. కన్నులు మూసుకొని కదన భూమిలో తిరుగుతున్న ఆ దాన వేంద్రుని పాదాలక్రింద పడి దేవతల దేహాలు నలిగిపోసాగాయి. ఈ విధంగా విశృంఖలంగా విహరిస్తున్న ఆ వీరుణ్ణి వీక్షించి ఇంద్రుడు వంద వజ్రాయుధాలశక్తి గల తన గదాదండాన్ని గ్రహణకాలంలో భానుని చుట్టూ వరద గుడి కట్టినట్లు గిరగిర త్రిప్పుతూ వృత్రునిపైకి విసిరివేశాడు.

మ. అది మింటం బెనుమంట లంటఁ బఱపై యాభీల వేగంబునన్
గదియన్ వచ్చిన లీల వామకర సంక్రాంతంబు గావించె బె
ట్టిదుఁడై చేరి సురారి దానిఁ గొని కాఠిన్యోరు పాతంబులం
జదియన్ మోఁదె గజేంద్ర మస్తకము నుత్సాహైక సాహాయ్యుఁడై. 387

* ఇంద్రుని గద గగనమండలం నిండా పెనుమంటలు గ్రక్కుతూ మహావేగంతో వచ్చి దనుజేంద్రుని తాకింది. వృత్రాసురుడు ఆ గదా దండాన్ని ఎడమచేతితో అవలీలగా పట్టుకొని ఇంద్రుని వాహనమైన ఐరావతం కుంభస్థలం మీద గట్టిగా ఒక్క పెట్టు పెట్టాడు.

ఆ. అగ్గజంబు కులిశహతిఁ గూలు కులమహీ, ధ్రంబు వోలె రక్తధార లురల
మస్తకంబు పగిలి మదమఱి జిర జిర, తిరిగి విఱుగు సూపి తెరలి పఱచె. 388

* ఆ దెబ్బకు ఐరావతం తల బద్దలై నెత్తురు చిమ్మింది. వజ్రాయుధం దెబ్బతిన్న పర్వతం వలె ఆ వెల్లయేనుగు తల్లడిల్లి గిర గిర తిరిగి భయంతో పరుగు తీసింది.

ఉత్సాహవృత్తము.
గజము దెరలి దాని కొఱలి గర్జ లిడుచుఁ బాఱఁగా
భజన నింద్రుఁ డంకుశమునఁ బట్టి బిట్టు నిల్పుచున్
నిజసుధార సైకపాన నిర్ణయార్ద్ర కరమునన్
బుజుత మీఁఱ నిమిరె నపుడు రీతి మెఱసి క్రమ్మఱన్. 389

* ఈ విధంగా దెబ్బతిని బెదరి గుండె చెదరి పారిపోతున్న ఐరావతాన్ని దేవేంద్రుడు అంకుశంతో అదుపులోకి తెచ్చి ఆపాడు. అమృత రసాన్ని ఆస్వాదించే తన చల్లనిహస్తంతో ఆ ఐరావతాన్ని మెల్లగా నిమిరాడు.

వ. ఇ వ్విధంబున నైరావతంబును సేదదేర్చుచు, నెదుర నిలుచున్న భిదుర పాణింగని, తోఁబుట్టువుం జంపిన తెంపు దలంచి, మోహశోకంబున విపర్యాసంబుగా నవ్వుచు నాహవకామ్యార్థియై వృత్రుం డిట్లనియె. 390

* ఈ ప్రకారంగా ఐరావతాన్ని తన చేతితో నిమురుతూ సేద తీరుస్తున్న దేవేంద్రుణ్ణి ఆ వృత్రాసురుడు చూచాడు. తన తోబుట్టువైన విశ్వరూపుణ్ణి మట్టు పెట్టినవాడు వీడే కదా అని పట్టరాని దుఃఖం వచ్చింది. ఆగ్రహావేశంతో వికటాట్టహాసం చేస్తూ అసురేంద్రుడు అమరేంద్రునితో ఇలా అన్నాడు.

శా. నాకుం బెద్దయు నీకు సద్గురువు దీనవ్రాత రక్షున్ శుభా
లోకుం జంపితి విట్లు పాపమతివై లోభంబుతో ని య్యెడన్
లోకుల్ నవ్వఁగ మద్భుజాపటిమకున్ లోనైతి వీ శూలమం
దాకంపింపఁగ నిన్నుఁగ్రుచ్చి ఋణముక్తాత్ముండనై పేర్చెదన్. 391

* "నాకు అన్నగారు; నీకు గురువుగారు; దీనజనరక్షకుడు; ఎల్లరకూ మేలుకూర్చే చల్లని చూపులవాడు, విశ్వరూపుడు. అటువంటి మహానుభావుణ్ణి దుర్బుద్ధితో హత్యచేసిన పాపాత్ముడవు నీవు. ఈనాడు ఇక్కడ చేవదక్కి నా బాహు పంజరంలో చిక్కి పదిమందిలో నవ్వుల పాలయినావు. ఇదిగో ఈ నా శూలాన్ని దడ దడ కొట్టుకొంటున్న నీ గుండెల్లో గ్రుచ్చి మా అన్నగారి రుణం తీర్చుకొంటాను.

క. ఎట్టి తులు వైనఁ గానీ, నెట్టనఁ దన బ్రతుకు కొఱకు నీవలె గురువుం
జుట్టమునుఁ బుణ్యు బ్రాహ్మణుఁ, బట్టి వధింపంగఁ గలఁడె? పశువుంబోలెన్. 392

* ఎటువంటి నీచాతినీచుడైనా నీలాగా కుటిలబుద్ధితో ఆచార్యుణ్ణి అందులో ఆత్మబాంధవుణ్ణి పుణ్యమూర్తిని భూసురవర్యుణ్ణి పట్టుకొని పశువును కోసినట్లు గొంతుకోసి చంపుతాడా?

చ. దయయును సత్యమున్ విడిచి ధర్మము మాని యశంబుఁ బాసి శ్రీ
జయములఁ బాఱఁదోలి పురుషత్వము గానక లోకనింది తా
హ్వయుఁ డగువాని చావునకు నార్యులు గుందుదురే? సృగాలముల్
ప్రియమున నంటునే శవముఁ? బ్రేలక చేరునె? కంక గృధ్రముల్. 393

* ఓరీ! ఇంద్రా! దయాదాక్షిణ్యాలు కోల్పోయి, సత్యాన్ని పరిత్యజించి, ధర్మాన్ని విడిచి, కీర్తిని పోగొట్టుకొని, సిరిసంపదలను దూరం చేసుకొని పౌరుషాన్ని పారదోలి పదిమంది చీవాట్లు పెట్టే పాడు పని చేశావు. ఇటువంటి నీచుడ వయిన నీ చావుకు సజ్జనులైన వారెవ్వరును బాధపడరు. నిర్భాగ్యుడవైన నీ మృతకళేబరాన్ని నక్కలు కూడా ముట్టుకోవు. కాకులు, గ్రద్దలు సైతం అంటుకొనవు.

క. నిక్కమగు పాపములచేఁ, జిక్కితివి నిశాత శూల శిఖరాగ్రమునన్
గ్రుక్కించి నీదు మాంసము, నక్కలుఁ గుక్కలును జేరి నమలఁగఁ జేతున్. 394

* ఓరీ! నీవు చేసిన పాతకానికి ఫలితంగా నా చేతిలో చిక్కావు. ఇదిగో! ఈ పదునైన శూలాగ్రాన్ని నీ గుండెల్లోకి దింపి నిన్ను చంపి, నీ మాంసం ముక్కలను నక్కలకూ, కుక్కలకూ వెదజల్లుతాను.

ఉ. దీకొని నీకు నేఁ డిచట దిక్కని వచ్చిన వారు గల్గిరే
నేకమతిం బిశాచముల కెల్లను దృప్తిగ మన్నిశాత శూ
లైక మహాగ్నికీలల ననేకవిధంబుల సోమయాజి నై
మేకలఁ జేసి వేల్చెద నమేయ మదోద్ధతి వ్రాలి యియ్యనిన్. 395

* నీకు దిక్కున్నవా డెవడైనా ఉంటే ఇక్కడికి రమ్మను. దుర్వారమైన గర్వోద్రేకంతో కదనరంగంలో దూకి నా పదునైన శూలం అంచున భగ భగ మండే అగ్ని జ్వాలలలో సోమయాజి మేకలను వేల్చినట్లు నిన్ను వేల్చి పిశాచాల కన్నింటికీ తృప్తిగా విందుచేస్తాను.

క. కాక ననుఁ గులిశధారల, దీకొని నిర్జింపఁ గలిగి తేనియు భూతో
ద్రేకంబు సేసి శూరుల, ప్రాకట పదపద్మ ధూళి భాగం బగుదున్. 396

* ఒకవేళ ఎదుర నిల్చి వాడిగల వజ్రాయుధంతో నీవే నన్ను నిర్జింప గలిగినట్లయితే ఈ పంచభూతాలలో కలిసిపోయి రణవీరుల పవిత్ర పాద పద్మపరాగంలో భాగం సంపాదించుకొని కృతార్థుణ్ణి అవుతాను.

సీ. సందేహ మేటికి జంభారి! వేవేగ భిదురంబు వ్రేయు మాభీలభంగి
నతిలోభి నడిగిన యర్థరాశియుఁబోలెఁ గడపకు మిది వృథ గాదు సుమ్ము,
మురమర్దనుని తేజమున నా దధీచి వీర్యాతిశయంబుల నధికమైన
యదిగాన హరిచే నియంత్రి తోన్నతుఁడ వై గెలువుము శత్రుల గీ టడంచి

ఆ. యెందు గలఁడు విష్ణుఁ డందు జయశ్రీలు, పొందు గాఁగ వచ్చి పొందుచుండుఁ,
గాన భక్త వరదుఁ గమలాక్షు సర్వేశు పదములందు మనము పదిలపఱుతు. 397

* ఓరీ! జంభారీ! ఇంకా సందేహిస్తా వెందుకు? అతిశీఘ్రంగా నీ భయంకరమైన వజ్రాయుధాన్ని నామీద ప్రయోగించు. అత్యంత లోభబుద్ధి గలవానిని అర్థించిన అర్థరాశి వలె నీ వజ్రాయుధం వ్యర్థం కాదు. ఎందుకంటే విష్ణుదేవుని తేజస్సుతోనూ, దధీచి మహర్షి తపశ్శక్తి తోనూ నీ వజ్రం శక్తి సంపన్నమై ఉన్నది. అందువల్ల శ్రీహరి ప్రోత్సాహంతో పోటుబంటువై నీ శత్రుణ్ణి ఈ వృత్రుణ్ణి జయించు. విష్ణువు ఎక్కడ ఉంటాడో విజయలక్ష్మి అక్కడే విరాజిల్లుతుంది. నేను భక్త వరదుడూ, పంకజాక్షుడూ అయిన భగవంతుని పాదపద్మాల యందు ఇదిగో నా హృదయాన్ని పదిలపరచు కొంటున్నాను.

వ. ఇట్లు వజ్రధారలం ద్రెంపఁబడిన విషయ భోగంబులు గల వాఁడనై శరీరంబు విడిచి, భగవ ద్ధామంబునుం బొందెద. నారాయణుని దాసుండ నైన నాకు స్వర్గమర్త్య పాతాళంబులం గల సంపద్భోగంబులు నిచ్ఛయింపఁబడవు. త్రైవర్గికాయాస రహితం బైన మహైశ్వర్యంబు ప్రసాదించుం గావున ననుపమేయం బైన భగవత్ప్రసాదం బన్యుల కగోచరంబు. ఆ దేవుని పాదైక మూలంబుగా నుండు దాసులకు దాసానుదాసుండనై యున్నవాఁడ అని యప్పరమేశు నుద్దేశించి. 398

* ఇప్పుడు నీ వజ్రాయుధం వ్రేటుకు నా సంసార బంధాలన్నీ తెగిపోతాయి. పాంచభౌతికమైన ఈ శరీరాన్ని పరిత్యజించి సర్వేశ్వరుని సన్నిధికి చేరుకుంటాను. నేను నారాయణ భక్తి పరాయణుడును, నాకు స్వర్గ మర్త్య పాతాళ లోకాలలో గల భోగభాగ్యాలు ఏవీ రుచింపవు. ధర్మార్థ కామాల జంజాటాలు ఏమాత్రం లేని మహైశ్వర్యాన్ని ప్రసాదించే భగవంతుని అనుగ్రహం అనుపమాన మైనది. అన్యులకు అగోచరమైనది. నేను ఆ దేవాదిదేవుని పాదాలు సేవించే దాసులకు దాసాను దాసుడను". - అని వృత్రాసురుడు పరమేశ్వరుణ్ణి ఈ విధంగా ధ్యానించాడు.

చ. అరయఁగ భక్తపాలనము లైన భవచ్చరితంబు లాత్మ సం
స్మరణము సేయ వాక్కు నిను సన్నుతి సేయ శరీర మెల్లఁ గిం
కర పరివృత్తి సేయ మదిఁ గాంక్ష యొనర్చెదఁ గాని యొల్ల నే
నరిది ధ్రువోన్నత స్థలము నబ్జజు పట్టము నింద్ర భోగమున్. 399

* స్వామీ! నా హృదయం భక్తులను పరిపాలించే భవదీయ సద్గుణ సముదాయాన్ని సర్వదా సంస్మరణం చేయాలి. నా వాక్కు నిన్నే ఎల్లప్పుడూ సన్నుతించాలి. నా శరీరం నిత్యమూ నీకు సేవచేయాలి. ఇదే నా కోరిక. ఇంతకు మించి నేను ధ్రువలోకాన్ని గాని, ఇంద్ర భోగమునుగాని కాని, బ్రహ్మపదాన్ని గాని ఆశించను.

**ఉ. ఆఁకలి గొన్న క్రేపులు రయంబున నీఁకలు రాని పక్షులుం**
**దీకొని తల్లికిన్ మఱి విదేశగతుండగు భర్త కంగజ**
**వ్యాకులచిత్త యైన జవరాలును దత్తఱ మందు భంగి నో**
**శ్రీకర! పంకజాక్ష! నినుఁ జేరఁగ నామది గోరెడుం గదే! 400**

* శ్రీహరీ! పుండరీకాక్షా! ఆకలితో అలమటించే లేగదూడలు గోమాత కోసం ఎదురు చూస్తున్నట్లుగా, ఈకలు రాని పక్షిపిల్లలు తమ తల్లిరాక కోసం నిరీక్షిస్తున్నట్లుగా, విరహవ్యాకుల అయిన జవరాలు విదేశగతుడైన పతికోసం ప్రతీక్షిస్తున్నట్లుగా నీకోసం నీ సమాగమం కోసం నా హృదయం ఉవ్విళ్లూరు తున్నది.

**క. నాకును సఖ్యము పుణ్య, శ్లోకులతోఁగాని తత్త్వశూన్యులు సంసా**
**రైక విమోహులతోడం, గాకుండ నొనర్పు మయ్య! కంజదళాక్షా! 401**

* ఓ పుండరీకాక్షా! పుణ్యాత్ములైన మహనీయులతో మాత్రమే నాకు మైత్రి ప్రాప్తించేటట్లు అనుగ్రహించు. తత్త్వజ్ఞానం లేనివారితోనూ, సంసార బంధాలలో చిక్కుకున్న వారితోను నాకు ఎటువంటి సంబంధమూ కలుగకుండేటట్లు కటాక్షించు.

**మహాస్రగ్ధర.**
**హరి పై సర్వాత్ముపై నత్యగణితగుణుపై నంతరంగంబు పర్వన్**
**పరిమేనుప్పొంగఁ జావుం జయమును సరిగా సంతసం బందుచుం భీ**
**కరుఁడై కాలాగ్ని వోలెన్ గనలుచుఁ గవిసెన్ గర్వదుర్వారుఁడై దు**
**ర్భరలీలం భూమి గంపింపఁగ దిశ లద్రువన్ భండనోద్దండవృత్తిన్. 402**

* ఈ విధంగా వృత్రాసురుడు అనంతకల్యాణగుణుడూ, సర్వాంతర్యామి ఐన శ్రీహరిపై తన మనస్సు లగ్నం చేశాడు. సంతోషంతో శరీరమంతా పొంగిపోగా రణరంగంలో సంభవించే జయమూ, చావూ సమానమే అని భావించాడు. గర్వోద్రేకంతో ప్రళయాగ్నిలాగా భగభగ మండుతూ సంగ్రామరంగంలో దుమికికాడు. అతడి భయంకరాకారానికి భూమి కంపించింది. దిక్కులు దద్దరిల్లాయి.

**క. దొరకొని ప్రళయోదకమున, హరిపైఁ గైటభుఁడు గవియు హంకారమునన్**
**సురనాథు మీఁద వృత్రా, సురుఁడు మదోద్వృత్తి నడచె శూలాయుధుఁడై. 403**

* కల్పాంతకాలంలో సముద్రజలాలపై కైటభుడనే రాక్షసుడు శ్రీమహావిష్ణువుపై దుమికిన మాదిరిగా వృత్రాసురుడు రోషావేశంతో శూలాన్ని ధరించి ఇంద్రునిపైకి కుప్పించి దూకాడు.

శా. కల్పాంతాగ్నియుఁబోలె నుల్క లెగయంగా ద్రిప్పుచున్ దీన నో
యల్పా! చావు మటంచు శూలము రయంబారంగఁ బై వైచినం
బోల్పం గోటిరవి ప్రకాశత దివిం బోవంగ వీక్షించి యా
వేల్పుల్పొంగఁగ వజ్రధారఁ దునిమెన్ విన్నాణ మొప్పారఁగన్. 404

* వృత్రాసురుడు శూలాన్ని "ఓరీ ! ఇంద్రా! చావు"అంటూ ఇంద్రుని పైకి విసిరాడు. గిర గిర తిరుగుతూ, నిప్పులు చెరుగుతూ ప్రళయాగ్నిజ్వాలలు గ్రక్కుతూ కోటిసూర్యుల కాంతితో తన పైకి వస్తున్న ఆశూలాన్ని దేవేంద్రుడు వజ్రాయుధంతో నేర్పుగా ఖండించాడు. అది చూచి దేవతలంతా ఆనందంతో పొంగిపోయారు.

ఆ. శూల మప్పు డతఁడు స్రుక్కఁగ ఖండించి, పూని తోన కదిసి భుజముఁ ద్రుంచె,
నసుర గనలి యేకహస్తుఁడై పరిఘంబు, గొని మహేంద్రుఁ గిట్టి హనువు లడిచె. 405

* ఇంద్రుడు దనుజేంద్రుని శూలాన్ని ఖండించి ఆ వజ్రాయుధం తోనే అతని హస్తాన్ని కూడా నరికి వేశాడు. అప్పుడు వృత్రుడు ఆగ్రహోదగ్రుడై ఒంటిచేతితో పెద్ద ఇనుపగుదియ పట్టుకొని దేవేంద్రుని మీదికి ఉరికాడు.

వ. ఇట్లు ప్రళయకాల భీషణ పరివేష పోషంబుగా రోషంబునం బరిఘంబు ద్రిప్పి, కుప్పించి, గజ కుంభస్థలంబు భగ్నంబు సేసి యింద్రు హనుప్రదేశంబును నిష్ఠురాహతి నొప్పించిన. 406

* ఈ విధంగా విజృంభించి ప్రళయకాలంలో సూర్యమండలాన్ని చుట్టుకొని ఉన్న పరివేషంలాగా ఇనుపగుదియను గిరగిర త్రిప్పుతూ ఐరావతం కుంభస్థలం మీద గట్టిగా ఒక్క పెట్టు పెట్టి ఇంద్రుని చెంపమీద పెళ్లుమని బాదాడు.

క. గజము మద ముడిగి తిరుగుచు, గుజగుజనై గీఁకపెట్టఁ గులిశము నేలన్
భజన చెడి విడిచె నింద్రుఁడు, గజిబిజితో బెగడె నసురకడిమి జగంబుల్. 407

* ఇనుపగుదియ దెబ్బకు ఇంద్రుని వెల్లయేనుగు తల్లడిల్లి గీ పెట్టింది. ఇంద్రుడు సొమ్మసిల్లి దిమ్మదిరిగి వజ్రాయుధం జారవిడిచాడు. వృత్రాసురుని పరాక్రమానికి జగములు బెగడొందాయి.

క. గరుడుఁడు వొదివిన నాగము, కరణిన్ వృత్రాసురేంద్రు కడిమికి లోనై
తిరుగుడు వడ్డ హరిం గని, పురపుర నాహా! యటంచుఁ బొగిలె జగంబుల్. 408

* గరుత్మంతుని బారి పడిన కాలసర్పం లాగా వృత్రాసురుని పరాక్రమానికి లోబడిన ఇంద్రుని దురవస్థ చూచి ముల్లోకాలు "అయ్యో" అని విచారించాయి.

వ. అప్పుడు. 409

తే. గజముపాటుఁ జూచి కడు దీనగతిఁ జూచి, పవి కరంబు జాఱి పడుటఁ జూచి
యుద్ధధర్మ మెఱిఁగి యున్న శత్రునిఁ జూచి, సిగ్గుతోడ వజ్రి శిరము వంచె. 410

* ఆ సమయంలో తన వాహనమైన ఐరావతం భంగపాటు చూసి, తన దైన్యస్థితి చూసి, తనచేతిలోని ఆయుధం జారి పడిపోవటం చూసి యుద్ధ ధర్మాన్ని గుర్తించి తన పైకి దూకకుండా నిబ్బరంగా నిలబడి ఉన్న శత్రువును చూచి దేవేంద్రుడు సిగ్గుతో శిరస్సు వంచుకొన్నాడు.

**వ. ఇట్లు యుద్ధంబున శత్రుసన్నిధిం గరంబు జాఱిపడిన వజ్రంబుఁ బుచ్చికొనక నివ్వెఱపడి, లజ్జించి యున్న పాకశాసనుంజూచి వృత్రుం డిట్లనియె. 411**

* ఈ విధంగా సిగ్గుపడి యుద్ధభూమిలో విరోధిముందు చేజారి క్రిందపడిన తన వజ్రాయుధాన్ని తిరిగి అందుకోకుండా నివ్వెర పాటుతో నిలబడిఉన్న ఇంద్రుణ్ణి చూచి దానవేంద్రుడు ఇలా అన్నాడు.

**క. దురమునఁ గైదువు వదలిన, శరణన్నను వైరిజనులఁ జంపము మది ని**
**వ్వెఱఁగొందనేల? కులిశము, కర మరుదుగఁ బుచ్చికొనుము కాచితి నింద్రా! 412**

* ఇంద్రా! భయపడకు. నీకు అభయ మిస్తున్నాను. రణరంగంలో ఆయుధం విడిచి ఉన్నప్పుడూ, “శరణు”అన్నప్పుడూ వీరులైన వారు శత్రువును సంహరింపరు. సిగ్గుపడకు. నీ ఆయుధాన్ని నీవు తీసుకో.

**సీ. వజ్రంబు గైకొని వైరి నిర్జింపు, మి ట్లడలంగ వేళగా దమరనాథ!**
**యరయ దేహాధీనులైన మూర్తుల కెల్ల నీశు లక్ష్మీశు సర్వేశుఁ బాసి**
**కడతేఱ జయములు గల్గనె యెందైనఁ దలపోసి చూడుమా! తత్త్వదృష్టి**
**నీ లోకపాలురు నెవ్వని వశగతి వలఁ బడ్డ పక్షుల వర్తనమునఁ**

**తే. జిక్కి చేష్టలు సేయుచుఁ జింతసేతు, రట్టి మృత్యు బలంబుల నాత్మజయము**
**తమదిగాఁ గోరి యజ్ఞాన తంత్రు లగుచుఁ, గమలలోచను లీలా వికారములను. 413**

* సురేంద్రా! వజ్రాన్ని అందుకో! వైరిని నిర్జించు. అంతే. ఈ విధంగా చింతించటానికి ఇది సమయం కాదు. శరీరధారులైన జీవులు సమస్త భువనాధీశ్వరుడైన రమానాథుని కాదని స్వతంత్రించి మిట్టిపడినచో గట్టెక్కలేరు. అట్టివారు జయాన్ని పొందలేరు. నీవే కొంచెం ఆలోచించు. సత్యాన్ని గ్రహించు. ఈ లోకపాలకు లందరూ ఆ పరాత్పరునికి లోబడి వలలో చిక్కిన పక్షులవలె వర్తిస్తున్నారు. చెప్పినట్లు చేస్తున్నారు. సుఖదుః ఖాలనూ, మృత్యుభయాన్నీ అనుభవిస్తున్నారు. ఇదంతా ఆ శ్రీహరి లీలావిలాసమన్న సంగతి మరచిపోయి తమకు ప్రాప్తించిన విజయానికి తామే కారణ మనుకొని విఱ్ఱవీగుతూ అజ్ఞానంలో మునిగి తేలుతున్నారు.

**తే. మెఱయ యంత్రమయం బైన మృగముభంగి, దారునిర్మిత మైనట్టి తరణిపోల్కి**
**శక్ర! యెఱుఁగుమ యీ భూతజాల మెల్ల, దళిత పంకేరుహాక్షు తంత్రంబు గాఁగ. 414**

* దేవేంద్రా! యంత్రనిర్మితమైన జంతువుల వలెనూ, కొయ్య చెక్కలతో కూర్చబడిన పడవలవలెనూ ఈ ప్రపంచలోని ప్రాణులందరూ మహావిష్ణువు మాయా తంత్రం వల్ల కదులుతున్న జంత్రపు బొమ్మలని తెలుసుకో.

వ. మఱియు భూతంబులచేతను, నింద్రియంబుల చేతను నవశుండైన పురుషుండు ప్రకృతిచేత వేఱుచేయబడిన యాత్మం బరమేశ్వరానుగ్రహంబు వాసి సుఖియించుచుండు. అవిద్వాంసుండైన వాఁ డనవరతంబుఁ దన్ను స్వతంత్రునిఁగాఁ దలంపుచుండు. భూతంబుల వలన భూతంబులుం బుట్టుచుండు. ఆ భూతంబులు భూతంబులచేత భక్షింపఁ బడుచుండు. పురుషున కాయువు, శ్రీయును, గీర్తియు, నైశ్వర్యంబును మొదలయినవి యనుభవింప నెంతకాలంబు ప్రాప్తం బంతకాలంబు నివసించు. ఆ ప్రాప్తంబు దీఱినఁ బురుషుండు జాలిం బొందిన నవి యుండక పోవుచుండు. కావున గుణంబును, నవగుణంబును, గీర్త్యపకీర్తులును, జయాపజయంబులును, సుఖదుఃఖంబులును, జావు బ్రతుకులును సమంబులై కలుగుచుండు. అజ్ఞానియైన వానికి సత్త్వరజస్తమో గుణంబులు గలిగియుండు. అట్టివానికి గుణమయంబులైన యింద్రియాదులే యాత్మయని తోఁచుచునుండు. కావున వాఁ డా గుణంబులచేత బద్ధుండగు. ఆ గుణంబులకు సాక్షిమాత్రం బైన శరీరంబు వేరని యెవ్వం డెఱుంగనోపు, వాఁ డా గుణంబులచేత బద్ధుండు కాఁడు. కావున గుణంబులును; గుణియును; భోక్తయును, భోగ్యంబును; జయంబు నపజయంబును, హర్తయును; హన్యంబును, నుత్పత్తిస్థితి లయకర్తయై, సర్వోత్కృష్టుండైన యప్పరమేశ్వరుండే కాని యన్యంబు లేదు. ఇప్పుడొక్క హస్తంబు నాయుధంబును బోయినను భవత్ప్రా ణాపహరణంబునకు సమర్థుండ నగుచున్న నన్నుం జూడుము అని వృత్రాసురుండు మఱియు నిట్లనియె. 415

* పంచేంద్రియాలకూ పంచభూతాలకూ లోబడిన జీవుడు తన్ను తాను ప్రత్యేకంగా భావిస్తున్నాడు. త్రిగుణాత్మకమైన ప్రకృతి చేత వేరుచేయబడి అస్వతంత్రుడైన జీవుడు స్వతంత్రుడనని తలంచి భగవంతుని అనుగ్రహానికి దూర మవుతున్నాడు. ఆ అజ్ఞానావస్థలోనే సుఖాన్ని అనుభవిస్తున్నాడు. లోకంలో జీవుల నుండి జీవులు జన్మించు తున్నవి. ఆ జీవులే జీవులను భక్షించుతున్నవి. పురుషుడు ఆయుర్దాయం, సంపద, యశస్సు, ఐశ్వర్యం మొదలైన వాటిని ఎంతవరకు ప్రాప్తమో అంతవరకు అనుభవిస్తాడు. ప్రాప్తం తీరిపోగానే పురుషునితో పాటు అవి కూడా అంతరిస్తాయి. జనన మరణాలకు నడుమ ఉన్నదే జీవితం. అది ఉన్నంతవరకే సంపదలూ సౌఖ్యాలూ. అది తీరిపోయాక సుఖాలూ, ఐశ్వర్యాలూ అన్నీ అదృశ్యమైపోతాయి. సుగుణాలూ దుర్గుణాలూ, కీర్తులూ అపకీర్తులూ, జయాపజయాలూ, సుఖదుఃఖాలూ, చావుబ్రతుకులూ సమానంగానే సంభవిస్తుంటాయి. సత్త్వరజస్తమో గుణాలకు లోబడిన అజ్ఞానియైన పురుషుడు ఆ గుణాలతో కూడిన ఇంద్రియాలూ దేహమూ తానని భావించి బంధాలలో చిక్కుకుంటాడు. ఆ గుణాలకు సాక్షి మాత్రమైన ఆత్మయే తాననీ, దేహేంద్రియాదులు వేరనీ గ్రహించిన బుద్ధిమంతుడు ఆ గుణాలలో బద్ధుడు కాడు. అందువల్ల గుణాలు, గుణాలు కలవాడూ, భోగ్యవస్తువూ, జయమూ అపజయమూ, చంపేవాడూ చంపబడేవాడూ- సమస్తమూ ఆ భగవంతుని స్వరూపాలే కాని వేరు కాదు. సృష్టి స్థితి లయాలకు హేతువైన వాడూ, సర్వోత్కృష్టుడూ అయిన ఆ పరాత్పరుని కంటే అన్యమైనది ఈ విశ్వంలో ఏదీ లేదు.

ఇప్పుడు నన్నే చూడు. నా ఆయుధం విరిగిపోయింది. నా చెయ్యి తెగిపోయింది. అయినా నీతో యుద్ధం చేయటానికి, నీ ప్రాణాలు తీయటానికి నేను సంసిద్ధంగా ఉన్నాను.

**తే. వాహనంబులు సారెలు వాఁడిశరము, లూర్జి తాక్షము లసువులు నొడ్డణములు**
**గాఁగఁ బోరెడు నీ ద్యూతకర్మమందు, నెసఁగ జయమును నపజయ మెవ్వఁ డెఱుఁగు? 416**

* వాహనాలే ఆటబల్లలు. వాడి బాణాలే పాచికలు. ప్రాణాలే పందాలు అయిన ఈ యుద్ధమనే జూదంలో జయాపజయాలు దైవాధీనాలు.

**చ. అనవుడు వృత్రుమాటలకు నద్భుత మంది సురేంద్రుఁ డెంతయుం**
**దనమదిఁ గుత్సితం బుడిగి దైవముగా నతనిన్ తలంచి కై**
**కొనియెఁ గరంబునం దిగువఁ గూలిన వజ్రము, నప్పుడాత్మలోఁ**
**దనరె జగంబు లన్నియు, ముదంబును బొందిరి ఖేచరావళుల్. 417**

* ఈ విధంగా పలుకుతున్న వృత్రాసురుని మాటలకు దేవేంద్రుడు మిక్కిలి ఆశ్చర్యచకితుడైనాడు. అతని మనస్సులోని మాత్సర్యం మాయమైంది. అతనికి వృత్రాసురుడు భగవంతుడుగా కనిపించాడు. ఇంద్రుడు వంగి నేలపై పడిఉన్న తన వజ్రాయుధాన్ని మళ్ళీ అందుకున్నాడు. అదిచూచి లోకాలన్నీ ఆనందించాయి. దేవతలు సంతోషించారు.

**క. రాహుగ్రహ వక్త్ర మహా, గేహాంతము వాసి వచ్చి కిరణావళి స**
**ద్బాహుళ్య మొప్ప వెలిగెఁడు, నా హరిదశ్వుండు వోలె హరి యొప్పె నృపా! 418**

* వజ్రాయుధం ధరించిన దేవేంద్రుడు గ్రహణానంతరం రాహు గ్రహం ముఖంనుండి వెలువడి వేయి కిరణాలతో ప్రకాశించే సూర్యబింబంలాగా విరాజిల్లాడు.

**వ. ఇట్లు కరకలిత వజ్రాయుధ రుఙ్మండల మండిత దిఙ్మండలుండై జంభారి గంభీర వాక్యంబుల విస్మయ మందస్మిత ముఖారవిందుండై వృత్రున కిట్లనియె. 419**

* ఈ ప్రకారంగా తన చేతిలోని వజ్రాయుధ కాంతులు దిక్కుల నిండా వెలుగులు వెదజల్లుతుండగా ఇంద్రుడు ఆశ్చర్యంతో కూడిన చిరునవ్వు చిందే ముఖంతో వృత్రాసురుని తిలకించి గంభీరంగా పలికాడు.

**క. ఓ దానవేంద్ర! నీ మతి, వేదాంతము వోలె తత్త్వ విజ్ఞాన కళా**
**మోదము, నీ వతిభక్తుఁడ, వాదిమ పురుషునకు హరికి నబ్జాక్షునకున్. 420**

* ఓ రాక్షసరాజా! నీ బుద్ధి ఉపనిషత్తులవలె తత్త్వ విజ్ఞానంతో విరాజిల్లుతున్నది. దేవాదిదేవుడైన వాసుదేవుడికి నీవు ఆంతరంగిక భక్తుడవని తెలుసుకున్నాను.

**ఉ. లోకములెల్ల నిండి తన లోనుగ సర్వముఁజేసి ప్రాణులన్**
**దీకులఁ బెట్టి యెల్లెడలఁ దీపులు సూపెడి విష్ణుమాయ నేఁ**
**డేకమతిం దలంచి తిది యేల? మహాసురు రూపుమాని సు**
**శ్లోకు పురాణపూరుషుని శోభనమూర్తి ధరింపు మింపునన్. 421**

* తాను సమస్తలోకాలలో వ్యాపించి సకల భువనాలనూ తనలో ఇముడ్చుకొని ప్రాణులను చిక్కులలో బంధించి, చింతలలో ముంచి, వింతలు చూపించి వినోదించే విష్ణుమాయను నీవు ఏకాగ్రబుద్ధితో తెలుసుకోగలిగావు. ఇంకా ఆ భీకరమైన రాక్షసాకారం నీకెందుకు? దీనిని పరిత్యజించి పరమ పవిత్రమైన పురాణపురుషుని స్వరూపాన్ని ధరించు.

**ఉ. ఏ నియమంబు సల్పితివొ! యెట్టి మహాతప మాచరించితో**
**పూని రజోగుణాభిరతిఁ బొందిన నీ మతి శాంత దాంత స**
**న్మానస మానసానుభవ మత్తమరాళు నరోష భావ స**
**న్మాను నమేయు నా దనుజమర్దను భక్తి పొసంగె నెంతయున్. 422**

* ఎటువంటి దీక్షావ్రతాన్ని అవలంబించావో! ఎటువంటి మహా తపస్సు ఆచరించావో! రజోగుణమందు అనురక్తమైన నీ మనస్సు భగవంతుడైన జగన్నాథుని భక్తి యందు ఆసక్త మయింది. శమదమాది సద్గుణ సంపన్నమైన మహాత్ముల మానసమనే మానస సరస్సులో మైమరచి విహరించే రాజహంస నారాయణుడు. రోషద్వేషాలకు అతీతమైన భావాలంటే ఆయన కెంతో అనురాగం.

**క. నారాయణ రూపామృత, పారావారమునఁ దేలు భక్తుఁడు దా భూ**
**దారకృత ఖాత కోదక, పూరంబుల నేల తృప్తిఁ బొందు? మహాత్మా! 423**

* మహానుభావా! శ్రీమన్నారాయణుని ప్రేమస్వరూపమనే అమృతమహాసాగరంలో ఓలలాడే భక్తుడు పందిముట్టెలతో త్రవ్వబడిన పాటిగుంటలలోని మురికినీటిలో మునిగి మురిసిపోతాడా?

**వ. ఇట్లు పలుకుచున్న యింద్రు నుపలక్షించి, వృత్రాసురుం డాయోధన దుర్మర్షణ సంఘర్షమాణ మానసుండై వైరిం బురికొల్పుకొని, వామహస్తంబునఁ బరిఘంబు ద్రిప్పుచు, మత్సరంబునం గుప్పించుచు, బ్రహ్మాండకర్పరంబు నిష్ఠుర భైరవారావంబునం బగిలించుచు, సముత్తుంగ మత్త మాతంగ పుంగవంబు వృషభంబుపైఁ గదియు భంగి సురవృషభు పేరుర ముపలక్షించి, భీషణాశని నిపాత వేగంబునఁ గొట్టిన, నింద్రుండు కులిశధార నప్పరిఘంబుఁ దునిమి, తోడనే శేష ఫణా విశేష భాసురం బైన బాహు దండంబు ఖండించె, అప్పుడు వృత్రుండు భిన్న బాహుద్వయుం డై, రక్త ధారలం దోఁగుచు వజ్రిచేతఁ బక్షహతంబై దివంబుననుండి జాఱుచున్న కులపర్వతంబు నుంబోలెఁ జూపట్టి, ప్రళయకాల సంహార నిటలచ్ఛటచ్ఛ టార్భట కఠోర కీలాభీలాగ్ని సమాన క్రూర కుటిల నిరీక్షణ దుర్నిరీక్షుండై భూనభో మండలంబులఁ గ్రింది మీఁది దౌడల హత్తించి, నభోమండలం బునుం బోలెఁ దుది మొద లెఱుంగరాక, వికృతంబుగా వక్త్రంబు దెఱచి, మందర మథన మథ్యమాన విషధరజనిత విష విషమ జిహ్వాభీలం బగు నాలుక నభంబు నాకుచుఁ గాల సంహార కారణుం డైన**

**కాలుని భుజదండ మండితంబగు దండంబునుం బోని దంష్ట్రల చేత జగత్త్రయంబును మ్రింగెడు వానిం బోలె నతిమాత్ర మహాకాయుండై, పర్వతంబులం దలంగ మీటుచు, నడగొండయుంబోలె నభోభాగ భూభాగంబుల నాక్రమించి యప్పుడు. 424**

* ఈ విధంగా పలుకుతున్న ఇంద్రుణ్ణి వృత్రాసురుడు యుద్ధానికి పురికొల్పాడు. ఉత్సాహం ఉరకలు వేసే మనస్సుతో ఎడమచేతిలోని పరిఘాయుధం గిరగిర త్రిప్పుతూ కుప్పించి ముందుకు దుమికాడు. బ్రహ్మాండభాండం బద్దలయేటట్లు భయంకరంగా గర్జిస్తూ మదపుటేనుగు ఆబోతుపైకి దూకినట్లు ఇంద్రునిమీదికి లంఘించి తన ఇనుపగుదియతో అతని ఎదురురొమ్మును గురిచూచి కొట్టాడు. పిడుగుపడినట్లు తన గుండెలపై పడుతున్న ఆ పరిఘాన్ని సురేంద్రుడు తన వజ్రాయుధంతో రెండుగా ఖండించాడు. వెనువెంటనే పడగొపైకెత్తిన ఆదిశేషుని మాదిరిగా ఉన్న అతని బాహుదండాన్ని నరికివేశాడు. రెండు చేతులూ మొదలంట తెగిపోయి రక్తధారలు స్రవిస్తున్న వృత్రాసురుడు రెక్కలు నరుకగా దివినుండి భువికి జారుతున్న కులపర్వతంలాగా కన్పించాడు. ఆ రాక్షసరాజు ఆగ్రహంతో కనుబొమలు చిట్లించాడు. ప్రళయకాల మందలి భయంకర జ్వలనజ్వాలలవంటి క్రూరకఠోర వీక్షణాలతో తేరి చూడరానివాడై ఆకాశమంత నోరు తెరచి నింగికీ నేలకూ రెండు దవుడలను హత్తించాడు. సముద్రమథన సమయంలో మందర పర్వతానికి చుట్టబడి విషం గ్రక్కుతున్న వాసుకి నాలుకవంటి నాలుకను చాచి ఆకాశాన్ని నాకుతూ ప్రళయకాల దండధరుని బాహుదండంవంటి దంష్ట్రలతో ముల్లోకాలను మ్రింగబోతున్నట్లు కన్పించాడు. ఆ మహాకాయుడు కొండలను ఎగుర మీటుతూ నడిచివస్తున్న పెనుగొండవలె భూమ్యాకాశాలను ఆక్రమించి పరాక్రమించాడు.

**ఉ. కాలమునాఁటి మృత్యువుముఖంబునఁ బోలెను విస్ఫులింగముల్**
**గ్రాలఁగ దేవసంఘములు కంపము నొంద జగంబు లెల్ల నా**
**హా లులి తారవం బెసఁగ నభ్రగజంబును నాయుధంబుతో**
**నాలుకఁ జుట్టి పట్టి సురనాథుని మ్రింగె మహాద్భుతాకృతిన్. 425**

* కల్పాంతకాలం నాటి మృత్యుదేవత నోరువంటి అసురేంద్రుని నోటినుండి అగ్నికణాలు రాలాయి. అదిచూచి అమరులందరూ గడగడలాడారు. లోకాలన్నీ హాహాకారాలు చేస్తుండగా ఆ భయంకరాకారుడు నాలుకచూచి ఐరావతంతో వజ్రాయుధంతోసహ చుట్టి పట్టి అమాంతంగా ఇంద్రుణ్ణి మ్రింగివేశాడు.

**ఆ. లోకమెల్ల నపుడు చీకాకు పడెఁ దమం, బడరె నుడుగణంబు లవనిఁ బడియె,**
**సోనవానఁ గురిసె సూర్యచంద్రాగ్నుల, రశ్మ లుడిగె దిశలు రభస మయ్యె. 426**

* ఆ విధంగా వృత్రాసురుడు దేవేంద్రుణ్ణి మ్రింగేసరికి లోకాలన్నీ చీకాకుపడ్డాయి. అంతటా చిమ్మచీకట్లు క్రమ్ముకున్నాయి. నక్షత్రాలు నేల రాలాయి. రక్తవర్షం కురిసింది. సూర్యచంద్రాగ్నులు తేజస్సులు కోల్పోయారు. దిక్కులు తారుమారైనాయి.

వ. అప్పుడు. 427

ఉ. కందఁడు భీతిఁ గుందఁడు ప్రకంపన మొందఁడు పెద్దనిద్దురం
జెందఁడు దత్తఱింపఁడు విశేషము చెప్పఁడు వైష్ణవీ జయా
నందపరైక విద్యను మనంబునఁ దాల్చుచు నుండెఁగాని సం
క్రందనుఁ డానిశాచరుని గర్భములో హరిరక్షితాంగుఁడై. 428

* వృత్రాసురుని కడుపులోని దేవేంద్రుడు కసుగంద లేదు. భీతి చెందలేదు. కంప మొందలేదు. ప్రాణాలు కోల్పోలేదు. తత్తర పడలేదు. ఆనందమయమైన వైష్ణవీ విద్యను మనస్సులో ధ్యానించుతూ శ్రీహరి వల్ల రక్షణ పొందినవాడై చెక్కుచెదరక నిశ్చలంగా నిర్భయంగా ఉన్నాడు.

వ. ఇట్లు కవచరూప శ్రీమన్నారాయణ కృపాపాలితుండై యోగ బలంబున బలభేది యతని యుదరంబు వజ్రాయుధంబున భేదించి, యైరావణ సహితుం డై వెడలి, యతని కంధరంబు తెగనడువ వజ్రంబు ప్రయోగించిన, నతి నిష్ఠుర వేగంబున వృత్ర హరణార్థంబుగం దిరుగుచు సూర్యాది గ్రహ నక్షత్రంబులకు దక్షిణోత్తర గతిరూపంబైన సంవత్సర సంధియందు నహోరాత్ర మధ్యంబున వృత్రు శిరంబు పర్వత శిఖరంబునుం బోలెఁ ద్రుంచి కూలం ద్రోచె. నప్పుడు. 429

* నారాయణ కవచరూపంలో శ్రీమహావిష్ణువు కరుణాకటాక్షంచేత రక్షితుడైన సహస్రాక్షుడు యోగబలంవల్ల తన వజ్రాయుధంతో వృత్రాసురుని కడుపు ఛేదించాడు. ఐరావత సహితంగా బయటకు వచ్చిన వాడై వృత్రుని కంఠాన్ని ఖండించటానికి వజ్రాన్ని ప్రయోగించాడు. ఇంద్రుడు విసరిన వజ్రాయుధం అఖండమైన వేగంతో గిరగిర తిరుగుతూ సూర్యాది గ్రహాలూ, నక్షత్రాలూ సంచరించే దక్షిణోత్తరాయనాల నడిమికాలంలో సంవత్సర సంధిలో సాయం సంధ్యాసమయంలో వృత్రాసురుని శిరస్సును ఖండించింది. ఆ శిరస్సు తెగిన గిరిశిఖరంలాగా నేలమీద పడింది.

మ. మొరసెం దుందుభు లంబరంబునఁ గడున్ మోదించి గంధర్వులున్
సురలున్ సాధ్యులు సిద్ధులున్ మునివరుల్ సాంసార వృత్రఘ్ను భీ
కర తేజోవిభవ ప్రకాశకర విఖ్యాతైక మంత్రంబులం
దిర మొప్పం బఠియించుచుం గురిసి రెంతేఁ గ్రొత్త పూ సోనలన్. 430

* ఆ సమయంలో ఆకాశాన దేవదుందుభులు మ్రోగాయి. గంధర్వులూ, దేవతలూ, సాధ్యులూ, సిద్ధులూ, మునీంద్రులూ మిక్కిలి ఆనందించినవారై వృత్రసంహారం చేసి ఇంద్రుని తేజో వైభవాన్ని ప్రకాశింపజేసే ప్రశస్తతర మంత్రాలు పఠించుతూ పూలవానలు కురిపించారు.

ఆ. ఏమి చెప్ప నప్పు డింద్రారి తనువున, నొక్క దివ్యతేజ ముబ్బి వెడలి
లోకమెల్లఁ జూడ లోకంబు చూడని, లోక మరిగి విష్ణులోను సొచ్చె. 431

* ఆ సమయంలో వృత్రాసురుని శరీరంలోనుండి ఒకానొక దివ్య తేజస్సు వెలువడింది. ఆ కాంతిపుంజం లోకంలోని జనులంతా ఆలోకిస్తుండగా ఈ లోకంలో నుంచి విష్ణులోకానికి వెళ్లి విష్ణువులో ప్రవేశించింది.

**వ. ఇట్లు లోకభీకరుం డైన వృత్రాసురుండు గూలిన, నఖిల లోకంబులుఁ బరితాపంబు లుడిగి సుస్థితిం బొందె, దేవ ఋషి పితృగణంబులు దానవులతోడం గూడి, యింద్రునకుం జెప్పక తమ తమ స్థానంబులకుం జనిరి అనిన విని, పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రున కిట్లనియె. 432**

* ఈ విధంగా లోకభయంకరుడైన వృత్రుడు మృతుడు కావటంతో సమస్తలోకాలూ సంతాపం విడిచి సంతోషించాయి. దేవతలూ, ఋషులూ, పితృదేవతలూ, దానవులూ, అందరూ ఇంద్రునితో చెప్పకుండానే తమ తమ ప్రదేశాలకు వెళ్లిపోయారు.

**తే. ఏమి కారణమున నింద్రుతోఁ బలుకక, సురలు వోయి? రట్టి సురగణంబు**
**లెందుచేత సుఖముఁ జెందిరి? వజ్రికిఁ జేటు గలుగు టెట్లు? చెప్పు మయ్య! 433**

* అని చెప్పగా విని పరీక్షిన్నరేంద్రుడు శుకయోగీంద్రునితో "అయ్యా! శుకమహర్షి! దేవతలు ఇంద్రుణ్ణి పలుకరించకుండా, మాట మాత్రం చెప్పకుండా ఎందుకు వెళ్ళారు? అలా వెళ్లటంలో వారికి కలిగిన సుఖమేమిటి? దేవేంద్రుడికి అటువంటి దుర్దశ కలగటానికి కారణమేమిటి? నాకు వివరించు"అన్నాడు.

**వ. అనిన శుకుం డిట్లనియె. వృత్రపరాక్రమ చకితులైన నిఖిల దేవతలును మహర్షి గణంబులును, మున్ను వృత్రవధార్థం బింద్రునిం బ్రార్థించిన, నతండు బ్రహ్మహత్య చేయఁజాలక, తొల్లియు విశ్వరూపునిం జంపిన పాపంబు స్త్రీలయందును, భూమియందును, జలంబులందును, ద్రుమంబు లందును విభజించి పెట్టితి, ఇపు డీ హత్య యేరీతిం బాపుకొనువాఁడ? నా కశక్యంబు అనిన మహర్షు లశ్వమేధ యజ్ఞంబు సేయించి, యజ్ఞ పురుషుండైన శ్రీ నారాయణదేవుని సంతుష్టునిం జేసి, యీ హత్యఁ బాపం గలవారము. స్వభావంబున బ్రాహ్మణ పితృ గో మాతృ సజ్జన హంతలైనవార లే దేవునిం గీర్తించి శుద్ధాత్ము లగుదురు, అద్దేవుని నశ్వమేధ మహామఖంబున శ్రద్ధాన్వితుండవై సేవించిన నీకు ఖలుండైన యి ద్దురాత్ముని హింసించిన హత్య యేమి సేయంగలదు? అని యొడంబఱచిన, నింద్రుండు వల్లెయని యీ విధంబున శత్రుం బరిమార్చి, బ్రహ్మహత్యం బొంది, యప్పాపంబు భరియింప నోపక దుర్దశం బొందె. నప్పుడు. 434**

* పరీక్షిత్తు అడిగినదానికి శుకమహర్షి ఇలా సమాధానం చెప్పాడు- మొదట్లో వృత్రాసురుని పరాక్రమానికి భయకంపితులైన దేవతలూ మహర్షులూ అందరూ వృత్రుణ్ణి సంహరించుమని ఇంద్రుణ్ణి ప్రార్థించారు. అప్పుడు దేవేంద్రుడు బ్రహ్మహత్యాపాతకానికి భయపడి "నేను విశ్వరూపుణ్ణి చంపి బ్రహ్మహత్యకు లోనై నానాకష్టాలు పడ్డాను. ఆ పాపాన్ని స్త్రీలకూ, భూమికి, నీళ్లకూ, చెట్లకూ వేరువేరుగా పంచిపెట్టి ఎట్లాగో బైట పడ్డాను. మళ్లీ ఇప్పుడు బ్రహ్మహత్య చేసి ఈ మహాపాపాన్ని ఏవిధంగా పోగొట్టుకొనేది? ఈ పని నావల్ల కాదు" అన్నాడు. అందుకు మహర్షులు "నీచేత అశ్వ మేధయాగం చేయిస్తాం. యజ్ఞపురుషుడైన

శ్రీమన్నారాయణమూర్తికి సంతుష్టి కలిగించి ఆయన అనుగ్రహం వల్ల నీ కీ బ్రహ్మహత్యాపాతకం అంటకుండా చేస్తాం. వాస్తవానికి బ్రాహ్మణులనూ తల్లిదండ్రులనూ గోవులనూ సాధువులనూ హింసించిన వారు కూడా ఆ దేవదేవుని సంస్తుతించి పాపవిముక్తు లౌతారు. అశ్వమేధ మహాయజ్ఞం ద్వారా శ్రద్ధాభక్తులతో ఆ దేవాదిదేవుణ్ణి ఆరాధించి నట్లయితే దుర్మార్గుడైన వృత్రుణ్ణి సంహరించిన పాపం నిన్ను ఏమీ చేయలేదు"అని చెప్పి ఒప్పించారు. అప్పుడు ఇంద్రుడు సరేనని వృత్రవధకు అంగీకరించాడు. ఇప్పుడు ఈ విధంగా శత్రుడైన వృత్రుణ్ణి సంహరించిన ఇంద్రుణ్ణి బ్రహ్మహత్యాపాతకం చుట్టుకొన్నది. ఆ పాపాన్ని భరించలేక దురవస్థపాలై నాడు దేవేంద్రుడు.

**సీ. పాపంబుఁ జండాలరూపంబు గలదాని ముదిమిచే నొడలెల్లఁ గదలు దానిఁ**
**క్షయకుష్ఠరోగ సంచయకృతం బగు దాని నురురక్త పూరంబుఁ దొరఁగు దాని**
**నెరసిన వెండ్రుకల్ బెరసిన తలదాని నటఁ బోకుపో కుండు మనెడు దానిఁ**
**గదురు కంపునఁ బ్రేవు లదరఁ జేసెడుదానిఁ దా నెందుఁ బాఱినఁ దఱుము దాని**

**ఆ. నాగుణంబు లెల్ల భోగింప కేరీతి, నరుగ నెంతవాఁడ వనెడు దాని**
**బిట్టు దిరిగి చూచి భీతిల్లి సిగ్గుతో, దేవనాయకుండు దెఱలి పఱచె. 435**

* బ్రహ్మహత్య భయంకరాకారంతో దేవేంద్రుని వెంట బడింది. ఆ మహాపాపం చండాలరూపం ధరించి ముసలితనంతో ఒడలంతా ముడతలుపడి గడగడ వణుకుతూ నడచి వస్తున్నది. క్షయరోగంతో కుష్ఠరోగంతో దాని శరీరమంతా నెత్తుర్లు చిమ్ముతున్నది. నరసిన జట్టు విరబోసుకొని "ఆగు ఆగు!", "పోకు పోకు!", "ఉండు ఉండు!" అంటూ వెంటాడసాగింది. దేహమంతా దుర్గంధంతో డోకు వచ్చి పేగులు తరుక్కుపోయే కంపుకొడుతున్నది. ఇంద్రుడు ఏ ప్రక్కకుపోతే ఆ ప్రక్కకూ పరుగెత్తుతూ వెంటబడి తరుముతున్నది. "ఇదిగో! నాకు లోబడకుండా నన్ను అనుభవించకుండా ఎక్కడికి పోతావో ఎట్లా పోతావో చూస్తాగా. నీవెంత! నీ బండార మెంత!" అంటూ అరుస్తున్నది. వెంట పరుగిడి వస్తున్న బ్రహ్మహత్యను తిరిగి తిరిగి చూస్తూ భయంతో సిగ్గుతో దేవేంద్రుడు పారిపోసాగాడు.

**వ. ఇ ట్లతి వికృత రూపంబుతో బ్రహ్మహత్య వెనుతగుల నింద్రుండు నభోభాగ భూభాగ దిగ్భాగంబు లెల్లం దిరిగి, చొరం దెరువులేక దీర్ఘ నిర్వాతాటోప నిశ్వాస దూషితుండై, యీశాన్య భాగంబునకుం బఱచి, యద్దెస నమేయ పుణ్యాగణ్యంబైన మానస సరస్సుం బ్రవేశించి, యందు నొక్క కమల నాళంబు సొచ్చి, యందుఁ దంతువులం గలసి, రూపంబు లేక యలబ్ధభోగుండై, బ్రహ్మహత్యా విమోచనంబుఁ జింతించికొనుచు సహస్రవర్షంబు లుండె. ఆ చండాలియు నది పరమేశ్వర దిగ్భాగం బగుటం జేసి యందుం జొరరాక కాచియుండె, అంతకాలంబుఁ ద్రిదివంబున నహుషుండు విద్యాబల తపోబల యోగబలంబులం బాలించుచుండి, సంపదైశ్వర్య మదాంధుండై, యింద్రపత్నిం గోరి, యింద్రుండు వచ్చునందాఁక నాకుం బత్నివి గమ్మనిన, నా శచీదేవియును బృహస్పతి ప్రేరితయై,**

**బ్రహ్మర్షి వాహ్యశిబికంబు నెక్కివచ్చి, నన్ను భోగింపు మనిన, నతం డట్లు చేసి, కుంభ సంభవ శాపహతుండై, యజగర యోనియందుఁ బుట్టె. నంత నింద్రుండు బ్రహ్మర్షి గణోపహూతుండై, త్రిదివంబునకు వచ్చె. అంతకాలంబు నారాయణ చరణారవింద ధ్యానపరుండై యుండుటం జేసియు, దిశాధినాయకుం డైన శంకరుచేత రక్షింపఁబడ్డవాఁడై యుండుటం జేసియుఁ, ద ద్దోషబలంబుదఱిగి, సహస్రాక్షుం బీడింపలే దయ్యె. నప్పు డింద్రుండు నిజైశ్వర్యంబునుం బొంది, బ్రహ్మర్షి పరివృతుండై, మహిపురుషారాధనంబు చేసి, హయామేధాధ్వరంబునకుం దీక్ష గైకొని, బ్రహ్మర్షులచేతం యజనంబు సేయింపఁ బడుచున్న వాఁడై, సర్వదేవతా మయుండైన నారాయణుం బరితృప్తుం జేసి, మంచు విరియించు మార్తాండుని చందంబునఁ ద్వాష్ట్ర వధరూప పాపంబును నాశంబు నొందించి, సకల దివిజ యక్ష గంధర్వ సిద్ధ మునిజన సంస్తూయ మానుండయి త్రిభువనైశ్వర్య భోగభాగ్యంబులం గైకొనియె. అప్పుడు. 436**

* ఈ విధంగా పరమ వికారస్వరూపంతో బ్రహ్మహత్య వెంటబడి తరుమగా దేవేంద్రుడు ఆకాశమూ భూమి దిక్కులూ అంతటా తిరిగాడు. ఎక్కడా నిలబడటానికి వీలు చిక్కలేదు. ఎటూ తప్పుకోలేక చిట్టచివరకు వేడివేడి నిట్టూర్పులు విడుస్తూ ఈశాన్యదిక్కుకు పరుగెత్తాడు. ఆ దిక్కున ఉన్న అత్యంత పవిత్రమైన మానససరస్సులో ప్రవేశించాడు. ఆ సరోవరంలోని ఒక కమలనాళంలో దూరి ఆ తామరతూడులోని సన్నని తంతువులలో కలిసిపోయాడు. ఆ విధంగా అక్కడ ఆ మృణాళనాళంలో అదృశ్యరూపంలో ఐశ్వర్యదూరుడై బ్రహ్మహత్యా పరిహారంకోసం విచారిస్తూ వెయ్యి సంవత్సరాలు గడిపాడు. ఈశాన్యం పరమేశ్వరునికి సంబంధించినది కావటం వల్ల బ్రహ్మహత్య ప్రవేశించలేక అల్లంతదూరంలో కాచుకొని కూర్చుంది. ఆ సమయంలో నహుషుడనే రాజు స్వర్గానికి అధిపతి ఐనాడు. తన విద్యాబలం వల్లనూ, యోగబలం వల్లనూ సాధించు కొన్న స్వర్గరాజ్యాన్ని పరిపాలిస్తున్న నహుషుడు ఐశ్వర్య గర్వాంధుడై దేవేంద్రుని భార్య అయిన శచీదేవిని కాంక్షించాడు. "నీ భర్త ఇంద్రుడు వచ్చే పర్యంతం నీవు నాకు భార్యగా ఉండు" మని ఆమెను కోరాడు. శచీదేవి దేవగురువైన బృహస్పతి సూచనానుసారం "నీవు బ్రహ్మర్షులు మోస్తున్న పల్లకీని ఎక్కి నా దగ్గరకు వస్తే నీ కోరిక నెరవేరుతుం"దని అన్నది.

నహుషుడు శచీదేవి చెప్పిన ప్రకారం బ్రహ్మర్షులచేత తన పల్లకీ మోయించుకొని అగస్త్య మహర్షి శాపానికి పాత్రుడై అజగరరూపం ధరించి స్వర్గభ్రష్టుడైనాడు. అనంతరం దేవేంద్రుడు బ్రహ్మర్షులు ఆహ్వానింపగా స్వర్గానికి తిరిగి వచ్చాడు. ఇంతకాలంగా శ్రీమన్నారాయణుని చరణారవిందాలు ధ్యానిస్తూ ఉండటంవల్లా, వేయి సంవత్సరాలు పరమేశ్వరుని దిగ్భాగంలో ఉండి ఆయన కరుణకు పాత్రుడవటంవల్ల బ్రహ్మహత్య క్రమంగా క్షీణించిపోయి ఇంద్రుణ్ణి స్పృశింపలేక పోయింది.

అప్పుడు దేవేంద్రుడు ఎప్పటివలె స్వర్గాధిపత్యం వహించి బ్రహ్మర్షు లందరినీ ఆహ్వానించి ఆరాధించి అశ్వమేధయాగానికి దీక్ష స్వీకరించాడు. బ్రహ్మవేత్తలైన మహర్షులు చక్కగా జరిపించిన మహాయజ్ఞంచేత సకల దేవతా స్వరూపుడైన వాసుదేవుణ్ణి సంతృప్తుణ్ణి చేశాడు. ఇందువల్ల సూర్యుని కిరణాలకు మంచు కరగిపోయినట్లుగా త్వష్టకుమారుడైన వృత్రాసురుని చంపిన పాపం నశించిపోయింది.

ఈ విధంగా ఇంద్రుడు సమస్త దేవతలూ, యక్షులూ, గంధర్వులూ, సిద్ధులూ సంస్తుతించుతుండగా ముల్లోకాలకు అధీశ్వరుడై సకల భోగభాగ్యాలు అనుభవించాడు.

**చ. సతత మరీచి ముఖ్య మునిసంఘముచేత యథోచితంబుగాఁ**
**గృత ఘన వాజిమేధమునఁ గేశవు నీశుఁ బురాణ పూరుషున్**
**హితు జగదీశు యజ్ఞపతి నిష్టఫలప్రదు నంతరంగ సం**
**గతు భజియించి వజ్రి గతకల్మషుఁడై నెగడెన్ మహీశ్వరా! 437**

* ఈ ప్రకారంగా దేవేంద్రుడు మరీచి మొదలైన మహామునుల సహాయంతో యథావిధిగా అశ్వమేధయాగం కావించి యజ్ఞేశ్వరుడూ జగదీశ్వరుడూ పరమేశ్వరుడూ అయిన శ్రీమన్నారాయణుని సేవించి బ్రహ్మహత్యా పాతకాన్ని పోగొట్టుకొని పరిశుద్ధుడై ప్రకాశించాడు.

**సీ. మఱియుఁ బుట్టింపంగ మనసు వెట్టినయట్టి క్రూరకర్మాంభోధి కుంభజుండు**
**అంగారములు సేయ నాహుతిఁ గన నోపు బహు పాపకానన పావకుండు**
**కందక దిగమ్రింగి గఱ్ఱునఁ ద్రేపంగఁ గల్మషగరళ గంగాధరుండు**
**ఘనగుహాంతరములఁ గాలూన నియ్యని కలుష దుస్తర తమోగ్రహవిభుండు**

**ఆ. సకల ముక్తిలోక సామ్రాజ్య సమధిక, సహజ భోగ భాగ్య సంగ్రహైక**
**కారణాప్రమేయ కంజాక్ష సర్వేశ, కేశవాది నామ కీర్తనంబు. 438**

* శ్రీమన్నారాయణుడు పునర్జన్మకు కారణాలైన క్రూరకృత్యాలనే సముద్రాన్ని త్రాగివేసే అగస్త్య మహర్షివంటివాడు. మహాపాతకాలనే అరణ్యాలను భస్మంచేసే అగ్నిహోత్రునివంటివాడు. భక్త జనుల కల్మషాలనే కాలకూటాన్ని అలవోకగా కబళించే పరమశివునివంటివాడు. అంతులేని కలుషరాసులనే కటికచీకట్లను పటాపంచలు చేయటంలో ప్రభాకరునివంటివాడు. ఆ నారాయణదేవుని నామసంకీర్తనం సమస్తమైన మోక్షసామ్రాజ్యాన్ని సంపాదించి పెట్టి సకల భోగభాగ్యాలను సమకూరుస్తుంది.

**సీ. అఖిల దుఃఖైక సంహారాది కారణం బఖిలార్థ సంచ యాహ్లాదకరము**
**విమల భక్త్యుద్రేక విభవ సందర్శనం బనుపమభక్త వర్ణనరతంబు**
**విబుధహర్షానేక విజయ సంయుక్తంబు గ్రస్తామరేంద్ర మోక్షక్రమంబు**
**బ్రహ్మహత్యానేక పాప నిస్తరణంబు గమనీయ సజ్జన కాంక్షితంబు**

**తే. నైన యీ యితిహాసంబు నధికభక్తి, వినిఁ జదివిన వ్రాసిన ననుదినంబు**
**నాయు రారోగ్య విజయభాగ్యాభివృద్ధి, కర్మనాశము సుగతియుఁ గలుగు ననఘ! 439**

* వృత్రాసుర సంహారమనే ఈ ఇతిహాసాన్ని భక్తి పూర్వకంగా ప్రతిదినమూ పఠించినా, ఆలకించినా, వ్రాసినా ఆయురారోగ్యాలు ప్రాప్తిస్తాయి. భోగ భాగ్యాలు లభిస్తాయి. విజయశ్రీ వరిస్తుంది. కర్మక్షయమై

మోక్షం చేకూరుతుంది. ఈ ఇతిహాసం సమస్త దుఃఖాలనూ శమింప జేస్తుంది. కోరిన కోరిక లన్నింటినీ సమకూరుస్తుంది. అచంచలమైన భక్తిని అతిశయింప జేస్తుంది. మహాభక్తులయందు ఆసక్తి కలిగిస్తుంది. దేవతలందరికీ ఆనందాన్ని అందిస్తుంది. విజయాలను చేకూరుస్తుంది. బ్రహ్మహత్య మొదలైన పాపాలను సైతం పోగొడుతుంది. సత్పురుషులకు సర్వదా కాంక్షింపదగినట్టిది. శాపగ్రస్తుడైన దేవేంద్రునికి సైతం విముక్తి ప్రసాదించినట్టిది.

**సీ. నావుడు యోగీంద్ర! నా మనం బీ వృత్రు వివరంబు నీచేత విన్న మొదలు**
**కడు నద్భుతంబునఁ గళవళం బందెడుఁ, గోరి రజస్తమోగుణములందు**
**వర్తించు నీ పాపవర్తికి నేరీతి మాధవ పదభక్తి మది వసించె?**
**సత్త్వ స్వభావులై సమబుద్ధు లై తపో నియమ ప్రయత్నులై నిష్ఠచేత**

**తే. నిర్మలాత్మకు లై నట్టి ధర్మపరుల, కమరులకుఁ బుణ్యమునులకు నంబుజాక్షు**
**భూరి కైవల్య సంప్రాప్తి మూలమైన, భక్తి వీనికిఁ బోలె నేర్పాటు గాదు.** 440

* వృత్రాసురుని వృత్తాంతం అంతా విన్న అనంతరం పరీక్షిత్తు శుకమహర్షితో ఇలా అన్నాడు.

యోగీంద్రా! వృత్రుని వృత్తాంతం విన్నది మొదలు నా హృదయం ఆశ్చర్యంతో కళవళపడుతున్నది. ఏమంటే వృత్రుడు రజోగుణమూ తమోగుణమూ ప్రధానంగా ప్రవర్తించేవాడు. దుష్టస్వభావుడు.అటువంటి వానికి నారాయణుని పాదపద్మాలయందు భక్తి ఎలా సంభవించింది? సత్త్వగుణ సంపన్నులు, సమబుద్ధులు, తపోనిష్ఠులు, నిర్మల స్వభావులు, ధర్మమూర్తులు ఐన మహానుభావులకు దేవతలకు మహర్షులకు సైతం అలభ్యమై మోక్షానికి మూలకారణమైన భగవద్భక్తి పరమరాక్షసుడైన వీనికి ఎలా పట్టుబడింది?

**సీ. భూస్థలిఁ గల రేణువులకన్న దట్టమై కడు నొప్పు జీవసంఘములు గలవు,**
**ఆ జీవములలోన నరయ ధర్మాయత మతి వసించినవారు మనుజజాతి**
**యీ మనుష్యులలోనఁ గామంబు లెడఁబాసి మోక్షార్థు లగువారు మొదల నరిది,**
**మోక్షమార్గం బాత్మ మూలంబుగా నుండు వారిలో ముక్తులు లేరు తఱచు**

**తే. ముక్తు లై నట్టి వారిలో యుక్తిఁ దలఁపఁ, జాల దుర్లభుఁ డమిత ప్రశాంతి పరుఁడు**
**పరమ సుజ్ఞాన నిరతుండు భద్రగుణుఁడు, రమణ శ్రీవాసుదేవపరాయణుండు.** 441

* ఈ క్షోణీస్థలంలో రేణువులకన్నా అధికప్రమాణంలో ప్రాణిసముదాయం ఉన్నది. ఆ ప్రాణులలో ధర్మమార్గాన్ని అతిక్రమించకుండా ఉండేవారు మనుష్యులు. అటువంటి మనుష్యులలో కూడ కామ ప్రవృత్తిని పరిత్యజించి మోక్షాన్ని అభిలషించేవారు చాల తక్కువగా ఉంటారు. అటువంటి మోక్షార్థులలో సైతం మోక్షలక్ష్మిని కైవసం చేసుకున్నవారు అరుదు. ఆ విధంగా ముక్తులైన వారిలోకూడా శాంత స్వభావం కలిగి జ్ఞానవంతుడై సుగుణవంతుడై శ్రీమన్నారాయణ భక్తి పరాయణుడైనవాడు నూటికి ఏ ఒక్కడో లభిస్తాడు.

తే. సకలలోకాపకారి దుస్సంగతుండు, వృత్రుఁ డేక్రియ సుజ్ఞాన నిరతుఁ డయ్యె?
సమరమునఁ బౌరుషంబుచే నమరవిభుని, నెట్టు మెప్పించె? దీని నా కెఱుఁగఁ జెపుమ. 442

* అటువంటి సందర్భంలో సకలలోకకంటకుడూ, దుస్సాంగత్యం కలవాడూ అయిన వృత్రాసురుడికి ఇంతటి దివ్యమైన జ్ఞానం ఎలా సంప్రాప్తించింది! రణరంగంలో ధర్మయుక్తమైన పౌరుషంతో దేవేంద్రుణ్ణి ఎలా మెప్పించగలిగాడు? ఈ విషయమంతా నాకు వివరించి చెప్పు.

## -: చిత్రకేతూపాఖ్యానము. :-

వ. అని పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రు నడిగె నని సూతుండు శౌనకాది మునులకుం జెప్పి, మఱియు నిట్లనియె. అట్లు గజపురవల్లభుండు సంప్రశ్నంబు సేసిన బాదరాయణి హరిస్మరణ శ్రద్ధాపరుండై యిట్లనియె. తొల్లి కృష్ణద్వైపాయన నారద దేవల మహర్షులు నా కెఱింగించిన యితిహాసంబు గలదు దాని నెఱింగించెద. సావధానుండ వై యాకర్ణింపుము అని యిట్లనియె. 443

* ఈ విధంగా పరీక్షిన్నరేంద్రుడు శుకయోగీంద్రుణ్ణి ప్రశ్నించాడని పలికి సూతమహర్షి శౌనకాదులతో ఇలా అన్నాడు - అలా పరీక్షిత్తు అడిగేసరికి శుకమహర్షి శ్రద్ధాపూర్వకంగా శ్రీమన్నారాయణ సంస్మరణం చేసి ఈ విధంగా చెప్పసాగాడు.

పూర్వం వేదవ్యాసులవారూ, నారదులవారూ, దేవలమహర్షీ నాకు చెప్పిన వృత్తాంతం ఒకటున్నది. అది నీకు వినిపించుతాను, సావధానంగా విను.

చ. అమితవిభూతిఁ జాల నమరాధిపుఁ బోలుచు శూరసేన దే
శములకు భర్త యై ప్రజలు సంతస మందఁగ సార్వభౌముఁడై
క్షమ దన కెల్లకాలమును గామ దుహంబుగఁ జిత్రకేతు నా
మమునఁ బ్రసిద్ధి కెక్కెఁ గుణమండనుఁ డంచిత కీర్తికాముఁడై. 444

* పూర్వకాలంలో చిత్రకేతువనే మహారాజు శూరసేన దేశాలను ఏలుతూ ఉండేవాడు. అతడు అమితమైన ఐశ్వర్యంలో దేవేంద్రునితో సమానుడు. సుగుణభూషణుడు, యశోవిశాలుడు. ఆ చక్రవర్తి ఎల్లవేళలా భూమి తన కోరిన కోరికలు తీరుస్తూ ఉండగా ప్రజారంజకంగా పాలనం సాగించాడు.

సీ. మానిత తారుణ్య మదనతురంగులు కందర్ప విజయైక ఖడ్గలతలు
మదనసమ్మోహన మంత్రాధిదేవతల్ పంచశిలీముఖు బందెకత్తె
లసమాస్త్రుఁ డఖిలంబు నడకించు బొమ్మలు నాత్మసంభవుని కట్టాయితములు
పుండ్రేక్షుకోదండు భూరితేజంబులు శంబర విద్వేషి సాయకములు

తే. నాఁగఁ బొలుపారు నొకకోటి నళినముఖులు, దనకుఁ బత్నులు గాఁగ నత్యంత విమల
కీర్తివైభవ సన్మార్గవర్తి యగుచు, జగతిఁ బాలింపుచుండె నా జనవిభుండు. 445

* ఆ మహారాజుకు చాలమంది భార్యలున్నారు. వారందరూ చక్కని చుక్కలు. మన్మథుని పందెపుగుర్రాలో, చివురాకు బాకులో, విజయపతాకలో, సమ్మోహన మంత్రాలో, ఎక్కుపెట్టిన పుష్పబాణాలో, అందాల ఆటబొమ్మలో అన్నట్లున్న ఆ ముద్దుగుమ్మ లందరితో కూడిన వాడై అఖండ కీర్తివైభవంతో ఆ చక్రవర్తి సన్మార్గవర్తియై రాజ్యం చేస్తూ ఉన్నాడు.

తే. కలిమి వేవేలు భార్యలు గలిగియుండఁ, బరఁగ సంతతి యొకరునిఁ బడయ లేక
చిత్తమునఁ జాల బాయని చింత వొడమి, బడలఁ జొచ్చెను వేసవి మడువువోలె. 446

* చాలినంత సిరిసంపదలున్నా, వేలకొలది భార్యలున్నా ఆ భూకాంతునికి సంతానంలేని చింత తప్పలేదు. బిడ్డలు లేరనే దిగులుతో అతడు ఎండాకాలపు చెరువువలె నానాటికీ క్షీణించి పోసాగాడు.

ఉ. రూపము సత్ప్రతాపము మరుత్పతిభోగము యౌవనంబు సం
దీపిత చారువర్తనము దిగ్విజయంబును సత్యముం జగ
ద్వ్యాపిత కీర్తియున్ సతులు వైభవముఖ్యము లెల్ల మాన్పఁగా
నోపకయుండె నా నృపతి నొందిన సంతతిలేని దుఃఖమున్. 447

* చక్కని రూపం ఉన్నది. సాటిలేని ప్రతాపం ఉన్నది. దేవేంద్ర భోగం ఉన్నది. నిండు యౌవనం ఉన్నది.మంచి నడవడికి లోటు లేదు. దిగ్విజయాలకు కొరతలేదు. సత్యహృదయం ఉన్నది. సువిశాల యశస్సు ఉన్నది. చక్కదనాల రాణులు, లెక్కలేనన్ని సంపదలూ అన్నీ ఉన్నాయి. ఎన్ని ఉన్నా ఇవేవీ కూడా ఆ మహారాజుకు సంతతి లేని లోటును తీర్చలేకపోయాయి.

వ. ఇట్లు సంతతి లేక యతిదుఃఖ మానసుండైన యా నరేంద్రుని మందిరంబున కంగిరసుం డను మహాముని వచ్చి, యతని చేత నతిథిసత్కారంబులు వడసి, కుశలం బడిగి, రాజ్యంబు భవదధీనంబు కదా! పృథివ్యప్తేజో వాయ్వాకాశ మహదహంకారంబు లనియెడి యేడింటిచేత రక్షింపఁబడిన జీవుండునుం బోలె, నమాత్య జనపద దుర్గ ద్రవిణ సంచయ దండ మిత్రంబు లనెడి సప్తప్రకృతులచేత రక్షితుండ వై, ప్రకృతి పురుషులయందు భారంబు వెట్టి, రాజసుఖంబు లనుభవింతువు కదా! మఱియు దార ప్రజామాత్య భృత్య మంత్రి పౌర జానపద భూపాలురు నీకు వశవర్తులు గదా! సర్వంబునుం గలిగి సార్వభౌముండ వైన నీ వదనంబు విన్నఁదనంబు గలిగి యున్నయది. కతంబేమి? అనిన నా మునిప్రవరునకు నతండు, మీ తపోబలంబున మీకు నెఱుంగరాని యదియుం గలదే? అని తలవంచి యూరకున్న నతని యభిప్రాయం బెఱింగి, యా భగవంతుండైన యంగిరసుండు దయాళుండై, పుత్రకామేష్టి వేల్చి యజ్ఞశేష మతని యగ్ర మహిషి యైన కృతద్యుతి కిచ్చి నీకుం బుత్రుండు గలిగెడి. అతని వలన సుఖదుఃఖంబు లనుభవింపంగలవు అని చెప్పి చనియె. ఆ కృతద్యుతి యనుదేవి గర్భంబు ధరియించి, నవమాసంబులు నిండినం గుమారునిం గనియె. ఆ కాలంబున రాజును, సమస్త భృత్యామాత్య జనంబులును బరమానందంబునం బొందిరి. అపుడు చిత్రకేతుండు కృతస్నానుండై, సకల భూషణ భూషితుండై, సుతునకు జాతకర్మంబు నిర్వర్తించి, బ్రాహ్మణులకు నపరిమిత హిరణ్య రజత దానంబులును, వస్త్రా భరణంబులును, గ్రామంబులును, గజంబులును,

**వాహనంబులును, ధేనువులును, నాఁటేసి యర్బుదంబుల ద్రవ్యంబును దానంబుసేసి, ప్రాణి సముదాయంబునకుం బర్జన్యుండునుం బోలెఁ దక్కినవారలకు నిష్టకామంబులు వర్షించి, పరమానంద హృదయుండై యుండె. అంతం బుత్రమోహంబునం గృతద్యుతి యందు బద్ధానురాగుం డై మహీధవుండు వర్తింపుచుండం, దక్కిన భార్యలు సంతాన సంతోష వికలలై, యీ మోహంబునకుం గారణంబు పుత్త్రుండ యని యీర్ష్యం జేసి దారుణచిత్తలై కుమారునకు విషం బిడిన, సుఖనిద్రితుండు నుం బోలె బాలుఁడు మృతిఁ బొందె. అప్పుడు వేఁగుటయు దాది బోధింపం జని, యా కుమారుని వికృతాకారంబుఁ జూచి, విస్మయ శోక భయార్త్తయై పుడమిం బడి యాక్రందించె. నప్పుడు. 448**

ఈ విధంగా సంతానహీనుడై అత్యంత చింతాక్రాంతుడై ఉన్న ఆ మహీకాంతుని మందిరానికి ఒకనాడు అంగిరసుడనే మహాముని విచ్చేశాడు. వచ్చిన మహర్షికి చిత్రకేతుడు అర్ఘ్యపాద్యాదులతో అతిథి సత్కారాలు చేశాడు. ఆ మునీంద్రుడు నరేంద్రుణ్ణి కుశల మడుగుతూ ఇలా అన్నాడు.

“రాజా! నీ రాజ్యమంతా నీ అధీనంలో ఉన్నదికదా! పృథివి, జలం, అగ్ని, వాయువు, ఆకాశం, మహత్తు, అహంకారం అనే ఏడింటిచేత జీవుడు రక్షింపబడుతున్నట్లే ప్రభువైన నీవు అమాత్యులు, జానపదులు, దుర్గము, కోశము, వస్తుసంపద, దండనము, మిత్రులు అనే సప్తాంగాలచే సురక్షితంగా ఉన్నావుగదా! నీ రాజ్యభారం మంత్రులపై ఉంచి నీవు రాజభోగాలు అనుభవిస్తున్నావుగదా! నీ భార్యాపుత్రులూ సామంతరాజులూ అందరూ నీకు వశవర్తులై నీవు చెప్పినట్లు నడచుకొంటున్నారు గదా! సర్వసంపదలతో తులతూగే సార్వభౌముడవైన నీ ముఖం ఈ విధంగా చింతాక్రాంతమై ఉండటానికి కారణమేమిటి?''

అంగిరసుని పలుకులు విన్న చిత్రకేతుడు “మహానుభావా! మీరు తపస్సంపన్నులు. మీకు తెలియరానిది ఏముంటుంది!'' అని తలవంచి మరి మాటాడలేక మౌనం వహించాడు.

సర్వజ్ఞుడైన అంగిరసుడు మహారాజు అభిప్రాయం గ్రహించాడు. దయామయుడైన ఆ మహర్షి మహారాజుచేత “పుత్రకామేష్టి” అనే యజ్ఞాన్ని చేయించాడు. ఆ యజ్ఞశేషాన్ని రాజుగారి పెద్దభార్య అయిన కృతద్యుతికి అనుగ్రహించి “నీకు కుమారుడు జన్మిస్తాడు. అతని వల్ల నీవు సుఖదుఃఖాలు అనుభవిస్తావు” అని వెళ్ళిపోయాడు.

కృతద్యుతి గర్భం ధరించి నవమాసాలు నిండిన అనంతరం కుమారుణ్ణి కన్నది. మహారాజు అమాత్యులు భృత్యులు ప్రజలు అందరూ అపారమైన ఆనందం పొందారు. అప్పుడు చిత్రకేతుడు స్నానం ఆచరించి సకలాభరణాలు అలంకరించుకొని పుత్రునికి జాతకర్మ మహోత్సవం నిర్వర్తించాడు. బ్రాహ్మణులకు అపరిమితంగా బంగారం, వెండి, నూతన వస్త్రాలూ, ఆభరణాలూ, గ్రామాలూ, ఏనుగులూ, వాహనాలూ, గోవులూ పంచిపెట్టాడు. అంతేకాకుండా ఒక్కొక్కరికి ఆరేసి అర్బుదాల ద్రవ్యాన్ని కూడా దానం చేశాడు. ప్రాణిసముదాయానికి వర్షాధిదేవత అయిన పర్జన్యుడు వలె ఆ మహారాజు తన రాజ్యంలోని ప్రజలకు వాంఛితార్థాలు వర్షించి పరమానందభరితుడైనాడు.

రాజకుమారుడు జననీజనకులకూ బంధువర్గానికీ సంతోషాన్ని సమకూరుస్తూ దినదిన ప్రవర్ధమాను డౌతున్నాడు. చిత్రకేతు మహారాజు తన కుమారునిమీది వ్యామోహంతో పట్టపురాణి అయిన కృతద్యుతియందు బద్ధానురాగుడై ఉండటం తక్కిన భార్యలు సహించలేకపోయారు.

ఈ విధంగా మహారాజు తమకు దూరం కావటానికి కారణం ఈ కుమారుడేగదా అని భావించారు. ఈర్ష్యతో నిండిన కర్కశ హృదయాలతో వారు రాకుమారుడికి విషప్రయోగం చేశారు. పిల్లవాడు నిద్రించినవాడు నిద్రించినట్లే మరణించాడు. ఉదయాన నిద్రలేపుదామని వెళ్లిన దాదికి మంచంమీద రాజకుమారుని మృతకళేబరం కనిపించింది. ఆ వికృతదృశ్యాన్ని చూచి దాది ఆశ్చర్యంతో దుఃఖంతో భయంతో క్రిందపడి దొర్లుతూ పెద్దగా ఏడ్చింది.

**తరల. పుడమి నిట్టక నిల్వునం బడి పొక్కుచుం గడుదీనయై**
**యడఁకు వేమియు లేని వాక్కుల నావు రంచు విలాపమం**
**దెడరు తోఁప భృశాతురోన్నతి నేడ్చినన్ విని భీతితోఁ**
**గడుపు బిట్టవియంగ భూపతి కాంత గ్రక్కున నేగుచున్.** 449

* నిట్టనిలువుగా నేలమీద పడి దీనురాలై నోటమాటరాక గొంతెత్తి బావురుమంటూ ఏడుస్తున్న ఆ దాదికేకలు విని భయవిహ్వలయై పట్టపు రాణి కృతద్యుతి పరువెత్తుకుని అచ్చటికి వచ్చింది.

**ఆ. బాలుఁ డొక్కరుండు పరిణామశీలుండు, వంశకర్త తపసి వరము వలనఁ**
**బుట్టి మిన్న కట్లు పొలిసియున్నట్టి యా, కొడుకుఁ జూచి తల్లి యడలఁ జొచ్చె.** 450

* లేకలేక కలిగిన ఏకైకపుత్రుడు, చక్కగా పెరిగి పెద్దవుతున్న వాడు, వంశోద్ధారకుడు, మహర్షివరంవల్ల జన్మించినవాడు, - ఈ విధంగా గతప్రాణుడై పడిఉండటం చూచి తల్లి గుండె తల్లడిల్లింది. ఆమె పెద్దగా శోకించింది.

**ఉ. కుంకుమరాగ రమ్య కుచకుంభములన్ గడు కజ్జలంబుతోఁ**
**బంకిలమైన బాష్పములఁ బాల్పడ మజ్జన మాచరింపుచున్**
**కంకణపాణి పల్లవయుగంబున వక్షము మోఁదికొంచు నా**
**పంకరుహాక్షి యేడ్చెఁ బరిభావిత పంచమ సుస్వరంబునన్.** 451

* కుంకుమపూతలతో ఎర్రనై మిక్కిలి చక్కనైన వక్షోజాలు కాటుకకన్నీళ్లతో తడిసి పంకిలములు కాగా పట్టపురాణియైన కృతద్యుతి కంకణాలు ఘలుఘల్లుమని మ్రోగగా చిగురాకులవంటి చేతులతో రొమ్ము బాదుకుంటూ కోకిల కంఠస్వరంతో గొంతెత్తి గోడుగోడున దుఃఖించింది.

**క. ఆ యార్తరవమునకు భూ, నాయకుఁడు భయంబు నొంది నయ ముడిగి సుతున్**
**డాయఁగ వేగంబునఁ జని, పాయని మోహంబు తోడ బాలుని మీఁదన్.** 452

**స్రగ్విణి. వ్రాలి యో పుత్ర! నీ వార్త దంభోళియై, కూలఁగా వ్రేయ కీ కొద్ది న న్నేటికిన్**
**జాలి నొందించె? నా జాడ యిం కెట్టిదో?, తూలి మీ తల్లికిన్ దుఃఖ మె ట్లాఱునో?** 453

* ఆమె రోదనధ్వని విని మహారాజైన చిత్రకేతుడు భయవిహ్వలుడై గబగబ పరుగెత్తుకుని వచ్చి కుమారుని శవంమీదపడి "నాయనా! పిడుగువంటి నీ మరణవార్త ఒక్కమాటుగా నన్ను కూల్చి వేయకుండా ఎందుకు బ్రతికించిందిరా! ఈ దుఃఖాన్ని నేనెట్లా భరించేది? ఈ స్థితిలో నా గతి ఏమిటి? తండ్రీ! నీ కన్న తల్లి కడుపుమంట ఎట్లా చల్లారుతుంది?" అంటూ పరిపరివిధాల ఆక్రందించాడు.

**వ. అని తల మొల యెఱుంగక పలవించుచు, భృత్యామాత్య బంధుజనంబులం గూడి యడలుచు నున్న యా రాజు దుఃఖం బెఱింగి, యంగిరసుండు నారదునితోడం గూడి చనుదెంచి, మృతుండైన పుత్రుని పదతలంబున మృతుండునుం బోలె పడియున్న యా రాజునుం గనుంగొని యిట్లనియె.454**

* ఈ ప్రకారంగా తుదమొదలు తెలియబడని దుఃఖావేశంతో దాసదాసీజనంతో, మంత్రులతో, చుట్టాలతో కలిసి ఆక్రోశించుతున్న మహారాజు శోకవృత్తాంతం తెలుసుకొని అంగిరసుడు నారద సమేతుడై అచ్చటికి వచ్చాడు. మరణించిన కుమారుని కాళ్లవైపు నిశ్చేష్టుడై కూలబడి ఉన్న చిత్రకేతుణ్ణి చూచి ఇలా అన్నాడు.

**సీ. నీకు వీఁ డెవ్వఁడు? నీ వెవ్వనికి శోక సంతాప మందెదు సార్వభౌమ?**
**పుత్త్ర మిత్త్రాదులు పూర్వజన్మంబున నెవ్వని వారలో యెఱుఁగఁ గలరె?**
**మొదలు నదీవేగమున నాడ కాడకు సికతంబు గూడుచుఁ జెదరుచుండు,**
**నారీతిఁ బ్రాణుల కతికాల గతిచేతఁ బుట్టుట సచ్చుట పొసఁగుచుండుఁ**

**ఆ. గాన భూతములకుఁ గలుగు భూతంబులు, మమత తోడ విష్ణుమాయఁ జేసి**
**దీని కడల నేల? ధృతిఁ దూలఁగా నేల? బుద్ధిఁ దలఁప వలదె? భూత సృష్టి. 455**

* ఓ మహారాజా! నీకూ వీనికీ ఏమి సంబంధం ఉంది? ఇతడు నీకు ఏమౌతాడని ఇతడికోసం నీవు ఇంతగా దుఃఖిస్తున్నావు? ఈ పుత్రులూ మిత్రులూ మొదలైన వారంతా పూర్వజన్మంలో ఎవరికి మిత్రులో నీకు తెలుసునా? ఈ నీ కుమారుడు వెనుకటి జన్మలో నీ కుమారుడే అని నీకు నమ్మకం ఉన్నదా? నదిలో ప్రవాహవేగానికి ఇసుకు రేణువులు కొట్టుకొని పోతుంటాయి. అవి అక్కడక్కడా కుప్పలు కుప్పలుగా కలుస్తుంటాయి; మళ్లీ చెదరిపోతుంటాయి. అదే విధంగా ప్రాణులు కాలప్రవాహంలో కలుస్తూ విడిపోతూ ఉంటారు. పుడుతూ చస్తూ మళ్ళీ పుడుతూ ఉంటారు. దేహధారులకు జననమరణాలు తప్పవు. ఇదంతా భగవంతుని మాయావిలాసం. ఆ మాయవల్లనే జీవులకు జీవులు జన్మిస్తున్నట్లు కన్పించుతుంది. ఈ విషయంలో దైన్యం పొందటంగానీ ధైర్యం కోల్పోవటంగానీ సముచితం కాదు. ఈసృష్టి రహస్యాన్ని గుర్తించాలి.

**వ. మఱియు నేము, నీవును, దక్కిన వారలును బ్రవర్తమాన కాలంబునం గలిగిన జన్మంబు నొంది, మృత్యువు వలన విరామంబు నొందంగలవారమై యిపుడ లేకపోవుదుము. చావు పుట్టువులకు నిక్కువంబు లేదు. ఈశ్వరుండు దన మాయచేత భూతజాలంబుల వలనం భూతంబులం బుట్టించు, వాని నా భూతంబుల చేతనే రక్షించు. వాని నా భూతంబులచేతన హరించు. స్వతంత్రంబు లేని తన సృష్టిచేత బాలుండునుం బోలె నపేక్ష లేకయుండు. దేహియైన పితృదేహంబు చేత దేహియైన పుత్త్రదేహంబు మాతృదేహంబు వలనం గలుగుచుండు. ఆ ప్రకారంబున బీజంబు వలన బీజంబులు**

**పుట్టుచు నుండు. దేహికి నివి శాశ్వతంబై జరుగు చునుండు. పూర్వకాలంబున సామాన్య విశేషంబులు సన్మాత్రంబైన వస్తువులం దేవిధంబునం గల్పింపంబడియె, నా ప్రకారంబున దేహంబునకు జీవునకు నన్యోన్య విభాగంబు పూర్వకాలంబున నజ్ఞాన కల్పితం బయ్యె. జన్మఫలంబులను జూచుచున్న వారికి దహనక్రియల నగ్ని పెక్కు రూపంబులం గానంబడు భంగి, నొకండైన జీవుండు పెక్కుభంగుల వెలుంగుచుండు. ఇవి యన్నియు నాత్మజ్ఞానంబు చాలక దేహి దేహసంయోగంబున స్వప్నంబునందు భయావహం బైన ప్రయోజనంబు నడపుచుండి, మేలుకాంచి, యా స్వప్నార్థంబైన ప్రయోజనంబు తనది గాదని యెఱుంగుభంగి, జీవుండే తా నని జ్ఞానగోచరుండైన వాఁడెఱుంగు. కావున నన్నియును మనోమాత్రంబని తెలిసి, మోహతమంబు వాసి, భగవంతుండైన వాసుదేవుని యందుఁ జిత్తంబు వెట్టి, నిర్మలాత్మకుండ వగుము అని బోధించినం జిత్రకేతుండు లేచి వారల కిట్లనియె. 456**

* రాజా! మేము మీరు ఇంకా ఇక్కడ ఉన్నవారూ అందరమూ ప్రస్తుతకాలంలో జన్మించి కలిసి జీవించి ఉన్నాము. భవిష్యత్తులో మృత్యువు కబళించి వేస్తుంది. ఇప్పుడు కలిసి ఉన్నవాళ్లం అప్పుడు కలిసి ఉండము. కనుక జననమరణాలు అన్నవి యథార్థాలు కావు. భగవంతుడు తన మాయాప్రభావంతో జీవులనుండి జీవులను పుట్టిస్తుంటాడు. జీవులచేతనే జీవులను రక్షింపజేస్తుంటాడు. చివరకు ఆ జీవుల చేతనే జీవులను సంహరింపజేస్తుంటాడు. ఈశ్వరుడు స్వతంత్రుడు. సృష్టిలోని జీవులు అస్వతంత్రులు. బాలకుడు బొమ్మలతో ఆడుకొన్నంత సేపు ఆడుకుని మరుక్షణంలో వాని అపేక్షమాని ఉపేక్షించి మరొక ఆట ఆడుకొంటాడు. అదేవిధంగా ఈశ్వరుడు కూడా జీవుల విషయంలో క్రీడిస్తూ ఉంటాడు. దేహధారియైన తండ్రిదేహంవల్ల తల్లిదేహం నుంచి పుత్ర దేహం పుడుతూ ఉంటుంది. ఒక విత్తనం వల్ల మరొక విత్తనం పుట్టటం ప్రకృతిసిద్ధమైన ధర్మం. అదే విధంగా దేహధారులైన వారి విషయంలో ఈ ధర్మం శాశ్వతంగా జరుగుతూ ఉంటుంది. పూర్వకాలంలో సద్వస్తువుల యందు సామాన్య విశేషభావాలు కల్పితము లైనట్లుగానే దేహానికి జీవునికీ పరస్పరభేదం కల్పింపబడింది. మండుతున్న అగ్ని ఆయా స్థానాలను బట్టి మనకు వేరు వేరు రూపాలతో కనిపిస్తుంటుంది. అదే విధంగా ఒకే జీవుడు అనేకరీతులుగా మనకు గోచరిస్తుంటాడు. దేహికీ దేహానికీ గల భేదం అజ్ఞానకల్పితం. మనం కలలు కంటుంటాం. స్వప్నంలో ఏదో భయంకరమైన సన్నివేశాన్ని దర్శిస్తాం. భయకంపితుల మవుతాం. మెలకువ రాగానే అది పీడకల అని తెలుసుకుంటాం. ఆ భయంకర సన్నివేశాలు మనకు సంబంధించినవి కావని గుర్తిస్తాం. అదే విధంగా జ్ఞానవంతు డైనవాడు చుట్టరికాలూ సంబంధాలూ నిజం కావనీ తెలుసుకుంటాడు. కనుక ఈ జనన మరణాదులన్నీ మనోభావనలే కాని వాస్తవాలు కావని గుర్తించి అజ్ఞానాంధకారం నుంచి వెలువడి నిర్మలాత్ముడివై నీ చిత్తాన్ని వాసుదేవుని యందు లగ్నం చెయ్యి.

ఈ విధంగా ప్రబోధించిన అంగిరసుని పలుకులు ఆలకించి చిత్రకేతుడు ఊరట చెంది లేచి వారిని చూచి ఇట్లా అన్నాడు.

**సీ. యతివేషములు పూని యతి గూఢగతి నిందు నేతెంచినట్టి మీ రెవ్వరయ్య?**
**కడఁగి నన్ బోలిన గ్రామ్యబుద్ధుల నెల్ల బోధింప వచ్చిన పుణ్యమతులొ?**

రమణఁ గుమార నారద ఋష భాదులొ దేవ లాసితు లను ధీరమణులొ?
వ్యాస వసిష్ఠ దుర్వాస మార్కండేయ గౌతమ శుక రామ కపిల మునులొ?

తే. యాజ్ఞవల్క్యుండుఁ దరణియు నారుణియును, చ్యవన రోమశు లాసురి జాతుకర్ణ
దత్తమైత్రేయ వర భరద్వాజ బోధ్య, పంచ శిఖులొ? పరాశర ప్రభృతి మునులొ? 457

క. వీరలలో నెవ్వరు సుర, చారణ గంధర్వ సిద్ధ సంఘంబులలో
వారలొ? యీ సుజ్ఞానము, కారణమై యెవరియందుఁ గలదు తలంపన్? 458

* అయ్యా! మునీంద్రుల వేషాలు ధరించి రహస్యంగా ఇచ్చటికి విచ్చేసిన మీ రెవ్వరో చెప్పండి. నా వంటి మందబుద్ధులైన పామరులకు జ్ఞానం బోధించటానికి వచ్చిన పుణ్యమూర్తులా? సనత్కుమారాదులా? నారదఋషభులా? అసిత దేవలులా? వ్యాస వసిష్ఠులా? దుర్వాస మార్కండేయులా? శుక గౌతములా? కపిలపరశురాములా? లేక యాజ్ఞవల్క్యుడు, తరణి, ఆరుణి, చ్యవనుడు, రోమశుడు, ఆసురి, జాతుకర్ణుడు, దత్తాత్రేయుడు, మైత్రేయుడు, భరద్వాజుడు, పంచశిఖుడు, పరాశరుడు మొదలైన మహర్షుల లోనివారా? కాక సుర సిద్ధ చారణ గంధర్వ సముదాయాలకు చెందిన వారా? అటువంటి వారు కాకపోతే ఇంతటి గొప్పజ్ఞానం మరెవ్వరికి ఉంటుంది.

క. పొందుగ గ్రామ్య పశుత్వముఁ, బొంది మహాశోకతమముఁ బొందిన నాకున్
ముందఱ దివ్యజ్ఞానముఁ, జెందించిన వారి మిమ్ముఁ జెప్పుడు తెలియన్. 459

* పశుత్వం కూడిన మొఱటువాడినై పెనుశోకం చీకటిలో చీకాకు పడుతున్న నాకు దివ్యజ్ఞానాన్ని బోధింపవచ్చిన మీ రెవ్వరో తెలియ జెప్పండి?

వ. అనిన నంగిరసుం డిట్లనియె. నేను పుత్రకాంక్షివైన నీకుం బుత్త్రుం బ్రసాదించిన యంగిరసుండ. ఇతండు బ్రహ్మపుత్త్రుండైన నారదభగవంతుండు. దుస్తరంబైన పుత్త్రశోకంబున మగ్నుండ వైన నిను ననుగ్రహించి, పరమజ్ఞానం బుపదేశింప వచ్చితిమి. నీ దుఃఖం బెఱింగి, బుత్త్రు నిచ్చితి మేనిఁ బుత్త్రవంతులైన వారి తాపంబు నీచేత ననుభవింపంబడు. ఈ ప్రకారంబున లోకంబున సతులును, గృహంబులును, సంపదలును, శబ్దాదులయిన విషయంబులును, రాజ్యవైభవంబును జంచలంబులు. మఱియు రాజ్యంబును, భూమియును, బలంబును, ధనంబును, భృత్యామాత్య సుహృజ్జనంబులును మొదలయినవి శోక మోహభయ పీడలం జేయుచుండుం గాని సుఖంబుల నీ నేరవు. గంధర్వనగరం బునుం బోలె స్వప్న లబ్ధ మనోరథంబునుంబోని యర్థంబుఁ బాసి కానంబడుచు మనోభవంబులయిన యర్థంబులం గూడి స్వార్థంబులై కానంబడనేరవు. కర్మంబులచేత ధ్యానంబులు సేయుచుండు మనంబులు నానాకర్మంబు లగుచు నుండు, నీ దేహిదేహంబు ద్రవ్యజ్ఞాన క్రియా త్మకంబై దేహికి వివిధ క్లేశసంతాపంబులం జేయుచుండుఁ గావున నీవు నిర్మలంబయిన మనంబుచేత నాత్మగతి వెదకి ధ్రువం బయిన పదవి నొందు మనియె. అప్పుడు నారదుం డిట్లనియె, నుపనిషద్గోప్యం బగు నే నిచ్చు మంత్రం బెవ్వండేని సప్తరాత్రంబులు పఠియించు, నతండు సంకర్షణుండైన భగవంతునిం

**జూచు నెవ్వని పాదమూలంబు సర్వాశ్రయంబై యుండు నట్టి శ్రీమన్నారాయణుని పాదంబులు సేవించి యీ మోహంబు వదలి యతి శీఘ్రంబున నుత్తమ పదంబు నొందు, మిప్పు డిక్కుమారునకును నీకును బ్రయోజనంబు గలదేనిం జూడు మని నారదుండు మృతబాలకుని కళేబరంబుఁ జూచి యోజీవుండ! నీకు శుభం బయ్యెడు. ఇందుఁ బ్రవేశించి మీ తల్లిదండ్రుల బంధుజనులం జూచి వీరల దుఃఖంబు లార్చి యీ కళేబరంబునందుఁ బ్రవేశించి యాయుశ్శేషంబు ననుభవించి పిత్రధీనంబైన రాజ్యాసనంబునం గూర్చుండు మనిన న బ్బాలుం డిట్లనియె. 460**

* ఈ విధంగా అడుగుతున్న చిత్రకేతునితో అంగిరసుడు ఇలా అన్నాడు - నీవు పుత్రసంతానం కావాలని కోరినప్పుడు నీకు పుత్రుణ్ణి ప్రసాదించిన అంగిరసుణ్ణి నేను. ఈయన బ్రహ్మ మానస పుత్రుడైన నారదమహర్షి. తరింప శక్యంకాని పుత్రశోకంలో మునిగి ఉన్న నిన్ను అనుగ్రహించి నీకు పరమజ్ఞానాన్ని ఉపదేశించటం కోసం వచ్చాము. నీ దుఃఖాన్ని తెలుసుకొని ఇప్పుడు మళ్ళీ నీకు కుమారుణ్ణి ప్రసాదించినప్పటికీ బిడ్డలు గలవారికి కలిగే దుఃఖం తిరిగి నీకు కలుగుతుంది.

ఈ విధంగా ఈ లోకంలో భార్యలూ, గృహాలూ, సంపదలూ, శబ్దస్పర్శ రూపాదులైన విషయసుఖాలూ రాజ్యవైభవాలూ అన్నీ అశాశ్వతాలు. చివరకు దుఃఖాన్నే కలిగిస్తాయి. ఇంతేకాదు, భోగ భాగ్యాలు, పొలం, బలం, ధనం, భృత్యులు, అమాత్యులు, మిత్రులు మొదలైన సంబంధాలన్నీ శోకాన్నీ మోహాన్నీ భయాన్నీ బాధనూ కలిగించుతాయే కాని సుఖాన్ని చేకూర్చలేవు.

గగనంలో కన్పించే గంధర్వనగరంలాగా కలలో కన్పించే వస్తువులులాగా ఈ సంబంధాలన్నీ మాయమవుతూ మళ్ళీ గోచర మవుతూ ఉంటాయి. మన మనస్సులలో ధ్యానించు భావాలే మనకు స్వప్నంలో సాక్షాత్కరించి అదృశ్య మవుతుంటాయి. జీవిదేహం, ద్రవ్యం, జ్ఞానం, క్రియ అనే మూడు విధాలైన సంబంధాలతో కూడి ఉంటుంది. అటువంటి దేహం దేహధారి అయినవానికి నానావిధాలైన క్లేశాలను కలిగిస్తుంది. ఎన్నెన్నో చిక్కులు తెచ్చి పెడుతుంది.

అందువల్ల రాజా! నీవు నీ మనస్సును ఈ బంధాలలో చిక్కుకోకుండా నిశ్చలం చేసుకో! అటువంటి నిర్మలమైన మనస్సుతో ఆత్మజ్ఞానాన్ని అలవరచుకో! శాశ్వతమైన పదవిని అందుకో!

ఈ విధంగా అంగిరసుడు పలికిన అనంతరం చిత్రకేతుడితో నారదమహర్షి ఇలా అన్నాడు - "రాజా! ఉపనిషత్తులలో రహస్యంగా నిక్షిప్తమై ఉన్న ఒక మంత్రాన్ని నేను నీకు ఉపదేశిస్తాను. ఈ మంత్రాన్ని ఏడు రాత్రులు జపించిన వానికి భగవంతుడైన సంకర్షణుని దర్శనం సంప్రాపిస్తుంది. సమస్త విశ్వానికీ ఆశ్రయమైన శ్రీమన్నారాయణుని పాదాలు సేవించి అతడు మోహబంధాలను ఛేదించి అతిశీఘ్రంగా ఉత్తమగతిని పొందుతాడు. ఈ కుమారునికీ నీకూ ఎటువంటి సంబంధమూ లేదు. ఒకవేళ ఏదైనా ప్రయోజనం ఉన్నదనుకుంటావేమో! అయితే ఇప్పుడే పరీక్షించుకో" అని నారదుడు చనిపోయిన ఆ బాలుని కళేబరంవైపు చూచి " ఓజీవుడా! నీకు శుభం కలుగుగాక! నీవు మళ్ళీ ఈ దేహంలో ప్రవేశించు. మీ తల్లిదండ్రులనూ

బంధుమిత్రులనూ ఒక్క మాటు చూడు. వాళ్ల దుఃఖాన్ని పోగొట్టు. మిగిలిన ఆయుర్దాయమంతా ఈ శరీరంలోనే ఉండి మీ తండ్రిగారి సింహాసనాన్ని అధిష్ఠించు'' అన్నాడు. అప్పుడు ఆ బాలుడు ఇలా అన్నాడు-

**తే. కర్మవశమున నెందు సుఖంబు లేక, దేవ తిర్యఙ్న్ర యోనులఁ దిరుగు నాకు**
**వెలయ నే జన్మమందునొ వీరు తల్లి, దండ్రు లయినారు చెప్పవే తాపసేంద్ర! 461**

* "ఓ మునీంద్రా! నేను పూర్వకర్మవశంచేత ఎన్నో జన్మలు ఎత్తి ఎన్నెన్నో కష్టాలు పడ్డాను. చేసిన పాపపుణ్యాలను అనుసరించి దేవతల గర్భంలోనూ, మానవుల గర్భంలోనూ, తిర్యగ్జంతువుల గర్భంలోనూ జన్మించాను. ఆయా జన్మాలలో నా తల్లిదండ్రులు ఎంద రెందరో ఉన్నారు కదా! మరి ఈ తల్లిదండ్రుల దుఃఖం తీరిస్తే ఆ తలిదండ్రుల సంగతి ఏమిటి? వీరు ఏనాటి తల్లిదండ్రులు?

**తే. బాంధవజ్ఞాతిసుతులును బగతు రాత్మ, వరు లుదాసీన మధ్యస్థవర్గములును**
**సరవిఁ గనుచుండు రొక్కొక్క జన్మమునను, నెఱయఁ బ్రాణికి నొక వావి నిజము గలదె? 462**

* జీవునికి ప్రతిజన్మలోనూ చుట్టాలుగా దాయాదులుగా కుమారులుగా శత్రులుగా మిత్రులుగా నిర్లిప్తులుగా తటస్థులుగా అనేకులు అనేక సంబంధాలను కలిగిన వారుంటారు. వాస్తవానికి జీవునికి వీరెవ్వరితోనూ ఎటువంటి సంబంధమూ లేదు.

**తే. రత్నములు హేమములు ననురాగలీల, నమ్మకంబుల నీవల నావల నగు**
**భంగి నరులందు జీవుండు ప్రాప్తుఁ డగుచు, నెలమిఁ దిరుగుచునుండుఁ, దా నెందుఁ జెడఁడు.463**

* రత్నాలూ, బంగారునగలూ మన ఆసక్తివల్ల క్రయవిక్రయాలలో ఏ విధంగా ఇటూ అటూ చేరుతూ ఉంటాయో అదే విధంగా జీవుడు తన కర్మానుసారంగా సంచరిస్తూ ఉంటాడేకాని అతనికి ఏ బంధమూ అంటదు. అతనికి ఎటువంటి మార్పూ లేదు.

**సీ. ఒక్కఁడై నిత్యుఁడై యెక్కడఁ గడలేక సొరిది జన్మాదుల శూన్యుఁడగుచు**
**సర్వంబు నందుండి సర్వంబుఁ దనయందు నుండంగ సర్వాశ్రయుం డనంగ**
**సూక్ష్మమై స్థూలమై సూక్ష్మాధికములకు సామ్యమై స్వప్రకాశమునఁ వెలిఁగి**
**యఖిలంబుఁ జూచుచు నఖిల ప్రభావుఁడై యఖిలంబు దనయందు నడఁచి కొనుచు**

**తే. నాత్మమాయాగుణంబుల నాత్మమయము, గాఁగ విశ్వంబుఁ దనసృష్టి ఘనతఁ జెందఁ**
**జేయుచుండును సర్వసంజీవనుండు, రమణ విశ్వాత్ముఁ డయిన నారాయణుండు. 464**

* సర్వాంతర్యామీ సర్వేశ్వరుడూ పరమాత్ముడూ అయిన శ్రీమన్నారాయణుడు తన మాయా గుణాలతో ప్రపంచమంతటా తానే నిండిఉంటాడు. ఆయన శాశ్వతుడు. ఆయన అనన్యుడు. ఆయన సర్వవ్యాపి. ఆయన ఈ జగత్తుకే ఆత్మ అయినవాడు. ఎన్ని జన్మలెత్తినా అవి ఆయనకు అంటవు. ఆ పరాత్పరుడు అన్నిటిలోనూ ఉన్నాడు. అన్నీ ఆయనలో ఉన్నాయి. ఆయన సమస్తానికీ ఆశ్రయమైనవాడు.

స్థూలసూక్ష్మభేదాలకు అతీతుడు. స్వయంప్రకాశుడు. ఆయన తన సృష్టిని దీప్తిమంతం చేస్తూ ఉంటాడు. ఆయన సమస్తాన్నీ తనలో దాచుకుంచాడు.

క. సతు లెవ్వరు? సుతు లెవ్వరు?, పతు లెవ్వరు? మిత్ర శత్రు బంధు ప్రియ సం
గతు లెవ్వరు? సర్వాత్మక, గతుఁడై గుణసాక్షి యైన ఘనుఁ డొక్కనికిన్. 465

* సర్వాత్ముఁడూ సర్వసాక్షీ అయిన ఆ మహనీయునకు సతులూ సుతులూ అధిపతులూ మిత్రులూ శత్రులూ ప్రియులూ అప్రియులూ అంటూ లేరు.

## -: చిత్రకేతుండు తపం బాచరించి భగవత్ప్రసాదంబు నొందుట :-

వ. మఱియు సుఖదుఃఖంబులఁ బొందక సర్వోదాసీనుండై పరమాత్మయై యుండు న ప్పరమేశ్వర రూపుండ నయిన నాకును మీకు నెక్కడి సంబంధంబు? మీకు దుఃఖంబునకుం బని లేదని పలికి యా జీవుండు వోయినం జిత్రకేతుండును బంధువులు నతి విస్మిత చిత్తులై శోకంబులు విడిచి మోహంబులం బాసి యమునా నది యందు నక్కుమారునకు నుత్తరకర్మంబులు నిర్వర్తించిరి, చిత్రకేతుండు గాఢపంకంబునం బడి వెడలిన యేనుంగునుంబోలె గృహాంధకూపంబునందుండి వెడలి కాళిందీనదికిం బోయి యందు విధిపూర్వకంబుగఁ గృతస్నానుండై మౌనంబుతోడ నారదునకు నమస్కరించిన నతండు ప్రసన్నుండై భగవన్మంత్రంబు విధి పూర్వకంబుగా నతనికి నుపదేశించి యంగిరసుతోడం గూడి బ్రహ్మలోకంబునకుం జనియె. చిత్రకేతుండును నారదోపదేశ మార్గంబున నిరాహారుండై సమాధినియతుండై నారాయణ రూపంబయిన యా విద్య నారాధించి సప్తరాత్రాంతంబున నప్రతిహతంబయిన విద్యాధరాధిపత్యంబున భాస్వద్రత్న దివ్య విమానంబునుం బడసి నారాయణునను గ్రహంబునుం బొంది మనోగమనంబునం ద్రిజగంబులం జరియించుచుండఁ గొన్ని దినంబులకు నొక్కచోట. 466

* అందువల్ల సుఖదుఃఖాలకు అతీతుడనై అన్నిటియందు నిర్లిప్తుడనై పరమాత్మ స్వరూపుడనైన నాకూ మీకూ ఎటువంటి సంబంధమూ లేదు. మీరు నాకోసం దుఃఖింపవలసిన అవసరం లేదు.'' ఈ విధంగా పలికి ఆ బాలునిలోని జీవుడు వెళ్లిపోయాడు.

తరువాత చిత్రకేతుడూ అతని బంధువులూ ఆశ్చర్యచకితులై దుఃఖాన్నీ వ్యామోహాన్నీ విడిచిపెట్టారు. యమునానదికి వెళ్లి ఆ బాలుని శరీరానికి అంత్యక్రియలు కావించారు.

చిత్రకేతుడు చిక్కనైన బురదలోనుంచి బయటపడిన ఏనుగు లాగా సంసారమనే చీకటి బావినుండి బయటపడ్డాడు. యమునానదిలో శాస్త్రోక్తంగా స్నానం చేశాడు. మౌనంగా నారదమహర్షికి నమస్కరించాడు. నారదుడు ప్రసన్నుడై చిత్రకేతునికి నారాయణ మంత్రాన్ని ఉపదేశించి అంగిరసునితో పాటు బ్రహ్మలోకానికి వెళ్లి పోయాడు. చిత్రకేతుడు నారదమహర్షి బోధించిన విధంగా నారాయణ రూపమైన విద్యను నిరాహారుడై సమాధినిష్ఠుడై ఏడురాత్రులు అత్యంతదీక్షతో ఆరాధించి చివరకు అనన్య సామాన్యమైన విద్యాధర చక్రవర్తిత్వాన్నీ, రత్నఖచితమైన దివ్య విమానాన్నీ పొందాడు. శ్రీమన్నారాయణుని అనుగ్రహంచేత మనోవేగం గల విమానంలో ముల్లోకాలలోనూ సంచరింప సాగాడు.

సీ. తారహారపటీర ధవళ దేహమువాని రమణీయ నీలాంబరంబువాని
మణికిరీట స్ఫురన్మస్తకంబులవానిఁ గంగణకేయూర కరమువానిఁ
గర్బురమయదీప్త కటిసూత్రములవానిఁ దరళయజ్ఞోపవీతములవాని
నతిసుప్రసన్న వక్త్రాంబుజంబులవానిఁ దరుణవివృత్త నేత్రములవాని

ఆ. సిద్ధమండలంబు సేవింపఁ బుణ్యప్ర, సిద్ధి వెలసినట్టి యిద్ధచరితుఁ
బద్మలోచనునకుఁ బాదపీఠంబైన, ఘనునిఁ బన్నగేంద్రుఁ గాంచె నతఁడు. 467

* ఆ విధంగా విహరిస్తున్న విద్యాధరచక్రవర్తి చిత్రకేతుడు కొన్ని దినాలకు ఒకానొకచోట మహావిష్ణువుకు మంజుల పాదపీఠమై మహానుభావుడైన ఆదిశేషుణ్ణి సందర్శించాడు. ఆదిశేషుడు నక్షత్రాలవలె, ముత్యాలహారాలవలె, చందనంవలె తెల్లనైన దేహం కలిగి ఉన్నాడు.సుందరమైన నల్లని వస్త్రాలు ధరించాడు. రత్నకిరీటాలతో అతని శిరస్సులు విరాజిల్లుతున్నాయి. చేతులకు కంకణాలూ కేయూరాలూ అలంకరించుకొని ఉన్నాడు. తళతళ ప్రకాశించే మొలనూలు ధరించి ఉన్నాడు. నిగ నిగ మెరిసే యజ్ఞోపవీతాలతో అలరారుతున్నాడు. ఆయన ముఖకమలాలు ఎంతో ప్రసన్నంగా ఉన్నాయి. ఆయన నేత్రాలు గుండ్రముగా దీప్తిమంతములై మెరుస్తున్నాయి. సిద్ధుల సమూహం ఆయన చుట్టూ చేరి సేవిస్తూ ఉన్నారు. పరమపావనుడై సచ్చరిత్రుడై పద్మనాభుని పాదపీఠమైన పన్నగేంద్రుణ్ణి కన్నుల విందుగా కనుగొన్నాడు చిత్రకేతుడు.

ఆ. కన్నమాత్ర నతఁడు కల్మషంబులఁ బాసి, విమలచిత్తుఁ డగుచు విశదభక్తి
నిట్టరోమములకుఁ బట్టగు చానంద, బాష్పనేత్రుఁ డగుచుఁ బ్రణుతి సేసె. 468

* అటువంటి మహానుభావుడైన ఆదిశేషుణ్ణి ఆలోకించగానే చిత్రకేతుని దురితములన్నీ దూరంగా తొలగిపోయాయి. అతని మనస్సు నిర్మలమై భక్తితో నిండిపోయింది. ఒడలు పులకించింది. కన్నులలో ఆనందబాష్పాలు పొంగి పొరలాయి. ఆ విధమైన తన్మయత్వంతో విద్యాధర చక్రవర్తి భగవంతుడైన ఆదిశేషునికి ప్రణామం చేశాడు.

క. సంతోషాశ్రులచేత న, నంతునిఁ బరిషిక్తుఁజేసి యతఁడు ప్రమోదం
బెంతయు నరికట్టిన నొక, కొంతయుఁ బలుకంగలేక కొండొక వడికిన్. 469

* చిత్రకేతుడు తన సంతోష బాష్పధారలతో అనంతుని అభిషేకించాడు. పట్టరాని ఆనందంతో గద్గదకంఠుడై ఒక్క పలుకుకూడా పలుక లేకపోయాడు.

చ. మది నొకయింతమాత్రన సమంబుగఁ జేయుచు బాహ్యవర్తనం
గదిసిన యింద్రియంబుల నొకంతకుఁ దెచ్చి మనంబు వాక్కునుం
గుదురుగఁ ద్రోచి తత్త్వమునఁ గూర్చుచు శాశ్వత విగ్రహంబునా
సదయుఁ బ్రశాంతు లోకగురు సన్నుతి సేయఁదొడంగె నిమ్ములన్. 470

* ఆ విధంగా కొంతసేపైన తరువాత అతడు తన హృదయాన్ని కొంత కుదుటపరచుకొన్నాడు. ఇంద్రియాలను వశపరచుకొన్నాడు. మనస్సును మాటను సరిచేసుకొని శాశ్వతుడూ, దయామయుడూ, శాంతమూర్తీ, జగద్గురువూ అయిన ఆదిశేషుణ్ణి ఈ విధంగా స్తుతింపసాగాడు.

**క. అజితుఁడవై భక్తులచే, విజితుఁడ వైనాఁడ విపుడు వేడుక వారున్**
**విజితులు నీచేఁ గోర్కులు, భజియింపనివారు నిన్నుఁ బడయుదురె హరీ! 471**

* "ఓ అనంతా! నీవు అజితుడవైనా విజితుడవే. ఏమంటే పరులచే జయింప శక్యం కానివాడవైన నీవు భక్తులచే ఇప్పుడు జయింపబడినావు. ఆ భక్తులుకూడా నీచేత జయింపబడినవారై నీకు వశులై వర్తిస్తున్నారు. కోర్కెలను జయింపలేనివాడు నీ కరుణకు పాత్రుడు కాలేడు.

**ఉ. నీ విభవంబు లీ జగము నిండుట యుండుట నాశమొందుటల్**
**నీ విమలాంశజాతములు నెమ్మి జగంబు సృజించువార లో**
**దేవ! భగవద్గుణాంబుధుల తీరముఁ గానక యీశ! బుద్ధితో**
**వావిరిఁ జర్చచేయుదురు వారికి వారలు దొడ్డవారలై. 472**

* ఓ దేవా! ఈ లోకాలు పుట్టటం, పెరగటం, నశించటం అనేవి నీ లీలావిలాసాలు మాత్రమే. లోకకర్తలైనవారు నిర్మలమైన నీ అంశవల్ల జనించినవారే. వీరందరూ నీ గుణసముద్రంలో మునిగి తేలుతూ తీరాలు చేరలేక తమకు తామే ప్రభువులమనే భావంతో వాదులాడుకుంటూ ఉంటారు.

**క. పరమాణువు మొదలుగఁ గొని, పరమము దుదిగాఁగ మధ్యపరికీర్తనచే**
**స్థిరుఁడవు త్రయీవిదుఁడవై, సరి సత్త్వాద్యంత మధ్య సదృశగతుఁడవై. 473**

* స్వామీ! నీవు వేదవేత్తవు. ఆది మధ్యాంతాలు నీ వశంలో ఉంచుకున్నవాడవు. పరమాణువు మొదలుకొని పరమోత్కృష్టమైన పదార్థంవరకూ వ్యాపించి ఉన్నావు. నీవు శాశ్వతుడవు.

**తే. ఉర్వి మొదలైన యేడు నొండొకటికంటె, దశగుణాధికమై యుండు, దానినండ**
**కోశమందు, రజాండంబు కోటి యెవని, యందు నణుమాత్రమగు ననంతాఖ్యుఁ డతఁడు. 474**

* పృథ్వి, జలం, తేజస్సు, వాయువు, ఆకాశం అనే పంచభూతాలూ, మహత్తూ, అహంకారమూ అనే ఏడున్నూ ఒకదానికంటె పదిరెట్లు పెద్దవిగా కూర్చబడి ఉంటాయి. దీనినే అండకోశం అంటారు. ఇటువంటి బ్రహ్మాండాలు నీలో లెక్కలేనన్ని అణువులుగా ఏర్పడి ఉన్నాయి. ఈ విధంగా అంతు తెలియరాని అనంతుడవు నీవు.

**వ. మఱియు నొక్కచోటవిషయతృష్ణాపరులైన నరపశువులు పరతత్త్వంబవైన నిన్ను మానియైశ్వర్యకాములై తక్కిన దేవతల భజియింపుదురు, వారిచ్చు సంపదలు రాజకులంబునుంబోలె వారలం గూడి నాశంబునం బొందుచుండు, విషయకాము లేని నిన్ను సేవించినవారు వేఁచిన విత్తనంబునుం బోలె దేహాంతరోత్పత్తి నొందకుండుదురు, నిర్గుణుండవై జ్ఞానవిజ్ఞాన రూపంబు నొందియున్న నిన్ను**

**గుణసమేతునింగా జ్ఞానులు భావింతురు. నీ భజనం బేరూపున నయిన మోక్షంబు ప్రసాదించు. జితమతివైన నీవు భాగవత ధర్మం బే ప్రకారంబున నిర్ణయించితి, వా ప్రకారంబున సర్వోత్కృష్టుండ వయిన నిన్ను సనత్కుమారాదులు మోక్షంబు కొఱకు సేవించుచున్నారు. ఈ భాగవత ధర్మంబు నందు జ్ఞానహీనుం డొక్కండును లేఁ డన్యకామ్యధర్మంబునందు విషమబుద్ధిచేత నేను నీవు నాకు నీకు నని వచియించు చున్నవాఁ డధర్మనిరతుండై క్షయించుచుండు. స్థావర జంగమ ప్రాణి సమూహంబునందు సమంబైన భాగవతధర్మంబుల వర్తించుచున్న మనుజునికి భవద్దర్శనంబువలనఁ బాపంబు క్షయించుట యేమి చిత్రం? బిపుడు భవత్పాదావలోకనంబున నిరస్తాశయము లుండనైతి. మూఢుండ నయిన నాకుఁ బూర్వకాలంబున నారదుం డనుగ్రహించి భగవద్ధర్మంబు దయసేసె,నది నేఁడు నాకు వరదుండవైన నీకతంబున దృష్టంబయ్యె, ఖద్యోతంబులచేత సూర్యుండు గోచరుండు గానిమాడ్కి జగదాత్మకుండవైన నీ మహత్త్వంబు మనుజులచేత నాచరింపంబడి ప్రసిద్ధం బైనదిగా, దం దుత్పత్తిస్థితి లయకారణుండవై భగవంతుండవైన నీకు నమస్కరించెద నని మఱియును.475**

* ఇంద్రియార్థులకు వశులై విషయసుఖాలు మరిగి తిరిగే నర పశువులు పరమేశ్వరుడవైన నిన్ను విడిచి ఐశ్వర్యవాంఛతో ఇతర దైవాలను ఆరాధిస్తారు. ఆ దేవతలు ఇచ్చే సంపదలు రాజులిచ్చే మడిమాన్యాల వంటివి. ఆ మడిమాన్యాలు ఆ రాజులతోపాటు నశించిపోయిన విధంగా ఆ చిల్లర దేవతలిచ్చే సంపదలు వారితోపాటు నష్టమై పోతాయి. విషయవాంఛలను విడనాడి నిన్ను ఆరాధించేవారు వేయించిన విత్తనాలవంటివారు. వారికి దేహాంతరాలలో మొలకెత్తే ప్రసక్తి ఉండనే ఉండదు.

నిర్గుణుడవై కూడా జ్ఞానవిజ్ఞానరూపాలతో విరాజిల్లే నిన్ను జ్ఞానవంతు లైనవారు గుణవంతునిగానే భావిస్తారు. ఏ విధంగా ఆచరించినప్పటికీ నీ సేవ మోక్షాన్ని ప్రసాదిస్తుంది. నీవు నిర్ణయించిన భాగవత ధర్మానుసారంగా సనత్కుమారుడు మొదలైన మహానుభావులు మోక్షాన్ని కాంక్షించి సర్వేశ్వరుడవైన నిన్ను సంసేవిస్తారు.

భాగవత ధర్మాన్ని అవలంబించిన మహానుభావు లందరూ జ్ఞానవంతులే. వారిలో జ్ఞానహీనుడంటూ ఉండడు. మనసులోని కోరికలు తీర్చుకోవలెననే తహతహతో కామ్యకర్మలవెంట పరువులెత్తుతూ "నేను నీవు నాకు నీకు"అనే విషమబుద్ధి కలవాడు అధర్మపరుడై అధోగతి పాలవుతాడు. చరాచరములైన సమస్తజీవులయందు సమదృష్టి కలిగి భాగవత ధర్మానుసారం సర్వత్ర భగవంతుణ్ణి సందర్శించే వానికి పాపం పరిహారం కావటంలో ఆశ్చర్యం ఏముంది? ఇప్పుడు భగవంతుడవైన నీ పాదసందర్శనంవల్ల నాలోని దోషాలన్నీ పూర్తిగా నశించాయి.

మందబుద్ధినైన నన్ను నారదమహర్షి అనుగ్రహించి భాగవత ధర్మాన్ని నాకు ఉపదేశించాడు. అందువల్ల ఇప్పుడు భగవంతుణ్ణి దర్శింపగలిగాను. మిణుగురు పురుగులకు సూర్యుడు గోచరింపనట్లే సామాన్యమానవులకు జగదంతర్యామివైన నీ మహత్త్వం గోచరం కాదు. సృష్టిస్థితిలయాలకు హేతుభూతుడవై భగవంతుడవైన నీకు నమస్కరిస్తున్నాను.

తే. అరయ బ్రహ్మాదు లెవ్వని ననునయించి, భక్తియుక్తుల మనమునఁ బ్రస్తుతింతు
రవని యెవ్వని తలమీఁద నావగింజఁ, బోలు నా వేయిశిరముల భోగిఁ గొల్తు. 476

* బ్రహ్మాది దేవతలు వినయ వినమ్రులై నిన్ను ఆశ్రయించి భక్తితో స్తోత్రం చేస్తారు. ఈ సమస్త భూమండలం నీ శిరస్సు మీద ఆవగింజవలె ఉంటుంది. అటువంటి వేయిపడగల మహాభోగివైన నిన్ను సేవిస్తాను.''.

క. ఈ విధమున వినుతింపఁగ, నా విద్యాధరులభర్త కనియె ననంతుం
డో విమలబుద్ధి! నీ దగు, ధీ విభవంబునకు మెచ్చితిం బ్రియమారన్. 477

ఆ. అరయ నారదుండు నంగిరసుండును, దత్త్వ మొసంగినారు, దాని కతన
నన్నుఁ జూడఁగల్గె నా భక్తి మదిఁ గల్గె, నా పథంబు నీకు నమ్మఁ గలిగె. 478

* ఈ ప్రకారంగా విద్యాధర చక్రవర్తి అయిన చిత్రకేతుడు భగవంతుడైన ఆదిశేషుణ్ణి సంస్తుతించాడు. అప్పుడు అనంతుడు చిత్రకేతునితో ఇలా అన్నాడు - ఓ బుద్ధిమంతుడా! నిర్మలమైన నీ బుద్ధి వైభవానికి మెచ్చుకున్నాను. నీవు నాకు మిక్కిలి ఆత్మీయుడవైనావు. నారదుడు, అంగిరసుడు నా యథార్థస్వరూపాన్ని నీకు ఎరుగ చేశారు. అందువలన నీవు నన్ను దర్శింపగలిగావు. నీ హృదయంలో నా భక్తి భావాన్ని పదిలపరచుకున్నావు. నా మార్గంమీద నీకు నమ్మకం కలిగింది.

సీ. పూని నా రూపంబు భూతజాలంబులు, భూతభావనుఁడ నేఁ బొందువడఁగ
బ్రహ్మంబు మఱియు శబ్దబ్రహ్మమును శాశ్వతంబైన తనువులు దగిలె నాకు
నఖిలలోకములందు ననుగతంబై యుందు, లోకంబు నాయందు జోకఁ జెందు,
నుభయంబు నాయందు నభిగతంబై యుండు, నభిలీన మగుదు న య్యుభయమందు!

తే. వెలయ నిద్రించువాఁ డాత్మ విశ్వమెల్లఁ, జూచి మేల్కాంచి తా నొక్క చోటివానిఁ
గా వివేకించు మాడ్కి నీ జీవితేశ, మాయ దిగనాడి పరమధర్మంబుఁ దెలియు. 479

* ఈ జగత్తులోని సమస్తజీవులూ నా స్వరూపాలే. నేను భూత భావనుడను. ఈ సృష్టిలోని సమస్త రూపాలనూ నిర్దేశించేవాడను నేనే. బ్రహ్మమూ, శబ్దబ్రహ్మమూ రెండూ శాశ్వతమైన నా దేహాలు. ఆత్మస్వరూపుడ నైన నేను అఖిలలోకములందు నిండి ఉన్నాను. ఈ సమస్త జగత్తులు నాలో ఇమిడి ఉన్నాయి. ఈ రెండు స్థితులూ నాకు అనుకూలంగా నడుస్తూ ఉంటాయి. నేను ఈ రెంటిలో అంతర్లీనంగా ఉంటాను. నిద్రించేవాడు స్వప్నావస్థలో సమస్త విశ్వాన్నీ సందర్శించి మేల్కాంచిన అనంతరం తాను ఎక్కడ ఉన్నాడో తెలుసుకుంటాడు. అదే విధంగా జీవులు ఈ విశాల సృష్టియందు విహరించి విహరించి ఏదో ఒకనాడు భగవంతుని మాయ నుండి విడివడినవారై పరమార్థాన్ని తెలుసుకుంటారు.

ఆ. నిద్ర వోవువేళ నిరతుఁడై దేహి దా, నెట్టి గుణముచేత నింద్రియములఁ
గడచినట్టి సుఖముఁ గను, నట్టి బ్రహ్మంబుఁ, గడిమి మెఱయ నన్నుఁగా నెఱుంగు. 480

* జీవుడు నిద్రించే సమయంలో ఇంద్రియాలకు అతీతుడై ఉంటాడు. అతనిని గుణాలు ఏవీ స్పృశింపవు. అటువంటి ఇంద్రియాతీతమైన ఆనందస్థితినే బ్రహ్మంగా గుర్తించు, ఆ బ్రహ్మస్వరూపమే నేనుగా తెలుసుకో.

ఆ. స్వప్నమందు నెట్లు సంచార మొనరించు, మేలుకాంచి దృష్ట మోలి నెఱుఁగు
నుభయ మెఱుఁగునట్టి యుత్తమజ్ఞానంబు, తత్త్వ, మట్టిదైన తలఁపు నేను. 481

* జీవుడు స్వప్నంలో ఎక్కడెక్కడో ఎట్లెట్లో సంచరిస్తాడు. మేల్కొన్న అనంతరం తాను చూచినవాటిని అవగతం చేసుకుంటాడు. ఈ రెండు స్థితులనూ చక్కగా సమన్వయించుకొని ఒకటిగా గ్రహించటమే ఉత్తమజ్ఞానం. అటువంటి జ్ఞానమే నేనుగా గుర్తించు.

సీ. అరయంగ నెవ్వని కలవిగానట్టి యీ సలలిత మానుషజాతిఁ బుట్టి
యాత్మతత్త్వ జ్ఞానహతుఁడైన వానికిఁ గలుగునె యెందు సుఖం బొకింత?
వెలయఁ బ్రవృత్తినివృత్తి మార్గంబుల సుఖదుఃఖ చయముల సొరిదిఁ దెలిసి
పనిచెడి సంకల్పఫల మూలమునఁ బాటి కడు సుఖదుఃఖ మోక్షములకొఱకు

ఆ. దంపతి క్రియామతంబు వర్తింతురు, దాన మోక్ష మేల దక్కి యుండు?
నఖిల దుఃఖహేతు వయిన యీ కర్మంబు, నెఱఁగి నన్నుఁ దలఁప రిచ్చలోన. 482

* లోకంలో నరజన్మం పరమదుర్లభం. కావాలంటే లభించేది కాదు. అటువంటి ఉత్తమజన్మనెత్తి కూడా ఆత్మస్వరూపం తెలుసుకోకుండా తప్పుమార్గంలో పడినవానికి ఏ మాత్రం కూడా సుఖం లభింపదు. మానవులు సుఖప్రాప్తి కోసం దుఃఖనివృత్తి కోసం ప్రయత్నిస్తుంటారు. ప్రవృత్తిమార్గాన్నీ నివృత్తి మార్గాన్నీ అవలంబిస్తారు. కాని వారి సంకల్పం కోరికతో కూడినందువల్ల వారికి సుఖం ప్రాప్తించదు. దుఃఖం తొలగిపోదు.

కొందరు సుఖం కోసం దాంపత్యధర్మాన్ని ఆశ్రయిస్తారు. దీనిలో కూడా పరస్పరం వియోగం కలిగినప్పుడు విషాదం తప్పదు.అందువల్ల సంసారసంబంధంలో సైతం సుఖదుఃఖాలు ప్రాప్తిస్తూనే ఉంటాయి. నన్ను విస్మరించి దుఃఖకారణమైన ఈ బంధాలలో చిక్కుకున్నవారికి మోక్షం ఎట్లా దక్కుతుంది!

వ. మఱియు విజ్ఞానాభిమాను లయిన మనుష్యులకు నతి సూక్ష్మంబయిన యాత్మగతి నిజస్థానత్ర యలక్షణంబునఁ జతుర్థాంశంబు నెఱింగి యైహికాముష్మిక విషయంబులచేతను వివేక బలంబుచేతను నియుక్తుండై జ్ఞానవిజ్ఞాన సంతృప్తుండైన పురుషుండు నాకు భక్తుండగు నీ విధంబులు గలవారలు యోగ నైపుణ్య బుద్ధి గలవారలునై స్వార్థంబయిన యాత్మచేతం బరమాత్మను దెలియుచుందురు. నీవు నీ క్రమంబున మద్భక్తి శ్రద్ధాపరుండవై విజ్ఞాన సంపన్నంబులైన వాక్కులచేత స్తోత్రంబుసేసి ముక్తుండ వైతి వని యా శేషభగవంతుండు విద్యాధరపతియైన చిత్రకేతుం బలికి యతని కదృశ్యుండై పోయె. ఏ దిక్కున సర్వాత్మకుండైన యనంతుం డంతర్ధానంబు నొందె, నా దిక్కునకు

**విద్యాధర భర్త నమస్కరించి గగనచరుండై చని లక్షల సంఖ్యలైన దివ్య వర్షంబు లవ్యాహత బలేంద్రియుండై పరమయోగి పురుషులును దివ్యమునీంద్రులును సిద్ధచారణగంధర్వులును వినుతి సేయం గుల ద్రోణాది శైలంబులను రమ్యప్రదేశంబులను సంకల్పసిద్ధ ప్రదేశంబులను వినోదించుచు శ్రీనారాయణ దత్తంబగు దివ్యవిమానంబు నందుఁ జరియించుచు నుండి. 483**

* మనుష్యులు విజ్ఞానాన్ని అభిమానిస్తారు. అటువంటివారు జాగ్రత్ స్వప్న సుషుప్తులనే మూడు అవస్థలకు అతీతమై నాలుగవదైన ఆత్మస్వరూపాన్ని తెలుసుకోవాలి. అలా తెలుసుకొన్న పురుషుడు ఇహపరాలను చక్కగా గుర్తించినవాడై, యుక్తాయుక్త వివేకంతో కూడినవాడై, జ్ఞాన విజ్ఞానాలతో సంతుష్టుడై నాకు భక్తుడవుతాడు. ఇటువంటివారే యోగవిద్యలో నైపుణ్యం సంపాదించి ఆత్మను దర్శిస్తారు. ఆ ఆత్మానుభూతితో పరమాత్మను సందర్శిస్తారు. నీవు అదే విధంగా నాయందు శ్రద్ధాభక్తులు కలవాడవై విజ్ఞానసంపన్నములైన వాక్కులతో నన్ను స్తుతించి ముక్తుడవైనావు.

ఈ విధంగా విద్యాధరచక్రవర్తి అయిన చిత్రకేతునితో పలికి భగవంతుడైన అనంతుడు అంతర్ధానం చెందాడు.

చిత్రకేతుడు ఆదిశేషుడు అదృశ్యమైన దిక్కుకు నమస్కరించి ఆకాశమార్గాన పయనించి అవ్యాహతమైన బలమూ, ఇంద్రియ పటుత్వమూ కలవాడై పరమయోగి పుంగవులూ, దివ్యమునీంద్రులూ, సిద్ధచారణ గంధర్వులూ కొనియాడుతుండగా లక్షలకొలది దివ్యసంవత్సరాలు రమణీయ ప్రదేశాలలో సంచరించాడు. సంకల్పసిద్ధులైన మహానుభావులు నివసించే స్థలాలలో వినోదించాడు. శ్రీమన్నారాయణుడు అనుగ్రహించిన దివ్యవిమానంలో విహరించాడు.

**శా. ఆడించున్ హరి దివ్యనాటక గుణవ్యాపార నృత్యంబులం,**
**బాడించున్ జలజాత నేత్రబిరుద ప్రఖ్యాత గీతంబులం,**
**గూడించున్ సతతంబు జిహ్వలతుదిన్ గోవిందనామావళుల్**
**క్రీడం గిన్నరయక్ష కామినులచేఁ గృష్ణార్పితస్వాంతుఁడై. 484**

* చిత్రకేతుడు కిన్నరకాంతల చేత, యక్షకాంతల చేత జగన్నాటక సూత్రధారి అయిన శ్రీహరి దివ్యలీలలను గానం చేయించాడు. నాట్యం చేయించాడు. ఆ పుండరీకాక్షుని నామాలను నిరంతరం నాల్కలపై పలికించాడు. ఈ విధంగా కృష్ణుని యందే లగ్నమైన మనస్సుతో చిత్రకేతుడు ప్రవర్తించాడు.

**సీ. వాసించు నాత్మలో వైష్ణవ జ్ఞానంబు, నాశించు భాగవతార్చనంబు,**
**భూషించు నే ప్రొద్దుఁ బుండరీకాక్షుని, భాషించు హరికథా ప్రౌఢి మెఱసి,**
**ఘోషించు హరినామగుణనికాయంబులు, పోషించుఁ బరతత్త్వ బోధ మరసి,**
**సేవించు శ్రీకృష్ణ సేవకనికరంబు, సుఖమునఁ జేయు నీశునకు బలులు,**

**తే. పాడుఁ బాడించు వైకుంఠభర్త నటన, రూపవర్తన గుణనామ దీపితోరు**
**గీతజాతప్రబంధ సంగీత విధులఁ, గేశవ ప్రీతిగాఁ జిత్రకేతుఁ డెపుడు. 485**

* చిత్రకేతుడు మనస్సులో వైష్ణవజ్ఞానాన్ని పరిమళింపజేసుకొన్నాడు. భగవద్భక్తులను అర్చించాడు. ఎల్లప్పుడూ పుండరీకాక్షుణ్ణే కొనియాడాడు. శ్రీహరికథలనే చక్కగా వక్కాణించాడు. వాసుదేవుని సుగణాలనే ఎలుగెత్తి చాటాడు. పరతత్త్వాన్నే ప్రబోధించాడు. శ్రీకృష్ణ సేవకులనే సేవించాడు. విష్ణుదేవునకే నైవేద్యాలు సమర్పించాడు.గోవిందుని లీలావిలాసాలనే తాను పాడుతూ పాడించాడు. విష్ణునామ సంకీర్తనలను భగవత్ప్రీతిగా గానం చేయించాడు.

## -: చిత్రకేతుం డీశ్వరధిక్కారంబున గౌరిచే శాప మొందుట :-

మ. హరిఁ గీర్తించుచు నల్లనల్ల మదిలో నబ్జాక్షు సేవించుచుం
బరమానందము నొందుచున్ జగములం బ్రఖ్యాతి వర్తించుచున్
సురరాజోపమమూర్తి యక్షగణముల్ సొంపార విద్యాధరా
ప్సరసల్ గొల్వఁగఁ బాడఁగా సితగిరిప్రాంతంబున న్నేఁగుచున్. 486

* ఈవిధంగా విష్ణుదేవుని వినుతిస్తూ ధ్యానిస్తూ సేవిస్తూ పరమానందాన్ని పొందుతూ చిత్రకేతుడు లోకంలో పేరెన్నిక గన్నాడు. దేవేంద్రసన్నిభుడైన ఆ విద్యాధరచక్రవర్తి యక్షులూ, విద్యాధరులూ, అప్సరసలూ తనను చుట్టుకొని సేవిస్తూ ఉండగా కైలాసప్రాంతంలో సంచరింప సాగాడు.

శా. ఆ విద్యాధరభర్త గాంచె హరనీహారామృతాహాసమున్
శ్రీవిభ్రాజితమున్ నిరస్తగిరిజాసేవాగతాయాసమున్
దేవానీక వికాసమున్ శుభమహాదేవాంఘ్రి సంవాసమున్
భూవిఖ్యాత విలాసముం ద్రిభువనీ పూతంబుఁ గైలాసమున్. 487

* ఆ విద్యాధరచక్రవర్తి అక్కడ కైలాసపర్వతాన్ని దర్శించాడు. శివునివలె మంచువలె అమృతంవలె తెల్లగా ఆ వెండికొండ శోభిస్తున్నది. సిరిసంపదలతో విరాజిల్లుతున్నది. పార్వతీ పరమేశ్వరులను దర్శించటానికి వచ్చిన భక్తుల శ్రమను తొలగిస్తున్నది. దేవతలకు వికాసాన్ని సమకూరుస్తున్నది. మహాశివుని పాదపద్మస్పర్శచే పునీతమైనది. విశ్వవిఖ్యాతి కన్నది. లోకాలను పవిత్రీకరిస్తున్నది.

క. ఆ రజత భూధరంబున, నీరేజభవామరాది నికరము గొల్వం
బేరోలగమున నుండిన, గౌరీయుతుఁడయిన హరునిఁ గనియె నరేంద్రా! 488

* పరీక్షిన్నరేంద్రా! ఆ వెండి కొండపైన బ్రహ్మాది దేవతలు సేవిస్తుండగా పార్వతీ సమేతుడై కొలువుతీర్చి ఉన్న పరమేశ్వరుణ్ణి చిత్రకేతుడు తిలకించాడు.

సీ. తన నిజరూప మింతయు నున్కి దెలియక, వాదంబుసేసెడు వేదరవముఁ
గరుణావలోకనాకాంక్షితులై యున్న బ్రహ్మాది సనకసంప్రణుతిరవము
సారశివానంద సల్లాపముల నొప్పు ప్రమథగణాళి యార్భటరవంబు
డమరుమృదంగాది ధమధమధ్వనితోడి పటుభృంగి నాట్యవిస్ఫారరవము

తే. మానుగాఁ జామరలు వీచు మాతృకాది, కామినీజన మహిత కంకణరవంబు
మెండు జెలఁగఁగఁ గన్నుల పండువయ్యెఁ, గొండరాచూలి పెనిమిటి నిండుకొల్వు. 489

* ఆ పరమేశ్వరుని కొలువుకూటంలో ఒక ప్రక్క భగవంతుని యథార్థస్వరూపాన్ని తెలుసుకోలేక వేదాలు వాదించుకుంటున్నాయి. ఒక ప్రక్క పరమశివుని దాక్షిణ్యవీక్షణం కోసం నిరీక్షిస్తూ బ్రహ్మాది దేవతలూ, సనక సనందనాది దేవర్షులూ స్తోత్రాలు చేస్తున్నారు. ఒక ప్రక్క సదాశివుని సల్లాపములు చెప్పుకుంటూ ప్రమథగణాలు ఆనందంతో కేకలు వేస్తున్నారు. మరొకప్రక్క డమరుకం, మృదంగం మొదలైన వాద్యాల ధమధమ ధ్వనులతో భృంగి నాట్యం చేస్తున్నాడు. మరొక ప్రక్క వింజామరలు వీస్తున్న సప్తమాతృకల మణికంకణ నిక్వాణాలు వినిపిస్తున్నాయి. ఈ విధంగా వెండికొండమీద పరమేశ్వరుని నిండు కొలువు కన్నుల పండువు కావించింది.

వ. ఇట్లు బ్రహ్మాది సురనికర సేవితుండై యూరుపీఠంబున నున్న భవానిఁ గౌఁగిటం జేర్చుకొని యొడ్డోలగంబున నున్న పరమేశ్వరుం జూచి చిత్రకేతుండు పకపక నగి యద్దేవి వినుచుండ నిట్లనియె. 490

* బ్రహ్మాది దేవతాసమూహం పరివేష్టించి సేవిస్తుండగా తొడమీద కూర్చున్న పార్వతీదేవిని ఆదరంతో ఆలింగనం చేసుకొని నిండుకొలువున్న పరమేశ్వరుణ్ణి పరికించి చిత్రకేతుడు పకపకా నవ్వాడు. భవాని వినేటట్లు ఈవిధంగా పలికాడు-

సీ. కొమరొప్పఁగా లోకగురుఁడును గడలేని ధర్మస్వరూపంబుఁ దాన యగుచు
జడలు ధరించియు సరిలేని తపమునఁ బొడవైన యీ యోగిపుంగవులును
బ్రహ్మవాదులుఁ గొల్వ భాసిల్లు కొల్వులో మిథున రూపంబున మెలఁతతోడఁ
బ్రాకృతుండునుబోలె బద్ధానురాగుఁడై లాలితుం డయ్యె నిర్లజ్జత నిట

ఆ. నకట! ప్రకృతి పురుషుఁ డై నఁ దా నేకాంత, మందు సతులతోడ నలరుఁగాని
యిట్లు ధర్మసభల నింతులతోఁగూడి, పరిఢవింపలేఁడు భ్రాంతి నొంది. 491

* "అయ్యో! ఇదేమిటి? సకలలోకజనకుడూ, సర్వధర్మ స్వరూపుడూ ఐన పరమేశ్వరుడు జటాధారులూ, మహాతపస్సంపన్నులూ, యోగిపుంగవులూ, బ్రహ్మవేత్తలూ పరివేష్టించి సేవిస్తున్న ఈ మహాసభలో మామూలు మానవుడులాగా ప్రేమవివశుడై సిగ్గులేకుండా భార్యను కౌగిలించుకొని కూర్చున్నాడు. పామరుడు సైతం ఏకాంతంగా కాంతలతో విహరిస్తాడు. కాని ఈ విధంగా ధర్మసభలలో నెచ్చెలులతో కూడి విచ్చలవిడిగా సంచరింపలేడు. ఇదెక్కడి చోద్యం!"

క. అన విని పరమేశ్వరుఁ డా, తని నేమియు ననక నవ్వెఁ దత్సభవారుం
గనుఁగొని యూరక యుండిరి, మనుజేశ్వర! యీశుధైర్య మహి మెట్టిదియో? 492

* ఈ విధంగా పలుకుతున్న చిత్రకేతుడు పరిహాసవచనాలు విని శివుడు చిరునవ్వు నవ్వాడు. ఆ సభలోని వారంతా మౌనంగా ఉండి పోయారు.

వ. ఇట్లు దన పూర్వకర్మశేషంబున నింద్రియజయుండ నని పుట్టిన యహంకారంబున జగద్గురువుం
బెక్కు ప్రల్లదంబు లాడుచున్న చిత్రకేతుం జూచి భవాని యిట్లనియె. 493

* పూర్వజన్మలో చేసిన కర్మల ప్రభావం వల్లనో, జితేంద్రియుడనన్న అహంకారం వల్లనో జగజ్జనకుడైన పరమేశ్వరుణ్ణి పరిహసించుతున్న చిత్రకేతుణ్ణి చూచి పార్వతీదేవి ఇలా పలికింది -

క. మముబోఁటి లజ్జ లుడిగిన, కుమతులకుం గర్త యగుచుఁ గోపింపంగా
నమితాజ్ఞానిపుణుం డగు, శమనుండా నేఁడు వీఁడు జగముల కెల్లన్? 494

* "మావంటి వారిని సిగ్గుమాలిన వారనీ, మతిమాలిన వారనీ ఆక్షేపించటానికి ఆజ్ఞాపించటానికి తెగించిన మొనగాడా వీడు? జగన్నియంతా వీడు?

క. భృగునారద కపిలాదులు, నిగమాంతజ్ఞులును యోగనిర్ణయ నిపుణుల్
త్రిగుణాతీతు మహేశ్వరు, నగ రెన్నఁడు వారు ధర్మనయ మెఱుఁగరొకో! 495

* భృగుమహర్షి, నారదమహర్షి, కపిలమహర్షి మొదలైన వేదాంత వేత్తలూ యోగవిద్యా విశారదులూ సైతం త్రిగుణాతీతుడైన త్రినేత్రుని ఎప్పుడూ పరిహసించి ఎరుగరే! వారికి వీడి మాత్రం ఉచితానుచితాలు తెలియవా!

సీ. ఎవ్వని పదపద్మ మింద్రాది విబుధుల, చూడాగ్ర పంక్తుల నీడఁ జూచు,
నెవ్వని తత్త్వంబ దెనయంగ బ్రహ్మాది, యోగిమానసపంక్తి నోలలాడు,
నెవ్వని రూపంబు నేర్పాటు గానక వేదంబు లందంద వాద మడుచు
నెవ్వని కారుణ్య మీలోకముల నెల్లఁ దనిపి యెంతయు ధన్యతములఁ జేయు

తే. నట్టి సర్వేశుఁ బాపసంహారు ధీరు, శాశ్వతైశ్వర్యు నాత్మసంసారు నీశు
నెగ్గు పల్కిన పాపాత్ముఁ డెల్లభంగి, దండనార్హుండు గా కెట్లు దలఁగఁ గలఁడు? 496

* ఏ మహానుభావుని పాదపద్మాలు ఇంద్రాది దేవతల కిరీటకాంతులలో విరాజిల్లుతుంటాయో, ఏ దేవదేవుని సత్యస్వరూపాన్ని తెలుసుకోవటానికి బ్రహ్మాది మహాయోగుల మనస్సులు తహతహలాడు తుంటాయో, ఏ పరాత్పరుని స్వరూపాన్ని నిరూపింపలేక వేదాలు వాదులాడుతుంటాయో, ఏ సదయహృదయుని కరుణా కటాక్షవీక్షణం ఈ లోకాల కన్నింటికీ రక్షణ కల్పిస్తూ ఉంటుందో అటువంటి సర్వేశ్వరుణ్ణి, పాప సంహారుణ్ణి, ధీరోదాత్తుణ్ణి, నిత్యకల్యాణుణ్ణి, జగత్కుటుంబుణ్ణి, జగదీశ్వరుణ్ణి నోటికి వచ్చినట్లు ప్రల్లదాలు పలికిన ఈ పాపాత్ముడు తప్పనిసరిగా శిక్షార్హుడు. వీణ్ణి దండింపక తప్పదు.

తే. నిఖిలలోకాశ్రయంబు సన్నిహిత సుఖము, సకలభద్రైక మూలంబు సాధుసేవ్య
మైన కంజాక్షు పాదపద్మార్చనంబు, ననుసరింపంగ ఖలుఁడు వీఁ డర్హుఁ డగునె? 497

* వీడు విష్ణుభక్తుడట! సకలలోకాలకూ ఆధారమైనదీ, అర్థించిన వెంటనే సౌఖ్యాన్ని అందించేదీ, సర్వమంగళాలకూ మూలకారణమైనదీ, సజ్జనులకు సేవింపదగినదీ అయిన విష్ణుదేవుని పాదపద్మారాధనం చేయటానికి దుష్టుడైన వీడు ఎంత మాత్రమూ యోగ్యుడు కాడు.''

**వ. కావున నోరి! దురాత్మక! యీ పాపంబునం బాపస్వరూపంబైన రాక్షసయోనిం బుట్టుమని శపియించి యింతనుండి మహాత్ములకు నవజ్ఞ సేయకుండు మని పలికినఁ జిత్రకేతుండు విమానంబు డిగ్గి వచ్చి య ద్దేవికి దండప్రణామంబు లాచరించి కరకమలంబులు దోయిలించి యిట్లనియె. ఓ జగన్మాత! భవచ్ఛాప వాక్యంబులట్ల కైకొంటిఁ బ్రాచీన కర్మంబులం బ్రాప్తంబైన సంసార చక్రంబుచేత నజ్ఞాన మోహితులై తిరుగుచున్న జంతువులకు సుఖ దుఃఖంబులును నైజంబులై ప్రవర్తిల్లుచుండు నిందులకుఁ బరతంత్రులైన వా రాత్మ పరసుఖదుఃఖంబులకు నెవ్వరు కర్త లీగుణంబుల నిమిత్తమై శాపాను గ్రహంబులును స్వర్గనరకంబులును సుఖదుఃఖంబులును సమంబులు. భగవంతుం డొక్కండ తన మాయచేత జగంబులు సృజియించుచు వారివారికి బంధాదిరాగంబులు గలుగం జేయుచుఁ దాను వానికి లోనుగాక నిష్కళుండై యుండు, నీ విధంబునం బుట్టుచున్న నరునకుం బత్ని బంధుశత్రు మిత్రోదాసీనత్వంబు లెక్కడివి? వారి వారి కర్మవశంబునం బరమేశ్వరుండు కల్పించుచు సర్వసముండై యుండు. అప్పరమేశ్వరునకు సుఖ దుఃఖంబులచేత రాగంబు లేదు. రాగానుబంధంబైన రోషంబును లేదు. అతని మాయాగుణవిసర్గంబు జంతువులకు సుఖదుఃఖంబులను బంధమోక్షంబులను గల్పించుచుండుం గావున నీకు నమస్కరించుచున్న నన్ను ననుగ్రహింపుము. శాపభయశంకితుండం గాను. జగన్మాతవైన నిన్నుఁ బలికిన దోషంబునకు శంకించు చున్నవాఁడ నని దండప్రణామంబు లాచరించి పార్వతీ పరమేశ్వరులం బ్రసన్నులం జేసి తనవిమానం బెక్కి చనియె. నప్పుడు పరమేశ్వరుండు బ్రహ్మాది దేవర్షిదైత్యదానవ ప్రమథ గణంబులు వినుచుండఁ బార్వతి కిట్లనియె. నీకు నిప్పుడు దృష్టంబయ్యెఁగదా నారాయణదాసదాసానుచరుల నిస్పృహాభావంబు! హరితుల్యార్థదర్శనులై నిస్పృహులైన భాగవతులకు స్వర్గాపవర్గ నరక భేదభావంబులు లేవు. ప్రాణులకు దేహసంయోగంబు వలన నారాయణలీలం జేసి యుండి ద్వంద్వాదిసుఖదుఃఖంబు లాత్మయందు నజ్ఞానంబున భేదంబు సేయంబడియె, నిట్టి విపర్యయంబులు భగవంతుండయిన వాసుదేవునిభక్తి గలవారిం జెందవు, మఱియును. 498**

* ఈ విధంగా పలికి భవాని చిత్రకేతుణ్ణి చూచి ఇలా అన్నది - "ఓరీ దురాత్ముడా! నీవు చేసిన ఈ పాపకార్యానికి ఫలంగా పాపకార్యాలకు నెలవైన రాక్షసజాతిలో జన్మించు. ఇకముందైనా మహానుభావులైన వారిని అవమానించకు'' అని ఘోరంగా శపించింది. అప్పుడు చిత్రకేతుడు విమానంలో నుంచి దిగి పార్వతీదేవికి సాష్టాంగనమస్కారం కావించి కరకమలాలు మోడ్చి ఇలా పలికాడు - "ఓ జగజ్జననీ! నీ శాపాన్ని శిరసా వహిస్తున్నాను. పూర్వజన్మంలో చేసిన కర్మలవల్ల సంప్రాప్తించే సంసారచక్రంలో పడి అజ్ఞానంతో ప్రవర్తించే జీవులకు సుఖదుఃఖాలు సహజంగానే సంక్రమిస్తుంటాయి. ఈ విషయంలో అస్వతంత్రులైన వారు తమ సుఖదుఃఖాలకు కర్తలు కారు. అందువల్ల ఆగ్రహంకానీ, అనుగ్రహంకానీ, స్వర్గంకానీ, నరకంకానీ, సుఖంకానీ, దుఃఖంకానీ సమానమైనవే. భగవంతుడు మాత్రమే తన మాయతో లోకాలను సృష్టించి జీవులకు రాగద్వేషాలు కల్పిస్తూ

తాను మాత్రం వానికి లోనుకాకుండా అన్నిటికీ అతీతుడై ఉంటాడు. ఈ విధంగా జన్మించే మానవుడికి శత్రుత్వంకానీ, మిత్రత్వంకానీ, ఉదాసీనత్వం కానీ ఎక్కడ ఉన్నాయి? జీవులకు పూర్వకర్మానుసారంగా సుఖదుఃఖాలను భగవంతుడు కల్పిస్తూ ఉంటాడు. ఆయన సర్వసముడు. ఆ పరాత్పరునకు సుఖదుఃఖాల వల్ల కలిగే రాగద్వేషాలు అంటవు. ఆయన తన మాయావిలాసంతో ఈ లోకంలోని ప్రాణులకు సుఖ దుఃఖాలూ, బంధమోక్షాలూ కల్పిస్తూ ఉంటాడు. నీకు నమస్కరిస్తున్నాను. నన్ను అనుగ్రహించు. నీ విచ్చిన శాపానికి నేను భయశంకితుణ్ణి కావటంలేదు. జగజ్జననివైన నిన్ను నిందించిన పాపానికి భయపడుతున్నాను"అని పలికి చిత్రకేతుడు మరల పార్వతీ పరమేశ్వరులకు సాష్టాంగ ప్రణామం చేశాడు. వారిని ప్రసన్నులను చేసుకొని తన విమానాన్ని ఆరోహించి వెళ్ళి పోయాడు. అప్పుడు బ్రహ్మాది దేవతలూ, దేవఋషులూ, దైత్య దానవులూ, ప్రమథగణాలు వింటూ ఉండగా పరమేశ్వరుడు పార్వతితో ఇలా అన్నాడు - "దేవీ! విష్ణుభక్తులైన వారి దాసానుదాసుల నిర్లిప్త స్వభావం ఇప్పుడు నీకు అర్థమయింది కదా! విష్ణుభక్తులు సర్వత్రా నారాయణ స్వరూపాన్నే దర్శిస్తారు. నిస్సంగులైన భగవద్భక్తులకు స్వర్గం నరకం మోక్షం అనే భేదభావాలు ఏవీ ఉండవు. జీవులకు దేహ సంయోగం వల్లనూ, విష్ణుమాయావిలాసం వల్లనూ ద్వంద్వాది భావాలు కలుగుతుంటాయి. అజ్ఞానం వల్ల సుఖదుఃఖాలు విడివిడిగా కనిపిస్తుంటాయి. ఈ విధమైన ఎగుడు దిగుడులు, హెచ్చుతగ్గులు భగవంతుడైన వాసుదేవుని భక్తులకు ఏమాత్రమూ అంటవు.

**ఉ. నేనుఁ గుమారనారదులు నీరజ గర్భుఁడు దేవసంఘమున్**
**మానితయోగివర్యముని మండల మిట్లగు వార మందఱున్**
**దానవవిద్విడంశ జనితాత్ముల మయ్యుఁ దదీయ తత్త్వముం**
**గానఁగనేర, మీశు ఘనగర్వమునం దలపోసి చూచుచున్.** 499

* నేను, కుమారస్వామీ, నారదుడూ, బ్రహ్మదేవుడూ, సమస్త దేవతలూ, యోగివరేణ్యులూ, మునీశ్వరులూ అందరమూ శ్రీమన్నారాయణాంశ వల్ల జన్మించిన వారమే. అయినప్పటికీ ఆ విష్ణుతత్త్వాన్ని తెలుసుకోలేక పోతున్నాము. ఇందుకు కారణం అధికమైన ఆత్మాభిమానమే.

**క. ఆతనికిఁ బ్రియుఁ డ ప్రియుఁ, డే తెఱఁగున లేఁడు నిఖిల మెల్లను దానై**
**భూతముల కాత్మ యగుటయు, భూతప్రియుఁ డొక్కఁ డాదిపురుషుఁడు తన్వీ!** 500

* పార్వతీ! ఆ నారాయణునకు ఇష్టమైనవాడూ, ఇష్టంకానివాడు అంటూ ఎవడూ ఉండడు. ఎందువల్లనంటే ఆయన సర్వాంతర్యామి. సమస్తమూ తానే అయినవాడు. సర్వజీవులకూ ఆత్మ అయినవాడు. సకల జీవులకూ ప్రియమైన ఆదిపురుషుడు ఆయన ఒక్కడే.

**ఆ. అరయఁ జిత్రకేతుఁ డతిశాంతుఁ డతిలోక, సముఁడు విష్ణుభక్తి సంగతుండు,**
**నితని నేమి సెప్ప? నీశుండ నగు నేను, నువిద! యచ్యుత ప్రియుండఁ జుమ్మి!** 501

* ఈ చిత్రకేతుడు మిక్కిలి శాంతస్వభావం కలవాడు. లోకాతీతులైన మహానుభావులతో సమానుడు. విష్ణుభక్తుడు. ఈ చిత్రకేతుణ్ణి గురించి ఎంతైనా చెప్పవచ్చు. సర్వేశ్వరుడనైన నాకు కూడా ఆ శ్రీమన్నారాయణుడంటే ఎంతో ఇష్టం.

**క. కావున భగవద్భక్తుల, భావమునకు విస్మయంబు పనిలేదు మహా**
**ధీ విభవశాంత చిత్తులు, పావన పరతత్త్వనిపుణ భవ్యులు వారల్. 502**

* కావున ఓ దేవీ! భగవద్భక్తులైన వారి స్వభావానికి ఆశ్చర్యపడ వలసిన పనిలేదు. వారు ఎంతో బుద్ధిమంతులు. ప్రశాంతచిత్తులు. పరమ పవిత్రమైన భగవత్తత్త్వాన్ని బాగా అవగతం చేసుకున్న పావన చరిత్రులు వారు."

**వ. అనిన విని యద్రినందన విస్మయంబు మాని శాంతచిత్త యయ్యె, నట్లు పరమభాగవతుండయిన చిత్రకేతుం డద్దేవికిఁ బ్రతిశాపం బియ్య సమర్థుం డయ్యును మరల శపింపక యతి శాంత రూపంబునఁ దచ్ఛాపంబు శిరంబున ధరియించె. ఇట్టి సాధులక్షణంబులు నారాయణ పరాయణు లయిన వారలకుంగాక యొరులకుఁ గలుగ నేర్చునే? యిట్లు శాపహతుండయిన చిత్రకేతుండు త్వష్ట సేయు యజ్ఞంబున దక్షిణాగ్ని యందు దానవయోనిం బుట్టి వృత్రాసురుం డన విఖ్యాతుండయి భగవద్జ్ఞానపరిణతుం డయ్యెం గావున.503**

* పరమేశ్వరుడు ఈ విధంగా పలుకగా పర్వతరాజపుత్రి ప్రసన్నురాలయింది. పరమభాగవతుడైన చిత్రకేతుడు మళ్ళీ శపించటానికి శక్తి కలవాడైనా పల్లెత్తు మాట పలుకలేదు. శాంతచిత్తంతో ఆ దేవి శాపాన్ని శిరసా వహించాడు. పరీక్షిన్నరేంద్రా! ఇటువంటి ఉత్తమ లక్షణాలు నారాయణ సేవా పరాయణులైన మహాత్ములకు తప్ప ఇతరులకు సంభవింపవు కదా!

ఈ విధంగా శాపోపహతుడైన చిత్రకేతుడు త్వష్ట అనే ప్రజాపతి చేస్తున్న యజ్ఞంలో దక్షిణాగ్ని మధ్యం నుండి దానవుడుగా జన్మించాడు. వృత్రాసురుడనే పేరుతో ప్రసిద్ధి గాంచాడు. పరిణతమైన భగవత్తత్త్వంతో ప్రకాశించాడు.

**సీ. నరనాథ! యీ వృత్రునకు రాక్షసాకృతి గలిగిన యీ పూర్వకారణంబు**
**చిరపుణ్యుఁ డయినట్టి చిత్రకేతు మహానుభావంబు భక్తితోఁ బరఁగ విన్నఁ**
**జదివినవారికి సకల దుష్కర్మముల్ శిథిలంబులై కడుఁ జెదరిపోవు**
**సకలవైభవములు సమకూరుఁ దమయంతఁ దొల్కాడు కోర్కులతోడఁ గూడి**

**ఆ. నిర్మలాత్ము లగుచు నిత్యసత్యజ్ఞాన నిరతు లగుచు విగత దురితు లగుచు**
**బంధుమిత్ర పుత్ర పౌత్రాదులను గూడి యనుభవించుచుందు రధిక సుఖము. 504**

* రాజా! విన్నావుకదా వృత్రాసురుని పూర్వజన్మ వృత్తాంతాన్ని, ఈ కారణంవల్ల విద్యాధరచక్రవర్తి అయిన చిత్రకేతునికి రాక్షసజన్మ లభించింది. చిత్రకేతుని పవిత్రచరిత్రాన్ని భక్తితో చదివినవారికీ ఆలకించినవారికీ పాపాలన్నీ పటాపంచ లవుతాయి. సమస్త వైభవాలూ సంప్రాప్తిస్తాయి. కోరిన కోరికలు నెరవేరుతాయి. అటువంటి వారు నిర్మల హృదయులై నిత్యసత్య వ్రతులై నిరస్తకల్మషులై బంధువులతో, మిత్రులతో, పుత్రులతో, పౌత్రులతో కూడినవారై అపార సౌఖ్యాలను అనుభవిస్తారు.

## -: సవితృ వంశ ప్రవచనాది కథ :-

సీ. వినవయ్య! నరనాథ! విశదంబుగాఁ ద్వష్టృ వంశంబు సెప్పితి, వాని వెనుక
సవితృండు పృశ్నియు సావిత్రి వ్యాహృతి యను భార్యలందు నింపారు వేడ్క
నగ్నిహోత్రంబుల నరయంగఁ బశుసోమ పంచయజ్ఞంబులఁ బరఁగఁ గనియె,
భగుఁడు సిద్ధిక యను భార్యకు మహిమానుభావుల విభవులఁ బడసె మువురఁ

ఆ. దనయ నొకతెఁ గాంచెఁ దదనంతరమున నా, తరళనేత్ర సద్వ్రతస్వధామ
పుణ్యశీల సుగుణ పూరిత చారిత్ర, యఖిలలోక పూజ్య యాశిషాఖ్య! 505

* పరీక్షిన్నరేంద్రా! వింటున్నావుగా. నీకు త్వష్ట అనే ప్రజాపతి వంశాన్ని వివరించాను. సూర్యవంశాన్ని వినిపిస్తాను విను -

అదితి దేవికి జన్మించిన పన్నెండు మంది ఆదిత్యులలో అయిదవవాడు సవిత. అతడు పృశ్ని అనే ఆమెను పెండ్లాడాడు. ఆమె సావిత్రి, వ్యాహృతి, త్రయి అనే పుత్రికలనూ, అగ్నిహోత్రము, పశుయాగము, సోమయాగము, పంచమనోయజ్ఞాలు అనే పుత్రులనూ కన్నది.

అదితి పుత్రులలో ఆరవవాడైన భగుడు సిద్ధిక అనే ఆమెను వివాహమాడాడు. ఆమె మహిముడు, విభుడు, ప్రభుడు అనే ముగ్గురు కుమారులనూ ఒక కుమార్తెనూ కన్నది. ఆ అమ్మాయి పేరు ఆశిష. తళతళ మెరిసే కన్నులు గల ఆ చిన్నది సువ్రతయై, పుణ్యశీలియై, సుగుణవతియై, సుచరిత్రయై అఖిల లోకాలకూ ఆరాధ్యురాలై పేరెన్నిక గన్నది.

వ. మఱియు ధాతకుఁ గల కుహూ సినీవాలీ రాకానుమతు లని యెడు నలువురు భార్యలలోఁ గుహూదేవి సాయమను సుతునిం గాంచె, సినీవాలి దర్శాఖ్యునిం బడసె, రాక ప్రాతరాఖ్యునిఁగాంచె, ననుమతి పూర్ణిమాఖ్యునిఁ గనె, విధాత క్రియయను భార్యయందు నగ్నిపురీష్యాదులం గనియె, వరుణునకుఁ జర్షిణి యను భార్యయందుఁ బూర్వకాలంబున బ్రహ్మపుత్త్రుండయిన భృగువును వల్మీకంబునం జనియించిన వాల్మీకియు నుదయించిరి. మిత్రావరుణులకు నూర్వశియందు రేతోద్గమంబైన, దానిఁ గుంభంబునం బ్రవేశింపం జేయ నందు నగస్త్యుండును వసిష్ఠుండును జనియించిరి. ప్రత్యేకంబ మిత్రునకు రేవతియందు నుత్సర్గసంభవులైన యరిష్టయుఁ బిప్పలుండును ననువారలు జనియించిరి. శుక్రునకుఁ బౌలోమియందు జయంత ఋషభ విదుషు లన ముగ్గురు పుట్టిరి. వామనుం డయిన యురుక్రమ దేవునకుఁ గీర్తియను భార్యయందు బృహచ్ఛ్లోకుండు పుట్టె, నా బృహచ్ఛ్లోకునకు సౌభగాదులు పుట్టిరి. మఱియు మహాను భావుండయిన కశ్యపప్రజాపతికి నదితియందు శ్రీమన్నారాయణుం డవతరించిన ప్రకారంబు వెనుక వివరించెద. దితిసుతులైన దైతేయుల వంశంబు సెప్పెద. ఆ దైతేయ వంశంబునం బ్రహ్లాద బలులు పరమ భాగవతులై దైత్యదానవ వందితులై

**వెలసిరి. దితి కొడుకులు హిరణ్యకశిపు హిరణ్యాక్షులనఁ బ్రసిద్ధి నొంది, రందు హిరణ్యకశిపునకు జంభాసుర తనయయైన కయాధువను వధువునకుఁ బ్రహ్లాదానుహ్లాద సంహ్లాదహ్లాదులను నలుగురు కొడుకులును సింహికయను కన్యకయు జన్మించి, రా సింహికకు రాహువు జనియించె. నా రాహువు శిరం బమృతపానంబు సేయ హరి దన చక్రంబునం ద్రుంచె. సంహ్లాదునకు గతి యను భార్యయందుఁ బంచజనుండు పుట్టె. హ్లాదునకు దమని యను భార్యయందు వాతాపీల్వలులు పుట్టిరి. వారల నగస్త్యుండు భక్షించె. అనుహ్లాదునకు సూర్మ్యయను భార్యయందు బాష్కలమహిషులు గలిగిరి. ప్రహ్లాదునకు దేవి యను భార్యయందు విరోచనుండు పుట్టె. నతనికి బలి జన్మించె. నా బలికి నశన యను భార్యయందు బాణుండు జ్యేష్ఠుండుగా నూర్వురు గొడుకులు పుట్టిరి. ఆ బలి ప్రభావంబు వెనుక వివరించెద, బాణాసురుండు పరమేశ్వరు నారాధించి ప్రమథగణంబులకు ముఖ్యుండయ్యె, మఱియు నా దితిసంతానంబులగు మరుత్తులేకోన పంచాశత్సంఖ్యగలవార, లందఱు ననపత్యులై యింద్రునితోఁ గూడి దేవత్వంబు నొంది రనిన విని పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రున కిట్లనియె. 506**

* ఏడవ ఆదిత్యుడైన ధాత అనేవానికి కుహువు, సినీవాలి, రాక, అనుమతి అనే నలుగురు భార్యలు. వారిలో కుహూదేవికి సాయంకాలమనే కుమారుడు పుట్టాడు. సినీవాలికి ధర్ముడనే తనయుడు జన్మించాడు. రాకకు ప్రాతఃకాలమనే నందనుడు ఉదయించాడు. అనుమతి పూర్ణిమాఖ్యుడైన పుత్రుణ్ణి కన్నది.

ఎనిమిదవ ఆదిత్యుడు విధాత. అతని భార్యపేరు క్రియ. ఆమె పురీష్యాదులైన అగ్నులను ప్రసవించింది తొమ్మిదవ ఆదిత్యుడైన వరుణుడు చర్షిణి అనే ఆమెను వివాహమైనాడు. ఈ దంపతులకు పూర్వ బ్రహ్మపుత్రుడైన భృగువూ, వల్మీకసంభవుడైన వాల్మీకీ పుత్రులైనారు.

అదితి కుమారులలో ఏడవవాడు మిత్రుడు. ఆ మిత్రుణ్ణీ వరుణుణ్ణీ కలిపి మిత్రావరుణు లంటారు. ఈ మిత్రావరుణులకు ఊర్వశివలన రేతస్సు స్ఖలనమైంది. దానిని ఒక కడవలో ఉంచగా అందులోనుంచి అగస్త్యుడు, వసిష్ఠుడు జన్మించారు. ఈ మిత్రావరుణులలో మిత్రునకు రేవతి అనే భార్యయందు ఉత్సర్గుడు, అరిష్కుడు, పిప్పలుడు అనే ముగ్గురు పుత్రులు పుట్టారు. అదితి దేవికి పదకొండవ కుమారుడు ఇంద్రుడు. ఇతని భార్య శచీదేవి. ఈ దంపతులకు "జయంతుడు, ఋషభుడు, విదుషుడు అనే కుమారులు ఉదయించారు. అదితి కుమారులలో పన్నెండవవాడు వామనుడనే త్రివిక్రమదేవుడు. ఆయన భార్య కీర్తి. ఈ దంపతులకు బృహత్శ్లోకుడు ఉదయించాడు. అతనికి సౌభగుడు మొదలైన తనయులు జనించారు. మహానుభావుడైన కశ్యపప్రజాపతికి, అదితికీ శ్రీమన్నారాయణుడు వామనుడై అవతరించిన వృత్తాంతాన్ని ముందు ముందు అష్టమస్కంధంలో విశదీకరిస్తాను.

పరీక్షిన్నరేంద్రా! అదితి కుమారులైన ఆదిత్యుల వంశాన్ని విన్నావు. ఇప్పుడు దితి కుమారులైన దైతేయుల వంశాన్ని నీకు వినిపిస్తాను. మహానుభావులూ పరమభాగవతోత్తములూ అయిన ప్రహ్లాదుడూ, బలిచక్రవర్తీ ఈ దైత్యవంశంలోనే జన్మించి అందరికీ వందనీయులైనారు.

దితికి హిరణ్యకశిపుడు హిరణ్యాక్షుడు అనే ఇద్దరు కుమారులు జన్మించారు. వారిలో హిరణ్యకశిపుడు జంభాసురుని పుత్రి అయిన కయాధువు అనే ఆమెను వివాహమాడాడు. ఆ దంపతులకు ప్రహ్లాదుడు, అనుహ్లాదుడు, సంహ్లాదుడు, హ్లాదుడు అనే నలుగురు పుత్రులూ, సింహిక అనే ఒక పుత్రికా పుట్టారు. ఆ సింహిక కుమారుడే రాహువు. ఆ రాహువు దేవతలలో దూరి దొంగచాటుగా అమృతపానం చేసే సమయాన శ్రీ మహావిష్ణువు తన సుదర్శనచక్రంతో అతని శిరస్సు ఖండించాడు.

సంహ్లాదుని భార్యపేరు గతి. ఈ దంపతులకు పంచజనుడు ఉదయించాడు. హ్లాదునికి దమని అనే భార్యయందు వాతాపి, ఇల్వలుడు అనే ఇద్దరు కుమారులు పుట్టారు. ఆ యిరువురు అగస్త్యమహర్షి ఆగ్రహాగ్నికి ఆహుతి అయినారు. అనుహ్లాదుని భార్యపేరు సూర్మ్య. ఆమెకు భాష్కలుడు, మహిషుడు అనే తనయులు జన్మించారు.

ప్రహ్లాదుని భార్యపేరు దేవి. ఆ దంపతులకు విరోచనుడు అనే పుత్రుడు ఉద్భవించాడు. ఆ విరోచనుని కుమారుడే బలిచక్రవర్తి. బలిచక్రవర్తికి అశన అనే ఆమె భార్య అయింది. ఆ దంపతులకు బాణాసురుడు మొదలైన వందమంది నందనులు జన్మించారు. బలిచక్రవర్తి గొప్పతనాన్ని అనంతరం వివరిస్తాను. బాణాసురుడు పరమశివుణ్ణి ఆరాధించి ప్రమథగణాలలో ప్రధానుడైనాడు.

ఈ చెప్పినవారు కాక దితికి ఇంకా నలభై తొమ్మిది మంది పుత్రులు కలిగారు. వీరందరికీ మరుత్తులు అనిపేరు. అయితే ఈ మరుత్తులు అనపత్యులు. వీరంతా దేవేంద్రుని ఆశ్రయించి దేవత్వాన్ని పొందారు.

శుకయోగీంద్రుని మాటలు విని పరీక్షిన్నరేంద్రుడు ఇలా అన్నాడు -

**ఆ. ఏమి కారణమున నింద్రునికిని మరు, చ్చయము లాప్తు లగుచు శాంతి నొంది?**
**రరయఁ దత్త్వమాను లగుచు వర్తించిరి?, దీని వినఁగ వలయుఁ దెలుపవయ్య! 507**

* "ఆర్యా! మరుత్తులు ఏ కారణంవల్ల ఇంద్రునికి ఆప్తులై దేవత్వాన్ని సంపాదింప గలిగారు? ఈ వృత్తాంతాన్ని వినాలని కుతూహలపడుతున్నాను. దయచేసి వివరించు".

**వ. అనిన శుకుం డిట్లనియె. 508**

**సీ. నరనాథ! విను తన నందను లందఱు నమరేంద్రుచే హతు లగుచునుండఁ**
**గోపశోకంబులఁ గ్రుళ్ళుచుఁ దనలోన మండుచు దితి చాల మఱుఁగఁ దొడఁగె,**
**భాతృ ఘాతుకుఁ డతిపాతకుం డీ యింద్రుఁ జంపక నాకేల సొంపు గలుగు?**
**వీని భస్మము సేయువానిఁగా నొక సుతుఁ బడసెద నని చాల భర్తఁ గోరి**

**ఆ. ప్రియము సేయఁదొడఁగెఁ బెక్కు భావంబుల, భాషణముల నధిక పోషణముల**
**భక్తియుక్తిచేతఁ బరిచర్యగతిచేత, నుతులచేత నతుల రతులచేత. 509**

* నరేంద్రుడు ఈ విధంగా అడుగగా యోగీంద్రుడు ఇలా చెప్పసాగాడు -

రాజా! విను. తన నందనులైన దైత్యుల నందరినీ రణరంగంలో దేవేంద్రుడు సంహరించటం చూచి దితి హృదయం కోపతాపాలతో తుక తుక ఉడికింది. ఆమె లోలోపల పరిపరివిధాల పరితపించింది. "ఈ ఇంద్రుడు భ్రాతృఘాతుకుడైన పరమపాతకుడు. వీణ్ణి హతమార్చేస్తేనే కాని నా హృదయానికి శాంతి లభించదు. ఈ పరమదుర్మార్గుణ్ణి భస్మీపటలం చేయగల తనయుణ్ణి కనాలి"అని ఆమె నిశ్చయించుకొన్నది.

ఆ ఉద్దేశంతోనే తన పతి ఐన కశ్యపప్రజాపతిని ఎంతో ఆసక్తితో ఆరాధింపసాగింది. అనేక విధాల హావభావాలు ప్రదర్శించుతూ సేవలు కావించింది. మృదుమధుర భావాలతో ఆయన హృదయాన్ని రంజింపజేసింది. భక్తి ప్రపత్తులతో కూడి పరిచర్యలతో పొగడ్తలతో సరససంభోగ క్రీడలతో మెప్పించ సాగింది.

**చ. కలికి కటాక్ష వీక్షణ వికారములన్ హృదయానురాగ సం**
**కలిత విశేషవాఙ్మధుర గర్జనలన్ లలితాననేందు మం**
**డల పరిశోభి తామృత విడంబిత సస్మిత సుప్రసన్నతా**
**ఫల రుచిర ప్రదానముల భామిని భర్తమనంబు లోఁగొనెన్. 510**

* సౌందర్యవతి అయిన దితి తన కడకంటి చూపులతో, అనురాగం పొంగి పొరలే శృంగారచేష్టలతో, చందమామవంటి అందమైన ముఖంలో చిందే అమృతంవంటి చిరునవ్వులతో, ప్రసన్నమైన ప్రసంగాలతో, అపురూపములైన ఉపచారాలతో మగని మనస్సును లొంగదీసుకొన్నది.

**తే. అఖిల మెఱిఁగిన కశ్యపు నంతవాని, హితవు తలకెక్కు రతుల సంగతులచేత**
**నవశుఁ గావించె వ్రేల్మిడి నబ్జవదన, పతుల భ్రమియింప నేరని సతులు గలరె? 511**

* సరోజముఖి అయిన ఆ సఖి సర్వజ్ఞుడైన కశ్యపప్రజాపతి అంతటివాణ్ణి తన లీలావిలాసాలతో మురిపించి మైమరపించింది. పతుల మతులను భ్రమింపచేయలేని సతులు ఈ లోకంలో లేరుగదా!

**క. ఏ తలఁ పెఱుఁగక నిలిచిన, భూతంబులఁ జూచి ధాత పురుషుల మనముల్**
**ప్రీతి గొలుపంగ యువతీ, వ్రాతంబు సృజించెఁ బతులు వారల కరుదే! 512**

* పూర్వం బ్రహ్మదేవుడు పురుషులను సృష్టించాడు. వారు నిశ్చలచిత్తులై ఉండటం చూచి వారి మనస్సులను భ్రమింపజేయటంకోసం స్త్రీలను పుట్టించాడు. అటువంటప్పుడు మగువలకు మగవారిని వశం చేసుకోవటం ఏమంత కష్టం?

**వ. ఇట్లు నిజసతిచేత నుపలాలితుండై కశ్యప ప్రజాపతి యా సతికిం బరమప్రీతుండై యిట్లనియె. ఓ తన్వీ! నీకుఁ బ్రసన్నుండనైతి. వరంబు గోరు మిచ్చెద. నాథుండు ప్రసన్నుండైన స్త్రీలకుం గోరిక సంభ వించుట కేమి కొఱంత? సతికిం బతియె దైవంబు. సర్వభూతంబుల మానసంబులకు వాసుదేవుండేభర్త.**

నామరూప కల్పితులైన సకల దేవతామూర్తులచేతం బురుషులచేతను భర్తృరూపధరుం డయిన భగవంతుండు సేవింపంబడు చుండు. విశేషించి స్త్రీలచేతఁ బతిరూపంబున భజియింపంబడుఁగావునం బతివ్రతలైన సుందరులు శ్రేయస్కామలై యేకచిత్తంబున నాత్మేశ్వరుం డయిన య ప్పరమేశ్వరుని భర్తృ భావంబున సేవించుచుండుదురు. ఏమను నీకీ భావంబున వరదుఁడ నైతి. దుశ్శీల లయిన వినతలకుం బొందరాని వరంబు నీ కిచ్చెద. వేఁడు మనిన నా కశ్యపునకు దితి యిట్లనియె. 513

* ఈ విధంగా కశ్యప ప్రజాపతి తన ప్రియసతి అయిన దితి చేస్తున్న సేవలకు ఎంతో సంతోషించినవాడై ఆమెతో ఇలా అన్నాడు -"ఓ లతాంగీ! నేను నీ ప్రవర్తనకు సంతుష్టుడనైనాను. నీకు కావలసిన వరం కోరుకో. కాంతుడు సంతోషించితే కాంతలకు కొరత ఏముంటుంది? సతులకు పతియే దైవం. సమస్త జీవరాసులకూ వాసుదేవుడే హృదయేశ్వరుడు. నామరూపాలు కల్పింపబడిన ఇతర దేవతామూర్తులూ, పురుషులూ భర్తరూపంలో ఉన్న భగవంతుణ్ణే ఆరాధిస్తుంటారు. అందుకని పతివ్రతలైన సతీమణులు శ్రేయస్సును ఆకాంక్షించినవారై ఏకాగ్రభావంతో ప్రాణేశ్వరుడైన పరమేశ్వరుణ్ణి సేవిస్తుంటారు. అటువంటి భావం నీలో కలిగినందువల్ల నేను నీకు వరప్రదానం చేస్తున్నాను. చెడునడతలు గల పడతులకు దుర్లభమైన వరాన్ని నేను నీకు అనుగ్రహిస్తాను కోరుకో". ఇలా కశ్యపుడు పలుకగా దితి పతితో ఇలా అన్నాది.

ఆ. వరము గోర నాకు వరదుండ వేనియు, నింద్రుఁ ద్రుంచునట్టి యుద్ధబలుని
నమిత తేజుఁ దనయు నమరత్వసంప్రాప్తు, నెందుఁ జెడనివాని నిమ్ము నాథ! 514

* "నాథా! మీకు నామీద అనుగ్రహం కలిగి వరాన్ని ప్రసాదింప తలిస్తే ఇంద్రుణ్ణి సంహరించగల పరాక్రమవంతుడూ, తేజోవిరాజితుడూ అయిన ఒక కుమారుణ్ణి నాకు అనుగ్రహించండి."

వ. అనవుడు. 515

క. ఉట్టిపడునట్టి వర మీ, కట్టిఁడి న న్నెట్టు వేఁడె? గటకట! యనుచున్
మిట్టిపడి యతఁడు మదిలోఁ, బుట్టిన తల్లడముతోడఁ బొక్కుచు నుండెన్. 516

* దితి మాటలు విని కశ్యపుడు త్రుళ్లి పడ్డాడు. "ఉన్నట్లుండి ఈ కఠినురాలు ఇటువంటి క్రూరమైన వరం కోరిందే!"అని లోలోపల తల్లడిల్లాడు.

చ. ప్రకృతినిఁ గర్మపాశమున బద్ధుఁడ నై తిఁ గదయ్య! నేఁడు నే
వికటసతీ స్వభావమున వేఁదుఱు గొల్పిన మాయ నింద్రియా
ధికమతి యైనవాఁడు దన తెంపునఁ జిత్తము వెచ్చపెట్టి పా
తకములఁ గూలకున్నె? నను దైవము నవ్వదె లోలితాత్మునిన్? 517

* "ఎన్నడూ ఎటువంటి చాంచల్యమూ ఎరుగని నేను ఈనాడు కర్మపాశబద్ధుడనై వికటస్వభావం కల ఈ మగువమాయకు లోనై పిచ్చివాడనైనాను. ఇంద్రియలోలుడైన మానవుడు మనస్సును మలినం చేసుకొని పాపకూపంలో పడిపోక తప్పదు. నా చంచలత్వాన్ని చూచి దైవం పరిహసిస్తుంది.

సీ. ఖండ శర్కరతోడఁ గలహించు పలుకులఁ బద్మవిలాస మేర్పఱచు మోముఁ
దుహినాంశు కళలతోఁ దులదూఁగు చెయ్వులఁ జెమటఁ గ్రొన్నెత్తురు సేయు మేను
నిలువెల్లఁ గరఁగించు నేర్పుల యింపులఁ బువ్వుల కరుదైన ప్రోది సేఁత
తమకంబు రెట్టించు తరితీపు తలఁపులు నెనసిన మదిలోని యిచ్చగింత

ఆ. గలిగి కఱవనున్న కాలాహిపోలికిఁ, జెలఁగుచున్న సతులచిత్తవృత్తిఁ
దెలియవశమె యెంత ధృతి గలవారికి, నాక కాదు నిఖిలలోకములకు. 518

* ఆహా! స్త్రీల విలాసాలు ఎంత చిత్రమైనవి. కలకండ పలుకుల వంటి పలుకులతో, కమలంవంటి ముఖశోభతో, చంద్రకళల వంటి చిత్రమైన చేష్టలతో, నెత్తురు ఉడుకెత్తించే నెమ్మేనులతో, నిలువెల్ల కరగించి మైమరపించే మురిపింపులతో, పువ్వులవంటి సుతిమెత్తని వలపులతో, మైకాన్ని రెట్టింపచేసే తీయని తలపులతో, అందరాని గుండెలోతులతో ఎటువంటి ధీరులను కూడా వీరు సాధించి తీరుతారు. నాకే కాదు. ఈ సమస్త లోకానికి కూడా కాంత చిత్తవృత్తి అంతుచిక్కదు. అది కాటువేయటానికి కాచుకొని ఉన్న కాలసర్పం వంటిది.

ఆ. కోరి సతుల కెల్లఁ గూర్చువా రెవ్వరు?, పతులనైన సుతుల హితులనైన
బలిమిఁ జేసి యైనఁ బరహ స్తమున నైన, హింసపఱతు రాత్మహితము కొఱకు. 519

* అంగనలకు ఆత్మీయులంటు ఎవరూ లేరు. అవసరమైతే సతులు తమ పతులనైన సుతులనైనా హితులనైనా బలవంతంగా వేధించి బాధించి తమ పనులు సాధించుకుంటారు. పరుల సాయంతో నైనా సరే హింసపెట్టి తమపని నెరవేర్చుకుంటారు.''

వ. అని చింతించి దీనికి నే మని ప్రతివాక్యం బిచ్చువాఁడ? మద్వచనం బెందు నమోఘంబు. త్రిలోక పరిపాలన శీలుండయిన భిదురపాణి వధార్హుండె? యేను దీనికి నైనది యొకటి గల్పించెద నని దితిం జూచి "యో తనుమధ్య! నీకు నట్లు దేవబాంధవుం డయిన యింద్రహంత యగు పుత్త్రుండు గలిగెడు. నొక్క సంవత్సరంబు వ్రతంబునం జరియింపుము. దాని ప్రకారం బెల్ల నేను జెప్పెద విను, మెల్లజీవులవలన హింసాభావంబు లేక యతిధ్వనివాక్యంబు లుడిగి కోపంబు మాని యనృతంబులు వలుకక నఖరోమచ్ఛేదనంబు సేయక యస్థి కపాలాదులైన యమంగళంబులు నంటక నదీ తటాకాదులన కాని ఘటోదక కూపోదకంబుల స్నానంబు సేయక దుర్జన సంభాషణంబు వర్జించి కట్టిన కోకను ముడిచిన పువ్వులను గ్రమ్మఱ ధరియింపక భోజనంబుల యందు నుచ్ఛిష్టాన్నం బును జండికా నివేదితాన్నంబును గీశ శునక మార్జార కంక క్రిమి పిపీలికాది విదూషితాన్నంబును సామిషాన్నంబును వృషలాహృతాన్నంబును నను నీ పంచవిధ నిషిద్ధాన్నంబులు వర్జించి దోయిట నీళ్లు ద్రావక సంధ్యాకాలంబుల ముక్తకేశిగాక మితభాషిణియై యలంకార విహీనగాక వెలుపలం దిరుగక పాదప్రక్షాళనంబు సేసికొని కాని శయనింప యార్ద్ర పాదయై పవ్వళింపక పశ్చిమ శిరస్కయ య్యును నగ్నయయ్యును సంధ్యాకాలంబుల నిద్రింపక నిత్యంబును ధౌత వస్త్రంబులు గట్టి శుచియై సర్వమంగళ సంయుక్తయై ప్రాతః కాలంబునఁ దూర్పు మొగంబై లక్ష్మీనారాయణుల నారాధించి

యావాహనార్ఘ్య పాద్యోపస్పర్శన వాసోపవీత భూషణ పుష్పధూప దీపోపచారాద్యు పచారంబుల నర్చించి హవిశ్శేషంబు ద్వాదశాహుతుల వేల్పించి ప్రణామంబు లాచరించి భగవన్మం త్రంబును దశవారంబు లనుసంధించి స్తోత్రంబుసేసి గంధపుష్పాక్షతంబుల ముత్తైదువులం బూజించి పతిని సేవించి పుత్త్రుం గుక్షిగతుంగా భావించి యి వ్విధంబున మార్గశీర్షశుద్ధ ప్రతిపదారంభంబుగా నొక్క సంవత్సరంబు సలిపి యా ద్వాదశ మాసాంత్యదివసంబున విధ్యుక్తంబుగా నుద్యాపనంబు సేయవలయు. నీ వీ పుంసవనం బనియెడు వ్రతంబు ద్వాదశమాస పర్యంతం బేమఱక సల్పిన నీవు గోరిన కుమారుండు గలిగెడు మనిన సేవించుచు వ్రతంబు తోడనె గర్భంబు ధరియించి వ్రతంబు సలుపుచునుండ నింద్రుండు మాత్రభిప్రాయం బెఱింగి యా యమ్మ నహరహంబును రహస్యంబున సేవించుచు వ్రతంబునకుం దగిన పుష్పఫల సమిత్కుశ పత్త్రాంకురంబులు మొదలయిన వస్తువితతిం ద్రికాలంబులం దెచ్చి యిచ్చుచుఁ బుండరీకంబు హరిణికిం బొంచియున్న భంగి నా యమ్మవ్రత భంగంబునకై కాచి శుశ్రూష సేయుచు నా యమ్మ ధరియించిన తేజోవిశేషంబునకు బెగ్గలించుచుఁ గృశించుచునుండె, నంత నొక్కనాఁడు. 520

* ఈ విధంగా తలపోసి కశ్యపప్రజాపతి "ఇప్పుడు నేను ఈమెకు ఏమని సమాధానం చెప్పేది? ఆడినమాట కాదనటం ఎట్లా? నా పలుకు పొల్లుపోరానిది. త్రిలోకాధినాథుడైన దేవేంద్రుణ్ణి సంహరింపగల కుమారుణ్ణి ఈమె కోరుతున్నది. ఇంద్రుడు వధార్హుడు కాడు కదా! ఇప్పుడు ఈమె కుటిలబుద్ధికి తగినట్లు ఒక ఉపాయం కల్పిస్తాను"అని ఆలోచించి తన సతితో ఇలా అన్నాడు -

" ఓ తలోదరీ! నీ కోరిక ప్రకారం ఇంద్రుణ్ణి సంహరింపగల పుత్రుడు జన్మించటానికి నీవు ఒక ఏడాదిపాటు నియమంతో ఒక వ్రతాన్ని ఆచరించాలి. దాని విధానం చెబుతాను విను. వ్రతం పూర్తి అయ్యేవరకు ఎవ్వరియందూ హింసాభావం వహించకూడదు. పెద్దగా మాటాడరాదు. ఎవ్వరినీ కోపపడరాదు. అసత్యం పలుకరాదు. గోళ్లనూ శిరోజాలనూ కత్తిరించుకోరాదు. ఎముకలు కపాలాలు మొదలైన అమంగళవస్తువులను తాకరాదు. నదులలో, సరస్సులలో తప్ప బావినీళ్లతో స్నానం చేయరాదు. దుష్టులతో సంభాషింపరాదు. విడిచిన చీర కట్టుకొనరాదు. ముడిచినపూలు పెట్టుకొనరాదు. ఎంగిలి అన్నం తినరాదు. కాళికి నివేదించిన అన్నం భుజింపరాదు. వెంట్రుక వచ్చిన అన్నం కానీ కుక్క, పిల్లి, పక్షి ముట్టుకొన్న అన్నం కానీ చీమలు పట్టిన అన్నం కానీ తినరాదు.

మాంసాహారం పనికిరాదు. శూద్రులు తెచ్చిన అన్నం తినరాదు. దోసిటితో నీళ్లు త్రాగరాదు. సంధ్యాసమయాలలో జుట్టువిరియబోసుకొని తిరుగరాదు. అతిగా మాటాడరాదు. అలంకారాలూ లేకుండా ఉండరాదు. ఆరుబయట సంచరింపరాదు. కాళ్ళు కడుగుకొనకుండా పడుకోరాదు. తడిపాదాలతో పవళింపరాదు. పడమటివైపు తలపెట్టి శయనింపరాదు. దిసమొలతో పడుకొనరాదు. సంధ్యవేళలలో నిదురింపరాదు.

ఎల్లప్పుడూ ఉదికిన వస్త్రాలు కట్టుకొని మంగళద్రవ్యాలు ధరించి శుచిగా ఉండాలి, ప్రాతఃకాలంలో తూర్పుముఖంగా కూర్చుండి లక్ష్మీనారాయణులను ఆరాధించాలి. ఆహ్వానం, అర్ఘ్యం, పాద్యం, స్నానం, వస్త్రం, యజ్ఞోపవీతం, అలంకారం, పుష్పం, ధూపం, దీపం మొదలైన షోడశోపచారాలతో అర్పించాలి. పన్నెండు ఆహుతులతో హోమకార్యం నెరవేర్చి నమస్కరించాలి. పది పర్యాయాలు భగవన్మంత్రాన్ని జపించి స్తుతించాలి. గంధపుష్పాక్షతలతో ముత్తైదువులను పూజించాలి. భర్తను భక్తితో సేవిస్తూ పుత్రుడు గర్భంలో ఉన్నట్లు భావించాలి.

ఈ విధంగా మార్గశిర శుద్ధపాడ్యమి మొదలుకొని ఒక సంవత్సరం ఈ వ్రతాన్ని ఆచరించి చిట్టచివరినాడు యథావిధిగా ఉద్యాపనం తీర్చుకోవాలి. పుంసవనం అనే ఈ వ్రతాన్ని ఈ ప్రకారంగా పన్నెండు మాసాల పర్యంతం పొరపాటు వాటిల్లకుండా ఆచరించినట్లయితే నీవు కోరిన కుమారుడు నీకు లభిస్తాడు".

కశ్యపప్రజాపతి చెప్పిన మాటలు విని వ్రతాన్ని అవలంబించిన దితి గర్భవతి అయింది; తన పినతల్లి మనస్సులోని అభిప్రాయాన్ని గుర్తించిన ఇంద్రుడు ఏమాత్రం ఏమరుపాటు లేకుండా ఆమెకు పరిచర్యలు చేయసాగాడు. ప్రతిదినమూ వ్రతానికి అవసరమైన పూలు, పండ్లు, సమిధలు, దర్భలు, పత్రాలు, పల్లవాలు మొదలైనవన్నీ తెచ్చి అందించుతూ లేడికోసం పొదలో పొంచిఉన్న పులివలె ఆయమ్మ వ్రతభంగం కోసం కాచుకొని ఉన్నాడు. ఆమె గర్భంలోని తేజో విశేషాన్ని చూచి దిగులుపడి కృశించసాగాడు.

**సీ. వామాక్షి యనుదిన వ్రతధారణోన్నత పరిచర్య విధులచే బడలి యలసి**
**యొంటి సంధ్యావేళ నుచ్ఛిష్టయై పద ప్రక్షాళనాదులఁ బాసి మఱచి**
**తన కర్మ మోహంబు దవిలి నిద్రింపంగ నింద్రుండు సయ్యన నెడరు గాంచి**
**యోగమాయా బలోద్యుక్తుఁడై యా యింతి యుదరంబుఁ జొరఁబడి యుగ్రుఁ డగుచుఁ**

**తే. దివిరి దేదీప్యమానమై తేజరిల్లు, నర్భకుని వజ్రధారల నడిచె నేడు**
**దునుకలుగ వాఁడు దునిసియుఁ దునుకఁ దునుక, చెడక యొక్కొక్క బాలుఁడై చెలఁగుచున్న.521**

* ఈ విధంగా ప్రతిదినమూ దీక్షతో నియమపూర్వకంగా వ్రతాన్ని ఆచరిస్తున్న దితి ఒకనాడు పని బడలికతో అలసిపోయి సంధ్యాసమయంలో భోజనం చేసి ఆ తొందరలో కాళ్లు కడుగుకోవటం మరచిపోయి పడుకొని నిద్రపోయింది. సమయం కోసం వేచి ఉన్న దేవేంద్రుడు సందు చూచుకొని యోగమాయతో ఆ యమ్మ గర్భంలో జొరబడ్డాడు. ఆమె కడుపులో దేదీప్యమానంగా వెలుగుతున్న బాలుణ్ణి ఆగ్రహావేశంతో తన వజ్రాయుధంతోఏడు ఖండాలుగా ఖండించాడు. అయితే ఒక్కొక్కముక్క ఒక్కొక్కబాలుడై ప్రకాశించింది.

**క. వా రేడ్వు రగుచుఁ గుయ్యిడ, నోరి యఱవ కనుచుఁ ద్రుంచె నొక్కొక్కని నా**
**శూరుం డేడ్గురుఁ దునుకలు, గా రయమున వారు సెడక ఖండితు లయ్యున్. 522**

* ఆ యేడుగురు బాలురూ గొంతెత్తి పెద్దగా అరవసాగారు. "ఓరీ! అరవబోకండి"అంటూ దేవేంద్రుడు ఒక్కొబాలుణ్ణీ మళ్లీ ఏడు ముక్కలుగా ఖండించాడు

క. ఖండము లన్నియు నందఱుఁ, జండాంశు సమప్రకాశ శాశ్వతు లగుచున్
యొండుకొని నిల్చి యని రా, ఖండలునకుఁ గరుణ పుట్టుగతి మదిఁ దోఁపన్. 523

* ఈ విధంగా నలుబదితొమ్మిది ఖండాలైన ఆ బాలురందరూ సూర్యునితో సమానమైన కాంతి కలవారై ఒక్కటిగా చేరి ఇంద్రుని మనస్సుకు జాలి కలుగునట్లుగా ప్రార్థించారు.

వ. అందఱు ముకుళిత కరకమలులై నీకుం దోడంబుట్టువులము. మమ్ము హింసింపంబని లేదు. నీకుం బారిషదులమై మరుద్గణములమై నిన్ను సేవించెదము. మమ్ము రక్షింపుమనిన నారాయణ ప్రసాదంబునం జెడని మరుద్గణంబుల పలుకులకుం గృపాళుండై యింద్రుండు వారల సహోదరులంగాఁ గైకొని మఱి హింసింపక మానె. అశ్వత్థామశరాగ్నివలన నారాయణ రక్షితుండ వయిన నీవునుంబోలెఁ గులిశధారల శకలంబు లయిన కుమారులన్నిరూపంబులై సంవత్సరంబునకు నొక్కింత కడమగా హరిం బూజించినుద్భవించిన వారు గావున నింద్రుతోడం గూడ నేకోన పంచాశద్దేవత లయిన మరుద్గణంబులు దితిగర్భంబు వెలువడి రంత దితి మేల్కాంచి యనల ప్రకాశులై యింద్రుతోడం గూడి వెలుంగుచున్న కుమారులం జూచి సంతోషింపక యింద్రుం జూచి నీకు మృత్యురూపంబయిన పుత్త్రుం గోరి దుస్తరంబయిన వ్రతంబు సలిపితి, సంకల్పించిన పుత్త్రుం డొక్కరుం డీ సప్త సప్త సంఖ్యలం గల కుమారు లగుట కేమి కతంబు? నీ వెఱింగిన భంగి తథ్యంబు పలుకుమనిన నింద్రుం డిట్లనియెఁ" దల్లీ! భవద్వ్రతంబుఁ జింతించి సమయ విచ్ఛేదనంబున గర్భంబు జొచ్చి పాప చిత్తుఁడనై వజ్రధారల గర్భంబు విదళనంబు సేసిన నాశకలంబులు సెడక మహాశ్చర్యంబుగా నివ్విధంబునం గుమారకులైరి. మహాపురుష పూజాసంసిద్ధి కార్యానుషంగి గాకుండునే? భగవదారాధనంబుఁ గోరికలఁ బాసి యెవ్వరు గావింతురు, వా రిహపరంబుల సర్వార్థకుశలు లగుదురు. అ మ్మహాపురుష వ్రతసముత్పన్న తేజంబు నడంప నెవ్వండోపుఁ? గావున దుర్మదంబున బాలిశ స్వభావుండనై దోషంబు సేసిన నా దౌర్జన్యకర్మంబు సహింపఁ దల్లికన్న నెవ్వరు సమర్థులు? పాపాత్ముండ నగు నన్నుం గావుము. నేను వీరలతోడివాఁడ నని నిష్కపటంబుగాఁ బ్రార్థించిన నద్దేవి యట్లగాక యని శాంతచిత్త యయ్యె, నింద్రుండును వారలం గూడి త్రిదివంబునకుం బోయి సోమపాన హవిర్భాగంబులు వారలకుం బంచిపెట్టి కూడి సుఖంబుండె నని చెప్పి పరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుండు వెండియు నిట్లనియె. 524

* వారందరూ "అయ్యా! మమ్మల్ని హింసింపవద్దు. మేము నీకు తోడబుట్టినవారము. మేమంతా మరుద్గణాలమై నీ పరివారము లోనివారమై నిన్ను సేవిస్తాము. మమ్మలను రక్షించు"అని వేడుకొన్నారు. వారి మాటలు విని నారాయణుని అనుగ్రహం వల్ల చెక్కుచెదరలేదని వారిని గుర్తించి ఇంద్రుడు దయతో వారిని తన సోదరులుగా ఆదరించాడు.

పరీక్షిన్న రేంద్రా! అశ్వత్థామ ప్రయోగించిన బాణాగ్నిజ్వాలల నుండి శ్రీకృష్ణుని అనుగ్రహం వల్ల నీవు రక్షింపబడినట్లే వజ్రధారల నుండి వారు రక్షింపబడ్డారు. వారంతా దాదాపు ఏడాదిపాటు మాతృగర్భంలో

ఉండి పురుషోత్తముణ్ణి పూజించినందు వల్ల నలుబది తొమ్మిదిమంది మరుద్గణములుగా మారి దేవత్వాన్ని పొంది ఇంద్రునితో పాటు తల్లిగర్భంలో నుంచి వెలుపలికి వచ్చారు.

దితికి మెలకువ వచ్చింది ఎదురుగుండా అగ్నితేజస్సుతో విరాజిల్లుతూ దేవేంద్రుని వెంట ఉన్న తన బిడ్డలను చూచి ఆమె సంతోష పడలేదు. ఆమె కోపంతో ఇంద్రుణ్ణి ఉద్దేశించి "ఓయీ! నిన్ను చంపే కుమారుడు కావలెనని నా భర్తను కోరి ఎంతో కష్టపడి ఈ వ్రతాన్ని ఆచరించాను. నేను కోరిన కుమారుడు ఒక్కడైతే ఈ విధంగా నలుబది తొమ్మిది రూపాలలో ఉండటానికి కారణమేమిటి. ఇందలి రహస్య మేమిటో నీకు తెలిస్తే చెప్పు"అని పలికింది.

దేవేంద్రుడు ఇలా అన్నాడు. "తల్లీ! ఈ వ్రతాన్ని పూనుకోవటంలో నీ ఉద్దేశం ఏమిటో నేను గుర్తించాను. నన్ను సంహరించే కుమారుణ్ణి కోరి నీ వీ వ్రతాన్ని ఆచరిస్తున్నావని గ్రహించాను. కుటిలబుద్ధితో పాపాత్ముడనై వ్రతభంగాన్ని గమనించి నీ గర్భంలో ప్రవేశించాను. వజ్రాయుధంతో నీ గర్భంలోని శిశువును ఖండించాను. ఆ ముక్కలు చెక్కుచెదరక ఈ విధంగా కుమారులుగా రూపొందారు. మహాత్ముల పూజాప్రభావం కార్యసిద్ధిని కల్పిస్తుంది. నిష్కామబుద్ధితో భగవంతుణ్ణి ఆరాధించినవారికి ఇహలోకమందూ, పరలోకమందూ సర్వార్థములూ సిద్ధిస్తాయి.

పురుషోత్తముని పూజావ్రతం వల్ల పుట్టిన ఈ తేజస్సును హతమార్చే శక్తి ఎవరికి ఉంటుంది! మూర్ఖుడనై మదోన్మత్తుడనై అపరాధం చేశాను. నా దౌర్జన్యాన్ని సహించి నా తప్పు క్షమించు. తల్లివైన నీకంటే నన్ను మన్నించేవాళ్లు ఎవరుంటారు? నేను నీ బిడ్డలవంటి వాడను"అని దేవేంద్రుడు నిష్కపటంగా ప్రార్థించే సరికి దితిదేవి హృదయం కరిగింది. ఆమె కోపం శాంతించింది. "సరే మంచిది" అన్నది.

ఇంద్రుడు మరుద్గణాలతో కూడి స్వర్గానికి వెళ్లిపోయాడు. యజ్ఞాలలో సోమపానాన్నీ, హవిర్భాగాలనూ వారికి పంచిపెట్టి వారితో సుఖంగా ఉన్నాడు.

ఈ విధంగా శుకయోగీంద్రుడు పరీక్షిన్నరేంద్రునకు మరుత్తుల వృత్తాంతం వినిపించి మళ్ళీ ఇలా అన్నాడు.

**క. హరి వరదుఁ డయిన వ్రతమఁట, హరి యంశజు లగుచు నెగడు నమరులజన్మ**
**స్ఫురణం బఁట! పఠియించిన, నరయఁగ నురుదీర్ఘపాప హరమగు టరుదే! 525**

* "ఇది వరాలను ప్రసాదించే వ్రతకథ. వరప్రదాత శ్రీహరి. హరి వంశజులైన మరుత్తులకు అమరత్వం ప్రాప్తించిన వృత్తాంతం ఇందులో ఉంది. ఇటువంటి పుణ్యకథ పఠించినవారి జన్మజన్మాల పాపాలు పటాపంచలు కావటంలో ఆశ్చర్యం ఏముంది?

**వ. అని విష్ణుకథాశ్రవణ కుతూహలాయమాన మానసులైన శౌనకాది మహామునులకు సూతుండు సెప్పెనని శుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రునకుఁ జెప్పె ననుటయు. 526**

* ఈ విధంగా గోవిందుని కథలు వినాలని కుతూహల పడుతున్న శౌనకాది మహర్షులకు సూతమహర్షి వినిపించిన విధంగా శుకయోగీంద్రుడు పరీక్షిన్నరేంద్రునకు వినిపించాడు.

**క. రాజీవరాజపూజ్య, శ్రీజిత గోపీకటాక్ష సేవాంతర వి**
**భ్రాజితమూర్తి! మదోద్ధత, రాజకులోత్పాద రామరాజాఖ్యనిధీ! 527**

* చక్కగా వికసించిన తామరరేకులవంటి కనుగొనలు గల గోపికల సేవలను అందుకొనే అందగాడా! మదోన్మత్తులయిన రాజుల వంశాలను రూపుమాపిన మొనగాడా! రామనామమునే ఆశ్రితులకు నిధిగా ఇచ్చినవాడా!

**తరల.మురవిదారణముఖ్య కారణ! మూలతత్త్వ విచారణా!**
**దురిత తారణ! దుఃఖవారణ! దుర్మదాసుర మారణా!**
**గిరి విహారణ! కీర్తిపూరణ! కీర్తనీయ మహారణా!**
**ధరణి ధారణ! ధర్మతారణ! తాపస స్తుతి పారణా! 528**

* ఓ స్వామీ! నీవు మురాసురుణ్ణి సంహరించిన మొనగాడవు. సమస్త విశ్వానికీ ప్రధాన కారణమైనవాడవు. ఆదిమూలమైన తత్త్వ స్వరూపుడవు. భక్తుల పాపాలను పటాపంచలు చేస్తావు. ఆర్తుల దుఃఖాలను దూరం చేస్తావు. గర్వాంధులైన రాక్షసులను శిక్షిస్తావు. గోవర్ధన పర్వతాన్ని అవలీలగా పైకెత్తావు. నీ కీర్తిప్రతిష్ఠలలో జగత్తునంతా నింపివేశావు. గొప్పరణరంగాలలో కొనియాడదగిన వీరుడవై నిలిచావు. ఈ సమస్త భూభారాన్ని వహించే వాడవు. ధర్మపరులను తరింపజేస్తావు. తపోధనుల స్తోత్రాలకు పాత్రమైనవాడవు.

**తోటకము.**
**కరుణాకర! శ్రీకర! కంబుకరా!, శరణాగత సంగత జాడ్యహరా!**
**పరిరక్షిత శిక్షిత భక్తమురా!, కరిరాజ శుభప్రద! కాంతిధరా! 529**

* ప్రభూ! నీవు కరుణకు ఆలవాలమైన వాడవు. సంపదలు సమకూర్చువాడవు. పాంచజన్య శంఖాన్ని చేతిలో ధరించినవాడవు. శరణుజొచ్చిన భక్తుల కష్టాలను కడతేర్చువాడవు. ఆర్తులను రక్షించి మురాసురాదులను శిక్షించేవాడవు. గజరాజుకు మేలుచేకూర్చావు. కాంతిమయమైన స్వరూపాన్ని ధరించావు.

**గద్య. ఇది సకల సుకవి జనమిత్ర శ్రీవత్సగోత్ర పవిత్ర కసువ యామాత్య పుత్త్ర బుధజన ప్రసంగానుషంగ సింగయ నామధేయ ప్రణీతంబైన శ్రీ మహాభాగవత పురాణంబునందు నజామిళోపాఖ్యానంబును, బ్రచేతసులఁ జంద్రుం డామంత్రణంబు సేయుటయు, దక్షోత్పత్తియుఁ, బ్రజాసర్గంబును, దక్షుండు శ్రీహరిం గూర్చి తపంబు సేయుటయు, నతనికి న ప్పరమేశ్వరుండు ప్రత్యక్షం బగుటయు, హర్యశ్వ కబళాశ్వుల జన్మంబును, వారలకు నారదుండు బోధించుటయు, నారదు వచనప్రకారంబున వారు మోక్షంబు నొందుటయుఁ, దద్వృత్తాంతంబు నారదు వలన విని దక్షుండు దుఃఖాక్రాంతుం డగుటయుఁ, దదనంతరంబ బ్రహ్మ వరంబున దక్షుండు శబళాశ్వసంజ్ఞుల సహస్ర సంఖ్యాకులగు పుత్త్రులం**

గాంచుటయు, సృష్టినిర్మాణేచ్ఛా నిమిత్తంబున దక్షుపంపున వార లగ్రజన్ములు సిద్ధింబొందిన దీర్ఘరాజంబైన నారాయణ సరస్సునకుం జనుటయు, వారికి నారదభగవంతుండు బ్రహ్మజ్ఞానంబు నుపదేశించుటయు వారు పూర్వజు లేగిన ప్రకారంబున మోక్షంబు నొందుటయుఁ, దద్వృత్తాంతంబును దక్షుండు దివ్యజ్ఞానంబున నెఱింగి నారదోపదిష్టంబని తెలిసి నారదుని శపియించుటయు, నారదుండు దక్షుశాపంబు ప్రతిగ్రహించుటయుఁ దక్షునకు మరల బ్రహ్మ వరంబున సృష్టివిస్తారంబు కొఱకుఁ గూఁతులఱువండ్రు జనించుటయు నందుఁ గశ్యపునకు నిచ్చిన పదమువ్వుర వలన సకల లోకంబులు నిండుటయు, దేవాసురనర తిర్యఙ్మృగఖగాదుల జన్మంబులును దేవేంద్ర తిరస్కారంబున బృహస్పతి యధ్యాత్మ మాయచేతం గానరాకుండుటయు, దద్వృత్తాంతంబు రాక్షసులు విని శుక్రోపదిష్టులై దేవతలపై నెత్తి వచ్చుటయు, దేవాసుర యుద్ధంబును, నాచార్య తిరస్కారంబున దివిజరాజ పలాయనంబును బలాయమానులైన దేవతలు బ్రహ్మసన్నిధికిం జనుటయును, బ్రహ్మవాక్యంబునఁ ద్వష్టృ కుమారుం డయిన విశ్వరూపు నాచార్యునింగా దేవతలు వరించుటయును, విశ్వరూపు ప్రసాదంబున నింద్రుండు నారాయణ వర్మంబను మంత్ర కవచంబు ధరియించి రాక్షసుల జయించుటయుఁ, బరోక్షంబున రాక్షసులకు ననుకూలుం డయిన విశ్వరూపు నింద్రుండు వధించుటయు విశ్వరూప వధానంతరంబున నింద్రునకు బ్రహ్మహత్య సంప్రాప్తం బయిన నింద్రుండు స్త్రీ భూ జలద్రుమంబులయందుఁ బంచిపెట్టుటయు, విశ్వరూపుండు హతుం డగుటకుఁ ద్వష్ట కోపించి యింద్రవధార్థంబు మారణహోమంబు సేయ వృత్రాసురుండు జనియిం చుటయు, వృత్రాసుర యుద్ధంబునఁ బరాజితులై యింద్రసహితులైన దేవతలు శ్వేతద్వీపంబునకుఁ జనుటయు, నందు శ్రీహరి ప్రసన్నుండై దధీచి వలన భిదురంబు గైకొనుటయు, నింద్రుండు వజ్రాయుధంబున వృత్రుని సంహరించుటయు, నింద్రుండు బ్రహ్మ హత్యా పీడితుండై మానస సరస్సుఁ బ్రవేశించుటయు, నహుషుండు శతాశ్వమేధంబులం జేసి, యింద్రాధిపత్యంబు వడయు టయు, నహుషుం డగస్త్య శాపంబున సురరాజ్య చ్యుతుండై, యజగరయోనిం బుట్టుటయు, నింద్రా గమనంబును, నశ్వమేధంబును, నింద్రుండు త్రిలోకాధి పత్యంబు వడయుటయును, జిత్రకేతూపాఖ్యానంబును, మరుద్గణంబుల జన్మ ప్రకారంబును నను కథలం గల షష్ఠస్కంధము సంపూర్ణము. 530

ఇది సకల సుకవిజనులకు మిత్రుడు, శ్రీవత్స పవిత్రగోత్రుడు, కసువయామాత్యుని పుత్రుడు, పండితుల సాహిత్య ప్రసంగాలతో సంబంధం కలవాడు అయిన సింగయ కవిచే రచింపబడిన శ్రీ మహాభాగవత పురాణంలో అజామిళోపాఖ్యానమూ, ప్రచేతసులను చంద్రుడు శాంతింపజేయటమూ, దక్షప్రజాపతి జన్మముగా, ప్రజాసృష్టి, దక్షుడు శ్రీహరిని గూర్చి తపస్సు చేయటమూ, అతనికి పరమేశ్వరుడు ప్రత్యక్షం కావటమూ, హర్యశ్వశబళాశ్వుల పుట్టుకా, నారదుడు వారికి వైరాగ్యం బోధించటమూ, వారు నారదుని మాటల ప్రకారం ప్రవర్తించి మోక్షం పొందటమూ ఆ వృత్తాంతాన్ని నారదునివలన ఆకర్ణించి దక్షుడు శోకించటమూ, అనంతరం బ్రహ్మవరంచే దక్షుడు శబళాశ్వులనే వేయిమంది తనయులను కనటమూ, సృష్టిచేయాలనే కోర్కెతో దక్షుని ఆజ్ఞమేరకు వారు తమ అన్నలు సిద్ధిబొందిన తీర్థశ్రేష్ఠమైన నారాయణ

సరస్సుకు పోవటమూ, వారికి నారదుడు బ్రహ్మజ్ఞానాన్ని ఉపదేశించటమూ, వారు తమ అగ్రజుల అడుగుజాడలలో నడచి మోక్షాన్ని పొందటమూ, ఆ వృత్తాంతాన్ని దక్షుడు దివ్యజ్ఞానంవలన తెలుసుకొని నారదుణ్ణి శపించటమూ, నారద మహర్షి దక్షుని శాపాన్ని స్వీకరించటమూ, బ్రహ్మవరంచే సృష్టిని విస్తరింపజేసే నిమిత్తం దక్షునకు అరవై మంది కూతుళ్లు పుట్టటమూ, అందులో కశ్యప ప్రజాపతికి ఇచ్చిన పదముగ్గురు కూతుండ్ర సంతానంవల్ల సకల లోకాలు నిండడమూ; దేవతలు, రాక్షసులు, మానవులు, మృగాలు, పక్షులు మొదలైనవాని జన్మములూ, దేవేంద్రుని తిరస్కారం సహింప లేక బృహస్పతి అదృశ్యం కావటమూ, ఆ వృత్తాంతాన్ని రాక్షసులు విని శుక్రునిచే ప్రేరేపింపబడినవారై దేవతలపై యుద్ధానికి రావటమూ; దేవ రాక్షస యుద్ధమూ; గురుతిరస్కారఫలంగా సురేంద్రుడు పరాజితుడై పారిపోవటమూ, దేవతలు బ్రహ్మ దగ్గరకు వెళ్లటమూ, బ్రహ్మ మాట ప్రకారం త్వష్ట కుమారుడైన విశ్వరూపుణ్ణి గురుదేవునిగా దేవతలు వరించటమూ, విశ్వరూపుని దయవల్ల ఇంద్రుడు "నారాయణకవచం"అనే మంత్రకవచాన్ని ధరించి రాక్షసులను జయించటమూ, పరోక్షంగా రాక్షసులకు అనుకూలుడైన విశ్వరూపుణ్ణి ఇంద్రుడు వధించటమూ, విశ్వరూపుణ్ణి చంపటంవల్ల ఇంద్రునకు బ్రహ్మహత్య సంప్రాప్తించటమూ, ఆ పాపాన్ని దేవేంద్రుడు భూ, జల, వృక్షాలకు పంచి పెట్టటమూ; విశ్వరూపుణ్ణి చంపినందుకు త్వష్ట కోపించి ఇంద్రుణ్ణి వధించే నిమిత్తం మారణహోమం చేయటమూ, వృత్రాసురుని జననమూ, వృత్రాసురునిచే ఓడింపబడిన దేవతలు ఇంద్రునితోగూడి శ్వేతద్వీపానికి పోవటమూ, శ్రీహరి దయగలవాడై దధీచి మహర్షిని ప్రార్థించి ఆయన వల్ల వజ్రాయుధాన్ని తీసుకోమని చెప్పటమూ, ఇంద్రుడు వజ్రాయుధం సంపాదించి వృత్రుణ్ణి సంహరించటమూ, ఇంద్రుడు బ్రహ్మహత్యచే పీడింపబడినవాడై మానస సరస్సులో ప్రవేశించటమూ, నహుషుడు నూరు అశ్వమేధ యజ్ఞాలు చేసి ఇంద్రపదవిని పొందటమూ, నహుషుడు అగస్త్యుని శాపంచే సురరాజ్య భ్రష్టుడై కొండచిలువగా మారిపోవటమూ, ఇంద్రుడు స్వర్గంలో ప్రవేశించి అశ్వమేధయాగంచేసి మరల త్రిలోకాధిపత్యాన్ని అందుకోటమూ, చిత్రకేతుని ఉపాఖ్యానమూ, మరుద్గణంబుల జన్మక్రమమూ అనే కథలతో కూడి షష్ఠస్కంధ మిది.

**శ్రీ కృష్ణార్పణ మస్తు.**

T.T.D. Religious Publications Series N0.639 - B
Price : Rs. 255/-

విష్ణుకథలు కల్యాణాత్మకమైనవి. అంటే శుభాలను ప్రసాదించేవి. అవి ఎన్ని మార్లు విన్నా, ఎప్పటికప్పుడు కొత్తవిగానే ఉంటాయి. భాగవతం అలాంటి పవిత్ర కథలకు నిలయం. ఈ పురాణరత్నం సహజకవి పోతన అమృతహస్తం నుండి మధుర భక్తిమయ కావ్యంగా తెలుగులో అవతరించిన నాటినుండీ ఎందరో భక్తులకు, కవులకు, వాగ్గేయకారులకు ఉపాదేయమై, అనేకవిధాల మార్గదర్శకమై అలరారుతోంది.

"పోతన్న తెనుగుల పుణ్యపేటి" అన్న విశ్వనాథ వారి మాటలు అక్షరసత్యాలు. పోతన తెలుగులో భాగవతాన్ని శ్రీకైవల్యపదాన్ని చేరదానికి రచించినా, ఆ గ్రంథాన్ని చదివినవాళ్లందరికీ కూడా మోక్షాన్ని సిద్ధింపజేశారు. భాగవతంలోని ప్రతిపద్యం ఎంతో హృద్యం. తెలుగునాట పోతన గారి పద్యం నోటికి రాని పండితుడు గాని, పామరుడు గాని లేడంటే అతిశయోక్తి కాదు.

అలాంటి ఉత్తమగ్రంథమైన భాగవత సందేశాన్ని, పోతనకవితా వైశిష్ట్యాన్ని, ఎన్నో వ్యాపకాలతో సతమతమయ్యే నేటి 'సగటుమనిషి'కి ప్రత్యేకించి యువతరానికి వీలైనంత సమగ్రంగా, సరళంగా అందించాలనే ఉదారాశయంతో తిరుమల తిరుపతి దేవస్థానం ఆంధ్రమహాభాగవతాన్ని కరుణశ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి గారి ప్రధాన సంపాదకత్వంలో తాత్పర్యసహితంగా ప్రచురించింది. ఈ సంపుటాలకు అనేకమంది పండితులు చక్కటి తాత్పర్యాన్ని సమకూర్చారు. ఇప్పటికి ఐదుసార్లు ముద్రితమైన ఈ సంపుటాలు పరిష్కరింపబడి పునర్ముద్రితమై వెలువడ్డాయి. పాఠకులు యథాపూర్వం ఆదరించగలరు!

"భాగవతపురాణఫలరసాస్వాదన
పదవిఁ గనుఁడు! రసికభావ విదులు!"

Published by I.Y.R.Krishna Rao, I.A.S., Executive Officer, T.T.Devasthanams, Tirupati
and Printed at Prajasakti Daily Printing Press, Hyderabad - 500 020.

# పోతన భాగవతము

(సప్తమ, అష్టమ, నవమ స్కంధములు)

మూడవ సంపుటము



తిరుమల తిరుపతి దేవస్థానములు,
తిరుపతి

# పోతన భాగవతము

*(సరళ గద్యానువాద సహితము)*

## మూడవ సంపుటము

**7, 8, 9 స్కంధములు**


*అనువాదకులు*

**శ్రీ జంధ్యాల వేంకటేశ్వర శాస్త్రి**
**శ్రీ జి. చెన్నయ్య**
**డా॥ బి. భాస్కర చౌదరి**

*ప్రధాన సంపాదకులు*

**డా॥ జంధ్యాల పాపయ్యశాస్త్రి**



*ప్రచురణ*

**కార్యనిర్వహణాధికారి**

**తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి**

**2010**

**POTANA BHAGAVATAMU,** with Lucid Prose
Third Volume - 7, 8 & 9 Skandhas

**Author :** Potana Mahakavi

**Prose Rendering :** Sri Jandhyala Venkateswara Sastry
Sri G. Chennaiah
Dr. B. Bhaskara Chowdary

**Edited by :** Dr. Jandhyala Papaiah Sastry. "Karuna Sri"



T.T.D Religious Publication Series No. 639-C

**First Edition** : 1987
**Re-prints** : 1998, 2004, 2005, 2008, 2010
**Revised Edition** : 2015

**Copies :** 5,000

**Published by**

Dr. D.Sambasiva Rao , I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati.

**D.T.P**

Sri Asangananda Graphics
Sri Vyasasramam, Yerpedu.
Ph:08578-287528

**Printed at**

# ముందుమాట

బ్రహ్మదేవుని చతుర్ముఖాలనుండి పురాణాలు, తరువాత వేదాలు వినిస్సృతాలైనట్లు తెలుస్తుంది. కాగా పురాణాల అనాదిత్వం పావనత్వం విద్యోతిత మవుతుంది. ఏనాటినుంచో సజీవంగా వెలిగేదే పురాణమంటారు. 'పురాపి నవం పురాణం'- ఎంత పాతదైనా పురాణం సరికొత్తగానే ఉంటుందన్నమాట!

సర్గం, ప్రతిసర్గం, వంశం, మన్వంతరం, వంశానుచరితం - అని పురాణాలు అయిదు లక్షణాలు కలిగి ఉంటాయి. ఈ లక్షణాలతో కూడిన పురాణాలు పద్దెనిమిది. ఉపపురాణాల సంఖ్యకూడా అంతే. ఈ పురాణాలన్నీ వేదవ్యాస మహర్షి విరచితాలే అని ప్రతీతి. ఇవి భిన్న కర్తృకాలు అనే ప్రవాదం కూడా ఉన్నది. ఏమైనా పురాణాలు ప్రాచీన సంస్కృతి సంప్రదాయాలకు ఆదర్శం లాంటివే కాకుండా, పూర్వ రాజవంశాలను గురించికూడ తెలపడంవల్ల ఒక విధంగా చరిత్రగ్రంథాలుగా కూడా ఉపకరిస్తాయి.

కథలద్వారా ప్రజలకు నీతి ధర్మాలు ఉపదేశించడం వీటి పరమాశయంగా కనిపిస్తుంది. భాగవత రచనవల్ల వ్యాసభగవానుడికి మనశ్శాంతి చేకూరిందనడంలో పురాణ ప్రభావం ఏమిటో విదిత మవుతుంది.

అష్టాదశ పురాణాలలో ప్రశస్తి వహించిన శ్రీమద్భాగవతాన్ని బమ్మెరపోతనామాత్యులు తెలుగులోనికి అనువదించి ఆంధ్రలోకానికి మహోపకారం చేశారు. పరమభాగవతోత్తముడైన పోతనగారు తన సహజ పాండిత్యముతో అనితరభక్తితో భాగవతాన్ని రచించారు. మహాతపస్వి పోతరాజుగారి లేఖిని నుండి జాలు వారిన కవితా ప్రవంతి ఆంధ్ర జనహృదయ కేదారాలను తడుపుతూ తాపత్రయాన్ని హరిస్తున్నదనడం సత్యం. భాగవతంలోని ప్రతి పద్యం ఎంతో హృద్యం. తెలుగునాట పోతనగారి పద్యం నోటికి రాని పండితుడు గాని, పామరుడుగాని లేడంటే అతిశయోక్తి కాదు.

ఇలా తెలుగునాట ప్రముఖస్థానాన్ని అలంకరించిన ఆంధ్రమహాభాగవతం అక్షరాస్యులందరికీ సులభ గ్రాహ్యం అయ్యేందుకు తి.తి.దేవస్థానంవారు ప్రముఖ విద్వాంసులచేత సులభశైలిలో తాత్పర్యాలు వ్రాయించి, ముద్రించారు.

ప్రధాన సంపాదకులైన డా॥ జంధ్యాల పాపయ్యశాస్త్రి (కరుణశ్రీ) గారికి, ఆయా సంపుటాల తాత్పర్య రచయితలకును మా అభినందనలు. తి.తి.దేవస్థానం వారు ప్రచురించిన పోతన భాగవత సంపుటాల ప్రతులన్నీ చెల్లిపోయినందున పాఠకుల సౌకర్యార్థమై పరిష్కరించి పునర్ముద్రించటం జరిగింది. పాఠకులు యథాపూర్వం ఆదరించగలరు.

శ్రీనివాసుని కృపతో తిరుమల తిరుపతి దేవస్థానంవారు చేస్తున్న ధార్మిక గ్రంథ ప్రచురణలపట్ల తెలుగునాట బహుళామోదం లభిస్తున్నందుకు సంతోషం.

**కార్యనిర్వహణాధికారి,**

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

## అనువాదకులు

| | |
|---|---|
| శ్రీ జంధ్యాల వేంకటేశ్వర శాస్త్రి | ( సప్తము స్కంధము) |
| శ్రీ జి. చెన్నయ్య | ( అష్టమ స్కంధము) |
| డా॥ బి. భాస్కర చౌదరి | ( నవమ స్కంధము) |

# పోతన భాగవతము

**అనువాదకులు** | **స్కంధములు**

**మొదటి సంపుటము**

| | | | |
|---|---|---|---|
| 1. | డా॥ జంధ్యాల పాపయ్య శాస్త్రి | --- | ప్రథమ స్కంధము |
| 2. | డా॥ సముద్రాల లక్ష్మణయ్య | --- | ద్వితీయ స్కంధము |
| 3. | డా॥ ఆశావాది ప్రకాశరావు | --- | తృతీయ స్కంధము |

**రెండవ సంపుటము**

| | | | |
|---|---|---|---|
| 4. | శ్రీ శనగన నరసింహస్వామి | --- | చతుర్థ స్కంధము |
| 5. | డా॥ సర్వోత్తమరావు | --- | పంచమ స్కంధము |
| 6. | శ్రీ తలమర్ల కళానిధి | --- | షష్ఠ స్కంధము |

**మూడవ సంపుటము**

| | | | |
|---|---|---|---|
| 7. | శ్రీ జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రి | --- | సప్తమ స్కంధము |
| 8. | శ్రీ జి. చెన్నయ్య | --- | అష్టమ స్కంధము |
| 9. | డా॥ బి. భాస్కర చౌదరి | --- | నవమ స్కంధము |

**నాల్గవ సంపుటము**

| | | | |
|---|---|---|---|
| 10. | డా॥ ఎక్కిరాల కృష్ణమాచార్య | --- | దశమ స్కంధము (పూర్వభాగం 1- 725 పద్యములు) |
| 11. | శ్రీమాన్ ముదివర్తి కొండమాచార్యులు | --- | దశమ స్కంధము (పూర్వభాగం 726 - 1791 పద్యములు) |

**ఐదవ సంపుటము**

| | | | |
|---|---|---|---|
| 12. | డా॥ అమరేంద్ర | --- | దశమస్కంధము - ఉత్తరభాగము ( 1- 535 పద్యములు) |
| 13. | శ్రీ డి. నాగసిద్ధారెడ్డి | --- | దశమస్కంధము - ఉత్తరభాగము (536 - 1342 పద్యములు) |
| 14. | డా॥ ప్రసాదరాయ కులపతి | --- | ఏకాదశ స్కంధము |
| 15. | శ్రీ టి. భాస్కర రావు (స్ఫూర్తిశ్రీ) | --- | ద్వాదశ స్కంధము |

# ప్రవేశిక

సురుచిరమూ సువిశాలమూ ఐన భక్తి సామ్రాజ్యానికి మకుటంలేని మహారాజు మన బమ్మెర పోతరాజు. బమ్మెరవారి బంగారు హస్తాలలో భాగవతం బాలరసాలమై పల్లవించి పుష్పించి ఫలించింది! రసజ్ఞులను రసాస్వాదనా పరవశులను కావించింది.

అందుకనే పోతన్నగారు -

**కమ్మని తేటతెల్గు నుడికారము లేరిచి కూర్చి చాక చ**
**క్యమ్ముగ కైతలల్లు "మొనగాండ్రు కవీశ్వరు" లెంతమంది లో**
**కమ్మున లేరు, నీ వలె నొకండును భక్తి రసామృత ప్రవా**
**హమ్ముల కేత మెత్తిన మహాకవి యేడి తెలుంగు గడ్డపై?**

అని అభిజ్ఞుల అభినందనలు అందుకున్నారు. ఇప్పుడు మీ చేతులలో ఉన్నది భాగవత సప్తమ స్కంధం. ఈ స్కంధంలో హిరణ్యాక్ష హిరణ్యకశిపుల శాపవృత్తాంతం, సుయజ్ఞోపాఖ్యానం, త్రిపురాసుర సంహారం, అజగరోపాఖ్యానం, నారదుని పూర్వజన్మ వృత్తాంతం మొదలైన కథలు ఉన్నా ప్రహ్లాదచరిత్రకే అనన్య సామాన్యమైన ప్రాధాన్యం ప్రాప్తించింది.

సప్తమ స్కంధం పేరు చెప్పగానే పరమ భక్తాగ్రేసరుడైన ప్రహ్లాదుడు మనముందు ప్రత్యక్ష మౌతాడు-

**"ప్రహ్లాద నారద పరాశర పుండరీక వ్యాసాంబరీష శుకశౌనక భీష్మదాల్భ్యాన్"**

అన్న శ్లోకం పరమభాగవతులలో ప్రహ్లాదుణ్ణి ప్రథమస్థానంలో కూర్చుండబెట్టి అగ్రతాంబూలం అందిస్తుంది.

పోతన్నగారి ప్రహ్లాదుడు "లలితమర్యాదుడు", "సుగుణాలవాలుడు", "సమస్తసభ్యనుతశీలుడు", "అంబుజోదర దివ్యపాదారవింద చింతనామృతపాన విశేష మత్తచిత్తుడూ"; "సంసార నివృత్తుడూ" అయిన అతని ప్రసక్తి వచ్చినప్పుడెల్లా పోతన్నగారు పరవశించిపోయి అర్థవంతాలైన అనేక విశేషణాలతో ఆ భక్త శిరోమణిని అభివర్ణిస్తాడు - చిత్తగించండి -

**బుధజనవిధేయుండును,**
**మహాభాగధేయుండును,**
**సుగుణ మణిగణ గరిష్ఠుండును,**
**పరమభాగవత శ్రేష్ఠుండును,**
**కర్మబంధలతాలవిత్రుండును.**
**పవిత్రుండును నైన పుత్రునియందు** - అనీ,

**బాలుఁ బ్రభావిశాలు**
**హరిపాదపయోరుహ చింతన క్రియాలోలు** - అనీ,

**సూనున్ శాంతగుణప్రధాను,**
**అతిసంశుద్ధాంచితజ్ఞాను,**

**అజ్ఞానారణ్యకృశాను,**
**అంజలిపుటీసంభ్రాజమానున్** - అనీ,

**భయవిరహితుండును,**
**బ్రహ్మజ్ఞాన సహితుండును,**
**పులకితదేహుండును,**
**సంతోషబాష్ప సలిలధారా సమూహుండును,**
**ప్రేమాతిశయ గద్గద భాషణుండును,**
**వినయ వివేకభూషణుండును,**
**ఏకాగ్రచిత్తుండును**
**భక్తిపరాయత్తుండును** - అనీ,

ఈ విధంగా తనకు అత్యంత ప్రియమైన అంత్యప్రాస విలాస విన్యాసాలతో ముంచెత్తి ప్రహ్లాదునిపట్ల తనకు గల భక్తి ప్రపత్తులను అభివ్యక్తం చేస్తాడు మన మహాకవి పోతన్న.

భాగవతంలోని అన్ని స్కంధాలలో కంటే ఈ సప్తమ స్కంధంలో ఉన్న విశేషమేమంటే ఇందులోని కథలన్నింటినీ నారదమహర్షి ధర్మరాజుకు చెప్పినట్లుగా శుకమహర్షి పరీక్షిన్మహారాజుకు వినిపించుతాడు. రాజసూయయాగంలో శ్రీకృష్ణుడు తన చక్రంతో శిశుపాలుని శిరస్సును ఖండిస్తాడు. చక్రచ్ఛిన్న శిరస్కుడైన శిశుపాలుని శరీరంలోనుంచి వెలువడిన తేజస్సు శ్రీకృష్ణునిలో ప్రవేశించటం చూచి ఆశ్చర్యచకితుడైన ధర్మజుడు సభలో వున్న నారద మహర్షిని ఇలా ప్రశ్నిస్తాడు.

**హరి సాధింతు, హరిన్ గ్రసింతు, హరిఁ బ్రాణాంతంబు నొందింతుఁ, దా**
**హరికిన్ వైరి నటంచు వీఁడు పటురోషాయత్తుఁడై యెప్పుడుం**
**దిరుగున్; బ్రువ్వదు నోరు, వ్రీలిపడదున్ దేహంబు దాహంబుతో,**
**నరకప్రాప్తియు నొందఁ, డేగతి జగన్నాథుం బ్రవేశించెనో?** **7-12**

ధర్మజుని సందేహానికి దేవర్షి ఇలా సమాధానం చెబుతాడు -

**కామోత్కంఠత గోపికల్, భయమునం గంసుండు, వైరక్రియా**
**సామగ్రిన్ శిశుపాలముఖ్య నృపతుల్, సంబంధులై వృష్ణులున్,**
**బ్రేమన్ మీరలు, భక్తి నేము నిదె చక్రిం గంటి; మెట్లైన ను**
**ద్దామ ధ్యాన గరిష్ఠుఁడైన హరిఁ జెందన్ వచ్చు ధాత్రీశ్వరా!** **7-18**

ఇలా చెబుతూ శ్రీహరి ద్వారపాలకులు సనకసనందనాదుల శాపం వల్ల పదభ్రష్టులై మొదటి జన్మలో హిరణ్యకశిపు హిరణ్యాక్షులుగానూ, రెండవజన్మలో రావణ కుంభకర్ణులుగానూ, మూడో జన్మలో శిశుపాల దంతవక్రులుగానూ ఉద్భవించారని చెప్పే సందర్భంలో హిరణ్యకశిపుని వృత్తాంతంతోపాటు ప్రహ్లాదుని వృత్తాంతం ప్రసక్తమౌతుంది. తండ్రిచేత పెక్కువిధాల హింసింపబడికూడా శ్రీహరి దయకు పాత్రుడైన ప్రహ్లాదుని చరిత్రం వివరంగా వినిపింపుమని ధర్మనందనుడు నారదుణ్ణి ప్రార్థిస్తాడు. ఈ విధంగా ప్రహ్లాదచరిత్ర ప్రారంభమౌతుంది.

కథా ప్రారంభంలోనే బమ్మెరవారు పరమ భాగవతుడైన ప్రహ్లాదుణ్ణి పాఠకులకు ఇలా పరిచయం చేస్తాడు-

**తనయందు నఖిలభూతములందు నొకభంగి సమహితత్వంబున జరగువాఁడు**
**పెద్దలఁ బొడగన్న భృత్యుని కై వడిఁ జేరి నమస్కృతుల్ సేయువాఁడు**
**కన్నుదోయికి నన్యకాంత లడ్డంబైన మాతృభావనసేసి మరలువాఁడు**
**తల్లిదండ్రులభంగి ధర్మవత్సలతను దీనులఁ గావఁ జింతించు వాఁడు**

**సములయెడ సోదరస్థితి సలుపువాఁడు, దైవతములంచు గురువులఁ దలఁచువాఁడు**
**లీల లందున బొంకులు లేనివాఁడు, లలిత మర్యాదుఁడైన ప్రహ్లాదుఁ డధిప! 7-115**

అంతేకాకుండా మరొక సీసపద్యంలో కూడా దైత్యరాజ తనయుని గుణగణాలను కొనియాడుతాడు చూడండి పోతన్నగారు.

**ఆకారజన్మవిద్యార్థ వరిష్ఠుఁడై గర్వసంస్తంభ సంగతుఁడు కాఁడు**
**వివిధమహానేక విషయసంపన్నుఁడై పంచేంద్రియములచేఁ బట్టువడఁడు**
**భవ్యవయోబల ప్రాభవోపేతుఁడై కామరోషాదులఁ గ్రందుకొనఁడు**
**కామినీ ప్రముఖ భోగము లెన్ని కలిగిన వ్యసన సంసక్తి నావంకఁ బోఁడు**

**విశ్వమందుఁ గన్న విన్న యర్థములందు, వస్తు దృష్టిఁజేసి వాంఛ యిడఁడు**
**ధరణీనాథ! దైత్యతనయుండు హరిపర, తంత్రుఁడై హతాన్యతంత్రుఁ డగుచు. 7-117**

ఇంతేకాదు - **"సద్గుణంబులెల్ల సంఘంబులై వచ్చి అసురరాజ తనయునందు నిలిచిన"**వట! "పగవారైన సురేంద్రులు" కూడా ప్రహ్లాదునివంటి సుగుణోపేతులను ఎక్కడా చూడలేదని సభలలో "సత్కవీంద్రులవలె" పొగడుతారట! "గుణనిధియగు ప్రహ్లాదుని గుణాలు ఇంకా అనేకం ఉన్నాయిట - వాటిని గణించటం **"ఫణిపతికి బృహస్పతికిని భాషాపతికి"** కూడా శక్యం కాదట!

అతడు నీళ్ళు త్రాగుతున్నా, అన్నం తింటున్నా, నిద్రిస్తున్నా, నడుస్తున్నా, నవ్వుతున్నాకూడా **"శ్రీనారాయణ పాదపద్మ యుగళీ చింతామృతాస్వాదసంధానుండై"** ఈ విశ్వాన్నే విస్మరిస్తాడట!

ఈవిధమైన వర్ణనలతో పోతన్నగారు ప్రహ్లాదుణ్ణి పాఠకుల హృదయాలకు ప్రత్యక్షం చేయటానికి ప్రయత్నిస్తాడు. ఇంత గుణవంతుడైన కుమారుణ్ణి కన్నతండ్రి ఎందుకు హింసించాడా అని మనకు కలిగినట్లే ధర్మరాజుకు కూడా సందేహం కలుగుతుంది. అనంతరం మహారాజు ప్రశ్నించటం మహర్షి వివరించటం జరుగుతుంది.

హిరణ్యకశిపునకు కుమారుని ప్రవర్తన ఏ మాత్రం నచ్చలేదు. అతడు కొడుకును హెచ్చరించాడు.

**"సురలం దోలుటయో! సురాధిపతులన్ స్రుక్కించుటో! సిద్ధులం**
**బరివేధించుటయో; మునిప్రవరులం బాధించుటో! యక్ష కి**
**న్నర గంధర్వ విహంగ నాగపతులన్ నాశంబు నొందించుటో!**
**"హరి" యంచున్ "గిరి" యంచు నేల చెడ మోహాంధుండ వై పుత్రకా!" 7-146**

ఈ రాక్షసరాజు సామాన్యుడు కాదు; "వేధోదత్త వరప్రసాదుడు." వీరాధివీరుడు. జగత్త్రయైక విభుడు. అతడి పేరంటే దేవతలు గడగడ కంపించి పోతారు.

**"ఏ దిక్పాలురఁజూచి నేఁ డలుగునో! యే దేవు బంధించునో!**
**యే దిగ్భాగముమీఁద దాడిచనునో! యే ప్రాణులం జంపునో!**
**యీ దైత్యేశ్వరుఁ"డంచు నొండొరులు దా రింద్రాదులాస్థాన భూ**
**వేదిన్ మెల్లన నిక్కి చూతురు భయావిర్భూతరోమాంచులై. 7-100**

అంతటి చండశాసనుడైన తండ్రి తన తనయుణ్ణి తనంతవాణ్ణి చెయ్యాలని నిర్ణయించాడు.

**"వీడు విద్యాభ్యాసంబునగాని తీవ్రమతిగా"**డని విచారించాడు. భార్గవులకు అప్పగించాడు. గురువులు విద్యలన్నీ బోధించి ప్రహ్లాదుణ్ణి హిరణ్యకశిపుని దగ్గరకు తీసుకుని వచ్చారు. దానవేంద్రుడు తనకు దండప్రణామం చేసి నిలుచున్న తనయుణ్ణి దీవించి, దగ్గరకు తీసుకుని, గాఢాలింగనం చేసుకొని, తొడమీద కూర్చుండబెట్టుకొని, చుంచుదువ్వి, చుబుకంబు పుణికి, చెక్కిలి ముద్దుగొని, శిరంబు మూర్కొని, ఆనంద బాష్పాలతో అతని వదనారవిందం తడుపుతూ మందమధురాలాపాలతో ఇలా అన్నాడు -

**చోద్యం బయ్యెడి నింతకాల మరిగెన్ శోధించి యేమేమి సం**
**వేద్యాంశంబులు చెప్పిరో! గురువు లేవెంటన్ బఠింపించిరో!**
**విద్యాసార మెఱుంగఁ గోరెద, భవద్విజ్ఞాత శాస్త్రంబులోఁ**
**బద్యం బొక్కటి చెప్పి సార్థముగఁ దాత్పర్యంబు భాషింపుమా! 7-161**

హిరణ్యకశిపుడు ఈ విధంగా అడిగేసరికి ప్రహ్లాదుడు "చదివించిరి నను గురువులు........చదువులలో మర్మమెల్లఁ జదివితిఁ దండ్రీ!" అంటూ తన భావాన్ని ఈ విధంగా వెల్లడించాడు.

**తను హృద్భాషల సఖ్యమున్, శ్రవణమున్, దాసత్వమున్, వందనా**
**ర్చనముల్, సేవయు, నాత్మలో నెఱుకయున్, సంకీర్తనల్, చింతనం**
**బను నీ తొమ్మిది భక్తి మార్గముల సర్వాత్మున్ హరిన్ నమ్మి స**
**జ్జనుఁడై యుండుట భద్రమంచుఁ దలఁతున్ సత్యంబు దైత్యోత్తమా! 7-167**

దీనికి సంస్కృత భాగవతంలో మూలశ్లోకం ఇట్లా ఉంది -

**శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్ ।**
**అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మనివేదనమ్ ॥**

మూలశ్లోకాన్ని పోతన్న చాలా చక్కగా తెలుగులో అనువదించారు. ఆ నవవిధ భక్తులనూ త్రికరణశుద్ధిగా ఆచరించాలని "తను హృద్ భాషల" అన్నమాటలు అధికంగా కలిపారు. చాలా బాగుంది. ప్రహ్లాదుడు అంతతో ఆగలేదు.

"తండ్రిగారు పద్యం బొక్కటి చెప్పు"మని అడిగితే తాను ఒక పద్యం చదివి దానికి తాత్పర్యం చెబుతున్నట్లు మరి నాలుగు పద్యాలు చదివాడు.

**అంధేందూదయముల్, మహాబధిర శంఖారావముల్, మూక స**
**ద్గ్రంథాఖ్యాపనముల్, నపుంసక వధూకాంక్షల్, కృతఘ్నావళీ**
**బంధుత్వంబులు, భస్మహవ్యములు, లుబ్ధద్రవ్యముల్, క్రోడ స**
**ద్గంధంబుల్ హరిభక్తి వర్జితుల రిక్తవ్యర్థ సంసారముల్.** **7-168**

హరిభక్తి లేని వారి జీవితాలు ఎందుకూ పనికిరానివని సోదాహరణంగా వివరించి ఊరుకోలేదు. మరో పద్యం ఎత్తుకున్నాడు. తన అభిప్రాయాన్ని బలపరుస్తూ -

**కమలాక్షు నర్చించు కరములు "కరములు" శ్రీనాథు వర్ణించు జిహ్వ "జిహ్వ"**
**సుర రక్షకునిఁ జూచు చూడ్కులు "చూడ్కులు" శేషశాయికి మ్రొక్కు శిరము "శిరము"**
**విష్ణు నాకర్ణించు వీనులు "వీనులు" మధువైరిఁ దవిలిన మనము "మనము"**
**భగవంతు వలగొను పదములు "పదములు" పురుషోత్తముని మీఁది బుద్ధి "బుద్ధి"**

**దేవ దేవునిఁ జింతించు దినము "దినము", చక్రహస్తునిఁ బ్రకటించు చదువు "చదువు"**
**కుంభినీధవుఁ జెప్పెడి గురుఁడు "గురుఁడు", తండ్రి! హరిఁ జేరుమనియెడి తండ్రి "తండ్రి."** **7-169**

కమలాక్షుని అర్చించే కరములే అసలైన సిసలైన కరములు; శ్రీనాథుని వర్ణించే జిహ్వాయే సరియైన జిహ్వ - అంటూ అన్నీ చెప్పి చెప్పి అంతటితో ఆగకుండా అచ్యుతుని సేవకు అంకితంగాని అవయవాలు ఎంత అధమాధమములో ఎంతనీరసములో నిరూపించసాగాడు ఇంకో పద్యములో -

**కంజాక్షునకుఁగాని కాయంబు కాయమే పవనగుంఫిత చర్మ భస్త్రి గాక,**
**వైకుంఠుఁ బొగడని వక్త్రంబు వక్త్రమే ఢమఢమ ధ్వనితోడి ఢక్క గాక,**
**హరిపూజనములేని హస్తంబు హస్తమే తరుశాఖ నిర్మితదర్వి గాక,**
**కమలేశుఁ జూడని కన్నులు కన్నులే తను కుడ్య జాలరంధ్రములు గాక;**

**చక్రి చింతనలేని జన్మంబు జన్మమే, తరళ సలిల బుద్బుదంబు గాక,**
**విష్ణుభక్తిలేని విబుధుండు విబుధుఁడే, పాదయుగముతోడి పశువు గాక.** **7-170**

ఇప్పటికీ ప్రహ్లాదుని భక్తిప్రబోధం ముగియలేదు. బ్రహ్మంత వాడికి కూడా భవబంధాలనే కారుమబ్బులు విచ్చిపోవాలంటే భగవద్దాస్యమనే ప్రభంజనం కావాలంటూ ఇంకో సీసపద్యాన్ని అందుకున్నాడు-

**సంసారజీమూత సంఘంబు విచ్చునే చక్రిదాస్య ప్రభంజనము లేక?**
**తాపత్రయాభీల దావాగ్ని లాఱునే విష్ణుసేవామృతవృష్టి లేక?**
**సర్వంకషాఘౌఘ జలరాసులింకునే హరిమనీషాబడబాగ్ని లేక?**
**ఘన విపద్గాఢాంధకారంబు లడఁగునే పద్మాక్షనుతిరవిప్రభలు లేక?**

**నిరుపమాపునరావృత్తి నిష్కళంక, ముక్తినిధి గానవచ్చునే? ముఖ్యమైన**
**శార్ఙ్గకోదండ చింతనాంజనము లేక, తామరసగర్భనకునైన దానవేంద్ర!** **7-171**

మనోవాక్కాయ కర్మలతో త్రికరణశుద్ధిగా శ్రీహరిని నవవిధభక్తులతో సేవించాలన్న మొదటి పద్యం మాత్రమే మూలానికి అనువాదం. తర్వాత పలికిన "అంధేందూదయముల్" అన్నవృత్తమూ, "కమలాక్షు నర్చించు", "కంజాక్షునకు గాని", "సంసారజీమూత" ఇత్యాది మూడు సీసపద్యాలూ అమూలకాలు. అవి సహజ పాండిత్యులవారి స్వకీయాలు.

ఈ విధంగా భక్తి రసాన్ని సీసాలనిండా నింపి బమ్మెరపోతన్న గారు పఠితలకు అందించారు. అసలు ఈ పద్యాలు పోతన్నగారి జీవిత పరమార్థాన్ని ప్రకటిస్తున్నా యేమో! తను నమ్మిన భక్తి సిద్ధాంతాన్నే, తన మనస్సులోని భావాన్నే బమ్మెరవారు ప్రహ్లాదుని నోటివెంట పలికించారేమో అని నా అనుమానం!

ఇక **"మందార మకరంద మాధుర్యమునఁ దేలు మధుపంబు వోవునే మదనములకు"** ఇత్యాది పద్యాన్ని గురించి ప్రత్యేకంగ చెప్ప నక్కరలేదు. అది ప్రహ్లాదుని మానసిక భావాలకూ బమ్మెరవారి మనోభావాలకూ అద్దం పట్టిన పద్యం, ఈ పద్యంకూడా అమూలకమే!

ప్రహ్లాదుని పలుకులు విని హిరణ్యకశిపుడు మండిపడతాడు. కొడుకును దారిలోకి తీసుకురావాలని ఎంతో ప్రయత్నం చేస్తాడు. బెదిరిస్తాడు, ధిక్కరిస్తాడు, వేధిస్తాడు, బాధిస్తాడు. అనేక విధాల హింసిస్తాడు, ఏనుగులతో త్రొక్కిస్తాడు, పాములతో కరిపిస్తాడు, శూలాలతో పొడిపిస్తాడు. ఎన్నిచేసినా ప్రహ్లాదుని దేహంతోపాటు అతని భక్తి భావనకూడా చెక్కుచెదరదు. చివరకు తండ్రి తనయుణ్ణి ఇలా గద్దిస్తాడు-

**దిక్కుల గెలిచితి నన్నియు, దిక్కెవ్వఁడు రోరి నీకు దేవేంద్రాదుల్,**
**దిక్కుల రాజులు వేఱొక, దిక్కెఱుఁగక కొలుతు, రితఁడె దిక్కని నన్నున్; 7-261**

దానికి ప్రహ్లాదుని ప్రత్యుత్తర మిది -

**దిక్కులు కాలముతో నే, దిక్కున లేకుండుఁ, గలుగు దిక్కుల మొదలై!**
**దిక్కు గల లేనివారికి, దిక్కయ్యెడు వాఁడు నాకు దిక్కు మహాత్మా! 7-265**

మళ్లీ హిరణ్యకశిపుడు ఇలా గర్జిస్తాడు ।

**బలవంతుఁడ నే జగముల, బలములతోఁ జనక, వీరభావమున మహా**
**బలుల జయించితి; నెవ్వని, బలమున నాడెదవు నాకుఁ బ్రతివీరుఁడవై? 7-262**

దానికి సమాధానం ప్రహ్లాదుడు ఈ విధంగా చెబుతాడు -

**బలయుతులకు దుర్బలులకు, బల మెవ్వడు? నీకు నాకు బ్రహ్మాదులకుం**
**బల మెవ్వఁడు? ప్రాణులకును, బల మెవ్వం డట్టి విభుఁడు బల మసురేంద్రా! 7-264**

ఆత్మనందనుని పలుకులకు ఆగ్రహోదగ్రుడైన రాక్షసరాజు అహంకారంతో హుంకరించి ఇలా అంటాడు -

**నాతోడం బ్రతిభాషలాడెదు జగన్నాథుండ నాకంటె నీ**
**భూతశ్రేణికి రాజులేఁ డొకఁడు సంపూర్ణ ప్రభావుండు; మ**
**ద్భ్రాతం జంపిన మున్ను నే వెదకితిన్ బల్మాఱు నారాయణుం**
**డేతద్విశ్వములోన లేఁడు, మఱి వాఁడెందుండురా దుర్మతీ! 7-271**

ఇందుకు పరమభాగవతుడైన ప్రహ్లాదుని సమాధానం -

**ఇందుఁ గలఁ డందు లేఁ డని, సందేహము వలదు; చక్రి సర్వోపగతుం;**
**డెందెందు వెదకి చూచిన, నందందే గలఁడు దానవాగ్రణి! వింటే!** **7-275**

ఈ విధంగా ఎక్కడా లేడని హిరణ్యకశిపుడూ, అంతటా ఉన్నాడని ప్రహ్లాదుడూ వాదులాడుతున్నారు. ఇక్కడ పోతరాజుగారు ఒక చక్కని పద్యం వ్రాశారు -

**"హరి సర్వాకృతులం గలం"డనుచుఁ బ్రహ్లాదుండు భాషింప స**
**త్వరుఁడై" యెందును లేఁడు లేఁ"డని సుతున్ దైత్యుండు తర్జింప, శ్రీ**
**నరసింహాకృతి నుండె నచ్యుతుఁడు నానాజంగమ స్థావరో**
**త్కరగర్భంబుల నన్నిదేశముల నుద్దండ ప్రభావంబునన్.** **7-277**

"ఈ తర్జన భర్జనలలో ఎప్పుడు ఏమి జరుగుతుందో, హిరణ్యా కశిపుడు ఎక్కడ చూపించమని అంటాడో" అని తన భక్తుడైన ప్రహ్లాదుని పలుకు అసత్యం కాకుండా ఉండటం కోసం భగవంతుడు చరాచర ప్రపంచంలో ప్రతి అణువులోనూ ప్రవేశించి ఉన్నాడట! ఎప్పుడు ఎక్కడ కావాలంటే అప్పుడు అక్కడ ప్రత్యక్షం కావాలని.

క్రమంగా తండ్రికొడుకుల మధ్య సంఘర్షణ అధిక మవుతుంది. శాంత రసం ముందు రౌద్రరసం వీగిపోతుంది. సత్త్వ గుణము ముందు రజోగుణం తలవంచుతుంది. స్తంభంలోనుంచి నృసింహస్వామి ఆవిర్భవిస్తాడు.

దుష్ట శిక్షణం, శిష్ట రక్షణం జరుగుతుంది. నృసింహుడు ప్రసన్నుడై భక్తుడైన ప్రహ్లాదుణ్ణి ఇలా బుజ్జగిస్తాడు.

**సంతోషించితి నీ చరిత్రమునకున్, సద్భద్రమౌఁగాక! నీ**
**యంతర్వాంఛితలాభమెల్లఁ గరుణాయత్తుండనై యిచ్చెదం;**
**జింతం జెందకు; భక్తకాముఁడ నే; సిద్ధంబు దుర్లోక్యుఁడన్;**
**జంతుశ్రేణికి నన్నుఁ జూచినఁ బునర్జన్మంబు లే దర్భకా!** **7-369**

త్రిపురాసుర సంహారంలోని ఒక పద్యం చిత్తగించండి. పరమేశ్వరుడు త్రిపురములను దహించిన తీరు పోతన్నగారు ఇలా అభివర్ణించారు.

**శరియై కార్ముకియై మహాకవచియై సన్నాహియై వాహియై**
**సరథుండై సనియంతయై సబలుఁడై సత్కేతనచ్ఛత్రుఁడై**
**పరమేశుం డొక బాణమున్ విడిచెఁ దద్బాణానలజ్వాలలం**
**బురముల్ గాలె ఛటచ్ఛటధ్వని నభోభూమధ్యముల్ నిండఁగన్.** **7-404**

ప్రహ్లాద అజగర సంవాదంలో అజగర మునీంద్రుడు తన జీవిత విధానాన్ని ఈ విధంగా వెల్లడిస్తాడు-

**లేదని యెవ్వరి నడుగను; రాదని చింతింపఁ; బరులు రప్పించినచోఁ**
**గాదని యెద్దియు మానను; భేదము మోదమును లేక క్రీడింతు మదిన్.** **7-439**

**నిందింపఁ బరుల నెన్నఁడు వందింప; ననేకపీడ వచ్చిన మది నా**
**క్రందింప, విభవముల కా, నందింపఁ బ్రకామవర్తనంబున నధిపా! 7-440**

పోతన్నగారి పద్యాలు పసిపాపల పాలబుగ్గల్లాగా మెత్త మెత్తగా హృదయానికి హత్తుకొంటాయి. వెన్నెల్లో ఆడుకొనే కన్నెపిల్లల్లాగా ఒయ్యారాలు వొలక బోస్తాయి. చెంగు చెంగున గంతులు వేసే బాలకురంగాల లాగా పరుగులు తీస్తాయి. మందార మకరంద మాధుర్యాలను చిందిస్తాయి. నిర్మల మందాకినీ వీచికలలో పఠితల హృదయాలను ఓలలాడిస్తాయి.

పోతనగారి ఊహలు పూలవానలు - పోతన్నగారి భావాలు తేనె సోనలు.

సహజ సుందరమైన సహజ పాండిత్యుని భాగవతం ప్రతి పద్యభావార్థ సహితంగా ప్రకటితం కావడం ఆంధ్రులందరికీ ఆనందకరమైన విషయం. ఈ విషయంలో తిరుమల తిరుపతి దేవస్థానంవారు ముందుకు రావడం ముదావహం. ఈ సందర్భంలో అనువాద భాగాలన్నింటినీ పరిశీలించి పరిష్కరించి ఏకసూత్రత కల్పించే కార్యం నాకు అప్పగించి నందుకు కార్యనిర్వహణాధికారి శ్రీ సి. హెచ్. వేంకటపతిరాజు., ఐ. ఏ. ఎస్., గారికీ, డాక్టర్ శ్రీరావుల సూర్యనారాయణమూర్తి పి. ఆర్. ఓ. గారికీ, ఎడిటర్ శ్రీ.కె. సుబ్బారావు గారికీ నా అభివందనాలు.

ఈ సప్తమ స్కంధాన్ని సరళగద్యంలో అనువదించినవారు మధురకవి శ్రీ జంధ్యాల వేంకటేశ్వర శాస్త్రి "శాంతి శ్రీ''. ఇతడు హిందీ, తెలుగు సాహిత్యాలలో చక్కని అభినివేశం కలవాడు.

జ్యోతిర్మయి, ఉదాహరణత్రయి, సుందరమందారము, నారద భక్తి దర్శనము, తియ్యనిపాటల తిరుప్పావై మొదలైన రసవత్ కావ్యములు రచించి అభిజ్ఞుల అభినందనలు అందుకొన్నవాడు. మంచి వక్త, ఉత్తమ ఉపాధ్యాయుడు. ప్రస్తుతం భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారి సన్నిధిలో ప్రశాంతి నిలయంలో పురాణప్రవచనం చేస్తున్నాడు.

శాంతిశ్రీ అనువాదం సరళంగా సర్వాంగసుందరంగా సహృదయ హృదయంగమంగా సాగింది. ఈ సప్తమ స్కంధాన్ని ముచ్చటగా ముద్రించి ఇచ్చిన దేవస్థానం ప్రెస్ మేనేజర్ శ్రీ విజయకుమార్‌రెడ్డి గారికి, వారి సిబ్బందికి నా సాధువాదాలు, అక్షరదోషాలు దొర్లకుండా సహస్రాక్షులై ప్రూఫులు సరిదిద్దిన పూజ్యమిత్రులు మహాకవులు శ్రీ ముదివర్తి కొండమాచార్యులవారికి నా ధన్యవాదాలు, ముద్రణకు తగునట్లు ప్రెస్‌కాపీ సిద్ధంచేసి ఇచ్చిన చిరంజీవి కోరాడ రామకృష్ణ M.A., M.Phil., కు నా ఆశీర్వాదాలు.

భవదీయుడు
**కరుణశ్రీ**
ప్రధాన సంపాదకుడు
పోతన భాగవతం.

గుంటూరు
మకరసంక్రాంతి - ప్రభవ

# విషయసూచిక

## ఏడవ స్కంధము (1-144)



## *ఎనిమిదవ స్కంధము (145-322)*

## తొమ్మిదవ స్కంధము (323-496)

శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః

# పోతన భాగవతము

## (సరళ గద్యానువాద సహితము)

## ఏడవ స్కంధము

**శ్రీమ ద్విఖ్యాతి లతా, క్రామిత రోదోఽంతరాళ! కమనీయ మహా**
**జీమూత తులితదేహా, శ్యామల రుచిజాల! రామచంద్రనృపాలా!** **1**

* శ్రీరామచంద్రా! సద్గుణసాంద్రా! నీవు విశిష్టరాజన్యుడవు, విశ్వనాథుడవు! మహనీయమైన నీ కీర్తిలతలు విశ్వమంతా నిండి విస్తరించినాయి. అందాల నీలిమేఘాల కాంతితో మెరిసిపోయే నీ శరీరం జగన్మోహన మయింది. స్వామీ! నీకు నమస్సుమాంజలి!

**వ. మహనీయ గుణ గరిష్ఠులగు న మ్ముని శ్రేష్ఠులకు నిఖిల పురాణ వ్యాఖ్యాన వైఖరీ సమేతుండయిన సూతుం డి ట్లనియె, నట్లు ప్రాయోపవిష్టుండయిన పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రు నవలోకించి. 2**

* ఒక సుప్రభాత సమయంలో సద్గుణగణ్యులూ, బుధవరేణ్యులూ అయిన మునీశ్వరులు సూతమహర్షిని సందర్శించారు. సూతమహర్షి అఖిల పురాణాలు తెలిసిన మహాపండితుడు. చక్కని వ్యాఖ్యానం చేయగల సమర్థుడు. సవివరంగా బోధించగల ప్రజ్ఞాశాలి. ప్రతిభావ్యుత్పత్తులు గల పౌరాణిక స్వామి. అటువంటి సూతమహర్షి శౌనకాది మునీశ్వరులతో ఈ విధంగా చెప్పసాగాడు - మునిశ్రేష్ఠులారా! మోక్షకాంక్షతో, నిర్మలమైన మనస్సుతో, ప్రాయోపవేశం చేసి పవిత్ర వ్రత దీక్షలో ఉన్న పరీక్షిన్మహారాజు శుకమహర్షిని చూచి ఇలా విన్నవించుకొన్నాడు -

### -: నారాయణుని వైషమ్యాభావమును దెలుపుట :-

**సీ. సర్వభూతములకు సముఁడు నెచ్చెలి ప్రియుం డైన వైకుంఠుఁ డనంతుఁ డాఢ్యుఁ**
**డింద్రుని కొఱకు దైత్యేంద్రుల నేటికి విషముని కైవడి వెదకి చంపె?**
**నసురులఁ జంపంగ నమరులచేఁ దన కయ్యెడి లాభ మింతైనఁ గలదె?**
**నిర్వాణ నాథుండు నిర్గుణుం డగు తన కసురుల వలని భయంబుఁ బగయుఁ**

**ఆ. గలుగ నేర, దట్టి ఘనుఁడు దైత్యులఁ జంపి, సురలఁ గాచుచునికి చోద్యమనుచు**
**సంశయంబు నాకు జనియించె! మునినాథ! ప్రజ్ఞ మెఱసి తెలియఁ బలుకవయ్య.** **3**

* మునిలోక చూడామణీ! నాకు ఒక సందేహం కలిగింది. దానిని తీర్చగల విజ్ఞాన సంపన్నులు తమరే. శ్రీ మహావిష్ణువు సర్వజీవకోటికీ హితుడూ, సన్నిహితుడూ. ఆ లక్ష్మీపతి సర్వగుణభద్రుడూ, దయా

సముద్రుడూ, ఆ అచ్యుతుడు, అనంతుడూ, ఆదిపురుషుడూ, ఆ వాసుదేవుడు వాసికెక్కినవాడు, వైకుంఠనివాసుడూ. అంతటి మహనీయుడు కేవలం దేవేంద్రుని కోసం రాక్షసరాజులను విరోధివలె వెదకి వెదకి సంహరించాడే. రాక్షసులను హతమారిస్తే దేవతలవల్ల ఆ పురుషోత్తమునికి ఒరిగేదేముంది? మోక్షాధినేత, సకల వరప్రదాత, త్రిగుణాలకు అతీతుడు, విశ్వవిఖ్యాతుడు అయిన విష్ణువునకు రాక్షసుల వల్ల భయమూ లేదు, వారిమీద పగా లేదు. అటువంటి నిత్య నిరంజనమూర్తి అసురులను అంతంచేసి, అమరులను ఆదరించటం ఎంతో వింతగా ఉంది. ఈ సంశయమును తమరే నివారించాలి.

**వ. అనిన శుకుం డిట్లనియె. 4**

* పరీక్షిత్తు ప్రశ్నకు శుకమహర్షి ఆనందించి ఇలా పలికాడు -

**శా. నీ సంప్రశ్నము వర్ణనీయము గదా, నిక్కంబు, రాజేంద్ర! ల**
**క్ష్మీ సంభావ్యుని సచ్చరిత్రము మహాచిత్రంబు చింతింపఁ, ద**
**ద్దాసాఖ్యానము లొప్పు విష్ణుచరణధ్యాన ప్రధానంబులై**
**శ్రీ సంధానములై మునీశ్వర వచో జేగీయమానంబులై. 5**

* ఓ రాజేంద్రా! నిజంగా నీ ప్రశ్న ఉత్తమోత్తమ మయింది. వివరించ తగింది. లక్ష్మీ నాథుడైన లోకనాథుని చరిత్ర మహావిచిత్రం, పరమ పవిత్రం! శ్రద్ధగా విని అర్థం చేసుకో. ఆ విష్ణుభక్తుల కథలు వింటే మనస్సులు శ్రీహరిచరణ కమలాలపై నిలుస్తాయి. ఆ కథలు భక్తి ప్రధానాలు, ముక్తిసాధనాలు! అవి మునీశ్వరుల వల్ల మధురంగా, మహనీయంగా భావించబడ్డాయి.

**క. చిత్రంబులు త్రైలోక్య ప, విత్రంబులు భవలతా లవిత్రంబులు స**
**న్మిత్రంబులు మునిజన వన, చైత్రంబులు విష్ణుదేవు చారిత్రంబుల్. 6**

* శ్రీ మహావిష్ణువు చరిత్రలు కేవలం చిత్రాలు మాత్రమే కావు. ముల్లోకాలకు పరమ పవిత్రాలు. అఖిల జీవరాశికి ఆప్తమిత్రాలు. వనాలకు వసంతాల వలె మునిజనాలకు అత్యంత ప్రీతి పాత్రాలు. అవి సంసార బంధాలను అవలీలగా ఛేదించే లవిత్రాలు.

**వ. నరేంద్రా! కృష్ణద్వైపాయనునకు నమస్కరించి హరికథనంబులు సెప్పెద వినుము. వ్యక్తుండు గాక, గుణంబులు లేక, ప్రకృతిం జెందక, భవంబుల నొందక పరమేశ్వరుండు దన మాయవలన నయిన గుణంబుల నావేశించి బాధ్య బాధకత్వంబుల నొందు, నతండు గుణరహితుండు, సత్త్వ రజ స్తమంబులు ప్రకృతి గుణంబు, లా గుణంబులకు నొక్కొక్క కాలంబున హాని వృద్ధులు గల, వా యీశ్వరుండు సత్త్వంబున దేవఋషులను, రజోగుణంబున నసురులను, దమోగుణంబున యక్ష రక్షోగణంబులను విభజించె. సూర్యుండు పెక్కెడలం గానంబడియు నొక్కరుండయిన తెఱంగునఁ దద్విభుండును సర్వగతుండయ్యును భిన్నుండు గాఁడు, తత్త్వ విదులయిన పెద్దలు తమలోనం బరమాత్మ స్వరూపంబున నున్న యీశ్వరు నవ్విధంబున నెఱుంగుదురు, జీవాత్మకుఁ బరుండైన సర్వమయుండు దనమాయ చేత విశ్వంబు సృజియింపంగోరి రజంబును, గ్రీడింపంగోరి సత్త్వంబును,**

**నిద్రింపంగోరి తమంబును నుత్పాదించి చరమైన కాలంబును సృజియించు, నా కాలంబున సర్వ దర్శనుండయిన యీశ్వరుండును గాలాహ్వాయుండునునై సత్త్వగుణంబయిన దేవానీకంబునకు వృద్ధియు, రజస్తమోగుణు లయిన రాక్షసులకు హానియుం జేయుచుండు. 7**

* మహారాజా! మహాత్ముడైన వేదవ్యాస మహర్షికి ముందుగా వందనం చేసి పరమాత్మ పరమ పవిత్ర చరిత్రను వివరిస్తాను. వినవలసింది. ఆ శ్రీమహావిష్ణువు ఇట్టివాడు అని తెలుసుకోలేము. ఆయన తత్త్వం ఎవరికీ అంతుపట్టదు. ఆయనకు గుణవికారాలు లేవు. జీవ ప్రకృతికి అంటీ అంటకుండా ఉంటాడు. ఆయన జన్మబంధాలలో చిక్కుకోడు. త్రిగుణాలకు అతీతుడైన ఆ పరమేశ్వరుడు తన మాయతో తానే గుణవికారాలు కల్పించుకొని బాధలు పెట్టేవాడూ, బాధలు పొందేవాడూ తానే అవుతాడు. లోకంలో సత్త్వగుణం, రజోగుణం, తమోగుణం అని సహజములైన మూడు గుణాలున్నాయి. ఆ గుణాలు ఒక్కొక్క సమయంలో తగ్గిపోతూ ఉంటాయి. మరొక సమయంలో ప్రకోపిస్తూ ఉంటాయి. ఆ పరాత్పరుడు సత్త్వగుణం ప్రధానంగా దేవతలనూ, మునీశ్వరులను; రజోగుణం ప్రధానంగా అసురులనూ; తమోగుణం ప్రధానంగా యక్ష, రాక్షస సమూహాలను సృష్టించి విభజించాడు.

సూర్యుడు వివిధ స్థానాలలో వేరువేరుగా కన్పించినప్పటికీ ఒక్కడే అయినట్లు ఆ బ్రహ్మాండనాయకుడు కూడా అన్నింటిలోనూ, అందరిలోనూ నివసిస్తున్నప్పటికీ వేరుకాడు. ఒక్కడే! తత్త్వం తెలిసిన పెద్దలు తమలో "ఆత్మ" స్వరూపంతో ప్రకాశించే దైవమును ఆ విధంగా తెలుసుకొంటారు. జీవాత్మకు ఇతరుడుగా కన్పిస్తూ సర్వం తానైన ప్రభువు తన మాయాబలంతో విశ్వమును సృష్టించదలచి రజోగుణమును, లీలా విలాసాలు చూపించదలచి సత్త్వగుణమును, నిద్రింపదలచి తమోగుణమును కలిగించి నడుస్తూ ఉండే కాలమును సృష్టించాడు. అటువంటి 'కాలం' వల్ల సర్వత్రా దర్శనం ఇచ్చే ఆ ఈశ్వరుడు 'కాలస్వరూపుడు' గానే పిలువబడ్డాడు. అటువంటి ఆ స్వామి సత్త్వగుణ ప్రధానులైన దేవతల సమూహానికి ఆనందం, రజోగుణ తమోగుణ ప్రధానులైన రాక్షసులకు దుఃఖం కలిగిస్తూ ఉంటాడు.

**క. జన నాయక! యీ యర్థము, ఘన యశుఁడగు ధర్మజునకుఁ గ్రతుకాలమునన్**
**మును నారదుండు సెప్పెను, వినిపించెద వినుము చెవులు విమలత నొందన్. 8.**

* జననాయకా! పూర్వం ఈ తత్త్వసారమును రాజసూయయాగ సమయంలో ధర్మరాజునకు ధర్మమర్మవిదుడైన నారదమహర్షి వివరించాడు. వీనులకు విందుగా ఆ విషయం నీకు వివరిస్తాను. అది వింటే నీ సందేహం తొలగిపోతుంది.

**వ. మున్ను ధర్మరాజు సేయు రాజసూయయాగంబున బాలుం డైన శిశుపాలుండు హరిని నిందించి, నిశిత నిర్వక్ర చక్రధారా దళిత మస్తకుండయి తేజోరూపంబున వచ్చి హరి దేహంబు సొచ్చుటంజూచి వెఱఁగుపడి ధర్మజుండు సభలో నున్న నారదునిం జూచి యిట్లనియె. 9**

* పూర్వం ఒకసారి ధర్మరాజు రాజసూయ యాగం చేశాడు. ఆ యాగానికి బాలుడూ, అజ్ఞానీ అయిన శిశుపాలుడు వచ్చి శ్రీకృష్ణుణ్ణి నిందించాడు. అపు డాహరికి కోపంవచ్చి వాడియైన తన చక్రాయుధంతో వాడి శిరస్సును ఖండించాడు. అలా చనిపోయిన శిశుపాలుడు తేజోరూపంతో వాత్సల్యమూర్తి అయిన వాసుదేవుని శరీరంలో ప్రవేశించి దానిలో లీనమైపోయి విష్ణుసాయుజ్యం పొందాడు. అది కళ్ళారా చూచిన ధర్మరాజుకు అత్యాశ్చర్యం కలిగింది. ఆ సభలో నున్న నారదమహర్షి దగ్గరకు వెళ్లి తనకు గల సంశయమును ఇలా వివరించాడు.

**ఆ. ఎట్టివారికైన నేకాంతులకు నైన, వచ్చి చొరఁగరాని వాసుదేవు**
**తత్త్వమందుఁ జేదిధరణీశుఁ డహితుఁడై, యెట్లు సొచ్చె మునివరేణ్య! నేఁడు. 10**

* మునివరేణ్యా! ధర్మమర్మజ్ఞా! నాకు ఒక పెద్ద సందేహం కలిగింది. మహానుభావుడైన వాసుదేవునిలో ప్రవేశించగలగటం ఎటువంటి పుణ్యాత్ములకైనా వీలుకాదే. ఎటువంటి తేజస్సుకైనా వానిలో ప్రవేశించే శక్తి ఉండదే. అటువంటిది. శత్రువైన శిశుపాలుడు ఆ మహా సౌభాగ్యమును ఎలా పొందగలిగాడు. స్వామీ? వీనికి విష్ణువును నిందించటమే నిత్యకృత్యం కదా! ఈ పుణ్యపదం వీనికెలా కలిగింది?

**ఉ. వేనుఁడు మాధవుం దెగడి విప్రులు దిట్టిన భగ్నుఁడై తమో**
**లీనుఁడు గాఁడె? తొల్లి మదలిప్తుఁడు చైద్యుఁడు పిన్న నాఁట నుం**
**డేనియు మాధవున్ విన సహింపఁడు భక్తి వహింపఁ డట్టి వాఁ**
**డే నిబిడ ప్రభావమున నీ పరమేశ్వరునందుఁ జొచ్చెనో? 11**

* పూర్వం వేనుడనేవాడు వాసుదేవుణ్ణి దూషించి, వేదమూర్తులైన బ్రాహ్మణుల ఆగ్రహానికి గురియై వారు శపించగా చివరకు నశించి పోయాడు. తమస్సులో సమసిపోయాడు. ఈ శిశుపాలుడుకూడా అజ్ఞానుడూ, మదాంధుడూ. తత్త్వం తెలిసినవాడూ కాడు. హరి కీర్తనం సహించేవాడు కాడు. చిన్ననాటి నుంచీ శ్రీహరి మాటంటేనే మండిపడేవాడు. అటువంటి ఈ శిశుపాలుడు ఇప్పుడు ఏ పుణ్యబలంతో పరమాత్మలో లీనం కాగలిగాడు చెప్పండి?

**మ. హరి సాధింతు, హరిన్ గ్రసింతు, హరిఁ బ్రాణాంతంబు నొందింతుఁ, దా**
**హరికిన్ వైరి నటంచు వీఁడు పటురోషాయత్తుఁడై యెప్పుడున్**
**దిరుగుం బ్రువ్వదు నోరు వ్రీలి పడ, దా దేహంబు దాహంబుతో**
**నరకప్రాప్తియు నొందఁ; డే క్రియ జగన్నాథుం బ్రవేశించెనో? 12**

* ఈ శిశుపాలుడు ఎప్పుడూ "హరిని సాధిస్తాను, హరిని మ్రింగేస్తాను, హరిని చంపేస్తాను. హరి అంటే నాకు అరికాలి మంట తలకెక్కుతుంది. వాడు నా ప్రాణ విరోధి"అంటూ రోషంతో, ద్వేషంతో, తాపంతో తిరుగుతుండేవాడు. పుణ్యపురుషులను దూషించే వీడు హీనంగా క్రిమికీటకాలతో క్రుళ్ళి చావనూ లేదు, వీని నోరు పడిపోనూ లేదు, దేహం దగ్ధమై నరకంలో కూలిపోనూ లేదు సరికదా పైగా శ్రీమన్నారాయణుని హృదయంలో ప్రవేశించాడు; చూశారా?

**వ. అదియునుం గాక దంతవక్త్రుండును వీఁడును నిరంతరంబు గోవిందు నిందసేయుదురు, నిఖిలజనులు సందర్శింప నేఁడు వీనికి విష్ణుసాయుజ్యంబు గలుగుట కేమి హేతువు? వినిపింపుము, పవనచలిత దీపశిఖయునుం బోలె నా హృదయంబు సంచలించుచున్న దనిన ధర్మనందనునకు నారదుండిట్లనియె. దూషణభూషణ తిరస్కారంబులు శరీరంబునకుఁ గాని పరమాత్మకు లేవు, శరీరాభి మానంబునం జేసి దండవాక్పారుష్యంబులు హింసయై తోఁచు తెఱంగున నేను, నాయది యనియెడు వైషమ్యంబును భూతంబులకు శరీరంబు నందు సంభవించు, అభిమానంబు బంధంబు. నిరభి మానుండై వధించినను వధంబు గాదు. కర్తృత్వ మొల్లని వానికి హింసయు సిద్ధింపదు. సర్వభూతాత్మకుండైన యీశ్వరునికి వైషమ్యంబు లేదు. గావున - 13**

* ఇంతేకాదు ఈ శిశుపాలుడున్నూ, వీని సోదరుడైన దంతవక్త్రుడునూ, నిత్యం నీరజాక్షుణ్ణి నిందించేవాళ్లు. ఆ మాటలు వినలేకపోయేవాళ్లం. అటువంటి పాపాత్ముడు ఈనాడు ఇంతమంది చూస్తుండగా ముక్తి సామ్రాజ్యమైన విష్ణుసాయుజ్యం అందుకోగలిగాడే? ఇది ఎలా సాధ్యమయింది! మహాత్మా! మహర్షీ! నా సంశయం తీర్చండి. పెనుగాలికి కొట్టుమిట్టాడే దీపంలాగా నా హృదయం చలించిపోతున్నది'అని పలికిన ధర్మజుని హృదయం తెలిసికొని నారదమహర్షి ఇలా పలికాడు.

ఓ రాజకులభూషణా! మధురభాషణా! దూషణ భూషణాలు, తిరస్కారపురస్కారాలు శరీరానికే గాని ఆత్మకు గావు. ఇవి ఆత్మకు అంటవు. శరీరం మీద ఉండే మితిలేని మమకారం కారణంగా దండనం, ఖండనం, కటుభాషణం వంటివి హింసగా అనిపిస్తాయి. నేను - నాది అనే స్వార్థ ద్వేషభావాలు కూడా జీవులకు శరీరం వల్లనే కలుగుతాయి. అసలు అభిమానం అనేదే బంధకారణం. నిరభిమానుడై సంహారక్రియ చేసినా అది సంహారమూ కాదూ, పాపమూ కాదూ. కర్తృత్వం తనమీద లేనివానికి హింసవల్ల కలిగే పాపం ఎప్పుడూ అంటదు. ఆ పాపం కర్త అయిన వానికే చెందుతుంది. సమస్త ప్రాణికోటియందు ఉండేటటువంటి శ్రీ విష్ణుమూర్తికి ద్వేషంకానీ, విరోధంకానీ ఏ ఒక్కటీ, ఎవరిమీదా, ఎప్పుడూ ఉండదు.

**ఆ. అలుకనైనఁ జెలిమి నైనఁ గామంబున, నైన బాంధవమున నైన భీతి**
**నైనఁ దగిలి తలఁప నఖిలాత్ముఁడగు హరిఁ, జేరవచ్చు వేఱు సేయఁ డతఁడు. 14**

* ధర్మనందనా! కోపంతో కానీ, కోరికతో కానీ, స్నేహంతో కానీ, మోహంతోకానీ, శత్రుత్వంతో కానీ, ప్రీతితోకానీ, భీతితో కానీ ఏ విధంగానైనా సరే హరిని ఏమరకుండా స్మరిస్తున్నట్లయితే సర్వ భూతాత్మకుడైన విష్ణుదేవుని సన్నిధానం లభ్యమవుతుంది. ఆ స్వామి ఎవరినీ, ఎప్పుడూ పరునిగా చూడడు.

**క. వైరానుబంధనంబునఁ, జేరిన చందమున విష్ణుఁ జిరతర భక్తిం**
**జేరఁగరా దని తోఁచును, నారాయణ భక్తియుక్తి నా చిత్తమునన్. 15**

* ఆ మహావిష్ణువును విశృంఖలమైన విరోధంతో చేరటం కంటే భక్తితో చేరటమే కష్టం అనిపిస్తున్నది. అనురాగంతో చేసే ఆరాధనతో కంటే, ద్వేషంతోనే భగవంతుని సారూప్యం పొందవచ్చేమో అని నాకు అనిపిస్తున్నది.

క. **కీటకముఁ దెచ్చి భ్రమరము, పాటవమున బంభ్రమింప భ్రాంతంబై త**
**త్కీటకము భ్రమరరూపముఁ, బాటించి వహించుఁగాదె భయయోగమునన్.** **16**

* తుమ్మెద ఒక పురుగును తెచ్చి దాని చుట్టూ ఝుంకారం చేస్తూ తిరుగుతూ ఉంటుంది. ఆ పురుగు తుమ్మెద అనే తలచి తలచి భ్రాంతిపడి చివరకు తుమ్మెదగా మారుతుంది. అలాగే భయంవల్ల గానీ, నయంవల్లగానీ, స్మరణంవల్ల గానీ, శ్రవణం వల్ల గానీ శ్రీహరి సారూప్యం పొందవచ్చు.

వ. **ఇవ్విధంబున** **17**

శా. **కామోత్కంఠత గోపికల్ భయమునం గంసుండు వైర క్రియా**
**సామగ్రిన్ శిశుపాలముఖ్యనృపతుల్ సంబంధులై వృష్ణులున్**
**బ్రేమన్ మీరలు భక్తి నేము నిదె చక్రిం గంటి మెట్లైన ను**
**ద్దామ ధ్యానగరిష్ఠుఁడైన హరిఁ జెందన్వచ్చు ధాత్రీశ్వరా!** **18**

* ఈ విధంగా మహారాజా! అధికమైన కామంతో గోపికాభామలూ, భయంతో కంసుడు, వెనుదీయని వైరంతో శిశుపాలుడు దంతవక్త్రుడు మొదలైన రాజులూ, అనుబంధం పెంచుకున్న సంబంధంతో యాదవులూ, ప్రేమతో ఉత్తమ ప్రభువులైన మీరూ, భక్తితో మహర్షుల మైన మేమూ శ్రీహరినామ స్మరణచేసి ఆ స్వామి అనురాగానికి పాత్రులమయ్యాం కాబట్టి ఏ విధంగా నైనా సరే నిరంతరమైన స్మరణం వల్ల జనుడు జనార్దను డౌతాడు. నరుడు నారాయణు డౌతాడు.

## -: శ్రీహరి ద్వారపాలకులకు సనకాదుల వలన శాపంబు గల్గుట. :-

వ. **మఱియుం బెక్కండ్రు కామ ద్వేష భయ స్నేహ సేవాతిరేకంబులఁ జిత్తంబు హరిపరాయత్తంబుగాఁ జేసి తద్గతిం జెందిరి, హరి నుద్దేశించి క్రోధాదులైన ఏ నింటి లోపల నొక్కటియైన వేనునికి లేని నిమిత్తంబున నతండు వ్యర్థుండయ్యె. మీ తల్లికి చెలియలి కొడుకు లయిన శిశుపాల దంతవక్త్రులు దొల్లి విష్ణు మందిర ద్వారపాలకులు! విప్రశాపంబునఁ బదభ్రష్టులై భూతలంబునన్ జన్మించి, రనిన విని యుధిష్ఠిరుండు నారదుని కిట్లనియె.** **19**

* చాలమంది భక్తులు ఆ రమా మనోహరుని సేవించి, భావించి, కామించి, ద్వేషించి కూడా ముక్తి పొందారు. భయపడి భంగపడి కొందరూ, ఆయనతో స్నేహం పెంచుకొని సేవచేసుకొని కొందరూ, మనస్సును మాధవునికే అంకితం చేసి సద్గతిని సంపాదించారు. రాజర్షీ! ఆ శ్రీహరిపట్ల కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలనే అయిదు గుణాలలో ఏ ఒక్కటి కూడా లేని కారణం చేతనే వేను డనే వాడు భ్రష్టుడై మరణించాడు.

ధర్మజా! మీ పినతల్లి కొడుకులైన శిశుపాలుడూ, దంతవక్త్రుడూ సామాన్యులు కారు. వారు పూర్వం వైకుంఠంలో ద్వారపాలకులు. అటువంటి ఆ భక్తులు ఒకానొకప్పుడు విప్రుల శాపంవల్ల పదభ్రష్టులై భూలోకంలో జన్మించారు - అని దేవర్షి నారదుడు అనగానే ధర్మరాజు అది విని మరలా నారదుణ్ణి ఇలా ప్రశ్నించాడు.

**మ. అలుగం గారణ మేమి? విప్రులకు ము న్నా విప్రు లెవ్వారు? ని**
**శ్చలు లేకాంతులు నిర్జితేంద్రియులు నిస్సంసారు లీశాను వ**
**ర్తులు వైకుంఠ పురీనివాసు లన విందున్, వారి కెబ్భంగి నీ**
**ఖల జన్మంబులు వచ్చె? నారద! వినం గౌతూహలం బయ్యెడిన్. 20**

* నారద మునీంద్రా! ఆ వేదమూర్తులైన విప్రులకు ఆగ్రహం ఎందుకు వచ్చింది? ఆ మునీంద్రులు ఎవ్వరు? విష్ణుమందిర ద్వారపాలకులు, నిశ్చలమైన భక్తి ప్రపత్తులు కలవాళ్లూ, సంసారబంధాలలో తగుల్కొనక నిరంతరం ఆ జగన్నాయకుని ఆజ్ఞను పాలించేవారూ కదా! అటువంటి వాళ్లు విప్రశాపానికి పాత్రులు ఎలా అయ్యారు? వాళ్ళ కీ దుష్టజన్మలు ఎలా సంభవించాయి? వినాలని కుతూహలంగా ఉంది చెప్పండి.

**వ. అనిన నారదుం డిట్లనియె. ఒక్కనాఁడు బ్రహ్మమానస పుత్త్రులైన సనకసనందనాదులు దైవయోగంబున భువనత్రయంబునందును సంచరించుచు, నై దా ఱేండ్ల ప్రాయంపు బాలకుల భావంబున దిగంబరు లయి హరి మందిరంబునకు వచ్చి చొచ్చు నెడ, మొగసాల నున్న పురుషు లిరువురు వారలం జూచి. 21**

* అని రాజేంద్రుడు అడుగగానే మునీంద్రుడు ఇలా పలికాడు - సనకసనందనాదులు బ్రహ్మమానస పుత్రులు. వాళ్లు ఒకనాడు దైవవశాత్తూ ముల్లోకాలు చూచి వస్తూ వస్తూ వైకుంఠం వెళ్ళారు. అప్పుడు వాళ్లు ఐదారేళ్ళ బాలకులుగా దిగంబరులై సంచరిస్తూ విష్ణుమూర్తి అంతఃపురంలోనికి ప్రవేశించబోతున్నారు. అప్పుడు అక్కడ ఉన్న ద్వారపాలకులు సనకసనందనాదులను చూచారు.

**క. డింభకుల ననర్గళ వి, స్రంభకుల రమాధినాథ సల్లాప సుఖా**
**రంభకుల ముక్త మానస, దంభకులం జొరఁగ నీక తరిమి రధీశా! 22**

* బాలరూపధారులైన ఆ సనకసనందనాదులు విష్ణుదేవునికి ఎంతో ప్రియమైన వాళ్లు. ఎప్పుడూ విష్ణుకథలనే వీనులకు విందుగా వినే వాళ్లు. గర్వం అంటే తెలియని నిర్మల మనస్కులు. అటువంటి చక్కని బాలకులను ద్వారపాలకు లిద్దరూ చూచి, గేలిచేసి లోపలకు రానీయకుండగా బయటికి తరిమివేశారు.

**క. వారించిన తమకంబున, వా రించుక నిలువలేక వడిఁ దిట్టిరి దౌ**
**వారికుల నసురయోని న, వారితులై పుట్టుఁడనుచు వసుధాధీశా! 23**

* ధర్మరాజా! ఆ సనకసనందనాది మునీంద్రులు ఎంతో నిగ్రహం గలవాళ్లు అయినప్పటికీ, వాళ్ళను శ్రీహరి సన్నిధికి పోనీయక పోయేటప్పటికి వాళ్లు వెంటనే కోపగించి ఆ ద్వారపాలకులను “మీరు రాక్షసులై పుట్టండి”అని శపించారు.

**వ. మఱియు నా పిన్న పెద్దలు వారలం జూచి 'మీర లీయెడ నుండ నర్హులు గారు. నారాయణ చరణ మూలంబు విడిచి రజస్తమోగుణులైన రాక్షసయోనిం బుట్టుం"డని శపియించిన వారు నా శాప వశంబునఁ బదభ్రష్టులై కూలుచు మొఱలిడిన న మ్మహాత్ములు దయాళువులై క్రమ్మఱం గరుణించి మూఁడు జన్మంబులకు వైరంబున భగవత్సన్నిధానంబు గలిగెడు మని నిర్దేశించి చని, రివ్విధంబున శాపహతులై హరిపార్శ్వ చరులైన పురుషు లిరువురు హిరణ్యకశిపు హిరణ్యాక్షులన దితికి జన్మించి, రందుఁ గనిష్ఠుండైన హిరణ్యాక్షుని హరి వరాహ రూపంబున సంహరించె, నగ్రజుండయిన హిరణ్య కశిపుండు నరసింహమూర్తి యయిన శ్రీహరిచేత విదళితుండయ్యె, నతని కొడుకు ప్రహ్లాదుండు దండ్రిచేత హింసితుం డయ్యును నారాయణ పరాయణుండై శాశ్వతుం డయ్యె, రెండవ భవంబునఁ గైకసి యను రాక్షసికి రావణ కుంభకర్ణులయి సంభవించిన, విశ్వంభరుండు రఘుకులంబున రాఘవుండయి యవతరించి వారల వధియించె, న మ్మహాత్ముని పరాక్రమంబులు మార్కండేయ ఋషివలన నెఱింగెదవు, తృతీయజన్మంబున మీ తల్లి చెలియలికి శిశుపాల దంతవక్త్రులన నుద్భవించి. 24**

* బాలకులుగా ఉన్న ఆ మహనీయులు వాళ్ళిద్దరినీ చూసి "మీరు ఇక్కడ ఉండడానికి అర్హులుకారు. శ్రీమన్నారాయణుని చరణారవిందాల సాన్నిధ్యం వదలిపొండి. రజస్తమో గుణప్రధానులైన రాక్షసులుగా జన్మించండి"అని శపించేసరికి వాళ్లు పదవీ భ్రష్టులై, దుఃఖంతో పశ్చాత్తాపంతో మునులను శరణువేడారు. వాళ్ళ దుఃఖం చూసి ఆ మహాత్ముల సుకుమారమైన మనస్సు ద్రవించింది. "మీకు మూడు జన్మలలో వైరభక్తితో భగవంతుని సాన్నిధ్యం సంప్రాప్తమౌతుంది"అని శాపానికి ఉపసంహారం చెప్పి వారు వెళ్లిపోయారు. ఆ విధంగా శాపహతులైన వైకుంఠద్వారపాలకు లిద్దరూ హిరణ్యకశిపు, హిరణ్యాక్షులుగా జన్మించారు. వారి తల్లిపేరు దితి. ఆ ఇద్దరిలో చిన్నవాడైన హిరణ్యాక్షుడు భూమిని చుట్టచుట్టుకొని పట్టుకపోతుంటే విష్ణువు వరాహరూపంలో వచ్చి సంహరించాడు. పెద్దవాడైన హిరణ్యకశిపుడు నరసింహమూర్తి అయిన శ్రీహరి చేతులలో సంహరింపబడ్డాడు. ఆ హిరణ్యకశిపుని కొడుకు ప్రహ్లాదుడు. అతడు హరిభక్తుడు. ఆ కారణంగా తండ్రిచేత నానా విధాలుగా హింసింపబడికూడా ప్రహ్లాదుడు నారాయణుని చరణకమలాలు విడువకుండా ధ్యానిస్తూ పరమపదం పొందాడు.

రెండవ జన్మలో హిరణ్యాక్ష హిరణ్యకశిపులు కైకసి అనే రాక్షసికి రావణ కుంభకర్ణులుగా జన్మించారు. అపుడు శ్రీ విష్ణువు రఘురాముడుగా జన్మించి వాళ్లను సంహరించాడు. ఆ శ్రీరామచంద్రుని బలపరాక్రమాలు మార్కండేయ మహర్షిద్వారా మున్ముందు నీవు తెలుసుకుంటావు.

వాళ్ళిద్దరూ మూడవజన్మలో మీ పినతల్లి అయిన సాత్వతికి శిశుపాల, దంతవక్త్రులుగా జన్మించారు.

**శా. వక్రత్వం బెటు లేక పాయని మహావైరంబుతో నిత్య జా**<br>
**తక్రోధ స్మరణంబులన్ విదళితోద్యత్పాప సంఘాతులై**<br>
**చక్రచ్ఛిన్న శిరస్కులై మునివచ శ్శాపావధి ప్రాప్తులై**<br>
**చక్రిం జెందిరి వారు పార్శ్వచరులై సారూప్య భావంబునన్. 25**

* ఆ ఇద్దరూ ద్వేషరోషాదులతోనే పుట్టారు. హరిని దూషించటం పుట్టుకతోనే ప్రారంభం అయింది. మహావైరంతో, నిత్య క్రోధంతో హరిని నిందించే వారు. హరి భక్తులను బాధిస్తూ వేధిస్తూ ఉండేవారు. ఆ స్వామిని పట్టి పరిమార్చాలనే ఉద్ధృతమైన ఉత్కంఠతో అదే ధ్యాసతో ఉండేవారు. వేరే ఆలోచనే లేదు. ఊహలన్నీ ఆయన చుట్టే. అలా వారి గుండెల్లో హరి నిండి ఉండేవాడు. అందుచేత వారి పాపం పండిపోయింది. కృష్ణపరమాత్మ ఇప్పుడు వారి శిరస్సులను సుదర్శనంతో ఖండించివేశాడు. సనక సనందనాదుల శాపం గడువు పూర్తి అయింది. తిరిగి వారు విష్ణు సాయుజ్యం పొందారు.

వ. అనిన విని ధర్మనందనుం డిట్లనియె. 26

* ఈవిధంగా నారదమహర్షి చెప్పినదంతా విని ధర్మరాజు ఇలా ప్రశ్నించాడు.

**క. బాలున్ హరిపద చింతా, శీలున్ సుగుణాలవాలు శ్రీమ న్మేధా**
**జాలున్ సంతోషింపక, యేలా శిక్షించె రాక్షసేంద్రుం డనఘా! 27**

* తాపసేంద్రా! ఆ రాక్షసేంద్రుడైన హిరణ్యకశిపుడు, శ్రీహరి పాదపద్మాలను ధ్యానించే గుణవంతుడూ, పసివాడూ, అయిన తన కుమారుణ్ణి చూచి సంతోషించవలసింది పోయి ఆ బాలుణ్ణి పట్టుకొని శిక్షించడానికి అతనికి చేతులు ఎలా వచ్చాయి? ఎంత రాక్షసుడైనా కొడుకును బాధించటానికి మనస్సు ఎలా ఒప్పింది?

**క. పరిభూత వ్యథనంబులు, నిరుపమ సంసార జలధి నిర్మథనంబుల్**
**నరకేసరి కథనంబులు, పరిరక్షిత దేవ యక్ష ఫణి మిథునంబుల్. 28**

* శ్రీహరి కథలు వ్యథలు పోగొట్టేవి, సుధలు చిలికించేవి, అనంతమైన సంసార సాగరములు దాటించేవి; దేవతలకూ, యక్షులకూ, నాగులకూ, స్త్రీ పురుష జాతుల కందరికీ క్షేమమును కలిగించేవి. కుమారునకు అటువంటి దైవధ్యానం అలవడినందుకు ఆ రాక్షసరాజు పొంగిపోక క్రుంగిపోయాడా? ఆ ప్రహ్లాదుణ్ణి హిరణ్యకశిపుడు ఎలా శిక్షించాడు స్వామీ?

**వ. మునీంద్రా వినిపింపు మనిన నారదుం డిట్లనియెఁ, కమలోదరుచేతం దన సహోదరుండు హతుం డయ్యె నని విని, హిరణ్యకశిపుండు రోష శోక దందహ్యమాన మానసుండయి ఘూర్ణిల్లుచు, నాభీల దావదహనజ్వాలా కరాళంబులయిన విలోకన జాలంబుల గగనంబునం బొగ లెగయ నిరీక్షింపుచుఁ దటిల్ల తాంకుర సంకాశ ధగద్ధగిత దంత సందష్ట దశనచ్ఛదుండును, నదభ్ర భయంకర భ్రుకుటిత ఫాలభాగుండును, నిరంతరాక్రాంత దురంతవైర వేగుండును నై మహాప్రభాజాల జటాలంబగు శూలంబుఁ గేల నందుకొని, సభామండపంబున నిలువంబడి త్రిమస్తక, త్రిలోచన, శకుని, శంబర, శతబాహు, నముచి, హయగ్రీవ, పులోమ, విప్రచిత్తి ప్రముఖులైన దైత్య దానవుల నాలోకించి ఇట్లనియె. 29**

* మునిచంద్రా! నా సందేహం నివృత్తి చెయ్యి - అనగా నారదమహర్షి ఇలా వివరించాడు. తన సోదరుడైన హిరణ్యాక్షుడు యజ్ఞ వరాహమూర్తి అయిన విష్ణువు చేతిలో హతుడైనాడని విని హిరణ్యకశిపునికి తీవ్రమైన కోపం వచ్చింది. రోషంచేతా, శోకంచేతా అతడి మనస్సు అగ్ని గుండంగా మండిపోయింది.

కళ్ళలోనుంచి వచ్చే చూపులు నిప్పులు క్రక్కుతూ దావాగ్ని జ్వాలల వలె ఉన్నాయి. ఆ పొగలు ఆకాశంలోనికి వ్యాపించాయి. మెరుపుల్లాగా ధగధగ మెరుస్తున్న పళ్ళు పట పట లాడించాడు. భయంకరమైన కనుబొమలు ఒక్కసారిగా ముడిపడినాయి. అతడు ఎడతెగని శత్రుభావంతో ఎగిరెగిరి పడసాగాడు. అమితమైన కాంతులు వెదజల్లే శూలాన్ని చేతితో అందుకున్నాడు. సభామండపంలోకి వచ్చి నిలుచున్నాడు. త్రిమస్తక, త్రిలోచన, శకుని, శంబర, శతబాహు, నముచి, హయగ్రీవ, పులోమ, విప్రచిత్తి మున్నగు ప్రముఖ దైత్యులనూ, దానవులనూ చూచి ఇలా ఉద్ఘోషించాడు.

**శా. నాకుం దమ్ముఁడు, మీకు నెచ్చెలి, రణన్యాయైకదక్షుండు బా**
**హాకుంఠీకృత దేవయక్షుఁడు హిరణ్యాక్షుండు, వానిన్ మహా**
**సౌకర్యాంగము దాల్చి దానవవధూ సౌకర్యముల్ నీఱుగా**
**వైకుంఠుండు వధించిపోయెనఁట! యీ వార్తాస్థితిన్ వింటిరే? 30**

* మిత్రులారా! మీరీ వార్త విన్నారా? వైకుంఠ వాసియైన హరి మన హిరణ్యాక్షుణ్ణి సంహరించాడట. నాకు సాక్షాత్తూ సహోదరుడూ, మీకు మక్కువగల మిత్రుడూ అయిన హిరణ్యాక్షుడు సామాన్యుడా? యుద్ధధర్మమర్మజ్ఞుడు. బాహుబలంతో దేవ, యక్ష గణాలను నిర్వీర్యులను చేసిన మహాపరాక్రమశాలి. అటువంటి హిరణ్యాక్షుణ్ణి హరి, వరాహంగా వచ్చి వధించి వాని అంతఃపురకాంత సౌభాగ్యాలు హరించి వేశాడు.

**చ. వనముల నుండుఁ జొచ్చు మునివర్గములోపల ఘోణిగాఁడు, సం**
**జనన మెఱుంగ రెవ్వరును, జాడ యొకింతయు లేదు, తన్ను డా**
**సిన మఱి డాయు, వెంటఁబడి చిక్కక చిక్కఁడు, వీని నొక్క కీ**
**లున మన మెల్ల లోఁబడక లోఁబడఁ బట్టుకొనంగ వచ్చునే? 31**

* సోదరులారా! ఆ "వరాహం"గాడు మహామాయగాడు. నీళ్ళలో ఉంటాడు. అడవులలో దాగుతాడు. మునుల సమూహంలో చొరబడి ఉంటాడు. వాని పుట్టు పూర్వోత్తరాలు ఎవరికీ తెలియవు. ఎక్కడి వాడో కూడా తెలియదు. మనం ఎదుర్కొంటే తానూ ఎదుర్కొంటాడు. వెంటపడితే ఎప్పటికీ అలసిపోడు. దొరికిపోడు. కాబట్టి మనం ఒక మాయోపాయం ఆలోచించాలి. మనం లోబడకుండా జాగ్రత్తగా అతడు మనకు లోబడే లాగా పట్టుకోవాలి. అది సాధ్యమేనా?

**సీ. భుజశక్తి నాతోడఁ బోరాడ శంకించి మున్నీట మునిఁగిన మునుఁగుఁగాక,**
**యలయించి పెనఁగ నా యచలసంభ్రమమున కెఱఁగి వె న్నిచ్చిన నిచ్చుఁగాక,**
**జగడంబు సైఁపక సౌకర్య కాంక్షి యై యిలక్రింద నీఁగిన నీఁగుఁగాక,**
**క్రోధించి యటు గాక కొంత పౌరుషమున హరిభంగి నడరిన నడరుఁ గాక,**

**ఆ. కఠినశూలధారఁ గంఠంబు విదళించి, వాని శోణితమున వాఁడి మెఱసి**
**మత్సహోదరునకు మహిఁ దర్పణము సేసి, మెఱసి వత్తు, మీకు మేలు దెత్తు. 32**

* వీరులారా! ఆ హరి నా భుజబల పరాక్రమాలు విని భయపడి పోరాడలేక సముద్రంలోపల దాగినప్పటికీ, యుద్ధవిద్యలో నా అచంచలమైన ధైర్యసాహసాలను చూచి వెన్నిచ్చి పారిపోయినప్పటికీ, 'పోరు ఎందుకులే బ్రతికి ఉంటే చాలు' ననుకొని భయకంపితుడై వరాహంగా భూమిని త్రవ్వుకొంటూ పాతాళానికి పోయినప్పటికీ, లేదా ఆ విధంగా కాకుండా కోపగించి పౌరుషంతో సింహంలాగా ఎదిరించి పోరాడి నప్పటికీ వానిని మాత్రం విడిచి పెట్టేది లేదు. ఈ వాడియైన బల్లెంతో వాడి కంఠాన్ని ఛేదించి ఆ వేడి నెత్తురుతో నా తమ్మునికి తర్పణం విడుస్తాను. తప్పక విజయంతో తిరిగివస్తాను. మీ కందరికీ మేలు చేస్తాను.

**క. ఖండిత మూలద్రుమమున, నెండిన విటపముల భంగి నితఁడు వడిన నా**
**ఖండల ముఖ్యులు వడుదురు, భండనమున నితఁడు దమకుఁ బ్రాణము లగుటన్. 33**

* ఒక వృక్షం కూలిన తర్వాత ఎండిపోయే కొమ్మలవలె విష్ణువును సంహరించిన తరువాత దేవేంద్రప్రముఖులంతా యుద్ధంలో ఓడిపోయి వాడిపోతారు. విష్ణువు వీళ్లందరికీమూలం, ప్రాణం; కాబట్టి విష్ణుసంహారం జరిగిందంటే వీళ్లపని శూన్యం!.

**సీ. పొండు దానవులార! భూసురక్షేత్ర సంగతయైన భూమికి గములు గట్టి**
**మఖతపస్స్వాధ్యాయ మౌనవ్రతస్థుల వెదకి ఖండింపుఁడు, విష్ణుఁ డనఁగ**
**నన్యుఁ డొక్కఁడు లేఁడు, యజ్ఞంబు వేదంబు నతఁడె, భూదేవ క్రియాది మూల**
**మతఁడె, దేవర్షి పిత్రాది లోకములకు ధర్మాదులకు మహాధార మతఁడె**

**తే. యే స్థలంబుల గో భూసురేంద్ర వేద, వర్ణ ధర్మాశ్రమంబులు వరుస నుండు**
**నా స్థలంబుల కెల్ల మీ రరిగి చెఱచి, దగ్ధములు చేసి రండు మీ దర్ప మొప్ప. 34**

* ఓ దానవ శ్రేష్ఠులారా! ముందు విప్రులు ఉండే ప్రదేశాలకు గుంపులు గుంపులుగా పొండి. యజ్ఞాలూ, జపతపాలూ, వేదాధ్యయనాలు, వ్రతాలూ ఆచరించే వాళ్లందరినీ వెదకి వెదకి చంపండి. విష్ణువంటే వేరుగా ఎక్కడో లేడు. ఎవడో కాడు. అతడే యజ్ఞం. అతడే వేదం. అతడే వైదిక బ్రాహ్మణ కర్మకాండకు ఆదిమూలం. దేవతల సమూహాలకూ, ముని సంఘాలకూ, పైతృకలోకాలకూ, సర్వధర్మాలకూ అతడే ఆధారం. ఎక్కడైతే గోవులూ, విప్రులూ సుఖంగా జీవిస్తుంటారో, ఎక్కడైతే వేద ధర్మాలూ, ఆశ్రమ నియమాలూ క్రమబద్ధంగా నడుస్తుంటాయో ఆ యా చోట్లకు వెళ్లి వాటిని ధ్వంసం చేయండి. మీ దర్పం, గర్వం శోభించే లాగా సర్వం దగ్ధం చేసిరండి.

**వ. అని యిట్లు నిర్దేశించిన దివిజమర్దను నిర్దేశంబులు శిరంబుల ధరియించి రక్కసులు పెక్కండ్రు భూతలంబునకుం జని. 35**

* అని దేవతల విరోధి అయిన హిరణ్యకశిపుడు అతిఘోరంగా ఆదేశాలు ఇచ్చాడు. ఆ ఆజ్ఞలను శిరసావహించి కటిక రక్కసి మూకలు తండోపతండాలుగా వచ్చి భూమండలంపై పడ్డాయి.

**సీ. గ్రామ పుర క్షేత్ర ఖర్వట ఖేట ఘోషారామ నగ రాశ్ర మాదికములు**
**గాలిచి కొలఁకులు గలఁచి ప్రాకార గోపుర సేతువులు ద్రవ్వి, పుణ్యభూజ**
**చయములు ఖండించి సౌధ ప్రపాగేహ పర్ణశాలాదులు పాడుచేసి**
**సాధు గోబ్రాహ్మణ సంఘంబులకు హింస గావించి వేదమార్గములు సెఱచి**

**ఆ. కుతల మెల్ల నిట్లు కోలాహలంబుగా, దైత్యు లాచరింపఁ దల్లడిల్లి**
**నష్టమూర్తు లగుచు నాకలోకము మాని, యడవులందుఁ జొచ్చి రమరవరులు. 36**

* గ్రామాలు, నగరాలు, పుణ్యక్షేత్రాలు, పల్లెలు, వనాలు, భవనాలు, ఆశ్రమాలు ఆ రాక్షసులు ధ్వంసం చేశారు. అందమైన సరోజాలుండే సరస్సులను కలచి వేశారు. ప్రాకారాలను, గోపురాలను త్రవ్వేశారు. వంతెలను కూల్చివేశారు. వాళ్ళ ఆగడాలు ఇన్నీ అన్నీ కావు. చక్కని పువ్వులతో, తియ్యని ఫలాలతో నిండిన వృక్షాలను నరికివేశారు. చలిపందిరులనూ, పర్ణశాలలనూ పాడుచేశారు. ఇతరులకు అపకారం తలపెట్టని గోవులనూ, విప్రులనూ హత్యగావించారు. వేద సంప్రదాయాలను నాశనం చేశారు. ఈ విధంగా కోలాహలంగా భూగోళం అంతా గందరగోళం చేస్తూ ఉపద్రవాలు, ఉత్పాతాలు కల్పించారు. ఇది చూచి దేవతలు భయపడి దైన్యంగా స్వర్గలోకం విడిచిపెట్టి శోకంతో అడవులలోకి వెళ్లి దాక్కున్నారు. దుర్జనులంటే సజ్జనులకు ఎప్పుడూ భయమే కదా!

**వ. అంత హిరణ్య కశిపుండు దుఃఖితుండై మృతుండైన సోదరునకు నుదక ప్రదానాది కార్యంబు లాచరించియతని బిడ్డలగు శకుని, శంబర, కాలనాభ, మదోత్కచ ప్రముఖుల నూఱడించి వారల తల్లితోఁగూడ హిరణ్యాక్షుని భార్యల నందఱ రావించి, తమ తల్లియైన దితి నవలోకించి యిట్లనియె.37**

* అక్కడ హిరణ్యకశిపుడు దుఃఖంతో, చనిపోయిన తన సోదరుడైన హిరణ్యాక్షునికి అంత్యక్రియలు చేసి, అతని కొడుకులైన శకుని, శంబర, కాలనాభ, మదోత్కచ ప్రముఖులను ఓదార్చాడు. వాళ్ల తల్లినీ, హిరణ్యాక్షుని మిగిలిన భార్యలను కూడా రప్పించి ఊరడించాడు. పుత్ర శోకంతో కుమిలిపోతున్న తన తల్లి అయిన దితిని చూచి హిరణ్యా కశిపుడు ఇలా పలికాడు.

**శా. నీరాగారనివిష్ట పాంథుల క్రియన్ నిక్కంబు సంసార సం**
**చారుల్ వత్తురు గూడి విత్తురు, సదా సంగంబు లేదొక్కచో**
**శూరుల్ వోయెడి త్రోవఁ బోయెను భవత్సూనుండు దల్లీ! మహా**
**శూరుం డాతఁడు త ద్వియోగమునకున్ శోకింప నీ కేటికిన్? 38**

* తల్లీ! లోకం ఒక చలిపందిరి వంటిది. ప్రాణులందరూ దాహం కోసం వచ్చిన బాటసారులు. వాళ్ళు దాహం తీర్చుకోవటానికి వచ్చి వెళ్లిపోతున్నట్లు, మనం కూడా ఈ సంసారంలోకి వచ్చి మనపని కాగానే వెళ్లిపోతూ ఉంటాం. ఎప్పుడూ ఒకచోటనే కలిసి ఉండం. కలుస్తూ ఉంటాం; విడిపోతూ ఉంటాం. మాతా! నీ చిన్నకుమారుడు జగదేకవీరుడు, మహాశూరుడు. కాబట్టే వీరస్వర్గం అందుకున్నాడు. నిన్ను వీరమాతను చేశాడు. పుత్రవియోగానికి దుఃఖించకమ్మా! వీరమాత కంటతడి పెట్టరాదు.

సీ. సర్వజ్ఞుఁ డీశుండు సర్వాత్ముఁ డవ్యయుం డమలుండు సత్యుఁ డనంతుఁ డాఢ్యుఁ
డాత్మరూపంబున నశ్రాంతమును దన మాయా ప్రవర్తన మహిమ వలన
గుణములఁ గల్పించి గుణసంగమంబున లింగ శరీరంబు లీలఁ దాల్చి
కంపిత జలములోఁ గదలెడి క్రియఁ దోఁచు పాదపంబుల భంగి భ్రామ్యమాణ

ఆ. చక్షువుల ధరిత్రి చలిత మై కానంగఁ, బడిన భంగి వికల భావరహితుఁ
డాత్మమయుఁడు కంపితాంత రంగంబునఁ, గదలినట్ల తోఁచుఁ గదలకుండు. 39

* ఆ ఈశ్వరుడు సమస్తానికీ అధిపతి. సర్వమూ తెలిసినవాడు. సర్వత్రా నిండియుండే వాడు. ఆ ప్రభువు సత్యుడు, నిత్యుడు, నిర్మలుడూ, ఆద్యంతములు లేనివాడు, ఆత్మస్వరూపుడు. అటువంటి ఆ ప్రభువు నిరంతరం తన మాయా ప్రవర్తనాది మహిమలతో త్రిగుణాలను కల్పించుకొంటాడు. ఆ గుణ సంయోగం వల్ల వినోదంగా లింగశరీరం ధరిస్తాడు.

కదలనిచెట్లు కదలాడే నీళ్లలో కదులునట్లు కనబడు విధంగా, భ్రమతో నిండినటువంటి కళ్లకు భూమి చంచలంగా తోచిన విధంగా, భావ వికారాలు లేనట్టి ఆత్మస్వరూపుడైన ఆ భగవంతుడు చలించే మనస్సు గలవాళ్ళకు చంచలుడుగా అనిపిస్తాడు. కానీ ఆ దేవుడు అచంచలుడు.

## -: బాలవేషము దాల్చిన యముండు దెలిపెడు సుయజ్ఞోపాఖ్యానము :-

వ. అవ్వా! యవ్విధంబున లక్షణవంతుండు గాని యీశ్వరుండు లక్షితుండై కర్మసంసరణంబున యోగవియోగంబుల నొందు, సంభవ వినాశ శోక వివేకావివేక చింతా స్మరణంబులు వివిధంబు, లీ యర్థంబునకు బెద్దలు ప్రేతబంధు యమసంవాదంబను నితిహాసంబు నుదాహరింతురు, వినుండు చెప్పెద. నుశీనర దేశంబునందు సుయజ్ఞుం డను రాజుగలం డతండు శత్రువుల చేత యుద్ధంబున నిహతుండయి యున్నయెడ. 40

* అమ్మా! భగవంతుడు ' ఇదిగో ఈ విధంగా ఉంటాడు, ఈ లక్షణాలతో ఉంటాడు' - అని నిర్ధారణ చేయలేం. కాని అప్పు డప్పుడు అతడు కొన్ని లక్షణాలు పొంది సంసార కర్మబంధాలలో చిక్కుకొని యోగవియోగాలు అనుభవిస్తుంటాడు.

పుట్టుక, వినాశం, శోకం, వివేకం, చింత, స్మరణం అనేవి అనేక విధాలు. ఈ పరమార్థమును వివరించటానికి పెద్దలు "ప్రేతబంధుయమ సంవాదం''అనే కథను చెప్తారు. ఆ కథ చెప్తాను. విను-

ఉశీనరదేశంలో సుయజ్ఞుడనే రాజుండేవాడు. అతడు ఒక యుద్ధంలో శత్రువుల చేతికి చిక్కి మరణించాడు.

సీ. చిరిఁగిన బహురత్న చిత్రవర్మముతోడ రాలిన భూషణరాజితోడ
భీకర బాణ నిర్భిన్న వక్షము తోడఁ దఱుచుఁ గాఱెడు శోణితంబుతోడఁ

గీర్ణమై జాఱిన కేశబంధము తోడ రయరోషదష్టాధరంబు తోడఁ
నిమిషహీనం బైన నేత్రయుగ్మము తోడ భూరజోయుత ముఖాంబుజము తోడఁ

ఆ. దునిసి పడిన దీర్ఘదోర్దండముల తోడ, జీవ రహితుఁడగు నుశీనరేంద్రుఁ
జుట్టి బంధుజనులు సొరిది నుండఁగ భయా, క్రాంత లగుచు నతని కాంత లెల్ల. 41

* ఆ మహారాజు రత్నకవచం చిరిగిపోయింది. ఖడ్గం విరిగి పోయింది. రత్నహారాలు పెరిగి పోయాయి. ఆభరణాలు సురిగి పోయాయి. వక్షస్థలం భయంకరమైన, వాడియైన బాణాల దెబ్బలకు గాయపడిపోయింది. ఆ గాయాల నుంచి రక్తం ప్రవహిస్తూ ఉంది. కళ్ళలో కదలికలేదు. నిశ్చలంగా రెప్పపాటు లేకుండా ఉన్నాయి. అందమైన అతని ముఖమంతా దుమ్ము కొట్టుకుపోయి ఉంది. కేశజాలం చిందరవందర అయింది. దంతాలు బిగుసుకుపోయాయి. దీర్ఘము లైన అతని బాహువులు తెగి నేలమీద పడ్డాయి. ప్రాణంలేని ఆ ఉశీనగర రాజు శవం చుట్టూ చేరి అతని భార్యాపుత్రులు, బంధుజనులు విలపించసాగారు.

శా. స్రస్తాకంపిత కేశబంధములతో సంఛిన్న హారాళితో
హస్తాబ్జంబులు సాఁచి మోఁదుకొనుచున్ హా నాథ యంచున్ బహు
ప్రస్తావోక్తులతోడ నేడ్చిరి వగం బ్రాణేశు పాదాలపై
నస్తోక స్తనకుంకుమారుణ వికీర్ణాస్రంబు వర్షించుచున్. 42

* ఆ కాంతలు తలలు బాదుకొని ఏడుస్తున్నారు. వారి సుందర మైన కేశబంధాలు వికారంగా రేగి చిందరవందరైనాయి. పాలిండ్లపై ఉండే ముత్యాల హారాలు తెగి జారిపోయాయి. చేతులతో గుండెలపై బాదుకుంటూ హృదయవిదారకంగా విలపిస్తున్నారు. "హా! నాథా! నాథా!" అని భర్తపాదాలపై పడి అనేక విధాల గతస్మృతులు తలచుకొని తలచుకొని దుఃఖించసాగారు. బాష్పధారలు పాలిండ్లపై బడి ప్రాకి కుంకుమ లేపం కరిగి వ్యాపిస్తుండగా కన్నీరు మున్నీరుగా రోదించ సాగారు -

మ. అనఘా! నిన్ను నుశీనర ప్రజల కర్థానంద సంధాయిగా
మును నిర్మించిన బ్రహ్మ నిర్దయత నున్మూలించెనే వీరికిం
దనయశ్రేణికి మాకు దిక్కు గలదే? ధాత్రీశ! నీబోఁటికిం
జనునే పాసి చనంగ భ్రాతృజనులన్ సన్మిత్రులం బుత్రులన్? 43

* "పాపరహితా! ప్రజలను సంపదలతో సంతోషంతో పరిపాలించటానికి బ్రహ్మ నిన్ను సృష్టించాడు. ఆ చతుర్ముఖుడే ఈ నాడు నిన్ను నిర్దయగా నిర్మూలించాడు. ఇక ప్రజలకు దిక్కెవరు? ఈ కుమారులకూ మాకూ ఆధారం ఎవరు? ఓ మహీపాలా! నీ వంటి వ్యక్తి జనులనూ, బంధు జనులనూ, పుత్రమిత్ర కళత్రాదులనూ దుఃఖసాగరం లోకి త్రోసి వెళ్ళవచ్చునా?

మ. జనలోకేశ్వర! నిన్నుఁబాసిన నిమేషంబుల్ మహాబ్దంబులై
చను లోకాంతర గామివై మరల కీ చందంబునన్ నీవు వో

**యిన మే మెట్లు చరింతు? మొల్లము గదా యీ లోకవృత్తంబు నేఁ**
**డనలజ్వాలలఁ జొచ్చి వచ్చెదము నీ యంఘ్రిద్వయిం జూడఁగన్. 44**

* ఓ ప్రాణనాథా! నీ వియోగంలో మాకు క్షణాలు సంవత్సరాలుగా గడుస్తాయి. పరలోకం నుంచి నీవు తిరిగి రాకపోతే మా కీలోకంతో పనేముంది? మేము ఎలా బ్రతుకగలం? నీవులేని ఈ లోకజీవనం మాకూ అక్కరలేదు. అగ్నిలో సహగమనం చేసి మేమూ నీ చరణ సన్నిధికి చేరుకొంటాము''.

**వ. అని యిట్లు రాజభార్య లా రాజశవంబు డగ్గఱి విలపింపఁబ్రొద్దు గ్రుంకెడు సమయంబున వారల విలాపంబులు విని బ్రాహ్మణ బాలకుండై యముండు సనుదెంచి ప్రేత బంధువులం జూచి యిట్లనియె. 45**

* అని ఈ విధంగా సుయజ్ఞుని భార్యలూ, బంధువులూ అతని శవం చుట్టూ చేరి విలపిస్తున్నారు. ఇంతలో సూర్యుడు అస్తమించే వేళ అయింది. ఆ సమయంలో వారి రోదనం విని విప్రబాలుని వేషంలో యముడు వచ్చాడు. వారి దగ్గరకు వెళ్లి ఓదారుస్తు ఇలా బోధించ సాగాడు -

**ఉ. మచ్చిక వీరికెల్ల బహుమాత్రముఁ జోద్యము, దేహి పుట్టుచుం**
**జచ్చుచునుండఁ జూచెదరు, చావక మానెడు వారిభంగి నీ**
**చచ్చిన వాని కేడ్చెదరు? చావున కొల్లక డాఁగవచ్చునే?**
**యెచ్చటఁ బుట్టె నచ్చటికి నేగుట నైజము ప్రాణికోటికిన్. 46**

* అజ్ఞానులారా! ఎక్కువగా మక్కువ పెంచుకుని కాలం తీరిపోయిన వారికోసం ఇంతగా దుఃఖించటం చోద్యంగా ఉంది! దేహం ధరించిన ప్రతివాడూ పుట్టటం గిట్టటం సహజం. మీరంతా నిత్యం చూస్తుంటారు కదా! పుట్టిన తర్వాత గిట్టని ప్రాణి అంటూ ఉంటుందా? మీరు చనిపోని వారిలాగా చనిపోయిన వారి కోసం విలపిస్తారేమిటి? మృత్యువును తప్పించుకోవటం ఎవరికీ సాధ్యం కాని పని! ప్రాణి ఎక్కడ నుంచి ఇక్కడికి వచ్చాడో మళ్ళీ అక్కడికి పోవటం తప్పని సరిగదా!

**క. జననీ జనకులఁ బాసియు, ఘన వృకముల బాధ వడక కడుఁ బిన్నలమై**
**మనియెద, మెవ్వఁడు గర్భం, బున మును పోషించె వాఁడె పోషకుఁ డడవిన్. 47**

* ఒకవేళ తల్లిదండ్రులను విడిచిపెట్టి చిన్నప్పుడే ఘోరమైన అడవిలో పెద్ద పెద్ద తోడేళ్లలాంటి క్రూరమృగాల మధ్య ఉన్నా ఆ పరమేశ్వరుని దయ ఉంటే సురక్షితంగా ఉంటాం. ఎలాగంటే తల్లి గర్భంలో ఉన్న శిశువులను ఎవరు పోషిస్తున్నారు? ఆ భగవంతుడే! అలాగే మనం అడవిలో ఎక్కడ ఉన్నా కూడా ఆ పరమాత్ముడే రక్షిస్తుంటాడు. సర్వత్రా, సర్వవిధాలా ఆయనే రక్షకుడు!

**క. ఎవ్వఁడు సృజించుఁ బ్రాణుల, నెవ్వఁడు రక్షించుఁ ద్రుంచు నెవ్వఁ డనంతుం**
**డెవ్వఁడు విభుఁ డెవ్వఁడు వాఁ, డివ్విధమున మనుచుఁ బెనుచు హేలారతుఁడై. 48**

* ఈ విశ్వమును సృష్టించేదీ, రక్షించేదీ, నశింపజేసేదీ ఎవడో, అనంతమూర్తి ఎవడో, బ్రహ్మాండానికి అధిపతి ఎవడో - వాడే లీలా విలాసంగా ఈ లోకాన్ని రక్షిస్తూ పోషిస్తూ ఉంటాడు.

**ఆ. ధనము వీథిఁబడిన దైవవశంబున, నుండుఁ బోవు మూలనున్న నైన**
**నడవి రక్షలేని యబలుండు వర్ధిల్లు, రక్షితుండు మందిరమునఁ జచ్చు. 49**

* ధనమును వీథిలో పడవేసినా దైవయోగం బాగుంటే సురక్షితంగా ఉంటుంది. గీత బాగుండకపోతే ఇంట్లో మూల భద్రంగా దాచి పెట్టినా మటుమాయమై పోతుంది. అలాగే దుర్బలుడు అడవిలో ఉన్నా భగవంతుని కృప ఉంటే ఆయురారోగ్యాలతో వృద్ధి పొందుతుంటాడు. అది లేనివాడు సౌధాల లోపల రక్షకభటులతో రక్షింపబడుతున్న రాజైనా మరణిస్తాడు.

**క. కలుగును, మఱి లేకుండును, గల భూతములెల్లఁ గాలకర్మవశము లై**
**నిలఁబడుఁ, బ్రకృతిం దద్గుణ, కలితుఁడుగాఁ డాత్మమయుఁ డగమ్యుఁడు దలఁపన్. 50**

* భగవంతుని తత్త్వం ఎవరికీ అర్థం కాదు. పరమాత్ముడు ఉండవచ్చు ఉండకపోవచ్చు. అయినా ఈ ప్రాణికోటి కాలానికీ, కర్మకూ వశమైపోయి ఈ బ్రహ్మాండ చక్రంలో ప్రవర్తిల్లుతుంటుంది. ఆ ఆత్మస్వరూపుడు త్రిగుణాలకు లోబడినవాడు కాడు. ఆ గుణాలకు అతీతుడైన విశ్వనాథు డాతడు! ఆ స్వామి ఎవరూ చేరుకోలేని ఒక దివ్యమైన స్థానంలో ప్రకాశిస్తూ ఉంటాడు.

**సీ. పాంచ భౌతికమైన భవనంబు దేహంబు పురుషుండు దీనిలోఁ బూర్వ కర్మ**
**వశమున నొకవేళ వర్తించు దీపించుఁ దఱి యైన నొకవేళఁ దలఁగి పోవుఁ,**
**జెడునేని దేహంబు సెడుఁగాని పురుషుండు సెడఁ డాతనికి నింతసేటు లేదు,**
**పురుషునికిని దేహపుంజంబునకు వేఱు గాని యేకత్వంబు గాన రాదు,**

**ఆ. దారువుల వెలుంగు దహనుని కైవడిఁ, గాయములఁ జరించు గాలి భంగి**
**నాళలీనమైన నభము చాడ్పున వేఱు, దెలియవలయు దేహి దేహములకు. 51**

* భూమి, నీరు, అగ్ని, గాలి ఆకాశములను అయిదింటికి పంచభూతాలని పేరు. మానవుని శరీరం ఈ పంచభూతాలతో తయారయింది. అంటే భూమినుంచి - చర్మం, మాంసం వంటివి; నీటినుంచి - మూత్రం, రక్తం వంటివి; అగ్ని నుంచి ఆకలి, దాహం వంటివి; గాలినుంచి కదలటం, నడవటం వంటివి; ఆకాశం నుంచి - కామం, క్రోధం వంటివి ఏర్పడ్డాయి. ఇవన్నీ కలిసి మానవ శరీరం అయింది.

పంచభూతాలతో తయారయిన ఈ దేహం ఒక భవనం వంటిది. ఈ భవనం వంటి శరీరంలో ఆత్మపురుషుడు పూర్వకర్మానుసారియై ప్రవర్తిస్తూ ఉంటాడు. కాలం తీరిపోగానే ఈ భవనం నుంచి వెళ్లిపోతాడు. దేహం అశాశ్వతం. అందులోని ఆత్మస్వరూపుడు శాశ్వతుడు! ఎప్పటికైనా దేహం చెడిపోతుంది కాని, లోపలి ఆత్మారామునకు మాత్రం నాశనం లేదు. పురుషుడూ, దేహం వేరు వేరే కాని ఎప్పుడూ ఒకటి కాదు. అరణిలో అగ్ని దాగి ఉన్నట్టు, శరీరంలో వాయువు ఉన్నట్టు తామరతూడు లోపల శూన్యం ఉన్నట్టు దేహంలో దేహి వేరుగా విలసిల్లు తుంటాడు.

**వ. అని మఱియు నిట్లనియె. 52**

సీ. భూపాలకుఁడు నిద్రవోయెడి నొండేమి? విలపింప నేటికి వెఱ్ఱులార!
యెవ్వఁడు భాషించు నెవ్వఁ డాకర్ణించు నట్టివాఁ డెన్నఁడో యరిగినాఁడు,
ప్రాణభూతుండైన పవనుఁ డాకర్ణింప భాషింప నేరఁడు ప్రాణి దేహ
ములకు వేఱై తాను ముఖ్యుఁడై యింద్రియ వంతుఁడై జీవుండు వలను మెఱయఁ

ఆ. బ్రాభవమున భూత పంచకేంద్రియమనో, లింగదేహములను లీలఁ గూడు,
విడుచు నన్యుఁ డొకఁడు విభుఁడు దీనికి మీరు, వొగులనేల? వగలఁ బొరల నేల? 53

* అని చెప్తూ బ్రాహ్మణ బాలకుని రూపంలో నున్న యముడు ఇంకా ఇట్లన్నాడు.

ఓయీ! మీకేమి వెఱ్ఱి పట్టిందా? ఈ భూపాలకుడు నిద్రిస్తుంటే పిచ్చిగా విలపిస్తారేమి? మాటలు పలికే, మాటలు వినే జీవుడు మాత్రం ఎప్పుడో వెళ్లిపోయాడు. ప్రాణానికి మూలమైనటువంటి వాయువు ఉన్నా ఆ వాయువు విడిగా భాషించలేడు. ఆకర్ణించలేడు. జీవుడు ప్రాణానికీ, దేహానికీ వేరుగా ఉండికూడా ముఖ్యుడై ఇంద్రియ ప్రభావంతో తేజరిల్లు తుంటాడు. ఆ ఆత్మరూపుడు పంచభూతాలనూ, పంచేంద్రియాలనూ, మనస్సునూ, లింగదేహమునూ విలాసంగా ధరిస్తాడు. మళ్ళీ విడిచిపెడతాడు. అసలు ఈ ప్రపంచ చక్రం తిప్పేవాడు వేరుగా ఉంటాడు. అతడు సర్వాధిపతి! కాబట్టి దీనికోసం మీరు బాధపడడం, దుఃఖించటం అవివేకం.

క. ఎందాఁక నాత్మదేహము, నొందెడు నందాఁకఁ గర్మయోగము లటపైఁ
జెందవు, మాయాయోగ, స్పందితులై రిత్త జాలిఁబడ నేమిటికిన్? 54

* ఎప్పటి వరకు ఆత్మ దేహమును ధరించి ఉంటుందో అప్పటి వరకూ ఈ కర్మయోగం జరుగుతూనే ఉంటుంది. ఆ తరువాత ఆత్మ దేహమును విడిచిపెట్టగానే ఈ బంధాలన్నీ తెగిపోతాయి. వీటితో సంబంధమే ఉండదు. ఈ మాయా యోగం వల్ల చలించే హృదయంతో కుమిలి పోవడం వృథా కదా!

మ. చెలులుం దల్లులుఁ దండ్రు లాత్మజులు సంసేవ్యుల్ సతుల్ చారు ని
ర్మలగేహంబు లటంచుఁ గూర్తురు, మహామాయా గుణ భ్రాంతులై
కలలోఁ దోఁచిన యర్థముల్ నిజములే? కర్మానుబంధంబులం
గలుగున్ సంగము, లేక మానుఁ బిదపం గర్మాంత కాలంబునన్. 55

* అజ్ఞానాంధులైన కొందరు ఆ మహామాయ అనే భ్రాంతిలో పడి తల్లిదండ్రులపై, భార్యాపుత్రులపై, స్నేహితులపై, ఆశ్రితులపై అనురాగాలూ, అనుబంధాలూ పెంచుకొని ఇళ్ళూ, వాకిళ్ళూ, సంపదలూ, సామ్రాజ్యాలూ సంపాదించుకొంటారు. ఎక్కడైన కలలో కన్పించిన సంపద యథార్థం అవుతుందా! కర్మాను బంధం ఉంటే సంయోగం కలుగుతుంది. కర్మఫలం అనుభవించాక బంధం విడిపోయి, వియోగం ఏర్పడుతుంది.

**వ. మఱియు మాయాగుణప్రపంచంబు నెఱింగెడు తత్త్వజ్ఞులు నిత్యానిత్యంబులం గూర్చి సుఖ దుఃఖంబులం జెంద, రజ్ఞులు గొందఱు యోగవియోగంబులకు సుఖదుఃఖంబుల నొందుదురు, తొల్లి యొక్క మహాగహనంబున విహంగంబులకు నంతకభూతుండైన యొఱుకగలఁ డతం డొక్కనాఁడు ప్రభాతంబున లేచి వాటంబైన వేఁట తమకంబున. 56**

* ఈ మాయా ప్రపంచ రహస్యం తెలుసుకొన్న మునులూ, జ్ఞానులూ శాశ్వతమైన వాటిని గురించి సంతోషించరు, అశాశ్వతమైన వాటిని గూర్చి దుఃఖించరు. అజ్ఞానులూ, అవివేకులూ మాత్రం సంయోగం కలిగితే పొంగిపోతారు. వియోగం కలిగితే క్రుంగిపోతారు.

పూర్వం ఒక అడవిలో ఒక కిరాతుడు ఉండేవాడు. వాడు పక్షులను వేటాడి జీవిస్తూ ఉండేవాడు. ఒకనాడు సూర్యోదయం కాగానే వాడు వేటకోసం బయలుదేరాడు.

**క. వల లురులు జిగురుఁ గండెలుఁ, జలిదియుఁ జిక్కంబు ధనువు శరములు గొనుచుం<br>బులుఁగులఁ బట్టెడు వేఁడుక, నలుగులు వెడలంగఁ గదలి యడవికిఁ జనియెన్. 57**

* వలలు, ఉరిత్రాళ్ళు, జిగురు కండెలు తీసుకొన్నాడు. చద్దిచిక్కం చంకకు తగిలించుకొన్నాడు. విల్లంబులు చేతపట్టాడు. అలా వచ్చే కిరాతుణ్ణి చూచీ చూడగానే ఎక్కడి పిట్టలు అక్కడ పారిపోతున్నాయి. వాడు దాగి దాగీ పొంచి పొంచీ అడవి లోపలికి చేరుకున్నాడు.

**వ. ఇట్లడవికిం జని తత్ప్రదేశంబునందు. 58**

**క. కట్టలుకఁ దడుకు చాటునఁ, బిట్టల నురిగోలఁ దిగిచి బిఱుసున ఱెక్కల్<br>వట్టి విఱిచి చిక్కములో, బెట్టుచు విహరించె లోకభీకరలీలన్. 59**

* ఇలా అడవిలోకి వెళ్లి ఒకచోటు చూచుకున్నాడు. అక్కడ పట్టుదలతో ఒక తడిక మాటు చేసుకున్నాడు. చాటుగా ఉరిత్రాళ్లతో వలలు పన్నాడు. వలలో చిక్కిన పిట్టలను పట్టుకుని రెక్కలు విరిచి సంచిలో వేసుకొంటూ పక్షుల పాలిటి యముడిలాగా అడవి అంతటా తిరగటం మొదలు పెట్టాడు.

**వ. మఱియు నానావిధంబులగు శకుంతంబుల నంతంబు నొందించుచు సకల పక్షి సంహార సంరబ్ధకుండైన లుబ్ధకుండు తన ముందటఁ గాలచోదితంబై సంచరించుచున్న కుళింగపక్షి మిథునంబుల గనుంగొని యందుఁ గుళింగి నురిం దిగిచి యొక్క చిక్కంబులో వైచినం జూచి దుఃఖించి కుళింగపక్షి యిట్లనియె. 60**

* రక రకాల పిట్టలను వేటాడుతున్నాడు. ఇంతలో ఒకచోట కాలం తీరిన అడవి పిచ్చుకల జంట వీడి కంటపడింది. అందులో ఆడపిచ్చుకను ఉరిపన్ని రెక్కలు విరిచి చిక్కంలో పడేసుకున్నాడు. అది చూచి చెట్టుమీద ఉన్న మగ పిచ్చుక ఆడపిచ్చుకతో దుఃఖంతో ఇలా పలికింది -

**చ. అడవుల మేఁత మేసి మన మన్యుల కెన్నఁడు నెగ్గు సేయ కి<br>క్కడ విహరింప నేఁడకట! కట్టిఁడి బ్రహ్మ కిరాతు చేతిలోఁ**

**బడుమని వ్రాసెనే నుదుటఁ? బాపపు దైవము కంటికింత యె**
**క్కుడు బరువయ్యెనే బ్రదుకు? కోమలి! యే మన నేర్తుఁ జెల్లరే! 61**

* ఓ ప్రియులారా! ఈ అడవిలో ఎక్కడో ఇంతమేత మేసి, ఒకరికి అపకారం తలపెట్టకుండా జీవిస్తున్నాం. మనం ఏ పాపం ఎరుగంకదా! కఠినహృదయుడైన బ్రహ్మ మనలను ఈ బోయవాని చేతిలో చావుమని వ్రాశాడు కాబోలు! ఆ పాపపుదేవుని దృష్టిలో కూడా మనం ఇంత బరువై పోయాం. ఓ సుకుమారీ! ఏమి చెప్పమంటావు? నేనింక ఏమి మాట్లాడ గలను?

**క. ఒక మాటు మనల నందఱఁ, బ్రకటించి కిరాతు వలలఁ బడఁ జేయక ని**
**న్నొకటిన్ వలఁ బడఁ జేసిన, వికటీకృత దక్షమైన విధి నే మందున్? 62**

* ఆ దేవుడు మనల్ని అందరినీ ఈ కిరాతుని వలలో పడేసి ఒక్క సారిగా చంపకూడదూ? నిన్నొక్కదాన్నే వలలో పడేసి మనకు తీరని ఎడబాటు కలిగించాడు. వక్రబుద్ధిలో ఆరితేరిన ఆ విధి యొక్క చేతలను ఏమనవచ్చు?

**ఉ. ఱెక్కలు రావు పిల్లలకు, ఱేపట నుండియు మేఁత గానమిం**
**బొక్కుచుఁ గూఁటిలో నెగసి పోవఁగ నేరవు, మున్ను తల్లి యీ**
**దిక్కున నుండి వచ్చునని త్రిప్పని చూడ్కుల నిక్కి నిక్కి న**
**ల్దిక్కులుఁ జూచుచున్న వతిదీనత నెట్లు భరింతు నక్కటా! 63**

* అయ్యయ్యో! మన పిల్లలకు ఇంకా రెక్కలుకూడా రాలేదు. తెల్లవారిన దగ్గరనుంచి ఆహారం లేక ఏడుస్తూ ఉంటాయి. గూటినుండి ఎటన్నా వెళ్లటానికా ఎగరటం చేతకాదు. “అమ్మ ఆహారం పట్టుకొని ఇదిగో ఇటువైపే వస్తుంది”అని ఒకటే ధ్యాసతో కళ్ళార్పకుండా, నిక్కినిక్కి నాలుగు దిక్కులూ చూస్తున్నాయి. అతిదీనమైన వీని ముఖాల్ని ఎలా చూడాలి? కడుపు తరుక్కుపోయే వీటి రోదనం ఎలా భరించగలను?

**వ. అని ఇవ్విధంబున. 64**

**క. కుంఠిత నాదము తోడను, గంఠము శోషింప వగచు ఖగమును హననో**
**త్కంఠుండైన కిరాతుఁ డ, కుంఠిత గతి నేసె నొక్క కోలం గూలన్. 65**

* అని ఈ విధంగా ఆడపిచ్చుకను చూచి మగ పిచ్చుక గద్గద స్వరంతో శోష వచ్చేలాగా దుఃఖిస్తూ ఉంది. ఆ మగపిచ్చుకను అప్పుడే బోయవాడు చూచి వేగంగా బాణం సంధించి నేల కూలేలాగా కొట్టాడు.

**క. కాలము వచ్చిన శబరుని, కోలను ధరఁ గూలె ఖగము ఘోషము తోడం**
**గాలము డాసిన నేలం, గూలక పో వశమె యెట్టి గుణవంతులకున్? 66**

* ఆయువు తీరిపోయిన ఆ మగపిచ్చుక బోయవాని బాణం దెబ్బకి కెవ్వున అరుస్తూ నేలమీద పడిపోయింది. అంతే. కాలం మూడితే ఎంతటి గుణవంతుడైనా, బలవంతుడైనా, ధనవంతుడైనా మరణించక తప్పదు కదా!

**ఉ. కావున మీరు చచ్చుతఱిఁ గానరు, వచ్చి ధరిత్రిఁ బడ్డ ధా**
**త్రీవిభు దేహముం గదిసి దీనత నేడువ నేల? పొండు, చిం**
**తావతులార! వత్సరశతంబులకైన నిజేశు చక్కికిం**
**బోవుట దుర్లభంబు, మృతిఁ బొందిన వారలు చేరవత్తురే? 67**

* ప్రాణం పోకడ వాన రాకడ తెలియదంటారు. మృత్యువు ఏ రూపంలో వస్తుందో ఎప్పుడు వస్తుందో ఎవరికీ తెలియదు. మీరు మీ సంగతి మరచిపోయి చనిపోయి నేలమీదపడి ఉన్న ఈ మహారాజు శవంచుట్టూ చేరి శోకించటం వ్యర్థం. ఓ దుఃఖితులారా! వెళ్లిపోండి. ఇలా మీరు వంద సంవత్సరాలు విలపించినా మీ నాథుని చేరుకోవటం దుర్లభం. చనిపోయిన వారు తిరిగి లేచివస్తారా?

**వ. అని యిట్లు కపట బాలకుండై క్రీడించుచున్న యముని యుపలాల నాలాపంబులు విని సుయజ్ఞుని బంధువులెల్ల వెఱఁగుపడి సర్వప్రపంచంబు నిత్యంబు గాదని తలంచి శోకింపక సుయజ్ఞునికి సాంప రాయిక కృత్యంబులు సేసి చని, రంత నంతకుం డంతర్హితుం డయ్యెనని చెప్పి హిరణ్య కశిపుండు దన తల్లిని, దమ్ముని భార్యలం జూచి యిట్లనియె. 68**

* అని ఈ విధంగా మాయా బాలకుడులాగా వచ్చి మాట్లాడుతున్న యముని ఊఱడింపు మాటలు విని సుయజ్ఞుని బంధువులు చాలా ఆశ్చర్యపోయారు. ఈ విశ్వం శాశ్వతం కాదని తెలుసుకొన్నారు. శోకం మానుకొన్నారు.కర్తవ్యం ఆలోచించి సుయజ్ఞ మహారాజుకు ఉత్తరక్రియలు చేసి వెళ్లిపోయారు. యముడు అంతర్ధాన మయ్యాడు అని చెప్పి హిరణ్యకశిపుడు తన తల్లిని, తమ్ముని భార్యలనూ చూచి ఇంకా ఇలా పలికాడు.

**క. పరు లెవ్వరు? దా మెవ్వరు?, పరికింపఁగ నేక మగుట భావింపరు, త**
**త్పరమజ్ఞానము లేమిని, బరులును నే మనుచుఁ దోఁచుఁ బ్రాణుల కెల్లన్. 69**

* ప్రాణులకు పరతత్త్వ చింతన లేకపోవటం చేత మనవాళ్లు అనీ, ఇతరులు అనీ తేడాగా భావిస్తారు. ఎవరు పరులు? ఎవరు తన వారు? వారు - మేము - అని అజ్ఞానులు మాత్రమే అనుకొంటారు. ఆలోచిస్తే అందరూ ఒక్కటే.

**వ. అని తెలియం బలికిన హిరణ్యకశిపుని వచనంబులు విని దితి కోడండ్రునుం దానును శోకంబు మాని తత్త్వవిలోకనంబు గలిగి లోకాంతరగతుండైన కొడుకునకు వగవక చనియె నని చెప్పి నారదుండు ధర్మనందనున కిట్లనియె. 70**

* అని హిరణ్యకశిపుడు వివరంగా చెప్పగానే దితి, ఆమె కోడళ్లు దుఃఖం దిగమ్రింగారు. తత్త్వం తెలుసుకొన్నారు. చనిపోయిన వాని కోసం విలపించటం మానుకొని అచటినుంచి వెళ్లిపోయారు - అని నారదమునీంద్రుడు ధర్మరాజుతో ఇలా చెప్పసాగాడు.

**క. అజరామర భావంబును, ద్రిజగద్రాజ్యంబు నప్రతిద్వంద్వము దో**
**ర్విజితాఖిల శాత్రవమును, గజరిపు బలమును హిరణ్యకశిపుఁడు గోరెన్. 71**

* హిరణ్యకశిపుడు తాను వార్ధక్యం రాకుండా, చావు లేకుండా బ్రతకాలనీ, త్రిలోకాలను ఎదురులేకుండా పరిపాలించాలనీ, బాహుబలంతో శత్రువులను జయించాలనీ, సింహ పరాక్రమం పొందాలనీ నిశ్చయించుకొన్నాడు.

**వ. ఇట్లు గోరి మందరాచల ద్రోణికిం జని యందుఁ గాలి పెను వ్రేల నేల నిలువంబడి యూర్ధ్వ బాహుండయి మిన్ను సూచుచు వాఁడి మయూఖంబుల తోడి ప్రళయకాల భానుండునుం బోలె దీర్ఘ జటారుణ ప్రభా జాలంబులతోడ నెవ్వరికిం దేఱిచూడరాక పరమ దారుణంబైన తపంబు సేయుచుండె, నిర్జరులు నిజస్థానంబుల నుండి, రంత. 72**

* ఇటువంటి కోరికలతో ఆ రాక్షసరాజు మందరపర్వతపు చరియలపైకి వెళ్ళాడు. అక్కడ ఒకచోటు చూచుకొన్నాడు. కాలి బొటన వ్రేలిపై నిలబడి, రెండుచేతులతో ఆకాశం వంక చూస్తూ ఘోరమైన తపస్సు చేయడం మొదలుపెట్టాడు. అపుడు ఆ హిరణ్యకశిపుడు పొడవైన ఎఱ్ఱని కేశపాశాలతో తేరి చూడడానికి శక్యం కాకుండా ఉన్నాడు. ప్రళయ కాలంలో అతితీక్షణ కిరణాలతో ప్రకాశించే చండ ప్రచండమైన సూర్యబింబంలాగా ప్రకాశిస్తున్నాడు! లోకానికి భయం కలిగించే దారుణమైన తపస్సు చేయసాగాడు. దేవతలు తమ తమ ప్రదేశాలలో ఉండి చూస్తున్నారు.

**మ. అదరెం గుంభిని సాద్రియై, కలఁగె నేడంభోనిధుల్, తారకల్**
**సెదరెన్, సగ్రహసంఘులై దిశలు విచ్ఛిన్నాంతలై మండెఁ, బె**
**ల్లదరెన్ గుండెలు జంతుసంహతికి, నుగ్రాచారదైత్యేంద్ర మూ**
**ర్ధ దిశోద్ధూత సధూమ హేతిపటలోదంచత్తపోవహ్నిచేన్. 73**

* రాక్షసేంద్రుడైన హిరణ్యకశిపుడు కఠినాతికఠినమైన నియమనిష్ఠలతో తపస్సు చేయసాగాడు. ఉగ్రమైన ఆచారాలు పాటించసాగాడు. అతని శిరోభాగం పైనుంచి పొగలు లేచాయి. అగ్నిజ్వాలలు చెలరేగి మిన్నంటసాగాయి. ఆ తాపానికి భూమండలం పర్వతాలతో సహా అదరిపోయింది. సప్తసముద్రాలు సుళ్ళు తిరిగాయి. చుక్కలు చెదరిపోయాయి. దిక్కులు గ్రహాలతోసహా ఛిన్నా భిన్నములై మండిమాడిపోసాగాయి. ప్రాణికోటి గుండెలు దడదడలాడాయి.

**వ. ఇట్లు త్రైలోక్య సంతాపకరంబైన దైత్యరాజ తపో విజృంభణంబు సైరింపక నిలింపులు నాకంబు విడిచి బ్రహ్మలోకంబునకుం జని లోకేశ్వరుండయిన బ్రహ్మకు వినతులయి యిట్లని విన్నవించిరి. 74**

* ఈ విధంగా మూడు లోకాలనూ తల్లడిల్లజేస్తున్న దానవేంద్రుని ఉగ్రమైన తపస్సును దేవతలు భరించలేకపోయారు. వెంటనే వారు స్వర్గలోకం విడిచిపెట్టి బ్రహ్మలోకానికి పరువెత్తారు. వేదమూర్తి అయిన చతుర్ముఖునకు నమస్కరించి తమ మనస్సులోని బాధను విన్నవించసాగారు.

**క. దితి కొడుకు తపము వేఁడిమి, నతి తప్తుల మైతి, మింక నలజడి నమరా**
**వతి నుండ వెఱతు, మె య్యది, గతి మాకును? దేవదేవ! కారుణ్యనిధీ! 75**

* కారుణ్యనిధీ! కమలాసనా! దితికుమారుడైన హిరణ్యకశిపుడు ఘోరమైన తపస్సు చేస్తున్నాడు. ఆ తపస్సుయొక్క వేడిమికి మేము తాళలేక పోతున్నాం. కోలాహలంగా ఉన్న అమరావతిలో ఇక ఉండడానికి భయంగా ఉంది. అన్యథా మాకు గతిలేదు. మాకు నీవే శరణు!

**శా. శంకా లేశము లేదు, దేవ! త్రిజగ త్సంహారమున్ దేవతా**
**సంకోచంబును వేదశాస్త్ర పదవీ సంక్షేపమున్ లేక యే**
**వంకన్ లేవ నటంచు దుస్సహ తపోవ్యావృత్తి చిత్తంబులో**
**సంకల్పించె నిశాచరుండు, ప్రతిసంస్కారంబు చింతింపవే. 76**

* దేవా! పితామహా! ఇంక సందేహం ఏ మాత్రమూ లేదు. ప్రళయం ముంచుకు వస్తున్నది. ముల్లోకాలను సంహారం చేయటానికో, అమరులను అణచివేయటానికో, వేదశాస్త్రాలను వినాశం చేయటానికో, వాడి ధ్యేయం ఏమిటోకాని హిరణ్యకశిపుడు భయంకరమైన తపస్సు తల పెట్టాడు. లోకాలు నాశనం కాకుండా వాడు తపస్సు విరమించేలాగా లేడు. ఆర్తత్రాణ పరాయణా! అరవిందాసనా! దీనికి నీవే ప్రతీకారం ఆలోచించి మమ్మల్ని రక్షించాలి.

**శా. నీ వే రీతిఁ దపోబలంబున జగ న్నిర్మాణముం జేసి యీ**
**దేవాధీశులకంటె నెక్కుడు సిరిం దీపించి, తిబ్బంగిఁ దా**
**నీ విశ్వంబుఁ దపస్సమాధి మహిమన్ హింసించి వే ఱొక్క వి**
**శ్వావిర్భావకరత్వశక్తి మదిలో నర్థించినాఁ డీశ్వరా! 77**

* ప్రభూ! నీవు మహనీయమైన తపోబలంతో జగత్తును నిర్మాణం చేసి, యీ దేవాధీశులకంటె గొప్ప కీర్తి, ప్రతిష్ఠలు సంపాదించావు. ఆ విధంగానే ఆ దానవుడైన హిరణ్యకశిపుడూ తన తపోనిష్ఠా మహిమచేత ప్రస్తుతం ఉన్న ఈ జగత్తును నాశనం చేసి, మరొక క్రొత్త ప్రపంచమును సృష్టించాలనీ, ఆ శక్తి ఈ తపోబలంతో సంపాదించుకోవాలనీ చూస్తున్నాడు.

**వ. అదియునుం గాక కాలాత్మకులగు జీవాత్ముల కనిత్యత్వంబు గలుగుటం జేసి తపోయోగ సమాధి బలంబునం దనకు నిత్యత్వంబు సంపాదింతు నని తలంచి నాఁడని మఱియు నిట్లనిరి. 78**

* అంతేకాదు. కాలాధీనులైన జీవులకు శాశ్వతత్వం లేకపోవటం వల్ల తపోయోగ సమాధి బలంతో తాను శాశ్వతత్వం పొందాలని అతడు కఠోరమైన పట్టుదలతో ఉన్నాడు - అని చెప్పి దేవతలు ఇంకా ఇలా అన్నారు.

**మ. భవదీయం బగు నున్నతోన్నత మహాబ్రహ్మైక పీఠంబు సం**
**స్తవనీయంబగు భూతియున్ విజయమున్ సౌఖ్యంబు సంతోషమున్**

భువనశ్రేణికి నిచ్చు దైత్యుని తపస్స్ఫూర్తిన్ నివారించి యో
భువనాధీశ్వర! కావవే భువనముల్ పూర్ణప్రసాదంబునన్. 79

* భువనేశ్వరా! ఆ దానవేశ్వరుడు నీ మహోన్నతమైన బ్రహ్మపీఠమునూ నీ అపారమైన ఐశ్వర్యమునూ, నీ విజయసంపదనూ, లోకులపాలూ కాకులపాలూ చేయటానికి కంకణం కట్టుకొన్నాడు. కాబట్టి వెంటనే ఆ రాక్షసుని తపస్సును నివారించు. దయచేసి లోకాలను రక్షించు.

## -: బ్రహ్మదేవుండు హిరణ్యకశిపునకు వరంబు లిచ్చుట :-

వ. అని దేవతలు విన్నవించిన స్వయంభూతుండును, భగవంతుండు నైన నలుమొగంబుల వేల్పుప్రోడ భృగు దక్షాదులతోడ మందర పర్వతంబునకు వచ్చి యందు నియమ యుక్తుండును, బిపీలికావృత మేదో మాంసచర్మరక్తుండును, వల్మీకతృణ వేణుపటల పరిచ్ఛన్నుండును, మహాతపః ప్రభావ సంపన్నుండునునై నీరంధ్ర నిబిడ నీరద నికర నివిష్ట నీరజ బంధుండునుం బోలె నివసించియున్న నిర్జరారాతిం జూచి, వెఱఁగుపడి నగుచు నిట్లనియె. 80

* అని దేవతలు విన్నవించగా విధాత విన్నాడు. ఆయన మనస్సు కరుణతో కరగిపోయింది. స్వయంభువుడైన, చతుర్ముఖుడైన ఆ భగవానుడు సమస్యకు పరిష్కారం ఆలోచించాడు. భృగు, దక్షాదులను వెంటపెట్టుకుని మందరపర్వతంపైకి వచ్చి చూశాడు. అక్కడ హిరణ్యకశిపుడు కఠోర నియమాలతో తపస్సు చేస్తున్నాడు. అతని శరీరమంతా చీమలు వ్యాపించి మజ్జామాంసాలను, చర్మమును కొరికివేస్తూ. రక్తమును పట్టి పీలుస్తున్నాయి. అయినా చలించటం లేదు ఆ రాక్షసుడు! అతని శరీరంపై పుట్టలు పెరిగాయి. దానిపై గడ్డిదుబ్బులు కట్టాయి. వెదుళ్లు లేచాయి. దానవేంద్రుడు పుట్టలో ఉన్నా తపస్సువల్ల కలిగిన అపూర్వమైన కాంతులతో ప్రకాశిస్తూ ఆకాశంలో దట్టమైన కారుమబ్బుల మధ్య కప్పబడిన కమలబాంధవునిలాగా ఉన్నాడు. అటువంటి హిరణ్యకశిపుణ్ణి చూచి విధాత విస్మయం చెందాడు. కొంతసేపటికి చిరునవ్వుతో ఇలా పలికాడు-

మత్తకోకిలము.

ఓ సురారి కులేంద్ర! నీ క్రియ నుగ్రమైన తపంబు మున్
చేసి చూపినవారు లే రిఁకఁ జేయువారును లేరు, నే
నీ సమాధికి మెచ్చితిన్, విను, నీ యభీష్టము లిత్తు, నా
యాస మేటికి? లెమ్ము లెమ్ము మహాత్మ! కోరుము కోరికల్. 81

* ఓ రాక్షసేంద్రా! నీ లాగా ఈ విధంగా ఉగ్రమైన తపస్సు చేసినవారు పూర్వకాలంలో ఎవరూ లేరు. ముందుకాలంలో ఎవరూ ఉండబోరు. నీతపస్సమాధి నిష్ఠకు సంతోషించాను. దానవోత్తమా! నీకేం కావాలో కోరుకో, అనుగ్రహిస్తాను. అనవసరంగా ఆయాసపడటం ఎందుకు?

శా. దంశ వ్రాతములం బిపీలికలు మేదః క్రవ్యరక్తంబులన్
సంశీర్ణంబులు సేసి పట్టి తినఁగా శల్యావశిష్టుండవై
వంశచ్ఛన్న తృణావళీయుత మహావల్మీకమం దింద్రియ
భ్రంశం బింతయు లేక నీకు నిలువం బ్రాణంబు లెట్లుండెనో? 82

* అసంఖ్యాకంగా ఈగలూ, చీమలు మూగి నీ శరీరంలోని మజ్జా మాంస రక్తాలను పీల్చి పిప్పిచేశాయి. నీవు చిక్కి శల్యావశిష్టుడ వయినావు. నీపై పుట్టలు కట్టి, గడ్డి పెరిగి, వెదుళ్ళు మొలిచాయి. అయినా నీవు చలించలేదంటే నీ మనోనిగ్రహం ఎంత గొప్పదో, ఎంతటి స్థితప్రజ్ఞుడవో తెలుస్తున్నది. నీ ప్రాణాలు ఎలా నిలిచాయో పరమాశ్చర్యంగా ఉంది.

ఉ. ఉత్సుకతన్ జలాన్నముల నొల్లక యీ క్రియ నూఱు దివ్య సం
వత్సరముల్ శరీరమున వాయువులన్ నిలుపంగ వచ్చునే?
యుత్సవ మయ్యె మాకు, మము నుగ్రతపంబున గెల్చి తీవు, నే
వత్సలతన్ నినుం గదియ వచ్చితిఁ, గోరిక లెల్ల నిచ్చెదన్. 83

* సడలని పట్టుదలతో తపస్సు చేశావు. అన్నపానీయాలు మాని వేశావు. ఒకటా! రెండా? నూరు దివ్యసంవత్సరాలు ప్రాణాలు నిలుపుకోవటం అన్యులకు అసాధ్యం! ఉగ్రమైన తపస్సులో మమ్మల్నే నీవు గెలిచావు. మాకు చాలా సంతోషంగా ఉంది. నీవు కోరిన కోరికలన్నీ తీర్చటానికి నేను నీ దగ్గరకు వాత్సల్యంతో వచ్చాను. రాక్షసేంద్రా! కోరుకో.

వ. అని పలికి వనమక్షికా పిపీలికా భక్షితంబైన రక్షోవిభుని దేహంబు మీఁదం గమండలుజలంబులు ప్రోక్షించిన నద్దానవేంద్రుండు కమలాసన కరకమల కమనీయ కనకమయ దివ్యామోఘ కమండలు నిర్గతనిర్మల నీరధారా బిందుసందోహ సంసిక్త సకలాంగుండయి, తపంబు సాలించి, సాంద్ర కీచక సంఘాత సంఛాదిత వామలూరు మధ్యంబు వెలువడి, మహా ప్రభావబల సౌందర్య తారుణ్య సహితుండును వజ్రసంకాశ దేహుండును దప్తసువర్ణ వర్ణుండునునై నీరసేంధన నికరనిర్గత వహ్నియునుం బోలె వెలుంగుచుం జనుదెంచి. 84

* అని పలికి బ్రహ్మదేవుడు తన కమండలంలోని మంత్రజలమును - అడవి ఈగలచేత, గండు చీమలచేత తినబడిన ఆ దానవేంద్రుని శరీరంపై చల్లాడు. దివ్యమైన ఆ కనక కమండలం నుంచి వెలువడిన పరమ పవిత్రమైన నీటిబిందువులతో తడిసిన ఒడలితో దానవుడు తపస్సు విరమించాడు. వెదుళ్ళతో నిండిన పుట్టమధ్య నుంచి లేచి వచ్చాడు. మంత్రజల ప్రభావంవల్ల మహాసుందరమైన యౌవనం పొందాడు. బంగారు వన్నెగల వజ్రంలాంటి దేహంతో ఎండుకట్టెల నుంచి భగ్గున పైకి లేచిన అగ్నిలాగా ప్రకాశిస్తూ వచ్చాడు.

మ. దివిజానీకవిరోధి మ్రొక్కెఁ గని వాగ్దేవీమనోనేతకున్
సవిశేషోత్సవ సంవిధాతకు నమత్సంత్రాతకున్ సత్తపో

నివహాభీష్ట వరప్రదాతకు జగన్నిర్మాతకున్ ధాతకున్
వివిధ ప్రాణి లలాట లేఖన మహావిద్యానుసంధాతకున్. 85

* వాణీ మనోనాథుడు దివ్యానందప్రదాత, భక్తరక్షాపరాయణుడు, తపోధనులకు కల్పవృక్షము, విశ్వమునకు సృష్టికర్త, ప్రాణికోటి "తలవ్రాతలు" వ్రాయునట్టి మహావిద్య తెలిసినవాడు - అయిన విధాతకు దేవతల విరోధి అయిన హిరణ్యకశిపుడు నమస్కరించాడు!

వ. ఇట్లు దైత్యేశ్వరుండు దివినున్న హంసవాహనునకు ధరణీ తలంబున దండ ప్రణామంబు లాచరించి సంతోష బాష్పసలిల సంవర్ధిత పులకాంకురుండై యంజలి సేసి కంజగర్భుని మీఁద దృష్టి యిడి గద్గదస్వరంబున నిట్లని వినుతించె. 86

* అసురనాథుని ఆనందానికి అవధులు లేవు. ఆకాశంలో హంసవాహనంపై కూర్చున్న స్వామికి నెన్నుదురు నేలకు సోకగా నమస్కారం చేశాడు. భక్తి పారవశ్యంవల్ల అమిత సంతోషం కలిగింది. నేత్రాలు చెమ్మగిల్లాయి. శరీరమంతా తన్మయత్వంతో పులకించి పోయింది. చేతులు మోడ్చి గద్గదస్వరంతో ఈ విధంగా స్తుతించాడు.

సీ. కల్పాంతమున నంధకార సంవృతమైన జగము నెవ్వఁడు దన సంప్రకాశ
మున వెలిఁగించుచు, మూఁడుభంగుల రజ స్సత్త్వ తమోగుణసహితుఁ డగుచుఁ
గల్పించు రక్షించుఁ గడపటఁ బ్రహరించు, నెవ్వఁ డాద్యుఁడు సర్వహేతు వగుచు
శోభితుండై స్వయంజ్యోతియై యొక్కట విలసిల్లు నెవ్వఁడు విభుత మెఱసి

ఆ. సమయ మయిన మానసప్రాణ బుద్ధీంద్రి, యములతోడ నెవ్వఁ డలఘుమహిమ
నడరు, నట్టి సచ్చిదానంద మయునకు, మహిత భక్తి నే నమస్కరింతు. 87

* స్వామీ! సరస్వతీపతీ! కల్పాంతంలో చీకట్లతో నిండిన ప్రపంచానికి వెలుగు ప్రసాదించే జ్యోతిస్స్వరూపా! సత్త్వరజస్తమో గుణాలతో విశ్వంలో సృష్టి, స్థితి, నాశములను నిర్వహించే భువనాధినేతా! సర్వమునకు కారకుడవై, స్వయంగా జ్యోతిస్స్వరూపంతో విలసిల్లే స్వయంభూ! తగిన సమయంలో మనస్సు, ప్రాణం, బుద్ధి, ఇంద్రియాలతో ప్రకాశించే చైతన్యమూర్తీ! ప్రప్రథమ దైవమైన ఓ సచ్చిదానందమూర్తీ! నేను భక్తితో నీకు నమస్కరిస్తున్నాను.

వ. దేవా! నీవు ముఖ్యప్రాణం బగుటంజేసి ప్రజాపతివి, మనోబుద్ధి చిత్తేంద్రియంబులకు నధీశ్వరుండవు, మహాభూతగణంబులకు నాధార భూతుండవు, త్రయీతనువునం గ్రతువులు విస్తరింతువు, సకల విద్యలు నీతనువు, సర్వార్థ సాధకులకు సాధనీయుండ, వాత్మనిష్ఠా గరిష్ఠులకు ధ్యేయంబగు నాత్మవు, కాలమయుండవై జనులకు నాయుర్నాశంబు సేయుదువు, జ్ఞాన విజ్ఞానమూర్తి, వాద్యంత రహితుండ, వంతరాత్మవు, మూఁడు మూర్తులకు మూలంబగు పరమాత్మవు, జీవలోకంబునకు జీవాత్మవు, సర్వంబును నీవ, నీవు గానిది లేశంబును లేదు, వ్యక్తుండవు గాక పరమాత్మవై పురాణపురుషుండవై యనంతుండ వైన నీవు ప్రాణేంద్రియ మనోబుద్ధి గుణంబుల నంగీకరించి పరమేష్ఠిపద విశేషంబున

**నిలిచి స్థూలశరీరంబునం జేసి యింతయుం బ్రపంచింతువు, భగవంతుండవైన నీకు మ్రొక్కెద నని మఱియు నిట్లనియె. 88**

* దేవా! నీవు ప్రాణానికి ప్రాణానివి! నీవు ప్రజాపతివి. మనస్సుకు, బుద్ధికి, చిత్తానికి, ఇంద్రియాలకు అధిపతివి. మహాభూత సమూహాలకు ఆధారమైనవాడవు. వేదం అనే శరీరంతో యజ్ఞయాగాదులను వ్యాప్తి చేయువాడవు నీవు. సమస్త విద్యలు నీ శరీరమే. కోరిన వారి కోరికలు నెరవేర్చగలవాడవు నీవు. ఆత్మతత్త్వమును తెలుసుకొనగోరేవారికి మూలమైన ఆత్మవు నీవు. కాలస్వరూపుడవై జనులకు ఆయుస్సును నశింపజేయునది నీవు. జ్ఞానమూర్తివి నీవు. విజ్ఞాన ఖనివి నీవు, నీవు ఆద్యంతములు లేనివాడవు. నీవు జీవుల అంతరాత్మవు. త్రిమూర్తులకు మూలమైన పరమాత్మవు నీవు. జీవకోటికి జీవాత్మవు నీవు. సర్వమూ నీవే కాదా దేవా! నీవు లేనిదేదీ లేదు. నిన్నెవరూ అర్థం చేసుకోలేరు. నీవు పురాణపురుషుడవు, సనాతన సారథివి. నీవు ప్రాణ, ఇంద్రియ, మనోబుద్ధి గుణాలు పొంది పరమేష్ఠి పదవి అందుకొన్నావు. నీవు స్థూల శరీరంతో ఈ విధంగా విస్తరిస్తావు. భగవానుడవైన నీకు అనేక వందనాలు!

**క. కోరిన వారల కోర్కులు, నేరుపుతో నిచ్చి మనుప నీ క్రియ నన్యుల్**
**నేరరు కరుణాకర! నేఁ, గోరెద, నీ విచ్చెదేనిఁ గోరిక లభవా! 89**

* భక్తవరదా! కరుణాసముద్రా! కోరినవారికి కోరికలు నైపుణ్యంతో ఇచ్చి కాపాడటంలో నీ సాటి ఎవరూ లేరు. ఎవరూ భక్తులపై నీవలె వాత్సల్యం చూపలేరు. నా కోరికలు తప్పకుండా అనుగ్రహిస్తానంటే నేను కోరుకుంటాను దేవా!

**శా. గాలిం గుంభిని నగ్ని నంబువుల నాకాశస్థలిన్ దిక్కులన్**
**రేలన్ ఘస్రములం దమఃప్రభల భూరిగ్రాహ రక్షోమృగ**
**వ్యాళాదిత్య నరాదిజంతుకలహ వ్యాప్తిన్ సమస్తాస్త్ర శ**
**స్త్రాళిన్ మృత్యువు లేని జీవనము లోకాధీశ! యిప్పింపవే. 90**

* విధాతా! అభయప్రదాతా! గాలిలో కానీ, ధూళిలో కానీ, నిప్పులో కానీ, నీళ్ళలో కానీ, నింగిపైకానీ, నేలపై కానీ, ఏ దిక్కునుంచీ, ఏ మూలనుంచీ, రాత్రి కానీ, పగలు కానీ, చీకటిలోకానీ, వెలుగులో కానీ నన్ను మృత్యువు చేరరాదు. రాక్షసులచేత కానీ, దేవతలచేత కానీ, మృగాలచేతకానీ, నరులచేత కానీ, నాగేంద్రాలచేత కానీ నాకు మరణం సంభవింప గూడదు. ఎటువంటి యుద్ధంలోనైనా ఏ అస్త్రం శస్త్రం చేతకూడా నేను చంపబడకూడదు. అటువంటి మరణంలేని జీవితం నాకు ప్రసాదించు ప్రభూ!

**వ. అని మఱియు రణంబులందుఁ దన కెదురులేని శౌర్యంబును లోకపాలుర నతిక్రమించు మహిమ యును భువనత్రయ జయంబును హిరణ్యకశిపుండు గోరిన నతని తపంబునకు సంతోషించి దుర్లభంబు లయిన వరంబు లన్నియు నిచ్చి కరుణించి విరించి యిట్లనియె. 91**

* దేవా! నాకు యుద్ధాలలో ఎదురులేని పరాక్రమం కావాలి. దిక్పాలకులను తలదన్నే ఘనత రావాలి. నేను మూడు లోకాలపై దిగ్విజయం సాధించాలి. అట్టి వరాలు అనుగ్రహించు - అని రాక్షసపతి కోరగానే అతని తపస్సుకు సంతోషించిన సరస్వతీపతి కరుణించి దుర్లభాలైన ఆ వరాలన్నీ యిచ్చి ఇలా హెచ్చరించాడు-

**శా. అన్నా! కశ్యపపుత్ర! దుర్లభము లీ యర్థంబు లెవ్వారికిన్,**
**ము న్నెవ్వారలుఁ గోర రీవరములన్, మోదించితిన్ నీ యెడన్**
**నన్నుం గోరిన వెల్ల నిచ్చితిఁ బ్రవీణత్వంబుతో బుద్ధి సం**
**పన్నత్వంబున నుండు మీ సుమతివై భద్రైక శీలుండవై. 92**

* నాయనా! కశ్యప కుమారా! ఇలాంటి వరాలు ఎవరికీ పొందటానికి సాధ్యమైనవి కావు. పూర్వం ఎవరూ ఈ వరాలను కోరలేదు; నేను ఈయనూ లేదు. నీకు మాత్రం ఇష్టంతో నీకు కోరినవన్నీ ఇచ్చాను. సుబుద్ధివై, సుగుణవంతుడవై జాగ్రత్తగా క్షేమంగా జీవించు!

**వ. అని యి ట్లమోఘంబు లయిన వరంబుల లిచ్చి దితినందను చేతం బూజితుండై యరవింద సంభవుండు బృందారక సందోహవంద్య మానుం డగుచు నిజమందిరంబునకుం జనియె, నివ్విధంబున నిలింపారాతి వరపరంపరలు సంపాదించుకొని. 93**

* అని బ్రహ్మ వానికి దివ్యమైన వరాలు ప్రసాదించాడు. అపుడు హిరణ్యకశిపుడు ఆనందంతో ఆ స్వామిని పూజించాడు. ఆ తరువాత దేవతల బృందాలు ప్రశంసిస్తుండగా విధాత సత్యలోకానికి వెడలిపోయాడు. ఈ విధంగా దేవతల విరోధి అయిన హిరణ్యకశిపుడు అనేక వరాలను సంపాదించుకొని సంతోషంతో రాజధానికి చేరుకొన్నాడు.

**క. సోదరుఁ జంపిన పగకై, యాదర మించుకయు లేక యసురేంద్రుఁడు కం**
**జోదరుపై వైరము దు, ర్మాద రతుం డగుచుఁ జేసె మనుజాధీశా! 94**

* ఓ మహారాజా! భగవంతుడైన బ్రహ్మ వరాలు ఇచ్చాడనే గౌరవం ఏ మాత్రం లేకుండా, తన సోదరుడైన హిరణ్యాక్షుణ్ణి చంపినందుకు శ్రీహరిపై పగ సాధించాలని హిరణ్యకశిపుడు నిశ్చయించుకొన్నాడు. మదించిపోయి మహావిష్ణువుపైననే విరోధం పెంచుకున్నాడు. ఇక ఆ దానవుని దుశ్చేష్టలు భరించడానికి వీలులేకుండా పెచ్చు పెరిగి పోయినాయి.

**సీ. ఒకనాఁడు గంధర్వ యూథంబుఁ బరిమార్చు దివిజుల నొకనాఁడు దెరలఁదోలు,**
**భుజగుల నొకనాఁడు భోగంబులకుఁ బాపు గ్రహముల నొకనాఁడు గట్టివైచు,**
**నొకనాఁడు యక్షుల నుగ్రత దండించు, నొకనాఁడు విహగుల నొడిసిపట్టు**
**నొకనాఁడు సిద్ధుల నోడించి బంధించు, మనుజుల నొకనాఁడు మద మడంచుఁ**

**తే. గడిమి నొకనాఁడు కిన్నర ఖచర సాధ్య, చారణ ప్రేత భూత పిశాచ వన్య**
**సత్త్వ విద్యాధరాదుల సంహరించు, దితితనూజుండు దుస్సహతేజుఁ డగుచు. 95**

* ఒకనాడు గంధర్వులను సంహరిస్తాడు. మరొకనాడు దేవతలను తరిమికొడతాడు. నాగరాజులను భోగాలకు దూరంచేస్తాడు ఒకసారి. గ్రహాలను ఆగ్రహంతో కట్టిపడేస్తాడు మరొకసారి. యక్షులను శిక్షిస్తాడు ఒక తడవ. పక్షిరాజులను పట్టుకొంటాడు మరొక తడవ. ఒకనాడు ప్రసిద్ధులైన సిద్ధులను బంధిస్తాడు. మరొకనాడు మానవులకు గర్వభంగం చేస్తాడు. ఒకమాటు కిన్నరులను, విద్యాధరులను, ఇంకొక మాటు సాధ్యులను, చారణులను; మరొకమాటు భూతాలను, ప్రేతాలను పిశాచాలను, వేరొకమాటు అడవిజంతు సమూహాలను సంహరించి వేస్తాడు. ఈ విధంగా దుస్సహమైన పరాక్రమంతో హిరణ్యకశిపుడు ప్రాణికోటిని పీడించసాగాడు. వరం పొందిన గర్వంవల్ల అతని కళ్లకు పొరలు క్రమ్మాయి.

**క. అట్టళ్ల తోడఁ గోటలఁ, గట్టలుకం గూలఁ ద్రోచి క్రవ్యాదులతోఁ**
**జుట్టు విడిసి దిక్పాలుర, పట్టణములు గొనియె నతఁడు బలమున నధిపా! 96**

* ఆ దానవుడు మహాకోపంతో ప్రహరీ గోడలపై నున్న బురుజులతో సహా పెద్ద పెద్ద కోటలను కూల్చివేశాడు. చుట్టూ రాక్షసబలమును మోహరించి దిక్పాలకులపై దాడి చేశాడు. వాళ్ళ రాజధానీ నగరములను ఆక్రమించాడు.

**క. కృశలై సంప్రాపిత దు, ర్దశలై సర్వంకషోగ్ర దైతేయాజ్ఞా**
**వశలై నిశలును, దివములు, దిశ లెల్లను గట్టువడియె దీనత ననఘా! 97**

* ఈ దానవుని ధాటికి రాత్రింబవళ్లూ, లోకాలూ కృశించి పోయాయి. దిశలు దుర్దశను పొందాయి. సృష్టి సమస్తమూ నిరంకుశుడైన ఆ నిశాచరుని శాసనానికి వశమైపోయింది. లోకమంతా అతిదీనంగా అతని ఆజ్ఞకు కట్టుబడిపోయింది.

**వ. మఱియు న ద్దానవేంద్రుండు విద్రుమ సోపానంబులును, మరకత మణిమయ ప్రదేశంబులును వైదూర్యరత్న స్తంభ సముదయంబులును, జంద్రికాసన్నిభ స్ఫటిక సంఘటిత కుడ్యంబులును, బద్మరాగ పీఠ కనక కవాట గేహళీ విటంక వాతాయనంబులును, విలంబమాన ముక్తా ఫలదామ వితానశోభిత ధవళ పర్యంకంబులును, వివిధ విచిత్ర విమానంబులును, నిరంతర సురభి కుసుమ ఫల భరిత పాదప మహోద్యానంబులును, హేమారవింద సౌగంధిక బంధుర సరోవరంబులును, రమణీయ రత్న ప్రాసాదవిశేషంబులును, మనోహర పరిమళశీతల మందమారుతంబులును, మృదుమధుర నినద కీరకోకిలకుల కోలాహలంబులును గలిగి విశ్వకర్మ నిర్మితంబై త్రైలోక్యరాజ్యలక్ష్మీ శోభితంబైన మహేంద్ర భవనంబు సొచ్చి. 98**

* అప్పుడు ఆ రాక్షసరాజు సుందరమైన సురేంద్రుని రాజ మందిరం ఆక్రమించటానికి వెళ్ళాడు. దేవశిల్పి అయిన విశ్వకర్మ నిర్మించిన ఆ మహాభవన వైభవం చూచి దిగ్భ్రాంతి చెందాడు. ఆ భవనం పగడాల మెట్లతో ప్రకాశిస్తూ ఉంది. అక్కడ ఎక్కడ చూచినా మరకతాలు! మాణిక్యాలు! స్తంభాలు చూస్తే వైడూర్యాలతో రతనాలతో మెరసిపోతున్నాయి. పద్మరాగాలు చెక్కిన సింహాసనాలు! వెన్నెలల వంటి తెల్లని స్ఫటికాల గోడలు, బంగారపు తలుపులు, అత్యున్నతమైన ద్వారాలు, అందాల కిటికీలు ఆశ్చర్యపరుస్తున్నాయి.

మనోహరమైన ముత్యాలహారాల దండలతో, తెల్లని పట్టుచాందినీలతో శోభాయమానంగా ఉన్న పందిరి మంచాలు మనస్సును పరవశింపజేస్తున్నాయి. ఆ భవనం చుట్టూ అందమైన పెద్ద ఉద్యానవనం ఉంది. అక్కడ అతడు విహరించే రకరకాలైన విమానాలున్నాయి. అక్కడి చెట్లు నిత్యం సుగంధసుమాలతో, మధురమైన ఫలాలతో భారంగా వంగి ఉన్నాయి. ఆ ప్రక్కనే సుందరమైన సరస్సులు! అందులో నవ్వుతున్న బంగారు కమలాలు! సౌగంధిక పుష్పాలు! ఆ చెంతనే రమణీయమైన భవంతులు! అవి రత్నాలతో మనస్సును రంజింపజేస్తున్నాయి. ఆ ప్రదేశంలో పిల్లగాలులు చల్లగా మెల్ల మెల్లగా వీస్తూ సువాసనలు విరజిమ్ముతున్నాయి. అక్కడే చిలుకల పలుకులు, కోకిలల పాటలు సుకుమారంగా తియ్యగా వినిపిస్తున్నాయి.

అటువంటి ముల్లోకాల ఐశ్వర్యంతో విరాజిల్లే దేవేంద్ర భవనంలోనికి హిరణ్యకశిపుడు ప్రవేశించాడు.

**మ. దితిపుత్త్రుండు జగత్త్రయైకవిభుఁడై దేవేంద్ర సింహాసనో**
**ద్ధతుఁడై యుండ హరాచ్యుతాంబుజభవుల్ దప్పంగ భీతిన్ సమా**
**గతులై తక్కిన యక్ష కిన్నరమరుద్గంధర్వ సిద్ధాదు లా**
**నతులై కానిక లిచ్చి కొల్తు రతనిన్ నానా ప్రకారంబులన్. 99**

* రాక్షసరాజు దేవేంద్ర సింహాసనంపై కూర్చుని త్రిలోకనాథు డయ్యాడు. ఇతని దర్పం చూచి బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు తప్ప తక్కిన దేవతలంతా భయభ్రాంతులైనారు. యక్షులు, సిద్ధులు, సాధ్యులు, గంధర్వులు, కిన్నరులు, కింపురుషులు మొదలైన వారంతా చేతులు మోడ్చి, శిరస్సులు వంచి అమరవిరోధి అయిన హిరణ్యకశిపునకు కానుకలిచ్చి అనేక విధాలుగా అడుగులకు మడుగులొత్తారు. కరుణించుమని శరణువేడసాగారు.

**శా. ఏ దిక్పాలురఁ జూచి నేఁ డలుగునో యే దేవు బంధించునో**
**యే దిగ్భాగముమీఁద దాడి చనునో యే ప్రాణులం జంపునో**
**యీ దైత్యేశ్వరుఁ డంచు నొండొరులు దారింద్రాదు లాస్థాన భూ**
**వేదిన్ మెల్లన నిక్కి చూతురు భయావిర్భూత రోమాంచులై. 100**

* ఈ రాక్షసరాజు ఈ రోజు ఏ దిక్పాలకులమీద మండిపడతాడో, ఏ దేవుణ్ణి బంధిస్తాడో, ఏ ప్రదేశం పై దాడి చేస్తాడో, ఎవరి ప్రాణాలు తీస్తాడో, ఎప్పుడు ఏమి ఆజ్ఞాపిస్తాడో అని ఇంద్రుడు మొదలైన దిక్పాలకులు ఒక్కొక్కరూ భయంతో ఒళ్ళు గగుర్పొడువగా హిరణ్యకశిపుడు కొలువున్న వేదికవైపే మెల్లగా నిక్కి నిక్కి చూస్తుంటారు.

**సీ. కోలాహలము మాని కొలువుఁడీ సురలార! తలఁగి దీవింపుఁడీ తపసులార!**
**ఫణు లెత్తకుఁడు నిక్కి పన్నగేంద్రములార! ప్రణతులై చనుఁడి దిక్పాలులార!**
**గానంబు సేయుఁడీ గంధర్వవరులార! సందడిఁ బడకుఁడీ సాధ్యులార!**
**యాడుఁడీ నృత్యంబు లప్సరోజనులార! చేరిక మ్రొక్కుఁడీ సిద్ధులార!**

**తే. శుద్ధకర్పూర వాసిత సురభి మధుర, భవ్య నూతన మైరేయ పానజనిత**
**సుఖవిలీనత నమరారి సొక్కినాఁడు, శాంతి లేదంద్రు నిచ్చలుఁ జారు లధిప! 101**

* అపుడు ఆ ప్రదేశమంతా రాక్షసభటులు తిరుగుతూ - ఓ సురలారా! కోలాహలం కట్టిపెట్టి సరిగా సేవ చేయండి. తాపసులారా! దానవేశ్వరుణ్ణి దీవించండి. నాగేంద్రులారా! తలలు వంచి తిరగండి. దిక్పాలకులారా! వినయంగా నమస్కరించి వెళ్లండి. గంధర్వులారా! గానం చేయండి. సాధ్యులారా! సందడి చేయకండి. అప్సరసలారా! మా ఆనందానికి ఆడండి. సిద్ధులారా! శిరసులు వంచి మ్రొక్కండి. స్వచ్ఛమైన పచ్చ కర్పూరపు పరిమళాల తియ్యని మధువును త్రాగి సౌఖ్యంగా మా ప్రభువు నిద్రిస్తున్నాడు. అమరులారా! అల్లరి చేయకండి! - అని రక రకాలుగా హెచ్చరికలు చేయసాగారు -

**శా. లీలోద్యాన లతా నివాసములలో లీలావతీ యుక్తుఁడై**
**హాలాపాన వివర్ధమాన మద లోలావృత్త తామ్రాక్షుఁడై**
**కేళిం దేలఁగ నేనుఁ దుంబురుఁడు సంగీత ప్రసంగంబులన్**
**వాలాయంబుఁ గరంగఁ జేయుదుము దేవద్వేషి నుర్వీశ్వరా! 102**

* ధర్మరాజా! స్వర్గలోకంలోని శృంగార వనంలో పువ్వుల పొదరిళ్లలో హిరణ్యకశిపుడు తన భార్యయైన లీలావతీదేవితో విహరిస్తున్నాడు. మధువును సేవించటంవల్ల మదించిపోయి చలించే ఎర్రని కళ్ళతో కేళీ వినోదాలలో లీనమై ఉన్నాడు. ఆ సమయంలో నేను, ఆ తుంబురుడూ కూడా మా వీణలపై సంగీతంలోని సరసమైన సంగతులు పలికిస్తూ ఆ రాక్షసరాజును ఆనందపరుస్తూ ఉండేవాళ్ళం.

**క. యాగములు బుధులు ధరణీ, భాగములం జేయుచుండఁ బఱతెంచి హవి**
**ర్భాగములు దాన కై కొనుఁ, జాగింపఁడు దైత్యుఁ డమరసంఘంబునకున్. 103**

* భూలోకంలో యాజ్ఞికులు యాగాలు చేస్తుంటే ఆ దానవేంద్రుడు తానే వచ్చి యాగాలలో దేవతలకు రావలసిన హవిర్భాగాలను స్వయంగా బలాత్కారంగా తీసుకు వెళ్లేవాడు. అంతేకాని దేవతలను అటు కన్నెత్తి చూడనిచ్చేవాడు కాదు. వాటిని వాళ్లకి దక్కనిచ్చేవాడూ కాదు.

**సీ. సకల మహాద్వీప సహిత విశ్వంభరా స్థలిని దున్నక పండు సస్యచయము,**
**కామధేన్వాదుల కరణి నర్థులు గోరు కోర్కులు గగనంబు గురియుచుండు,**
**వననిధు లేడును వాహినీ సందోహములును వీచుల రత్నములు వహించు,**
**నుర్వీరుహంబులు నొక్క కాలంబున నఖిలర్తు గుణముల నతిశయిల్లు,**

**తే. నంబు సంపూరిత ద్రోణు లగుచు నొప్పుఁ, బర్వతంబులు సర్వదిక్పాల వివిధ**
**గుణము లెల్లను దానె కైకొనుచు దైత్య, విభుఁడు త్రైలోక్యరాజ్య సంవృద్ధి నుండ. 104**

* సమస్త దిక్పాలకుల గుణవిశేషాలతో విరాజిల్లుతూ ఆ రాక్షసరాజు పరిపాలిస్తుంటే మూడులోకాలు కూడ పాడిపంటలతో, రత్నరాసులతో, సకల ఐశ్వర్యాలతో నిండి ఉండేవి! సకల ద్వీపాలతో భూమండలమంతా

దున్నకుండా పంటలు పండేది. కామధేనువు కల్పవృక్షమువలె అర్థులు కోరిన విధంగా ఆకాశం వర్షించేది. సప్త సముద్రాలు, నదీనదాలు రత్నరాసులను ఇస్తుండేవి. వృక్షాలు ఒక్కకాలంలోనే అన్ని విధాల ఋతుధర్మాలు కలిగి రకరకాల పూలు, పళ్ళు ప్రసాదించేవి. కొండ లోయలు నదీజలాలతో నిండి కన్నుల పండువుగా కన్పించేవి.

**వ. ఇట్లు సకల దిక్కులు నిర్జించి, లోకైకనాయకుండై, తన యిచ్ఛాప్రకారంబున నింద్రియసుఖంబు లనుభవించుచుం, దనియక శాస్త్రమార్గంబు నతిక్రమించి, విరించి వరజనిత దుర్వార గర్వాతిరేకంబున సుపర్వారాతి యైశ్వర్యవంతుండై పెద్ద కాలంబు రాజ్యంబు సేయునెడ. 105**

* ఈ విధంగా హిరణ్యకశిపుడు దిక్కులన్నీ జయించి, దిక్పాలకు లందరినీ తనకు వశం చేసుకున్నాడు. లోకం మొత్తానికి ఏకైక నాయకు డయ్యాడు. యథేచ్ఛగా ఇంద్రియ సుఖాలు అనుభవిస్తూ, దానితో తృప్తి పడకుండా శాస్త్ర మర్యాదలను కూడా అతిక్రమించాడు. విధాత ఇచ్చిన వరబలంవల్ల పెల్లుబికిన దుర్వార గర్వంతో విఱ్ఱవీగాడు. మహైశ్వర్యవంతుడై ఈ విధంగా చాలాకాలం రాజ్యం చేయసాగాడు.

**ఉ. ఎన్నఁడు మాకు దిక్కుగల! దెన్నఁడు దైత్యుని బాధ మాను? మే**
**మెన్నఁడు వృద్ధిఁ బొందఁగల? మెవ్వరు రక్షకు లంచు దేవతా**
**కిన్నర సిద్ధ సాధ్య ముని ఖేచర నాయకు లాశ్రయించి రా**
**పన్నగతల్పు భూరి భవబంధవిమోచనుఁ బద్మలోచనున్. 106**

* ఆ సమయంలో దేవతలు, కిన్నరులు, సిద్ధులు, సాధ్యులు, ఖేచరులు, మహర్షులు మొదలైన వారందరూ ముక్తిదాయి అయిన శేషశాయిని మనసులో తలచుకొంటూ "దేవా! మేము విముక్తి పొందేది ఎప్పుడు? మాకు ఆ రాక్షసుని పీడ తొలగేది ఎప్పుడు? మేము బాగు పడేది ఎన్నడు? మమ్మల్ని రక్షించేవారు ఎవరూ లేరా? మాకు మంచి రోజులు ఎప్పుడు వస్తాయి?"అని చింతించేవారు.

**వ. ఇట్లు దానవేంద్రుని యుగ్రదండంబునకు వెఱచి యనన్య శరణులై రహస్యంబున నందఱుం గూడికొని. 107**

* ఈ విధంగా వారందరూ దానవేంద్రుని భయంకరమైన రాజదండానికి భయపడి అభయమిచ్చి రక్షించే వారు లేక ఒకనాడు రహస్యంగా సమావేశం జరిపి తమ దాస్యవిముక్తికై ఆలోచించసాగారు.

**ఉ. ఎక్కడ నున్న వాఁడు జగదీశ్వరుఁ? డాత్మమయుండు మాధవుం**
**డెక్కడి కేఁగె శాంతులు మునీశులు భిక్షులు రారు క్రమ్మఱం**
**దిక్కులనెల్ల నెక్కుడు తుదిం జొర దిక్కగు నట్టి దిక్కుకై**
**మ్రొక్కెద మేము హస్తయుగముల్ ముకుళించి మదీయ రక్షకున్. 108**

* జగత్తుకు ప్రభువైన ఆ జనార్దనుడు ఎక్కడ ఉన్నాడు? ఆత్మ స్వరూపుడైన ఆ అచ్యుతుడు ఎక్కడకు వెళ్ళాడు? శాంతులూ, మునీశ్వరులూ, మహర్షులూ ఏ దివ్య పదానికి వెళ్ళి తిరిగిరారో, ఆ పరమ పదంలో ఉండే పరంధామునికి, దిక్కులు అన్నిటికీ దిక్కుఅయిన ఆ దివ్యమూర్తికి, చివరికి

విశ్వమంతటినీ తనలో విలీనం చేసుకొనే ఆ విష్ణుమూర్తికి మేము రెండు చేతులూ ఎత్తి మమ్మల్ని రక్షించ వలసినదిగా మ్రొక్కుకొంటున్నాము.

**వ. అని మఱియు నాహారనిద్రలు మాని, చిత్తంబులు పరాయత్తంబులు గానీక సమాహిత బుద్ధులై భగవం తుండును, మహాపురుషుండును, మహాత్ముండును, విశుద్ధ జ్ఞానానంద మయుండును నైన హృషీకేశునకు నమస్కరించుచున్న యెడ, మేఘరవసమాన గంభీర నినదంబున దిశలు మ్రోయించుచు సాధులకు నభయంబు గావించుచు, దృశ్యమానుండు గాక పరమేశ్వరుండైన హరి యిట్లనియె. 109**

* అని వారందరూ ఆహారనిద్రలు మానుకొని, ఏకాగ్రచిత్తంతో నిశ్చల బుద్ధివైభవంతో భగవంతుడూ, మహాత్ముడూ, నిర్మల జ్ఞానానంద స్వరూపుడూ, సర్వేంద్రియాలకూ అధిపతీ అయిన అచ్యుతునికి నమ స్కారాలు చేశారు. ఇంతలో మేఘ గర్జన వంటి గంభీర స్వరంతో దిశలు మారుమ్రోగుతుండగా కంటికి కన్పించకుండా పరమేశ్వరుడైన శ్రీహరి సాధు స్వభావులైన దేవతలకు ధైర్యం చెప్పుతూ ఇలా పలికాడు.

**మ. భయముం జెందకుఁడయ్య నిర్జరవరులే! భద్రంబు మీ కయ్యెడున్,**
**జయముం లాభము భూతసంతతికి మత్సందర్శన ప్రాప్తి న**
**వ్యయమై చేరు, నెఱుంగుదున్ దితిసుత వ్యాపార భాషా విప**
**ర్యయముల్, కాలము గూడఁ జంపెదఁ, జనుం దందాఁక మీ త్రోవలన్. 110**

* దేవతా శ్రేష్ఠులారా! భయపడకండి. నేను మీకు అభయం ఇస్తున్నాను. మీకు క్షేమం కలుగుతుంది. నేను వస్తాను. నా దర్శనభాగ్యం చేత జీవకోటికి శాశ్వతమైన జయం ప్రాప్తిస్తుంది. లాభం చేకూరుతుంది. దుష్టుడైన హిరణ్యాకశిపుడు చేస్తున్న అశాస్త్రీయమైన దుష్కృత్యాలు నాకు తెలుసు. వాడికి కాలం మూడుతుంది. నేనే సంహరిస్తాను. అప్పటివరకు మీరు జాగ్రత్తగా కాలం గడుపుతూ ఉండండి.

**ఆ. శుద్ధ సాధులందు సురలందు శ్రుతులందు, గోవులందు విప్రకోటియందు**
**ధర్మపదవియందుఁ దగిలి నా యందు వాఁ, డెన్నఁ డలుగు నాఁడె హింస నొందు. 111**

* సాధుపురుషులను బాధించేవాడూ, దేవతలను వేధించేవాడూ, విప్రులపై క్రోధించేవాడూ, వేదాలను నిందించేవాడూ, గోవులను ఖండించేవాడూ, ధర్మపథం తప్పి నాపై శత్రుత్వం పూనినవాడూ ఎక్కువ కాలం నిలువడు. పతనమై పోతాడు.

**క. కన్నకొడుకు శమ దమ సం, పన్నుఁడు నిర్వైరుఁ డనక ప్రహ్లాదుని వాఁ**
**డెన్నఁడు రోషంబున నా, పన్నత నొందించు నాఁడె పట్టి వధింతున్. 112**

* ఆ రాక్షసుడు తన కన్న కొడుకైన ప్రహ్లాదుణ్ణి బుద్ధిమంతుడనీ, శమ దమాది సద్గుణ సంపన్నుడనీ; అజాతశత్రువు అనీ ప్రేమాభిమానాలు ఏ కోశానా లేకుండా ఎప్పుడు హింసిస్తాడో, అప్పుడే వీణ్ణి నేను వధించి వేస్తాను.

శా. వేధోదత్తవర ప్రసాద గరిమన్ వీఁ డింతవాఁడై మిమున్
బాధం బెట్టుచు నున్నవాఁడని మదిన్ భావింతు, భావించి నే
సాధింపం దఱిగాదు, కావునఁ గడున్ సైరించితిన్, మీఁదటన్
సాధింతున్ సురలార! నేఁడు చనుఁడా శంకింప మీ కేటికిన్? 113

* ఈ దానవుడు బ్రహ్మవర ప్రభావం వల్లనే కన్నుకానకుండా ఇంతవాడై, దేవతలను భక్తులను బాధిస్తున్నాడు. నాకు సర్వమూ తెలుసు. కాని నేను వాణ్ణి సంహరించటానికి ఇది సమయం కాదు. కనుక చాలా వరకు సహిస్తున్నాను. ఇక మీద వాణ్ణి సంహరిస్తాను. మీకు శుభం కలుగుతుంది. సందేహించక వెళ్లిరండి.

వ. అని యిట్లు దనుజమర్దనుండు నిర్దేశించిన, నిలింపులు గుంపులు గొని మ్రొక్కి రక్కసుండు మ్రగ్గుట నిక్కం బని తమ తమ దిక్కులకుం జనిరి. హిరణ్యకశిపునకు విచిత్ర చరిత్రులు నలువురు పుత్రు లుద్భవించి రందు. 114

* అని ఈ విధంగా రాక్షసాంతకుడైన శ్రీ మహావిష్ణువు దేవతలకు అభయ మిచ్చాడు. దేవతలు ఆ స్వామికి నమస్కరించి తిరుగుముఖం పట్టారు. ' ఇక మన కష్టాలు గట్టెక్కినట్లే, ఈ దుర్మార్గుడికి కాలం సమీపించింది. వాడు నాశనమవటం తథ్యం'అని అనుకుంటూ తమ తమ స్థానాలకు వెళ్ళారు.

హిరణ్యకశిపునికి విచిత్రమైన చరిత్ర గల నలుగురు కుమారులు పుట్టారు.

## -: ప్రహ్లాద చరిత్రము :-

సీ. తనయందు నఖిలభూతములందు నొకభంగి సమహితత్వంబున జరగువాఁడు!
పెద్దలఁ బొడగన్న భృత్యుని కైవడిఁ జేరి నమస్కృతుల్ సేయువాఁడు!
కన్నుదోయికి నన్యకాంత లడ్డంబైన మాతృభావము సేసి మరలువాఁడు!
తల్లి దండ్రులభంగి ధర్మవత్సలతను దీనులఁ గావఁ జింతించువాఁడు

తే. సఖులయెడ సోదరస్థితి జరుపువాఁడు, దైవతములంచు గురువులఁ దలఁచువాఁడు
లీలలందును బొంకులు లేనివాఁడు, లలిత మర్యాదుఁడైన ప్రహ్లాదుఁ డధిప! 115

* ధర్మజా! ఆ దానవేంద్రుని నలుగురు కొడుకులలో ప్రహ్లాదుడు హరిభక్తుడు, సమస్త ప్రాణులను తనలాగా భావించే సమదర్శి. ఆతడు పెద్దలు ఎదురైనపుడు గౌరవంతో నమస్కరించే వినయశీలి. ఇతర స్త్రీలు కన్పిస్తే తల్లిలాగా భావించి ప్రక్కకు తొలగిపోయే గుణవంతుడు. దీనులకు తల్లీ తండ్రీ తానే అయి ఆదరించే ఆర్ద్రహృదయుడు. స్నేహితులను సోదరుల లాగా చూచుకొనే సహృదయుడు. గురువులను దైవంగా కొలిచే ఆదర్శ విద్యార్థి. హాస్యానికైనా అబద్ధమాడని సత్యవంతుడు. ఈ విధమైన మంచీ మర్యాదా తెలిసిన మహోత్తముడు ప్రహ్లాదుడు.

వ. మఱియును. 116

సీ. ఆకారజన్మ విద్యార్థవరిష్ఠుఁడై గర్వసంస్తంభ సంగతుఁడు గాఁడు,
వివిధమహానేక విషయసంపన్నుఁడై పంచేంద్రియములచేఁ బట్టువడఁడు,
భవ్యవయోబల ప్రాభవోపేతుఁడై కామరోషాదులఁ గ్రందుకొనఁడు,
కామినీ ప్రముఖ భోగము లెన్ని గలిగిన వ్యసనసంసక్తి నా వంకఁబోఁడు,

ఆ. విశ్వమందుఁ గన్న విన్న యర్థములందు, వస్తుదృష్టిఁ జేసి వాంఛ యిడఁడు,
ధరణినాథ! దైత్య తనయుండు హరి పర తంత్రుఁడై హతాన్యతంత్రుఁ డగుచు. 117

* ఇంతేకాదు, ధర్మనందనా! రూపురేఖల విషయంలో విద్య, ఐశ్వర్యం విషయంలో అధికుడై కూడ ఆవంత గర్వం లేనివాడు ప్రహ్లాదుడు. అనేక భోగభాగ్యాల మధ్య పెరిగినా కూడ చంచలత్వం లేని ధీరుడు. చక్కని వయస్సు, వయస్సుకు తగ్గ బలం ఉన్నవాడైనా కామం, క్రోధం ఎరుగని వాడు. కాంతలు మొదలగు భోగాలు కళ్ళముందే కన్పిస్తున్నా శృంగారభావమే ఆతని మనస్సుకు రాదు. ఆతడు లోకంలో గొప్పగొప్ప ఐశ్వర్యాలను చూచినప్పటికీ, వాటిని గురించి విన్నప్పటికీ వాటిని ఎప్పుడూ కోరుకునేవాడు కాదు. ఆ రాక్షసరాజు కొడుకైన ప్రహ్లాదునికి నిత్యం శ్రీవిష్ణువును గూర్చే ఆలోచన! అదే ఆరాటం! అదే ఆసక్తి! ఇతరములైన ఆలోచనలు అతని దరికిరావు.

ఆ. సద్గుణంబు లెల్ల సంఘంబులై వచ్చి, యసుర రాజతనయునందు నిలిచి
పాసి చనవు విష్ణుఁ బాయని విధమున, నేఁడుఁ దగిలి యుండు నిర్మలాత్మ! 118

* ధర్మరాజా! అనుక్షణం విష్ణువును విడిచిపెట్టని ఆ ప్రహ్లాదుణ్ణి లోకంలో ఉండే మంచిగుణాలన్నీ తండోపతండాలుగా వచ్చి ఆశ్రయించాయి. ఆ సుగుణాలు ఎప్పుడూ విష్ణుమూర్తినివలె అతనిని విడిచిపెట్టి పోవు.

మ. పగవారైన సురేంద్రులున్ సభలలోఁ బ్రహ్లాద సంకాశులన్
సుగుణోపేతుల నెందు మే మెఱుఁగ మంచున్ వృత్తబంధంబులన్
బొగడం జొత్తురు సత్కవీంద్రుల క్రియన్ భూనాథ! మీబోఁటి స
ద్భగవద్భక్తులు దైత్యరాజ తనయున్ బాటించి కీర్తింపరే! 119

* ఓ మహారాజా! ప్రహ్లాదుడు రాక్షస కులంలో పుట్టాడని ఏ మాత్రం ద్వేషం లేకుండా శత్రువులైన దేవతాశ్రేష్ఠులు కూడా వారి వారి సభలలో "ప్రహ్లాదుని వంటి గుణవంతుణ్ణి మేము ఎక్కడా చూడలేదు" అని పెద్ద పెద్ద కవులు పొగడినట్లు రకరకాల వృత్తాలలో అతణ్ణి మెచ్చుకొంటూ ఉంటారు. అలాంటప్పుడు మీ వంటి మహానుభావులు భగవద్భక్తులు దానవచక్రవర్తి కొడుకైన ప్రహ్లాదుణ్ణి మెచ్చుకోకుండా ఉంటారా ధర్మరాజా!

క. గుణనిధి యగు ప్రహ్లాదుని, గుణము లనేకములు గలవు గురుకాలమునన్
గణుతింప నశక్యంబులు, ఫణిపతికి బృహస్పతికిని భాషాపతికిన్. 120

* ప్రహ్లాదుడు సుగుణాలకు నిధివంటివాడు. అతని గుణాల గురించి ఎంతచెప్పినా సమయం సరిపోదు. ఆ గుణాలన్నీ వర్ణించాలంటే సాక్షాత్తు ఆ ఆదిశేషునికైనా, దేవతల గురువైన బృహస్పతి కైనా, భారతీదేవి భర్త అయిన బ్రహ్మకైనా సాధ్యం కాదు.

**వ. ఇట్లు సద్గుణ గరిష్ఠుండయిన ప్రహ్లాదుండు భగవంతుండయిన వాసుదేవుని యందు సహజ సంవర్ధమాన నిరంతర ధ్యానరతుండై. 121**

* సుగుణ వంతుడైన ప్రహ్లాదుడు భగవంతుడైన ఆ శ్రీహరిని అనుదినమూ ఆరాధిస్తూ ఉండేవాడు. అతడి ఆనందమంతా ఆ స్వామిని ధ్యానించటమే. అతని హరి భక్తి ఆనాటి కానాటికీ అతిశయించింది.

**సీ. శ్రీవల్లభుఁడు దన్నుఁ జేరిన యట్లైనఁ జెలికాండ్ర నెవ్వరిఁ జేర మఱచు,**
**నసురారి దనమ్రోల నాడినయట్లైన నసుర బాలుర తోడ నాడ మఱచు,**
**భక్తవత్సలుఁడు సంభాషించి నట్లైన బరభాషలకు మాఱుపలుక మఱచు,**
**సురవంద్యుఁ దనలోనఁ జూచిన యట్లైనఁ జొక్కి సమస్తంబుఁ జూడ మఱచు,**

**తే. హరిపదాంభోజయుగ చింతనామృతమున, నంతరంగంబు నిండినట్లైన నతఁడు**
**నిత్య పరిపూర్ణుఁ డగుచు నన్నియును మఱచి, జడత లేకయు నుండును జడుని భంగి. 122**

* ఒక్కొక్కసారి ఆ శ్రీ మహావిష్ణువు తన దగ్గరకు వచ్చినట్లు అనిపించేది. అలాంటి సమయంలో ప్రహ్లాదుడు తన స్నేహితుల దగ్గరకు వెళ్లటం మరచిపోయేవాడు. మరొకసారి ఆ శ్రీహరి తనతో ఆడుతున్నట్లు అనిపించేది. అప్పుడు ప్రహ్లాదుడు తోడి బాలకులతోడి ఆటలాడటం మరచిపోయేవాడు. ఒక్కొక్కసారి మాధవుడు తనతో మాట్లాడుతున్నట్లు అనిపించేది. ఆ సమయంలో ఎవరైనా పలకరిస్తే మాటకు బదులుపలకటం కూడా మరచిపోయేవాడు. మరొకసారి ఆ చక్రధారిని తను చూస్తున్నట్లు అనిపించేది. అపుడు తన్మయత్వంతో ప్రహ్లాదుడు సర్వప్రపంచాన్నే మరచిపోయేవాడు. నిత్యం శ్రీహరి పాదపద్మాలను తలచుకుంటూ ఉండటం వల్ల ఆ భక్తి సుధలతో అతని మానసమంతా నిండిపోయేది. దివ్యమైన ఆనందంతో అన్నీ మరచిపోయేవాడు. ప్రహ్లాదునికి జడత్వం ఆవంత కూడా లేకపోయినా నిత్యం దేవుని గురించే ఆలోచిస్తూ పైకి జడునిలాగా కనిపించేవాడు.

**శా. పానీయంబులు ద్రావుచుం గుడుచుచున్ భాషించుచున్ హాస లీ**
**లా నిద్రాదులు సేయుచుం దిరుగుచున్ లక్షించుచున్ సంతత**
**శ్రీనారాయణ పాదపద్మ యుగళీ చింతామృతా స్వాద సం**
**ధానుండై మఱచెన్ సురారిసుతుఁ డేతద్విశ్వమున్ భూవరా! 123**

* ధర్మరాజా! మహానుభావుడైన ప్రహ్లాదునికి మంచినీరు త్రాగేటప్పుడు, మాటలాడేటప్పుడు ఆ మాధవుని చింతనే. ఆహారం తీసుకునేటప్పుడు, ఆటలాడేటప్పుడుకూడ ఆ అచ్యుతుని స్మరణే. నడుస్తున్నా, నవ్వుతున్నా నారాయణ ధ్యానమే. చివరకు నిద్రలోకూడ ఆ నీరజాక్షుని కలవరింతలే. ఈ విధంగా

శ్రీమన్నారాయణుని చరణారవింద సంస్మరణమనే అమృతాన్ని ఆస్వాదించి ఆ మైకంలో ఈ లోకాన్నే మరచిపోయిన మహనీయుడు ప్రహ్లాదుడు!

**సీ. వైకుంఠ చింతా వివర్జిత చేష్టుఁడై యొక్కఁడు నేడుచు నొక్కచోట,**
**నశ్రాంతహరిభావనారూఢ చిత్తుఁడై యుద్ధతుఁడై పాడు నొక్కచోట,**
**విష్ణుఁ డింతియ కాని వేఱొండు లే దని యొత్తిలి నగుచుండు నొక్కచోట,**
**నలినాక్షుఁ డనునిధానముఁ గంటి నే నని యుబ్బి గంతులు వైచు నొక్కచోటఁ,**

**ఆ. బలుకు నొక్కచోటఁ బరమేశుఁ గేశవుఁ, బ్రణయహర్ష జనిత బాష్పసలిల**
**మిళితపులకుఁడై నిమీలిత నేత్రుఁడై, యొక్కచోట నిలిచి యూరకుండు. 124**

* ప్రహ్లాదుడు ఒక్కొక్కసారి హరిస్మరణంలో మునిగి మైమరచి ఒంటరిగా కూర్చొని ఏడుస్తూ ఉండేవాడు. అంతులేని హరిభక్తి నిండిన మనస్సుతో ఒక్కొక్కసారి విష్ణుకీర్తనలను గొంతెత్తి గానం చేసేవాడు. విష్ణువే తప్ప వేరెవరూ లేరని గట్టిగా వాదిస్తూ పకపక నవ్వేవాడు. మరొకసారి. 'కమలాక్షుడనే పెన్నిధిని కన్నులారా చూచాను' అని పొంగిపోతూ గంతులేసేవాడు వేరొకసారి. మరొకసారి 'మాధవా! మధుసూదనా!' అని మైమరచి పిలుస్తూ ఆనందబాష్పాలు రాలుస్తూ భక్తితో పులకించి పోయేవాడు. ఒక్కొక్కసారి కళ్ళు మూసుకొని ఒకచోట నిర్లిప్తంగా నిలుచొని ఉండేవాడు. ఆ ప్రహ్లాదుడు ఏ పనిచేసినా, ఎలా ప్రవర్తించినా హృదయమంతా హృషీకేశుని ఆరాధనయందే!

**వ. ఇట్లు పూర్వజన్మ పరమభాగవత సంసర్గ సమాగతంబైన ముకుంద చరణారవింద సేవాతిరేకంబున నఖర్వ నిర్వాణ భావంబు విస్తరించుచు, నప్పటికి దుర్జనసంసర్గ నిమిత్తంబునం దన చిత్తం బన్యాయత్తంబు గానీక నిజాయత్తంబు సేయుచు, నప్రమత్తుండును, సంసార నివృత్తుండును, బుధజన విధేయుండును, మహాభాగధేయుండును, సుగుణమణి గణగరిష్ఠుండును, బరమ భాగవత శ్రేష్ఠుండును, గర్మబంధ లతాలవిత్రుండును, బవిత్రుండునునైన పుత్రుని యందు విరోధించి, సురవిరోధి యనుకంప లేక చంపం బంపె నని పలికిన నారదునకు ధర్మజుం డిట్లనియె. 125**

* ప్రహ్లాదునికి పూర్వజన్మలో మహాభక్తులతో మంచి స్నేహం ఉండేది. ఆ పూర్వజన్మ వాసనవల్ల ఈ జన్మలో కూడ శ్రీహరి పాదారవిందాల మీద భక్తి ఏర్పడింది. అందువల్ల చెడ్డవారు చెంతనే ఉన్నా కూడ చిత్తాన్ని అచ్యుతుని మీదనుంచి అతడు మరల్చలేదు. చాల జాగ్రత్తగా సంసార బంధాలలో చిక్కుకోకుండా ఉండేవాడు. పెద్దలంటే గౌరవం ఉన్న గుణవంతు డాతడు. లతలను కొడవలితో కోసినట్లు కర్మబంధాలను ఛేదించి వేసిన ఘనుడు ఆ ప్రహ్లాదుడు. అటువంటి భక్తుడైన, పవిత్రుడైన, పుత్రునిమీద రాక్షసరాజైన హిరణ్యకశిపుడు విరోధం పెంచుకొన్నాడు. మనస్సులో కరుణలేకుండా కఠినాత్ముడై కన్న కుమారుణ్ణి చంపటానికి భటులను పంపించాడు అని పలికిన నారదుని చూచి ధర్మరాజు ఆశ్చర్యచకితుడై ఇలా అన్నాడు.

శా. పుత్రుల్ నేర్చిన నేరకున్న జనకుల్ పోషింతు రెల్లప్పుడున్
మిత్రత్వంబున బుద్ధి సెప్పి దురితోన్మేషంబు వారింతు రే
శత్రుత్వంబుఁ దలంప, రిట్టియెడ నా సౌజన్యరత్నాకరుం
బుత్రున్ లోకపవిత్రుఁ దండ్రి నెగులుం బొందింప నెట్లోర్చెనో? 126

* నారదమహర్షీ! లోకంలో కుమారులు చేతనయిన వా రైనా, చేతకానివారైనా, దుర్బలు లైనా దుర్మార్గులైనా తండ్రులు వారిని పోషిస్తూ ఉంటారు. మిత్రునిలాగ బుద్ధి చెప్పి మంచిమార్గంలోకి తీసుకురావటానికి ప్రయత్నం చేస్తారు. అంతేకాని కొడుకులతో ఎవరైనా శత్రుత్వం పెట్టుకొంటారా? కొడుకులను చిత్రహింసలు పెట్టే తండ్రులు ఉంటారా? అందులో ప్రహ్లాదుడు రత్నాలవంటి గుణాలు ఉన్నవాడు కదా? అంత పరమ పవిత్రుడైన పుత్రుణ్ణి కన్నందుకు సంతోషించకపోగా, పైగా హింసించటానికి అతనికి మనస్సు ఎలా ఒప్పింది స్వామీ?

ఉ. బాలుఁ బ్రభావిశాలు హరిపాదపయోరుహ చింతన క్రియా
లోలుఁ గృపాళు సాధు గురు లోక పదానతఫాలు నిర్మల
శ్రీలు సమస్త సభ్య నుతశీలు విఖండిత మోహవల్లి కా
జాలు నదేల తండ్రి వడిఁ జంపఁగ జంపె? మునీంద్ర! సెప్పవే? 127

* మునీశ్వరా! ఆ ప్రహ్లాదుడు బాలుడు, బుద్ధిమంతుడు. చూడ చక్కనివాడు, దయాశీలుడు. తామరపూలవంటి శ్రీహరి పాదాలనే మనసులో తలచుకొంటూ ఉండేవాడు. ఆతడు గురుజనులకు తలవంచి నమస్కరించేవాడు, గొప్పతేజస్సు కలవాడు, సజ్జనులచే సన్నుతింపబడే వాడు, కోరికలను జయించినవాడు గదా! అటువంటి సుపుత్రుణ్ణి ఆ కన్న తండ్రి ఆలోచించకుండా చంపించాలని అనుకొన్నాడు? ఆశ్చర్యంగా ఉందే?

వ. అనిన నారదుం డిట్లనియె. 128

శా. లభ్యంబైన సురాధిరాజపదమున్ లక్షింపఁడశ్రాంతమున్
సభ్యత్వంబున నున్నవాఁ డబలుఁడై జాడ్యంబుతో వీఁడు, వి
ద్యాభ్యాసంబునఁ గాని తీవ్రమతి గాఁ డంచున్ విచారించి దై
త్యేభ్యుం డొక్కదినంబునం బ్రియసుతున్ వీక్షించి సోత్కంఠుఁడై. 129

* అని ధర్మరాజు అడగగానే నారదమహర్షి ఇలా వివరించాడు -

ధర్మరాజా! నీవు అన్నట్లే దానవేశ్వరుడు కొడుకును తన మార్గంలోకి తీసుకురావటానికి విశ్వప్రయత్నం చేశాడు. హిరణ్యకశిపుడు ఒకరోజు పుత్రుణ్ణి ప్రేమగా పిలిచి, వాని స్వభావం పరిశీలనగా చూచి ఇలా అనుకొన్నాడు. "వీడు సంప్రాప్తించిన స్వర్గరాజ్య పదవిని కూడా లెక్కచేయడు. అసలు వీనికి రాజ్యకాంక్ష ఏ మాత్రమూ ఉన్నట్లు లేదు. ఎప్పుడూ మామూలు వ్యక్తిలాగా దుర్బలుడుగా, సోమరితనంతో ఉంటాడు;

రాజకుమారుడులాగా రాజసంగా, పౌరుషంగా ఉండడేమిటి? ఒకవేళ చదువు చెప్పిస్తే మనస్సు వికసించి బాగుపడతాడేమో, చురుకుతనం వస్తుందేమో''అని ఆశ పడ్డాడు.

**క. చదువనివాఁ డజ్ఞుం డగుఁ, జదివిన సదసద్వివేక చతురత గలుగుం,**
**జదువఁగ వలయును జనులకుఁ, జదివించెద నార్యులొద్దఁ జదువుము తండ్రీ! 130**

* కొడుకును ముద్దాడి "బాబూ! చదువు చాల ముఖ్యం. చదువుకోనివాడు అజ్ఞానిగా ఉంటాడు. వాడు పశువుతో సమానం! చదువుకొంటే తెలివితేటలు బాగా వస్తాయి. ఇది మంచీ, ఇది చెడూ అనే వివేకం కలుగుతుంది. మనిషి అయిన ప్రతీవాడు తప్పకుండా చదువుకోవాలి. మంచి గురువుల దగ్గర చదివిస్తాను. చదువుకో నాయనా!''అన్నాడు.

**వ. అని పలికి యసురలోక పురోహితుండును భగవంతుండును నయిన శుక్రాచార్యు కొడుకులఁ బ్రచండవితర్కులఁ జండామర్కుల రావించి సత్కరించి యిట్లనియె. 131**

* అని చెప్పి నీతిశాస్త్రవిశారదుడు, రాజగురువైన శుక్రాచార్యుని కొడుకులను పిలిపించాడు. వారి పేర్లు చండుడు, అమర్కుడు, వారు తర్కవిద్యలో ఆరితేరినవారు. ఆ చండామర్కులను చూచి హిరణ్యాకశిపుడు గౌరవపురస్సరంగా ఇలా పలికాడు-

**శా. 'అంధప్రక్రియ నున్నవాఁడు, పలుకం, డస్మత్ప్రతాపక్రియా**
**గంధం బించుక లేదు, మీరు గురువుల్ కారుణ్యచిత్తుల్ మనో**
**బంధుల్ మాన్యులు మాకుఁ బెద్దలు మముం బాటించి యీ బాలకున్**
**గ్రంథంబుల్ చదివించి నీతికుశలుం గావించి రక్షింపరే!' 132**

* మీరు గురుపుత్రులు! పరమ పవిత్రులు! మాకు గౌరవపాత్రులు! మీరు మాకు బంధువులు. దయాసింధువులు. మా కుమారుడు అజ్ఞానంతో అంధుడై ఉన్నాడు. ఎప్పుడూ సోమరిలాగా ఉంటాడు. పలుకరిస్తే వెంటనే పలుకడు. నా ప్రతాపానికి సంబంధించిన వాసన కొంచెం కూడా వీడికి అంటలేదు. మీరు గురువులు. మాకు పెద్దలు దయచేసి మా మాట మన్నించి ఈ బాలుని చేత గ్రంథాలు చదివించండి. వీనికి నీతిశాస్త్రం నేర్పండి. వీణ్ణి సంస్కరించి మమ్మల్నీ, మా వంశమునూ రక్షించండి.

**వ. అని పలికి వారలకుం బ్రహ్లాదు నప్పగించి తోడ్కొని పొం డనిన వారును దనుజ రాజకుమారునిం గొనిపోయి యతనికి సవయస్కులగు సహశ్రోతల నసురకుమారులం గొందఱం గూర్చి. 133**

* అని పలికి రాక్షసరాజు కొడుకును తీసుకొని వెళ్లండని గురువులకు అప్పగించాడు. అపుడు వారు ప్రహ్లాదుణ్ణి తీసుకువెళ్లి సమాన వయస్సుగల తోడి రాక్షస విద్యార్థులతోపాటు కూర్చో పెట్టుకొన్నారు.

**ఉ. అంచిత భక్తితోడ దనుజాధిపు గేహసమీపముం బ్రవే**
**శించి సురారి రాజసుతఁ జేకొని శుక్రకుమారకుల్ పఠిం**

**పించిరి పాఠయోగ్యములు పెక్కులు శాస్త్రము, లాకుమారుఁ డా**
**లించి పఠించె నన్నియుఁ జలింపని వైష్ణవభక్తి పూర్ణుఁడై.** 134

* మహారాజసౌధం సమీపంలో ఉన్న విద్యాభవనంలో ప్రత్యేక శ్రద్ధ తీసుకొని చండామర్క గురువులు బాలుణ్ణి చదివించసాగారు. అతి ముఖ్యమైన అనేక శాస్త్రాలు బోధించారు. ప్రహ్లాదుడు విష్ణుదేవునిమీద భక్తితో అన్ని శాస్త్రాలను చదివి అర్థం చేసుకొన్నాడు. అన్ని విద్యలను నేర్చుకొన్నాడు.

**క. ఏ పగిది వారు సెప్పిన, నా పగిదిం జదువుఁ గాని యట్టి ట్టని యా**
**క్షేపింపఁడు, తా నన్నియు, రూపించిన మిథ్యలని నిరూఢమనీషన్.** 135

* గురుదేవులు చెప్పినవన్నీ శ్రద్ధగా విని అర్థం చేసుకొన్నాడు. వారు ఏ విధంగా చెప్తే ప్రహ్లాదుడు ఆ విధంగానే చదివేవాడు. అంతే కాని 'అలా కాదు ఇలా'అని ఎప్పుడూ గురువులకు ఎదురు చెప్పేవాడు కాదు. తనకు ఇష్టం లేనివి గురువులు బోధించినా, ఈ విద్యలన్నీ అసత్యాలనీ, భ్రమలనీ తెలిసినా కూడా ఆక్షేపించే వాడు కాదు. వారు చెప్పినట్లు విని చదువుకొన్నాడు.

**శా. అంతం గొన్నిదినంబు లేఁగిన సురేంద్రారాతి శంకాన్విత**
**స్వాంతుండై నిజనందనున్ గురువు లే జాడం బఠింపించిరో**
**భ్రాంతుం డేమి పఠించెనో, పిలిచి సంభాషించి విద్యా పరి**
**శ్రాంతిం జూచెదఁగాక నేఁడని మహాసౌధాంతరాసీనుఁడై.** 136

* ఇలా కొంతకాలం జరిగేసరికి హిరణ్యకశిపునికి అనుమానం వచ్చింది. తన కొడుకును గురువులు ఏ విధంగా చదివిస్తున్నారో? ఈ పసివాడు ఏమి చదువుతున్నాడో తెలుసుకోవాలి అనిపించింది. సరే వాళ్ళని పిలిచి మాట్లాడి వీడు ఎంతవరకు చదివాడో చూడాలి అనుకున్నాడు మనస్సులో. ఆ సమయంలో హిరణ్యకశిపుడు తన దివ్య భవనంలో కూర్చొని ఉన్నాడు.

**ఉ. మోదముతోడ దైత్యకులముఖ్యుఁడు రమ్మని చీరఁ బంచెఁ బ్ర**
**హ్లాదకుమారకున్ భవమహార్ణవతారకుఁ గామరోష లో**
**భాది విరోధివర్గ పరిహారకుఁ గేశవచింతనామృతా**
**స్వాద కఠోరకుం గలుషజాల మహోగ్రవనీకుఠారకున్.** 137

* ఈ సంసారం అనే సముద్రాన్ని దాటినవాడూ; కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలను జయించినవాడూ, మనసులో కల్మషం లేనివాడూ, కలుషములనే కారడవిని మూలమట్టంగా ఛేదించినవాడూ, దైవ చింతన అనే అమృతం గ్రోలినవాడూ అయిన తన కుమారుడు ప్రహ్లాదుని కోసం ఆ రాక్షసరాజు ఆనందంతో కబురు పంపించాడు.

**వ. ఇట్లు చారులచేత నాహూయమానుండై ప్రహ్లాదుండు చనుదెంచిన.** 138

* రాజభటులు వెళ్ళి ప్రహ్లాదునికి ఈ విషయం చెప్పారు. అతడు గురువుతోపాటు తండ్రి దగ్గరకు వచ్చాడు.

శా. ఉత్సాహ ప్రభు మంత్రశక్తి యుతమే యుద్యోగ? మారూఢ సం
వి త్సంపన్నుఁడ వైతివే? చదివితే వేదంబులున్ శాస్త్రముల్?
వత్సా! రమ్మని చేరఁ జీరి కొడుకున్ వాత్సల్య సంపూర్ణుఁడై
యుత్సంగాగ్రముఁ జేర్చి దానవవిభుం డుత్కంఠ దీపింపఁగన్. 139

* హిరణ్యకశిపుడు కొడుకును చూచి కుమారా! రా రమ్మ'ని పిలిచి, వాత్సల్యంతో ఆనందంతో ఒళ్ళో కూర్చోబెట్టుకొని ఆసక్తిగా ఇలా అడిగాడు - "నాయనా! ఏదైనా ప్రయత్నం ఫలించాలంటే ప్రభుశక్తి, మంత్రశక్తి, ఉత్సాహశక్తి అనే మూడు శక్తులూ కలిసిరావాలి. అవి అన్నీ సహకరించి నీ ప్రయత్నాలు నిరాటంకంగా నెరవేరుతున్నాయా? విజ్ఞాన సంపద పొందావా? వేదాలు వల్లించావా? శాస్త్రాలు పఠించావా?

క. అనుదిన సంతోషణములు, జనితశ్రమతాపదుఃఖ సంశోషణముల్
తనయుల సంభాషణములు, జనకులకుం గర్ణయుగళ సద్భూషణముల్. 140

* నాయనా! కుమారుల తియ్యని మాటలు తల్లిదండ్రులకు తేనెల ఊటలు, వీనుల విందులు! ఆ మాటలు ప్రతిరోజు విన్నా విసుగు కలగదు. పైగా సంతోషం కలిగిస్తాయి. శ్రమవల్ల, కష్టాలవల్ల కలిగిన రకరకాల దుఃఖాలను తొలగిస్తాయి.

వ. అని మఱియుఁ బుత్రా! నీ కెయ్యది భద్రంబై యున్నది? సెప్పు మనినఁ గన్న తండ్రికిఁ బ్రియనందనుం డిట్లనియె. 141

* గురువులు చెప్పిన పాఠాలలో నీకు బాగా నచ్చిందీ, నీకు ఇష్టమయిందీ, నీకు మంచి అనిపించిందీ ఏ విషయమో చెప్పు నాన్నా" - అన్న కన్న తండ్రితో చిన్నారి పుత్రుడు ఇలా అన్నాడు.

ఉ. ఎల్ల శరీరధారులకు నిల్లను చీఁకటి నూతిలోపలం
ద్రెళ్ళక వీరు నే మను మతిభ్రమణంబున భిన్నులై ప్రవ
ర్తిల్లక సర్వము న్నతని దివ్యకళామయ మంచు విష్ణునం
దుల్లముఁ జేర్చి తా రడవి నుండుట మేలు నిశాచరాగ్రణీ! 142

* 'తండ్రీ! దానవచక్రవర్తీ! నాకు నచ్చిన విషయం ఒక్కటే. అది నారాయణ చరణ స్మరణం. ఈ మానవులు అందరూ అజ్ఞానులూ, అవివేకులూ, వీరందరూ ఈ సంసారమనే చీకటి నూతిలో నుంచి బయటపడలేరు. 'మీరు వేరు, మేము వేరు' అనుకొంటూ భ్రమతో బ్రతుకుతూ ఉంటారు. అలా భావించకుండా ఇది అంతా ఆ భగవంతుని విచిత్రమైన లీలావిలాసం అని తెలుసుకోలేరు. అలా తెలుసుకో గలిగినప్పుడే ఆ విష్ణువును తలుచుకొంటూ సంపదలన్నీ విడిచి అడవిలో నివసించినా మంచిదే నాన్నా!"

వ. అని కుమారుం డాడిన ప్రతిపక్షానురూపంబు లయిన సల్లాపంబులు విని దానవేంద్రుండు నగుచు నిట్లనియె. 143

* ఈ విధంగా తన కొడుకు శత్రువును మెచ్చుకొనే మాటలు అంటూ ఉంటే విని హిరణ్యకశిపుడు ఆశ్చర్యపడి నవ్వుతూ ఇలా అన్నాడు.

**క. ఎట్టాడిన న ట్టాడుదు, రిట్టి ట్టని పలుక నెఱుఁగ రితరుల శిశువుల్**
**దట్టించి యెవ్వ రేమని, పట్టించిరొ బాలకునకుఁ బరపక్షంబుల్? 144**

* కుమారా! పిల్లలు పెద్దలను అనుకరిస్తారు. గురువులు చెప్పింది చదువుతారు. ఎలా అనమంటే అలా అంటారు. ఏది నేర్పితే అది నేర్చుకొంటారు. 'అలా కాదు ఇలా'అని చిన్నపిల్లలు అనలేరు కదా? ఎవరైనా నిన్ను బెదిరించి తప్పుడు బుద్ధులు నేర్పారా? చెప్పు. శత్రువును మెచ్చుకోమని ఎవరు చెప్పారు నాయనా?

**శా. నాకుం జూడఁగఁ జోద్యమయ్యెడిఁ గదా! నా తండ్రి! యీ బుద్ధి దా**
**నీకున్ లోపలఁ దోఁచెనో? పరులు దుర్నీతుల్ పఠింపించిరో?**
**యేకాంతంబున భార్గవుల్ పలికిరో? యీ దానవశ్రేణికిన్**
**వైకుంఠుండు కృతాపరాధుఁ డతనిన్ వర్ణింప నీ కేటికిన్? 145**

* నా చిన్ని నాన్నా! చెప్పరా! ఆశ్చర్యంగా ఉందే! ఈ బుద్ధి నీకే పుట్టిందా! మనకు గిట్టనివాళ్లు ఎవరన్నా చెప్పారా! లేక రహస్యంగా గురువులు చండామర్కులు బోధించారా? మన దానవులందరికీ విష్ణువు పెద్ద శత్రువు, బద్ధ విరోధి. అతణ్ణి మనం నిందించాలి కానీ పొగడకూడదు. అతణ్ణి మనం భంజించాలి కానీ భజించకూడదు.

**మ. సురలం దోలుటయో సురాధిపతులన్ స్రుక్కించుటో సిద్ధులం**
**బరివేధించుటయో మునిప్రవరులన్ బాధించుటో? యక్ష కి**
**న్నర గంధర్వ విహంగనాగపతులన్ నాశంబు నొందించుటో**
**హరి యంచున్ గిరి యంచు నేల చెడ మోహాంధుండవై పుత్రకా! 146**

* పుత్రకా! మన పని ఏమిటంటే - దేవతలను తన్ని తరిమివేయటం, దేవతాధిపతులను బాధించటం, సిద్ధపురుషులను వేధించటం, మునీశ్వరులను శిక్షించటం; యక్షులను, కిన్నరులను, గంధర్వులను ఏడిపించటం! నాగరాజులను, గరుడులను నాశనం చేయటం. ఈ విధంగా వాళ్ళను బాధించటం వేధించటమే మన విధి. అదే మనకు పరమావధి. అంతే కాని నీవు 'హరీ, గిరీ!' అంటూ మూఢుడులాగా అజ్ఞానం అనే అంధకారంలో పడి చెడిపోకు.

**వ. అనినఁ దండ్రిమాటకుఁ బురోహితు నిరీక్షించి ప్రహ్లాదుం డిట్లనియె, మోహ నిర్మూలనంబు సేసి యెవ్వని యందుఁ దత్పరులయి యెఱుక గల పురుషులకుం బరులు దా మనియెడు మాయాకృతం బయిన యసద్గ్రాహ్యంబగు భేదంబు గానంబడ, దట్టి పరమేశ్వరునకు నమస్కరించెద. 147**

* అని హిరణ్యకశిపుడు పలుకగానే ప్రహ్లాదుడు గురువుల వంకచూచి ఇలా అన్నాడు. కోరికలను జయించి భగవంతుని గూర్చి ధ్యానించే జ్ఞానుల మనస్సులో మీరు - మేము అనే అర్థంలేని భేదాలు ఉండవు. అటువంటి సమదృష్టిని ఇచ్చే ఆ పరమాత్మునికి నమస్కరిస్తున్నాను.

శా. అజ్ఞుల్ గొందఱు నేము దా మనుచు మాయం జెంది సర్వాత్మకుం
బ్రజ్ఞాలభ్యు దురన్వయక్రమములన్ భాషింపఁగా నేర, రా
జిజ్ఞాసాపథమందు మూఢులు గదా చింతింప బ్రహ్మాది వే
దజ్ఞుల్ తత్పరమాత్ము విష్ణు నితరుల్ దర్శింపఁగా నేర్తురే? 148

* అజ్ఞానంలో పడిన కొందరు 'మీరు వేరు - మేము వేరు'అనే భ్రాంతిలో ఉంటారు. అటువంటివారు బుద్ధికి అందనటువంటి భగవంతుణ్ణి ఎంతో తెలివితేటలను పాండిత్యమును ఉపయోగించికూడా తెలుసుకోలేరు. పరమాత్మను తెలుసుకొనే విషయంలో బ్రహ్మవంటి వేదమూర్తులు కూడా అసమర్థులే. అటువంటప్పుడు సామాన్యులైన ఇతరులు పరాత్పరుడైన ఆ విష్ణువును దర్శింపగలుగుట అసాధ్యం గదా!

తే. ఇను మయస్కాంత సన్నిధి నెట్లు భ్రాంత, మగు హృషీకేశుసన్నిధి నా విధమునఁ
గరఁగుచున్నది దైవయోగమునఁ జేసి, బ్రాహ్మణోత్తమ! చిత్తంబు భ్రాంత మగుచు. 149

* గురువర్యా! ఇనుము అయస్కాంతం వైపు ఆకర్షింపబడినట్లు దైవయోగంవల్ల నా మనస్సు ఆ శ్రీహరివైపు ఆకృష్టమై ఆయన సన్నిధిలోనే విహరిస్తున్నది. మరి ఏ విషయంలోనూ నా మనసు నిలవటంలేదు.

సీ. మందార మకరంద మాధుర్యమునఁ దేలు మధుపంబు వోవునే మదనములకు?
నిర్మల మందాకినీ వీచికలఁ దూఁగు రాయంచ సనునె తరంగిణులకు?
లలిత రసాలపల్లవ ఖాది యై చొక్కు కోయిల సేరునే కుటజములకుఁ?
బూర్ణేందు చంద్రికా స్ఫురిత చకోరకం బరుగునే సాంద్ర నీహారములకు?

తే. నంబుజోదర దివ్య పాదార వింద, చింతనామృత పానవిశేష మత్త
చిత్త మేరీతి నితరంబుఁ జేర నేర్చు? వినుత గుణశీల! మాటలు వేయు నేల? 150

* మహానుభావా! మందార పుష్పంలోని మకరంద మాధుర్యం అనుభవించే తుమ్మెద ఉమ్మెత్తపూల వైపుకు పోతుందా? స్వచ్ఛమైన ఆకాశగంగా తరంగాలపై విహరించే రాజహంస వాగులదగ్గరా, వంకలదగ్గరా తిరుగుతుందా? తియ్య మామిడి లేతచిగుళ్ళు తిని పులకించి పాటలుపాడే కోయిల కొండమల్లెల చెంతకు చేరుతుందా? నిండు పున్నమి పండువెన్నెలలో విహారం చేసే చకోరం దట్టమైన మంచుపొరల వైపుకు మరలుతుందా? లేదు. వెళ్లలేదు! ఆ విధంగానే నా మనస్సుకూడా దివ్యమైన విష్ణుపాదపద్మాలు ధ్యానించటంలోనే, ఆ అమృతం గ్రోలటంలోనే పరవశించి, ఆనందం పొందుతున్నది. అటువంటి హరిపదాయత్తమైన నా చిత్తం ఇతర విషయాలపైకి ఏ మాత్రమూ పోవటం లేదు. సుగుణశీలా! వేయి మాట లెందుకు?

వ. అనిన విని రోషించి రాజసేవకుం డైన పురోహితుండు ప్రహ్లాదుం జూచి, తిరస్కరించి యిట్లనియె. 151

* అని ప్రహ్లాదుడు అన్నాడు. ఆ మాటలు విని ఆతని గురువు కోపించి అతనితో ఇలా పలికాడు.

ఉ. పంచశర ద్వయస్కుఁడవు, బాలుఁడ వించుక గాని లేవు భా
షించెదు తర్కవాక్యములు, చెప్పిన శాస్త్రములోని యర్థ మొ
క్కించుక యైనఁ జెప్ప వసురేంద్రుని ముందట మాకు నొదలల్
వంచుకొనంగఁ జేసితివి వైరి విభూషణ! వంశదూషణా! 152

* బాలకా! ఐదేళ్ళ పసివాడివి. చూడటానికి ఇంత కూడా లేవు. "పిట్ట కొంచెం కూత ఘనం"అన్నట్లు అనవసరంగా ఎక్కువగా వాదిస్తున్నావు. మేము చెప్పిన శాస్త్రాలలోని ఒక్క విషయం కూడా చెప్పవేం? మహారాజు ముందు మాకు తలవంపులు తెచ్చావే. శత్రువుని మెచ్చుకొంటూ నీ వంశానికి మచ్చ తెచ్చావే?

చ. తనయుఁడు గాఁడు శాత్రవుఁడు దానవభర్తకు వీఁడు, దైత్య చం
దనవనమందుఁ గంటకయుత క్షితిజాతముభంగిఁ బుట్టి నాఁ,
డనవరతంబు రాక్షసకులాంతకుఁ బ్రస్తుతి సేయుచుండు దం
డనమునఁ గాని శిక్షలకు డాయఁడు పట్టుఁడు కొట్టుఁ డుద్ధతిన్. 153

* వీడు హిరణ్యకశిపు మహారాజుకు పుత్రుడు కాడు, శత్రువు! రాక్షస వంశమనే చక్కని మంచి గంధపు తోటలో వీడు ముళ్ళమొక్కలాగ పుట్టాడు. ఎప్పుడూ మన శత్రువైన విష్ణువును మెచ్చుకొంటూ ఉండే వీణ్ణి శిక్షించాలి. కాని బాబూ! నాయనా! అంటే వినే స్థితిలో లేడు. వీణ్ణి పట్టుకొని కొట్టండి. 'దెబ్బకు గాని దయ్యం వదలి పోదు' - అని హిరణ్యకశిపునితో మళ్ళీ ఇలా అన్నాడు రాక్షస గురువు.

క. ఈ పాపనిఁ జదివింతుము, నీ పాదము లాన, యింక నిపుణతతోడం
గోపింతుము దండింతుము, కోపింపకుమయ్య దనుజకుంజర! వింటే! 154

* దానవచక్రవర్తీ! మీ పాదాలపై ఒట్టు. ఆ బాలుణ్ణి భయపెట్టి, కొట్టి ఎలాగైనా సరే చదివిస్తాం. మా నైపుణ్యం చూపిస్తాం. వినండి! దయచేసి మా మీద కోపించకండి!

వ. అని మఱియు నా రాచపాపనికి వివిధోపాయంబులం బురోహితుండు వెఱపుఁజూపుచు రాజసన్నిధిం బాపి, తోడుకొని పోయి యేకాంతంబున. 155

* అని గురువు పలికి రాజకుమారుడైన ప్రహ్లాదునికి రకరకాలుగా భయం చెప్పి, అక్కడనుంచి తీసుకొని వెళ్ళి, ఒంటరిగా కూర్చుండబెట్టి నీతులు చెప్పసాగాడు.

క. భార్గవనందనుఁ డతనికి, మార్గము చెడకుండఁ బెక్కు మాఱులు నిచ్చల్
వర్గ త్రితయము చెప్ప న, నర్గళమగు మతివిశేష మమర నరేంద్రా! 156

* శుక్రాచార్యులవారి కుమారుడైన ఆ గురువు రాకుమారుడైన ప్రహ్లాదునికి వాళ్ళ సంప్రదాయాను సారంగా అనేక విద్యలు నేర్పాడు. ధర్మశాస్త్రం, అర్థశాస్త్రం, కామశాస్త్రం గొప్పగా బోధించాడు. అనర్గళమైన తెలివి తేటలు అమరునట్లుగా ఆ యా విషయాలను ప్రహ్లాదునిచే పలుమార్లు వల్లింప చేశాడు.

**వ. మఱియు, గురుండు శిష్యునకు సామ దాన భేద దండోపాయంబు లన్నియు నెఱింగించి, నీతి కోవిదుం డయ్యె నని నమ్మి నిశ్చయించి, తల్లికి నెఱింగించి, తల్లి చేత నలంకృతుం డయిన కులదీపకు నవలోకించి. 157**

* ఉపాయాలు నాలుగురకాలు. మంచి మాటలతో చెప్పటం సామం. కొన్ని వస్తువులను ఇచ్చి మంచి చేసుకోవటం దానం. ఒకరికి మరొకరికి కలహాలు పెట్టటం భేదం. శిక్షించి ఒప్పించటం దండం - ఈ సామ, దాన, భేద, దండోపాయాలూ, అవి ఉపయోగించే సమయాలూ ప్రహ్లాదుని గురువు చక్కగా వివరించాడు. అన్ని విద్యలు నేర్పి నీతికోవిదుణ్ణి చేశాడు. "బుద్ధిమంతుడయ్యాడు" అనుకొన్నాడు. ఆ బాలుణ్ణి తల్లియైన లీలావతిదగ్గరకు తీసుకువెళ్ళాడు. ఆమెకూడా చాల సంతోషించింది. కొడుకును చక్కగా అలంకరించి తండ్రి దగ్గరకు వెళ్లమంది. అపుడు శిష్యుణ్ణి చూసి గురువుగారు ఇలా అన్నారు.

**ఉ. త్రిప్పకు మన్న మా మతము దీర్ఘములైన త్రివర్గపాఠముల్**
**దప్పకు మన్న! నేఁడు మన దైత్యవరేణ్యుని ప్రోల నేము మున్**
**చెప్పిన నీతిగాని మఱి చెప్పకుమన్న విరోధి నీతులన్,**
**విప్పకుమన్న దుష్టమగు విష్ణుచరిత్ర కథార్థజాలముల్. 158**

* ప్రహ్లాద కుమారా! మీ తండ్రిగారి దగ్గర మేము చెప్పిందే చెప్పు. మేము చెప్పిన దానికి వ్యతిరేకంగా పలుకబోకు. గొప్పవైన ధర్మ, అర్థ, కామ శాస్త్ర విషయాలలో ప్రశ్నిస్తే జాగ్రత్తగా మరచిపోకుండా సరి అయిన సమాధానం చెప్పు. మేము నేర్పిన నీతిపాఠాలే పలుకు. మన విరోధియైన విష్ణుమూర్తి మాటమాత్రం ఎత్తబోకు. దుష్టమైన విష్ణుకథలను ఆ చరిత్రలను గురించి అసలు మాట్లాడనే వద్దు. ఏం? మరచిపోకు నాయనా.

**వ. అని బుజ్జగించి, దానవేశ్వరుని సన్నిధికిం దోడి తెచ్చిన. 159**

* అని గురువు ప్రహ్లాదుణ్ణి బుజ్జగించి అతణ్ణి మహారాజు ఆస్థానానికి తీసుకొని వచ్చాడు.

**సీ. అడు గడ్గునకు మాధ వానుచింతన సుధా మాధుర్యమున మేను మఱచు వాని,**
**నంభోజగర్భాదు లభ్యసింపఁగ లేని హరిభక్తి పుంభావ మైనవాని,**
**మాతృగర్భము సొచ్చి మన్నది మొదలుగాఁ జిత్త మచ్యుతుమీఁదఁ జేర్చువాని,**
**నంకించి తనలోన నఖిల ప్రపంచంబు శ్రీ విష్ణుమయ మని చెలఁగువాని,**

**తే. వినయ కారుణ్యబుద్ధి వివేక లక్ష, ణాది గుణముల కాటపట్టయిన వాని**
**శిష్యు బుధలోక సంభావ్యుఁ జేరి గురుఁడు, ముందటికి ద్రొబ్బి తండ్రికి మ్రొక్కు మనుచు. 160**

* ప్రహ్లాదుడు అడుగడుగునా మాధవుణ్ణి ధ్యానిస్తూ ఆ ధ్యానామృత మాధుర్యంలో తన్ను తానే మరచిపోతున్నాడు. బ్రహ్మవంటి వారికి కూడ అలవి కాని హరిభక్తి తానుగా రూపం దాల్చినట్లు ఉన్నాడు. ఆ బాలుడు! పుట్టిన దగ్గరనుంచీ ఆ పురోషోత్తముని మీదనే అతని మనసంతా! ఈ సమస్త ప్రపంచం విష్ణుమయం

అని అనుకొంటూ ఆనందిస్తూ ఉంటాడు. వినయం, వివేకం, సద్బుద్ధి, దయాదాక్షిణ్యాలు - ఇలాంటి మంచి లక్షణాలకు అతడు పెట్టింది పేరు. అటువంటి సుగుణ వంతుడైన శిష్యుణ్ణి గురువుగారు మహారాజు దగ్గరకు తీసుకొని వెళ్ళాడు. మెల్లగా శిష్యుణ్ణి ముందుకు త్రోసి "తండ్రికి నమస్కారం చెయ్యి" అన్నారు.

**క. శిక్షించితి మన్యము లగు, పక్షంబులు మాని నీతి పారగుఁడయ్యెన్.**
**రక్షోవంశాధీశ్వర!, వీక్షింపుము నీ కుమారు విద్యాబలమున్. 161**

* గురువు హిరణ్యకశిపుణ్ణి చూచి "దానవేంద్రా! బాలునికి అన్ని విద్యలు నేర్పాము. శత్రువుల వైపు నుంచి మనస్సు మరల్చి ప్రహ్లాద కుమారుణ్ణి నీతికోవిదుణ్ణి చేశాము. నీవు నీ కుమారుని విద్యను పరీక్షించవచ్చు" - అని అన్నాడు.

**వ. అని పలికిన, శుక్రకుమారకు వచనంబు లాకర్ణించి, దానవేంద్రుండు దనకు దండ ప్రణామంబు సేసి నిలుచున్న కొడుకును దీవించి, బాహుదండంబు సాఁచి, దిగ్గనన్ డగ్గఱం దిగిచి, గాఢాలింగనంబు సేసి, తన తొడలమీఁద నిడుకొని, చుంచు దువ్వి, చుబుకంబు పుణికి, చెక్కిలి ముద్దుగొని, శిరంబు మూర్కొని, ప్రేమాతిరేక సంజనిత బాష్పసలిలబిందు సందోహంబుల నతని వదనారవిందంబు దడుపుచు, మందమధురాలాపంబుల నిట్లనియె. 162**

* శుక్రకుమారుని మాటలు విన్నాడు హిరణ్యకశిపుడు. వినయంగా తనకు నమస్కరిస్తున్న తనయుణ్ణి చూచి చాల ఆనందపడ్డాడు. ప్రేమతో దీవించి చేయి చాచి పుత్రుణ్ణి ఆప్యాయంగా దగ్గరకు తీసుకొన్నాడు. వాణ్ణి కౌగిలించుకొని తన ఒళ్లో కూర్చోపెట్టుకొన్నాడు. ప్రేమతో వాడి జుట్టు నిమిరాడు. ఒళ్లంతా స్పృశించాడు. గడ్డం పట్టుకొన్నాడు. బుగ్గలు ముద్దు పెట్టుకొన్నాడు. తల మూర్కొని దగ్గరకు చేర్చుకొన్నాడు. అమితమైన ప్రేమవల్ల కన్నతండ్రి కళ్ళవెంట ఆనందబాష్పాలు స్రవించాయి. అవి ఆ చిన్ని కుమారుని ముఖకమలం మీద పడ్డాయి. అపుడు తండ్రి మెల్లగా, తియ్యగా తనయునితో ఇలా పలికాడు -

**శా. చోద్యం బయ్యెడి, నింతకాల మరిగెన్, శోధించి యే మేమి సం**
**వేద్యాంశంబులు సెప్పిరో? గురువు లే వెంటం బఠింపించిరో?**
**విద్యాసార మెఱుంగఁ గోరెద భవ ద్విజ్ఞాత శాస్త్రంబులోఁ**
**బద్యం బొక్కటి సెప్పి సార్థముగఁ దాత్పర్యంబు భాషింపుమా! 163**

* బాబూ! కొత్తగా ఉందిరా. నిన్ను చూచి చాలా కాలం అయింది. ఇంతకాలం గురువులు నీకు క్రొత్త క్రొత్త సంగతులు ఏం చెప్పారు? నిన్ను ఎలా చదివించారు? నీవు చదువుకొన్న చదువుల సారం తెలుసుకొందామని ఉంది నాయనా. నీకు ఇష్టమైన ఏ గ్రంథంలోదైనా ఒక పద్యం చెప్పి దానికి అర్థం, తాత్పర్యం వివరించు.

**శా. నిన్నున్ మెచ్చరు నీతిపాఠ మహిమన్ నీతోడి దైత్యార్భకుల్**
**గన్నా రన్నియుఁ జెప్ప నేర్తురు గదా! గ్రంథార్థముల్ దక్షు లై**

యన్నా! యెన్నఁడు నీవు నీతివిదుఁడౌ దంచున్ మహా వాంఛతో
నున్నాఁడన్, ననుఁ గన్న తండ్రి! భవదీయోత్కర్షముం జూపవే! 164

* నీ తోడి దైత్య విద్యార్థులు నీతిశాస్త్రంలో నీకంటే బాగా చదువు తున్నారనీ, ఏదైనా సరే చక్కగా అప్పచెపుతున్నారనీ, అందుచేత వాళ్ళు నిన్ను లెక్కచేయటం లేదనీ విన్నాను. మరి నీవు ఎప్పుడు నీతి శాస్త్రం బాగా చదువుకొని పండితుడవౌతావా అని ఎంతో కోరికతో ఎదురుచూస్తున్నాను. నా కన్న తండ్రీ! చదువులో నీ ప్రతిభావిశేషం నాకొక సారి చూపించవూ?

వ. అనినం గన్న తండ్రికిఁ బ్రియనందనుం డయిన ప్రహ్లాదుం డి ట్లనియె. 165

* అవి ఎంతో ఆశతో పలికిన కన్న తండ్రితో చిన్ని కుమారుడు ప్రహ్లాదుడు ఇలా అన్నాడు.

క. చదివించిరి నను గురువులు, చదివితి ధర్మార్థ ముఖ్యశాస్త్రంబులు నేఁ
జదివినవి గలవు పెక్కులు, చదువులలో మర్మమెల్లఁ జదివితిఁ దండ్రీ! 166

* నాన్నగారూ! నన్ను గురువులు చక్కగా చదివించారు. నేను ధర్మశాస్త్రం, అర్థశాస్త్రం ఇంకా చాలా శాస్త్రాలు చదివాను. ముఖ్యమైన గొప్ప శాస్త్రాలు అన్నీ చదివి, అన్ని చదువులలోని సారమునూ, రహస్యమునూ తెలుసుకొన్నాను.

మ. తనుహృద్భాషల సఖ్యమున్, శ్రవణమున్ దాసత్వమున్ వందనా
ర్చనముల్, సేవయు, నాత్మలో నెఱుకయున్ సంకీర్తనల్, చింతనం
బను నీ తొమ్మిది భక్తిమార్గముల సర్వాత్మున్ హరిన్ నమ్మి స
జ్జనుఁడై యుండుట భద్రమంచుఁ దలఁతున్ సత్యంబు దైత్యోత్తమా! 167

* దైత్య చక్రవర్తీ! సఖ్యం, శ్రవణం, దాస్యం, వందనం, అర్చనం, సేవనం, ఆత్మనివేదనం, కీర్తనం, చింతనం అని భక్తి మార్గాలు మొత్తం తొమ్మిది. ఈ భక్తి మార్గాలను మనస్సుచేత, మాటచేత క్రియచేత ఒకే విధంగా నెరవేరుస్తూ - లోకనాయకుడైన ఆ శ్రీహరిని నమ్ముకొని మానవుడు ఉత్తముడుగా ఉండటం మంచిది అని నాకు అనిపిస్తుంది. ఇది తప్ప మరొక సత్యం నాకు కన్పించలేదు.

శా. అంధేందూదయముల్ మహాబధిర శంఖారావముల్ మూక స
ద్గ్రంథాఖ్యాపనముల్ నపుంసక వధూకాంక్షల్ కృతఘ్నావలీ
బంధుత్వంబులు భస్మ హవ్యములు లుబ్ధద్రవ్యముల్ క్రోడ స
ద్గంధంబుల్ హరిభక్తి వర్జితుల రిక్త వ్యర్థ సంసారముల్. 168

* లోకంలో గ్రుడ్డివానికి వెన్నెల విలువ తెలియదు. చెవిటి వానికి శంఖధ్వని వినపడదు. మూగవానికి పుస్తక పఠనం సాధ్యపడదు. నపుంసకునకు కాంతమీద కోరిక ఫలింపదు. కృతఘ్నులకు బంధుత్వం కుదరదు. బూడిదలో వేసిన హోమద్రవ్యాలు ఉపయోగపడవు. పిసినిగొట్టువాని సంపద పనికి వచ్చేది కాదు. వరాహానికి సువాసనలు తెలియనే తెలియవు. ఆ విధంగానే హరిభక్తి లేని వారి జీవితాలు కూడా నిస్సారములూ, వ్యర్థములూ అని భావిస్తాను.

సీ. కమలాక్షు నర్చించు కరములు కరములు శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ
సురరక్షకునిఁ జూచు చూడ్కులు చూడ్కులు శేషశాయికి మ్రొక్కు శిరము శిరము,
విష్ణు నాకర్ణించు వీనులు, వీనులు మధువైరిఁ దవిలిన మనము మనము,
భగవంతు వలగొను పదములు పదములు పురుషోత్తముని మీఁది బుద్ధి బుద్ధి,

తే. దేవదేవునిఁ జింతించు దినము దినము, చక్రహస్తునిఁ బ్రకటించు చదువు చదువు,
కుంభినీధవుఁ జెప్పెడి గురుఁడు గురుఁడు, తండ్రి హరిఁ జేరుమనియెడి తండ్రి తండ్రి, 169

* హరిని పూజించే హస్తమే హస్తం. ఆ చిన్మయుణ్ణి పూజించక పోతే చేతికి సార్థకత లేదు. నారాయణుణ్ణి కీర్తించే నాలుకే నాలుక. లేక పోతే ఆ నాలుకకు చరితార్థత లేదు. శ్రీపతిని చూచే చూపులే చూపులు. మిగిలిన చూపులకు విలువేముంది? శేషశాయి పాదాలకు మ్రొక్కే శిరస్సే శిరస్సు. చక్రధారి కథలు వినే చెవులే చెవులు. మధుసూదనుణ్ణి తలచే మనస్సే మనస్సు. పరంధామునికి ప్రదక్షిణం చేసే పాదాలే పాదాలు. పద్మనాభుని భావించే బుద్ధే బుద్ధి! లేకపోతే అది సద్బుద్ధి కాదు. అంబుజాక్షుని గూర్చి ఆలోచించే దినమే సుదినం. లేకపోతే ఆ దినం దుర్దినం. చక్రధారిని గూర్చి విశదపరచే చదువే చదువు. గోవిందుని గురించి బోధించే గురువే గురువు, విష్ణువును సేవించుమనే తండ్రే తండ్రి! మానవ శరీరంలోని మనస్సు, శిరస్సు, కాళ్ళు, చేతులు, చూపులు, చెవులు, నాలుక, బుద్ధి ఒకటేమిటి? సమస్త అవయవాలూ ఆ హరి ధ్యానంలో పరవశమై పోవలసిందే. లేకపోతే అతడు భగవంతుని విషయంలో కృతఘ్నుడే. ప్రతి దినమందూ ప్రతిచదువులోనూ హరిస్మరణమే కావాలి! ప్రతిగురువూ ప్రతితండ్రీ హరిబోధే చేయాలి!

సీ. కంజాక్షునకుఁ గాని కాయంబు కాయమే పవనగుంఫిత చర్మ భస్త్రి గాక
వైకుంఠుఁ బొగడని వక్త్రంబు వక్త్రమే ఢమఢమ ధ్వనితోడి ఢక్కగాక!
హరిపూజనము లేని హస్తంబు హస్తమే తరుశాఖ నిర్మిత దర్విగాక!
కమలేశుఁ జూడని కన్నులు కన్నులే తనుకుడ్యజాల రంధ్రములుగాక!

ఆ. చక్రి చింతలేని జన్మంబు జన్మమే తరళ సలిలబుద్బుదంబు గాక!
విష్ణుభక్తి లేని విబుధుండు విబుధుఁడే పాదయుగముతోడి పశువు గాక! 170

* శ్రీ పతిని సేవించని శరీరం శరీరం కాదు. అది కేవలం గాలి నిండిన కొలిమి తిత్తి. వైకుంఠుని స్తుతించని నోరు నోరుకాదు. అది ఢమ ఢమ మ్రోగే వట్టి ఢక్కమాత్రమే. హరిని పూజించని చేయి చేయి కాదు. అది కొయ్యతో చేసిన తెడ్డుతో సమానం. కేశవుని చూడని కన్నులు కన్నులు గావు. అవి శరీరం అనే గోడకుండే కన్నాలు. ఆ జగన్నాయకుని గూర్చి ఆలోచన లేని జన్మ జన్మ కాదు. అది క్షణికమైన నీటిబుడగ. విష్ణుభక్తి లేని పండితుడు పండితుడు కాదు. అతడు ద్విపాద పశువు.

సీ. సంసారజీమూత సంఘంబు విచ్చునే, చక్రిదాస్య ప్రభంజనము లేక?
తాపత్రయాభీల దావాగ్ని లాఱునే విష్ణుసేవామృతవృష్టి లేక?
సర్వంకషాఘౌఘ జలరాసు లింకునే హరి మనీషాబడబాగ్ని లేక?
ఘన విపద్గాఢాంధకారంబు లడఁగునే పద్మాక్షు నుతిరవిప్రభలు లేక?

తే. నిరుపమాపునరావృత్తి నిష్కళంక, ముక్తినిధిఁ గానవచ్చునే ముఖ్యమైన
శార్ఙ్గకోదండచింతనాంజనము లేక, తామరసగర్భునకు నైన దానవేంద్ర! 171

* దానవేంద్రా! పెద్దగాలి విసురు లేకుండా కారుమబ్బుల గుంపులు విడిపోవు. అలాగే చక్రధారి సేవ చేయకుండా సంసారబంధాలు తొలగిపోవు. వర్షం పడకపోతే అడవులలో రగులుకొన్న అగ్ని ఆరదు. అలాగే హరిసేవ అనే అమృతం పడకపోతే మనిషికి తాపత్రయాలు చల్లారవు. బడబాగ్ని ప్రజ్వరిల్లితే సముద్రాలు కూడా ఇంకిపోతాయి. అలాగే విష్ణు చింతన ఉంటే పాపాలు పటాపంచలై పోతాయి. సూర్యుని కిరణాలు పడకపోతే చీకటి తెరలు విడిపోవు. అలాగే కేశవుని కీర్తన లేకపోతే చుట్టుముట్టిన ఆపదలు తొలగిపోవు. ఒక్కమాటలో చెప్పాలంటే హరిభక్తి అనే అంజనం లేకుండా నిర్మలమై నిరుపమానమై పునర్జన్మ లేని ముక్తి అనే పెన్నిధిని అందుకోటం ఎవరికీ సాధ్యం కాదు. ఆఖరికి ఆ బ్రహ్మకు కూడా ఇది తప్ప మరొక మార్గం లేదు.

వ. అని యి వ్విధంబున వెఱపు మఱపు నెఱుంగక యులుకు సెడి పలికెడి కొడుకు నుడువులు చెవులకు ములుకుల క్రియ నొదవినఁ గటము లదరఁ బెదవులం గఱచుచు నదరిపడి గురుసుతునిం గనుంగొని విమత కథనంబులు గఱపినాఁడ వని దానవేంద్రుం డిట్లనియె. 172

* అని ఈ విధంగా జంకూ గొంకూ లేకుండా ప్రహ్లాదుడు మాట్లాడుతున్నాడు. ఆ పలుకులు తండ్రి చెవులకు వాడి ములుకుల్లాగా నాటుకొన్నాయి. హిరణ్యకశిపుడు అదరిపోయాడు. పళ్ళతో పెదవులు కరిచాడు. గురువును కొరకొరా చూచాడు. "ఇదా నీవు చెప్పిన చదువు? ఇదా నీవు చేసిన నిర్వాకం? విరోధి కథలు బాగా వినిపించావన్నమాట?" అని ఇంకా ఇలా హుంకరించాడు.

చ. పటుతర నీతిశాస్త్రచయ పారగుఁ జేసెద నంచు బాలు నీ
వటు గొనిపోయి వానికి ననర్థములైన విరోధిశాస్త్రముల్
కుటిలతఁ జెప్పినాఁడవు భృగుప్రవరుండ వటంచు నమ్మితిం,
గటకట! బ్రాహ్మణాకృతివి గాక యథార్థపు బ్రాహ్మణుండవే! 173

* నా కుమారునికి నీతిశాస్త్రం నేర్పుతానని తీసుకొనివెళ్లి వాడికి విరోధియైన విష్ణుకథలు నూరిపోశావా? నీవు ద్రోహబుద్ధితో చేసిన పని ఇది. నీవు పవిత్రమైన భృగువంశంలో పుట్టినవాడవని నమ్మి నా బిడ్డను అప్పగించాను. కాని నీవు బ్రాహ్మణుని ఆకారంలో ఉన్న వాడివే కాని నిజమైన బ్రాహ్మణుడవు మాత్రం కావు. నిజమైన బ్రాహ్మణుడు ఇలా మాకు సరియైన చదువు చెప్పకుండా ద్రోహం చేయడు!

**క. ధర్మేతరవర్తనులును, దుర్మంత్రులునైన జనుల దురితము లొందున్**
**మర్మములు గలఁచి కల్మష, కర్మల రోగములు పొందు కైవడి విప్రా! 174**

* ఓయి విప్రుడా! దుర్మార్గులను రోగాలుపట్టి బాధిస్తాయి. అలాగే ధర్మం తప్పిన వాళ్ళనూ, కుటిలమైన ఆలోచన గల వాళ్ళనూ పాపాలు చుట్టుకొని ఆ పాపాలే వాళ్లను నానా బాధలు పెడతాయి. తెలుసా!

**వ. అనిన రాజునకుఁ బురోహితుం డిట్లనియె. 175**

* అని మండిపడుతున్న మహారాజుతో గురువు అతి వినయంగా ఇలా అన్నాడు.

**ఉ. తప్పులు లేవు మా వలన దానవనాథ! విరోధిశాస్త్రముల్**
**చెప్పము, క్రూరులై పరులు సెప్పరు, మీ చరణంబులాన సు**
**మ్మెప్పుడు మీ కుమారునకు నింతయు నైజమనీష, యెవ్వరుం**
**జెప్పెడి పాటిగాదు, ప్రతిచింతఁ దలంపుము నేర్పు కైవడిన్. 176**

* రాక్షసరాజా! మా వల్ల ఏ తప్పులేదు. నీ ఇష్టానికి వ్యతిరేకంగా ఎప్పుడూ మేము ప్రవర్తించము, మేము విరోధి కథలు అసలు చెప్పము. ఎంత క్రూరాత్ములైనా శత్రువును గురించి ఎవరూ నూరిపోయరు. నీ పాదాలమీద ఒట్టు. మీ వానికిది సహజంగా పుట్టిన బుద్ధే తప్ప ఒకరు చెపితే వచ్చింది కాదు. ఎవరూ అంత సాహసంగా ఈ విషయాలు చెప్పనూ లేరు. కాబట్టి ప్రస్తుతం దీనికి ప్రతిక్రియ జాగ్రత్తగా ఆలోచించు.

**క. మిత్రులము పురోహితులము, పాత్రుల మే మదియుఁగాక భార్గవులము నీ**
**పుత్రుని నిటువలెఁ జేయఁగ, శత్రులమే? దైత్యజలధిచంద్రమ! వింటే? 177**

* మహారాజా! మేము నీకు పూర్వం నుంచీ స్నేహితులం, పురోహితులం, నీ దయకు పాత్రులం. అదీకాక భృగు వంశీయులం. మేము నీకు మేలు కోరేవారమే కాని నీ కుమారునికి ఇలా బోధించటానికి మేమేమన్నా శత్రువులమా? చెప్పు.

**వ. అనిన గురునందనుం గోపింపక దైత్యవల్లభుండు గొడుకు నవలోకించి యిట్లనియె. 178**

* అని గురువు అనేటప్పటికి హిరణ్యకశిపుడు ఆయనపై ఆగ్రహం మాని కొడుకును చూచి ఇలా అడిగాడు.

**క. ఒజ్జలు సెప్పని యీ మతి, మజ్జాతుఁడ వైన నీకు మతి యెవ్వరిచే**
**నుజ్జాత మయ్యె బాలక!, తజ్జనులం బేరుకొనుము తగ నా మ్రోలన్. 179**

* "ఈ విషయాలు నీకు ఉపాధ్యాయులు చెప్పలేదు. నా కుమారుడవైన నీకు ఇలాంటి పాడుబుద్ధులు ఎలా వచ్చాయి? నీకు ఎవరు నేర్పారు? నాకు వాళ్ళెవరో చెప్పు?"

**వ. అనినఁ దండ్రికిఁ బ్రహ్లాదుం డిట్లనియె. 180**

* అని కోపంతో అడిగేసరికి తండ్రికి సమాధానం సవినయంగా ప్రహ్లాదుడు ఇలా చెప్పాడు.

ఉ. అచ్చపుఁ జీఁకటిం బడి గృహవ్రతులై విషయ ప్రవిష్టులై
చచ్చుచుఁ బుట్టుచున్ మరలఁ జర్వితచర్వణు లైన వారికిం
జెచ్చెరఁ బుట్టునే పరులు సెప్పిననైన నిజేచ్ఛనైన నే
మిచ్చిన నైనఁ గానలకు నేఁగిన నైన హరి ప్రబోధముల్? 181

* తండ్రీ! కొందరు గాఢమైన కారుచీకటినుండి ఈ మాయలోపడి కోరికలు చంపుకోకుండా సంసారం సాగిస్తుంటారు. చస్తూ, పుడుతూ, మరలా చస్తూ, పుడుతూ ఇలా వారు ఈ సంసారచక్రంలోపడి తిరుగుతూనే ఉంటారు. అటువంటి మూర్ఖులకు శ్రీహరిపై భక్తి దానంతట అది పుట్టదు. ఒకవేళ ఇతరులు బోధించినా కలుగదు. ఏమైనా ఇచ్చి ఆశ చూపించినా వారికి దేవునిమీద భక్తి ఏర్పడదు. ఆఖరికి అడవులలోకి తీసుకువెళ్లినా ఫలితం లేదు. దేవుని మీదికి అంత తొందరగా మనస్సు పోతుందా?

ఉ. కాననివాని నూఁతగొని కాననివాఁడు విశిష్టవస్తువుల్
గానని భంగిఁ గర్మములు గై కొని కొందఱు కర్మబద్ధులై
కానరు విష్ణుఁ గొంద ఱటఁ గందు రకించన వైష్ణవాంఘ్రి సం
స్థాన రజోఽభిషిక్తులగు సంహృతకర్ములు దానవేశ్వరా! 182

* దానవాధీశ్వరా! గ్రుడ్డివాడు మరొక గ్రుడ్డివాని చేయి పట్టుకొని వాని సాయంతో ఏ వస్తువునూ చూడలేడు గదా! అదే విధంగా విషయాసక్తులై కర్మబంధాలలో చిక్కినవారు శ్రీహరిని చూడలేరు. విష్ణుభక్తుల పాద పరాగాలు తలమీద ధరించిన పుణ్యాత్ములు కొందరు మాత్రం ఆ స్వామిని కనులారా చూడగలుగుతారు. అంతేకాని సంసారంలో కొట్టు మిట్టాడే వాళ్ళు భగవంతుణ్ణి ఎన్నటికీ దర్శింపలేరు.

శా. శోధింపం బడె సర్వశాస్త్రములు రక్షోనాథ! వే యేటికిన్
గాథల్ మాధవసేముషీతరణి సాంగత్యంబునం గాక దు
ర్మేధన్ దాఁటఁగ వచ్చునే సుతవధూమీనోగ్ర వాంఛా మద
క్రోధోల్లోల విశాల సంసృతి మహా ఘోరామితాంభోనిధిన్. 183

* రాక్షసేశ్వరా! అన్ని శాస్త్రాలూ చదివాను. కథలూ గాథలూ అనేకం త్రవ్విచూశాను. ఈ సంసారం భయంకరమైన పారావారం లాంటిది. ఈ సంసార సముద్రంలో భార్యాపుత్రులు తిమింగిలాలు. కామక్రోధ మదమాత్సర్యాదులు పొంగిపొరలే కెరటాలు. ఇటువంటి ఘోరమైన సముద్రమును దాటాలంటే అనవసరమైన వాదాలతో, అతి తెలివి తేటలతో సాధ్యం కాదు. హరిభక్తి అనే నౌక ఒక్కటే దీనిని దాటించగలది. ఇతర ఆలోచనలూ, చదువులూ పాండిత్యాలూ ఎందుకూ పనికిరావు.

వ. అని పలికిన కొడుకును ధిక్కరించి మక్కువ సేయక రక్కసుల ఱేఁడు దన తొడలపై నుండనీక గొబ్బున దిగఁద్రొబ్బి నిబ్బరంబగు కోపంబు దీపింప వేఁడిచూపులు మింట మంట లెగయ మంత్రులం జూచి యిట్లనియె. 184

* అని పలికిన కొడుకుపై రాక్షసేశ్వరునికి ఒక్కసారిగా ప్రేమ పోయింది. కోపంతో ఒళ్ళోనుంచి ఒక్కమాటుగా క్రిందికి నెట్టివేసి నిప్పులు రాలే కన్నులతో వేడి చూపులు చూస్తూ మంత్రులతో ఇలా పలికాడు హిరణ్యకశిపుడు.

**శా. క్రోడంబై పినతండ్రిఁ జంపె నని తాఁ గ్రోధించి చిత్తంబులో**
**వీడం జేయఁడు, బంటుభంగి హరికిన్ విద్వేషికిన్ భక్తుఁడై**
**యోడం డక్కట! ప్రాణవాయువులు వీఁడొప్పించు చున్నాఁడు నా**
**తోడన్ వైరము పట్టె, నిట్టి జనకద్రోహిన్ మహిం గంటిరే? 185**

* మంత్రులారా! విష్ణువు వరాహరూపంలో వచ్చి సాక్షాత్తూ తన పినతండ్రిని చంపాడనే బాధ, సిగ్గుకూడా లేకుండా వీడు మన వంశ విరోధికి బంటులాగా భజన చేస్తాడా? నా పుత్రుడై పుట్టినా శత్రువుకు భక్తుడు అవుతాడా? అయ్యో! వీడు నా ప్రాణాలు తోడుతున్నాడే! నాతోనే విరోధానికి పూనుకున్నాడే! తండ్రికే ద్రోహం తలపెట్టే ఇలాంటి తనయుణ్ణి లోకంలో ఎక్కడైనా మీరు చూశారా?

**వ. అని రాక్షసవీరుల నీక్షించి యిట్లనియె. 186**

* అని హిరణ్యకశిపుడు రాక్షస భటులను చూచి ఇలా ఆదేశించాడు.

### -: హిరణ్యకశిపుండు ప్రహ్లాదుని వివిధోపాయంబుల హింసించుట :-

**శా. పంచాబ్దంబులవాఁడు, తండ్రినగు నా పక్షంబు నిందించి య**
**త్కించిద్భీతియు లేక విష్ణు నహితుం గీర్తించుచున్నాఁడు, వ**
**ల్దంచుం జెప్పిన మానఁ, డంగమునఁ బుత్రాకారతన్ వ్యాధి జ**
**న్మించెన్, వీని వధించి రండు దనుజుల్ మీమీ పటుత్వంబులన్. 187**

* రాక్షస వీరులారా! వీడు అయిదేళ్ళవాడు! నాకే ఎదురు తిరుగుతున్నాడు. తండ్రినైన నన్నే లెక్కచేయకుండా నా శత్రువైన విష్ణువును నా ఎదుటే పొగడు తున్నాడు. 'తప్పురా' అన్నా మానటం లేదు. నా శరీరంలోనుంచి పుత్రరూపంలో వ్యాధి పుట్టుకొని వచ్చింది. మీరు ఈ ప్రహ్లాదుణ్ణి వెంటనే తీసుకొని వెళ్లి వధించి రండి. మీ మీ పరాక్రమాలు ప్రకటించండి.

**శా. అంగవ్రాతములోఁ జికిత్సకుఁడు దుష్టాంగంబు ఖండించి శే**
**షాంగశ్రేణికి రక్ష సేయు క్రియ నీ యజ్ఞుం గులద్రోహి దు**
**స్సంగుం గేశవపక్షపాతి నధముం జంపించి వీరవ్రతో**
**త్తుంగఖ్యాతిఁ జరించెదం, గులము నిర్దోషంబు గావించెదన్. 188**

* శస్త్రవైద్యుడు వ్యాధి కలిగిన అవయవమును ఖండించి మిగిలిన అవయవాలను రక్షించి శరీరానికి ఆరోగ్యం కలిగిస్తాడు. అలాగే చెడుత్రోవ పట్టిన కులద్రోహి, శత్రుపక్షపాతీ, మూర్ఖుడూ అయిన వీణ్ణి చంపించి మా కులానికి మచ్చ లేకుండా చేస్తాను. ఒక మంచిపని చేసిన మహావీరుడనే కీర్తి పొందుతాను.

క. హంతవ్యుఁడు రక్షింపను, మంతవ్యుఁడు గాఁడు యముని మందిరమునకున్
గంతవ్యుఁడు వధమున కుప, రంతవ్యం డనక చంపి రం డీపడుచున్. 189

* వీడు చంపదగినవాడే కాని ఏ మాత్రం క్షమించదగినవాడు కాడు. ఈ విషయంలో జాలి తలపగూడదు. వీడి తప్పులు మన్నించ కూడదు. వీడు తత్క్షణం యముని దగ్గరకు పంపించ దగినవాడు. వీణ్ణి దయతలచి విడిచిపెట్టకుండా మీరు వధించి రండి.

వ. అని దానవేంద్రుం డానతిచ్చిన వాఁడికోఱలు గల రక్కసులు పెక్కంద్రు శూలహస్తులై వక్త్రంబులు దెఱచికొని యుబ్బి బొబ్బలిడుచు ధూమసహిత దావదహనంబునుం బోలెఁ దామ్ర సంకాశంబు లయిన కేశంబులు మెఱయ భేదన వాదనచ్ఛేదనంబులు సేయుచు. 190

* అని హిరణ్యకశిపుడు ఆజ్ఞఇచ్చేసరికి- పదునైన కోరలున్న చాలమంది క్రూర రాక్షసులు శూలాలు చేత్తో పట్టుకొని, నోళ్ళు భయంకరంగా తెరుచుకొని పెద్దగా అరుచుకొంటూ ఆనందంతో గంతులు వేయటం మొదలు పెట్టారు. వాళ్ళు విరబోసుకొన్న ఎర్రనిజుట్టు పొగలు రేగుతున్న కారుచిచ్చు మంటలులాగా వికృతంగా మెరుస్తున్నది. అటువంటి ఆకారాలతో ఆ భటులు వచ్చి ఆ బాలుణ్ణి తిడుతూ, కొడుతూ, మాటలతో, ఆయుధాలతో బాధించడం ప్రారంభించారు.

ఉ. బాలుఁడు రాచబిడ్డఁడు కృపాళుఁడు సాధుఁడు లోకమాన్య సం
శీలుఁడు వీఁ డ వధ్యుఁడని చిక్కక స్రుక్కక క్రూరచిత్తులై
శూలములం దదంగముల సుస్థిరులై ప్రహరించి రుగ్ర వా
చాలత నందఱున్ దివిజశత్రుఁడు వల్దనఁ డయ్యె భూవరా! 191

* "ఈ బాలుడు రాజకుమారుడే, సుకుమారుడే, దయగలవాడే, మంచివాడే, శీలసంపన్నుడే, చంపదగినవాడు కాదే"అని - ఏ మాత్రం జాలి లేకుండా వాళ్ళందరూ ప్రహ్లాదుణ్ణి క్రూరంగా కొట్టారు. శూలాలతో పొడిచారు. వేధించారు. బాధించారు. నానా మాటలూ అన్నారు. ఇంత జరుగుతున్నా తండ్రి 'కొడుకును కొట్టవద్దు' అని ఒక్కమాట కూడా అనలేదు. ధర్మరాజా! అతనికి సుతుని మీద అంత పగ ఏమిటో అర్థం కాదు.

చ. పలువురు దానవుల్ పొడువ బాలుని దేహము లేశమాత్రము
న్నొలియదు, లోపలన్ రుధిర ముబ్బదు, కందదు, శల్య సంఘమున్
నలియదు, దృష్టివైభవము నష్టము గాదు, ముఖేందు కాంతియుం
బొలియదు, నూతనశ్రమము పుట్టదు, పట్టదు దీనభావమున్. 192

* అంతమంది రాక్షసులు ఆ ఒక్క బాలుణ్ణి పట్టుకొని పొడుస్తుంటే అదేమి చిత్రమో కాని ఆ పసివాని దేహం అసలు కందనే లేదు. చర్మం చెదరలేదు. రక్తం చిందలేదు. ఎముకలు విరగలేదు. కళ్ళు తిరుగలేదు. చూపు చెడలేదు. చంద్రబింబంవంటి ముఖం వాడలేదు. వానికి ఏమీ అలసటే అనిపించలేదు. దీన భావం అతనిలో ఎక్కడా ఏ మాత్రం కనిపించనే లేదు.

**ఉ. తన్ను నిశాచరుల్ పొడువ దైత్యకుమారుఁడు మాటి మాటి 'కో**
**పన్నగశాయి! యో దనుజభంజన! యో జగదీశ! యో మహా**
**పన్న శరణ్య! యో నిఖిలపావన!' యంచు నుతించుఁగాని తాఁ**
**గన్నుల నీరు దేఁడు, భయకంపసమేతుఁడు గాఁడు భూవరా! 193**

* ధర్మరాజా! రాక్షసులు ఆ విధంగా చిత్రహింసలు పెడుతుంటే ఆ ప్రహ్లాదుడు మాటి మాటికీ " ఓ పన్నగశయనా! మాధవా! మధుసూదనా! లోకేశ్వరా! రాక్షసాంతకా! దీనశరణ్యా! పరమపావనా!"అని రక రకాలుగా భగవంతుణ్ణి ప్రార్థిస్తాడే తప్ప కళ్ళ నీళ్లు పెట్టుకోడు. ఏ మాత్రం భయపడడు. ఏ మాత్రం జంకడు.

**ఉ. పాఱఁడు లేచి దిక్కులకు, బాహువు లొడ్డఁడు, బంధురాజిలోఁ**
**దూఱఁడు, ఘోరకృత్య మని దూఱఁడు తండ్రిని, మిత్రవర్గముం**
**జీరఁడు, మాతృసంఘము వసించు సువర్ణ గృహంబులోనికిం**
**దాఱఁడు, కావరే యనఁడు, తాపము నొందఁడు కంటగింపఁడున్. 194**

* ఆ రాక్షసులు అన్నిబాధలు పెడుతున్నా ప్రహ్లాదుడు ఎటూ పారిపోడు. కొట్టవద్దని చేతులైనా అడ్డుపెట్టుకోడు. బంధువులలోపల దూరి దాక్కోడు. "ఇది ఘోరం, అన్యాయం"అని తండ్రిని పల్లెత్తు మాట అనడు. స్నేహితులను ఎవర్నీ సహాయానికి పిలువడు. తల్లి నివసించే బంగారు మేడలోకి పరువెత్తడు. నన్ను 'కాపాడండి, కష్టంగా ఉంది'అనడు. బాధ పడడు. ఎవరినీ ద్వేషించడు. ఇటువంటి బాలుడు అసలు ఎక్కడైనా ఉంటాడా?

**వ. ఇట్లు సర్వాత్మకంబై యిట్టి దట్టి దని నిర్దేశింపరాని పరబ్రహ్మంబు దానయై య మ్మహావిష్ణునియందుఁ జిత్తంబుఁ జేర్చి తన్మయుండయి పరమానందంబునం బొంది యున్న ప్రహ్లాదునియందు రాక్షసేంద్రుండు దన కింకరుల చేతం జేయించుచున్న మారణకర్మంబులు పాపకర్ముని యందుఁ బ్రయుక్తంబులైన సత్కారంబులుం బోలె విఫలంబు లగుటం జూచి. 195**

* ఇలా ప్రహ్లాదుడు ఎవరూ వర్ణింపలేని ఆ పరబ్రహ్మ స్వరూపం తానే అయ్యాడు, మనస్సు మాధవునిపై నిల్పి తనను తానే మరచిపోయాడు. దివ్యమైన ఆనందంతో పరవశించి పోయాడు. పాపాత్ముని పట్ల జరిపే సన్మానాలు ఎలా అయితే విఫలం అవుతాయో అదే విధంగా ప్రహ్లాదుణ్ణి హిరణ్యకశిపుడు పెట్టే భయంకర బాధలన్నీ విఫలమై పోయాయి. ఇది చూచి హిరణ్యకశిపుడు ఇలా అనుకున్నాడు.

**ఉ. శూలములన్ నిశాచరులు స్రుక్కక దేహము నిగ్రహింపఁగా**
**బాలుఁడు నేలపైఁ బడఁడు, పాఱఁడు, చావఁడు, తండ్రినైన నా**
**పాలికి వచ్చి చక్రధరపక్షము మానితి నంచుఁ బాదముల్**
**ఫాలము సోఁక మ్రొక్కఁ, డనపాయత నొందుట కేమి హేతువో? 196**

* ఇంతపగతో పట్టుదలతో రాక్షసులు బరిసెలుపెట్టి పొడుస్తుంటే బాలుడు క్రింద పడిపోవటం లేదు. బాధలు భరించలేక పారిపోవటం లేదు. సొమ్మసిల్లి ప్రాణాలు విడవటం లేదు. తండ్రినైన నా దగ్గరకు వచ్చినేను ఇక హరిని ఆరాధించను. నన్ను క్షమించు'అని కాళ్ళ మీద సాగిలపడి నమస్కరించటం లేదు. ఈ పసివాడు ఏ మాత్రం బాధపొందకుండా ఆనందంగా ఉండటానికి కారణం ఏమిటో అర్థం కావటం లేదు.

వ. అని శంకించుచు. 197

సీ. ఒకమాటు దిక్కుంభియూథంబుఁ దెప్పించి కెరలి డింభకునిఁ ద్రొక్కింపఁ బంపు,
నొకమాటు విషభీకరోరగ శ్రేణులఁ గడువడి నర్భకుఁ గఱవఁ బంపు,
నొకమాటు హేతిసంఘోగ్రానలములోన విసరి కుమారుని వ్రేయఁ బంపు,
నొకమాటు కూలంకషోల్లోల జలధిలో మొత్తించి శాబకు ముంపఁ బంపు,

ఆ. విషముఁ బెట్టఁ బంపు విదళింపఁగాఁ బంపుఁ, దొడ్డకొండ చఱులఁ ద్రోయఁ బంపుఁ
బట్టికట్టఁ బంపు బాధింపఁగాఁ బంపు, బాలుఁ గినిసి దనుజపాలుఁ డధిప! 198

* అని హిరణ్యకశిపుడు అనుమానించాడు. కొడుకును చంపటానికి ఇంకా కఠినమైన పద్ధతులు ఆలోచించాడు. ధర్మరాజా! ప్రహ్లాదుని మీద కోపం పట్టలేక హిరణ్యకశిపుడు మదించిన ఏనుగులను తెప్పించి బాలుణ్ణి క్రిందపడవేసి త్రొక్కించ మని పంపాడు. మరొకసారి పెద్ద పెద్ద విషసర్పాలను తెప్పించి వాటిచేత వాణ్ణి కరిపించ మన్నాడు. ఇంకొక తడవ భగభగలాడే అగ్ని గుండాలు మండించి ఆ పసివాణ్ణి దానిలోకి విసిరివేయించమన్నాడు. వేరొక మాటు ప్రహ్లాదుణ్ణి బాగా చితకబాది నడిసముద్రంలో ముంచి చంపమన్నాడు. వానికి విషం పెట్టించ మన్నాడు. కత్తితో వాణ్ణి నరక మన్నాడు. కొండశిఖరాలపై నుంచి క్రిందకు నెట్టివేయ మన్నాడు. ఒకచోట కదలకుండా కట్టిపడవేయ మన్నాడు. ఇలా రకరకాలుగా బాధించసాగాడు.

సీ. ఒకవేళ నభిచారహోమంబు సేయించు నొకవేళ నెండల నుండఁ బంచుఁ,
నొకవేళ వానల నుపహతి నొందించు నొకవేళ రంధ్రంబు లుక్కఁ బట్టు,
నొకవేళఁ దనమాయ నొదవించి బెగడించు నొకవేళ మంచున నొంటి నిలుపు
నొకవేళఁ బెనుగాలి కున్ముఖుఁ గావించు నొకవేళఁ బాఁతించు నుర్వియందు,

తే. నీర మన్నంబు నిడనీక నిగ్రహించు, గశల నడిపించు ఱువ్వించు గండ శిలల
గదల వ్రేయించు, వేయించు ఘనశరములఁ, గొడుకు నొకవేళ నమరారి క్రోధి యగుచు, 199

* అంతులేని కోపంతో ఆ రాక్షసరాజు తన కొడుకును సంహరించటం కోసం మారణహోమం చేయించాడు. మరొకసారి వాణ్ణి మండుటెండలో నిలువునా నిలబెట్టాడు. మరొకసారి జడివానలో తడిముద్దగా ఉండిపొమ్మన్నాడు. మరొకసారి బాలుని నవరంధ్రాలు మూయించి ఉక్కిరి బిక్కిరి చేయించాడు. మరొకసారి వానికి తన మాయ చూపించి భయం కలిగించాడు. మరొకసారి మంచులో ఒంటరిగా నిలబెట్టాడు. ఇంకొకసారి సుడిగాలికి ఎదురుగా ఉంచాడు. చివరకు ప్రహ్లాదుణ్ణి భూమిలో పాతిపెట్టించాడు. వానికి అన్నం నీళ్ళూ ఇవ్వకుండా మాడిపించాడు. వాణ్ణి కొరడాలతో కొట్టించాడు. వాని మీదకు రాళ్లు రువ్వించాడు. వాణ్ణి గదలతో బాదించాడు. వాడిబాణాలు వాడిమీదకు వేయించాడు. కోపంతో ఒళ్ళు తెలియని క్రూర దానవుడు కొడుకుపై చేయరాని ఘోరాలన్నీ చేయించాడు.

వ. మఱియు ననేక మారణోపాయంబులఁ బాపరహితుండైన పాపని రూపుమాపలేక యేకాంతంబున దురంత చింతా పరిశ్రాంతుండయి రాక్షసేంద్రుండు దన మనంబున. 200

* ఇంకా అనేక మారణోపాయాలతో ఏ పాపం ఎరుగని ఆ పసివాణ్ణి చంపాలని చూశాడు. ఎలాగైనా రూపుమాపాలని అనుకొన్నాడు. కాని సాధ్యం కాలేదు. అందుకని ఆ రాక్షసరాజు చాల దిగులు పడ్డాడు. చివరకు ఏకాంతంగా ఇలా ఆలోచించ సాగాడు.

**ఉ. ముంచితి వార్ధులన్, గదల మొత్తితి, శైలతటంబులందు ద్రో**
**బ్బించితి, శస్త్రరాజిఁ బొడిపించితి మీఁద నిభేంద్రపంక్తి ఁ ద్రొ**
**ప్పించితి, ధిక్కరించితి, శపించితి, ఘోరదవాగ్నులందుఁ ద్రో**
**యించితిఁ, బెక్కుపాట్ల నలయించితిఁ, జావఁ డి దేమి చిత్రమో! 201**

* ఈ బాలుణ్ణి సముద్రాలలో నెట్టించాను. గదలతో కొట్టించాను. కొండలమీది నుంచి త్రోయించాను. ఆయుధాలతో పొడిపించాను. ఏనుగులతో త్రొక్కించాను. నిప్పుల్లో నెట్టించాను. కొట్టాను, తిట్టాను. అవమానించాను. పలువిధాలుగా బాధించాను. కానీ వీడు చనిపోడేమిటి? చిత్రంగా ఉందే!

**చ. ఎఱుఁగఁడు జీవనౌషధము, లెవ్వరు భర్తలు లేరు, బాధలం**
**దరలఁడు, నైజతేజమునఁ దథ్యము జాడ్యము లేదు, మిక్కిలిన్**
**మెఱయుచు నున్నవాఁ డొక నిమేషము దైన్యము నొందఁ డింక నే**
**తెఱఁగునఁ ద్రుంతు? వేసరితి, దివ్యము వీని ప్రభావమెట్టిదో! 202**

* వీడు చావకుండా జీవించటానికి మందేమైనా తీసుకుంటున్నాడా అంటే అదేదీ లేదు. పోనీ ఎవరైనా ఆదుకుంటున్నారా అంటే వీనికి ఆధారం కూడా ఎవరూ లేరు. ఈ బాధలకు తట్టుకోలేక వీడు ఇక్కడినుంచి ఎక్కడికైనా పారిపోతాడా? అదీ లేదు. వీనికి ముఖంలో సహజమైన కాంతికూడా ఏ మాత్రం తగ్గలేదు. పైగా బాధలు పెట్టినకొద్దీ ముఖం ఇంకా ముచ్చటగా కనిపిస్తూన్నది, వీడు అసలు దిగులు పడటమే లేదు. ఇంకా వీణ్ణి ఎలా సంహరించటం? విసుగు కలుగుతుందే కానీ మరొక ఉపాయం తోచటం లేదు. వీని శక్తి చూస్తే ఇదేదో దేవతా ప్రభావం అనిపిస్తోంది.

**వ. అదియునుం గాక తొల్లి శునశ్శేఫుండను మునికుమారుండు దండ్రిచేత యాగపశుత్వంబునకు దత్తుండయి తండ్రి తనకు నపకారి యని తలంపక బ్రతికిన చందంబున. 203**

* పూర్వం ఒకముని ఉండేవాడు. అతనికి శునశ్శేపుడు అనే కుమారుడు ఉండేవాడు. తండ్రి తన కుమారుణ్ణి యాగపశువుగా పంపాడట, ధనం తీసుకొని. అయినా కూడా ఆ బాలుడు తండ్రిని అపకారిగా భావించకుండా ఉపకారిగానే భావించి బ్రతికే ఉన్నాడట. నా కొడుకు కూడా శునశ్శేపుడులాగా ఉన్నాడే!

**క. ఆగ్రహమున నేఁ జేసిన, నిగ్రహములు పరులతోడ నెఱి నొకనాఁడున్**
**విగ్రహము లనుచుఁ బలుకఁ డ, నుగ్రహములుగా స్మరించు, నొవ్వఁడు మదిలోన్. 204**

* ఎంతో కోపం వచ్చి నేను వీణ్ణి ఎన్ని బాధలు పెట్టినా వాటిని గురించి వీడు ఇతరులతో ఎక్కడా చెప్పడు? మా నాన్న ఇలా బాధిస్తున్నాడు. ఇది అన్యాయం' - అని ఎవరితోనూ అనడు. పైగా నేనెంతో ప్రేమతో చూస్తున్నట్లు భావిస్తాడు. మనసులో కూడా అసహ్యించుకోడు. అసలు ఏమిటి వీని తత్త్వం?

వ. కావున వీఁడు మహాప్రభావ సంపన్నుండు, వీని కెందును భయంబు లేదు, వీనితోడి విరోధంబునం దనకు మృత్యువు సిద్ధించు నని నిర్ణయించి చిన్నవోయి ఖిన్నుండై ప్రసన్నుండు గాక క్రిందు సూచుచు విషణ్ణుండై చింతనంబు సేయుచున్న రాజునకు మంతనంబునఁ జండామర్కు లిట్లనిరి. 205

* ఈ ప్రహ్లాదుడు సామాన్యుడు కాడు. గొప్పశక్తి గలవాడు. వీనికి ఏ విషయంలోనూ భయం లేదు. ఈ బాలునితో విరోధం పెట్టుకొంటే నాకు తొందరలోనే మరణం కలుగుతుంది - అని మనస్సులో నిశ్చయించుకున్నాడు. హిరణ్యకశిపుడు కొడుకును చాలా బాధపెట్టినందుకు చిన్న బుచ్చుకుని నేలచూపులు చూస్తూ బాధపడుతున్నాడు. అలా ఏకాంతంగా కూర్చుని దిగులుపడుతున్న రాక్షసరాజును చూచి గురువు లైన చండామర్కులు ఏకాంతంగా ఇలా ధైర్యం చెప్పారు -

శా. శుభ్రఖ్యాతివి; నీ ప్రతాపము మహాచోద్యంబు దైత్యేంద్ర! రో
షభ్రూయుగ్మ విజృంభణమ్మున దిగీశవ్రాతముం బోరులన్
విభ్రాంతంబుగఁ జేసి యేలితి గదా విశ్వంబు! వీఁడెంత? యీ
దభ్రోక్తుల్ గుణదోష హేతువులు, చింతం బొంద నీకేటికిన్. 206

* రాక్షసరాజా! నీవు మహాకీర్తిశాలివి. నీ ప్రతాపం అత్యద్భుతమైనది. నీవు కోపించి కనుబొమలు చిట్లించావంటే యుద్ధాలలో దిక్పాలకులు సైతం భయపడి పారిపోతారు. లోకం మొత్తాన్నీ ఏకచ్ఛత్రంగా ఏలినటువంటి నీకు వీడెంత? ఈ పసివాని తెలిసీతెలియని మాటలు విని నీవు దిగులు పడటం ఏమిటి? ఈ విషయాన్ని పెద్ద సమస్యగా భావించి బాధపడతా వేమిటి?

శా. వక్రుండైన జనుండు వృద్ధగురు సేవంజేసి మేధానయో
పక్రాంతిన్ విలసిల్లు, మీఁదట వయఃపాకంబుతో బాలకున్
శక్రద్వేషణబద్ధుఁ జేయుచు మదిం జాలింపుమీ రోషమున్,
శుక్రాచార్యులు వచ్చునంత కితఁడున్ సుశ్రీయుతుం డయ్యెడున్. 207

* వక్రమార్గంలో అల్లరి చిల్లరగా ప్రవర్తించే ఈ ప్రహ్లాదుణ్ణి పెద్దలైన గురువుల దగ్గర కొన్నాళ్ళు చదివిస్తే బుద్ధిమంతుడు అవుతాడు. ఆ తరువాత మెల్లగా వయసు కూడా వస్తుంది. అప్పుడు ఏ సంగతి ఏమిటో తెలుస్తుంది. అప్పుడు నిదానంగా వయసుతోపాటే ఇంద్రుని మీద ద్వేషం కూడా నేర్పుతుంటే సరిపోతుంది. గురుదేవులైన శుక్రాచార్యులవారు వచ్చేటప్పటికి ఈ బాలుడు పూర్తిగా గుణవంతుడు అవుతాడు.

వ. అని గురుపుత్రులు పలికిన రాక్షసేశ్వరుండు గృహస్థులైన రాజులకు నుపదేశింపఁ దగిని ధర్మార్థకామంబులు ప్రహ్లాదునకు నుపదేశింపుఁడని యనుజ్ఞ చేసిన వారు నతనికిఁ ద్రివర్గంబు నుపదేశించిన, నతండు

రాగద్వేషంబులచేత విషయాసక్తులైన వారలకు గ్రాహ్యంబులైన ధర్మార్థకామంబులు దనకు నగ్రాహ్యంబు లనియును, వ్యవహార ప్రసిద్ధికొఱకైన భేదంబుగాని యాత్మభేదంబు లేదనియును, ననర్థంబులయం దర్థకల్పన సేయుట దిగ్భ్రమం బనియును నిశ్చయించి గురూపదిష్ట శాస్త్రంబులు మంచివని తలంపక గురువులు దమ గృహస్థ కర్మానుష్ఠానంబులకుం బోయిన సమయంబున. 208

* అని గురుపుత్రులు పలుకగానే హిరణ్యకశిపుడు కొంచెం మనశ్శాంతిని పొందాడు. "వివాహం అయినటువంటి రాజులకు నేర్పదగిన ధర్మార్థ కామములను ప్రహ్లాదునకు ఉపదేశించండి"అని ఆదేశించాడు. ఆ గురువులు ఆ విధంగానే వానికి ధర్మార్థ కామాలకు సంబంధించిన శాస్త్రాలు బోధించారు.

నానావిధాలైన కోరికలలో ఆసక్తి ఉన్నవారికి ఈ ధర్మశాస్త్రం, అర్థశాస్త్రం, కామశాస్త్రం అవసరమనీ, ఈ లోకంలో వ్యవహారాలకోసం ఈ తేడాలే కానీ, ఆత్మకు మాత్రం ఏ మార్పులేదనీ, ప్రయోజనం లేని వాటిని గురించి ప్రయోజనం ఉంది అనుకోవటం భ్రాంతి అనీ - ప్రహ్లాదుడు మనసులో బాగా నిశ్చయం చేసుకున్నాడు. గురువులు చెప్పే శాస్త్రాలు పనికి వచ్చేవి కావనీ, మంచివి కావనీ భావించాడు. గురువులు గృహకృత్యాలూ, జపాలూ, తపాలూ చేసుకోవటానికి ఇళ్ళకు వెళ్ళిన సమయం గమనించాడు.

క. ఆటలకుఁ దన్ను రమ్మని, పాటించి నిశాటసుతులు భాషించిన దో
షాటకులేంద్రకుమారుఁడు, పాటవమున వారిఁ జేరి ప్రజ్ఞాన్వితుఁడై. 209

* ఆ సమయంలో తోడి రాక్షస బాలకులు ఆడుకుంటూ తమతో పాటూ ఆడుకోవటానికి ప్రహ్లాదుణ్ణి కూడా పిలిచారు. అపుడు దానవ చక్రవర్తి కొడుకైన ప్రహ్లాదుడు వారందరితో నేర్పుగా ఇలా చెప్పాడు -

క. చెప్పఁడొక చదువు మంచిది, చెప్పెడిఁ దగులములు చెవులు చిందఱ గొనఁగా
నెప్పుడు మనయెడ నొజ్జలు, చెప్పెద నొక చదువు వినుఁడు చిత్తము లలరన్. 210

* మిత్రులారా! గురువులు మనకు మంచి చదువు ఒక్కటీ చెప్పటం లేదు. చెవులు చిల్లులు పడేలాగా సంసార భోగ విషయాలు ఎప్పుడూ చెపుతున్నారు. మీ మనస్సుకు నచ్చే ఒక మంచి చదువు నేను చెప్తాను వింటారా?

వ. అని రాజకుమారుండు గావునఁ గరుణించి సంగడికాండ్రతోడ నగియెడి చందంబునఁ గ్రీడలాడుచు సమానవయస్కులైన దైత్యకుమారుల కెల్ల నేకాంతంబున నిట్లనియె. 211

* అని ప్రహ్లాదుడు తాను రాజకుమారుడు కాబట్టి చనువుగా ధైర్యంగా ఆ స్నేహితు లందరితో నవ్వుతూ ఆడుతూ పాడుతూ వారితో కలిసిపోయి వారందర్నీ ఒకచోట చేర్చి రహస్యంగా ఇలా బోధించాడు.

ఉ. బాలకులార! రండు మన ప్రాయపుబాలురు గొంద ఱుర్విపైఁ
గూలుటఁ గంటిరే! గురుఁడు క్రూరుఁ డనర్థ చయంబునందు దు
శ్శీలత నర్థకల్పనముఁ జేసెడి, గ్రాహ్యము గాదు శాస్త్ర, మే
మే లెఱిఁగించెదన్! వినిన మీకు నిరంతర భద్ర మయ్యెడిన్. 212

* ఓ బాలకులారా! వినండి. మన గురువు మంచివాడు కాదు. పనికిరాని విషయాలు చెప్తూ వాటిల్లో అనర్థవిషయాలకు అర్థాలను కల్పించి గొప్పగా మనకు బోధిస్తుంటాడు. అవి మనం నేర్చుకోకూడదు. ఆ శాస్త్రాలు మంచివి కావు. ఇది వినండి. లోకంలో చిన్నతనంలోనే కొందరు మన యీడు పిల్లలు మనముందే చనిపోవటం చూస్తూనే ఉన్నాం కదా! కాబట్టి మానవుడు జీవితకాలమును ఏమాత్రం వృథా చేయకూడదు. మీ మేలు కోరి చెప్తున్నాను. ఇది వింటే మీకు సర్వదా క్షేమం కలుగుతుంది.

వ. వినుండు, సకల జన్మంబులందును ధర్మార్థాచరణ కారణంబయిన మానుషజన్మంబు దుర్లభం, బందుఁ బురుషత్వంబు దుర్గమం, బదియు శతవర్ష పరిమితంబైన జీవిత కాలంబున నియతంబై యుండు, నందు సగ మంధకార బంధురంబయి రాత్రి రూపంబున నిద్రాదివ్యవహారంబుల నిరర్థకం బయి చనుఁ, జిక్కిన పంచాశద్వత్సరంబులందును బాల్యకైశోర వయోవిశేషంబుల వింశతి హాయనం బులు గడచుఁ, గడమ ముప్పది యబ్దంబుల చేతఁ బట్టువడి దురవగాహంబులయిన కామ క్రోధ లోభ మోహ మద మత్సరంబులను పాశంబులం గట్టువడి విడివడ సమర్థుండు గాక ప్రాణంబులకంటె మధురాయమాణమైన తృష్ణకు లో నై భృత్యతస్కరవణిక్కర్మంబులఁ బ్రాణహానియైన నంగీకరించి పరార్థంబుల నర్థించుచు రహస్యసంభోగచాతుర్య సౌందర్య విశేషంబుల ధైర్యవల్లికా లవిత్రంబు లయిన కళత్రంబులను, మహనీయ మంజుల మధురాలాపంబులు గలిగి వశులయిన శిశువులను, శీలవయో రూపధన్యలగు కన్యకలను, వినయ వివేకవిద్యాలంకారులయిన కుమారులను, గామిత ఫలప్రదాత లగు భ్రాతలను, మమత్వ ప్రేమదైన్య జనకు లయిన జననీ జనకులను, సకల సౌజన్య సింధువు లయిన బంధువులను, ధనకనక వస్తువాహన సుందరంబు లయిన మందిరం బులను, సుకరంబులైన పశుభృత్య నికరంబులను, వంశపరంపరాయత్తంబు లయిన విత్తంబులను వర్జింపలేక సంసారంబు నిర్జించు నుపాయంబుఁ గానక తంతువర్గంబున నిర్గమద్వార శూన్యంబయిన మందిరం బుఁ జేరి చిక్కువడి వెడలెడి పాటవంబు చాలక తగులువడు కీటకంబు చందంబున గృహస్థుండు స్వయంకృత కర్మ బద్ధుండై శిశ్నోదరాది సుఖంబులఁ బ్రమత్తుండయి నిజకుటుంబ పోషణ పారవశ్యంబున విరక్తి మార్గంబుఁ దెలియ నేరక స్వకీయ పరకీయ భిన్న భావంబున నంధకారంబునం బ్రవేశించుఁ, గావునఁ గౌమార సమయంబున మనీషా గరిష్ఠుం డై పరమ భాగవత ధర్మంబు లనుష్ఠింప వలయు, దుఃఖంబులు వాంఛితంబు గాక చేకుఱుభంగి సుఖంబులును గాలాను సారంబులై లబ్ధంబు లగుం; గావున వృథాప్రయాసంబున నాయుర్వ్యయంబు సేయంజనదు, హరి భజనంబున మోక్షంబు సిద్ధించు, విష్ణుండు సర్వభూతంబులకు నాత్మేశ్వరుండు ప్రియుండు. ముముక్షువైన దేహికి దేహావసాన పర్యంతంబు నారాయణ చరణారవింద సేవనంబు కర్తవ్యంబు. 213

* వినండి. ధర్మాలు ఆచరించగలిగిన మానవజన్మ పొందటం చాలా కష్టం. అందులోనూ పురుషుడుగా పుట్టటం గొప్ప అదృష్టం. మనుష్యుని ఆయుర్దాయం నూరు సంవత్సరాలు మాత్రమే ఉంటుంది. అందులో సగంకాలం కారుచీకట్లతో కూడిన రాత్రి వల్ల నిద్రలాంటి వాటితో వృథాగా వ్యయ మయిపోతుంది. ఇక మిగిలింది యాభై సంవత్సరాలు. దాంట్లో పసివాడుగా, బాలుడుగా ఇరవై సంవత్సరాలు గడిచిపోతాయి.

ఇంక మిగిలిన ముప్ఫై సంవత్సరాలు మానవుడు ఇంద్రియ సుఖాలకు వశమై పోతాడు. కామం, క్రోధం, లోభం, మోహం, మదం, మాత్సర్యం అనే బంధాలలో చిక్కుకొనియు, బయటకు రాలేక తన్నుకుంటూ ఉంటాడు.

ఈ జీవుడు తన ప్రాణాలకంటే తియ్యగా అనిపించే ఆశకు దాసుడవుతాడు. ఈ కోరికల కారణంగా ఇతరుల ధనమును అపహరించాలని చూస్తాడు. సేవకులు, దొంగలు, వ్యాపారులు వంటి వాళ్ళచేత ప్రాణం పోగొట్టుకోవటానికైనా సరే సిద్ధపడతాడు. రహస్యంగా స్త్రీ సౌఖ్యం కోరుకొంటాడు. చాతుర్యంగా అవి పొందాలని అనుకొంటాడు. కాళ్ళకు బంధాలు వేసే భార్యలు ఏర్పడతారు. తియ్యతియ్యని, జిలిబిలి పలుకులతో ఆనందింప జేసే శిశువులు పుడతారు. వయస్సుచేత, రూపంచేత బుద్ధిమతులైన కూతుళ్ళూ, వినయ వివేకాలతో విద్యావంతులైన కొడుకులూ, కోరిన విధంగా సహకారం ఇచ్చే సోదరులూ, ప్రేమతో అనురాగంతో జాలిగొలిపే తల్లిదండ్రులూ, మంచిగా సంచరించే బంధువులూ ఏర్పడతారు. ఈ విధంగా రకరకాల బంధాలలో కట్టుబడి పట్టుబడతాడు.

డబ్బు, బంగారం, ఆభరణాలు, వాహనాలు, భవనాలు, పాడిపంటలు, సేవకులు, పశువులు - ఇలాంటి సంపదలనూ, తరతరాలుగా వచ్చే ధనధాన్యాలనూ వదలిపెట్టలేక మానవుడు పూర్తిగా సంసారంలో పడి పోతాడు. ఒక చిన్న పురుగు సాలీడు గూటిలో చిక్కి బయటికి రాలేక తన్నుకొనే విధంగా మానవుడు ఈ సంకెళ్ళలో నుంచి విడిపోలేడు. తాను చేసిన కర్మల ఫలితాన్ని తాను అనుభవిస్తూ ఉంటాడు. కామ సుఖంలోపడి, తన కుటుంబాన్ని పోషించటంలో నిమగ్నమై ముక్తి పొందే మార్గం మరచిపోతాడు. తాను వేరు - మిగిలినవారు వేరు అనే భేద భావంతో చీకట్లోనే ఉండిపోతాడు. కాబట్టి మానవుడుగా పుట్టినపుడు చిన్నప్పుడే బుద్ధిబలంతో భక్తి, ధర్మాలను ఆచరించాలి. కష్టాలు కోరకుండానే వచ్చినట్లు సుఖాలు కూడా కోరకుండానే ఆ సమయానికి అవి వస్తాయి. వాటికోసం అందుకని ఎంతో విలువైన జీవితకాలమును వృథా చేసుకోకూడదు. ఆ శ్రీహరిని నమ్ముకుంటే ముక్తి కలుగుతుంది. ప్రాణులన్నింటికి ఆ విష్ణువే ఆత్మీయుడు అధిపతి. ముక్తి కోరుకునేవాడు చివరి వరకూ చేయదగిన పని ఆపరమపురుషుని పాదపద్మాలు భావించి సేవించటం ఒక్కటే.

**సీ. కంటిరే మనవారు ఘనులు గృహస్థులై విఫలులై కైకొన్న వెఱ్ఱి తనము?**
**భద్రార్థులై యుండి పాయరు, సంసార పద్ధతి నూరక పట్టువడిరి,**
**కల యోనులం దెల్ల గర్భాద్యవస్థలఁ బురుషుండు దేహియై పుట్టుచుండుఁ**
**దన్నెఱుంగఁడు, కర్మతంత్రుఁడై కడపట ముట్టఁడు భవశతములకు నయిన**

**ఆ. దీన శుభము లేదు, దివ్యకీర్తియు లేదు, జగతిఁ బుట్టి పుట్టి చచ్చి చచ్చి**
**పొరల నేల మనకుఁ? బుట్టని చావని త్రోవ వెదకికొనుట దొడ్డబుద్ధి. 214**

* మీరూ చూస్తున్నారు కదా మనవాళ్ళు గృహస్థ జీవితం గడుపుతూ పడుతున్న పాట్లు! ఆనందం కోరుకుంటారే కాని వెర్రితనం మాత్రం విడిచిపెట్టరు. సంసారం అనే ఊబిలో ఊరకే కూరుకుపోతుంటారు.

రకరకాల స్త్రీల గర్భాలలో నుంచి నానా అవస్థలు పడి పుడుతూ ఉంటాడు మానవుడు. తనను గూర్చి తాను తెలుసుకోడు. వందలకొద్దీ జన్మలెత్తినా కర్మబంధాల చిక్కులలో నుంచి బయటపడలేడు. విష్ణు సన్నిధిని అందుకోలేడు. కాబట్టి ఈ సంసారం వల్ల ఏ సుఖమూ లేదు. ఏ కీర్తిరాదు. లోకంలో పుట్టటం, చావటం, మళ్ళీ పుట్టటం, చావటం - ఈ బాధలు మనకెందుకు? అసలు పుట్టుక అనేదీ, చావు అనేదీ లేనటువంటి మంచిదారి వెతుక్కోవటం మనకు ఎంతో మంచిది కదా!

**శా. హాలాపాన విజృంభమాణ మదగర్వాతీత దేహోల్లస**
**ద్బాలాలోకన శృంఖలానిచయ సంబద్ధాత్ముఁడై లేశమున్**
**వేలానిస్సరణంబు గానక మహావిద్వాంసుఁడుం గామినీ**
**హేలాకృష్ణకురంగశాబక మగున్ హీనస్థితిన్ వింటిరే! 215**

* ఎంతో తెలివి కల మహావిద్వాంసుడు కూడా మధువు త్రాగి మత్తులో కన్నులు తెరవలేకుండా ఉంటాడు. తన శరీరం తాను మరచి పోతాడు. కాంతల చిత్రమైన చూపుల సంకెళ్ళలో చిక్కుకొని పోతాడు. అతివిలువైన జీవిత సమయం వృథా అయిపోతోందని ఏ మాత్రం గమనించలేడు. ఆడవారి ఆకర్షణకు లోనై వాళ్ళచేతిలో లేడిపిల్లలాగా ఆడుతూ ఈ మానవుడు తన ఉత్తమస్థితిలో నుంచి హీనస్థితికి దిగజారిపోతాడు. ఈ వింత విషయాలు మీరు విన్నారా?

**ఆ. విషయసక్తులైన విబుధాహితుల తోడి, మనికి వలదు, ముక్తి మార్గవాంఛ;**
**నాది దేవు విష్ణు నాశ్రయింపుఁడు ముక్త, సంగజనులఁ గూడి శైశవమున. 216**

* కాబట్టి కోరికలతో కూరుకుపోయి విషయాసక్తులైన ఈ రాక్షస గురువులు మన క్షేమం కోరేవారు కారు. వాళ్ళతో స్నేహం మనకు పనికి రాదు. మీరు ఈ చిన్న వయస్సులోనే మోక్షమార్గం కోరుకొని, మంచి వారితో స్నేహం చేస్తూ ఆదిదేవుడైన అచ్యుతుని ఆశ్రయించండి!

**వ. కావున విషయంబులఁ జిక్కువడిన రక్కసులకు హరిభజనంబు శక్యంబు గాదు, రమ్యమయ్యును బహుతర ప్రయాస గమ్యమని తలంచితిరేనిఁ జెప్పెద, సర్వభూతాత్మకుండై సర్వ దిక్కాల సిద్ధుండై బ్రహ్మ కడపలగాఁ గల చరాచర స్థూల సూక్ష్మజీవసంఘంబు లందును, నభోవాయుకుంభినీ సలిల తేజంబు లనియెడు మహాభూతంబులయందును, భూతవికారంబు లయిన ఘటపటాదుల యందును, గుణసామ్యంబయిన ప్రధానమందును, గుణవ్యతిరేకం బైన మహత్తత్త్వాదియందును, రజస్సత్త్వతమోగుణంబుల యందును భగవంతుం డవ్యయుం డీశ్వరుండు పరమాత్మ పరబ్రహ్మ మనియెడు వాచకశబ్దంబులు గల్గి కేవలానుభవా నంద స్వరూపకుండు నవి కల్పితుండు ననిర్దేశ్యుండు నయిన పరమేశ్వరుండు త్రిగుణాత్మ కంబైన తన దివ్య మాయచేత నంతర్హితైశ్వర్యుండై వ్యాప్యవ్యాపకరూపంబులం జేసి దృశ్యుండును ద్రష్టయు భోగ్యుండును భోక్తయు నయి నిర్దేశింపందగి వికల్పితుండై యుండుఁ, దత్కారణంబున నాసుర భావంబు విడిచి సర్వ భూతంబులందును దయాసుహృద్భావంబులు కర్తవ్యం బులు, దయా సుహృద్భావంబులు గల్గిన నధోఽక్షజుండు సంతసించు, ననంతుం డాద్యుండు హరి సంతసించిన**

**నలభ్యం బెయ్యదియు లేదు, జనార్దనచరణ సరసీరుహ యుగళస్మరణ సుధారస పానపరవశుల మైతిమేని మనకు దైవవశంబున నకాంక్షితంబులై, సిద్ధించు ధర్మార్థకామంబులు, కాంక్షితంబై సిద్ధించు మోక్షం బననేల? త్రివర్గంబును నాత్మవిద్యయుం దర్కదండనీతి జీవికాదు లన్నియుఁ ద్రైగుణ్య విషయం బులయిన వేదంబుల వలనం బ్రతిపాద్యంబులు, నిస్త్రైగుణ్యలక్షణంబునం బరమ పురుషుండైన హరికి నాత్మసమర్పణంబు సేయుట మేలు, పరమాత్మ తత్త్వజ్ఞానోదయంబునం జేసి స్వపరభ్రాంతిసేయక పురుషుండు యోగావధూతత్త్వంబున నాత్మ వికల్పభేదంబునం గలలోఁ గన్న విశేషంబుల భంగిం దథ్యం బనక మిథ్యయని తలంచు నని మఱియుఁ బ్రహ్లాదుం డిట్లనియె. 217**

* స్నేహితులారా! కోరికలలో కామంలో చిక్కుకొన్న రాక్షసులకు హరిభజన అలవడదు. అలాగని ఇష్టమైనప్పటికీ చాలా ప్రయాసపడాలి అనుకుంటారేమో, కాదు. వినండి. అన్ని ప్రాణుల మనస్సులలోనూ, అన్నిదిక్కులలోనూ భగవంతుడు ఉన్నాడు. బ్రహ్మయే పరాకాష్ఠగా ఉన్నటువంటి ఈ లోకంలో కంటికి కన్పించునట్టి, కంటికి కన్పించనట్టి చిన్న పెద్ద జీవకోటిలోనూ; ఆకాశం, భూమి, నీరు, గాలి, అగ్ని - అనే పంచభూతాలలోనూ, వీటిల్లోనుంచి పుట్టినటువంటి కుండ, గుడ్డ లాంటి సమస్త వస్తువులలోనూ, ఆ దేవుడు ఉన్నాడు. గుణాలు నిండి ఉన్న మూలప్రకృతిలోనూ త్రిగుణాలకు అతీతమైన మహత్తత్త్వం లోనూ, రజోగుణం, సత్త్వగుణం, తమోగుణం అనే గుణత్రయంలోనూ, భగవంతుడు ఉన్నాడు. అలా ఉన్న ఆ స్వామి ఈశ్వరుడనీ, పరమాత్మ అనీ, పరబ్రహ్మ అనీ రకరకాలుగా పిలువబడతాడు.

ఆ పరమేశ్వరుడు అనుభవంచేత మాత్రమే మనం తెలుసుకొనగలిగే ఆనంద స్వరూపుడు. ఆయనకు ఎటువంటి మార్పు ఉండదు. ఇటువంటిదని నిరూపింపదగిన రూపం ఉండదు. ఆ ప్రభువు సత్త్వం, రజస్తమోగుణాలు నిండిన తన దివ్యమైన మాయచేత, అదృశ్యమైన శక్తితో వ్యాపించునట్టి, వ్యాపింపజేయునట్టి రూపాలతో కనుపించువాడూ, చూచువాడూ, అనుభవింపదగినవాడూ, అనుభవించువాడూ తానే అయి స్పష్టాస్పష్టమైన రూపంతో ఉంటాడు.

ఈ కారణం వల్ల మానవుడు రాక్షస భావమును విడిచిపెట్టి అన్ని ప్రాణుల మీదా దయా దాక్షిణ్యాలు కలిగి ఉండాలి. అలా ఉంటే భగవంతుడు మెచ్చుకొంటాడు. భగవంతుడు మెచ్చుకొంటే మనకు లభించని దేదీ ఉండదు. ఆ శ్రీహరి చరణకమల స్మరణమనే అమృతరసం త్రాగి పరవశులం కాగలిగితే మనకు ఆ దేవుని దయవల్ల కోరకుండానే ధర్మ, అర్థ, కామాలు లభిస్తాయి. ఇక మనం కాంక్షించే మోక్షం లభిస్తుంది అని వేరే చెప్పాలా?

ధర్మం, అర్థం, కామం, వేదాంతం, తర్కం, దండనీతి - ఇలాంటి జీవితావసర విషయాలన్నీ త్రిగుణాత్మ కాలైన వేదాలలో ప్రతిపాదింప బడ్డాయి. నిస్స్వార్థంతో, ఎటువంటి కోరికా లేకుండా త్రిగుణాతీతుడైన శ్రీహరికి హృదయమును సమర్పించడం మంచిది. పరమాత్మ తత్త్వాన్ని తెలుసుకున్న మానవుడు తాను వేరనీ, మరొకరు వేరనీ భేదభావం పాటించడు. అటువంటి వ్యక్తి మహాయోగి లాగా ఆత్మ తత్త్వం గ్రహిస్తాడు. కలలో విషయాలు ఎలా నిజం కావో అలాగే ఈ లోకం కూడా నిజం కాదనీ తెలుసుకుంటాడు - అని చెప్పి ప్రహ్లాదుడు ఇంకా ఇలా అన్నాడు.

**మ. నరుఁడుం దానును మైత్రితో మెలఁగుచున్ నారాయణుండంతయున్**
**వరుసన్ నారద సంయమీశ్వరునకున్ వ్యాఖ్యానముం జేసె మున్,**
**హరిభక్తాంఘ్రి పరాగశుద్ధతను లేకాంతుల్ మహాకించనుల్,**
**పరతత్త్వజ్ఞులు గాని నేరరు మదిన్ భావింప నీ జ్ఞానమున్. 218**

* పూర్వం నరనారాయణులు ధరణిలో అవతరించి మైత్రితో మెలగుతూ ఉన్నప్పుడు నారాయణుడు నారదమహర్షికి ఈ తత్త్వమును బోధించాడు. హరిభక్తుల పాదపరాగంతో పవిత్రులైన మహాత్ములూ, ఏకాగ్రచిత్తులూ, నిరాడంబరులూ, పరతత్త్వం తెలిసినవాళ్ళూ తప్ప ఈ విషయమును ఇతరులు అర్థం చేసుకోలేరు.

**వ. తొల్లి నేను దివ్యదృష్టి గల నారదమహాముని వలన సవిశేషం బయిన యీ జ్ఞానంబును బరమభాగవత ధర్మంబును వింటి: ననిన వెఱఁగుపడి దైత్యబాలకు లద్దనుజ రాజకుమారున కిట్లనిరి. 219**

* పూర్వం నేను దివ్యదృష్టి సంపన్నుడై నటువంటి ఆ నారద మహర్షి వల్ల ఈ విశేషజ్ఞానమునూ, పరమభక్తుల ధర్మములనూ తెలుసుకొన్నాను - అని ప్రహ్లాదుడు అనగానే ఆ రాక్షస బాలకులు ఆశ్చర్యపడి ఇలా అడిగారు.

**ఉ. మంటిమి గూడి భార్గవకుమారకులొద్ద ననేక శాస్త్రముల్**
**వింటిమి, లేఁడు సద్గురుఁడు వే ఱొకఁ డెన్నఁడు రాజశాల ము**
**క్కంటికి నైన రాదు సొరఁగా, వెలికిం జన రాదు, నీకు ని**
**ష్కంటక వృత్తి నెవ్వఁడు ప్రగల్భుఁడు సెప్పె గుణాఢ్య! సెప్పుమా. 220**

* ఓయీ ! మిత్రమా! మనం పుట్టినప్పటినుంచి కలిసే ఉంటున్నాం. శుక్రాచార్యుల కుమారులగు చండామర్కుల దగ్గరే శాస్త్రాలన్నీ చదివాం. మరొక గురువును మనం ఎరుగము. పైగా మన మహారాజపాఠశాల లోనికి ఫాలాక్షుడు కూడా రాలేకుండా కట్టుదిట్టం చేశారు. మనమా బయటికి వెళ్లకూడదు. అలాంటప్పుడు అరమరిక లేకుండా - నీకు ఈ విషయాలన్నీ ఏ మహానుభావుడు చెప్పాడు? ఆశ్చర్యంగా ఉందే? ఇవన్నీ ఎలా నేర్చుకున్నావో చెప్పు.

**క. సేవింతుము నిన్నెప్పుడు, భావింతుము రాజ వనుచు బహుమానములం**
**గావింతుము, తెలియును నీ, కీ వింతమతిప్రకాశ మే క్రియఁ గలిగెన్? 221**

* ఇప్పటికి మాకు ఒక మంచివిషయం తెలిసింది. జ్ఞానం కలిగింది. ఇక నిన్ను మేము ఎప్పుడూ సేవిస్తాము. నిన్నే రాజుగా భావిస్తాము; సంభావిస్తాము. కానీ నీకు ఈ విచిత్రమైన ఆత్మజ్ఞానం ఎలా వచ్చిందో అర్థం కావటం లేదు. మాకు తెలుసుకోవాలని ఉంది.

**వ. అని ఇట్లు దైత్యనందనులు ద న్నడిగినఁ బరమభాగవత కులాలంకారుండైన ప్రహ్లాదుండు నగి తనకుఁ బూర్వంబు వినంబడిన నారదు మాటలు దలంచి యిట్లనియె. 222**

* అని రాక్షస బాలకులు తమ మనసులోని సందేహం తెలియజేశారు. అప్పుడు మహాభక్తుడైన ప్రహ్లాదుడు నవ్వి పూర్వం నారదుని ద్వారా తాను విన్న విషయం గుర్తుకు తెచ్చుకొని ఇలా చెప్పాడు -

**శా. అక్షీణోగ్ర తపంబు మందరముపై నర్థించి మా తండ్రి శు**
**ద్ధ క్షాంతిం జని యుండఁ జీమగమిచేతన్ భోగిచందంబునన్**
**భక్షింపంబడెఁ బూర్వ పాపములచేఁ బాపాత్మకుం డంచు మున్**
**రక్షస్సంఘముమీఁద నిర్జరులు సంరంభించి యుద్ధార్థులై. 223**

* మిత్రులారా! పూర్వం మా తండ్రి ఉగ్రమైన తపస్సు చేయటానికి ప్రశాంతచిత్తంతో మందర పర్వతం మీదకు వెళ్ళాడు. "చలిచీమల చేత చిక్కి పీడింపబడే సర్పంలాగా ఈ రాక్షసుడు తాను చేసుకొన్న పాపాలచేతనే తాను నాశన మౌతాడు" అని దేవతలు మా తండ్రిని చూచి అనుకొన్నారు. మా తండ్రి నగరంలో లేని అవకాశం కనిపెట్టి రాక్షసులందరినీ చంపివేయాలని దేవతలు వాళ్ళమీదికి యుద్ధానికి సంసిద్ధమై బయలుదేరారు.

**శా. ప్రస్థానోచిత భేరి భాంకృతులతోఁ బాకారియుం దారు శౌ**
**ర్య స్థైర్యంబుల నేగుదెంచినఁ దదీయాటోప విభ్రాంతులై**
**స్వస్థేమల్ దిగనాడి పుత్రధనయోషామిత్ర సంపత్కళా**
**ప్రస్థానంబులు డించి పాఱి రసురుల్ ప్రాణావనోద్యుక్తులై. 224**

* జైత్రయాత్రకు తగినట్టుగా యుద్ధభేరీలు మ్రోగాయి. దేవేంద్రుడూ దేవతలూ యుద్ధోత్సాహంతో, ఆవేశంతో పెద్ద సైన్యంతో వచ్చి పట్టణం మీద పడ్డారు. ఆ ధాటికి తట్టుకోలేక రాక్షసులందరూ తమ తమ భార్యలనూ, పిల్లలనూ, బంధుమిత్రులనూ, ధనధాన్యాలనూ విడిచి పెట్టి ప్రాణాలు అరచేతుల్లో పెట్టుకుని పారిపోయారు.

**మత్తకోకిలము.**

**ప్రల్లదంబున వేల్పు లుద్ధతిఁ బాఱి రాజనివాసముం**
**గొల్లవెట్టి సమస్త విత్తముఁ గ్రూరతం గొనిపోవఁగా**
**నిల్లు సొచ్చి విశంకుఁడై యమరేశ్వరుం డదలించి మా**
**తల్లిఁ దాఁ జెఱవట్టె సిగ్గునఁ దప్తయై విలపింపఁగాన్. 225**

* దౌర్జన్యంగా దండెత్తి వచ్చిన దేవతలు వెంటనే రాక్షసరాజు నివాస మందిరాన్ని ఆక్రమించారు. సర్వసంపదలు, ధనాగారం కొల్లగొట్టారు. దేవేంద్రుడు సంకోచం లేకుండా అంతఃపురంలో జొరబడి మా తల్లిని చెరపట్టాడు. ఆమె సిగ్గుతో విలవిలలాడింది. ఎంత ఏడ్చినా దేవేంద్రుడు వినిపించుకోలేదు.

**వ. ఇట్లు సురేంద్రుండు మా తల్లిం జెఱగొని పోవుచుండ న మ్ముగుద కురరి యను పులుఁగు క్రియ మొఱలిడినఁ దెరువున దైవయోగంబున నారదుండు పొడగని యిట్లనియె. 226**

* ఆ విధంగా సురేంద్రుడు మా తల్లిని తీసుకొని పోతుంటే ఆవిడ ఆడులకుముకిపిట్ట లాగా రోదించింది. దైవయోగం వల్ల అదృష్టం బాగుండి దారిలో నారదమహర్షి కన్పించాడు. ఇంద్రుణ్ణి చూచి నారదుడు ఇలా అన్నాడు.

ఉ. స్వర్భువనాధినాథ! సురసత్తమ! వేల్పులలోన మిక్కిలిన్
నిర్భరపుణ్యమూర్తివి, సునీతివి, మానినిఁ బట్ట నేల? యీ
గర్భిణి నాతురన్ విడువు, కల్మషమానసురాలు గాదు, నీ
దుర్భరరోషమున్ నిలుపు దుర్జయుఁడైన నిలింప వైరి పై. 227

* ఓ స్వర్గాధిపతీ! దేవరాజా! నీవు దేవతలలో ఉత్తముడవు. పుణ్యమూర్తివి! నీతిమంతుడవు! నీవు పరస్త్రీని పట్టుకొని రావటం తప్పు కదా. అందులోనూ ఈమె గర్భవతి. భయార్తురాలైన ఈమెను నీవు వెంటనే విడిచిపెట్టు. ఈమె పాపాత్మురాలు కాదు. నీ కోపాన్ని దేవ విరోధియైన హిరణ్యకశిపుని మీద చూపించు. ఉత్తమురాలైన ఈమెను విడిచిపెట్టు.

వ. అనిన వేల్పుఁదపసికి వేయిగన్నుల దేవర యిట్లనియె. 228

* అని పలికిన నారదమహర్షితో వేయికన్నుల వేలుపు దొర ఇంద్రుడు ఇలా అన్నాడు.

ఉ. అంతనిధానమైన దివిజాహితువీర్యము దీని కుక్షి న
త్యంత సమృద్ధి నొందెడి మహాత్మక! కావునఁ దత్ప్రసూతి ప
ర్యంతము బద్ధఁ జేసి జనితార్భకు వజ్రపుధారఁ ద్రుంచి ని
శ్చింతుఁడనై తుదిన్ విడుతు, సిద్ధము దానవరాజవల్లభన్. 229

* మహాత్మా! ఈ రాజపత్ని గర్భంలో సురవిరోధి అయిన హిరణ్యకశిపుని వీర్యం వృద్ధిపొందుతూ ఉంది. అది మా వినాశనానికి మూలకారణం. కాబట్టి ప్రసవించేవరకూ ఈమెను బందీచేసి, పుట్టిన బిడ్డను పుట్టినట్లే నా వజ్రాయుధంతో వధించి అనంతరం రాక్షసరాజపత్నిని తప్పకుండా విడిచిపెడతాను. అప్పుడు నా మనస్సు నిశ్చింతగా ఉంటుంది.

వ. అని పలికిన వేల్పు తేనికిం దపసి యిట్లనియె. 230

* అని పలికిన ఇంద్రునితో మునీంద్రుడు ఇలా అన్నాడు.

శా. నిర్భీకుండు ప్రశస్త భాగవతుఁడున్ నిర్వైరి జన్మాంతరా
విర్భూతాచ్యుత పాదభక్తి మహిమా విష్ణుండు దైత్యాంగనా
గర్భస్థుండగు బాలకుండు బహుసంగ్రామాద్యుపాయంబులన్
దుర్భావంబునఁ బొంది చావఁడు భవద్దోర్దర్ప విభ్రాంతుఁడై, 231

* ఈ లీలావతి కడుపులో పెరిగేవాడు మహాధైర్యశాలి, మహా భక్తుడు. అతనికి శత్రువులు లేరు. అతనికి జన్మజన్మల నుంచీ హరిభక్తి సంప్రాపిస్తూ వచ్చింది. అటువంటి మహిమాన్వితుడు కాబట్టి నీవు

ఎన్ని యుద్ధాలు చేసినా, ఎన్ని ఉపాయాలు పన్నినా, నీకు ఎంతబలం ఉన్నా ఆ బాలుణ్ణి మాత్రం చంపలేవు. నీ బాహుపరాక్రమం ఈ విషయంలో ఏమాత్రం పనిచేయదు.

వ. అని దేవముని నిర్దేశించిన నతని వచనంబులు మన్నించి తాను హరిభక్తుండు గావున దేవేంద్రుండు భక్తిబాంధవంబున మా యవ్వను విడిచి వలగొని సురలోకంబునకుం జనియె, మునీంద్రుండు మజ్జననియందుఁ బుత్రికాభావంబు సేసి యూఱడించి నిజాశ్రమంబునకుం గొనిపోయి నీవు పతివ్రతవు, నీ యుదరంబునఁ బరమభాగవతుండయిన ప్రాణి యున్నవాఁడు, తపోమహత్త్వంబునం గృతార్థుండై నీ పెనిమిటి రాఁగలం, డందాఁక నీ విక్కడ నుండు మనిన సమ్మతించి. 232

* నారదముని చెప్పిన ఈ మాటలు విని ఇంద్రుడు ఆలోచించాడు. తానుకూడా విష్ణుభక్తుడు కాబట్టి ఆ భక్తిబంధుత్వం వల్ల మా అమ్మకు నమస్కరించి ప్రదక్షిణం చేసి విడిచిపెట్టి స్వర్గలోకానికి వెళ్ళిపోయాడు. నారదమహర్షి మా తల్లిని కూతురుగా భావించి, ఓదార్చి తన ఆశ్రమానికి తీసుకుని వెళ్ళాడు.

"అమ్మా! నీవు పరమ పతివ్రతవు. నీ కడుపులో మహాభక్తుడైన ఒక బాలుడు పెరుగుతున్నాడు. నీ భర్త తపస్సుచేసి వరాలు పొంది తప్పక తిరిగి వస్తాడు. అప్పటి వరకూ నీవు ఇక్కడే ఉండు" అని నారదుడు ధైర్యం చెప్పాడు. అందుకు మా అమ్మ సరేనని ఒప్పుకుంది.

శా. యోషారత్నము నాథదేవత విశాలోద్యోగ మా తల్లి, ని
ర్దైషమ్యంబున నాథురాక మదిలో వాంఛించి నిర్దోషయై
యోషద్భీతియు లేక గర్భపరిరక్షేచ్ఛన్ విచారించి శు
శ్రూషల్ సేయుచు నుండె నారదునకున్ సువ్యక్త శీలంబునన్. 233

* రమణీశిరోమణీ, మహాపతివ్రత ఐనటువంటి మా అమ్మ ఎవరి మీదా ద్వేషం పెట్టుకోకుండా భర్తనే దేవునిగా భావిస్తూ, భర్త రాకకోసం ఎదురుచూస్తూ ఉండిపోయింది. ఆశ్రమంలో మంచిగా ఉంటూ ఏమాత్రం జంకులేకుండా, తన కడుపులో ఉన్న కుమారుని క్షేమం కోరుకుంటూ నారదమహర్షికి సేవలు చేస్తూ ఉంది.

వ. ఇట్లు దనకుఁ బరిచర్య సేయుచున్న దైత్యరాజకుటుంబినికి నాశ్రితరక్షా విశారదుండైన నారదుండు నిజసామర్థ్యంబున నభయం బిచ్చి గర్భస్థుండనైన నన్ను నుద్దేశించి ధర్మ తత్త్వంబును నిర్మల జ్ఞానంబును నుపదేశించిన నమ్ముద్దియ దద్దయుం బెద్ద కాలంబునాఁటి వినికి గావున నాఁడుది యగుటం జేసి పరిపాటి దప్పి నూటిలేక మఱచె, నారదుండు నా యెడఁ గృపగల నిమిత్తంబున. 234

క. వెల్లిగొని నాఁటనుండియు, నుల్లసితంబైన దైవయోగంబున శో
భిల్లెడు మునిమత మంతయు, నుల్లంబున మఱపు పుట్ట దొకనాఁడైనన్. 235

* ఇలా తనకు సేవచేస్తున్నందుకు ఆశ్రితజనరక్షణ చణుడైన నారదుడు ఎంతో మెచ్చుకొని సాధ్వీమతల్లి అయిన మా తల్లికి 'ఏమీ భయం లే'దని ధైర్యం చెప్పాడు. అపుడు ఆమె గర్భంలో ఉన్న నన్ను మనసులో

పెట్టుకొని స్వచ్ఛమైన జ్ఞానాన్నీ, ధర్మాన్నీ ఉపదేశించాడు. మా తల్లి అంతా విన్నది. కానీ చాలా కాలం క్రితం విని ఉండటం వల్లనూ, ఆడుది అవటం వల్ల ఈ విషయాల మీద మనస్సు సూటిగా నిలుపలేక వాటిని మరచిపోయింది. అయినా కూడా నారద మహర్షికి నామీద ఉన్న దయవల్ల దైవయోగం కలిసి వచ్చినందు వల్ల ఆయన చెప్పిన ధర్మాలు కానీ, జ్ఞాన విషయాలు కానీ నాటి నుంచీ నేటి వరకూ నేను ఏ ఒక్కనాడు కూడా ఒక్కటి కూడా మరచి పోలేదు.

ఆ. వినుఁడు నాదు పలుకు విశ్వసించితి రేని, సతుల కయిన బాలజనుల కయినఁ
దెలియవచ్చు మేలు దేహాద్యలంకార, దళననిపుణమైన తపసి మతము. 236

* మిత్రులారా! వినండి. నా మాట నమ్మండి. నారదుడు చెప్పే ఈ వేదాంతాన్ని తెలుసుకోటానికి స్త్రీలు, బాలురు కూడా అర్హులే. ఈ నారద భక్తితత్త్వం తెలుసుకొంటే దేహాభిమానాలూ, మమకారాలూ తొలగిపోతాయి. ఉత్తమమైన భక్తి ఏర్పడుతుంది.

వ. అని నారదోక్త ప్రకారంబున బాలకులకుఁ బ్రహ్లాదుం డిట్లనియె, నీశ్వరమూర్తియైన కాలంబునంజేసి వృక్షంబు గలుగుచుండ ఫలంబునకు జన్మసంస్థాన వర్ధనాపక్షీణత్వ పరిపాకనాశంబులు ప్రాప్తంబులైన తెఱంగున దేహంబునకుంగాని షడ్భావ వికారంబు లాత్మకు లే, వాత్మ నిత్యుండు, క్షయ రహితుండు, శుద్ధుండు, క్షేత్రజ్ఞుండు, గగనాదులకు నాశ్రయుండు, గ్రియాశూన్యుండు, స్వప్రకాశుండు,సృష్టి హేతువు, వ్యాపకుండు, నిస్సంగుండుఁ, బరిపూర్ణుండు, నొక్కండునని వివేక సమర్థంబులగు నాత్మలక్షణంబులు పండ్రెండు నెఱుంగుచు దేహాదులందు మోహజనకంబులగు నహంకార మమకారంబులు విడిచి పసిండి గనులు గల నెలవున విభ్రాజమాన కనకలేశంబులైన పాషాణాదులందుఁ బుటంబు పెట్టి వహ్ని యోగంబునఁ గరంగ నూది హేమకారకుండు పాటవంబున హాటకంబుఁ బడయుభంగి నాత్మకృత కారణంబుల నెఱింగెడి నేర్పరి దేహంబునం దాత్మసిద్ధికొఱకు నయిన యుపాయంబునం జేసి బ్రహ్మ భావంబుఁ బడయు, మూలప్రకృతియు, మహదహంకారంబులును, బంచతన్మాత్రంబులు, నివి యెనిమిదియుం బ్రకృతి గుణంబు లనియు, గర్మేంద్రియంబు లయిన వాక్పాణిపాద పాయూపస్థంబులును జ్ఞానేంద్రియుం బులైన శ్రవణనయన రసనా త్వగ్ఘ్రాణంబులును మనంబును మహీసలిల తేజోవాయు గగనంబులును నివి పదాఱును వికారంబు లనియును గపిలాది పూర్వాచార్యులచేతఁ జెప్పంబడియె, సాక్షిత్వంబున నీ యిరువదేడింటిని నాత్మగూడియుండుఁ బెక్కింటి కూటువ దేహ, మదియు జంగమస్థావరరూపంబుల రెండు విధంబులయ్యె, మూలప్రకృతి మొదలయిన వర్గంబునకు వేఱై, మణిగణంబులం జొచ్చియున్న సూత్రంబు చందంబున నాత్మ యన్నింటియందునుం జొచ్చి దీపించు, నాత్మకు జన్మస్థితి లయంబులు గలవంచు మిథ్యాతత్పరులుగాక వివేక శుద్ధమైన మనంబునం జేసి విచారించి దేహంబునం దాత్మ వెదకవలయు, నాత్మకు నవస్థలు గలయట్లుండుఁ గాని, యవస్థలు లేవు, జాగరణస్వప్న సుషుప్తులను వృత్తు లెవ్వనిచేత గంధాశ్రయుండయిన వాయువు నెఱింగెడు భంగిం ద్రిగుణాత్మకంబులయి కర్మ జన్యంబు లయిన బుద్ధిభేదంబుల నాత్మ నెఱుంగందగు నని చెప్పి. 237

* అని నారదమహర్షి బోధించిన విధమంతా ప్రహ్లాదుడు తోడి బాలకులకు ఇలా తెలియ జేశాడు:" కాలం ఈశ్వర స్వరూపం! కాల క్రమంలో వృక్షం పుట్టి ఫలిస్తుంది. ఆ ఫలానికి పుట్టటం, వృద్ధి పొందటం, పండటం, ఎండటం, కృశించటం, నశించటం అనే క్రమం తప్పదు. అలాగే దేహానికి కూడా ఈ ఆరువిధాలైన భావవికారాలూ ఉన్నాయి. అంతే కానీ ఆత్మకు మాత్రం ఈ మార్పులు ఎంతమాత్రం ఉండవు. ఆత్మ శాశ్వతమైనది. నాశనం లేనిది. అది స్వచ్ఛమైనది. ఈశ్వరాంశ కలది. ఆకాశం వంటి పంచభూతాలకు ఆత్మ ఆశ్రయం. అది అవికారం. అది స్వయంప్రకాశం. సృష్టికి కారణం. అది వ్యాపించు స్వభావం గలది. అది సంగం లేనిది. అది పరిపూర్ణ మైనది. ఆత్మ అద్వితీయ మైనది. ఈ విధంగా ఆత్మ లక్షణాలు మొత్తం పన్నెండని పెద్దలు చెబుతారు.

బంగారపు గనులలో బంగారపు రేణువులు రాయి రప్పలతో కలసి ఉంటాయి. ఆ రాళ్ళను అగ్నిలో పుటం పెట్టి, కరగపెట్టి స్వర్ణకారులు వానిలో నుంచి నేర్పుగా బంగారం తీస్తారు. అదే విధంగా ఆత్మతత్త్వం తెలిసినవారు దేహం వంటి వాటిపై భ్రాంతిని కలిగించే అహంకారాలూ, మమకారాలూ విడిచిపెట్టి దేహాదులకంటె ఆత్మను భిన్నంగా భావించి తెలివిగా బ్రహ్మసాక్షాత్కారాన్ని పొందుతారు.

మూలప్రకృతి, మహత్తు, అహంకారము, శబ్దం, స్పర్శం, రూపం, రసం, గంధం, ఈ ఎనిమిదింటికీ "ప్రకృతులు"అని పేరు; సత్త్వము, రజస్సు, తమస్సు - ఈమూడు ప్రకృతి గుణాలు; వాక్కు, పాణి, పాదం, గుదం, మర్మావయవం - ఈ ఐదు కర్మేంద్రియాలూ; కన్ను, చెవి, చర్మం, నాసిక, నాలుక - ఈ; ఐదు జ్ఞానేంద్రియాలూ; మనస్సూ ఒకటీ - నేల, నీరు, నింగి, గాలి, అగ్ని - ఈ ఐదు పంచభూతాలూ - ఈ పదహారింటిని "వికారాలు"అంటారని కపిల మహర్షి వంటి పూర్వాచార్యులు చెప్పారు. మొత్తం ఈ ఇరవై ఏడింటిలోనూ ఆత్మ సాక్షీభూతంగా ఉంటుంది.

ఈ విధమైన అనేక పదార్థాలతో తయారయింది ఈ దేహం. ఈ దేహాన్ని స్థిరమనీ, చరమనీ రెండు విధాలుగా భావించవచ్చు. మూల ప్రకృతి మొదలైన వాటికన్న భిన్నమైన ఆత్మ పూసలలో దారం లాగా ఇన్నింటి లోపల ప్రకాశిస్తూనే ఉంటుంది. ఆత్మకు జనన స్థితి మరణాలు ఉన్నాయని మాయలో పడకుండా వివేకంతో ఆలోచించాలి. దేహంలో ఆత్మను అన్వేషించాలి. ఆత్మకు అవస్థలు ఉన్నట్లు అనిపిస్తాయి. కానీ నిజానికి దానికి ఏ అవస్థలూ లేవు. జాగృతి, స్వప్నం, సుషుప్తి అనే మనోవృత్తులను ఎవడు తెలుసుకుంటాడో అతడే ఆత్మస్వరూపుడు! సుమాలకు ఉండే సువాసన వల్ల వాయువును తెలుసుకునే విధంగా త్రిగుణాత్మకములూ, కర్మజన్యములూ అయిన బుద్ధిభేదాల వల్ల ఆత్మను తెలుసుకోవచ్చు.

**సీ. సంసార మిది బుద్ధిసాధ్యము గుణకర్మ గణబద్ధ మజ్ఞానకారణంబు,**
**కలవంటి, దింతియ కాని నిక్కము గాదు, సర్వార్థములు మనస్సంభవములు,**
**స్వప్నజాగరములు సమములు, గుణశూన్యుఁ డగు పరమునికి గుణాశ్రయమున**
**భవవినాశంబులు పాటిల్లి నట్లుండుఁ బట్టి చూచిన లేవు బాలులార!**

తే. కడఁగి త్రిగుణాత్మకములైన కర్మములకు, జనకమై వచ్చు నజ్ఞాన సముదయమును
ఘనతర జ్ఞానవహ్నిచేఁ గాల్చి పుచ్చి, కర్మవిరహితులై హరిఁ గనుట మేలు. 238

* ఈ సంసారం కేవలం బుద్ధివల్లనే ఏర్పడుతుంది. ఇది సత్త్వ రజ స్తమోగుణాత్మకాలైన కర్మలలో బందీ అయి ఉంటుంది. ఇది అజ్ఞానానికి మూలమైనది. ఈ సంసారం కేవలం స్వప్నం వంటిది. ఎంత మాత్రమూ నిజం కాదు. సకల కాంక్షలూ మనస్సులోనే జన్మిస్తాయి. స్వప్నం, మెలకువ ఈ రెంటికీ తేడాయే లేదు. పరమాత్మ గుణాలకు అతీతుడు అయినా గుణాలను ఆశ్రయించి ఆయన కూడా జననం, మరణం పొందుతున్నట్లు అనిపిస్తుంది. కానీ ఆలోచించి చూస్తే పరమాత్మకు జనన మరణాలు లేవు. త్రిగుణాలవల్ల ఆవిర్భవించే ఆయాకర్మలకు కారణమైన మనలోని అజ్ఞానాన్ని జ్ఞానం అనే అగ్నితో కాల్చివేయాలి. ఆవిధమైన నిస్స్వార్థమైన మనస్సుతో కమలాక్షుణ్ణి కనుగొనడం మంచిది.

వ. అది గావున గురుశుశ్రూషయు సర్వలాభసమర్పణంబును, సాధుజన సంగమంబును, నీశ్వర ప్రతిమా సమారాధనంబును, హరికథాతత్పరత్వంబును, వాసుదేవునియందలి ప్రేమయు, నారాయణగుణకర్మ నామకీర్తనంబును, వైకుంఠ చరణకమలధ్యానంబును, విశ్వంభరమూర్తి విలోకన పూజనంబులును మొదలయిన విజ్ఞాన వైరాగ్య లాభసాధనంబులైన భాగవత ధర్మంబులపై రతిగలిగి సర్వభూతంబుల యందు నీశ్వరుండు భగవంతుండాత్మ గలండని సమ్మానంబు సేయుచుఁ గామ క్రోధ లోభమోహ మద మాత్సర్యంబుల గెలిచి యింద్రియ వర్గంబును బంధించి భక్తి సేయుచుండ నీశ్వరుండయిన విష్ణు దేవుని యందలి గతి సిద్ధించు. 239

* కాబట్టి బాలకులారా! గురువులకు సేవచేయటం, సమస్త ఫలితాన్ని భగవంతునికి సమర్పించటం, సజ్జనులతో స్నేహం చేయటం, దేవుని విగ్రహాన్ని ఆరాధించటం, శ్రీహరికథా శ్రవణం, వాసుదేవమననం, నారాయణ సంకీర్తనం, విష్ణుపాదధ్యానం, విరాట్స్వరూప దర్శనం, పూజనం - మొదలైనవి జ్ఞానవైరాగ్యములను కలిగిస్తాయి. ఇవి భాగవత ధర్మాలు. ఈ ధర్మాలపై ఆసక్తి కలిగి ఉండాలి. ఈశ్వరుడైన భగవంతుడే ఆత్మ స్వరూపంతో సర్వప్రాణకోటిలోనూ ఉన్నాడని తెలుసుకొని మనం వాటిని ఆదరించాలి. కామం, క్రోధం, లోభం, మోహం, మదం, మాత్సర్యం అనువాటిని జయించి ఇంద్రియచాపల్యాన్ని అరికట్టాలి. ఆ విధంగా భక్తితో భజిస్తే భగవంతుడైన శ్రీహరి సాన్నిధ్యం తప్పకుండా లభిస్తుంది.

సీ. దనుజారి లీలావతారంబులందలి శౌర్య కర్మంబులు సద్గుణములు
విని భక్తుఁడగు వాఁడు వేడ్కతోఁ బులకించి కన్నుల హర్షాశ్రుకణము లొలుక
గద్గదస్వరముతోఁ కమలాక్ష! వైకుంఠ! వరద! నారాయణ! వాసుదేవ!
యనుచు నొత్తిలి పాడు! నాడు! నాక్రోశించు! నగు! జింతనము సేయు, నతి యొనర్చు

తే. మరులు కొనియుండుఁ దనలోన మాటలాడు, వేల్పుసోఁకిన పురుషుని వృత్తిఁ దిరుగు
బంధములఁ బాసి యజ్ఞానపటలి గాల్చి విష్ణుఁ, బ్రాపించుఁ దుది భక్తివివశుఁ డగుచు. 240

* భక్తుడైనవాడు భగవంతుని లీలావతారాలలోని పరాక్రమ గాథలు విని పులకించి పోతాడు. అతడు ఆ స్వామి సుగణాలు విని పొంగిపోతాడు. భక్తి పారవశ్యంతో కళ్ళలో ప్రమోద బాష్పాలు ఒలుకుతుండగా "నారాయణా! గోవిందా! వరదా! వాసుదేవా!"అని గద్గద స్వరంతో గొంతెత్తి పాడుతూ ఆడతాడు. అరుస్తాడు, నవ్వుతాడు, నమస్కరిస్తాడు. తనలో తానే ప్రేమావేశంతో మాట్లాడుకుంటాడు. ఇంతేకాదు గాలిసోకిన వాడిలాగా తిరుగుతాడు. చివరకు భవబంధాల్ని పరిత్యజించి అజ్ఞానమును అంతం చేసుకొని, భక్తివివశుడై శ్రీహరి సాన్నిధ్యం చేరుకుంటాడు.

**వ. కావున రాగాదియుక్త మనస్కుండయిన శరీరికి సంసారచక్ర నివర్తకం బయిన హరిచింతనంబు బ్రహ్మమందలి నిర్వాణ సుఖంబెట్టి దట్టిదని బుధులు దెలియుదురు, హరి భజనంబు దుర్గమంబు గాదు, హరి సకల ప్రాణి హృదయంబుల యందు నంతర్యామియై యాకాశంబు భంగి నుండు, విషయార్జనంబుల నయ్యెడిది లేదు, నిమిషభంగుర ప్రాణులయిన మర్త్యులకు మమతాస్పదంబులును జంచలంబులును నైన పుత్రమిత్ర కళత్ర పశు భృత్య బల బంధు రాజ్య కోశ మణి మందిరమంత్రి మాతంగ మహీ ప్రముఖ విభవంబులు నిరర్థకంబులు. యాగప్రముఖ పుణ్యలబ్ధంబు లైన స్వర్గాదిలోక భోగంబులు, పుణ్యానుభవ క్షీణంబులుగాని నిత్యంబులు గావు, నరుండు విద్వాంసుండ నని యభి మానించి కర్మంబు లాచరించి యమోఘంబు లయిన విపరీతఫలంబుల నొందుఁ, గర్మంబులుగోరక చేయవలయుఁ, గోరి చేసిన దుఃఖంబులు ప్రాపించుఁ, బురుషుండు దేహంబు కొఱకు భోగంబుల నపేక్షించు, దేహంబు నిత్యంబు గాదు, తోడ రాదు, మృతంబయిన దేహంబును శునకాదులు భక్షించు, దేహి కర్మంబు లాచరించి కర్మబద్ధుండయి క్రమ్మఱం గర్మానుకూలంబైన దేహంబుఁ దాల్చు, నజ్ఞానంబునంజేసి పురుషుండు కర్మదేహంబుల విస్తరించు, నజ్ఞాన తంత్రంబులు ధర్మార్థ కామంబులు, జ్ఞానలభ్యంబు మోక్షంబు, మోక్షప్రదాత యగు హరి సకల భూతంబులకు నాత్మేశ్వ రుండు, ప్రియుండు, దన చేతనయిన మహాభూతంబుల తోడ జీవసంజ్ఞితుం డయి యుండు, నిష్కాములై హృదయగతుం డయిన హరిని నిజభక్తిని భజింపవలయు. 241**

* కోరికలతో నిండిన మానవుడు ఈ సంసార చక్రాన్ని ఛేదించాలంటే శ్రీహరి సంకీర్తనం ఒక్కటే ఉపాయం. పరబ్రహ్మంలో ఐక్యమై అనుభవించే ఆనందం ఎటువంటిదో అటువంటి ఆనందాన్ని ఆ మాధవుని ఆరాధన ప్రసాదిస్తుంది - అని పండితులు చెబుతారు. శ్రీహరిని సేవించటం కష్టమైన పనికాదు. ఆ స్వామి సమస్త ప్రాణుల హృదయాలలో అంతర్యామియై ఆకాశంవలె వ్యాపించి ఉంటాడు. భోగ భాగ్యాలు సంపాదించటం వల్ల ఏమాత్రం సుఖం లేదు.

మానవుల జీవితాలు క్షణభంగురాలు. ఇటువంటి మానవులకు మమతాబంధాలు పెంచే భార్యా పుత్రులూ, బంధుమిత్రులూ, మడిమాన్యాలూ, పాడిపంటలూ, రాజ్యకోశాలూ, మణిమందిరాలూ, మంత్రులూ, మత్తేభాలూ మొదలైనవన్నీ అనవసరమైనవి, అస్థిరమైనవి. యజ్ఞయాగాదులవల్ల లభించే స్వర్గ సుఖాలు పుణ్యం క్షీణింపగానే నశించేవే కాని శాశ్వతాలు కావు. మానవుడు తాను ఘనుడని భావించుకుని, తనపై తాను అభిమానం పెంచుకొని, వివిధ కర్మలు ఆచరించి విపరీతమైన ఫలితాలు విశేషంగా పొందుతాడు. కర్మలు ఎటువంటి కోరికలూ లేకుండా చేయాలి. కోరికలతో చేసిన కర్మలన్నీ దుఃఖాలనే కలిగిస్తాయి.

పురుషుడు తన దేహంకోసం భోగాలు కోరుకుంటాడు. కానీ దేహం శాశ్వతమైనది కాదు. తనతో వచ్చేదీ కాదు. ప్రాణం పోగానే ఈ శరీరాన్ని కుక్కలు, నక్కలు తినివేస్తాయి. దేహం ధరించిన ఈ వ్యక్తి కర్మలను చేసి, ఆ కర్మలకు బద్ధుడైపోతాడు. మరల ఆ చేసిన కర్మలకు అనుకూలమైన దేహం ధరిస్తాడు. అజ్ఞానంవల్ల కర్మలు ఎక్కువగా చేయటం, మరల మరల దేహాలు ధరిస్తూ ఉండటం - ఇలాగే కర్మ దేహాలలో పురుషుడు సంచరిస్తూ ఉంటాడు. అజ్ఞానంతోకూడిన కర్మలు ధర్మార్థకామాలను మాత్రమే అందిస్తాయి. కాని జ్ఞానం ఒక్కటే మోక్షాన్ని ప్రసాదిస్తుంది. ఆ మోక్షాన్ని అనుగ్రహించేవాడు శ్రీ మహావిష్ణువు! ఆ స్వామి సర్వప్రాణికోటికీ ఆత్మేశ్వరుడూ, ప్రియుడూ. ఆ దేవుడు తన చేత సృష్టింపబడిన పంచమహా భూతాలతో లీనమై 'జీవుడు' అనే పేరుతో పిలువబడతాడు. కాబట్టి ప్రతివ్యక్తీ తమ తమ హృదయాలలో ఉండే ఆ భగవంతుణ్ణి భక్తి శ్రద్ధలతో నిస్స్వార్థంగా ధ్యానించాలి.

**క. దానవదైత్య భుజంగము, మానవగంధర్వ సురసమాజములో ల**
**క్ష్మీనాథు చరణకమల, ధ్యానంబున నెవ్వఁ డయిన ధన్యత నొందున్.** **242**

* దానవులూ, దైత్యులూ, సురలూ, నరులూ, నాగరాజులూ, గంధర్వులూ ఎవరైనా సరే ఆ లక్ష్మీపతి అయిన శ్రీమహా విష్ణువు పాదపద్మాలను సేవిస్తే చాలు, పుణ్యాత్ములు అవుతారు.

**క. చిక్కఁడు వ్రతములఁ గ్రతువులఁ, జిక్కఁడు, దానముల శౌచశీలతపములం**
**జిక్కఁడు, యుక్తిని భక్తిని, జిక్కిన క్రియ నచ్యుతుండు సిద్ధము సుండీ!** **243**

* మిత్రులారా! ఆ భగవానుడు గాఢమైన భక్తికి చిక్కినట్లుగా దానవ్రతాలకూ, శౌచశీలాలకూ, జపతపాలకూ, యజ్ఞయాగాలకూ, నియమ నిష్ఠలకూ చిక్కడు. భక్తి ఒక్కటే ఆ స్వామిని పొందే సాధనం. మరొక మార్గమే లేదు.

**క. చాలదు భూదేవత్వము, చాలదు దేవత్వ మధిక శాంతత్వంబుం**
**జాలదు, హరి మెప్పింప వి, శాలోద్యములార! భక్తి చాలిన భంగిన్.** **244**

* బాలకులారా! విష్ణువును మెప్పించటానికి భక్తి సరిపోయి నట్లుగా బ్రాహ్మణత్వమూ సరిపోదు, దేవత్వమూ చాలదు. గొప్ప శాంత స్వభావమూ చాలదు. పద్మనాభుణ్ణి ప్రసన్నం చేసుకోవటానికి భక్తి ఒక్కటే సమర్థ మైనది.

**ఆ. దనుజ భుజగ యక్ష దైత్యమృగాభీర, సుందరీ విహంగ శూద్ర శబరు**
**లైనఁ బాపజీవు లైన ముక్తికిఁ బోదు, రఖిల జగము విష్ణుఁ డనుచుఁ దలఁచి.** **245**

* దనుజులూ, దైత్యులూ, యక్షులూ, పక్షులూ, గొల్లలూ, పిల్లలూ, నాగులూ, నారీమణులూ, మృగములూ, శబరులూ ఇంకా ఏ జాతి వారైనా, ఏ పాపజీవనులైనా సరే "సర్వం విష్ణుమయం జగత్" అని మనసారా తలచి నట్లైతే చాలు - ముక్తి పొందుతారు.

**క. గురువులు దమకును లోఁబడు, తెరువులు సెప్పెదరు, విష్ణుదివ్యపదవికిం**
**దెరువులు సెప్పరు చీఁకటిఁ, బరువులు పెట్టంగనేల? బాలకులారా! 246**

* బాలకులారా! మన గురువులు తమకు లోబడే మార్గాలు చెబుతున్నారు అంతేకానీ దివ్యమైన శ్రీహరి సాన్నిధ్యం పొందటానికి అవసరమైన మార్గాలు చూపించరు. మనం వారి వెంట చీకటిలో పడి అజ్ఞానంతో పరుగెత్తటం దేనికి? కొంచెం ఆలోచించండి.

**క. తెం డెల్ల పుస్తకంబులు, నిం డాచార్యులకు, మరల నేకతమునకున్**
**రండు, విశేషము సెప్పెదఁ, బొం డొల్లనివారు కర్మపుంజముపాలై. 247**

* మిత్రులారా! మీ మీ పుస్తకాలు అన్నీ తెచ్చి గురువులకు ఇచ్చివేయండి. మరల ఏకాంతంగా కూర్చుందాం రండి. ఇంకా చాలా విశేషాలు బోధిస్తాను. అక్కరలేనివాళ్ళు వెళ్ళండి. మీ కర్మలను మీరు అనుభవించండి.

**క. ఆడుదము మనము, హరి రతిఁ, బాడుద మే ప్రొద్దు విష్ణుభద్రయశంబుల్,**
**వీడుదము దనుజసంగతిఁ, గూడుదము ముకుంద భక్తకోటిన్ సూటిన్. 248**

* మనం మనసు నిండా మాధవుణ్ణి నింపుకొని ఆడుకొందాం. ఎప్పుడూ హరి సంకీర్తనలనే పాడుకొందాం. మిగిలిన రాక్షసుల స్నేహం విడిచిపెడదాం. నిర్భయంగా విష్ణుభక్తులతో కలిసి పోదాం రండి.

**క. విత్తము సంసృతిపటలము, వ్రత్తము కామాది వైరి వర్గంబుల నేఁ**
**డిత్తము చిత్తము హరికిని, జొత్తము నిర్వాణపదము, శుభమగు మనకున్. 249**

* ఈ సంసారం అనే మాయాబంధాన్ని విడదీద్దాం. కామం, క్రోధం, లోభం, మోహం, మదం, మాత్సర్యం అనే శత్రువర్గాలను చీల్చి చెండాడుదాం. చిత్తమును శ్రీహరికి సమర్పణ చేద్దాం. కైవల్య పదాన్ని అందుకొందాం. మనకు తప్పకుండా శుభం కలుగుతుంది.

**వ. అని యిట్లు ప్రహ్లాదుండు రహస్యంబున న య్యావేళల రాక్షస కుమారులకు నపవర్గమార్గంబు నెఱింగించిన వారును గురుశిక్షితంబులైన చదువులు చాలించి నారాయణ భక్తి చిత్తంబులం గీలించి యుండుటం జూచి వారల యేకాంత భావంబుఁ దెలిసి వెఱచి వచ్చి శుక్రనందనుండు శక్రవైరి కిట్లనియె. 250**

* అని ఈ విధంగా ప్రహ్లాదుడు అనేక విధాలుగా అనుకూలమైన సమయాలలో రాక్షస కుమారులకు రహస్యంగా మోక్షమార్గం బోధించ సాగాడు. అప్పుడు వాళ్ళందరూ గురువుల దగ్గర తమ తమ చదువులు ఆపివేసి తమ హృదయాలను హృషీకేశుని వైపు మళ్ళించారు. వాళ్ళ గురువు ఇది గమనించి, శిష్యుల భావాలు తెలుసుకుని, భయపడి హిరణ్యకశిపుని వద్దకు వచ్చి ఇలా మొరపెట్టుకున్నాడు.

**శా. రక్షో బాలుర నెల్ల నీ కొడుకు చేరంజీరి లోలోన నా**
**శిక్షామార్గము లెల్లఁ గల్ల లని యాక్షేపించి తా నందఱన్**

**మోక్షాయత్తులఁ జేసినాఁడు, మనకున్ మోసంబు వాటిల్లె, నీ**
**దక్షత్వంబునఁ జక్కఁ జేయవలయున్ దైతేయవంశాగ్రణీ! 251**

* ఓ దైత్యకులావతంసా! నీ కుమారుడు రాక్షస కుమారులను అందరినీ రహస్య ప్రదేశాలకు తీసుకొని వెళ్ళి నేను చెప్పే చదువులన్నీ అబద్ధాలనీ ఆక్షేపించాడు. రాక్షస విద్యార్థుల కందరికీ మోక్షం గురించి బోధించాడు. మనకు తీరని ద్రోహం చేశాడు. మరి నీవు ఏం చేస్తావో! నీ కొడుకు దుడుకుతనం మితిమీరింది. పరిస్థితి చెయ్యి దాటిపోయేలాగా కన్పిస్తున్నది. ఇక నీ కొడుకును నీవే సమర్థతతో చక్కపెట్టుకోవాలి.

**క. ఉల్లసిత విష్ణుకథనము, లెల్లప్పుడు మాకుఁ జెప్పఁడీ గురుఁడని న**
**న్నుల్లంఘించి కుమారకు, లొల్లరు చదువంగ దానవోత్తమ! వింటే. 252**

* " ఈ గురువు మనకు మాధవుని కథలు మనోహరంగా చెప్పడు"అని శిష్యులు నా గురించి అనుకొంటూ నన్నూ, నా మాటలనూ లెక్కచేయటం మానివేశారు. నేను చెప్పిన చదువు చదవటం మానివేశారు. ఓ దానవోత్తమా! వింటున్నావుగదా! ఇదీ పరిస్థితి.

**క. ఉడుగఁడు మధురిపు కథనము, విడివడి జడుపగిదిఁ దిరుగు, వికసనమున నే**
**నొడివిన నొడువులు నొడువఁడు, దుడుకనిఁ జదివింప మాకు దుర్లభ మధిపా! 253**

* నీ కొడుకు మంచి మాటలు చెప్తే వినే బుద్ధిమంతుడు కాడు. ఎవరు ఎన్ని చెప్పినా చక్రపాణి గురించి చెప్పటం మానడు. ఎప్పుడూ మందమతిలాగా తిరుగుతూ ఉంటాడు. మనో వికాసం కోసం నేను చెప్పే మంచిమాటలు వినిపించుకోడు. ఇటువంటి దుడుకువాణ్ణి, దుండగీణ్ణి చదివించటం మా వల్లకాదు మహా ప్రభూ!

**క. చొక్కపు రక్కసి కులమున, వెక్కురు జన్మించినాఁడు విష్ణునియందున్**
**నిక్కపు మక్కువ విడువం, డెక్కడి సుతుఁగంటి? రాక్షసేశ్వర! వెట్టిన్ 254**

* రాక్షసేశ్వరా! చక్కని రక్కసి కులంలో ఈ పనికిమాలిన కొక్కిరాయి పుట్టాడు. వీనికి వైకుంఠుని వెఱ్ఱి పట్టింది. ఇది వదిలేలాగా కనిపించటం లేదు. వీడెక్కడి కొడుకు? ఇలాంటి బుద్ధిహీనుణ్ణి కన్నావేమయ్యా?

**వ. అని యిట్లు గురుసుతుండు చెప్పినఁ గొడుకువలని విరోధ వ్యవహారంబులు కర్ణరంధ్రంబులందు ఖడ్గ ప్రహారంబులయి సోఁకిన బిట్టు మిట్టిపడి పదాహతంబైన భుజంగంబు భంగిఁ, బవన ప్రేరితంబైన దవానలంబు చందంబున, దండతాడితం బయిన కంఠీరవంబు కైవడి, భీషణరోషరసావేశజాజ్వల్యమాన చిత్తుండును, బుత్రసంహారోద్యోగాయత్తుండును. గంపమాన గాత్రుండును, నరుణీకృత నేత్రుండును నై కొడుకును రప్పించి సమ్మాన కృత్యంబులఁ దప్పించి నిర్దయుండై యశనిసంకాశ భాషణంబుల నదల్చుచు. 255**

* అని చెప్పి బాధపడ్డాడు ప్రహ్లాదుని గురువు. తన కుమారుని విష్ణుభక్తి విషయాలు వినేటప్పటికి హిరణ్యకశిపునికి చెవులలో కత్తులు గ్రుచ్చినట్లు అనిపించింది. రాక్షసరాజు ఒక్కసారిగా ఉలిక్కిపడ్డాడు.

తోకత్రొక్కిన పాములాగా, గాలికి చెలరేగిన కార్చిచ్చులాగా, దెబ్బతిన్న సింహం లాగా భయంకరమైన కోపావేశంతో భగభగ మండిపోతున్నాడు. అతని శరీరం ఊగిపోయింది. కళ్ళు చింత నిప్పులయ్యాయి. అతడు కన్నకొడుకును సంహరించటానికి సిద్ధమయ్యాడు. వెంటనే ప్రహ్లాదుణ్ణి పిలిపించాడు. వచ్చిన రాజకుమారుణ్ణి ఆప్యాయతతో ఆదరించలేదు; పైగా కఠినాత్ముడై హిరణ్యకశిపుడు పిడుగులు కురిపించి వెరపించ సాగాడు.

**శా. సూనున్ శాంత గుణప్రధాను నతిసంశుద్ధాంచిత జ్ఞాను న**
**జ్ఞానారణ్య కృశాను నంజలిపుటీ సంభ్రాజమానున్ సదా**
**శ్రీనారాయణ పాదపద్మయుగళీ చింతామృతాస్వాదనా**
**ధీనున్ ధిక్కరణంబు సేసి పలికెన్ దేవాహితుం డుగ్రతన్.** **256**

* ఆ ప్రహ్లాదుడు మహాశాంతమూర్తి, మంచి గుణవంతుడూ. అజ్ఞానం అనే అరణ్యానికి అగ్నిలాంటివాడు. జ్ఞానమనే సంపదకు గనిలాంటివాడు. నిరంతరం కరములు మోడ్చి మనస్సులో పరంధాముని పాదపద్మాలనే ధ్యానించేవాడు. అటువంటి సకల సద్గుణ సంపన్నుడైన కుమారుణ్ణి ధిక్కరించి, కోపించి విబుధవిరోధి ఇలా విరుచుకు పడ్డాడు.

**సీ. అస్మదీయంబగు నాదేశమునఁ గాని మిక్కిలి రవి మింట మెఱయ వెఱచు,**
**నన్ని కాలములందు ననుకూలుఁడై కాని విద్వేషియై గాలి వీవ వెఱచు,**
**మత్ప్రతాపానల మందీకృతార్చి యై విచ్చలవిడి నగ్ని వెలుఁగ వెఱచు,**
**నతితీక్ష్ణమైన నా యాజ్ఞ నుల్లంఘించి శమనుండు ప్రాణులఁ జంప వెఱచు,**

**తే. నింద్రుఁ డొదల నా మ్రోల నెత్త వెఱచు, నమర కిన్నర గంధర్వ యక్ష విహగ**
**నాగ విద్యాధరావలి నాకు వెఱచు, నేల వెఱవవు? పలువ! నీ కేది దిక్కు?** **257**

* అర్భకా! నా ఆజ్ఞ లేకుండా ఆకాశంలో ఆదిత్యుడు కూడా అతిగా ప్రకాశించటానికి హడలి పోతాడు. వాయువు అన్ని కాలాలలోనూ అనుకూలంగానే ఆనందం కలిగేలాగా వీచాలి తప్ప ప్రతికూలంగా వీచటానికి భయపడిపోతాడు. అగ్నిహోత్రుడుకూడా నా ప్రతాపం అనే అగ్ని ముందు మందంగా వెలుగ వలసినదే కానీ దేదీప్యమానంగా దీపించటానికి సాహసించడు. కఠోరమైన నా ఆజ్ఞను కాదని యముడు కూడా ప్రాణికోటి ప్రాణాలు తీయటానికి కంపించి పోతాడు. దేవేంద్రునికి కూడా నా ఎదుట తల ఎత్తే ధైర్యం లేదు. దేవతలైనా, కిన్నరులైనా, యక్షులైనా, పక్షులైనా, నాగులైనా, గంధర్వులైనా, విద్యాధరులైనా నేనంటే భయపడి పారిపోవలసినదే. అటువంటిది నీవు ఇంతలేవు. నేనంటే నీకు భయమే లేదేమి? దుర్మార్గుడా! ఇక్కడ నీకు ఎవరురా దిక్కు? ఎవరి అండ చూసుకొని ఇంత మిడిసిపడి పోతున్నావు?

**శా. ప్రజ్ఞావంతులు లోకపాలకులు శుంభద్వేషు లయ్యున్ మదీ**
**యాజ్ఞాభంగము సేయనోడుదురు, రోషాపాంగదృష్టిన్ వివే**

**క జ్ఞానచ్యుతమై జగత్త్రితయముం గంపించు, నీ విట్టిచో**
**నాజ్ఞోల్లంఘన మెట్లు సేసితివి? సాహంకారతన్ దుర్మతీ!** 258

* ప్రతాపవంతులైన గొప్పగొప్ప దిక్పాలకులు నాకు శత్రువులైనా కూడా భయపడి నా మాట జవదాటరు. నేను కోపంతో కడకంట చూచానంటే వివేకం, విజ్ఞానం కోల్పోయి ముల్లోకాలూ అల్ల కల్లోలాలవుతాయి. అటువంటప్పుడు నీవు నా ఆజ్ఞను ఎలా ధిక్కరించ గలుగుతున్నావు? దుర్మతీ! నీ అహంకారం ఏమిటి?

**శా. కంఠక్షోభము గాఁగ నొత్తిలి మహాగాఢంబుగా డింభ! వై**
**కుంఠుం జెప్పెదు దుర్జయుం డనుచు, వైకుంఠుండు వీరవ్రతో**
**త్కంఠాబంధురుఁడేని నే నమరులన్ ఖండింప దండింపఁగాఁ**
**గుంఠీభూతుఁడు గాక రావలదె మద్ఘోరాహవక్షోణికిన్?** 259

* డింభకా! " జనార్దనుణ్ణి జయించటం సాధ్యం కాదు, కాదు"అని గొంతు తెగ చించుకుంటున్నావు. కానీ ఆ విష్ణువుకే పౌరుషం ఉంటే, అతడే అంతటి వీరుడైతే, నేను యుద్ధరంగంలో దేవతలను దండిస్తున్నప్పుడూ, ఖండిస్తున్నప్పుడూ భయపడకుండా నా ముందుకు రాలేదేం? ఆ విష్ణువు వచ్చి వాళ్ళను కాపాడలేదేం?

**శా. ఆచార్యోక్తము గాక బాలురకు మోక్షాసక్తిఁ బుట్టించి నీ**
**వాచాలత్వముఁ జూపి విష్ణు నహితున్ వర్ణించి మద్దైత్య వం**
**శాచారంబులు నీఱు సేసితివి, మూఢాత్ముం గులద్రోహి నిన్**
**నీచుం జంపుట మేలు, చంపి కులమున్ నిర్దోషముం జేసెదన్.** 260

* ఆచార్యులు చెప్పింది నీవు ఆలకించలేదు. పైగా నీతోడి బాలకులకు కైవల్యంమీద కాంక్ష పుట్టించావా? నీ వాచాలత్వం చూపించి విరోధిని విష్ణుని విపరీతంగా పిచ్చిమాటలతో పొగడుతావా? మన రాక్షసవంశ సంప్రదాయాలు అన్నీ బూడిదపాలు చేశావు. నీవు కుల ద్రోహివి, మూఢుడివి, నీచుడివి. నీవంటి వాణ్ణి చంపటం చాలా మంచిది. నిన్ను చంపి నా వంశానికి మచ్చ రాకుండా చేస్తాను.

**క. దిక్కులు గెలిచితి నన్నియు, దిక్కెవ్వఁడు రోరి నీకు దేవేంద్రాదుల్**
**దిక్కుల రాజులు వేఱొక, ది క్కెఱుఁగక కొలుతు రితఁడె దిక్కని నన్నున్.** 261

* ఓరీ! ఎవడురా నీకు దిక్కు? దిక్కుల నన్నిటినీ నేనే గెలిచాను కదా! దిక్కులను పరిపాలించే దేవేంద్రునిలాంటి వాళ్ళే ఏ దిక్కూ లేక ఇప్పుడు నన్నే దిక్కుగా తలచి మ్రొక్కుతున్నారు. నీకు కూడా నేను తప్ప వేరే దిక్కులేదని తెలుసుకో.

**క. బలవంతుఁడ నే జగముల, బలములతోఁ జనక వీరభావమున మహా**
**బలుల జయించితి, నెవ్వని, బలమున నాడెదవు నాకుఁ బ్రతివీరుఁడవై.** 262

* ముల్లోకాలలో నేనే బలశాలిని. సైన్యం లేకుండా నేను ఒక్కడినే ఏకైక వీరుడనై గొప్ప గొప్ప బలవంతులను జయించాను. నీవు ఎవడి బలం చూసుకుని నన్ను ఎదిరిస్తున్నావు? ఎవడి ధైర్యం చూసుకొని నాతో విరోధం పెట్టుకొన్నావు?

వ. అనినఁ దండ్రికి మెల్లన వినయంబునఁ గొడు కిట్లనియె. 263

* అని కోపంతో పలికిన తండ్రిని చూచి కొడుకు వినయంగా ఇలా అన్నాడు.

క. బలయుతులకు దుర్బలులకు, బల మెవ్వఁడు నీకు నాకు బ్రహ్మాదులకున్
బల మెవ్వఁడు ప్రాణులకును, బల మెవ్వం డట్టి విభుఁడు బల మసురేంద్రా! 264

* దానవేంద్రా! లోకంలో బలవంతులకూ, బలహీనులకూ ఎవడు బలమో నీకూ, నాకూ, బ్రహ్మాది దేవతలకూ ఎవడు బలమో; సమస్త ప్రాణికోటికీ ఎవడు బలమో ఆ పరాత్పరుడే నాకూ బలము.

క. దిక్కులు కాలముతో నే, దిక్కున లేకుండుఁ, గలుగు దిక్కుల మొదలై
దిక్కు గల లేని వారికి, ది క్కయ్యెడు వాఁడు నాకు దిక్కు మహాత్మా! 265

* మహాత్మా! దిక్కులకూ కాలానికీ అతీతుడైన వాడెవడో, దిక్కు లకు దిక్కైనవాడు ఎవడో, ఆధారం ఉన్నవాళ్ళకీ, ఆధారం లేనివాళ్ళకీ ఆధారం ఎవడో ఆ అచ్యుతుడే నాకు ఆధారం.

సీ. కాలరూపంబులఁ గ్రమ విశేషంబుల నలఘు గుణాశ్రయుం డయిన విభుఁడు
సత్త్వబలేంద్రియ సహజ ప్రభావాత్ముఁ డై వినోదంబున నఖిల జగముఁ
గల్పించు, రక్షించు, ఖండించు, నవ్యయుం డన్ని రూపములందు నతఁడు గలఁడు
చిత్తంబు సమముగాఁ జేయుము, మార్గంబుఁ దప్పి వర్తించు చిత్తంబుకంటె

తే. వైరు లెవ్వరు, చిత్తంబు వైరిగాక, చిత్తమును నీకు వశముగాఁ జేయవయ్య!
మదయుతాసురభావంబు మానవయ్య!, యయ్య నీ మ్రోల మేలాడరయ్య! జనులు. 266

* తండ్రీ! ఆ జనార్దనుడు జగత్పతి; కాలానుగుణంగా, వివిధ రూపాలతో వివిధ పద్ధతులతో ఆ విరాణ్మూర్తి విరాజిల్లుతుంటాడు. ఆ శౌరి సుగుణాలకు నిధి. ఆ చతుర్భుజుడు తన సత్త్వ బల పరాక్రమాల ప్రభావంతో వినోదంగా విశ్వాన్ని సృష్టిస్తూ, పోషిస్తూ, లయంచేస్తూ ఉంటాడు. ఆ స్వామి అవ్యయుడు. అన్ని రూపాలలోనూ అతడు ఉంటాడు. అయ్యా! మనస్సుకు సమదృష్టి సంపాదించుకో! ధర్మమార్గం నుంచి తప్పిన మనస్సుకంటె శత్రువు మరెవరు? మనస్సును విరోధం చేసుకొనక, వశం చేసుకో! అంతేకానీ చిత్తానికి నీవు 'చిత్తం, చిత్తం' అని దాస్యం చేయకూడదు. మదోన్మత్తమైన రాక్షస భావాన్ని విడిచి పెట్టు. నీకు భయపడి ఎవరూ నీ ఎదుట హితం పలకటం లేదు. అందరూ నీ మనస్సుకు ప్రియమైనదే చెబుతున్నారు కానీ హితమైనది చెప్పటం లేదు.

ఉ. లోకము లన్నియున్ గడియలోన జయించినవాఁడ, వింద్రియా
నీకముఁ జిత్తమున్ గెలువ నేరవు! నిన్ను నిబద్ధుఁ జేయు నీ
భీకరశత్రు లార్వురఁ బ్రభిన్నులఁ జేసినఁ బ్రాణికోటిలో
నీకు విరోధి లేఁడొకఁడు, నేర్పునఁ జూడుము దానవేశ్వరా! 267

* దానవేశ్వరా! లోకాలన్నీ క్షణంలో జయించావు. కానీ నీలోని మనస్సునూ, ఇంద్రియాలనూ గెలువలేక పోయావు. వాటిముందు నీవు ఓడిపోయావు. నిన్ను కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలనే ఆ ఆరుగురు శత్రువులు బందీ చేశారు. ఆ భయంకర శత్రువులను జయించి నశింపజేసినట్లయితే ప్రాణికోటిలో నీకు విరోధి ఎవ్వడూ ఉండడు. నా విన్నపం మన్నించు.

**క. పాలింపుము శేముషి, ను, న్మూలింపుము కర్మబంధముల, సమదృష్టిం**
**జాలింపుము సంసారముఁ, గీలింపుము హృదయమందుఁ గేశవభక్తిన్.** 268

* తండ్రీ! మంచిమనస్సుతో మరొకసారి ఆలోచించు. కర్మబంధాలను త్రెంచివేయి. భేదభావం లేకుండా చక్కని సమదృష్టి అలవరచుకో. సంసార మోహాన్ని తొలగించుకో. నిరంతరం మనసంతా మాధవునిపై లగ్నం చెయ్యి.

**వ. అనినఁ బరమభాగవత శేఖరునకు దోషాచరశేఖరుం డిట్లనియె.** 269

* అని పలికిన పరమభక్త శిఖామణిని చూసి నక్తంచర శిఖామణి ఇలా హుంకరించాడు.

**క. చంపినఁ జచ్చెద నను చును, గంపింపక యోరి పలువ! కఠినోక్తుల నన్**
**గుంపించెదు, చావునకుం, దెంపరివై వదరువాని తెఱఁగునఁ గుమతీ!** 270

* కుమతీ! చావుకు తెగించావు. చంపుతారనీ కానీ, చచ్చిపోతానని కానీ భయం లేకుండా పోయింది. దుర్మార్గుడా! కర్ణకఠోరమైన మాటలను ఈటెలుగా నా మీదనే విసరుతున్నావు. చావును కూడా లెక్కచేయకుండా మితిమీరి మాట్లాడుతున్నావు.

**శా. నాతోడం బ్రతిభాష లాడెదు, జగన్నాథుండు నా కంటె నీ**
**భూతశ్రేణికి రాజు లేఁ డొకఁడు సంపూర్ణ ప్రభావుండు, మ**
**ద్భ్రాతం జంపిన మున్ను నే వెదకితిం బల్మాఱు నారాయణుం**
**డేతద్విశ్వములోన లేఁడు, మఱి వాఁడెం దుండురా? దుర్మతీ!** 271

* దుర్మతీ! నాతోనే ఎదురుతిరిగి వాదనకు పూనుకున్నావు. ఈ జగమునకు అధిపతిని, నేను తప్ప మరొకడు లేడు. నేనే జగన్నాథుణ్ణి. నేను కాక ఈ జీవకోటికి సంపూర్ణశక్తిమంతుడైన మరొక రాజు లేడు. నా సోదరుడైన హిరణ్యాక్షుణ్ణి చంపినపుడు కేశవుని కోసం అనేక పర్యాయాలు అన్వేషించాను. విశ్వం అంతా గాలించాను. కానీ ఆ విష్ణువు ఈ విశ్వం మొత్తంలో ఎక్కడా లేడు. మరి ఈ పిరికివాడు ఇంకెక్కడ ఉంటాడు?

**క. ఎక్కడఁ గలఁ? డే క్రియ నే, చక్కటి వర్తించు? నెట్టి జాడను వచ్చున్?**
**జక్కడుతు నిన్ను విష్ణునిఁ, బెక్కులు ప్రేలెదవు వాని భృత్యుని పగిదిన్.** 272

* విష్ణు వెక్కడ ఉంటాడు? ఏ విధంగా ఉంటాడు? ఏ రీతిగా తిరుగుతుంటాడు? ఏ పద్ధతిలో వస్తుంటాడు? చెప్పు. లేకపోతే నిన్నూ, నీ హరినీ కూడా సంహరిస్తాను. నీవు వాడి సేవకుడిలాగా తెగపొగడుతున్నావు. ముందు సమాధానం చెప్పు.

**వ. అనిన హరికింకరుండు శంకింపక హర్షపులకాంకుర సంకలిత విగ్రహుండై యాగ్రహంబు లేక హృదయంబున హరిం దలంచి నమస్కరించి బాలవర్తనంబున నర్తనంబు సేయుచు నిట్లనియె. 273**

* అని తండ్రి గద్దించగా హరిభక్తుడైన ప్రహ్లాదుడు సందేహించలేదు. అమితమైన ఆనందంతో నిలువెల్లా పులకించిపోయాడు. ఆవంత కూడా ఆగ్రహం లేకుండా హృదయంలో హృషీకేశుణ్ణి తలచుకుని నమస్కరించాడు. ఆ బాలుడు అత్యంత విశ్వాసంతో నృత్యం చేస్తూ ఇలా పలికాడు.

**మ. కలఁడంభోధిఁ, గలండు గాలిఁ, గలఁడాకాశంబునం, గుంభినిం**
**గలఁ, డగ్నిన్ దిశలం బగళ్ళ నిశలన్ ఖద్యోత చంద్రాత్మలం**
**గల, డోంకారమునం ద్రిమూర్తులఁ ద్రిలింగవ్యక్తులం దంతటం**
**గలఁ, డీశుండు గలండు, తండ్రి! వెదకంగా నేల నీ యా యెడన్. 274**

* తండ్రీ! భగవంతుడైన విష్ణువు లేనిచోటు విశ్వములో లేదు. సముద్రంలో ఉన్నాడు. సమీపంలో ఉన్నాడు. ఆకాశంలో ఉన్నాడు. అవనిమీద ఉన్నాడు. అగ్నిలో ఉన్నాడు. అన్నిదిశలలోనూ ఉన్నాడు. రాత్రిలో ఉన్నాడు. పగటిలో ఉన్నాడు. సూర్యునిలో ఉన్నాడు. చంద్రునిలో ఉన్నాడు. ఓం కారంలో ఉన్నాడు. శ్రీకారంలో ఉన్నాడు. త్రిమూర్తులలో ఉన్నాడు. స్త్రీపురుష నపుంసక వ్యక్తులలో ఉన్నాడు. అక్కడా ఇక్కడా వెతకటం దేనికి? సర్వేశ్వరుడు ఒకచోట అని ఏమిటి? అంతటా నిండి ఉన్నాడు.

**క. ఇందుఁ గలఁ డందు లేఁడని, సందేహము వలదు, చక్రి సర్వోపగతుం,**
**డెం దెందు వెదకి చూచిన, నందందే కలఁడు, దానవాగ్రణి! వింటే. 275**

* దానవ సార్వభౌమా? ఆ భగవంతుడు ఒకచోట ఉన్నాడనీ, మరొకచోట లేడనీ సందేహించవద్దు. అచ్యుతుడు అన్ని ప్రదేశాలలోనూ ఉంటాడు. ఆ పద్మనాభుడు అన్ని పదార్థాలలోనూ ఉంటాడు. ఎక్కడెక్కడ వెతికితే అక్కడక్కడ కన్పిస్తాడు. నా మాట నమ్ము.

**వ. అని యి వ్విధంబున. 276**

**మ. 'హరి సర్వాకృతులం గలం' డనుచుఁ బ్రహ్లాదుండు భాషింప స**
**త్వరుఁడై 'యెందును లేఁడు లేఁ'డని సుతున్ దైత్యుండు తర్జింప శ్రీ**
**నరసింహాకృతి నుండె నచ్యుతుఁడు నానాజంగమస్థావరో**
**త్కరగర్భంబుల నన్ని దేశముల నుద్దండ ప్రభావంబునన్. 277**

* అని ఈ విధంగా అచ్యుతుడు అన్ని రూపాలలో ఉన్నాడూ ఉన్నాడూ - అని ప్రహ్లాదుడు వాదించాడు. శ్రీహరి ఎక్కడా లేడూ, లేడూ అని హిరణ్య కశిపుడు గద్దించాడు. ఒకరి కొకరు తగ్గటం లేదు. పట్టుదలలు

పెరిగిపోయాయి. తండ్రి కొడుకును దారుణంగా బెదిరిస్తున్నాడు. గర్జిస్తున్నాడు. అప్పుడు శ్రీ విష్ణువు "శ్రీనరసింహ" స్వరూపంలో సమస్త చరా చర జీవ వస్తుజాలములలో ప్రపంచమంతా నిండి ఉన్నాడు. దివ్య ప్రభావంతో అన్ని ప్రదేశాలలో, అన్ని వస్తువులలో అణువు అణువునా అచ్యుతుడు నరసింహమూర్తి ఆకారంతో ఆవరించి ఉన్నాడు.

**వ. అయ్యవసరంబున న ద్దానవేంద్రుండు. 278**

* ఆ సమయంలో హిరణ్యకశిపుడు ఇలా హుంకరించాడు.

**క. డింభక! సర్వస్థలముల, నంభోరుహ నేత్రుఁ డుండు ననుచు మిగుల సం**
**రంభంబునఁ బలికెద వీ, స్తంభంబునఁ జూపఁ గలవె? చక్రిన్ గిక్రిన్. 279**

* ఓరీ డింభకా! ఆ హరి అన్నిచోట్లా, అన్నింటిలోనూ ఉన్నాడని గొప్పగా గొంతు చించుకుంటున్నావే అయితే ఈ స్తంభంలో చూపగలవా ఆ చక్రినీ గిక్రినీ?

**క. స్తంభమునఁ జూపవేనియుఁ, గుంభిని నీ శిరముఁ ద్రుంచి కూల్పఁగ రక్షా**
**రంభమున వచ్చి హరి వి, స్రంభంబున నడ్డపడఁగ శక్తుం డగునే. 280**

* ఈ స్తంభంలో చక్రిని చూపకపోతే నీ తల త్రుంచి వేస్తాను. అప్పుడు నిన్ను రక్షించటానికి ఆ అంబుజాక్షుడు వచ్చి అడ్డుపడతాడా? నాకు అడ్డురాగలిగినంతటి శక్తిమంతుడా వాడు?

**వ. అనిన భక్తవత్సలుని భటుం డి ట్లనియె. 281**

* అని తండ్రి పెద్దగా గద్దించినపుడు భక్తవత్సలుని భక్తుడైన ప్రహ్లాదుడు ఇలా పలికాడు.

**శా. 'అంభోజాసనుఁ డాదిగాఁగఁ దృణపర్యంతంబు విశ్వాత్ముఁడై**
**సంభావంబున నుండు ప్రోడ విపుల స్తంభంబునం దుండఁడే?**
**స్తంభాంతర్గతుఁడయ్యు నుండుటకు నే సందేహమున్ లేదు, ని**
**ర్దంభత్వంబున నేఁడు గానఁబడుఁ బ్రత్యక్షస్వరూపంబునన్'. 282**

* పరంధాముడు బ్రహ్మదగ్గర నుంచి గడ్డిపరక దాకా అన్ని వస్తువులలోనూ సమస్త ప్రపంచంలో నిండి ఉన్నాడు. అటువంటప్పుడు ఇంత పెద్ద స్తంభంలో ఎందు కుండడు? తండ్రీ! ఈ స్తంభంలో సర్వేశ్వరుడు ఉన్నాడు అనటానికి ఎటువంటి అనుమానమూ లేదు. నిస్సదేహంగా ఉన్నాడు. కావాలంటే ఇపుడు పరమాత్మ ప్రత్యక్షంగా కనిపిస్తాడు కూడా.

**వ. అనిన విని కరాళించి గ్రద్దన లేచి గద్దియ డిగ్గనుఱికి యొఱఁ బెట్టిన ఖడ్గంబు పెఱికి కేల నమర్చి జళిపించుచు మహాభాగవత శిఖామణి యైన ప్రహ్లాదుని ధిక్కరించుచు. 283**

* అని పలికే సరికి హిరణ్యకశిపుడు ఒక్కసారిగా వికటాట్టహాసం చేసి, చివాలున లేచి సింహాసనం దిగి పరుగున వచ్చి ఒరలో ఉన్న ఖడ్గాన్ని లాగి ఝళిపించి భక్తశేఖరుడైన ప్రహ్లాదుని భయపెడుతూ ధిక్కరించి ఇలా గర్జించాడు.

మ. వినరా! డింభక! మూఢచిత్త! గరిమన్ విష్ణుండు విశ్వాత్మకుం
డని భాషించెద, వైన నిందుఁ గలఁడే యంచున్ మదోద్రేకియై
దనుజేంద్రుం డఱచేత వ్రేసెను మహోదగ్ర ప్రభాశుంభమున్
జనదృగ్భీషణదంభమున్ హరిజనుస్సంరంభమున్ స్తంభమున్. 284

* "డింభకా! మూర్ఖా! వినరా! విష్ణువును గొప్పగా విశ్వాత్మకుడని అంటున్నావు. అయితే ఇందులో ఉన్నాడా?"అని మదోన్మత్తుడై ఆవేశంతో అసురచక్రవర్తి హిరణ్యకశిపుడు అరచేతితో భయంకరమైన కాంతులు వెదజల్లుతూ, జీవకోటికి చూడ శక్యం కాకుండా, శ్రీ నరసింహ స్వామి ఆవిర్భావానికి సంరంభం పడుతున్న ఆ స్తంభాన్ని బలంగా కొట్టాడు.

## -: శ్రీహరి నరసింహరూపంబున స్తంభంబునం దావిర్భవించుట. :-

వ. ఇట్లు దానవేంద్రుండు పరిగృహ్యమాణ వైరుండును, వైరానుబంధ జాజ్వల్యమాన రోషానలుండును, రోషానల జంఘన్యమాన విజ్ఞాన వినయుండును, వినయ గాంభీర్య ధైర్య జేగీయమాన హృదయుం డును, హృదయచాంచల్యమాన తామసుండును, దామసగుణచంక్రమ్యమాణ స్థైర్యుండును నై విస్రంభంబున హుంకరించి బాలుని ధిక్కరించి హరి నిందుఁజూపు మని కనత్కనక మణిమయ కంకణ క్రేంకార శబ్దపూర్వకంబుగా దిగ్దంతి దంత భేదన పాటవ ప్రశస్తంబగు హస్తంబున సభామండప స్తంభంబు వ్రేసిన వ్రేటుతోడన దశదిశలను మిడుంగుఱులు చెదఱం జిటిలి పెటిలిపడి బంభజ్యమానం బగు నమ్మహా స్తంభంబు వలనఁ బ్రళయ వేళా సంభూత సప్తస్కంధ బంధుర సమీరణ సంఘటిత ఘోరజోఘుష్యమాణ మహావలాహక వర్గ నిర్గత నిబిడ నిష్ఠుర దుస్సహ నిర్ఘాత సంఘ నిర్ఘోషనికాశం బులైన ఛటచ్ఛట స్ఫటస్ఫట ధ్వని ప్రముఖ భయంకరారావ పుంజంబులు జంజన్య మానంబులయి యెగసి యాకాశ కుహరాంతరాళంబు నిరవకాశంబు సేసి నిండినం బట్టు సాలక దోదూయమాన హృదయంబులయి పరవశంబులయి పితామహ మహేంద్ర వరుణ వాయు శిఖి ప్రముఖ చరాచర జంతుజాలంబుల తోడ బ్రహ్మాండ కటాహంబు పగిలి పరిస్ఫోటితంబుగాఁ, బ్రఫుల్ల పద్మయుగళ సంకాశ భాసురచక్ర చాప హల కులిశ అంకుశ జలచర రేఖాంకిత చారుచరణ తలుండును, జరణ చంక్రమణఘనవినమిత విశ్వ విశ్వంభరాభార ధౌరేయ దిక్కుంభి కుంభీనస కుంభినీధర కూర్మ కులశేఖరుండును, దుగ్ధజలధిజాత శుండాల శుండాదండ మండిత ప్రకాండ ప్రచండమహోరు స్తంభ యుగళుండును, ఘణ ఘణాయమాన మణి కింకిణీగణ ముఖరిత మేఖలావలయ వలయిత పీతాంబర శోభిత కటి ప్రదేశుండును, నిర్జరనిమ్నగావర్తవర్తుల కమలాకర గంభీరనాభి వివరుండును, ముష్టిపరిమేయ వినుత తనుతర స్నిగ్ధమధ్యుండును, గులాచలసాను భాగ సదృశ కర్కశ విశాల వక్షుండును, దుర్జన దనుజభట ధైర్య లతికా లవిత్రాయమాణ రక్షోరాజ వక్షోభాగ విశంకట క్షేత్ర విలేఖన చుంచులాంగలాయమాన ప్రతాప జ్వలన జ్వాలాయమాన శరణాగత నయన చోకర చంద్ర రేఖాయమాణ వజ్రాయుధ ప్రతిమాన భాసమాన నిశాతనఖరతర ముఖ నఖరుండును, శంఖ చక్ర గదా ఖడ్గ కుంత తోమర ప్రముఖ నానాయుధ మహిత మహోత్తుంగ మహీధరశృంగ సన్నిభ వీర

సాగర వేలాయమాన మాలికా విరాజమాన నిరర్గళానేకనత భుజార్గళుండును, మంజు మంజీర మణిపుంజ రంజిత మంజుల హార కేయూర కంకణ కిరీట మకర కుండలాది భూషణ భూషితుండును, త్రివళీయుత శిఖరిశిఖరాభ పరిణద్ధ బంధుర కంధరుండును, ప్రకంపన కంపిత పారిజాత పాదపల్లవ ప్రతీకాశ కోపావేశ సంచలితాధరుండును, శరత్కాల మేఘజాలమధ్య ధగద్ధగాయమాన తటిల్లతా సమాన దేదీప్యమాన దంష్ట్రాంకురుండును, గల్పాంతకాల సకల భువన గ్రసన విలసన విజృంభమాణ సప్తజిహ్వా జిహ్వాతులిత తరలతరాయమాణ విభ్రాజమాన జిహ్వుండును, మేరు మందర మహాగుహాంతరాళ విస్తార విపులవక్త్ర నాసికా వివరుండును, నాసికావివర నిస్సరన్నిబిడ నిశ్వాస నికర సంఘట్టన సంక్షోభిత సంతప్యమాన సప్త సాగరుండును, బూర్వపర్వత విద్యోతమాన ఖద్యోతమండల సదృక్ష సమంచిత లోచనుండును, లోచనాంచల సముత్కీర్యమాణ విలోల కీలాభీల విస్ఫులింగ వితాన రోరుధ్యమాన తారకాగ్రహ మండలుండును, శక్రచాప సురుచిరోదగ్ర మహా భ్రూలతాబంధ బంధుర భయంకర వదనుండును, ఘనతర గండశైలతుల్య కమనీయ గండభాగుండును, సంధ్యారాగ రక్త ధారాధర మాలికా ప్రతిమ మహాభ్రంకష తంతన్యమాన పటుతర సటాజాలుండును, సటాజాలసంచాలన సంజాతవాత డోలాయమాన వైమానిక విమానుండును, నిష్కంపిత శంఖవర్ణ మహోర్ధ్వకర్ణుండును, మంథదండాయమాన మందర వసుంధరాధర పరిభ్రమణ వేగ సముత్పద్యమాన వియన్మండల మండిత సుధారాశి కల్లోల శీకరాకార భాసుర కేసరుండును, బర్వాఖర్వ శిశిరకిరణ మయూఖగౌర తనూరుహుండును, నిజ గర్జానినాద నిర్దళిత కుముద సుప్రతీక వామ నైరావణ సార్వభౌమ ప్రముఖ దిగిభరాజ కర్ణ కోటరుండును, ధవళ ధరాధర దీర్ఘ దురవలోకనీయ దేహుండును, దేహ ప్రభాపటల నిర్మథ్యమాన పరిపంథి యాతుధాన నికురుంబ గర్వాంధ కారుండును, బ్రహ్లాద హిరణ్యకశిపురంజన భంజన నిమిత్తాంతరంగ బహిరంగ జేగీయమాన కరుణా వీర రస సంయుతుండును, మహాప్రభావుండును నయిన శ్రీ నృసింహదేవుం డావిర్భవించినం గనుంగొని. 285

* ఈ విధంగా హిరణ్యకశిపుడు శ్రీహరితో శత్రుత్వం పూనాడు. శత్రుత్వంవల్ల అతని మనస్సులో రోషం అనే అగ్ని భగభగమండింది. ఆ రోషాగ్ని జ్వాలలు చెలరేగి అతనిలోని విజ్ఞానమునూ, వినయమునూ కాల్చివేశాయి. ధైర్యగాంభీర్యాల వల్ల అతని హృదయం ధగ ధగ మెరిసింది. హృదయ చాంచల్యంవల్ల తామస గుణం విజృంభించింది. ఆ తామస గుణంవల్ల అతని స్థైర్యం చిందులు త్రొక్కసాగింది. పట్టలేని ఆవేశంతో హిరణ్యకశిపుడు హుంకరించి ప్రహ్లాదుణ్ణి ధిక్కరించాడు. “ఇందులో హరిని చూపరా”అని అరచేతితో సభామంటప స్తంభాన్ని బలంగా చరిచాడు విష్ణు విరోధి. ఆ దెబ్బకు ఆతని చేతి బంగారు మణి మయ కంకణాలు గణగణ ధ్వనించాయి. ఆ దానవేంద్రుడు దిగ్గజాల దంతాలు విరిచి వేయగలిగిన తన హస్తంతో స్తంభాన్ని కొట్టేటప్పటికి ఆ దెబ్బకి పది దిక్కులా విస్ఫులింగాలు విరజిమ్ముతూ చిటిలి పెటిలి ఆ మహాస్తంభం ఫెళఫెళమని భయంకర ధ్వనులు చేసింది. కల్పాంత కాలంలో అతి తీవ్రమైన వేగంతో వీచే సప్త మహా వాయువుల ఒత్తిడివల్ల ఉరుములతో ఉరకలువేసే భయంకర ప్రళయ మేఘాలు వర్షించే పిడుగుల ధ్వనులవంటి. “ఛటఛట ఫటఫట”రవాలు విపరీతంగా పైకి ఎగసి ఆకాశమంతా నిండి కర్ణకఠోరంగా వినిపించసాగాయి.

బ్రహ్మ, ఇంద్రుడూ, వరుణుడూ, వాయువూ, అగ్ని మున్నగు దేవతలతో, సమస్త జంతుజాలంతో ఈ బ్రహ్మాండభాండం గుండెలవిసి ఒక్కసారి ఫెఫేలున పగిలినట్లయింది. స్తంభం ఛిన్నాభిన్నమయింది. అందులో నుంచి దేదీప్యమానమైన దివ్యతేజస్సుతో నరసింహదేవుడు ఆవిర్భవించాడు.

ఆ నరసింహస్వామి పాదాలు - చక్రం, చాపం, నాగలి, వజ్రాయుధం, మీనంవంటి శుభరేఖలతో నిండి వికసించిన పద్మాల వలె ప్రకాశిస్తున్నాయి. ఆ స్వామి పాదాలు కదలుతూంటే ఆ భారానికి భూమిని మోసే అష్టదిగ్గజాలూ, ఆదిశేషుడూ, కులపర్వతాలూ, కూర్మరాజూ అణిగి మణిగిపోతున్నారు.

ఆ ఉగ్రమూర్తి ఊరువులు క్షీరసముద్రంలో పుట్టిన ఐరావతం తొండాలలాగా బలిసి బలవత్తరంగా ఉన్నాయి. మణులు చెక్కిన మువ్వల ఒడ్డాణం. పీతాంబరం ధరించిన ఆ స్వామి నడుంచుట్టూ తిరిగి ఘణఘణమని మ్రోగుతున్నది. ఆ స్వామి నాభి ఆకాశగంగా నదిలో సుళ్ళు తిరుగుతున్న సరస్సులాగా గంభీరంగా ఉంది. ఆ నరసింహుని నడుము పిడికిటిలో ఇమిడేటంతగా ఉండి నిగనిగ మెరుస్తున్నది. ఆయన వక్షస్థలం పెద్ద కొండచరియవలె అతికఠినమై, విశాలమై ప్రకాశిస్తున్నది.

ఆ భీకరాకారుని వాడితేలి వంకరలు తిరిగిన గోళ్ళు, రాక్షససేనల ధైర్యలతలను తెగకోసే కొడవళ్ళవలె ఉన్నాయి. రాక్షసరాజుల బండ బారిన గుండె పొలాలను దున్నే పదునైన నాగళ్ళు ఆ గోళ్ళు. శత్రువుల కళ్ళకి మిరుమిట్లు గొలిపే మంటలు మండుతున్న నెగళ్ళు ఆ గోళ్ళు. అయినా అవి శరణాగతులైన భక్తుల నేత్రాలకు మాత్రం చకోరాలకు చంద్రరేఖలలాగా అందంగా కనిపిస్తున్నాయి. ఆ గోళ్ళు గోళ్ళు కావు, వజ్రాయుధాలు.

మహోన్నత పర్వత శిఖరాలవంటి ఆ స్వామి బాహువులు శంఖ, చక్ర, గదా, ఖడ్గ, కుంత, తోమరాది వివిధ ఆయుధాలతో నిండి ఉన్నాయి. అసంఖ్యాకములైన ఆ బాహువులు వీరరసం అనే సాగరానికి చెలియలికట్టలవలె ఉన్నాయి. అనేక పుష్పమాలికలతో విరాజిల్లుతున్నాయి. కాంతులీనే కాలి కడియాలు మణిఖచితములై విరాజిల్లుతున్న మనోహరమైన హారాలు, భుజకీర్తులు, కంకణాలు, మకర కుండలాలు, కిరీటం వంటి వివిధ ఆభరణాలతో స్వామి ధగధగ మెరిసిపోతున్నాడు. ఆ ప్రభువు కంఠం మూడు రేఖలతో ప్రకాశిస్తూ, పర్వత శిఖరంలాగా దృఢంగా ఉంది.

ఆ దేవుని కెమ్మోవి గాలికి కదలే పారిజాత పల్లవంలాగా రాగరంజితమై, కోపావేశంచేత చలించి పోతున్నది. శరత్కాలంలో మేఘమాల మధ్య మెరిసే మెరుపు తీగల్లాగా ఆ నరసింహస్వామి కోరలు తళతళలాడుతున్నాయి. ప్రళయకాలంలో సమస్త లోకాలను కబళించి వేయటానికి పరాక్రమించే అగ్ని జ్వాల లాగా ఆ స్వామి నాలుక ఎర్రగా భయం కలిగిస్తున్నది. ఆ ఉగ్రమూర్తి నోరు, నాసికారంధ్రాలు మేరుమందర పర్వతాల గుహలలాగా విస్తారమై ఉన్నాయి. ఆ నాసికారంధ్రాల నుంచి వచ్చే వేడి వేడి నిట్టూర్పులకు తట్టుకోలేక సప్తసాగరాలు అల్లకల్లోలమై సల సల కాగుతున్నాయి. ఆ ప్రభువు కళ్ళల్లో తూర్పుకొండపై ప్రకాశిస్తున్న సూర్యమండల కాంతులు తేజరిల్లుతున్నాయి. ఆ నేత్రాల అంచులు

విరజిమ్ముతున్న విస్ఫులింగాలవల్ల గ్రహమండలాలు, నక్షత్ర మండలాలు కకావికలై క్రిందుమీదు అవుతున్నాయి.

ఇంద్రధనుస్సుల వలె వంగి ఉన్న ఆ స్వామి కనుబొమలు ముడిపడి ముఖం భయంకరంగా ఉంది. ఆయన చిక్కని చెక్కిళ్ళు గండ శిలలలాగా అతికఠినంగానూ, అయినా కమనీయంగానూ ఉన్నాయి. ఆ స్వామి దీర్ఘమైన జడలు సంధ్యాసమయంలో ఎఱ్ఱబడిన మేఘమాలికలలాగా మెరుస్తున్నాయి. ఆ జడలను అటునిటు విదల్చటం వల్ల పుట్టిన వాయువు వేగం వల్ల ఆకాశంలో ప్రయాణిస్తున్న విమానాలు వైమానికులతో సహా ఉయ్యాల లూగుతున్నాయి. ఆయన చెవులు నిశ్చలములై శంఖాలలాగా స్వచ్ఛంగా ఉన్నాయి. మందర పర్వతాన్ని కవ్వంగా చేసి పాలసముద్రమును చిలికేటప్పుడు గిరగిర తిరుగుతున్న ఆ గిరి వేగానికి ఆకాశమంతా ఆవరించిన తరంగ శీకరాలవలె ఆ ప్రభువు కేసరాలు భాసిల్లుతున్నాయి. ఆ స్వామి శరీరం మీది రోమరాజి సంపూర్ణపూర్ణిమా చంద్రుని వెన్నెలకిరణాల వలె వెలుగుతూ ఉన్నాయి.

ఆ నరసింహస్వామి సింహగర్జనకు కుముదము, సుప్రతీకము, వామనము, ఐరావణము, సార్వభౌమము మొదలైన గొప్పగొప్ప దిగ్గజాల చెవులు పగిలిపోతున్నాయి. ఆ దేవుని తెల్లనిదేహం వెండికొండలాగా ప్రకాశిస్తూ, చూడటానికి శక్యంకాని విశేష కాంతితో వెలుగుతూ ఉంది. ఆ శరీరకాంతులు శత్రువులైన రాక్షసుల గర్వాంధకారాన్ని చీల్చి వేస్తున్నాయి. ఆ నరసింహస్వామి ఆకారం ప్రహ్లాదునికి సంతోష కారణంగా ఉంది. హిరణ్యకశిపునికి సంతాప కారణంగా ఉంది. ఆ నరకేసరి అంతరంగం కరుణా రసంతోనూ, బహిరంగం వీరరసంతోనూ విరాజిల్లుతూ ఉన్నాయి. దివ్యప్రభావ సంపన్నుడైన శ్రీ నరసింహస్వామి ఈ విధంగా సభాస్తంభం మధ్యంనుంచి ఆవిర్భవించాడు. అద్భుతమైన ఈ దృశ్యం చూచి హిరణ్యకశిపుడు నిశ్చేష్టుడై ఇలా అనుకున్నాడు -

**క. నరమూర్తి గాదు, కేవల, హరిమూర్తి యుఁ గాఁదు మానవాకారముఁ గే**
**సరియాకారము నున్నది, హరిమాయారచితమగు యథార్థము చూడన్. 286**

* ఇది నరరూపమూ కాదు, సింహ రూపమూ కాదు. యథార్థంగా ఇది మానవాకారం, సింహాకారం రెండూ కలిసి ఏర్పడిన శ్రీహరి మాయారూపం. లేకపోతే ఇటువంటిరూపం ఎక్కడైనా ఉంటుందా?

**ఉ. తెంపున బాలుఁ డాడిన సుధీరత సర్వగతత్వముం బ్రతి**
**ష్ఠింపఁ దలంచి యిందు నరసింహ శరీరముఁ దాల్చి చక్రి శి**
**క్షింపఁగ వచ్చినాఁడు హరిచే మృతియంచుఁ దలంతు నైన నా**
**సొంపును బెంపు నందఱును జూడఁ జరింతు, హరింతు శత్రువున్. 287**

* సాహసంతో బాలుడు పలికిన మాటను నిలబెట్టటానికీ, తాను సర్వాత్మకుడనని నిరూపించటానికీ హరి ఈ నరసింహరూపం ధరించి నన్ను శిక్షించటానికే వచ్చాడు. ఇక శ్రీహరి చేతిలో నా మృత్యువు తప్పదు. అయినా ఇందరి ఎదుట నా బలపరాక్రమాలు ప్రదర్శిస్తాను. శత్రు సంహారం చేస్తాను. విజయం సాధిస్తాను.

## -: నృసింహమూర్తి హిరణ్యకశిపుతోఁ బోరి వధించుట :-

వ. అని మెత్తంబడని చిత్తంబున గద నెత్తికొని తత్తఱంబున నార్చుచు నకుంఠిత కంఠీరవంబు డగ్గఱు గంధసింధురంబు చందంబున నక్తంచర కుంజరుండు నరసింహదేవున కెదురు నడచి తదీయ దివ్యతేజోజాల సన్నికర్షంబునం జేసి దవానలంబు డగ్గఱిన ఖద్యోతంబునుం బోలెఁ గర్తవ్యాకర్తవ్యంబులు దెలియక నిర్గత ప్రభుండయి యుండె, నప్పుడు. 288

* అని భావించి హిరణ్యకశిపుడు వెనుకంజ వేయకుండా మనోధైర్యం తెచ్చుకున్నాడు. గద ఎత్తి తొట్రుపాటుతో అరుస్తూ ముందుకు వస్తున్నాడు. మృగరాజును సమీపించే మదగజం లాగా రాక్షసేశ్వరుడు నరసింహస్వామికి ఎదురు నడిచాడు. ఆ దేవదేవుని దివ్యకాంతి సమూహాల ముందు హిరణ్యాకశిపుడు దావానలం ముందు మిణుగురు పురుగులాగా ఉన్నాడు. కర్తవ్యాకర్తవ్యాలను మరచిపోయాడు. తన తేజస్సును కోల్పోయాడు.

మ. ప్రకటంబై ప్రళయావసానమున మున్ బ్రహ్మాండభాండావరో
ధకమై యున్న తమిస్రమున్ జగము నుత్పాదించుచోఁ ద్రావి సా
త్త్విక తేజోనిధియైన విష్ణునెడ నుద్దీపించునే? నష్టమై
వికలంబై చెడుఁగాక తామసుల ప్రావీణ్యంబు రాజోత్తమా! 289

* ధర్మరాజా! పూర్వం ప్రళయకాలంలో ఈ బ్రహ్మాండం మొత్తానికీ అవరోధకంగా గాఢమైన చీకట్లు క్రమ్మి లోకం నాశనం కాబోతున్నపుడు ఆ అంధకారాన్ని ఆపోశన పట్టి తేజోమూర్తి అయ్యాడు. విష్ణువు. అటువంటి శ్రీ మహావిష్ణువు ముందు ఈ తామసుల పరాక్రమం పటా పంచలు కాక ప్రకాశించుతుందా?

వ. అంత నద్దానవేంద్రుండు మహోద్దండంబగు గదాదండంబు గిరగిరం ద్రిప్పి నరమృగేంద్రుని వ్రేసిన నతండు దర్పంబున సర్పంబు నొడిసిపట్టు సర్పపరిపంథి నేర్పున దితిపట్టిం బట్టికొనిన మిట్టిపడి దట్టించి బిట్టు కట్టలుక న య్యసుర వరుండు దృఢబలంబున నిట్టట్టు మిడిసి పట్టు దప్పించుకొని విడివడి దిటవు దప్పక కుప్పించి యుప్పరం బెగసి విహంగ కులరాజచరణ నిర్గళిత భుజంగంబు తెఱంగునం దలంగ నుఱికి తన భుజాటోపంబున నరకంఠీరవుండు కుంఠితుం డయ్యెడి నని తలంచి కలంగక చెలంగుచుఁ దన్ను నిబిడ నీరద నికరంబుల మాటున నిలింపులు గుంపులు గొని డాఁగి మూఁగి క్రమ్మఱ నాత్మీయ జీవన శంకా కళంకితులై మంతనంబులఁ జింతనంబులు సేయుచు నిరీక్షింప నక్షీణ సమర దక్షతా విశేషం బుపలక్షించి ఖడ్గ వర్మంబులు ధరియించి భూనభో భాగంబుల వివిధ విచిత్ర లంఘనా లాఘవంబులం బరిభ్రమణ భేదంబులఁ గరాళవదనుండయి యంతరాళంబునఁ దిరుగు సాళువడేగ చందంబున సంచరించిన సహింపక. 290

* దానవ వీరుడు తన భయంకరమైన గదాదండం గిరగిరా త్రిప్పి నరసింహస్వామిపై విసిరాడు. వెంటనే ఆ స్వామి గరుత్మంతుడు సర్పాన్ని ఒడిసి పట్టినట్లుగా రాక్షసరాజును పట్టుకున్నాడు. దానవేంద్రుడు ఎగిరిపడి ఇటూ అటూ గింజుకుని, కోపంతో, చాకచక్యంతో బలం పుంజుకొని, పట్టు తప్పించుకొన్నాడు.

అధైర్యం చెందకుండా గరుత్మంతుని పట్టు తప్పించుకొన్న సర్పరాజులాగా ఎగిరి ఎగిరి పడుతూ చిందులు త్రొక్కుతూ పోరాడ సాగాడు. తన భుజబలం ముందు నరసింహుడు లొంగిపోతాడులే అనుకొని రాక్షసేశ్వరుడు కలత పడకుండా విజృంభిస్తూ అతి నిపుణంగా తన పరాక్రమాన్ని ప్రదర్శిస్తున్నాడు. ఆకాశంలో దట్టమైన నల్లని మేఘాలమాటున నక్కి నక్కి చూస్తూ దేవతలు 'వీడు లొంగేటట్లు లేడు, మన జీవితాలకు ముప్పు తప్పేటట్లు లేదు'అని దిగాలుపడి ఆలోచనలు చేస్తున్నారు. ఆ రాక్షసుణ్ణి రహస్యంగా చూస్తూనే ఉన్నారు. హిరణ్యకశిపుడు యుద్ధ విద్యా తంత్రాలు ప్రదర్శిస్తూ చిత్ర విచిత్ర గతులలో కవచధారియై ఖడ్గచాలనం చేస్తూ భూమ్యాకాశాలంతటా తానే పరిభ్రమిస్తున్నాడు. నేర్పుగా దూకుతున్నాడు. రక రకాలుగా తప్పించు కొంటున్నాడు. తారసిల్లుతున్నాడు. భయం పుట్టించే ముఖంతో ఆకాశంలో తిరిగే డేగలాగా ఎగిరిపడుతున్న రాక్షసుని అహంకారాన్ని సహింపక ఆగ్రహించాడు నరసింహస్వామి!

సీ. పంచాననోద్ధూత పావక జ్వాలలు భూనభోఽంతరమెల్లఁ బూరితముగ
దంష్ట్రాంకురాభీల ధగధగాయిత దీప్తి నసురేంద్రు నేత్రము లంధములుగఁ
గంటక సన్నిభోత్కట కేసరాహతి నభ్రసంఘము భిన్నమై చలింపఁ
బ్రళయాభ్రచంచలా ప్రతిమభాస్వరములై కరనఖరోచులు గ్రమ్ముదేర

తే. సటలు జళిపించి గర్జించి సంభ్రమించి, దృష్టి సారించి బొమలు బంధించి కెరలి
జిహ్వ యాడించి లంఘించి చేత నొడిసి, పట్టె నరసింహుఁ డా దితిపట్టి నధిప! 291

* ఉగ్ర నరసింహస్వామి ఉచ్ఛ్వాస, నిశ్వాసములలో అగ్ని జ్వాలలు వెలువడి భూమ్యాకాశాలు నిండిపోయాయి. ఆయన కోరల ధగ ధగ కాంతులు ఈ నిశాచరుని నేత్రాలకు మిరుమిట్లు గొలిపి అంధుణ్ణి చేశాయి. కంటక సమూహాల వంటి ఆయన కేసరాల విదలింపులకు గగనంలోని మేఘపంక్తులు చెల్లాచెదరై పోయాయి. ఆ ఉగ్రమూర్తి తీక్ష్ణములైన నఖకాంతులు ప్రళయకాల మేఘాల విద్యుల్లతల వలె మెరుస్తున్నాయి. ఆ నరహరి అదను చూచి జటలు ఝళిపించాడు. ఒక్కసారి గర్జించి హుంకరించాడు. కనుబొమలు ముడిచి తీక్షణంగా వీక్షించాడు. ఆ నరసింహుడు నాల్క వికృతంగా ఆడించి, విజృంభించి దూకి దానవేంద్రుణ్ణి ఒడిసి పట్టుకున్నాడు.

క. సరకుగొనక లీలాగతి, నురగేంద్రుఁడు మూషకంబు నొడిసిన పగిదిన్
నరకేసరి దను నొడిసిన, సురవిమతుఁడు ప్రాణభీతి సుడివడియె నృపా! 292

* నాగేంద్రుడు ఎలుకను పట్టినట్లుగా ఆ నరసింహమూర్తి అవలీలగా అసురుణ్ణి పట్టేసరికి వాడు ప్రాణభీతితో సుళ్ళు తిరిగి పోయాడు.

క. సురరాజవైరి లోఁబడెఁ, బరిభావిత సాధుభక్త పటలాంహునకున్
నరసింహునకు నుదంచ, త్ఖరతరజిహ్వునకు నుగ్రతరరంహునకున్. 293

* భక్త రక్షాపరాయణుడూ, దుష్టశిక్షాపరతంత్రుడూ, కడు భయంకరమై కదులుతున్న నాలుక కలవాడూ, మహోగ్రమైన వేగాటోపం కలవాడూ అయిన నరసింహస్వామికి సుర విరోధి క్రమంగా లోబడి పోయాడు.

వ. అంత. 294

**మ. విహగేంద్రుం డహి వ్రచ్చుకైవడి మహోద్వృత్తిన్ నృసింహుండు సా**
**గ్రహుఁడై యూరువులందుఁ జేర్చి నఖసంఘాతంబులన్ వ్రచ్చె దు**
**స్సహు దంభోళికఠోరదేహు నచలోత్సాహున్ మహాబాహు నిం**
**ద్ర హుతాశాంతకభీకరున్ ఘనకరున్ దైత్యాన్వయ శ్రీకరున్.** 295

* అపుడు గరుత్మంతుడు నాగుబామును పట్టుకొని చీల్చిన విధంగా నరసింహస్వామి ఆగ్రహంతో వజ్రకఠోరకాయుడూ, అచంచల ఉత్సాహవంతుడూ, మహాబాహుడూ; ఇంద్ర, అగ్ని, యమాదులకు మహా భయంకరుడూ; దనుజకుల శుభంకరుడూ, దుస్సహ విక్రముడూ అయిన హిరణ్యకశిపుని పట్టుకొని బలవంతంగా తన ఊరువులపై అడ్డంగా పడవేసుకొన్నాడు. వాడి గోళ్ళతో వాడి రొమ్ము చీల్చి వేశాడు.

**శా. చించున్ హృత్కమలంబు, శోణితము వర్షించున్ ధరామండలిం,**
**ద్రెంచుం గర్కశనాడికావళులు, భేదించున్ మహావక్షముం,**
**ద్రుంచున్ మాంసము సూక్ష్మఖండములుగా, దుష్టాసురున్ వ్రచ్చి ద**
**ర్పించుం, బ్రేవులు కంఠమాలికలు గల్పించున్ నఖోద్భాసియై.** 296

* శ్రీ నృసింహస్వామి రాక్షసేశ్వరుని గుండెలు చీల్చి భూమిమీద నెత్తురు కురిపించాడు. ఆ రాక్షసుని కఠోర రక్తనాళాలు తుత్తునియలుగా త్రుంచివేశాడు. అతని కఠినాతి కఠినమైన వక్షస్థ్సలమును పగులగొట్టాడు. నిశాచరుని కండరాలను ముక్కలు ముక్కలుగా ఖండించాడు. వాడి నెత్తుటి ప్రేవులు లాగి తన కంఠంలో మాలికలుగా వేసుకొన్నాడు. దుష్టాత్ముణ్ణి ఈ విధంగా అత్యుత్సాహంతో చంపి నరసింహస్వామి నఖప్రభలతో ప్రచండంగా ప్రకాశిస్తున్నాడు.

**సీ. వక్షఃకవాటంబు వ్రక్కలు సేయుచో ఘన కుఠారంబులకరణి నొప్పు,**
**గంభీర హృదయపంకజము భేదించుచో గుద్దాలముల భంగిఁ గొమరుమిగులు**
**ధమనీ వితానంబు దవిలి ఖండించుచోఁ బటు లవిత్రంబుల పగిది మెఱయుఁ**
**జఠరవిశాలాంత్రజాలంబుఁ ద్రెంచుచోఁ గ్రకచ సంఘంబుల గరిమఁజూపు,**

**తే. నంకగతుఁడైన దైత్యుని నాగ్రహమున, శస్త్రచయముల నొంపక సంహరించి**
**యమరు నరసింహు నఖరంబు లతివిచిత్ర, సమర ముఖరంబులై యుండె జనవరేణ్య!** 297

* ఆ నృసింహస్వామి గోళ్ళు దానవేంద్రుని వక్షఃకవాటం పగుల కొట్టేటప్పుడు గండ్రగొడ్డళ్ళవలె ప్రకాశించాయి. దేవ విరోధి హృదయ పద్మం పెకలించేటప్పుడు స్వామి గోళ్ళు త్రవ్వుగోలల వలె విరాజిల్లాయి.

అమరవిరోధి రక్తనాళాలు త్రెంపివేసేటప్పుడు స్వామి గోళ్ళు బలమైన కొడవళ్ళులాగా దీపించాయి. అసురేశ్వరుని గ్రీవులు తెగకోసేటప్పుడు ఆ గోళ్ళు రంపాలలాగా రాణించాయి. తన ఊరువులపై పడి ఉన్న రాక్షసుణ్ణి ఎటువంటి అస్త్ర శస్త్రాలతోనూ పనిలేకుండా నరసింహస్వామి తన నఖాలతోనే సంహరించివేశాడు. అప్పుడు ఆ గోళ్ళు అతి విచిత్రమైన రణ విజయాన్ని చాటుతూ శోభించాయి.

**క. స్ఫురిత విబుధజనముఖములు, పరివిదళిత దనుజ నివహపతి తనుముఖముల్**
**గురు రుచి జిత శిఖిశిఖములు, నరహరిఖరనఖము లమరు నతజన సఖముల్.** **298**

* ఆ నరకేసరి నఖాలు శరణాగత సాధుజనులకు ప్రాణసఖాలు. అవి రాక్షసనాథుని శరీరమును చీల్చివేశాయి. దేవతల ముఖాలను వికసింపజేశాయి. అధికతర కాంతులతో అగ్నిశిఖలను సైతం జయించి వేశాయి.

**వ. ఇట్లు కేవల పురుషరూపంబును మృగరూపంబునుం గాని నరసింహ రూపంబున రేయునుం బవలునుం గాని సంధ్యాసమయంబున, నంతరంగంబును బహిరంగంబునుం గాని సభాద్వారంబున, గగనంబునుం భూమియునుం గాని యూరుమధ్యంబునఁ, బ్రాణసహితంబులును బ్రాణరహితం బులును గాని నఖంబులం ద్రైలోక్యజన హృదయ భల్లుండయిన దైత్యమల్లుని వధియించి మహాదహన కీలాభీల దర్శనుండును, గరాళవదనుండును లేలిహానభీషణ జిహ్వుండును శోణిత పంకాంకిత కేసరుండునునై గ్రేవులు కంఠమాలికలుగా ధరించి కుంభి కుంభ విదళనంబుసేసి చనుదెంచు పంచాననంబునుంబోలె దనుజకుంజర హృదయకమల విదళనంబు సేసి తదీయ రక్తసిక్తంబులైన నఖంబులు సంధ్యారాగ రక్తచంద్రరేఖల చెలువు వహింప సహింపక లేచి తన కట్టెదుర నాయుధంబు లెత్తుకొని తత్తరంబున రణంబునకు నురవడించు రక్కసులం బెక్కుసహస్రంబులం జక్రాదిక నిర్వక్ర సాధనంబుల నొక్కనిఁ జిక్కకుండం జక్కడిచె, ని వ్విధంబున.** **299**

* ఈ విధంగా కేవలం నరరూపమూ, కేవలం మృగరూపమూ కానటువంటి నరసింహరూపంతో, రాత్రీ పగలూ కానీ సంధ్యాసమయంలో, గృహమునకు లోపలా వెలుపలా కాని ద్వారమధ్యంలో, ఆకాశమూ, భూమి కానటువంటి ఊరు ప్రదేశంలో, ప్రాణసహితాలూ, ప్రాణరహితాలూ కాని గోళ్ళతో బ్రహ్మ ఇచ్చిన వరనియమాలకు భంగం లేకుండగా ముల్లోకాలకూ గుండెగాలమైన రాక్షసరాజును వధించాడు నరసింహస్వామి.

ఉగ్రస్వరూపంతో ఆయన దావానల జ్వాల లాగా దర్శనమిస్తున్నాడు. ఆ నరహరి ముఖం భయంకరంగా ఉంది. చాచిన నాలుక నాగేంద్రునిలాగా భీకరంగా ఉంది. మెడజూలు నెత్తురుతో తడిసి ఎర్రబడింది. ఆ స్వామి రాక్షసుని గ్రేవులు కంఠమాలికలుగా ధరించి ఉన్నాడు. దానవుని హృదయకమలం చీల్చి వేసిన నరసింహస్వామి మత్తేభ కుంభస్థలం చీల్చి చెండాడిన సింహరాజం లాగా విరాజిల్లుతున్నాడు. రక్తంలో తడిసిన ఆయన నఖాలు సంధ్యారాగరంజిత చంద్రరేఖల వలె ప్రకాశిస్తున్నాయి. ఆ రూపం చూచి కోపం పట్టలేక అసుర వీరులు ఆయుధాలతో దానవాంతకుని పైకి దండెత్తి వచ్చారు. నరసింహస్వామి వచ్చిన వారిని వచ్చినట్లే చక్రాది ఆయుధాలతో పెక్కువేల రక్కసులను ఒక్కడినీ విడువకుండా వధించివేశాడు.

శా. రక్షోవీరుల నెల్లఁ ద్రుంచి రణసంరంభంబు చాలించి దృ
ష్టిక్షేపంబు భయంకరంబుగ సభాసింహాసనారూఢుఁడై
యక్షీణాగ్రహుఁడై నృసింహుఁడు కరాళాస్యంబుతో నొప్పెఁ దన్
వీక్షింపం బలికింప నోడి యితరుల్ విభ్రాంతులై డాఁగఁగన్. 300

* ఈ విధంగా రాక్షస సంహారం పూర్తిచేసి రణం చాలించాడు. కానీ ఆ ఉగ్రనరసింహస్వామికి ఆగ్రహం తగ్గలేదు. ఆ చూపులు ఇంకా భయం కలిగిస్తున్నాయి. కరాళ వదనంతో ఊగిపోతున్నాడు. ఇతరులు తనను చూడటానికి గానీ, పలుకరించటానికి గానీ భయభ్రాంతులై తత్తర పడుతుండగా నృసింహస్వామి ఆ సభాభవనంలోని సింహాసనంపై ఆసీను డయ్యాడు.

క. సురచారణ విద్యాధర, గరుడోరగ యక్షసిద్ధగణములలో నొ
క్కరుఁడైన డాయ వెఱచును, నరహరి న య్యవసరమున నరలోకేశా! 301

* రాజేంద్రా! సురలు, విద్యాధరులు, ఫణులు, చారణులు, సిద్ధులు, సాధ్యులు, యక్షులు, కిన్నరులు - వీళ్ళలో ఏ ఒక్కడు కూడా ఆ సమయంలో నరసింహస్వామి దగ్గరకు వెళ్ళటానికి సాహసించలేక భయ కంపితులౌతున్నారు.

క. తర్షంబుల నరసింహుని, హర్షంబులఁ జూచి నిర్జరాంగనలు మహో
త్కర్షంబులఁ గుసుమంబుల, వర్షంబులు గురిసి రుత్సవంబుల నధిపా! 302

* నరేంద్రా! నరసింహస్వామి విజయోత్కర్షం జూచి హర్షంతో దేవకాంతలు కుసుమ వర్షం కురిపించారు. ఆనందంతో ఉత్సవం చేసుకొన్నారు.

వ. మఱియు న య్యవసరంబున మింట ననేక దేవతా విమానంబులును, గంధర్వగానంబులును, నప్సరోగణనర్తన సంవిధానంబులును, దివ్యకాహళ భేరీపటహ మురజాది ధ్వానంబులును, బ్రకాశ మానంబు లయ్యె, సునందకుముదాదు లయిన హరి పార్శ్వచరులును మహేశ్వరవిరించి మహేంద్ర పురస్సరులగు త్రిదశకిన్నర కింపురుష పన్నగ సిద్ధ సాధ్య గరుడ గంధర్వ చారణ విద్యాధరాదులును బ్రజాపతులును నరకంఠీరవ దర్శనోత్కంఠు లయి చనుదెంచి. 303

* ఆ సమయంలో ఆకాశంలో అనేక దేవతా విమానాలు, గంధర్వ గానాలు, అప్సరసల నానావిధ నాట్యవిధానాలు, దివ్యములైన కాహళ, భేరీ, పటహ, మురజాది, మంగళ ధ్వానాలు ప్రకాశమానాలై నేత్రాలకూ, వీనులకూ విందుచేశాయి. సునందుడు, కుముదుడు మొదలైన శ్రీహరి పార్శ్వచరులునూ; మహేశ్వరుడు, విధాత, మహేంద్రుడు మొదలైన దేవతలూ, కిన్నరులూ, కింపురుషులూ, సిద్ధులూ, సాధ్యులూ, చారణులూ, విద్యాధరులూ, పన్నగులూ, ప్రజాపతులూ గరుడులూ, గంధర్వులూ అందరూ శ్రీనరసింహస్వామిని సందర్శించాలనే కుతూహలంతో విచ్చేశారు.

## -: బ్రహ్మాది దేవతలు శ్రీనృసింహదేవుని వేర్వేఱ స్తుతించుట :-

**క. కరకమల యుగళ కీలిత, శిరులై దగ్గఱక భక్తిఁ జేసిరి బహు సం**
**సరణాబ్ధి తరికి నఖరికి, నరభోజనహస్తి హరికి నరకేసరికిన్. 304**

* సంసార సాగరమును తరింపజేసేవాడూ, రాక్షస మత్తేభాలను సింహంలాగా హరింపజేసేవాడూ అయిన నరసింహస్వామిని సమీపించలేక వారందరూ దూరంగానే ఉండి తమ కర కమలాలను శిరస్సులపై చేర్చి భక్తితో నమస్కరించారు.

**వ. ఆ సమయంబున దేవత లందఱు వేఱు వేఱ వినుతించి, రందుఁ గమలాసనుం డిట్లనియె. 305**

* అపుడు దేవత లందరూ ఎవరికి వారు స్వామిని వివిధ రీతులుగా స్తుతించారు. ముందు చతుర్ముఖుడైన బ్రహ్మ నరసింహస్వామిని ఇలా సన్నుతించాడు.

**మ. ఘనలీలా గుణచాతురిన్ భువనముల్ గల్పించి రక్షించి భే**
**దనముం జేయు దురంతశక్తికి ననంతజ్యోతికిం జిత్ర వీ**
**ర్యునికిన్ నిత్యపవిత్రకర్మునికి నే నుత్కంఠతో నవ్యయా**
**త్మునికిన్ వందన మాచరించెదఁ గృపాముఖ్య ప్రసాదార్థినై. 306**

* ఈ అఖిల ప్రపంచమును సృష్టించటం, పోషించటం, హరించటం అనే మహాకార్యక్రమమును లీలావిలాసంగా నిర్వహించే శక్తి సంపన్నా! అనంతజ్యోతిస్స్వరూపా! విచిత్ర పరాక్రమశాలీ! నిత్యపవిత్ర కార్యనిర్వాహకా! అవ్యయాత్మా! నేను అత్యాసక్తితో నీ అనుగ్రహాన్ని అర్థిస్తూ అభివందనం ఆచరిస్తున్నాను. దేవా! స్వీకరించు.

**వ. రుద్రుం డిట్లనియె. 307**

**చ. అమరవరేణ్య! మీఁదట సహస్ర యుగాంతము నాఁడు గాని కో**
**పమునకు వేళ కాదు, సురబాధకుఁడైన తమస్వినీచరున్**
**సమరమునన్ వధించితివి చాలుఁ దదాత్మజుఁడైన వీఁడు స**
**ద్విమలుఁడు నీకు భక్తుఁడు పవిత్రుఁడు గావుము భక్త వత్సలా! 308**

* రుద్రుండు ఇలా ప్రస్తుతించాడు. అమరవరేణ్యా! అగ్రగణ్యా! ఇంకా సహస్ర యుగాలు గడచిన తరువాత నీవు కోపం పూనాలి కానీ, ఆగ్రహానికి ఇది సమయం కాదు. సురలను బాధించే అసురేంద్రుణ్ణి సంహరించావు. బాగుంది. చాలు. అతని కుమారుడు ఈ బాలుడు. కల్మషం లేనివాడు. నీకు భక్తుడు, పరమ పవిత్రుడు. భక్తవత్సలా! వీణ్ణి కరుణతో కాపాడు.

**వ. ఇంద్రుం డిట్లనియె. 309**

సీ. ప్రాణి సంఘముల హృత్పద్మ మధ్యంబుల నివసించి భాసిల్లు నీవ యెఱుఁగు
దింతకాలము దానవేశ్వరుచే బాధ పడి చిక్కియున్న యాపన్న జనుల
రక్షించితివి మమ్ము రాక్షసేశ్వరుఁ జంపి క్రతుహవ్యములు మాకుఁ గలిగె మరల
మంటిమి నీ సేవ మరగిన వారలు కైవల్య విభవంబు కాంక్షసేయ,

ఆ. రితర సుఖము లెల్ల నిచ్ఛయింపఁగ నేల, యస్థిరంబు లివి యనంత భక్తిఁ
గొలువ నిమ్ము నిన్ను ఘోరదైత్యానీక, చిత్తభయద రంహ! శ్రీనృసింహ! 310

* మహేంద్రుడు ఇలా మనవిచేశాడు, అరిభయంకర స్ఫూర్తీ! నృసింహమూర్తీ! సమస్త ప్రాణుల హృదయ పద్మాలలో ప్రకాశించు వాడవు నీవు. నీకు తెలియని దేమున్నది? ఇంతకాలమూ రాక్షసనాథుడైన హిరణ్యకశిపుని వల్ల కష్టాలు అనుభవించాము. నీవు ఆ రాక్షసుని సంహరించి ఆర్తులమైన మమ్ములను రక్షించావు. నీ దయవల్ల మా హవిర్భాగాలు మరల మాకు దక్కాయి. మా బ్రతుకులు వన్నె కెక్కాయి. దానవ మర్దనా! జనార్దనా! నీ సేవాభాగ్యం పొందినవారు కైవల్యమును కూడా కాంక్షించరు. అటువంటిది అశాశ్వతాలైన ఇతర సుఖాలు ఎందుకు కోరుకుంటారు. అపారమైన భక్తితో నీ పాదపద్మాలు సేవించే వరం ప్రసాదించు స్వామీ!

వ. ఋషు లిట్లనిరి. 311

మ. భవదీయోదరలీన లోకముల నుత్పాదించి రక్షింప నేఁ
డవి దైత్యేశునిచేత భేదితము లై హ్రస్వంబులై యుండ నీ
యవినీతు న్నరసింహరూపమున సంహారంబు నొందించి వే
ద విధిం గ్రమ్మఱ నుద్ధరించితి గదా! ధర్మానుసంధాయివై. 312

* మునీంద్రులు ఇలా వినుతించారు : ధర్మమూర్తీ! నీవు ఎంతో ఆదరంతో లోకాలను సృష్టించి రక్షిస్తున్నావు. సమాజ వ్యవస్థను కాపాడుతున్నావు. కానీ నేడు ఈ దానవుడు లోకాలను ఛిన్నా భిన్నం చేశాడు. ఈ దురహంకారుణ్ణి నీవు నరసింహరూపంలో వచ్చి సంహరించి వేద ధర్మాన్ని ఉద్ధరించావు. ధర్మసంస్థాపకా! ధన్యవాదాలు !

వ. పితృదేవత లిట్లనిరి. 313

శా. చండక్రోధముతోడ దైత్యుఁడు వడిన్ శ్రాద్ధంబులన్ మత్సుతుల్
పిండంబుల్ సతిలోదకంబులుగ నర్పింపంగ మా కీక యు
ద్దండత్వంబునఁ దాన కై కొను మహోదగ్రుండు వీఁడిక్కడన్
ఖండింపంబడె నీ నఖంబుల నుతుల్ గావింతు మాత్మేశ్వరా! 314

* పితృదేవత లిలా ప్రణతు లర్పించారు. ఆత్మేశ్వరా! మా సుతులు మాకు సుగతులు కోరి తిలోదకాలతో శ్రాద్ధాలు పెట్టి పిండ ప్రదానం చేస్తుంటే అవి మాకు అందకుండా ఈ మదాంధుడు హరించుకుని పోయే వాడు. అట్టి స్వార్థపరుని దుండగీని ఖండించి మా కష్టాలు తీర్చావు. నృసింహస్వామి! నమస్సులు.

వ. సిద్ధు లి ట్లనిరి. 315

క. క్రుద్ధుండై యణిమాదిక, సిద్ధులు గై కొనిన దైత్యుఁ జీరితివి మహా
యోద్ధవు నీ కృప మాకును, సిద్ధులు మఱలంగఁ గలిగె శ్రీనరసింహా! 316

* సిద్ధులు స్వామి ప్రసిద్ధిని ఇలా ప్రశంసించారు. సర్వేశ్వరా! శత్రుసంహారా! అహంకారి అయి మా అణిమ, గరిమ మున్నగు అష్ట సిద్ధులను అపహరించిన ఈ హిరణ్యకశిపుని చీల్చి వేశావు. నీ దయవల్ల మా సిద్ధులు మరల మాకు లభించాయి. కృతజ్ఞతలు నృసింహదేవా!

వ. విద్యాధరు లిట్లనిరి. 317

క. దానవునిఁ జంపి యంత, ర్ధానాదిక విద్యలెల్ల దయతో మఱలం
గా నిచ్చితివి విచిత్రము, నీ నిరుపమ వైభవంబు నిజము నృసింహా! 318

* విద్యాధరులు ఇలా వినుతి చేశారు. నృసింహస్వామీ! నీవు దానవుని చంపి దయతో మా అదృశ్య శక్తులు మాకు ప్రసాదించావు. నిజంగా నీ వైభవం అతులితమూ, అసాధారణమూ, నీ చరిత్రము విచిత్రము!

వ. భుజంగు లి ట్లనిరి. 319

క. రత్నములను మత్కాంతా, రత్నములనుఁ బుచ్చుకొన్న రక్కసు నురమున్
యత్నమున వ్రచ్చి వైచితి, పత్నులు రత్నములుఁ గలిగిఁ బ్రతికితి మీశా ! 320

* పన్నగేంద్రులు ఇలా సన్నుతించారు. ఈశ్వరా! మా రత్నాలనూ, మా కాంతారత్నాలనూ అపహరించి మమ్ములను ఈ దుర్మార్గుడు నానాబాధలు పెట్టాడు. ఆ దుష్టుని ఈనాడు నీవు చంపి మాకు మహానందం కలిగించావు. మహానుభావా! మా మణులు, మా రమణీ మణులూ మరల మాకు దక్కారు. అభివందనాలు అందుకో స్వామీ!

వ. మనువు లి ట్లనిరి. 321

క. దుర్ణయుని దైత్యుఁ బొరిగొని, వర్ణాశ్రమ ధర్మ సేతు వర్గము మరలం
బూర్ణముఁ జేసితి వేమని, వర్ణింతుము కొలిచి బ్రదుకువారము దేవా! 322

* మనువులు ఇలా మనవి చేశారు. దేవా! వర్ణాశ్రమ ధర్మాలు ఈ దానవుని వల్ల ధ్వంసమైనాయి. ఆ దుష్టుని సంహరించి ధర్మసంస్థాపన చేశావు. నిన్ను ఏమని నుతించ గలము? నిన్ను ఆరాధించటమే మాకు జీవనాధారము ప్రభూ!

వ. ప్రజాపతు లి ట్లనిరి. 323

మ. ప్రజలం జేయుటకై సృజించితి మముం బాటించి దైత్యాజ్ఞచేఁ
బ్రజలం జేయక ఇంతకాలము మహాభారంబుతో నుంటి, మీ

**కుజనున్ వక్షముఁ జీరి చంపితివి, సంకోచంబు లే కెల్లచోఁ**
**బ్రజలం జేయుచు నుండువారము జగద్భద్రాయమాణోదయా!** 324

* ప్రజాపతులు ఇలా ప్రణామం చేశారు. ప్రభూ! పరంధామా! ప్రజాసృష్టి చేయటంకోసం మమ్ములను సృష్టించావు. కానీ ఈ రాక్షసుని ఆజ్ఞవల్ల ప్రజాసృష్టి మానివేయవలసి వచ్చింది. మా వ్యవస్థకు దురవస్థ ఏర్పడింది. నేడు ఈ దుర్మతిని గుండెలు చీల్చి చంపావు. ఇక సంకోచం లేకుండా ప్రజాసృష్టి చేస్తుంటాము. లోక కల్యాణ కారకా! నమోఽస్తు!

వ. గంధర్వు లి ట్లనిరి. 325

క. **ఆడుదుము రేయుఁ బగలుం, బాడుదుము నిశాటునొద్ద, బాధించు, దయం**
**జూడఁడు, నీచే జమునిం, గూడె మహాపాతకునకుఁ గుశలము గలదే?** 326

* గంధర్వులు ఇలా గానం చేశారు - స్వామీ! మేము రాత్రిం బవళ్ళు ఈ రాక్షసుని దగ్గర నాట్యం చేసే వాళ్ళం. గానం చేసే వాళ్ళం. అయినా మమ్మల్ని ఎంతో హీనంగా చూచి బాధించేవాడు ఈ దుర్మార్గుడు. మమ్మల్ని ఏనాడూ దయతో చూచేవాడే కాదు. అటువంటి మదాంధుడు నీవల్ల యమపురికి పంపబడ్డాడు. లోకంలో మహాపాతకికి మంగళం కలుగుతుందా మహాత్మా!

వ. చారణు లి ట్లనిరి. 327

క. **భువనజన హృదయభల్లుఁడు, దివిజేంద్ర విరోధి నేఁడు దెగె నీ చేతన్,**
**భవరోగ నివర్తక మగు, భవదంఘ్రియుగంబుఁ జేరి బ్రదికెద మీశా !** 328

* చారణులు ఇలా సంస్తుతించారు - జగదీశ్వరా! ప్రజా హృదయ కంటకుడూ, మహేంద్రునికి బద్ధశత్రువూ, అయిన ఈ నిశాచరుడు నేడు నీ వల్ల నిర్జింపబడ్డాడు. మా కష్టాలు గట్టెక్కాయి. ఇక సంసార బంధ విముక్తిని ప్రసాదించే నీ పాదపద్మాల నాశ్రయించి బ్రతుకుతాము.

వ. యక్షు లి ట్లనిరి. 329

ఉ. **భ్రంశము లేని నీ భటుల భంగవిముక్తుల మమ్ము నెక్కి, ని**
**స్సంశయవృత్తి దిక్కులఁ బ్రచారము సేయుచు నుండు వీఁడు, ని**
**స్త్రింశముతోడ వీనిఁ గడతేర్చితి, వా పద మానె నో చతు**
**ర్వింశతి తత్త్వశాసక! త్రివిష్టపముఖ్య! జగన్నివాసకా!** 330

* యక్షులు ఇలా విన్నవించారు - జగన్నివాసా! ఓ శ్రీనివాసా! మేము నీ సేవకులం. అవమానాల నుంచి విముక్తి పొందాం. ఈ అసురుడు పాపం అనుకోకుండా మా భుజాల మీద ఎక్కి అన్ని దిక్కులూ తిరిగేవాడు. వీణ్ణి వధించి మా కష్టాలు కడతేర్చావు. ఇరవైనాలుగు తత్త్వాలనూ ప్రవర్తింప జేసే మహానుభావా! నమస్సులు!

వ. కింపురుషు లి ట్లనిరి. 331

క. పురుషోత్తమ! నేరము, కిం, పురుషుల, మల్పులము, నిన్ను భూషింపఁగ, దు
ష్పురుషున్, సకల సుజన హృ, త్పరుషుం జంపితివి జగము బ్రదికె నధీశా! 332

* కింపురుషులు ఇలా కీర్తించారు - పురుషోత్తమా! పరంధామా! మేము కింపురుషులం, అల్పులం. నీ మాహాత్మ్యం కీర్తించటానికి మేము తగుదుమా దేవా? శిష్ట శిక్షకుడైన దుష్టుని శిక్షించావు. కనుక జగమంతా సజీవమైంది.

వ. వైతాళికు లిట్లనిరి. 333

క. త్రిభువన శత్రుఁడు పడియెను, సభలందును మఖములందు జగదీశ్వర! నీ
శుభగీతములు పఠించుచు, నభయులమై సంచరింతు మార్త శరణ్యా! 334

* వైతాళికులు ఇలా స్తుతించారు - దేవవరేణ్యా! ఆర్త శరణ్యా! ముల్లోకాలకూ శత్రువైన హిరణ్యకశిపుడు అస్తమించాడు. ఇక యజ్ఞశాలలో, సభావేదికలలో నీ వీరగాథలు, యశోగీతాలు గానం చేస్తాం. నిర్భయంగా మా కర్తవ్యం నిర్వహిస్తాం.

వ. కిన్నరు లి ట్లనిరి. 335

క. ధర్మము దలఁపఁడు, లఘుతర, కర్మము సేయించు మమ్ముఁ గలుషాత్మకు దు
ష్కర్మునిఁ జంపితి, వున్నత, శర్ములమై నీదు భక్తి సలిపెదము హరీ! 336

* కిన్నరులు ఇలా విన్నవించారు : శ్రీహరీ! ఈ రాక్షసుడు ధర్మం తెలియని మూర్ఖుడు. మాచేత హీనమైన కార్యాలు చేయిస్తూ ఉండేవాడు. ఇటువంటి కలుషాత్ముణ్ణి, దుర్మార్గుణ్ణి సంహరించావు. ఇక సుఖజీవనులమైన మేము నిన్ను భక్తితో భజిస్తాము.

వ. విష్ణుసేవకు లిట్లనిరి. 337

ఉ. సంచితవిప్రశాపమునఁ జండనిశాచరుఁడైన వీని శి
క్షించుట కీడు గాద, కృప సేసితి వీశ్వర, భక్తితోడ సే
వించుటకంటె వైరమున వేగము చేరఁగ వచ్చు నిన్ను నీ
యంచితనారసింహతను వద్భుత, మాపదఁబాసి రందఱున్. 338

* విష్ణుసేవకులు ఇలా వినుతించారు : రమేశ్వరా! ఘోరమైన విప్రశాపం చేత క్రూరదానవుడై జన్మించిన ఈ హిరణ్యకశిపుని ఇప్పుడు చంపి, వీనికి కీడు కాదు మేలే చేశావు. ఘోరాతి ఘోరాలు చేసిన వాడు నేడు నీచేతిలో మరణించి నీ సాన్నిధ్యం పొందాడు. స్వామీ! భక్తితో కంటే శత్రుత్వంతోనే వేగంగా నిన్ను చేరవచ్చు

నను కుంటున్నాము. అద్భుతమైన నీ నరసింహ స్వరూపం చూచి మేము తరించిపోయాము. ప్రభూ! అందరికీ ఆపదలు తొలగి ఆనందం లభించింది.

**వ. ఇట్లు బ్రహ్మరుద్రేంద్ర సిద్ధ సాధ్య పురస్సరులైన దేవముఖ్యు లందఱు నెడ గలిగి యనేక ప్రకారంబుల వినుతించి, రంధు రోష విజృంభమాణుం డయిన నరసింహదేవుని డగ్గఱఁ జేర వెఱచి లక్ష్మీదేవిం బిలిచి యిట్లనిరి. 339**

* ఈ విధంగా బ్రహ్మ, మహేశ్వరుడు, మహేంద్రుడు, సిద్ధులు, సాధ్యులు మున్నగు దేవతాప్రముఖులు నరసింహదేవుని ప్రసన్నం చేసుకోవటానికి పరిపరి విధాల ప్రార్థించారు. అయినా ఆయన ఉగ్ర స్వరూపం శాంతించ లేదు. ప్రసన్నం కాలేదు. నరసింహస్వామి రోషభీషణాకారం చూచి ఆయనను సమీపించటానికే భయపడి దేవతలంతా లక్ష్మీదేవిని ఆహ్వానించి ఇలా విన్నవించారు.

**క. హరికిం బట్టపు దేవివి, హరిసేవా నిపుణమతివి, హరిగతివి, సదా**
**హరిరతివి, నీవు సని నర, హరిరోషము డింపవమ్మ! హరివరమధ్యా! 340**

* లోకజననీ! ఇందిరాదేవీ! ఈ ఆపదను తప్పించి నీవే మమ్మల్ని రక్షించాలి. శ్రీహరికి పట్టపురాణివి. హరిప్రియవు. పతిసేవావిధానం ఎరిగిన సతీమతల్లివి! మా కోరికలు తీర్చు కల్పవల్లివి! మా సింహేంద్రమధ్యా! నరసింహస్వామిని శాంతపరచు తల్లీ!

**వ. అనిన నియ్యకొని మహోత్కంఠతోడ నా కలకంఠకంఠి నరకంఠీరవుని యుపకంఠంబునకుం జని. 341**

* అని అభ్యర్థించగా విని సమ్మతించి ఆదిలక్ష్మి అత్యంత ఆసక్తితో నరసింహస్వామి సన్నిధికి వెళ్లి చూచింది.

**సీ. ప్రళయార్కబింబంబు పగిది నున్నది గాని నెమ్మోము పూర్ణేందు నిభము గాదు,**
**శిఖి శిఖా సంఘంబు చెలువు సూపెడుఁ గాని చూడ్కి ప్రసాదభాసురము గాదు,**
**వీరరౌద్రాద్భుతావేశ మొప్పెడుఁ గాని భూరి కృపారస స్ఫూర్తి గాదు,**
**భయద దంష్ట్రాంకుర ప్రభలు గప్పెడుఁ గాని దరహసితాంబుజాతంబు గాదు,**

**తే. కఠిన కర నారసింహ విగ్రహము గాని, కామినీజన సులభ విగ్రహము కాదు,**
**విన్నదియుఁ గాదు, తొల్లి నే విష్ణువలనఁ, గన్నదియుఁ గాదు భీషణాకార మనుచు. 342**

* నరసింహస్వామి వదనం ప్రళయకాల భానుబింబం లాగా ఉంది. కానీ, ప్రసన్న చంద్రబింబంలాగా లేదు. ఆయన చూపులు అగ్ని జ్వాలలవలె ఉన్నాయి కానీ అనుగ్రహమును అందించునట్లుగా లేవు. స్వామి రూపం వీర, రౌద్ర, అద్భుత రసావేశంతో నిండి ఉంది కానీ, అపార కృపారస స్ఫూర్తిగా లేదు. ఆయన దంష్ట్రలు భయంకరమైన ప్రభలు వెలికక్కుతున్నాయి. కానీ చిరునవ్వులు చిందిస్తూ పద్మకాంతులు ప్రసరించటం లేదు. అది కఠిన కర్కశ నరసింహ విగ్రహం తప్ప కామినీ మణులు సులభంగా ప్రసన్నం చేసుకొనే కమనీయ విగ్రహం కాదు. ఈ రూపం నేను ఎప్పుడూ విన్నదీ కాదు, కన్నదీ కాదు, ఇంత భీషణాకారం ప్రభువు ఎలా ధరించాడు? అని ఆశ్చర్యపోయింది శ్రీ లక్ష్మి.

క. **పలికెద నని గమకముఁ గొనుఁ, బలికినఁ గడు నలుగు, విభుఁడు ప్రతివచనములం**
**బలుకఁడని నిలుచు శశిముఖి, బలువిడి హృదయమునఁ జనవు భయమును గదురన్.** **343**

* ఇందువదన అయిన ఇందిరాదేవి చిరునవ్వుతో శ్రీహరిని పలుకరిద్దాం అనుకొంటుంది. పలుకరిస్తే మండిపడతాడేమో, అడిగిన దానికి బదులు పలుకడేమో అని సందేహిస్తుంది. మనస్సులో ఒకవైపు చనువూ, మరొకవైపు భయమూ కలుగుతుండగా సంకోచంతో నిలబడి పోయింది.

వ. **ఇట్లు నరహరిరూపంబు వారిజనివాసిని వీక్షించి శంకించి శాంతుండైన వెనుక డగ్గఱెద నని చింతించుచున్న వారిజ సంభవుం డ ద్దేవుని రోషంబు నివారింప నితరుల కలవి గా దని ప్రహ్లాదుం జీరి యిట్లనియె.** **344**

* హరిప్రియ ఇలా నరసింహదేవుని రూపం చూచి సందేహించి "స్వామి శాంతించిన తరువాతనే సమీపిస్తాను" అనుకొన్నది. ఆమె మనోభావం గ్రహించాడు బ్రహ్మ. ఇక ఆ దేవుని కోపం తగ్గించటం ఎవరికీ సాధ్యము కాదని, ఇందుకు ప్రహ్లాదుడే సమర్థుడని తలచి వానిని పిలిచి ఇలా అన్నాడు.

క. **తీండ్రమగు రోషమున మీ, తండ్రి నిమిత్తమునఁ జక్రి దారుణమూర్తిన్**
**వేండ్రము విడువఁడు, మెల్లన, తండ్రీ! శీతలునిఁ జేసి దయ సేయఁగదే!** **345**

* నాయనా! ప్రహ్లాదా! నీ తండ్రి కారణంగా చక్రి తీవ్రరోషంతో ఉన్నాడు. ఎంతకూ ఆ ఉగ్రరూపం ఉపసంహరించుకొని శాంతించటం లేదు. మెల్లగా వెళ్ళి నీవే స్వామిని చల్లపరచు తండ్రీ!

వ. **అనిన 'నౌఁగాక'యని మహాభాగవత శేఖరుండయిన బాలకుండు కరకమలంబులు ముకుళించి మందగమనంబున నమంద వినయ వివేకంబుల నరసింహదేవుని సన్నిధికిం జని సాష్టాంగ దండ ప్రణామంబు సేసిన భక్త పరాధీనుండగు నయ్యీశ్వరుం డాలోకించి.** **346**

* అని పద్మసంభవుడు అనగానే పరమ భక్తశిఖామణి అయిన ప్రహ్లాదుడు 'అలాగే'నని వినయంగా కరకమలాలు ముకుళించి మెల్ల మెల్లగా నరసింహస్వామిని సమీపించాడు. వినయవినమ్రుడై ఆయన దివ్యపాదపద్మాలకు సాష్టాంగ దండ ప్రణామాలు చేశాడు. అపుడు భక్తవత్సలుడు ప్రసన్నుడై ప్రహ్లాదుని ప్రేమగా చూశాడు.

ఉ. **ప్రాభవ మొప్ప నుత్కట కృపామతియై కదియంగఁ జీరి సం**
**శోభిత దృష్టిసంఘములఁ జూచుచు బాలుని మౌళియందు లో**
**కాభినుతుండు పెట్టె నసురాంతకుఁ డుద్భటకాల సర్ప భీ**
**తాభయ దానశస్తము ననర్గళ మంగళ హేతుహ స్తమున్.** **347**

* నరసింహమూర్తి మనసులో కరుణారసం ఉప్పొంగింది. బాలుణ్ణి దగ్గరకు పిలిచాడు. వాత్సల్యపురస్సరంగా చూస్తూ - కాలసర్ప భయమును తొలిగించే, నిత్యమంగళం కలిగించే, ప్రశస్తమైన తన హస్తంతో ప్రహ్లాదుని మస్తకాన్ని ఆప్యాయంగా నిమిరాడు.

వ. ఇట్లు హరికరస్పర్శనంబున భయవిరహితుండును, బ్రహ్మ జ్ఞాన సహితుండును, బులకితదేహుండును, సముత్పన్న సంతోష బాష్పసలిలధారా సమూహుండును, బ్రేమాతిశయ గద్గద భాషణుండును, వినయవివేక భూషణుండును, నేకాగ్రచిత్తుండును, భక్తి పరాయత్తుండును నయి య ద్దేవుని చరణ కమలంబులు దనహృదయంబున నిలిపికొని కరకమలంబులు ముకుళించి యిట్లని వినుతించె.348

* నరహరి హస్తస్పర్శతో ప్రహ్లాదునికి భయం పోయింది. బ్రహ్మజ్ఞానం కలిగింది. దేహం పులకించింది. సంతోష బాష్పధారలు పెల్లుబికాయి. ఆప్యాయతతో కంఠం గాద్గదిక మయింది. వినయవివేకాలు మరింత శోభ కలిగించాయి. చిత్తం ఏకాగ్రత పొందింది. భక్తి పరవళ్ళు త్రొక్కింది. హృదయంలో హృషీకేశుని పదపద్మాలను పదిలపరచుకొని కరకమలాలను ముడిచి ప్రహ్లాదుడు ప్రభువును ఇలా ప్రస్తుతించాడు.

### -: ప్రహ్లాదుఁడు నరసింహ మూర్తిని స్తుతించుట. :-

మ. అమరుల్ సిద్ధులు సంయమీశ్వరులు బ్రహ్మాదుల్ సతాత్పర్య చి
త్తములన్ నిన్ను బహుప్రకారముల నిత్యంబున్ విచారించి పా
రము ముట్టన్ నుతిసేయ నోపరఁట, నే రక్ష స్తనూజుండ, గ
ర్వ మదోద్రిక్తుఁడ, బాలుఁడన్, జడమతిన్, వర్ణింప శక్తుండనే? 349

* జగదీశ్వరా! అమరులూ, సిద్ధులూ, మునీంద్రులూ, బ్రహ్మాదులూ ప్రగాఢకాంక్షతో నిన్ను నిత్యమూ అనేక విధాల ఆరాధిస్తారు. నీ గుణాలు గానం చేస్తారు. కానీ సంపూర్ణంగా నిన్ను తెలుసుకొని, సమగ్రంగా నీ గుణాలను అభివర్ణించ లేరట! ఇక నేను ఎంత? అందులో అసురుని ఆత్మజుణ్ణి. గర్విష్ఠిని, బాలుణ్ణి, మూర్ఖుణ్ణి. నిన్ను కీర్తించటం నాకు అసాధ్యం కదా ప్రభూ!

మ. తపమున్ వంశముఁ దేజమున్ శ్రుతము సౌందర్యంబు నుద్యోగమున్
నిపుణత్వంబుఁ బ్రతాప పౌరుషములున్ నిష్ఠాబలప్రజ్ఞలున్
జపహోమంబులుఁ జాల వీశ్వర! భవత్సంతుష్టికై దంతి యూ
థపుఁ జందంబున భక్తిచేయ వలయుం దాత్పర్య సంయుక్తుఁడై. 350

* ఈశ్వరా! నిన్ను సంతోష పరచి సాయుజ్యం పొందటానికి ప్రతాప, పౌరుషాలు పనికిరావు. సౌందర్యాలూ, సత్కార్యాలు సరిపోవు. పుణ్యాలూ, నైపుణ్యాలు పనిచేయవు. జప, తపాలు, వేదాధ్యయనాలూ వృథా కులతత్త్వాలు కుదరవు. ప్రజ్ఞాబలాలూ, నిష్ఠానియమాలూ నిరర్థకం. పూర్వం గజేంద్రుడు అమితమైన భక్తితోనే నిన్ను మెప్పించాడు. కాబట్టి భక్తి ఒక్కటే నిన్ను సంతుష్టి పరచే సాధనం. భక్తి ఒక్కటే శక్తి నిచ్చేదీ, ముక్తి నిచ్చేదీ! మానవుడు అటువంటి భక్తిని ఆసక్తితో అలవరచుకోవాలి.

మ. అమలజ్ఞాన సుదాన ధర్మరతి సత్యక్షాంతి నిర్మత్సర
త్వములన్ యజ్ఞతపోఽనసూయలఁ గడున్ దర్పించు ధాత్రీసురో
త్తముకంటెన్ శ్వపచుండు ముఖ్యుఁడు మనోఽర్థప్రాణ వాక్కర్మముల్
సమతన్ నిన్ను నయించెనేని నిజవంశ శ్రీకరుం డౌఁ దుదిన్. 351

* ప్రభూ! నిర్మలజ్ఞానం, దానం, క్షాంతి, శాంతి, సత్యభాషణం, ధర్మపరాయణత్వం, అసూయలేని హృదయం, యజ్ఞం, తపశ్శక్తి - ఇవన్నీ ఉండి గర్వించే బ్రాహ్మణుని కంటే త్రికరణశుద్ధిగా సమదృష్టితో నిన్ను సేవించే చండాలుడు ఉత్తముడు. వాడు నీ సాన్నిధ్యం పొంది తన వంశం మొత్తానికి శోభ కలిగిస్తాడు.

సీ. అజ్ఞుండు సేసిన యారాధనములఁ జేపట్టఁ డీశ్వరుఁడు కృపాళుఁ డగుటఁ
జేపట్టు నొకచోట సిద్ధ మీశ్వరునకు నర్థంబు లేకుండు, నతఁడు పూర్ణుఁ
డైన నర్థము లీశ్వరార్పణంబులు గాఁగఁ జేయుట ధర్మంబు సేసెనేని
నద్దంబుఁ జూచిన నళికలలామంబు ప్రతిబింబితంబగు పగిది మరల

తే. నర్థములు దోఁచుఁ, గావున నధికబుద్ధి, భక్తిసేయంగ వలయును, భక్తి గాని
మెచ్చఁ డర్థంబు లొసఁగెడు మేరలందుఁ, బరమ కరుణుండు హరిభక్తి బాంధవుండు. 352

* అజ్ఞాని చేసిన అపరాధాలు అఖిలేశ్వరుడు లెక్కచేయడు. ఆయన దయాసముద్రుడు. సర్వగుణభద్రుడు. కాని కొందరు చేసిన తప్పులకు తప్పకుండా శిక్షిస్తాడు. సామాన్యులకు ఈశ్వరుడు అర్థంకాడు. ఆయన పరిపూర్ణుడు. కాబట్టి ఫలితమును ఈశ్వరార్పణం చేయటం ధర్మం! ఆ విధంగా చేసినట్లైతే అద్దంలో ముఖం కన్పించినంత స్పష్టంగా మానవునికి పరమార్థం గోచరిస్తుంది. కాబట్టి మంచి మనస్సుతో భక్తి కుదుర్చుకోవాలి. ఆ భక్తితో భగవంతుని ఆరాధించాలి. భగవంతుడు భక్తికి బంధువు. ఆ స్వామి భక్తిని తప్ప సంపదలను మెచ్చడు. దరిచేరిన వారి కోరికలను తీర్చటంలో ఆయన దయాసముద్రుడు. నీవే ఆ భగవంతుడవు.

క. కావున నల్పుఁడ, సంస్తుతిఁ, గావించెద వెఱపు లేక కలనేరుపునన్
నీవర్ణనమున ముక్తికిఁ, బోవు నవిద్యను జయించి పురుషుఁ డనంతా! 353

* అనంతా! ఆదిదేవా! నేను అల్పుణ్ణి. నాకున్న కొద్ది జ్ఞానంతో భయపడకుండా సంస్తుతికి సాహసిస్తున్నాను. నా ప్రార్థన మన్నించు. దేవా! పురుషుడు కేవలం నీ గుణాలు కీర్తించి, అజ్ఞానమును జయించి కైవల్యమును అందుకోగలడు.

సీ. సత్త్వాకరుఁడవైన సర్వేశ!, నీ యాజ్ఞ శిరముల నిడుకొని చేయువారు
బ్రహ్మాదు లమరులు భయ మందుచున్నారు నీ భీషణాకృతి నేఁడు చూచి
రోషంబు మాను, నీ రుచిర విగ్రహములు కల్యాణకరములు గాని భీతి
కరములు గావు లోకములకు, వృశ్చిక పన్నగంబుల భంగి భయముఁ జేయు

తే. నసుర మర్దించితివి, సాధుహర్ష మయ్యె, నవతరించిన పని దీఱె నలుక యేల?
కలుషహారివి సంతోషకారి వనుచు, నిన్నుఁ దలఁతురు లోకులు నిర్మలాత్మ! 354

* సర్వేశ్వరా! నీవు సత్త్వగుణ ప్రధానుడవు. నీ ఆజ్ఞలు తల దాల్చు బ్రహ్మాది దేవతలు ఈనాడు నీ భీషణాకృతి చూసి భయపడుతున్నారు. శాంతించు స్వామీ! నీ సుందర స్వరూపాలు లోకానికి కల్యాణకారకాలు! భక్తిప్రేరకాలు! అంతేకానీ భయంకరాలు కావుకదా! పాములాగా, తేలులాగా ప్రతిక్షణం ప్రజలకు భయం కలిగించిన పాపాత్ముడైన రాక్షసేంద్రుని పరిమార్చావు. సకలజనులకు సంతోషం సమకూరింది. అవతార ప్రయోజనం సిద్ధించింది కదా! ఈ సంతోష సమయంలో ఇంత ఆగ్రహం ఎందుకు? నిర్మలాత్మా! నీరజాక్షా! ప్రజలు నిరంతరం నిన్ను కల్యాణకరుడవనీ, కల్మషహరుడవనీ భావిస్తున్నారు.

మ. ఖరదంష్ట్రా భ్రుకుటీ సటానఖయు నుగ్రధ్వానయున్ రక్త కే
సరయున్ దీర్ఘతరాంత్రమాలికయు భాస్వన్నేత్రయున్నైన నీ
నరసింహాకృతిఁ జూచి నే వెఱవఁ, బూర్ణక్రూర దుర్వార దు
ర్భర సంసారదవాగ్నికిన్ వెఱతు, నీ పాదాశ్రయుం జేయవే! 355

* స్వామీ! భయంకరమైన కోరలూ, కనుబొమలూ, జడలూ, గోళ్ళూ, నీ భీకర ధ్వనులూ, రక్తరంజిత కేసరాలూ, అగ్నినేత్రాలూ, నీ మెడలోని ప్రేగుల దండలూ వీటన్నిటితో ఉన్న నీ ఉగ్రనరసింహ రూపం చూచి నేను ఎంతమాత్రమూ భయపడను. కానీ భయంకరమైనదీ, భరింపరానిదీ, క్రూరమైనదీ, నికృష్టమైనదీ అయిన సంసార దవాగ్నిని చూచిమాత్రం నేను వణకిపోతున్నాను. కరుణించి నీ చరణసన్నిధిలో నాకు శరణు ప్రసాదించు!

వ. దేవా! సకలయోనులందును సుఖవియోగ దుఃఖసంయోగ సంజనితంబైన శోకానలంబున దంద హ్యమానుండనై, దుఃఖ నివారకంబు గాని దేహాద్యభిమానంబున మోహితుండనై పరిభ్రమించుచున్న యేను నాకుం బ్రియుండవు సఖుండవుఁ బర దేవతవు నైన నీ యొక్క బ్రహ్మగీతంబులయిన లీలా వతార కథావిశేషంబులఁ బఠియించుచు రాగాదినిర్ముక్తుండనై దుఃఖ పుంజంబులఁ దరియించి భవదీయ చరణకమల స్మరణ సేవా నిపుణులైన భక్తులం జేరి యుండెద, బాలునిఁ దల్లిదండ్రులును, రోగిని వైద్యదత్తం బయిన యౌషధంబును, సముద్రంబున మునింగెడివాని నావయును దక్కనొరులు రక్షింపనేరని తెఱంగున సంసారతాపతంతప్య మానుండై నీ చేత నుపేక్షితుండయిన వాని నుద్ధరింప నీవు దక్క నన్యుండు సమర్థుండు గాఁడు, జగంబుల నెవ్వండేమి కృత్యంబు నెవ్వనిచేతం బ్రేరితుండై యేయింద్రియంబులం జేసి యేమిటికొఱకు నెవ్వనికి సంబంధియై యే స్థలంబున నే సమయంబునం దేమి రూపంబున నే గుణంబున నపరంబైన జనకాది భావంబున నుత్పాదించి పరంబయిన బ్రహ్మాది భావంబున రూపాంతరంబు నొందించునట్టి వివిధ ప్రకారంబు లన్నియు నిత్యముక్తుండవు రక్షకుండవు నైన నీవ, నీ యంశంబైన బురుషునికి నీ యనుగ్రహంబునఁ గాలంబుచేతం బ్రేరిత యై కర్మమయం బును బలయుతంబును బ్రధానలింగమును నైన మనంబును నీ మాయ సృజియించు, నవిద్యార్పిత వికారంబును, వేదోక్తకర్మ ప్రధానంబును, సంసార చక్రాత్మకంబైన యీ మనమున నిన్ను సేవింపక

**నియమించి తరియింప నొక్కండును సమర్థుండు లేఁడు, విజ్ఞాననిర్జిత బుద్ధి గుణుండవు నీవు, నీ వలన వశీకృతకార్య సాధన శక్తియైన కాలంబు మాయతోడం గూడ షోడశవికారయుక్తంబయిన సంసార చక్రంబుఁ జేయుచుండు, సంసారదావ దహన తంతప్య మానుండనగు నన్ను రక్షింపుము.356**

* దేవా! జన్మజన్మలలో సుఖానికి వియోగం, దుఃఖానికి సంయోగం కలుగుతూనే ఉంది. అందువల్ల నాకెప్పుడూ శోకమే ప్రాప్తిస్తూ ఉంది. ఆ శోకాగ్ని నన్ను నిలువునా కాల్చివేస్తూ ఉంది. సుఖమును ఇవ్వదని తెలిసికూడా ఈ దేహం మీద అభిమానం వదల లేకుండా మోహంతో తిరుగుతున్నాను. ఇటువంటి నాకు ప్రియుడవు, సఖుడవు, పరదేవతవు నీవే! బ్రహ్మ గీతాలయిన నీ లీలావతార విశేషాలు నిరంతరం పఠిస్తూ కోరికల నుంచి విముక్తి పొంది, దుఃఖములను అతిక్రమించి నీ చరణకమల సేవచేసే భక్తులతో కలిసి ఉంటాను.

బాలుణ్ణి వాని తల్లిదండ్రులూ, రోగిని వైద్యుడిచ్చే ఔషధమూ, సముద్రమగ్నుడైన వానిని నావా, కాక మరెవ్వరు రక్షిస్తారు? అలానే సంసారతాప తప్తులైన వాళ్ళను నీవే కాపాడాలి. నీ చేత ఇంతకాలం ఉపేక్ష చేయబడ్డాను. ఇప్పటికైనా కరుణించు. నీవు తప్ప మరొకడు నన్ను ఉద్ధరించలేడు. జగత్తులో ఎవడు, ఏ కార్యం, ఎవరి ప్రేరణతో, ఏ ఇంద్రియాలవల్ల, దేనికోసం, ఎవరికి సంబంధించి, ఏ స్థలంలో, ఏ సమయంలో, ఏ రూపంలో, ఏ గుణం వల్ల - నెరవేరుస్తాడో, ఇహ లోకంలో జనక భావానికీ, పరలోకంలో బ్రహ్మభావానికీ రూపాంతరం పొందించే ఆ వివిధ ప్రకారాలూ నీవే! సమస్తమూ నీవే. నీవు నిత్య ముక్తుడవు. నీవు సత్య రక్షకుడవు.

నీ అంశమైన పురుషునిలో నీ అనుగ్రహం వల్ల కాలప్రేరితమూ, కర్మమయమూ, బలయుతమూ, ప్రధానలింగమూ అయిన మనస్సును నీ మాయ సృష్టిస్తుంది. ఈ మనస్సు అవిద్యార్పిత వికారమూ, వేదోక్త కర్మప్రధానమూ, సంసారచక్రాత్మకమూ అయినది. ఇటువంటి ఈ మనస్సుతో నిన్ను సేవించకుండా తరించగల సమర్థుడు ఎవడూ లేడు. భగవాన్! నీవు విజ్ఞానం చేత బుద్ధిగుణమును జయించినవాడవు. కార్య కారణశక్తిని కాలం నీ వలననే వశం చేసుకుంటుంది. ఈ 'కాలం' మాయతో కలిసి పదహారువిధములైన వికారాలతో కూడిన ఈ సంసార చక్రమును నిర్మించి త్రిప్పుతూ ఉంటుంది. నేను ఈ సంసార దావానలంలో పడి మాడిపోతున్నాను. లోకరక్షామణీ! నన్ను రక్షించు!

**సీ. జనులు దిక్పాలుర సంపదాయుర్విభవములు గోరుదురు భవ్యంబు లనుచు,**
**నవి యంతయును రోషహాసజృంభితమైన మా తండ్రి బొమముడి మహిమఁ జేసి**
**విహతంబు లగు,నట్టి వీరుండు నీ చేత నిమిషమాత్రంబున నేఁడు మడిసెఁ,**
**గావున ధ్రువములు గావు బ్రహ్మాదుల శ్రీవిభవంబులు జీవితములుఁ,**

**తే. గాలరూపకుఁడగు నురుక్రముని చేత, విదళితము లగు, నిలువవు వేయు నేల?**
**యితర మేనొల్ల నీమీఁది యెఱుక గొంత, గలిగియున్నది కొలుతుఁ గింకరుఁడ నగుచు. 357**

* దేవా! లోకంలో జనులు దిక్పాలకుల సిరసంపదలూ, ఆయురారోగ్యాలూ, వైభవాలూ, సత్యాలనుకొని వాటినే కోరుకొంటారు. కానీ ఇవన్నీ మా తండ్రి హిరణ్యకశిపుని రోష, హాసాలలో పుట్టిన భ్రూభంగంతో నాశన మయ్యేవే! అటువంటి బలవంతుడ ననుకొనే వీరుణ్ణే నీవు నిమేషంలో ఖండ ఖండాలుగా ఖండించివేశావు. కనుక బ్రహ్మాది జీవుల జీవితాలూ, సిరిసంపదలూ శాశ్వతాలు కావు. ఇవి కాలరూపంలో మెదిలే విష్ణువుచేతిలో కనిపించకుండా నశించిపోతాయి. ఇవి నిలిచేవి కావు. వేయి మాటలెందుకు? స్వామీ! నాకు ఇక ఏమీ వద్దు. నీ మీద నాకు కొంత భక్తి, జ్ఞానం కుదిరి ఉంది. కాబట్టి నేను సేవకుణ్ణై నిత్యం నిన్ను సేవిస్తాను.

**మత్తకోకిలము.**

**ఎండమావులవంటి భద్రము లెల్ల సార్థము లంచు మ**
**ర్త్యుండు రోగనిధాన దేహముతో విరక్తుఁడు గాక యు**
**ద్దండమన్మథవహ్ని నెప్పుడుఁ దప్తుఁడై యొకనాఁడుఁ జే**
**రండు పారము దుష్టసౌఖ్య పరంపరాక్రమణంబునన్. 358**

* ఈశ్వరా! ఎండమావులవంటి సుఖాలూ, భోగాలూ ఇవే జీవిత పరమావధి అనుకుంటాడు మూర్ఖుడు. ఈతని దేహం దుఃఖ భూయిష్ఠం. రోగగ్రస్తం. అయినాసరే, విరక్తి పొందకుండా ప్రజ్వలించే కామాగ్నిలో పడి తపించిపోతూ ఉంటాడు. వాడు ఈ దుష్టసౌఖ్య పరంపర దాటి ఏ ఒక్కనాటికీ తీరమును చేరలేడు.

**ఉ. శ్రీమహిళామహేశ! సరసీరుహగర్భులకైన నీ మహో**
**ద్దామకరంబుచే నభయదానము సేయవు, నేను బాలుఁడం**
**దామస వంశ సంభవుండ, దైత్యుఁడ, నుగ్రరజోగుణుండ ని**
**స్సీమ దయం గరాంబుజము శీర్షముఁ జేర్చుట చోద్యమీశ్వరా! 359**

* విశ్వేశ్వరా! నీ సన్నిధికి శ్రీలక్ష్మి వచ్చింది. మహేశ్వరుడు వచ్చాడు. విధాత విచ్చేశాడు. అయినా వాళ్లలో ఏ ఒక్కరికీ నీ దివ్య హస్తంతో అభయం ఇవ్వలేదు. నే నా బాలుణ్ణి. తామసగుణంతో కూడిన దనుజవంశంలో జన్మించినవాణ్ణి. దైత్యుణ్ణి. అత్యంత రజోగుణదూషితుణ్ణి - అటువంటి నా శిరస్సు మీద అపారమైన కృపతో నీ దివ్యహస్తం ఉంచి దీవించావంటే ఇది చాలా ఆశ్చర్యంగా ఉంది ప్రభూ!

**వ. మహాత్మా! సుజనులయిన బ్రహ్మాదులందును, దుర్జనులైన మాయందును సేవానురూపంబునం బక్షాపక్షంబులు లేక కల్పవృక్షంబు చందంబున ఫలప్రదానంబు సేయుదువు, కందర్పసమేతంబగు సంసార కూపంబునం గూలుచున్న మూఢ జనులం గూడి కూలెడి నేను భవదీయ భృత్యుండగు నారదుని యనుగ్రహంబునం జేసి నీ కృపకుఁ బాత్రుండనైతి, నన్ను రక్షించి మజ్జనకు వధియించుట నా యందులఁ బక్షపాతంబు గాదు, దుష్టదనుజ సంహారంబును శిష్టభృత్యమునిజన రక్షా ప్రకారంబును నీకు నైజ గుణంబులు, విశ్వంబు నీవ; గుణాత్మకంబైన విశ్వంబు సృజియించి యందుం బ్రవేశించి హేతు భూత గుణయుక్తుండవై రక్షక సంహారకాది నానా రూపంబుల నుండుదువు; సదసత్కారణ కార్యాత్మకం బయిన విశ్వంబునకుం బరమకారణంబు నీవ; నీ మాయచేత వీఁడు దానినియెడు**

> బుద్ధివికల్పంబు దోఁచుఁ; గాని నీ కంటె నొండెద్దియు లేదు; బీజంబు నందు వస్తుమాత్ర భూత సౌక్ష్మ్యంబును వృక్షంబునందు నీలత్వాదివర్ణంబునుం గలుగు తెఱంగున విశ్వంబునకు నీ యంద జన్మస్థితి ప్రకాశ నాశంబులుం గలుగు; నీ చేతనయిన విశ్వంబు నీ యంద నిలుపుకొని తొల్లి ప్రళయకాల పారావారంబునఁ బన్నగేంద్ర పర్యంకంబునఁ గ్రియారహితుండవై నిజసుఖానుభవంబు సేయుచు నిద్రితుని భంగి యోగనిమీలిత లోచనుండవై మెలంగుచుఁ గొంతకాలంబునకు నిజకాల శక్తిచేతం బ్రేరితంబులై ప్రకృతి ధర్మంబులయిన సత్త్వాదిగుణంబుల నంగీకరించి సమాధి చాలించి వెలుంగుచున్న నీ నాభియందు వటబీజంబు వలన నుద్భవించు వటంబు తెఱంగున నొక్క కమలంబు సంభవించె, నిట్టి కమలంబువలన నాల్గుమోముల బ్రహ్మ జన్మించి దిశలు వీక్షించి కమలంబునకు నొం డయిన రూపంబు లేకుండుటఁ జింతించి జలాంతరాళంబుఁ బ్రవేశించి జలంబులందు నూఱు దివ్యవత్సరంబులు వెదకి తన జన్మంబునకు నుపాదానకారణంబైన నిన్ను దర్శింప సమర్థుండు గాక మగిడి కమలంబు కడకుం జని విస్మయంబు నొంది చిరకాలంబు నిర్భర తపంబు సేసి పృథివియందు గంధంబు గను చందంబునఁ దనయందు నానా సహస్రవదన శిరో నయన నాసా కర్ణ వక్త్ర భుజ కర చరణుండును బహువిధాభరణుండును మాయాకలితుండును మహాలక్షణలక్షితుండును నిజప్రకాశ దూరీకృతతముండును బురుషోత్తముండును నయిన నిన్ను దర్శించె, నయ్యవసరంబున. 360

* మహాత్మా! ఉత్తములైన బ్రహ్మాదులందూ, అధములమైన మా యందూ ఏ మాత్రం పక్షపాతం లేకుండా నీ సేవలకు తగిన ఫలాన్ని ప్రసాదిస్తావు. కామితములను తీర్చటంలో నీవు కల్పవృక్షానివి కదా! మన్మథుడు విహరించే సంసారకూపంలో మదాంధులతో పాటూ నేనూ పడవలసిన వాడను. నీ భక్తుడైన నారదుని ఉపదేశంవల్ల నీ కృపను పొందగలిగాను. నన్ను రక్షించి నా తండ్రిని శిక్షించటం నాపై పక్షపాతంతో కాదు. దుష్టశిక్షణ, శిష్టరక్షణం నీ సహజగుణాలు! విశ్వమూర్తివీ, విరాట్ స్వరూపానివీ నీవే. నీవే త్రిగుణాత్మకమైన విశ్వమును సృష్టిస్తావు. అందులో ప్రవేశిస్తావు. హేతురూపములైన గుణములతో కూడి నీవే రక్షకుడుగా, శిక్షకుడుగా నానారూపాలు ధరిస్తావు. నిత్యా నిత్య, కార్యకారణ సంబంధం కలిగిన ఈ విశ్వానికి మూలకారణం నీవే. నీ మాయ చేతనే వీడూ, వాడూ, నీవూ, నేనూ అనే భ్రాంతి కలుగుతుంది. అంతేకానీ ఈ విశ్వంలో నీవు తప్ప మరొకటి లేదు.

విత్తనంలో అతి సూక్ష్మంగా వస్తుతత్త్వం నిక్షిప్తమైనట్లు. వృక్షంలో నీలాది నానా వర్ణాలు దాగి ఉన్నట్లు, విశ్వం నీలోనే జన్మ, స్థితి, ప్రకాశ నాశాలను పొందుతుంది. నీచేత సృష్టింపబడిన ఈ విశ్వమును నీవు నీలోనే దాచుకుని ప్రళయకాలంలో మహాసముద్ర మధ్యంలో శేషతల్పంపై క్రియారహితంగా శయనించి ఆత్మానందం అనుభవిస్తూ ఉంటావు. నిద్రపోతున్నట్లు యోగ నిమీలిత నేత్రుడవై ఉంటావు. కొంతకాలానికి స్వకీయమైన కాలమహిమవల్ల నీవు ప్రకృతి ధర్మాలైన సత్త్వాదిగుణాలను స్వీకరించి సమాధి చాలించి తేజరిల్లు తుంటావు. అటువంటి సమయంలోనే వటబీజం నుంచి మహావట వృక్షం వెలువడే విధంగా నీ నాభినుంచి ముందుగా ఒక కమలం పుట్టింది. కమలంలోనుంచి చతుర్ముఖ బ్రహ్మ పుట్టాడు. నాలుగు ముఖాలతో నాలుగువైపులా

పరిశీలించాడు. కమలం తప్ప మరొకరూపం ఆయనకు కన్పించలేదు. ఆలోచించి జలాలలోకి వెళ్ళి నూఱుదివ్య సంవత్సరాలు వెదకి కూడా తన జన్మకు ప్రధానకారణమైన నిన్ను దర్శించలేక పోయాడు. మళ్ళీ కమలం దగ్గరకు వెళ్ళి ఆశ్చర్యపడి చాలాకాలం గొప్ప తపస్సు చేశాడు. చివరకు పృథివియందు గంధాన్ని కనుగొన్నట్లు తనలో నిన్ను చూడగలిగాడు. అపుడు నీవు సహస్రశీర్షుడవై, సహస్రాక్షుడవై, సహస్రవదనుడవై, పెక్కువేల నాసికలతో, పెక్కువేల వీనులతో, పెక్కువేల భుజాలతో, అనేకానేక కర, చరణాలతో ఒప్పుతూ ఉన్నావు. నానాలంకార భూషితుడవూ, మాయామయుడవూ మహాలక్షణ లక్షితుడవూ, స్వయం ప్రకాశుడవూ, దూరీకృత తముడవూ, పురుషోత్తముడవూ అయిన నీ విశ్వవిరాట్ స్వరూపాన్ని బ్రహ్మ దర్శించాడు.

**క. ఘోటక వదనుఁడవై మధు, కైటభులం ద్రుంచి నిగమగణముల నెల్లం**
**బాటించి యజున కిచ్చిన, కూటస్థుఁడ వీశ్వరుఁడవు! కోవిదవంద్యా! 361**

* ఆ సమయంలో నీవు హయగ్రీవుడవుగా వచ్చి మధుకైటభ రాక్షసులను మట్టుపెట్టి, వేదాలను ఉద్ధరించి విధాతకు ఇచ్చావు. అటువంటి కూటస్థుడవైన ఈశ్వరుడు నీవే గదా స్వామీ!

**వ. ఇవ్విధంబునఁ గృత త్రేతా ద్వాపరంబులను మూఁడు యుగంబులందును దిర్యఙ్మానవ మునిజలచరా కారంబుల నవతరించి లోకంబుల నుద్ధరించుచు హరించుచు యుగానుకూల ధర్మంబులం బ్రతిష్ఠింపుచు నుండుదువు. దేవా! యవధరింపుము. 362**

* ఈ ప్రకారంగా కృతయుగ, త్రేతాయుగ, ద్వాపరయుగాలలో తిర్యక్, మానవ, ముని, జలచర ఆకారాలు ధరించి అవతరించి లోకాలను ఉద్ధరిస్తూ, హరిస్తూ యుగధర్మాలు ప్రతిష్ఠించి పరిపాలిస్తుంటావు.

**సీ. కామహర్షాది సంకలితమై చిత్తంబు భవదీయచింతన పదవి సొరదు,**
**మధురాదిరసముల మరగి చొక్కుచు జిహ్వ నీ వర్ణనమునకు నిగుడనీదు,**
**సుందరీముఖములఁ జూడఁ గోరుచుఁ జూడ్కి తావకాకృతులపైఁ దగులువడదు,**
**వివిధ దుర్భాషలు వినఁ గోరు వీనులు వినవు యుష్మత్కథావిరచనములు,**

**తే. ఘ్రాణ మురవడిఁ దిరుగు దుర్గంధములకుఁ, దవులు గొలుపదు వైష్ణవధర్మములకు,**
**నడఁగి యుండవు, కర్మేంద్రియములు పురుషుఁ, గలఁచు సవతులు గృహమేధి! గలఁచునట్లు.363**

* నరసింహదేవా! కామం, క్రోధం, హర్షం, మున్నగు గుణాలతో నిండిన నీ చిత్తం నీ చింతన మార్గంలో ప్రవేశింపదు. మాధుర్యాది రుచులకు అలవాటు పడిన నాలుక నీ నామ స్మరణామృతం రుచి చూడదు. కామినీ ముఖదర్శనం కాంక్షించే కన్ను నీ దివ్యమంగళమూర్తిని చూడటానికి అంగీకరింపదు. రకరకాల దుర్భాషలు వినగోరే వీనులు నీ కథలు వినలేవు. దుర్వాసనలు ఆఘ్రాణించటానికి అలవాటుపడిన నాసిక వైష్ణవ ధర్మ సుగంధమును ఆఘ్రాణించలేదు. గృహస్థుణ్ణి సవతులంతా చుట్టుముట్టి బాధించినట్టుగా నిరంతరం పురుషుణ్ణి కర్మేంద్రియాలు బాధిస్తాయి.

వ. ఇవ్విధంబున నింద్రియంబులచేతం జిక్కువడి స్వకీయ పరకీయ శరీరంబులందు మిత్రామిత్ర భావంబులు సేయుచు జన్మమరణంబుల నొందుచు సంసారవైతరణీ నిమగ్నం బయిన లోకంబు నుద్ధరించుట లోకసంభవ స్థితిలయ కారణుండ వైన నీకుం గర్తవ్యంబు, భవదీయ సేవకుల మయిన మా యందుం బ్రియభక్తులయిన వారల నుద్ధరింపుము. 364

* జీవుడు ఈ విధంగా ఇంద్రియజాలంలో చిక్కుపడిపోయి తన వారి యెడల మిత్రత్వం, పరుల యెడల శత్రుత్వం పాటిస్తూ ఉంటాడు. జననమరణ వలయాలలో తిరుగుతూ ఉంటాడు. ఇలా సంసార వైతరణిలో మునిగిపోయింది లోకం. ఈ లోకమును ఉద్ధరించాలంటే జన్మ, స్థితి, లయకారకుడవైన నీకే సాధ్యం. అది నీ కర్తవ్యం కూడా. కరుణాంతరంగా! నీ సేవకులమూ, ప్రియభక్తులమూ ఐన మమ్ము ఉద్ధరించు.

మ. భగవద్దివ్య గుణానువర్తన సుధా ప్రాప్తైక చిత్తుండనై
బెగడన్ సంసరణోగ్ర వైతరణికిన్, భిన్నాత్ములై తావకీ
య గుణస్తోత్ర పరాఙ్ముఖత్వమున మాయాసౌఖ్యభావంబులన్
సుగతిం గానని మూఢులన్ గని మదిన్ శోకింతు సర్వేశ్వరా! 365

* సర్వేశ్వరా! నేను భగవంతుడవైన భవదీయ దివ్య సుగుణ కీర్తనమనే సుధను త్రాగాను. నా చిత్తం ఆ చింతనంతోనే నిండిపోయింది. నేను సంసారమనే దారుణ వైతరణిని చూచి భయపడటం లేదు, కానీ భేదభావంతో నీ గుణకీర్తనకు విముఖులై మాయా సౌఖ్యాలలో పడి దుర్గతి పొందే మూర్ఖులను చూచి బాధపడుతున్నాను.

వ. దేవా! మునీంద్రులు నిజవిముక్తి కాములయి విజనస్థలంబులం దపంబు లాచరింతురు, కాముకత్వంబు నొల్లక యుండువారికి నీ కంటె నొండు శరణంబు లేదు, గావున నిన్ను సేవించెదఁ, గొందఱు కాముకులు కరద్వయ కండూతి చేతం దనియని చందంబునఁ దుచ్ఛంబయి పశుపక్షి క్రిమికీట సామాన్యం బయిన మైథునాది గృహమేధి సుఖంబులం దనియక కడపట నతిదుఃఖవంతు లగుదురు, నీ ప్రసాదంబు గల సుగుణుండు నిష్కాముండయి యుండు, మౌనవ్రత జపతపశ్శ్రుతాధ్యయనంబులును, నిజధర్మవ్యాఖ్యాన విజనస్థలనివాస సమాధులును, మోక్షహేతువులగు, నైన నివి పదియు నింద్రియ జయంబు లేని వారికి, భోగార్థంబు లయి విశ్రమించు వారికి జీవనోపాయంబు లయి, డాంబికులకు వార్తాకరంబులయి యుండు, సఫలంబులు గావు, భక్తిలేక భవదీయజ్ఞానంబు లేదు, రూపరహితుండవైన నీకు బీజాంకురంబుల కైవడిఁ గారణకార్యంబు లయిన సదసద్రూపంబులు రెండును బ్రకాశ మానం బులగు, నా రెంటియందును భక్తియోగంబున బుద్ధిమంతులు మథనంబున దారువులందు వహ్నిం గనియెడు తెఱంగున నిన్నుఁ బొడగందురు, పంచభూత తన్మాత్రంబులును, బ్రాణేంద్రియంబు లును, మనోబుద్ధ్యహంకార చిత్తంబులును నీవ, సగుణంబును నిర్గుణంబును నీవ, గుణాభిమానులయిన జన్మమరణంబుల నొందు విబుధు లాద్యంతంబులు గానక నిరుపాధికుండవైన నిన్నెఱుంగరు, తత్త్వజ్ఞు లయిన విద్వాంసులు వేదాధ్యయనాది వ్యాపారంబులు మాని వేదాంత ప్రతి పాద్యుండవగు నిన్ను సమాధివిశేషంబుల నెఱింగి సేవింతు, రది గావున. 366

* దేవాదిదేవా! మునీంద్రులు కోరికలు వదలి ఏకాంత ప్రదేశాలలో తపస్సు చేసుకొంటూ ఉంటారు. కామవికారం లేనివాళ్ళకు నీ కంటె కాంక్షించదగినది ఏమున్నది? అందుకనే నేను నిన్ను సేవిస్తాను. కొందరు రెండు చేతులతోటి గోకుకొని కూడా తృప్తిపొందనట్లు కాముకులు తుచ్ఛమైన పశుపక్ష్యాదులకూ, క్రిమికీటకాదులకూ సామాన్యమైన మైథునాది గృహస్థ సుఖాలలో మునిగి సంతృప్తిచెందరు. చివరకు దుఃఖాల పాలవుతారు. నీ దయ పొందిన బుద్ధిమంతుడు నిష్కాముడై దివ్యసుఖం పొందుతాడు.

మౌనం, వ్రతం, జపం, తపం, స్మరణం, అధ్యయనం, స్వధర్మం, వ్యాఖ్యానం, ఏకాంతవాసం, ఏకాగ్రత ఇవి మోక్షహేతువులు. ఈ పదీ ఇంద్రియ నిగ్రహం లేని వాళ్ళకు భోగకారణాలు, విశ్రమించే వాళ్ళకు జీవనోపాయాలు, ఆడంబర పరులకు కాలక్షేపవిషయాలు అవుతాయి. ఇలాంటి వారికి ఆ మోక్షహేతువులు సఫలం కావు. మనస్సులో భక్తి లేని వానికి నీ తత్త్వజ్ఞానం అంతుపట్టదు.

విత్తనాల నుండి మొలకలు బయలుదేరి నట్లు రూపంలేని నీ యందు కారణ కార్యాలైన సత్, అసత్ రూపాలు రెండూకూడా తేజరిల్లుతూ ఉంటాయి. ఆ రెంటిలోనూ భక్తి యోగంతో బుద్ధిమంతులు మథించి అరణిలో అగ్నిని కనుగొన్నట్లు నిన్ను దర్శిస్తారు. భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశం అనే పంచభూతాలూ; శబ్దం, స్పర్శం, రూపం, రసం, గంధం అనే పంచ తన్మాత్రలు; ప్రాణం, ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి, అహంకారం, చిత్తం - అన్నీ నీవే. సగుణం, నిర్గుణం నీవే! సత్త్వ, రజ, స్తమో గుణాభి మానులై జనన, మరణాలు పొందే పండితులు నీ ఆద్యంతాలు తెలుసుకోలేరు. ఉపాధిరహితుడవైన నిన్ను గుర్తించలేరు; తత్త్వజ్ఞులైన విద్వాంసులు వేదాధ్యయనాది కర్మలు మాని, వేదాంత ప్రతిపాదకుడవైన నిన్ను ఏకాగ్రచిత్తంతో దర్శించి సేవిస్తుంటారు.

**సీ. నీ గృహాంగణ భూమి నిటలంబు మోవంగ మోదించి నిత్యంబు మ్రొక్కఁడేని,**
**నీ మంగళ స్తవనికర వర్ణంబులు పలుమాఱు నాలుకఁ బలుకఁడేని,**
**నీ యధీనములుగా నిఖిలకృత్యంబులు ప్రియభావమున సమర్పింపఁడేని,**
**నీ పదాంబుజముల నిర్మలహృదయుఁడై చింతించి మక్కువఁ జిక్కఁడేని.**

**తే. నిన్నుఁ జెవులార వినఁడేని, నీకు సేవ, సేయ రాఁడేని బ్రహ్మంబు జెందఁ గలఁడె?**
**యోగియైనఁ దపోవ్రతయోగియైన, వేదియైన మహాతత్త్వ వేదియైన. 367**

* నీ ఆలయ ప్రాంగణంలో నిన్ను చూచి నిత్యం తలవంచి మ్రొక్కనివాడూ, మంగళకరాలైన నీ వర్ణనలు పలుమార్లు నాలుకతో పలుకలేని వాడూ, సకలకృత్యాలూ నీ అధీనం అని తలచి భక్తిభావంతో ఫల సమర్పణ చేయని వాడూ, నీ పాదపద్మాలు నిర్మలమైన మనస్సులో నిత్యమూ ధ్యానించి పరవశుడు కానివాడూ, చెవులారా నీ సంకీర్తనం విననివాడూ, చేతులారా నీ సేవ చేయనివాడూ యోగి అయినా, తప శ్శాలి అయినా, పండితుడైనా, తత్త్వవేత్త అయినా ఎన్నటికీ పరమపదం అందుకోలేడు.

వ. కావున భవదీయ దాస్యయోగంబు కృపసేయు మని ప్రణతుండైన ప్రహ్లాదుని వర్ణనంబులకు మెచ్చి నిర్గుణుండైన హరి రోషంబు విడిచి యిట్లనియె. 368

* కల్యాణమూర్తీ! నీ దాస్యం చేసే మహాభాగ్యాన్ని ప్రసాదించుస్వామీ!- అని ప్రణామం చేసిన ప్రహ్లాదుని సంస్తుతికి సంతోషించి భగవంతుండైన శ్రీహరి రోషం మాని ప్రసన్నుడై నవ్వుతూ ఇలా అన్నాడు.

శా. సంతోషించితి నీ చరిత్రమునకున్, సద్భద్ర మౌఁగాక !నీ
యంతర్వాంఛితలాభ మెల్లఁ గరుణాయత్తుండనై యిచ్చెదం?
జింతం జెందకు, భక్త కాముదుఁడ నే, సిద్ధంబు దుర్లోక్యుఁడన్,
జంతుశ్రేణికి నన్నుఁ జూచినఁ బునర్జన్మంబు లే దర్భకా! 369

* నాయనా! ప్రహ్లాదా! నిన్ను చూస్తే నాకు చాలా ఆనందంగా ఉంది. నీ భక్తితత్త్వానికి భద్రం కలుగుతుంది. నీకు శుభం కలుగుతుంది! నేను భక్తుల కోరికలు తీర్చేవాణ్ణే. నీవు నీ మనసులో కోరుకొన్న వరమును తప్పకుండా ప్రసాదిస్తాను. దిగులుపడకు. నేను చూడ శక్యంకాని వాణ్ణి, నిజమే! కానీ నన్ను ఒకసారి చూస్తే చాలు, ప్రాణికోటికి పునర్జన్మ ఉండదు!

ఆ. సకలభావములను సాధులు విద్వాంసు, ల ఖిల భద్రవిభుఁడ నైన నన్నుఁ
గోర్కు లి మ్మటంచుఁ గోరుదు, రిచ్చెదఁ, గోరు మెద్దియైనఁ గుఱ్ఱ! నీవు. 370

* నేను సకల శుభప్రదాతను. నన్ను సాధువులూ, విద్వాంసులూ, ఎన్నెన్నో కోరికలు కోరుతుంటారు. వత్సా! నీవూ ఏదైనా కోరుకో! తప్పకుండా ఇస్తాను.

వ. అని పరమేశ్వరుండు ప్రహ్లాదునియందుఁ గల సకామత్వంబుఁ దెలియు కొఱకు వంచించి యిట్లానతిచ్చిన నతండు నిష్కాముండైన యేకాంతి గావునఁ గామంబు భక్తియోగంబునకు నంతరాయం బని తలంచి యిట్లనియె, నుత్పత్తి మొదలు కామాద్యనుభవాసక్తి గల నాకు వరంబు లిచ్చెద నని వంచింప నేల? సంసార బీజంబునకు హృదయ బంధకంబు లయిన కామంబులకు వెఱచి ముముక్షుండనై సేమంబు కొఱకు నేమంబున నిన్నుం జేరితిఁ, గామంబులును, నింద్రియంబులును, మనశ్శరీర ధైర్యంబులును, మనీషాప్రాణ ధర్మంబులును, లజ్జాస్మరణ లక్ష్మీసత్య తేజో విశేషంబులును, నశించు; లోకంబులందు భృత్యు లర్థకాములయి రాజుల సేవింతురు, రాజులుం బ్రయోజనంబు లర్థించి భృత్యులకు నర్థంబు లొసంగుదు, రవ్విధంబునం గాదు, నాకుం గామంబు లేదు, నీకుం బ్రయోజనంబు లే, దయినను దేవా! వరదుఁడ వయ్యెద వేనిఁ గామంబులు వృద్ధిబొందని వరంబు కృపసేయుము, కామంబులు విడిచిన పురుషుండు నీతోడ సమాన విభవుం డగు, నరసింహ! పరమాత్మ! పురుషోత్తమ! యని ప్రణవ పూర్వకంబుగా నమస్కరించిన హరి యిట్లనియె. 371

* అని పరమేశ్వరుడు - ప్రహ్లాదుడు కోరికలను జయించాడా లేదా అని పరీక్షించటం కోసం కపటంగా ఇలా సెలవిచ్చాడు. అయితే ప్రహ్లాదుడు జితేంద్రియుల్లో అగ్రగణ్యుడు కాబట్టి భక్తి యోగానికి కోరికలు ఆటంకం అని నిశ్చయించుకొని స్వామితో ఇలా పలికాడు! ప్రభూ! పుట్టుక నుంచి కామాది అనుభవాలలో ఆసక్తి ఉన్న నాకు వరాలు

ఇస్తానని పరీక్షిస్తున్నావా? సంసార బీజములైన కామములు హృదయగ్రంథులు. అటువంటి కామములకు భయపడి నేను మోక్షకామినైక్షేమాన్ని కోరి నియమవంతుడనై నీ సన్నిధికి వచ్చాను. కోరికలూ, ఇంద్రియాలూ, మనస్సు, శరీరం, ధైర్యం, బుద్ధి, ప్రాణం, ధర్మం, లజ్జ, స్మరణం, సిరిసంపదలూ, తేజోవిశేషాలూ సమస్తం నశించేవే. ఇది సత్యం. లోకంలో సేవకులు ధనం కోసం రాజులను సేవిస్తారు. రాజులు తమ ప్రయోజనాల కోసం సేవకులకు ధనం ఇచ్చి పోషిస్తారు. తండ్రీ! నా విషయం ఆ విధంగా భావించకు. నాకు ఏ కోరికా లేదు. నీకు నా వల్ల ప్రయోజనమూ లేదు. అయినా నీవు నాకు వరప్రదానం చెయ్యాలనుకుంటే కామములు వృద్ధిపొందని వరమును దయతో ప్రసాదించు. స్వామీ! కామములు విడిచిన వాడు నీతో సమానమైన వైభవం పొందుతాడు - అని ప్రహ్లాదుడు భక్తితో ప్రణవ పూర్వకంగా 'నరసింహా! పరమాత్మా! పురుషోత్తమా!' అంటూ నమస్కరించాడు. అప్పుడు నరహరి ఇలా పలికాడు -

**సీ. నీయట్టి సుజ్ఞాన నిపుణు లేకాంతులు గోర్కులు నాయందుఁ గోర నొల్ల,**
**రట్లైనఁ బ్రహ్లాద! యసురేంద్రభర్తవై సాగి మన్వంతర సమయ మెల్ల,**
**నిఖిలభోగంబులు నీవు భోగింపుము, కల్యాణబుద్ధి నా కథలు వినుము,**
**సకల భూతములందు సంపూర్ణుఁడగు నన్ను యజ్ఞేశు నీశ్వరు నాత్మ నిలిపి**

**ఆ. కర్మచయము లెల్ల ఖండించి పూజన మాచరింపు మీశ్వరార్పణముగ,**
**భోగముల నశించుఁ బుణ్యంబు, వ్రతములఁ బాపసంచయములు పాయు నిన్ను. 372**

* ప్రహ్లాదా! నీవంటి జ్ఞాన సంపన్నులు, ఏకాంతవాసులు ఎటువంటి కోరికా కోరరు. అయినా కూడా నీవు దానవనాథుడవై మన్వంతర కాలం సకల భోగాలూ అనుభవించు. శుభప్రదమైన బుద్ధితో నా గాథలు విను. సర్వభూతాత్మకుడనైన నన్ను యజ్ఞేశునిగా, ఈశ్వరునిగా తెలుసుకొని ఆత్మలో నిత్యం ఆరాధించు. కర్మబంధాలు ఖండించి ఈశ్వరార్పణ బుద్ధితో నన్ను పూజించు. సుఖాలను అనుభవించుటచేత పూర్వ పుణ్యాలు వ్యయ మవుతాయి. వ్రతాలవల్ల పాపాలు తొలగిపోతాయి.

**వ. మఱియు నటమీఁదఁ గాలవేగంబునం గళేబరంబు విడిచి త్రైలోక్య విరాజమానంబును, దివిజరాజజేగీయ మానంబును బరిపూరిత దశదిశంబును నైన యశంబుతోడ ముక్తబంధుండవై నన్ను డగ్గఱియెదవు. వినుము. 373**

* ఆ తరువాత కాలప్రవాహానికి లోబడి కళేబరం విడిచిపెట్టి బంధ విముక్తుడవై త్రైలోక్య విరాజమానమూ, దేవేంద్రజేగీయ మానమూ, దశదిశాపరిపూర్ణమూ అయిన గొప్ప కీర్తితో నా సాన్నిధ్యం పొందుతావు.

**ఆ. నరుఁడు ప్రియముతోడ నా యవతారంబు, నీ యుదారగీత నికరములును**
**మానసించునేని మఱి సంభవింపఁడు, కర్మబంధ చయముఁ గడచిపోవు. 374**

* నా నరసింహావతారాన్నీ, నీవు చేసిన సంస్తుతినీ, ప్రేమపూర్వకంగా మనస్సులో భావించిన నరుడు పునర్జన్మ పొందడు. కర్మబంధాలను అతిక్రమిస్తాడు.

**వ. అనినఁ బ్రహ్లాదుం డిట్లనియె. 375**

* అని నరసింహస్వామి అనగా ప్రహ్లాదుడు మహానందంతో ఇలా పలికాడు.

సీ. దంష్ట్రివై తొల్లి సోదరుని హిరణ్యాక్షు నీవు చంపుటఁ జేసి నిగ్రహమున
మా తండ్రి రోషనిమగ్నుఁడై సర్వలోకేశ్వరుఁ బరము నిన్నెఱుఁగ లేక
పరిపంథి పగిది నీ భక్తుండనగు నాకు నపకారములు సేసె; నతఁడు నేఁడు
నీ శాంతదృష్టిచే నిర్మలత్వము నొందెఁ, గావునఁ బాపసంఘంబు వలనఁ

తే. బాసి శుద్ధాత్మకుఁడు గాఁగ భవ్యగాత్ర!, వరము వేఁడెద నా కిమ్ము వనజనేత్ర!
భక్త సంఘాత ముఖపద్మ పద్మమిత్ర! భక్త కల్మషవల్లికా పటులవిత్ర! 376

* దేవా! పూర్వం నీవు వరాహరూపంలో వచ్చి తన తమ్ముడైన హిరణ్యాక్షుణ్ణి సంహరించావని మా తండ్రి ద్వేషంతో, రోషంతో, సర్వేశ్వరుడవైన నిన్ను గుర్తించలేక పోయాడు. నిన్ను బద్ధవిరోధిగా భావించాడు. నీ భక్తుడ నయినందుకు నన్ను నానా బాధలు పెట్టాడు. అటువంటి నా తండ్రి ఈనాడు నీ శాంతదృష్టి సోకి నిర్మలు డయ్యాడు. అందువల్ల ఆయన పాపాలు పోయి పరిశుద్ధాత్ము డయ్యే లాగున వరం ప్రసాదించు స్వామీ! నీవు భక్తుల ముఖపద్మాలకు పద్మ మిత్రుడవు! భక్త జన పాపలతా లవిత్రుడవు!

వ. అనిన భక్తవత్సలుం డిట్లనియె. 377

* అని ప్రహ్లాదుడు పలుకగా భక్తవత్సలుడైన నరసింహస్వామి ఇలా అన్నాడు.

మ. నిజభక్తుండవు నాకు, నిన్నుఁ గనుటన్ నీ తండ్రి త్రిస్సప్త పూ
ర్వజులం గూడి పవిత్రుఁడై శుభగతిన్ వర్తించు, విజ్ఞాన దీ
ప జితానేక భవాంధకారు లగు మద్భక్తుల్ వినోదించు దే
శ జనుల్ దుర్జనులైన శుద్ధులు సుమీ! సత్యంబు దైత్యోత్తమా! 378

* ప్రహ్లాదా! నీవు నాకు పరమభక్తుడవు. నిన్ను కనటంవల్ల నీ తండ్రి ముయ్యేడు తరాలవాళ్లతో కూడా పవిత్రుడై శుభస్థితి పొందాడు. విజ్ఞానదీపికలు వెలిగించి సంసార మాయాంధకారం పోగొట్టే నా భక్తులు నివసించే ప్రదేశాలలో ఉండి వారి ప్రేమకు పాత్రులైన వాళ్ళు దుర్జనులైనా కూడా పరిశుద్ధు లవుతారు. ఇది సత్యం.!

సీ. ఘన సూక్ష్మభూత సంఘాతంబు లోపల నెల్లవాంఛలు మాని యెవ్వ రయిన
నీ చందమున నన్ను నెఱయ సేవించిన మద్భక్తు లగుదురు, మత్పరులకు
గుఱిసేయ నీవ యోగ్యుఁడ వైతి, విటమీఁద వేదచోదితమైన విధముతోడఁ
జిత్తంబు నామీఁదఁ జేర్చి మీ తండ్రికిఁ బ్రేతకార్యములు సంప్రీతిఁ జేయు

తే. మతఁడు రణమున నేఁడు నా యంగమర్శ, నమున నిర్మల దేహుఁ డై నవ్యమహిమ
నపగతాఖిల కల్మషుఁడై తనర్చి, పుణ్యలోకంబులకు నేఁగుఁ బుణ్యచరిత! 379

* పుణ్యచరితా! చిన్నవారైనా, పెద్దవారైనా ఎల్లవాంఛలూ మాని ఎవరైతే నీ వలె నన్ను ఉపాసిస్తారో వాళ్ళు నా భక్తులు, నా భక్తులలో నీవు ఉత్తముడవు, ఇక నీవు నీ మనస్సు నా మీద నిలిపి సంతోషంగా వేదోక్త

విధిగా నీ తండ్రికి ఉత్తరక్రియలు చెయ్యి. అతడు నా శరీర స్పర్శతో నిర్మల దేహం పొందాడు. కల్మషాలు కడిగివేసుకొని పుణ్యలోకాలకు పయనిస్తాడు.

వ. అని యిట్లు నరసింహదేవుం డానతిచ్చిన హిరణ్య కశిపునకుం బ్రహ్లాదుండు పరలోక క్రియలు సేసి భూసురోత్తములచేత నభిషిక్తుం డయ్యె, నయ్యెడం బ్రసాద సంపూర్ణ ముఖుండైన శ్రీ నృసింహదేవునిం జూచి దేవతా ప్రముఖ సహితుండైన బ్రహ్మదేవుం డిట్లనియె. 380

* అని నరసింహస్వామి కరుణాంతరంగుడై ఆనతిచ్చాడు. వెంటనే ప్రహ్లాదుడు సుస్నాతుడై విప్రవర్యుల పర్యవేక్షణలో తండ్రికి పరలోక క్రియలు జరిపి ప్రాజ్ఞులచే ప్రశంసింపబడ్డాడు. అనంతరం ప్రసన్నమూర్తియైన నరసింహస్వామిని చూచి దేవతాశ్రేష్ఠులతో కూడి బ్రహ్మదేవుడు ఇలా విన్నవించాడు.

సీ. దేవ దేవాఖిల దేవేశ! భూత భావన! వీఁడు నాచేత వరము వడసి
మత్సృష్టజనులచే మరణంబు నొందక మత్తుఁడై సకల ధర్మములుఁ జెఱచి
నేఁడు భాగ్యంబున నీ చేత హతుఁడయ్యెఁ, గల్యాణ మమరె లోకముల కెల్ల,
బాలు నీతని మహాభాగవత శ్రేష్ఠుఁ బ్రదికించితివి మృత్యుభయముఁ బాపి

తే. వరము కృప సేసితివి మేలుఁ వారిజాక్ష! నీ నృసింహావతారంబు నిష్ఠతోడఁ
దగిలి చింతించువారలు దండధరుని, బాధ నొందరు, మృత్యువు బారిఁ బడరు. 381

* దేవదేవా! సర్వేశ్వరా! ఈ హిరణ్యకశిపుడు నాచేత సృష్టింపబడిన ప్రాణుల వల్ల మృత్యువు పొందని విధంగా నా వల్ల వరం పొంది గర్వించాడు. సకల ధర్మాలను మంటకలిపాడు. లోకాలను శోకాలపాలు చేశాడు. అటువంటి ఉద్దండుడు ఈ నాడు మా అదృష్టం వల్ల నీచేతిలో హతు డయ్యాడు. లోకాలకు మేలు కలిగింది. కమలాక్షా! ఈ బాలుడు భక్తశిఖామణి. ఇతనికి మృత్యుభయం, జన్మభయం లేకుండా వరం ప్రసాదించావు. స్వామీ! నీ నరసింహావతారాన్ని నిష్ఠతో ఉపాసించే వాళ్ళు యమునివల్ల బాధలు పడరు, మృత్యుభయం పొందరు.

వ. అనిన నరసింహ దేవుం డిట్లనియె. 382

* అని పలికిన బ్రహ్మతో నరసింహస్వామి ఇలా అన్నాడు -

క. 'మన్నించి దేవశత్రుల, కెన్నఁడు నిటువంటి వరము లీకుము, పాపో
త్పన్నులకు వరము లిచ్చుట, పన్నగముల కమృత మిడుట పంకజగర్భా!' 383

* పంకజాసనా! అమర విరోధులను ఆదరించి ఇక ఎప్పుడూ ఇలాంటి వరములను ఈయకు. పాపాత్ములకు వరములను ఇవ్వటం పాములకు పాలు పోయటం వంటిది.

వ. అని యిట్లానతిచ్చి బ్రహ్మాదిదేవతా సమూహంబుచేఁ బూజితుండై భగవంతుండైన శ్రీనృసింహ దేవుండు తిరోహితుండయ్యె!, బ్రహ్లాదుండును శూలికిఁ బ్రణమిల్లి తమ్మిచూలికి వందనంబులుసేసి ప్రజాపతులకు మ్రొక్కి భగవత్కళలైన దేవతలకు నమస్కరించినం జూచి బ్రహ్మదేవుండు శుక్రాది

మునీంద్ర సహితుండై దైత్య దానవ రాజ్యంబునకుం బ్రహ్లాదుం బట్టంబు గట్టి యతనిచేతఁ బూజితుండై దీవించె, అంత నీశానాది నిఖిలదేవతలు వివిధంబులగు నాశీర్వాదంబులచేత నా ప్రహ్లాదునిఁ గృతార్థుం జేసి తమ్మిచూలిని ముందట నిడుకొని నిజస్థానంబులకుఁ జని, రిట్లు విష్ణుదేవుండు నిజపార్శ్వచరు లిరువురు బ్రాహ్మణ శాపంబునం జేసి ప్రథమ జన్మంబున దితిపుత్రులైన హిరణ్యాక్ష హిరణ్య కశిపులను వరాహ నారసింహ రూపంబుల నవతరించి వధియించె, ద్వితీయ భవంబున రాక్షసజన్మంబు దాల్చిన రావణకుంభకర్ణులను శ్రీరామ రూపంబున సంహరించెఁ దృతీయ జన్మంబున శిశుపాల దంతవక్త్రులను పేరులం బ్రసిద్ధి నొందిన వారలను శ్రీకృష్ణ రూపంబున ఖండించె, నివ్విధంబున మూఁడు జన్మంబుల గాఢ వైరానుబంధంబున నిరంతర సంభావిత ధ్యానులై వారలు నిఖిల కల్మష విముక్తులై హరిం గదిసి, రని చెప్పి నారదుం డిట్లనియె. 384

* అని ఇలా ఆనతిచ్చి బ్రహ్మాది దేవతల పూజలు స్వీకరించి భగవంతుడైన శ్రీనరసింహదేవుడు అంతర్ధాన మయ్యాడు. ప్రహ్లాదుడు ప్రమోదంతో పరమేశ్వరునకు నమస్కారం చేశాడు. విధాతకు వందనం చేశాడు. ప్రజాపతులకు ప్రణతు లర్పించాడు. భగవదంశతో ప్రకాశించే దేవతలకు మ్రొక్కాడు. చతుర్ముఖుడు శుక్రాది మునీంద్రులతో కలిసి దైత్య దానవ రాజ్యానికి ప్రహ్లాదుణ్ణి పట్టాభిషిక్తుణ్ణి చేసి ఆశీర్వదించాడు. ప్రహ్లాదుడు దేవతల నందరిని అర్హరీతిని పూజించాడు. ఈశానుడు మొదలైన సమస్త దేవతలు వివిధములైన ఆశీస్సులతో ప్రహ్లాదుణ్ణి ధన్యుణ్ణి చేశారు. బ్రహ్మతో సహ దేవతలందరూ తమ తమ స్థానాలకు దయచేశారు.

ఈ విధంగా వైకుంఠ ద్వారపాలకులు శాప విముక్తు లయ్యారు. విప్రశాపం వల్ల ప్రథమజన్మలో దితికి పుత్రులైన హిరణ్యాక్ష, హిరణ్యకశిపులను విష్ణువు వరాహ, నారసింహ అవతారాలెత్తి అంతంచేశాడు. ద్వితీయజన్మలో పుట్టిన రావణ కుంభకర్ణులను శ్రీరాముడుగా అవతరించి పరిమార్చాడు. తృతీయ జన్మలో శిశుపాల, దంతవక్త్రులుగా పుట్టిన వాళ్లను శ్రీకృష్ణుడై సంహరించాడు. ఇలా మూడు జన్మలలో గాఢమైన వైరబంధంతో వీళ్ళు నిరంతరం హరి స్మరణం చేస్తూ పాప విముక్తు లయ్యారు. చివరకు ద్వారపాలకు లయ్యారు అని నారదమహర్షి మహారాజైన ధర్మరాజుకు వివరించి ఫలశ్రుతిగా ఇలా పలికాడు.

ఉ. శ్రీరమణీయమైన నరసింహవిహారము నింద్రశత్రు సం
హారముఁ బుణ్యభాగవతుఁడైన నిశాచరనాథ పుత్ర సం
చారము నెవ్వఁడైన సువిచారత విన్నఁ బఠించినన్ శుభా
కారముతోడ నే భయముఁ గల్గని లోకముఁ జెందు భూవరా! 385

* రాజా! శుభకరమైన శ్రీ నరసింహస్వామి విహారమూ, హిరణ్య కశిపు సంహారమూ, పుణ్యమూర్తియైన భక్తుడైన ప్రహ్లాదుని సంచారమూ మంచి మనస్సుతో వినినా, చదివినా ఏ భయమూ కలుగని పుణ్యలోకానికి మానవుడు చేరుకొంటాడు.

మ. జలజాత ప్రభవాదులున్ మనములోఁ జర్చించి భాషావళిం
బలుకన్ లేని జనార్దనాహ్వయ పరబ్రహ్మంబు నీ యింటిలోఁ

జెలియై మేనమఱందియై సచివుఁడై చిత్తప్రియుండై మహా
ఫలసంధాయకుఁడై చరించుటలు నీ భాగ్యంబు రాజోత్తమా! 386

* రాజోత్తమా! బ్రహ్మాదులు సైతం మనస్సులో ఆలోచించి, పరిశోధించి మాటలలో చెప్పలేనటువంటి పరబ్రహ్మ స్వరూపమైన శ్రీకృష్ణుడు మిత్రుడుగా, బావమరదిగా, మంత్రిగా, మనః ప్రియుడుగా, మహాఫల ప్రదాతగా నీ గృహంలో విహారం చేయటం నీ మహాభాగ్యం ! - అని ధర్మరాజునకు నారద మునీంద్రుడు ప్రహ్లాద చరిత్ర వినిపించాడు.

## -: త్రిపురాసుర సంహారము :-

క. బహుమాయుఁడైన మయుచే, విహతంబగు హరుని యశము విఖ్యాత జయా
వహముగ నీ భగవంతుఁడు, మహితాత్ముఁడు ము న్నొనర్చె మనుజవరేణ్యా? 387

* నరవరేణ్యా! ఒకసారి మాయలమారి మయునివల్ల మహేశ్వరుని మహిమాన్వితమైన యశస్సుకు మచ్చ కలిగింది. అపుడు మహా విష్ణువు మహాదేవునికి జయం కలిగించి ఆయన కీర్తికి వన్నె తెచ్చాడు - అని నారదుడు ధర్మరాజుతో చెప్పాడు.

వ. అనిన ధర్మనందనుం డిట్లనియె. 388

క. ఏ కర్మంబున విభుఁ డగు, శ్రీ కంఠుని యశము మయునిచే సుడివడియెన్?
వైకుంఠుఁ డెవ్విధంబునఁ, గైకొని తత్కీర్తి చక్కఁగా నొనరించెన్? 389

* అది విని ధర్మజుడు ఇలా అడిగాడు -

మయునివల్ల నీలకంఠుని యశస్సుకు ఎలా కళంకం కలిగింది? మయుడు ఏమి చేశాడు? శ్రీహరి ఆ సమస్యను ఎలా పరిష్కరించాడు?

వ. అనిన నారదుం డి ట్లనియె, 390

క. చక్రాయుధ బలయుతు లగు, శక్రాదుల కోహటించి శమమున నసురుల్
సక్రోధంబున నరిగిరి, విక్రమములు మాని మయుని వెనుకకు నధిపా! 391

* ఆ ప్రశ్న విని నారదుడు ఇలా అన్నాడు.

ఒకసారి దానవులు శ్రీహరి అండచే బలవంతులైన దేవేంద్రాదుల ఉద్ధతికి తట్టుకోలేక భయపడి పోయారు. దానవులకు కోపం వల్ల మనస్సు మండిపోయింది. కానీ దేవతలను ఎదుర్కోలేక పోయారు. అపుడు వాళ్ళకు మయుడు కనిపించాడు. మయుడు మాయావి. కొన్ని శక్తులను సాధించిన ఉద్దండుడూ, గర్వితుడూ. అటువంటి మయుణ్ణి అసురులు శరణువేడారు.

వ. ఇట్లు రక్కసులు దన వెనుకఁ జొచ్చిన మాయా నిలయుండును దుర్నయుండును నైన మయుండు దన యోగబలంబున నయోరజత సువర్ణమయంబులై యెవ్వరికిని లక్షింపరాని గమనాగమనంబులు

**వితర్కింపరాని కర్కశ పరిచ్ఛదంబులును గలిగిన త్రిపురంబుల నిర్మించి యిచ్చిన నక్తంచరు లం దఱు నందుఁ బ్రవేశించి కామసంచారులై పూర్వవైరంబుఁ దలంచి సనాయకంబులయిన లోకంబుల నస్తోకంబయిన నిజబలాతి రేకంబున శోకంబు నొందించిన.** 392

* ఇలా రాక్షసులు తన చెంతకు వచ్చి నీవే దిక్కు అనే సరికి మాయలమారీ, దుర్మార్గుడూ అయిన మయునికి మరింత గర్వం వచ్చింది. దేవతలుకూడా కంటికి కన్పించలేదు. వెంటనే తన యోగబలంతో ఇనుము, వెండి, బంగారాలతో నిర్మింపబడినటువంటి, రాకపోకలు తెలియరానటువంటి, రహస్యమార్గాలూ, రక్షణగృహాలూ కలిగినటువంటి మూడు పురములను సిద్ధం చేశాడు. తనను శరణువేడిన రాక్షసులకు మయుడు ఆ త్రిపురములను ఇచ్చి మీ ఇష్టం వచ్చినట్లు ఉండండి అన్నాడు. ఇక కల్మషాత్ములైన రాక్షసులంతా కామ సంచారు లయ్యారు. వెనుకటి శత్రుత్వం గుర్తుంచుకొని భయంకరమైన తమ పరాక్రమంతో నగరాలనూ, రాజ్యాలనూ కొల్లగొడుతూ లోకాలనూ శోకాలపాలు చేయసాగారు.

క. **లోకాధినాథులెల్లను, శోకాతురు లగుచు శరణు సొచ్చిరి దుష్టా**
**నీక విదళనాకుంఠున్, శ్రీకంఠున్ భువనభరణ చిత్తోత్కంఠున్.** 393

* రాకాసిమూకల బాధలు భరించలేక పోయింది లోకం. దిక్పాలకులు శోకమూర్తు లయ్యారు. అపుడు వాళ్ళంతా వెళ్లి లోకశుభంకరుడూ దుష్టనాశంకరుడూ భక్తవశంకరుడూ అయిన శంకరుని శరణువేడారు.

వ. **ఇట్లు సకల లోకేశ్వరుండగు మహేశ్వరుం జేరి లోకపాలకులు ప్రణతులై పూజించి కరకమలంబులు ముకుళించి.** 394

* ఇలా సకల లోకేశ్వరుడగు పరమేశ్వరుని పూజించి, నమస్కరించి లోకపాలకులు ఇలా పలికారు.

క. **త్రిపురాలయులగు దానవు, లపరాజితు లగుచు మాకు నశ్రాంతంబున్**
**వపురాది పీడఁ జేసెద, రపరాధకులను వధింపు మగజాధీశా!** 395

* పార్వతీపతీ! త్రిపురాలలో ఉండే అసురులు చేసే అరాచకాలకు అంతం లేకుండా ఉంది. వాళ్ళు అజేయులై నిత్యం లోకాలను తల్లడిల్ల జేస్తున్నారు. మా ప్రాణాలకు ముప్పుతెస్తున్నారు. శూలపాణీ! నీవు పరాక్రమించి అపరాధులను అంతమొందించి అమరులను ఆదుకో.

క. **దీనులము గాక యుష్మద, ధీనులమై యుండు మేము దేవాహిత దో**
**ర్లీనుల మైనారము, బల, హీనుల మగు మమ్ముఁగావు మీశాన! శివా!** 396

* త్రిలోచనా! నీ ఆధీనంలో మేము నిరంతరం దివ్యానందంతో ఉండేవాళ్ళం. కానీ ఇప్పుడు రాక్షస బలం పెరిగి వాళ్ళముందు దీనులమూ, బలహీనులమూ కావలసి వచ్చింది. ఆ దుర్మార్గులను శిక్షించి మమ్ములను నీవే రక్షించాలి అన్నారు అమరులు.

వ. **అనిన భక్తవత్సలుండగు పరమేశ్వరుండు శరణాగతులైన గీర్వాణుల వెఱవకుండుఁడని దుర్వార బలంబున బాణాసనంబుఁ గేల నందికొని యొక్క దివ్యబాణంబు సంధించి త్రిపురంబుల పయినేసిన మార్తాండ**

**మండలంబున వెలువడు మయూఖజాలంబుల చందంబునఁ దద్బాణంబువలన దేదీప్యమానంబులై యనేక బాణసహస్రంబులు సంభవించి భూనభోఽంతరాళంబులు నిండి మండి తెప్పలుగా! గుప్పలుగొని త్రిపురంబుల పయిఁ గప్పి, నప్పుడు తద్బాణపావక హేతి సందోహ దందహ్యమానులై గతాసులైన త్రిపురపుర నివాసులం దెచ్చి మహాయోగియైన మయుండు సిద్ధరస కూపంబున వైచిన. 397**

* పరమేశ్వరుడు శరణాగతులను కరుణించి, అభయహస్తం ఇచ్చాడు. అవక్రపరాక్రమంతో ధనుస్సును చేత పట్టాడు. దివ్యమైన అగ్నిబాణం గురిపెట్టి త్రిపురాలపైకి విడిచాడు. ఆ బాణంవల్ల చండ ప్రచండమైన సూర్యమండలంలో వెలిగే కిరణాల సమూహాల లాగా అగ్ని శిఖలు సహస్రముఖాలుగా వెలువడి భూమ్యాకాశాలు నిండి, మండి నిప్పులు తెప్పలు తెప్పలుగా కురుస్తూ త్రిపురాలను ముట్టడించాయి. ఆ బాణాగ్ని శిఖల సందోహానికి దానవులు దహించుకుపోయి అసువులు విడిచారు. అపుడు మహాయోగి అయిన మయుడు తన యోగబలంతో, సిద్ధరసంతో నిండిన కూపంలో అసువులు వీడిన అసురుల శవాలను తెచ్చిపడవేశాడు.

**క. సిద్ధామృత రస మహిమను, శుద్ధ మహావజ్రతుల్య శోభిత తనులై**
**వృద్ధిం బొందిరి దానవు, లుద్ధత నిర్ఘాతపావకోపము లగుచున్. 398**

* ఆ సిద్ధరస ప్రభావం వల్ల రాక్షసులంతా పునర్జీవితు లయ్యారు. వజ్రాలవంటి శరీరాలతో చిచ్చర పిడుగులవలె బల సంపన్నులయ్యారు. అంతులేని బలంవల్ల పౌరుషం హెచ్చింది. మళ్ళా దేవతలపై ద్వేషం పెరిగింది.

**క. కూపామృతరస సంగతి, దీపితులై నిలిచియున్న దేవాహితులన్**
**రూపించి చింత నొందెడు, గోపధ్వజుఁ జూచి చక్రి కుహనాన్వితుఁడై. 399**

* తన బాణశక్తి వ్యర్థం కావటం, మయుని సిద్ధరస ప్రభావం వల్ల రాక్షసులు ఇలా ప్రబలి పోవటం మహేశ్వరునకు బాధ కలిగించింది. తన పరాక్రమానికి కళంకం ఏర్పడిందని తన కీర్తికి మచ్చ కలిగిందని చింతించాడు. విష్ణువు ఇది తెలుసుకొని ఉపాయం ఆలోచించాడు. మాయగాళ్ళను మాయతోనే మటుమాయం చేయాలని నిశ్చయించుకొన్నాడు.

**శా. ఉత్సాహంబున నొక్కపాఁడి మొదవై యూథంబు ఘూణించుచున్**
**వత్సంబై తన వెంట బ్రహ్మ నడవన్ వైకుంఠుఁ డే తెంచి యు**
**ద్యత్సత్త్వంబునఁ గూపమధ్యరసముం ద్రావెన్ విలోకించుచుం**
**దత్సౌభాగ్య నిమగ్నులై మఱచి రాదైత్యుల్ నివారింపఁగన్. 400**

* విష్ణువు ఒక అందమైన పాడి ఆవు అయ్యాడు. బ్రహ్మ దాని పొదుగు చుంబించే చిన్నారి గోవత్సంగా మారాడు. ఆ ఆవుదూడలు జగన్మోహనంగా ఉన్నాయి. అవి మెల్లమెల్లగా వచ్చి ఆ కూపంలో ఉన్న సిద్ధరసం త్రాగుతున్నాయి. దానిని కాపలా కాస్తున్న రాక్షస భటులు వాటి అందచందాలు చూస్తూ వాటిని తోలటమే మరచిపోయారు. ఆవు దూడలు ఆ బావిలోని సిద్ధరసం పూర్తిగా త్రాగేశాయి.

**వ. ఇట్లు విష్ణుండు మోహనాకారంబున ధేనువయి త్రిపురమధ్య కూపామృత రసంబు ద్రావిన నెఱింగి శోకాకుల చిత్తులయిన రసకూపపాలకుంజూచి మహాయోగియైన మయుండు వెఱఁగు పడి, దైవగతిం జింతించి శోకింపక యిట్లనియె. 401**

* ఇలా విష్ణువు మోహనాకారంలో ధేనువుగా వచ్చి త్రిపురాల మధ్య గల కూపంలోని రసం అంతా త్రాగేసరికి ఇది తెలుసుకొని గుండెలు బాదుకొని ఆ కూప పాలకులు దుఃఖించసాగారు. శోకిస్తున్న వాళ్లను చూచి మహాయోగియైన మయుడు విషయం తెలుసుకొని ఆశ్చర్యపడ్డాడు. ఆ దురదృష్టం గురించి తలుచుకొని బాధపడకుండా ఇలా అన్నాడు.

**ఆ. అమరులైన దనుజు లైనను నరులైన, నెంత నిపుణులైన నెవ్వరైన**
**దైవికార్థచయముఁ దప్పింపఁగా లేరు, వలదు దనుజులార! వగవ మనకు! 402**

* ఆప్తులారా! అసురులారా! దైవేచ్ఛ ఇలా ఉంది కాబోలు. తప్పించటం ఎవరి తరం అవుతుంది? అమరులైనా, అసురులైనా, నరులైనా, ఎంత ఘనులైనా దైవగతి దాటలేరు. కాబట్టి అనవసరంగా మనం బాధపడకూడదు.

**వ. అని పలికె. అంత విష్ణుండు నైజంబులైన ధర్మ జ్ఞాన విద్యాతపో విరక్తి సమృద్ధి క్రియాశక్తి విశేషంబుల శంభునికిఁ బ్రాధాన్యంబు సమర్పించి రథ సూత కేతువర్మ బాణాసన ప్రముఖ సంగ్రామ సాధనంబులు సేసినం గైకొని. 403**

* అని మయుడు రాక్షసులను ఓదార్చాడు. ఆ తరువాత విష్ణుమూర్తి తన సహజశక్తులైన ధర్మం, జ్ఞానం, విద్య, తపస్సు, విరక్తి, సమృద్ధి, క్రియాశక్తి విశేషాలతో రథం, సారథి, కేతనం, కవచం, ధనుస్సు మొదలైన యుద్ధ సామగ్రిని శంకరునికి సమకూర్చి పెట్టాడు. రథికుడైన ఈశ్వరుడు వాటిని స్వీకరించాడు.

**మ. శరి యై కార్ముకియై మహాకవచియై సన్నాహియై వాహియై**
**సరథుండై సనియంతయై సబలుఁడై సత్కేతనచ్ఛత్రుఁడై**
**పరమేశుం డొక బాణమున్ విడిచెఁ దద్బాణానల జ్వాలలం**
**బురముల్ గాలె ఛటచ్ఛటధ్వని నభోభూమధ్యముల్ నిండఁగన్. 404**

* పరమేశ్వరుడు కవచం ధరించాడు. పినాకం చేతపట్టాడు. అమ్ము అందుకొన్నాడు. సర్వసన్నాహంతో యుద్ధానికి సిద్ధమయ్యాడు. రథం అధిరోహించాడు. సేన కూడా సిద్ధమయింది. త్రినేత్రుడు ఉగ్రస్వరూపంతో ఛత్రం క్రింద నిలబడ్డాడు. సారథి రథం ముందుకు సాగనిచ్చాడు. సేన కదిలింది. రథం పై జెండా వాయువేగానికి రెప రెప లాడసాగింది. పినాకపాణి గురి చూచి ఒక్కబాణం వింట సంధించి విడిచాడు. ఆ బాణం నుంచి మహాగ్ని జ్వాలలు చెలరేగాయి. ఒక్కసారిగా మూడు పురాలు భగ్గున మండాయి. ఛట ఛట ధ్వనులతో భూమ్యాకాశాల మధ్య బాగం అంతా నిండిపోయింది.

వ. ఇట్లు హరుండు దురవగాహంబులైన త్రిపురంబుల నభిజిన్ముహూర్తంబున భస్మంబుసేసి కూల్చిన, నమర గరుడ గంధర్వ సిద్ధ సాధ్య యక్ష వల్లభులు వీక్షించి, జయ జయ శబ్దంబులు సేయుచుఁ గుసుమ వర్షంబులు వర్షించిరి, ప్రజలు హర్షించిరి, బ్రహ్మాదులు కీర్తించి, రప్సరసలు నర్తించిరి, దివ్యకాహళ దుందుభి రవంబులును, మునిజనోత్సవంబులును, బ్రచురంబు లయ్యె, నిట్లు విశ్వజనీనంబగు త్రిపురాసుర సంహారంబున నఖిల లోకులును సంతసిల్లియుండ నయ్యవసరంబున. 405

* ఇలా త్రినేత్రుడు దుర్భేద్యాలైన త్రిపురాలను మట్టమధ్యాహ్న సమయంలో భస్మం చేసి కూల్చివేశాడు. ఇది చూచి దేవతలూ, గరుడ గంధర్వులూ, సిద్ధ సాధ్యులూ, యక్షాధిపతులూ, జయ జయ నినాదాలు చేసి పూలవానలు కురిపించారు. ప్రజలు ప్రమోదం చెందారు. బ్రహ్మాది దేవతలు పరమేశ్వరుని ప్రస్తుతించారు. అప్సరసలు ఆనందంతో నృత్యం చేశారు. మునిజనులు ఉత్సవం జరుపుకొన్నారు. దివ్య కాహళ ధ్వనులూ, దుందుభి ధ్వనులూ మిన్ను ముట్టాయి. ఇలా పరమేశ్వరుడు విశ్వకల్యాణకరం అయిన త్రిపురాసుర సంహారం చేయటంతో సకల లోకాలూ సంతసించాయి.

ఆ. తృణకణముల భంగిఁ ద్రిపురంబుల దహించి, పరముఁ డవ్యయుండు భద్రయశుఁడు
శివుఁడు పద్మజాది జేగీయమానుఁడై, నిజ నివాసమునకు నెమ్మిఁ జనియె. 406

* అగ్ని హోత్రుడు ఎండుగడ్డిని దహించినట్లుగా ముక్కంటి మూడు పురాలను రూపుమాపాడు. పరముడూ, అవ్యయుడూ, కీర్తిశాలీ అయిన ఈశ్వరుడు బ్రహ్మాదుల పూజలు అందుకొని తన మందిరానికి వెళ్ళాడు.

వ. ఇట్లు నిజమాయా విశేషంబున మర్త్యలోకంబున విడంబించు చున్న విష్ణుని పరాక్రమ విధానంబులు మునిజన వంద్య మానంబులై, సకల లోక కల్యాణ ప్రదానంబులై యుండు ననిన విని నారదునకు ధర్మనందనుం డిట్లనియె. 407

* ఇలా తన మాయా విశేషాలతో విష్ణువు మానవలోకంలో విరాజిల్లుతున్నాడు. ఆ ప్రభువు పరాక్రమవిధానాలు మునిజనులకు స్తుతిపాత్రాలు! లోకానికి కల్యాణ కరాలు!! - అని నారదుడు ధర్మరాజుకు వివరించాడు.

అపుడు ధర్మరాజు ఇలా అన్నాడు.

## -: నారదుండు ధర్మరాజునకు వర్ణాశ్రమ ధర్మంబులు తెలుపుట :-

సీ. అనఘాత్మ! సకలవర్ణాశ్రమాచార సమ్మత ధర్మ మెయ్యది మానవులకు?
నే ధర్మమున నరుం డిద్ధ విజ్ఞానము భక్తియుఁ బ్రాపించుఁ? బద్మజునకు
సాక్షాత్సుతుండవు, సర్వజ్ఞుఁడవు, నీకు నెఱుఁగరానిది ధర్మమింత లేదు,
నారాయణ పరాయణస్వాంతు లనఘులు శాంతులు సదయులు సాధువృత్తి.

ఆ. మెఱయుచున్న ఘనులు మీ వంటివా రెద్ది, పరమధర్మ మనుచు భక్తిఁ దలఁతు?
రట్టి ధర్మరూప మఖిలంబు నెఱిఁగింపు, వినఁగ నిచ్చ గలదు విమలచరిత! 408

* పుణ్యాత్మా! నీవు సాక్షాత్తు చతుర్ముఖుని మానస పుత్రుడవు, పవిత్ర చరిత్రుడవు. సర్వదా నారాయణ చరణ స్మరణ పరాయణుడవు. శాంతమూర్తివి. సదయ హృదయుడవు. సర్వజ్ఞుడవు. నీవు ఎరుగని ధర్మం లేదు. సకల ధర్మాలూ, ఆచార వ్యవహారాలూ నీకు తెలుసు. అన్ని వర్ణాల వారికి పనికివచ్చే ఉత్తమమైన ధర్మం ఏది? ఏ ధర్మం ఆచరిస్తే మానవునికి నిర్మలమైన భక్తి జ్ఞానాలు ప్రాప్తమౌతాయి? తమ వంటివారు ఏది ఉత్తమ ధర్మమని భావిస్తారు? అటువంటి ధర్మస్వరూపమును వివరించండి. నాకు వినాలని కుతూహలంగా ఉంది.

**వ. అనిన నారదుండు ధర్మరాజుం జూచి దాక్షాయణియందు నిజాంశంబున నవతరించి, భువన శోభనంబు కొఱకు బదరి కాశ్రమంబునఁ దపోనిరతుండయి యున్న నారాయణునివలన సనాతనంబగు ధర్మంబు వింటి, నది సెప్పెద, సకల వర్ణంబుల జనులకు సత్యంబును, దయయును, నుపవాసాది తపంబును, శౌచంబును, సైరణయు, సదసద్వివేకంబును, మనోనియమంబును, బహిరింద్రియ జయంబును, హింసలేమియు, బ్రహ్మచర్యంబును, దానంబును, యథోచిత జపంబును, సంతోషం బును, మార్దవంబును, సమదర్శనంబును, మహాజనసేవయు, గ్రామ్యంబు లయిన కోరికలు మానుటయు, నిష్ఫలక్రియలు విడుచుటయు, మితభాషిత్వంబును, దేహంబుగాని తన్ను వెదకి కొనుటయు, నన్నోదకంబులు ప్రాణులకుం బంచి యిచ్చుటయుఁ బ్రాణులందు దేవతాబుద్ధియు, నాత్మబుద్ధిం జేయుటయు, శ్రీనారాయణ చరణ స్మరణ కీర్తన శ్రవణ సేవార్చన నమస్కార దాస్యాత్మ సమర్పణ సఖ్యంబు లనియెడి త్రింశల్లక్షణంబులు గలుగ వలయు, నందు సత్కులాచారుండయి మంత్ర వంతంబులైన గర్భాధానాది సంస్కారంబు లవిచ్ఛిన్నంబులుగాఁ గలవాఁడు ద్విజుండు. ద్విజునకు యజన యాజ నాధ్యయ నాధ్యాపన దాన ప్రతిగ్రహంబులను షట్కర్మంబులు విహితం బులు. రాజునకుఁ బ్రతిగ్రహ వ్యతిరిక్తంబులయిన యజనాది కర్మంబు లయిదును బ్రజాపాలనంబును, బ్రాహ్మణులు గానివారివలన దండశుల్కాదులు గొనుటయు, విహితకర్మంబులు, వైశ్యునికిఁ గృషి వాణిజ్య గోరక్షణాది కర్మంబులు, బ్రాహ్మణ కులానుసరణంబును విహితంబులు, శూద్రునకు ద్విజశుశ్రూష సేయ వలయును. 409**

* ఇలా అడిగిన ధర్మజుని ధర్మప్రియత్వానికి సంతసించి నారదమహర్షి ఇలా పలికాడు. రాజోత్తమా! పూర్వం దక్షపుత్రికి నారాయణుడు తన అంశతో అవతరించాడు. లోక క్షేమం కోసం బదరికా వనంలో తపోదీక్షలో ఉన్న నారాయణుడు ఈ సనాతన ధర్మమును నాకు వివరించాడు. ఆ విన్నది నీకు వివరిస్తాను. అన్ని వర్ణాల ప్రజలకు సత్యం, సంతోషం, సమదృష్టి, సదసద్వివేకం, శౌచం, క్షమ, దయ, దానం, మార్దవం, మనోనిగ్రహం. మహాజనసేవ, మితభాషిత్వం, ఇంద్రియజయం, బ్రహ్మచర్యం, ప్రాణులలో పరమాత్మ దర్శనం, అభేదబుద్ధితో ప్రవర్తించటం, ఉపవాసాదికం, ఉచితజపం, అహింస, ఆత్మావలోకనం, అన్నోదకాలు పంచి ఇవ్వటం; అసభ్యవాంఛలూ, అనర్థకమైన క్రియలూ విడిచిపెట్టటం; ఇంకా శ్రీమన్నారాయణ స్మరణం, కథాశ్రవణం, నామ సంకీర్తనం, సేవాభావం, ఆరాధనం, నమస్కృతి, దాస్యం, సఖ్యం, ఆత్మసమర్పణం - అనే ముప్పది లక్షణాలూ అలవడాలి.

బ్రాహ్మణులు తమ కులాచారాలతో మంత్రపూర్వక గర్భాధానాది షోడశ సంస్కారాలు పొందాలి. ఈ సంస్కారాలకు భంగం కలగకుండ జరుపుకుంటూ ఉండాలి. ఇవికాక యజ్ఞం చేయటం, చేయించటం, వేదం చదవటం, చదివించటం, దానం ఇవ్వటం, గ్రహించటం అనే షట్కర్మలు విప్రుల ధర్మాలు.

దాన స్వీకారం ఒకటి తప్ప మిగిలిన అయిదు ధర్మాలూ, మరింకా ప్రజాపరిపాలన చేయటం, బ్రాహ్మణేతరుల నుండి పన్నులు వసూలు చేయటం, దోషులైన వాళ్లను దండించటం క్షత్రియ ధర్మాలు.

వ్యవసాయం, వాణిజ్యం, పశుపాలనం, బ్రాహ్మణ కులానుసరణం మొదలైనవి వైశ్యకుల ధర్మాలు. విప్రపరిచర్య మిగిలిన కులం వారి ధర్మం.

**సీ. విను, కర్షణాదిక వృత్తికంటెను మేలు యాచింప నొల్లని యట్టి వృత్తి,**
**ప్రాప్తంబుఁ గైకొని బ్రదుకు కంటెను లెస్స యనుదినంబును ధాన్య మడిగికొనుట,**
**యాయావారముకంటె నధిక కళ్యాణంబు పఱిగ యెన్నుల ధాన్య భక్షణంబు,**
**శిలవృత్తికంటెను శ్రేయ మాపణములఁ బడ్డ గింజలు దిని బ్రదుకుఁ గనుట.**

**ఆ. యెడరుచోట నృపతి కీ నాల్గువృత్తులుఁ, దగుఁ, బ్రతిగ్రహంబు దగదు తలఁప,**
**నాపదవసరముల నధముఁ డెక్కువజాతి, వృత్తి నున్న దోషవిధము గాదు. 410**

* ధర్మరాజా! పొలం దున్ని జీవించే కర్షక వృత్తి వల్ల కొంత జీవహింస జరుగుతుంది. కాబట్టి దానికంటె యాచించ నటువంటి వృత్తి మంచిది. ఆ విధంగా ప్రాప్తించినది స్వీకరించి బ్రతికే కంటే ధాన్యం అర్థించి బ్రతకటం క్షేమం. అలా యాయవారంతో జీవించేకంటే పొలాలలో పరిగలు ఏరుకొని జీవనం గడపటం మేలు. వరిమళ్ళయందు జారి పడిన ఎన్నులవంటివి ప్రోగుచేసి బ్రతికే శిలవృత్తికంటె అంగడి వద్ద పడ్డ గింజలు సేకరించి ఆహారంగా చేసుకొని బ్రతకటం ఉత్తమం. భంగపడిన రోజులలో క్షత్రియుండు ఈ నాలుగు వృత్తులూ చేయవచ్చు. కానీ దానం స్వీకరించటం మాత్రం నిషేధం. ఆపత్కాలాలలో నిమ్న జాతివాళ్ళు అగ్రజాతుల వారి వృత్తులను స్వీకరించటం దోషం కాదు.

**వ. వినుము. శిలవృత్తియు నుంఛవృత్తియు ఋత మనియు, నయాచితవృత్తి యమృత మనియు, నిత్యయాచ్ఞావృత్తి మృత మనియుఁ, గర్షకవృత్తి ప్రమృత మనియు నెన్నుదు, రట్టి వృత్తుల జీవించుట మేలు, వాణిజ్యంబు సత్యానృత మనియు, శ్వవృత్తి నీచసేవ యనియుఁ బలుకుదురు, సర్వవేదమ యుండు బ్రాహ్మణుండు, సర్వదేవమయుండు క్షత్రియుండు. బ్రాహ్మణ క్షత్రియులకు నీచసేవనంబు కర్తవ్యంబు గాదు. 411**

* ధర్మరాజా! శ్రద్ధగా విను, శిలవృత్తినీ, ఉంఛవృత్తినీ ఋతమనీ, అయాచిత వృత్తిని అమృతమనీ, నిత్యయాచనావృత్తిని మృతమనీ, కర్షకవృత్తిని ప్రమృత మనీ అంటారు. సమయానుకూలంగా ఆ వృత్తులను స్వీకరించటం మంచిది. వాణిజ్యం సత్యాసత్యాల సమ్మిశ్రితం. నీచసేవ శ్వవృత్తి. బ్రాహ్మణుడు సర్వవేద మయుడు. క్షత్రియుడు సర్వదేవమయుడు కనుక బ్రాహ్మణ క్షత్రియులకు నీచసేవ తగదు.

క. దమమును, శౌచముఁ, దపమును, శమమును, మార్దవముఁ, గృపయు, సత్యజ్ఞాన
క్షమలును, హరిభక్తియు, హ, ర్షము నిజలక్షణము లగ్రజాతికి నధిపా! 412

* బహిరింద్రియ నిగ్రహం, అంతరింద్రియ నిగ్రహం, మృదు స్వభావం, శుచిత్వం, తపం, దయ, సత్యం, జ్ఞానం, క్షమ, హరిభక్తి, హర్షం - ఇవి విప్రుల ముఖ్య లక్షణాలు.

ఉ. శౌర్యము దానశీలముఁ బ్రసాదము నాత్మజయంబుఁ దేజమున్
ధైర్యము దేవభక్తియును ధర్మము నర్థముఁ గామమున్ బుధా
చార్యముకుంద సేవలును సత్కృతియుం బరితోషణంబు స
ద్వీర్యము రక్షణంబుఁ బృథివీవరశేఖర! రాజచిహ్నముల్. 413

* ధైర్యము, శౌర్యం, వీర్యం, ఆత్మనిగ్రహం, అనుగ్రహం, దానశీలం, ధర్మనిష్ఠ, అర్థసంపాదన, తేజం, బుధసేవాకాంక్ష, ఆచార్యసేవ, అచ్యుతారాధన, సత్కార్యం, సంరక్షణం, సంతోషం - ఇవి రాజుల లక్షణాలు.

క. ధర్మార్థ కామ వాంఛయు, నిర్మల గురుదేవ విప్ర నివహార్చనముల్
నిర్మదభావముఁ బ్రమదము, శర్మకరత్వమును వైశ్యజన లక్షణముల్. 414

* ధర్మార్థకామ వాంఛలు, దేవ బ్రాహ్మణసేవ, ఆచార్య పాదారాధన, నిగర్వం, నిర్మలత్వం, సంతృప్తి - ఇవి వైశ్య జనుల లక్షణాలు.

ఉ. స్తేయము లేని వృత్తియు శుచిత్వము సన్నుతియున్ నిజేశులన్
మాయలు లేక డాయుటయు మంత్రము సెప్పక పంచయజ్ఞముల్
సేయుటయున్ ధరామరుల సేవయు గోవుల రక్షణంబు న
న్యాయము లేమియున్ మనుజనాథ! యెఱుంగుము శూద్ర ధర్మముల్. 415

* చౌర్యం లేకుండా ఉండటం, శుచి శుభ్రత కలిగి ఉండటం. సంప్రార్థన చేయటం, నిష్కపటంగా సేవ చేయటం, దేవ యజ్ఞం, పితృయజ్ఞం, మనుష్య యజ్ఞం, భూత యజ్ఞం, బ్రహ్మ యజ్ఞం అనే పంచయజ్ఞాలు మంత్రం చెప్పకుండా నిర్వర్తించటం, పండితాదరణ, గోవుల రక్షణ, న్యాయ జీవనం ఇవి నాలుగవ కులము వారి ధర్మాలు.

సీ. నిలయము పాటించి నిర్మల దేహియై శృంగార మే ప్రొద్దుఁ జేయవలయు,
సత్యప్రియాలాపచతురయై ప్రాణేశు చిత్తంబు ప్రేమ రంజింప వలయు,
దాక్షిణ్య సంతోష ధర్మమేధాదుల దైవత మని ప్రియుఁ దలఁప వలయు,
నాథుఁ డే పద్ధతి నడచు నా పద్ధతి నడచి సద్బంధుల నడపవలయు,

ఆ. మార్దవమునఁ బతికి మజ్జన భోజన, శయన పాన రతులు జరప వలయు,
విభుఁడు పతితుఁడైన వెలఁది ప్రాతివ్రత్య, మహిమఁ బుణ్యుఁ జేసి మనుప వలయు. 416

* ఇక స్త్రీలు గృహాలను చక్కగా తీర్చి దిద్దుకోవాలి. శరీరమును సుందరంగా, నిర్మలంగా ఉంచుకోవాలి. సత్యం ప్రియంగా పలకాలి. చాతుర్యంతో కూడిన వచనమాధుర్యంతో పతిమనస్సు రంజింపచేయాలి. దాక్షిణ్యం, సంతోషం, ధర్మచింతనం, మేధాసంపద- ఈ మొదలైన సుగుణాలకు తనపతి అధిపతి అని భావించాలి. నాథునికి ఇష్టమైన పద్ధతిలో నడవాలి. బంధువులను చక్కని మార్గంలో నడపాలి. మృదు స్వభావంతో పతికి స్నాన పాన ఆహారాదులు సమకూర్చి సౌఖ్యం కలిగించాలి. ఒకవేళ పతి పతితుడైతే తన పాతివ్రత్య బలంతో ఆతనిని ఉద్ధరించి, ఉత్తమునిగా దిద్ది తీర్చుకోవాలి.

**క. తరుణి దన ప్రాణవల్లభు, హరిభావముగా భజించి యతఁడును దానున్**
**సిరి కైవడి వర్తించును, హరిలోకమునందు సంతతానందమునన్.** 417

* కాంత తన కాంతుణ్ణి శ్రీ విష్ణువుగా భావించాలి. తాను లక్ష్మీ దేవిలాగా ప్రవర్తించాలి. ఇలా ఉంటే వాళ్ళిద్దరూ విష్ణులోకంలో నిత్యానందం అనుభవిస్తారు.

**క. ఉపవాసంబులు వ్రతములుఁ, దపములు వేయేల? భర్త దైవత మని ని**
**ష్కపటతఁ గొల్చిన సాధ్వికి, నృపవర! దుర్లభము లేదు నిఖిలజగములన్.** 418

* నరవరా! ఉపవాస, వ్రత, తపస్సులకంటే నిష్కపటంగా నిర్మలంగా నాథుణ్ణి నారాయణునిగా భావించి సేవించటమే నారీమణుల ధర్మం. అటువంటి పతివ్రతకు జగత్తులో దుర్లభం అన్నదే లేదు!

**వ. మఱియు సంకర జాతులయిన రజక చర్మకారక నట బురుడ కైవర్తక మేద భిల్లురగు నంత్యజాతు లేడ్వురకును జండాల పుల్కస మాతంగ జాతులకును నా యా కులాగతంబులయిన వృత్తులఁ జౌర్య హింసాదులు వర్జించి సంచరింపవలయు, మానవులకుఁ బ్రతియుగంబున నైసర్గికంబులైన ధర్మంబులు రెండు లోకంబులందును సుఖకరంబు లని వేదవిదులైన పెద్దలు సెప్పుదురు, కారుకారున దున్నెడు క్షేత్రంబు లావు సెడు, నందుఁ జల్లిన బీజంబులు నిస్తేజంబులై యుండి లెస్సగ నంకురింపవు, నిరంతర ఘృత ధారా వర్షంబున దహనంబునకు దాహకత్వంబు లేక శాంతిం జెందు, నందు వేల్చిన హవ్యంబులు ఫలింపవు, తద్విధంబున ననవరత కామానుసంధానంబున గామోన్ముఖంబైన చిత్తంబు కామంబులఁ దనిసి నిష్కామంబై విరక్తి నొందుం గావున సత్త్వ స్వభావంబు తోడ నెప్పుడుఁ దప్పక నిజవంశానుగత విహిత ధర్మంబున వర్తించు నరుండు మెల్లన స్వాభావిక కర్మపరత్వంబు విడిచి ముక్తి నొందు, జాతిమాత్రంబునఁ బురుషునికి వర్ణంబు నిర్దేశింపం బనిలేదు. శమదమాది వర్ణ లక్షణ వ్యవహారంబులఁ గనవలయు నని మఱియు నారదుం డిట్లనియె.** 419

* ఇంకా రజకులు, నటకులు, కిరాతులు, మేదరులు, జాలరులు, చర్మకారులు, కుమ్మరులు అనే ఈ ఏడు జాతులవారునూ, చండాల పుల్కస మాతంగ జాతులవారునూ వారి వారి కులాచార వృత్తులు ఆచరిస్తూ జీవించాలి. అయితే చౌర్య హింసాదులు మాత్రం ఎవరికీ తగవు. మానవులకు ప్రతియుగంలో సహజమైన ధర్మాలూ ఇహలోక, పరలోకాలలో కూడా సుఖమును కలిగిస్తాయి - అని వైదిక ఋషులు వచించారు.

తడవ తడవకూ దున్నితే పొలం సారం కోల్పోతుంది. అందులో చల్లిన విత్తనాలు మొలచి ఏపుగా పైకిరావు. హోమకుండంలో ఎడతెగకుండా ఎక్కువగా ఆజ్యం పోస్తే అగ్నికి దాహకత్వం తగ్గిపోతుంది. అందులో వ్రేల్చిన హోమద్రవ్యాలు నిరుపయోగం అవుతాయి. ఆ విధంగానే నిరంతర కామకలాపాలతో మన్మథమగ్నమైన చిత్తం తరువాత నిష్కామమై క్రమంగా విరక్తి పొందుతుంది.

కాబట్టి పురుషుడు సాత్త్వికభావంతో నియమానుసారంగా నిజ వంశాచారాలు నిర్వర్తిస్తూ ఉండాలి. అటువంటి మానవుడు క్రమంగా, సహజంగానే కర్మబంధాలనుంచి విముక్తు డవుతాడు. జాతి మాత్రం వల్ల పురుషునికి వర్ణం నిర్ణయం చేయకూడదు. శమదమాది ధర్మాలు పాటించటం ద్వారా వాని జాతి నిర్ణయించాలి - అని నారదుడు ధర్మజునితో -

ఇంకా ఇలా చెప్పసాగాడు.

**క. క్రమమున వర్ణంబుల చి, హ్నము లెల్లను జెప్పఁబడియె, నాశ్రమముల ధ**
**ర్మము లెఱిఁగించెద నన్నియు, సమదాహిత హృదయశూల! సదమలశీలా! 420**

* సుగుణశీలా! అరివీర భయంకరా! క్రమంగా వివిధ కుల లక్షణాలు నీకు చెప్పాను. ఇక ఆశ్రమ ధర్మాలు తెలియ జేస్తాను.

**వ. వినుము - బ్రహ్మచారి మౌంజీ కౌపీన యజ్ఞోపవీత కృష్ణాజిన పలాశదండ కమండలు ధరుండును. సంస్కారహీన శిరోరుహుండును, దర్భహస్తుండును, శీల ప్రశస్తుండును, మౌనియునై త్రిసంధ్యంబును బ్రహ్మ గాయత్రి జపియించుచు, సాయం ప్రాత రవసరంబుల నర్కపావక గురుదేవతోపాసనంబులు సేయుచు, గురుమందిరంబునకుం జని దాసుని చందంబున భక్తి వినయ సౌమనస్యంబులు గలిగి వేదంబులు చదువుచు నధ్యయనోపక్రమావసానంబుల గురుచరణంబులకు నమస్కరించుచు, రేపు మాపును విహిత గృహంబుల భిక్షించి భైక్షంబు గురువునకు నివేదించి యనుజ్ఞ గొని మిత భోజనంబు గావించుచు, విహిత కాలంబుల నుపవసించుచు నంగనలందు నంగనాసక్తులందుం బ్రయోజన మాత్రభాషణంబు లొనర్చుచు, గురుపరాంగనల వలన నభ్యంగకేశ ప్రసాధన శరీర మర్దన మజ్జన రహస్య యోగంబులు వర్జించుచు, గృహంబున నుండక జితేంద్రియత్వంబున సత్య భాషణుండయి సంచరింపవలయు. 421**

* ముందుగా బ్రహ్మచర్య లక్షణాలు చెప్తాను విను. బ్రహ్మచారి మౌంజి, కౌపీనం, యజ్ఞోపవీతం, కృష్ణాజినం, పలాశదండం, కమండలం, దర్భలు ధరించాలి. కేశసంస్కారం చేసుకొనకూడదు. శీలవంతుడై ప్రవర్తించాలి. మౌనంగా మూడు పూటలా బ్రహ్మ గాయత్రిని జపించాలి. ప్రాతఃకాల, సాయంకాలాలలో సూర్యోపాసనం, అగ్ని ఆరాధన, గురువందనం, దేవతార్చనం చేస్తుండాలి. గురువుగారి గృహంలో దాసునివలె భక్తిగా, వినయంగా, సౌమనస్యం కలిగి ఉంటూ వేదాలు వల్లించాలి. అధ్యయనానికి ఆరంభంలోనూ, చివరిలోనూ ఆచార్య దేవులకు పాదాభివందనం చేయాలి. ఉదయం సాయంకాలం మంచి గృహస్థుల నుంచి భిక్షాన్నం గ్రహించి గురువులకు నివేదించి, వారి అనుజ్ఞతో మితంగా భుజించాలి. నియమిత దినాలలో

ఉపవాసా లుండాలి. స్త్రీలతోను స్త్రీలోలురతోనూ అనవసరంగా సంభాషించరాదు. బ్రహ్మచారి గురుపత్నులతో, పరాంగనలతో తల అంటించుకోవటం, తల దువ్వించుకోవటం, శరీరం పట్టించుకోవటం, స్నాన సపర్యలు చేయించుకోవటం, ఏకాంతంగా ఉండటం పనికిరాదు. ఎల్లప్పుడూ ఇంటిలో ఉండక జితేంద్రియుడై, సత్యభాషణుడై సంచరించాలి.

**ఆ. పొలఁతి దావవహ్ని; పురుషుఁ డాజ్యఘటంబు, కరఁగ కుండరాదు కదిసెనేని,**
**బ్రహ్మయైనఁ గూఁతుఁ బట్టక మానఁడు, వడుగు కింతి పొత్తు వలదు వలదు. 422**

* ధర్మరాజా! బ్రహ్మచారి చాలా నియమ నిష్ఠలతో నివసించాలి. పొలతితో పొత్తు తగదు. స్త్రీ దావాగ్ని వంటిది. పురుషుడు నేతి పాత్రవంటివాడు. సెగ తగలగానే పాత్రలోని ఘృతంలా కరగిపోతాడు. బ్రహ్మ అంతటివాడు తన కూతురుపై వ్యామోహంతో ఆమెను భార్యగా గ్రహించక విడువలేదు కదా! కాబట్టి బ్రహ్మచారికి పడతి సాన్నిహిత్యం పనికిరాదు.

**వ. వినుము. స్వరూప సాక్షాత్కారంబున దేహి బహిరింద్రియాదికం బయిన యంతయు నాభాస మాత్రంబుగా నిశ్చయించి యెందాఁక జీవుండు స్వతంత్రుం డయిన యీశ్వరుండు గాకుండు, నంతదడవు నంగన యిది, పురుషుండ నే ననియెడి బుద్ధిమానుట కర్తవ్యంబు గాదు, బ్రహ్మచారి యతి గృహస్థులం దెవ్వఁడైన జిత్తంబు పరిపక్వంబుగాక యద్వైతానుసంధానంబు సేసిన మూఢుండగుం గావున, రహస్యంబునం బుత్రిక నైనం డాయకుండవలయు. 423**

* ఆత్మసాక్షాత్కారం పొంది, బహిరింద్రియాలకు కన్పించేదంతా కూడా స్వప్నంగా భావించి తానూ, ఈశ్వరుడూ ఒకటేనని మానవుడు ఎప్పటివరకూ గ్రహించలేడో, అప్పటివరకూ ఈమె స్త్రీ నేను పురుషుడను అనే భేదభావం వలదు. కనుక బ్రహ్మచారి, యతి, గృహస్థుడు వీరిలో ఎవరైనా మనస్సు పరిపక్వం చెందకుండా అద్వైతానుసంధానం చేసుకోవటం మూర్ఖత్వం అవుతుంది. కాబట్టి కన్న కొమార్తెతో కూడా రహస్యంగా, ఏకాంతంగా ఉండకూడదు.

**చ. శిరమున మేన సంస్కృతులు సేయక చందనభూషణాద్యలం**
**కరణము లెల్ల మాని ఋతుకాలమునన్ నిజభార్యఁ బొందుచుం**
**దరుణులఁ జూడఁబాఱక ధృతవ్రతుఁడై మధుమాంసవర్జి యై**
**గురుతరవృత్తితో మెలఁగు కోవిదుఁ డొక్క గృహస్థ భూవరా! 424**

* భూవరా! ఇక గృహస్థ ధర్మాలు విను. ఉత్తమ గృహస్థుడు అభ్యంగనాది స్నానాలూ, చందన భూషణాదులు కలిగి ఋతుకాలంలో మాత్రం తన భార్యను పొందాలి. ఇతర కాంతలను చూచి మోహం చెందరాదు. చక్కని మన స్థైర్యం సంపాదించాలి. మధుమాంసాలు వర్జించాలి. ఈ విధంగా సత్ప్రవర్తనతో తన ధర్మం నిర్వర్తించిన వాడే ఉత్తమ గృహస్థుడు.

వ. మరియు ద్విజుండు గృహస్థుండై గురువుల వలన నుపనిషదంగ సహితంబైన వేదత్రయంబును పఠియించి నిజాధికారానుసారంబుగ నర్థవిచారంబు సేసి తనబలంబు కొలంది గురువులకు నభీష్టంబు లొసంగి గృహంబున నొండె, వనంబున నొండె, నైష్ఠికత్వంబు నాశ్రయించి, ప్రాణులతోడ జీవించుచు గురువునందు, నగ్నియందు నాత్మయందు సర్వభూతంబులందు నచ్యుతదర్శనంబు సేయుచు ఇంద్రియ వ్యసనాది ముగ్నుండు గాక యెఱుక గలిగి వర్తించుచుఁ బరబ్రహ్మంబు నొందు. 425

* బ్రాహ్మణ గృహస్థుడు గురువువల్ల ఉపనిషత్తులూ, శిక్ష, వ్యాకరణం, ఛందస్సు, నిరుక్తం, జ్యోతిషం, కల్పం - అనే వేదాంగాలతో సహ, ఋక్, యజు, స్సామ వేదాలను పఠించాలి. తన స్థాయికి తగినట్లుగా అర్థవిచారణ చేయాలి. యథాశక్తిగా గురువుల అభీష్టాలు నెరవేర్చాలి. భవనంలో ఉన్నా, వనంలో ఉన్నా నిష్ఠాగరిష్ఠుడై ఉండాలి. ఇతర ప్రాణులతో సహజీవనం సాగిస్తూ ముఖ్యంగా గురువులో, అగ్నిలో, ఆత్మలో సర్వభూతాలలో అచ్యుతుణ్ణి దర్శించాలి. ఇంద్రియలోలుడు కాకుండా ఈ విధంగా ఆత్మజ్ఞానంతో ప్రవర్తించిన గృహస్థుడు పరబ్రహ్మమును చేరుకొంటాడు.

క. వినుము వనప్రస్థునకున్, మునికథితము లైన నియమములు గల, వా చొ
ప్పున వనగతుఁడై మెలఁగెడి, ఘనుఁడు మహర్లోకమునకు గమనించు నృపా! 426

* ధర్మజా! తరువాత వానప్రస్థాశ్రమ విధులు చెప్తాను విను. వానప్రస్థ ఆశ్రమం స్వీకరించినవాడు అరణ్యాలకు వెళ్ళి మునివృత్తి అవలంబించాలి. ఋషీశ్వరులు నిర్దేశించిన నియమాలు పాటించిన పుణ్యాత్ముడు మహర్లోకం చేరి సుఖిస్తాడు.

వ. అటమీఁద గృహస్థాశ్రమంబు విడిచి వనంబునకు జని, దున్నక పండెడి నీవారాదికంబు లగ్ని పక్వంబుసేసి యొండె. నామంబులు సేసియొండె నర్కపక్వంబులైన ఫలాదులొండె భక్షించుచు వన్యాహారంబుల నిత్య కృత్యంబులయిన చరు పురోడాశంబు లొనర్చుచుఁ, బ్రతిదినంబును బూర్వ సంచితంబులు పరిత్యజించి నూతనద్రవ్యంబులు సంగ్రహించుచు నగ్ని కొఱకుఁ బర్ణశాలయైనఁ బర్వత కందరం బయిన నాశ్రయించుచు, హిమ వాయు వహ్ని వర్షాతపంబులను సహించుచు, నఖ శ్మశ్రు కేశ తనూరుహంబులు ప్రసాధితంబులు సేయక, జటిలుం డై వసియించుచు, దండాజిన కమండలు వల్కల పరిచ్ఛదంబులు ధరియించి పండ్రెండైన, నెనిమిదైన, నాలుగైన, రెండైన నొక వత్సరంబయినఁ దపః ప్రయాసంబున బుద్ధినాశంబు గాకుండ మునియై చరించుచు, దైవవశంబున జరారోగంబుల చేతఁజిక్కి నిజధర్మానుష్ఠాన సమర్థుండు గాని సమయంబున నిరశనవ్రతుఁడయి యగ్నుల నాత్మా రోపణంబులు సేసి సన్న్యసించి యాకాశంబునందు శరీర రంధ్రంబులును, గాలి యందు నిశ్శ్వాసం బును, దేజంబు లోపల నూష్మంబును, జలంబుల రసంబును, ధరణియందు శల్యమాంస ప్రముఖంబులును, వహ్నియందు వక్తవ్యంబుతోడ వాక్కును, నింద్రునియందు శిల్పంబు తోడఁ గరంబులును, విష్ణునియందు గతితోడఁ బదంబులును, బ్రజాపతి రతితోడ నుపస్థంబును, మృత్యువందు విసర్గంబుతోడఁ బాయువును, దిక్కులందు శబ్దంబుతోడ శ్రోత్రం బును, వాయు వందు స్పర్శంబుతోడఁ ద్వక్కును, సూర్యుని యందు రూపంబుతోడఁ జక్షువులును, సలిలంబు లందుఁ బ్రచేతస్సహితయయిన జిహ్వయు, క్షితియందు గంధసహితంబయిన ఘ్రాణంబును,

**జంద్రునియందు మనోరథంబులతోడ మనంబును, గవియైన బ్రహ్మయందు బోధంబుతోడ బుద్ధియు, రుద్రునియం దహంకారంబుతోడ మమత్వంబును, క్షేత్రజ్ఞునియందు సత్త్వంబుతోడఁ జిత్తంబును, బరంబునందు గుణంబులతోడ వైకారికంబును డిందించి యటమీఁదఁ బృథివిని జలంబునందును, జలంబును దేజంబు నందును, దేజంబును వాయువునందును, వాయువును గగనంబునందును, గగనంబును నహంకార తత్త్వంబునందును, నహంకారంబును మహత్తత్త్వంబు నందును, మహత్తత్త్వంబును బ్రకృతియందును, బ్రకృతి నక్షరుండైన పరమాత్మయందును లయంబు నొందించి, చిన్మాత్రా వశేషితుం డయిన క్షేత్రజ్ఞుని నక్షరత్వంబున నెఱింగి ద్వయరహితుండై దగ్ధ కాష్ఠుండైన వహ్నిచందంబునఁ బరమాత్మయైన నిర్వికార పరబ్రహ్మంబునందు లీనుండు గావల యును. 427**

* గృహస్థాశ్రమ ధర్మాలు చక్కగా నిర్వహించిన తరువాత వానప్రస్థాశ్రమమును స్వీకరించాలి. వనాలలో నివసించాలి. అక్కడ దున్నక పండే నీవారాది ధాన్యాలు ఉడకపెట్టినవికానీ, పచ్చివికానీ, సూర్యకాంతితో పండి ఎండిన ఫలాలను కానీ భుజిస్తూ, ఈశ్వరుని భజిస్తూ ఉండాలి. వనంలో లభించిన పదార్థాలతో అన్నంగాని, పిండిగానీ చేసుకొని జీవనం గడపాలి. నిన్నటిరోజున మిగిలిన పదార్థాలు విడిచిపెట్టి క్రొత్తవి సంపాదించుకోవాలి. అగ్ని రక్షణకోసం పర్ణశాలలనో, పర్వత గుహలనో ఆశ్రయించాలి. చలీ, గాలీ, ఎండా, వానా, అగ్నీ, అన్నీ సహించాలి. గోళ్ళు తీసుకోకూడదు. గడ్డం చేసుకోకూడదు. క్షౌరం పనికిరాదు. జుట్టు దువ్వుకోరాదు. కేవలం జటిలుడై నివసించాలి. దండం, కమండలం, జింక చర్మాలు, నారబట్టలు ధరించాలి. పన్నెండేళ్ళు కానీ, ఎనిమిదేళ్ళుకానీ, నాలుగైనా, రెండైనా చివరకు ఒక సంవత్సరమైనా ఏకాగ్రచిత్తంతో తపస్సు చేయాలి. బుద్ధిని చలించనీయకుండా మౌనియై జీవించాలి.

దైవవశాత్తూ వృద్ధాప్యం వల్లకానీ, రోగం వల్లకానీ తన ధర్మాలూ, అనుష్ఠానాలూ నెరవేర్చు కొనలేకపోతే నిరశనవ్రతం పూని ఆత్మయందు అగ్నులను అరోపణసేసి సన్న్యసించాలి. శరీర రంధ్రాలను ఆకాశంలోనూ నిశ్వాసం గాలిలోనూ, శరీరంలోని వేడిని తేజస్సులోనూ, రసం జలంలోనూ, శల్యమాంసాదులను మట్టిలోనూ విలీనం చెయ్యాలి. వాక్కును వక్తవ్యంతో పాటూ అగ్నియందూ, హస్తద్వయమును శిల్పంతో పాటూ ఇంద్రునియందూ, పాదద్వయాన్ని నడకతోపాటూ విష్ణువునందూ, ఉపస్థను రతితోపాటు ప్రజాపతియందూ, పాయువును విసర్గంతోపాటూ మృత్యువునందూ, శ్రోత్రద్వయమును శబ్దంతోపాటూ దిక్కులయందూ, చర్మమును స్పర్శతోపాటూ వాయువునందూ, చక్షువులను రూపంతోపాటు సూర్యునియందూ అనుసంధానం చెయ్యాలి. జిహ్వను వరుణ సహితంగా నీటియందూ, నాసికను గంధ సహితంగా భూమియందూ, మనస్సును మనోరథంతోపాటు చంద్రునియందూ, బుద్ధిని బోధంతోపాటు కవియైన బ్రహ్మయందూ, మమత్వమును అహంకారముతోపాటూ రుద్రునియందూ, మనస్సును సత్త్వంతో పాటు క్షేత్రజ్ఞునియందూ, వికారం పొందిన క్షేత్రజ్ఞుని గుణాలతో పాటూ పరబ్రహ్మమునందూ విలీనం చేయాలి. ఈ విధంగా ఆయా విషయేంద్రియాలను ఆ యా అధిదేవతలలో ఐక్యం గావించాలి.

ఆ తర్వాత పృథివిని జలంలోనూ, జలమును తేజంలోనూ, తేజస్సును వాయువులోనూ, వాయువును గగనంలోనూ, గగనమును అహంకార తత్త్వంలోనూ, అహంకారాన్ని మహత్తత్త్వంలోనూ, మహత్తత్త్వమును ప్రకృతిలోనూ, ప్రకృతిని శాశ్వతుడైన పరమాత్మలోనూ లయం చేయాలి. అపుడు కేవలం చిన్మయుడుగా మిగిలిన క్షేత్రజ్ఞుణ్ణి జ్ఞానంతో తెలుసుకొని, అద్వైతుడై కట్టెలను దహించిన అగ్నివలె పరమాత్మ అయిన నిర్వికార బ్రహ్మంలో విలీనం కావాలి.

**క. అనఘ! వనప్రస్థుండై, చని తద్ధర్మంబు లిట్లు సలుపుచు మఱియున్**
**మనెనేని సన్న్యసింపం, జను నటమీఁదటను ముక్తసంగత్వమునన్. 428**

* పుణ్యాత్మా! మానవుడు వానప్రస్థాశ్రమం స్వీకరించి, ఆ ధర్మాలు పాటిస్తూ ఆ తర్వాత ముక్తసంగుడై సన్న్యాసాశ్రమం తీసుకోవచ్చు.

**వ. ఇట్లు వానప్రస్థాశ్రమంబు జరిపి సన్న్యసించి దేహమాత్రావశిష్టుండును, సర్వభూత నిరపేక్షుండును, భిక్షుండును, నిరాశ్రయుండును, నాత్మారాముండును, సర్వభూతసముండును, శాంతుండును సమచిత్తుండును, నారాయణ పరాయణుండును నై కౌపీనంబను నాచ్ఛాదన మాత్రంబైన వస్త్రంబు ధరియించి దండాది వ్యతిరిక్తంబులు విసర్జించి యాత్మపరంబులు గాని శాస్త్రంబులు తర్కింపక యెందును బక్షీకరింపక శిష్యులకు గ్రంథంబులు వంచించి యుపన్యసింపక. బహువిద్యల జీవింపక మత్తాది వ్యాపారంబుల నుల్లసిల్లక, పెక్కు దినంబు లొక్కయెడ వసింపక. యూరూర నొక్కొక్క రాత్రి నిలుచుచుఁ, గార్యకారణ వ్యతిరిక్తంబైన పరమాత్మయందు విశ్వంబు దర్శించుచు, సద సన్మయంబైన విశ్వంబునందుఁ బర బ్రహ్మంబయిన యాత్మ నవలోకించుచు జాగరణ స్వప్న సంధి సమయంబుల నాత్మనిరీక్షణంబు సేయుచు, నాత్మకు బంధమోక్షణంబులు మాయా మాత్రం బులు గాని వస్తుప్రకారంబున లేవనియును దేహంబునకు జీవితంబు ధ్రువంబు గాదనియును మృత్యువు ధ్రువం బనియును నెఱుంగుచు, భూతదేహంబుల సంభవనాశంబులకు మూలం బయిన కాలంబుఁ బ్రతీక్షించుచుఁ, నివ్విధంబున జ్ఞానోత్పత్తి పర్యంతంబుఁ జరియించి యటమీఁద విజ్ఞాన విశేషంబు సంభవించినఁ బరమహంసుండై దండాది చిహ్నంబులు ధరియించి యొండె, ధరియింపక యొండె బహిరంగవ్యక్త చిహ్నుండు గాక యంతరంగ వ్యక్తంబైన యాత్మానుసంధానంబు గలిగి మనీషియైన బాహ్యానుసంధాన భావంబున మనుష్యులకుఁ దనవలన నున్మత్త బాలమూకుల తెఱంగుఁ జూపుచుండ వలయును. 429**

* సన్న్యాసాశ్రమం స్వీకరించిన వాడు దేహ మాత్రావశిష్టుడై ఉండాలి. సర్వభూతాలయందూ నిరపేక్షుడై, భిక్షుకుడై, నిరాశ్రయుడై, ఆత్మారాముడై, సర్వప్రాణిసముడై, శాంతుడై, సమచిత్తుడై,నారాయణ పరాయణుడై తేజరిల్లుతుండాలి. సన్న్యాసి కౌపీనం మాత్రమే శరీరం మీద ధరించాలి. దండ కమండలాలు విసర్జించాలి. ఆత్మపరములు కానటువంటి శాస్త్రాలు వర్జించాలి. జ్యోతిషం మొదలైన విద్యలు పరిత్యజించాలి. కుతర్కాలజోలికి పోకుండా ఒక పక్షం చేరకుండా, ఆత్మచింతనలోనే నిమగ్నమైన సమాధినిష్ఠలో ఉండాలి. సన్న్యాసి శిష్యులకు వంచనతో గ్రంథాలు బోధింపకూడదు. బహువిద్యలలో ఆసక్తి చూపించకూడదు. మత్తతలో నిమగ్నుడు కాకూడదు. పెక్కుదినాలు ఒక్కచోట నివసించ కూడదు. ఒక ఊరిలో ఒక రాత్రి మాత్రమే

గడపాలి. కార్యకారణాలకు అతీతమైన పరమాత్మలో విశ్వాన్ని దర్శిస్తూ, సత్ అసత్ పదార్థాలలో నిర్మితమైన ఈ విశాల విశ్వంలో పరబ్రహ్మమైన ఆత్మను సందర్శిస్తూ ఉండాలి, జాగరణ, స్వప్న, సంధి సమయాలలో ఆత్మనిరీక్షణం చేయాలి. ఆత్మకు బంధమోక్షణాలు మాయామాత్రాలు కాని వాస్తవంగా లేవని భావించాలి. దేహానికి జీవితం స్థిరం కాదనీ, మృత్యువు నిశ్చయం అనీ తెలుసుకొని ప్రవర్తించాలి. జీవకోటి దేహాల పుట్టుకలకూ, నాశములకూ మూలం కాలం అని గ్రహించి అట్టి కాలం కోసం నిరీక్షిస్తూ ఉండాలి. ఈ విధంగా జ్ఞానోత్పత్తి వరకూ ప్రవర్తించి, ఆ తరువాత విజ్ఞాన విశేషం ప్రాప్తించి నట్లైతే 'పరమహంస'యై దండాది చిహ్నాలు ధరించికానీ ధరించకకానీ అంతరంగంలో ఆత్మను అనుసంధానం చేయగలిగి విజ్ఞానియై వెలగాలి. బాహ్యానుసంధానాల వల్ల ఇతరులకు ఉన్మత్తునివలె, బాలునివలె, మూగవానివలె కనిపించాలి.

## ప్రహ్లాదాజగర సంవాదము.

**క. మునివల్లభుఁ డజగరుఁడను, సునయుండు హిరణ్యకశిపు సూనుండును ము**
**న్నొనరించిన సంవాదము, విను మీ యర్థంబునందు వెలయు నరేంద్రా! 430**

* నరేంద్రా! పూర్వం ప్రహ్లాదునికీ, అజగరుడనే మునీంద్రునికి సంవాదం జరిగింది. దానిలో పరమహంస ధర్మాలూ, వాని మహత్త్వమూ చక్కగా వివరింపబడ్డాయి. అవి తెలియజేస్తాను విను.

**వ. తొల్లి భగవత్ప్రియుండయిన ప్రహ్లాదుండు కతిపయామాత్య సమేతుండయి లౌకికతత్త్వంబు నెఱింగెడి కొఱకు లోకంబుల సంచరించుచు నొకనాఁడు కావేరీతీరంబున సహ్యపర్వత తటంబున ధూళి ధూసరితంబు లయిన కరచరణాద్యవయవంబుల తోడ గూఢంబైన నిర్మల తేజంబుతోఁ గర్మాకారవచో లింగ వర్ణాశ్రమాదుల నెవ్వరికి నెఱుంగఁబడక నేల నిద్రించుచు నజగర వ్రత ధరుండైన మునిం గని డాయం జని విధివత్ప్రకారంబున నర్చించి మునిచరణంబులకు శిరంబు మోపి మ్రొక్కి యతని చరిత్రంబు దెలియ నిశ్చయించి యి ట్లనియె. 431**

* ఒకసారి మహాభక్తుడైన ప్రహ్లాద చక్రవర్తి లౌకిక తత్త్వం తెలుసు కోవాలనుకొన్నాడు. కొందరు మంత్రులను వెంట తీసుకొని లోకసంచారం చేయసాగాడు. అలా ప్రయాణిస్తూ కావేరీ నదీ తీరం చేరుకొన్నాడు. అక్కడ సహ్యపర్వతాలు విస్తరించి ఉన్నాయి. ప్రహ్లాదుడు ఆ పర్వతసానువులలో సంచరిస్తుండగా, ఆ ప్రదేశంలో దుమ్ము కొట్టుకొని పోయిన దేహంతో అజగరుడనే ముని శయనించి ఉన్నాడు. శరీరం ధూళితో నిండి ఉన్నా ఆయన అద్భుతమైన తేజస్సు నిగూఢంగా వెలుగుతున్నది. కార్యంవల్ల కానీ, ఆకారంవల్ల కానీ, మాటవల్ల కానీ, లింగభేదంవల్ల కానీ వర్ణాశ్రమాదుల వల్ల కానీ, ఏమాత్రం గుర్తించటానికి వీలులేకుండా కొండ చిలువవలె నిర్వికారంగా నేలపై పడుకొని ఉన్నాడు. ప్రహ్లాదుడు మహామహిమాన్వితుడైన ఆ మునీశ్వరుని సమీపించి యథా విధిగా పూజించి నమస్కరించాడు. ఆ మునీశ్వరుని పవిత్ర చరిత్ర తెలుసుకోవాలని నిశ్చయించుకొని ఇలా పలికాడు.

సీ. భూమి నుద్యోగియై భోగియై యుండెడి, నరునికైవడి మునినాథ! నీవు
ఘనశరీరము దాల్చి కదలవు, చిత్ర, ముద్యమయుక్తునకుఁ గాని ధనము లేదు,
ధనవంతునకుఁ గాని తగు భోగములు లేవు, భోగికి గాని సంపూర్ణమైన
తనువు లే, దుద్యోగ ధనభోగములు లేక నేల నూరక వడి నిద్ర వోవు

ఆ. నీకు నెట్లు గలిగె నిరుపమ దేహంబు?, సముఁడ వార్యుఁడవు, విశారదుఁడవు,
బుద్ధినిధివి, జనులఁ బొగడవు, దెగడవు, నిద్ర ప్రతిదినంబు నిలుప నేల? 432

* మునినాథా! నీవు సామాన్యుడవు కావు. పరమాద్భుత మూర్తివి. మహాప్రయత్నం చేసి, మహా భోగివలె జీవితం గడిపే మానవుడిలాగా నీవు గొప్ప శరీరం పొంది కదలకుండా శయనించి ఉన్నావు. నీ చరిత్ర విచిత్రంగా ఉంది. లోకంలో ప్రయత్నించిన వానికే కానీ ధనం లభించదు. ధనం ఉన్న వానికే కానీ భోగాలు జరగవు. భోగాలు ఉన్న వాడు తప్ప శరీర పోషణ బాగా చేసుకోలేడు. అటువంటి వానికే శరీరం సౌందర్యంతో ప్రకాశిస్తూ ఉంటుంది, కానీ చూస్తే ఎటువంటి ప్రయత్నం లేకుండానే, ఏ ప్రయత్నం ధన భోగాలు లేకుండానే, కటిక రాతినేలపై పడుకొని నిద్రించే నీకు ఇంతటి అసమాన సుందర దేహం ఎలా వచ్చింది? నీవు మహానుభావుడవు! పూజనీయుడవు. తత్త్వ విశారదుడవు! సర్వసముడవు! జనులను దూషించవు, భూషించవు. సమదృష్టిని అలవరచుకొన్న స్థిత ప్రజ్ఞుడవు. అటువంటి నీవు ఇలా ప్రతిదినం నిద్రలో ఎందుకు గడుపుతున్నావు స్వామీ! చెప్పు. వినాలని ఉంది - అన్నాడు ప్రహ్లాదుడు.

వ. అని యిట్లు ప్రహ్లాదుం డడిగిన వికసితముఖుండయి మునీంద్రుండు తదీయ మధురాలాపసుధారస ప్రవాహంబులు కర్ణంబులఁ బరిపూర్ణంబులైన నతని నవలోకించి యిట్లనియె. 433

* ప్రహ్లాదుని మధురమైన మాటలు సుధారసంలాగా వీనులకు విందు చేయగా అజగర మౌని ఆనందంతో ప్రఫుల్లముఖుడై ప్రహ్లాదుని చూచి ఇలా అన్నాడు.

సీ. ఆంతరంగికదృష్టి నంతయు నెఱుఁగుదు, వార్యసమ్మతుఁడ వీ వసురవర్య!
విశ్వజంతువుల ప్రవృత్తి నివృత్తి లక్షణములు నీ యెఱుంగనివి లేవు,
భగవంతుఁడగు హరి పాయక నీ మనో వీథి రాజిల్లుచు వెలుఁగు తేని
క్రమమున బహుళాంధకారంబుఁ బరిమార్చుఁ బరమ సాత్త్వికుఁడవు, భద్రబుద్ధి

ఆ. వైన నీవు నన్ను నడిగెదు గావున, విన్న ధర్మమెల్ల విస్తరింతు,
నిన్నుఁ జూడఁ గలిగె నీ తోడిమాటల, నాత్మశుద్ధి గలిగె ననఘచరిత! 434

* పుణ్యాత్మా! దానవోత్తమా! అంత ర్దృష్టితో నీవు సమస్తమూ తెలుసుకొన గలవు. నీవు పరమ సాత్త్వికుడవు. ఆర్య సమ్మతుడవు. విశ్వంలోని ప్రాణికోటి ప్రవృత్తి, నివృత్తి మార్గాలు నీకు తెలియనివి లేవు. నీ హృదయంలో అజ్ఞానాంధకారం దరిచేరనీయకుండా భగవంతుడు సూర్యుడులాగా ప్రకాశిస్తున్నాడు నీవు సుబుద్ధివి. నీకు తెలియని దేముంది? అయినా కూడా నీవు ధర్మజిజ్ఞాసతో నన్ను అడుగుతున్నావు.

నిన్ను నేను దర్శింప గలిగాను. నీతో సంభాషించటం వల్ల నా మనస్సు పరిశుద్ధ మయింది. నేను విన్న ధర్మమును నీకు వివరిస్తాను. విను.

**వ. వినుము : ప్రవాహకారిణియై విషయంబుల చేతం బూరింపరాని తృష్ణచేతం బడి కర్మంబులఁ బరిభ్రామ్యమాణుండనైన నేను నానావిధ యోనులందుఁ బ్రవేశించుచు, వెడలుచు నెట్టకేలకు మనుష్యదేహంబు ధరియించి యందు ధర్మంబున స్వర్గ ద్వారంబును, నధర్మంబున శునకసూకరాది తిర్యగ్జంతు యోని ద్వారంబుల నొంది క్రమ్మఱ మనుష్యుండై పుట్టవలయు నని వివేకించి సుఖరక్షణ దుఃఖమోక్షణంబుల కొఱకు ధర్మంబు సేయు దంపతుల వ్యవహారంబు గని సర్వక్రియా నివృత్తి గలిగిన జీవుండు స్వతంత్రుఁడై ప్రకాశించునని నిర్ణయించి భోగంబులు మనోరథ జాత మాత్రంబులు గాని, శాశ్వతంబులు గావని పరీక్షించి నివృత్తుండనై యుద్యోగంబు లేక నిద్రించుచుఁ బ్రారబ్ధభోగంబుల ననుభవించుచు నుండుదు, నివ్విధంబునఁ దనకు సుఖరూపంబైన పురుషార్థంబు దనయందుఁ గలుగుట యెఱుఁగక పురుషుండు శైవాలజాల నిరుద్ధంబులైన శుద్ధజలంబుల విడిచి యెండమావులు జలంబులని పాఱెడు మూఢుని వడువున సత్యంబుగాని ద్వైతంబుఁ జొచ్చి ఘోర సంసార చక్ర పరిభ్రాంతుండైయుండు. దైవతంత్రంబులైన దేహాదుల చేత నాత్మకు సుఖంబును దుఃఖనాశనంబునుం గోరుచు నిరీశుండైన వాని ప్రారంభంబులు నిష్ఫలంబులగు, నదియునుంగాక మర్త్యునకు ధనంబు ప్రాప్తంబయిన నది దుఃఖకరంబుగాని సుఖకరంబు గాదు, లోభవంతులయిన ధనవంతులు నిద్రాహారంబులు లేక రాజచోర యాచక శత్రుమిత్రాది సర్వస్థలంబులందును శంకించుచు దాన భోగంబులు మఱచి యుండుదురు, ప్రాణార్థవంతులకు భయంబు నిత్యంబు, శోకమోహ భయ క్రోధరాగశ్రమాదులు వాంఛామూలంబులు, వాంఛ లేకుండవలయును. 435**

* విషయ సుఖాలచేత తృప్తి పొందక పరుగులుపెట్టే దురాశ వెంటబడి నేను కర్మబంధాలలో చిక్కుకొని సంసార చక్రంలో పరిభ్రమించాను. నానా జన్మలూ ఎత్తాను. మరణించాను. ఈ పరిభ్రమణంలో చిట్ట చివరకు ఎట్ట కేలకూ మనుష్య దేహం ధరించాను. ఆ జన్మలలో ధర్మాలూ, పుణ్యాలూ చేసి స్వర్గ ద్వారాలు చేరుకొన్నాను. అధర్మాలూ, పాపాలూ చేసి శునక, సూకరాది జంతువుల యోనులలో పుట్టి నానా బాధలూ పడ్డాను. మరలా ఆలోచించి మానవ జన్మ ఎత్తాలి అనే వివేకంతో సుఖ సంపాదన కోసం, దుఃఖ నివారణ కోసం ధర్మం చేసే దంపతులను దర్శించాను. సమస్తక్రియల నుంచీ నివృత్తి పొందిన జీవుడు స్వతంత్రుడై ప్రకాశిస్తాడని నిర్ణయించుకొన్నాను. భోగాలు కోరికల వల్ల జనించేవే కాని శాశ్వతాలు కావని పరీక్షించి నిర్ణయించుకున్నాను. కర్మబంధాలనుంచి నివృత్తి పొంది, ఏ ప్రయత్నమూ, ఏ కోరికా లేకుండా ఇలా నిద్రిస్తూ, ప్రారబ్ధ భోగాలు అనుభవిస్తూ పడి ఉన్నాను.

ఈ విధంగా తనకు కావలసిన సుఖరూపమైన పురుషార్థం తన లోనే జన్మిస్తుందని పురుషుడు తెలుసుకోలేక పోతున్నాడు. పరిశుద్ధ జల ప్రవాహాన్ని విడిచిపెట్టి ఎండమావుల వెంటపడి పరుగెత్తే మూర్ఖునివలె జీవుడు అసత్యమైన ద్వైతంలో పడిపోతున్నాడు. ఘోర సంసార చక్రంలో పడి తిరుగుతున్నాడు. దైవ తంత్రాలైన దేహాదులచేత ఆత్మకు సుఖమునూ, దుఃఖనాశనమునూ కోరుకొనే నిరీశు డైనటువంటి వాని

ప్రయత్నాలు నిష్ఫలా లవుతాయి. అదీకాక నరునకు ధనం ప్రాప్తిస్తే అది దుఃఖం కలిగిస్తుందే తప్ప సుఖం కలిగించదు. లుబ్ధులైన ధనవంతులు నిద్రాహారాలు మాని ప్రభువులనూ, యాచకులనూ, చోరులనూ, శత్రువులనూ, మిత్రులనూ అందరినీ అనుమానిస్తూ, దానం చేయటం, అనుభవించటం మరచిపోతారు. నిత్యం దుఃఖంతో బాధ పడుతుంటారు. ప్రాణంమీద, ధనంమీద తీపిఉన్న వాళ్ళను నిత్యం భయం వెంటాడుతూ ఉంటుంది. శోకం, మోహం, భయం, క్రోధం, రాగం, శ్రమ, మున్నగు వానికి కోరికలే కారణం. కాబట్టి కోరికలు లేకుండా ఉండటం శ్రేయస్కరం.

**మ. సరఘుల్ గూర్చిన తేనె! మానవులకున్ సంప్రాప్తమైనట్లు లో**
**భ రతుల్ గూర్చిన విత్తముల్ పరులకుం బ్రాపించుఁ బ్రాప్తాశియై**
**తిరుగం బోని మహోరగంబు బ్రదుకున్ దీర్ఘాంగమై యుండియుం**
**జిరకాలంబును వాని వర్తనములం జింతించి యేకాంతినై. 436**

* తేనెటీగలు కూడబెట్టిన తేనె ఇతరుల పాలయినట్లు లోభులు సంపాదించిన ధనంకూడా పరులకు ప్రాప్తిస్తుందే తప్ప సంపాదించిన వానికి ఉపయోగపడదు. లభించినదే తిని కదలకుండా పడి ఉండే పెనుబాము కూడా చాలాకాలం బ్రతుకుతుంది. నేను చిరకాలం ఒక కొండ చిలువను పరిశీలించి ఈ నీతిని నేర్చుకొన్నాను. అందుకని నేనూ ఏకాంత వాసం చేస్తున్నాను.

**క. అజగరమును జుంటీఁగయు, నిజ గురువులుగాఁ దలఁచి నిశ్చింతుఁడనై**
**విజనస్థలిఁ గర్మంబుల, గజిబిజి లేకున్నవాఁడ గౌరవవృత్తిన్. 437**

* కొండచిలువ, తేనెటీగ నాకు గురువులు. వాటి దగ్గర నుంచి నేను గుణపాఠం నేర్చుకొని, నిశ్చింతగా ఈ నిర్జన ప్రదేశంలో కర్మబంధాల గందరగోళం లేకుండా ముని వృత్తిలో ఇలా జీవిస్తున్నాను.

**సీ. అజినవల్కల దుకూలాంబరంబులు గట్టి యైన గట్టక యైనఁ నలరుచుందు**
**నాందోళికారథ హయనాగముల నెక్కి యైన నెక్కకయైన నరుగుచుందు,**
**గర్పూరచందన కస్తూరికా లేప మైన భూరజమైన నలఁదుచుందు,**
**భర్మశయ్యల నైనఁ బర్ణశిలాతృణ భస్మంబు లందైనఁ బండుచుందు,**
**ఆ. మానయుక్తమైన మానహీనంబైనఁ, దీయనైన మిగులఁ దిక్తమైనఁ**
**గుడుతు సగుణమైన గుణవర్జితంబైన, నల్పమైనఁ జాల నధికమైన. 438**

* ప్రహ్లాదా! నిన్ను చూస్తే నాకు ఆహ్లాదంగా ఉంది. నేను పట్టు బట్టలుకానీ, నారబట్టలుకానీ; లేడి చర్మాలు కానీ, చెట్టుబెరళ్ళు కానీ ఏది లభిస్తే అదే ధరిస్తాను. ఏదీ లభించకపోతే దిగంబరంగానే ఉంటాను. కట్టుకొన్నాననే సంతోషం కానీ లేదే అనే బాధ కానీ పొందను. పల్లకీల మీద గానీ, రథాలమీదగానీ, అశ్వాలమీదగానీ, ఏనుగుల మీద గానీ ప్రయాణం చేస్తాను. లేదా నడిచిపోతుంటాను. అలానే కస్తూరి, చందనం, అగరు లేపనాలుంటే శరీరానికి పూసుకుంటాను. మరొకసారి దుమ్ములోపడి దానినే ఒంటికి పులుముకుంటాను. బంగారు తల్పాలమీద గానీ, ఆకులమీదగానీ, గడ్డిమేటల మీదగానీ, రాయిరప్పల

మీదగానీ, బూడిదనేలలోగానీ ఎక్కడైనా సరే నిశ్చింతగా నిద్రపోతాను. మానావమానాలు పట్టించుకోను. లభించేది భుజిస్తాను. అది బాగుండవచ్చు. బాగుండకపోవచ్చు. అది తియ్యగా ఉండవచ్చు లేదా కటిక చేదుగా ఉండవచ్చు, అది అత్యల్పం కావచ్చు, అత్యధికం కావచ్చు. మనస్సులో దేనిని గురించీ నాకు చింత లేదు!

క. **లే దని యెవ్వరి నడుగను, రా దని చింతింపఁ బరులు రప్పించినచోఁ**
**గా దని యెద్దియు మానను, ఖేదము మోదమును లేక క్రీడింతు మదిన్.** **439**

* లేదని నేను ఎవరినీ యాచించను. లభించలేదని చింతించను. పరులు ఏదైనా పంపితే దానిని కాదనను. ఏదీ మానను. ఏదీ కోరను. ద్వేషం లేదు, ప్రేమ లేదు. సుఖం లేదు, దుఃఖం లేదు. ఇలా జీవితమును లీలా వినోదంగా గడుపుతున్నాను.

క. **నిందింపఁ బరుల నెన్నఁడు, వందింప ననేకపీడ వచ్చిన, మది నా**
**క్రందింప, విభవముల కా, నందింపఁ బ్రకామవర్తనంబున నధిపా!** **440**

* రాజా! నేను పరులను ఎవరినీ నిందింపను. ఎవరినీ స్తుతింపను. ఎన్ని కష్టాలు వచ్చినా బాధపడను, ఎన్ని సంపదలు వచ్చినా ఆనందపడను. ఎప్పుడూ నిశ్చింతగా, సంతృప్తిగా ఉండటం అభ్యాసం చేసుకొన్నాను.

వ. **ఇట్లు గోరిక లేక యొక్క సమయంబున దిగంబరుండనై పిశాచంబు చందంబున వర్తించుచుఁ బెక్కు దినంబులం గోలెఁ బెనుఁ బాఁప వర్తనంబుఁ గైకొని నిమీలిత లోచనత్వంబున నేకాంత భావంబున విష్ణునియందు వికల్పంబును భేదగ్రాహక చిత్త వృత్తులఁ జిత్తంబు నర్థరూప పరిభ్రమణంబు గల మనంబు నందు మనంబును, నహంకారంబునందు నహంకారంబును, మాయయందు మాయను, నాత్మానుభూతియందు లయంబు నొందించి సత్యంబు దర్శించుచు విరక్తినొంది స్వానుభవంబున నాత్మస్థితుండనై యుండుదు. నీవు భగవత్పరుండవు గావున రహస్యంబైన పరమహంస ధర్మంబు స్వానుభవ గోచరంబైన తెఱంగున నీకు హృద్గోచరం బగునట్లు సెప్పితి ననిన విని.** **441**

* ఈ విధంగా ఏ కోరికా లేకుండా పూర్వం కొన్నాళ్ళు దిగంబరంగా పిశాచంలాగా ప్రవర్తిస్తుండేవాణ్ణి. ఇపుడు చాలా రోజులనుంచీ పెద్ద కొండ చిలువలాగా కళ్లు మూసుకొని భావం భగవంతుని పాదపద్మాలపై కేంద్రీకరించి ఇలా ఉండిపోయాను. భ్రాంతిని భేదభావం చూపే చిత్త వృత్తులలోనూ, చిత్తమును అర్థరూపములపై పరిభ్రమించే మనస్సులోనూ, మనస్సును అహంకారంలోనూ, అహంకారమును మాయలోనూ, మాయను ఆత్మానుభూతిలోనూ కేంద్రీకరించి విలీనం చేశాను. అది మొదలు సత్యదర్శనం చేస్తూ విరక్తి పొందాను. స్వానుభవంతో ఆత్మస్థితి అలవరచుకొన్నాను. ప్రహ్లాదా! నీవు భక్తశిఖామణివి కాబట్టి ఈ రహస్యమైన పరమహంస ధర్మమును నాకు తెలిసినంతవరకు నీకు అర్థమయ్యేలాగా చెప్పాను - అని అజగరముని అన్నాడు.

క. **ఘను నజగరముని వల్లభు, దనుజేంద్రుఁడు పూజసేసి తగ వీడ్కొని నె**
**మ్మనమున సంతోషించుచుఁ, జనియెన్ నిజగేహమునకు శశికులతిలకా!** **442**

* ధర్మరాజా! ముని మాటలు విని ప్రహ్లాదుడు ఆహ్లాదం పొందాడు. ఆ అజగర మునీంద్రుణ్ణి పూజించి, నమస్కరించి, సెలవు తీసుకొని తన రాజధానికి తిరిగి వెళ్లిపోయాడు.

**వ. అనిన యుధిష్ఠిరుం డిట్లనియె. 443**

* అని చెబుతున్న నారదమహర్షితో ధర్మరాజు ఇలా అన్నాడు.

**క. ననుబోఁటి జడగృహస్థుఁడు, మునివల్లభ! యిట్టి పదవి మోదంబున నే**
**యనువునఁ జెందును? వేగమ, వినిపింపుము నేఁడు నాకు విజ్ఞాన నిధీ! 444**

* దేవమునీ! విజ్ఞాన ఖనీ! నీవు చెప్పిన పరమార్థం, ధర్మప్రబోధం నాకు బాగా నచ్చింది. కానీ నా బోటి అజ్ఞాని అయిన గృహస్థుడు అటువంటి పదవి అందుకోవటం సాధ్యమా? అందుకు ఏమి చేయాలి? మహానుభావా! మార్గం చెప్పు.

**వ. అనిన నారదుం డిట్లనియె, గృహస్థుం డయినవాఁడు వాసుదేవార్పణంబుగా గృహోచిత క్రియలను సంధించుచు మహామునుల సేవించి వారల వలన నారాయణ దివ్యావతార కథా శ్రవణంబుసేయుచు, నయ్యై విహితకాలంబుల శాంతజనులం గూడి మెలంగుచుఁ, బుత్ర మిత్ర కళత్రాది సంగంబులు గలల వంటివని యెఱుంగుచు లోపల నాసక్తి లేక సక్తుని కైవడి వెలుపలఁ బురుషకారంబు లొనర్చుచుఁ దగులంబులేక విత్తంబు లిచ్చి జనక సుత సోదర సఖి జ్ఞాతి జనుల చిత్తంబులు సమ్మదాయత్తంబులు గావించుచు, ధనధాన్య నిధాన దైవలబ్ధంబుల వలన నభిమానంబు మాని యనుభవించుచు, గృహక్షేత్రంబులఁ జొచ్చి యుదరపూరణ మాత్రంబు దొంగిలినవాని దండింపక భుజగ మృగ మూషక మర్కట మక్షికా ఖరోష్ట్రంబుల హింసింపక పుత్త్రులభంగి నీక్షించుచు, దేశకాల దైవంబుల కొలందిని ధర్మార్థకామంబులఁ బ్రవర్తించుచు, శునక పతిత చండాలాదులకైన భోజ్యపదార్థంబులు దగిన భంగి నిచ్చుచు నిజవృత్తి లబ్ధంబులగు నశనాదులచేత దేవ ఋషి పితృభూత మానవుల సంతర్పించు చుఁ బంచమహాయజ్ఞావశేషంబుల నంతర్యామి పురుషయజనంబును నాత్మజీవనోపాయంబును సమర్థించుచు నుండవలయు. 445**

* అని జిజ్ఞాసతో అడిగిన ధర్మజునితో నారదమహర్షి ఇలా పలికాడు -

ధర్మరాజా! గృహస్థుడు మోక్షపదవి అందుకోవచ్చు. గృహస్థుడు గృహోచిత కర్మలనన్నీ వాసుదేవార్పణంగా ఆచరించాలి. మహర్షులను ఆదరించి, వాళ్ళతో శ్రీహరి దివ్యావతార గాథలు చెప్పించుకొని వీనుల విందుగా వినాలి. సజ్జనులతో సాన్నిహిత్యం కలిగి ఉండాలి. పుత్ర మిత్ర కళత్రాదుల కలయికలు కలలవంటివని తెలిసి మెలగాలి. మానసికంగా ఆసక్తి పెంచకోకుండా ఆసక్తునివలె పురుష ప్రయత్నాలు నెరవేర్చాలి. మమకారాలూ, బంధాలూ పెంచుకోకుండగా, అలాగని త్రెంచుకోకుండగా నిర్లిప్తుడుగా ఉంటూ తండ్రికీ, పిల్లలకూ, సోదరులకూ, స్నేహితులకూ, జ్ఞాతులకూ ధనముల నిచ్చి వారికి ఆనందం కలిగించాలి. భగవంతుని దయవల్ల చేకూరిన ధనధాన్య సంపదలపై అభిమానం పెంచుకోకుండా అనుభవించాలి.

గృహాలలో, పొలాలలో తిండికి మాత్రం దొంగతనం చేసే చిన్న చిన్న దొంగలను దండించకూడదు. మృగాలను, సర్పాలను, మూషికాలను, మర్కటాలను, మక్షికాలను, గార్దభాలను, ఒంటెలను హింసించక, కన్నబిడ్డలను వలె కనికరంతో చూడాలి. దేశ, కాల, దైవాలకు అనుగుణంగా ధర్మార్థకామ పురుషార్థాలతో ప్రవర్తించాలి. శునక, పతిత, చండాలురకు కూడా భోజన పదార్థాలు తనకు తగిన విధంగా పెడుతూ ఉండాలి. తన కులవృత్తి వల్ల ప్రాప్తమైన ఆహార పదార్థాలను దేవతలకూ, ఋషులకూ, పితృదేవతలకూ, మానవులకూ, జీవజంతువులకూ సంతర్పణ చేయాలి. ఈ ఐదు సంతర్పణలకే పంచమహాయజ్ఞాలని పేరు. ఈ యజ్ఞాలు జరిపిన అనంతరం పరమాత్ముని అర్చించాలి. ఆత్మజీవనోపాయం సమర్థంగా, సంతృప్తి కరంగా నెరవేర్చుకోవాలి.

**ఆ. జనక గురులనైనఁ జంపు నర్థమునకై, ప్రాణ మైన విడుచు భార్య కొఱకు,**
**నట్టిభార్యఁ బురుషుఁ డతిథిశుశ్రూష సే, యించి గెలుచు నజితు నీశునైన. 446**

* లోకంలో మానవుడు ధనానికి దాసోఽహమని తండ్రినైనా, గురువులనైనా సంహరిస్తాడు. కాని భార్యకోసం ధనమేమిటి? ప్రాణమైనా ధారపోస్తాడు. అటువంటి భార్యచేత అతిథి శుశ్రూష చేయించి విజయం సాధించవచ్చు. భార్య సహాయంతో ధర్మపథంలో పరమేశ్వరుణ్ణి కూడా గెలువవచ్చు.

**ఆ. పరముఁ డీశ్వరుండు బ్రాహ్మణ ముఖమున, నాహరించి తుష్టుఁ డయిన భంగి**
**నగ్ని ముఖమునందు హవ్యరాసులు గొని, యైనఁ దుష్టి నొందఁ డనఘచరిత! 447**

* పుణ్యచరితా! దేవాది దేవుడైన పరమేశ్వరుడు అతిథియైన బ్రాహ్మణుని ముఖంగా ఆహారం స్వీకరించి, తృప్తిపొంది ఆనందిస్తాడు. ఇంత ఆనందమూ తృప్తీ ఈశ్వరుడు అగ్నిముఖంగా హవిస్సులు గైకొని కూడా పొందడు.

**వ. కావున గృహస్థుండు బ్రాహ్మణులందును, దేవతలందును మర్త్యపశు ప్రముఖ జాతులందును నంతర్యామియు, బ్రాహ్మణాననుండును నైన క్షేత్రజ్ఞునందు నయ్యై కోరికలు సమర్పించి సంతర్పణంబు సేయవలయు, భాద్రపదంబునఁ గృష్ణ పక్షంబునందును, దక్షిణోత్తరాయణంబులందును, రేయిం బగలు సమమైన కాలంబులందును, వ్యతీపాతంబునందును, దినక్షయంబులందును, సూర్య చంద్రగ్రహణంబు లందును, శ్రవణద్వాదశి యందును, వైశాఖ శుక్ల తృతీయయందును, గార్తిక శుక్లనవమియందును, హేమంత శిశిరంబులలోన నాలుగష్టకలందును, మాఘశుక్ల సప్తమియందును, జన్మ నక్షత్రంబుల తోడం గూడిన పున్నమలందును, ద్వాదశితోడం గూడిన యుత్తరాత్రయ శ్రవణా నూరాధలందును, నుత్త రాత్రయ సహితంబులయిన యేకాదశీ తిథులందును, జన్మనక్షత్ర యుక్త దివసంబులందును, మఱియుఁ బ్రశస్తకాలంబు లందును, జననీ జనక బంధుజనులకు శ్రాద్ధంబు లును, జపహోమస్నాన వ్రతంబులును, దేవబ్రాహ్మణ సమారాధనంబులును, నాచరింప వలయు, భార్యకుఁ బుంసవనాదికంబును, నపత్యంబునకు జాత కర్మాదికంబును, దనకు యజ్ఞ దీక్షాదికంబును, బ్రేతజనులకు దహనాదికంబును, మృతదివసంబున సాంవత్సరికంబును జరప వలయు. 448**

* కాబట్టి గృహస్థుడు బ్రాహ్మణ సమారాధనం చేస్తుండాలి. దేవతలకూ, మానవులకూ దానధర్మాలు చేయాలి. పశువులకు ఆహారాదులను సమర్పించాలి. సమస్త జీవకోటిలో, సమస్త జాతులలో అంతర్యామిగా ఉన్నటువంటీ, బ్రాహ్మణుడే ముఖముగా ఉన్నటువంటి పరమాత్మకు సమదృష్టితో, సేవాభావంతో ఆయా అభీష్టాలు సమర్పించి, సంతర్పణలు చేయాలి. భాద్రపదంలో, కృష్ణపక్షాలలో, దక్షిణ, ఉత్తరాయణాలలో, రాత్రీ పగలూ సమానంగా ఉండే కాలాలలో, గ్రహయోగ కాలాలలో, దినక్షయ కాలాలలో, సూర్య చంద్రగ్రహణ సమయాలలో, శ్రవణ ద్వాదశిలో, వైశాఖ శుక్ల తదియలలో, కార్తిక శుక్లనవమిలో పండితులు చెప్పినట్లు శ్రాద్ధకర్మలూ, జపహోమాదులూ, పుణ్యకర్మలూ చేయాలి.

ఇంకా హేమంత శిశిరాలలో మార్గశిర, పుష్య, మాఘ, ఫాల్గుణ మాసాలలో వచ్చే కృష్ణపక్ష అష్టమీ తిథులలో, వాటి ముందు వెనుక సప్తమి, నవమి రోజులలో - ఈ నాలుగు అష్టకాలలో, మాఘ శుక్ల సప్తమిలో, జన్మనక్షత్రంతో కూడిన పూర్ణిమ తిథులలో, ద్వాదశితో కూడిన ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర లందు, శ్రవణ అనూరాధలందు, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్రలతో కూడిన ఏకాదశి తిథులలో జన్మనక్షత్ర దినాలలో, ఇంకనూ ప్రశస్తకాలాలలో జననీ జనక బంధువులకు శ్రాద్ధములూ, జపహోమాలూ, స్నానాలూ, వ్రతాలూ, దేవబ్రాహ్మణ సమారాధనలూ చేస్తుండాలి. భార్యకు పుత్రుడు పుట్టాలని జరిపే పుంసవనం వంటి వేడుకలూ, బిడ్డలకు జాతకర్మలూ మున్నగునవీ, తనకు యజ్ఞదీక్షాదికమూ ప్రేతజనులకు దహనాదికమూ, మృతిదినము ననుసరించి సాంవత్సరికాలూ మున్నగు కర్మలూ గృహస్థు డైనవాడు శ్రద్ధగా నిర్వర్తించాలి.

**మ. విను, మే దేశములన్ దయా గుణ తపో విద్యాన్వితంబైన వి**
**ప్రనికాయంబు వసించు, నే స్థలములన్ భాగీరథీ ముఖ్య వా**
**హిను లుండున్, హరిపూజ లెయ్యెడల భూయిష్ఠప్రకారంబులం**
**దనరున్ భూవర! యట్టి చోటులఁ దగున్ ధర్మంబులం జేయఁగన్.** 449

* ధర్మజా! ఏ దేశంలో దయా, గుణ, శీల, తపో, విద్యానిధులైన విప్రవర్యులు సుఖజీవనం చేస్తుంటారో, ఏ ప్రదేశంలో భాగీరథి మొదలైన నదులు ప్రవహిస్తుంటాయో, ఎక్కడ హరి సంకీర్తనమూ, పూజలూ పుష్కలంగా జరుగుతుంటాయో ఆ ప్రదేశాలలో ధర్మకార్యాలు నిర్వర్తించాలి.

**క. హరియందు జగము లుండును, హరిరూపము సాధుపాత్రమం దుండు, శివం**
**కరమగు పాత్రము గలిగిన, నరయఁగ నది పుణ్యదేశ మనఘచరిత్రా!** 450

* అనఘా! శ్రీహరి ఉదరంలో విశ్వం విస్తరించి ఉంటుంది. అటువంటి శ్రీహరి సాధు పురుషులలో ఉంటాడు. సత్పాత్రు లున్నదేశం పుణ్యప్రదేశం కాబట్టి దేశ, కాల, పాత్రలను గుర్తించి అవి ప్రాప్తించిన వెంటనే ఆ అవకాశం జారవిడువకుండా పుణ్యకార్యాలు చేయాలి.

**వ. మఱియుఁ గురుక్షేత్రంబును గయాశీర్షంబును బ్రయాగంబును బులహాశ్రమంబును నైమిశంబును ఫాల్గునంబును సేతువును బ్రభాసంబును గుశస్థలియును వారణాసియు మధురాపురియును**

**బంపాబిందు సరోవరంబులును నారాయణాశ్రమంబును సీతారామాశ్రమంబును మహేంద్ర మలయాదులైన కులాచలంబులును హరిప్రతిమార్చన ప్రదేశంబులును హరిసేవాపరులైన పరమభాగవతులు వసించెడు పుణ్యక్షేత్రంబులును శుభకాముండైన వాఁడు సేవింపవలయు.451**

* కురుక్షేత్రం, గయా, ప్రయాగ, పులహాశ్రమం, నైమిశం, ఫల్గుణీ నదీతీరం, రామేశ్వరం, ప్రభాసతీర్థం, కుశస్థలి, వారణాసి, మధురాపురి, పంపాసరోవరం, బిందుసరోవరం, నారాయణాశ్రమం, సీతారామాశ్రమం, మహేంద్ర, మలయపర్వతాలు మున్నగు తీర్థ క్షేత్ర పర్వత, ఆశ్రమ స్థలాలనూ, విష్ణు విగ్రహారాధన జరిగే ప్రదేశాలనూ విష్ణుభక్తులు నివసించే పుణ్యక్షేత్రాలనూ శుభాలు కోరే మానవులు తప్పక సేవించాలి.

**ఆ. భూవరేంద్ర! యిట్టి పుణ్యప్రదేశంబు, లందు నరుఁడు సేయునట్టి ధర్మ**
**మల్పమైన నది సహస్రగుణాధిక, ఫలము నిచ్చు హరికృపావశమున. 452**

* రాజేంద్రా! ఇటువంటి పుణ్యస్థలాలలో మానవుడు ఏ కొంచెం ధర్మకార్యం చేసినా శ్రీహరి దయావిశేషం వల్ల అది వేయి రెట్లు అధికమైన ఫలమును ప్రసాదిస్తుంది.

**వ. వినుము : చరాచరం బయిన విశ్వమంతయు విష్ణుమయం బగుటంజేసి పాత్ర నిర్ణయ నిపుణులైన విద్వాంసులు నారాయణుండు ముఖ్యపాత్రం బని పలుకుదురు. దేవఋషులు బ్రహ్మ పుత్రులైన సనకాదులును నుండ భవదీయ రాజసూయంబున నగ్రపూజకు హరి సమ్మతుం డయ్యె. ననేక జంతు సంఘాత సంకీర్ణంబైన బ్రహ్మాండ పాదపంబునకు నారాయణుండు మూలంబు, తన్నిమిత్తం బున నారాయణ సంతర్పణంబు సకల జంతు సంతర్పణంబని యెఱుంగుము. ఋషి నర తిర్యగమర శరీరంబులు పురంబులు, వానియందుఁ దారతమ్యంబులతోడ జీవరూపంబున భగవంతుండయిన హరి వర్తించుటం జేసి పురుషుం డనఁ బ్రసిద్ధుఁ డయ్యె. నందుఁ దిర్యగ్జాతుల కంటె నధికత్వంబు పురుషునియందు విలసిల్లుటం జేసి పురుషుండు పాత్రంబు. పురుషులలోన హరితనువైన వేదంబును ధరించుచు సంతోష విద్యాతపోగరిష్ఠుండైన బ్రాహ్మణుండు పాత్రంబు. బ్రాహ్మణులలోన నాత్మజ్ఞాన పరిపూర్ణుండయిన యోగి ముఖ్య పాత్రం బని పలుకుదురు. పరస్పర పాత్రంబులకు సహింపని మనుష్యులకుఁ బూజ నార్థంబుగాఁ ద్రేతాయుగంబునందు హరిప్రతిమలు గల్పింపఁబడియెఁ, గొందఱు ప్రతిమార్చనంబు సేయుదురు. పాత్ర పురుష ద్వేషులైన వారలకు నట్టి ప్రతిమార్చనంబు ముఖ్యార్థ ప్రదంబు గాదు. మందాధికారులకుఁ బ్రతిమార్చనంబు పురుషార్థప్రదం బగును. 453**

* ఈ చరాచర విశ్వమంతా విష్ణుమయం! అందుకనే అర్హతను ఆలోచించి నిర్ణయించే నిపుణులైన విద్వాంసులు - విష్ణువునే ముఖ్యమైన సత్పాత్రముగా నిశ్చయించారు. ఈనాడు నీ రాజసూయ మహాయాగ మండపంలో దేవతలూ, ఋషులూ, బ్రహ్మ మానస పుత్రులైన సనక సనందనాదులూ ఎందరో ఉంటే అగ్రపూజకు శ్రీహరినే ఎన్నుకున్నారు. అందుకు ఆ స్వామి సమ్మతించాడు. కారణం ఇదే! అనేక జంతుజాలంతో నిండి నిబిడీకృతమైన ఈ బ్రహ్మాండం అనే మహావృక్షానికి మూలం శ్రీ మహావిష్ణువు! ఆ కారణంచేత నారాయణునికి సంతర్పణం చేస్తే సకల ప్రాణికోటికీ సంతర్పణ చేసినట్లు అవుతుందని గ్రహించు; ఋషి,

దేవ, మానవ పశుపక్ష్యాదుల శరీరాలు అన్నీ పురములు. తారతమ్యాలను బట్టి ఆ పురములలో జీవరూపంతో భగవంతుడైన హరి ప్రవర్తిస్తాడు. అందువలననే శ్రీహరికి 'పురుషుడు' అని పేరు. ఇందులో కూడా తిర్యక్ జాతులకంటె ఎక్కువగా పురుషులలో హరి విలసిల్లుతున్నాడు. కనుక పురుషుడు పాత్రుడు. పురుషులలో మరల బ్రాహ్మణుడు పాత్రుడు; దీనికి కారణం విష్ణుశరీరమైన వేదమును విప్రుడు నిత్యం పఠిస్తూ, వల్లిస్తూ, ఉద్ధరిస్తూ, ఆ సంతోషంవల్ల విద్యాతపస్సులవల్లా బ్రాహ్మణుడు ఘనంగా ప్రకాశిస్తాడు. కాబట్టి పురుషులలో విప్రుడు పాత్రుడు. బ్రాహ్మణులలో కూడా ఆత్మజ్ఞానం పూర్తిగా పొందిన యోగి ప్రధాన పాత్రుడు అని పెద్దలు చెబుతారు. పరస్పర అర్హతలను గౌరవాదరాలను సహింపలేని మానవులకు పూజచేసుకోవటం కోసం త్రేతాయుగంలో విష్ణు ప్రతిమలు కల్పింపబడ్డాయి. కొందరు ప్రతిమలను ఆరాధిస్తారు. కానీ యోగులైన పురుషులను ద్వేషించేవారికి విగ్రహారాధనం ఫలప్రదం కాదు. సామాన్యులకు మాత్రమే ఈ విగ్రహారాధన ఫలప్రదంగా ఉంటుంది.

**ఆ. అఖిల లోకములకు హరి దైవతము చూడ, హరికి దైవతము ధరాధినాథ!**
**పదపరాగ లేశపం క్తిచేఁ ద్రైలోక్య, పావనంబు సేయు బ్రాహ్మణుండు. 454**

* ధరాధినాథా! అఖిల లోకాలకు ఆదిపురుషుడు అచ్యుతుడు! ఆ శ్రీహరికి దేవుడు బ్రాహ్మణుడు. ఈతడు తన పాద పరాగ లేశం వల్ల మూడు లోకాలను పావనం చేస్తాడు.

**వ. అటువంటి బ్రాహ్మణ జనులందుఁ గర్మనిష్ఠులు, దపోనిష్ఠులు, వేదశాస్త్రనిష్ఠులు, జ్ఞానయోగ నిష్ఠులునై కొందరు వర్తింతు, రందు జ్ఞాన నిష్ఠునికి ననంత ఫలకామియైన గృహస్థుండు పితృజనుల నుద్దేశించి కవ్యంబులును, దేవతల నుద్దేశించి హవ్యంబులును బెట్టుట ముఖ్యంబు, దైవకార్యంబునకు నిరువురనైన నొకరినైనఁ బితృకార్యంబునకు ముప్పురనైన నొకరినైన భోజనంబు సేయింప వలయు, ధనవంతునకైనను శ్రాద్ధవిస్తారంబు కర్తవ్యంబు కాదు. దేశ కాలప్రాప్త కందమూల ఫలాదికం బయినవారి నై వేద్యంబున విధిచోదిత ప్రకారంబుగా శ్రద్ధతోడఁ బాత్రంబునందుఁ బెట్టిన యన్నంబు కామదంబయి యక్షయ ఫలకారియగు, ధర్మతత్త్వవేదియైన వాఁడు శ్రాద్ధంబులందు మాంస ప్రదానంబు సేయక భక్షింపక చరింపవలయుఁ; గందమూలాది దానంబున నయ్యెడి ఫలంబు పశుహింసనంబున సంభవింపదు, ప్రాణిహింస సేయక వర్తించుటకంటె మిక్కిలి ధర్మంబు లేదు, యజ్ఞవిదులైన ప్రోడలు నిష్కాములయి బాహ్యకర్మంబులు విడిచి యాత్మజ్ఞాన దీపంబులందు గర్మమయంబు లయిన యజ్ఞంబుల నాచరింతురు. 455**

* అటువంటి బ్రాహ్మణులలో కర్మనిష్ఠులు, తపోధనులు, వేద శాస్త్ర పారంగతులు, జ్ఞానయోగులుగా కొందరు పండిత ప్రకాండులు ప్రకాశిస్తారు. వారిలో జ్ఞాననిష్ఠాగరిష్ఠుడైన వానికి అనంత ఫలాలను కాంక్షించే గృహస్థుడు తన పితృజనులను ఉద్దేశించిన కవ్యమునూ, దేవతలను ఉద్దేశించిన హవ్యమునూ సమర్పించాలి. ఇది చాలా ముఖ్య విషయం. దేవకార్యాలకు ఇద్దరికీ లేదా ఒక్కరికీ, పితృకార్యాలకు ముగ్గురికీ లేదా ఒక్కరికీ భోజనం పెట్టాలి. కానీ ధనవంతుడైనా శ్రాద్ధవిధికి అధికంగా చేయకూడదు. ఆ ప్రదేశంలో, ఆ కాలంలో

లభించిన కందమూల ఫలాదికాలు మరియు అన్నం విధి ప్రకారంగా శ్రద్ధగా బ్రాహ్మణులకు సమర్పించాలి. ఆ సంతర్పణ గృహస్థుని వాంఛలు నెరవేర్చే అక్షయ ఫలమును ప్రసాదిస్తుంది. ధర్మశాస్త్రం తెలిసిన గృహస్థుడు శ్రాద్ధ కాలంలో మాంసం వడ్డించకూడదు. తాను భుజించనూ కూడదు. కందమూలాదులు దానం చేస్తే వచ్చే పుణ్యఫలం జంతుహింసవల్ల ఎప్పుడూ లభించదు. ప్రాణిహింస చేయకుండా ఉండటం కంటే గొప్పధర్మం మరొకటి లేదు! అహింసయే పరమధర్మం. యజ్ఞతత్త్వం తెలిసిన పెద్దలు నిష్కాములై బాహ్యకర్మలు విడిచిపెట్టి ఆత్మజ్ఞాన దీప్తితోనే కర్మమయాలైన యజ్ఞాలు నిర్వర్తిస్తారు.

క. పశువులఁ బొరిగొని మఖములు, విశదములుగఁ జేయు బుధుని వీక్షించి తమున్
విశసనము సేయునో యని, క్రశిమన్ బెగడొందు భూతగణము నరేంద్రా! 456

* నరేంద్రా! యజ్ఞాలలో పశుహింస చేసే పండితులను చూచి వీరు ఎప్పుడు తను ప్రాణాలు తీసి చంపుతారో అని మిగతా జంతువులు కూడా భయంతో కృశించి పోతూ ఉంటాయి.

వ. అది గావున ధర్మవేది యయినవాఁడు దైవప్రాప్తంబు లయిన కందమూలాదికంబులచేత నిత్యనైమిత్తిక క్రియలఁ జేయవలయు, నిజధర్మ బాధకం బయిన ధర్మంబును, పరధర్మ ప్రేరితంబయిన ధర్మంబును, నాభాసధర్మంబును, బాషండ ధర్మంబును, గపటధర్మంబును ధర్మజ్ఞుండయిన వాఁడు మానవలయు, నైసర్గిక ధర్మంబు దురితశాంతి సమర్థంబగు, నిర్ధనుండు ధర్మార్థంబు యాత్రసేయుచునైన ధనంబు గోరవలదు, జీవనోపాయంబునకు నిట్టట్టుఁ దిరుగక కార్పణ్యంబు లేక జీవించు మహాసర్పంబు తెఱంగున సంతోషంబున నాత్మారాముండై యెద్దియుం గోరక బ్రదికెడి సుగుణునికిం గల సుఖంబు కామలోభంబుల దశదిశలం బరిధావనంబు సేయువానికి సిద్ధింపదు, పాదరక్షలు గలవానికి శర్కరా కంటకాదుల వలన భయంబు లేక మెలంగ నలవడుభంగిఁ గామంబుల వలన నివృత్తి గల వానికి నెల్ల కాలంబును భద్రంబగు, నుపస్థమునకును జిహ్వాదైన్యంబునకుఁ బురుషుండు గృహపాలక శునకంబుకైవడి సంచరించుచు సంతుష్టి లేక చెడు, సంతోషి గాని విప్రుని విద్యా తపో విభవ యశంబులు నిరర్థకంబులగు, నింద్రియ లోలత్వంబున జ్ఞానంబు నశించు, సకలభూలోక భోగంబుల భోగించియు దిగ్విజయంబు సేసియు బుభుక్షా పిపాసలవలనఁ గామపారంబును, హింసవలనఁ గ్రోధపారంబును జేరుట దుర్లభంబు, సంకల్పవర్జనంబునఁ గామంబును, గామవర్జనంబునఁ గ్రోధంబును, నర్థానర్థ దర్శనంబున లోభంబును, నద్వైతానుసంధానంబున భయంబును, నాత్మా నాత్మ వివేకంబున శోకమోహంబులును, సాత్త్విక సేవనంబున దంభంబును, మౌనంబున యోగాంతరాయంబును, శరీరవాంఛలేమిని హింసయు, హితాచరణంబున భూతజంబయిన దుఃఖంబును, సమాధిబలంబున దైవిక వ్యథయుఁ బాణాయామాదికంబున మన్మథవ్యథయు, సాత్త్వికా హారంబున నిద్రయు, సత్త్వగుణంబున రజస్తమంబులును, నుపశమంబున సత్త్వంబును గురుభజన కుశలుఁ డై శీలంబున జయింపవలయు. 457

* కాబట్టి ధర్మవేత్త అయిన వాడు దైవప్రాప్తమైన కందమూలాదులతోనే నిత్యనైమిత్తిక క్రియలు చేస్తుండాలి. ధర్మజ్ఞుడైనవాడు తన వృత్తి ధర్మానికి బాధాకరమైనదీ, పరధర్మ ప్రేరితమైనదీ, పైకి మాత్రం ధర్మంగా కనబడేదీ అనుసరించకూడదు. పాషండ ధర్మమునూ, కపట ధర్మమునూ నిర్వర్తించకూడదు. ప్రకృతిసిద్ధమైన సహజధర్మం పాపాలను పరిహరిస్తుంది. నిర్ధనుడు ధర్మంకోసం సంచారం చేస్తూ కూడా పరధనం కోరుకోకూడదు.

నిర్ధనుడైన జనుడు జీవనోపాధికి అటూ ఇటూ తిరుగకుండా, దైన్యం చెందకుండా జీవించే కొండచిలువ లాగా సంతోషంగా ఆత్మారాముణ్ణి ఆరాధిస్తూ, నిష్కాముడై బ్రతకాలి. అటువంటి సుగణశాలి పొందే గొప్ప సుఖం - కామలోభాదులతో పది దిక్కులకూ పరుగెత్తేవాడికి ఎప్పుడూ లభించదు, పాదరక్షలు కలవాడు రాళ్ళల్లో, ముళ్ళల్లో ఏ భయం లేకుండా ఎలా తిరుగుతాడో, అలా కామముల నుండి నివృత్తి పొందినవాడు ఎల్లకాలం సుఖంగా ఉంటాడు.

స్త్రీ వ్యసనం వల్లనూ, జిహ్వాచాపల్యం వల్లనూ మానవుడు పెంపుడు కుక్కలాగా తిరుగుతూ సంతృప్తిలేక చెడిపోతాడు. సంతుష్టి లేని విప్రునికి గల విద్యా, తపో, యశో, విభవాదులు నిరర్థకాలు. ఇంద్రియ లోలత్వం వల్ల మహనీయమైన జ్ఞానం నశిస్తుంది. సకల భూలోక భోగాలు అనుభవించినా, దిగ్విజయాలు సాధించినా, ఆకలి దప్పికలవల్ల కామాన్నీ, హింసవల్ల క్రోధాన్ని అంతమొందించటం దుర్లభం. సంకల్ప వర్జనంతో కామాన్నీ, కామవర్జనంతో క్రోధాన్నీ, అర్థానర్థ దర్శనంతో లోభాన్ని, అద్వైతానుసంధానంతో భయాన్నీ, ఆత్మానాత్మ వివేకంతో శోకమోహాలనూ జయించాలి. సాత్త్వికజన సేవతో కపటాన్నీ, మౌనంతో యోగ విఘ్నాన్నీ, శరీరవాంఛలు లేకుండా ఉండటంవల్ల హింసను నిర్మూలించాలి. హితం ఆచరించి ప్రాణిసహజమైన బాధనూ, సమాధిబలంతో దైవికబాధనూ, ప్రాణాయామంతో మన్మథవ్యధనూ, సాత్త్వికాహారంతో నిద్రనూ, సత్త్వగుణంతో రజస్తమోగుణాలనూ పోగొట్టుకోవాలి. ఉపశమనంవల్ల సత్త్వమును జయించాలి. ఈ విధంగా మానవుడు బుధవిధేయుడై, సుగుణశీలుడై కృతార్థుడు కావాలి.

**క. హరిమహిమ దనకుఁ జెప్పిన, గురువున్ నరుఁ డనుచుఁ దలఁచి కుంఠితభక్తిం**
**దిరుగు పురుషుశ్రమ మెల్లను, గరిశౌచముక్రియ నిరర్థకంబగు నధిపా! 458**

* తనకు శ్రీహరి మహిమ చెప్పే గురువును సామాన్యుడని తలచి నట్లైతే ఆ శిష్యుని శ్రమ గజ స్నానం వలె నిరర్థకం. ఏనుగు నదిలో స్నానంచేసి ఒడ్డుకు రావడంతోటే దుమ్ము చల్లుకుంటుంది. అలాగే ఉత్తమ గురువుపై గౌరవభావం లేకపోతే అతని శ్రమ వ్యర్థమై పోతుంది.

**ఉ. ఈ వనజాత నేత్రుఁ బరమేశు మహాత్ముఁ బ్రధానపూరుషున్**
**దేవశరణ్యు సజ్జనవిధేయు ననంతుఁ బురాణయోగి సం**
**సేవిత పాదపద్ముఁ దమ చిత్తములన్ నరుఁ డంచు లోకు లి**
**చ్ఛావిధిఁ జూచుచుండుదురు సన్మతి లేక నరేంద్ర చంద్రమా! 459**

* నరేంద్రచంద్రా! దేవదేవుడూ, ప్రధాన పురుషుడూ, మహాత్ముడూ, పురాణయోగీశ్వరులచే పూజింపబడే పాదపద్మాలు కలవాడూ, సురశరణ్యుడూ, అనంతుడూ, అరవిందాక్షుడూ, సజ్జన విధేయుడూ, సర్వమయుడూ, అయిన శ్రీ మహావిష్ణువును కొందరు అజ్ఞానులు బుద్ధిహీనులై కేవలం ఒక సామాన్య వ్యక్తిగా భావిస్తారు.

**వ. వినుము: షడింద్రియంబులలోన నొకటియందుఁ దత్పరులై యిచ్ఛాపూరణ విధానంబులఁ జరితార్థులమైతి మను వారలు ధారణాభ్యాస సమాధి యోగంబుల సాధింపలేరు, కృషి ప్రముఖంబులు సంసార సాధనంబులు గాని మోక్షసాధనంబులు గావు, కుటుంబ సంగంబునఁ జిత్త విక్షేపం బగుఁ , జిత్త విజయ ప్రయత్నంబున సన్న్యసించి సంగంబు వర్జించి మితంబయిన భిక్షాన్నంబు భక్షించుచు శుద్ధ వివిక్త సమప్రదేశంబున నొక్కచో నాసీనుండై సుస్థిరత్వంబునఁ బ్రణవోచ్చారణంబు సేయుచు రేచక పూరక కుంభకంబులఁ బ్రాణాపానంబుల నిరోధించి కామహతంబయిన చిత్తంబునఁ బరిభ్రమణంబు మాని కామ విసర్జనంబుసేసి మరలు నంతకు నిజనాసాగ్ర నిరీక్షణంబు సేయుచు నవ్విధంబున యోగాభ్యాసంబు సేయువాని చిత్తంబు కాష్ఠ రహితంబైన వహ్ని తెఱంగున శాంతిఁ జెందుఁ, గామాదులచేత వేధింపంబడక ప్రశాంత సమస్త వృత్తం బయిన చిత్తంబు బ్రహ్మసుఖ సమ్మర్శనంబున లీనంబై మఱియు నెగయ నేరదు. 460**

* కొందరు కన్ను, చెవి, ముక్కు, నాలుక, చర్మం, మనస్సు అనే షడింద్రియాలలో ఏ ఒక్కదానియందో తత్పరులై ఏవో కొన్ని కోరికలు తీర్చుకొనే పద్ధతులతో తమజన్మ చరితార్థం అయినట్లుగా భావిస్తారు. అటువంటి వాళ్ళు ధారణ, అభ్యాస, సమాధి యోగాలు సాధింపలేరు. కృషి మొదలైనవి సంసార సాధనాలు కానీ మోక్షసాధనాలు కావు. కుటుంబ జంజాటంవల్ల చిత్త చాంచల్యం వస్తుంది. చిత్తాన్ని జయించాలంటే సన్న్యసించాలి. అన్యసాంగత్యం విడిచిపెట్టాలి. మితంగా భిక్షాన్నం భుజించాలి. హరిని భజించాలి. పరిశుభ్రమైన సమమైన ఏకాంత ప్రదేశంలో కూర్చొని సుస్థిరంగా ప్రణవం ఉచ్చరించాలి. రేచక, పూరక, కుంభకాలతో ప్రాణాపానాలను  నిరోధించాలి. కామోపహతమైన చిత్తం పరిభ్రమించటం మాని పూర్తిగా కామ విసర్జనం చేసి, ప్రవృత్తి మార్గం నుంచి మరలేదాకా నాసాగ్రంపై దృష్టిని నిలిపి ఉంచాలి. ఇలా కనుక యోగాభ్యాసం చేస్తే వాని చిత్తం కట్టెలు లేని అగ్నివలె శాంతి పొందుతుంది. కామాదులతో బాధింపబడని మనస్సు ప్రశాంతమై బ్రాహ్మసుఖానుభవంలో లీనమై పోతుంది. ఇక చిత్తం మరల పైకి లేచి పిచ్చిపనులు చేయదు.

**మ. ధరణీ దేవుఁడు సన్న్యసించి యతియై ధర్మార్థకామంబులం**
**బరివర్జించి పునర్విలంబమునఁ దత్ప్రారంభి యౌనేని లో**
**భ రతిం గ్రక్కిన కూడు మంచి దనుచున్ భక్షించి జీవించు దు**
**ర్నరు చందంబున హాస్యజీవనుఁ డగున్ నానా ప్రకారంబులన్. 461**

* బ్రాహ్మణుడు సన్న్యసించి, ధర్మార్థ కామాలు విసర్జించి, యతియై ధర్మమును సరిగా నిర్వర్తించక మరల సంసార చక్రంలో మొదటికి వస్తే అపుడు అతడు - లోభంతో కక్కినకూడు తిని సంతుష్టి పొందే దుష్టమానవునిలాగా పరి పరి విధాలుగా పరిహాస పాత్రుడు అవుతాడు.

**క. మలమునఁ గ్రిమియును బడు క్రియ, నిలఁబడు నొడ, లాత్మ గాదు హేయం బనుచుం**
**దలఁతురు తద్‌జ్ఞులు, పొగడుదు, రలసత నొడ లాత్మ యనుచు నజ్ఞు లిలేశా? 462**

* మహాత్మా! మలంలో పురుగుపడినట్లుగా, మానవదేహం భూమి మీద పడుతుంది. అటువంటి శరీరం ఆత్మ కాదు. కాన అది విడువ తగినది అంటారు బ్రహ్మజ్ఞులు. కానీ అజ్ఞులు దేహమే ఆత్మ అనుకొని, ఆదేహమును నమ్ముకొని మాయలో పడిపోతుంటారు.

**ఆ. వ్రతము మానఁ దగదు వడుగుఁ గుఱ్ఱనికిని, గ్రియలు మానఁ దగదు గృహగతునికిఁ,**
**దపసి కూర నుండఁ దగదు, సన్న్యాసికిఁ, దరుణి తోడి పొత్తు దగదు తగదు, 463**

* ధర్మరాజా! బ్రహ్మచారి తన ఆశ్రమ నియమాలు మానకూడదు. గృహస్థుడు నిత్యనైమిత్తిక క్రియలు విడువకూడదు. వానప్రస్థుడు జనపదంలో నివసించకూడదు. సన్న్యాసికి స్త్రీల ఆలోచనే రాకూడదు. ఈ విధంగా బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ సన్న్యాస ఆశ్రమవిధులు చెప్పబడ్డాయి.

**సీ. రథము మే నెల్ల, సారథి బుద్ధి, యింద్రియ గణము గుఱ్ఱములు, పగ్గములు మనము,**
**ప్రాణాది దశవిధ పవనంబు లిరుసు, ధర్మాధర్మగతులు రథాంగకములు**
**బహుళతరంబైన బంధంబు చిత్తంబు, శబ్దాదికములు సంచార భూము,**
**లభిమాన సంయుతుం డయిన జీవుఁడు రథి, ఘనతర ప్రణవంబు కార్ముకంబు,**

**తే. శుద్ధజీవుండు బాణంబు, శుభదమైన, బ్రహ్మమంచిత లక్ష్యంబు, పరులు రాగ**
**భయ మద ద్వేష శోక లోభ ప్రమోహ, మాన మత్సర ముఖములు మానవేంద్ర! 464**

* మానవేంద్రా! ధర్మతత్త్వం తెలుసుకో. ఈ శరీరం ఒక రథం. బుద్ధి సారథి. ఇంద్రియాలు గుఱ్ఱాలు. మనస్సు కళ్ళెం. ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమాన, నాగ, కూర్మ, కృకర, దేవదత్త, ధనంజయములనే దశ విధ పవనాలు ఇరుసులు. ధర్మం, అధర్మం, రెండూ రెండు చక్రాలు. చిత్తం కఠినమైన బంధం. శబ్ద, రస, రూప, స్పర్శ, గంధాలు రథం సంచరించే ప్రదేశాలు. అహంకారి అయిన జీవుడు రథము నధిరోహించిన రథికుడు. ఘనమైన ప్రణవమే ధనుస్సు. శుద్ధజీవుడు బాణం. బ్రహ్మమే పరమలక్ష్యం. రాగ, భయ, మద, మోహ, శోక, లోభ, అహంకార, మత్సరాలు బద్ధ శత్రువులు.

**వ. ఇట్లు మనుష్య శరీర రూపంబయిన రథంబు దన వశంబు సేసికొని మహాభాగవత చరణకమల సేవానిశితంబయిన విజ్ఞాన ఖడ్గంబు ధరియించి శ్రీమన్నారాయణ కరుణావలోక బలంబున రాగాది శత్రు నిర్మూలనంబు గావించి ప్రణవబాణాసనంబున శుద్ధజీవశరంబును సంధించి బ్రహ్మ మనియెడు గుఱియందుఁ బడవేసి యహంకార రథికుండు రథికత్వంబు మాని నిజానందంబున నుండవలయు, నట్టి విశేషంబు సంభవింపని సమయంబున బహిర్ముఖంబు లయిన యింద్రియ ఘోటకంబులు బుద్ధి సారథి సహితంబులై స్వాభిమాన రథికుని ప్రమత్తత్వంబు దెలిసి ప్రవృత్తి మార్గంబు నొందించి విషయశత్రు మధ్యంబునం గూల్చిన. 465**

* ఇటువంటి శరీరరూపమైన రథమును మానవుడు తనవశంలో ఉంచుకోవాలి. పరమభక్తుల పాదసేవ అనే నిశితమైన విజ్ఞాన ఖడ్గం ధరించాలి. శ్రీమన్నారాయణ కృపాబలంతో రాగము మున్నగు శత్రువులను నిర్మూలించాలి. ప్రణవం అనే ధనుస్సునకు శుద్ధ జీవం అనే శరం సంధించి బ్రహ్మపై గురి ఉంచి ప్రయోగించాలి. అహంకారి అయిన రథి తన రథికత్వం మానుకొని ఆత్మానందంతో ఉండాలి. మానవుడు ఇటువంటి విశేషతత్త్వం అందుకోలేకపోతే బహిర్ముఖాలైన ఇంద్రియాలనే అశ్వాలు అహంకారి, స్వాభిమాని అయిన రథికుని ప్రమత్తత పసిగట్టి, బుద్ధి అనే సారథితో సహ రథమును ప్రవృత్తి మార్గంలోకి లాగి, విషయ శత్రువ్యూహం మధ్యలో కూల్చి వేస్తాయి.

ఆ. విషయ శత్రులెల్ల విక్రాంతితోడ సా, రథి సమేతుఁడయిన రథికుఁ బట్టి
యుగ్రతిమిర మృత్యుయుతమగు సంసార, కూప మధ్యమందుఁ గూల్తు రధిప! 466

* అధిపా! ఆ విషయవాసనలనే శత్రువులు విజృంభించి సారథి సమేతంగా రథికుణ్ణి పట్టుకొని భయంకరమైన, అంధకారావృతమైన, మృత్యు గహ్వర మైన సంసారకూపం లోకి కూల్చివేస్తారు.

వ. వినుము : వైదికకర్మంబు ప్రవృత్తంబును, నివృత్తంబును నన రెండు దెఱంగులయ్యె, నందుఁ బ్రవృత్తంబునఁ బునరావర్తనంబును, నివృత్తంబున మోక్షంబును సిద్ధించుఁ, బ్రవృత్తకర్మంబులోన నిష్టాపూర్తంబులన రెండు మార్గంబులు గల, వందు హింసా ద్రవ్యమయ కామ్యరూపంబులయిన దర్శ పూర్ణమాసపశు సుత వైశ్వదేవ బలిహరణ ప్రముఖంబులైన యాగాదికంబు లిష్టంబులు, దేవతాలయ వన కూప తటాక ప్రముఖంబులు పూర్తంబులు, ప్రవృత్తకర్మంబున దేహంబు విడిచి దేహాంతరారం భంబున దేహి హృదయాగ్రంబున వెలుంగు, వానితోడ నింద్రియంబులుంగూడ భూతసూక్ష్మయుక్తుండై ధూమ దక్షిణాయన కృష్ణపక్ష రాత్రి దర్శంబుల వలన సోమలోకంబుఁ జేరి భోగావసానంబున విలీనదేహుండై వృష్టి ద్వారంబునఁ గ్రమంబున నోషధి లతాన్న శుక్ల రూపంబులం బ్రాపించి భూమి యందు జన్మించు, నిది పునర్భవ రూపంబయిన పితృమార్గంబు, నివృత్త కర్మనిష్ఠుం డయినవాడు జ్ఞానదీప్తంబు లయిన యింద్రియంబులందుఁ గ్రియాయజ్ఞంబుల యజించి ఇంద్రియం బుల దర్శనాది సంకల్ప మూలంబయిన మనంబునందు వికారయుక్తంబయిన మనం బును, వాక్కునందు విద్యా విలక్షణమైన వాక్కును, వర్ణసముదాయంబు నందు వర్ణసముదాయం బును, నకారాది స్వరత్ర యాత్మకం బయిన యోంకారంబునందు నోంకారంబును, బిందువందు బిందువును. నాదంబునందు నాదంబును, బ్రాణంబునందు ప్రాణంబును బ్రహ్మమందు నిలుప వలయును, దేవమార్గంబయిన యుత్తరాయణ శుక్ల పక్ష దివా ప్రాహ్ణ పూర్ణిమా రాకల వలన సూర్య ద్వారంబున బ్రహ్మలోకంబునందుఁ జేరి భోగావసానంబున స్థూలోపాధియైన విశ్వుండై సూక్ష్మంబు నందు లయించి సూక్ష్మోపాధియైన తైజసుండై సూక్ష్మంబును గారణంబునందు లయించి, తుర్యుండై సూక్ష్మలయంబునందు శుద్ధాత్ముండై యివ్విధంబున ముక్తుం డగును. 467

* ధర్మజా! వేదాలు చెప్పిన కర్మకాండ అంతా రెండు విభాగాలు. ఒకటి ప్రవృత్తిమార్గం, రెండు నివృత్తిమార్గం. ప్రవృత్తిమార్గం వల్ల పునర్జన్మలు కలుగుతుంటాయి. నివృత్తిమార్గం మోక్షమును ప్రసాదిస్తుంది. ప్రవృత్తిలో మళ్ళీ ఇష్టాపూర్తాలు అని రెండు మార్గాలు ఉన్నాయి.

హింసా ద్రవ్యమయములై కామ్యరూపాలైన దర్శ పూర్ణమాసక్రతువు, పశుమేధం, పుత్రకామేష్టి, వైశ్వదేవం, బలిహరణం మొదలైన ప్రముఖయాగాలు ఇష్టాలు. దేవాలయప్రతిష్ఠ, వన, తటాక, కూప, నిర్మాణాది ప్రముఖ కార్యాలు పూర్తాలు.

ప్రవృత్తి కర్మవల్ల దేహం విడిచిపెట్టి దేహి దేహాంతర ప్రాప్తిలో హృదయగ్రహంపై ప్రకాశిస్తాడు. ఇంద్రియాలతో కూడా సూక్ష్మదేహం ధరించి ధూమ దక్షిణాయన కృష్ణపక్షరాత్రి అమావాస్యలద్వారా సోమలోకం చేరుకొంటాడు. అక్కడనుంచి పుణ్యఫలం పూర్తికాగానే, భోగావసానంలో దేహం విలీనం కాగా వర్షం ద్వారా క్రమంగా ఓషధులు, లతలు, అన్నం, శుక్లం రూపాలు పొంది భూమిపై మరల జన్మిస్తాడు. ఇది పునర్జన్మ రూపమైన పితృమార్గం. ఇదే ప్రవృత్తిమార్గం.

ఇక నివృత్తిమార్గంలో నిష్ఠుడైన వాడు జ్ఞానదీప్తములైన ఇంద్రియాలయందు క్రియాయజ్ఞాలు చేస్తాడు. అలా చేసి ఇంద్రియాలను దర్శనాది సంకల్పమూలమైన మనస్సులోనూ, వికార తత్త్వం గల మనస్సును వాక్కులోనూ, విద్యాదిలక్షణమైన వాక్కును వర్ణమాలలోనూ; వర్ణమాలను అకార, ఉకార, మకార సంయుక్తమైన “ఓం” కారంలోనూ; ఓం కారమును బిందువులోనూ, బిందువును నాదంలోనూ, నాదమును ప్రాణంలోనూ, ప్రాణమును బ్రహ్మంలోనూ నిలుపుకొంటూ ముందుకు పోతాడు. పుణ్యాత్ముడు దేవమార్గాలైన ఉత్తరాయణం, శుక్లపక్షం, పగలు ప్రాతఃకాలం, రాకా పూర్ణిమలలో, సూర్యమండలం ద్వారా బ్రహ్మలోకం చేరుకొంటాడు. పుణ్యకాలం పూర్తికాగానే భోగావసాన దశలో స్థూ ల ఉపాధి అయిన విశ్వం అయిపోతాడు. స్థూలమును సూక్ష్మంలో లయం చేస్తాడు. సూక్ష్మ ఉపాధితో తేజస్వి అవుతాడు. సూక్ష్మాన్ని కారణంతో లయంచేసి కారణ ఉపాధి అయిన ప్రాజ్ఞు డవుతాడు. కారణమును సాక్షి స్వరూపంలో లీనం చేసి బ్రహ్మరూపు డవుతాడు. ఇలా సూక్ష్మరూపంలో విలీనమై శుద్ధాత్ముడై యోగి ముక్తు డవుతాడు.

**ఆ. అమర నిర్మితంబులై యొప్పు పితృదేవ, సరణు లెవ్వఁ డెఱుఁగు శాస్త్ర దృష్టి**
**నట్టివాఁడు దేహియై మోహమున నొందఁ, డతిశయించు బుద్ధి నవనినాథ! 468**

* అవనినాథా! దేవనిర్మితాలైన పితృదేవ మార్గాలను అంటే ప్రవృత్తి, నివృత్తి మార్గాలను ఎవడు బాగా శాస్త్రదృష్టితో అవగాహన చేసుకొంటాడో వాడు దేహిగా ఉండి కూడా బుద్ధిబలం చేత మోహానికి లోను కాకుండా విరాజిల్లుతాడు.

**వ. వినుము : దేహాదులకుఁ గారణత్వంబున నాదియందును నవధికత్వంబున నంతమందును గలుగుచు బహిరంగంబున భోగ్యంబును నంతరంగంబున భోక్తయుఁ బరంబున నపరంబును జ్ఞానంబున జ్ఞేయంబును వచనంబున వాచ్యమును నప్రకాశంబునఁ బ్రకాశంబును నైన వస్తువునకు వేఱొండు**

లేదు, ప్రతిబింబాదికంబు వస్తుతత్త్వంబునం జేసి వికల్పితంబై తలంపంబడు భంగి నైంద్రియకం బైన సర్వంబును నర్థత్వంబున వికల్పితంబయి తోఁచుంగాని పరమార్థంబు గాదు. దేహాదికంబులు మిథ్యాత్మకంబులు, వానికి హేతువులయిన క్షితి ప్రముఖంబులును మిథ్యాత్మకంబు లగుట సిద్ధంబు, పరమాత్మకు నవిద్యచేత నెంతదడవు వికల్పంబు దోఁచు నంత దడవును భ్రమంబునుం దోఁచు, నవిద్యానివృత్తియైన సర్వంబును మిథ్యయయి శాస్త్రవిధి నిషేధంబులు గల లోపల మేలుగన్న తెఱం గగు, భావాద్వైత క్రియాద్వైత ద్రవ్యాద్వైతంబులు మూఁడు గల, వందుఁ బటతంతు న్యాయంబున గార్య కారణంబులందు వస్తు వొక్కటియై యుండు నని యెఱింగి, యేకత్వాలోచనంబు సేసి వికల్పంబు లేదని భావించుట భావాద్వైతంబు, మనోవాక్కాయ కృతంబులైన సర్వకర్మంబులను ఫలభేదంబు సేయక పరబ్రహ్మార్పణంబు సేయుట క్రియాద్వైతంబు పుత్రమిత్రకళత్రాది సర్వప్రాణుల కుం దనకును దేహంబునకుం బంచభూతాత్మకత్వంబున భోక్త యొక్కరుండను పరమార్థత్వంబున నర్థకామంబుల యెడ నైక్యదృష్టిం జేయుట ద్రవ్యాద్వైతంబు, నేర్పున నాత్మతత్త్వానుభవంబున నద్వైత త్రయంబును విలోకించి వస్తుభేదబుద్ధియు, స్వకీయ పరకీయ బుద్ధియు స్వప్నంబులుగాఁ దలంచి ముని యైనవాఁడు మానవలయు. 469

* ధర్మజా! విను. దేహాదులకు కారణ రూపమై ఆదిలోనూ, అవధిరూపమై అంతమందునూ సంభవించుతూ బహిరంగంగా భోగ్యమై ఆంతరంగికంగా భోక్తయై పరం అపరం; జ్ఞానం, జ్ఞేయం; వచనం వాచ్యం, అప్రకాశం ప్రకాశం అయిన మూలవస్తువు ఒక్కటే! అది కానిది మరొకటి లేదు. వస్తుతత్త్వంలో ప్రతిబింబం బింబంకంటే వేరైనదిగా భావింపబడినట్లు ఇంద్రియసంబంధమైన సర్వమూ వికల్పత్వాన్ని పొంది అలా అనిపిస్తుందే కాని అది యథార్థం కాదు. దేహం మున్నగునవి భ్రాంతి మూలకాలు. అవి అవశ్యం నశించేవి. వానికి మూల హేతువులైన పృథివి మొదలైనవి కూడా నశించేవే కానీ శాశ్వతాలు కావు. అజ్ఞానం వల్ల పరమాత్మ ఎంతవరకు వికల్పం అనిపిస్తాడో, అంతవరకు భ్రమ ఉన్నట్లే. అజ్ఞానం తొలగిపోగానే అంతా మిథ్య అయి, శాస్త్రవిధి నిషేధాలు అన్నీ పోయి కలలో నుంచి మేలుకొన్నట్లు అవుతుంది.

భావాద్వైతం, క్రియాద్వైతం, ద్రవ్యాద్వైతం అని అద్వైతాలు మూడు. వస్త్రము, దారములు ఒకటే వస్తువైనట్లు కార్య కారణాలలో కూడా వస్తువు ఒకటే. విశ్వానికి మూలం ఒక్కటే అని ఏకైకరూపమైన ఆలోచన చేసి వికల్పం లేదని భావించటం భావాద్వైతం. మనస్సు, వాక్కు, కాయము - వీనిచే నెరవేర్చబడిన సర్వకర్మలూ ఫలభేదం లేకుండా, కర్తృత్వం తనమీద పెట్టుకోకుండా తాను నిమిత్తమాత్రంగా భావించి కర్మ ఫలాలను బ్రహ్మార్పణం చేయటం క్రియాద్వైతం. పుత్ర మిత్ర కళత్రాది సర్వప్రాణులకూ, తనకూ, దేహానికీ కూడా పంచభూతాత్మకంగా భోక్త ఒక్కడే అను పరమార్థ తత్త్వంతో అర్థకామాల పట్ల ఐక్యదృష్టి నిలపటం ద్రవ్యాద్వైతం. మునియైనవాడు నేర్పుగా ఆత్మతత్త్వానుభవంతో పైన చెప్పిన అద్వైతత్రయమును పరిశీలించి వస్తు భేద బుద్ధి, స్వకీయ, పరకీయ బుద్ధీ - స్వప్నాలుగా భావించి జీవనం సాగించాలి.

క. వాదములు వేయు నేటికి?, వేదోక్త విధిం జరించు విబుధుఁడు గృహముం
దాదరమున నారాయణ, పాదంబులు గొలిచి ముక్తిపదమున కేఁగున్. 470

* ఇన్ని వాదాలెందుకు కానీ సారం ఏమిటంటే విద్వాంసుడు వేదోక్త ప్రకారంగా నడుచుకొంటూ, గృహంలో ఉండి కూడా శ్రీహరి పాదపద్మార్చకుడైతే తేలికగా ముక్తి పొందుతాడు.

**శా. భూపాలోత్తమ!, మీరు భక్తిగరిమ స్ఫూర్తిన్ సరోజేక్షణ**
**శ్రీపాదాంబుజ యుగ్మమున్ నియతులై సేవించి కాదే మహో**
**గ్రాపత్సంఘము లోనఁ జిక్కక సమస్తాశాంత నిర్జేతలై**
**యేపారంగ మఖంబు సేసితిరి దేవేంద్ర ప్రభావంబునన్. 471**

* భూపాల చూడామణీ! మీరు పరమభక్తితో శ్రీహరి పాదపద్మాలను పూజించటం వల్లకదా భయంకరమైన కష్టాలకు గురికాకుండా, వాటిల్లో చిక్కుపడకుండా అపూర్వంగా దిగ్విజయం సాధించి దేవేంద్ర వైభవంగా రాజసూయయాగం చేయగలిగారు.

## -: నారదుని పూర్వజన్మ వృత్తాంతము. :-

**వ. వినుము : పోయిన మహాకల్పంబునందు గంధర్వులలోన నుపబర్హణుం డనుపేర గంధర్వుండ నైన నేను సౌందర్య మాధుర్య గాంభీర్యాది గుణంబుల సుందరులకుఁ బ్రియుండనై క్రీడించుచు నొక్కనాఁడు విశ్వస్రష్టలైన బ్రహ్మలు దేవసత్త్రమనియెడి యాగంబులోన నారాయణకథలు గానంబు సేయుకొఱకు నప్సరోజనులను గంధర్వులనుం జీరిన. 472**

* ధర్మనందనా! నా పూర్వజన్మ వృత్తాంతం వివరిస్తాను. విను. గతించిన మహాకల్పంలో గంధర్వవంశంలో ఉపబర్హణుడు అనే పేరుతో జన్మించాను. అపుడు నేను చాలా అందంగా ఉండేవాణ్ణి. మధురంగా మాట్లాడేవాణ్ణి. గంభీరంగా ప్రవర్తించేవాణ్ణి. ఈ కారణాలవల్ల సుందరీ మణులు సమ్మోహితలై నా దగ్గరకు చేరేవారు. నేనూ ఆ రమణీమణుల వాల్గంటిచూపులకు లోనై వారితో క్రీడిస్తూ ఉండేవాణ్ణి. ఒకసారి విశ్వ సృష్టికర్తలైన ప్రజాపతులు దేవసత్రం అనే యజ్ఞం చేశారు. ఆ యజ్ఞంలో యజ్ఞపురుషుడైన శ్రీ విష్ణువు గాథలు గానం చేయటానికి గంధర్వులను, అప్సరసలను ఆహ్వానించారు.

**ఆ. క్రతువులోని కేను గంధర్వ గణముతోఁ, గలసిపోయి విష్ణుగాథ లచటఁ**
**గొన్ని పాడి సతులఁ గూడి మోహితుఁడనై, తలఁగి చనితి నంత ధరణినాథ! 473**

* ధరణీశ్వరా! ఆ యజ్ఞాలకు నేనూ గంధర్వ సమూహంతో వెళ్ళాను. విష్ణుకథలు వీనుల విందుగా గానం చేశాను. మధ్యలో మందగమనలపై మనసుపోయింది. మోహం పెరిగి, మైమరచి, కర్తవ్యం విస్మరించి, హరికీర్తన మాని హరిణాక్షుల పొందు కోసం పరుగెత్తాను.

**క. వారిజ గంధుల పొత్తున, వారిం గైకొనక తలఁగి వచ్చిన బుద్ధిన్**
**వా రెఱింగి శాప మిచ్చిరి, వారింపఁగ రాని రోషవశమున నధిపా! 474**

* అధిపా! మోహంలో పడిపోయి సృష్టికర్తల ఆజ్ఞ అనుసరించక పోవటంతో ప్రజాపతులకు నాపై కోపం వచ్చింది. అనివార్యమైన క్రోధంతో వాళ్ళు నన్ను ఇలా శపించారు.

ఆ. పంకజాక్షు నిచటఁ బాడక కామినీ, గణముఁ గూడి చనిన కల్మషమున
దగ్ధకాంతి వగుచు ధరణీతలంబున, శూద్రజాతి సతికి సుతుఁడ వగుము.' 475

వ. అని యిట్లు విశ్వస్రష్టలు శపించిన నొక బ్రాహ్మణదాసికిఁబుత్త్రుండనై జన్మించి యందు బ్రహ్మవాదులైన పెద్దలకు శుశ్రూష సేసిన భాగ్యంబున నిమ్మహాకల్పంబునందు బ్రహ్మ పుత్త్రుండనై జన్మించితి. 476

* "ఓరీ మదాంధుడా! నిన్ను హరికథా గానం చేయమంటే, చేయటం మాని మదిరాక్షులతో పారిపోయావు. కనుక మా ఆజ్ఞాధిక్కారానికి ఫలంగా తేజస్సు కోల్పోయి, ఎటువంటి దివ్యశక్తులూ లేక భూలోకంలో శూద్రస్త్రీకి సుతుడవై జన్మించు"అని సృష్టికర్తలు శపించిన కారణంగా భూలోకంలో ఒక బ్రాహ్మణదాసికి పుత్రుడుగా పుట్టాను. అక్కడ బ్రహ్మవేత్తలైన కొందరు పెద్దలకు చాలాకాలం శుశ్రూష చేశాను. ఆ సేవా ప్రభావంవల్ల ఈ మహాకల్పంలో బ్రహ్మ మానసపుత్రుడనై జన్మించాను. ధర్మజా! నా పూర్వజన్మ వృత్తాంతం ఇది.

ఆ. కౌశలమున మోక్షగతికి గృహస్థుఁ డే, ధర్మ మాచరించి తగిలి పోవు
నట్టి ధర్మ మెల్ల నతివిశదంబుగాఁ, బలుకఁ బడియె నీకు భవ్యచరిత! 477

* శుభచరితా! గృహస్థుడు ఏ ధర్మం ఎలా ఆచరిస్తే అనాయాసంగా మోక్షపదం అందుకొంటాడో, ఆ ధర్మం అంతా నీకు విశదంగా వివరించాను.

మ. అఖిలాధారుఁ డజాది దుర్లభుఁడు బ్రహ్మంబైన విష్ణుండు నీ
మఖమం దర్చితుఁడై నివాసగతుఁడై మర్త్యాకృతిన్ సేవ్యుఁడై
సఖియై చారకుఁడై మనోదయితుఁడై సంబంధియై మంత్రియై
సుఖదుం డయ్యెఁ, భవన్మహామహిమ దాఁ జోద్యంబు ధాత్రీశ్వరా! 478

* ధాత్రీశ్వరా! ఒక విషయం నాకు చాలా సంతోషంగా ఉంది. అఖిల ప్రపంచానికీ ఆధారభూతుడూ, బ్రహ్మాదులకు సైతం లభ్యం కాని పరబ్రహ్మ స్వరూపుడూ అయిన శ్రీమహావిష్ణువు నీవు చేసిన యజ్ఞంలో ఆరాధింపబడ్డాడు! నీ సన్నిధిలో మాధవుడు ఒక మానవుడుగా, మహనీయుడుగా, పూజనీయుడుగా, పుణ్యమూర్తిగా, ప్రాణస్నేహితుడుగా, కార్యనిర్వాహకుడుగా, ఆప్తబాంధవుడుగా, మనోనాథుడుగా, మంత్రిగా ఉండి సర్వసుఖాలూ సమకూర్చాడు! అంటే నీ పూర్వ పుణ్యఫలం ఎంత గొప్పదని చెప్పాలి? నీవు మహాభాగ్యశాలివి మహారాజా!

వ. అని యిట్లు నారదుండు సెప్పిన వృత్తాంతం బంతయు విని ధర్మనందనుండు ప్రేమ విహ్వలుండై వాసుదేవునిం బూజించె. వాసుదేవ ధర్మనందనుల చేతఁ బూజితుండై నారదమునియు దేవమార్గంబునం జనియె నని శుక యోగీంద్రుండు పాండవ పౌత్త్రునకుం జెప్పెనని సూతుండు శౌనకాదులకుం జెప్పిన.479

* అని ఈ విధంగా నారదమహర్షి చెప్పిన ధర్మతత్త్వం అంతా విని, ధర్మజుడు పట్టరాని పరమానందం పొందాడు. వినయంగా వాసుదేవుణ్ణి అర్చించాడు. వాసుదేవుడు సంతసించాడు. శ్రీకృష్ణ, ధర్మజులచేత పూజింపబడిన నారదమునీంద్రుడు దేవలోకానికి ప్రయాణమై వెళ్ళి పోయాడు అని శుకమహర్షి పరీక్షిన్మహారాజుకు వివరించాడు అని అఖిల పురాణ శాస్త్ర పారంగతుడైన సూతుడు శౌనకాది మునీంద్రులకు తెలియ చేశాడు.

క. రాజీవ సదృశలోచన!, రాజీవ భవాదిదేవ రాజవినుత! వి,
భ్రాజిత కీర్తిలతావృత, రాజీవ భవాండ భాండ! రఘుకుల తిలకా! 480

* పోతన కవీంద్రుడు ఆశ్వాసాంతంలో శ్రీరామచంద్రమూర్తిని ఇలా ప్రస్తుతిస్తున్నాడు - రఘువంశ తిలకమైన శ్రీరామచంద్రా! కమలములవలె కమనీయమైన కన్నులు గల స్వామీ! బ్రహ్మాది దేవతా గణము చేత ప్రశంసింపబడిన దేవా! బ్రహ్మాండమెల్ల వ్యాపించిన విస్తారమైన కీర్తి లతలు కల ప్రభూ! నీకు ప్రణామము!!

మాలిని

ధరణిదుహితృరంతా! ధర్మమార్గానుగంతా!
నిరుపమనయకాంతా! నిర్జరారాతిహంతా!
గురుబుధసుఖ కర్తా! కుంభినీచక్రభర్తా!
సురభయపరిహర్తా! సూరిచేతోవిహర్తా! 481

* పరమ పావని సీతకు ప్రాణవల్లభుడవు! అతి కఠినమైన ధర్మమార్గం ఆచరించి చూపిన ఆదర్శమూర్తివి! నిరుపమానమైన నీతి పథంలో నడచిన వాడవు! నిశాచరులను నేలగూల్చిన వీరుడవు! గురు జన సుఖదాయకుడవు! భువనములకు అధినాయకుడవు! అమరులకు అభయ మిచ్చి ఆదుకొన్న ధీరమూర్తివి. వివేకవంతుల హృదయాలలో విహరించే స్వామివి! శ్రీరామచంద్రా! నీకు నమస్కారము!

గద్యము: ఇది శ్రీపరమేశ్వర కరుణా కలిత కవితా విచిత్ర కేసన మంత్రి పుత్ర సహజ పాండిత్య పోతనామాత్య ప్రణీతంబయిన శ్రీ మహాభాగవతంబను మహా పురాణంబునందు ధర్మనందనునకు నారదుండు హిరణ్యాక్ష హిరణ్యకశిపుల పూర్వజన్మ వృత్తాంతంబు సెప్పుటయు, హిరణ్యకశిపు దితి సంవాదంబును, సుయజ్ఞోపాఖ్యానంబును, యమసల్లాపంబును, బ్రహ్మవరలాభ గర్వితుండైన హిరణ్యకశిపు చరిత్రంబును, బ్రహ్లాద విద్యాభ్యాస కథయును, బ్రహ్లాద హిరణ్యకశిపుల సంవాదంబును, బ్రహ్లాదు వచనంబు ప్రతిష్ఠింప హరి నరసింహరూపంబున నావిర్భవించి హిరణ్యకశిపుని సంహరించి ప్రహ్లాదునకు నభయం బిచ్చి నిఖిలదేవతానివహ ప్రహ్లాదాది స్తూయమా నుండై తిరోహితుం డగుటయుఁ, ద్రిపురాసుర వృత్తాంతంబును, నీశ్వరుండు త్రిపురంబుల దహించుటయు, వర్ణాశ్రమ ధర్మ వివరణంబును, బ్రహ్లాదాజగర సంవాదంబును, స్వధర్మ ప్రవర్తకుఁడగు గృహస్థుండు ముక్తుండగు మార్గంబు నారదుండు ధర్మజునకుఁ దెలుపుటయు, నారదుని పూర్వజన్మ వృత్తాంతంబును నను కథలు గల సప్తమ స్కంధము. 482

* ఇది శ్రీ పరమేశ్వరుని కరుణ వల్ల కలిగిన కమనీయమైన కవిత్వం కలవాడూ, శ్రీ కేసనమంత్రి కుమారుడూ, సహజపాండిత్యం కలవాడూ అయిన పోతనామాత్యునిచేత రచింపబడ్డ శ్రీ మన్మహాభాగవతము. ఈ మహా పురాణంలో ధర్మరాజుకు నారదమహర్షి చెప్పిన గాథలు వివరింపబడ్డాయి.

హిరణ్యాక్ష హిరణ్య కశిపుల పూర్వజన్మ వృత్తాంతం, దితి హిరణ్యకశిపుల సంభాషణం, సుయజ్ఞో పాఖ్యానం, యమ సల్లాపం, బ్రహ్మవల్ల వరాలు పొంది గర్వించిన హిరణ్యకశిపుని చరిత్రం, ప్రహ్లాదుని విద్యాభ్యాసం, ప్రహ్లాద హిరణ్యకశిపుల సంవాదం, ప్రహ్లాదుని మాట నిలబెట్టటానికి శ్రీ విష్ణువు నరసింహస్వామి రూపంలో ఆవిర్భవించటం, హిరణ్యకశిపు సంహారం, ప్రహ్లాదునకు నరసింహదేవుని వరప్రదానం, అఖిల దేవతాగణంచేత ప్రహ్లాదునిచేత ప్రస్తుతింపబడి నరసింహస్వామి అంతర్ధాన మవటం, త్రిపురాసుర వృత్తాంతం, త్రిలోచనుడు త్రిపురాలను దహించటం, వర్ణధర్మాలు, ఆశ్రమధర్మాలు, ప్రహ్లాద అజగర సంవాదం, గృహస్థుడు మోక్షం పొందేమార్గం నారదుని పూర్వజన్మ వృత్తాంతం- అనే వివిధ కథల కదంబం- ఈ సకల శుభప్రదమైన మహాభాగవత సప్తమ స్కంధం!.

**శ్రీ కృష్ణార్పణమస్తు**

# పోతన భాగవతము

## మూడవ సంపుటము

### ఎనిమిదవ స్కంధము

# ప్రవేశిక

ఉ. గంటమొ? చేతిలోది ములుగఱ్ఱయొ?
నిల్కడ యింటిలోననో? పంటపొలానొ?
చేయునది పద్యమొ? సేద్యమొ?
మంచమందుఁ గూర్చుంటివొ? మంచెయందొ?
కవివో? గడిదేరిన కర్షకుండవో?
రెంటికిఁ జాలియుంటివి!
సరే! కలమా హలమా ప్రియంబగున్?

ఉ. కాయలుగాచి పోయినవిగా యరచేతులు!
వ్రాతగంటపున్ రాయిడిచేతనో?
కరకు నాగలిమేడినిబట్టి
సేద్యముం జేయుటచేతనో?
కవి కృషీవల!
నీ వ్యవసాయదీక్ష "కా హో" యని
ఇంతలేసి కనులార్పక చూచిరిలే దివౌకసుల్.

ఈ రెండు ఉత్పలమాలలనూ పోతన్నగారి గళాన అలంకరించి ఆలోచించితే సఫలమూ, సర్వదా సంస్మరణీయమూ, సకలజన స్తవనీయమూ, రసభావ రమణీయమూ, ప్రసాద మహనీయమూ అయిన సహజ పాండిత్యులవారి సారస్వత వ్యవసాయం అటువంటిదే అని తోస్తుంది. ఆ మహాకవి నిత్య నిరంతరకృషి దండిగా నిండుగా పండించిన "బంగారుపంట" భాగవతం.

ఇప్పుడు తమ హస్తాలను అలంకరించిన గ్రంథం బమ్మెరవారి భాగవత మహా ప్రబంధంలోని అష్టమ స్కంధం.

అష్టమ స్కంధం అనగానే గజేంద్ర మోక్షణమూ, వామన చరిత్రమూ మన స్మృతిపథంలో సాక్షాత్కరిస్తాయి.

**"శ్రీకైవల్య పదంబుఁ జేరుటకునై చింతించెదన్"** అన్న భాగవత ప్రారంభ పద్యంలోని **"భక్తపాలన కళా సంరంభకున్"** అనే విశేషణానికి విశ్లేషణ రూపమే గజేంద్రుని కథాకలాపం.

తెలుగునాట ఈ కథకున్న ప్రచారం ఇంతా అంతా కాదు:-

**ఎంత దయో దాసులపై, పంతంబున మకరిపట్టి బాధింపగ, శ్రీ**
**కాంతుడు చక్రము బంపెను, దంతావళరాజు గాయ, దత్తాత్రేయా!**

ఈ పద్యాన్ని ఆటవిడుపునాడు అయ్యవారు పిల్లల పలకలపై వ్రాసి పెట్టేవారు. కన్న తల్లి దండ్రులు తమ చిన్ని బిడ్డలను పొట్టమీద పడుకో బెట్టుకొని **"చేతిలో వెన్నముద్ద"**తోపాటు పై పద్యాన్ని కూడా నోటికి అందించేవారు.

తెలుగు బామ్మలు!-

**"రాజేంద్ర వినుము**
**విరాజితము గజ**
**రాజ మోక్షణ కథనూ**
**మహా సుధనూ**
**రహిత మనోవ్యథను"**

అనే పల్లవితో ప్రారంభించి భాగవతంలోని పద్యాలనే పాటలుగా మార్చి తూ చా తప్పకుండా గజేంద్ర మోక్షణం కథంతా కమ్మని కంఠాలతో ఇంటింటా పాడుకోటం ఎన్నోచోట్ల ఎన్నోసార్లు విన్నాను.

ఇక పోతన్నగారి గజేంద్రమోక్షణ కథాఘట్టంలోని-

**"లావొక్కింతయు లేదు ధైర్యము విలోలం బయ్యె",**
**"ఎవ్వనిచే జనించు జగ మెవ్వని లోపలనుండు",**
**"అలవైకుంఠ పురంబులో నగరిలో ఆమూల",**
**"సిరికిం జెప్పఁడు శంఖ చక్ర యుగమున్",**
**"తనవెంటన్ సిరి లచ్చివెంట",**
**"అడిగెద నని కడువడిఁ జను",**
**"లోకంబులు లోకేశులు",**
**"కలఁడందురు దీనులయెడ",**

ఇత్యాది పద్యాలన్నీ ఆబాల గోపాలానికి కంఠస్థం అనటంలో అతిశయోక్తి అణుమాత్రమూ లేదు. ఇక "వామనచరిత్ర" సరేసరి-

**"వడుగా ఎవ్వరివాఁడ? వెవ్వఁడవు?",**
**"వరచేలంబులొ మాడలో",**
**"ఒంటివాఁడ నాకు ఒకటి రెం డడుగుల",**
**"గొడుగో జన్నిదమో కమండలువొ",**
**"వారిజాక్షులందు వైవాహికములందు",**
**"కారేరాజులు రాజ్యముల్ గలుగవే",**
**"ఆదిన్ శ్రీసతి కొప్పుపై, తనువుపై",**
**"ఇంతింతై వటుఁ డింతయై-",**

మొదలైన తియ్యతియ్యని పద్యాలు తెలుగువారి నాలుకలమీద నాట్యం చేస్తుంటాయి నాటికీ, నేటికీ, ఏనాటికీ.

అష్టమస్కంధం విశిష్టత అటువంటిది.

గజేంద్రమోక్షణంలో ఒకచమత్కారం జరిగింది-

అరణ్యంలో అలవోకగా తిరిగితిరిగి దాహంగొన్న మత్తేభయూథం ఒకపెద్దమడుగులో ప్రవేశించింది. అప్పుడు దప్పికతీర్చుకుంటున్న మత్తేభ రాజును మకరం పట్టుకుంది. మకరమత్తేభాలకు పెనగులాట ఆరంభమైంది. ఆ పోరాటంలో మత్తేభం బాగా ఆరాటపడి అలసిపోయింది. క్రమక్రమంగా గజేంద్ర బలం ఉడిగిపోయింది. ప్రాణావశిష్టమైన ఆ ఏనుగు **"నీవే తప్ప ఇతఃపరం బెఱుఁగ"** నంటూ పరిపరివిధాల భగవంతుణ్ణి ప్రార్థించింది.

అది వైకుంఠం. అందులో రాచనగరు. ఆ మూలగా ఒక పెద్దమేడ. ఆ మేడప్రక్కనే ఒక మందారవనం. ఆ తోటమధ్యలో ఒక అమృత సరస్సు. ఆ సరోవరం ఆనుకొని చంద్రకాంత మణివేదిక. ఆ వేదికమీద కలువపూలపాన్పు. ఆ పానుపుపైన శ్రీమహాలక్ష్మితో సరసాలాడుతున్నాడు శ్రీమన్నారాయణుడు.

ఆ రసమయ సమయంలో ఆస్వామికి ఆపన్నుడైన గజేంద్రుని ఆర్తకంఠం వినిపించింది. వినీ వినగానే ఆయన చివాలున లేచాడు. ఈ సన్నివేశాన్ని పోతనగారు ఒకమత్తేభవృత్తంలో ఇలా వర్ణించారు-

**అల వైకుంఠపురంబులో నగరిలో నామూలసౌధంబు దా**
**పల మందారవనాంతరామృతసరః ప్రాంతేందు కాంతోపలో**
**త్పల పర్యంక రమావినోది యగు నా పన్న ప్రసన్నుండు వి**
**హ్వలనాగేంద్రము "పాహిపాహి" యనఁగుయ్యాలించి సంరంభియై.** 8-95

గజేంద్రుణ్ణి కాపాడాలనే సంరంభంలో లక్ష్మీదేవికి చెప్పకుండా, తనచేతిలో ఉన్న ఆమె పైటచెరగును సైతం విడిచిపెట్టకుండా, శంఖచక్రాలుకూడా పట్టుకోకుండా, మైమరచి పరువెత్తుతున్న ఆపన్నప్రసన్నుణ్ణి మరొక మత్తేభవృత్తంలో ఈ విధంగా చిత్రించాడు పోతన్న-

**సిరికిం జెప్పఁడు శంఖచక్రయుగముం జేదోయి సంధింపఁ డే**
**పరివారంబును జీరఁ డభ్రగపతిం బన్నింపఁ డాకర్ణికాం**
**తర ధమ్మిల్లము చక్కనొత్తఁడు వివాదప్రోత్థిత శ్రీకుచో**
**పరి చేలాంచలమైన వీడఁడు గజ ప్రాణావనోత్సాహియై.** 8-96

ఈ విధంగా జుట్టు విరబోసుకొని పరువెత్తే శ్రీహరివెంట వైకుంఠంలోని ఆబాలగోపాలం పరువెత్తుకు రావటాన్ని మన మహాకవి మరో మత్తేభంలో ఇలా చెప్పాడు-

**తనవెంటన్ సిరి; లచ్చివెంట నవరోధవ్రాతమున్; దాని వె**
**న్కను పక్షీంద్రుఁడు, వానిపొంతను ధనుః కౌమోదకీ శంఖ చ**

**్ర నికాయంబు నారదుండు, ధ్వజనీకాంతుండు రా వచ్చి రొ**
**య్యన వైకుంఠపురంబునం గలుగువా రాబాలగోపాలమున్.** 8-98

ఆ సమయంలో **"గోవిందకరారవింద సమాకృష్యమాణ సంవ్యానచేలాంచల"**యై పోతున్న శ్రీదేవి దేవ దేవుని ససంభ్రమ గమనానికి కారణం తెలియక పరిపరివిధాల భావించటం కూడా పోతనగారు మత్తేభ వృత్తంలోనే చెప్పారు-

**తన వేంచేయు పదంబు పేర్కొనఁ డనాథస్త్రీజనాలాపముల్**
**వినెనో! మ్రుచ్చులు మ్రుచ్చిలించిరొ ఖలుల్ వేదప్రపంచంబులన్!**
**దనుజానీకము దేవతానగరిపై దండెత్తెనో! భక్తులం**
**గని చక్రాయుధుఁ డేఁడి చూపుఁడని ధిక్కారించిరో దుర్జనుల్!** 8-100

అనంతరం రెండు మూడు పద్యాలలో లక్ష్మీదేవి స్వరూప స్వభావాలను అభివర్ణించి ఆ తర్వాత ఆకాశపథంలో అమరానీకం అవలోకించిన అచ్యుతుణ్ణి మళ్లీ మత్తేభంలోనే మనముందు నిలిపాడు-

**వినువీథిం జనుదేరఁ గాంచి రమరుల్ విష్ణున్ సురారాతి జీ**
**వన సంపత్తి నిరాకరిష్ణుఁ గరుణా వర్ధిష్ణు యోగీంద్ర హృ**
**ద్వన వర్తిష్ణు సహిష్ణు భక్తజన బృంద ప్రాభవాలంకరి**
**ష్ణు నవోఢోల్ల సదిందిరా పరిచరిష్ణున్ జిష్ణు రోచిష్ణునిన్.** 8-105

ఇలా స్వామిని సందర్శించి దేవతలంతా ఆ దేవదేవునకు నమస్సు లర్పించారట. ఈ సందర్భంలో సైతం పోతన్నగారు మత్తేభవృత్తాన్నే ఉపయోగించారు. చిత్తగించండి-

**చనుదెంచెన్ ఘనుఁ డల్లవాఁడె! హరి పజ్జం గంటిరే లక్ష్మి! శం**
**ఖ నినాదంబదె! చక్ర మల్లదె! భుజంగధ్వంసియున్ వాఁడె! క్ర**
**న్నన నేతెంచె నటంచు వేల్పులు "నమో నారాయణా" యేతి ని**
**స్వనులై మ్రొక్కిరి మింట హస్తి దురవస్థావక్రికిన్ జక్రికిన్.** 8-107

అటు తర్వాత శ్రీహరి గజరాజును కాపాడటం కోసం తన సుదర్శన చక్రంతో నక్రకంఠాన్ని ఖండించటాన్ని చెప్పేటప్పుడుకూడా మహాకవి మత్తేభాన్ని విస్మరించలేదు. చూడండి-

**కరుణాసింధుఁడు శౌరి వారిచరమున్ ఖండింపఁగాఁ బంపె స**
**త్వరితాకంపిత భూమిచక్రము మహో దృద్విస్ఫులింగచ్ఛటా**
**పరిభూతాంబర శుక్రమున్ బహువిధ బ్రహ్మాండ భాండచ్ఛటాం**
**తర నిర్వక్రము ఁబాలితాఖిల సుధాంధశ్చక్రమున్ జక్రమున్.** 8-109

ఈ విధంగా ఈ ఘట్టం పట్టినపట్టు విడవకుండా ఒకదానివెంట ఒకటిగా ఏడు మత్తేభాలను వడివడిగా నడిపించటంలో ఏదైనా సారస్వత రహస్యముందా అని సందేహం కలుగుతుంది.

ఈ సందేహానికి సమాధానం ఇలా కన్పించుతుంది-

ప్రప్రథమంగా **"మత్తేభయూథంబు మడుగుసొచ్చె"** అన్నారు పోతన్నగారు. ఆ మత్తేభరాజాన్ని మకరం పట్టింది.

అప్పుడు ఆ మత్తేభం **"రావే ఈశ్వర! కావవే వరద! సంరక్షించు భద్రాత్మకా!"** అని భగవంతుణ్ణి ప్రార్థించింది. ఆ ప్రార్థన ఆలకించి మత్తేభరక్షణాయత్త చిత్తుడై హడావుడిగా పరుగెత్తుకుంటూ వచ్చిన శ్రీహరి హృదయంలో అడుగడుగునా ఆ మత్తేభమే మెదలుతున్నది. "మత్తేభం కష్టంలో ఉన్నది." "మత్తేభాన్ని కాపాడాలి." ఈ విధంగా మహావిష్ణువు మనస్సు మత్తేభమయమై పోయింది. అటువంటి దేవదేవుణ్ణి పోతన్నగారు తన హృదయంలో భావిస్తున్నారు. మహావిష్ణువునకూ, మహాకవికీ సాధారణీకరణం ఏర్పడింది. అందువల్ల శ్రీహరికి అడుగడుగునా మత్తేభ వృత్తాంతమే స్ఫురించినట్లు పోతన్న గారికి అడుగడుగునా ఒక దానివెంట ఒకటి మత్తేభవృత్తాలే దొరలి దొరలి వచ్చాయి.

అయితే ఇక్కడ ఒక చిన్న అనుమానం. అదేమంటే పోతన్న గారు కావాలనే ఈ విధంగా మత్తేభవృత్తాలు వ్రాశాడా, లేకపోతే ఏదో అప్రయత్నంగా వాటంతటవే దొర్లాయా అని. పోతన్నగారు వ్రాయాలని వ్రాయక పోయినా "పలికించెడివాఁడు రామభద్రుఁడే" గనుక ఆ మహాకవి నోటినుంచీ, ఆయన గంటమునుంచీ ఆ విధంగా మత్తేభాలు దొర్లి ఉంటాయి. అలా కాకపోతే అన్ని మత్తేభాలు ఎందుకొస్తాయి? ఎలా వస్తాయి?

ఇక్కడ మరొక చమత్కారం కూడా మనకు గోచరిస్తుంది. శ్రీహరి వైకుంఠం నుండి బయలుదేరే ముందు కలువపూల పాన్పుమీద లక్ష్మీదేవితో సరస సల్లాపాలాడుతూ వినోదిస్తున్నాడు. శ్రీదేవి పైటచెరగు శ్రీహరిచేతిలో ఉన్నది. అంతలో గజేంద్రుని మొర విన్పించింది. గభీలున లేచాడు. చేతిలో పట్టుకొన్న పైట చెరగు చేతిలోనే ఉన్నదట. **"శ్రీకుచోపరి చేలాంచలమైన వీడఁడు"** అన్నారు గదా పోతన్నగారు.ఆ విషయాన్ని మరింత దృఢంగా మన మనస్సుల్లో నిలపటానికి పతివెంట పరువెత్తుతున్న శ్రీసతి **"మనోహర కరావలగ్నోత్త రీయంబుతో"** ఉన్నట్లు కవి వర్ణిస్తాడు. అంతేగాదు. అంతకుముందు గూడా ఒకవచనంలో **"అ య్యిందిరా దేవి గోవింద కరారవింద సమాకృష్యమాణ సంవ్యాన చేలాంచలయై పోవుచు"** అంటాడు.

అంటే గజేంద్రుడి దగ్గరకు వచ్చే పర్యంతమూ శ్రీదేవి స్తనాంశుకము శ్రీహరిచేతిలోనే ఉన్నదన్న మాట మనం గుర్తించాలి. మకరాన్ని సంహరించి మత్తేభాన్ని రక్షించిన అనంతరం శ్రీమహావిష్ణువు లక్ష్మీదేవితో ఇలా అంటాడు.

**"బాలా! నా వెను వెంటను, హేలన్ వినువీథినుండి యేతెంచుచు నీ**
**చేలాంచలంబు పట్టుట, కాలో నే మంటి నన్ను అంభోజముఖీ!"** 8-129

ఆ మాట విని **"అరవింద మందిర అయిన ఆ య్యిందిరాదేవి మందస్మిత వదనారవిందయై ముకుందునితో"** ఇలా పల్కింది. "స్వామీ! ఏం చేసేది? మీపాదాలను అనుసరించడమే నా కర్తవ్యం గదా! మీరు ముందు పరుగెత్తుతుంటే మీవెంట నేనూ పరుగెత్తుకొచ్చాను."- ఇలా పలికించి ఊరుకున్నాడా పోతన్న గారు? లక్ష్మీదేవిచేత వాసుదేవుడికి ఒక యోగ్యతాపత్రంకూడా ఇప్పించారు-

**'దీనుల కుయ్యాలింపను, దీనుల రక్షింప మేలు దీవన పొందన్**
**దీనావన! నీ కొప్పును, దీనపరాధీన! దేవదేవ! మహేశా!"** 8-133

ఈ విధంగా దేవదేవుడైన వాసుదేవుణ్ణి ఆపద్బాంధవునిగా, ఆపన్నప్రసన్నునిగా, భక్తరక్షణ కళాసంరంభకునిగా, మనకు సాక్షాత్కరింప చేశాడు సహజపాండిత్యుడైన పోతనామాత్యుడు.

ఇంతకూ ఈ గజేంద్రుడు పూర్వజన్మలో ఇంద్రద్యుమ్నుడనే ద్రవిడదేశాధీశ్వరుడు. అగస్త్యమహర్షి శాపంవల్ల ఏనుగుగా జన్మించాడు. అలాగే గజేంద్రుణ్ణి పట్టుకున్న మకరరాజు మునుపటిజన్మలో "హూ హూ" నామకుడైన గంధర్వుడు. దేవల మహర్షిశాపంవల్ల మొసలిగా పుట్టాడు. పూజ్యపూజా వ్యతిక్రమం ఎంతలేసి కష్టాలకు కారణమౌతుందో! మనకీ కథ వివరిస్తుంది. అంతేకాకుండా ఆర్తులమొర ఆలకించగానే "ఆపన్నప్రసన్ను"డైన భగవంతుడు పరుగెత్తుకు వచ్చి రక్షిస్తాడని "గజేంద్ర మోక్షణం" మనకు ప్రబోధిస్తుంది.

ఇక వామనచరిత్రకు వద్దాం-

**స్వస్తి జగత్త్రయీ భువన శాసన కర్తకు; హాసమాత్ర వి**
**ధ్వస్త నిలింపభర్తకు; నుదారపదవ్యవహర్తకున్, మునీం**
**ద్రస్తుత మంగళాధ్వర విధానవిహర్తకు; నిర్జరీగళ**
**న్యస్త సువర్ణసూత్ర పరిహర్తకు, దానవలోకభర్తకున్.** 8-545

ఈ పద్యం వామనుడు బలిచక్రవర్తిని చెయ్యెత్తి దీవించిన సందర్భంలోది. **జగత్త్రయీభువన శాసనకర్తకు నిర్జరీగళన్యస్త సువర్ణసూత్ర పరిహర్తకు దానవలోకభర్తకు** స్వస్తి చెప్పటంలో ఒకధ్వని స్ఫురిస్తున్నది. "ఈ దినంతో నీకూ, నీసామ్రాజ్యానికీ స్వస్తి" అని.

ఇక బలివామనల సంభాషణలు చాలా రసవంతంగా నడిచాయి. **"వడుగా! ఎవ్వరివాఁడవు? ఎవ్వఁడవు?"** అన్న ప్రశ్నకు సమాధానంగా **"ఒంటివాఁడ చుట్ట మొకఁడు లేఁడు. ఒరులు గారు నాకు, ఒరులకు నేనొందు సిరియు తొల్లి గలదు"** అని వామనుడు పలకటం ఎంతో చమత్కారంగా ఉన్నది. **"ఒంటివాఁడ నాకు ఒకటిరెండడుగుల మేర యిమ్ము"** అనటం. **"కోర్కి తీర బ్రహ్మ కూకటిముట్టెద"** అనటం, **"మూఁడడుగుల్ మేరయ త్రోవ కిచ్చుటది బ్రహ్మాండంబు నాపాలికిన్", "ఇది యిచ్చుట ముజ్జగమ్ము లిచ్చుట మాకున్"-** అనటం వామనుని వచోనైపుణ్యానికి మచ్చుతునకలు.

**"ఇంతింతై వటుఁడింతయై మఱియుఁ దానింతై"** ఇత్యాది పద్యం పోతన్నగారి క్రాంతదర్శనానికి నిదర్శనంగా నిలుస్తుంది. అలా పెరిగిపోతున్న త్రివిక్రమదేవుని ఎత్తు ఎంతదో మనకు చూపాలని పోతన్న గారు ఒక క్రొత్తఎత్తు ఎత్తారు. అది సూర్యబింబాన్ని కొలత సాధనంగా స్వీకరించటం.

ఆదిలో పెరుగుతున్న వామనమూర్తికి పైన ఉన్న సూర్యమండలం గొడుగుగా కన్పించింది. స్వామి పెరుగుతున్న కొద్దీ గొడుగుగా ఉన్న ఆ రవిబింబమే శిరోమణిగా అయింది. ఆ తర్వాత క్రమక్రమంగా చెవి కమ్మగా, కంఠాభరణంగా, భుజకీర్తిగా, కరకంకణంగా, మొలగంటగా, కాలికడియంగా, చివరకు పాద పీఠంగా మారిపోయింది. మొదట ఛత్రంగా ఉన్న సూర్యుడు పదపీఠంగా అయినాడంటే స్వామి ఎంత ఎత్తు పెరిగిపోయాడో మనలనే ఊహించుకో మన్నాడు మహాకవి. ఇందులో రవిబింబానికి చేర్చిన ఉపమానాలన్నీ గుండ్రంగా (గోళాకారంలో) ఉండటం విశేషం.

స్వామి (యాచకుడు) అంత ఎత్తు పెరిగినా బలిచక్రవర్తి మహాదాతగా అంతకంటే రెండంగుళాలు ఎత్తుగానే మనకు కన్పిస్తాడు. ఇదే విధంగా ఈ అష్టమస్కంధంలో సముద్రమథనం, లక్ష్మీప్రాదుర్భావం, కూర్మావతార మత్స్యావతారాల వృత్తాంతం ఎంతో మనోహరంగా అభివర్ణితము లైనాయి.

శివదేవుడు దేవగణప్రార్థితుడై హాలాహలాన్ని పానం చేసే ఘట్టంలో పోతన్నగారు ఒక అందమైన కందం వ్రాశారు-

**మ్రింగెడువాఁడు విభుండని, మ్రింగెడునది గరళ మనియు మేలని ప్రజకున్**

**మ్రింగు మనె "సర్వమంగళ", మంగళసూత్రంబు నెంత మది నమ్మినదో!!** 8-24

ఈ పద్యంలో తన భర్త శివుడు హాలాహలం మ్రింగటానికి అంగీకరించిన భవానికి "సర్వమంగళ" అనే సార్థకమైన విశేషణం వేశారు మహాకవి పోతన్నగారు.

"అల వైకుంఠపురంబులో" అన్న పద్యంలో "ఆపన్నప్రసన్నుండు" అని శ్రీహరికి వేసిన విశేషణం ఎంత గొప్పగా ఉన్నదో, ఇక్కడ "సర్వమంగళ" అన్న పదం అంత స్ఫూర్తిమంతంగా ప్రయుక్తమైంది. అందుకనే పోతన్నగారి ఊహలు పూలవానలు; ఆయన భావాలు తేనెసోనలు.

సహజసుందరమైన పోతనభాగవతం ప్రతిపద్య భావార్థసహితంగా ప్రకటించాలని తిరుమల తిరుపతి దేవస్థానంవారు ముందుకు రావడం ముదావహమైన విషయం. ఈ సందర్భంలో అనువాదభాగా లన్నింటినీ పరిశీలించి పరిష్కరించి వాటికి ఏకసూత్రత కల్పించే భారం నాకు అప్పగించి నందులకు కార్య నిర్వహణాధికారి శ్రీ సి హెచ్. వేంకటపతిరాజు, ఐ.ఏ.ఎస్, గారికీ, డాక్టర్ రావుల సూర్యనారాయణమూర్తి, పి.ఆర్.ఓ., గారికీ, ఎడిటర్ శ్రీ కె. సుబ్బారావుగారికి నా అభివందనాలు

ఈ అష్టమస్కంధాన్ని సరళగద్యంలో అనువదించినవారు శ్రీ జి. చెన్నయ్యగారు. వీరు నగరి ప్రభుత్వ కళాశాలలో ఆంధ్రోపన్యాసకులు. ఆంధ్రసంస్కృత సాహిత్యాలలో చక్కని అభినివేశం కలవారు. వీరి అనువాదం అందరికీ అందుబాటైన సులభశైలిలో సుమనోమనోజ్ఞంగా వుంది.

ఈ అష్టమస్కంధాన్ని ముచ్చటగా నిర్దుష్టంగా ముద్రించి యిచ్చిన దేవస్థానం ప్రెస్ మేనేజర్ శ్రీ యం. విజయకుమార్‌రెడ్డిగారికీ, వారి సిబ్బందికీ నా సాధువాదాలు.

అక్షరదోషాలు దొర్లకుండా సహస్రాక్షులై ప్రూఫులు సరిదిద్దిన పూజ్యమిత్రులు, మహాకవి శ్రీమాన్ ముదివర్తి కొండమాచార్యులుగారికి నా ధన్యవాదాలు.

ముద్రణకు తగినట్లు ప్రెస్‌కాపీ సిద్ధంచేసి యిచ్చిన చిరంజీవి కోరాడ రామకృష్ణ, యం. ఏ., యం.ఫిల్. కు నా ఆశీర్వాదాలు.

గుంటూరు,
శుక్ల, వసంతము.

భవదీయుడు
***కరుణశ్రీ***
ప్రధాన సంపాదకుడు
పోతన భాగవతం

శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః

# పోతన భాగవతము

## (సరళ గద్యానువాద సహితము)

## ఎనిమిదవ స్కంధము

శ్రీమన్నామ! పయోద
శ్యామ! ధరాభృల్లలామ! జగదభిరామా!
రామాజనకామ! మహో
ద్ధామ! గుణస్తోమధామ! దశరథరామా! 1

* మంగళకరమైన పేరూ, మేఘమువంటి కాంతీ కలవాడా! రాజులలో గొప్పవాడా! అఖిలలోకాలలో అందమైనవాడా! స్త్రీలకు మన్మథుని వంటివాడా! మిక్కిలి గంభీరమైన వాడా! సుగుణాలకు నెలవైన వాడా! దశరథరామా! అవధరించు.

వ. మహనీయ గుణగరిష్ఠులగు నమ్మునిశ్రేష్ఠులకు నిఖిల పురాణవ్యాఖ్యాన వైఖరీ సమేతుండైన సూతుం డిట్లనియె; నట్లు ప్రాయోపవిష్టుండైన పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రుం గనుంగొని. 2

క. వినఁబడియెను స్వాయంభువ, మనువంశము వర్ణ ధర్మ మర్యాదలతో
మనుజుల దనుజుల వేల్పుల, జననంబులు స్రష్ట లెల్ల జనియించుటయున్. 3

* గొప్ప గుణాలతో కూడిన మహాత్ములైన శౌకనాది మునులకు అన్ని పురాణాలూ వివరించడంలో నేర్పరియైన సూతుడు ఇట్లా చెప్పడానికి మొదలు పెట్టినాడు; ప్రాయోపవేశం చేసిన పరీక్షిన్మహారాజు శుకమహర్షిని చూచి ఇలా అన్నాడు. 'ఓ మునీంద్రా! స్వాయంభువ మనువంశాన్ని గురించీ, ఆ కాలంలోని జాతిధర్మాల కట్టుబాట్లను గురించీ, మనుష్యులూ, రాక్షసులూ, దేవతలూ, బ్రహ్మలూ పుట్టడాన్ని గురించీ విన్నాను.

ఉ. ఏ మనుకాలమందు హరి యీశ్వరుఁ డేటికి సంభవించె? నే
మేమి యొనర్చె? నమ్మనువులే? రతఁ డేక్రియఁ జేయుచున్న వాఁ?
డేమి నటించు మీఁద? గత మెయ్యది? సజ్జనులైనవారు ము
న్నే మని చెప్పుచుందురు? మునీశ్వరఁ నా కెఱిఁగింపవే దయన్. 4

వ. అనిన శుకుం డిట్లనియె. 5

* పరమాత్ముడైన విష్ణువు ఏ యే మనువుల కాలంలో జన్మించి నాడు? ఏ యే విధంగా ఏమేమి చేసినాడు? అటు తరువాత ఎట్లా ప్రవర్తించినాడు? అందుకు కారణమేమి? పూర్వం పెద్దలు చెప్పినవిధంగా నీవు నాకు చెప్పు? అని కోరినాడు. అందుకు శుకుడు ఇట్లా చెప్పినాడు-

**క. ఈ కల్పంబున మనువులు, ప్రాకటముగ నార్వురైరి పదునలువురలో;**
**లోకముల జనుల పుట్టువు, లాకథితము లయ్యె వరుస నఖిలములు నృపా! 6**

* ఓ రాజా! ఈ కల్పంలో పద్నాలుగుమంది మనువులలో ఆరుగురు మనువులు ప్రఖ్యాతులైనారు. లోకాలూ, జనులూ పుట్టిన విధానమంతా నీకు చెప్పినాను.

**వ. ప్రథమ మనువైన స్వాయంభువునకు, నాకూతి దేవహూతులను నిరువురు గూఁతులు గలరు. వారికిఁ గ్రమంబునఁ గపిలయజ్ఞ నామంబుల లోకంబులకు ధర్మజ్ఞాన బోధంబు సేయుకొఱకు హరి పుత్రత్వంబు నొందె; నందుఁ గపిలుని చరిత్రంబు మున్న చెప్పంబడియె; యజ్ఞుని చరిత్రంబు సెప్పెద వినుము. 7**

* మొదటి మనువైన స్వాయంభువునికి దేవహూతీ, ఆకూతీ అనే కుమార్తె లున్నారు. వారికి వరుసగా కపిలుడూ, యజ్ఞుడూ అనే నామాలతో లోకాలకు ధర్మాన్నీ జ్ఞానాన్నీ బోధించడంకోసం విష్ణువు జన్మించినాడు. కపిలుని చరిత్ర ముందే చెప్పినాను. ఇక యజ్ఞుని చరిత్ర చెపుతాను; ఆలకించు.

**మ. శతరూపాపతి కామభోగ విరతిన్ సంత్యక్త భూ భారుఁడై**
**సతియుం దానును గాన కేఁగి శతవర్షంబుల్ సునందానదిన్**
**వ్రతియై యేకపదస్థుఁడై నియతుఁడై వాచంయమస్ఫూర్తితో**
**గతదోషుండు తపంబు సేసె భువనఖ్యాతంబుగా భూవరా! 8**

* ఓ రాజా! స్వాయంభువ మనువు కామ భోగాలనూ, రాజ్యభారాన్నీ విడిచిపెట్టి తన భార్యయైన శతరూపతోపాటు అడవికి వెళ్ళినాఁడు. సునందానది దగ్గర పవిత్రమైన నియమాలతో మౌనంగా ఒంటి కాలిపై నిలిచి నూరేండ్లు విశ్వవిఖ్యాత మైన తపస్సు చేసినాడు.

**వ. ఇట్లు తపంబు సేయుచు స్వాయంభువ మనువు దనమనంబులోన. 9**

**సీ. సృష్టిచే నెవ్వఁడు చేతనపడకుండు? సృష్టి యెవ్వని చేఁతచే జనించు?**
**జగములు నిద్రింప జాగరూకత నొంది యెవ్వఁడు బ్రహ్మాండ మెఱుఁగుచుండు?**
**నాత్మకాధారంబు నఖిలంబు నెవ్వఁడౌ? నెవ్వని నిజధనం బింత వట్టు**
**బొడగాన రాకుండఁ బొడగను? నెవ్వఁడే నెవ్వని దృష్టికి నెదురు లేదు?**
**ఆ. జననవృద్ధి విలయ సంగతిఁ జెందక, యెవ్వఁ డెడపకుండు నెల్ల యెడల?**
**దన మహత్త్వసంజ్ఞఁ దత్త్వ మెవ్వఁడు దాన, విశ్వరూపుఁ డనఁగ విస్తరిల్లు? 10**

**వ. అని మఱియు నిరహంకృతుండును బుధుండును నిరాశియుఁ బరిపూర్ణుండును ననన్య ప్రేరితుండును నృశిక్షాపరుండును నిజమార్గ సంస్థితుండును నిఖిలధర్మ భావనుండునునైన పరమేశ్వరునకు నమస్కరించెద నని యుపనిషదర్థంబులు పలుకుచున్న మనువుం గనుంగొని. 11**

* పై విధంగా తపస్సు చేస్తూ స్వాయంభువ మనువు మనస్సులో భగవంతుని ఇట్లా ధ్యానించినాడు. "ఎవడైతే సృష్టివల్ల చైతన్యం పొందకుండా తన చైతన్యం వల్ల సృష్టి చేస్తాడో, లోకాలు నిద్రిస్తుండగా తాను మేల్కొని బ్రహ్మాండాన్ని తెలుసుకొంటాడో, తనకు తానే ఆధారమై సమస్తమూ తానై ఉంటాడో, రూపం కనిపించకుండా తన ప్రభావాన్ని రూపొందిస్తాడో, తన కంటికి ఎవడూ ఎదురు లేకుండా ఉంటాడో, ఆదిమధ్యాంతాలు లేకుండా అన్నిచోట్ల చేరి ఉంటాడో, తన మహిమ చూపుతూ శాశ్వతుడై విశ్వరూపుడుగా పెరుగుతాడో, విద్వాంసుడై వినయంగా విరాజిల్లుతాడో, ఆశలు లేకుండా పరిపూర్ణుడై ఉంటాడో, ఇతరుల ప్రేరణ లేకుండా ఇతరులకు బోధిస్తుంటాడో, తన దారి వదలకుండా అన్ని ధర్మాలకూ కారణమై ఉంటాడో అటువంటి పరమేశ్వరునికి నమస్కారం చేస్తాను"- ఈ విధంగా ఉపనిషత్తుల పరమార్థాన్ని ప్రకటిస్తూ ధ్యానంలో ఉన్నాడు.

**క. రక్కసులు దినఁగఁ గడఁగిన, వెక్కసముగ యజ్ఞనామ విష్ణుఁడు వారిం**
**జక్కడిచెఁ జక్రధారల, మిక్కుటముగ వేల్పులెల్ల మేలని పొగడన్. 12**

* ఇట్లా ఉన్న స్వాయంభువ మనువును భక్షించడానికి రాక్షసులు ప్రయత్నించినారు. వారిని యజ్ఞుడుగా ఉండిన విష్ణువు తన చక్రాయుధంతో సంహరించినాడు. అది చూచి దేవతలంతా ఆయనను స్తుతించారు.

**వ. ఇది ప్రథమ మన్వంతరం; బింక ద్వితీయ మన్వంతరంబు వినుము. 13**

* ఇది మొదటి మన్వంతరం సంగతి. ఇక రెండవ మన్వంతరం కథ విను.

**సీ. స్వారోచిషుం డన సప్తార్చిబిడ్డఁడు మనువు వానికి నా ద్యుమత్సుషేణ**
**రోచిష్మదాదు లారూఢ పుత్త్రులు ధాత్రి నేలిరి; రోచనుఁ డింద్రుఁ డయ్యెఁ;**
**నధికులు తుషితాదు లమరు లూర్జస్తంబ ముఖ్యు లాధ్యులు సప్తమునులు నాఁడు**
**వేదశిరుం డను విప్రుని దయితకుఁ దుషితకుఁ బుత్త్రుఁడై తోయజాక్షుఁ**

**ఆ. డవతరించెను విభుఁ డన నశీత్యష్ట స, హస్ర మునులు నధికు లయినవారు;**
**ఘను లనుగ్రహింపఁ గౌమారక బ్రహ్మ, చారి యగుచు నతఁడు సలిపె వ్రతము. 14**

* అగ్ని కుమారుడైన స్వారోచిషుడు మనువైనాడు. అతని కొడుకులలో ప్రసిద్ధులైన ద్యుమంతుడూ, సుషేణుడూ, రోచిష్మంతుడూ మొదలైనవారు భూమిని పాలించినారు. అప్పుడు రోచనుడు ఇంద్రుడైనాడు. తుషితులు మొదలైనవారు దేవతలైనారు. ఊర్జస్తంబుడు మొదలైన వారు సప్తఋషులైనారు. విష్ణువు "విభు' డనే పేరుతో వేదశిరుడనే బ్రాహ్మణుని భార్యయైన తుషితకు పుత్రుడై జన్మించినాడు. అతడు కుమార బ్రహ్మచారియై ఎనభై ఎనిమిది వేలమంది మహామునుల అనుగ్రహంతో వ్రతదీక్షాపరు డైనాడు.

వ. తదనంతరంబ. 15

సీ. మనువు మూఁడవవాఁడు మనుజేంద్ర! యుత్తముం డనఁ బ్రియవ్రతునకు నాత్మజుండు
పాలించె నిల యెల్లఁ బవనసృంజయ యజ్ఞ హోత్రాదు లాతని పుత్త్రు లధిక
గుణులు వసిష్ఠుని కొడుకులు ప్రమథాదు లైరి సప్తర్షులు నమరవిభుఁడు
సత్యజిత్తనువాఁడు సత్యభద్రాద్యులు సురలు ధర్మునికి నిసూనృతకును

తే. బుట్టి సత్యనియతిఁ బురుషోత్తముఁడు సత్య, సేనుఁ డనఁగ దుష్టశీలయుతుల
దనుజ యక్షపతుల దండించె సత్య జి, న్మిత్రుఁ డనఁగ జగము మే లనంగ. 16

* ఓ రాజా! అటుపిమ్మట ప్రియవ్రతుని కొడుకైన "ఉత్తముడు" మూడవ మనువై లోకమంతా పాలించినాడు. అతనికి పవనుడూ, సృంజయుడూ, యజ్ఞహోత్రుడూ మొదలైన గుణవంతులగు కొడుకులున్నారు. వసిష్ఠుని కొడుకులైన ప్రథముడు మొదలైనవారు సప్తఋషులైనారు. సత్యజిత్తనేవాడు దేవేంద్రుడైనాడు. సత్యులూ భద్రులూ మొదలైన వారు దేవతలైనారు. విష్ణువు "సత్యసేను" డనే పేరుతో ధర్మునికి సూనృతకూ పుట్టినాడు. అతడు సత్యజిత్తుకు చెలికాడై లోకం మెచ్చుకొనే విధంగా సత్యనిష్ఠతో దుర్మార్గులైన యక్షరాక్షసులను దండించినాడు.

## -: గజేంద్ర మోక్షణ కథా ప్రారంభము :-

వ. చతుర్థమనువు కాల ప్రసంగంబు వివరించెద. 17

సీ. మానవాధీశ్వర! మనువు నాలవవాఁడు తామసుం డనఁగ నుత్తముని భ్రాత
పృథ్వీపతులు కేతు వృష నర ఖ్యాతాదు లతని పుత్త్రులు పద్గు రధికబలులు
సత్యకహరి వీర సంజ్ఞులు వేల్పులు త్రిశిఖనామమువాఁడు దేవవిభుఁడు
మునులు జ్యోతిర్వ్యోమ ముఖ్యులు; హరి పుట్టె హరిమేధునకుఁ బ్రీతి హరిణియందు;

ఆ. గ్రాహబద్ధుఁ డయిన గజరాజు విడిపించి, ప్రాణభయము వలనఁ బాపి కాచె
హరి దయాసముద్రుఁ డఖిలలోకేశ్వరుఁ, డనిన శుకునిఁ జూచి యవనివిభుఁడు. 18

* ఓ రాజా! ఇక నాల్గవమనువు కాలం సంగతి వివరిస్తాను. ఉత్తముని తమ్ముడైన "తామసు" డనే వాడు నాల్గవ మనువైనాడు. అతని కొడుకులైన కేతువూ, వృషుడూ, నరుడూ, ఖ్యాతీ మొదలైన పదిమంది బలవంతులు రాజులైనారు. సత్యకులూ హరులూ వీరులూ మొదలైనవారు దేవతలైనారు. త్రిశిఖుడనేవాడు దేవేంద్రుడైనాడు. జ్యోతిర్వ్యోముడు మొదలైనవారు సప్తఋషులైనారు. విష్ణువు హరిమేధునికి హరిణికీ "హరి" అను నామముతో జన్మించినాడు. దయాసముద్రుడై అన్ని లోకాలకూ ప్రభువైన హరి మొసలికి చిక్కిన గజేంద్రుణ్ణి విడిపించి ప్రాణాపాయం నుండి కాపాడినాడు. ఈ విధంగా చెప్పగా పరీక్షిత్తు శుకుని ఈ క్రింది విధంగా అడిగినాడు.

క. నీరాట వనాటములకుఁ, బోరాటం బెట్లు గలిగెఁ? బురుషోత్తముచే
నారాట మెట్లు మానెను, ఘోరాటవిలోని భద్ర కుంజరమునకున్. 19

క. మునినాథ! యీ కథాస్థితి, వినిపింపుము వినఁగ నాకు వేడుక పుట్టెన్;
వినియెదఁ గర్ణేంద్రియముల, పెనుఁబండువు సేయ మనముఁ బ్రీతిం బొందన్. 20

క. ఏ కథల యందుఁ బుణ్య, శ్లోకుఁడు హరి సెప్పఁబడును సూరిజనముచే
నా కథలు పుణ్యకథలని, యాకర్ణింపుదురు పెద్ద లతి హర్షమునన్. 21

వ. ఇవ్విధంబునఁ బ్రాయోపవిష్టుండైన పరీక్షిన్న రేంద్రుండు బాదరాయణి నడిగెనని చెప్పి సభాసదులయిన మునుల నవలోకించి సూతుండు పరమహర్ష సమేతుండై చెప్పె; నట్లు శుకుండు రాజున కిట్లనియె.22

* "ఓ మునీంద్రా! నీటిలో తిరిగే మొసలికి దట్టమైన అడవిలో తిరిగే ఏనుగుకూ పోరాటం ఎట్లా జరిగింది? విష్ణువు గజేంద్రుని సంకటాన్ని ఏ విధంగా తీర్చినాడు? ఈ కథను వినాలని నాకు కుతూహలంగా ఉంది. దీనిని వినిపించు. చెవులకు పండువుగా, మనస్సుకు ప్రీతిగా వింటాను. పండితులు పుణ్యాత్ముడైన విష్ణువును గురించి చెప్పేకథలను పెద్దలు సంతోషంగా వింటారు కదా!''- అని పరీక్షిత్తు పలికినాడు. అందుకు పరీక్షిత్తుతో శుకుడు చెప్పిన కథను శౌనకాదులకు సూతుడు సంతోషంగా చెప్పసాగినాడు.

సీ. రాజేంద్ర! విను సుధారాశిలో నొక పర్వతము త్రికూటం బనఁ దనరుచుండు
యోజనాయుతమగు నున్నతత్వంబును నంతియ వెడలుపు నతిశయిల్లుఁ;
గాంచనాయస్సారకలధౌతమయములై మూఁడు శృంగంబులు మొనసియుండుఁ;
దట శృంగబహురత్న ధాతుచిత్రితములై దిశలు భూనభములుఁ దేజరిల్లు;

తే. భూరిభూజలతా కుంజ పుంజములును, మ్రోసి పఱతెంచు సెలయేటి మొత్తములును
మరఁగి తిరిగెడు దివ్య విమానములును, జఱులఁ గ్రీడించు కిన్నరచయముఁ గలిగి. 23

* ఓ రాజేంద్రా! పాలసముద్రంలో త్రికూటమనే అందమైన పర్వతముంది. అది పదివేల ఆమడల పొడవూ, అంతే వెడల్పూ, ఎత్తు కలిగి ఉంది. దానికి బంగారూ వెండి ఇనుమూ నిండిన మూడు శిఖరాలున్నాయి. ఆ కొండ ప్రక్కలోనూ శిఖరాలలోనూ ఉండే రత్నాలవల్లనూ ధాతువుల వల్లనూ దిక్కులూ, భూమి, ఆకాశమూ చిత్రమైన రంగులతో ప్రకాశిస్తాయి. ఆ కొండలో పెద్ద పెద్ద చెట్లూ తీగలూ పొదలూ, మ్రోగుతూ పారే సెలయేర్లూ, అలవాటు ప్రకారం తిరిగే దేవతల విమానాలూ ఉంటాయి. దాని చరియలలో కిన్నరులు విహారం చేస్తూంటారు.

వ. అది మఱియును మాతులుంగ లవంగ లుంగ చూత కేతకీ భల్లాత కామ్రాతక సరళ పనస బదరీ వకుళ వంజుల వట కుటజ కుంద కురవక కురంటక కోవిదార ఖర్జూర నారికేళ సిందువార చందన పిచుమంద మందార జంబూ జంబీర మాధవీ మధూక తాల తక్కోల తమాల హింతాల రసాలసాల ప్రియాళు బిల్వామలక క్రముక కదంబ కరవీర కదళీ కపిత్థ కాంచన కందరాళ శిరీష శింశు పాశోక

పలాశ నాగ పున్నాగ చంపక శతపత్ర మరువక మల్లికామతల్లికా ప్రముఖ నిరంతర వసంతసమయ సౌభాగ్య సంపదంకురిత పల్లవిత కోరకిత కుసుమిత ఫలిత లలిత విటప విటపి వీరున్నివహాలం కృతంబును, మణివాలుకానేక విమల పులినతరంగిణీ సంగత విచిత్ర విద్రుమలతా మహోద్యాన శుక పిక నికర నిశిత సమంచిత చంచూపుట నిర్దళిత శాఖిశాఖాంతర పరిపక్వ ఫలరంధ్రప్రవర్షిత రసప్రవాహ బహుళంబును, గనకమయ సలిల కాసార కాంచన కుముద కహ్లార కమల పరిమళ మిళిత కబళాహార సంతతాంగీకార భార పరిశ్రాంత కాంతా సమాలింగిత కుమార మత్త మధుకర విటసముదయ సమీపసంచార సముదంచిత శకుంత కలహంస కారండవ జలకుక్కుట చక్రవాక బక బలాక కోయష్టిక ముఖర జలవిహంగ విసర వివిధ కోలాహల బధిరీభూత భూన భోఽంతరాళం బును, దుహినకరకాంత మరకత కమలరాగ వజ్రవైదూర్య నీల గోమేధిక పుష్యరాగ మనోహర కనక కలధౌత మయానేక శిఖరతట దరీవిహరమాణ విద్యాధర విబుధ సిద్ధ చారణ గరుడ గంధర్వ కిన్నర కింపురుష మిథున సంతత సరససల్లాప సంగీత ప్రసంగ మంగళాయతనంబును గంధగజ గవయ గండభేరుండ ఖడ్గ కంఠీరవ శరభ శార్దూల శశ చమర శల్య భల్ల సారంగ సాలావృక వరాహ మహిష మర్కట మహోరగ మార్జాలాది నిఖిల మృగనాథ సమూహ సమర సన్నాహ సంరంభ సంచకిత శరణాగత శమన కింకరంబునై యొప్పు నప్పర్వత సమీపంబునందు. 24

* ఆ త్రికూట పర్వతం మాదీఫలం, లవంగం, పుల్లమాదీఫలం, మామిడి, మొగలి, జీడి, అంబాళం, తెల్ల తెగడ, పనస, రేగు, పొగడ, ప్రబ్బ, మట్టి, కొండమల్లె, మొల్ల, ఎఱ్ఱగోరంట, తుమ్మ, కోవిదారం, ఖర్జూరం, నారికేళం, వావిలి, చందనం, వేము, మందారం, నేరేడు, నిమ్మ, పూలగురివెంద, ఇప్ప, తాడి, తక్కోలం, తమాలం, గిరకతాడి, రసాలం, మద్ది, మోరటి, మారేడు, ఉసిరిక, పోక, కడిమి, గన్నేరు, అరటి, వెలగ, ఉమ్మెత్త, కలజువ్వి, దిరిసెన, ఇరుగుడు, అశోకం, మోదుగు, పొన్న, సురపొన్న, సంపెంగ, తామర, మరువకం, మంచిమల్లె మొదలైన వాటితో ఎల్లప్పుడూ నిండి ఉన్నది. ఆ చెట్లు కొమ్మలూ రెమ్మలూ పెనవేసుకొని ఉండేవి. ఆ చెట్లూ తీగలూ నిండుగా పొటమరిస్తూ చిగురిస్తూ మొగ్గలు తొడుగుతూ పూలు పూస్తూ ఎడతెరపి లేకుండా వసంతకాలపు చక్కదనాలకు నెలవై ఉంటాయి. ఆ తోటలలో ముత్యాల చిప్పలతో కూడిన ఇసుక తిన్నెలు కుప్ప తెప్పలుగా ఉన్నాయి.

ఆ చెట్లకొమ్మలలో చిలుకలూ కోయిలలూ గుమిగూడి ఉన్నాయి. అవి పండిన పండ్లను తమ వాడి ముక్కులతో పొడుస్తూంటాయి. ఆ పండ్లరంధ్రాల నుండి కురిసే రసం కాలువలుగా పారుతుంటుంది.

ఆ కొండలో బంగారపు రంగునీటి సరస్సులున్నాయి. వాటిలో బంగారుకాంతితో కూడిన తెల్లకలువలూ ఎఱ్ఱకలువలూ పద్మాలూ ఉన్నాయి. సువాసన నిండిన ఆ పూలలోని మకరందాన్ని ఎల్లప్పుడూ త్రాగుతూ మదించిన గండుతుమ్మెదలు తమ ప్రియురాండ్రతో చేరి క్రీడించుతుంటాయి. వాటి ప్రక్కనే శకుంతపక్షులూ కలహంసలూ కారండవ పక్షులూ నీటికోళ్ళూ చక్రవాకాలూ కొంగలూ కొక్కెరలూ చీకుకొక్కెరలూ అందంగా తిరుగాడుతూ ఉంటాయి. ఆ పక్షులు చేసే గగ్గోలు భూమికి ఆకాశానికి మధ్య ఉండే ప్రదేశం చెవుడుపడేటట్లు ఉంటుంది. ఆ కొండలో చంద్రకాంతమణులూ మరకతాలూ వజ్రాలూ వైడూర్యాలు నీలాలు గోమేధికాలూ

పుష్యరాగాలు మనోహరంగా ఉన్నాయి. బంగారు వెండి నిండిన ఆ కొండ శిఖరాల ప్రక్కలలో విద్యాధరులూ, దేవతలూ, సిద్ధులూ, చారణులూ గరుడులూ, గంధర్వులూ, కిన్నరులూ, కింపురుషులూ తమ ప్రియురాండ్రతో కలిసి జంటలు జంటలుగా విహరించు తుంటారు. వారు రసవంతంగా మాట్లాడుతూ పాటలు పాడుతూ ఉంటారు. ఎల్లప్పుడూ ఆ కొండ శుభాలకు ఆలవాలంగా ఉంది. అందులో మదపుటేనుగులూ, గురుపోతులూ, గండభేరుండములూ, ఖడ్గమృగాలు, సింహాలు, శరభాలూ, పులులూ, కుందేళ్లూ, చమరీమృగాలూ, ముండ్లపందులూ, ఎలుగుబంట్లూ, జింకలూ, తోడేళ్ళూ, అడవిపందులూ, అడవి దున్నపోతులూ, కోతులూ, పెద్ద పెద్ద పాములూ, పిల్లులూ మొదలైన జంతువు లుండేవి. అవి ఎల్లప్పుడూ పోరాటాలు సాగిస్తుంటాయి. వాటికి భయపడి యమభటులు సైతం శరణు వేడుతుంటారు.

**క. భిల్లీ భిల్ల లులాయక, భల్లుక ఫణి ఖడ్గ గవయ వలిముఖ చమరీ**
**ఝిల్లీ హరి శరభక కిటి, మల్లాద్భుత కాక ఘూక మయమగు నడవిన్.** 25

* త్రికూట పర్వతం దగ్గరున్న అడవిలో చెంచెతలూ, చెంచులూ, తిరుగుతుండేవారు. అడవిదున్నలూ, ఎలుగుబంట్లూ, పాములూ, ఖడ్గమృగాలూ, గురుపోతులూ, కోతులూ నిండి ఉండేవి.

**శా. అన్యాలోకన భీకరంబులు జితాశానేకపానీకముల్**
**వన్యేభంబులు గొన్ని మత్తతనులై వ్రజ్యావిహారాగతో**
**దన్యత్వంబున భూరి భూధరదరీ ద్వారంబులందుండి సౌ**
**జన్యక్రీడల నీరుగాలి వడి కాసారావగాహార్థమై.** 26

* ఆ అడవిలో కొన్ని ఏనుగులు ఇతర మృగాలకు కన్నెత్తి చూడటానికి కూడా భయంకరంగా ఉంటాయి. మదించిన తమ శరీరాలతో దిగ్గజాలను సైతం మించిపోతాయి. అవి కొండ గుహలలోనుండి తిరుగాడడానికి బయలు దేరినాయి. చెర్లాటాలు ఆడుతూ దప్పిక గొన్నాయి. నీళ్ళమడుగులలో దిగాలనుకొన్నాయి. నీటిగాలి వచ్చే దిక్కుకు నడచినాయి.

**ఆ. అంధకార మెల్ల నద్రిగుహాంతర, వీథులందఁ బగలు వెఱచి డాఁగి**
**యెడరు వేచి సంధ్య నినుఁడు వృద్ధత నున్న, వెడలె ననఁగ గుహలు వెడలెఁ గరులు.** 27

* ఆ ఏనుగులు పగటి వేళ భయంతో కొండగుహలలో దాగుకొని సాయంకాలంలో సూర్యుని శక్తి సన్నగిల్లడం కనిపెట్టి బయటికి వచ్చిన చీకట్ల గుంపులేమో అనేటట్లు ఉన్నాయి.

**క. తలఁగవు కొండలకైనను, మలఁగవు సింగములకైన మార్కొను కడిమిం**
**గలఁగవు పిడుగుల కైనను, నిల బలసంపన్న వృత్తి నేనుఁగు గున్నల్.** 28

* గున్న ఏనుగులు ఎక్కువ బలసంపదతో ఎదిరించే శక్తి కలిగి కొండలను డీకొనటానికైననూ వెనుదీయవు. సింహాలను ఎదిరించి నిలుస్తాయి. పిడుగులను సైతం లెక్కచేయకుండా ముందంజ వేస్తాయి.

సీ. పులుల మొత్తంబులు పొదరిండ్లలోఁ దూఱు ఘోరభల్లూకముల్ గుహలు సొచ్చు;
భూదారములు నేల బొఱియలలో డాఁగు; హరిదంతముల కేఁగు హరిణచయము;
మడువుల జొరఁబాఱు మహిషసంఘంబులు గండశైలంబులఁ గపులు ప్రాఁకు;
వల్మీకములు సొచ్చు వనభుజంగంబులు నీల కంఠంబులు నింగి కెగయు;

తే. వెఱచి చమరీమృగంబులు విసరు వాల, చామరంబుల విహరణశ్రమము వాయ
భయదపరిహేల విహరించు భద్రకరుల, గాలివాఱిన మాత్రన జాలిఁ బొంది. 29

* ఆ మదపుటేనుగులు భయంకరమైన క్రీడలతో విహరింపసాగాయి. వాటి గాలి సోకిన వెంటనే భయపడి పులులన్నీ పొదలలో దూరినాయి. ఎలుగుబంట్లు గుహలలో దాగినాయి. అడవిపందులు గోతులలో చేరినాయి. జింకలు దిక్కుల కొనలకు పరుగెత్తినాయి. అడవి దున్నలు మడుగులలో జొరబడినాయి. కోతులు కొండల బండలపైకి ఎగప్రాకినాయి. పాములు పుట్టలలో ఒదిగినాయి. నెమళ్ళు ఆకాశానికి ఎగిరినాయి. సవరపుమెకాలు తమతోక కుచ్చులతో ఏనుగుల అలసట తీరేటట్లు విసరినాయి.

క. మదగజ దానామోదము, గదలని తమకములఁ ద్రావి కడుపులు నిండన్
బొదలుచుఁ దుమ్మెదకొదమల, కదుపులు ఝం ఝుమ్మటంచు గానము సేసెన్. 30

* పడుచు తుమ్మెదల గుంపులు ఆ మదపుటేనుగుల సుగంధంతో కూడిన మదజలధారలను కమ్మగా కడుపుల నిండా త్రాగి సంతోషంతో ఝుంఝుమ్మని పాటలు పాడుతున్నాయి.

క. తేఁటి యొకటి యొరు ప్రియకును, మాటికి మాటికిని నాగ మదజల గంధం
బేటి కని తన్నుఁ బొందెడి, బోటికి నందిచ్చు నిండు బోటుఁ దనమునన్. 31

* ఒక గండుతుమ్మెద ఏనుగుల మదజల సుగంధాన్ని మరల మరల మరియొక ఆడుతుమ్మెదకు ఇచ్చుట ఎందులకని కూడెడి తన ప్రియురాలైన ఆడు తుమ్మెదకు నిండు మగతనంతో అందించింది.

క. అంగీకృత రంగ న్మా, తంగీ మదగంధ మగుచుఁ దద్దయు వేడ్కన్
సంగీత విశేషంబుల, భృంగీగణ మొప్పె వ్రూనుపెట్టెడి మాడ్కిన్. 32

* తుమ్మెద కదుపులు ఇంపైన ఏనుగుల మదజల గంధాలను ఎంతో వేడుకతో ఆస్వాదిస్తూ కదలకుండా ఝుంఝుమ్మని రొదలు చేయసాగాయి.

క. వల్లభలు పాఱి మునుపడ, వల్లభ మని ముసరి రేని వారణదానం
బొల్లక మధుకరవల్లభు, లుల్లంబులఁ బొందిరెల్ల యుల్లాసంబుల్. 33

* ఏనుగుల మదజలానికి ఆడుతుమ్మెదలు ఆత్రంగా పోయి ముసురుకొన్నాయి. అందుకు ఆశపడకుండా మగతుమ్మెదలు నిండుగా తమ మనసులో సంతోషపడినాయి.

వ. అప్పుడు. 34

మ. కలభంబుల్ సెరలాడుఁ బల్వలము లాఘ్రాణించి మట్టాడుచున్
ఫలభూజంబుల రాయుచుం జివురు జొంపంబుల్ వడిన్ మేయుచుం
బులులం గాఱెనుపోతులన్ మృగములం బోనీక శిక్షించుచుం
గొలకుఁల్ సొచ్చి కలంచుచున్ గిరులపై గొబ్బిళ్లు గోరాడుచున్. 35

* ఆ సమయంలో గున్న ఏనుగులు పచ్చిక బయళ్ళను వాసనచూచి త్రొక్కుతూ పండ్లచెట్లనూ రాచుకుంటూ, చిగుళ్ళు మేస్తూ; పులులనూ, దున్నపోతులనూ. జింకలనూ తప్పించుకొని పోకుండా నిలిపి దండించుతూ; మడుగులలో దిగి కలగుండు పెడుతూ; కొండలమీద వినోదంగా ఆడుకుంటూ విహరింపసాగాయి.

క. తొండంబుల మదజలవృత, గండంబులఁ గుంభములను ఘట్టన సేయం
గొండలు దలక్రిందై పడు, బెండుపడున్ దిశలు చూచి బెగడున్ జగముల్. 36

* ఆ మత్తవేదండాలు తమ తొండాలతో మదజలం నిండిన చెక్కిళ్ళతో కుంభస్థలాలతో ఢీకొనగా కొండలు తలక్రిందు లయ్యేవి. దిక్కులు బ్రద్దలయ్యేవి, లోకాలు భయపడేవి.

క. ఎక్కడఁ జూచిన లెక్కకు, నెక్కువయై యడవి నడచు నిభయూథములో
నొక్కకరినాథు డెడతెగి, చిక్కెనొక కరేణుకోటి సేవింపంగన్. 37

* ఎక్కడ చూచినా లెక్కకు మిక్కిలిగా ఏనుగులు అడవిలో సంచరింపసాగాయి. ఆ గుంపులో ఒక గజేంద్రుడు వెనుక చిక్కినాడు. కొన్ని ఆడ ఏనుగులు అతనిని సేవిస్తూ అతనివెంట ఉన్నాయి.

వ. ఇట్లు వెనుక ముందట నుభయ పార్శ్వంబులఁ దృషార్దితంబులై యరుగుదెంచు నేనుంగు గములం గానక తెఱంగు దప్పి తొలంగుడుపడి యీశ్వరాయత్తంబైన చిత్తంబు సంవిత్తంబు గాకుండుటంజేసి తానును దన కరేణు సముదయంబును నొక్క తెరువై పోవుచు. 38

* ఆ గజరాజు దైవవశం చేత తెలివి కోల్పోయి తనకు అన్ని వైపులా దప్పికతో అలసి నడుస్తున్న ఏనుగుల గుంపు నుండి విడిపోయి దారిదప్పినాడు. తన ఏనుగులతో కలసి వేరేదారిగుండా నడచినాడు.

సీ. పల్వలంబుల లేఁతపచ్చిక మచ్చికఁ జెలుల కందిచ్చు నచ్చికము లేక;
ఇవురుజొంపములఁ గ్రొవ్వేలయు పూఁగొమ్మలఁ బ్రాణవల్లభలకుఁ బాలువెట్టు,
ఘనదానశీతల కర్ణతాళంబుల దయితల చెమటార్చుఁ దనువు లరసి;
మృదువుగాఁ గొమ్ముల మెల్లన గళములు నివురుచుఁ బ్రేమతో నెఱపు వలపు;

తే. పిఱుఁదు చిక్కట్ల డగ్గఱి ప్రేమతోడ, డాసి మూర్కొని దివికిఁ దొండంబు సాఁచు
వెద వివేకించుఁ గ్రీడించు విశ్రమించు, మత్తమాతంగ మల్లంబు మహిమతోడ; 39

* ఆ సమయంలో గజరాజు బల్లిదుడై తన ప్రియురాండ్రకు నీటి గుంటలు ప్రక్కన ఉండే లేతపచ్చికను మచ్చికతో అందించుతూ, చిగుళ్ళ గుత్తులనూ పూలకొమ్మలనూ కోసి పంచిపెడుతూ, మదజలంతో తడిసిన విసనకఱ్ఱలవంటి తన చెవులతో వాటి చెమటలు పోగొడుతూ, తన దంతాలతో ప్రియురాండ్ర మెడలక్రింద మెల్లగా గోకుతూ భార్యల వెనుక వైపు చేరి మూచూచి తొండాన్ని పైకెత్తి ఆకాశంలోకి చూపుతూ, ఋతుసమయాన్ని గుర్తించుతూ క్రీడిస్తూ విహరిస్తూ ఉన్నాడు.

**సీ. తన కుంభముల పూర్ణతకు డిగ్గి యువతులు కుచములు పయ్యెదకొంగు లీఁగఁ**
**దన యానగంభీరతకుఁ జాల కబలల యానంబు లందెల నండగొనఁగఁ**
**దన కరశ్రీఁ గని తలఁగి బాలలు చిఱు దొడలు మేఖలదీప్తిఁ దోడు పిలువఁ**
**దన దంతరుచికోడి తరుణుల నగవులు ముఖచంద్ర దీప్తుల ముసుఁగు దిగువఁ**

**తే. దనదు లావణ్య రూపంబుఁ దలఁచి చూడ, నంజనాభ్రము కపిలాదిహరిదిభేంద్ర**
**దయిత లందఱుఁ దనవెంటఁ దగిలి నడువఁ, గుంభివిభుఁ డొప్పె నొప్పుల కుప్పవోలె. 40**

* గజరాజు కుంభస్థలాల నిండుతనానికి సరిరాక పోవటం వల్ల లోకంలోని జవరాండ్ర స్తనాలు పైటకొంగులమాటు కోరాయి. అతని నడకల ఠీవికి సరితూగనందు చేతనే కన్నెల చిన్ని తొడలు ఒడ్డాణాలను తోడుచేసుకొన్నాయి. అతని దంతాల కాంతికి సరితూగనందువల్లే తరుణీమణుల చిరునవ్వులు ముఖచంద్రకాంతుల ముసుగు వేసుకోగోరాయి. ఒప్పుల కుప్ప అయిన ఆ గజేంద్రుని అందాన్ని చూడగోరి దిగ్గజాల భార్యలైన అంజన, అభ్రమువు, కపిల మొదలైనవి వెంట పడినవేమో అన్నట్లు ఆడ ఏనుగులు ఆ గజరాజును అనుసరించాయి.

**వ. మఱియు నానాగహన విహరణ మహిమతో మదగజేంద్రంబు మార్గంబుఁ దప్పి పిపాసా పరాయత్త చిత్తంబున మత్తకరేణువుల మొత్తంబునుం దానునుం జని చని. 41**

* తరువాత గజరాజు పెక్కు అడవులలో విపరీతంగా సంచారం చేసినాడు. దప్పికతో అతని మనస్సు స్వాధీనం తప్పింది. ఆడ ఏనుగులతో పాటు ఆయాసంతో ప్రయాణం సాగించినాడు.

**మ. అటఁ గాంచెం గరిణీవిభుండు నవఫుల్లాంభోజకల్హారమున్**
**నటదిందిందిర వారముం గమఠమీనగ్రాహ దుర్వారమున్**
**వట హింతాల రసాల సాల సుమనో వల్లీకుటీతీరముం**
**జటులోద్ధూత మరాళచక్రబక సంచారంబుఁ గాసారమున్. 42**

* గజరాజు ఒకచోట ఒక మడుగు చూచినాడు. ఆ మడుగులో కొత్తగా విచ్చుకున్న కమలాలు కలువలూ ఉన్నాయి. వానిలో తుమ్మెదలు ఆడుతూ ఉన్నాయి. ఆ నీళ్ళలో తాబేళ్ళు చేపలూ గొప్ప గొప్ప మొసళ్ళూ తిరుగుతున్నాయి.హంసలూ, చక్రవాకాలూ, కొంగలూ విహరిస్తున్నాయి. దాని గట్టుపై మఱ్ఱీ, తాడీ, మామిడి, మద్దీ, పూలతీగలూ పొదరిండ్లూ ఉన్నాయి.

వ. ఇట్లనన్య పురుష సంచారంబై నిష్కళంకంబైన యప్పంకజాకరంబుఁ బొడగని. 43

సీ. తోయజగంధంబు దోఁగిన చల్లని మెల్లని గాడ్పుల మేను లలరఁ
గమల నాళాహార విమలవాక్కలహంస రవములు సెవుల పండువులు సేయ
ఫుల్లదిందీవరాంభోరుహామోదంబు ఘ్రాణరంధ్రంబుల గారవింప
నిర్మల కల్లోల నిర్గతాసారంబు వదన గహ్వరముల వాడు దేర్పఁ

తే. ద్రిజగ దభినవ సౌభాగ్య దీప్తమైన, విభవ మీక్షణములకును విందు సేయ
నరిగి పంచేంద్రియ వ్యవహారములను, మఱచి మత్తేభయూథంబు మడుఁగుఁ జొచ్చె. 44

* మదపుటేనుగులు ఎవరూ దరిజేరకుండా నిర్మలంగా ఉన్న ఆ పద్మసరస్సును చూచినాయి. వాటి శరీరాలకు పద్మాలవాసనతో కూడిన చల్లని పిల్లగాలులు హాయి కలిగించినాయి. తామరతూండ్లు తిని రాయంచలు చేసే శబ్దాలు చెవులకు పండుగ కలిగించుతున్నాయి. విరిసిన కలువల పద్మాల వాసనలు ముక్కులకు తృప్తి కలిగించినాయి.

స్వచ్ఛమైన అలలనుండి వెలువడిన నీటి తుంపురలు దప్పిక తీర్చినాయి. ముల్లోకాలలోనూ సరికొత్త సొగసుతో ఆ సరోవరం శోభ కన్నులకు ఆనంద మిచ్చింది. మదపుటేనుగులు పంచేంద్రియాల జ్ఞానాన్నీ మరచి ఆ మడుగులోనికి దిగినాయి.

క. తొండంబులఁ బూరించుచు, గండంబులఁ జల్లుకొనుచు గళగళరవముల్
మెండుకొన వలుఁదకడుపులు, నిండన్ వేదండకోటి నీరుం ద్రావెన్. 45

* ఏనుగులు తొండాలతో నీళ్ళు నింపుకొని చెక్కిళ్ళపై చల్లుకొన్నాయి. గళగళమనే శబ్దాలు చేస్తూ తమ కడుపుల నిండుగా నీళ్ళు త్రాగినాయి.

వ. అప్పుడు. 46

మ. ఇభలోకేంద్రుఁడు హస్తరంధ్రముల నీరెక్కించి పూరించి చం
డభ మార్గంబున కెత్తి నిక్కివడి నుద్దాడించి పింజింప నా
రభటిన్ నీరములోన బెల్లెగసి నక్రగ్రాహ పాఠీనముల్
నభమం దాడెడు మీనకర్కటములన్ బట్టెన్ సురల్ మ్రాన్పడన్. 47

* ఆ సమయంలో గజరాజు తన తొండం లోనికి నీళ్ళు పీల్చి పైకెత్తినాడు. మునిగాళ్ళపై నిల్చి వేగంగా పైకి చిమ్మినాడు. ఆ నీటిలో నుండి మ్రోతతో పై కెగిరిన ఎండ్రకాయలూ మొసళ్ళూ, చేపలూ ఆకాశములో తిరిగే మీనరాశినీ, కర్కాటకరాశినీ పట్టుకోబోతున్నట్లున్నాయి. అది చూచి దేవతలు ఆశ్చర్యచకితు లవుతున్నారు.

వ. మఱియు న గ్గజేంద్రంబు నిరర్గళవిహారంబున. 48

సీ. కరిణీకరోజ్ఝిత కంకణచ్ఛటఁ దోఁగి సెలయేటి నీలాద్రి చెలువుఁ దెగడు
హస్తినీ హస్త విన్యస్తపద్మంబుల వేయుగన్నులవాని వెరవు సూపుఁ

గలభసముత్కీర్ణ కల్హార రజమునఁ గనకాచలేంద్రంబు ఘనతఁ దాల్చుఁ
గుంజరీ పరిచిత కుముదకాండంబుల ఫణిరాజ మండన ప్రభ వహించు

ఆ. మదకరేణు ముక్త మౌక్తిక శుక్తుల, మెఱుఁగు మొగిలుతోడ మేలమాడు
నెదురులేని గరిమ నిభరాజ మల్లంబు, వనజగేహకేళి వ్రాలునపుడు. 49

* ఆ గజరాజు అడ్డులేకుండా విహరించినాడు. ఆ పద్మాల మడుగులో ఎదురు లేకుండా ఈదాడినాడు. ఆడ ఏనుగులు అతనిపై నీళ్ళు చల్లినాయి. ఆ నీటి ధారలలో తడిసి అతడు సేలయేళ్ళతో కూడిన నీల గిరివలె ఒప్పారినాడు. ఆడ ఏనుగులు అతని శరీరం నిండా పద్మాలు అలంకరించినాయి. వాటితో గజరాజు సహస్రాక్షుడైన దేవేంద్రుని వలె కనిపించినాడు. ఆడ ఏనుగులు గజరాజుపై కలువల పుప్పొడి చల్లినాయి. దానివల్ల అతడు బంగారు కొండవలె ప్రకాశించినాడు. ఆడ ఏనుగులు అతని మేనినిండా కలువతూండ్లను క్రైసేసినాయి. వాటివల్ల గజరాజు సర్పహారాలు ధరించిన శివుని చెలువం పొందినాడు. ఆడ ఏనుగులు వాని మీద ముత్యాల చిప్పలను విసరినాయి. వాటివల్ల అతడు మెరుపు తీగలతో కూడిన మేఘాన్ని మించిపోయినాడు.

వ. మఱియు నా సరోవరలక్ష్మి మదగజేంద్ర వివిధ విహారవ్యాకులిత నూతన లక్ష్మీవిభవయై యనంగ విద్యానిరూఢ పల్లవ ప్రబంధపరికంపిత శరీరాలంకార యగు కుసుమ కోమలియునుంబోలె వ్యాకీర్ణ చికురమత్తమధుకర నికరయు, విగతరస వదనకమలయు, నిజస్థాన చలిత కుచరథాంగ యుగళయు, లంపటిత జఘనపులినతలయునై యుండె; నంత. 50

* గజరాజు చేసిన విశేషమైన సంచారాలవల్ల ఆ మడుగు అందచందాలు మాసిపోయి దానికి ఒక క్రొత్తసొగసు వచ్చింది. గడుసువాడైన విటునితో రతిక్రీడ చేస్తూ ఆతని కౌగిళ్ళలో గాసిపడి వణకుతున్న కుసుమ సుకుమారివలె ఆ సరసి ఒప్పింది. మదించిన తుమ్మెదలు చెదరిన ముంగురులుగా, రసాన్ని కోల్పోయిన పద్మాలు ముఖంగా, తమ స్థానాల నుండి విడివడిన చక్రవాకాలు స్తనాలుగా, నలిగిన ఇసుకతిన్నెలు అలసిన పిరుదులుగా గోచరించాయి.

సీ. భుగభుగాయితభూరి బుద్బుదచ్ఛటలతోఁ గదలుచు దివికి భంగంబు లెగయ;
భువన భయంకరపూత్కార రవమున ఘోరనక్రగ్రాహకోటి బెగడ,
వాలవిక్షేప దుర్వార ఝంఝానిల వశమున ఘుమఘుమావర్త మడరఁ
గల్లోలజాల సంఘట్టనంబులఁ దటీ తరులుమూలములతో ధరణిఁ గూల,

తే. సరసిలోనుండి పొడగని సంభ్రమించి, యుదరి కుప్పించి లంఘించి హుంకరించి
భానుఁ గబళించి పట్టు స్వర్భానుపగిది, నొక్క మకరేంద్రుఁ డిభరాజు నొడిసి పట్టె. 51

* ఈ విధంగా గజరాజు సరస్సులో క్రీడించే సమయంలో ఆ మడుగులో ఒక మూల దాగి ఉండి ఒక మొసలి రాజు అతనిని చూచినాడు. భుగ భుగ మనే చప్పుళ్ళతో పెద్ద పెద్ద బుడగలు పుట్టి అలలు ఆకాశానికి

ఎగిరేటట్లు పైకి ఎగసినాడు. మొసళ్ళు చేపలూ భయపడేటట్లు లోకానికి భయం కలిగేటట్లు పూత్కారం చేసినాడు. గాలికి సుడిగుండాలు లేచేటట్లు తోక జాడించినాడు. అలల తాకిడికి గట్టుపైని చెట్లు వ్రేళ్ళతో పాటు నేలపై కూలేటట్లు చేసినాడు. హుంకారం చేస్తూ కుప్పించి ఎగిరినాడు. రాహువు సూర్యుని పట్టుకొన్నట్లు ఆ మకరరాజు మన గజరాజును ఒడిసి పట్టుకొన్నాడు.

**క. వడిఁ దప్పించి కరీంద్రుఁడు, నిడుదకరం బెత్తి వ్రేయ నీరాటంబున్**
**బొడ వడఁగినట్లు జలములఁ బడి, కడువడిఁ బట్టెఁ బూర్వపదయుగళంబున్. 52**

* గజేంద్రుడు మొసలిపట్టు తప్పించుకొన్నాడు. పొడవైన తన తొండాన్ని పైకెత్తి కొట్టినాడు. ఆ దెబ్బకు మొసలి చనిపోయినట్లు నీళ్ళలో పడిపోయింది. తొందరగా తేరుకొని అది ఏనుగు ముందరి కాళ్ళను పట్టుకొన్నది.

**చ పదములఁ బట్టినం దలఁకుఁబా టొకయింతయు లేక శూరతన్**
**మదగజవల్లభుండు ధృతిమంతుఁడు దంతయుగాంత ఘట్టనం**
**జెదరఁగఁ జిమ్మె న మ్మకరిచిప్పలు పాదులు దప్ప నొప్పఱన్**
**వదలి జలగ్రహంబు కరివాలముమూలముఁ జీరెఁ గోఱలన్. 53**

* మొసలి తనకాళ్లు పట్టుకోగానే గజేంద్రుడు ఏ మాత్రమూ వెనుదీయలేదు. ధైర్యంతో తన దంతాల మొనలతో బలంగా ఆ మొసలి బొరుసుల క్రింది భాగాలు కదిలిపోయేటట్లు పొడచినాడు. మొసలిపట్టు తప్పింది. వెంటనే అది ఏనుగుకాళ్ళు విడిచి దాని తోకను పండ్లతో కరిచింది.

**క. కరిఁ దిగుచు మకరి సరసికిఁ, గరి దరికిని మకరిఁ దిగుచుఁ గరకరి బెరయన్**
**గరికి మకరి మకరికిఁ గరి, భర మనుచును నతల కుతల భటు లరుదు పడన్. 54**

* మొసలి ఏనుగును మడుగులోనికి ఈడ్చింది. ఏనుగు మొసలిని గట్టుపైకి లాగింది. రెండూ ద్వేషాన్ని పెంచుకొన్నాయి. 'ఏనుగు కంటె మొసలీ, మొసలి కంటె ఏనుగు బలమైనవి' అనుకుంటూ అతలకుతల లోకాల వీరులు ఆశ్చర్యపడినారు.

**వ. ఇట్లు కరిమకరంబులు రెండును నొండొంద సముద్దండదండంబులై తలపడి నిఖిల లోకాలోకన భీకరంబులై, యన్యోన్యవిజయశ్రీ వశీకరంబులై, సంక్షోభిత కమలాకరంబులై, హరి హరియును, గిరి గిరియునుం దాఁకి పిఱుతివియక పెనంగు తెఱంగున నీరాటం బయిన పోరాటంబునం బట్టుచు వెలికి లోనికిం దిగుచుచుఁ గొలంకు గలంకంబందఁ గడువడి నిట్టట్టు పడి తడఁబడక బుడబుడాను కారంబులై బుగులు బుగుల్లను చప్పుళ్లతో నురువులు గట్టుచు జలంబు లుప్పరం బెగయం జప్ప రించుచుఁ దప్పక వదనగహ్వరంబుల నప్పళింపుచు నిశితనితాంత దురంతదంత కుంతంబుల నింతింతలు దునియలయి నెప్పళంబునం బునుక చిప్పలు గుదుళ్ళు దప్పి రక్తంబులు గ్రమ్ముదేర హుమ్మని యొక్కుమ్మడిం జిమ్ముచు నితరేతర సమాకర్షణంబులం గదలక పదంబుల మొదలిపట్టు**

**వదలక కుదురై వర్తించుచుఁ బరిభ్రమణ వేగంబున జలంబులం దిరుగుచు మకర కమఠ కర్కట గండక మండూకాది సలిల నిలయంబుల ప్రాణంబులు క్షీణంబులుగా నొండొంటిం దాఁకు రభ సంబున నిక్కలువడ ప్రక్కం ద్రొక్కుచు మెండుచెడి బెండువడి నాఁచు గుల్లచిప్పతండంబులం బరస్పర తాడనంబులకు నడ్డంబుగా నొడ్డుచు నోలమాసగొనక గెలుపుఁ దలంపులు బెట్టిదంబులై రెట్టింప నహోరాత్రంబులం బోలెఁ గ్రమక్రమ విజృంభమాణంబులై బహుకాల కలహ విహారంబులై నిర్గత నిద్రాహారంబులై, యవక్ర పరాక్రమ ఘోరంబులై పోరుచున్న సమయంబున.** **55**

* ఏనుగూ మొసలీ రెండూ అభిమానంతో ఒకదాన్ని ఒకటి మించి ఢీకొన్నాయి. వాటి పోరాటం అన్ని లోకాలకూ భయంకరంగా సాగింది. అవి రెండూ ఒకదాన్ని ఒకటి ఓడించాలనే పట్టుదలతో ఆ సరస్సును కలచివేసినాయి. సింహాన్ని సింహమూ, కొండను కొండా వెనుదీయకుండా ఎదిరించినట్లు నీళ్ళలో అవి రెండూ తీవ్రంగా పోరాడినాయి. బయటికి లోపలికి లాగుతూ అటూ ఇటూ పడుతూ తొట్రుపడలేదు. ఆ నీళ్ళలో "బుడ బుడ" "బుగులు బుగులు" మనే శబ్దాలు చెలరేగినాయి. నురుగులు లేచి ఆకాశాన్ని తాకినాయి. కరి మకరి రెండూ ఎడతెరపి లేకుండా ముట్టెలతో తాకుతూ, తలలు ముక్కలయ్యేటట్లు అమరికలు తప్పి నెత్తురు కారేటట్లు హుమ్మంటూ వాడి పండ్లతో పొడుచుకొన్నాయి. ఒక దానిని ఒకటి లాగేటప్పుడు కాళ్ళపట్టు వదలకుండా గట్టిగా నిలదొక్కుకొన్నాయి.

సరస్సులోని నీళ్ళు వేగంగా సుళ్ళు తిరిగినాయి. ఆ నీళ్ళ తాకిడికి మొసళ్ళూ తాబేళ్ళూ ఎండ్రకాయలూ చేపలూ కప్పలూ మొదలైనవి ప్రాణాలు కోల్పోయినాయి. బింకంతో వేగంగా మొసలీ ఏనుగూ ఒక దానిని ఒకటి అణగద్రొక్కి చీకాకుపరచాయి. బాగా అలసట పొందినాయి.

ఒకదాని దెబ్బలకు ఇంకొకటి నాచునూ పాచినీ కప్పచిప్పలనూ అడ్డంగా వేసినాయి. శరీరాలపై ఆశలు వదలుకొన్నాయి. పరస్పరం గెలవాలనే కోరిక రెట్టించుకొన్నాయి. క్రమక్రమంగా చెలరేగి రేయింబగళ్ళు తిండీ నిద్రా లేకుండా అవి రెండూ చాలకాలం పోరాడినాయి.

**క. జవమును జలమును బలమును, వివిధములుగఁ బోరు కరటివీరతకు భువిన్**
**దివి మకరమీన కర్కట ,నివహము లొక్కటన మిత్రనిలయముఁ బొందెన్.** **56**

* గజేంద్రుడు చురుకుదనంతో పట్టుదలతో పెక్కు విధాలుగా మకరంతో యుద్ధం చేసినాడు. అతని పరాక్రమాన్ని చూచి భయపడి ఆకాశంలోని మకరం మీనం కర్కాటకం అనే రాసులు ఒక్క సారిగా సూర్యమండలంలో దూరినాయి.

**శా. ఆటోపంబునఁ జిమ్ము ఔమ్మగల వజ్రాభీల దంతంబులం**
**దాటించున్ మెడఁ జుట్టిపట్టి హరి దోర్దండాభ శుండాహతిన్**
**నీటన్ మాటికి మాటికిం దిగువఁగా నీరాటమున్ నీటి పో**
**రాట న్నోటమిపాటుఁ జూపుట కరణ్యాటంబు వాచాటమై.** **57**

* నీటిలోనికి మరల మరల లాగుతున్న మొసలిని ఓడించడానికై గజరాజు గగ్గోలు చేసినాడు. దానిని వేగంగా పై కెగుర గొట్టి పిడుగువంటి భయంకరమైన తన దంతాగ్రాలతో దాని రొమ్ము పగిలేటట్లు పొడిచినాడు. ఇంద్రుని భుజంవంటి తన తొండంతో దాని మెడను చుట్టి విసిరి కొట్టినాడు.

**వ. అప్పుడు. 58**

**ఆ. మకరితోడఁ బోరు మాతంగఁ విభుని నొ, క్కరుని డించి పోవఁ గాళ్ళు రాక**

**కోరి చూచు చుండెఁ గుంజరీయూథంబు, మగలు దగులు గారె మగువలకును. 59**

ఆ సమయంలో మొసలితో పోరాడుతున్న గజరాజును ఒంటరిగా విడిచిపెట్టి వెళ్ళడానికి కాళ్ళాడక ఆడ ఏనుగులు ఊరక చూస్తూ ఉండినాయి. ఆలుమగలకు మధ్య ఉండే ముడి విడరానిది కదా!

**వ. అంత. 60**

**ఆ. జీవనంబు దనకు జీవనంబై యుంట, నలవుఁ జలము నంతకంత కెక్కి**

**మకర మొప్పె డస్సె మత్తేభమల్లంబు, బహుళపక్ష శీతభాను పగిది. 61**

* అప్పుడు మొసలికి నీళ్ళే బ్రతుకుతెరువు కావడం వల్ల క్రమంగా దానికి బలమూ పట్టుదలా పెరిగినాయి. నాగరాజు కృష్ణపక్షంలోని చంద్రునివలె అంతకంతకూ తగ్గిపోయినాడు.

**మ. ఉఱుకుం గుంభయుగంబుపై హరి క్రియన్ హుమ్మంచుఁ, బాదంబులన్**

**నెఱయం గంఠము వెన్నుదన్ను; నెగయున్ హేలాగతిన్, వాలముం**

**జఱచున్; నుగ్గుగఁ దాఁకు: ముంచు; మునుఁగున్; శల్యంబులున్ దంతముల్**

**విఱుగన్ వ్రేయుచుఁ బొంచి పొంచి కదియున్ వేదండ యూథోత్తమున్. 62**

* సింహమువలె మొసలి హుంకారం చేసింది. ఒక్క ఉదుటున ఏనుగు కుంభస్థలంపైకి ఉరికింది. పాదాల నడుమ దూరి గిరిగిర తిరిగింది. మెడనూ వీపునూ కరచి బాధపెట్టింది. సులువుగా ఎగిరి తోక కొరికింది. నలిగిపోయేటట్లు డీకొన్నది. నీళ్ళలో ముంచింది. మునిగింది. ఎముకలూ దంతాలూ విరిగేటట్లు కొట్టింది. దాగి దాగి పైబడింది.

**మ. పొడగానం బడకుండ డాఁగు వెలికిం బోవంగఁ దా నడ్డమై**

**పొడచూపుం జరణంబులం బెనగొనుం బో రాక రారాక బె**

**గ్గడిలం గూలఁగఁదాఁచు లేచుతఱి నుద్ఘాటించు లంఘించు బ**

**ల్విడిఁ జీరుం దలఁగున్ మలంగు నొడియున్ వేధించుఁ గ్రోధించుచున్. 63**

* మొసలి గుట్టుగా, నీళ్ళలో దాగుతూ ఉండి ఏనుగు గట్టుకు వెళ్ళేటప్పుడు అడ్డంగా వస్తూ ఉంది. దాని కాళ్ళు బంధిస్తూ ఉంది. అటూ ఇటూ కదలకుండా చేసి భయంతో కూలిపోయేటట్లు తోకతో కొట్టుతూ ఉంది. లేచినప్పుడు ఒడలు జాడించి పైపైకి ఎగురుతూ ఉంది. వేగంగా వైదొలగి పోతూ వెనుదిరిగి వచ్చి క్రోధంతో ఏనుగు పై కెగిరి వేధించి బాధ పెట్టుతూ ఉంది.

వ. ఇట్లు విస్మితనక్రచక్రంబు నిర్వక్రవిక్రమంబున నల్పహృదయజ్ఞాన దీపంబు నతిక్రమించు మహా మాయాంధకారంబునుంబోలె నంతకంతకు నుత్సాహ కలహ సన్నాహ బహువిధ జలావగాహం బయిన గ్రాహంబు మహాసాహసంబున. 64

* పై విధంగా మొసలి తన అవక్రపరాక్రమంతో తన జాతి మొసళ్ళకు అత్యంతమైన ఆశ్చర్యం కలిగిస్తూ ఉంది. మహామాయ అనే అంధకారం అల్పమైన జ్ఞానకాంతిని కప్పివేసినట్లుగా క్రమక్రమంగా ఉత్సాహంతో పెక్కు విధాలుగా కుప్పించి ఎగసి గజరాజును నొప్పించింది. తెగువతో నీళ్ళలో మునిగి తేలసాగింది.

శా. పాదద్వంద్వము నేలమోపి పవనున్ బంధించి పంచేంద్రియో
న్మాదంబుం బరిమార్చి బుద్ధిలతకున్ మాఱాకు హత్తించి ని
ష్ఖేదబ్రహ్మపదావలంబనరతిం గ్రీడించు యోగీంద్రు మ
ర్యాదన్ నక్రము విక్రమించెఁ గరిపాదాక్రాంతనిర్వక్రమై. 65

* నీళ్ళలో మునిగిన మొసలి రెండు కాళ్ళను నేలపై మోపి ఊపిరి బిగపట్టింది. యోగీంద్రుండు పంచేంద్రియాల ఆడంబరాన్ని అణగింప చేసి బుద్ధి అనే తీగకు మారాకు అమర్చి ఆనందమయమైన పరమాత్మ పదాలను అవలంబించి ఆనందించే విధంగా ఆ మొసలి విజృంభించి గజేంద్రుని పాదాలను కదలకుండా వదలకుండా పట్టుకొన్నది.

ఆ. వనగజంబు నెగుచు వనచారిఁ బొడగని, వనగజంబ కాన వజ్రిగజము
వెల్ల నై సురేంద్రు వేచి సుధాంధులఁ, బట్ట పట్టనీక బయలు ప్రాఁకె. 66

* జలచరమైన ఆ మకరం వనచరమైన ఏనుగును నీళ్ళలోకి లాగడాన్ని చూచి జలంనుండి పుట్టిన ఇంద్రుని ఏనుగు ఐరావతం తెల్లబోయింది. దేవేంద్రుని పడవేసి దేవతలు పట్టుకోవడానికి వచ్చినా చిక్కకుండా అటూ ఇటూ ఆకాశంలో పరుగెత్తింది.

ఉ. ఊహ గలంగి జీవనపుటోలమునం బడి పోరుచున్ మహా
మోహలతా నిబద్ధపదమున్ విడిపించుకొనంగ లేక సం
దేహముఁబొందు దేహిక్రియ దీనదశన్ గజ ముండె భీషణ
గ్రాహదురంత దంత పరిఘట్టిత పాదఖురాగ్ర శల్యమై. 67

* బ్రతుకు తెరువులో పడిపోయి మోహమనే పెద్దతీగతో కట్టుపడిన పాదాన్ని విడిపించుకోలేక దిక్కుతోచకుండా సందేహానికి గురియైన జీవుని విధంగా గజేంద్రుడు ఘోరమైన మొసలి వాడి కోరలకు చిక్కి తొక్కుడుపడిన కాలి గిట్టలు కలవాడై ఆర్తితో అలమటించివాడు.

వ. ఇ వ్విధంబున. 68

క. అలయక సొలయక వేసట, నొలయక కరి మకరితోడ నుద్దండత రా
త్రులు సంధ్యలు దివసంబులు, సలిపెం బో రొక్కవేయి సంవత్సరముల్. 69

* పై విధంగా ఆ గజరాజు మొసలితో అలసి పోకుండా స్రుక్కిపోకుండా విసుగు చెందకుండా రాత్రులూ పగళ్ళూ సంజలూ వెయ్యి ఏండ్లకాలం తీవ్రంగా పోరాటం సాగించింది.

మ. పృథుశక్తిన్ గజ మా జలగ్రహముతోఁ బెక్కేండ్లు పోరాడి సం
శిథిలంబై తన లావు వైరిబలముం జింతించి మిథ్యామనో
రథమిం కేటికి? దీని గెల్వ సరి పోరం జాలరా దంచు స
వ్యథమై యిట్లనుఁ బూర్వపుణ్యఫల దివ్యజ్ఞాన సంపత్తితోన్; 70

* గొప్ప బలంతో గజరాజు చాలాకాలం మకరరాజుతో పోరాడి పోరాడి చివరకు చితికి పోయినాడు. తన సత్తువనూ శత్రువు బలాన్నీ పోల్చి ఆలోచించినాడు. 'దీనిని ఓడంచటానికి లేదా దీనితో సమానంగా పోరాడటానికి నాకు సాధ్యం కాదు; అడియాస ఇంకెందుకు?'- అని దుఃఖించినాడు. పూర్వపుణ్యం వల్ల కలిగిన మేలైన జ్ఞానం వల్ల అతడు తనలో ఈ విధంగా అనుకొన్నాడు.

శా. ఏ రూపంబున దీనిగెల్తు? నిట మీఁ దేవేల్పుఁ జింతింతు? నె
వ్వారిం జీరుదు? నెవ్వరడ్డ? మిఁక ని వ్వారిప్రచారోత్తమున్
వారింపం దగువార లెవ్వ? రఖిలవ్యాపార పారాయణుల్
లేరే! మ్రొక్కెద దిక్కుమాలిన మొఱాలింపం బ్రపుణ్యాత్మకుల్. 71

* ఈ మొసలిని ఏ రీతిగా గెలువగలను? ఇకపై ఏ దేవుని ప్రార్థించేది? ఎవరిని పిలిచేది? ఎవరు నన్ను కాపాడుతారు? దొడ్డదైన ఈ మొసలిని అడ్డగించే వారెవ్వరు? అన్ని కార్యాలలోనూ దిట్టలూ, గొప్పపుణ్యాత్ములూ దిక్కులేని నా మొర వినేవారు లేకపోతారా? అటువంటి వారికి నమస్కారం చేస్తాను.

శా. నానానేకపయూథముల్ వనములోనం బెద్దకాలంబు స
న్మానింపన్ దశలక్షకోటి కరిణీనాథుండనై యుండి మ
ద్దానాంభః పరిపుష్ట చందన లతాంతచ్ఛాయలం దుండ లే
కీ నీరాశ నిటేల వచ్చితి, భయం బెట్లోకదే యీశ్వరా! 72

* అడవిలో చాలాకాలంగా పెక్కు ఏనుగుసమూహాల గౌరవాన్ని పొందినాను. పదిలక్షలకోట్ల ఆడ ఏనుగులకు అధినాథుడుగా ఉండినాను. నా దాన జలధారలతో పెరిగిన మంచి గంధపుచెట్ల నీడలలో సుఖంగా ఉండకుండా నీళ్ళపై ఆశతో ఇక్కడి కెందుకు వచ్చినాను? భగవంతుడా! భయం కలుగుతూ ఉంది. నా గతి ఏమవుతుందో!

ఉ. ఎవ్వనిచే జనించు జగ; మెవ్వని లోపల నుండు లీనమై;
యెవ్వని యందు డిందుఁ; బరమేశ్వరుఁ డెవ్వఁడు; మూల కారణం

బెవ్వఁ; డనాదిమధ్యలయుఁ డెవ్వఁడు; సర్వముఁ దానయైన వాఁ
డెవ్వఁడు; వాని నాత్మభవు నీశ్వరు నే శరణంబు వేఁడెదన్. 73

* ఈ లోకం ఎవనివల్ల పుట్టుతుందో, ఎవనితో కలిసి ఉంటుందో, ఎవని లోపల లయం పొందుతుందో, ఎవడు పరమాత్ముడో, ఎవడు ఈ విశ్వానికి మూలకారణమో; ఎవడు పుట్టడము, గిట్టడము, పెరగడమూ లేకుండా ఉంటాడో, ఎవడు అన్నీ తానేయై ఉంటాడో- అటువంటి ప్రభువైన భగవంతుణ్ణి నేను శరణు కోరుతాను.

క. ఒకపరి జగములు వెలి నిడి, యొకపరి లోపలికిఁ గొనుచు నుభయముఁ దానై
సకలార్థ సాక్షి యగు న, య్యకలంకుని నాత్మమూలు నర్థిఁ దలంతున్. 74

* ఒకసారి లోకాలను సృష్టిచేసి, ఇంకొకసారి తనలో చేర్చుకుంటూ, ఆ లోకాలూ రెండూ తానేయై, అన్ని విషయాలనూ ఆలోకిస్తూ ఆత్మలకు ఆత్మయైన ఆ పరమాత్ముని ఆసక్తితో ధ్యానం చేస్తాను.

క. లోకంబులు లోకేశులు, లోకస్థులుఁ దెగిన తుది నలోకం బగు పెం
జీఁ కటి కవ్వల నెవ్వం, డే కాకృతి వెలుఁగు నతని నే సేవింతున్. 75

* లోకాలూ, లోకాలను పాలించేవారూ, లోకాలలో ఉండేవారూ అందరూ నశించిన అనంతరం, ఆ కారు చీకట్లకు అవతల అఖండమైన రూపంతో ప్రకాశించే దేవుణ్ణి నేను భావించి సేవిస్తాను.

క. నర్తకుని భంగిఁ బెక్కగు, మూర్తులతో నెవ్వఁడాడు? మునులు దివిజులుం
గీర్తింప నేర రెవ్వని, వర్తన మొరు లెఱుఁగ రట్టి వాని నుతింతున్. 76

* నర్తకునిలాగా పెక్కురూపాలతో ఎవడు నాట్యం చేస్తుంటాడో, ఋషులూ, దేవతలూ ఎవనిని కీర్తింపలేరో, ఎవని ప్రవర్తన ఇతరులకు అగోచరంగా ఉంటుందో- అటువంటి దేవదేవుణ్ణి నేను సంస్తుతిస్తాను.

ఆ. ముక్తసంగులైన మునులు దిదృక్షులు, సర్వభూత హితులు సాధుచిత్తు
లసదృశ వ్రతాఢ్యులై కొల్తు రెవ్వని, దివ్యపదము వాఁడు దిక్కు నాకు. 77

* ప్రపంచంతో సంబంధాలు వదలివేసిన మునులూ, భగవంతుణ్ణి చూడాలని కోరేవారూ, అన్ని ప్రాణులకూ మేలు కోరేవారూ, మంచి మనసు కలవారూ, సాటిలేని వ్రతాలు ఆచరించుతూ, ఎవని పాదాలను సేవిస్తారో అటువంటి దేవుడు నాకు ఆధార మగుగాక!

సీ. భవము దోషంబు రూపంబుఁ గర్మంబు నాహ్వాయమును గుణము లెవ్వనికి లేక
జగములఁ గలిగించు సమయించు కొఱకునై నిజమాయ నెవ్వఁ డిన్నియును దాల్చు
నా పరేశునకు ననంతశక్తికి బ్రహ్మ కిద్ధరూపికి రూపహీనునకును
జిత్రచారునికి సాక్షికి నాత్మరుచికినిఁ బరమాత్మునకుఁ బరబ్రహ్మమునకు

ఆ. మాటలను నెఱుకల మనములఁ జేరంగఁ, గాని శుచికి సత్త్వగమ్యుఁ డగుచు
నిపుణుఁడైన వాని నిష్కర్మతకు మెచ్చు, వాని కే నొనర్తు వందనములు. 78

* భగవంతునికి పుట్టుకా, పాపమూ, ఆకారమూ, కర్మా, నామాలూ, గుణాలూ లేవు. అతడు లోకాలను పుట్టించి నశింపజేయడం కోసం తన మాయాప్రభావంతో ఇవన్నీ ధరిస్తాడు. రూపం లేనివాడైనా ఆశ్చర్యకరంగా అంతులేని శక్తితో నిండైన రూపాన్ని పొందుతాడు. అన్నింటినీ చూస్తాడు. ఆత్మకాంతిలో వెలుగుతాడు. అతడే ఆత్మకు మూలం; అతడే మోక్షానికి అధికారి. అతడు మాటలకూ ఊహలకూ అందరానివాడు; పరిశుద్ధుడు. సత్త్వగుణంతో దరిజేర దగినవాడు. నేర్పరులు చేసే ఫలాపేక్షలేని కర్మలకు సంతోషిస్తాడు. అటువంటి దేవునికి నేను నమస్కారాలు చేస్తాను.

సీ. **శాంతున కపవర్గసౌఖ్య సంవేదికి నిర్వాణ భర్తకు నిర్విశేషు**
**నకు, ఘోరునకు గూఢునకు గుణధర్మికి సౌమ్యున కధిక విజ్ఞాన మయున**
**కఖిలేంద్రియ ద్రష్ట కధ్యక్షునకు బహు క్షేత్రజ్ఞునకు దయాసింధుమతికి**
**మూలప్రకృతి కాత్మ మూలున కఖిలేంద్రియ జ్ఞాపకునకు దుఃఖాంత కృతికి**

ఆ. **నెఱి నసత్య మనెడి నీడతో వెలుఁగుచు, నుండు నెక్కటికి మహోత్తరునకు**
**నిఖిల కారణునకు, నిష్కారణునకు నమస్కరింతు నన్ను మనుచు కొఱకు.** 79

* భగవంతుడు శాంతస్వరూపుడు. మోక్షానికి అధిపతి. ఆనందానికి ఆలవాలం. స్వపరభేదం లేనివాడు. దుష్టులకు భయంకరుడు. సంసారబద్ధులకు అందనివాడు. గుణాల ధర్మము కలవాడు. సరళ స్వభావమూ విశేషమైన జ్ఞానము కలిగినవాడు. అన్ని ఇంద్రియాల కార్యాలు చూచేవాడు. అన్నిటికీ ప్రభువు. సర్వజ్ఞుడు. దయారసానికి సముద్రం వంటివాడు. అన్నింటికీ మూలపురుషుడు . ఆత్మకు ఆధారమైనవాడు. ఇంద్రియాలను ఆజ్ఞాపించేవాడు. దుఃఖాన్ని తొలగించే వాడు. మాయ అనే నీడతో నిండుగా వెలిగేవాడూ. ఒంటరివాడు. మిక్కిలి గొప్పవాడు. అన్నిటికీ బీజమైనవాడు. ఏ కారణమూ లేనివాడు. అటువంటి స్వామికి నన్ను కాపాడుమంటూ నమస్కరిస్తాను.

క. **యోగాగ్ని దగ్ధకర్ములు, యోగీశ్వరు లే మహాత్ము నొం డెఱుఁగక స**
**ద్యోగ విభాసిత మనముల, బాగుగ వీక్షింతు రట్టి పరము భజింతున్.** 80

* యోగీంద్రులు యోగమనే అగ్నితో తమ పూర్వకర్మలను కాల్చివేసి ఇతరమేమి తలంచకుండా ప్రకాశించే తమ మనసులోని ఏ మహాదేవుని చూస్తుంటారో అటువంటి ప్రభువును నేను సేవిస్తాను.

సీ. **సర్వాగమామ్నాయ జలధికి నపవర్గ మయునికి నుత్తమ మందిరునకు**
**సకలగుణారణిచ్ఛన్న బోధాగ్ని కిఁ దనయంత రాజిల్లు ధన్యమతికి**
**గుణలయోద్దీపిత గురు మానసునకు సంవర్తితకర్మనిర్వర్తితునకు**
**దిశ లేని నాబోఁటి పశువుల పాపంబు లడఁచువానికి సమస్తాంతరాత్ముఁ**

తే. **డై వెలుంగువాని కచ్ఛిన్నునకు భగ, వంతునకుఁ దనూజపశునివేశ**
**దారసక్తు లయినవారి కందఁగరాని, వాని కాచరింతు వందనములు.** 81

* పరమాత్ముడు అన్ని ఆగమాలకూ వేదాలకూ సముద్రం వంటి వాడు. మోక్షస్వరూపుడు. గొప్ప గుణాలకు నిలయమైనవాడు. రాపిడి కొయ్యలలో అగ్నివలె సుగుణాలలో దాగియుండేవాడు. తనంత తానుగా ప్రకాశించేవాడు. గొప్ప మనసు కలవాడు. ప్రళయమునూ, సృష్టినీ నడిపేవాడు. నావంటి దిక్కులేని ప్రాణుల పాపాలను శమింపజేసేవాడు. అందరిలోనూ ఆత్మగా వెలిగేవాడు. నాశనం లేనివాడు. పూజింపదగిన వాడు. భార్యా పుత్రులూ ఇల్లూ పశువులూ అనే వాటిపై ఆసక్తి కలవారికి అందరానివాడు. అటువంటి దేవాధిదేవునికి నమస్కారాలు చేస్తాను.

**వ. మఱియును. 82**

**సీ. పరధర్మకామార్థ వర్జితకాములై విబుధు లెవ్వాని సేవించి యిష్ట**
**గతిఁ బొందుదురు? చేరి కాంక్షించువారి కవ్యయ దేహ మిచ్చు నెవ్వాఁడు కరుణ?**
**ముక్తాత్ములెవ్వని మునుకొని చింతింతు? రానందవార్ధి మగ్నాంతరంగు**
**లేకాంతు లెవ్వని నేమియుఁ గోరక భద్రచరిత్రంబుఁ బాడుచుందు?**

**ఆ. రా మహేశు నాద్యు నవ్యక్తు నధ్యాత్మ, యోగగమ్యుఁ బూర్ణు నున్నతాత్ము**
**బ్రహ్మమైన వానిఁ బరుని నతీంద్రియు, నీశు స్థూలు సూక్ష్మ నే భజింతు. 83**

* అంతేకాక భగవంతుడు ధర్మంపైనా కామంపైనా ధనం పైనా ఆశలు విడిచిన పండితుల పూజ లందుకొని వారు కోరుకున్న ఉత్తమ వరాలు అనుగ్రహిస్తాడు. దరిజేరి కోరిన వారికి దయతో నాశనంలేని శరీరాన్ని ప్రసాదిస్తాడు. ముక్తులైన వారు ఆనంద సముద్రంలో మునిగిన మనస్సులతో ఆయనను అనునిత్యమూ ఆరాధిస్తారు. పరమార్థాన్ని చింతించేవారు ఏకాంతంగా ఆయన పవిత్రమైన చరిత్రను పాడుతుంటారు. అతడు అందరికంటి ఆద్యుడైనవాడు. కంటికి కనరానివాడు. అధ్యాత్మ యోగంవల్ల మాత్రమే చేరదగినవాడు. పరిపూర్ణుడు, మహాత్ముడు, బ్రహ్మస్వరూపుడు, శ్రేష్ఠమైనవాడు, ఇంద్రియాలకు అతీత మైనవాడు, స్థూలస్వరూపుడు, సూక్ష్మ స్వరూపుడు, అటువంటి మహాత్ముణ్ణి నేను సేవిస్తాను.

**వ. అని మఱియు నిట్లని వితర్కించె. 84**

**సీ. పావకుం డర్చుల భానుండు దీప్తుల నెబ్భంగి నిగిడింతు రెట్లడంతు**
**రా క్రియ నాత్మకరావళిచేత బ్రహ్మాదుల వేల్పుల నఖిలజంతు**
**గణముల జగముల ఘన నామ రూప భేదములతో మెఱయించి తగ నడంచు**
**నెవ్వఁడు మనము బుద్ధీంద్రియమ్ములుఁ దాన యై గుణ సంప్రవాహంబు బఱపు**

**తే. స్త్రీ నపుంసక పురుష మూర్తియును గాక, తిర్య గమర నరాది మూర్తియును గాక**
**కర్మ గుణ భేద స దసత్ప్రకాశి గాక, వెనుక నన్నియుఁ దా నగు విభుఁ దలంతు. 85**

* గజేంద్రుడు ఇంకా ఈ విధంగా భావించాడు- అగ్ని జ్వాలలనూ, సూర్యుడు వెలుగులనూ, ప్రసరింపజేసి మళ్లీ శమింపజేసే విధంగా భగవంతుడు తన కిరణాలచేత బ్రహ్మ మొదలైన దేవతలనూ,

అన్ని జీవరాసులనూ, సకల లోకాలనూ నానా విధాలైన నామరూపభేదాలతో పుట్టించి లయింపచేస్తాడు. ఆయన మనస్సూ, బుద్ధీ, ఇంద్రియాలూ అన్నీ తానేయై గుణాలతో ప్రవర్తిస్తాడు. ఆయన స్త్రీ, పురుషుడూ, నపుంసకుడు, నర సుర జంతు స్వరూపుడూ కాకుండా గుణభేదాలకు కర్మకు అతీతంగా ఉంటాడు. ఉండడమూ లేకపోవడమూ అనే వాటిని బయలు పరచకుండా ఉంటాడు. ఏదీ కాకుండానే అన్నీ తానే అవుతాడు. అటువంటి ప్రభువును నేను ధ్యానం చేస్తాను.

**క. కలఁ డందురు దీనుల యెడఁ, గలఁ డందురు పరమయోగి గణములపాలం**
**గలఁ డందు రన్నిదిశలను, గలఁడు కలం డనెడు వాఁడు గలఁడో లేఁడో!** 86

* దేవుడు ఆర్తులైన వారివెంట ఉంటా డంటారు. ఉత్తములైన యోగుల చెంత ఉంటా డంటారు. అన్ని దిక్కులలోనూ ఉంటాడని అంటారు. "ఉన్నాడు ఉన్నాడు" అనే అటువంటి దేవుడు మరి ఉన్నాడో! లేడో!

**సీ. కలుగఁడే నాపాలికలిమి సందేహింపఁ గలిమిలేములు లేక కలుగువాఁడు;**
**నా కడ్డపడ రాఁడె నలి నసాధువులచేఁ బడిన సాధుల కడ్డపడెడువాఁడు**
**చూడఁడే నా పాటుఁ జూపులఁ జూడక చూచువారలఁ గృపఁ జూచువాఁడు;**
**లీలతో నా మొఱాలింపఁ డే మొఱఁగుల మొఱ లెఱుంగుచుఁ దన్ను మొఱఁగువాఁడు;**

**తే. అఖిలరూపముల్ దనరూప మైనవాఁడు, నాదిమధ్యాంతములు లేక యడరువాఁడు**
**భక్తజనముల దీనుల పాలివాఁడు, వినఁడె చూడఁడె తలపఁడె వేగ రాఁడె!** 87

* నా విషయంలో భగవంతుని ఉనికిని అనుమానించడమెందుకు? అతడు ఐశ్వర్యమూ పేదరికమూ అనేవి చూడకుండా అందరికీ అండగా ఉండేవాడు. నా పట్లకూడా ఉంటాడు. అతడు దుర్జనుల చేత చిక్కుకొన్న సజ్జనులకు సాయపడతాడు. కాబట్టి నాకు కూడా సాయపడతాడు. అతడు బయటి చూపులు వదలి తననే చూచే వారిని దయతో చూస్తాడు. నా కష్టాన్ని చూస్తాడు. అతడు దీనుల మొరలు తెలుసుకొని తన్నుతానే మరచిపోతాడు. నా మొరనూ వింటాడు. అన్ని రూపాలూ అతని రూపాలే. అతనికి మొదలూ నడుమూ తుదా లేవు. అతడే భక్తులకూ, దిక్కులేని వారికీ ఆధారం. అందువల్ల అటువంటి దొర నా మొర వినడా? నా బాధ చూడడా? దయ తలచడా? తొందరగా రాడా?

**క. విశ్వకరు విశ్వదూరుని, విశ్వాత్మకు విశ్వవేద్యు విశ్వు నవిశ్వున్**
**శాశ్వతు నజు బ్రహ్మ ప్రభు, నీశ్వరునిం బరమపురుషు నే భజియింతున్.** 88

* లోకాన్ని సృష్టిచేసి, లోకానికి దూరంగా ఉంటూ, లోకానికి అంతరాత్మయై, లోకానికి బాగా తెలుసుకో తగినవాడై, లోకమే తానై, లోకాతీతుడై పుట్టుక లేకుండా ఎల్లప్పుడూ ఉంటూ, ముక్తికి నాయకుడై, లోకాన్ని నడిపిస్తున్న పరమాత్ముని నేను ఆరాధిస్తాను.

వ. అని పలికి తన మనంబున నగ్గజేంద్రు డీశ్వర సన్నిధానంబు కల్పించుకొని యిట్లనియె. 89

* ఈ విధంగా తలంచి తన మనస్సులో భగవంతుని నెలకొల్పుకొని గజరాజు ఈ విధంగా ప్రార్థించినాడు-

శా. లా వొక్కింతయు లేదు; ధైర్యము విలోలంబయ్యెఁ; బ్రాణంబులున్
ఠావుల్ దప్పెను; మూర్ఛ వచ్చెఁ; దనువున్ డస్సెన్, శ్రమం బయ్యెడిన్,
నీవే తప్ప నితఃపరం బెఱుఁగ; మన్నింపం దగున్ దీనునిన్,
రావే యీశ్వర! కావవే వరద; సంరక్షింపు భద్రాత్మకా! 90

* భగవంతుడా! నాలో కొంచెం కూడా శక్తిలేదు. ధైర్యం తగ్గిపోయింది. ప్రాణాలు కూడా కదలుతున్నాయి. మూర్ఛ వస్తూ ఉంది. శరీరం స్రుక్కిపోయింది. అలసట కలిగింది. నాకు నీవు తప్ప వేరే దిక్కు లేదు. ఆర్తితో కూడిన నన్ను ఆదుకోవడం న్యాయం. దేవాధిదేవా! రావయ్యా! వరాలిచ్చే దొరా! కరుణించవయ్యా. పుణ్యాత్ముడా! కాపాడవయ్యా!

క. విను దఁట జీవుల మాటలు, చను దఁట చనరానిచోట్ల శరణార్థుల కో
యను దఁట పిలిచిన సర్వముఁ, గను దఁట సందేహ మయ్యెఁ గరుణావార్ధీ! 91

* ఓ దయాసముద్రుడా! ప్రాణుల పిలుపులు వింటావట, పోరాని చోట్లకైనా పోతావట! శరణన్న వారికి వెంటనే 'ఓ' అంటావట. సమస్తమూ తెలుసుకొంటావట. కాని ఇప్పుడు ఇదంతా నాకు అనుమానంగా ఉంది.

ఉ. ఓ కమలాప్త! యోవరద! యో ప్రతిపక్షవిపక్షదూర! కు
య్యో! కవియోగివంద్య సుగుణోత్తమ! యో శరణాగతామరా
నోకహ! యో మునీశ్వర మనోహర! యో విమలప్రభావ! రా
వే! కరుణింపవే! తలఁపవే! శరణార్థిని నన్నుఁ గావవే! 92

* ఓ కమలాక్షుడా! ఓ వరదుడా! శత్రువులపైన కూడా వైరం లేనివాడా! నా మొర వినవా! కవుల చేత యోగులచేత నమస్కారాలు అందుకొనేవాడా! ఉత్తమ గుణాలు కలవాడా! శరణు వేడిన వారికి కల్పవృక్షం వంటివాడా! మునీంద్రులకు ప్రియమైనవాడా! నిర్మలమైన మహిమ కల దేవా! రావా! కనికరింపవా! కరుణించి శరణు కోరుతున్న నన్ను కాపాడవా!

వ. అని పలికి మఱియు నరక్షిత రక్షకుండైన యీశ్వరుం డాపన్నుండైన నన్నుం గాచుఁ గాక యని నింగి నిక్కి చూచుచు నిట్టూర్పులు నిగిడించుచు బయ లాలకించుచు న గ్గజేంద్రుండు మొఱ సేయుచున్న సమయంబున. 93

* రక్షణ లేని వారిని రక్షించే భగవంతుడు ఆపదలో ఉన్న నన్ను ఆదుకొనుగాక! అని గజరాజు మొరపెట్టుకొన్నాడు. నింగి వైపు నిక్కి చూస్తూ నిట్టూర్పులు విడిచినాడు. ఆకాశానికి చెవు లప్పగించి ఆక్రోశించినాడు.

**ఆ. విశ్వమయత లేమి వినియు నూరక యుండి, రంబుజాసనాదు లడ్డపడక**
**విశ్వమయుఁడు విభుఁడు విష్ణుండు జిష్ణుండు, భక్తియుతున కడ్డపడఁ దలంచె. 94**

* ఆ సమయంలో బ్రహ్మ మొదలైన వారికి విశ్వమంతా నిండి ఉండే గుణం లేనందువల్ల గజరాజు మొర వినిపించినా వారు సాయపడలేక ఊరకే ఉండి పోయినారు. విశ్వమయుడూ, విభుడూ విజయశీలి ఐన విష్ణువు భక్తుడైన గజరాజును కాపాడడానికి నిశ్చయించుకొన్నాడు.

**మ. అల వైకుంఠ పురంబులో నగరిలో నా మూల సౌధంబు దా**
**పల మందారవనాంతరామృత సరః ప్రాంతేందు కాంతోప లో**
**త్పల పర్యంక రమావినోది యగు నాపన్నప్రసన్నుండు వి**
**హ్వల నాగేంద్రము 'పాహి పాహి' యనఁ గుయ్యాలించి సంరంభియై. 95**

* కష్టాలలో చిక్కుకొన్న వారిని కాపాడే భగవంతుడు ఆ సమయంలో వైకుంఠంలో ఉన్నాడు. అందులో అంతఃపురంలో ఉన్నాడు. అందులో ఒక ప్రక్కనుండే మేడకు సమీపంలోని అమృత సరస్సుకు దగ్గర చంద్రకాంత శిలల అరుగుపై కలువ పూల పాన్పుమీద లక్ష్మీదేవితో వినోదిస్తున్నాడు. భయంతో స్వాధీనం తప్పి 'కాపాడు కాపాడు' మన్న గజేంద్రుని మొర విన్నాడు. అతనిని కాపాడడానికి వేగిరపడినాడు.

**మ. సిరికిం జెప్పఁడు; శంఖచక్ర యుగముం జేదోయి సంధింపఁ డే**
**పరివారంబును జీరఁ డభ్రగపతిం బన్నింపఁ డాకర్ణికాం**
**తర ధమ్మిల్లముఁ జక్క నొత్తఁడు వివాదప్రోత్థిత శ్రీకుచో**
**పరి చేలాంచలమైన వీడఁడు గజప్రాణావనోత్సాహియై. 96**

* గజరాజు ప్రాణాలను కాపాడాలనే ఉత్సాహంతో నిండిపోయిన విష్ణువు లక్ష్మీదేవికి చెప్పలేదు. శంఖచక్రాలను చేతులలోనికి తీసుకోలేదు. సేవకుల నెవరినీ పిలువలేదు. గరుడవాహనం సిద్ధపరచుకోలేదు. చెవిలోని తామర దుద్దువరకూ జారిన జుట్టుముడిని కూడా చక్కదిద్దుకోలేదు. ప్రణయకోపంతో లేచిపోతున్న లక్ష్మీదేవి పైటకొంగునుకూడా వదలి పెట్టలేదు.

**వ. ఇట్లు భక్తజన పాలన పరాయణుండును, నిఖిల జంతుహృదయారవింద సదన సంస్థితుండును నగు నారాయణుండు కరి కులేంద్ర విజ్ఞాపిత నానావిధ దీనాలాపంబు లాకర్ణించి లక్ష్మీకాంతా వినోదంబులం దగులు సాలించి సంభ్రమించి దిశలు నిరీక్షించి గజేంద్రరక్షాపరత్వంబు నంగీకరించి నిజపరికరంబు మరల నవధరించి గగనంబున కుద్గమించి వేంచేయు నప్పుడు; 97**

* భగవంతుడు భక్తులను బ్రోవడంలో ఆసక్తి కలవాడు. అన్ని ప్రాణుల హృదయాలనే కమలాలలో నివసించేవాడు. ఆయన గజరాజు మొరలన్నీ విని ప్రియురాలైన లక్ష్మీదేవితో సరస సల్లాపాలు చాలించినాడు. గజరాజును కావడానికి ఆత్రపడినాడు. అటూ ఇటూ చూచినాడు. గజేంద్రుణ్ణి రక్షించాలని నిర్ణయించు కున్నాడు. అటుపిమ్మట ఆయుధా లన్నింటినీ అవధరించి ఆకాశమార్గాన బయలు దేరినాడు.

**మ. తనవెంటన్ సిరి, లచ్చివెంట నవరోధవ్రాతమున్, దాని వె**
**న్కను బక్షీంద్రుఁడు, వాని పొంతను ధనుఃకౌమోదకీ శంఖ చ**
**క్ర నికాయంబును, నారదుండు, ధ్వజినీకాంతుండు రా వచ్చి రొ**
**య్యన వైకుంఠపురంబునం గలుగువా రాబాలగోపాలమున్. 98**

* ఆ సమయంలో విష్ణువు వెనుక లక్ష్మి, ఆ మె వెనుక అంతఃపుర స్త్రీలూ, వారి వెనుక గరుడుడూ, అతని ప్రక్కనే విల్లూ గదా శంఖమూ చక్రమూ నారదుడూ విష్వక్సేనుడు వచ్చినారు. వారి వెనుక వరుసగా వైకుంఠపురంలోని వారందరూ వచ్చినారు.

**వ. తదనంతరంబ ముఖారవింద మకరంద బిందు సందోహ పరిష్యందమానానందదిందిందిర యగు నయ్యిందిరాదేవి గోవింద కరారవింద సమాకృష్యమాణ సంవ్యానచేలాంచల యై పోవుచు. 99**

* ఆ సమయంలో పద్మంవంటి లక్ష్మీదేవి ముఖంలో చిందుతున్న మకరంద బిందువులవంటి తియ్యని చెమట బొట్లకు తుమ్మెదలు ఆనందంతో ముసరుకొన్నాయి. గోవిందుని కరారవిందం తన పైట చెరగు పట్టుకొని లాగుతుండగా లక్ష్మీదేవి వెన్నుని వెన్నంటి పోతూ తనలో తాను ఇలా అనుకుంది-

**మ. తన వేంచేయు పదంబుఁ బేర్కొనఁ; డనాథస్త్రీ జనాలాపముల్**
**వినెనో, మ్రుచ్చులు మ్రుచ్చిలించిరొ ఖలుల్ వేదప్రపంచంబులన్,**
**దనుజానీకము దేవతానగరిపై దండెత్తెనో, భక్తులం**
**గని చక్రాయుధుఁ డేఁడి చూపుఁడని ధిక్కారించిరో దుర్జనుల్. 100**

**వ. అని వితర్కించుచు. 101**

* ప్రభువు తాను వెళ్ళేచోటు వెల్లడించలేదే! దిక్కులేని స్త్రీల దీనాలాపాలు విన్నాడో! దుర్మార్గులైన దొంగలు వేదాలను దొంగిలించినారో! దేవతల రాజధాని అయిన అమరావతిపై రాక్షసులు దండయాత్ర చేసినారో! 'విష్ణువెక్కడ చూపండి' అంటూ భక్తులను దుష్టులు ధిక్కరించినారో!- అనుకొంటూ అనేక విధాలుగా అనుమానపడింది.

**శా. తాటంకాచలనంబుతో, భుజనటద్ధమ్మిల్లబంధంబుతో,**
**శాటీముక్త కుచంబుతో, నదృఢచంచత్కాంచితో, శీర్ణ లా**
**లాటాలేపముతో, మనోహరకరాలగ్నోత్తరీయంబుతోఁ,**
**గోటీందుప్రభతో, నురోజభర సంకోచద్విలగ్నంబుతోన్. 102**

* కరిని కాపాడాలని పరువెత్తే పతివెంట పరుగిడుతున్న లక్ష్మీదేవి చెవుల పోగులు కదలాడినాయి. భుజాలపై కొప్పుముడి చిందు లాడింది. స్తనాలపైని పైట తొలగిపోయింది. ఒడ్డాణం వదులైపోయింది. నుదుటిపూత చెదరింది. ఆమె పైటకొంగు మాత్రం ప్రియుని చేతిలో పట్టుబడే ఉంది. స్తనభారంతో నడుం నకనక లాడింది. ఆమె ముఖం కోటిచంద్రుల కాంతితో నిండి ఉంది.

క. అడిగెద నని కడు వడిఁ జను, నడిగినఁ దను మగుడ నుడుగఁ డని నడ యుడుగున్
వెడవెడ చిడిముడి తడఁబడ, నడు గిడు; నడుగిడదు జడిమ నడుగిడు నెడలన్. 103

* అప్పుడామె భర్తను ఎక్కడికి వెళ్ళుతున్నాడో ఎందుకు వెళ్ళుతున్నాడో అడగాలనుకొని వేగంగా ముందుకు అడుగులు వేసేది. అడిగితే మారు మాటాడకుండా వెనుకకు పొమ్మంటాడని నడక మానేది. చీకాకుతో తొట్రుపడుతూ మళ్లీ మెల్లగా ముందుకు అడుగులు పెట్టేది. మళ్లీ ఆగేది. అడుగులు కదలించ లేక తడబడుతూ నడిచేది.

సీ. నిటలాలకము లంట నివుర ఝంఝుమ్మని ముఖసరోజము నిండ మూసరుఁ దేంట్లు;
నళులఁ జోఁపఁగఁ జిల్క లల్ల నల్లనఁ జేరి యోష్ఠబింబద్యుతు లొడియ నుఱుకు;
శుకములఁ దోలఁ జక్షుర్మీనములకు మందాకినీ పాఠీనలోక మెగుచు;
మీన పంక్తుల దాఁట మెయిదీఁగతో రాయ శంపాలతలు మింట సరణి గట్టు;

తే. శంపలను జయింపఁ జక్రవాకంబులు, కుచయుగంబుఁ దాఁకి క్రొవ్వుసూపు;
మెలఁత మొగిలు పిఱిఁది మెఱుఁగుఁదీవయుఁ బోలె, జలదవర్ణు వెనుకఁ జనెడు నపుడు. 104

* మేఘం వెంట మెరుపు తీగవలె విష్ణువు వెంట లక్ష్మీదేవి వెళ్ళసాగింది. ఆసమయంలో ఆమె నొసటిపైని ముంగురులను చక్కదిద్దుకో బోతే పద్మంవంటి ఆమెముఖం నిండా తుమ్మెదలు కమ్ముకొన్నాయి. తుమ్మెదలను తోలుతుండగానే దొండపండువంటి ఆమె పెదవుల కోసం చిలుకలు వచ్చి వాలినాయి. చిలుకలను తరుమగానే చేపలవంటి ఆమె కన్నుల మీదకు ఆకాశగంగలోని పెనుచేపలు ఎగసి దుమికినాయి. చేపలను తప్పించుకోగానే ఆమె తీగవంటి శరీరంతో ఒరుసుకోవడానికి మెరుపు తీగలు బారులు తీరినాయి. మెరుపు తీగలను అతిక్రమించగానే జక్కవజంటలు ఆమె చిక్కని స్తనద్వయాన్ని మిడిసిపడుతూ ఎదిరించాయి.

మ. వినువీథిం జనుదేరఁ గాంచి రమరుల్ విష్ణున్ సురారాతి జీ
వనసంపత్తి నిరాకరిష్ణుఁ గరుణావర్ధిష్ణు యోగీంద్ర హృ
ద్వనవర్తిష్ణు సహిష్ణు భక్తజనబృంద ప్రాభవాలంకరి
ష్ణు నవోఢోల్లసదిందిరా పరిచరిష్ణున్ జిష్ణు రోచిష్ణునిన్. 105

* రాక్షసుల బ్రతుకు తెరువులను తొలగద్రోసేవాడూ, నిండు దయతో యోగీంద్రుల మనస్సులలో నివాసం చేసేవాడూ, ఓర్పుతో భక్తుల గొప్పతనాన్ని పెంపొందించేవాడూ, తొలి ప్రాయంతో చెలువొందే లక్ష్మీదేవిని సేవించేవాడూ, జయశీలుడూ, కాంతిమంతుడూ అయిన విష్ణుదేవుడు ఆకాశమార్గంలో వస్తుండగా దేవతలు చూచినారు.

వ. ఇట్లు పొడగని. 106

మ. చనుదెంచెన్ ఘనుఁ డల్లవాఁడె! హరి పజ్జం గంటిరే లక్ష్మి? శం
ఖ నినాదం బదె; చక్రమల్లదె; భుజంగధ్వంసియున్ వాఁడె; క్ర
న్నన నేతెంచె నటంచు వేల్పులు నమో నారాయణాయేతి ని
స్వనులై మ్రొక్కిరి మింట హస్తిదురవస్థావక్రికిం జక్రికిన్. 107

* గజరాజు కష్టాన్ని తొలగించడానికి ఆకాశంలో వెళుతున్న విష్ణువును చూచి దేవతలు "అదిగో మహనీయుడైన విష్ణువు వస్తున్నాడు. అతని వెనుకనే లక్ష్మీదేవి వస్తున్నది చూడండి, అదే శంఖధ్వని! అల్లదే చక్రం! అదిగో గరుడుడు వెంట వస్తున్నాడు!" అనుకొంటూ 'నారాయణునికి నమస్కారం' అంటూ నమస్కారం చేసినారు.

వ. అయ్యవసరంబునం గుంజరేంద్రపాలన పారవశ్యంబున దేవతానమస్కారంబు లంగీకరింపక మనస్స మాన సంచారుండై పోయి పోయి కొంతదూరంబున శింశుమార చక్రంబునుం బోలె గురుమకరకుళీర మీన మిథునంబై, కిన్నరేంద్రుని భాండాగారంబునుంబోలె స్వచ్ఛ వరకచ్ఛపంబై, భాగ్యవంతుని భాగధేయంబునుం బోలె సరాగజీవనంబై, వైకుంఠంబునుంబోలె శంఖచక్ర కమలాలంకృతంబై, సంసార చక్రంబునుం బోలె ద్వంద్వసంకుల పంక సంకీర్ణంబై యొప్పు నప్పంకజాకరంబుఁ బొడగని. 108

* ఆ సమయంలో విష్ణువు గజరాజును కాపాడాలనే తొందరలో మైమరచి దేవతల మ్రొక్కులు అందుకోలేదు. మనోవేగంతో వెళ్ళినాడు. మొసలీ ఏనుగూ పోరాడుతున్న కమల సరస్సును చూచినాడు. దానిలో శింశుమార చక్రంలో వలె గొప్ప మొసళ్ళూ, ఎండ్రకాయలూ, చేపలూ జంటలు జంటలుగా ఉండినాయి. కుబేరుని కచ్ఛపమనే ధనాగారంలోవలె శ్రేష్ఠమైన తాబేళ్ళు ఉండినాయి. అదృష్టవంతుని సుఖజీవితంవలె అనురాగ పూర్ణమైన జీవనం (నీరు) నిండిఉన్నది. శంఖచక్రాలతో కమలాదేవితో కూడిన వైకుంఠపురం వలె శంఖాలు, చక్రవాకపక్షులూ, కమలాలు ఆ సరస్సునిండా ఉన్నాయి. సుఖదుఃఖాలు మొదలైన ద్వంద్వాలతో నిండిన సంసారంవలె నీటి జంతువుల జంటలతోనూ చిక్కనైన బురదతోనూ నిండి ఉంది.

మ. కరుణా సింధుఁడు శౌరి వారిచరమున్ ఖండింపఁగాఁ బంపె స
త్వరితాకంపిత భూమిచక్రము మహోద్యద్విస్ఫులింగచ్ఛటా
పరిభూతాంబర శుక్రమున్ బహువిధ బ్రహ్మాండభాండచ్ఛటాం
తరనిర్వక్రముఁ బాలితాఖిల సుధాంధశ్చక్రముం జక్రమున్. 109

* దయాసముద్రుడైన విష్ణువు మొసలిని చంపడానికై తన చక్రాన్ని పంపినాడు. ఆ చక్రం దేవతలను అందరినీ కాపాడేది. భూమండలాన్ని కంపింప జేసే వేగం కలది. తన అగ్ని కణాలతో ఆకాశవలయాన్ని ధిక్కరించేది. పెక్కు బ్రహ్మాండాల కాంతి సమూహాలతో నిండినది. ఎదురు లేనిది.

వ. ఇట్లు పంచిన. 110

శా. అంభోజాకరమధ్య నూతన నలిన్యాలింగన క్రీడనా
రంభుండైన వెలుంగుతేని చెలువారన్ వచ్చి నీటన్ గుభుల్

**గుంభధ్వానముతోఁ గొలంకును గలంకం బొందఁగాఁ జొచ్చి దు**
**ష్టాంభోవర్తి వసించు చక్కటికి డాయంబోయి హృద్వేగమై. 111**

* విష్ణువు పంపిన చక్రాయుధం సరస్సులోని సరిక్రొత్త పద్మలతను కౌగిలించుకోవడానికి పోతున్న సూర్య బింబంవలె ఉంది. అది మనోవేగంతో వెళ్ళింది. గుభుల్లు గుభుల్లు మనే శబ్దంతో సరస్సు కలత పడేటట్లు లోపలికి దూకింది. చెడ్డదైన ఆ మొసలి ఉండేచోటును సమీపించింది.

**శా. భీమంబై తలఁ ద్రుంచి ప్రాణములఁ బాపెం జక్ర మాశు క్రియన్**
**హేమక్ష్మాధర దేహముం జకితవన్యేభేంద్ర సందోహముం**
**గామక్రోధన గేహమున్ గరటి రక్తస్రావ గాహంబు ని**
**స్సీమోత్సాహము వీత దాహము జయశ్రీ మోహమున్ గ్రాహమున్. 112**

* చక్రాయుధం రివ్వు రివ్వున పోయి భయంకరంగా మొసలి తల తెగనరకివేసింది. ఆ మొసలి మేరుపర్వతం వంటి మేను కలిగి అడవి ఏనుగుల మందలకు సైతం భయంకరమైంది. కామ క్రోధాలతో నిండింది. గజరాజు రక్తధారలను రుచి చూచింది. అంతులేని ఉత్సాహంతో అలసట లేకుండా గెలుపుపై కోరిక నిలుపుకొని పోరాడుతున్నది. అటువంటి మకరం శిరస్సు ఖండించి ప్రాణాలు తీసింది చక్రం.

**వ. ఇట్లు నిమిష స్పర్శనంబున సుదర్శనంబు మకరి తలఁద్రుంచు నవసరంబున. 113**

**క. మకర మొకటి రవిఁ జొచ్చెను, మకరము మఱియొకటి ధనదు మాటున డాఁగెన్;**
**మకరాలయమునఁ దిరిగెడు, మకరంబులు కూర్మరాజు మఱువున కరిగెన్. 114**

* ఈ విధంగా సుదర్శన చక్రం రెప్పపాటు కాలంలో మకరం శిరస్సును ఖండించింది. ఆ సమయంలో ద్వాదశరాసులలో ఉండే మకరం సూర్యుని చాటున నక్కింది. నవనిధులలోని మకరం కుబేరుని చాటు చేసుకొని రక్షణ పొందింది. సముద్రంలో తిరుగాడే మకరాలు ఆదికూర్మం చాటుకు వెళ్ళి దాగుకొన్నాయి.

**మ. తమముం బాసిన రోహిణీ విభుక్రియన్ దర్పించి సంసార దుః**
**ఖము వీడ్కొన్న విరక్తచిత్తుని గతిన్ గ్రాహంబు పట్టూడ్చి పా**
**దము లల్లార్చి కరేణుకావిభుఁడు సౌందర్యంబుతో నొప్పె సం**
**భ్రమదాశాకరిణీ కరోజ్ఝిత సుధాంభస్స్నాన విశ్రాంతుఁడై. 115**

* గజరాజు మొసలి పట్టు విడిపించుకొని ఉత్సాహంతో కాళ్ళు కదలించినాడు. అతడు కారుచీకటి నుండి వెలువడిన చంద్రునివలెనూ, సంసారబంధాలనుండి విడివడిన సన్యాసివలెనూ ఉన్నాడు. ఆదరంతో ఆడ దిగ్గజాలు తొండాలు చాచి అతడిపై అమృతజలం పోసి అభిషేకించాయి. ఆ జలాలలో స్నానం చేసిన గజరాజు అలసట తీర్చుకొని అందంగా ఆనందంగా అలరారినాడు.

శా. పూరించెన్ హరి పాంచజన్యముఁ గృపాంభోరాశి సౌజన్యమున్
భూరిధ్వాన చలాచలీకృత మహాభూత ప్రచైతన్యమున్
సారోదారసిత ప్రభాచకిత పర్జన్యాది రాజన్యమున్
దూరీభూత విపన్నదైన్యమును నిర్ధూతద్విషచ్ఛైన్యమున్. 116

* విజయ సూచకంగా విష్ణువు పాంచజన్య శంఖాన్ని ఊదినాడు. ఆ శంఖం దయారసానికి సముద్రంవంటిది. గొప్ప శబ్దంతో పంచభూతాలను పటాపంచలు చేసి సంచలింపజేసేది. అపారశక్తితో కూడిన శుభ్రమైన కాంతితో ఇంద్రాది ప్రభువులకు సైతం వెరపు పుట్టించేది. దీనుల దుఃఖాన్ని దూరంజేసేది. పగవారి సైన్యాలను పారదోలేది.

మ. మొరసెన్ నిర్జరదుందుభుల్; జలరుహామోదంబులై వాయువుల్
దిరిగెం; బువ్వుల వానజల్లు గురిసెన్; దేవాంగనాలాస్యముల్
పరఁగెన్; దిక్కులయందు జీవజయ శబ్దధ్వానముల్ నిండె, సా
గర ముప్పొంగెఁ దరంగ చుంబిత నభో గంగాముఖాంభోజమై. 117

* పాంచజన్యం ధ్వనించగానే దేవతల నగారాలు మ్రోగినాయి. పద్మాల సువాసనలతో గాలులు వీచినాయి. పూలవాన కురిసింది. దేవతాస్త్రీలు అందంగా నాట్యాలు చేసినారు. సకల ప్రాణుల జయ జయ శబ్దాలు అన్ని వైపులా వ్యాపించినాయి. సముద్రుడు తన తరంగాలతో ఆకాశగంగ ముఖపద్మాన్ని ముద్దాడి ఆనందాన్ని పొందినాడు.

క. నిడుద యగు కేల గజమును, మడువున వెడలంగఁ దిగిచి మదజల రేఖల్
దుడుచుచు మెల్లన పుడుకుచు, నుడిపెన్ విష్ణుండు దుఃఖ మూర్వీనాథా! 118

* ఓ పరీక్షిన్మహారాజా! విష్ణువు తన పొడవైన హస్తం చాచి గజరాజును మడుగులో నుండి వెడలించినాడు. అతని మదజలధారలు తుడిచి మెల్లగా దువ్వుతూ వెన్నుతట్టి బాధ పోగొట్టినాడు.

క. శ్రీహరి కర సంస్పర్శను, దేహము దాహంబు మాని ధృతిఁ గరిణీ సం
దోహంబుఁ దాను గజపతి, మోహన ఘీంకార శబ్దములతో నొప్పెన్. 119

* విష్ణువు హస్త సంస్పర్శవల్ల గజేంద్రుని శరీరంలోని తాపమంతా చల్లారిపోయింది. అతడు సంతోషంతో ఆడ ఏనుగులతో కలిసి సొంపుగా ఘీంకారం చేసినాడు.

క. కరమున మెల్లన నివురుచుఁ, గర మనురాగమున మెఱసి కలయం బడుచుం
గరి హరికతమున బ్రదుకుచుఁ, గర పీడన మాచరించెఁ గరిణుల మరలన్. 120

* భగవంతుని దయవల్ల బ్రతికిన గజరాజు తన ఆడ ఏనుగులను చేరుకొన్నాడు. పూర్వం లాగే తన తొండంతో వానిని మెల్లగా తాకినాడు. మిక్కిలి ప్రేమతో వాటి తొండాలను తన తొండంతో చుట్టి పట్టుకొన్నాడు.

సీ. జననాథ! దేవలశాప విముక్తుఁడై పటుతర గ్రాహరూపంబు మాని
ఘనుఁడు హూహూ నామ గంధర్వుఁ డప్పుడు దన తొంటి నిర్మల తనువుఁ దాల్చి
హరికి నవ్యయునకు నతిభక్తితో మ్రొక్కి తవిలి కీర్తించి గీతములు పాడి
యా దేవు కృప నొంది యందంద మఱియును వినత శిరస్కుఁడై వేడ్కతోడ

ఆ. దళిత పాపుఁ డగుచుఁ దనలోకమున కేగె, నపుడు శౌరి కేల నంటి తడవ
హస్తిలోకనాథుఁ డజ్ఞాన రహితుఁడై, విష్ణురూపుఁ డగుచు వెలుఁగుచుండె. 121

* ఓ రాజా! గొప్పదైన ఆ మొసలి దేవలముని పెట్టిన శాపం వల్ల కలిగిన తమ మకర రూపం విడిచిపెట్టింది. నిర్మల మైన శరీరంతో "హూహూ" అనే గంధర్వుడుగా మారింది. ఆ గంధర్వుడు మిక్కిలి భక్తితో భగవంతునికి మ్రొక్కి స్తోత్రాలు చేసినాడు. స్వామి అనుగ్రహం పొందినాడు. మరల మరల నమస్కారం చేసి పుణ్యాత్ముడై గంధర్వ లోకానికి వెళ్ళిపోయినాడు. అటుపిమ్మట విష్ణువు గజరాజును చేతితో దువ్వినాడు. వెంటనే గజరాజులోని అజ్ఞానం తొలగిపోయింది; విష్ణుదేవునితో సారూప్యాన్ని సంపాదించి ప్రకాశించినాడు.

మ. అవనీనాథ! గజేంద్రుఁ డా మకరితో నాలంబు గావించె మున్
ద్రవిళాధీశుఁ డతండు పుణ్యతముఁ డింద్రద్యుమ్న నాముండు వై
ష్ణవ ముఖ్యుండు గృహీతమౌననియతిన్ సర్వాత్మ నారాయణున్
సవిశేషంబుగఁ బూజ సేసెను మహాశైలాగ్రభాగంబునన్. 122

* ఓ రాజా! మొసలితో పోరాడిన గజరాజు పూర్వజన్మలో ఇంద్రద్యుమ్నుడనే మహారాజు; ఆ పుణ్యాత్ముడు ద్రవిడ దేశాన్ని పాలించే వాడు. అతడు విష్ణుభక్తులలో శ్రేష్ఠుడు. ఒక పర్వతంపై అతడు మౌనవ్రతంతో భగవంతునికి విశేషమైన పూజలు జరిపేవాడు.

మ. ఒకనాఁ డా నృపుఁ డచ్యుతున్ మనములో నూహించుచున్ మౌనియై
యకలంకస్థితి నున్నచోఁ గలశజుం డచ్చోటికిన్ వచ్చి లే
వక పూజింపక యున్న మౌనిఁ గని నవ్య క్రోధుఁడై మూఢ! లు
బ్ధ! కరీంద్రోత్తమ యోనిఁ బుట్టు' మని శాపం బిచ్చె భూవల్లభా! 123

* ఓ రాజా! ఇంద్రద్యుమ్నుడు ఒకనాడు విష్ణువును ఏకాగ్రచిత్తంతో ధ్యానం చేస్తూ మైమరచి ఉండినాడు. అప్పుడు అగస్త్యముని అక్కడికి వచ్చినాడు. రాజు తనకు గౌరవ మివ్వకుండా, లేవకుండా మౌనంగా ఉన్నందువల్ల అగస్త్యుడు ఆగ్రహించినాడు. "ఓరీ మూర్ఖుడా! లుబ్ధుడా! అజ్ఞానంతో కూడిన ఏనుగుగా పుట్టు" మంటూ అతనికి శాపమిచ్చినాడు.

క. మునిపతి నవమానించిన, ఘనుఁ డింద్రద్యుమ్న విభుఁడు గౌంజరయోనిం
జననం బందెను; విప్రులఁ గని యవమానింపఁ దగదు ఘన పుణ్యులకున్. 124

* మునీంద్రుడైన అగస్త్యుని అవమానించినందువల్ల ఇంద్రద్యుమ్నుడు ఏనుగుగా పుట్టినాడు. అందువల్ల ఎంత గొప్ప పుణ్యాత్ములైనా సరే తపోధనులైన బ్రాహ్మణులను అవమానింపరాదు.

క. కరినాథుఁ డయ్యె నాతఁడు, కరులైరి భటాదులెల్ల; గజముగ నయ్యున్
హరిచరణ సేవ కతమునఁ, గరి వరునకు నధికముక్తి గలిగె మహాత్మా! 125

* ఓ రాజేంద్రా! ఇంద్రద్యుమ్నుడు గజరాజుగా పుట్టినాడు. అతని సేవకులందరూ ఏనుగులుగా పుట్టినారు. ఆ రాజు ఏనుగుగా పుట్టి నప్పటికీ విష్ణుభక్తివల్ల గొప్పదైన ముక్తి అతనికి లభించింది.

ఆ. కర్మతంత్రుఁ డగుచుఁ గమలాక్షుఁ గొల్చుచు, నుభయ నియతవృత్తి నుండెనేనిఁ
జెడును గర్మమెల్ల శిథిలమై మెల్లన, ప్రబలమైన విష్ణుభక్తి సెడదు. 126

* భక్తుడు తన నిత్య కృత్యాలు నిర్వర్తించుతూ విష్ణువును సేవించాలి. ఈ రెండు నియమాలనూ పాటించితే క్రమంగా పాపాలన్నీ నశించిపోతాయి. విష్ణుభక్తి అభివృద్ధి పొందుతుంది.

క. చెడుఁ గరులు హరులు ధనములు, జెడుదురు నిజసతులు సుతులుఁ జెడు చెనఁటులకుం;
జెడక మనునట్టి గుణులకుఁ, జెడని పదార్థములు విష్ణుసేవా నిరతుల్. 127

* దైవబలం లేనందువల్ల గుణరహితులైన దుర్జనులకు ఏనుగులూ గుఱ్ఱాలూ సంపదలూ నశించిపోతాయి. వారి ఆలు బిడ్డలూ నశించి పోతారు. గుణవంతులైన సజ్జనులు చెడకుండా బ్రతుకుతారు. వారికి విష్ణుభక్తి యందలి ఆసక్తి అభివృద్ధి చెందుతుంది.

వ. అప్పుడు జగజ్జనకుండగు న ప్పరమేశ్వరుండు దరహసిత ముఖకమల యగు నక్కమల కిట్లనియె. 128

క. 'బాలా! నా వెనువెంటను, హేలన్ వినువీథినుండి యేతెంచుచు నీ
చేలాంచలంబుఁ బట్టుట, కాలో నేమంటి నన్ను నంభోజముఖీ! 129

* గజరాజును కాపాడిన తరువాత లోకాలకు తండ్రియైన విష్ణువు చిరునవ్వు మొగంతో కూడిన లక్ష్మీదేవితో ఇట్లా అన్నాడు; తామర పువ్వు వంటి మోమున్న చిన్నదానా! ఆకాశ మార్గం గుండా నా వెంట విలాసంగా పరుగెత్తుకొని వస్తూ నీ పైటకొంగును విడువకుండా నేను పట్టుకొని ఉన్నందుకు నన్ను గురించి ఏ మనుకొన్నావో?

క. ఎఱుఁగుదు తెఱవా యెప్పుడు, మఱవను సకలంబు నన్ను మఱచిన యెడలన్
మఱతు నని యెఱిఁగి మొఱఁగక, మఱవక మొఱ యిడిర యేని మఱి యన్యములన్. 130

* ఓ మగువా! నన్ను మరువని వారిని నేను ఎన్నడూ మరువను. నన్ను విడిచిపెట్టిన వారిని నేను విడిచిపెట్టుతాను. ఈ సంగతి తెలుసుకొని ఇతరులకు మొరపెట్టకోకుండా నన్ను విడువకుండా ప్రార్థించిన వారిని ఎప్పుడైనా నేను రక్షిస్తాను. ఇది నీకు తెలుసుకదా!

**వ. అని పలికిన నరవింద మందిర యయిన న య్యిందిరాదేవి మందస్మిత చంద్రికా సుందర వదనారవింద యగుచు ముకుందున కిట్లనియె. 131**

* ముకుందుని మాటలు విని చిరునవ్వు చిందే ముఖారవిందంతో కూడిన ఇందిరాసుందరి గోవిందునితో ఇట్లా అన్నది-

**క. దేవా! దేవర యడుగులు, భావంబున నిలిపి కొలుచు పని నా పని గా**
**కో వల్లభ! యే మనియెద, నీ వెంటను వచ్చుచుంటి నిఖిలాధిపతీ! 132**

* ఓ దేవదేవా! నీవు సమస్తానికీ ప్రభువైనవాడవు. నీ పాదాలను మనస్సులో ఉంచుకొని పూజించడమే నా పని. కాబట్టి ఏమీ అనుకోకుండా నాస్వామివైన నిన్ను అనుసరించి వచ్చినాను.

**క. దీనుల కుయ్యాలింపను, దీనుల రక్షింప మేలు దీవనఁ బొందన్**
**దీనావన! నీ కొప్పును, దీన పరాధీన! దేవదేవ! మహేశా! 133**

* ఓ దేవాధిదేవా! మహాప్రభూ! నీవు దీనబంధుడవు. దీన రక్షకుడవు. దీనుల మొరలను ప్రీతితో వినడమూ, వారిని కాపాడడమూ, మంచి మంచి దీవనలు అందుకోవడమూ, దీన పరాధీనుడవైన నీకు తగి ఉన్నాయి.

**వ. అని మఱియును సముచిత సంభాషణంబుల నంకించుచున్న య ప్పరమ వైష్ణవీరత్నంబును సాదర సరస సల్లాప మందహాస పూర్వకంబుగా నాలింగనంబు గావించి సపరివారుండై గరుడ గంధర్వ సిద్ధ విబుధగణ జేగీయమానుండై గరుడారూఢుం డగుచు నిజసదనంబునకుం జనియె; నని చెప్పి శుకయోగీంద్రుం డిట్లనియె. 134**

* లక్ష్మీదేవి పైవిధంగా పలికి, తగిన విధంగా భగవంతుని స్తుతించింది. భగవంతుడు తన భక్తురాలైన లక్ష్మీదేవినీ ఇంపైన మాటలతో చిరునవ్వుతో ఆదరంగా కౌగిలించుకొన్నాడు. గరుడులూ, గంధర్వులూ దేవతలూ 'జయ జయ' ధ్వానాలు చేసినారు. స్వామి గరుడ గామియై పరివారసహితంగా వైకుంఠానికి బయలుదేరినాడు అని చెప్పి శుకమహర్షి పరీక్షిత్తుతో ఇట్లా అన్నాడు.

**సీ. నరనాథ! నీకును నాచేత వివరింపఁ బడిన యీ కృష్ణానుభావమైన**
**గజరాజమోక్షణకథ వినువారికి యశము లిచ్చును గల్మషాపహంబు;**
**దుస్స్వప్న నాశంబు దుఃఖ సంహారంబుఁ; బ్రొద్దున మేల్కాంచి పూతవృత్తి**
**నిత్యంబుఁ బఠియించు నిర్మలాత్మకులైన విప్రులకును బహువిభవ మమరు;**
**తే. సంపదలు గల్గుఁ; బీడలు శాంతిఁబొందు; సుఖము సిద్ధించు; వర్ధిలు శోభనములు;**
**మోక్ష మఱచేతిదై యుండు; ముదము చేరు, ననుచు విష్ణుండు ప్రీతుఁడై యానతిచ్చె. 135**

* ఓ రాజా! నీకు నేను వివరించిన విష్ణు మహిమతోకూడిన ఈ గజేంద్ర మోక్షం కథను వినే వారికి కీర్తి పెరుగుతుంది. పాపాలు పరిహారమవుతాయి. చెడ్డకలలు తొలగిపోతాయి. దుఃఖాలు దూరమవుతాయి. ప్రతి దినమూ ఉదయమే లేచి పవిత్రమైన నియమంతో నిర్మలమైన మనస్సుతో ఈ కథను చదివితే బ్రాహ్మణులకు గొప్పధనమూ సుఖమూ కలుగుతాయి. ఆపదలు అంతరిస్తాయి. శుభాలు వృద్ధిచెందుతాయి. మోక్షం సులభమౌతుంది. సంతోషం సమకూరుతుంది- అని ఆనందంగా విష్ణువు సెలవిచ్చినాడు.

**వ. అని మఱియు నప్పరమేశ్వరుం డిట్లని యానతిచ్చె; నెవ్వరేని నపరరాత్రంబున మేల్కాంచి సమాహిత మనస్కులయి నన్నును నిన్నును నీ సరోవరంబును శ్వేతద్వీపంబున నాకుం బ్రియంబైన సుధా సాగరంబును హేమ నగంబును నిగ్గిరి కందర కాననంబులను వేత్రకీచక వేణులతాగుల్మ సురపాదపంబులను నేనును, బ్రహ్మయు, ఫాలలోచనుండును నివసించియుండు నక్కొండ శిఖరంబులను గౌమోదకీ కౌస్తుభ సుదర్శన పాంచజన్యంబులను శ్రీదేవిని శేష గరుడ వాసుకి ప్రహ్లాద నారదాదిఋషులను మత్స్య కూర్మ వరాహాద్యవతారంబులను దదవతార కృతకార్యంబులను సూర్య సోమపావకులను బ్రణవంబును ధర్మతపస్సత్యంబులను వేదంబును వేదాంగంబులను శాస్త్రంబులను గో భూసుర సాధు పతివ్రతా జనంబులను జంద్రకాశ్యపజాయా సముదయంబును గౌరీగంగా సరస్వతీ కాళిందీ సునందా ప్రముఖ పుణ్యతరంగిణీ నిచయంబును నమరులను నమర తరువులను నైరావతంబును నమృతంబును ధ్రువుని బ్రహ్మర్షినివహంబును బుణ్య శ్లోకులయిన మానవులను సమాహిత చిత్తులై తలంచు వారలకుఁ బ్రాణావసాన కాలంబున మదీయంబగు విమలగతి నిత్తునని హృషీకేశుండు నిర్దేశించి శంఖంబు పూరించి సకలామరవందిత చరణారవిందుండై విహగపరివృఢ వాహనుండై వేంచేసె; విబుధానీకంబు సంతోషించెనని చెప్పి శుకుండు రాజున కిట్లనియె. 136**

* అంతేకాకుండా తెల్లవారుజాముననే లేచి ప్రశాంతమైన మనస్సుతో విష్ణువునూ, గజరాజునూ, ఆ సరస్సునూ, శ్వేతద్వీపాన్నీ, పాలసముద్రాన్నీ, త్రికూట పర్వతం లోని గుహలనూ, అడవులనూ, పేమూవెదురూ పొదలతో కూడిన కల్పవృక్షాలనూ, విష్ణువూ, బ్రహ్మ శివుడూ నివసించే ఆ త్రికూటపర్వతం శిఖరాలనూ, కామోదకీ గదనూ, కౌస్తుభమణినీ, సుదర్శనచక్రాన్నీ, పాంచజన్య శంఖాన్నీ, లక్ష్మీదేవినీ, ఆదిశేషుని, గరుడునీ, వాసుకినీ, ప్రహ్లాదునీ, నారదునీ, మత్స్యం కూర్మం వరాహం మొదలైన అవతారాలనూ, ఆ అవతారాలలో చేసిన కార్యాలనూ, సూర్యునీ, చంద్రునీ, అగ్నినీ, ఓంకారాన్ని, ధర్మాన్నీ, తపస్సునీ, సత్యాన్నీ, వేదాన్నీ, వేదాంగాలనూ, శాస్త్రాలనూ, గోవులనూ, బ్రాహ్మణులనూ, సాధువులనూ, పతివ్రతలనూ, చంద్రుని భార్యలనూ, కాశ్యపుని భార్యలనూ, గౌరి గంగ సరస్వతి యమున సునంద మొదలైన పుణ్యనదులనూ, దేవతలనూ, దేవతా వృక్షాలనూ, ఐరావతాన్నీ, అమృతాన్నీ, ధ్రువునీ, బ్రహ్మఋషులనూ, పుణ్యాత్ములైన మానవులనూ తలంచేవారు చనిపోయే సమయంలో నిర్మలమైన విష్ణువు రక్షణ పొందుతారు అని కూడా విష్ణువు తెలిపినాడు. శంఖాన్ని పూరించినాడు. దేవతలందరూ ఆయన పాదపద్మాలకు నమస్కారాలు చేయగ అందుకొని విష్ణువు గరుడునిపై కూర్చొని పయనించినాడు. దేవతలు సంతోషించినారు అని చెప్పి శుకుడు పరీక్షిత్తుతో ఇట్లా అన్నాడు-

క. గజరాజ మోక్షణంబును, నిజముగఁ బఠియించునట్టి నియతాత్ములకున్
గజరాజ వరదుఁ డిచ్చును, గజతురగ స్యందనములుఁ గైవల్యంబున్. 137

* గజేంద్రమోక్షం కథను భక్తితో నియమంగా చదివేవారికి విష్ణువు ఈ లోకంలో ఏనుగులూ గుఱ్ఱాలూ రథాలు కలిగిన భోగాలనూ, పరలోకంలో మోక్ష సుఖాన్నీ అనుగ్రహిస్తాడు.

క. తామసు తమ్ముఁడు రైవత, నామకుఁడై వెలసె మనువు; నలువురమీఁదన్
భూమికిఁ బ్రతివింధ్యార్జున, నామాదులు నృపులు మనువు నందనులు నృపా. 138

* ఓ రాజా! తామస మనువు తమ్ముడైన రైవతుడు ఐదవ మనువైనాడు. అతని కొడుకులైన ప్రతివింధ్యుడూ అర్జునుడూ మొదలైనవారు భూలోకానికి రాజులైనారు.

సీ. మునులు హిరణ్యరోముఁడు నూర్ధ్వబాహుండు వేదశీర్షుండను వీరు మొదలు
నమరులు భూతరయాదులు శుభ్రుని పత్ని వికుంఠాఖ్య పరమసాధ్వి;
యీ యిద్దఱకుఁ బుత్త్రుఁడై తన కళలతో వైకుంఠు ( డనఁ బుట్టి వారిజాక్షుఁ
డవనిపై వైకుంఠ మనియెడి లోకంబుఁ గల్పించె నెల్ల లోకములు మ్రొక్క;

తే. రమ యెదుర్కోలు సేకొనె రాజముఖ్య!, తదనుభావంబు గుణములుఁ దలఁపఁదరమె?
యీ ధరారేణు పటలంబు నెఱుఁగవచ్చుఁ, గాని రాదయ్య హరిగుణగణము సంఖ్య. 139

* ఓ రాజా! ఈ మన్వంతరంలో హిరణ్యరోముడూ ఊర్ధ్వబాహుడూ వేదశీర్షుడూ మొదలైనవారు సప్తఋషులై నారు. భూతరయులు మొదలైనవారు దేవతలైనారు. శుభ్రునికీ పతివ్రతయైన వికుంఠ అనే అతని భార్యకూ " వైకుంఠు" డనే పేరుతో విష్ణుమూర్తి జన్మించినాడు. అతడు అన్ని లోకాలవారూ గౌరవించేటట్లు వైకుంఠమనే లోకాన్ని సృష్టించినాడు. అతనిని లక్ష్మీదేవి స్వయంగా పెండ్లాడింది. ఆ దేవదేవుని మహిమనూ, సుగుణాలనూ ఊహించడానికి సాధ్యం కాదు. భూమిలోని ధూళి కణాల నైనా తెలుసుకోవచ్చు కాని వైకుంఠుని గుణగణాలను తెలుసుకోవడం సాధ్యం కాదు.

వ. తదనంతరంబు. 140

సీ. చక్షుస్తనూజుండు చాక్షుషుం డను వీరుఁ డాఱవ మనువయ్యె నవనినాథ!
భూమీశ్వరులు పురుఃపురుష సుద్యుమ్నాదు లాతని నందను; లమర విభుఁడు
మంత్రద్యుమాఖ్యుఁ డమర్త్యు లాప్యాదికులాహవిష్మద్వీరకాదిఘనులు
మునులందు విభుఁడు సంభూతికి వైరాజునకుఁ బుట్టి యజితుఁడు నాఁగ నొప్పె

ఆ. నతఁడ కాఁడె కూర్మమై మందరాద్రిని, నుదధి జలములోన నుండి మోచె;
నతఁడు సువ్వె దివిజు లర్థింప నమృతాబ్ధిఁ, ద్రచ్చి యిచ్చె నా సుధారసంబు. 141

* అటు తరువాత చక్షువు కొడుకైన చాక్షుషుడు ఆరవమనువైనాడు. అతని కొడుకులైన పురుడు పురుషుడూ సుద్యుమ్నుడూ మొదలైనవారు రాజులైనారు. మంత్రద్యుముడు ఇంద్రుడైనాడు. ఆప్యాదులు

దేవతలైనారు. హవిష్మంతుడూ వీరకుడూ మొదలైనవారు సప్తఋషులైనారు. విష్ణువు వైరాజుకూ సంభూతికీ "అజితు" డనే పేరుతో జన్మించినాడు. పరీక్షిన్మహారాజా! అతడే కూర్మరూపంతో మందరపర్వతాన్నీ సముద్రంలో మునుగకుండా మోసినాడు. దేవతలు ప్రార్థింపగా అతడే క్షీరసముద్రాన్ని చిలికి అమృతాన్ని ఇచ్చినాడు.

## -: క్షీరసాగర మథన కథా ప్రారంభము :-

వ. అని పలికినం బరీక్షిన్న రేంద్రుండు మునీంద్రున కిట్లనియె. 142

* శుకుడు పైవిధంగా చెప్పగా పరీక్షిత్తు ఇట్లా అడిగినాడు.

**మ. విను; ము న్నేటికిఁ ద్రచ్చె పాలకడలిన్ విష్ణుండు? కూర్మాకృతిన్**
**వనధిం జొచ్చి య దెట్లు మోచె బలుకవ్వంబైన శైలంబు? దే**
**వ నికాయం బమృతంబు నెట్లు వడసెన్? వారాశి నేమేమి సం**
**జనితం బయ్యె? మునీంద్ర! చోద్యము గదా సర్వంబుఁ జెప్పంగదే!** 143

* ఓ మునీంద్రుడా! విష్ణువు పాలసముద్రాన్ని పూర్వం ఎందుకు మథించినాడు? సముద్రంలో దిగి పెద్ద కవ్వపు కొండను తాబేలు రూపంతో ఏ విధంగా మోసినాడు? అమృతాన్ని దేవతలకు ఏ విధంగా అందించినాడు? సముద్రంలో ఏమేమి పుట్టినాయి? ఆశ్చర్యకరములైన ఈ సంగతులన్నీ నాకు వివరంగా చెప్పు.

**క. అప్పటినుండి బుధోత్తమ!, చెప్పెదు భగవత్కథావిశేషంబులు నా**
**కెప్పుడుఁ దనివి జనింపదు, సెప్పఁగదే చెవులు నిండ శ్రీహరికథలన్.** 144

* ఓ పండితోత్తమా! ఇది వరకూ నీవు చెప్పిన భగవంతుని కథావిశేషాల వల్ల ఇంకా నాకు సంతృప్తి కలుగలేదు. విష్ణుదేవుని కథలను చెవులకు పండువుగా వినిపించు.

**వ. అని మఱియు నడుగం బడినవాఁడై యతని నభినందించి హరిప్రసంగంబు సెప్ప నుపక్రమించె నని సూతుండు ద్విజుల కిట్లనియె; నట్లు శుకుండు రాజుం జూచి.** 145

* పరీక్షిత్తు ప్రశ్నకు సంతోషించి శుకుడు విష్ణుదేవుని కథలను వివరించడానికి పూనుకొన్నాడు- అని చెప్పి సూతుడు శౌనకాది మునులతో క్రింది విధంగా చెప్పినాడు.

**క. కసి మసఁగి యసుర విసరము, లసి లతికల సురల నెగువ నసువులు వెడలం**
**బసఁ జెడిరి; పడిరి; కెడసిరి, యసమ సమర విలసనముల నను వెడలి నృపా!** 146

* శుకుడు ఇలా చెప్పసాగాడు. ఓ రాజా! రాక్షసులు ఆయుధాలు ధరించి విజృంభించి దేవతలను మించిపోయి సాటిలేని పోరాటాలు చేసినారు. దేవతలు బలం తగ్గి ఇక్కట్ల పాలై ప్రాణాలు అరచేతుల్లో పెట్టుకొని శత్రువులను లొంగదీసుకొనే ఉపాయం తెలియక తల్లడిల్లి పోయినారు.

క. సురపతి వరుణాదులతో, సురముఖ్యులు గొంద ఱరిగి సురశైలముపై
సురనుతుఁడగు నజుఁ గని యా, సుర దుష్కృతిఁ జెప్పి రపుడు సొలయుచు నతులై. 147

* ఆ సందర్భంలో దేవేంద్రుడు వరుణాదులైన కొందరు ముఖ్యదేవతలతోపాటు మేరుపర్వతంలో దేవతలకు పెద్దయైన బ్రహ్మదేవుని సందర్శించి నమస్కారం చేసినాడు. దేవతలందరూ రాక్షసుల దుండగాలను ఆయనకు ఇట్లా విన్నవించినారు.

క. దుర్వాసు శాపవశమున, నిర్వీర్యత జగములెల్ల నిశ్శ్రీకములై
పర్వతరిపుతోఁ గూడ న, పర్వము లయి యుండె హతసుపర్వావళులై. 148

* దుర్వాసుని శాపం వల్ల లోకాలన్నీ పౌరుషమూ వైభవమూ పోగొట్టుకొన్నాయి. ఇంద్రునితో పాటు దేవతలు ఓడిపోయినారు. వేడుకలు అంతరించినాయి.

ఆ. నెలవు వెడలి వచ్చి నిస్తేజులై నట్టి, వేల్పుగములఁ జూచి వేల్పుఁ బెద్ద
పరమ పురుషుఁ దలఁచి ప్రణతుఁడై సంఫుల్ల, పద్మవదనుఁ డగుచుఁ బలికెఁ దెలియ. 149

* ఇల్లూ వాకిలీ విడిచిపెట్టి కాంతి విహీనులై తనవద్దకు వచ్చిన దేవతలను బ్రహ్మ చూచినాడు. అతడు పరమాత్మునికి నమస్కరించి ధ్యానించినాడు. అటుపిమ్మట వికసించిన ముఖకమలంతో ఇట్లా తెలియజేసినాడు.

క. ఏనును మీరును గాలము, మానవ తిర్యగ్లతాద్రుమ స్వేదజముల్
మానుగ నెవ్వని కళలము, వానికి మ్రొక్కెదము గాక వగవఁగ నేలా? 150

* నాకూ మీకూ కాలానికీ మానవులకూ పశువులకూ పక్షులకూ చెట్లకూ తీగలకూ చెమటలో పుట్టే అల్పజీవులకు మూలపురుషుడు భగవంతుడు. అతనిని మనము శరణు వేడుదాము. మీరు దుఃఖపడకండి.

క. వధ్యుండు రక్షణీయుఁడు, సాధ్యుఁడు మాన్యుఁడని లేని సర్గత్రాణా
వధ్యాదు లొనర్చు నతం, డాద్యంత విధానమునకు నర్హుఁడు మనకున్. 151

* భగవంతునికి చంపదగినవాడు, కాపాడదగినవాడు, కష్టపెట్టదగినవాడు, గౌరవింపదగినవాడు అనే తారతమ్యం లేదు. సృష్టిని రక్షించడానికీ, నాశనం చేయడానికి అతడే కర్త. అటువంటి భగవంతుడే మనమనోవ్యథలు పోగొట్టేవాడు. మనకు ఎల్లప్పుడూ ఆధారమైనవాడు.

క. వరదునిఁ బరమ జగద్గురు, గరుణాపరతంత్రు మనము గనుఁగొన దుఃఖ
జ్వరములు సెడునని సురలకు, సరసిజజని చెప్పి యజితు సదనంబునకున్. 152

వ. తానును దేవతాసమూహంబును నతిరయంబునం జని వినయంబునం గానంబడని య వ్విభు నుద్దేశించి దైవికంబులగు వచనంబుల నియతేంద్రియుండై యిట్లని స్తుతియించె. 153

* వరాలిచ్చేవాడూ, పరమాత్ముడూ,లోకాలకు తండ్రీ, దయామయుడు ఐన స్వామిని దర్శనం చేసుకొంటే మన దుఃఖాలూ, బాధలూ దూరమౌతాయి- అని బ్రహ్మదేవుడు దేవతలకు చెప్పి దేవతలతో కలసి వేగంగా అజిత భగవానుని నివాసానికి వెళ్ళినాడు. అదృశ్యరూపుడైన ఆ ప్రభువు ఏకాగ్రచిత్తంతో దివ్య వాక్కులతో బ్రహ్మ ఈ విధంగా ప్రార్థించినాడు.

**సీ. ఎవ్వని మాయకు నింతయు మోహించుఁ దఱిమి యెవ్వని మాయ దాఁట రాదు;**
**తనమాయ నెవ్వఁ డింతయు గెల్చినట్టివాఁ డెవ్వనిఁ బొడగాన రెట్టిమునులు,**
**సర్వభూతములకు సమవృత్తి నెవ్వఁడు చరియించుఁ దనచేత జనితమయిన,**
**ధరణి పాదములు చిత్తము సోముఁ డగ్ని ముఖంబు గన్నులు సోమకమలహితులు,**

**తే. చెవులు దిక్కులు, రేతంబు సిద్ధజలము, మూఁడు మూర్తుల పుట్టిల్లు, మొదలి నెలవు**
**గర్భ మఖిలంబు,మూర్ధంబు గగన మగుచు, మలయు నెవ్వఁడు వాని నమస్కరింతు. 154**

* ఓ ప్రభూ! నీ మాయవల్ల సృష్టి సమస్తమూ మోహంలో మునిగిపోతుంది. నీమాయను దాటడానికి వీలుకాదు. దానిని ఏ మాత్రమూ గెలిచినవారు లేరు. నిన్ను మునులైనా చూడలేరు. నీవు అన్ని ప్రాణుల పట్లా సమానంగా మెలగుతావు. నీవల్ల పుట్టిన ఈ భూమి నీ పాదాలు. శివుడు నీమనస్సు. అగ్ని నీ ముఖం. సూర్యచంద్రులు నీ కన్నులు, దిక్కులు నీ చెవులు. జలం నీ వీర్యం. త్రిమూర్తులకు నీ రూపం పుట్టినిల్లు. సమస్త సృష్టికీ మూలాధారం నీ కడుపు. ఆకాశం నీ శిరస్సు. ఈవిధంగా విశ్వరూపుడైన నీకు నమస్కరిస్తాను.

**వ. మఱియు నెవ్వని బలంబున మహేంద్రుండును, బ్రసాదంబున దేవతలును, గోపంబున రుద్రుండును, బౌరుషంబున విరించియు, నింద్రియంబుల వలన వేదంబులును మునులును, మేఢ్రంబునఁ బ్రజాపతియును, వక్షంబున లక్ష్మియు, ఛాయ వలనఁ బితృదేవతలును, స్తనంబుల వలన ధర్మంబును, బృష్ఠంబుల వలన నధర్మం బును, శిరంబు వలన నాకంబును, విహాసంబు వలన నప్సరోజనం బులును, గుహ్యంబువలన బ్రహ్మంబును, ముఖంబు వలన విప్రులును, భుజంబుల వలనరాజులును (బలంబును,) నూరువుల వలన వైశ్యులును (నైపుణ్యంబును,) బదంబుల వలన శూద్రులును, (నవేదంబును) నధరంబువలన లోభంబును, సుపరిరదచ్ఛదంబు వలనఁ బ్రీతియు, నాసాపుటంబు వలన ద్యుతియు, స్పర్శంబునఁ గామంబును, భ్రూయుగళంబున యమంబును, బక్ష్మంబునట గాలంబును సంభవించె; నెవ్వని యోగమాయా విహితంబులు ద్రవ్యవయః కర్మగుణ విశేషంబులు; చతుర్విధభూత సర్గం బెవ్వని యాత్మతంత్రం; బెవ్వని వలన సిద్ధించి లోకంబులును లోకపాలురును బ్రదుకు చుందురు, పెరుఁగుచుందురు; దివిజులకు నాయువు బలంబునై, జగంబులకు నీశుండై, ప్రజలకుఁ బ్రజనుండై, బ్రజావన క్రియాకాండ నిమిత్త సంభవుండగు జాతవేదుండై, యంతస్స ముద్రంబున ధాతు సంఘాతం బులం బ్రపంచించుచు బ్రహ్మమయుండై, ముక్తికి ద్వారంబై, యమృత, మృత్యు స్వరూపుండై, చరాచర ప్రాణులకు ప్రాణంబై యోజస్సహోబల వాయు రూపంబులైన ప్రాణేంద్రియాత్మ శరీర నికేతనుండై పరమ మహాభూతి యగు న ప్పరమేశ్వరుండు మాకుం బ్రసన్నుం డగుంగాక! యని మఱియును. 155**

* నీ బలం నుండి దేవేంద్రుడూ, నీ అనుగ్రహం నుండి దేవతలూ, నీ ఆగ్రహం నుండి రుద్రుడూ, నీ పౌరుషం నుండి బ్రహ్మదేవుడూ, నీ ఇంద్రియాలనుండి వేదాలూ మునులూ, నీ పురుషాంగం నుండి ప్రజాపతీ, నీ రొమ్మునుండి లక్ష్మీదేవీ, నీ నీడ నుండి పితృదేవతలూ, నీ రొమ్ము నుండి ధర్మమూ, నీ వీపు నుండి అధర్మమూ, నీ తల నుండి స్వర్గమూ, నీ నవ్వు నుండి అప్సరసలూ, నీ ముఖం నుండి బ్రాహ్మణులు, బ్రహ్మమూ; నీ భుజాలనుండి రాజులూ, బలమూ; నీ తొడలనుండి వైశ్యులు నేర్పరి తనమూ, నీ పాదాలనుండి శూద్రులూ శుశ్రూషా, నీ క్రింది పెదవి నుండి లోభమూ, పై పెదవి నుండి ప్రేమా, నీ ముక్కుపుటాల నుండి కాంతీ, నీ స్పర్శ నుండి కామమూ, నీ కనుబొమ్మల నుండి యముడూ, నీ ప్రక్కభాగంలో నుండి కాలమూ సంభవించినాయి. నీ యోగమాయ వల్ల ద్రవ్యమూ, వయస్సూ, కర్మమూ, గుణవిశేషాలూ విధింపబడినాయి. నీ ఆత్మతంత్రంనుండి ధర్మమూ, అర్థమూ, కామమూ, మోక్షమూ కలిగినాయి. నీ వల్ల లోకాలూ, లోకపాలకులూ ఏర్పడి అభివృద్ధి పొందుతారు. దేవతలకు ఆయుస్సూ, ఆహారమూ, బలమూ నీవే. పర్వతాలకు అధికారివి నీవే. ప్రజలను పుట్టించి వారిని కాపాడే కర్మకాండలకోసం ఏర్పడిన అగ్నివి నీవే. సముద్రంలో రత్నరాసులను విస్తరింపజేసేది నీవే. మోక్షానికి ద్వారమైన పరబ్రహ్మవు నీవే. చావు బ్రతుకులు నీ రూపాలే. ప్రాణులకు అన్నింటికీ ప్రాణం నీవే. తేజస్సు అహంకారమూ వాయువూ నిండిన ప్రాణుల అవయవాలలో, ఆత్మలో, శరీరాలలో నీవు నివసిస్తావు. పరమశక్తివైన మహాప్రభూ! మా పై దయచూపు.

**క. మొదల జల మిడిన భూజము, దుది నడుమను జల్లఁ దనము దొరఁకొను మాడ్కిన్**
**మొదలను హరికిని మ్రొక్కిన, ముద మొందుదు మెల్ల వేల్పుమూఁకలు నేమున్. 156**

* చెట్టు మొదలుకు నీళ్ళు పోస్తే చెట్టు కొన కొమ్మలలోనూ, మధ్యలోనూ, చల్లదనం వ్యాపిస్తుంది. అట్లే మొదట నీకు మ్రొక్కితే దేవతలూ నేనూ సంతోషిస్తాము.

**క. ఆపన్నులగు దిదృక్షుల, కో పుణ్య! భవన్ముఖాబ్జ మొయ్యన తటితోఁ**
**బ్రాపింపఁ జేయు సంపద, నోపరమదయానివాస! యుజ్జ్వలతేజా! 157**

* ఓ పుణ్యాత్ముడా! దయా నిలయుడా! గొప్ప తేజస్సు కలవాడా! కష్టాలపాలై నిన్ను చూడగోరే వారికీ నీ ముఖపద్మం సకాలంలో సమగ్రమైన సంపదను సమకూర్చుతుంది.

**వ. అని యిట్లు దేవగణసమేతుండై యనేక విధంబులం గీర్తించుచు నున్న పరమేష్ఠియందుఁ గరుణించి దయాగరిష్ఠుండగు విశ్వగర్భుం డావిర్భవించె. 158**

* బ్రహ్మదేవుడు పైవిధంగా దేవతలతో కూడి పెక్కువిధాలుగా విష్ణుదేవుని స్తోత్రం చేసినాడు. అందుకు కరుణించి మహాప్రభువు ప్రత్యక్షమైనాడు.

**మ. ఒక వేయర్కులు గూడిగట్టి కరువై యుద్యత్ప్రభాభూతితో**
**నొకరూపై చనుదెంచు మాడ్కి హరి దా నొప్పారె; నా వేలుపుల్**

**వికలాలోకనులై, విషణ్ణమతులై; విభ్రాంతులై మ్రోలఁ గా**
**నక శంకించిరి కొంత ప్రొద్దు; విభుఁ గానం బోలునే వారికిన్? 159**

* మహావిష్ణువు వెయ్యిసూర్యుల తేజస్సు ఒకటిగా పోతపోసిన కాంతివైభవంతో ప్రకాశించినాడు. దేవతలు చూపులు చెదరిపోయినాయి. ధ్యానిస్తూ వారు స్వామిని చూడగానే కొంతసేపు భయపడినారు. ప్రభువును చూడడం వారికి సాధ్యం కాదు కదా!

**వ. అప్పుడు. 160**

**సీ. హార కిరీట కేయూర కుండల పాద కటక కాంచీలతా కంకణాది**
**కౌస్తుభోపేతంబుఁ గౌమోదకీ శంఖ చక్రశరాసన సంయుతంబు**
**మరకతశ్యామంబు సరసిజ నేత్రంబుఁ గర్ణాభరణ కాంతి గండ యుగము**
**గలిత కాంచన వర్ణ కౌశేయవస్త్రంబు శ్రీ వన మాలికా సేవితంబు**

**ఆ. నై మనోహరంబునై దివ్యసౌభాగ్య, మైన యతని రూపు హర్ష మెసఁగఁ**
**జూచి బ్రహ్మ హరుఁడు సురలును దానును, బొంగి నమ్రుఁ డగుచుఁ బొగడఁ దొడఁగె. 161**

* ఆ సమయంలో భగవంతుడు హారాలూ, కిరీటమూ, భుజకీర్తులూ, కుండలాలూ, అందెలూ, మొలనూలూ, కంకణలూ, కౌస్తుభరత్నమూ, కౌమోదికీ గదా, శంఖమూ, చక్రమూ, ధనుస్సూ ధరించి దర్శన మిచ్చినాడు. అతనికి మరకతమణి వంటి నల్లని మేనూ, పద్మాల వంటి కన్నులూ కాంతులీను తున్నాయి. తళ తళలాడే మకర కుండలాల కాంతులు చెక్కిళ్ళపై ప్రసరిస్తున్నాయి. బంగారురంగు పట్టు వస్త్రమూ ధరించి  ఉన్నాడు. కంఠాన వైజయంతీమాల ప్రకాశిస్తున్నది. మిక్కిలి అందంగా ఉన్న స్వామి రూపాన్ని బ్రహ్మదేవుడూ, శివుడూ, దేవతలూ సంతోషంగా కనుగొన్నారు. బ్రహ్మ భగవంతునకు నమస్కారం చేసి స్తోత్రం చేయడానికి పూనుకొన్నాడు.

**క. జననస్థితిలయ దూరుని, మునినుతు నిర్వాణసుఖ సముద్రుని సుగుణుం**
**దనుతనునిఁ బృథుల పృథులుని, ననఘాత్ము మహానుభావు నభినందింతున్. 162**

* మహాప్రభూ! ఆది మధ్యాంతములు నీకు లేవు. మునులు నిన్ను ఎన్నోవిధాల పొగడుతుంటారు. మోక్షసౌఖ్యానికి సముద్రం నీవు. చిన్నవాటి కంటె చిన్నవాడవు నీవు. గొప్పవాటికంటె గొప్పవాడవు నీవు. సద్గుణవంతుడవు నీవు. పుణ్యాత్ముడవు నీవు. అటువంటి నిన్ను ప్రస్తుతి చేస్తాను.

**క. పురుషోత్తమ! నీ రూపము, పరమ శ్రేయంబు భువన పంక్తుల కెల్లన్**
**స్థిరవైదిక యోగంబున, వరుసను మీ యంద కానవచ్చెను మాకున్. 163**

* ఓ పురుషోత్తముడా! అన్ని లోకాలలోనూ నీ రూపం శ్రేష్ఠమైనది. ఆ రూపం శాశ్వతమైన వేదమంత్రంతో కూడి మాకు కన్పిస్తున్నది.

క. మొదలును నీలోఁ దోఁచెను, దుదియును నటఁ దోఁచె; నడుము దోఁచెను; నీవే
మొదలు నడుము దుది సృష్టికిఁ, గదియఁగ ఘటమునకు మన్ను గతియగు మాడ్కిన్. 164

* కుండకు మన్నే ఆధారం. అట్లే ఈ సృష్టికి మొదలూ, దీని మధ్యభాగమూ, దీని అంతమూ నీలోనే కనిపిస్తాయి. సృష్టిలోని మూడు దశలూ నీవే.

క. నీ మాయ చేత విశ్వము, వేమాఱు సృజింతు వనుచు విష్ణుఁడ వనుచున్
ధీమంతులు గుణపద విని, నేమంబున సగుణుఁడైన నినుఁ గాంతు రొగిన్. 165

* నీవు ప్రపంచాన్ని మాయతో పలుమార్లు సృష్టించి, గుణవంతుడవై ప్రపంచ మంతటా నిండి ఉంటావని, గుణ సంపన్నులైన బుద్ధిమంతులు పరిగణిస్తారు. నిన్ను సందర్శిస్తారు.

ఆ. అన్న మవనియందు నమృతంబు గోవుల, యందు వహ్ని సమిధలందు నమర
యోగవశతఁ బొందు నోజను బుద్ధిచే, నగుణు నిన్నుఁ గాంతు రాత్మవిదులు. 166

* భూమిలో ఆహారాన్నీ, ఆవులలో పాలనూ, కట్టెలలో అగ్నినీ కనుగొనే విధంగా ఆత్మజ్ఞానం కలవారు తమ బుద్ధిద్వారా ఈ విశ్వంలో నిన్ను చూస్తారు.

మత్త. పట్టులేక బహుప్రకార విపన్న చిత్తులమైతి; మే
మెట్టకేలకు నిన్నుఁగంటి మభీప్సితార్థము వచ్చుఁ; బె
న్పెట్టయైన దవానలంబున వేఁగు నేనుఁగు మొత్తముల్
నిట్టనేర్చిన గంగలోపల నీరు గాంచిన చాడ్పునన్. 167

* మేము దిక్కులేని వారమై పెక్కువిధాలుగా మానసికమైన కష్టాలకు గురియైనాము. మిక్కిలి వేడితో గూడిన కార్చిచ్చుధాటికి తపించిన ఏనుగుల మంద ఉప్పొంగుతున్న గంగలోని నీళ్ళు చూచిన విధంగా ఎట్టకేలకూ చిట్టచివరికి నిన్ను చూచినాము. ఇక మా కోరికలు నెరవేరి తీరుతాయి.

మత్త. నీకు నే మని విన్నవింతుము! నీవు సర్వమయుండవై
లోకమెల్లను నిండి యుండఁగ లోకలోచన! నీ పదా
లోకనంబు శుభంబు మాకును లోకపాలకు లేను నీ
నాకవాసులు నీవ వహ్నిఁ దనర్చు కేతుతతిక్రియన్. 168

వ. అని కమల సంభవ ప్రముఖులు వినుతి సేసి రని చెప్పి నరేంద్రునకు శుకుం డిట్లనియె. 169

* నీవు లోకమంతటా నిండి ఉండే మహాత్ముడవు. లోకాన్ని అనుక్షణమూ వీక్షిస్తుంటావు. మేము నీకు మనవి చేసుకోవలసిన పనిలేదు. నీ పాదదర్శనం మాకు శుభాన్ని కలిగిస్తుంది. అగ్నిలోని స్ఫులింగాలవలె లోకపాలకులూ నేను ఈ దేవతలూ నీలోని అంశాలమే. ఈ విధంగా బ్రహ్మాదులు విష్ణువును ప్రార్థించినారని చెప్పి శుకుడు పరీక్షిత్తుతో ఇట్లా అన్నాడు:-

**శా. ఈ రీతిం జతురాననాది సుతుఁడై యేపార జీమూత గం**
**భీరంబైన రవంబునం బలికె సంప్రీతాత్ముఁడై యీశ్వరుం**
**డారోమాంచిత కాయులన్ నవవిముక్తాపాయులం బ్రేయులం**
**బ్రారబ్ధోగ్ర మహార్ణవోన్మథన వాంఛానల్పులన్ వేల్పులన్. 170**

* పై విధంగా బ్రహ్మాదులు ప్రార్థింపగా భగవంతుడు సంతోషించినాడు. దేవతల శరీరాలు నిలువెల్ల పులకించినాయి. అప్పుడే తమ కష్టాలనుండి గట్టెక్కినట్లు వీరు తలంచినారు. భయంకరమైన ప్రారబ్ధమనే సముద్రాన్ని మథించటానికి ఉత్సాహపడినారు. అప్పుడు స్వామి మేఘ గంభీరమైన కంఠస్వరంతో ఇట్లా అన్నాడు.

**క. ఓ నలువ! యో సురేశ్వర!, యో నిటలతటాక్ష! యో సురోత్తములారా!**
**దానవులతోడ నిప్పుడు, మానుగఁ బోరామి గలిగి మనుటే యొప్పున్. 171**

* ఓ బ్రహ్మ! ఓదేవేంద్రుడా! ఓ రుద్రుడా! ఓ దేవతలారా! ప్రస్తుతం మీరు మంచిగా రాక్షసులతో స్నేహం చేసి జీవించడం మంచిది.

**వ. అది యెట్లంటిరేని. 172**

**క. ఎప్పుడు దనకును సత్త్వము, సొప్పడు నందాఁక రిపులఁ జూచియుఁ దనమైఁ**
**గప్పికొని యుండవలయును, నొప్పుగ నహి మూషకమున కొదిగిన భంగిన్. 173**

* ఎందుకంటే ఎలుకకోసం పాము పొంచి ఉండే విధంగా బలం సమకూరే దాకా సమయం కోసం నిరీక్షిస్తూ పగవారి బారినుండి శరీరాన్ని దాచుకొని ఉండడం ఉత్తముల లక్షణం.

**క. అమృతోత్పాదన యత్నము, విమల మతిం జేయు టొప్పు; వేల్పులు వినుఁడీ,**
**యమృతంబుఁ ద్రావి జంతువు,లమృతగతిన్ బ్రదుకుచుండు నాయుర్వృద్ధిన్. 174**

* ఓ దేవతలారా! వినండి. నిర్మలమైన మనస్సుతో మీరు అమృతాన్ని ఉత్పత్తి చేయడానికి ప్రయత్నించడం మేలు. అమృతాన్ని త్రాగిన వారికి ఆయుస్సు పెరుగుతుంది. మరణం లేని మనుగడ కలుగుతుంది.

**సీ. పాలమున్నీటి లోపల సర్వతృణలతౌషధములు దెప్పించి చాల వైచి**
**మందర శైలంబు మంథానముగఁ జేసి తనర వాసుకిఁ దరిత్రాడు సేసి**
**నా సహాయతచేత నలి నందఱును మీరు తరువుఁడు వేగ మతంద్రు లగుచు;**
**ఫలము మీఁదయ్యెడు బహుళ దుఃఖంబులఁ బడుదురు దైత్యులు పాపమతులు;**

**ఆ. అలసటయును లేక యఖిలార్థములుఁ గల్గు, విషధిలోన నొక్క విషము పుట్టుఁ;**
**గలఁగి వెఱవ వలదు; కామరోషంబులు, వస్తుచయము నందు వలదు చేయ. 175**

* మీ రందరూ పాలసముద్రంలో పలువిధాలైన తృణాలనూ, మొక్కలనూ, తీగలనూ, ఔషధాలనూ విరివిగా తెప్పించి వేయండి. మందరపర్వతాన్ని కవ్వంగానూ, సర్పరాజైన వాసుకిని కవ్వపు త్రాడుగానూ

చేసుకొని నా సహాయంతో జాగ్రత్తగా పాలకడలిని చిలకండి. అందువల్ల మీకు ప్రయోజనం కలుగుతుంది. పాపాత్ములైన రాక్షసులు పలుకష్టాల పాలవుతారు. అన్ని సంపదలూ మీకు లభిస్తాయి. ఆ సముద్రంలో ఒక విషం పుట్టుతుంది. అందుకు మనసు చెడి మీరు భయపడరాదు. దానిలో పుట్టే వస్తువుల పట్ల ఇష్టానిష్టాలు చూపరాదు.

వ. అని యాదేశించి. 176

క. అంతాది రహితుఁ డచ్యుతుఁ, డంతర్ధానంబు నొందె; నజ ఫాలాక్షుల్
సంతోషంబునఁ దమ తమ, కాంతాలయములకుఁ జనిరి గౌరవ మొప్పన్. 177

* ఆదీ అంతమూ లేని విష్ణువు పైవిధంగా ఆజ్ఞాపించి అదృశ్యమైనాడు. బ్రహ్మ, శివుడూ సంతోషంగా తమ తమ నిలయాలకు వెళ్ళి పోయినారు.

క. కయ్యంబు సేయ నొల్లక, నెయ్యంబున నతులు వెట్టి నిర్జర నికరం
బియ్యప్పనములు వెట్టుచుఁ, దియ్యంబునఁ గొల్చె బలిని దేవద్వేషిన్. 178

* దేవతలు యుద్ధం మాట వదలి పెట్టినారు. రాక్షసుల రాజైన బలిచక్రవర్తిపట్ల స్నేహాన్నీ భక్తిని కనబరచినారు. అతని ఆజ్ఞలను సంతోషంగా అనుసరించినారు.

క. పసచెడి తనకును వశమై, సుసరపుగతిఁ గొల్చుచున్న సురసంఘములన్
గసిమసఁగి చంపఁ బూనిన, నసురుల వారించె బలియు నతినయయుక్తిన్. 179

వ. అట్లు వారించి వైరోచని రాక్షస సముదయంబున కిట్లనియె. 180

* బలహీనులైన దేవతలు బలవంతులైన బలికి లోబడి మంచి మనస్సుతో సేవించినారు. అట్లుండగా దేవతలను రాక్షసులు కక్షతో చంపివేయాలనుకొన్నారు. కాని బలిచక్రవర్తి నేర్పుతో వారిని అడ్డగించినాడు. అతడు రాక్షసులతో ఇట్లా పలికినాడు.

క. పగవారు శరణు చొచ్చిన, మగతనములు నెఱపఁ దగునె మగవారలకున్
దగు సమయ మెఱుఁగ వలదే, మగఁటిమిఁ బాటింప వలద మర్త్యులతోడన్. 181

* శత్రువులు వెరచి శరణు వేడినప్పుడు పరాక్రమవంతులు తమ పౌరుషాన్ని చూపరాదు. సమయాన్ని గమనించాలి. అందువల్ల మీరు దేవతలపై మీ బాహు బలాన్ని ప్రకటించరాదు.

వ. అని పలికి కొలువు కూటంబున నసుర నికర పరివృతుండై నిఖిల లోక రాజ్యలక్ష్మీ సహితుండై యఖిల విబుధ వీర విజయాహంకార నిజాలంకారుండై సుఖంబునం గొలువున్న విరోచన నందనుం గని శచీవిభుం డుత్తమ సచివుండునుం బోలె సాంత్వన వచనంబుల శాంతిం బొందించి పురుషోత్తమ శిక్షితంబైన నీతిమార్గంబున శంబరునికిం బ్రియంబు సెప్పి, యరిష్టనేమి ననునయించి, త్రిపుర వాసులగు దానవుల నొడంబఱిచి, జంభుని సమ్మతంబు సేకొని, హయగ్రీవుని విగ్రహంబు మాన్చి, నముచి తారక బాణాదులతో సఖ్యంబు నెఱపి, విప్రచిత్తికిం బొత్తు హత్తించి, శకుని విరోచన

**ప్రహేతులకుఁ బోరామి సూపి, మయ మాలి సుమాలి ప్రముఖులకు మైత్రి యెఱింగించి; కుంభనికుంభులకు సౌజన్యంబు గైకొలిపి, పౌలోమ కాలకేయ నివాత కవచాదులయెడ బాంధవంబు ప్రకటించి, వజ్రదంష్ట్రికి వశుండై, యితర దానవ దైత్యసమూహంబు వలన నతిస్నేహంబు సంపాదించి, మనకు నక్క చెలియండ్ర బిడ్డలకు నొడ్డారంబు లేమిటికి? నేక కార్యపరత్వంబున నడ్డంబు లేక బ్రదుకుద; మన్యోన్య విరోధంబు లేల? తొల్లి యన్యోన్యవిరోధంబున నలంగితి; మిది మొదలు దనుజ దివిజ సముదయంబులకు రాజు విరోచన నందనుండ; మనమందఱ మతని పంపు సేయంగలవార; ముభయ కులంబును వర్ధిల్లునట్టి యుపాయం బెఱింగింతునని యమృత జలధిమథన ప్రారంభ కథనంబు దెలియం జెప్ప; నట్లు సురాసుర యూథంబులు బలారాతిబలి ప్రముఖంబులై పరమోద్యోగంబున సుధాసంపాదనాయత్త చిత్తులై యైకమత్యంబు నొంది యమంద గమనంబున మందర నగంబునకుం జని. 182**

* కొలువుకూటంలో దేవతలు బలిచక్రవర్తిని చుట్టు ముట్టి సేవించినారు. అన్ని లోకాల రాజ్యాలనూ గెలుచుకొన్న వైభవంతోనూ దేవతా వీరులను ఓడించిన గర్వంతోనూ బలిచక్రవర్తి సుఖంగా ఉండినాడు. మంచి మంత్రివలె దేవేంద్రుడు ఓదార్పు మాటలతో బలిచక్రవర్తికి శాంతి కలిగించినాడు. అంతేకాక శంబరుడూ, అరిష్టనేమి, త్రిపురాసురులూ, జంభుడూ, హయగ్రీవుడూ, నముచీ, తారకుడూ, బాణుడూ, విప్రచిత్తీ, శకుని, విరోచనుడూ, ప్రహేతీ, మయుడూ, మాలీ, సుమాలీ, కుంభుడూ, నికుంభుడూ, పౌలోముడూ, కాలకేయులూ, నివాత కవచులూ, వజ్రదంష్ట్రీ మొదలైన రాక్షసులతో వినయమూ విధేయతా కలిగి స్నేహం చేసినాడు.

"అక్కాచెల్లెండ్ర బిడ్డలమైన మనకు పగ తగదు. కలసి కట్టుగా పనిచేసి ఎదురు లేకుండా బ్రతుకుదాము. మనకింక విరోధాలు వద్దు. విరోధంవల్ల ఇదివరలో ఇబ్బంది పడినాము. ఇకపై రాక్షసులకూ దేవతలకూ బలిచక్రవర్తియే రాజు. మన మందరూ ఆయన ఆజ్ఞకు కట్టుబడి ఉందాము. మన కులాలు రెండూ బాగుపడే ఉపాయం చెప్పుతాను'' అంటూ పాలసముద్రాన్ని మథించాలనే సంగతి తెలిపినాడు.

దేవతల సమూహానికి ఇంద్రుడూ, రాక్షసుల సమూహానికి బలిచక్రవర్తీ నాయకులై ఐకమత్యంతో, గొప్ప పూనికతో అమృతాన్ని సంపాదించడానికి నిశ్చయించుకొన్నారు. అందరూ కలిసి వడివడిగా మందరపర్వతం దగ్గరికి వెళ్ళినారు.

**సీ. వాసవు వర్ధకి వాఁడిగాఁ జఱచిన కుద్దాలముఖములఁ గొంత ద్రవ్వి**
**ముసలాగ్రములు చొన్పి మొదలి పాఁ తగలించి దీర్ఘ పాశంబులఁ దిండు సుట్టి**
**పెకలించి బాహులఁ బీడించి కదలించి పెల్లార్చి తమ తమ పేరువాడి**
**పెఱికి మీఁదికి నెత్తి పృథుల హస్తంబులఁ దలల భుజంబులఁ దరలకుండ**

**తే. నాని మెల్లన కుఱుతప్పుటడుగు లిడుచు, భార మధికంబు మఱవక పట్టుఁ డనుచు**
**మందరనగంబుఁ దెచ్చి రమందగతిని, దేవదైత్యులు జలరాశి తెరువు వట్టి. 183**

* దేవదానవులు దేవతాశిల్పియైన త్వష్ట పదును పెట్టిన త్రవ్వుగోలలతో మందర పర్వతాన్ని కొంత త్రవ్వినారు; రోకండ్లను లోనికి చొప్పించినారు. పొడుగాటి త్రాళ్ళతో బిగించి చుట్టినారు. ఆ కొండను

మెల్లగా కుళ్లగించి చేతులతో గట్టిగా పట్టి కదలించినారు. తమ తమ బిరుదులు ప్రకటించుతూ గావు కేకలు వేస్తూ బలాన్ని ఉపయోగించి పెరికి పెల్లగించి పైకెత్తినారు. బలమైన తమ చేతులతోనూ, తలలతోనూ, భుజాలతోనూ జారకుండా కొండను ఎత్తుకొన్నారు. మెల్లగా అడుగులు వేసినారు. 'బరువెక్కువగా ఉంది. జాగ్రత్తగా పట్టండి' అంటూ చురుకుగా ఆ కొండను సముద్రం వైపుకు మోసుకొని, తీసుకొని వచ్చినారు.

**క. మందరముమోవ నోపమి, నందఱపైఁ బడియె నదియు నతిచోద్యముగాఁ;**
**గొందఱు నేలం గలిసిరి, కొందరు నుగ్గైరి; చనిరి కొందరు భీతిన్.** 184

* మందరపర్వతాన్ని మోయడానికి దేవదానవులకు శక్తి చాలక పోయింది. ఆశ్చర్యకరంగా ఆ కొండ ఒరిగి నేలమీద పడిపోయింది. అప్పుడు కొందరు మరణించినారు. కొందరు నలిగి పోయినారు. కొందరు భయంతో పరుగెత్తినారు.

**క. ఏలా హరికడ కేఁగితి, మేలా దొరఁకొంటి మధిక హేలనశైలో**
**న్మూలనము వేసి తెచ్చితి, మేలా పెక్కండ్రు మడిసి రేలా నడుమన్?** 185

**క. ఏటికి మముఁ బని పంచెను?, నేటికి మనఁ బోఁటివారి కింతలు పను? లిం**
**కేటికి రాఁడు రమేశ్వరుఁ?, డేటి కుపేక్షించె? మఱవనేటికి మనలన్?** 186

* 'విష్ణువు దగ్గరకు ఎందుకు పోయినాము? మైకంతో ఎందుకు ఈ పనికి పూనుకొన్నాము? ఈ కొండను ఎందుకు పెకలించి తెచ్చినాము? చాల మంది చావడం ఎందుకు జరిగింది? ఈ పనికి భగవంతు డెందుకు నియోగించినాడు? మనవంటి వారికి ఇటువంటి పనులు సాధ్యమా? అతడు రాకుండా ఎందుకు నిర్లక్ష్యం చేసినాడో? ఎందుకు మరచి పోయినాడో'?

**వ. అని కులకుధర పతనజన్యంబు దైన్యంబు సహింపనోపక పలవించుచున్న దివిజ దితిజుల భయంబు మనంబున నెఱింగి సకల వ్యాపకుండగు హరి తత్సమీపంబున.** 187

**మ. గరుడారోహకుఁడై గదాదిధరుఁడై కారుణ్యసంయుక్తుఁడై**
**హరికోటిప్రభతో నొహో వెఱవకుం డంచుం బ్రదీపించి త**
**ద్గిరిఁ గేలన్ నలువొందఁ గందుకము మాడ్కిం బట్టి క్రీడించుచున్**
**గరుణాలోకసుధన్ సురాసురుల ప్రాణంబుల్ సమర్థించుచున్.** 188

* ఇలా అనుకొంటూ దేవదానవులు మందరం పడిపోయినందు వల్ల కలిగిన కష్టాన్ని ఓర్చుకోలేక దుఃఖపడినారు. అన్నింటినిలోనూ వ్యాపించి ఉండే విష్ణువు వారి ఆపదను తెలుసుకొన్నాడు. ఆ స్వామి గరుడునిపై కూర్చొని దయతో నిండినవాడై, గదను ధరించి, కోటి సూర్యుల కాంతితో వారి ముందు ప్రత్యక్షమైనాడు, 'ఓహో! భయపడకండి' అన్నాడు. బంతివలె ఆ కొండను నేర్పుతో చేత పట్టుకొని ఆడించినాడు. దయామృతం నిండిన చూపులతో వారిని కాపాడినాడు.

క. వారలు గొలువఁగ హరియును, వారాన్నిధి కరుగు మనఁగ వసుధాధరమున్
వారిజ నయనునిఁ గొంచు న, వారిత గతిఁ జనియె విహగవల్లభుఁ డలుతన్. 189

* విష్ణువు దేవదానవుల సేవ లందుకొన్నాడు. 'సముద్రం వద్దకు కొని పొమ్మని గరుడునికి ఆజ్ఞ ఇచ్చినాడు. గరుడుడు ఆ పర్వతాన్నీ, విష్ణువునూ మూపుపై దాల్చి ఆటంకం లేకుండా ఎగిరిపోయినాడు.

క. చని జలరాశి తటంబున, వనజాక్షుని గిరిని డించి వందనములు స
ద్వినుతులు సేసి ఖగేంద్రుఁడు, పని వినియెను భక్తి నాత్మభవనంబునకున్. 190

* ఓ రాజా! ఆ సమయంలో గరుడుడు సముద్రం గట్టుకు వచ్చి విష్ణువునూ మందర పర్వతాన్నీ అక్కడ దించినాడు. భక్తితో స్వామికి నమస్కరించి స్తోత్రం చేసి తన నివాసానికి వెళ్ళిపోయినాడు.

వ. అప్పుడు. 191

సీ. భూనాథ! వినవయ్య భోగీంద్రు వాసుకిఁ బిలిపించి యతనికిఁ బ్రియము సెప్పి
ఫలభాగ మీ నొడఁబడి సమ్మతునిఁ జేసి మెల్లన చేతుల మేను నివిరి
'నీవ కా కెవ్వరు నేర్తు? రీ పని కియ్య కొ'మ్మని యతని కైకోలు వడసి
కవ్వంపుఁ గొండ నిష్కంటకంబుగఁ జేసి ఘర్షించి యతని భోగంబు జుట్టి

ఆ. కడఁగి యమృత జలధిఁ గలశంబు గావించి, తచ్చు నవసరమునఁ దలఁపు లమర
బద్ధవస్త్రకేశభారులై యా రెండు, గములవారు తరువఁ గదిసి రచట. 192

* దేవతలూ, రాక్షసులూ సర్పరాజైన వాసుకిని పిలిపించి అతనికి ప్రీతి కలిగేటట్లు మాట్లాడినారు. అమృతంలో అతనికి భాగ మివ్వడానికి ఒప్పుకొన్నారు. మెల్లగా అతని శరీరాన్ని దువ్వినారు. ' నీ కంటే సమర్థులు లేర'న్నారు. కవ్వపుత్రాడుగా ఉండడానికి అతనిని ఒప్పించినారు. నొప్పి కలగకుండా మందర పర్వతాన్ని చదును చేసినారు. దానికి వాసుకిని త్రాడుగా చుట్టి పాలసముద్రాన్ని కుండగా చేసినారు. రెండు పక్షాలవారు బారులు తీర్చి వస్త్రాలు ఎగకట్టుకున్నారు. జుట్టు గట్టిగా ముడి చుట్టుకున్నారు. పాలసంద్రం చిలకడానికి తలపడినారు.

వ. తదనంతరంబ. 193

క. హరియును దేవానీకము, నురగేంద్రుని తలలు పట్ట నుద్యోగింపన్
హరిమాయా పరవశులై, సురవిమతులు గూడి పలుకఁ జొచ్చిరి కడిమిన్. 194

* ఆ సమయంలో విష్ణువూ, దేవతలూ వాసుకి తలవైపు పట్టుకోవడానికి ప్రయత్నించినారు. విష్ణువు మాయవల్ల రాక్షసులందరూ ఒళ్ళు తెలియని పట్టుదలతో వాదులాటకు ప్రారంభించినారు.

మత్త. స్వచ్ఛమైన ఫణంబు మీరలు చక్కఁబట్టి మథింపఁగాఁ
బుచ్ఛ మేటికి మాకుఁ బట్టఁగ? బూరుషత్వము గల్గి మే

**మచ్ఛమైన తపోబలాధ్యయనాన్వయంబుల వారమై**
**యిచ్ఛయింతుమె తుచ్ఛవృత్తికి?నిండు మాకు ఫణాగ్రముల్.** 195

**వ. అని పలుకు దనుజులం జూచి.** 196

* "మీరు స్వచ్ఛమైన పడగలు పట్టుకొని చిలుకుతుంటే మేము తుచ్ఛమైన తోకనెందుకు పట్టుకోవాలి? ఇది మాకు చాల అవమానం. మేము పౌరుషమూ, గొప్ప తపస్సూ, చదువూ, కులమూ, బలమూ కలవారము. ఈ నీచమైన పనికి మేము ఒప్పుకోము. మాకు పడగలు ఇవ్వండి. మీరే తోకపుచ్చు కొనండి" అని రాక్షసులు పలికినారు.

**క. విస్మయముఁ బొంది దానవ, ఘస్మరుఁ డహిఫణము విడువ గైకొని యసురుల్**
**విస్మితముఖులై యార్చి ర, విస్మితముగఁ గొనిరి సురలు వీఁకం దోఁకన్.** 197

* విష్ణువు ఆశ్చర్యంతో వాసుకి పడగ విడిచిపెట్టినాడు. రాక్షసులు గర్వంతో కూడిన మొగాలతో కేకలు వేస్తూ పడగలు పట్టుకొన్నారు. దేవతలు వినయంతో తోక పట్టుకొన్నారు.

**వ. ఇట్లు సమాకర్షణ స్థానభాగ నిర్ణయంబు లేర్పఱచుకొని దేవతలు పుచ్ఛంబును, బూర్వదేవతలు ఫణంబులుం బట్టి పయోరాశి మధ్యంబునం బర్వతంబు వెట్టి పరమాయత్త చిత్తులై యమృతార్థంబు ద్రచ్చుచున్న సమయంబున.** 198

* పై విధంగా ఏర్పాటు చేసుకొని సముద్రం నడుమ మందర పర్వతాన్ని ఉంచి అమృతం కోసం గట్టి నిర్ణయంతో వాసుకితోకను దేవతలూ, పడగలను రాక్షసులూ పట్టుకొని చిలుకుతున్నారు.

**క. విడువిడుఁడని ఫణి పలుకఁగఁ, గడుభరమున మొదలఁ గుదురు గలుగమిఁ వెడఁగై**
**బుడ బుడ రవమున నఖిలము, వడ వడ వడఁకఁగ మహాద్రి వనధి మునింగెన్.** 199

* ఆ సమయంలో వాసుకి 'వదలండి వదలండి' అన్నాడు. కొండ అడుగున కుదురు లేనందువల్ల ఆ పర్వతం మిక్కిలి బరువై సముద్రంలో బుడ బుడ మని మునిగింది. దేవరాక్షస సమూహం గడ గడ వడకింది.

**ఉ. గౌరవమైన భారమునఁ గవ్వపుఁగొండ ధరింపలేక దో**
**స్సార విహీనులై యుభయ సైనికులుం గడు సిగ్గుతో నకూ**
**పార తటంబునం బడిరి పౌరుషముం జెడి పాండవేయ! యె**
**వ్వారికి నేరఁబోలు బలవంతపు దైవము నాక్రమింపఁగన్?** 200

* ఓ రాజా! దేవతలూ రాక్షసులూ భుజశక్తి కోల్పోయినారు. గొప్ప పూనికతో మందర పర్వతాన్ని మళ్లీ పైకి ఎత్తలేక పోయినారు. మిక్కిలి సిగ్గుపడినారు. పరాక్రమం గోల్పోయి సముద్రం గట్టుపై నిలబడి మిక్కిలి బాధపడినారు. ప్రబలమైన విధిని దాటడానికి ఎవరికి సాధ్యం కాదు గదా!

క. వననిధి జలముల లోపల, మునిఁగెడి గిరిఁ జూచి దుఃఖమునఁ జింతాబ్ధిన్
మునిఁగెడి వేల్పులఁ గనుఁగొని, వనజాక్షుఁడు వార్ధినడుమ వారలు సూడన్. 201

* సముద్రం నీళ్ళలో మునుగుతున్న మందరపర్వతాన్ని చూచి అంతులేని దుఃఖసముద్రంలో మునుగుతున్న దేవతలను విష్ణువు అవలోకించినాడు. వారు చూస్తూండగానే అతడు సముద్రంలో దిగినాడు.

## -: కూర్మావతార కథా ప్రారంభము :-

సీ. సవరనై లక్షయోజనముల వెడలుపై కడుఁ గఠోరమునైన కర్పరమును
నదనైన బ్రహ్మాండమైన నాహారించు ఘన తరంబగు ముఖగహ్వరంబు
సకల చరాచర జంతురాసుల నెల్ల మ్రింగి లోఁగొనునట్టి మేటి కడుపు
విశ్వంబుపై వేఱు విశ్వంబు పైఁ బడ్డ నాఁగినఁ గదలని యట్టి కాళ్ళు

తే. వెలికి లోనికిఁ జనుదెంచు విపుల తుండ, మంబుజంబులఁ బోలెడు నక్షియుగము
సుందరంబుగ విష్ణుండు సురలతోడి, కూర్మి చెలువొంద నొక మహా కూర్మమయ్యె. 202

* విష్ణుదేవుడు దేవతలపై తన ప్రేమను వెల్లడిస్తూ మహాకూర్మంగా మారిపోయినాడు. ఆ తాబేలుకు లక్ష ఆమడల వెడల్పైన చక్కని గట్టి వీపుడిప్ప ఉంది. ఆకలి గొప్పప్పుడు బ్రహ్మాండాన్ని సైతం కబళించే పెద్దనోరుంది. లోకంలోని ప్రాణు లన్నింటినీ మ్రింగి ఇముడ్చుకొనేటంత పెద్ద కడుపు వుంది. ప్రపంచంపై ఇంకొక ప్రపంచం పడి అడ్డగించినా వెనుదీయకుండా ఉండే కాళ్ళున్నాయి. లోపలికి బయటికీ కదలాడే పెద్దమూతి ఉంది. కమలాల వంటి కన్నుల జంట ఉంది.

మ. కమఠంబై జలరాశిఁ జొచ్చి లఘుముక్తాశుక్తి చందంబునన్
నమదద్రీంద్రము నెత్తె వాసుకి మహానాగంబుతో లీలతో
నమరేంద్రాదులు మౌళికంపములతో నౌ నాఁగదే! బాపురే!
కమలాక్షా! శరణంబు భూదిశలు నాకాశంబునున్ మ్రోయఁగన్. 203

* తాబేలుగా మారిన విష్ణువు ముత్తెపుచిప్ప విధంగా సుళువుగా సముద్రంలో ప్రవేశించినాడు. దానిని చూచి దేవేంద్రాదులు ఆశ్చర్యంతో తలలు ఊగించి భూమీ, దిక్కులూ, ఆకాశమూ మారుమ్రోగునట్లు ' మేలు మేలు. శ్రీహరీ! నీకు నమస్కారం' అని జేజేలు పలికినారు. భగవంతుడు ఆ తాబేలు రూపంతో సముద్రజలాలలో దూరి వాసుకితోపాటు మందర పర్వతాన్ని పైకెత్తినాడు.

వ. ఇవ్విధంబున. 204

క. తరిగాండ్రలోన నొకఁడఁట, తరి కడవకుఁ గుదురు నాఁక త్రాడఁట చేరుల్;
దరి గవ్వంబును దా నఁట, హరి హరి! హరిచిత్రలీల హరియే యెఱుఁగున్. 205

* పై విధంగా విష్ణువు సముద్రాన్ని చిలికే వారిలో ఒకడుగా ఉన్నాడు. సముద్రమనే కడవకు కుదురు ఐనాడు. చిలికే కవ్వమూ కవ్వానికి చుట్టిన త్రాడూ తానే ఐనాడు. ఆహా! విచిత్రమైన విష్ణులీలలు విష్ణువుకే తెలుసు.

ఆ. జలధిఁ గడవ సేయ శైలంబుఁ గవ్వంబు, సేయభోగిఁ ద్రాడుసేయఁ దరువ
సిరియు సుధయుఁ బడయ శ్రీవల్లభుఁడు దక్క, నొరుఁడు శక్తిమంతుఁ డొకఁడు గలఁడె? 206

* సముద్రాన్ని కడవగానూ, పర్వతాన్ని కవ్వంగానూ, సర్పాన్ని త్రాడుగానూ చేసి చిలకడంలోనూ; లక్ష్మిని, అమృతాన్నీ సంపాదించడంలోనూ విష్ణువు తప్ప శక్తి సంపన్నులు వేరే ఎవ్వ రుంటారు?

ఆ. గొల్లవారి బ్రదుకు గొఱఁతన వచ్చునే, గొల్లరీతిఁ బాలకుప్పఁ ద్రచ్చి
గొల్లలైరి సురలు గొల్లయ్యె విష్ణుండు, చేటు లేని మందు సిరియుఁ గనిరి. 207

* గోపాలకుల జీవితం కొంచెమైనది కాదు. దేవతలు గొల్లవారి వలె పాల సముద్రాన్ని చిలికినారు. విష్ణువు సైతం గొల్ల అయినాడు. అమరత్వాన్ని అందించే అమృతాన్నీ శ్రీలక్ష్మినీ పొందగలిగాడు.

వ. ఇట్లు సురాసుర యూథంబును హరిసనాథంబులయి కవచంబులు నెట్టంబులు వెట్టికొని, పుట్టంబులు పిరిచుట్టు సుట్టికొని, కరంబులు కరంబుల నప్పళించుచు, భుజంబులు భుజంబుల నొరయుచు, లెండు లెండు దరువఁ దొడంగుండు రండని యమందగతిం బెరుఁగుం ద్రచ్చు మందగొల్లల చందంబున మహార్ణవమధ్యంబున మంథాయమాన మందర మహీధర విలగ్నభోగి భోగాద్యంతంబులం గరంబులం దెమల్చుచుఁ, బెనుబొబ్బలం బ్రహ్మాండ కటాహంబు నిర్భరంబయి గుబ్బుగుబ్బని యురలు కొండకవ్వంబుగుత్తి జిఱ జిఱం దిరుగు వేగంబున ఛటచ్ఛటాయ మానంబులయి బుగులు బుగుళ్ళను చప్పు ళ్లుప్పరం బెగసి లెక్కకు మిక్కిలి చుక్కల కొమ్మల చెక్కుల నిక్కలువడు మిసిమి గల మీఁది మీఁగడపాల తేటనిగ్గుఁదుంపరల పరంపరల వలన నిజకరక్రమ క్రమాకర్షణ పరిభ్రాంత ఫణి ఫణాగర్భ సముద్భూత నిర్భర విష కీలి కీలజాలంబుల నప్పటప్పటికి నుప్పతిల్లిన దప్పిం గొండొక మందగతిం జెందక యకూపార వేలాతట కుటజ కుసుమగుచ్ఛ పిచ్ఛిల స్వచ్ఛ మకరంద సుగంధి గంధవహంబులం గ్రొంజెమట నీటి పెను వఱదగము లొడళ్ల నిగుర నొండొరులం బరిహసించుచుఁ బేరువాడి విలసించుచు, మేలుమే లని యుగ్గడించుచు, గాదు కాదని భంగించుచు, నిచ్చ మెచ్చని మచ్చరంబు వలన వనధి వలమాన వైశాఖ వసుంధరాధర పరివర్తన సముజ్జనిత ఘుమ ఘుమారావంబును, మథనగుణాయమాన మహాహీంద్రప్రముఖ ముహుర్ముహురుచ్చలిత భూరి ఘోర ఫూత్కార ఘోషం బును, గులకుధర పరిక్షేపణ క్షోభిత సముల్లంఘన సమాకులితంబులై వెఱచఱచి గుబురు గుబురులై యొరలు కమఠ కర్కట కాకోదర మకర తిమితిమింగిల మరాళచక్రవాక బలాహకభేక సారసానీకంబుల మొఱలునుం గూడికొని ముప్పిరిగొని, దనుజ దివిజ భటాట్టహాస తర్జన గర్జన ధ్వనులు నలుపురియై మొత్తినట్లైన దశదిగంత భిత్తులును, బేఁటెత్తి పెల్లగిలం ద్రుళ్ళుచుఁ గికురు పొడుచుచు నొకఁ డొకనికంటె వడియునుం, గడుపునుం గలుగఁ ద్రచ్చుచుఁ బంతంబు లిచ్చుచు సుధాజననంబుఁ జింతించుచు నూతన పదార్థంబులకు నెదుళ్లు సూచుచు నెంతదడవు ద్రత్తమని హరి నడుగుచు నెడపడని తమకంబుల నంతకంతకు మురువు డింపక త్రచ్చు సమయంబున. 208

* పై విధంగా దేవతలూ రాక్షసులూ విష్ణువుతో చేరి కవచాలు ధరించారు. దట్టీలు కట్టుకొన్నారు. బట్టలు పిరిచుట్లు చుట్టుకొన్నారు. చేతులూ చేతులూ చరచు కున్నారు. భుజాలూ భుజాలూ రాచుకున్నారు. "లేవండి, లేవండి, రండి, చిలకండి మొదలు పెట్టండి"- అని హెచ్చరించు కొన్నారు. వేగంగా పెరుగు చిలికే గొల్లపల్లె గోపాలకుల వలె సముద్రం నడుమకవ్వంగా ఉండే మందరపర్వతానికి త్రాడైన పాము తలా తోకా పట్టుకొని మథింపసాగారు. వారి పెద్ద పెద్ద కేకలతో బ్రహ్మాండం నిండి పోయింది. 'గుబ గుబ' మంటూ కవ్వపు కొండ గిర గిర తిరిగింది. అది తిరిగే వేగానికి "భుగ భుగ" మనే శబ్దాలు ఆకాశాన్ని వ్యాపించినాయి. లెక్కకు మించిన చుక్కల చక్కదనంతో ఆ పాలమీగడ తేటలోని కాంతి నిండిన తుంపరల పరంపరలు పై కెగిరినాయి. తమ తమ చేతులతో గట్టిగా పట్టుకొని చిలకడం వల్ల తిరుగుతున్న ఆ సర్పరాజు శరీరంలోనుండి విషాగ్ని కీలలు విపరీతంగా పుట్టినాయి. దానివల్ల సురాసురులకు దాహం హెచ్చింది. ఐనా ఏ మాత్రమూ వారు అలసట పొందలేదు.

ఆ సముద్రంలో గట్టుమీది కొండమల్లె పూలగుత్తులలోని విరివియైన మకరంద సుగంధాలు నిండిన మందమారుతాలు వీచినాయి. ఆ గాలి వల్ల వారి శరీరాల మీది స్వేదధారలు ఇంకిపోయినాయి వారు ఒకరి నొకరు వేళాకోళం చేసుకొంటూ గప్పాలు కొడుతూ "భళి భళీ" అని పొగడుకొంటూ "అలా ఇలా" అని మందలించుకొంటూ అసూయతో పోటి పడి జలధిని మథింపసాగినారు. ఆ కవ్వపు కొండ తిరిగేటప్పుడు 'ఘుమఘుమ' మనే శబ్దం పుట్టింది. కవ్వపు త్రాడైన సర్పం నోటినుండి భయంకరమైన పూత్కార శబ్దాలు రేగినాయి. పర్వతం తిరగడం వల్ల సముద్రం లోపల గుంపులు గుంపులుగా ఉండిన తాబేళ్ళూ, ఎండ్రకాయలూ, పాములూ, మొసళ్ళూ,పెద్దచేపలూ, తిమింగిలాలూ, హంసలూ, చక్రవాకాలూ, కొక్కెరలూ, కప్పలూ, బెగ్గురు పక్షులూ భయపడి ఆర్తనాదాలు చేసినాయి. వాటి అరుపులు మూడురెట్లయినాయి. రాక్షసులూ దేవతలూ పెద్దగా అట్టహాసాలు చేశారు. హెచ్చరికలు చేశారు. వారి తర్జన గర్జన శబ్దాలు నాలుగు రెట్లుగా హెచ్చినాయి. పదిదిక్కులూ పగిలి పాదులూడి కూలిపోయినట్లైనది. ఒకని కంటె ఒకడు మించిపోయి చిలుకుతూ పౌరుషంతో మాట్లాడినాడు. అమృతంకోసం ఉబలాటపడినారు. క్రొత్త వస్తువుల పుట్టుక కోసం ఎదురుచూచినారు. ఇంకా ఎంతసేపు చిలకాలి' అని విష్ణువును అడిగినారు. ఎడతెగని ఆశతో పట్టినపట్టు వదలకుండా మథింపసాగినారు.

**క. అప్పాల వెల్లిలోపల, నప్పటి కప్పటికి మందరాగము దిరుగం**
**జప్పుడు నిండె నజాండము, సెప్పెడి దే మజుని చెవులు సిందఱగొనియెన్.** **209**

* ఆ పాలసముద్రంలో మందరపర్వతం గిరిగిరా తిరిగింది. దాని శబ్దం బ్రహ్మాండమంతా నిండింది. బ్రహ్మదేవుని చెవులు గింగురుమన్నాయి. ఇంక చెప్పవలసిందేముంది?

**వ. అంత న ప్పయోరాశి మధ్యంబున.** **210**

**క. ఎడమఁ గుడి మునుపు దిరుగుచుఁ, గుడి నెడమను వెనుకఁ దిరుగు కులగిరి గడలిం**
**గడ లెడల సురలు నసురులుఁ, దొడి తొడి ఫణి ఫణము మొదలుఁ దుదియును దిగువన్.** **211**

* ఆ సముద్రంలో మందరపర్వతం మొదట ఎడమవైపు నుండి కుడి వైపుకు తిరుగుతూ, తరువాత కుడి వైపు నుండి ఎడమ వైపుకు తిరిగేది. అప్పుడు దేవతలూ రాక్షసులూ ఉండేచోట్లు మారి పోయేవి. వారు తొందర తొందరగా పాము తోకా తల గట్టిగా పట్టుకొని చిలికేవారు.

క. వడిగొని కులగిరిఁ దరువఁగ, జడనిధి ఖగ మకర కమఠ ఝష ఫణిగణముల్
సుడివడుఁ దడఁబడుఁ గెలఁకులఁ, బడు భయపడి నెగసి బయలఁబడు నురలిపడున్. 212

* ఆ సముద్రంలో ఉండే పక్షులూ తాబేళ్లూ చేపలూ సర్పాలూ చీకాకు పడుతూ తొట్రుపడుతూ ప్రక్కలకు పడుతూ భయంతో ఎగిరి గట్టుపై పడుతూ పొరలుతూ ఉన్నాయి.

క. అమరాసుర కరవిహరి, భ్రమణ ధరాధరవరేంద్ర భ్రమణంబును దాఁ
గమఠేంద్రు వీఁపు తీఁటను, శమియింపఁగఁ జాలదయ్యె జగతీనాథా! 213

* ఓ రాజా! దేవతలూ రాక్షసులూ త్రిప్పుతున్న మందరపర్వతం రాపిడి కూడా కూర్మరాజు వీపు దురదను పోగొట్ట లేక పోయింది.

వ. తదనంతరంబ. 214

క. ఆలోల జలధి లోపల, నాలో నహి విడిచి సురలు నసురులుఁ బఱవం
గీలా కోలాహలమై, హాలాహల విషము పుట్టె నవనీనాథా! 215

* అటు తర్వాత అల్లకల్లోలమైన పాలసముద్రంలో నుంచి అగ్ని జ్వాలలు కోలాహలంతో కూడిన హాలాహలమనే మహావిషం పుట్టింది. అది చూచి భయంతో దేవతలూ, రాక్షసులూ వాసుకిని వదలిపెట్టి పరుగెత్తినారు.

వ. అదియునుం బ్రళయకాలాభీల ఫాలలోచన లోచనానల శతంబు చందంబున నమందంబై విలయ దహన సహస్రంబు కైవడి వడియై, కడపటి పట్టపగలింటి వెలుంగుల లక్ష తెఱంగున దుర్లక్షితంబై, తుదిరేయి వెలింగిన మొగిలు గమలు వలనుం బడు బలు పిడుగుల వడువున బెడిదంబై, పంచభూతంబులుం దేజోరూపంబులైన చాడ్పున దుస్సహంబై, భుగ భుగాయమానంబులైన పొగలును, జిటజిటాయమానంబులైన విస్ఫులింగంబులును, ధగధగాయ మానంబులైన నెఱమంటలును గలిగి మహార్ణవ మధ్యంబున మందర నగం బమంథరంబుగం దిరుగునెడ జనియించి పటపటాయమానంబై నింగికిం బొంగి, దిశలకుం గేలుసాఁచి బయళ్లు ప్రబ్బికొని, తరిగవ్వంపుఁ గొండ నండ గొనక, నిగిడి కడల నలుగడలకుం బఱచి, దరుల కుఱికి, సురాసుర సముదయంబులన్ దరికొని, గిరివర గుహాగహ్వరంబుల సుడివడక, కులశిఖరి శిఖరంబుల నెరగలివడి, గహనంబుల దహించి, కుంజ మంజీర పుంజంబుల భస్మంబు సేసి, జనపదంబు లేర్చి, నదీ నదంబు లెరియించి,దిక్కుంభి కుంభములు నిక్కలు వడ నిక్కి, తరణితారామండలంబులపై మిట్టించి, మహర్లోకంబు దరికొని, యుపరిలోకంబునకు మాఱు గొనలిడి. సుడివడి, ముసరుకొని, బ్రహ్మాండ గోళంబు చిటిలిపడన్ దాఁటి పాతాళాది లోకంబులను వ్రేళ్లువాఱి, సర్వలోకాధికంబై శక్యంబు గాక యెక్కడఁ జూచినం దానయై, కురంగంబు క్రియం గ్రేళ్లుఱుకుచు భుజంగంబు విధంబున నొడియుచు, సింగంబుభంగి లంఘించుచు, విహంగంబు పగిది నెగయుచు, మాతంగంబు పోలికి నిలువంబడుచు, నిట్లు హాలాహల దహనంబు జగంబులం గోలాహలంబు సేయుచున్న సమయంబున, మెలకు సెగల మిడుక జాలక

**నీఱైన దేవతలును, నేలంగూలిన రక్కసులును, డుల్లిన తారకలును గీటడంగిన కిన్నర మిథునంబులును, గమరిన గంధర్వ విమానంబులును, జీకాకుపడిన సిద్ధ చయంబులును, జిక్కు పడిన గ్రహంబులును, జిందఱవందఱలయిన వర్ణాశ్రమంబులును, నిగిరిపోయిన నదులును, నింకిన సముద్రంబులును, గాలిన కాననంబులును, బొగిలిన పురంబులును బొనఁగు పడిన పురుషులును బొక్కిపడిన పుణ్యాంగనా జనంబులును, బగిలిపడిన పర్వతంబులును, భస్మంబులైనట ప్రాణి సంఘంబులును, వేఁగిన లోకంబులును, వివశలైన దిశలును, నొడ్డ గెడవులైన భూజ చయంబులును, నఱవఱలైన భూములునునై, యకాల విలయకాలంబై తోఁచుచున్న సమయంబున. 216**

* మందరపర్వతం రాపిడివల్ల మహాసముద్రంలో పుట్టిన హాలాహలం ప్రళయకాలంలోని రుద్రుని కంటి మంటకు నూరురెట్లు క్రూరమైనది. 'కల్పాంతకాలపు అగ్నికి వెయ్యిరెట్లు తీవ్రమైనది. ప్రళయకాలపు లక్ష సూర్యులవలె తేరి చూడరానిది. ప్రళయరాత్రిలో మెరిసే మేఘాల నుండి కురిసే పిడుగులవలె మహాభయంకరమైనది. భగ భగ మండే పంచ భూతాలవలె భరింపరానది. భుగు భుగ మనే పొగలతో చిటపటమనే నిప్పుకణాలతో ధగ ధగమనే పెనుమంటతో ఫట ఫట మంటూ ఆ మహా విషం ఆకాశానికి పొంగింది. దిక్కులలో వ్యాపించింది. బయళ్ళలో నిండింది. మందరపర్వతాన్ని అతిక్రమించి సముద్రంలో నలువైపులా ప్రాకింది. గట్లను లంఘించింది. దేవదానవుల గుంపులను దాటిపోయింది. కొండగుహలలో తొట్రుపడకుండా ఎత్తయిన గిరి శిఖరాలలో నిప్పులు నింపింది. అడవులను కాల్చింది. పొదరిండ్ల పూల గుత్తులను బూడిద చేసింది. గ్రామాలను కాల్చివేసింది. నదీనదాలను నాశనం చేసింది. దిగ్గజాల కుంభస్థలాలపైకి ప్రాకింది. సూర్య గోళాన్ని నక్షత్రాలను అణగదొక్కింది. మహర్లోకాన్ని మసిచేసింది. పైలోకాలకు కీడు కలిగేటట్లు ఎదిగి పోయింది. చుట్టు ముట్టి క్రమ్ముకొని బ్రహ్మాండం ప్రేలిపోయేటట్లు విస్తరించింది. పాతాళలోకం దాకా వేళ్లు పాకింది.

ఆ హాలాహల మహావిషాగ్ని ఎటుచూచినా అసాధారణంగా అన్ని లోకాలలోనూ కిక్కిరిసింది. జింకవలె గంతులు వేసింది. పాములె ప్రాకింది. సింహంవలె దూకింది. పక్షివలె ఎగిరింది. ఏనుగువలె కదలకుండా నిలిచింది. లోకాలలో గగ్గోలు కలిగించింది. ఆ పెనుమంటల వేడికి తట్టుకోలేక దేవతలు కొందరు భస్మమైనారు. రాక్షసులు నేలకూలినారు. చుక్కలు రాలిపోయినాయి. కిన్నర దంపతులు రూపుమాసినారు. గంధర్వుల విమానాలు కాలిపోయినాయి. సిద్ధుల గుంపులు చెదరిపోయినాయి. గ్రహాలు సంకటపడినాయి. నదులు ఎండిపోయినాయి సముద్రాలు ఇంకిపోయినాయి. అడవులు మాడిపోయినాయి. పట్టణాలు బావురు మన్నాయి. పురుషులు వెత పొందినారు. పుణ్యస్త్రీలు పొగిలిపోయినారు. పర్వతాలు బ్రద్దలైనాయి. జీవరాసులు బూడిదైనాయి. లోకాలు తపించినాయి. దిక్కులు కలత పొందినాయి. చెట్లు తలక్రిందులైనాయి. నేలలు బదాబదలైనాయి. అకాలంలో ప్రళయం వచ్చి పడినట్లైనది.

**క. ఒడ్డారించి విషంబున, కడ్డము చనుదెంచి కావ నధికులు లేమిన్**
**గొడ్డేటి గ్రమంది రా లన, బిడ్డన నెడలేక జనులు పృథ్వీనాథా! 217**

* రాజా! అప్పుడు ఆ విషాగ్నిని సాహసంతో అడ్డగించి కాపాడే మహనీయులు లేకపోయినారు. ఆలూ బిడ్డా అనే మమకారం లేకుండా జనులు తమ వారిని విడిచిపెట్టి ప్రాణాలు కోల్పోయినారు.

**వ. అప్పుడు. 218**

**మ. చని కైలాసముఁ జొచ్చి శంకరుని వాసద్వారముం జేరి యా**
**సున దౌవారికు లడ్డపడ్డఁ దల మంచుం జొచ్చి 'కుయ్యో! మొఱో!**
**విను మాలింపుము; చిత్తగింపుము; దయన్ వీక్షింపు' మం చంబుజా**
**నన ముఖ్యుల్ గని రార్తరక్షణ కళాసంరంభునిన్ శంభునిన్. 219**

* ఆ సమయంలో బ్రహ్మాది దేవతలంతా కైలాసానికి వెళ్ళారు. ఆ మహేశ్వరుని మందిరం ముంగిట గుమి కూడినారు. పరమేశ్వరుని ద్వారపాలకులు అడ్డగించగా అవసరాన్ని చెప్పి లోపలికి చొచ్చుకొని పోయినారు. దుఃఖపడేవారిని తొందరగా ఆదుకొని రక్షించడంలో అగ్రేసరుడైన పరమేశ్వరుని దర్శనం చేసుకొని "శరణు శరణు చిత్తగించు. దయతో చూడు, కాపాడు" అంటూ బ్రహ్మాది దేవతా ప్రముఖులు మొరపెట్టుకొన్నారు.

**క. వారలు దీనత వచ్చుటఁ గూరిమితో నెఱిఁగి దక్షుకూఁతురు దానుం**
**బేరోలగమున నుండి ద, యారతుఁడై చంద్రచూడుఁ డవసర మిచ్చెన్. 220**

**వ. అప్పుడు భోగిభూషణునకు సాష్టాంగ దండప్రణామంబులు గావించి ప్రజాపతి ముఖ్యు లిట్లని స్తుతియించిరి. 221**

*దయామయుడైన శివుడు ఆ సమయంలో సతీదేవితో కూడి పేరోలగంలో ఉన్నాడు, దుఃఖంతో వచ్చిన దేవతల ఆర్తనాదాలను ఆదరంతో విన్నాడు. బ్రహ్మాదులు సాగిలపడి నమస్కారం చేసి క్రింది విధంగా ప్రార్థించినారు.

**సీ. భూతాత్మ! భూతేశ! భూత భావనరూప! దేవ! మహాదేవ! దేవవంద్య!**
**యీ లోకముల కెల్ల నీశ్వరుండవు నీవు; బంధమోక్షములకుఁ బ్రభుఁడ వీవ;**
**యార్త శరణ్యుండ వగు గురుండవు నిన్నుఁ గోరి భజింతురు కుశలమతులు;**
**సకల సృష్టి స్థితి సంహారకర్తవై బ్రహ్మవిష్ణు శివాఖ్య బరఁగు దీవు;**

**ఆ. పరమ గుహ్య మయిన బ్రహ్మంబు సదసత్త, మంబు నీవ; శక్తి మయుఁడ వీవ**
**శబ్ద యోని వీవ; జగదంతరాత్మవు నీవ, ప్రాణ మరయ నిఖిలమునకు. 222**

* ఓ పరమేశ్వరా! నీవు పంచభూతాలకు ఆత్మయైనవాడవు! భూతనాథుడవు! జీవులకు కారణరూపమైన దేవుడవు! దేవదేవా! మహాదేవా! దేవవంద్యా! అన్ని లోకాలనూ పాలించేవాడవు నీవు. లోకంలోని బంధ మోక్షాలకు ప్రభుడవు నీవు. దుఃఖించే వారిని చేరదీసే తండ్రిని నీవు. బుద్ధిమంతులు ప్రీతితో నిన్ను పూజిస్తారు. సమస్తమైన సృష్టికీ స్థితికీ నాశనానికీ కర్తవు నీవే. బ్రహ్మ, విష్ణువు, శివుడు అనేపేర్లతో ప్రకాశించే వాడవు నీవే.

భావింపరాని పరమాత్మవు నీవే! ప్రకృతి పురుష స్వరూపుడవు నీవే! శక్తియుక్తుడవు నీవే! శబ్దానికి జన్మస్థానం నీవే! లోకానికి అంతరాత్మవు నీవే! సమస్తానికి ప్రాణం నీవే!

**క. నీయంద సంభవించును, నీయంద వసించి యుండు నిఖిల జగములున్**
**నీయంద లయముఁ బొందును, నీయుదరము సర్వభూత నిలయము రుద్రా! 223**

* పరమేశ్వరా! అన్నిలోకాలూ నీలోనే పుట్టుతాయి. నీలోనే నివసిస్తాయి. నీలోనే లయమౌతాయి. అన్ని ప్రాణులకూ నీ ఉదరం ఆలవాలం.

**సీ. అగ్నిముఖంబు; పరాపరాత్మక మాత్మ; కాలంబు గతి; రత్నగర్భ పదము;**
**శ్వసనంబు నీ యూర్పు; రసన జలేశుండు; దిశలు కర్ణంబులు; దివము నాభి;**
**సూర్యుండు గన్నులు; శుక్లంబు సలిలంబు; జఠరంబు జలధులు; చదలు శిరము;**
**సర్వౌషధులు రోమచయములు; శల్యంబు లద్రులు; మానస మమృతకరుఁడు;**

**తే. ఛందములు ధాతువులు ధర్మసమితి హృదయ;, మాస్య పంచక ముపనిష దాహ్వయంబు;**
**నయిన నీ రూపు పరతత్త్వమై శివాఖ్య, మై స్వయం జ్యోతియై యొప్పు నాద్య మగుచు. 224**

* అగ్ని నీ ముఖం. జీవాత్మ పరమాత్మల కలయిక నీ ఆత్మ. కాలం నీ నడక. భూమి నీ పాదం. వాయువు నీ శ్వాస. వరుణుడు నీ నాలుక. దిక్కులు నీ చెవులు. స్వర్గం నీ నాభి. సూర్యుడు నీ దృష్టి. నీరు నీ వీర్యం. సముద్రాలు నీ గర్భం ఆకాశం నీ శిరస్సు ఓషధులన్నీ నీ రోమ సమూహాలు. పర్వతాలు నీ ఎముకలు. చంద్రుడు నీ మనస్సు. వేదాలు నీ ధాతువులు. ధర్మశాస్త్రాలు నీ హృదయం. ఉపనిషత్తులు నీ ముఖాలు. నీ రూపం పరతత్త్వం. నీవు స్వయం ప్రకాశుడవు. శివస్వరూపుడైన పరంజ్యోతివి నీవు.

**క. కొందఱు గలఁ డందురు నినుఁ;, గొందఱు లేఁ డందు రతఁడు గుణి గాఁ డనుచుం**
**గొందఱు; గలఁ డని లేఁ డని,కొందల మందుదురు నిన్నుఁ గూర్చి మహేశా! 225**

* ఓ మహాప్రభూ! కొందరు నీ వున్నా వని అంటారు. కొందరు నీవు లేవంటారు. మరికొందరు నీవు గుణాతీతుడ వంటారు. ఇంకా కొందరు నీవు ఉన్నావో లేవో అనే సందేహంతో కొందలమందు తుంటారు.

**సీ. తలఁపఁ బ్రాణేంద్రియ ద్రవ్యగుణ స్వభావుఁడవు, కాలక్రతువులును నీవ;**
**సత్యంబు ధర్మ మక్షరము ఋతంబును, నీవు ముఖ్యుండవు నిఖిలమునకు**
**ఛందోమయుండవు సత్త్వరజస్తమ, శ్చక్షుండవై యుందు సర్వరూప**
**కామ పురాధ్వర కాలగతాది భూతద్రోహభయము చోద్యంబు గాదు;**

**తే. లీలలోచనవహ్ని స్ఫులింగ శిఖల, నంతకాదులఁ గాల్చిన యట్టి నీకు**
**రాజఖండావతంస! పురాణ పురుష!, దీన రక్షక! కరుణాత్మ! దేవ దేవ! 226**

* ఓ దయామయా! దేవదేవా! పురాణ పురుషా! చంద్రకళా కిరీటా! దీనరక్షకా! ఆలోచిస్తే ప్రాణమూ ఇంద్రియాలు ద్రవ్యగుణాలూ నీకు స్వభావసిద్ధాలు. కాలమూ యజ్ఞాలూ నీవే. సత్యమూ ధర్మమూ ఓంకారమూ

మోక్షమూ నీవే. అన్నింటికీ ఆధారం నీవే. వేదరూపుడవు నీవే. సత్త్వమూ రజస్సూ తమస్సూ నీ నేత్రాలు. అన్ని రూపాలలోనూ నీ వున్నావు. నుదుటి కంటి మంటలతో యమాదులను అవలీలగా నీవు కాల్చినావు. అటువంటి నీకు మన్మథుడూ, త్రిపురాసురులూ, దక్షయజ్ఞమూ, కాలకూటవిషమూ మొదలైన వాటి నుండి హాని కలుగుతుందనే సంకోచం ఏ మాత్రం లేదు.

**ఆ. మూఁడు మూర్తులకు మూఁడు లోకములకు, మూఁడు కాలములకు మూల మగుచు**
**భేద మగుచుఁ దుది నభేదమై యొప్పారు, బ్రహ్మ మనఁగ నీవ ఫాలనయన!** 227

* ఓ శంకరా! ముగ్గురు మూర్తులకూ, మూడు లోకాలకూ, మూడు కాలాలకూ నీవే మూలం. మొదట భేదంతో కన్పించినా చివరికి అభేదస్వరూపంతో ఒప్పుతున్న పరబ్రహ్మం నీవే.

**క. సదసత్తత్త్వ చరాచర, సదనం బగు నిన్నుఁ బొగడ జలజభవాదుల్**
**పెదవులు గదలుప వెఱతురు, వదలక నినుఁ బొగడ నెంతవారము దేవా!** 228

* ఓ స్వామీ! సదసద్రూపమైన ఈ చరాచర ప్రపంచానికి మూలాధారం నీవు. బ్రహ్మాదులు కూడా నిన్ను ప్రస్తుతించడానికి భయపడి పెదవులు కదలించలేదు. అటువంటి నిన్ను స్తుతించటానికి మేమెంతవారం?

**మత్త. బాహుశక్తి సురాసురుల్ చని పాలవెల్లి మథింప హా**
**లాహలంబు జనించె నేరి కలంఘ్య మై భువనంబు గో**
**లా హలంబుగఁ జేసి చిచ్చును లాగముం గొని ప్రాణి సం**
**దోహమున్ బ్రదికింపవే? దయ దొంగలింపఁగ నీశ్వరా!** 229

* ఓ పరమేశ్వరా! దేవతలూ, రాక్షసులూ భుజబలంతో పాలసముద్రాన్ని చిలుకగా హాలాహల విషం పుట్టి లోకాలను కోలాహలం చేస్తున్నది. ఎవరూ దానిని ఎదిరించలేక ఉన్నారు. అది లోకానికి ఎంతో క్షోభ కలిగిస్తూ ఉన్నది. ఆ విషజ్వాలను అవలీలగా పరిగ్రహించు! దయతో ప్రాణికోటిని అనుగ్రహించు!

**క. లంపటము నివారింపను, సంపదఁ గృపసేయ జయము సంపాదింపం**
**జంపెడివారి వధింపను, సొంపారఁగ నీక చెల్లు సోమార్ధధరా!** 230

* ఓ చంద్రశేఖరా! ఆపదను తొలగించడానికీ, ఆనందాన్ని చేకూర్చడానికీ, జయాన్ని సంపాదించ టానికీ, క్రూరులను హతమార్చడానికీ నీకే సాధ్య మవుతుంది.

**క. నీకంటె నొం డెఱుంగము;, నీకంటెం బరులు గావ నేరరు జగముల్;**
**నీకంటె నొడయఁ డెవ్వఁడు, లోకంబుల కెల్ల నిఖిలలోక స్తుత్యా!** 231

* అన్ని లోకాలచేతనూ పొగడబడుతున్న స్వామీ! నీవే మాకు దిక్కు. నిన్ను తప్ప మరెవ్వరినీ ఆశ్రయింపము. నీవు తప్ప ఇంకెవరూ లోకాలను కాపాడలేరు. అన్ని లోకాలలోనూ నీకంటే గొప్పవాడులేడు.

వ. అని మఱియు నభినందించుచున్న ప్రజాపతి ముఖ్యులం గని సకలభూత సముండగు నద్దేవుండు దన ప్రియసతి కిట్లనియె. 232

* ఈ విధంగా సన్నుతించుతున్న బ్రహ్మాదులను చూచి అన్నిప్రాణులనూ సమానంగా ఆదరించే పరమేశ్వరుడు తన అనుంగు ఇల్లాలితో ఇట్లు అన్నాడు.

## -: శివుండు దేవప్రార్థితుండై హాలాహలమును బానము సేయుట :-

క. కంటే జగముల దుఃఖము,వింటే జలజనిత విషము వేఁడిమి; ప్రభువై
యుంటకు నార్తుల యాపద, గెంటించుట ఫలము; దానఁ గీర్తి మృగాక్షీ! 233

* ఓ హరిణాక్షీ! లోకాల దుఃఖాన్ని ఆలోకించి నావా? నీళ్ళలో పుట్టిన ఈ విషం వేడిమి ఎంతటిదో విన్నావా? శక్తి కలిగిన ప్రభువు కష్టపడుతున్న వారి కష్టాన్ని తొలగించాలి. దానివల్ల కీర్తి చేకూరుతుంది.

క. ప్రాణేచ్ఛ వచ్చి చొచ్చిన, ప్రాణుల రక్షింపవలయుఁ బ్రభువుల కెల్లం;
బ్రాణుల కిత్తురు సాధులు, ప్రాణంబులు నిమిష భంగురము లని మగువా! 234

* ఓ మగువా! ప్రాణభయంతో ఆశ్రయించిన ప్రాణులను కాపాడడం ప్రభువుల కర్తవ్యం. ప్రాణాలు నిమిషంలో నశించిపోయేవి. అందువల్లనే ఉత్తములు ప్రాణుల ప్రాణరక్షణకోసం తమ ప్రాణాలను సైతం లెక్క చేయరు.

క. పరహితము సేయు నెవ్వఁడు, పరమ హితుం డగును భూత పంచకమునకుం
బరహితమె పరమ ధర్మము, పరహితునకు నెదురులేదు పర్వేందుముఖీ! 235

* పంచభూతాలకూ పరమాప్తుడై పరులకు సహాయం చేయడం కోసం ఎవడు సుముఖు డవుతాడో అటువంటి వానికి ఎక్కడా తిరుగులేదు. పరోపకారమే పరమోత్తమధర్మం.

క. హరి మది నానందించిన, హరిణాక్షి! జగంబులెల్ల నానందించున్
హరియును జగములు మెచ్చఁగ, గరళము వారించు టొప్పుఁ గమలదళాక్షి! 236

* ఓ కమలాక్షి! విష్ణువు మనస్సు ఆనందపడితే అన్ని లోకాలూ ఆనందపడుతాయి. విష్ణువూ, లోకాలూ సంతోషించే విధంగా హాలాహలాన్ని అదుపుచేయడం మంచిది.

క. శిక్షింతు హాలహలమును, భక్షింతును మధుర సూక్ష్మ ఫలరసము క్రియన్
రక్షింతుఁ బ్రాణి కోట్లను, వీక్షింపుము నీవు నేఁడు వికచాబ్జముఖీ! 237

ఓ పద్మముఖీ! హాలాహలాన్ని దండిస్తాను. తియ్యతియ్యని పండ్లరసం వలె దీనిని ఆరగిస్తాను. ఈ నాడు ప్రాణుల సమూహాన్ని కాపాడుతాను చూడు.

వ. అని పలికిన ప్రాణవల్లభునకు వల్లభ 'దేవా! దేవర చిత్తంబుకొలంది నవధరింతురు గాక!' యని పలికె నని చెప్పిన యమ్మునీంద్రునకు నరేంద్రుం డిట్లనియె. 238

* పై విధంగా పలికిన ప్రాణేశ్వరుడైన మహేశ్వరునితో "స్వామీ! మీ మనస్సుకు తగినట్లు నిశ్చయించుకొండి" అని భవాని పలికింది- అని చెప్పగా శుకునితో పరీక్షిత్తు ఇట్లా అన్నాడు-

మ. అమరన్ లోకహితార్థమంచు నభవుం డౌఁ గాక యం చాడెఁబో
యమరుల్ భీతిని మ్రింగవే యనిరి వో యంభోజ గర్భాదులుం
దముఁ గావన్ హర! లెమ్ము లెమ్మనిరి వో తాఁ జూచి కన్గంట న
య్యుమ ప్రాణేశ్వరు నెట్లు మ్రింగుమనె నయ్యుగ్రానలజ్వాలలన్. 239

వ. అనిన శుకుం డిట్లనియె. 240

* లోకానికి మేలు కలుగుతుందని శివుడు 'సరే' అన్నాడనుకో! భయంతో కూడిన దేవతలు "స్వామి! మ్రింగండి" అని అన్నారనుకో! బ్రహ్మాదులు "మమ్ము రక్షింపుము. లెమ్ము" అని ప్రార్థించినారనుకో! పార్వతీదేవి కన్నులారా ఆ హాలాహలాన్ని చూస్తూ భయంకరమైన ఆ అగ్ని జ్వాలను మ్రింగుమని ప్రాణకాంతునితో ఎట్లా చెప్పింది.- అని అడిగిన పరీక్షిత్తుతో శుకుడు ఇట్లా అన్నాడు:-

క. మ్రింగెడు వాఁడు విభుం డని, మ్రింగెడిదియు గరళ మనియు మే లని ప్రజకున్
మ్రింగు మనె సర్వమంగళ, మంగళసూత్రంబు నెంత మది నమ్మినదో! 241

*మ్రింగేవాడు తన భర్త అని తెలిసీ, మ్రింగేది విషమని తెలిసీ దానివల్ల ప్రజలకు మేలుకలుగుతుందనే ఉద్దేశంతో సర్వమంగళయైన ఆ పార్వతీదేవి మ్రింగుమని చెప్పింది. ఆమె తన మనస్సులో తన మంగళసూత్రాన్ని ఎంతగా నమ్మిందో!

మ. తనచుట్టున్ సురసంఘముల్ జయజయధ్వానంబులన్ బొబ్బిడన్
ఘన గంభీర రవంబుతో శివుఁడు లోకద్రోహి! హుం పోకు ర
మ్మని కెంగేలఁ దెమల్చి కూర్చి కడిగా నంకించి జంబూఫలం
బన సర్వంకషమున్ మహావిషము నాహారించె హేలాగతిన్. 242

* దేవతలు శివుని చుట్టూ చేరి జయ జయ ధ్వానాలు చేసినారు. శివుడు గంభీర కంఠస్వరంతో "ఓహో! లోకద్రోహీ! పోవద్దు. రా! రా!" అంటూ అన్ని చోట్లా వ్యాపించిన మహావిషాన్ని తన చేయి చాచి పట్టుకొని కబళంగా చేసి నేరేడు పండు వలె విలాసంగా భుజించినాడు.

వ. అ య్యవిరళ మహాగరళ దహన పాన సమయంబున. 243

మ. కదలం బాఱవు పాఁప పేరు; లొడలన్ ఘర్మాంబుజాలంబు వు
ట్టదు; నేత్రంబులు నెఱ్ఱగావు; నిజజూటా చంద్రుఁడుం గందఁడున్;

వదనాంభోజము వాడ; దా విషము నాహ్వానించుచో డాయుచోఁ
బదిలుండై కడి సేయుచోఁ దిగుచుచో భక్షించుచో మ్రింగుచోన్. 244

* పరమేశ్వరుడు ప్రచండమైన ఆ విషాగ్నిని ఆహ్వానించే టప్పుడూ, దానిని సమీపించే టప్పుడూ, పదిలంగా కబళం చేసేటప్పుడూ, నోటిలో ఉంచుకునే టప్పుడూ, తినేటప్పుడూ, మ్రింగేటప్పుడూ ఆయన శరీరం మీది సర్పహారాలు కదలలేదు. చెమటలు గ్రమ్మలేదు. కన్నులు ఎఱ్ఱబడలేదు. సిగలోని చంద్రుడు కందలేదు. వదనపద్మం వాడిపోలేదు

క. ఉదరము లోకంబులకును, సదనం బగు టెఱిఁగి శివుఁడు చటుల విషాగ్నిం
గుదురుకొనఁ గంఠబిలమునఁ, బదిలంబుగ నిలిపె సూక్ష్మఫలరసము క్రియన్. 245

* పరమేశ్వరుని ఉదరం సమస్త లోకాలకు సదనం. అందువల్ల ఆయన ఆ భయంకర విషాగ్ని లోనికి పోనీయ కుండా ఏదో ఫలరసంలాగా జాగ్రత్తగా గొంతులోనే ఉండేటట్లు నిలుపుకొన్నాడు.

క. మెచ్చిన మచ్చిక కలిగిన, నిచ్చిన నీవచ్చుఁ గాక యిచ్చ నొరులకుం
జిచ్చుఁ గడిగొనఁగ వచ్చునె, చిచ్చఱచూ పచ్చుపడిన శివునకుఁ దక్కన్. 246

* మెచ్చినపుడూ నచ్చినపుడూ ఇతరులకు ఇచ్చవచ్చినంత ఈయవచ్చును. అంతేకానీ ఇతరులకోసం భగ భగ మండే చిచ్చును మ్రింగటం చిచ్చరకన్నుగల శివునకు తప్ప ఎవరికి సాధ్యమౌతుంది?

ఆ. హరుఁడు గళమునందు హాలాహలము వెట్టఁ, గప్పు గలిగి తొడవు కరణి నొప్పె;
సాధురక్షణంబు సజ్జనులకు నెన్న, భూషణంబు గాదె భూవరేంద్ర! 247

* ఓ రాజా! శివుడు మ్రింగకుండా హాలాహలాన్ని కంఠాన ధరించడంవల్ల ఆయన గొంతుకు నలుపు ఏర్పడి అది ఒక అలంకారం వలె ఒప్పింది. ఆలోచిస్తే సాధుసంరక్షణం ఉత్తములకు ఒక ఆభరణమే కదా!

వ. తదనంతరంబ. 248

క. గరళంబుఁ గంఠబిలమున, హరుఁడు ధరించుటకు మెచ్చి యౌ నౌ ననుచున్
హరియు విరించియు నుమయును, సురనాథుఁడుఁ బొగడి రంత సుస్థిరమతితోన్. 249

* విషాన్ని శివుడు తన కుత్తుకలో ధరించడం చూచి విష్ణువూ బ్రహ్మ పార్వతీ దేవేంద్రుడూ 'మేలు మేలు' అంటూ మెచ్చుకొన్నారు. అచ్చమైన మనస్సుతో పొగడినారు.

క. హాలాహల భక్షణ కథ, హేలాగతి విన్న వ్రాయ నెలమిఁ బఠింపన్
వ్యాళానల వృశ్చికముల, పాలై చెడ రెట్టి జనులు భయవిరహితులై. 250

వ. మఱియు నా రత్నాకరంబు సురాసురులు ద్రచ్చునెడ. 251

* ఓ రాజా! ఎటువంటి జనులైనా ఈ "హాలాహలభక్షణం" కథను సంతోషంగా వినినా వ్రాసినా చదివినా భయానికి గురికారు. వారు పాముల వల్లనూ తేళ్ళవల్లనూ అగ్నివల్లనూ కష్టాన్నీ పొందరు. అనంతరం దేవతలూ, రాక్షసులూ మళ్లీ సముద్రమథనాన్ని కొనసాగించినారు.

## -: పాలకడలిం దరుచునెడ నైరావతాదులు జనించుట :-

క. తెల్లని మేనును నమృతము, జిల్లున జల్లించు పొదుఁగు శితశృంగములుం
బెల్లుగ నర్థుల కోర్కులు, వెల్లిగొలుపు మొదవు పాలవెల్లిం బుట్టెన్. 252

* ఇలా చిలుకుతున్న పాలసముద్రంలోనుంచి మొదటగా కామధేనువు పుట్టింది, అది తెల్లని శరీరమూ, జిల్లుమంటూ బాగా పాలుకార్చే పొదుగూ చక్కని కొమ్ములూ కలిగి ఉన్నది. అది పుష్కలంగా కోరిన కోరికలను కురిపించే వేల్పుటావు.

ఆ. అగ్నిహోత్రి యనుచు నా సురభిని దేవ, మునులు పుచ్చికొనిరి మున్నెఱింగి
విబుధ సంఘములకు వెరవుతో నధ్వర, హవులు వెట్టుకొఱకు నవనినాథ! 253

* కామధేనువు హోమకార్యాలకు తగిందని దేవమునులు ముందుగానే తెలుసుకొన్నారు. యాగాలకు తగినట్లు హవిస్సు సమకూర్చగల అ సురభిని వారు తీసుకొన్నారు.

వ. మఱియు నా జలరాశియందు. 254

క. సచ్చంద్రపాండురంబై, యుచ్చైశ్శ్రవ మనఁగఁ దురగ మొగి జనియించెం
బుచ్చి కొనియె బలి దైత్యుం, డిచ్చఁ గొనం డయ్యె నింద్రుఁ డీశ్వరశిక్షన్. 255

* అటు తరువాత సముద్రంలో “ఉచ్చైశ్శ్రవ” మనే గుఱ్ఱం పుట్టింది. అది చంద్రునివలె తెల్లగా ఉంది. దానిని బలి చక్రవర్తి తీసుకొన్నాడు. భగవంతుని ప్రేరణవల్ల ఇంద్రుడు అందుకు కాదనలేదు.

క. ఒఱ పగు నురమును బిఱుఁదును, నెఱిఁ దోకయు ముఖము సిరియు నిర్మలఖురముల్
కుఱుచ చెవులుఁ దెలిగన్నులుఁ, దఱచగు కందంబుఁ జూడఁ దగు నా హరికిన్. 256

* ఉచ్చైశ్శ్రవం అందమైన రొమ్మూ, చిక్కనైన పిరుదూ, చక్కనైన తోకా, కళకళలాడే కాంతి నిండిన మొగమూ, గుండ్రని గిట్టలూ, కురుచైన చెవులూ, శుభ్రమైన కన్నులూ, నిగ నిగలాడే మెడ కలిగి చూడ ముచ్చటగా ఉంది.

వ. అంత న ప్పాలకుప్పయందు. 257

క. దంత చతుష్టాహతి శై, లాంతంబులు విఱిగి పడఁగ నవదాత కుభృ
త్కాంతంబగు నైరావత, దంతావళ ముద్భవించె ధరణీనాథా! 258

* ఓ రాజా! ఆ తరువాత పాలసముద్రంలో ఐరావతం అనే ఏనుగు పుట్టింది. అది నాలుగు దంతాలు కలిగి ఉన్నది. వాటితో కొండల శిఖరాలను సైతం కూల్చివేయగల ఆ గజరాజం వెండికొండవలె మనోహరంగా విరాజిల్లుతూ ఉంది.

క. తడలేని నడపు వడి గల, యొడలును బెను నిడుదకరము నురుకుంభములున్
బెడఁగై యువతుల మురిపపు, నడకలకున్ మూలగురు వనన్ గజ మొప్పెన్. 259

* ఐరావతం తడబాటులేని అందమైన నడకల వేగం కలది. పొడవైన తొండమూ పెద్దకుంభస్థలమూ కలిగింది. ప్రాయపు ఆడవారి కులుకు నడకలకు అది ఒజ్జబంతి అనే విధంగా ఉంది.

వ. మఱియు నత్తరంగిణీ వల్లభు మథించు నయ్యెడ. 260

ఆ. ఎల్ల ఋతువులందు నెలరారి పరువమై, యింద్రు విరులతోఁట కేపు దెచ్చి
కోరి వచ్చువారి కోర్కుల నీనెడు, వేల్పుమ్రాను బాలవెల్లిఁ బుట్టె. 261

* అటుతరువాత ఆ సముద్రాన్ని చిలికేటప్పుడు అందులో నుంచి కల్పవృక్షం పుట్టింది. అది అన్ని ఋతువులలోనూ విరబూచి రాలిపోని పూలతో ఇంద్రుని నందన వనానికి ఇంపు గూర్చేది. ఆశ్రయించిన వారి కోర్కులను తీర్చేది.

వ. మఱియునుం గొండకవ్వంబునం గడలి మథింప నప్సరోజనంబు జనించె; నంత. 262

క. క్రొక్కారు మెఱుఁగు మేనులు, గ్రిక్కిరిసిన చన్నుగవలుఁ గ్రిస్సిన నడుముల్
పిక్కటిలి యున్న తుఱుములుఁ, జక్కని చూపులును దివిజసతులకు నొప్పెన్. 263

* ఆ తరువాత పాలసముద్రంలో అప్సరః స్త్రీలు పుట్టినారు. వారికి వానకాలంలోని మెరుపుతీగల వంటి శరీరాలూ, చిక్కని చక్కని స్తనాలూ, సన్నమైన నడుములూ, నిండైనకొప్పులూ, అందమైన చూపులూ అమరివున్నాయి.

వ. మఱియు నా రత్నాకరంబు వందు సుధాకరుం డుద్భవించి, విరించి యనుమతంబునఁ దన యథాస్థానంబునం బ్రవర్తించుచుండె; నంత. 264

* అటు తరువాత ఆ సముద్రంలో చంద్రుడు జన్మించినాడు. అతడు బ్రహ్మ అనుమతితో తన మొదటిస్థానాన్నే అధిష్ఠించాడు.

క. తొలుకారు మెఱుఁగు కైవడిఁ, దళ తళ మని మేను మెఱయ ధగ ధగ మనుచున్
గలుముల నీనెడు చూపులఁ, జెలువంబుల మొదలి టెంకి సిరి పుట్టె నృపా! 265

* ఓ రాజా! తరువాత ఆ జలనిధిలో నుంచి అందచందాలకు పెన్నిధియైన లక్ష్మీదేవి పుట్టింది. ఆమె కొంగ్రొత్త మెరపు తీగవలె తళ తళ మనే దేహంతో విరాజిల్లుతున్నది. ధగ ధగ మనే ఆమె చూపులు సంపదలను వెదజల్లుతున్నాయి.

సీ. పాలమున్నీటి లోపలి మీఁది మీఁగడ, మిసిమి జిడ్డునఁ జేసి మేను వడసి
క్రొక్కారు మెఱుఁగుల కొనల తళుక్కుల మేనిచే గలనిగ్గు మెఱుఁగు సేసి

నాడుఁ నాఁటికిఁ బ్రోది నవకంపుఁదీవల నునుఁ బోద నెయ్యంబు నూలుకొలిపి
క్రొవ్వారు కెందమ్మి కొలఁకులఁ బ్రొద్దునఁ బొలసిన వలపులఁ బ్రోది వెట్టి

తే. పసిఁడి చంపక దామంబు బాగుఁగూర్చి, వాలు క్రొన్నెల చెలువున వాఁడి దీర్చి
జాణతనమునఁ జేతుల జడ్డు విడిచి, నలువ యీ కొమ్మ నొగిఁ జేసినాఁడు నేఁడు. 266

* బ్రహ్మదేవుడు పాలసముద్రంపైన ఉండే మీగడ మిస మిసలతో ఈమె దేహాన్ని నేర్పుగా దిద్ది తీర్చి, వర్షాకాలపు మెరుపుల అంచులలోని సరికొత్త కాంతిరేఖలతో మెరుగుపెట్టి, కోమల మైన తీగల నున్నని చెలువంతో దిన దినమూ చెలిమి చేయించి, విరిసిన ఎఱ్ఱతామరల కొలనులో వేకువజామున వెలసే సువాసనతో ప్రోదిచేసి, బంగారు సంపెంగల దండ అందాన్ని సమకూర్చి, బాలచంద్రుని సొగసుతో పదును పెట్టి ఈ అందాల రాశిని సృష్టించినాడా అనేటట్లు లక్ష్మీదేవి ఒప్పారింది.

క. కెంపారెడు నధరంబును, జంపారెడి నడుము సతికి శంపారుచులన్
సొంపారు మోముఁ గన్నులుఁ, బెంపారుచు నొప్పుగొప్పు ( బిఱుఁదును గుచముల్. 267

* లక్ష్మీదేవికి ఎఱ్ఱని పెదవులూ, సన్నని నడుమూ, మెరపు కాంతులతో మేలైన మొగమూ, తళుకు కన్నులూ, కొప్పు, కటి ప్రదేశమూ, చిక్కని కుచాలూ పెంపొందు తున్నాయి.

వ. అని జనులు పొగడు చుండ. 268

సీ. తరుణికి మంగళస్నానంబు సేయింత మని పెట్టె నింద్రుఁ డనర్ఘమైన
మణిమయ పీఠంబు; మంగళవతులైన వేలుపు గరితలు విమల తోయ
పూర్ణంబులై యున్న పుణ్యాహ కలశంబు లిడిరి పల్లవముల నిచ్చెభూమి;
గడిమి గోవులు పంచగవ్యంబులను నిచ్చె మలసి వసంతుఁడు మధు వొసంగె;

తే. మునులు కల్పంబుఁ జెప్పిరి మొగిలుగములు, పణవ గోముఖ కాహళ పటహ మురజ
శంఖ వల్లకీ వేణు నిస్వనము లిచ్చెఁ, బాడి రాడిరి గంధర్వ పతులు సతులు. 269

* ఈ విధంగా జనులు పొగడు తుండగా జవరాలైన లక్ష్మీదేవికి మంగళస్నానం చేయించడం కోసం ఇంద్రుడు వెలలేని రత్నాలపీఠం అమర్చినాడు. వేల్పుముత్తైదువలు నిర్మలమైన నీళ్ళు నిండిన కడవలు కొని తెచ్చినారు. భూదేవి కలశాలలోనికి చిగుళ్ళ నిచ్చింది. గోవులు పాలూ పెరుగూ నెయ్యీ మొదలైన వాటి నిచ్చినాయి. వసంతుడు విరివిగా తేనె అందిచ్చినాడు. మునులు సంకల్పం చెప్పినారు. మేఘాలు పణవాలూ, గోముఖాలు, బాకాలూ, తప్పెటలూ, మద్దెలలూ, శంఖాలూ, వీణలూ, పిల్లన గ్రోవులూ మ్రోగినట్లు ధ్వనించాయి. గంధర్వులు పాడారు. గంధర్వకాంతలు ఆడారు.

క. పండిత సూక్తుల తోడుతఁ, దుండంబులు సాఁచి తీర్థ తోయములెల్లం
గుండముల ముంచి దిగ్బే, దండంబులు జలక మార్చెఁ దరుణీ మణికిన్. 270

* మహాపండితులు మంగళాశీస్సులు పలుకుతుండగా దిగ్గజాలు తొండాలు చాచి పుణ్యతీర్థాలలోని జలాలతో అన్నులమిన్నయైన లక్ష్మికి స్నానం చేయించినాయి.

సీ. కట్టంగఁ బచ్చని పట్టుఁబుట్టముదోయి ముదితకుఁ దెచ్చి సముద్రుఁ డిచ్చె
మత్తాళి నికరంబు మధు వాన మూఁగిన వైజయంతీమాల వరుణుఁ డిచ్చెఁ
గాంచన కేయూర కంకణ కింకిణీ కటకాదులను విశ్వకర్మ యిచ్చె
భారతియొక మంచి తారహారము నిచ్చెఁ బాణిపద్మము నిచ్చెఁ పద్మభవుఁడు

తే. కుండలివ్రజంబు గుండలముల నిచ్చె, శ్రుతులు భద్రమైన నుతులు సేసె
నెల్ల లోకములకు నేలిక సానివై, బ్రదికె దనుచు దిశలు పలికె నధిప! 271

* ఓ రాజా! లక్ష్మీదేవికి కట్టుకోవడానికి పట్టుబట్టల జతను సముద్రుడు తెచ్చియిచ్చినాడు. మధుకర బృందాలకు విందైన మకరందం చిందే వైజయంతీమాలికను వరుణుడు సమర్పించినాడు. బంగారు బాహుపురులూ కంకణాలూ గజ్జెలూ కడియాలూ మొదలైన అలంకారాలను దేవతల శిల్పియైన విశ్వకర్మ ఇచ్చినాడు. మంచిముత్యాల హారాన్ని సరస్వతి ఇచ్చింది. చేతిలో ధరించే లీలాకమలాన్ని బ్రహ్మదేవుడు ఇచ్చినాడు. నాగరాజులు కర్ణాభరణాలు ఇచ్చినారు. మంగళకరమైన స్తోత్రాలను వేదాలు సమకూర్చినాయి. "ఎల్ల లోకాలకూ ఏలిక సానివై జీవించు'' మంటూ దిక్కులు దీవించినాయి.

వ. మఱియును. 272

సీ. పలుకుల నమృతంబు చిలుక నెవ్వానితో భాషించె వాఁడెపో బ్రహ్మయనఁగ
నెలయించి కెంగేల నెవ్వని వరియించె వాఁడె లోకములకు వల్లభుండు
మెయిదీఁగ నెవ్వని మేనితోఁ గదియించె వాఁడెపో పరమ సర్వజ్ఞమూర్తి
నెలఁతుక యెప్పుడు నివసించు నేయింట నాయిల్లు పరమగు నమృత పదము

ఆ. నింతి చూపు వాఱె నెచ్చోటి కచ్చోటు, జిష్ణుధనద ధర్మ జీవితంబు
గొమ్మ పిన్న నగవు గురుతర దుఃఖ ని, వారణంబు సృష్టి కారణంబు. 273

* అటువంటి లక్ష్మీదేవి అమృతాన్ని ఒలికిస్తూ ఎవనితో పలుకుతుందో అతడే బ్రహ్మ. ఆమె మెచ్చుకొంటూ అంద మైన తన చేతితో ఎవనిని వరిస్తుందో అతడే అన్నిలోకాలకూ అధిపతి. ఆమె తీగవంటి తన మేమ ఎవని మేనితో చేర్చుతుందో అతడే సర్వజ్ఞుడు. ఆమె ఎల్లప్పుడూ ఏ ఇంటిలో కాపురం చేస్తుందో అది కలకాలం కళకళలాడే వైకుంఠం. ఆమె ఎచ్చట తన చూపు ప్రసరిస్తుందో అది ఇంద్రునికీ, కుబేరునికీ, యమునికీ ఆయువుపట్టు, ఆమె చిరునవ్వు దుఃఖాన్ని తొలగించుతుంది; సృష్టిని వెలిగించుతుంది.

వ. మఱియు నక్కొమ్మ నెమ్మనంబున. 274

సీ. భావించి యొకమాటు బ్రహ్మాండ మంతయు నాటల బొమ్మరిల్లని తలంచుఁ
బోలించి యొకమాటు భువనంబు లన్నియుఁ దనయింటిలో దొంతులని తలంచు
బాటించి యొకమాటు బ్రహ్మాది సురులను దనయింటిలో బొమ్మలని తలంచుఁ
గొనకొని యొకమాటు కుంభినీచక్రంబు నలవడ బొమ్మపీఁటని తలంచు.

ఆ. సొలసి యొక్కమాటు సూర్యేందురోచుల, నచటి దీపకళిక లని తలంచు
భామ యొక్క మాటు భారతీదుర్గల, నాత్మసఖు లటంచు నాదరించు. 275

* లక్ష్మీదేవి తన నిండు మనస్సులో బ్రహ్మాండమంతా తన బొమ్మరిల్లుగా ఒకసారి భావించేది. లోకాలన్నీ తన ఇంటిలోని కుండల దొంతులుగా ఒకసారి ఊహించేది. బ్రహ్మమొదలైన దేవతలను తన ఇంటిలోని ఆట బొమ్మలుగా ఒకసారి తలంచేది. భూమండలాన్ని తన బొమ్మల కొలువుగా ఒకసారి మన్నించేది. సూర్యచంద్రుల కాంతులను చిరు దీపాలుగా ఒకసారి చిత్తగించేది. సరస్వతినీ పార్వతినీ తన అనుంగు చెలికత్తెలుగా ఒకమాటు ఆదరించేది.

వ. తదనంతరంబ. 276

ఆ. చంచరీకనికర ఝంకార నినదంబు, దనరు నుత్పలముల దండ (బట్టి
మేఘకోటి నడిమి మెఱుఁగుఁ బుత్తడి మాడ్కి, సురల నడుమ నిలిచె సుందరాంగి. 277

* అటు తర్వాత అందగత్తెయైన ఆ ఇందిరాదేవి ఝంకారం చేస్తున్న తుమ్మెదలతో కూడిన కలువపూల దండను చేతులతో పట్టుకొని మేఘాలమధ్య నుండే మెరుపు తీగవలె దేవతల నడుమ నిలిచింది.

క. ఆ కన్నులు నా చన్నులు, నా కురు లా పిఱుఁదు నడుము నాముఖ మా న
వ్యాకారముఁ గని వేల్పులు, చీకాకునఁ బడిరి కలఁగి శ్రీహరి దక్కన్. 278

* లక్ష్మీదేవి అపురూపమైన ఆకారం కలిగింది. ఆమె కన్నులూ, ఉరోజాలూ, శిరోజాలూ, పిరుదులూ, నడుమూ, మొగమూ చూచి విష్ణువు తప్ప తక్కిన దేవత లందరూ ధైర్యాన్ని కోల్పోయినారు.

వ. అట్లు నిలిచి దశ దిశలం బరివేష్టించి యున్న యక్ష రక్షస్సిద్ధసాధ్య దివిజ గరుడ గంధర్వ చారణ ప్రముఖ నిఖిల యూథంబులం గనుంగొని య ప్పురాణ ప్రౌఢకన్యకారత్నంబు దనమనంబున నిట్లని వితర్కించె. 279

* లక్ష్మీదేవి నిత్యసౌభాగ్యవతి నిండు జవరాలు. ఆమె అన్ని వైపులా తనను చుట్టుకొనియున్న యక్షులూ, రాక్షసులూ, సిద్ధులు, సాధ్యులు, దేవతలు, గరుడులు, గంధర్వులు, చారణులు మొదలైన వారి నందరినీ చూచింది. ఆ కన్యకారత్నం తన మనస్సులో ఇట్లా ఆలోచించింది-

సీ. ఐదువ నై యుండ నలవడ దొక చోట నొకచోట సవతితో నోర్వ రాదు
తగ నొకచోట సంతత వైభవంబు గా దొకచోట వేఁడిమి నుండఁ బోల
దొకచోటఁ గరుణ లే దొక్కింత వెదకిన నొకచోట దగ్గతి యుండ బెట్ట
నెఱయంగ నొకచోట నిలుకడ చాలదు చర్చింప నొకచోట జడత గలదు.

ఆ. కొన్ని చోట్లు కామగుణ గరిష్ఠంబులు, క్రోధ సంయుతములు గొన్ని యెడలు
గొన్ని మోహలోభ కుంఠితంబులు గొన్ని, ప్రమద మత్సరానుభావకములు. 280

వ. అని సకల సత్పురుష జనన వర్తనంబు మానసించి పరిహరించి. 281

* ఒకచోట ముత్తైదువగా ఉండటానికి వీలుండదు. ఒకచోట సవతివల్ల సైరణ ఉండదు. ఒకచోట ఎల్లప్పుడూ వైభవం నిలిచి ఉండదు. ఒకచోట వెచ్చదనాన్ని భరించడానికి వీలుకాదు. ఒకచోట ఎంత వెదకినా దయ కనిపించదు. ఒక చోట దగ్గరగా ఉంటానికి అవకాశం లేదు. ఒకచోట నిలకడ లభించదు. ఒకచోట జడత్వం అధికం. ఒకచోట చైతన్యం కొరవడి ఉంటుంది. కొన్నిచోట్ల కామగుణం ప్రబలంగా కనిపిస్తుంది. కొన్ని చోట్ల క్రోధం కలిగి ఉంటుంది. కొన్ని చోట్ల మోహమూ, లోభమూ నిండిన మొరటుతన ముంటుంది. కొన్ని చోట్ల గర్వమూ, మచ్చరమూ కూడి ఉంటాయి- ఈ విధంగా లక్ష్మీదేవి అచ్చటి గొప్పవారందరి నడవడికలనూ ఆలోచించి వారిసంగతి విడనాడింది.

సీ. అమర ముత్తైదువనై యుండ వచ్చును వరుసకు సవతు లెవ్వరును లేరు
వెలయంగ నశ్రాంత విభవ మీతని యిల్లు శృంగార చందన శీతలుండు
గలఁగఁ డెన్నఁడు శుద్ధకారుణ్యమయమూర్తి విమలుండు గదిసి సేవింప వచ్చు
నెఱి నాడి తిరుగఁడు నిలుకడ గలవాఁడు సకల కార్యములందు జడత లేదు;

ఆ. సాధురక్షకుండు షడ్వర్గ రహితుండు, నాథుఁ డయ్యె నేని నడప నోపు
నితఁడె భర్త యనుచు నింతి సరోజాక్షుఁ, బుష్ప దామకమునఁ బూజసేసె. 282

* లక్ష్మీదేవి విష్ణువును మెచ్చుకొన్నది. ఇతనివద్ద సౌభాగ్యవతిగా ఉండవచ్చు. వంతుకువచ్చే సవతులు లేరు. ఇతని ఇల్లు ఎడతెగని సంపదలకు విడిది. ఇతడు అందగాడు. చందనం వలె చల్లని వాడు. ఎప్పుడూ కలత పొందడు. దయామయుడు, నిర్మలమైనవాడు. ఇతనిని చేరి సేవించవచ్చు. ఇతడు ఆడినమాట తప్పడు. స్థిరత్వం కలవాడు. ఏ పనిలోనూ ఆలస్యం లేనివాడు. సజ్జనులను కాపాడేవాడు. కామం క్రోధం మొదలైన చెడ్డగుణాలు లేనివాడు. ఇతడే నాకు తగినభర్త'- అని నిశ్చయించుకొన్నది. పూలమాల మెడలో వేసి విష్ణువును వరించింది.

క. ఇందీవర దామమున ము, కుందునిఁ బూజించి తనకుఁ గూడి వసింపన్
మందిరముగఁ దద్వక్షము, నంద సలజ్జా సుదృష్టి నాలోకించెన్. 283

* లక్ష్మీదేవి కలువపూలమాలతో విష్ణువు కంఠాన్ని అలంకరించింది. తాను చేరి నివసించడానికి ఆయన వక్షస్థలాన్ని ఎన్నుకొన్నది. ఆ విశాలవక్షాన్ని సిగ్గునిండిన చూపులతో మరీ మరీ చూచింది.

ఆ. మోహరుచుల వలన ముద్దియ తలయెత్తు, సిగ్గువలన బాల శిరము వంచు
నింతి వెఱఁగు వలన నెత్తదు వంపదు, తనదు ముఖము ప్రాణదయితుఁ జూచి. 284

* పెల్లుబికిన ప్రేమతో లక్ష్మీదేవి తల ఎత్తింది. సిగ్గుతో తల దించింది. ప్రాణవల్లభుడైన ఆయనని చూడడం వల్ల కలిగిన తొట్రుపాటువల్ల మొగాన్ని ఎత్తడానికి కానీ, దించడానికి కానీ ఆమెకు శక్తి లేక పోయింది.

**క. హరి సూచిన సిరి సూడదు, సిరి సూచిన హరియుఁ జూడ సిగ్గును బొందున్**
**హరియును సిరియును దమలో, సరిచూపులఁ జూడ మరుఁడు సందడి వెట్టెన్. 285**

* విష్ణువు చూస్తే లక్ష్మి చూచేది కాదు. లక్ష్మి చూస్తే ఆమెను చూడటానికి విష్ణువు సిగ్గుపడేవాడు. లక్ష్మీ విష్ణువూ ఒకరి నొకరు సరిసమానంగా చూచేటట్లు మన్మథుడు తొందర పెట్టినాడు.

**చ జగముల తండ్రియై తనరు శౌరి జగంబుల తల్లి నిందిరం**
**దగ నురమందుఁ దాల్చె; నటఁ దత్కరుణారసదృష్టిచేఁ బ్రజల్**
**మగుడఁగఁ దొంటి భంగి నతిమంగళసాధ్వి పతిత్వసంపదన్**
**నెగడిన లోకముల్ గని; రనేక శుభంబులఁ బొంది రత్తఱిన్. 286**

* లోకాలకు తండ్రియైన విష్ణువు లోకాలకు తల్లియైన లక్ష్మీదేవిని తన పక్షాన చేర్చుకొన్నాడు. అప్పుడు కనికరం కురిసే లక్ష్మీదేవి చూపుల వల్ల ప్రజలు ఎన్నో శుభాలు పొందినారు. అటువంటి సాధ్వీమణి పూర్వంవలె భర్తతో చేరిన పుణ్యసంపదవల్ల లోకాలు పెంపొందినాయి.

**వ. అట మున్న యబ్ధిరాజు దనయందు నున్న యమూల్యం బయిన కౌస్తుభంబు పేరిట యనర్ఘ మణి రాజంబు న య్యంబుజాక్షునకు సమర్పించిన దానిం దన వక్షస్థలంబున ధరియించె; నప్పు డయ్యాదిలక్ష్మియు శ్రీవత్సకౌస్తుభ వైజయంతీ వనమాలికా తారహారాద్యలంకృతంబైన పుండరీకాక్షు వక్షస్థలంబున వసియించె; న య్యవసరంబున. 287**

* అల్లుడైన మహావిష్ణువునకు కడలిరాజు తనలోని కౌస్తుభమనే అమూల్య రత్నాన్ని కానుకగా ఇచ్చినాడు. దానిని విష్ణువు తన వక్షస్థలాన ధరించినాడు. అప్పుడు శ్రీవత్సమూ, కౌస్తుభమూ, వైజయంతీ మాలికా, ముత్యాలహారమూ మొదలైన వాటితో కూడిన సొగసైన విష్ణువు ఎదపై లక్ష్మీదేవి నివసించింది.

**శా. మ్రోసెన్ శంఖ మృదంగ వేణురవముల్ మున్నాడి; పెంజీఁకటుల్**
**వాసెన్, నర్తన గాన లీలల సురల్ భాసిల్లి; రార్యుల్ జగ**
**ద్వాసుల్ విష్ణుని బ్రహ్మదేవముఖరుల్ దల్లింగ మంత్రంబులం**
**బ్రాసక్తిన్ వినుతించి రుల్లసితపుష్ప శ్రేణి వర్షించుచున్. 288**

* ఆ సమయంలో మునుముందుగా శంఖాలూ, మద్దెలలూ, పిల్లన గ్రోవులూ మ్రోగినాయి. పెనుచీకట్లు తొలగి పోయినాయి. దేవతల నాట్యసంగీతాల వేడుకలు వెలుగొందినాయి. లోకంలోని పూజ్యులూ బ్రహ్మాది దేవతలూ సంతోషించి పూలజల్లు కురిపించినారు; విష్ణునామాంకితాలైన మంత్రాలతో స్తోత్రం చేసినారు.

**క. ఆ పాలవెల్లి కూఁతురు, దీపుల చూపులను దోఁగి తిలకించఁ బ్రజల్**
**చేపట్టిరి సంపదలను, బ్రాపించెను మేలు; జగము బ్రదికె నరేంద్రా! 289**

* ఓ రాజా! లక్ష్మీదేవి చల్లని చూపులతో తియ్యగా చూచింది. ప్రజలకు వైభవమూ శుభమూ సమకూరినాయి. లోకం సుఖించింది. జగత్తుకు క్రొత్తప్రాణం వచ్చింది.

క. పాలేటిరాచకన్నియ, మేలారెడు చూపులేక మిడు మిడు కంచుం
జాలిం బురపురఁ బొక్కుచుఁ, దూలిరి రక్కసులు కీడు దోఁచిన నధిపా! 290

* ఓ రాజా! లక్ష్మీదేవి శుభకరమైన చూపులు కరవై రాక్షసులు పరితపించినారు. వారికి కీడు అనిపించింది; విచారంతో తహ తహ లాడినారు

క. వారిధిఁ దరువఁగ నంతట, వారుణి యన నొక్క కన్య వచ్చిన నసురుల్
వారిజలోచను సమ్మతి, వారై కైకొనిరి దాని వారిజనేత్రన్. 291

* ఆ తరువాత పాలసముద్రాన్ని చిలికేటప్పుడు వారుణి అనే అందగత్తె పుట్టింది. ఆ కన్యను విష్ణువు అనుమతితో రాక్షసులు తీసుకొన్నారు.

వ. మఱియుం దరువం దరువ న ప్పయోరాశియందు. 292

సీ. తరుణుండు దీర్ఘ దోర్దండుండు గంబుకంధరుఁడు పీతాంబరధారి స్రగ్వి
లాలిత భూషణాలంకృతుం డరుణాక్షుఁ డున్నతోరస్కుఁ డత్యుత్తముండు
నీలకుంచిత కేశ నివహుండు జలధర శ్యాముండు మృగరాజ సత్త్వశాలి
మణికుండలుఁడు రత్నమంజీరుఁ డచ్యుతు నంశాంశ సంభవుం డమలమూర్తి

ఆ. భూరియాగభాగ భోక్త ధన్వంతరి, యనఁగ నమృత కలశహస్తుఁ డగుచు
నిఖిలవైద్యశాస్త్ర నిపుణుఁ డాయుర్వేది, వేల్పు వెజ్జు కడలి వెడలి వచ్చె. 293

* అటు తరువాత చిలకగా చిలకగా ఆ సముద్రంలో అమృత కలశాన్ని చేత పట్టుకొని ధన్వంతరి అనే దివ్య పురుషుడు జన్మించినాడు. అతడు మంచి ప్రాయం కలవాడు. అతడు ఆజానుబాహుడు. అతనికి శంఖం వంటి కంఠమూ, ఎఱ్ఱని కన్నులూ, ఎత్తైన రొమ్మూ, నల్లని వెండ్రుకలూ, మేఘంవంటి రంగూ, మణిఖచిత మకరకుండలాలూ, రత్నాల కాలి అందెలూ ఉన్నాయి. అతడు పట్టువస్త్రం కట్టుకొన్నాడు. పూలమాల దాల్చినాడు. మెరసే నగలు ధరించినాడు. అతడు సింహం వంటి శక్తి కల్గినవాడు. విష్ణువు అంశంతో జన్మించినవాడు, పవిత్రమైన యజ్ఞాలలోని హవిర్భాగాన్ని పొందే యోగ్యత కలవాడు. వైద్యవిద్యలో ఆరితేరినవాడు; దేవతలకు వైద్యుడు.

వ. తదనంతరంబ. 294

ఆ. అతనిచేత నున్న యమృత కుంభము సూచి, కెరలు వొడిచి సురలఁ గికురువెట్టి
పుచ్చికొనిరి యసుర పుంగవు లెల్లను, మాఱులేని బలిమి మానవేంద్ర! 295

* ఓ రాజా! ధన్వంతరి సముద్రంనుండి వెలువడి రాగానే అతని చేతిలోని అమృత కలశాన్ని రాక్షసులు చూచినారు. వారందరూ దేవతలను త్రోసిపుచ్చి సాటిలేని బలంతో చెలరేగి ఎగబడి ఆయన చేతులలోనుంచి ఆ కలశాన్ని లాగుకొన్నారు.

**వ. వెండియు. 296**

**ఆ. చావులేని మందు చక్కఁగ మన కబ్బె, ననుచుఁ గడవ నసురు లాఁచి కొనిన**
**వెఱచి సురలు హరికి మొఱలు వెట్టిరి సుధా, పూర్ణఘటము వోయెఁ బోయె ననుచు. 297**

* "చావు రానివ్వని మందు మనకు సులువుగా దొరికింది" అంటూ రాక్షసులు అమృత కుంభాన్ని అపహరించినారు. భయంతో దేవతలు "అమృతభాండం పోయింది, పోయింది" అంటూ విష్ణువుతో మొరపెట్టుకొన్నారు.

## -: శ్రీ విష్ణుమూర్తి మోహినీస్వరూపంబు నొందుట :-

**వ. ఇట్లు శరణాగతులైన వేల్పుల దైన్యంబు వొడగని భృత్యజన కాముదుండగు న ప్పరమేశ్వరుండు 'మీరలు దుఃఖింప వలవ దేను నా మాయాబలంబునం జేసి మీ యర్థంబు మరల సాధించెద' నని పలికెఁ; దత్సమయంబున నయ్యమృత పూరంబు నేమ త్రావుద' మని తమకించు దైత్యదానవ జనంబుల లోపల నమంగళంబగు కలి సంభవించిన కతంబునఁ బ్రబలులగు రక్కసులు విలోకించి సత్త్రయాగంబు నందు నడచు చందంబునఁ దుల్యప్రయాస హేతువులగు సురలును సుధాభాగంబున కర్హు లగుదురు గావునఁ బంచి కుడుచుట కర్తవ్యం; బిది సనాతనంబగు ధర్మం బగుటం జేసి యియ్యమృత కుంభంబు విడువుం డని దుర్బలులగు నిశాచరులు జాత మత్సరులై ప్రబలు లైన తమవారల వారించుచున్న సమయంబున. 298**

* మహావిష్ణువు భక్తుల కోరికలు నెరవేర్చేవాడు. కాబట్టి అతడు శరణు వేడిన దేవతల దుఃఖాన్ని చూచి 'మీరు బాధపడకండి. నా మాయ వల్ల మీ కోరికను తిరిగి నేను సాధిస్తాను' అన్నాడు. ఆ సమయంలో రాక్షసులు 'అమృత రసాన్ని మనమే త్రాగుదాము' అంటూ త్వరపడినారు. కానీ రాక్షసులలో అమంగళ కరమైన కలహం బయలుదేరింది. అందువల్ల బలవంతులైన రాక్షసులు కొందరు అసూయపడినారు. 'గొప్ప యజ్ఞంలోవలె దేవతలు మనతో సమానంగా శ్రమపడినారు. వారికి కూడ అమృతంలో భాగాన్ని ఇవ్వాలి. పంచుకొని అనుభవించడం న్యాయం. ఇది తరతరాల ధర్మం. కాబట్టి అమృతకలశాన్ని వదలండి' అంటూ కొందరు తక్కిన బలవంతులైన రాక్షసులను అడ్డగించినారు.

**ఆ. ఒకని చేత నుండ నొకఁడు బలిష్ఠుఁడై, పుచ్చికొనిన వాని బొదుగఁ బట్టి**
**యంతకంటె నధికుఁ డమృత కుంభము నెత్తి, కొంచుఁ బాఱెఁ బరులు గుయ్యిడంగ. 299**

* ఒకనిచేతిలో ఉండిన అమృతకలశాన్ని ఇంకొక బలవంతుడు లాగుకొన్నాడు. అంతకంటె బలవంతుడు మరియొకడు వానిని పట్టుకొని ఆ కలశాన్ని ఎత్తుకొని పరుగెత్తినాడు. తక్కినవారు అరచినారు.

వ. అంత. 300

సీ. మెత్తని యడుగుల మెఱుఁగారు జానువు లరఁటి కంబముల దోయైన తొడలు
ఘనమగు జఘనంబుఁ గడు లేఁత నడుమును బల్లవారుణకాంతి పాణియుగముఁ
గడు దొడ్డపాలిండ్లుఁ గంబుకంఠంబును బింబాధరముఁ జంద్రబింబముఖముఁ
దెలిగన్నుఁగవయును నళికుంతలంబును బాలేందు సన్నిభ ఫాలతలము

తే. నమరఁ గుండల కేయూర హార కంక, ణాదు లే పార మంజీర నాద మొప్ప
నల్ల నవ్వులఁ బద్మదళాక్షుఁ డసుర, పతుల నడఁగింప నాఁడురూపంబుఁ దాల్చి. 301

* అప్పుడు విష్ణువు మెల్లగా తనలో నవ్వుకొన్నాడు. అసుర వీరులను అణచి వేయడం కోసం మోహినీరూపాన్ని ధరించినాడు. ఆ మాయా మోహినికి మెత్తని అడుగులూ, నిగనిగలాడే మోకాళ్ళూ, అరటి బోదెల వంటి తొడలూ, పెద్దవైన పిరుదులూ, మిక్కిలి సన్నని నడుమూ, చిగురుటాకుల వంటి ఎఱ్ఱని చేతులూ, పెద్దవైన వక్షోజాలూ, శంఖం వంటి గొంతూ, దొండపండువంటి పెదవీ, చంద్రబింబం వంటి మొగమూ, వెలుగు లీనే కన్నులూ, తుమ్మెదల వంటి శిరోజాలు, నెలవంక వంటి నుదురూ ఒప్పారినాయి. ఆమెకు రవల చెవుల పోగులూ, బాహుపురులూ, హారాలూ, కంకణాలూ మొదలైన నగలు ఉన్నాయి. వాటి నన్నింటినీ మించి సవ్వడిచేసే అందెలు శోభించినాయి.

వ. అ య్యవసరంబున జగన్మోహనాకారంబున. 302

సీ. పాలిండ్లపై నున్న పయ్యెద జాఱించు జాఱించి మెల్లనఁ జక్క నొత్తుఁ
దళుకు దళ్కను గండఫలకంబు లొలయించు నొలయించి కెంగేల నుజ్జగించుఁ
గడుమెఱుంగులు వాఱు కడకన్ను లల్లార్చు నల్లార్చి ఱెప్పల నండ గొలుపు
నవరని దరహాస చంద్రికఁ జిలికించుఁ జిలికించి కెమ్మోవిఁ జిక్కువఱచు

తే. దళిత ధమ్మిల్ల కుసుమ గంధమ్ము నెఱవుఁ, గంకణాది ఝణంకృతుల్ గడలు కొలుపు
నొడలి కాంతులు పట్టులే కులుకఁబాఱు, సన్న వలిపంపుఁ బయ్యెద చౌకళింప. 303

* మోహిని వేషధారిణియైన శ్రీమహావిష్ణువు లోకాన్ని మోహింప జేసే రూపం కలిగి ఉన్నాడు. ఆ సమయంలో ఆమె చన్నులపైని పైటను జార్చి మెల్లగా చక్కదిద్దుకొనేది. తళతళలాడే చెక్కిళ్ళను సొగసైన చేతిపై వాల్చి మళ్లీ వదలిపెట్టేది. జిగేలుమనే కడగంటి చూపులను ప్రసరింపజేసి మళ్లీ రెప్పలు మూసేది. అందంగా చిరునవ్వు వెన్నెలలు చిలికించి, ఎఱ్ఱని పెదవిని మెలికపెట్టేది. కొప్పులోని వికసించిన పూలపరిమళాన్ని నలుగడలా వ్యాపింపజేసేది. పల్చగా ఉండే తెల్లనిపైటను అల్లల నాడించి నెమ్మేని కాంతులను నిలకడ లేకుండా పొంగిపొరలేటట్లు చేసేది.

వ. ఇవ్విధంబున నక్కపట యువతీరత్నంబు జగన్మోహనదేవతయునుం బోలె నెమ్మొగంబు తావికి మత్తిల్లిన తేఁటి మొత్తంబులం గెలిచి చిగురు జొంపంబుల నెడగలుగ జడియుచు మురియుచుండ రాక్షసవరులు గనుంగొని. 304

* పై విధంగా ఆ మాయలమారి జవరాలు లోకాన్ని మోహింపజేసే దేవతగా ఉన్నది. అందమైన ముఖంలోని సుగంధం కోసం వచ్చిన మదించిన తుమ్మెదలను అదలించుతూ చిగురాకు పొదరిండ్లలో ఆమె దూర దూరంగా తిరుగుతుండటం రాక్షస వీరులు చూచినారు.

**సీ. అవుఁగదే లావణ్య, మవుఁగదే మాధుర్య మవుఁగదే సతి నవయౌవనాంగి!**
**యెటనుండి వచ్చితి? వేమి యిచ్చించెదు? నీ నామ మెయ్యది నీరజాక్షి?**
**యమర గంధర్వ సిద్ధాసురచారణ మనుజకన్యలకు నీ మహిమ గలదె?**
**ప్రాణ చిత్తేంద్రియ పరిణామ దాయియై నిర్మించెఁ బో విధి నిన్నుఁ గరుణ,**

**తే. వనిత! గశ్యపు సంతతి వార మేము, భ్రాతలము సురలకు నిద్ధపౌరుషులము**
**జ్ఞాతులకు మాకు నేకార్థసంగతులకుఁ, బాలు దీరని యర్థంబు పంచి యిమ్ము. 305**

* మోహిని అందచందాలను చూచి రాక్షసులు ఆశ్చర్యపడినారు. ఆమెతో వారిట్లా పలికినారు- చక్కదనాల జవరాలా! ఎక్కడినుండి వచ్చినావు? ఏమి కావాలి? కమలాక్షీ! నీ పేరేమి? దేవతలలోనూ గంధర్వులలోనూ సిద్ధులలోనూ రాక్షసులలోనూ చారణులలోనూ మనుష్యులలోనూ ఉండే కన్నెలకు నీ అందచందాలు లేవు. నీ ప్రాణానికి మనసుకీ నీ అవయవాలకూ నిండుతనాన్ని కలిగించి బ్రహ్మదేవుడు నిన్ను ప్రీతితో సృష్టించినాడు కాబోలు! ఓ వన్నెలాడి! మేము కశ్యపుని బిడ్డలము. దేవతలకు సోదరులము. ఎదురులేని పరాక్రమం కలవారము. ఒకే ప్రయోజనం కోసం మేము ఇచ్చట చేరినాము. మాలో మాకు పంపకం కుదరకుండా ఉండే ఈ పదార్థాన్ని మాకు పంచిపెట్టు.

**క. సభయై యుండెద మిందఱ, మభయంబున వచ్చు కొలఁది నమృతంబును నీ**
**విభరాజగమన! తప్పక, విభజింపు విపక్షపక్ష విరహితమతి వై. 306**

* ఓ జవరాలా! మే మందరం బారులు దీరి కూర్చుంటాము. 'పరాయి వారు- తనవారు' అనే భేద బుద్ధి లేకుండా ఏ మాత్రం సంకోచం లేకుండా మా ఉభయులకూ సరిగా అమృతాన్ని పంచిపెట్టు.

**వ. అని మందలించిన దైత్యులం గని మాయాయువతి రూపుండగు హరి తన వాఁడి వాలు చూపు టంపఱలవలన వారల తాలుముల నగలించి చిఱునగవు లెగయ మొగమెత్తి యిట్లనియె. 307**

* పై విధంగా రాక్షసులు హెచ్చరించగా మోహినీరూపంలో ఉండిన విష్ణువు అందమైన తన వాలుచూపుల తూపులతో వారి ఓర్పులను చీకాకుపరుస్తూ చిరునవ్వులు చిలికే మొగమెత్తి ఇట్లా అన్నాడు-

**క. సుందరులగు పురుషులఁ గని, పొందెడు నాయందు నిజము పుట్టునె మీకున్?**
**బృందారకరిపులారా!, చెందరు కామినుల విశ్వసింపరు పెద్దల్. 308**

* ఓ రాక్షసులారా! నేను అందమైన మగవారిని ప్రేమించేదానను. మీకు నా పై నమ్మకం కుదురుతుందా? అందగత్తెలను నమ్మి పెద్దలు దరిచేరరు కదా!

క. పలుకులు మధురసధారలు, దలఁపులు నానా ప్రకార దావానలముల్
సెలుములు సాలావృకములు, చెలువల నమ్మకటలు వేదసిద్ధాంతములే! 309

* అందగత్తెల మాటలు తేనెల ఊటలు. వారి ఆలోచనలు పలువిధాలైన కార్చిచ్చులు. వారి స్నేహాలు తోడేళ్ళు. అటువంటి వారిని విశ్వసించడం వేదసమ్మతం కాదు.

క. నా నేర్చుకొలఁది మీకును, మానుగ విభజించి యిత్తు; మానుఁడు శంకన్
గానిం డనవుడు నిచ్చిరి, దానవు లమృతంపుఁ గడవఁ దరుణీ మణికిన్. 310

* సరే! శక్తివంచన లేకండా చక్కగా పంచిపెడతాను లెండి, అనుమానం వదలండి- అని మోహిని పలికింది. వెంటనే రాక్షసులు అమృతకలశాన్ని ఆ చక్కని చుక్కకు ఇచ్చినారు.

క. ఆ శాంతాలోకనములు, నా శీతల భాషణములు నా లాలితముల్
రాశి పరంపర లగుచుం, బాశములై వారి నోళ్ళు బంధించె నృపా! 311

* ఓ రాజా! మోహిని మెరుగారుచూపులూ, చల్లని మాటలూ, బుజ్జగింపులూ, దొంతర దొంతరలై త్రాళ్ళవలె రాక్షసుల నోళ్ళను కట్టివేసినాయి.

వ. ఇట్లు సుధాకలశంబు కేల నందుకొని మందస్మిత భాషణంబుల సుందరీ రూపుం డగు ముకుందుండు 'మేలు గీ డనక నేను బంచి యిచ్చిన తెఱంగున నంగీకరించుట కర్తవ్యం' బనవుడు 'నగుంగాక' యని సురాసుర దైత్యదానవ సమూహం బుపవసించి కృతస్నానులై హోమంబు లాచరించి విప్రులకు గోభూహిరణ్యాది దానంబులు సేసి తదాశీః ప్రవచనంబును గైకొని ధవళపరిధానులై గంధమాల్య ధూపదీపాలంకృతం బగు కనకరత్న శాలా మధ్యంబునఁ బ్రాగగ్రకుశ పీఠంబులం బూర్వ దిశాభిముఖులై పంక్తులు గొని యున్న సమయంబున. 312

* పై విధంగా మోహినీరూపంలో ఉండిన విష్ణువు అమృతకలశాన్ని చేతికి తీసుకొన్నాడు. చిరునవ్వు చిందే మాటలతో నేను పంచిపెట్టిన విధంగా 'ఔను-కాదు' అనకుండా ఒప్పుకోవాలి అన్నాడు. అందుకు దేవతలూ రాక్షసులూ 'సరే' అన్నారు. వారందరూ ఉపవాసం చేసి స్నానాలు చేసినారు. అగ్నిహోత్రం చేసినారు. బ్రాహ్మణులకు గోవులూ, భూమీ, బంగారమూ మొదలైన వాటిని దానమిచ్చి వారి ఆశీర్వాదాలు అందుకొన్నారు. తెల్లని బట్టలు కట్టుకొన్నారు. చందనంతో పూలమాలలతో, ధూపాలతో, దీపాలతో అలంకరించిన బంగారు మండపంలో చేరినారు. తూర్పుగా కొసలు పరచిన దర్భల ఆసనాలపై తూర్పుముఖంగా బారులు తీరి కూర్చుండినారు.

క. శ్రోణీభర కుచయుగ భర, వేణీభరములను డస్సి వివిధాభరణ
క్వాణ యయి యువిద వచ్చెను, బాణి సరోజమున నమృతభాండముఁ గొంచున్. 313

* ఆ సమయంలో మోహిని పద్మంవంటి హస్తంతో అమృత కలశాన్ని పట్టుకొని అరుదెంచింది. ఆమె కటిభారంతోనూ, స్తనభారంతోనూ, శిరోజభారం తోనూ బాగా అలసిపోయింది. ఆమె ధరించిన నానా విధాలైన నగలు అడు గడుగునా ధ్వనిస్తున్నాయి.

క. భాసుర కుండల భాసిత, నాసాముఖ కర్ణ గండనయనాంచలయై
శ్రీసతి యగు సతిఁ గని దే, వాసుర యూథంబు మోహ మందె నరేంద్రా! 314

* రాజా! ఆ మోహిని అలంకరించిన కర్ణాభరణాల తళతళలు ఆమె ముక్కుకూ, మొగానికీ, చెవులకూ, చెక్కిళ్ళకూ, కనుగొనలకూ వ్యాపించి ఉన్నాయి. లక్ష్మీదేవికి సాటియైన ఆ మగువను చూచి దేవతలకూ, రాక్షసులకూ మనసు చెదరి పోయింది.

వ. అప్పుడు. 315

క. 'అసురుల కమృతము వోయుట, వొసఁగదు పాములకుఁ బాలు వోసినమాడ్కిన్
దొసఁగగు నంచును వేఱొక దెసఁ గూర్చుండంగఁ బెట్టె దేవాహితులన్. 316

వ. ఇట్లు రెండు పంక్తులుగా నేర్పరించి. 317

* ఆ సమయంలో "రాక్షసులకు అమృతాన్ని పోయడం పాములకు పాలుపోసిన విధంగా ఆపద కలిగిస్తుంది'' అని మోహిని అనుకొన్నది. రెండువరుసలు ఏర్పాటు చేసింది. రాక్షసులను ప్రత్యేకంగా ఒక ప్రక్క కూర్చోబెట్టింది.

సీ. వేగిర పడకుఁడీ వినుఁడు దానవులార! తడవు సేయక వత్తు దైత్యులార!
యటుసక్కఁ గూర్చుండుఁ డని కన్ను లల్లార్చి చనుఁగవ పయ్యెద జాఱఁ దిగిచి
వదినె మఱందుల వావులు కల్పించి మర్మంబు లెడలించి మఱుఁగు సేసి
మెల్లని నగవుల మేనులు మఱపించి కడు జాణ మాటలఁ గాకు పఱచి

ఆ. యసుర వరుల నెల్ల నడకించి సురలను, దడవు సేయ వలదు; ద్రావుఁ డనుచు
వచ్చు కొలఁది నమృతవారి విభాగించెఁ, దరుణి దివిజు లెల్లఁ దనిసి పొగడ. 318

*"రాక్షసులారా! తొందరపడకండి. ఆలస్యం చేయకుండా వస్తాను, నెమ్మదిగా కూర్చోండి'' అని మోహిని పలికింది. కన్నులు కదలించింది. చన్నుల పైని పైట జారదీసింది. 'వదినె-మరదుల' వరుసలు కలిపింది. మర్మస్థానాలను మరుగు తొలగించి కప్పివేసింది. చిరునవ్వులతో మైమరపించింది. నెరజాణతనంతో మాట్లాడింది, రాక్షసులను లొంగ దీసుకొన్నది. 'తడవు చేయకుండా త్రాగండి' అంటూ దేవతలకు అమృతాన్ని పంచింది. దేవతలు సంతృప్తితో అమృతాన్ని ఆరగించారు. ఆమెను అభినందించారు.

వ. ఆ య్యవసరంబున. 319

సీ. మనకు వేల్పులకును మందట లేకుండఁ బంచి పెట్టెద నని పడఁతి పూనెఁ
దానేల తప్పును? దప్పదు తరళాక్షి గాక రమ్మనుచును గడఁకఁ బిల్వ

మఱుమాట లాడదో మఱి చూడకుండునో చనుఁగవఁ గప్పునో చాలు ననుచు
నొండాడఁ గలఁగుచు నొక్కింత సొలయునో మనయెడఁ గందునో మగువ యనుచు

ఆ. నెలఁత చూడ్కి గముల నీరై కరంగుచుఁ, బ్రణయ భంగ భీతి బద్ధు లగుచు
నూరకుండ్రు గాని 'యువిద! తే తెమ్మ'ని, యడుగఁ జాల రప్పు డసుర వరులు. 320

* ఆ సమయంలో మోహిని చూపులకు రాక్షసులు కరిగిపోయినారు. 'ఈ మగువ మనకూ దేవతలకూ తగాదా లేకుండా పంచిపెట్టడానికి పూనుకొన్నది. ఆ పనిచేయకుండా తప్పించుకుంటుందా! తప్పించుకోదు. కానీ మనం సాహసించి రమ్మని పిలిస్తే బదులు పలుకదేమో! తిరిగి చూడదేమో! చందోయిపై పైట కప్పుకొంటుందేమో! మరోమాట కలిపితే వెరగుపడి వెనుదీస్తుందేమో! మనపై కోపగించుకొంటుందేమో! మనమీద విశ్వాసం చెడుతుందేమో?' అనుకొంటూ జంకుతూ గొంకుతూ ఊరకే ఉండి పోయినారు. "సుందరీ! తొందరగా తీసుకొనిరా'' అని పిలువలేక పోయినారు.

వ. అప్పుడు. 321

మ. అమర వ్రాతములోనఁ జొచ్చి దివిజుండై రాహు పీయూష పా
నము సేయం గని చంద్రభాస్కరులు సన్నల్ సేయ నారాయణుం
డమరారాతిశిరంబు చక్రహతిఁ దున్మాడెన్ సుధాసిక్తమై
యమరత్వంబును జెందె మూర్ధము దదన్యాంగంబు నేలం బడెన్. 322

* ఆ సమయంలో మోహిని అమృతాన్ని దేవతలకు పోయడం చూచి రాహువనే రాక్షసుడు రహస్యంగా దేవతల వరుసలో చేరినాడు. దేవతావేషంతో అమృతాన్ని త్రాగినాడు. అదిచూచి సూర్యచంద్రులు మోహినికి సైగలు చేసినారు. వెంటనే చక్రాయుధంతో విష్ణువు రాహువు తల ఖండించినాడు. అమృతంతో కూడినందువల్ల ఆ తల నిర్జీవం కాలేదు. మొండెం నేలపై కూలిపోయింది.

ఆ. అజుఁడు వాని శిరము నంబరవీథిని, గ్రహము సేసి పెట్టి గారవించె;
వాఁడు పర్వములను వైరంబు దప్పక, భానుచంద్రములను బట్టు చుండు. 323

* బ్రహ్మదేవుడు రాహువు శిరస్సును ఆకాశంలో ఒక గ్రహంగా నిలిపి గౌరవించినాడు. ఆ రాహుగ్రహం పగ వదలకుండా అమావాస్య పూర్ణిమలలో సూర్యచంద్రులను నేటికీ అడ్డగిస్తూ ఉంది.

క. ఒక బొట్టుఁ జిక్క కుండఁగ, సకల సుధారసము నమర సంఘంబులకుం
బ్రకటించి పోసి హరి దన, సుకరాకృతిఁ దాల్చె నసుర శూరులు బెగడన్ 324

* విష్ణువు ఒక్కచుక్క కూడా మిగలకుండా అమృతమంతా అమరసమూహానికే బాహాటంగా పోసినాడు. మోహినీ రూపాన్ని వదలి తన మామూలు ఆకారాన్ని ధరించినాడు. ఇదంతా చూచి రాక్షస వీరులు దుఃఖ పడినారు.

మ. అమరుల్ రక్కసులుం బ్రయాసబలసత్త్వార్థాభిమానంబులన్
సములై లబ్ధవికల్పులైరి యమరుల్ సంశ్రేయముం బొంది ర
య్యమరారుల్ బహుదుఃఖముల్ గనిరి తా మత్యంత దోర్గర్వులై;
కమలాక్షున్ శరణంబు వేఁడని జనుల్ గల్యాణ సంయుక్తులే? 325

* దేవతలూ సరిసమానమైన రాక్షసులూ పూనికా, శక్తి, బలమూ, తెలివీ, ధనమూ, ఆత్మగౌరవమూ కలిగినవారే. కాని వారికి రెండు విధాలైన ఫలితాలు ప్రాప్తించినాయి. దేవతలు శుభాలను పొందినారు. విష్ణువును శరణు వేడని వారు శుభాలను పొందలేరు.

## -: దేవాసుర యుద్ధము :-

క. దానవు లమృతము ద్రావం, బూని పయోరాశిఁ ద్రచ్చి పొగిలిన మాడ్కిన్
శ్రీనాథ పరాఙ్ముఖులగు, హీనులు వొందంగఁజాల రిష్టార్థంబుల్. 326

* అమృతాన్ని త్రాగడం కోసం ప్రయత్నించి సముద్రాన్ని చిలికి రాక్షసులు దుఃఖానికి గురియైనారు. విష్ణుభక్తిలేని వివేక హీనులు తాముకోరిన సంపదలను పొందలేరు.

క. శోధించి జలధి నమృతము, సాధించి నిలింపవైరి చక్షుర్గతులన్
రోధించి సురల కిడి హరి, బోధించి ఖగేంద్రు నెక్కి పోయె నరేంద్రా! 327

* ఓ రాజా! ఈ విధంగా విష్ణువు సముద్రాన్ని చిలికి అమృతాన్ని సంపాదించి రాక్షసుల కనుగప్పి దానిని దేవతలకే పంచిపెట్టినాడు. అటు పిమ్మట దేవతలను హెచ్చరించి గరుడునిపై కూర్చొని వెళ్ళిపోయినాడు.

క. శుద్ధముగ సురల కమృతము, సిద్ధించిన నసుర వరులు సిడిముడిపడుచున్
గ్రుద్ధులు నానాయుధ స, న్నద్ధులు నయి యుద్ధమునకు నడచిరి బలిమిన్. 328

* అమృతం సంపూర్ణంగా దేవతలకే సమకూరి నందువల్ల రాక్షస వీరులు కోపతాపాలు పొందినారు. వారు పలు విధాలైన ఆయుధాలతో యుద్ధానికి సంసిద్ధులై బయలుదేరినారు.

క. ధన్యులు వైరోచని శత, మన్యుప్రముఖులు మదాభిమానులు దమలో
నన్యోన్యరణము బాహా, సిన్యాసంబులను బేర్చి చేసిరి కడిమిన్. 329

* బలిచక్రవర్తీ దేవేంద్రుడూ మొదలైన బలవంతులు ఖడ్గాలు చేబూని గర్జిస్తూ పరాక్రమంతో ఉప్పొంగి ఒకరినొకరు ఎదిరించి పోరాడినారు.

మ. అరుదై కామగమై మయాసురకృతంబై లోకితాలోక్యమై
వరశస్త్రాస్త్ర సమేతమై తరళమై వైహాయసంబై మహా

**సురయోధాన్వితమైన యానమున సంశోభిల్లెఁ బూర్ణేందు సు**
**స్థిరకాంతిన్ బలి చామరధ్వజ చమూదీప్తస్థితిన్ ముందటన్. 330**

* బలిచక్రవర్తి నిలిచి వెలిగే నిండు చంద్రునివలె ప్రకాశిస్తూ తన రథంపై బయలుదేరినాడు. ఇది మయాసురుడు నిర్మించిన రథం. అది ఆశ్చర్యం కలిగించేది. ఇష్టాన్ని అనుసరించి పయనించేది. గొప్ప శస్త్రాలతో నిండి ఉండేది. చూపులకు అందకుండా ఆకాశంలో వెళ్ళేది. గొప్ప రాక్షస భటులతో కూడి ఉండేది. ఆ రథానికి ముందుభాగంలో వింజామరలతో జెండాలతో దానవసైన్యాలు నడుస్తున్నాయి.

**వ. మఱియు నముచి శంబర బాణ ద్విమూర్ధ కాలనాభ శకుని జంభాయోముఖ ప్రహేతి హేతి భూత సంత్రాస హయగ్రీవ కపిలేల్వ లోత్కల మేఘదుందుభి మయ త్రిపురాధిప విప్రచిత్తి విరోచనవజ్రదంష్ట్ర తార కారిష్టారిష్టనేమి శుంభ నిశుంభ శంకుశిరః ప్రముఖులును, పౌలోమ కాలకేయులును, నివాత కవచ ప్రభృతులును, దక్కిన దండ యోధులునుం గూడికొని యరదంబులం దురంగంబుల మాతంగంబుల హరిణంబుల హరి కిరి కీట జలచరంబులను, శరభ మహిష గవయ ఖడ్గ గండభేరుండ చమరీ జంబుక శార్దూల గోవృషాది మృగంబులను, గంక గృధ్ర కాక కుక్కుట బక శ్యేన హంసాది విహంగంబులను, దిమి తిమింగిలాది జలచరంబులను, నరులను, నసుర సుర నికర వికృతి విగ్రహరూపంబులగు జంతువులను నారోహించి, తమకు నడియాలంబులగు గొడుగులు జోడుఁ గైదువులు పక్కెరలు బొమిడికంబులు మొదలగు పోటుముట్లాయితంబుగఁ గైకొని వేఱు వేఱ మొనలై విరోచననందనుండగు బలిముందట నిలువంబడిరి; దేవేంద్రుండును నైరావతారూఢుఁడై వైశ్వానర వరుణవాయు దండధరా ద్యనేక నిర్జరవాహినీ సందోహంబును, దాను నెదురుపడి పిఱు తివియక మోహరించె; నట్లు సంరంభసన్నాహ సముత్సాహంబుల రెండు దెఱంగుల వారునుం బోరాడు వేడుకల మీఁటగు మాటల సందడించు చున్న సమయంబున, 331**

* బలిచక్రవర్తి ముందు భాగంలో నముచీ శంబరుడూ బాణుడూ ద్విమూర్ధుడూ శకునీ జంభుడూ అయోముఖుడూ ప్రహేతీ హేతీ భూతసంత్రాసుడూ హయగ్రీవుడూ కపిలుడూ ఇల్వలుడూ ఉత్కలుడూ మేఘదుందుభీ మయుడూ త్రిపురాసురులూ విప్రచిత్తీ విరోచనుడూ వజ్రదంష్ట్రుడూ తారకుడూ అరిష్టుడూ అరిష్టనేమీ శంభుడూ నిశుంభుడూ శంకుశిరుడూ మొదలైన వారూ, పౌలోముడూ కాలకేయులూ నివాత కవచులూ మొదలైనవారూ, తక్కిన మహావీరులూ, వేరే వేరే గుంపులుగా నిలబడినారు. వారు రథాలూ గుఱ్ఱాలు ఏనుగులూ జింకలూ సింహాలూ పందులూ శరభాలూ దున్నపోతులూ గురుపోతులూ ఖడ్గమృగాలూ గండభేరుండ మృగాలు సవరపు మెకాలూ నక్కలూ పులులూ ఎద్దులూ మొదలైన జంతువులనూ, రాబందులూ గ్రద్దలూ కాకులూ కోడిపుంజులూ కొంగలూ డేగలూ హంసలూ మొదలైన పక్షులనూ, తిములూ తిమింగిలాలూ మొదలైన నీటిజంతువులనూ, మనుష్యులనూ, రాక్షసులవలె దేవతలవలె వికారమైన ఆకారాలతో కూడిన జంతువులనూ ఎక్కి ఉన్నారు. తమ సంకేతాలైన గొడుగులనూ జెండాలనూ ధరించి ఉన్నారు. కవచాలూ ఆయుధాలూ వాహనాలపై వేసే అంగీలూ శిరస్త్రాణాలూ మొదలైన సాధనాలను సిద్ధం చేసుకొని తెచ్చిఉన్నారు.

దేవేంద్రుడు ఐరావతంపై ఎక్కి వచ్చినాడు. అతనితోబాటు అగ్నీ వరుణుడూ వాయువూ యముడూ మొదలైన దేవతలు పెక్కుసైన్యసమూహాలతో వచ్చి వెనుదీయక ఎదిరించినారు. రెండు పక్షాలవారూ వేగిరపడుతూ ప్రయత్నించి గొప్ప ఉత్సాహంతో యుద్ధం చేయడానికి సన్నద్ధులైనారు. క్రోధోద్రేకంతో పరస్పరం అధిక్షేపించుకొన్నారు.

సీ. వజ్రదంష్ట్రాంచిత వ్యజనంబులును బర్హ చామరంబులు సితచ్ఛత్త్రములును
జిత్రవర్ణధ్వజ చేలంబులును వాత చలితోత్తరోష్ణీష జాలములును
జప్పుళ్ల నెసఁగు భూషణ కంకణంబులుఁ జండాంశురోచుల శస్త్రములును
వివిధ ఖేటకములు వీరమాలికలును బాణపూర్ణములైన తూణములును

ఆ. నిండి పెచ్చురేఁగి నిర్జరాసురవీర, సైన్యయుగ్మకంబు సాల నొప్పె
గ్రాహతతుల తోడఁ గలహంబునకు వచ్చు, సాగరముల భంగి జనవరేణ్య! 332

* ఓ రాజా! కఠినమైన కోరలూ, అందమైన ఆలవట్టాలూ, నెమలి పురులూ, వింజామరలూ, వెల్లగొడుగులూ, సొగసైన రంగు రంగుల జెండాలూ, గాలికి కదలాడే తలపాగాలూ, ధ్వనించే కంకణాది ఆభరణాలూ, సూర్యకాంతులతో మెరిసే ఆయుధాలూ, రకరకాల డాలువార్లూ, హారాలూ, నిండిన అంప పొదులూ కలిగి దేవదానవుల ఉభయసైన్యాలూ చెలరేగినాయి. అవి మొసళ్ళ సమూహాలతో కూడుకొని పోరాడడానికి వచ్చిన రెండు సముద్రాలవలె ఒప్పినాయి.

క. భేరీ భాంకారంబులు, వారణ ఘీంకారములును వరహరి హేషల్
భూరి రథనేమి రవములు, ఘోరములై పెల్లగించెఁ గులశైలములన్. 333

* భేరీ వాద్యాలనుండి వెలువడిన భాంకారాలూ ఏనుగుల ఘీంకారాలూ గుఱ్ఱాల సకిలింతలూ రథచక్రాల శబ్దాలూ మహాభయంకరంగా ఉండి పెద్ద పర్వతాలనే తల క్రిందు చేసినాయి.

వ. ఇవ్విధంబున నుభయబలంబులును మోహరించి బలితో నింద్రుండును, దారకునితో గుహుండును, హేతితో వరుణుండును, బ్రహేతితో మిత్రుండును, గాలనాభునితో యముండును, మయునితో విశ్వకర్మయు, శంబరునితోఁ ద్వష్టయు, విరోచనునితో సవితయు, నముచితోఁ బరాజితుండును, వృషపర్వునితో నశ్వినీ దేవతలును, బలిసుతబాణాది పుత్త్రశతంబుతో సూర్యుండును, రాహువుతో సోముండును, బులోమునితో ననిలుండును, శుంభ నిశుంభులతో భద్రకాళీదేవియు, జంభునితో వృషాకపియును, మహిషునితో విభావసుండును, నిల్వల వాతాపులతో బ్రహ్మపుత్త్రులును, దుర్మర్షణు నితోఁ గామదేవుండును, నుత్కలునితో మాతృకా గణంబును, శుక్రునితో బృహస్పతియు, నరకునితో శనైశ్చరుండును, నివాతకవచులతో మరుత్తులును, గాలేయులతో వసువులు నమరులును, బౌలోము లతో విశ్వేదేవగణంబును, గ్రోధవశులతో రుద్రులును, నివ్విధంబునం గలసి పెనంగి ద్వంద్వ యుద్ధంబు సేయుచు మఱియు రథికులు రథికులను, పదాతులు పదాతులను, వాహనారూఢులు వాహనారూఢులను దాఁకి సింహనాదంబులు సేయుచు, నట్టహాసంబు లిచ్చుచు నాహ్వానంబు

లొసంగుచు, నన్యోన్య తిరస్కారంబులు సేయుచు, బాహునాదంబుల విజృంభించుచుఁ, బెనుబొబ్బల నుబ్బిరేఁగుచు, హుంకరించుచు, నహంకరించుచు, ధనుర్గుణంబులం దంకరించుచు, శరంబుల నాఁటించుచుఁ, బరశువుల నఱకుచుఁ, జక్రంబులం జెక్కుచు, శక్తులం దునుముచుఁ, గశలం బెట్టుచుఁ, గుఠారంబులఁ బొడుచుచు, గదల నడచుచుఁ, గరంబులఁ బొడుచుచుఁ, గరవాలంబుల వ్రేయుచుఁ బట్టిసంబుల నొంచుచుఁ, బ్రాసంబులం ద్రెంచుచుఁ, బాశంబులం గట్టుచుఁ, బరిఘంబుల మొత్తుచు, ముసలంబుల మోఁదుచు, ముద్గరంబులఁ జదుపుచు, ముష్టివలయంబుల ఘట్టించుచుఁ, దోమరంబుల నుఱుముచు, శూలంబులఁ జిమ్ముచు, నఖంబులం జీరుచుఁ, దరు శైలంబుల ఱువ్వుచు, నుల్ముకంబులం జూఁడుచు నిట్లు బహువిధంబులం గలహ విహారంబులు సలుపు నవసరంబున భిన్నంబులైన శిరంబులును, విచ్ఛిన్నంబులైన కపాలంబులును, వికలంబులైన కపోలంబులును, జిక్కువడిన కేశబంధంబులును, భగ్నంబులైన దంతంబులును, గృత్తంబులైన భుజంబులును, ఖండితంబులైన కరంబులును, విదళితంబులైన మధ్యంబులును, వికృతంబులైన వదన బింబంబులును, వికలంబులైన నయనంబులును, వికీర్ణంబులైన కర్ణంబులును, విశీర్ణంబులైన నాసికలును, విఱిగి పడిన యూరుదేశంబులును, విసంధులైన పదంబులును, జిరిఁగిన కంకటంబులును, రాలిన భూషణంబులును, వ్రాలిన కేతనంబులును, గూలిన ఛత్రంబులును, మ్రొగ్గిన గజంబులును, నుగ్గయిన రథంబులును, నుఱుమైన హయంబులును, జిందఱవందఱలైన భటసమూహంబులును, నొఱలెడు కొఱప్రాణంబులును, బొరలెడు మేనులును, నుబ్బియాడెడు భూతంబులును, బాఱెడు రక్తప్రవాహంబులును, గట్టలు గొన్న మాంసంబులును, నెగసి తిరిగెడి కళేబరంబులును, గలకలంబులు సేయు కంక గృధ్రాది విహంగంబులు నయి యొప్పు న ప్పోరతి ఘోరంబయ్యె నప్పుడు. 334

* పై విధంగా రెండు సైన్యాలూ గుమికూడిన తరువాత బలిచక్రవర్తితో దేవేంద్రుడూ, తారకునితో కుమారస్వామీ, హేతితో వరుణుడూ, ప్రహేతితో మిత్రుడూ, కాలనాభునితో యముడూ, మయునితో విశ్వకర్మా, శంబరునితో త్వష్టా, విరోచనునితో సవితా, నముచితో పరాజిత్తూ, వృషపర్వునితో అశ్వినీదేవతలూ, బాణుడూ మొదలైన బలికొడుకులతో సూర్యుడూ, రాహువుతో చంద్రుడూ, పులోమునితో వాయువూ, శుంభ నిశుంభులతో భద్రకాళీ, జంభునితో వృషాకపీ, మహిషునితో విభావసుడూ, ఇల్వలునితోనూ వాతాపితోనూ బ్రహ్మపుత్రులూ, దుర్మర్షణునితో మన్మథుడూ, ఉత్కలునితో సప్తమాతృకలూ, శుక్రునితో బృహస్పతీ, నరకునితో శనైశ్చరుడూ, నివాతకవచులతో మరుత్తులూ, కాలకేయులతో వసువులూ దేవతలూ, పౌలోములతో విశ్వేదేవులూ, క్రోధవశులతో రుద్రులూ- ఈ విధంగా ఎదిరించి ద్వంద్వయుద్ధాలు చేసినారు. అంతేకాక రథాలవారు రథాలవారినీ, కాలిబంట్లు కాలిబంట్లనూ, వాహనాల వారు వాహనాల వారినీ ఎదిరించినారు. సింహనాదాలు చేస్తూ బిట్టుగా నవ్వుతూ, ఒకరినొకరు పిలుస్తూ, ధిక్కారాలు చేస్తూ, భుజాలు తట్టుకొని ముందంజవేస్తూ, గావుకేకలతో ఉప్పొంగిపోతూ, హుంకారాలు చేస్తూ, గర్విస్తూ, అల్లెత్రాళ్ళు మ్రోగిస్తూ, బాణాలను నాటుతూ, గండ్రగొడ్డళ్ళతో నరుకుతూ, చక్రాలతో ఖండిస్తూ, శక్తులతో ముక్కలు చేస్తూ, కొరడాలతో కొట్టుతూ, గొడ్డళ్ళతో పోట్లాడుతూ, గదలతో

మొత్తుతూ, చేతులతో గ్రుద్దుతూ, కత్తులతో ఉత్తరిస్తూ, అడ్డకత్తులతో నొప్పిస్తూ, ఈటెలతో తెగవేస్తూ, త్రాళ్ళతో కట్టివేస్తూ, గుదియలతో అదరగొట్టుతూ, రోకళ్ళతో దంచుతూ, సమ్మెటలతో బాదుతూ, పిడికిళ్ళతో పొడుస్తూ, తోమరాలతో పిండిచేస్తూ, శూలాలతో కుమ్ముతూ, గోళ్ళతో చీల్చుతూ, చెట్టూ కొండలూ విసరుతూ, కొరవులతో కాల్చుతూ- ఈ విధంగా పలువిధాలుగా పోరాటాలు చేసినారు.

ఆ యుద్ధంలో తలలు పగిలినాయి, పుఱ్ఱెలు బ్రద్దలైనాయి. చెక్కిళ్ళు చీలిపోయినాయి. కొప్పులు చిక్కుపడినాయి. పండ్లు విరిగినాయి. భుజాలు తెగిపోయినాయి. చేతులు తునాతునుకలైనాయి. నడుములు చీలినాయి. మొగాలు వికారమైనాయి. కన్నులు లొట్టపోయినాయి. చెవులు చెదరిపోయినాయి. ముక్కులు తెగినాయి. తొడలు విరిగినాయి. పాదాలు ఊడినాయి. కవచాలు చినిగాయి. నగలు రాలినాయి. జెండాలు జారినాయి. గొడుగులు కూలినాయి. ఏనుగులు క్రుంగిపోయినాయి. రథాలు నుగ్గునుగ్గయినాయి. గుఱ్ఱాలు పొడిపొడియైనాయి. సైన్యసమూహాలు చెల్లాచెదరైనాయి. కొన ప్రాణాలు కొట్టుకొన్నాయి. శరీరాలు పొర్లాడినాయి. పిశాచాలు సంతోషంగా చిందులు ద్రొక్కినాయి. నెత్తురు వాగులు ప్రవహించినాయి. మాంసాలు రాసులైనాయి. పీనుగులు ఎగిరిపడుతున్నాయి. రాబందులూ, గ్రద్దలూ మొదలైన పక్షులు పెద్ద రొద చేస్తున్నాయి. ఈ విధంగా ఆ యుద్ధరంగం మిక్కిలి భయంకరంగా రూపొందింది.

**శా. నాకాధీశుఁ బదింట; మూఁట గజమున్, నాల్గింట గుఱ్ఱంబుల**
**న్నేకాస్త్రంబున సారథిం జొనిపె, దైత్యేంద్రుండు వీఁకన్ వియ**
**ల్లోకాధీశుఁడు ద్రుంచి యన్నిటిని దోర్దో నన్నిభల్లంబులన్**
**రాకుండన్ రిపువర్గముం దునిమె గీర్వాణారి యగ్గింపఁగన్.** 335

* ఆ యుద్ధంలో బలిచక్రవర్తి దేవేంద్రునిపై పది బాణాలనూ, ఐరావతంపై మూడింటినీ, గుఱ్ఱాలపై నాలుగింటినీ, సారథిపై ఒక దానిని వేసినాడు. వెంటనే దేవేంద్రుడు అన్ని బాణాలనూ నరికివేసి శత్రుసమూహాన్ని ఖండించినాడు. బలిచక్రవర్తి ఇంద్రుని పరాక్రమాన్ని మెచ్చుకొన్నాడు.

**సీ. తన తూపులన్నియుఁ దరమిడి శక్రుండు నఱికిన జోదు విన్ననువు మెఱసి**
**బలి మహాశక్తిచేఁ బట్టిన నదియును నతఁడు ఖండించె నత్యద్భుతముగ;**
**మఱి ప్రాసశూల తోమరములు గైకొన్నఁ దోర్ద్రోడ నవియును దునిమివైచె;**
**నంతటఁ బోక యెయ్యది వాఁడు సంధించెఁ దొడరి తా నదియును దుమురు సేసె;**

**ఆ. నసురభర్త విరథుఁడై తన పగఱకుఁ, గానఁబడక వివిధ కపట వృత్తి**
**నేర్పు మెఱసి మాయ నిర్మించె, మింటను వేల్పుగములు సూచి వెఱఁగు పడఁగ.** 336

* దేవేంద్రుడు తనబాణాలను వరుసపెట్టి నరకివేయగా వీరుడైన బలిచక్రవర్తి ఉపాయంతో గొప్పదైన శక్తి ఆయుధాన్ని చేతికి తీసుకొని ప్రయోగించినాడు. ఆశ్చర్యంగా దీనిని కూడా ఇంద్రుడు ఖండించినాడు. ఆ తరువాత బలి ఈటెనూ శూలాన్నీ తోమరాన్నీ అందుకొన్నాడు. వెంటనే వాటినికూడా ఇంద్రుడు ముక్కలు

చేసినాడు. అంతటితో ఆగకుండా బలి వేనిని వేసినా ఇంద్రుడు పూనికతో వాటి నన్నిటినీ తునాతునకలు చేసినాడు. బలిచక్రవర్తి రణరంగంలో రథాన్ని పోగొట్టుకొన్నాడు. అతడు పగవారికి కనిపించకుండా పలుమాయలతో నేర్పరితనం చూపుతూ ఆకాశంలో మాయను సృష్టించినాడు. దానిని చూచి దేవతలు భయపడినారు.

**వ. ఇట్లు దానవేంద్రుని మాయావిశేషవిధానంబున సురానీకంబులపైఁ బర్వతంబులు వడియె; దావాగ్ని దందహ్యమాన తరువర్షంబులు గురిసె; సటంక శిఖర నికరశిలాసారంబులు గప్పె; మహోరగ దందశూకంబులు గఱచె; వృశ్చికంబులు మీటె; వారాహ వ్యాఘ్ర సింహంబులు గదిసి విదళింపం దొరఁకొనియె; వనగజంబులు మట్టి మల్లాడం జొచ్చె; శూలహస్తులు దిగంబరులునై రండు రండని బలురక్కసులు శతసహస్రసంఖ్యులు ఛేదనచ్ఛేదన భాషణంబులు సేయం దొడంగిరి; వికృత వదనులు గదా దండధారులు నాలంబిత కేశ భారులునై యనేక రాక్షస వీరులు 'పోనీకు పోనీకుఁడు; తునుము తునుముం'డని వెనుతగిలిరి; పరుష గంభీర నిర్ఘాత సమేతంబులయిన జీమూత సంఘాతంబులు వాతాహతంబులై యుప్పతిల్లి నిప్పుల కుప్పలు మంటల ప్రోవులం గురిసె; మహాపవన విజృంభితంబైన కార్చిచ్చు ప్రళయానలంబు చందంబునం దరికొనియెఁ, బ్రచండ ఝంఝానిల ప్రేరిత సముత్తుంగ తరంగావర్తభీషణంబయిన మహార్ణవంబు సెలియలికట్ట దాఁటి వెల్లి విరిసి నట్లమేయంబై యుండె; నా సమయంబునం బ్రళయకాలంబునుం బోలె మిన్ను మన్నును, రేయుంబగలని యెఱుంగ రాదయ్యె; న య్యవసరంబున. 337**

* పై విధంగా బలిచక్రవర్తి సృష్టించిన ఇంద్రజాలం వల్ల దేవతలపై పర్వతాలు వచ్చిపడినాయి. కార్చిచ్చుతో మండుతున్న చెట్లు చెలరేగినాయి. కొండల శిఖరాల నుండి రాళ్ళవర్షం వర్షించింది. గొప్ప గొప్ప నాగుబాములు పైనబడి కరచినాయి. తేళ్ళు కుట్టినాయి. అడవి పందులూ, పులులూ, సింహాలూ, పైకి దూకి చీల్చడానికి మొదలు పెట్టినాయి. అడవి ఏనుగులు పడద్రొక్కినాయి. శూలాలు ధరించిన దెసమొలల మహారాక్షసులు లక్షల సంఖ్యలో "రండు రం" డంటూ, "నరుకుతాం, కోస్తాం" అంటూ కేకలు పెట్టినారు.

వీరులైన పెక్కండ్రు రాక్షసులు గదాదండాలు ధరించి వికారమైన ముఖాలతో వ్రేలాడుతున్న శిరోజాలతో "పోనివ్వకండి, పోనివ్వకండి, నరకండి, నరకండి" అంటూ వెన్నంటి తరిమినారు. పిడుగులతో కూడిన మేఘాల సమూహాలు గాలికి చెలరేగి క్రూరంగా గంభీరంగా మూగి నిప్పుల కుప్పలనూ మంటరాసులనూ కురిపించినాయి. గాలుల వల్ల రెచ్చగొట్ట బడిన కారుచిచ్చు ప్రళయ కాలపు అగ్నివలె మండ సాగింది.. తీవ్రమైన తుపానువల్ల అల్లకల్లోలమై భయంకరమైన సముద్రం గొప్ప గొప్ప అలలతో సుడిగుండాలతో ఉప్పొంగి గట్లుదాటింది. ఆ సమయంలో ప్రళయకాలంలో వలె నింగీ నేలా, రాత్రీ పగలూ తెలుసుకోవడానికి వీలులేకుండా పోయింది.

**క. ఆ యసురేంద్రుని బహుతర, మాయా జాలంబులకును మా ఱెఱుఁగక వ**
**జ్రాయుధ ముఖరాదిత్యు ల, పాయంబునుఁ బొంది చిక్కువడిరి నరేంద్రా! 338**

* ఓ రాజా! బలిచక్రవర్తి పన్నిన పలువిధాలైన మాయా జాలాలకు విరుగుడు తెలియని ఇంద్రాది దేవతలు దిక్కు తెలియక చిక్కుల పాలైనారు.

వ. అప్పుడు. 339

క. ఇ య్యసురులచేఁ జిక్కితి, మెయ్యది దెరు? వెందుఁ జొత్తు? మిటు వొలయఁ గదే
యయ్యా! దేవ! జనార్దన!, కుయ్యో! మొఱ్ఱో! యటంచుఁ గూయిడి రమరుల్. 340

* ఆ సమయంలో దేవతలు "స్వామీ! జనార్దనా! ఈ రాక్షసరాజు మాయాజాలంలో చిక్కుకున్నాము. ఇప్పుడు మాకు దారి ఏది? ఎక్కడికి పోవాలి? ఇక్కడికి నీవు రావా? కుయ్యో మొఱ్ఱో" అంటూ విష్ణువుకు మొర పెట్టుకొన్నారు.

వ. అట్లు మొఱయిడు నవసరంబున. 341

మ. విహగేంద్రాశ్వ నిరూఢుఁడై మణిరమా విభ్రాజితోరస్కుఁడై
బహుశస్త్రాస్త్ర రథాంగ సంకలితుఁడై భాస్వ త్కిరీటాది దు
స్సహుఁడై నవ్యపిశంగచేల ధరుఁడై సంఫుల్ల పద్మాక్షుఁడై
విహితాలంకృతితోడ మాధవుఁడు దా వేంచేసె నచ్చోటికిన్. 342

* దేవతలు మొరపెట్టుకుంటున్న సమయంలో మహావిష్ణువు గరుడవాహనంపై కూర్చొని ఆ ప్రదేశానికి వచ్చినాడు. ఆయన వక్షస్థలం కౌస్తుభరత్నంతోనూ లక్ష్మీదేవితోనూ, ప్రకాశిస్తున్నది. పెక్కు ఆయుధాలనూ చక్రమునూ ధరించి ఉన్నాడు. తలపైన ధగ ధగ మెరిసే కిరీటం ప్రకాశిస్తూ ఉన్నది. క్రొంగ్రొత్త పసుపు పచ్చనిపట్టు వస్త్రమును ధరించి ఉన్నాడు. వికసించిన పద్మాల వంటి కన్నులతో విరాజిల్లు తున్నాడు. నానావిధాలైన అలంకారాలతో కూడి ఉన్నాడు.

చ. అసురులమాయ లన్నియును నబ్జదళాక్షుఁడు వచ్చినంతటన్
గసిబిసియై నిరర్థమయి గ్రక్కునఁ బోయెను; నిద్రనొంది సం
తసమున మేలుకొన్నగతిఁ దాల్చి చెలంగిరి వేల్పులందఱుం;
బస సెడ కేలయుండు హరిపాద పరిష్కృతిసేయ నాపదల్? 343

* విష్ణువు రాగానే రాక్షసుల మాయలన్నీ వెల వెల పోయి వ్యర్థమైనాయి. దేవలంతా నిద్రనుండి మేల్కొన్న విధంగా సంతోషంతో ప్రకాశించినారు. పురుషోత్తముని పాదాలను పూజిస్తే దుఃఖాలు దూరం కాకుండా ఎందుకుంటాయి?

వ. అయ్యెడ. 344

ఆ. కాలనేమి ఘోర కంఠీరవము నెక్కి, తార్క్ష్యు శిరము శూలధారఁ బొడువ
నతని పోటుముట్టు హరి కేల నంకించి, దానఁ జావఁ బొడిచె దానవునిని. 345

* అప్పుడు కాలనేమి అనే దానవ వీరుడు భయంకరమైన సింహంపై కూర్చున్నవాడై గరుడుని తలపై వాడియైన బల్లెంతో కుమ్మినాడు. వాని ఆయుధాన్ని విష్ణువు పట్టుకొని దానితోనే ఆ రాక్షసుడు చనిపోయేటట్లు పొడిచాడు.

**క. పదపడి మాలి సుమాలులు, బెదరించినఁ దలలు ద్రుంచెఁ బృథు చక్రహతిన్;**
**గదఁగొని గరుడుని ఱెక్కలు, సెదరించిన మాల్యవంతు శిరమున్ ద్రెవ్వెన్. 346**

* అటు తరువాత మాలీ సుమాలీ విష్ణువును బెదరించినారు. అప్పుడు శ్రీహరి చక్రాయుధంతో వారి తలలు తెగనరికినాడు. మాల్యవంతుడు గదతో గరుడుని రెక్కలు చెదరగొట్టినాడు. వాని శిరస్సును కూడ శ్రీహరి చక్రంతో ఖండించినాడు.

**వ. ఇట్లు పరమపురుషుండగు హరి కరుణాపరత్వంబునఁ బ్రత్యుపలబ్ధ మనస్కులైన వరుణవాయువాసవ ప్రముఖులు పూర్వంబున నెవ్వ రెవ్వరితోఁ గయ్యంబు సేయుదురు, వారు వారలం దలపడి నొప్పించి; ర య్యవసరంబున. 347**

* భగవంతుడైన విష్ణువు దయాగుణంపై మనసు నిలిపి వరుణుడూ, వాయువూ, ఇంద్రుడూ మొదట ఎవరెవరితో యుద్ధం ప్రారంభించినారో మరల వారినే ఎదిరించి పోరాడినారు.

**క. బాహు బలంబున నింద్రుఁడు, సాహసమున బలిని గెలువ సమకట్టి సము**
**త్సాహమున వజ్ర మెత్తిన, హాహా నినదంబు సేసి రఖిల జనంబుల్. 348**

* ఆ సమయంలో ఇంద్రుడు సాహసించి భుజబలంతో బలిచక్రవర్తిని జయించడానికి పూనుకొని పట్టుదలతో వజ్రాయుధాన్ని పైకెత్తినాడు. అప్పుడు అక్కడి రాక్షసులంతా హాహాకారం చేసినారు.

**వ. ఇట్లు సముద్యత భిదుర హస్తుండై యింద్రుండు దన పురోభాగంబునం బరాక్రమించుచున్న విరోచన నందనుని ఉపలక్షించి యిట్లనియె. 349**

* ఇంద్రుండు వజ్రాయుధాన్ని జళిపించుచూ తన ఎదుట పరాక్రమాన్ని ప్రదర్శించుతున్న బలిచక్రవర్తితో ఇట్లా అన్నాడు-

**మ. 'జగతిన్ వైరి మొఱంగి గెల్చుటదియున్ శౌర్యంబె? ధైర్యంబె?తా**
**మగవాఁ డయ్యునుఁ దన్నుఁ దా నెఱిఁగి సామర్థ్యంబునుం గల్గియున్**
**బగవానిం గని డాఁగెనేని మెయి సూపం జాలఁడేనిం గటా!**
**నగరే బంధులు? దిట్టరే బుధులు? గన్యల్ గూర్తురే? దానవా! 350**

* "ఓ రాక్షసుడా! లోకంలో శత్రువును మాయతో మోసగించి గెలవడం శౌర్యమూ కాదు; ధైర్యమూ కాదు. పౌరుషం కల మగవాడు తన శక్తిసామర్థ్యాలు తెలుసుకొని పగవానిని ఎదిరించాలి. అటువంటి శక్తి కలిగికూడా కన్పించకుండా దొంగ వేషాలు వేస్తే చుట్టాలు నవ్వుతారు. పండితులు తిట్టుతారు. ఆడపిల్లలు సైతం పెదవి విరుస్తారు.

శా. మాయల్ సేయఁగ రాదు పో; నగవులే మాతోడి పోరాటముల్?
దాయా! చిక్కితి; వ్రక్కలించెదఁ గనద్దంభోళి ధారాహతిన్;
నీ యిష్టార్థము నెల్లఁ జూడుము వెసన్ నీ వారలం గూడుకో
నీ యాటోపము నిర్జరేంద్రుఁ డడఁచున్ నేఁ డాజిలో దుర్మతీ! 351

వ. అని యుపాలంభించిన విని విరోచన నందనుం డిట్లనియె. 352

* ఓ దుర్మార్గుడా! ఇంక నీమాయలు చెల్లవు. మాతో పోరాటాలు నవ్వులాటలు కావు. నా చేతికి చిక్కినావు. తళ తళ మెరిసే ఈ వజ్రాయుధంతో నిన్ను చీల్చివేస్తాను. త్వరగా నీ కోరికలు ప్రకటించుకో! నీ వారిని కలుసుకో! ఈనాటి యుద్ధంలో నీ అహంకారాన్ని అణచి వేస్తాను''- ఈ విధంగా నిందించుతున్న సురచక్రవర్తితో బలిచక్రవర్తి ఇట్లా అన్నాడు.

శా. నీవే పోటరివే? సురేంద్ర! తెగడన్ నీకేల? గె ల్పోటముల్
లేవే? యెవ్వరి పాలఁ బోయినవి? మేల్గీడుల్ విరించాదులుం
ద్రోవం జాలుదు రెవ్విధానమున సంతోషింప శోకింప నా
దైవం బేమి? కరస్థలామలకమే! దర్పోక్తులుం బాడియే? 353

* దేవేంద్రా! నీవే మొనగాడవు కావు. మిడిసిపడి తెగనాడబోకు! జయాపజయాలు దైవాధీనాలు. అవి ఎవరికైనా తప్పవు. బ్రహ్మాదులు సైతం సుఖదుఃఖాలు తప్పించుకోలేరు. ఈవిషయంలో సంతోషించడం కానీ దుఃఖించడం కానీ తగదు. అదృష్టం అరచేతిలో ఉసిరికకాయ కాదు. అందువల్ల నీవు ప్రగల్భాలు పలకడం చాలించు.

ఆ. జయము లపజయములు సంపద లాపద, లనిల చలిత దీపికాంచలములు
చంద్రకళలు మేఘచయములు దరఁగలు, మెఱుఁగు లమరవర్య! మిట్టిపడకు. 354

* అమరేంద్రా! జయములూ, అపజయములూ, సంపదలూ, ఆపదలూ శాశ్వతమైనవి కావు. అవి గాలిలో కదలే దీపాలు, చంద్రకళలు. మేఘమాలికలు. నీటితరగలు. మెరపు తీగలు. అందువల్ల విర్రవీగవద్దు.

వ. అని యి ట్లాక్షేపించి. 355

క. వీరుఁడు దానవ నాథుఁడు, నారసముల నింద్రు మేన నాఁటించి మహా
ఘోరాయుధకల్పములగు, శూరాలాపములు సెవులఁ జొనిపెన్ మరలన్. 356

* పై విధంగా వీరాధివీరుడైన బలిచక్రవర్తి ఇంద్రుని తూలనాడి అతని శరీరంలో వాడిబాణాలను గ్రుచ్చినాడు. అతని చెవులు చిల్లులుపడే పదునైన ములుకులవంటి సూటిపోటు మాటలు పలికినాయి.

వ. ఇట్లు తథ్యవాది యైన బలిచే నిరాకృతుండై. 357

క. శత్రువు నాక్షేపంబునఁ దోత్రాహత గజము భంగిఁ ద్రుళ్ళుచు బలి నా
వృత్రారి వీచి వైచిన, గోత్రాకృతి నతఁడు నేలఁగూలె నరేంద్రా! 358

* ఓ రాజా! సత్యవాది అయిన బలి పలికిన తిరస్కార వాక్కులు విని దేవేంద్రుడును అంకుశంతో పొడిచిన ఏనుగులాగా త్రుళ్ళిపడినాడు. ఆగ్రహంతో బలిని పట్టుకొని వజ్రాయుధంలో కొట్టినాడు. బలిచక్రవర్తి కొండవలె కూలిపోయినాడు.

క. చెలికాని పాటు గనుఁగొని, బలి సఖుఁడగు జంభుఁ డతులబాహాశక్తిం
జెలితనము సాల నెఱపుచు, నిలు నిలుమని వీఁకఁ దాఁకె నిర్జర నాథున్. 359

* జంభుడు తన చెలికాడైన బలిచక్రవర్తి పడిపోవటం చూచినాడు. అతడు తన స్నేహాన్ని ప్రకటిస్తూ సాటిలేని మేటి పరాక్రమంతో 'నిలు నిలు' మంటూ దేవేంద్రుని ఎదిరించినాడు.

క. పంచానన వాహనుఁడై, చంచద్గద జంభుఁడెత్తి శైలారిని దాఁ
కించి సురేభంబును నొ, ప్పించి విజృంభించి యార్చి పేర్చెం గడిమిన్. 360

* జంభుడు సింహంపై కూర్చొని గదను పై కెత్తి పరాక్రమంతో దేవేంద్రుని పైకి విజృంభించి ఐరావతాన్ని ఒక్క చరుపు చరచి కేకలు వేస్తూ ఉప్పొంగి పోయినాడు.

క. వీఁక సెడి ఘనగదాహతిఁ, దోఁ కయుఁ గదలింపలేక దుస్సహపీడన్
మోఁకరిలఁ బడియె నేలను, సోఁ కోర్వక దిగ్గజంబు సుడిసుడి గొంచున్. 361

* క్రూరమైన జంభుని గదాఘాతంతో ఐరావతం ఉత్సాహం కోల్పోయింది. ఓర్వరాని బాధతో గిరి గిర తిరిగి తోకను సైతం కదలించ లేక ముందుకు వంగి నేలపై వాలిపోయింది.

వ. అయ్యెడ. 362

క. సారథి వేయు హయంబుల, తే రాయిత పఱచి తేర దేవేంద్రుఁడు దా
నారోహించెను దైత్యుఁ డు, దారత మాతలిని శూలధారం బొడిచెన్. 363

* ఆ సమయంలో ఇంద్రుని సారథియైన మాతలి వేయి గుఱ్ఱాల రథాన్ని సిద్ధంచేసి తీసుకొని వచ్చినాడు. దేవేంద్రుడు దానిపై కూర్చున్నాడు. అప్పుడు జంభుడు వాడియైన బాణంతో మాతలిని పొడిచినాడు.

ఆ. శూల నిహతి నొంది స్రుక్కక యార్చిన, సూతు వెఱకు మంచు సురవిభుండు
వాని శిరముఁ దునిమె వజ్రఘాతంబున, దైత్యసేన లెల్లఁ దల్ల డిల్ల. 364

* జంభుని బల్లెం దెబ్బకు తల్లడిల్లకుండా మాతలి కేకలు వేసినాడు. అతనిని 'భయపడవ'ద్దని చెప్పి దేవేంద్రుడు వజ్రాయుధంతో జంభుని తల నరికినాడు. అది చూచి రాక్షస సైన్యాలు చెల్లాచెదరైనాయి.

చ. చని సురనాథుచేఁ గలన జంభుఁడు సచ్చుట నారదుండు సె
ప్పిన విని వాని భ్రాతలు గభీర బలాధికుఁ డా బలుండు పా
క నముచు లాపురందరునిఁ గాంచి ఖరోక్తులఁ దూలనాడుచున్
ఘన జలధారలన్ నగముఁ గప్పిన చాడ్పునఁ గప్పిరమ్ములన్. 365

* పోరాటంలో జంభుడు చనిపోయిన సంగతి బలవంతులైన అతని సోదరులు బలుడూ పాకుడూ నముచీ అనే వారు నారదుని ద్వారా విన్నారు. వారు రణరంగంలో దుమికి పోటుమాటలతో ఇంద్రుని నిందించినారు. మేఘాలు వర్షధారలతో కొండను కప్పివేసినట్లు వారు తమ బాణాలతో ఇంద్రుని కప్పివేసినారు.

సీ. విబుధలోకేంద్రుని వేయుగుఱ్ఱంబుల నన్ని కోలల బలుఁ డదర నేసె
నిన్నూట మాతలి నిన్నూట రథమును నా రీతి నింద్రు ప్రత్యంగకమును
వేధించెఁ; బాకుండు వింట వాఁ డస్త్రంబు లేయుట దొడుగుట యెఱుఁగరాదు;
కనకపుంఖంబుల కాండంబు లొకపది యేనింట నముచియు నేసి యార్చె;

ఆ. బలిమి నిట్లు ముగురు పగవాని రథసూత, సహితు ముంచి రస్త్రజాలములను
వనజలోక సఖుని వాన కాలంబున, మొగిలు గములు మునుఁగ మూఁగినట్లు. 366

* బలాసురుడు దేవేంద్రుని వేయి గుఱ్ఱాలనూ వేయి బాణాలతో అదరగొట్టినాడు. మాతలినీ రథాన్నీ ఇంద్రుని ప్రతి అవయవాన్ని ఇన్నూరేసి బాణాలతో బాధించినాడు. పాకుడు ధనుస్సులో బాణాన్నీ ఎక్కుపెట్టడమూ, ప్రయోగించడమూ తెలియనంత వేగంతో యుద్ధం చేసినాడు. నముచి పదునైదు బంగారు పిడుల బాణాలను వేసి కేకలు వేసినాడు. ఈ విధంగా వానాకాలంలో మేఘాలు సూర్యుని కప్పివేసిన విధంగా బలవంతులైన ఆ ముగ్గురూ ఇంద్రుని, అతని రథాన్నీ, సారథినీ అమ్ములతో ముంచివేసినారు.

వ. అయ్యవసరంబున. 367

మ. అమరారాతుల బాణజాలముల పాలై పోయితే చెల్లరే;
యమరాధీశ్వర! యంచు భిన్నతరులై యంభోధిలోఁ జంచల
త్వమునం గ్రుంకు వణిగ్జనంబుల క్రియన్ దైత్యాధిప వ్యూహ మ
ధ్యమునం జిక్కిరి వేల్పు లందఱు విపద్ధ్వానంబులం జేయుచున్. 368

* ఆ సమయంలో "అయ్యో! అమరాధినాథా! అసురుల బాణాలకు గురియైపోయినావా"? అంటూ అర్తనాదాలూ చేస్తూ దేవతలందరూ దనుజేశ్వరుల మొగ్గరం నడుమ చిక్కుకొన్నారు. సముద్రం నడుమ పడవలో మునిగిపోయే వర్తకుల వలె హాహాకారాలు చేసినారు.

శా. 'ఓహో దేవతలార! కుయ్యిడకుఁ; డే నున్నాఁడ' నం చంబు భృ
ద్వాహుం డా శరబద్ధ పంజరము నంతం జించి తేజంబునన్

వాహోపేత రథంబుతోడ వెలికిన్ వచ్చెన్ నిశాంతోల్లస
న్మాహాత్మ్యంబునఁ దూర్పునం బొడుచు నా మార్తాండు చందంబునన్. 369

* అప్పుడు దేవేంద్రుడు 'ఓ దేవతలారా! భయపడకండి. నేను బ్రతికే ఉన్నాను' అంటూ అవక్ర పరాక్రమంతో అమ్ముల పంజరాన్ని చీల్చుకొని గుఱ్ఱాలతో కూడిన రథాలతోపాటు బయటికి వచ్చినాడు. ఉదయ కాలంలో తూర్పున ఉదయించే సూర్యునివలె వెలిగినాడు.

వ. ఇట్లు వెలువడి. 370

చ. విఱిగిన సేనఁగాంచి సురవీరుఁ 'డొహో!' యని బిట్టు చీరి క్ర
మ్మఱఁ బురికొల్పి పాకబల మస్తకముల్ నిశితాస్త్రధారలన్
నెఱసిన తీక్ష్ణవజ్రమున నేలకు వ్రాల్చెను వాని చుట్టముల్
వెఱచిరి; తచ్చమూపతులు విహ్వలులై చెడి పాఱి రార్తితోన్. 371

* పై విధంగా వెలువడిన దేవేంద్రుడు వెనుదిరిగి పరుగెత్తే తన సైన్యాన్ని చూచి 'ఓహో' అంటూ బిగ్గరగా పిలిచినాడు. సైనికులను యుద్ధానికి తిరిగి పురికొల్పినాడు. పాకుని తలనూ, బలాసురుని తలనూ వాడి బాణాలతోనూ వజ్రాయుధంతోనూ నేలకూల్చినాడు. దానిని చూచి బలిచక్రవర్తి బంధువులు భయపడినారు. బలిసేనాపతులు భయ కంపితులై పరుగెత్తినారు.

వ. అప్పుడు నముచి నిలువంబడి. 372

మ. తనచుట్టంబులఁ జంపెఁ వీఁడనుచు నుద్యత్క్రోధ శోకాత్ముఁడై
కనకాంతంబును నశ్మసారమయమున్ ఘంటాసమేతంబునై
జనదృగ్దుస్సహమైన శూలము నొగిన్ సారించి వైచెన్ సురేం
ద్రునిపై 'దీన హతుండ వౌ' దని మృగేంద్రుం బోలి గర్జించుచున్. 373

* దేవేంద్రుడు తన బంధువులను చంపినందుకు నముచి మిక్కిలి దుఃఖంతోనూ కోపంతోనూ కదలకుండా నిలబడి, బంగారుపిడీ, గంటలూ కలిగి జనుల చూపులకు దుస్సహమైన ఇనుప శూలాన్ని తీసినాడు. 'దీనితో చస్తావు' అంటూ సింహంవలె గర్జిస్తూ ఆ శూలాన్ని దేవేంద్రుని పై విసరినాడు.

శా. ఆకాశంబున వచ్చు శూలమును జంభారాతి ఖండించి నా
నా కాండంబుల వాని కంఠము దెగ న్దంభోళియున్ వైచె న
స్తోకేంద్రాయుధమున్ సురారిగళముం ద్రుంపంగ లేదయ్యె; వాఁ
డా కంపింపక నిల్చె దేవవిభుఁ డత్యాశ్చర్యముం బొందఁగన్. 374

వ. ఇట్లు నిలిచి యున్న నముచిం గనుంగొని వజ్రంబు ప్రతిహతం బగుటకు శంకించి బలభేది దన మనంబున. 375

* ఆకాశంలో వస్తున్న నముచి శూలాన్ని ఇంద్రుడు ఖండించినాడు. అటు తరువాత నముచి తల నరకడానికి పెక్కు అమ్ములనూ, వజ్రాయుధాన్నీ విసరినాడు. నముచితలను వజ్రాయుధం సైతం నరకలేక పోయింది. నముచి చలించకుండా నిలిచినాడు. అందుకు ఇంద్రుడు ఆశ్చర్యపడినాడు. వజ్రాయుధం వమ్మైపోయినందుకు అతడు సందేహించి తనలో ఈ విధంగా అనుకొన్నాడు.

**సీ. 'కొండల ఱెక్కలు ఖండించి వైచుచో వజ్రమెన్నడు నింత వాఁడి సెడదు;**
**వృత్రాసురాదుల విదళించుచో నిది దిరుగ దెన్నఁడు పనిఁ దీర్చికాని;**
**యింద్రుండఁ గానొకో యేను దంభోళియుఁ గాదొకో యిది ప్రయోగంబు సెడెనొ**
**దనుజాధముఁడు మొనతాఁకుఁ దప్పించెనో భిదురంబు నేఁ డేల బెండువడియె!'**

**ఆ. ననుచు వజ్రి వగవ 'నార్ద్ర శుష్కంబులం, జావకుండఁ దపము సలిపె నీతఁ**
**డితర మెద్ది యైన నింద్ర! ప్రయోగింపు, వైళ' మనుచు దివ్యవాణి పలికె.** 376

* కొండల రెక్కలను ఖండించేటప్పుడు ఏనాడూ వజ్రాయుధానికి వాడి తగ్గలేదు. వృత్రాసురుడు మొదలైన వారిని చీల్చేటప్పుడు ఏనాడు ఇది పని ముగించకుండా వెనుదిరగలేదు. ఇప్పుడు అయిందేమిటి? నేను ఇంద్రుణ్ణి కానా? ఇది వజ్రాయుధం కాదా? దీన్ని ఉపయోగించడంలో పొరపాటు జరిగిందా? ఈ దుష్ట రాక్షసుడు దీని వాదర తెగకుండా చేసినాడా? ఇది ఎందు కీనాడు శక్తి కోల్పోయింది?'' అనుకొంటూ దేవేంద్రుడు ఆలోచింపసాగినాడు. అప్పుడు ఆకాశవాణి "ఇంద్రుడా! ఈ రాక్షసుడు తడివాటితోనూ, పొడి వాటితోనూ చావకుండా తపస్సు చేసినాడు. వేరే దేనినైనా త్వరగా ప్రయోగించు'' అంటూ పలికింది.

**వ. ఇట్లాదేశించిన దివ్యవాణి పలుకు లాకర్ణించి పురందరుండు.** 377

**ఆ. ఆత్మబుద్ధిఁ దలఁచి యార్ద్రంబు శుష్కంబు, గాని సాధనంబు ఫేన మనుచు**
**నది యమర్చి దాన నమరులు మెచ్చంగ, నముచి శిరముఁ ద్రుంచె నాకవిభుఁడు.** 378

* ఆకాశవాణి మాటలు విని 'తడిదీ పొడిదీ కాని వస్తువు సముద్రపు నురుగు ఒక్కటే' అని ఇంద్రుడు నిశ్చయించుకొన్నాడు. ఆ విధంగా సముద్రపు నురుగులో ముంచిన వజ్రంతో నముచి శిరస్సును నరికినాడు. అందుకు దేవతలు సంతోషించినారు.

**వ. అ య్యవసరంబున.** 379

**సీ. పురుహూతు నగ్గించి పుష్పాంజలులు సేసి మునులు దీవించిరి ముదము తోడ;**
**గంధర్వముఖ్యులు ఘనులు విశ్వావసుఁ డును బరావసుఁడు నింపెనయఁ బాడి;**
**రమరాంగనాజను లాడిరి; దేవతా దుందుభులును మ్రోసె దురములోన;**
**వాయు వహ్ని కృతాంత వరుణాదులను బ్రతిద్వంద్వుల గెల్చి రుద్దండవృత్తి;**

**తే. నల్ప మృగముల సింహంబు లట్ల తోలి, రమరవర్యులు దనుజుల నదటు వాయ**
**నజుఁడు పుత్తేర నారదుఁ డరుగు దెంచె, దైత్యహరణంబు వారింప ధరణినాథ!** 380

**వ. వచ్చి సురలకు నారదుం డిట్లనియె.** 381

* ఓ రాజా! ఆ సమయంలో మునులు దేవేంద్రుని పొగడుతూ పూలదోసిళ్ళతో సంతోషంగా దీవించినారు. విశ్వావసుడూ, పరావసుడూ అనే గంధర్వ ప్రభువులు సొంపుగా పాటలు పడినారు. దేవతాస్త్రీలు నాట్యం చేసినారు. దేవదుందుభులు మ్రోగినాయి. అగ్నీ, యముడూ, వరుణుడూ, వాయువూ రణరంగంలో తమతో తలపడిన వారిని భయంకరంగా పారద్రోలినారు. సింహాలు ముక్కడి మృగాలను పారద్రోలిన విధంగా దేవతా వీరులు రాక్షసుల అహంకారాన్ని అణచి ఓడించినారు. రాక్షస సంహారాన్ని ఆపివేయడం కోసం బ్రహ్మదేవుడు నారదుని పంపినాడు. దేవతలతో నారదుడు ఇట్లా అన్నాడు.

**శా. సిద్ధించెన్ సురలార! మీ కమృతమున్; శ్రీనాథ సంప్రాప్తులై**
**వృద్ధిం బొందితి రెల్లవారలును; విద్వేషుల్ మృతిం బొంది!రీ**
**యుద్ధం బేటికి? నింకఁజాలుఁ; బనిలేదో హో పురే;' యంచు సం**
**బద్ధాలాపము లాడి మాన్పె సురలం బాండవ్యవంశాగ్రణీ! 382**

"ఓ దేవతలారా! బాగు బాగు. అమృతం మీకు సమకూరింది. మీరందరూ విష్ణువును ఆశ్రయించి బాగుపడినారు. మీ శత్రువులు నశించినారు. ఇంక యుద్ధంతో అవసరం లేదు, ఆపండి'' అంటూ తగిన మాటలు పలికి నారదుడు దేవతలను వారించినాడు.

**వ. ఇట్లు నారద వచననియుక్తులై రాక్షసులతోడి సంగ్రామంబు సాలించి సకలదేవ ముఖ్యులును త్రివిష్టపంబునకుం జనిరి; హతశేషులైన దైత్యదానవులు విపన్నుండైన బలిం దోడ్కొని పశ్చిమశిఖరి శిఖరంబుఁ జేరిరి; విధ్వంసమాన కంధరులై వినష్టదేహులగు యామినీచరుల నెల్లను శుక్రుండు మృతసంజీవనియైన తనవిద్య పెంపునం జేసి బ్రదికించె; బలియును భార్గవానుగ్రహంబున విగత శరీర వేదనుండై పరాజితుం డయ్యును లోకతత్త్వ విచక్షణుం డగుటం జేసి దుఃఖింపక యుండె నని చెప్పి రాజునకు శుకుం డిట్లనియె. 383**

* నారదుని మాటప్రకారంగా దేవతావీరులు రాక్షసులతో యుద్ధాన్ని చాలించి దేవలోకానికి వెళ్ళిపోయినారు. చావకుండా మిగలిన రాక్షసులు పరాజితులైన బలిచక్రవర్తిని పిలుచుకొని పడమటి కొండ శిఖరాన్ని చేరుకొన్నారు. శుక్రాచార్యుడు మృతసంజీవని అనే విద్యమహిమ వల్ల గొంతులు తెగిపోయి మరణించిన రాక్షసుల నందరినీ మరల బ్రతికించినాడు. శుక్రుని దయవల్ల బలిచక్రవర్తి శరీర వేదన చల్లారింది. ప్రపంచతత్త్వం తెలిసినవాడు కాబట్టి ఓటమి పొందినప్పటికీ బలిచక్రవర్తి దుఃఖపడలేదు అని చెప్పి శుకుడు పరీక్షిత్తుతో ఇట్లా అన్నాడు.

**సీ. కైలాసగిరి మీఁద ఖండేందు భూషణుఁ డొకనాఁడు గొలువున నున్నవేళ**
**నంగనయై విష్ణుఁ డసురుల వంచించి, సురలకు నమృతంబు సూఱ లిడుట**
**విని దేవియును దాను వృషభేంద్రగమనుఁడై కడువేడ్కఁ భూతసంఘములు గొలువ**
**మధుసూదనుండున్న మందిరంబున కేగి పురుషోత్తముని చేతఁ బూజ వడసి**

**తే. తాను గూర్చుండి పూజించె దనుజ వైరిఁ, గుశలమే మీకు మాకును గుశల మనుచు**
**మధురభాషల హరిమీఁద మైత్రి నెఱపి, హరుఁడు పద్మాక్షుఁ జూచి యిట్లనియెఁ బ్రీతి. 384**

* శివుడు కైలాసపర్వతంపై ఒకనాడు కొలువుదీరి ఉండినాడు. ఆ సమయంలో విష్ణువు మోహినీ రూపంతో రాక్షసులను మోసగించి దేవతలకు అమృతాన్ని పంచిపెట్టిన సంగతి విన్నాడు. అతడు పార్వతీదేవితో పాటు నందీశ్వరునిపై కూర్చొని ప్రమథగణసమేతుడై వైకుంఠనగరానికి బయలుదేరి వెళ్ళినాడు. విష్ణువు శివుణ్ణి గౌరవించినాడు. శివుడు విష్ణువును గౌరవించినాడు. విష్ణువు క్షేమాన్ని అడిగి, తమ క్షేమాన్ని తెలిపి, తియ్యని మాటలతో శివుడు తన ప్రసంగాన్ని ప్రారంభించినాడు. తరువాత శివుడు చనువుగా విష్ణువుతో ఇట్లా అన్నాడు.

**సీ. దేవ! జగన్మయ! దేవేశ! జగదీశ! కాలజగద్వ్యాపకస్వరూప!**
**యఖిల భావములకు నాత్మయు హేతువు నైన యీశ్వరుఁడ వాద్యంతములును**
**మధ్యంబు బయలును మఱి లోపలయు లేక పూర్ణమై యమృతమై భూరిసత్య**
**మానంద చిన్మాత్ర మవికార మాద్య మనన్య మశోకంబు నగుణ మఖిల**

**తే. సంభవస్థితి లయముల దంభకంబు, నైన బ్రహ్మంబు నీవ; నీ యంఘ్రియుగము**
**నుభయ సంగ విస్పృష్టులై యున్న మునులు, గోరి కైవల్యకాములై కొల్తు రెపుడు. 385**

* దేవ దేవా! వాసుదేవా! జగదీశ్వరా! ఎల్లప్పుడూ లోకాలతో నిండి ఉండే వాడవు. సమస్త వస్తువులకూ కారణ భూతుడవైన ప్రభువు నీవే. అది మధ్యాంతాలు లేకుండా లోపలా వెలుపలా అంతటా నిండిన వాడవు నీవు. పరిపూర్ణమైన సత్యం నీవు. ఆనందంతో కూడిన జ్ఞానం నీవు. మార్పులేని మూలవస్తువు నీవు దుఃఖదూరుడవు. గుణాతీతుడవు. అన్నింటి పుట్టుకకూ మనుగడకూ నాశనానికి కారణం నీవు. మాయతో కూడిన పరమాత్మవు నీవు. మోక్షాన్ని కోరేవారు స్వార్థాన్నీ, అహంకారాన్నీ విడిచి ఎల్లప్పుడూ నీ పాదాలను సేవిస్తారు.

**సీ. భావించి కొందఱు బ్రహ్మంబు నీ వని తలపోసి కొందఱు ధర్మ మనియుఁ**
**జర్చించి కొందఱు సదసదీశ్వరుఁడని సరవిఁ గొందఱు శక్తి సహితుఁడనియుఁ**
**జింతించి కొందఱు చిరతరుం డవ్యయుఁ డాత్మతంత్రుఁడు పరుం డధికుఁడనియుఁ**
**దొడరి యూహింతురు తుది నద్వయద్వయ సదసద్విశిష్ట సంశ్రయుఁడ వీవు;**

**తే. తలఁప నొక్కింత వస్తుభేదంబు గలదె, కంకణాదులు పసిఁడి యొక్కటియ కాదె?**
**కడలు పెక్కైన వార్ధి యొక్కటియ కాదె? భేద మంచును నిను వికల్పింప వలదు. 386**

* నీవు పరబ్రహ్మవని కొందరు భావిస్తారు. నీవు ధర్మమని కొందరు తలుస్తారు. నీవు ప్రకృతి పురుషు లకంటె పరుడవని కొందరంటారు. నీవు శక్తిస్వరూపుడవని కొందరు ధ్యానిస్తారు. విష్ణువుగా శాశ్వతుడుగా స్వతంత్రుడుగా పరమపురుషుడుగా ఉత్తముడుగా కొందరు నిన్ను ఊహిస్తారు. అన్నింటినీ మించి సాటిలేని వాడవు నీవు. సదసత్తులకు పవిత్రమైన నిలయం నీవు. ఆలోచించి చూస్తే కంకణం మొదలైన బంగారు నగలూ,

బంగారమూ వాస్తవంగా ఒకటే కదా. అనంతమైన అలలూ సముద్రమూ ఒకటే కదా! అందువల్ల పైకి భేదం కన్పిస్తున్నా నీకు-ఈ సృష్టికీ వాస్తవంగా భేదం లేనేలేదు.

సీ. యద్విలాసము మరీచ్యాదు లెఱుంగరు; నిత్యుఁడనై యున్న నేను నెఱుఁగ
యన్మాయ నంధులై యమరాసురాదులు వనరెద రఁట; యున్న వారలెంత?
యే రూపమునఁ బొంద కేపారుదువు నీవు; రూపివై సకలంబు రూపుసేయ
రక్షింపఁ జెఱుపఁ గారణమైన సచరాచరాఖ్యవై విలసిల్లు దంబరమున

తే. ననిలుఁ డే రీతి విహరించు నట్ల నీవు, గలసి వర్తింతు సర్వాత్మకత్వ మొప్ప;
జగములకు నెల్ల బంధమోక్షములు నీవ, నీవ సర్వంబుఁ దలపోయ నీరజాక్ష! 387

* ఓకమలలోచనా! నీ లీలను మరీచి మొదలైన మహర్షులు సైతం తెలియలేరు. నీతోపాటూ ఉండే నేను కూడా తెలుసుకోలేను. నీ మాయ తెలియక దేవతలూ, రాక్షసులూ కష్టపడతారు. ఇంక తక్కిన వారెంత? నీవు ఏరూపాన్ని పొందకుండా పెంపొందుతావు. రూపాన్ని పొంది అన్నింటిని పుట్టించి కాపాడి అంతం చేయడానికి కారణమౌతావు. సకల చరాచరరూపుడవై వెలుగొందుతావు. ఆకాశంలో గాలి విహరించే విధంగా సర్వాత్మకుడవై అన్నింటిలోనూ నీవు చేరి ఉంటావు. లోకాలు పుట్టడమూ విడిపోవడమూ రెండూ నీవే. ఆలోచిస్తే అన్నీ నీవే.

మ. ఘనతన్ నీ మగపోఁడుముల్ పలుమఱుం గన్నారఁ గన్నార; మే
నిను విన్నారము; చూడ మెన్నఁడును మున్ నీ యాఁడు చందంబు; మో
మెహినివై దైత్యులఁ గన్నుఁ బ్రామి యమృతం బింద్రాది దేవాళి కి
చ్చిన నీ రూపముఁ జూపుమా! కుతుకముం జిత్తంబునం బుట్టెడిన్. 388

* మాధవా! మహిమతో కూడిన నీ మగసోయగాన్ని పెక్కుసార్లు కన్నులారా కన్నాము; విన్నాము. నీ ఆడరూపాన్ని ఏనాడూ చూడలేదు. మోహినిగా నీవు రాక్షసులను మోసగించి ఇంద్రాది దేవతలకు అమృతాన్ని పంచి యిచ్చిన ఆ రూపాన్ని చూపు. దానిని చూడాలని నా మనసు కుతూహల పడుతున్నది.

క. మగవాఁడ వై జగంబులఁ, దగిలిచి చిక్కులను బెట్టు దంటకు నీకున్
మగువ తనంబున జగములఁ, దగులము బొందింప నెంతతడవు ముకుందా! 389

*ముకుందా! మగవాడుగా నీవు లోకాలను ఎన్నోచిక్కులకు గురిచేస్తావు. అటువంటి నీవు ఆడరూపంలో లోకాలను ఆకర్షించడంలో ఆశ్చర్య మేముంది?

వ. అని పలుకుచున్న శూలపాణిచే నపేక్షితుండై విష్ణుండు భావగంభీరమగు నవ్వు నివ్వటిల్ల న వ్వాసు దేవు న కిట్లనియె. 390

* పై విధంగా పలుకుతున్న పరమేశ్వరుని మాటలకు గంభీరంగా నవ్వుతూ విష్ణువు ఇలా అన్నాడు.

**శా. 'శ్రీకంఠా! నిను నీవ యేమఱకుమీ చిత్తంబు రంజించెదన్,**
**నాకద్వేషుల డాఁగురించుటకునై నాఁ డేను గైకొన్న కాం**
**తాకారంబు జగన్నిమజ్జనము నీవై చూచెదేఁ జూపెదం;**
**గైకో నర్హము లండ్రు కాముకులు సంకల్ప ప్రభూతార్థముల్'. 391**

* మహేశ్వరా! నీ మనస్సుకు సంతోషం కలిగిస్తాను. తొందర పడవద్దు. ఆనాడు రాక్షసులను మోసగించడం కోసం నేను ధరించిన మోహినీరూపం- లోకాన్ని మోహింపజేసేది-నీవు చూడాలనుకుంటే చూపుతాను. మనసులోని కోరికలు తీర్చుకోవడం మంచిదేకదా!

## -: శ్రీహరి తన మోహినీ రూపంబుచే నీశ్వరుని మోహింపఁ జేయుట :-

**వ. అని పలికి, కమలలోచనుం డంతర్హితుండయ్యె; నయ్యుమా సహితుం డయిన భవుండు విష్ణుండెటు వోయెనో యెందుఁ జొచ్చెనోయని దిశ దిశలం గలయ నవలోకించుచుండం దనపురోభాగంబున.392**

**సీ. ఒక యెల దోఁటలో నొకవీథి నొక నీడఁ గుచకుంభముల మీఁది కొంగు దొలఁగఁ**
**గబరికాబంధంబు గంపింప నుదుటిపైఁ జికురజాలంబులు సిక్కువడఁగ**
**ననుమానమై మధ్యమల్లాడఁ జెక్కులఁ గర్ణకుండల కాంతి గంతు లిడఁగ**
**నారోహభరమున నడుగులు దడఁబడఁ దృగ్దీప్తి సంఘంబు దిశలఁ గప్ప**

**తే. వామకరమున జాఱిన వలువఁ బట్టి, కనక నూపుర యుగళంబు గల్లనంగఁ**
**గంకణంబులఁ ఝణఝణత్కార మెసఁగ, బంతిచే నాడు ప్రాయంపుటింతిఁ గనియె. 393**

* పై విధంగా పలికి విష్ణువు మాయమైనాడు. పార్వతీ దేవితో కూడిన శివుడు "విష్ణువెక్కడికి వెళ్ళినాడా?ఎక్కడున్నాడా"? అనుకొంటూ అన్ని వైపులా పారజూచినాడు. అంతలో ఆయన ఎదుట ఒక ఉద్యానవనం. ఆ వనంలో ఒక చెట్ల వరుస. అందులో ఒక చెట్టు నీడలో ఒక ఎలప్రాయపు సుందరాంగి కనిపించింది. ఆమె కుచకుంభముల మీద పైట తొలగిపోయింది. కొప్పుముడి వీడింది. నుదుటిపై ముంగురులు ముసురుకొన్నాయి. నడుముందా? లేదా? అనే అనుమానానికి అవకాశమిస్తూ కదలాడుతున్నది. చెవుల కమ్మల కాంతులు చెక్కిళ్లపై చిందుతున్నాయి. పిరుదుల బరువుతో పాదాలు తడబడుతున్నాయి. తళుకు చూపులు దిక్కులలో పిక్కటిల్లినాయి. జారిపోయిన చీర కుచ్చెళ్ళను ఎడమచేతితో పట్టుకొన్నది. బంగారు కాలి అందెల గల గలలూ, చేతి కంకణాల ఝణఝణలూ అతిశయింపగా ఆ యింతి బంతితో ఆడుతూ ఉంది.

**వ. కని, మున్ను మగువ మరగి సగమయిన మగవాఁ డమ్మగువ వయో రూప గుణ విలాసంబులు దన్ను నూరింపం గనుఱెప్పవ్రేయక తప్పక చూచి మెత్తనయిన చిత్తంబున. 394**

* అదివరకే మగువ వలపుతో సగమైన మగవాడు శివుడు. ఆ జవరాలి ప్రాయమూ, రూపమూ, ఒయ్యారమూ, విలాసమూ, ఆయన్ని బాగా ఆకర్షించినాయి. ఆయన కంటిపై రెప్పవేయకుండా మైమరచి ఆమెను చూచినాడు. ఆయన చిత్తం మెత్తబడి పోయింది.

శా. 'ఈ కాంతాజనరత్న మెవ్వరిదొకో? యీ యాఁడురూపంబు ము
న్నే కల్పంబులయందుఁ గాన; మఱిఁ డీ యింతిన్ సృజింపంగఁ దా
లేకుంటెల్ల నిజంబు, వల్లభత నీ లీలావతిం జేరఁగా
నే కాంతుండు గలండొ క్రీడలకు నా కీ యింతి సిద్ధించునే?' 395

* "ఈ అన్నుల మిన్న ఎవ్వరిదో కదా! ఏ కల్పం లోనూ నేను ఇటువంటి అందమైన ఆడదానిని చూడలేదు. ఈమెను బ్రహ్మ సృష్టించ లేదడనం తథ్యం. ఈ ఒయ్యారిని ఇల్లాలుగా పొందగలిగే అదృష్టవంతుడెవడో! ఈ లావణ్యవతి నాలీలా విహారాలకు లభిస్తుందా?'' అనుకొన్నాడు శివుడు.

వ. అని మఱియుం జెఱకువిలుతుని కోలలు మేరమీఱి దఱుమ నెఱబిరుదు వెఱఁగుపడం దెఱవ దుఱిమిన తుఱుము బిగిముడి వదలి కదలి భుజముల మెడల నదరి చెదరిన కురులు నొసలి మృగమద తిలకంపుటసలు మసల, విసవిస నగు మొగము మెఱుంగులు దశదిశలం బసలు కొలుపఁ, జిఱునగవు మెఱయ నునుఁ జెమటం దడంబడి పులకరములు గులకరములు గొన, హృదయానంద కందంబగు కందుకంబు గరారవిందంబునం దమర్చి, యక్కునం జేర్చి, చెక్కున హత్తించి, చుబుకంబు మోపి, చూచుకంబులం గదియించి, నఖంబుల మీటుచు, మెల్లమెల్లన గెల్లాడు కరకమలంబుల గనక మణివలయంబులు ఝుణఝుణయనం గుచకలశంబు లొండొంటి నొరయ, నెడమఁ గుడినిం దడంబడఁ గ్రమ్మన నెగురఁ జిమ్ముచు, నెగురఁ జిమ్మి తనకుఁ దానె కొన్ని చిన్ని పన్నిదంబులు సేసికొని బడుగునడుము బెడఁకి వడ వడ వడంకి నఱితి సరులు గలయం బడఁ దిరుగుచుఁ దిరుగునెడఁ బెనఁకువలుగొనఁ జెవుల తొడవుల రుచులు గటముల నటనములు సలుపఁ, బవిరి తిరిగి యొడియుచు, నొడిసి కెలంకులం జడియుచు, జడిసి జడనుపడక వలువ నెలవు వదలి దిగంబడం, గటిస్థలంబునఁ గాంచీ కనకమణి కింకిణులు మొరయఁ, జరణ కటకమ్ములు గల్లు గల్లు మనం, గరకంకణ మణి గణములు మెఱయ, మితి దప్పిన మోహాతిరేకం బుప్పొంగ వెనుకొని యుఱికి పట్టుచుఁ, బట్టి పుడమిం బడవైచి, పాటు వెంటనే మింటికెగసినం గెంటక కరంబునం గరంబు దిరంబయి పలుమఱు నెగయ నడుచుచు, నెగయు నెడం దిగంబడు తఱిని నీలంపు మెఱుంగు నిగ్గు సోగపగ్గంబుల వలలు వైచిరాఁ దిగిచిన పగిది వెనుకొనంగ, విలోకన జాలంబులు నిగిడించుచు, మగిడించుచుఁ, గర లాఘవంబున నొకటి, పది, నూఱు, వేయు సేసి నేర్పులు వాటించుచు, నరుణ చరణకమల రుచుల నుదయ శిఖరి శిఖర తరణి కరణి సేయుచు, ముఖచంద్ర చంద్రికలఁ జంద్రమండలంబులు గావించుచు, నెడ నెడ నురోజ దుర్గ నిర్గతచేలాంచలంబుఁ జక్క నొత్తుచుఁ గపోలఫలకాలోల ఘర్మజలబిందు బృందంబులు నఖాంకురంబుల నొనరించుచు, నధరబింబారుణ సంభ్రాంత సమాగత రాజకీరంబులం జోపుచు, ముఖసరోజ పరిమళాసక్త మత్తమధుపంబుల నివారించుచు, మందగమనాభ్యాస కుతూహలాయత్త మరాళ యుగ్మంబులకుం దలంగుచు, విలాస వీక్షణానందిత మయూర మిథునంబులకు నెడఁగ లుగుచుఁ, బొదరిండ్ల యీఱములకుం బోక మలంగుచుఁ, గరకిసల యాస్వాద కాముక కలకంఠ దంపతులకుఁ దూరమగుచుఁ, దీఁగె యుయ్యేలల నూఁగుచు; మాధవీ మండపంబు లెక్కుచుఁ,

**గుసుమరేణు పటలంబుల గుబ్బళ్లు వ్రాఁకుచుఁ, మకరందస్యంద బిందుబృందంబు నుత్తరించుచు, గృతక శైలంబుల నారోహించుచుఁ బల్లవ పీఠంబులం బరిశ్రమంబు పుచ్చుచు, లతాసౌధభాగంబులఁ బొడసూపుచు, నున్నత కేతకీ స్తంభంబుల నొరగుచుఁ, బుష్పదళ రచిత వాతాయనంబులం దొంగి చూచుచుఁ, గమల కాండ పాలికల నాలంబించుచుఁ, జంపక దేహళి మధ్యంబుల నిలువంబడుచు; గదళికాపత్ర కవాటంబున నుద్ఘాటించుచుఁ, బరాగ నిర్మిత సాలభంజికా నివహంబుల నాదరించుచు, మణికుట్టిమంబుల మురియుచుఁ, జంద్రకాంత వేదికల నెలయుచు, రత్నపంజర శారికా నివహంబులకుం జదువులు సెప్పుచుఁ, గోరిన క్రియం జూచుచుఁ, జూచినక్రియ మెచ్చుచు, మెచ్చిన క్రియ వెఱఁగు పడుచు, వెఱఁగుపడిన క్రియ మఱచుచు, మఱవక యేకాంతం బగు నవ్వనాంతంబున ననంత విభ్ర మంబుల జగన్మోహినియై విహరించుచు నున్న సమయంబున. 396**

* అంతలో మన్మథుని జయించిన పరమశివుని నిబ్బరం నీరై పోయేటట్లు మోహిని ముడుచుకున్న కొప్పుముడి వీడింది. వెంట్రుకలు భుజాలపైన, మెడపైనా చెదరి కదలాడినాయి. ఆమె నుదుటిమీది కస్తూరి బొట్టు కరగింది. ముద్దులు మూటగట్టే ముఖకాంతులు నలుదెసలా ప్రసరించినాయి. చిరునవ్వులు చిందుతున్నాయి. లేత చెమటతో తడబడుతూ పులకలు మొలకలెత్తినాయి. మనసుకు ఇంపునింపే బంతిని అందమైన హస్తంతో అందుకొన్నది. దానిని రొమ్ముపై ఉంచుకొన్నది. చెక్కిలిపై చేర్చుకొన్నది. గడ్డానికి తాకించుకొన్నది. చనుమొనలపై ఆనించుకొన్నది. గోళ్ళతో మీటింది. సొగసైన చేతులలో మెల్ల మెల్లగా కదలాడే మేలిమి కంకణాలు ఝణ ఝణ ధ్వని చేయగా, కుచకుంభములు ఒకదానితో ఒకటి రాయగా కుడి ఎడమలకు త్రుళ్ళిపడేటట్లు బంతిని ఒయ్యారంగా ఎగురవేసింది. తనకు తానే చిన్నచిన్న పందాలు వేసుకొన్నది. సన్నని నడుం వణికేటట్లు మెడలోని హారాలు చిక్కుపడేటట్లు తిరుగాడింది. అట్లా తిరిగేటప్పుడు చెవుల కుండలాల కాంతులు చెక్కిళ్ళపై చిందులాడినాయి. ఆమె గుండ్రంగా తిరుగుతూ బంతిని పట్టుకొని ప్రక్కలకు కదలుతున్నది. అప్పుడామె పైటచెరుగు జారిపోయింది. ఒడ్డాణంలోని బంగారు చిరుగంటలు మ్రోగినాయి. కాలి అందెలు గల్లు గల్లుమన్నాయి. కర కంకణాల రత్నాలు మెరిసినాయి. ఆమె వెనువెంట పరుగెత్తి బంతిని పట్టుకొంటూ, పట్టుకొని నేలపై చరుస్తూ, అది పై కెగిరినపుడు రెండు చేతులూ చేర్చి పలుసార్లు కొట్టుతున్నది. బంతి ఎగిరేటప్పుడు పడేటప్పుడూ పొడవైన వలలు వేసి లాగుతున్నట్లు తన సోగచూపులు వ్యాపింపజేస్తున్నది. బంతిని కొట్టుతూ, ఒకటి నుండి పది నూరు దాకా నేర్పుతో లెక్కపెట్టు తున్నది.

మోహిని ఎఱ్ఱ తామరలవంటి తన పాదాల అరుణ కాంతులతో తూర్పుకొండపైని సూర్యబింబాన్ని స్ఫురింపజేస్తున్నది. నెమ్మోము చందురుని వెన్నెల వెలుగులతో చంద్రమండలాలను సృజిస్తున్నది. అప్పుడప్పుడు కుచకలశాల మిట్టపల్లాలనుండి జారిపోయిన పైట సవరించు కొంటున్నది. చెక్కిళ్ళపై చిందే చెమట బొట్లను

కొనగోళ్ళతో చిమ్ముతున్నది. ఎఱ్ఱని పెదవిని దొండపండుగా భ్రమపడి వచ్చిన రా చిలుకలను తోలుతున్నది. పద్మంవంటి ముఖంలోని సువాసనకోసం మూగిన కొదమ తుమ్మెదలను అదలించు తున్నది. అందమైన మందగమనం నేర్చుకోడానికి వచ్చిన రాయంచ జంటలను గెంటుతున్నది. సొగసైన చూపులకోసం ముచ్చటపడి వచ్చిన నెమళ్ళ జంటలకు దూరంగా వెళ్తున్నది. పొదరిండ్ల దరిజేరకుండా చిగుళ్ళవంటి చేతులకు మనసుపడి వచ్చిన కోయిలజంటలకు దూరమగుతున్నది. తీగ ఉయ్యాలపై ఊగుతూ, పూలగురివెంద గుబుర్లపై ఎక్కుతూ, పుప్పొడి గుట్టలను దాటుతూ, మకరందాల మడుగులు గడుస్తూ, క్రీడా పర్వతాలపై విహరించుతూ, చిగురుటాకుల ఆసనాలపై అలసట తీర్చుకుంటూ, తీగయిండ్లలో దాగుడు మూతలాడుతూ, మొగలిబోదెలకు ఆనుకొంటూ, పూలరేకుల గవాక్షాలలో తొంగిచూస్తూ, మెట్టతామర మొక్కలను తాకుతూ, సంపెంగ పొదల గడపలలో నిలబడుతూ, అరటి ఆకులద్వారాలు తెరుస్తూ, కమ్మపుప్పొడి బొమ్మలను బుజ్జగించుతూ, రత్నాలబాటలపై విహరించుతూ, చంద్రకాంత వేదికలను సమీపించుతూ, రత్న పంజరాలలోని గోరువంకలకు మాటలు నేర్పుతూ, ఇష్టం వచ్చిన దానిని చూస్తూ, చూచిన దానిని మెచ్చుకొంటూ, మెచ్చుకొన్నదానిపై అచ్చెరువు కనబరుస్తూ, మైమరుస్తూ, మైమరపించుతూ, ఆ వాల్గంటి ఒంటరిగా ఆ తోటలో అంతులేని అందచందాలతో జగన్మోహినియై సంచరింప సాగింది.

**ఆ. వాలుఁగంటి వాఁడి వాలారుఁజూపుల, శూలి ధైర్యమెల్లఁ గోలుపోయి**
**తఱలి యెఱుకలేక మఱచె గుణంబుల, నాలి మఱచె నిజగణాలి మఱచె.** 397

* అందమైన ఆ వగలాడి వాడి చూపు వల్ల శివుడు నిగ్రహాన్నీ, నిబ్బరాన్నీ పూర్తిగా గోల్పోయినాడు. తన్ను తాను మరచిపోయినాడు. తన ఇల్లాలినీ, ప్రమథగణాలనూ విస్మరించినాడు.

**వ. అప్పుడు.** 398

**ఆ. ఎగురవైచి పట్ట నెడలేమిఁ జే దప్పి, వ్రాలు బంతిఁ గొనఁగ వచ్చు నెడను**
**బడఁతి వలువ వీడి పడియె మారుతహతిఁ, జంద్రధరుని మనము సంచలింప.** 399

* ఆ సమయంలో మోహిని బంతిని ఎగురవేసింది. పట్టుకోవడానికి వీలుపడకుండా అది జారిపడిపోయింది. దానిని తీసుకోవడానికి వస్తుండగా గాలి తాకిడికి ఆమె చీరముడి ఊడిపోయింది. అప్పుడు శివుని మనస్సు కంపించి పోయింది.

**మ. రుచిరాపాంగిని వస్త్రబంధన పరన్ రోమాంచ విభ్రాజితం**
**గుచభారానమితం గరద్వయపుటీ గూఢీకృతాంగిం జల**
**త్కచ బంధం గని మన్మథాతురత నాకంపించి శంభుండు ల**
**జ్జ చలింపం దనకాంత సూడఁ గదిసెం జంద్రాస్య కేల్దమ్మికిన్.** 400

* మోహిని కడగంటి కాంతులు తళుక్కుమని మెరసినాయి. చీర కట్టుకోవడానికి ఆమె ప్రయత్నించింది. ఆమె మేను పులకించింది. స్తనభారంతో ఆమె వంగింది. రెండు చేతులతో ఆమె వక్షఃస్థలాన్ని కప్పుకొన్నది.

ఆమె కొప్పుముడి వీడి వ్రేలాడుతున్నది. ఆ స్థితిలో ఆమెను చూచి కామావేశంతో శివుడు చలించిపోయినాడు. అతడు సిగ్గు పడేటట్లు సతీదేవి చూస్తున్నది. అయినా ఆయన మోహిని చేయిపట్టు కోవడానికి వెళ్ళినాడు.

ఆ. పదము సేరవచ్చు ఫాలాక్షుఁ బొడగని, చీరవీడి పడిన సిగ్గుతోడ
మగువ నగుచుఁ దరుల మాటున డాఁగెను, వేల్పుఱేఁడు నబల వెంటఁ బడియె. 401

* అడుగు దూరంలో సమీపిస్తున్న శివుని చూసింది మోహిని. చీర ఊడిపోయిన సిగ్గుతో నవ్వుతూ చెట్లచాటున దాగింది. ముక్కంటి ఆ వాల్గంటి వెంటబడినాడు.

మ. ప్రబలోద్యత్కరిణిం గరీంద్రుఁడు రమింపన్ వచ్చు లీలన్ శివుం
డబలా! పోకుము; పోకుమీ యనుచు డాయం బాఱి కెంగేలఁ ద
త్కబరీ బంధము వట్టి సంభ్రమముతోఁ గౌఁగిళ్ల నోలార్చె నం
త బహిః ప్రక్రియ నెట్టకేనిఁ గదియం దద్బాహునిర్ముక్తయై. 402

* మదించిన మగ ఏనుగు ఈడేరిన ఆడ ఏనుగుతో క్రీడించడానికి వెన్నాడిన విధంగా పరమేశ్వరుడు పరుగెత్తి మోహినిని సమీపించినాడు. 'అబలా పోవద్దు, పోవద్దు' అంటూ ఆమె జడపట్టుకొన్నాడు. వేగిరపాటుతో కౌగిలించుకొన్నాడు. పరవశత్వంతో రతిక్రీడకు పూనుకోబోయినాడు. అంతలో ఆమె అతనిపట్టు వదలించుకొన్నది.

సీ. వీడి వెన్నున నాడు వేణీభరంబుతో జఘన భారాగత శ్రాంతితోడ
మాయావధూటియై మఱలిచూచుచుఁ బాఱు విష్ణునద్భుత కర్ము వెంటఁ దగిలి
యీశాను మరల జయించె మరుం డనఁ గరిణి వెన్నను కరి కరణిఁ దాల్చి
కొండలు నేఱులుఁ గొలఁకులు వనములు దాఁటి శంభుఁడు సనం దన్మహాత్ము

తే. నిర్మలామోఘ వీర్యంబు నేలమీఁదఁ బడిన చోటెల్ల వెండియుఁ బైఁడి యయ్యె
ధరణి వీర్యంబు వడఁ దన్నుఁదా నెఱింగి దేవ మాయాజడత్వంబు దెలిసె హరుఁడు. 403

* మన్మథుడు తిరిగీ శివుని జయించినాడా! అనేటట్లు ఆడ ఏనుగును వెంటాడే మగ ఏనుగు వలె శివుడు మోహిని రూపంలో ఉన్న విష్ణువును వెంటాడినాడు. ఆ మాయా సుందరిజడ వీడి వీపుపై వ్రేలాడుతున్నది. ఆమె పిరుదులు బరువుతో అలసి సొలసి వెనుదిరిగి చూస్తూ పరుగెత్తుతున్నది. ఆమె వెంట శివుడు కొండలూ నదులూ సరస్సులూ అడవులూ దాటి వెళ్ళినాడు. అమోఘమైన ఆ మహాత్ముని వీర్యం నేలపై పడింది. అది పడిన చోటంతా వెండిగా బంగారంగా రూపుదాల్చింది. ఆ తరువాత శివుడు తన్నుతాను తెలుసుకొన్నాడు. పరమాత్ముని మాయవల్ల కలిగిన మైమరపును గమనించినాడు.

క. జగదాత్మకుఁడగు శంభుఁడు, మగిడెను హరి నెఱిఁగి తనదు మాహాత్మ్యమునన్
విగతత్రపుఁడై నిలిచెను, మగువతనం బుడిగి హరియు మగవాఁడయ్యెన్. 404

* మహానుభావుడైన శివుడు తన మహిమాతిశయంవల్ల విష్ణుమాయను తెలుసుకొని వెనుదిరిగినాడు. విష్ణువు సిగ్గుతోపాటు స్త్రీరూపాన్ని విడిచిపెట్టి మగవాడుగా మారిపోయాడు.

**ఆ. కాము గెలువవచ్చుఁ గాలారి గావచ్చు, మృత్యుజయము గలిగి మెఱయవచ్చు**
**నాఁడువారి చూపుటంపఱ, గెలువంగ వశము గాదు త్రిపురవైరి కైన. 405**

* మన్మథుని ఓడించవచ్చు. యముని ధిక్కరించవచ్చు. మృత్యుంజయుడై ప్రకాశించవచ్చు. కాని ఆడవారి వాలుచూపుల వాడి బాణాలను గెలవడం త్రిపురాంతకుడైన మహాశివునికైనా సాధ్యం కాదు.

**వ. ఇట్లు పురుషాకారంబు వహించిన హరి హరున కిట్లనియె. 406**

* మోహినీరూపాన్ని చాలించిన విష్ణువు శివునితో ఇట్లన్నాడు.

**సీ. 'నిఖిలదేవోత్తమ! నీ వొక్కరుఁడు దక్క నెవ్వఁడు నా మాయ నెఱుఁగ నేర్చు?**
**మానిని యైన నా మాయచే మునుఁగక ధృతి మోహితుండవై తెలిసి తీవు**
**కాలరూపంబునఁ గాలంబుతోడ నాయందును నీ మాయ యధివసించు**
**నీ మాయ నన్ను జయింప నేరదు నిజ మకృతాత్ములకు నెల్ల ననుపలభ్య**

**తే. మిపుడు నీ నిష్ఠపెంపున నెఱిఁగి' తనుచు, సత్కరించిన సఖ్యంబు సాల నెఱపి**
**దక్షతనయ గణంబులుఁ దన్నుఁ గొలువ, భవుఁడు విచ్చేసెఁ దగ నిజభవనమునకు. 407**

* 'ఓ మహాదేవా! నీ వొక్కడవు తప్ప నా మాయను మరెవ్వడూ తెలుసుకోలేడు. మోహినిగా మారిన నా మాయలోపడి మోసపోకుండా ధైర్యంతో పొరబాటు తెలుసుకొని మేలుకొన్నావు. కాలంతో కలిసి నీ మాయ నాలో చేరింది. ఈ మాయ నన్ను గెలవజాలదు. అల్పజ్ఞులు తెలుసుకోని నా మాయను నీ విప్పుడు నేర్పుతో తెలుసుకొన్నావు' అంటూ విష్ణువు శివుని గౌరవించినాడు. విష్ణువు పట్ల తన స్నేహాన్ని ప్రకటించి పరమేశ్వరుడు సతీదేవితో ప్రమథగణాలసేవ లందుకొంటూ తన నివాసానికి వెళ్ళినాడు.

**శా. పారావారముఁ ద్రచ్చుచో గిరి సముద్వాహార్థమై కచ్ఛపా**
**కారుండైన రమేశువర్తనము నాకర్ణింపఁ గీర్తింప సం**
**సారాంభోనిధిలో మునుంగు కుజనుల్ సంశ్రేయముం బొంది వి**
**స్తారోదార సుఖంబుఁ జెందుదురు తథ్యం బింతయున్ భూవరా! 408**

* పరీక్షిన్మహారాజా! సముద్రాన్ని చిలికేటప్పుడు సముద్ర మధ్యంలో మునిగిపోతున్న మందరపర్వతాన్ని మోయడం కోసం కూర్మావతారాన్ని ధరించిన విష్ణువు చరిత్రను వినినా, పాడినా, సంసార సముద్రంలో మునిగిపోయే అల్పులైన జనులు గొప్ప పుణ్యాన్ని, విశేషమైన సుఖాన్నీ చూరగొంటారు. ఇందులో సందేహం ఏ మాత్రమూ లేదు.

**మ. ఎలమిన్ దైత్యుల నాఁడురూపమున మోహింపించి పీయూషముం**
**జలితాపన్నులకుం సురోత్తములకుం జక్కన్ విభాగించి ని**

ర్మల రేఖన్ విలసిల్లు శ్రీ విభునిఁ దన్మాయావధూరూపముం
దలఁతున్ మ్రొక్కుదు నాత్మలోన దురితధ్వాంతార్క రూపంబుగన్. 409

వ. అని చెప్పి శుకుం డిట్లనియె. 410

* ఆడదాని రూపం ధరించి ఉపాయంగా రాక్షసులను మోసగించి ఆపదలలో అడలుతున్న దేవతలకు అమృతాన్ని పంచిపెట్టి, దివ్యతేజస్సుతో విరాజిల్లే విష్ణువునూ, ఆయన మోహినీ రూపాన్నీ ఊహించి మ్రొక్కుతాను. అది పాపపు చీకట్లను రూపుమాపే సూర్యుని స్వరూపంగా భావిస్తాను అని చెప్పి శుకుడు ఇట్లా అన్నాడు.

తే. నరవరాధీశ! యిప్పుడు నడుచుచున్న, వాఁడు సప్తమ మనువు వైవస్వతుండు;
శ్రాద్ధదేవుం డనందగు జనవరేణ్య!, పదురు నందను లతనికిఁ బ్రకట బలులు. 411

వ. వార లిక్ష్వాకుండును, నభగుండును, ధృష్టుండును, శర్యాతియు, నరిష్యంతుండును, నాభాగుండును, దిష్టుండును, గరూశకుండును, వృషధ్రుండును, వసుమంతుండును నను వారు పదుగురు రాజులు; పురందరుండను వాఁడింద్రుం; డాదిత్య మరుదశ్వి వసు రుద్ర సంజ్ఞలు గలవారు దేవతలు, గౌతమ కశ్యపాత్రి విశ్వామిత్ర జమదగ్ని భరద్వాజ వసిష్ఠులనువారు సప్తర్షులయి యున్నవా; రందుఁ గశ్యపున కదితి గర్భంబున విష్ణుండు వామనరూపుండై జనియించి యింద్రావరజుం డయ్యె; నిప్పు డేడు మన్వంతరంబులు సెప్పంబడియె; రాఁగల మన్వంతరంబులును శ్రీహరి పరాక్రమంబునుం జెప్పెద; దత్తావధానుండవై విను మని శుకుం డిట్లనియె. 412

* ఓ రాజా! ఇప్పుడు వైవస్వతుడనే ఏడవ మనువు పాలిస్తున్నాడు. అతనినే శ్రాద్ధదేవు డంటారు. అతనికి బలవంతులైన పదిమంది కొడుకు లున్నారు. వారు ఇక్ష్వాకుడూ, నభగుడూ, ధృష్టుడూ, శర్యాతీ, నరిష్యంతుడూ, నాభాగుడూ, దిష్టుడూ, కరూశకుడూ, వృషధ్రుడూ, వసుమంతుడూ అనేవారు. ఈ పదిమంది రాజులైనవారు. పురందరుడనే వాడు ఇంద్రుడైనాడు. ఆదిత్యులూ, మరుత్తులూ, అశ్వినులూ, వసువులూ, రుద్రులు అనేవారు దేవతలైనారు. గౌతముడూ, కశ్యపుడూ, అత్రీ, విశ్వామిత్రుడూ, జమదగ్నీ, భరద్వాజుడూ, వసిష్ఠుడూ అనేవారు సప్తఋషులైనారు. అందులో కశ్యపునిభార్య అయిన అదితి గర్భంలో నుంచి విష్ణువు వామన రూపంలో జన్మించి ఇంద్రునికి తమ్ముడైనాడు. ఇంతవరకూ ఏడు మన్వంతరాల కథ చెప్పినాను. ఇక రాబోయే మన్వంతరాల గురించీ, మహావిష్ణువు పరాక్రమాన్ని గురించీ చెప్పుతాను. శ్రద్ధగా విను అని చెప్పి శుకుడు ఇట్లా అన్నాడు.

సీ. జననాథ! సంజ్ఞయు ఛాయయు ననువారు గల రర్కునకు విశ్వకర్మతనయ
లిరువురు వల్లభ లిటమున్న చెప్పితిఁ బరఁగుఁ దృతీయయు బడబ యనఁగ
సంజ్ఞకు యముఁడును శ్రాద్ధదేవుండును యమునయుఁ బుట్టిరి హర్ష మెసఁగ;
ఛాయకుఁ దపతియు సావర్ణియును శనై శ్చరుఁడును గలిగిరి; సంవరణుఁడు

తే. దపతి నాలిగఁ గైకొనెఁ దా వరించె, నశ్వియుగళంబు బడబకు నవతరించె;
వచ్చు నష్టమ వసువు సావర్ణి; వాఁడు, తపము సేయుచు నున్నాఁడు ధరణినాథ! 413

* ఓ రాజా! సూర్యునికి సంజ్ఞా, ఛాయా అనే భార్యలున్నారు. వారు విశ్వకర్మ కుమార్తెలు. ఇదివరకే ఈ సంగతి చెప్పినాను. వారిద్దరే కాక సూర్యునికి "బడబ" అనే భార్యకూడా ఉంది. సంజ్ఞకు యముడూ శ్రాద్ధదేవుడూ యమునా పుట్టినారు. ఛాయకు సావర్ణీ శనైశ్చరుడూ తపతీ పుట్టినారు. తపతిని సంవరణుడు పెండ్లాడినాడు. బడబకు ఇద్దరు అశ్వినీ దేవతలు పుట్టినారు. రాబోయే కాలంలో సావర్ణి ఎనిమిదవ మనువవుతాడు. అత డిప్పుడు తపస్సు చేస్తున్నాడు.

**క. ఒకపరి సూచిన వెండియు, నొకపరి సూడంగ లేకయుండు సిరులకై**
**యొక నొకని చేటు వేళకు, నొకఁ డొక్కఁడు మనువుఁ గాచి యుండు నరేంద్రా! 414**

* ఓ రాజా! ఒకసారి కనిపించి ఇంకొకసారి కనపించకుండా మాయమయ్యే సంపదలకోసం ఒక్కొక్క మనువు దిగిపోయే సమయానికి ఒక్కొక్క మనువు కాచుకొని ఉంటాడు.

**వ. సూర్య సావర్ణి మన్వంతరంబున నతని తనయులు నిర్మోహవిరజస్కాద్యులు రాజులును, సుతపో విరజోమృత ప్రభులను వారు దేవతలును గాఁగలరు; గాలవుండును, దీప్తిమంతుండును, బరశురాముండును, ద్రోణపుత్త్రుండగు నశ్వత్థామయుఁ, గృపుండును, మజ్జనకుండగు బాదరాయ ణుండును, ఋశ్యశృంగుండును సప్తర్షు లయ్యెదరు; వార లిప్పుడు దమతమ యోగబలంబుల నిజాశ్రమ మండలంబులం జరియించు చున్నవారు; విరోచన నందనుండగు బలి యింద్రుం డయ్యెడు నని చెప్పి శుకుం డిట్లనియె. 415**

* సూర్య సావర్ణి పాలించే ఎనిమిదవ మన్వంతరంలో అతని కొడుకులైన నిర్మోహుడూ, విరజస్కుడూ మొదలైనవారు రాజు లవుతారు. సుతపులూ, విరజులూ, అమృతప్రభులూ దేవత లవుతారు, గాలవుడూ, దీప్తిమంతుడూ, పరశురాముడూ, ద్రోణునికొడుకైన అశ్వత్థామా, కృపుడూ, వ్యాసుడూ, ఋశ్యశృంగుడూ సప్తఋషు లవుతారు. ఇప్పుడు వారు తమ తమ ఆశ్రమాలలో ఉన్నారు. విరోచనుని కొడుకైన బలిచక్రవర్తి ఇంద్రు డవుతాడు.

**సీ. బలి మున్ను నాకంబు బలిమిమైఁ జేకొన్న వామనుండై హరి వచ్చి వేఁడఁ**
**బాదత్రయం బిచ్చి భగవన్నిబద్ధుఁడై సురమందిరము కంటె సుభగమైన**
**సుతల లోకంబున సుస్థితి నున్నాఁడు వెతలేక యట మీఁద వేదగుహికి**
**నా సరస్వతికిఁ దా నట సార్వభౌముండు నాఁ బ్రభువయి హరి నాకవిభునిఁ**

**ఆ. బద విహీనుఁ జేసి బలిఁ దెచ్చి నిలుపును, బలియు నిర్జరేంద్రు పదము నొందు;**
**నింద్రపదము హరికి నిచ్చిన కతమున, దానఫలము సెడదు ధరణినాథ! 416**

* ఓ రాజా! పూర్వం బలిచక్రవర్తి బలవంతుడై స్వర్గలోకాన్ని స్వాధీనం చేసుకోగా విష్ణువు వామనుడుగా వెళ్ళి అతనిని మూడడుగులు దానమడగినాడు. దానమిచ్చిన బలిని భగవంతుడు బంధించినాడు. తరువాత బలికి అమరావతికంటె సొగసైన సుతల లోకాన్ని ఇచ్చినాడు. దానిలో బలి సుఖంగా ఉన్నాడు. అటు తర్వాత

విష్ణువు వేదగుహికీ, సరస్వతికీ "సార్వభౌము" డనే పేరుతో జన్మిస్తాడు. దేవేంద్రుని పదవినుండి తొలగిస్తాడు. ఆ పదవిలో బలిచక్రవర్తిని నిలుపుతాడు. విష్ణువు నుండి బలిచక్రవర్తి ఇంద్రపదవిని పొందినప్పటికీ అతడు మొదట విష్ణువుకు దానం చేసిన పుణ్యం చెడదు.

**వ. అట మీఁదటి కాలంబున వరుణ నందనుండగు దక్షసావర్ణి తొమ్మిదవ మను వయ్యెడు; అతని కొడుకులు ధృతకేతు, దీప్తకేతు ప్రముఖులు రాజులును, బరమరీచిగర్గాదులు నిర్జరులును, నద్భుతుం డనువాఁ డింద్రుండును, ద్యుతిమత్ప్రభృతు లగు వారలు ఋషులును నయ్యెద రందు. 417**

* అటు తరువాతి కాలంలో వరుణుని కొడుకైన దక్షసావర్ణి తొమ్మిదవ మను వవుతాడు. అతని కొడుకులైన ధృతకేతువూ, దీప్తకేతువూ మొదలైనవారు రాజు లవుతారు. పరుడు, మరీచిలూ, గర్గుడు మొదలైనవారు దేవత లవుతారు. అద్భుతు డనేవాడు ఇంద్రు డవుతాడు. ద్యుతిమంతుడు మొదలైనవారు సప్తఋషులవుతారు.

**ఆ. దనుజహరణుఁ డంబుధార కాయుష్మంతు, నకు జనించి రక్షణంబు సేయ**
**మూఁడు లోకములను మోదంబుతో నేలు, నద్భుతాఖ్య నొప్పు నమరవిభుఁడు. 418**

* ఆ కాలంలో విష్ణువు ఆయుష్మంతునికి అంబుధారకూ జన్మిస్తాడు. అతని రక్షణలో దేవేంద్రుడైన అద్భుతుడు మూడులోకాలనూ సంతోషంగా పాలిస్తాడు.

**వ. మఱియు నుపశ్లోక సుతుం డగు బ్రహ్మసావర్ణి దశమ మనువయ్యెడిఁ; దత్పుత్త్రులు భూరిషేణాదులు భూపతులును, హవిష్మత్ప్రముఖులు మునులును, శంభుండను వాఁ డింద్రుండును, విబుద్ధ్యాదులు నిర్జరులును నయ్యెద; రందు. 419**

* ఓ రాజా! ఆ తర్వాత ఉపశ్లోకుని కొడుకైన బ్రహ్మసావర్ణి పదియవ మనువవుతాడు. అతని కొడుకులైన భూరిషేణుడు మొదలైన వారు రాజు లవుతారు. హవిష్మంతుడు మొదలైనవారు సప్తఋషు లవుతారు. శంభుడనే వాడు ఇంద్రు డవుతాడు. విబుద్ధులు మొదలైనవారు దేవత లవుతారు.

**ఆ. విశ్వసృజుని యింట విభుఁడు విషూచికి, సంభవించు నంశ సహితుఁ డగుచుఁ**
**జెలిమి శంభుతోడఁ జేయు విష్వక్సేనుఁ, డనఁగ జగముఁ గాచు నవనినాథ! 420**

* ఆ కాలంలో విష్ణువు విశ్వసృజునికీ, విషూచికీ "విష్వక్సేను" డనే పేరుతో జన్మించి శంభునికి చెలికాడై లోకాన్ని కాపాడుతాడు.

**వ. మఱియుం దదాగమిష్యత్కాలంబున ధర్మసావర్ణి పదునొకండవ మను వయ్యెడి; మను తనూజులు సత్యధర్మాదులు పదుండ్రు ధరణి పతులును; విహంగమ కామగమన నిర్వాణరుచు లనువారు సురలును, వైధృతుం డనువాఁ డింద్రుండును, నరుణాదులు ఋషులును నయ్యెద; రందు. 421**

* ఆ తరువాత వచ్చేకాలంలో ధర్మసావర్ణి పదకొండవ మనువవుతాడు. అతని కొడుకులైన సత్యధర్ముడు మొదలైనవారు పదిమంది రాజులవుతారు. విహంగములూ, కామగమనులూ, నిర్వాణరుచులూ దేవతలవుతారు. వైధృతుడనేవాడు ఇంద్రు డవుతాడు. వరుణుడు మొదలైనవారు సప్తఋషు లవుతారు.

**ఆ. అంబుజాత నేత్రుఁ డా సూర్య సూనుఁడై, ధర్మసేతు వనఁగఁ దగ జనించి**
**వైభవాఢ్యుఁ డగుచు వైధృతుఁ డలరంగఁ, గరుణఁ ద్రిజగములను గావఁ గలఁడు. 422**

* ఆ కాలంలో విష్ణువు "ధర్మసేతు" వనే పేరుతో సూర్యుని కొడుకుగా జన్మిస్తాడు. అతడు మహిమలతో సంపన్నుడై వైధృతుడు సంతోషించేటట్లు మూడు లోకాలనూ కరుణతో కాపాడుతాడు.

**వ. మఱియుఁ దద్భవిష్యత్సమయంబున భద్రసావర్ణి పంద్రెండవమను వయ్యెడి; నతని నందనులు దేవవ దుపదేవ దేవ జ్యేష్ఠాదులు వసుధాధిపతులును, ఋతుధాముం డనువాఁ డింద్రుండును, హరితాదులు వేల్పులును, దపోమూర్తి తపఅగ్నీధ్రకాదులు ఋషులును నయ్యెద; రందు. 423**

* ఓ రాజా! ఆ తరువాత రాబోయే కాలంలో భద్రసావర్ణి పంద్రెండవ మనువవుతాడు. అతని కొడుకులైన దేవవంతుడూ, ఉపదేవుడూ, దేవజ్యేష్ఠుడూ మొదలైనవారు రాజులవుతారు. ఋతుధాము డనేవాడు ఇంద్రు డవుతాడు. హరితులు మొదలైన వారు దేవత లవుతారు. తపోమూర్తీ తపస్వీ అగ్నీధ్రకుడూ మొదలైన వారు సప్తఋషు లవుతారు.

**ఆ. జలజలోచనుండు సత్యతపస్సూనృ, తలకు సంభవించుఁ దనయుఁ డగుచు**
**ధరణిఁ గాచు నంచిత స్వధామాఖ్యుఁడై, మనువు నంతసింప మానవేంద్ర! 424**

*ఆ కాలంలో విష్ణువు సత్యతపునికీ సూనృతకూ "స్వధాము" డనే పేరుతో జన్మిస్తాడు. మనువు సంతోషించే టట్లు లోకాన్ని రక్షిస్తాడు.

**వ. మఱియుం దదేష్యత్కాలంబున నాత్మవంతుండగు దేవసావర్ణి పదుమూఁడవ మనువయ్యెడి; మనుకుమారకులు చిత్రసేన విచిత్రాదులు జగతీనాయకులును, సుకర్మ సుత్రామ సంజ్ఞలు గలవారు బృందారకులును, దివస్పతి యను వాఁ డింద్రుండును, నిర్మోహ తత్త్వదర్శాద్యులు ఋషులును నయ్యెద; రందు. 425**

* ఓ రాజా! ఆ తరువాతి కాలంలో దేవసావర్ణి పదుమూడవ మనువవుతాడు. అతని కొడుకులైన చిత్రసేనుడూ, విచిత్రుడూ మొదలైన వారు రాజులవుతారు. సుకర్ములూ, సుత్రాములూ దేవత లవుతారు. దివస్పతి అనేవాడు ఇంద్రు డవుతాడు. నిర్మోహుడూ, తత్త్వదర్శుడూ మొదలైనవారు సప్తఋషు లవుతారు.

**ఆ. ధరణి దేవహోత్ర దయితకు బృహతికి, యోగవిభుఁడు నాఁగ నుద్భవించి**
**వనజనేత్రుఁ డా దివస్పతి కెంతయు, సౌఖ్యమాచరించు జగతినాథ! 426**

* ఆ కాలంలో విష్ణువు దేవహోతకూ బృహతికీ "యోగవిభు" డనే పేరుతో పుట్టుతాడు. దివస్పతికి మిక్కిలి సహాయం చేస్తాడు.

వ. మఱియు నట వచ్చుకాలంబున నింద్రసావర్ణి పదునాల్గవ మను వయ్యెడి; మను నందనులు ఉరు గంభీరవస్వాదులు రాజులును, బవిత్రచాక్షుషు లనువారు దేవగణంబులును, శుచి యనువాఁ డింద్రుండును, నగ్ని బాహు శుచి శుక్ర మాగధాదులు ఋషులును నయ్యెద; రందు. 427

* ఆ తరువాత రాబోయే కాలంలో ఇంద్రసావర్ణి పదునాలుగవ మను వవుతాడు. అతని కొడుకులు ఉరు గంభీరుడూ, వసువూ మొదలైనవారు రాజులవుతారు. పవిత్రులూ చాక్షుషులూ దేవత లవుతారు. శుచి అనేవాడు ఇంద్రు డవుతాడు. అగ్నీ, బాహువూ, శుచీ, శుక్రుడూ, మాగధుడూ మొదలైనవారు సప్తఋషు లవుతారు.

తే. తనర సత్రాయణునకు వితానయందు, భవము నొందెడి హరి బృహద్భానుఁ డనఁగ
విస్తరించుఁ గ్రియాతంతు విసరములను, నాకవాసులు ముదమంద నరవరేణ్య! 428

* ఆ కాలంలో విష్ణువు సత్రాయణునకూ, వితానకూ "బృహద్భాను'' డనే పేరుతో పుట్టుతాడు. దేవతలు సంతోషించేటట్లు క్రియాకలాపాలను పెంపొందిస్తాడు.

క. జగతీశ! త్రికాలములను, బొగడొందు మనుప్రకారములు సెప్పఁబడెం;
దగఁ బదునలువురు మనువులుఁ, దెగ యుగములు వేయు నడవ దివ మజున కగున్. 429

వ. అనినఁ బరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రున కిట్లనియె. 430

* ఓ రాజా! మూడులోకాలలోనూ ప్రఖ్యాతి పొందే మనువుల విధానాన్ని చెప్పినాను. పద్నాలుగుమంది మనువులు అంతరించి వెయ్యి యుగాలు గడిస్తే బ్రహ్మకు ఒకదిన మవుతుంది- అని శుకుడు చెప్పగా పరీక్షిత్తు ఇట్లా అన్నాడు.

ఆ. ఈ పదంబులందు నీ మను ప్రముఖుల, నెవ్వ రనుపువార లేమి కతన
నధిక విభవులైరి? హరి యేల జనియించె?, నెఱుఁగఁ బలుకు నాకు నిద్ధచరిత! 431

వ. అనినం బారాశర్య కుమారుం డిట్లనియె. 432

* ఓ మునీంద్రుడా! ఈ పదవులలో మనువులను ఎవరు నియోగిస్తారు? దేనివల్ల వారు గొప్ప వైభవాన్ని పొందుతారు? ఆ మన్వంతరాలలో ఎందుకు విష్ణువు జన్మిస్తాడు? నాకు తెలిసేటట్లు చెప్పు' అని అడిగిన పరీక్షిత్తుతో శుకుడు ఇట్లా అన్నాడు.

సీ. మనువులు మునులును మనుసుతు లింద్రులు నమరులు హరియాజ్ఞ నడఁగువారు
యజ్ఞాదు లందఱు హరిపౌరుషాకృతు లా మనువులు దత్సహాయశక్తి
జగముల నడపుదు రొగి నాల్గుయుగముల కడపటఁ గాల సంగ్రస్తమైన
నిగమచయంబును నిజతపోబలముల మరలఁ గాంతురు ఋషివరులు; దొంటి

తే. పగిది ధర్మంబు నాలుగు పాదములును, గలిగి వర్తిల్లు; మనువులు గమల నేత్రు
నాజ్ఞఁ దిరుగుదు; రేలుదు రవనిపతులు, జగతి భాగించి తమ తమ సమయములను. 433

* మనువులూ, ఋషులూ, మనువుల కొడుకులూ, ఇంద్రులూ, దేవతలూ విష్ణుని ఆజ్ఞకు లోబడి ఉంటారు. యజ్ఞుడు మొదలైనవారు అందరూ విష్ణుదేవుని అంశముతో రూపు దాలుస్తారు. అతని సహాయం వల్ల మనువులు లోకాలను ఏలుతారు. క్రమంగా నాలుగుయుగాల చివర వేదాలను కాలం మ్రింగివేస్తుంది. పుణ్యాత్ములైన ఋషులు తమ తపశ్శక్తి వల్ల మరల వేదాలను దర్శిస్తారు. పూర్వంవలె ధర్మం నాలుగు పాదాలతో నడుస్తుంది. విష్ణువు ఆజ్ఞ చెల్లుబడి అవుతుంది. తమ తమ కాలాలలో రాజులు లోకాన్ని పంచుకొని పాలిస్తారు.

**వ. మఱియుఁ బ్రాప్తులయిన వారల నింద్రపదంబులను, బహుప్రకారంబుల దేవపదంబులను, హరి ప్రతిష్ఠించుచుండు; వారలు విహితకర్మంబుల జగత్త్రయంబునుం బరిపాలింతురు; లోకంబులు సువృష్టులై యుండును. 434**

* విష్ణువు శక్తిమంతులను ఇంద్రపదవిలోనూ పెక్కు విధాలైన దేవతల పదవులలోనూ నెలకొల్పుతాడు. వారు తమకు నిర్ణయింపబడిన నియమాలతో మూడు లోకాలనూ ఏలుతారు. లోకాలు సుభిక్షంగా ఉంటాయి.

**సీ. యోగీశరూపుఁడై యోగంబుఁ జూపుచు మౌని రూపమునఁ గర్మంబుఁ దాల్చి**
**సర్గంబు సేయుఁ బ్రజాపతి రూపుఁడై యింద్రుఁడై దైత్యుల నేపడంచు**
**జ్ఞానంబు నెఱిఁగించుఁ జతుర సిద్ధాకృతిఁ గాలరూపమునఁ బాకంబు సేయుఁ**
**నానావిధములైన నామరూపంబులఁ గర్మలోచనులకుఁ గానఁబడఁడు.**

**ఆ. చనిన రూపములను జనురూపముల నింకఁ, జనఁగనున్న రూపచయము నతఁడు**
**వివిధుఁడై యనేకవృత్తుల వెలిఁగించు, విష్ణుఁ డవ్యయుండు విమల చరిత! 435**

* ఓ పుణ్యాత్ముడా! శాశ్వతుడైన విష్ణువు యోగీంద్రుని రూపంతో యోగం బోధిస్తాడు. మౌనిరూపంతో కర్మానుష్ఠానాన్ని ప్రబోధిస్తాడు. ప్రజాపతి రూపంతో సృష్టిచేస్తాడు. ఇంద్రుడై రాక్షసుల గర్వాన్ని అణచివేస్తాడు. సిద్ధస్వరూపంతో జ్ఞానం ఉపదేశిస్తాడు. కాలరూపంతో కడతేరుస్తాడు. అవ్యయుడైన ఆ విష్ణువు పెక్కు పేర్లతో పెక్కురూపాలతో కూడి ఉంటాడు. అతడు విషయాసక్తుల కంటికి కనిపించడు. అతడు జరిగిన కాలంలోనూ జరుగుతున్న కాలంలోనూ, జరుగబోయే కాలంలోనూ పెక్కురీతుల వేర్వేరు రూపాలతో వెలుగుతాడు.

## -: వామన చరిత్ర కథాప్రారంభం :-

**వ. అనిన భూవరుం డిట్లనియె. 436**

**మ. బలి నంభోరుహ నేత్రుఁ డేమిటికినై పాదత్రయిన్ వేఁడె? ని**
**శ్చలుఁడుం బూర్ణుఁడు లబ్ధకాముఁడు రమా సంపన్నుఁడై తాఁ బర**
**స్థలికిన్ దీనునిమాడ్కి నేల చనియెం? దప్పేమియున్ లేక ని**
**ష్కలుషున్ బంధన మేల చేసెను? వినం గౌతూహలం బయ్యెడిన్. 437**

**వ. అనిన శుకుం డిట్లనియె. 438**

* పై విధంగా చెప్పిన శుకునితో పరీక్షిత్తు ఇట్లా అన్నాడు. "విష్ణువు పూర్ణపురుషుడు. పూర్ణ కాముడు. నిర్వికారుడు. లక్ష్మీదేవితో కూడిన వాడు. అటువంటివాడు బలిచక్రవర్తిని ఎందుకోసం మూడడుగులు అడిగినాడు? దరిద్రునివలె ఇతరుల వద్దకు ఎందుకు పోయినాడు? ఏమీ తప్పు లేకుండానే పుణ్యాత్ముడైన బలిని ఎందుకు బంధించినాడు? ఈ కథ వినాలని కుతూహలంగా ఉన్నది." ఈ విధంగా అడిగిన పరీక్షిత్తుతో శుకుడు ఇట్లా అన్నాడు.

**సీ. పురుహూతుచే నొచ్చి పోయి భార్గవులచే బలి యెట్టకేలకు బ్రదికి వారి**
**చిత్తంబురాఁ గొల్చి శిష్యుఁడై వర్తింప వారు నాతని భక్తి వలన మెచ్చి**
**విశ్వజిద్యాగంబు విధితోడఁ జేయింప భవ్యకాంచనపట్ట బద్ధ రథము**
**నర్కునాజులఁ బోలు హరులఁ గంఠీరవ ధ్వజము మహాదివ్యధనువుఁ బూర్ణ**

**తే. తూణయుగళంబుఁ గవచంబుఁ దొలుత హోమ, పావకుం డిచ్చె; నమ్లాన పద్మమాలఁ**
**గలుష హరుఁడగు తన తాత కరుణ నొసఁగె;, సోమ సంకాశ శంఖంబు శుక్రుఁ డిచ్చె. 439**

* బలిచక్రవర్తి ఇంద్రుని చేతిలో ఓడిపోయి శుక్రాచార్యుని దయవల్ల తేరుకొన్నాడు. శుక్రునికి కనికరం కలిగేటట్లు శిష్యుడై సేవించినాడు. బలి భక్తికి శుక్రుడు మెచ్చుకొన్నాడు. బలిచేత నియమపూర్వకంగా విశ్వజిద్యాగాన్ని చేయించినాడు. బలిచక్రవర్తికి హోమాగ్ని నుండి బంగారు వస్త్రాలు కప్పిన రథమూ, సూర్యుని గుఱ్ఱాలవంటి గుఱ్ఱాలూ, సింహపు జెండా, గొప్పవిల్లూ, అంపపొదులజంటా, కవచమూ లభించినాయి. పుణ్యాత్ముడైన తన తాతగారు ప్రహ్లాదుడు వాడిపోని పద్మాలదండ ఇచ్చినాడు. శుక్రుడు చంద్రుని వంటి తెల్లని శంఖాన్ని ఇచ్చినాడు.

**వ. ఇ వ్విధంబున. 440**

**క. పాణియు, రథియుఁ గృపాణియుఁ, దూణియు, ధన్వియును స్రగ్వి తురగియు దేహ**
**త్రాణియు ధిక్కృత విమత, ప్రాణియు మణికనక వలయ పాణియు నగుచున్. 441**

* పై విధంగా బలిచక్రవర్తి బాణాలూ, రథమూ, ఖడ్గమూ, అమ్ముల పొదులూ, విల్లూ, పూలదండా, గుఱ్ఱాలు, కవచమూ, రత్నఖచిత సువర్ణకంకణాలూ సంపాదించినాడు. అటుపిమ్మట పగవారిపై పగతీర్చు కొనవలెనని నిశ్చయించినాడు.

**మ. పలుదానంబుల విప్రులం దనిపి తద్భద్రోక్తులం బొంది పె**
**ద్దలకున్ మ్రొక్కి విశిష్టదేవతల నంతర్భక్తిఁ బూజించి, ని**
**ర్మలుఁ బ్రహ్లాదునిఁ జీరి నమ్రశిరుఁడై రాజద్రథారూఢుఁడై**
**వెలిఁగెన్ దానవభర్త శైల శిఖరోద్వేల్లద్దవాగ్ని ప్రభన్. 442**

* బలిచక్రవర్తి గొప్ప దానాలతో బ్రాహ్మణులను సంతోషపెట్టి వారి దీవనలు అందుకొన్నాడు. పెద్దలకు నమస్కరించినాడు. నిండు భక్తితో ఇలవేల్పులును పూజించినాడు. నిర్మల చరిత్రుడైన ప్రహ్లాదునకు

ప్రణమిల్లినాడు. నిగనిగలాడే రథంపై కూర్చొని కొండశిఖరాన ప్రచండంగా మండే కార్చిచ్చువలె ప్రకాశించినాడు.

క. **దండిత మృత్యు కృతాంతులు, ఖండిత సుర సిద్ధ సాధ్య గంధర్వాదుల్**
**పిండిత దిశు లమరాహిత, దండాధీశ్వరులు సములు దన్నుం గొలువన్.** **443**

* బలిచక్రవర్తితో సమానమైన బలముగల దైత్యసేనాపతులు ఆయన ముందు వినమ్రులై నిలిచినారు. వారు మృత్యు దేవతనూ, యమధర్మరాజునూ దండింప గల ఉద్దండులు. దేవతలూ, సిద్ధులూ, సాధ్యులూ, గంధర్వులూ మొదలైన వారిని భంగపరచిన వారు. దిక్కులను ముక్కలు చేయగలవారు.

క. **చూపుల గగనము మ్రింగుచు, నేపున దివిభువియు నాత లీతల సేయన్**
**రూపించుచు దనుజేంద్రుఁడు, ప్రాపించెను దివిజనగర పథము నరేంద్రా!** **444**

* ఓ పరీక్షిన్నరేంద్రా! బలిచక్రవర్తి తన చూపులతో ఆకాశాన్ని కబళిస్తూ, నింగినీ నేలనూ తలక్రిందులుగా చేయాలని పొంగిపడుతూ దేవతల రాజధానికి బయలు దేరినాడు.

వ. **ఇట్లు బలవంతుండగు బలి సురేంద్రుని సాధింప సమకట్టి దండగమనంబు సేసి, నిడుద పయనంబులం జని చని.** **445**

మ. **కనియెం బుణ్యజనౌకమున్ విగతరోగస్వప్న పీడాన్న ఖా**
**దన సంశోకముఁ బుష్ప పల్లవ ఫలోద్దామ ద్రుమానీకమున్**
**స్వనితోద్ధూత పతాకముం బ్రవిచరద్వైమానికానీకమున్**
**ఘన గంగాసలిలైకమున్ మఘవయుక్త శ్రీకమున్ నాకమున్.** **446**

* పై విధంగా బలశాలియైన బలిచక్రవర్తి దేవేంద్రునిపై పగతీర్చుకోటానికి వేగంగా దీర్ఘమైన ప్రయాణం సాగించి స్వర్గలోకాన్ని సమీపించినాడు. స్వర్గం పుణ్యాత్ములకు నివాసస్థానం. అక్కడ రోగాలూ, చెడు కలలూ, ఆకలి బాధలూ, దుఃఖాలు ఉండవు. అక్కడ పూలూ పండ్లూ నిండుగా ఉండే చెట్లు దండిగా ఉన్నాయి. గాలికి సవ్వడిచేస్తూ జెండాలు ఎగురుతుంటాయి. దేవతల విమానాలు తిరుగుతుంటాయి. పవిత్రమైన ఆకాశగంగానదీజలాలు ప్రవహిస్తుంటాయి. అది దేవేంద్రుని రాజధాని.

వ. **కని రక్కసులఱేఁడు వెక్కసంబై చాల్పుగల వేల్పుల నెలవు దఱియం జొచ్చి, చెచ్చెర ముందటికింజని చని, ముందట నెడపడక మొనమోసి యిగురుచు చిగురు తలిరాకు జొంపంబునన మొగుడు మొగ్గ యరవిరి నెఱవిరి గుత్తి పిందె పూఁపదోరగాయ పండుగెలల తండంబుల వ్రేఁగు లాఁగలేక మూఁగివీఁగి వ్రేఁకలగు మ్రాఁకుల ప్రోకలకుఁ బేఁట లగు పెందోఁటలును, దోఁటల గాటంబులై నివ్వ టిల్లు మవ్వంపుఁ గ్రొవ్విరులకుఁ గవలు వివ్వక కసిమసలు గలిగి ముసరు కొసరి పూని పోని తేనియ లాని విసరు గలిగి మసరు కవిసి క్రొవ్వి రిమ్మగొని జుమ్మ్ముజుమ్మనుచు జంజాటించు తేఁటి

దాఁటులును, దాఁటు వడక నాఁటుకొని కూడి జోడు వీడక క్రొమ్మామ్మవుల కమ్మని కొమ్మల నిమ్మల ముసరి పసిమి గల కిసలయమ్ములు వొసగంగ మెసంగి కిసరువడక కసరు సెడి బిట్టు రట్టడి తనంబు మించి కరాళించు కోయిలల మొత్తంబులును, మొత్తంబులై చిత్తంబులు మత్తంబులుగఁ దత్తఱంబునం దియ్యని పండ్లకుఁ గయ్యంబులు నేసి చయ్యన నెసరేఁగి, బేసంబులు గాసంబులు గొని వాసికెక్కి పలుబాసలాడు బహుప్రకారంబులగు కీరంబులును, గీరంబులకు సరిగడచి మింటినంట నెగసి పెట్టలం బట్టి చీరి యిట్టట్టుఁ జనక నెట్టుకొని నెలవుల వ్రాలుచు నింపుగల రవమ్ములు గలుగు కలరవమ్ములును, గలరవమ్ము లలరం గొలంకుల కెలంకులఁ గడంకలఁ బ్రియల నిడుకొని క్రమ్మిదొమ్మి సేసి యెలదమ్మి తూఁడుల వాఁడులగు చంచువులం జించి మెక్కి చొక్కి మిక్కిలి కలఁకలం బడుచు నలబలంబులు సేయు కలహంసంబులును, హంసరుచి జనిత వికసనముల వికవిక నగుచుం బసగలిగి మిసమిస మెఱచు పసిడి కెందమ్ము లిందిరా మందిరమ్ముల చందంబులుగ నందమ్ములగు కొలంకులును, కొలంకుల కరళ్ళఁ దడిసి వడవడ వడంకుచు నల్లిబిల్లులు గొని సాఁగిన తీగెయిండ్ల గండ్ల యీఱములం దోరములు సెడి పలువిరుల కమ్మవలపుల వ్రేఁగునం దూఱలేక యీడిగిలం బడు గాడ్పులును, గాడ్పుల వలననెగసి గగనమున విరిసి పలువన్నెలం జెన్నగు మేలుకట్టుఁ బుట్టంబుల తెఱంగున దట్టంబులయిన కుసుమ పరాగంబులును, బరాగంబుల సరాగంబులగు వాఁగు వ్రంతల చెంతల గుంపులుగొని గఱిక జొంపంబులు లంపుదిని మంపులుగొని పెల్లు నెమర్లు వెట్టుచు నొదుఁగుల పొదుఁగులు గదల వాడల వాడల జాడలం బరుగులిడు దూడల క్రీడల వేడుకం గూడుకొని యిండ్ల వాకిండ్లకుం జేరి పౌరుల కోరికల కనుసారిక లగుచు నమృతంబు గురియు కామధేనువులును, గామధేనువులకు నిలువ నీడ లగుచు నడిగిన జనమ్ములకు ధనమ్ములు ఘనమ్ముగఁ బుడుకు కల్పతరువులును, కల్పతరువుల పల్లవ మంజరులఁ గుంజరులకు విఱచి యిచ్చుచు, మచ్చికల కలిమి నిచ్చ మెచ్చుచుఁ గృతకగిరుల చఱుల సిరుల నడరు పడఁతుల నడలకు గురువు లగుచు మెఱయు మురువుల నొత్తరించు మత్తేభంబులును, నిభంబుల సరస నొరసికొని వరుసఁ బరుసఁదనము లెడలి సుకరములగు మకరతోరణస్తంభంబులును, తోరణస్తంభంబుల చేరువ నిలిచి చెఱకు విలుతుండొఱ వెతికిన బెడిదములగు నవకంపు మెఱుఁగుం జిగురు టడిదముల తెఱంగున నిలుకడ సంపదలు గలుగు శంపల సొంపునం గరచరణాది శాఖలు గల చంద్రరేఖల పోఁడిమిని వాహిని గల మోహినీ విద్యల గ్రద్దనఁ జూపులకుం దీపు లొదవించుచు మర్మకర్మంబు వశంబు లరయు యశంబులు గలిగి యనూనంబు లగు విమానంబు లెక్కి చచ్చి వచ్చిన సచ్చరిత్రులకుం జెచ్చెర నెదురు చని తూకొని తోకొని పోవు రంభాది కుంభికుంభకుచల కలకలంబులును, గలహంస కారండవ కోక సారసబృంద సుందర సుందరియు, నిందీవరారవింద నందదిందిందిరయు, సభంగయు నగు గంగ నింగికిం బొంగెనో యని మిగుల దిగులువడఁ బొగడ్తల కెక్కిన యగడ్తలును, నగడ్తల మిన్నేటి తేటనీట నీటులీను పాటి సూటి చల్లులాటలు మేటి కూటువలు గొనుచు నేచిన ఖేచర కన్యకావారంబులును, వారవనితానుపూజిత రాజిత దేహళీ పాటవంబులగు గోపుర కనక కవాటంబులును, గవాట వేదికాఘటిత మణిగణ కిరణోదారంబు లగు నింద్రనీల స్తంభ గంభీరతలును, గంభీర విమల కమల రాగ పాలికా వారంబులగు చతుర్ద్వారంబులును, ద్వార దేశంబుల చావిళ్ళం గావళ్లుండి

ప్రొద్దువోక రక్కసుల వేల్పుల కయ్యంబులు నెయ్యంబులు సెప్పికొనుచున్న యస్త్ర శస్త్రధారులు శూరులు నయిన మహాద్వారపాలక వీరులును, వీరరస జలధివేలోదారంబులయి శుద్ధస్ఫటికబద్ధ మహోత్తానంబులగు సోపాన సుభగాకారంబులును, సుభగాకార ప్రదీపంబులగు వజ్రమహారజత వప్రంబులును, వప్రోపరి వజ్రకుడ్య శిరోభాగ చంద్రకాంత తరుణ హిమకరకిరణ ముఖరంబు లగు సాలశిఖరంబులును; శిఖర స్తోమధామ నికృత్తతారకంబులును, దారతార మణి శిలా కఠోరంబు లగుచు మిగుల గరిత యగు నగరిసిరి మీఱ నమరు మొగులు వొడగని నిలుకడలకు నలువ నడిగికొని పడసిన పసిఁడి తెరలు వలువల బెడంగునం దోరంబులగు ప్రాకారంబులును,బ్రాకార కాంచనాంచిత యుద్ధసన్నద్ధ మహోఖర్వ గంధర్వ వాహినీ పాలకంబులగు మరక తాట్టాలకంబులును, నట్టాలకోత్తుంగ వజ్రమయస్తంభోదంచనంబులును, బరభట ప్రాణవంచనంబులు సముదం చనంబులు నగు దంచనంబులును, దంచనంబుల తుదను రథంబుల యిరుసులు నొరసికొనం, గోట యీవలి యావలి తివియని దివియల కరణి రుచిరము లగుచుఁ బచరించు నహిమకర హిమకర మండలంబులును, హిమకర మండలంబు నిద్దంపు టద్దంబని మూఁగి తొంగి చూచుచు నళిక ఫలకంబులఁ గులకములు గొను నలకములం దరపి తిలకములం దెఱఁగు పఱచుకొని సమయముల వెనుక నొదిగి కదిసి ముకురంబులం బ్రతిఫలితులైన పతు లితర సతుల రతుల కనుమతులని కనుకనిన్ మరలి నీడ తలంగినం గలంగి చనికాంతు లకు సొలయు ముగుదలకు నేకాంతంబులై గగన సముత్సేధంబులైన రాజసౌధంబులును, సౌధంబుల సీమల ముత్తియంపు సరులతోడి నిబ్బరపు గుబ్బచన్నులు చెన్నులం బ్రక్కలం జుక్కపదవులుండ మండిత సౌధ శిఖరంబులకు శృంగారంబులయిన భృంగారంబులును, భృంగారశయన జాలక డోలికా శ్రేణికాది విశేషరమ్యంబు లైన హర్మ్యంబులును, హర్మ్యకనక గవాక్షరంధ్ర నిర్గత కర్పూర కుంకుమాగరు ధూపధూమంబులును, ధూమంబులు జీమూత స్తోమంబులని ప్రేమంబు లుబ్బ గొబ్బునం డబ్బాటు పబ్బంబు లబ్బెనని మరులుగొని పురుల వన్నియల సిరులు సరులు గొనం గుటవిటపములఁ దటపెట నటించుచుఁ బలుకులు విసిరి కికురువొడుచు వలతేని మఱుఁగు చదువుల టీక లనం గేకలిడు నెమిళ్లును, నెమిళ్ల పురుల నారలు నారులగు రతనంపు విండ్ల నినదంబులను తలంపుం దోఁకలు వడసి వీఁకలు మెఱసి మూఁకలు గొని దివికెగిరి రవికిం గవిసిన రాహువు క్రియం దివిఁ దడంబడు పడగలును, బడగలును గొడుగులును దమకు నాలంబులకు నడియాలంబులుగఁ దోరంబులైన సారంబుల బీరంబులు మెఱసి బెబ్బులుల గబ్బునం గరుల సిరుల సింగంబుల భంగుల శరభంబుల రభసంబుల ధూమకేతువుల రీతుల వైరిం జీరికిం గొనక శంకలుడిగి ఱంకెలిడుచు లంకెలై లెక్కకు మిక్కిలి యగుచు రక్కసుల చక్కటి యెక్కటి కయ్యముల దయ్యము లెఱుంగం దిరుగు వీరభట కదంబంబులును, గదంబకరవాల శూలాదుల మెఱుంగులు మెఱపుల తెఱంగుల దిశల చెఱంగులం దుఱంగలింప నేమి నినదంబులు దళములగు నుఱుములుగ నడమొగిళ్ళ పెల్లునం బ్రవర్షిత రథికమనోరథంబు లగు రథంబుల గములును గములుగొని గమనవేగముల వలన హరిహరుల నగి గాలిం జాలింబడ గేలికొని ఘనంబులగు మనంబులం దెగడి నెగడు సురంగంబులగు తురంగంబులును, రంగదుత్తుంగ విశద మదకల

**కరటి కటతట జనిత మదసలిల కణగణ విగళితదళ శతనయన భుజ సరళ మిళిత లలిత నిఖిల దిగధిపతి శుభకర కరకనక కటకఘటిత మణిసముదయ సముదిత రేణువర్గ దుర్గమంబు లయిన నిర్వక్రమార్గం బులును, మార్గస్థలోపరి గతాగత శతశతాయుతానేక గణనాతీత రోహణాచల తట విరాజమానంబులగు విమానంబులును, విమాన విహరమాణ సుందర సుందరీ సందోహ సంవాదిత భూరిభేరీ వీణా పణవ మృదంగ కాహళ శంఖాది వాదనా నూన గాన సాహిత్య నృత్య విశేషంబులును, విశేషరత్న సంఘటిత శృంగార శృంగాటక వాటికాదేహ దేహళీ ప్రదీపంబులును, దీపాయమాన మానిత సభామండప ఖచిత రుచిరచింతా రత్నంబులునుం గలిగి రత్నా కరంబునుం బోలె ననిమిషకౌశిక వాహినీ విశ్రుతంబయి, శ్రుతివాక్యంబునుం బోలె నకల్మష సువర్ణప్రభూతంబయి, భూతపతి కంఠంబునుం బోలె భోగిరాజ కాంతంబయి, కాంతాకుచంబునుం బోలె సువృత్తంబయి, వృత్తజాతంబునుం బోలె సదా గురులఘు నియమాభిరామంబయి, రామచంద్రుని తేజంబునుం బోలె ఖర దూషణాది దోషాచరాను పలబ్ధంబయి, లబ్ధవర్ణు చరిత్రంబునుం బోలె నమలాంతరంగ ద్యోత మానంబయి, మానధనుని నడవడియునుం బోలె సన్మార్గభాతి సుందరంబయి, సుందరోద్యానంబునుం బోలె రంభాంచితాశోక పున్నాగంబయి పున్నాగంబుమం బోలె సురభి సుమనో విశేషంబయి, శేషాహిమస్తంబునుం బోలె నున్నతక్షమావిశారదంబయి, శారదసముదయంబునుంబోలె ధవళ జీమూత ప్రకాశితంబయి, సితేతరాజిన దానంబును బోలె సరసతిలోత్తమంబై, యుత్తమ పురుష వచనంబునుం బోలె ననేక సుధారస ప్రవర్షంబై, వర్షాదియునుం బోలె నుల్లసదింద్ర గోపంబయి, గోపతి మూఁపురంబునుం బోలె విచక్షురార్యాలంకృతంబయి, కృతార్థం బయిన యమరావతీ నామనగరంబు సేరం జని కోటచుట్టునుం బట్టు గలుగ బలంబులఁ జలంబున విడియం బంచి పొంచి మార్గంబు లెల్ల నరికట్టుకొని యేమఱక యుండె;నంత. 447**

* బలిచక్రవర్తి మిక్కిలి విశాలమైన దేవతల పట్టణం దరిజేరి వేగంగా ముందుకు సాగినాడు. మొదట పెద్ద పెద్ద తోటలు కనిపించినాయి. ఆ తోటలలోని చెట్లు ఎల్లప్పుడూ అందంగా పొటమరించే చిగురుటాకులతో, రెమ్మలతో, మొగ్గలతో, సగం విచ్చిన విరులతో, నిండుగా విరిసిన పూలగుత్తులతో పూపిందెలతో, లేతకాయలతో, దోరగాయలతో పండ్లగెలలతో నిండి బరువెక్కి వంగి ఉన్నాయి.

దట్టమైన ఆ తోటలలో తుమ్మెదల గుంపుల జంటలు వదలకుండా సొగసైన క్రొత్తపూలతో నిండి ఉన్న మకరందాన్ని కొసరికొసరి త్రాగి బలిసి కై పెక్కి జుంజుమ్మని సంతోషంతో విహరిస్తున్నాయి. కోయిల గుంపులు జంటబాయక కలసి మెలసి గున్నమామిడిచెట్ల కొమ్మలలో ముసరి సొంపుగా చిగురుటాకులు మెక్కి ఉత్సాహంతో గానం చేస్తున్నాయి. చిలుకల గుంపులు మత్తెక్కి త్వరపడుతూ పోరాడుతూ చెలరేగి నేర్పుతో తియ్యని పండ్లు తిని కలకల ధ్వనులు సలుపుతున్నాయి. పావురాలు చిలుకలను మించి ఆకాశానికి ఎగురుతూ ఆడపావురాలను చెంతకు పిలుస్తూ అటు ఇటూ పోనీయకుండా అడ్డగించుతూ తమ నెలవులపై వ్రాలి ఇంపుగా గుబాళిస్తున్నాయి.

రాయంచలు చెలువైన సరస్సుల వద్ద ఉత్సాహంగా పెంటి హంసలతో కలిసి తమ వాడి ముక్కులతో లేతతామరతూండ్లు చీల్చి తిని సంతోషంగా సవ్వడి చేస్తున్నాయి. అందమైన ఆ సరస్సులు హంసల కాంతికంటె

అధికంగా మిలమిల మెరుస్తూ లక్ష్మీమందిరాల వంటి బంగారుసరోజాలతో విరాజిల్లుతున్నాయి. ఆ సరస్సుల అలలలో తడిసిపోయి వడవడ వడకుతూ అల్లిబిల్లిగా అల్లుకొని నేలవ్రాలిన దట్టమైన తీగల సందులలో జొరబడి ఇంపైన పూలవాసనలతో బరువెక్కి లోపలకు దూరలేక చల్లగాలులు చతికిల పడుతున్నాయి. ఆ గాలులతో కలిసి పై కెగిరిన పుప్పొడులు ఆకాశంలో నిండి రంగురంగుల మేలుకట్టు చాందినీలను సృష్టిస్తున్నాయి.

పుప్పొడి రంగులతో కలిసిన కాలువల గట్లపై ఇచ్చవచ్చినట్లుగా పచ్చిక గుబురులు మేస్తూ మైమరచి నెమరువేస్తూ తమ పెద్దపొదుగులు కదలిస్తూ కామధేనువులు నడచి వస్తున్నాయి. వాటి దూడలు వాడవాడలలో చెంగుచెంగున దూకి ఆడుకుంటూ తల్లులవెంట వెళ్లుతున్నాయి. కామధేనువులు దూడలతోకూడి ఇండ్లవాకిండ్లు చేరి పౌరులు కోరినంత పాలు కురుస్తున్నాయి. కోరినవారి కోరికలు తీర్చే కల్పవృక్షాలు ఆ కామధేనువులకు నిలువ నీడనిస్తున్నాయి. ఆ కల్పవృక్షాల చిగుళ్ళనూ పూలగుత్తులనూ కోసి మదపుటేనుగులు ఆడ ఏనుగులకు ప్రేమతో ఇచ్చి సంతోషింపజేస్తున్నాయి. ఆ మదపుటేనుగులు క్రీడాపర్వతాల సొగసుతో ఒప్పారుతున్నాయి. అవి పడుచులకు నడకలు నేర్పు గురువులై మురువుగా నడుస్తున్నాయి. ఆ ఏనుగుల శరీరాలు రాచుకోవడం వల్ల కరకుతనం పోయి నున్నబడుతున్న మకరతోరణస్తంభాలు కన్నుల విందుచేస్తున్నాయి.

మకరతోరణాల స్తంభాలవద్ద రంభమొదలైన అప్సరసలు నిలబడి ఉన్నారు. వారు మన్మథుడు ఒరలోనుండి తీసిన వాడికత్తులవలె తళ తళ మెరుస్తున్నారు. నిలుకడగల మెరుపు తీగలవలె ఉన్నారు. కాళ్లూ చేతులూ మొదలైన అవయవాలు కలిగిన నెలవంకల వలె ఉన్నారు. రూపుదాల్చిన మోహినీ విద్యలవలె చూపులకు హాయి కలిగించుతూ, శృంగార రహస్యాలు తెలుసుకోవడంలో పేరుపొందిన వారై, విమానాలపై స్వర్గలోకానికి వచ్చే పుణ్యాత్ములకు త్వరగా ఎదురుపోయి సగౌరవంగా తోడ్కొని పోతున్నారు.

ఆ పట్టణానికి చుట్టూ అందమైన అగడ్తలు ఉన్నాయి. ఆ అగడ్తల నీటిలో కలహంసలూ రాజహంసలూ చక్రవాకాలూ బెగ్గురు పక్షులూ విహరిస్తుంటాయి. అందలి కలువలలోనూ కమలాలలోనూ, తుమ్మెదలు సంతోషంతో సంచరిస్తుంటాయి. ఆ అగడ్తలు తరంగాలు లేని గంగానది ఆకాశానికి పొంగినట్లు వెరగు కలిగిస్తుంటాయి. దేవకన్యలు గుంపులు గుంపులుగా చేరి వాటిలోని తేటనీటిలో అందంగా హాయిగా జలకాలాడుకొంటూంటారు.

ఆ పట్టణం ముంగిలిలో భద్రమైన బంగారు తలుపులు గల పెద్ద గోపురా లున్నాయి. ఆ గోపురద్వారాల గడపలను అక్కడి దేవవేశ్యలు పూజిస్తుంటారు. ఆ ద్వారాల ప్రక్కన అరుగులపైన రత్నాల కాంతులు వెదజల్లే ఇంద్రనీలాల స్తంభాలు ఉన్నాయి. ఆ నాలుగు ద్వారాలకూ పద్మరాగాల మాలలు వ్రేలాడుతున్నాయి. ఆ ద్వారాల దగ్గర ఉన్న చావిళ్ళలో పరాక్రమవంతులైన ద్వారపాలకులు ఆయుధాలు ధరించి మెలకువతో కాపలా కాస్తున్నారు. వారు దేవదానవుల యుద్ధాల ముచ్చట్లు చెప్పుకుంటుంటారు. అచ్చటి ఎత్తైన మెట్ల వరుసలు వీరరస సముద్రపు చెలియలి కట్టలవంటి అచ్చమైన పాలరాళ్ళతో కట్టబడి ఉన్నాయి. అచ్చటి కోటలు అత్యంత శోభాయమానములై వజ్రాలతోనూ వెండితోనూ నిర్మింపబడి ఉన్నాయి. ఆ కోటల పైభాగాలు నిండు

చంద్రుని కిరణాలూ వెల్లివిరిసే తెల్లని అద్దాలవలె ఉన్నాయి. వాటి కాంతులు చుక్కలను ధిక్కరిస్తుంటాయి. ఆ పట్టణలక్ష్మి ప్రాయంతో నిండిన యువతివలె మేఘాలను చూస్తూ బ్రహ్మను ప్రార్థించి సంపాదించిన బంగారు పరదాలవలె పెద్ద పెద్ద వెండి ప్రాకారాలు ప్రకాశవంతములై ఉన్నాయి. ఆ ప్రాకారాలపై మరకతమణులతో నిర్మించిన బురుజులున్నాయి. కోట్ల కొలది గంధర్వసైనికులు యుద్ధసన్నద్ధులై వాటిని కాపాడుతుంటారు. ఆ బురుజులపై ఎత్తైన వజ్రాల స్తంభాలున్నాయి. వాటిమీద శత్రువీరుల ప్రాణాలు తీసే శతఘ్నులు (ఫిరంగులు) అమర్చబడి ఉన్నాయి. వాటికి రెండువైపులా రథాల ఇరుసులు రాచుకొంటూ ఆరిపోని దీపాలవలె సూర్యచంద్ర మండలాలు వెలుగుతుంటాయి.

ఆ పట్టణంలోని మేడలు ఆకాశాన్ని తాకుతుంటాయి. అందలి సుందరీమణులు చంద్రబింబాన్ని నిగ్గుటద్దంగా భావించి తొంగిచూస్తూ తమ నొసటిపైని ముంగురులను సరిదిద్దుకొని తిలకాలను అలంకరించుకుంటుంటారు. అప్పుడు వారి వెనుకవైపుగా వచ్చిన వారి ప్రియుల ప్రతిబింబాలు కనిపించగానే తమ భర్తలు ఇతర స్త్రీలను వలచివారికి వశులైనారని భ్రమించి తత్తరపాటుతో వెనుదిరిగి అంతలో ప్రతిబింబాలు మాసిపోగానే ఆ స్త్రీలు ఏకాంతంగా తమ ప్రియుల కోసం ఎదురుచూస్తూ ఉంటారు. ముత్యాల హారాలతో కూడిన ఆ ముద్దుగుమ్మల గుబ్బచన్నుల సొగసుతో ప్రక్కల చుక్కలు మెరుస్తుండగా ఆ మేడల శిఖరాలను సింగారిస్తూ బంగారు కలశాలు ప్రకాశిస్తున్నాయి. ఆ మేడల లోపల బంగారు మయములైన పరుపులూ కిటికీలూ ఉయ్యాలలూ మెట్లూ మొదలైనవి ఎంతో మనోహరంగా విరాజిల్లుతున్నాయి.

ఆ మేడల బంగారు కిటికీల సందులగుండా కర్పూరమూ కుంకుమ పువ్వూ సాంబ్రాణీ కలసిన సువాసనల పొగలు వెలువడుతుంటాయి. ఆ పొగలను మేఘాలని భ్రమపడిన నెమిళ్లు అనుకోకుండా తమకు పండగ వచ్చిందని ఆనందంతో తమ రంగురంగుల పింఛాలు విప్పి చెట్ల కొమ్మలపై నాట్యాలు చేస్తుంటాయి. అవి మన్మథుని శృంగార శాస్త్రాలకు టీకల విధంగా కేకలు వేస్తుంటాయి. అప్పుడు నెమళ్ళ పింఛాలను అల్లెత్రాళ్ళుగానూ, వాటి కేకలను ధనుష్టంకారాలుగానూ భావించి వెంటనే సూర్యునిపైకి ఉరికే రాహువువలె జెండాలు ఆకాశానికి ఎగురుతున్నాయి. జెండాలు గొడుగులూ తమయుద్ధ లక్షణాలుగా అవక్రపరాక్రమంతో విజృంభించి పెద్దపులులవలె, ఏనుగులవలె, సింహాలవలె, శరభాల వలె, తోకచుక్కల వలె శత్రువులను లెక్కచేయకుండా కేకలు వేస్తూ గుములు గుములై వీరసైనిక సమూహాలు రాక్షసులతో ద్వంద్వయుద్ధాలు చేయటంకోసం దుముకుతున్నారు.

కత్తులూ శూలాలు మొదలైన ఆయుధాల తళతళలు మెరుపువలె దిక్కుల అంచులవరకు వ్యాపింపగా చక్రాల ధ్వనులు ఉరుములవలె ధ్వనింపగా వీరుల శర వర్షాలతో మేఘాల వలె ఒప్పుతున్న రథాలు రాజిల్లుతున్నాయి. ఆ రథాలకు సూర్యుని గుఱ్ఱాలనూ, వాయువునూ, మనస్సునూ మీరిన వేగంతో పరుగెత్తగల గుఱ్ఱాలు పూన్చబడి ఉన్నాయి. ఆ పట్టణంలో ఎత్తైన తెల్లని మదపుటేనుగులు ఉన్నాయి. వాటి చెక్కిళ్ళమీది మదజల కణాల సమూహాలు సహస్రనయనుడైన దేవేంద్రుని ఔదార్య విశేషాలను లెక్కించుతున్నట్లు ఉంటాయి. ఇంద్రుణ్ణి సందర్శించటానికి గుమికూడిన సమస్త దిక్పాలకుల

శుభంకరములైన బంగారు కరకంకణాల నుండి రాలిన ధూళికణాలతో ఆ పట్టణంలోని వీథులన్నీ నిండి ఉన్నాయి. ఆ మార్గాలకు పై భాగాలలో లక్షల కొలది విమానాలు వస్తూ పోతూ ఉంటాయి. అవి రోహణ పర్వతం చరియల వలె వెలుగులు వెదజల్లుతుంటాయి. ఆ విమానాలలో తమ ప్రియులతో విహరించే అందగత్తెలు భేరీ వీణా పణవమూ మద్దెలా బాకా శంఖమూ మొదలైన వాటిని మ్రోగించుతూ వాటికి తగినట్లుగా పాటలు పాడుతూ నాట్యాలు చేస్తుంటారు. ఆ నగరంలోని చతుష్పథాలలోని గృహ పరంపరల ముంగిళ్ళలో పెద్ద పెద్ద రత్నాల దీపాలు వెలుగుతుంటాయి. దేదీప్యమానములైన సభామండపాలలో చింతామణులు ప్రకాశించుతుంటాయి.

స్వర్గపట్టణం సముద్రం మాదిరిగా అనిమిష కౌశిక వాహినీ విశ్రుతమై ఉన్నది. (చేపలతోనూ, నదులతోనూ పేరెన్నిక గన్నది) (దేవతలతో, ఇంద్రునితో, ఆకాశగంగతో పేరెన్నిక గన్నది.)

ఆ పట్టణం వేదవాక్యం మాదిరిగా అకల్మష సువర్ణ ప్రభూతమై ఉన్నది. (పవిత్రమైన అక్షరాలతో నిండినది.) (నిర్మలమైన బంగారంతో అతిశయించినది)

ఆ పట్టణం శివుని కంఠం మాదిరిగా భోగిరాజ కాంతమై ఉన్నది. (సర్పరాజులతో ప్రకాశించు తున్నది). (ధనవంతులైన ప్రభువులతో ఒప్పుచున్నది.

ఆ పట్టణం జవరాలి వక్షోజంవలె సువృత్తమై ఉన్నది. (గుండ్రనైనది.) (మంచిచరిత్ర కలది).

ఆ పట్టణం వృత్తసమూహంవలె సదా గురు లఘు నియమాభిరామమై ఉన్నది. (గురువులతోనూ, లఘువులతోనూ, యతులతోనూ ఒప్పుతున్నది). (బృహస్పతి నీతి నియమాలతో కూడినది).

ఆ పట్టణం శ్రీరామచంద్రుని తేజస్సువలె ఖరదూషణాది దోషాచరులకు చేరరానిదై ఉన్నది. (ఖరుడు, దూషణుడు మొదలైన రాక్షసులకు చేరశక్యం కానిది.) (కఠినమైన నిందలు మొదలగు దోషములు ఆచరించువారికి పొందశక్యం కానిది.)

ఆ పట్టణం విద్వాంసుని చరిత్రంవలె అమలాంతరంగ ద్యోతమాన మైనది. (స్వచ్ఛమైన హృదయాలకు స్ఫురించేది). (నిర్మల మనస్కులైన పుణ్యాత్ములతో ప్రకాశించేది).

ఆ పట్టణం అభిమానవంతుని ప్రవర్తనంవలె సన్మార్గభాతి సుందరమైనది. (మంచి మార్గంలో మిక్కిలి చక్కగా ప్రకాశించునది.) (ఆకాశ మార్గమందలి చుక్కలతో మిక్కిలి చక్కనైనది).

ఆ పట్టణం అందమైన ఉద్యానవనంవలె రంభాంతాశోకపున్నాగ మైనది. (అరటి చెట్లతో కూడిన అశోకవృక్షాలు, పున్నాగవృక్షాలు కలది.) (రంభతో కూడిన ఆనందంగా ఉన్న పురుషశ్రేష్ఠులు కలది).

ఆ పట్టణం సురపొన్న వృక్షంవలె సురభి సుమనో విశేషమైనది. (సుగంధంతో కూడిన పుష్పాలతో అతిశయించింది). (కామధేనువులతోనూ, దేవతలతోనూ నిండినది.)

ఆ పట్టణం ఆదిశేషుని శిరస్సువలె ఉన్నత క్షమా విశారదమైనది. (మహోన్నతమైన భూమండలం కలది). (విశేషమైన క్షమాగుణంతో ఒప్పుతున్నది).

ఆ పట్టణం శరత్కాలం మాదిరిగా ధవళజీమూత ప్రకాశితమైనది. (తెల్లని మేఘాలతో విరాజిల్లునది) (తెల్లని కొండలతో ప్రకాశించునది).

ఆ పట్టణం కృష్ణాజిన దానంవలె సరస తిలోత్తమమైనది. (మంచినువ్వులతో ఒప్పిదమైనది). (సరసురాలైన తిలోత్తమతో కూడినది).

ఆ పట్టణం ఉత్తమ పురుషుని వాక్కువలె అనేక సుధారస ప్రవర్షమైనది. (అఖండమైన తియ్యదనాన్ని వర్షించేది.) (అఖండమైన అమృతవర్షాన్ని కురియించేది).

అ పట్టణం వర్షఋతువు ప్రారంభంవలె ఉల్లసదింద్ర గోపమైనది. (ప్రకాశించే ఆరుద్ర పురుగులు గలది), (ప్రకాశించే ఇంద్రునిచేత రక్షింపబడేది.)

ఆ పట్టణం నందీశ్వరుని మూపురం వలె విచక్షురార్యాలంకృత మైనది. (శివపార్వతులతో అలంకరింపబడినది) (వేల్పు పెద్దలతో విరాజిల్లునది)

ఈ విధంగా ఐశ్వర్యవంతమై పరమధన్య మైన ఆ అమరావతీ నగరానికి చేరి బలిచక్రవర్తి ఆ నగరం కోటను చుట్టుముట్టడానికి సైన్యాలకు ఆజ్ఞ ఇచ్చాడు. మార్గాలన్నీ అరికట్టి గట్టి పట్టుదలతో ఉన్నాడు.

**క. మాయరు నగవులకును గను, మూయరు కాలంబు కతన ముదియరు ఖలులన్**
**డాయరు పుణ్యజనంబులఁ, బాయరు సురరాజు వీటి ప్రమదాజనముల్. 448**

* దేవేంద్రుని పట్టణంలోని స్త్రీలు ఎల్లప్పుడు నవయౌవనవతులే. చిరునవ్వులతో సరికొత్తగా ఉంటారు. కన్ను లార్పకుండా చూస్తుంటారు. వయస్సు చెల్లినా ముసలివారు కారు. దుష్టులను దరిజేరనీయరు. పుణ్యాత్ములను ఎడబాయరు.

**వ. అప్పుడు. 449**

**క. దుర్భర దానవ శంఖా, విర్భూత ధ్వనులు నిండి విబుధేంద్ర వధూ**
**గర్భములు పగిలి లోపలి, యర్భకతతు లావు రనుచు నాక్రోశించెన్. 450**

* అమరావతి పట్టణాన్ని రాక్షసులు ముట్టడించి విజయశంఖాలు పూరించాయి. వారి శంఖారావాలకు దేవతా స్త్రీల గర్భాలు బ్రద్దలైనాయి. ఆ గర్భాలలోని శిశువులు ఆవురుమంటూ ఆక్రోశించినారు.

**వ. అంత. 451**

**సీ. బలి వచ్చి విడియుట బలభేది వీక్షించి గట్టిగాఁ గోటకుఁ గాపు వెట్టి**
**దేవవీరులుఁ దాను దేవతామంత్రిని రప్పించి సురవైరిరాకఁ జెప్పి**

ప్రళయానలుని భంగి భాసిల్లుచున్నాఁడు ఘోరరాక్షసులను గూడినాఁడు
మన కోడి చని నేఁడు మరల వీఁ డేతెంచె నే తపంబున వీని కింత వచ్చె?

ఆ. నీ దురాత్మకునకు నెవ్వఁడు దోడయ్యె?, నింక వీని గెల్వ నేది త్రోవ?
యేమి సేయువార? మెక్కడి మగఁటిమి?, నెదురు మోహరింప నెవ్వఁ డోపు? 452

* ఆ సమయంలో బలిచక్రవర్తి వచ్చి పట్టణాన్ని ముట్టడించడం దేవేంద్రుడు తెలుసుకొన్నాడు. కోటకు బలమైన కాపలా ఏర్పాటు చేసినాడు. దేవతావీరులతో కలసి, దేవమంత్రియైన బృహస్పతిని పిలిపించి బలిచక్రవర్తి దండెత్తి వచ్చిన సంగతి చెప్పినాడు. "వాడు ప్రళయాగ్నివలె మండిపడుతున్నాడు. క్రూరులైన రాక్షసులతో కూడి ఉన్నాడు. మనతో ఓడిపోయి ఈనాడు తిరిగీ మనపైకి వచ్చినాడు. ఏ తపస్సు వల్ల వానికింత శక్తి వచ్చిందో! ఈ దురాత్ముడు ఎవరి సహాయాన్ని పొందినాడో? వీనిని గెలిచే మార్గమేది? ఏమి చేయాలి? పరాక్రమంతో వీనిని రణరంగంలో ఎదిరించి నిలువగల వీరు డెవడు!" అని పలికినాడు.

క. మ్రింగెడు నాకాశంబును, బొంగెడు నమరాద్రి కంటెఁ బొడవై వీఁడున్
మ్రింగెడుఁ గాలాంతకు క్రియ, భంగించును మరలఁ బడ్డఁ బంకజగర్భున్ 453

* ఈ బలిచక్రవర్తి ఆకాశాన్ని కబళించేటట్లు ఉన్నాడు. మేరుపర్వతం కంటె ఎత్తు పెరిగి విఱ్ఱవీగుతున్నాడు. కాలయమునివలె వచ్చి మనమీద పడినాడు. తిరుగబడితే బ్రహ్మను కూడా వీడు భంగపరుస్తాడు అని ఇంద్రుడు వాపోయాడు.

క. ఈరాదు రాజ్యమెల్లను, బోరాదు రణంబు సేయఁ; బోయితి మేనిన్
రారాదు దనుజుచేతను, జారా దిట మీఁద నేమి జాడ మహాత్మా!" 454

వ. అనిన సురరాజునకు నాచార్యుం డిట్లనియె. 455

* "మహాత్మా! రాజ్యాన్ని వీడికి వదలి పెట్టడానికీ వీలులేదు. యుద్ధానికి వెళ్ళడానికీ వీలులేదు. వెళ్ళితే తిరిగీ రాగలమనే నమ్మకం లేదు. ఈ రాక్షసుని చేతిలో ప్రాణాలు గోల్పోలేము. వీని బారి నుండి తప్పించుకొని బ్రతికే దారి ఏది?" అంటూ అడిగిన ఇంద్రునితో బృహస్పతి ఇట్లా అన్నాడు.

సీ. 'వినవయ్య దేవేంద్ర! వీనికి సంపద బ్రహ్మవాదులు భృగుప్రవరు లర్థి
నిచ్చిరి రాక్షసు నెదురను నిలువంగ హరి యీశ్వరుఁడు దక్క నన్యజనుల
నీవును నీ సముల్ నీకంటె నధికులుఁ జాలరు; రాజ్యంబు సాలు; నీకు
విడిచి పోవుట నీతి విబుధనివాసంబు; విమతులు నలఁగెడు వేళ సూచి

తే. మరలి మఱునాఁడు వచ్చుట మా మతంబు;, విప్రబలమున వీనికి వృద్ధివచ్చె
వారిఁ గైకొన కిటమీఁద వాఁడి సెడును;, దలఁగు మందాఁక రిపు పేరు దడవవలదు. 456

* దేవేంద్రా విను. బ్రహ్మవాదులైన భృగువంశపు బ్రాహ్మణులు వీనికి బలసంపదను సమకూర్చినారు. ఈ రాక్షసుని ఎదిరించడానికి విష్ణువుకూ శివునికీ తప్ప నీకు కానీ నిన్ను మించిన ఇంకెవరికి కానీ శక్తి చాలదు. నీ విప్పుడు రాజ్యాన్నీ రాజధానినీ విడిచిపెట్టి వెళ్ళడమే మేలు. పగవారికి కష్టాలు వచ్చినప్పుడు పసిగట్టి మళ్లీ తిరిగి రావడం మంచిదని నా అభిప్రాయం. బలికి బ్రాహ్మణుల శక్తివల్ల బలం సమకూరింది. ఇకపైన వీడు బ్రాహ్మణులను గౌరవించడు. దానివల్ల వీని పరాక్రమం సన్నగిల్లుతుంది. అంతవరకూ శత్రువు పేరుకూడా ఎత్త వద్దు.

**క. పరు గెలువ వలయు నొండెను, సరిపోరఁగ వలయునొండెఁ జా వలె నొండెన్**
**సరి గెలుపు మృతియు దొరకమి, సరసంబుగ మున్న తొలఁగి చనవలె నొండెన్.** 457

* శత్రువును ఎదిరించి జయించాలి, లేదా వానితో సమానంగా నైనా పోరాడాలి. లేదా రణరంగంలో వీరమరణం పొందాలి. గెలుపూ సమానత్వమూ మరణమూ కలుగని పక్షంలో ముందుగా తొలగి వెళ్ళి పోవడమే మంచిది.

**వ. అనినఁ గార్యకాల ప్రదర్శియగు బృహస్పతి వచనంబులు విని కామరూపులై దివిజులు త్రివిష్టపంబు విడిచి తమ తమ పొందుపట్లకుం జనిరి; బలియునుం బ్రతిభట వివర్జిత యగు దేవధాని నధిష్ఠించి జగత్త్రయంబునుం దన వశంబు సేసికొని విశ్వవిజయుండై పెద్దకాలంబు రాజ్యంబు సేయుచుండె; శిష్యవత్సలులగు భృగ్వాదు లతనిచేత శతాశ్వమేధంబులు సేయించిరి; తత్కాలంబున.** 458

* పై విధంగా బృహస్పతి సమయోచితమైన కర్తవ్యాన్ని తెలియజేసినారు. ఆ మాటలకు ఇంద్రుడూ దేవతలూ ఒప్పుకొన్నారు. స్వర్గలోకాన్ని విడిచిపెట్టి తమకు ఇష్టమైన రూపాలు ధరించి అనుకూలమైన చోట్లకు వెళ్ళిపోయినారు. బలిచక్రవర్తి పగవారు లేని అమర రాజధానిని అనాయాసంగా ఆక్రమించినాడు. ముల్లోకాలనూ తన వశం చేసుకొన్నాడు. ఈ విధంగా విశ్వవిజేత అయి చాలా కాలం పాలించినాడు. శిష్యులపై వాత్సల్యం కలిగి శుక్రుడు మొదలైనవారు బలి చక్రవర్తిచేత నూరు అశ్వమేధయాగాలు చేయించినారు.

**శా. అర్థుల్ వేఁడరు; దాతలుం జెడరు; సర్వారంభముల్ పండుఁ; బ్ర**
**త్యర్థుల్ లేరు; మహోత్సవంబులను దేవాగారముల్ వొల్చుఁ; బూ**
**ర్ణార్థుల్ విప్రులు; వర్షముల్ గురియుఁ గాలార్హంబులై ధాత్రికిన్**
**సార్థంబయ్యె వసుంధరాత్వ మసురేంద్రాధీశు రాజ్యంబునన్.** 459

* బలిచక్రవర్తి రాజ్యంలో చేచాచి దానమడిగే యాచకులు లేరు. దానమిచ్చే దాతకు లోటులేదు. సకల ప్రయత్నాలూ సఫలమయ్యేవి. పగవారు లేరు. దేవాలయాలు ఉత్సవాలతో వేడుకలతో వెలిగేవి. బ్రాహ్మణుల కోరికలు తీరేవి. కాలానికి తగిన విధంగా వానలు కురిసేవి. భూమికి వసుంధర అనే పేరు సార్థకమైనది.

**వ. అంత.** 460

సీ. తన తనూజుల ప్రోలు దనుజులు గొనుటయు వేల్పు లెల్లను డాఁగ వెడలుటయును
భావించి సురమాత పరితాపమునఁ బొంది పగ ననాథాకృతి వనరుచుండ
నా యమ్మ పెనిమిటి యగు కశ్యపబ్రహ్మ మఱియొకనాఁడు సమాధి మాని
తన కుటుంబిని యున్న ధామంబునకు నేగి నాతిచే విహితార్చనములు వడసి

ఆ. వంది వ్రాలి కంది వాడిన యిల్లాలి, వదనవారిజంబు వడువుఁజూచి
చేరఁ దిగిచి మగువచిబుకంబు పుడుకుచు, వారిజాక్షి! యేల వగచె దనుచు. 461

వ. అ మ్మహాత్ముం డిట్లనియె. 462

* అటు పిమ్మట దేవతల తల్లియైన అదితి అమరావతిని రాక్షసులు ఆక్రమించుకొనడం, తలదాచుకోటానికి దేవతలు తరలిపోవడం తలంచి దిక్కులేని దానివలె దుఃఖించింది. ఒకనాడు ఆమె భర్త కశ్యప ప్రజాపతి తపస్సు చాలించి ఇంటికి వచ్చినాడు. అదితి చేత పూజలు అందుకొన్నాడు. బాధతో కంది కుందిన ఆమెముఖపద్మాన్ని చూచినాడు. ఆ మహాత్ముడు ఆమెను చేరదేసి గడ్డం పట్టుకొని ఓదార్చినాడు. "ఓ కమలాక్షీ! ఎందుకు బాధపడుతున్నావు!" అని అడిగి మరలా ఇట్లా అన్నాడు.

మ. 'తెఱవా! విప్రులు పూర్ణులే? చెలఁగునే దేవార్చనాచారముల్?
తఱితో వేలుతురే గృహస్థులు? సుతుల్ ధర్మానుసంధానులే?
నెఱి నభ్యాగతి కోటి కన్న మిడుదే? నీరంబునుం బోయుదే?
మఱ లే కర్థుల దాసులన్ సుజనులన్ మన్నింపుదే? పై దలీ? 463

* కల్యాణీ! ఎందుకిట్లా విచారంగా ఉన్నావు? బ్రాహ్మణులను ఏ లోటు లేకుండా ఆదరిస్తున్నావు గదా?దేవాలయాలలో పూజలు యథావిధిగా సాగుతున్నాయా? ఇక్కడి మనవారంతా వేళకు సరిగా హోమకార్యాలు నెరవేరుస్తున్నారా? నీ కొడుకులు ధర్మాన్ని పాటిస్తున్నారా? అతిథులకు అర్ఘ్యపాద్యాలిచ్చి అన్నం పెట్టి ఆదరిస్తున్నావా? మరువకుండా బిచ్చగాళ్ళనూ, సేవకులనూ, సజ్జనులనూ సత్కరిస్తున్నావా?

ఆ. అన్న మైనఁ దక్రమైనఁ దోయంబైన, శాకమైనఁ దనకు జరుగు కొలఁది
నతిథి జనులకడ్డ మాడక యిడరేని, లేమ! వారు కలిగి లేనివారు. 464

* అన్నమైనా మజ్జిగైనా నీళ్ళైనా చివరకు కూరగాయలైనా తమకు ఉన్నంతలో అతిథులకు లేదనకుండా పెట్టాలి. అట్లా పెట్టకపోతే ధనవంతులైనా వారు దరిద్రులే.

వ. మఱియు. 465

ఆ. నెలఁత! విష్ణునకును నిఖిలదేవాత్మున, కాననంబు శిఖియు నవనిసురులు;
వారు దనియఁ దనియుఁ వనజాతలోచనుఁ, డతఁడు దనియ జగము లన్ని దనియు. 466

* మగువా! అంతే కాకుండా దేవతలకు ఆత్మవిష్ణువు; అగ్నీ బ్రాహ్మణులూ విష్ణువుకు ముఖాలు. వారిని సంతోష పెట్టితే విష్ణువు సంతోషపడతాడు. విష్ణువు సంతోషిస్తే సమస్తలోకాలు సంతోషిస్తాయి.

క. బిడ్డలు వెఱతురె నీ కఱ, గొడ్డంబులు సేయ కెల్ల కోడండ్రును మా
ఔొడ్డారింపక నడతురె, యెడ్డము గాకున్నదే మృగేక్షణ; యింటన్! 467

వ. అని పలికినం బతికి సతి యిట్లనియె. 468

* నీ తనయులు నీ విషయంలో వినయంగా ఉంటున్నారా? గయ్యాళితనంతో నీకు ఎదురు పలుకకుండా నడుస్తున్నారా? ఇంటిలో ఇబ్బంది ఏమీ లేదుకదా? ఈ విధంగా అడిగిన కశ్యప ప్రజాపతితో అదితి ఇట్లా అన్నది.

ఉ. ప్రేమ యొకింత లేక దితి బిడ్డలు బిడ్డల బిడ్డలున్ మహా
భీమ బలాఢ్యులై తనదు బిడ్డల నందఱఁ దోలి సాహసా
క్రామిత వైరులయ్యు నమరావతి నేలుచు నున్నవారు; నీ
కే మని విన్నవింతు? హృదయేశ్వర! మేలు దలంచి చూడవే! 469

* హృదయేశ్వరా! దితిబిడ్డలూ వారిబిడ్డలూ బలవంతులై పగబూని నా బిడ్డలను ఓడించి పారద్రోలినారు. సాహసంతో అమరావతిని ఆక్రమించుకొని పాలిస్తున్నారు. ఈ విషాదవార్త నీకు ఏమని విన్నవింపగలను? మేలు కలిగేటట్లు ఆలోచించు.

క. అక్కా చెల్లెండ్రయ్యును, దక్కదు నాతోడి పోరు; దానును దితియున్
రక్కసులు సురల మొత్తఁగ, నక్కట! వల దనదు చూచు నౌనౌ ననుచున్. 470

* దితీ నేను అక్కాచెల్లెళ్ళ మైనప్పటికీ ఆమె నాతో ఎప్పుడూ కలహిస్తూనే ఉంటుంది. దేవతలను రాక్షసులు బాధపెడుతున్నా ఆమె మెచ్చుకుంటుందే కాని వద్దని పలుకదు.

సీ. ఎండకన్నెఱుఁగని యింద్రుని యిల్లాలు పలుపంచలను జాలిఁ బడియె నేఁడు
త్రిభువన సామ్రాజ్య విభవంబుఁ గోల్పోయి దేవేంద్రుఁ డడవులఁ దిరిగె నేఁడు
గలిమి గారాబు బిడ్డలు జయంతాదులు శబరార్భకుల వెంటఁ జనిరి నేఁడు
నమరుల కాధారమగు నమరావతి యసురుల కాటపట్టయ్యె నేఁడు

ఆ. బలి జగముల నెల్ల బలియుచు నున్నాఁడు, వాని గెలువరాదు వాసవునకు
యాగభాగమెల్ల నతఁ డాహరించుచుఁ, గడఁగి సురల కొక్కకడియు నీఁడు 471

* ఎండ కన్నెరుగని ఇంద్రుని ఇల్లాలు శచి ఈనాడు పలు కష్టాలకు గురియై బాధపడుతూ ఉంది. ఇంద్రుడు ముల్లోకాల రాజ్య సంపదనూ పోగొట్టుకొని ఈనాడు అడవులలో ఇడుమలు పడుతున్నాడు. కలవారి బిడ్డలై అల్లారు ముద్దుగా పెరిగినా జయంతాదులు ఈనాడు బోయపిల్లల వెంట తిరుగుతున్నాడు. దేవతల నెలవైన అమరావతి ఈనాడు రాక్షసులకు ఆలవాలమైనది. అన్ని లోకాలలోనూ బలి బలవంతు డవుతున్నాడు. వానిని ఇంద్రుడు నిలువరించలేక పోతున్నాడు. యజ్ఞాలలో హవిర్భాగా లన్నింటినీ బలి దోచుకొంటున్నాడు. ఒక్క కబళం కూడా దేవతలకు చిక్కనివ్వడు.

**క. ప్రజలకు నెల్లను సముఁడవు, ప్రజలను గడుపారఁ గన్న బ్రహ్మవు నయ్యుం**
**ప్రజలందు దుష్టమతులను, నిజముగ శిక్షింప వలదె నీవు? మహాత్మా! 472**

* మహాత్మా! బిడ్డలందరిపట్లా నీవు సమాన మైనవాడవు. ప్రేమతో బిడ్డలను కన్న ప్రజాపతివి. కాబట్టి నీవు దుర్మార్గులైన బిడ్డలను కనిపెట్టి దండింపవలదా?

**మ. సురలన్ సభ్యుల నార్తులన్ విరథులన్ శోకంబు వారించి ని**
**ర్జరధానిన్ నిలుపంగ రాత్రిచరులన్ శాసింప సత్కార్య మే**
**వెర వేరీతి ఘటిల్లు నట్టి క్రమమున్ వేగంబ చింతింపవే?**
**కరుణాలోక సుధాఝరిం దనుపవే? కల్యాణ సంధాయకా! 473**

* మహానుభావా! ఉత్తములైన దేవతలు కష్టాలకు గురియైనారు. భాగ్యాలు కోల్పోయినారు. వారి దుఃఖాన్ని తొలగించు. వారిని అమరావతిలో నెలకొల్పడమూ, రాక్షసులను శిక్షించడమూ చేయదగిన మంచిపని. ఈ కార్యం ఏ విధంగా నెరవేరుతుందో తొందరగా ఆలోచించు. మమ్మల్ని నీ కరుణారస ప్రవాహంలో ముంచెత్తు.

**వ. అనిన మనోవల్లభపలుకు లాకర్ణించి ముహూర్తమాత్రంబు చింతించి విజ్ఞానదృష్టి నవలంబించి భావికాల కార్యంబు విచారించి కశ్యపబ్రహ్మ యిట్లనియె. 474**

* పై విధంగా పలికిన ప్రియురాలి మాటలు విని కశ్యపప్రజాపతి కొంచెం సేపు చింతించినాడు. జ్ఞానదృష్టితో రాబోయే కాలం లోని సంగతులను తెలుసుకొని ఇట్లా అన్నాడు.

**మ. 'జనకుం డెవ్వడు?జాతుఁ డెవ్వఁడు? జనిస్థానంబు లెచ్చోటు? సం**
**జననం బెయ్యది? మేను లేకొలఁది? సంసారంబు లేరూపముల్?**
**వినుమా యింతయు విష్ణుమాయ దలఁపన్ వే తేమియున్ లేదు; మో**
**హ నిబద్ధంబు నిదాన మింతటికి జాయా; విన్నఁబో నేటికిన్? 475**

**వ. అగు; నయిననుం గాలోచిత కార్యంబు సెప్పెద. 476**

* దేవీ! విను. తండ్రి ఎవడు? కొడుకెవడు? పుట్టిన స్థలాలు ఏవి? పుట్టుకకు కారణమేది? శరీరాలు ఏపాటివి? ఈ సంసారాలు ఏ మాత్రమైనవి? ఆలోచిస్తే ఇదంతా భగవంతుడైన విష్ణుదేవుని మాయతప్ప మరేమీ కాదు. అజ్ఞానంలో బంధింపబడి ఉండడమే దీనికి మూలం. అందువల్ల జరిగిన దానికి చింతించవద్దు. ఐనప్పటికీ ఇప్పటికి తగిన కార్యాన్ని చెప్పుతాను; విను.

**మ. భగవంతుం బరముం జనార్దనుఁ గృపాపారీణు సర్వాత్మకున్**
**జగదీశున్ హరిసేవ సేయు; మతఁడున్ సంతుష్టినిం బొంది నీ**
**కగు నిష్టార్థము లెల్ల నిచ్చు; నిఖిలార్థావాప్తి సేకూరెడిన్;**
**భగవత్సేవలఁ బొందరాదె బహుసౌభాగ్యంబులం బ్రేయసీ'!**

వ. అనిన గృహస్థునకు గృహిణి యిట్లనియె. 478

* ప్రియులారా! భగవంతుడూ, పురుషోత్తముడూ, జనార్దనుడూ, దయాసముద్రుడూ, సర్వాంతర్యామీ, జగదీశ్వరుడూ అయిన విష్ణుమూర్తిని ఆరాధించు. ఆయన సంతోషిస్తే చాలు; నీ కోరికలు నెరవేరుతాయి. అన్ని ప్రయోజనాలు కలుగుతాయి. అతనిని పూజించి సమస్త సంపదలనూ పొందవచ్చుగదా! ఈ విధంగా చెప్పిన కశ్యపుని మాటలను విని అదితి ఇట్లా అన్నది.

క. 'నారాయణుఁ బరమేశ్వరు, నేరీతి దలంతు? మంత్ర మెయ్యది? విహితా
చారంబు లే ప్రకారము?, లారాధన కాలమెద్ది? యానతి యీవే.' 479

* స్వామీ! పరమాత్ముడైన శ్రీమహావిష్ణువును ఏవిధంగా ధ్యానించాలి? అందుకు తగిన మంత్రమేది? దాని నియమాలు ఏవి? పూజింపవలసిన కాలమేది? సెలవివ్వు.

వ. అనినఁ గశ్యపప్రజాపతి సతికిఁ బయోభక్షణంబను వ్రతం బుపదేశించి తత్కాలంబును, దన్మంత్రం బును, దద్విధానంబును, దదుపవాస దాన భోజన ప్రకారంబులును నెఱింగించిన నదితియును ఫాల్గుణ మాసంబు శుక్లపక్షంబునఁ బ్రథమ దివసంబునన్ దొరఁకొని పంద్రెండు దినంబులు హరి సమర్పణంబుగా వ్రతంబుసేసి వ్రతాంతంబున నియతయై యున్న యెడఁ జతుర్బాహుండును, బీతవాసుండును, శంఖచక్రగదా ధరుండునునై, నేత్రంబుల కగోచరుండైన నారాయణదేవుండు ప్రత్యక్షంబైనం గనుంగొని. 480

* పై విధంగా అడిగిన అదితికి కశ్యపుడు "పయోభక్షణం" అనే వ్రతాన్ని ఉపదేశించాడు. అందుకు తగిన కాలాన్నీ, మంత్రాన్నీ, నియమాన్నీ వ్రతకాలంలో పాటించవలసిన ఉపాసనా విధినీ దానభోజ నాది విధానాలనూ బోధించినారు. అదితి ఫాల్గుణమాసం శుక్ల పక్షం మొదటిదినాన ఆ వ్రతాన్ని ప్రారంభించింది. పంద్రెండు దినాలు యథావిధిగా భగవంతుని పూజించింది. వ్రతం ముగియగానే నియమవంతురాలైన ఆమెకు విష్ణువు ప్రత్యక్షమైనాడు. ఆయన చతుర్బాహుడు. శంఖాన్నీ చక్రాన్నీ గదనూ ధరించి ఉన్నాడు. పచ్చని పట్టువస్త్రాన్ని కట్టుకొని ఉన్నాడు. కన్నులకు కానరాని భగవంతుడు ఆమె కన్నుల ఎదుట సాక్షాత్కరించాడు.

క. కన్నుల సంతోషాశ్రులు, చన్నులపైఁ బఱవఁ బులక జాలము లెసఁగన్
సన్నుతులును సన్నుతులును, నున్నత రుచిఁ జేసి నిటల యుక్తాంజలియై. 481

* అదితి కన్నుల నుండి సంతోషంవల్ల కురిసిన కన్నీళ్ళు ఆమె వక్షః స్థలంపై ప్రవహించినాయి. ఆమె శరీరమంతా పులకరించింది. భక్తితో స్తోత్రాలు చేస్తూ నుదుటిపై చేతులు జోడించి స్వామికి నమస్కరించింది.

క. చూపుల శ్రీపతి రూపము, నాపోవక త్రావి త్రావి హర్షోద్ధతయై
వాపుచ్చి మంద మధురా, లాపంబులఁ బొగడె నదితి లక్ష్మీనాథున్. 482

* అదితిదేవి ఆ దేవదేవుని రూపాన్ని చూపులతో తనివితీరా త్రాగింది. నిండు సంతోషంతో మైమరచి ఆ స్వామిని మృదుమధుర వాక్కులతో ఇట్లా స్తుతించింది.

సీ. 'యజ్ఞేశ! విశ్వంభరాచ్యుత! శ్రవణ మంగళనామధేయ! లోకస్వరూప!
యాపన్న భక్త జనార్తి విఖండన! దీనలోకాధార! తీర్థపాద!
విశ్వోద్భవస్థితి విలయకారణభూత! సంతతానంద! శశ్వద్విలాస!
యాయువు దేహంబు ననుపమ లక్ష్మియు వసుధయు దివముఁ ద్రివర్గములును

తే. వైదికజ్ఞాన యుక్తియు వైరిజయము, నిన్నుఁ గొలువని నరులకు నెఱయఁ గలదె?
వినుతమందార! గుణహార! వేదసార!, ప్రణత వత్సల! పద్మాక్ష! పరమపురుష! 483

* యజ్ఞేశ్వరా! విశ్వంభరా! అచ్యుతా! నీవు భక్తులపాలి కల్పవృక్షానివి సుగుణ నిధివి. పూజించే వారిని బ్రోచేవాడవు. కమలాలవంటి కన్నులు గలవాడవు. పరమాత్ముడవు. వేదాలకు ఆధారమైన వాడవు. అంతట నిండినవాడవు. లోకమే రూపమైనవాడవు. దిక్కులేని దీనులను చేరదీసేవాడవు. పాదంలో పవిత్రమైన గంగానది కలవాడవు. లోకాలు పుట్టి పెరిగి గిట్టడానికి కారణ మైనవాడవు. ఎల్లప్పుడూ ఆనందంతో అలరారే వాడవు. శాశ్వతమైన లీలావిలాసాలు కలవాడవు. ఈ లోకంలో మంచి ఆయుస్సూ, మనుగడా, కలిమీ, ఇహమూ, పరమూ, ధర్మార్థ కామాలూ, వేదవిజ్ఞానమూ, శత్రుజయమూ నిన్ను పూజించని వారికి లభించవు కదా!

ఆ. అసురవరులు సురల నదలించి బెదరించి, నాక మేలుచున్న నాఁట నుండి
కన్న కడుపు గాన కంటఁ గూరుకు రాదు, కడుపుఁబొక్కు మాన్పి కావవయ్య' 484

వ. అనిన విని దరహసిత వదనుండయి యాశ్రిత కామధేనువైన యప్పరమేశ్వరుడుం డిట్లనియె. 485

* తండ్రీ! బలవంతులైన రాక్షసులు నా బిడ్డలైన దేవతలను అదరించి, బెదరించి స్వర్గలోకాన్ని పాలిస్తున్నారు. ఆ బెంగతో దేవతల కన్నతల్లినైన నాకు కంటికి నిద్ర కరవైనది. నా బిడ్డల బాధ పోగొట్టి కాపాడు- అని పలికిన అదితి మాటలు విని శ్రీమహావిష్ణువు చిరునవ్వు చిందించినాడు. శరణువేడిన వారికి కామధేనువైన ఆ పరమాత్ముడు అదితితో ఇట్లా అన్నాడు.

శా. నీ కోడండ్రును, నీకుమారవరులున్, నీనాథుఁడున్, నీవు సం
శ్లోకింపన్ సతులుం బతుల్ మిగుల సమ్మోదింప రాత్రించరుల్
శోకింపన్ భవదీయ గర్భమునఁ దేజోమూర్తి జన్మించెదన్
నాకున్ వేడుక పుట్ట నీ సుతుఁడనై నర్తించి వర్తింపఁగాన్ 486

* అమ్మా! తేజస్సుతో కూడిన రూపంతో నీ కడుపున జన్మించుతాను. నీ కోడళ్ళూ నీ కొడుకులూ నీ మగడూ నీవు మెచ్చుకొనేటట్లు చేస్తాను. మీ ఆలుమగలు ఆనందించేటట్లు చేస్తాను. రాక్షసులు కళవళ పడేటట్లు చేస్తాను. నీ ఒడిలో ఆడుకోవాలని నాకూ కుతూహలంగా ఉంది.

మ. బలిమిన్ దైత్యులఁ జంపరాదు వినయోపాయంబునం గాని; సం
చలనం బొందకు; నేను నీ నియతికిన్ సద్భక్తికిన్ మెచ్చితిన్;

**బలి విద్వేషియు నా నిలింపగణమున్ బౌలోమియున్ మెచ్చ దై**
**త్యుల రాజ్యంబు హరింతు, నింద్రునికి నిత్తున్; దుఃఖ మింకేటికిన్? 487**

* సహనంతో కూడిన ఉపాయంతో తప్ప బలం చూపెట్టి రాక్షసులను మట్టుపెట్టడానికి వీలులేదు. నీ నియమానికి భక్తికి నేను సంతోషించినాను. ఇంద్రుడూ, శచీదేవీ, దేవతలూ సంతోషించే విధంగా రాక్షసుల రాజ్యాన్ని అపహరించి ఇంద్రునికి ఇస్తాను. నీవు బాధపడవద్దు.

**క. నీ రమణుని సేవింపుము, నా రూపము మానసించి నలి నీ గర్భా**
**గారంబు వచ్చి చొచ్చెద, గారామునఁ బెంపవమ్మ కరుణన్ నన్నున్. 488**

* నా రూపాన్ని తలచుకొంటూ నీ భర్తను సేవించు. నేను నీ గర్భంలో చేరుతాను. మక్కువతోనూ కనికరంతోనూ నన్ను కాపాడవమ్మా!

**క. ఏలింతు దివము సురలను, బాలింతు మహేంద్రయువతి భాగ్య శ్రీలం**
**దూలింతు దానవుల ని, ర్మూలింతు రిపుప్రియాంగముల భూషణముల్! 489**

* దేవతలు స్వర్గాన్ని పాలించేటట్లు చేస్తాను. శచీదేవి సౌభాగ్యాలను కాపాడుతాను. రాక్షసులను అధికారం నుంచి తొలగిస్తాను. వారి ఇల్లాండ్ర సొమ్ములను ఊడదీయిస్తాను.

**వ. అని యిట్లు భక్తజన పరతంత్రుండగు పురాణపురుషుం డాన తిచ్చి తిరోహితుం డయ్యె; న య్యదితియుఁ గృతకృత్యయై సంతోషంబునఁ దన మనోవల్లభుండగు కశ్యపు నాశ్రయించి సేవించుచుండె; నంత నొక్కదినంబున. 490**

**ఆ. ఘన సమాధినుండి కశ్యపుఁ డచ్యుతు, నంశ మాత్మ నొలయ నదితియందుఁ**
**దనదు వీర్య మధికతరము సేర్చెను గాలి, శిఖిని దారువందుఁ జేర్చినట్లు 491**

* పై విధంగా భక్తజన విధేయుడైన నారాయణుడు సెలవిచ్చి మాయమైనాడు. కృతార్థురాలైన అదితి సంతోషంతో తన ప్రాణవల్లభుడైన కశ్యపప్రజాపతిని సేవింపసాగింది. అటుతరువాత ఒకనాడు తపస్సులో ఉండిన కశ్యపునిలో విష్ణువు తేజస్సు ప్రవేశించింది. వాయువు కొయ్యలో అగ్నిని చేర్చిన విధంగా అదితిలో కశ్యపుడు తన అసాధారణమైన వీర్యాన్ని చేర్చినాడు.

**వ. ఇట్లు కశ్యప చిరతర తపస్సంభృత వీర్య ప్రతిష్ఠిత గర్భయై సురలతల్లి యుల్లంబున నుల్లసిల్లుచు నుండె; నంత. 492**

* రాజా! పై విధంగా కశ్యపుడు చాలాకాలంగా మహాతపో విశేషంతో సంపాదించిన వీర్యంవల్ల అదితి గర్భాన్ని ధరించింది. ఆమె మనస్సు చాలా ఉల్లాసాన్ని పొందింది.

**క. చలచలనై పిదపిదనై, గలలంబై కరుడు గట్టి గళనాళముతోఁ**
**దల యేర్పడి గర్భంబై, నెలమసలం జీరచిక్కె నెలఁతకు నధిపా! 493**

* ఒక నెల గడిచింది. అదితి కడుపులో క్రమక్రమంగా ద్రవరూపమూ, మెత్తని రూపమూ గడ్డకట్టి పిండరూపము ఏర్పడింది. నెల తప్పింది. గొంతుతోపాటు తల ఏర్పడి గర్భం నిలిచింది.

క. నెలఁతకుఁ జూలై నెల రె, న్నెలలై మఱి మూఁడు నాల్గు నెలలై వరుసన్
నెల లంత కంత కెక్కఁగ, నెలలును డగ్గఱియె నసుర నిర్మూలతకున్. 494

* అదితి చూలాలై తరువాత వరుసగా ఒకటి, రెండు, మూడు, నాలుగు నెలలు గడిచినాయి. క్రమంగా నెలలు పెరిగినాయి. దానితో పాటు రాక్షసులు నాశనం కావడానికి నెలలు సమీపించినాయి.

క. మహితతర మేఘమాలా, పిహితాయుత చండభాను బింబప్రభతో
విహితాంగంబులఁ కశ్యపు, గృహిణీగర్భమున శిశువు గ్రీడించె నృపా! 495

* రాజా! అదితి గర్భంలో అవయవాలతో కూడిన ఆ అద్భుత శిశువు గొప్ప మేఘాలు కప్పిన పదివేల సూర్య బింబాల వెలుగుతో కదలాడసాగాడు.

క. తన కడుపున నొక వెఱపున, వనరుహ గర్భాండభాండ వనధిచయంబుల్
గొనకొని జగముల నిడుకొని, తనుగతిఁ గడు నడఁగి మడఁగి తనరెన్ బెడఁగై. 496

* అదితి గర్భంలోని ఆచిన్నారి శిశువు భూగోళాలనూ, ఖగోళాలనూ, సముద్రాలనూ, సమస్త లోకాలనూ తన కడుపులో ఇమిడించుకొని సన్నసైన చిన్ని రూపంతో అందంగా అణగిమణగి ఉన్నాడు.

వ. అంత న క్కాంతాతిలకంబు క్రమక్రమంబున. 497

మ. నిలిపెన్ ఱెప్పల బృందిమన్ విశదిమన్ నేత్రంబులం, జూచుకం
బుల నాకాళిమ, మేఖలం ద్రఢిమ నెమ్మో మారఁగా బాండిమన్
బలిమిం జన్నుల, శ్రోణిపాళిగరిమ, న్మధ్యంబునన్ బృంహిమ
న్లలితాత్మన్ లఘిమన్, మహామహిమ మేనన్ గర్భదుర్వారయై. 498

* అదితి క్రమక్రమంగా నిండుచూలాలై నది. ఆమె రెప్పలు అందంగా ఒప్పినాయి. కన్నులు నిర్మలమైనాయి. స్తనాగ్రాలు నల్లబడినాయి. ఒడ్డాణము బిగువైంది. ముఖం తెల్లబడింది. స్తనాలు లావైనాయి. పిరుదులు బరువెక్కినాయి. నడము విస్తరించింది. మనస్సు తేలికపడింది. దేహం మహత్త్వాన్ని పొందింది.

క. పెట్టుదురు నుదుట భూతిని, బొట్టిడుదురు మేనఁ బట్టుఁ బుట్టపుదోయిం
బెట్టుదురు వేల్పులమ్మకుఁ, గట్టుదురు సురక్ష పడఁతి గర్భంబునకున్. 499

* పెద్ద ముత్తైదువలు అదితికి నుదుట విభూతి పెట్టినారు. తిలకం దిద్దినారు. పట్టుబట్టల జతను కట్టినారు. ఆమె గర్భానికి రక్ష కట్టినారు.

వ. ఇ వ్విధంబున. 500

తే. విశ్వగర్భుఁడు దనగర్భ వివరమందుఁ, బూఁటపూఁటకుఁ బూర్ణుఁడై పొటకరింప
వ్రేఁకఁ జూలాలితనమున వేల్పుఁ బెద్ద, పొలఁతి కంతట నీళ్లాడు ప్రొద్దు లయ్యె. 501

* పై విధంగా అదితి గర్భంలో విశ్వగర్భుడైన భగవంతుడు పూటపూటకూ పెరిగినాడు. గర్భం బరువెక్కింది. ఆమె నీళ్ళాడే సమయం ఆసన్న మయింది.

వ. తదనంతరంబునఁ జతురాననుం డరుగుదెంచి యదితి గర్భపరిభ్రమ విభ్రముం డగు న ప్పరమేశ్వరు నుద్దేశించి యిట్లని స్తుతియినించె. 502

* ఆ సమయంలో బ్రహ్మదేవుడు అదితి గర్భంలో అందంగా కదలాడుతున్న భగవంతుని ఉద్దేశించి ఈ విధంగా స్తోత్రం చేసినాడు:-

సీ. 'త్రిభువన జయరూఢ! దేవ! యురుక్రమ! పృథులాత్మ! శిపివిష్ట! పృశ్నిగర్భ!
ప్రీతత్రిణాభ! త్రిపృష్ఠ! జగంబుల, కాద్యంత మధ్యంబు లరయ నీవ!
జంగమస్థావర జననాది హేతువు నీవ; కాలంబ వై నిఖిల మాత్మ
లోపల ధరియింతు లోనిజంతుల నెల్ల స్రోతంబులోఁ గొను సుందరతను;

తే. బ్రహ్మలకు నెల్ల సంభవ భవన మీవ; దివమునకుఁ బాసి దుర్దశ దిక్కులేక
శోకవార్ధి మునింగిన సురలకెల్లఁ, దేల నాధార మగుచున్న తెప్పవీవ. 503

* అదితి గర్భంలో వర్ధిలుచున్న స్వామీ! నీవు ముల్లోకాలనూ జయింపగలవాడవు. దేవాధిదేవుడవు; మహానుభావుడవు. సమస్త భువనాలను సంతోషంగా నీ కడుపులో దాచుకుంటావు. ఈ లోకాలకు మొదలు నడుమూ తుదా నీవే. చరాచర ప్రపంచం పుట్టడానికి కారణం నీవే. కాలమై సమస్తమూ నీలోపలే ధరిస్తావు. ప్రవాహం ప్రాణికోటిని ధరించినట్లు సమస్త జీవులనూ నీలోనే నిలుపు కొంటావు. సృష్టికర్తలకు సృష్టికర్తవు నీవు. స్వర్గలోకాన్ని పోగొట్టుకొని దేవతలు కష్టసముద్రంలో మునిగినారు. వారిని కాపాడి గట్టుచేర్చే తెప్పవు నీవే.

క. విచ్చేయు మదితి గర్భము, వెచ్చెర వెలువడి మహాత్మ! చిరకాలంబున్
విచ్చలవిడి లే కమరులు, ముచ్చటపడి యున్నవారు ముద మందింపన్. 504

* మహానుభావా! చాలాకాలంగా దేవతలు స్వేచ్ఛకోసం ఆరాటపడుతున్నారు. వారికి సంతోషాన్ని సమకూర్చడానికై తొందరగా అదితిగర్భం నుండి వెలువడి వేంచేయవయ్యా.

## -: వామనమూర్త్యావిర్భావఘట్టము :-

వ. అని యిట్లు కమలసంభవుండు వినుతిసేయు న య్యవసరంబున. 505

మ. రవి మధ్యాహ్నమునం జరింప గ్రహతారాచంద్రభద్రస్థితిన్
శ్రవణద్వాదశినాఁడు శ్రోణ నభిజి త్సంజ్ఞాతలగ్నంబునన్

**భువనాధీశుఁడు పుట్టె వామనగతిం బుణ్యవ్రతోపేతకున్**
**దివిజాధీశ్వరు మాతకుం బరమపాతివ్రత్య విఖ్యాతకున్. 506**

* పై విధంగా బ్రహ్మదేవుడు స్తోత్రం చేసిన తరువాత నిర్మలమైన నియమంతో గొప్ప పతివ్రతగా పేరు పొందిన దేవమాత అదితి గర్భంనుండి వామన రూపంతో మహావిష్ణువు జన్మించినాడు. అది శ్రావణ మాస ద్వాదశి, శ్రవణ నక్షత్రం, అభిజిత్తులగ్నం, పట్టపగలు సూర్యుడు ఆకాశం నట్టనడుమ ప్రకాశించు తున్నాడు. గ్రహాలు నక్షత్రాలూ చంద్రుడూ ఉచ్చదశలో ఉన్నాయి.

**వ. మఱియు న ద్దేవుండు శంఖచక్రగదా కమల కలిత చతుర్భుజుండును, బిశంగవర్ణవస్త్రుండును, మకర కుండల మండిత గండ భాగుండును, శ్రీవత్సవక్షుండును,నలిన చక్షుండును, నిరంతర శ్రీవిరాజిత రోలంబ కదంబాలంబిత వనమాలికా పరిష్కృతుండును, మణికనక కాంచీవలయాంగద కిరీటహార నూపురాలంకృతుండును, కమనీయ కంఠ కౌస్తుభాభరణుండును, నిఖిలజన మనోహరుండునునై యవతరించిన సమయంబున. 507**

* వామనుడు జన్మించినపుడు అతనికి నాలుగు చేతులూ, ఆ చేతులలో శంఖమూ చక్రమూ గదా పద్మమూ ఉన్నాయి. గోరోజనం రంగు వస్త్రమూ, మకర కుండలాలతో మెరిసే చెక్కిళ్ళు, రొమ్ముపై శ్రీవత్సమూ, కమలాలవంటి కన్నులూ కలిగి ఉన్నాడు. తుమ్మెదలు మూగిన అందమైన వనమాల మెడలో కదలుతున్నది. రత్నాలు కూర్చిన బంగారు ఒడ్డాణము, బాహుపురులూ, కిరీటమూ, హారాలు, కాలి అందెలు-కాంతులు వెదజల్లుతున్నాయి. కమనీయమైన కంఠభాగాన కౌస్తుభమణి మెరుస్తున్నది. అతని రూపం అఖిల జనుల మనస్సులను ఆకర్షిస్తున్నది.

**శా. చింతం బాసిరి యక్షతార్క్ష్యసుమనస్సిద్ధోరగాధీశ్వరుల్**
**సంతోషించిరి సాధ్యచారణ మునీశ బ్రహ్మ విద్యాధరుల్**
**గాంతిం జెందిరి భానుచంద్రములు; రంగద్గీత వాద్యంబులన్**
**గంతుల్ వైచిరి మింటఁ గింపురుషులున్ గంధర్వులుం గిన్నరుల్. 508**

* వామనుడు పుట్టగానే యక్షులూ గరుడులూ దేవతలూ సిద్ధులూ నాగులూ చింతలు విడిచినారు. సాధ్యులూ, చారణులూ, ఋషులూ, ఋత్విజులూ, విద్యాధరులూ సంతోషించినారు. సూర్యచంద్రులు కాంతులు విరజిమ్మినారు. గంధర్వులూ, కిన్నరులూ, కింపురుషులూ వాద్యాలు మ్రోగిస్తూ ఆటపాటలతో ఆకాశంలో నాట్యాలు చేసినారు.

**క. దిక్కుల కావిరి వాసెను, నెక్కువ నిర్మలత నొందె నేడు పయోధుల్**
**నిక్కమెయి నిలిచె ధరణియుఁ, జుక్కల త్రోవయును విప్రసుర సేవ్యములై. 509**

* దిక్కులలోని కావిరంగు కరగిపోయింది. సప్తసముద్రాలూ నిర్మలమైనాయి. భూమి పొంగి పులకించింది. బ్రాహ్మణులతో దేవతలతో ఆకాశం అలరారింది.

క. ముంపుగొని విరుల వానల, జొంపంబులు గురియ సురలు, సుమనోమధువుల్
తుంపర లెగయఁ బరాగపు, రొంపుల భూభాగ మతి నిరూషిత మయ్యెన్. 510

* పొదరిండ్లు విశేషంగా పూలజల్లులు విరజల్లినాయి. దేవతలు కురిపించిన పూలవానల మకరంద బిందువులు అంతటా వ్యాపించినాయి. పుప్పొడుల కుప్పలతో భూభాగం నిండిపోయింది.

వ. తదనంతరంబ. 511

ఆ. ఈ మహానుభావుఁడె ట్లింత కాలంబు, నుదరమందు నిలిచి యుండె ననుచు
నదితి వెఱఁగుపడియె నానంద జయశబ్ద, ములను గశ్యపుండు మొగి నుతించె. 512

* అటు తరువాత వామనుని చూచి " ఈ మహానుభావుడు ఇంత కాలమూ నా కడుపులో ఎట్లా ఉన్నాడా!" అని అదితి ఆశ్చర్యపడింది. ఆనందంతోకూడిన 'జయజయ' శబ్దాలతో కశ్యపుడు స్వామిని సంస్తుతించినాడు.

వ. అంత నవ్విభుండు సాయుధ సాలంకారంబగు తన దివ్యరూపంబు నుజ్జగించి రూపాంతరం బంగీకరించి కపటవటుని చందంబున నుపనయన వయస్కుండైన వామన బాలకుండై దల్లి ముందటఁ గుమార సముచితా లాపంబు లాడుచుఁ గ్రీడించు సమయంబున నదితియుం దన యవలోకన పరిణామ పారవశ్యంబున. 513

* అటుపిమ్మట వామనుడు ఆయుధాలూ అలంకారాలూ కలిగిన తన దివ్యరూపాన్ని వదలి కపట బ్రహ్మచారిగా మారు రూపాన్ని పొందినాడు. పొట్టిబాలుడై వడుగుచేయదగిన వయసు కలవాడైనాడు. ఆ కొడుకును చూచి అదితి ఆనందంతో మైమరచింది.

ఆ. నన్నుఁ గన్న తండ్రి! నా పాలిదైవమ!, నాతపఃఫలంబ? నా కుమార!
నాదు చిన్ని వడుగ! నాకులదీపక!, రాఁగదయ్య! భాగ్య రాశి వగుచు. 514

క. అన్నా రమ్మని డగ్గఱిఁ, చన్నుల పాలేఱువాఱ సంశ్లేషిణియై
చిన్నారి మొగము నివురుచుఁ, గన్నారం జూచెఁ గన్నకడుపై యుంటన్. 515

* కన్నబిడ్డయైన వామనుని 'నా కన్నతండ్రీ! నా పాలిదేవుడా! నా నోముల పంటా! నా ముద్దుల నాన్నా! నా చిన్ని వడుగా! నా వంశాలంకారమా! నా పెన్నిధీ! నా అన్నా! రావయ్యా!' అంటూ అదితి దగ్గరకు పిలిచింది. ఆమె చనుబాలు జాలువారించింది. అక్కున చేర్చుకొన్నది. అతని చిన్నారి మొగాన్ని దువ్వింది. కన్నుల నిండుగా చూచింది.

క. పురు డీ బోటికి నిందిర, పురు డంబిక గాక యొరులు పురుడే? యనుచున్
బురుటాలికిఁ బది దినముల, పురుడు ప్రవర్తించి రెలమిఁ బుణ్యాపు గరితల్. 516

*ఈ ఇల్లాలికి లక్ష్మీ పార్వతులే సమానమైనవారు. ఇతరులు సమానం కారు'- అంటూ పెద్ద ముత్తైదువలు బాలెంతరాలైన అదితికి పదిరోజులు పురుడు నడిపినారు.

వ. అంత న బ్బాలునకు సంతసంబున మహర్షులు గశ్యపప్రజాపతిం బురస్కరించుకొని సముచితో పనయన కర్మకలాపంబులు సేయించిరి; సవిత సావిత్రి నుపదేశించె; బృహస్పతి యజ్ఞోపవీతంబును, గశ్యపుండు ముంజియుఁ, గౌపీనం బదితియు, ధరణి గృష్ణాజినంబును, దండంబు వనస్పతియగు సోముండును, గగనాధిష్ఠాన దేవత ఛత్రంబును, గమండలువు బ్రహ్మయు, సరస్వతి యక్షమాలికయు, సప్తర్షులు గుశ పవిత్రంబులు నిచ్చిరి, మఱియును. 517

* అటు తరువాత వామనునికి వడుగు చేయడానికై కశ్యపప్రజాపతిని ముందుంచుకొని మునీంద్రులు తగిన కార్యకలాపాలు జరిపినారు. వామనునికి సూర్యుడు గాయత్రి మంత్రాన్ని బోధించినాడు. బృహస్పతి జన్నిదాన్నీ, కశ్యపుడు ముంజదర్భల మొలత్రాడునూ, అదితి కౌపీనాన్నీ, భూదేవి నల్లని జింక చర్మాన్నీ, చంద్రుడు దండాన్నీ, ఆకాశం గొడుగునూ, బ్రహ్మ కమండలాన్నీ, సరస్వతీదేవి జపమాలనూ, సప్తఋషులు పవిత్రమైన దర్భలనూ ఇచ్చినారు.

క. భిక్షాపాత్రిక నిచ్చెను, యక్షేశుఁడు వామనునకు; నక్షయ మనుచున్
సాక్షాత్కరించి పెట్టెను, భిక్షునకు భవాని పూర్ణభిక్ష నరేంద్రా! 518

* పరీక్షిన్మహారాజా! కుబేరుడు వామనునికి భిక్షాపాత్రను ఇచ్చినాడు. జగన్మాత పార్వతీదేవి ప్రత్యక్షమై 'అక్షయం' అంటూ ఆ బ్రహ్మచారికి నిండైన భిక్ష పెట్టింది.

క. శుద్ధబ్రహ్మర్షి సమా, రాద్ధుండై విహితమంత్రరాజిఁ జదువుచుం
బ్రోద్ధంబగు ననలంబున, వృద్ధాచారమున వటుఁడు వేల్చెం గడఁకన్. 519

* పరిశుద్ధులైన బ్రహ్మఋషులు వామనుని ఆదరంగా ఆశీర్వదించినారు. అటు పిమ్మట ఆ బ్రహ్మచారి సంప్రదాయం ప్రకారంగా వేదమంత్రాలను చదువుతూ, వెలిగే అగ్నిహోత్రంతో ఉత్సాహంతో హోమం చేసినాడు.

## -: బలిచక్రవర్తి కడకు వామనమూర్తి యేతెంచుట :-

వ. ఇట్లు కృతకృత్యుండైన మాయామాణవకుండు దేశాంతర సమాగతులగు బ్రాహ్మణులం గొందఱ నవలోకించి యిట్లనియె. 520

*పై విధంగా ఉపనయనం పూర్తి అయిన తరువాత మాయా బ్రహ్మచారి ఇతర దేశాల నుండివచ్చిన కొందరు బ్రాహ్మణులను చూచి ఇట్లా అడిగాడు:-

క. వత్తురె విప్రులు? వేఁడఁగ, నిత్తురె దాతలును వేడ్క నిష్టార్థములం?
దెత్తురె మీరును సంపద?, లిత్తెఱఁగున దానవీరుఁ డెవ్వఁడొ చెపుఁడా? 521

వ. అనిన నఖిల దేశీయు లగు భూసురు లిట్లనిరి. 522

* 'దానాలు అందుకోవటానికి బ్రాహ్మణులు దాతల చెంతకు పోతున్నారా? వారు కోరిన ధనాలను దాతలు ఇస్తున్నారా? మీరుకూడా అటువంటి ధనాన్ని తెచ్చుకుంటారా? ఈ విధంగా అర్థులకు అడిగినది ఇచ్చే దానవీరుడు ఎవడో చెప్పండి' అని అడిగిన వామనునితో పలుదేశాలకు చెందిన బ్రాహ్మణులు ఇట్లా అన్నారు:-

**మ. 'కలరున్ దాతలు; నిత్తురుం ధనములుం; గామ్యార్థముల్ గొంచు వి**
**ప్రులు నేతెంతురు; గాని యీవిని బలింబోలన్ వదాన్యుండు లేఁ**
**డలఘుండై యొనరించె నధ్వరశతం బా భార్గవానుజ్ఞచే;**
**బలి వేఁడం బడయంగ వచ్చు బహుసంపల్లాభముల్ వామనా! 523**

* "వామనా! ధనమిచ్చే దాత లున్నారు. బ్రాహ్మణులు కోరిన సంపదలను పొందుతున్నారు. కానీ ఆ దాతలలో బలిచక్రవర్తితో సమానమైన మహాదాత లేడు. అతను శుక్రాచార్యుని అనుమతితో నూరు గొప్ప యాగాలు చేసినాడు. అతనిని అడిగితే నీకు గొప్ప సంపద సమకూరుతుంది.''

**వ. అని తెలియం జెప్పిన బ్రాహ్మణుల వచనంబు లాలకించి లోకంబులకుం బ్రీతి పుట్టింపఁ బయనంబై లాభవచనంబులు గైకొనుచుఁ దల్లిదండ్రుల వీడ్కొని శుభముహూర్తంబునం గదలి. 524**

* పై విధంగా తేటపరచిన బ్రాహ్మణుల మాటలు విని లోకాలకు మేలు కలిగించడానికై వామనుడు ప్రయాణమైనాడు. పెద్దల దీవనలూ, తల్లిదండ్రుల అనుమతీ పొంది మంచి ముహూర్తంలో బయలుదేరినాడు.

**క. ప్రక్షీణ దివిజ. వల్లభ, రక్షాపరతంత్రుఁ డగుచు రాజీవాక్షుం**
**డా క్షణమున బలి యింటికి, భిక్షాగమనంబు సేసెఁ బేదఱికముతోన్. 525**

* వామనుడు, మిక్కిలి బక్కచిక్కిపోయిన దేవేంద్రుని కాపాడ గోరినాడు. వెంటనే పేదవానివలె బలిచక్రవర్తిని దాన మడగడానికి సంకల్పించాడు.

**క. హరి హరి! సిరి యురమునఁ గల, హరి హరిహయుకొఱకు దనుజు నడుగం జనియెం;**
**బరహితరతి మతియుతులగు, దొరలకు నడుగుటయు నొడలి తొడవగుఁ బుడమిన్. 526**

* ఔరా! తన రొమ్మున లక్ష్మీదేవిని కలిగినవాడు విష్ణువు. అయినా అతడు ఇంద్రునికోసం బలిని బిచ్చమడగడానికి ప్రయాణమై వెళ్ళినాడు. ఇతరులకు మేలుచేసే ఉద్దేశంతో బిచ్చమెత్తడంకూడా గొప్పవారికి ఒక అలంకారమే కాబోలు!

**క. సర్వప్రపంచ గురుభర, నిర్వాహకుఁ డగుటఁజేసి నెఱిఁ జనుదేరన్**
**ఖర్వుని వ్రేఁగు సహింపక, యుర్వీస్థలి గ్రుంగె; మ్రొగ్గె నురగేంద్రుండున్. 527**

* భగవంతుడైన వామనుడు తన కడుపులో సమస్త లోకాలను భరించేవాడు. అందువల్ల అతడు ఒయ్యారంగా నడచేటప్పుడు అతని బరువునకు తట్టుకోలేక భూమి క్రుంగిపోయింది. ఆదిశేషుడు వంగిపోయినాడు.

వ. ఇట్లు సని చని. 528

క. శర్మద, యమదండ క్షత, వర్మద, నతి కఠినముక్తి వనితాచేతో
మర్మద, నంబునివారిత, దుర్మద, నర్మదఁ దరించెఁ ద్రోవన్ వటుఁడున్. 529

* వామనుడు ప్రయాణాన్ని సాగించి దారిలో నర్మదానదిని దాటినాడు. ఆ నది శుభాలను అందించేది. యమబాధల నుండి కవచంవలె కాపాడేది. గడుసుతనంతోకూడిన ముక్తికాంత మనసులోని గుట్టు బయట పెట్టేది. తన నీళ్ళతో దోషాలను నివారించేది.

వ. దాఁటి తత్ప్రవాహంబున కుత్తరతటంబునందు. 530

శా. చండస్ఫూర్తి వటుండు గాంచె బహుధాజల్పన్నిశాటంబు, ను
ద్దండాహూతమునీభ్యబిభ్యదమృతాంధ స్సిద్ధ కూటంబు, వే
దండాశ్వధ్వజినీ కవాటము, మహోద్యద్ధూమ సంఛన్న మా
ర్తాండ స్యందన ఘోటమున్, బలిమఖాంతర్వేదికావాటమున్. 531

* మంచితేజస్సుగల వామనుడు ఈ విధంగా నర్మదా నదిని దాటి దానికి ఉత్తరతీరంలో ఉన్న బలిచక్రవర్తి యాగశాలను సందర్శించాడు. అక్కడ రాక్షసులు పెక్కువిధాలుగా పెద్దపెద్దగా సందడి చేస్తున్నారు. ఆ యజ్ఞంలో పాల్గొన్న ఉద్దండులైన మునులను చూచి దేవతలూ, సిద్ధులూ భయపడుతున్నారు. ఆ స్థలానికి ముందు వైపు ద్వారంలో ఏనుగులూ, గుఱ్ఱాలూ, సైన్యాలూ నిండి ఉన్నాయి. అందలి యజ్ఞకుండాల పొగలతో సూర్యని రథం గుఱ్ఱాలు పూర్తిగా కప్పబడి పోతున్నాయి.

వ. కని దానవేంద్రుని హయమేధవాటి దఱియం జొచ్చు నయ్యవసరంబున. 532

శా. శంభుండో హరియో పయోజభవుఁడో చండాంశుఁడో వహ్నియో
దంభాకారత వచ్చెఁ గాక, ధరణిన్ ధాత్రీసురుం డెవ్వఁ డీ
శుంభద్ద్యోతనుఁ డీ మనోజ్ఞతనుఁ డంచున్ విస్మయభ్రాంతులై
సంభాషించిరి బ్రహ్మచారిఁ గని తత్సభ్యుల్ రహస్యంబుగన్. 533

* వామనుడు బలిసార్వభౌముని యజ్ఞవాటికను సమీపించినాడు. అప్పుడు ఆ సభలోనివారు వామనుని చూచి "శివుడో! విష్ణువో! బ్రహ్మయో! సూర్యుడో! అగ్నియో! ఈ మారువేషంతో వచ్చి ఉండవచ్చు. ప్రపంచంలో ఇంతటి కాంతీ అందమూ ఉండే బ్రహ్మచారి ఎవడుంటాడు?" అనుకొంటూ ఆశ్చర్యంతో భ్రమపడి రహస్యంగా గుసగుసలాడారు.

క. గుజగుజలు వోవువారును, గజిబిజిఁ బడువారుఁ జాలఁ గలకల పడుచున్
గజిబిజి యైరి సభాస్థలిఁ, బ్రజ లెల్లను బొట్టివడుగు బాపని రాకన్. 534

* పొట్టి బ్రహ్మచారియైన వామనుడు రాగానే ఆ సభలోని ప్రజలంతా గజిబిజిపడినారు. కొందరు గుసగుసలాడినారు. కొందరు తికమక పడినారు. కొందరు పెద్ద కలకలం చేసినారు.

**వ. ఆ సమయంబున బలిసభామండపంబుఁ దఱియం జొచ్చి. 535**

**సీ. చవులుగాఁ జెవులకు సామగానంబులు సదువు నుద్గాతల చదువు వినుచు**
**మంత్ర తంత్రార్థ సంబంధ భావములు పే ర్కొనెడి హోతలతోడఁ గూడికొనుచు**
**హోమకుండంబులం దున్న త్రేతాగ్నుల వెలిఁగించు యాజక వితతిఁ గనుచు**
**దక్షులై బహువిధాధ్వర విధానంబులు సెప్పెడు సభ్యులఁ జేరఁ జనుచుఁ**

**తే. బెట్టు గోరెడు వేడుక పట్టుపఱుప, నదితిపుట్టువు లచ్చికి నాటపట్టు**
**గోరి చరియించె సభలోనఁ గొంతదడవు, పుట్టు వెన్నఁడు నెఱుఁగని పొట్టివడుగు. 536**

* విష్ణువుకు పుట్టుకే లేదు. అటువంటివాడు అదితి కొడుకుగా వామనుడై పుట్టినాడు. ఆ పొట్టి బ్రహ్మచారి బలి చక్రవర్తి సభామండపంలో చేరినాడు. చెవులకు ఇంపుగా సామవేదం పఠించే ఉద్గాతల గానాలు విన్నాడు. మంత్రతంత్రాలను వివరిస్తూ హోమంచేసే హోతలను కలుసుకొన్నాడు. హోమకుండంలో ఆహవనీయం, గార్హపత్యం, దక్షిణాగ్ని అనేమూడగ్నులను వెలిగించే ఋత్విజులను చూచినాడు. యోగవిధులను నేర్పరితనంతో పేర్కొంటున్న సభాపతులను సమీపించినాడు. ఆ సభను బాగా ఆకర్షించాలని అనుకొని కొంతసేపు ఆ సభలో తిరుగాడినాడు.

**వ. మఱియును. 537**

**క. వెఱచుచు వంగుచు వ్రాలుచు, నఱిముఱి గుబురులకుఁ జనుచు హరి హరి యనుచున్**
**మఱుఁగుచు నులుకుచు దిఱదిఱఁ, గుఱుమట్టపుఁ బొట్టివడుగు గొంత నటించెన్. 538**

* అంతేకాక ఆ పొట్టిబ్రహ్మచారి భయపడుతూ, ఒయ్యారంగా వంగుతూ, జనంలోనికి దూరుతూ 'హరి హరి' అంటూ చాటుచాటులకు వెళ్ళుతూ, ఉలికిపడుతూ కొంతసేపు చుట్టూ తిరుగుతూ, కొంతసేపు నటించాడు.

**క. కొందఱతోఁ జర్చించును, గొందఱతో జటలు సెప్పు గోష్ఠిం జేయుం**
**గొందఱతోఁ దర్కించును, గొందఱతో ముచ్చటాడుఁ; గొందఱ నవ్వున్. 539**

**వ. మఱియు ననేక విధంబుల నందఱకు నన్ని రూపులై వినోదించుచు. 540**

* వామనుడు కొందరితో వాదోపవాదాలు చేశాడు. కొందరితో కలిసి వేదాన్ని చదివాడు. కొందరితో సల్లాపాలు సాగించాడు. కొందరితో వాదించాడు. కొందరితో చక్కగా మాట్లాడాడు. కొందరితో నవ్వుతూ ముచ్చటించాడు. అంతేకాక అందరితోనూ అనేక విధాలుగా వ్యవహరిస్తూ ఆనందించసాగాడు.

క. వెడవెడ నడకలు నడచుచు, నెడనెడ నడు గిడఁగ నడరి యిల దిగఁ బడఁగా
బుడి బుడి నొడువులు నొడువుచుఁ, జిడిముడి తడఁబడఁగ వడుగు సేరెన్ రాజున్. 541

వ. ఇట్లు డగ్గఱి మాయాభిక్షుండు రక్షోవల్లభుం జూచి యిట్లనియె. 542

* వామనుడు మెల్లమెల్లగా అడుగులు పెట్టి నడచినాడు. అక్కడక్కడ పుడమి క్రుంగిపోతుంటే సరిగా అడుగులు పెట్టలేక కష్టపడినాడు. నడుమ నడుమ కొద్దికొద్దిగా మాట్లాడుతూ తడబడుతూ కలవరపడుతూ బలిచక్రవర్తిని సమీపించినాడు. ఆ మాయా బ్రహ్మచారి ఆ దానవచక్రవర్తిని చూచి ఇట్లా అన్నాడు.

మ. ఇతఁడే దానవచక్రవర్తి సురలోకేంద్రాగ్ని కాలాది ది
క్పతి గర్వాపనయప్రవర్తి, గతలోభస్ఫూర్తి, నానామఖ
వ్రతదాన ప్రవణానువర్తి, సుమనోరామామనోభేదనో
ద్ధత చంద్రాతపకీర్తి, సత్యకరుణా ధర్మోల్లసన్మూర్తి దాన్. 543

వ. అని కుశ పవిత్రాక్షత సంయుతంబగు దక్షిణహస్తంబు సాఁచి యిట్లనియె. 544

* ఇతడేనా రాక్షస చక్రవర్తి! ఇతడేనా దేవేంద్రుడూ అగ్నీ యముడూ మొదలైన దిక్పాలకుల గర్వాన్ని తొలగించిన మొనగాడు! ఇతడేనా అత్యాశలేని నిండైన హృదయం కలవాడు! ఇతడేనా పెక్కుయజ్ఞాల పుణ్యకార్యాలలో, ప్రీతితో దానమిచ్చేవాడు! ఇతడేనా దేవతా స్త్రీల మనస్సును కలవరపెట్టే వెన్నెలవంటి కీర్తికలవాడు! ఇతడేనా సత్యంతో దయతో ధర్మంతో ప్రకాశించే స్వరూపం గలవాడు- ఈ విధంగా పలికి దర్భలతోనూ అక్షతలతోనూ పవిత్రమైన కుడి చెయ్యి చాచి వామనుడు ఇట్లా అన్నాడు.

ఉ. స్వస్తి జగత్త్రయీ భువన శాసన కర్తకు, హాసమాత్ర వి
ధ్వస్త నిలింపభర్తకు, నుదారపదవ్యవహర్తకున్, మునీం
ద్రస్తుత మంగళాధ్వర విధాన విహర్తకు, నిర్జరీగళ
న్యస్తసువర్ణ సూత్ర పరిహర్తకు, దానవలోక భర్తకున్. 545

* ముల్లోకాలను శాసించే అధికారం కలవాడా! నీకు స్వస్తి! అవలీలగా దేవేంద్రుని వెలవెలపోయేటట్లు చేసినవాడా! గొప్ప ఉన్నత పదవిలో మెలగేవాడా! మునీంద్రుల పొగడ్తల నందుకొన్న శుభకరమైన యాగకార్యాలతో విహరించేవాడా! దేవతాస్త్రీల మెడలోని బంగారు మంగళ సూత్రాలను తొలగించేవాడా! సమస్త రాక్షసలోక సార్వభౌముడా! నీకు శుభమగుగాక!

వ. అని దీవించి కరచరణాద్యవయవంబులు ధరించిన వేదరాశియుం బోలె ముందట నకుటిలుండును, జటిలుండును, సదండచ్ఛత్త్రుండును, గక్షలంబిత భిక్షాపాత్రుండును, గరకలిత జలకమండలుండును, మనోహర చంద్రవదన మండలుండును, మాయావాదన నటుండును, నగు వటువుం గని దినకర కిరణ పిహితంబులైన గ్రహంబుల చందంబునఁ దిరోహితులై భృగువులు గూర్చున్న యెడల లేచి సేమం బడిగి తియ్యని మాటల నాదరించిరి, బలియును నమస్కరించి తన గద్దియ నునిచి, పాదంబులు దుడిచి తన ప్రాణవల్లభ పసిండిగిండి నుదకంబులు వోయ వడుగుం గొమరుని చరణంబులు గడిగి తడియొత్తి తత్సమయంబున. 546

* పై విధంగా దీవించిన వామనుడు కరచరణాలతో మానవాకారం ధరించిన, వేదరాశివలె బలి ముందు నిలబడినాడు. జడలుగట్టిన జుట్టూ, దండమూ, గొడుగూ, కమండలమూ దాల్చి ఉన్నాడు. అతని చంకలో భిక్షాపాత్ర వ్రేలాడుతూ ఉంది. అతని ముఖం చంద్రబింబంవలె అందంగా ఉంది. అప్పు డతడు కొన్ని చతురోక్తులతో నటించినాడు. సూర్యుని కిరణాలతో కప్పబడి వెలవెలపోయిన ఇతరగ్రహాల మాదిరిగా ఆ బ్రహ్మచారి ముందు భృగువంశపు బ్రాహ్మణులు మరుగుపడిపోయినారు. వారు లేచి నిలబడి వామనుని క్షేమాన్ని అడిగి తియ్యని మాటలతో అతణ్ణి గౌరవించినారు. బలిచక్రవర్తి అతనికి మ్రొక్కి ఆసనంపై కూర్చోబెట్టనాడు. అతని అడుగులను తుడిచినాడు. తన ఇల్లాలు బంగారు కలశంతో నీళ్ళు పోయగా రాక్షస సార్వభౌముడు ఆ వడుగు అడుగులు కడిగి తడి తుడిచినాడు.

**ఆ. వటుని పాద శౌచవారి శిరంబునఁ, బరమ భద్ర మనుచు బలి వహించె**
**నే జలము గిరీశుఁ డిందుజూటుఁడు దేవ, దేవుఁ డుద్వహించె ధృతి శిరమున. 547**

**వ. మఱియు న య్యజమానుం డభ్యాగతున కిట్లనియె. 548**

* జటాజూటంలో చంద్రుని ధరించిన మహాదేవుడైన శివుడు ఎల్లప్పుడూ ఏ నీళ్ళను తలపై ధరిస్తాడో అటువంటి వామనుని కాళ్ళు కడిగిన నీళ్ళను బలి చక్రవర్తి మిక్కిలి మేలు కలిగించేవిగా తలంచి తలపై చల్లుకొన్నాడు. అటుపిమ్మట ఆ చక్రవర్తి వామనునితో ఇట్లా అన్నాడు.

**మ. వడుగా! యెవ్వరివాఁడ? వెవ్వఁడవు? సంవాసస్థలం బెయ్య? ది**
**య్యెడకున్ నీ వరుదెంచుటన్ సఫల మయ్యెన్ వంశమున్ జన్మమున్;**
**గడు ధన్యాత్ముఁ డనైతి, నీ మఖము యోగ్యంబయ్యె; నా కోరికల్**
**గడతేఱెన్! సుహుతంబులయ్యె శిఖులుం! గల్యాణ మిక్కాలమున్. 549**

* ఓ బ్రహ్మచారీ! నీ పేరేమిటి? ఎవరి పిల్లవాడవు? నీవు నివసించే చోటేది? ఇక్కడికి నీవు రావడంవల్ల నా వంశమూ నా జన్మమూ సఫలమైనాయి. నేను చాలా పుణ్యాత్ముడనైనాను. ఈ యజ్ఞం పవిత్రమైనది. నా కోరికలు నెరవేరినాయి. అగ్నులు బాగా వేల్పబడినాయి. ఈ కాలం చాలా శుభదాయకమైనది.

**మ. వరచేలంబులొ మాడలో ఫలములో వన్యంబులో గోవులో**
**హరులో రత్నములో రథంబులొ విమృష్టాన్నంబులో కన్యలో**
**కరులో కాంచనమో నికేతనములో గ్రామంబులో భూములో**
**ధరణీ ఖండమొ కాక యే మడిగెదో ధాత్రీసురేంద్రోత్తమా! 550**

**వ. అని ధర్మయుక్తంబుగాఁ బలికిన వైరోచని వచనంబులు విని సంతోషించి యీశ్వరుం డిట్లనియె. 551**

* ఓ బ్రాహ్మణోత్తమా! నీకేమి కావాలి? మేలైన వస్త్రాలా? రూకలా? పండ్లా? అడవి సంపదలా? ఆవులా? గుఱ్ఱాలా? రత్నాలా? రథాలా? మంచి ఆహారాలా? కన్యలా? ఏనుగులా? బంగారమా? భవనాలా? గ్రామాలా? పొలాలా? భూభాగమా? ఇవి కాకుండా ఇంకేమైనా కావాలా? ఈ విధంగా ధర్మప్రకారంగా బలి చక్రవర్తి పలికిన పలుకులకు సంతోషించి వామనుడు ఇట్లా అన్నాడు.

సీ. ఇది నాకు నెలవని యేరీతిఁ బలుకుదు? నొకచో టనక యెందు నుండ నేర్తు;
నెవ్వనివాఁడ నం చేమని పలుకుదు? నాయంతవాఁడనై నడవనేర్తు;
నీ నడవడి యని యెట్లు వక్కాణింతుఁ బూని ముప్పోకలఁ బోవ నేర్తు
నదినేర్తు నిదినేర్తు నని యేల చెప్పంగ? నేరువు లన్నియు నేన నేర్తు

ఆ. నొరులు గారు నాకు నొరులకు నే నౌదు, నొంటివాఁడఁ జుట్ట మొకఁడు లేఁడు
సిరియుఁ దొల్లి గలదు చెప్పెద నా టెంకి, సుజనులందుఁ దఱచుఁ జొచ్చియుందు. 552

* ఇది నాచోటు- అని ఎట్లా చెప్పేది? ఒక చోటనకుండా అన్నిచోట్లా ఉంటాను. ఎవరికి చెందిన వాడనని చెప్ప గలను? నేను నా అంతవాడనై స్వేచ్ఛగా నడుచుకొంటాను. నా నడవడి ఇది- అని చెప్పడమెట్లా? పూనికతో మూడు పోకడలూ పోగలను. అది నేర్చుకొన్నాను; ఇది నేర్చుకొన్నాను- అని చెప్పడమెందుకు? అన్ని విద్యలూ నేర్చుకొన్నాను. వేరే వారు ఎవ్వరూ నన్ను చేరదీయరు. నేనే వారిని చేరదీస్తాను. నేను ఒంటరివాణ్ణి, చుట్టాలు ఎవ్వరూ లేరు. ఆదిలో నాకు సిరి, ఉండేది. ఎక్కువగా నేను మంచివారితో కలిసి మసలుతుంటాను. అదే నానివాసం.

వ. అది యట్లుండ నిమ్ము. 553

సీ. జననాథ! నీ మాట సత్యంబు సత్కీర్తిదంబుఁ గులార్హంబు ధర్మయుతముఁ
గరుణానువర్తులు ఘనసత్త్వ మూర్తులు గాని మీ కులమందుఁ గలుగ రొరులు
రణభీరువులు వితరణభీరువులు లేరు ప్రత్యర్థు లర్థులు ప్రబ్బికొనిన
దానశౌండిమమునఁ దనుపుదు రధికులై మీ తాత లందఱు మేటిమగలు

ఆ. మీ కులంబునందు మెఱయుఁ ప్రహ్లాదుండు, మింటి చంద్రుమాడ్కి మేలి రుచులఁ
బ్రథిత కీర్తితోడ భవదీయవంశంబు, నీరరాశి భంగి నెగడు చుండు. 554

* అసురేంద్రా! ఆ సంగతి అట్లుండనీ, ఇప్పుడు నాతో నీవు అన్నమాట యథార్థం; మంచి కీర్తి నిచ్చేది; నీ వంశానికి తగింది; ధర్మంతో కూడింది. మీ కులంలో కనికరం గలవారు ఆత్మబలము కలవారూ తప్ప వేరేవారు పుట్టలేదు. యుద్ధం చెయ్యడానికీ, దానం ఇయ్యడానికీ మీ వంశంలో భయపడేవారు లేరు. దరిజేరిన ప్రత్యర్థులకు పరాక్రమంతోనూ, 'దేహి' అనే అర్థులకు దానంతోనూ తృప్తి కలిగిస్తారు. మీ తాత లందరూ మేటి వీరులు. మీ వంశంలో ప్రహ్లాదుడు ఆకాశంలో వెలిగే చంద్రునివలె మేలైన కాంతులతో ప్రకాశిస్తాడు. మీ వంశం సమృద్ధమైన కీర్తితో సముద్రం వలె పెంపారుతుంది.

వ. తొల్లి మీ మూఁడవ తాత హిరణ్యాక్షుండు విశ్వజయంబు సేసి గదాయుధుండై భూతలంబునఁ బ్రతి వీరులం గానక సంచరింప విష్ణుండు వరాహరూపంబున నతని సమయించెఁ దద్భ్రాతయగు హిరణ్యకశిపుం డది విని హరిపరాక్రమంబునకు నాశ్చర్యంబు నొంది తన జయంబును, బలంబునుం బరిహసించి గ్రద్దన నుద్దవిడి నద్దనుజ మర్దను మందిరంబునకుం జనియె; నప్పుడు- 555

* పూర్వం మీ మూడవ తాతయైన హిరణ్యాక్షుడు విశ్వాన్ని జయించి గదాదండాన్ని ధరించి భూలోకమంతటా తిరిగినాడు. ఎక్కడా పగవాడు కనిపించలేదు. చివరకు అతనిని విష్ణువు పంది రూపంలో పరిమార్చినాడు. ఆ సంగతిని హిరణ్యాక్షుని సోదరుడైన హిరణ్యకశిపుడు విన్నాడు. విష్ణువు పరాక్రమానికి ఆశ్చర్యపడినాడు. విష్ణువు విజయాన్నీ బలాన్నీ తూలనాడినాడు. వెంటనే విష్ణువు పట్టణమైన వైకుంఠంపైకి దండెత్తినాడు.

**క. శూలాయుధహస్తుండై, కాలాకృతి వచ్చు దనుజుఁ గని విష్ణుండుం**
**గాలజ్ఞత మాయాగుణ, శీలత నిట్లని తలంచెఁ జిత్తములోనన్. 556**

* అప్పుడు శూలాన్ని ధరించి ప్రళయకాల యమునివలె వస్తున్న హిరణ్యకశిపుణ్ణి చూచి సమయాసమయములు గుర్తించగల మాయల మారి కనుక విష్ణువు తన మనస్సులో ఇట్లా ఆలోచించినాడు.

**మ. ఎదురై పోర జయింప రాదితనిఁ; గా కెందేనియుం బోవ భీ**
**ప్రదుఁడై ప్రాణులఁ దోలు మృత్యువు క్రియం బై వచ్చు నంచుం గ్రియా**
**విదుఁ డబ్జాక్షుఁడు సూక్ష్మరూపమున నావేశించి నిశ్వాస రం**
**ధ్ర దిశన్ దైత్యు హృదంతరాళమునఁ బ్రత్యక్ష క్రియా భీరుఁడై. 557**

* ఈ హిరణ్యకశిపుణ్ణి యుద్ధంలో ఎదిరించి జయించడానికి వీలులేదు. అట్లు కాకుండా నేను ఎక్కడికైనా వెళ్ళిపోతే ఇక లోకంలోని ప్రాణులపైకి మృత్యువు మాదిరిగా దండెత్తి భయపెట్టి పారద్రోలుతాడు అనుకొని విష్ణువు ఉపాయాన్ని ఆలోచించినాడు; ఎదుటపడి ఏమీ చేసే ధైర్యం చాలక సూక్ష్మమైన రూపంతో ముక్కురంధ్రంగుండా హిరణ్యకశిపుని గుండెలో ప్రవేశించినాడు.

**వ. అంత నద్దైత్యవల్లభుండు వైష్ణవాలయంబు సొచ్చి వెదకి హరిం గానక కోపంబు మానక మిన్ను మన్ను నన్వేషించి, త్రిదివంబున నరసి, దిశలం బరికించి, భూ వివరంబులు వీక్షించి, సముద్రంబులు వెదకి, పురంబులు శోధించి, వనంబులు విమర్శించి, జగంబున నదృష్టశత్రుండై మార్గణంబు సాలించి, తనలో నిట్లనియె. 558**

* అటు పిమ్మట హిరణ్యకశిపుడు మందిరంలో దూరి విష్ణుమూర్తి కోసం వెదకినాడు. కానీ, పగవాడు అగుపించలేదు. కోపంతో ఆ రాక్షసుడు విష్ణువుకోసం ఆకాశాన్నీ, భూ లోకాన్నీ, స్వర్గ లోకాన్నీ గాలించినాడు. దిక్కులనూ, భూ గర్భాలనూ, సముద్రాలనూ, పట్టణాలనూ అడవులనూ వెదకినాడు. లోకంలో ఎక్కడా విష్ణువుజాడ చిక్కలేదు. కడకు వెదకడాన్ని చాలించి తనలో ఇట్లా అనుకొన్నాడు.

**క. 'పగవాఁడు మడియనోపును, దెగఁ డేనియు నెదురువడఁడె? దేహధరులకుం**
**దెగినయెడఁ బగఱ మీఁదను, బగ గొనఁ దగ' దనుచు నుడిగెఁ బ్రాభవశక్తిన్. 559**

వ. అతండు మీ ప్రపితామహుం; డతనిగుణంబు లనేకంబులు గల; వవి యట్లుండనిమ్ము. 560

* "నా పగవాడు మరణించి ఉండవచ్చు. మరణించకుండా ఉంటే నన్ను ఎదుర్కొనేవాడే. మరణించిన పగవారిపై పగబూనడం తగదు" - ఈ విధంగా అనుకొని దండయాత్ర ఆపివేసినాడు. అటువంటి మీ ముత్తాతయైన హిరణ్యకశిపుడు సుగుణాలరాశి. అది అట్లుండనీ.

క. ఆతుర భూసురగతిఁ బురు, హూతాదులు దన్ను వేఁడ నొగిఁ గొం డనుచున్
మీ తండ్రి యిచ్చె నాయువు, నేతన్మాత్రుఁడవె నీవు నీలోకమునన్? 561

* ఇక మీ తండ్రి మాత్రం సామాన్యుడా! ఇంద్రాదులు బ్రాహ్మణులవలె బాధ నటించుతూ అడుగుకొన 'సరే తీసుకొండి' అంటూ మీ తండ్రి వారికి తన ఆయుస్సును దానమిచ్చినాడు. నీవుకూడా వారికి ఏ మాత్రమూ తీసిపోవు.

క. ఏలితివి మూఁడు జగములుఁ, దోలితి వింద్రాది సురలఁ, దొల్లిటివారిం
బోలితివి దానగుణముల, చాలితి వీ రాక్షసులను సంరక్షింపన్. 562

* నీవు ముల్లోకాలనూ పాలించినావు. ఇంద్రాది దేవతలను ఓడించి నావు. దాన మివ్వండలోనూ సుగుణాలలోనూ మీ పూర్వపు పెద్దలకు సమానుడైనావు. రాక్షసులను రక్షించడంలో సమర్థుడవైనావు.

వ. అదియునుం గాక. 563

క. రాజ్యంబు గలిగె నేనియుఁ, బూజ్యులకును యాచకులకు భూమిసురులకున్
భాజ్యముగ బ్రదుకఁ డేనియుఁ, ద్యాజ్యంబులు వానిజన్మ ధన గేహంబుల్. 564

* మహారాజా! ఇంకొక్క సంగతి. రాజ్యాధికారం కలిగినపుడు గౌరవింపదగిన వారికీ, తిరిపెమెత్తే వారికీ, బ్రాహ్మణులకూ ధనాన్ని పంచిపెట్టి బ్రతకాలి. అట్లా చేయని వాని బ్రతుకూ, ధనమూ, మేడలూ, నిరర్థకాలు. అవి పరిత్యజింప తగినవి.

క. మున్నెన్నుదురు వదాన్యుల, నెన్నెడుచో నిన్నుఁ ద్రిభువనేశుం డనుచున్;
ఇన్ని దినంబుల నుండియు, నెన్నఁడు నినుఁ బెట్టు మనుచు నీంద్రము సేయన్. 565

* దాతలను లెక్కించేటప్పుడు ముల్లోకాలలోనూ గొప్పవాడుగా మొట్టమొదట నిన్నే ఎన్నిక చేస్తారు. ఇంతవాడవైనా ఇంతవరకూ నిన్ను ఇమ్మంటూ ఏనాడూ నేను పీడించలేదు.

ఆ. ఒంటివాఁడ నాకు నొకటి రెండడుగులు, మేర యిమ్ము సొమ్ము మేర యొల్లఁ;
గోర్కిదీర బ్రహ్మకూఁకటి ముట్టెద, దానకుతుక సాంద్ర! దానవేంద్ర! 566

వ. అనినఁ బరమయాచకునకుఁ బ్రదాత యిట్లనియె. 567

* రాక్షసరాజా! నీవు నాకు ఏవేవో ఇవ్వాలని కుతూహలపడుతున్నావు. నేను ఒంటరివాణ్ణి. నాకు సొమ్ములూ, భూములూ అక్కరలేదు. మూడడుగుల నేల మాత్రమివ్వు. దానితో తృప్తిపడి బ్రహ్మానందం పొందుతాను- ఈ విధంగా అడిగిన వామనునితో బలిచక్రవర్తి ఇట్లా అన్నాడు:-

ఆ. 'ఉన్నమాటలెల్ల నొప్పును విప్రుండ!, సత్యగతులు వృద్ధసమ్మతంబు;
లడుగఁ దలఁచి కొంచె మడిగితివో చెల్ల!, దాత పెంపుఁ సొంపుఁ దలఁపవలదె?' 568

వ. అని మఱియు నిట్లనియె. 569

* ఓ బ్రాహ్మణుడా! నీవు అన్నమాటలన్నీ ఉన్నమాటలే! వాటిని ఒప్పుకోవలసిందే. ముమ్మాటికీ సత్యములే! అందుకు పెద్దలు కూడా కాదనరు. కానీ పాపం! అడిగి అడిగీ కొంచెమే అడిగినావు. చాలా బాగుంది! కానీ అడిగేటప్పుడు దాత గొప్పతనాన్నీ అతని సంతోషాన్నీ తలంచవద్దా!- అని పలికి బలి చక్రవర్తి మరల ఇట్లా అన్నాడు.

మ. వసుధాఖండము వేఁడితో? గజములన్ వాంఛించితో? వాజులన్
వెస నూహించితొ? కోరితో యువతులన్ వీక్షించి కాంక్షించితో?
పసిబాలుండవు; నేర వీ వడుగ; నీభాగ్యంబు లీపాటిగా
కసురేంద్రుండు పదత్రయం బడుగ నీ యల్పంబు నీనేర్చునే? 570

వ. అన మొగంబునం జిఱునగవు మొలకలొత్త గృహమేధికి మేధావి యిట్లనియె. 571

* భూభాగాన్ని కోరినావా? ఏనుగులను కోరినావా? గుఱ్ఱాలను కోరినావా? పెండ్లికాని జవరాండ్రను కోరినావా? నీవు పసిపిల్లవాడవు. నీకు అడగడం తెలియదు. అందువల్ల మూడడుగులే అడిగినావు. నీ అదృష్టం అల్పమైనది కావచ్చు. ఇంతటి రాక్షస చక్రవర్తి ఇంత అల్పమైన దానిని ఎట్లా ఇస్తాడు?- ఈ విధంగా పలికిన బలిచక్రవర్తితో చిరునవ్వు చిందే మొగంతో వామనుడు ఇట్లా అన్నాడు.

మ. 'గొడుగో, జన్నిదమో,కమండలువొ, నాకున్ ముంజియో, దండమో,
వడు గేనెక్కడ? భూము లెక్కడ? కరుల్, వామాక్షు, లశ్వంబు లె
క్కడ? నిత్యోచితకర్మ మెక్కడ? మదాకాంక్షామితంబైవ మూఁ
డడుగుల్ మేరయ త్రోవ కిచ్చుటది బ్రహ్మాండంబు నా పాలికిన్. 572

* అయ్యా! నేను బ్రహ్మచారిని. నాకు గొడుగూ జందెమూ కమండలమూ మొలత్రాడూ యోగదండమూ అవసరం. అంతేకాని భూములతో, ఏనుగులతో, గుఱ్ఱాలతో, స్త్రీలతో నాకు పనిలేదు. వాటికీ నానిత్యకృత్యాలకూ సంబంధం లేదు. కాదని త్రోసివేయకుండా నా కోరికకు తగినట్లు ఆ మూడడుగుల చోటిస్తే అదే నా పాలికి బ్రహ్మాండం.

వ. అదియునుం గాన. 573

క. వ్యాప్తిం బొందక వగవక, ప్రాప్తంబగు లేశమైనఁ బదివే లనుచుం
దృప్తిం జెందని మనుజుఁడు, సప్తద్వీపముల నయినఁ జక్కంబడునే? 574

* అంతేకాక అబ్బింది కొంచెమైనాసరే, ఉబ్బితబ్బిబ్బు కాకుండా అదే పదివేలుగా భావించి తృప్తి పొందాలి. అట్లా తృప్తిపడని వానికి సప్తద్వీపాల సంపదలు వచ్చిపడినా కూడా తృప్తి తీరదు.

శా. ఆశాపాశము దాఁ గడున్ నిడుపు; లే దంతంబు రాజేంద్ర! వా
రాశిప్రావృత మేదినీవలయ సామ్రాజ్యంబు సేకూడియుం
గాసిం బొందిరి గాక వైన్య గయ భూకాంతాదులు; న్నర్థ కా
మాశం బాయఁగ నేర్చిరే మును నిజాశాంతంబులం జూచిరే. 575

* రాక్షస రాజేంద్ర! ఆశ మిక్కిలి పొడవైన త్రాడువంటిది. దానికి అంతు లేదు. పూర్వకాలంలో పృథు చక్రవర్తి, గయుడూ మొదలైన రాజులు సముద్రాల దాకా వ్యాపించిన సామ్రాజ్యాన్ని సంపాదించి పాలించినారు. వారు సైతం వృథాగా కష్టపడినవారే కాని అర్థంపైనా, కామంపైన ఆశలు వదలలేదు. వారి ఆశలు నెరవేరనూ లేదు.

సీ. సంతుష్టుఁ డీమూఁడు జగములఁ బూజ్యుండు సంతోషి కెప్పుడు జరుగు సుఖము
సంతోషి గాకుంట సంసార హేతువు సంతసంబున ముక్తి సతియు దొరకుఁ
బూఁట పూఁటకు జగంబుల యదృచ్ఛాలాభ తుష్టిని దేజంబు దోన పెరుఁగుఁ
బరితోష హీనతఁ బ్రభసెడి పోవును జలధార ననలంబు సమయునట్లు

ఆ. నీవు రాజ వనుచు నిఖిలంబు నడుగుట, దగవు కాదు నాకుఁ; దగిన కొలఁది
యేను వేఁడి కొనిన యీ పదత్రయమును, జాల దనక యిమ్ము; చాలుఁ జాలు! 576

* సంతోషపడేవాడు ముల్లోకాలలోనూ గౌరవింపబడతాడు. సంతోషం కలవానికి ఎల్లప్పుడూ సుఖం కలుగుతుంది. సంతోషం లేకపోవడమే తిరిగీ పుట్టడానికి కారణం. సంతోషం వల్ల మోక్షం సమకూరుతుంది. పూటపూటకు తనంత తానుగా దొరికిన దానితో సంతోషపడితే తేజస్సు పెరుగుతుంది. నీళ్ళవల్ల నిప్పు చల్లారిన విధంగా సంతోషం లేకపోతే తేజస్సు తగ్గిపోతుంది. నీవు రాజవుకదా అని అవీ ఇవీ అన్నీ ఇమ్మని అడగడం న్యాయం కాదు. నాకు తగినట్టుగా నేను అడిగిన ఈ మూడడుగులూ కాదనకుండా ఇవ్వు. అదే చాలు, అంతేచాలు.

వ. అని యిట్లు పలుకుచున్న ఖర్వునకు నుర్వీదానంబు సేయం దలంచి కరకలిత సలిల కలశుండైన యవ్వితరణముఖరునిం గని నిజవిచారయుక్తదనుజ రాజ్య చక్రుండగు శుక్రుం డిట్లనియె. 577

* పై విధంగా పలికిన వామనునికి మూడడుగల భూ దానం చేయడానికై బలిచక్రవర్తి జలకలశం చేతికి తీసుకొన్నాడు. అంతలో రాక్షసరాజ్య నిర్మాణధుర్యుడైన శుక్రాచార్యుడు దానశీలుడైన దానవ చక్రవర్తితో ఇట్లా అన్నాడు:-

సీ. 'దనుజేంద్ర! యీతఁడు ధరణీసురుఁడు గాఁడు దేవకార్యంబు సాధించుకొఱకు
హరి విష్ణుఁ డవ్యయుం డదితి గర్భంబునఁ గశ్యపసూనుఁడై కలిగె; నకట!

యెఱుఁగ కీతని కోర్కి నిచ్చెద నంటివి దైత్య సంతతి కుపద్రవము వచ్చు
నీ లక్ష్మిఁ దేజంబు నెలవు నైశ్వర్యంబు వంచించి యిచ్చుఁ దా వాసవునకు;

ఆ. మొనసి జగములెల్ల మూఁడు పాదంబుల, నఖిలకాయుఁ డగుచు నాక్రమించు
సర్వ ధనము విష్ణు సంసర్జనము సేసి, బడుగు పగిది నెట్లు బ్రదికె దీవు? 578

* దానవేశ్వరా! ఇతడు బ్రాహ్మణుడు కాదు; పరమాత్ముడైన విష్ణువు. దేవతల కార్యాన్ని సాధించడంకోసం కశ్యపుని కొడుకుగా అదితి గర్భంలో పుట్టినవాడు. అయ్యో! తెలియకుండా ఇతనికి దాన మిస్తావని ఒప్పుకొన్నావు. దీనివల్ల రాక్షసులకు కష్టం వస్తుంది. ఇతడు నిన్ను మోసగించి నీ సంపదనూ, తేజస్సునూ రాజ్యాన్నీ ఇంద్రుని కిస్తాడు. విశ్వరూపం ధరించి మూడడుగులతో అన్ని లోకాలనూ ఆక్రమిస్తాడు. నీ ఐశ్వర్యమంతా విష్ణువుకు ధారపోసి నీవు నిరుపేదగా ఎట్లా బ్రతుకుతావు?

క. ఒక్కపదంబున భూమియు, నొక్కటఁ ద్రిదివంబుఁ ద్రొక్కి యున్నతమూర్తిన్
దిక్కులు గగనముఁ దానై, వెక్కసమై యున్న నెందు వెడలెదు చెపుమా! 579

* ఇతడు ఒక పాదంతో భూలోకాన్నీ, ఇంకొక పాదంతో స్వర్గలోకాన్నీ కప్పివేస్తాడు. గొప్ప ఆకారంతో దిక్కులూ, ఆకాశమూ పిక్కటిల్లేటట్లు పెరుగుతాడు. అప్పుడు నీ వెక్కడికి పోతావు చెప్పు!

సీ. ఇచ్చెద నని పల్కి యీకున్న నరకంబుఁ ద్రోవ నీవును సమర్థుఁడవు గావ;
యే దానమున నాశ మేతెంచు నదియును దానంబు గా దండ్రు తత్త్వవిదులు;
దానంబు యజ్ఞంబుఁ దపముఁ గర్మంబును దా విత్తవంతుఁడై తలఁపవలయుఁ;
దనయింటఁ గల సర్వధనమును నైదు భాగములుగా విభజించి కామమునకు

ఆ. నర్థమునకు ధర్మయశముల కాశ్రిత, బృందములకు సమతఁ బెట్టునట్టి
పురుషుఁడిందు నందుఁ బూర్ణుఁడై మోదించు, దన్నుమాని చేఁత దగవు గాదు. 580

వ. అదియునుం గాక యీ యర్థంబునందు బహుభంగి బహ్వృచ గీతార్థంబు గల దొక్కటి సావధానుండవై యాకర్ణింపుము. 581

* ఇస్తానని చెప్పి ఇవ్వకపోతే వచ్చే నరకాన్ని త్రోసిపుచ్చడానికి నీకు శక్తి ఉంది. దాతకు నాశనం కలిగించే దానం దానమే కాదని పెద్దలు చెప్తుతారు. తాను ధనవంతుడుగా ఉంటూ దానాన్నీ, యజ్ఞాన్నీ, తపస్సునూ గురించీ ఆలోచించాలి. ఉత్తముడైన పురుషుడు తన ధనమంతా ఐదుభాగాలు చేసి కామానికీ, అర్థానికీ, ధర్మానికీ, కీర్తికీ, ఆశ్రయించినవారికీ సమానంగా పంచాలి. ఆ విధంగా చేసేవాడు ఈ లోకంలోనూ ఆ లోకంలోనూ నిండుగా సుఖపడతాడు. తనకు మించిన ధర్మం న్యాయం కాదు. అంతేకాక ఈ విషయంలో పెక్కువిధాలుగా ప్రసిద్ధమైన ఒక ఋగ్వేదసూక్తి ఉన్నది. దాన్ని చెప్పుతాను, శ్రద్ధగా విను.

సీ. అంగీకరించిన నఖిలంబుఁ బోవుచో నన్ృతంబు గాదు లే దనిన నధిప!
యాత్మ వృక్షము మూల మనృతంబు నిశ్చయ మనృత మూలము గల్గ నాత్మ సెడదు;

పుష్పఫలము లాత్మభూజంబునకు సత్య మా మ్రాను బ్రదుకమి నవియుఁ జెడును
ఫలపుష్పములు లేక పసపెడి వృక్షంబు మూలంబుతో వృద్ధిఁ బొందుఁ గాదె?

తే. చేటుఁ గొఱఁతయు లఘిమయుఁ జెందకుండ, నిచ్చు పురుషుండు సెడకుండు నిద్ధచరిత!
కాక యంచిత సత్య సంగతి నటంచు, నిజధనం బర్థి కిచ్చిన నీకు లేదు. 582

* సచ్చరిత్రా! దేనిని ఇవ్వడంవల్ల సర్వమూ నష్టమవుతుందో ఆ దాన మివ్వరాదు- ఇస్తానని మాట ఇచ్చినా సరే దానివల్ల అసత్యదోష మంటదు. ఎందుకంటే అత్మ అనే చెట్టుకు అసత్యమే మూలం. అటువంటి ఆత్మవృక్షానికి సత్యం, పూలు పండ్లుగా ఉంటాయి. అసత్యమనే మూలం బాగుంటే ఆత్మ అనే వృక్షం చెడదు. మొదలు చెడితే చెట్టూ చెడుతుంది; పూలూపండ్లూ చెడుతాయి. పండ్లూ, పూలు లేక పోయినా మొదలు బాగా ఉంటే వృక్షం వృద్ధిపొందుతుంది. కాబట్టి మొదటికి చేటువాటిల్లకుండా, లోటురాకుండా, పదుగురలో పలుచన కాకుండా దానం చేసే దాత చెడడు. అందువల్ల సత్యంకోసం నీవు ఇతనికి దానమిస్తే నీకు మిగిలేది ఇక ఏమీ ఉండదు.

ఆ. సర్వమయినచోట సర్వధనంబులు, నడుగ 'లే' దటంచు నన్నతమాడు
చెనఁటి పంద నేమి సెప్పఁ బ్రాణము తోడి, శవము వాఁడు! వాని జన్మమేల? 583

వ. మఱియు నిం దొక్క విశేషంబు గలదు; వివరించెద. 584

* రాజా! అన్ని విషయములందును ఇది వర్తింపదు. ఏ ధనాన్ని అడిగినా ఆ వస్తువు ఉన్నప్పటికీ లేదని అబద్ధం చెప్పరాదు. ఆ విధంగా చెప్పేవాడు నీచుడు; పిరికివాడు. వాడు ప్రాణమున్న పీనుగ. వాని బ్రతుకు వ్యర్థము. దీనిలో ఇంకొక విశేషముంది. వివరిస్తాను.

ఆ. వారిజాక్షులందు వైవాహికము లందుఁ, బ్రాణవిత్తమానభంగమందుఁ
జకిత గోకులాగ్ర జన్మరక్షణ మందు, బొంకవచ్చు నఘము వొందఁ డధిప! 585

* అసురేంద్రా! ఆడవారి విషయంలోనూ, పెండ్లిండ్లలోనూ; ప్రాణానికీ, ధనానికీ, గౌరవానికీ భంగం కలిగేటప్పుడూ; భయపడిన గోవులనూ బ్రాహ్మణులనూ ఆదుకొనేటప్పుడూ అబద్ధం చెప్పవచ్చు. దానివల్ల పాపం రాదు.

మ. కులమున్ రాజ్యముఁ దేజమున్ నిలుపు మీ కుబ్జుండు విశ్వంభరుం
డలఁతిం బోఁడు; త్రివిక్రమస్ఫురణ వాఁడై నిండు బ్రహ్మాండముం
గలఁడే మాన్ప నొకండు? నా పలుకు లాకర్ణింపు కర్ణంబులన్;
వల దీ దానము గీనముం; బనుపుమా వర్ణిన్ వదాన్యోత్తమా! 586

వ. అని యిట్లు హితంబు పలుకుచున్న కులాచార్యునకు క్షణమాత్ర నిమీలిత లోచనుండయి యశస్వి యిట్లనియె. 587

* వదాన్య శిరోమణీ! నీ కులాన్నీ, రాజ్యాన్నీ, పరాక్రమాన్నీ నిలుపుకో. ఈ పొట్టివాడు విష్ణువు. ఇతడు తేలికగా పోడు. మూడు లోకాలనూ మూడడుగులుగా కొలిచే త్రివిక్రమ రూపాన్ని పొందుతాడు. బ్రహ్మాండమంతా నిండుతాడు. ఇతనిని ఎవరూ అడ్డగించలేరు. నా మాటలు ఆలకించు. దానం వద్దు గీనం వద్దు. ఈ బ్రహ్మచారిని పంపించు- ఈ విధంగా శుక్రాచార్యుడు మేలుకోరి చెప్పగా క్షణకాలం కన్నులుమూసి ఆలోచించి బలిచక్రవర్తి ఇట్లా అన్నాడు.

**సీ. నిజ మాన తిచ్చితి నీవు మహాత్మక! మహిని గృహస్థ ధర్మంబు నిదియ**
**యర్థంబుఁ గామంబు యశమును వృత్తియు నెయ్యది ప్రార్థింప నిత్తు ననియు**
**నర్థ లోభంబున నర్థిఁ బొమ్మను టెట్లు? పలికి లే దనుకంటెఁ బాప మెద్ది?**
**'యెట్టి దుష్కర్ముని నే భరించెదఁ గాని సత్యహీనుని మోవఁజాల' ననుచుఁ**

**తే. బలుకదే తొల్లి భూదేవి బ్రహ్మతోడ, సమరమున నుండి తిరుగకఁ చచ్చుకంటెఁ**
**బలికి బొంకక నిజమునఁ బరఁగుకంటె, మానధనులకు భద్రంబు మఱియుఁ గలదె! 588**

* ఓ మహాత్మా! నీవు చెప్పింది నిజమే. లోకంలో ఇదే గృహస్థుల ధర్మంకూడా. అర్థమూ, కామమూ, కీర్తి, జీవనో పాయము- వీటిలో ఏది అడిగినా ఇస్తానని చెప్పినాను. ధనంపై దురాశతో, అడిగిన వానికి లేదని చెప్పి త్రిప్పి పంపించలేను. ఇచ్చిన మాట తప్పటంకంటే పాపం లేదు. పూర్వం భూదేవి "ఎటువంటి చెడ్డపనిచేసిన వానినైనా మోస్తాను. కాని ఆడిన మాట తప్పిన వానిని మాత్రం మోయలేను'' అని బ్రహ్మతో చెప్పిందికదా! యుద్ధంలో వెనుదిరగకుండా వీరమరణం పొందటమూ, మాటకు కట్టుబడి సత్యంతో బ్రతకడమూ మానధనులైన వారికి మేలైన మార్గాలు.

**క. ధాత్రిని హలికునకును సు, క్షేత్రము బీజములు నొకటఁ జేకుఱు భంగిం**
**జిత్రముగ దాత కీవియుఁ, బాత్రము సమకూరునట్టి భాగ్యము గలదే? 589**

* రైతుకు మంచి పొలమూ, మంచి విత్తనాలూ ఒకచోట దొరకడం అరుదు. అదే విధంగా దాతకు తగిన ధనమూ దానిని తీసుకొనే ఉత్తముడూ దొరికే అదృష్టం అపురూపం కదా!

**శా. కారే రాజులు? రాజ్యముల్ గలుగవే? గర్వోన్నతిం బొందరే?**
**వారేరీ సిరి మూట గట్టుకొని పోవం జాలిరే? భూమి పైఁ**
**బేరైనం గలదే? శిబిప్రముఖులుం బ్రీతిన్ యశఃకాములై**
**యీరే కోర్కులు? వారలన్ మఱచిరే యిక్కాలమున్ భార్గవా! 590**

* ఆచార్యా! పూర్వం రాజులు ఉన్నారు. వారికి రాజ్యాలు ఉన్నాయి. వారు ఎంతో అహంకారంతో ఎంతో విర్రవీగారు. కాని వారెవరూ ఈ సంపదను మూటకట్టుకొని పోలేదు. ప్రపంచంలో వారిపేరు కూడా మిగులలేదు. శిబి చక్రవర్తి వంటి వారు కీర్తికోసం సంతోషంగా అడిగినవారి కోరికలు తీర్చలేదా? వారిని ఈ నాటికి లోకం మరువలేదుకదా!

క. ఉడుగని క్రతువుల వ్రతములఁ, బొడగనఁ జననట్టి పొడవు పొడవునఁ గుఱుచై
యడిగెడినఁట; ననుబోఁటికి, నిడరాదె మహానుభావ! యిష్టార్థంబుల్. 591

* మహాత్మా! ఎడతెగని యజ్ఞాలు చేసినా పుణ్యకార్యాలు కావించినా విష్ణువును చూడటానికి వీలుపడదు. అటువంటి గొప్పవాడు పొట్టి వాడై అడుగుతున్నాడు. అతడు కోరిన దానిని ఇవ్వడంకంటె నా వంటి వానికి ఇంకేం కావాలి?

శా. ఆదిన్ శ్రీసతి కొప్పుపైఁ, దనువుపై, నంసోత్తరీయంబుపైఁ
బాదాబ్జంబులపైఁ గపోల తటిపైఁ బాలిండ్లపై నూత్న మ
ర్యాదం జెందు కరంబు గ్రిం దగుట మీఁదై నా కరంబుంట మేల్
గాదే? రాజ్యము గీజ్యమున్ సతతమే? కాయంబు నాపాయమే? 592

* ఇతడు చెయ్యిచాచి అడుగుతున్నాడు. ఈ చెయ్యి ఎంత గొప్పది? మొదట లక్ష్మీదేవి కొప్పుపైన, శరీరంపైనా, పైటపైనా, పాదపద్మాలపైనా, చెక్కిళ్ళపైనా, పాలిండ్లపైనా సరికొత్త గౌరవాన్ని పొందేది. అటువంటి గొప్ప చెయ్యి ఇప్పుడు క్రిందిది కావడమూ, నా చెయ్యి పైది కావడమూ ఎంత అదృష్టం! ఎంత మేలు! ఈ రాజ్యం ఏ పాటిది? ఇది శాశ్వతంగా ఉండేది కాదు. ఈ శరీరంకూడా పడిపోకుండా నిలిచేది కాదు.

మ. నిరయంబైన, నిబద్ధమైన, ధరణీ నిర్మూలనంబైన, దు
ర్మరణంబైనఁ గులాంతమైన నిజమున్ రానిమ్ము; కానిమ్ము పో;
హరుఁడైనన్, హరియైన,నీరజభవుం డభ్యాగతుండైన నాఁ;
దిరుగన్ నేరదు నాదు జిహ్వ; వినుమా! ధీవర్య! వేయేటికిన్? 593

* ఓ సుధీమణీ! నాకు నరకం దాపురించినా సరే! బంధనం ప్రాప్తమైనా సరే! భూమండలం అదృశ్యమైనా సరే! నాకు దుర్మరణం వచ్చినా సరే! నా కులానికి చేటు వాటిల్లినాసరే! నేను ఆడినమాట తప్పను. జరగవలసింది జరగనీ! భయం లేదు. అభ్యాగతుడు శివుడైనా విష్ణువైనా బ్రహ్మదేవుడైనా, ఎవరైనా సరే! ఏమైనా సరే! ఎందుకు పలుమాటలు? నా నాలుకకు మారుమాట రాదు.

ఆ. నొడివినంత పట్టు నుసలక యిచ్చుచో, నేల కట్టు విష్ణుఁ డేటి మాట?
గట్టెనేనిఁ దాన కరుణించి విడుచును, విడువకుండ నిమ్ము విమల చరిత! 594

* సచ్చరిత్రా! అన్నమాట ప్రకారం ఆలస్యం చేయకుండా దానమిస్తే విష్ణువు ఎందుకు బంధిస్తాడు? ఒకవేళ బంధించినా అతడే దయతో విడిచి పెట్టుతాడు. విడిచి పెట్టకపోయినా సరే ఏమీ ఇబ్బందిలేదు.

క. మేరువు దలక్రిందైనను, బారావారంబు లింకఁ బాటిన లోలో
ధారుణి రజమై పోయినఁ, దారాధ్వము బద్ధమైనఁ దప్పక యిత్తున్. 595

* మేరుపర్వతం తలక్రిందులైనా, సముద్రాలు ఇంకిపోయినా, భూమండలం లోలోపల పొడియై పోయినా, మిన్ను విరిగి మీదపడినా సరే, తప్పకుండా ఈ దానాన్ని ఇచ్చితీరుతాను.

**మత్తకోకిలము.**

**ఎన్నఁడుం బరు వేడఁ బోఁడఁట! యేకలుం డఁట! కన్న వా**
**రన్నదమ్ములు నైన లేరఁట; యన్నివిద్యల మూల గో**
**ష్ఠి న్నెఱింగిన ప్రోడ గుజ్జఁట; చేతు లొగ్గి వసింప నీ**
**చిన్ని పాపనిఁ ద్రోసి పుచ్చఁగఁ జిత్త మొల్లదు సత్తమా!** 596

* మహానుభావా! ఈ పొట్టివాడు ఎన్నడూ ఇతరులను అడుగుట లేదట. తోడు లేనివాడట. తల్లిదండ్రులూ అన్నదమ్ములూ లేరట. అన్ని విద్యల మూలమూ తెలుసుకొన్న నేర్పరియట. ఈ విధంగా నా ముందు చేతులు చాచిన ఈ పసివానిని గెంటివేయడానికి నాకు మనసొప్పటం లేదు.

వ. **అని యిట్లు సత్య పదవీ ప్రమాణ తత్పరుండును, వితరణ కుతూహల సత్వరుండును, విమల యశస్కుండును, దృఢమనస్కుండును, నియతసత్య సంధుండును, నర్థిజన బంధుండును నైన బలిం జూచి శుక్రుండు గోపించి మదీయ శాసనం బతిక్రమించితివి గావున శీఘ్రకాలంబునఁ బదభ్రష్టుండవు గమ్మని శాపం బిచ్చె; బలియును గురుశాప తప్తుండయ్యు నన్ృతమార్గంబున కభిముఖుండు గాకుండె; నప్పుడు.** 597

* పై విధంగా పలికిన బలిచక్రవర్తి సత్యమార్గం నుండి చలించలేదు. ఆ మార్గం నుండి అతనిని మార్చడానికి వీలుకాదు. అతని మనస్సు చాలా గట్టిది. అతనికీర్తి నిర్మలమైనది. అతడు దానమడిగే వారికి దగ్గర బంధువు. అతడు వామనునికి దానమిచ్చే కుతూహలంతో తహతహ లాడడం చూచి అతనిపై శుక్రాచార్యుడు కోపగించుకున్నాడు. "నా ఆజ్ఞ మీరినావు. కాబట్టి త్వరలో పదభ్రష్టుడవై పోతావు" అని శాప మిచ్చినాడు. గురువుగారి శాపానికి గురియైకూడా బలిచక్రవర్తి బాధపడలేదు. అతడు అసత్యమార్గాన్ని అవలంబించ లేదు.

ఆ. **బ్రదుక వచ్చుఁగాక బహుబంధనములైన, వచ్చుఁగాక లేమి వచ్చుఁగాక**
**జీవధనములైనఁ జెడుఁగాక పడుఁగాక, మాటఁ దిరుగలేరు మానధనులు.** 598

* బాగా బ్రతికినా, పెక్కుకష్టాలకు గురియైనా, పేదరికం వచ్చినా, ప్రాణానికి ధనానికీ చేటువచ్చినా కడకు చావు సంభవించినా సరే మానధనులు మాటతప్పలేరు.

వ. **అ య్యవసరంబున.** 599

ఆ. **దనుజలోకనాథు దయిత వింధ్యావళి, రాజవదన మదమరాళ గమన**
**వటుని కాళ్లు గడుగ వరహేమ ఘటమున, జలముఁ దెచ్చె భర్త సన్న యెఱిఁగి.** 600

వ. **అ య్యవసరంబునఁ గపటవటునకు నద్దానవేంద్రుం డిట్లనియె.** 601

* బలిచక్రవర్తి ఇల్లాలు వింధ్యావళి. ఆమె మొగం చందమామ వంటిది. ఆమె నడకలు రాజహంస నడకలు. ఆ సందర్భంలో ఆమె భర్త సైగ గమనించింది. బ్రహ్మచారికాళ్లు కడగటానికి బంగారు కలశంతో నీళ్ళు తెచ్చింది. అప్పుడు వామనునితో బలిచక్రవర్తి ఇట్లా అన్నాడు.

క. రమ్మా! మాణవకోత్తమ!, లెమ్మా! నీ వాంఛితంబులే దన కిత్తుం
దెమ్మా యడుగుల నిటు రా, నిమ్మా కడుగంగవలయు నేఁటికిఁ దడయన్? 602

* ఓ బ్రహ్మచారీ! లేవయ్యా! ఇటు రావయ్యా! నీవు అడిగింది ఇస్తాను. నీ పాదాలు కడుగ నివ్వు. ఇంకా ఆలస్యం దేనికి?

వ. అనిన విని. 603

మ. బలి దైత్యేంద్ర కరద్వయీ కృతజల ప్రక్షాళన వ్యాప్తికిన్
జలజాతాక్షుఁడు సాఁచె యోగి సుమనస్సంప్రార్థితశ్రీదముం
గలితానమ్ర రమాలలాట పదవీ కస్తూరికా శాదమున్
నళినామోదము రత్ననూపురిత నానావేదముం బాదమున్. 604

*ఆ పిలుపును విని బలిచక్రవర్తి తన రెండుచేతులతోనూ కడగడానికి అనుకూలంగా వామనుడు తన కుడిపాదాన్ని చాచినాడు. ఆ పాదం యోగులూ, దేవతలూ కోరుకొనే సంపదలు సమకూర్చేది. భక్తితో వంగిన లక్ష్మీదేవి నొసటి మీది కస్తూరీ పంకంతో కూడింది. పద్మాల పరిమళం గుబాళించేది. ఆ పాదం వేదాల రాశిని అందెగా అందగించు కొన్నది.

క. సురలోక సముద్ధరణము, నిరత శ్రీకరుణ మఖిల నిగమాంతాలం
కరణము భవసంహరణము, హరిచరణము నీటఁ గడిగె నసురోత్తముఁడున్. 605

వ. ఇట్లు ధరణీసుర దక్షిణ చరణ ప్రక్షాళనంబు సేసి వామపాదంబు గడిగి తత్పావన జలంబు శిరంబునం జల్లుకొని వార్చి దేశ కాలాది పరిగణనంబు సేసి. 606

* వామనుడైన విష్ణువు కుడిపాదాన్ని బలిచక్రవర్తి కడిగినాడు. ఆ పాదం దేవతలను కష్టాలనుండి కాపాడేది. కలకాలమూ మేలు కలిగించేది. అన్ని ఉపనిషత్తులకూ అలంకారమైనది. భవబంధాలను పోకార్చి మోక్షాన్ని సమకూర్చేది. అదే విధంగా ఆ చక్రవర్తి వామనుని ఎడమ పాదాన్ని కూడా కడిగినాడు. పవిత్రమైన ఆ జలాలను నెత్తిపై చల్లుకొన్నాడు; ఆచమించినాడు. దేశమూ, కాలమూ మొదలైన వాటిని లెక్కించినాడు.

శా. 'విప్రాయ ప్రకటవ్రతాయ భవతే విష్ణుస్వరూపాయ వే
దప్రామాణ్య విదే త్రిపాద ధరణీం దాస్యామి' యంచుం గ్రియా
క్షిప్రుండై దనుజేశ్వరుండు వడుగుం జేసాఁచి పూజించి' బ్ర
హ్మప్రీత' మ్మని ధారవోసె భువనం బాశ్చర్యముం బొందఁగన్ 607

* బలిచక్రవర్తి చేతులు చాచి వామనుని పూజించినాడు. "బ్రాహ్మణుడవూ ప్రసిద్ధమైన వ్రతం కలవాడవూ, విష్ణు స్వరూపుడవూ, వేదాల నియమాలు తెలిసినవాడవు అయిన నీకు మూడడుగుల నేల దానం చేస్తున్నాను" అని పలికి "పరమాత్మునకు ప్రీతి కలుగుగాక!" అంటూ వెనువెంటనే ధారపోసినాడు. అది చూచి లోకం ఆశ్చర్యపడింది.

వ. తత్కాలంబున. 608

ఆ. నీరధారఁ బడఁగనీక యడ్డంబుగాఁ, గలశరంధ్ర మాఁపఁగాను దెలిసి
హరియుఁ గావ్యనేత్ర మటఁ గుశాగ్రంబున, నడువ నేకనేత్రుఁడయ్యె నతఁడు. 609

* ఆ సమయంలో నీళ్ళధార పడకుండా శుక్రాచార్యుడు కలశం రంధ్రానికి అడ్డుపడి ఆపివేసినాడు. ఆ సంగతి తెలుసుకొని వామనుడు దర్భకొనతో పొడిచినాడు. దానివల్ల శుక్రునికి ఒక కన్నుపోయింది.

వ. అంత. 610

మ. అమరారాతి కరాక్షతోజ్ఝిత పవిత్రాంభః కణశ్రేణికిం
గమలాధీశ్వరుఁ డొడ్డె ఖండిత దివౌకస్స్వామిజిన్మస్తమున్
గమలాకర్షణ సుప్రశస్తము రమాకాంతాకచోపాస్తమున్
విమలశ్రీ కుచశాత చూచుక తటీవిన్యస్తమున్ హస్తమున్. 611

* అటు తరువాత ఆటంకం లేకుండా బలిచక్రవర్తి ధారపోసినాడు. పవిత్రమైన ఆ నీటి బిందువులకు వామనుడు తన చెయ్యి ఒడ్డినాడు. ఆచెయ్యి రాక్షసుల శిరస్సులు ఖండించినది. లక్ష్మీదేవిని ఆకర్షించడంలో మేలైనది. లక్ష్మీదేవి శిరోజాలచే సేవించబడేది. నిర్మలమైన ఆమెకుచాగ్రముల మీద మర్యాదలు అనుభవించేది.

క. మునిజన నియమాధారను, జనితాసుర యువతి నేత్ర జలకణధారన్
దనుజేంద్రనిరాధారను, వనజాక్షుఁడు గొనియె బలివివర్జితధారన్. 612

* బలిచక్రవర్తి అందించిన దానధారను వామనుడు స్వీకరించినాడు. ఆ జలధార మునుల నియమాలకు ఆధారమైనది. రాక్షసస్త్రీలను కన్నీటిధారల పాలుచేసేది. రాక్షసరాజులను నిరాధారులుగా మార్చేది.

ఆ. కమలనాభు నెఱిఁగి కాలంబు దేశంబు, నెఱిఁగి శుక్రు మాట లెఱిఁగి నాశ
మెఱిఁగి పాత్ర మనుచు నిచ్చె దానము బలి, మహి వదాన్యుఁ డొరుఁడు మఱియుఁ గలఁడె. 613

* బలిచక్రవర్తి విష్ణువునూ దేశకాలాలనూ తెలుసుకొన్నాడు. శుక్రుని మాటలను తెలుసుకొన్నాడు. తనకు చేటు వాటిల్లుతుందని కూడా తెలుసుకొన్నాడు. ఐనప్పటికీ ఆ దానం యోగ్యమైనదిగా భావించి ఇచ్చినాడు. లోకంలో అతని వంటి మహాదాత మరొక్కడు ఎక్కడున్నాడు?

క. బలి సేసిన దానమునకు, నలినాక్షుఁడు నిఖిలభూత నాయకుఁ డగుటం
గలకల మని దశదిక్కులు, బళి బళి యని పొగడె భూతపంచక మనఘా! 614

* ఓ పరీక్షిన్మహారాజా! అన్ని భూతాలకూ విష్ణువు అధిపతి. ఆయనకు బలిచక్రవర్తి దానం చేయగానే అన్ని దిక్కులూ కలకళలాడినాయి. పంచభూతాలు “బళిబళి” అని పొగడినాయి.

క. క్షితి దానమిచ్చు నతఁడును, నతికాంక్షఁ బరిగ్రహించు నతఁడును దురిత
చ్యుతులై శతవత్సరములు, శతమఖ లోకమునఁ గ్రీడ సలుపుదు రెలమిన్. 615

వ. అట్లు గావున నే దానంబును భూదానంబునకు సదృశంబు గానేరదు; గావున వసుంధరా దానంబిచ్చితి;
వుభయ లోకంబులం గీర్తిసుకృతంబులు వడయు మని పలికి య మ్మాయా వటుం డిట్లనియె. 616

క. ఇది యేమి వేఁడితని నీ, మది వగవక ధారవోయుమా; సత్యము పెం
పొదవఁగఁ గోరిన యర్థం, బిది యిచ్చుట ముజ్జగంబు లిచ్చుట మాకున్. 617

* మాయాబ్రహ్మచారి బలిచక్రవర్తితో ఇలా అన్నాడు. "భూమిని దానమిచ్చిన వానికీ, దానిని ప్రీతితో తీసుకొన్న వానికీ పాపాలు నశించిపోతాయి. వారు సంతోషంగా స్వర్గలోకంలో నూరేండ్లు విహరిస్తారు. అందువల్ల ఏ దానమూ భూదానానికి సమానం కాదు. భూదానమిచ్చిన నీకు రెండులోకాలలోనూ కీర్తి, పుణ్యమూ కలుగుతుంది'' అని పలికి మళ్లీ ఇట్లా అన్నాడు. నే నెందుకు దీనిని అడిగినానని నీ మనస్సులో చింతించకుండా దానమివ్వు. సత్యం పెంపొందే విధంగా దీన్ని అడిగినాను. ఈ మూడడుగులూ ఇస్తే మాకు మూడు లోకాలూ ఇచ్చినట్లే''.

వ. అని పలికిన వటుని పలుకులకు హర్ష నిర్భర చేతస్కుండై వైరోచనుండు. 618

ఆ. 'పుట్టి నేర్చు కొనెనొ పుట్టక నేర్చెనో, చిట్టిబుద్ధు లిట్టి పొట్టివడుగుఁ
బొట్ట నున్న వెల్ల బూమెలు' నని నవ్వి, యెలమి ధరణి దాన మిచ్చె నపుడు. 619

* పై విధంగా పలికిన వామనుని మాటలకు బలిచక్రవర్తి ఎంతగానో సంతోషించినాడు. "ఈ పొట్టి బ్రహ్మచారి ఈ చిట్టి బుద్ధులను పుట్టిన తరువాత నేర్చుకొన్నాడో! పుట్టకముందే నేర్చుకొన్నాడో! ఇతని పొట్టనిండా మాయలే'' అంటూ నవ్వి సంతోషంగా భూదానం చేసినాడు.

## -: వామనమూర్తి విశ్వరూపము నొంది విజృంభించుట :-

ఆ. గ్రహ మునీంద్ర సిద్ధ గంధర్వ కిన్నర, యక్ష పక్షి దేవతాహిపతులు
వొగడి రతని పెంపుఁ; బుష్పవర్షంబులు, గురిసె దేవతూర్యకోటి మొరసె. 620

*బలిచక్రవర్తి ఔదార్యాన్ని గ్రహాలూ, మునీశ్వరులూ, సిద్ధులూ, గంధర్వులూ, కిన్నరులూ, యక్షులూ, గరుడులూ, దేవతలూ, సర్పరాజులూ అందరూ పొగడినారు. అతనిపై పూలవానలు కురిపించినారు. దేవతల విజయదుందుభులు మ్రోగినాయి.

వ. ఇట్లు ధారాపరిగ్రహంబు సేసి. 621

శా. ఇంతింతై, వటుఁడింతయై, మఱియుఁ దా నింతై, నభోవీథిపై
నంతై, తోయదమండలాగ్రమున కల్లంతై, ప్రభారాశిపై
నంతై, చంద్రుని కంతయై, ధ్రువుని పైనంతై, మహర్వాటి పై
నంతై, సత్యపదోన్నతుం డగుచు బ్రహ్మాండాంతసంవర్ధియై. 622

* పై విధంగా దానాన్ని తీసుకొన్న వామనుడు కొద్ది కొద్దిగా ఎదిగినాడు. ఇంతవాడు అంతవాడైనాడు. అంతవాడు మరింత వాడైనాడు. క్రమక్రమంగా పెరిగిపోతున్నాడు. వరుసగా ఆకాశం కంటె మేఘమండలం కంటె, వెలుగుల రాశికంటె పైకి పెరిగాడు. చంద్రుని వరకూ, ధ్రువతారవరకూ, మహర్లోకం వరకూ, ఆ పైన సత్యలోకం వరకూ పెరుగుతూ బ్రహ్మాండమంతా నిండిపోయినాడు.

మ. రవిబింబం బుపమింపఁ బాత్రమగు ఛత్రంబై, శిరోరత్నమై
శ్రవణాలంకృతియై గళాభరణమై సౌవర్ణకేయూరమై
ఛవిమత్కంకణమై కటిస్థలి నుదంచ ద్ఘంటయై నూపుర
ప్రవరంబై పదపీఠమై వటుఁడు దా బ్రహ్మాండమున్ నిండుచోన్. 623

* వామనుడు బ్రహ్మాండమంతా నిండిపోతున్న ఆ సమయంలో సూర్యబింబం క్రమక్రమంగా అతనికి గొడుగుగా, తర్వాత శిరోమణిగా, తర్వాత మకర కుండలంగా, తర్వాత కంఠాభరణంగా, ఆ తర్వాత బంగారు భుజకీర్తిగా, అటు తర్వాత కాంతులీనే కంకణంగా, అనంతరం మొలలోని గంటగా, ఆ పైన మేలైన కాలి అందెగా, చివరకు పాదపీఠంగా ప్రకాశించింది.

వ. ఇట్లు విష్ణుండు గుణత్రయాత్మకంబగు విశ్వరూపంబు ధరియించి భువియును, నభంబును, దివంబును, దిశలును, దిశాఛిద్రంబులును, సముద్రంబులును, జల దచల దఖిల భూతనివహంబులుం దానయై యేకీభవించి, క్రమ క్రమంబున భూలోకంబునకుం బొడవై, భువర్లోకంబు నతిక్రమించి, సువర్లోకంబును దల కడచి, మహర్లోకంబు దాఁటి జనోలోకంబునకు మీఁదై, తపోలోకంబునకు నుచ్ఛ్రితుండై, సత్యలోకంబుకంటె నౌన్నత్యంబు వహించి, యెడ లిఱుములు సందులు రంధ్రంబులు లేకుండ నిండి, మహాదేవ మహితుండై చరణతలంబున రసాతలంబును, బాదంబుల మహియును, జంఘుల మహీధ్రంబులును, జానువులఁ బతత్రిసముదయంబులును, నూరువుల నింద్రసేన మరుద్గణంబులును, వాసస్థలంబున సంధ్యయు, గుహ్యంబునఁ బ్రజాపతులును, జఘనంబున దనుజులును, నాభిని నభంబును, నుదరంబున నుదధిసప్తకంబును, నురంబునఁ దారకానికరంబును, హృదయంబున ధర్మంబును నురోజంబుల ఋతసత్యంబులును, మనంబునఁ జంద్రుండును, వక్షంబునఁ గమలహస్త యగు లక్ష్మియుఁ, గంఠంబున సామాది సమస్త వేదంబులును, భుజంబులం బురందరాది దేవతలును, గర్ణంబుల దిశలును, శిరంబున నాకాశంబును, శిరోజంబుల మేఘంబు లును, నాసాపుటంబున వాయువును, నయనంబుల సూర్యుండును, వదనంబున వహ్నియు,వాణి నఖిలచ్ఛంద స్సముదయంబును, రసనను జలేశుండును, భ్రూయుగళంబున విధినిషేధంబులును,

**ఱెప్పల నహోరాత్రంబులును, లలాటంబునఁ గోపంబును, నధరంబున లోభంబును,స్పర్శంబునఁ గామంబును, రేతంబున జలంబును, బృష్ఠం బున నధర్మంబును, గ్రమణంబుల యజ్ఞంబులును, ఛాయల మృత్యువును, నగవున ననేక మాయావిశేషంబులును, రోమంబుల నోషధులును, నాడీ ప్రదేశంబుల నదులును, నఖంబుల శిలలును, బుద్ధి నజుండును, బ్రాణంబుల దేవర్షిగణంబులును, గాత్రంబున జంగమస్థావర జంతుసంఘంబులును గలవాఁడై, జలధరనినద శంఖ శార్ఙ్గ సుదర్శన గదాదండ ఖడ్గాక్షయ బాణతూణీర విభ్రాజితుండును, మకరకుండల కిరీట కేయూర హార కటక కంకణ కౌస్తుభమణి మేఖలాంబర వనమాలికా విరాజితుండును, సునంద నంద జయ విజయ ప్రముఖ పరిచర వాహినీ సందోహ పరివృతుండును, నమేయ తేజోవిరాజితుండునునై బ్రహ్మాండంబు దన మేనికప్పు తెఱంగున నుండ విజృంభించి.** **624**

* పై విధంగా విష్ణువు సత్త్వరజస్తమో రూపకమైన విశ్వరూపాన్ని పొంది విజృంభించినాడు. భూమి ఆకాశమూ స్వర్గమూ దిక్కులూ దిక్కుల మధ్యభాగాలూ సముద్రాలూ చరాచరములైన సమస్తప్రాణులూ తానేఐనాడు. క్రమంగా భూలోకాన్ని అతిక్రమించినాడు. భువర్లోకమూ, సువర్లోకమూ, మహర్లోకమూ, జనోలోకము, తపోలోకమూ దాటిపోయినాడు. సత్యలోకం కంటె ఎత్తుగా ఎదిగినాడు. అన్ని చోట్లా మూల మూలలూ, సందుసందులూ నిండిపోయినాడు. మహోన్నతమైన ఆకారంతో పాదాల అడుగుభాగంలో రసాతలాన్నీ, పాదాలలో భూమినీ, పిక్కలతో పర్వతాలనూ, మోకాళ్ళలో పక్షుల సమూహాన్ని, తొడలలో దేవతలనూ, వస్త్రంలో సంధ్యాకాలాన్నీ రహస్యాంగంలో ప్రజాపతులనూ, పిరుదులలో రాక్షసులనూ, నాభిలో ఆకాశాన్ని, కడుపులో సప్తసముద్రాలనూ, వక్షంలో నక్షత్రసమూహాన్నీ, హృదయంలో ధర్మాన్నీ, స్తనద్వయంలోఋుతాన్నీ సత్యాన్నీ, మనస్సులో చంద్రుణ్ణీ, ఎదలో లక్ష్మిదేవినీ, కంఠంలో వేదాలనూ, భుజాలలో ఇంద్రాదులైన దేవతలనూ, చెవులలో దిక్కులనూ, తలలో స్వర్గలోకాన్నీ, తలవెంట్రుకలలో మేఘాలనూ, ముక్కుపుటాలలో వాయువునూ, కన్నులలో సూర్యుణ్ణీ, ముఖంలో అగ్నినీ, వాక్కులో సమస్త ఛందస్సులనూ, నాలుకలో వరుణునీ, కనుబొమ్మలలో కార్యాకార్యాలనూ, రెప్పలలో రేయింబవళ్ళనూ, ఫాలభాగంలో కోపాన్నీ, క్రింది పెదవిలో లోభాన్నీ, స్పర్శలో కామాన్నీ, రేతస్సులో జలాన్నీ, వీపులో అధర్మాన్నీ, అడుగులలో యజ్ఞాలనూ, నీడలో మరణాన్నీ, నవ్వులో మాయావిశేషాలనూ, రోమాలలో సస్యాలనూ, నరాలలో నదులనూ, గోళ్ళలో రాళ్ళనూ, బుద్ధిలో బ్రహ్మనూ, ప్రాణాలలో దేవర్షి గణాలనూ, శరీరంలో చరాచర సకల ప్రాణులనూ ఇమిడించుకొన్నాడు. ఆయన మేఘంవలె మ్రోగే పాంచజన్యమనే శంఖంతో శార్ఙ్గమనే ధనుస్సుతో, సుదర్శనమనే చక్రంతో, కౌమోదకీ అనే గదాదండంతో, నందకమనే ఖడ్గంతో, అక్షయములైన అంపపొదులతో ప్రకాశించుతున్నాడు. మకరకుండలాలతో, కిరీటంతో, భుజకీర్తులతో, హారాలతో, కాలి అందెలతో, కంకణాలతో, కౌస్తుభమణితో రత్నాల మొలనూలుతో, పీతాంబరంతో, వైజయంతీ మాలికతో విరాజిల్లుతున్నాడు. సునందుడూ, నందుడూ, జయుడూ, విజయుడూ మొదలైన పరిచారకుల సమూహం చుట్టూ చేరి ఉంది. ఆయన మేరలేని తేజస్సుతో మెరుస్తున్నాడు. బ్రహ్మాండం ఆయన దేహానికి మేలిముసుగుగా ఒప్పుతున్నది.

**మ. ఒకపాదంబున భూమిఁ గప్పి దివి వేఱొంటన్ నిరోధించి యొం**
**డొకటన్ మీఁది జగంబులెల్లఁ దొడి, యొం డొంటిన్ విలంఘించి, ప**
**ట్టక బ్రహ్మాండ కటాహముం బగిలి వేంద్రంబై పరుల్ గానరా**
**కొకఁడై వాగ్దృగలభ్యుఁడై హరి విభుం డొప్పారె విశ్వాకృతిన్. 625**

* విశ్వరూపాన్ని ధరించిన త్రివిక్రముడు ఒక అడుగుతో భూలోకాన్నీ, ఇంకొక అడుగుతో స్వర్గలోకాన్నీ, మరియొక అడుగుతో పై లోకాలనూ కప్పివేసినాడు. క్రమంగా అన్నింటినీ దాటిపోయినాడు. ఆ మహారూపం పట్టకపోవడం వల్ల బ్రహ్మాండభాండం పెటపెటలాడి బ్రద్దలైపోసాగింది. ఆయన తప్ప ఇంకెవరూ కనిపించకుండా పోయినారు. ఆ విశ్వరూపుడు మాటలకూ, చూపులకూ అందరానివాడై శోభించినాడు.

**ఆ. ఒక పదంబు క్రింద నుర్వి పద్మము నంటి, కొన్న పంకలవము కొమరుఁ దాల్చె;**
**నొకటి మీఁదఁ దమ్మి కొదిఁగిన తేఁటినా, వెలసె మిన్ను నృప! త్రివిక్రమమున. 626**

* రాజా! ఆ విశ్వరూపంలో ఒక పాదం క్రింద ఉన్న భూమండలం పద్మానికి అంటుకొన్న చిన్న బురదముద్ద వలె ఒప్పింది. ఇంకొక పాదం మీద ఉన్న ఆకాశం పద్మంమీద వ్రాలిన తుమ్మెదవలె ప్రకాశించింది.

**వ. తత్సమయంబున. 627**

**ఆ. జగములెల్ల దాఁటి చనిన త్రివిక్రము, చరణనఖర చంద్ర చంద్రికలను**
**బొనుఁగు పడియె సత్యమున బ్రహ్మతేజంబు, దివసకరుని రుచుల దివియ వోలె. 628**

* ఆ సమయంలో అన్ని లోకాలకూ దాటిపోయిన తివిక్రమ దేవుని కాలిగోళ్ళ కాంతికి సత్యలోకంలోని బ్రహ్మ తేజస్సు సూర్యుని ముందు దివిటీవలె వెలవెలపోయింది.

**సీ. భవబంధములఁ బాసి బ్రహ్మలోకంబునఁ గాఁపురంబులు సేయు ఘనులు రాజు**
**లా మారీచ్యాదులు నా సనందాదులు నా దివ్య యోగీంద్రు లచట నెపుడు**
**మూర్తి మంతంబులై మ్రోయు పురాణ తర్కామ్నాయ నియమేతిహాస ధర్మ**
**సంహితాదులు గురుజ్ఞానాగ్ని నిర్దగ్ధ కర్ములై మఱియును గలుగునట్టి**
**ఆ. వార లెల్లఁ జొచ్చి వచ్చి సర్వాధిపు, నంఘ్రిఁ జూచి మ్రొక్కి రధికభక్తి**
**దమ మనంబులందుఁ దలఁచు నిధానంబుఁ, గంటి మనుచు నేఁడు మంటి మనుచు. 629**

* సంసారబంధాలను త్రెంచుకొని మోక్షాన్ని పొంది బ్రహ్మలోకంలో నివాసం చేస్తున్న మరీచి మొదలైనవారూ, సనందుడూ మొదలైన యోగీంద్రులూ, ఆకారం ధరించి అక్కడ మారు మ్రోగుతున్న పురాణాలూ తర్కశాస్త్రాలూ, వేదాలూ, వేదాంగాలూ, ఇతిహాసాలూ, ధర్మశాస్త్రాలూ, మహాజ్ఞానులైన పుణ్యాత్ములూ ఆ మహావిష్ణువు పాదాన్ని దర్శించారు. ఆ పాదానికి భక్తితో మ్రొక్కినారు. "మనస్సులలో మేము భావిస్తున్న పెన్నిధి కనిపించింది. ఈనాడు మేము ధన్యులమైనాము'' అనుకొన్నారు.

మ. తన పుట్టిల్లిదె పొమ్మటంచు నజుఁడుం దన్నాభిపంకేరుహం
బు నిరీక్షించి, నటించి యున్నతపదంబుం జూచి తత్పాద సే
చనముం జేసెఁ గమండలూదకములం జల్లించి; తత్తోయముల్
వినువీథిం బ్రవహించె దేవనదినా విశ్వాత్ముకీర్తి ప్రభన్. 630

* మహావిష్ణువు బొడ్డు తామరను చూచి "నా జన్మస్థానం ఇదే సుమా" అనుకొంటూ బ్రహ్మదేవుడు సంతోషించినాడు. తన కమండల జలంతో స్వామి పాదాన్ని కడిగినాడు. ఆజలధారలు భగవంతుని కీర్తి కాంతితో నిండి ఆకాశంలో దేవనదిగా ప్రవహించాయి.

వ. తత్సమయంబున. 631

సీ. యోగమార్గంబున నూహించి బహువిధ పుష్పదామంబులఁ బూజసేసి
దివ్యగంధంబులు తెచ్చి సమర్పించి ధూపదీపములఁ దోడ్తోడ నిచ్చి
భూరి లాజాక్షతంబులు సల్లి ఫలములు గానిక లిచ్చి రాగములఁ బొగడి
శంఖాదిరవముల జయ ఘోషములు సేసి 'కరుణాంబునిధి! త్రివిక్రమ' యటంచు

ఆ. బ్రహ్మమొదలు లోకపాలురు గొనియాడి; రెల్ల దిశల వనచరేశ్వరుండు
జాంబవంతుఁ డరిగి చాటె భేరీధ్వని, వెలయఁ జేసి విష్ణు విజయ మనుచు. 632

*ఆ సమయంలో లోకాలను పాలించే బ్రహ్మాదులు మహావిష్ణువును యోగమార్గంలో ఊహించి పలువిధాలైన పూలమాలలతో పూజించినారు. మేలైన సుగంధ వస్తువులూ, ధూపదీపాలనూ సమర్పించినారు. పేలాలనూ అక్షతలనూ చల్లినారు. ఫలాలను కానుక పెట్టినారు. సంతోషంతో పొగడినారు. శంఖాలను ఊదినారు. 'జయ జయ' నాదాలు చేసినారు. 'కరుణసముద్రా! త్రివిక్రమ దేవా!' అని కొనియాడినారు. భల్లూకరాజైన జాంబవంతుడు అన్ని దిక్కులలో ఢంకా మ్రోగించుతూ "విష్ణుదేవుని విజయాన్ని" చాటినాడు.

క. అన్ని జగంబులఁ దానై, యున్న జగన్నాథుఁ జూడ నొగి భావింపం
గన్నందక మన మందక, సన్నుతులం జేసి రపుడు సభ్యులు బలియున్. 633

* అన్ని లోకాలలోనూ వ్యాపించిన భగవంతుణ్ణి కంటితో చూడడానికీ మనసుతో ఊహించడానికీ వీలుకాక బలి చక్రవర్తీ, ఆయన సభలోనివారూ చక్కగా స్తోత్రం చేసినారు.

వ. అంత నొయ్యనఁ బూర్వప్రకారంబున వామనాకారంబు వహించి యున్న వామనునిం గని 'పదత్రయ వ్యాజంబున నితండు సకలమహీమండలంబు నాక్రమించెఁ గపటవటురూప తిరోహితుండగు విష్ణుం డని యెఱుంగక మన దానవేంద్రుండు సత్యసంధుండు గావున మాట దిరుగక యిచ్చె; నతనివలన నేరంబులే; దీ కుబ్జుం డప్రతిహత తేజః ప్రభావంబున సజ్జకంబుగా ని జ్జగంబులం బరిగ్రహించి, పర్జన్యాదులకు విసర్జనంబు సేయం దలంచి యున్నవాఁ, డీ పాఱునిం దూఱి పాఱనీక నిర్జించుట

కర్జం' బని తర్జనంబులును గర్జనంబులును జేయుచు, వజ్రాయుధాది మరుజ్జేతలగు రాహు హేతి ప్రహేతి విప్రచిత్తి ముఖ్యులయిన రక్కసులు పెక్కం డ్రుక్కుమిగిలి యుద్ధంబునకు సన్నద్ధులై పరశు పట్టిస భల్లాది సాధనంబులు ధరియించి, కసిమసంగి ముసరికొని దశదిశలం బ్రసరించినం చూచి హరి పరిచరులు సునంద నంద జయ జయంత విజయ ప్రబలోద్బల కుముద కుముదాక్ష తార్క్ష్య పుష్పదంత విష్వక్సేన శ్రుతదేవ సాత్వత ప్రముఖులగు దండనాథు లయుత వేదండ సముద్దండ బలులు దమతమ యూథంబుల నాయుధంబులతోడం గూర్చుకొని దానవానీకంబులఁ బరలోకంబున కనుపువారలై వారల నెదుర్కొని కదనంబునకుం బరవసంబు సేయుచున్నం గనుంగొని శుక్రుశాపంబుఁ దలంచి దనుజవల్లభుం డి ట్లనియె. 634

* అటు తరువాత విష్ణువు మెల్లగా వామనరూపాన్ని ధరించినాడు.ఇంద్రాది దేవతలను గెలిచిన రాహుహేతి, ప్రహేతి, విప్రచిత్తి మొదలైన రాక్షసులు "ఇతడు మూడడుగుల నెపంతో ప్రపంచమంతా ఆక్రమించుకొన్నాడు. మాయతో బ్రహ్మచారి రూపాన్ని పొందిన విష్ణువని తెలియక మనరాజు ఆడినమాట తప్పకుండా దానమిచ్చినాడు. అతనిలో తప్పులేదు. ఈ పొట్టివాడు ఎదురులేని మహిమతో లోకాలను స్వాధీనం చేసుకొన్నాడు. వీటిని ఇంద్రాదులకు ఇస్తాడు. ఈ బ్రహ్మచారి తప్పించుకొని పరుగెత్తిపోకుండా పట్టి చంపివేయాలి-" అంటూ బెదరిస్తూ కేకలువేస్తూ యుద్ధానికి సిద్ధమైనారు. గండ్రగొడ్డళ్ళూ, అడ్డకత్తులూ, ఈటెలూ మొదలైన ఆయుధాలు ధరించి చెలరేగి అన్నివైపులా మూగినారు. దానిని చూచి విష్ణుసేవకులైన సునందుడూ నందుడూ జయుడూ జయంతుడూ విజయుడూ ప్రబలుడూ ఉద్బలుడూ కుముదుడూ కుముదాక్షుడూ గరుడుడూ పుష్పదంతుడూ విష్వక్సేనుడూ శ్రుతదేవుడూ సాత్వతుడూ మొదలైన సేనాపతులు పదివేల ఏనుగుల బలంతో కూడినవారు తమ తమ సైన్యాలనూ ఆయుధలనూ సమకూర్చుకొన్నారు. యుద్ధంలో రాక్షససైన్యాలను ఎదిరించి తుద ముట్టించడానికి ఉత్సాహంతో సిద్ధపడినారు. అప్పుడు బలిచక్రవర్తి శుక్రాచార్యుని శాపాన్ని తలంపుకు తెచ్చుకొని రాక్షసులతో ఇట్లా అన్నాడు.

సీ. రాక్షసోత్తములార! రండు పోరాడక; కాలంబు గాదిది కలహమునకు;
సర్వభూతములకు సంపదాపదలకుఁ బ్రభువైన దైవంబుఁ బరిభవింప
మన మోపుదుమె? తొల్లి మనకు రాజ్యంబును సురలకు నాశంబు సొరిది నిచ్చి
విపరీతముగఁ జేయు వేల్పు నే మందుము మనపాలిభాగ్యంబు మహిమ గాక;

తే. వెఱచి పలుమాఱుఁ బాటెడి విష్ణుభటులు, మిమ్ము నెగచుట దైవంబు మేర గాదె?
మనకు నెప్పుడు దైవంబు మంచిదగును, నాఁడు గెలుతము పగవారి; నేఁడు వలదు. 635

* ఓ రాక్షస వీరులారా! ఆగండి. యుద్ధానికి వెళ్ళకండి. మనకు ఇది సమయం కాదు. సర్వప్రాణుల సుఖాలకూ దుఃఖాలకూ అధికారి యైన దేవుని ఓడించడానికి మనకు సాధ్యం కాదు. మొదట మనకు రాజ్యాన్ని ఇచ్చినాడు. దేవతలకు చేటు కలిగించినాడు. ఇప్పుడు దానికి వ్యతిరేకంగా చేసినాడు. అటువంటి దేవుని ఏమనగలము? ఇది మన అదృష్టఫలం. పలుసార్లు భయపడి పారిపోయిన విష్ణుసేవకులు ఇప్పుడు మిమ్మలను ఎదిరించడం దైవనిర్ణయం. మనకు అదృష్టం అనుకూలించినపుడు శత్రువులను జయించు దాము. ఇప్పుడు వద్దు.

వ. అదియునుం గాక. 636

క. బలు దుర్గంబులు సచివులు, బలములు మంత్రౌషధములు బహుశేముషియుం
గలిగియు సామోపాయంబులఁ గాల మెఱింగి నృపుఁడు పోరుట యొప్పున్. 637

* అంతేకాక రాజైనవాడు పెక్కు కోటలూ, మంత్రులూ, సైన్యాలూ, మంత్రాలూ, ఓషధాలూ తెలివితేటలూ ఉన్నప్పటికి కాలాన్ని గమనించి, ఓర్పుతో ఉపాయంతో యుద్ధం చేయడం మంచిది.

వ. అట్లు గావున రణంబున కిప్పుడు శత్రులకెదురు మోహరించుట కార్యంబు గాదు; మనకుం దగు కాలంబున జయింతము; నలంగక తలంగుఁ డనినఁ దలంగి భాగవత భట భీతులై చిక్కి రక్కసులు రసాతలంబునకుం జని; రంత హరి హృదయం బెఱింగి తార్క్ష్యనందనుండు యాగసుత్యాహంబున వారుణ పాశంబుల నసురవల్లభుని బంధించె; నంత. 638

ఇప్పుడు శత్రువులతో యుద్ధానికి పూనుకోవడం తగదు. మనకు అనుకూలమైన సమయంలో గెలువవచ్చు. అనవసరంగా శ్రమపడకుండా తొలగిపొండి అని బలిచక్రవర్తి పలికినాడు. అప్పుడు విష్ణుభటులకు భయపడి రాక్షసులు రసాతలానికి వెళ్ళిపోయినారు. అటు పిమ్మట యాగంలో సోమపానం చేసే చివరి దినాన విష్ణువు అభిప్రాయాన్ని తెలుసుకొన్న గురుడు బలిచక్రవర్తిని వరుణపాశాలతో బంధించినాడు.

క. బాహులుఁ బదములుఁ గట్టిన, 'శ్రీహరికృప గాక యేమి సేయుదు?' నని సం
దేహింపక బలి నిలిచెను, హాహారవ మెసఁగె దశ దిగంతములందున్. 639

* చేతులూ కాళ్ళు కట్టివేయగా బలిచక్రవర్తి సంకోచం లేకుండా మౌనం వహించినాడు. 'ఇది విష్ణువు దయ. దీనికి ఏమీ చేయలేను'- అనుకొన్నాడు. అన్ని వైపులలోనూ హా హా కారాలు చెలరేగినాయి.

క. సంపద సెడియును దైన్యముఁ, గంపంబును లేక తొంటికంటెను బెంపుం
దెంపును నెఱుకయు ధైర్యము, వంపని సురవైరిఁ జూచి వటుఁ డిట్లనియెన్. 640

* ఐశ్వర్యం నశించినా బలిచక్రవర్తిలో దీనత్వమూ కంపమూ కలుగలేదు. అంతేకాక వెనుకటికంటే గౌరవమూ, తెగువా,జ్ఞానమూ, ధైర్యమూ అధికమైనాయి. అప్పుడు బలిచక్రవర్తిని చూచి వామనుడు ఇట్లా అన్నాడు.

సీ. దానవ! త్రిపదభూతల మిత్తు నంటివి ధరణిఁ జంద్రార్కు లెందాఁక నుందు
రంతభూమియు నొక్క యడుగయ్యె నాకును;, స్వర్లోకమును నొక్కచరణమయ్యె;
నీ సొమ్ము సకలంబు నేఁడు రెండడుగులు; గడమ పాదమునకుఁ గలదె భూమి?
యిచ్చెద నన్నర్థ మీని దురాత్ముండు నిరయంబుఁ బొందుట నిజము గాదె?

తే. కాన దుర్గతికిని గొంతకాల మరుగు, కాక యిచ్చెదవేని వేగంబు నాకు
నిపుడు మూఁడవ పదమున కిమ్ము చూపు, బ్రాహ్మణాధీనములు ద్రోవ బ్రహ్మవశమె? 641

* ఓ దనుజేంద్రా! మూడడుగుల నేల ఇస్తానంటివి. భూలోకమూ చంద్ర సూర్యులదాకా ఉండే స్థలమూ నాకు ఒక అడుగైనది. స్వర్గలోకం ఒక అడుగైనది. నీ సంపద అంతా ఈనాడు రెండడుగులైనది. ఇక మూడవ అడుగుకు ఎక్కడుంది చోటు? ఇస్తానన్న అర్థాన్ని ఇవ్వనివాడు నరకాన్ని పొందడం నిజం. అందువల్ల కొంతకాలం నరకానికి వెళ్లు. అట్లా కాకుండా మూడవ అడుగు ఇవ్వదలచుకొంటే ఆ చోటు నాకు తొందరగా చూపు. బ్రాహ్మణులకు స్వాధీనం కావలసిన దానిని కాదనడానికి బ్రహ్మకుకూడా సాధ్యం కాదు.

**వ. అని యిట్లు వామనుండు పలుక సత్యభంగ సందేహ విషదిగ్ధ శల్యనికృత్త హృదయుండయ్యును విషణ్ణుండు గాక వైరోచని ప్రసన్న వదనంబుతోడఁ జిన్ని ప్రోడ వడుగున కిట్టనియె. 642**

* పై విధంగా పలికిన వామనుని మాటలు విని 'సత్యం భంగమవుతుందేమో' అనే సందేహం కలిగింది బలిచక్రవర్తికి, అది విషబాణంవలె అతడి మనస్సును గాయపరచింది. ఐనా అతడు దిగులు చెందకుండా ప్రసన్నమైన ముఖంతో బుద్ధిశాలియైన వామనునితో ఇట్లా అన్నాడు.

**ఆ. సూనృతంబ గాని సుడియదు నాజిహ్వ, బొంకఁజాల; నాకు బొంకు లేదు;**
**నీ తృతీయ పదము నిజము నా శిరమున, నెలవు సేసి పెట్టు నిర్మలాత్మ! 643**

* ఓ పుణ్యాత్ముడా! నా నాలుక సత్యాన్నే పలుకుతుంది. దానికి తిరుగులేదు. అసత్యం పలుకదు. నాలో అసత్యం అనేది లేదు. నీ మూడవ పాదాన్ని శాశ్వతంగా నా తలపై పెట్టు.

**ఆ. నిరయమునకుఁ బ్రాప్త నిగ్రహంబునకును, బదవిహీనతకును బంధనమున**
**కర్థ భంగమునకు నఖిలదుఃఖమునకు, వెఱవ దేవ! బొంక వెఱచినట్లు. 644**

* స్వామీ! అసత్యం పలుకడానికి నేను భయపడినట్లు నరకానికిగానీ, ఇప్పుడు కలిగిన ఈ శిక్షకు గానీ గొప్పపదవి పోయినందుకుగానీ, చెరసాలకుగానీ, ఐశ్వర్యం నశించినందుకుగాని ఎటువంటి కష్టాలకుగానీ భయపడను.

**వ. అదియునుం గాక. 645**

**సీ. తల్లిదండ్రులు, నన్నదమ్ములుఁ, జెలికాండ్రు, గురువులు శిక్షింపఁ గొఱఁతవడునె?**
**పిదప మేలగుఁగాక! పృథుమదాంధులకును దానవులకు మాకుఁ దఱియెఱింగి**
**విభ్రంశచక్షువు వెలయ నిచ్చుటఁ జేసి గురువులలో నాదిగురువ వీవ;**
**నీవు బంధించిన నిగ్రహమో లజ్జయో నష్టియో బాధయో తలంప**

**తే. నిన్ను నెదిరించి పోరాడి నిర్జరారు, లాది యోగీంద్రు లందెడునట్టి టెంకి**
**నందరే తొల్లి పెక్కండ్రు? హర్షమూర్తి!, యీశ! నీయెడ దుర్లభమేమి గలదు? 646**

* ఓ ఆనందస్వరూపా! అంతేకాక తల్లిదండ్రులూ అన్నదమ్ములూ మిత్రులూ గురువులూ బుద్ధి చెప్పడంలో ఏమీ నష్టం లేదు. దానివల్ల తరువాత మేలే కలుగుతుంది. మదంతో కన్నులు కనిపించని మావంటి రాక్షసులకు నీవు సకాలంలో చెదరిపోకుండా వెలిగే చూపు నిచ్చినావు. అందువల్ల నీవు గురువులలో మొదటి గురువైనావు. నీవు నన్ను బంధించడం శిక్షగాకానీ సిగ్గుగాకానీ లోటుగాగానీ బాధగాగానీ నేను భావించను. ఇదివరలో చాలమంది రాక్షసులు నిన్ను ఎదిరించి పోరాడి యోగీశ్వరులు పొందే స్థానాన్నే పొందినారుగదా! స్వామీ! నీవు ఇవ్వలేనిది ఏముంది?

**మ. చెలియే మృత్యువు? చుట్టమే యముఁడు? సంసేవార్థులే కింకరుల్?**
**శిలలం జేసెనె బ్రహ్మ దన్ను? దృఢమే జీవంబు? నో చెల్లరే!**
**చలితం బౌట యెఱుంగ కీ కపట సంసారంబు నిక్కంబుగాఁ**
**దలఁచున్ మూఢుఁడు సత్యదాన కరుణాధర్మాదినిర్ముక్తుఁడై. 647**

* అయ్యో! మృత్యువు ఆప్తమిత్రం కాదు. యముడు దగ్గర చుట్టం గాదు. సేవకులు భక్తితో సేవించాలనే బుద్ధిమంతులూ కారు. ప్రాణం శాశ్వతం కాదు. ఈ శరీరాన్ని బ్రహ్మ రాళ్ళతో మలచలేదు. ఐనా మూర్ఖుడు సత్యమూ దానమూ దయా ధర్మమూ మొదలైన వాటిని వదలివేస్తున్నాడు. ఈమాయా సంసారాన్ని సత్యమని భావిస్తున్నాడు.

**సీ. చుట్టాలు దొంగలు; సుతులు ఋణస్థులు; కాంతలు సంసార కారణములు;**
**ధనము లస్థిరములు; దను వతి చంచల; గార్యార్థు లన్యులు గడచుఁగాల**
**మాయువు సత్వర మైశ్వర్య మతిశీఘ్రమని కాదె తమ తండ్రి నతకరించి**
**మా తాత సాధుసమ్మతుఁడు ప్రహ్లాదుండు నీ పాదకమలంబు నియతిఁ జేసె**

**తే. భద్రుఁ డతనికి మృతిలేని బ్రదుకు గలిగె, వైరులై కాని తొల్లి మావారు గాన**
**రర్థివై వచ్చి నీవు న న్నడుగు టెల్లఁ, బద్మలోచన! మా పుణ్యఫలము గాదె? 648**

* పుణ్యాత్ముడైన మా తాత ప్రహ్లాదుడు "చుట్టాలు దొంగలు. కొడుకులు అప్పులవాళ్ళు. భార్యలు ముక్తిని దూరంచేసేవారు. సంపదలు నిలకడ లేనివి. శరీరం స్థిరం కాదు. ఇతరులు తమ ప్రయోజనాన్నే కోరుతారు. కాలం నిలువదు. ఆయుస్సు త్వరగా గడుస్తుంది. ఐశ్వర్యం తొందరగా వెళ్ళిపోతుంది" అనుకొన్నాడు. ఆయన తనతండ్రిని విడనాడి నీ పాదాలను సేవించినాడు. అదృష్టవంతుడైన అతనికి మరణం లేని మనుగడ దొరికింది. పురాణపురుషా! పూర్వం మావారు శత్రువులుగా మారితే తప్ప నిన్ను దర్శింపలేకపోయినారు. నీవు బిచ్చగాడుగా వచ్చి నన్ను 'దేహి' అనడం మా పూర్వపుణ్యఫలం కాక మరేమిటి?

**వ. అని యిట్లు పలుకుచున్న యవసరంబున. 649**

**శా. ఆ దైత్యేంద్రుఁడు పీనవక్షు, నవపద్మాక్షుం, బిశంగాంబరా**
**చ్ఛాదున్, నిర్మలసాధువాదు, ఘన సంసారాది విచ్ఛేదు, సం**

**శ్రీదున్, భక్తిలతాతిరోహిత హరి శ్రీపాదు నిఃఖేదుఁ బ్ర**
**హ్లాదున్ బోధకళావినోదుఁ గనియెన్ హర్షంబుతో ముందటన్. 650**

* పై విధంగా బలిచక్రవర్తి పలుకుతున్న సమయంలో పరమభక్తాగ్రగణ్యుడైన ప్రహ్లాదుడు అక్కడికి వచ్చినాడు. అతడు విశాలమైన వక్షమూ, క్రొత్త పద్మాలవంటి కన్నులూ కలవాడు. పచ్చని పట్టువస్త్రం కట్టుకొన్నవాడు. చక్కగా మాట్లాడడంలో నిపుణుడు. సంసారపు బంధాలను తెగత్రెంచుకొన్న సుగణ సంపన్నుడు. భక్తితో భగవంతుని పాదాలను లోబరచుకొన్నవాడు. దుఃఖాన్ని పాఱద్రోలి జ్ఞానవిద్యతో ఆనందించేవాడు. అటువంటి ప్రహ్లాదుణ్ణి బలిచక్రవర్తి సంతోషంగా సందర్శించినాడు.

**వ. ఇట్లు సమాగతుం డైన తమ తాతం గనుంగొని విరోచన నందనుండు వారుణపాశబద్ధుండు గావునఁ దనకుం దగిన నమస్కారంబు సేయరామింజేసి సంకులాశ్రువిలోల లోచనుండై సిగ్గుపడి నతశిరస్కుండై నమ్రభావంబున మ్రొక్కు సెల్లించె; నంతఁ బ్రహ్లాదుండు ముఖమండపంబున సనందాది పరిచర సమేతుండై కూర్చున్న వామన దేవునిం గని యానంద బాష్పంబులుఁ బులకాంకురంబులున్ నెఱయ దండప్రణామం బాచరించి యిట్లని విన్నవించె. 651**

* బలిచక్రవర్తి వరుణపాశాలతో కట్టివేయబడినందువల్ల అతడు ప్రహ్లాదునికి నమస్కారం చేయడానికి వీలుకాకుండా పోయింది. బలిచక్రవర్తి కన్నులలోకన్నీళ్ళు పొరలినాయి. అతడు సిగ్గుతో తలవంచుకొన్నాడు. వినయవినమ్రుడై తాతకు మ్రొక్కు చెల్లించినాడు. అప్పుడు ప్రహ్లాదుడు, మొగసాలలో సునందుడు మొదలైన వారితో కూర్చున్న వామనదేవుని చూచినాడు.సంతోషంతో అతని కన్నులు చెమ్మగిల్లినాయి. ఒడలు పులకరించింది. అతడు స్వామికి సాగిలపడి నమస్కరించి ఇట్లా అన్నాడు.

**సీ. ఇతనికి మున్ను నీ వింద్రపదం బిచ్చి నేఁడు త్రిప్పుటయును నెఱయ మేలు**
**మోహనాహంకృతి మూలంబు గర్వాంధ తమసవికారంబు దాని మాన్పి**
**కరుణ రక్షించుటగాక బంధించుటే? తత్త్వజ్ఞునకు మహేంద్రత్వమేల?**
**నీ పాదకమలంబు నియతిఁ గొల్చిన దానిఁ, బోలునే సురరాజ్య భోగపరత?**

**తే. గర్వమేపారఁ గన్నులు గానరావు;, చెవులు వినరావు; చిత్తంబు సిక్కుపడును;**
**మఱచు నీ సేవ లన్నియు మహిమ మాన్పి, మేలు సేసితి నీ మేటి మేర సూపి. 652**

* స్వామీ! నీవు వీనికి మొదట ఇంద్రపదవి ఇచ్చినావు. దానిని ఈనాడు తొలగించడం చాలా మేలైనది. ఆ పదవి అజ్ఞానానికి అహంకారానికీ మూలకారణ మైనది. గర్వమనే కారుచీకటిని కలిగించేది. అట్టి దానిని దయతో పోగొట్టి రక్షించడమే కాని ఈ బంధనం శిక్షించడం కాదు. పరమాత్ముని తెలుసుకొన్న వానికి ఇంద్రపదవి ఎందుకూ కొరగానిది. అది నీ పాదసేవకు సాటిరాదు. ఇంద్రపదవిలో గర్వం పెరిగి కన్నులు కనిపించవు. చెవులు వినిపించవు. మనస్సుకు మైకం కమ్ముతుంది. నిన్ను మరచిపోతాడు. అటువంటి పదవిని విడిపించి వీనికి గొప్ప ఉపకారమే చేసినావు.

**వ. అని పలికి జగదీశ్వరుండు నిఖిలలోక సాక్షియు నగు నారాయణ దేవునకు నమస్కరించి ప్రహ్లాదుండు పలుకుచున్న సమయంబున. 653**

* పై విధంగా ప్రహ్లాదుడు లోకనాథుడూ లోకదర్శకుడూ అయిన విష్ణుదేవునకు నమస్కరించి పలికినాడు.

**మ. తతమత్తద్విపయాన యై కుచ నిరుంధ చ్చేళ సంవ్యానయై**
**ధృత బాష్పాంబు వితానయై కరయుగాధీ నాలిక స్థానయై**
**'పతి భిక్షాం మమ దేహి కోమలమతే! పద్మాపతే!' యంచుఁ ద**
**త్సతి వింధ్యావలి సేరవచ్చెఁ ద్రిజగ ద్రక్షామనున్ వామనున్. 654**

**వ. వచ్చి యచ్చేడియ తచ్చరణ సమీపంబునం బ్రణతయై నిలువంబడి యిట్లనియె. 655**

* ఆ సమయంలో బలిచక్రవర్తి భార్య వింధ్యావళి కన్నీరు కారుస్తూ మందగమనంతో అచ్చటికి వచ్చింది. ఆమె వక్షస్థలం నిండా గట్టిగా పైట చెరగు బిగించుకొని ఉంది. రెండు చేతులనూ నుదుటిపై జోడించి "దయామయా! లక్ష్మీపతీ! నాకు పతిభిక్ష పెట్టు" అంటూ ముల్లోకాలకూ ప్రభువైన వామనమూర్తిని వేడుకొన్నది. స్వామి పాదాలకు మ్రొక్కి ఆ ఇల్లాలు ఇట్లా అన్నది.

**క. నీకుం గ్రీడార్థములగు, లోకంబుల జూచి పరులు లోకులు కుమతుల్**
**లోకాధీశుల మందురు, లోకములకు రాజ వీవ లోకస్తుత్యా! 656**

* ఓ లోకపూజ్యుడా! లోకాలు నీవు సంచరించే విహార స్థలాలు. లోకాలకే రాజువు నీవే. తెలివిలేని మూర్ఖులు ఈ లోకాలకు తామే పాలకులమని భావిస్తారు.

**క. కా దనఁడు పొమ్ము లే దీ, రాదనఁడు జగత్త్ర యైక రాజ్యము నిచ్చెన్**
**నా దయితుఁ గట్ట నేటికి?, శ్రీదయితా చిత్తచోర! శ్రితమందారా! 657**

* స్వామీ! నీవు లక్ష్మీ ప్రాణేశ్వరుడవు! ఆశ్రితుల పాలిటి కల్పవృక్షానివి! నా భర్త "కాదు-లేదు-పొమ్ము-ఇవ్వను" అని నిరాకరింపలేదు! మూడు లోకాల రాజ్యాన్నీ నీకు ధారపోసినాడే! అటువంటి ప్రాణేశ్వరుణ్ణి ఎందుకు బంధించినావు?

**వ. అని యిట్లు వింధ్యావళియుం బ్రహ్లాదుండును విన్నవించు నవసరంబున హిరణ్యగర్భుండు సనుదెంచి యిట్లనియె? 658**

* పై విధంగా ప్రహ్లాదుడు వింధ్యావళి విన్నవించిన తరువాత బ్రహ్మదేవుడు వచ్చి వామనస్వామితో ఇట్లా అన్నాడు.

సీ. భూతలోకేశ్వర! భూతభావన! దేవ దేవ! జగన్నాథ! దేవ వంద్య!
తనసొమ్ము సకలంబుఁ దప్పక నీ కిచ్చె దండయోగ్యుఁడు గాఁడు దానపరుఁడు;
గరుణింప నర్హుండు గమలలోచన! నీకు విడిపింపు మీతని వెఱపు దీర్చి;
తోయపూరము సల్లి దూర్వాంకురంబులఁ జేరి నీ పదము లర్చించునట్టి

తే. భక్తియుక్తుఁడు లోకేశపదము నందు, నీవు ప్రత్యక్షముగ వచ్చి నేఁడు వేఁడ
నెఱిఁగి తన రాజ్య మంతయు నిచ్చినట్టి, బలికిఁ దగునయ్య దృఢపాశబంధనంబు? 659

వ. అని పలికిన బ్రహ్మవచనంబులు విని భగవంతుం డిట్లనియె. 660

* ఓ దేవదేవా! దేవవంద్యా! జగన్నాథా! నీవు పరమాత్ముడవు, మహాదేవుడవు. అన్ని ప్రాణులనూ కాపాడి అభివృద్ధి చేసేవాడవు. బలిచక్రవర్తి గొప్పదాత. ఇతడు నీకు తన ధనమంతా ఇచ్చినాడు. ఇతడు శిక్షింప దగినవాడు కాడు; దయ చూపదగినవాడు. ఇతని భయాన్ని పోగొట్టి బంధవిముక్తుణ్ణి చెయ్యి. ఇతడు జలముతో అభిషేకించి గరిక పోచలతో నీ పాదాలు పూజించిన భక్తుడు. లోకాధిపతివైన నీవు స్వయంగా దరిజేరి అడగడాన్ని తెలిసికూడా తన రాజ్యమంతా ఇచ్చినాడు. ఇటువంటి వానిని త్రాళ్ళతో కట్టివేయడం న్యాయమా! ఈ విధంగా పలికిన బ్రహ్మ మాటలు విని భగవంతుడు ఇట్లా అన్నాడు.

సీ. 'ఎవ్వనిఁ గరుణింప నిచ్ఛయించితి వాని యఖిలవిత్తంబు నే నపహరింతు
సంసార గురుమద స్తబ్ధుఁడై యెవ్వఁడు, దెగడి లోకము నన్ను ధిక్కరించు
నతఁడెల్లకాలంబు నఖిలయోనులయందుఁ బుట్టుచు దుర్గతిఁ బొందుఁ బిదప
విత్త వయో రూప విద్యా బలైశ్వర్య కర్మజన్మంబుల గర్వ ముడిగి

తే. యేకవిధమున విమలుఁడై యెవ్వఁ డుండు, వాఁడు నా కూర్చిరక్షింపవలయువాఁడు;
స్తంభలోభాభిమాన సంసార విభవ, మత్తుఁడై చెడ నొల్లఁడు మత్పరుండు. 661

* ఎవనిపై నేను దయ చూపాలనుకొంటానో అటువంటి వాని సంపదనంతా అపహరిస్తాను. సంసార సంబంధమైన గొప్పమైకంతో ఎవడు లోకాన్ని నిందించి నన్ను తిరస్కారం చేస్తాడో వాడు ఎల్లప్పుడూ నానాయోనులలో పుడుతుంటాడు. కడకు నరకానికి పోతాడు. ఎవడైతే ధనానికీ వయస్సుకూ రూపానికీ విద్యకూ బలానికి ఐశ్వర్యానికి వృత్తికీ జన్మకూ సంబంధించిన గర్వాన్ని విడిచిపెట్టి ఎల్లప్పుడూ నిర్మలంగా ఉంటాడో అటువంటి వానిని ప్రీతితో కాపాడుతాను. నా భక్తుడైన వాడు అజ్ఞానంతో దురాశతో గర్వంతో లౌకిక సంపదలతో మదించి నశించడానికి కోరుకోడు.

శా. బద్ధుండై గురుశాపతప్తుఁడయి తా బంధువ్రజత్యక్తుఁడై
సిద్ధైశ్వర్యముఁ గోలుపోయి విభవక్షీణుండునై పేదయై

శుద్ధత్వంబును సత్యముం గరుణయున్ సొంపేమియుం దప్పఁ డు
దుబ్బుద్ధుండై యజయాఖ్యమాయ గెలిచెం బుణ్యుం డితం డల్పుఁడే? 662

* ఈ పుణ్యాత్ముడు బంధింపబడినాడు. గురువు శాపం వల్ల పరితాపానికి గురియైనాడు. బంధువులనుండి విడువ బడినాడు. ప్రాప్తించిన అధికారాన్నీ, ఐశ్వర్యాన్నీ గోల్పోయి పేదవాడైనాడు. ఐనా నిర్మలంగా ఉన్నాడు. సత్యాన్నీ దయనూ సన్మార్గాన్నీ వదలకుండా ఉన్నాడు. జ్ఞానియై గెలవడానికి సాధ్యంకాని మాయను గెలిచినాడు. ఇతడు మహనీయుడు.

ఆ. ఆసురనాథుఁ డనుచు ననఘుని మర్యాద,యేను జూత మనుచు నింత వలుక
నిజము వలికె నితఁడు నిర్మలాచారుండు, మేలు మేలు నాకు మెచ్చువచ్చు. 663

* ఇతనిని పుణ్యాత్ముడైన దనుజేంద్రునిగా నేను ఆదరించాలనే ఉద్దేశంతోనే ఇంతవరకూ ఊరకున్నాను. ఇతడు మంచి నడవడి కలవాడు; సత్యవాది, మేలు మేలు! ఈతని ప్రవర్తన నాకు మెప్పు గొలుపుతున్నది.

క. సావర్ణిమనువు వేళను, దేవేంద్రుం డగు నితండు దేవతలకు; దు
ర్భావిత మగు నా చోటికి, రావించెద; నంత మీఁద రక్షింతు దయన్. 664

* సావర్ణి మనువుకాలంలో ఇతడు దేవతలకు ప్రభువై దేవేంద్రు డవుతాడు. ఊహించడానికి వీలుకాని ఆ పదవికి నేనే పిలిపిస్తాను. దయతో కాపాడుతాను.

క. వ్యాధులు దప్పులు నొప్పులు, బాధలు చెడి విశ్వకర్మభావిత దనుజా
రాధిత సుతలాలయమున, నేధిత విభవమున నుండు నితఁ డందాఁకన్. 665

వ. అని పలికి బలిం జూచి భగవంతుం డిట్లనియె. 666

* అంత వరకూ ఇతడు సుతలలోకంలో దానవుల సేవలు అందుకొంటూ ఐశ్వర్యంతో పెంపొదుతాడు. ఆ లోకాన్ని రోగాలూ శ్రమమూ ఆపదలూ దుఃఖాలు లేకుండా విశ్వకర్మ సృష్టించినాడు. ఈ విధంగా పలికి బలిచక్రవర్తితో భగవంతుడు ఇట్లా అన్నాడు.

సీ. సేమంబు నీ కింద్రసేన మహారాజ! వెఱవకు! మేలు నీ వితరణంబు;
వేలుపు లందుండి వేడుక పడుదురు; దుఃఖంబు లిడుమలు దుర్మరణము
లాతురతలు నొప్పు లందుండు వారికి నొందవు; సుతలమందుండు నీవు;
నీ పంపు సేయని నిర్జరారాతుల నా చక్ర మేతెంచి నఱకుచుండు;

ఆ. లోకపాలకులకు లోనుగా వక్కడ, నన్యు లెంతవార లచట?నిన్ను
నెల్ల ప్రొద్దు వచ్చి యేను రక్షించెదఁ, గరుణతోడ నీకుఁ గానవత్తు. 667

* ఇంద్రసేనమహారాజా! నీకు మేలు కలుగుతుంది. భయపడవద్దు. నీ త్యాగం శ్రేష్ఠమైనది. సుతల లోకంలో ఉండడానికి దేవతలు సైతం కుతూహల పడతారు. ఆలోకంలోని వారికి దుఃఖమూ కష్టమూ దుర్మరణమూ రోగబాధా కీడూ కలుగవు. అటువంటి లోకంలో నీవుండు. నీ ఆజ్ఞ మీరిన రాక్షసులను నా చక్రం నరుకుతుంది. ఆ లోకంలో దిక్పాలకులకు నీపై అధికార ముండదు. ఇంక ఇతరులేమి లెక్క? ఎల్లప్పుడూ నిన్ను నేను రక్షిస్తుంటాను. కనికరంతో నీకు కనిపిస్తుంటాను.

**క. దానవ దైత్యుల సంగతిఁ, బూనిన నీ యసురభావమును దోడ్తో ను**
**ద్ధ్యానమునఁ దొలఁగి పోవును, మానుగ సుతలమున నుండుమా మా యాజ్ఞన్. 668**

* దైత్య దానవుల కలయికవల్ల నీకు కలిగిన రాక్షసత్వం నన్ను ధ్యానించడం వల్ల త్వరలో తొలగి పోతుంది. మా ఆజ్ఞ ప్రకారంగా సంతోషంగా సుతలంలో ఉండు.

**వ. అని యిట్లు పలుకుచున్న ముమ్మూర్తుల ముదుకవేల్పు తియ్యని నెయ్యంపుఁ బలుకుఁ జెఱకు రసంపుసోనలు వీనుల తెరువులం జొచ్చి లోను బయలు నిండి ఱెప్పల కప్పు దప్పం ద్రోచికొని కనుఁగవ కొలంకుల నలుఁగులు వెడలిన చందంబున సంతసంబునం గన్నీరు మున్నీరై పఱవ, నురః ఫలకంబునం బులకంబులు కులకంబులయి తిలకంబు లొత్తఁ, గేలు మొగిడ్చి నెక్కొన్న వేడుకం ద్రొక్కుడువడుచుఁ జిక్కని చిత్తంబునఁ జక్కని మాటలు రక్కసులఱేఁ డిట్లనియె. 669**

* పై విధంగా ప్రీతితో పరమాత్ముడు పలికిన తియ్యని మాటలు బలిచక్రవర్తి చెవులలో చెరుకురసపు జల్లులవలె ప్రవేశించినాయి. లోపలా బయటా నిండినాయి. రెప్పల తొలగద్రోచుకుంటూ కాలువలై వెలువడి సంతోషబాష్పాలు ప్రహించినాయి. వక్షస్థలమంతా పులకాంకురములు నిండినాయి. అప్పుడు బలిచక్రవర్తి మిక్కిలి వేడుకతో చేతులు జోడించి నాడు. స్థిరమైన మనస్సుతో మెల్లగా ఇట్లా అన్నాడు.

**ఉ. ఎన్నడు లోకపాలకుల నీ కృపఁ జూడని నీవు నేఁడు న**
**న్నున్నతుఁ జేసి నా బ్రదుకు నోజయు నానతి యిచ్చి కాచి; తీ**
**మన్నన లీ దయారసము మాటలు పెద్దఱికంబుఁ జాలదే?**
**పన్నగతల్ప! నిన్నెఱిఁగి పట్టిన నాపద గల్గనేర్చునే? 670**

* ఓ పన్నగరాజతల్ప! నీవు దిక్పాలకులపైన కూడా ఏనాడూ ఇంతగా దయ చూపలేదు. ఈనాడు నన్ను గొప్పగా గౌరవించినావు. నా జీవితానికి తేజస్సు నిచ్చి కాపాడినావు. ఈ మన్ననా ఈ కరుణా ఈ మాటల మర్యాదా నాకు చాలు! నిన్ను తెలుసుకొని ఆశ్రయించిన వారికి ఎన్నడూ కష్టాలు కలగవు.

**వ. అని పలికి హరికి నమస్కరించి, బ్రహ్మకుం బ్రణామంబు సేసి, యిందుధరునకు వందనం బాచరించి, బంధవిముక్తుండై తన వారలతోఁ జేరికొని బలి సుతలంబునకుఁ జనియె; నంత హరి కృపావశంబునం గృతార్థుండై కులోద్ధారకుం డయిన మనుమనిం గని సంతోషించి ప్రహ్లాదుండు భగవంతున కిట్లనియె.671**

* పై విధంగా పలికి బలిచక్రవర్తి విష్ణువుకూ బ్రహ్మకూ శివునికీ నమస్కరించినాడు. బంధనం నుండి విడుదల పొంది తన పరివారంతో చేరి సుతలలోకానికి వెళ్ళినాడు. విష్ణుదేవుని దయతో ధన్యుడై కులాన్ని ఉద్ధరించిన మనుమణ్ణి చూచి ప్రహ్లాదుడు సంతోషించినాడు. భగవంతునితో ప్రహ్లాదుడు ఇట్లా అన్నాడు.

**సీ. చతురాననుఁడు నీ ప్రసాదంబు గానఁడు; శర్వుఁ డీ లక్ష్మల జాడఁ బొందఁ,**
**డన్యుల కెక్కడి? దసురులకును మాకు బ్రహ్మాదిపూజితపదుఁడ వయిన**
**దుర్లభుండవు నీవు దుర్గపాలుఁడ వైతి; పద్మజాదులు భవత్పాదపద్మ**
**మకరంద సేవనమహిమ నైశ్వర్యంబు లందిరి కాక మే మల్పమతుల**

**తే. మధిక దుర్యోనులము కుత్సితాత్మకులము, నీ కృపాదృష్టిమార్గంబు నెలవు సేర**
**నేమి తప మాచరించితి మెన్నఁగలమె?, మమ్ముఁగాచుట చిత్రంబు మంగళాత్మ! 672**

* ఓ మంగళస్వరూపా! బ్రహ్మదేవుడు ఇంతగా నీ అనుగ్రహాన్ని పొందలేదు. శివుడు కూడా ఇంతగా ఆదరాభిమానాలు పొందలేదు. ఇంక ఇతరులెంత! బ్రహ్మాదులచేత నీవు పూజింపబడినవాడవు. నీ దరిజేరడానికి ఎవరికీ సాధ్యం కాదు. ఇటువంటి నీవు మా రాక్షసులకు దుర్గరక్షకుడవైనావు. నీ పాదపద్మాల మకరందాన్ని సేవించిన మహిమ వల్ల బ్రహ్మాదులు ఐశ్వర్యాన్ని పొందినారు. కానీ మేము చాల అల్పులము. నీచ జన్మ కలవారము. ఏమి తపస్సు చేయడం వల్ల మాపై నీ కరుణాకటాక్షం కురిసిందో ఊహించలేము. నీవు మమ్ములను కాపాడడం ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నది.

**వ. అదియునుం గాక. 673**

**ఆ. సర్వగతుఁడ వయ్యు సమదర్శనుఁడ వయ్యు, నొకట విషమవృత్తి నుండు దరయ**
**నిచ్చ లేనివారి కీవు భక్తులు గోరు, తలఁపు లిత్తు కల్పతరువు మాడ్కి. 674**

**వ. అని విన్నవించుచున్న ప్రహ్లాదుం జూచి, పరమ పురుషుం డిట్లనియె. 675**

* అంతేకాక నీవు అన్నింటిలోనూ ఉంటావు. అందరినీ సమానంగా చూస్తావు. అయినప్పటికీ కొన్నిచోట్ల పక్షపాతాన్ని కూడా చూపుతావు. భక్తిలేనివారి కోరికలు తీర్చవు. కల్పవృక్షంవలె భక్తులైనవారి కోరికలు నెరవేర్చుతావు- ఈ విధంగా మనవి చేసిన ప్రహ్లాదునితో పరమాత్ముడు ఇట్లా అన్నాడు.

**తే. వత్స! ప్రహ్లాద! మేలు నీ వారి నీవు, సొరిది మనుమనిఁ దోడ్కొని సుతలమునకుఁ**
**బయనమై పొమ్ము నే గదాపాణి నగుచుఁ, జేరి రక్షింతు దురితంబు సెంద దచట. 676**

* నాయనా ప్రహ్లాదా! చాలా సంతోషం! నీవు నీ మనుమనితో పాటు నీవారితోపాటు సుతల లోకానికి వెళ్ళు. నేను గదాహస్తుడనై వచ్చి మిమ్ములను కాపాడుతాను. అక్కడ మీకు ఏ కష్టమూ కలుగదు.

వ. అని యిట్లు నియమించిన బరమేశ్వరునకు నమస్కరించి వలగొని కరకమల పుటఘటిత నిటల తటుండై, వీడ్కొని బలిం దోడ్కొని సకల సురయూథంబునుం దానునొక్క మహాబిలద్వారంబు సొచ్చి ప్రహ్లాదుఁడు సుతలలోకంబునకుం జనియె; నంత బ్రహ్మవాదులయిన యాజకుల సభామధ్యంబునం గూర్చున్న శుక్రునిం జూచి నారాయణుం డిట్లనియె. 677

* పై విధంగా ఆజ్ఞాపించిన భగవంతునికి ప్రహ్లాదుడు నమస్కరించి ప్రదక్షిణం చేసినాడు. నొసటిపై చేతులు జోడించి సెలవు తీసుకొన్నాడు. అటుపిమ్మట అతడు బలిచక్రవర్తినీ రాక్షసుల సమూహాన్నీ వెంటబెట్టుకొని ఒక గొప్ప గుహాద్వారంగుండా సుతలలోకానికి చేరినాడు. ఆటు తర్వాత మహావిష్ణువు బ్రహ్మవేత్తలైన ఋత్విజుల నడుమ సభలో కూర్చున్న శుక్రాచార్యుని చూచి ఇట్లా అన్నాడు.

ఆ. 'ఏమి గొఱఁత వడియె నీ బలి జన్నంబు, విస్తరింపు కడమ విప్రవర్య!
విషమ మయిన కర్మ విసరంబు బ్రాహ్మణ, జనులు సూచినంత సమతఁ బొందు' 678

వ. అనిన శుక్రుం డిట్లనియె. 679

* ఆచార్యవర్యా! బలిచక్రవర్తి యాగానికి లోపమేమీ రాకూడదు. ఈ యజ్ఞంలో మిగిలిన కార్యాన్ని నీవు నెరవేర్చు. ఆగిపోయిన యజ్ఞకార్యాలు మీవల్ల బ్రహ్మవేత్తలవల్ల సఫలమవుతాయి- ఈ విధంగా పలికిన విష్ణువుతో శుక్రుడు ఇట్లా అన్నాడు.

సీ. అఖిల కర్మంబుల కధినాథుఁడవు నీవ; యజ్ఞేశుఁడవు నీవు యజ్ఞపురుష!
ప్రత్యక్షమున నీవు పరితుష్టి నొందినఁ గడ మేల కల్గు నే కర్మములకు?
ధనదేశకాలార్హ తంత్రమంత్రంబులఁ గొఱఁతలు నిన్నుఁ బేర్కొనిన మాను;
నయినఁ గావింతు నీయానతి భవదాజ్ఞ మెలఁగుట జనులకు మేలుగాదె?

తే. యింతకంటెను శుభము నా కెచటఁ గలుగు, ననుచు హరిపంపు శిరమున నావహించి
కావ్యుఁ డసురేంద్రుజన్నంబు కడమఁ దీర్చె, మునులు విప్రులు సాహాయ్యమునఁ జరింప. 680

*'విష్ణుదేవా! అన్ని కార్యాలకు అధినాథుడవు నీవే. యజ్ఞాలకు అధికారివి నీవే. నీవు సంతోషిస్తే ఏకార్యాలకూ లోపం కలుగదు. నిన్ను ధ్యానం చేస్తే ధనానికి దేశానికీ మంత్ర తంత్రాలకూ ప్రాప్తించిన దోషాలు తొలగిపోతాయి. మంచిది! నీ ఆజ్ఞ ప్రకారమే చేస్తాను. నీ ఆజ్ఞకు లోబడి మెలగడమే మానవులకు మేలు. ఇంతకంటే నాకు భాగ్యమేముంది?'-ఈ విధంగా పలికి శుక్రుడు విష్ణువు ఆజ్ఞను తలదాల్చి బలిచక్రవర్తి యాగాన్ని పూర్తిచేసినాడు. అతనికి ఋషులూ బ్రాహ్మణులూ తోడ్పడినారు.

వ. ఇ వ్విధంబున వామనుం డయి హరి బలి నడిగి, మహిం బరిగ్రహించి, తనకు నగ్రజుండగు నమరేంద్రునకుం ద్రిదివంబు సదయుండయి యొసంగె; నత్తఱి దక్షభృగు ప్రముఖ ప్రజాపతులును, భవుండును, గుమారుండును, దేవర్షి పితృగణంబులును, రాజులును, దానును గూడికొని

**చతురాననుండు గశ్యపునకు నదితికి సంతోషంబుగా లోకంబులకు లోకపాలురకు 'వామనుండు వల్లభుం'డని నియమించి యంత ధర్మంబునకు యశంబునకు లక్ష్మికి శుభంబులకు దేవతలకు వేదంబులకు స్వర్గాపవర్గంబులకు 'నుపేంద్రుండు ప్రధానుం' డని సంకల్పించె; నా సమయంబున.681**

* పై విధంగా విష్ణువు వామనుడై బలిచక్రవర్తి వద్ద భూదానం తీసుకొన్నాడు. అతడు తన అన్నయైన ఇంద్రునికి దయతో స్వర్గలోకాన్ని ఇచ్చినాడు. ఆసమయంలో బ్రహ్మదేవుడు దక్షుడూ భృగువూ మొదలైన ప్రజాపతులతోనూ శివునితోనూ కుమారస్వామితోనూ నారదునితోనూ పితృదేవతలతోనూ రాజులతోనూ కలుసుకొన్నాడు.. కశ్యపునికి అదితికీ సంతోషం కలిగే విధంగా లోకాలకూ దిక్పాలకులకూ 'వామనుడు ప్రభువు' అని కట్టుబాటు చేసినాడు. అంతేకాక ధర్మానికి కీర్తికీ సంపదలకూ శుభాలకూ దేవతలకూ స్వర్గానికీ మోక్షానికి 'వామనుడే అధికారి' అని నిర్ణయం చేసినాడు.

**క. కమలజుఁడు లోకపాలురు, నమరేంద్రునిఁగూడి దేవయానంబున న**
**య్యమరావతికిని వామను, నమరం గొనిపోయి రంత నట మీఁద నృపా! 682**

ఓ పరీక్షిన్మహారాజా! అటుతరువాత బ్రహ్మదేవుడూ దిక్పాలకులూ దేవేంద్రునితో కలిసి ఎంతో ఆదరంతో వామనుణ్ణి విమానంపై కూర్చోబెట్టుకొని అమరావతికి తీసుకొని వెళ్ళినాడు.

**ఆ. బల్లిదంపుఁదోడు ప్రాపున నింద్రుని, కింద్రపదము సేరు టిట్లు గలిగెఁ;**
**దనకు నాఢ్యుఁడైన తమ్ముఁడు గలిగినఁ, గోర్కు లన్న కేల కొఱఁత నొందు? 683**

* బలవంతుడైన తమ్ముని ప్రాపువల్ల ఈ విధంగా ఇంద్రునికి ఇంద్రపదవి లభించింది. ఉత్తముడైన తమ్ముడుంటే అన్న గారి కోరికలు నెరవేరకుండా ఉంటాయా?

**క. పా లడుగఁడు మే లడుగం, డేలఁడు భిక్షించి యన్న కిచ్చెఁ ద్రిజగముల్**
**వేలుపులతల్లి కడపటి, చూలుం బోలంగఁ గలరె సొలయని తమ్ముల్. 684**

*దేవతల తల్లి అదితి దేవికి కడగొట్టు కొడుకైన వామనుడు భిక్షమడిగి సంపాదించిన ముల్లోకాలనూ తన అన్నకే ఇచ్చినాడు. అందులో భాగాన్ని అడుగలేదు; లాభాన్ని అడుగలేదు. ఆ విధంగా అన్నలకోసం శ్రమపడని తమ్ముళ్ళు వామనునితో సాటి కాలేరు.

**ఆ. కడుపు బదరగాఁగఁ గొడుకులఁ గనుకంటెఁ, దల్లికొకఁడె చాలు బల్లిదుండు;**
**ద్రిదశగణముఁ గన్న యదితి కానుపు దీర్చి, జిన్ని మేటివడుగుఁ గన్న యట్లు. 685**

* దేవతల సమూహాన్ని కన్న అదితి చివరికి అదృష్టం పండేటట్లు వామనుని కన్నది. తల్లి కడుపు చెక్కలయ్యేటట్లు గంపెడు కొడుకులను కన్నదానికంటె ఆ విధంగా ఉత్తముడైన వానిని ఒక్కనిని కనినా చాలు.

వ. ఇట్లు దేవేంద్రుడు వామన భుజపాలితం బగు త్రిభువన సామ్రాజ్య విభవంబు మరల నంగీకరించె; నప్పుడు బ్రహ్మయు, శర్వుండును, గుమారుండును, భృగుప్రముఖు లయిన మునులును, బితృదేవతలును, దక్షాది ప్రజాపతులును, సిద్ధులును, వైమానికులును మఱియుం దక్కినవారలును, బరమాద్భుతం బైన విష్ణుని సుమహా కర్మంబులకు నాశ్చర్యంబు వొందుచుఁ, బ్రశంసించుచు, నాడుచుం, బాడుచుం, దమతమ నివాసంబులకుం జని; రని చెప్పి శుకుం డిట్లనియె. 686

* పై విధంగా వామనుడు సంపాదించి ఇచ్చిన మూడులోకాల సామ్రాజ్య సంపదనూ దేవేంద్రుడు తిరిగీ తీసుకొన్నాడు. అటు పిమ్మట బ్రహ్మ శివుడూ కుమారస్వామీ భృగువూ మొదలైన మునులూ పితృదేవతలూ దక్షుడు మొదలైన మునులూ ప్రజాపతులూ సిద్ధులూ దేవతలూ ఇంకా తక్కినవారు అచ్చెరువుగొల్పే విష్ణుదేవుని లీలావిలాసాలకు ముచ్చటపడుతూ పొగడుతూ ఆటపాటలతో తమ తమ నివాసాలకు వెళ్ళినారు- అని చెప్పి శుకుడు ఇట్లా అన్నాడు.

తే. మనుజనాథ! త్రివిక్రము మహిమ కొలఁది, యెఱుఁగఁ దర్కింప లెక్కింప నెవ్వఁడోపుఁ?
గుంభినీ రేణుకణములు గుఱుతు పెట్టు, వాఁడు నేరఁడు దక్కినవారి వశమె? 687

* ఓ రాజా! వామనుని గొప్ప గుణాలను పూర్తిగా తెలుసుకోవడానికి ఊహించడానికీ లెక్కపెట్టడానికీ ఎవనికీ సాధ్యంకాదు. భూమిలోని ధూళికణాలను లెక్కపెట్టగలిగిన వారికైనా ఇది సాధ్యంకాదు. ఇంక వేరే వారి సంగతి చెప్పేదేముంది?

క. అద్భుత వర్తనుఁడగు హరి, సద్భావితమైన విమలచరితము విను వాఁ
డుద్భట విక్రముఁడై తుది, నుద్భాసితలీలఁ బొందు నుత్తమ గతులన్. 688

* అత్యద్భుతమైన లీలలతోకూడిన విష్ణువును గురించి తెలిపే ఈ పుణ్యాచరిత్రను వినేవాడు గొప్ప భాగ్యవంతు డవుతాడు. చివరికి ప్రకాశించే ప్రభావంతో దివ్యసుఖాలు పొందుతాడు.

తే. తగిలి మానుష పైతృక దైవకర్మ, వేళలందుఁ ద్రివిక్రమ విక్రమంబు
లెక్క డెక్కడఁ గీర్తింతు రెవ్వరేనిఁ, బొందుదురు నిత్య సౌఖ్యంబు భూవరేంద్ర! 689

* ఓ రాజా! మానవులకూ పితృదేవతలకూ దేవతలకూ సంబంధించిన పుణ్యాకార్యాలు చేసేవారు ఎవరైనా త్రివిక్రముని పవిత్ర చరిత్రను కీర్తించితే వారు ఎల్లప్పుడూ సుఖాలు అనుభవిస్తారు.

## -: మత్స్యావతార కథా ప్రారంభము :-

వ. అని యిట్లు శుకుఁడు రాజునకు వామనావతార చరితంబు సెప్పెనని సూతుండు మునులకుం జెప్పిన విని, వార లతని కిట్లనిరి. 690

* పై విధంగా శుకుడు పరీక్షిత్తుకు వామనావతార కథను చెప్పినాడని సూతుడు శౌనకాది మహర్షులకు తెలిపినాడు. అప్పుడు శౌనకాది మునులు సూతునితో ఇట్లా అన్నాడు.

సీ. 'విమలాత్మ! విన మాకు వేడ్క యయ్యెడు; మున్ను హరి మత్స్యమైన వృత్తాంతమెల్లఁ;
గర్మబద్ధుని భంగి ఘనుఁ డీశ్వరుఁడు లోక నిందితంబై తమోనిలయమైన
మీనరూపము నేల మే లని ధరియించె? నెక్కడ వర్తించె? నేమి సేసె?
నాద్యమై వెలయు న య్యవతారమునకు నెయ్యది కారణంబు? గార్యాంశ మెట్లు?

ఆ. నీవు దగుదు మాకు నిఖిలంబు నెఱిఁగింపఁ, దెలియఁ జెప్పవలయు, దేవదేవు!
చరిత మఖిలలోక సౌభాగ్యకరణంబు, గాదె; విస్తరింపు క్రమముతోడ' 691

వ. అని, మునిజనంబులు సూతు నడిగిన నతం డిట్లనియె; మీర లడిగిన యీ యర్థంబుఁ బరీక్షిన్నరేంద్రుం డడిగిన భగవంతుండగు బాదరాయణి యిట్లనియె. 692

* ఓ పుణ్యాత్ముడా! పూర్వం విష్ణువు మత్స్యావతారాన్ని ధరించిన వృత్తాంతం వినాలని కుతూహలంగా ఉంది. భగవంతుడు కర్మకు కట్టుబడిన వానివలె లోకంలో గౌరవమూ జ్ఞానమూ లేని చేప రూపాన్ని ఎందుకు ధరించినాడు? ఎక్కడుండినాడు? ఏమి చేసినాడు? మొదటిదైవ ఆ అవతారానికి కారణమేమి? దాని అవసరమేమి? దీనినంతా తెలుపగల సమర్థుడవు నీవే. విష్ణుదేవుని కథ లోకాలకు మేలు కలిగించేదికదా! కాబట్టి దీనిని విశదంగా తెలియజెప్పు- ఈ విధంగా అడిగిన మునులతో సూతుడు ఇట్లా అన్నాడు. మీరు అడిగినట్లే పరీక్షిత్తు శుకుని అడిగినాడు. అందుకు ఆ మహాముని ఇట్లా చెప్పినాడు.

సీ. విభుఁ డీశ్వరుఁడు వేదవిప్రగోసురసాధు ధర్మార్థములఁ గావఁ దనువుఁ దాల్చి
గాలిచందంబున ఘనరూపములయందుఁ దనురూపములయందుఁ దగిలియుండు;
నెక్కువ దక్కువ లెన్నఁడు నొందక నిర్గుణత్వంబున నెఱియు ఘనుఁడు;
గురుతయుఁ గొఱఁతయు గుణసంగతి వహించు; మనుజేశ! చోద్యమే మత్స్య మగుట?

తే. వినుము పోయిన కల్పాంతవేళఁ దొల్లి, ద్రవిళదేశపురాజు సత్యవ్రతుండు
నీరు ద్రావుచు హరిఁగూర్చి నిష్ఠతోడఁ, దపముఁ గావించె నొక యేటితటమునందు. 693

* ఓ రాజా! విను. ప్రభువైన విష్ణువు వేదాలనూ బ్రాహ్మణులనూ గోవులనూ దేవతలనూ సజ్జనులనూ ధర్మాన్నీ అర్థాన్ని రక్షించడం కోసం అవతారాలు ధరిస్తాడు. వాయువు విధంగా గొప్పరూపాలలోనూ సూక్ష్మమైన రూపాలలోనూ చేరి ఉంటాడు. అతడు ఎల్లప్పుడూ ఎక్కువ తక్కువలు లేని నిర్గుణ పరబ్రహ్మ మైనప్పటికీ గుణరహితుడై గొప్పతనాన్నీ, తక్కువతనాన్నీ, గుణాల కలయికనూ పొందుతుంటాడు. అందువల్ల అతడు మత్స్యావతారం ధరించటంలో ఆశ్చర్యం లేదు. పోయిన కల్పం చివర ద్రవిడదేశానికి రాజైన సత్యవ్రతుడు కేవలం నీళ్ళే ఆహారంగా తీసుకుంటూ ఒక నదిగట్టుపై విష్ణువును గురించి తపస్సు చేసేవాడు.

వ. మఱియు నొక్కనాఁ డమ్మేదినీ కాంతుండు గృతమాలికయను నేటిపొంత హరిసమర్పణంగా జలతర్పణంబు సేయుచున్న సమయంబున నా రాజు దోసిట నొక్క మీనుపిల్ల; దవిలి వచ్చిన నులికిపడి,

**మరలం దరంగిణీ జలంబునందు శకుల శాబకంబు విడిచె నట్లు విడివడి నీటిలో నుండి జలచరపోతంబు భూతలేశ్వరున కిట్లనియె.** 694

* సత్యవ్రతుడు ఒకనాడు కృతమాలిక అనే నది దగ్గర విష్ణువుకు ప్రీతి కలిగేటట్లు నీళ్ళతో తర్పణం విడుస్తున్నాడు. అప్పుడు అతని దోసిలిలో ఒక చేపపిల్ల కనిపించింది. అతడు ఉలికిపడి ఆ చేపపిల్లను నది నీళ్ళలో వదలినాడు. నదిలో చేరిన చేపపిల్ల ఆ రాజుతో ఇట్లా అన్నది.

**మత్తకోకిల.**
**"పాటువచ్చిన జ్ఞాతి ఘాతులు పాపజాతి ఝషంబు లీ**
**యేటఁ గొండొక మీనుపిల్లల నేఁతి పట్టి వధింప న**
**చ్చోట నుండక నీదు దోసిలి సొచ్చి వచ్చిన నన్ను న**
**ట్టేటఁ ద్రోవఁగఁ బాడియే? కృప యింత లేక దయానిధీ?** 695

* ఓ దయామయుడా! ఈ నదిలో దాయాదులను చంపే పాపిష్ఠి చేపలున్నాయి. అవి చిన్న చేపలను పట్టి మ్రింగుతాయి. అందువల్ల ఇక్కడ ఉండలేక నీ దోసిటిలోనికి వచ్చినాను. దయలేకుండా నన్ను నట్టేటిలో త్రోయడం న్యాయం కాదు.

**ఆ. వలలుఁ దారు నింక వచ్చి జాలరి వేఁట, కాలు నేలు గలఁచి గారవెట్టి**
**మిడిసి పోవనీక మెడఁ బట్టుకొనియెద;, రప్పు డెందుఁ జొత్తు? ననఘ చరిత!** 696

* ఓ పుణ్యాత్ముడా! ఇంక చేపలు పట్టేవారు వలలు తీసుకొని వస్తారు. నదిని కలత పెట్టి నన్ను బంధిస్తారు. తప్పించుకోకుండా మెడ పట్టుకొంటారు. అప్పుడు ఎక్కడ దాగుకోగలను?

**క. భక్షించు నొండె ఝషములు, శిక్షింతురు ధూర్తు లొండెఁ; జెడకుండ ననున్**
**రక్షింపు దీనవత్సల!, ప్రక్షీణులఁ గాచుకంటె భాగ్యము కలదే?"** 697

* ఓ దీనవత్సలా! నన్ను పెద్దచేపలైనా తింటాయి. లేదా బెస్తలైనా పట్టుకొంటారు. ఆ విధంగా చచ్చిపోకుండా నన్ను ఆదుకో. బలహీనులను కాపాడడానికంటే పరమ పుణ్యం లేదు.

**వ. అనిన విని కరుణాకరుండగు న వ్విభుండు మెల్లన య య్యంభశ్చరడింభకంబును గమండలు జలంబునం బెట్టి తన నెలవునకుం గొనిపోయె, నదియు నొక్క రాత్రంబునం గుండిక నిండి తనకు నుండ నిమ్ము సాలక రాజన్యున కిట్లనియె.** 698

* సత్యవ్రతుడు చేపపిల్ల మాటలు విని జాలిపొందినాడు. మెల్లగా దానిని తన కమండలం నీళ్ళలో ఉంచుకొన్నాడు. తన నివాసానికి తీసుకొని పోయినాడు. ఒక్క రాత్రిలోనే ఆ చేపపిల్ల కమండలమంతా నిండిపోయింది. ఉండడానికి చోటుచాలక రాజుతో ఇట్లా అన్నది.

క. 'ఉండ నిది గొంచె మెంతయు, నొండొకటిం దెమ్ము భూవరోత్తమ?' యనుడున్
గండకముఁ దెచ్చి విడిచెను, మండలపతి సలిలకలశ మధ్యమునందున్. 699

* "ఓ రాజేంద్రా! నేను ఉండడానికి ఈ కమండలం చాలదు. ఇంకొక దానిని తీసుకొనిరా" అని చేపపిల్ల పలుకగా సత్యవ్రతుడు ఒక నీళ్ళ కడవలో దానిని విడిచినాడు.

వ. అదియును ముహూర్తమాత్రంబునకు మూఁడు చేతులనిడుపై యుదంచనంబు నిండి పట్టు సాలక వేఱొండు దెమ్మనవు డా రాచపట్టి కరుణాగుణంబునకు నీడపట్టు గావున గండకంబు నొండొక్క చిఱుతమడుఁగున నునిచె; నదియు నా సరోవర జలంబునకు నగ్గలంబై 'తనకు సంచరింప నిదిగొంచెం' బని పలికినం బుడమితేఁడు మంచివాఁ డగుటం జేసి యా కంచరంబు నుదంచిత జలాస్పదంబైన హ్రదంబునందు నిడియె; నదియు నాసలిలాశయంబునకును నధికంబై పెరుఁగ నిమ్ము సాలదని చెప్పికొనిన నప్పుణ్యుం డొప్పెడి నడవడిం దప్పనివాఁడైన కతంబున నమ్మహామీనంబును మహార్ణ వంబున విడిచె; నదియును మకరాకరంబునం బడి రాజున కి ట్లను బెనుమొసళ్లు ముసరికొని కసిమసంగి మ్రింగెడి; నింత కాలంబు నడపి కడపట దిగవిడువకు; వెడలఁ దిగువు' మని యెలింగింపఁ దెలిసి య న్నీటి తిరుగుడు ప్రోడకుం బుడమితేఁ డిట్లనియె. 700

* క్షణకాలంలోనే ఆ చేప మూడుచేతుల పొడవై ఆ పాత్రంతా నిండిపోయింది. చోటు చాలక 'ఇంకొక దానిని తెమ్మన్నది. దయామయుడైన సత్యవ్రతుడు ఆ చేపను ఒక చిన్న మడుగులో విడిచినాడు. అది ఆ మడుగుకంటే పెద్దదై 'నేను తిరగడానికి ఇది చాలదు' అని చెప్పింది. ఉత్తముడైన రాజు ఆ చేపను ఎక్కువ నీళ్ళుండే పెద్ద చెరువులో విడిచినాడు. ఆ చెరువు కంటే ఆ చేప పెద్దదిగా పెరిగింది. 'చోటు చాల' దని చెప్పుకొన్నది. ఆ పుణ్యాత్ముడు ఆ పెద్ద చేపను పెద్ద సముద్రంలో విడిచినాడు. సముద్రంలో చేరిన తరువాత "పెద్ద మొసళ్ళు నన్ను చుట్టుకొని పట్టుకొని చంపి మ్రింగుతాయి. ఇంతకాలమూ కాపాడి ఇప్పుడు నన్ను విడిచి పెట్టవద్దు. బయటికి ఎత్తుకో" అని ఆ చేప రాజుతో మొరపెట్టకొన్నది. అప్పుడు నేర్పరియైన చేపతో రాజు ఇట్లా అన్నాడు.

సీ. ఒక దినంబున శతయోజనమాత్రము విస్తరించెదు నీవు; వినుము చూడ
మిటువంటి ఝషముల నెన్నఁడు నెఱుఁగము; మీనజాతుల కిట్టి మేను గలదె?
యేమిటి కెవ్వఁడ? వీ లీలఁ ద్రిప్పెదు కరుణ నాపన్నులఁ గావ వేఁడి
యంభశ్చరంబైన హరివి నే నెఱిఁగితి నవ్యయ! నారాయణాభిధాన!

తే. జనన సంస్థితి సంహార చతురచిత్త!, దీనులకు భక్తులకు మాకు దిక్కు నీవ
నీదు లీలావతారముల్ నిఖిలభూత, భూతి హేతువుల్ మ్రొక్కెదఁ బురుషవర్య! 701

* ఒక్కరోజులోనే నీవు నూరు ఆమడల దూరం వ్యాపించినావు. ఇటువంటి చేపలను మేము ఎన్నడూ కని విని ఎరుగము. చేప జాతులకు ఇంతటి శరీరం ఉండదు. నీ వెవరు? ఎందులకు ఇబ్బంది పెట్టుతున్నావు? నీవు దీనులను కాపాడడం కోసం చేపరూపం ధరించిన విష్ణుదేవుడవని నేను తెలుసుకొన్నాను. అచ్యుతా! నారాయణా! లోకాలను సృష్టించి పోషించి లయం చేసే మహానుభావుడవు నీవు? దిక్కులేని భక్తులమైన మాకు నీవే దిక్కు. మహిమతోకూడిన నీ అవతారాలు అన్ని ప్రాణులకూ మేలు కలిగిస్తాయి. ఓ పురుషోత్తమా! అటువంటి నీకు మ్రొక్కుతున్నాను.

క. ఇతరులము గాము చిత్సం, గతులము మాపాల నీవు గలిగితి భక్త
స్థితుఁడవగు నిన్ను నెప్పుడు, నతిసేసిన వాని కేల నాశము గలుగున్? 702

* మేము నీకు పరాయి వాళ్ళము కాము. నిర్మలమైన జ్ఞానం కలవాళ్ళము. మాకు అండగా నీవు దొరికినావు. ఎల్లప్పుడూ భక్తులలో నివసించేవాడవు నీవు. నీకు నమస్కరించిన వానికి చేటు వాటిల్లదు.

క. శ్రీలలనాకుచవేదికఁ, గేళీపరతంత్రబుద్ధిఁ గ్రీడించు సుఖా
లోలుఁడవు దామసాకృతి, నేలా మత్స్యంబ వైతి వెఱిగింపు హరీ!" 703

వ. అని పలుకు సత్యవ్రత మహారాజునకు నయ్యుగంబు కడపటఁ బ్రళయవేళా సముద్రంబున నేకాంతజన ప్రీతుండయి విహరింప నిచ్ఛించు మీనరూపధరుండైన హరి యిట్లనియె. 704

* ఓ స్వామీ! నీవు లక్ష్మీదేవి వక్షస్థలం మీద క్రీడిస్తూ సంతోషంతో విహరించే ఆనందస్వరూపుడవు. అజ్ఞానంతో కూడిన చేప రూపాన్ని ఎందుకు ధరించినావు చెప్పు? 'ఈ విధంగా సత్యవ్రతుడు అడిగినాడు. ఆ యుగం చివర ప్రళయ కాలంలో ఒంటరిగా సముద్రంలో సంచరించడానికోసం చేపరూపాన్ని ధరించిన శ్రీమహావిష్ణువు సత్యవ్రతునితో ఇట్లా అన్నాడు.

సీ. ఇటమీఁద నీ రాత్రి కేడవదినమునఁ బద్మగర్భుని కొక్కపగలు నిండు;
భూర్భువాదిక జగంబులు మూఁడు విలయాబ్ధి లోన మునుంగు; నా లోనఁ బెద్ద
నావ సేరఁగ వచ్చు; నా పంపు పెంపున దానిపై నోషధితతులు బీజ
రాసులు నిడి పయోరాశిలో విహరింపఁ గలవు సప్తర్షులుఁ గలసి తిరుగ

ఆ. మ్రోలఁ గాన రాక ముంచు పెంజీఁకటి, మిడుకుచుండు మునుల మేని వెలుఁగు
దొలఁకుచుండు జలధి దోదూయమాన మై, నావ దేలుచుండు నరవరేణ్య! 705

* ఓ నృపవరేణ్యా! ఈ రాత్రి గడచిన తరువాత రాబోయే ఏడవ దినముతో బ్రహ్మకు ఒక పగలు పూర్తి అవుతుంది. భూలోకం మొదలుకొని మూడు లోకాలూ ప్రళయసముద్రంలో మునుగుతాయి. అప్పుడు నా ఆజ్ఞానుసారం ఒక పెద్ద నావ నీ దగ్గరికి వస్తుంది. అప్పుడు నీవు సమస్తములైన ఓషధీసమూహాలు విత్తనాల రాసులూ ఆ నౌకపై ఉంచుకొని ప్రళయ సముద్రజలాలలో విహరించు. సప్తఋషులు నీతో కలిసి

ఆ ఓడలో ఉంటారు. మీ ముందుభాగంలో పెనుచీకటి ఆవరిస్తుంది. మునుల మేనికాంతులు మిణుకు మిణుకు మంటూ మెరుస్తుంటాయి. సముద్రంలో నావ ఊగుతూ తేలుతూ సాగిపోతూ ఉంటుంది.

**వ. మఱియు నన్నావ మున్నీటి కరళ్లకు లోనుగాకుండ, నిరుగెలంకుల వెనుక ముందట నేమఱకుండఁ బెన్నెఱులగు నా గఱులన్ జడియుచుఁ బొడువ వచ్చిన బలుగ్రాహంబుల నొడియుచు సంచరించెద; నొక్క పెనుఁబాము చేరువ నా యనుమతిం బొడసూపెడు దానంజేసి సుడిగాడ్పుల కతంబున నావ వడిం దిరుగంబడకుండ నా కొమ్ము తుదిం బదిలముచేసి నీకును మునులకును నలజడి సెందకుండ మున్నీట నిప్పాటం దమ్మిచూలి రేయి వేగునంతకు మెలంగెద; నది కారణంబుగా జలచర రూపంబుఁ గయికొంటి; మఱియును; బ్రయోజనంబు గలదు. నా మహిమ పరబ్రహ్మంబని తెలియుము. నిన్ను ననుగ్రహింతు నని సత్యవ్రతుండు సూడ హరి తిరోహితుండయ్యె; న య్యవసరంబున. 706**

* ఆ ఓడ సముద్రపు అలలకు దెబ్బతినకుండా మత్స్యరూపం ధరించిన నేను అన్నివైపులా పెద్ద ఈకలతో కూడిన నా రెక్కలను కదలిస్తూ ఉంటాను. నావను భగ్నంచేయడానికి వచ్చే పెద్దపెద్దజలచరాలను తరిమివేస్తూ తిరుగుతుంటాను. నా ఆజ్ఞానుసారంగా ఒక పెద్దపాము అక్కడ కనిపించుతుంది. సుడిగాడ్పులకు నావ తిరగబడకుండా ఆ పాముతో నా కొమ్ముకొనకు ఆ నావను బంధించు. నీకూ మునీశ్వరులకూ చేటువాటిల్లకుండా ఆ ప్రళయరాత్రి గడిచేటంతవరకు నేను రక్షిస్తూ ఉంటాను. ఇందుకోసమే నేను ఈ విధమైన మీనరూపం ధరించాను. ఇంకా విశేషమేమంటే నేను నిన్ను అనుగ్రహిస్తాను. పరబ్రహ్మస్వరూపమైన నా మహిమ తెలుసుకో. ఈ విధంగా పలికి శ్రీహరి అదృశ్యమైనాడు.

**ఆ. మత్స్య రూపియైన మాధవు నుడుగులు, దలఁచి కొనుచు రాచతపసి యొక్క<br>దర్భశయ్యఁ దూర్పు దలగడగాఁ బండి, కాచి యుండె నాఁటి కాలమునకు. 707**

* చేప రూపంతో విష్ణువు పలికిన మాటలను తలచుకొంటూ సత్యవ్రతుడు దర్భల శయ్యపై తూర్పువైపు తలగడగా పరుండి ప్రళయ సమయం కోసం వేచి ఉన్నాడు.

**వ. అంతఁ గల్పాంతంబు డాసిన. 708**

**క. ఉల్లసిత మేఘపంక్తులు, జల్లించి మహోగ్రవృష్టి జడిగొని కురియన్<br>వెల్లి విరిసి జలరాసులు, సెల్లెలి కట్టలను దాఁటి సీమల ముంచెన్. 709**

* అటు పిమ్మట ప్రళయం సమీపించింది. మెరుపులతో కూడిన మేఘాలు ఎడతెరిపి లేకుండా భయంకరమైన వర్షం కురిపించినాయి. సముద్రాలు చెలియలి కట్టలు దాటి పొంగిపొరలి దేశాలను ముంచి వేసినాయి.

**వ. తదనంతరంబ. 710**

**తే. మున్ను పోయిన కల్పాంతమున నరేంద్ర!, బ్రాహ్మ మనఁగ నైమిత్తిక ప్రళయవేళ**
**నింగిపై నిట్టతొలఁకు మున్నీటిలోనఁ, గూలె భూతాళి జగముల కొలఁదు లెడలి. 711**

* ఓ రాజా! బ్రాహ్మమనే కల్పాంతకాలంలో ఏర్పడిన ఆ ప్రళయంలో సముద్రజలాలు హద్దులు దాటి ఆకాశమంతా వ్యాపించినాయి. ప్రాణుల సమూహాలు ప్రాణాలు గోల్పోయినాయి.

**వ. అంత న మ్మహారాత్రియందు. 712**

**మ. నెఱి నెల్లప్పుడు నిల్చి ప్రాణిచయమున్ నిర్మించి నిర్మించి వీఁ**
**పిఱియన్ నీల్గుచు నావులించుచు నజుండే సృష్టియున్ మాని మే**
**నొఱఁగన్ ఱెప్పలు మూసి కేల్ దలగడై యుండంగ నిద్రించుచున్**
**గుఱు వెట్టం దొడఁగెం గలల్ గనుచు నిర్ఘోషించుచున్ భూవరా! 713**

*ఓ రాజా! బ్రహ్మదేవుడు విశ్రాంతి లేకుండా కూర్చుండి ఓర్పుతో ప్రాణులను సృష్టించి అలసిపోయినాడు. అతని నడుమూ వీపూ బిగుసుకు పోయినాయి. అతడు నీల్గుతూ ఆవులిస్తూ సృష్టి కార్యాన్ని ఆపివేసినాడు. శరీరాన్ని వాల్చి రెప్పలు మూసుకొని చెయ్యితలగడగా ఉంచుకొని గురకలు పెట్టుతూ కలలుగంటూ నిద్రపోయినాడు.

**ఆ. అలసి సొలసి నిదుర నందిన పరమేష్ఠిముఖమునందు వెడలె మొదలి శ్రుతులు**
**నపహరించె నొక హయగ్రీవుఁడను దైత్య, భటుఁడు; దొంగఁదొడరఁ బరులవశమె! 714**

* చతుర్ముఖుడు బాగా అలసిపోయి నిద్రించినాడు. అతని ముఖాలనుండి వేదాలు వెలువడినాయి. హయగ్రీవుడనే రాక్షసుడు ఆ వేదాలను దొంగిలించినాడు. ఆ రాక్షసుడు తప్ప బ్రహ్మను దరిజేరడానికి ఇతరులకు సాధ్యం కాదు.

**క. చదువులు దన చేవడినం, జదువుచుఁ బెన్ బయల నుండ శంకించి వడిం**
**జదువుల ముదుకఁడు గూరుకఁ, జదువుల తస్కరుఁడు సొచ్చె జలనిధి కడుపున్. 715**

*వేదాలను స్వాధీనం చేసుకొన్న హయగ్రీవుడు వాటిని చదువసాగినాడు. బయటి ప్రపంచంలో ఉండడానికి భయపడినాడు. బ్రహ్మదేవుడు నిద్రలో ఉండటం కనిపెట్టి వాడు వేగంగా సముద్రంలో ప్రవేశించినాడు.

**వ. ఇట్లు వేదంబు దొంగిలి దొంగరక్కసుండు మున్నీట మునింగిన వాని జయింపవలసియు, ప్రానుదీఁ గెల యందు విత్తనంబుల పొత్తరలు పెన్నీట నాని చెడకుండ మనుపవలసియు నెల్లకార్యంబులకుం గావలి యగు నాపురుషోత్తముం డప్పెనురేయి చొరుదలయందు. 716**

* ఆ ప్రళయ కాలంలో వేదాలను దొంగిలించి సముద్రజలాలలో మునిగిన ఆ రాక్షసుణ్ణి జయించడమూ, ఓషధులూ విత్తనాల సంచులూ సముద్రంలో తడిసిపోకుండా రక్షించడమూ ఈ రెండు భగవంతుడైన విష్ణుదేవునకు కర్తవ్యాలయినాయి.

క. కుఱుగఱులు వలుఁద మీసలు, చిఱుఁదోఁకయు బసిఁడి యొడలు సిరిగల పొడలున్
నెఱి మొగము నొక్క కొమ్మును, మిఱుచూపులుఁ గలిగి విభుఁడు మీనం బయ్యెన్. 717

* మహావిష్ణువు మత్స్యరూపం ధరించాడు. చిన్న చిన్న రెక్కలూ, పెద్ద పెద్ద మీసాలు, పొట్టి తోకా, బంగారు రంగు శరీరమూ, అందమైన మచ్చలూ, చక్కని మొగమూ, ఒక కొమ్మూ, మిరుమిట్లు గొలిపే చూపులూ కలిగి ఆమహామత్స్యం విరాజిల్లుతున్నది.

వ. అట్లు లక్షయోజనాయతం బయిన పాఠీనంబై విశ్వంభరుండు జలధి సొచ్చి. 718

సీ. ఒకమాటు జలజంతుయూథంబుతోఁ గూడు నొకమాటు దరులకు నుఱికి వచ్చు;
నొకమాటు మింటికి నుదరి యుల్లంఘించు నొకమాటు లోపల నొదిఁగి యుండు;
నొకమాటు వారాశి నొడలు ముంపఁగఁ జూచు నొకమాటు బ్రహ్మాండ మొరయఁ దలఁచు;
నొకమాటు ఝషకోటి నొడిసి యాహారించు నొకమాటు జలముల నుమిసివైచు

తే. గఱులు సారించు మీసలు గడలు కొలుపుఁ, బొడలు మెఱయించుఁ గన్నుల పొలప మార్చుఁ;
నొడలు జళిపించుఁ దళతళ లొలయు మీన, వేషి పెన్నీట నిగమ గవేషి యగుచు. 719

* పై విధంగా భగవంతుడు లక్ష ఆమడల పొడవైన మత్స్యరూపం ధరించినాడు. సముద్రంలో ప్రవేశించినాడు. అతడు తళతళలాడే పెనుచేపరూపంతో ప్రళయ జలాలలో వేదాలకోసం వెదకడానికి పూనుకొన్నాడు. ఒకసారి జలచరాలతో కలిసి తిరుగుతాడు. ఒకసారి వేగంగా గట్లవైపు దుమికివస్తాడు. ఒకసారి ఆకాశానికి ఎగురుతాడు. ఒకసారి నీళ్ల లోపల దాగి ఉంటాడు. ఒకసారి సముద్రంలో మునిగి తేలుతాడు. ఒకసారి బ్రహ్మాండాన్ని ఒరసుకోవడానికి ప్రయత్నిస్తాడు. ఒకసారి చేపల గుంపును పట్టి మ్రింగుతాడు. ఒకసారి నీళ్ళను పీల్చి వెలుపలికి చిమ్ముతాడు. ఈ విధంగా ఆ మహామత్స్యమూర్తి రెక్కలు చాస్తూ, మీసాలు కదలించుతూ, మేనిపొడలు మెరపిస్తూ, కన్నుల కాంతులు ప్రసరిస్తూ, ఒడలు విరుచుకుంటూ, తళతళలాడుతూ సాగరగర్భంలో విహరించాడు.

వ. అంతకు మున్న సత్యవ్రతుండు మహార్ణవంబులు మహీవలయంబు ముంచు నవసరంబున భక్తపరాధీనుండగు హరిం దలచుచునుండ నారాయణ ప్రేరితయై యొక్క నావ వచ్చినం గనుంగొని. 720

మ. చని సత్యవ్రతమేదినీదయితుఁ డోజం బూని వ్రాల్దీఁగ వి
త్తనముల్ పెక్కులు నావపై నిడి హరిధ్యానంబుతో దానిపై
మునిసంఘంబులు దాను నెక్కి వెఱతో మున్నీటిపైఁ దేలుచుం
గనియెన్ ముందట భక్తలోక హృదలంకర్మీణమున్ మీనమున్. 721

* సత్యవ్రతుడు ప్రళయ సముద్రజలాలు భూలోకాన్ని ముంచి వేయడానికి ముందే భక్తులకు తోడు నీడైన భగవంతుణ్ణి ధ్యానించుతున్న సమయంలో శ్రీహరి ప్రేరణతో ఒక నావ అక్కడకు వచ్చింది. ఆ ఓడను చూచి సత్యవ్రతుడు ఉత్సాహంతో దానిపై పెక్కు ఓషధులను విత్తనాలను అమర్చినాడు. విష్ణువును

స్తోత్రం చేస్తూ మునులతోపాటు దానిపై కూర్చొన్నాడు. భయం భయంగా సముద్రంపై తేలిపోతున్నాడు. అప్పుడు ఆయనకు భక్తుల హృదయాలకు అలంకారమైన విష్ణువు మహామీన స్వరూపంతో ఎదుట కనిపించినాడు.

వ. కని, జలచరేంద్రుని కొమ్మున నొక్కపెనుఁ బాఁపత్రాట న న్నావఁ గట్టి, సంతసించి డెందంబు నివురుకొని తపస్వులుం దాను నారాచపెద్ద మీనాకారుండగు వేల్పుతేని నిట్లని పొగడం దొడంగి.722

* సత్యవ్రతుడు ఒక పెద్దపామును త్రాడుగా చేసి ఆ ఓడను మహామత్స్యం కొమ్ముకు కట్టివేసినాడు. సంతోషంతో హృదయాన్ని పదిలపరచుకొన్నాడు. ఋషులతో పాటు అతడు విష్ణువును క్రింది విధంగా పొగడసాగినాడు.

మ. తమలోఁ బుట్టు నవిద్య గప్పిగొనుడుం దన్మూలసంసార వి
భ్రములై కొందఱు దేలుచుం గలఁగుచున్ బల్వెంటలన్ దైవ యో
గమునం దే పరమేశుఁ గొల్చి ఘనులై కైవల్యసంప్రాప్తులై
ప్రమదంబందుదు రట్టి నీవు కరుణం బాలింపు మ మ్మీశ్వరా! 723

* ఓ భగవంతుడా! తమలో ఆవరించిన అజ్ఞానం వల్ల కొందరు సంసారంలోపడి చిక్కుకొని మోసపోయి కలత పడతారు. కోరికలను వెన్నంటుతారు. అటువంటివారు అదృష్టంవల్ల పరమాత్ముడవైన నిన్ను సేవించి మోక్షాన్ని పొంది సంతోషపడతారు. ఆ విధంగా అందరినీ ఆదరించే నీవు మమ్ములను కాపాడు.

ఉ. కన్నులు గల్గువాఁడు మఱి కాననివానికిఁ ద్రోవఁ జూపఁగాఁ
జన్న తెఱంగు మూఢునకు సన్మతి దా గురుఁడౌట సూర్యుఁడే
కన్నులు గాఁగ భూతములఁ గాంచుచు నుండు రమేశ! మాకు ను
ద్యన్నయమూర్తివై గురువవై యల సద్గతిజాడఁ జూపవే! 724

* ఓ లక్ష్మీపతీ! సూర్యుడే కన్నులుగా నీవు ప్రాణులను చూస్తుంటావు. జ్ఞానం లేనివానికీ దుర్బుద్ధి కలవానికి తండ్రివి నీవే. కాబట్టి కనులున్న వాడు కనులు లేనివానికి దారి చూపించిన విధంగా మమ్ములను ఉద్ధరించు. గురుడవై మాకు మంచిదారి చూపించు.

క. ఇంగలముతోడి సంగతి, బంగారమువన్నె గలుగుభంగినిఁ ద్వత్సే
వాంగీకృతుల యఘంబులు, భంగంబులఁ బొందు ముక్తి ప్రాప్తించు హరీ! 725

* ఓ స్వామీ! అగ్నితో చేరడంవల్ల బంగారానికి మెరుగు కలుగుతుంది. ఆ విధంగానే నిన్ను పూజించే భక్తుల పాపాలు నాశనమై మోక్షం లభించుతుంది.

క. హృదయేశ! నీ ప్రసన్నత, పదివేలవపాలి లేశభాగముకతనం
త్రిదశేంద్రత్వము గలదఁట!, తుది నిను మెప్పింప నేది దొరకదు శ్రీశా! 726

* ఓ లక్ష్మీరమణా! పరమాత్మా! నీ అనుగ్రహంలో పదివేలవవంతులో ఒక లేశ భాగం వల్ల దేవేంద్రపదవి కలుగుతుందట. ఇకనీకు మెప్పు కలిగిస్తే లభించని భాగ్య మేముంటుంది.?

క. పెఱవాఁడు గురుఁ డటంచును, గొఱగాని పదంబు సూపఁ గుజనుండగు నీ
నెఱత్రోవ నడవ నేర్చిన, నఱమఱ లేనట్టిపదమునందు దయాబ్ధీ! 727

* ఓ దయాసముద్రుడా! పనికి మాలిన వానిని గొప్పవాడనుకొని దరిజేరే వారు చెడిపోతారు. నిన్ను నమ్ముకొని మంచిమార్గంలో నడవ గలిగితే సందేహం లేకుండా నీ సంరక్షణ పొందుతారు.

మ. చెలివై చుట్టమవై మనస్స్థితుఁడవై చిన్మూర్తివై యాత్మవై
వలనై కోర్కుల పంటవై విభుఁడవై వర్తిల్లు నిన్నొల్లకే
పలువెంటంబడి లోక మక్కట! వృథా బద్ధాశమై పోయెడిన్
నిలువన్ నేర్చునె హేమరాశిఁ గనియున్ నిర్భాగ్యుఁ డంభశ్శయా! 728

* నారాయణా! నీవు స్నేహితుడుగా బంధువుగా జ్ఞానస్వరూపుడుగా మానవుల మనస్సులోనే మసలుతావు. ఆత్మవై అండగా ఉంటావు. ప్రభువువై కోరికలు పండిస్తావు. అటువంటి నిన్ను ఆదరించకుండా లోకం పెక్కింటిపై పేరాసతో పరుగులు పెడుతుంది. అదృష్టహీనుడు బంగారు రాశి లభించినా దక్కించుకోలేడు. గదా!

ఆ. నీరరాశిలోన నిజకర్మ బద్ధమై, యుచితనిద్రఁ బొంది యున్న లోక
మే మహాత్ముచేత నెప్పటి మేల్కాంచు, నట్టి నీవు గురుఁడ వగుట మాకు. 729

క. ఆలింపుము విన్నప మిదె, వేలుపు గమిఁతేని నిన్ను వేఁడికొనియెదన్
నాలోని చిక్కు మానిచి, నీలోనికిఁ గొంచుఁ బొమ్ము నిఖిలాధీశా! 730

* లోకేశ్వరా! కర్మఫలానికి లోబడి సముద్రంలో మునిగి కూరుకు పోయిన లోకాన్ని మేలుకొలిపే మహాత్ముడవు నీవు. దేవతలకు ప్రభువవు నీవు. అటువంటి నీవు మాకు గురువవైనావు. మా విన్నపాలు మన్నించమంటూ ప్రార్థిస్తున్నాను. నాలోని సంకటాన్ని తొలగించి నన్ను నీ లోకానికి చేర్చుకోమని వేడుకుంటున్నాను.

వ. అని ఇట్లు సత్యవ్రతుండు పలికిన సంతసించి మత్స్యరూపంబున మహాసముద్రంబున విహరించు హరి పురాణపురుషుం డగుటంజేసి, సాంఖ్య యోగక్రియాసహితయగు పురాణ సంహిత నుపదేశించె; నమ్మహారాజు మునిసమేతుండై భగవన్నిగదితంబై సనాతనంబగు బ్రహ్మస్వరూపంబు విని కృతార్థుం

డయ్యెఁ; నతం డిమ్మహా కల్పంబున వివస్వంతుం డనంబరఁగిన సూర్యునకు శ్రాద్ధదేవుండన జన్మించి శ్రీహరికృపావశంబున నేడవ మనువయ్యెఁ; నంత నవ్విధంబునఁ బెనురేయి నిండునంతకు సంచరించి జలచరాకారుండగు నారాయణుండు దన్నిశాంత సమయంబున. 731

* పై విధమున సత్యవ్రతుని ప్రార్థన విని మత్స్యరూపంతో సముద్రంలో సంచరిస్తున్న మహావిష్ణువు సంతోషించినాడు. ఆ పరమాత్ముడు సాంఖ్యయోగంతో కూడిన పురాతనమైన వేదభాగాన్ని అతనికి బోధించినాడు. మునులతోపాటు సత్యవ్రతుడు భగవంతుడు చెప్పిన సతనాతనమైన బ్రహ్మజ్ఞానాన్ని తెలుసుకొని ధన్యుడైనాడు. సత్యవ్రతుడు ఈ కల్పంలో వివస్వంతుడని పిలువబడే సూర్యునికి శ్రాద్ధ దేవుడనే పేరుతో పుట్టి విష్ణువు దయవల్ల ఏడవ మనువైనాడు. ప్రళయరాత్రి ముగిసి తెల్లవారే పర్యంతమూ ఆ విధంగా విష్ణువు మత్స్యస్వరూపంతో తిరుగుతూ ఉన్నాడు.

మ. ఉఱ కంభోనిధి రోసి వేదముల కుయ్యాన్ దైన్యముం జూచి వే
గఱు లల్లార్చి ముఖంబు సాఁచి బలువీఁకం దోఁక సారించి మే
న్మెఱయన్ దౌడలు దీటి మీస లదరన్ మీనాకృతిన్ విష్ణుఁ డ
క్కఱటిం దాఁకి వధించె ముష్టిదళిత గ్రావున్ హయగ్రీవునిన్. 732

వ. అంతం బ్రళయావసాన సమయంబున. 733

* తెల్లవారుజామున విష్ణుమూర్తి వేదాలు బాధతో మొరపెట్టకోవడాన్ని విన్నాడు. వేగంగా రెక్కలు అల్లార్చి నోరు తెరిచినాడు. ఉత్సాహంతో తోక ఊగించినాడు. మేను మెరపించినాడు, దౌడలు చక్కజేసుకొన్నాడు. మీసాలు కదలించినాడు. దుష్టుడూ మహాబలిష్ఠుడూ ఐన హయగ్రీవుణ్ణి హతమార్చినాడు. అంతలో ప్రళయకాలం ముగిసింది.

సీ. ఎప్పుడు వేగునం చెదురు చూచుచు నుండు మునుల డెందంబులు ముదము నొందఁ,
దెలివితోఁ బ్రక్క నిద్రించు భారతి లేచి యోరపయ్యెదఁ జక్కనొత్తి కొనఁగ,
మలినమై పెను రేయి మ్రక్కిన తేజంబు దొంటి చందంబునఁ దొంగలింపఁ
బ్రాణుల సంచితభాగధేయంబులు గన్నుల కొలఁకులఁ గానఁబడఁగ,

తే. నవయవంబులు గదలించి యావులించి, నిదురఁ దెప్పిఱి, మేల్కాంచి, నీల్గి, మలఁగి,
యొడలు విఱుచుచుఁ గనుఁగవ లుసుముకొనుచు, ధాత గూర్చుండె సృష్టి సంధాత యగుచు.734

* ఎప్పుడు తెల్లవారుతుంతో! అనుకొంటూ ఎదురుచూస్తున్న మునుల హృదయాలు ముదమొందినాయి. మైమరచి నిద్రస్తున్న సరస్వతి లేచి బ్రహ్మప్రక్కన కూర్చుండి ఓరగా పైట సరిదిద్దుకొన్నది. ప్రళయకాలంలో మాసిపోయిన బ్రహ్మ తేజస్సు మరల మిసమిసలాడింది. ప్రాణులు సంపాదించిన పూర్వపుణ్యాలు ఆయన కడ కన్నులకు ఆగుపించినాయి. అప్పుడు నిద్రలో ఉన్న బ్రహ్మదేవుడు అవయవాలను కదలించినాడు. ఆవులించి మేల్కొని నీలిగినాడు. ఒడలు విరుచుకొంటూ కన్నులు తుడుచుకొన్నాడు. తిరిగి సృష్టిచేయడంకోసం కూర్చున్నాడు.

వ. అ య్యవసరంబున. 735

ఆ. వాసవారిఁ జంపి వానిచే పడియున్న, వేదకోటి చిక్కు విచ్చి తెచ్చి
నిదుర మానియున్న నీరజాసనునకు, నిచ్చెఁ గరుణతోడ నీశ్వరుండు. 736

* ఆ సమయంలో భగవంతుడు హయగ్రీవుని చంపివేసి వాడు అపహరించిన వేదాలను చెర విడిపించినాడు, వాటిని తెచ్చి మేల్కొన్న బ్రహ్మదేవునికి అనుగ్రహ పూర్వకంగా అప్పగించినాడు.

క. జలరుహనాభుని కొఱకై, జలతర్పణ మాచరించి సత్యవ్రతుఁ డా
జలధి బ్రదికి మను వయ్యెను, జలజాక్షునిఁ గొలువ కెందు సంపద గలదే? 737

* విష్ణుదేవునికి సత్యవ్రతుడు అర్ఘ్యం సమర్పించి ప్రళయ సముద్రంలో నుంచి బయటపడి మనువైనాడు. విష్ణువును పూజించకుండా ఐశ్వర్యం ప్రాప్తించదు గదా!

ఆ. జనవిభుండు దపసి సత్యవ్రతుండును, మత్స్యరూపి యైన మాధవుండు
సంచరించినట్టి సదమలాఖ్యానంబు, వినినవాఁడు బంధ విరహితుండు. 738

* రాజఋషియైన సత్యవ్రతుని భక్తినీ మత్స్యావతారం ధరించిన విష్ణుదేవుని మహిమనూ ప్రకటించే ఈ పుణ్యకథను విన్నవాడు సంసార బంధాలలోనుంచి విముక్తుడౌతాడు.

క. హరిజలచరావతారముఁ, బరువడిఁ బ్రతిదినముఁ జదువఁ బరమపదంబున్
నరుఁ డొందు వాని కోర్కులు, ధరణీశ్వర! సిద్ధిబొందుఁ దథ్యము సుమ్మీ! 739

* ఓ రాజా! ప్రతిదినమూ మత్స్యావతారం కథను శ్రద్ధతో చదివే వాడు మోక్షాన్ని పొందుతాడు. అతని కోరికలు నెరవేరుతాయి. ఇది సత్యం.

మ. ప్రళయాంభోనిధిలోన మేన్మఱచి నిద్రం జెందు వాణీశు మో
ముల వేదంబులు గొన్న దైత్యుని మృతిం బొందించి సత్యవ్రతుం
దలరన్ బ్రహ్మము మాటలం దెలిపి సర్వాధారుఁడై మీనమై
జలధిం గ్రుంకుచుఁ దేలుచున్ మెలఁగు రాజన్మూర్తికిన్ మ్రొక్కెదన్. 740

వ. అని చెప్పి. 741

* ప్రళయ సముద్రంలో మైమరచి నిద్రించి బ్రహ్మదేవుని ముఖాలనుండి వెలువడిన వేదాలను దొంగిలించిన దుష్ట రాక్షసుని సంహరించి, సత్యవ్రతుడు సంతోషించేటట్లు బ్రహ్మస్వరూపాన్ని తెలిపి, అన్నింటికీ ఆదరువై, మత్స్యావతారంతో సముద్రంలో మునుగుతూ తేలుతూ సంచారం చేసిన మహావిష్ణువునకు నమస్కారం చేస్తున్నాను అని ఈ విధంగా శుకయోగీంద్రుడు పరీక్షిన్నరేంద్రునకు చెప్పినాడు.

క. రాజేంద్ర! దైత్యదానవ, రాజమహాగహన దహన! రాజస్తుత్యా!
రాజావతంస మానిత! రాజధరార్చిత! గుణాఢ్య! రాఘవ రామా! 742

* రాజేంద్రా! రాక్షస రాజులనే గొప్ప అడవిని కాల్చినవాడా! రాజులచేత స్తుతింప బడినవాడా! రాజులలో తలమానికమైన వాడా! మహానుభావుడైన శివునిచేత పూజింపబడిన వాడా! గుణసంపన్నుడా! రఘువంశలలామా! శ్రీరామా!

మాలిని. దివిజరిపువిదారీ! దేవలోకోపకారీ!, భువనభరనివారీ! పుణ్యరక్షానుసారీ!
ప్రవిమలశుభమూర్తీ! బంధుపోషప్రవర్తీ!, ధవళబహుళకీర్తీ! ధర్మనిత్యానువర్తీ! 743

* రాక్షసులను తెగటార్చిన వాడా! దేవతలకు మేలు చేసినవాడా! భూభారమును నివారించినవాడా! పుణ్యాత్ములను రక్షించేవాడా! నిర్మలమైన శుభకరమైన రూపం కలవాడా! ఆత్మీయులను పోషించేవాడా! స్వచ్ఛమైన గొప్పకీర్తి కలవాడా! ఎల్లప్పుడూ ధర్మాన్ని ఆదరించే వాడా!

గద్యము

ఇది శ్రీ పరమేశ్వర కరుణాకలిత కవితావిచిత్ర కేసనమంత్రి పుత్త్ర సహజపాండిత్య పోతనామాత్య ప్రణీతంబయిన శ్రీమహాభాగవత పురాణంబను మహాప్రబంధము నందు స్వాయంభువ స్వారోచిషోత్తమతామస మనువుల చరిత్రంబును, గరిమకరంబుల యుద్ధంబును, గజేంద్రరక్షణంబును, రైవతచాక్షుష మనువుల వర్తనంబును, సముద్రమథనంబును, గరళ భక్షణంబును, నమృతాది సంభవంబును, దేవాసుర కలహంబును, హరి కపటకామినీ రూపంబున నసురుల వంచించి దేవతల కమృతంబు వోయుటయును, రాక్షసవధంబును, హరిహర సల్లాపంబును, హరి కపట కామినీ రూప విభ్రమణంబును, వైవస్వత సూర్యసావర్ణి దక్షసావర్ణి బ్రహ్మసావర్ణి ధర్మసావర్ణి భద్రసావర్ణి దేవ సావర్ణీంద్రసావర్ణి మనువుల వృత్తాంతంబును, బలియుద్ధయాత్రయును, స్వర్గవర్ణనంబును, దేవ పలాయనంబును, వామనావతారంబును, శుక్రబలిసంవాదంబును, త్రివిక్రమవిస్ఫురణంబును, రాక్షసుల సుతల గమనంబును, సత్యవ్రతోపాఖ్యానంబును, మీనావతారంబును నను కథలు గల యష్టమ స్కంధము. 744

* ఇది పరమశివుని దయవల్ల కలిగిన కవితా సౌందర్యం కలవాడూ, కేసనమంత్రి పుత్రుడూ, సహజపాండిత్యుడూ ఐన పోతనామాత్యుడు రచించిన శ్రీమహాభాగవత పురాణమనే మహాకావ్యంలోని అష్టమస్కంధం. దీనిలో స్వాయంభువుడూ, స్వారోచిషుడూ, ఉత్తముడూ, తామసుడూ అనే మనువుల చరిత్రమూ; ఏనుగుకూ మొసలికీ జరిగిన పోరాటమూ; శ్రీహరి గజేంద్రుణ్ణి కాపాడటమూ; రైవతుడూ చాక్షుషుడూ అనే మనువుల చరిత్రమూ; దేవదానవులు సముద్రాన్ని మథించడమూ, పరమేశ్వరుడు విషాన్ని మ్రింగడమూ, పాలసముద్రంలో అమృతం మొదలైనవి పుట్టడమూ, దేవతలకూ రాక్షసులకూ పోరాటం జరగడమూ, విష్ణువు

మోహినీ రూపంతో రాక్షసులను మోసగించి దేవతలకు అమృతాన్ని పోయడమూ, రాక్షస సంహారమూ, శివకేశవుల సరస సంభాషణమూ, విష్ణువు మోహినీ రూపంతో శివుణ్ణి భ్రమింప జేయడమూ; వైవస్వతుడూ, సూర్యసావర్ణీ, దక్షసావర్ణీ, బ్రహ్మసావర్ణీ, ధర్మసావర్ణీ, భద్రసావర్ణీ, దేవసావర్ణీ, ఇంద్రసావర్ణీ అనే మనువుల వృత్తాంతమూ, బలిచక్రవర్తి యుద్ధానికి వెళ్ళడమూ, స్వర్గలోక వర్ణనమూ, దేవతల పలాయనమూ, వామనావతారమూ, శుక్ర బలిచక్రవర్తుల సంభాషణమూ, వామనుని త్రివిక్రమస్ఫురణమూ, రాక్షసులు సుతలానికి పోవడమూ, సత్యవ్రతుని వృత్తాంతమూ, మత్స్యావతార చరిత్రమూ అనే కథలున్నాయి.

**శ్రీ కృష్ణార్పణ మస్తు.**

# ప్రవేశిక

శ్రీ కైవల్య పదంబుఁ జేరుటకునై చింతించెదన్ లోక ర
క్షైకారంభకు, భక్త పాలన కళాసంరంభకున్ దానవో
ద్రేక స్తంభకుఁ గేళిలోల విలసద్ దృగ్జాలసంభూత నా
నా కంజాత భవాండకుంభకు మహానందాంగనా డింభకున్. **1-1**

పరమ భాగవతాగ్రేసరుడైన బమ్మెరపోతన్న గారు భాగవత మహాపురాణానికి శ్రీకారం చుట్టుతూ మనకు ప్రసాదించిన ప్రప్రథమ పద్యమిది. సంపూర్ణ భాగవతానికే అద్దం పడుతూ తెలుగు సాహిత్య సరస్వతికే మకుటాయమానమైన ఈ పద్య ప్రసూనంలో ఆరు దళాలు ఉన్నవి. "(1) శ్రీ కైవల్య పదంబుఁ జేరుటకునై చింతించెదన్ (2) లోక రక్షైకారంభకున్ (3) భక్త పాలన కళాసంరంభకున్ (4) దానవోద్రేక స్తంభకున్ (5) కేళిలోల విలసద్ దృగ్జాల సంభూత నానాకంజాత భవాండ కుంభకున్ (6) మహానందాంగనా డింభకున్'' అనేవి అవి.

ఈ ఆరుదళాలూ భగవంతుని ప్రధాన గుణాలయిన సర్వేశ్వరత్వాన్నీ, ధర్మ సంస్థాపకత్వాన్నీ, శిష్టరక్షణ పరాయణత్వాన్నీ, దుష్టశిక్షణ చణత్వాన్నీ, విశ్వకర్తృత్వాన్నీ, ఆనందమయత్వాన్నీ క్రమంగా స్ఫురింపజేస్తున్నాయి.

చిత్తగించండి. "శ్రీ కైవల్యపదంబుఁ జేరుటకునై చింతించెదన్'' అన్న ప్రథమదళం మోక్షంకోసం ఉత్కంఠితుడైన పరీక్షిన్మహారాజు వృత్తాంతంతో పాటు ప్రథమ ద్వితీయ తృతీయ చతుర్థ స్కంధాలలోని, నారదుడు, భీష్మాచార్యుడు, కుంతీదేవి, ఖట్వాంగుడు, ఉద్ధవుడు, దేవహూతి, ధ్రువుడు మొదలైన వారి చరిత్రలను స్ఫురింపజేస్తూ భగవంతుని సర్వేశ్వరత్వాన్ని నిరూపించుతున్నది. ఎందుకంటే కైవల్యపదాన్ని అనుగ్రహించే అధికారం సర్వేశ్వరునికి మాత్రమే చెల్లుతుంది కనుక.

"లోకరక్షైకారంభకున్'' అన్న ద్వితీయదళం తృతీయ సప్తమ స్కంధాల్లో హిరణ్యాక్ష హిరణ్యకశిపులను సంహరించి వారి అత్యాచారాలతో అస్తవ్యస్తమైన లోకాన్ని ఉద్ధరించిన భగవంతుని ధర్మసంస్థాపకత్వాన్ని వెల్లడిస్తుంది.

"భక్తపాలన కళాసంరంభకున్'' అనే తృతీయదళం గజేంద్రుణ్ణి కాపాడటానికి శ్రీహరి వైకుంఠం నుంచి పరుగెత్తుకు రావటం, పరమ శివుడు ముల్లోకాలను రక్షించే నిమిత్తం హాలహలం త్రాగటం ఇత్యాది అష్టమస్కంధ కథలను ధ్వనింపజేస్తూ భగవంతుని శిష్టరక్షణ పరాయణత్వాన్ని చాటుతున్నది.

"దానవోద్రేక స్తంభకున్'' అనే చతుర్థదళం వామనావతారానికి వ్యంజక మౌతున్నది. వచ్చే మన్వంతరంలో ఇంద్రుడు కావలసిన బలి చక్రవర్తి వరబలంతో ముందుగానే స్వర్గాన్ని ఆక్రమించి సింహాసన మెక్కి కూర్చున్నాడు. ఆ దానవేంద్రుని ఉద్రేకానికి పగ్గాలు పట్టి అతని విజృంభణాన్ని స్తంభింపజేసిన వృత్తాంతం భగవంతుని దుష్టశిక్షణ చణత్వాన్ని ప్రకటిస్తున్నది.

ఇక "కేళిలోల విలసద్ దృగ్జాల సంభూత నానాకంజాత భవాండ కుంభకున్" అన్న ఐదవదళం నవమస్కంధంలోని సూర్య చంద్ర వంశీయులైన రాజుల గాథలను అభివర్ణిస్తూ భగవంతుని విశ్వకర్తృకత్వాన్ని సూచిస్తున్నది. ఏమంటే స్వామి సవిలాసంగా త్రిప్పే నేత్రాలలో నుంచి బ్రహ్మాండ భాండాల సృష్టి జరుగుతుంది. వాస్తవానికి స్వామి నేత్రాలు సూర్య చంద్రులేగా!

" మహానందాంగనా డింభకున్" అనే ఆరవదళం శ్రీకృష్ణలీలా సర్వస్వమైన దశమస్కంధానికి ప్రతీక. ఆ నందాంగనకు ఆనందం అందిస్తూ ఆనందం అనుభవిస్తున్న ఆనందమయ స్వరూపుడు కదా ఆ నందనందనుడు!

పై విధంగా భాగవతాన్నంతా ప్రథమ పద్యంలోనే ప్రస్ఫురింపజేశాడు. మన మహాకవి పోతన్నగారు. ఆయన కవితా శిల్పానికి కైమోడ్పులు.

ఇప్పుడు మీ చేతులలో ఉన్న గ్రంథం నవమస్కంధం. ఇంతకు ముందు మనం చెప్పుకున్న ప్రకారం పరమపురుషుని నేత్రాలయిన సూర్యచంద్రుల వంశాలలో జన్మించిన మహాపురుషుల గాథలతో నిండిన నవమస్కంధం.

## "పురాణం పంచలక్షణం"

**సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణి చ ।**
**వంశానుచరితం చేతి పురాణం పంచలక్షణమ్ ॥**

"సర్గం" అంటే బ్రహ్మాండోత్పత్తి. "ప్రతిసర్గం" అంటే కల్పాంతాన పునస్సృష్టి. "వంశం" అంటే దేవర్షుల బ్రహ్మర్షుల దేవతల వంశ వర్ణనం. "మన్వంతరం" అంటే పదునల్గురు మనువుల పరిపాలన కాలం. "వంశానుచరితం" అంటే సూర్య చంద్ర వంశీయులైన మహారాజుల చరిత్రం.

పురాణానికి ఉండవలసిన ఈ ఐదు లక్షణాలలో మొదటి నాలుగూ ఇంతకు ముందు స్కంధాలలో అభివర్ణితము లైనాయి. ఇప్పుడు ఈ నవమస్కంధంలో ఐదవదైన "వంశానుచరితం". అంటే సూర్యచంద్ర వంశీయులైన రాజుల చరిత్రం అత్యంత మనోహరంగా అభివర్ణింపబడింది. పాఠకుల సౌకర్యంకోసం కొందరు ప్రధాన వ్యక్తులను పరిచయం చెయ్యటం ఆవశ్యకంగా భావిస్తాను.

## సూర్యవంశం

పరమపురుషుని నాభిమధ్యం నుంచి బంగారుపద్మం ప్రభవించింది. ఆ సరోజంలో నుంచి చతుర్ముఖబ్రహ్మ జన్మించాడు. ఆ బ్రహ్మదేవుని కుమారుడు మరీచి మహర్షి. మరీచి పుత్రుడు కశ్యపుడు. కశ్యపుడు దక్షుని పుత్రిక అయిన అదితిని పెండ్లాడాడు. ఆ దంపతులకు సూర్యుడు ఉదయించాడు. సూర్యునికి 'సంజ్ఞ' అనే భార్య యందు 'శ్రాద్ధదేవు'డనే నామాంతరం గల వైవస్వతమనువు పుట్టాడు. ఈ మనువు భార్య శ్రద్ధ. ఈ దంపతులకు మొదట సుద్యుమ్నుడు, అనంతరం ఇక్ష్వాకుడు మొదలైన పది మంది పుత్రులు జన్మించారు. ఈ విధంగా సూర్యవంశం కొనసాగింది.

## సుద్యుమ్నుడు

ఇతడు వైవస్వతమనువు ప్రథమ సంతానం. సంకల్పవైషమ్యం వల్ల ముందు ఇళా కన్యకగా జన్మించి వసిష్ఠుని తపఃప్రభావం వల్ల సుద్యుమ్నుడుగా మార్పుచెందాడు. స్త్రీరూపంలో ఇళా కన్యకగా ఉన్నప్పుడు చంద్రుని కుమారుడైన బుధునితో సంబంధం కలిగింది. ఈ దంపతులకు పురూరవుడు జన్మించాడు. సుద్యుమ్నుడు ఒకనాడు వేటకు పోయి కుమారవనంలో ప్రవేశించి మరల స్త్రీ (ఇళాకన్య) గా మారిపోయాడు. తరువాత పరమేశ్వరుని అనుగ్రహం వల్ల ఒక నెల స్త్రీగా, ఒకనెల పురుషునిగా మారుతూ చిరకాలం రాజ్యం పరిపాలించాడు.

## శర్యాతి

ఇతడొక సుప్రసిద్ధుడైన సూర్యవంశపురాజు, వైవస్వత మనువు పదిమంది బిడ్డలలో ఒకడు. ఈతని కొమార్తె సుకన్యకు చ్యవన మహర్షితో వివాహం జరిగింది. చ్యవనమహర్షి దేవవైద్యులైన అశ్వినీ దేవతలకు యజ్ఞాలలో హవిర్భాగం కల్పించి వారి వల్ల తాను నవయౌవనం పొందాడు.

## అంబరీషుడు

సూర్యవంశపు రాజులలో పేరెన్నిక గన్నవాడు. వైవస్వతుని మనుమడైన నాభాగుని కుమారుడు మహాభక్తుడు. విష్ణుదేవుని ఆరాధన యందు ఆసక్తుడు. ఒకనాడు ఉపవాసానంతరం ద్వాదశిపారణ సందర్భంలో దుర్వాసుణ్ణి భోజనానికి ఆహ్వానించాడు. దుర్వాసుడు నదిలో స్నానం చేయటానికి పోయి ఎంత సేపటికి తిరిగిరాడు. పారాయణ సమయం గడిచిపోతున్నది. అంబరీషుడు అభిజ్ఞుల అభిప్రాయాన్ని అనుసరించి జలపారణం చేశాడు. ఆ సంగతి తెలుసుకొని దుర్వాసుడు మండి పడి అహంకారంతో హుంకరించి అంబరీషుని మీద మహాకృత్యను ప్రయోగించాడు. తన భక్తుడైన అంబరీషుని రక్షించే నిమిత్తం శ్రీ హరి సుదర్శన చక్రాన్ని పంపించాడు. సుదర్శనం కృత్యను భస్మంచేసి దురహంకారి అయిన దుర్వాసుని వెంట పడింది. దుర్వాసుడు భయంతో పరువెత్తి ముల్లోకాలూ తిరిగి చివరకు శ్రీహరి ఆజ్ఞానుసారం మహాభక్తుడైన అంబరీషుడి పాదాల మీదపడి ప్రార్థించాడు. ఆయన అనుగ్రహం వల్ల చక్రానలజ్వాలల నుంచి విముక్తుడైనాడు.

## ఇక్ష్వాకుడు

మనువు పదిమంది కుమారులలో పెద్దవాడు. సూర్యవంశానికి మణిమకుటం వంటి మహారాజు. ఈ మహాపురుషుని పేరు మీదుగానే శ్రీరాముడు "ఇక్ష్వాకు కులతిలకు'' డన్న విఖ్యాతి నందుకొన్నాడు.

## కకుత్స్థుడు.

ఇతడు ఇక్ష్వాకుని పౌత్రుడు. ఇతనికి "పురంజయుడు'' అనే నామాంతర మున్నది. ఈ మహనీయుడు దేవదానవ యుద్ధంలో వృషభరూపం ధరించిన దేవేంద్రుని మూపురం మీద కూర్చుండి రాక్షస సంహారం చేసి దేవతలకు సంతోషం చేకూర్చాడు. "కకుత్'' అంటే ఆబోతు మూపురం. అందువల్లనే "కకుత్స్థుడు''

అనే పౌరుషనామం ఇతని పట్ల సార్థకమయింది. ఈ వీరుని పేరు మీదుగా శ్రీరాముడు "కకుత్‌స్థవంశ కలశాంబుధిసోముడు" అయినాడు.

## మాంధాత

ఈతడు కకుత్‌స్థునికి 16 వ తరంవాడు. వీరాధివీరుడు, రావణుని వంటి మహాబలశాలిని సైతం గడగడ లాడించి "త్రసదస్యుడు" అనే బిరుదు వహించాడు. శతబిందుని పుత్రిక అయిన బిందుమతి యందు ముగ్గురు పుత్రులను, ఏబదిమంది పుత్రికలను కన్నాడు. అందగత్తెలైన ఈ ఏబదిమందినీ "సౌభరి" అనే మహర్షి వివాహమాడాడు.

## పురుకుత్సుడు

ఇతడు మాంధాత పెద్దకుమారుడు. నాగలోకంలో గర్వాంధులైన గంధర్వనాయకులను సంహరించి నాగులమెప్పు పొందాడు. "నర్మద" అనే నాగకన్యను వివాహమాడాడు. నర్మదా పురుకుత్సుల దాంపత్యం చరిత్ర ప్రసిద్ధం. పురుకుత్సుడు షట్చక్రవర్తులలో ఒకడుగా పేరెన్నిక గన్నాడు.

## త్రిశంకుడు

ఇతడు పురుకుత్సునికి ఏడవతరం వాడు. బొందితోకూడా స్వర్గానికి పోవాలని ప్రయత్నించి చివరకు విశ్వామిత్రుని అనుగ్రహం వల్ల త్రిశంకుడు స్వర్గంలో స్థిరపడినాడు. సుప్రసిద్ధుడైన హరిశ్చంద్రునికి కన్న తండ్రి.

## హరిశ్చంద్రుడు

ఈయన షట్చక్రవర్తులలో ప్రధానుడు. సుప్రసిద్ధుడైన సూర్యవంశపు రాజు. తన సత్యనిష్ఠవల్ల విశ్వామిత్రుని ప్రశంస లందుకొన్నాడు. ఈయన యజ్ఞంలో సంతుష్టుడైన దేవేంద్రుడు ఈయనకు కనకరథాన్ని బహూకరించాడు.

## సగరుడు

హరిశ్చంద్రునికి ఎనిమిదవ తరంవాడు షట్చక్రవర్తులలో ఒకడు. ఇతని తల్లి గర్భవతిగా ఉన్నప్పుడు చూడలేని సవతి తల్లులు ఆమెకు విషం పెట్టారు. ఐనా ఏ మాత్రం చెక్కుచెదరకుండా గరళంతో పాటు జన్మించినందువల్ల ఇతనికి 'సగరుడు' అనే పేరు వచ్చింది. ఈ మహావీరుడు శకులను, యవనులను, హైహయులను, బర్బరులను జయించినాడు. ఇతని కుమారులు త్రవ్వటం చేతనే సముద్రానికి 'సాగర'మనే పేరు వచ్చింది. సగరుని అశ్వమేధయాగంలో యజ్ఞాశ్వాన్ని దేవేంద్రుడు అపహరించి పాతాళలోకంలోని కపిలమహర్షి ఆశ్రమంలో కట్టివేసి వెళ్లిపోయాడు. అశ్వాన్ని అన్వేషింప వచ్చిన సగరనందనులు మహర్షిని అనుమానించి అవమానించి ఆ మహర్షి కన్నులు తెరవగానే అంతా భస్మమై పోయారు. తరువాత సగరుని

మనుమడైన అంశుమంతుడు తన వినయవినమ్రతల వల్ల కపిలమహర్షి అనుగ్రహాన్ని సంపాదించి అశ్వాన్ని కొనివచ్చి తాతగారి యజ్ఞం పూర్తి చేయించాడు.

## భగీరథుడు

ఇతడు సగర చక్రవర్తి మనుమడైన అంశుమంతుని మనుమడు. ఘోరమైన తపస్సు చేసి సదాశివుని మెప్పించి దివిజగంగను భువికి రప్పించి తన పితామహుల భస్మరాసులపై ప్రవహింపచేశాడు. వారికి పుణ్యలోకాలు ప్రాప్తింపచేశాడు. ఇతని పేరు మీదుగానే గంగకు "భాగీరథి" అనే నామం వచ్చింది. "దృఢమైన సంకల్పం అసాధ్యాన్ని కూడా సుసాధ్యం చేస్తుంది" అన్న నీతికి భగీరథుని వృత్తాంతం చక్కని ఉదాహరణం.

## ఋతుపర్ణుడు

ఇతడు భగీరథునికి ఐదవతరం వాడు. షట్చక్రవర్తులలో ఒకడైన నలునికి ప్రియమిత్రుడు. ఇతడు నలునికి అక్షవిద్యారహస్యం బోధించి ఆయన నుంచి అశ్వవిద్యావిశేషం గ్రహించాడు.

## ఖట్వాంగుడు

ఈయన భగీరథునికి పదకొండవ తరంవాడు. రణరంగంలో రాక్షసులను సంహరించి అమరులకు విజయం చేకూర్చిన పరాక్రమశాలి. దేవతల వల్ల తన ఆయుశ్శేషాన్ని తెలుసుకొని సమస్త రాజ్యభోగాలూ పరిత్యజించి విరక్తుడై విష్ణుసాయుజ్యం పొందిన వివేకవంతుడు.

## రఘుమహారాజు

ఈయన ఖట్వాంగుని మనుమడు. రవి వంశానికి "రఘువంశ" మనే ప్రసిద్ధి చేకూర్చిన మహావీరుడు. భారతభూమిని ఏకచ్ఛత్రంగా పరిపాలించిన మహాప్రభువు. ఈయన వల్లనే శ్రీరాముడు 'రఘురాము' డైనాడు.

## దశరథుడు

ఈయన రఘుమహారాజు మనుమడు. అజమహారాజు పుత్రుడు. దేవాసుర సంగ్రామంలో ఇంద్రుని పక్షం వహించి పోరాడిన వీరశిరోమణి, సత్యసంధుడు. అవతార పురుషుడైన శ్రీరామచంద్రుని కన్న తండ్రి.

## శ్రీరాముడు

రామాయణ కథానాయకుడు. సీతావల్లభుడు. రావణగర్వనిర్వాపణుడు. దశరథుని నలుగురు పుత్రులలో జ్యేష్ఠుడు. శ్రీరామునికి కుశలవులూ, లక్ష్మణునికి అంగద చంద్రకేతులూ, భరతునికి దక్షపుష్కలులూ, శత్రుఘ్నునికి సుబాహు శ్రుతసేనులూ సంభవించి సూర్యవంశాన్ని మూడు పూలూ ఆరు కాయలుగా విస్తరింపచేశారు.

## చంద్రవంశం

సహస్రశీర్షుడైన జగన్నాథుని నాభికమలంలో నుంచి బ్రహ్మ ప్రాదుర్భవించాడు. బ్రహ్మకు అత్రిమహర్షి ఆవిర్భవించాడు. అత్రిమునీంద్రుని కడగంటి చూపులలో నుంచి కలువల చెలికాడు చంద్రు డుదయించాడు. చంద్రుడు బ్రహ్మదేవుని ఆజ్ఞానుసారం తారామండలానికీ, ఓషధులకూ అధినాథుడైనాడు. రాజసూయం చేసి త్రిలోకవిజయం సాధించాడు. చంద్రుడు మూలపురుషుడుగా చంద్రవంశం కొనసాగింది.

## బుధుడు

ఇతడు తారాచంద్రుల గారాబు బిడ్డ. బుద్ధిమంతుడైన బుధుడు మనుపుత్రి అయిన ఇళా కన్యను వరించాడు. ఈ దంపతులకు పురూరవుడనే కుమారుడు జన్మించి చక్రవర్తిగా పేరెన్నిక గన్నాడు.

## పురూరవుడు

పురూరవుని శౌర్యధైర్య సౌందర్య గాంభీర్యాది గుణాలకు ఆకర్షితురాలైన ఊర్వశి అతనిని వరించింది ఊర్వశీ పురూరవులకు "ఆయువు" మొదలైన ఆరుగురు పుత్రులు జన్మించారు. వారిలో ఆయువుకు నహుషుడు ఉద్భవించాడు.

## నహుషుడు

ఇతడు నూరు యజ్ఞాలు చేసి దేవేంద్రపదవిని అధిష్ఠించాడు. ఆ అహంకారంతో అధికార గర్వంతో ఇంద్రపత్ని అయిన శచీదేవిని తన దానినిగా చేసుకోవాలని ఆకాంక్షించాడు. అందుకోసం అట్టహాసంగా మహర్షులు మోస్తున్న పల్లకీ ఎక్కి బయలుదేరాడు. పల్లకీ సరిగా మోయటం లేదని అగస్త్యుణ్ణి అధిక్షేపించి ఆ మహర్షి ఆగ్రహానికి గురియై అజగరంగా మారిపోయాడు. పూజ్యపూజావ్యతిక్రమం ఎంతటి అనర్థాన్ని కలిగిస్తుందో ఈ కథ మనకు తెలుపుతుంది.

## విశ్వామిత్రుడు

ఇతడు పురూరవునికి పన్నెండవ తరం వాడైన గాధిరాజు కుమారుడు. వసిష్ఠునితో వైరం పెంచుకొని రాజ్యాన్ని త్యజించి ఘోరమైన తపస్సు చేసి తాను కూడా "బ్రహ్మర్షి" అనిపించుకున్నాడు. పట్టుదల ఉంటే సాధ్యం కానిదేమీ ఉండదని ఈయన చరిత్ర మనకు బోధిస్తుంది.

## యయాతి

ఇతడు నహుషుని కుమారుడు. అసురగురువైన శుక్రుని తనూజ దేవయానినీ, అసురరాజైన వృషపర్వుని పుత్రిక శర్మిష్ఠనూ వివాహమాడాడు. సప్తద్వీప సమన్వితమైన వసుమతీ చక్రాన్ని అవక్రపరాక్రమంతో పరిపాలించాడు. దేవయానికి యదువు, తుర్వసుడు అనే ఇద్దరు కొడుకులు జన్మించారు. శర్మిష్ఠకు ద్రుహ్యుడు, అనువు, పూరుడు అనే ముగ్గురు పుత్రులు పుట్టారు.

## పూరుడు

ఇతడు యయాతి చిన్నకొడుకు. పేరెన్నిక గన్న పితృభక్తుడు. తండ్రి వార్ధక్యాన్ని తాను గ్రహించి తన యౌవనాన్ని తండ్రికి ధారపోసిన త్యాగధనుడు.

## దుష్యంతుడు

ఈ మహారాజు పూరునకు పదునాల్గవతరం వాడు. చతుస్సముద్ర ముద్రితమైన మహీమండలాన్ని పరిపాలించిన మహావీరుడు. వేట నిమిత్తం అడవికి పోయి అక్కడ కణ్వాశ్రమంలో మేనకా విశ్వామిత్రుల పుత్రిక అయిన శకుంతలను చూచి ప్రేమించి గాంధర్వ వివాహం చేసుకున్నాడు.

## భరతుడు

ఇతడు శకుంతలా దుష్యంతుల కుమారుడు. తండ్రిని మించిన తనయుడై సమస్త భూమండలాన్నీ జనరంజకంగా పాలించాడు. యమునాతీరంలో డెబ్బై ఎనిమిదీ, గంగాతీరంలో ఏభై ఐదూ మొత్తం నూటముప్పై మూడు అశ్వమేధయాగాలు చేశాడు. శక శబర బర్బర కిరాత హూణ మ్లేచ్ఛరాజులను జయించాడు. రసాతలంలో రాక్షసరాజుల కారాగృహాలలో ఉన్న దేవతాస్త్రీలను విడిపించాడు. ఈయన చల్లని పరిపాలనలో భూమ్యాకాశాలు ప్రజలపాలిటి కల్పవృక్షాలై వారి కోరికలు తీర్చాయి.

## రంతిదేవుడు.

ఈయన భరతునకు ఐదవతరం వాడు. ఈ మహారాజు తన సర్వ సంపదలనూ బీదసాదలకు పంచిపెట్టి నలభై ఎనిమిది రోజులు నిరాహారుడై ఉన్నాడు. ఆనాడు తినబోతున్న అన్నాన్ని సైతం ఆగంతుకులైన అభ్యాగతులకు అర్పించి మిగిలి ఉన్న నీళ్లు త్రాగబోతున్నాడు. ఆ సమయంలో ఒక చండాలుడు దాహార్తుడై రాగా తన దగ్గర ఉన్న ఆ జలాలను సైతం వానికి సమర్పించిన త్యాగమూర్తి. బ్రహ్మాది దేవతల అనుగ్రహానికి పాత్రుడైన పవిత్ర చరిత్రుడు.

## హస్తి

ఇతడు భరతుని మనుమడైన బృహత్క్షత్రుని మనుమడు. తన పేరు మీదుగా హస్తినాపురం నిర్మించి ప్రశస్తి గాంచిన యశోధనుడు.

## సంవరణుడు

ఇతడు హస్తిరాజు కుమారుడైన అజమీఢుని పౌత్రుడు. సూర్యనందన అయిన తపతిని ప్రేమించి పెండ్లి చేసుకున్నాడు. తపతీసంవరణుల దాంపత్యం జగత్ప్రసిద్ధం.

## కురువు

ఇతడు తపతీ సంవరణుల కుమారుడు. ఇతని పేరు మీదుగానే "కురుక్షేత్రం" వెలసింది. ఈయన వల్లనే "కురువంశ" మనే పేరు వాడుకలోనికి వచ్చింది.

### శంతనుడు

కురువుకు పదమూడవ తరంవాడు. కౌరవ పాండవులకు మూల పురుషుడు. ఈ మహారాజుకు గంగాదేవి యందు భీష్ముడూ, దాశరాజుపుత్రి అయిన సత్యవతి యందు చిత్రాంగద విచిత్ర వీర్యులూ జన్మించారు. సత్యవతికి కన్యాప్రాయంలో పరాశర మునీంద్రుని అనుగ్రహంవల్ల వేదవ్యాసమహర్షి ఉదయించాడు.

### విచిత్రవీర్యుడు

శంతనుని చిన్నకొడుకు. ఇతడు కాశీరాజు పుత్రికలైన అంబికను అంబాలికను వివాహమాడాడు. వ్యాసభగవానుని అనుగ్రహం వల్ల అంబికకు ధృతరాష్ట్రుడూ, అంబాలికకు పాండురాజూ జన్మించారు.

### ధృతరాష్ట్రుడు

గాంధార రాజపుత్రి అయిన  గాంధారిని వివాహమాడాడు. ఈ దంపతులకు దుర్యోధనాదులు వందమంది పుత్రులు, దుశ్శల అనే పుత్రిక కలిగారు.

### పాండురాజు

ఈయన "కుంతి" అనే నామాంతరం కల వసుదేవుని సోదరి పృథను, మద్రదేశాధీశ్వరుని పుత్రి మాద్రినీ వివాహమాడాడు. కుంతికి ధర్మజ భీమార్జునులూ, మాద్రికి నకులసహదేవులూ ఉదయించారు.

### అర్జునుడు

పాండుపుత్రులలో తృతీయుడు; పరాక్రమంలో అద్వితీయుడు. శ్రీకృష్ణసోదరి అయిన సుభద్రను వివాహమాడాడు. ఈ దంపతులకు అభిమన్యుడు జన్మించాడు.

### పరీక్షిత్తు

ఉత్తరాభిమన్యుల నందనుడు. ఈతడే మహాభాగవత శ్రోత.

### జనమేజయుడు

పరీక్షిత్తు కుమారుడు. ఈతడు మహాభారత శ్రోత.

### కార్తవీర్యార్జునుడు

యయాతి కుమారుడైన యదువునకు పదవ తరంవాడైన కృతవీర్యుని కుమారుడు. సప్తద్వీపవతి అయిన వసుమతిని పరిపాలించాడు. దత్తాత్రేయుని ప్రియశిష్యుడై యోగవిద్య నభ్యసించాడు.

### ఆహుకుడు

ఈతడు యదువంశీయులలో నలభై నాల్గవ తరంవాడు. దేవకుడు, ఉగ్రసేనుడు అనేవారు ఈయన కుమారులు.

## దేవకుడు

ఈయనకు "దేవకి" మొదలైనవారు ఏడుగురు పుత్రికలు జన్మించారు. వీరందరినీ వసుదేవుడు వివాహమాడాడు.

## ఉగ్రసేనుడు

ఈయన అహుకుని రెండవ కుమారుడు. మధురానగరాధీశుడు. కంసుడు మొదలైన వారు తొమ్మిదిమంది ఈయన కుమారులు.

## శూరసేనుడు

ఈతడు యదువంశీయులలో ముప్ఫైనాల్గవ తరంవాడైన సాత్వతునికి పన్నెండవ తరంవాడు. ఈయన భార్యపేరు మారిష. ఈ దంపతులకు వసుదేవుడు మొదలైన పదిమంది పుత్రులూ, కుంతి మొదలైన ఐదుగురు పుత్రికలూ జన్మించారు.

## వసుదేవుడు

శూరసేనుని జ్యేష్ఠపుత్రుడు. దేవకుని పుత్రికలైన "దేవకి" మొదలైన ఏడుగురను పెండ్లాడాడు. ఈయన జన్మించినప్పుడు ఆకాశాన దేవదుందుభులు మ్రోగాయి. అది కారణంగా వసుదేవునికి "ఆనక దుందుభి" అనే పేరు వచ్చింది. ఈ పుణ్యపురుషునికి రోహిణి యందు బలరాముడు, గదుడు, సారణుడు అనే కుమారులు కలిగారు. దేవకి యందు దేవదేవుడైన శ్రీకృష్ణభగవానుడు ఆవిర్భవించాడు. అనంతరం శ్రీకృష్ణుని ముద్దుల చెల్లె సుభద్ర జన్మించింది.

వసుదేవుని చెల్లెంద్రలో "పృథను" పాండురాజు పెండ్లాడాడు. వీరి పుత్రులు పాండవులు.

"శ్రుతదేవ" ను కరూషదేశాధిపతి వృద్ధశర్మ వివాహం చేసుకొన్నాడు. వీరికి దంతవక్త్రుడు పుట్టాడు.

"శ్రుతకీర్తి" ని కేకయవంశీయుడు ధృష్టకేతువు వివాహమాడాడు. వీరికి ప్రతర్దనుడు మొదలైనవారు జన్మించారు.

"శ్రుత శ్రవస"ను చేది దేశపురాజు దమఘోషుడు పెండ్లాడాడు. వీరికి శిశుపాలుడు పుట్టాడు.

"రాజాధిదేవి" ని జయసేనుడు పరిణయమాడాడు. వీరికి విందానువిందులు జన్మించారు.

వీరందరూ చంద్రవంశపువారే. అయినప్పటికీ యయాతి పుత్రుడైన యదువు పేరుమీద యదువంశీయులుగా ప్రసిద్ధి గాంచారు.

సూర్యవంశంలో శ్రీరామచంద్రుడు ఉదయించాడు. చంద్రవంశంలో శ్రీకృష్ణభగవానుడు ఉద్భవించాడు. ఈ విధంగా ఇద్దరు అవతార పురుషులకు మూలభూతాలైన సూర్యచంద్రవంశాలు ఈ నవమస్కంధంలో అత్యంత మనోహరంగా అభివర్ణితములైనాయి. అదీగాక-

**హరిశ్చంద్రో నలో రాజా పురుకుత్సః పురూరవః।**
**సగరః కార్తవీర్యశ్చ షడేతే చక్రవర్తినః॥**

ఆరుగురు చక్రవర్తులలో హరిశ్చంద్రుడు, పురుకుత్సుడు, సగరుడు- ఈ ముగ్గురూ సూర్యవంశీయులు. నలుడు, పురూరవుడు, కార్త వీర్యార్జునుడు- ఈ ముగ్గురూ చంద్రవంశానికి చెందినవారు.

ఈ స్కంధంలో సుద్యుమ్నుని వృత్తాంతం, సుకన్యాచరిత్రం, అంబరీషోపాఖ్యానం గంగావతరణం, శ్రీరామచరిత్రం, ఊర్వశీ పురూరవం, పరశురామ పరాక్రమం, యయాతి చరిత్రం, శకుంతలా దుష్యంతుల ఉదంతం, ఋశ్యశృంగ చరిత్రం మొదలైన ఘట్టాలను ఎంతో రమ్యంగా రసవంతంగా పోతన్న గారు తీర్చిదిద్దారు.

అందులో తనకు అభిమానపాత్రమైన శ్రీరామచరిత్రాన్ని అందమయిన అనుప్రాసలతో అంత్యప్రాసలతో అలంకరించి తన కవితాశక్తినీ, రామభక్తి నీ వ్యక్తీకరించారు పోతన్నగారు.

శ్రీరామచంద్రుడు వనవాసానికి బయల్దేరాడు. అదుగో- దండకారణ్యం ఎంత దర్శనీయంగా ఉన్నదో చూడండి.

**పుణ్యుడు రామచంద్రుఁడటవోయి ముదంబునఁ గాంచె దండకా**
**రణ్యముఁ దాపసోత్తమ శరణ్యము నుద్ధత బర్హిబర్హ లా**
**వణ్యము గౌతమీవిమల వాఃకణపర్యటన ప్రభూత సా**
**ద్గుణ్యము నుల్లసత్తరు నికుంజ వరేణ్యము నగ్రగణ్యమున్.** **9-268**

శ్రీరాముడు పరాక్రమశాలి అయిన వాలిని నేలకూల్చిన ఘట్టం తిలకించండి-

**లీలన్ రామవిభుండొక, కోలన్ గూలంగ నేసె గురునయశాలిన్**
**శీలిన్ సేవితశూలిన్, మాలిన్ వాలిన్ దశాస్యమానోన్మూలిన్.** **9-273**

పగవాని తమ్మునికి పట్టాభిషేకం చేసిన శ్రీరాముని ఔదార్యాన్ని ఈ క్రింది పద్యంలో సందర్శించవచ్చు-

**శోషితదానవుండు నృపసోముఁడు రాముఁడు రాక్షసేంద్రతా**
**శేషవిభూతిఁ గల్పసమజీవిని గమ్మని నిల్పె నర్థి సం**
**తోషణుఁ బాపశోషణు నదూషణు శశ్వదరోషణున్ మితా**
**భాషణు నార్యతోషణుఁ గృపాగుణభూషణు నవ్విభీషణున్.** **9-312**

సీతాసమేతుడై అయోధ్యకు తిరిగి వచ్చిన శ్రీరామచంద్రుణ్ణి పురకాంతలు సౌధాగ్రాలపై నుంచి దర్శించిన తీరు సుమనో మనోహరంగా ఉన్నది.

**ఇతఁడే రామనరేంద్రుఁ; డీయబల కా యింద్రారి ఖండించె! న**
**ల్లతఁడే లక్ష్మణుఁ; డాతఁడే కపివరుం! డా పొంతవాఁడే మరు**
**త్సుతుఁ; డా చెంగట నా విభీషణుఁ; డటంచుం జేతులం జూపుచున్**
**సతులెల్లం బరికించి చూచిరి పురీసౌధాగ్ర భాగంబులన్. 9-325**

రామకథను రసవంతంగా గానం చేస్తున్న కుశలవులను శ్రీరామచంద్రుడు ప్రశ్నించిన విధం ఎంతో సహజంగా ఉన్నది.

**చిన్ని యన్నలార! శీతాంశుముఖులార!, నళినదళవిశాల నయనులార!**
**మధురభాషులార! మహిమీఁద నెవ్వరు, దల్లి దండ్రి మీకు ధన్యులార! 9-353**

పోతన్నగారు శివుడిలో శ్రీరాముణ్ణి చూడగలరు. శ్రీరాముడిలో శ్రీకృష్ణుణ్ణి చూడగలరు. ఆయనకు కృష్ణుడంటే ఎంత ఇష్టమో రాముడన్నా అంతే ఇష్టం. అందువల్లనే దశమస్కంధంలో శ్రీకృష్ణుణ్ణి వర్ణిస్తూ వ్రాసిన "నల్లనివాడు పద్మనయనంబులవాడు" అన్న పద్యం వంటి పద్యాన్ని నవమస్కంధంలో అదే ఛందంలో అదే ప్రాసలో రచించి శ్రీరాముని కంఠంలో అలంకరించారు. ఎన్నటికీ వాడనిదీ సౌరభం వీడనిదీ అయిన ఆ ఉత్పలమాలను చిత్తగించండి-

**నల్లనివాఁడు, పద్మనయనంబులవాఁడు, మహాశుగంబులన్**
**విల్లును దాల్చువాఁడు, గడువిప్పగు వక్షమువాఁడు, మేలు పైఁ**
**జల్లెడువాఁడు, నిక్కిన భుజంబులవాఁడు, యశంబు దిక్కులం**
**జల్లెడు వాఁడు నైన రఘుసత్తముఁ డీవుత మా కభీష్టముల్! 9-361**

సీతారాముల ప్రణయమయ జీవితానికి అద్దం పట్టుతూ ముద్దులు మూటగట్టుతూ ఉన్న ఈ క్రింది పద్యం పోతన్నగారి అనువాద సౌభాగ్యానికి అచ్చమైన మచ్చుతునక-

మూలం: **ప్రేమ్ణానువృత్త్యా శీలేన ప్రశ్రయావనతా సతీ।**
**భియా హ్రియా చ భావజ్ఞా భర్తుః సీతాహరన్మనః॥**

దీనికి పోతన్న గారి అనువాదం-

**సిగ్గుపడుట గల్గి సింగారమును గల్గి**
**భక్తి గల్గి చాల భయము గల్గి**
**నయము ప్రియము గల్గి నరనాథు చిత్తంబు**
**సీత తనకు వశము చేసికొనియె. 9-338**

ఇది ఎంత చిన్న పద్యమో అంత గొప్పపద్యం. ఈ పద్యం ఎంత సునాయాసంగా పాఠకుని హృదయాన్ని ఆకర్షించు కుంటున్నదో అంత సులభంగా సున్నితంగా సీత శ్రీరాముని హృదయాన్ని వశంచేసుకున్నదని ఇందలి పరమార్థం.

అశ్వాన్ని అన్వేషిస్తూ తన ఆశ్రమానికి అరుదెంచిన అంశుమంతుని వినయవిధేయతలకు మెచ్చి కపిలమహర్షి ఇలా అంటాడు-

**అశ్వోఽయం నీయతాం వత్స! పితామహ పశుస్తవ।**

**ఇమే చ పితరో దగ్ధా గంగా భోఽర్హంతి నేతరత్ ॥**

మూలంలోని ఈ శ్లోకాన్ని పోతన్నగారు ఇలా అనువదించారు-

**గుఱ్ఱము గొనిపో ముద్దుల, కుఱ్ఱడ! నీ తాత యొద్దకున్; నీ తండ్రుల్**

**వెఱ్ఱులు, నీఱైరదె! యీ, మిఱ్ఱున గంగాజలంబు మెలఁగ శుభ మగున్.** 9-215

"ముద్దుల కుఱ్ఱఁడ!" అనటంలో కపిలమహర్షికి అంశుమంతునిపై కలిగిన అపార వాత్సల్యం వెల్లడి అవుతున్నది.

భయంతో పరుగెత్తుతున్న దుర్వాసుని వెంటపడి తరుముతున్న సుదర్శనాన్ని దర్శించండి.

**భువి దూఱన్ భువి దూఱు; నబ్ధిఁ జొరఁ నబ్ధుల్ సొచ్చు; నుద్వేగియై**

**దివిఁ బ్రాఁకన్ దివిఁ బ్రాఁకు;దిక్కులకుఁబో దిగ్వీథులం బోవుఁ; జి**

**క్కి వెసన్ గ్రుంగినఁ గ్రుంగు; నిల్వ నిలుచున్; గేడింపఁ గేడించు; నొ**

**క్క వడిన్ దాపసు వెంటనంటి హరిచక్రం బన్యదుర్వక్రమై!!** 9-107

యయాతి చేయూత నిచ్చి నూతిలో నుంచి దేవయానిని ఉద్ధరించిన సందర్భం పురస్కరించుకొని భారతం ఆదిపర్వంలో నన్నయ్యగారు ఇలా వ్రాశారు.

**జలధి విలోలవీచి విలసత్కలకాంచి సమంచితావనీ**

**తల వహనక్షమం బయిన దక్షిణహస్తమునం దదున్నమ**

**ద్గళదురు ఘర్మవారికణ క్రమకరాబ్జము వట్టి నూతిలో**

**వెలువడఁ గోమలిం దిగిచె విశ్రుతకీర్తి యయాతి ప్రీతితోన్.**

ఇందలి అక్షరరమ్యతకూ, సమాససౌందర్యానికీ చేతులెత్తి నమస్కరిద్దాము. ఇదే సందర్భాన్ని పురస్కరించుకొని పోతన్నగారు భాగవతం నవమస్కంధంలో ఈ క్రింది పద్యం రచించారు.

**సప్తాంభోనిధి మేఖలావృత మహాసర్వంసహా కన్యకా**

**ప్రాప్తోద్యద్వర దక్షదక్షిణకర ప్రాలంబముంజేసి ప్రో**

**క్షిప్తం జేసె యయాతి కట్టుకొనఁ బై చేలంబు మున్నిచ్చి ప**

**ర్యాప్త స్వేదజలాంగి నాళిసముదాయ స్వర్గవిన్ భార్గవిన్.** 9-527

పోతన్నగారు నన్నయ్యగారి పద్యాన్ని మనస్సులో పెట్టుకునే ఈ పద్యం వ్రాశారనటంలో సందేహం లేదు. వస్త్రవిహీనయై నూతిలో పడి ఉన్న దేవయానిని పైకి లాగటం కోసం చాపిన యయాతి దక్షిణ హస్తాన్ని మహాకవు లిద్దరూ ఇంచుమించుగా ఒకే విధంగా వర్ణించారు. రెండు పద్యాలలో గట్టి పట్టు ఉన్నది. బిగువు ఉన్నది. ముగింపు కూడా రెండు పద్యాలలోనూ బాగ కుదిరింది. అయితే "కట్టుకొన పై చేలంబు మున్నిచ్చిన" భాగవత యయాతిలో భారత యయాతిలో కంటే కొంత ఔచిత్యం ఉన్నదనక తప్పదు.

కణ్వాశ్రమంలో ప్రవేశిస్తున్న దుష్యంతునికి శుభశకునము లైనట్లు పోతన్నగారు చిత్రించారు. ఇక్కడ కూడా ఆయన నన్నయ్య గారిని మనస్సులో పెట్టుకొనే ఈ క్రింది అందమైన కందాలు వ్రాశారు.

**ఇందిందిరాతిసుందరి**
**యిందిందిర చికుర యున్న దిందంద శుభం**
**బిం దిందువంశ! యను క్రియ**
**నిందీవరవీథి మ్రోసె నిందిందిరముల్.** 9-603

తుమ్మెదల ఝుంకారాలే కాదు; కోకిలకూజితాలు కూడా దుష్యంతుడికి సంతోషాన్ని చేకూర్చేవిగా ఉన్నాయిట-

**మా కందర్పుని శరములు**
**మా కందము లగుటఁజేసి మా కందంబుల్**
**మా కందములను కైవడి**
**మాకందాగ్రములఁ బికసమాజము నిలిచెన్.** 9-604

శకుంతల దుష్యంతునికి స్వాగత మివ్వటం కూడా ఎంతో అందంగా చెప్పారు పోతన్నగారు.

**నీ వారము ప్రజ మేమును;**
**నీ వారము పూజగొనుము! నిలువుము! నీవున్**
**నీ వారును మా యింటను**
**నీవారాన్నంబు గొనుఁడు; నేఁడు నరేంద్రా!** 9-618

దాహార్తుడైన చండాలునికి తన దగ్గర ఉన్న కొంచెము నీళ్లు దానం చేస్తున్న కారుణ్యమూర్తి రంతిదేవుని పలుకులు ఎంతో సహజంగా ఉన్నాయి.

**అన్నము లేదు; కొన్ని మధురాంబువు లున్నవి త్రావు మన్న! రా**
**వన్న! శరీరధారులకు నాపద వచ్చిన వారి యాపదల్**
**గ్రన్నన మాన్చి వారికి సుఖంబులు సేయుట కంటె నొండు మే**
**లున్నదె? నాకు దిక్కు పురుషోత్తముఁ డొక్కఁడు సుమ్ము పుల్కసా!** 9-647

ఈ విధంగా నవమస్కంధం నిండా నవనవ పరిమళాలు వెదజల్లే నవమల్లికలూ నల్లకలువలూ కొల్లలు కొల్లలుగా వెల్లివిరిశాయి. స్కంధాంతంలో సొంత గొంతుకతో పోతన్న గారు ఇలా ఆకాంక్షిస్తారు.

**నగుమొగమున్, సుమధ్యమును, నల్లని దేహము, లచ్చి కాట ప**
**ట్టగు నురమున్, మహాభుజము, లంచితకుండల కర్ణముల్, మదే**
**భగతియు, నీలవేణియుఁ, గృపారసదృష్టియుఁ గల్గు వెన్నుఁ డి**
**మ్ముగఁ బొడసూపుఁగాతఁ గనుమూసిన యప్పుడు విచ్చు నప్పుడున్.** **7-732**

సహజసుందరమైన సహజపాండిత్యుని భాగవతం అక్షరాస్యు లందరికీ అందుబాటులో ఉండే నిమిత్తం సరళభావార్థ సహితంగా ప్రకటితం కావటం ఆంధ్రులందరికీ ఆనందకరమైన విషయం. ఈ సదుద్దేశంతోనే పోతన భాగవతం ప్రాజెక్టు ప్రారంభ మయింది. ఈ సందర్భంలో అనువాదభాగా లన్నింటినీ పరిశీలించి పరిష్కరించి ఏకసూత్రత కల్పించే కార్యం నాకు అప్పగించినందుకు కార్య నిర్వహణాధికారి శ్రీ సి. హెచ్. వేంకటపతిరాజు, ఐ.ఏ.ఎస్. గారికీ, డాక్టర్ రావుల సూర్య నారాయణమూర్తి (పి.ఆర్.ఓ.) గారికీ, ఎడిటర్ శ్రీ కె. సుబ్బారావు గారికీ నా సాధువాదాలు.

ఈ నవమస్కంధాన్ని మనోహరమైన సరళగద్యంలో అనువదించిన వారు శ్రీ బి. భాస్కరచౌదరి గారు. వీరు అనంతపురం ప్రభుత్వ కళాశాలలో ఆంధ్రోపన్యాసకులుగా పనిచేయుచున్నారు. వీరి అనువాదం సహజంగా సరళంగా అన్యూనాతిరిక్తంగా సాగింది.

ఈ గ్రంథాన్ని ఇంత ముచ్చటగా ముద్రించి ఇచ్చిన దేవస్థానం ప్రెస్‌మేనేజర్ శ్రీ యం విజయకుమార్ రెడ్డిగారికి, వారి సిబ్బందికి నా శుభాశీస్సులు, అక్షర దోషాలు దొర్లకుండా సహస్రాక్షులై ప్రూఫులు సరిదిద్దిన పూజ్యమిత్రులు మహాకవి శ్రీ ముదివర్తి కొండమాచార్యుల వారికి నా ధన్యవాదాలు. ప్రెస్‌కాపీ సిద్ధంచేసి ఇచ్చిన చిరంజీవి కోరాడ రామకృష్ణ ఎం.ఏ., ఎం.ఫిల్ కు నా శుభాకాంక్షలు.

భవదీయుడు
**కరుణశ్రీ**
ప్రధాన సంపాదకుడు
పోతన భాగవతం

శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః

# పోతన భాగవతము

## (సరళ గద్యానువాద సహితము)

## తొమ్మిదవ స్కంధము

**శ్రీ రాజిత! మునిపూజిత!, వారిధి గర్వాతిరేకవారణబాణా!**
**సూరిత్రాణ! మహోజ్జ్వల, సారయశస్సాంద్ర! రామచంద్ర నరేంద్రా! 1**

* లక్ష్మీదేవితో ప్రకాశించేవాడా! మునులచే పూజింపబడేవాడా! సముద్రుని గర్వాన్ని పోగొట్టిన బాణం కలిగినవాడా! పండితులను కాపాడేవాడా! గొప్ప కీర్తి కలిగినవాడా! ఓ రామచంద్రప్రభూ! అవధరించు!

**వ. మహనీయ గుణగరిష్ఠులగు న మ్ముని శ్రేష్ఠులకు నిఖిలపురాణ వ్యాఖ్యాన వైఖరీ సమేతుండైన సూతుం డిట్లనియె; నట్లు ప్రాయోపవిష్టుం డయిన పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రుం గనుంగొని. 2**

* అన్ని పురాణాలనూ విడమరిచి చెప్పే సూతుడు గొప్ప గుణవంతులైన, శ్రేష్ఠులైన ఆ మునులతో ఇట్లా అన్నాడు. ఆ విధంగా అన్నపానాలను వదలి ప్రాయోపవిష్టుడైన పరీక్షిన్మహారాజు శుకమహర్షిని చూచి ఇట్లా అడిగాడు.

**సీ. మనువుల నడవళ్ళు మర్యాదలును వింటి; మన్వంతరంబున మాధవుండు**
**దిరిగిన జాడలు దెలిసె సత్యవ్రతుం డనురాజు ద్రవిళ దేశాధిపుండు**
**పోయిన కల్పాంతమున విష్ణు సేవించి విజ్ఞానమును బొంది వెలుఁగుతేని**
**కతఁడు వైవస్వతుండై పుట్టి మను వయ్యె; నతనికి నిక్ష్వాకుఁ డాదిగాఁగఁ**

**తే. బదురు గొడుకులు గల రండ్రు పరఁగ వారి, వంశ మేరీతి వర్తించె? వారిలోనఁ**
**జనిన వారిని జనువారిఁ జనెడువారిఁ, జెప్పవే వ్యాసనందన! చిత్తగించి. 3**

* వ్యాసనందనా! మనువుల మనుగడలనూ, మర్యాదలనూ విన్నాను. మన్వంతరంలో విష్ణువు తిరిగిన తీరులు తెలుసుకొన్నాను, పోయిన కల్పాంతంలో ద్రవిళదేశాన్ని పాలించిన సత్యవ్రతుడనే రాజు విష్ణువును సేవించి, తత్త్వాన్ని తెలుసుకొన్నవాడై, సూర్యునికి పుట్టి, వైవస్వతుడనే నామంతో మనువయ్యాడు గదా! అతడికి ఇక్ష్వాకుడు మొదలైన పదిమంది కొడుకులని చెబుతారు. వారి వంశం ఏ రీతిగా ప్రవర్తిల్లింది? వారిలో వెనుకటి వాళ్ళను గురించి, ఇప్పటి వాళ్ళను గురించి, పుట్టబోయే వాళ్లను గురించి దయతో నాకు విశదీకరించు.

క. చెవులార నేఁడు వినియెద, రవివంశమునందుఁ గలుగు రాజుల కీర్తుల్
వివరింపు వరుసతోడను, భువిఁ బుణ్యుల కీర్తి వినినఁ బుణ్యము గాదే! 4

* మునీంద్రా! సూర్యవంశ రాజుల కీర్తులను నేడు నేను చెవులారా వింటాను. నీవు వరుసగా వివరించు, లోకంలో పుణ్యాత్ముల చరిత్రలు వింటే పుణ్యం కలుగుతుంది కదా!

వ. అనినం బరాశరమునిమనుమం డిట్లనియె. 5

* అని పలుకగా శుకుడు ఇట్లా అన్నాడు.

## -: వైవస్వత మనువంశ కథనము :-

ఆ. వినుము, మనువుకులము వేయి నూతేండ్లును, బరఁగ విస్తరించి పలుకరాదు
నాకుఁ దోఁచినంత నరనాథ! వేగంబ, యెఱుకపడఁగఁ బ్రీతి నేర్పరింతు. 6

* ఓ రాజా! విను. మనువుల వంశవృత్తాంతం వేయి నూరేండ్లయినా విస్తరంగా చెప్పడానికి సాధ్యపడేది కాదు. నాకు తోచినంతగా నీకు ఇప్పుడే తెలియ జేస్తాను.

క. ఎక్కువ తక్కువ పొడవుల, కెక్కటి మొదలైన పురుషుఁడింతయుఁ జెడఁ దా
నొక్కఁడుఁ గల్పాంతంబున, నక్కజమై నిల్చె విశ్వ మతఁడై యుంటన్. 7

* ఆ శ్రీహరి ఒక్కడే స్థూలమైన, సూక్ష్మమైన ప్రాణులకు అంతరాత్మ, ఆదిపురుషుడు. అతడే విశ్వమై ఉండడంవల్ల కల్పాంత సమయంలో సమస్తమూ లయమైనా తా నొక్కడే ఏకాంతంగా నిలిచాడు.

సీ. భూమీశ! య మ్మహాపురుషుని నాభిమధ్యమున బంగారుఁ గెందమ్మి మొలిచె;
నా తమ్మిపూవులో నటమీఁదఁ దనయంత నాలుగు మోముల నలువ పుట్టె
నా బ్రహ్మమనమున నట మరీచి జనించె; గశ్యపుం డతనికిఁ గలిగె; నంత
నా కశ్యపునికి దక్షాత్మజ యదితికిఁ గొమరుఁడై చీఁకటిగొంగ వొడమె;

తే. జలజ బంధుని పెండ్లాము సంజ్ఞయందు, శ్రాద్ధదేవుండు మనువు సంజాతుఁడయ్యె
మనువునకు శ్రద్ధ యనియెడి మగువయందుఁ, బదురు గొడుకులు గలిగిరి భద్రయశులు. 8

* ఓ మహారాజా! ఆ మహాపురుషుని బొడ్డు నడుమ ఎఱ్ఱటి బంగారు తామర పువ్వు మొలిచింది. ఆ పువ్వులోనుండి తనంత తానుగా నాలుగుముఖాలు కలిగిన బ్రహ్మ పుట్టాడు. ఆ బ్రహ్మ మనస్సులో మరీచి జన్మించాడు. అతడికి కశ్యపుడు కలిగాడు. ఆ కశ్యపునికి దక్షుని కూతురైన అదితికీ సూర్యుడు కొడుకై పుట్టాడు. ఆ సూర్యుని భార్య సంజ్ఞకు శ్రాద్ధదేవుడనే మనువు జన్మించాడు. ఆ మనువుకు శ్రద్ధ అనే భార్యవల్ల పవిత్ర చరిత్రులైన పదిమంది పుత్రులు పుట్టారు.

వ. వార లిక్ష్వాకుండును, నృగుండును, శర్యాతియు, దిష్టుండను, ధృష్టుండును, గరూశకుండును, నరిష్యంతుండును, వృషధ్రుండును, నభగుండును, గలియు నన నెగడి; రటమున్ను మనువు కొడుకులు లేని వాఁడై, మిత్రావరుణుల నుద్దేశించి. 9

సీ. మనువు బిడ్డలు పుట్ట మఖ మాచరించుచో నతని భార్యయు హోత నాశ్రయించి
కూఁతురు పుట్ట నాకును జేయు మని పల్కి వరభక్తితోఁ బయోవ్రతము సల్పె;
నా పతి సెప్పిన ట్లధ్వర్యుఁడును హోత నగుఁ గాక! వేలువు, మనుచుఁ బలికె;
హవి నందుకొని 'కూఁతు రయ్యెడు' మని వషట్కారంబు సెప్పుచుఁ గదిసి వేల్వ

తే. హోత పెడచేఁత నిల యను నువిద పుట్టె, దానిఁ బొడగని మనువు సంతాప మంది
"కొడుకు మేల్ గాక! యేటికిఁ గూఁతు? రకట!, చెప్పవే" యని పోయె వసిష్ఠకడకు. 10

వ. చని యిట్లనియె. 11

* వారు ఇక్ష్వాకుడు, నృగుడు, శర్యాతి, దిష్టుడు, ధృష్టుడు, కరూశకుడు, నరిష్యంతుడు, వృషధ్రుడు, అభంగుడు, కవి అనే పేర్లతో వర్ధిల్లినారు. అంతకు ముందు మనువు కొడుకులు లేనివాడై మిత్రావరుణులను గూర్చి యాగం చేశాడు.

మనువు బిడ్డలకోసం యాగం చేసేటప్పుడు అతడి భార్య హోతను ఆశ్రయించి కూతురు పుట్టేటట్లు చేయమని కోరి, పరమభక్తితో పాలవ్రతాన్ని చేసింది, ఆమె కోరినట్లుగానే అధ్వర్యుడు 'అట్లే అగుగాక! వేలువుమ'ని హోతతో చెప్పాడు. ఆ విధంగానే హోత యజ్ఞకుండాన్ని సమీపించి హవిస్సును అందుకొని 'కూతురు కలుగుగాక!' అని వషట్కారం చెబుతూ వేల్చినాడు. హోత చేసిన విపరీతమైన చేష్టవల్ల "కొడుకైతే మేలుగాని కూతురెందుకు?'' అనుకొని వసిష్ఠుని దగ్గరకు వెళ్లి ఇట్లా అన్నాడు.

క. "అయ్యా! కొడుకుల కొఱకై, యియ్యాగము నీ యనుజ్ఞ నేఁ జేయంగా
నియ్యాఁడు దేల పుట్టెను?, మీయంతటివారి కొండు మేరయుఁ గలదే! 12

* 'అయ్యా! నేను కొడుకుల కోసం నీ అనుమతితో ఈ యాగం చేస్తే ఈ ఆడకూతురు ఎందుకు పుట్టింది? మీలాంటి వారి వల్ల ఈ అక్రమం జరగవచ్చా!

వ. అదియునుంగాక, మీరు బ్రహ్మవాదులరు; మంత్రవాదులరు; పాపంబు లందకుండం జేయించువా; రిదియేమి?"యనవుడు, మా ముత్తాత వసిష్ఠుండు హోతృవ్యభిచారం బెఱింగి, మనువున కిట్లనియె!13

* అదీగాక మీరు బ్రహ్మవాదులు, మంత్రవాదులు, ఏ మాత్రం పాపం అంటకుండా కర్మలు చేయించేవారు. ఇప్పుడు ఇట్లా జరిగిందేమి?'' అని ప్రశ్నింపగా మా ముత్తాత ఐన వసిష్ఠుడు హోత తప్పునడతను తెలుసుకొని మనువుతో ఇట్లా అన్నాడు.

తే. 'అధిప! సంకల్ప వైషమ్య మగుటఁజేసి, హోత కల్లతనంబున నువిద గలిగె;
నైనఁ గలిగింతు నీకుఁ బ్రియాత్మజునిని, నీవు మెచ్చంగఁ జూడు నా నేర్పుబలిమి' 14

* "ఓ రాజా! సంకల్పానికి వ్యతిరేకంగా జరగడం వల్లనూ, హోతచేసిన మోసం వల్లనూ కూతురు కలిగింది. ఐనా విచారింప వలసిన పనిలేదు. నా నేర్పుతో నీవు మెచ్చేటట్లుగా కొడుకును కలిగిస్తాను చూడు.''

వ. అని పలికి భగవంతుడగు వసిష్ఠుండు గీర్తి తత్పరుండు గావున మనువు కూఁతు మగతనంబు కొఱకు నేక చిత్తంబున నాదిపురుషుండగు హరిం బొగడిన నప్పరమేశ్వరుండు మెచ్చి తపసి కోరిన వరం బిచ్చె; నది నిమిత్తంబుగా నిలాకన్యక సుద్యుమ్నుండను కుమారుండయి రాజ్యంబు సేయుచు. 15

సీ. ప్రొద్దు వో కొకనాఁడు వోయి పేరడవుల, వెంట వేఁటాడుచు వేడ్కతోడఁ
గొందఱు మంత్రులు గూడ రా సైంధవం బయిన గుఱ్ఱము నెక్కి యందమైన
బలువిల్లుఁ గ్రొవ్వాఁడి బాణంబులును దాల్చి పెను మెకంబుల వెంట బిఱుసుతోడ
నుత్తరదిశను మహోగ్రుఁడై చని చని మేరువు పొంతఁ గుమారవనముఁ

తే. జేరె నందు మహేశుండు శివయు నెపుడు, రతి సలుపుచుందు రందుఁ జొరంగఁ బోవ
నాఁడుదయ్యెను రాజు; రాజానుచరులుఁ, బడఁతులైరి తదశ్వంబు బడబ యయ్యె. 16

* అని చెప్పి పూజ్యుడైన వసిష్ఠుడు మనువు కూతురు మగతనం పొందడం కోసం ఏకాగ్రచిత్తంతో ఆదిపురుషుడైన శ్రీహరిని సంస్తుతించినాడు. శ్రీహరి మెచ్చి మునికోరిన వరాన్ని అనుగ్రహించాడు. ఆ కారణంగా ఇలా కన్య సుద్యుమ్నుడనే కుమారుడుగా మారిపోయింది. ఆ సుద్యుమ్నుడు రాజ్యం చేస్తూ ఒకనాడు ప్రొద్దుపోక కొందరు మంత్రులు వెంటరాగా ఉత్తమజాతి గుఱ్ఱాన్ని ఎక్కి గొప్పవిల్లును, వాడిబాణాలను ధరించి కారడవుల్లో వేటాడటానికి బయలుదేరాడు. అతడు శౌర్యంతో క్రూరజంతువులను వెంటాడుతూ ఉత్తర దిక్కుగా వెళ్లి మేరుపర్వతం దగ్గరున్న కుమారవనాన్ని చేరాడు. అందులో పార్వతీ పరమేశ్వరులు ఎప్పుడూ ఏకాంతంగా విహరిస్తూ ఉంటారు. ఆ వనంలో కాలు పెట్టేసరికి రాజు ఆడుది ఐనాడు. రాజు వెంట వచ్చిన వారూ స్త్రీలుగా మారిపోయారు. ఆ రాజు గుఱ్ఱం సైతం ఆడుగుర్రమై పోయింది.

వ. ఇట్లు మగతనంబు సెడి మగువలై యొండొరుల మొగంబులు సూచి మఱుఁగుచుండి; రనిన విని శుకునకు రాజిట్లనియె. 17

* ఈ విధంగా వారంతా మగతనం పోయి ఆడువారై ఒకరి ముఖాన్ని ఒకరు చూచి దుఃఖిస్తూ ఉండినారు అని చెప్పగా విని పరీక్షిత్తు శుకమహర్షితో ఇట్లా అన్నాడు.

ఆ. 'రాజుఁ దోడివారు రమణులై రంటివి, కాంత లగుట యేమికారణమున?
నిట్టి దేశ మెఱుఁగ మెన్నఁడు నా కథల్, వేడ్కదీర నాకు విస్తరింపు. 18

* రాజు, అతని వెంట ఉన్నవారు ఆడువారయ్యారని చెప్పావు. ఏ కారణం వల్ల వారు స్త్రీలయ్యారు? ఇటువంటి విడ్డూరమైన చోటును గూర్చి ఎన్నడూ విని ఉండలేదు. ఆ కథలను వేడుక తీరేటట్లు నాకు విస్తరించి చెప్పు.

వ. అదియునుం గాక. 19

ఆ. మగువతనము మాని మగవాఁడు గావచ్చుఁ, గాక పేరుఁ బెంపు గాసి గాఁగ
మగతనంబు మాని మగువ గావచ్చునె, మానవంతుఁడైన మానవునకు? 20

* అదీగాక ఆడుతనాన్ని కోల్పోయి మగవాడు కావచ్చు. కాని మానం కలిగిన పురుషుడు పేరుప్రతిష్ఠలు నశించేటట్లుగా మగతనాన్ని పోగొట్టుకొని ఆడుది కావచ్చునా?

వ. అని యడిగిన నర్జున పౌత్రునకు వ్యాసపుత్త్రుం డిట్లనియె. 21

* అని అడిగిన పరీక్షిత్తుతో శుకమహర్షి యిట్లా అన్నాడు.

సీ. 'పురవైరి కొకనాఁడు పొడసూపు వేడుకఁ దద్దయు దిక్కుల తమము లెల్ల
దమతమ వెలుఁగులు దగిలి గొందులు సొరఁ గొందఱు మౌనులు గోరి రాఁగఁ
బ్రాణేశు తొడలపై భాసిల్లు నంబిక వారలఁ జూచి మై వలువ లేమి
సిగ్గు పుట్టిన లేచి చీరఁ గట్టినఁ జూచి దేవియు దేవుండు దీర్ఘ లీల

తే. నొంటి దమలోనఁ గ్రీడించుచున్న వారు, మనకు సమయంబు గా దని మరలి మునులు
నరుఁడు నారాయణుండు ననారతంబు, మెలఁగు చోటికి నడచిరి మేదినీశ! 22

* ఓ రాజా! ఒకనాడు శివుణ్ణి దర్శించాలనే వేడుకతో కొందరు ఋషులు బయలుదేరారు. దిక్కుల్లోని చీకట్లన్నీ తమ తేజస్సుకు తట్టుకోలేక సందుగొందుల్లో దూరగా, ఋషులు ఆ కుమారవనానికి వచ్చారు. శివుని ఒడిలో ఉన్న పార్వతీదేవి వారిని చూచి సిగ్గుతో లేచి చీరకట్టుకొన్నది. అప్పుడు ఋషులు 'పార్వతీపరమేశ్వరులు ఏకాంతంగా క్రీడిస్తున్నారు. వారిని దర్శించడానికి ఇది సమయం కాదు' అనుకొని నరనారాయణుల నిత్య నివాసమైన బదరీవనానికి వెళ్లారు.

వ. అది కారణంగా, భగవంతుం డగు శివుండు తన ప్రియురాలి వేడుకల కొఱకు నిట్లని వక్కాణించె. 23

క. ఈ నెల వెవ్వఁడు సొచ్చిన, మానిని యగు ననిన తొంటి మాటకతమునన్
మానవుఁడు మగువ పోఁడిమి, మానక పేరడవులందు మఱియుం దిరిగెన్. 24

* ఆ కారణంగా భగవంతుడైన పరమేశ్వరుడు తన ప్రియురాలి వేడుక కోసం ఈ కుమారవనంలోనికి ఎవడు ప్రవేశించినా ఆడుది అవుతాడు" అని నొక్కి పలికాడు. ఆ నాటి ఈ మాట కారణంగా సుద్యుమ్నుడు ఆడుతనాన్ని పొంది ఆ కారడవుల్లో తిరిగాడు.

వ. ఇట్లు చెలికత్తియల మొత్తంబులుం దానును నా రాచపూఁబోఁడి చూపుల నాఁడు పోఁడిమి నెఱపుచు దైవయోగంబున సోమసుతుండును, భగవంతుండును నగు బుధుని యాశ్రమంబు సేరి మెలఁగుచున్న యెడ. 25

* ఈ విధంగా రాజకాంత ఐన సుద్యుమ్నుడు తాను తన చెలికత్తెలతో కలిసి వాడి చూపులతో స్త్రీ విలాసాలను కనబరుస్తూ దేవ ఘటన వల్ల చంద్రుని కొడుకూ, తేజోవంతుడూ అయిన బుధుని ఆశ్రమాన్ని చేరి అచ్చట విహరిస్తూ ఉన్నాడు.

**ఆ. రాజుకొడుకుఁ జూచె రాజీవదళనేత్ర, రాజవదనఁ జూచె రాజుపట్టి**
**దొంగ కాముఁ డంత దొందడిఁ జిగురాకు, వాలు వెఱికి యుఱికి వారి మొత్తె. 26**

* అప్పుడు ఆ రాజుకూతురు చంద్రుని కొడుకును చూచింది. బుధుడు ఆ చంద్రముఖిని చూచాడు. అప్పుడు కొంటెవాడైన మన్మథుడు చిగురాకు కత్తిని బయటకు లాగి సందడి చేస్తూ వారిమీదికి ఉరికి దాడి చేశాడు.

**వ. ఇట్లలరువిల్తుని నెఱబిరుదు చిగురు టడిదంబు మొనకు నోహటించి వార లిరువురుం బై పడి వేడుకలకుం జొచ్చిన వారలకుం బురూరవుం డను కుమారుండు పుట్టె. ని వ్విధంబున. 27**

* వీరాధివీరుడైన మన్మథుని చిగురాకు బాకుకు జంకి వాళ్ళిద్దరూ రతిక్రీడలకు పూనుకోగా వారికి పురూరవుడనే కుమారుడు పుట్టాడు.

**ఆ. మనుసుతుండు ఘనుఁడు మగనాలి తనమున, గొడుకుఁ గాంచి విసివి కుంది కుంది**
**చింతఁ బొంది గురు వసిష్ఠుని భావించె, నతని తలఁపుతోన నతఁడు వచ్చె. 28**

* ఈ విధంగా గొప్పవాడైన ఆ మనువు కుమారుడు ఆడుతనంతో కొడుకును కని, విసిగి వేసారి గురువైన వసిష్ఠుని తలచుకొన్నంతలో ఆయన అచ్చటకు వచ్చాడు.

**వ. వచ్చి సుద్యుమ్నుండు మగవాడగు కొఱకు న మ్మునిపుంగవుండు శంకరు నారాధింప నీశ్వరుండును దపసి ప్రయాసంబునకు సంతసిల్లి యిట్లనియె. 29**

* అట్లా వచ్చి సుద్యుమ్నుడు మగవాడు కావడం కోసం ఆ ముని శ్రేష్ఠుడు శివుణ్ణి పూజించాడు. ఈశ్వరుడు మునిపూనికకు సంతోషించాడు.

**మ. 'తన మున్నాడిన మాటయున్ నిజముగాఁ దన్మౌనికిం బ్రీతిగా**
**మనుచుండున్ నెల వో నెలం బురుషుఁడై మాసాంతరంబైనఁ గా**
**మినియై యీ గతి వీడుపాటమర భూమిం దాన రక్షించుఁ బొ**
**మ్మనినన్ వచ్చె వసిష్ఠుఁ; డా మనుసుతుం డా రీతి రాజ్యస్థుఁడై. 30**

* తాను ముందు చెప్పిన మాట పొల్లు పోకుండానూ, ఆ మునికి ప్రీతి కలిగేటట్లుగానూ పరమేశ్వరుడు అనుగ్రహించాడు- "సుద్యుమ్నుడు ఒక నెల పురుషుడుగానూ ఒకనెల ఆడుదిగానూ ఉంటాడు. ఈ మారుపాటు ఒప్పేటట్లు రాజ్యాన్ని కాపాడుతాడు. వెళ్ళు" అని శివుడు చెప్పగా వసిష్ఠుడు తిరిగి వచ్చాడు. ఆ మనుపుత్రుడు సుద్యుమ్నుడు ఆ రీతిగా రాజ్యం చేస్తూ ఉన్నాడు.

**ఆ. మగువ యగుచు మరల మగవాఁడు నగుచును, భూతధాత్రి యంత నాతఁ డేలెఁ**
**బ్రజలు సంతసింప బాహాబలముతోడ, గురుని కరుణఁ జేసి కువలయేశ! 31**

* ఓ రాజా! గురువు కృపవల్ల అత డా విధంగా ఆడుతనం పొంది మరలా మగవాడుగా మారి ప్రజలు సంతోషించేటట్టుగా తన భుజబలంతో భూమిని పరిపాలించాడు.

**వ. అతనికి నుత్కలుండును, గయుండును, విమలుండును నను కొడుకులు మువ్వురు గలిగి ధర్మపరులై యుత్తరాపథంబునకు రాజు లయిరి! సుద్యుమ్నుండు ముదుసలియై ప్రతిష్ఠానపురంబు విడిచి పురూరవునకు భూమి యిచ్చి వనంబునకుం జనియె. న వ్విధంబున. 32**

* అతడికి ఉత్కలుడు, గయుడు, విమలుడు అనే ముగ్గురు కొడుకులు కలిగి ధర్మపరులై ఉత్తర దిక్కులోని భూములకు రాజులయ్యారు. సుద్యుమ్నుడు ముసలి వాడై పురూరవునికి రాజ్యాన్ని అప్పగించి ప్రతిష్ఠానపురాన్ని వదలి తపస్సు చేసుకోవటానికి అడవులకు వెళ్ళాడు.

**సీ. కొడుకు సుద్యుమ్నుండు ఘోరాటవుల కేఁగ వందుచు మనువు వైవస్వతుండు**
**దనకు బిడ్డలు గల్గఁ దప మాచరించెను హరిఁ గూర్చి నూఱేండ్లు యమునలోన;**
**హరియంత నిక్ష్వాకుఁ డాదిగాఁ బదుగురు పుత్త్రుల నిచ్చెను బొసఁగ; వారి**
**యందుఁ బృషధ్రాఖ్యుఁ డనువాడు గురునాజ్ఞ విమల ధర్మంబులు వెలయఁబూని**

**తే. పసుల కదుపులఁ గాచుచు బలు మొగిళ్ళు, వచ్చి నడురేయి జోరున వాన గురియ**
**మంద విడియించి చుట్టు నేమఱకయుండె, నడవి మెకములు సొరకుండ నరసికొనుచు. 33**

* ఈ విధంగా కొడుకైన సుద్యుమ్నుడు అడవులకు వెళ్లగా దుఃఖిస్తూ వైవస్వత మనువు బిడ్డలకోసం యమునానది తీరంలో విష్ణువును గూర్చి నూరేండ్లు తపస్సు చేశాడు. విష్ణువు అతడికి ఇక్ష్వాకుడు మొదలైన పదిమంది కొడుకులను ప్రసాదించాడు. వారిలో పృషధ్రుడనే వాడు గురువు ఆజ్ఞమేరకు పరిశుద్ధ ధర్మాలను పాటించి ఆలమందలను కాస్తూ ఉండేవాడు. ఒకరోజు అర్ధరాత్రివేళ దట్టంగా మబ్బులు కమ్ముకొని భోరున వాన కురవసాగింది. అతడు మందను ఒకచోట చేర్చి అడవి మృగాలు మందపై పడకుండా కనిపెట్టుకొని ఉన్నాడు.

**వ. అంత. 34**

**క. ప్రబ్బికొనిన పెంజీఁకటి, నిబ్బరముగ నడిఁకి నడికి నింగికి వడితో**
**గొబ్బున నెగసి తటాలున, బెబ్బులి మందావుఁ బట్టెఁ బెలుకుఱే యఱవన్. 35**

* అంతలో కమ్ముకొన్న ఆ కారుచీకట్లో ఒక బెబ్బులి కదలకుండా ఒదిగిఒదిగి తటాలున పైకిదూకి, మందలోని ఒక ఆవును పట్టింది. ఆవు భయంతో 'అంబా' అని అరచింది.

**క. ఉల్లముల గలఁగి మొదవుల, వెల్లువ లన్నియును లేచి విచ్చల విడితోఁ**
**జెల్లాచెదరై పాఱెను, బెల్లుగ నంభా యటంచు బెబ్బులి గాలిన్. 36**

* పులిని పసిగట్టగానే గుండె లదరిపోయిన ఆలమందలన్నీ అంబారావాలు చేస్తూ ఎట్లాబడితే అట్లా చెల్లాచెదరై పోయాయి.

**వ. అ య్యవసరంబున 37**

శా. ఆ పెంజీఁకటి మ్రోలఁ గాన కడిదం బంకించి శార్దూల మం
చా పుల్లావు శిరంబుఁ ద్రుంచి తెగదో యంచుం, బులిన్ వెండియున్
వాపోవం దెగ వ్రేసి భూవరుఁడు ద్రోవన్ ఖడ్గరక్తంబుచేఁ
బై పై గీయుచుఁ జేరి చూచెఁ దల ద్రెవ్వంబడ్డ యద్దేనువున్. 38

* ఆ రాజు కారుచీకట్లో ముందేమున్నదో చూడలేక కత్తి తీసుకొని పులికాబోలనుకొని పుల్లావు తలను ఖండించాడు; తెగలేదేమో అని మళ్లా పులి వాపోయేటట్లుగా తెగనరికాడు. తర్వాత కత్తినంటిన నెత్తుటిని చేత్తో తుడుస్తూ వెళ్ళి తలతెగిన ఆవును చూశాడు.

వ. చూచి దుఃఖితుఁడై యున్న పృషధ్రునింగని, కులగురుండగు వసిష్ఠుండు కోపించి 'నీవు రాజత్వంబునకుఁ బాసి యీ యపరాధంబున శూద్రుండవు గ' మ్మని శపియించె; నతండును గృతాంజలియై తన కులాచార్యుని వలన మరలం గైకోలు వడసి యతని యనుమతంబున. 39

సీ. అఖిలాత్ముఁ డగుచున్న హరియందుఁ బరునందు భక్తితోఁ జాలఁ దత్పరత మెఱసి
యూర్ధ్వరేతస్కుఁ డై యున్న ప్రాణులకెల్ల నాప్తుఁడై సర్వేంద్రియములు గెల్చి
సంగంబునకుఁ బాసి శాంతుండు నపరిగ్రహుండునై కోరక యుండి తనకు
వచ్చిన యదియ జీవనము గావించుచుఁ దనుఁదాన నిలుపుచు ధన్యబుద్ధి

తే. జడుని తెఱఁగున నంధుని చందమునను, జెవిటి భంగిని మహినెల్లఁ జెల్లఁ దిరిగి
యడవులకు నేఁగి కార్చిచ్చు నందుఁ జొచ్చి, చిక్కి నియతుడై బ్రహ్మంబుఁ జెందె నతఁడు. 40

* అది చూచి దుఃఖించిన పృషధ్రుని కనుకొని కులగురువైన వసిష్ఠుడు కోపించి 'ఈ తప్పువల్ల నీవు క్షత్రియుడివి కాకుండా శూద్రుడివై ఉండు' అని శపించాడు. అతడు నమస్కరించి తన కులగురువు నుండి మళ్ళా అనుజ్ఞను పొంది అతడి అంగీకారంతో అఖిలాత్ముడు, పరమాత్ముడు ఐన శ్రీహరియందే మనస్సు లగ్నంచేసి, భక్తితో ప్రకాశించాడు. కామ వ్యాపారాలను జయించినవాడై, ప్రాపంచిక సుఖాలకు దూరమైనవాడై ప్రవర్తిల్లాడు. ఇతరుల నుండి ఏదీ పుచ్చుకోకుండా తనకు దొరికిన దానితోనే జీవితాన్ని వెళ్ళబుచ్చాడు. మూగవాడిలాగా, గ్రుడ్డివాడి విధంగా, చెవిటివాడి రీతిగా నేలనాలుగు చెఱగులూ తిరిగాడు. చివరికి అడవుల్లోకి వెళ్ళి కార్చిచ్చులో పడి పరబ్రహ్మలో కలసిపోయాడు.

క. కవి యను కడపటి కొమరుఁడు, భవనము రాజ్యంబు విడిచి బంధులతో నేఁ
గి వనమునఁ బరమపురుషునిఁ, బ్రవిమలమతిఁ దలఁచి తలఁచి వరముం బొందెన్. 41

* కవి అనే కడగొట్టు కొడుకు ఇంటినీ రాజ్యాన్ని విడిచి బంధువులతో కలసి అడవికి వెళ్ళి పరమపురుషుడైన శ్రీహరిని పరిశుద్ధమైన మనస్సుతో ధ్యానించి మోక్షాన్ని పొందాడు.

వ. మఱియుఁ గరూశుం డను మానవునివలనం గొందఱు కారూశులు క్షత్రియులు గలిగి, ధర్మంబుతోడి ప్రియంబున బ్రహ్మణ్యులై యుత్తరాపథంబునకు రక్షకులైరి; ధృష్టుని వలన ధార్ష్టం బను వంశంబు

గలిగి భూతలంబున బ్రహ్మభూయంబు నొంది నెగడె; నృగుని వంశంబున సుమతి పుట్టె; నతనికి భూతజ్యోతి పుట్టె; నతనికి వసువు జనించె; వసువునకుం బ్రతీతుండు గలిగెఁ; బ్రతీతునికి నోఘవంతుఁడు జనించె; నతని కూఁతు నోఘవతి యను కన్యకను సుదర్శనుండు వివాహంబయ్యెఁ; నరిష్యంతుండును మనుపుత్త్రునికి జిత్రసేనుం, డా విభునకు దక్షుం, డా పుణ్యునకు మీఢ్వాంసుం, డా సుజనునికి శర్వుం, డమ్మహాత్మునికి నింద్రసేనుం, డా రాజునకు వీతిహోత్రుం, డా సుమతికి సత్యశ్రవుం, డాఘునునికి నురుశ్రవుం, డా వీరునకు దేవదత్తుం, డా పండితునకు నగ్ని వేశుండు సుతులయి జనియించి; రయ్యగ్నివేశుండు కానీనుండన నెగడి జాతకర్ణుండను మహర్షియై వెలసె; నతని వలన నాగ్నివేశ్యాయనం బను బ్రహ్మకులంబు గలిగె; నవ్విధంబున. 42

* కరూశుడనే కొడుకువల్ల కారూశులనే క్షత్రియులు కలిగారు. ధర్మప్రియులూ, బ్రాహ్మణప్రియులూ ఐనవారు ఉత్తరదిక్కులోని భూములకు రక్షకులయ్యారు. ధృష్టునివల్ల ధార్ష్టమనే వంశం కలిగి బ్రహ్మజ్ఞానం పొంది భూతలంలో వర్ధిల్లింది.

నృగుని వంశంలో సుమతి పుట్టాడు. అతనికి భూతజ్యోతి కలిగాడు. అతడికి వసువు జన్మించాడు. ఆ వసువుకు ప్రతీతుడు పుట్టాడు. అతడికి ఓఘవంతుడు జన్మించాడు. అతడి కూతురైన ఓఘవతి అనే కన్యను సుదర్శనుడు పెళ్ళిచేసుకొన్నాడు.

నరిష్యంతుడనే మనువు కొడుక్కి చిత్రసేనుడు, ఆ రాజుకు దక్షుడు, ఆ పుణ్యాత్ముడికి మీఢ్వాంసుండు, ఆ మంచి వాడికి శర్వుడు, ఆ మహాత్ముడికి ఇంద్రసేనుడు, ఆ రాజుకు వీతిహోత్రుడు, ఆ బుద్ధిమంతుడికి సత్యశ్రవుడు, ఆ గొప్పవాడికి ఉరుశ్రవుడు, ఆ వీరుడికి దేవదత్తుడు, ఆ పండితుడికి అగ్నివేశుడు కొడుకులై పుట్టారు. ఆ అగ్నివేశుడు కానీనుడని ప్రసిద్ధుడై జాతకర్ణుడనే మహర్షిగా వెలిశాడు. అతడి వల్లనే "అగ్నివేశ్యాయన" మనే బ్రాహ్మణకులం ఏర్పడింది.

క. తెలుపఁబడె నరిష్యంతుని, కుల మెల్లను నీకు దిష్టకులమున్ దెలియం
దెలిపెద రాజేంద్రోత్తమ!, తెలియుము సర్వంబు నీకుఁ దేటపడంగన్. 43

* ఓ రాజశ్రేష్ఠుడా! ఈ విధంగా నీకు నరిష్యంతుని కులమంతా తెలుపబడింది. ఇక దిష్టుడి వంశాన్ని గూర్చి నీకు తేటతెల్లంగా తెలియ జేస్తాను.

వ. దిష్టుని కొడుకు నాభాగుం డను వాఁడు కర్మవశంబున వైశ్యత్వంబు నొందె; నా నాభాగునికి హలంధనుండు కలిగె; నతనికి వత్సప్రీతియు, వత్సప్రీతికిఁ బ్రాంశువు, నతనికిఁ బ్రమితియుఁ, బ్రమితికి ఖమిత్రుండును, ఖమిత్రునికిఁ జాక్షుషుండు, నతనికి వివింశతియు, వివింశతికి రంభుండు, రంభునికి ధార్మికుండైన ఖనినేత్రుండు, నతనికిఁ గరంధనుండు, గరంధనున కవిక్షిత్తు,నా యవిక్షిత్తునకు మరుత్తుండు జనియించిరా మరుత్తుండు చక్రవర్తి యయ్యెఁ; నతని చరిత్రంబు వినుము. 44

* దిష్టుడి కొడుకు నాభాగుడనేవాడు కర్మవశంగా వైశ్యత్వాన్ని పొందాడు. ఆ నాభాగునికి హలంధనుడు కలిగాడు. అతడికి వత్సప్రీతి, వత్సప్రీతికి ప్రాంశువు, అతడికి ప్రమితి, ప్రమితికి, ఖమిత్రుడు, ఖమిత్రునికి చాక్షుషుడు, అతడికి వివింశతి, వివింశతికి రంభుడు, రంభునికి ధర్మాత్ముడైన ఖనినేత్రుడు , అతడికి కరంధనుడు, కరంధనుడికి అవిక్షిత్తు, అవిక్షిత్తుకు మరుత్తుడు జన్మించారు. ఆ మరుత్తుడు చక్రవర్తి అయ్యాడు. అతడి చరిత్ర విను.

**సీ. అంగిరస్సుతుఁడు మహాయోగి సంవర్తుఁ డతని యాగమునకు యాజకుండు,**
**దిరిగి యుండెడివారు మరుదాఖ్యగణము లొ ప్పారు విశ్వేదేవు లచటి సభ్యు**
**లధిక దక్షిణల బ్రాహ్మణకోటిఁ దనిపెను; సోమపానంబున సురవరుండు**
**మది నుబ్బి బంగారు మయము గావించెను యాగవస్తువు లెల్ల; నధిక నియతి**

**తే. నా మరుత్తుఁడు సేసిన యట్టిభంగి, ధీరభావంబుఁ జాగంబుఁ దెంపుఁ గలిగి**
**మఖము సేసిన వారిని మఱియు నెఱుఁగ, మెల్ల లోకములందు నరేంద్రముఖ్య! 45**

* ఓ రాజా! ఆ మరుత్తుని యాగానికి అంగిరసుని కొడుకు, మహాయోగి ఐన సంవర్తుడు నిర్వాహకుడు. దాన్ని పరివేష్టించిన వారు మరుత్తులు. విశ్వేదేవతలు అక్కడి సదస్యులు. ఆ మరుత్తుడు గొప్ప దక్షిణలతో బ్రాహ్మణులను తృప్తిపరిచాడు. సోమపానంతో పొంగిపోయిన దేవేంద్రుడు యాగవస్తువుల నన్నింటినీ బంగారుమయం చేశాడు. ఆ మరత్తుడిలాగా త్యాగమూ, తెంపూ గలిగి యజ్ఞం చేసిన మరొకరిని ముల్లోకాల్లోనూ చూడబోము.

**వ. ఆ మరుత్తునకు దముండును, దమునకు రాజవర్ధనుండును, రాజవర్ధనునకు సుధృతియు, సుధృతికి సౌధృతేయుండును, సౌధృతేయునకుఁ గేవలుండును, కేవలునకు బంధుమంతుండును, నతనికి వేదవంతుండును, వేదవంతునికి బంధుండును, బంధునకుఁ దృణబిందుండును సంభవించి; రంత.46**

* ఆ మరుత్తునికి దముడు, దమునికి రాజవర్ధనుడు, రాజవర్ధనునికి సుధృతి, సుధృతికి సౌధృతేయుడు, సౌధృతేయునికి కేవలుడు, కేవలునికి బంధుమంతుడు, అతడికి వేదవంతుడు, వేదవంతునికి బంధుడు, బంధుడికి తృణబిందుడు జన్మించారు.

**క. అచ్చరకన్య యలంబుస, గ్రచ్చఱఁ దృణబిందుఁ జూచి కామించి తుదిం**
**బచ్చవిలుకాని యమ్ముల, ముచ్చిచ్చున వచ్చి పొందె మోహాతురయై. 47**

* అప్సరఃస్త్రీ ఐన అలంబుస తృణబిందుణ్ణి చూచి కామించింది. మోహంతో మన్మథుని బాణాలకు లోనై అతణ్ణి పొందింది.

**వ. ఆ దంపతులకు నిలబిల యను కూఁతురు జన్మించె; నా కొమ్మను విశ్రవసుండు వొందిన నైల బిలుండనం గుబేరుండు పుట్టె; మఱియు నా తృణబిందునకు విశాలుండును, శూన్య బంధుండును, ధూమ్రకేతుండును ననువారు ముప్వురు గొడుకులు గలిగి, రందు విశాలుండును వంశవర్ధనుండై**

**వైశాలియను నగరంబు నిర్మించె; నా రాజునకు హేమచంద్రుం, డా నరేంద్రునకు ధూమ్రాక్షుం, డా పుడమితేనికి సహదేవుం, డా బలిష్ఠునకుఁ గృశాశ్వుం డాతనికి సోమదత్తుండు జన్మించె; నతండు.48**

* ఆ దంపతులకు "ఇలబిల" అనే కూతురు పుట్టింది. ఆమెను విశ్రవసుడు పెళ్ళిచేసుకోగా కుబేరుడు పుట్టాడు. ఆ తృణబిందువునకు విశాలుడు, శూన్యబంధుడును, ధూమ్రకేతుడును నను వారు ముగ్గురు కొడుకులు కలిగారు. వారిలో విశాలుడు వంశాన్ని పెంపొందించిన వాడై "వైశాలి" అనే నగరాన్ని నిర్మించాడు. ఆ రాజుకు హేమచంద్రుడు, అతడికి ధూమ్రాక్షుడు, ఆ ప్రభువుకు సహదేవుడు, ఆ బలవంతుడికి కృశాశ్వుడు, అతడికి సోమదత్తుడు జన్మించారు.

**ఆ. అమర విభుఁడు మెచ్చ నశ్వమేధము సేసి, భూరిపుణ్యగతికిఁ బోయె నెలమి;**
**సోమదత్తుకొడుకుఁ సుమతికి జనమేజ, యుం డనంగఁ గొమరుఁ డుప్పతిల్లె. 49**

* ఆసోమదత్తుడు దేవేంద్రుడు మెచ్చేటట్లుగా అశ్వమేధయాగం చేసి పుణ్యగతిని పొందాడు. అతడి కొడుకైన సుమతికి జనమేజయుడనే కుమారుడు కలిగాడు.

**వ. వీరలు వైశాలు రనం బరఁగి తృణబిందుని కీర్తి వహించి, రాజ్యంబు సేసిరి. మఱియును. 50**

* వీళ్ళందరూ వైశాలురని ప్రసిద్ధి గాంచారు. తృణబిందుడి కీర్తిని విస్తరింపజేస్తూ వీరు రాజ్యం చేశారు.

**సీ. శర్యాతియను రాజు జనియించె బ్రహ్మవరుండైన మనువుకు రూఢితోడ;**
**నతఁ డంగిరుని సత్త్రమందు రెండవనాఁటి విహితకర్మము నెల్ల వెలయఁ జెప్పె;**
**నతని కూఁతురు సుకన్యక యను వనజాక్షి దన తండ్రితోఁ దపోవనికి నరిగి**
**చ్యవనాశ్రమముఁ జేరి సఖులును దానును ఫలపుష్పములు గోయఁ బాఱ తిరిగి**

**ఆ. యొక్కపుట్టలోన నొప్పారు జ్యోతుల, రెంటిఁగాంచి వాఁడి ముంటఁ బొడిచెఁ;**
**గన్య ముగుద మఱచి ఖద్యోతయుగ మంచు, దైవ వశముకతనఁ దమకి యగుచు. 51**

* పరబ్రహ్మయందు ఆసక్తుడైన మనువుకు శర్యాతి అనే రాజు జన్మించాడు. అతడు అంగిరుని యజ్ఞమందు రెండవనాడు చేయవలసిన కర్మకాండను వివరించి చెప్పాడు. ఆ శర్యాతి కూతురైన సుకన్యక ఒక రోజు తండ్రితో పాటు చ్యవనముని ఆశ్రమానికి వెళ్ళింది. చెలికత్తెలూ, తాను పూలనూ పండ్లనూ కోస్తూ వనమంతా తిరిగి ఒక పుట్టలో వెలుగుతూన్న రెండు జ్యోతులను చూచింది. దైవఘటనవల్ల అవి మిణుగురు పురుగుల జంట కాబోలనుకొని తొందరపాటున వాటిని సుకన్యక ఒక వాడిముల్లుతో పొడిచింది.

**క. జ్యోతుల ముంటం బొడిచిన, వాతల నెత్తురుల గురిసె వసుధేశభట**
**వ్రాతముల కెల్ల నచ్చట, నా తఱి మలమూత్ర బంధమయ్యె నరేంద్రా! 52**

* ఆ విధంగా జ్యోతులను ముల్లుతో పొడవగా వాటి నుండి నెత్తురు కారింది. ఆ అపరాధం వల్ల అప్పుడు రాజభటులకు మలమూత్రాలు స్తంభించి పోయాయి.

వ. వారలంజూచి రాజర్షియగు శర్యాతి విస్మితుండై 'మీరలియ్యాశ్రమ దూషణంబు సేయ నోపుదురది కారణంబుగా మీకీ నిరోధంబు సిద్ధించె. నని పలుకు నవసరంబునఁ దండ్రికి సుకన్యక యిట్లనియె. 53

* వారి అవస్థ చూచి రాజర్షి ఐన శర్యాతి ఆశ్చర్యపడి 'మీ రీ ఆశ్రమంలో ఏదైనా అపరాధం చేసి ఉండవచ్చు, ఆ కారణంగా మీకీ ఆటంకం కలిగింది' అని చెబుతుండగా సుకన్యక తండ్రితో ఇట్లా అన్నది.

తే. అయ్య! యీ పుట్టచేరువ నాడి యాడి, యిందులో రెండుజ్యోతుల నేనుఁ గాంచి
కంటకంబునఁ బొడువ రక్తంబు గురిసె, నే విధంబునఁ గురిసెనో యెఱుఁగు మీవు. 54

* అయ్యా! ఈ పుట్టదగ్గర ఆడుకొని, అందులో రెండు జ్యోతులను చూచి నేను ముల్లుతో పొడువగా రక్తం కారింది. ఎందు కట్లా రక్తం కారిందో నీవు తెలుసుకో.

వ. అనిన శర్యాతి భీతుండై కూఁతుం దోడ్కొని వల్మీకంబుకడకుం జని యందుఁ దపంబు సేయుచున్న చ్యవనుని గని తన నేర్పున నతనివలనఁ బ్రసన్నత వడసి తపసి చిత్తంబు నెఱింగి తన పుత్రిక నిచ్చి యెట్ట కేలకుం బ్రదికినవాఁడై మునీశ్వరుని వీడ్కొని పురంబునకుం జనియె; నంత. 55

* అని చెప్పగా శర్యాతి భయపడి కూతురును పుట్టదగ్గరకు తీసుకొని పోయి అందులో తపస్సు చేస్తున్న చ్యవన మునిని చూచాడు. తన తెలివితేటలతో మునిని ప్రసన్నుణ్ణి చేసుకొన్నాడు. అతడి మనస్సు తెలుసుకొని కూతురును ఆయన కిచ్చి పెళ్ళిచేసి ఆ ప్రమాదం నుండి బయట పడ్డాడు. తర్వాత మునీశ్వరుని దగ్గర సెలవు తీసుకొని పట్టణానికి వెళ్ళాడు.

ఆ. పరమకోపుఁ డయిన భార్గవుఁ బతిఁ జేరి, మిగులఁ బనుల యెడల మెచ్చఁ దిరిగి
యతని పర్ణశాల నా సుకన్యక యను, మగువ గొన్ని యేండ్లు మనువు మనియె. 56

* పిమ్మట ఆ సుకన్యక మిక్కిలి కోపిష్ఠి అయిన ఆ చ్యవన మహర్షిని చేరి మెప్పు పొందేటట్లుగా పనులు చేసుకొంటూ అతడి ఆశ్రమంలో కొన్ని ఏండ్లు కాపురం చేసింది.

వ. అంత నొక్కనాఁ డ య్యాశ్రమంబునకు వేల్పువెజ్జులైన యాశ్వ్విను లిద్దఱు వచ్చిన వారలం బూజించి తన ముదిమి సూపి చ్యవనుం డిట్లనియె, 'మీకు మున్న యాగభాగంబుల లేని సోమపానంబు నేడు గల్పించి యిచ్చెద, సోమపాన సమయంబునఁ బాన పాత్రంబు మీకు నందిచ్చెద; నా ముదిమి మానుపుం' డని యిట్లనియె. 57

* అంతలో ఒకనాడు ఆ ఆశ్రమానికి దేవవైద్యులైన అశ్వినీ దేవతలు ఇద్దరు వచ్చారు. 'మీకు యాగభాగాల్లో ఇంతకు ముందు లేని సోమపానాన్ని నేను కలుగజేస్తాను. సోమపాన సమయంలో మీకు పాత్రను అందిస్తాను. ఎట్లాగైనా నా ముసలితనాన్ని పోగొట్టండి' అని యింకా ఇట్లా అన్నాడు.

క. నవకంబగు ప్రాయంబున, జవరాండ్రఁ గరంచు మేని చక్కఁదనంబున్
శివతరముగఁ గృప సేయుఁడు, దివిజాధిప వైద్యులార! దీవింతు మిమున్. 58

* ఓ దేవవైద్యులారా! అందమైన ప్రాయంతో యువతులను వశీకరించుకొనే మంగళకరమైన శరీరసౌందర్యాన్ని నాకు అనుగ్రహించండి. మిమ్ములను నేను ఆశీర్వదిస్తాను.

**వ. అనిన నశ్వినీదేవతలు సంతోషించి సిద్ధనిర్మితంబయిన యీ మడుఁగున మునుఁగు మని పలికి.59**

**సీ. ముసలితాపసుఁబట్టి మొగి నెత్తుకొనిపోయి ముగురు నా మడుఁగున మునిఁగి లేచి**
**వనితాజనము నెల్ల వలపించువారలై సుందర మూర్తులై సుభగు లగుచుఁ**
**గమలమాలికలతోఁ గనకకుండలములతో మంచి చీరలతోడఁ దుల్యు**
**లై సూర్యతేజస్కులై యున్న వారల మువ్వురఁ బొడఁగాంచి ముగుద బాల**

**తే. యిందు బెనిమిటి వీఁ డని యెఱుఁగ లేక, గరిత గావున నిజనాథుఁ గానఁ గోరి**
**సుభగమతులార! నా నాథుఁ జూపుఁ డనుచు, నశ్వినీదేవతలకు నయ్యబల మ్రొక్కె. 60**

* అనగా అశ్వినీదేవతలు సంతోషించి 'సిద్ధజాతి దేవతలచేత నిర్మింపబడ్డ ఈ మడుగులో మునుగు' మని చెప్పి ఆ ముసలిమునిని ఉత్సాహంతో ఎత్తుకొని పోయి ముగ్గురూ ఆ మడుగులో మునిగి లేచారు. స్త్రీల నందరినీ ఆకర్షించే సుందరాకారులై అదృష్టవంతులై తామరపూల మాలలతో, బంగారు చెవిపోగులతో, మంచి వస్త్రాలతో సూర్యుని వంటి కాంతి గలిగి ఒక్కలాగే ఉన్న ఆముగ్గురినీ చూచి అమాయికురాలైన సుకన్యక వారిలో తన భర్తను కనిపెట్టలేక పోయింది. పతివ్రత అయిన ఆమె తన భర్తను తెలుసుకోవాలనుకొని 'ఓ పుణ్యాత్ములారా! నా భర్తను చూపి పుణ్యం కట్టుకోండి' అని అశ్వినీ దేవతలకు మ్రొక్కింది.

**వ. వార లా పతివ్రత నిజమరితనంబునకు మెచ్చి వయోరూప సంపన్నుం డయిన చ్యవనుం జూపి, దంపతుల వీడ్కొని విమానారూఢులై వేలుపుల ప్రోలికిం జని, రంత. 61**

* అశ్వినీదేవతలు పతివ్రతయైన సుకన్యక సత్యశీలానికి మెచ్చి యౌవనంతో సుందరాకారుడై ఉన్న చ్యవనమహర్షిని చూపి ఆ దంపతుల దగ్గర సెలవు తీసుకొని విమానం ఎక్కి స్వర్గానికి వెళ్ళారు.

**సీ. యాగంబు సేయంగ నర్థించి శర్యాతి, చ్యవనమునీంద్రు నాశ్రమముకడకుఁ**
**గూఁతు నల్లునిఁ దోడుకొని పోవు వేడుక వచ్చి పుత్త్రికకుఁ బార్శ్వంబునందు**
**సూర్యతేజంబున సొంపారు నరుఁ గని, వీఁ డెవ్వఁడో దీనివిభుఁడు గాఁడు;**
**చెల్లరే! యని పుత్త్రి సేసిన ప్రియములు మ్రొక్కులు నొల్లక మోము వాంచి**

**తే. మాఱుమాటాడ దీవింప మనసు రోసి, "చ్యవనుఁ డధికుండు మునిజన సత్తముండు**
**భువన సన్నుతుఁ డతఁ డెందుఁ బోయె? నాతఁ, డెట్లు వంచింపఁ బడియె? వీఁ డెవ్వఁ డబల!62**

* అప్పుడు శర్యాతి యాగం చేయాలనుకొని కూతురిని అల్లుణ్ణి తీసుకొని పోవడానికి చ్యవనముని ఆశ్రమానికి వచ్చాడు. అక్కడ తన కూతురైన సుకన్యక చెంత సూర్యునికాంతితో ప్రకాశించే పురుషుణ్ణి చూచాడు. 'వీడెవడో దీని భర్తకా' డని ఆశ్చర్యపోయి, కూతురు చేసిన మర్యాదలకు ఇష్టపడక తలవంచుకొన్నాడు. మారుమాటాడటానికి, దీవించడానికి మనస్కరింపక ఆమెతో ఇట్లా అన్నాడు. 'చ్యవనుడు

గొప్పవాడు. మునిశ్రేష్ఠుడు. లోకంచేత పొగడబడేవాడు. అతడు ఎక్కడికి వెళ్ళాడు? అతడు ఎట్లా వంచింప బడ్డాడు? వీ డెవడు?

**మ. తగవే? ధర్మమె ! శీలమే? కులజ వై దర్పించి మోదింప నా**
**జగదారాధ్యుని బుణ్యశీలుఁ దపసిన్ సాధ్వీమనస్సమ్మతున్**
**మగనిన్ మాని భుజంగుఁ బొందఁదగునే మానంబు వాటింపఁగాఁ**
**దగదే! దుర్గతిఁ ద్రోచితే కఠినవై తండ్రిం బతిం గూఁతురా! 63**

* ఓ బిడ్డా! ఉత్తమ కులంలో పుట్టిన నీవు లోకంచేత పూజింపబడేవాడు, పుణ్యాత్ముడు, తపస్వి, పతివ్రత మనస్సుకు నచ్చేవాడు ఐన భర్తను కాదని విటుణ్ణి పొందడం న్యాయమేనా? ధర్మమేనా? లోక ధర్మాన్ని పాటించవద్దా! ఇటు కన్న తండ్రినీ, అటు కట్టుకొన్న భర్తనూ దుర్గతి పాలు చేశావు కదా!

**ఆ. పద్మనయన! మగఁడు ప్రాయంపువాఁడైనఁ, గాపు వెట్టి కొంతఁ గావ నేర్చుఁ**
**గడఁగి ముసలి తపసి గావంగ నేర్చునే, యువతి ముదుకఁ గూర్ప నొప్ప దెందు." 64**

* ఓ కూతురా! మగడు ప్రాయపువాడైతే కొంతవరకు తన భార్యను కాపాడుకోగలడు. ముసలిముని తన భార్యను అదుపులో పెట్టుకోగలడా? ఎక్కడైనాసరే పడుచుపిల్లను ముసలివాడికి కట్టబెట్టకూడదు.

**వ. అని పలికిన న ప్పరమపతివ్రతా లలామంబు చిఱునగవు చెక్కుటద్దంబులఁ జిడిముడిపడఁ దండ్రి కిట్లనియె. 65**

* అనగా పరమ పతివ్రత ఐన సుకన్యక చిరునవ్వుతో తండ్రితో ఇట్లా అన్నది.

**క. 'నీయల్లుఁడితఁడు భార్గవుఁ, డయ్యా! జారుండు గాఁడు హర్షము తోడన్**
**నెయ్యంబు నిల్పు' మంచును, దొయ్యలి సర్వంబు దండ్రితో వినిపించెన్. 66**

* 'ఓ తండ్రి! ఇతడు నీ అల్లుడైన భార్గవుడేకాని పర పురుషుడు కాడు. నీవు ఈయనను సంతోషంతో ఆదరించు' అంటూ ఆమె తండ్రికి జరిగిన దంతా చెప్పింది.

**వ. అంత శర్యాతియు నప్రమత్తుండై కూఁతుం గౌఁగిలించుకొని గారవంబున' నయిదువవు గ'మ్మని దీవించె; నంత భార్యాసహితుండై చ్యవనుండు సని తన మామకు యాగంబు సేయించి యొక్క పాత్రంబున సోమభాగంబుఁ బట్టి నిజ తపో బలమున నశ్వినీదేవతల కిచ్చినం జూచి. 67**

* శర్యాతి సంతోషంతో కూతురిని చేరదీసి ఆదరంతో "సౌభాగ్యవతివి కమ్మ"ని దీవించాడు. అప్పుడు చ్యవనుడు భార్యతోపాటు వెళ్ళి మామకు యాగాన్ని చేయించి పెట్టాడు. ఒక గిన్నెలో సోమరసాన్ని పోసి తన తపోబలంబుతో అశ్వినీ దేవతల కిచ్చాడు.

**క. కోపముతోడుత వాసవుఁ, డేపున ముని పైని వజ్రమెత్తిన మరలం**
**దాపసుఁడు వజ్రిభుజమున, నాపవి నిలిపెన్ జగంబు లాశ్చర్యపడన్. 68**

* అది చూచి ఇంద్రుడు కోపంతో ముని మీదికి వజ్రాయుధాన్ని ప్రయోగించాడు. చ్యవనుడు లోకాలు ఆశ్చర్యపడేటట్లుగా ఆ వజ్రాయుధం మళ్లా ఇంద్రుడి భుజం మీదే స్తంభించిపోయేటట్లు చేశాడు.

**వ. ఇవ్విధంబున నశ్వినీదేవతలిద్దఱు దేవతావైద్యులై సోమభాగంబు లేని వారయ్యుఁ జ్యవను సామర్థ్యంబునఁ బ్రాప్తభాగు లయి చనిరి; శర్యాతికి నుత్తానబర్హియు, నానర్తుండును, భూరిషేణుండు నను ముప్వురు కొడుకులు గలిగి; రందు. 69**

* ఈ విధంగా దేవవైద్యులైన అశ్వినీదేవతలు ఇద్దరూ సోమభాగాన్ని పొందే అర్హత లేనివారైనా, చ్యవనముని ప్రభావం వల యజ్ఞ భాగాన్ని పొంది వెళ్లారు. శర్యాతికి ఉత్తానబర్హి, ఆనర్తుడు, భూరిషేణుడు అనే ముగ్గురు కొడుకులు కలిగారు.

**సీ. ఆనర్తునకు రైవతాహ్వయుం డుదయించె! నతఁడు కుశస్థలి యనుపురంబు**
**నీరధిలోపల నిర్మించి పెంపుతో, నావర్తముఖ విషయంబు లేలెఁ;**
**గనియెఁ గకుద్మిముఖ్యంబైన నందన శతము; రైవతుఁడు విశాల యశుఁడు**
**దనకూఁతు రేవతి ధాత ముందటఁ బెట్టి, తగు వరు నడిగెడి తలఁపుతోడఁ**

**తే. గన్యఁ దోడ్కొని బ్రహ్మలోకమున కేఁగి, యచట గంధర్వ కిన్నరు లజుని మ్రోల**
**నాటపాటలు సలుపఁగ నవసరంబు, గాక నిలుచుండె నతఁ డొక్కక్షణము తడవు. 70**

* వారిలో ఆనర్తుడికి రైవతుడు జన్మించాడు. అతడు సముద్రంలో కుశస్థలి అనే పట్టణాన్ని నిర్మించి ఆనర్తము మొదలైన దేశాలను పెంపుతో పాలించాడు. అతడు కకుద్మి మొదలైన వందమంది కొడుకులను పొందాడు. గొప్పకీర్తి కలిగిన ఆ రైవతుడు తన కూతురైన రేవతిని బ్రహ్మకు చూపెట్టి తగిన వరుణ్ణి అడగాలనే తలంపుతో బ్రహ్మలోకానికి వెళ్ళాడు. బ్రహ్మకొలువులో గంధర్వులు, కిన్నరులు ఆడుతూ పాడుతూ ఉండడంవల్ల అది దర్శనానికి తగిన సమయం కాదనుకొని ఒక్కక్షణం పాటు నిలుచుండి పోయాడు.

**వ. అంత నవసరంబైన నజునికి నమస్కరించి రైవతుండు రేవతిఁ జూపి యిట్లనియె. 71**

* అంతలో దర్శనానికి వీలుకలుగ రైవతుడు బ్రహ్మకు నమస్కరించి, రేవతిని చూపి ఇట్లా అన్నాడు.

**ఆ. చాల ముద్దరాలు జవరాలు గొమరాలు, నీ శుభాత్మురాలి కెవ్వఁ డొక్కొ**
**మగఁడు? సెప్పు' మనిన మదిఁ జూచి పకపక, నవ్వి భూమిపతికి నలువ పలికె. 72**

* అమాయకురాలు, అందగత్తె, ప్రాయంలో ఉన్నది ఐన ఈ మంచిపిల్లకు ఎవడు మగడవుతాడో సెలవివ్వు' అనగా బ్రహ్మ మనో దృష్టితో చూచి పక పక నవ్వుతూ ఆ రాజుతో ఇట్లా అన్నాడు.

**సీ. 'మనుజేశ! దీనికై మదిలోనఁ దలఁచిన, వార లెల్లరు గాల వశతఁ జనిరి;**
**వారల బిడ్డల వారల మనుమల, వారల గోత్రంబు వారినైన**

వినము మేదిని మీఁద; వినుము నీ వచ్చిన యీలోన నిరువదియేడు మాఱు
లొండొండ నాలుగు యుగములుఁ జనియె; నీ వటు గాన ధరణికి నరుగు మిపుడు

తే. దేవదేవుండు హరి బలదేవుఁ డనఁగ, భూమి భారంబు మాన్పంగఁ బుట్టినాఁడు;
సకల భూతాత్మకుఁడు నిజాంశంబు తోడ, యువతి మణి నిమ్ము జనమణి కున్నతాత్మ! 73

* 'ఓ రాజా! నీవు ఈ కన్యకోసం ఎవరిని మనసులో పెట్టుకున్నావో వాళ్లందరూ కాలంతోపాటు వెళ్ళిపోయారు. ఇప్పుడు వాళ్ళ కొడుకులూ, మనుమలూ ఎవ్వరూ లేరు. భూమిమీద వాళ్ల కులగోత్రాల పేర్లు కూడా వినబడవు. నీవు వచ్చిన ఈ లోపునే భూలోకంలో నాలుగు యుగాలు ఇరవైయేడు మారులు గడచిపోయాయి. నీ విప్పుడు భూలోకానికి వెళ్ళు . ఈ భూభారాన్ని పోగొట్టడానికి దేవదేవుడైన శ్రీహరి బలరాముని అవతారం ఎత్తాడు. ఆ పురుషోత్తముడికి ఈ కన్యారత్నాన్ని ఇవ్వు' అన్నాడు.

వ. అని యానతిచ్చిన బ్రహ్మకు నమస్కరించి భూలోకంబునకుఁ జనుదెంచి సోదరస్వజన హీనంబగు తన నగరంబున కారాజు వచ్చి బలభద్రుం గాంచి రేవతీకన్య నతని కిచ్చి నారాయణాశ్రమంబగు బదరికా వనంబునకు నియమంబునఁ దపంబు సేయం జనియె. 74

* ఇట్లా ఆనతిచ్చిన బ్రహ్మకు నమస్కరించి రైవతుడు భూలోకానికి బయలుదేరి నా అన్నవాళ్ళు ఎవ్వరూ లేని నగరానికి వచ్చాడు. బలరాముడికి రేవతి నిచ్చి పెళ్లి చేసి, నారాయణాశ్రమం ఉండే బదరికా వనానికి' తపస్సు చేసుకోవడానికి వెళ్ళి పోయాడు.

క. నభగుఁడను మనుజపతికిని శుభమతి నాభాగుఁ డనఁగ సుతుఁ డుదయించెం
బ్రభులై మనియెడు తలఁపున, విభజించిరి భ్రాత లతని విత్తము నధిపా! 75

* నభగుడనే రాజుకు బుద్ధిమంతుడైన నాభాగుడనే కొడుకు కలిగాడు. చాలాకాలం గురుకులంలో ఉండిపోయిన అతడి ఆస్తిని అన్నలు కాజేసి పంచేసుకున్నారు.

వ. అంత నాభాగుండను బ్రహ్మచారియై తన తోడంబుట్టువులను ధనంబుల పాలడగిన వారలు' దండ్రి చెప్పిన క్రమంబున నిచ్చెద' మనిన నాభాగుండు తండ్రియగు నభగు కడకుం జని' విభాగంబు సేయు'మని పలికిన నతం 'డిందు నంగిరసుల మేధ గలవార లయ్యును సత్త్రయాగంబు సేయుచు నాఱవ దినంబున నర్హకర్మంబులు దోఁపక మూఢు లయ్యేదరు; వారలకు నీవు వైశ్వదేవసూక్తంబులు రెండెఱింగించినఁ గవి యనం బ్రసిద్ధి కెక్కెదవు; దానంజేసి వారు కృతకృత్యులై స్వర్గంబునకుఁ బోవుచు, సత్త్ర పరిశేషితంబైన ధనంబు నీ కిచ్చెద' రని పలికినం దండ్రి వీడ్కొని నాభాగుండు సని యట్టు సేసిన నంగిరసులు సత్త్ర పరిశేషితధనంబు లతని కిచ్చి నాకంబునకుం జని రంత. 76

* అప్పుడు ఆశ్రమం నుండి వచ్చిన బ్రహ్మచారి ఐన నాభాగుడు తోబుట్టువులను ఆస్తిలో తనకు చెందవలసిన వాటాను అడిగాడు. వాళ్ళు నాన్నగారు చెప్పినట్లుగా ఇస్తామని అంటే నాభాగుడు తండ్రి దగ్గరకు వెళ్లి ఆస్తిలో భాగం అడిగాడు. అప్పుడు నభగుడు 'నీవు ఇదేమీ పట్టించు కోవద్దు. అంగిరసులనే

వాళ్ళు ఇప్పుడు గొప్ప సత్రయాగం చేస్తున్నారు. వాళ్ళు గొప్ప మేధావులైనా ఆరో రోజు చేయవలసిన కర్మకాండను తెలుసుకోలేని మూఢు లవుతారు. వారికి నీవు వైశ్వదేవసూక్తులు రెండింటిని తెలియ జెప్పి కవి అనేపేరుతో ప్రసిద్ధుడవుతావు. వాళ్ళు కృతార్థులై స్వర్గానికి వెళుతూ యాగంలో మిగిలిన ధనాన్ని నీ కిస్తారు' అని చెప్పగా నాభాగుడు తండ్రి దగ్గర సెలవు తీసుకొని ఆ విధంగానే చేశాడు. అప్పుడు అంగిరసులు యాగంలో మిగిలిన ధనాన్ని అతడి కిచ్చి స్వర్గానికి వెళ్ళారు.

**క. అంగిరసు లిచ్చు పసిఁడికి, మంగళమతిఁ జేరు నృపుని మానిచి యొకఁ డు**
**త్తుంగుఁడు గృష్ణాంగుఁడు దగ, ముంగల నిలుచుండి విత్తముం జేకొనియెన్. 77**

* అప్పుడు మంచి పొడగరి, నల్లనివాడు ఐన ఒకడు అంగిరసు లిచ్చిన బంగారాన్ని తీసుకోవడానికి నాభాగుణ్ణి అడ్డగించి దాన్ని గుంజుకొన్నాడు.

**వ. వానిం జూచి నాభాగుండు దనకు మును లిచ్చుటంజేసి తన ధనం బని పలికిన, నమ్మహాపురుషుండు 'మీ తండ్రి సెప్పిన క్రమంబ కర్తవ్యం' బనిన నాభాగుండు నభగు నడిగిన, నతండు యజ్ఞమందిరగతంబై 'యుచ్ఛిష్టంబగు ధనంబుఁ దొల్లి మహామునులు రుద్రున కిచ్చి; రది కారణంబుగా నా దేవుండు సర్వధనంబులకు నర్హుం' డనిన విని, వచ్చి నాభాగుండు మహాదేవునకు నమస్కరించి 'దేవా! యీ ధనంబు నీ యధీనం' బని మా తండ్రి సెప్పె, నే నపరాధంబు సేసితి; సహింపు' మనవుడు భక్త వత్సలుండగు న మ్మహాపురుషుండు నభగు సత్యవచనంబునకు, నాభాగుని నిజంబునకు మెచ్చి 'నీవు దప్పక పలికితివి కావున, సత్త్రపరిశేషితంబగు ధనంబు నీకు నిచ్చితి' నని పలికి యంతర్దర్శిత్వంబును, సనాతనం బగు బ్రహ్మజ్ఞానంబును నుపదేశించి తిరోహితుండయ్యె; నివ్విధంబున. 78**

* నాభాగుడు వాణ్ణి చూచి మునులు ఇవ్వడం వల్ల అది తనకు చెందవలసిన ధనమని చెప్పాడు. అప్పు డా మహాపురుషుడు 'మీ తండ్రి చెప్పిన రీతిగా చేయడమే తగి ఉంటుంది' అన్నాడు. నాభాగుడు తండ్రిని అడగ్గా అతడు 'వెనుక ఋషులు యజ్ఞశాలలో మిగిలిన ధనం రుద్రునికి చెందేటట్లు చెప్పి ఉన్నారు. అందువల్ల దానికంతటికి ఆ దేవుడే అర్హుడు' అని చెప్పాడు. అప్పుడు నాభాగుడు రుద్రునికి నమస్కరించి 'ఓ దేవా! ఈ ధనం నీకే చెందుతుందని మా తండ్రి చెప్పాడు. నేను తప్పుచేశాను, క్షమించు' అన్నాడు. ఆ మహాదేవుడు నభగుని తీర్పుకూ, నాభాగుని సత్యానికి మెచ్చి 'నీవు నిజమే పలికావు. కాబట్టి యాగంలో మిగిలిన ఈ ధనాన్ని నీ కిస్తున్నాను' అని నాభాగునికి ఆత్మదర్శనాన్నీ, బ్రహ్మజ్ఞానాన్నీ ఉపదేశించి అంతర్ధాన మయ్యాడు.

**క. భువిలో నాభాగునికథ, దవిలి మతిన్ రేపు మాపుఁ దలఁచిన మాత్రం**
**గవి యగు; మంత్రజ్ఞుండగుఁ, బ్రవిమలగతిఁ బొందు నరుఁడు భద్రాత్మకుఁడై. 79**

* లోకంలో నాభాగుని కథను ఉదయం, సాయంకాలం చిత్తశుద్ధితో తలచిన మాత్రాన నరుడు పండితు డవుతాడు, మంత్రజ్ఞు డవుతాడు. సద్గతిని పొందుతాడు.

వ. అంత నాభాగునకు నంబరీషుండు జనియించె; నతని యందు జగదప్రతిహతంబైన బ్రాహ్మణశాపంబు నిరర్థకం బయ్యె ననిన విని యేమి కారణంబున దురంతంబైన బ్రహ్మదండంబు వలన నతండు విడువం బడియె ననిన నప్పుడమితేనికి శుకుం డిట్లనియె. 80

* నాభాగునికి అంబరీషుడు జన్మించాడు. అతనిపట్ల లోకంలో అడ్డులేనిదైన బ్రాహ్మణశాపం కూడా వ్యర్థమై పోయింది అని శుకమహర్షి చెప్పగా 'ఏకారణం వల్ల దాటరాని బ్రాహ్మణశాపం కూడా అతణ్ణి ఏమీ చేయలేకపోయింది?' అని పరీక్షిన్మహారాజు అడిగాడు. అప్పుడు శుకమహర్షి ఇట్లా అన్నాడు.

## -: అంబరీషోపాఖ్యానము :-

శా. సప్తద్వీప విశాల భూభరము దోఃస్తంభంబునం బూని సం
ప్రాప్త శ్రీయుతుఁడై మహీవిభవసంపచ్చాతురిం గల్గి దు
ర్వ్యాప్తిం జెందక వైష్ణవార్చనల మేరం గాలముం బుచ్చుచున్
సుప్తిం బొందక యొప్పె సద్గుణ గరిష్ఠుం డంబరీషుం డిలన్. 81

* శ్రేష్ఠుడైన ఆ అంబరీషుడు ఏడు దీవులతో కూడిన భూమండల భారాన్ని తన భుజస్తంభాలమీద మోపి శుభాలనూ పొంది, రాజ్యసంపదను కలిగి చెడునడతకు లోనుకాకుండా, విష్ణుపూజలతోనే కాలాన్ని వెళ్లబుచ్చుతూ ఏమరుపాటు పొందక ఈ లోకంలో ప్రశస్తి గాంచాడు.

సీ. చిత్తంబు మధురిపు శ్రీపాదముల యంద; పలుకులు హరిగుణపఠనమంద;
కరములు విష్ణుమందిర మార్జనములంద; శ్రవములు హరికథాశ్రవణమంద;
చూపులు గోవింద రూపవీక్షణమంద; శిరము గేశవ నమస్కృతుల యంద;
పదము లీశ్వరగేహపరిసర్పణ ములంద; కామంబు చక్రికైంకర్యమంద;

తే. సంగ మచ్యుత జనతనుసంగమంద, ఘ్రాణ మసురారి భక్తాంఘ్రి కమలమంద;
రసన దులసిదళములంద; రతులు పుణ్య, సంగతులయంద యా రాజచంద్రమునకు. 82

* "ఆ రాజచంద్రుని మనస్సు శ్రీహరి పాదాల మీదే, మాటలు హరి గుణసంకీర్తన మందే; చేతులు విష్ణు మందిరాలను శుభ్రపరచడమందే; చెవులు హరికథలను వినడమందే; చూపులు గోవిందుని రూపాన్ని తనివి తీరా చూడడం మీదే; తల కేశవునికి నమస్కరించడమందే; పాదాలు విష్ణుదేవుని ఆలయాలను చుట్టిరావడమందే; కోరిక హరిసేవయందే; చెలిమి విష్ణుభక్తుల పాదపద్మాల యందే; నాలుక పవిత్ర తులసీ దళములందే; కోరికలు పుణ్యవిషయాలందే నిమగ్నమై ఉండేవి.

వ. మఱియు నమ్మహీవిభుండు. 83

సీ. ఘనవైభవంబునఁ గల్మషదూరుఁడై యజ్ఞేశు నీశు నబ్జాక్షుఁ గూర్చి
మొనసి వసిష్ఠాది మునివల్లభులతోడఁ దగిలి సరస్వతీ తటమునందు

**మేధతో బహువాజిమేధంబు లొనరించె గణుతింపరాని దక్షిణలు వెట్టి**
**సమలోష్ట హేముఁడై సర్వకర్మంబులు హరిపరంబులు గాఁగ నవని యేలె;**

**ఆ. విష్ణుభక్తులందు విష్ణువునందుఁ గ, లంక మెడల మనసు లంకె పెట్టి**
**విహితరాజ్యవృత్తి విడువని వాఁడునై, యతఁడు రాచతపసి యనఁగ నొప్పె. 84**

* ఇంకా ఆ రాజు గొప్పవైభవంతో పుణ్యాత్ముడై వసిష్ఠుడు మొదలైన ఋషులతోకూడి యజ్ఞేశుడైన శ్రీహరినిగూర్చి సరస్వతీనదీ తీరంలో లెక్కించరాని దక్షిణలు పెట్టి ఎన్నో అశ్వమేధయాగాలు చేశాడు. బంగారాన్నీ మట్టి పెళ్లనూ సమానంగా చూచే అతడు సర్వకర్మలనూ హరిపరంచేసి భూమిని పరిపాలించాడు. విష్ణుభక్తుల పట్ల శ్రీహరిపట్ల మనసు లంకెపెట్టి తనకు విధించబడ్డ రాజ్యపాలన వదలక రాజర్షిగా విరాజిల్లాడు.

**వ. వెండియు న మ్మహాభాగవతుండు. 85**

**క. హరియని సంభావించును; హరి యని దర్శించు; నంటు; నాఘ్రాణించున్;**
**హరియని రుచిగొనఁ దలఁచును, హరిహరి! ఘను నంబరీషు నలవియె పొగడన్? 86**

* ఇంకా ఆ భగవంతుని భక్తుడైన అంబరీషుడు"హరీ'' అని తలచేవాడు. "హరి'' అని చూచేవాడు. "హరి'' అని తాకేవాడు. "హరి'' అని వాసన చూచేవాడు. "హరి'' అంటూ రుచి చూచేవాడు. ఆహా! గొప్ప వాడైన ఆ అంబరీషుణ్ణి కొనియాడ సాధ్యమా!

**వ. ఇట్లు పుణ్యచిత్తుండు, నీశ్వరాయత్తుండునై యల్లనల్లన రాజ్యంబు సేయుచున్న సమయంబున.87**

**ఆ. అతని కీహ మానె హరులందుఁ గరులందు, ధనములందుఁ గేళివనములందుఁ,**
**బుత్త్రులందు బంధుమిత్త్రులయందును, బురమునందు నంతిపురమునందు. 88**

* ఈ విధంగా పుణ్యాత్ముడై భగవంతుని యందు లగ్నమైన చిత్తం గలవాడై ఆ రాజు చక్కగా రాజ్యంచేస్తూ ఉన్నాడు. అతడికి గుఱ్ఱాలు, ఏనుగులు, సంపదలు, ఉద్యానవనాలు, కొడుకులు, బంధు మిత్రులు, పురం, అంతఃపురం మొదలైన భోగభాగ్యాలపట్ల ఆసక్తి ఉడిగి పోయింది.

**వ. అంతఁ గొంతకాలంబున క మ్మేదినీకాంతుండు సంసారంబు వలని తగులంబు విడిచి నిర్మలుండై యేకాంతంబున భక్తి పరవశుండయి యుండ నా రాచతపసికి భక్తలోకవత్సలుండగు పురుషోత్తముండు ప్రతిభటశిక్షణంబును, నిజజనరక్షణంబును, నిఖిలజగ దవక్రంబునగు చక్రంబు నిచ్చి చనియె నంత. 89**

* కొంతకాలానికి ఆ రాజు సంసారంపట్ల మోహాన్ని వదలుకొని పరిశుద్ధుడై ఏకాంతంలో భక్తి పారవశ్యంతో ఉండగా భక్తులపట్ల ప్రేమ కలిగిన పురుషోత్తముడు ప్రతిపక్షులను శిక్షించేదీ, ఆత్మీయులను రక్షించేదీ, సమస్తలోకాలలోనూ అడ్డులేనిదీ ఐన సుదర్శనచక్రాన్ని ఆ రాజర్షికి అనుగ్రహించి వెళ్లాడు.

**క. తనతోడి నీడకైవడి, ననురూప గుణాఢ్యయైన యాత్మ మహిషితో**
**జనవిభుఁడు ద్వాదశీవ్రత, మొనరఁగ హరిఁగూర్చి చేసె నొక యేఁడధిపా! 90**

* ఓ రాజా! గుణవంతురాలై తనకు తోడునీడలాగా ఉన్న పట్టపురాణితో కలసి ఆ అంబరీషుడు ఒక సంవత్సరంపాటు శ్రీహరిని గూర్చి ద్వాదశీవ్రతాన్ని చేశాడు.

**వ. ఇట్లు వ్రతంబు సేసి, యా వ్రతాంతంబునం గార్తికమాసంబున మూఁడు రాత్రు లుపవసించి, కాళిందీజలంబుల స్నాతుండయి, మధువనంబున మహాభిషేక విధానంబున విహిత పరికర సంపన్నుండయి, హరి నభిషేకంబు సేసి, మనోహరంబు లయిన గంధంబులు సమర్పించి యభినవామోదంబులైన పుష్పంబులం బూజించి తదనంతరంబ. 91**

* ఈ విధంగా చేసి వ్రతం పూర్తయ్యాక కార్తిక మాసంలో మూడు రాత్రులు ఉపవాస ముండినాడు. యమునానదిలో స్నానం చేసి మధువనంలో మహాభిషేక విధి ప్రకారం శ్రీహరిని అభిషేకించినాడు. మనోహరములైన సుగంధాలను సమర్పించి సువాసనలతో కూడిన పూలతో పూజించాడు.

**శా. పా లేఱై ప్రవహింప డగ్గఱుచు లేఁ బ్రాయంబులున్ రూపము<br>
లేమ్రలై ధూర్తలు గాక వెండిగొరిజ ల్హేమోరు శృంగంబులుం<br>
గ్రాలం గ్రేపుల యఱ్ఱు నాఁకుచును రంగచ్ఛాయలై యున్న మం<br>
దాలన్ న్యర్బుదషట్క మిచ్చె విభుఁ డుద్యద్వైదిక శ్రేణికిన్. 92**

* పాలు ఏరై ప్రవహించేటట్లుగా లేతప్రాయంలో ఉండేవీ, మంచి రూపం కలవీ, పోట్లమారితనం లేనివీ, వెండి తొడిగిన గిట్టలతో, బంగారవు కుప్పెలు తొడిగిన గొప్ప కొమ్ములతో విలసిల్లేవీ, దూడల అఱ్ఱు నాకు తున్నవీ, ప్రకాశించేవీ అయిన ఆరువందలకోట్ల పాడి ఆవులను ఆ రాజు వైదిక శ్రేష్ఠులకు దానం చేశాడు.

**క. పెక్కంద్రు విప్రవరులకు, గ్రక్కున నతిభక్తి తోడఁ గడుపులు నిండం<br>
జొక్కపు టన్నంబిడి విభుఁ, డెక్కొడఁ బారణము సేయ నుద్యోగించెన్. 93**

* అతడు పెక్కుమంది బ్రాహ్మణశ్రేష్ఠులకు మిక్కిలి భక్తితో కడుపులు నిండేటట్లుగా షడ్రసోపేతమైన భోజనం పెట్టి ఉపవాసానంతరం తాను భోజనం చేయడానికి పూనుకొన్నాడు.

**వ. అ య్యవసరంబున. 94**

**క. భాసుర నిగమ పదోప, న్యాసుఁడు సుతపోవిలాసుఁ డనుపమ యోగా<br>
భ్యాసుఁడు రవిభాసుఁడు దు, ర్వాసుఁ డతిథి యయ్యెఁ దన్నివాసంబునకున్. 95**

* ఆ సమయంలో వేదాలను పుక్కిట పట్టినవాడూ, మహాతపస్సంపన్నుడూ, గొప్ప యోగాభ్యాస నిపుణుడూ, సూర్యుడిలాగా ప్రకాశించేవాడూ ఐన దుర్వాసుడు అతడి ఇంటికి అతిథిగా వచ్చాడు.

**వ. అట్లతిథియై వచ్చిన న మ్మునివల్లభునకుఁ బ్రత్యుత్థానంబు చేసి, కూర్చుండ గద్దియ యిడి పాదంబులు గడిగి పూజించి సేమం బరసి తనయింట నన్నంబు గుడువుమని నమస్కరించిన నమ్మహాత్ముండును సంతసించి భోజనంబునకు నంగీకరించి నిర్మలంబులగు కాళిందీజలంబులం**

**బరమధ్యానంబు సేయుచు, మునింగి లేచి రాక తడవుసేసిన, ముహూర్తార్ధావశిష్ట యగు ద్వాదశి యందుఁ బారణ సేయవలయుటఁ జింతించి బ్రాహ్మణాతిక్రమదోషంబునకు శంకించి విద్వజ్జనంబుల రావించి వారల నుద్దేశించి. 96**

* అట్లా వచ్చిన మునీశ్వరుణ్ణి చూచి అంబరీషమహారాజు ఆయన కూర్చోడానికి ఏర్పాటు చేశాడు. ఆయన పాదాలు కడిగి పూజించి కుశల మడిగి తన ఇంట్లో భోజనం చేయమని ప్రార్థించాడు. ఆ మహాత్ముడు సంతోషించి ఆ రాజు కోరికను అంగీకరించాడు. కాళిందీనదికి వెళ్ళి స్నానంచేసి ధ్యానం చేస్తూ నీటిలో మునిగి లేచి రాకుండా జాగు చేశాడు. అప్పుడు గడియ మాత్రమే మిగిలి ఉన్న ద్వాదశిలోనే పారణచేయవలసి ఉంటుందని ఆ అంబరీషుడు చింతించాడు. బ్రాహ్మణ తిరస్కారానికి వెనుకాడి పండితులను పిలిపించి వారిని ఉద్దేశించి ఇట్లా అన్నాడు.

**క. 'ముని నీరు సొచ్చి వెడలఁడు, చనియెడు ద్వాదశియు నింత సనియె న్నీలో**
**నన పారణచేయవలయు, వినిపింపుం డర్హమైన విధ మెట్టిదియో?' 97**

* 'స్నానానికి వెళ్లిన దుర్వాసముని కాళిందినుండి బయటపడలేదు. ద్వాదశి గడచిపోతూ ఉంది, ఈ లోపల పారణ చేయాలి. ఇప్పుడు తగిన ధర్మాన్ని తెలియజేయండి.'

**వ. అని పలికిన నా రాజునకు బ్రాహ్మణజను లిట్లనిరి. 98**

* అని అడిగిన ఆ రాజుతో బ్రాహ్మణులు ఇట్లా అన్నారు.

**ఆ. 'అతిథి వోయి రామి నధిప! యీ ద్వాదశి, పారణంబు మానఁ బాడి గాదు**
**గుడువకుంటఁ గాదు కుడుచుటయును గాదు, సలిలభక్షణంబు సమ్మతంబు.' 99**

* 'వెళ్ళిన అతిథి రాకపోవడం వల్ల ద్వాదశి పారణను మానడం ధర్మం కాదు. నీళ్లు తాగితే భోజనం చేసినట్టూ అవుతుంది, చేయనట్టూ అవుతుంది. ఇది ధర్మసమ్మతమే.'

**వ. అని ధర్మసందేహంబు వాపిన, నా రాజర్షి శ్రేష్ఠుండును మనంబున హరిం దలంచి నీరు పారణంబు సేసి, జలంబుల మునింగిన తపసిరాక కెదురుచూచుచున్న సమయంబున. 100**

* అని ధర్మజ్ఞులు తన ధర్మసందేహాన్ని పోగొట్టగా ఆ రాజర్షి మనస్సులో శ్రీహరిని స్మరించి పారణచేసి, స్నానార్థం పోయిన తపస్వి రాక కోసం ఎదురుచూస్తున్నాడు.

**సీ. యమునలోఁ గృతకృత్యుఁడై వచ్చి రాజుచే సేవితుండై రాజుచేష్టితంబు**
**బుద్ధిలో నూహించి బొమముడి మొగముతో నదరెడి మేనితో నాగ్రహించి**
**రెట్టించి యాఁకలి కొట్టుమిట్టాడంగ నీ సంపదున్మత్తు నీ నృశంసు**
**నీ దురహంకారు నిందఱుఁ గంటిరే? విష్ణుభక్తుఁడు గాఁడు వీఁడు నన్నుఁ**

**తే. గుడువ రమ్మని మునుముట్టఁ గుడిచినాఁడు, ధర్మభంగంబు సేసి దుష్కర్ముఁ డయ్యె!**
**నయిన నిప్పుడు సూపెద నన్ని దిశల, నేనుఁ గోపింప మాన్పువాఁ డెవ్వఁ? డనుచు. 101**

* ఆ సమయంలో యమునలో స్నానాదికం పూర్తిచేసుకొని వచ్చిన దుర్వాసుడు అంబరీషుని సేవలు అందుకొని ఆ రాజు చేసిన పనిని మనోదృష్టితో తెలుసుకొన్నాడు. కనుబొమలు ముడిపడేటట్లుగా, శరీరం కంపించి పోయేటట్టుగా కోపం తెచ్చుకొన్నాడు. కరకరలాడే ఆకలితో అతడు"ఐశ్వర్యంతో కన్నుమిన్ను గానని ఈ ఘాతుకుణ్ణి మీరందరూ చూచారుకదా! నన్ను భోజనానికి పిలిచి ముందు తానే ఆరగించి కూర్చున్నాడు. వీడు విష్ణుభక్తుడు కాడు. ధర్మభంగం చేసి చెడ్డవాడయ్యాడు. ఐనా పరవాలేదు. నాశక్తి ఏమిటో ఇప్పుడే చూపుతాను. నేను కోపిస్తే మాన్పగలిగిన వాడెవడూ ఈ ప్రపంచంలో లేడు" అని మండిపడ్డాడు.

**చ. పెటపెటఁ బండ్లు గీఁటుచును, భీకరుఁడై కనుఁగ్రేవ నిప్పుకల్**
**పొటపొట రాల, గండములు పొంగ, మునీంద్రుఁడు హుంకరించుచున్,**
**జట మొదలంటఁగాఁ బెఱికి చక్కన దానన కృత్య నాయుధో**
**త్కట వలమాన హస్తయుతఁగా నొనరించె నయించె రాజుపైన్'** 102

* పెట పెటమని పండ్లు కొరుకుతూ, భయంకరుడై, కనుకొనల నుండి, చిటచిట మని నిప్పులు రాలగా, చెంపలు జేవురించేటట్టుగా హుంకరిస్తూ తన సిగలోని ఒక జడను సమూలంగా పెరికి దానిచే ఆయుధహస్తయైన కృత్యను సృష్టించి అంబరీషునిపైకి ప్రయోగించాడు.

**వ. అంత.** 103

**క. కాలానల సన్నిభయై, శూలాయుధహస్త యగుచు సుఱసుఱ స్రుక్కన్,**
**నేలఁ బదంబులఁ ద్రొక్కుచు, వాలి మహాకృత్య మనుజవల్లభుఁ జేరెన్.** 104

* అప్పు డాకృత్య ప్రళయాగ్ని సమాన మైన చేతిలో శూలాన్ని ధరించి, నేల క్రుంగి పోయేటట్లుగా కాళ్లతో త్రొక్కుతూ అతిశయించి అంబరీషుని పైకి దూకింది.

**ఆ. ఆ ప్రకార మెఱిఁగి హరి విశ్వరూపుండు, 'వెఱ్ఱితపసి సేయు వేడబంబుఁ**
**జక్కఁ బెట్టు' మనుచుఁ జక్రంబుఁ బంచిన, వచ్చె నదియుఁ బ్రళయ వహ్నిపగిది.** 105

* విశ్వరూపుడైన హరి ఆ సంగతి తెలుసుకొని వెఱ్ఱితపసి చేసే మాయను చక్కబెట్టమని సుదర్శనచక్రాన్ని పురమాయించాడు. అప్పుడది ప్రళయాగ్నిలాగా వచ్చింది.

**వ. వచ్చి ముని పంచిన కృత్యను దహించి, తనివి సనక ముని వెంటంబడిన, మునియును మేరుగుహ సొచ్చిన నదియు వ్యాళంబు వెనుకొను దవానలంబు చందంబునఁ దోన చొచ్చి మఱియును.**106

* ఆ విధంగా వచ్చిన సుదర్శనచక్రం ముని పంపిన కృత్య అనే శక్తిని కాల్చివేసింది. దానితో తృప్తి పడకుండా ముని వెంటబడింది. అతడు మేరు పర్వతపు గుహలోనికి ప్రవేశించాడు. వెంటనే అది కూడా పామును వెంటాడే కార్చిచ్చులాగా గుహలో ప్రవేశించింది.

మ. భువి దూఱన్ భువిదూఱు; నబ్ధిఁ జొర నబ్ధుల్ సొచ్చు; నుద్వేగియై
దివిఁ బ్రాఁకన్ దివిఁ బ్రాఁకు; దిక్కులకుఁ బో దిగ్వీథులం బోవుఁ; జి
క్కి వెసం గ్రుంకినఁ గ్రుంగు; నిల్వ నిలుచు; గ్రేడింపఁ గ్రేడించు నొ
క్క వడిన్ దాపసు వెంటనంటి హరిచక్రం బన్యదుర్వక్రమై. 107

* ఇతరులకు మరలింపరానిదైన ఆ విష్ణుచక్రం ముని వెంట బడింది. అతడు భూమిలోనికి దూరితే తానూ భూమిలోనికి దూరేది. అతడు సముద్రంలో మునిగితే తాను మునిగేది. కలతపడి ఆకాశానికి ఎగబ్రాకితే తానూ ఆకాశానికి ఎగబ్రాకేది. దిక్కులవైపు పరుగులు తీస్తే తానూ దిక్కులవైపు ఉరకలు వేసేది. ఆముని పరుగులు తీయడం మానితే తానూ మానేది. రొప్పుతూ నిలబడిపోతే తానూ నిలబడిపోయేది. ప్రక్కకు తొలగితే తానూ తొలగేది.

శా. ఏలోకంబున కైన వెంటఁబడి తో నేతెంచు చక్రానల
జ్వాలల్ మానుపువారు లేమిఁ జని దేవజ్యేష్ఠు లోకేశు వాఁ
డాలోకించి "విధాత! విశ్వజనన వ్యాపార పారీణ రే
ఖా లీలేక్షణ! కావవే కరుణఁ జక్రంబు న్నివారింపవే." 108

వ. అనిన బ్రహ్మ యిట్లనియె. 109

* ఏ లోకానికి వెళ్ళినా తరుముకొని వచ్చే ఆ చక్రపు మంటలను మాన్పేవారు లేకపోవడంవల్ల ఆ దుర్వాసుడు బ్రహ్మలోకానికి వెళ్లాడు. లోకేశుడైన బ్రహ్మను చూచి 'ఓ విధాతా! సృష్టించే పనిలో నేర్పు తీర్పు గల విలాసమైన చూపులు గలవాడా! నన్ను కాపాడు. చక్రాన్ని తొలగించు' అని ప్రార్థించాడు. అప్పుడు బ్రహ్మ ఇట్లా అన్నాడు.

మ. కర మర్థిన్ ద్విపరార్థ సంజ్ఞగల యీ కాలంబుఁ గాలాత్ముఁడై
సొరిదిన్ నిండగఁ జేసి లోకముల నా చోటున్ విభుం డెవ్వఁడో
పరిపూర్తిన్ గనుఁగ్రేవఁ గెంపుగదురన్ భస్మంబుగాఁ జేయు నా
హరిచక్రానల కీల కన్యుఁ డొకరుం డడ్డంబు గా నేర్చునే? 110

* రెండు పరార్థముల ప్రమాణం గల ఈ కాలాన్ని కాలస్వరూపుడైన విభుడు ఎవడైతే మిక్కిలి ప్రీతితో సృష్టిస్తాడో; కాలం పరిపూర్తి అయ్యాక ఎవడైతే తన కనుకొనల్లో ఎరుపు కుదురుకొన్నంతనే ఆ బ్రహ్మలోకాన్నీ, ఇతరలోకాలనూ బూడిద చేస్తాడో అటువంటి శ్రీహరియొక్క సుదర్శన చక్రం అగ్ని జ్వాలలకు అడ్డు పడగలిగిన శక్తి కలిగినవాడు మరొక డున్నాడా?

ఆ. ఏను, భవుఁడు, దక్షుఁ, డింద్రాదులునుఁ బ్రజా, పతులు, భృగుఁడు, భూతపతులు శిరము
లందుఁ దాల్తు మతని యాజ్ఞ జగద్ధితం, బంచు భూరికార్యమతుల మనుచు. 111

వ. కావున సుదర్శనానల నివారణంబునకు నోపనని విరించి పలికిన దుర్వాసుండు కైలాసంబునకుం జనుదెంచి, శర్వు నాలోకించి, చక్రానలంబు తెఱం గెఱింగించిన న మ్మహాదేవుం డిట్లనియె. 112

* లోకకల్యాణమన్న తలంపుతో ఆ శ్రీహరి ఆనతిని నేనూ, శివుడూ, దక్షుడూ, ఇంద్రుడూ, ప్రజాపతులూ, భృగుడూ, భూతపతులూ గొప్ప బుద్ధితో తలదాలుస్తాము. కాబట్టి సుదర్శనచక్రం మంటలను నే నాపలేను' అని బ్రహ్మ చెప్పగా దుర్వాసుడు కైలాసానికి వెళ్ళి శివుణ్ణి దర్శించి ఆ చక్రం మంటలను గూర్చి తెలియ చేశాడు. అప్పుడు ఆ మహాదేవుడు ఇట్లా అన్నాడు.

**సీ. వినవయ్య! తండ్రి! యీ విశ్వేశ్వరుని యందుఁ జతురాస్య జీవకోశములు పెక్కు**
**వేల సంఖ్యలు గూడి వేళతో నిబ్బంగి, నగుచుండుఁ జనుచుండు; నదియుఁగాక**
**యెవ్వానిచే భ్రాంతి నేమందుచున్నార మేను దేవలుఁ డసురేంద్ర సుతుఁడు**
**నారదుఁ డజుఁడు సనత్కుమారుఁడు ధర్ముఁ డాకపిలుఁడు మరీచ్యాదు లన్య**

**ఆ. పారవిదులు సిద్ధపతులు నెవ్వని మాయ, నెఱుఁగలేము దాన నింత పడుదు**
**మట్టి నిఖిల నాథు నాయుధశ్రేష్ఠంబుఁ, దొలఁగఁజేయ మాకు దుర్లభంబు. 113**

* నాయనా! విను. ఆ విశ్వేశ్వరునిలో వేలకొలది బ్రహ్మాండాలు నియమంతో పుట్టుతుంటాయి. గిట్టుతుంటాయి. అదీగాక ఎవనిచేత మేమందరమూ భ్రాంతికి లోనవుతున్నామో; నేను, దేవలుడు, ప్రహ్లాదుడు, నారదుడు, బ్రహ్మ, సనత్కుమారుడు, ధర్ముడు, కపిలుడు, మరీచి, సిద్ధేశ్వరులు, పరతత్త్వం తెలిసిన వారు ఎవని మాయను తెలుసుకోటానికి అశక్తుల మౌతున్నామో అటువంటి సర్వేశ్వరుని చక్రాన్ని తొలగేటట్లు చేయడం మావల్ల అయ్యేపని కాదు.

**వ. మునీంద్రా! నీవు న మ్మహాత్ముని శరణంబు వేఁడు మతండు మేలు సేయంగలవాఁడని పలికిన నీశ్వరునివలన నిరాశుండై, దుర్వాసుండు వైకుంఠనగరంబునకుం జని. 114**

* ఓ మునీంద్రా! నీవు ఆ మహాత్ముడినే శరణువేడు. అతడు మేలు చేస్తాడు అని పలికిన ఈశ్వరుని వల్ల నిరాశపొంది దుర్వాసుడు వైకుంఠానికి వెళ్ళి.

**శా. ఆ వైకుంఠములోని భర్మ మణి సౌధాగ్రంబు పై లచ్చి దాఁ**
**గ్రేవన్ మెల్లన నర్మభాషణములం గ్రీడించు పుణ్యున్ హరిన్**
**దేవాధీశ్వరుఁ గాంచి "యో వరద! యో దేవేశ! యో భక్త ర**
**క్షా విద్యాపరతంత్ర! మానుపఁ గదే, చక్రానలజ్వాలలన్. 115**

* ఆ వైకుంఠంలో రత్నాలు పొదిగిన బంగారుమేడ పైభాగంలో లక్ష్మీదేవిచెంత సరసపు మాటలాడుతూ ఉన్న పురుషోత్తముడైన శ్రీహరిని చూచి ' ఓ వరదా! భక్త రక్షణ పరాయణా! ఈ చక్రపు మంటలను మాన్పవా

**ఉ. నీ మహిమార్ణవంబు తుది నిక్కముగా నెఱుఁగంగ లేక నీ**
**ప్రేమకు వచ్చు దాసునకుఁ గ్రించుఁదనంబున నెగ్గు చేసితిన్**
**నా మఱపున్ సహింపు మట నారకుఁడైన మనంబులో భవ**
**న్నామము చింతసేసిన ననంత సుఖస్థితిఁ జెందకుండునే? 116**

* నీ మహిమ ఒక మహాసముద్రం వంటిది. దాని ఆవలి గట్టును నిజంగా తెలుసుకోలేక నీ ప్రేమకు పాత్రులైన నీ దాసునకు నీచత్వంతో కీడుచేశాను. నా అజ్ఞానాన్ని క్షమించు. నరకాన్ని అనుభవించే పాపాత్ముడైనా మనస్సులో నీ నామాన్ని తలిస్తే అనంతసుఖస్థితిని పొందకుండా ఉంటాడా?

**వ. అని పలికి, పాదకమలంబులకు మ్రొక్కి, లేవకయున్న దుర్వాసునిం గని హరి యిట్లనియె. 117**

* ఈ విధంగా పలికి తన పాదపద్మాలకు మ్రొక్కి లేవకుండా ఉన్న దుర్వాసుణ్ణి చూచి శ్రీహరి ఇట్లా అన్నాడు.

**చ. చలమున బుద్ధిమంతులగు సాధులు నా హృదయంబు లీల దొం**
**గిలి కొనిపోవుచుండుదు రకిల్బిషభక్తి లతాచయంబుల**
**న్నిలువఁగఁ బట్టి కట్టుదురు నేరుపుతో మదకుంభికైవడిన్**
**వలలకుఁ జిక్కి భక్తజన వత్సలతన్ జనుచుందుఁ దాపసా! 118**

* ఓ మహర్షీ! బుద్ధిమంతులైన సాధువులు నా హృదయాన్ని కొల్లకొట్టుగొని పోతుంటారు. పవిత్రమైన భక్తి అనే తీగెలతో మదించిన ఏనుగులాగా నేర్పుగా నన్ను కట్టిపడవేస్తారు. ఆ బంధాలకు చిక్కిన నేను భక్తులమీది ప్రేమతో వారిని వదలి వెళ్లలేను.

**ఆ. నాకు మేలుఁ గోరు నా భక్తుఁ డగువాఁడు, భక్తజనుల కేన పరమగతియు;**
**భక్తుఁడెందుఁ జనినఁ బఱతెంతు వెనువెంట, గోవు వెంటఁ దగులు కోడెభంగి. 119**

* నా భక్తుడైనవాడు నాక్షేమాన్నే కోరుతుంటాడు. భక్తులకు నేనే దిక్కు. గోవు వెంటబడే కోడెలాగా నేను భక్తుడు ఎటుపోతే అటు వెళ్లుతాను.

**వ. అదియునుం గాక. 120**

**ఆ. తనువు మనువు విడిచి, తనయులఁ జుట్టాల, నాలి విడిచి, సంపదాళి విడిచి**
**నన్నె కాని యన్య మెన్నఁడు నెఱుఁగని, వారి విడువ నెట్టివారి నైన. 121**

* అదిగాక తన దేహాన్నీ, జీవితాన్నీ, ఆలుబిడ్డలనూ, చుట్టాలనూ, సంపదలనూ వదలి నన్నే నమ్ముకున్న వారు ఎలాంటి వారైనా నేను వారిని వదలిపెట్టను.

**క. పంచేంద్రియముల తెరువుల, వంచించి మనంబునందు వరమతులు ప్రతి**
**ష్ఠించి వహింతురు నన్నును, మంచివరుం బుణ్యసతులు మరగిన భంగిన్. 122**

* పతివ్రతలు ఉత్తముడైన భర్తను స్వాధీనపరచుకొన్నట్లుగా పంచేంద్రియాల మార్గాలను అరికట్టి పుణ్యాత్ములు నన్ను తమ మనస్సుల్లో నిలుపుకొంటారు.

**క. సాధుల హృదయము నాయది;, సాధుల హృదయంబు నేను; జగముల నెల్లన్**
**సాధుల నేన యెఱుంగుదు, సాధు లెఱుంగుదురు నాదు చరితము విప్రా! 123**

* ఓ బ్రాహ్మణుడా! సాధువుల హృదయం నాది. నేనే సాధువుల హృదయాన్ని, వాళ్ళను నే నెరుగుదును. వాళ్ళకు నా చరిత్ర తెలుసు.

**ఆ. ధారుణీసురులకుఁ దపము విద్యయు రెండు, ముక్తి చేయుచుండు ముదముతోడ;**
**దుర్వినీతులైన దుర్జను లగువారి, కివియుఁ గీడు సేయ కేలయుండు? 124**

* సద్బ్రాహ్మణులకు తపస్సు, విద్య అనే రెండూ ముక్తిని కలిగిస్తాయి. వినయం లేని చెడ్డవారైన బ్రాహ్మణులకు అవి కీడు చేయకుండా ఉంటాయా?

**క. నా తేజము సాధులలో, నాతతమై యుండు వారి నలఁచు జనులకున్**
**హేతిక్రియ భీతి నిచ్చుం, జేతోమోదంబుఁ జెఱుచు సిద్ధము సుమ్మీ. 125**

* సాధువుల్లో నా తేజస్సు విరివియై ఉంటుంది. వాళ్ళను కష్టపెట్టేవారికి అది ఆయుధం లాగా భయాన్ని కల్గిస్తుంది. అటువంటి వారి మనస్సులకు సంతోషం లేకుండా చేస్తుంది.

**క. అదె పో బ్రాహ్మణ! నీకును, సదయుఁడు నాభాగసుతుఁడు జనవినుత గుణా**
**స్పదుఁ డిచ్చు నభయ మాతని, మది సంతసపఱచి వేఁడుమా శరణంబున్,. 126**

* ఓ బ్రాహ్మణుడా! వెళ్ళు! జనులచేత పొగడబడే సుగుణాల ప్రోవు, దయాపరుడు ఐన అంబరీషుడే అభయ మిస్తాడు. అతని మనస్సును సంతోషపెట్టి శరణువేడు.

**మ. అని శ్రీవల్లభుఁ డానతిచ్చిన మహోద్యచ్చక్రకీలావళీ**
**జనితాయాసుఁడు నిర్వికాసుఁ డుదితశ్వాసుండు దుర్వాసుఁ డ**
**ల్లన యేతెంచి సుభక్తిఁ గాంచెఁ గరుణాలావణ్య వేషున్ విదో**
**షు నయోదారమనీషు మంజుమితభాషు న్నంబరీషున్ వెసన్. 127**

* అని శ్రీపతి ఆనతిచ్చిన వెంటనే ఎగసిపడే సుదర్శనచక్రం మంటలవల్ల ఆయాసాన్ని పొందినవాడూ, వెలవెల బోతున్న వాడూ, రొప్పుతున్న వాడూ ఐన దుర్వాసుడు వచ్చి దయామయుడూ, దోషం లేనివాడూ, మహాత్ముడు, హితమితభాషీ ఐన అంబరీషుణ్ణి చూచాడు.

**వ. కని, దుఃఖితుండై, యమ్మహీవల్లభు పాదంబులు వట్టి విడువకున్న నా నరేంద్రచంద్రుండు చరణస్పర్శనంబునకు నోడుచుఁ గరుణారసభరిత హృదయుండై, హరిచక్రంబు నిట్లని స్తుతియించె.128**

* చూచి, దుఃఖించి అంబరీషుని కాళ్లను వదలకుండా పట్టుకొన్నాడు. అ ట్లా ఋషి తన పాదాలను పట్టినందుకు వెనుకాడి ఆ రాజు దయతో నిండిన హృదయంతో విష్ణుచక్రాన్ని ఇట్లా స్తుతించాడు.

**సీ. నీవ పావకుఁడవు; నీవ సూర్యుండవు; నీవ చంద్రుండవు; నీవ జలము;**
**నీవ నేలయు; నింగి వీవ; సమీరంబు నీవ; భూతేంద్రియ నికర మీవ;**
**నీవ బ్రహ్మంబును; నీవ సత్యంబును; నీవ యజ్ఞంబును; నీవ ఫలము;**
**నీవ లోకేశులు; నీవ సర్వాత్మయు; నీవ కాలంబును! నీవ జగము;**

తే. నీవ బహుయజ్ఞభోజివి;నీవ నిత్య, మూలతేజంబు; నీకు నే మ్రొక్కువాఁడ
నీరజాక్షుండు చాల మన్నించు నట్టి, శస్త్రముఖ్యమ! కావవే చాలు మునిని! 129

* ఆయుధశ్రేష్ఠమా! నిన్ను శ్రీహరి బాగా మన్నిస్తాడు. నీవే అగ్నివి. నీవే సూర్యుడివి. నీవే చంద్రుడివి. నీవే నీరు, నీవే నేల, నీవే ఆకాశం. నేవే గాలి, సమస్త ప్రాణులూ, ఇంద్రియాలూ నీవే. నీవే బ్రహ్మం, నీవే సర్వాత్మ; కాలమూ నీవే. సమస్త యజ్ఞ ఫలాన్నీ నీవే పొందుతున్నావు. నిత్యమైన మూలతేజస్సు నీవే. నీకు నేను నమస్కరిస్తున్నాను. ఈ మునిని కాపాడు, నా కదే చాలు.

మ. హరిచే నీవు విసృష్టమై చనఁగ ము న్నాలించి నీ ధారలన్
ధరణిన్ వ్రాలుట నిక్క మంచు మునుపే దైత్యేశ్వర వ్రాతముల్
శిరముల్ పాదములున్ భుజోరుయుగమున్ చేతుల్ నిజాంగంబు ల
ప్డారగం ప్రాణసమీరముల్ వెడలు నీ యుద్ధంబులం జక్రమా! 130

* ఓ చక్రమా! నీ పరాక్రమం సాటిలేనిది. శ్రీహరిచే వదలబడి నీవు విజృంభిస్తే ఆ సంగతి ముందే పసిగట్టి నీ పదునువల్ల ఎలాగూ చాపు తప్పదని ముందుగానే రాక్షససమూహాలు తలలూ, కాళ్లూ, చేతులు తెగి తమ దేహాల్లోని ప్రాణవాయువును వదలుతారు.

ఆ. కలఁగి నిద్రవోవఁ గలలోన వచ్చిన, నిన్నుఁ జూచి దీర్ఘ నిద్ర వోదు
రసురవరులు శయ్యలం దున్న సతులు ప్ర, భాతమందు లేచి పలవరింప. 131

* రాత్రి కలలో నిన్ను చూస్తే చాలు రాక్షసశ్రేష్ఠులు మరణిస్తారు. పడకల్లోని వారిభార్యలు తెల్లవారగానే లేచి, వారిని చూచి గొల్లుమని ఏడుస్తారు.

ఉ. చీఁకటి వాపుచున్ వెలుఁగు సేయుచు సజ్జనకోటి నెల్ల స
శ్రీకులఁ జేయు నీరుచులు చెల్వుగ ధర్మసమేతలై నినున్
వాకున నిట్టి దట్టిదని వర్ణన సేయ విధాత నేరఁ డ
స్తోకము నీదు రూపు గలదుం దుది లేదు పరాత్పరాద్యమై. 132

* ధర్మమయమైన నీ కాంతులు చీకటిని పారదోలుతూ, వెలుగును పుట్టిస్తూ సత్పురుషుల సమూహాన్ని సంపన్నం చేస్తాయి. నిన్ను మాటలతో వర్ణించడానికి ఆ బ్రహ్మదేవుడికే అలవికాదు. పరమశ్రేష్ఠమైన, మహోన్నతమైన నీ రూపం పరాత్పర స్వరూపం. దానికి ఆద్యంతాలు లేవు.

ఆ. కమలలోచనుండు ఖలుల శిక్షింపంగఁ, బాలు సేయ నీవు పాలు వడితి
వైన నింకఁజాలు నాపన్నుఁడై యున్న, తపసిఁ గావు నీవు ధర్మవృత్తి. 133

* విష్ణువు దుష్టులను శిక్షించడానికి పంపగా నీ వా పనికి పూనుకున్నావు. ఇక చాలు, ఆపదకు చిక్కిన ఈ తాపసుని ధర్మమైన నడవడితో కాపాడు.

వ. అని వినుతించి కేలుఁదమ్మిఁదోయి నొసలం బొసంగించి యిట్లనియె. 134

ఆ. ఏ నమస్కరింతు నింద్రశాత్రవ ధూమ, కేతువునకు ధర్మ సేతువునకు
విమల రూపమునకు విశ్వదీపమునకుఁ, జక్రమునకు గుప్త శక్రమునకు. 135

* అని పొగడి అంబరీషుడు తామరల వంటి తన చేతులను నొసట చేర్చి ఇట్లా అన్నాడు.

ఇంద్రుని శత్రువులైన రాక్షసులకు మృత్యుసూచకమైన ధూమకేతువు, ధర్మరూపమైనసేతువు, పరిశుద్ధ స్వరూపం, విశ్వదీపం, ఇంద్రుని కాపాడే సుదర్శన చక్రానికి నేను నమస్కరిస్తాను.

వ. అని మఱియు నిట్లనియె. 136

ఆ. విహితధర్మమందు విహరింతు నేనియు, నిష్టమైన ద్రవ్య మిత్తునేని
ధరణిసురుఁడు మాకు దైవతం బగునేని, విప్రునకు శుభంబు వెలయుఁగాక! 137

* అని సంస్తుతించి ఇంకా ఇట్లా అన్నాడు. నాకు విధింపబడ్డ ధర్మమార్గంలో నేను నడిచే వాణ్ణయితే, యాచకులు, కోరిన మేరకు నేను ద్రవ్యాన్ని దానం చేసే వాణ్ణయితే, బ్రాహ్మణుడు మాకు దైవస్వరూపుడైతే ఈ దుర్వాసునికి శుభం కలుగుగాక!

క. అఖిల గుణాశ్రయుఁ డగు హరి, సుఖియై నా కొలువు వలనఁ జొక్కెడి నేనిన్
నిఖిలాత్మమయుం డగుటకు, సుఖమందుం గాక భూమిసురుఁ డివ్వేళన్. 138

* సమస్త గుణాలను ఆశ్రయించిన శ్రీహరి నా సేవ వల్ల తృప్తి పొందినవాడైతే ఆయన సమస్త మైన ఆత్మలను ఆవరించినవాడై ఉండడానికి నిదర్శనంగా ఈ బ్రాహ్మణుడు ఇప్పుడు సుఖాన్ని పొందుగాక!

వ. అని యివ్విధంబునం బొగడు పుడమితేని వలన మన్నించి, తపసిని దాహంబు నొందింపక, రక్కసుల గొంగ చక్రంబు తిరిగి చనియె; నంత దుర్వాసుండు శాంతిం బొంది మెల్లని మేలిమి మాటల నా రాజుం దీవించి, యిట్లనియె. 139

* అని ఈ విధంగా రాజు ప్రార్థింపగా విష్ణుచక్రం మునిని మన్నించి తపింపజేయకుండా తరలి వెళ్ళింది. అప్పుడు దుర్వాసుడు శాంతిని పొంది చల్లని మంచి మాటలతో ఆ రాజును దీవించి ఇట్లా అన్నాడు.

మ. 'నరనాథోత్తమ! మేలు సేసితి కదా! నాతప్పు మన్నించి శ్రీ
హరి పాదాబ్జము లింతముట్టఁ గొలుతే? యాశ్చర్య మౌ నెన్నుచో
నరుదంద్రే నినుఁ బోఁటి సాధులకుఁ దానై యిచ్చుటల్ గాచుటల్
సొరిదిన్ నైజగుణంబులై సరస వచ్చుం గాదె మిత్రాకృతిన్. 140

* ఓ రాజశ్రేష్ఠుడా! నా తప్పుకాచి మేలు చేశావు. శ్రీహరి పాదపద్మాలను ఇంత గాఢంగా నమ్మి సేవించావా! ఇది ఆశ్చర్యం! కాని నీవంటి సాధువులకు ఇది అరుదేమీ కాదు. కోరింది ఇవ్వడం కాపాడటం అనేవి నీ వంటి సాధువుకు సహజ గుణాలై మైత్రీ భావంతో సరసంగా సంప్రాప్తిస్తాయి కదా!

వ. అదియునుం గాక. 141

మ. ఒక మా టెవ్వని పేరు కర్ణములలో నొయ్యారమై సోఁకినన్
సకలాఘంబులు పల్లటిల్లి తొలఁగున్ సంభ్రాంతితో నట్టి స
త్పుకరున్ మంగళతీర్థపాదు హరి విష్ణున్ దేవదేవేశుఁ దా
నకలంకస్థితి గొల్చు భక్తులకు లే దడ్డంబు రాజాగ్రణీ! 142

* అంతేకాదు. ఓ రాజా! ఒక్కమారు ఎవ్వని పేరు చెవుల సోకగానే సమస్త పాపాలూ పటాపంచలై పోతాయో అటువంటి భక్తసులభుడూ, మంగళకరమైన తీర్థాన్ని పాదాల చెంత కలిగినవాడూ ఐన విష్ణువును నిష్కళంకబుద్ధితో సేవించే భక్తులకు అడ్డమే లేదు.

మత్తకోకిల.
తప్పు లోఁగొని చక్రపావక దాహముం బెడఁబాపి తా
నొప్పునొప్పు భవద్దయారస మో నరేశ్వర! ప్రాణముల్
సెప్ప మున్మను వోయి క్రమ్మఱఁ జేరె ధన్యుఁడ నైతి నీ
కెప్పుడున్ శుభ మేను గోరెద నింకఁ బోయెద భూవరా! 143

* ఓ రాజా! నా తప్పును లెక్కించక నేను సుదర్శనచక్రం మంటల్లోపడి మాడిపోకుండా నన్ను తప్పించావు. ఈ కరుణారసం నీకే తగును. పోయిన ప్రాణాలు మళ్ళీ వచ్చాయి. ధన్యుణ్ణి అయ్యాను. నీ కెప్పుడూ శుభం కలగాలని కోరుకొంటాను. ఇక వెళ్ళివస్తాను.

క. అనిన విని రాజముఖ్యుఁడు, మునివల్లభు పాదములకు మ్రొక్కి కడున్ మ
న్నన సేసి యిష్టభోజన, మనువుగఁ బెట్టించెఁ దృప్తుఁ డయ్యె నతండున్. 144

వ. మఱియు న మ్మునీంద్రుం డిట్లనియె. 145

* అనగా విని ఆ అంబరీషుడు మునికాళ్ళకు మ్రొక్కి ఎంతో గౌరవించి, సుష్టుగా భోజనం పెట్టించాడు. ఆ దుర్వాసుడు తృప్తి పొందాడు. మఱియు నమ్మునిశ్రేష్ఠుడు ఇట్లా అన్నాడు.

శా. "కంటిన్ నేఁటికి నిన్ను నీ వచనముల్ కర్ణద్వయ ప్రీతిగా
వింటి న్నన్నముఁ గొంటి నీ గృహమునన్ వేడ్కన్ ఫలం బబ్బె నే
మంటిన్ బోయెద! నీ చరిత్ర మమరుల్ మర్త్యుల్ సుఖాసీనులై
మింటన్ మేదిని సన్నుతింపఁ గల రీమీఁద న్నరేంద్రాగ్రణీ! 146

* ఓ నరేంద్ర చంద్రా! నేటికి నిన్ను కళ్ళారా చూడగలిగాను. నీ మాటలను చెవులారా విన్నాను. నీ యింట్లో కడుపారా తిన్నాను. నాకు ఫలం దక్కింది. ఇక వెళ్ళి వస్తాను. ఇక మీదట స్వర్గంలోని సురలూ, భూలోకంలోని నరులూ, నీ నడవడిని మెచ్చుకుంటారు.

వ. అని చెప్పి దుర్వాసుం డంబరీషుని దీవించి, కీర్తించి, మింటి తెరువున బ్రహ్మలోకమునకుం జనియె. మునీశ్వరుండు తిరిగి చనువేళకు నొక సంవత్సరంబు నిండి, వ్రతంబు పరిపూర్ణం బయిన. 147

* అని చెప్పి దుర్వాసుడు అంబరీషుణ్ణి ఆశీర్వదించి అభినందించి ఆకాశమార్గం గుండా బ్రహ్మలోకానికి వెళ్ళాడు. దుర్వాసుడు వచ్చి వెళ్ళినప్పటికి ఒక సంవత్సరం నిండి వ్రతం పూర్తయింది.

ఆ. అవనిసురుఁడు గుడువ నతిపవిత్రంబైన, వంటకంబు భూమి వరుఁడు గుడిచెఁ
దపసి నెగులు మాన్పఁ దానెంత వాఁడను, హరి కృపామహత్త్వ మనుచుఁ దలఁచి. 148

* 'ఋషి కష్టాన్ని మాన్పడానికి నే నెంతటివాణ్ణి? అంతా ఆ శ్రీహరి ప్రభావం' అని మనస్సులో తలచి, దుర్వాసుడు భోజనం చేసిన తర్వాత మిగిలిన పవిత్రమైన వంటకాన్ని ఆ అంబరీషుడు భుజించాడు.

వ. మఱియును. 149

క. హరిఁ గొల్పుచుండు వారికిఁ, బరమేష్ఠిపదంబు మొదలు పదభోగంబుల్
నరకసమము లను తలఁపున, ధరణీ రాజ్యంబుతోడి తగులము మానెన్. 150

* శ్రీహరిని సేవించే భక్తులకు బ్రహ్మపదవి మొదలైన భోగభాగ్యాలన్నీ నరకంతో సమానమైనవనే తలంపుతో ఆ అంబరీషుడు రాజ్యం పట్ల మోహాన్ని మానుకొన్నాడు.

వ. ఇట్లు విరక్తుం డై 151

ఆ. తనకు సదృశులైన తనయుల రావించి, ధరణి భరము వారిఁ దాల్పఁ బంచి
కాననంబు సొచ్చెఁ గామాది విజయుఁడై, నరవిభుండు హరిసనాథుఁ డగుచు. 152

* ఈ విధంగా విరక్తుడై కామాది అరిషడ్వర్గాన్ని జయించిన అంబరీషుడు తనకు సాటివచ్చే కొడుకులను పిలిపించి రాజ్యభారాన్ని వారికి అప్పగించాడు. పిమ్మట శ్రీహరికటాక్షాన్ని పొంది తపస్సు కోసం అడవికి వెళ్ళాడు.

క. ఈ యంబరీషచరితము, తీయంబున విన్నఁ జదువ ధీసంపన్నుం
డై యుండును భోగపరుం, డై యుండును నరుఁడు పుణ్యుఁడై యుండు నృపా! 153

* ఓ రాజా! అంబరీషుని చరిత్రను ఆసక్తితో విన్నా, చదివినా నరుడు బుద్ధిమంతుడై ఉంటాడు. భోగపరుడై ఉంటాడు. పుణ్యాత్ముడై ఉంటాడు.

వ. విను మయ్యంబరీషునకు విరూపుండును, గేతుమంతుండును, శంభుండు నను వారు మువ్వురు కొడుకు; లందుఁ గేతుమంతుండును, శంభుండును హరింగూర్చి తపంబు సేయువారై, వనంబునకుం జనిరి. విరూపునికిఁ బృషదశ్వుండును, బృషదశ్వునకు రథీతరుండును గలిగి; రమ్మహాత్మునికి సంతతి లేకున్న నంగిరసుఁడను మునీంద్రుం డతని భార్యయందు బ్రహ్మతేజోనిధులైన కొడుకులం గలిగించె; వారలు రథీతరగోత్రులు, నాంగిరసులను బ్రాహ్మణులునై, యితరులందు ముఖ్యులయి ప్రవర్తిల్లి రని చెప్పి శుకుం డిట్లనియె. 154

* ఆ అంబరీషునికి విరూపుడు, కేతుమంతుడు, శంభుడు అని ముగ్గురు కొడుకులు, వారిలో కేతుమంతుడు, శంభుడు శ్రీహరిని గూర్చి తపస్సుచేయడానికై అడవులకు వెళ్ళారు. విరూపునికి పృషదశ్వుడు, అతడికి రథీతరుడు పుట్టారు. ఆ మహాత్మునికి బిడ్డలు లేకుంటే అంగిరసుడనే ముని అతడి భార్యకు బ్రహ్మతేజస్సుతో కూడిన కొడుకులను ప్రసాదించాడు. వాళ్ళు రథీతరగోత్రులుగానూ, అంగిరసులనే బ్రాహ్మణులు గానూ ప్రసిద్ధు లయ్యారు అని చెప్పి శుకమహర్షి ఇట్లా అన్నాడు.

## -: ఇక్ష్వాకు వంశానుక్రమము :-

క. ఒకనాఁడు మనువు దుమ్మిన, వికలుఁడు గా కతని ఘ్రాణవివరము వెంటం
బ్రకటయశుం డిక్ష్వాకుం, డకలంకుఁడు పుట్టె రవికులాధీశుండై. 155

* ఒక రోజు మనువు తుమ్మగా అతడి ముక్కురంధ్రం నుండి గొప్పకీర్తి కలిగిన ఇక్ష్వాకుడు పుట్టి సూర్యవంశానికి ప్రభు వైనాడు

సీ. ఇక్ష్వాకునకుఁ బుత్త్రు లెలమిఁ బుట్టిరి నూర్వు రమర వికుక్షియు నిమియు దండ
కుండు నాతని పెద్దకొడుకులు మువ్వురార్యావర్తమందు హిమాచలంబు
వింధ్యాద్రిమధ్య ముర్వీమండలము కొంత యేలిరి యిరువదియేవు రొక్క
పొందున నా తూర్పు భూమి పాలించిరి యందఱు పడమటి కధిపులైరి

తే. యున్న నలువది యేడ్గురు నుత్తరోర్వి, దక్షిణోర్వియుఁ గాచిరి తండ్రి యంత
నష్టకాశ్రాద్ధ మొనరింతు ననుచు నగ్ర, సుతు వికుక్షి నిరీక్షించి శుద్ధమైన,
మాంసఖండంబుఁ దెమ్మనె మహితయశుఁడు. 156

* ఇక్ష్వాకు మహారాజుకు వందమంది కొడకులు పుట్టారు. వాళ్లలో వికుక్షి, నిమి, దండకుడు పెద్దవాళ్ళు. వాళ్ళు ఆర్యావర్తంలోని హిమవత్పర్వతం, వింధ్యపర్వతం నడుమ ఉన్న భూభాగాన్ని పాలించారు. తక్కిన వాళ్లలో ఇరవై ఐదుమంది తూర్పుభాగాన్ని పరిపాలించారు. మరోఇరవై ఐదుగురు పడమటి ప్రాంతాన్ని ఏలారు. మిగిలిన నలభై ఏడుమంది ఉత్తర దిక్కులలోని భూములకు రక్షకులైనారు. అప్పుడు ఇక్ష్వాకుడు అష్టకాశ్రాద్ధం చేయాలనుకొని పెద్దకొడుకైన వికుక్షిని పరిశుద్ధమైన మాంసపుముక్కను తెమ్మని చెప్పాడు.

మ. అగుఁగా కంచు వికుక్షి వేఁట సని ఘోరారణ్య భూమిం దగన్
మృగసంఘంబులఁ జంపి బిట్టలసి తా, మే నొల్లఁబో నాఁకటన్
సగమై యొక్క శశంబుఁ బట్టి తిని శేషంబైన మాంసంబు శీ
ఘ్రగతిం దండ్రికిఁ దెచ్చి యిచ్చె నకలంక స్ఫూర్తి వర్తిల్లఁగాన్. 157

* ఆ వికుక్షి అట్లానే అని వేటకై కారడవులకు వెళ్ళి జంతువులను చంపి బాగా అలసి పోయాడు. ఆకలితో సగమైపోయిన అతడు ఒక కుందేటిని పట్టి చంపితిన్నాడు. మిగిలిన మాంసాన్ని శీఘ్రంగా తెచ్చి తండ్రికి ఇచ్చాడు.

తరలము.

కులగురుండు వసిష్ఠుఁడంత వికుక్షి కుందెలు దింట లో
పల నెఱింగి 'యనర్హ మెంగిలి పైతృకం బొనరింపఁగా
వలదు వీఁడు దురాత్మకుం' డన వాని తండ్రియు వానిఁ జెం
తలను జేరఁగనీక దేశము దాఁటి పో నడిచెన్ వడిన్. 158

* అప్పుడు కులగురువైన వసిష్ఠుడు వికుక్షి అడవిలో కుందేలు మాంసాన్ని తిన్న విషయం తెలుసుకొని 'ఈ ఎంగిలిమాంసం పితృకర్మ చేయడానికి పనికి రాదు. వీడు దుర్మార్గుడు' అనగా ఇక్ష్వాకుడు వికుక్షిని తన రాజ్యం నుండి వెళ్ళగొట్టాడు.

ఆ. కొడుకు వెడలఁగొట్టి గుణవంతుఁ డిక్ష్వాకుఁ, డా వసిష్ఠుఁ డేమి యానతిచ్చె
నదియుఁ జేసి యోగి యై వనంబునఁ గళే, బరము విడిచి ముక్తి పదము నొందె. 159

* ఆ విధంగా కొడుకును వెళ్ళగొట్టిన గుణవంతుడైన ఇక్ష్వాకుడు వసిష్ఠుడు ఆన తిచ్చినట్టు చేసి, యోగియై అడవులకు వెళ్ళి శరీరం వదలి ముక్తి పొందాడు.

చ. జనకుఁడు ముక్తిఁ బొంద నయశాలి వికుక్షి శశాదు డంచు భూ
జనులు నుతింప నీ ధరణిచక్ర మశేషము నేలి యాగముల్
గొనకొని చేసెఁ బ్రీతి హరిఁ గూర్చి పురంజయుఁ బుత్త్రుఁ గాంచెఁ బే
ర్కొనె "నమరేంద్ర వాహుఁడు గకుత్స్థుఁడు" నంచును వానిలోకముల్. 160

* తండ్రి ముక్తిని పొందాక నీతిమంతుడైన వికుక్షి లోకులు తన్ను శశాదుడని పిలువగా సమస్త భూమండలాన్ని పాలించాడు. అతడు శ్రీహరిగూర్చి ప్రీతితో అనేక యాగాలను చేశాడు. పురంజయుడనే కొడుకును కన్నాడు. అతడినే లోకాలన్నీ అమరేంద్రవాహుడని, కకుత్స్థుడని పేర్కొన్నాయి.

సీ. కృతయుగాంతంబున దితి సుతామరులకు రణ మయ్యెఁ; నందు నా రాక్షసులకు
నమరవల్లభుఁ డోడి హరితోడఁ జెప్పిన జలజనేత్రుఁడు పురంజయుని యందు
వచ్చి నే నుండెద వాసవ! వృషభంబ వై మోవు మని పల్క నమర విభుఁడు
గోరాజమూర్తిఁ గకుత్త్రదేశంబున నా పురంజయు మోచె నంత నతఁడు

తే. విష్ణుతేజంబు దనయందు విస్తరిల్ల, దివ్య చాపంబు చేఁబట్టి దీర్ఘ నిశిత
బాణములఁ బూని వేల్పులు ప్రస్తుతింప, నంత కాలాగ్ని చాడ్పున ననికి నడచె. 161

* కృతయుగాంతంలో దేవతలకూ రాక్షసులకూ గొప్ప యుద్ధం జరిగింది. అందులో రాక్షసులకు ఓడిన ఇంద్రుడు శ్రీహరిని శరణువేడినాడు. అప్పుడు విష్ణువు ' ఓ దేవేంద్రా! పురంజయుణ్ణి నేను ఆవహించి ఉంటాను. నీవు ఆబోతువై అతణ్ణి మూపున వహించు' అని చెప్పాడు. దేవేంద్రుడు ఆబోతురూపాన్ని పొంది

తన మూపుమీద పురంజయుణ్ణి మోశాడు. అప్పుడతడు విష్ణుతేజస్సు తనలో వ్యాపింపగా దివ్యమైన ధనుస్సును చేతబట్టి వాడి బాణాలను ధరించి దేవతలు పొగడుతుండగా ప్రళయాగ్నిలాగా యుద్ధానికి వెళ్ళాడు.

**చ. నడచి శరావళిన్ దనుజనాథుల మేనులు చించి కంఠముల్**
**దొడిఁదొడిఁ ద్రుంచి కాలుపురి త్రోవకుఁ గొందఱఁ బుచ్చి కొందఱన్**
**వడి నురగాలయంబున నివాసము సేయఁగఁ దోలి యంత నూ**
**రడక నిశాచరేంద్రుల పురంబులు గూల్చె పురంజయాఖ్యతన్. 162**

* అట్లా వెళ్ళి బాణాలతో రాక్షసరాజుల శరీరాలను చీల్చి, వెంట వెంటనే మెడలను ఖండించి కొందరిని యమపురికి పంపించాడు. మరి కొందరిని పాతాళలోకానికి తరిమి కొట్టాడు. అంతటితో ఊరుకోక పురంజయుడని ప్రసిద్ధి పొందేటట్టుగా రాక్షసరాజుల పురాలను కొల్లగొట్టాడు.

**వ. ఇ వ్విధంబున శశాదపుత్త్రుండు రాక్షసుల పురంబులు జయించిన కతనం బురంజయుండును, వృషభరూపుండైన యింద్రుడు వాహనం బగుటంజేసి యింద్రవాహనుండును, నతని మూపురం బెక్కి రణంబు సేసిన కారణంబునఁ గకుత్స్థుండును నన నీ మూఁడు నామంబులం బ్రసిద్ధి కెక్కి దైత్యుల ధనంబులు నింద్రుని కిచ్చె, నప్పురంజయుని పుత్త్రుం డనేనసుండు. అతని పుత్త్రుండు పృథుండు, పృథుని కొడుకు విశ్వగంధుండు, విశ్వగంధునకు నందనుండు చంద్రుండు. చంద్ర సుతుండు, యవనాశ్వుండు, యవనాశ్వ తనూభవుండు శవస్తుండు. అతండు శావస్తి నామ నగరంబు నిర్మించె. శవస్త తనయుండు బృహదశ్వుండు. బృహదశ్వ తనూజుండు గువలయాశ్వుం; డానరేంద్ర చంద్రుండు. 163**

* ఈ విధంగా శశాదుని కొడుకు రాక్షసుల పురాలను జయించి నందువల్ల పురంజయుడనీ, ఆబోతురూపంలో ఉన్న ఇంద్రుడు వాహనమైనందువల్ల ఇంద్రవాహనుడనీ, అతడి మూపురాన్ని ఎక్కి యుద్ధం చేసినందువల్ల కకుత్స్థుడనీ మూడు పేర్లతో ప్రసిద్ధి కెక్కాడు. తాను గ్రహించిన రాక్షసుల ధనాన్ని ఇంద్రుని కిచ్చాడు. ఆ పురంజయుని కొడుకు అనేనసుడు. అతడి కుమారుడు పృథువు. అతడిపుత్రుడు విశ్వగంధుడు, అతడి కొడుకు చంద్రుడు. అతడి కుమారుడు యవనాశ్వుడు. అతడికొడుకు శవస్తుడు. అతడు శావస్తి అన్నపేరుగల నగరాన్ని నిర్మించాడు. అతడి పుత్రుడు బృహదశ్వుడు. అతడి కొడుకు కువలయాశ్వుడు.

**క. లావు మెఱసి యిరువది యొక, వేవురు నందనులుఁ దాను వీరుఁ డతఁడు భూ**
**దేవుఁ డుదంకుఁడు పనుప దు, రావహుడై చంపె దుందు నమరాబంధున్. 164**

* ఆ రాజు తనశక్తి ప్రకాశించేటట్లుగా ఉదంకముని ఆనతి మేరకు ఇరవై ఒక్క వేలమంది కొడుకులతో వెళ్ళి ధుంధుడనే రాక్షసుణ్ణి చంపాడు

**వ. అది కారణంబుగా దుంధుమారుం డన నెగడె.నయ్యసురు ముఖానలంబునఁ గువలయాశ్వ కుమారు లందఱు భస్మంబై; రందు దృఢాశ్వుండును, గపిలాశ్వుండును, భద్రాశ్వుండును ననువారలుముగ్గురు**

సిక్కి; రందు దృఢాశ్వునకు హర్యశ్వుండును, హర్యశ్వునుకు నికుంభుండును, నికుంభునకు బర్హిణాశ్వుండును, బర్హిణాశ్వునకుఁ గృతాశ్వుండును, గృతాశ్వునకు సేనజిత్తును, సేనజిత్తునకు యువనాశ్వుండును జనియించి; ర య్యువనాశ్వుండు గొడుకులు లేక నూర్వురు భార్యలుం దానును నివ్వెఱపడియుండ, నా రాజునకు మునులు కృపసేసి, ఇంద్రునిఁ గూర్చి సంతతి కొఱకై యైంద్రయాగంబు సేయించి రందు. **165**

* ఆ కారణంగా దుందుమారుడని అతడు ప్రసిద్ధి కెక్కాడు. ఆ రాక్షసుడి నోటినుండి వెలువడిన అగ్గిలోబడి కువలయాశ్వుని కొడుకులందరూ బూడిద అయ్యారు. వారిలో దృఢాశ్వుడు, కపిలాశ్వుడు, భద్రాశ్వుడు అనే ముగ్గురు మాత్రం ఎలాగో బ్రతికి బయటపడ్డారు. వారిలో దృఢాశ్వునికి హర్యశ్వుడు; అతడికి నికుంభుడు; నికుంభునికి బర్హిణాశ్వుడు, బర్హిణాశ్వునికి కృతాశ్వుడు; కృతాశ్వునికి సేనజిత్తు, సేనజిత్తుకు యువనాశ్వుడు జన్మించారు. ఆ యువనాశ్వుడు కొడుకులు లేక వంద మంది భార్యలూ తాను విచారిస్తుండగా మునులు కటాక్షించి సంతతి కోసం ఇంద్రుణ్ణి గూర్చి యాగం చేయించారు.

సీ. భూమీశు భార్యకుఁ బుత్త్ర లాభమునకై పోయు తలంపున భూమిసురులు
జలమును మంత్రించి జలకలశము దాఁచి నియమంబుతోఁ గూడి నిద్రవోవ
ధరణీశ్వరుఁడు పేరు దప్పితో నా రాత్రి ధృతిలేక యజ్ఞమందిరముఁ జొచ్చి
యా నీరుఁ ద్రావిన నంత మేల్కని వార 'లెవ్వఁడు ద్రావె నీరెందుఁ బోయె?'

ఆ. ననుచు రాజు ద్రావు టంతయు భావించి, యెఱిఁగి చోద్యమంది యీశ్వ రాజ్ఞ
యెవ్వఁ డోపుఁ గడవ; నీశ్వరునకు నమ, స్కార మనుచు నేది కార్య మనుచు. **166**

* ఆ రాజుభార్యకు సంతానం కలగడానికై బ్రాహ్మణులు నీళ్లను మంత్రించి, ఆ పవిత్రజలం ఉన్న కలశాన్ని భద్రంగా దాచి నిద్ర పోయారు. ఆ రాత్రి రాజు దప్పికతో ఆగలేకుండా యజ్ఞమందిరంలోనికి వెళ్ళి ఆ పవిత్రజలాన్ని త్రాగాడు. ఆ బ్రాహ్మణులు మేల్కొని 'నీళ్లేమైనాయి? ఎవరు త్రాగారు?' అంటూ రాజు త్రాగిన సంగతిని ఊహించి, 'ఈశ్వరాజ్ఞను ఎవడు దాటగలడు? ఇప్పుడు ఏంచేయాలి? ఆ ఈశ్వరుడే దిక్కు' అని విచారిస్తూ ఉండినారు.

వ. వారలు దుఃఖింపుచుండు నంతఁ గొంత తడవునకు యువనాశ్వుని కడుపు వ్రక్కలించుకొని , చక్రవర్తి చిహ్నంబులు గల కుమారుండు జన్మించి, తల్లి లేని కతంబునం గడుపునకు లేక యేడ్చుచుండ, ఇంద్రుండు వచ్చి, శిశువునకు నాఁకటి దీఱు కొఱకు వానినోటం దనవ్రేలిడినం, ద్రావిన కతంబున వాని పేరు మాంధాత యని నిర్దేశించి చనియె. ని వ్విధంబున. **167**

* పిమ్మట కొంతసేపటికి యువనాశ్వుని కడుపును చీల్చుకుని చక్రవర్తి చిహ్నాలు కలిగిన కొడుకుపుట్టి, తల్లిలేని కారణంగా ఆకలితో ఏడుస్తూ ఉండినాడు. అప్పుడు ఇంద్రుడు వచ్చి ఆకలి తీరడానికి ఆ నిసువునోట తన చూపుడు వ్రేలిని పెట్టాడు. అట్లా త్రాగినందువల్ల ఇంద్రుడు ఆ బాలునికి 'మాంధాత' అనే పేరు పెట్టి వెళ్ళాడు.

ఆ. కడుపు పగుల ముద్దుకొడుకు జన్మించినఁ, దీఱఁ డయ్యెఁ దండ్రి దేవవిప్ర
కరుణ యట్లు కాదె? కడిఁది దైవము లావు, కలుగువాఁడు బ్రతుకుఁ గాక చెడునె? 168

* ఈ విధంగా తన కడుపును చీల్చుకొని ముద్దుల కొడుకు పుట్టినా ఆ యువనాశ్వుడు చావలేదు. దేవతల అనుగ్రహం, మునులదయ అలాంటివి కదా! దైవబలం కలవాడు బాగా బ్రతుకుతాడు. కాని చెడిపోడుకదా!

వ. ఇట్లు బ్రతికియున్న యువనాశ్వుండు, కొంత కాలంబునకుఁ దపంబుసేసి, సిద్ధిం బొందె; నంత.169

* ఇట్లా బ్రతికిన యువనాశ్వుడు కొంతకాలానికి తపస్సు చేసి సిద్ధిపొందాడు.

సీ. పడమటఁ బొడమెడు బాలచంద్రుని మాడ్కిఁ బూఁటపూఁటకు వృద్ధిఁ బొందె బాలుఁ;
డల్లన పరిపూర్ణ యౌవనారూఢుఁడై రావణాది రిపుల రాజవరుల
దండించి తనుఁ ద్రసదస్యుఁ డంచు సురేంద్రుఁ డంకింప శూరుఁడై యఖిల దేవ
మయు నతీంద్రియు విష్ణు మాధవు ధర్మాత్ము నజుని యజ్ఞాధీను నాత్ముఁ గూర్చి

తే. చేసెఁ గ్రతువులు భూరిదక్షిణల నిచ్చి, ద్రవ్యయజమాన విధిమంత్ర ధర్మయజ్ఞ
కాల ఋత్వి క్ప్రదేశ ముఖ్యంబు లెల్ల, విష్ణురూపంబు లనుచు భావించి యతఁడు 170

* ఆ బాలుడు పడమటి దిక్కున పుట్టే బాలచంద్రుని లాగా దినదిన ప్రవర్ధమానుడై, నిండు యౌవనాన్ని పొంది, రావణాసురుడు మొదలైన శత్రురాజులను దండించాడు. ఆ శూరుణ్ణి దేవేంద్రుడు 'త్రసదస్యుడు' అని పొగిడాడు. యజ్ఞసంభారాలు, యజమాని, మంత్రాలు , ఋత్విక్కులు, సర్వమూ విష్ణురూపాలే అని భావించిన ఆ మాంధాత సర్వదేవమయుడూ, ఇంద్రియాతీతుడూ, ధర్మాత్ముడూ, యజ్ఞాధీశుడూ ఐన శ్రీహరిని గూర్చి గొప్ప దక్షిణలతో కూడిన యజ్ఞాలు చేశాడు.

క. బలిమి నడంచుచు నరులం, జలి వెలుఁగున్ వేఁడివెలుఁగుఁ జనుచోటెల్లన్
జలరుహనయనుని కరుణను, జెలువుగ మాంధాత యేలె సిరి నిండారన్. 171

* ఆ మాంధాత శ్రీహరికటాక్షంతో శత్రువులను అణచివేస్తూ సూర్యచంద్రులు వెలిగే చోటు లన్నింటినీ సిరిసంపదలు నిండేటట్లుగా పరిపాలించాడు.

వ. అంత నా రాజునకు శతబిందుని కూఁతురగు బిందుమతి యందుఁ బురుకుత్సుండు; నంబరీషుండును, ముచుకుందుండును ననువారు ముగ్గురు గొడుకులు, నేఁబండ్రు కూఁతులును జనియించి, పెరుఁ గుచున్న యెడ. 172

* పిమ్మట ఆ రాజుకు శతబిందుని కూతురైన బిందుమతివల్ల పురుకుత్సుడు, అంబరీషుడు, ముచుకుందుడు అనే ముగ్గురు కొడుకులు ఏభైమంది కూతుళ్ళు పుట్టి పెరుగుతుండినారు.

సీ. యమునాజలములోన నధికుఁడు సౌభరి తపము సేయుచు జలస్థలమునందుఁ
బిల్లలుఁ దనప్రాణవల్లభయునుఁ గూడి మెలఁగ నానందించు మీనరాజుఁ
గనుఁగొని సంసార కాంక్షియై మాంధాత నొకకన్య నడుగ నృపోత్తముండు
తరుణి నిత్తును స్వయంవరమునఁ జేకొను మనవుడు ననుఁ జూచి యౌవనాంగి

ఆ. యేల ముసలిఁ గోరు నిట్టట్టు వడఁకెడి, వాఁడఁ జాల నరసినాఁడ నొడల
జిగియు బిగియు లేని శిథిలుండఁ గరఁగింప, బాలఁ దిగిచికొను నుపాయ మెట్లు? 173

* గొప్పవాడైన సౌభరి అనేముని యమునానది నీటిలో మునిగి తపస్సు చేసుకుంటూ, ఒకరోజు భార్యాపుత్రులతో కలిసి సంసారసుఖాన్ని చూరలాడే చేపలరాజును చూచాడు. అతడు సంసారసుఖాన్ని ఆశించి మాంధాతను ఒక కన్యను తన కిమ్మని అడిగాడు. అప్పు డారాజు 'కన్య నిస్తాను. కాని స్వయంవరంలో స్వీకరించు' అన్నాడు- అప్పుడు ముని తనలో ఇట్లా అనుకొన్నాడు. 'మంచి యౌవనంలో ఉన్న కన్య నాలాంటి ముసలి వాణ్ణి ఎందుకు కోరుకొంటుంది. నేను ముసలితనంవల్ల వణుకు తున్నాను. జుట్టు నెరసిపోయింది ఒంట్లో జిగీ బిగీ లేదు. కన్యను లోబరచుకునే ఉపాయమేది?

వ. అదియునుం గాక. 174

ఆ. బాల పువ్వుఁబోడి ప్రాయంపు వానినిఁ, జెన్నువాని ధనముఁ జేర్చువాని
మరగెనేనిఁ గొంత మరగుఁగా కెదిరిఁ ద, న్నెఱిఁగి ముసలితపసి నేల మరగు? 175

* అదీగాక అందమైన ఆడపిల్ల ప్రాయంలో ఉన్న వాణ్ణి, అందమైన వాణ్ణి, ధనవంతుణ్ణి ఆశించవచ్చు గాని తెలిసి తెలిసి ముదివగ్గయిన మునిని ఎందుకు కోరుకుంటుంది?

వ. అని విచారించి సౌభరి దనతపోబలంబునం జేసి ముసలి తనంబు విడిచి యెల ప్రాయంపుఁ గొమరుం డయి యలంకరించుకొని ముందట నిలువంబడిన మాంధాతయుఁ గన్నియల నగరు గాచికొని యున్నవారికి సెలవు సేసిన వా రమ్మునీంద్రుని నా రాజపుత్రికలున్న యెడకుం గొనిపోయి చూపిన.176

* అని విచారించి సౌభరి తన తపోబలంతో ముసలితనాన్ని వదలి పడుచువాడై చక్కగా అలంకరించు కొని మాంధాత దగ్గరకు వచ్చాడు. రాజు అంతఃపురానికి కాపలా ఉన్న వారిని ఆజ్ఞాపించగా వారు ఆ మునీంద్రుణ్ణి రాజపుత్రికలున్న చోటుకు తీసుకొనివెళ్ళి చూపెట్టారు.

ఉ. 'కోమలులార! వీఁడు నలకూబరుఁడో! మరుఁడో! జయంతుడో!
యేమఱి వచ్చె; వీనిఁ దడ వేల వరింతుము నేమ నేమ' యం
చా మునినాథుఁ జూచి చలితాత్మికలై సొరిదిన్ వరించి రా
భామిను లందఱుం గుసుమబాణుఁడు గీయని ఘంట వ్రేయఁగన్. 177

* మన్మథుడు మోహాన్ని కలిగింపగా ఆ కన్యలు మునీంద్రుణ్ణి చూచి 'వీడు నలకూబరుడో, మన్మథుడో! జయంతుడో! ఏమరుపాటున ఇక్కడికి వచ్చాడు. ఇక జాగుచేయడ మెందుకు? మేము వరిస్తాము. మేము వరిస్తాము' అంటూ అతణ్ణి కోరుకొన్నారు.

వ. ఇట్లు రాజకన్యకల నందఱం జేకొని సౌభరి నిజతపః ప్రభావంబున ననేక లీలావినోదంబులఁ గల్పించి.

సీ. గృహరాజములయందుఁ గృతకాచలములందుఁ గలువలు విలసిల్లు కొలఁకులందుఁ
గలకంఠ శుకమధుకర నినాదములచే వర్ణనీయములైన వనములందు
మణివేదికల యందు మహనీయ పర్యంక పీఠలీలాశైల బిలములందు
శృంగార వతులగు చెలువలు పలువురు తనపంపు సేయ సుస్థలములందు

తే. వస్త్ర మాల్యానులేప సువర్ణహార, భూరి సంపద నిష్పన్న భోజి యగుచుఁ
బూఁట పూటఁకు నొక వింత పొలుపుఁ దాల్చి, రాజకన్యల నందఱ రతులఁ దేల్చె. 179

* ఇట్లా రాజకన్యల నందరినీ పెళ్లిచేసుకొని సౌభరి తన తపోమహిమతో అనేక లీలా వినోదాల్ని కల్పించి సుందరభవనాల్లోనూ, కేళీ పర్వతాల్లోనూ, కలువపూలు విలసిల్లే కొలకుల్లోనూ, కోకిలకూజితాలతో కూడిన వనాల్లోనూ, మణులు తాపడం చేసిన తిన్నెలపైనా, గొప్ప శయ్యలందు, కొండగుహలయందూ శృంగారవతులైన స్త్రీలు కనుసన్నల్లో మెలగుతూ ఉండగా, మంచి బట్టలు, పూలమాలలు, నగలు, అంగరాగాలూ పుష్కలంగా కల్పించి, షడ్రసోపేతమైన భోజనం చేస్తూ, పూట పూటకూ ఒక వింత అనుభవాన్ని పొంది రాజకన్యలతో పొందును అనుభవించాడు.

క. పెక్కండ్రు రాజముఖులకు, నొక్కఁడు మగఁడయ్యుఁ దనియకుండె మునీంద్రుం
డెక్కుడు ఘృతధారలచే, నక్కజమై తృప్తి లేని యనలుని భంగిన్. 180

* ఆ మునీంద్రుడు పెక్కుమంది భార్యలతో పొందు కలిగిన వాడైనా నేతి ధారలతో తృప్తిపడని అగ్నిహోత్రులనిలాగా విషయభోగాలతో తృప్తి పొందలేక పోయాడు.

వ. ఇవ్విధంబున 181

క. ఆరామంబున మునివరుఁ, డా రామలతోడ బహువిహార మయుండై
గారాములఁ దన కిట్టటు, పోరాముల సేసి కొన్ని ప్రొద్దులు పుచ్చెన్. 182

* ఈ విధంగా ఆ మునిశ్రేష్ఠుడు ఉద్యానవనంలో ఆ యువతులతో అనేక విధాల విహరిస్తూ అనురాగాలు ప్రకటిస్తూ, ఆప్యాయత కనబరుస్తూ విషయలంపటుడై కొంతకాలం గడిపాడు.

వ. అంత నొక్కనాఁడు మాంధాతృమేదినీ వల్లభుఁడు, మునీశ్వరుం డెందుఁబోయెఁ? గూఁతు లెక్కడ నలజడి పడుచున్న వారలో" అని తలంచి, వెదుక వచ్చి, యొక్క మహానగరంబున, మణిమయ సౌధంబులం, జక్రవర్తియుం బోలెఁ గ్రీడించుచున్న తాపస రాజుం గని, సంతసించి, వెఱఁగుపడి, మన్ననలం బొంది, మెల్లన కూఁతులం బొడగని సత్కరించి యిట్లనియె. 183

* అప్పుడు ఒక రోజు మాంధాత 'ముని ఎటు వెళ్ళాడో, కూతుళ్లు ఏం పాట్లుపడుతున్నారో' అని విచారించి వెదకుతూ, ఒక మహారణ్యంలో మణులతో నిండిన భవనంలో చక్రవర్తి లాగా క్రీడిస్తున్న మునిరాజును చూచి సంతోషాన్ని, ఆశ్చర్యాన్ని పొందాడు. ఆ ముని చేత మన్ననలను అందుకొని కూతుళ్ల దగ్గరకు వెళ్ళి ఇట్లా అన్నాడు.

క. నా తోడులార! మీ పతి, మీ తోడే? పనుల యెడల మేలే' యనుడున్
'నా తోడిదె నా తోడిదె, తాతా మే!' లనుచు ననిరి తరుణులు వరుసన్. 184

* 'నా బిడ్డలారా! మీ భర్త మిమ్మల్ని బాగా చూచుకొంటున్నాడా?' అని అడుగగా వెంటనే ఆ రాజుకుమార్తె లందరూ వరుసగా 'తండ్రీ! నా తోడే ఉన్నాడు. నా తోడే ఉన్నాడు. బాగా చూచుకొంటున్నాడు' అన్నారు.

వ. అంతఁ గొంతకాలంబునకు గృహగతచర్యుండగు సౌభరి యేకాంతంబునఁ దన్నుఁ దాన చింతించుకొని, మీనమిథున సంగదోషంబునం గాఁపురంబు దనకు నగపడుట యెఱింగి, పశ్చాత్తాపంబున నిట్లనియె.185

* పిమ్మట కొంతకాలానికి లౌకికబంధాలకు చిక్కి సౌభరి ఒంటరిగా తన్నుగూర్చి తాను చింతించి చేపలజంట పొత్తును చూడటం వల్ల కలిగిన దోషంచేత తాను సంసార జంజాటానికి చిక్కుకోవడం తెలుసుకొని పశ్చాత్తాపంతో ఇట్లా అనుకొన్నాడు.

మ. ఉపవాసంబుల డయ్యుటో? విషయసంయోగంబు వర్జించుటో?
తపముం బూని చరించుటో? హరిపదధ్యానంబునన్ నిల్చుటో?
యపలాపంబున నేల పొందితి? హతం బయ్యెం దపం బెల్ల నీ
కపటస్త్రీ పరిరంభముల్ మునులకుం గైవల్య సంసిద్ధులే? 186

* ఉపవాసాలచేత శుష్కించడమో, ఇంద్రియసుఖాలతోడి పొత్తు వదలడమో, తపస్సు చేసుకోవడమో, శ్రీహరిని ధ్యానించడమో చేయక నేనెందు కీ ప్రేమలో పడ్డాను? నాతపస్సంతా వ్యర్థమై పోయింది. వ్యామోహంతో కూడిన ఈ స్త్రీసాంగత్యం మునులకు మోక్షాన్ని కలిగించేదా?

చ. ముని నట! తత్త్వవేది నఁట! మోక్షముకాని సుఖంబు లెవ్వియుం
జన వఁట! కాంత లేఁబ దఁట! సౌధచయం బఁట వాసదేశముం,
దనయులు నైదువే లఁట! నిదానము మీనకుటుంబి సౌఖ్యముం
గను టఁట చెల్లరే నగవుగాక మహాత్ములు సూచి మెత్తురే? 187

* నేనొక మునినట! తత్త్వాన్ని తెలిసిన వాడనట! మోక్షం తప్ప ఇతర సుఖాల వైపు వెళ్లనట! ఏభై మంది భార్యలట! నివాస ముండేది మేడల్లో మిద్దెల్లో నట! ఐదువేల మంది కొడుకులట. దీనికంతకూ మూలకారణం చేపల జంట సౌఖ్యాన్ని చూడడమట! ఇది అపహాస్యం కాకపోతే మహాత్ములు చూచి మెచ్చుకొనే విషయమా!

ఆ. తపము సేయువాఁడు దత్త్వజ్ఞుఁ డగువాఁడు, నెలమి మోక్ష మిచ్చ నెంచువాఁడు
నేకతంబు విడిచి యేర్పడ నేరఁడు, కాఁపురంబు సేయుఁ గఱటితపసి. 188

* తపస్సు చేసేవాడు, తత్త్వం తెలిసినవాడు, మోక్షాన్ని కోరేవాడు ఏకాంతాన్ని అభిలషిస్తాడు. అది లేకుండా పరమాత్మను తెలుసుకోలేడు. మూర్ఖుడైన నా వంటి ముని మాత్రమే సంసార జంజాటంలో చిక్కుకొంటాడు.

**వ. అని దుఃఖించి, తన్నుం దాన నిందించుకొని, తనవేడబంబు వివేకించుచు, నిహపరసాధకుండై, కాఁపురంబు విడిచి, సతులుం దానును వానప్రస్థధర్మంబున నడవికిం జని, ఘోరతపంబు సేసి, శరీరంబు గుదియించి, యగ్ని సహితుండై, పరబ్రహ్మంబు సొచ్చె; నంత. 189**

* అని దుఃఖించి తన్నుతాను నిందించుకొని మాయలో తగులుకొన్న తనస్థితిని బాగా తెలుసుకొని ఇహపరసాధన కోసం సంసారం తోడి తగులాన్ని వదలుకున్నాడు. వాన ప్రస్థధర్మాన్ని స్వీకరించి భార్యలతో అడవికి వెళ్లాడు. ఘోరతపస్సు చేసి శరీరాన్ని కృశింప చేసుకొని అగ్నులతో కూడా పరబ్రహ్మాన్ని పొందాడు.

**క. మునిపతి వనమున కరిగిన, వనితలు తో నరిగి ప్రాణవల్లభు గతికిం**
**జనిరి వెనుతవిలి విడువక, యనలునితో శిఖలు నిలువ కరిగిన భంగిన్. 190**

* అప్పుడు అగ్నిదేవుణ్ణి జ్వాలలు అనుసరించినట్లుగా సౌభరి భార్యలు కూడా అతణ్ణి అనుసరించి అతడు పొందిన గతినే పొందారు.

**వ. అంత మాంధాత పెద్దకొడుకగు నంబరీషునిం దత్పితామహుం డగుటం జేసి యువనాశ్వుండు దనకుఁ బుత్త్రుండు గావలయునని కోరి తెచ్చుకొనియె; న య్యంబరీషునకు యౌవనాశ్వుం, డతనికి హారితుండు జనియించి, రది కారణంబుగా నంబరీష యౌవనాశ్వ హారితులు మాంధాతృగోత్రంబునకుఁ బ్రవరులైరి; మాంధాత రెండవ కొడుకు పురుకుత్సుం; డతని నురగలోకంబునకుఁ గొనిపోయి భుజంగ కుమారులు దమ చెల్లెలి నర్మదయను కన్యకను వివాహంబు చేసిరి; పురుకుత్సుండు నక్కడ ననేక గంధర్వ నాథుల వధించి తన నాగలోక సంచరణంబు దలంచువారికి నురగభయంబు లేకుండ వరంబు వడసి తిరిగి వచ్చె; నా పురుకుత్సునకుఁ ద్రసదస్యుండుఁ, ద్రసదస్యునకు ననరణ్యుండు, నా యనరణ్యునకు హర్యశ్వుండు, హర్యశ్వునకు నరుణుండు, నరుణునకుఁ ద్రిబంధనుండుఁ; ద్రిబంధనునకు సత్య వ్రతుండును జన్మించి; రా సత్యవ్రతుండు త్రిశంకుఁడనం బరఁగె; నతండు. 191**

* మాంధాత కొడుకుల్లో అంబరీషుడు ఉత్తముడని తాత ఐన యువనాశ్వుడు అతణ్ణి కుమారుడిగా స్వీకరించాడు. ఆ అంబరీషునికి యౌవనాశ్వుడు, అతడికి హారితుడు జన్మించారు. ఆ కారణంగా అంబరీష యౌవనాశ్వ హారితులు మాంధాతృగోత్రానికి ముఖ్య పురుషులైనారు. మాంధాత రెండవ కొడుకు పురుకుత్సుడు. నాగకుమారులు అతణ్ణి పాతాళానికి తీసుకొనిపోయి, తమ చెల్లెలైన నర్మద అనే కన్యక నిచ్చి వివాహం చేశారు. అక్కడ పురుకుత్సునికి త్రసదస్యుడు, త్రసదస్యునికి అనరణ్యుడు, అనరణ్యునికి హర్యశ్వుడు, హర్యశ్వునికి, అరుణుడు, అరుణునికి త్రిబంధనుడు. త్రిబంధనునికి సత్యవ్రతుడు జన్మించారు. ఆ సత్యవ్రతుడే త్రిశంకుడని ప్రసిద్ధి గాంచాడు.

సీ. గురుశాపవశమునఁ గూలి చండాలుఁడై యనఘాత్ముఁ గౌశికు నాశ్రయించి
యతని లావున దివిజాలయంబున కేఁగ మన్నింప కమరులు మరలఁ ద్రోయఁ
దలక్రిందుగాఁ బడి దైన్యంబుతో రాఁగఁ గౌశికుం డెప్పటి ఘనత మెఱసి
నిలిపె. నాకసమున; నేఁడు నున్నాఁడు త్రిశంకుఁ; డాతఁడు హరిశ్చంద్రుఁ గనియె

తే. నా హరిశ్చంద్రుఁ గౌశికుఁ డర్థిఁ జేరి, యాగ దక్షిణామిషమున నఖిలధనముఁ
గొల్లఁ గొని మీఁదఁ గులహీనుఁ గొలువఁబెట్ట, బొంక కలజడిఁ బొందె నా భూవరుండు. 192

* గురుశాపంవల్ల చండాలుడైన అతడు పుణ్యాత్ముడైన విశ్వామిత్రుణ్ణి ఆశ్రయించి, అతడి ప్రభావంతో స్వర్గానికి వెళ్ళగా దేవతలు అతణ్ణి అంగీకరించక త్రోసివేశారు. అట్లా తలక్రిందులుగా పడి దయనీయంగా వచ్చే అతణ్ణి విశ్వామిత్రుడు తన ప్రభావంతో ఆకాశంలో నిలిపాడు. నేటికీ ఆ త్రిశంకుడు ఆకాశంలో ఉన్నాడు. అతడు హరిశ్చంద్రుణ్ణి కన్నాడు. విశ్వామిత్రుడు ఆ హరిశ్చంద్రుడి దగ్గరకు కోర్కెతో వెళ్ళి యాగ దక్షిణ నెపంతో సమస్త ధనాన్ని కొల్లగొట్టాడు. ఆపైన అతణ్ణి కులహీనుణ్ణి సేవించేటట్లు చేశాడు. ఐనా ఆ హరిశ్చంద్ర మహారాజు అసత్యం పలుకక కష్టాన్ని సహించాడు.

వ. అట్లు విశ్వామిత్రుండు హరిశ్చంద్రు నెగులుపఱచుట విని వసిష్ఠుండు విశ్వామిత్రుని గృధ్రమ్మవు గమ్మని శపించె. విశ్వామిత్రుండును వసిష్ఠుని బకంబవు గమ్మని శపించెఁ; బక్షి రూపు లయ్యును వైరంబు మానక య య్యిరువురును యుద్ధంబు సేసి; రంత హరిశ్చంద్రుండు పుత్త్రులు లేక నారదు నుపదేశంబున వరుణోపాసనంబు నతిభక్తితోఁ జేయ నా వరుణుండు ప్రత్యక్షంబైన నతనికిఁ మ్రొక్కి యిట్లనియె. 193

* అట్లా విశ్వామిత్రుడు హరిశ్చంద్రుణ్ణి బాధపెట్టడం విని వసిష్ఠుడు విశ్వామిత్రుణ్ణి గ్రద్దవు కమ్మని శపించాడు. ఆ విశ్వామిత్రుడూ వసిష్ఠుణ్ణి కొంగవు కమ్మని శపించాడు. పక్షి రూపాలను పొందినా ఆ ఇద్దరూ శత్రుత్వం మానక పోరాడు కొన్నారు. అప్పుడు హరిశ్చంద్రుడు కొడుకులు లేక నారదుని ఉపదేశంవల్ల వరుణదేవుణ్ణి మిక్కిలి భక్తితో పూజించాడు. వరుణదేవుడు ప్రత్యక్షం కాగా హరిశ్చంద్రుడు అతడికి నమస్కరించి ఇట్లా అన్నాడు.

ఆ. 'వరుణదేవ! నాకు వరవీర గుణములఁ, గొడుకు పుట్టె నేనిఁ గొడుకుఁ బట్టి
పశువుఁ జేసి నీవు పరిణమింపఁగ వేల్తుఁ , గొడుకు నీఁ గదయ్య కొసరు లేక! 194

* ఓ వరుణదేవా! నాకు గొప్పవీరుడైన కొడుకు పుట్టితే నీవు సంతోషించేటట్లుగా అతణ్ణి బలిపశువును చేసి అగ్నిలో హోమం చేస్తాను. వెలితిలేకుండా కొడుకును ప్రసాదించు.

వ. అని పలికినం గుమారుండు గలిగెడు మని వరంబిచ్చి వరుణుండు సనియె; నంత హరిశ్చంద్రునకు వరుణప్రసాదంబున రోహితుండను కుమారుండు జన్మించె; వరుణుండును హరిశ్చంద్రకుమారు నుద్దేశించి. 195

సీ. పురిటిలోపల వచ్చి పుత్త్రువేలుపు మన్నఁ బురుడు వోయినఁ గాని పొసఁగ దనియెఁ;
బలురాక మును వచ్చి బాలు వేలుపు మన్నఁ బండ్లు లేకుంట నభావ్యుఁ డనియెఁ;
బండ్లు రాఁజూచి డింభకుని వేలుపు మన్నఁ బడి పండ్లు రామి నభావ్యుఁ డనియెఁ;
బడిపండ్లు వొడమినఁ గొడుకు వేలుపు మన్నఁ బోరుల కొదవక పోల దనియెఁ;

ఆ. దొడరి యిట్లు గొడుకుతోడి మోహంబునఁ, బ్రొద్దు గడపుచుండె భూవరుండు
దండ్రి తలఁపు కొలఁదిఁ దనలోనఁ జింతించి, యింట నుండ కడవి కేఁగెఁ గొడుకు. 196

* అని వేడుకోగా కుమారుడు కలుగుతాడని వరమిచ్చి వరుణ దేవుడు అదృశ్యుడైనాడు. పిమ్మట హరిశ్చంద్రునికి వరుణదేవుని అనుగ్రహంవల్ల రోహితుడనే కొడుకు గలిగాడు. వరుణుడు హరిశ్చంద్రుని వాగ్దానం ప్రకారం పురిటిలోపలవచ్చి కొడుకును బలి ఇవ్వమంటే, పురుడు తీరితేగానీ పొసగ దన్నాడు. పండ్లు రాకముందు వచ్చి పిల్లవాణ్ణి బలి ఇవ్వమంటే పండ్లు లేక పోవడంవల్ల తగడని చెప్పి పంపించాడు. పండ్లు వచ్చాక బాలుణ్ణి బలియివ్వమంటే, పడి పండ్లురాక పోవడం వల్ల అర్హుడు కాడన్నాడు. పడి పండ్లు పొడసూపగా వచ్చి కొడుకును బలి ఇవ్వమంటే యుద్ధాలకు ఉపయోగపడే యువకుడు కాకుండా పనికిరాడని చెప్పాడు. ఇట్లా హరిశ్చంద్రుడు కొడుకుపట్ల ఉన్న వ్యామోహంతో ఏవో సాకులు చెబుతూ కాలం గడిపాడు. తండ్రి తలపును తెలుసుకొన్న రోహితుడు చింతించి ఇల్లు విడిచి అడవికి వెళ్ళాడు.

వ. ఇట్లు వనంబునకుం జని శరశరాసన ధరుండయి రోహితుండు దిరుగుచుండి వరుణగ్రస్తుండై హరిశ్చంద్రుండు మహోదర వ్యాధిచేఁ బీడితుండుగా నుండుట విని పురంబునకుం దిరిగి రా గమకింప నింద్రుండు ముసలి తపసియై వచ్చి యిట్లనియె. 197

* ఇట్లా ఇల్లు విడిచి విల్లంబులను ధరించి కారడవుల్లో తిరుగులాడే రోహితుడు, తన తండ్రి వరుణదేవుడు కల్పించిన మహోదర వ్యాధితో పీడింపబడుతున్నాడని విని పట్టణానికి బయలుదేరాడు. అప్పుడు ఇంద్రుడు ముసలి తపసి రూపంలో వచ్చి ఇట్లా అన్నాడు.

ఆ. పుణ్యభూము లరుగు; పుణ్యతీర్థంబులఁ, గ్రుంకు; పుణ్యజనులఁ గోరి చూడు;
పుణ్యకథలు వినుము భూపాలపుత్రక!, మేలు గలుగునట్టి మేర గలదు. 198

* ఓ రాజకుమారా! పుణ్యక్షేత్రాలను దర్శించు. పుణ్యతీర్థాల్లో మునుగు, పుణ్యాత్ముల సాంగత్యంలో మెలగు. పుణ్యకథలను విను. నీకు మేలు కలుగుతుంది.

వ. అని యిట్లు మగుడించినం దిరిగి చని రోహితుం డొక్క యే డవ్వనంబునం దిరిగి క్రమ్మఱఁ జనుదేర నింద్రుండు వచ్చి తొంటియట్ల నివారించె; ని వ్విధంబున. 199

* అని ఇట్లా మరలించగా రోహితుడు వెళ్ళి ఒక సంవత్సరం పాటు తిరిగి ఇంటి ముఖం పట్టాడు. ఇంద్రుడు మళ్ళా వచ్చి వెనుకటిలాగే అతణ్ణి నివారించి పంపివేశాడు.

సీ. ఐదేండ్లు మరలించె నమరేంద్రుఁ డా బాలు నాఱవయేటఁ దా నడవినుండి
యింటికి వచ్చుచు నెలమి నజీగర్తు మధ్యమ పుత్త్రు సన్మాన్య చరితు
ఘను శునశ్శేపునిఁ గొని యాగపశువుగ నా హరిశ్చంద్రున కాతఁ డిచ్చెఁ;
బురుషమేధము సేసి భూపాల వర్యుఁడు వరుణాది నిఖిల దేవతలఁ దనిపె

తే. హోత కౌశికుఁ; డధ్వర్యుఁ డొనర భృగువు;, బ్రహ్మ జమదగ్ని, సామంబు పాడువాఁడు
ముని వసిష్ఠుఁ డా ముఖమున ముదముఁ బొంది, కనకరథ మిచ్చె నింద్రుఁ డా మనుజపతికి. 200

* ఈ విధంగా దేవేంద్రుడు ఆ బాలుణ్ణి ఐదేండ్ల పాటు ఇంటికి వెళ్ళనివ్వలేదు. ఆరో ఏడు రోహితుడు అడవినుండి ఇంటికి వస్తూ అజీగర్తుడనే వాడి నడిమికొడుకు, మంచి నడవడిక కలవాడు ఐన శునశ్శేపుణ్ణి వెంటబెట్టుకొని వచ్చి అతణ్ణి యాగపశువుగా తండ్రికి సమర్పించాడు. అప్పుడు హరిశ్చంద్రుడు నరమేధం చేసి వరుణుడు మొదలైన దేవతలను తృప్తిపరచాడు. ఆ యజ్ఞానికి హోత విశ్వామిత్రుడు. భృగుమహర్షి అధ్వర్యుడు. జమదగ్ని బుత్విజుడు. సామవేదగానం చేసినవాడు వసిష్ఠముని. ఆ యజ్ఞంవల్ల సంతోషించిన ఇంద్రుడు హరిశ్చంద్రునికి బంగారు రథాన్ని ఇచ్చాడు.

వ. శునశ్శేపుని ప్రభావంబు వెనుక వివరించెద; నంత భార్యాసహితుండైన హరిశ్చంద్రు వలన నత్యంత ప్రీతుండై విశ్వామిత్రుం డతనికి ముఖ్యజ్ఞానంబుఁ గృపసేసిన మనం బన్నమయంబు గావున, నన్న రూపియైన పృథివి నెఱింగి, పృథివిని జలంబువలన నణంచి, జలంబుఁ దేజంబువలన నింకించి, తేజంబు వాయువువలనం జేర్చి, వాయువు నాకాశంబునం గలిపి, యాకాసంబు దామసాహంకారంబునందు లయంబు చేసి, యహంకారత్రయంబు మహత్తత్త్వంబునందు డిందించి, పరతత్త్వంబునకు లోకంబులు సృజించెద నను తలం పైన మహత్తత్త్వంబునందు విషయాకారంబు నివర్తించి విషయ వివర్జితుండై పరతత్త్వంబుల నెఱుంగుచు, న య్యెఱుకవలన సంసార హేతువైన ప్రకృతిని భస్మంబుఁ జేసి, యయ్యెఱుకను నిర్వాణ సుఖ పారవశ్యంబునం బరిహరించి, సకల బంధ విముక్తుండై హరిశ్చంద్రుం డవాఙ్మనస గోచరంబయిన నిజరూపంబుతో వెలుంగుచుండె; నతని కుమారునకు హరితుండు పుట్టె; హరితునకుఁ జంపనామధేయుండు జనియించె; నతండు దనపేరఁ జంపానగరంబు నిర్మించె; నా చంపునికి సుదేవుండు, సుదేవునికి విజయుండు, విజయునకు రురుకుండు, రురుకునకు వృకుండు, వృకునకు బాహుకుండు జనియించి; రందు బాహుకుండు. 201

* ఆ శునశ్శేపుని మహిమను తర్వాత వివరిస్తాను. భార్యతో పాటు హరిశ్చంద్రుడు పాటించిన సత్యనిష్ఠకు మెచ్చిన విశ్వామిత్రుడు అతనికి ముఖ్య జ్ఞానాన్ని బోధించాడు. ఆ హరిశ్చంద్రుడు మనసు అన్నమయం కాబట్టి అన్నరూపియైన భూమిని తెలుసుకొని దాన్ని జలంలో కలిపాడు. జలాన్ని తేజస్సులో లీనంచేశాడు. తేజస్సును వాయువులో చేర్చాడు. వాయువును ఆకాశంలో కలిపాడు. ఆకాశాన్ని తామసాహం కారంలో కలిసేలా చేశాడు. అహంకారత్రయాన్ని మహత్తత్త్వంలో విలీనమయ్యేలా చేశాడు. లోకసృష్టికి సంకల్ప రూపమైన మహత్తత్త్వంలో విషయాకారాన్ని తొలగించాడు. అది తొలగిపోగానే పరమాత్మనూ తెలుసుకొన్నాడు. ఆ జ్ఞానం వల్ల సంసారహేతువైన ప్రకృతిని భస్మంచేసి అజ్ఞానాన్ని మోక్ష సుఖ పారవశ్యంతో తొలగించి,

;



సకల బంధాలనుండి విముక్తుడైన ఆ హరిశ్చంద్రుడు వాక్కునకు మనస్సునకు అందని ఆత్మస్వరూపంలో కలిసి ప్రకాశించాడు. అతడి కుమారుడైన రోహితునికి హరితుడు పుట్టాడు. హరితునికి చంపుడు జన్మించాడు. అతడు తన పేరుమీదుగా చంపానగరాన్ని నిర్మించాడు. అతడికి సుదేవుడు, సుదేవునికి విజయుడు, విజయునికి రురుకుడు, రురుకునికి వృకుడు, వృకునికి బాహుకుడు జన్మించారు.

## -: సగర చక్రవర్తి కథాప్రారంభము :-

సీ. దండించి పగవారు దనభూమిఁ జేకొన్న నంగనలును దాను నడవి కేఁగి
యడవిలో ముసలియై యాతఁడు సచ్చిన నాతని భార్య దా ననుగమింపఁ
గదియుచో నా స్త్రీకి గర్భంబు గలుగుట యౌర్వమునీశ్వరు డాత్మ నెఱిఁగి
వారించె; నంత న వ్వనజాక్షి సవతులు సూలు నిండారినఁ జూడఁ జాల

తే. కర్థి నన్నంబు గుడుచుచో నందుఁ గలిపి విషము వెట్టిరి; పెట్టిన విరిసి పడక
గరముతోఁ గూడ సగరుండు ఘనుఁడు పుట్టి, వరయశస్స్ఫూర్తితోఁ జక్రవర్తి యయ్యె. 202

* బాహుకుణ్ణి ఓడించి శత్రువులు అతడి రాజ్యాన్ని అపహరించారు. బాహుకుడు స్త్రీజనంతో పాటు అడవికి వెళ్ళి, అక్కడే ముసలి వాడై చనిపోయాడు. అతడిభార్య సహగమనం చేయడానికి సిద్ధపడింది. ఆమె గర్భవతి అన్న సంగతిని తెలుసుకొన్న ఔర్వముని ఆమెను వారించాడు. ఆమెకు నవమాసాలూ నిండుతుండగా సవతులు చూచి ఓర్వలేనివారై అన్నంలో విషం కలిపి పెట్టారు. ఐనా ఆమె కడుపులోని పిండం వికలం కాలేదు. ఆవిషంతో పాటు సగరుడనేవాడు పుట్టి గొప్ప కీర్తి వహించి చక్రవర్తి అయ్యాడు.

శా. చండస్ఫూర్తి నతండు తండ్రిపగకై సంగ్రామరంగంబులం
జెండెన్ హైహయబర్బరాదుల; వధించెం దాళజంఘాదులన్;
ముండీభూతులుగా నిరంబరులుగా మూర్తుల్ సబీభత్సులై
యుండం జేసె నిజారులన్ సగరనామోర్వీ విభుం డల్పుఁడే. 203

* తండ్రి పగను తీర్చుకోవడానికై అతడు యుద్ధరంగంలో తీవ్రంగా విజృంభించి శత్రువులను చెండాడినాడు. హై హయ బర్బరాదులను సంహరించాడు. తాళజంఘాదులను తలలు గొరిగించి, వివస్త్రులను చేసి చూచే వారికి రోతపుట్టేటట్లుగా చేశాడు. ఆ సగర చక్రవర్తి సామాన్యుడా మరి!

క. ఖగరాజరుచులు గల యిల, పగరాజుల నడఁచి యేలె బాహాశక్తిన్
నగరాజధీరు శూరున్, సగరున్ హతవిమతనగరుఁ జను వినుతింపన్. 204

* అతడు తన భుజశక్తితో శత్రువులను అణచి సూర్యచంద్రుల కాంతులు ప్రసరించేటంత మేరగల భూమండలాన్ని పరిపాలించాడు. మేరునగధీరుడూ, శూరుడూ, శత్రువుల పురాలను మట్టు పెట్టిన వాడూ ఐన ఆ సగరుడు సర్వవిధముల సంస్తుతింప దగినవాడు.

సీ. ఔర్వుండు సెప్పంగ నమర వేదాత్మకు హరినీశు నమృతు ననంతుఁ గూర్చి;
వాజిమేధంబులు వసుధేశ్వరుఁడు సేసె నం దొక్క మఖమున హయము విడువ
నగభేది గొనిపోయి నాగలోకంబునఁ గపిలుని చేరువఁ గట్టి తొలఁగె;
నంత గుఱ్ఱము గాన కా రాజు దనపుత్త్ర నివహంబు దిశలకు నెమకఁ బంప

తే. వారు నిల యేడుదీవుల వరుస వెదకి, మఖతురంగంబు లేకున్న మగుడి రాక
ప్రాభవంబున దోర్దండబలము మెఱసి, గ్రొచ్చి కోరాడి త్రవ్విరి కుతల మెల్ల. 205

* ఔర్వమహర్షి ఆదేశం మేరకు సగరుడు వేదాత్మకుడైన శ్రీహరిని గూర్చి అశ్వమేధయాగాలను చేశాడు. ఒకానొక యజ్ఞ సందర్భంగా అతడు వదలిన గుఱ్ఱాన్ని ఇంద్రుడు అపహరించుకొనిపోయి నాగలోకంలో తపస్సు చేసుకుంటున్న కపిలమహర్షి దగ్గర కట్టివేసి వెళ్ళాడు. అప్పుడు గుఱ్ఱం జాడను తెలుసుకోలేని సగరుడు దానిని వెతకడానికి తన కొడుకులను అన్నిదిక్కులకూ పంపాడు. వారు భూమండలంలోని ఏడుదీవులనూ వరుసగా గాలించారు. యజ్ఞాశ్వాన్ని పొడగానక వాళ్లు భుజబలం అతిశయించేటట్లుగా భూమిని త్రవ్వసాగారు.

వ. ఇట్లు సుమతికొడుకులు నేలం ద్రవ్వి పాతాళంబునం దూర్పు ముట్టియున్న యుత్తరభాగంబునం గపిలముని పొంతనున్న తురంగంబుఁ గని . 206

* ఈ విధంగా సుమతికొడుకులు నేలను త్రవ్వి పాతాళంలో ఈశాన్య దిక్కున కపిలమహర్షి కట్టివేసి ఉన్న గుఱ్ఱాన్ని చూశారు.

చ. 'ఎఱిఁగితి మద్దిరయ్య తడ వేటికి? గుఱ్ఱపు దొంగ వీఁడె; యీ
జఱభునిఁ బట్టి చంపు; డతిసాధు మునీంద్రుఁడువోలె నేత్రము
ల్దెఱవక బాకినోరు మెదలింపక బైసుకపట్టె' నంచు న
య్యఱువది వేవురున్ నిజకరాయుధముల్ జళిపించి డాయుచోన్. 207

* 'భళీ! తెలుసుకొన్నాం, ఇంకా ఆలస్య మెందుకు? వీడే గుఱ్ఱపు దొంగ. ఈ పాపిని పట్టి చంపండి. పరమసాధువులాగా కళ్లు తెరవక నోరు మెదపక పంతం పట్టి కూర్చున్నాడు' అంటూ ఆ అరవై వేల మందీ తమ చేతుల్లోని ఆయుధాలను జళిపిస్తూ ముని మీదికి తారసిల్లారు.

చ. కపిలుఁడు నేత్రముల్ దెఱవఁగా దమ మేనుల మంట పుట్టి తా
రపగతధైర్యులై పడి యహంకరణంబున మూఢచిత్తులై
నృపసుతు లందఱున్ ధరణి నీఱయి రా క్షణమంద; సాధులం
దపసులఁ గాసిఁ బెట్టెడి మదస్ఫురితాత్ములు నిల్వనేర్తురే? 208

* కపిలముని కళ్ళు తెరవగానే గర్వాంధులూ మూఢచిత్తులూ ఐన ఆ రాజకుమారు లందరూ గుండెదిటవును కోల్పోయి, తమ శరీరాల్లో పుట్టిన అగ్నివల్ల బూడిద ఐపోయారు. సాధువులనూ, తాపసులనూ బాధించే మదాంధులు మన గలుగుతారా?

సీ. కొందఱు కపిలుని కోపానలంబున గ్రందిరి సగరకుమారు లనుచు
నందు రాముని శాంతుఁ డానందమయమూర్తి తొడరి కోపించునే? దుమ్మునేలఁ
గాక జన్మించునే గగనస్థలంబున? నే సాంఖ్యమతమున నిద్ధమతులు
భవసముద్రము మృత్యు భయమును లంఘింతు రా బుద్ధిఁ జేయు పరాత్మ భూతుఁ

తే. డఖిలబోధకుఁ డతనికి నరసి చూడ, సఖు లమిత్రులు నెవ్వరు? సగరసుతులు
దాము దమచేయు నేరమి దనువులందు, ననలకీలలు పుట్టి నీఱైరి గాక. 209

* కొందరు కపిలముని కోపాగ్నికి ఆ సగరకుమారులు ఆహుతి అయ్యారంటారు. అది సమంజసం కాదు. పరమశాంతమూర్తి ఐన ముని కోపం తెచ్చుకొంటాడా? దుమ్ము నేల మీదనుండి కాక ఆకాశంలో నుండి రేగిపడుతుందా? వివేకవంతులు భవసముద్రాన్నీ, మృత్యు భయాన్నీ తరించడానికి సాధనంగా చేసుకొనే సాంఖ్యమతాన్ని స్థాపించిన మహాత్ముడు కపిలముని. అతడికి శత్రులూ, మిత్రులూ అన్న భేదభావమే లేదు. ఆ సగరుని కుమారులు తాము చేసిన తప్పువల్లనే తమ శరీరాల్లో పుట్టిన అగ్ని జ్వాలలకు బూడిదై పోయారు.

వ. మఱియు, సగరుండు గేశినియందుఁ గన్న పుత్త్రుం డసమంజసుం డనువాఁడు, సమంజస గుణంబులు లేక పూర్వజన్మంబున యోగీశ్వరుఁడై యుండి, సంగదోషంబు వలన యోగ భ్రష్టుండయి, సగరునకు జన్మించి, జాతిస్మరజ్ఞానంబు గలిగి లోకంబు వారలకుఁ దమవారలకు నప్రియంబగు వర్తనంబునం దిరుగుచు, నొక్కనాఁడు. 210

* సగరునికి కేశిని గర్భంలో కలిగిన కొడుకే అసమంజసుడు. అయోగ్యుడైన అతడు పూర్వజన్మలో యోగీశ్వరుడై ఉండి సహవాసదోషంవల్ల యోగభ్రష్టుడై సగరునికి కొడుకుగా పుట్టాడు. అతడు వెనుకటి జన్మకు సంబంధించిన జ్ఞానాన్ని కలిగి తనవారికీ లోకులకూ అనిష్టమైన రీతిగా ప్రవర్తిస్తూండేవాడు.

చ. వరుస నయోధ్యలోనఁ గల వాడల నాడెడు పిన్నవాండ్ర నా
సరయువులోన వైచి జనసంఘముఁ దండ్రియుఁ దిట్టుచుండ వాఁ
డురుమతిఁ గొన్ని ప్రొద్దులకు యోగబలంబునఁ జేసి బాలురం
దిరిగి పురంబు లోపలికిఁ దెచ్చిన నివ్వెఱగంది రందఱున్. 211

* అతడు అయోధ్యానగరంలోని వాడల్లో ఆడుతూ పాడుతూ ఉన్న పిల్లలను సరయూనదిలో పడవేశాడు. ఆ ఘాతుకత్వానికి తండ్రి ప్రజలూ అతణ్ణి చీవాట్లు పెట్టారు. కొన్ని రోజులకి ఆ అసమంజసుడు తనయోగబలంతో ఆ పిల్లల నందరినీ బ్రతికించి ఊళ్లోకి తెచ్చాడు. ఎదురుచూడని ఈ సంఘటనకు అందరూ ముక్కుమీద వేలువేసుకున్నారు.

వ. ఆ య్యసమంజసుని కొడుకు అంశుమంతుం డనువాఁడు వినీతుండై, తనయొద్దఁ బనులు సేయుచుండు నంత సగరుం డమ్మనుమని నంశుమంతు నశ్వంబు వెదకి తెమ్మని పంచిన

నతండు దమతండ్రుల చొప్పునం జని, వారలు ద్రవ్విన మహాఖాతంబు సొచ్చి, యందు భస్మరాసుల పొంత నున్న హయంబునుం గని, హయసమీపంబునం దున్న కపిలాఖ్యుండైన విష్ణునికి దండ ప్రణామంబు సేసి, యిట్లని స్తుతియించె. 212

* ఆ అసమంజసుని కొడుకే అంశుమంతుడు, సగరుడు తన దగ్గర ఒద్దికతో పనులుచేసే బుద్ధి మంతుడైన అతణ్ణి యాగాశ్వాన్ని వెదకి తెమ్మని ఆజ్ఞాపించాడు. అంశుమంతుడు తన తండ్రులు వెళ్ళిన దారి వెంబడే పోయి వాళ్లు త్రవ్విన గోతిలో ప్రవేశించి బూడిద రాసుల దగ్గరున్న గుఱ్ఱాన్ని చూచాడు. ఆ సమీపంలోనే కపిలుని రూపంలో ఉన్న విష్ణువుకు దండప్రణామం చేసి ఇట్లా స్తుతించాడు.

సీ. మతిసిక్కఁబట్టి సమాధి గౌరవమున వ్రాలియుఁ దనకు నవ్వల వెలుంగు
నినుఁ గానఁ డొకనాఁడు ని న్నెఱుంగునె? బ్రహ్మ యజుని మనంబున నవయవముల
బుద్ధి జన్మించిన భూరిజంతువులందు హీనులమైన మా కెఱుఁగ వశమె?
తమలోన నీ వుండఁ దా మెఱుంగరు నిన్ను గుణములు చూతురు గుణములైనఁ

తే. గాన రొకవేళ జీఁకటిఁ గందు రాత్మ, లందుఁ దెలియరు వెలుపల నమరు పొందు
లరయుదురు దేహధారు లత్యంధు లగుచుఁ, గడఁది నీ మాయ నెవ్వఁడు గడవలేక. 213

* బుద్ధిని చిక్కబట్టి సమాధి అవస్థను పొందికూడా తనకు అతీతంగా ప్రకాశించే నిన్ను ఆ బ్రహ్మదేవుడే తెలుసుకోలేడు. అతడి మనస్సు నుండి, అవయవాల నుండి, బుద్ధి నుండి పుట్టిన అనల్పమైన ప్రాణుల్లో అల్పులమైన మాకు నిన్ను తెలుసుకోవడం సాధ్యమా? గుణ ప్రధానులైన దేహధారులు నీ మాయకు చిక్కి తమోగుణాన్ని కలిగినవారై బాహ్యాన్నే చూస్తారు. తమలోనే ఉన్న అంతర్యామి ఐన నిన్ను వారు చూడలేరు.

వ. అని వినుతి సేయుచు, హయంబు విడువుమని చెప్పక తన తండ్రులు నీ ఱగుటం దడవక, మ్రొక్కి నిలుచున్న యంశుమంతునికిఁ గరుణావిపులుండగు గపిలుం డిట్లనియె. 214

* అని పొగడుతూ గుఱ్ఱాన్ని వదలిపెట్టమనకుండాను, తన తండ్రులు భస్మం కావడాన్ని ప్రస్తావించకుండాను నమస్కరించి నిలబడిన అంశుమంతునితో దయామయుడైన కపిలుడు ఇట్లా అన్నాడు.

క. 'గుఱ్ఱము గొనిపో బుద్ధుల, కుఱ్ఱఁడ! మీ తాతయొద్దకున్ నీతండ్రుల్
వెఱ్ఱులు నీఱై రదె! యీ, మిఱ్ఱున గంగాజలంబు మెలఁగ శుభమగున్.' 215

* 'బుద్ధిమంతుడైన ఓ కుఱ్ఱవాడా! ఈ గుఱ్ఱాన్ని మీ తాత దగ్గరుకు తీసుకుపో, నీ తండ్రులు అవివేకులై బూడిద అయ్యారు. ఆ దిబ్బమీద గంగాజలం ప్రవహిస్తే శుభం కలుగుతుంది.'

వ. అని పలికిన, నమస్కరించి, తురగంబుఁ గొనివచ్చి యా సగరున కిచ్చిన సగరుం డా పశువు వలన జన్నంబు కడమ నిండించి, యంశుమంతునకు రాజ్యం బిచ్చి, ముక్తబంధనుండై, యౌర్వుండు సెప్పిన మార్గంబున నుత్తమ గతికిం జనియె నంత. 216

* అని చెప్పగా అంశుమంతుడు కపిలమహర్షికి నమస్కరించి గుఱ్ఱాన్ని వెంటబెట్టుకొని వచ్చి సగరునికి అప్పగించాడు. సగరుడు మిగిలిన యాగాన్ని పూర్తి చేసి, అంశుమంతునికి రాజ్య మప్పగించి, లౌకిక బంధాలను తెంచుకొని ఔర్వముని ఉపదేశాన్ని పాటించి ఉత్తమగతిని పొందాడు.

**క. జనకులు ప్రుగ్గిన చోటికి, ననిమిషనదిఁ దెత్తు ననుచు నటవీస్థలికిన్**
**జని తపము సేయఁ జాలక, మనమున వగ లొలయ నంశుమంతుఁడు దీఱెన్. 217**

* పిమ్మట ఆ అంశుమంతుడు తండ్రులు బుగ్గి ఐన చోటికి గంగా నదిని తెప్పిస్తానని అడవికి వెళ్ళి తపస్సు సాగించలేక దిగులతో దేహాన్ని చాలించాడు.

**క. ఆతనికొడుకు దిలీపుఁడు, భూతలమున గంగఁ దెచ్చి పొందించుటకై**
**ప్రీతిం దపంబు సేయుచు, భాతిగఁ దేలేక కాలపరవశుఁ డయ్యెన్. 218**

* అతడి కొడుకు దిలీపుడు భూమి మీదికి గంగను తెప్పించడానికి తపసుచేశాడు. కాని దానిని తేలేక గతించాడు.

**క. అతని సుతుండు భగీరథుఁ, డతితప మొనరించి కనియె నమృతాపాంగన్**
**సుతరంగన్ ముఖవనరుహ, రతభృంగన్ శివజటాగ్రరంగన్ గంగన్. 219**

* దిలీపుని కుమారుడైన భగీరథుడు ఘోరతపస్సుచేసి అమృతమయ కటాక్షాలు కలిగినదీ, గొప్ప అలలతో కూడినదీ, ముఖపద్మంపై ఆసక్తి కలిగిన తుమ్మెదలు కలదీ, శివ జటాజూటాన్ని రంగస్థలంగా కలిగినదీ ఐన గంగను దర్శించాడు.

**వ. కని నమస్కరించిన గంగ కృపసేసి, వరంబు వేఁడు మనిన, నా రాచపట్టి యిట్లనియె. 220**

* భగీరథుడు నమస్కరించగా గంగాదేవి కరుణించి వరం వేడుకోమన్నది. అప్పు డా రాజకుమారుడు ఇట్లా అన్నాడు.

**క. మా వారి భస్మరాసుల, నీ వారిం గలిపికొనుము; నెఱి మావారల్**
**నీ వారిఁ గలయ నాకము, మావారికి గలుగు; నిది ప్రమాణము తల్లీ! 221**

* ఓ తల్లీ! మా వారి బూడిద రాసులను నీ నీటిలో కలుపుకో, నీ వారి సోకితే మా వారికి స్వర్గలోక ప్రాప్తి కలుగుతుంది. ఇది యథార్థం

**ఇంద్రవజ్ర.**

**చెల్లన్ మది న్ని న్ను భజింతు గంగన్, ఫుల్లాంతరంగన్ బహుపుణ్యసంగన్**
**గల్లోల లక్ష్మీజితకాశమల్లిన్, దల్లిన్ సుధీకల్పలతామతల్లిన్. 222**

* నీవు వికసించిన హృదయం కలదానవు, అనేక పుణ్యాలను కలిగినదానవు. అలల శోభచే రెల్లు పువ్వులనూ, మల్లెలనూ జయించిన చల్లని తల్లివి. ఉత్తముల పాలిటి శ్రేష్ఠమైన కల్పవల్లివి. ఓ గంగా మాతా! నిన్ను మనసారా పూజిస్తాను.

**వ. అని వినుతులు సేయుచున్న రాజకుమారునకు లోకపావని యిట్లనియె. 223**

* అని కొనియాడుతున్న రాజకుమారునితో లోకపావని ఐన గంగ ఇట్లా అన్నది.

**మ. వినువీథిం బఱతెంచి నేలఁబడ నా వేగంబును న్నిల్ప నో**
**పిన వాఁడెవ్వఁడు? మేదినీతలము నే భేదించి పాతాళమున్**
**జనుదున్; వచ్చితినేని నా జలములన్ సుస్నాతులై మానవుల్**
**ననుఁ బొందించు నఘవ్రజం బెచట నే నాశంబుఁ బొందించెదన్. 224**

**వ. అది కారణంబుగా విచారించెదనని పలుకుచున్న లోకమాతకు రాజన్యవర్యుండగు భగీరథుం డిట్లనియె. 225**

* "ఆకాశమార్గం నుండి నేలమీద పడే నా వేగాన్ని నిలుపగల శక్తి గలిగినవాడు ఎవ్వడు? నేను భూమిని చీల్చుకొని పాతాళానికి వెళతాను. నేను భూమి మీదకు అవతరిస్తే మానవులు తమ పాపాలను నా నీటిలో కడిగివేసుకొంటారు. నన్నంటిన పాపాన్ని నేనెక్కడ వదలించుకోను? ఈ కారణంగా సంశయిస్తున్నాను''. ఇలా అన్న ఆ లోకమాతతో రాజశ్రేష్ఠుడైన భగీరథుడు ఇట్లా అన్నాడు.

**మ. పరతత్త్వజ్ఞులు శాంతచిత్తులు తపః పారీణు లార్యుల్ ఘనుల్**
**పురుష శ్రేష్ఠులు వచ్చి తల్లి! భవదంభోగాహముల్ సేయఁగా**
**నరసంఘాఘము నిన్నుఁ బొందునె జగన్నాథుండు నానాఘ సం**
**హరుఁ డా విష్ణుఁడు వారిచిత్తములఁ దా నై యుంట మందాకినీ! 226**

* ఓ మందాకినీ! పరతత్త్వం తెలిసినవారు, శాంతచిత్తులు తపోనిష్ఠులు ఐన మహనీయులు వచ్చి నీ నీట స్నానాలు చేస్తే నరుల పాపం నిన్ను ఎలా చుట్టుకొంటుంది? ఎందుకంటే సమస్త పాపాలను హరించే శ్రీహరి వారి హృదయాల్లో తానుగా నివసించి ఉంటాడు.

**మ. తనలో నిన్ని జగంబులుం గలుగుటం దా నిన్నిటం గల్గుటన్**
**జననీ! తంతువులందుఁ జీర గల యాచందంబునన్ విశ్వ భా**
**వనుఁడై యొప్పు శివుండు గాక మఱి నీ వారి న్ని వారింప నే**
**ర్చిన వార్వెరు; నిన్ ధరించు కొఱకై శ్రీకంఠునిన్ గొల్చెదన్. 227**

* ఓ తల్లీ తనలో సమస్తలోకాలనూ, కలిగి ఉండడంవల్ల, అన్నిటా తానై ఉండడంవల్ల పడుగు పేక ఉన్న దారాల్లో వస్త్రం ఉన్న విధంగా విశ్వమంతటా వ్యాపించిన ఆ శివుడు కాక నీ ప్రవాహ వేగాన్ని భరించగల సమర్థు డెవ్వడు? నిన్ను ధరించడం కోసం ఆ సదాశివుణ్ణి ప్రార్థిస్తాను.

వ. అని యెఱింగించి వీడ్కొని, చని, భగీరథుండు మహేశ్వరు నుద్దేశించి, గ్రద్దనఁ దపంబు సేసిన.228

* అని గంగాదేవి దగ్గర సెలవు పుచ్చుకొని వెళ్ళి భగీరథుడు వెంటనే శివుణ్ణి గూర్చి తపస్సు చేశాడు.

ఆ. భక్తవత్సలుండు ఫాలాక్షుఁ డా భగీ,రథుని మెచ్చి నిజశిరంబునందు
శౌరిపాదపూత సలిల యై దివి నుండి, ధరకు వచ్చు గంగఁ దాల్చె నపుడు. 229

* అప్పుడు భక్త వత్సలుడైన శివుడు, ఆ భగీరథుని పూనికను మెచ్చి, విష్ణుపాదాలను సోకి పవిత్రమైన జలం గలిగి, ఆకాశంనుండి భూమి మీదికి ఉరికే గంగను తన శిరస్సుపై ధరించాడు.

## -: శ్రీ పరమేశ్వర జటానిర్గత గంగా ప్రవాహ మహిమాభివర్ణనము :-

వ. ఇ ట్లమ్మహానది, పురారాతి జటాజూట రంధ్రంబు వలన దిగంబడి, నిరర్గళ ప్రవాహంబై, నేలకు జల్లించి నెఱసి, నిండి, పెల్లువెల్లిగొని, పెచ్చు పెరిఁగి, విచ్చలవిడిం గ్రేపువెంబడి మఱక క్రేళ్ళుఱుకు మఱక ప్రాయంపుఁ గామధేనువు చందంబున ముందఱికి నిగుడుచు, ముద్దుఁ జందురుతోడి నెయ్యం బునఁ గ్రయ్యనడరి చొప్పుదప్పక సాఁగి చనుదెంచు సుధార్ణవంబు కైవడిఁ బెంపుగలిగి, మహేశ్వరు వదన గహ్వరంబు వలన నోంకారంబు పిఱుంద వెలువడు శబ్ద బ్రహ్మంబు భంగి నదభ్రవిభ్రమంబున నమ్మహీపాల తిలకంబు తెరువువెంట నంటివచ్చుచు వెలియేనుఁగు తొండంబుల ననుకరించి పఱచు వఱద మొగంబులును, వఱద మొగంబుల పిఱుంద నందంద క్రందుకొని, పొడచూపి, తొలంగు బాలశారదా కుచకుంభంబులకు నగ్గలంబైన బుగ్గలును, బుగ్గల సంగడంబునం బారిజాత కుసుమ స్తబకంబుల చెలువంబునుం దెగడు వెలినురువులును, వెలినురువుల చెంగట నర్ధోన్మీలిత కర్పూర తరుకిసలయంబుల గేలిగొను సుళ్ళును, సుళ్ళ కెలంకుల ధవల జలధర రేఖాకారంబులు బాగు మెచ్చని నిడుదయేఱులును, నేఱులం గలసి వాయువశంబుల నొండొంటిం దాఁకి బిట్టు మిట్టించి, మీఁది కెగయు దురితభంగంబులైన భంగం బులును, భంగంబుల కొనల భిన్నభిన్నంబులై కుప్పించి, యుప్పరం బెగసి; ముత్తి యంపు సరుల వడువున, మల్లికాదామంబుల తెఱంగునఁ, గర్పూరఖండ కదంబంబుల చెలువంబున, నిందు శకలంబుల తేజంబునఁ, దారకా నికరంబుల పొలుపున మెఱయుచు; ముక్తి కన్యా వశీకరంబులైన శీకరంబులునుం గలిగి మధ్యమలోక శ్రీకరంబై, శ్రీకరంబు తెఱంగున విష్ణుపదంబు ముట్టి, విష్ణు పదంబు భాతి నుల్లసిత హంస రుచిరంబై, రుచిరపక్షంబురీతి నతిశోభిత కువలయంబై, కువలయంబు చెన్నున బహుజీవనంబై, జీవనంబులాగున సుమనో వికాసప్రధానంబై, ప్రధాన పర్వంబు పొలుపున నేకచక్ర బక భీమ మహాభంగ సుభద్రార్జున చరిత్రాభి రామంబై, రామచిత్తంబు మెలుపునం దనవారిలోఁ జొచ్చిన దోషాచరుల కభయప్రదాన చణంబై, ప్రదాన చణవర్తనంబుభాతి సముపాసిత మృత్యుం జయంబై, మృత్యుంజయు రూపంబుపోలిక విభూతి సుకుమారంబై, కుమారచరిత్రంబుతేవను గ్రౌంచప్రముఖవిజయంబై, విజయ రథంబుభాతి హరిహయామంథరంబై, మంథరవిచారంబు గ్రద్దన మహారామ గిరివన ప్రవేశకామంబై, కామకేతనంబు పెల్లున నుద్దీపిత మకరంబై, మకర కేతనుబాణంబు కైవడి విలీన పరవాహినీకలిత శంబరంబై,

శంబరారాతి చిగురుఁ గుంతంబుసూటి నధ్వగవేదనా శమనంబై, శమనదండంబు జాడ న్నిమ్నోన్నత సమవృత్తంబై, వృత్తశాస్త్రంబు విధంబున వడిఁ గలిగి సదా గురులఘు వాక్యచ్ఛటా పరిగణితంబై, గణితశాస్త్రంబు కొలఁదిని ఘనఘనమూల వర్గమూల సంకలిత భిన్న మిశ్ర ప్రకీర్ణ ఖాతభీష్మంబై, భీష్మపర్వంబు పెంపున ననేక భగవద్గీతంబై, గీతాశాస్త్రంబు నిలుకడను మహాసుషిరతను ఘన నానాశబ్దంబై, శబ్దశాస్త్రంబు మర్యాద నచ్చువడి హల్లు గలిగి, మహాభాష్య రూపావతారవృత్తి వృద్ధిగుణసమర్థంబై, యర్థశాస్త్రంబు మహిమను బహుప్రయోజన ప్రమాణ దృష్టాంతంబై, దృష్టాంతంబు తెఱంగున సర్వసామాన్య గుణ విశేషంబై, శేషవ్యాపారంబు కరణిని సుస్థిరోద్ధరణ తత్పరంబై, పరబ్రహ్మంబు గరిమ నతిక్రాంతానేక నిగమంబై, నిగమంబు నడవడిని బ్రహ్మవర్ణ పద క్రమసంగ్రహంబై, గ్రహశాస్త్రంబు పరిపాటిని కర్కట మీన మిథున మకర రాశి సుందరంబై, సుందరి ముఖంబు పోఁడిమిని నిర్మల చంద్రకాంతంబై , కాంతాధరంబు రుచిని శోణచ్ఛాయావిలాసంబై, విలాసవతి కొప్పు నొప్పునఁ గృష్ణనాగాధికంబై, యధికమతి శాస్త్ర సంవాదంబు సొంపున నపార సరస్వతీ విజయవిభ్రమంబై, విభ్రమవతి చనుదోయి పగిది నిరంతర పయోవ్యాప్తాఖిలలోక జీవన ప్రదతుంగ భద్రాతిరేఖా సలలితంబై, లలితవతి నగవు మించున నపహసిత చంద్రభాగధేయంబై, భాగధేయవంతుని వివాహంబు లీల మహామేఖల కన్యకావిస్తారం బై, తారకెంగేలి యొడికంబున నాక్రాంత సూర్యతనయంబై, సూర్యతనయు శరవర్షంబు పోలిక భీమరథ్యాటోపవారణంబై, వారణంబుపరుసునం బుష్కరోన్నత సంరంభంబై, రంభ నెమ్మోము డాలున సురసాతిశయ దశంబై, దశరథ తనయు బొమముడి చాడ్పున సింధుగర్వ ప్రభంజనంబై, ప్రభంజనతనయు గదపెట్టు మాడ్కిని సమీపగత దుశ్శాసన దుర్మద నివారకంబై, వార కన్యక ముంజేతి గతిని ముహుర్ముహు రుచ్చలిత కంకణాలంకృతంబై, కృతయుగంబు నోజ నపంకంబై, పంకజాసన ముఖంబు నొఱపునఁ బ్రభూతముఖవర్ణంబై, వర్ణగుణితంబు తెఱకువను బహుదీర్ఘబిందు విసర్గంబై, సర్గబంధకావ్యంబు విన్ననువున గంభీరభావమధురంబై, మధురాపురంబు సొబగున మహానందనందనంబై, నందనవనంబు పొందున విహరమాణ కౌశికంబై, కౌశికహయంబు రీతి సుదశధ్రువంబై, ధ్రువుతలంపు క్రియం పరిశీలత విశ్వంభరంబై, విశ్వంభరుని శంఖంబు రూపున దక్షిణావర్తోత్తరంబై, యుత్తరావివాహంబు చందంబునఁ బ్రముదిత నరంబై, నరసింహ నఖరంబుల భాతి నాశ్రిత ప్రహ్లాద గురువిభవ ప్రదానంబై, దానకాండంబు సిరిం గామధేను కల్పలతాద్యభినవంబై, నవసూతికాకుచంబు పేర్మిని నిరంతర పయోవర్ధనంబై, ధనదు నిలయంబు తూనిక సంగత మకర పద్మ మహాపద్మ కచ్ఛపంబై, కచ్ఛప కర్పరంబు బలిమిని పతితశైల సముద్ధరణంబై, ధరణీధరంబు సాటి నుత్తుంగ తటముఖ్యంబై, ముఖ్య వరాహంబు గరిమ నున్నతక్షమంబై, క్షమాసుర హస్తంబు గరగరికను సత్పవిత్ర మనోరామంబై, రామచంద్రుబాణంబు కడింది నభ్యాగత ఖరదూషణ మదాపహరణ ముఖరంబై, ముఖర రామ కుఠారంబు రీతిని భూభృన్మూలభేదన ప్రబలంబై, బలరామ హలంబుభాతిని బ్రతికూల సన్నికర్షణ ప్రబుద్ధంబై, బుద్ధదేవుని మేని యొఱపున నభియాతి రక్షోదార మనోహరంబై, హరతాండవంబు మేర నుల్లసి తానిమిషంబై, యనిమిషావతారంబు కీర్తిని శ్రుతి మంగళ ప్రదంబై, ప్రదాత యీఁగి సూటి నర్థపరంపరా వామనంబై, వామన చరణరేఖను బలివంశవ్యపనయంబై,

**నయశాస్త్రంబు మార్గంబున సామ భేద మాయోపాయ చతురంబై, చతురాననాండంబు భావంబున నపరిమిత భువన జంతుజాల సేవ్యమానంబై, మానిని యన లోఁతు సూపక, గరితయన నడిచప్పుడు సేయక, ముగుద యన బయలుపడక, ప్రమద యనఁ గ్రయ్యం బాఱుచుఁ బతివ్రత యన నిట్టట్టు సనక, తల్లి యన నెవ్వియైన లోఁగొనుచు, దైవంబన భక్త మనోరథంబు లిచ్చుచు, నంతకంతకు విస్తరించి గుఱి గడచి, యవాఙ్మానస గోచరంబై ప్రవహించి. 230**

* పై విధంగా ఆ మహానది శివుని జటాజూట రంధ్రాలనుండి దూకి, అడ్డులేకుండా నేలపై కురికింది. బాగా వ్యాపించిన గొప్ప ప్రవాహంతో పొంగి పొరలి అతిశయించింది. దూడవెంబడి గంతులు వేస్తూ పరుగులు తీసే ప్రాయంలో ఉన్న కామధేనువులాగా ముందుకు సాగింది. ఇంకా ఆ మహానది ముద్దులొలికే చంద్రునిపై ప్రేమతో ఉప్పొంగే పాలసముద్రంలాగా కాలువగట్టి దారి తప్పక పెంపు కలిగి, పరమాత్ముని నోటినుండి ఓంకారాన్ని అనుసరించి వెలువడే శబ్దబ్రహ్మం లాగా విస్తారమైన విలాసంతో కూడి; ఐరావతం తొండాలతో సమానమైన ప్రవాహపు ముందరి భాగాలు కలిగి భగీరథుని మార్గాన్ని అనుసరించింది. ఆ ప్రవాహాలవెంట అక్కడక్కడ కనిపించి తొలగిపోయే బాలసరస్వతి కుచ కలశాలను మించిన అధికమైన నీటి బుడగలనూ, ఆ నీటి బుడగల చేరికతో పారిజాతపు పూలగుత్తుల కాంతిని మించిన తెల్లని నురగలనూ, ఆ నురగల ప్రక్కన సగం విరిసిన కర్పూరపు చెట్ల చిగుళ్ళ సోయగాన్ని గేలిచేసే సుడులనూ; ఆ సుడుల ప్రక్కల్లో తెల్లటి మేఘాలను మించిన నిడుపైన ప్రవాహాలనూ; ఆ ప్రవాహాలను కలిసి గాలితాకిడి వల్ల తీవ్రంగా పై కెగసి వేగంగా వీగిపోయే పాపనాశనకరమైన అలలనూ; ఆ అలల కొనల్లో కుప్పించి పైకెగిరే ముత్యాలసరాలలాగా, మల్లెపూల మాలల లాగా, కర్పూర ఖండాలలాగా, చంద్రశకలాల లాగా, చుక్కల గుంపుల్లాగా ప్రకాశిస్తూ ముక్తి కాంతను వశీకరింపచేసుకో గలిగిన నీటి తుంపురులనూ కలిగి; భూలోకానికి మంగళాన్ని కలిగించేదిగా విరాజిల్లింది. లక్ష్మీదేవి చేయిలాగా విష్ణుపాదమైన ఆకాశాన్ని తాకి; ఆకాశం వలె ప్రకాశించే హంసల (సూర్య) కాంతితో ఒప్పి; శుక్లపక్షంలోని భూమండలం (కువలయం) లాగా శోభించే కలువలు కలిగి; పలు బ్రతుకు తెరువులతో కూడిన లోకంలాగా అధికమైన జీవనం (నీటిని) కలిగి; మంచి మనస్సుతో శోభించే జీవితంలాగా వికసించినపూలతో కూడి; అనేక సేనలూ, బకుడూ, భీముడూ, సుభద్రార్జునులచరిత్రా కలిగిన మనోహరమైన భారతపర్వంలాగా పెక్కు చక్రవాకపక్షులతో, బకములతో, భయంకరమైన అలలతో సుందరమై; తనవాళ్ళను కలిసిన రాక్షసులకు అభయ మివ్వడంలో సమర్థమైన శ్రీరాముని హృదయంలాగా తన నీళ్లలో మునిగిన పాపాత్ములకు అభయమివ్వడంలో సమర్థమై; మృత్యువును జయించిన గొప్పదాత ప్రవర్తనలాగా, గొప్ప నడవడికతో శివుణ్ణి సేవిస్తూ; విభూతితో కూడిన అందమైన శివుడి రూపంలాగా సంపదతో సుకుమారమై; క్రౌంచపర్వతాదులను గెల్చిన కుమారస్వామి చరిత్రలాగా; కొంగలు మొదలైన వాటితో కూడి; అర్జునుడి రథంలాగా సూర్యుని గుఱ్ఱాలవంటి వేగం గలిగి; శ్రీరామునికి వనవాసం కల్పించిన మంథర ఆలోచనలాగా శీఘ్రంగా వన పర్వతాలలో ప్రవేశించే కోరిక కలిగి; మన్మథుని జెండాలాగా మొసళ్ళతో కూడి; సైన్యంతో కూడిన శంబరాసురునిలో ప్రవేశించే మన్మథుని బాణంలాగా తనలో లీనమైన యితర ప్రవాహ జలాలు

కలిగి; మన్మథుని చిగురుకత్తిలాగా బాటసారుల తాపాన్ని తొలగించి; అల్పులపట్ల, అధికులపట్ల సమానంగా ప్రవర్తించే యముని దండంలాగా ఎత్తుపల్లాల్లో సమానంగా మెలిగి; యతితోనూ, గురులఘువులతోనూ వాక్య సమూహాలతోనూ కూడిన ఛందశ్శాస్త్రంలాగా, వేగంతోనూ, పెద్దాచిన్నా శబ్దాలతోను, కూడి; గొప్ప వర్గమూలాలతో, భిన్నాలతో, మిశ్రాలతో, ప్రకీర్ణాలతో నిండిన గణిత శాస్త్రంలాగా, పరస్పరం రాచుకొనే పాదరింఢ్లతో, విడివడ్డలోయలు కలిసిపోయేటట్లు భయంకరంగా ప్రవహించునదై; భగవద్గీతా సహితమైన భీష్మపర్వంలాగా సుఖకరమైన శబ్దాలతో కూడినదై, వాద్యం నుండి వెలువడే మంద్రతార స్వరాలు గల సంగీతశాస్త్రం లాగా అనేక విధాలైన శబ్దాలతో కూడినదై; అచ్చులు హల్లులు కలిగిన వ్యాకరణశాస్త్రంలాగా వడిగలదై; మహాభాష్యవృత్తిలాగా వృద్ధి గుణాల సామర్థ్యం కలిగినదై; పెక్కు ప్రయోజనాలతో కూడిన నిడివి అందరికీ అందుబాటులో ఉండే గొప్పగుణంతో విలసిల్లినదై; భూమిని భరించడంలో నిమగ్నమైన ఆదిశేషుని కార్యంలాగా సుస్థిరమైన గొప్పయత్నం కలిగినదై; వేదసమూహాలకు అతీతమైన పరబ్రహ్మలాగా అనేక మార్గాలను అతిక్రమించినదై; వర్ణపదక్రమాలతో కూడిన వేదంలాగా ధ్వని క్రమాలకు కూడికయై; కర్కట, మీన, మిథున, మకరాలతో ఒప్పిదమైన ఖగోళనియతిలాగా ఎండ్రకాయలతో, చేపల జంటలతో, మొసళ్ళతో ఒప్పినదై; నిర్మలమైన సుందరాంగి ముఖంలాగా స్వచ్ఛమైన చంద్రకాంతులతో నిండినదై; ఇంపైన స్త్రీ పెదవిలాగా కెంపురంగుతో కూడినదై; విలాసవతి కచ బంధంలాగా నల్లత్రాచు విలాసాలతో మించినదై, బుద్ధిమంతుని శాస్త్రచర్చలాగా గొప్పదైన సరస్వతీ విజయంతో విలసిల్లునదై, అఖిల సంతానానికి బ్రతుకుతెరువై శుభకరమైన ఆకారంతో కూడిన సుందరాంగి చనుదోయిలాగ పయోధారలతో నిండి తుంగభద్రానది సొగసును మించినదై; సుందరాంగి మందహాసంలాగా చంద్రభాగ సౌభాగ్యాన్ని అతిశయించినదై; గొప్ప ఒడ్డాణాలు ధరించిన కన్యలతో కూడిన అదృష్టవంతుని వివాహంలాగా భూమినిండా విస్తరించినదై; తార తన చేతితో సుగ్రీవుని స్పృశించినట్లు ముత్యంవంటి తన హస్తంతో ఉపాయంగా యమునా నదిని ఆక్రమించినదై; భీముని రథ విజృంభణను అడ్డగించిన కర్ణుని బాణవర్షంలాగా, భీమరథీనది విజృంభణను అరికట్టినదై; నీటిని చిమ్మే ఏనుగుతొండంవంటి గొప్ప విజృంభణతో కూడినదై; రసవంతమైన రంభ ముఖంలాగా మంచినీటితో అతిశయించి; సముద్రుని గర్వాన్ని భంగపరచిన శ్రీరాముని బొమముడి లాగా సింధునది గర్వాన్ని భంగం చేసినదై; దరిచేరిన దుశ్శాసనుని దుర్మదాన్ని తొలగించే భీముని గదాఘాతంలాగా సమీపించినవారి మహాపాపాలను తొలగించునదై; మాటి మాటికి కదలాడే కంకణాలతో అలంకరింపబడిన వేశ్య ముంజేయిలాగా మళ్ళా మళ్ళా పొరలే నీటి బిందువులతో కూడినదై; పాపంలేని కృతయుగంలాగా నిర్మలమై; గొప్పదైన తెల్లరంగుతోకూడిన బ్రహ్మముఖంలాగా గొప్ప బ్రాహ్మణజాతిచే ఆశ్రయింపబడినదై; అనేక దీర్ఘాలతో, బిందువులతో, విసర్గలతో కూడిన అక్షరాల గుణితంలాగా అధికమైన నీటిబిందువులతో, అధికమైన నీటి బిందువులను వెదజల్లుచున్నదై; గంభీరమైన భావాలతో మధురమైన సర్గ బిందువులను వెదజల్లుచున్నదై; గొప్పవాడైన నందనందనునితో కూడిన మధురాపురంలాగా గొప్ప ఆనందానికి నందనవనమై; ఇంద్రుడు విహరించే నందనవనంలాగా కౌశికనదితో విహరించునదై; ఇంద్రుని గుఱ్ఱంలాగా ధ్రువమైన మంచి దశ కలిగినదై; విష్ణుచింత కలిగిన ధ్రువుని తలంపులాగా విశ్వాన్ని పరిశీలించునదై;

ప్రశస్తంగా వలమురియైన విష్ణువు శంఖంలాగా కుడి నుండి ఎడమవైపుకు మరలి; ఉత్తరా వివాహంలాగా నరానంద సంధాయకమై; పాలతోపొంగే పచ్చి బాలెంతరాలి స్తనంలాగా ఎప్పుడూ పెరుగుతున్న నీళ్ళతో నిండినదై; మకరం, పద్మం మహాపద్మం, కచ్ఛపం అనే నిధులతో నిండిన కుబేరుని నిలయంలాగా మొసళ్ళతో, మెట్టతామరలతో, తామరలతో తాబేళ్లతో నిండినదై, కూలిన కొండను పైకెత్తే ఆది కూర్మపు బలమైన వెన్నెముక లాగా కొండలను కదిలించునదై; ఎత్తైన చరియలతో నిండిన కొండలాగా ఎత్తైన గట్లతో కూడినదై భూమిని పైకెత్తే ఆదివరాహంలాగా గొప్పదైన ఓర్పు గలిగినదై; దర్భలతో కూడిన బ్రాహ్మణుని హస్తంలాగా పవిత్రమై ఇంపు కలిగించునదై; ఎదిరించి వచ్చే ఖరదూషణుల గర్వాన్ని అపహరిస్తూ మ్రోగే రామచంద్రుని బాణంలాగా తన్ను చేర వచ్చే కఠినుల, పాపుల అహంకారాన్ని అపహరించునదై; రాజులను సమూలంగా నాశనం చేసిన పరశురాముని గండ్రగొడ్డలిలాగా పర్వతాలను సమూలంగా పెల్లగించే బలంతో కూడినదై; విరోధులను ఉన్మూలించే బలరాముని నాగేలులాగా గట్లను రాచుకొని ఉప్పొంగుచున్నదై; రాక్షసకాంతలకు మనోహరమైన బుద్ధదేవుని నెమ్మేనులాగా ఆశ్రయించిన వారిని రక్షించడంలో సమర్థమైనదై; దేవతలను సంతోషింపజేసే శివుని నాట్యంలాగా త్రుళ్లిపడే చేపలతో నిండినదై; వేదాలకు శుభాన్ని సమకూర్చిన మత్స్యావతారంలాగా చెవులకు ఇంపు కలిగించునదై; ధన సమూహంతో సుముఖుడైన దాతదానంలాగా వస్తుసమూహంతో విస్తారమైనదై; బలిచక్రవర్తి వంశాన్ని నిర్మూలించిన వామనుని పాదంలాగా గొప్ప వెదురుపొదలను కదల్చివేయునదై; సామభేద మాయోపాయాలతో కూడిన నీతిశాస్త్రంలాగా చాతుర్యంతో ఒప్పినదై; అపరిమితమైన లోకాలతో, జంతు సమూహంతో సేవింపబడే బ్రహ్మాండంలాగా లెక్కలేనన్ని నీటి జంతువులతో సేవింపబడినదై; మానవతిలాగా గుట్టు తెలియనీక; ఇల్లాలిలాగా చడీచప్పుడు చేయక, ముద్దరాలివలె బయలు పడక, జవరాలి లాగా శీఘ్రగమనం కలిగి, పతివ్రతలాగా అటూ ఇటూ పోక; తల్లిలాగా అన్నింటినీ కడుపులో దాచుకొంటూ, దేవతలాగా భక్తుల కోరికలను తీర్చుతూ, క్రమక్రమంగా పరిమితిని దాటి మాటకూ, మనసుకూ అందకుండా ఆ గంగానది భగీరథుని వెంట ప్రవహించింది.

**మ. జగతీనాథు రథంబుపజ్జ బహుదేశంబుల్ వడిం దాఁటి త**
**త్సగరక్ష్మాపకుమార భస్మముల మీఁదన్ ముంచి పాఱన్ మరు**
**న్నగరావాసము వారు పొందిరి నవీనశ్రీలతో గంగ నీ**
**రు గతిం గాక మహాదురంత సుజన ద్రోహానలం బాఱునే. 231**

* ఆ విధంగా గంగానది భగీరథుని రథాన్ని వెంబడించి ఎంతో వేగంతో అనేక దేశాలను దాటి సగరచక్రవర్తి కుమారుల బూడిద రాసులను ముంచి ప్రవహించింది. వాళ్లు అభినవ శుభాలతో స్వర్గాన్ని పొందారు. పుణ్యాత్ములపట్ల చేసిన ద్రోహమనే అగ్ని పవిత్ర గంగా జలంవల్ల కాకుండా వేరే విధంగా చల్లారుతుందా?

**మ. హరు మెప్పించి మహా తపో నియతుఁడై యాకాశగంగానదిన్**
**ధరకుం దెచ్చి నితాంత కీర్తిలతికా స్తంభంబుగా నవ్య సు**
**స్థిర లీలం బితృకృత్య మంతయు నొనర్చెన్ వారితానేక దు**
**స్తర వంశవ్యథుఁ డా భగీరథుఁడు నిత్య శ్రీకరుం డల్పుఁడే! 232**

* శివుణ్ణి మెప్పించి గొప్ప తపోనిష్ఠ కలవాడై ఆకాశగంగను అవని మీదకు తెచ్చి అఖండమైన తన కీర్తిలతకు స్తంభంగా కలకాలం విలసిల్లేటట్లు చేసి పితృకార్యాన్ని తీర్చినవాడూ, తన వంశానికి వాటిల్లిన దాటరాని కష్టాన్ని తొలగించిన వాడూ నిత్య మంగళకరుడూ ఆ భగీరథుడు సామాన్యుడా?

**క. హరిఁదమ మనమున లోనిడి, హరి పాదాంభోజ జనితమైన నదిన్ సు**
**స్థిరులై గ్రుంకి మునీంద్రులు, హరిఁ గలిసిరి త్రిగుణరహితులై యవ్వేళన్. 233**

* అప్పుడు మునీంద్రులు కొందరు శ్రీహరిని ధ్యానించి విష్ణు పాదపద్మాల నుండి పుట్టిన ఆ పవిత్ర నదీ జలాలలో మునిగి త్రిగుణాతీతులై శ్రీహరిలో ఐక్యమయ్యారు.

**వ. అంత నా భగీరథునకు శ్రుతుండును, శ్రుతునకు నాభావరుండును, నాభావరునకు సింధు ద్వీపుండును, సింధుద్వీపునకు నయుతాయువును, నయుతాయువునకు ఋతుపర్ణుడును జనియించె. నతండు. 234**

* అనంతరం ఆ భగీరథునికి శ్రుతుడు, శ్రుతునికి నాభావరుడు, నాభావరునికి సింధుద్వీపుడు, సింధుద్వీపునికి అయుతాయువు, అయుతాయువునకు ఋతుపర్ణుడు జన్మించారు.

**ఆ. నయ విశాలబుద్ధి నలచక్రవర్తితో, సంగడీనితనము చాలఁ జేసి**
**యక్షహృదయ మతని కభ్యస్తముగ నిచ్చి, యశ్వవిద్య నేర్చె నతని వలన. 235**

* ఆ ఋతుపర్ణుడు గొప్ప బుద్ధిమంతుడైన నలచక్రవర్తితో స్నేహంచేసి అతడికి అక్షవిద్యను సంపూర్ణంగా తెలిపి, అతడివల్ల అశ్వవిద్యను నేర్చాడు.

**వ. ఆ ఋతుపర్ణునకు సర్వకాముండును, సర్వకామునకు మదయంతీ వల్లభుండైన సుదాసుండును బుట్టె. నా రాజశేఖరుని మిత్రసహుండును, గల్మాషపాదుండునని చెప్పుదు. రాభూవరుండు వసిష్ఠుని శాపంబున రాక్షసుండై, తన కర్మంబున ననపత్యుండయ్యె. ననిన విని పరీక్షిన్నరేంద్రుం, డేమి కారణంబున సుదాసునకు గురుశాపంబు ప్రాప్తం బయ్యె నని యడిగిన శుకుం డిట్లనియె. 236**

* ఆ ఋతుపర్ణునికి సర్వకాముడు, సర్వకామునికి సుదాసుడు పుట్టారు. ఆ సుదాసుడి భార్యపేరు మదయంతి. ఆ రాజశ్రేష్ఠుణ్ణి మిత్రసహుడు, కల్మాషపాదుడు అని కూడా అంటారు. ఆ రాజు వసిష్ఠుని శాపం వల్ల రాక్షసుడై తన కర్మానుసారంగా బిడ్డలు లేని వాడయ్యాడు- అని చెప్పగా పరీక్షిత్తు 'ఎందువల్ల సుదాసునికి గురుశాపం కలిగింది'' అని అడిగాడు. అప్పుడు శుకమహర్షి ఇట్లా అన్నాడు.

**సీ. ఆ సుదాసుఁడు వేఁటకై వనంబున కేగి గర్వించి యొక్క రక్కసునిఁ జంపి**
**వానితోఁ బుట్టిన వానిఁ బో విడిచిన వాఁడును దనతోడివాని చావు**
**వోనీక కపటియై భూపాలు గృహమున నడబాలతనమున నర్థిఁ గొలిచి**
**యుండ వసిష్ఠున కుర్వీశుఁ డొక్కనాఁ డన్నంబు సేయంగ నతనిఁ బనుప**

తే. వాఁడు మానవ మాంసంబు వండి తెచ్చి, మునికి వడ్డింపఁ గోపించి ముని నరేంద్రుఁ
బిల్చి మానవమాంసంబుఁ బెట్టి తనుచు, నలుకతో రాక్షసుఁడవు గమ్మని శపించె. 237

* ఆ సుదాసుడు వేటకై అడవికి వెళ్లి ఒక రాక్షసుణ్ణి చంపి, వాని తోడబుట్టినవాణ్ణి వదలిపెట్టాడు. ఆ పగ తీర్చుకోవడం కోసం వాడు ఆ రాజుగారింట్లో మోసంతో వంటవాడుగా కుదురుకున్నాడు. ఒకరోజు అతిథిగా వచ్చిన వసిష్ఠునికి అన్నం వండమని రాజు చెప్పగా వాడు నరమాంసాన్ని వండి మునికి వడ్డించాడు. అప్పుడు వసిష్ఠుడు రాజును పిలిచి కోపంతో "నీవు నరమాంసాన్ని నాకు వండించి పెట్టావు. కనుక నీవు రాక్షసుడివైపో'' అని శపించాడు.

వ. ఇట్లు శపించి పదంపడి, రాక్షసుండు వండి తెచ్చుటయు, సుదాసుని యెఱుఁగమియుఁ దన మనంబున నెఱింగి, వసిష్ఠుండు పండ్రెండేండ్లు రక్కసుండవై యుండుమని నియమించె; న య్యవసరంబున.238

* ఇట్లా శపించిన తర్వాత ఇది రాక్షసుడు చేసిన పని అని, సుదాసుని కీ సంగతి తెలియదని మనోదృష్టితో తెలుసుకొన్న వసిష్ఠముని సుదాసుణ్ణి పన్నెండేండ్లు రాక్షసుడై ఉండమని కట్టుబాటు చేశాడు.

మ. గురుపున్ మాఱు శపింతు నంచు జలముల్ గోపంబుతో దోయిటన్
నరనాథుండు ధరింపఁ దత్సతి పతిన్ వారింప మిన్నున్ దిశల్
గరయుం జీవమయంబకా నిఖిలముం దాఁ జూచి చల్లెన్ ధరా
వరుఁ డాత్మీయ పదంబులం గరపుటీ వాఃపూరమున్ బొక్కుచున్. 239

* అప్పుడు గురువును మారుశపిస్తానని ఆ రాజు దోసిట్లో నీరు పుచ్చుకోగా అతడి భార్య వారించింది. అప్పుడు సుదాసుడు దిక్కులూ, భూమీ, ఆకాశమూ అన్నీ జీవులతో నిండి ఉన్నాయి. ఈ నీళ్ళను ఎక్కడ పోసేది అని విచారించి దోసిటిలో ఉన్న శాపజలాలను తన కాళ్ళమీదే చల్లుకున్నాడు.

వ. ఇట్లు మిత్రసహుండు గావునఁ గళత్రానుకూలుండై శపియింప నొల్లక, సుదాసుండు రాక్షసభావంబు నొంది, కల్మషవర్ణంబు లయిన పాదంబులతో నడవులం దిరుగుచు. 240

* ఇట్లా స్నేహార్ద్ర హృదయుడైన అతడు భార్య మాటలకు అనుకూలంగా నడచుకొని శపించడానికి ఇష్టపడక రాక్షసత్వాన్ని పొంది నల్లని రంగు కలిగిన పాదాలతో కల్మాషపాదుడై అడవుల్లో తిరుగుతున్నాడు.

క. ఆఁకట మలమల మాడుచు, వీఁక నతం డడవి నున్న విప్రమిథునమున్
దాఁకి తటాలున విప్రునిఁ, గూఁకటి చేఁబట్టి మ్రింగఁ గొనిపోవు తఱిన్. 241

* ఆకలితో మలమలమాడుతున్న అతడు ఆ అడవిలో బ్రాహ్మణ దంపతులను చూచాడు. వెంటనే వారిని అటకాయించి తటాలున బ్రాహ్మణుణ్ణి జుట్టుపట్టుకొని మింగడానికి తీసుకొని పోయాడు.

వ. అంత నా బ్రాహ్మణుని భార్య మోఁదికొనుచుం బెగ్గడిల్లి, డగ్గుత్తికతోఁ బతికి నడ్డంబు వచ్చి, యేడ్చుచు రాచరక్కసున కిట్లనియె. 242

* ఆ సమయంలో ఆ బ్రాహ్మణుని భార్య భయంతో గుండెలు బాదుకొనుచూ గొంతు పెగలక భర్తకు అడ్డువచ్చి ఏడుస్తూ రాక్షసుడైన ఆ రాజుతో ఇట్లా అన్నది.

**క. మానుషదేహము గలుగుట, భూనాయక! దుర్లభంబు పుట్టినమీఁదన్**
**దానము పరోపకారము, భూనుతకీర్తియును వలదె పురుషున కెందున్? 243**

* ఓ రాజా! మానవజన్మ ఎంతో దుర్లభమైంది. మనిషై పుట్టాక అతడు దానం, ధర్మం, పరోపకారం, గొప్పకీర్తి కలిగి ఉండాలికదా!

**మ. రవివంశాగ్రణివై సమస్తధరణీరాజ్యానుసంధాయివై**
**భువనస్తుత్యుఁడవై పరార్థరతివై పుణ్యానుకూలుండవై**
**వివరం బేమియు లేక నా పెనిమిటిన్ విప్రున్ దపశ్శీలు స**
**త్ప్రవరున్ బ్రహ్మవిదున్ జగన్నుతగుణున్ భక్షింపఁగాఁ బాడియే? 244**

* సూర్యవంశంలో ముఖ్యుడవై, సమస్తలోకాన్ని పాలించిన వాడవై, లోకంచేత పొగడబడినవాడవై, ఇతరులకు మేలు చేసే వాడవై, పుణ్యాత్ముడవై ప్రవర్తిల్లిన నీవు ఏ తప్పూ లేని బ్రాహ్మణుడు, తపశ్శీలుడు, బ్రహ్మవాది, గుణవంతుడు అయిన నా భర్తను భక్షించడం ధర్మమేనా?

**శా. తండ్రీ! మీకు దినేశవంశజులకున్ దైవం బగున్ బ్రాహ్మణుం**
**డం డ్రా మాటలు లేవె? భూమిసుర గోహత్యాభిలాషంబు గై**
**కొండ్రే మీ యటువంటి సాధువులు? రక్షోభావ మిట్లేల? మీ**
**తండ్రిం దాతలఁ బూర్వులం దలఁపవే ధర్మంబునం బోఁగదే! 245**

* ఓ తండ్రీ! సూర్యవంశస్థులైన మీకు బ్రాహ్మణుడు దేవునితో సమాన మంటారు. ఆ మాటలు అబద్ధాలా? నీవంటి సాధువులు బ్రాహ్మణ గోహత్యాపాతకాన్ని కోరితెచ్చుకొంటారా? ఈ రాక్షసత్వం ఎందుకు? ఒక్కసారి మీ తండ్రిని, తాతలను, పూర్వికులనూ తలచుకో! ధర్మాన్ని పాటించి నడచుకో.

**శా. అన్నా! చెల్లెల నయ్యెదన్; విడువు నీకన్నంబు వెట్టింతు నా**
**ప్రాణ్నాథున్ ద్విజు గంగికుఱ్ఱి నకటా! హింసింప నేలయ్య? నీ**
**వెన్నం డింతులతోడఁ బుట్టవె? నిజం బిట్టైన మున్ముట్ట నా**
**పన్నన్ నన్ను శిరంబు ద్రుంచి మఱి మత్ప్రాణేశు భక్షింపవే. 246**

* అన్నా! నీకు నేను చెల్లెలి నవుతాను. నా భర్తను వదలిపెట్టు. నీకు కావలసినంత వండి వడ్డిస్తాను. బ్రాహ్మణుణ్ణి, గంగిగోవువంటి ఈ పరమసాధువును ఎందుకు హింసిస్తావు? నీకు తోబుట్టువులు లేరా? నీవు చంపాలనే నిర్ణయించుకొని ఉంటే ముందుగా దీనురాలనైన నా శిరస్సు ఖండించి ఆ తర్వాత నా భర్తను భక్షించు.

**క. అని కరుణపుట్ట నాడుచు, వనితామణి పలవరింప వసుధాదేవుం**
**దినియె నతఁడు పులి పశువుం, దినుక్రియ శాపంబు కతన ధీరహితుండై. 247**

* అని ఆమె జాలిపుట్టేటట్లుగా బతిమాలింది. శాపగ్రస్తుడైన అతడు వివేకాన్ని కోల్పోయి పెద్దపులి పశువును విరుచుకు తిన్నట్లుగా ఆ బ్రాహ్మణుణ్ణి తిన్నాడు.

**వ. అంత నా బ్రాహ్మణి కోపించి కామార్తనైన నాదు పెనిమిటిని భక్షించితివి గావున, నీవు నెలఁతలం బొందఁ జేరిన వేళ మరణంబును బొందు మని, కల్మాషపాదుని శపించి, పతిశల్యంబులతో నగ్నిప్రవేశంబు సేసి సుగతికిం జనియె. నంతఁ బండ్రెండేండ్లు సనిన నా రాజు మునిశాప నిర్ముక్తుండై. 248**

* అప్పు డాబ్రాహ్మణి కోపించ "కామార్తురాలనైన నాకు సర్వస్వమైన నా పెనిమిటిని భక్షించావు. కాబట్టి నీవు స్త్రీ సాంగత్యానికి సిద్ధపడి నప్పుడు నీకు మృత్యువు ప్రాప్తిస్తుంది" అని కల్మాషపాదుణ్ణి శపించి, భర్త ఎముకలతో పాటు అగ్ని ప్రవేశం చేసి ఉత్తమగతిని పొందింది. పన్నెండేండ్లు గడవగా ఆ రాజుకు మునిశాపం తీరింది.

**ఆ. రతులకొఱకు భార్య రావింప నదియును, బెదరి విప్రసతి శపించు టెఱిఁగి**
**మగని నడ్డపెట్టి మైథునకర్మంబు, మాన్పె సతుల గోష్ఠి మానె నతఁడు. 249**

* పిమ్మట అతడు పొందుకోరి భార్యను పిలువనంపగా, బ్రహ్మణస్త్రీశాపం గుర్తున్న ఆమె భయపడి భర్తను వారించింది. అప్పటినుండి అతడు స్త్రీసాంగత్యం మానుకున్నాడు.

**క. అది కారణముగఁ బుత్రా, భ్యుదయము లే దా సుదాసభూపాలునకున్**
**దదనుమతి న వ్వసిష్ఠుఁడు , మదయంతికిఁ గడుపుసేసె మదన క్రీడన్. 250**

* ఆ కారణంగా సుదాసునికి సంతతి లేకపోయినది అతడి కోరిక ప్రకారం వసిష్ఠుడు మదయంతికి గర్భాధానం చేశాడు.

**వ. ఇట్లు సుదాసుని భార్యయగు మదయంతి వసిష్ఠువలన గర్భిణియై యేడేండ్లు గర్భంబు ధరియించి, నీళ్ళాడ సంకటపడు చున్న వసిష్ఠుండు వాఁడియగు నశ్మమున నా గర్భంబుఁ జీరిన, నశ్మకుండను కుమారుండు పుట్టె, నతనికి మూలకుండు పుట్టె నతండు. 251**

* ఇట్లా సుదాసుని భార్య మదయంతి వసిష్ఠునివల్ల గర్భవతి అయి ఏడేండ్లు గర్భాన్ని ధరించి ప్రసవించడానికి కష్టపడుతుంటే వసిష్ఠుడు వాడి అయిన రాతితో ఆమె గర్భాన్ని చీల్చగా అశ్మకుడనే కొడుకు పుట్టాడు. అతనికి మూలకుడు జన్మించాడు.

**క. వీరుఁ డగు పరశురాముఁడు, ఘోర కుఠారమున నృపులఁ గూలుచు వేళన్**
**నారీజనములు దాఁచిన, నారీకవచుం డనంగ నరనుతి కెక్కెన్. 252**

* వీరుడైన పరశురాముడు గండ్రగొడ్డలితో రాజులను కూల్చే వేళ స్త్రీజనం కవచంలా అతని చుట్టూ చేరి కాపాడడం వల్ల మూలకుడు నారీకవచు డని ప్రసిద్ధి పొందాడు.

**వ. ఆ నారీకవచుండు నిర్మూలం బయిన రవి వంశంబునకు మూలం బగుటం జేసి, మూలకుం డనఁ బరఁగె నామూలకునకు విశ్వసహుండు పుట్టె. విశ్వసహునకు ఖట్వాంగుండు పుట్టి చక్రవర్తి యయ్యె. నతండు. 253**

* ఆ నారీకవచుడు పరశురామునిచే నిర్మూలింపబడ్డ సూర్యవంశానికి మూలమైనందువల్ల మూలకుడని పేరు పొందాడు. ఆ మూలకునికి విశ్వసహుడు పుట్టాడు. విశ్వసహునికి ఖట్వాంగుడు జన్మించి చక్రవర్తి అయినాడు.

సీ. అమరులు వేఁడిన నసురనాథులఁ జంపి త్రిదశులతోఁ దన బ్రదుకు కాల
మెంతని యడిగిన 'నిదె నిండుచున్నది తడవులే దే మైన నడుగు' మనిన
వరములు గోరక వరవిమానం బెక్కి తనపురి కేతెంచి తత్త్వబుద్ధిఁ
బరమేశ్వరుని యంద భావంబుఁ గీలించి కులదైవత ద్విజకులము కంటె

తే. నంగనా ప్రాజ్యరాజ్య పుత్త్రాదు లెల్లఁ, గావు ప్రియములు; ధర్మంబు గడచి నాదు
మతి ప్రవర్తింప దెన్నఁడు మది నెఱుంగ, నన్య మా యీశ్వరునిఁ దక్క ననుచు మఱియు. 254

మ. ఇలమీఁదం బ్రతుకేల? వేల్పుల వరం బేలా? ధనం బేల? చం
చల గంధర్వపురీ విడంబనము లైశ్వర్యంబు లేలా? జగం
బులఁ బుట్టించు తలంపునం బ్రకృతితోఁ బొత్తై తుదిం బాసి ని
ర్మలమై వాఙ్మనసామితం బగు పరబ్రహ్మంబు నేఁ జెందెదన్. 255

* ఆ ఖట్వాంగుడు దేవతలు కోరగా రాక్షసరాజులను సంహరించి, తన ఆయుర్దాయం ఎంత అని దేవతలను అడిగాడు. వాళ్ళు 'ఇదే నిండుతూ ఉంది. ఆలస్యం లేదు. ఏదైనా వరాన్ని కోరుకో' అన్నారు. అతడు వరాలను కోరక విమాన మెక్కి తన పట్టణానికి వచ్చి పరమేశ్వరుని యందే మనస్సు లగ్నం చేశాడు. 'కులదేవతైన బ్రహ్మణుల కంటే నాకు నాప్రాణం కానీ, భార్యాపుత్రులుకానీ, రాజ్యం గానీ ప్రియమైనవి కావు. నా బుద్ధి ఎన్నడూ ధర్మాన్ని అతిక్రమించి ప్రవర్తించలేదు. ఈశ్వరుణ్ణి తప్ప అన్యవిషయాలను నేను మదిలో నిలుపుకోలేదు.

భూమిపై ఈ బ్రతు కెందుకు? దేవతల వరా లెందుకు? ధన మెందుకు? చంచలమైన గంధర్వనగరాన్ని పోలిన ఈ సంపద లెందుకు? లోకాలను సృష్టించే తలపుతో ప్రకృతితో పొత్తు పెట్టుకుని, తుదకు దాన్ని వదలి పరిశుద్ధమై వెలుగుతూ వాక్కునకూ, మనస్సునకూ అందని ఆ పరబ్రహ్మాన్ని నేను పొందుతాను'

వ. అని నిశ్చయించి. 256

మ. కలసెన్ సంగము లెల్లఁ బాసి నియతిన్ ఖట్వాంగుఁ డశ్రాంతమై
కల దయ్యున్ మఱి మీఁద లే దనెడిదై కల్యాణమై యాత్మలోఁ
దలఁపం బల్కఁగ రానిదై పరమమై తత్త్వజ్ఞు లూహించి హృ
జ్జలజాతంబుల వాసుదేవుఁడని సంస్థాపించు నా బ్రహ్మమున్. 257

* అని నిశ్చయించుకొని ఆ ఖట్వాంగుడు లౌకికబంధాలను తెంచుకొని నిష్ఠతో శాశ్వతమైనదీ, దానికి మించి మరొకటి లేనిదీ, కల్యాణకర మైనదీ, ఆత్మలో ఊహింప రానిదీ, పేర్కొన రానిదీ, అన్నిటికంటె గొప్పదీ, తత్త్వం తెలిసినవాళ్ళు తమ హృదయ పద్మాల్లో స్థాపించుకొనేది ఐన పరబ్రహ్మంలో లీనమై పోయాడు.

**వ. అట్టి ఖట్వాంగునకు దీర్ఘబాహుండు, దీర్ఘ బాహువునకు రఘువు, రఘువునకుఁ బృథుశ్రవుండుఁ, బృథుశ్రవునకు నజుండు, నజునకు దశరథుండును బుట్టి; రా దశరథునకు సుర ప్రార్థితుండై పరబ్రహ్మమయుండైన హరి నాల్గువిధంబులై శ్రీరామ లక్ష్మణ భరత శత్రుఘ్న నామంబుల నిజాంశ సంభూతుండై జన్మించెఁ; దచ్చరిత్రంబు వాల్మీకి ప్రముఖులైన మునులచేత వర్ణితం బైనది; యైననుం జెప్పెద; సావధాన మనస్కుండవై యాకర్ణింపుము. 258**

* అటువంటి ఖట్వాంగునికి దీర్ఘబాహుడు, దీర్ఘబాహునికి రఘువు, రఘువుకు పృథుశ్రవుడు, పృథుశ్రవునికి అజుడు, అజునికి దశరథుడు పుట్టారు. దేవతల ప్రార్థన మన్నించి సాక్షాత్తూ పరబ్రహ్మమైన శ్రీహరి తన అంశంతో నాలుగు విధాలై శ్రీరామ లక్ష్మణ భరత శత్రుఘ్నులనే పేర్లతో జన్మించాడు. ఆ పవిత్ర చరిత్రను వాల్మీకి మొదలైన మహామునులు వర్ణించారు. ఐనా చెబుతాను సావధానుడవై విను.

## -: శ్రీరామచరిత్ర :-

**మ. అమరేంద్రాశకుఁ బూర్ణచంద్రుఁ డుదితుండై నట్లు నారాయణాం**
**శమునం బుట్టె మదాంధ రావణశిరస్సంఘాత సంఛేదన**
**క్రమణోద్దాముఁడు రాముఁ డా గరితకుం గౌసల్యకున్ సన్నుతా**
**సమనైర్మల్యక తుల్య కంచితజనుస్సంసారసాఫల్యకున్. 259**

* తూర్పు దిక్కుకు నిండు చంద్రుండు ఉదయించినట్లుగా పొగడ దగినదీ, పరిశుద్ధురాలూ, సంసారసాఫల్యాన్ని పొందినదీ, సాటిలేని సాధ్వి అయిన కౌసల్యకు, గర్వాంధుడైన రావణుని తలలను ఖండించుటలో గడిదేరిన శ్రీరాముడు నారాయణాంశతో జన్మించాడు.

**మ. సవరక్షార్థము దండ్రి పంపఁ జని విశ్వామిత్రుఁడుం దోడ రా**
**నవలీలం దునుమాడె రాముఁ డదయుండై బాలుఁడై కుంతల**
**చ్ఛవిసంపజ్జితహాటకం గపటభాషావిస్ఫురన్నాటకన్**
**జవభిన్నార్యమఘోటకం గరవిరాజ త్ఖేటకం దాటకన్. 260**

* బాలుడైన ఆ రాముడు తండ్రి పంపగా యాగాన్ని కాపాడ్డానికి విశ్వామిత్రుని వెంట వెళ్ళాడు. వెళ్ళి బంగారురంగు వెండ్రుకలు కలదీ, కపటపు మాటలతో కూడిన నటన కలిగినదీ, సూర్యుడి గుఱ్ఱాల కంటె వడిగా పరుగు లెత్తేదీ, చేత డాలు కలిగినదీ అయిన తాటక అనే రాక్షసిని ఏ మాత్రం దయతలచక అవలీలగా నేలకూల్చాడు.

క. గారామునఁ గౌశికముఖ, మా రాముఁడు గాచి దైత్యు నధికు సుబాహున్
ఘోరాజిఁ ద్రుంచి తోలెను, మారీచు న్నీచుఁ గపటమంజులరోచున్. **261**

* ఆ రాముడు బలవంతుడై సుబాహుణ్ణి ఘోరయుద్ధంలో చంపి, కపటమైన వేషాన్ని ధరించిన మారీచుణ్ణి తరిమికొట్టి విశ్వామిత్రుని యాగాన్ని కాపాడాడు.

మ. ఒక మున్నూఱు గదల్చి తెచ్చిన లలాటోగ్రాక్షు చాపంబు బా
ల కరీంద్రంబు సులీలమైఁ జెఱుకుఁగోలం ద్రుంచు చందంబునన్
సకలోర్వీశులుఁ జూడఁగా విఱిచె దోశ్శక్తిన్ విదేహ క్షమా
పక గేహంబున సీతకై గుణమణి ప్రస్ఫీతకై లీలతోన్. **262**

* ఆ రామచంద్రుడు విదేహరాజైన జనకుని ఇంటిలో సుగుణాల ప్రోవైన సీతకోసం మున్నూరుమంది కదిలించి తెచ్చిన శివధనుస్సును రాజులందరి సమక్షంలో గున్న ఏనుగు చెఱుకుగడను విరిచినట్లు హేలగా అవలీలగా విరిచాడు.

క. భూతలనాథుఁడు రాముఁడు, ప్రీతుండై పెండ్లి యాడెఁ బృథుగుణమణి సం
ఘాతన్ భాగ్యోపేతన్, సీతన్ ముఖకాంతివిజిత సితఖద్యోతన్. **263**

* లోకనాయకుడైన రాముడు గొప్పగుణవంతురాలూ, అదృష్టవంతురాలూ, చంద్రుణ్ని అతిశయించిన ముఖకాంతి కలదైన సీతను ప్రీతితో పెండ్లాడినాడు.

క. రాముఁడు నిజబాహుబల, స్థేమంబున భంగపఱిచె దీర్ఘకుఠారో
ద్దామున్ విదళీకృతనృప, భామున్ రణరంగభీము భార్గవరామున్. **264**

* ఆ రాముడు గండ్రగొడ్డలి కలిగిన గండరగండడు. రాజుల తేజస్సును పటాపంచలు చేసినవాడు, రణరంగంలో పరవీరభయంకరుడు అయిన పరశురాముణ్ణి భంగపరచాడు.

క. దశరథుడు మున్ను గైకకు, వశుఁడై తానిచ్చి నట్టి వరముకతన వా
గ్దశ చెడక యడవి కనిచెను, దశముఖ ముఖకమల తుహినధామున్ రామున్. **265**

* దశరథుడు మునుపు కైకకు ఇచ్చిన వరాలకు కట్టుబడి మాట తప్పక రావణుని ముఖకమలాలకు చంద్రుడైన రామచంద్రుణ్ణి అడవికి పంపాడు.

క. జనకుఁడు పనిచిన మేలని, జనకజయును లక్ష్మణుండు సంసేవింపన్
జనపతి రాముఁడు విడిచెను, జనపాలారాధ్య ద్విషదసాధ్య నయోధ్యన్. **266**

* తండ్రి ఆజ్ఞ తలదాల్చి ఆ రామచంద్రుడు సీతాలక్ష్మణులు తన్ను సేవిస్తుండగా రాజులచే పూజింపబడేదీ, శత్రురాజులకు అసాధ్యమైనదీ ఐన అయోధ్యను వదలివెళ్ళాడు.

క. భరతున్ నిజపదసేవా, నిరతున్ రాజ్యమున నునిచి నృపమణి యెక్కెన్
సురుచిరరుచి పరిభావిత, గురుగోత్రాచలముఁ జిత్రకూటాచలమున్. 267

* ఆ రాజశ్రేష్ఠుడు, నిజచరణ సేవానిరతుడైన భరతుణ్ణి రాజ్యంలో నిలిపాడు. పిమ్మట సుందరమైన కాంతులతో కులపర్వతాలను మించిన చిత్రకూట పర్వతంమీద కాలు పెట్టాడు.

ఉ. పుణ్యుఁడు రామచంద్రుఁ డట వోయి ముదంబునఁ గాంచె దండకా
రణ్యముఁ దాపసోత్తము శరణ్యము నుద్ధత బర్హిబర్హ లా
వణ్యము గౌతమీ విమల వాఃకణ పర్యటన ప్రభూత సా
ద్గుణ్యము నుల్లసత్తరు నికుంజ వరేణ్యము నగ్రగణ్యమున్. 268

* పుణ్యాత్ముడైన రామచంద్రుడు ఆ విధంగా వెళ్ళి ఋషులకు శరణ్యమూ, పురివిప్పి ఆడే నెమళ్ళతో చూడ ముచ్చటైనది, పవిత్ర గోదావరీ జలాలతో భాసించేదీ, గొప్పచెట్లతో పొదరిండ్లతో కూడినదీ ఐన దండకారణ్యాన్ని సంతోషంతో సందర్శించాడు.

సీ. ఆ వనంబున రాముఁడనుజ సమేతుఁడై, సతితోడ నొక పర్ణశాల నుండ
రావణు చెల్లెలు రతిఁగోరి వచ్చిన మొగి లక్ష్మణుఁడు దాని ముక్కు గోయ
నది విని ఖరదూషణాదులు పదునాల్గు వేవురు రా రామవిభుఁడు కలన
బాణానలంబున భస్మంబు గావింప జనకనందన మేని చక్కఁదనము

తే. విని దశగ్రీవుఁ డంగజ వివశుఁ డగుచు, నర్థిఁ బంచిన బసిఁడిఱ్ఱి యై నటించు
నీచు మారీచు రాముఁడు నెఱి వధించె, నంతలో సీతఁ గొనిపోయె నసురవిభుఁడు. 269

* ఆ అడవిలో రాముడు తమ్ముడితో, భార్యతో ఒక కుటీరంలో ఉండగా రావణుని చెల్లెలైన శూర్పణఖ రాముణ్ణి కామించి వచ్చింది. అప్పుడు లక్ష్మణుడు దాని ముక్కు కోశాడు. అది విని దండెత్తి వచ్చిన ఖరదూషణాదులను పద్నాలుగు వేలమందినీ రాముడు తన బాణాగ్నితో భస్మం చేశాడు. సీత చక్కదనాన్ని విని మన్మథ పరవశుడైన రావణుడు పంపగా బంగారు లేడిగా కపటవేషాన్ని ధరించి వచ్చిన నీచుడైన మారీచుణ్ణి రాముడు వధించాడు. ఆ సమయంలో రావణుడు సీతను అపహరించుకొని పోయాడు.

ఉ. ఆ యసురేశ్వరుండు వడి నంబరవీథి నిలాతనూజ న
న్యాయము సేసి నిష్కరుణుఁడై కొనిపోవఁగ నడ్డమైన ఘో
రాయత హేతిఁ ద్రుంచె నసహాయత రామనరేంద్ర కార్య ద
త్తాయువుఁ బక్షవేగ పరిహాసిత వాయువు న జ్జటాయువున్. 270

* ఆ విధంగా రావణుడు అన్యాయంగా, ఏ మాత్రం దయలేకుండా ఆకాశమార్గంలో సీతాదేవిని కొనిపోయేటప్పుడు రామకార్యం కోసం ప్రసాదింపబడ్డ ఆయుర్దాయం కలవాడు, వాయువేగాన్ని మించిన వేగం కలవాడు ఐన జటాయువు అడ్డుపడ్డాడు. అప్పుడు రావణుడు నిస్సహాయుడైన జటాయువును కఠోరమైన ఆయుధంతో ఖండించాడు.

వ. అంత నా రామచంద్రుండు లక్ష్మణసహితుండై, సీత వెదక నరుదెంచి, నిజకార్యనిహతుండైన జటాయువునకుం బరలోక క్రియలు గావించి ఋశ్యమూకంబునకుం జని. 271

* పిమ్మట ఆ రామచంద్రుడు లక్ష్మణునితో కలిసి సీతను వెదుకుతూ వచ్చి తన కార్యానికై ప్రాణాలను కోల్పోయిన జటాయువుకు పరలోకక్రియలు చేసి ఋశ్యమూకానికి వెళ్ళాడు.

క. నిగ్రహము నీకు వల దిఁక, నగ్రజు వాలిన్ వధింతు నని నియమముతో
నగ్రేసరుగా నేలెను, సుగ్రీవున్ చరణఘాతచూర్ణ గ్రావున్. 272

* 'ఇక నీకు నిర్బంధం అక్కరలేదు. మీ అన్న వాలిని వధిస్తాను' అని అభయమిచ్చి పాదాల రాపిడిచేతనే బండలను పొడిచేసే సుగ్రీవుణ్ణి ఆత్మీయులలో అగ్రేసరుణ్ణిగా చేసుకొన్నాడు శ్రీరాముడు.

క. లీలన్ రామవిభుండొక, కోలం గూలంగ నేసె గురు నయశాలిన్
శీలిన్ సేవితశూలిన్, మాలిన్ వాలిన్ దశాస్యమానోన్మూలిన్. 273

* శ్రీరాముడు ఒకేబాణంతో గొప్పనీతిశాలీ, ఈశ్వరుణ్ణి సేవించేవాడూ, ఇంద్రు డిచ్చిన మాలను కంఠంలో ధరించినవాడూ, రావణుని గర్వాన్ని హరించిన వాడూ ఐన వాలిని కూల్చివేశాడు.

క. ఇలమీఁద సీత వెదకఁగ, నలఘుఁడు రాఘవుఁడు పనిచె హనుమంతు నతి
చ్ఛలవంతున్ మతిమంతున్, బలవంతున్ శౌర్యవంతుఁ బ్రాభవవంతున్. 274

* గొప్పవాడైన రాముడు సీతను వెదకడానికి మహామహిమాన్వితుడూ, బుద్ధిమంతుడూ, బలవంతుడూ, శౌర్యవంతుడూ, సుగుణవంతుడూ ఐన హనుమంతుణ్ణి నియోగించాడు.

క. అలవాటు కలిమి మారుతి, లలితామిత లాఘవమున లంఘించెను శై
వలినీగణసంబంధిన్, జలపూరిత ధరణి గగన సంధిన్ గంధిన్. 275

* ఆ హనుమంతుడు నదులకు బంధువూ, భూమికి ఆకాశానికీ గల వ్యవధానాన్ని నీటితో నింపినదీ ఐన సముద్రాన్నీ అలవాటు మేరకు అత్యంత లాఘవంతో దాటాడు.

వ. ఇట్లు సముద్రంబు దాఁటి సీతం గని, హనుమంతుండు దిరిగి చనుదెంచుచు నక్షకుమారాదుల వధియించి. 276

* ఆంజనేయుడు ఆ విధంగా సముద్రాన్ని దాటి సీతను దర్శించి తిరిగివచ్చేటప్పుడు అక్షకుమారుడు మొదలైన వారిని సంహరించాడు.

క. సముదగ్రత ననిలసుతుం, డమరాహిత దత్త వాల హస్తాగ్నుల భ
స్మము సేసె నిరాతంకన్, సమదాసుర సుభటవిగతశంకన్ లంకన్. 277

* ఆ హనుమంతుడు రాక్షసులు తన తోకకు పెట్టిన నిప్పుతో భయంకరంగా అడ్డులేనిదీ, మదించిన రాక్షసభటుల వీరత్వం చేత ఏ మాత్రం ఆపద కలుగుతుందన్న శంకలేనిదీ ఐన లంకను భస్మం చేశాడు.

**వ. ఇట్లు లంకాదహనం చేసి వచ్చి వాయుజుండు సీతాకథనంబు సెప్పిన విని రామచంద్రుండు వనచరనాథ యూథంబులుం దానును, జని చని. 278**

* ఈ విధంగా లంకను కాల్చి వచ్చి హనుమంతుడు సీతావృత్తాంతాన్ని విన్నవింపగా విన్న శ్రీరామచంద్రుడు వానరసేనలతో బయలు దేరివెళ్ళాడు.

**శా. ఆ రాజేంద్రుఁడు గాంచె భూరివిధ రత్నాగారమున్ మీన కుం**
**భీరగ్రాహ కఠోరమున్ విపుల గంభీరంబు నభ్రభ్రమ**
**ద్ఘోరాన్యోన్య విభిన్న భంగభవ నిర్ఘోషచ్ఛటాంభఃకణ**
**ప్రారుద్ధాంబర పారమున్ లవణ పారావారమున్ జేరువన్. 279**

* ఆ విధంగా వెళ్ళి శ్రీరామచంద్రుడు తన ఎదుట అనేక రత్నాలకు ఆటపట్టయినదీ; చేపలు మొసళ్లు తిమింగిలాలూ కలిగి భయంకర మైనదీ; మిక్కిలి గంభీరమైనదీ; ఆకాశానికీ ఎగసిపడి పరస్పరం డీకొని పెద్దచప్పుడు చేసే అలలు కలిగినదీ; నీటి తుంపురులతో నిండిన ఆకాశం అంచులు కలిగినదీ ఐన లవణసముద్రాన్ని చూచాడు.

**వ. కని తనకుఁ ద్రోవ యిమ్మని వేఁడిన నదియు మార్గంబు సూపక మిన్నందిన నా రాచపట్టి రెట్టించిన కోపంబున. 280**

**క. మెల్లని నగవున నయనము, లల్లార్చి శరంబు విల్లు నందినమాత్రన్**
**గుల్లలు నాఁచులుఁ జిప్పలుఁ, బెల్లలునై జలధి పెద్ద బీడై యుండెన్. 281**

* సముద్రాన్ని తనకు దారి యిమ్మని శ్రీరాముడు కోరాడు. కాని సముద్రం దారి ఇవ్వక ఆకాశాన్ని తాకేటట్టు ఉప్పొంగింది. అప్పు డా రాజకుమారుడు రెట్టించిన కోపంతో చిరునవ్వు నవ్వుతూ కళ్లను తిప్పి విల్లంబులను అందుకొన్నాడు. వెంటనే ఆ సముద్రం నత్తగుల్లలతో, నాచుతో, ముత్తెపుచిప్పలతో పెద్దబీడుగా మారిపోయింది.

**వ. ఇట్లు విపన్నుండగు సముద్రుండు నదులతోఁ గూడి మూర్తి మంతుండయి చనుదెంచి రామచంద్రుని చరణంబులు శరణంబుఁ జొచ్చి యిట్లని స్తుతియించె. 282**

* ఇట్లా ఆపదపాలైన సముద్రుడు నదులతో కలిసి రూపుగొన్న వాడై వచ్చి రామచంద్రుని పాదాలను శరణుజొచ్చి ఈ విధంగా స్తుతించాడు.

**శా. 'ఓ కాకుత్స్థకులేశ! యో గుణనిధీ! యో దీనమందార! నే**
**నీ కోపంబున కెంతవాఁడ? జడధిన్; నీవేమి భూరాజవే?**

**లోకాధీశుఁడ; వాదినాయకుఁడ; వీ లోకంబు లెల్లప్పుడున్**
**నీకుక్షిం బ్రభవించు; నుండు; నడఁగున్ నిక్కంబు సర్వాత్మకా! 283**

* 'ఓ కాకుత్థ్సకులేశ్వరా! గుణనిధీ! దీనమందారా! సర్వాత్మకా! నీ కోపానికి నే నెంతటివాణ్ణి? జడత్వం కలిగిన వాణ్ణి. నీవేమి సామాన్యుడైన భూలోకపు రాజువా? లోకాలకే ప్రభుడవు. ఆదినాయకుడవు. ఈ లోకాలు ఎల్లప్పుడూ నీ కడుపులో పుట్టుతుంటాయి, మను తుంటాయి, నశించిపోతుంటాయి. ఇది సత్యం.

**క. ధాతల రజమున దేవ, వ్రాతము సత్త్వమున భూతరాశిఁ దమమునన్**
**జాతులుఁగా నొనరించు గు, ణాతీతుఁడ వీవు గుణగణాలంకారా! 284**

* ఓ గుణగణాలంకారా! ప్రజాపతులను రజోగుణంచేత, దేవతల సమూహాన్ని సత్త్వగుణంచేత, ప్రాణికోటిని తమోగుణం చేత జన్మింపజేసే గుణాతీతుడవు నీవు.

**క. కట్టుము సేతువు. లంకం జుట్టుము; నీబాణవహ్ని సురవైరితలల్**
**గొట్టుము నేలంబడఁ జే, పట్టుము నీ యబల నధికభాగ్యప్రభలన్. 285**

* ఓ రామా! నాపై సేతువు కట్టు! లంకను చుట్టుముట్టు! నీ బాణాగ్నిచేత రాక్షసుల తలలు నేలపడేటట్టు కొట్టు! మంగళకరంగా నీ యిల్లాలిని చేపట్టు!

**ఆ. హరికి మామ నగుదు; నఁటమీఁద శ్రీదేవి, తండ్రి; నూరకేల? తా గడింపఁ**
**గట్టఁగట్టి దాఁటు కమలాప్తకులనాథ, నీ యశోలతలకు నెలవు గాఁగ. 286**

* ఓ సూర్యకులాధినాథ! నేను శ్రీహరికి మామను. ఆ పైన శ్రీదేవికి తండ్రిని. ఊరక నన్ను పీడించడం ఎందుకు? నీ కీర్తిలతకు ఉనికిపట్టుగా నాపై వారధికట్టి సముద్రాన్ని దాటు.

**వ. అని విన్నవించిన రామచంద్రుండు సముద్రునిం బూర్వప్రకారంబున నుండు; పొమ్మని వీడుకొల్పె; నంత. 287**

* అని మనవి చేసుకోగానే రామచంద్రుడు సముద్రుణ్ణి వెనుకటి లాగానే ఉండమని పంపాడు.

**క. ఘనశైలంబులుఁ దరువులు, ఘనజవమునఁ బెఱికి తెచ్చి కపికులనాథుల్**
**ఘనవనరాశిం గట్టిరి, ఘనవాహ ప్రముఖ దివిజగణము నుతింపన్. 288**

* పిమ్మట దేవేంద్రుడు మొదలైన దేవతలు పొగడేటట్టుగా వానరశ్రేష్ఠులు గొప్పకొండలను చెట్లను మిక్కిలి వేగంతో పెకలించి తెచ్చి వారిధిపై వారధి కట్టారు.

**వ. ఇట్లు సముద్రంబు దాఁటి రామచంద్రుండు రావణు తమ్ముండైన విభీషణుండు శరణంబు వేఁడిన నభయం బిచ్చి కూడుకొని లంకకుఁ జని విడిసి వేడె పెట్టించి లగ్గలు పట్టించిన. 289**

* ఈ విధంగా సముద్రాన్ని దాటి రామచంద్రుడు రావణుని తమ్ముడైన విభీషణుడు తన్ను శరణువేడగా అభయమిచ్చాడు. అతడితో కలిసి లంకకు వెళ్ళి సేనలతో ఆ పట్టణాన్ని ముట్టడింపజేసి కోటగోడలకు ఎగబ్రాకించాడు.

సీ. ప్రాకారములు ద్రవ్వి, పరిఖలు పూడిచి కోటకొమ్మలు నేలఁ గూలఁ ద్రోచి
వప్రంబు లగలించి వాకిళ్లు పెకలించి తలుపులు విఱచి యంత్రములు సెఱిచి
ఘనవిటంకంబులు ఖండించి పడవైచి గోపురంబులు నేలఁ గూలఁ దన్ని
మకరతోరణములు మహిఁ గూల్చి కేతనంబులు సించి సోపానములు గదల్చి

ఆ. గృహము లెల్ల వ్రచ్చి గృహరాజముల గ్రొచ్చి, భర్మకుంభచయము పాఱవైచి
కరులు కొలను సొచ్చి కలఁచిన కైవడిఁ, గపులు లంకఁ జొచ్చి కలఁచి రపుడు. 290

* అప్పుడు ఏనుగులు మడుగులోనికి ప్రవేశించి కలచివేసినట్లుగా ఆ వానరులు లంకలోనికి ప్రవేశించి ప్రాకారాలను త్రవ్వి, అగడ్తలను పూడ్చి, కోటకొమ్మలను నేలకూలద్రోసి, కోటగోడలను పగులగొట్టి, వాకిళ్ళను పెకలించి, తలుపులను విరిచి, యంత్రాలను చెరచి, ముంజూరులను ఖండించి, గోపురాలను నేల కూలేటట్లు పడదన్ని, మకరతోరణాలను మట్టిపాలుచేసి, జెండాలను చింపి, మెట్లను కదిలించి, ఇళ్ళను చీల్చి, భవనాలను కూల్చి, బంగారు కలశాలను విసిరివేసి కల్లోలపరిచారు.

వ. అంత న య్యసురేంద్రుడు పంచిన గుంభ, నికుంభ, ధూమ్రాక్ష, విరూపాక్ష, సురాంతక, నరాంతక, దుర్ముఖ, ప్రహస్త, మహాకాయ ప్రముఖులగు దనుజవీరులు శరశరాసన తోమర గదా ఖడ్గ శూల భిందిపాల పరశు పట్టిస ప్రాస ముసలాది సాధనంబులు ధరియించి మాతంగ తురంగ స్యందన సందోహంబుతో బవరంబు సేయు సుగ్రీవ పవనతనయ పనస గజ గవయ గంధమాదన నీల కుముద జాంబవదాదు లా రక్కసుల నెక్కటి కయ్యంబులందుఁ దరుల, గిరులఁ, గరాఘాతంబుల నుక్కడంచి రంత. 291

* పిమ్మట రావణుడు పంపగా కుంభ, నికుంభ, ధూమ్రాక్ష, విరూపాక్ష, సురాంతక, దుర్ముఖ, ప్రహస్త, మహాకాయ ముఖ్యులైన రాక్షసవీరులు విల్లంబులూ, గదలూ, కత్తులూ, శూలాలూ, గొడ్డళ్లూ మొదలైన ఆయుధాలను ధరించి గజాశ్వరథ సమూహాలతో వచ్చి యుద్ధం చేశారు. సుగ్రీవ, ఆంజనేయ, పనస, గజ, గవయ, గంధమాదన, నీల, అంగద, కుముద, జాంబవంతులు ఆ రాక్షసులను ద్వంద్వ యుద్ధంలో ఎదుర్కొని తరులతో గిరులతో, పిడికిటి పోట్లతో నాశనం చేశారు.

క. ఆ యెడ లక్ష్మణుఁ డుజ్జ్వల, సాయకములఁ ద్రుంచె శైలసమకాయు సురా
జేయు ననర్గళమాయో, పాయున్ నయగుణ విధేయు న య్యతికాయున్. 292

* అప్పుడు లక్ష్మణుడు ఉజ్జ్వలమైన బాణాలతో కొండంతవాడూ, దేవతలకే అజేయుడూ, మాయోపాయుడూ, నయగుణ విధేయుడూ ఐన అతికాయుణ్ణి నేల కూల్చాడు.

ఆ. రామచంద్ర విభుఁడు రణమున ఖండించె, మేటి కడిమి నీలమేఘవర్ణు
బాహుశక్తి పూర్ణుఁ బటుసింహనాద సం, కుచిత దిగిభకర్ణుఁ గుంభకర్ణు. 293

* ఆ యుద్ధంలో రామచంద్రుడు గొప్ప శౌర్యవంతుడూ, కారు మేఘంవంటి రంగుగలవాడూ, నిండైన భుజశక్తి కలవాడూ, గొప్పదైన తన సింహనాదంతో దిగ్గజాల చెవులు దిమ్మెక్కించే వాడూ ఐన కుంభకర్ణుణ్ణి ఖండించాడు.

క. అలవున లక్ష్మణుఁ డాజి, స్థలి గూల్చెన్ మేఘనాదుఁ జటులాహ్లాదున్
బలభేది జయవినోదున్, బలజనిత సుపర్వ సుభటభావవిషాదున్. 294

* ఆ రణరంగంలో లక్ష్మణుడు యుద్ధమంటే పండుగలాగా భావించేవాడూ, ఇంద్రుణ్ణి అవలీలగా జయించినవాడూ, తన బలంచేత దేవతావీరుల మనస్సులకు విషాదాన్ని పుట్టించేవాడూ ఐన మేఘనాదుణ్ణి ఎంతో నేర్పుతో కూల్చివేశాడు.

వ. అంత. 295

క. తనవారందఱు గ్రుగ్గిన, ననిమిషపతివైరి పుష్ప కారూఢుండై
యనికి నడచి రామునితో, ఘనరౌద్రముతోడ నంపకయ్యము సేసెన్. 296

* అప్పుడు తన వారందరూ నేలకూలగా రావణుండు పుష్పక విమానం ఎక్కి రణరంగానికి వచ్చి గొప్ప రౌద్రావేశంతో రామునితో యుద్ధానికి తలపడ్డాడు.

వ. అ య్యవసరంబున. 297

క. సురపతిపంపున మాతలి, గురుతరమగు దివ్యరథముఁ గొనివచ్చిన, నా
ధరణీవల్లభుఁ డెక్కెను, ఖరకరుఁ డుదయాద్రి నెక్కు కైవడి దోఁపన్. 298

* ఆ సమయంలో దేవేంద్రుని ఆజ్ఞమేరకు మాతలి గొప్పదైన దేవతారథాన్ని తీసుకొని వచ్చాడు. సూర్యుడు ఉదయపర్వతాన్ని ఎక్కేలాగా రామచంద్రుడు ఆ దివ్యరథాన్ని అధిరోహించాడు.

వ. ఇట్లు దివ్యరథారూఢుండయి రామచంద్రుండు రావణున కిట్లనియె. 299

* ఇ ట్లా దివ్యరథాన్ని ఎక్కిన రామచంద్రుడు రావణునితో ఇట్లా అన్నాడు.

మ. చపలత్వంబున డాఁగి హేమమృగమున్ సంప్రీతిఁ బుత్తెంచుటో
కపట బ్రాహ్మణమూర్తివై యబల నా కాంతార మధ్యంబునం
దపలాపించుటయో మదీయశిత దివ్యామోఘ బాణాగ్ని సం
తపనం బేగతి నోర్చువాఁడవు? దురంతం బెంతయున్ రావణా! 300

* ఓ రావణా! నాతో యుద్ధం చేయడ మంటే నీచత్వంతో మరుగున ఉండి బంగారు లేడిని పంపడం వంటిది కాదు. కపట బ్రాహ్మణుడివై కారడివి మధ్య ఒక అబలను మోసపుచ్చడం వంటిదికాదు. నా వాడి ఐన, దివ్యమైన బాణాగ్ని వల్ల కలిగే తాపాన్నీ, దుఃఖకరమైన ఈ పర్యవసానాన్ని నీవు ఎట్లా ఓర్వగలవు?

క. నీ చేసిన పాపములకు, నీచాత్మక! యముఁడు వలదు నేఁ డిట నా నా
రాచములఁ ద్రుంచి వైచెద, ఖేచర భూచరులుఁ గూడి క్రీడన్ జూడన్. 301

* ఓ నీచాత్ముడా! నీవు చేసిన పాపాలకు యముడు అక్కరలేదు. ఖేచరులూ, భూచరులూ కలసి వినోదంతో చూస్తుండగా నేడు ఇక్కడే నిన్ను నా బాణాలతో ఖండిస్తాను.

వ. అని పలికి . 302

మ. బలువింటన్ గుణటంకృతంబు నిగుడన్ బ్రహ్మాండ భీమంబుగాఁ
బ్రళయోగ్రానల సన్నిభంబగు మహాబాణంబు సంధించి రా
జ లలాముండగు రాముఁ డేసె ఖరభాషాశ్రావణున్ దేవతా
బలవిద్రావణు వైరిదారజనగర్భ స్రావణున్ రావణున్. 303

* అని పలికి రాజలలాముడైన శ్రీరాముడు గొప్పదైన తన వింటి నుండి టంకారాలు చెలరేగగా పరుషవాక్కులు కలవాడూ, దేవతల సైన్యాన్ని పారదోలేవాడూ, శత్రురాజుల భార్యలకు గర్భస్రావాన్ని కలిగించేవాడూ ఐన రావణుడిపైకి ప్రళయాగ్ని సమానమైన బాణం భయంకరంగా ప్రయోగించాడు.

క. దశరథ సూనుం డేసిన, విశిఖము హృదయంబుఁ దూఱ వివశుం డగుచున్
దశకంధరుండు గూలెను, దశవదనంబులను రక్తధారలు దొరఁగన్. 304

* దాశరథి వేసినబాణం తన హృదయాన్ని దూసుకొనిపోగా దశకంఠుడు తన పదిముఖాలనుండి నెత్తురు కారుతుండగా నేలకూలాడు.

వ. అంత నా రావణుండు దెగుట విని. 305

సీ. కొప్పులు బిగి వీడి కుసుమమాలికలతో నంసభాగంబుల నావరింప
సేసముత్యంబులు సెదరఁ గర్ణిక లూడఁ గంఠహారంబులు గ్రందుకొనఁగ
వదనపంకజములు వాడి వాతెఱ లెండఁ గన్నీళ్ళవఱద లంగములు దడుప
సన్నపు నడుములు జవ్వాడఁ బాలిండ్ల బరువులు నడుములఁ బ్రబ్బికొనఁగ

ఆ. నెత్తి మోఁదికొనుచు నెఱిఁ బయ్యెదలు జాఱ, నట్టు నిట్టు తప్పటడుగు లిడుచు
నసురసతులు వచ్చి రట భూత వేతాళ, సదనమునకు ఘోరకదనమునకు. 306

* అప్పుడు అంతఃపురకాంతలు రావణుని మరణవార్త విన్నారు. కొప్పులు నడలిపోయి పూలహారాలతో పాటు మూపులపై క్రమ్ముకోగా, పాపట బొట్టుల ముత్యాలు చెదరిపోగా, చెవికమ్మలు ఊడిపోగా, కంఠహారాలు చిక్కువడగా, ముఖపద్మాలు వాడిపోగా, పెదవులు ఎండిపోగా, కన్నీళ్ళు వరదలై శరీరాలను తడిపివేయగా, సన్నటి నడుములు పాలిండ్ల బరువుచే నకనకలాడగా, పైటలు జారగా, నెత్తి బాదుకొంటూ, అటూ ఇటూ తప్పటడుగులు వేస్తూ ఆ రాక్షస స్త్రీలు భూత బేతాళాలకు ఆటపట్టయిన యుద్ధభూమికి వచ్చారు.

వ. ఇట్లు వచ్చి తమ తమ నాథులం గని, శోకించి, రందు, మందోదరి రావణుంజూచి యిట్లనియె.307

* ఇట్లా వచ్చి వాళ్లు తమ తమ భర్తలను ఆనవాలు పట్టి రోదించారు. వారిలో మందోదరి రావణుణ్ణి చూచి ఈ విధంగా విలపించింది.

**ఉ. హా దనుజేంద్ర! హా సురగణాంతక! హా హృదయేశ! నిర్జరేం**
**ద్రాదుల గెల్చి నీవు కుసుమాస్త్రుని కోలల కోర్వలేక సో**
**న్మాదమునన్ రఘుప్రవరు మానిని నేటికిఁ దెచ్చి? తప్పు డేఁ**
**గాదని చెప్పినన్ వినక కాలవశంబును బొంది తక్కటా! 308**

* హా రాక్షసేంద్రా! హృదయేశ్వరా! దేవతల పాలిటి మృత్యుదేవతవు నీవు! దేవతా శ్రేష్ఠులను గెల్చిన నీవు మన్మథుని పూల బాణాలకు ఓర్వలేక పోయావుకదా! రాముని ఇల్లాలిని ఎందుకు అపహరించి తెచ్చావు? అప్పుడు నేను వలదని చెప్పినా వినక ఇప్పు డీ విధంగా కాల గతికి చిక్కావు కదా!

**ఆ. ఎండఁగాయ వెఱచు నినుఁడు వెన్నెలఁగాయ, వెఱచు విధుఁడు గాలి వీవ వెఱచు**
**లంకమీఁద; నిట్టి లంకాపురికి మాకు, నధిప! విధవభావ మడరె నేఁడు 309**

* నాథా! ఇంతవరకూ లంకమీద సూర్యుడు ఎండకాయడానికి భయపడేవాడు. వెన్నెల కురిపించడానికి చంద్రుడు జంకేవాడు. గాలి వీచడానికి వాయుదేవుడు జడిసేవాడు. నేడు అలాంటి లంకానగరమూ, మేమూ అనాథుల మైపోయాముగదా!

**క. దురితముఁ దలఁపరు గానరు, జరుగుదు రెటకైన నిమిష సౌఖ్యంబులకై**
**పరవనితాసక్తులకును, బరధనరక్తులకు నిహముఁ బరముం గలదే? 310**

* ఇతరుల భార్యలనూ, ధనాన్ని కోరేవారు క్షణికసుఖాలకోసం దేనికైనా తెగిస్తారు. వాళ్లు పాపమని భావించరు. మంచి చెడ్డలను తలంచరు. అలాంటి వారికి ఇహపరా లుంటాయా? అని దుఃఖించింది.

**వ. అని విలపింప నంత విభీషణుండు రామచంద్రుని పంపు వడసి, రావణునకు దహనాది క్రియలు గావించె, నంత రాఘవేంద్రుండు నశోకవనంబున కేఁగి, శింశుపాతరుసమీపంబు నందు. 311**

**శా. దైతేయ ప్రమదా పరీత నతిభీతన్ గ్రంథి బంధాలక**
**వ్రాతన్ నిశ్శ్వసనానిలాశ్రుకణ జీవంజీవదారామ భూ**
**జాతన్ శుష్కకపోల కీలిత కరాబ్జాతం బ్రభూతం గృశీ**
**భూతం బ్రాణసమేత సీతఁ గనియెన్ భూమీశుఁ డా ముందటన్ . 312**

* అప్పుడు విభీషణుడు రామచంద్రుని అనుజ్ఞ పొంది రావణునికి దహనక్రియలు జరిపాడు. పిమ్మట రాముడు అశోకవనానికి వెళ్ళాడు. అక్కడ అశోకవృక్షం దగ్గర రాక్షసస్త్రీల చేత చుట్టబడినదీ, మిక్కిలి భయపడినదీ, ముడులుగా పెనగొన్న ముంగురులు కలదీ, తన నిట్టూర్పు గాలులచేత, కన్నీటిబొట్లచేత బ్రతుకుతున్న ఉద్యానవృక్షాలు కలదీ, శుష్కించిన చెక్కిలిపై చేర్చబడ్డ హస్త పద్మం కలదీ, మిక్కిలి కృశించినదీ, ఎట్లో ప్రాణాలు బిగబట్టుకొని ఉన్నదీ యైన సీతను చూచాడు.

వ. కని రామచంద్రుండును దాపంబు నొంది, భార్యవలన దోషంబు లేకుండుట వహ్నివలనం బ్రకటంబు సేసి, దేవతల పంపున దేవిం జేకొని. 313

* ఆ రామచంద్రుడు సీతను చూచి దుఃఖాన్ని పొందాడు సీతవల్ల దోషం లేదన్న సంగతిని అగ్నిముఖంగా ప్రకటింపజేసి, దేవతల అనుజ్ఞ మేరకు ఇల్లాలిని స్వీకరించాడు.

ఉ. శోషితదానవుండు నృపసోముఁడు రాముఁడు రాక్షసేంద్రతా
శేషవిభూతిఁ గల్పసమజీవివి గ మ్మని నిల్పె నర్థి సం
తోషణుఁ బాపశోషణు నదూషణు శశ్వదరోషణున్ మితా
భాషణు నార్య పోషణుఁ గృపాగుణభూషణు న వ్విభీషణున్. 314

* రాక్షసులను నాశంచేసిన రాజచంద్రుడు రామచంద్రుడు యాచకులను సంతోషింప చేసేవాడూ, పాపరహితుడూ, దోషంలేనివాడూ, కోపం లేనివాడూ, మితభాషీ, పెద్దలను సంతోషింపజేసేవాడూ, దయాగుణం అలంకారంగా కలవాడూ ఐన విభీషణుణ్ణి సమస్త రాక్షస రాజ్యానికీ అధిపతిని కావించి కల్పాంతం జీవించమని దీవించి సింహాసనం మీద నెల కొల్పాడు.

వ. ఇట్లు విభీషణ సంస్థాపనుండై రామచంద్రుండు సీతాలక్ష్మణ సమేతుండై, సుగ్రీవ హనుమదాదులం గూడికొని, పుష్పకారూఢుండై , వేల్పులు గురియు పువ్వుల సోనలం దడియుచుఁ దొల్లి వచ్చిన తెరువు జాడలు సీతకు నెఱింగించుచు, మరలి నందిగ్రామంబునకు వచ్చె; నయ్యవసరంబున. 315

* ఈ విధంగా విభీషణుణ్ణి లంకారాజ్యంలో ప్రతిష్ఠించి శ్రీరామచంద్రుడు సీతాలక్ష్మణులతో కూడి, సుగ్రీవుడు, హనుమంతుడు మొదలగు వారితో కలసి పుష్పకవిమానం ఎక్కి దేవతలు కురిపించే పూలవానలలో తడుస్తూ మునుపు వచ్చిన దారితెన్నులను సీతకు తెలుపుతూ నంది గ్రామానికి వచ్చాడు.

ఆ. రామచంద్రవిభుని రాక వీనుల విని, భరతుఁ డుత్సహించి పాదుకలను
మోచికొనుచు వచ్చి ముదముతోఁ బురజను, లెల్లఁ గొలువ నన్న కెదురు వచ్చె. 316

* అప్పుడు శ్రీరామచంద్రుని రాకను చెవులారా విన్న భరతుడు పురజనులు వెంటరాగా ఉత్సాహంతో పాదుకలను మోసుకుంటూ అన్నకు ఎదురువచ్చాడు.

వ. వచ్చి, పాదుకల ముందట నిడికొని, యెడనెడ సాష్టాంగ దండప్రణామంబులు సేయుచు, మెల్లమెల్లన డాసి, రామచంద్రుని పాదంబులు దన నొసలం గదియించి, తచ్చరణ రేణువులు దుడిచి, శిరంబునం జల్లికొని తనివిలేక మఱియు, న ప్పదకమలంబు లక్కున మోపికొనుచు, సంతసంపుఁ గన్నీటం గడిగి, సేమంబు లరయుచుండె. నంత సీతాలక్ష్మణ సహితుండై విభుండును, దన కెదురు వచ్చిన బ్రాహ్మణ జనంబులకు నమస్కరించి తక్కిన వారలచేత మన్ననలు వొంది వారల మన్నించె, నయ్యవసరంబున. 317

* అట్లా వచ్చి పాదుకలను ముందుపెట్టుకొని నడుమ నడుమ సాష్టాంగ దండప్రణామాలు చేస్తూ మెల్లగా సమీపించాడు. రామచంద్రుని పాదాలను తన నొసట చేర్చుకుంటూ. పాదధూళిని తలపై చల్లుకొని,

అంతటితో తృప్తి పడక ఆ పాదపద్మాలను అక్కున చేర్చుకొని ఆనందబాష్పాలతో కడిగి యోగక్షేమాలను విచారించాడు. అప్పుడు సీతాలక్ష్మణులతో కూడిన రాముడు తనకు ఎదురువచ్చిన బ్రాహ్మణులకు నమస్కరించాడు. మిగిలిన వారలచేత మన్ననలను పొంది వారిని ఆదరించాడు.

**చ. నృపవర! పెక్కునాళ్ల గొలె నిన్ గనకుండిన యట్టి నేఁడు మా**
**తపములు పండె నిందఱము ధన్యుల మైతి మటంచుఁ బుట్టముల్**
**చపలతఁ ద్రిప్పి పువ్వుల వసంతము లాడుచుఁ బాడుచున్ గత**
**త్రపులయి యాడుచుం బ్రజలు దద్దయుఁ బండుగ సేసి రెల్లెడన్. 318**

* 'ఓరాజా! ఇన్నాళ్లుగా నిన్ను చూడలేకున్నాము. నేడు మా తపస్సులు ఫలించాయి. మేమందరమూ ధన్యులమైనాము' అంటూ ప్రజలు నిస్సంకోచంగా ఉత్తరీయాలను పై కెగురవేస్తూ పూలవసంతా లాడుతూ, ఆడుతూ, పాడుతూ అంతటా పండుగచేసుకొన్నారు.

**సీ. కవ గూడి యిరుదెసఁ గపిరాజు రాక్షస రాజు నొక్కెడఁ జామరములు వీవ**
**హనుమంతుఁ డతి ధవళాతపత్రముఁ బట్టఁ బాదుకల్ భరతుండు భక్తిఁ దేర**
**శత్రుఘ్నుఁ డమ్ములుఁ జాపంబుఁ గొనిరాఁగ సౌమిత్రి భృత్యుఁడై చనవుసూప**
**జలపాత్ర చేఁబట్టి జనకజ గూడిరాఁ గాంచనఖడ్గ మంగదుఁడు మోవఁ**

**ఆ. బసిఁడి కేడె మర్థి భల్లూకపతి మోచి, కొలువఁ బుష్పకంబు వెలయ నెక్కి**
**గ్రహము లెల్లఁ గొలువఁ గడు నొప్పు సంపూర్ణ, చంద్రుపగిది రామచంద్రుఁ డొప్పె. 319**

* సుగ్రీవుడు, విభీషణుడు జతయై రెండు ప్రక్కలా వింజామరలు వేయగా, హనుమంతుడు వెల్లగొడుగు పట్టగా, భరతుడు భక్తితో పాదుకలను పట్టుకొని రాగా, శత్రుఘ్నుడు విల్లంబులను తేగా, లక్ష్మణుడు సేవకుడై చనువు చూపగా, సీత జలపాత్రను తీసుకొని వెంట నడువగా, అంగదుడు కాంచన ఖడ్గాన్ని ధరింపగా, జాంబవంతుడు బంగారు డాలును పట్టి సేవింపగా, సమస్త గ్రహాలూ కొలుస్తున్న పూర్ణచంద్రునిలాగా ఆ రామచంద్రుడు, పుష్పకవిమానాన్ని ఎక్కి ప్రకాశించాడు.

**వ. ఇట్లు పుష్పకారూఢుండై, కపి బలంబులు చేరి కొలువ, శ్రీరామచంద్రుం డయోధ్యకుం జనియె. నంతకు మున్న య ప్పురంబునందు. 320**

* ఇ ట్లా పుష్పక విమానాన్ని అధిరోహించి వానరసైన్యాలు తన్ను సేవిస్తుండగా శ్రీరాముడు అయోధ్యానగరంలో కాలు పెట్టాడు

**సీ. వీథులు సక్కఁ గావించి తోయంబులు సల్లి రంభాస్తంభచయము నిలిపి**
**పట్టుచీరెలు సుట్టి బహుతోరణంబులు గలువడంబులు మేలుకట్లు గట్టి**
**వేదిక లలికించి వివిధరత్నంబుల మ్రుగ్గులు పలుచందములుగఁ బెట్టి**
**కలయ గోడల రామకథలెల్ల వ్రాయించి ప్రాసాదములు దేవభవనములును**

తే. గోపురంబుల బంగారు కుండలెత్తి యెల్ల వాకింట్లఁ గానుక లేర్పరించి
జనులు గైసేసి తూర్య ఘోషములతోడ నెదురు నడతెంచి రా రాఘవేంద్రుకడకు. 321

* అంతకుముందే ఆ పట్టణంలో పౌరులు వీథులను శుభ్రం చేసి, నీళ్ళు చల్లి, అరటికంబాలను నిలిపి, పట్టువస్త్రాలను చుట్టారు. పెక్కు తోరణాలను, కలువపూదండలను, చాందినీలను కట్టారు. అరుగులను అలికించి, వివిధరత్నాలతో పలు రకాల ముగ్గులు పెట్టారు. గోడలమీద రామకథలను వ్రాయించారు. భవనాల మీదా, దేవాలయాలమీద, గోపురాల మీదా, బంగారు కలశాలను ఎత్తించారు. వాకిళ్లలో కానుకలను అమర్చి పెట్టారు. ఈ విధంగా అయోధ్యా నగరపౌరులు మంగళ వాద్యాలతో ఆ రామచంద్రునికి ఎదురువెళ్లారు.

క. సమద గజదానధారల, దుమదుమలై యున్న పెద్ద త్రోవల తోడన్
రమణీయ మయ్యె న ప్పురి, రమణుఁడు వచ్చినఁ గరంగు రమణియపోలెన్. 322

* భర్తరాకకు కరిగిపోయే భార్యలాగా ఆ అయోధ్యాపురి రామచంద్రుని రాకతో సంతోషించి మదపుటేనుగుల మదజలంవల్ల తడిసిన రాజమార్గాలతో రమణీయమైంది.

ఆ. రామభూవరేంద్రు రాకఁ దూర్యములతో, రథగజాశ్వసుభటరాజితోడ
నమరెఁ బురము, చంద్రుఁ డరుదేర ఘూర్ణిల్లు, జంతుభంగమిళిత జలధిభంగి. 323

* చంద్రుడు పొడసూపగా జలచరాలతో, అలలతో సందడించే సముద్రంలాగా అయోధ్యానగరం ఆ రామచంద్రుని రాకతో మంగళ వాద్యాల శబ్దాలతో, రథాలతో, ఏనుగులతో, గుఱ్ఱాలతో, సైనికులతో విలసిల్లింది.

వ. 'ఇట్లొప్పుచున్న య ప్పురంబు ప్రవేశించి, రాజమార్గంబుల రామచంద్రుం డరుగుచున్న సమయంబున. 324

మ. 'ఇతఁడే రామనరేంద్రుఁ డీ యబల కాయింద్రారి ఖండించె న
ల్లతఁడే లక్ష్మణుఁ డాతఁడే కపివరుం డా పొంతవాఁడే మరు
త్సుతుఁ డాచెంగట నా విభీషణుఁ' డటంచుం జేతులం జూపుచున్
సతులెల్లన్ బరికించి చూచిరి పురీసౌధాగ్ర భాగంబులన్. 325

* రామచంద్రుడు ఈ రీతిగా ఒప్పారుతున్న అయోధ్యానగరంలో ప్రవేశించి రాజమార్గంలో వెళ్ళుతుండగా "ఇతడే రాముడు! ఈమెయే సీత! ఈ అబలకోసమే రామచంద్రుడు రావణుణ్ణి ఖండించాడట! అల్లతడే లక్ష్మణుడు! అతడే సుగ్రీవుడు! ఆ చెంత నున్నవాడే హనుమంతుడు. ఆ సమీపంలోని వాడే విభీషణుడు" అని చేతులతో చూపుతూ మేడల పై భాగాలనుండి స్త్రీలు ఆసక్తితో చూచారు.

వ. ఇట్లు సమస్త జనులు సూచుచుండ రామచంద్రుండు రాజ మార్గంబునం జనిచని. 326

సీ. పటికంపు గోడలు పవడంపు వాకిండ్లు నీలంపు టరుగులు నెఱయఁ గలిగి
కమనీయమై దూర్యక స్తంభ చయముల మకరతోరణముల మహిత మగుచుఁ

బడగల మాణిక్యబద్ధ చేలంబులఁ జిగురు తోరణములఁ జెలువు మీఱి
పుష్పదామకముల భూరివాసనలను బహుతర ధూపదీపముల మెఱసి

తే. మాఱువేల్పుల భంగిని మలయుచున్న, సతులు పురుషులు నెప్పుడు సందడింప
గుఱుతు లిడరాని ధనముల కుప్పలున్న, రాజసదనంబునకు వచ్చె రామవిభుఁడు. 327

* ఇట్లా ప్రజలందరూ చూస్తుండగా రామచంద్రుండు రాజమార్గంలో వెళ్లి స్ఫటికపుగోడలు, పగడాల వాకిళ్లు, ఇంద్రనీలాలు తాపిన అరుగులు కలిగి; వైడూర్యాలు పొదిగిన స్తంభాలతో, మరకత తోరణాలతో ఒప్పారు తున్నదీ; మాణిక్యాలుకూర్చిన వస్త్రాలు కలిగిన జెండాలతోను, చిగురు తోరణాలతోనూ విలసిల్లుతున్నదీ; పూలదండలవాసనలతోను, అనేకధూప దీపాలతోను ప్రకాశిస్తున్నదీ; దేవతలను పోలిన స్త్రీపురుషుల సంచారం వల్ల సందడి కలిగినదీ, లెక్కలేనన్ని ధనరాసులకు నిలయమైనదీ ఐన రాజప్రాసాదంలో అడుగుపెట్టాడు.

వ. ఇట్లు వచ్చి. 328

ఉ. తల్లుల కెల్ల మ్రొక్కి తమ తల్లికి వందన మాచరించి య
ల్లల్ల బుధాలికిన్ వినతుఁడై చెలికాండ్రను దమ్ములం బ్రసం
పుల్లతఁ గౌఁగిలించుకొని భూవరుఁ డోలిఁ గృపారసంబు రం
జిల్లఁగఁ జాలమన్ననలు సేసె నమాత్యులఁ బూర్వభృత్యులన్. 329

* ఇట్లా వచ్చి ఆ రామచంద్రుడు తల్లులకు మ్రొక్కాడు. కన్న తల్లి ఐన కౌసల్యాదేవికి నమస్కరించాడు. పండితులపట్ల వినయాన్ని కనబరచాడు. చెలికాండ్రనూ, తమ్ములనూ ఆదరంతో కౌగిలించుకున్నాడు. మంత్రులనూ వెనకటి సేవకులనూ కనికరం ఉట్టిపడేలా చేరదీశాడు.

వ. తత్సమయంబునఁ దల్లులు. 330

చ. కొడుకులుఁ బెద్దకోడలును గొబ్బున మ్రొక్కిన నెత్తి చేతులన్
బుడుకుచు మోములుం దలలు బోరన ముద్దులు గొంచు నవ్వుచున్
దొడలకు వారి రాఁదిగిచి తోఁగఁగఁ జేసిరి నేత్రధారలన్
వెడలిన ప్రాణముల్ దగఁ బ్రవిష్టము లయ్యె నటంచు నుబ్బుచున్. 331

* ఆ సమయంలో కొడుకులూ, పెద్దకోడలూ తమకు మ్రొక్కగా తల్లులు వారిని లేవనెత్తారు. చేతులతో ముఖాలనూ, తలలను నిమురుతూ వారిని వడివడిగా ముద్దులాడారు. నవ్వుతూ ఒడుల్లోనికి తీసుకొన్నారు. 'పోయిన ప్రాణాలు లేచివచ్చాయి' అని సంతోషిస్తూ వాళ్ళను కన్నీళ్ళతో తడిపివేశారు.

వ. అంత వసిష్ఠుండు, శ్రీరామచంద్రుని జటాబంధంబు విడిపించి, కులవృద్ధులుం, దానును సమంత్రకంబుగా దేవేంద్రుని మంగళస్నానంబు సేయించు బృహస్పతి చందంబున, సముద్ర నదీ జలంబుల నభిషేకంబు సేయించె; రఘువరుండును, సీతాసమేతుండై, జలంబు లాడి, మంచి

పుట్టంబులు గట్టికొని, కమ్మని పువ్వులు దుఱిమి , సుగంధంబు లలందికొని, తొడవులు దొడిగికొని, తనకు భరతుండు సమర్పించిన రాజసింహాసనంబునం గూర్చుండి, యతని మన్నించి, కౌసల్యకుఁ బ్రియంబు సేయుచు, జగత్పూజ్యంబుగా రాజ్యంబు సేయుచుండె; నప్పుడు. 332

* అప్పుడు వసిష్ఠుడు వచ్చి శ్రీరామచంద్రుని సిగముడిని విప్పి కులవృద్ధులూ, తానూ మంత్రయుక్తంగా దేవేంద్రుణ్ణి మంగళస్నానం చేయించే బృహస్పతిలాగా- సముద్రనదీజలాలతో, అభిషేకం చేయించాడు. ఆ రామచంద్రుడు సీతతో పాటు మంగళస్నానం చేసి, నూతన వస్త్రాలను ధరించి, పుష్పాలను అలంకరించుకొని, సుగంధాలను పూసుకొని, భూషణాలను పెట్టుకొని, తనకు భరతుడు అప్పగించిన సింహాసనం మీద ఆసీనుడై, అనుజుణ్ణి ఆదరించి, కౌసల్యకు ప్రియం కలిగిస్తూ లోకం మెచ్చుకొనేటట్లుగా రాజ్యం చేయసాగాడు.

సీ. కలఁగు టెల్లను మానెఁ గంధు లేడింటికిఁ జలనంబు మానె భూచక్రమునకు;
జాగరూకత మానె జలజలోచనునకు; దీనభావము మానె దిక్పతులకు;
మాసి యుండుట మానె మార్తాండ విధులకుఁ; గావిరి మానె దిక్తటములకును;
నుడిగి పోవుట మానె నుర్వీరుహంబుల; కణఁగుట మానెఁ ద్రేతాగ్నులకును;

ఆ. గడిఁది వ్రేఁగు మానెఁ గరి గిరి కిటి నాగ, కమఠములకుఁ బ్రజల కలఁక మానె;
రామచంద్ర విభుఁడు రాజేంద్రరత్నంబు, ధరణి భరణరేఖఁ దాల్చు నపుడు 333

* రాజమహేంద్రుడైన ఆ రామచంద్రుడు భూభారాన్ని వహించి నప్పుడు సప్తసముద్రాలకు సంక్షోభం లేక పోయింది. భూచక్రానికి కంపం లేకపోయింది. విష్ణువుకు జాగరూకత అవసరం లేకపోయింది. దిక్పాలకుల దైన్యం పోయింది. సూర్యచంద్రుల వెలవెలపాటు తొలగింది. దిక్కులు అమంగళకరమైన కావిరంగును కోల్పోయాయి. చెట్లకు మోడువారే స్థితి పోయింది. త్రేతాగ్నులకు నివురుకప్పడం తప్పింది. భూమిని మోస్తున్న దిగ్గజాలకూ, కులపర్వతాలకూ, వరాహమూర్తికి, ఆదిశేషునికీ, కూర్మమూర్తికి భారం తగ్గింది.

వ. మఱియును. 334

సీ. పొలఁతుల వాలుఁజూపులయంద చాంచల్య; మబలల నడుములయంద లేమి;
కాంతాలకములంద కౌటిల్యసంచార; మతివల నడపులయంద జడిమ;
ముగుదల పరిరంభములయంద పీడన; మంగనాకుచముల యందు పోరు;
పడఁతుల రతులంద బంధసద్భావంబు;సతులఁ బాయుటయంద సంజ్వరంబు;

తే. ప్రియులు ప్రియురాండ్ర మనముల బెరసి తార్పు, లంద చౌర్యంబు; వల్లభు లాత్మసతుల
నాఁగి క్రొమ్ముళ్ళు పట్టులం దక్రమంబు; రామచంద్రుండు పాలించు రాజ్యమందు. 335

* ఇంకా ఆ రామచంద్రుడు పాలించే రాజ్యంలో స్త్రీల వాలుచూపుల్లోనే చాంచల్యం, అందగత్తెల నడుముల్లోనే పేదరికం, స్త్రీల కేశాల్లోనే కౌటిల్యం, ఆడువారి నడకల్లోనే మాంద్యం, స్త్రీల కౌగిలింతల్లోనే

పీడనం, ఆడువారి స్తనాల్లోనే సంఘర్షణ, స్త్రీలతోటి కలయికల్లోనే బంధాలు, భార్యల ఎడబాటులోనే తాపం, ప్రియులు ప్రియురాండ్ర మనసులను దోచుకొనుటలోనే దొంగతనం ఉండేవి. భర్తలు భార్యలను అడ్డగించి జడలు పట్టుకొని లాగడంలోనే అక్రమం ఉండేది.

**క. తండ్రిక్రియ రామచంద్రుఁడు, దండ్రుల మఱపించి ప్రజలఁ దా రక్షింపన్**
**దండ్రుల నందఱు మఱచిరి, తండ్రిగదా రామచంద్రధరణీపుఁ డనుచున్. 336**

* తండ్రిలాగా రామచంద్రుడు కన్నతండ్రులనూ సైతం మరపించి ప్రజలను కాపాడాడు. ప్రజలు రామచంద్రప్రభువే తమ తండ్రి అని తమ తండ్రులను మరచారు.

**వ. మఱియు, నా రామచంద్రుండు రాజర్షి చరితుండును, నిజధర్మనిరతుండును, నేకపత్నీ వ్రతుండును, సర్వలోక సమ్మతుండును నగుచు, ధర్మవిరోధంబు గాకుండఁ గోరిక లనుభవించుచుఁ ద్రేతాయుగంబైనఁ గృతయుగధర్మంబు గావించుచు, బాలమరణంబు మొదలగు నరిష్టంబులు ప్రజలకుఁ గలుగ కుండ రాజ్యంబు సేయుచుండె, నయ్యెడ. 337**

* ఇంకా ఆ రామచంద్రుడు రాజర్షులవంటి నడవడిక కలవాడు, తన ధర్మంపట్ల నిష్ఠ కలవాడు, ఏకపత్నీవ్రతుడు, సమస్తలోకాలచేత అంగీకరింపబడిన వాడు అవుతూ ధర్మానికి విరోధం కలగకుండా కోరికలను తీర్చుకొంటూ, త్రేతాయుగమైనా కృతయుగ ధర్మాలను పాటిస్తూ, ప్రజలకు బాలమరణాలు మొదలైన అరిష్టాలు కలగనివ్వకుండా రాజ్యం చేశాడు.

**ఆ. సిగ్గు వడుట గల్గి సింగారమును, గల్గి, భక్తి గల్గి చాల భయము గల్గి**
**నయముఁ బ్రియముఁ గల్గి, నరనాథు చిత్తంబు, సీత దనకు వశము చేసికొనియె. 338**

* అప్పుడు సీతాదేవి సిగ్గూ సింగారం కలిగి, భయభక్తులు గలిగి, నయమూ ప్రియమూ కలిగి శ్రీరాముని మనస్సును తనకు వశం చేసుకొన్నది.

**వ. అనిన విని పరీక్షిన్నరేంద్రుఁ డిట్లనియె. 339**

* అని శుకమహర్షి చెప్పగా విని పరీక్షిన్మహారాజు ఇట్లా అన్నాడు.

**ఆ. భ్రాతృజనుల యందు బంధువులందును, బ్రజలయందు రాజభావ మొంది**
**యెట్లు మెలఁగె? రాముఁ డీశ్వరుం డగు తన్నుఁ, గూర్చి క్రతువు లెట్లు గోరి చేసె?' 340**

* ఆ రామచంద్రుడు రాజై సోదరులపట్ల, బంధువులపట్ల, ప్రజల పట్ల ఎలా మసలుకొన్నాడు? ఏయే యజ్ఞాలు ఏ విధంగా చేశాడు?

**వ. అనిన శుకుం డిట్లనియె. 341**

* అని ప్రశ్నించగా అప్పుడు శుకుడు ఇట్లా అన్నాడు.

సీ. భగవంతుఁడగు రామభద్రుండు ప్రీతితో దేవోత్తముని సర్వదేవమయునిఁ
దనుఁదాన కూర్చి యధ్వరములు సేసెను; హోతకుఁ దూరుపు నుత్తరంబు
సామగాయకునికి శమనదిగ్భాగంబు బ్రహ్మకుఁ గ్రమమునఁ బడమ రెల్ల
నధ్వర్యునకు శేష మాచార్యునకు నిచ్చి సొమ్ములు పంచి భూసురుల కొసఁగి

తే. తనదు రెండు పుట్టంబులుఁ దనకు నైన, మెలఁత మంగళసూత్రంబు మినుకుఁ దక్క
వినతుఁడై యుండె; నా రాము వితరణంబు, పాండవోత్తమ! యేమని పలుకవచ్చు? 342

* ఓ పాండవశ్రేష్ఠుడా! భగవంతుడైన రామభద్రుడు ప్రీతితో దైవోత్తముడు, సర్వదేవమయుడు, ఐన తన్నుగూర్చి తానే యాగాలను చేశాడు. హోతకు తూర్పుదిక్కును, సామగానం చేసేవానికి ఉత్తర దిక్కును, బ్రహ్మకు దక్షిణదిక్కును, అధ్వర్యునికి పడమటి దిక్కును, మిగిలిన భాగాన్ని ఆచార్యునికి ఇచ్చివేశాడు. కట్టుబట్టలు, ఇల్లాలి తాళిబొట్టు తప్ప అన్ని ఆభరణాలనూ, సమస్త సంపదలనూ బ్రహ్మవేత్తలైన మునులకు దానంచేసి వినయంతో మెలిగాడు. ఆ రాముని దానగుణాన్ని ఏమని పొగడవచ్చు.

వ. అంత నా రామచంద్రుని దాన శీలత్వంబునకు మెచ్చి విప్రవరులు తమతమ భూములు మరల
నిచ్చి యిట్లనిరి. 343

* అప్పుడు రామచంద్రుని దానశీలానికి మెచ్చి ముని శ్రేష్ఠులు తమకు దానం చేసిన భూములను తిరిగి యిచ్చి ఇట్లా అన్నారు.;

ఆ. ధరణి వలదు మాకుఁ దపసుల కేల? నీ, వఖిలలోక గురుఁడవైన హరివి;
మా మనంబు లందు మలయు చీఁకటిఁ బాపు, భవ దుదారరుచులఁ బార్థివేంద్ర! 344

* ఓ రాజేంద్రా! రామచంద్రా! ఋషులమైన మాకు భూమి లెందుకు? నీవు అన్ని లోకాలచేత పూజింపబడే శ్రీహరివి. నీ దయ అనే కాంతులను ప్రసరింపజేసి మా మనస్సులలో క్రమ్ముకొన్న అజ్ఞానాంధకారాన్ని తొలగించు.

వ. అని పలికి బ్రహ్మణ్యదేవుండైన రామచంద్రుని వినయోక్తులం బూజించి మునులు సని రిట్లు
పెద్దకాలంబు రాజ్యంబు సేసి, రాఘవేంద్రుం డొక్కదినంబున. 345

* అని చెప్పి బ్రహ్మణ్యదేవుడైన రామచంద్రుణ్ణి వినయ వినమ్రులై పూజించి మునులు వెళ్ళారు. ఇట్లా చాలాకాలం రాముడు రాజ్యాన్ని పరిపాలించాడు.

సీ. వసుధపైఁ బుట్టెడు వార్త లాకర్ణించు కొఱకునై రాముండు గూఢవృత్తి
నడురేయిఁ దిరుగుచో నాగరజనములో నొక్కఁడు దన సతి యొప్పకున్న
నొరునింటఁ గాఁపురం బున్న చంచలురాలిఁ బాయంగ లేక చేపట్ట నేమి
తా వెఱ్ఱియగు రామధరణీశ్వరుండనే, బేల, పొమ్మను మాట బిట్టు వలుక

ఆ. నాలకించి మఱియు నా మాట చారుల, వలన జగములోనఁ గలుగఁ దెలిసి
సీత నిద్రవోవఁ జెప్పక వాల్మీకి, పర్ణశాలఁ బెట్టఁ బనిచె రాత్రి. 346

* ఒకరోజు రాజ్యంలోని విశేషాలను స్వయంగా వినడంకోసం రాముడు మారువేషంతో తిరుగుతున్నాడు. ఆ నడిరేయి అయోధ్యలోని ప్రజల్లో ఒక్కడు భార్యతో జగడమాడి " పరాయివాడింట్లో కాపురం చేసిన చంచలు రాలిని వదులుకోకుండా ఏలుకోడానికి నేనేమి ఆ వెఱ్ఱిరాముడినా?" అని కేక లేస్తుంటే విన్నాడు. లోకం అంతా కూడా ఆ విషయాన్నే కోడై కూస్తున్నదని చారుల ద్వారా తెలుసుకొన్నాడు. ఆదమరిచి నిద్రపోయే సీతకు ఆ సంగతి ఏదీ చెప్పక రాత్రికి రాత్రే ఆమెను వాల్మీకి ఆశ్రమంలో దిగబెట్టి రమ్మని ఆజ్ఞాపించాడు.

వ. అంత సీతయు గర్భిణి గావునఁ గుశలవు లనియెడి కొడుకులం గనియె. వారికి వాల్మీకి జాతకర్మంబు లొనరించె; లక్ష్మణునకు నంగదుండును, చంద్రకేతుండును; భరతునకుఁ దక్షుండును, బుష్కలుండును, శత్రుఘ్నునకు సుబాహుండును, శ్రుతసేనుండును సంభవించి రయ్యెడ. 347

* గర్భవతి ఐన సీత వాల్మీకులవారి ఆశ్రమంలో కుశలవులనే కుమారులను కన్నది. వాల్మీకి మహర్షి వారికి జాతకర్మలు చేశాడు. లక్ష్మణునికి అంగదుడు, చంద్రకేతుడు; భరతునికి తక్షుడు; పుష్కలుడు; శత్రుఘ్నునికి సుబాహుడు, శ్రుతసేనుడు అనే పుత్రులు జన్మించారు.

క. బంధురబలుఁడగు భరతుఁడు, గంధర్వచయంబుఁ ద్రుంచి కనకాదుల స
ద్బంధుఁడగు నన్న కిచ్చెను, బంధువులును మాతృజనులుఁ బ్రజలున్ మెచ్చన్. 348

* అప్పుడు బలశాలి అయిన భరతుడు దిగ్విజయం చేసి గంధర్వులను రూపుమాపి తల్లులు, బంధువులు, ప్రజలు మెచ్చేటట్లుగా అపారమైన ధనాన్నీ బంగారాన్నీ సజ్జనబంధుడైన రామచంద్రునకు సమర్పించాడు.

ఆ. మధువనంబులోన మధునందనుం డగు, లవణుఁ జంపి భుజబలంబు మెఱసి
మధుపురంబు సేసె మధుభాషి శత్రుఘ్నుఁ, డన్న రామచంద్రుఁ డౌననంగ. 349

* మధురభాషణుడైన శత్రుఘ్నుడు తన అన్న రామచంద్రుడు మెచ్చుకొనేటట్లు మధురాక్షసుడి కొడుకైన లవణాసురుణ్ణి సంహరించి మధువనంలో మధుపురాన్ని నిర్మించాడు.

వ. అంతఁ గొంతకాలంబునకు రామచంద్రుని కొమారులైన కుశలవు లిద్దఱును వాల్మీకివలన వేదాది విద్యలయందు నేర్పరులై పెక్కు సభలను సతానంబుగా రామకథాశ్లోకంబులు పాడుచు, నొక్కనాఁ డు రాఘవేంద్రుని యజ్ఞశాలకుం జని. 350

* పిమ్మట కొంతకాలానికి రామచంద్రుని కొడుకులైన కుశలవులు వాల్మీకివల్ల వేదవిద్యల్లో ఆరితేరిన వారయ్యారు. అనేక సభల్లో రామ కథాశ్లోకాలను స్వరసహితంగా గానం చేస్తూ ఒకరోజు రాముని యజ్ఞశాలకు వెళ్లారు.

మత్త. వట్టిమ్రాఁకులు పల్లవింప నవారియై మధుధార దా
నుట్టఁబాడిన వారిపాటకు నుర్వరాధిపుఁడున్ బ్రజల్
బిట్టు సంతస మంది రయ్యెడఁ బ్రీతిఁ గన్నుల బాష్పముల్
దొట్ట నౌదల లూఁచి వారలతోడి మక్కువ పుట్టఁగాన్. 351

* ఆ విధంగా వెల్లి మోళ్లు చిగురించేటట్లుగా, అమృతధారలు ఒలికేటట్లుగా వారు రామకథ గానం చేశారు. వారిపాటకు ఆ రామచంద్రుడూ, ఇతర ప్రజలూ పారవశ్యంతో ఆనందబాష్పాలు రాలుస్తూ తల లూచి, వారిపట్ల ఎక్కువ మక్కువ కలిగినవారై మిక్కిలి సంతోషాన్ని పొందారు.

వ. అంత నా రామచంద్రుండు కుమారుల కిట్లనియె. 352

ఆ. చిన్న యన్నలార! శీతాంశుముఖులార!, నళినదళ విశాలనయనులార!
మధుర భాషులార! మహి మీఁద నెవ్వరు, తల్లి దండ్రి మీకు ధన్యులార! 353

* చంద్రునివంటి ముఖములు కల ఓ ముద్దుకుఱ్ఱలారా! తామర రేకులవలె వెడల్పైన కన్నులూ, తియ్యని వాక్కులూ కల ధన్యులారా! మీ తల్లిదండ్రులెవరు'

వ. అనిన వార'లేము వాల్మీకిపౌత్రులము; రాఘవేశ్వరుని యాగంబు సూడవచ్చితి' మనవుడు మెల్లన నగి 'యెల్లి ప్రొద్దున మీ తండ్రి నెఱింగెద; రుండుండని యొక్క నివాసంబునకు సత్కరించి పనిచె; మఱునాఁడు సీతం దోడ్కొని కుశలవుల ముందట నిడుకొని వాల్మీకి వచ్చి రఘుపుంగవునిం గని యనేక ప్రకారంబుల వినుతించి యిట్లనియె. 354

* అనగా వాళ్ళు 'మేము వాల్మీకి మునీంద్రుని మనుమలం. రాఘవుని యాగాన్ని చూడవచ్చాము' అన్నారు. అప్పుడు రామచంద్రుడు మెల్లగా నవ్వి 'రేపు ప్రొద్దున మీ తండ్రిని తెలుసుకొందురు గాని ఈ పూటకు ఇక్కడే ఉండండి' అని వాళ్లను సత్కరించి వారి నివాసానికి పంపాడు. మరునాడు సీతను వెంటబెట్టుకొని, కుశలవులను ముందుపెట్టుకొని వాల్మీకిమునీంద్రుడు రఘుకుల శ్రేష్ఠుడైన రాముణ్ణి దర్శించి అనేక విధాల సంస్తుతించి ఇట్లా అన్నాడు.

ఆ. 'సీత శుద్ధురాలు, చిత్తవాక్కర్మంబు, లందు సత్యమూర్తి యమలచరిత
పుణ్యసాధ్వి విడువఁ బోలదు చేకొను, రవికులాబ్ధిచంద్ర! రామచంద్ర! 355

* ఓ రామచంద్రా! నీవు సూర్యకులమనే సముద్రానికి చంద్రుని వంటివాడవు! సీత అమాయకురాలు. మనోవాక్కాయకర్మల్లో, సత్యనిష్ఠ కలది. పరిశుద్ధమైన నడవడిక కలిగింది. పుణ్యాత్మురాలు. పతివ్రత. ఆమెను దూరం చేసుకోవద్దు. స్వీకరించు.

వ. అని వాల్మీకి వలుక, రామచంద్రుండు పుత్రార్థియై విచారింపఁ, గుశలవులను వాల్మీకికి నొప్పగించి, రామచంద్ర చరణ ధ్యానంబు సేయుచు, నిరాశయై సీత భూ వివరంబు సొచ్చె. నయ్యెడ. 356

* అని వాల్మీకి చెప్పగా రామచంద్రుడు కొడుకుల కోసం విచారించాడు. నిరాశయైన సీత కుశలవులను వాల్మీకికి అప్పగించి, రామచంద్రుని పాదాలను ధ్యానిస్తూ భూగర్భంలో ప్రవేశించింది.

మ. ముదితా! యేటికిఁ గ్రుంకి తీవు మనలో మోహంబు చింతింపవే
వదనాంభోజము సూపవే మృదువు నీవాక్యంబు విన్పింపవే
తుదిసేయం దగ దంచు నీశ్వరుఁడునై దుఃఖించె భూపాలుఁ డా
పద గాదే ప్రియురాలిఁ బాసినయెడన్ భావింప నెవ్వారికిన్? 357

* తాను భగవంతుడైనా ఆ రామభద్రుడు 'ఓ కాంతా! నీవెందుకు భూమిలోనికి క్రుంగిపోయావు? పద్మంవంటి నీ ముఖాన్ని చూపవా? నీ మృదుమధురవాక్కులు వినిపించవా? ఇట్లా నన్ను వీడిపోవడం తగదు' అంటూ దుఃఖించాడు. ఎటువంటి వారికైనా ప్రియురాలు దూరమైతే దుఃఖం కలగడం సహజమేకదా!

వ. అని వగచి, రామచంద్రుండు బ్రహ్మచర్యంబు ధరియించి, పదుమూఁడువేల యేం డ్లెడతెగకుండ నగ్ని హోత్రంబులు సెల్లించి, తానీశ్వరుండు గావునఁ దన మొదలి నెలవునకుం జనియె; ని వ్విధంబున.358

* ఆ విధంగా శోకించి రామచంద్రుడు బ్రహ్మచర్యాన్ని అవలంబించి పదమూడు వేల సంవత్సరాలు ఎడతెగకుండా అగ్నిహోత్రాలను ప్రవర్తిల్లచేసి, తాను భగవంతు డైనందువల్ల తన మొదటి చోటైన పరమ పదానికి వెళ్ళాడు.

ఆ. ఆదిదేవుఁడైన యా రామచంద్రుని, కబ్ధిఁ గట్టు టెంత యసురకోటిఁ
జంపుటెంత కపులసాహాయ్య మది యెంత, సురల కొఱకుఁ గ్రీడ చూపెఁ గాక. 359

* ఆదిదేవుడైన ఆ రామచంద్రునికి సముద్రంపై సేతువుకట్టడం, రాక్షసులను చంపడం ఎంతపని? వానరుల సాయం ఏపాటిది? ఇతర దేవతలకు తన లీలలను చూపాడంతే.

చ. వశుఁడుగ మ్రొక్కెదన్ లవణవార్ధి విజృంభణతా నివర్తికిన్
దశదిగధీశమౌళిమణి దర్పణమండిత దివ్యకీర్తికిన్;
దశశతభానుమూర్తికి సుధారుచిభాషికి సాధుపోషికిన్
దశరథరాజుపట్టికిని దైత్యపతిం బొరిగొన్న జెట్టికిన్. 360

* లవణసముద్రపు అహంకారాన్ని అణచినవానికి, దిక్పాలకుల కిరీట మణిదర్పణాల్లో ప్రకాశించే దివ్యకీర్తి కలవానికి, వేయిసూర్యుల కాంతిని పుణికిపుచ్చుకొన్న వానికి, అమృతంవలె తియ్యగా మాట్లాడేవానికి సాధువులను పోషించే వానికి, దశరథరాజు కుమారునికి , రాక్షసరాజును చంపిన వీరునికి నేను వినమ్రుడనై మ్రొక్కుతాను.

ఉ. నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు మహాశుగంబులున్
విల్లును దాల్చువాఁడు గడు విప్పగు వక్షమువాఁడు మేలు పైఁ
జల్లెడువాఁడు నిక్కిన భుజంబులవాఁడు యశంబు దిక్కులం
జల్లెడువాఁడు నైన రఘుసత్తముఁ డీవుత మా కభీష్టముల్. 361

* నల్లనివాడు, పద్మాలవంటి కన్నులు కలవాడు, గొప్పవిల్లును బాణాలను ధరించినవాడు, విశాలమైన రొమ్ము కలవాడు, మేలు చేకూర్చే వాడు, ఎగుభుజాలు కలవాడు, అన్ని దిక్కులా కీర్తిని వెదజల్లేవాడు ఐన రఘుకుల తిలకుడు మా కోరికలను తీర్చుగాక!

ఆ. రామచంద్రుఁ గూడి రాకల పోకలఁ, గదిసి తిరుగువారుఁ గన్నవారు
నంటికొన్నవారు నా కోసల ప్రజ, లరిగి రాదియోగు లరుగు గతికి. 362

* ఆ రామచంద్రునితో కలిసి మెలసి తిరిగినవారూ, తనవి తీరా చూచినవారూ, ప్రేమతో తాకిన వారూ అయిన ఆ కోసలదేశప్రజలు ఆది యోగులు పొందే సద్గతిని పొందారు.

క. మంతనములు సద్గతులకు, పొంతనములు ఘనములైన పుణ్యముల కిదా
నీంతనపూర్వమహాఘ ని, కృంతనములు రామనామ కృతి చింతనముల్. 363

* శ్రీరామనామ సంస్మరణాలు సద్గతులకు ఏకాంత మార్గాలు. గొప్ప పుణ్యాలకు ఆలవాలాలు. ఇప్పుడూ ఇంతకు ముందూ చేసిన గొప్ప పాపాలను పోగొట్టేవి.

వ. ఆ రామచంద్రునకుఁ గుశండును, గుశునకు నతిథి, యతిథికి నిషధుండును, నిషధునకు నభుండును, నభునికిఁ బుండరీకుండును, బుండరీకునకు క్షేమధన్వుండును, క్షేమధన్వునకు దేవానీకుండును, దేవానీకునకు నహీనుండును, నహీనునకుఁ బారియాత్రుండును, బారియాత్రునకు బలుండును, బలునకు జలుండను, జలునకు నర్కసంభవుం డగు వజ్రనాభుండును, వజ్రనాభునకు శంఖణుండును, శంఖణునకు విధృతియును, విధృతికి హిరణ్యానాభుండును జనియించిరి. ఆ హిరణ్యానాభుండు జైమిని శిష్యుండైన యాజ్ఞవల్క్యముని వలన నధ్యాత్మయో గంబు నేర్చి, హృదయ కలుషంబులం బాసి యోగ చర్యుండయ్యెఁ; నా హిరణ్యానాభునకుఁ బుష్యుండును, బుష్యునకు ధ్రువసంధియు, ధ్రువసంధికి సుదర్శనుండును, సుదర్శనునకు నగ్నివర్ణుండును, నగ్నివర్ణునకు శీఘ్రుండును, శీఘ్రునకు మరువను రాజశ్రేష్ఠుండును బుట్టి; రా రాజయోగి సిద్ధుండయి, కలాపగ్రామంబున నున్నవాఁడు; కలియుగాంతంబున నష్టం బయ్యెడు సూర్యవంశంబుఁ గ్రమ్మఱఁ బుట్టింపం గల వాఁ;డా మరువునకుఁ బ్రశుశ్రుకుండును, నాప్రశుశ్రుకునకు సంధియు, నతనికి నమర్షణుండును, నా యమర్షణునికి మహస్వంతుండును, నా మహస్వంతునకు విశ్వసాహ్యుండును, నా విశ్వసాహ్యునకు బృహద్బలుండును జనియించి రా బృహద్బలుండు భారత యుద్ధంబున మీ తండ్రియగు నభిమన్యునిచేత హతుండయ్యెఁ; వినుము. 364

* ఆ రామచంద్రునికి కుశుడు, కుశునికి అతిథి, అతిథికి నిషధుడు, నిషధునికి నభుడు, నభునికి పుండరీకుడు, పుండరీకునికి క్షేమధన్వుడు, క్షేమధన్వునికి దేవానీకుడు, దేవానీకునికి అహీనుడు, అహీనునికి పారియాత్రుడు, పారియాత్రునికి బలుడు, బలునికి చలుడు జన్మించారు. చలునికి విధృతి, విధృతికి హిరణ్యానాభుడు జన్మించారు. అతడు జైమిని శిష్యుడైన యాజ్ఞవల్క్యమునిని ఆశ్రయించి అధ్యాత్మయోగాన్ని నేర్చి హృదయంలో కలతలను మాని యోగచర్యుడైనాడు.

ఆ హిరణ్యానాభునికి పుష్యుడు, పుష్యునికి ధ్రువసంధి, ధ్రువసంధికి సుదర్శనుడు, సుదర్శనునికి అగ్నివర్ణుడు, అగ్నివర్ణునికి శీఘ్రుడు, శీఘ్రునికి మరువనే రాజశ్రేష్ఠుడు పుట్టారు. ఆరాజు యోగసిద్ధిని పొంది కలాపగ్రామంలో ఇప్పుడూ ఉంటున్నాడు. కలియుగాంతంలో నష్టమయ్యే సూర్యవంశాన్ని మళ్లా అతడు ప్రతిష్ఠిస్తాడు. ఆ మరువుకు ప్రశుశ్రుకుడు, ఆ ప్రశుశ్రుకునికి సంధి, అతడికి అమర్షణుడు, ఆ అమర్షణునికి మహస్వంతుడు, ఆ మహస్వంతునికి విశ్వసాహ్వుడు, ఆ విశ్వసాహ్వునికి బృహద్బలుడు జన్మించారు. ఆ బృహద్బలుడు భారతయుద్ధంలో మీ తండ్రి ఐన అభిమన్యుని చేతిలో హతుడైనాడు. విను.

## -: భవిష్యద్రాజేతిహాసము :-

తే. పరఁగ నిక్ష్వాకుఁడును బృహద్బలుఁడు మొదలుఁ, దుదయుఁ గాఁగల రాజులఁ దోడుతోడ
నెఱుఁగ జెప్పితి నీ వారి; నింకమీఁదఁ, బుట్టఁ గలవారిఁ జెప్పెద భూవరేంద్ర! 365

* ఓ రాజేంద్రా ! ఇక్ష్వాకుడు మొదలుకొని బృహద్బలుని వరకూ ప్రవర్తిల్లిన మీ వంశంలోని రాజులను గూర్చి వరుసగా వివరించాను. ఇక పుట్టబోయేవాళ్ళను గూర్చి చెబుతాను.

వ. ఆ బృహద్బలునకు బృహద్రణుండును, బృహద్రణునకు నురుక్షతుండు, నాతనికి వత్సప్రీతుండును, వత్సప్రీతునకుఁ బ్రతివ్యోముండును, బ్రతివ్యోమునకు భానుండును, భానునకు సహదేవుండును, సహదేవునకు బృహదశ్వుండును, బృహదశ్వునకు భానుమంతుండును, భానుమంతునకుఁ బ్రతీకాశ్వుండును, బ్రతీకాశ్వునకు సుప్రతీకుండును, సుప్రతీకునకు మేరుదేవుండును, మేరుదేవునకు సుతక్షత్రుండును, సుతక్షత్రునకు బుక్షకుండును, బుక్షకునకు నంతరిక్షుండును, నతనికి సుతపుండును, సుతుపునకు నమిత్రజిత్తు, నతనికి బృహద్వాజియు, నతనికి బర్హియు, బర్హికి ధనంజయుండును, ధనంజయునకు రణంజయుండును, రణంజయునకు సృంజయుండును, సృంజయునకు శాక్యుండును, శాక్యునకు శుద్ధాదుండును, శుద్ధాదునకు లాంగలుండును, లాంగలునకుఁ బ్రసేనజిత్తు నతనికి క్షుద్రకుండును, క్షుద్రకునకు బుణకుండును, బుణకునకు సురథుండును, సురథునకు సుమిత్రుండును బుట్టుదురు. సుమిత్రుని యనంతరకాలంబున సూర్యవంశంబు నశింపం గలదు. వీరలు బృహద్బలుని నుండి క్రమంబునం బుట్టంగలవారలు అని చెప్పి శుకుం డిట్లనియె. 366

* ఆ బృహద్బలునికి బృహద్రణుడు, బృహద్రణునికి ఉరుక్షత్రుడు, అతడికి వత్సప్రీతుడు, వత్సప్రీతునికి ప్రతివ్యోముడు, ప్రతివ్యోమునికి భానుడు, భానునికి సహదేవుడు, సహదేవునికి బృహదశ్వుడు, బృహదశ్వునికి భానుమంతుడు, భానుమంతునికి ప్రతీకాశ్వుడు, ప్రతీకాశ్వునికి సుప్రతీకుడు, సుప్రతీకునికి మేరుదేవుడు, మేరుదేవునికి సుతక్షత్రుడు, సుతక్షత్రునికి బుక్షకుడు, బుక్షకునికి అంతరిక్షుడు, అంతరిక్షునికి సుతపుడు, సుతపునికి అమిత్రజిత్తు, అతడికి బృహద్వాజి, అతడికి బర్హి, బర్హికి ధనంజయుడు, ధనంజయునికి రణంజయుడు, అతడికి సృంజయుడు, సృంజయునికి శాక్యుడు, శాక్యునికి శుద్ధాదుడు, శుద్ధాదునికి లాంగలుడు, లాంగలునికి ప్రసేనజిత్తు, అతడికి క్షుద్రకుడు, క్షుద్రకునికి బుణకుడు, బుణకునికి సురథుడు,

సురథునికి సుమిత్రుడు పుడతారు. సుమిత్రుని తర్వాత సూర్యవంశం నశిస్తుంది. వీరు బృహద్బలుని నుండి క్రమంగా కలుగుతారు అని చెప్పి శుకుడు ఇట్లా అన్నాడు.

సీ. 'ధన్యుఁ డా యిక్ష్వాకు తనయుఁడౌ నిమి యాగ మాచరింపఁగఁ గోరి యా వసిష్ఠ
నార్త్విజ్యమునకుఁ దా నర్థింపఁ గని యాతఁ డింద్రుని మఖము సేయింప నియ్య
కొనినాఁడ మఱి వత్తుఁ గొదవ లే దన వచ్చి సంసార మెంతయుఁ జంచలంబు
కాలయాపన మేల? గ్రతువు సేసెద' మని యన్యఋత్విక్కుల నతఁడు గూర్చి

తే. సేయ నింద్రుని యాగంబు చెల్లఁజేసి, గురుఁడు చనుదెంచి శిష్యుపైఁ గోప మెత్తి
యోరి నా వచ్చు నిందాఁక నుండ వనుచు, నతని దేహంబు వడుఁగాక యని శపించె. 367

* ధన్యాత్ముడైన ఆ ఇక్ష్వాకునికొడుకు నిమి యాగం చేయాలనుకొని ఋత్విజుడుగా ఉండడానికి వసిష్ఠమహర్షిని అర్థించాడు. అతడు 'ఇంద్రుడి యజ్ఞం చేయించడానికి ముందే ఒప్పుకున్నాను. తర్వాత వస్తాను. ఏలోటూ కలగకుండా చూస్తాను' అన్నాడు. కాని నిమి 'ఈ సంసారం నిలకడ లేనిది. కాలయాపన చేయడ మెందుకు? యజ్ఞం చేస్తాను' అని వేరే ఋత్విక్కులను ఏర్పాటు చేసుకుని యజ్ఞానికి ఉపక్రమించాడు. తర్వాత ఇంద్రుని యాగాన్ని ముగించి వచ్చి వసిష్ఠుడు నిమిపై కోపం తెచ్చుకొని 'నేను వచ్చేదాకా ఆగలేకపోయావు' అంటూ అతని శరీరం, కూలిపోవాలని శపించాడు.

వ. ఇట్లు వసిష్ఠుండు శపించిన, నిమియును వసిష్ఠుని దేహంబు వడుఁగాక యని మరల శపించిన న వ్వసిష్ఠుండు మిత్రావరుణుల వలనఁ గడపట నూర్వశికి జన్మించె. గురుశాపంబున బ్రహ్మజ్ఞాని యైన నిమి, విగతదేహుండైన, నతని దేహంబు మునీశ్వరులు గంధవస్తువులం బొదివి, దాఁచి, దొరకొన్న సత్త్రయాగంబు సెల్లించిరి. యాగంబు కడపటను దేవగణంబులు మెచ్చి వచ్చిన, వారలకు నిమిదేహంబు సూపి, బ్రతుకం జేయుం' డనవుడు వారలు 'నిమి ప్రాణంబులు వచ్చుంగాక' యని పలికిన, నిమి తనదేహంబు సారనొల్లక యిట్లనియె. 368

* ఇట్లా వసిష్ఠుడు తన్ను శపించగా నిమికూడా వసిష్ఠుని దేహం నాశన మగుగాక అని ప్రతిశాపం పెట్టాడు. వసిష్ఠుడు మిత్రావరుణులవల్ల తిరిగి ఊర్వశికి జన్మించాడు. బ్రహ్మజ్ఞాని అయిన నిమి గురుశాపం వల్ల ప్రాణాలను వదిలాడు. అతడి దేహాన్ని మునులు సుగంధద్రవ్యాల్లో భద్ర పరచి, ప్రారంభించిన సత్త్రయాగాన్ని పూర్తిచేశారు. యాగం చివర మెచ్చి వచ్చిన దేవతలకు నిమిదేహాన్ని చూపి 'బ్రతికించండి' అని ప్రార్థించారు. 'నిమిప్రాణం వచ్చుగాక' అని వాళ్ళు ఆశీర్వదించారు. కాని నిమి తుచ్ఛశరీరాన్ని పొందడానికి ఇష్టపడక ఇలా అన్నాడు.

మ. అతి మోహాకులితంబు సాంద్ర మమతాహంకారమూలంబు సం
తత నానాసుఖదుఃఖపీడిత మనిత్యం? బిట్టి దేహంబు సం
కృతి నా కేటికి? మీనజీవనము భంగిం భీతి బాహుళ్య మం
చితరుల్ పెద్దలు దీనిఁ జేకొనరు సర్వేశున్ మదిన్ గొల్చెదన్. 369

* మోహంచేత కలత పొందునదీ, మమతాహంకారాలకు మూలమైనదీ, ఎడతెగని సుఖదుఃఖాలచేత పీడింపబడేదీ, అనిత్య మైనది ఐన శరీరబంధం నా కెందుకు? వివేకవంతులు సర్వేశ్వరుడైన శ్రీహరిని సేవిస్తూ చేపబ్రతుకువలె నిరంతర మరణభయం కలిగిన ఈ శరీర బంధాన్ని స్వీకరించరు.

**వ. అని పలికిన నిమిమాటలు గ్రమ్మఱింప నేరక, శరీరులు గన్నులు దెఱచినప్పుడును, మూసినప్పుడును, నిమి గాన వచ్చుంగాక యని పల్కి దేవతలు సనిరి. అంత. 370**

* అని చెప్పిన నిమిమాటలు కాదనలేక దేవతలు 'దేహధారులకు కనురెప్పలు తెరచినప్పుడు, మూసినప్పుడు నిమి అస్తిత్వం కాన వస్తుంది' అని చెప్పి వెళ్ళారు.

**ఆ. పెద్దలైన మునులు పృథ్వీస్థలికి రాజు, లేమిఁ జూచి నిమి కళేబరంబు**
**తరువ నొకఁడు పుట్టెఁ దనయుండు వానిని, జనకుఁ డనుచుఁ బలికె జగము లెల్ల. 371**

* పిమ్మట మునీశ్వరులు రాజు లేకపోతే రాజ్యంలో అరాజకత్వం కలుగుతుందని భావించి నిమికళేబరాన్ని మథించగా ఒకకొడుకు పుట్టాడు. లోకాలన్నీ అతణ్ణి జనకు డని పేర్కొన్నాయి.

**వ. మఱియు నతఁడు విగతదేహుండు గావున వైదేహు డనియును, మథజాతుండు గావున మిథిలుం డనియుం బరఁగె. అ మ్మిథులునిచేత నిర్మితం బైనది గావున మిథిలా నగరంబు నాఁ బరఁగె; ఆ జనకునకు నుదావసుండును, నుదావసునకు నందివర్ధనుండును, నందివర్ధనునకు సుకేతుండును, సుకేతునకు దేవరాతుండును, దేవరాతునకు బృహద్రథుండును పుట్టె. అతనికి మహావీర్యుండును, నతనికి సుధృతియు, నతనికి ధృష్టకేతుండును, నతనికి హర్యశ్వుండు, నతనికి మరువు, నతనికిఁ బ్రతింధకుండును, నతనికిఁ గృతరయుండు, నతనికి దేవమీఢుండును, నతనికి విధృతుండును, నతనికి మహాధృతియు, నతనికిఁ గీర్తిరాతుండు, నతనికి మహారోముండు, నతనికి స్వర్ణరోముండును, నతనికి హ్రస్వరోముండును, నతనికి సీరధ్వజుండును బుట్టిరి. 372**

* అతడు విదేహుడివల్ల పుట్టాడు. కాబట్టి వై దేహుడని, మథించడం వల్ల పుట్టినందువల్ల మిథిలుడని ప్రసిద్ధికెక్కాడు. మిథిలునిచేత నిర్మించబడ్డ పట్టణం మిథిలానగరంగా ప్రసిద్ధమైంది. ఆ జనకునికి ఉదావసుడు, ఉదావసునికి నందివర్ధనుడు, నందివర్ధనునికి సుకేతుడు, సుకేతునికి దేవరాతుడు, దేవరాతునికి బృహద్రథుడు పుట్టారు. అతనికి మహావీర్యుడు. అతడికి సుధృతి, అతడికి ధృష్టకేతుడు, అతడికి హర్యశ్వుడు, అతడికి మరువు, అతడికి ప్రతింధకుడు, అతడికి కృతరయుడు, అతడికి దేవమీఢుడు, అతడికి విధృతుడు, అతడికి మహాధృతి, అతడికి కీర్తిరాతుడు, అతడికి మహారోముడు, అతడికి స్వర్ణరోముడు, అతడికి హ్రస్వరోముడు. అతడికి సీరధ్వజుడు పుట్టారు.

**ఆ. అతఁడు మఖము సేయ నవని దున్నింపంగ, లాంగలంబుకొనను లక్షణాంగి**
**సీత జాత యయ్యె సీరధ్వజుండన, దానఁ జెప్పఁబడియె ధన్యుఁ డతఁడు. 373**

* అతడు యజ్ఞం చేయడానికి భూమిని దున్నింపగా నాగేటిచాలులో శుభలక్షణవతి ఐన సీత దొరికింది. అందుకే పుణ్యాత్ముడైన అతణ్ణి సీర ధ్వజుడని అన్నారు.

వ. ఆ సీరధ్వజునకుఁ గుశధ్వజుండును, గుశధ్వజునకు ధర్మధ్వజుండును, ధర్మధ్వజునకుఁ గృతధ్వజ, మితధ్వజులను వారిద్దఱుఁ బుట్టిరి. అందుఁ గృతధ్వజునకుఁ గేశిధ్వజుఁ డుదయించె. అతండుఁ దన్నుఁ దా నెఱింగెడి విద్యయందు నేర్పరి య య్యె. మితధ్వజునకు ఖాండిక్యుం డనువాఁడు జన్మించి, తండ్రివలన నెఱుక గలవాఁడై, కర్మతత్త్వంబు నేర్చి, కేశిధ్వజునివలన భీతుండై యేగె, ఖాండిక్యునకు భానుమంతుండును, భానుమంతునకు శతద్యుమ్నుండును, శతద్యుమ్నునికి శుచియు, శుచికి సనద్వాజుండును, సనద్వాజునకు నూర్ధ్వకేతుండు, నూర్ధ్వకేతునకు నజుండును, నజునకుఁ గురుజిత్తును, గురుజిత్తునకు నరిష్టనేమియు, నరిష్టనేమికి శ్రుతాయువు, శ్రుతాయువునకుఁ బార్శ్వుండును, బార్శ్వునకుఁ జిత్రరథుండును, జిత్రరథునకు క్షేమాపియు, క్షేమాపికి హేమ రథుండును, హేమరథునకు సత్యరథుండును, సత్యరథునకు నుపగురుండును, ఉపగురునకు నగ్నిదేవుప్రసాదంబున నుపగుర్వుండును, ఉపగుర్వునకు సావనుండును, సావనునకు సువర్చ సుండును గలిగె, అతఁడె సుభూషణుండని వినంబడు. ఆ సుభూషణునకు జయుండును, జయునకు విజయుండును, విజయునకు ధృతుండును, ధృతునకు ననఘుండును, అనఘునకు వీతిహవ్యుం డును, వీతిహవ్యునకు ధృతియు, ధృతికి బహుళాశ్వుండును, బహుళాశ్వునకుఁ గృతియుఁ, గృతికి మహావశియును జన్మించిరి. వీరలు మైథిలులగు రాజులని చెప్పంబడుదురు. యోగీశ్వరు ప్రసాదంబున గృహస్థులై యుండియు బంధవిముక్తులై యాత్మజ్ఞానంబు గలిగి, నిరంతర బ్రహ్మానుసంధానంబు సేయుచు నుండుదురు అని పలికి శుకయోగీంద్రుం డిట్లనియె. 374

* ఆ సీరధ్వజునికి కుశధ్వజుడు, కుశధ్వజునికి ధర్మధ్వజుడు, ధర్మధ్వజునికి కృతధ్వజుడు, మితధ్వజుడు అనే ఇద్దరు కొడుకులు పుట్టారు. వారిలో కృతధ్వజునికి కేశిధ్వజుడు జన్మించాడు. అతడు ఆత్మవిద్యలో నేర్పరి అయ్యాడు. మితధ్వజునికి ఖాండిక్యుడు జన్మించాడు. అతడు తండ్రివల్ల కర్మకాండలను నేర్చి కేశిధ్వజునికి భయపడి పారిపోయాడు. ఖాండిక్యునికి భానుమంతుడు, భానుమంతునికి శతద్యుమ్నుడు, శతద్యుమ్నునికి శుచి, శుచికి సనద్వాజుడు, సనద్వాజునికి ఊర్ధ్వకేతుడు, ఊర్ధ్వకేతునికి అజుడు, అజునికి కురుజిత్తు, కురుజిత్తుకు అరిష్టనేమి, అరిష్టనేమికి శ్రుతాయువు, శ్రుతాయువుకు పార్శ్వకుడు, పార్శ్వకునికి చిత్రరథుడు. చిత్రరథునికి క్షేమాపి, క్షేమాపికి హేమరథుడు, హేమరథునికి సత్యరథుడు, సత్యరథునికి ఉపగురుడు, ఉపగురునికి అగ్నిదేవుని అనుగ్రహం వల్ల ఉపగుర్వుడు, ఉపగుర్వునికి సావనుడు, సావనునికి సువర్చసుడు కలిగారు. అతడు సుభాషణుడని పిలువబడ్డాడు.

ఆ సుభాషణునికి జయుడు, జయునికి విజయుడు, విజయునికి ధృతుడు, ధృతునికి అనఘుడు, అనఘునికి వీతిహవ్యుడు, వీతిహవ్యునికి ధృతి, ధృతికి బహుళాశ్వుడు, బహుళాశ్వునికి కృతి, కృతికి మహావశి జన్మించారు. మిథిలరాజులైన వీరందరూ మైథిలు లని చెప్పబడతారు. వీరందరూ యోగీశ్వరుల అనుగ్రహం పొంది గృహస్థులై ఉండికూడా బంధాలను తెంచుకుని ఆత్మజ్ఞానం కలిగి బ్రహ్మానుసంధానం చేస్తూ ఉంటారు అని చెప్పి శుకమహర్షి ఇట్లా అన్నాడు.

## -: చంద్రవంశ్యులగు రాజుల యితిహాసము :-

ఆ. చంద్రగౌరమైన చంద్రవంశమునందుఁ, జంద్రకీర్తితోడ జనితమైన
యట్టి పుణ్యమతులు నైళాదిరాజుల, నింక వినుము మానవేంద్రచంద్ర! 375

* ఓ రాజచంద్రుడా! చంద్రునివలె తెల్లనైన చంద్రవంశంలో కీర్తిమంతుడైన చంద్రునివల్ల పుట్టిన పురూరవుడు మొదలైన పుణ్యాత్ములైన రాజుల చరిత్ర విను!

సీ. ఒకవేయుతలలలో నుండు జగన్నాథు బొడ్డుఁ దమ్మిని బ్రహ్మ పుట్టె మొదల;
నతనికి గుణముల నతనిఁ బోలిన దక్షుఁ, డగు నత్రి సంజాతుఁ డయ్యె; నత్రి
కడగంటి చూడ్కులఁ గలువలసంగడీఁ, డుదయించె విప్రుల కోషధులకు
నమరఁ దారాతతి కజుని పంపున నాథుఁడై యుండి రాజసూయంబు సేసి

తే. మూఁడులోకములను గెల్చి మోఱకమునఁ, జని బృహస్పతి పెండ్లాముఁ జారుమూర్తిఁ
దార నిలుసొచ్చి కొనిపోయి తన్ను గురుఁడు, వేఁడునందాఁక నయ్యింతి విడువఁ డయ్యె. 376

* వేయితలలు కలిగిన శ్రీహరినాభికమలంలో నుండి మొదట బ్రహ్మ పుట్టాడు. అతడికి అతడిని పోలిన గుణవంతుడైన అత్రి జన్మించాడు. అత్రి కడగంటి చూపుల నుండి చంద్రుడు ఉదయించాడు. బ్రహ్మ ఆనతి మేరకు అతడు బ్రాహ్మణులకూ, ఓషధులకూ, నక్షత్రసమూహానికి రాజయ్యాడు. అతడు రాజసూయయాగాన్ని చేసి ముల్లోకాలనూ గెల్చాడు. అతడు బృహస్పతి భార్య అందగత్తె అయిన తారను మూర్ఖత్వంతో లేవదీసుకొని పోయాడు. తాత ఐన బ్రహ్మదేవుడు జోక్యం చేసుకొనేటంత వరకూ ఆమె నతడు వదలి పెట్టలేదు.

వ. అంత వేల్పులతో రక్కసులకుం గయ్యం బయ్యె, బృహస్పతి తోడి వైరంబునం జేసి, కావ్యుఁడు రాక్షసులతోఁ జేరికొని చంద్రునిఁ జేపట్టి, సురాచార్యునిం బోఁదోలిన హరుండు భూతగణసమేతుండై, తన గురుపుత్త్రుండైన బృహస్పతినిఁ జేపట్టె. దేవేంద్రుడును, సురగణంబులుం, దానును బృహస్పతికి నడ్డంబు వచ్చె, అ య్యవసరంబున బృహస్పతి భార్యా నిమిత్తంబున రణంబు సురాసుర వినాశకరం బయ్యె. ఆలోన బృహస్పతి తండ్రియగు నంగిరసుండు సెప్పిన విని బ్రహ్మదేవుండు చంద్రునిం గోపించి, గర్భిణి అయిన తారను మరల నిప్పించినం జూచి, బృహస్పతి దాని కిట్లనియె. 377

* అప్పుడు దేవతలతో రాక్షసులకు యుద్ధం జరిగింది. బృహస్పతి తోడి విరోధం వల్ల రాక్షసులూ శుక్రాచార్యుడూ చంద్రుని పక్షం చేరి బృహస్పతిని వెళ్లగొట్టారు. శివుడు భూతగణాలతో పాటు గురుపుత్రుడైన బృహస్పతికి బాసటగా నిలిచాడు. దేవేంద్రుడు దేవగణాలతో పాటు బృహస్పతికి అండగా వచ్చాడు. అప్పుడు బృహస్పతి భార్య నిమిత్తంగా యుద్ధం జరగింది. రెండు పక్షాలలోని వారు నాశన మయ్యారు. ఆ లోపుగా బృహస్పతి తండ్రి అయిన అంగిరసుడు యుద్ధాన్ని ఆపు చేయించమని బ్రహ్మను కోరాడు. బ్రహ్మదేవుడు వచ్చి చంద్రుణ్ణి మందలించి, గర్భిణి అయిన తారను చంద్రునికి ఇప్పించాడు. అప్పుడు బృహస్పతి ఆమెతో ఇట్లా అన్నాడు.

ఉ. సిగ్గొకయింతలేక వెలచేడియ భంగిని ధర్మకీర్తులన్
బొగ్గులు సేసి జారు శశిఁ బొంది కటా! కడు పేల దెచ్చి కొం
టెగ్గు దలంపఁగా వలదె యిప్పుడు గర్భము దించుకొమ్ము నిన్
బ్రగ్గఁగ జేసెదన్ జెనఁటి మానవతుల్ నినుఁ జూచి మెత్తురే? 378

* ఓ అపవిత్రురాలా! ఏ మాత్రం సిగ్గులేక వేశ్యలాగా ధర్మాన్నీ, కీర్తినీ నాశనం చేసి ఆ చంద్రుడి పొందుకోరి కడుపెందుకు తెచ్చుకున్నావు? పాపచింత అక్కరలేదా? గర్భాన్ని దించుకో, నిన్ను నిలువునా కాల్చేస్తాను. మానవతులు నిన్ను చూచి మెచ్చుకుంటారా?

వ. అని కోపించుచుండ, నా చెలువకుఁ బసిండిచాయ మేనుగల కుఱ్ఱ పుట్టె. వానిం జూచి మోహంబు చేసి, బృహస్పతి తన కొడుకనియునుం, జంద్రుండు దన కన్నవాఁ డనియును, జగడించిరి. అప్పుడు- 379

* అని కోపగించుకొంటుండగా ఆమెకు బంగారం వంటి దేహకాంతి గల పిల్లవాడు పుట్టాడు. ఆ బిడ్డను చూచి మోహాన్ని పొందిన బృహస్పతి వాడు తనకొడుకనీ, చంద్రుడు తన బిడ్డడనీ వాదులాడుకున్నారు.

ఆ. వారి వాదు చూచి వారింపఁగా వచ్చి, యేర్పరింపలేక యెల్లమునులు
నమరవరుల నడుగ నా వేడుకలకత్తె, యెఱుఁగుఁ గాని యితరు లెఱుఁగ రనిరి. 380

* అప్పుడు దేవతలూ మునులూ వారి తగవును తీర్చడానికి వచ్చారు. ఎవరిబిడ్డో తేల్చలేకపోయారు. నిజం ఆ వగలాడికే తెలుసు. ఇతరులకు తెలియదన్నారు.

వ. ఆ పలుకులు విని, సిగ్గుపడి యున్న తారకుఁ జిన్ని కొమరుం డిట్లనియె. 381

* ఆ మాటలను విని సిగ్గుపడుతున్న తల్లితో ముద్దులకొడుకు ఇట్లా అన్నాడు.

క. ఇలువరుస చెడఁగ బంధులు, దలవంపఁగ మగఁడు రోయఁ దల్లీ! కట్టా!
వెలినేల నన్ను గంటివి, కలిగించినవాఁడు శీతకరుఁడో గురుఁడో. 382

* తల్లీ! ఇంటి పరువు పోయేటట్లుగా, బంధువులు తలవంచుకొనేటట్లుగా, మగడు అసహ్యించు కొనేటట్లుగా అన్యులవల్ల నన్నెందుకు కన్నావు? నన్ను పుట్టించినవాడు చంద్రుడా? బృహస్పతా? చెప్పు.

వ. అని పలుకుచున్న కొడుకునకు మాఱు మాటలాడనేరకున్న తార నేకాంతంబునకుం జీరి మంతనంబున బ్రహ్మ యిట్లనియె. 383

* అని అడిగిన కొడుకుకు సమాధానం చెప్పలేక ఊరకున్న తారను బ్రహ్మ ఏకాంతానికి పిలిచి రహస్యంగా ఇట్లా అన్నాడు.

మ. చెలువా! నీయెల సిగ్గు వాసి, గురుఁడో శీతాంశుఁడో యెవ్వడౌ
లలితాకారుఁ గుమారుఁ గన్న యతఁ? డేలా దాఁప? నీ పాటు నీ

**తలనే పుట్టెనె? వెచ్చ నూర్పకుము; కాంతల్ కామినుల్ గారె? మా**
**టల నిందేమియుఁ బోదుపో యొరులతోడం జెప్పు; విన్పింపవే. 384**

* ఓ కాంతా! సిగ్గుపడటం మాని ఈ ముద్దులకుఱ్ఱవాడి కన్న తండ్రి చంద్రుడా? బృహస్పతా? చెప్పు. ఎందుకీ విషయాన్ని దాస్తావు? ఆ బుద్ధి నీకె పుట్టిందా? ఎందుకు నిట్టూరుస్తావు? కాంతలు కాముకురాండ్రుకదా? నోరు విప్పిన మాత్రాన ఏమీ కాదులే! ఇతరులతో చెప్పను. నిజం చెప్పు.

**వ. అని పలికిన బ్రహ్మకు నెదురుమాటాడ వెఱచి , మంతనంబున నయ్యింతి చంద్రునికిం గన్న దాన ననవుఁడు నా బాలకునకు బుధుండని పేరు పెట్టి, చంద్రున కిచ్చి బ్రహ్మ సనియె. నంత. 385**

* అని అడిగిన బ్రహ్మకు ఎదురుచెప్పడానికి భయపడి ఆమె మెల్లగా చంద్రుడి వల్ల కన్నాను అన్నది. అప్పుడు బ్రహ్మ ఆ బాలుడికి బుధుడని పేరు పెట్టి చంద్రునికి అప్పగించి వెళ్ళాడు.

**ఆ. బుద్ధిమంతుడైన బుధుఁడు పుత్త్రుండైన, మేను పెంచి రాజు మిన్ను ముట్టె;**
**బుద్ధిగల సుతుండు పుట్టినచోఁ దండ్రి, మిన్ను ముట్టకేల మిన్నకుండు? 386**

* పిమ్మట తనకొడుకైన బుధుడు అన్ని విధాలా బుద్ధిమంతు డయ్యాడని చంద్రుడు వృద్ధి చెంది ఆకాశాన్ని ముట్టాడు. బుద్ధిమంతుడైన కొడుకు పుడితే తండ్రి ఉప్పొంగకుంటాడా?

**వ. ఆ బుధునకుఁ దొల్లి చెప్పిన యిళాకన్యక వలనఁ బురూరవుండు పుట్టె; ఆ పురూరవునకుఁ గల శౌర్యసౌందర్య గాంభీర్యాది గుణంబులు నారదుని వలన నింద్ర సభలోన నూర్వశి విని, మిత్రావరుణుల శాపంబున మనుష్యస్త్రీరూపంబు దాల్చి, భూలోకంబునకు వచ్చి, పురూరవు ముందట నిలువంబడి. 387**

* ఆ బుధునికి ఇది వరకే చెప్పినట్లు ఇళాకన్యవల్ల పురూరవుడు పుట్టాడు. అతడి సౌందర్యాన్నీ, శౌర్యాదిగుణాలను ఇంద్రసభలో ఊర్వశి నారదుడి వల్ల విన్నది. మిత్రావరుణుల శాపం వల్ల ఆమె మనుష్యరూపాన్ని పొంది భూలోకానికి వచ్చింది.

**తరలము.**

**సరసిజాక్షు మృగేంద్రమధ్య విశాలవక్షు మహాభుజున్**
**సురుచి రానన చంద్రమండల శోభితున్ సుకుమారు నా**
**పురుషవర్యుఁ బురూరవుం గని పువ్వుటంపరజోదుచేఁ**
**దొరఁగు క్రొవ్విరి తూపులన్ మదిఁ దూలపోవఁగ భ్రాంతయై. 388**

* ఆ విధంగా వచ్చిన ఊర్వశి తామరలవంటి కన్నులు కలవాడు, సింహం నడుమువంటి సన్నని నడుము కలవాడు, విశాలమైన రొమ్ము కలవాడు, గొప్ప భుజాలు కలవాడు, చంద్రునివంటి కాంతిమంతమైన ముఖం కలవాడు, సుకుమారుడు అయిన పురూరవుణ్ణి చూచింది. మన్మథుడు వేసే వాడిబాణాలకు తూలిపోయి వివశు రాలయింది.

వ. ఊర్వశి నిలిచి యున్నంత 389

ఉ. భావజు కోలయో? మొగులువాసి వెలుంగు మెఱుంగొ? మోహినీ
దేవతయో? నభోరమయొ? దీని కరగ్రహణంబు లేనిచో
జీవన మేటి కంచు మరుచేఁ జిగురా కడిదమ్ము జిమ్ములం
దా వడఁకెన్ బురూరవుఁడు తామర పాకు జలంబు కైవడిన్. 390

* అట్లా నిలబడిఉన్న ఊర్వశి మన్మథుడు తన్ను వశీకరించు కోవడం కోసం సిద్ధపరచిన ఎరవలెనూ, మబ్బుతొలగి వెలిగే మెరుగు వలెనూ, మోహినీ దేవతవలెనూ, ఆకాశలక్ష్మి వలెనూ పురూరవునికి కన్పించింది. "ఈమెను చేపట్టకపోతే బ్రతుకెందుకు?" అనుకొంటూ ఆ పురూరవుడు మన్మథుని చిగురాకుకత్తి దెబ్బలవల్ల తామరాకు మీది నీటిబొట్టులాగా చలించాడు.

వ. ఇట్లు రాచపట్టి చెఱకు వింటి వాని దాడికి నోడి, యెట్టకేలకు సైరణచేసి నిలుకడం దెచ్చికొని; యచ్చెలువ కిట్లనియె. 391

* ఈ విధంగా ఆ రాజకుమారుడు మన్మథుని దాడికి వెనుకాడి తుదకు కుదుటబడి ఆమెతో ఇట్లా అన్నాడు.

ఉ. ఎక్కడనుండి రాక? మన కిద్దఱికిం దగు నీకుఁ దక్కితిన్
ప్రుక్కడి వచ్చెనే యలరు ముల్కుల వాఁడడిదంబుఁ ద్రిప్పు చే
దిక్కు నెఱుంగ నౌ యబల! దేహము దేహము గేలుఁ గేల నీ
చెక్కునఁ జెక్కు మోపి తగు చెయ్వుల నన్ను విపన్నుఁ గావవే. 392

* ఓ సుందరీ! నీ వెక్కడినుండి వచ్చావు? మన ఇద్దరికీ ఈడూ జోడూ బాగా కుదిరింది. నేను నీకు చిక్కాను. మన్మథుడు కత్తి తిప్పుతూ విజృంభించాడు. నాకు దిక్కుతోచడం లేదు. నన్ను దయచూడు. నీ బిగికౌగిలి ప్రసాదించు. విపన్నుడనైన నన్ను కటాక్షించు. రక్షించు.

వ. అనినం బ్రోడచేడియ యిట్లనియె 393

* అనగా ప్రౌఢురాలైన ఊర్వశి పురూరవునితో ఇట్లా అన్నది.

మ. ఇవి నా కూర్చుతగళ్ళు రెండు దగ నీ వెల్లప్పుడున్ గాచె దే
ని వివస్త్రుండవు గాక నాకడ సదా నీవుండు దేనిన్ విశే
ష విలాసాధిక! నీకు నా ఘృతము భక్ష్యంబయ్యె నేనిన్ మనో
జ వినోదంబుల నిన్నుఁ దేల్తు నగునే చంద్రాన్వయగ్రామణీ! 394

* రసికశిరోమణి! శశికుల గ్రామణీ! ఈ రెండుపోట్టేళ్ళు నాకు ప్రాణ సమానమైనవి. నీ వెప్పుడూ వీటిని కంటికి రెప్పలా కాపాడేటట్లయితే, నా చెంత నీవు దిగంబరుడవు కాకుండా మెలిగేటట్లయితే, నాకు వలెనే నేయి నీకు ఇష్టమయ్యేట ట్లయితే నిన్ను మన్మథసుఖాల్లో ఓలలాడిస్తాను. ఈ నియమాలు నీకు అంగీకారమేనా?

వ. అని పల్కిన వేల్పుల వెలయాలి ప్రతిమాటల కియ్యకొని తన మనంబున. 395

క. మంచిదఁట రూపు ననురతి, నంచిత యఁట దేవగణిక యఁట మరుచేతన్
సంచలితచిత్తయై కా, మించిన దఁట యింతకంటె మేలుం గలదే. 396

వ. అని నిశ్చయించుకొని 397

* అని పలికిన దేవవేశ్య నియమ నిబంధనలకు అంగీకరించి పురూరవుడు తన మనస్సులో 'ఇది అన్ని విధాలా బాగుంది. మంచి రూపాన్ని పుట్టుకను ప్రోగుచేసుకొన్న దేవవేశ్య ఈమె. పైగా మన్మథ పరవశురాలై నన్ను కామించింది. ఇంతకంటె మేలుందా?' అని నిశ్చయించు కొన్నాడు.

ఆ. రాజు రాజముఖిని రతిఁ దేల్చె బంగారు, మేడలందుఁ దరుల నీడలందుఁ
దోఁటలందు రత్నకూటంబులందును, గొలఁకులందు గిరుల కెలఁకులందు. 398

* ఆ పురూరవుడు ఆ అందాలరాశి ఐన ఊర్వశిని బంగారు మేడల లోనూ, చెట్ల నీడలలోనూ, పూలతోటలలోనూ, రత్నకూటాలలోనూ, సరస్సులలోనూ, గిరిశిఖరాలలోను సురతసౌఖ్యాలలో ముంచి తేల్చాడు.

వ. అంత న య్యిద్దరకుం తగులంబు నెలకొనిన 399

క. ఒక దిక్క యేగుదురు వా, రొకచోటన కాని నిలిచి యుండరు దమలో
నొకటియె మనమున నెంచుచు, నొకనిమిషము పాయకుందు రువిదయుఁ దానున్. 400

* అప్పు డా యిద్దరికీ చక్కగా పొత్తు కుదిరింది. ఆ ఇద్దరూ ఒక దిక్కే వెళ్ళేవారు. ఒక చోటే నిలచేవారు. ఒకటిగానే తలచేవారు. క్షణ కాలమైన ఒకరిని విడిచి ఒకరు ఉండేవారు కారు.

క. దయ్య మెఱుంగును వారల, నెయ్యంబును మక్కువలును నిజమరితనముల్
వియ్యములును నెడసందినిఁ, బయ్యదకొం గడ్డమైనఁ బ్రాణము వెడలున్. 401

* వారిద్దరి స్నేహాలు, ప్రేమలూ, నెయ్యాలూ, వియ్యాలూ ఆ దేవుడికే తెలుసు. ఇద్దరి మధ్య పైటకొంగు అడ్డమైనా ప్రాణాలు పోయి నంతగా విలవిలలాడే వాళ్ళు.

వ. ఇ ట్లూర్వశియుం బురూరవుండు నొం డొరువుల వలన మక్కువలు చెక్కులొత్తం బగళ్ళు రేలు నెల్లెడల విహరింప నొక్కనాఁడు దేవలోకంబున దేవేంద్రుండు గొలువుండు తతిఁ గొలువున నూర్వశి లేకుండుటం జూచి. 402

* ఇ ట్లా ఊర్వశీపురూరవులు పరస్పరం అనురాగాలు అతిశయించే టట్లు రాత్రనక పగలనక అన్ని చోట్లా తామై విహరించారు. అప్పుడు ఒక రోజు దేవలోకంలో దేవేంద్రుండు కొలువుదీరి ఉన్నప్పుడు సభలో ఊర్వశి లేకుండడం గమనించాడు.

క. ఇన్ని దినంబులవలె నా, యున్న సభామధ్యవేది యూర్వశి లేమిన్
విన్నఁ దనంబున నున్నది, వన్నె దఱఁగి యున్న పసిఁడివడువున ననుచున్. 403

వ. ఇంద్రుండు గంధర్వులం బనిచిన వారు నడురేయిం జని చీఁకటి నూర్వశి పెంచుకొన్న యేడకంబులం బట్టిన నవి రెండును మొఱవెట్టిన వాని మొఱ విని రతిఖిన్నుండై మేనుమఱచి కూరుకుచున్న పురూరవు కౌఁగిటనుండి యూర్వశి యిట్లనియె. 404

* ఇన్నిదినాలూ ఊర్వశి లేకపోవడం వల్ల నా సభాప్రదేశం వన్నె తగ్గిన బంగారంలాగా కళావిహీనమై ఉంది. ఇంద్రుడు ఊర్వశిజాడ తెలుసుకోవడం కోసం గంధర్వులను పంపాడు. వారు వెళ్ళి నడిరేయి చీకటిసమయంలో ఊర్వశి పెంచుకుంటున్న పొట్టేళ్లను పట్టుకున్నారు. అవి అరచి మొరపెట్టాయి. రతి వల్ల అలసి ఒళ్ళు మరచి నిద్రపోతున్న పురూరవుడి కౌగిట్లోని ఊర్వశి వాటి మొరను ఆలకించి ఇట్లా అన్నది!

మ. 'అదె నా బిడ్డలఁ బట్టి దొంగలు మహాహంకారులై కొంచు ను
న్మదులై పోయెద; రడ్డపాటునకు సామర్థ్యంబునన్ హీనుఁడై
కదలం డీ మగపంద; కూరుకుగతిం గన్మూసి గుర్వెట్టుచున్
వదలం జాలఁడు నాదు కౌఁగిలియు దా వంధ్యాత్ముఁడై చెల్లరే' 405

* "అదిగో నాబిడ్డలవంటి పొట్టేళ్లను దొంగలు ఎత్తుకొని పోతున్నారు. అడ్డుపడడానికి చేవలేకుండా ఈ పిరికిమగడు కాలుకదపడం లేదు. తాను చేతగానివాడై కళ్ళుమూసుకొని నిద్రపోతూ గుర్రు పెడుతూ నా కౌగిలి వదలడం లేదు. ఇది ఇతడికే చెల్లింది."

క. పగతురు దొంగల రేఁపఁగ, మగఁటిమి వాటింపలేక మగతన మెల్లన్
మగువల కౌఁగిటఁ జూపెడు, మగవాఁడగుకంటె మగఁడు మగువగు టొప్పున్. 406

* "విరోధులు దొంగలను ఉసిగొల్పగా పౌరుషం కనబరచక స్త్రీల కౌగిట్లో మాత్రమే మగతనం చూపే మగడు మగవాడవడం కంటె ఆడుది కావడమే బాగు."

ఆ. అధముఁడైన వాని కా లగుకంటె న, త్యధికునింట దాసి యగుట మేలు;
హీనుఁ బొంది యోని హింసింపఁగా నేల? యువతిజనుల కూరకుంట లెస్స. 407

* "అల్పుడైన వానికి భార్యకావడం కంటె గొప్పవానింట దాసి కావడమే మేలు. స్త్రీలు పౌరుషహీనుడి పొందుకోరి బాధపడ్డం కన్నా ఊరకుండడమే మేలు."

క. ఏటిది నీరాచఱికం, బాఁటది మొఱవెట్టఁ బశువులాతురపడ నో
యాఁటదని లేచి దొంగల, గీఁటవు వెడలంగ శవముక్రియ నుండె దిదే. 408

* "నీ రాజరికం ఎందుకు? ఒక ఆడకూతురు మొరపెట్టినా, నోరులేని పశువులు బాధపడుతున్నా పట్టించుకోవు. దొంగలను తరిమికొట్టవు. పీనుగలాగా పడి ఉన్నావు."

**క. వినియు వినవు రణభీరువు, మనుజాధము నిదురబోతు మందుని నకటా!**
**నినుఁ జక్రవర్తిఁ జేసిన, వనజాసనుకంటె వెఱ్ఱివాఁడును గలఁడే. 409**

* "విన్నా విననట్లే ఉన్నావు. నీలాంటి పిరికివాణ్ణి, మనుష్యాధముణ్ణి, నిదురపోతును, మందుణ్ణి చక్రవర్తిగా చేసిన బ్రహ్మకంటె వెఱ్ఱి వాడున్నాడా?"

**వ. అని పెక్కుభంగుల నయ్యింతి, పరుషోక్తులను కరవాలమ్ములు చెవులఁజొనుప, నా రాజశేఖరుం డంకుశంబు పోట్ల నడరు మదగజంబు చందంబున చీరమఱచి, దిగంబరుండై వాలు కేల నంకించి, నడురేయి దొంగల నఱకి వైచి మేషంబుల విడిపించుకొని, తిరిగివచ్చునెడ. 410**

అని అనేక విధాల ఆ ఊర్వశి పరుషమైన మాటలనే పదునైన బాణాలను పురూరవుని చెవుల్లో గుచ్చుకొనేటట్లు చేసింది. వెంటనే ఆ రాజశ్రేష్ఠుడు అంకుశం పోట్లచేత కలవరపడే మదపుటేనుగులాగా కట్టుబట్ట మరచి దిగంబరుడై చేత కత్తినందుకున్నాడు. పరుగుపరుగున పోయి ఆ అర్ధరాత్రి దొంగలను తెగనరికి పొట్టేళ్లను విడిపించుకొని తిరిగి వచ్చాడు.

**ఆ. చీఱలేని మగనిఁ జెలువ దా నీక్షించి, కన్ను మొఱఁగి పోవఁ గడఁక నతఁడు**
**వెఱ్ఱివానిభంగి వివశుఁడై పడి లేచి, పొటిలి తెఱలి స్రుక్కి సొక్కిపడియె. 411**

* అప్పుడు దిసమొలతో ఉన్న మగణ్ణి చూచి ఊర్వశి ఆ క్షణమే మాయమై పోయింది. ఆ పురూరవుడు వెఱ్ఱివాడిలాగా వశంతప్పి నేలమీద పడి పొర్లి పొర్లి దుఃఖించాడు.

**వ. మరియుఁ బురూరవుండు మదనాతురుండై, వెతకుచు, సరస్వతీ తీరంబునఁ జెలికత్తెలతోఁ గూడియున్న నూర్వశిం గని, వికసితముఖుండై యిట్లనియె. 412**

* ఆ పురూరవుడు మదనవేదనతో ప్రియురాలిని వెదకుతూ సరస్వతీ నదీతీరంలో చెలికత్తెలతో కలిసి ఉన్న ఊర్వశిని చూచి విప్పారిన ముఖంతో ఇట్లా అన్నాడు.

**మ. తనుమధ్యా! యిది యేల వచ్చి తకటా ధర్మంబె శర్మంబె మున్**
**మనలో నుంకువలాడి కొన్న పలుకుల్ మర్యాదలున్ దప్పెనే**
**నిను నేఁ బాసిన యంతనుండి తనువు న్నేలం బడంబాఱె మే**
**దినిపై వ్రాలకమున్న నన్నుఁ గరుణాదృష్టిన్ విలోకింపవే! 413**

* ఓ సుందరీ! ఇట్లా ఎందుకు వచ్చావు? ఇది ధర్మమేనా? ఈపని నీకు సంతోషకర మైనదేనా? ఇదివరలో మనం మనసు విప్పి చెప్పికొన్న సుద్దులను, ఏర్పరచుకొన్న హద్దులను మరచావా? నీకు దూరమైనప్పటి నుండి నా శరీరం క్రుంగిపోతూ ఉంది. క్రూరమృగాలు నా దేహాన్ని పీక్కుతినకుండా దీనుడనైన నన్ను కనికరింపవా?

**వ. అనిన నూర్వశి యిట్లనియె. 414**

క. మగువలకు నింత లొంగెదు; మగవాఁడవె నీకు పశువుమాడ్కిన్ వగవం
దగవే మానుషపశువును, మృగములు గని రోయుఁగాక మేలని తినునే. 415

* అనగా ఊర్వశి ఇట్లా అన్నది-ఆడవాళ్లకు ఇంతగా దాసోహమనే నీవూ ఒక మగవాడివా? పశువులాగా దుఃఖించడం ధర్మమేనా? మనుష్యరూపంలో ఉన్న పశువును క్రూరమృగాలుకూడా తినడానికి అసహ్యించుకొంటాయి.

వ. అదియునుం గాక. 416

మ. తలఁపుల్ చిచ్చులు మాట లుజ్జ్వల సుధాధారల్ విభుండైన పు
వ్విలుతున్ మెచ్చర యన్యులన్ వలతురే విశ్వాసమున్ లేదు క్రూ
రలు తోడుం బతినైనఁ జంపుదు రధర్మల్ నిర్దయల్ చంచలల్
వెలయాండ్రెక్కడ వారి వేడబము లా వేదాంతసూక్తంబులే. 417

* అదీగాక చపలచిత్తలైన చెలువల తలపులు చిచ్చులవంటివి. మాటలేమో అమృతధారలు. మగువలు మన్మథుడే మగడైనా మెచ్చరు. ఇతరులను లెక్కచేస్తారా? వారికి విశ్వాసం ఏ కోశానా లేదు. క్రూర స్వభావం వాళ్ళది. తోబుట్టువులనైనా భర్తనైనా చంపడానికి వెను కాడరు. ధర్మం, దయా ఏ మాత్రం లేని చంచలచిత్తలైన వేశ్య లెక్కడ? ప్రేమ లెక్కడ? వేదాంతసూక్తాలైనా అర్థమవుతాయి కానీ వారి మాయలు అంతుచిక్కవు!

ఉ. ఇంకొక యేఁడు వోయిన నరేశ్వర! యాతలిరేయి నీవు నా
లంకెకు వచ్చి యాత్మజుల లక్షణవంతులఁగాంచె దేమియున్
గొంకక పొమ్ము నావుడును గొమ్మను గర్భిణిఁ గాఁ దలంచుచున్
శంక యొకింత లేక నృపసత్తముఁ డల్లనపోయె వీటికిన్. 418

* 'ఓ రాజా! ఇంకొక సంవత్సరం గడిచాక అవతలిరాత్రి నన్ను కలసి లక్షణవంతులైన కొడుకులను పొందుతావు. అనుమానమేమీ పెట్టుకోక వెళ్ళు' అని ఊర్వశి చెప్పగా, అతడు ఆమె గర్భంతో ఉందని భావిస్తూ ఏ మాత్రం శంకలేకుండా తన పట్టణానికి వెళ్లాడు.

వ. ఇట్లు మరలి చని, తన పురంబున నొక్కయేఁడుండి, పిదప నూర్వశికడ కేగి యొక్కరేయి పురూరవుం డ య్యింతికడ నున్న, నా వెలఁదియు గంధర్వుల వేఁడికొనుము. నన్నిచ్చెదరు అనవుడు నతండు గంధర్వులను బ్రార్థించిన, వారలతండు పొగడుటకు మెచ్చి, యగ్నిస్థాలి నిచ్చిన, న య్యగ్ని స్థాలి నూర్వశింగాఁ దలంచుచు, దానితో నడవిం దిరుగుచుండి, యొక్కనాఁ డగ్నిస్థాలి యని యెఱింగి, వనంబున దిగవిడిచి, యింటికిఁ జనుదెంచి, నిత్యంబు రాత్రి దానిన చింతించుచుండఁ, ద్రేతాయుగంబు సొచ్చిన నా రాజుచిత్తంబునం గర్మబోధంబులై, వేదంబులు మూఁడు మార్గంబులం దోఁచిన, నా భూ వరుండు స్థాలికడకుం జని, యందు శమీగర్భజాతంబైన యశ్వత్థంబుఁ జూచి, యశ్వత్థంబుచేత నరణులు రెండు గావించి, ముందటి యరణి దానును, వెనుకటి యరణి నూర్వశియును, రెంటినడుమ నున్న కాష్ఠంబు పుత్రుండు నని, మంత్రంబు చెప్పుచుం ద్రచ్చుచుండ, జాతవేదుండను

నగ్ని సంభవించె. నతఁడు విహితారాధన సంస్కారంబునం జేసి, యాహవనీయాది రూపంబుల మూఁట నెగడి పురూరవుని పుత్రుండని కల్పింపం బడియె. ఆ యగ్ని పురూరవునిఁ బుణ్యలోకంబునకుం బనుపం గారణం బగుటం జేసి. 419

* ఇట్లా వెళ్లిన పురూరవుడు తన పట్టణంలో ఒక సంవత్సరం ఉండి పిమ్మట ఊర్వశి దగ్గరకు వెళ్లి ఒకరాత్రి ఆమెతో గడిపాడు. అప్పుడామె 'గంధర్వులను ప్రార్థించు. నన్ను నీకు అనుగ్రహిస్తారు' అన్నది. పురూరవుని పొగడ్తలకు మెచ్చిన గంధర్వులు అతడికి ఒక కుంపటి నిచ్చారు. పురూరవుడు ఆ కుంపటిని ఊర్వశిగా భావిస్తూ దానితో పాటే అడవిలో తిరుగుతూ ఉన్నాడు. ఒకరోజు అది ఊర్వశి కాదని తెలిసికొని ఆ కుంపటిని అడవిలోనే వదలి ఇంటికి వెళ్ళాడు. ప్రతిరాత్రీ ఊర్వశినే స్మరిస్తూ కాలం గడిపాడు. త్రేతాయుగం ప్రవేశించగానే ఆ రాజు చిత్తంలో కర్మబోధ అయి మూడు వేదాలు సాక్షాత్కరించాయి. అతడు కుంపటిని పారవేసిన చోటికి వెళ్లి శమీవృక్షం లోంచి పుట్టిన రావిచెట్టును చూచాడు. రావిచెట్టు నుండి రెండు అరణులను చేసి పైనున్న అరణి తాననీ, క్రింద ఉన్న అరణి ఊర్వశి అనీ, ఆ రెంటి నడుమ ఉన్న కాష్ఠం కొడుకనీ మంత్రం చెబుతూ మథించాడు. అప్పుడు జాతవేదుడనే అగ్ని పుట్టాడు. పురూరవుడు త్రయీవిద్యతో దాన్ని మూడగ్నులుగా సంస్కరించగా అది ఆహవనీయాది రూపియై వర్ధిల్లి పురూరవుని కొడుకుగా కల్పింపబడింది. ఆ అగ్ని పురూరవుణ్ణి పుణ్యలోకాన్ని పొందించడానికి సమర్థమైంది.

క. ఆ యగ్నిచేఁ బురూరవుఁ, డా యజ్ఞేశ్వరు ననంతు హరి వేదమయున్
శ్రీయుతుఁ గూర్చి యజించె గు, ణాయుతుఁ డూర్వశిఁ గనంగ నరిగెడు కొఱకై. 420

* ఊర్వశి ఉన్న లోకానికి వెళ్లడం కోసం పురూరవుడు ఆ అగ్నితో యజ్ఞేశుడూ, అనంతుడు, వేదమయుడు ఐన శ్రీహరిని గూర్చి యజ్ఞం చేశాడు.

ఉ. ఒక్కడ వహ్ని వేల్పు పురుషోత్తముఁ డొక్కఁడ సర్వవాఙ్మయం
బొక్కఁడ వేద మా ప్రణవ మొక్కఁడ వర్ణము తొల్లి త్రేతయం
దెక్కటి మాన్పి మూఁడుగను నేర్పఱిచెన్ దనబుద్ధి పెంపుచేఁ
జక్కఁగ నా పురూరవుఁ డశక్తులకున్ సులభంబులౌ గతిన్. 421

* త్రేతాయుగానికి పూర్వం అగ్ని అఖండమై ఉండేది. నారాయణుడు ఒక్కడే దేవత. ప్రణవం ఒక్కటే వేదంగా ఉండేది. సర్వ వాఙ్మయమూ అందులోనే యిమిడి ఉండేది. ఒకే వర్ణం ఉండేది. ఆపురూరవుడు తన బుద్ధి పెంపుతో శక్తిహీనులకు కూడా కర్మమార్గం సుకర మయ్యేటట్లుగా ఒక్కటిని మూడుగా ఏర్పరచాడు.

వ. ఇట్లు వేదవిభాగంబు గల్పించి, యాగంబు సేసి, పురూరవుం డూర్వశియున్న గంధర్వలోకంబునకుం జనియె. అతనికి నూర్వశిగర్భంబున నాయువు, శ్రుతాయువు, సత్యాయువు, రయుండు, జయుండు విజయుం డన నార్గురు పుత్త్రులు గలిగిరి, అందు శ్రుతాయువునకు వసుమంతుండును, సత్యాయువునకు ద్రుతంజయుండును, రయునకు శ్రుతుండు, నేకుండు నన నిరువురును గలిగిరి, జయునకు నమితుండును, విజయునకు భీముండును జనించిరి. ఆ భీమునకుఁ గాంచనుండును, గాంచనునకు

**హోత్రకుండును, హోత్రకునకు గంగా ప్రవాహంబు పుక్కిటం బట్టిన జహ్నుండును , జహ్నునకుఁ బూరుండును, బూరునకు బాలకుండును, బాలకునకు నజకుండును, నజకునకుఁ గుశుండును, గుశునకుఁ గుశాంబుండు, ధూర్తయుండు, వసువు, కుశనాభుం డన నలువురును సంభవించిరి. అందుఁ గుశాంబునికి గాధి యనువాఁడు గలిగె. ఆ గాధి రాజ్యంబు సేయుచుండ. 422**

* ఈ విధంగా వేదవిభాగాన్ని కల్పించి, యజ్ఞం చేసి ఆ పురూరవుడు గంధర్వలోకానికి వెళ్ళాడు. అతనికి ఊర్వశివలన ఆయువు శ్రుతాయువు, సత్యాయువు, రయుడు, జయుడు, విజయుడు అనే ఆరుమంది కొడుకులు కలిగారు. వారిలో శ్రుతాయువుకు వసుమంతుడు, సత్యాయువుకు శ్రుతంజయుడు, రయునికి శ్రుతుడు, ఏకుడు అనే యిద్దరు, జయునికి అమితుడు, విజయునికి భీముడు జన్మించారు. ఆ భీమునికి కాంచనుడు, కాంచనునికి హోత్రకుడు, హోత్రకునికి గంగాప్రవాహాన్ని పుక్కిటబట్టిన జహ్నుడు, జహ్నునికి పూరుడు, పూరునికి బాలకుడు, బాలకునికి అజకుడు, అజకునికి కుశుడు, కుశునికి కుశాంబుడు, ధూర్తయుడు, వసువు, కుశనాభుడు అనే నలుగురు కొడుకులు పుట్టారు. వారిలో కుశాంబునికి గాధి అనేవాడు కలిగి రాజ్యాధిపతి ఐనాడు.

**సీ. సత్యవతిని గాధిజాతను కన్యను విప్రుఁడు ఋచికుండు వేఁడుకొనిన**
**గాధియు సుత కీడు గాఁడని తెల్లని, నవకంపు మేనులు నల్లచెవులు**
**గల గుఱ్ఱముల వేయు కన్యకు నీ వుంకు విచ్చిన గూఁతురు నిత్తు ననిన**
**వసుధామరుండును వరుణుని కడ కేగి హరులఁ దెచ్చినఁ గూఁతు నాతఁ డిచ్చె**

**ఆ. నా మహాత్ము సతియు నత్తయుఁ గొడుకులఁ, గోరి యడుగ నీయకొని యతండు**
**విప్రరాజ మంత్ర వితతుల వేల్పించి, చరువుసేసి గ్రుంకఁ జనియె నదికి. 423**

* ఆ గాధిరాజు కూతురు సత్యవతి, బ్రాహ్మణుడైన ఋచికుడు ఆ కన్యను తన కిమ్మని గాధిరాజును అర్థించాడు. తన కూతురికి అతడు ఈడు కాడని భావించాడు గాధిరాజు. తెల్లని మృదుదేహాలను, నల్లని చెవులను కలిగిన వేయి గుఱ్ఱాలను శుల్కంగా ఇస్తే తన కూతురిని ఇస్తానని ఋచికునితో అన్నాడు. అతడు వరుణుణ్ణి అడిగి అటువంటి గుఱ్ఱాలను తీసుకొని రాగా గాధిరాజు తన కూతురిని అతడి కిచ్చాడు. భార్యా అత్త ఇద్దరూ పుత్రులు కావాలని ఋచికుణ్ణి కోరారు. అతడు దానికి సమ్మతించి బ్రహ్మమంత్రాలతోను, క్షత్రియమంత్రాలతోనూ వేల్చి, హవిస్సు తయారు చేసి, స్నానం చేయడానికి నదికి వెళ్లాడు.

**వ. అయ్యెడం దల్లి యడిగిన సత్యవతి బ్రహ్మమంత్రంబుల వేల్పించిన చరువు దల్లి కిచ్చి, క్షాత్ర మంత్రంబులం దల్లికి వేల్పించిన చరువు దా నందుకొని యుండ, నా ముని సనుదెంచి, వీడ్వడుట యెఱింగి, భార్య కిట్లనియె. 424**

* అప్పుడు తల్లి అడగ్గా సత్యవతి బ్రహ్మమంత్రాలతో వేల్పించిన హవిస్సును తల్లికిచ్చి, క్షాత్రమంత్రాలతో తల్లికోసం వేల్పించిన హవిస్సును తాను గ్రహించింది. అప్పుడు ముని వచ్చి హవిస్సులు తారుమారు కావడం తెలుసుకొని భార్యతో ఇట్లా అన్నాడు.

**ఆ. తల్లి చరువు నీవు దాల్చి నీ చరువేల, తల్లిపాల నిడితి తరళనేత్ర!**
**కొమ్మ! యింక నీకుఁ గ్రూరుఁడు పుట్టు మీ, యమ్మ బ్రహ్మవిదుని ననఘుఁ గాంచు. 425**

* తల్లికోసం ఉంచిన హవిర్భాగాన్ని నీవు గ్రహించి, నీ కోసం ఉంచిన హవిర్భాగాన్ని ఎందుకు మీ అమ్మ కిచ్చావు? ఇక మీదట నీకు క్రూరుడైన కొడుకు పుడతాడు. మీ అమ్మ బ్రహ్మజ్ఞాని అయిన పుణ్యాత్ముణ్ణి కంటుంది.

**వ. అనిన, నయ్యింతి వెఱచి మ్రొక్కి, వినయంబు లాడినం బ్రసన్నుండై, నీ కొడుకు సాధువై, నీ మనుమండు క్రూరుం డగుంగాక యని , రుచికుం డనుగ్రహించిన నా సత్యవతికి జమదగ్ని సంభవించె, ఆ సత్య వతియునుం గౌశికీనదియై, లోకపావనియై ప్రవహించె. ఆ జమదగ్నియు రేణువుకూఁతురు రేణుకను వివాహంబై, వసుమనాది కుమారులం గనియె నందు. 426**

* అనగా సత్యవతి భయపడి అతడికి నమస్కరించి ప్రాధేయపడింది. అప్పుడు ఋచికుడు ప్రసన్నుడై 'నీ కొడుకు సాధువూ, మనుమడు క్రూరుడూ అవుతారు' అని అనుగ్రహించగా సత్యవతికి జమదగ్ని జన్మించాడు. ఆ సత్యవతి లోకాన్ని పావనం చేస్తూ కౌశికీనదియై ప్రవహించింది. ఆ జమదగ్ని రేణువుకూతురైన రేణుకను పెళ్ళిచేసుకొని వసుమనాది పుత్రులను పొందాడు.

**క. పురుషోత్తము నంశంబున, ధర జమదగ్నికి జనించె ధన్యుఁడు రాముం**
**డిరువది యొకమఱి నృపతుల, శిరములఁ జక్కడిచెఁ దనదు చేగొడ్డంటన్. 427**

* పురుషోత్తముని అంశవల్ల పరశురాముడు జమదగ్నికి కుమారుడై తన గండ్రగొడ్డలితో ఇరవై ఒక్కమారు రాజుల తలలు ఖండించాడు.

**వ. అనిన విని, భూవరుండు శుకున కిట్లనియె. 428**

* అని చెప్పగా విని పరీక్షిత్తు శుకునితో ఇట్లా అన్నాడు.

## -: పరశురాముని చరిత్రము :-

**ఉ. ఏటికిఁ జంపె రాముఁ డవనీశులఁ బల్వుర వారియందుఁ ద**
**ప్పేటిది విప్రుఁడయ్యు నతఁడేటికి రాజస తామసంబులన్**
**వాటముఁ బొందె భూభరము వారిత మౌటది యే విధంబు నా**
**మాటకు మౌనిచంద్ర! మఱి మాట ప్రకాశము గాఁగఁ జెప్పవే. 429**

* ఓ మునీంద్రా! పరశురాముడు అంతమంది రాజులను ఎందుకు చంపాడు? వారేం తప్పుచేశారు? బ్రహ్మకులంలో పుట్టిన రాముడు రాజస తామస గుణాలను ఎందుకు పొందాడు? భూభారం ఎలా తొలగించబడింది? నా మాటకు విశదంగా సమాధానం చెప్పవా?

వ. అనిన విని శుకుం డిట్లనియె. 430

సీ. హైహయాధీశ్వరుం డర్జునుం డనువాఁడు ధరణీశ్వరులలోనఁ దగినవాఁడు
పురుషోత్తమాంశాంశుఁ బుణ్యదత్తాత్రేయు నారాధనము చేసి యతని వలనఁ
బరిపంథి జయమును బాహుసహస్రంబు నణిమాది గుణములు యశము బలము
యోగీశ్వరత్వంబు నోజయుఁ దేజంబు చెడని యింద్రియములు సిరియుఁ బడసి

తే. గాలికైవడి సకల లోకంబు లందుఁ, దనకు పోరాని రారాని తలము లేక
యెట్టిచో నైనఁ దనయాజ్ఞ యేపు మిగుల, ధరణి వెలుఁగొందె వినువీథిఁ దరణి మాడ్కి. 431

* అని అడగ్గా శుకుడు ఇట్లా అన్నాడు.

హైహయవంశపురాజులలో కార్తవీర్యార్జునుడు అన్ని విధాలా గొప్పవాడు. నారాయణాంశ కలిగిన దత్తాత్రేయుణ్ణి ఆరాధించి అతడి కృపవల్ల శత్రువిజయమూ, వేయిచేతులూ, అణిమాది సిద్ధులూ, యశస్సూ, ఓజస్సూ, తేజస్సూ, అఖండమైన ఇంద్రియ పటుత్వమూ పొందాడు. అతడు అన్ని లోకాల్లోనూ గాలిలాగా అడ్డూ ఆపు లేక విజృంభించి తిరుగుతూ, తన ఆజ్ఞకు ఎదురులేక ఆకాశంలో సూర్యుడిలాగా భూమండలం మీద వెలుగొందాడు.

మ. ఒకనాఁ డా మనుజేంద్రుఁ డంగనలతో నుద్దాముఁడై వీట నుం
డక రేవానది కేగి యందుఁ దెలినీటం జల్లుపోరాడి దీ
ర్ఘ కరాబ్జంబుల నా నదీజలములం గట్టెన్; వడిన్ నీరు మ్రో
లకుఁ బెల్లుబ్బి రణాగతుండయిన యా లంకేశుపైఁ దొట్టఁగన్. 432

* ఒకనా డారాజు గర్వితుడై పట్టణం వదలి భార్యలతో కలసి రేవానదికి వెళ్ళాడు. జలక్రీడ లాడుతూ కార్తవీర్యార్జునుడు తన పొడవైన చేతులతో ఆ నదీజలాలను అరికట్టాడు. అప్పు డానీళ్ళు ముందువైపుగా పెల్లుబికి కయ్యానికి వచ్చిన రావణుడివైపు ఉరవడితో ప్రవహించాయి.

వ. ఇట్లు దిగ్విజయార్థంబు వచ్చిన రావణుం డా రాజుచే కట్టం దొట్టిన యేటినీటికి సహింపక రోషంబునం బోటరియుంబోలె నమ్మేటి మగనితోడి పోరాటకుం దొడరినఁ బాటింపక తన బాహుపాటవంబున. 433

* ఇ ట్లా దిగ్విజయార్థం వచ్చిన రావణుడు కార్తవీర్యార్జునుని చేతులతో అరికట్టబడి ప్రవహించిన నదీజలాలను సహించలేక పోయాడు. అతడు రోషంతో వీరుడిలాగా పరాక్రమవంతుడైన కార్తవీర్యుడితో కయ్యానికి దిగాడు. కార్తవీర్యార్జునుడు అతణ్ణి ఏ మాత్రం లెక్కచేయలేదు.

క. వీఁకమెయి నతఁడు రావణుఁ, గూఁకటు లగలించి పట్టికొని మోఁకాళ్లం
దాఁకించి కోఁతికైవడి, నాఁకం బెట్టించెఁ గింకరావళిచేతన్. 434

* కార్తవీర్యార్జునుడు తన భుజబలంతో ఆ రావణుణ్ణి జుట్టుపట్టుకొని మోకాళ్ళతో పొడిచి కోతిని కట్టిపడవేసినట్లు తన భటులచేత కట్టించి చెరసాలలో పెట్టించాడు.

వ. అంత నర్జునుండు మాహిష్మతీపురంబున కేతెంచి. 435

క. ఆ రాజేంద్రుఁడు రావణు, నోరీ! యిటమీఁద నూరకుండుము; జగతిన్
వీరుఁడ ననకుము; కాచితిఁ, బోరా; యని సిగ్గుపఱిచి పుచ్చెను మరలన్. 436

* పిమ్మట కార్తవీర్యార్జునుడు మాహిష్మతీపురానికి వచ్చి రావణుణ్ణి చూచి 'ఓరీ! ఇక మీదటైనా ఊరక పడిఉండు. లోకంలో నేనే వీరుణ్ణి అని విఱ్ఱవీగవద్దు. ఈ సారికి తప్పుకాచాను పో' అని అవమానపరచి పంపాడు.

వ. అంత. 437

సీ. ధరణీశుఁ డొకనాఁడు దైవయోగంబున వేఁటకై కాంతారవీథి కేగి
తిరిగి వేఁటల శ్రాంతదేహుఁడై జమదగ్ని ముని యాశ్రమముఁ జేరి మ్రొక్కి నిలువ
నా మునీంద్రుఁడు రాజు నర్థితోఁ బూజించి యా రాజునకు రాజుననుచరులకుఁ
దన హోమధేనువుఁ దడయక రప్పించి యిష్టాన్నములు గురియింపఁ దడవఁ

తే. గుడిచి కూర్చుండు మొదవుపైఁ గోర్కిఁ జేసి, సంపద యదేల యీ యావు చాలుఁ గాక
యిట్టి గోవుల నెన్నఁడు నెఱుఁగ మనుచుఁ, బట్టి తెండని తనయొద్ది భటులఁ బనిచె. 438

* అంతట ఒకనాడు ఆ కార్తవీర్యుడు దైవఘటనవల్ల వేటకోసం అడవికి వెళ్ళాడు. బాగా తిరిగి, అలసిపోయి, నకనకలాడే ఆకలితో జమదగ్ని ముని ఆశ్రమానికి వెళ్లి ఆయనకు నమస్కరించాడు. ఆ మునీంద్రుడు రాజును ప్రీతితో ఆదరించాడు. తన హోమధేనువును రప్పించి ఆ రాజుకు అతడి పరివారానికీ సుష్ఠుగా భోజనం పెట్టించాడు. తిని కూర్చున్న కార్తవీర్యార్జునుడికి కామధేనువుపై కోరిక కలిగింది. 'ఎన్ని సంపదలుండీ ఏం లాభం? ఇలాంటి కామధేనువు ఒక్కటుంటే చాలు' అనుకొన్నాడు. ఆ గోవును పట్టితెమ్మని భటులను ఆజ్ఞాపించాడు.

వ. పంచిన వారలు దర్పంబునం జని. 439

క. క్రేపుం బాపకుఁ డంచును, నాపదలం బడితి ననుచు నంభా యంచున్
జూపోపరు నృపు లంచును, వాపోవన్ మొదవుఁ గొంచు వచ్చిరి పురికిన్. 440

* వాళ్ళు గర్వంతో వెళ్ళి 'దూడను, నాకు దూరం చేయకండి. ఈ పీడ ఇట్లా వచ్చి పడ్డదేమి? రాజులు ఓర్వలేనివారు కదా!' అంటూ వాపోతున్న కామధేనువును పట్టుకొని పట్టణానికి తీసుకొని వెళ్లారు.

వ. అంత నర్జునుండు మాహిష్మతీ పురంబునకు వచ్చునెడ, రాముం డాశ్రమంబున కేతెంచి. 441

* పిమ్మట కార్తవీర్యార్జునుడు మాహిష్మతీపురానికి వెళ్లేటంతట్లో పరశురాముడు ఆశ్రమానికి వచ్చి జరిగినదంతా తండ్రి చెప్పగా విన్నాడు;

**ఆ. అద్దిరయ్య యింట నశనంబుఁ గుడిచి మా, యయ్య వల దనంగ నాక్రమించి**
**కోరి మొదవు రాజు గొనిపోయినాఁ డఁట, యేను రాముఁడౌట యెఱుఁగఁ డొక్కొ!. 442**

* ఔరా! మాయింట్లో సుష్టుగా భోజనం చేసి మా తండ్రి వద్దన్నా వినక దౌర్జన్యం చేసి మా కామధేనువును అపహరించుక పోయాడట. నా సంగతి అతడికి తెలియదు కాబోలు!

**వ. అని పలికి. 443**

**మ. ప్రళయాగ్నిచ్ఛట భంగిఁ గుంభి విదళింపన్ బాఱు సింహాకృతిన్**
**బెలుచన్ రాముఁ డిలేశుఁ వెంట నడచెన్ బృథ్వీతలంబెల్ల నా**
**కులమై గ్రుంగఁ గుఠారియై కవచియై కోదండియై కాండియై**
**ఛలియై సాహసియై మృగాజిన మనోజ్ఞశ్రోణియై తూణియై. 444**

* అని చెప్పి పరశురాముడు కవచాన్నీ, గండ్రగొడ్డలినీ, అమ్ముల పొదినీ, విల్లంబులనూ ధరించి జింకచర్మంతో ఒప్పారే నడుముతో కయ్యానికి సిద్ధమై ప్రళయాగ్నిలాగా, ఏనుగు వెంటబడే సింహంలాగా భూతలం దద్దరిల్లేటట్లు కార్తవీర్యార్జునుడి వెంటపడ్డాడు.

**వ. చని మాహిష్మతీపురంబుఁ జేరి నిలుచున్న సమయంబున. 445**

**మ. కనియెన్ ముందటఁ గార్తవీర్యుఁడు సమిత్కాముం బ్రకాముం శరా**
**సనతూణీరకుఠారభీము నతిరోషప్రోచ్చల ద్భ్రూయుగా**
**నన నేత్రాంచల సీము నైణపట నానా మాలికోద్దాము నూ**
**తన సంరంభ నరేంద్రదాన? శుభసూత్రక్షామునిన్ రామునిన్, 446**

* ఆ విధంగా వెళ్ళి మాహిష్మతీపురం చేరి నిలబడగా కార్తవీర్యార్జునుడు తన ఎదుట కయ్యాన్ని కోరి వచ్చినవాడూ, విల్లంబులతో, గండ్రగొడ్డలితో భయంకరంగా కన్పించేవాడు, అతిరోషంతో చలించే కనుబొమలు కడగంటి చూపులు కలవాడూ; జింకచర్మాన్నీ అనేక కంఠహారాలనూ ధరించిన పరాక్రమవంతుడూ, మిడిసిపడే రాజుల భార్యల మంగళ సూత్రాలను తొలగించే వాడూ ఐన పరశురాముణ్ణి చూచాడు.

**వ. కని కోపించి. 447**

**ఉ. బాలుఁడు వెట్టి బ్రాహ్మణుఁడు బ్రాహ్మణుకైవడి నుంట మాని భూ**
**పాలురతోడ భూరిబలభవ్యులతోడ భయంబుఁ దక్కి క**
**య్యాలకు వచ్చినాఁడు మనయం దిఁకఁ బాపము లేదు లెండు లెం**
**డేల సహింప భూసురుని నేయుఁడు వ్రేయుఁడు గూల్చుఁ డిమ్మహిన్. 448**

* చూచి ఆగ్రహోదగ్రుడైనాడు. "ఈ బాలుడైన వెట్టిబాపడు బ్రాహ్మణుడిలాగా సాత్త్వికుడై పడి ఉండక, ఏ మాత్రం భయంలేక పరాక్రమవంతులైన రాజులతో తనంత తానుగా కయ్యానికి కాలు

దువ్వుతాడా? ఇలాంటి బ్రాహ్మణుడి మీద కత్తికట్టడం పాపం కాదు. చూస్తూ ఊరుకొంటా రేమిటి? ఈ బ్రాహ్మణ్ణి నేలకూల్చండి'' అని సేనాధిపతులను పురికొల్పాడు.

వ. అని కదలించి, దండనాయకుం బురికొల్పిన, వారును రథ గజ తురగ పదాతి సమూహంబులతో లెక్కకుం బదియే డక్షౌహిణులతో నెదురు నడచి, శర చక్ర గదా ఖడ్గ భిండివాల శూల ప్రముఖ సాధనంబుల నొప్పించిన, నవ్విప్రుండు గన్నుల కొలఁకుల నిప్పులు కుప్పలుగొన రెట్టించిన కట్టల్క మిట్టిపడి, యజ్ఞోపవీతంబు చక్క నిడికొని, కరాళించి, బిట్టు దట్టించి, కఠోరంబగు కుఠారంబు సారించి, మూఁకలపై కుటికి, తొలకరి మొగంబునం గ్రొచ్చెలికపట్టునం జెట్టులు గొట్టు కృషీవలుని తెఱంగునఁ బదంబులు ద్రెంచుచు నరఁటికంబంబులఁ దెగనడచు నారామకారుని పగిది మధ్యంబులఁ ద్రుంచుచు, దాళఫలంబులు రాల్చు వృక్షారోహకుని కైవడి శిరంబులు ద్రుంచుచు, మృగంబుల వండం దుండించు సూపకారుని భంగి నవయవంబులఁ జెక్కుచు, నంతటం దనివి సనక, విలయకాలకీలి కేళిని మంట లుమియుచు, విల్లంది యెల్లెడం బిడుగుల సోనలు గురియు బలు మొగుళ్ళ వడువున నప్రమాణంబులగు బాణంబులు పఱపి, సుభటసైన్యంబుల దైన్యంబు నొందించుచు, నడ్డంబు లేని యార్భాటంబులు గల బాణవర్ష ఘృతంబులచే రాహుతులం గోపానలంబున కాహుతులు సేయుచుఁ, దురంగంబుల నిరంగంబులఁ గావించుచు, రథంబుల విశ్లథంబులుగా నొనర్చుచు, ద్విరదంబుల నరదంబులపైఁ బఱవం దోలుచు, ని వ్విధంబున సేనల నంపవానల ముంచి, రూపుమాపిన. 449

* వాళ్లు రథ గజ తురగ పదాతి దళాలతో కూడిన పదిహేడు అక్షౌహిణుల సైన్యంతో ఎదురువెళ్లి ఆ పరశురాముణ్ణి గదలూ, కత్తులూ, బాణాలూ మొదలైన ఆయుధాలతో నొప్పించారు. అప్పు డా బ్రాహ్మణుడు కన్నుల్లో నిప్పులు రాలుస్తూ రెట్టించిన కోపంతో విజృంభించి జందెం చక్కబరచుకొని, బొబ్బలు పెడుతూ, గండ్రగొడ్డలిని విసరుతూ మూకల పైకి ఉరికాడు. తొలకరి జల్లులు పడగానే చేనిలోని తుప్పలను పెల్లగించే సేద్యగాడిలాగా కాళ్లను తెగనరుకుతూ, అరటి కంబాలను తెగవేసే తోట మాలిలాగా నడుములను ముక్కలు చేస్తూ, చెట్టెక్కి తాటికాయలను రాల్చే వాడిలాగా తలలను ఖండిస్తూ, వంటకోసం మృగమాంసాన్ని తునకలు చేసే వంటవాడిలాగా వారి అవయవాలను తునుమాడాడు. అంతటితో తృప్తిపడక ప్రళయాగ్ని లాగా మంటలు గ్రక్కుతూ విల్లందుకొని పిడుగులను వర్షించే కారుమేఘంలాగా లెక్కలేనన్ని బాణాలు వేసి ఆ సైన్యాలను దురవస్థపాలు చేశాడు. ఎదురులేని బాణవర్షమనే నేతులతో మండుతున్న కోపాగ్నికి గుఱ్ఱపురౌతులను ఆహుతిచేస్తూ, గుఱ్ఱాలను తునుమాడుతూ, రథాలను కూల్చుతూ, ఏనుగులను రథాలపైకి తోలుతూ కార్తవీర్యుని సేనలను శరవర్షంలో ముంచి రూపుమాపాడు.

క. మత్తిల్లి భూతజాలము, చిత్తంబులఁ జొక్కి వేడ్క చిందులు వాఱన్
జొత్తిల్లి సమిత్తలమున, నెత్తురు మేదంబు పలలనికరం బయ్యెన్. 450

* అప్పుడు పిశాచగణాలు ఆనందపారవశ్యంతో చిందులు ద్రొక్కాయి. ఆ యుద్ధభూమి నెత్తుటితోనూ, మెదళ్ళతోనూ, మాంసఖండాలతోనూ నిండి ముద్దయి పోయింది.

వ. అ య్యవసరంబున. 451

క. మే లీ బ్రాహ్మణుఁ డొక్కఁడు, నేలం బడఁ గూల్చె సైన్యనిచయము నెల్లన్
బాలార్ప నేల యీతనిఁ, దూలించెదఁ గాక నాదు దోర్బలము వడిన్. 452

* ఆ సమయంలో "సరిసరి ఈ బ్రాహ్మణుడు ఒక్కడే ఇంత సైన్య సమూహాన్ని నేలకూల్చాడు. ఇక ఉపేక్ష చేయడం పనికిరాదు. నా భుజబలంతో ఇతనిని నాశనం చేస్తాను.''

వ. అని పలికి. 453

మ. ఒకయేనూఱు కరంబులన్ ధనువు లత్యుల్లాసియై తాల్చి వే
ఱొక యేనూట గుణధ్వనుల్ నిగుడ శాతోగ్రాస్త్రముల్ గూర్చి వి
ప్ర! కుఠారంబును నిన్నుఁ గూల్తు ననుచున్ భర్జించి పుంఖాను పుం
ఖ కఠోరంబుగ నేసె రాజు రయరేఖా ధామునిన్ రామునిన్. 454

* అని పలికి కార్తవీర్యార్జునుడు ఉత్సాహంతో ఐదువందలచేతుల్లో ధనుస్సులను పూని, మిగిలిన ఐదువందలచేతులతో అల్లెత్రాళ్ల శబ్దాలు అతిశయించేటట్లుగా వాడిబాణాలను సంధించాడు. 'ఓ బ్రాహ్మణుడా! నిన్నూ, నీ గండ్రగొడ్డలినీ నేల కూలుస్తాను చూడు' అంటూ గర్జించి గొప్పయుద్ధవేగం గల ఆ పరశురాముడిమీద ఎడతెరపి లేకుండా బాణాలను ప్రయోగించాడు.

క. వడిఁదూపు లెగయ గుడుసులు, పడి కార్ముక పంచశతము పరఁగ విభుఁడు సొం
పడరెఁ బరివేషమండలి, నడుమ ఖరద్యుతుల వెలయు నళివాపు క్రియన్. 455

* ఆ ఐదువందల బాణాలూ వలయాలుగా ఏర్పడి పరశురాముణ్ణి చుట్టుకొన్నాయి. అప్పుడు ఆ భార్గవరాముడు పరివేషమండలం మధ్యములో కిరణాలకాంతితో ప్రకాశించే సూర్యుడిలాగా ఒప్పారినాడు.

వ. ఇ ట్లర్జునుండు బాణవిలాసంబు సూపిన. 456

మ. ధరణీదేవుఁడు రాముఁడాఢ్యుఁడు జగద్ధానుష్కరత్నంబు దు
ష్కరచాపం బొక టెక్కు పెట్టి శరమున్ సంధించి పెల్లేసి భూ
వరుకోదండము లొక్కచూడ్కిఁ దునిమెన్ వాఁడంతటం బోక వే
తరువుల్ ఱువ్వఁ గుఠారధార నఱికెన్ దద్బాహుసందోహమున్. 457

* ఇట్లా కార్తవీర్యార్జునుడు భుజవిలాసం చూపగా లోకంలోని విలుకాండ్రలో మేటి ఐన పరశురాముడు ధనుస్సును ఎక్కుపెట్టి, బాణమును సంధించి కార్తవీర్యార్జునుని ధనుస్సులను ఒక్కసారిగా తుత్తునియలు చేశాడు. కార్తవీర్యుడు అంతటితో ఊరుకోక రాముడిమీదికి వేగంగా చెట్లను విసిరాడు. అప్పుడు రాముడు గండ్రగొడ్డలితో అతడి చేతులను నరికాడు.

క. కరములు దునిసిన నతనికి, శిరమొక్కటి చిక్క శైలశిఖరముభంగిం
బరశువున నదియుఁ ద్రుంచెను, బరసూదనుఁడైన ఘనుఁడు భార్గవుఁడు వడిన్. 458

* చేతులు తెగగా కొండశిఖరంలా మిగిలిన అతడి తలను శత్రు సంహారకుడైన ఆ భార్గవరాముడు వేగంగా ఖండించాడు.

ఆ. తండ్రివడిన నతని తనయులు పదివేలు, దలఁగి పోయి రతనిఁ దాఁకలేక
పరభయంకరుండు భార్గవుం డంత నా, గోవుఁ గ్రేపుతోడఁ గొనుచుఁ జనియె. 459

* తండ్రి నేల కూలగా కార్తవీర్యార్జునుని కొడుకులు పదివేలమంది రాముణ్ణి ఎదిరించలేక తలో దిక్కుగా పారిపోయారు. పిమ్మట శత్రు భయంకరుడైన రాముడు దూడతోపాటు కామధేనువును ఆశ్రమానికి తోలుకొని వెళ్లాడు.

వ. ఇట్లు హోమధేనువు మరలం దెచ్చి యిచ్చి తన పరాక్రమంబుఁ దండ్రికిం దోఁబుట్టువులకుఁ దెలియఁ జెప్పిన, జమదగ్ని రాముస కిట్లనియె. 460

* ఇట్లా హోమధేనువును మళ్లా తెచ్చి యిచ్చి రాముడు తన పరాక్రమాన్ని తండ్రికీ, తోబుట్టువులకూ సవివరంగా తెలియజేశాడు. అప్పుడు జమదగ్ని రామునితో ఇట్లన్నాడు.

క. కలవేల్పు లెల్లఁ దమతమ, చెలువంబులు దెచ్చి రాజుఁ జేయుదు రకటా!
బలువేల్పు రాజు వానిం, జలమున నిట్లేల పోయి చంపితి పుత్రా! 461

* ఓ కుమారా! అందరు దేవతలూ తమ అంశలను రాశిగా చేసి రాజును పుట్టిస్తారు. రాజంటే పెక్కుమంది దేవతల స్వరూపం. అటువంటి రాజును పంతం పట్టి వెళ్లి ఎందుకు చంపావు?

క. తాలిమి మనకును ధర్మము, తాలిమి మూలంబు ధర్మతత్త్వంబునకున్;
దాలిమి గల దని యీశుం, డేలించును బ్రహ్మపదము నెల్లన్ మనలన్. 462

* క్షమ మనకు ధర్మము. అదే మన మనుగడకు మూలం. క్షమ కలిగి ఉండడం వల్లే మనలను సర్వేశ్వరుడు బ్రహ్మపదంలో నిలిపాడు.

క. క్షమ గలిగిన సిరి గలుగును, క్షమ గలిగిన వాణి గలుగు సౌఖ్యము లెల్లన్
క్షమ గలుగఁ దోన కలుగును, క్షమ కలిగిన మెచ్చు శౌరి సదయుఁడు తండ్రీ! 463

* ఓ తండ్రీ! క్షమకలిగి ఉంటే సంపద కలుగుతుంది. క్షమ ఉంటే విద్య అబ్బుతుంది. క్షమ ఉంటే సుఖములన్నీ కలుగుతాయి. క్షమ కలిగి ఉంటే దయామయుడైన శ్రీహరి సంతోషిస్తాడు.

క. పట్టపురాజును జంపుట, గట్టలుకన్ విప్రుఁ జంపు కంటెను పాపం
బట్టిట్టనకుము నీ వీ, చెట్ట సెడన్ దీర్థ సేవ సేయుము తనయా! 464

* ఓ బిడ్డా! అభిషిక్తుడైన రాజును చంపడం బ్రహ్మహత్యకంటె మహాపాపం. నీవు మారు చెప్పవద్దు. ఈపాపం పోయేలా పుణ్యతీర్థాలను సేవించు.

**క. అని తన్నుఁ దండ్రి పనిచినఁ, బనిపూని ప్రసాద మనుచు భార్గవుఁడు రయం**
**బున నొకయేఁడు ప్రయాణము, చని తీర్థము లెల్ల నాడి చనుదెంచె నృపా! 465**

* పరీక్షిన్మహారాజా! అట్లా తండ్రి ఆనతివ్వగా మహాప్రసాదమని ఆ భార్గవరాముడు వెంటనే వెళ్ళి ఒక ఏడాదిపాటు పుణ్యతీర్థాలను సేవించి తిరిగి వచ్చాడు.

**ఉ. ఆ యెడ నొక్కనాఁడు సలిలార్థము రేణుక గంగలోనికిం**
**బోయి ప్రవాహమధ్యమునఁ బొల్పుగ నచ్చరలేమపిండుతోఁ**
**దోయవిహారముల్ సలుపు దుర్లభుఁ జిత్రరథున్ సరోజ మా**
**లాయుతుఁ జూచుచుండెఁ బతియాజ్ఞఁ దలంపక కొంత ప్రేమతో. 466**

* ఒకరోజు జమదగ్ని భార్య అయిన రేణుక నీళ్లు తేవడానికి గంగా నదికి వెళ్లింది. అప్పుడామె భర్త ఆనతిని మరచి, నది మధ్యలో తామర పూలమాలతో ఒప్పారుతూ అప్సరః స్త్రీలతో కలిసి జలక్రీడలాడే చిత్రరథుణ్ణి చూస్తూ ఉండిపోయింది.

**వ. ఇట్లు గంధర్వవల్లభునిం జూచు కారణంబునఁ దడసి. 467**

* ఇ ట్లా గంధర్వరాజును చూస్తూ ఆమె జాగు చేసింది.

**ఉ. అక్కట; వచ్చి పెద్దతడ వయ్యెడి; హోమమువేళ దప్పె; నే**
**నిక్కడ నేల యుండితి? మునీశ్వరుఁ డేమనునో యటంచుఁ దా**
**గ్రక్కునఁ దోయకుంభము శిరఃస్థలమం దిడి తెచ్చి యిచ్చి వే**
**మ్రొక్కి కరంబు మోడ్చి పతిముందట నల్లన నిల్వఁ జూచుచున్. 468**

* "అయ్యో? వచ్చి చాలసే పయింది. హోమానికి వేళ తప్పింది. నే నెందు కిట్లా నిలబడిపోయాను. ముని ఏమంటాడో కదా!" అని భయపడి వెంటనే నీటి కడవ నెత్తికెత్తుకొని వచ్చి భర్తకు నమస్కరించి బెదురుతూ నిలబడింది.

**వ. అప్పుడు. 469**

**క. చిత్తమున భార్య దడసిన, వృత్తాంతం బెఱిఁగి తపసి వేగము సుతులన్**
**మత్తం దీనిం జావఁగ, మొత్తుం డన మొత్తరైరి మునుకుచు వారల్. 470**

* అప్పుడు భార్య జాగుచేసిన సంగతిని దివ్యదృష్టితో తెలుసుకొని జమదగ్ని కొడుకులను చూచి మదించిన దీన్ని చావ మొత్తండి" అన్నాడు. వాళ్ళు దుఃఖిస్తూ చంపలేకపోయారు.

**క. కడుకొని పెండ్లముఁ జంపని, కొడుకులఁ బెండ్లాముఁ జంప గురుఁ డానతి యీ**
**నడుగులకు నెఱఁగి రాముం, డడుగిడకుండంగఁ ద్రుంచె నన్నలఁ దల్లిన్. 471**

* ఆ జమదగ్ని కొడుకులు తన భార్యను చంపలేదన్న కోపంతో భార్యను కొడుకులనూ చంపుమని రాముణ్ణి ఆజ్ఞాపించాడు. అతడు తండ్రి పాదాలకు మ్రొక్కి వెనుకాడక అన్నలను తల్లినీ ఖండించాడు.

**శా. తల్లిన్ భ్రాతల నెల్లఁ జంపు మనుచోఁ దాఁ జంపి రాకున్న బెం**
**పెల్లన్ బోవ శపించుఁ దండ్రి; తన పంపేఁ జేయుడున్ మెచ్చి నా**
**తల్లిన్ భ్రాతల నిచ్చు నిక్కము తపోధన్యాత్మకుం డంచు వే**
**తల్లిన్ భ్రాతలఁ జంపె భార్గవుఁడు లేదా చంపఁజేయాడునే. 472**

* 'తాను చెప్పిన మేరకు తల్లినీ అన్నలనూ చంపకపోతే తండ్రి కీడు కలిగేట్లుగా శపిస్తాడు. తన ఆజ్ఞను పాటిస్తే తపోధనుడైన అతడు తప్పక అన్నలనూ, తల్లినీ బ్రతికిస్తాడు' అని నిశ్చయించుకొని ఆ రాముడు తల్లినీ అన్నలనూ చంపాడు. అలా కాకపోతే చంపడానికి చేతులాడుతాయా?

**వ. ఇ వ్విధంబున. 473**

**క. అడ్డఁడు చెప్పక కడపటి, బిడ్డఁడు రాముండు సుతులఁ బెండ్లము నచటన్**
**గొడ్డంటం దెగ నడచిన, జడ్డనఁ దలయూఁచి మెచ్చె జమదగ్ని మదిన్. 474**

* ఈ విధంగా కడగొట్టు కొడుకైన రాముడు తన మాటకు అడ్డు చెప్పక గొడ్డలితో తన భార్యనూ బిడ్డలనూ వధించినందుకు ఆ జమదగ్ని మనస్సులో మెచ్చుకొన్నాడు.

**క. మెచ్చిన తండ్రినిఁ గనుఁగొని, చెచ్చెర నీ పడినవారి జీవంబులు నీ**
**విచ్చితి నను మని మ్రొక్కిన, నిచ్చెన్ వారలును లేచి రెప్పటిభంగిన్. 475**

* మెచ్చుకొన్న తండ్రిని చూచి పరశురాముడు వెంటనే ఈ చచ్చి పడిఉన్న వారి ప్రాణాలను 'ప్రసాదించానని చెప్పు' అని తండ్రి పాదాలకు నమస్కరించాడు. ముని వారి ప్రాణాలను తిరిగి అనుగ్రహించగా వాళ్ళు ఎప్పటిలాగే లేచి నిలిచారు.

**ఆ. పడిన వారి మరల బ్రతికింప నోపును, జనకుఁ డనుచుఁ జంపె జామదగ్న్యుఁ;**
**డతఁడు సంపె ననుచు నన్నలఁ దల్లిని, జనకునాజ్ఞ నైనఁ జంపఁదగదు. 476**

* చనిపోయినవాళ్లను, తనతండ్రి తపోబలంతో మళ్లా బ్రతికించ గలడని తెలుసు కాబట్టే, రాముడు ఆ విధంగా చంపాడు. అతడలా చంపాడని కన్నతండ్రి ఆన తిచ్చినా ఎవరూ తల్లినీ, అన్నలనూ చంపకూడదు.

**వ. అంత. 477**

**సీ. పరశురామున కోడి పరుగులు పెట్టిన యర్జునపుత్త్రకు లాత్మయందుఁ**
**దండ్రి మ్రగ్గుటకు సంతప్తులై పొగులుచు నింతట నంతట నెడరు వేచి**
**తిరిగి యాడుచు నొక్కదివసమం దా రాముఁ డడవి కన్నలతోడ నరుగఁ బిదపఁ**
**బగదీర్పఁ దఱి యని పఱతెంచి హోమాలయంబున సర్వేశు నాత్మ నిలిపి**

తే. నిరుపమ ధ్యాన సుఖవృత్తి నిలిచియున్న, పుణ్యు జమదగ్ని నందఱుఁ బొదివి పట్టి
కుదులకుండఁగఁ దలఁ ద్రెంచి కొనుచుఁ జనిరి, యడ్డ మే తెంచి రేణుక యడిచికొనఁగ. 478

* పరశురాముడికి భయపడి పారిపోయిన అర్జునుని కొడుకులు తండ్రి అలా చచ్చినందుకు మనసుల్లో బాధపడుతూ అదనుకోసం కనిపెట్టుకొని ఉన్నారు. ఒకరోజు పరశురాముడు అన్నలతో కలిసి అడవికి వెళ్ళాడు. పగ తీర్చుకోవడానికి అదే తగిన సమయమని వాళ్ళు వచ్చారు. యజ్ఞశాలలో సర్వేశ్వరుణ్ణి ఆత్మలో ప్రతిష్ఠించుకొని ధ్యాన వృత్తిలో ఉన్న జమదగ్నిని కదలనీకుండా పొదివి పట్టుకొన్నారు. రేణుక అడ్డం వచ్చి ఎంత మొత్తుకుంటున్నా లెక్కచేయక జమదగ్నితలను నరికి వెళ్ళారు.

వ. మఱియును. 479

మ. జనకుం జంపిన వైర మేమఱక రాజన్యాత్మజుల్ నేఁడు మీ
జనకుం జంపిరి రామ! రామ! రిపులన్ శాసింతు రమ్మంచు న
మ్మునిపై వ్రాలి లతాంగి మోఁదికొనియెన్ ముయ్యేడుమాఱుల్ రయం
బున రాముం డరుదెంచి యెన్నికొన నాపూర్ణాపదాక్రాంతయై. 480

* "ఓ రామా! రామ! తమ తండ్రిని చంపిన పగను మనస్సులో ఉంచుకొని ఇప్పుడు అర్జునుని కొడుకులు మీ తండ్రిని చంపారు. శత్రువులను శిక్షించడానికి వేగంగా రా" అంటూ భర్తమీదపడి ఆపదకు చిక్కిన రేణుక పరశురాముడు వచ్చి లెక్కపెట్టుకొనేటట్లుగా ఇరవై ఒక్కమారులు ఆక్రోశించుతూ గుండెలు బాదుకొన్నది.

వ. ఇట్లప్పుడు దల్లి మొఱ విని, జమదగ్నికుమారులు వచ్చి యిట్లని విలపించిరి. 481

* అప్పుడు తల్లి మొఱ విని, జమదగ్నికుమారులు వచ్చి యిట్లా దుఃఖించారు.

క. వాకిలి వెడలవు కొడుకులు, రాకుండఁగ నట్టి నీవు రాజసుతులచేఁ
జీకాకు పొంది పోవఁగ, నీకా ళ్లెట్లాడెఁ దండ్రి! నిర్జరపురికిన్. 482

* తండ్రీ! కొడుకులు తోడులేకుండా నీవు గడపదాటి ఎరగవే. అలాంటి నీకు రాజకుమారులచేత ఖండింపబడి ఒంటిగా స్వర్గానికి వెళ్ళడానికి ఎట్లా కాళ్లాడాయి?

వ. అని విలపించుచున్న అన్నలను జూచి రాముం డిట్లనియె. 483

* అని దుఃఖిస్తున్న అన్నలను చూచి రాముడు ఇట్లా అన్నాడు.

ఉ. ఏడువనేల తండ్రి తను వేమఱకుండుఁడు తోడులార! నే
నూడొగిఁ దీర్తునంచుఁ బరశుద్యుతి భీముఁడు రాముఁ డుగ్రుఁడై
యోడక యర్జునాత్మభవులున్న పురంబున కేగి వారు గో
డాడఁగఁ బట్టి చంపె వడి నర్జునజాతుల బ్రహ్మఘాతులన్. 484

* “ ఓ అన్నలారా! ఎందుకు దుఃఖిస్తారు? తండ్రి కళేబరాన్ని జాగ్రత్తగా చూస్తూ ఉండండి. నేను పగ తీరుస్తాను” అని పదునైన గండ్రగొడ్డలి ధరించి అరిభయంకరుడైన పరశురాముడు జంకూ గొంకూ లేకుండా మాహిష్మతీపురానికి వెళ్ళి బ్రహ్మహత్యా పాతకులైన అర్జునుడి కొడుకులు రోదించేటట్లుగా అందరినీ పట్టి మట్టుబెట్టాడు.

క. ఖండించి రిపుల శిరములు, గొండలుగాఁ బ్రోగు లిడియె గురురక్తనదుల్
నిండికొని పాఱి యుబ్బెను, భండనమున నృపులు రిపులు భయమంద నృపా! 485

* ఓ రాజా! బ్రాహ్మణ శత్రువుల గుండె లదరే టట్లుగా, ఆ పరశురాముడు యుద్ధంలో రక్తపునదులు వరదలై పారేటట్లుగా శత్రువుల తలలను నరికి కొండలుగా ప్రోగులు పెట్టాడు.

వ. మఱియు నంతటఁ బోక. 486

ఆ. అయ్యపగకు రాముఁ డలయక రాజుల, నిరువదొక్కమాఱు లరసి చంపె;
జగతిమీఁద రాజశబ్దంబు లేకుండ, సూడు దీర్పలేని సుతుఁడు సుతుఁడె. 487

* ఇంకా అంతటితో ఊరుకోక తండ్రిపగ తీర్చుకోవడంకోసం ఆ రాముడు విసుగూ విరామం లేక భూమిమీద క్షత్రియుడనే శబ్దం వినబడ నీకుండా ఇరవై ఒక్కమారులు రాజులను గాలించి చంపాడు. తండ్రిపగ తీర్చలేని కొడుకూ ఒక కొడుకేనా?

వ. మఱియు నా రాముఁడు శమంతక పంచకంబున రాజరక్తంబులం దొమ్మిది మడుఁగులు కావించి, తండ్రి శిరంబుఁ దెచ్చి, శరీరంబుతోఁ సంధించి, సర్వదేవమయుండగు దేవుండు తాన కావునఁ దన్ను నుద్దేశించి యాగంబు చేసి, హోతకుం దూర్పును, బ్రహ్మకు దక్షిణభాగంబును, నధ్వర్యునకుఁ బడమటి దిక్కును, నుద్గాత కుత్తరదిశయును, నున్నవారల కవాంతరదిశలును, గశ్యపునకు మధ్యదేశంబును, నుపద్రష్టకు ఆర్యావర్తంబును, సదస్యులకుం దక్కిన యెడలును గలయ నిచ్చి, బ్రహ్మనదియైన సరస్వతియం దవభృథస్నానంబు సేసి, కల్మషంబులం బాసి, మేఘవిముక్తుండైన సూర్యుండునుం బోలె నొప్పుచుండె. నంత. 488

* ఆ పరశురామడు శమంతపంచకంలో రాజులరక్తాలతో తొమ్మిది మడుగులు చేసి, తండ్రితలను తెచ్చి శరీరంతో చేర్చి తానే సర్వదేవమయుడు అయిన దేవుడు కావడంవల్ల తన్ను గూర్చే యాగంచేశాడు. హోతకు తూర్పుదిక్కును, బ్రహ్మకు దక్షిణభాగాన్నీ, అధ్వర్యునికి పడమటిదిక్కును, ఉద్గాతకు ఉత్తరదిక్కును, మిగిలిన ఋత్విజులకు అవాంతరదిశలను, కశ్యపునికి మధ్యదేశాన్నీ, ఉపద్రష్టకు ఆర్యావర్తాన్నీ, సదస్యులకు మిగిలిన దిక్కులనూ ఇచ్చాడు. యజ్ఞం పూర్తయ్యాక బ్రహ్మనది అయిన సరస్వతీ జలాల్లో అవభృథస్నానం చేసి పాపాలను పోగొట్టుకొని మబ్బు విడిచిన సూర్యుడిలాగా ప్రకాశించాడు.

క. ఆప్తుఁడగు పుత్రువలనను, బ్రాప్తతనుం డగుచుఁ దపము బలిమిని మింటన్
సప్తర్షిమండలంబున, సప్తముఁడై వెలుఁగుచుండె జమదగ్ని నృపా! 489

* ఓ రాజా! వంశోద్ధారకుడైన కొడుకువల్ల ఆ జమదగ్ని సంకల్ప శరీరం పొంది తన తపోబలంతో ఆకాశంలోని సప్తర్షిమండలంలో ఏడవ ఋషిగా వెలిగాడు.

**క. ఆ జమదగ్ని తనూజుఁడు, రాజీవాక్షుండు ఘనుఁడు రాముఁ డధికుఁడై**
**యోజను వేదర్షులలో, రాజిల్లెడు మీఁదిమనువు రా నవ్వేళన్. 490**

* వచ్చే మన్వంతరంలో ఆ జమదగ్ని కుమారుడూ, కమల నేత్రుడూ ఐన పరశురాముడు సప్తర్షులలో ఒకడై ప్రకాశిస్తాడు.

**ఆ. శాంతచిత్తుఁ డగుచు సంగవిముక్తుఁడై, భవ్యుఁడై మహేంద్రపర్వతమున**
**నున్నవాఁడు రాముఁడోజతో గంధర్వ, సిద్ధవరులు నుతులు సేయుచుండ. 491**

* గంధర్వులూ, సిద్ధులూ తన పవిత్రచరిత్రను గానం చేస్తుండగా ఆ పరశురాముడు ఐహికబంధాల నుండి బయటపడి శాంతచిత్తుడై మహేంద్ర పర్వతం మీద ఈ నాటికీ తేజోవంతుడై తపోనిమగ్నుడై ఉన్నాడు.

**క. భగవంతుఁడు హరి యీక్రియ, భృగుకులమునఁ బుట్టి యెల్ల పృథివీపతులన్**
**జగతీభారము వాయఁగఁ, బగఁగొని పలుమాఱు చంపె బవరమున నృపా! 492**

* ఓ రాజా! భగవంతుడైన శ్రీహరి ఈ విధంగా భృగుకులంలో పుట్టి లోకభారం తొలగేటట్లుగా పగబట్టి రాజులను పలుమార్లు యుద్ధంలో పరిమార్చాడు.

**వ. అంత గాధికి నగ్నితేజుండగు విశ్వామిత్రుండు జన్మించి తపోబలంబున రాజధర్మంబును మాని, బ్రహ్మర్షియై, యేకశత సంఖ్యాగణితు లగు కొడుకులం గనియె; అయ్యెడ భృగుకుల జాతుండైన యజీగర్తుని కొడుకు శునశ్శేఫుండు దల్లిదండ్రుల చేత హరిశ్చంద్రుని యాగపశుత్వంబునకు నమ్ముడుపడి, బ్రహ్మాదిదేవతల వినుతి సేయుచు మెప్పించి, పితృదేవతలచే బంధవిముక్తుండైన వాని యందుఁ గృప గలిగి, విశ్వామిత్రుండు పుత్త్రుల కిట్లనియె. 493**

* పిమ్మట గాధికి అగ్ని వంటి తేజస్సు గల విశ్వామిత్రుడు జన్మించాడు. అతడు తపోబలంతో క్షాత్రాన్ని వదలి బ్రహ్మర్షియై వందమంది కొడుకులను కన్నాడు. భృగుకులంలో పుట్టిన అజీగర్తుని కొడుకు శునశ్శేఫుడు తల్లిదండ్రులచేత హరిశ్చంద్రుని యాగానికి బలిపశువుగా అమ్ముడు పడినవాడై బ్రహ్మాదిదేవతలను స్తుతించి మెప్పించి వారిచేత వదలిపెట్టబడిన ఆ శునశ్శేఫుడిపట్ల విశ్వామిత్రుడు జాలిపడి అతణ్ణి వెంటబెట్టుకొనివచ్చి కొడుకులతో ఇట్లా అన్నాడు.

**క. కన్నులఁ గంటిని వీనిని, మన్నన కొమరుండు నాకు మక్కువ మీలో**
**నన్నన్న యనుచు నతనిన్, మన్నింపుం డనినఁ జూచి మదసంయుతులై. 494**

**క. ఇతఁ డన్నఁటవో మాకును, గృతకృత్యుల మైతి మనుచు గేలి యొనర్పన్**
**సుతులన్ మ్లేచ్ఛులు గండని, ధృతిలేక శపించి తపసి తిరుగుడువడఁగన్. 495**

* 'ఈ పుణ్యాత్ముణ్ణి కళ్ళారా చూశాను. నే నితణ్ణి కొడుకుగా మన్నించాను. మీరూ ఇతణ్ణి అన్నగా భావించి గౌరవించండి' అనగా వాళ్ళు మదంతో 'ఇతడు మాకు అన్నగారట! కృతార్థుల మైనాములే!' అని గేలి చేశారు. అప్పు డా ముని బాధపడి కొడుకులను మ్లేచ్ఛులు కండని శపించాడు.

వ. అయ్యెడ నతని శాపంబునకు వెఱచి, యా నూర్వురయందు మధ్యముండైన మధుచ్ఛందుం డేఁబండ్రు దమ్ములుం దానును నమస్కరించి, తండ్రీ! నీ చెప్పిన క్రమంబున శునశ్శేఫుండు మా కన్నయని నమస్కరింపం గలవార' మనవుఁడు సంతసించి, మంత్రదర్శియైన శునశ్శేఫుని వారల యందుఁ బెద్దఁజేసి, మధుచ్ఛందున కిట్లనియె. 496

* అప్పుడతని శాపానికి భయపడి నూరుమంది కొడుకులలో నడిమి వాడైన మధుచ్ఛందుడు ఏభైమంది తమ్ములూ తానూ తండ్రికి నమస్కరించి 'నీవు చెప్పినట్లుగానే శునశ్శేఫుణ్ణి మా అన్నగా మన్నిస్తాము' అని అన్నారు. అప్పుడు విశ్వామిత్రుడు సంతోషించి మంత్ర ద్రష్ట అయిన శునశ్శేఫుని వారికి పెద్దచేసి మధుచ్ఛందునితోనూ, మిగిలిన కొడుకులతోనూ ఇట్లా అన్నాడు.

ఆ. పాడి సెడక వీఁడె నేఁడు నీకతమునఁ, గొడుకు కలిగె నేఁడు కొడుకులార!
కడుపులార మీరు గొడుకులఁ గనుఁ డింకఁ, బ్రీతితోడ దేవరాతుఁ గూడి. 497

* 'కుమారులారా! మీరు ధర్మం తప్పక నడుచుకోవడం వల్ల నాకు మరో కొడుకు కలిగాడు. మీరీ దేవరాతుడితో ఒద్దికగా మెలిగి బిడ్డలను పొందండి' అని ఆశీర్వదించాడు.

వ. అని పలికె, అట్లు శునశ్శేఫుండు దేవతలచేత విడివడుటం జేసి, దేవరాతుండయ్యె. మధుచ్ఛందుండు మొదలైన యేఁబండ్రును దేవరాతునకుఁ దమ్ములైరి. పెద్దలైన యష్టక, హారీత, జయంత, సుమదాదు లేఁబండ్రును వేఱై చనిరి. ఈ క్రమంబున విశ్వామిత్రు కొడుకులు రెండు విధంబులైనం, బ్రవరాంతరంబు గలిగె నని చెప్పి శుకుం డిట్లనియె.

ఆ పురూరవు కొడుకగు నాయువునకు నహుషుండును, క్షత్రవృద్ధుడును, రజియును, రంభుండును, ననేనస్సు ననువారు పుట్టిరి. అందు క్షత్రవృద్ధునకుఁ గుమారుండగు సుహోత్రునకుఁ గాశ్యుండుఁ గుశుండు గృత్స్నమదుండను ముగ్గురు గలిగిరి. ఆ కృత్స్నమదునకు శునకుండును, శునకునకు శౌనకుండును, న మ్మహాత్మునకు బహ్వృచప్రవరుండును జన్మించిరి. ఆ బహ్వృచప్రవరుండు తపోనియతుండై చనియె. కాశ్యునకుఁ గాశియుఁ, గాశికి రాష్ట్రుండును, రాష్ట్రునకు దీర్ఘతపుండు నుదయించిరి. 498

* ఆ విధంగా శునశ్శేఫుడు దేవతల చేత వదలి పెట్టబడడం వల్ల దేవరాతు డయ్యాడు. మధుచ్ఛందుడు మొదలైన ఏభైమంది దేవరాతుడికి తమ్ములయ్యారు. పెద్దవారైన అష్టకుడు, హారీతుడు, జయంతుడు, సుమదుడు మొదలైన ఏభై మంది వాళ్లని వదలి వెళ్లారు. ఈ విధంగా విభేదాలు ఏర్పడి విశ్వామిత్రుని కొడుకులు రెండుతెగలై పోగా గోత్రభేదం కలిగింది.

అని చెప్పి శుకుడు ఇట్లా అన్నాడు; ఆ పురూరవుని కొడుకైన ఆయువునకు నహుషుడు, క్షత్రవృద్ధుడు, రజి, రంభుడు, అనేనసుడు అనే వాళ్ళు పుట్టారు. వారిలో క్షత్రవృద్ధుని కొడుకైన సుహోత్రునికి కాశ్యుడు, కుశుడు, కృత్స్న మదుడికి శునకుడు, శునకునికి శౌనకుడు, ఆ మహాత్ముడికి బహ్వృచ ప్రవరుడు జన్మించారు. అతడు తపోనియతు డయ్యాడు. కాశ్యునికి కాశి, కాశికి రాష్ట్రుడు, రాష్ట్రునికి దీర్ఘతపుడు జన్మించారు.

**క. ఆ దీర్ఘతపుని కధికుఁడు, శ్రీదయితాంశమునఁ బుట్టె సేవ్యం డాయు**
**ర్వేదజ్ఞుఁడు ధన్వంతరి, ఖేదంబులు వాయు నతనిఁ గీర్తన సేయన్. 499**

ఆ దీర్ఘతపునికి శ్రీహరి అంశతో ఆయుర్వేదం తెలిసిన గొప్ప వాడైన ధన్వంతరి పుట్టాడు. అతణ్ణి కీర్తిస్తే సకలదుఃఖాలూ రోగాలూ తొలిగి పోతాయి.

**వ. వాసుదేవాంశ సంభూతుండగు నా ధన్వంతరి, యజ్ఞభోగంబున కర్హుండు. అతనికిఁ గేతుమంతుండు, కేతుమంతునకు భూమరథుం, డతనికి దివోదాసుం డనం బరఁగు ద్యుమంతుం డుదయించిరి. ఆ ద్యుమంతునకుఁ బ్రతర్దనుండు జన్మించెఁ. బ్రతర్దనుండు శత్రుజిత్తనియు, ఋతధ్వజం డనియుఁ జెప్పఁబడె, అతనికిఁ గువలయాశ్వుండు సంభవించె. 500**

* నారాయణాంశవల్ల పుట్టిన ఆ ధన్వంతరి యజ్ఞభాగం అందుకోవడానికి అర్హుడు. అతడికి కేతుమంతుడు, కేతుమంతునికి భీమరథుడు, అతడికి దివోదాసుడనే ద్యుమంతుడు పుట్టాడు. ఆ ద్యుమంతునికి ప్రతర్దనుడు జన్మించాడు. ఆ ప్రతర్దనుడు శత్రుజిత్తనీ, ఋతధ్వజుడనీ ప్రసిద్ధ డయ్యాడు. అతడికి కువలయాశ్వుడు కలిగాడు.

**ఆ. వసుమతీశ ! విను కువలయాశ్వభూభర్త, లలితపుణ్యు ఘను నలర్కుఁ గనియె**
**నాతఁ డేలె నేల నఱువదియాఱు వే, లేండ్లు వానిభంగి నేలె నెవఁడు? 501**

* ఓరాజా! విను. ఆ కువలయాశ్వచక్రవర్తి పుణ్యాత్ముడు, గొప్ప వాడు ఐన అలర్కుణ్ణి కన్నాడు. అతడు అరవైయారువేల సంవత్సరాల పాటు ఈ భూమండలాన్ని పాలించాడు. అతడిలాగా రాజ్యంచేసిన వాళ్ళు లేనేలేరు.

**వ. అ య్యలర్కునకు సన్నతియు, నతనికి సునీతుండు, అతనికి సుకేతనుండును, నతనికి ధర్మ కేతువును, నతనికి సత్యకేతువును, నాతనికి ధృష్టకేతువును, నాధృష్టకేతువునకు సుకుమారుండును, నా సుకుమారునకు వీతిహోత్రుండును, వీతిహోత్రునకు భర్గుండును, భర్గునకు భార్గ భూమియు జనియించిరి. 502**

* ఆ అలర్కునికి సన్నతి, అతడికి సునీతుడు, అతడికి సుకేతనుడు, అతడికి ధర్మకేతువు, అతడికి సత్యకేతువు, అతడికి ధృష్టకేతువు, ఆ ధృష్టకేతువునకు సుకుమారుడు, ఆ సుకుమారునికి వీతిహోత్రుడు, వీతి హోత్రునికి భర్గుడు, భర్గునికి భార్గభూమి జన్మించారు.

**ఆ. వాఁడు తుదయుఁ గాశ్యవసుమతీశుం డాది, యైనవారు గాశు లనఁగ నెగడి**
**రవనిమీఁద వార లా క్షత్రవృద్ధుని, వంశజాతు లగుచు వంశవర్య! 503**

* ఓ వంశోద్ధారకుడా! కాశ్యుడు మొదలుకొని అతడివరకూ ప్రవర్తిల్లిన ఆ క్షత్రవృద్ధుడి సంతతి రాజులందరూ కాశులని వర్ధిల్లారు.

**వ. మఱియు, క్షత్రవృద్ధునికి రెండవకొడుకగు కుశునికిఁ బ్రీతియును, వానికి సంజయుండును, సంజయునికి జయుండును, జయునికిఁ గృతుండును, గృతునకు హర్యధ్వనుండును, హర్వధ్వనునకు సహదేవుండును, సహదేవునికి భీముండును, భీమునకు జయత్సేనుండును. జయత్సేనునకు సంకృతి యును, సంకృతికి జయుండును, జయునికి క్షత్రధర్ముండును బుట్టిరి. వీరలు క్షత్రవృద్ధుని వంశంబున గల రాజులు. రంభునికి రభసుండును, రభసునకు గంభీరుండును, గంభీరునికిఁ గృతుండును గలిగిరి. ఆ కృతునికి బ్రహ్మకులంబు పుట్టె. అ య్యనేనసునకు శుద్ధుండును, శుద్ధునకు శుచియు,శుచికి బ్రహ్మసారథియైన త్రికకుత్తును జనించిరి. అతనికి శాంతరజుండు పుట్టె. నతండు విజ్ఞానవంతుండు, కృతకృత్యుండు, విరక్తుండు నయ్యె. 504**

* ఇంకా ఆ క్షత్రవృద్ధుడి రెండవకొడుకైన కుశునికి ప్రీతి, అతడికి సంజయుడు, సంజయునికి జయుడు, జయునికి కృతుడు, కృతునికి హర్యధ్వనుడు, హర్యధ్వనుడికి సహదేవుడు, సహదేవుడికి భీముడు, భీమునికి జయత్సేనుడు, జయత్సేనునికి సంకృతికి, సంకృతి జయుడు, జయునికి క్షత్రధర్ముడు పుట్టారు. వీళ్ళందరూ క్షత్రవృద్ధుని వంశంలోని రాజులు, రంభునికి రభసుడు, రభసునికి గంభీరుడు, గంభీరునికి కృతుడు కలిగారు. ఆ కృతుడి సంతతివారు బ్రాహ్మణ్యాన్ని అవలంబించారు. అనేనసునకు శుద్ధుడు, శుద్ధునికి శుచి, శుచికి బ్రహ్మసారథి ఐన త్రికకుత్తు జన్మించారు. అతడికి శాంతరజుడు పుట్టాడు. ఆత్మజ్ఞాని అయిన అతడు కృతకృత్యుడూ, విరక్తుడూ అయ్యాడు.

**సీ. రజియనువానికి రాజేంద్ర! యేనూఱు కొడుకులు గలిగిరి ఘోరబలులు**
**వేల్పులెల్లను వచ్చి వేఁడిన నా రజి, దైతులం బెక్కండ్ర ధరణిఁ గూల్చి**
**నాకంబు దేవేంద్రునకు నిచ్చె నిచ్చిన రజికాళ్ళ కెఱఁగి సురప్రభుండు**
**వెండియు నతనికి విబుధదేహము నిచ్చి సంతోషబుద్ధి నర్చన మొనర్చె**

**ఆ. అంత నా రజి మృతుఁడైన నతని పుత్త్రు, లమరవిభుఁడు దమ్ము నడిగికొనిన**
**నీక యింద్రలోక మేలిరి యాగభో, గములు పుచ్చుకొనిరి గర్వమంది. 505**

* ఓ రాజశ్రేష్ఠుడా! ఆరజికి గొప్పబలవంతులైన ఐదు వందల మంది కొడుకులు కలిగారు. దేవత లందరూ వచ్చి ప్రార్థించగా ఆ రజి పలువురు రాక్షసులను నేలకూల్చి స్వర్గాన్ని దేవేంద్రుడికి అప్పగించాడు. దేవేంద్రుడు రజిపాదాలకు నమస్కరించి, స్వర్గాన్ని కాపాడే భారాన్ని అతడికే అప్పగించి సేవిస్తున్నాడు. ఆ రజి చనిపోయాక, అతని కొడుకులు, దేవేంద్రుడు తమను అర్థించినా స్వర్గాన్ని అప్పగించక, యాగ భాగాలను తామే పుచ్చుకొంటూ గర్వంతో స్వర్గాన్ని పాలించారు.

క. వేలుపులఱేఁడు గురుచే, వేలిమిఁ బెట్టించి బలిమి వెలయఁగ నిజ దం
భోలిని రజిసుతులను ని, ర్మూలము గావించి స్వర్గముం గై కొనియెన్. 506

* అప్పుడు దేవేంద్రుడు బృహస్పతిని ఆశ్రయించి అతడిచేత హోమం చేయించాడు. తర్వాత అతడు అతిశయించిన బలంతో రజి కొడుకు లందరినీ తన వజ్రాయుధంతో నిర్మూలించి స్వర్గాన్ని వశపరుచుకొన్నాడు.

వ. అది యట్లుండె నహుషునకు యతియు, యయాతియు, సంయాతియు, నాయాతియు, వియతియుఁ గృతియు నన నార్గురు కొడుకులు- దేహికి నింద్రియంబుల చందంబున సంభవించిరి. అందుఁ బెద్దకొడు కగు యతికి రాజ్యం బిచ్చిన, నతండు విరక్తుండై. 507

* దేహధారికి ఆరు ఇంద్రియా లున్నట్లుగా నహుషునికి యతి, యయాతి, సంయాతి, ఆయతి, వియతి, కృతి అనే ఆర్గురు కొడుకులు కలిగారు. వారిలో పెద్దకొడుకైన యతికి రాజ్యాన్ని అప్పగించగా అతడు విరక్తు డయ్యాడు.

క. రాజ్యంబు పాపమూలము, రాజ్యముతో నొడ లెఱుంగ రాదు సుమతియున్
రాజ్యమునఁ బూజ్యు నెఱుఁగఁడు, రాజ్యము గీజ్యంబు ముక్తిరతులకు నేలా? 508

వ. అని పలికి, వాఁడు రాజ్యంబునకుం బాసి చనియె. 509

* 'రాజ్యం పాపమూల మైంది. అధికారం ఒళ్ళుతెలియ నివ్వదు. బుద్ధిమంతుడైనా అధికారమదంతో పూజ్యుడిని తెలుసుకోలేడు. ముక్తిని కోరేవాడికి రాజ్యం ఎందుకు? అని అతడు రాజ్యాన్ని వదులుకొన్నాడు.

క. ఆ నహుషుడు మఖశతమును, మానుగఁ గావించి యింద్రమానినిఁ గవియం
బూని మునీంద్రులు మోచిన, యానముపై నుండి కూలె నహియై నేలన్. 510

* ఆ నహుషుడు నూరు యజ్ఞాలు చేసి ఇంద్రపదవిని పొందాడు. శచీదేవిపొందుకోరడం వల్ల అతడు సర్పమై మహర్షులు మోస్తున్న పల్లకి నుండి జర్రున జారి నేలకూలాడు.

ఉ. అన్నయుఁ దండ్రియుం జన యయాతి మహీపతియై చతుర్దిశల్
పన్నుఁగఁ గావఁ దమ్ములకుఁ బాలిడి శుక్రుని కూఁతురున్ సుసం
పన్న గుణాభిరామ వృషపర్వుని కూఁతురు నోలి నాండ్రుగా
సన్నయశాలి యీధరణి చక్రధురంధరుఁ డయ్యెఁ బేర్మితో. 511

* అట్లా అన్నా తండ్రీ రాజ్యం వదలిపోగా యయాతి రాజయ్యాడు. తమ్ముళ్లకు రాజ్యం పంచిపెట్టాడు. నీతిశాలి ఐన యయాతి శుక్రాచార్యుని కూతురినీ, గుణవతి ఐన వృషపర్వుని పుత్రికనూ క్రమంగా పెళ్ళిచేసుకొని పెంపుతో భూభారాన్ని వహించాడు.

వ. అనిన విని పరీక్షిన్నరేంద్రుం డిట్లనియె. 512

* అనగా విని పరీక్షిన్మహారాజు ఇట్లా అన్నాడు.

## -: యయాతి చరిత్రము :-

ఆ. పార్థివుఁడు యయాతి బ్రహ్మర్షిభార్గవుఁ, డల్లుఁడగుట మామ యగుట యెట్లు
రాజు రాచకూఁతు రతిసేయఁ దగుఁగాక, విప్రకన్య నొంద విహిత మగునె? 513

వ. అనిన శుకుం డిట్లనియె. 514

* "యయాతి ఏమో క్షత్రియుడు. శుక్రాచార్యుడేమో బ్రహ్మర్షి. వాళ్లు అల్లుడూ మామా ఎట్లా అయ్యారు? రాజైనవాడు రాజుకొమార్తెను పెళ్ళాడవచ్చుగానీ బ్రాహ్మణకన్యను పొందవచ్చా? దానికి శాస్త్రాలు ఒప్పుకొంటాయా?'' అని అడగ్గా దానికి శుకుడు ఇట్లా అన్నాడు.

సీ. దనుజేంద్రుకూఁతురు తరళాక్షి శర్మిష్ఠ పురములో నొకనాఁడు ప్రొద్దువోక
వేలసం89ఖ్యను చెలుల్ వెంటరా గురుసుత యగు దేవయానితో నాట మరగి
పూచిన యెలదోఁట పొంత జొంపము గొన్న క్రొమ్మావిచేరువ కొలఁకుఁ జేరి
యందుఁ దమ్ములతేనె లాని చొక్కుచు మ్రోయు నళుల ఝుంకృతులకు నదరిపడుచు

ఆ. వలువ లూడ్చి కొలఁకు వడిఁ జొచ్చి తమలోనఁ, బెల్లురేఁగి నీటఁ జల్లులాడ
నందినెక్కి మౌళి నిందురోచులు పర్వ, శూలి వచ్చెఁ గొండచూలితోడ. 515

* రాక్షసరాజుకూతురైన శర్మిష్ఠ ఒకరోజు ప్రొద్దువోక వేయి మంది చెలికత్తెలు వెంటరాగా గురుపుత్రిక ఐన దేవయానితో కలిసి ఉద్యానవన విహారానికి వెళ్ళింది. వా ళ్ళా పూలతోటలో గుబురుకొన్న మామిడిచెట్టు దగ్గరికొలను సమీపించారు. తామర పూవులోని తేనెను ఆరగించి ఝుంకారం చేసే తుమ్మెదలను చూచి గంతులు వేస్తూ, బట్టలు విప్పి కొలనిలో జలక్రీడ లాడడానికి పూనుకొన్నారు. అప్పుడు తన సిగలోని చంద్రుడి కాంతులు వ్యాపించగా పార్వతితో పాటు శివుడు నందివాహనంపై ఆ చోటుకు వచ్చాడు.

చ. మలహరుఁ జూచి సిగ్గుపడి మానిను లందఱు సంభ్రమంబునన్
వలువలు గట్టుచో దనుజవల్లభు కూఁతురు దేవయాని దు
వ్వలువ ధరించి ముందఱికి వచ్చినఁ జూచి యెఱిం గెఱింగి నా
వలు విది యెట్లు గట్టుకొనవచ్చును దాసికి నంచు దెప్పుచున్. 516

వ. దేవయాని యిట్లనియె: 517

* శివుణ్ణి చూచి సిగ్గుపడి ఆ మానవతు లందరూ తత్తరపాటుతో చీరలు కట్టుకొన్నారు. అప్పుడు తన చీర ధరించి వేగంగా వచ్చిన రాక్షస రాజుకూతురిని దేవయాని చూచింది. 'తెలిసి తెలిసి ఈ దాసి నా చీర కట్టుకోవచ్చా' అని తిడుతూ ఇట్లా అన్నది.

శా. ఆ లోకేశుముఖంబునం గలిగె బ్రాహ్మణ్యంబు బ్రహ్మంబు నా;
మేలై వైదికమార్గముల్ దెలుపుచున్ మిన్నంది రందున్ మహా

శీలుర్ భార్గవు; లందు శుక్రుఁడు సుధీసేవ్యుండు- నే వానికిన్
జూలన్ నా వలువెట్లు గట్టితివి రక్షోజాతవై చేటికా! 518

* లోకేశుని ముఖంలో నుండి పుట్టి లోకహితంకోసం వైదికమార్గాలను తెలియజేస్తూ ప్రశస్తంగా అతిశయించిందే బ్రాహ్మణకులం. అందులో భృగువంశీయులు మహానియమవంతులు, వాళ్లలో శుక్రాచార్యుడు బుద్ధిమంతులచేత సేవింపబడేవాడు. రాక్షసివైన ఓ దాసీ! అలాంటి వానికి కూతురినైన నా చీర నీవెలా కట్టుకొన్నావు?

క. మహిమవతులైన భూసుర, మహిళలవిత్తంబులు పెఱమగువల కగునే?
మహిఁ బసిఁడి గొలుసు లిడినన్, విహితములే కుక్కలకు హవిర్భాగంబుల్. 519

* గొప్ప మహిమ గలిగిన బ్రాహ్మణస్త్రీల సొత్తులు ఇతర స్త్రీలకు చెందుతాయా? బంగారు గొలుసులను అలంకరించినంత మాత్రాన కుక్కలు పవిత్రమైన హవిస్సుకు అర్హమౌతాయా?

క. మీ తండ్రి మాకు శిష్యుఁడు, మా తండ్రి గురుండు గొంతమాత్రం బైనం
బ్రీతిం గావింపక పరి, భూతం జేయుదువె తులువపోఁడిమిఁ జెనఁటీ! 520

* ఓ దుష్టురాలా! మీ తండ్రి మాకు ఊడిగం చేసేవాడు. మాతండ్రి మీ తండ్రికి గురువు. కొంతకు కొంతైనా ప్రీతి కలిగించక ఇట్లా చెడు నడతతో నన్ను అవమానిస్తావా?

వ. అని భర్జించుచున్న దేవయాని పలుకులు విని, కరాళించి, మ్రోఁగుచున్న భుజంగి పగిది నిట్టూర్పులు నిగుడించి, పెదవులు గొఱుకుచు, శర్మిష్ఠ యిట్లనియె. 521

* అని మండిపడుతున్న దేవయాని మాటలను విని శర్మిష్ఠ పెద్దగా అరుస్తూ, బుసలు కొడుతున్న ఆడుపాములాగా నిట్టూర్పులు వదలి, పెదవులు కొరుకుతూ ఇట్లా అన్నది.

శా. భిక్షుండై తమ తండ్రి మా జనకునిన్ భిక్షించి యుండంగ సం
రక్షింపం దుది నింతయై మఱపుతో రాజప్రసూతాకృతిన్
రక్షోరాజతనూజతో సుగుణతో నాతో సమం బాడెడిన్
గుక్షిస్ఫోటము గాఁగ దీనిఁ జెలు లీ కూపంబునం ద్రోవరే. 522

* ఓ చెలులారా? బిచ్చగాడైన ఈమె తండ్రి మాతండ్రి దయాభిక్షతో బ్రతుకు తున్నాడు. అదంతా మరచి ఈమె ఇప్పుడిట్లా రాచపుట్టుక కలిగిందానిలా అహంకరించి గుణవతిని రాక్షసరాజపుత్రికను ఐన నాతో సరిసమంగా ప్రేలుతూ ఉంది. దీని కడుపు బ్రద్దలయ్యే టట్లు ఈ బావిలోనికి పడద్రోయండి.

వ. అని పలికి. 523

ఆ. బోఁటిపిండుచేతఁ బొదువంగఁ బట్టించి, రాజసమున దైత్యరాజతనయ
తొడరి దేవయానిఁ ద్రోపించె వలు వీక, క్రుంకి నూతిలోనఁ గుదిలకొనఁగ. 524

* అని కేకలేసి, ఆ రాక్షసరాజుకూతురు గర్వంతో చీర యివ్వక దేవయానిని చెలికత్తెలతో పొదివి పట్టించి నూతిలో పడ(ద్రోయించగా దేవయాని దుఃఖించింది.

**వ. ఇట్లు సేసి, శర్మిష్ఠ వోయిన వెనుక, యయాతిభూపాలుండు వేఁటమార్గంబున నడవిం దిరుగుచు, దైవయోగంబున నా దేవయాని యున్న నుయ్యి చేరం జనుదెంచి యందు. 525**

* ఇట్లా పడ(ద్రోసి శర్మిష్ఠ వెళ్ళిన తర్వాత యయాతి మహారాజు వేటాడుతూ దైవ ఘటనవల్ల ఆ దేవయాని ఉన్న నూతిని చేరవచ్చాడు.

**క. బంధువుల నెల్లఁ జీరుచు, నందు జలామగ్న నగ్నయై వగచుచు ని
ర్బంధమునఁ జిక్కి (వ్రీడా, సింధువున మునింగియున్న చేడియఁ గనియెన్. 526**

* పేరుపేరునా బంధువులను పిలుస్తూ ఆ నూతి నీటిలో పై బట్ట లేక దుఃఖిస్తూ నిర్బంధానికి చిక్కి సిగ్గనే సము(ద్రంలో మునిగిన దేవయానిని చూచాడు.

## -: దేవయాని యయాతిని వరించుట :-

**వ. కనుంగొని. 527**

**శా. సప్తాంభోనిధి మేఖలావృత మహా సర్వంసహా కన్యకా
(ప్రాప్తోద్యద్వరదక్ష దక్షిణకర(ప్రాలంబముం జేసి (ప్రో
క్షిప్తం జేసె యయాతి కట్టుకొనఁ బై చేలంబు మున్నిచ్చి ప
ర్యాప్త స్వేదజలాంగి నాళిసముదాయస్వర్గవిన్ భార్గవిన్. 528**

* ఇలా చూచి ఆ యయాతి ముందుగా ఆమె కట్టుకోవడానికి పై బట్ట నిచ్చి చెమటతో తడసిన శరీరం కలిగినదీ, చెలికత్తెలపాలిటి కామధేనువూ ఐన దేవయానిని, ఏడు సము(ద్రాలనే ఒడ్డాణంతో ఆవరింపబడిన భూమండాలాన్ని భరించే (శ్రేష్ఠమైన, సమర్థమైన తన కుడిచేతిని అందించి వెలికి లాగాడు.

**వ. ఇట్లు నుయ్యి వెడలించిన రాజునకు రాజవదన యిట్లనియె. 529**

* ఈ విధంగా బావినుంచి బయట పడవేసిన రాజుతో చం(ద్రుని వంటి ముఖం కలిగిన దేవయాని ఇట్లా అన్నది.

**మ. ననుఁ బాణి(గ్రహణంబు చేసితి గదా నా భర్తవు న్నీవ దై
వ నియోగం బిది పౌరుషంబునకు నా వాక్యంబు సిద్ధంబు సౌ
ఖ్య నివాసు న్నిను మాని యొండు వరునిం గాంక్షింప నే నేర్తునే!
వనజం బానెడి తేఁటి యన్యకుసుమావాసం బపేక్షించునే? 530**

* నీవు నా చేతిని పట్టుకొన్నావు కదా! నీవే నా భర్తవు. ఇది దైవఘటన, మన పెండ్లి జరగక తప్పదు. ఆ కచుని మాట పొల్లుపోలేదు. సుఖపెట్టే నిన్ను కాదని వేరొక వరుణ్ణి నేను కోరుకోగలనా? తామర పూవును మరగిన తుమ్మెద మరొక పూవును కోరుకొంటుందా?

వ. అదియునుంగాక. 531

సీ. సుగుణాఢ్య! విను నేను శుక్రుని కూఁతుర దేవయానిని దొల్లి దేవమంత్రి
తనయుండు కచుఁడు మా తండ్రిచేత మృతసంజీవనిఁ దా నభ్యసించు వేళ
నతనిఁ గామించిన నతఁడొల్ల ననవుడు నతఁడు నేర్చిన విద్య యణఁగి పోవ
నతని శపించిన నతఁడు నా భర్త బ్రాహ్మణుఁడు గాకుండెడు నని శపించె

తే. నది నిమిత్తంబు నాకు బ్రాహ్మణుఁడు గాఁడు, ప్రాణనాథుఁడ వీ వని పడఁతి వలుకఁ
దనదు హృదయంబు నెలఁతపైఁ దగులువడినఁ, దమక మొక యింతయును లేక తలఁచి చూచి,532

* అదీగాక ఓ గుణవంతుఁడా! విను, నేను శుక్రుని కూతురైన దేవయానిని. వెనుక బృహస్పతి కొడుకైన కచుడు మా తండ్రిని ఆశ్రయించి మృతసంజీవిని విద్యను నేర్చుకొనేటప్పుడు అతణ్ణి కామించాను. దానికి అంగీకరించని అతణ్ణి తాను నేర్చిన విద్యను మరచి పోయేటట్లు శపించాను. అతడూ నాభర్త బ్రాహ్మణుడు కాబోడని మారుశాపం ఇచ్చాడు. ఆ కారణంగా బ్రాహ్మణుడు నాకు భర్త కాడు. నీవే నాభర్తవు అని ఆమె పలికింది. అప్పుడు యయాతి తాను ఆమెపై మనసుపడి ఏ మాత్రం తొందరపాటు లేకుండా ఇట్లా ఆలోచించాడు.

మత్త. దైవయోగము గాక విప్రసుతన్ వరించునె నా మనం
బే విధంబున నీశ్వరాజ్ఞయు నిట్టిదంచు వరించె ధా
త్రీవరుండును దేవయానిని ధీరబుద్ధులకున్ మనో
భావ మొక్కటియే ప్రమాణ మభావ్య భావ్య పరీక్షకున్. 533

* "దైవఘటన కాకపోతే ఈవిధంగా నా మనస్సు ఒక బ్రాహ్మణ కన్యను కోరుతుందా? ఈశ్వరాజ్ఞ ఇలా ఉంది కాబోలు!" అనుకొని ఆ రాజు దేవయానిని వరించాడు. ధీరమతులకు కారానిది కాదగినది అనే పరీక్షకు మనోభావం ఒక్కటే ప్రమాణం.

వ. ఇట్లు వరించి, యయాతి చనిన వెనుక దేవయాని శుక్రుని కడకుం జని, శర్మిష్ఠ చేసిన వృత్తాంతం బంతయుం జెప్పి కన్నీరు మున్నీరుగా వగచిన. 534

* ఇట్లా వరించి యయాతి వెళ్ళాక దేవయాని శుక్రుని దగ్గరకు వెళ్లి శర్మిష్ఠ చేసిన సంగతంతా చెప్పి కన్నీరు మున్నీరుగా ఏడ్చింది.

క. క్రూరాత్ముల మందిరములఁ, బౌరోహిత్యముల కుంట పాపం బీ సం
సారముకంటె శిలల్ దిని, యూరక కాపోతవృత్తి నుండుట యొప్పున్. 535

* అప్పుడు శుక్రుడు ఇలా అనుకున్నాడు- కఠినాత్ముల ఇళ్లలో పౌరోహిత్యం చేయడం పాపం. ఇట్లా సంసారాన్ని సాగించడం కన్నా పావురాలలాగా ఎప్పటి కప్పుడు దొరకిన దాన్ని తిని ఊరకుండడం మేలు.

వ. అని వృషపర్వుని కడ నుండుట నిందించుచు, శుక్రుం డాకూఁతుం దోడ్కొని పురంబు వెడలి చన, నయ్యసురవల్లభుం డెఱింగి, శుక్రునివలన దేవతల గెలువఁ దలఁచి తెరువున కడ్డంబు వచ్చి, పాదంబులపైఁ బడి ప్రసన్నుఁ జేసిన, నా కోపంబు మాని శుక్రుండు శిష్యున కిట్లనియె. 536

* అని వృషపర్వుని కొలువులో ఉండడం ఇష్టంలేక శుక్రుడు దేవయానిని వెంటబెట్టుకొని ఊరువదలి వెళ్ళాడు. ఆ సంగతి తెలుసుకొన్న రాక్షసరాజు వృషపర్వుడు శుక్రుని సాయంతో దేవతలను జయించాలనుకొని ఆయన దారి కడ్డు వెళ్లి ఆయన కాళ్ల మీద పడి ప్రార్థించి ప్రసన్ను డయ్యేటట్లు చేసుకొన్నాడు. అప్పుడు శుక్రుడు కోపాన్ని మాని శిష్యునితో ఇట్లా అన్నాడు.

తరలము. చెలులు వేవురుఁ దాను నీ సుత చేటికైవడి నాసుతం
గొలుచు చుండినఁ దీఱుఁ గోపము గొల్వఁ బెట్టెద వేని నీ
వెలఁదిఁ దోడ్కొని వత్తు నావుడు వేగ రమ్మని భార్గవిం
గొలువఁ బెట్టె సురారివర్యుఁడు గూఁతు నెచ్చెలిపిండుతోన్. 537

* 'వేయిమంది చెలికత్తెలతో నీ కూతురు దాసిలాగా నా పుత్రికను సేవిస్తుంటే నా కోపం తీరుతుంది. అట్లా ఊడిగం చేసేటట్లు నీవు చేస్తే నా కూతురిని వెంటబెట్టుకుని తిరిగీ నీ రాజ్యానికి వస్తాను' అన్నాడు. అట్లానే అని ఆ రాక్షసశ్రేష్ఠుడు చెలికత్తెలతో పాటు తన కూతురు దేవయానిని సేవించేటట్లు చేశాడు.

మ. చల మింకేలని తన్నుఁ దండ్రి వనుపన్ శర్మిష్ఠ సన్నిష్ఠతో
జలజాతాస్యలు సద్వయస్యలు సహస్రంబు న్నిజస్రంబుఁ ద
న్నలమన్ దాసి సుదాసి యయ్యెఁ బగ వాయన్ భూరికోపానలా
కలితగ్లానికి దేవయానికి మహాగర్వోద్యమ స్థానికిన్. 538

* "ఇంకా పంతం ఎందుకు!" అని తండ్రి ఆజ్ఞాపించగా ఆ శర్మిష్ఠ నిష్ఠతో తన చెలికత్తెలు వేయిమందితోనూ కోపాన్ని దిగమ్రింగి వెళ్ళి కోపాగ్ని చేత బడలినదీ, గొప్పగర్వోద్రేకానికి ఆటపట్టయినదీ ఐన దేవయానివి సమీపించి ఆమెకు దాసి అయినది.

వ. అంత. 539

ఉ. ఆతతమైన వేడ్కఁ దనుజాధిపమంత్రి సురారినందనో
పేతఁ దనూభవం బిలిచి పెండ్లి యొనర్చె మహావిభూతికిన్
బ్రీతి మహోగ్రజాతికి నభీతికి సాధు వినీతికిన్ సిత
ఖ్యాతికి భిన్నదుష్కలహకార్యభియాతికి నయ్యయాతికిన్. 540

* పిమ్మట శుక్రాచార్యుడు మిక్కిలి ఉత్సాహంతో రాక్షసరాజ పుత్రిక సేవలను అందుకొనే కూతురిని అభినందించి గొప్పసంపద కలవాడు, క్షత్రియకులానికి చెందినవాడు, భయం లేనివాడు, సాధువులపట్ల వినయం కలవాడు, పరిశుద్ధమైన కీర్తి కలవాడు, శత్రువులను జయించినవాడు ఐన యయాతి కిచ్చి పెళ్లిచేశాడు.

వ. ఇట్లు యయాతికి దేవయాని నిచ్చి శుక్రుండు శర్మిష్ఠాసంగమంబు సేయకు మని నియమించి చనియె. పిదప న ద్దేవయానియు, న య్యయాతివలన యదు తుర్వసులను కుమారులం గనియె, ఒక్కరేయి సెఱంగు మాసి, దేవయాని వెలుపలనున్న యెడ శర్మిష్ఠ యెదురు వేచి, యేకాంతంబున యయాతి కడకుం జని, చెఱకువింటి జోదుపువ్వుటంపర కోహటించి, తన తలంపు సెప్పిన. 541

* ఇట్లు యయాతికి దేవయాని నిచ్చి పెండ్లి చేసి శుక్రుడు 'శర్మిష్ఠతో శరీరసంపర్కం పెట్టుకోవద్దు' అని అల్లుణ్ణి హెచ్చరించి పంపాడు. పిమ్మట దేవయాని యయాతివల్ల యదుతుర్వసు లనే కొడుకులను కన్నది. ఒకరాత్రి ఋతుమతియై దేవయాని బయట ఉండగా, అదనుకోసం కనిపెట్టుకొని ఉండిన శర్మిష్ఠ మన్మథుని పూలబాణాలకు జంకి ఒంటరిగా యయాతిదగ్గరకు వెళ్లి తన కోరికను వెల్లడించింది.

## -: శుక్రాచార్యులు యయాతికి శాపం బొసంగుట :-

**ఉ. ఆ జవరాలిఁ జూచి మన మాఁపఁగలేక మనోభవార్తుఁడై**
**యా జనభర్త మున్ను కవియాడిన మాట దలంచి యైనఁ జే**
**తోజ సుఖంబులం దనిపెఁ, ద్రోవఁగ వచ్చునె దైవ యోగముల్**
**రా జఁట సద్రహస్య మఁట రాజకుమారిని మాన నేర్చునే? 542**

* యయాతి శుక్రుడు చేసిన హెచ్చరికను గుర్తుంచుకొని కూడా ఆ యువతిని చూచి మనస్సు చిక్కబట్టుకోలేక ఆమెను మన్మథసౌఖ్యాలతో తృప్తిపరచాడు. దైవఘటనలను దాటడానికి ఎవరికీ సాధ్యం కాదు. తానేమో రాజు. పైగా గుట్టు రట్టుకాని ఏకాంతం. ఆ రాచకొమార్తెను ఎట్లా వదలుకుంటాడు?

**వ. ఇట్లు యయాతి వలన శర్మిష్ఠ గర్భంబై క్రమంబున ద్రుహ్యుండును, ననువును, పూరువును ననువారి ముువ్వురి తనయులం గాంచె. అంత దేవయాని తద్వృత్తాంతం బంతయు నెఱింగి, కోపించి, శుక్రుని కడకుం జని క్రోధమూర్ఛితయై యున్న సమయమున యయాతి వెంటం జని, యిట్లనియె. 543**

* ఇట్లా యయాతివల్ల శర్మిష్ఠ గర్భవతియై క్రమంగా ద్రుహ్యుడు, అనువు, పూరువు అనే ముగ్గురు కొడుకులను కన్నది. పిమ్మట దేవయాని ఆ సంగతి తెలుసుకొని కోపించి తండ్రి దగ్గరకు వెళ్ళింది. అట్లా కోపంతో ఒళ్ళు తెలియని స్థితిలో ఉన్న దేవయాని వెంటబడి యయాతి ఆమెతో ఇట్లా అన్నాడు.

**ఆ. మామకేల చెప్ప మాను సరోజాక్షి, దనుజతనయఁ బొంది తప్పువడితిఁ**
**గామినైన నన్నుఁ గరుణింపు పతిమాట, తండ్రిమాటకంటెఁ దగును నీకు. 544**

* ఓ పద్మాక్షీ! ఈ సంగతి మామగారిదాకా ఎందుకు? నీవు ఆయనతో చెప్పవద్దు. రాక్షసుడి కూతురును పొంది తప్పుచేశాను. నీపట్ల అమరక్తుడైన నన్ను కనికరించు. ఇల్లాలికి తండ్రిమాటకంటె భర్త మాటే మన్నింపదగింది కదా!

**వ. అని పలికి పాదంబుల కెఱఁగిన న య్యింతి యొడంబడక యుండె; నంత నది యెఱింగి శుక్రుం డిట్లనియె. 545**

* అని చెప్పి యయాతి కాళ్ళా వేళ్ళా పడిననూ ఆమె సుతరాము ఒప్పుకోలేదు. పిమ్మట ఆ విషయం తెలుసుకొని శుక్రుడు ఇట్లా అన్నాడు.

**క. నా మాటఁ ద్రోచి దానవ, భామను బొందితివి ధరణి పాలక! తగవే?**
**యేమాట యేది రూపము, కాముకులకు లోలుపులకుఁ గలవే నిజముల్? 546**

* ఓ రాజా! నా మాట కాదని రాక్షసస్త్రీని పొందావు. ఇది ధర్మమేనా? నేను చెప్పిం దేమిటి? నీవు చేసిందేమిటి? కాముకులైన వారికి ప్రలోభచిత్తులకు సత్యనిష్ఠ ఎక్కడిది?

వ. అని పలికి, నీవు వనితాజన హేయంబైన ముదిమిం బొందెదవు అని శపియించిన, యయాతి యిట్లనియె. 547

* అని పలికి 'స్త్రీలు అసహ్యించుకొనే ముసలితనం నిన్ను పొందుగాక' అని శపించగా యయాతి ఇట్లన్నాడు.

క. మామా! నాపైఁ గోపము, మామా; నీ పుత్రి యందు మానవు నాకుం
గామోపభోగవాంఛలు, ప్రేమన్ రమియించి ముదిమిఁ బిదపన్ దాల్తున్. 548

* మామా! వద్దు. నాపై కోపం వద్దు. నీ కూతురి పట్ల నాకు విషయవాంఛలు ఉడిగిపోలేదు. మరికొంతకాలం ప్రేమతో రమించి తర్వాత ముసలితనాన్ని పొందుతాను.

వ. అని పలికి యనుజ్ఞ గొని, దేవయానిం దోడ్కొని పురంబునకుఁ జని పెద్దకొడుకగు యదువుం బిలిచి యయాతి యిట్లనియె. 549

* అని చెప్పి యయాతి శుక్రుని అనుజ్ఞ పొంది దేవయానిని వెంట బెట్టుకొని నగరానికి వెళ్ళి పెద్దకొడుకైన యదువును పిలిచి యిట్లా అన్నాడు.

శా. నీతల్లిం గనినట్టి శుక్రువలనన్ నేఁడీ జరం బొందితిన్;
నాతండ్రి! యదునామధేయ! తనయా! నా వృద్ధతం దాల్పవే
నీ తారుణ్యము నాకు నిమ్ము తనివో నిండారఁ గొన్నేండ్లు నేఁ
జేతోజాత సుఖంబులం దిరిగెదన్ శృంగారినై పుత్రకా! 550

* "యదునామధేయుడవైన ఓ బిడ్డా! నీ తల్లి కన్న శుక్రుని వల్ల నేడీ ముసలితనాన్ని పొందాను. నీ యౌవనాన్ని నాకిచ్చి, నా ముసలితనాన్ని నీవు ధరింపవా? మరికొన్నాళ్ళపాటు నేను తనివితీరేట్లుగా శృంగారంలో మునిగి మన్మథసౌఖ్యాలను అనుభవిస్తూ తిరగాలని ఉంది."

వ. అనిన తండ్రికి యదు విట్లనియె. 551

* అనగా విని తండ్రితో యదువు ఇట్లా అన్నాడు-

శా. కాంతాహేయము దుర్వికారము దురాకండూతి మిశ్రంబు హృ
చ్చింతామూలము పీనసాన్వితము ప్రస్వేదవ్రణాకంపన
శ్రాంతిస్ఫోటక యుక్త మీ ముదిమి వాంఛం దాల్చి నానా సుఖో
పాంతం బైన వయోనిధాన మిది యయ్యా! తేర యీవచ్చునే? 552

* తండ్రీ! స్త్రీలు అసహ్యించుకొనేది, ఎక్కువ కండూతితో కూడినదీ, మిక్కిలి వికారమైనదీ, హృదయచింతకు మూలమైనదీ; రొంప, చెమట, కురుపులు, కంపం, అలసట, బొబ్బరోగాలతో కూడినదీ ఐన ముసలితనాన్ని ఎవరైనా కోరి తెచ్చుకొంటారా? అనేక సుఖాలకు అనుకూలమైన యౌవనాన్ని తేరగా జారవిడుచుకొంటారా?

**వ. అని యదుం డొడంబడకున్న యయాతి తుర్వసు ద్రుహ్యాదుల నడిగిన వారును యదువు పలికినట్లు పలికినఁ గడగొట్టు కుమారుండైన పూరువున కిట్లనియె. 553**

* అని పలికి యదువు ఒప్పుకోకపోతే యయాతి తుర్వసుడు, ద్రుహ్యుడు మొదలైన కొడుకులను అడిగాడు. వాళ్లు యదువు చెప్పినట్లే చెప్పారు. అప్పుడు యయాతి కడగొట్టు కొడుకైన పూరువుతో ఇట్లా అన్నాడు.

**ఉ. 'పిన్నవుగాని నీవు కడుఁ బెద్దవు బుద్ధుల యందు రమ్ము నా**
**యన్న! మదాజ్ఞ దాఁటవు గదన్న! వినీతుఁడ వన్న! నీవు నీ**
**యన్నలు సెప్పినట్లు పరిహారము సెప్పకు మన్న! నా జరన్**
**మన్ననఁ దాల్చి నీ తరుణిమం బొనఁగూర్పుము నాకుఁ బుత్త్రకా!' 554**

* ' ఓ అన్నా! నీవు వయసులో పిన్నవాడివి; కాని బుద్ధిలో దొడ్డవాడివి. నా ఆజ్ఞ జవదాటవు గదా! నీవు అడకువ కలవాడివి. నీవూ నీ అన్నలలాగా నా మాట త్రోసిపుచ్చవద్దు. నాయనా! నా ముసలి తనాన్ని నీవు పొంది నీ యౌవనాన్ని నా కివ్వు'

**వ. అనిన విని, గురుభక్తి గుణాధారుండైన పూరుం డిట్లనియె. 555**

* అనగా పెద్దలపట్ల భక్తి కలిగిన గుణవంతుడైన పూరుడు ఇట్లా అన్నాడు.

**శా. అయ్యా! నన్నిటు వేఁడనేల? భవదీయాజ్ఞా సముల్లంఘనం**
**బయ్యుండన్ బరిహారమున్ నొడువ నే నన్యాయినే నీ జర**
**న్నెయ్యం బొప్పఁగఁ దాల్చి నా తరుణిమ న్నీ కిచ్చెదన్ బంపినన్**
**గయ్యం బాడెడి పుత్త్రకుండు గ్రిమిసంకాశుండుఁ గాకుండునే? 556**

* తండ్రీ! నన్నింతగా వేడుకోవడం ఎందుకు? నీ ఆజ్ఞను మీరి నీకు అడ్డుచెప్పడానికి నే నంత అధార్మికుడనా? నీ ముసలితనాన్ని సంతోషంతో స్వీకరించి, నా యౌవనాన్ని నీ కిస్తాను. తండ్రి ఆజ్ఞాపిస్తే కాదని తగాదా పెట్టుకొనే కొడుకు పురుగుతో సమానుడు.

**వ. అదియునుం గాక. 557**

**క. మునివృత్తి డయ్య నేటికి, జనపాలక! సుగతిఁ గోరు సత్పురుషులకున్**
**దనుఁ గన్న తండ్రి సెప్పిన, పనిచేసిన సుగతి గొంగుపసిఁడియె కాదే! 558**

* అదీ గాక మహారాజ! సద్గతిని కోరే మంచివాడు మునివృత్తిని అవలంబించి శ్రమపడ్డం ఎందుకు? తనకు జన్మనిచ్చిన తండ్రి చెప్పిన పని చేస్తే వానికి సద్గతి కొంగు బంగారమే కదా?

**క. పనుపక చేయుదు రధికులు, పనిచిన మధ్యములు పొందుపఱుతురు తండ్రుల్**
**పనిచెప్పి కోరి పనిచిన, ననిశము మాఱాడు పుత్త్రు లధములు తండ్రీ! 559**

* తండ్రీ! ఉత్తములు తండ్రుల ఇంగితం తెలుసుకొని చెప్పకనే చేస్తారు. మధ్యములు చెప్పిన తర్వాత పనులు చేస్తారు. తండ్రులు ఆజ్ఞాపించినా చేయకుండా ఎప్పుడూ ఏదో ఒకటి అడ్డుచెప్పే కొడుకులు అధములు.

వ. అని పలికి, పూరుండు ముదిమి చేకొని, తన లేఁత ప్రాయంబు యయాతి కిచ్చె, అ య్యయాతియుం దరుణుండై, 560

* అని చెప్పి పూరుడు తండ్రి ముసలితనాన్ని గ్రహించి తన లేత ప్రాయాన్ని తండ్రి కిచ్చాడు.

శా. ఏడున్ దీవులు నేడు వాడలుగ సర్వేలాతలం బెల్లఁ బెన్
వీడై లోనుగ నేలుచుం బ్రజల నన్వేషించి రక్షింపుచున్
దోడం భార్గవి రా మనోజసుఖసంతోషంబులం దేలుచున్
గ్రీడించె న్నియతేంద్రియుం డగుచు నాక్రీడా విశేషంబులన్. 561

* ఆ యయాతి ఈ విధంగా యువకుడై ఏడుద్వీపాలు ఏడు వాడలుగా, సమస్త భూమండలమూ గొప్పపట్టణంగా చేసుకొని ప్రజల బాగోగులను పరిశీలించి కాపాడుతూ రాజ్యం పరిపాలించాడు. దేవయాని తోడు నీడయై అనుసరించగా ఇంద్రియలోలుడై మన్మథసుఖాల్లో ఓలలాడుతూ క్రీడించాడు.

క. మర్మంబుల నతిసాధ్వి, ధర్మంబుల దేవయాని తన ప్రాణేశున్
నర్మముల మనోవాక్తను, కర్మంబుల నొండు లేక కడు మెప్పించెన్. 562

* ఆ దేవయాని గుట్టుమట్టులతో పతివ్రతాధర్మాలతో ప్రియాలతో మనోవాక్కాయకర్మల్లో వ్యతిక్రమం లేక తనభర్తను మిక్కిలిగా మెప్పించింది.

శా. ఆకాశంబున మేఘబృందము ఘనంబై సన్న మై దీర్ఘమై
యేకంబై బహురూపమై యణఁగు నట్లేదేవు గర్భంబులో
లోకశ్రేణి జనించుచున్ మెలఁగుచున్ లోపించు నా దేవు సు
శ్రీకాంతున్ హరిఁ గూర్చి యాగములు సేసె న్నాహుషుం డిమ్ములన్. 563

* ఆకాశంలో మేఘపంక్తులు దట్టమై సన్నమై, పొడవై, ఒక్కటై అనేక రూపాలను పొంది అణగిపోవునట్లు ఏ పరమపురుషుని గర్భంలో లోక సమూహం పుట్టుతూ, ప్రవర్తిల్లుతూ, నశిస్తూ ఉంటుందో ఆ దేవదేవుడైన శ్రీహరిగూర్చి యయాతి ప్రీతితో యాగాలను చేశాడు.

వ. మఱియు. 564

మ. చెలికాండ్రం గరులన్ రథమ్ముల భటశ్రేణిం దురంగంబులం
గలలోఁ గన్న ధనాళితో సమములంగాఁ జూచుచున్, భార్యతోఁ
బలు వేలేండ్లు మనోజభోగ లహరీపర్యాప్తుఁడై తేలియున్
బలుతృష్ణం గడఁగాన కెంతయు మహాబంధంబులన్ స్రుక్కుచున్. 565

* ఇంకా ఆ యయాతి ఆప్తులనూ చతురంగబలాలను పట్టించుకోక పెక్కువేల సంవత్సరాలు భార్యతోను కలిసి మన్మథభోగాలనే తరంగాలలో తేలియాడుతూ మిక్కుటమైన తృష్ణతో లౌకికబంధాలకు చిక్కి, కడగానక సతమత మయ్యాడు.

వ. ఒక్కదినంబున నాత్మజ్ఞానంబునం జేసి కాంతానిమిత్తంబున మోసపోవుట యెఱింగి యయాతి యతివిషాదంబు నొంది దేవయాని కిట్లనియె. 566

* ఒక రోజు ఆత్మజ్ఞానం కలిగినందువల్ల స్త్రీనిమిత్తంగా తాను మోసపోవటం తెలుసుకొని యయాతి మిక్కిలి దుఃఖాన్ని పొంది దేవయానితో ఇట్లా అన్నాడు.

## -: యయాతి దేవయానికి బస్తోపాఖ్యాన మనెడి వ్యాజంబున స్వవృత్తాంతంబు దెలుపుట :-

క. 'మనచారిత్రము వంటిది, విను మితిహాసంబు గలదు; వృద్ధజనములన్
మునులును మెత్తురు; నీవును, మనమున నంగీకరింపు మంజులవాణీ! 567

* మధురభాషిణీ! ఒక యితిహాసం ఉంది. అది మన చరిత్ర వంటిదే. విను. పెద్దలూ మునులూ దాన్ని మెచ్చుకొంటారు. నీవూ మనస్ఫూర్తిగా అంగీకరించు.

వ. అది యెట్టి దనిన. 568

సీ. అజమొకం డడవిలో నరుగుచుఁ దాఁ గర్మ ఫలమున నూతిలోపలికి జాతి
లోఁగెడి ఛాగి నాలోకించి కామియై కొమ్మున దరిఁ గొంత గూలఁ ద్రోచి
వెడలింప నచ్ఛాగి విభునిగాఁ గోరిన నగుఁగాక యని తాను నదియుఁ దిరుగ
నెన్నియేనియుఁ దన్ను నెంత కామించిన నన్నింటికిని భర్తయై తనర్చి

తే. వాని నే ప్రొద్దు రతులకు వశలఁ జేసి, సొరిదిఁ గ్రీడించి క్రీడించి చొక్కి చొక్కి
కాముఁ డనియెడు దుస్సహాగ్రహముకతనఁ, జిత్త మేమఱి మత్తిల్లి చెల్లఁ జిక్కె. 569

* అది ఎలాంటిదో విను. ఒక మేకపోతు అడవిలో తిరుగుతూ కర్మవశాత్తూ నూతిలోపడి దుఃఖించే ఒక ఆడుమేకను చూచి కామించింది. తన కొమ్ములతో ఒడ్డును కొంత కూల్చి దాన్ని బయటపడేటట్లు చేసింది. ఆడుమేక తన్ను భర్తగా కోరగా అదీ తానూ జతకట్టి తిరుగుతూ ఉన్నాయి. తన్ను చూచి కామించిన పెంటిమేక లన్నింటితోనూ ఆ మేకపోతు జతకట్టింది. అన్ని వేళలా వాటిని రతిపరవశలను చేసి క్రీడించడంతో మన్మథుడనే పెనుభూతంవల్ల మేకపోతు చిత్తం ఏమరుపాటు చెంది మత్తిల్లింది.

క. వెడవింటివాని చిగురా, కడిదపు వ్రేటునకు లొంగి యతిమోహితుఁడై
విడువక సతులం దగిలెడు, జడునకు నెక్కడివి బుద్ధిచాతుర్యంబుల్? 570

* మన్మథుని చిగురాకుకత్తి దెబ్బలకు లోనై, మిక్కిలి మోహంతో ఎడతెగని మన్మథక్రీడల్లో స్త్రీలపొందును కోరే మూర్ఖుడికి బుద్ధిచాతుర్యాలు ఎలా ఉంటాయి?

వ. అంత న చ్ఛాగంబు తన పిదపం దగిలిన ఛాగీనివహంబు లోపలం జూడ నొప్పెడి ఛాగియందుఁ దగిలి, క్రీడింపం గని, నూతిలోపలం బడి వెలువడిన ఛాగి, తన పతివలని నెయ్యంబు లేకుండుటకు విన్ననై తన మనంబున. 571

* పిమ్మట నూతిలోనుండి బయటపడ్డ ఆడుమేక తన తర్వాత జత కట్టిన ఆడుమేకల్లో అన్ని విధాలా అందమైన ఆడుమేకతో పొత్తుకలిపి ఆ మేకపోతు క్రీడిస్తుండగా చూచింది. తనపట్ల భర్తకు ప్రేమలేదన్న సంగతిని గ్రహించి దైన్యాన్ని పొంది, తన మనస్సులో ఇట్లా అనుకొన్నది.

**క. పలికిన పలుకులు పలుకఁడు, కలఁచు న్నవకాంతఁ జూచి కడు సంచలుఁడై**
**నిలిచిన చోట న్నిలువఁడు, నిలు వెల్లను గల్ల కామి నిజమరి గలఁడే. 572**

* నోరు విప్పితే ఉలకడు పలకడు. కొత్తదాన్ని చూస్తే కలియడానికి ఎగబడతాడు. నిలిచినచోట నిలవడు. నిలువెల్లా మోసమే. కాముకు డైనవాడు సత్యవంతు డవుతాడా?

**వ. అని పలికి, విడిచి చనిన, న య్యజవల్లభుండు సురతపరతంత్రుఁడై, మిసిమిసియను శబ్దంబు సేయుచు, న చ్ఛాగి వెంటం జని, యొడంబఱుపం జాలకుండె, అంత దానికిఁ గర్తయైన బ్రాహ్మణుండు రోషంబున రతిసమర్థంబు గాకుండ నల్లాడుచున్న ఛాగవృషణంబులు త్రెంచివేసిన, న చ్ఛాగంబు గ్రిందఁ బడి, వేఁడుకొనిన, బ్రయోజనంబు వొడగని, యోగవిదుండు గావున, బ్రాహ్మణోత్తముండు గ్రమ్మఱ న య్యజవృషణంబులు సంధించిన. 573**

* అని భావించి ఆ మేకపోతుతో పొత్తు మానుకొని వెళ్ళిపోయింది. అప్పుడు ఆ మేకపోతు రతికి లోబడినదై 'మేఁమేఁ' అంటూ ఆ పెంటిమేక వెంటబడింది. ఎంత ప్రయత్నించినా దాన్ని ఒప్పించలేక పోయింది. అప్పుడు పెంటిమేక యజమాని ఐన బ్రాహ్మణుడు కోపంతో రతిక్రియకు పనికిరాకుండా అల్లాడేటట్లుగా ఆ మేకపోతు అండకోశాన్ని కోసేశాడు. ఆ మేకపోతు క్రిందపడి ప్రార్థించగా కార్యపర్యవసానాన్ని ఊహించిన ఆ బ్రాహ్మణుడు తాను యోగం తెలిసిన వాడైనందువల్ల మళ్లా ఆ మేకపోతు అండకోశాన్ని అతికించాడు.

**క. వృషణములు మరలఁ గలిగిన, సుషముండై ఛాగివిభుఁడు సుందరితోడన్**
**విషయసుఖంబులఁ బొందుచుఁ, దృష తుదిఁ గనఁ డయ్యె బెక్కు దివసము లయ్యున్. 574**

* ఆ విధంగా మేకపోతు మళ్లా అండకోశాన్ని పొంది చేవ కలిగినదై ప్రియురాలితో విషయసుఖాలను అనుభవిస్తూ పెక్కుదినాలైనా ఆశ కడగానలేక పోయింది.

**వ. అని యీ విధంబున యయాతి దేవయానికి నిజవృత్తాంతంబు గథారూపంబున నెఱింగించి యిట్లనియె. 575**

* అని ఈ విధంగా యయాతి దేవయానికి తన సంగతినే కథారూపములో తెలియజేసి యిట్లా అన్నాడు.

**మ. అబలా! నీ నిబిడాతి దుర్జయ సలజ్జాపాంగభల్లంబులం**
**బ్రబలంబైన మనంబు భగ్నముగ నా ప్రావీణ్యముం గోలుపో**
**యి బలిష్ఠుండగు కాముఁబారిఁ బడి నే నెట్లోర్చెదన్ బంది క**
**త్తె బడిం బాపపుఁ దృష్ణ యిప్పుడకటా! దీర్ఘాకృతిన్ రొప్పెడిన్. 576**

* కాంతా! దట్టమై గెలువ శక్యంగాని సిగ్గుతో గూడిన నీ కడగంటి చూపులనే బల్లెములవల్ల బలమైన నా మనస్సు భగ్నమై పోయింది. నా తెలివిని కోల్పోయాను. బలవంతుడైన మన్మథుని బారికి నే నెట్లా ఓర్వగలను? బందికత్తె ఐన పాపపుతృష్ణ నన్నిప్పుడు అధికంగా బాధిస్తున్నది.

క. అదలదు ప్రాణము లదలినఁ, గదలదు సర్వాంగకములు గదలుచు నున్నన్
వదలదు బిగువులు వదలినఁ, దుదిలే దీ తృష్ణ దీనిఁ ద్రుంపఁగ వలయున్. 577

* ప్రాణాలు తొలగినా తొలగదు. సర్వాంగాలు వణకుతున్నా వీడిపోదు. జిగిబిగి సడలినా వదలిపోదు. ఇటువంటి తృష్ణకు అంతం లేదు. దీనిని బలవంతంగా త్రుంచి వేయాలి.

క. వెయ్యేం డ్లయ్యెను నీతోఁ, గ్రయ్యంబడి యున్నవాఁడ గామసుఖములం
గ్రుయ్య దొక యించుకైనన్, డయ్యదు కొన లిడియెఁ దృష్ణ నవపద్మముఖీ! 578

* ఓ పద్మముఖీ! వెయ్యేండ్లుగా నిన్ను కూడి ఉన్నాను. కామ సుఖాలపట్ల ఆసక్తి తగ్గడం లేదు. ఏ మాత్రం బడలిక కలగడం లేదు. తృష్ణ కొనలుసాగుతూనే ఉంది.

క. ముదిసెను దంతావళియును, ముదిసెను కేశములుఁ దనువు ముదిసెం దనకున్
ముదియనివి రెండు చిక్కెను, బ్రదికెడి తీపియును విషయపక్షస్పృహయున్. 579

* పళ్లు రాలిపోయాయి. వెంట్రుకలు నెరిశాయి. శరీరం శిథిలమౌతున్నది. ప్రాణాలమీది తీపి, ఇంద్రియ సుఖాలపట్ల కోరికా ఈ రెండూ మాత్రం ముదియకుండా ఉన్నాయి.

క. కడ లే దాశాలతకును, గడఁజూడఁగఁ గానరాదు కడఁ గనిరేనిన్
గడుముదమున సంసారము, గడఁ గందురు తత్త్వవిదులు కమలదళాక్షీ! 580

* ఓ కమలదళాక్షీ! ఆశ అనే తీగెకు అవధి లేదు. అంతు చూడాలనుకొన్నా కన్పించదు. తత్త్వం తెలిసినవాళ్ళు ఆ ఆశకు అంతు చూడ గలిగితే సంతోషంతో సంసారం కడముట్టగలరు.

క. మండన హాటక పశు వే, దండాశ్వ వధూ దుకూల ధాన్యాదులు పె
క్కుండియు నాశాపాశము, ఖండింపఁగ లేవు మఱియుఁ గడమయ చుమ్మీ. 581

* నగలు, బంగారం, పశువులు, ఏనుగులు, గుఱ్ఱాలు, కన్యలు, మేలైన వస్త్రాలు, ధాన్యాలు ఎన్ని ఉన్నా ఆశాపాశాన్ని ఖండించలేవు. ఇంకా ఏదో కొరత ఉండనే ఉంటుంది సుమా!

క. కామోపభోగసుఖములు, వేమాఱును బురుషుఁ డనుభవింపుచు నున్నం
గామంబు శాంతిఁ బొందదు, ధూమధ్వజుఁ డాజ్యవృష్టిఁ ద్రుంగుడు వడునే? 582

ఆ. అక్క తల్లి చెల్లె లాత్మజ యెక్కిన, పాను పెక్కఁ జనదు పద్మనయన!
పరమయోగికైన బలిమిని నింద్రియ, గ్రామ మధికపీడఁ గలుగఁ జేయు. 583

* ఓ పద్మనయనా! పరమయోగికైనా సరే బలవంతములైన ఇంద్రియాలు కీడు కలిగిస్తాయి. అందుకే తల్లి కూతుళ్లయినా సరే, అక్కచెల్లెండ్రయినా సరే వాళ్లతో కలిసి ఒకే పానుపుమీద కూర్చోకూడదు.

క. వెంగలివిత్తై తిరుగక, కంగారై చెడక ముక్తిఁ గాంక్షించు నతం
డంగనలతోడ విడువని, సంగడముల వదలవలయు జలజాతముఖీ! 584

* ఓ కమలముఖీ! ముక్తి కోరేవాడు మూర్ఖుడై సంచరిస్తూ కలతపడి చెడిపోకుండా స్త్రీలతోడి సాంగత్యాన్ని వదలుకోవాలి.

వ. అది గావున నేఁడు మొదలు తృష్ణాఖండనంబు సేసి, నిర్విషయుండనై, యహంకారంబు విడిచి, మృగంబులం గలసి, వనంబున సంచరించెద. పరబ్రహ్మంబునందుఁ జిత్తంబుఁ జేర్చెద, బ్రహ్మనిష్ఠ మనుష్యులకు నాశానివారిణి యగుటం జేసి యే నందుఁ దత్పరుండనై, యాహారనిద్రాది యోగంబులం బరిహరించెద. ఆత్మ విదుండై, సంసార నాశంబుఁ దలంచిన వాఁడె విద్వాంసుండని తలంచి పలికి, పూరుని యౌవనం బతని కిచ్చి, ముదిమి తాను గైకొని, విగతలోభుండై, నిజభుజశక్తి పాలితం బగు భూమండలంబు విభాగించి, ద్రుహ్యునకున్ బూర్వభాగంబును, యదువునకు దక్షిణభాగంబును, దుర్వసునకుఁ బశ్చిమదిగ్భాగంబును, ననువునకు నుత్తరదిగ్భాగంబును సంరక్షింపుం డని యిచ్చి వారల సమక్షంబున. 585

* అందువల్ల నేటి నుండి తృష్ణను నిర్మూలించి, విషయాసక్తి లేనివాడినై, అహంకారం వదలుకొని మృగాలతో కలిసి అడవుల్లో తిరుగుతాను, పరబ్రహ్మలోనే చిత్తాన్ని చేర్చుతాను. బ్రహ్మనిష్ఠ మనుషులకు ఆశను పోగొట్టేది కాబట్టి నే నందులో నిమగ్నుణ్ణయి నిద్రాహారాలను మానుకొంటాను. ఆత్మజ్ఞానినై సంసారబంధాలనుండి బయటపడినవాడే పండితుడు- అని చెప్పి యయాతి పూరుని యౌవనాన్ని తిరిగి అతడి కిచ్చి, ముసలితనాన్ని తాను తీసుకొన్నాడు. లోభగుణం వదలుకొన్న ఆ యయాతి తన భుజశక్తితో కాపాడబడే భూమండలాన్ని నాలుగు భాగాలు చేసి ద్రుహ్యునికి పూర్వభాగాన్ని, యదువునకు దక్షిణదిక్కును, తుర్వసునికి పడమటి దిక్కును, అనువుకు ఉత్తరదిక్కును కాపాడమని ఇచ్చాడు.

క. నాలుగుచెఱఁగుల నేలయుఁ, బాలింపుం డనుచు నగ్రభవులకుఁ బంచెన్
భూలోక మేలు మనుచును, బాలార్కోదారుఁ బూరుఁ బట్టము గట్టెన్. 586

* నాలుగు చెరగులనేలను పాలించు మని పెద్ద కొడుకులను ఆజ్ఞాపించాడు. బాలసూర్యుడివలె ప్రకాశించే పూరునికి సమస్తభూమండలాన్ని పరిపాలించ మని పట్టం కట్టాడు.

వ. ఇట్లు పూరునికి రాజ్యం బిచ్చి, పెక్కువర్షంబుల యందు ననుభూతంబులైన యింద్రియ సుఖంబులు విసర్జించి. 587

* ఈ విధంగా యయాతి పూరునికి రాజ్యాన్ని ఇచ్చి అనేక సంవత్సరాలుగా అనుభవిస్తున్న ఇంద్రియసుఖాలను విసర్జించాడు.

క. మిక్కిలి విజ్ఞానంబునఁ, జక్కఁగ దిగ విడిచి వైరిషడ్వర్గంబున్
ఱెక్కలు వచ్చిన విహగము, గ్రక్కున నీడంబు విడుచుకరణి నుదితుఁడై. 588

* ఆ యయాతి గొప్పజ్ఞానంతో అరిషడ్వర్గాలను అణచివేసి రెక్కలు వచ్చిన పక్షి వెంటనే గూడును వదలిపెట్టునట్లుగా సంసారవిముక్తు డయ్యాడు.

క. కారుణికోత్తముఁడగు హరి, కారుణ్యము కతన నతఁడు ఘనుఁడై గెలిచెన్
క్రూరములగు విషయంబుల, నూరక గెలువంగ శక్తుఁ డొక్కఁడు గలఁడే? 589

* కరణామయుడైన శ్రీహరి దయవల్ల అతడు కఠోరమైన విషయవాంఛలను గెలిచాడు. భగవంతుని కృపలేకుండా వాటిని గెలువగలిగిన వాడు ఒక్కడైనా ఉన్నాడా?

వ. మఱియు నిర్మూలిత సకలసంగుండై సత్త్వరజస్తమో గుణంబులం దిగనాడి నిర్మలంబై, పరమంబైన వాసుదేవాభిధాన బ్రహ్మంబునందు యయాతిభూపాలుండు స్వతస్సిద్ధయైన భాగవతగతిం జెందె. నంత.590

* ఇట్లా బంధాలను తెంచుకొని త్రిగుణాలను అతిక్రమించి ఆ యయాతి, భగవంతుని భక్తులు పొందే ఉత్తమగతిని పొంది పరిశుద్ధమూ, పరమమూ ఐన వాసుదేవ పరబ్రహ్మంలో లీన మయ్యాడు.

సీ. ప్రాణేశుఁ డాడిన పలుకులు నగవులు గాఁ జూడ కంతరంగమున నిలిపి
పథికులై పోవుచుఁ బానీయశాలలఁ జల్లఁగా నుండెడి జనుల యట్ల
సంసారమునఁ గర్మసంబంధులై వచ్చి, యాలుబిడ్డలు మగం డనుచుఁ గూడి
యుండుట గాని సంయోగంబు నిత్యంబు గా దీశమాయా ప్రకల్పితంబు

తే. దీని విడుచుట తగ వని తెగువ మెఱసి, నిద్ర పాలించి మేల్కొన్న నేర్పు చాలఁ
గలిగి భార్గవి సర్వసంగముల విడిచి, హరిపదధ్యానయై ముక్తి కరిగె నధిప! 591

* ఓ రాజా! ఆ దేవయాని భర్త చెప్పిన మాటలను పరిహాసంగా భావించక మనస్సులో నిలుపుకొన్నది. బాటసారులై వెళ్లుతూ చలివేంద్రల్లో కొంతసేపు చల్లగా గడిపే జనులలాగా జీవులు సంసారంలో కర్మానుసారులై వచ్చి ఆలు, బిడ్డలు, మగడు అంటూ కూడి ఉంటారు. ఈ పొత్తులు శాశ్వతం కావు. ఇవన్నీ సర్వేశ్వరుడి మాయాకల్పితాలే. ఇలాంటి క్షణికమైన దాన్ని వదలడమే ధర్మం- అని జాగరూకత పొందిన ఆమె సమస్తబంధాలనూ వదలుకొని శ్రీహరిధ్యానంలో నిమగ్నురాలై ముక్తి పదాన్ని చేరుకొన్నది.

వ. అని యిట్లు యయాతి చరితంబు చెప్పి, భగవంతుండును, సర్వభూత నివాసుండును, శాంతుండును, వేదమయుండు నైన వాసుదేవునకు నమస్కరించెద అని శుకుం డిట్లనియె. 592

* అని ఇ ట్లా యయాతి చరిత్రను చెప్పి "భగవంతుడూ, సమస్త ప్రాణుల్లో నివసించే వాడూ, శాంతుడూ, వేదమయుడూ ఐన వాసుదేవునికి నమస్కరిస్తాను' అని శుకుడు మళ్లీ ఇలా అన్నాడు.

క. భారత! నీవు జనించిన, పూరునివంశంబునందుఁ బుట్టిన వారిన్
జారుయశోఽలంకారుల, ధీరుల వినిపింతు నధిక తేజోధనులన్. 593

* పరీక్షిన్మహారాజా! నీవు పుట్టిన పూరునివంశంలోనే జన్మించిన వారూ, కీర్తినే అలంకారంగా కలిగినవారూ, ధీరులూ, తేజస్సంపన్నులూ ఐన వారిని గూర్చి వినిపిస్తాను.

వ. పూరునకుఁ జనమేజయుండు, జనమేజయునకుఁ బ్రాచిన్వాంసుఁ డతనికిఁ బ్రవిరోధనమన్యు, వతనికిఁ జారువు పుట్టె. ఆ చారునకు సుద్యువు, సుద్యువునకు బహుగతుండును, బహుగతునకు శర్యాతి,

శర్యాతికి సంయాతియు, సంయాతికి రౌద్రాశ్వుండు, రౌద్రాశ్వునకు ఘృతాచి యను నచ్చరలేమయందు ఋతేపువు కక్షేపువు, స్థలేపువు, కృతేపువు, జలేపువు, సన్నతేపువు, ధర్మేపువు, సత్యేపువు, వ్రతేపువు, వనేపువు అనువారు జగదాత్మ భూతుండైన ప్రాణునకు నింద్రియంబుల చందంబునఁ బదుగురు కొడుకులు జన్మించిరి. అందు ఋతేపువునకు నంతిసారుండు, నంతిసారునకు సుమతియు, ధ్రువుండు, నప్రతిరథుండు నను ముమ్వురును బుట్టిరి. అందు నప్రతిరథునకుఁ గణ్వుం, డా కణ్వునికి మేధాతిథి, యతనికి ప్రస్కందుండు మొదలగు బ్రాహ్మణులు జన్మించిరి. ఆ సుమతికి రైభ్యుండు, రైభ్యునకు దుష్యంతుండు పుట్టె. 594

* పూరునికి జనమేజయుడు, జనమేజయునికి ప్రాచిన్వాంసుడు, ఆ ప్రాచిన్వాంసునికి ప్రవిరోధనమన్యువు, అతడికి చారువు పుట్టారు. ఆ చారువునకు సుద్యువు, సుద్యువుకు బహుగతుడు, బహుగతునికి శర్యాతి, శర్యాతికి సంయాతి, సంయాతికి రౌద్రాశ్వుడు, రౌద్రాశ్వునికి ఘృతాచి అనే అప్సరః స్త్రీ వల్ల జగదాత్మభూతుడైన ప్రాణునికి ఇంద్రియాలవలె ఋతేపువు, కక్షేపువు, స్థలేపువు, కృతేపువు, జలేపువు, సన్నతేపువు, ధర్మేపువు, వ్రతేపువు, సత్యేపువు, వనేపువు అనే పదిమంది కొడుకులు జన్మించారు. వారిలో ఋతేపువుకు అంతిసారుడు, అంతిసారునికి సుమతి, ధ్రువుడు, అప్రతిరథుడు అన్న ముగ్గురు పుత్రులు పుట్టారు. వారిలో ఆ ప్రతిరథునికి కణ్వుడు, కణ్వునికి మేధాతిథి, అతడికి ప్రస్కందుడు మొదలైన బ్రాహ్మణులు జన్మించారు. ఆ సుమతికి రైభ్యుడు పుట్టాడు. రైభ్యునికి దుష్యంతుడు కలిగాడు.

క. పారావారపరీతో, దారధరాభారదక్ష దక్షిణహస్త
శ్రీ రాజిల్లఁగ నొకనాఁ, డా రాజేంద్రుండు వేఁటయం దభిరతుఁడై. 595

* సముద్రంచే చుట్టబడిన సమస్త భూభారాన్ని వహించటానికి సమర్థమైన తన దక్షిణహస్తం సుప్రశస్తమై ప్రకాశించగా ఒకనాడు ఆ రాజేంద్రుడు వేట యందలి కోరికతో బయలుదేరాడు.

క. గండక కంఠీరవ భే, రుండ శశ వ్యాళ కోల రోహిష రురు వే
దండ వ్యాఘ్ర మృగాదన, చండ శరభ శల్య భల్ల చమరాటవులన్. 596

క. చప్పుడు సేయుచు మృగముల, రొప్పుచు నీరములయందు రోయుచు వలలం
ద్రిప్పుకొని పడఁగఁ జోపుచుఁ, దప్పక యేయుచును వేఁటతమకం బొప్పన్. 597

క. మృగయూథంబుల వెంటను, మృగలాంఛన సన్నిభుండు మృగయాతురుఁడై
మృగయులు గొందఱుఁ గొలువఁగ, మృగరాజ పరాక్రమంబు మెఱయఁగ వచ్చెన్. 598

* ఖడ్గమృగాలు, సింహాలు, గండభేరుండాలు, కుందేళ్ళు, పాములు, అడవిపందులు, గొఱ్ఱెలు, లేళ్లు, ఏనుగులు, పులులు, సివంగులు, మీగండ్ల మెకాలు, ఏదుపందులు, ఎలుగుబంట్లు, సవరపు మెకాలు మొదలైన వాటితో కూడిన అడవులలో చప్పుడుచేస్తూ జంతువులనూ అదలిస్తూ పొదల్లో వెదకుతూ, వలలు తప్పుకొనిపోతూ, గురితప్పక కొట్టుతూ చంద్రునితో సమానుడైన ఆ దుష్యంతుడు కొందరు వేటగాళ్ళు తన్ను సేవిస్తుండగా సింహపరాక్రమం ప్రకటిత మయ్యేటట్టుగా జంతువులను వేటాడసాగాడు.

వ. ఇట్లు వచ్చి వచ్చి దైవయోగంబునఁ గణ్వమహాముని తపోవనంబు చేరంజని. 599

సీ. ఉరుతర శ్రాంతాహి యుగళంబులకుఁ బింఛముల విసరెడి కేకిముఖ్యములను
గరుణతో మదయుక్త కలభంబులకు మేఁత లిడుచు ముద్దాడు మృగేంద్రములను
ఘనమృగాదనములు, గాపుగా లేళ్ళతో రతులు సాగించు సారంగములను
నునుపుగా హోమధేనువుల కంఠంబులు దువ్వుచు నాడు శార్దూలములను

తే. దార కలహించు మూషిక దంపతులకు, మైత్రి నంకించు మార్జాలమల్లములను
మతిని జాతివైరంబులు మాని కూడి, కలసి క్రీడించు మృగములఁ గాంచె నతఁడు. 600

* అ దుష్యంతుడు దైవ ఘటనవల్ల కణ్వమహాముని తపోవనాన్ని సమీపించాడు. ఆ వనంలో సహజమైన శత్రుభావం మాని మిక్కిలి అలసట పొందిన పాముల జంటలకు పురులు విప్పి విసరే నెమళ్ళనూ, మదించిన గున్న ఏనుగులకు జాలితో మేతలు అందించుచూ ముద్దాడే సింహాలనూ, సివంగులు కాపుండగా లేళ్లతో జతకట్టే మగజింకలనూ, హోమధేనువుల మెడలను నున్నగా నిమురుతూ ఆడుకొంటున్న పులులనూ, తమలో తాము పోట్లాడుకొనే ఎలుకల జతలకు పొత్తు కలిగించు పిల్లులనూ చూచాడు.

క. ఇ త్తెఱఁగున మృగజాతుల, పొత్తులు మే మెఱుఁగ మనుచు భూవల్లభుఁడుం
జిత్తములోపల నా ముని, సత్తము సద్వృత్తమునకు సంతసపడుచున్. 601

* ఈ విధంగా సహజవైరం గల జంతువులు పొత్తుకూడి ఉండడం నే నెక్కడా చూడలేదని అబ్బురపడి దుష్యంతుడు మనసులో ఆ మహాముని మహిమకు సంతోషించాడు.

క. హల్లక బిసరుహ సరసీ, కల్లోలోత్ఫుల్ల యూథికా గిరిమల్లీ
మల్లీ మరువక కురవక, సల్లలితానిలము వలన సంతుష్టుండై. 602

* ఆ తర్వాత దుష్యంతుడు చెంగలువలతోను, తామర పూలతోను, నిండిన సరస్సులోని అలలమీదుగా; బాగా వికసించిన అడవి మల్లెలు, కొండమల్లెలు, మొల్లలు మొదలైన పూలమీదుగా వీచే మలయమారుతంతో సేద దీరాడు.

వ. దుష్యంతుండు వచ్చు నవసరంబున. 603

క. ఇం దిందిరాతి సుందరి, యిందిందిరచికుర యున్న; దిందింద శుభం;
బిం దిందువంశ యను క్రియ, నిందీవరవీథి మ్రోసె నిందిందిరముల్. 604

* అట్లా దుష్యంతుడు వచ్చే సమయంలో "చంద్రవంశాలంకారా!" ఇక్కడ లక్ష్మీదేవికంటె అందగత్తె, తుమ్మెదలవంటి ముంగురులు కల సుందరి ఉంది. నీకు శుభం కలుగుతుంది' అన్నట్లుగా కలువపూల లోని తుమ్మెదలు ఝంకారాలు చేశాయి.

క. మా కందర్పుని శరములు, మా కందము లగుటఁజేసి మాకందంబుల్
మా కందము లను కైవడి, మాకందాగ్రములఁ బికసమాజము లులిసెన్. 605

* 'మా మన్మథునిబాణాలు మామిడి పూలైనందువల్ల మామిడిచెట్లు మాకు తగిఉన్నాయి. అన్నట్లుగా మామిడిచెట్ల కొనకొమ్మల్లో కోయిలలు కూజితాలు చేశాయి.

వ. అంత. 606

క. ఇందున్న కణ్వమునికిని, వందన మొనరించి తిరిగి వచ్చెద ననుచుం
బొందుగ ననుచరులను దా, నందఱ నందంద నిలిపి యటఁ జని మ్రోలన్. 607

* అప్పుడు దుష్యంతుడు 'ఇక్కడున్న కణ్వమునికి నమస్కరించి తిరిగి వస్తాను' అంటూ అనుచరుల నందరినీ అక్కడే నిలిపి ముందుకు వెళ్లాడు.

శా. ఆ కణ్వాశ్రమమందు నీరజనివాసాంత ప్రదేశంబులన్
మాకందంబులనీడఁ బుష్పలతికా మధ్యంబునన్ మంజు రం
భాకాండాంచితశాలలోఁ గుసుమసంపన్నస్థలిన్ జూచె నా
భూకాంతుండు శకుంతల న్నవనటత్ భ్రూపర్యటత్కుంతలన్. 608

* ఆ రాజు కణ్వాశ్రమంలో తామరకొలను దగ్గర మామిడిచెట్ల నీడలో పుష్పలతలమధ్య, అరటి బోదెల పొదరింట్లో, పూలగుత్తుల ప్రక్క, క్షణ క్షణమూ కదలే కనుబొమలను అలముకొన్న ముంగురులు గల శకుంతలను సందర్శించాడు.

క. దట్టపుఁదుఱుమును మీఁదికి, మిట్టించిన చన్నుఁగవయు మిఱుమిఱుచూడ్కుల్
నట్టాడునడుముఁ దేనియ, లుట్టెడు మోవియును మనము నూరింపంగన్. 609

వ. అంత నా రాజకుమారుం డలరు టమ్ముల విలుకాని, వెడవింట ఘణఘణాయమానలై మ్రోయు ఘంటలకుం బబ్బురించి, తన మనంబున. 610

* ఆమె దట్టమైన జుట్టూ, పైకుబికిన చనుకట్టూ, చలించే చూపులూ, కదలాడే నడుమూ, తేనె లొలికే పెదవులూ ఆ రాజుమనస్సును ఊరించాయి.

* అప్పు డా రాజేంద్రుడు గణగణమని శబ్దించే మన్మథుని వింటి గంటల మ్రోతలకు లొంగిపోయి తన మనస్సులో ఇట్లా అనుకున్నాడు.

శా. వన్యాహారములన్ జితేంద్రియత నావాసించు నా కణ్వుఁ డీ
కన్యారత్నము నే గతిం గనియెడిం గా; దీ కురంగాక్షి రా
జన్యాపత్యము గాఁగ నోపు; నభిలాషం బయ్యెఁ; గాదేని నే
యన్యాయక్రియలందుఁ బౌరవుల కెం దాశించునే చిత్తముల్? 611

* అడవిలో దొరికే కందమూలాలను తింటూ జితేంద్రియుడై నివసించే కణ్వమహర్షి ఈ కన్యారత్నాన్ని ఎట్లా కని ఉంటాడు? బెదరు చూపులు కలిగిన ఈమె రాజకుమారి ఐయుండవచ్చు. అందుకనే ఈమెపై నావకు కోరిక కలిగింది. అలా కానిపక్షంలో పురువంశంలోని వాళ్ళ మనస్సులు అధర్మకార్యాలపట్ల ప్రవర్తిల్లుతాయా?

క. అడిగిన నృపసుతఁ గానని, నొడివెడినో కదే మనంబు నొవ్వ నని విభుం
డుడురాజవదన నడుగఁగఁ, దడుమన యొకకొంతప్రొద్దు తడఁబడఁ జొచ్చెన్. 612

* 'నోరు విప్పి అడిగితే రాజా మనసు నొచ్చుకొనేటట్టు తా నెక్కడ రాజపుత్రికను కానని చెబుతుందేమో' అనుకొని రాజచంద్రుడు ఆ చంద్రముఖిని అడుగక కొంతసేపు సందేహంతో తటపటాయించాడు.

వ. మఱియు నెట్టకేలకుఁ దన చిత్త సంచలనంబు సత్యంబుగాఁ దలంచి యిట్లనియె. 613

* చివరకు తన మనస్సులోని ప్రేరణ సత్యమని భావించి ఇట్లా అన్నాడు.

క. భూపాలక కన్యక వని, నీపై చిత్తంబు నాఁటె, నీవా రేరీ?
నీపే రెవ్వరు? నిర్జన, భూపర్యటనంబు తగవె? పూర్ణేందుముఖీ! 614

* పూర్ణచంద్రముఖీ! నీవు రాజపుత్రిక వని నీమీద నా మనస్సు లగ్నమైంది. నీవా రెక్కడ? మీ పేరేమి? జనసంచారం లేని చోట ఒంటరిగా తిరుగుతున్నావేమిటి?

వ. అని పలుకుచున్న రాజకుమారుని వదనచంద్ర చంద్రికా రసంబు నేత్రచకోరంబువలనఁ ద్రావుచు, న య్యువిద విభ్రాంతయై యున్న సమయంబున. 615

* అని పలుకుతున్న రాజచంద్రుడి ముఖంలోని వెన్నెలను నయన చకోరాలతో త్రాగుచూ ఆమె తడబాటుకు లోనైంది.

క. కంఠేకాలునిచేతన్, గుంఠితుఁడగు టెట్లు మరుఁడు? కుసుమాస్త్రంబుల్
లుంఠించి గుణనినాదము, ఠం, ఠమ్మన బాల నేసె ఠవఠవ గదురన్. 616

* మన్మథుడు పూలబాణాలను సంధించి అల్లెత్రాడు ఠంఠమ్మని శబ్దం చేయగా ఆ బాలికపై ప్రయోగింప సాగాడు. అందువల్ల శివుడు మన్మథుణ్ణి దహించా డన్నమాట బూటకం.

వ. ఇట్లు వలరాజువాఁడి క్రొవ్విరికోలల వేఁడిమిఁ దాలిమి పోఁడిమి సెడి, యా వాలుఁగంటి యిట్లనియె. 617

* ఇట్లా మన్మథుని పూలబాణాల వేడివల్ల గుండెదిటవును పోగొట్టుకొని వాలుచూపులు గల శకుంతల ఆ రాజకుమారునితో ఇట్లా అన్నది.

మ. అనివార్యప్రభ మున్ను మేనకయు విశ్వామిత్రభూభర్తయున్
గని! రామేనక డించిపోయె నడవిన్; గణ్వుండు న న్నింతగా
మనిచెన్; సర్వము నా మునీంద్రుఁ డెఱుఁగన్ మద్భాగధేయంబునన్
నినుఁ గంటిం బిదపం గృతార్థ నగుదున్ నేఁడీ వనాంతంబునన్. 618

* పూర్వం అమోఘతేజోవంతులైన మేనకావిశ్వామిత్రులు నన్ను కన్నారు. కన్నతల్లి మేనక నన్ను అడవిలో వదలిపెట్టి పోయింది. కణ్వముని న న్నింతదాన్ని చేశాడు. అంతా ఆ మహర్షికి తెలుసు. నా అదృష్టంవల్ల కృతకృత్యురాలి నయ్యేటట్టుగా నేడు నిన్నీ అడవిలో చూచాను.

**క. నీవారము ప్రజ లేమును, నీవారము పూజగొనుము నిలువుము నీవున్**
**నీవారును మాయింటను, నీవారాన్నంబుఁ గొనుఁడు నేఁడు నరేంద్రా! 619**

* ఓ రాజా! ప్రజలూ, మేమూ నీ వారమే. ఈ రోజు ఇక్కడ ఆగి మా పూజలు అందుకో, మా యింట్లోని నివ్వరి అన్నంతో ఆతిథ్యాన్ని స్వీకరించు.

**వ. అని పలికిన, దుష్యంతుడు మెచ్చి, మచ్చెకంటి యిచ్చ యెఱింగి యిట్లనియె. 620**

* అని చెప్పగా దుష్యంతుడు మెచ్చి ఆమె యింగితం గ్రహించి ఇట్లా అన్నాడు.

**ఆ. రాజతనయ వగుదు రాజీవదళనేత్ర!, మాట నిజము లోనిమాట లేదు.**
**తనకు సదృశుఁడైన తరుణుని ( గైకొంట, రాజసుతకుఁ దగవు రాజవదన! 621**

* కమలదళాల వంటి కన్నులు కలదానా! నీవు రాజకుమారివే ఐయుంటావు. ఇది సత్యం. దాపరికం ఎందుకు? ఓ చంద్రముఖీ! తనకు అన్ని విధాలా తగినవరుణ్ణి వరించడం రాజపుత్రికకు ధర్మమే.

**వ. అని మఱియుఁ దియ్యని నెయ్యంపుఁ బలుకుల వలన నయ్యువిద నియ్యకొలిపి. 622**

* ఇట్లా తియ్యటి వలపు చిలుకు పలుకులతో ఆమెను అంగీకరింపజేసి

**క. బంధురయశుఁడు జగన్నుత, సంధుఁడు దుష్యంతుఁ డుచితసమయజ్ఞుండై**
**గంధగజగమన నప్పుడు, గాంధర్వవిధిన్ వరించె గహనాంతమునన్. 623**

* జగన్నుతుడు కీర్తిమంతుడైన ఆ దుష్యంతుడు ఉచితజ్ఞుడై ఆ అడవిలో శకుంతలను గాంధర్వవిధిని అనుసరించి వివాహమాడాడు.

## -: భరతుని చరిత్ర :-

**వ. ఇవ్విధంబున నమోఘవీర్యుండగు నా రాచపట్టి, తపసిరాచూలికిఁ జూలునిలిపి, మఱునాఁడు తన వీటికిం జనియె. నయ్యింతియుం గొంతకాలంబునకుఁ గొడుకుం గనినం, గణ్వమునీంద్రుఁ డా రాచపట్టికి జాత కర్మాది మంగళాచారంబు లొనర్చె. నా డింభకుండును దినదినంబునకు బాలచంద్రుండునుం బోలె నెదుగుచు. 624**

* ఈ విధంగా అమోఘతేజోవంతుడైన దుష్యంతుడు శకుంతలను గర్భవతిని చేసి మరునాడు తన పట్టణానికి వెళ్ళాడు. ఆమె కొంతకాలానికి కొడుకును కన్నది. కణ్వమహర్షి ఆ రాజకుమారుడికి జాతకర్మ మొదలైన మంగళకార్యాలు జరిపించాడు. ఆ పసివాడు బాలచంద్రుడిలాగా దినదిన ప్రవర్ధమాను డైనాడు.

**క. కుంఠితుఁడుగాక వాఁ డు,త్కంఠం దన పిన్ననాఁడె కణ్వవనచరత్**
**కంఠీరవముఖ్యంబుల, కంఠములన్ బట్టి యడుచుఁ; గట్టున్; విడుచున్. 625**

* ఆ బాలుడు పసితనంలోనే గొప్పబలవంతుడై ఆ వనంలో తిరుగాడే గొప్పసింహాలను మెడలు వంచి పట్టుకొని వచ్చి, చెట్లకు కట్టుతూ, వదలిపెట్టుతూ, ఆడుకొనేవాడు.

వ. అంత నా కణ్వమునీంద్రుండు బాలకుం జూచి శకుంతల కిట్లనియె. 626

ఉ. పట్టపురాజు నీమగఁడు; పాపఁడు నన్నిట నెక్కు డంతకున్,
బట్టపుదేవివై గరిమ బాగుగ నుండక పాఱువారితో
గట్టువనంబులో నవయఁగాఁ బనిలే దిటఁ దర్లి పోఁగదే
పుట్టినయిండ్లు మాని పతిఁబొందక యిట్లనిశంబు నుందురే? 627

* అప్పుడు కణ్వమహర్షి ఆ బాలుణ్ణి చూచి శకుంతలతో ఇట్లా అన్నాడు; "నీ మగడేమో మహారాజు. ఈ పసివాడు అన్నిట్లో అందె వేసినచేయి. నీవు పట్టపురాణివై మర్యాద మన్ననల నందవలసినది పోయి ఇక్కడ తాపసులతో కలిసి ఈ కొండకోనల్లో కష్టపడవలసిన పని లేదు. నీ విక్కడనుండి దుష్యంతుని అంతఃపురానికి బయలుదేరి వెళ్లు. పుట్టినిండ్లలో మానవతులు కలకాలమూ కాలక్షేపం చేస్తారా?

వ. అనిన నియ్యకొని 628

క. ఆ పిన్నవాని నతుల, వ్యాపారు నుదారు వైష్ణవాంశోద్భవునిం
జూపెద నంచు శకుంతల, భూపాలునికడకు వచ్చెఁ బుత్త్రుని గొనుచున్. 629

* అని కణ్వమహర్షి చెప్పగా ఒప్పుకొని ఆ శకుంతల పిన్నవాడు, సాటిలేని సాహసవంతుడు, విష్ణువుఅంశ వల్ల పుట్టినవాడు ఐనబాలుణ్ణి భర్తకు చూపెట్టుతా నని కొడుకును వెంటబెట్టుకొని దుష్యంతుని దగ్గరకు వచ్చింది.

వ. వచ్చి దుష్యంతుండున్న సభామండపంబునకుం జని నిలిచి యున్నయెడ. 630

మ. వలకేలన్ గురుచక్రరేఖయుఁ బదద్వంద్వంబునం బద్మ రే
ఖలు నొప్పారఁగ నందు వచ్చిన రమాకాంతుండు నాఁ గాంతి న
గ్గలమై యున్న కుమారు మారసదృశాకారున్ విలోకించి తాఁ
బలుకండయ్యె విభుం డెఱింగి సతి విభ్రాంతాత్మయై వందురన్. 631

* అట్లా వచ్చి శకుంతల దుష్యంతుడున్న సభామండపానికి వెళ్ళి నిలబడింది. కుడిచేతిలో చక్రరేఖ, పాదాలలో పద్మరేఖలు కలిగి దిగి వచ్చిన శ్రీమన్నారాయణుడేమో అన్నట్లు గొప్పతేజస్సుతో కూడిన, మన్మథాకారుడైన కుమారుణ్ణి చూచి విషయమంతా తెలిసికూడా ఆ రాజు పెదవి విప్పి మాటాడలేదు. అందుకు ఆ శకుంతల తడబాటు చెందిన మనస్సుతో విచారించింది.

వ. ఆ సమయంబున. 632

మ. అదె నీ వల్లభ, వాఁడు నీ సుతుఁడు; భార్యాపుత్త్రులన్ బాత్రులన్
వదలం గా; దలనాటి కణ్వవనికా వైవాహికారంభముల్
మది నూహింపు; శకుంతలా వచనముల్ మాన్యంబులౌ భూవరేం
ద్ర! దయం జేకొను మంచు మ్రోసెను వియద్వాణీ వధూవాక్యముల్. 633

* ఆ సమయంలో 'ఓ రాజేంద్రా' ఆమె నీ భార్య. వాడే నీ కొడుకు. యోగ్యులైన నీ భార్యాపుత్రులను వదులుకోవద్దు. కణ్వాశ్రమంలో ఆ నాటి నీ వివాహప్రయత్నాలను మనసులో ఊహించు. శకుంతల మాటలను గౌరవించి దయతో ఆమెను స్వీకరించు' అంటూ ఆకాశవాణి పలికింది.

**వ. ఇట్లశరీరవాణి సర్వభూతంబులకుం దేటపడ భరింపు మని పలికిన, నా కుమారుడు భరతుండయ్యె, అంత నా రాజు రాజవదన నంగీకరించి, తనూభవుం జేకొని, కొంతకాలంబు రాజ్యంబుఁ జేసి పరలోకంబునకుం జనియె. తదనంతరంబ. 634**

* ఈ విధంగా అశరీరవాణి సర్వప్రాణులకూ స్పష్టమయ్యేటట్లుగా భరింపుమని పలికినందువల్ల ఆ కుమారుడు భరతుడుగా ప్రసిద్ధికెక్కాడు. పిమ్మట ఆ రాజు శకుంతలను ఆదరించి పుత్రుణ్ణి స్వీకరించి కొంతకాలం రాజ్యం చేసి పరలోకగతుడైనాడు.

**క. రెండవ హరిక్రియ ధరణీ, మండలభారంబు నిజసమంచితబాహా**
**దండమున నిలిపి తనకును, భండనమున నెదురులేక భరతుం డొప్పెన్. 635**

* ఆ తర్వాత భరతుడు రెండవ విష్ణువులాగా ఒప్పిదమైన తన భుజదండంమీద భూభారాన్ని నిలిపి యుద్ధంలో తనకు ఎక్కడా ఎదురు లేకుండా విలసిల్లాడు.

**వ. మఱియు నా దౌష్యంతి, యమునాతటంబున దీర్ఘతపుండు పురోహితుండుగా డెబ్బదియెనిమిది యును, గంగాతీరంబున నేఁబదియయిదును, నిట్లు నూటముప్పదిమూఁ డశ్వమేధయాగంబులు సదక్షిణంబులుగా నొనర్చి, దేవేంద్రవిభవంబున నతిశయించి, పదుమూఁడువేలున్నెనుబదినాలుగు కదుపుధేనువులు గలయది ద్వంద్వంబనం బరఁగు. అట్టి వెయ్యిద్వంద్వంబుల పాఁడిమొదవులఁ గ్రేపులతోడ నలంకార సహితలం జేసి, వేవురు బ్రాహ్మణుల కిచ్చి, మష్కారపుణ్యతీర్థకూలంబున విప్రముఖ్యులకు రత్నభూషణ శోభితంబులై; ధవళదంతంబులు గల నల్లని యేనుంగులఁ బదునాలుగు లక్ష లొసంగె. దిగ్విజయ కాలంబున శక, శబర, బర్బర,కష, కిరాతక, హూణ, మ్లేచ్ఛ దేశంబుల రాజుల పీచం బడంచి, రసాతలంబున రాక్షస కారా గృహంబులందున్న వేల్పుల గరితలం బెక్కంద్ర విడిపించి తెచ్చి, వారల వల్లభులం గూర్చె. త్రిపురదానవుల జయించి, నిర్జరుల నిజమందిరంబుల నునిచె. అతని రాజ్యంబున గగన ధరణీతలంబులు ప్రజలు గోరిన కోరిక లిచ్చుచుండె, ఇవ్విధంబున. 636**

* ఇంకా ఆ భరతుడు యమునానది ఒడ్డున దీర్ఘతపుణ్ణి పురోహితుడిగా చేసుకొని డెబ్బై ఎనిమిదీ, గంగాతీరంలో ఏభైఐదూ మొత్తం నూట ముప్ఫైమూడు సదక్షిణములైన అశ్వమేధయాగాలను చేసి దేవేంద్ర వైభవంతో అతిశయించాడు.

పదమూడువేల ఎనభైనాలుగు పాడియావులమందను ద్వంద్వమంటారు. అలాంటి వేయిద్వంద్వముల పాడియావులను, దూడలతోపాటు అలంకరించి వేయిమంది బ్రాహ్మణుల కిచ్చాడు. మష్కారతీర్థం ఒడ్డున బ్రాహ్మణ శ్రేష్ఠులకు బంగారునగలతో శోభించేవీ, తెల్లని దంతాలు కలిగినవీ ఐన పద్నాలుగు లక్షల నల్లని ఏనుగులను దానం చేశాడు. దిగ్విజయయాత్రలో శక శబర బర్బర కష కిరాతక హూణ మ్లేచ్ఛ దేశాలరాజుల

గర్వాన్ని అణచాడు. పాతాళంలో రాక్షసుల చెరసాలల్లో ఉన్న పెక్కుమంది దేవతాస్త్రీలను విడిపించి వారి భర్తలకు అప్పగించాడు. త్రిపురరాక్షసులను జయించి దేవతలను తమ తమ స్థానాల్లో నిలిపాడు. అతడిరాజ్యంలో భూమీ, ఆకాశమూ ప్రజలు కోరిన కోర్కెలను తీరుస్తుండేవి.

**ఆ. సత్యచరితమందుఁ జలమందు బలమందు, భాగ్యమందు లోకపతులకంటె**
**నెక్కుడైన పేర్మి నిరువదియేడు వే, లేండ్లు ధరణి భరతుఁ డేలె నధిప! 637**

* ఓ రాజా! ఈ విధంగా ఆ భరతుడు సత్యమైన నడవడిక, పట్టుదల, బలం, భాగ్యం మొదలైన విషయాల్లో దిక్పాలకులకంటే ఎక్కువైన వైభవంతో ఇరవైయేడువేల యేండ్లు భూమండలాన్ని పరిపాలించాడు.

**క. అర్థపతికంటెఁ గలిమి గృ, తార్థుండై యతుల శౌర్య మలవడియు నతం**
**డర్థములును బ్రాణములును, వ్యర్థము లని తలఁచి శాంతుఁడయ్యె నరేంద్రా! 638**

* ఓ రాజా! కుబేరునికంటె గొప్పసంపదతో కృతార్థుడై ఉండీ, సాటిలేని శౌర్యం కలిగిఉండీ అతడు అర్థప్రాణాలు వ్యర్థాలని భావించి శాంతిని అభిలషించాడు.

**క. భరతుని భార్యలు ముప్వురు, వరుసం బుత్త్రకులఁ గాంచి వల్లభుతోడన్**
**సరిగారని తోడ్తోడను, శిరముల దునుమాడి రాత్మశిశువుల నధిపా! 639**

* ఓ రాజా! భరతుని భార్యలు ముగ్గురూ క్రమంగా కొడుకులను కన్నారు. కాని భర్తపేరు నిలిపే వాళ్ళు కారని తెలుసుకొని వెంటనే తమ బిడ్డల తలలను ఖండించారు.

**వ. ఇట్లు విదర్భరాజపుత్త్రికలు శిశువులఁ జంపిన భరతుం డపుత్త్రకుండై మరుత్స్తోమం బను యాగంబు పుత్త్రార్థియై చేసి, దేవతల మెప్పించె. న య్యవసరంబున. 640**

* ఇట్లా విదర్భరాజుకొమార్తెలు శిశువులను వధింపగా భరతుడు అపుత్రకు డయ్యాడు. కొడుకుకోసం మరుత్స్తోమం అనే యాగాన్ని చేసి దేవతలను మెప్పించాడు.

**సీ. అన్న యిల్లాలిఁ జూలాలిని మమతాఖ్యఁ జూచి బృహస్పతి సురతమునకుఁ**
**దొరఁకొని పై ఁబడ్డఁ దొల్లి గర్భంబున నున్న బాలుఁడు భయం బొదవి వలదు**
**తగదని మొఱసేయఁ దమకంబుతో వాని నంధుండ వగుమన్న నలిగి వాఁడు**
**యోనిలోపలి వీర్య మూడఁదన్నిన నేలఁ బడి బిడ్డఁడై యున్నఁ బాయలేక**

**ఆ. నితనిఁ బెంపు; కొడుకు లిరువురు జన్మించి, రనుచు వెలయఁజేయుమనిన మమతఁ**
**బెంపఁజాల; నీవు పెంపు; భరింపు మీ; ద్వాజు ననుచుఁ జనియె దాని విడిచి. 641**

* ఒకసారి బృహస్పతి తన అన్న భార్య, గర్భవతి ఐన మమతను చూచి రతిక్రీడకు పూనుకోగా గర్భంలో ఉన్న శిశువు భయపడి 'వద్దు' ఇది నీకు తగదు' అని మొరపెట్టుకున్నాడు. అప్పుడు బృహస్పతి తమకంతో వాణ్ణి 'గ్రుడ్డివాడివైపో' అని శపించగా వాడు కోపించి యోని లోపలి వీర్యం ఊడిపడేలా తన్నాడు.

అది బిడ్డగా నేలమీద పడింది. అప్పుడు మమత ఆ బిడ్డను వదలలేక బృహస్పతితో వీణ్ణి పెంచు. ఇద్దరు కొడుకులు కలిగారు. బాగా మనేటట్లు చేయి' అన్నది. ఆ బృహస్పతి 'నేను పెంచలేను. నీవే సాకు. ఈ ద్వాజుణ్ణి నీవే భరించు' అంటూ ఆమెను వదలి వెళ్లాడు.

**వ. ఇట్లుచథ్యునిభార్య యగు మమతయు, బృహస్పతియు శిశువుం గని, ద్వాజుండైన వీని నీవే భరింపుమని, వదినె మఱందులు దమలో నొండొరువులం బలికిన కారణంబున వాఁడు భరద్వాజుండయ్యె, గర్భస్థుండైన వాఁడు బృహస్పతి శాపంబున దీర్ఘతముం డయ్యె, అంత నా బృహస్పతియు, మమతయు నుదయించిన వాని విడిచి, నిజేచ్ఛం జనిన, మరుత్తులు వానిం బోషించి, పుత్రార్థియైన భరతున కిచ్చిరి. భరతుండును వానిం జేకొనియె. వితథంబైన భరత వంశమునకు నా భరద్వాజుండు వంశకర్త యగుటం జేసి, వితథుండనం బరఁగె. ఆ వితథునికి మన్యువు, మన్యువునకు బృహత్క్షత్ర జయ మహావీర్య నర గర్గులను వారేవురు సంభవించిరి. అందు నరునికి సంకృతి, సంకృతికి గురుండు, రంతిదేవుం డన నిరువురు జన్మించిరి. అందు.642**

* ఇట్లా ఉచథ్యుని భార్య ఐన మమత, బృహస్పతీ శిశువును చూచి 'ద్వాజుడైన వీణ్ణి భరించు నీవే భరించు' అని పరస్పరం వాదులాడుకొన్నందువల్ల అతడు భరద్వాజు డయ్యాడు. గర్భంలో ఉన్నవాడు బృహస్పతి ఇచ్చిన శాపంవల్ల గ్రుడ్డివాడయ్యాడు. పిమ్మట అట్లా పుట్టిన భరద్వాజుణ్ని వదలి బృహస్పతీ, మమతా తమదారిన తాముపోగా మరుత్తులు ఆ పిల్లవాణ్ణి పోషించి కొడుకును కోరిన భరతుడికి ఇచ్చారు. భరతుడు అతడిని స్వీకరించాడు. సంతులేక పోయిన భరతవంశానికి ఆ భరద్వాజుడు వంశకర్త ఐనందువల్ల అతడు వితథుడని పేరు పొందాడు. ఆ వితథునికి మన్యువు, మన్యువుకు బృహత్క్షత్రుడు, జయుడు, మహావీర్యుడు, నరుడు, గర్గుడు అనే ఐదుమంది కొడుకులు పుట్టారు. వారిలో నరునికి సంకృతి, సంకృతికి గురుడు, రంతిదేవుడు అనే యిద్దరు కొడుకులు జన్మించారు.

## -: రంతిదేవుని చరిత్రము :-

**సీ. రాజవంశోత్తమ! రంతిదేవుని కీర్తి యేల? చెప్పఁగ విను మిందు నందు**
**నా రాజు దన సంచితార్థంబు లన్నియు నెడపక దీనుల కిచ్చి యిచ్చి**
**సకుటుంబుఁడై ధైర్యసంయుతుండై పేద యై కూడు నీరులే కథమవృత్తి**
**నెందేని నలువది యెనిమిది దివసముల్ చరియింప నొకదివసంబు రేపు**

**ఆ. నెయ్యి పాయసంబు నీళ్ళును గలిగిన, బహుకుటుంబ భారభయముతోడ**
**నలసి నీరువట్టు నాఁకలియును మిక్కి, లొదవఁ జూచి కుడువ నుత్సహించె. 643**

* ఓ రాజశ్రేష్ఠుడా! రంతిదేవుని కీర్తి వైభవం ఏమని చెప్పను? విను. ఆ రాజు సంపాదించిన సంపదల నన్నింటినీ ఎడతెగకుండా దీనుల కిచ్చి యిచ్చి పేదవాడయ్యాడు. నలభై ఎనిమిది రోజులు అన్నమూ నీళ్లూ లేకుండా సకుటుంబంగా తిరుగులాడవలసి వచ్చినా గుండెదిటవును కోల్పోలేదు. ఒకరోజు ఉదయం అతడికి

నేయీ, పాయసమూ, నీళ్లూ లభించాయి. కుటుంబభారం ఒక వంక, దప్పికా ఆకలి మరోవంక, క్రుంగదీయగా అతడు దొరికిన ఆహారాన్ని తినడానికి తొందరపడ్డాడు.

**వ. అ య్యవసరంబున.** 644

**సీ. అతిథిభూసురుఁ డొక్కఁడాహార మడిగినఁ గడపక ప్రియముతో గారవించి**
**హరిసమర్పణ మంచు నన్నంబులో సగ మిచ్చిన భుజియించి యేగె నాతఁ;**
**డంతలో నొకశూద్రుఁ డశనార్థియై వచ్చి పొడసూపలే దనఁబోక తనకు**
**నున్న యన్నములోన నొకభాగ మిచ్చిన సంతుష్టుఁడై వాఁడు సనిన వెనుక**

**ఆ. కుక్క గమియుఁ దాను నొక్కఁ డేతేర నా, యన్న శేషమిచ్చి సన్నయమున**
**వాని మ్రొక్కి పంప వరుసతోఁ జండాలుఁ, డొక్కఁ డరుగుదెంచి చక్క నిలిచి.** 645

* ఆ సమయంలో ఒక బ్రాహ్మణుడు అతిథిగా ఆహారం పెట్టమని అడిగాడు. ఆ రంతిదేవుడు లేదనకుండా అతణ్ణి ప్రేమతో గౌరవించి హరిసమర్పణంగా ఆహారంలో అర్ధభాగాన్ని అతడికి ఇచ్చాడు. అతడు కడుపునిండా తిని వెళ్ళాడు. అంతలో ఒక శూద్రుడు వచ్చి అన్నం కావాలని ప్రార్థించాడు. రంతిదేవుడు లేదనక మిగిలిన అన్నంలో ఒక భాగాన్ని అతడికిచ్చాడు. వాడు తృప్తితో వెళ్లీ వెళ్ళగానే కుక్కల గుంపుతో మరొకడు తయారయ్యాడు. వాడికి మిగిలిన భాగం ఇచ్చి నమస్కరించి మంచిమాటలాడి పంపాడు. వెనువెంటనే ఒక చండాలుడు వచ్చి రంతిదేవుడి ఎదుట నిలిచాడు.

**క. హీనుఁడఁ; జండాలుండను, మానవకులనాథ! దప్పి మానదు; నవలం**
**బోనేర; నీకుఁ జిక్కిన, పానీయము నాకుఁ బోసి బ్రతికింపఁగదే!** 646

* "ఓ రాజా! నేను దిక్కుమాలిన వాణ్ణి! పైపెచ్చు చండాలుణ్ణి. దప్పిక ఎంతకూ తీరడం లేదు. అడుగు ముందుకు వేయలేను. నీదగ్గరున్న నీటితో నా గొంతు తడిపి నా ప్రాణాలు నిలబెట్టు" అన్నాడు.

**వ. అనిన వాని దీనాలాపంబులకుఁ గరుణించి, రాజిట్లనియె.** 647

* వాడి జాలిమాటలకు దయతలచి ఆ రాజు ఇట్లా అన్నాడు.

**ఉ. అన్నము లేదు, కొన్ని మధురాంబువు లున్నవి.; ద్రావుమన్న; రా**
**వన్న, శరీరధారులకు నాపద వచ్చిన వారియాపదల్**
**గ్రన్నన మాన్చి వారికి సుఖంబులు సేయుటకంటె నొండు మే**
**లున్నదె? నాకు దిక్కు పురుషోత్తముఁ డొక్కఁడ సుమ్ము పుల్కసా!** 648

* "ఓ అన్నా! అన్నం లేదుకాని తియ్యటినీళ్ళు ఉన్నాయి. దగ్గరకు రా! దప్పిక తీరేటట్లు త్రాగు. తనతోడి దేహధారులకు ఆపద కలిగితే వెంటనే వారి కష్టాలను పోగొట్టి వారిని ఆదుకోవడంకంటే మానవులకు వేరే పరమార్థం ఉందా? ఆ పురుషోత్తముడు ఒక్కడే నాకు దిక్కు!"

**వ. అని పలికి.** 649

మ. బలవంతంబగు నీరువట్టున నిజప్రాణాంతమై యున్నచో
నలయం డేమియు; వీని హృజ్జ్వరము నాయాసంబు ఖేదంబు నా
జలదానంబున నేఁడు మాను ననుచున్ సర్వేశ్వరాధీనుఁడై
జలముల్ వోసెను రంతిదేవుఁడు దయం జండాలపాత్రంబునన్. 650

* అని చెప్పి అధికమైన దప్పికతో తన ప్రాణాలు కడముట్టుతూ ఉన్నా ఏ మాత్రమూ లెక్క చేయకుండా వున్నాడు. "నా జలదానం చేత ఇతడి హృదయబాధ, ఆయాసం, దుఃఖం తొలగితే నా కంతే చాలు. అంతా ఈశ్వరేచ్ఛ" అనుకొంటూ ఆ రంతిదేవుడు చండాలుని పాత్రలో తన దగ్గర ఉన్న నీటిని పోశాడు.

వ. తదనంతరంబ, బ్రహ్మాదిదేవతలు సంతోషించి, రంతిదేవునికి మేలు సేయం దలంచి, నిజాకారంబులతో ముందట నిలువంబడి యా రాజు ధైర్య పరీక్షార్థంబు దమ చేసిన వృషలాదిరూపంబు లగు విష్ణుమాయ నెఱింగించిన, నా నరేంద్రుం డందఱికి నమస్కరించి. 651

* తర్వాత బ్రహ్మ మొదలైన దేవతలు సంతోషించి రంతిదేవుడికి మేలు చేయాలనుకొని తమ తమ రూపులతో అతడిముందు నిలబడ్డారు. ఆ రాజు గుండెదిటవును పరీక్షించడంకోసం బ్రాహ్మణుడు, శూద్రుడు మొదలైన రూపాలన్నీ తాము కల్పించినవే అన్నారు. అంతా విష్ణుమాయ అని తెలియజేశారు. అది విని రాజేంద్రుడు వినయంతో అందరికీ నమస్కరించాడు.

క. వారల నేమియు నడుగక, నారాయణభక్తి తన మనంబున వెలుఁగన్
ధీరుం డాతఁడు మాయా, పారజ్ఞుం డగుచుఁ బరమపదముం బొందెన్. 652

* ధీరుడైన రంతిదేవుడు వారిని ఏదీ యాచించలేదు. అతడి మనస్సులో విష్ణుభక్తి ప్రకాశించింది. మాయాప్రభావం ఎరిగినవాడై అతడు పరమపదాన్ని పొందాడు.

క. ఆ రాజర్షిని గొలిచిన, వారెల్లఁ దదీయయోగవైభవమున శ్రీ
నారాయణ చింతనులై, చేరిరి యోగీశు లగుచు సిద్ధపదంబున్. 653

* ఆ రాజర్షిని సేవించిన వాళ్లందరూ అతడి యోగమహిమవల్ల హరిచింతన కలవారై పరమ యోగులుగా మారి సిద్ధపదాన్ని చేరుకొన్నారు.

వ. ఇట్లు రంతిదేవుండు విజ్ఞానగర్భిణియగు భక్తివలన బరమ పదంబునకుం జనియె. అంత గర్గునకు శిని జన్మించె, శినికి గార్గ్యుండు గలిగె, అతని నుండి బ్రాహ్మణకులంబయ్యె. మహావీర్యునికి నురుక్షయుండు, నురుక్షయునకుఁ ద్రయ్యారుణియుఁ, గవియుఁ, బుష్కరారుణియు నను ముప్వురు సంభవించిరి. వారును బ్రాహ్మణులై చనిరి. బ్రహ్మక్షత్రునికి సుహోత్రుండును, సుహోత్రునికి హస్తియు జనించిరి. అతండు దనపేర హస్తినాపురంబు నిర్మించె, ఆ హస్తికి నజమీఢుండును, ద్విమీఢుండును, పురుమీఢుండును నన ముగ్గురు జనియించిరి. అందు నజమీఢుని వంశంబునఁ బ్రియమేధాదులు గొందఱు పుట్టి బ్రాహ్మణులై చనిరి. ఆ య్యజమీఢునికి బృహదిషువు, నతనికి బృహద్ధనువు,నతనికి

బృహత్కాయుండు, నతనికి జయద్రథుండు, అతనికి విశ్వజిత్తు, విశ్వజిత్తునకు సేనజిత్తు, సేనజిత్తునకు రుచిరాశ్వుండు, దృఢహనువు, కాశ్యుండు, వత్సుండు నన నలుగురు జనియించిరి. అందు రుచిరాశ్వునకుఁ బ్రాజ్ఞుండు, నతనికిఁ బృథుసేనుండును, బృథుసేనునికిఁ బారుండును, వానికి నీపుండును, నీపునికి నూర్వురు కొడకులును బుట్టిరి; మఱియును. 654

* ఇట్లా రంతిదేవుడు స్వస్వరూప జ్ఞానకారణమైన భక్తివల్ల పరమ పదానికి వెళ్ళాడు. పిమ్మట గర్గునికి శిని జన్మించాడు. శినికి గార్గ్యుడు కలిగాడు. అతడి నుండి అతడి వంశంలోని వాళ్ళు బ్రాహ్మణు లయ్యారు. మహావీర్యుడికి ఉరుక్షయుడు; ఉరుక్షయునికి త్రయ్యారుణి, కవి, పుష్కరారుణి అనే ముగ్గురు జన్మించారు. వారిలో అజమీఢుని వంశంలో పుట్టిన ప్రియమేథుడు మొదలైన కొందరు బ్రాహ్మణు లయ్యారు. ఆ అజమీఢునికొడుకు బృహదిషుడు. అతడి కొడుకు బృహద్ధనువు. అతడికి బృహత్కాయుడు, అతడికి జయద్రథుడు, అతడికి విశ్వజిత్తు, విశ్వజిత్తుకు సేనజిత్తు కలిగారు. సేవజిత్తుకు రుచిరాశ్వుడు, దృఢహనువు, కాశ్యుడు, వత్సుడు అనే నలుగురు జన్మించారు. వారిలో రుచిరాశ్వునికి ప్రాజ్ఞుడు, అతడికి పృథుసేనుడు, పృథుసేనునికి పారుడు, అతడికి నీపుడు పుట్టారు. ఆ నీపునికి నూరు మంది కొడుకులు పుట్టారు.

ఆ. శుకునికూఁతు రైన సుందరి సత్కృతిఁ, బొంది వేడ్క నీపభూవిభుండు
విమలయోగవిత్తు విజ్ఞానదీపితో, దారచిత్తు బ్రహ్మదత్తుఁ గనియె. 655

* ఆ నీపమహారాజు శుకుని కూతురైన సత్కృతిని పెళ్ళిచేసుకొని యోగవిద్య తెలిసినవాడూ, విజ్ఞానంచేత ప్రకాశించే గొప్ప మనస్సు కలవాడూ ఐన బ్రహ్మదత్తుణ్ణి కన్నాడు.

వ. బ్రహ్మదత్తుండు, జైగీషవ్యోపదేశంబున, యోగతంత్రంబునఁ జేసి గోదేవి యను భార్యవలన విష్వక్సేనుండను కుమారునిం గనియె. విష్వక్సేనునకు నుదక్సేనుండు, నుదక్సేనునకు భల్లాదుండు. వీరలు బార్హదిషవులను రాజులైరి. ద్విమీఢునకు యమీనరుండు, యమీనరునికిఁ గృతిమంతుడు, గృతిమంతునికి సత్యధృతి, సత్యధృతికి దృఢనేమి, దృఢనేమికి సుపార్శ్వకృత్తు, సుపార్శ్వకృత్తునకు సుపార్శ్వుండు, సుపార్శ్వునకు సుమతి, సుమతికి సన్నతిమంతుండు జనించిరి. సన్నతిమంతు కొడుకు కృతి యనువాఁడు, హిరణ్య నాభునివలన యోగమార్గం బెఱింగి, శోకమోహంబులు విడిచి, తూర్పు దేశంబున సామసంహిత పఠియించె. నతనికి నుగ్రాయుధుండు, నుగ్రాయుధునకు క్షేమ్యుండు, క్షేమ్యునకు సువీరుండు, సువీరునకుఁ బురంజయుండుఁ, బురంజయునకు బహురథుండు జన్మించిరి. హస్తికొడుకు పురుమీఢునకు సంతతి లేదయ్యె. అ య్యజమీఢునికి నళిని యని భార్యయందు నీలుండు, నీలునికి శాంతి, శాంతికి సుశాంతి, సుశాంతికిఁ బురుజుండు, పురుజునికి నర్కుండు, నర్కునికి భర్మ్యాశ్వుండు, భర్మ్యాశ్వునకు ముద్గల యవీనర బృహదిషు కాంపిల్య స్పంజయు లను వా రేవురు పుట్టిరి. 656

* ఆ బ్రహ్మదత్తుడు జైగీషవ్యుని ఉపదేశంవల్ల పొందిన యోగతంత్రంలో గోదేవి అనే భార్యవల్ల విష్వక్సేనుడనే కుమారుణ్ణి కన్నాడు. విష్వక్సేనునికి ఉదక్సేనుడు, ఉదక్సేనునికి భల్లాదుడు జన్మించారు. వీళ్లందరూ బార్హదిషవు లనే రాజులుగా పేరు పొందారు. ద్విమీఢునికి యమీనరుడు, యమీనరునికి

కృతిమంతుడు, కృతిమంతునికి సత్యధృతి, సత్యధృతికి దృఢనేమి, దృఢనేమికి సుపార్శ్వకృత్తు, సుపార్శ్వకృత్తుకు సుపార్శ్వుడు, సుపార్శ్వునికి సుమతి, సుమతికి సన్నతిమంతుడు, అతడికి కృతి పుట్టారు. ఆ కృతి హిరణ్యానాభుడి దగ్గర యోగవిద్య నేర్చుకొని శోకమోహాలను వదలి తూర్పుదేశంలో సామసంహిత పఠించాడు. అతడికి ఉగ్రాయుధుడు, ఉగ్రాయుధునికి క్షేమ్యుడు, క్షేమ్యునికి, సువీరుడు, సువీరునికి పురంజయుడు, పురంజయునికి బహురథుడు జన్మించారు. హస్తికొడుకు పురుమీఢునికి సంతతి లేకపోయింది. ఆ అజమీఢునికి నళిని అనే భార్యవల్ల నీలుడు పుట్టాడు. నీలునికి శాంతి, శాంతికి సుశాంతి, సుశాంతికి పురుజుడు, పురుజునికి అర్కుడు, అర్కునికి భర్మ్యాశ్వుడు, భర్మ్యాశ్వునికి ముద్గలుడు, యవీనరుడు, బృహదిషుడు, కాంపిల్యుడు, సృంజయుడు అనే ఐదుగురు కొడుకులు పుట్టారు.

క. మించిన భర్మ్యాశ్వుఁడు సుత, పంచకమును జూచి విషయపంచకమును వ
ర్జించితి మే మని పల్కినఁ, బాంచాలురు నాఁగ సుతులు పరఁగిరి ధరణిన్. 657

* అతిశయ బలసంపన్నుడైన ఆ భర్మ్యాశ్వుడు తన ఐదుమంది కొడుకులను చూచి 'ఐదు రాజ్యభాగాలను మీకిస్తున్నాను. అవశ్యం పాలించండి' అన్నాడు. అప్పటినుండి వాళ్లు లోకంలో పాంచాలురుగా ప్రసిద్ధులయ్యారు.

వ. అంత ముద్గలుని నుండి, బ్రాహ్మణకులంబై ముద్గలగోత్రంబు నా నెగడె, భర్మ్యాశ్వపుత్త్రుండైన యా ముద్గలునికి దివోదాసుండు, నహల్య యను కన్యకయునుం బుట్టిరి. అహల్య యందు గౌతమునికి శతానందుండు పుట్టె; శతానందునికి ధనుర్వేదవిశారదుండైన సత్యధృతి పుట్టె, అతనికి శరద్వంతుండు పుట్టె. అతం డొక్కనాఁడు వనంబున నూర్వశిం గనిన, నతనికి, రేతః పాతంబై తద్వీర్యంబు శరస్తంబంబునంబడి, మిథునంబైన సమయంబున. 658

* పిమ్మట ముద్గలుడివంశం బ్రాహ్మణకులమై ముద్గలగోత్రమనే పేరుతో ప్రకాశించింది. భర్మ్యాశ్వుని పుత్రుండైన ఆ ముద్గలునికి దివోదాసుడనే కొడుకూ, అహల్య అనే కూతురూ పుట్టారు. ఆ అహల్యవల్ల గౌతమునికి శతానందుడు జన్మించాడు. శతానందునికి ధనుర్వేదంలో పండితుడైన సత్యధృతి పుట్టాడు. అతడికి శరద్వంతుడు కలిగాడు. అతడు ఒకనాడు వనంలో ఊర్వశిని చూచి మోహించగా రేతస్ఖలన మైంది. ఆ వీర్యం ఒక రెల్లుదుబ్బుమీదపడి రెండు భాగాలు కాగా కవలబిడ్డలుగా కలిగారు.

క. చపలరతి శంతనుండను, నృపవరుఁ డడవికిని వేఁటనెపమునఁ జనుచుం
గృపతో శిశుయుగముం గని, కృపియుం గృపుఁ డనుచుఁ దెచ్చి గృహమునఁ బెంచెన్. 659

* ఆ సమయంలో చంచలమైన కోరికతో శంతనుడనే రాజశ్రేష్ఠుడు వేటసాకుతో అడవికి వెళ్లుతూ ఆ కవల పిల్లలను చూచి జాలిపడి కృపి, కృపుడు అని పేర్లు పెట్టి తన యింటికి తెచ్చి పెంచాడు.

వ. ఆ కృపి ద్రోణునకు భార్య యయ్యె. దివోదాసునకు మిత్త్రాయువు, మిత్త్రాయువునకుఁ జ్యవనుండు, చ్యవనునకు సుదాసుండు, సుదాసునకు సహదేవుఁడు, సహదేవునకు సోమకుండు, సోమకునకు సుజన్మకృత్తు, సుజన్మకృత్తునకు నూర్వురు కొడుకులు గలిగిరి. వారిలో జంతు వనువాఁడు జ్యేష్ఠుండు కడచూలుపృషతుండు.

పృషతునకు ద్రుపదుండు, ద్రుపదునకు ధృష్టద్యుమ్నాదు లయిన కొడుకులును, ద్రౌపది యను కూఁతురుం గల్గిరి. ధృష్టద్యుమ్ననకు ధృష్టకేతువు పుట్టె. వీరలు పాంచాలరాజు లని యెఱుంగుము. మఱియు న య్యజమీఢుని కొడుకు ఋక్షుండు, ఋక్షునకు సంవరణుం డుదయించె. ఆ సంవరణుఁడు తపతి యనెడి సూర్యకన్యక యందుఁ గురువుం గనియె. ఆ కురువుపేరం గురుక్షేత్రం బయ్యె. ఆ కురువునకుఁ బరీక్షిత్తు, సుధనువు, జహ్నువు, నిషధుండు ననువారలు నలువురు పుట్టిరి. అందుఁ బరీక్షిత్తు కొడుకులు లేక చనియె. సుధనువునకు సుహోత్రుండు, నతనికి చ్యవనుండు, చ్యవనునకుఁ గృతి, కృతికి నుపరిచరవసువు, వసువునకు బృహద్రథ, కుసుంభ, మత్స్య, ప్రత్యగ్ర చేదిషాదులు పుట్టిరి. అందు, బృహద్రథునకుఁ గుశాగ్రుండు, గుశాగ్రునికి ఋషభుండు, ఋషభునికి సత్యహితుండు, సత్యహితునికిఁ బుష్పవంతుండు, బుష్పవంతునకు జహ్ను వనువాఁడు జనియించిరి. మఱియును. 660

* ఆ కృపి ద్రోణునకు భార్య ఐనది. దివోదాసునికి మిత్రాయువు, మిత్రాయువునకు చ్యవనుడు, చ్యవనునికి సుదాసుడు, సుదాసునికి సహదేవుడు, సహదేవునికి సోమకుడు, సోమకునికి సుజన్మకృత్తు, సుజన్మకృత్తుకు నూరుమంది కొడుకులు కలిగారు. వారిలో పెద్దవాడు జంతువు. కడగొట్టువాడు పృషతుడు. పృషతునికి ద్రుపదుడు, ద్రుపదునికి ధృష్టద్యుమ్నుడు మొదలైన కొడుకులు, ద్రౌపది అనే కూతురు కలిగారు. ధృష్టద్యుమ్నునికి ధృష్టకేతువు పుట్టాడు. వీరందరూ పాంచాల రాజు లయ్యారు. ఇక ఆ అజమీఢుని కొడుకు ఋక్షుడు, ఋక్షునికి సంవరణుడు కలిగాడు. ఆ సంవరణుడు తపతి అనే సూర్యుడి కూతురు వల్ల కురువును కన్నాడు. ఆ కురువు పేరుమీదుగానే కురుక్షేత్రం వెలసింది. ఆ కురువుకు పరీక్షిత్తు, సుధనువు, జహ్నువు, నిషధుడు అనే నలుగురు కొడుకులు పుట్టారు. వారిలో పరీక్షిత్తుకు సంతతి కలగలేదు. కృతికి ఉపరిచరవసువు, వసువుకు బృహద్రథుడు, కుసుంభుడు, మత్స్యుడు, ప్రత్యగ్రుడు, చేదిషుడు మొదలైనవారు పుట్టారు. వారిలో బృహద్రథునికిఁ గృశాగ్రుడు, కుశాగ్రునికి ఋషభుడు, ఋషభునికి సత్యహితుడు, సత్యహితునికి పుష్పవంతుడు, పుష్పవంతునికి జహ్నువు కలిగారు.

సీ. ఆ బృహద్రథునకు నన్యభార్యాగర్భమున రెండు తను ఖండములు జనించెఁ;
దునుకలు గని తల్లి దొలఁగంగ వైచిన సంధించె నొకటిగా జర యనంగ
నొక దైత్యకాంత; వాఁడొప్పె జరాసంధుఁ డన; గిరివ్రజపుర మాతఁ డేలె;
నతనికి సహదేవుఁ; డతనికి సోమాపి తనయుఁ; డాతనికి శ్రుతశ్రవుండు

తే. జహ్నుపుత్త్రుండు సురథుండు జనవరేణ్య!, యతనికొడుకు విదూరథుఁ; డతనిపట్టి
సార్వభౌముండు;వానికి సంభవుండు, విను జయత్సేనుఁ డనువాఁడు; విమలకీర్తి. 661

* ఆ బృహద్రథునికి వేరొకభార్యగర్భంలో ఒకేబిడ్డ శరీరం రెండు ముక్కలుగా పుట్టాడు. ఆ తునుకలను చూచి తల్లి పారవేసింది. జర అనే రాక్షస స్త్రీ ఆ రెండు ముక్కలనూ ఒకటిగా సంధించగా వాడు జరాసంధుడనే పేరుతో ప్రసిద్ధుడయ్యాడు, అతడు గిరివ్రజపురాన్ని పాలించాడు. అతడి కొడుకు సహదేవుడు. అతడికి సోమాపి జన్మించాడు. అతడికి శ్రుతశ్రవుడు కలిగాడు. జహ్నువు కొడుకు సురథుడు. అతడి కొడుకు విదూరథుడు. అతడి పుత్త్రుడు సార్వభౌముడు. పరిశుద్ధమైన కీర్తిగల జయత్సేనుడు అతడి కుమారుడు.

**వ. ఆ జయత్సేనునికి రథికుండు, రథికునకు నయుతాయువు, నయుతాయువునకుఁ గ్రోధనుండు; గ్రోధనునకు దేవాతిథి, దేవాతిథికి ఋక్షుండు, ఋక్షునికి భీమసేనుండు, వానికిఁ బ్రతీపుండుఁ; బ్రతీపునకు దేవాపి శంతను బాహ్లీకు లను ముపు్వరు కొడుకులు పుట్టిరి. అందు. 662**

* జయత్సేనునికి రథికుడు, రథికునికి అయుతాయువు, అయుతాయువునకు క్రోధనుడు, క్రోధనునికి దేవాతిథి, దేవాతిథికి ఋక్షుడు, ఋక్షునికి భీమసేనుడు, అతడికి ప్రతీపుడు కలిగారు. ప్రతీపునికి దేవాపి, శంతనుడు బాహ్లీకుడు అనే ముగ్గురు కొడుకులు పుట్టారు.

**సీ. దేవాపి రాజ్యంబు దీర్పనొల్లక వనంబున కేగెఁ దమ్ముండు పూర్వజన్మ**
**మందు మహాభిషుఁ డనియెడు వాఁడు శంతనుఁ డయ్యె వాఁడె యీ ధాత్రినెల్ల**
**నేలుచుఁ గరముల నేవృద్ధు ముట్టిన వాఁడెల్ల నిండుజవ్వనము నొందు;**
**నతఁడు శాంతిప్రాప్తుఁడై యున్నఁ దానఁ బండ్రెండేండ్లు వజ్రి వర్షింపకున్న**

**ఆ. వృష్టిలేని చొప్పు విప్రుల నడిగిన, "నన్న యుండఁ దమ్ముఁ డగ్నిహోత్ర**
**దారసంగ్రహంబుఁ దాల్చినఁ" బరివేత్త, యండ్రు వాని నీవ యతఁడ వైతి. 663**

* వారిలో దేవాపి రాజ్యపాలన ఇష్టంలేక అడవికి వెళ్లాడు. అతడి తమ్ముడు శంతనుడు రాజయ్యాడు. పూర్వజన్మలో అతడి పేరు మహాభిషుడు. ఆ శంతనుడు భూమండలాన్ని పాలిస్తుండేవాడు. అతడు చేతులతో తాకితే పండుముసలి అయినా నిండు యౌవనం పొందేవాడు. శాంతుడై అతడు రాజ్యం చేస్తుండగా ఇంద్రుడు పన్నెండేండ్లు వానలు కురిపించలేదు. వానపడకపోవడం గూర్చి అతడు బ్రాహ్మణులను అడిగాడు. 'అన్న బ్రతికి ఉండగా అగ్నిహోత్రాన్ని, భార్యను స్వీకరించిన తమ్ముణ్ని పరివేత్త అంటారు. నీవు అటువంటి వాడవయ్యావు.'

**వ. అట కారణంబుగా నన్న యుండఁ దమ్ముండు రాజ్యార్హుండు గాఁడు, నీవు పరివేత్తవు. మీయన్నకు రాజ్యం బిచ్చిన, ననావృష్టి దోషంబు చెడు నని బ్రాహ్మణులు పల్కిన, శంతనుండు వనంబునకుం జని, దేవాపికిఁ బ్రియంబు చెప్పి, రాజ్యంబు చేకొమ్మని పల్కె, అంతకు మున్న వాని మంత్రి దేవాపిని రాజ్యంబున కనర్హుం జేయఁ దలంచి విప్రులం బంచిన, నా విప్రులు పాషండమత వాక్యంబులు దేవాపికి నుపదేశించిరి. దేవాపి వేదంబుల నిందించినఁ బాషండుండును, దేవదూషకుండును గావున వానికి రాజ్యంబు లేదని బ్రాహ్మణులు సెప్పిన, శంతనుండును మగుడి వచ్చి, రాజ్యంబుఁ జేకొనియె. వర్షంబులు గురిసె. నివ్విధంబున. 664**

* అన్న బ్రతికుండగా తమ్ముడు రాజ్యార్హుడు కాడు. నీవు పరివేత్తవు. మీ అన్నకు రాజ్యం అప్ప చెప్పితే అనావృష్టిదోషం తొలగిపోతుంది' అని బ్రాహ్మణులు చెప్పారు. శంతనుడు అడవికి వెళ్ళి దేవాపిని రాజ్యం గ్రహించమని కోరాడు. కాని అంతకు ముందే అతడితండ్రి దేవాపిని రాజును చేయాలనుకొని బ్రాహ్మణులను పంపగా వారు దేవాపికి పాషండమతాన్ని నూరిపోశారు. వేదనింద చేసినందువల్ల ఆ దేవాపి

పాషండుడు, దేవదూషకుడు అయ్యాడు. కాబట్టి దేవాపికి రాజ్యార్హత లేదు అని బ్రాహ్మణులు చెప్పగా శంతనుడు తిరిగివచ్చి రాజ్యాన్ని స్వీకరించాడు. పిమ్మట వానలు పడ్డాయి.

**క. దేవాపి కలాపపురం, బావాసము గాఁగ యోగియై యున్నాఁ డు**
**ర్వీవర! కలినష్టంబగు, జైవాతృకకులము మీఁద సంస్థాపించున్. 665**

* ఓ రాజా! ఈ విధంగా ఆ దేవాపి కలాపపురాన్ని నివాసంగా చేసుకొని యోగియై ఉన్నాడు. కలియుగాంతంలో నాశనమయ్యే చంద్రవంశాన్ని అతడు తర్వాతి యుగంలో స్థాపిస్తాడు.

**వ. బాహ్లీకుం డనువానికి సోమదత్తుండు పుట్టె, సోమదత్తునికి భూరియు, భూరిశ్రవస్సు, శలుండను వారు ముపు్వరు పుట్టిరి. 666**

* బాహ్లీకునికి సోమదత్తుడు జన్మించాడు. అతడికి భూరి, భూరిశ్రవసుడు, శలుడు అన్న ముగ్గురు కుమారులు పుట్టారు.

**క. భాతిగ శంతనునకు గం, గా తటినికి వైష్ణవాగ్రగణ్యుఁడు ఘోరా**
**రాతి నయననీలోత్పల, భీతికర గ్రీష్మఁడైన భీష్మఁడు పుట్టెన్. 667**

* ఆ శంతనునికి గంగానదివలన విష్ణుభక్తుడు, శత్రుభయంకరుడు ఐన భీష్ముడు ఉజ్జ్వల తేజోనిధియై జన్మించాడు.

**ఆ. పరశురాముతోడఁ బ్రతిఘటించి జయింప, నన్యునొకని నెఱుఁగ మతనిఁ దక్క**
**వీరయూథపతి వివేకధర్మజ్ఞుండు, వేల్పుటేటిపట్టి విమలయశుఁడు. 668**

* పరశురామునితో యుద్ధంచేసి జయింపగలిగిన వీరుణ్ణి అతణ్ణి తప్ప మరొకరిని చూడబోము. ఆ దేవనది ఐన గంగకొడుకు వీరులకు తలమానికం, వివేకం కలవాడు, ధర్మం తెలిసినవాడు, దైవ సమానుడు.

**వ. ఆ శంతనునకు దాశకన్యకయైన సత్యవతి యందుఁ జిత్రాంగద విచిత్రవీర్యులు పుట్టిరి. అందుఁ జిత్రాంగదుండు (చిత్రాంగదుండను) గంధర్వునిచేత నిహతుండయ్యె. మఱియును. 669**

* ఆ శంతనునికి దాశరాజ పుత్రికయైన సత్యవతివల్ల చిత్రాంగదుడు, విచిత్ర వీర్యుడు అనే కొడుకులు కల్గారు. వారిలో చిత్రాంగదుడు గంధర్వులతో యుద్ధంచేసి హతుడైనాడు.

**ఉ. సత్యవతీవధూటి మును శంతను పెండ్లముగానినాఁడు సాం**
**గత్యమునం బరాశరుఁడు గర్భము చేసిన బాదరాయణుం**
**డత్యధికుండు శ్రీహరికళాంశజుఁడై ప్రభవించె నిత్యముల్**
**సత్యములైన వేదముల సాంగములన్ విభజింప దక్షుఁడై. 670**

* సత్యవతి శంతనుని పెళ్లాము కాక ముందు మత్స్యగంధిగా ఉన్నప్పుడు పరాశరముని ఆమెను కలిశాడు. ఆమె గర్భంనుంచి నిత్యసత్యాలైన వేదాలను సాంగములుగా విభజన చేయటానికి, సమర్థుడైన వ్యాసుడు శ్రీహరిఅంశతో జన్మించాడు.

ఆ. బాదరాయణుండు భగవంతుఁ డనఘుండు, పరమగుహ్యమైన భాగవతము
నందనుండ నైన నాకుఁ జెప్పెను శిష్య, జనుల మొఱఁగి యేను జదువుకొంటి. 671

* భగవంతుడు, పుణ్యాత్ముడు ఐన బాదరాయణుడు పరమగోప్యమైన భాగవతాన్ని కుమారుడనైన నాకు చెప్పాడు. రహస్యంగా నేను దాన్ని చదువుకొన్నాను.

వ. ఆ విచిత్రవీర్యునికిఁ గాశిరాజుకూఁతుల, నంబికాంబాలికల భీష్ముండు బలాత్కారంబునం దెచ్చి వివాహంబు చేసిన, విచిత్ర వీర్యుండు వారలం దగిలి మనోజరాగ మత్తుండై, చిరకాలంబు నానావిధక్రీడలన్ విహరించుచు, రాజయక్ష్మ పీడితుండై, మృతుండయ్యె. నంత. 672

* భీష్ముడు కాశీరాజు కొమార్తె లయిన అంబిక అంబాలిక లను బలాత్కారంగా తెచ్చి విచిత్రవీర్యుడి కిచ్చి వివాహం చేశాడు. విచిత్ర వీర్యుడు వారిపట్ల ఆసక్తుడై, కామాకుల చిత్తుడై, మత్తుడై చాలాకాలం అనేకవిధాలైన క్రీడలతో విహరిస్తూ చివరకు క్షయరోగపీడితుడై మరణించాడు.

క. అతనిసతుల వలన సుతుల, సుత! కను మని తల్లి పనుప సొరిదిం గనియెన్
ధృతరాష్ట్ర పాండు విదురుల, నుతచరితుఁడు బాదరాయణుండు నరేంద్రా! 673

* రాజా! "ఆ విచిత్రవీర్యుడి భార్యల యందు పుత్రులను పుట్టింపు" మని తల్లి సత్యవతి ఆజ్ఞాపించగా సచ్చరిత్రుడై బాదరాయణుడు వారి యందు ధృతరాష్ట్రుణ్ణి, పాండురాజును, విదురుణ్ణి కన్నాడు.

వ. అందు, ధృతరాష్ట్రునికి గాంధారియందు దుర్యోధనాదులగు కొడుకులు నూర్వురును, దుశ్శలయను కన్యకయునుఁ జన్మించిరి. మృగశాపభయంబునం జేసి, భార్యం బొంద వెఱచిన పాండునకుఁ గుంతీదేవియందు ధర్మానిలేంద్ర ప్రసాదంబున యుధిష్ఠిర భీమార్జునులను ముప్వురును, మాద్రిదేవి వలన నాసత్య ప్రసాదంబున నకుల సహదేవులను వారిద్దఱునుగా నేవురు పుట్టిరి. అయ్యేవురకును, ద్రుపదరాజపుత్రియైన ద్రౌపదియందుఁ గ్రమంబునం బ్రతివింధ్యుండును, శ్రుతసేనుండును, శ్రుతకీర్తియు, శతానీకుండును, శ్రుతకర్ముండు నన నేవురు పుట్టిరి. మఱియు యుధిష్ఠిరునకుఁ బౌరవతియందు దేవకుండును, భీమసేనునికి హిడింబయందు ఘటోత్కచుండును, గాళియందు సర్వగతుండును, సహదేవునికి విజయయందు సుహోత్రుండును, నకులునకు రేణుమతియందు నిరమిత్రుండును, నర్జునునకు నులూపియను నాగకన్యకయందు నిరావంతుడును, మణలూరుపతి పుత్రికయైన చిత్రాంగదయందు బభ్రువాహనుండును, సుభద్రయందు శౌర్యధైర్యతేజో విభవంబుల నఖిల రాజనికరంబునఁ బ్రఖ్యాతుండైన యభిమన్యుండును జన్మించిరి. అందుఁ బభ్రువాహనుం డర్జునుని నియోగంబున మాతామహుని గోత్రంబునకు వంశకర్త యయ్యె. 674

* వారిలో ధృతరాష్ట్రుడికి గాంధారి గర్భం నుంచి దుర్యోధనుడు మొదలైన వందమంది కొడుకులూ, దుశ్శల అనే కూతురూ జన్మించారు. జింకరూపంలో ఉన్న ముని యిచ్చిన శాపానికి భయపడి భార్యను కలియడానికి వెనుకాడిన పాండురాజుకు కుంతీ గర్భం నుంచి ధర్మదేవత కటాక్షంవల్ల యుధిష్ఠిరుడు,

వాయుదేవుడి కృపవల్ల భీముడు, ఇంద్రుడి ప్రసాదంవల్ల అర్జునుడు, మాద్రిదేవి గర్భంనుంచి అశ్వినీదేవతల ప్రసాదం వల్ల నకులుడు సహదేవుడు అనే కవలలు మొత్తం ఐదుగురు కుమారులు పుట్టారు. ఆ ఐదు మందికి ద్రుపదరాజు కూతురైన ద్రౌపది గర్భం నుంచి క్రమంగా ప్రతివింధ్యుడు, శ్రుతసేనుడు, శ్రుతకీర్తి, శతానీకుడు, శ్రుతకర్ముడు అనే ఐదుగురు కొడుకులు కలిగారు. ఇంకా యుధిష్ఠిరుడికి పౌరవతివల్ల దేవకుడు; భీమసేనునికి హిడింబవల్ల ఘటోత్కచుడు, కాళివల్ల సర్వగతుడు; సహదేవునికి విజయవల్ల సుహోత్రుడు; నకులునికి రేణుమతి వల్ల నిరమిత్రుడు; అర్జునునికి ఉలూపి అను నాగకన్య వల్ల ఇరావంతుడు, మణిపురం రాజకుమారి ఐన చిత్రాంగదవల్ల బభ్రువాహనుడు; సుభద్రవల్ల గొప్ప శౌర్యంతో, ధైర్యంతో, తేజస్సుతో ప్రసిద్ధుడైన అభిమన్యుడు జన్మించారు. వారిలో బభ్రువాహనుడు అర్జునుని ఆనతిమేరకు మాతామహుని గోత్రానికి వంశకర్త అయ్యాడు.

**ఉ. అన్యసుపూజ్య! నీ జనకుఁడై యభిమన్యుఁడు భూవరేంద్ర మూ**
**ర్ధన్యుఁడు ధన్యమార్గణ కదంబ విదారిత వైరివీర రా**
**జన్యుఁడు జన్యభీత కురుసైన్యుఁడు సైన్య సమూహనాథ దృ**
**జ్మాన్యుఁడు మాన్యకీర్తి మహిమం దనరెం గురువంశకర్తయై. 675**

* జగత్పూజ్యా! రాజుల్లో ముఖ్యుడూ, శరపరంపరలతో శత్రురాజులను చీల్చి చెండాడే వాడూ, యుద్ధంలో విరోధి సైన్యాలను భయకంపితులను చేసేవాడూ, కాకలు తీరిన శత్రుసేనానాయకులచేత గౌరవింపబడే వాడూ ఐన నీ తండ్రి అభిమన్యుడు కురువంశకర్త అయి గొప్ప కీర్తితో, మహిమతో ప్రకాశించాడు.

**వ. ఆ యభిమన్యునకు నుత్తర యందు నీవు జన్మించితివి. 676**

**క. ద్రోణసుతు తూపువేఁడిమిఁ, బ్రాణంబులఁ బాసి హరికృపాదర్శన సం**
**త్రాణంబున బ్రతికితె కా, క్షోణీశ్వర! మున్ను నీ శిశుత్వమువేళన్. 677**

* ఓ రాజా! నీవు తల్లి గర్భంలో ఉన్నప్పుడు అశ్వత్థామ ప్రయోగించిన బాణాగ్నికి ప్రాణాలను కోల్పోయి ఆ శ్రీహరి కరుణాకటాక్షంవల్ల తిరిగి బ్రతికావు.

**వ. నీ కుమారులు జనమేజయ శ్రుతసేన భీమసేనోగ్రసేనులను నల్వురు. వీరలయందు. 678**

**ఆ. నీవు తక్షకాహి నిహతుఁడ వని విని, సకలసర్పలోక సంహృతముగ**
**సర్పయాగ మింక జనమేజయుఁడు సేయఁ, గలఁడు పూర్వరోషకలితుఁ డగుచు. 679**

* జనమేజయుడు, శ్రుతసేనుడు, భీమసేనుడు, ఉగ్రసేనుడు అన్న నలుగురూ నీ కుమారులుకదా! నీవు తక్షకుడనే పాముకాటు వల్ల మరణిస్తావు. ఆ సంగతి విని జనమేజయుడు బుసలు కొట్టే కోపంతో అన్ని పాములూ భస్మమయ్యేటట్లుగా సర్పయాగం చేస్తాడు.

**వ. మఱియు నతఁడు సర్వధరణీ మండలంబును జయించి, కావషేయుండు పురోహితుండుగా నశ్వమేధంబు సేయఁగలవాఁడు. వానికి శతానీకుండు జనియించి, యాజ్ఞవల్క్యునితోడ వేదంబులు**

పఠియించి, కృపాచార్యుని వలన విలువిద్య నేర్చి, శౌనకుని వలన నాత్మ జ్ఞానంబునుం బడయం గలవాఁడు. ఆ శతానీకునికి సహస్రానీకుండు, వానికి నశ్వమేధజుండు, నశ్వమేధజునికి నాసీమ కృష్ణుండు, నాసీమకృష్ణునకు నిచకుండు జనియింతురు. ఆ నిచకుఁడు గజాహ్వయంబు నదిచే హృతంబుగాఁ గౌశాంబియందు వసియించు, ఆతనికి నుష్ణుండు నుష్ణునికిఁ జిత్రరథుండు, చిత్ర రథునకు శుచిరథుండు, శుచిరథునికి వృష్టిమంతుండు, వృష్టిమంతునికి సుషేణుండు, సుషేణునికి సుపీతుండు, సుపీతునికి నృచక్షుస్సు, నృచక్షుస్సుకు సుఖానిలుండు, సుఖానిలునికిఁ బరిప్లవుండు, పరిప్లవునకు మేధావి, మేధావికి సునయుండు, సునయునికి నృపంజయుండు, నృపంజయునికి దూర్వుండు, దూర్వునికి నిమి, నిమికి బృహద్రథుండు, బృహద్రథునకు సుధాంశుండు, సుధాంశునికి శతానీకుండు, శతానీకునకు దుర్దమనుండు, దుర్దమనునికి విహీనరుండు, విహీనరునికి దండపాణి, దండపాణికి మితుండు, మితునకు క్షేమకుండు, క్షేమకునకు బ్రహ్మక్షత్రుండు పుట్టుదురు. వాఁడు నిర్వంశుండై, దేవర్షి సత్కృతుండై, కలియుగంబునందుఁ జనం గలవాఁడు. 680

* ఇంకా అతడు సమస్తభూమండలాన్నీ జయించి కావషేయుణ్ణి పురోహితుణ్ణిగా పెట్టుకొని అశ్వమేధయాగం చేస్తాడు. అతనికి శతానీకుడు జన్మిస్తాడు. అతడు యాజ్ఞవల్క్యుని దగ్గర వేదాలను అభ్యసించి, కృపాచార్యుని వల్ల విలువిద్యను నేర్చి, శౌనకునివల్ల ఆత్మజ్ఞానం పొందగలుగతాడు. ఆ శతానీకునికి సహస్రానీకుడు, అతడికి అశ్వమేధజుడు, అశ్వమేధజునికి ఆసీమకృష్ణుడు, ఆసీమకృష్ణునికి నిచకుడు పుట్టుతారు.

ఆ నిచకుడు హస్తినాపురం నదీజలాలతో కొట్టుకొనిపోగా కౌశాంబి నగరంలో నివసిస్తాడు. అతడికి ఉష్ణుడు, ఉష్ణునికి చిత్రరథుడు, చిత్ర రథునికి శుచిరథుడు, శుచిరథునికి వృష్టిమంతుడు, వృష్టిమంతునికి సుషేణుడు, సుషేణునికి సుపీతుడు, సుపీతునికి నృచక్షువు, నృచక్షువుకు సుఖానిలుడు, సుఖాలునికి పరిప్లవుడు, పరిప్లవునికి వేధావి, మేధావికి సునయుడు, సునయునికి నృపంజయుడు, నృపంజయునికి దూర్వుడు, దూర్వునికి నిమి, నిమికి బృహద్రథుడు, బృహద్రథుకి సుదాసుడు, సుదాసునికి శతానీకుడు, శతానీకునికి దుర్దమనుడు, దుర్దమనునికి విహీనరుడు, విహీనరునికి దండపాణి, దండపాణికి మితుడు, మితునికి క్షేమకుడు, క్షేమకునికి బ్రహ్మక్షత్రుడు కలుగుతారు. అతడు సంతతి లేనివాడై దేవతలచేత ఋషులచేత మన్నింపబడి కలియుగంలో యశోవంతు డౌతాడు.

క. జగతి నిటమీఁదఁ బుట్టెడు, మగధాధీశ్వరుల నిఖిలమనుజేశ్వరులన్
నిగమాంతవిదులఁ జెప్పెద, సుగుణాలంకార! ధీర! సుభగవిచారా! 681

* సుగుణాలనే అలంకారంగా కలవాడా! లోకంలో ఇకమీద పుట్టబోయే వేదాంతవేత్తలైన మగధదేశపు రాజులను గూర్చి చెబుతాను.

వ. జరాసంధపుత్త్రుండైన సహదేవునికి మార్జాలి, మర్జాలికి శ్రుతశ్రవస్సు, శ్రుతశ్రవస్సునకు నయుతాయువు, నయుతాయువునకు నిరమిత్రుండు, నిరమిత్రునకు సునక్షత్రుండును, సునక్షత్రునికి బృహత్సేనుండు,

బృహత్సేనునికిఁ గర్మజిత్తు, కర్మజిత్తునకు శ్రుతంజయుండు, శ్రుతంజయునకు విప్రుండు, విప్రునకు శుచి, శుచికి క్షేముండు, క్షేమునికి సువ్రతుండు, సువ్రతునకు ధర్మనేత్రుండు, ధర్మనేత్రునకు శ్రుతుండు, శ్రుతునకు దృఢసేనుండు, దృఢసేనునికి సుమతి, సుమతికి సుబలుండు, సుబలునకు సునీతుండు, సునీతునకు సత్యజిత్తు, సత్యజిత్తునకు విశ్వజిత్తు, విశ్వజిత్తునకుఁ బురంజయుండును జన్మించెదరని చెప్పి మఱియు నిట్లనియె. 682

* జరాసంధుని కొడుకైన సహదేవునికి మార్జాలి, మార్జాలికి శ్రుతశ్రవుడు, శ్రుతశ్రవునికి అయుతాయువు, అయుతాయువునకు నిరమిత్రుడు, నిరమిత్రునికి సునక్షత్రుడు, సునక్షత్రునికి బృహత్సేనుడు, బృహత్సేనునికి కర్మజిత్తు, కర్మజిత్తుకు శ్రుతంజయుడు, శ్రుతంజయునికి విప్రుడు, విప్రునికి ధర్మనేత్రుడు, ధర్మనేత్రునికి శ్రుతుడు, శ్రుతునికి దృఢసేనుడు, దృఢసేనునికి సుమతి, సుమతికి సుబలుడు, సుబలునికి సునీతుడు, సునీతునికి సత్యజిత్తు, సత్యజిత్తునకు విశ్వజిత్తు, విశ్వజిత్తుకు పురంజయుడు జన్మిస్తారు- అని చెప్పి శుకమహర్షి ఇంకా ఇట్లా అన్నాడు.

ఆ. వినుము మగధదేశవిభులు జరాసంధ, ప్రముఖధరణిపతులు ప్రబలయశులు
వీరు కలియుగమున వెయ్యేండ్ల లోపలఁ, బుట్టి గిట్టఁగలరు భూవరేంద్ర! 683

* ఓ రాజా! విను, మగధదేశాధి పతులైన జరాసంధుడు మొదలైన రాజులు గొప్పకీర్తి కలవారు. వీరందరూ కలియుగంలో వెయ్యి సంవత్సరాలలోపుగా పుట్టి మరణిస్తారు.

వ. యయాతికొడు కనువునకు సభానరుండు, చక్షువు, పరోక్షుండు ననువారు ముగ్గురు పుట్టి రందు సభానరునకుఁ గాలనాథుండు, కాలనాథునకు సృంజయుండు, సృంజయునకుఁ బురంజయుండు, పురంజయునకు జనమేజయుండు, జనమేజయునకు మహాశాలుండు, మహాశాలునికి మహామనసుఁడు, మహామనసునకు నుశీనరుండు, తితిక్షు వన నిరువురు జన్మించిరి. అందుశీనరునకు శిబియు, వనుండును, గ్రిమియు, దర్పుండు నన నలువురు జన్మించిరి. అందు శిబికి వృషదర్ప సువీర మద్ర కేకయులు నలువురు పుట్టిరి. తితిక్షునకు రుశద్రథుండు, రుశద్రథునకు హేముండు, హేమునకు సుతపుండు, సుతపునకు బలి పుట్టిరి. ఆ బలిక్షేత్రమున దీర్ఘతముని వలన అంగ, వంగ, కళింగ, సింహ, పుండ్రాంధ్రులను పేళ్ళు గలవారార్వురు కుమారులు పుట్టిరి. వారలు తూర్పు దేశంబునకు రాజులై, దేశంబులకుఁ దమతమ నామధేయంబు లిడి యేలిరి. సువీరునకు సత్యరథుఁడు, సత్యరథునికి దివిరథుండు, దివిరథునికి ధర్మరథుండు, ధర్మరథునకుఁ జిత్రరథుండుఁ బుట్టిరి. ఆ చిత్రరథుండు రోమపాదుండు నా బరఁగె, 684

* యయాతి కొడుకైన అనువునకు సభానరుడు, చక్షువు, పరోక్షుడు అనే ముగ్గురు కొడుకులు, వారిలో సభానరునికి కాలనాథుడు, కాలనాథునికి సృంజయుడు, సృంజయునికి పురంజయుడు, పురంజయునికి జనమేజయుడు, జనమేజయునికి మహాశాలుడు, మహాశాలునికి మహామనసుడు, మహామనసునికి ఉశీనరుడు, తితిక్షువు అనే ఇద్దరు జన్మించారు. వారిలో ఉశీనరునికి శిబి, వనుడు, క్రిమి,

దర్పుడు అనే నలుగురు జన్మించారు. వారిలో శిబికి వృషదర్పుడు, సువీరుడు, మద్రుడు, కేకయుడు అనే నలుగురు కుమారులు పుట్టారు. తితిక్షువుకు రుశద్రథుడు, రుశద్రథునికి హేముడు, హేమునికి సుతపుడు, సుతపునికి బలి పుట్టారు. ఆ బలికి అంగుడు, వంగుడు, కళింగుడు, సింహుడు, పుండ్రుడు, ఆంధ్రుడు అనే పేర్లుగల ఆరుగురు కొడుకులు కలిగారు. వాళ్ళు తూర్పుదేశానికి రాజులై తమతమ పేర్లతో దేశాలను స్థాపించి పాలించారు. సువీరునికి సత్యరథుడు, సత్యరథునికి దివిరథుడు, దివిరథునికి ధర్మరథుడు, ధర్మరథునికి చిత్రరథుడు పుట్టారు. ఆ చిత్రరథుడే రోమ పాదుడని ప్రసిద్ధు డయ్యాడు.

**క. సంతతి లేని కతంబునఁ, జింతింపుచు నుండ నతని చెలికాఁ డగు ధీ**
**మంతుఁడు దశరథుఁ డతనికిఁ, సంతతిగా నిచ్చె నాత్మజను శాంతాఖ్యన్.** 685

* ఆ రోమపాదుడు సంతానం లేక విచారిస్తుంటే అతడి స్నేహితుడు, బుద్ధిమంతుడు ఐన దశరథుడు శాంత అనే తనకూతురిని అతడికి పెంపుడు కూతురుగా ఇచ్చాడు.

**వ. అంత రోమపాదుండు, దన కూఁతురు శాంత యని కైకొని మెలఁగుచుండ, నా రాజు రాజ్యంబునం గొంతకాలంబు వర్షంబు లేమికిం జింతించి, విభాండక సుతుండైన ఋశ్యశృంగుండు వచ్చిన వర్షంబు గురియు నని పెద్దలవలన నెఱింగి,** 686

**క. ఆ రాజు ఋశ్యశృంగుని, ఘోరతపోనిరతుఁ దెచ్చుకొఱకై పనిచెన్**
**వారసతుల నేర్పరుల ను, దార స్తనభారభీరుతర మధ్యగలన్.** 687

* రోమపాదుడు శాంతను తన కూతురుగా గ్రహించాడు. అతడి రాజ్యంలో కొంతకాలం వానలు పడలేదు. అందుకు అతడు కారణం విచారించాడు. "విభాండకుడనే ఋషికొడుకైన ఋశ్యశృంగుడు తన రాజ్యంలో అడుగు పెడితే వర్షం కురుస్తుం"దని పెద్దలవల్ల తెలుసుకొన్నాడు. ఘోరతపోనిష్ఠ కలిగిన ఋశ్యశృంగుణ్ణి తీసుకురావడానికై గొప్పస్తనభారంతో కదలాడే నడుము గల నెఱజాణలైన వేశ్యలను పంపాడు.

**వ. వారును జని.** 688

**ఆ. కాంతలార! మెకము గన్నది మొదలుగా, నాఁడువారి నెఱుఁగఁ డడవిలోన,**
**గోఁచి బిగియఁ గట్టకొనిన యా వడుగని, మత్తికాని రతికి మరపవలయు,** 689

**వ. అని పలుకుచు.** 690

* వాళ్ళు తపోవనానికి వెళ్ళి "ఓ చెలులారా! విభాండకముని వల్ల లేడిగర్భంలో పుట్టినది మొదలుగా ఇతడు ఆడువారి పొడనే ఎరగడు. అడవిలో గోచి పెట్టుకొని తిరిగే బ్రహ్మచారిని మన్మథక్రీడకు మరిగేటట్లు చేయాలి" అని తమలో తాము కూడబలుక్కున్నారు.

**క. ఆడుచుఁ జెవులకు నింపుగఁ, బాడుచు నాలోక నిశితబాణౌఘములన్**
**వీడుచు డగ్గఱ నోడుచుఁ, జేడియ లాతపసి కడకుఁ జేరిరి కలఁపన్.** 691

* ఆ వారకాంతలు ఋశ్యశృంగుణ్ణి కామవికారం కలవాణ్ణిగా చేయాలని ఆడుతూ, పాడుతూ, వాడి చూపులనే బాణాలను ప్రసరింపజేస్తూ జంకుతూ ఆ ఋషిదగ్గరకు చేరారు.

**వ. అ య్యవసరంబున వారలం జూచి. 692**

**సీ. మిళితాళినీలధమ్మిల్ల భారంబులు చారుజటావిశేషంబు లనియు**
**భర్మాంచ లోజ్జ్వల ప్రభదుకూలంబులు తతచర్మ వస్త్రభేదంబు లనియు**
**బహు రత్నకీలిత భాసురదామంబు లధికరుద్రాక్షమాలాదు లనియు**
**మలయజ మృగనాభి మహిత లేపంబులు బహువిధ భూతిలేపంబు లనియు**

**తే. మధుర గానంబు శ్రుతియుక్త మంత్రజాతు లనియు, వీణెలు దండంబు లనియు, సతుల**
**మూర్తు లెన్నఁడు నెఱుఁగని ముగుదతపసి, వారిఁ దాపసులని డాయ వచ్చి మ్రొక్కె. 693**

* అప్పుడు ఋశ్యశృంగుడు వారిని చూచాడు. తుమ్మెదలవంటి నల్లటి దట్టమైన కొప్పులు అందమైన జటావిశేషాలనీ; బంగారు జరీతో కూడిన శ్రేష్ఠమైన వలువలు మెత్తని మృగచర్మాలనీ; అనేక రత్నాలతో ప్రకాశించే హారాలు గొప్ప రుద్రాక్షమాలలనీ; చందనం కస్తూరి మొదలైన మైపూతలు అనేక విధాలైన బూదిపూతలనీ; శ్రావ్యమైన పాటలు వేదమంత్రాలనీ; వీణలు యోగదండాలనీ అనుకుని ఆడవారి పొడ తెలియని అమాయకుడైన ఆ ఋషికుమారుడు ఋశ్యశృంగుడు వారూ తపస్సు చేసుకొనే మునులు కాబో లనుకున్నాడు. వారిని సమీపించి నమస్కరించాడు.

**వ. ఇట్లు వచ్చి మ్రొక్కిన ఋశ్యశృంగుం జూచుచు, నగుచు డగ్గఱి. 694**

**సీ. సేమమే యని సతుల్ చేతుల గ్రుచ్చి కర్కశకుచంబులు మోవఁ గౌఁగిలించి**
**చిరతపోనియతి డస్సితి గదా యని మోముఁ గంఠంబు నాభియుఁ గలయఁ బుణికి**
**క్రొత్తదీవన లివి కొనుమని వీనుల పొంత నాలుకలఁ జప్పుళ్ళు చేసి**
**మా వనంబుల పండ్లు మంచివి తిను మని పెక్కు భక్ష్యంబులు ప్రీతి నొసఁగి**

**ఆ. నూతనాజినంబు నును పిది మేలని, గోఁచి విడిచి మృదుదుకూల మిచ్చి**
**మౌని మరగఁజేసి మాపర్ణశాలకుఁ, బోద మనుచుఁ గొంచుఁ బోయి రతని. 695**

* ఇట్లా నమస్కరించిన ఋశ్యశృంగుణ్ణి చూచి నవ్వుతూ వాళ్ళు 'కుశలమేనా' అంటూ చేతులతో చేతులు కలిపి గట్టిగా నొక్కారు; కఠిన స్తనాలతో ఒత్తుగా కౌగిలించారు; "చాలాకాలం తపస్సుచేసి అలసి పోయావు కదా'' అని ముఖం, మెడ, బొడ్డు తాకారు; "ఇవి కొత్తరకమైన ఆశీస్సులు స్వీకరించు'' అంటూ చెవుల దగ్గర నాలుకలతో చప్పుడు చేశారు; "ఇవి మా అడవుల్లో దొరికే పండ్లు తిను'' అని తినుబండారాలను ప్రీతితో ఇచ్చారు; 'ఇదో కొత్తరకం జింకచర్మం. నునుపైంది. బాగుంటుంది' అని కౌపీనానికి బదులుగా మేలైన మెత్తని వలువలు ఇచ్చి అతణ్ణి వశీకరించుకొన్నారు. తర్వాత 'మా పర్ణశాలకు వెళదాము రా' అని వెంటబెట్టుకొని తీసుకొనిపోయారు.

వ. ఇట్లు హరిణీసుతుండు కాంతాకటాక్ష పాశబద్ధుండై, వారల వెంటం జని రోమపాదుకడకుం బోయిన నతండు, దన ప్రియనందనయైన శాంత నిచ్చి పురంబున నునిచికొనియె. ఆ మ్మునీశ్వరుండు వచ్చిన వర్ష ప్రతిబంధదోషంబు చెడి వర్షంబు గురిసె. నంత. 696

* ఇ ట్లా ఋశ్యశృంగుడు ఆ స్త్రీలకడగంటి చూపులనే వలలలో తగులుకొన్నవాడై వారి వెంటబడి రోమపాదుని పట్టణానికి వెళ్ళాడు. రోమపాదుడు తనప్రియపుత్రిక యయిన శాంత నిచ్చి పెళ్లిచేసి ఋశ్యశృంగుణ్ణి తన పట్టణంలోనే ఉంచుకున్నాడు. ఆ మునీశ్వరుడు కాలు పెట్టడంతోనే దోషం తొలగిపోయి దేశమంతటా వర్షం కురిసింది.

ఆ. ఆ నృపాలచంద్రుఁ డనపత్యుఁడై యుండ, నెఱిఁగి మునికులేంద్రుఁ డింద్రుఁ గూర్చి
యిష్టిచేసి సుతుల నిచ్చె నాతని కృపఁ బంక్తిరథుఁడు పిదపఁ బడసె సుతుల. 697

* పిమ్మట ఆ రాజేంద్రుడు సంతానం లేక బాధపడుతున్నాడని తెలుసుకొని ఆ మునీంద్రుడు అతడిచేత ఇంద్రయాగం చేయించి బిడ్డలు కలిగేలాగా చేశాడు. తర్వాత ఆ ఋశ్యశృంగుడి దయవల్లే దశరథుడు పుత్రులను పొందగలిగాడు.

వ. ఆ రోమపాదునకుఁ జతురంగుండును, జతురంగునకుఁ బృథులాక్షుండును, బృథులాక్షునికి బృహద్రథుండును, బృహత్కర్ముండు, బృహద్భానుండు ననువారు ముగ్గురును బుట్టిరి. అందు బృహద్రథునకు బృహన్మనస్సును, బృహన్మనస్సునకు జయద్రథుండును, జయద్రథునకు విజయుండును, విజయునకు సంభూతి యను భార్యయందు ధృతియు, నాధృతికి ధృతవ్రతుండును, ధృతవ్రతునకు సత్యకర్ముండును, సత్యకర్మునకు నతిరథుండును జనించిరి. 698

* ఆ రోమపాదునకు చతురంగుడు, చతురంగునికి పృథులాక్షుడు; పృథులాక్షునికి బృహద్రథుడు, బృహత్కర్ముడు, బృహద్భానుడు అనే ముగ్గురు కొడుకులు కలిగారు. వారిలో బృహద్రథునికి బృహన్మనసుడు, బృహన్మనసునికి జయద్రథుడు, జయద్రథునికి విజయుడు, విజయునికి సంభూతి అనే భార్యవల్ల ధృతి పుట్టారు. ఆ ధృతికి ధృతవ్రతుడు, ధృతవ్రతునికి సత్యకర్ముడు, సత్యకర్మునికి అతిరథుడు జన్మించారు.

గీ. కుంతి పిన్ననాఁడు గోరి సూర్యునిఁ బొంద, బిడ్డఁ డుదితుఁడైనఁ బెట్టెఁ బెట్టి
గంగ నీట విడువఁ గని యతిరథుఁ డంతఁ, గర్ణుఁ డనుచుఁ గొడుకు గారవించె. 699

* కుంతి అభం శుభం తెలియని వయస్సులో సూర్యుణ్ణి కోరి అతడి పొందువల్ల పుట్టిన బిడ్డను ఒక పెట్టెలో పెట్టి గంగానదిలో విడిచి పెట్టినప్పుడు ప్రవాహంలో కొట్టుకొని వచ్చిన ఆ బిడ్డను అతిరథుడు చూచి ఆదరించి కర్ణుడని పేరు పెట్టి పెంచాడు.

వ. ఇ ట్లతిరథునకుఁ గానీనుండైన కర్ణుండు కొడుకయ్యె. కర్ణునకు వృషసేనుండు పుట్టె. అ య్యయాతి కొడుకైన ద్రుహ్యునకు బభ్రుసేతువు, బభ్రుసేతువునకు నారబ్ధుండు, నారబ్ధునకు గాంధారుం, డాగాంధారునకు ఘర్మండు, ఘర్మునకు ఘృతుండు, ఘృతునకు దుర్మదుండు, దుర్మదునకుఁ

**బ్రచేతస్సు జనించిరి. ప్రచేతస్సునకు నూర్గురు పుట్టి, మ్లేచ్ఛాధిపతులై, యుదీచీదిశ నాశ్రయించిరి. తుర్వసునకు వహ్ని, వహ్నికి భర్గుండు, భర్గునకు భానుమంతుడు, భానుమంతునకుఁ ద్రిసానువు, త్రిసానువునకుఁ  గరంధముండు, కరంధమునకు నుదార చిత్తుండైన మరుత్తుండును బుట్టరి. అతనికి యయాతిశాపంబున సంతతి లేదయ్యె. వినుము. 700**

* ఈ విధంగా కన్యకు పుట్టిన కర్ణుడు అతిరథునికి కొడుకయ్యాడు. కర్ణునికి వృషసేనుడు పుట్టాడు. ఆ యయాతి  కొడుకైన ద్రుహ్యునికి బభ్రుసేతువు, బభ్రుసేతువునకు ఆరబ్ధుడు, ఆరబ్ధునికి గాంధారుడు, గాంధారునికి ఘర్మ్ముడు, ఘర్మ్మునికి ఘృతుడు, ఘృతునికి దుర్మదుడు, దుర్మదునికి ప్రచేతసుడు జన్మించారు. ప్రచేతసునికి నూరుమంది కొడుకులు కలిగారు. వాళ్ళు మ్లేచ్ఛాధిపతులై ఉత్తరదిక్కును పాలించారు. తుర్వసునికి వహ్ని, వహ్నికి భర్గుడు, భర్గునికి భానుమంతుడు, భానుమంతునికి త్రిసానువు, త్రిసానువుకు కరంధముడు, కరంధమునికి మరుత్తుడు జన్మించారు. ఆ మరుత్తుడికి యయాతిశాపం వల్ల సంతతి లేకపోయింది.

## -:యదువంశ చరిత్రము:-

**చ. అనఘ! యయాతి పెద్దకొడుకైన యదుక్షితిపాలు వంశమున్**
**వినినఁ బఠించినన్ నరుఁడు వెండియుఁ బుట్టఁడు ముక్తిఁ బొందు న**
**య్యనుపమమూర్తి విష్ణుఁడు నరాకృతిఁ బొంది జనించెఁ గావునన్**
**వినుము నరేంద్ర! నీకు నిది వీనుల పండువు గాఁగఁ జెప్పెదన్. 701**

* ఓ పుణ్యవంతుడా! భగవంతుడైన విష్ణుమూర్తి మానవరూపాన్ని పొంది ఆ వంశంలో పుట్టినందువల్ల యయాతి పెద్దకొడుకైన యదుమహారాజువంశాన్ని గూర్చి విన్నా, చదివినా నరుడు జీవన్ముక్తు డవుతాడు. మోక్షాన్ని పొందుతాడు. ఓ రాజా! విను. యదువంశాన్ని వీనులవిందుగా చెబుతాను.

**వ. యదువునకు సహస్రజిత్తు, క్రోష్టువు, నలుండు, రిపుండు ననువారు నలువురు సంభవించిరి. అందుఁ బెద్దకొడుకైన సహస్రజిత్తునకు శతజిత్తు గలిగె. ఆ శతజిత్తునకు మహాహయ, వేణుహయ, హేహయులను వారు ముప్పురు పుట్టిరి. అందు హేహయునకు ధర్మ్ముండు, ధర్మ్మునకు నేత్రుండు, నేత్రునకుఁ గుంతి, కుంతికి మహిష్మంతుఁడు, మహిష్మంతునకు భద్రసేనుండు, భద్రసేనునకు దుర్మదుండు, దుర్మదునికి ధనికుండు, ధనికునికిఁ గృతవీర్యుండు, కృతాగ్ని, కృతకర్మ, కృతౌజుఁడను నలువురు సంభవించిరి. అందుఁ గృతవీర్యునికి నర్జునుండు జనియించె. అతండు మహాబుద్ధి బలంబున. 702**

* యదువునకు సహస్రజిత్తు, క్రోష్టువు, నలుడు, రిపుడు అనే నలుగురు కొడుకులు  కలిగారు. వారిలో పెద్దకొడుకైన సహస్రజిత్తుకు శతజిత్తు పుట్టాడు. ఆ శతజిత్తుకు మహాహయుడు, వేణుహయుడు, హేహయుడు అనే ముగ్గురు జన్మించారు. వారిలో హేహయునికి ధర్మ్ముడు, ధర్మ్మునికి నేత్రుడు, నేత్రునికి దుర్మదుడు, దుర్మదునికి ధనికుండు జన్మించారు. ధనికునకు కృతవీర్యుండు, కృతాగ్ని, కృతకర్మ్ముండు, కృతౌజుడు అనే నలుగురు కొడుకులు పుట్టారు. వారిలో కృతవీర్యునికి అర్జునుడు కలిగాడు.

సీ. హరికళాసంజాతుఁడైన దత్త్రాత్రేయు సేవించి సద్యోగసిద్ధిఁ బొంది
బహు యజ్ఞ దాన తపంబులు గావించి సకల దిక్కులు గెల్చి జయముతోడ
సతతంబు హరినామ సంకీర్తనము సేసి ధనముల నొంది యుదారవృత్తి
యెనుబదియైదువే లేండ్లు భూచక్రంబు ఘనకీర్తిఁ దనపేరు గాఁగ నేలె;

ఆ. ముదిమి లేక తరుణమూర్తియై యురుకీర్తి, నమరెఁ గార్తవీర్యు డనఁగ విభుఁడు;
నిజము వానిభంగి నేల యేలిన యట్టి, రాజు నెఱుఁగ మెందు రాజముఖ్య! 703

* ఓ రాజా! ఆ కార్తవీర్యార్జునుడు శ్రీహరి అంశతో పుట్టిన దత్త్రాత్రేయుణ్ణి సేవించి యోగవిద్యను, అణిమాది సిద్ధులను పొందాడు. అతడు అనేక యజ్ఞాలను దానాలను చేశాడు. గొప్ప తపస్సు చేశాడు. అన్ని దిక్కులనూ జయించి ఎల్లప్పుడూ హరినామ సంకీర్తన చేస్తూ గొప్ప సంపదలను పొందాడు. అతడు భూమండలాన్ని ఎనభై ఐదువేల సంవత్సరాలు గొప్పకీర్తితో పేరు పెంపులతో పాలించాడు. ఐనా అతడు ముసలితనం పొందక యువకుడై గొప్పకీర్తితో కార్తవీర్యుడని ప్రసిద్ధి కెక్కాడు. అతడిలాగా పరిపాలించిన మరో రాజును ఎక్కడా చూడబోము.

వ. ఆ యర్జునునకుం గల పుత్త్రసహస్రంబునం బరశురాముని బారికిం దప్పి జయధ్వజుండు, శూరసేనుండు, వృషణుండు, మధువు, నూర్జితుం డనువా రేవురుం బ్రతికిరి. జయధ్వజునకు దాళజంఘుండు, తాళజంఘునకు నౌర్వముని తేజంబున నూర్వురు కొడుకులుఁ గలిగిరి. అందుఁ బ్రథముండు వీతిహోత్రుండు. మధువునకు వృష్ణుండు, వృష్ణునకుఁ బుత్త్ర శతంబు వుట్టె, నందుఁ బ్రథముండు వృష్ణి; మఱియు మధు వృష్ణి యదువుల యా వంశంబుల వారు మాధవులు, వృష్ణులు యాదవులు ననం బరఁగిరి. యదుపుత్రుండయిన క్రోష్టువునకు వృజినవంతుండు, వృజినవంతునకు శ్వాహితుండు, శ్వాహితునకు భేరుశేకుండు, భేరుశేకునకుఁ జిత్రరథుండు, చిత్రరథునకు శశిబిందుండుఁ బుట్టిరి.704

* ఆ కార్తవీర్యార్జునుని వేయిమంది కొడుకులలో పరశురాముని బారి నుండి తప్పించుకొని జయధ్వజుడు, శూరసేనుడు, వృషణుడు, మధువు, ఊర్జితుడు అనే ఐదుమంది మాత్రం బ్రతికారు. జయధ్వజునికి తాళజంఘుడు పుట్టాడు. తాళజంఘునికి ఔర్వముని తేజస్సువల్ల నూరుమంది కొడుకులు కలిగారు. వారిలో పెద్దవాడు వృష్టి. ఇంకా మధు, వృష్టి యదువుల వంశాలకు చెందినవారు మాధవులని, వృష్ణులని, యాదవులని పేరు పొందారు. యదువు కొడుకైన క్రోష్టువుకు వృజినవంతుడు, వృజిన వంతునికి శ్వాహితుడు, శ్వాహితునికి భేరుశేకుడు, భేరుశేకునికి చిత్రరథుడు, చిత్రరథునికి శశిబిందుడు పుట్టారు.

మ. కృశమధ్యల్ పదివేవు రంగనలతోఁ గ్రీడం బ్రమోదింప స
త్కుశలుండై పదివేలలక్షలు సుపుత్త్రుల్ భక్తి సేయం జతు
ర్దశ రత్నుండును యోగినాఁ బరఁగి సప్తద్వీప రాజేంద్రుఁడై
శశిబిందుం డురునీతిమంతుఁ డమరెన్ సత్కాంతి పూర్ణేందుఁడై. 705

* గొప్పనీతిశాలి అయిన ఆ శశిబిందుడు పదివేల మంది భార్యలతో కూడి ఆనందిస్తూ, పదివేలలక్షల కొడుకులు భక్తితో సేవిస్తుండగా పద్నాలుగు రత్నాలకు అధిపతియై యోగిగా ప్రవర్తిల్లి మంచి కాంతి కలిగిన పూర్ణచంద్రుడిలాగా ఏడుదీవులకూ రాజేంద్రుడై ఒప్పారాడు.

వ. అతని కొడుకుల మొత్తంబులకు ముఖరులైన యార్వురలోఁ బృథుశ్రవుండను వానికి ధర్ముండు పుట్టె. ధర్మునకు నుశనుండు పుట్టి నూ ఱశ్వమేధంబులు సేసె. ఆ యుశనునకు రుచకుండు పుట్టె. ఆ రుచకునకుఁ బురుజిత్తు, రుక్ముండు, రుక్మేషువు, పృథువు, జ్యామఘుండు నను వా రేవురు పుట్టిరి. అందు జ్యామఘుండు. 706

*అతడి అంతమంది కొడుకులలోను ఆరుగురు ముఖ్యులు. వాళ్ళలో పృథుశ్రవుడనే వానికి ధర్ముడు పుట్టాడు. ధర్మునికి ఉశనుడు జన్మించాడు. అతడు వంద అశ్వమేధయాగాలను చేశాడు. ఆ ఉశనుడికి రుచకుడు పుట్టాడు. ఆ రుచకునికి పురుజిత్తు, రుక్మడు, రుక్మేషువు, పృథువు, జ్యామఘుడు అనే ఐదుగురు కుమారులు కలిగారు.

సీ. తొట్రుకొల్పెడు శైబ్యతోడి ప్రేమంబున ననపత్యుఁ డయ్యును నన్యభార్యఁ
గైకొన కొకకొంత కాలంబునకుఁ బోయి పగవారియింటను బలిమిఁ బట్టి
యొకకన్యఁ దేరిపై నునిచి తోడ్తేరంగ జననాథుఁ గన్యను శైబ్య చూచి
కోపించి మానవకుహక! యీ పడుచును దెచ్చియు నేనుండఁ దేరిమీఁదఁ

ఆ. బెట్టినాఁడ వనుచు బిఱుసులు పలుకంగ, నతఁడు పలికె నంత నతివతోడ
నాకుఁ గోడ లింత నమ్ము మీ లలితాంగి, సవతి గాదు వినుము సత్య మనుచు. 707

* వారిలో జ్యామఘుడు శైబ్యపట్ల ఉన్న గాఢమైన ప్రేమవల్ల సంతానం లేనివాడైనా మరోభార్యను స్వీకరించలేదు. కొంతకాలానికి శత్రువుల ఇంట్లోని, ఒక కన్యను బలవంతంగా రథం మీద పెట్టుకుని వస్తుంటే శైబ్య చూచి కోపగించుకుంది. 'ఓ మోసగాడా! నే నుండగానే ఎవతెనో తెచ్చి రథం మీద పెట్టుకుని ఊరేగుతున్నావా?' అని కఠినంగా పలికింది. అప్పుడతడు 'ఈమె నాకు కోడలవుతుంది. నీకు సవతి కాదు. ఇది నిజం' అని చెప్పాడు.

వ. అ య్యవసరంబున శైబ్య కొడుకుం గాంచు నని యెఱింగి, విశ్వేదేవతలును, పితృదేవతలును సంతసించిరి. వారల ప్రసాదంబున. 708

క. తనసవతి మొఱఁగి పెనిమిటి, తనుఁ బొందిన శైబ్య మఱి విదర్భునిఁ గనియెన్
దనయుఁ గని జ్యామఘుండును, దనతెచ్చిన కన్యఁ దెచ్చి తనయున కిచ్చెన్. 709

* అప్పుడు శైబ్య కొడుకును కనబోతుంది అని తెలుసుకొన్న విశ్వేదేవతలు, పితృదేవతలు సంతోషించారు. వారి కటాక్షంతో శైబ్య విదర్భుడనే కొడుకును కన్నది. జ్యామఘుడు తాను బలాత్కారంగా తెచ్చిన కన్యను కుమారుని కిచ్చి పెళ్లిచేశాడు.

వ. ఆ కన్యకయందు విదర్భునకుఁ గుశుండును, గ్రుథుండును, రోమపాదుండునుం బుట్టిరి. రోమపాదునకు బభ్రువు, బభ్రువునకు విభువు, విభువునకుఁ గృతి, కృతికి నుశికుండు, ఉశికునకు చేది, చేదికి చైద్యాదులు పుట్టిరి. క్రుథునకుఁ గుంతి, కుంతికి ధృష్టి, ధృష్టికి నిర్వృతి, నిర్వృతికి దశార్హుండు, దశార్హునకు వ్యోముండు, వ్యోమునకు జీమూతుండు, జీమూతునకు వికృతి, వికృతికి

భీమరథుండు, భీమరథునకు నవరథుండు. నవరథునకు దశరథుండు, దశరథునకు శకుని, శకునికిఁ గుంతి, కుంతికి దేవరాతుండు, దేవరాతునకు దేవక్షత్రుండు, దేవక్షత్రునకు మధువు, మధువునకుఁ గురువశుండు, కురువశునకు ననువు, అనువునకుఁ బురుహోత్రుండు, నతనికి నంశువు, నతనికి సాత్త్వతుండు, సాత్త్వతునకు భజమానుండును, భజియు, దివ్యుండును, వృష్టియు, దేవావృథుండును, నందకుండును, మహాభోజుండు నను నేడ్గురును బుట్టిరి. అందు భజమానునకుఁ బ్రథమభార్య యందు నిమ్రోచి కంకణ వృష్ణులు ముప్వురును, రెండవభార్యయందు శతజిత్తు, సహస్రజిత్తు, అయుతజిత్తు నను ముప్వురును బుట్టిరి. అందు దేవావృథునికి బభ్రువు పుట్టె. వీర లిరువుర ప్రభావంబులఁ బెద్దలు శ్లోకరూపంబునఁ బఠియించుదురు. అట్టి శ్లోకార్థం బెట్టిదనిన.710

* ఆ కన్యక యందు విదర్భునికి కుశుడు, క్రుథుడు, రోమపాదుడు పుట్టారు. ఆ రోమపాదునికి బభ్రువు, బభ్రువుకు విభువు, విభువుకు కృతి, కృతికి ఉశికుడు, ఉశికునకు చేది జన్మించారు. చేదికి చైద్యుడు మొదలైన వాళ్లు పుట్టారు. క్రుథునికి కుంతి, కుంతికి ధృష్టి, ధృష్టికి నిర్వృతి, నిర్వృతికి దశార్హుడు, దశార్హునికి వ్యోముడు, వ్యోమునికి జీమూతుడు, జీమూతునికి వికృతి, వికృతికి భీమరథుడు, భీమరథునికి నవరథుడు, నవరథునికి దశరథుడు, దశరథునికి శకుని, శకునికి కుంతి, కుంతికి, దేవరాతుడు, దేవరాతునికి దేవక్షత్రుడు, దేవక్షత్రునికి మధువు, మధువుకు కురువశుడు, కురువశునికి అనువు, అనువుకు పురుహోత్రుడు, అతడికి అంశువు, అతడికి సాత్త్వతుడు జన్మించారు.

సాత్త్వతునికి భజమానుడు, భజి, దివ్యుడు, వృష్టి, దేవావృథుడు, అంధకుడు, మహాభోజుడు అనే ఏడు మంది పుత్రులు కలిగారు. వారిలో భజమానునికి మొదటిభార్యవల్ల నిమ్రోచి, కంకణుడు, వృష్ణువు అనే ముగ్గురు; రెండవ భార్యవల్ల శతజిత్తు, సహస్రజిత్తు, అయుతజిత్తు అనే ముగ్గురు కుమారులు కలిగారు. వారిలో దేవావృథునికి బభ్రువు పుట్టాడు. వీరిద్దరి మహిమలను పెద్దలు శ్లోకరూపంలో గానం చేస్తారు. ఆ శ్లోకార్థం ఎటువంటిదంటే-

తే. వినుము దూరంబునం దేమి వినుచు నుందు, మదియు చూతుము డగ్గఱ నరుగుదేర
నరులలో బభ్రుకంటె నున్నతుఁడు లేఁడు, యోజ దేవావృథున కెన యొరుఁడు గలఁడె? 711

* దూరాన ఏది వింటామో దగ్గరగా దాన్నే చూస్తాము. మనుషుల్లో బభ్రువుకంటె గొప్పవాడు లేడు. గొప్ప తేజస్సులో దేవావృథునికి సాటి మరొకడు లేడు.''

క. పదునాలుగు వేవురు నఱు, వదియేవురు నరులు ముక్తి పడసిరి బభ్రుం
డుదితుఁడు దేవావృథుఁడును, బదపడి యోగంబుఁ దెలియఁ బలికిన కతనన్. 712

* 'ఆ బభ్రువూ, దేవావృథుడూ యోగాన్ని ఉపదేశించినందువల్ల పద్నాలుగువేల అరవై ఐదుమంది నరులు ముక్తిని పొందారు.'

వ. మహాభోజుం డతిధార్మికుండు. వాని వంశంబువారు భోజులని పలుకం బడిరి. వృష్టికి సుమిత్రుం డును, యుధాజిత్తును జన్మించిరి. అందు యుధాజిత్తునకు శినియు, అనమిత్రుండును జనించిరి. అనమిత్రునికి నిమ్నుండు, నిమ్నునికి సత్రాజితుండు, ప్రసేనుండు నన నిరువురు పుట్టిరి, మఱియు

ననమిత్రునికి శినియను వాఁడు వేఱొకండుఁ గలఁడు, అతని పుత్త్రుండు సత్యకుండు, అతనికి యుయుధానుం డనం బరఁగిన సాత్యకియు, నా సాత్యకికి జయుండును, జయునకుం గుణియు, నాగుణికి యుగంధరుండును బుట్టిరి. మఱియు ననమిత్రునకుఁ బృశ్నియను వేఱొక కొడుకుం గలఁడు. వానికి శ్వఫల్క-చిత్రకులు గలిగిరి. అందు శ్వఫల్కునకు గాందిని యం దక్రూరుండును, నసంగుండును, సారమేయుండును, మృదుకుండును, మృదుపచ్ఛివుండును, వర్మదృక్కును, ధృష్టవర్ముండును, క్షత్రోపేక్షుండును, అరిమర్దనుండును, శత్రుఘ్నుండును, గంధమాదనుండును, ప్రతిబాహువు ననువారు పన్నిద్దఱు కొడుకులును, సుచారువను కన్యకయుం జనించిరి. వారియం దక్రూరునికి దేవలుండును, అనుపదేవుండును బుట్టిరి. మఱియుఁ జిత్రునకుఁ బృథుండును, విడూరథుండును మొదలుగాఁ గలవారు పెక్కండ్రు వృష్ణి వంశ జాతు లయిరి. భజమానుండు, కుకురుఁడు, శుచి, కంబళబర్హిషుండు నన నలువు రంధకునికిఁ బుట్టిరి. కుకురునకు వృష్ణి, వృష్ణికి విలోమతనయుండు, విలోమతనయునికి కపోతలోముండు, కపోతలోమునికిం దుంబురు సఖుండైన యనువు, అనువునకు దుందుభి, దుందుభికి దవిద్యోతుండు, దవిద్యోతునకుఁ బునర్వసువు, ఆతనికి ఆహుకుం డను కుమారుండును, ఆహుకి యను కన్యకయుం గలిగిరి. ఆ యాహుకునికి దేవకుండు, ఉగ్రసేనుండు నన నిరువురు జన్మించిరి. అందు దేవకునికి దేవలుండు, అనుపదేవుండు, సుదేవుండు, దేవవర్ధనుండన నలుగురు గలిగిరి. వారలకు ధృతదేవయు, శాంతిదేవయు, ఉపదేవయు, శ్రీదేవయు, దేవరక్షితయు, సహదేవయు,దేవకియు ననఁ దోఁబుట్టువు లేడ్వురు గలిగిరి. 713

* మహాభోజుడు ధర్మం తెలిసినవాడు, గొప్పవాడు. అతడి వంశంలోనివారు భోజులని పిలువబడ్డారు. వృష్ణికి సుమిత్రుడు, యుథాజిత్తు, పుట్టారు. వారిలో యుథాజిత్తుకు శిని, అనమిత్రుడు జన్మించారు. అనమిత్రునికి నిమ్నుడు పుట్టాడు. నిమ్నునికి సత్రాజిత్తు, ప్రసేనుడు అనే ఇద్దరు కొడుకులు గలిగారు. ఇంకా అనమిత్రునికి శిని అనే మరో కొడుకు ఉన్నాడు. అతని కొడుకు సత్యకుడు. అతనికి యుయుధాను డనే పేరు గల సాత్యకి పుట్టాడు. ఆ సాత్యకికి జయుడు, జయునికి కుణి, ఆ కుణికి యుగంధరుడు పుట్టారు. ఇంకా అనమిత్రునికి పృశ్ని అనే మరోకొడుకు ఉన్నాడు. అతడికి శ్వఫల్కుడు, చిత్రకుడు జన్మించారు.

వారిలో శ్వఫల్కునికి గాందిని అను భార్యయందు అక్రూరుడు, అసంగుడు, సారమేయుడు, మృదుకుడు, మృదుపచ్ఛివుడు, వర్మదృక్కు, ధృష్టవర్ముడు, క్షత్రోపేక్షుడు, అరిమర్దనుడు, శత్రుఘ్నుడు గంధమాదనుడు, ప్రతిబాహువు అన్న పన్నెండుమంది కొడుకులు, సుచారువు అనే కూతురు జన్మించారు. వారిలో అక్రూరునికి దేవలుడు, అనుపదేవుడు పుట్టారు. ఇంకా చిత్రునికి పృథుడు, విడూరథుడు మొదలైన పెక్కుమంది పుట్టి వృష్ణికులంలో ప్రసిద్ధు లయ్యారు. అంధకునికి భజమానుడు, కుకురుడు, శుచి, కంబళబర్హిషుడు అనే నలుగురు కుమారులు పుట్టారు. కుకురునికి వృష్ణి, వృష్ణికి విలోమతనయుడు, విలోమతనయునికి కపోతలోముడు, కపోతలోమునికి తుంబురుని స్నేహితుడైన అనువు, అనువుకు దుందుభి, దుందుభికి

దవిద్యోతుడు, దవిద్యోతునికి పునర్వసువు, అతడికి ఆహుకుడు అనే కొడుకు, ఆహుకి అనే కూతురు గలిగారు, ఆ ఆహుకునికి దేవకుడు, ఉగ్రసేనుడు అనే ఇద్దరు జన్మించారు. వారిలో దేవకునికి దేవలుడు, అనుపదేవుడు, సుదేవుడు, దేవవర్ధనుడు అనే నలుగురు కొడుకులు కలిగారు. వారికి ధృతదేవ, శాంతిదేవ, ఉపదేవ, శ్రీదేవ, దేవరక్షిత, సహదేవ, దేవకి అనే ఏడుమంది చెల్లెండ్రు కలిగారు.

**క. అసదృశ లలితాకారలఁ, గిసలయ కరతలల దేవకీముఖ్యల నా**
**బిసరుహనయనల నందఱ, వసుదేవుఁడు పెండ్లి యాడె వసుధాధీశా! 714**

* ఓ రాజా! సాటిలేని అందమైన రూపులూ, చిగురులవంటి అరచేతులూ, తామరలవంటి కన్నులూ కలిగిన దేవకి మొదలైన వా రందరినీ వసుదేవుడు పెండ్లాడాడు.

**వ. ఉగ్రసేనునకుఁ గంసుండును, న్యగ్రోధుండును, సునామకుండును, కహ్వుండును, శంకుండును, సుభువును, రాష్ట్రపాలుండును, విసృష్టుండును, తుష్టిమంతుండు నను కొడుకులును; కంసయు, కంసవతియు, సురాభువు, రాష్ట్రపాలికయు నను కూఁతులుం బుట్టిరి. వారు వసుదేవానుజ భార్యలైరి. భజమానునికి విడూరథుండును, విడూరథునికి శినియు, నతనికి భోజుండు, భోజునికి హృదికుండు, హృదికునకు దేవమీఢుండు, శతధనువు, కృతవర్మయు నను కొడుకులు గలిగిరి. ఆ దేవమీఢుండు శూరుండు ననంబడు. శూరునికి మారిష యను భార్య యందు వసుదేవుండును, దేవభాగుండును, దేవశ్రవుండును, ఆనకుండును, సృంజయుండును, శ్యామకుండును, కంకుండును, అనీకుండును, వత్సకుండును, వృకుండు ననువారు పదుగురు కొడుకులును; పృథయు, శ్రుతదేవయు, శ్రుతకీర్తియు శ్రుతశ్రవసయు, రాజాధి దేవియు నను కూఁతు లేవురును బుట్టిరి. అందు- 715**

* ఉగ్రసేనునికి కంసుడు, న్యగ్రోధుడు, సునామకుడు, కహ్వుడు, శంకుడు, సుభువు, రాష్ట్రపాలుడు, విసృష్టుడు, తుష్టిమంతుండు అనే కొడుకులు; కంస, కంసవతి, సురాభువు, రాష్ట్రపాలిక అనే నలుగురు కొమార్తెలు కలిగారు. వాళ్లు వసుదేవుని తమ్ముళ్లకు భార్యలయ్యారు. భజమానునికి విడూరథుడు, విడూరథునికి శిని, అతడికి భోజుడు, భోజునికి హృదికుడు కలిగారు. వారిలో హృదికునికి దేవమీఢుడు, శతధనువు, కృతవర్మ అనే కొడుకులు కలిగారు. ఆ దేవమీఢుడు శూరుడని ప్రసిద్ధు డయ్యాడు. శూరునికి మారిష అనే భార్యగర్భంలో వసుదేవుడు, దేవభాగుడు, దేవశ్రవుడు, ఆనకుడు, సృంజయుడు, శ్యామకుడు కంకుడు, అనీకుడు, వత్సకుడు, వృకుడు అనే పది మంది కొడుకులు; పృథ, శ్రుతదేవ, శ్రుతకీర్తి, శ్రుతశ్రవస, రాజాధిదేవి అనే ఐదుగురు కూతుళ్లు పుట్టారు.

## -: వసుదేవుని వంశక్రమానువర్ణనము :-

**ఉ. ధీనయశాలియైన వసుదేవుఁడు పుట్టిన వెంట మింటిపై**
**నానక దుందుభుల్ మొరసె నచ్యుతుఁ డీతనికిం దనూజుఁడై**
**మానుగఁ బుట్టునంచు గరిమంబున దేవత లుబ్బ రాజపం**
**చానన! తన్నిమిత్తమున నానకదుందుభి యయ్యె వాఁడిలన్. 716**

* ఓ రాజసింహుడా! గొప్ప బుద్ధిమంతుడు, నీతిశాలి ఐన ఆ వసుదేవుడు పుట్టిన వెంటనే దేవతలు "ఆ శ్రీహరి ఇతడికి ముద్దుల కొడుకై జన్మిస్తాడు" అని ఉత్సాహంతో ఆకాశంలో దేవదుందుభులను మ్రోగించారు. ఆ కారణంగా వసుదేవుడు ఆనకదుందుభిగా లోకంలో ప్రసిద్ధుడయ్యాడు.

**క. తన చెలికాఁడగు కుంతికిఁ, దనయులు లేకున్నఁ జూచి తన తనయఁ బృథన్**
**దనయఁగ నిమ్మన శూరుఁడు, దనయందుల మైత్రి నిచ్చె ధరణీ నాథా! 717**

* ఓ రాజా! శూరుడు తనస్నేహితుడైన కుంతిభోజునికి బిడ్డలు లేకుంటే ఆతడికోరిక ననుసరించి తన కూతురైన పృథను పెంచుకోటానికి ఇచ్చాడు.

**వ. అ య్యింతి కుంతిభోజుని యింటం బెరుగుచుండ, నొకనాఁడు దుర్వాసుం డరుగుదెంచిన న మ్మహాత్మునకుఁ గొన్ని దినంబులు పరిచర్యలు చేసి వేల్పులం జేరంజీరు విద్య వడసి, యా విద్య లావెఱుంగ నొక్క నాఁడేకాంతంబున వెలుంగుఱేని నాకర్షించిన, నా దేవుండు వచ్చినం జూచి, వెఱఁగుపడి యిట్లనియె. 718**

* ఆమె కుంతిభోజుని ఇంట్లో పెరుగుతుండగా ఒకరోజు దుర్వాసుడు వచ్చాడు. ఆమె ఆ మహాత్ముడికి కొన్ని రోజులు పరిచర్యలు చేసి అతడి దయవల్ల దేవతలను ఆహ్వానించే మంత్రవిద్యను పొందింది. ఆ మంత్రవిద్యాప్రభావం పరీక్షించాలనుకొని ఏకాంతంలో ఆమె సూర్యుణ్ణి ఆహ్వానించింది. అతడు ప్రసన్నుడై రాగా ఆమె అబ్బురపడి ఇట్లా అన్నది.

**క. మంత్ర పరీక్షార్థం బభి, మంత్రించితిఁ గాని దేవ! మదనక్రీడా**
**తంత్రంబుఁ గోరి చీరన్, మంత్రించిన తప్పు సైచి మరలు దినేశా! 719**

* ఓ సూర్యభగవానుడా! మంత్రాన్ని పరీక్షించడం కోసం నేను పిలిచానంతే. పొత్తుకోరి నేను ఆహ్వానించలేదు. నా తప్పుకాచి మరలిపో.

**వ. అనిన న య్యువిదకుం బద్మినీవల్లభుం డిట్లనియె. 720**

* ఇట్లా పలికిన కుంతితో సూర్యుడు ఇట్లా అన్నాడు.

**మ. తెఱవా! నీ పలుకట్ల యౌ. వినుము లే దేవోత్తమాహ్వానముల్**
**మొఱగంబోలునె? వేల్పులం బడయుటల్ మోఘంబు లే నీకు నీ**
**తఱి గర్భం బగుఁ బుత్త్రుఁడుం గలుగు; నీ తారుణ్యముం బూజ్యమౌ**
**వెఱవం గార్యము లేదు; సిగ్గు దగునే? వ్రీడావినమ్రాననా! 721**

* "ఓ కాంతా! నీ మాటలలా ఉండనీ, దేవతలను ఆహ్వానించటాలు అల్పమైన విషయాలా? కప్పిపుచ్చడం సరికాదు. దేవతల పొత్తులు వ్యర్థాలు కావు. నీ కిప్పుడు గర్భం కలుగుతుంది. ఐనా నీ యౌవనం దూషితం కాదు. భయపడవలసిన పని లేదు. లజ్జావతీ! సిగ్గుతో తల వంచుకో వద్దు."

**చ. అని తగ నీయకొల్పి లలితాంగికి గర్భము సేసి మింటికిన్**
**జనియె దినేశ్వరుం డపుడు చక్కని రెండవ సూర్యుఁడో యనన్**

దనరెడు పుత్త్రుఁ గాంచి కృప దప్పి జగజ్జనవాదభీతయై
తనయుని నీటఁ బోవిడిచి తా నరిగెం బృథ దండ్రియింటికిన్. 722

* సూర్యభగవానుడు ఈ విధంగా ఒప్పించి ఆమెకు గర్భం కలిగించి ఆకాశానికి వెళ్ళాడు. పిమ్మట కుంతికి రెండవ సూర్యుడా అన్నట్లుగా ప్రకాశించే కొడుకు కలిగాడు. లోకనిందకు భయపడిన ఆమె ఏ మాత్రం జాలిలేక ఆ బిడ్డను నీటిలో విడిచి తండ్రి యింటికి వెళ్ళింది.

వ. అ య్యువిదను నీ ప్రపితామహుండైన పాండురాజు వివాహం బయ్యె. అ య్యంగనకుఁ బాండురాజు వలన ధర్మజ, భీమార్జునులు పుట్టిరి, అమ్మగువచెల్లెలగు శ్రుతదేవను, గారూషకుండైన వృద్ధశర్మ పెండ్లియాడె. అయ్యిద్దఱకును ముని శాపంబున దంతవక్త్రుండను దానవుండు జన్మించె. దాని తోడంబుట్టువగు శ్రుతకీర్తినిఁ గేకయుండు పెండ్లియాడె. ఆ దంపతులకుఁ బ్రతర్దనాదు లేవురు పుట్టిరి. దాని భగిని యైన రాజాధిదేవిని జయత్సేనుండు పరిణయం బయ్యె. ఆ మిథునమునకు విందానువిందులు సంభవించిరి. చేది దేశాధిపతియైన దమఘోషుండు శ్రుతశ్రవసను పరిగ్రహించె, వారలకు శిశుపాలుం డుదయించె. వసుదేవుని తమ్ముండైన దేవభాగునికిఁ గంసయందుఁ జిత్రకేతు బృహద్బలు లిరువురు జనించిరి. వాని భ్రాతయగు దేవశ్రవస్సును వానికి గంసవతి యందు వీరుండును, నిషుమంతుండును నుప్పతిల్లిరి. వాని సోదరుండైన కంకునికిఁ గంక యను దానికి బకుండును, సత్యజిత్తు పురుజిత్తను వారు జనించిరి. వాని సహజుండైన సృంజయునికి రాష్ట్రపాలియందు వృష, దుర్మర్షనాదులు జనించిరి. వాని యనుజాతుండైన శ్యామకునకు సురభూమియందు హరికేశ హిరణ్యాక్షులు ప్రభవించిరి. వాని తమ్ముండైన వత్సుండు మిశ్రకేశి యను నప్సరసయందు వృకాదిసుతులం గనియె. వృకుండు దూర్వాక్షి యందుఁ దక్ష పుష్కర సాళ్వాదుల నుత్పాదించె. వాని జఘన్యజుండయిన యనీకుండు సుదామని యను దాని యందు సుమిత్రానీక బాణాదు లయిన కొడుకులం బడసె, వాని యనుజుండైన యానకుండు కర్ణిక యందు ఋతధామ జయులం గాంచె. వసుదేవుని వలన రోహిణియందు బలుండును, గదుండును, సారణుండును, దుర్మదుండును, విపులుండును, ధ్రువుండును, కృతాదులును; పౌరవియందు సుభద్రుండును, భద్రబాహుండును, దుర్మదుండును, భద్రుండును భూతాదులుం గూడఁ బన్నిద్దఱును; మదిరయందు నందోపనంద కృతక శ్రుత శూరాదులును; నిళయందు యదుముఖ్యులయిన యురువల్కలాదులును; ధృతదేవయందుఁ ద్రిపృష్ఠుండును; శాంతిదేవాత్మజయందుఁ బ్రశ్రమ ప్రశ్రితాదులును; నుపదేవయందుఁ గల్పవృష్ట్యాదులు పదుండ్రును; శ్రీదేవయందు వసుహంస, సుధన్వాదు లార్గురును, దేవరక్షితయందు గదాదులు తొమ్మండ్రును; సహదేవయందుఁ గీర్తిమంతుండును, సుషేణుండును, భద్రసేనుండును, ఋజువును సమదనుండును, భద్రుండును, సంకర్షణుండును, ననువా రేడ్వురు పుట్టిరి. మఱియును.723

* పరీక్షిన్మహారాజా! ఆ కుంతిని నీ ముత్తాత అయిన పాండురాజు పెళ్ళాడాడు. ఆమెకు పాండురాజు వల్ల ధర్మరాజు, భీముడు, అర్జునుడు పుట్టారు. ఆమె చెల్లెలైన శ్రుతదేవను కరూశదేశం రాజైన వృద్ధశర్మ వివాహం చేసుకున్నాడు. ఆ ఇద్దరికి మునిశాపంవల్ల దంతవక్త్రుడనే రాక్షసుడు పుట్టాడు. ఆమె తోబుట్టు వైన శ్రుత కీర్తిని కేకయరాజైన ధృష్టకేతుడు పెళ్ళాడాడు. ఆ దంపతులకు ప్రతర్దనుడు మొదలైన ఐదుగురు

కొడుకులు పుట్టారు. వారి సోదరి అయిన రాజాధిదేవిని జయత్సేనుడు మనువాడాడు. వారిద్దరికీ విందుండు అనువిందుడు అనే కొడుకులు కలిగారు. చేది దేశపు రాజైన దమఘోషుడు శ్రుతశ్రవసను చేపట్టాడు. వారికి శిశుపాలుడు జన్మించాడు. వసుదేవుని తమ్ముడైన దేవభాగునికి కంస అనే భార్య యందు చిత్ర కేతుడు, బృహద్బలుడు జన్మించారు. అతడి సోదరుడైన దేవశ్రవుడనే వానికి కంసవతివల్ల వీరుడు, ఇషుమంతుడు, పుట్టారు. వాని సోదరుడైన కంకునికి కంకవల్ల బకుడు, సత్యజిత్తు, పురుజిత్తు అనే వాళ్ళు కలిగారు. వాని తోడబుట్టిన వాడైన సృంజయునికి రాష్ట్రపాలివల్ల వృషుడు, దుర్మర్షణుడు మొదలైన వాళ్ళు జన్మించారు. వాని తమ్ముడైన శ్యామకునికి సురభూమి గర్భంలో హరికేశుడు, హిరణ్యాక్షుడు పుట్టారు. అతడి సోదరుడైన వత్సుడు మిశ్రకేశి అనే అప్సరః స్త్రీ వల్ల వృకుడు మొదలైన కొడుకులను పొందాడు. వాని తమ్ముడైన వృకుడు దూర్వాక్షి గర్భంలో తక్షుడు పుష్కరుడు, సాళ్వుడు మొదలైన వారిని పొందాడు. వాని సోదరుడైన అనీకుడు సుదామని వల్ల సుమిత్రానీకుడు, బాణుడు మొదలైన కొడుకులను కన్నాడు. వాని తమ్ముడైన ఆనకుడు కర్ణికవల్ల ఋతధాముడు, జయుడు అనే కొడుకులను పొందాడు.

వసుదేవునికి రోహిణి గర్భంలో బలరాముడు, గదుడు, సారణుడు, దుర్మదుడు, విపులుడు, ధ్రువుడు కృతుడు మొదలైన కొడుకులు; పౌరవి గర్భంలో సుభద్రుడు, భద్రబాహుడు, దుర్మదుడు, భద్రుడు, భూతుడు మొదలైన పన్నెండుమంది పుత్రులు; మదిర గర్భంలో నందుడు, ఉపనందుడు, కృతకుడు, శ్రుతుడు, శూరుడు మొదలైన కొడుకులు; కౌసల్య గర్భంలో కౌశి; రోచన గర్భంలో హస్తుడు, హేమాంగదుడు మొదలైన కుమారులు; ఇళ గర్భంలో యదుకులంలో ముఖ్యులైన ఉరువల్కులుడు మొదలైనవారు, ధృతదేవ గర్భంలో త్రిపుష్ఠుడనే కొడుకు; శాంతిదేవ గర్భంలో ప్రశ్రముడు, ప్రశ్రితుడు మొదలైన వారు; ఉపదేవగర్భంలో కల్పవృష్టి మొదలైన పదిమంది కొడుకులు; శ్రీదేవగర్భంలో వసుడు, హంసుడు,సుధన్వుడు మొదలైన ఆర్గురు కుమారులు; దేవరక్షిత గర్భంలో గదుడు మొదలైన తొమ్మిదిమంది కొడుకులు; సహదేవగర్భంలో పురూధుడు, శ్రుతుడు మొదలైన ఎనిమిదిమంది పుత్రులు; దేవకీ గర్భంలో కీర్తిమంతుడు సుషేణుడు, భద్రసేనుడు, ఋజువు, సవదనుడు, భద్రుడు, సంకర్షణుడు అనే ఏడుమంది కొడుకులు కలిగారు.

**క. దుష్టజన నిగ్రహంబును, శిష్టజనానుగ్రహంబు సేయుట కొఱకై**
**యష్టమ గర్భమున గుణో, త్కృష్టుఁడు దేవకికి విష్ణుదేవుఁడు పుట్టెన్. 724**

* ఇంకా ఆ దేవకికి ఎనిమిదవ గర్భంలో భగవంతుడైన విష్ణుదేవుడే దుష్ట శిక్షణం, శిష్టరక్షణం కోసం ఆవిర్భవించాడు.

**ఆ. విష్ణుఁ డుదితుఁడైన వెనుక నా దేవకి, భద్రమూర్తియగు సుభద్రఁ గనియె;**
**నా గుణాఢ్య ముత్తవగు నీకు నర్జున, దయిత యగుటఁ జేసి ధరణినాథ! 725**

* ఓ రాజా! విష్ణుమూర్తి జన్మించాక ఆ దేవకి మంగళస్వరూప అయిన సుభద్రను కన్నది. గుణవంతురాలైన ఆమె అర్జునుడి భార్య ఐనందువల్ల నీకు ముత్తవ్వ అవుతుంది.

**క. ఎప్పుడు ధర్మక్షయ మగు, నెప్పుడు పాపంబు పొడము నీ లోకములో**
**నప్పుడు విశ్వేశుఁడు హరి, దప్పక విభుఁడయ్యుఁ దన్నుఁ దా సృజియించున్. 726**

* ఈ లోకంలో ఎప్పుడు ధర్మం నశించి అధర్మం అతిశయిస్తుందో; అప్పుడు విశ్వేశుడైన శ్రీహరి తాను సర్వవ్యాపకుడై ఉన్నా తన్ను తానే సృష్టించుకొంటాడు.

క. తనమాయ లేక పరునకు, ఘనునకు నీశ్వరున కాత్మకర్తకు హరికిన్
జననములకుఁ గర్మములకు, మనుజేశ్వర! కారణంబు మఱియును గలదే? 727

* ఓ రాజా! పరమాత్మ, సర్వవ్యాపకుడు, ఈశ్వరుడు, ఆత్మ స్వరూపుడు ఐన శ్రీహరి తనమాయచేతనే జన్మకర్మలను పరిగ్రహిస్తాడు. దానికి మరో కారణం ఏదీ ఉండదు.

క. తలపఁగ నెవ్వని మాయా, విలసనములు జనన వృద్ధి విలయంబులకుం
గలిమి కనుగ్రహ మోక్షం, బులు కను జీవులకు మూలములు నా నెగడున్. 728

సీ. అట్టి సర్వేశుని కరయంగ జన్మాది పరతంత్రభావ మెప్పాటఁ గలదు
రాజలాంఛనముల రాక్షసవల్లభు లక్షౌహిణీశులై యవనిఁ బుట్టి
జనులను బాధింప శాసించు కొఱకునై సంకర్షణునితోడ జనన మంది
యమరుల మనముల కైన లెక్కింపఁగ రాకుండు నట్టి కర్మములఁ జేసి

తే. కలియుగంబున జన్మింపఁ గలుగు నరుల దుఃఖ శోకతమంబులఁ దొలఁగఁ జేసి
నేల వ్రేఁగెల్ల వారించి నిఖిలదిశల, విమలకీర్తులు వెదచల్లి వెలసె శౌరి. 729

* ఎవని మాయావిలాసాలు జీవుల సృష్టి స్థితి సంహారాలకూ, సంపదలకూ, కటాక్ష మోక్షాలకూ మూలాధారాలుగా అలరారుతుంటాయో అటువంటి సర్వేశ్వరునికి పుట్టుక మొదలైన వాటికి చిక్కుకొనే స్వభావం ఎట్లా ఉంటుంది? రాక్షసులు రాజులుగా భూమి మీద అవతరించి అనేక అక్షౌహిణుల సైన్యానికి అధిపతులై ప్రజలను బాధిస్తారు. వాళ్ళను శాసించడం కోసం శ్రీహరి బలరామునితో పాటు జన్మించి దేవతలు ఊహించడానికైన వీలు కానన్ని గొప్పకార్యాలు చేసి కలియుగంలో పుట్టే నరుల దుఃఖాన్ని అజ్ఞానాన్ని నశింపజేసి, భూభారాన్ని తొలగించి, అన్ని దిక్కులా పరిశుద్ధమైన కీర్తులను వెదజల్లి భూలోకంలో ప్రకాశిస్తాడు.

సీ. జనకుని గృహమున జన్మించి మందలోఁ బెరిఁగి శత్రులనెల్లఁ బీఁచ మణఁచి
పెక్కండ్రు భార్యలఁ బెండ్లియై సుతశతంబులఁ గాంచి తను నాదిపురుషుఁ గూర్చి
శరణన్న వారిని గరుణించి పాండవ కౌరవులకు నంతఁ గలహమైన
నందఱ సమయించి యర్జును గెలిపించి యుద్ధవునకుఁ దత్త్వ మొప్పఁ జెప్పి

తే. మగధ పాండవ సృంజయ మధు దశార్హ, భోజ వృష్ణ్యంధకాది సంపూజ్యుఁ డగుచు
నుర్విభరము నివారించి, యుండ నొల్ల, కా మహామూర్తి నిజమూర్తి యందుఁ బొందె. 730

* ఆ మహావిష్ణువు వసుదేవునింట పుట్టి వ్రేపల్లెలో పెరిగి శత్రువులను నాశనం చేశాడు. పెక్కుమంది కాంతలను పెళ్ళాడి వందలకొలదిగా కొడుకులను కన్నాడు. ఆదిపురుషుడైన తన్ను గూర్చే అనేక యాగాలను చేశాడు. పాండవ కౌరవుల మధ్య జరిగిన యుద్ధంలో శత్రువు లందరినీ రూపుమాపి అర్జునుణ్ణి గెలిపించాడు. ఉద్ధవునికి తత్త్వాన్ని తెలియజెప్పాడు. మగధ, పాండవ, సృంజయ, మధు, దశార్హ, భోజ, వృష్ణి, అంధక

వంశాలకు చెందిన వారిచే పూజింపబడుతుండేవాడు. భూభారాన్ని తొలగించాక ఆ తేజోమూర్తి ఆత్మమూర్తిలో కలిసిపోయాడు.

**క. మంగళహరికీర్తి మహా, గంగామృత మించుకైనఁ గర్ణాంజలులన్**
**సంగతము సేసి ద్రావఁ దొ, లంగును గర్మంబు లావిలం బగుచు నృపా! 731**

* ఓ రాజా! మంగళకరమైన ఆ శ్రీహరికీర్తి గంగామృతం వంటిది. దాన్ని వీనుల విందుగా కొంతైనా త్రాగితే సమస్త కలుషములూ నశిస్తాయి.

**క. వనజాక్షుని మందస్మిత, ఘనకుండల దీప్తి గండ కలితాననమున్**
**వనితలుఁ బురుషులుఁ జూచుచు, ననిమిషభావంబు లేమి కలయుదు రధిపా! 732**

* ఓ రాజా! చిరునవ్వుతోను, గొప్పకుండలాల కాంతితో విలసిల్లే చెక్కులతోను కూడిన శ్రీహరి ముఖాన్ని చూస్తూ స్త్రీ పురుషులు తమకు రెప్పపాటున్నందుకు విచారిస్తారు.

**చ. నగు మొగమున్ సుమధ్యమును నల్లని దేహము లచ్చి కాట ప**
**ట్టగు నురమున్ మహాభుజము లంచితకుండల కర్ణముల్ మదే**
**భ గతియు నీలవేణియుఁ గృపారసదృష్టియుఁ గల్గు వెన్నుఁ డి**
**మ్ముగఁ బొడసూపుఁ గాతఁ గను మూసిన యప్పుడు విచ్చు నప్పుడున్. 733**

**వ. అని చెప్పి. 734**

* నగుమోము, సన్నటి నడుమూ, నల్లటి దేహమూ, లక్ష్మీదేవికి ఆటపట్టయిన రొమ్మూ, గొప్పభుజాలూ, కుండలాలతో ఒప్పారే చెవులూ, మదపుటేనుగ నడకవంటి నడకా, నీలవర్ణ కుంతలాలూ, దయారసం ఒలికే చూపులూ కలిగిన శ్రీమహావిష్ణువు కన్ను మూసినా, తెరిచినా కన్నులపండువుగా కన్పించుగాక- అని శుకమహర్షి పరీక్షిత్తుతో పలికాడు.

**క. జనకసుతాహృచ్చోరా!, జనకవచోలబ్ధ విపినశైల విహారా!**
**జనకామిత మందారా!, జనకాది మహేశ్వరాతిశయసంచారా! 735**

* సీతాదేవి హృదయాన్ని దోచుకొన్న వాడా! తండ్రిమాట జవదాటక కొండకోనల్లో తిరిగినవాడా! జనుల కోరికలు తీర్చడంలో కల్ప వృక్షం వంటివాడా! జనకుడు మొదలైన రాజర్షులను అతిశయించిన ప్రవర్తన కలవాడా!

**క. జగదవనవిహారీ! శత్రులోక ప్రహారీ!, సుగుణఘనవిహారీ; సుందరీమానహారీ!**
**విగతకలుషపోషీ! వీరవిద్యాభిలాషీ!, స్వగురుహృదయతోషీ! సర్వదా సత్యభాషీ! 736**

* లోకరక్షణకోసం సంచరించేవాడా! శత్రువుల సమూహాన్ని దండించేవాడా! సుగుణాలచే ఉద్యానవనంలో విహరించేవాడా! అందగత్తెల అభిమానాన్ని అపహరించేవాడా! పుణ్యాత్ములను పోషించేవాడా! వీరత్వంలో అభినివేశం కలవాడా! గురువుల హృదయాలకు సంతోషాన్ని కలిగించేవాడా! ఎల్లప్పుడూ సత్యాన్నే పలికేవాడా!

గద్య. ఇది శ్రీపరమేశ్వర కరుణాకలిత కవితావిచిత్ర కేసనమంత్రిపుత్ర సహజపాండిత్య పోతనామాత్య ప్రణీతంబైన శ్రీమహాభాగవతంబను మహాపురాణంబునందు సూర్యవంశారంభంబును, వైవస్వతమను జన్మంబును, హైమచంద్రకథనంబును, సుద్యుమ్నాది మనుసూనుల చరిత్రంబును; మరుత్తు, తృణబిందు, శర్యాతి, కకుద్మి, సగర, నాభాగ ప్రముఖుల చరిత్రంబులును, నంబరీషుని యందుఁ బ్రయోగింపఁ బడిన దుర్వాసుల కృత్య నిరర్థక యగుటయు; నిక్ష్వాకు, వికుక్షి, మాంధాతృ, పురుకుత్స, హరిశ్చంద్ర, సగర, భగీరథ ప్రముఖుల చరిత్రంబులును; భాగీరథీ ప్రవాహవర్ణనంబును; గల్మాషపాద, ఖట్వాంగ ప్రముఖుల వృత్తాంతంబును, శ్రీరామచంద్రకథనంబును, దదీయవంశ పరంపరా గణనంబును; నిమికథయును, జంద్రవంశారంభంబును, బుధపురూరవుల కథయును, జమదగ్ని పరశురాముల వృత్తాంతంబును; విశ్వామిత్ర, నహుష, యయాతి, పూరు, దుష్యంత, భరత, రంతిదేవ, పాంచాల, బృహద్రథ, శంతను, భీష్మ, పాండవ, కౌరవ, ప్రముఖుల వృత్తాంతంబులును, ఋశ్యశృంగ వ్రతభంగంబును, ద్రుహ్యానుతుర్వసుల వంశంబును, యదు కార్తవీర్య శశిబిందు జామదగ్న్యాదుల వృత్తాంతంబులును, శ్రీకృష్ణావతార కథాసూచనంబును నను కథలుం గల నవమస్కంధము సంపూర్ణము. 737

* ఇది శ్రీపరమేశ్వరుని కటాక్షం వల్ల లభించిన కవితా వైచిత్రి కలవాడు, కేసనమంత్రి కుమారుడు, సహజపాండిత్యుడూ, ఐన పోతనామాత్యునిచే రచింపబడిన శ్రీమహాభాగవత మనే మహాపురాణంలో సూర్యవంశ ప్రారంభం; వైవస్వతమనువు పుట్టుక; హైమచంద్ర కథనం; సుద్యుమ్నుడు, శర్యాతి, కకుద్మి, సగరుడు, నాభాగుడు మొదలైన ప్రముఖుల చరిత్రలు; అంబరీషునిపై ప్రయోగింపబడిన దుర్వాసుని కృత్య అనే శక్తి వ్యర్థం కావడం; ఇక్ష్వాకుడు, వికుక్షి, మాంధాత, పురుకుత్సుడు, హరిశ్చంద్రుడు, సగరుడు, భగీరథుడు మొదలైనవారి చరిత్రలు; భాగీరథీనదీ ప్రవాహవర్ణన; కల్మాషపాదుడు, ఖట్వాంగుడు మొదలైన ప్రముఖుల వృత్తాంతం; శ్రీరామచంద్రుడి చరిత్రం, అతడి వంశ పరంపరను గూర్చిన లెక్కింపు; నిమికథ, చంద్రవంశ ప్రారంభం; బుధ పురూరవుల కథ; జమదగ్ని పరశురాముల వృత్తాంతం; విశ్వామిత్రుడు, నహుషుడు, యయాతి, పూరుడు, దుష్యంతుడు, భరతుడు, రంతిదేవుడు, పాంచాలుడు, బృహద్రథుడు, శంతనుడు, భీష్ముడు, పాండవులు, కౌరవులు మొదలైనవారి వృత్తాంతం; ఋశ్యశృంగుని వ్రతభంగం; ద్రుహ్యుడు, అనువు, తుర్వసుడు మొదలైనవారి వంశం; యదువు, కార్తవీర్యుడు, శశిబిందుడు, జమదగ్ని మొదలైన వారి చరిత్ర; శ్రీకృష్ణావతార కథాసూచన అనే కథలు కలిగిన నవమస్కంధం.

**శ్రీ కృష్ణార్పణమస్తు**

**T.T.D. Religious Publications Series N0.639 - C**
**Price : Rs. 235/-**

విష్ణుకథలు కల్యాణాత్మకమైనవి. అంటే శుభాలను ప్రసాదించేవి. అవి ఎన్ని మార్లు విన్నా, ఎప్పటికప్పుడు కొత్తవిగానే ఉంటాయి. భాగవతం అలాంటి పవిత్ర కథలకు నిలయం. ఈ పురాణరత్నం సహజకవి పోతన అమృతహస్తం నుండి మధుర భక్తిమయ కావ్యంగా తెలుగులో అవతరించిన నాటినుండీ ఎందరో భక్తులకు, కవులకు, వాగ్గేయకారులకు ఉపాదేయమై, అనేకవిధాల మార్గదర్శకమై అలరారుతోంది.

"పోతన్న తెనుగుల పుణ్యపేటి" అన్న విశ్వనాథ వారి మాటలు అక్షరసత్యాలు. పోతన తెలుగులో భాగవతాన్ని శ్రీకైవల్యపదాన్ని చేరదానికి రచించినా, ఆ గ్రంథాన్ని చదివినవాళ్లందరికీ కూడా మోక్షాన్ని సిద్ధింపజేశారు. భాగవతంలోని ప్రతిపద్యం ఎంతో హృద్యం. తెలుగునాట పోతన గారి పద్యం నోటికి రాని పండితుడు గాని, పామరుడు గాని లేదంటే అతిశయోక్తి కాదు.

అలాంటి ఉత్తమగ్రంథమైన భాగవత సందేశాన్ని, పోతనకవితా వైశిష్ట్యాన్ని, ఎన్నో వ్యాపకాలతో సతమతమయ్యే నేటి 'సగటుమనిషి'కి ప్రత్యేకించి యువతరానికి వీలైనంత సమగ్రంగా, సరళంగా అందించాలనే ఉదారాశయంతో తిరుమల తిరుపతి దేవస్థానం ఆంధ్రమహాభాగవతాన్ని కరుణశ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి గారి ప్రధాన సంపాదకత్వంలో తాత్పర్యసహితంగా ప్రచురించింది. ఈ సంపుటాలకు అనేకమంది పండితులు చక్కటి తాత్పర్యాన్ని సమకూర్చారు. ఇప్పటికి ఐదుసార్లు ముద్రితమైన ఈ సంపుటాలు పరిష్కరింపబడి పునర్ముద్రితమై వెలువడ్డాయి. పాఠకులు యథాపూర్వం ఆదరించగలరు!

"భాగవతపురాణఫలరసాస్వాదన
పదవిఁ గనుఁడు! రసికభావ విదులు!"

**Published by I.Y.R.Krishna Rao, I.A.S., Executive Officer, T.T.Devasthanams, Tirupati and Printed at Prajasakti Daily Printing Press, Hyderabad - 500 020.**

# పోతన భాగవతము

(దశమ స్కంధము - పూర్వ భాగం)

## నాల్గవ సంపుటము



తిరుమల తిరుపతి దేవస్థానములు,
తిరుపతి

# పోతన భాగవతము

*(సరళ గద్యానువాద సహితము)*

## నాల్గవ సంపుటము

### దశమ స్కంధము - పూర్వభాగము


*అనువాదకులు*

**డా॥ ఎక్కిరాల కృష్ణమాచార్య**

**శ్రీమాన్ ముదివర్తి కొండమాచార్యులు**

*ప్రధాన సంపాదకులు*

**డా॥ జంధ్యాల పాపయ్యశాస్త్రి**



*ప్రచురణ*

**కార్యనిర్వహణాధికారి**

**తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి**

**2010**

**POTANA BHAGAVATAMU,** with Lucid Prose
Fourth Volume - First Part of 10th Skanda

**Author :** Potana Mahakavi

**Prose Rendering :** Dr. Ekkirala Krishnamacharya
Sriman Mudivarthi Kondamacharyulu

**Edited by :** Dr. Jandhyala Papaiah Sastry. "Karuna Sri"



T.T.D Religious Publication Series No. 639-D

**First Edition** : 1987
**Re-prints** : 1998, 2004, 2005, 2008, 2010
**Revised Edition** : 2015

**Copies :** 5,000

**Published by**

**Dr. D.Sambasiva Rao ,** I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati.

**D.T.P**

Sri Asangananda Graphics
Sri Vyasasramam, Yerpedu.
Ph:08578-287528

**Printed at**

## ముందుమాట

బ్రహ్మదేవుని చతుర్ముఖాలనుండి పురాణాలు, తరువాత వేదాలు వినిస్సృతాలైనట్లు తెలుస్తుంది. అందువల్ల పురాణాల అనాదిత్వం పావనత్వం విద్యోతిత మవుతుంది. ఏనాటినుంచో సజీవంగా వెలిగేదే పురాణమంటారు. 'పురాపి నవం పురాణం'- ఎంత పాతదైనా పురాణం సరికొత్తగానే ఉంటుందన్నమాట!

సర్గం, ప్రతిసర్గం, వంశం, మన్వంతరం, వంశానుచరితం - అని పురాణాలు అయిదు లక్షణాలు కలిగి ఉంటాయి. ఈ లక్షణాలతో కూడిన పురాణాలు పద్దెనిమిది. ఉపపురాణాల సంఖ్యకూడా అంతే. ఈ పురాణాలన్నీ వేదవ్యాస మహర్షి విరచితాలే అని ప్రతీతి. ఇవి భిన్న కర్తృకాలు అనే ప్రవాదం కూడా ఉన్నది. ఏమైనా పురాణాలు ప్రాచీన సంస్కృతి సంప్రదాయాలకు ఆదర్శం లాంటివే కాకుండా, పూర్వ రాజవంశాలను గురించికూడ తెలపడంవల్ల ఒక విధంగా చరిత్రగ్రంథాలుగా కూడా ఉపకరిస్తాయి.

కథలద్వారా ప్రజలకు నీతి ధర్మాలు ఉపదేశించడం వీటి పరమాశయంగా కనిపిస్తుంది. భాగవత రచనవల్ల వ్యాసభగవానుడికి మనశ్శాంతి చేకూరిందనడంలో పురాణ ప్రభావం ఏమిటో విదిత మవుతుంది.

అష్టాదశ పురాణాలలో ప్రశస్తి వహించిన శ్రీమద్భాగవతాన్ని బమ్మెరపోతనామాత్యులు తెలుగులోనికి అనువదించి ఆంధ్రలోకానికి మహోపకారం చేశారు. పరమభాగవతోత్తముడైన పోతనగారు తన సహజ పాండిత్యముతో అనితరభక్తితో భాగవతాన్ని రచించారు. మహాతపస్వి పోతరాజుగారి లేఖిని నుండి జాలువారిన కవితా ప్రవంతి ఆంధ్ర జనహృదయ కేదారాలను తడుపుతూ తాపత్రయాన్ని హరిస్తున్నదనడం సత్యం. భాగవతంలోని ప్రతి పద్యం ఎంతో హృద్యం. తెలుగునాట పోతనగారి పద్యం నోటికి రాని పండితుడు గాని, పామరుడుగాని లేడంటే అతిశయోక్తి కాదు.

ఇలా తెలుగునాట ప్రముఖస్థానాన్ని అలంకరించిన ఆంధ్రమహాభాగవతం అక్షరాస్యులందరికీ సులభ గ్రాహ్యం అయ్యేందుకు తి.తి.దేవస్థానంవారు ప్రముఖ విద్వాంసులచేత సులభశైలిలో తాత్పర్యాలు వ్రాయించి, ముద్రించారు.

ప్రధాన సంపాదకులైన డా॥ జంధ్యాల పాపయ్యశాస్త్రి (కరుణశ్రీ) గారికి, ఆయా సంపుటాల తాత్పర్య రచయితలకును మా అభినందనలు. తి.తి.దేవస్థానం వారు ప్రచురించిన పోతన భాగవత సంపుటాల ప్రతులన్నీ చెల్లిపోయినందున పాఠకుల సౌకర్యార్థమై పరిష్కరించి పునర్ముద్రించటం జరిగింది. పాఠకులు యథాపూర్వం ఆదరించగలరు.

శ్రీనివాసుని కృపతో తిరుమల తిరుపతి దేవస్థానంవారు చేస్తున్న ధార్మిక గ్రంథ ప్రచురణలపట్ల తెలుగునాట బహుళామోదం లభిస్తున్నందుకు సంతోషం.

**కార్యనిర్వహణాధికారి,**
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

## సంపాదక మండలి



## అనువాదకులు

డాక్టర్ ఎక్కిరాల కృష్ణమాచార్య - 10 వ స్కంధం - పూర్వభాగం (1-725 పద్యములు)

శ్రీమాన్ ముదివర్తి కొండమాచార్యులు - 10 వ స్కంధం - పూర్వభాగం (726-1791 పద్యములు)

# పోతన భాగవతము

| అనువాదకులు | | స్కంధములు |
|---|---|---|

**మొదటి సంపుటము**

| | | | |
|---|---|---|---|
| 1. | డా॥ జంధ్యాల పాపయ్య శాస్త్రి | --- | ప్రథమ స్కంధము |
| 2. | డా॥ సముద్రాల లక్ష్మణయ్య | --- | ద్వితీయ స్కంధము |
| 3. | డా॥ ఆశావాది ప్రకాశరావు | --- | తృతీయ స్కంధము |

**రెండవ సంపుటము**

| | | | |
|---|---|---|---|
| 4. | శ్రీ శనగన నరసింహస్వామి | --- | చతుర్థ స్కంధము |
| 5. | డా॥ సర్వోత్తమరావు | --- | పంచమ స్కంధము |
| 6. | శ్రీ తలమర్ల కళానిధి | --- | షష్ఠ స్కంధము |

**మూడవ సంపుటము**

| | | | |
|---|---|---|---|
| 7. | శ్రీ జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రి | --- | సప్తమ స్కంధము |
| 8. | శ్రీ జి. చెన్నయ్య | --- | అష్టమ స్కంధము |
| 9. | డా॥ బి. భాస్కర చౌదరి | --- | నవమ స్కంధము |

**నాల్గవ సంపుటము**

| | | | |
|---|---|---|---|
| 10. | డా॥ ఎక్కిరాల కృష్ణమాచార్య | --- | దశమ స్కంధము (పూర్వభాగం 1- 725 పద్యములు) |
| 11. | శ్రీమాన్ ముదివర్తి కొండమాచార్యులు | --- | దశమ స్కంధము (పూర్వభాగం 726 - 1791 పద్యములు) |

**ఐదవ సంపుటము**

| | | | |
|---|---|---|---|
| 12. | డా॥ అమరేంద్ర | --- | దశమస్కంధము - ఉత్తరభాగము ( 1- 535 పద్యములు) |
| 13. | శ్రీ డి. నాగసిద్ధారెడ్డి | --- | దశమస్కంధము - ఉత్తరభాగము (536 - 1342 పద్యములు) |
| 14. | డా॥ ప్రసాదరాయ కులపతి | --- | ఏకాదశ స్కంధము |
| 15. | శ్రీ టి. భాస్కర రావు (స్ఫూర్తిశ్రీ) | --- | ద్వాదశ స్కంధము |

# ప్రవేశిక

**(1 నుండి 725వ పద్యం వరకు)**

రసజ్ఞ పాఠకులకు అభివందనాలు. ఇప్పుడు మనం పోతన భాగవతం దశమస్కంధంలోకి ప్రవేశించాము. భాగవతంలోని అన్నిస్కంధాలూ ఒక ఎత్తు. దశమ స్కంధం ఒక ఎత్తు. దేవాదిదేవుడైన శ్రీకృష్ణభగవానుని దివ్యమంగళ లీలా విలాసాలన్నీ సమగ్రంగా సర్వాంగ సుందరంగా ఈ దశమస్కంధంలోనే అభివర్ణితము లైనాయి. ఇందువల్లనే "శ్రీకృష్ణ సర్వస్వ"మైన భాగవత దశమ స్కంధానికి ఎక్కడలేని ప్రాశస్త్యం, ప్రాముఖ్యం ప్రాప్తించాయి.

శ్రీమన్నారాయణుని దశావతారములు ఈ క్రింది శ్లోకంలో పేర్కొనబడ్డాయి.

**మత్స్యః కూర్మో వరాహశ్చ నారసింహశ్చ వామనః।**
**రామో రామశ్చ రామశ్చ బుద్ధః కలికి రేవ చ ॥**

ఇందులో కృష్ణావతారం చెప్పబడలేదు. దానికి కారణం శ్రీకృష్ణుడు త్రిమూర్తులకు అతీతుడైన వాడనీ, గోలోకవాసియనీ, పరబ్రహ్మ స్వరూపుడనీ, ఆయనే ఈ అవతారాలన్నీ ధరించాడనీ పెద్దల అభిప్రాయం.

గీత గోవిందకర్త జయదేవ మహాకవి ప్రారంభ శ్లోకంలోనే ఇలా వ్రాశాడు.

**వేదా నుద్ధరతే గిరిం కలయతే భూ చక్ర ముద్బిభ్రతే**
**దైత్యం దారయతే బలిం ఛలయతే క్షత్రక్షయం కుర్వతే ।**
**అబ్ధిం లంఘయతే హలం కలయతే కారుణ్య మాతన్వతే**
**మ్లేచ్ఛాన్ మూర్ఛయతే దశాకృతిభృతే కృష్ణాయ తుభ్యం నమః ॥**

ఈ శ్లోకములో కూడా దేవదేవుడైన శ్రీకృష్ణుడే దశావతారములు ధరించాడని శ్రీ కృష్ణుణ్ణే దశావ తారములకు అతీతుడుగా, శ్రీమన్నారాయణ స్వరూపుడుగా అభివర్ణించాడు జయదేవుడు. కృష్ణావతార స్థానంలో "హలం కలయతే"అని బలరాముణ్ణి చెప్పటం గమనించదగ్గ విషయం.

అమరసింహుడు కూడా తన **"నామలింగానుశాసనం"**లో **"విష్ణుర్నారాయణః కృష్ణో వైకుంఠో విష్టరశ్రవాః"** అని విష్ణుదేవుని పర్యాయపదాల్లో కృష్ణశబ్దం చేర్చాడు. బ్రహ్మవైవర్త పురాణం శ్రీకృష్ణుని పరబ్రహ్మ స్వరూపాన్ని నిరూపిస్తున్నది. అందువల్ల విష్ణుదేవుని అవతారాలలో సర్వశ్రేష్ఠమైనదీ, సర్వాంగ సుందరమైనదీ, పరిపూర్ణమైనదీ, దివ్యతేజో విరాజితమైనదీ కృష్ణావతారమని చెప్పవచ్చు.

మహేశ్వర ధ్యానతత్పరుడై అర్ధనిమీలిత నేత్రుడైన పోతన్న గారికి శ్రీరాముడు సాక్షాత్కరించి **"మన్నా మాంకితంబుగా భాగవతంబు తెనుంగు సేయుము"**అని అనుశాసించినప్పటికీ పోతన్నగారు అంకితం పద్యాలు (షష్ఠ్యంతములు) **"హరికి నందగోకుల విహారికి"** ఇత్యాదిగా శ్రీకృష్ణునిపేర రచించటంలో బమ్మెర వారికి కల కృష్ణప్రీతి అభివ్యక్త మవుతున్నది. అందుకనే పోతన్నగారు భాగవతానికి శ్రీకారం చుట్టుతూ ఈ క్రింది పద్యంలో **"మహానందాంగనా డింభకుణ్ణి"** స్మరించి నమస్కరించాడు.

**శ్రీ కైవల్యపదంబుఁ జేరుటకునై చింతించెదన్ లోక ర**
**క్షైకారంభకు భక్తపాలన కళా సంరంభకున్ దాన వో**
**ద్రేక స్తంభకుఁ గేళిలోల విలస ద్దృగ్జాల సంభూత నా**
**నా కంజాతభవాండ కుంభకు మహా నందాంగనా డింభకున్.** **1-1**

ఈ పద్య ప్రసూనంలోని ఆరుదళాలూ ఆయా స్కంధాల్లోని ఆయా కథలను సూచిస్తున్నాయని ఇంతకు ముందే ప్రథమస్కంధంలో ప్రస్తావించి ఉన్నాను. పై పద్యంలోని ఆరవదళమైన "మహానందాంగనా డింభకున్" అన్నది దశమస్కంధాన్నీ, అందలి శ్రీకృష్ణలీలా విశేషాలనూ అభివ్యక్తం చేస్తున్నది. ఆనంద స్వరూపిణి అయిన ఆ నంద గోపుని ఇల్లాలు యశోదమ్మ ఒడిలో అల్లారు ముద్దుగా ఆడుకుంటున్న నల్లనయ్యను ధ్యానిస్తున్నా నన్నాడు పోతన్నగారు. ఆ యశోదా కిశోరుడు సామాన్యుడు కాడు. ఏ మాత్రం ఏమరుపాటు లేకుండా ఎల్ల లోకాలనూ చల్లగా పరిపాలిస్తుంటాడు. ప్రపన్నులైన భక్తుల ప్రార్థనలను ఆలించి లాలిస్తూ ఉంటాడు. నిరంకుశులైన నిశాచరుల ఔద్ధత్యాన్ని నిర్మూలిస్తూ ఉంటాడు. అంతేకాదు. కన్నతల్లి ఒడిలో ఒయ్యారంగా కూర్చున్న ఆ చిన్నికన్నయ్య ఒక్కమాటు అలా కన్నెత్తి చూస్తే చాలు - ఎన్నెన్నో బ్రహ్మాండ భాండాలు ఆ చూపులో రూపులు దిద్దుకుంటాయిట!

శ్రీ కృష్ణసౌందర్యాన్ని సహృదయ హృదయంగమంగా సంస్కృతంలో మహాకవులు వర్ణించారు. శుభాకృతులైన ఆ కృతులలో జయదేవుని "గీత గోవిందం", లీలాశుకుని "శ్రీకృష్ణ కర్ణామృతం", నారాయణ తీర్థులవారి "శ్రీకృష్ణ లీలాతరంగిణి" ప్రధానంగా చెప్పుకోదగ్గవి. ఇక తెలుగులో శ్రీకృష్ణుని లీలావిలాసాలను ఎఱ్ఱన మహాకవి తన హరివంశంలో సుమనో మనోజ్ఞంగా చిత్రించాడు. తరువాత బమ్మెర పోతన్నగారి భాగవత దశమస్కంధం కృష్ణావతార వైభవాన్ని అత్యంత హృదయంగమంగా, అద్వితీయంగా, అనన్య సామాన్యంగా అభివర్ణించింది. ఒక విధంగా చెప్పాలంటే దశమ స్కంధం "మహానందాంగనా డింభకుని లీలా సర్వస్వ"మని భావించవచ్చు. దేవకీ గర్భస్థుడైన భగవంతుని బ్రహ్మాది దేవతలు ఈ విధంగా ప్రార్థిస్తారు.

**ముచ్చిరి యున్నది లోకము, నిచ్చలు కంసాది ఖలులు నిర్దయు లేఁచన్;**
**మచ్చికఁ గావఁగ వలయును, విచ్చేయుము తల్లికడుపు వెడలి ముకుందా!** 10-10

ఆ తరువాత దేవదేవుని దేవకీదేవి ప్రసవించిన శుభ సందర్భంలో

**పాడిరి గంధర్వోత్తము, లాడిరి రంభాది కాంత, లానందమునన్**
**గూడిరి సిద్ధులు, భయములు, వీడిరి చారణులు, మొరసె వేల్పుల భేరుల్.** 10-107

అతి ప్రసన్నుడైన వెన్నుని కన్న దేవకి, పున్నమినాడు షోడశ కళాప్రపూర్ణుడైన చంద్రుని కన్న ప్రాగ్దిశవలె చెలువొందిన దంటారు పోతన్నగారు.

వసుదేవుడు దేవదేవుని ఆజ్ఞానుసారం చిన్నికృష్ణుణ్ణి గోకులంలో ఉన్న నందుని ఇల్లాలు యశోదమ్మ పక్కలో చేరుస్తాడు. యశోద కుమారుణ్ణి కన్నదన్న వార్త గోకులమంతా వ్యాపించింది. అప్పుడు వ్రేపల్లెలోని గోపకాంతలంతా ఎంతో సంతోషంతో చిన్ని కన్నయ్యను చూడటానికి వచ్చారట.

**ఏమి నోము ఫలమొ ఇంత ప్రొద్దొక వార్త, వింటి మబలలార! వీను లలర;**
**మన యశోద చిన్ని మగవానిఁ గనె నఁట; చూచి వత్తమమ్మ! సుదతులార!** 10-184

అనుకుంటూ యశోద ఇంటికి వస్తున్న వ్రజకాంతల ఉత్కంఠను పోతన్నగారు ఈవిధంగా వర్ణించారు.

**వేడుకతోడఁ గ్రొమ్ముడులు వీడఁ గుచోపరిహారరేఖ ల**
**ల్లాడఁ గపోల పాలికల హాటక పత్రరుచుల్ వినోదనం**
**బాడఁ, బటాంచలంబు లసియాడఁగఁ జేరి యశోదయింటికిం**
**జేడియ లేఁగి చూచి రొగి, జిష్ణుని విష్ణునిఁ జిన్ని కృష్ణునిన్.** 10-187

అలా వచ్చిన గోపాంగనలు తెచ్చిన కానుక లిచ్చి, చిన్ని పాపనికి తల అంటి, పసుపు పూసి, స్నానం చేయించారట. నీళ్లు చుట్టు తిప్పి, రక్షపెట్టి, తొట్టెలో ఉంచి జోలపాడారట.

**జోజో కమలదళేక్షణ!, జోజో మృగరాజమధ్య! జోజో కృష్ణా!**
**జోజో పల్లవ కరపద!, జోజో పూర్ణేందువదన! జోజో యనుచున్.** 10-190

గొల్ల యిల్లాండ్రు అలా జోల పాడుతూ ఊపుతూ ఉంటే దొంగనిద్దుర పోతున్న బాలకృష్ణుణ్ణి పోతన్నగారు ఈ విధంగా వర్ణించారు.

**లోకములు నిదుర వోవఁగ, జోకొట్టుచు నిదురవోని సుభగుఁడు, రమణుల్**
**జోకొట్టి పాడ నిదురం, గైకొను క్రియ నూరకుండె, కనుదెఱవకయున్.** 10-193

చిన్నారి నల్లనయ్యకు అప్పు డప్పుడే మాటలు వస్తున్నాయి. "అవ్వా అవ్వా" అంటున్నాడు. అక్కడ పోతన్నగారి కల్పనా శిల్పం ఈ క్రింది కందంలో అందంగా రూపొందింది. చిత్తగించండి -

**అవ్వల నెఱుఁగక మువ్వుర, యవ్వల వెలుఁగొందు పరముఁ, డర్భకుఁడై యా**
**యవ్వలకు సంతసంబుగ, "అవ్వా అవ్వా" యనంగ నల్లన నేర్చెన్.** 10-294

కొన్నాళ్ళకు చిన్ని కృష్ణుడు మెల్ల మెల్లగా అడుగులు వెయ్యటం సాగించాడు. ఇక్కడ పోతన్నగారి భావ చిత్రణం -

**అడుగులు వే గలిగియు, రెం, డడుగులనే మన్ను మిన్ను నలమిన బాలుం,**
**డడుగిడ దొరకొనె, శాత్రవు, లడుగులు సడుగులును వదలి అడుగవనిఁ బడన్.** 10-295

భగవంతుడు సహస్రశీర్షుడు. సహస్రాక్షుడు. సహస్రపాదుడు. వేయి అడుగులు గల ఆ స్వామి రెండడుగులతోనే భూమ్యాకాశాలు ఆక్రమించాడు. అటువంటి దేవదేవుడు బాలకృష్ణుడై నందుని ఇంట్లో అడుగులు వేయసాగాడు. ఆ బుడుతడు అలా అడుగులు వేస్తూ ఉంటే విరోధులైన నిశాచరులు అవయవ సంధులు వీడిపోయి "అడుగవని" అంటే పాతాళంలోకి పడిపోయారట. రెండడుగులతోనే మన్నూ మిన్నూ ఆక్రమించిన వేయిఅడుగులవాడు అడుగులు వేస్తుంటే ఎంత భయమో మరి!

పోతన్నగారు **"పరమేశ్వర కరుణా కలిత కవితా విచిత్రులు"** తండ్రీ, తల్లీ, అక్కగారూ శైవాచార సంపన్నులు. అందువల్లనే పోతన్నగారు అవకాశం వచ్చినపుడల్లా హరిహరుల అభేదాన్ని కావలెనని అభివర్ణిస్తూ ఉంటారు. గ్రంథారంభంలోనే **"చేతులారంగ శివుని పూజింపఁడేని, నోరు నొవ్వంగ హరికీర్తి నుడువఁడేని"** అంటూ తన అద్వైత భావాన్ని వెల్లడించారు. ఇప్పుడు వ్రేపల్లెలో నందుల వారి గుమ్మం ముందు దుమ్ములో ఆడుకుంటున్న బాలకృష్ణుణ్ణి వర్ణించ బోతున్నారు. ఆ నీలకంఠుడికీ, ఈ బాల గోపాలుడికీ అభేదం చెప్పాలని ఆయన సంకల్పం. ఎలా కుదురుతుంది. ఒకరు తెల్లని వారు. మరొకరు నల్లనివారు. అందుకోసం బాలకృష్ణుడి ఒంటినిండా తెల్లనిదుమ్ము కొట్టుకున్నట్లు అందువల్ల నల్లనివాడు తెల్లనివాడుగా మారినట్లు పోతనగారు కల్పించారు. ఈ క్రింది పద్యంలో -

**తనువున నంటిన ధరణీ పరాగంబు పూసిన నెఱభూతి పూఁత గాఁగ**
**ముందఱ వెలుఁగొందు ముక్తా లలామంబు తొగల సంగడికాని తునుక గాఁగ**
**ఫాలభాగంబుపైఁ బరఁగు కావిరిబొట్టు కామునిఁ గెల్చిన కన్ను గాఁగఁ**
**గంఠమాలికలోని ఘన నీల రత్నంబు కమనీయమగు మెడకప్పు గాఁగ**
**హారవల్లు లురగహారవల్లులు గాఁగ, బాలలీలఁ బ్రౌఢబాలకుండు**
**శివుని పగిది నొప్పె శివునికిఁ దనకును, వేఱులేమిఁ దెల్ప వెలయునట్లు.......** 10-297

బాలకృష్ణుడికి ఆ భావం ఉందో లేదో కాని శివుడికీ, కృష్ణుడికీ భేదం లేదని తెల్పాలనే ఉత్సాహం, ఉత్కంఠ సహజ పాండిత్యులవారికి ఉన్నదనటంలో సందేహం లేదు.

గోపకాంత లందరూ వచ్చి శ్రీకృష్ణుని దుడుకు చేష్టలు యశోదమ్మతో చెప్పుతున్నప్పుడు ఏమీ ఎరుగని అమాయకుని వలె తల్లి ఒడిలో తలజేర్చి కూర్చున్న బాలగోపాలుని వాలకాన్ని ఈ పద్యంలో మన కనులకు కట్టించారు పోతనగారు.

**కాంతలు తల్లితోఁ దన వికారము లెల్ల గణింప భీతుఁడై**
**శాంతుని సొంపునం, బరమ సాధుని పెంపున, గోలమాడ్కి, వి**
**భ్రాంతుని కై వడిన్, జడుని భంగిఁ, గుమారకుఁ డూరకుండె నే**
**వింతయు లేక తల్లి కుచ వేదిక నొదల మోపి యాడుచున్.** 10-334

తన బిడ్డపై నేరాలు మోపిన గోపికలను బుజ్జగించి పంపడంలో యశోద మాటనేర్పు చిత్తగించండి-

**అన్య మెఱుగఁడు తనయంత నాడుచుండు, మంచివాఁ డీతఁ డెగ్గులు మానరమ్మ!**
**రామలార! త్రిలోకాభిరామలార! తల్లులార! గుణవతీమతల్లులార!** 10-332

పెరుగు తరుస్తున్న యశోదమ్మ సహజ స్వరూపాన్ని పోతన్నగారు ఎంత చక్కగా వర్ణించాడో చూడండి-

**కరకమలారుణకాంతి గవ్వఁపుఁద్రాడు పవడంపు నునుఁదీవ పగిది మెఱయఁ**
**గ్రమముతో రజ్జు నాకర్షింపఁ బాలిండ్లు వీడ్వడి యొండొంటి వీఁక నొత్తఁ**

గుచకుంభముల మీఁది కొంగు జాఱఁగఁ జిక్కువడుచు హారావళి బయలుపడఁగఁ
బొడమిన చెమటతోఁ బొల్పారు నెమ్మోము మంచుపైఁ బడిన పద్మంబుఁ దెగడఁ
గౌను గునియంగఁ గంకణక్వణన మెసఁగఁ,దుఱుము బిగివీడఁ గర్ణికాద్యుతులు మెఱయ
బాలు నంకించి పాడుచుఁ బాటఁబాట, తరువు లిగురొత్త పెరుఁగింతి దరువఁ జొచ్చె. 10-355

దధిభాండాన్ని బద్దలు చేసిన తుంటరి కృష్ణుణ్ణి వెంట నంటి దండించాలని బెత్తం పట్టుకొని పరుగెత్తుతున్న యశోదను చూచి భయంతో పారిపోతున్న వెన్నదొంగ స్వరూపాన్ని పోతన్నగారు ఈ సీసంలో పోతపోశారు.

స్తంభాదికంబులు తనకు నడ్డంబైన నిట్టట్టు సని పట్టనీని వాని
ఈ తప్పు సైరింపు మింక దొంగిలఁ బోవ నే నని మునుముట్ట నేడ్చువానిఁ
గాటుక నెఱయంగఁ గన్నీరు నులుముచు వెడలు కన్నీటితో వెగచు వాని
ఏ దెస వచ్చునో యిది యని పలుమాఱు సురుగుచుఁ గ్రేగంటఁ జూచువానిఁ
గూడుఁ బాఱి పట్టుకొని వెఱపించుచుఁ, జిన్ని వెన్నదొంగ చిక్కె ననుచు
నలిగి కొట్టఁ జేతులాడక పూఁబోఁడి, కరుణతోడ బాలుఁ గట్టఁదలఁచి. 10-372

అల్లరి కృష్ణుణ్ణి పట్టుకొని బంధింపబోతూ యశోద ఇలా అంటుంది -

వీరెవ్వరు శ్రీకృష్ణులు, గారా! ఎన్నడును వెన్నఁ గానరఁట గదా!
చోరత్వం బించుకయును, నేర రఁట! ధరిత్రి నిట్టి నియతులు గలరే! 10-374

ఇలా ఎత్తి పొడుస్తూ బాలకృష్ణుణ్ణి రోటికి కట్టివేస్తుంది యశోద. అక్కడ ఒక చక్కని కందం వ్రాశారు పోతన్నగారు.

చిక్కఁడు సిరికౌఁగిటిలోఁ, జిక్కఁడు సనకాది యోగిచిత్తాబ్జములన్
జిక్కఁడు శ్రుతి లతికావళిఁ, జిక్కె నతఁడు లీలఁ దల్లిచేతన్ ఱోలన్. 10-383

బాలగోపాలుడు గోపాలబాలురతో కలిసి క్రేపులను కాయటం పోతన్నగారు చాలా హృదయంగమంగా వర్ణించారు. అందులోనూ గొల్లపిల్లలతోకూడి చల్ది లారగించటం కన్నులకు కట్టేటట్లు చిత్రించారు.

మాటిమాటికి వ్రేలు మడిచి యూరించుచు నూరుఁగాయలు దినుచుండు నొక్కఁ;
డొకని కంచములోని దొడిసి చయ్యన మ్రింగి చూడు లేదని నోరు చూపు నొక్కఁ;
డేగు రార్గురిచల్ది లెలమిఁ బన్నిదమాడి కూర్కొని కూర్కొని కుడుచు నొక్కఁ;
డిన్నియుఁ దగఁబంచి యిడుట నెచ్చెలితన మనుచు బంతెనగుండులాడు నొకఁడు;
కృష్ణుఁ జూడు మనుచుఁ గికురించి పరుమ్రోల, మేలి భక్ష్యరాశి మెసఁగు నొకఁడు;
నవ్వు నొకఁడు; సఖుల నవ్వించు నొక్కఁడు; ముచ్చటాడు నొకఁడు; మురియు నొకఁడు.10-496

సంగడీల నడుమ చక్కగా కూర్చుండి ఛలోక్తులు విసురుతూ యాగభోక్త అయిన భగవానుడు బాలకృష్ణుడై చల్దిముద్దలు తినటం ఎంత అద్భుతమైన విషయం! అటువంటి దేవాదిదేవునితో కలసి కూర్చుండి ఆడుతూ పాడుతూ చల్దులు ఆరగిస్తున్న గోపబాలకులు ఎంత అదృష్టవంతులో అంటారు పోతన్నగారు.

**ఎన్నఁడునైన యోగివిభు లెవ్వని పాదపరాగ మింతయున్**
**గన్నులఁగాన; రట్టి హరిఁ గౌఁగిటఁ జేర్చుచుఁ జెట్టఁబట్టుచున్**
**దన్నుచు గ్రుద్దుచున్ నగుచుఁ దద్దయుఁ బైపడి కూడియాడుచున్**
**మన్ననసేయు వల్లవ కుమారుల భాగ్యము లింత యొప్పునే!** 10-461

ఇదే సందర్భంలో బాలకృష్ణుని ప్రభావాన్ని పరీక్షింపబోయి ఓటువడిన బ్రహ్మదేవుడు ఈ విధంగా పలుకుతాడు కృష్ణునితో.

**ఏలా బ్రహ్మపదంబు? వేదములకు న్వీక్షింపఁగా రాని ని**
**న్నీ లోకంబున నీ వనాంతరమునం దీ మందలోఁ గృష్ణ యం**
**చాలాపాది సమస్త భావములు నీ యందే సమర్పించు నీ**
**వ్రేలం దొక్కని పాదరేణువులు పై వేష్టించినం జాలదే!** 10-572

తిరుమల తిరుపతి దేవస్థానంవారు బమ్మెరపోతన్నగారి భాగవతాన్ని ప్రతిపద్య భావార్థసహితంగా ప్రకటించాలని సంకల్పించటం ఆంధ్రులందరికీ ఆనందకరమైన విషయం. ఈ సందర్భాన్ని పురస్కరించు కొని అనువాదభాగా లన్నింటినీ పరిశీలించి పరిష్కరించి ఏక సూత్రత కల్పించే కార్యం నాకు అప్పగించినందుకు టి.టి.డి. కార్య నిర్వహణాధికారి శ్రీ ఎం. వి. ఎస్. ప్రసాద్, ఐ. ఏ.యస్ గారికీ, ఎడిటర్ శ్రీ కె. సుబ్బారావు, ఎం. ఏ., గారికీ, డాక్టర్. రావుల సూర్యనారాయణ మూర్తి, పి. ఆర్. ఓ. గారికీ నా సాధు వాదాలు.

పోతన్నగారు రచించిన ఈ భాగవత దశమస్కంధం **3** వేల పద్యాలకు పై చిలుకుగా ఉన్నది. ఈ దశమస్కంధ పూర్వభాగంలో **1** నుండి **725**వ పద్యం వరకు సరళ గద్యంలో అనువదించినవారు డాక్టర్. ఎక్కిరాల కృష్ణమాచార్యులవారు. ఎక్కిరాలవారు సంస్కృతాంధ్రములలో అందెవేసిన చేయి. ప్రముఖ కవి, ఆధ్యాత్మిక తత్త్వవేత్త. విశేషించి శ్రీకృష్ణభక్తిరస పరిపూర్ణములైన అనేక కృతులు వెలువరించినవారు. వీరి అనువాదం సర్వాంగసుందరమై, సరళమై, సహృదయ హృదయాహ్లాదాన్ని సంపాదించుకున్నది.

ఈ సంపుటాన్ని ముచ్చటగా ముద్రించి ఇచ్చిన దేవస్థానం ప్రెస్ మేనేజర్ శ్రీ ఎం. విజయకుమార్ రెడ్డిగారికి, వారి సిబ్బందికి నా శుభాకాంక్షలు. అక్షరదోషాలు దొర్లకుండా సహస్రాక్షులై ప్రూఫులు సరిదిద్దిన పూజ్య మిత్రులు, మహాకవులు శ్రీమాన్ ముదివర్తి కొండమాచార్యులవారికి నా ధన్యవాదాలు. ముద్రణకు తగినట్లు ప్రెస్ కాపీ సిద్ధంచేసి ఇచ్చిన చిరంజీవి కోరాడ రామకృష్ణ, ఎం.ఏ., ఎం.ఫిల్., కు నా ఆశీర్వాదాలు.

భవదీయుడు

గుంటూరు, ***కరుణశ్రీ***

ప్రమోద-శ్రావణము ప్రధాన సంపాదకుడు

పోతన భాగవతము

# ప్రవేశిక

**(726నుండి - 1791వ పద్యం వరకు)**

'భాగవతం భాగవతం' అని పదిమార్లు అంటే చాలు మనమంతా బా గవతాం' అన్నాట్ట వెనకటికి ఒక పెద్దాయన. అంటే చదువుకున్న పండితులలోనే కాకుండా చదువురాని సామాన్యప్రజలలో కూడా భాగవతం అంటే ఎంతటి గౌరవం ఉన్నదో మనం ఊహించుకోవచ్చు.

అంతేకాదు. అష్టాదశ మహాపురాణాలలో కూడా శ్రీమద్భాగవతానికి ఒక విశిష్టస్థానం ఉన్నది. శ్రీమన్నారాయణుని ఏకవింశతి అవతారాలూ భాగవతంలో అభివర్ణింపబడినాయి. అంతేకాకుండా విశేషించి శ్రీకృష్ణావతారం సమగ్రంగా సర్వాంగసుందరంగా సహృదయ హృదయంగమంగా చిత్రీకృతమైంది.

భగవంతుని లీలలతోనూ, భగవద్భక్తుల చరిత్రలతోనూ నిండి భక్తి జ్ఞానవైరాగ్య సంభరితమై ఉండటం కూడా భాగవతానికి ఎక్కడలేని ప్రశస్తి తెచ్చిపెట్టింది. అందుకనే అది శ్రీమద్భాగవతంగా విరాజిల్లింది.

ఇంకా చెప్పాలంటే తక్కిన పురాణాల్లోకంటే భాగవతంలో వ్యాసులవారి రచన రమ్యమై ప్రౌఢగంభీరమై విలసిల్లింది.

పద్మపురాణంలో శ్రీమద్భాగవతం సాక్షాత్తుగా భగవత్స్వరూపమని నిరూపింపబడింది.

**తమాదిదేవం కరుణానిధానం, తమాలవర్ణం సుహితావతారమ్ ।**
**అపారసంసార సముద్రసేతుం, భజమహే భాగవతస్వరూపమ్ ॥**

భాగవతం భగవంతుని స్వరూపంగా చెప్పటం గమనించదగింది. భాగవతంలో ఉన్న పంద్రెండు స్కంధాలనూ భగవంతుని అవయవములుగా పేర్కొనడం జరిగింది. చిత్తగించండి-

**ప్రథమశ్చ ద్వితీయశ్చ చరణౌ ద్వౌ ప్రకీర్తితౌ ।**
**తృతీయశ్చ చతుర్థశ్చ ద్వావూరూ సముదీరితౌ ॥**
**పంచమో నాభిదేశశ్చ షష్ఠో హృదయ ముచ్యతే ।**
**సప్తమ శ్చాష్టమశ్చైవ బాహూ ద్వౌ పరికీర్తితౌ ॥**
**నవమః కంఠదేశః స్యాత్ దశమో ముఖమేవ చ ।**
**ఏకాదశో లలాటం చ ద్వాదశస్తు శిఖోచ్యతే ।**
**ఏవం సర్వం భాగవతం శ్రీహరేరంగ ముచ్యతే ॥**

భాగవతంలోని ప్రథమ ద్వితీయస్కంధాలు భగవంతుని చరణాలనీ, తృతీయ చతుర్థస్కంధాలు ఊరువులనీ, పంచమ స్కంధం నాభిప్రదేశమనీ, షష్ఠస్కంధం హృదయమనీ, సప్తమ అష్టమస్కంధాలు బాహువులనీ,

నవమస్కంధం కంఠమనీ, దశమస్కంధం ముఖమనీ, ఏకాదశం లలాటమనీ, ద్వాదశం శిఖ అనీ వివరింపబడింది. ఇందులో దశమస్కంధం భగవంతుని ముఖమనీ చెప్పడంవల్ల దాని ప్రాధాన్యం ఎంతటిదో అభివ్యక్త మవుతున్నది.

దశావతారాలలో శ్రీకృష్ణావతారానికి ఒక ప్రత్యేక ప్రాధాన్యం ఉన్నట్లే భాగవతంలోని పన్నెండు స్కంధాలలోను దశమస్కంధానికి ఒక విశిష్టస్థానం ఉన్నది. సమగ్రంగా సర్వాంగసుందరంగా శ్రీకృష్ణచరిత్రం అభివర్ణింపబడిన దశమస్కంధం "శ్రీకృష్ణ లీలాసర్వస్వం'' అనటంలో అతిశయోక్తి అణుమాత్రం లేదు.

**"శ్రీ కైవల్యపదంబు చేరుటకునై చింతించెదన్''** అంటూ పోతన్న గారు భాగవత ప్రారంభంలో సంస్మరించిన **"మహానందాంగనాడింభకుని''** లీలావిలాసాలన్నీ ఈ దశమ స్కంధంలోనే చోటు చేసుకున్నాయి.

**"శ్రీకంఠ చాపఖండన! పాకారిప్రముఖ వినుత భండన! విలసత్**
**కాకుత్థ్సవంశ మండన! రాకేందు యశోవిశాల! రామనృపాలా!"**

బాల బాలికలకు బాగా పరిచయమైన ఈ పద్యం దశమస్కంధారంభంలోనిదే.

వరాహావతారం తృతీయ స్కంధంలోను, నరసింహావతారం సప్తమ స్కంధంలోనూ, మత్స్య కూర్మ వామనావతారాలు అష్టమస్కంధంలోను, పరశురామ శ్రీరామావతారాలు నవమస్కంధంలోను అభివర్ణితాలు కాగా శ్రీకృష్ణావతారానికి దశమస్కంధం సంపూర్ణంగా, సర్వతో ముఖంగా ప్రాతినిధ్యం వహిస్తున్నది.

ఆంధ్రదేశంలో ఆబాల గోపాలానికీ అత్యంతం అభిమాన పాత్రాలైన-

**"నల్లనివాడు పద్మనయనంబులవాడు....."**
**"ఓయమ్మ! నీ కుమారుఁడు మా యిండ్లను పాలు పెరుగు....."**
**"నీ పాదకమల సేవయు నీ పాదార్చకులతోడి నెయ్యము....."**
**"ఏమి నోము ఫలమొ ఇంత ప్రొద్దొకవార్త....."**
**"తనువున నంటిన ధరణీ పరాగంబు....."**
**"అమ్మా! మన్ను దినంగ నే శిశువనో ఆఁకొంటినో!....."**
**"చిక్కఁడు సిరి కౌఁగిటిలో....."**
**"వీరెవ్వరు శ్రీకృష్ణులు గారా?...."**
**"కలయో! వైష్ణవమాయయో! ఇతర సంకల్పార్థమో!....."**
**"బాలుం డీతఁడు కొండ దొడ్డది మహాభారంబు....."**
**"మామా వలువలు ముట్టకు మామా! కొనిపోకు పోకు....."**

**"ఇంతుల్ తోయము లాడచుండ మగవా రేతెంతురే!....."**

**"శ్రీయుతమూర్తి! యో పురుషసింహమ!....."**

**"ఘనుఁ డా భూసురుఁ డేగెనో! నడుమ మార్గశ్రాంతుఁడై చిక్కెనో!....."**

**"లగ్నం బెల్లి వివాహముం గదిసె....."**

**"ఆ యెలనాగ నీకుఁ దగు అంగనకున్ దగుదీవు....."**

**"లేమా! దనుజుల గెలువఁగ లేమా?....."**

**"ఊరకరారు మహాత్ములు....."**

**"వీఁడటే రక్కసి విగతజీవగ....."**

ఇత్యాది పద్యరత్నాలన్నీ ఈ మంజుల మంజూషలోనివే.

భాగవతంలోని పన్నెండు స్కంధాలలో దశమస్కంధం చాలా పెద్దది. ఇందులో సుమారు 3140 గద్య పద్యాలు ఉన్నాయి.

ఈ సంపుటంలో శ్రీకృష్ణజననం, పూతనాహరణం, శకటాసుర భంజనం, తృణావర్తనిరాసనం, బలరామకృష్ణుల బాల్యక్రీడలు, మృద్భక్షణం, విశ్వరూప సందర్శనం, ఉలూఖలబంధనం, యమళార్జున భంజనం, బృందావనాగమనం, వత్సాసుర బకాసుర వధ, చల్ది భోజనములు, బ్రహ్మదేవుని పరీక్ష, ధేనుకా సుర సంహారం, కాళియ మర్దనం మొదలైన కథలు మీరు చదివే ఉన్నారు.

ఇప్పుడు మీరు ప్రలంబాసుర వధ, దావాగ్ని దమనం, గోపికావస్త్రాపహరణం, గోవర్ధనోద్ధరణం, శర ద్రాత్రిలో వేణుగానం, గోపికాగీతలు, రాసక్రీడలు, కేశివ్యోమాసుర సంహారం, అక్రూరాగమనం, మథురా నగర ప్రవేశం, రజక గర్వభంజనం, సుదాముని వృత్తాంతం. కువలయాపీడ మర్దనం, చాణూర ముష్టికవధ, కంససంహారం, దేవకీ వసుదేవుల కారాగృహ విమోచనం, ఉగ్రసేనుని పట్టాభిషేకం, రామకృష్ణుల విద్యాభ్యాసం, భ్రమరగీతలు, జరాసంధ దురాక్రమణం, కాలయవన సంహారం, ముచుకుందుని వృత్తాంతం, రుక్మిణీ కల్యాణం- అనే కథాఘట్టాలు సుమనోమనోజ్ఞంగా అభివర్ణితమైనాయి.

దావాగ్ని చుట్టుముట్టిన వ్రజవాసులు శ్రీకృష్ణుణ్ణి ఇలా ప్రార్థిస్తారు.

**నీ చుట్టాలకు నాపదల్ గలుగునే నే మెల్ల నీవార, మ**
**న్యాచారంబు లెఱుంగ మీశుఁడవు మా; కాభీలదావాగ్ని నేఁ**
**డే చందంబున నింక దాఁటుదుము? మ మ్మీక్షించి రక్షింప వ**
**న్నా! చంద్రాభ! విపన్నులన్ శిఖివితానచ్ఛన్నులన్ ఖిన్నులన్.** 10-745

కోకలు కొనిపోతున్న కొంటెగోపాలుని గోపికలు వేడుకుంటున్నారు.

**మామా వలువలు ముట్టకు, మామా కొనిపోకు పోకు మన్నింపు తగన్**
**మా మాన మేల కొనియెదు, మా మానసహరణ మేల మానుము కృష్ణా!** 10-820

కట్టుబట్టలు అపహరించి చెట్టెక్కి కూర్చున్న నల్లనయ్యతో వల్లవాంగనలు ఇలా అంటారు-

**ఇంతుల్ తోయము లాడుచుండ మగవా రేతెంతురే! వచ్చిరా**
**యింతల్ సేయుదురే కృపారహితులై యేలోక మందైన; నీ**
**వింతల్ నీతలఁ బుట్టెఁగాక మఱియే వీ కృష్ణ! యో చెల్ల! నీ**
**చెంతన్ దాసులమై చరించెదము మా చేలంబు లిప్పింపవే!** 10-829

ఇక్కడ "ఇంతల్ సేయుదురే" అన్నదానిలో ఎంత కవిత్వం ఉన్నదో!

గోవర్ధనపర్వతాన్ని గొడుగుగా పై కెత్తి పట్టిన గోపాల కృష్ణుడు గోప గోపీజనులను భయపడవద్దని హెచ్చరిస్తూ ఇలా పలుకుతాడు.

**బాలుం డీతఁడు కొండ దొడ్డది మహా భారంబు సైరింపఁగాఁ**
**జాలండో యని దీనిక్రింద నిలువన్ శంకింపఁగాఁ బోల; దీ**
**శైలాంభోనిధి జంతు సంయుత ధరా చక్రంబు పైఁబడ్డ నా**
**కే లల్లాడదు బంధులార! నిలుఁ డీ క్రిందన్ బ్రమోదంబునన్.** 10-917

బృందావనంలో అంతర్హితుడైన నందనందనుణ్ణి అన్వేషిస్తున్న వ్రజసుందరుల ఆందోళన, ఆవేదన-ఈక్రింది పద్యాలలో సందర్శించవచ్చు-

**"పున్నాగ! కానవే పున్నాగ వందితు తిలకంబ! కానవే తిలకనిటలు**
**ఘనసార! కానవే ఘనసారశోభితు బంధూక! కానవే బంధుమిత్రు**
**మన్మథ! కానవే మన్మథాకారుని వంశంబ! కానవే వంశధరుని**
**చందన! కానవే చందనశీతలు కుందంబ! కానవే కుందరదను......."** 10-1009

**"అదె నందనందనుం డంతర్హితుం డయ్యెఁ బాటలీతరులార! పట్టరమ్మ!**
**హేలావతుల కృష్ణ! యేల పాసితి వని యైలేయలతలార! యడుగ రమ్మ!**
**వనజాక్షుఁ డిచటికి వచ్చి దాగఁడు గదా చూతమంజరులార! చూడరమ్మ!**
**మానినీమదనుతో మా రాక యెఱిఁగించి మాధవీలతలార! మనుప రమ్మ!....."** 10-1014

**"హరిచరణములకుఁ బ్రియవై, హరి నిను మన్నింప భద్ర మందెడు తులసీ!**
**హరి నీ దెసరాఁడు గదా, హరిచొ ప్పెఱిఁగించి శుభము లందింపఁగదే!"** 10-1015

ఇదే సందర్భంలో కలువపూల సుగంధాలు వెలువరించుచున్న రెండు పద్యాలు-

నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు కృపారసంబు పైఁ
జల్లెడు వాఁడు మౌళిపరిసర్పిత పింఛమువాఁడు నవ్వు రా
జిల్లెడు మోమువాఁ డొకఁడు చెల్వల మానధనంబుఁ దెచ్చె నో
మల్లియలార! మీ పొదల మాటున లేఁడు గదమ్మ! చెప్పరే! 10-1011

అంగజునైనఁ జూడ హృదయంగముఁడై కరఁగించువాఁడు శ్రీ
రంగదురంబువాఁడు మధురంబగు వేణురవంబువాఁడు మ
మ్మంగజు పువ్వుఁదూపులకు నగ్గము చేసి లవంగ లుంగ నా
రంగములార! మీకడకు రాఁడు గదా! కృప నున్నఁ జూపరే! 10-1012

ఈ విధంగా చెట్టు చెట్టునూ ప్రశ్నిస్తూ యదుకులతిలకుని వెదకుతున్న గోపికలకు "హల కులిశ కలశాంకుశాది శుభలక్షణ లక్షితము"లైన కృష్ణుని పదచిహ్నాలు కన్పిస్తాయి. గోపాంగనలు గోపాలదేవుని చరణాలు గుర్తించారు. ఈ చరణాల గుర్తింపులో సహజ పాండిత్యుని సహజపాండిత్యాన్ని మనం గుర్తిస్తాము-

ఒక యెలనాఁగ చేయూఁదినాఁ డిక్కడ సరస నున్నవి నాల్గు చరణములును
ఒక నీలవేణితో నొదిగినాఁ డిక్కడ మగజాడలో నిదె మగువజాడ
ఒక లేమ మ్రొక్కిన నొడిసినాఁ డిక్కడ రమణి మ్రొక్కిన చొప్పు రమ్య మయ్యె
ఒక యింతి కెదురుగా నొలసినాఁ డిక్కడ నన్యోన్యముఖములై యంఘ్రు లొప్పె

ఒకతె వెంటఁదగుల నుండక యేగినాఁ, డడుగు మీఁదఁ దరుణి యడుగు లమరె
అబల లిరుగెలంకులందు రాఁ దిరిగినాఁ, డాఋపదము లున్న వమ్మ యిచట!! **10-1029**

ఇచ్చటి "గోపికాగీత" లలో గోపసుందరుల సుకుమారహృదయం గోచరిస్తుంది-

నీ వడవిం బగల్ దిరుగ నీకుటిలాలక లాలితాస్య మి
చ్ఛావిధిఁ జూడకున్న నిమిషంబులు మాకు యుగంబులై చనున్
గావున రాత్రులైన నినుఁ గన్నుల నెప్పుడుఁ జూడకుండ ల
క్ష్మీవర! ఱెప్ప లడ్డముగఁ జేసె నిదేల విధాత క్రూరుఁడై? **10-1051**

ఒక శరద్రాత్రి చల్లనివేళ తెల్లని వెన్నెలలో నల్లనయ్య పిల్లన గ్రోవిమీద బ్రహ్మ గాంధర్వ గీతాన్ని ప్రసరింప జేశాడు. ఆ మురళీధరుని మోహనమూర్తిని దర్శించండి-

కర్ణావతంసిత కర్ణికారప్రభ గండభాగద్యుతి గడలుకొనఁగ
భువనమోహనమైన భ్రూవిలాసంబుతో వామభాగానతవదన మొప్ప

**అపసవ్యకర మృదులాంగుళీచాతురి షడ్జధ్వనికి మర్మసరణిఁ జూప**
**డాకాలిమీఁద నడ్డము సాఁచి నిల్పిన పదనఖద్యుతి భూమిఁ బ్రబ్బికొనఁగ**

**మౌళిపింఛము కంఠదామమున మెఱయ, విలసితగ్రామముగ నొక్క వేణువందు**
**బ్రహ్మగాంధర్వగీతంబు పరఁగఁజేసెఁ, జతురనటమూర్తి గోపాలచక్రవర్తి.** 10-769

వేణుగానం వీనుల సోకగానే వ్రేపల్లెలోని గోపికలందరూ బృందావనానికి పరువెత్తుకొని వచ్చారు. వంశీధరుని గానమాధుర్యానికి మైమరచారు. ఒక గోపిక యదుకుమారుని పెదవులక్రింద కదలుతున్న మురళి అదృష్టానికి అసూయపడి అంటుంది-

**ఒనరన్ వ్రేతల కించుకేనియును లేకుండంగ గోపాల కృ**
**ష్ణుని కెమ్మోవి సుధారసంబుఁ గొనుచుం జోద్యంబుగా మ్రోయుచున్**
**దన పర్వంబులు నేత్రపర్వములుగా దర్పించెఁ బూర్వంబునన్**
**వనితా! యెట్టి తపంబుసేసె నొకొ యీ వంశంబు వంశంబులోన్.** 10-779

ఇంకొక గోపిక తాను మురళిగా పుట్టి ఉంటే ఎంత బాగుండేది, అటువంటి అదృష్టం తనకు లభించ లేదని వాపోతుంది. క్రిందటి జన్మలో తన పొరపాటుకు బాధపడుతుంది-

**నా మోసంబున కెద్దిమేర వినవే నా పూర్వజన్మంబునన్**
**లేమా! నోముల నోముచో నకట! కాళిందీ తటిన్ వేణువై**
**భూమిం బుట్టెద నంచుఁ గోరఁ దగదే; బోధిల్లి యట్లైన నీ**
**బామం దిప్పుడు మాధవాధర సుధా పానంబు గల్గుం గదే!** 10-782

మరొక గోపిక వేణుగాన శ్రవణంతో పరవశించిన పక్షులను వీక్షించి పలుకుతుంది. ఈ సందర్భంలో వ్యాసభాగవతంలోని శ్లోక మిది-

**ప్రాయో బతాంబ విహగా మునయో వనేఽస్మిన్**
**కృష్ణేక్షితం తదుదితం కలవేణుగీతమ్ ।**
**ఆరుహ్య యే ద్రుమభుజాన్ రుచిరప్రవాళాన్**
**శృణ్వంతి మీలితదృశో విగతాన్యవాచః ॥**

పక్షులు పారవశ్యంలో కన్నులు మూసుకున్నాయన్న శ్లోకభావాన్ని తమ హృదయాలలో ఉన్న కృష్ణుని రూపం వెలుపలికి పోకుండా అడ్డుపెడుతున్నట్లు కనులు మూసుకున్నాయని పోతన్నగారు చమత్కరించారు-

**జగతీజంబుల శాఖ లెక్కి మురళీ శబ్దామృతస్యందమున్**
**మిగులన్ వీనులఁ ద్రావి వ్రేగుపడి నెమ్మిం గృష్ణురూపంబు చి**

**త్తగమై యుండఁగ నడ్డపెట్టుక్రియ నేత్రంబుల్ దగన్ మూసి యీ**

**ఖగముల్ సొక్కెడిఁ జూచితే మునిజనాకారంబులన్ గామినీ!** 10-790

శ్రీకృష్ణుని ముఖంలోనుంచి వెలువడుతున్న వేణుగాన సుధారసాన్ని ఆవులు నిక్కించిన చెవులతో త్రాగుతున్నాయనీ, ఆవుదూడలు పాలుత్రాగడం మాని ఆనందబాష్పాలతో ఆ నందనందనుణ్ణి సందర్శిస్తూ ఉన్నవనీ వ్యాసులవారు సంస్కృత భాగవతంలో ఇలా అభివర్ణించారు-

**గావశ్చ కృష్ణముఖ నిర్గత వేణుగీత, పీయూష ముత్తభిత కర్ణపుటైః పిబంత్యః ।**

**శాబాః స్తనస్నుతపయః కబలాః స్మ తస్థుః, గోవింద మాత్మని దృశాశ్రుకలాః స్పృశంత్యః ॥**

ఒకే శ్లోకంలో ఉన్న భావాన్ని పోతన్నగారు చక్కగా ప్రస్తరించి విస్తరించి రెండు పద్యాలలో సుమనో మనోజ్ఞంగా వర్ణించారు. ముందుగా ఆవుల ఆనంద తన్మయత్వం-

**మమతన్ మోములు మీఁది కెత్తుకొని రోమంథంబు సాలించి హృ**

**త్కమలాగ్రంబులఁ గృష్ణు నిల్పి, మురళీ గానామృతశ్రేణి క**

**ర్ణములం గ్రోలుచు మేఁత మాని గళితానందాశ్రులై చిత్రితో**

**పమలై గోవులు చూచుచున్న వవిగో పద్మాక్షి! వీక్షించితే!** 10-789

అనంతరం ఆవుదూడల సంతోష పారవశ్యం ఎంత హృదయంగమంగా చిత్రించారో చిత్తగించండి-

**తల్లుల చన్నుఁబాలు మును ద్రావుతటిన్ దమకర్ణ వీథులన్**

**వల్లభమైన మాధవుని వంశరవామృతధార సొచ్చినన్**

**ద్రుళ్ళక పాలురాఁ దివక దూఁటక మానక కృష్ణుమీఁద దృ**

**గ్వల్లులు సేర్చి నిల్చె నదె వత్సము లంగనలార కంటిరే!** 10-788

నెమరు వేయటం మాని చూస్తున్న గోవులూ, పాలుత్రాగటం మాని చూస్తున్న గోవత్సాలూ.....

కంసుని పంపున అక్రూరుడు బలరామకృష్ణులను తీసికొని పోవటానికి గోకులానికి వస్తాడు. పూర్వజన్మలో ఎంత పుణ్యం చేశానో ఇప్పుడు కృష్ణుణ్ణి దర్శించే భాగ్యం కలిగింది అనుకుంటాడు. దీని మూలశ్లోకం ఇది-

**కిం మయాచరితం భద్రం కిం తప్తం పరమం తపః ।**

**కిం వాథాప్యర్హతే దత్తం యద్ద్రక్ష్యామ్యద్య కేశవమ్ ॥**

దీనిని పోతన్నగారు "నా యట్టి వివేకహీనునకు" అని అక్రూరుని అల్పత్వాన్నీ "మహామునీంద్రుల యోగదృష్టికి సైతం పట్టువడని పరమేశ్వరుని" అని శ్రీకృష్ణుని మహత్త్వాన్నీ ఇలా అభివ్యక్తం చేశాడు-

**ఎట్టి తపంబు సేయఁబడె నెట్టి చరిత్రము లబ్ధ మయ్యెనో**
**యెట్టి ధనంబు లర్థులకు నీఁబడెనో తొలిబామునందు నా**
**యట్టి వివేకహీనునకు నాదిమునీంద్రులు యోగదృష్టులం**
**బట్టఁగ లేని యీశ్వరుని బ్రహ్మమయున్ హరిఁ జూడఁ గల్గెడిన్.** 10-1189

మథురనుంచి తన్ను తీసుకొని పోవటానికి వచ్చిన అక్రూరుణ్ణి గోపాలుడు కుశలప్రశ్న వేసిన తీరు మూలంలో ఇలా ఉన్నది-

**తాత సౌమ్యాగతః కంసాత్ స్వాగతం భద్రమస్తు వః ।**
**అపి స్వజ్ఞాతి బంధూనా మనమీవ మనామయమ్? ॥**

దీనికి పోతన్నగారు తెలుగు పూతపూసి ఎంత చక్కని పద్యం వ్రాశారో తిలకించండి-

**శుభమే నీకుఁ? బ్రమోదమే సఖులకున్? జుట్టాలకున్ సేమమే?**
**యభయంబే ప్రజకెల్ల? గోత్రజుల కాత్మానందమే? మామ ము**
**క్త భయుండే? వసుదేవదేవకులు తత్ కారాగృహంబందు మత్**
**ప్రభవవ్యాజ నిబద్ధులై బ్రదికిరే ప్రాణానిలోపేతులై?** 10-1206

కృష్ణుణ్ణి మథురకు తీసుకొనివెళ్ళటానికి అక్రూరుడు వచ్చాడని తెలుసుకున్న గోపికలు ఇటువంటి దుర్ఘటన ఘటింపజేసిన విధిని క్రూరుడని నిందిస్తారు మూలంలో-

**క్రూర స్త్వమక్రూర సమాఖ్యయా స్మ న, శ్చక్షుర్హి దత్తం హరసే బతాజ్ఞవత్ ।**
**యేనైకదేశేఽఖిలసర్గ సౌష్ఠవం, త్వదీయ మద్రాక్ష్మ వయం మధుద్విషః ॥**

పోతన్నగారి గోపికలు బ్రహ్మదేవుణ్ణి విడిచిపెట్టి అక్రూరుణ్ణి ఆడిపోసుకుంటారు. ఇతడు అక్రూరుడు కాడు, క్రూరు డంటారు. అందుకే ఇలా వచ్చాడు అంటారు.

**అక్రూరుండని పేరు పెట్టుకొని నేఁ డస్మన్మనోవల్లభుం**
**జక్రిన్ మాకడఁ బాపికొంచు నరుగం జర్చించి యేతెంచి నాఁ**
**డక్రూరుం డట క్రూరుఁ డీతఁడు నిజం బక్రూరుఁడౌ నేని ని**
**ర్వక్రత్వంబున కృష్ణుఁ బెట్టి తన త్రోవం బో విచారింపఁడే.** 10-1216

నిజంగా అక్రూరుడే అయితే కృష్ణుణ్ణిక వదలిపెట్టి వెళ్లాలి అనటం బాగుంది.

అక్రూరుడు రామకృష్ణులను రథం ఎక్కించుకొని మథురకు కొనిపోతున్నాడు. కృష్ణవియోగాన్ని సహించలేని గోపికలు గొంతెత్తి విలపించుతారు-

**ఏవం బ్రువాణా విరహాతురా భృశం, వ్రజస్త్రియః కృష్ణవిషక్త మానసాః ।**

**విసృజ్య లజ్జాం రురుదుస్స్మ సుస్వరం, గోవింద దామోదర మాధవేతి ॥**

వీరు సంస్కృత గోపికలు. ఇక తెలుగు గోపికలు ఎలా విలపించారో పోతన్నగారు ఈ క్రింది పద్యంలో చెప్పారు. "కపోలతట సంవిన్యస్త హస్తాబ్జలై", "పవనోద్ధూత లతాభలై" అనే రెండు విశేషణాలు అదనంగా జేర్చి గోపికల దయనీయ స్థితిని కనులకు కట్టించారు.

**ఉవిదల్ సిగ్గులు మాని కన్గవల నీ రొండొండ వర్షింపఁగా**

**వివశత్వంబులతోఁ గపోలతట సంవిన్యస్తహస్తాబ్జలై**

**పవనోద్ధూత లతాభలై మముఁ గృపం బాలింపు గోవింద మా**

**ధవ దామోదర యంచు నేడ్చిరి సుజాతంబైన గీతంబులన్.** 10-1221

అక్రూరుడు రామకృష్ణులను మథురకు తీసుకువెళ్తున్నాడు. రథం యమునా నదీతీరానికి చేరింది. రామకృష్ణులు రథం దిగి నదిలోనికి వెళ్లి నీళ్లు త్రాగి మళ్లీ రథంమీదకు వచ్చి కూర్చున్నారు. అక్రూరుడు నదిలో దిగి స్నానం చేస్తుండగా నదీజలాలలో శ్రీకృష్ణుడు కన్పించాడు. అలా చాలాసేపు చూచిచూచి చేతులు మోడ్చి నమస్కరించి ఒడ్డుకు వచ్చి చూస్తే కృష్ణుడు రథంమీద కూర్చుని ఉన్నాడు. ఆశ్చర్యచకితుడైన అక్రూరునితో కృష్ణుడంటాడు-

**జలములు చేరువ నున్నవి;, తలపోయఁగ నీవు పోయి తడవయ్యె; నదీ**

**జలముల, నభమున ధరణిన్, గలుగని చోద్యములు నీకుఁ గానంబడెనే?** 10-1237

శ్రీకృష్ణుని ప్రశ్నకు అక్రూరుడు ఏమని సమాధానం చెబుతాడు? భగవంతుడైన కృష్ణుని మహత్త్వానికి వెరగుపడి వినయ వినమిత శిరస్కుడై భక్తిరస పరిపూర్ణ మనస్కుడై ఇలా అంటాడు-

**నీలోన లేని చోద్యము, లే లోకములందుఁ జెప్ప రీశ్వర! నీటన్**

**నేలన్ నింగిని నున్నవె, నీలోఁ జోద్యంబు లెల్ల నెగడు మహాత్మా!** 10-1239

రథం మథురానగరంలో ప్రవేశిస్తుంది. శ్రీకృష్ణుడు మథురకు విచ్చేస్తున్నాడనే శుభవార్త విన్న పౌరకాంత లందరూ నందనందన సందర్శన కుతూహలాయత్తచిత్తలై గుములు కూడతారు. ఆ సంతోష వార్తను పరస్పరం ఈ విధంగా చెప్పుకుంటారు-

**నందు తపఃఫలంబు, సుగుణంబుల పుంజము, గోపకామినీ**

**బృందము నోముపంట, సిరి విందు, దయాంబుధి, యోగిబృందముల్**

**డెందములందుఁ గోరెడి కడింది నిధానము, సేరవచ్చెనో**

**సుందరులార! రండు చని చూతము కన్నుల కోర్కి దీరఁగన్.** 10-1247

ఈ విధంగా సంబరాలు పడుతూ మధురాపురం సుందరీమణు లందరూ తొందర తొందరగా నంద తనయుణ్ణి చూడటానికి మేడ లెక్కుతారు:

**వీటఁగల చేడె లెల్లను, హాటకమణి ఘటిత తుంగ హర్మ్యాగ్రములన్**
**గూటువలు గొనుచుఁ జూచిరి, పాటించి విశాలవక్షు పద్మదళాక్షున్.** 10-1240

విశాలవక్షుడైన ఆ పద్మదళాక్షుణ్ణి వీక్షిస్తూ ఉన్న హరిణేక్షణలను సహజపాండిత్యుడు ఇలా అభివర్ణించాడు-

**"వీఁడఁటే రక్కసి విగతజీవగఁ జన్నుఁ బాలుద్రావిన మేటి బాలకుండు**
**వీఁడఁటే నందుని వెలఁదికి జగమెల్ల ముఖమందుఁ జూపిన ముద్దులాఁడు**
**వీఁడఁటే మందలో వెన్నలు దొంగిలి దర్పించి మెక్కిన దాఁపరీఁడు**
**వీఁడటే యెలయించి వ్రేతల మానంబు సూఱలాడిన లోకసుందరుండు....."** 10-1250

ఈ విధంగా ఒకరి నొకరు తోసుకుంటూ చేతులు చాచి చూపిస్తూ అ నవనీతచోరుని భువనమోహన సౌందర్యానికి మురిసిపోతూ అనుకుంటారు.

**చెలియా! గోపిక లీ కుమారతిలకుం జింతించుచుం బాడుచుం**
**గలయం బల్కుచు నంటుచున్ నగుచు నాకర్షించుచున్ హస్తగా**
**మలక క్రీడకుఁ దెచ్చి నిచ్చలును సమ్మానంబులం బొందఁగాఁ**
**దొలుజన్మంబుల నేమి నోఁచిరొ కదే దుర్గప్రదేశంబులన్.** 10-1251

శ్రీకృష్ణుడు మధురానగరంలో ఎదురుగా వస్తున్న రజకుణ్ణి చూచి ఇలా అంటాడు-

**విందులమై నరేశ్వరుని వీటికి వచ్చితి మేము; మాకు మా**
**మందలలోన గట్టికొన మంచిపటంబులు లేవు; నీ ముడిన్**
**సుందరధౌతచేలములు శోభిలుచున్నవి; తెమ్ము; నిన్ను మే**
**లందెడు నిమ్ము, రాజుదెస నల్లుర మో రజకాన్వయాగ్రణీ!** 10-1256

అంత గొప్పగా సంబోధించి ప్రాధేయపడి శుభం పలికి ప్రార్థించినా అందుకు ఆ రజకుడు తలబిరుసుగా సమాధానం చెబుతాడు-

**ఎట్టెట్టా! మనుజేంద్రు చేలములు మీ కీఁబాడియే? మీరలుం**
**గట్టం బోలుదురే? పయోఘృతదధిగ్రాసంబులన్ మత్తులై**
**యిట్టాడం జనెఁగాక గొల్లలకు మీ కెబ్బంగి నోరాడెడిన్?**
**కట్టా! ప్రాణము గోలుపోయెదు సుమీ కంసోద్ధతిన్ బాలకా!** 10-1258

గర్వాంధుడైన రజకుడికి దేహశుద్ధి చేసి రామకృష్ణులు వస్త్రాలు ధరించి ముందుకు సాగుతారు. ఇంతలో సుదాముడనే మాలాకారుడు కనిపిస్తాడు. అతడిసేవలకు మెచ్చి వరం కోరుకోమంటాడు కృష్ణుడు. అప్పుడు సుదాముడు ఇలా అంటాడు-

**నీ పాదకమలసేవయు, నీపాదార్చకులతోడి నెయ్యమును నితాం**
**తాపారభూత దయయును, తాపసమందార! నాకు దయసేయఁగదే!** 10-1270

ఈ పద్యానికి తెలుగువారి నాలుకలపై ఎంతటి ప్రచారం అధికారం ఉన్నదో మన అందరికీ తెలుసు. ఇంతకూ ఆ పద్యం సుదాముడు పలికిందా? పోతనగారు పలికిందా? అనేదే సందేహం.

ఆ తరువాత కుబ్జ అనే మరుగుజ్జుపిల్ల కనిపిస్తుంది. ఆ వంకరటింకరపిల్లను చూచి కృష్ణు డిలా అంటాడు-

**ఎవ్వరిదానవు? లేపము, లెవ్వరికిం గోరికొనుచు నేగెదు? నీ పే**
**రెవ్వతె? మా కిమ్మన్నియు, నివ్వటిలెదు చక్కనగుచు నీరజనేత్రా!** 10-1274

'చక్కనగుచు' అన్నమాటలోని వ్యంగ్యాన్ని కుబ్జ గ్రహించింది. ఆ అమ్మాయి కొంచెం రోషంతో ఇలా అంటుంది-

**'చక్కనివాఁడవౌదు! సరసంబుల నొంపకు; మెల్లవారికిన్**
**జక్కదనంబు లెక్కడివి?** 10-1276

'నీవే పెద్ద చక్కనయ్యవులే. చమత్కారాలు చాలించు. అందరికీ నీ చక్కదనం ఎక్కడనుంచి వస్తుంది? నా పేరు త్రివక్ర. కంసుడి దాసిని. రాజుగారికి సుగంధలేపనాలు తీసుకువెళుతున్నాను' అంటుంది.

కుబ్జ నిజానికి త్రివక్ర. మెడ వంకర. నడుమ వంకర. కాళ్లు వంకర. అయితే మాత్రం వెక్కిరింపుగా 'చక్కనగుచు నివ్వటిలెదు' అంటాడా! ఇదంతా పోతనగారి చమత్కారం. మూలంలో ఈ మాట లేదు

**కా త్వం వరోర్వే తదుహానులేపనం, కస్యాంగనే వా కథయస్వ సాధు నః ।**
**దేహ్యావయో రంగవిలేప ముత్తమం, శ్రేయ స్తతస్తే న చిరాద్భవిష్యతి ॥**

'ఆ విలేపనాలు మా కివ్వు. నీకు త్వరలో శుభం కలుగుతుంది' అని మూలంలో ఉంటే ఇవన్నీ మాకిస్తే నీవంకర చక్కబడి నీవు చక్కని దానవవుతావు' అంటాడు తెలుగు కృష్ణుడు. అందుకు కుబ్జకు రోషం వచ్చి పై విధంగా పలికింది. తరువాత ఆ విలేపనాన్ని రామకృష్ణులకు సమర్పిస్తుంది. కృష్ణుడు ఆమె వక్రత్వం పోగొట్టి అనుగ్రహిస్తాడు.

శ్రీకృష్ణుడు కంసుని ధనుశ్శాలలో ఉన్న విల్లు విరవటం అత్యంత మనోహరంగా వర్ణించాడు పోతన-

**బంధుల్ మేలన వామహస్తమునఁ జాపం బెత్తి మౌర్వీలతా**
**సంధానం బొనరించి కొంచెపుఁ దెగన్ శబ్దించుచున్ ధీరతా**
**సింధుం డా హరి దాని ఖండితముగాఁ జేసెన్ జనుల్ చూడఁగా**
**గంధేభంబు రసాలదండము నొగిన్ ఖండించు చందంబునన్.** 10-1283

ఈ పద్యం మూలానికి సరైన అనువాదం. గమనించండి మూలశ్లోకాన్ని-

**కరేణ వామేన సలీలముద్ధృతం, సజ్యం చ కృత్వా నిమిషేణ పశ్యతామ్ ।**
**నృణాం వికృష్య ప్రబభంజ మధ్యతో, యథేక్షుదండం మదకర్యురుక్రమః ॥**

పోతన్నగారు ఈ సందర్భంలో చేసిన చంద్రోదయ సూర్యోదయ వర్ణనలు అనన్యసామాన్యములు, అత్యంతమనోహరములు, ముందు చంద్రోదయాన్ని చిత్తగించండి-

**ప్రాచీదిశాంగనా ఫాలతలంబున దీపించు సిందూరతిలక మనఁగ**
**దర్పించి విరహుల ధైర్యవల్లులు ద్రెంప దర్పకుం డెత్తిన దాత్ర మనఁగ**
**నలిగి కాలకిరాతుఁ డంధకారమృగంబు ఖండింప మెఱయించు ఖడ్గ మనఁగ**
**గగనతమాలవృక్షము తూర్పుకొమ్మను లలితమై మెఱయు పల్లవ మనంగఁ**

**దొఁగలు సంతసిల్ల దొంగలు భీతిల్ల, కడలి మిన్ను ముట్టి కడలుకొనఁగ**
**పొడిచె శీతకరుఁడు భూరి చకోరక, ప్రీతికరుఁడు జారభీతికరుఁడు.** 10-1295

చంద్రోదయానికి ముకుళించుకొన్న కమలాలను ఎంత హృదయంగమంగా వర్ణించాడో చూడండి-

**'కళలు గలుగు గాక; కమల తోడగుఁ గాక, శివుని మౌళిమీఁదఁ జేరుఁగాక;**
**నన్యు నొల్లఁ దపనుఁడై న మత్పతి' యని, సాధ్విభంగి కమలజాతి మొగిడె.** 10-1290

ఇక్కడ 'తపనుఁడు' అనటంలో చమత్కారం ఉన్నది. తపన శబ్దానికి సూర్యుడు, తపింపజేసేవాడు అని రెండర్థాలు. సాధ్వీలక్షణం సమంజసంగా నిరూపితమైంది.

ఇదే సందర్భంలో పోతన్నగారు చేసిన సూర్యోదయవర్ణనం అనంతర ప్రబంధకవులకు 'ఒజ్జబంతి' అయింది. ముద్దులు మూటగట్టే ఆ పద్యాన్ని చిత్తగించండి-

**పౌలోమి తన బాలు పాన్పుపైఁ గనుపట్టఁ బన్నిన పవడంపు బంతి యనఁగ**
**నాయురర్థముల వ్యయంబు లొత్తిలి చాటు కాలజాంఘికుచేతి ఘంట యనఁగ**

**ఘనజంతుజీవిత కాలరాసుల విధి కొలువ నెత్తిన హేమకుంభ మనఁగ**

**పశ్చిమదిక్కాంత పరఁగఁ గైసేయుచో ముందట నిడుకొన్న ముకుర మనఁగఁ**

**గోకతాపోపశమ దివ్య ఘుటిక యనఁగ, పద్మినీకాంత నోముల ఫల మనంగ**

**'మూఁడుమూర్తుల సారంపు ముద్ద' యనఁగ, మిహిరమండల ముదయాద్రిమీఁద నొప్పె.** 10-1304

ఈ వర్ణనలన్నీ పోతన్నగారి సొంతం.

మల్లయుద్ధంలో మహావీరుడైన చాణూరుడు శ్రీకృష్ణుణ్ణి అధిక్షేపించటం చాలా సహజంగా ఉన్నది.

**నాతోఁ బోరఁగ నెంతవాఁడ విసిరో నా సాటియే నీవు? వి**

**ఖ్యాతుండం గులజుండ సద్గుణుఁడ సత్కర్మస్వభావుండ; నీ**

**కేతాదృగ్విభవంబు లెల్లఁ గలవే? యీ వీట పోరాడుటల్**

**వ్రేతల్ చూడఁగఁ గుప్పిగంతు లిడుటే వీక్షింపు గోపార్భకా!** 10-1338

రణరంగంలో కూడ పోతనగారు తనకు సహజమైన అంత్యప్రాస సౌందర్యాన్ని ప్రదర్శించకుండా ఉండలేడు. జరాసంధుడు రామకృష్ణుల పైకి యుద్ధానికి వచ్చి వారిని చుట్టుముట్టినప్పుడు ఎంత చక్కని కల్పన చేశాడో చూడండి-

**పవనుఁడు మేఘరేణువుల భానుకృశానులఁ గప్పుకైవడిన్**

**వివిధబలౌఘముం బనిచి వేగమ మాగధుఁ డావరించె భూ**

**మ్యవనిచరిష్ణులన్ గుధిమతావనినాథ నిరాకరిష్ణులన్**

**దివిషదలంకరిష్ణుల నతిస్థిరజిష్ణుల రామకృష్ణులన్.** 10-1554

కాలయవనుడు శ్రీకృష్ణుని వెంట పడతాడు. కృష్ణుడు పరుగిడుతూ పోయి పోయి ఒక గిరిగహ్వరంలో దూరుతాడు. కాలయవనుడు కూడా ఆ గుహలో జొరబడి నిద్రపోతున్న ముచుకుందుణ్ణి శ్రీకృష్ణునిగా భావించి కాలితో తంతాడు. ముచుకుందుని కన్నులనుండి వెలువడిన క్రోధాగ్ని జ్వాలలకు కాలయవనుడు భస్మమైపోతాడు. అనంతరం ముచుకుందుడు తనముందు సాక్షాత్కరించిన శ్రీకృష్ణుణ్ణి చూచి ఇలా అంటాడు-

**శశివో! యింద్రుఁడవో! విభావసుఁడవో! చండప్రభారాశివో!**

**శశిచూడామణివో! పితామహుఁడవో! చక్రాంకహస్తుండవో!**

**దిశలున్ భూమియు మిన్ను నిండె నిదె నీ తేజంబు చూడంగ దు**

**ర్వశమై; యెవ్వఁడ వేల వచ్చి తిచటన్ వర్తించె దేకాకివై?** **10-1647**

ఇది పోతన్నగారి ప్రసన్నమధురశైలికి ఒక చిన్న ఉదాహరణం.

రుక్మిణీకల్యాణఘట్టంలో పరీక్షిన్మహారాజు శుకమహర్షితో ఇలా అంటాడు-

**బ్రహ్మన్ కృష్ణకథాః పుణ్యా మాధ్వీర్లోకమలాపహాః ।**
**కో ను తృప్యేత శృణ్వానః శ్రుతజ్ఞో నిత్యనూతనాః ॥**

వ్యాసుని మూలానికి పోతన్నగారి అనువాదం ఎంత చక్కగా ఉన్నదో చూడండి-

**కల్యాణాత్మకమైన విష్ణుకథ లాకర్ణించుచున్ ముక్త వై**
**కల్యుం డెవ్వఁడు తృప్తుఁడౌ? నవి వినంగాఁ గ్రొత్త లౌచుండు; సా**
**కల్యం బేర్పడ భూసురోత్తమ! యెఱుంగం బల్కవే రుక్మిణీ**
**కల్యాణంబు వినంగ నాకు మదిలోఁ గౌతూహలం బయ్యెడిన్.** 10-1683

అంతటితో పోతన్నగారికి తృప్తి కలుగలేదు. శ్రీకృష్ణుని కథలంటేనే ఆయన ఒళ్లు పులకించిపోతుంది. సహజపాండిత్యుడు తన సహజమైన కృష్ణభక్తిని వెంటనే ఈ కందపద్యంలో పొందుపరచకుండా ఉండలేక పోయాడు-

**భూషణములు సెవులకు; బుధ, తోషణము; లనేక జన్మదురితౌఘ విని**
**శ్శోషణములు; మంగళతర, ఘోషణములు; గరుడగమను గుణభాషణముల్.** 10-1684

రుక్మిణి అన్నగారైన రుక్మి తన చెల్లెల్ని శిశుపాలునికి ఇవ్వాలని నిర్ణయిస్తాడు. బంధువుల అభిప్రాయాన్ని త్రోసిపుచ్చుతాడు.

**బంధూనా మిచ్ఛతాం దాతుం, కృష్ణాయ భగినీం నృప ।**
**తతో నివార్య కృష్ణద్విడ్, రుక్మీ చైద్య మమన్యత ॥**

ఈ శ్లోకానికి పోతన్నగారు వ్రాసినపద్యం ఎంత హృద్యంగా ఉందో చిత్తగించండి-

**బంధువు లెల్లఁ గృష్ణునకు బాలిక నిచ్చెదమంచు శేముషీ**
**సింధువులై విచారములు సేయఁగ వారల నడ్డపెట్టి దు**
**స్సంధుడు రుక్మి కృష్ణునెడఁ జాల విరోధముఁ జేసి మత్త పు**
**ష్పంధయవేణి నిత్తు శిశుపాలున కంచుఁ దలంచె నంధుఁడై.** 10-1696

శ్రీకృష్ణుని దగ్గర కంపిన బ్రాహ్మణుని రాక ఆలస్యం కావడంతో రుక్మిణి పడుతున్న ఆవేదన, ఆందోళన పోతన్నగారు అత్యద్భుతంగా వర్ణించారు-

**లగ్నం బెల్లి; వివాహముం గదిసె; నేలా రాఁడు గోవిందుఁ? డు**
**ద్విగ్నం బయ్యెడి మానసంబు; వినెనో వృత్తాంతమున్; బ్రాహ్మణుం**

**డగ్నిద్యోతనుఁ డేటికిం దడసె? నా యత్నంబు సిద్ధించునో**
**భగ్నంబై చనునో విరించికృత మె బ్భంగిన్ బ్రవర్తించునో?** 10-1725

ఇంకా ఈ పద్యంలో ఆమె మనోవేదన ఆలకించండి-

**ఘనుఁ డా భూసురుఁ డేగెనో నడుమ మార్గశ్రాంతుఁడై చిక్కెనో**
**విని కృష్ణుం డిది తప్పుగాఁ దలఁచెనో? విచ్చేసెనో? యీశ్వరుం**
**డనుకూలింపఁ దలంచునో తలఁపఁడో? యార్యామహాదేవియున్**
**నను రక్షింప నెఱుంగునో యెఱుఁగదో? నాభాగ్య మెట్లున్నదో?** 10-1726

తానేమైనా రహస్యంగా రాయబారం పంపటం పొరపాటేమో! అందుకు కృష్ణుడు తప్పుపట్టాడేమో! అని అందోళన చెందుతున్న రుక్మిణితో ద్వారకనుండి తిరిగివచ్చిన అగ్నిద్యోతనుడు ఈ విధంగా చెప్పడంలో ఎంతో ఔచిత్యం ఉన్నది-

**మెచ్చె భవద్గుణోన్నతి; కమేయధనావళు లిచ్చె నాకుఁ; దా**
**వచ్చె సుదర్శనాయుధుఁడు వాఁడె; సురాసురు లెల్ల నడ్డమై**
**వచ్చిన నైన రాక్షసవివాహమునం గొనిపోవు నిన్ను; నీ**
**సచ్చరితంబు భాగ్యమును సర్వము నేఁడు ఫలించెఁ గన్యకా!** 10-1735

ఈ పద్యంలో 'మెచ్చె భవద్గుణోన్నతికి' అనటంలో రుక్మణి మనస్సులోని సందేహం తీరిపోయింది. 'తా వచ్చె సుదర్శనాయుధుఁడు' అనటంలో శ్రీకృష్ణుని ఆగమనవేగం అభివ్యక్త మయింది.

పోతన్నగారు భాగవతప్రారంభంలో గురుస్తుతి చేయలేదే అని కొంతమందికి అనుమానంగా ఉండేది. దానికి సమాధానం మనకు ఇక్కడ దొరుకుతుంది. రుక్మిణీ కల్యాణఘట్టంలోనే పోతన్నగారు సొంతంగా ఈ పద్యం వ్రాశారు. రాయబారిగా వచ్చిన బ్రాహ్మణుడు కృష్ణుడితో అంటాడు-

**ఆ యెలనాఁగ నీకుఁ దగు; నంగనకుం దగు దీవు; మా యుపా**
**ధ్యాయుల యాన; పెండ్లి యగుఁ; దప్పదు; జాడ్యము లేల? నీవు నీ**
**తోయమువారిఁ గూడుకొని తోయరుహాననఁ దెత్తుగాని వి**
**చ్చేయుము; శత్రులన్ నుఱుముసేయుము; సేయుము శోభనం బిలన్.** 10-1713

'మీ రిద్దరూ పరస్పరం తగిన దంపతులు. మీకు తప్పకుండా వివాహం జరిగి తీరుతుంది. మా గురువులమీద ఒట్టు' అంటాడు. అంతేకాని ఆ వేదవేత్త అయిన బ్రాహ్మణోత్తముడు వేదాల తోడనిగాని,

భగవంతుని తోడనిగాని, గాయత్రి తోడనిగాని అనకుండా ' మా ఉపాధ్యాయుల ఆన' అనటంలో ఎంతో విశేషం ఉంది. ఇది పోతన్నగారికి గురువులయందుండే గౌరవానికి మచ్చుతునుక.

తన కోరిక చెల్లించి కృష్ణుని కొనితెచ్చిన బ్రాహ్మణునికి రుక్మిణీదేవి తన కృతజ్ఞతాపూర్వక ధన్యవాదాలు సమర్పించడం ఎంతో సముచితంగా ఉంది.

**జలజాతేక్షణుఁ దోడితెచ్చితివి నా సందేశమున్ జెప్పి; నన్**
**నిలువం బెట్టితి; నీ కృపన్ బ్రదికితిన్; నీయంత పుణ్యాత్మకుల్**
**గలరే? దీనికి నీకుఁ బ్రత్యుపకృతిం గావింప నే నేర; నం**
**జలిఁ గావించెద; భూసురాన్వయమణీ! సద్బంధుచింతామణీ!** 10-1737

ఈ విధంగా పోతన్నగారి అనువాదం అత్యంతసహజంగా ఔచిత్యభరితంగా, సరసంగా, సరళంగా సాగిపోయింది.

తెలుగుజాతికి అత్యంత ప్రీతిపాత్రమైన పోతనభాగవతాన్ని అక్షరాస్యులందరికీ అందుబాటులో ఉండే నిమిత్తం హృద్యగద్యానువాద సహితంగా, ప్రతిపద్య భావార్థ సంయుతంగా ప్రకటించాలనే సముచితసంకల్పం తిరుమల తిరుపతి దేవస్థానముల వారికి కలగటం బహుధా ప్రశంసనీయం.

ఈ సందర్భంగా సంపాదించిన అనువాద భాగా లన్నింటినీ పరిశీలించి, పరిష్కరించి, వాటికి ఏక సూత్రత కల్పించే భారం నాకు అప్పగించినందులకు కార్యనిర్వహణాధికారి శ్రీ యం. వి. యస్. ప్రసాద్, ఐ.ఏ.ఎస్., మహాశయులకూ,డా. రావుల సూర్యనారాయణమూర్తి, పి.ఆర్.ఒ., గారికీ, ఎడిటర్ శ్రీ కె. సుబ్బారావు గారికీ నా హృదయ పూర్వక ధన్యవాదాలు.

ఈ దశమ స్కంధంలో **726** నుండి **1791** వరకు ఉన్న గద్యపద్యాలను శ్రీమాన్ ముదివర్తి కొండమాచార్యులవారు సరళగద్యంలోకి అనువదించారు. వీరు సంస్కృతాంధ్ర సాహిత్య ధర్మజ్ఞులు, కవితామర్మజ్ఞులు, "విద్వత్కవి శిరోమణి" బిరుదాంకితులు, హృద్యానవద్య పద్యవిద్యా విశారదులు. ధర్మదీక్ష, అమరసందేశము, వీరమనీడు, కూనలమ్మ, నారాయణమ్మ, పూర్ణాహుతి ముక్తావళి, ప్రచండకౌశికం, వంటి అనేక కావ్యములు రచించి పేరెన్నిక గన్నవారు. అమృతసారము, బ్రహ్మగాంధర్వము, అన్నమయ్య విన్నపాలు అనే కృతులద్వారా అన్నమాచార్యులవారి అధ్యాత్మ సంకీర్తనల మధురభావ సుధారసాన్ని సుమారు తొమ్మిది వందల సీసాలకెత్తి ఆంధ్రావళికి అందించిన ధన్యజీవనులు శ్రీమాన్ ఆచార్యులవారు. వీరి రచనలపై శ్రీచల్లా హరిశ్చంద్ర పరిశోధన చేసి శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయం నుండి పిహెచ్. డి., పట్టం అందుకున్నారు. వీరు భాగవతమునకు కావించిన పద్యగద్యానువాదం సరసమై, సరళమై, అందరికీ అందుబాటులో ఉంది.

ఈ గ్రంథాన్ని ఇంతముచ్చటగా, ఇంత నిర్దుష్టంగా ముద్రించి ఇచ్చిన దేవస్థానం ప్రెస్ మేనేజర్ శ్రీయుతులు ఎమ్. విజయకుమార్‌రెడ్డి గారికీ, వారి సిబ్బందికీ నా సాధువాదాలు.

అక్షరదోషాలు దొర్లకుండా, సహస్రాక్షులై ప్రూఫులు సరిదిద్దిన పూజ్యమిత్రులు మహాకవి శ్రీమాన్ ముదివర్తి కొండమాచార్యులవారికి, శ్రీములుకుట్ల రామకృష్ణశాస్త్రి గారికి నా అభివాదాలు.

ముద్రణకు అనుకూలంగా ప్రెస్ కాపీ సిద్ధంచేసి శుద్ధప్రతి అందించిన చిరంజీవి కోరాడ రామకృష్ణ, ఎమ్.ఎ., ఎమ్.ఫిల్., కు నా ఆశీర్వాదాలు.

| | |
|---|---|
| కళ్యాణభారతి | భవదీయుడు |
| రవీంద్రనగర్, | ***కరుణశ్రీ*** |
| గుంటూరు. | ప్రధాన సంపాదకుడు |
| ప్రజాపతి, వసంతము. | పోతన భాగవతము |

# విషయసూచిక

## పదవ స్కంధము - పూర్వభాగము

| విషయము | | పుట |
|---|---|---|

శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః

# పోతన భాగవతము

*(సరళ గద్యానువాద సహితము)*

## దశమ స్కంధము - పూర్వభాగము

### -: పరీక్షిన్మహారాజు శుకయోగీంద్రు నడిగెడు ప్రశ్న :-

**శ్రీకంఠచాప ఖండన!, పాకారి ప్రముఖ వినుత భండన! విలస**
**త్కాకుత్స్థవంశమండన!, రాకేందు యశోవిశాల! రామనృపాలా! 1**

* శ్రీరామచంద్రా! నీవు శివుని విల్లు విరచిన వాడవు. ఇంద్రుడు మొదలైన వారు మెచ్చుకొనేటట్లు యుద్ధం చేయగలవాడవు. ప్రకాశిస్తూ ఉన్న కాకుత్ స్థ వంశానికి అలంకార మైనవాడవు. కార్తిక పూర్ణిమనాటి చంద్రుని వెన్నెలవంటి కీర్తితో విశ్వమంతటను వ్యాపించిన వాడవు. ప్రజలను ఆనందపరచు రాజువు నీవు. అటువంటి నీకు నమస్కారము.

**వ. మహనీయ గుణగరిష్ఠులగు న మ్మునిశ్రేష్ఠులకు నిఖిల పురాణ వ్యాఖ్యాన వైఖరీ సమేతుం డయిన సూతుం డిట్లనియె, నట్లు పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రుం గనుంగొని. 2**

* అన్ని పురాణాలనూ వ్యాఖ్యానించటంలో నైపుణ్యం గల సూతమహాముని, గొప్ప గుణాలచేత ఉత్తములైన శౌనకాది మహర్షి సత్తములతో ఈ విధంగా అన్నాడు.

పరీక్షిన్మహారాజు శుకమహర్షిని చూచి ఇలా పలికాడు.

**క. తెలిపితివి సోమసూర్యుల, కులవిస్తారంబు, వారి కులము ధరిత్రీ**
**శుల నడవళ్ళను వింటిమి, కలరూపము లెల్ల మాకుఁ గడు వెఱఁగులుఁగన్. 3**

* "సూర్యవంశ చంద్రవంశాలను తెలిపావు. ఆ వంశాలలో జన్మించిన రాజుల చరిత్రలు నీవు చెప్పగా విన్నాము. వారి చరిత్రలలో ఉన్న విశేషాలు మాకు చాలా విభ్రాంతిని కలిగించాయి.

**క. శీలము గల యదుకులమున, నేలా పుట్టెను మహాత్ముఁ డీశుఁడు విష్ణుం?**
**డే లీల మెలఁగె? నెయ్యే, వేళల నే మేమి సేసె? వివరింపు తగన్. 4**

* మహాత్ముడు, ఈ లోకాలకు ఈశ్వరుడు అయిన విష్ణువు శీలవంతమైన యదువంశంలో ఎందుకు పుట్టవలసి వచ్చింది? అలా పుట్టి ఏ విధంగా ప్రవర్తించాడు? ఏయే వేళల్లో ఏమేమి పనులు చేశాడు? ఈ విషయాలన్నీ చక్కగా చెప్పవలసింది?

క. భవములకు మందు, చిత్త, శ్రవణానందము, ముముక్షుజన పదము, హరి
స్తవము పశుఘ్నుఁడు దక్కను, జెవులకుఁ దని వయ్యె ననెడి చెనఁటియుఁ గలఁడే. 5

* శ్రీహరియైన విష్ణువుయొక్క స్తోత్రం సంసార బాధలకు ఔషధం. చెవులకు మనస్సుకు ఆనందం కలిగిస్తుంది, మోక్షం అర్థించే జనులకు కోరదగినస్థానం. అటువంటి హరిస్తోత్రం విని ' ఇంక చాలు'అనే మూర్ఖుడు ఎవడైనా ఉంటాడా? కసాయివాడు అయితే తప్ప ఆ మాట ఎవడూ అనడు.

క. మా పెద్దలు మును వేల్పులు, నోపని భీష్మాది కురుకులోత్తమ సేనా
కూపారము నే కోలము, ప్రాపున లంఘించి రొక్క బాలపదముగాన్. 6

* భీష్మాది కురువీరులతో నిండిన కౌరవసైన్యం దేవతలకైనా ఓర్వరానిది. అలాంటి కౌరవసేనా సముద్రాన్ని మా పెద్దలైన పాండవులు ఒక్క పసిపిల్లవాని అడుగును దాటగలిగినంత సులభంగా దాటగలిగారు గదా! ఏ తెప్ప సహాయంతో దాటగలిగారు?

క. మా యమ్మ కుక్షి గురుసుత, సాయక పీడితుఁడ నైన జడు నన్నుం గౌం
తేయ కురుకులము నిలుపఁగ, నా యుత్తముఁ డాత్త చక్రుఁడై రక్షించెన్. 7

* నేను మా అమ్మ గర్భంలో ఉండగా అశ్వత్థామ ప్రయోగించిన అస్త్రంచేత బాధపడి నిశ్చేష్టుడనైనాను. అటువంటి సమయంలో పాండవకులాన్ని నిలబెట్టడానికి శ్రీకృష్ణుడు చక్రాన్ని ధరించి నన్ను రక్షించాడు.

ఆ. కలిసి పురుషమూర్తి కాలరూపములను, లోకజనుల వెలిని లోన నుండి
జన్మ మృత్యువులను సంసారముక్తుల, నిచ్చు నతని చరిత మెల్లఁ జెపుమ! 8

* పురుషోత్తముడైన విష్ణువు పురుషరూపంతోనూ కాలరూపంతోనూ లోకంలోని జీవులందరి లోపలా బయటా కూడా ఉంటాడు. అలా ఉండి జనన మరణాలనూ సంసార బంధాలనూ మోక్షాన్నీ ప్రసాదిస్తాడు. అటువంటి పురుషోత్తముని చరిత్ర అంతా చెప్పవలసింది.

సీ. ఊహించి రాముఁడు రోహిణి కొడుకంచు నప్పుడు యోగీంద్ర! చెప్పి తీవు
దేవకి కడుపున నే వెరవున నాతఁ డుండెను దేహంబు నొండు లేక?
తన తండ్రి యిలవాసి వనజాక్షుఁ డేరీతి మందకుఁ బోయె? నే మందిరమున
నుండి యెయ్యది సేయుచుండెను? దన మేన మామ కంసుని నేల నామ మణఁచె

ఆ. నెన్ని యేండ్లు మనియె నిలమీఁద మనుజుఁడై?, యెంద ఱైరి భార్య? లెట్లు మెలఁగె?
మఱియు నేమి చేసె? మాధవు చారిత్ర, మెంత గలదు? నాకు నేర్పరింపు. 9

* యోగీంద్రా! బలరాముడు రోహిణీదేవి కుమారుడని చెప్పావు. మరి మరో శరీరం లేకుండా దేవకీదేవి గర్భానకూడా ఎలా ఉన్నాడు? కృష్ణుడు తన తండ్రిగారి యిల్లు వదలి వ్రేపల్లెకు ఎలా వెళ్లాడు? ఎవరి యింట ఉన్నాడు? ఎలా ప్రవర్తించాడు? ఆయన తన మేనమామ అయిన కంసుని సంహరించ

వలసిన పరిస్థితి ఎందుకు వచ్చింది? ఆయన భూమిమీద మానవుడుగా ఎన్ని సంవత్సరాలు జీవించాడు? ఆయనకు భార్యలెందరు? వారితో ఏ విధంగా ప్రవర్తించాడు? ఇంకా ఏమేమి చేశాడు? ఆ మాధవుని చరిత్ర ఇంకా ఎంత ఉందో అంతా నాకు వివరంగా చెప్పవలసింది.''

**వ. అని మఱియు నిట్లనియె. 10**

**ఆ. నీ ముఖాంబుజాత నిర్ముక్త హరికథా, మృతముఁ ద్రావఁ ద్రావ మేను వొదలె,**
**వంత మానె, నీరువట్టు నాఁకలియును, దూరమయ్యెఁ, మనము దొంగలించె. 11**

* అని పరీక్షిత్తు ఇంకా ఇలా అన్నాడు: - నీ ముఖం అనే పద్మం నుండి మకరందంలాగా స్రవిస్తున్న హరికథలు అనే అమృతం త్రాగి త్రాగి నా శరీరం పులకరిస్తూన్నది. మరణం దగ్గర పడుతున్నదనే దుఃఖం అంతరించింది. ఆకలిదప్పులు దూరమైపోయాయి. మనస్సు ఆనందంతో పరవళ్ళు త్రొక్కుతున్నది.

**వ. అని పలుకుచున్న రాజు మాటలు విని, వైయాసి యిట్లనియె. 12**

* ఇలా అంటున్న పరీక్షిత్తు మాటలు విని వ్యాసభగవానుని కుమారుడైన శ్రీశుకుడు ఇలా అన్నాడు.

**క. విష్ణు కథా రతుఁ డగు నరు, విష్ణుకథల్ చెప్పు నరుని వినుచుండు నరున్**
**విష్ణుకథా సంప్రశ్నము, విష్ణుపదీ జలము భంగి విమలులఁ జేయున్. 13**

* "రాజా! విష్ణువు పాదాలనుండి పుట్టిన గంగాజలం వలెనే విష్ణు కథాప్రసంగంకూడా విష్ణుకథలయందు ఆసక్తి గలవారినీ, ఆ కథలు చెప్పే వారినీ, వినేవారినీ పునీతులను చేస్తుంది.

**సీ. రాజేంద్ర! విను తొల్లి రాజలాంఛనముల వేలసంఖ్యల దైత్య విభులు దన్ను**
**నాక్రమించిన భార మాఁగఁజాలక భూమి గోరూపయై బ్రహ్మఁ జేరఁ బోయి**
**కన్నీరు మున్నీరుగా రోదనము సేయఁ గరుణతో భావించి కమలభవుఁడు**
**ధరణి నూఱడఁ బల్కి ధాత్రియు వేల్పులుఁ గదలిరా విష్ణునిఁ గాన నేఁగి**

**తే. పురుష సూక్తంబుఁ జదివి యద్భుత సమాధి, నుండి యొకమాట విని వారిజోద్భవుండు**
**వినుఁడు వేల్పులు ధరయు నే విన్నయట్టి, పలుకు వివరింతు నని ప్రీతిఁ బలికెఁ దెలియ. 14**

* పరీక్షిన్మహారాజా! వివరంగా చెబుతాను విను. పూర్వం ఎంతో మంది దానవశ్రేష్ఠులు భూమిపై పుట్టి అధికారాలు చేపట్టి రాజులై భూమిని ఆక్రమించారు. భూదేవి ఆ భారం మోయలేక, బ్రహ్మదేవుని వద్దకు వెళ్ళి కన్నీరు మున్నీరుగా ఏడ్చింది. బ్రహ్మదేవుడు కరుణతో భూదేవిని ఊరడించి కర్తవ్యం ఆలోచించాడు. భూదేవినీ, దేవతలనూ వెంటబెట్టుకొని విష్ణువును దర్శించడానికి బయలుదేరాడు. పురుష సూక్తం పఠించి అద్భుతమైన సమాధిస్థితిలో ప్రవేశించాడు. ఆ ధ్యానంలో ఒకమాట ఆయనకు వినబడింది. అది విని బ్రహ్మదేవుడు సంతోషంతో ఇలా అన్నాడు :

"భూదేవీ! దేవతలారా! నేను విన్నమాట వివరిస్తాను - వినండి.

**క. యాదవకులమున నమరులు!, మేదినిపైఁ బుట్ట జనుఁడు మీ యంశములన్**
**శ్రీదయితుఁడు వసుదేవున, కాదరమునఁ బుట్టి భార మంతయుఁ బాపున్. 15**

* దేవతలైన మీరంతా మీ మీ అంశలతో యాదవకులంలో భూమిపై జన్మించండి. లక్ష్మీపతి అయిన విష్ణువు ఆదరంతో వసుదేవునికి పుత్రుడుగా జన్మించి భూభారమంతా తొలగిస్తాడు.

**క. హరి పూజార్థము పుట్టుఁడు, సురకన్యలు! భూమియందు సుందరతనులై**
**హరి కగ్రజుఁడై శేషుఁడు హరికళతోఁ బుట్టుఁ దత్ప్రియారంభుండై. 16**

* అప్సరసలందరూ భూమిపైన సుందరమూర్తులై, విష్ణువును పూజించడానికి పుట్టవలసింది. విష్ణువు ప్రీతికోసం ఆదిశేషుడు హరి కళతో విష్ణుని అన్నగారుగా పుట్టగలడు.

**ఆ. ఈ ప్రపంచ మెల్ల నే మాయచే మోహి, తాత్మ మగుచు నుండు నట్టిమాయ**
**కమలనాభు నాజ్ఞఁ గార్యార్థమై నిజాం, శంబు తోడఁ బుట్టు జగతియందు. 17**

* ఈ ప్రపంచం అంతా ఏ మాయచేత మోహం చెందుతూ ఉంటుందో, ఆ యోగమాయ విష్ణువు ఆజ్ఞచేత తన అంశతో కార్యనిర్వహణకోసం భూమిపైన జన్మిస్తుంది."

**వ. అని యిట్లు వేల్పుల నియ్యకొలిపి పుడమిముద్దియ నొడంబఱిచి తమ్మిచూలి తన మొదలి నెలవునకుం జనియె, నంత యదువిభుం డయిన శూరసేనుండను వాఁడు మధురాపురంబు తనకు రాజధానిగా మాధురంబులు శూరసేనంబు లనియెడు దేశంబు లేలెం. బూర్వకాలంబున. 18**

* ఈ విధంగా దేవతలకు చెప్పి వారిని అంగీకరింపజేసి భూదేవిని ఓదార్చి బ్రహ్మదేవుడు తన లోకానికి వెళ్లిపోయాడు.

భూలోకంలో యాదవ వంశంలో పుట్టిన శూరసేనుడనే రాజు మధురాపురాన్ని రాజధానిగా చేసుకొని మధురకూ, శూరసేనమునకూ సంబంధించిన దేశాలు పరిపాలించాడు.

**క. ఏ మథురయందు నిత్యము, శ్రీమన్నారాయణుండు సెలఁగుఁ బ్రియముమై**
**నా మథుర సకల యాదవ, భూమీశుల కెల్ల మొదలి పురి యయ్యె నృపా! 19**

* ఏ మథురానగరంలో శ్రీమన్నారాయణుడు విలాసంగా విహరించాడో ఆ మథురానగరం పూర్వకాలంలో యాదవ ప్రభువుల కందరకూ మొదట రాజధానిగా ఉండేది.

**సీ. ఆ శూరసేనుని కాత్మజుం డగు వసుదేవుఁ డా పురి నొక్క దినమునందు**
**దేవకిఁ బెండ్లియై దేవకియును దానుఁ గడువేడ్క రథమెక్కి కదలువేళ**

నుగ్రసేనుని పుత్త్రుఁ డుల్లాసి కంసుండు చెల్లెలు మఱఁదియు నుల్లసిల్లి
హరుల పగ్గములఁ జేనంది రొప్పఁ దొడంగె, ముందట భేరులు మురజములును

ఆ. శంఖ పటహములును జడిగొని మ్రోయంగఁ, గూఁతుతోడి వేడ్క కొనలు సాఁగ
దేవకుండు సుతకు దేవకీదేవికి, నరణ మీఁ దలంచి యాదరించి. 20

* ఆ శూరసేనుని కుమారుడైన వసుదేవుడు దేవకీదేవిని పెండ్లి చేసుకొని, ఒకనాడు తన భార్యతో కలిసి రథమెక్కి బయలుదేరాడు. ఉగ్రసేనుని కుమారుడైన కంసుడు చెల్లెలిపై ప్రేమతో తానే స్వయంగా గుర్రాల పగ్గాలు పట్టి రథం త్రోలసాగాడు. అదిచూచి దేవకీ వసుదేవులు చాలా సంతోషించారు. రథం ముందుగా భేరీలు, మృదంగాలు, శంఖాలు, డప్పులు రాజలాంఛనాలుగా మ్రోగుతూ ఉన్నాయి.

దేవకితండ్రియైన దేవకుడు కుమార్తెపైన ప్రేమతో ఆమెకు అరణం ఇవ్వాలని అనుకున్నాడు.

వ. సార్థంబు లయిన రథంబుల వేయునెనమన్నూటినిఁ, గనక దామ సముత్తుంగంబు లయిన మాతంగంబుల నన్నూటినిఁ బదివేల తురంగంబులను, విలాసవతు లయిన దాసీజనంబుల నిన్నూటి నిచ్చి యనిచినం గదలి వరవధూ యుగళంబు దెరువునం జను సమయంబున. 21

* ధనంతో నిండిన పదునెనిమిది వందల రథాలనూ, బంగారుహారాలతో అలంకరించిన నాలుగు వందల ఏనుగులనూ, పదివేల గుర్రాలనూ, విలాసవతులైన రెండు వందలమంది దాసీజనులనూ ఆమెకు అరణంగా ఇచ్చాడు. క్రొత్త దంపతులైన దేవకీ వసుదేవులు రథంలో కూర్చుండి రాచబాటలో బయలుదేరారు.

క. పగ్గములు వదలి వేగిర, మగ్గలముగ రథముఁ గడపు నా కంసుఁడు లో
బెగ్గిలి యెగ్గని తలఁపఁగ, దిగ్గన నశరీరవాణి దివి నిట్లనియెన్. 22

* కంసుడు గుర్రాల పగ్గాలు సడల్చి రథం వేగంగా నడపసాగాడు. ఇంతలో అకస్మాత్తుగా అతని గుండెలు అదరేటట్లు అశరీరవాణి ఆకాశంలో నుండి యిలా పలికింది.

క. "తుష్టయగు భగిని మెచ్చఁగ, నిష్టుఁడవై రథము గడపె, దెఱుఁగవు మీఁదన్
శిష్టయగు నీ తలోదరి, యష్టమగర్భంబు నిన్ను హరియించుఁ జుమీ!" 23

* "సంతృప్తురాలైన చెల్లెలు దేవకీదేవి మెప్పుకోసం ఎంతో ప్రేమతో రథం నడుపుతున్నావు. కాని ముందు రానున్నది తెలుసుకో లేకుండా ఉన్నావు. ఉత్తమురాలైన ఈ యువతి అష్టమ గర్భంలో పుట్టిన వాడు నిన్ను సంహరిస్తాడు సుమా!''

వ. అని యిట్లాకాశవాణి పలికిన నులికిపడి భోజకుల పాంసనుండైన కంసుండు సంచలదంసుండై యడిదంబు బెడిదంబుగాఁ బెఱికి జళిపించి దెప్పరంబుగ ననుజ కొప్పుఁబట్టి కప్పరపాటున నొప్పఱం దిగిచి యొడిసి పట్టి, తోఁబుట్టువని తలంపక తెంపు సేసి తెగవ్రేయ గమకించు సమయంబున వసుదేవుండు డగ్గఱి. 24

* ఈ విధంగా ఆకాశవాణి పలుకగా కంసుడు ఉలిక్కిపడ్డాడు. భోజవంశాన్ని పాడుచేయడానికి పుట్టిన ఆ దుర్మార్గుడు, భుజాలు అదురుతూ ఉండగా భయంకరంగా కత్తిదూసి, తొట్రుపాటుతో చెల్లెలి కొప్పు పట్టుకొని క్రిందికి లాగాడు. తోడబుట్టిన దనికూడా చూడకుండా తెగించి ఆమెను చంపబోతూ ఉన్న కంసునికి వసుదేవుడు అడ్డుపడ్డాడు.

**క. ఆ పాపచిత్తు మత్తుం, గోపాగ్ని శిఖానువృత్తుఁ గొనకొని తన స**
**ల్లాపామృతధారా వి, క్షేపంబునఁ గొంత శాంతుఁ జేయుచుఁ బలికెన్. 25**

* ఆ కంసుడు అసలే పాడుబుద్ధి కలవాడు. మదమెక్కి మైమరచి ఉన్నాడు. ఆగ్రహావేశంతో అగ్నిజ్వాలలాగా మండిపడుతున్నాడు. వసుదేవుడు అమృతధారలవంటి తన చల్లని మాటలచేత ఆతనిని కొంత శాంతింపజేస్తూ ఇలా అన్నాడు.

**ఉ. 'అన్నవు నీవు చెల్లెలికి, నక్కట! మాడలు చీర లిచ్చుటో!**
**మన్నన సేయుటో? మధుర మంజులభాషల నాదరించుటో?**
**'మిన్నుల మ్రోఁతలే నిజము, మే'లని చంపకు మన్న మాని రా**
**వన్న! సహింపు మన్న! తగ దన్న! వధింపకు మన్న! వేఁడెదన్. 26**

* "బావా! నీవు ఈ చిన్నదానికి అన్నగారివిగదా! నీ చెల్లెలికి ధనం ఇవ్వాలి, చీరలుపెట్టాలి, ఆడపడుచు అని గౌరవించాలి, మధురమైన మాటలతో ఆదరించాలిగానీ అయ్యో! ఇదేమిటి? ఏవో గాలిమాటలు విని అవే నిజమనుకొని, ఆ అమాయికురాలిని వధించబూనావు. చంపవద్దు బావా! దయచేసి వెనక్కువచ్చెయ్యి. ఓర్పు తెచ్చుకో! ఇది నీ వీరత్వానికి తగినపని కాదు. ఆమెను వధింపవద్దు నాయనా! నా మాటవిను. నిన్ను వేడుకుంటున్నాను.

**వ. అదియునుం గాక. 27**

**మ. చెలియల్, గన్నియ, ముద్దరా లబల, నీ సేమంబు చింతించు ని**
**ర్మల, దీనిన్ బయలాడుమాటలకు నై మర్యాదఁ బోఁదట్టి, స**
**త్కుల జాతుండవు పుణ్యమూర్తి వకటా! గోపంబు పాపంబు, నె**
**చ్చెలి నోహో! తెగవ్రేయఁ బాడియగునే? చింతింపు భోజేశ్వరా! 28**

* అదీకాక ఈ నీ చెల్లెలు అమాయికురాలు, అబల. నీ క్షేమాన్నే ఎప్పుడూ ఆశిస్తూ ఉంటుంది. ఏ పాపమూ ఎరుగనిది. ఇటువంటి ఈమెను ఆచోట ఈ చోట వినిపించే మాటలు కారణంగా చంపబోవడం న్యాయమేనా? కోపం మహాపాపం సుమా? పవిత్రమైన భోజవంశంలో జన్మించినవాడవు. పుణ్యమూర్తివి. భోజవంశీయుల కందరికీ నాయకుడవు. ఇటువంటి నీవు ప్రియమైన సోదరిని సంహరించడం ధర్మమా? ఆయ్యో! ఇది నీ ప్రతిష్ఠకు భంగకరం కాదా! ఆలోచించి చూడు!

**సీ. మేనితోడన పుట్టు మృత్యువు జనులకు, నెల్లి నేఁడైనఁ నూఱేండ్ల కైనఁ**
**దెల్లంబు మృత్యువు దేహంబు పంచత నందఁ గర్మానుగుండై శరీరి**

**మాఱుదేహము నూఁది, మఱి తొంటి దేహంబుఁ బాయును దన పూర్వ భాగమెత్తి**
**వేఱొంటిపైఁ బెట్టిఁ వెనుకభాగం బెత్తి గమనించు తృణజలూకయును బోలె,**

**ఆ. వెంటవచ్చు కర్మవిసరంబు, మును మేలు కన్నవేళ నరుఁడు గన్న విన్న**
**తలఁపఁబడిన కార్యతంత్రంబు కలలోనఁ, బాడితోడఁ గానఁబడిన యట్లు. 29**

* జన్మమెత్తిన వారికి ఆ శరీరంతోబాటే మృత్యువుకూడా పుట్టి వుంటుంది. నేడో రేపో నూరేళ్ళకైనా మృత్యువు తప్పదు. మరణించడం అంటే శరీరం పంచమహాభూతాలలో కలిసిపోవడమే! ఆకు పురుగును చూడు! శరీరం ముందుభాగం ఎత్తి మరోచోట పెట్టి, వెనుక భాగం ఎత్తి ముందుకు లాక్కుంటుందిగదా! అలాగే శరీరం ధరించిన జీవుడు తన కర్మ ననుసరించి మరొక దేహం ఏర్పాటు సేసుకొని మరీ ఉన్న శరీరం విడిచిపెడతాడు.

* మనకు మెలకువగా ఉన్నప్పుడు మానవుడు చూచినవి, విన్నవి, ఆలోచించినవి అయిన పనులు కలలో చక్కగా కనబడినట్లు శరీరం విడువగానే కర్మవాసనలన్నీ ఆ జీవివెంట వస్తాయి.

**క. తన తొంటి కర్మరాశికి, ననుచరమై బహువికారమై మనసు వడిం**
**జను, నింద్రియముల తెరువులఁ, దనువులు పెక్కైనఁ జెడవు తన కర్మంబుల్. 30**

* తన పూర్వకర్మల ననుసరించి, మనస్సు అనేక వికారాలు చెందుతూ ఇంద్రియాలనే మార్గాల వెంట వేగంగా చరిస్తూ ఉంటుంది. ఎన్ని శరీరాలు ధరించినా తన కర్మలు మాత్రం ఎక్కడికీ పోవు.

**ఆ. జలఘటాదులందుఁ జంద్రసూర్యాదులు, గానఁబడుచు గాలిఁ గదలు భంగి**
**నాత్మకర్మ నిర్మితాంగంబులను బ్రాణి, గదలుచుండు రాగకలితుఁ డగుచు. 31**

* చంద్రబింబం, సూర్యబింబం మొదలైనవి నీటికుండలు మొదలైన వానిలో ప్రతిఫలిస్తూ గాలికి కదలుతూ ఉంటాయి. అలాగే ప్రాణి తన కర్మలచేత నిర్మించుకొన్న శరీరాలలో ఆసక్తి చెంది సంచలిస్తుంటాడు.

**క. కర్మములు మేలు నిచ్చును, గర్మంబులు గీడు నిచ్చు, గర్తలు దనకుం**
**గర్మములు బ్రహ్మ కైనను, గర్మగుఁ డై పరులఁ దడవఁగా నేమిటికిన్? 32**

* మంచిగానీ, చెడుగానీ ఎవరికైనా తాను చేసుకున్న కర్మల ఫలితంగానే వస్తుంది. బ్రహ్మంత వాడికైనా తన కర్మలే తన అనుభవానికి కర్తలు. కర్మను అనుసరించి ప్రవర్తిస్తూ ఇతరులలో దోషాలు వెదకడం ఎందుకు?

**క. కావునఁ బరులకు హింసలు, గావింపఁగ వలదు తనకుఁ గల్యాణముగా**
**భావించి పరుల నొంచినఁ, బోవునె? తత్ఫలము పిదపఁ బొందక యున్నే? 33**

* కనుక ఇతరులను బాధించడం మంచిది కాదు. తన సౌఖ్యంకోసం ఇతరులను బాధిస్తే ఊరకే పోతుందా? దానికి ఫలితం తరువాతనైనా పొందక తప్పుతుందా?

మత్త. వావిఁ జెల్లెలుగాని పుత్త్రికవంటి దుత్తమురాలు, సం
భావనీయచరిత్ర, భీరువు, బాల, నూత్నవివాహ సు
శ్రీవిలాసిని, దీన, కంపితచిత్త నీకిదె మ్రొక్కెదం,
గానవే! కరుణామయాత్మక! కంస! మానవవల్లభా! 34

* "కంసరాజేంద్రా! ఈమె నీకు వరసకే చెల్లెలుగాని, పుత్రికవంటిది. ఉత్తమురాలు; గౌరవించదగిన ప్రవర్తన కలది. అసలే భయస్థురాలు; అందులో పిన్న వయస్సుది. కొత్త పెండ్లికూతురు. చక్కని లక్ష్మీకళలతో విలసిల్లుతున్నది. భయంతో లోలోన వణకిపోతున్నది. కరుణామయా! ఇదిగో నీకు చేతులెత్తి మ్రొక్కుతున్నాను. ఈమెను రక్షించు!"

వ. అని మఱియు సామభేదంబులగు పలుకులు పలికిన వినియు వాఁడు వేఁడిచూపుల రాలు నిప్పులు గుప్పలు గొన ననుకంపలేక, తెంపుసేసి చంపకగంధిం జంపఁ జూచుట యెఱింగి మొఱంగెడి తెఱంగు విచారించి తనలో నిట్లనియె. 35

* ఈ విధంగా వసుదేవుడు ఇంకా అనునయంగానూ, కంసుని మనస్సు కలిచివేసేటట్లుగానూ మాట్లాడాడు. అయిన కంసుడు జాలి పడలేదు. అతడు కోపపు చూపులతో కూడిన కన్నులనుండి నిప్పులు రాలుతూ ఉండగా దేవకీ దేవిని చంపబోయాడు. అతని మూర్ఖత్వాన్ని గమనించి వసుదేవుడు ఎలాగైనా అతణ్ణి ఒప్పించాలని తనలో ఇలా అనుకున్నాడు.

క. 'ఎందును గాలము నిజ మని, పందతనంబునను బుద్ధిఁబాయక ఘనులై
యెందాఁక బుద్ధి నెగడెడి, నందాఁకఁ జరింపవలయు నాత్మబలమునన్. 36

* "మానవులకు బేలతనం పనికిరాదు. ఎప్పుడైనా కాలమే వాస్తవమనే వివేకం వదలరాదు. ఆత్మబలంతో గట్టిగా నిలబడి తన బుద్ధి ఎంత వరకు ప్రసరిస్తుందో అంతవరకూ ఉపాయం ఆలోచించి ఆచరిస్తూ ఉండాలి.

వ. అని నిశ్చయించి 37

* అని స్థిరమైన బుద్ధితో ఇలా నిశ్చయించుకున్నాడు వసుదేవుడు :

సీ. ఆపన్నురాలైన యంగన రక్షించి సుతుల నిచ్చెద నంట శుభము నేఁడు,
మీఁ దెవ్వఁ డెఱుఁగును? మెలఁత ప్రాణంబుతో నిలిచిన మఱునాఁడు నేరరాదె?
సుతులు పుట్టిర యేని సుతులకు మృత్యువు వాలాయమై వెంట వచ్చెనేని
బ్రహ్మచేతను వీఁడుపా టేమియును లేక యుండునే? సదుపాయ మొకటి లేదె?

తే. పొంత మ్రాఁకులఁ గాల్పక పోయి వహ్ని, యెగసి దవ్వులవాని దహించు భంగిఁ
గర్మవశమున భవమృతికారణములు, దూరగతిఁ బొందు, నిఁక నేల తొట్రుపడఁగ? 38

* "ఆపద పాలైన దేవకిని రక్షించడానికి పుట్టబోయే కుమారులను వీడికి ఇచ్చివేస్తా ననడం ఇప్పటికి మంచిది. ముందు ఏమి జరుగబోతున్నదో ఎవరికి తెలుసు? ఈమె ఇప్పటికి ప్రాణాలతో నిలిచి ఉంటే

రేపు మరోమార్గం లభించదా? పుత్రులే పుట్టి, వారికి వెనువెంటనే మృత్యువుకూడా వచ్చినా రానీ! అందాకా వీడు బ్రహ్మదేవునిచేత ఏ ఆపద పొందకుండానే ఉంటాడా? అప్పటికి ఏదో ఒక చక్కని ఉపాయం ఉండదా?

అడవిలో పుట్టిన దావాగ్ని ప్రక్కనున్న చెట్లను విడిచి, ఎగసి ఎక్కడో దూరాన ఉన్న చెట్లను దహించివేస్తుంది. అలాగే కర్మ ననుసరించి జన్మ, మృత్యువు అనే వాని కారణాలు దూర దూరంగా పోతూ ఉంటాయి. ఇంత తెలిసి ఇంకా తొట్రుపాటు పడడ మెందుకు?

**క. కొడుకుల నిచ్చెద నని సతి, విడిపించుట నీతి, వీఁడు విడిచిన మీఁదం**
**గొడుకులు పుట్టినఁ గార్యము, దడఁబడదే? నాఁటి కొక్క దైవము లేదే? 39**

* కుమారులను ఇస్తానని మాట యిచ్చి భార్యను విడిపించడం తెలివైన పని. వీడిప్పుడు వదలితే, తరువాత కొడుకులు పుట్టేనాటికి పరిస్థితులు తారుమారు కాకపోతాయా? ఆ నాటికి ఏదైవమైనా అడ్డుపడక పోతుందా?

**క. ఎనిమిదవ చూలు వీనిం, దునుమాడెడి నంచు మింటఁ దోరపుఁబలుకుల్**
**వినఁ బడియె, నేల తప్పును?, వనితను విడిపించు టొప్పు వైళం బనుచున్. 40**

* "ఎనిమిదవ గర్భంలో పుట్టినవాడు వీడిని సంహరిస్తాడని సూటి అయిన మాటలు వినువీథి నుంచి వినబడ్డాయి. అవి ఎందుకు తప్పుతాయి? త్వరగా నా భార్యను విడిపించడం మంచిది''అని ఆలోచించాడు వసుదేవుడు.

**క. తిన్నని పలుకులు పలుకుచుఁ, గ్రన్నన తగఁ బూజ చేసి కంసు నృశంసున్**
**మన్నించి చిత్త మెరియఁ బ్ర, సన్నాననుఁ డగుచుఁ బలికె శౌరి నయమునన్. 41**

* మర్యాదతోకూడిన మంచిమాటలతో క్రూరుడైన కంసుని గౌరవించి సంస్తుతించాడు. మనస్సులో మంటగా ఉన్నా, పైకి నవ్వుతున్న ముఖంతో అనునయంగా నేర్పుగా ఇలా అన్నాడు వసుదేవుడు.

**క. "లలనకుఁ బుట్టిన కొమరుని, వలనం దెగె దనుచు గగనవాణి వలికె నం**
**చలిగెద వేని మృగాక్షికిఁ, గల కొడుకులఁ జంప నిత్తుఁ గ్రమమున నీకున్". 42**

* "బావా! ఈమెకు పుట్టే కొడుకువలన మరణిస్తావని ఆకాశవాణి పలికిందని కదా కోపగిస్తున్నావు! ఈమెకు పుట్టిన కొడుకుల నందరినీ వరుసగా నీకు సమర్పిస్తాను. వారిని నీవు చంపుదువుగాని.''

**వ. అని యిట్లు పలికిన విని కంసుడు కంపితావతంసుండై సంతసించి గుణగ్రాహిత్వంబు గైకొని కొందలమందు చెలియలి ముందల విడిచి చనియె, వసుదేవుండును బ్రదుకు మందలఁ గంటి ననుచు సుందరియుం దానును మందిరంబునకుం బోయి డెందంబున నానందంబు నొందియుండె, నంతఁ గొంతకాలంబు సనిన సమయంబున. 43**

* వసుదేవుడు ఇలా చెప్పగానే కంసుడు తల పంకించి సంతోషించాడు. మంచిగుణాలను గ్రహించే వానిలాగున ప్రవర్తించి, భయపడుతున్న చెల్లెలి కొప్పువిడిచి ఇంటికి వెళ్ళిపోయాడు. వసుదేవుడు కూడా బ్రతికి బయటపడ్డా ననుకొని భార్యతో కలిసి తన మందిరానికి వెళ్ళి సంతోషంగా ఉన్నాడు. ఇలా కొంతకాలం గడిచింది.

**క. విడువక కంసుని యెగ్గులఁ, బడి దేవకి నిఖిలదేవభావము దన కే**
**ర్పడ నేఁట నొకని లెక్కను గొడుకుల నెనమండ్ర నొక్క కూతుం గనియెన్. 44**

* కంసునిచేత నిరంతరం బాధలుపడి దేవకీదేవి అందరు దేవతల భావము తాను పొంది ఏడాదికి ఒక్కరుచొప్పున ఎనిమిదిమంది కొడుకులను ఒక్క కూతురును కన్నది.

**వ. అందు. 45**

**ఆ. సుదతి మున్ను గన్న సుతుఁ గీర్తిమంతునిఁ, బుట్టుతడవ కంసభూవరునకుఁ**
**దెచ్చి యిచ్చెఁ జాల ధృతి గల్గి వసుదేవుఁ, డాసపడక సత్యమందు నిలిచి. 46**

* ఆమె కన్న మొదటి కుమారుని పుట్టిన వెంటనే వసుదేవుడు ధైర్యంగా తీసుకొనివచ్చి అన్నమాట ప్రకారం కంసుని కిచ్చివేశాడు.

**క. పలికిన పలుకులు దిరుగక, సొలయక వంచనము లేక సుతుల రిపునకుం**
**గలఁగక యిచ్చిన ధీరుం, డిల వసుదేవుండు దక్క నితరుఁడు గలఁడే? 47**

* ఇచ్చినమాట తప్పకుండా, తాత్సారం చేయకుండా, మోసం చేయకుండా, బెంగపడకుండా, కన్నకొడుకులను శత్రువున కొప్పగించిన ధీరుడు వసుదేవుడు తప్ప భూమి మీద ఇంకెవడున్నాడు?

**ఆ. మానవేంద్ర! సత్యమతికి దుష్కరమెయ్య?, దెఱుక గలుగువాని కిష్ట మెయ్య?**
**దీశభక్తి రతుని కీరాని దెయ్యది?, యెఱుక లేనివాని కేది కీడు? 48**

* పరీక్షిన్మహారాజా! సత్యమునందు నిశ్చలంగా నిలబడిన బుద్ధిమంతునికి కష్టమైనపని ఉండదు. జ్ఞాని అయినవానికి ఇష్టమైనదంటూ ప్రత్యేకంగా ఉండదు. అజ్ఞాని అయిన వాడికి అపకారం అంటూ వేరే ఏమీ ఉండదు. పరమేశ్వర భక్తుడైన వానికి ఇతరులకు ఇవ్వరానిదంటూ ఏమీ ఉండదు.

**వ. ఇట్లు సత్యంబు దప్పక కొడుకు నొప్పించిన వసుదేవుని పలుకు నిలుకడకు మెచ్చి కంసుం డిట్లనియె. 49**

* ఈ విధంగా సత్యం తప్పకుండా కొడుకును తీసుకొని వచ్చి ఒప్పగించిన వసుదేవుని మాటనిలుకడకు మెచ్చుకొని కంసు డిలా అన్నాడు:

**ఆ. కొడుకు నీవు మరలఁ గొనిపొమ్ము వసుదేవ!, వెఱపు లేదు నాకు వీనివలన,**
**నల్గ వీనికి, భవ దష్టమపుత్రుండు, మృత్యు వఁట! వధింతు మీఁద నతని. 50**

* "బావా! వసుదేవా! నీ ఈ కొడుకును నీవే తీసుకొని వెళ్ళు. వీడి వలన నాకు భయంలేదు. కనుక వీడియెడల నాకు కోపం లేదు. నీ ఎనిమిదవ పుత్రుడే నా పాలిట మృత్యువట! వాడు పుట్టిన వెంటనే వధిస్తాను."

**వ. అనిన నానకదుందుభి నందనుం గొని చనియు నానందంబు నొందక, దుష్టస్వభావుండగు బావపలుకులు వినియు నులుకు చుండె, నంత. 51**

* కంసుడిలా అనగానే వసుదేవుడు కొడుకును తీసుకొని తిరిగి వెళ్ళిపోయాడు. అయినా అతనికి సంతోషంగా లేదు. దుష్టస్వభావుడైన కంసుని మాటలు విన్నా "ఎప్పుడేమో" అని లోలోపల ఉలికిపడుతూనే ఉన్నాడు.

**సీ. ఒకనాఁడు నారదుం డొయ్యన కంసుని యింటికిఁ జనుదెంచి యేకతమున**
**'మందలోపల నున్న నందాదులును, వారి భార్యలుఁ బుత్త్రులు బాంధవులును**
**దేవకి మొదలగు తెఱవలు వసుదేవుఁ డాదిగాఁ గల సర్వయాదవులును,**
**సురలు గాని, నిజంబు నరులుగా రని చెప్పి 'కంసుండ! నీవు రక్కసుఁడ వనియు**
**ఆ. దేవమయుఁడు చక్రి దేవకీ దేవికిఁ, బుత్త్రుఁడై జనించి భూతలంబు**
**సెఱుపఁ బుట్టినట్టి చెనఁటి దైత్యుల నెల్లఁ, జంపు' ననుచుఁ జెప్పి చనియె దివికి. 52**

* ఇలా ఉండగా ఒకనాడు నారదమహర్షి కంసుని యింటికి పనికట్టుకొని వచ్చాడు. ఏకాంతంగా కంసుని కలుసుకొని ఇలా చెప్పాడు! "కంసరాజా! వ్రేపల్లెలో ఉన్న నందుడు మొదలైనవారు, వారి భార్యలు కుమారులు, బంధువులు, దేవకి మొదలైన స్త్రీలు, వసుదేవుడు మొదలైన యాదవులు అందరూ దేవతలేగాని కేవలం మానవులు కారు. నీవు రాక్షసుడవు. సర్వదేవతా మయుడైన చక్రధారి విష్ణువు దేవకీదేవి గర్భాన జన్మిస్తాడు, భూమిని పాడుచేయడానికి పుట్టిన దుష్టదైత్యుల నందరినీ సంహరిస్తాడు."

ఇలా చెప్పి నారదుడు దేవలోకానికి వెళ్ళిపోయాడు.

**క. నారదు మాటలు విని పె, ల్లారాటముఁ బొంది యదువు లనిమిషు లనియున్**
**నారాయణకరఖడ్గవి, దారితుఁ డగు కాలనేమి దా ననియు మదిన్. 53**

* నారదుని మాటలు విన్న కంసుడు ఎంతో ఆరాటం పొందాడు. యాదవులు దేవతలని, నారాయణుని చేతి కత్తితో తెగి చనిపోయిన కాలనేమి తానే అని తెలుసుకున్నాడు.

**మ. కలఁగంబాఱి మఱందిఁ జెల్లెలి నుదగ్రక్రోధుఁడై పట్టి బ**
**ద్ధులఁ గావించి హరిం దలంచి వెస తోడ్తో వారు గన్నట్టి పు**
**త్త్రులఁ జంపెన్, గురు నుగ్రసేను యదుఁ దద్భోజాంధకాధీశు ని**
**ర్మలు బట్టెం గడు వాలి యేలెఁ జల మారన్ శూరసేనంబులన్. 54**

* ఈ విధంగా తలచుకొని మనస్సులో బెదిరిపోయాడు. ఉవ్వెత్తున రేగిన కోపంతో దేవకీ వసుదేవులను పట్టి బంధించాడు. వారి పుత్రులను విష్ణుస్వరూపులుగా స్మరించి వెంటనే సంహరించాడు. విజృంభించి

యదు భోజ అంధక దేశాల నేలుతున్న తన తండ్రి ఉగ్రసేనుణ్ణి పట్టి కారాగారంలో పెట్టాడు. పట్టుదలపట్టి శూరసేనదేశాలకు తానే రాజై పరిపాలించాడు.

**ఆ. తల్లిఁ దండ్రి నైనఁ దమ్ముల నన్నల, సఖుల నైన బంధుజనుల నైన**
**రాజ్యకాంక్షఁజేసి రాజులు సంపుదు, రవనిఁ దఱచు జీవితార్థు లగుచు. 55**

* ఈ లోకంలో రాజులు రాజ్యకాంక్షతో తమ జీవితాలను కాపాడు కోవడానికి ఎవరినైనా చంపుతారు. తల్లి తండ్రులు, అన్న, తమ్ముడు, స్నేహితులు, బంధువులు ఎవరైనా వారు లెక్కచేయరు.

**వ. మఱియును బాణ భౌమ మాగధ మహాశన కేశి ధేనుక బక ప్రలంబ తృణావర్త చాణూర ముష్టి కారిష్ట ద్వివిధ పూతనాది సహాయసమేతుండై కంసుండు గదనంబున మదంబు లడంచిన వదనంబులు వంచికొని, సదనంబులు విడిచి యదవలై, యదువులు పదవులు వదలి నిషధ కురు కోసల విదేహ విదర్భ కేకయ పాంచాల సాల్వ దేశంబులు సొచ్చి, మచ్చరంబులు విడిచి కొందఱు కంసునిం గొలిచి నిలిచి, రంత. 56**

* ఈ విధంగా రాజ్యం ఆక్రమించిన కంసుడు రాక్షసులను అనుచరులుగా కూడగట్టు కున్నాడు. బాణుడు, భౌముడు, మాగధుడు, మహాశనుడు, కేశి, ధేనుకుడు, బకుడు, ప్రలంబుడు, తృణావర్తుడు, చాణూరుడు, ముష్టికుడు, అరిష్టుడు, ద్వివిదుడు, పూతన మొదలైన రాక్షసుల సహాయంతో యుద్ధాలు చేసి యాదవులను ఓడించాడు. ఓడిపోయిన వాళ్ళు అవమానాలతో ముఖాలు వంచుకొని తమ ఇండ్లు విడిచి తమ పదవులు వదలి, దీనులై నిషధ, కురు, కోసల, విదేహ, విదర్భ, కేకయ, పాంచాల, సాల్వదేశాలు పట్టి పోయారు. కొందరు మాత్రం అసూయ వదలి కంసుని సేవిస్తూ మధురలోనే ఉండిపోయారు.

**క. తొడితొడిఁ గంసుఁడు దేవకి, కొడుకుల నార్వుర వధింప గురుశేషాఖ్యం**
**దొడవగు హరిరుచి యాసతి, కడుపున నేడవదియైన గర్భం బయ్యెన్. 57**

* దేవకీ దేవి కొడుకుల ఆరుగురిని వెంటవెంటనే కంసుడు వధించాడు. ఆదిశేషు డనబడే మహనీయమై మనోహరమైన విష్ణుదేవుని తేజస్సు దేవకీ దేవి గర్భాన ఏడవదిగా ప్రవేశించింది.

**వ. అ య్యవసరంబున విశ్వరూపుండగు హరి దన్ను నమ్మిన యదువులకుం గంసునివలన భయంబు గలుగు నని యెఱింగి యోగమాయాదేవి కిట్లనియె. 58**

* ఆ సమయంలో విశ్వరూపుడైన హరి, తనను నమ్మిన యాదవులకు కంసునివలన భయం కలుగుతుందని భావించి, యోగమాయా దేవితో ఇలా అన్నాడు.

**సీ. 'గోపికా జనములు గోపాలకులు నున్న పసులమందకుఁ బొమ్ము భద్ర! నీవు**
**వసుదేవుభార్యలు వరుసఁ గంసునిచేత నాఁకలఁ బడియుండ నందుఁ జొరక**
**తలఁగి రోహిణియను తరళాక్షి నంద గోకుల మందు నున్నది గుణగణాఢ్య**
**దేవకికడుపున దీపించు శేషాఖ్య మైన నా తేజ మీ వమరఁ బుచ్చి**

ఆ. నేర్పు మెఱసి రోహిణీదేవి కడుపునఁ, జొనుపు దేవకికిని సుతుఁడ నగుదు
నంశభాగయుతుఁడనై, యశోదకు నందు, పొలఁతి కందు మీఁదఁ బుట్టె దీవు. 59

* "భద్రా! నీవు గోపాలకులు గోపికలు ఉన్న వ్రేపల్లెకు వెళ్ళు. వసుదేవుని భార్యలందరూ కంసునిచేత బంధితలై ఉన్నారు. కాని రోహిణి అనే ఒక భార్య మాత్రం నందగోకులంలో తలదాచుకున్నది. ఆమె చక్కని గుణగణాలు కలిగినది. దేవకి కడుపులో ఉన్న శేషుడనే తేజస్సును నీవు బయటికి తీసి నేర్పుగా రోహిణిగర్భాన ప్రవేశ పెట్టు. నేనా నాఅంశతో దేవకికి జన్మిస్తాను. ఆ తరువాత నందుని భార్యయైన యశోదాదేవికి నీవు బిడ్డగా పుట్టగలవు.

క. నానావిధ సంపదలకుఁ దానకమై సర్వకామదాయిని వగు నిన్
మానవులు భక్తిఁ గొలుతురు, కానుకలును బలులు నిచ్చి కల్యాణమయీ! 60

* ఓ కళ్యాణమయీ! నీవు ఎన్నోరకాల సంపదలకు నిలయమనీ, ఏ కోరికలైనా తీర్చగలవనీ మానవులు భక్తితో నిన్ను పూజిస్తారు. నీకు కానుకలు బలులు ఇస్తారు.

వ. మఱియు నిన్ను మానవులు దుర్గ భద్రకాళి విజయ వైష్ణవి కుముద చండిక కృష్ణ మాధవి కన్యక మాయ నారాయణి యీశాన శారద యంబిక యను పదునాలుగు నామంబులం గొనియాడుదు రయ్యైస్థానంబుల యం'దని యెఱింగించి సర్వేశ్వరుండగు హరి పొమ్మని యానతిచ్చిన మహాప్రసాదం బని యయ్యోగనిద్ర యియ్యకొని మ్రొక్కి చయ్యన ని య్యిల కయ్యెడ వాసి వచ్చి. 61

* దేశంలో వివిధ ప్రాంతాలలోనూ నిన్ను మానవులు దుర్గ, భద్రకాళి, విజయ, వైష్ణవి, కుముద, చండిక, కృష్ణ, మాధవి, కన్యక, మాయ, నారాయణి, ఈశాన, శారద, అంబిక - అనే పదునాలుగు పేర్లతో సేవిస్తారు. ఇక వెళ్ళిరా!''అని సర్వేశ్వరుడైన హరి ఆజ్ఞ ఇచ్చాడు. ఆ యోగనిద్రాదేవి మహాప్రసాదమని అంగీకరించి నమస్కారం చేసి సూటిగా భూలోకానికి వచ్చింది.

తే. దేవకీదేవి కడుపులోఁ దేజరిల్లు, దీప్తగర్భంబు మెల్లనఁ దిగిచి యోగ
నిద్ర రోహిణికడుపున నిలిపి చనియెఁ, గడుపు దిగె నంచుఁ బౌరులు గలఁగఁ బడఁగ. 62

* దేవకీ దేవి కడుపులో కాంతులు చిమ్ముతున్న గర్భాన్ని యోగ నిద్రాదేవి నెమ్మదిగా బయటకు తీసి రోహిణీదేవి కడుపులో ప్రవేశపెట్టి వెళ్లిపోయింది. దేవకీ దేవకి గర్భస్రావం జరిగిపోయిందని పౌరులందరూ బాధపడ్డారు.

వ. అంత. 63

ఆ. బలము మిగులఁ గలుగ 'బలభద్రుఁ' డన లోక, రమణుఁ డగుటఁ జేసి 'రాముఁ' డనఁగ
సతికిఁ బుట్టె గర్భసంకర్షణమున 'సం, కర్షణుం' డనంగ ఘనుఁడు సుతుఁడు. 64

* కొన్నినెలలకు రోహిణీదేవిగర్భాన ఒకకుమారుడు పుట్టాడు. గర్భాన్ని బయటకు లాగడం ద్వారా పుట్టిన వాడుగనుక 'సంకర్షణుడు'అనీ, చాలా బలవంతుడు కావడం వలన 'బలభద్రుడు'అనీ, అందరినీ ఆనందింప జేసేవాడు గనుక 'రాముడు' అనీ అతనికి పేర్లు వచ్చాయి. అతడు చాలా గొప్పవాడు.

వ. తదనంతరంబ. 65

క. ఆనకదుందుభి మనమున, శ్రీనాథుం డంశభాగశిష్టతఁ జొరఁగన్
భానురుచి నతఁడు వెలిఁగెను, గానఁగఁ బట్టయ్యె భూతగణములకు నృపా! 66

* అనంతరం శ్రీదేవికి భర్త ఐన విష్ణుదేవుని అంశ వసుదేవునిలో ప్రవేశించగా అతడు సూర్యకాంతితో ప్రకాశించాడు. పంచ భూతాలకూ, జీవులకూ కూడ అది చూచి ఆనందం కలిగింది.

ఉ. ఆవసుదేవుఁ డంతఁదనయం దఖిలాత్మక మాత్మభూతముం
బావనరేఖయున్ భువనభద్రమునై వెలుఁగొందుచున్న ల
క్ష్మీ విభుతేజ మచ్చుపడఁ జేర్చినఁ దాల్చి నవీనకాంతితో
దేవకి యొప్పెఁ బూర్వయగు దిక్సతి చంద్రునిఁ దాల్చు కైవడిన్. 67

* ఆ వసుదేవుడు, తనలో ప్రవేశించిన విష్ణుతేజాన్ని దేవకీ దేవియందు ప్రవేశింపజేశాడు. ఆ విష్ణుతేజస్సు సృష్టి అంతటా నిండి ఉన్నది. అది అన్నిటికీ ఆత్మ అయినది; లోకాలను పునీతం చేయగలిగినది; లోకాల కన్నిటికీ క్షేమం చేకూర్చేది; లక్ష్మీపతి అయిన విష్ణు దేవుని తేజస్సు అది. ఆ తేజస్సు అచ్చులో పోసినట్లు, తనలో ప్రవేశించగా, దేవకీ దేవి కొత్త కాంతితో ప్రకాశించింది. తూర్పుదిక్కు అనే స్త్రీ చంద్రోదయానికి ముందు చంద్రుని కాంతితో నిండిపోయినట్లు దేవకీదేవి దేదీప్యమానంగా ప్రకాశించింది.

వ. అనిన విని తర్వాతి వృత్తాంతం బెట్లయ్యె నని రా జడిగిన శుకుం డిట్లనియె. 68

* ఇంతవరకు విన్న పరీక్షిత్తు కుతూహలంతో 'ఆ! తరువాత ఏమి జరిగింది?'అని అడిగాడు. అందుకు శ్రీ శుకమహర్షి ఇలా చెప్పసాగాడు.

క. గురుతరముగఁ దన కడుపునఁ, సరసిజగర్భాండభాండ చయములు గల యా
హరి దేవకి కడుపున భూ, భరణార్థము వృద్ధిఁ బొందె బాలార్కు క్రియన్. 69

* ఎంతో బరువైన బ్రహ్మాండ భాండాలెన్నో తన కడుపులో దాచుకొన్న విష్ణువు భూమి నుద్ధరించడానికి దేవకీదేవి కడుపులో ఉదయ సూర్యునిలాగున వృద్ధిపొందాడు.

వ. అంత. 70

సీ. విమతులమోములు వెలవెలఁ బాఱంగ విమలాస్యమోము వెల్వెలుకఁ బాఱె
మలయు వైరులకీర్తి మాసి నల్లన గాఁగ, నాతిచూచుకములు నల్లనయ్యె
దుష్టాలయంబుల ధూమరేఖలు పుట్ట లేమ యారున రోమలేఖ మెఱసె
నరిమానసముల కాహారవాంఛలు దప్ప వనజాక్షి కాహారవాంఛ దప్పె

తే. శ్రమము సంధిల్లె రిపులకు శ్రమము గదుర, జడత వాటిల్లె శత్రులు జడను వడఁగ,
మన్ను రుచియయ్యెఁ బగతురు మన్ను సొరఁగ, వెలఁది యుదరంబులో హరి వృద్ధిఁబొంద. 71

* అప్పుడు దేవకీ దేవికి గర్భవతులైన స్త్రీలకుండే లక్షణాలు కనిపించ సాగాయి. స్వచ్ఛమైన ఆమె ముఖము తెల్లబడుతుండగా దుర్మార్గుల ముఖాలుకూడా తెలతెలబోవడం మొదలెట్టాయి. ఆమె చనుమొనలు నల్లబడుతుండగా శత్రువుల కీర్తులు మాసిపోయి నల్లబడటం ప్రారంభమైనది. ఆమె పొత్తికడుపుపై నూగారు మెరుస్తుండగా, దుష్టుల ఇండ్లలో అపశకునా లయిన ధూమరేఖలు పుట్టాయి. ఆమెకు ఆహారంపై కోరిక తప్పుతుండగా శత్రువులకు బెంగతో ఆహారం హితవు అవటం మానివేసింది. ఆమెకు బడలిక వస్తూ ఉంటే శత్రువులలో తెలియని అలసట మొదలయింది. ఆమెకు బద్ధకము కలుగుతూ ఉంటే శత్రువులు నిశ్చేష్టులు కావడం మొదలయింది. శత్రువులు మట్టికరవవలసిన స్థితి వస్తూ ఉన్నట్లు ఆమెకు మట్టి అంటే రుచి ఎక్కువైంది. ఈ విధంగా దేవకీదేవి కడుపులో విష్ణువు క్రమక్రమంగా వృద్ధి చెందసాగాడు.

వ. మఱియును. 72

సీ. **సలిల మా యెలనాఁగ జఠరార్భకునిఁ గానఁ, జనిన కైవడి ఘర్మసలిల మొప్పె,**
**నొగిఁ దేజ మా యింతి యుదరడింభకుఁ గొల్వఁ గదిసిన క్రియ దేహకాంతి మెఱసెఁ**
**బవనుఁ డా కొమ్మ గర్భస్థుని సేవింప నొలసె నా మిక్కిలి యూర్పు లమరెఁ**
**గుంభిని యా లేమ కుక్షిగు నర్చింపఁ జొచ్చుభంగిని మంటి చొరవ దనరె**

ఆ. **గగన మిందువదనకడుపులో బాలు సే, వలకు రూపు మెఱసి వచ్చినట్లు**
**బయలువంటి నడుము బహుళ మయ్యెను బంచ, భూతమయుఁడు లోనఁ బొదల సతికి.** 73

* దేవ దేవుడు పంచభూతాత్మకుడు అయిన విష్ణువు దేవకీ దేవి గర్భంలో పెరుగుతూ ఉన్నాడు. పంచభూతాలలో - జలములు వానిని చూడడానికి వెళ్ళినవా అన్నట్లు, ఆమెకు చెమటలు పోయడం మొదలెట్టాయి. అగ్ని ఆ కడుపులోని పాపడిని సేవించడానికి వచ్చినట్లు ఆమె శరీరం కాంతితో మెరిసింది. ఆ గర్భస్థుడైన శిశువును వాయుదేవుడు సేవించబోయినట్లు, ఆమెకు నిట్టూర్పులు ఎక్కువైనవి. భూమి ఆ కడుపులోని బాలుని పూజించడానికి వెళ్లినదా అన్నట్లు దేవకీదేవి మన్ను తినడం ఎక్కువైంది. గర్భంలో ఉన్న శిశువును సేవించడానికి ఆకాశం రూపం ధరించి వచ్చిందా అన్నట్లు కనుపించని ఆమె నడుము విశాలమైంది.

వ. తదనంతరంబ. 74

సీ. **అతివకాంచీగుణం బల్లన బిగియంగ వైరివధూ గుణవ్రజము వదలె,**
**మెల్లన తన్వంగి మెయిదీవ మెఱుఁగెక్క దుష్టాంగనాతనుద్యుతు లడంగె,**
**నాతి కల్లన భూషణములు పల్చలన గాఁ బరసతీభూషణపంక్తు లెడలెఁ,**
**గలకంఠి కొయ్యన గర్భంబు దొడ్డగాఁ బరిపంథిదారగర్భములు వగిలెఁ,**

తే. **బొలఁతి కల్లన నీళ్ళాడు ప్రొద్దు లెదుగ, నహితవల్లభ లైదువలై తనర్చు**
**ప్రొద్దు లన్నియుఁ గ్రమమునఁ బోవఁ దొడఁగె, నువిదకడుపున నసురారి యుంటఁజేసి.** 75

* దేవకీదేవి గర్భాన రాక్షసులను సంహరించే విష్ణువు ఉండడంవల్ల, ఆమెకు మొలనూలు నెమ్మదిగా బిగుస్తూ ఉంటే శత్రువుల భార్యల మంగళసూత్రాల త్రాళ్ళు జారిపోసాగాయి. ఆమె శరీర కాంతి హెచ్చుతూ ఉంటే పగవారి భార్యల శరీరకాంతులు మాసిపోసాగాయి. ఆమెకు ఆభరణాలు బరువు అవుతూ ఉంటే శత్రుభార్యల ఆభరణాలు సడలిపో సాగాయి. ఆమె గర్భం బరువెక్కుతూ ఉంటే, శత్రుభార్యల కడుపులు జారిపోసాగాయి. ఆమెకు ప్రసవించే దినాలు దగ్గరవుతున్నకొద్దీ, శత్రుభార్యలు ముత్తైదువులుగా ఉండే దినాలు తరిగి పోవసాగాయి.

**వ. ఇవ్విధంబున.** **76**

**ఆ. జ్ఞానఖలునిలోని శారదయును బోలె, ఘటములోని దీపకళిక వోలె**
**భ్రాతయింట నాఁకఁ బడియుండె దేవకీ, కాంత విశ్వగర్భగర్భ యగుచు.** **77**

* ఈ విధంగా లోకా లన్నింటినీ కడుపులో దాచుకున్న విష్ణువును తన గర్భంలో మోస్తూ ఉన్న దేవకీదేవి అన్నగారి యింట్లో బంధించబడి ఉంది. దుర్మార్గుడైన పండితునిలో సరస్వతివలె, కుండలోపల దీప కళికవలె ఆమె నిర్బంధంలో అణగి మణగి ఉండిపోయింది.

**వ. అంత న క్కాంతాతిలకంబు నెమ్మొగంబు తెలివియును, మేని మెఱుంగును, మెలఁగెడి సొబగునుం జూచి వెఱఁగుపడి తఱచు వెఱచుచుఁ గంసుండు దనలో నిట్లనియె.** **78**

* అంత కంతకూ అతిశయించుతున్న ఆమె ముఖంలోని కాంతినీ, శరీరపు మెరుపునూ, అందాన్నీ చూచి కంసుడు నిశ్చేష్టు డవుతున్నాడు. తరచూ భయపడుతూ తనలో తాను ఇలా అనుకున్నాడు.

**క. కన్నులకుఁ జూడ బరువై, యున్నది యెలనాఁగగర్భ ముల్లము గలఁగన్**
**ము న్నెన్నఁడు నిట్లుండదు, వెన్నుఁడు సొరఁ బోలు గర్భవివరములోనన్.** **79**

* ఈమె గర్భం చూస్తూ ఉంటేనే నా గుండె బరువెక్కి పోతున్నది. మనస్సు కలవరపడిపోతున్నది. ఇంతకుముందు ఏ గర్భాన్ని చూచినా ఇలా లేదు. ఈ గర్భంలో విష్ణువు ప్రవేశించి ఉంటాడు.

**ఉ. ఏమి దలంచువాఁడ? నిఁక నెయ్యది కార్యము? నాఁడు నాఁటికిం**
**గామిని చూలు పెంపెసఁగె? గర్భిణిఁ జెల్లెలి నాఁడు పేద నే**
**నేమని చంపువాఁడఁ? దగ వేలని చంపితినేని శ్రీయు ను**
**ద్దామ యశంబు నాయువును ధర్మమునుం జెడిపోవ కుండునే?** **80**

* ఇంక ఏమి ఆలోచించాలి? ఏమిటి చేయడం? రోజు రోజుకీ ఈమె గర్భం కాంతిమంతమవుతూ ఉంది. గర్భవతి, చెల్లెలు, ఆడకూతురు ఈమెను ఎట్లా చంపేది? ఎందుకు వచ్చిన గొడవ అని చంపితినా, నా ఐశ్వర్యం, ఆయువూ, కీర్తీ, ధర్మం అన్నీ నాశనమైపోవా?

**క. వావి యెఱుంగని క్రూరుని, జీవన్మృతుఁ డనుచు నిందసేయుదు, రతఁడుం**
**బోవును నరకమునకు, దు, ర్భావముతో బ్రదుకు టొక్క బ్రదుకే తలఁపన్?** **81**

* వాని వరుసలు చూడని క్రూరుడు బ్రతికినా చచ్చినవాడే అని నిందిస్తారు లోకులు. అలాంటివాడు నరకానికి పోతాడు. దుష్టుడనే పేరుతో బ్రతకడం కూడా ఒక బ్రతుకేనా?

**వ. అని నిశ్చయించి క్రౌర్యంబు విడిచి, ధైర్యంబు నొంది, గాంభీర్యంబు వాటించి, శౌర్యంబు ప్రకటించు కొనుచు, దిగ్గనం జెలియలిం జంపు నగ్గలిక యెగ్గని యుగ్గడించి, మాని, మౌనియుం బోలె నూర కుండియు. 82**

* ఇలా నిశ్చయించుకుని క్రౌర్యం మాని ధైర్యం తెచ్చుకుని గాంభీర్యం పైన పులుముకొని, శూరునివలె ప్రవర్తించాడు. "చెల్లెలిని చంపడం మహాపాపం"అని గట్టిగా భావించాడు. ఆ తర్వాత ఏమీ మాట్లాడకుండా మౌనిలాగా శాంత స్వభావం ప్రకటిస్తూ ఉండిపోయాడు.

**ఆ. 'పాపరాని దొడ్డపగ పుట్టె, నిఁక నెట్టు, లిందుముఖికిఁ జక్రి యెపుడు పుట్టుఁ?**
**బుట్టినపుడె పట్టి పురిటింటిలోఁ దెగఁ, జూతు' ననుచు నెదురు సూచుచుండె. 83**

* అయినా లోలోపల మాత్రం కంసుడు భయపడుతూనే ఉన్నాడు. "తప్పించుకోలేని గొప్ప శత్రుత్వం పుట్టుకొని వచ్చింది. ఇంకెలాగ? ఈమెకు విష్ణువు పుడతాడో ఏమిటో? పుట్టగానే పురుటింటిలోనే వాడిని పట్టుకొని చంపివేస్తాను" అంటూ దేవకి ప్రసవించే సమయంకోసం ఎదురుచూడ సాగాడు.

**వ. మఱియు వైరానుబంధంబున నన్యానుసంధానంబు మఱచి యతండు. 84**

**క. తిరుగుచుఁ గుడుచుచుఁ ద్రాగుచు, నరుగుచుఁ గూర్చుండి లేచు చనవరతంబున్**
**హరిఁ దలఁచి తలఁచి జగ మా, హరిమయ మని చూచెఁ గంసుఁ డాఱని యలుకన్. 85**

* విష్ణువుతో సంభవించిన శత్రుత్వం కారణంగా కంసునికి విష్ణువు తప్ప ఇతర విషయం అంటూ ఏమీ లేకుండా పోయింది. తిరుగుతున్నా, భోజనం చేస్తున్నా, త్రాగుతున్నా, నడుస్తూ ఉన్నా, కూర్చున్నా, లేచినా ఎల్లప్పుడూ విష్ణువునే స్మరించ సాగాడు. క్రోధంతో వేడెక్కిపోయి, లోకమంతా విష్ణుమయంగానే దర్శించసాగాడు.

**వ. వెండియు. 86**

**సీ. శ్రవణరంధ్రముల నే శబ్దంబు వినఁబడు నది హరిరవ మని యాలకించు,**
**నక్షిమార్గమున నెయ్యది సూడఁబడు నది హరిమూర్తి గానోపు నంచుఁ జూచుఁ,**
**దిరుగుచో దేహంబు తృణమైన సోఁకిన హరికరాఘాతమో యనుచుఁ నులుకు,**
**గంధంబు లేమైన ఘ్రాణంబు సోఁకిన హరిమాలికాగంధ మనుచు నదరుఁ,**

**ఆ. బలుకు లెవ్వియైనఁ బలుకుచో హరి పేరు, పలుకఁ బడియె ననుచు భ్రమసి పలుకుఁ**
**దలఁపు లెట్టివైనఁ దలఁచి యా తలఁపులు, హరితలంపు లనుచు నలుగఁ దలఁచు. 87**

* చెవులకు ఏ శబ్దం వినబడినా అది విష్ణుదేవుని మాటేనని వింటూ ఉన్నాడు. కనుల కేది కనిపించినా అది విష్ణువు రూపమేనని చూస్తున్నాడు. శరీరానికి గడ్డిపరక తగిలినా విష్ణుచేయి తగిలిందేమో నని

ఉలిక్కిపడుతున్నాడు. ముక్కుకు ఏ వాసన సోకినా అది విష్ణువు మెడలోని వనమాలిక వాసనేమో నని అదరిపడుతున్నాడు. తాను ఏ మాట ఉచ్చరించినా విష్ణువు పేరు పలికానేమో నని భ్రమపడి విష్ణువు పేరే పలుకుతున్నాడు. ఎటువంటి ఆలోచనలు వచ్చినా అవి విష్ణువును గురించిన ఆలోచన లేమోనని ఆగ్రహం తెచ్చుకుంటున్నాడు.

**వ. ఆయ్యవసరంబున ననుచరసమేతులైన దేవతలును, నారదాది మునులునుం గూడి నడవ నలువయును, ముక్కంటియు నక్కడకు వచ్చి దేవకీ దేవిగర్భంబున నర్భకుండై యున్న పురుషోత్తము నిట్లని స్తుతియించిరి. 88**

* ఇలా ఉండగా బ్రహ్మదేవుడూ, పరమేశ్వరుడూ దేవతలతోనూ, నారదాది మునులతోనూ, అనుచరులతోనూ కలిసి దేవకీదేవి బంధింపబడి ఉన్న కారాగారం దగ్గరకు వచ్చారు. ఆమె గర్భంలో శిశువుగా ఉన్న పురుషోత్తముడైన విష్ణువును ఈ విధంగా స్తోత్రం చేశారు.

## -: బ్రహ్మాదిదేవతలు దేవకీ గర్భస్థుండగు శ్రీకృష్ణుని స్తుతించుట. :-

**సీ. సత్యవ్రతుని నిత్యసంప్రాప్తి సాధనుఁ గాలత్రయమునందుఁ గలుగువాని**
**భూతంబు లైదును బుట్టుచోటగు వాని నైదుభూతంబులం దమరువాని**
**నైదు భూతంబులు నడఁగిన పిమ్మటఁ బరఁగువానిని సత్యభాషణంబు**
**సమదర్శనంబును జరిపెడు వానిని ని న్నా శ్రయింతుము, నీ యధీన**

**ఆ. మాయచేత నెఱుకమాలిన వారలు, పెక్కుగతుల నిన్నుఁ బేరుకొందు,**
**రెఱుఁగ నేర్చు విబుధు లేకచిత్తంబున, నిఖిలమూర్తు లెల్ల నీవ యండ్రు. 89**

* "మహానుభావా! నీవు సత్యమే వ్రతంగా కలవాడవు. నిత్యత్వం అనే యోగసిద్ధి ప్రాప్తించడానికి నీవే ఆధారం. జరిగినది, జరుగుతున్నది, జరుగబోయేది అయిన కాలములలో నీవు ఉంటూ ఉంటావు. భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశం, అనే అయిదు భూతాలూ నీయందే జన్మిస్తున్నాయి. ఆ ఐదు భూతాలలోనూ నీవే నిండి ఉన్నావు. పంచభూతాలూ ప్రళయంలో అణగి పోయిన తర్వాత కూడా నీవు ఉంటూ ఉంటావు. సృష్టిలో ఉన్న సత్యమనేదే నీ వాక్కు, అన్నిటినీ సమానంగా చూడడం అనేది నీవే నిర్వహిస్తూ ఉంటావు.

అటువంటి నీవే దిక్కని నిన్ను ఆశ్రయిస్తున్నాము. మాయ అనేది నీ అధీనంలో ఉంటుంది. ఆ మాయచేత జ్ఞానం కప్పబడి అజ్ఞానం ఆవరించినవారు నీయందు భేదభావం వహించి ఉంటారు. కాని జ్ఞానులైన పండితులు మాత్రం ఒకే మనస్సుతో ఆలోచించి, అన్ని అనగలుగుతారు.

**వ. అదియునుంగాక. 90**

**సీ. ప్రకృతి యొక్కటి పాదు, ఫలములు సుఖదుఃఖములు రెండు, గుణములు మూఁడు వేళ్ళు,**
**తగు రసంబులు నాల్గు ధర్మార్థముఖరంబు, లెఱిఁగెడి విధము లై దింద్రియంబు,**

**లాఱు స్వభావంబు లా శోకమోహాదు లూర్ములు, ధాతువు లొక్కయేడు,**
**పైపొర లెనిమిది ప్రంగలు, భూతంబు లైదు బుద్ధియు మనోఽహంకృతులును,**

**తే. రంధ్రములు దొమ్మిదియుఁ గోటరములు, ప్రాణ పత్త్రదశకంబు, జీవేశ పక్షియుగముఁ**
**గలుగు సంసార వృక్షంబు గలుగఁజేయఁ, గావ నడఁగింప రాజ వొక్కరుఁడ వీవ. 91**

* జీవుల కందరికీ ఈశ్వరుడవు నీవు. ఈ సృష్టిలో సంసారమనే వృక్షం ఒకటుంది. దానికి ప్రకృతి అనేది పాదు. సుఖదుఃఖాలనేవి రెండు ఫలాలు.

సత్త్వము, రజస్సు, తమస్సు అనే గుణాలు మూడు దానికి వేళ్ళు.

ధర్మము అర్థము కామము మోక్షము అనే నాలుగు పురుషార్థాలూ రసాలు.

దానికి శబ్దం, స్పర్శం, రూపం, రుచి, వాసన అనే ఐదూ ఇంద్రియాలు గ్రహించే విధానాలు.

కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములు అనే ఆరు స్వభావాలూ ఆ వృక్షానికి గల ఆరు ఊర్ములు. (ఆకలి, దప్పిక, శోకము, మోహము, ముసలితనము, మరణము - అనేవి).

రసం, రక్తం, మాంసం, మేదస్సు, అస్థి, మజ్జ, శుక్రము అనే ఏడు ధాతువులూ ఆ వృక్షానికి గల ఏడుపొరలు. ఇంత తెలిసి ఇంకా తొట్రుపాటు పడడ మెందుకు?

పంచభూతాలు, బుద్ధి, మనస్సు, అహంకారం అనే ఎనిమిదీ ఆ వృక్షానికి కొమ్మలు.

కన్నులు, చెవులు, ముక్కుపుటాలు, నోరు, మలమూత్రద్వారాలు అనే తొమ్మిదీ ఆ వృక్షానికి గల తొమ్మిది రంధ్రాలు.

ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానము అనే పంచప్రాణాలు; నాగము, కూర్మము, కృకరము, దేవదత్తము, ధనంజయము అనే అయిదు ఉపప్రాణాలూ- మొత్తం పది ప్రాణాలు అనే ఆకులు ధరించి ఉంటుంది ఆ సంసారవృక్షం.

జీవుడు ఈశ్వరుడు అనే రెండు పక్షులు ఆ వృక్షంపైన నివసిస్తూ ఉంటాయి.

ఇటువంటి అద్భుతమైన సంసార వృక్షాన్ని పుట్టించడానికీ, రక్షించడానికీ, మళ్ళీ లయం చేయడానికీ, ప్రభువు నీ వొక్కడవే.

**క. నీదెసఁ దనుచిత్తము లిడి, యే దెసలకుఁ బోక కడతు రెఱుక గలుగు వా,**
**రా దూడయడుగుక్రియ నీ, పాదంబను నావకతన భవసాగరమున్. 92**

* జ్ఞాను లైనవారు తమ మనస్సును ఏ వైపునకూ పోనీయకుండా నీయందే నిలుపుతారు. అందువలన వారు నీ పాదమనే నావ ఆధారంతో, భయంకరమైన సంసార మహాసముద్రాన్ని ఆవుదూడ అడుగును దాటినంత తేలికగా దాట గలుగుతారు.

ఆ. మంచివారి కెల్ల మంగళప్రద లయ్యుఁ, గల్లరులకు మేలుగాని యట్టి
తనువు లెన్నియైనఁ దాల్చి లోకములకు, సేమ మెల్లప్రొద్దుఁ జేయు దీవు. 93

* నీవు నిత్యమూ ఎన్ని శరీరాలు అవసరమైతే అన్ని శరీరాలూ ధరిస్తూ లోకాలకు క్షేమం కలుగజేస్తూ ఉంటావు. ఆ శరీరాలతో నీవు మంచివారి కందరికీ శుభములు చేకూరుస్తూ, దుష్టులకు శిక్ష విధిస్తూ ఉంటావు.

క. ఎఱిఁగినవారల మనుచును, గొఱమాలిన యొఱుక లెఱిఁగి కొందఱు నీ పే
రెఱిఁగియుఁ దలఁపఁగ నొల్లరు, పఱతు రధోగతుల జాడఁ బద్మదళాక్షా! 94

* నీ నామ సంకీర్తనం నిజంగా జ్ఞానులైన వారిని రక్షిస్తుంది. కొందరు జ్ఞానుల మనుకొంటూ దుష్టులై పనికిమాలిన తెలివితేటలతో నీ నామ సంకీర్తన చేయరు. అలా ప్రవర్తించి అధోగతులైన వారిని చూచి అయినా వారు నేర్చుకోరు.

క. నీవారై నీ దెసఁ దమ, భావంబులు నిలిపి ఘనులు భయవిరహితులై
యే విఘ్నంబులఁ జెందక, నీ వఱలెడి మేటిచోట నెగడుదు రీశా! 95

* నిజంగా గొప్పవారైనవారు తమ సొంతం అంటూ ఏమీ లేకుండా నీ వారుగా ఉంటారు. నీ యందే తమ భావాలను నిలిపి ఉంచడం వల్ల భయం అనేది వారికి ఉండదు. నీ యందు హృదయాలు నిలపడం వల్ల విఘ్నాలేవీ వారిని చేరవు. నీవు ఎక్కడ ఉంటావో ఆ దివ్యలోకంలోనే వారూ నివసిస్తారు.

క. నిను నాలుగాశ్రమంబుల, జనములు సేవింప నఖిలజగముల సత్త్వం
బును శుద్ధంబును శ్రేయం, బును నను గాత్రంబు నీవు వొందుదువు హరీ! 96

* బ్రహ్మచారులు, గృహస్థులు, వానప్రస్థులు, సన్న్యాసులు అనే నాలుగు ఆశ్రమాల ప్రజలూ నిన్ను సేవిస్తూ ఉంటారు. అన్ని లోకాలలోనూ సత్త్వమయ మైనదీ, పరిశుద్ధ మైనదీ, క్షేమము చేకూర్చేదీ అయిన దేహాన్ని నీవు పొందుతూ ఉంటావు.

సీ. నలినాక్ష! సత్త్వగుణంబు నీ గాత్రంబు గాదేని విజ్ఞానకలిత మగుచు
నజ్ఞానభేదకం బగు టెట్లు? గుణముల యందును వెలుఁగ నీ వనుమతింపఁ
బడుదువు, సత్త్వరూపంబు సేవింపంగ సాక్షాత్కరింతువు సాక్షి వగుచు
వాఙ్మనసముల కవ్వలిదైన మార్గంబు గలుగు, నీ గుణజన్మకర్మరహిత

తే. మైన రూపును బేరు నత్యనఘబుద్ధు, లెఱుఁగుదురు, నిన్నుఁగొల్చ నూహించుకొనుచు
వినుచుఁ దలఁచుచుఁ బొగడుచు వెలయువాఁడు, భవము నొందఁడు నీ పాదభక్తుఁ డగును. 97

* పద్మదళములవంటి కన్నులు గల శ్రీమన్నారాయణా! సత్త్వ గుణమే నీ శరీరంగా రూపు కట్టుకుంది. కాకపోతే విజ్ఞానంతో నిండి ఉండి, నీ శరీరం అజ్ఞానాన్ని భేదించటం ఎలాసాధ్యం? గుణములలో కూడా వెలుగుతూ ఉన్నవాడుగా నీవు పరిగణింపబడుతూ ఉన్నావు. అలా కాకుండా నీ సత్త్వరూపాన్నే సేవిస్తే

సాక్షాత్కరిస్తావు. అటువంటప్పుడు నీవు గుణములకు అంటక, కేవలము సాక్షివిగా ఉంటావు. వాక్కుకు మనసుకు అతీతంగా ఉంటుంది నీ మార్గం; గుణములకు, కర్మలకు, అతీతమైన నీ రూపాన్నీ పుణ్యాత్ములైన వివేకవంతులు గ్రహిస్తున్నారు. నిన్ను సేవిస్తూ, భావన చేస్తూ, వింటూ, స్మరిస్తూ, స్తోత్రం చేస్తూ, జీవించేవాడు తిరిగి ఈ సంసారాన్ని పొందడు. నీ పాదములనే అంటిపెట్టుకొని భక్తుడై ఉండిపోతాడు.

**క. ధరణీభారము వాసెను, బురుషోత్తమ! యీశ! నీదు పుట్టువున, భవ**
**చ్చరణాంబుజముల ప్రాపున, ధరణియు నాకసముఁ గాంచెదము నీ కరుణన్.** 98

* పురుషోత్తమా! ఈశ్వరా! నీవు జన్మించడంవల్ల ఈ భూ భారం తగ్గిపోతుంది. నీ పాదపద్మములు మాకు అండగా ఉండగా, నీ దయవల్ల భూమి, ఆకాశమూ ఎక్కడ ఉన్నాయో చూడగల్గుతాము.

**ఉ. పుట్టువు లేని నీ కభవ! పుట్టుట క్రీడయ కాక పుట్టుటే?**
**యెట్టనుడున్ భవాదిదశ లెల్లను జీవులయం దవిద్య దాఁ**
**జుట్టుచు నుండుఁ గాని నినుఁ జుట్టినదింబలెఁ బొంత నుండియుం**
**జుట్టఁగ లేమిఁ దత్క్రియలఁ జొక్కని యెక్కటి వౌదు వీశ్వరా!** 99

* పుట్టుట ఎరుగని నారాయణా! నీకు పుట్టుక అంటూ వేరే లేదు. అటువంటి నీవు ఇలా పుట్టడం అనేది నీకు క్రీడగాని, పుట్టుక కాదుకదా! అది ఎలా అంటే జన్మ, మరణం మొదలైన స్థితులన్నీ మాయ కారణంగా జీవులను ఆవరిస్తూ ఉంటాయి. కాని నిన్ను మాత్రం ఆ మాయాదేవి ప్రక్కన నిలబడికూడా స్పృశించలేక దూరంగా ఉండిపోతుంది. కనుక ఆ మాయామయమైన క్రియలు వేటిలోనూ చిక్కుకొనకుండ ఏకైక మూర్తివిగా నిలబడిపోతావు. కనుకనే ఈ జగత్తుల కన్నిటికీ నీవు ఈశ్వరుడవు.

**మ. గురుపాఠీనమవై జలగ్రహమవై కోలంబవై శ్రీనృకే**
**సరివై భిక్షుఁడవై హయాననుఁడవై క్ష్మాదేవతాభర్త వై**
**ధరణీనాథుఁడవై దయాగుణగణోదారుండవై లోకముల్**
**పరిరక్షించిన నీకు మ్రొక్కెద, మిలాభారంబు వారింపవే!** 100

* నీవు ఎన్నో అవతారా లెత్తి దయాదాక్షిణ్యాలు మొదలైన గుణాలతో, ఉదారుడవై లోకాలను రక్షించావు. మహామత్స్య రూపుడవై, కూర్మమూర్తివై, వరాహరూపుడవై, నరసింహుడవై, వామనమూర్తివై, హయగ్రీవుడవై, పరశురాముడవై, శ్రీరామచంద్రుడవై, లోకాలను రక్షించిన నీకు ఇదే మేము నమస్కరి స్తున్నాము. ఈ భూమి భారాన్ని తొలగించ వలసిందిగా నిన్ను ప్రార్థిస్తున్నాము.

**క. ముచ్చిరి యున్నది లోకము, నిచ్చలుఁ గంసాది ఖలులు నిర్దయు లేఁచన్,**
**మచ్చిగఁ గావఁగ వలయును, విచ్చేయుము తల్లికడుపు వెడలి ముకుందా!** 101

* కంసుడు మొదలైన దుర్మార్గులు క్రూరంగా వేధిస్తూ, బాధిస్తూ ఉంటే ఈ లోకం నిత్యం దుఃఖంలో మునిగిపోయి ఉంది. ముకుందా! లోకాన్ని కాపాడడానికి తల్లి కడుపులోనుండి వెంటనే బయటికి రావయ్యా!

వ. అని మఱియు దేవకీదేవిం గనుంకొని 102

మత్త.తల్లి! నీ యుదరంబులోనఁ బ్రధానపూరుషుఁ డున్న వాఁ
డెల్లి పుట్టెడిఁ, గంసుచే భయ మింత లేదు, నిజంబు, మా
కెల్లవారికి భద్రమయ్యెడు, నింక నీ కడు పెప్పుడుం
జల్లగావలె యాదవావళి సంతసంబునఁ బొంగఁగన్. 103

* బ్రహ్మాది దేవతలు ఈ విధంగా విష్ణువును ప్రార్థించి, దేవకీ దేవిని చూచి ఇలా అన్నారు.

"తల్లీ! నీ గర్భంలో పురుషోత్తముడు ఉన్నాడు. రేపు పుట్టబోతున్నాడు. కంసునివలన ఏ మాత్రమూ భయంలేదు. మా మాట నమ్ము. ఈ నాటినుండి మాకందరికీ క్షేమం చేకూరుతుంది. యాదవు లందరూ సంతోషంతో పొంగిపోతూ ఉన్నారు. ఎల్లవేళలా నీ కడుపు చల్లగా వర్ధిల్లాలి."

వ. అని యి వ్విధంబున హరిం బొగడి దేవకీదేవిని దీవించి దేవత లీశానబ్రహ్మల మున్నిడుకొని చని, రంత - 104

* దేవతలు ఈ విధంగా విష్ణువును సంస్తుతించి దేవకీదేవిని దీవించి, బ్రహ్మ మహేశ్వరులతో వెనుదిరిగి వెళ్ళిపోయారు.

## -: శ్రీ కృష్ణావతార ఘట్టము :-

క. పంకజముఖి నీ ళ్ళాడను, సంకటపడ ఖలుల మానసంబుల నెల్లన్
సంకటము దోఁచె, మెల్లన, సంకటములు లేమి దోఁచె సత్పురుషులకున్. 105

* పద్మంవంటి ముఖం కల్గిన దేవకీదేవి ప్రసవించడానికి వేదన పడుతూ ఉంటే దుష్టుల మనస్సులలో ఏదో ఆవేదన కల్గింది. మంచి వారికి కష్టాలు నెమ్మదిగా తొలగుతూ ఉన్న సూచనలు కనిపించాయి.

సీ. స్వచ్ఛంబులై పొంగె జలరాసు లేడును గలఘోషణముల మేఘంబు లుఱిమె,
గ్రహతారకలతోడ గగనంబు రాజిల్లె దిక్కులు మిక్కిలి తెలివిఁ దాల్చెఁ
గమ్మని చల్లని గాలి మెల్లన వీచె, హోమానలంబు చెన్నొంది వెలిఁగెఁ
గొలఁకులు కమలాళికులములై సిరి నొప్పెఁ, బ్రవిమలతోయలై పాఱె నదులు,

తే. వరపుర గ్రామఘోషయై వసుధ యొప్పె, విహగ రవ పుష్పఫలముల వెలసె వనము,
లలరుసోనలు గురిసి ర య్యమరవరులు దేవదేవుని దేవకీదేవి గనఁగ. 106

* దేవకీదేవి దేవదేవుని ప్రసవిస్తూ ఉన్న ఆ సమయంలో ఏడు సముద్రాలు ఉప్పొంగినాయి. మేఘాలు ఆనందంతో ఆ విషయాన్ని చాటుతున్నట్లు గర్జించాయి. ఆకాశము గ్రహాలతోనూ, తారకలతోనూ ప్రకాశించింది. దిక్కులన్నీ దివ్యకాంతులతో నిండిపోయాయి. చల్లనిగాలి కమ్మని వాసనలతో మెల్లగా వీచింది. ఆ అర్ధరాత్రి ఋషులు ప్రత్యేకంగా చేస్తూవున్న హోమకుండాలలో అగ్ని జాజ్వల్యమానంగా వెలిగింది.

తామరపూలతోనూ, వాటిలో ఝుంకారాలు చేస్తూ తిరుగుతూ ఉన్న తుమ్మెదలతోనూ కొలనులు కళకళ లాడాయి. నదులు చాలా నిర్మలమైన నీటితో నిండుగా ప్రవహించాయి. శ్రేష్ఠమైన నగరాలతో, గ్రామాలతో, గోకులములతో, ఉత్సవాలతో భూదేవి వెలిగిపోయింది. పక్షుల కిలకిలారావాలతో, పుష్కలమైన పూలతో, పండ్లతో ఉద్యానవనాలు, అరణ్యాలు ఆనందం ప్రకటించాయి. దేవకీదేవి ఆ దేవదేవుడైన ఆ వాసుదేవుణ్ణి కంటూ ఉండగా దేవత లందరూ పుష్పవర్షాలు కురిపించారు.

క. **పాడిరి గంధర్వోత్తము, లాడిరి రంభాదికాంత, లానందమునం**
**గూడిరి సిద్ధులు, భయముల, వీడిరి చారణులు, మొరసె వేల్పుల భేరుల్.** 107

* విశ్వావసు మొదలైన గంధర్వులు ఆనందంతో దివ్యగానం చేశారు. రంభ మొదలైన అప్సరసలు నృత్యం చేశారు. సిద్ధులు అనబడే దేవతలు ఆనందంతో ఒకచోట చేరారు. చారణులు అనబడే దేవతలు భయం తీరి ఆనందించారు. దేవతలు ఉత్సవం చేసుకుంటున్నట్లు భేరీలు మ్రోగించారు.

వ. **అ య్యవసరంబున.** 108

క. **సుతుఁ గనె దేవకి నడురే, యతి శుభగతిఁ దారలును గ్రహంబులు నుండన్**
**దితిసుత నిరాకరిష్ణున్, శ్రితవదనాలంకరిష్ణు జిష్ణున్ విష్ణున్.** 109

* అటువంటి సమయంలో దేవకీదేవి అర్ధరాత్రివేళ విష్ణువును ప్రసవించింది. అతడు రాక్షసులను శిక్షించేవాడు. అతణ్ణి ఆశ్రయించే వారి ముఖాలు ఆనందంతో వెలిగిపోయాయి. ఆ సమయంలో తారలు గ్రహాలు అత్యంత శుభమైన స్థానాల్లో ఉన్నాయి.

క. **వెన్నుని నతిప్రసన్నునిఁ, గ్రన్నన గని మెఱుఁగుఁబోఁడి గడు నొప్పారెం**
**బున్నమనాఁడు కళానిధిఁ, గన్న మహేంద్రాశ చెలువుగలిగి నరేంద్రా!** 110

* విష్ణువును ప్రసవించిన దేవకీదేవి శరీరం మెరుపుతీగలాగ దేదీప్యమానంగా ప్రకాశించింది. ఆ పుట్టిన బిడ్డడు చిరునవ్వులు చిందిస్తూ సమస్త కళామయ మూర్తిగా ఉన్నాడు. ఆ సమయంలో పూర్ణిమనాడు పదహారు కళలతో నిండిన చంద్రుని ప్రసవించిన తూర్పు దిక్కులాగా దేవకీ దేవి ప్రకాశించింది.

వ. **అప్పుడు.** 111

సీ. **జలధరదేహు నాజానుచతుర్బాహు సరసీరుహాక్షు విశాలవక్షుఁ**
**జారుగదాశంఖచక్రపద్మవిలాసుఁ గంఠకౌస్తుభమణికాంతి భాసుఁ**
**గమనీయ కటిసూత్ర కంకణ కేయూరు శ్రీవత్సలాంఛనాంచిత విహారు**
**నురుకుండల ప్రభాయుత కుంతలలలాటు వైదూర్యమణిగణ వరకిరీటు**

తే. **బాలుఁ బూర్ణేందురుచిజాలు భక్తలోక, పాలు సుగణాలవాలుఁ గృపావిశాలుఁ**
**జూచి తిలకించి పులకించి చోద్య మంది, యుబ్బి చెలరేఁగి వసుదేవుఁ డుత్సహించె.** 112

* అప్పుడు వసుదేవుడు ఆ బాలుని తేరిపారచూచాడు. ఆ బాలుడు ఆయనకు దివ్యరూపంతో దర్శనమిచ్చాడు. ఆ పిల్లవాడు మేఘవర్ణ శరీరం కలిగి ఉన్నాడు. అతడి పొడవైన నాలుగు బాహువులలో గద, శంఖం, చక్రం, పద్మం వెలుగొందుతున్నాయి. తామరపువ్వు రేకులవంటి కన్నులు, విశాలమైన వక్షఃస్థలం కలవాని కంఠంలో కౌస్తుభరత్నం కాంతులు వెలుగొందుతున్నాయి. అందమైన మొలత్రాడు, కంకణాలు, బాహుపురులు ధరించి ఉన్నాడు. శ్రీవత్సమనే పుట్టుముచ్చ వక్షఃస్థలం పైన మెరుస్తున్నది. చెవులకున్న కుండలాల కాంతితో నుదుటి ముంగురులు వెలుగుతున్నాయి. మణులు, వైదూర్యాలు పొదిగిన కిరీటం ధరించాడు.

ఆబిడ్డడు బాలుడుగానే ఉన్నా ఈ అన్ని దివ్యలక్షణాలతోనూ పూర్ణచంద్రుని కాంతులు చిమ్ముతూ ఉన్నాడు. అతడు భక్తులందరిని రక్షించేవాడు. సృష్టిలోని సుగుణాలన్నీ అతనివద్దనుండే పుట్టినాయి. అతివిశాలమైన కరుణ గలవాడు.

అటువంటి బాలుని చూచిన వసుదేవుడు మళ్ళీమళ్ళీ తేరిపారచూచి పులకించి పోయాడు, ఆశ్చర్యపోయాడు, ఉప్పొంగిపోయాడు. ఆ పారవశ్యంనుంచి తేరుకుని ఉత్సాహంతో నిలబడ్డాడు.

క. **స్నానము సేయఁగ రామిని, నానందరసాబ్ధిమగ్నుఁడై విప్రులకున్**
**ధేనువులం బదివేలను, మానసమున ధారవోసె మఱి యిచ్చుటకున్.** **113**

* స్నానం చేయడం వీలుకాక పోయినప్పటికీ ఆనందరసమనే సముద్రంలో మునిగితేలిన వసుదేవుడు బ్రాహ్మణులకు పదివేల ఆవులను దానం చేస్తానని మానసికంగా ధారపోశాడు.

వ. **మఱియు వసుదేవుండు.** **114**

క. **ఈ పురిటియింటి కుద్య, ద్దీపంబును బోలి చాల దీపించి నిజం**
**బీ పాపఁడు నలు మొగముల, యా పావని గనిన మేటి యగు నని భక్తిన్.** **115**

ఆ. **చాఁగి మ్రొక్కి లేచి సరగున నొసలిపై, గేలుఁదమ్మిదోయిఁ గీలుకొలిపి**
**పాపఁ డనక వెఱక పాపని మొదలింటి, పోకలెల్లఁ దలఁచి పొగడఁ దొడఁగె.** **116**

* వసుదేవుడు ఇలా అనుకొన్నాడు. "ఈ పురిటింటికి గొప్ప దీపంలాగా ఈ బాలుడు వెలుగొందు తున్నాడు. నిజంగా ఆ నాలుగు మొగాల పాపని కన్నతండ్రి విష్ణువే ఈ పాపడు"అనుకున్నాడు. భక్తితో సాష్టాంగపడి నమస్కారం చేశాడు. రెండుచేతులూ తామర మొగ్గలాగా నొసటిపై చేర్చాడు. బాలుడని వెనుదీయకుండా ఆ బాలుని దివ్యచరిత్రలన్నీ తలచుకుని పొగడసాగాడు.

క. **ఏ నిన్ను నఖిలదర్శను, జ్ఞానానందస్వరూపు సంతతు నపరా**
**ధీనుని మాయాదూరుని, సూనునిఁగాఁ గంటి, నిట్టి చోద్యము గలదే?** **117**

* "స్వామీ! నీవు సమస్త సృష్టినీ నీయందు దర్శింప జేస్తావు. జ్ఞానము, ఆనందము ఒక్కటై నీ రూపం కట్టుకున్నాయి. నీవు శాశ్వతుడవు. ఎవరి అదుపాజ్ఞలకు నీవు లొంగవలసిన పనిలేదు. మాయ నిన్ను

అంటలేక దూరంగా తొలగిపోతుంది. ఇటువంటి నిన్ను నేను కుమారుడుగా కన్నానట! ఇలాంటి చోద్యం ఎక్కడైనా ఉన్నదా?

**క. అచ్చుగ నీ మాయను మును, జెచ్చెరఁ ద్రిగుణాత్మకముగఁ జేసిన జగముం**
**జొచ్చినక్రియఁ జొరకుందువు, చొచ్చుటయును లేదు, లేదు చొరకుండుటయున్. 118**

* నీమాయను చక్కగా నీ నుండి వెలువరచి, సత్త్వం, రజస్సు, తమస్సు అనే మూడు గుణాలుగా విస్తరింప జేస్తావు. ఆ మూడు గుణాలతోనూ జగత్తులన్నీ సృష్టి అవుతాయి. త్రిగుణాలు నీలో నిండి ఉంటాయి. కనుక సృష్టిలో నీవు ప్రవేశించడం ఉండదు. అలా అని ప్రవేశించక పోవడమూ ఉండదు.

**సీ. అదియు నెట్లన మహదాదులఁ బోలెడి దై వేఱువేఱయై యన్నివిధము**
**లగు సూక్ష్మభూతంబు లమర షోడశ వికారములతోఁ గూడి విరాట్టనంగఁ**
**బరమాత్మునకు నీకుఁ బఱపైన మేను సంపాదించి యందులోఁ బడియుఁ బడక**
**యుండు సృష్టికి మున్న యున్న కారణమున వానికి లోనిభవంబు గలుగ,**

**ఆ. దట్లు బుద్ధి నెఱుఁగ ననువైన లాగునఁ, గలుగు నింద్రియముల కడలనుండి**
**వాని పట్టులేక వరుస జగంబులఁ, గలసియుండి యైనఁ గలయ వెపుడు. 119**

* సృష్టికి ముందు సృష్టిలో ఉండవలసిన సూక్ష్మశక్తులు అన్నీ కలిసి నీకు 'విరాట్' అనే పేరుగల శరీరం నిర్మిస్తాయి. అలా నిర్మించడానికి పదహారు కళలు అనబడే ప్రకృతి వికారాలతో ఆ సూక్ష్మ శక్తులు కలిసిపోతాయి. ' ఆ విరాట్' అనే శరీరం నీకు విస్తరించడానికి అవసరమైనది. ఆ నీ శరీరం సృష్టికి ఆధారమైన మహత్తు మొదలైన ధర్మాలవంటిదేగాని, వానికన్న వేరుగా కూడా ఉంటుంది. అనగా వానిలో నిండిఉండి, వానికన్నా అతీతంగా కూడా ఉంటుంది. ఆ శరీరంలో నీవు ప్రవేశించి ఉండి, దానికి అతీతంగా కూడా ఉంటావు. ఎందుచేతనంటే అది నీ శక్తి అనే నీటినుండి తయారైన ఒక బుడగ వంటిది. నీవు సృష్టికి ముందు కూడా ఉన్నందువల్ల విరాట్టులోనికి నీవు పుట్టడం ఉండదు. మానవులకు ఇంద్రియాల ప్రవృత్తులు ఎక్కడ ఆగిపోతాయో అక్కడ ఉండి బుద్ధితో పరిశీలిస్తే ఈ విధమైన జ్ఞానం కలుగుతుంది. నీవు ఆ సూక్ష్మ శక్తుల ఆధారం లేకుండానే జగత్తులో నిండి ఉండి కూడా దానితో కలవకుండా ఉండిపోతావు.

**క. సర్వము నీలోనిదిగా, సర్వాత్ముఁడ, వాత్మవస్తు సంపన్నుఁడవై**
**సర్వమయుఁడ వగు నీకును, సర్వేశ్వర! లేవు లోనుసంధులు వెలియున్. 120**

* సృష్టి అంతా నీలోనే ఉన్నది గనుక సర్వమునకూ ఆత్మ అయిన వాడవు నీవు. నీ చేత తయారైన వస్తువులతో సర్వమునందు నిండి ఉన్న నీకు లోపల, బయట, మధ్య ఉండే మార్పులు అనేవి లేవు. కనుకనే నీవు సర్వేశ్వరుడవు.

**ఆ. ఆత్మవలనఁ గలిగి అమరుదేహాదుల, నాత్మకంటె వేఱు లవి యటంచుఁ**
**దలఁచువాఁడు మూఢతముఁడు గావున నీశ!, విశ్వ మెల్ల నీవ, వేఱు లేదు. 121**

* ఆత్మనుండే శరీరం మనస్సు మొదలైనవి పుట్టుకువస్తాయి. వాటిని ఆత్మకన్నా వేరు అని అనుకునేవాడు మూర్ఖులలోకెల్లా మూర్ఖుడు. కనుక విశ్వమంతా నీవే. నీవు కానిది వేరుగా ఏమి లేదు. నీవు మాకు ఈశ్వరుడవు.

**వ. అదియునుం గాక. 122**

**సీ. గుణము వికారంబుఁ గోరికయును లేని నీవలన జగంబు నెఱి జనించుఁ,**
**బ్రబ్బు, లేదగు; నంచుఁ బలుకుట దప్పుగా దీశుండవై బ్రహ్మ మీవ యైన**
**నినుఁ గొల్చు గుణములు నీ యానతులు సేయ, భటుల శౌర్యంబులు పతికి వచ్చు**
**పగిది నీ గుణముల బాగులు నీ వని తోఁచును నీమాయతోడఁ గూడి**

**ఆ. నీవు రక్త ధవళ నీల వర్ణంబుల, జగము సేయఁ గావ సమయఁ జూడఁ**
**దనరు, దట్లు నేఁడు దైత్యుల దండింపఁ, బృథివిఁ గావ నవతరించి తీశ! 123**

* నీవలన జగత్తు అంతా జన్మిస్తుంది. అయితే ఆ జగత్తుకి అవసరమైన త్రిగుణాలు గాని, వాని మార్పులు గాని నీకు లేవు. సృష్టి చేయాలనే కోరికకూడా నీకు లేదు. నీ వల్లనే పుట్టిన జగత్తు నీవలననే వృద్ధిపొంది నీయందే లయమవుతుంది అనడం పొరపాటు కాదు. సర్వాతీతుడవై బ్రహ్మము అయిన నీవు తమ ప్రభువు వని త్రిగుణాలు నీ ఆజ్ఞను పరిపాలిస్తాయి. లోకంలో భటుల శౌర్యం ప్రభువు శౌర్యంగా ప్రసిద్ధి కెక్కుతుంది. అలాగే నీ మాయతో కూడి గుణాలూ, వాటి గొప్పతనమూ నీవిగా కన్పిస్తుంటాయి? నీవు ఎర్రని రంగుతోకూడి ఉన్నప్పుడు రజోగుణ రూపుడవై సృష్టిచేశావు. తెల్లని రంగుతోకూడి ఉన్నప్పుడు సత్త్వగుణ రూపుడవై సృష్టిని రక్షిస్తావు. నల్లని రంగుతోకూడి ఉన్నప్పుడు తమోగుణ రూపుడవై, సృష్టినంతటినీ లయం చేస్తావు. ఇవన్నీ నీవు ధరించే పాత్రలు. అలాగే నేడుకూడా దుష్టులను దండించడానికి భూమిపై మానవుడుగా అవతరించావు. అయినా నీవు మాకు ప్రభుడవే!

**శా. మింటన్ మ్రోసిన మ్రోఁత దాలిమిని లో మేంగ్రడింప మున్ నీవు నా**
**యింటం బుట్టెద వంచుఁ గంసుఁడు దొడిన్ హింసించె నీ యన్నలం,**
**గంటం గూరుకుఁ దేఁడు, నీ యుదయ మా కారాజనుల్ సెప్పఁగా**
**బంటింపం, డెదురేఁగుదెంచు వడి నీపై నేఁడు సన్నద్ధుఁడై. 124**

* ఆకాశంలో వినబడిన మాటలు కంసుని ధైర్యాన్ని కూలద్రోశాయి. ఆనాటి నుండి నీవు ఈ యింటిలో పుట్టబోతున్నావని భయపడి, వాడు నీ అన్నల నందరినీ సంహరించాడు. ఇప్పుడు నీవు, పుట్టబోతున్నావని తెలిసి కంట కునుకు లేకుండా ఉన్నాడు. నీవు పుట్టావని ఈ కారాగార భటులు చెబితే ఇక వెనుకాడడు. వెంటనే ఇప్పుడే నీ పైకి విరుచుకుని పడడానికి సిద్ధంగా ఉన్నాడు.

## -: దేవకీదేవి స్వామిని స్తుతించుట. :-

**వ. అనుచుండ దేవకీదేవి మహాపురుష లక్షణుండును, విచక్షణుండును, సుకుమారుండును నైన కుమారునిం గని, కంసునివలన వెఱపున శుచిస్మితయై యిట్లనియె. 125**

* వసుదేవుడిలా అంటూ ఉండగా, దేవికీదేవి ఆ బాలుని వంక చూచింది. అతడు సాముద్రిక శాస్త్రరీత్యా మహాపురుషుని లక్షణాలు కలిగి ఉన్నాడు. అతడు చక్కని చూపులతో చాలా సుకుమారంగా కనిపిస్తున్నాడు. కంసుని పేరు వసుదేవుడు ఎత్తగానే ఆమె భయపడింది. అయినా ఆ బాలుని చూడగానే ఆమె ముఖం చిరునవ్వుతో వెలుగొందింది. ఆమె బాలుడుగా ఉన్న ఆ దేవదేవుని వంక చూచి ఇలా విన్నవించింది.

సీ. అట్టిట్టి దనరానిదై మొదలై నిండుకొన్నదై వెలుఁగుచు గుణము లేని
దై యొక్క చందంబుదై కలదై నిర్విశేషమై క్రియలేక చెప్పరాని
దేరూపమని శ్రుతు లెప్పుడు నొడివెడి యా రూప మగుచు నధ్యాత్మదీప
మై బ్రహ్మ రెండవ యర్థంబు తుదిజగంబులు నశింపఁ, గఁ బెద్దభూతగణము
ఆ. సూక్ష్మభూతమందుఁ జొరఁగ నా భూతంబు, ప్రకృతిలోనఁ జొరఁగఁ బ్రకృతి వోయి
వ్యక్తమందుఁ జొరఁగ వ్యక్త మడంగను, శేషసంజ్ఞ నీవు సెలువ మగుదు. 126

* బ్రహ్మదేవుని ఆయుర్దాయంలోని రెండవ సగం పూర్తి అయిన తర్వాత స్థూలమైన పంచ మహా భూతాలూ అహంకార మనే సూక్ష్మభూతంలో లీనమవుతాయి. అది మూలప్రకృతిలో లీనమవుతుంది. ఆ మూలప్రకృతి వ్యక్తతత్త్వం లోనికి లీనమవుతుంది. ఆ వ్యక్తతత్త్వం కూడా లీనమైన తర్వాత శేషుడవై నీవు నిలబడి ఉంటావు. అలాంటి నీ తత్త్వం అలాంటిదీ ఇలాంటిదీ అనే వర్ణనకు అతీతమైనది. అదే అన్నిటికీ మొదలు. అన్నిటా అదే నిండి వెలుగుతూ ఉంటుంది. గుణాలకు అది అతీతమైనది. ఏకైకతత్త్వంగా నిలబడి ఉంటుంది. అదికాక వేరుగా శేషించిన దంటూ ఏమీ ఉండదు. దానిరూపం ఇలా ఉంటుంది అని చెప్పడానికి వీలులేదు. ఎందువల్లనంటే అది సర్వక్రియా స్వరూపమైనది. వేదాలు ఆ తత్త్వాన్ని గురించే ఎప్పుడూ గానం చేస్తూ ఉంటాయి. ఆత్మను అధిష్ఠించి, దానికి ఆధారంగా నిలబడిన జ్యోతి అది! అది నీవే!

ఉ. విశ్వము లీలఁ ద్రిప్పుచు నవిద్యకుఁ జుట్టమ వైన నీకుఁ దా
శాశ్వతమైన కాలమిది సర్వము వేడబమందు, రట్టి వి
శ్వేశ్వర! మేలుకుప్ప నిను నెవ్వఁడు గోరి భజించు వాఁడపో
శాశ్వతలక్ష్మి మృత్యుజయ సౌఖ్యయుతుం డభయుండు మాధవా! 127

* విశ్వేశ్వరా! ఈ విశ్వాన్ని అంతటినీ నీ లీలతో ప్రవర్తింపజేస్తూ ఉంటావు. దానికి ఆధారమైన 'అవిద్య'అనబడే మాయకు నీవు దగ్గరి బంధువవు! కనుక ఈ శాశ్వతమూ, అనంతమూ అయిన కాలమంతా నీవు నడిపించే మాయ. ఇలా శాశ్వతమైన కాలాన్ని ప్రవర్తింపజేస్తూ జగత్తులకు మేలు చేకూర్చే నిన్ను కోరి ఆరాధించేవాడు వివేకవంతుడు. వాడే సమస్త లక్ష్మీకళలనూ, శాశ్వత మృత్యుంజయత్వాన్నీ, శాశ్వత సుఖాన్ని పొందినవాడు. లక్ష్మీదేవికి భర్తవైన నిన్ను సేవించేవాడే భయం అంటే ఏమిటో తెలియనివాడు!

మత్త. ఒంటి నిల్చి పురాణయోగులు యోగమార్గనిరూఢులై
'కంటి' మందురు కాని, నిక్కము కాన! రీ భవదాకృతిం
గంటి భద్రముఁ గంటి, మాంసపుఁ గన్నులం గనఁబోల, దీ
తొంటిరూపుఁ దొలంగఁ బెట్టుము తోయజేక్షణ! మ్రొక్కెదన్. 128

* ప్రాచీనకాలం నుంచీ మహాయోగీశ్వరులు యోగమార్గంలో అత్యంత దీక్షతో ఒంటరిగా తమకు తాము సాధనచేసి నిన్ను చూచామంటారు. కాని వారు చూచింది తాము చూడదలచిన రూపాన్నే కానీ నీవు అనుగ్రహించే ఆ రూపాన్ని కాదు. నీవు అనుగ్రహించి దర్శనం ఇప్పించిన ఈ రూపాన్ని నేనుచూచాను. ఇంక నాకు భయమనేదే లేదు. ఈ భౌతికమైన కన్నులతో నీ ఈ దివ్యరూపాన్ని చూడడంకష్టంగా ఉంది. సర్వానికీ ఆధారమైన ఈ స్వస్వరూపాన్ని ఉపసంహరించుకో! నీ చూపులలో ఏవేవో వెలుగులు విచ్చుకుం టున్నాయి. కమలదళాలవంటి కన్నులుగల ఓ దేవా! నీ కిదే నమస్కారం చేస్తున్నాను.

ఆ. విలయకాలమందు విశ్వంబు నీ పెద్ద, కడుపులోన దాఁచు కడిమి మేటి
నటుఁడ వీవు, నేఁడు నా గర్భజుఁడ వౌట, పరమపురుష! వేడబంబు గాదె! 129

* సృష్టి అంతా ప్రళయంలో లీనమై పోయినపుడు ఈ సమస్త విశ్వాన్నీ నీ కడుపులో దాచుకున్న సమర్థుడవైన మహానటుడవు. అటువంటి పరమ పురుషుడవు నీవు నా కడుపున పుట్టడం నీ మాయ కాక పోతే మరేమిటి!

తరలము. నలినలోచన! నీవు నిక్కము నాకుఁ బుట్టెద వంచు నీ
ఖలుఁడు గంసుఁడు పెద్దకాలము కారయింట నడంచె, దు
ర్మలినచిత్తుని నాజ్ఞసేయుము, మమ్ముఁ గావుము భీతులన్,
నలుసులేక ఫలించె నోఁచిన నోము లెల్లను నీవయై. 130

* పద్మదళాలవంటి చిక్కని కన్నులున్న నీవు నా కడుపున పుట్టబోతున్నావని విని, దుర్మార్గుడైన కంసుడు మమ్ములను చాలాకాలం ఈ కారాగృహంలో బంధించి బాధపెట్టాడు. మురిగిపోయిన మనస్సుగల ఆ దుష్టుని శిక్షించి, భయభ్రాంతులమైన మమ్ము రక్షించు. మేము నోచుకున్న నోములన్నీ ఏ లోటు లేకుండా ఈ విధంగా నీ రూపంగా పండినాయి.

## -: దేవకీ వసుదేవుల పూర్వజన్మముల వృత్తాంతము :-

వ. అని యిట్లు దేవకీదేవి విన్నవించిన నీశ్వరుండిట్లనియె, అవ్వా! నీవు దొల్లి స్వాయంభువ మన్వంతరం బునఁ బృశ్నియను పరమపతివ్రతవు, వసుదేవుండును సుతపుం డను ప్రజాపతి, మీ రిరువురును సృష్టికాలంబున బ్రహ్మపంపునం, బెంపున నింద్రియంబుల జయించి తెంపున వాన గాలి యెండ మంచులకు సైరించి యేకలములయి యాకలములు దిని యే కలంకంబును లేక వేంద్రంబుగఁ బంద్రెండువేల దివ్యవర్షంబులు దపంబులు సేసిన నెపంబున మీ రూపంబులు మెరయ నోజ

**నాజపంబులు సేసి, డాసి, పేర్చి, యర్చింప మీకు నాకుం గల రూపుఁ జూపి యేను 'దిరంబు లగు వరంబులు వేఁడుం' డనిన మీరు నా మాయం బాయని మోహంబున బిడ్డలు లేని దొడ్డయడ్డంబున దుర్దమం బగు నపవర్గంబు గోరక నా యీఁడు కొడుకు నడిగిన మెచ్చి యట్ల వరం బిచ్చి మీ కేను 'బృశ్నిగర్భుం'డన నర్భకుండ నయితి, మఱియును. 131**

* ఈ విధంగా విన్నవించిన దేవకీదేవితో ఈశ్వరుడైన మహా విష్ణువు ఇలా అన్నాడు. "అమ్మా! పూర్వం స్వాయంభువ మన్వంతరంలో నీవు 'పృశ్ని' అనే మహాపతివ్రతగా పుట్టావు. అప్పుడు వసుదేవుడు "సుతపుడు"అనే ప్రజాపతి. మీరిద్దరూ సృష్టికాలంలో బ్రహ్మదేవుని ప్రేరణతో మహాతపస్సు చేశారు. ఇంద్రియములను జయించారు. గాలి, వాన, ఎండ, మంచు మొదలైనవి సహించారు. ఏకాకులై ఆకులు, అలములు తిని తీవ్రమైన మహాతపస్సు చేశారు. అలా పంద్రెండు వేల దివ్యసంవత్సరాలు తపస్సు చేయగా మీ రూపాలు ప్రకాశమానంగా వెలిగాయి. అలా నిష్ఠతో నా నామజపం చేసి నా తత్త్వాన్ని సమీపించ గలిగారు. చక్కని రీతిలో నన్ను పూజించారు. అప్పుడు నేను నా సత్యస్వరూపాన్ని చూపి శ్రేష్ఠమైన వరాలు కోరుకో మని అనుగ్రహించాను. అయితే మీరు అతి కష్టసాధ్యమైన మోక్షాన్ని కోరలేదు. ఆ సమయంలో నా మాయ మిమ్ములను ఆవరించింది. అప్పటికి మీకు బిడ్డలు లేరు కనుక మోహంతో నాతో సాటియైన కొడుకును ప్రసాదించమని మీరు నన్ను అర్థించారు. సృష్టి, సంతానం పొందడం అనేది నా సంకల్పం గనుక నేను మీ కోరికకు మెచ్చుకున్నాను. అలాగే వర మిచ్చాను. నా సాటివాడు అంటూ వేరొకడు లేడు గనుక నేను మీ దంపతులకు కుమారుడుగా జన్మించాను. అప్పుడు నా పేరు "పృశ్నిగర్భుడు"

**క. అదితియుఁ గశ్యపుఁడును నన, విదితుల రగు మీకుఁ గుఱుచవేషంబున నే**
**నుదయించితి వామనుఁ డనఁ, ద్రిదశేంద్రానుజుఁడనై ద్వితీయభవమునన్. 132**

* రెండవ జన్మలో మీరు అదితి, కశ్యపుడు అనుపేర్లతో ప్రఖ్యాతులైన దంపతులుగా జన్మించారు. అప్పుడు నేను పొట్టివాని రూపంలో వామనుడు అనే పేరుతో మీకు జన్మించాను. అప్పుడు ఇంద్రుడు నాకు అన్నగారు.

**క. ఇప్పుడు మూఁడవబామునఁ, దప్పక మీ కిరువురకును దనయుఁడ నైతిం**
**జెప్పితిఁ బూర్వము మీయం, దెప్పటికిని లేదు జన్మమిటపై నాకున్. 133**

* మూడవజన్మలో ఇప్పుడు పూర్వం నేనిచ్చిన మాటప్రకారం మీకు కుమారుడుగా పుట్టాను. ఇక మీయందు ఎప్పటికీ నా జన్మము లేదు.

**క. నందనుఁ డనియుం బరమా, నందంబగు బ్రహ్మ మనియు ననుఁ దలఁచుచు నా**
**పెందెరువు నొందెదరు, నా, యందలి ప్రేమమున భవము నందరు మీరల్. 134**

* నన్ను మీరు కుమారుడని తలచుకుంటూ ఉంటారు. ఇప్పుడు నేను అనుగ్రహించిన ఈ దర్శనంవలన పరమానంద స్వరూపంబైన పరబ్రహ్మము నేనే అనికూడ నన్ను అనుకుంటూ ఉంటారు.

ఆ నిరంతరం సంస్మరణం వలన నా అద్భుతమైన అపవర్గమార్గాన్ని పొందుతారు. నా యందు మీ కున్న ప్రేమవలన ఇక ముందు మీరు జన్మ ఎత్తరు.

**వ. అని యిట్ల పలికి యీశ్వరుం డా రూపంబు విడిచి. 135**

**క. చెప్ప లిడక తలిదండ్రులు, దప్పక తనుఁజూడ మాయఁ దనరి లలితుఁడై**
**యప్పుడటు గన్నపాపని, యొప్పున వేడుకలు సేసె నొకకొన్ని నృపా! 136**

* పరీక్షిన్మహారాజా! ఇలా చెప్పి శ్రీమహావిష్ణువు ఆ దివ్యరూపం వదలి పసిబిడ్డనిరూపం ధరించాడు. దేవకీవసుదేవులు దిగ్భ్రాంతులై రెప్పలు వాల్చక అతనినే చూస్తూ ఉండిపోయారు. వారు చూస్తూ ఉండగానే నారాయణుడు మాయను ఆవరింపజేసుకొని సుకుమారుడైన శిశువుగా మారిపోయాడు. అప్పుడే పుట్టిన బిడ్డనివలె కేరుకేరు మని ఏడవడం వంటి కొన్ని వేడుకలు చూపాడు.

**వ. అంత వసుదేవుండు దనకుం జేయవలసిన పను లీశ్వరుండైన హరివలన నెఱింగిన వాఁడు గావున. 137**

* అప్పుడు వసుదేవుడు తాను చేయవలసిన పనులను శ్రీహరి సంకల్పంవలన గ్రహించాడు.

**క. ఆ పురిటి యిల్లు వెలువడి, పాపనిఁ దరలించు కొనుచుఁ బఱచెద ననుచున్**
**రూపింప నందుభార్యకుఁ, బాప యగుచు యోగమాయ ప్రభవించె నృపా! 138**

* ఆ బిడ్డని తీసుకొని ఆ పురిటియిల్లు దాటి పరువెత్తి పోవాలని అతడు గ్రహించాడు. అదే సమయానికి వ్రేపల్లెలో నందుని భార్య అయిన యశోదాదేవికి ఆడుబిడ్డగా యోగమాయ జన్మించింది.

**వ. అ య్యవసరంబున. 139**

**క. బిడ్డనిఁ గరముల ఱొమ్మున, నడ్డంబుగఁ బట్టి పదము లల్లన యిడుచున్**
**జడ్డనఁ గావలి వారల, యొడ్డు గడచి పురిటిసాల యొయ్యన వెడలెన్. 140**

* అప్పుడు వసుదేవుడు పసిబిడ్డను చేతుల్లోకి ఎత్తుకొని, అడ్డంగా రొమ్ముకు హత్తుకొని, చప్పుడు చేయకుండా మెల్లమెల్లగా అడుగులు వేసుకుంటూ బయలు దేరాడు. గభాలున కావలివాళ్ల గండం గడిచి, పురిటింటిలో నుండి నెమ్మదిగా బయటపడ్డాడు.

**వ. అంత నట. 141**

**క. నందుని సతికి యశోదకుఁ, బొందుగ హరి యోగమాయ పుట్టిన మాయా**
**స్పందమున నొక్క యెఱుఁగమి, గ్రందుకొనియె నూరివారిఁ గావలివారిన్. 142**

* అక్కడ వ్రేపల్లెలో నందునిభార్య యశోదకు విష్ణుదేవుని యోగమాయ పుట్టగానే ఆ ఊరి వారినీ, ఊరి కావలివారినీ కూడా ఒక చిత్రమైన మైకం ఆవరించింది.

**వ. అప్పుడు చప్పుడు గాకుండఁ దప్పటడుగు లిడుచు, నినుప గొలుసుల మెలుసుల వీడినఁ దాలంబులు మహోత్తాలుండై న బిడ్డనికి నడ్డంబు గాక కీలూడి వీడి పడ, నరళంబులు విరళంబులైన సరళంబులగు**

**మొగసాలలం గడచి, పాఁపతేఁడు వాకిళ్ళు మరల మూయుచుఁ, బడగ లెడగలుగ విప్పి, కప్పి, యేచి, కాచికొని వెంట నంటి రాఁగఁ దూఁగి నడచు నెడ. 143**

* వసుదేవుడు పురిటింటిని దాటి, చప్పుడు కాకుండా తప్పటడుగులతో ముందు చావడిలోకి వచ్చాడు. హరిమాయవలన కాళ్లకు ఉన్న ఇనుపగొలుసుల అతుకులు ఊడిపోయాయి. చేతుల సంకెళ్ళు విడిపోయాయి తలుపులకున్న తాళాలు ఆ దివ్య మహిమగల పాపని సంకల్పానికి అడ్డురాలేక కీళ్ళు ఊడి పడిపోయాయి. ద్వారాలు వాటంతట అవే తెరచుకున్నాయి. వసుదేవుడు మెల్లగా ముందున్న చావళ్ల దాటాడు. అక్కడ ఎక్కడా దాక్కోవడానికి వీలులేకుండా అన్ని చావళ్ళు సూటిగా ఉన్నాయి. అయినా హరి మాయవలన ఎవరూ చూడలేదు. వసుదేవుడు ద్వారాలు దాటుతూ ఉంటే వెనకనుంచి ఆదిశేషుడు ఆ ద్వారాలు మూస్తూ ఆయన వెనువెంటనే వచ్చాడు. పడగలు విప్పి ఆ బాలునికి గొడుగులాగా పట్టి నడచాడు. వెనుకనుంచి ఏ అపదా రాకుండా కాచుకుంటూ బయలుదేరాడు. వసుదేవుడు చీకటిలో తూలుతూ ముందుకు సాగిపోయాడు.

**క. అ శౌరికి దెరువొసఁగెఁ బ్ర, కాశోద్ధత తుంగ భంగ కలిత ధరాశా**
**కాశ యగు యమున మును సీ, తేశునకుఁ బయోధి త్రోవ యిచ్చిన భంగిన్. 144**

* అలా వెడుతూ ఉండగా అతని దారికి యమునానది అడ్డు వచ్చింది. ఎగసిపడుతున్న తరంగాలు మళ్ళీ విరిగిపోతూ దిక్కులనూ ఆకాశాన్నీ ఏకం చేస్తున్నట్లు ఉరవళ్ల పరవళ్ల త్రొక్కుతూ ప్రవహిస్తూ ఉంది. పూర్వం సీతాపతి అయిన రామచంద్రునకు సముద్రం దారి యిచ్చినట్లు, యమునానది వసుదేవునకు దారియిచ్చింది.

**వ. ఇట్లు యమున దాఁటి, దూఁటి, చని, నందుని మందంజేరి, యందమంద నిద్రం బొంది, యొడ లెఱుంగని గొల్లలం దెలుప నొల్లక, నిత్యప్రసాదయగు యశోదశయ్యా నొయ్యన చిన్ని నల్లనయ్యా నునిచి, చయ్యన న య్యవ్వకూఁతు నెత్తుకొని, మరల నింటికిఁ బంటింపక వచ్చి, య చ్చిఱుతపాపను దేవకి ప్రక్కం జక్క నిడి. 145**

* ఈ విధంగా వసుదేవుడు యమునానదిని దాటి, హుటాహుటిన ప్రయాణం చేసి, నందుని వ్రేపల్లెలో ప్రవేశించాడు. అక్కడ గొల్లలందరూ అతిగాఢమైన నిద్రలో ఉన్నారు. వారిని మేల్కొల్పడం ఇష్టంలేక, వసుదేవుడు యశోదాదేవి నిద్రిస్తున్న స్థలం వద్దకు చేరాడు. ఆమె మైమరచి హాయిగా నిద్రపోతున్నది. ఆమెప్రక్కలో తన చేతిలోని చిన్నారి నల్లనయ్యను పడుకో బెట్టాడు వసుదేవుడు. వెంటనే ఆమె ప్రక్కలో ఉన్న ఆమె కొమార్తెను ఎత్తుకొని బయలుదేరాడు. జాగుచేయకుండా వేగంగా తిరిగి వచ్చి ఆ చిన్నిపాపను దేవకిప్రక్కలో అనుమానం రాకుండా మెల్లగా పడుకోబెట్టాడు.

**క. పదముల సంకెల లిడుకొని, మదిఁ దలఁకుచు శూరసుతుఁడు మందుఁడు వోలెన్**
**బెదరు గలరీతి దేహము, గదలించుచు నొదిఁగియుండె గఱువతనమునన్. 146**

* వసుదేవుడు వెంటనే భయంభయంగా కాళ్లకు సంకెళ్ళు యథాప్రకారం తగిలించుకున్నాడు. శూరసేనుని కుమారుడైన ఆ వసుదేవుడు ఏమీ ఎరుగనివాడివలె, బెదురుతున్న వాడివలె, ఒదిగి ఒదిగి పోతూ, శరీరాన్ని దాచుకుంటున్నట్లు చక్కగా నటించసాగాడు.

క. **వనజాక్షునిఁ దెచ్చుటయును, దనసుతఁ గొనిపోవుటయును దా నెఱుఁగక మూఁ**
**గిన నిద్రఁ జొక్కియుండెను, వనజాక్షి యశోద రేయి వసుధాధీశా! 147**

* వసుదేవుడు వచ్చి నల్లనయ్యను తెచ్చి తనప్రక్కన పడుకోబెట్టడం గానీ, తన బిడ్డను తీసుకొని పోవడంగానీ, ఎరుగకుండా యశోదా దేవి రాత్రి అంతా ముంచుకువచ్చిన నిద్రలో ఉండిపోయింది. కమల దళాల వంటి కన్నులున్న యశోదకు అలాంటి కన్నులే ఉన్నబిడ్డడు పుట్టాడని అందరూ అనుకొన్నారు.

సీ. **అంత బాలిక యావు రని యేడ్చు చిఱుచప్పు డాలించి వే కన నాఁకయింటి**
**కావలివారు మేల్కని చూచి తలుపుల తాళముల్ తొంటివిధమున నుండఁ**
**దెలిసి చక్కన వచ్చి దేవకి నీళ్ళాడె రమ్మురమ్మని యాభోజరాజుతోడఁ**
**జెప్పిన నాతఁడు చిడిముడి పాటుతోఁ దల్పంబు పై లేచి తత్తఱమున**

తే. **వెండ్రుకలు వీడఁ బై చీర వ్రేలియాడఁ, దాల్మి కీలూడ రోషాగ్ని దర్పమాడ**
**భూరివైరంబుతోఁ గూడ పురిటియింటి, జాడఁ జనుదెంచి యా పాపఁ జంపఁ గదియ. 148**

* ఇక్కడ మథురలోని కారాగృహంలో చిన్ని పాప అప్పుడు కేరు కేరున ఏడ్చింది, ఆ శబ్దం విని కావలి భటులు వెంటనే మేల్కొన్నారు. అప్పటికి విష్ణుమాయ విడిపోయింది కాబోలు. లోపలికి తొంగిచూచి తాళాలు పరీక్షచేశారు. తాళాలన్నీ యథాప్రకారంగానే ఉన్నాయని సంతృప్తి పడ్డారు. వెంటనే కంసుని వద్దకు పరుగెత్తుకు వెళ్ళి, దేవకి ప్రసవించిందనీ చూడడానికి రమ్మనీ చెప్పారు. అతడు గాబరాతో లేచి, కంగారుగా బయలుదేరాడు. తలవెండ్రుకలు చిందరవందరగా వ్రేలాడుతున్నాయి. పై ఉత్తరీయం నేలపై జీరాడుతున్నది. ఓర్పు నశించి, రోషాగ్ని విజృంభించి నాట్యమాడుతున్నది. తనతోపాటు తీరని శత్రుత్వం వెంటరాగా, వాడు పురుటింటికి పరువెత్తుకుని వచ్చాడు. ఆ చిన్నిపాపను చంపబోయాడు.

వ. **అంత దేవకి యడ్డంబు వచ్చి యిట్లనియె. 149**

* అప్పుడు దేవకీదేవి అడ్డం వచ్చి ఇలా వేడుకొంది.

ఉ. **అన్న! శమింపు మన్న! తగ దల్లుఁడు గాఁ డిది మేనగోడ లా**
**మన్నన సేయుమన్న! విను మానినిఁ జంపుట రాచపాడి గా**
**దన్న, సుకీర్తివై మనఁ గ దన్న! మహాత్ములు వోవు త్రోవఁ బో**
**వన్న! భవత్సహోదరిఁ గదన్న, నినున్ శరణంబు వేఁడెదన్. 150**

* అన్నా! శాంతించవయ్యా! ఇది నీకు తగిన పనికాదు. మేనల్లుడైతే నిన్ను వధిస్తాడు గాని ఇది మేనకోడలు గదా! మేనకోడలని ముద్దుచేయడం భావ్యం! నా మాట విను. ఆడుదానిని చంపడం రాజులకు తగినపని కాదు. కోపాన్ని అణచుకొని, శత్రువులనుకూడా క్షమించే మహానుభావులు నడచే త్రోవలో నడవడం నీ వంటి ఉత్తమునికి చక్కని కీర్తిని కలిగిస్తుంది. అన్నా! నీ తోడబుట్టిన దానిని. నేను నిన్ను శరణు అని ప్రార్థిస్తున్నాను.

క. **కట్టా! యార్గురు కొడుకులఁ, బట్టి వధించితివి యాఁడుఁబడుచిది, కోడల్,**
**నెట్టన చంపఁగ వలెనే?, కట్టిఁడివి గదన్న! యన్న! కరుణింపఁ గదే! 151**

* అయ్యయ్యో! పసిబిడ్డలైన ఆరుగురు కొడుకులనూ పట్టి వధించావు. ఇది ఇంటి ఆడపడుచు, నీ కోడలు; ఇలా చంపుతావా! ఇంత దయలేని వాడవా? అన్నా! దయచూపవా?

క. **పుత్త్రుఁడు నీ బ్రతుకునకును, శత్రుండని వింటిగాన సమయింపఁ దగుం,**
**బుత్త్రులకు నోఁచ నైతిని, బుత్త్రీదానంబు సేసి పుణ్యముఁ గనవే! 152**

* నా కుమారుడైతే నీకు, నీ ప్రాణానికి శత్రువని విన్నావు గనుక చంపడంలో కొంత అర్థం ఉంది; ఇది ఆడకూతురు గదా! కొడుకులకు ఎట్లాగూ నోచుకోలేక పోయాను. అన్నా! కనీసం ఈ కూతురినైనా నాకు దానంచేసి పుణ్యం కట్టుకోలేవా?

వ. **అని పయ్యెదఁ జక్క సవరించుకొనుచుఁ బలవరించుచు, భ్రాంతి పడి కూఁతున్ గ్రక్కున నక్కునం జక్క హత్తించుకొని, చెక్కు చెక్కున మోపి చయ్యన నుత్తరీయాంచలంబున సంచలతం గప్పి చప్పుడు గాఁ గుయ్యిడ, నయ్యెడం గ్రయ్యంబడి వాఁడు పోఁడిమి సెడఁ దోఁబుట్టువుం దిట్టి, చిట్టిపట్టి నాపురని వాపోవఁ గావరంబున నడుగు లొడిసి తిగిచి వడిం బెడిసి పడం బుడమిపయిం బడవైచిన నబ్బాలయు నేలంబడక యవలీల నెగడి నవ్యదివ్యమాలికా గంధబంధుర మణిహారాంబరాద్యలంకార మనోహారిణియు, గదా శంఖ చక్ర పద్మ శరచాపాసి శూలధారిణియునై యెనిమిది కరంబులం గరం బొప్పుచు, సిద్ధ చారణ కిన్నర గరుడ గంధర్వాది వైమానిక నికాయంబు గానిక లిచ్చి పొగడ, నెగడుచు నచ్చరల యాటపాటలకు మెచ్చుచు, మింటనుండి కంటఁబడి కంటువడఁ గంసున కిట్లనియె.153**

* ఇన్ని మాయలు చూస్తూ ఉన్నా బిడ్డను తాను రక్షించగల నేమో అని దేవకీ దేవి భ్రాంతిపడింది. విలపిస్తూ, పలవరిస్తూ ముందుకు వంగి, జారిపోతున్న పయ్యెదకొంగు సవరించుకొని బిడ్డను అమాంతంగా ఎత్తుకొని హృదయానికి గాఢంగా హత్తుకొన్నది. పాపచెక్కిలికి తన చెక్కిలి ఆనించి, పయటకొంగు చటుక్కున పాప అలికిడి కనపడకుండా కప్పివేసింది. గొంతెత్తి బావురుమని ఏడ్చింది. ఆ ఏడుపు విన్న కంసుడు రెచ్చిపోయాడు. సిగ్గు, లజ్జ వదలివేసి తోబుట్టువును తిట్టాడు. కన్ను గానని కావరంతో ఆ చిట్టిపాప కాళ్ళు పట్టుకుని లాగాడు. ఆపాప ఒక్కసారిగా కెవ్వుమని ఏడ్చినా లక్ష్యపెట్టకుండా విసిరి నేలపైన కొట్టాడు. అయితే ఆ చిట్టిపాప నేలపైన పడడానికి బదులు రివ్వున ఆకాశంలోనికి ఎగిరింది. ఆమె దేవలోక పుష్పాల పరిమళాలతో ఘుమఘుమలాడి పోయింది. మణిమయములైన హారములు మొదలైన అలంకారాలతో ఎంతో అందంగా కనుపించింది. గద, శంఖము, చక్రము, పద్మము, బాణము, ధనుస్సు, ఖడ్గము, శూలము - ఈ యెనిమిదీ ఎనిమిది చేతులలో వెలిగిపోతున్నాయి. ఆకాశంలో విమానాలలో పయనించే దేవగణాలైన సిద్ధులు, చారణులు, కిన్నరులు, గంధర్వులు, గరుడులు మొదలైనవారు ఆమెకు కానుకలు సమర్పిస్తూ స్తోత్రాలు చేస్తున్నారు. ఆమెను సంతోష పెట్టడానికి అప్సరసలు చేస్తున్న నాట్యాలను ఆమె మెచ్చుకుంటూ, ఆకాశంలోనుండి కనిపిస్తూ, కంసుని చూచి కర్కశంగా ఇలా అన్నది.

ఉ. తెంపరివై పొరిం బొరిని దేవకిబిడ్డలఁ జిన్నికుఱ్ఱలం
జంపితి వింకనైన నుపశాంతి వహింపక ఱాలమీఁద నొ
ప్పింపఁగ నిస్సిరో యిదియు వీరమె? నా సరసన్ జనించి నిన్
జంపెడు వీరుఁ డొక్క దెస సత్కృతి నొందెడు వాఁడు దుర్మతీ! 154

* "దుర్మార్గుడా! మహాకోపంతో ఈ దేవకీదేవి బిడ్డలను ఆరుగురిని వధించావు. మహా పరాక్రమ వంతుడవు! పోనీ అంతటితో శాంతించక పసిబిడ్డను రాతిమీద కొట్టి చంపడానికి పూనుకొన్నావు. ఛీ! చీ! ఇదేనా నీ వీరత్వం? నిన్ను చంపే వీరు డొకడు నాతో పాటే జన్మించి మరో దిక్కున మహాగౌరవాలు అందుకుంటూ పెరుగుతున్నాడులే!"

వ. అని పలికి. 155

క. మహనీయ గుణాస్పదయై, మహిలో నా దేవి జనము మన్నింపంగా
బహునామ నివాసంబుల, బహునామములం జరించె భద్రాత్మికయై. 156

* ఇలా బెదిరించి, ఆదేవి అదృశ్యురాలైంది. ఈ భూమి మీద ఎన్నోచోట్ల ఆరాధ్య దేవతగా అవతరించింది. ఒక్కొక్కచోట ఒక్కొక్క మహాగుణం ప్రధానంగా ఆ యాప్రాంతాల జనులచేత వేర్వేరు పేర్లతో పిలువబడింది. ఎక్కడ ఏలక్షణం ఉన్నా 'రక్షించడం' అనేది ఆమె ముఖ్యలక్షణం.

వ. అంత నా బోటి పలికిన కలికి పలుకులు ములుకులై, చెవులఁ జిలికిన, నులికిపడి, జళుకు గదిరిన మనంబున ఘనంబుగ వెఱఁగంది, కంది, కుందెడు దేవకీవసుదేవుల రావించి, యాదరంబున సంభావించి, చేరి వారితో నిట్లనియె. 157

* ఆ యోగమాయ పలికిన మాటలు కంసుని చెవులలో బాణాలలాగా తగిలాయి. అతడు ఉలిక్కిపడ్డాడు. బెదురు కలిగింది. మనస్సులో చాలా భయపడ్డాడు. దేవకీ వసుదేవుల వంక చూచాడు. వారు దుఃఖంతో క్రుంగిపోయి ఉన్నారు. వారిని దగ్గరకు పిలిపించుకుని ఆదరించి, గౌరవించాడు. వారి దరి చేరివారితో ఇట్లా అన్నాడు.

ఉ. పాపుఁడ, బాల ఘాతకుఁడ, బంధు విరక్తుఁడ, దుష్ట చిత్తుఁడన్,
గోపనుఁడం, జరన్మృతుఁడఁ, గ్రూరుఁడ, బ్రాహ్మణహంత భంగి మీ
పాపలఁ జంపితిన్ బయలి పల్కుల నమ్మితి సాధులార! నా
పాపము లుగ్గడింపక కృపాపరులై కనరే శమింపరే! 158

* "శాంతమూర్తులైన ఉత్తములారా! నేను ఘాతకుడును; పసిపిల్లలను చంపిన మహాపాతకుడను; బంధువులపై కత్తిగట్టిన దుష్టమైన మనస్సు గలవాడను. క్రోధం నా కళ్ళను కప్పివేసింది. నేను బ్రతికి ఉండీ చచ్చినవాడితో సమానమే! బ్రహ్మహత్య చేసిన పాపాత్మునివలె మీ పాపలను చంపాను. క్రూరుణ్ణి! ఎవరు

చెప్పారో తెలియకుండా విన్నమాటలను నమ్మి ఇంత పాపం చేశాను. దయామయులారా! మీ దయాస్వభావంతో నా పాపాలను లెక్కించకుండా నన్ను కరుణించి, శాంతించ వలసిందిగా ప్రార్థిస్తున్నాను.

**ఉ. ఒక్కెడఁ బ్రాణు లందఱు నిజోచితకర్మము లోలిఁ ద్రిప్పఁగా
నొక్కొక మేనితోఁ బొడమి యొక్కొక త్రోవను రాక పోకలం
జిక్కులఁ బొందుచుండుదురు, చెల్మిని సంసృతితోడఁ బాయ రే
నెక్కడి హంత? మీ శిశువు లెక్కడి హన్యులు! దూఱ నేటికిన్? 159**

* తమ తమ కర్మలే జీవులను వెనుకనుంచి తోస్తూ నడిపిస్తుంటాయి. అలా తమకర్మలే కారణంగా, ఎన్నోరకాల జీవులు తమకు అనుకూలమైన శరీరంతో ఒక్కచోట జన్మిస్తారు. తలకొకవైపు నుంచి వచ్చి, అందరూ ఒకచోట జీవించి, ఎవరిదారిన వారు వెళ్లిపోతారు. ఈ రాకపోకలలో చిక్కులు పడుతూ ఉంటారు. ఒకచోట ఉన్నప్పుడు కలిగిన స్నేహాలను అక్కడ వదలి వెళ్ళిపోతారు. ఎవడు చంపేవాడు? ఎవడు చనిపోయేవాడు? మీ బిడ్డలను నేను చంపినవాడనూ కాదు; వారు చంపబడినవారూ కారు. ఇంక ఒకరి నొకరు నేరా లెంచడ మెందుకు?

**క. పగతురఁ జెఱచితి ననియును, బగతుర చేఁ జెడితి ననియు బాలుఁడు దలఁచున్,
బగ చెలుములు లే వాత్మకుఁ, బగచెలుముల కీలు కర్మబంధము సుండీ! 160**

* శత్రువులను తాను బాధపెట్టాననీ, శత్రువులచేత తాను బాధలు పడ్డాననీ అమాయకుడైన వాడు అనుకుంటాడు. సత్యం తెలిసి ఆలోచిస్తే ఆత్మకు స్నేహం, విరోధం అంటూ ఏమున్నాయి? శత్రుత్వం, స్నేహం అనే వాటి మధ్యనున్న సంబంధం కేవలం తాము చేసుకున్న కర్మల బంధమే సుమా!''

**వ. అని పలికి, కన్నీరు నించి, వగచి, వెఱచుచు, దేవకీవసుదేవుల పాదంబులఁ బట్టుకొని, సంకెలలు విప్పించి, మిక్కిలి యక్కఱ గల వాక్యంబుల నైక్యంబులు నెఱపిన, వారును బరితప్తుండైన కంసునిం జూచి, రోషంబును బాసిరి. అంత నా వసుదేవుండు బావ కిట్లనియె. 161**

* కంసుడు ఈ విధంగా విన్నవించి, కంట నీరు పెట్టుకొని, జంకుతూనే దేవకీవసుదేవుల పాదాలు పట్టుకొని వేడుకున్నాడు. వారిసంకెళ్ళు ఊడదీయించాడు. చాల ప్రేమకురిసే మాటలతో "ఇకనుంచి మీరూ నేనూ ఒకటే''అనే భావం కలిగించాడు. దేవకీవసుదేవులుకూడా పశ్చాత్తాపం పొందుతున్న కంసుణ్ణి చూచి శాంతించారు. అప్పుడు వసుదేవుడు కంసునితో ఇలా అన్నాడు.

**శా. బావా! నీవచనంబు నిక్కము సుమీ, ప్రాణుల్ గతజ్ఞానులై
నీవే నంచును లోభ మోహ మద భీ నిర్మిత్రతా మోద శో
కావేశంబుల నొండొరుం బొడుతు రేకాకారుఁడై సర్వ రూ
పావిష్టుండగు నీశ్వరుం దెలియలే రన్యోన్యవిభ్రాంతులై. 162**

* "బావా! నీవు చెప్పినమాట నిజమే సుమా! ప్రాణులందరూ అహంకారంవలన జ్ఞానాన్ని పోగొట్టుకుంటారు. లోభం, మోహం, మదం, భయం, శత్రుత్వం, ఇష్టం, దుఃఖం, ఆవేశం మొదలైన వాటికి లోనై 'నీవా? నేనా?'అంటూ ఒకరినొకరు సంహరించుకుంటూ ఉంటారు. అంతేగాని, కంటికి కనబడుతున్న అనేక ఆకారాలలో నిండిఉన్న ఒకే ఒక 'నేను' అనే ఈశ్వరుని తెలుసుకోలేకుండా ఉన్నారు. ఒకరిని చూచి మరొకరు వేరు వేరుగా భావిస్తూ ఉండడంవల్ల ఈ విధమైన భ్రాంతికి లోనవుతూ ఉంటారు.

**వ. అని యిట్లు ప్రసన్నులైన దేవకీ వసుదేవుల యనుజ్ఞ వడసి, కంసుం డింటికిం జని యా రేయి గడపి, మఱునాఁడు ప్రొద్దునం గ్రద్దనం దనకుం బరతంత్రులగు మంత్రుల రావించి, యోగనిద్రవలనం దా వినిన వృత్తాంతం బంతయు మంతనంబున నెఱింగించిన, నపుడు వార లతని కిట్లనిరి. 163**

* ఈ విధంగా ప్రసన్నులైన దేవకీ వసుదేవుల అనుమతి తీసుకొని కంసుడు తన ఇంటికి వెళ్లిపోయాడు. ఆ రాత్రి ఎలాగో గడిపి, మరునాడు ఉదయాన్నే తన వశంలో ఉండే మంత్రులను పిలిపించాడు. యోగ మాయాదేవి చెప్పిన విషయమంతా వారికి చెప్పి, సలహా అడిగాడు. ఆ మంత్రులు అతనితో ఇలా అన్నారు.

**క. ఇట్టయినఁ దడయ నేటికిఁ?, బట్టణముల మందలందుఁ బల్లెల నెల్లన్**
**బుట్టెడి పెరిఁగెడి శిశువులఁ, బట్టి వధించెదము మమ్ముఁ బంపు మధీశా! 164**

* "అలా అయితే ఇంకా ఆలస్యం దేనికి? మహారాజా! పట్టణాలు, గొల్లపల్లెలు, గ్రామాలు అన్నీ వెదకి పసిపాపలు ఎక్కడ పుట్టి పెరుగుతున్నా సరే వధించి వస్తాము. మమ్ములను ఆజ్ఞాపించండి.

**మ. భవదీయోజ్జ్వల బాహుచాప విలసద్బాణావళీ భగ్నులై**
**దివిజాధీశ్వరు లేక్రియం బడిరొ యే దేశంబులన్ డాఁగిరో**
**శివునిం జొచ్చిరొ బ్రహ్మఁ జెందిరొ హరిన్ సేవించిరో మౌని వృ**
**త్తి వనాంతంబుల నిల్చిరో మనకు శోధింపం దగున్ వల్లభా! 165**

* భయంకరంగా ప్రకాశిస్తున్న నీ బాహువులతో ప్రయోగించిన బాణాల దెబ్బలు తిన్న దేవతాధిపతులు ఏమైపోయారో, ఎక్కడ తల దాచుకున్నారో? శివుని ఆశ్రయించారో? లేక బ్రహ్మనో విష్ణువునో సేవిస్తున్నారో? అదీకాకపోతే మునివృత్తులను స్వీకరించి నిరాశతో అరణ్యాల మధ్యలో ఉండి పోయారేమో! మనం వెంటనే వెదకడం మంచిది మహారాజా!

**క. నొచ్చిరి శాత్రవు లనుచును, విచ్చలవిడిఁ దిరుగవలదు వివిధాకృతులన్**
**ముచ్చిలి వత్తురు వారలు, సచ్చిన యందాఁక మఱవఁ జన దధిపునకున్. 166**

* శత్రువులు దెబ్బతిన్నారనుకొని విచ్చలవిడిగా తిరుగరాదు. వారు ఎన్నోరకాల వేషాలతో దొంగతనంగా రాగలరు. వారు చచ్చి పోయేటంత వరకూ రాజైనవాడు వారిని మరచిపోరాదు.

**క. ఒత్తి కొనుచు రానీఁ జన, దెత్తిన రోగముల రిపుల నింద్రియముల ను**
**త్పత్తిసమయములఁ జెఱుపక, మెత్తన గారాదు రాదు మీఁద జయింపన్. 167**

* విజృంభించిన రోగాలను, శత్రువులను, ఇంద్రియాలను అవి మనలను ఆక్రమించే వరకూ చూస్తూ ఊరుకోరాదు. అవి పుట్టినపుడే త్రుంచి వేయడంలో మెతకదనం పనికిరాదు. ముదిరిన తర్వాత జయించడం మన తరంకాదు.

**మ. అమరశ్రేణికి నెల్లఁ జక్రి ముఖరుం డాచక్రి యేధర్మమం**
**దమరున్, గోవులు భూమిదేవులు దితిక్షామ్నాయకారుణ్య స**
**త్యములున్ యాగ తపోదమంబులును శ్రద్ధాశాంతులున్ విష్ణు దే**
**హము లిన్నింటిని సంహరించిన నతం డంతంబునుం బొందెడిన్. 168**

* దేవతల కందరకూ ఆ విష్ణువే ముఖ్యుడు. అతడు ధర్మమునందు నిలచి ఉంటాడు. విష్ణువును సంహరించాలంటే అతని శరీరం మనకి దొరకాలి. అది ఒక్కచోట దొరకదు. అతని కెన్నో శరీరాలు ఉన్నాయి. గోవులు, బ్రాహ్మణులు, వేదములు, ఓరిమి, కారుణ్యము, సత్యము, యాగము, తపస్సు, దమము, శ్రద్ధ, శాంతి- ఇవన్నీ విష్ణువుయొక్క శరీరాలే. ఇన్నిటినీ అంతం చేస్తే, అతడు కూడా నిలువ నీడ లేక నశించిపోతాడు.

**వ. కావున. 169**

**ఉ. చంపుదుమే నిలింపులను? జంకెల ఉంకెలఁ దాపసావలిం**
**బంపుదుమే కృతాంతకుని పాలికిఁ? గ్రేపులతోడ గోవులం**
**ద్రుంపుదుమే? ధరామరులఁ దోలుదుమే? నిగమంబులన్ విదా**
**రింపుదుమే? వసుంధర హరింపుదు మే? జననాథ! పంపుమా! 170**

* కనుక, మహారాజా! దేవతలను చంపమంటావా? తపస్సు చేసుకునే మునులను భీకర గర్జనలతో యముని వద్దకు పంపమంటావా? దూడలతో కూడ గోవులను నరికి వేయమంటావా? బ్రాహ్మణులను తరిమి తరిమి కొట్టమంటావా? లేక వేదాలను చింపివేయమంటావా? అదీ కాక పోతే భూమినే చుట్టచుట్టి తెచ్చి నీ వశంలో ఉంచమంటావా? ఏదో ఒకటి మమ్మల్ని ఆజ్ఞాపించు!

**వ. అని పలుకు మంత్రుల మంత్రంబుల నిమంత్రితుండై బ్రాహ్మణ నిరోధంబు నిషిద్ధంబని తలంపక కాలపాశబద్ధుండై విప్రాది సాధుమానవులఁ జంప దానవులం బంపి యంతిపురంబునకుం జనియె, ననంతరంబ యా రక్కసులు వెక్కసంబులగు మొక్కలంబుల సజ్జనుల పజ్జలం బడి తర్జన గర్జన భర్జనాది దౌర్జన్యంబులం జేసి నిర్జించి పాపంబు లార్జించిరి. 171**

* ఇలా మాట్లాడుతున్న మంత్రుల ఆలోచనలకు కంసుడు బద్ధుడైపోయాడు. బ్రాహ్మణులను బాధించడం తప్పు అని ఆలోచించ లేదు. కాలము అనేది అతని దుష్కర్మ రూపంలో యమపాశంవలె అతణ్ణి బంధించి వేసింది. బ్రాహ్మణులు మొదలైన సాధుజనులను చంపడానికి తన అనుచరులైన రాక్షసులను పంపి, తాను అంతఃపురానికి వెళ్ళిపోయాడు. ఆ తరువాత ఆ రాక్షసులు భీకరంగా విజృంభించారు. సజ్జనుల

వద్దకు చేరి, భయపెట్టారు, దూషించారు, దండించారు. అనేక విధాల దుర్మార్గాలతో వారిని బాధించి వేధించి ఎన్నో పాపాలు మూటగట్టుకున్నారు.

**ఆ. వెదకి వెదకి దైత్యవీరులు సాధుల, నణఁప వారి బలము లడఁగిపోయె,**
**యశము సిరియు ధర్మ మాయువు భద్రంబు, నార్యహింససేయ నణఁగుఁ గాదె! 172**

* ఈ విధంగా ఆ దానవులు సజ్జనులను వెదకి వెదకి హింస పెడుతూ ఉంటే క్రమంగా వారిలోని అసలైన బలం నశించి పోయింది. పూజ్యులైన వారిని హింసించితే కీర్తి, ఐశ్వర్యము, ధర్మము, ఆయుర్దాయము, క్షేమముకూడా నశించిపోతాయి గదా!

**వ. అంత మందలో నందుండు నందనుండు పుట్టుట యెఱింగి మహానందంబున నెఱవాదులగు వేదవిదులం బిలిపించి, జలకంబు లాడి, శుచియై, శృంగారించుకొని, స్వస్తిపుణ్యాహవాచనంబులు సదివించి, జాతకర్మంబులు సేయించి, పితృదేవతల నర్చించి, క్రేపులతోడం గూడఁ గై సేసిన పాఁడి మొదవుల రెండులక్షలను, గనక కలశ మణి వసన విశాలంబులైన తిల శైలంబు లేడింటిని భూదేవతల కిచ్చిన. 173**

* ఇది ఇలా ఉండగా, అక్కడ వ్రేపల్లెలో నందుడు తనకు కొడుకు పుట్టాడని విని మహానందం పొందాడు. సమర్థులు వేదం తెలిసిన వారు అయిన బ్రాహ్మణులను పిలిపించాడు. తాను స్నానం చేసి శుచియై అలంకరించుకున్నాడు. ఆ బ్రాహ్మణులచేత స్వస్తివాచకాలు, శుభాశీస్సులు, పుణ్యాహవచనాలు చేయించాడు. బాలునికి పుట్టినప్పుడు చేయవలసిన శుభకర్మలు చేయించాడు. పితృదేవతలకు తృప్తిగా పూజలు చేశాడు. రెండులక్షల పాడి ఆవులను ఆభరణాలతో అలంకరించి, దూడలతో సహా బ్రాహ్మణులకు దానాలు చేశాడు. బంగారుచెంబులు, ఆభరణాలు, నూతన వస్త్రాలు సమర్పించాడు. పెద్దకొండల వంటి నువ్వులరాసులను కూడా బ్రాహ్మణులకు దానం చేశాడు.

**క. ఈ యాభీరకుమారుఁడు, శ్రీయుతుఁడై వీర వైరిజేతయునై దీ**
**ర్ఘాయుష్మంతుం డగు నని, పాయక దీవించి రపుడు బ్రాహ్మణజనముల్. 174**

* ఆ బ్రాహ్మణు లందరూ "ఈ నందగోప కుమారుడు సమస్త సంపదలతో తులతూగుతూ, శత్రువీరులను జయించి, దీర్ఘాయుష్మంతుడు కాగలడు"అని దీవించారు.

**క. దుందుభులు మొరసె, గాయక, సందోహము పాడె, సూతసముదాయముతో**
**వందిజనులు కీర్తించిరి, క్రందుగ వీతెంచె భద్రకాహళరవముల్. 175**

* ఆ వ్రేపల్లెలో దుందుభులు మ్రోగించారు. గాయకులు ఆనందంతో పాటలు పాడారు. సూతులు వందిజనులు స్తోత్రాలతో కీర్తించారు. రక్షణను, క్షేమాన్ని సూచించే బాకాల మ్రోతలు చెవుల కింపుగా వినిపించాయి.

**క. పల్లవ తోరణసురుచిర, వల్లీధ్వజరాజధూపవాసనములతో**
**సల్లలితములై యొప్పెను, వల్లవవల్లభులయిండ్ల వాకిండ్లెల్లన్. 176**

* గొల్లనాయకుల ఇండ్లవాకిళ్ళు చిగురుటాకుల తోరణములతో మనోహరములైన తీవలతో, గొప్ప కేతనములతో, ధూపముల పరిమళములతో ఇంపు గొల్పినవి.

**క. పసుపులు నూనెలు నలఁదిన, పసఁ దనరి సువర్ణబర్హి బర్హ ప్రభతోఁ**
**బసిమి గలిగి వెలుఁగొందుచుఁ, బసు లన్నియు మందలందుఁ బ్రసరించె నృపా! 177**

* గోపకులందరూ తమ పశువుల శరీరాలకు పసుపునూనె కలిపి పట్టించారు. ఆ పశువులు బంగారు రంగు నెమలిపింఛముల లాగున పచ్చని పసిమి రంగుతో వెలుగొందుతూ మందలలో చెంగనాలు వేశాయి.

**క. క్రేళ్ళుటికి మసలె లేఁగలు, మళ్లడిగొని ఱంకె లిడియె మదవృషభంబుల్,**
**పెల్లుగ మొదవుల పొదుఁగుల, జల్లించెం బాలు బాలుసంభవవేళన్. 178**

* బాలుడు పుట్టిన శుభవేళ ఆ మందలలో లేగదూడలు చెంగనాలు వేశాయి. పోతరించిన వృషభాలు ఉత్సాహంతో 'ఖణిల్లు' మని ఱంకెలు వేశాయి. ఆవులు పుష్కలంగా పాలను వర్షించాయి.

**క. ఆరఁగఁ జదివెడి పొగడెడి, వారికి విద్యలను బ్రదుకువారికి లేమిం**
**జేరినవారికి నెల్లను, గోరక మును నందుఁ డిచ్చె గోధనచయముల్. 179**

* నందుడు ఆ సమయంలో తృప్తిగా దానాలు చేశాడు. ప్రతి దినమూ వచ్చి పుణ్యకథలు వినిపించే బ్రాహ్మణులకూ, స్తోత్రపాఠాలు చేసే వందిగాయకులకూ, గరిడీలు ఇంద్రజాలాలు పగటి వేషాలు మొదలైన విద్యలపైన బ్రతికే జనానికీ, దారిద్ర్యంతో బాధపడుతూ దగ్గరికి చేరిన వారికీ అందరికీ వారు అడగకముందే గోవులనూ, ధనాన్నీ కొల్లలుగా దానాలు చేశాడు.

**వ. ఆ సమయంబున. 180**

**క. కంచుకములు తలచుట్లును, గాంచన భూషాంబరములుఁ గడు మెఱయఁగ నే**
**తెంచిరి గోపకు లందఱు, మంచి పదార్థములు గొనుచు మాధవుఁ జూడన్. 181**

* ఆనాడు గోపకు లందరూ నందుని నందనుణ్ణి చూడడానికి బయలుదేరారు. అందరూ అంగీలు తొడుక్కున్నారు. తలచుట్లు చుట్టుకున్నారు. బంగారు ఆభరణాలు, అందమైన దుస్తులు ధరించారు. అందరూ శుభకరములైన పసుపు మొదలైన పదార్థాలు తీసుకొని నందుని యింటికి వెళ్లారు. ఆ పుట్టినవాడు లక్ష్మీదేవికి భర్త కనుక అందరూ సంపదలతో తులతూగుతూ బయలు దేరారు.

**క. ఏతెంచి చూచి చెలఁగుచు, నేతులఁ బెరుఁగులను బాల నీళ్లను వెన్నం**
**బ్రీతి వసంతము లాడిరి, యేతరులై సరసభాష లెసఁగన్ గొల్లల్. 182**

* అలా వచ్చి ఆ బాలుని చూచి గోపకు లందరూ ఆనందముతో పొంగి పోయారు. ఉత్సాహంతో చెలరేగి నేతులను, పెరుగులను, పాలను, నీళ్లను, వెన్నను ఒకరిపై ఒకరు చిమ్ముకుంటూ, ఒకరిపైఒకరు ఛలోక్తులు విసురుకుంటూ వసంతోత్సవం జరుపుకున్నారు.

వ. తదనంతరంబ. 183

ఆ. ఏమినోము ఫలమొ యింత ప్రొ ద్దొక వార్త, వింటి మబలలార! వీను లలర
మన యశోద చిన్ని మగవానిఁ గనె నఁట, చూచి వత్త మమ్మ! సుదతులార! 184

* గోప యువతులు కూడా "ఏనాడు నోచిన నోముల ఫలమోగాని, ప్రొద్దున్నే లేస్తూనే ఒక శుభవార్త చెవులారా విన్నాము; మన యశోదమ్మ చిన్నిపాపడిని కన్నదట! చూచి వద్దాము రండమ్మా!" అని ఒకరి నొకరు నిద్రలనుండి లేపారు.

వ. అని యొండొరుల లేపికొని గోపిక లోపికలు లేని చిత్తంబుల నెత్తిన - తత్తఱంబు లొత్తుకొన నుదారంబులగు శృంగారంబులతో నిండ్లు వెలువడి. 185

* ఆ గోపికలు సహజంగానే సున్నిత హృదయాలు గలవారు. ఈ వార్త వినేసరికి తొందర ఎక్కువైంది. అపూర్వంగా అలంకారాలు చేసుకొని ఇళ్ళనుండి బయలుదేరారు.

క. జడగతులును బలుపిఱుఁదులుఁ, బిడికెడు నడుములును వలుఁద బిగి చనుఁగవలున్
వెడఁద నయనములు సిరి దడఁ, బడు మోములు భ్రమర చికుర భరములు నమరన్. 186

* అందరికీ త్వరగానే నడవాలని ఉన్నది. కాని విశాలమైన పిరుదులు, పొంకమైన వక్షోజాలు, నడుము పిడికిట్లో ఇమిడేటంత సన్ననిది; ఇంకెలా త్వరగా నడువగలరు? నెమ్మదిగా నడకలు సాగుతున్నాయి. కన్నులు మాత్రం ఆనందంతో విశాలంగా విచ్చుతున్నాయి. పెద్ద తుమ్మెద రెక్కలవలె నల్లనైన పెద్దతల కొప్పులు చక్కగా ఊగుతున్నాయి. లక్ష్మీకళలుకూడా ఆగోపికల అందమైన ముఖాలలో కనుపించడానికి తడపాటు పడుతున్నాయి.

ఉ. వేడుకతోడఁ గ్రొమ్ముడులు వీడఁ గుచోపరి హారరేఖ ల
ల్లాడఁ గపోలపాలికల హాటకపత్త్రరుచుల్ వినోదనం
బాడఁ బటాంచలంబు లసియాడఁగఁ జేరి యశోద యింటికిం
జేడియ లేఁగి చూచి రొగి జిష్ణుని విష్ణునిఁ జిన్ని కృష్ణునిన్. 187

* నందుని యింటి ప్రాంతానికి చేరుకునే సరికి దాదాపు పరుగెత్తుతున్నంత వేగంగా నడకలు సాగాయి. అప్పుడే వేసుకుని వచ్చిన జడముడులు విడిపోయాయి. వక్షఃస్థలంపైన ఉన్న హారాలు అల్లలాడి పోయినాయి. కర్ణపత్రాల బంగారు కాంతులు వారి చెక్కిళ్ళపై వినోదాలు చూపాయి. పయ్యెదకొంగులు గాలిలో ఒయ్యారంగా నాట్యాలు చేశాయి. ఆ విధంగా ఆ గోపికలు యశోదయింటికి చేరి ఎంతో ఉత్సాహంతో చిన్నికృష్ణుని చూచారు. అతడు దానవులను జయించే విష్ణువే గదా?

వ. చూచి సంతసించి తెచ్చిన కానుక లిచ్చి. 188

* గోపికలు చిన్ని కృష్ణుని చూచి చాల సంతోషించారు. తాము తెచ్చిన కానుకలు ఇచ్చారు.

**తే. పాపనికి నూనెఁ దలయంటి పసుపుఁ బూసి, బోరుకాడించి "హరి రక్ష పొ"మ్మటంచు**
**జలము లొకకొన్ని చుట్టిరాఁ జల్లి తొట్ల, నునిచి దీవించి పాడి ర య్యువిద లెల్ల. 189**

* గోపికలందరూ కలిసి ఆ బాలుని తలకు నూనె అంటి, శరీరానికి పసుపు పూశారు. శుభ్రంగా స్నానం చేయించారు. చివరగా "ఇదే నీకు శ్రీరామరక్ష"అని కొన్ని నీళ్ళు చుట్టూ త్రిప్పి చల్లారు. తొట్టెలో పడుకోబెట్టి దీవించారు. పాట పాడారు.

**క. 'జోజో కమలదళేక్షణ!, జోజో మృగరాజమధ్య! జోజో కృష్ణా!**
**జోజో పల్లవకరపద!, జోజో పూర్ణేందువదన! జోజో' యనుచున్. 190**

* "జో జో! కమల దళేక్షణా! జో జో! మృగరాజమధ్యా! జో జో! కృష్ణా! జో జో! పల్లవ కరపదా! జో జో! పూర్ణేందు వదనా! జో జో!" అంటూ జోలపాటలు పాడారు.

**వ. ఇ వ్విధంబున. 191**

**క. పలుతోయంబుల జగములఁ, బలు తోయములందు ముంచి భాసిల్లెడి యా**
**పలుతోయగాఁడు వల్లవ, లలనా కరతోయములఁ జెలంగుచుఁ దడియున్. 192**

* ప్రళయ సమయంలో ఎన్నోరకాల జగత్తులను నీటిలో ముంచివేసి, తాను ప్రకాశిస్తూ ఉండే ఆ మాయలాడు గోపికల చేతుల్లో జలకాలాడుతూ కేరింతలు కొడుతూ ఆడుకున్నాడు.

**క. లోకములు నిదుర వోవఁగ, జో కొట్టుచు నిదురవోని సుభగుఁడు రమణుల్**
**జోకొట్టి పాడ నిదురం, గైకొను క్రియ నూరకుండెఁ గను దెఱవకయున్. 193**

* లోకాలన్నింటినీ జోకొట్టి నిదురబుచ్చుతూ తాను మాత్రం మెలకువగానే ఉండే ఆ అందగాడు గోపికలు జో కొట్టుతూ ఉంటే నిద్రపోయినట్లు కనులు తెరవకుండా, కదలకుండా పడుకున్నాడు.

**సీ. ఏ బాము లెఱుఁగక యేపారు మేటికిఁ బసుల కాపరియింట బాము గలిగె,**
**నే కర్మములు లేక యెనయు నెక్కటికిని జాతకర్మంబులు సంభవించె,**
**నే తల్లి చనుఁబాలు నెఱుఁగని ప్రోడ యశోద చన్నుల పాల చొరవ నెఱిఁగె,**
**నే హాని వృద్ధులు నెఱుఁగని బ్రహ్మంబు పాదిఁగిటిలో వృద్ధిఁ బొందఁజొచ్చె,**

**ఆ. నే తపములనైన నెలమిఁ బండనిపంట, వల్లవీజనముల వాడఁ బండె**
**నే చదువుల నైన నిట్టిట్టి దనరాని, యర్థ మవయవముల నంద మొందె. 194**

* కష్టాలు అనేవి ఎరుగని మహాత్మునికి పశువుల కాపరులయింట బాధలలో పెరుగవలసిన స్థితి కలిగింది. కర్మములు అనేవి లేకుండా తానొక్కడే ప్రకాశించే విష్ణువు జాతకర్మలు చేయించుకున్నాడు. తానే జగత్తులకు తల్లీ తండ్రి అయి తల్లిపాలు అనేవి ఎఱుగని వాడు నేడు యశోదాదేవి చనుబాల రుచి మరిగాడు. పెరుగుట, తరుగుట అనేవి యెరుగని పరబ్రహ్మము ఈనాడు యశోదమ్మ ఒడిలో పెరగ సాగాడు.

ఎన్ని తపస్సులు చేసినా పండని బంగారు పంట నేడు గోపకుల వ్రేపల్లె వాడలో కన్నుల పండుగా పండింది. ఎన్ని చదువులు శాస్త్రాలు చదువుకున్నా "ఇలా ఉంటుంది"అని తెలియరాని ఆ పరమార్థం అందాలు చిందే ఆ బాలుని అవయవా లన్నిటిలోనూ అభివ్యక్తం కాసాగింది.

**మ. చెయువుల్ సేయుతఱిన్ విధాతకరణిం జెన్నొందు, సంతోష దృ**
**ష్టి యుతుండై నగుచున్ జనార్దనుని మాడ్కిం బొల్చు, రోషించి యు**
**న్న యెడన్ రుద్రునిభంగి నొప్పును, సుఖానందంబునం బొంది త**
**న్మయుఁడై బ్రహ్మము భాతి బాలుఁ డమరు న్బాహుళ్య బాల్యంబునన్. 195**

* ఆ చిన్నికృష్ణుడు బాల్యచేష్టలు చేస్తూ క్రొత్త క్రొత్త లీలలు ప్రకటించేటప్పుడు సృష్టికర్తయైన బ్రహ్మదేవునివలె వెలుగొందుతాడు. సంతోషం నిండిన చూపులతో నవ్వుతూ ఉన్నప్పుడు విష్ణువువలె కనిపిస్తాడు. కోపం వచ్చి రోషం తెచ్చుకున్న సమయంలో రుద్రునివలె భయం గొలుపుతాడు. సుఖంతో, ఆనందంతో, తన్మయుడై ఉన్న సమయంలో పర బ్రహ్మములాగా గోచరిస్తాడు. ఈ విధంగా ఎన్నో రీతులతో బాలకృష్ణుని బాల్యం గడుస్తూ ఉన్నది.

**వ. అయ్యవసరంబున. 196**

**ఆ. కొడుకుఁ గన్న వేడ్క, కొనసాగ రోహిణిఁ, జీరఁ బంచి చిత్రచేలములను**
**మండనముల నిచ్చి మన్నించె నందుఁ డా, యంబుజాక్షి ప్రీతయై చరింప. 197**

* అప్పుడు నందుడు తాను కొడుకును కన్న సంబరంలో రోహిణీ దేవిని పిలిపించాడు. రంగురంగుల చీరలను, ఆభరణాలను బహూకరించి గౌరవించాడు. ఆమె చాల సంతోషించింది.

**వ. అది మొదలు మొదవుల కదుపులు పొదువులు గలిగియుండె, నంత నందుండు గోపకుల ననేకుల గోకులరక్షకుం దక్షులైన వారిని నియమించి మథురకుం జని కంసునికి నేఁటేఁటం బెట్టెడి యరిం బెట్టి వీడ్కొని వసుదేవుని కడకుం జని యథోచితంబుగ దర్శించిన. 198**

* ఆ బాలుడు జన్మించినది మొదలు వ్రేపల్లెలోని ఆలమందలు కుండపొదుగులతో కనులపండుగ చేశాయి. ఒకనాడు నందుడు ఆలమందలను, వ్రేపల్లెను రక్షించడానికి నిపుణులైన గోపకులను నియమించాడు. తాను మథురా నగరానికి వెళ్ళి ఏటేటా చెల్లించవలసిన పన్నులను కంసునికి సమర్పించాడు. వానివద్ద సెలవు తీసికొని వసుదేవుని ఇంటికి వెళ్లాడు. ఎంతో గౌరవంతో అతని దర్శనం చేసుకున్నాడు.

**క. నందునిఁ గనుఁగొని ప్రాణము, పొందిన బొందియునుఁబోలెఁ బొలుపారుచు నా**
**నందాశ్రులు గడకన్నులఁ, గ్రందుకొనం గేలుసాఁచి కౌఁగిటఁ జేర్చెన్. 199**

* నందుని చూడగానే వసుదేవుడు ఆనందాశ్రువులతో చేతులు సాచి కౌగిలించుకొన్నాడు. ప్రాణం లేని కళేబరానికి ప్రాణాలు వచ్చినట్లు అతనికి నందుని చూడగనే ప్రాణాలు లేచి వచ్చాయి.

**వ. మఱియుఁ గౌఁగిలించుకొని, సుఖాసీనుంజేసి, వసుదేవుండు దనకొడుకువలని మోహంబు దీపింప నందున కిట్లనియె. 200**

* ఆ విధంగా నందుని కౌగిలించుకొని సుఖాసీనుణ్ణి చేశాడు. అప్పుడు వసుదేవునికి తన కుమారునిపైన ప్రేమ పొంగివచ్చింది. అతడు నందునితో ఇలా అన్నాడు.

**క. సంతతి లే దని మును ఘన, చింతనముల మునిఁగి ముదిసి చిక్కిన నీకున్**
**సంతతి గలిగెను భాగ్యము!, సంతతిహీనునికి సౌఖ్యసంతతి గలదే? 201**

* మిత్రమా! సంతానం లేదని ఎన్నో ఏండ్ల నుంచి తీరని చింతతో చిదికి చిక్కిపోయిన నీకు ఈ నాటికి సంతతి కలిగింది. ఎంత అదృష్టవంతుడవు! నిజానికి సంతానంలేని వానికి సౌభాగ్యా లెక్కడివి?

**క. పొడగంటి నిన్ను బ్రదికితిఁ, గడచితి నాపదల నింకఁ గార్యంబులు నే**
**యెడమడుగు లేని నెచ్చెలిఁ, బొడఁగాంచుట చచ్చి మఱలఁ బుట్టుట గాదే! 202**

* ఇన్నాళ్ళకు నిన్ను చూచాను. ఇప్పుడు బ్రతికాను. నా ఆపదలన్నీ గడచినట్లనిపిస్తూ ఉంది. కార్య నిర్వహణలో ఏ మాత్రమూ భేదభావం చూపని స్నేహితుణ్ణి చూడడం అంటే చచ్చినవాడు మళ్ళీ పుట్టడమే కదా!

**క. పలుపాటులఁబడు జనులకు, నిల నొకచో నుండఁ గలదె? యేఱుల వెంటం**
**గలిగి చను మ్రాఁకు లన్నియుఁ, బలువెంటలఁ బోవుఁగాక పాయక యున్నే? 203**

* బ్రతుకు తెరువులో ఎన్నో పాట్లు పడుతూ ఉండే జనులకు ఒక్కచోట ఉండాలంటే వీలుపడుతుందా? మరి నదులలో ఎన్నోచెట్లు మ్రాకులు కొట్టుకొని వస్తూ ఉంటాయి. కొన్ని మాకులు కలిసి ఒక్క చోట చేరి ప్రయాణం చేస్తాయి. మళ్ళీ విడిపోయి తమదారిని తాము వెళ్ళిపోతాయి.

**మ. పలురోగంబుల నొందకున్నవె పసుల్? పాలిచ్చునే ధేనువుల్?**
**కొలఁకుల్ వాఁగులు వారిపూరితములే? గోష్ఠ ప్రదేశంబులం**
**బులులున్ దుప్పులు సంచరింపవు గదా! పొల్పారునే ఘోషముల్?**
**కలవే పచ్చనిపూరిజొంపములు తత్కాంతార భాగంబులన్? 204**

* మిత్రమా! మీ ఆవులన్నీ చక్కగా పాలు ఇస్తున్నాయా! ఏ అంటురోగాలు లేవు గదా! మీ ప్రాంతాల చెరువులూ ఏరులూ నీళ్ళతో నిండి ఉన్నాయా! మీ గోవులు నిలిచే చోట పులులు, చిఱుతపులులూ సంచరించడం లేదు గదా! మీ గొల్లపల్లెలన్నీ వృద్ధి పొందుతున్నాయా! మీ అడవుల్లో చక్కని పచ్చని పచ్చిక బయళ్ళు సమృద్ధిగా ఉన్నాయి గదా!

**క. తనపుత్త్రమిత్రముఖరులఁ, దనుపక చూడకయు వారు దఱిఁగి నశింపన్**
**మనుచు గృహమేధియాశ్రమ, మున నుండెడువాని కొక్క మోదముఁ గలదే? 205**

* తనపుత్రులూ మిత్రులూ మొదలైన వారిని సంతృప్తి పరచకుండా, వారి క్షేమం చూడకుండా, వారు క్షీణించి నశించి పోయేటట్లుగా ప్రవర్తించే గృహస్థు పోషణతో ఉన్నవారికి ఏ మాత్రం సంతోషం ఉండదుగదా!

**క. నీకాంతయొద్ద నీవును, నీకాంతయు గారవింప నినుఁ దండ్రిఁగ నా**
**లోకించుచు నీ మందను, నా కొడు కున్నాఁడె? నంద! నందాన్వితుఁడై. 206**

* నందా! నీవూ, నీభార్య ప్రేమగా చూస్తూ ఉంటే యశోదవద్ద నా కొడుకు ఆనందంగా ఉన్నాడా! నిన్ను తండ్రిగా చూస్తూ నే ప్రేమలు అందుకుంటూ వ్రేపల్లెలో క్షేమంగా ఉన్నాడు గదా!

**వ. అనిన నందు డిట్లనియె. 207**

* వసుదేవుడు ఇలా అడుగగానే నందుడిలా అన్నాడు.

**శా. నీకున్ దేవకికిన్ జనించిన సుతానీకంబుఁ దోడ్తోడ ము**
**న్నీ కంసుండు వధించె, మీసుతఁ దుది న్హింసింపఁ జేఁదప్పి తా**
**నాకాశంబున కేగె, బాల యది, దైవాధీనమాపద్దశన్**
**శోకంబందునె తజ్ఞుఁ? డూఱడుము నా సూనుండు నీ సూనుఁడే. 208**

* వసుదేవా! నీకూ దేవకీదేవికీ పుట్టిన కొడుకు లందరినీ పుట్టిన వెంటనే ఆ కంసుడు వధించాడు. పాపం! చివరికి మీ కూతురుకూడా హింసించబోతే ఆ పాప ఆకాశానికి ఎగిరిపోయింది. మొత్తం మీద నీకు బిడ్డలు లేకుండా పోయారు. జగత్తు అంతా దైవాధీనం కదా! ఈ సంగతి తెలిసినవాడు ఆపదలు వచ్చినపుడు దుఃఖపడతాడా? కనుక ఊరడిల్లుము. నా కొడుకే నీ కొడుకు అనుకో!

**వ. అనిన వసుదేవుండు నందునకు మఱియు నిట్లనియె. 209**

* అప్పుడు వసుదేవుడు నందునితో ఇలా అన్నాడు.

**క. జనపతి కరి యిడితివి, మముఁ, గనుఁగొంటివి, మేము నిన్నుఁ గంటిమి, మే ల**
**య్యెను, బొమ్మింకను గోకుల, మున నుత్పాతములు దోఁచు మునుకొనవలయున్. 210**

* కంసునికి పన్నులు చెల్లించావు; మమ్మల్ని చూచావు; మేమూ నిన్ను చూచాము. మంచిది. గోకులంలో ఉత్పాతాలు సంభవించే సూచన లున్నాయి. ముందు జాగ్రత్త పడవలసి ఉంది. వెంటనే బయలుదేరు.

## -: కంసుని పంపునఁ బూతన యను రాక్షసి వ్రేపల్లెకుఁ జనుదెంచుట :-

**వ. అని పలికి వసుదేవుండు నందాదులయిన వల్లవుల వీడ్కొలిపిన వారలు గొబ్బున వడిగల గిబ్బలం బూనిన శకటంబులు ప్రకటంబులుగ నెక్కి తమ తమ పల్లెల త్రోవలు వట్టి చని రానందుండు ప్రతీతంబులైన యుత్పాతంబులు ముందటఁ బొడగని శౌరి దనతోఁ బలికిన పలుకులు దప్పవనుచుఁ దలంచుచుం జనియె. నంత. 211**

* ఇలా చెప్పి వసుదేవుడు నందుడు మొదలైన గోపకులకు సెలవు ఇచ్చి పంపినాడు. వాళ్ళుకూడా త్వరగా, వేగంగా పోయే గిత్తలను పూన్చిన బండ్లు ఎక్కి తమ తమ పల్లెలకు ప్రయాణమై వెళ్ళారు. నందుడు ఎదుట స్పష్టమైన ఉత్పాతాలను చూచాడు. వసుదేవుడు చెప్పిన మాటలు తప్పవేమో అనుకుంటూ వేగంగా ప్రయాణం సాగించాడు.

సీ. **కంసుపంపున బాలఘాతిని పూతన పల్లెల మందలఁ బట్టణముల**
**నిల నెల్లచో బాలహింసఁ గావించుచుఁ జనుచు నెవ్వనిపేరు శ్రవణవీథిఁ**
**బడినయంతన సర్వభయనివారణ మగు నట్టి దైత్యాంతకుం డవతరించి**
**యున్న నందునిపల్లె కొకనాఁడు ఖేచరి యై వచ్చి యందు మాయాప్రయుక్తిఁ**

తే. **గామరూపిణియై చొచ్చి కానకుండ, నరిగి యిల్లిల్లుఁ దప్పక యరసి కొనుచు**
**నందగృహమున బాలుని నాద మొకటి, విని ప్రమోదించి సుందరీవేష యగుచు.** 212

* ఇలా ఉండగా కంసుడు ప్రేరేపించిన పూతన అనే రాక్షసి - శిశువులను చంపడంలో ఆరితేరినది. అది పల్లెలు, గొల్లపల్లెలు, పట్టణాల్లో ఎక్కడ పాపలు కనిపించినా చంపివేస్తూ వెళ్లుతూ ఉంది. ఎవరిపేరు వింటే సర్వభయాలూ పోతాయో అటువంటి పరమాత్ముడు పాపడుగా అవతరించి ఉన్న నందుని వ్రేపల్లెకు ఆకాశ మార్గాన వచ్చింది. అది మాయావిని, కామరూపిణి గనుక, మాయతో వ్రేపల్లెలో ప్రవేశించింది. ఎవరికంటా పడకుండా ఇల్లిల్లూ తిరిగింది. నందుని యింట్లో బాలుని ఏడుపు విని సంతోషంతో అందమైన యువతివేషం ధరించింది.

మత్త. **క్రాలుకన్నులు గుబ్బచన్నులుఁ గందువొందని చందురుం**
**బోలు మోమును గల్గు లేదన బుద్ధి దూఱని కౌను హే**
**రాళమైన పిఱుందుఁ బల్లవరాగ పాదకరంబులుం**
**జాల దొడ్డగు కొప్పు నొప్పఁగ సర్వమోహనమూర్తితోన్.** 213

* ప్రకాశిస్తున్న కన్నులు, పొంకమైన వక్షోజములు, మచ్చలేని చంద్రునివంటి ముఖము, ఉందా లేదా అనే ఆలోచనకు తావిచ్చే సన్నని నడుము, విశాలమైన పిరుదులు, చివుళ్లవంటి ఎర్రని కాలుసేతులు, ఒత్తైన జుట్టుముడి- ఇలా చాలా అందంగా అందరిని మోహపెట్టే రూపంతో నందుని ఇంటికి వెళ్ళింది పూతన.

మానిని.

**కాంచనకుండల కాంతులు గండయుగంబునఁ గ్రేళ్లుఱుకన్ జడపై**
**మించిన మల్లెల మేలిమి తావులు మెచ్చి మదాళులు మింటను రా**
**నంచిత కంకణహారరుచుల్ చెలువారఁగఁ బై వలు వంచల నిం**
**చించుక జాఱఁగ నిందునిభానన యేఁగెఁ గుమారుని యింటికినై.** 214

* ఆ పూతన కృష్ణుడున్న యింటికి వెళుతూ ఉంటే ఆమె ధరించిన బంగారు లోలాకుల కాంతులు చెక్కిళ్ళపై కేరింతలు కొడుతున్నాయి. జడలో ధరించిన మల్లెపూల సువాసనలకు తుమ్మెదలు ఆకర్షించబడి ఆమెతోపాటే ఆమె తలపైగా ఎగిరివస్తున్నాయి. చేతుల కంకణాలు, మెడలో హారాల కాంతులు చిమ్ముతున్నాయి. పై వల్లెవాటు కొద్దిగా జారిపోతూ ఉంది. చంద్రునివలె ఆకర్షణీయంగా కనబడే ముఖంతో పూతన కృష్ణుని యింటికి బయలుదేరింది.

వ. ఆ సమయంబున. 215

మ. 'సిరి మమ్మున్ బ్రదుకంగఁ జూచుకొఱకై శృంగార వేషంబుతో
నరుదేనోపు' నటంచు గోపికలు జిహ్వల్ రాక మోహించి త
త్పరలై చూడ లతాంగి వోయి కనియెం బర్యంక మధ్యంబునం
బరు భస్మానలతేజు దుర్జనవధ ప్రారంభకున్ డింభకున్. 216

* ఆమె లోపలికి వెడుతూ ఉంటే గోపిక లందరూ ఏమీ మాట్లాడడానికి నోరురాక మైకంలో ఉన్నట్లు నిలబడి పోయారు. "మమ్మల్ని అందరినీ బ్రతికించడానికి లక్ష్మీదేవి శృంగార వేషంతో వచ్చిందో ఏమో?"అని భ్రాంతిపడి తదేక దృష్టితో చూస్తూ ఉండిపోయారు. పూతన సరా సరి వెళ్ళి మంచం మధ్యలో ఉన్న పరాత్పరుడైన కృష్ణుని చూచింది. అతడు నివురు గప్పిన నిప్పులాగా ఉండడంచేత అది నిప్పు అనీ, తాకితే కాలుతుందనీ ఆమెకు తెలియదు. ఆ మాయాశిశువు దుష్టులను చంపడం ప్రారంభిస్తున్నాడని ఇంకా ఆమెకు తెలియదు.

వ. కని కదియవచ్చు సమయంబున. 217

శా. ఆ లోకేశ్వరుఁ డాచరాచరవిభుం డా బాలగోపాలుఁ డా
బాలధ్వంసిని గొంటు గం టిడి వెసన్ బాలెంతచందంబునం
బాలిండ్లన్ విస మూని వచ్చుట మదిన్ భావించి లో నవ్వుచున్
కాలుం గేలు నెఱుంగకున్న కరణిం గన్మోడ్చి గుర్వెట్టఁగన్ 218

* కృష్ణుని వద్దకు పూతన వస్తూ ఉంది. అతడు చరాచర జగత్తుకూ ప్రభువైన వాడు. లోకాల కన్నిటికీ ఈశ్వరుడు. గోపాలబాలుని రూపం ధరించినవాడు. అతడు ఆ బాల హంతకురాలిని చూచాడు. క్రూరత్వంతో నిండిపోయి, బాలెంతరాలి వేషంలో పాలిండ్లలో విషం ధరించి వస్తున్నదని గ్రహించాడు. లోలోపల నవ్వుకున్నాడు. కాలు ఏదో చెయ్యి ఏదో ఎరుగకుండా నిద్రపోతున్నట్లు గుర్రుపెట్ట సాగాడు.

క. ఆ పాపజాతిసుందరి, యా పాపని పాన్పుఁ జేర నరిగి కరములన్
లేపి చనుంగవ శిశువున్, మోపుచు ముద్దాడి శిరము మూర్కొని పలికెన్. 219

* ఆ పాపిష్ఠి రాక్షసి పూతన కృష్ణుని పాన్పువద్దకు వెళ్ళింది. చేతులతో లేవదీసి అతణ్ణి తన పాలిండ్లకు హత్తుకుంది. శిరసు వాసన చూచి ముద్దుపెట్టుకున్నది.

క. "చను నీకుఁ గుడుపఁజాలెడి, చనువారలు లేరు, నీవు చనవలె," ననుచుం
జనుగుడిపి మీఁద నిలుకడఁ, జనుదాన ననంగ వేడ్కఁ జనుఁ జను గుడుపన్. 220

* ఆమె యిలా అన్నాది. "నీకు చనుబాలు త్రాగించగల్గిన సమర్థులు లేరు. నువ్వు నా పాలు త్రాగడం భావ్యం. నీకు చన్ను కుడిపిన తరువాత నిదానంగా వెళతాను. నీకు చన్ను కుడపడం నాకు వేడుక!

క. 'నా చనుఁబా లొక గ్రుక్కెఁడు, నోచిన్ని కుమార! త్రావు మొయ్యను పిదపన్
నీచెలువ మెఱుఁగ వచ్చును, నా చెలువము సఫల మగును నళినదళాక్షా!' 221

* "చిన్నితండ్రీ! నా చనుబాలు ఒక్క గ్రుక్కెడు త్రాగి చూడు. అపుడు నీ అందమెలా ఉంటుందో తెలుస్తుంది. అందువల్ల ఇప్పుడున్న నా అందానికి కూడ ఫలితం దక్కుతుంది."

వ. అని బాలు నుద్దేశించి ముద్దాడెడి భంగి మాటలాడెడి చేడియం జూచి. 222

* ఈ విధంగా కృష్ణుని చూచి ముద్దాడుతున్నట్లు మాటలాడుతున్న ఆ పూతనను చూచి యశోదారోహిణులు అభ్యంతరం చెప్పారు.

మ. వనితా! ముట్టకు మమ్మ! చన్ను గుడుపన్ వల్దమ్మ నీచన్ను మా
తనయుం డొల్లఁడు వాసి పొమ్మని యశోదారోహిణుల్ సీరఁ గై
కొన కీక్షించుచు మాయఁబన్ని పెలుచం గోశంబులో వాలు మె
ల్పున రాజిల్లుచు మాట మెత్తఁదనమున్ లోవాఁడియు న్నేర్పడన్. 223

* "చూడమ్మా! నీ వెవరో క్రొత్త యువతివి. మాబాబును ముట్టుకోకు. అయ్యో! వానికి చనుకుడుప వద్దమ్మా! నీ చనుబాలు మా అబ్బాయి ఇష్టపడడు. వెంటనే వెళ్ళిపో"అని యశోదా రోహిణులు అరుస్తున్నా లెక్కచేయక ఆ పూతన కృష్ణునివైపే చూచింది. మాయపన్ని ఒరలో ఉన్న పదునైన కత్తిలాగా తీక్షణంగా చూచింది. ఆమె మెత్తని మాటల లోపల వాడితనం కనబడకుండా దాగివుంది.

వ. కదిసి కలికిపలుకులు పలుకుచు నులుకుసెడి జళుకు సొరక యెదుర నిదుర గదిరిన ఫణిని ఫణియని యెఱుంగక గుణమతిం దిగుచు జడమతి బెడంగునఁ గఱటి జఱభితెఱవ వెరపునం జనుదెంచి పఱపునడుమ నొఱపు గలిగి మెఱయుచుఁ గన్ను దెఱవక వెఱపు మఱపు నెఱుంగక కొమరు మిగులు చిఱుత కొమరునిం దిగిచి తొడలనడుమ నిడుకొని యొడలు నివురుచు నెడనెడ మమతం గడలుకొలుపుచు నాఁకొన్న చిన్నియన్న! చన్ను గుడువు మని చన్నిచ్చు సమయంబున. 224

* ఇలా తియ్యని మాటలాడుతూ, అదురూ బెదురూ లేక దగ్గరగా వచ్చింది. ఎదుట నిద్రపోతున్న పామును పామని తెలియక త్రాడు అనుకొని చేతితో లాగే మూర్ఖునివలె, క్రూరురాలు దుష్టురాలు అయిన పూతన బాలుని మంచముదగ్గరకు వచ్చింది. పరువుపైన చక్కని కాంతులతో ప్రకాశిస్తూ, కనులు తెరువక, భయమంటే ఎరుగక అందాలు చిందుతూ ఉన్న చిన్నారి బాలుడిని చేతిలోకి తీసుకొని తొడలపై పడుకో

బెట్టుకుంది. ఒళ్ళు నిమురుతూ వాత్సల్యం ప్రదర్శిస్తూ, "చిన్నితండ్రీ! ఆకలి వేస్తున్నదా? పాలుత్రాగు నాన్నా!"అని తన చన్ను కుడుపడానికి ప్రయత్నించింది.

సీ. మేల్కొన్న తెఱఁగున మెల్లన కనువిచ్చి క్రేఁగంటఁ జూచుచుఁ గిదికి నీల్గి
యావులించుచుఁ జేతు లాదరంబునఁ జాఁచి యొదిఁగిలి యాఁకొన్న యోజ నూఁది
బిగిచన్నుఁగవఁ గేలఁ బీడించి కబళించి గ్రుక్కగ్రుక్కకు గుటుగుటుకు మనుచు
నొక రెండు గ్రుక్కల నువిదప్రాణంబులు సైతము మేనిలో సత్త్వ మెల్లఁ

తే. ద్రావె నదియును గుండెలు దల్లడిల్లఁ, జిమ్మఁ దిరుగుచు నిలువక శిరము వ్రాల
నితర బాలుర క్రియవాఁడ వీవు గావు, చన్ను విడువుము విడువుము చాలు, ననుచు. 225

* కృష్ణుడు అప్పుడే మేలుకున్నట్లు మెల్లగా కనులు తెరిచాడు. క్రీగంట చూచాడు. మూలుగుతూ ఒళ్ళు విరుచుకున్నాడు, ఆవులించాడు. చేతులు అప్యాయంగా చాచి, ఒదిగి పడుకున్నాడు. ఎంతో ఆకలితో ఉన్నట్లు ఆమె బిగువైన చన్నులను చేతులతో గట్టిగా పట్టుకున్నాడు. చన్ను నోటపెట్టుకొని గుటుక్కుగుటుక్కుమని రెండు గ్రుక్కలలో ఆమె శరీరం లోని సత్తువ అంతా త్రాగేసి, చివరకు ప్రాణాలుకూడా త్రాగేశాడు.

ఆమెకు గుండెలు తల్లడిల్లి పోయాయి. నాలుకలోపలికి చుట్టుకునిపోయింది. నిలువలేక తల వాల్చేసింది. "అమ్మో! నీవు మిగిలిన బాలురవంటి వాడవు కావు! ఇకచాలు! నన్ను విడు! అయ్యో! నన్ను విడిచిపెట్టు!"అంటూ గిల గిల లాడింది.

క. నిబ్బరపు దప్పి మంటలు, ప్రబ్బిన ధృతిలేక నేత్రపదహస్తంబుల్
గొబ్బున వివృతములుగ నా, గుబ్బగుచున్నట్టి కూఁతఁ గూలెన్ నేలన్. 226

* భయంకరమైన మంటలు లోలోపల రేగుతూ ఉంటే పూతన నిలువలేక పోయింది. కాళ్ళు, చేతులు వంకరలు తిరిగిపోయాయి. గ్రుడ్లు వెళ్ళుకు వచ్చాయి. అంతకంతకు అధికమవుతున్న ఆర్తనాదంతో నేల కూలిపోయింది.

మ. అదరెం గొండలతోడ భూమి, గ్రహతారానీకముల్ మింటి పై
బెదరెన్, దిక్కుల మాఱు మ్రోఁత లెసఁగెన్, భీతిల్లి లోకంబులుం
గదలం బాఱెను,వజ్రభిన్న గిరిరేఖం బూర్వదేహంబుతో
ద్రిదశధ్వంసిని గూలి కుయ్యిడిన తద్ఘోరోరు ఘోషంబునన్. 227

* ఆ రాక్షసికి చావు దగ్గర పడింది. ఆ సమయంలో తన అసలైన భయంకరరూపంతో, కొండవంటి శరీరంతో ఆమె నేలకూలిపోయింది. ఇంద్రుని వజ్రాయుధపు దెబ్బకు రెక్కలు విరిగి నేల కూలిన పర్వతంలా దభేలున కూలిపోయింది. అలా కూలిపోతూ ప్రాణాలు తోడేసే బాధతో పూతన భీకరంగా గావుకేక పెట్టగానే, ఆ ధ్వని దిక్కులన్నిటా ప్రతిధ్వనించింది. పర్వతాలతో సహా భూమి అదిరింది. ఆకాశంలో గ్రహాలు, తారకలు

కదలిపోయాయి. దేవతలనుకూడ వేధించే ఆ రక్కసి పెట్టిన కేకలకు అన్ని లోకాలు భయపడి చలించి పోయాయి.

క. అప్పుడు దెప్పరమగు నా, చప్పుడు హృదయములఁ జొచ్చి సందడి పెట్టన్
ముప్పిరిగొని పడి రెఱుకలు, దప్పి ధరన్ గొల్ల లెల్లఁ దల్లడపడుచున్. 228

* ఆ భయంకరమైన శబ్దము గోపకుల హృదయాలలో జొరబడి భయపెట్టగా, వారందరూ బెంబేలుపడి, మెలికలు తిరుగుతూ, స్పృహ తప్పి పడిపోయారు.

క. ఆ జఱభిరండ రక్కసి, నైజశరీరంబు నేల నలియం బడినన్
యోజనమున్నర మేర ధ, రాజంబులు నుగ్గులయ్యె రాజవరేణ్యా! 229

* పరీక్షిన్మహారాజా! క్రూరురాలు, నీచురాలు అయిన ఆ రాక్షసి అసలు శరీరం నేలమీద పడి కొట్టుకుంటూ ఉంటే ఒకటిన్నర యోజనాల మేర చెట్లన్నీ నుగ్గు నుగ్గు అయిపోయినాయి.

సీ. దారుణ లాంగలదండ దంతంబులు నగ గహ్వరముఁబోలు నాసికయును
గండశై లాకృతి గల కుచయుగమును విరిసి తూలెడి పల్లవెంద్రుకలును
జీఁకటి నూతులఁ జెనయు నేత్రంబులుఁ బెనుదిబ్బఁ బోలెడి పెద్దపిఱుఁదుఁ
జాఁగు కట్టలఁబోలు చరణోరుహస్తంబు లింకినమడువుతో నెనయు కడుపుఁ

తే. గలిగి షట్క్రోశదీర్ఘమై కదిసి చూడ, భయదమగు దాని ఘనకళేబరముఁ జూచి
గోపగోపీజనంబులు గుంపుగూడి, బెగడుచుండిరి మనముల బెదరు గదిరి. 230

* ఆ రాకాసికోరలు నాగేటికొయ్యలంత ఉన్నాయి. పర్వత గుహలవంటి ముక్కురంధ్రాలు; రాతిబండలవంటి వక్షోజాలు; గాలికి రేగుతూ ఉన్న ఎర్రని వెంద్రుకలు; చీకటి నూతులకన్న లోతైన కన్నులు; పెద్ద దిబ్బ అంతటి విశాలమైన పిరుదు; పొడుగైన కాలువ కట్టలవంటి పాదాలు; తొడలు, చేతులు; నీరు ఇంకిపోయి బీటలు తీసిన చెరువువంటి కడుపు, ఆరుక్రోశముల పొడవుగా, భీకరంగా ఉన్నది. దాని కళేబరం దగ్గరకు వెడితే మరీ భయకరంగా కనిపిస్తున్నది. గోపకులు గోపికలు అందరూ గుంపుగా కూడి భయం భయంగా చూస్తూ దూరంగా ఉండి పోయారు.

వ. ఇ వ్విధంబున. 231

క. ఆ తతిఁ గుడువఁగ నడచెన్, నూతన ఫుల్లాబ్జలోచనుఁడు హరి మృత్యు
ద్యోతనఁ గృతముని సముదయ, యాతనఁ బూతన నెఱింగి యాతనలీలన్. 232

* అప్పుడే విచ్చిన తామరపువ్వులవంటి కన్నులుగల బాలకృష్ణుడు పాలు కుడిచే నెపంమీద ఆ పూతనను తన లీలతో అవలీలగా సంహరించాడు. మరి ఆ పూతన మృత్యువువలె పాపలను చంపినది. మునులను బాధపెట్టినదిగదా!

క. విషధరరిపు గమనునికిని, విషగళసఖునికిని విమలవిషశయనునికిన్
విషభవభవ జనకునికిని, విషకుచచనువిషముఁ గొనుట విషమే తలఁపన్? 233

* మరి ఆ బాలుడు సాక్షాత్తు విష్ణువు. విషజంతువులైన నాగులను చీల్చివేసే గరుత్మంతుడు అతని వాహనం. విషాన్ని కంఠంలో ధరించిన శివుడు అతని మిత్రుడు; స్వచ్ఛమైన విషముల (నీళ్ళ)పై పడుకొనేవాడు అతడు. విషముల (అంటే నీళ్ళ) నుండి పుట్టిన పద్మంలో పుట్టిన బ్రహ్మదేవునికి అతడు తండ్రి. అటువంటి విష్ణువుకు ఒకరాకాసి చన్నులలోని విషాన్ని లాగివేయటం ఒక పెద్ద విషమమైన విషయమా?

వ. అంత నా గోపగోపీజనంబులు తెలిసి రోహిణీయశోదలం గూడుకొని బెగ్గడిలక డగ్గఱి. 234

* ఇంతలో గోపీగోపకులకు స్పృహ వచ్చింది. యశోదాదేవితోను రోహిణీదేవితోను కలిసి భయపడకుండా ఒక్కసారిగా ముందుకు వచ్చారు.

శా. నేలం గూలిన దాని పెన్నురముపై నిర్భీతిఁ గ్రీడింప నో
బాలా! రమ్మని మూఁపు జేర్చుకొని సంస్పర్శించి యూరార్చుచున్
గోలాంగూలముఁ ద్రిప్పి గోవురజమున్ గోమూత్రముం జల్లి త
ద్బాలాంగంబుల గోమయం బలఁది రా పండ్రెండు నామంబులన్. 235

* కూలిపోయిన రాకాసి విశాలమైన పొట్టమీద నిర్భయంగా ఆడుకొంటున్నాడు చిన్ని కృష్ణుడు. గోపికలు ఆ కుర్రవాడిని ఎత్తుకున్నారు. భుజాలపైన పడుకోబెట్టుకుని ఓదార్చారు. పీడ వదలి పోవడానికి ఆవుతోక వాడిచుట్టూ త్రిప్పి దిష్టి తీశారు. గోధూళిని, గోమూత్రాన్ని బాలునిపై చల్లారు. పండ్రెండు నామములతో పండ్రెండు అవయవాలలోనూ గోమయం (ఆవుపేడ) పట్టించారు.

వ. మఱియు నంతటం దనియక గోపిక లాచమనంబు సేసి దక్షలయి, మునుపుగాఁ దమకు రక్షాకరం బగు బీజన్యాసంబు సేసికొని, 'చిన్ని యన్న! నీ యడుగు లజుండును, జానువు లనిలుండును, దొడలు యజ్ఞుండును, గటితలం బచ్యుతుండును, గడుపు హయాస్యుండును, హృదయంబుఁ గేశవుండును, నుర మీశుండును, గంఠంబినుండును, భుజంబులు చతుర్భుజుండును, ముఖంబు త్రివిక్రముండును, శిరం బీశ్వరుండును రక్షింతురు. ముందు చక్రియు, వెనుక గదాధరుండైన హరియుఁ బార్శ్వంబుల ధనుర్ధరుండైన మధువైరియు నసిధరుండగు నజనుండును, గోణంబుల శంఖ చక్ర గదాధరుండైన యురుకాయుండును, మీఁ దుపేంద్రుండును, గ్రింద తార్క్ష్యుండును, నంతటను హలధరుండగు పురుషుండును కాతురు. నీ యింద్రియంబుల హృషీకేశుండును, బ్రాణంబుల నారాయణుండును, జిత్తంబును శ్వేతద్వీపపతియును, మనంబును యోగీశ్వరుండైన కపిలుండును, బుద్ధిని పృశ్నిగర్భుండును, నహంకారంబును భగవంతుండైన పరుండును బాలనంబు సేయుదురు. నీవు క్రీడించునెడ గోవిందుండును, శయనించు తఱి మాధవుండును, నడచువేళ వైకుంఠుండును, గూర్చున్న సమయంబున శ్రీపతియును, గుడుచు కాలంబున సర్వభక్షకుండైన యజ్ఞభుజుండును నేమఱ కుండుదురు. నిన్నుఁ బేర్కొనిన దుస్స్వప్న వృద్ధబాలగ్రహంబులును, గూశ్మాండ డాకినీ

**యాతుధానులును, భూత ప్రేత యక్ష రాక్షస పిశాచ వినాయకులును, గోటరా రేవతులును, జ్యేష్ఠా పూతనలును, మాతృకాది గణంబులును నశియింతురు. నీయందుఁ బ్రాణేంద్రియ శరీర నిరోధంబు లయిన యున్మాదంబులును నపస్మారంబులును మహోత్పాతంబులును బొందకుండుం గావుతమని రక్షసేసి దీవించి రంత. 236**

* గోపికలకు అంతటితో తృప్తి కలుగలేదు. అంగాంగాలకు మహారక్ష కట్టదలచి ఆచమనం చేశారు. బాలునకు రక్ష కట్టేముందు తమకు రక్షకోసం బీజన్యాసం చేసుకున్నారు. బాలునికి రక్ష కట్టడం ప్రారంభించారు. "చిన్ని తండ్రీ! నీ పాదాలు బ్రహ్మ, మోకాళ్ళు వాయువు, తొడలు యజ్ఞుడు, నడుము అచ్యుతుడు, కడుపు హయగ్రీవుడు, హృదయం కేశవుడు, వక్షస్సు ఈశుడు, భుజాలు చతుర్భుజుడు, ముఖము త్రివిక్రముడు, శిరస్సు ఈశ్వరుడు రక్షిస్తారు.

అంతేకాక -

నీ ముందు చక్రధరుడైన విష్ణువు, వెనుక గదాధరుడు అయిన శ్రీహరి, కుడిప్రక్క ధనుర్ధారుడైన మధువైరి, ఎడమప్రక్క ఖడ్గధరుడైన అజనుడు, గోణములలో (మూలలు) శంఖ చక్ర గదాధరుడైన ఉరుగాయుడు, మీద ఉపేంద్రుడైన విష్ణువు, క్రింద తార్క్ష్యుడు (గరుత్మంతుడు); అంతటా హలధరుడైన పురుషుడు రక్షిస్తారు.

నీ ఇంద్రియాలు హృషీకేశుడు, ప్రాణాలు నారాయణుడు, చిత్తము శ్వేతద్వీపపతి, మనస్సు యోగీశ్వరుడైన కపిలుడు, బుద్ధి పృశ్ని గర్భుడైన విష్ణువు, అహంకారము భగవంతుడైన పరమపురుషుడు రక్షిస్తూ ఉంటారు.

నీవు ఆడుతూ ఉండగా గోవిందుడు, నిద్రించునపుడు మాధవుడు, నడచే వేళ వైకుంఠుడు, కూర్చొని ఉన్నప్పుడు శ్రీపతి, భుజిస్తున్నపుడు సర్వభక్షకుడైన యజ్ఞభుజుడు ఏమరుపాటు లేకుండా నిన్ను రక్షిస్తూ ఉంటారు.

నీపేరు చెప్పితే చాలు చెడ్డకలలు, వృద్ధగ్రహాలు, బాలగ్రహాలు కూశ్మాండాలు, డాకినీ పిశాచాలు, యాతుధానులనే దుష్టశక్తులు నశించిపోతాయి. భూతాలు, ప్రేతాలు, పిశాచాలు, యక్షులు, రాక్షసులు, నాశనమైపోతారు. గోటర, రేవత లనే దుష్టశక్తులు, జ్యేష్ఠాదేవి, పూతన, మాతృకలు మొదలైన గణాలు నాశనమై పోతాయి.

నీలో ప్రాణాలను, ఇంద్రియాలను, శరీరాన్ని బాధించే ఉన్మాదాలు, మూర్ఛలు, మహోత్పాతాలు చేరకుండుగాక!" అని బాలుడికి రక్ష పెట్టి దీవించారు.

**క. ఆ పెద్దవేడబంబుల, పాపనికినిఁ జన్నుఁ గుడిపి పానుపుపై సం**
**స్థాపించి కప్పి 'కూరుకు, మో పాపఁడ!'యని యశోద యొయ్యన పాడెన్. 237**

* ఆ పెద్దమాయలాడైన పసిపాపడికి యశోద చనుబాలు త్రాగించి పానుపుపైన పడుకోబెట్టి, "ఇక నిద్రపో నాన్నా"అంటూ జోలపాట పాడింది.

**వ. అంత నందుండు మొదలయిన గోపకులు మధురనుండి వచ్చి రక్కసిమేనుఁ గని వెఱఁగుపడి 'మున్ను వసుదేవుం డుత్పాతంబు లెఱింగి చెప్పె, నతండు మహాయోగి'యని పొగడి కఠోరంబగు పూతన యొడలు కుఠారంబుల నఱికి తమ కుటీరంబులకుం దవ్వగు ప్రదేశంబునఁ బటీరంబుల దహనంబు సంగ్రహించి దహించి రంత. 238**

* అప్పుడు నందుడు మొదలైన గోపనాయకులు మధురనుండి వచ్చి ఆ రాకాసి కళేబరం చూచి నివ్వెరపోయారు. "వసుదేవుడు ఈ జరుగబోయే ఉత్పాతాలను ఊహించి చెప్పాడు. అతడు మహాయోగి!"అని మెచ్చుకున్నారు. తరువాత కఠినమైన ఆ పూతన శరీరాన్ని గొడ్డళ్ళతో నరకి ముక్కలు చేశారు. తమ పల్లెలకు చాలదూరంగా చందనపు కట్టెలను పేర్చి ఆ కళేబరపు ముక్కలను దహనం చేశారు.

**ఆ. పొగిలి పొగిలి కాలు మగువదేహంబున, నగురు పరిమళముల పొగలు వెడలె<br>దేహకల్మషములు శ్రీహరి ముఖమునఁ, ద్రావఁబడుటఁ జేసి భూవరేణ్య! 239**

* పరీక్షిన్మహారాజా! ఆ పూతన శరీరం రగిలి పొగిలి కాలుతూ ఉంటే, ఆ శరీరంనుండి అగరు సువాసనలు వెదజల్లే పొగలు వచ్చాయి. ఎందుచేతనో తెలుసా? కృష్ణుడు పాలతోపాటు విషాన్నీ, ఆమె ప్రాణాన్నే కాక శరీరంలో ఉన్న మాలిన్యాన్నంతటినీ త్రాగివేశాడు!

**క. హరి దనమీఁదం బదములుఁ, గరములు నిడి చన్నుఁ గుడిచి కదిసినమాత్రన్<br>హరిజననిపగిదిఁ బరగతి, కరిగెను దురితములఁ బాసి యసురాంగనయున్. 240**

* కృష్ణుడు తనపై కాళ్ళు చేతులు వేసి దగ్గరకు వచ్చి, చనుబాలు త్రాగినంత మాత్రాననే అంతటి ముక్కిడి రక్కసికి కూడా పాపాలు పటాపంచలై పోయి, విష్ణువు తల్లివలెనే పరమగతికి చేరుకుంది.

**క. వెన్నుని కొకమఱి విషమగు, చన్నిచ్చిన బాలహంత్రి చనెనఁట దివికిన్,<br>వెన్నునిఁ గని పెంచుచుఁ దన, చన్నిచ్చిన సతికి మఱియు జన్మము గలదే? 241**

* విష్ణువుకు ఒక్కమారు విషమయమైన చనుబాలు ఇచ్చిన రాకాసి, బాలహంతకురాలుకూడా స్వర్గానికి వెళ్ళిందట! ఇక విష్ణువును కన్న తల్లికీ 'పాలిచ్చి పెంచిన తల్లికీ మోక్షమేకాని మళ్ళీ జన్మ ముంటుందా?

**క. హరిఁగని చన్నులు గుడిపెడి, తరుణులు ప్రాప్తించు పదము దలఁపఁగ వశమే?<br>హరి యారగించుటకుఁ బా, ల్గురిసిన ధేనువులు ముక్తి కొనలఁ జరించున్. 242**

* విష్ణువును చూచి, చనుబాలు త్రాగించగలిగిన యువతులు ఎంత ఉత్తమలోకాలకు పోతారో ఊహించడం శక్యమా? హరికి త్రాడగానికి పాలనిచ్చిన గోమాతలుకూడా ముక్తిలోకం పొలిమేరలలో తిరుగుతూ ఉంటాయి.

**క. ఆపూతన మెయి గంధము, గోపాలు రెఱింగి 'యిట్టి కువనిత యొడలం**
**దీపాటి స్వాదుగంధము', ప్రాపించునె యనుచుఁ జనిరి పల్లెల కధిపా! 243**

* ఆ సమయంలో వస్తున్న సుగంధం పూతన కళేబరంనుంచి వచ్చినదే అని గోపాలకులు గ్రహించారు. "ఇటువంటి దుష్టురాలి శరీరంలో ఇంతటి యోగ్యమైన సుగంధమా"అని ఆశ్చర్యపోతూ తమతమ పల్లెలకు వెళ్లిపోయారు.

**వ. అంత నందుండు పరమానందంబున నింటికిం జని వ్రేతల చేత రక్కసిచేఁత లన్నియు నెఱింగి వెఱంగుపడి పాపని లేపి శిరంబు మూర్కొని ముద్దాడి ముదంబున నుండెనని చెప్పిన విని పరీక్షి న్నరేంద్రుం డిట్లనియె. 244**

* నందుడు ఉత్పాతం తప్పినందుకు చాలా సంతోషంతో తన ఇంటికి వెళ్ళాడు. గోపకాంతల వలన పూతన చేసిన చేష్టలన్నీ విన్నాడు. నిశ్చేష్టుడై, పాపడిని నిద్రలేపి శిరస్సు మూర్కొని, ముద్దు పెట్టుకున్నాడు. బిడ్డడికి ఆపద తప్పిపోయిందని సంతోషించాడు.

ఈ విధంగా శుకమహర్షి చెప్పగా విని పరీక్షిన్మహారాజు ఆయనను ఇలా అడిగాడు.

**క. ఏ యే యవతారంబుల, నే యే కర్మములు సేసె నీశుఁడు హరి భ**
**ద్రాయతనము లన్నియు వినఁ, బాయదు చిత్తంబు సెవులపండువు లయ్యెన్. 245**

* ఈశ్వరుడైన హరి ఏయే అవతారాలలో ఏయే పనులు చేశాడు? అతని చరిత్రలు ఏవి విన్నా అవి మనలను రక్షిస్తాయి. నా మనస్సు మరొకవంకకు పోవడం లేదు. శ్రీహరి కథలు వింటుంటే చెవులకు పండుగగా ఉంది.

**క. ఉరుసంసారపయోనిధి, తరణంబులుఁ బాపపుంజతరణంబులు శ్రీ**
**కరణంబులు ముక్తి సమా, చరణంబులు బాలకృష్ణు సంస్మరణంబుల్. 246**

* బాలకృష్ణుని సంస్మరణలు సంసారమనే గొప్ప సముద్రాన్ని దాటించే నావలు. అవి పాపపుంజాలను పారద్రోలుతాయి. అవి ఎవరికైనా సకలసంపదలు కలిగిస్తాయి. మోక్షం ఎవరికైనా దొరకాలంటే అతని సంస్మరణలే అందుకు మూలాధారాలు.

**వ. అని తరువాత బాలకృష్ణుండేమి సేసె నాయందుఁ గృప గలదేనిం జెప్పవే యని యడిగిన రాజునకు శుకుం డిట్లనియె. 247**

* "మునీంద్రా! నాయందు నీకు దయ ఉంటే ఆ తరువాత బాలకృష్ణుడేమి చేశాడో చెప్పు''అని పరీక్షిత్తు అడుగగానే, శుకమహర్షి ఇలా అన్నాడు.

**-: బాలకృష్ణుండు శకటముం దన పాదమునఁ గూలఁ దన్నుట :-**

సీ. బాలకుం డొదిఁగిలఁ బడ నేర్చెనని జన్మ నక్షత్రమం దొకనాఁడు నందు
పొలఁతి వేడుక బోర్కుఁ బోయ ప్రేతలఁ జీరి వాదిత్రగీతారవంబు సెలఁగ
విప్రులతోఁ గూడ వేదమంత్రంబుల నభిషేచనాదిక మాచరించి
వారిదీవన లొంది వారికి మొదవుల నన్నంబుఁ జీరల నడిగినట్టి

ఆ. లిచ్చి బాలుఁ దియ్య మెసఁగఁ బానుపు సేర్చి, నిదురపుచ్చి గోపనివహమునకు
గోపికలకుఁ బూజఁ గొమరారఁ జేయుచు, జనని కొడుకు మఱచె సంభ్రమమున. 248

* బాలకృష్ణుడు ప్రక్కకు ఒత్తిగిలి బోర్లబడడం చేర్చుకున్నాడని యశోద ఒకనాడు వేడుక చేసింది. ఆనాడు బాలకుని జన్మనక్షత్రం. ముచ్చటతో గోపికల నందరినీ పేరంటానికి పిలిచింది. మంగళవాద్యాలు మ్రోగుతూ ఉండగా బ్రాహ్మణులచేత వేదమంత్రాలతో అభిషేకం మొదలైనవి చేయించింది. ఆ బ్రాహ్మణుల దీవెనలు పొంది, వారికి ఆహార ధాన్యాలు, గోవులు, క్రొత్తబట్టలు అడిగినవి అడిగినట్లు సమర్పించింది. తరువాత బాలకృష్ణుణ్ణి ప్రేమతో పాన్పుపై పడుకోబెట్టి నిదురపుచ్చింది. వృద్ధులైన గోపకులను, గోపికలను చక్కగా పూజిస్తూ, ఆ సందడిలో పిల్లవాడి విషయం మరచిపోయింది.

వ. ఆ సమయంబున. 249

క. నిదురించిన శిశు వాఁకొని, కిదుకుచుఁ జను గోరి కెరలి కిసలయ విలస
న్మృదుచక్రచాపరేఖా, స్పదపదమునఁ దన్నె నొక్కబండిన్ దండిన్. 250

* నిద్రపోయి లేచిన ఆ పసివానికి ఆకలి వేసింది. తల్లి పాలిండ్లకోసం తడుముకున్నాడు, దొరకలేదు. వానికి కోపం వచ్చి కాళ్ళు కొట్టుకోసాగాడు. ఆ పాదాలు చిగుళ్ళులాగా అతిసుకుమారంగా ఉన్నాయి. చక్ర రేఖ, చాపరేఖ అనబడే దివ్యరేఖలు ఆ పాదాలలో ఉన్నాయి. అటువంటి కాలితో బాలకృష్ణుడు ప్రక్కనున్న ఒక బండిని ఒక్క తన్ను తన్నాడు.

క. శకటము హరి దన్నిన దివిఁ, బ్రకటం బై యెగసి యిరుసు భరమునఁ గండ్లున్
వికటంబుగ నేలంబడె, నకటా! యని గోపబృంద మాశ్చర్యపడన్. 251

* చిన్నారి కన్నయ్య తన్నితే ఆ బండి ఒక్కసారిగా పై కెగిరి నేలపైన పడిపోయింది. ఇరుసూ కమ్ములూ చక్రాలూ ముక్కలు చెక్కలైనాయి. గోపకులందరూ ఔరా! అని ఆశ్చర్యపడ్డారు.

వ. అప్పుడందున్న సరసపదార్థంబులు వ్యర్థంబులై నేలం గూలుటం జూచి యశోదానంద ముఖ్యులైన గోపగోపికాజనంబులు పనులు మఱచి పబ్బంబులు మాని యుబ్బుసెడి వెఱపులు ఘనంబులుగ మనంబులందు. 252

* ఆ బండిలో ఉన్న మధురములైన పదార్థాలు అన్నీ నేలపాలై పోయాయి. అది చూచి యశోద, నందుడు, గోపికలు, గోపకులు నివ్వెరపోయి చేస్తున్న పనులు మరచిపోయారు. పండుగ చేసుకోవడం మానివేశారు. గొప్పభయంతో వారి మనస్సులు బరువెక్కి పోయాయి.

**క. మిన్నున కూరక యెగయదు, తన్న సమర్థుండు గాఁడు తల్పగతుం డీ**
**చిన్ని కుమారుఁడు దేరే, విన్నువున నెగసె దీనివిధ మెట్టిదియో. 253**

**వ. అని వితర్కించు సమయంబున. 254**

* ఈ బండి ఆకాశంలోకి తనంతట తాను ఎగురదు కదా! దగ్గర ప్రక్కపైన ఉన్న ఈ పాపడు తన్నడానికి సమర్థుడు కాదు; మరి బండి ఏ విధముగా ఆకాశానికి ఎగిరినట్లు? ఏమిటి ఇందులోని విశేషం? అంటూ వారిలో వారు చర్చించుకోసాగారు.

**క. బాలకుఁ డాఁకొని యేడ్చుచుఁ, గా లెత్తినఁ దాఁకి యెగసెఁ గాని శకట మే**
**మూలమున నెగయ దని య, బ్బాలుని కడ నాడుచుండి పలికిరి శిశువుల్. 255**

* ఆ పాపనివద్ద ఆడుకొంటున్న బాలురు కొందరు "ఈ బాలకుడు ఆకలితో ఏడుస్తూ కాలెత్తి ఒక్కతన్ను తన్నాడు. తన్నగానే ఈ బండి అమాంతంగా పైకి వెళ్లిపోయింది, అంతేగాని మరేకారణం వల్లా కాదు"అని చెప్పారు.

**వ. ఇట్లు శిశువులు పలికిన పలుకు విని. 256**

**శా. బాలుం డెక్కడ? బండి యెక్కడ? నభోభాగంబుపైఁ జేడ్పడం**
**గాలం దన్నుట యెక్క? డేల పడుచుల్ గల్లాడి? రీజడ్డుఁ బ**
**ల్కే లోకంబున నైనఁ జెప్పఁబడునే? యే చందమో కాక యం**
**చాలాపించుచు వ్రేలువ్రేతలుఁ బ్రభూతాశ్చర్యులై రందఱున్. 257**

* ఆ పిల్లల మాటలు విని "ఏమిటి? ఈ బాలు డెంతవాడు? బండి ఎంతటిది? వీడు ఈ బండిని ఆకాశానికి ఎగిరేటట్లుగా తన్నడ మేమిటి? ఇలాంటి మూర్ఖపుమాట ఏలోకంలోనైనా ఎవరైనా నమ్ముతారా? ఈ బాలకులు అబద్ధాలాడి ఉంటారు. లేకపోతే మరేమైనా విశేషం ఉన్నదేమో?"అని గోపకులు గోపికలు అందరూ అంతులేని ఆశ్చర్యంతో నిశ్చేష్టులై నిలబడి పోయారు.

**వ. అప్పు డా బాలుని రోదనంబు విని యశోద పఱతెంచి. 258**

**ఆ. అలసితివి గదన్న! యాఁకొంటివి గదన్న!, మంచియన్న! యేడ్పు మాను మన్న!**
**చన్ను గుడువు మన్న సంతసపడు మన్న, యనుచుఁ జన్ను గుడిపె నర్భకునకు. 259**

* అప్పుడు ఆ పాపని ఏడుపు విని యశోద పరుగెత్తుకుని వచ్చి వానిని ఎత్తుకున్నది. "చిన్ని నాన్నా! అలసిపోయావా? ఆకలి వేస్తున్నదా! మా మంచి వాడవు కదూ! ఏడుపు మాను తండ్రీ! ఇదుగో! పాలు త్రాగి పకపకా నవ్వాలి, ఏదీ!" అంటూ చిన్ని కన్నయ్యకు చన్నుబాలు త్రాగించింది.

వ. అంత న బ్బాలునిమేన బాలగ్రహంబు సోఁకునుగదా యని శంకించి గోపకు లనేకు లనేక బలి విధానంబులు సేసరి. బ్రాహ్మణులు దధికుశాక్షతంబుల హోమంబు లాచరించిరి. ఋగ్యజుస్సామ మంత్రంబుల నభిషేచనంబులు సేయించి స్వస్తి పుణ్యాహవాచనంబులు సదివించి కొడుకున కభ్యుదయార్థంబు నందుం డలంకరించిన పాఁడి మొదవుల విద్వజ్జనంబుల కిచ్చి వారల యాశీర్వాదంబులు గైకొని ప్రమోదించె నని చెప్పి శుకుం డిట్లనియె. 260

* ఎంతోమంది వృద్ధులైన గోపకులు బాలునికి బాలగ్రహం సోకిందేమో అని ఊహించి ఎవరికి తోచిన శాంతి విధానాలను వారు నిర్వర్తించారు. బ్రాహ్మణులు పెరుగు, దర్భలు, అక్షతలతో హోమాలు చేశారు. నందుడు కుర్రవాని క్షేమంకోసం ఋగ్వేద యజుర్వేద సామవేద మంత్రాలతో బాలునికి అభిషేచనాలు చేయించి, బ్రాహ్మణుల చేత స్వస్తివాచనాలు, పుణ్యాహవాచనాలు చదివించి అలంకరించిన పాడియావులను వారికి దానం చేశాడు. వారందరూ ఇచ్చిన ఆశీర్వాదాలు స్వీకరించి సంతోషించాడు నందుడు.

ఈ విధంగా చెప్పి శుకయోగి ఇలా అన్నాడు.

క. కొడుకు నొకనాఁడు తొడపై, నిడుకొని ముద్దాడి తల్లి యెలమి నివురుచోఁ
గడుదొడ్డ కొండ శిఖరము, వడువున వ్రేఁ గయ్యె నతఁడు వసుధాధీశా! 261

* పరీక్షిన్మహారాజా! ఒకనాడు యశోద ముద్దులకొడుకును తొడ పై పడుకోబెట్టుకుని ముద్దాడి, ప్రేమతో ఒడలు నిమురుతూ ఉంది. అంతలోకే అకస్మాత్తుగా ఆ బిడ్డడు కొండశిఖరం లాగున బరువెక్కి పోయాడు.

## -: తృణావర్తుఁడను రాక్షసుఁడు సుడిగాలియై కృష్ణు నెత్తుకొని పోవుట :-

క. బరువైన కొడుకు మోవను, వెరవిఁడి యిలమీఁదఁ బెట్టి వెఱచి జనని దా
థరఁ గావఁబుట్టిన మహా, పురుషుఁడు గాఁబోలు ననుచు బుద్ధిఁ దలంచెన్. 262

* అలా బరువెక్కిపోయిన కొడుకును మోయడ మెలాగో తెలియని యశోద నేలపైన పడుకోబెట్టింది. ఈ విచిత్రానికి ఆమె భయపడిపోయి " ఇతడు జగత్తును సంరక్షించడానికి పుట్టిన మహాపురుషుడు కాబోలు" అనుకొన్నది.

వ. అప్పుడు. 263

క. ఖరుఁ డగు కంసునిపంపున, నరిగి తృణావర్తుఁ డవని కవచాటముగా
సురకరువలి యై బిసబిస, నరు దరు దన ముసరి విసరి హరిఁ గొనిపోయెన్. 264

* అప్పుడు కఠినాత్ముడైన కంసుడు పంపిన తృణావర్తుడనే రాక్షసుడు సుడిగాలి రూపంలో 'రుంయ్యి' మనే శబ్దంతో అకస్మాత్తుగా భూమిపైకి దిగివచ్చాడు. "ఇంతగాలి ఎప్పుడూ ఎరుగము'' అని గోపీగోపకులు అనుకుంటూ ఉండగానే రుంయ్యి రుంయ్యిన కుర్రవాణ్ణి ఆక్రమించి ఒక్క విసురుతో బాలుణ్ణి పైకి ఎత్తుకొని పోయాడు.

క. సుడి యెఱుఁగని హరి సుడివడ, సుడిగాలి తెఱంగు రక్కసుఁడు విసరెడి యా
సుడిగాలి ధూళి గన్నుల, సుడిసిన గోపకులు బెగడి సుడివడి రధిపా! 265

* కష్టమంటే ఎరుగని చిన్ని బాలుడు సుడిగాలిలో చిక్కిపోయాడు. ఆ సుడిగాలి రాక్షసుడు విసిరిన సుడిగాలికి రేగిన దుమ్ము దుమారం గోపకుల కన్నులను చుట్టుకొన్నది. వారు దిక్కుతెలియక భయంతో గాబరా పడిపోయారు.

వ. మఱియు న వ్వలయపవన దనుజుండు విలయపవనుని తెఱంగునం గసిమసంగి ముసరి మసరు గవిసి విసరెడి సురకరువలిం బొడమిన పుడమిరజంబు వడి నెగసి గగనమున మెరసి తరణికిరణములకు మఱుఁగువడిన నిబిడమగు బెడిదంపుఁ దిమిరమున దశదిశ లెఱుంగఁబడక గోకులం బాకులత నొంద నొండొరుల నెఱుంగక బెండుపడుచున్న జనంబుల మనంబుల ఘనంబుగ భయంబు రయంబునం జెంద నదభ్రపరిభ్రమణ శబ్దంబున దిగంతంబులు సెవుడు పడి పరిభ్రాంతంబులుగ నొక్క ముహూర్తమాత్రంబున భువన భయంకరత్వంబు దోఁచె, నా సమయంబున. 266

* ఆ సుడిగాలి రాక్షసుడు ప్రళయకాల ప్రభంజనంవలె విజృంభించి రివ్వురివ్వున విసరికొట్టాడు. ఆ గాలినుండి పుట్టిన దుమ్ము ధూళి ఉవ్వెత్తుగా లేచింది. ఆ ధూళి ఆకాశమంతా ఆవరించి సూర్యుని కిరణాలకు అడ్డుపడింది. అప్పుడు భయంకరమైన చీకటి ఆకాశమంతా దట్టంగా ఆవరించింది. గోపకులు దిక్కు తెలియక అల్లాడిపోయారు. ఎవరెక్కడున్నారో తెలియకుండా పోయింది. దానితో నిశ్చేష్టులైన వారి కందరికీ గొప్ప భయం పుట్టి మనస్సులనిండా నిండిపోయింది. ఆ సుడిగాలి వేగానికీ ఆ భయంకర ధ్వనికీ దిక్కులు దద్దరిల్లాయి. జగమంతా గిర్రున తిరుగుతున్నట్లు తోచింది. అలా ఒక్కముహూర్తం సేపు లోకాలన్నిటికీ భయంకరమైన స్థితి ఏర్పడింది.

ఉ. పాపనిఁ జూడఁ గానక విపద్దశ నొంది కలంగి తల్లి 'యో
పాపఁడ! బాలసూర్యనిభ! బాలశిరోమణి! నేఁడు గాలికిం
జేపడి పోయితే' యనుచుఁ జీరుచు దైవముఁ జాల దూఱుచుం
దాపము నొంది నెవ్వగల దయ్యుచుఁ గ్రుయ్యుచు బిట్టుఁ గూయుచున్. 267

* పసివాడు కనపడకపోయేసరికి యశోద ఎంతో దుఃఖంతో కలవరపడిపోయింది. "ఓయి చిట్టితండ్రీ! ఉదయించే సూర్యునివంటి కాంతిగలవాడవే! చిన్ని బిడ్డలలోకెల్లా శిరోమణివంటి వాడవే! ~~ఈనాడు ఈ~~ సుడిగాలికి ఆపదలో పడిపోయినావా?"అని విలపించింది. కుర్రవాణ్ణి గొంతెత్తి పిలిచింది. ~~ఈస్థితి~~ కలిగించినందుకు దైవాన్ని ఎంతో నిందించింది. లోలోపల పరితాపంతో తపించి పోయింది. శోకంతో సొమ్మసిల్లి పోయింది.

క. సుడిగాలి వచ్చి నిన్నున్, సుడిగొని కొనిపోవ మింట సుడిసుడి గొనుచున్
బెడఁ గడరెడి నా ముద్దుల, కొడుకా! యే మంటి వనుచు ఘోరం బనుచున్. 268

* ఆ సుడిగాలి వచ్చి నిన్ను చుట్టుబెట్టి ఆకాశంలో ఎక్కడికో లాక్కొనిపోతే ఒక్కడవే చిక్కిపోయి భయంతో అలమటించిపోతూ ఎంత ఏడుస్తున్నావో! అయ్యో! నా ముద్దుల కొడకా! ఇదెంత ఘోరంరా!

ఉ. ఇక్కడఁ బెట్టితిం దనయుఁ డిక్కడ నాడుచు నుండె గాలి దా
నెక్కడ నుండి వచ్చె శిశువెక్కడి మార్గము వట్టిపోయె నే
నెక్కడఁ జొత్తునంచుఁ గమలేక్షణ గ్రేపుఁ దొలంగి ఖిన్నయై
పొక్కుచు వ్రాలు గోవుక్రియ భూ స్థలి వ్రాలె దురంత చింతయై. 269

* "ఇప్పుడు ఇక్కడే కూర్చోబెట్టాను బిడ్డను. ఇక్కడే ఆడుకొంటున్నాడు. ఇంతలో ఈ గాలి ఒక్కసారిగా ఎక్కడనుండి వచ్చింది? ఆ గాలి వెంట నా బాబు. ఎటువైపు ఎగిరిపోయాడో? అయో! నేనెందులో దూకేది?"అని విలపిస్తూ యశోద భరించరాని దుఃఖంతో కుప్పకూలిపోయింది. లేగదూడ కనిపించకపోతే దుఃఖంతో కుమిలిపోయే ఆవు లాగా అల్లాడిపోయిం దా తల్లి.

క. పాపనికై యిటు వొగిలెడి, యా పాపని తల్లిఁ జూచి యారటపడుచున్,
గోపాలసతులు బాష్పజ, లాపూరిత నయన లైరి యార్తిం బడుచున్. 270

* చిన్నిపాపని కోసం ఆ విధంగా ఖిన్నురాలై దుఃఖపడుతున్న కన్నతల్లి యశోదాదేవిని చూచి గోపికలు ఆరాటపడ్డారు, వారి కన్నులలో నీళ్లు నిండాయి.

శా. ఆలోఁ జక్రసమీర దైత్యుఁడు మహాహంకారుఁడై మింటికిన్
బాలుం దాఁ గొనిపోయి పోయి తుదిఁ దద్భారంబు మోవన్ బల
శ్రీలేమిం బరిశాంతవేగుఁ డగుచుం జేష్టింపఁగా లేక ము
న్నీలా గర్భకుఁ జూడనంచు నిట మీఁదెట్లంచుఁ జింతించుచున్. 271

* ఈ లోగా సుడిగాలి రాక్షసుడు మహాగర్వంతో బాలుని ఆకాశంలోనికి తీసుకొని పోగలిగాడు. అయితే క్రమేణ బాలుడు బరువెక్కిపోసాగాడు. చివరకి ఆ బాలుణ్ణి భరించడానికి కావలసిన శక్తి ఆ రాక్షసునివద్ద లేకపోయింది. కడకు కదలడమే వాడికి కష్టసాధ్యమైపోయింది. "ఇంతకు ముందు ఇలాంటి బాలుణ్ణి నే నెక్కడా చూడలేదే?" అనుకొన్నాడు. దిక్కుతోచక 'ఇక నే నేమవుతానో?"అని విచారపడసాగాడు.

వ. అటు దనుజుండు చింతించుచున్న సమయంబున. 272

క. బాలద్విరద కరంబులఁ, బోలెడి కరములను దనుజు బొండుగ బిగియం
గీలించి వ్రేలఁ బడియెను, బాలకుఁ డొక కొండభంగి బరు వై యధిపా! 273

* ఆ రాక్షసుడు ఆ విధంగా ఆరాటపడుతున్న సమయంలో కృష్ణుడు పిల్లయేనుగు తొండాలవంటి తన రెండు చేతులూ నేరస్థుని మెడకు బిగించే బొండు కొయ్యలు లాగా రాక్షసుని మెడకు తగిలించి బిగించాడు. ఒక పెద్ద కొండంతబరువై వాడి మెడపట్టుకుని క్రిందికి వ్రేలాడసాగాడు.

క. మెడబిగియఁ బట్టుకొని డిగఁ, బడియెడి బాలకునిచేతఁ బర్వతనిభుచే
విడివడఁజాలక వాఁ డురిఁ, బడి బెగడెడు ఖగముభంగి భయముం బొందెన్! 274

* తన మెడను బిగియబట్టి పర్వత మంత బరువుతో దిగలాగుతున్న ఆ బాలకుని పట్టునుంచి విడిపించుకోలేక ఆ రాక్షసుడు ఉరిలోపడి కొట్టుకొనే పక్షిలాగా గిలగిల కొట్టుకున్నాడు.

**క. హరి కరతల పీడనమునఁ, బరవశుఁడై ఱాలమీఁద భగ్నాంగకుఁ డై**
**సురవైరిభటుఁడు గూలెను, బురభంజను కోలఁ గూలు పురముంబోలెన్. 275**

* ఆ చిన్నిబాలుని చేతుల ఒత్తిడికి తన శరీరం తన అధీనంలో లేక ఆకాశంలోనుంచి ఆ రాక్షసుడు క్రింద రాళ్లమీద కూలిపోయాడు. ఆ దెబ్బకు వాడి శరీరభాగాలన్నీ తుక్కుతుక్కుగా చితికిపోయినాయి. శివుని బాణం దెబ్బకు త్రిపురాసురుల పురం కూలిపోయినట్టు ఆ రాక్షసుడు నేలగూలాడు.

**వ. అంత గోపకాంత లంతయుం గని రోదనంబులు మాని సమ్మోదంబున వికృవిరిసి రక్కసుని యురంబున మురువు గలిగి బరువులేక వ్రేలు బాలుం గొనివచ్చి ముచ్చిరుచున్న తల్లి కిచ్చిరప్పుడు గోపగోపికాజనంబు లందఱుఁ దమలో నిట్లనిరి. 276**

* అప్పుడు గోపికలు అదంతా చూచి ఏడుపులు మాని ఎంతో సంతోషించారు. పువ్వు విచ్చినట్లు విక సించిన ముఖంతో ఆ రాక్షసుని వక్షస్థలంపైన ముచ్చటగా ఆడుకొంటున్న బాలుణ్ణి ఎత్తుకున్నారు. అప్పుడు చిన్నికృష్ణుడు చిత్రంగా ఏ మాత్రం బరువు లేకుండా తేలిగ్గా చేతుల్లో వ్రేలాడుతున్నట్లు ఉన్నాడు. ఆ చిన్ని కన్నయ్యను తీసికొనివచ్చి దుఃఖపడుతున్న యశోదచేతికి ఇచ్చి ఆమె దుఃఖం పోగొట్టారు. అప్పుడు గోపాలకులు తమలో ఇలా అనుకున్నారు.

**క. రక్షణము లేక సాధుఁడు, రక్షితుఁ డగు సమతఁ జేసి రాయిడులందున్**
**రక్షణములు వెయి గలిగిన, శిక్షితుఁ డగు ఖలుఁడు పాపచిత్తుం డగుటన్. 277**

* సజ్జనుడైనవాడు అందరి యెడలా సమబుద్ధితో ఉంటాడు. కనుక రక్షణ అంటూ వేరే లేకపోయినా కష్టాలలో రక్షించబడతాడు. దుర్జనుడు పాపపు ఆలోచనలు చేస్తూ ఉండటంవలన, వేయి రక్షణలు ఏర్పాటు చేసుకున్నా శిక్ష పొంది తీరుతాడు.

**మ. గతజన్మంబుల నేమి నోఁచితిమొ? యాగశ్రేణు లే మేమి సే**
**సితిమో? యెవ్వరి కేమి పెట్టితిమొ యే చింతారతిం బ్రొద్దు పు**
**చ్చితిమో? సత్యము లేమి పల్కితిమొ? యే సిద్ధ ప్రదేశంబుఁ ద్రొ**
**క్కితిమో? యిప్పుడు సూడఁ గంటి మిచటం గృష్ణార్భకున్ నిర్భయున్. 278**

* పూర్వజన్మలలో మనం ఏయే నోములు నోచామో? ఏయే యాగాలు ఎన్నెన్ని చేశామో? ఎంతమంది అర్థులకు ఏమేమి దానం చేశామో? ఏయే పుణ్యకథలను మననం చేసుకుంటూ కాలం గడిపామో? ఎన్ని సత్యవాక్యాలు మాట్లాడామో? ఏ యే పుణ్య తీర్థాలు సేవించామో? కనుకనే ఇప్పుడు ఈ నల్లనయ్యను ఇంత నిర్భయంగా ఉన్నవాణ్ణి చూడగలిగాము''అని ఆశ్చర్యపోయారు.

**వ. అని పలికి రంత నందుండు మున్న దనకు వసుదేవుండు సెప్పిన మాటలకు వెఱఁగుపడుచుండె. మఱియును. 279**

* నందుడు తనకు వసుదేవుడు చెప్పిన మాటలను గుర్తుకు తెచ్చుకుని లోలోపల భయపడుతున్నాడు.

**సీ. జననాథ! యొకనాఁడు చన్ను చేఁపినఁ దల్లి చిన్ని ముద్దుల కృష్ణుఁ జేరఁ దిగిచి**
**యెత్తి పెందొడలపై నిడికొని ముద్దాడి చ న్నిచ్చి నెమ్మోము సక్క నివిరి**
**యల్లని నగవుతో నావులించిన బాలు వదనగహ్వరమున వారినిధులు**
**దిశలు భూమియు వనద్వీపశైలంబులు నేఱులు గాలియు నినుఁడు శశియు**

**ఆ. దహనుఁ డాకసంబుఁ దారలు గ్రహములు, నఖిలలోకములుఁ జరాచరంబు**
**లైన భూతగణము లన్నియు నుండుటఁ, జూచి కన్నుమోడ్చి చోద్యపడియె. 280**

* పరీక్షిన్మహారాజా! ఒకనాడు యశోదకు పాలిండ్లు చేపువచ్చాయి. చిన్నారి ముద్దుల కృష్ణుని ఎత్తుకొని, ఒడిలో పరుండబెట్టుకుని ముద్దాడింది. చంటివాడికి చక్కగా పాలు త్రాగించి, ప్రేమగా ముఖం నిముర సాగింది. ఆ మాయలమారి పిల్లవాడు అల్లరిగా చిరునవ్వు నవ్వుతూ నిద్రవస్తున్నట్లు ఆవులించాడు. వాని ముఖం పెద్ద కొండగుహవలె యశోదకు గోచరించింది. ఆ లోతులలో సముద్రాలు, దిక్కులు, భూమి, అరణ్యాలు, ద్వీపాలు, పర్వతాలు, నదులు, గాలి, సూర్యుడు, చంద్రుడు, అగ్ని, ఆకాశము, తారలు, గ్రహాలు, సర్వలోకాలు, చరాచరములైన అన్ని జీవరాసులూ కనుపించాయి. ఆమె కన్నులు అరమోడ్పులై మూతపడ్డాయి. ఆమె నివ్వెరపోయింది.

**వ. అంత నొక్కనాఁడు వసుదేవుపంపున యాదవ పురోహితుండైన గర్గుండు మందకుం జనుదెంచిన నందుం డతనిఁ గనుంగొని లేచి నిలిచి కృతాంజలి యై. 281**

* ఒకనాడు యాదవుల పురోహితుడైన గర్గుడనే మహర్షి వసుదేవుని సూచనపైన వ్రేపల్లెకు వచ్చాడు. నందుడు ఆయనను చూచి, లేచి నిలబడి చేతులను జోడించి నమస్కారం చేశాడు.

**క. కోరి భజించెను నందుఁడు, సారగుణాచారమార్గు సత్సంసర్గు**
**న్నారాధితభర్గున్ మతి, దూరితషడ్వర్గుఁ గుజనదుర్గున్ గర్గున్. 282**

* ఆయన ఉత్తమములైన గుణాలు, ఆచారాలు కలవాడు. మంచి ప్రవర్తన కలవాడు. సత్పురుషుల తోనే సాంగత్యం చేసేవాడు. శివుని ఆరాధించేవాడు. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్స ర్యాలను దూరంగా ఉంచినవాడు. దుర్జనులు ఆయన వద్దకు చేరలేరు. అంతటి మహాత్ముడైన గర్గమహర్షిని నందుడు భక్తి శ్రద్ధలతో పూజించాడు.

**వ. మఱియుఁ దగిన సత్కారంబులు సేసి యిట్లనియె. 283**

**క. ఊరక రారు మహాత్ములు, వా రధముల యిండ్లకడకు వచ్చుట లెల్లం**
**గారణము మంగళములకు, నీరాక శుభంబు మాకు నిజము మహాత్మా! 284**

* తగిన సత్కారాలుచేసి నందుడు ఆయనతో ఇలా అన్నాడు; "మహాత్ములైనవారు ఏపనీ లేకుండా ఊరకే రారు. మీవంటివారు తక్కువస్థాయిలో ఉన్న మావంటి వారి ఇంటికి వచ్చారంటే దానికి కారణం

మాకు శుభములు చేకూర్చడానికే అవుతుంది. మహానుభావా మీరాక మాకు చాల శుభం కలిగిస్తుందని నాకు బాగా తెలుసు.

**శా. జ్యోతిశ్శాస్త్రుల కెల్ల మేటరివి తేజోమూర్తి వాశాంత వి**
**ఖ్యాత స్ఫూర్తివి బ్రహ్మబోధనుఁడ వాకర్ణింపు నా పల్కు ని**
**ర్ణీతుండైన గురుండు మానవులకు న్విప్రోత్తముండండ్రు నీ**
**చాతుర్యంబున నీ కుమారులకు సంస్కారంబు గావింపవే. 285**

* జ్యోతిశ్శాస్త్రం తెలిసిన వారందరిలో శ్రేష్ఠుడవు. తేజోవంతుడవు. నీ కీర్తి అన్ని దిక్కులలోనూ నిండి ఉన్నది. బ్రహ్మానుభూతిని పొందినవాడవు. నా విన్నపం ఆలకించు. మానవులకు గురువుగా నిర్ణయింప బడినవాడు బ్రాహ్మణుడని పెద్దలంటారు. నీవు ఈ కుమారు లిద్దరికీ యథావిధిగా అవసరమైన సంస్కారాలు నిర్వర్తించవలసిందిగా ప్రార్థిస్తున్నాను.

**వ. అని రామకృష్ణులం జూపిన గర్గుండు మున్ను కంసునిచేత వ్రేటువడి దివి కెగసిపోయిన తెఱవ సెప్పిన తెఱంగు దేట పఱిచి దేవకీదేవి కొడుకని కృష్ణునిఁ గంసుండు దలంచుం గావున రహస్యంబున సంస్కారంబు సేయుట కార్యంబని నందానుమతంబున రోహిణీసుకుమారు నుద్దేశించి. 286**

* అని నందుడు రోహిణీదేవి కొడకునూ, తన కొడుకునూ గర్గునికి చూపించాడు. కంసుని వ్రేటునుండి తప్పించుకున్న బాలిక శక్తి స్వరూపిణియై చెప్పిన మాటలను గర్గమహర్షి నందునికి చెప్పాడు. కంసునికి మృత్యువైన బాలుడు వేరొకచోట పెరుగుతున్నాడని ఆ దేవి పలకడం కంసునికి తెలుసును. ఈ బాలకుని విషయం తెలిస్తే ఇతడు దేవకీదేవి కొడుకేమోనని కంసుడు అనుమానిస్తాడు. అప్పుడు ఈ బాలునికి అపకారం జరగవచ్చు. కనుక చేయవలసిన సంస్కారాలు రహస్యంగా చేయడం మంచిది అని నందునికి నచ్చచెప్పాడు. అందుకు నందుడు అంగీకరించాడు.

**క. జనులు రమియింపఁ దిరిగెడి, యనువు కలిమి రాముఁడనియు యదు సంకర్షం**
**బున సంకర్షణుఁ డనియును, ఘనబలమున బలుఁడు వనియు గణుతించె నృపా! 287**

* అప్పుడు గర్గమహర్షి రోహిణీదేవి కుమారునికి ఈ విధంగా నామకరణం చేశాడు. జనులందరికీ ప్రీతిపాత్రుడుగా ఉంటాడు కనుక. 'రాముడు'అనీ, యాదవులనుండి వ్రేపల్లెలోనికి సంకర్షణం (లాగబడడం) చేయబడినాడు గనుక 'సంకర్షణుడు'అనీ, మహా బలవంతుడు గనుక 'బలుడు'అనీ పేరు పెట్టాడు.

**వ. మఱియుం గృష్ణు నుద్దేశించి తొల్లి యీ శిశువు ధవళారుణ పీతవర్ణుండై యిప్పుడు నల్లనైన కతంబునఁ గృష్ణుం డయ్యె, వసుదేవునకు నొక్కెడ జన్మించిన కారణంబున వాసుదేవుండయ్యె, నీ పాపనికి గుణరూపకర్మంబు లనేకంబులు గలుగుటంజేసి నామంబు లనేకంబులు గలవు. ఈ శాబకునివలన మీరు దుఃఖంబులఁ దరియింతు, రీ యర్భకునిచేత దుర్జనశిక్షణంబును సజ్జనరక్షణంబును నగు,నీ కుమారుండు నారాయణ సమానుండని చెప్పి తన గృహమ్మునకు మ్మునీశ్వరుండుసనియె. నందుం డును బరమానందంబున నుండె నంత. 288**

* తరువాత గర్గమహర్షి యశోదాకుమారుని ఉద్దేశించి ఇలా అన్నాడు, " ఈ శిశువు పూర్వం తెలుపు, ఎరుపు, పసుపు రంగులలో ఉండేవాడు. ఇప్పుడు నల్లనైనాడు, కనుక 'కృష్ణు'డని పిలవండి. ఇతడు వసుదేవునకు జన్మించినవాడు గనుక 'వాసుదేవుడు' అని పేరుగూడ చెల్లుతుంది. ఈ బిడ్డడికి గుణములు, రూపములు, కర్మములు ఎన్నో ఉండడంవలన ఇంకా ఎన్నో పేర్లు వహిస్తాడు. ఈ బాలునివలన మీరు అన్ని దుఃఖాలనూ అతిక్రమించుతారు. వీనిచేత దుష్ట శిక్షణం శిష్టరక్షణం జరుగుతాయి. నాయనా! నీ కుమారుడు నారాయణు నితో సమానుడు సుమా!అని చెప్పి గర్గమహాముని తన ఇంటికి వెళ్ళిపోయాడు. మహానుభావుడైన ఋషీంద్రుడు తన కుమారునిగురించి మంచిమాటలు చెప్పినందుకు నందుడు చాల ఆనందించాడు.

## -: శ్రీ కృష్ణ బలరాముల బాల్యక్రీడాభివర్ణనము :-

సీ. జానుభాగముల హస్తమ్ములు వీడ్వడ నిడుచు దిగ్గనఁ బోదు రింత నంత
నవ్వల పయ్యెద లంది జవ్వాడుదు రాల క్రేపుల తోఁక లలమి పట్టి
విడువ నేరక వాని వెనువెంట జరగుదు రప్పంకముల దుడు కడరఁ జొత్తు
రెత్తి చ న్నిచ్చుచో నిరుదెసం బాలిండ్ల చేతులఁ బుడుకుచుఁ జేఁపుఁ గలుగ

తే. దూఁటుదురు గ్రుక్క గ్రుక్కకుఁ దోర మగుచు, నాడుదురు ముద్దు పలుకు లవ్యక్తములుగఁ
గరము లంఘ్రులు నల్లార్చి కదలుపుదురు, రామకృష్ణులు శైశవరతులఁ దగిలి. 289

* శ్రీ కృష్ణుడు, బలరాముడు క్రమంగా బాల్యక్రీడలతో తల్లి దండ్రులను గోపీగోపకులను చక్కగా సంతోషింపజేస్తున్నారు. మోకాళ్ళ మీద చేతులుపూని పట్టి నెమ్మదిగా లేచి నిలబడతారు. ఆ లేవడంలో చేతులు జారిపోయి ముందుకు తూలిపోతూ, మళ్లీ లేస్తారు. ఇటూ అటూ నడుస్తారు. తమ తల్లుల పైట కొంగులు పట్టుకొని ఊగుతారు, ఆవుదూడల తోకలు గట్టిగా పట్టుకుంటారు. అవి ముందుకుపోతూ ఉంటే తోక విడిచి పెట్టాలని తెలియక దూడల వెనుకనే జరుగుతూ ఉంటారు. బురదలోకి దూకుడుగా వెళ్ళి ఆడుకుంటారు. తల్లులు ఎత్తుకుని చనుబాలు త్రాగిస్తూ ఉంటే, రెండుచేతులతోనూ, రెండు పాలిండ్లూ తడుముతూ గుక్క గుక్కకీ మరింత చేపు వచ్చేటట్లు పాలు త్రాగుతారు. వచ్చీరాని ముద్దుమాటలు ముచ్చటగా మాట్లాడుతారు. "ఏది నాన్నా నాట్యం చెయ్యి" అంటే చేతులు కాళ్ళు అందంగా కదుపుతారు.

క. తడ వాడిరి బలకృష్ణులు, దడ వాడిరి వారిఁ జూచి తగ రంభాదుల్
దడవాడి రరులు భయమునఁ, దడ వాడిరి మంతనములఁ దపసులు వేడ్కన్. 290

* బలరాముడు, కృష్ణుడు ఆ విధంగా ఎంతోసేపు ఆడుకుంటూ ఉంటే, రంభ మొదలైన అప్సరసలు చాలసేపు ఆకాశంలో ఆనందంతో నాట్యం చేశారు. లోకంలోని దుర్మార్గులు భయంతో వడబడి తడబడ్డారు. ఋషులు తమ గోష్ఠులలో లోకం సుఖపడబోతున్నదని సంతోషంతో ఎంతోసేపు సంభాషించుకున్నారు.

సీ. తల లెత్తి మెల్లన తడవి యాడెడు వేళఁ బన్నగాధీశుల పగిదిఁ దాల్తు,
రంగసమ్మృష్ట పంకాంగరాగంబుల నేనుఁగు గున్నల యెత్తు వత్తు,
రసమంబులైన జవాతి రేకమ్ముల సింగపుఁగొదమల సిరి వహింతు
రాననంబులఁ గాంతు లంతకంతకు నెక్కు బాలార్క చంద్రులపగిదిఁ దోఁతు,

తే. రెలమిఁ దల్లుల చన్నుఁబా లెల్లఁ ద్రావి, పరమయోగోద్భవామృత పానలీల
సోలి యెఱుఁగని యోగుల సొంపు గందు, రా కుమారులు జనమనోహారు లగుచు. 291

* ఆ బాలకులు నేలపైన ప్రాకుతూ మెల్లగా తలలెత్తి ఆడుకుంటూ ఉంటే ఆదిశేషుడు పడగెత్తి ఆడినట్లు కనిపిస్తారు. మట్టిలో ఆడుకుని ఒళ్లంతా మట్టి పులుముకున్నప్పుడు ఏనుగు గున్నలవలె కనిపిస్తారు. కుప్పించి దూకుతున్నప్పుడు సాటిలేని జవసత్వాలతో సింహపు పిల్లలవలె కనిపిస్తారు. రోజురోజుకూ వారి ముఖాలలోని తేజస్సు పెరుగుతూ ఉంటే ఉదయించిన సూర్యచంద్రులవలె గోచరిస్తారు. తల్లుల చనుబాలు త్రాగి పరవశించి ఉత్తమమైన యోగసాధన వలన కలిగిన అనుభూతి అనే అమృతాన్ని రుచి చూస్తున్న యోగీశ్వరులవలె కనబడతారు. వారిని చూస్తున్న కొద్దీ వ్రేపల్లెలోని జనులకు తన్మయత్వం కలుగుతున్నది.

క. చూడనివారల నెప్పుడుఁ, జూడక లోకములు మూఁడు చూపులఁ దిరుగం
జూడఁగ నేర్చిన బాలక, చూడామణి జనుల నెఱిఁగి చూడఁగ నేర్చెన్. 292

* విష్ణువు తనవంక చూడని వారిని ఎన్నడూ చూడడు. అతని చూపుతో మూడు లోకాలూ గిరగిర తిరుగుతూ ఉంటాయి. అంతటి చూపు నేర్చిన శ్రీమహావిష్ణువు గోపాలబాలకుడై, జనులను కనులెత్తి చూడసాగాడు. క్రమంగా గుర్తుపట్టడం ప్రారంభించాడు.

క. నగవుల నవిద్యపోఁడిమి, నగుబాటుగఁ జేయనేర్చు నగవరి యంతన్
నగుమొగముతోడ మెల్లన, నగుమొగముల సతులఁ జూచి నగనేర్చె నృపా! 293

* ఓ రాజా! ఆ బాలకృష్ణుడు చిరునవ్వు నవ్వితే దట్టమైన అజ్ఞానం నవ్వులపాలైపోయి, జ్ఞానం పుట్టుకుని వస్తుంది. అంతటి విష్ణువు ఇంతటి వింతబాలకుడై, తనను చూచి నవ్వే గోపకాంతలను చూచి నెమ్మదిగా నవ్వడం నేర్చాడు.

క. అవ్వల నెఱుఁగక ముప్వురి, కవ్వల వెలుఁగొందు పరముఁ డర్భకుఁడై యా
యవ్వలకు సంతసంబుగ, నవ్వా! యవ్వా! యనంగ నల్లన నేర్చెన్. 294

* త్రిమూర్తులకు అతీతంగా ఉండే శ్రీమన్నారాయణుడు జన్మలు లేనివాడు గనుక "అమ్మ" అంటూ ఆయన కెవరూ లేరు. ఆపరమ పురుషు డిప్పుడు బాలకుడై తన అమ్మలకు ఆనందం కలిగేటట్లు "అమ్మా' ' "అమ్మా" అని పిలవడం నేర్చుకున్నాడు.

క. అడుగులు వే గలిగియు రెం, డడుగులనే మన్ను మిన్ను నలమిన బాలుం
డడుగిడఁ దొడఁగెను శాత్రవు, లడుగులు నడుగులును వదలి యడుగవనిఁ బడన్. 295

* విష్ణువు సహస్ర శీర్షుడు, సహస్రాక్షుడు, సహస్రపాదుడు. అలా వేయి అడుగులు కలిగిన వాడైనా, వామనుడుగా రెండే అడుగులతో భూమినీ,ఆకాశాన్నీ ఆవరించిన వాడు. అటువంటివాడు ఇప్పుడు బాలకృష్ణుడై తప్పటడుగులు వేయడం నేర్చుకున్నాడు. ఆయన అడుగులు వేయడం చూచి దుష్టులు పొగరుమాటలు, వంకరమాటలు మాని అడుగున పడిపోయారు.

**వ. మఱియును.** **296**

**సీ. తనువున నంటిన ధరణీపరాగంబు పూసిన నెఱిభూతి పూఁత గాఁగ**
**ముందఱ వెలుఁగొందు ముక్తాలలామంబు తొగలసంగడికాని తునుక గాఁగ**
**ఫాలభాగంబుపైఁ బరఁగు కావిరిబొట్టు కాముని గెల్చిన కన్ను గాఁగఁ**
**గంఠమాలికలోని ఘననీల రత్నంబు కమనీయ మగు మెడకప్పుగాఁగ**

**ఆ. హారవల్లు లురగహారవల్లులు గాఁగ బాలలీలఁ బ్రౌఢబాలకుండు**
**శివుని పగిది నొప్పె శివునికిఁ దనకును, వేఱులేమిఁ దెల్ప వెలయునట్లు.** **297**

* ఆటపాటల సమయాలలో బాలకృష్ణుడు పరమశివునివలె కనిపించేవాడు. వాని దేహానికి అంటిన దుమ్ము విభూతి పూతవలె కనిపించేది. ఉంగరాలజుట్టును పైకి ముడిచి ముత్యాల పేరుతో ముడివేసింది. యశోద. అది శివునితలపై ఉండే చంద్రవంకలాగా కనబడుతున్నది. నుదుట నిలువుగా పెట్టిన ఎర్రని తిలకం మన్మథుని గెలిచిన శివుని ఫాల నేత్రంలాగా కనబడసాగింది. మెడలో వేసిన రత్నాలహారం మధ్యలో నాయకమణిగా ఉన్న పెద్దనీలమణి, శివుని కంఠంలోని హాలాహలపు నల్లని మచ్చలాగా కనబడుతున్నది. మెడలోని ముత్యాలహారాలు శివుని మెడలోని సర్పహారాలుగా కనబడుతున్నాయి. ఎదగకుండానే పెద్దవాడైన విష్ణువు బాలకృష్ణుని అవతారంలో ఈవిధంగా లీలలు చూపాడు. శివుడూ తానూ, ఒకటేసుమా అని హెచ్చరిస్తున్నాడా? అన్నట్లు చిన్నికృష్ణుడు శివునివలె కనుపించాడు.

**క. ఆపాపల విహరణములు, తీపులు పుట్టింప మరఁగి తేఁకువ లే కా**
**గోపాలసతులు మక్కువ, నే పనులును మఱచి యుండి రీక్షణపరలై.** **298**

* బలరామకృష్ణుల బాల్యక్రీడలు గోపికలకు మధుర మధురంగా కనిపించుతూ ఉన్నాయి. వారు ఆ మాధుర్యాన్ని మరగి అన్ని పనులు మరచిపోయి ఆ క్రీడలనే మక్కువతో వీక్షిస్తూ ఉండిపోయారు.

**వ. ఆ సమయంబున బాలకుల తల్లులు గోరుగోఱ కొమ్ములు గల జంతువులవలన నేమఱక, జలదహన కంటకాదుల యెడ మోసపోక, బాలసంరక్షణంబు సేయుచు నుల్లంబుల మొల్లంబులైన ప్రేమంబు లభిరామంబులు గా విహరించు చుండి రంత.** **299**

* అప్పుడు బాలరామకృష్ణుల తల్లులు చక్కని జాగ్రత్తలతో తమ బాలురను పెంచుతూ వచ్చారు. గోళ్ళు, కోరలు, కొమ్ములు, ఉన్న జంతువులనుండి నీళ్ళు, నిప్పు, ముళ్ళు మొదలైన వానినుండి ప్రమాదాలు జరగకుండా జాగ్రత్తపడ్డారు. ఆయా ఋతువులకు తగిన విధంగా రక్షించుకుంటూ వస్తున్నారు. హృదయాలలో బాలకులయెడ ప్రేమానురాగాలు ఉప్పొంగిపోతూ ఉండగా ఆనందంగ కాలం గడుపుతున్నారు.

**క. తనయీడు గోపబాలురు, దనుఁ గొలువఁగ రాముఁ గూడి తనువు గలుగుచుం**
**దను గమనంబులఁ గృష్ణుఁడు, తనుమధ్యలు మెచ్చ నీల తనురుచి మెఱసెన్. 300**

బాలకృష్ణుడు బలరామునితోపాటు చిన్ని చిన్న అడుగులతో ఆడుకుంటూ ఉంటే, తనయీడు గల గోపబాలురు అతనిచుట్టూనే ఆడుకునేవారు. అతడే తమ నాయకు డన్నట్లు భక్తితో ప్రేమతో ప్రవర్తించేవారు. ఆతని శరీరపు నీలివన్నెలుచూచి గోపికాస్త్రీలు చాల సంతోషిస్తున్నారు.

**వ. మఱియు నా కుమారుండు దినదినంబునకు సంచార సంభాషణ దక్షుండై. 301**

కృష్ణుడు రోజురోజకు నడవడం, మాట్లాడడం చక్కగా నేర్చుకున్నాడు.

**ఉ. చప్పుడు సేయకుండు మని జంకె యొనర్చిన నల్గిపోవఁగా**
**నప్పుడు బార సాఁచి తనయర్మిలి విందులు వచ్చి రంచు న**
**వ్వొప్పఁగఁ జీరు తల్లి దెస కొత్తిలి కృష్ణుఁడు రంతు సేయుచు**
**న్నెప్పటి వచ్చి చ న్గుడుచు నిం పొలయన్ మొలగంట మ్రోయఁగన్ 302**

* తల్లి అల్లరి చేయవద్దని బెదిరిస్తే, కోపగించి దూరంగా వెళ్ళిపోతాడు. యశోద అది చూచి "నాకన్న తండ్రి వచ్చేశాడు ఏడీ?" అంటూ చేతులు సాచి నవ్వుతూ పిలవగానే పరుగెత్తుకుంటూ తన దగ్గరకు వచ్చి అల్లరిచేస్తూ ఎప్పటిలాగా చనుబాలు త్రాగుతాడు. అలా అల్లరిచేస్తూ అటూఇటూ పరుగెత్తుతూ ఉంటే మొల త్రాడుకు కట్టిన గంట ఘల్లు ఘల్లున మ్రోగుతుంది. ఆ అల్లరి ఎంతో అందంగా ఉంటుంది.

**క. వల్లవగృహ నవనీతము, లెల్లను భక్షించి వచ్చి యెఱుఁగని భంగిం**
**దల్లిఁ గదిసి చి ట్టాడుచు, నల్లన చను బువ్వఁ బెట్టు మవ్వా! యనుచున్. 303**

* గోపికల ఇండ్లలో వెన్నలన్నీ తిని యింటికి వచ్చి ఏమీ ఎరగ నట్టు తప్పటడుగులతో తల్లి దగ్గరకు వస్తాడు. నెమ్మదిగా "అమ్మా! చనుబువ్వపెట్టు"అని అడుగుతాడు.

**వ. మఱియు గోపకుమారులం గూడికొని కృష్ణుండు : 304**

**సీ. "గోవల్లభుఁడ నేను, గోవులు మీ'రని వడి ఱంకె వైచుచు వంగి యాడు,**
**'రాజ నే, భటులు మీరలు, రండు రం'డని ప్రాభవంబునఁ బెక్కుపనులు పనుచు,**
**'నేఁ దస్కరుండ, మీ రింటివా' రని నిద్ర పుచ్చి సొమ్ములు గొనిపోయి డాఁగు,**
**'నే సూత్రధారి! మీ రందఱు బహురూపు' లని చెలంగుచు నాట లాడఁ బెట్టు,**

**తే. మూల ఉఱుకును, డాఁగిలి మూఁతలాడు, నుయ్యెలల నూఁగుఁ జేబంతు లొనరవైచు,**
**జారచోరుల జాడలఁ జాల నిగుడు, శౌరి బాలురతో నాడు సమయమందు. 305**

* కృష్ణుడు గోపబాలకు లందరితో కలసి, రకరకాల ఆటలు ఆడసాగాడు. "మీరందరు గోవులు, నేను ఆబోతును" అంటూ, ఆబోతులా వంగి రంకెవేస్తూ పరుగుపెడతాడు. "నేను రాజును, మీరు భటులు"

అంటూ అధికారం చూపుతూ వాళ్ళ కెన్నో పనులు చెప్పి చేయిస్తూ ఉంటాడు. "నేను దొంగను మీరు ఇంటివాళ్ళు" అంటూ వారిని నిద్రపుచ్చి, వారి వస్తువులను తీసుకొని పారిపోయి దాక్కుంటాడు. "మీరందరూ వేషధారులు, నేను సూత్రధారిని"అంటూ వారందరిచేత ఆటలాడిస్తాడు. మూలమూలల్లో దూరతాడు. దాగుడుమూత లాడతాడు. ఉయ్యాల లూగుతాడు. చేతి బంతు లెగర వేస్తాడు. జారునివలె, చోరునివలె రకరకాల పోకళ్లు పోతాడు.

వ. మఱియు నా కుమారశేఖరుండు గపట శైశవంబున దొంగజాడలం గ్రీడింప గోపిక లోపికలు లేక యశోదకడకు వచ్చి యిట్లనిరి. 306

* ఆ కృష్ణుడు బాలకు లందరిలోనూ చాల ఉత్తముడు. బాల్యక్రీడలు అతనికి లీలలేగాని నిజమైనవి కావు. అతడు దొంగలాగా రకరకాల అల్లరి పనులు చేస్తూ క్రీడిస్తూ ఉన్నాడు. నల్లనయ్య అల్లరి ఆటలు చూచి గోపికలకు ఓర్పు నశించి పోయింది. వారు యశోద దగ్గరకు వచ్చి ఈ విధంగా చెప్పుకున్నారు.

## -: గోపికలు శ్రీకృష్ణుని దుడుకుఁజేఁతలను యశోదాదేవితోఁ జెప్పుట : -

క. బాలురకుఁ బాలు లే వని, బాలెంతలు మొఱలు వెట్టఁ బకబక నగి యీ
బాలుం డాలము సేయుచు, నాలకుఁ గ్రేపులను విడిచె నంభోజాక్షీ! 307

* అమ్మా! యశోదా! మా యిళ్ళలో బాలెంతలు కుఱ్ఱవాళ్ళకు పాలు చాలవని గోలపెడుతుంటే నీ కొడుకు పకపక నవ్వుతూ, వెక్కిరిస్తూ లేగదూడల త్రాళ్ళు విప్పి ఆవుల వద్దకు వదిలేస్తున్నాడు.

క. పడఁతీ! నీ బిడ్డఁడు మా, కడవలలో నున్న మంచి కాఁగిన పా లా
పడుచులకుఁ బోసి చిక్కిన, కడవలఁ బో నడిచె నాజ్ఞ గలదో లేదో? 308

* ఓ యమ్మా! చక్కగా కాగినపాలు కడవలలో ఉంటే, నీ బిడ్డడు ఆపాలను తోడిపిల్లలకు పోసి, అంతటితో ఊరుకోకుండా మిగిలిన కడవలను పగులకొట్టేశాడు. మీ వాడికి మీ భయ భక్తులు ఉన్నాయో లేవో మరి?

క. మీ పాపఁడు మా గృహముల, నా పోవఁగఁ బాలు ద్రావ నగపడ కున్నం
గోపించి పిన్నపడుచుల, వాపోవఁగఁ జిమ్ముకొనుచు వచ్చెం దల్లీ! 309

* ఓ తల్లీ! మా యిళ్ళలో తృప్తిదీరా త్రాగడానికి పాలు కనబడకపోతే మీ కుఱ్ఱవాడు కోపంతో పసిబిడ్డలను పడదోసుకుంటూ బయటకు వచ్చేస్తున్నాడు. వాళ్ళు గుక్కపెట్టి ఏడుస్తున్నారు. మరి నువ్వా ఒక తల్లివేగదా?

మత్త.పుట్టి పుట్టఁడు నేఁడు దొంగిలఁ బోయి మాయిలు సొచ్చి తా
నుట్టి యందక ఱోళ్ళుఁ బీఁటలు నొక్క ప్రోవిడి యెక్కి చే

**వెట్టఁ జాలక కుండక్రిం దొక పెద్ద తూఁటొనరించి మీ**
**పట్టి మీఁగడ పాలుఁ జేరలఁ బట్టి త్రావెఁ దలోదరీ! 310**

* నిన్నగాక మొన్న పుట్టాడో లేదో అపుడే దొంగతనాలు మొదలు పెట్టాడు. అవికూడ మామూలు దొంగతనాలుగా ఉన్నాయా? మా యింట్లో జొరబడి ఉట్టి అందకపోతే రోళ్ళు, పీటలు ఒకదానిమీద ఒకటి ఎక్కించి అందుకోవాలని ప్రయత్నించాడు. మీ వాడు ఈ విధంగా చేస్తాడేమో అని మేము ఇంకా ఎత్తుగా కట్టాము. చేయి పెట్టడానికి వాడికి సాధ్యం కాలేదు. క్రిందనుంచే కుండకు పెద్ద చిల్లిపెట్టి, మీగడపాలు దోసిళ్ళతో పట్టి త్రాగాడు. ఇంత సన్నని కడుపు గలదానవు. అంత పెద్ద పొట్టగల కుర్రవాడిని ఎలా కన్నావమ్మా?

**క. ఆడం జని వీరల పెరుఁ, గోడక నీ సుతుఁడు ద్రావి యొకయించుక తాఁ**
**గోడలి మూఁతిం జరిమినఁ, గోడలు మ్రుచ్చనుచు నత్త గొట్టె లతాంగీ! 311**

* అమ్మా! ఆటలకని బయల్దేరి నీ కొడుకు ఇదిగో వీళ్ళ ఇంట్లో పెరుగుత్రాగి పోయాడు. వెళ్ళేవాడు వెళ్లక నిద్రపోతున్న ఇంటికోడలి మూతికి కొద్దిగ పెరుగు అంటించి వెళ్ళిపోయాడు. దొంగ తిండి తిన్నదని పాపం కోడలిని అత్తగారు కొట్టింది.

**క. వా రిల్లు సొచ్చి కడవలఁ, దోరంబగు నెయ్యి ద్రావి తుది నా కడవల్**
**వీరింట నీ సుతుం డిడ, వారికి వీరికిని దొడ్డ వా దయ్యె సతీ! 312**

* మీ సుపుత్రుడు వాళ్ళ ఇంట్లో చొరబడి ఘుమఘుమలాడే నెయ్యి త్రాగి చివరకు ఆ కడవలు వీళ్ళ ఇంట్లో పడవేసి పోయాడు. ఓ ఇల్లాలా! వాళ్ళకీ వీళ్ళకీ పెద్ద పోట్లాట అయిపోయింది. తెలుసా!

**క. వేలుపులటె! నా కంటెను, వేలుపు మఱి యెవ్వఁ డనుచు వికవిక నగి మా**
**వేలుపుల గోడపై నో, హేలావతి! నీ తనూజుఁ డెంగిలిఁ జేసెన్. 313**

* మా యింట్లో దేవతలను చిత్రించిన గోడలు చూచాడు నీ కొడుకు. "వీళ్ళు దేవతలా! నా కంటె దేవత లెవరు?" అంటూ ఆ గోడమీద నీ కొడుకు ఎంగిలి చేశాడు. ఇదిగో యశోదమ్మా! గొప్పగా నవ్వేవుగాని ఇది విను.

**క. వెన్నఁ దినఁగఁ బొడగని మా, పిన్నది యడ్డంబు వచ్చి పిఱిఁదికిఁ దివియం**
**జ న్నొడిసి పట్టి చీరెను, జిన్నికుమారుండె యితఁడు? శీతాంశుముఖీ! 314**

* మా యింట జొరబడి నీ కొడుకు వెన్న తింటూ ఉంటే చూచి మా చిన్నమ్మాయి అడ్డం వెళ్ళి ఈవలకు లాగింది. మీవాడు ఆ పడుచు పిల్లను ఒడిసిపట్టుకొని రొమ్ముమీద గోళ్లతో గీరి పారిపోయాడు. ముఖమింత చేసుకొని చూస్తున్నావు గాని ఇవి పసిబిడ్డడి చేష్టలేనా తల్లీ.

**క. ఇమ్మగువ దన్ను వాకిటఁ, గ్రుమ్మరుచోఁ జీరి నిలిపికొని పే రడుగం**
**గెమ్మోవిఁ గఱచి వడిఁ జనె, నమ్మా! యీ ముద్దుఁ గుఱ్ఱఁ డల్పుఁడె? చెపుమా. 315**

* నీ కొడుకు వాకిట్లోనుంచి వెళ్లుతూ ఉంటే ఈ అమ్మాయి పిలిచి నిలబెట్టి "నీ పేరేమిటి బాబూ" అని అడిగింది. మీవాడు చటుక్కున ఆ కుర్రదాని పెదవి కొరికి తుర్రుమని పారిపోయాడు. నీ ముద్దుల కొడుకు పసివాడు అంటే నమ్మ మంటావా?

**క. చేబంతి దప్పి పడెనని, ప్రాబల్యముతోడ వచ్చి భవనము వెనుకన్**
**మాబిడ్డ జలక మాడఁగ, నీ బిడ్డఁడు వలువ దెచ్చె నెలఁతుక తగునే? 316**

* తనచేతి బంతి ఎగిరివచ్చి మా పెరట్లో పడిందని మీ వాడు మా దొడ్డిలోపలికి వచ్చాడు. అప్పుడు పెరట్లో మా చిన్నది స్నానంచేస్తూ ఉంది. మీ సుపుత్రుడు మా అమ్మాయి చీరతీసుకొని పారిపోయాడు. ఇది ఏమైనా బాగుందా?

**క. ఇచ్చెలువఁ జూచి 'ముచ్చిలి, యచ్చుగ నుతికించుకొనుచు నరిగెద, నాతో**
**వచ్చెదవా? యని' యన్నాఁ, డిచ్చిఱుతఁడు, సుదతి! చిత్ర మిట్టిది గలదే? 317**

* మా అమ్మాయిని చూచి మీ కుర్రవాడు "నిన్ను దొంగతనంగా లేవదీసుకొని పోతాను, నాతో వచ్చేస్తావా?"అని అడిగాడట? యశోదమ్మతల్లీ! ఇలాంటి చిత్రమెక్కడైనా చూశామా?

**క. కొడుకులు లే రని యొక సతి, గడు వగవఁగఁ దన్ను మగనిఁగాఁ గై కొనినం**
**గొడుకులు గలిగెద రని పైఁ, బడినాఁ డిది వినుము శిశువుపనులే తల్లీ! 318**

* ఇదిగో తల్లీ! ఈ విచిత్రం విను ! ఒక యువతి నీ కొడుకును చూచి తనకు కొడుకులు లేకపోయారని బాధపడుతూ ఉంటే "నన్ను మగడుగా చేసుకొంటే నీకు కొడుకులు పుడతారు" అంటూ మీది మీదికి వచ్చాడు. ఇవి పసివాని పనులేనా?

**క. తలఁగినదానం దల మనఁ, దలఁగక యా చెలికి నాన తల యెత్తఁగ నీ**
**తలఁగినచో టెయ్యది? యని, తలయూఁచెన్ నీ సుతుండు దగవె మృగాక్షీ! 319**

* మా వాడలో ఒక యువతి మీ వాడిని చూచి "బహిష్ఠ అయిన దానను తాకబోకు దూరంగా పో" అన్నది. మీ సుపుత్రుడు దూరంగా వెళ్ళకపోగా కొంటెగా తల ఊపుతూ "బహిష్ఠ అయినచోటు ఏది?" అని అడిగాడు. పాపం ఆ అమ్మాయి సిగ్గుతో చితికిపోయింది. ఇది బాగుందా? చెప్పు తల్లీ!

**క. వ్రాలఁగ వచ్చిన నీ సతి, చూలాలం దలఁగు మనుడుఁ జూ లగుటకు నే**
**మూలంబు సెప్పుమనె నీ, బాలుఁడు, సెప్పుదురె సతులు పర్వేందుముఖీ! 320**

* నీ కొడుకు ఒళ్ళో కూర్చోవడానికి వస్తే ఈ యిల్లాలు "నేను గర్భవతిని దూరంగా ఉండు" అన్నది. "గర్భవతిని కావడానికి కారణ మేమిటి చెప్పు" అని అడిగాడు నీ కొడుకు. ఓ పూర్ణ చంద్రముఖీ! నీ కొడుకు తెలివితేటలు నీకే ఆనందం కలిగించాలి గాని అలా అడిగితే ఎవరైనా చెబుతారటమ్మా?

క. **మగువా! నీ కొమరుఁడు మా, మగవా రటు వోవఁ జూచి మంతనమునకుం**
**దగఁ జీరి పొందు నడిగెను, జగముల ము న్నిట్టి శిశువు సదువంబడెనే? 321**

* ఓ ఇల్లాలా! మా మగవాళ్లు బయటకు వెళ్లగా చూచి రహస్యం చెప్పాలి దగ్గరకు రమ్మని నీ కొడుకు "ఆడుకుందాం వస్తావా?" అని అడిగాడు. ఈ వయసులో ఇలాంటి ప్రశ్న అడిగే బిడ్డడు ఏ యుగంలో నైనా ఉన్నాడని విన్నామా?

ఆ. **నమ్మి నిదురవోవ నా పట్టిచుంచు మా, లేఁగతోఁకతోడ లీలఁ గట్టి**
**వీథులందుఁ దోలె వెలఁది నీ కొమరుండు, రాచబిడ్డఁ డైన నవ్వ మేలె? 322**

* ఆటలాడుతూ అలసిపోయి నా కొడుకు నిద్రపోయాడు. నీ సుపుత్రుడు నా కొడుకు జుట్టును మా లేగదూడ తోకకు కట్టి దాన్ని వీథుల వెంట తోలాడు. ఎంత దొడ్డనాయకుడి బిడ్డడైతే మాత్రం ఇంత అల్లరి పెట్టడం న్యాయమేనా?

క. **నాపట్టిపొట్ట నిండఁగఁ, బై పడి నీ పట్టి వెన్న బానెం డిడినాఁ,**
**డూపిరి వెడలదు, వానిం, జూపెద నేమైన నీవ చుమ్ము లతాంగీ! 323**

* నీ కొడుకు నా కొడుకుమీద పడి వాణ్ణి గట్టిగా పట్టుకొని వాడి పొట్ట నిండిపోయినా వదలక బానెడు వెన్న బలవంతంగా పట్టించాడు, మావాడికి ఊపిరాడడం లేదు. నా బిడ్డని తీసుకొచ్చి చూపిస్తాను. ఇదిగో! ఏమైనా అయితే నువ్వే సమాధానం చెప్పుకోవాలి సుమా!

క. **తెఱవ యొకతె నిద్రింపఁగ, నెఱిఁ గట్టిన వలువ వీడ్చి నే టగు తేలుం**
**గఱపించి నీ కుమారుఁడు, వెఱచుచు నది పఱవ నగియె విహితమె సాధ్వీ? 324**

* ఒక స్త్రీ నిద్రిస్తుంటే, నీ కొడుకు ఇంత పెద్ద తేలును తెచ్చి కరపించాడు. ఆ అమ్మాయి భయంతోనూ, బాధతోను, కేకలు పెడుతూ గంతులు వేస్తూ ఉంటే మీవాడు పకపక నవ్వాడు. ఇదేమైనా బాగుందా తల్లీ! నీవే చెప్పు!

క. **నా కొడుకును నా కోడలు, నేకతమునఁ బెనఁగఁ బాము నీతఁడు వై వం**
**గోక లెఱుంగక పాఱినఁ, గూఁక లిడెన్ నీసుతుండు గుణమె గుణాఢ్యా! 325**

* నా కొడుకూ, కోడలూ ఏకాంతంగా ఉంటే నీ కొడుకు ఒక పామును తెచ్చి పైన పడవేశాడు. ఒంటిమీద గుడ్డలు లేవని కూడా గుర్తులేక వాళ్ళిద్దరూ పరుగెత్తుతూ ఉంటే, నీ కొడుకు హేళనగా కేకలు పెట్టాడు. ఇది మంచి లక్షణమేనా చెప్పు తల్లీ!

ఆ. **తరుణి యొకతె పెరుఁగుఁ ద్రచ్చుచోఁ దుది వంగి, వెన్నదీయ నొదిఁగి వెనుకఁ గదిసి**
**మగువఁ నీ సుతుండు మగపోఁడుములు సేయ, సాగినాఁడు తగదె? చక్కఁజేయ. 326**

* మా పేటలో ఒక యువతి చల్ల చిలికిన తర్వాత ముందుకు వంగి వెన్నతీస్తూ ఉంటే నీ కొడుకు వెనుకనుంచి చేరి కూడని పనులు చేయసాగాడు. చూడుతల్లీ! వీడికి కొంచెం బుద్ధి చెప్పలేవా!

సీ. కలకంఠి! మావాడ గరితల మెల్ల నీపట్టి రాఁగలఁడని పాలు పెరుఁగు
లిండ్ల లోపల నిడి యే మెల్లఁ దన త్రోవఁ జూచుచో నెప్పుడు సొచ్చినాఁడొ?
తలుపుల ముద్రలుఁ దాళంబులును బెట్టి యున్నచందంబున నున్న వరయ
నొక యింటిలో నాడు నొకయింటిలోఁ బాడు నొకయింటిలో నవ్వు, నొకటఁ దిట్టు,
ఆ. నొకట వెక్కిరించు నొక్కొకచో మృగ, పక్షిఘోషణములు పరఁగఁ జేయు
నిట్లుసేసి వెనుక నెక్కడఁ బోవునో?, కాన రాఁడు రిత్తకడవ లుండు. 327

* ఓ యశోదమ్మా! మావాడలో ఉన్న గోపికలందరమూ కలిసి మీ బిడ్డడు వస్తాడేమో అని పాలు, పెరుగులు భద్రంగా ఇండ్లలోపెట్టి తలుపులకు తాళాలు వేసి పైన ముద్రలు కూడా వేశాము. మేమందరమూ తాను వచ్చే దారి వంకకు చూస్తూ కాపలా ఉన్నాము. ఎప్పుడు వచ్చాడో ఏమిటో? తలుపుల తాళాలు వేసినవి వేసినట్లే ఉన్నాయి. నీ కొడుకు ఒక ఇంట్లో నాట్యము చేస్తూ ఉన్నాడు. ఒక ఇంట్లో పాటలు పాడుతూ ఉన్నాడు. ఒక ఇంట్లో నవ్వుతూ ఉన్నాడు. ఒక ఇంట్లో నుంచి తిడుతూ ఉన్నాడు. ఒక ఇంట్లో నుంచి వెక్కిరిస్తూ ఉన్నాడు. మరొక ఇంట్లోనుంచి రకరకాల జంతువుల అరుపులూ, పక్షులకూతలూ కూస్తూ ఉన్నాడు. ఇలా చేసి, చేసి ఎక్కడకు పోతాడో? ఎప్పుడు పోతాడో? కనపడకుండా మాయమవుతాడు. తీరా తలుపులు తీసిచూస్తే ఖాళీ కడవలు మాత్రం అటూ ఇటూ పడి ఉంటాయి.

క. కడు లచ్చి గలిగె నేనిం, గుడుతురు గట్టుదురు గాక కొడుకుల నగుచున్
బడుగుల వాడలపైఁ బడ, విడుతురె రాకాంత లెందు? విమలేందుముఖీ! 328

* మీరు ప్రభువులైతే అయినారు. మీకు ఎంతో సంపద ఉంటే మిరు కడుపునిండా తినవచ్చు. ఒంటినిండా కట్టుకోవచ్చు. పెట్టుకోవచ్చు. అంతేగాని ఇలా బిడ్డలను పేదవాళ్ళ ఇళ్లమీదకు పంపించి ఇలా నవ్వుతూ ఊరుకుంటారటమ్మా!

క. ఓ యమ్మ! నీ కుమారుఁడు, మాయిండ్లను బాలుఁబెరుఁగు మననీఁ డమ్మా!
పోయెద మెక్కడి కైనను, మా యాన్నల సురభులాన మంజులవాణీ! 329

* ఇదిగో తల్లీ! నీ బిడ్డడు మా ఇండ్లలో పాలూ, పెరుగూ బ్రతక నివ్వడం లేదమ్మా! మా అన్నగారు నందప్రభువులవారి ఆవులమీద ఒట్టు. మమ్మల్ని మెత్తని మాటలతో సర్దిపుచ్చాలని చూస్తావేమో! ఇక ఈ వాడలో ఉండలేము. ఊరు విడిచి పోవలసినదే గాని మాకు మరోగతి లేదు.

వ. అని మఱియు ననేకవిధంబుల బాలకృష్ణుండు సేయు వినోదంబులు దమయందుఁ జేయు మహాప్రసాదంబు లని యెఱుంగక దూఱుచున్న గోపికలకు యశోద యిట్లనియె. 330

* ఈ విధంగా గోపికలు ఎన్నో విధాలుగా చిన్నికృష్ణుని నేరాలను ఎత్తిచూపుతూ గొడవ చేశారు. బాలకృష్ణుడు చేస్తూ ఉన్న ఆ వినోదాలన్నీ తమ యెడల అనుగ్రహించిన మహాప్రసాదాలని వారు తెలుసుకోలేకపోయారు. వారి మాటలన్నీ విన్న యశోద వారితో ఇలా అన్నది.

**క. చన్ను విడిచి చనఁ డిట్టటు, నెన్నఁడుఁ బొరుగిండ్లత్రోవ లెఱుఁగడు నేఁడుం**
**గన్నులు దెఱవని మా యీ, చిన్న కుమారకుని రవ్వసేయం దగునే? 331**

* మా కన్నయ్య నా ఒళ్లో కూర్చుండి పాలుత్రాగుతుండటమే తప్ప నన్ను విడిచి ప్రక్కకైనా పోడు. మా చిన్ని కన్నయ్యకు ప్రక్క ఇంటికి త్రోవలుకూడా తెలియవు. ఈ నాటికీ సరిగా కళ్ళు తెరవని పసిగుడ్డును ఇలా అల్లరి పెట్టడం మీ కేమైనా బావుందా?

**తే. అన్య మెఱుఁగఁడు, తనయంత నాడుచుండు, మంచివాఁడీతఁ, డెగ్గులు మానరమ్మ!**
**రామలార! త్రిలోకాభి రామలార, తల్లులార, గుణవతీమతల్లులార! 332**

* "ఈ బిడ్డడికి మరేమీ తెలియదు. ఏదో తనంతట తాను ఆడుకుంటూ ఆనందిస్తూ ఉంటాడు. మా వాడు ఎంతో మంచివాడు. (పరమాత్ముడుగా తానొక్కడే ఉంటాడు. తానే ఆనందస్వరూపుడు గనుక తనలో తానే ఆనందిస్తూ ఉంటాడు.) అమ్మలారా! తల్లులారా! మీరందరు సకల సద్గుణవతులు, మూడు లోకాలలోనూ అందమైనవారు. ఈనా బిడ్డడిపైన నిందలు వేయకండి. మిమ్మలిని బతిమాలు కుంటాను."

**వ. అని యశోద వారల నొడంబఱిచి పంపి గొడుకుం గోపింపంజాలక యుండె నిట్లు. 333**

* యశోదాదేవి ఈ విధంగా గోపికలను సముదాయించి సర్దిచెప్పి ఒప్పించి పంపి వేసిందేగాని కొడుకును మాత్రం కోపగించలేకపోయింది.

## -: మృద్భక్షణ విశ్వరూప ప్రదర్శనాద్యభివర్ణనము :-

**ఉ. కాంతలు దల్లితోఁ దనవికారము లెల్ల గణింప భీతుఁడై**
**శాంతుని సొంపునం బరమసాధుని పెంపున గోలమాడ్కి వి**
**భ్రాంతుని కైవడిన్ జడునిభంగిఁ గుమారకుఁ డూరకుండె నే**
**వింతయు లేక తల్లి కుచవేదికపైఁ దల మోపి యాడుచున్. 334**

* గోపికలందరూ వచ్చి తాను చేసిన అల్లరి పనులన్నింటినీ వర్ణించి వర్ణించి చెప్పగానే కృష్ణుడు భయపడ్డాడు. పరమశాంతునిలాగా ఎంతో సాధుస్వభావము కలవానివలె, అమాయకునివలె, ఆడుకోవటమే చేతకానివానివలె మౌనం నటించాడు. గోపికలు తనమీద నేరాలు చెబుతుంటే తెల్లబోయి తల్లి వక్షఃస్థలంమీద తల ఆనించుకొని ఎంతో బుద్ధి మంతుడిలాగా ఆడుకోసాగాడు.

**వ. అంత నొక్కనాఁడు బలభద్రప్రముఖులైన గోపకుమారులు వెన్నుండు మన్ను దినె నని చెప్పిన యశోద బాలునికేలు పట్టుకొని యిట్లనియె. 335**

* తరువాత ఒకనాడు బలరాముడూ, మిగిలిన గోపకుమారులూ కృష్ణుణ్ణి తీసుకొని వచ్చి మన్ను తింటున్నాడని యశోదాదేవితో చెప్పారు. యశోదాదేవి బాలుని చేయి పట్టుకొని కోపంగా ఇలా అన్నది.

**క. మ న్నేటికి భక్షించెదు?, మన్నియమము లేల నీవు మన్నింపవు? మీ**
**యన్నయు సఖులును జెప్పెద, రన్నా! మ న్నేల? మఱి పదార్థము లేదే? 336**

* "నాన్నా! మన్నెందుకు తిన్నావు. నేను చెప్పిన నియమాలు ఎందుకు పాటించవు. అలా తల అడ్డంగా ఊపకు. మీ అన్నయ్యా స్నేహితులూ అందరూ చెబుతున్నారు. అయినా మన్ను తినవలసిన కర్మ నీకేమి పట్టింది. ఇంట్లో ఇంకా తినడానికి పదార్థాలే లేవా?"

**వ. అని పలికిన ముగుదతల్లికి నెఱదంటయైన కొడు కిట్లనియె. 337**

* "ఇలా అమాయకంగా అడిగిన ఆ తల్లికి ఆ గడుసరి పిల్లవాడు ఇలా సమాధానం చెప్పాడు.

**శా. అమ్మా! మన్ను దినంగ నే శిశువనో? యాఁకొంటినో? వెఱ్ఱినో?**
**నమ్మం జూడకు వీరిమాటలు మదిన్, న న్నీవు గొట్టంగ వీ**
**రిమ్మార్గంబు ఘటించి చెప్పెదరు. కాదేనిన్ మదీయాస్య గం**
**ధమ్మాఘ్రాణము సేసి నా వచనముల్ దప్పైన దండింపవే! 338**

* "అమ్మా! మన్ను తినడానికి నేను పసిపాపనా? ఇప్పుడుగదా, నేను పాలుతాగివెళ్ళాను - ఆకలి వేసిందనుకోవడానికి? లేకపోతే నేనేమైనా వెర్రివాడ ననుకొన్నావా? వీళ్ళమాటలు నమ్మబోకమ్మా! నీ చేత నన్ను తన్నించాలని వీళ్ళు ఈ ఎత్తువేశారు. పోనీ, నా మాట నమ్మకపోతే నా నోరు వాసన చూడు. నే చెప్పింది అబద్ధమైతే అప్పుడు దండించవచ్చు.

**వ. అని పలికి నెయ్యంబున నయ్యవ్వ నియ్యకొలిపి క్రీడామనుజ బాలకుండైన యీశ్వరుండు తన నోరు దెఱచి ముఖంబుఁ జూపిన. 339**

* ఈ విధంగా తల్లిని మెత్తని మాటలతో శాంతింప చేశాడు కృష్ణుడు. సర్వలోకాలకు ప్రభువైన ఆ లీలామానుషవేషధారి తల్లికి తన నోరు తెరచి చూపించాడు.

**క. ఆ లలితాంగి కనుంగొనె, బాలుని ముఖమందు జలధి పర్వత వన భూ**
**గోళ శిఖి తరణి శశి ది, క్పాలాది కరండమైన బ్రహ్మాండంబున్. 340**

* యశోదాదేవి ఆ పసివాని నోటిలో సముద్రాలు, పర్వతాలు, అరణ్యాలు వీటితో కూడి భూగోళము, అగ్ని, సూర్యుడు, చంద్రుడు, అష్టదిక్పాలకులు వీరందరితోకూడి ఉన్న బ్రహ్మాండం మొత్తాన్ని చూచింది.

**వ. కనుంగొని. 341**

**మ. కలయో! వైష్ణవమాయయో! యితర సంకల్పార్థమో! సత్యమో!**
**తలఁపన్ నేరక యున్నదాననొ! యశోదాదేవిఁ గానో! పర**
**స్థలమో! బాలకుఁడెంత! యీతని ముఖస్థంబై యజాండంబు ప్ర**
**జ్వలమై యుండుట కేమి హేతువొ! మహాశ్చర్యంబు చింతింపఁగన్! 342**

* ఆమె విభ్రాంతురాలై ఇలా అనుకొన్నది. "నేను కల గనలేదు గదా? లేకపోతే ఇది విష్ణువుయొక్క మాయ కాదు గదా? దీనిలో మరేదైనా అర్థముందా? లేకపోతే ఇదే సత్యమేమో? నా బుద్ధి పనిచేయడం లేదు? అసలు నేను యశోదనేనా? ఇది అసలు మా యిల్లేనా? లేకపోతే ఈ కుర్రవాడు ఎంత? వీని నోటిలో ఈ బ్రహ్మాండమంతా వెలుగులు చిమ్ముతూ ఉండడం ఎంతటి వింత? ఆలోచించి చూచిన కొద్దీ ఇదంతా ఎంతో ఆశ్చర్యంగా ఉన్నది.

**ఆ. బాలమాత్రుఁడగు సలీలుని ముఖమందు, విశ్వమెల్ల నెట్లు వెలసి యుండు**
**బాలుభంగి నితఁడు భాసిల్లుఁగాని స, ర్వాత్ముఁ డాది విష్ణుఁడగుట నిజము. 343**

* "ఇంత చిన్న కుర్రవాడి నోటిలో, ఈ బ్రహ్మాండ మంతా ఎలా ఇమిడి ఉంటుంది? పసివానిలాగ కనిపిస్తూ ఉన్నాడు గాని ఇతడు సర్వాత్మకుడైన విష్ణువే అయి ఉంటాడు. ఇదే ముమ్మాటికీ నిజం!"

**వ. అని నిశ్చయించి. 344**

**ఆ. ఏ మహాత్మువలన నీ విశ్వరూపంబు, గానఁబడిన బుద్ధికంప మయ్యె**
**నా మహాత్ము విష్ణు నఖిలలోకాధారు, నార్తులెల్లఁ బాయ నాశ్రయింతు. 345**

* ఇలా నిశ్చయించుకొన్న యశోదాదేవి ఈ విధంగా స్తోత్రం చేసింది. "ఈ అంతటా వ్యాపించి ఉన్న విష్ణువు వల్లనే నాకు ఈ విశ్వరూపం కనబడి నా బుద్ధి చలించి పోయింది. ఆ విష్ణువు అన్ని లోకాలకు ఆధారంగా నిలబడినవాడు. నా దుఃఖాలన్నీ పోవడానికి ఆ విష్ణువునే శరణు కోరతాను.

**క. నామగఁడు నేను గోవులు, నీ మందయు గోపజనులు ని బ్బాలుని నె**
**మ్మోమున నున్న విధముఁ గని, యేమఱితిమి గాని యీశుఁ డీతఁడు మాకున్. 346**

* ఈ బాలుని ముఖం చూచి నేనూ, నా భర్త, ఈ వ్రేపల్లెలోని గోప గోపీ జనము లందరూ చివరకు ఆవులుకూడ ఇతడు బాలుడే అని భ్రాంతి పడటం జరిగింది. ఇతడు మా కందరికీ ప్రభువు అని గుర్తించలేక పోయాము."

**వ. అని తన్నుఁ బరమేశ్వరుండని తలంచుచున్న యశోద యందు నా కృష్ణుండు వైష్ణవమాయం బొందించిన. 347**

* ఈ విధంగా పరమేశ్వరుడైన విష్ణువుగా తనను భావిస్తూ ఉన్న యశోదయందు మళ్ళీ వైష్ణవ మాయను ఆవరింపచేశాడు బాలకృష్ణుడు.

**క. జడనుపడి యెఱుక సెడి యా, పడఁతుక సర్వాత్ముఁ డనుచుఁ బలుకక యతనిం**
**గొడుకని తొడపై నిడుకొని, కడువేడుకతోడ మమత గావించె నృపా! 348**

* పరీక్షిన్మహారాజ! ఆ మాయాప్రభావం వలన యశోద మోహం చెంది సర్వాత్ముడు అనే మాట మరచిపోయింది. అతడు తన కొడుకే అనుకొని ఒడిలో కూర్చుండ బెట్టుకొని చక్కగా ముద్దు లాడింది."

వ. అనిన విని రా జిట్లనియె. 349

* శుకమహర్షి ఈ విధంగా చెప్పగా విని పరీక్షిన్మహారాజు ఇలా అన్నాడు.

ఆ. జగదధీశ్వరునకుఁ జ న్నిచ్చు తల్లిగా, నేమి నోము నోఁచె నీ యశోద!
పుత్త్రుఁ డనుచు నవనిఁ బోషించు తండ్రిగా, నందుఁ డేమి సేసె నందితాత్మ! 350

* "మహర్షీ! ఈ జగత్తుల కన్నింటికీ ప్రభువైన భగవంతునికి పాలిచ్చి పెంచే తల్లిగా జన్మించడానికి ఈ యశోదాదేవి వెనుకటి జన్మలో ఏ నోములు నోచిందో? శ్రీహరిని పోషించే తండ్రిగా పుట్టడానికి నందగోపుడు ఏ తపస్సులు చేశాడో? కృష్ణకథామృతం త్రాగి ఆనందించిన మహాత్ముడవు నీవు.

క. ప్రబ్బిన భక్తిని హరిపైఁ, గబ్బంబులు సెప్పి కవులు కైవల్య శ్రీ
కబ్బుదు రఁట! హరిపోషణ, మబ్బిన తల్లిదండ్రు లెచటి కబ్బుదురొ తుదిన్. 351

* కవీంద్రులు ఎంతో భక్తితో శ్రీహరిపై ఆ కావ్యాలు రచించి, మోక్షలక్ష్మీకటాక్షానికి పాత్రులవుతారట. మరి శ్రీహరిని కనిపెంచి పోషించే అదృష్టానికి నోచుకున్న తల్లి దండ్రులు ఏ లోకానికి పాలవుతారో?"

వ. అనిన విని రాజయోగికి శుకయోగి యిట్లనియె. 352

* రాజయోగి అయిన పరీక్షిత్తు ఇలా అడుగగానే శుకమహర్షి ఇలా అన్నాడు.

## -: యశోదానందుల పూర్వజన్మవృత్తాంతము :-

సీ. అవనీశ! విను ద్రోణుఁ డనువాఁడు వసువుల యందు ముఖ్యుఁడు, ధర యతని భార్య,
వారి నిద్దఱ బ్రహ్మ 'వసుధపై జన్మింపుఁ' డంచుఁ బంచిన వార లతనిఁ జూచి
'విశ్వేశ్వరుండైన విష్ణు సేవారతి మా కిచ్చితేనిని మహి జనింతు'
మనవుడు 'నట్ల కా' కనియె వేల్పుల పెద్ద యా ద్రోణుఁ డీ నందుఁడై జనించె

ఆ. ధర యశోద యయ్యె, దనుజేంద్ర వైరియుఁ, గమలగర్భుమాట గారవించి
తల్లిదండ్రు లనుచుఁ దగ వారి మన్నించె, నధిక భక్తితోడ నలరి రిట్లు. 353

* "మహారాజా! చెబుతాను విను. వసువులు అనే దేవతలలో ద్రోణుడు అనేవాడు ముఖ్యుడు. అతని భార్యపేరు ధర. బ్రహ్మదేవుడు వారిద్దరినీ భూమిపైన జన్మించమని ఆదేశించాడు. "విశ్వేశ్వరుడైన విష్ణుదేవుని సేవించే భాగ్యం ప్రసాదించి నట్లయితే అలాగే భూమిపై జన్మిస్తాము"అన్నారు ఆ దంపతులు. బ్రహ్మదేవుడు "అలాగే"అని అనుగ్రహించాడు. ఆ ద్రోణుడనే వసువే యీ నందుడు. ధరాదేవి యశోదగా జన్మించింది. శ్రీహరి కూడ బ్రహ్మదేవుని మాట మన్నించి ఆ దంపతులను తల్లిదండ్రులుగా అంగీకరించి, ఎంతో భక్తితో, సంతోషంతో గౌరవించాడు.

వ. అంత నొక్కనాఁడు దనయింటికడ పాపలందఱు నయ్యే పసులవెంటఁ బంపువడి పోయిన నంద సుందరి సంరంభంబునం దరికంబంబు కడఁ గుదురున నొక్కదధి కుంభంబు వెట్టి మిసిమి గల మీఁగడ బెరుఁగు గూడఁబోసి వీఁక నాఁక త్రాడు కవ్వంబున నలవరించి. 354

* ఒకనాడు యశోదాదేవి యింటివద్ద ఉన్న యువతులందరూ వారి పనులమీద వెళ్లిపోయారు. యశోద పెరుగు చిలికే స్తంభంవద్ద కుదురులో పెరుగకుండను పెట్టి, అందులో మిసమిసలాడే మీగడ పెరుగు పోసింది. తరి త్రాటిని కవ్వానికి తగిలించి పెరుగు చిలకడం మొదలు పెట్టింది.

### -: యశోద దధిభాండ వికలనాదులు సేసిన కృష్ణునిఁ బట్టుకొనుట :-

సీ. కరకమలారుణకాంతిఁ గవ్వపుఁ ద్రాడు పవడంపు నునుఁదీవపగిది మెఱయఁ
గ్రమముతో రజ్జు వాకర్షింపఁ బాలిండ్లు వీడ్వడి యొండొంటి వీఁక నొత్తఁ
గుచకుంభములమీఁది కొంగు జాఱఁగఁ జిక్కు వడుచు హారావళు ల్బయలుపడఁగఁ
బొడమిన చెమటతోఁ బొల్పారు నెమ్మోము మంచుపై పడిన పద్మంబుఁ దెగడఁ

తే. గౌను నులియంగఁ గంగణక్వణన మెసఁగఁ, దుఱుము బిగివీడఁ గర్ణికాద్యుతులు మెఱయ
బాలు నంకించి పాడెడి పాటవలనఁ, దరువు లిగురొత్తఁ బెరుఁ గింతి దరువఁ జొచ్చె. 355

* యశోదాదేవి అరచేతుల అరుణకాంతులు కవ్వపుత్రాటిపై ప్రసరించి, ఆ త్రాడు లేత పగడపు తీగెలాగున మెరుస్తున్నది. ఒక క్రమపద్ధతిలో త్రాడు చివరలు ఒకదాని తర్వాత ఒకటిగా రెండు చేతులతోను లాగుతూ ఉంటే, ఆమె పాలిండ్లు ఒకదానినొకటి ఒరుసుకొంటున్నాయి. వక్షోజాల పైనున్న కొంగు జారిపోయి, మెడలో నున్న హారాలు చిక్కుపడి కంపించి పోతున్నాయి. చెమట బిందువులతో అందంగా ఉన్న ముఖం, మంచుబిందువులు చిందిన తామర పూవుకన్నా మనోహరంగా ఉన్నది. సన్నని నడుము జవజవలాడుతున్నది. చేతుల కంకణాలు గలగల శబ్దం చేస్తున్నాయి. కొప్పుముడి బిగింపు సడలిపోయింది. చెవుల కమ్మల కాంతులు తళుక్కు మంటున్నాయి. ముద్దుల కృష్ణుని ఉద్దేశించి ఆమె పాడే పాటకు చెట్లు చిగురు తొడుగుతున్నాయి. ఈ విధంగా యశోదా దేవి పెరుగు చిలుకుతూ ఉన్నది.

వ. ఆ సమయంబున. 356

క. సుడియుచు వ్రాలుచుఁ గిదుకుచు, సడి గొట్టుచు నమ్మ రమ్మ! చ న్నిమ్మనుచున్
వెడవెడ గంతులు వైచుచుఁ, గడవఁ గదిసి బాలకుండు గవ్వముఁ బట్టెన్. 357

* ఆ సమయంలో కృష్ణుడు ఆమె చుట్టూ తిరుగుతూ, ఆమెపైన వ్రాలుతూ, ఆమెపైట లాగుతూ, అల్లరి చేయసాగాడు. "అమ్మా! రావే! నాకు పాలివ్వవే!"అంటూ గంతులు వేస్తూ దగ్గరకు వచ్చి కవ్వాన్ని కదలకుండా పట్టుకొన్నాడు చిన్నారి కన్నయ్య.

క. కవ్వముఁ బట్టిన ప్రియసుతు, న వ్వనరుహనేత్ర దిగిచి యంకతలమునన్
నవ్వుచు నిడుకొని కూఁకటి, దువ్వుచుఁ జన్నిచ్చె, నతఁడు దూఁటుచుఁ గుడిచెన్. 358

* అలా కవ్వం పట్టుకున్న కృష్ణుణ్ణిచూచి యశోద నవ్వుతు దగ్గరకు తీసుకొంది. ఒడిలో కూర్చుండ బెట్టుకొని ప్రేమగా జుట్టూ దువ్వుతూ బాలకృష్ణుడికి పాలివ్వసాగింది. నల్లనయ్య చక్కగా తల్లి రొమ్ములో తలదూర్చి ప్రాలు త్రాగుతున్నాడు.

**మ. కడుపారం జనుఁబాలు ద్రావని సుతుం గంజాక్షి పీఠంబుపై**
**నిడి పొంగారెడి పాలు డించుటకునై యేగంగఁ దద్బాలుఁ డె**
**క్కుడు కోపంబున వాఁడిఱాత దధిమత్కుంభంబు వోఁగొట్టి తెం**
**పడరం గుంభములోని వెన్నఁదినె మిథ్యాసంకులద్బాష్పుఁడై. 359**

* బాలుడు పాలు త్రాగుతూ ఉండగా, పొయ్యిమీద పాలు పొంగుతూ ఉంటే యశోద చూచింది. కృష్ణుడు పాలు పూర్తిగా త్రాగకుండానే అతణ్ణి దింపి, పాలకుండ దించడానికి గబగబ లోపలికి వెళ్లింది. మధ్యలో దించి వెళ్లిందని కోపంతో కృష్ణుడు ఒక వాడి అయిన రాతితో పెరుగుకుండ బ్రద్దలు కొట్టాడు. పగిలిన దధిభాండంలోని వెన్నతింటూ, పై పెచ్చు దొంగ కన్నీళ్ళు కారుస్తూ ఏడుపు మొదలు పెట్టాడు.

**వ. అంత నా లోలలోచన పాలు డించి వచ్చి వికలంబు లయిన దధికుంభ శకలంబులఁ బొడగని తుంటకొడుకు వెన్నదింట యెఱింగి నగుచు నా కలభగామిని యతనిం గానక చని చని. 360**

* యశోద పొయ్యిమీది పాలు దించి వచ్చి, ముక్కలు ముక్కలుగా పగిలిపోయిన పెరుగ కుండను చూచింది. తుంటరి కొడుకు వెన్న మీగడలు తిన్నాడని గ్రహించి లోపల నవ్వుకొని, కొడుకుకోసం చూస్తే ఆ కొంటె కృష్ణుడు కంటికి కనిపించలేదు. అతణ్ణి వెదుకుతూ బయలుదేరింది యశోద.

**ఆ. వికచకమలనయన వే ఱొకయింటిలో, వెలయ ఱోలు దిరుగ వేసి యెక్కి**
**యుట్టిమీఁది వెన్న నులుకుచు నొక కోఁతి, పాలు సేయు చున్న బాలుఁ గనియె. 361**

* ఇక్కడ పారిపోయిన కృష్ణుడు అక్కడ మరొక యింటిలో ప్రత్యక్షమైనాడు. చాల కోపంగా ఉన్నాడు. ఒక రోలు తిరగవేసి దానిమీద ఎక్కి నిలబడి, ఉట్టిమీద ఉన్న వెన్న తీసి ఒక కోతికి పెడుతున్నాడు. యశోద వచ్చి చూసే సమయానికి అతడు చేస్తున్న అల్లరి పని అది.

**మ. కని చేతన్ సెలగోల వట్టికొనుచుం గానిమ్ము గానిమ్ము రా**
**తనయా! యెవ్వరియందుఁ జిక్కువడ నేదండంబునుం గాన నే**
**విని వారంబును బొంద నే వెఱపు నే విభ్రాంతియుం జెంద ము**
**న్ననియో నీవిటు నన్నుఁ గై కొనమి నేఁడారీతి సిద్ధించునే? 362**

* కృష్ణుని అలా చూచిన యశోదాదేవి బెత్తం చేతబట్టుకొని కొడుకును ఇలా బెదిరించింది. "కన్నయ్య! నీవు ఇంతవరకు ఎవరి చేతికీ చిక్కలేదనీ, ఇంతవరకు ఎవరూ నిన్ను శిక్షించలేదనీ, ఎవరూ నిన్ను అడ్డ కోలేదనీ, ఎవరూ నిన్ను భయపెట్టరనీ, నీకు బొత్తిగా అదురూ బెదురూ లేకుండా పోయినాయిరా! అందుకేగదా నా మాట లక్ష్యపెట్టడం లేదు. కానీ కానీ! ఇవాళ ఎలా తప్పించుకుంటావో చూస్తాను."

వ. అని యదలించుచుఁ గొడుకునడవడిం దలంచి తనుమధ్య దన మనంబున. 363

* ఈ విధంగా కృష్ణుణ్ణి అదలిస్తూ యశోదాదేవి కొడుకు దుడుకు తనాన్ని తలచుకొని తనలో ఈ విధంగా అనుకొంది.

సీ. బాలుఁ డీతండని భావింతు నందునా యే పెద్దలును నేర రీక్రమంబు
వెఱ వెఱుంగుటకు నై వెఱపింతు నందునా కలిగి లేకొక్కఁడు గాని లేఁడు
వెఱపుతో నా బుద్ధి వినిపింతు నందునా తనుఁ దానయై బుద్ధిఁ దప్పకుండు
నొం డెఱుంగక యింట నుండెడి నందునా చొచ్చి చూడని దొకచోటు లేదు

ఆ. తన్ను నెవ్వరైనఁ దలపోయఁ బాఱెడి, యోజ లేదు భీతి యొకటి యెఱుఁగఁ
డెలమి నూర కుండఁ డెక్కసక్కెము లాడుఁ, బట్టి శాస్తి సేయు భంగి యెట్లు? 364

* "ఇతడు పసివాడనుకొందామా? ఇలాంటి నడవడి ఏ పెద్దలకూ తెలియదు. పోనీ కొంచెం భయం తెలియడానికి భయపెడదామంటే లేకలేక పుట్టినవాడు వీడొక్కడే. బెదిరించి బుద్ధులు నేర్పుదామనుకొంటే తనంతట తానే బుద్ధిగా ఉంటున్నాడు. అలాగని ఇంకేమీ తెలియక ఇంట్లో కూర్చుంటాడా అనుకుంటే వీడు వెళ్ళనిదీ, చూడనిదీ చోటంటూ లేదు. తన నెవరైనా చూస్తే పారిపోదామనే ఆలోచనకూడా వీడికి రాదు. భయము అంటూ ఒకటుందని వీడికి తెలీదు. ఒకచోట కదలకుండా కుదురుగా కూర్చోడు. ఎకసెక్కాలాడతాడు. వీణ్ణి పట్టుకొని తగిన శాస్తి చేయడం ఎలా".

వ. అని వితర్కించి. 365

క. లాలనమున బహుదోషము, లోలిం బ్రాపించుఁ దాడనోపాయములం
జాల గుణంబులు గలుగును, బాలురకును దాడనంబ పథ్యం బరయన్. 366

* "చివరికి మరీ గారాబం చేస్తే పిల్లలు బాగా చెడిపోతారు. అప్పుడప్పుడు తగలనిస్తూ ఉంటే చాల మంచి గుణాలు అలవడతాయి. దుండగులైన పిల్లలకు దండోపాయమే మంచిది"అని నిశ్చయించుకొంది యశోద.

వ. అని నిశ్చయించి కేల నున్న కోల జళిపించి బాలా! నిలునిలు మని బగ్గుబగ్గున నదల్చుచుఁ దల్లి డగ్గఱిన బెగ్గడిలిన చందంబున నగ్గలిక సెడి ఱోలు డిగ్గ నుఱికి. 367

* చేతిలో ఉన్న బెత్తం జళిపించి "ఒరేయి ఆగు అక్కడ" అంటూ కోపంగా అదలిస్తూ దగ్గరకు వచ్చింది యశోద. కృష్ణుడు భయ పడినట్టు ముఖంపెట్టి అల్లరి మాని రోలుమీదనుంచి గభాలున దూకాడు.

క. గజ్జెలు గల్లని మ్రోయఁగ, నజ్జలు ద్రొక్కుటలు మాని యతిజవమున యో
షిజ్జనములు నగఁ దల్లియుఁ, బజ్జం జనుదేర నతఁడు పరువిడె నధిపా! 368

* కాలిగజ్జెలు ఘల్లుఘల్లుమని మ్రోగుతూ ఉండగా కృష్ణుడు చిందులు తొక్కడం మానేసి, అతివేగంగా పారిపోసాగాడు. చుట్టుప్రక్కల ఉండే గోపికలు నవ్వుతూ చూస్తుండగా యశోదాదేవికూడా బాలుడివెంట పరుగెత్తింది.

వ. అప్పుడు. 369

మ. స్తనభారంబున డస్సి డ్రుస్సి యసదై జవ్వాడు మధ్యంబుతో
జనిత స్వేదముతోఁ జలత్కబరితో స్రస్తోత్తరీయంబుతో
వనజాతేక్షణ గూడ బాఱి తిరిగెన్ వారించుచున్ వాకిటన్
ఘనయోగీంద్ర మనంబులున్ వెనుకొనంగా లేని లీలారతున్. 370

* ముంగిలిలో పరుగెత్తుతూ ఉన్న బాలకృష్ణుణ్ణి 'ఆగు, ఆగు''అంటూ యశోద వాని వెనుకే పరుగెత్తసాగింది. పెద్ద వక్షోజాలు బరువుతో అలసిపోయి, వంగిపోతూ ఉన్నది. సన్నని నడుము జవ జవ లాడుతూ ఉన్నది. గమనవేగానికి కొప్పు కదలి జారిపోతున్నది. ముఖంనిండా చెమటలు పోశాయి. పైట జారిపోయింది. మహా మహా యోగీంద్రుల మనస్సులుకూడా వెంటబడి పట్టుకోలేని ఆ లీలా గోపాలబాలుణ్ణి పట్టాలనే పట్టుదలతో వెంటబడి తరుమ గల్గిన ఆ యశోద ఎంత అదృష్టవంతురాలు!

వ. ఇట్లు గూడం జని. 371

సీ. స్తంభాదికంబులు దనకు నడ్డం బైన నిట్టట్టు సని పట్టనీని వాని
నీ తప్పు సైరింపు మింక దొంగిలఁ బోవ నే నని మునుముట్ట నేడ్చువానిఁ
గాటుక నెఱయంగఁ గన్నులు నులుముచు వెడలు కన్నీటితో వెగచువాని
నే దెస వచ్చునో యిది యని పలుమాఱు సురుఁగుచుఁ గ్రేఁగంటఁ జూచువానిఁ

ఆ. గూడఁ బాఱి పట్టుకొని వెఱపించుచుఁ, జిన్ని వెన్నదొంగ సిక్కె ననుచు
నలిగి కొట్టఁ జేతు లాడక పూఁబోఁడి, కరుణతోడ బాలుఁ గట్టఁ దలఁచి. 372

* కృష్ణుడు వాకిట్లో స్తంభాలు అడ్డంగా ఉంటే వాటి చాటున అటూఇటూ పరుగెడుతూ దొరక్కుండా ఉన్నాడు. "ఇక ముందు దొంగతనం చేయను. ఈ ఒక్కసారికి క్షమించవే!'' అంటూ మును ముందే ఏడుస్తూ ఉన్నాడు. కాటుక చెదరిపోయేటట్లు కళ్ళు నులుముకుంటూ దొంగ కన్నీటితో వెక్కి వెక్కి ఏడుస్తూ ఉన్నాడు. ఈ అమ్మ ఎటువైపునుంచి వస్తుందో అని మాటి మాటికీ ప్రక్కలకు తప్పుకుంటూ క్రీగంట చూస్తూ ఉన్నాడు. చివరకు ఎలాగైతేనేం యశోద వెంటబడి తరుముకుంటూ వెళ్ళి "అమ్మయ్య! ఈ చిన్ని వెన్నదొంగ చిక్కాడు'' అంటూ బాలకృష్ణుణ్ణి పట్టుకొన్నది. పట్టుకొన్నదే గాని కొట్టడానికి చేతులు రాలే దామెకు. యశోద శరీరము, స్వభావముకూడ పువ్వువలె సుతిమెత్తనైనవి. అతనిమీద జాలిపడి పోనీలే కొట్టకుండా కట్టివేద్దామనుకొంది.

వ. ఇ ట్లనియె. 373

క. వీ రెవ్వరు? శ్రీకృష్ణులు, గారా? యెన్నఁడును వెన్నఁ గానరఁట కదా
చోరత్వం బించుకయును, నేర రఁట! ధరిత్రి నిట్టి నియతులు గలరే, 374

* అప్పుడు యశోద పట్టుబడ్డ కృష్ణుడితో ఇలా అన్నాది. "ఓహో ఎవరు వీరు? శ్రీకృష్ణులవారేనా! అసలు వెన్నంటే ఎప్పుడూ చూడనే చూడలేదట కదా! పాపం! దొంగతనమంటే ఏమిటో ఎరుగరట! ఈ భూమి మీద మీ అంతటి బుద్ధిమంతులు ఉన్నారా?

**క. పట్టినఁ బట్టువడని నినుఁ, బట్టెద నని చలముగొనినఁ బట్టుట బెట్టే?**
**పట్టువడ వండ్రు పట్టీ!, పట్టుకొనన్ నాకుఁగాక పరులకు వశమే? 375**

* పట్టుకోవాలంటే ఎవరికీ పట్టుబడనని నీవు అనుకుంటున్నావు. పట్టుకోవాలని నేను పట్టుబడితే నిన్ను పట్టుకోవడం పెద్ద కష్టమనుకున్నావా? నీవు పట్టుబడవని అందరూ అంటారు. నిన్ను పట్టుకోవడం నాకు తప్ప ఇతరులకు సాధ్యం కాదురా.''

(యశోదకు తెలియకుండానే అసలు తత్త్వంకూడా ఆమె నోటి వెంటనే అంతరార్థంగా బయటపడు తున్నది. అది శ్రీకృష్ణుని సాన్నిధ్యంలో ఉన్న దివ్యప్రభావం. భగవంతుడు మామూలుగా పట్టుబడడు. కాని నిష్ఠగా యోగసాధన చేస్తే ఆనందస్వరూపుడుగా పట్టుబడకపోడు. తనలోనూ, అందరిలోనూ అంతర్యామిగా ఉన్న 'నేను' అనే ప్రజ్ఞగా మాత్రమే అతడు పట్టుబడతాడుగాని, ఇతరులను వేరుగా చూస్తే పట్టు బడడు.)

**క. ఎక్కడ నైనను దిరిగెద, వొక్కయెడన్ గుణము కలిగి యుండవు, నియమం**
**బెక్కడిది నీకు? మఱచినఁ, జక్కఁగఁ బోయెదవు పెక్కుజాడలఁ బుత్రా! 376**

* నాన్నా! ఎక్కడపడితే అక్కడ తిరుగుతూ ఉంటావు. ఒకచోట కుదురుగా బుద్ధికలిగి ఉండవు. నీ ప్రవర్తనకు ఒక పద్ధతి అంటూ లేదేమి? ఒక్కక్షణం ఏమరుపాటు చెందితే చాలు, ఎన్ని వేషాలైనా వేసి, ఎక్క డికైనా పోతావు.

(భగవంతుడు సర్వాంతర్యామి, గుణాతీతుడు, ఆయనకు నియమాలు పెట్టడం ఎవరికీ సాధ్యం కాదు. అంతటా ఆయనే అనే ఎరుక ఒక్కక్షణం మరచిపోతే మిత్రులు, శత్రువులు మొదలైన అనేకంగా ఆయన కనిపిస్తాడు).

**సీ. తోయంబు లివి యని తొలఁగక చొచ్చెదు, తలఁచెదు గట్టైనఁ దరల నెత్త,**
**మంటితో నాటలు మానవు, కోరాడె, దున్నత స్తంభంబు లూఁపఁ బోయె,**
**దన్యుల నల్పంబు లడుగంగఁ బాఱెదు, రాచవేఁటలఁ జాల ఆవ్వదెచ్చె,**
**దలయవు నీళ్లకు నడ్డంబు గట్టెదు, ముసలిపై హరివృత్తి మొనయఁ, జూచె**

**ఆ. దంబరంబు మొలకు నడుగవు తిరిగెద, వింకఁ గల్కిచేఁత లేల పుత్ర!**
**నిన్ను వంప వ్రాల్ప నే నేర ననియొ, నీ విట్టు క్రిందు మీఁదు నెఱుఁగ కునికి. 377**

* ఒరే కన్నయ్యా! అదురూ బెదురూ లేక నీళ్ళలో జొరబడి పోతావు. ఎంత పెద్దబండనైనా ఎత్తేయాలని ప్రయత్నిస్తావు. మట్టితో ఆటలు మానక పొర్లాడుతావు. పెద్దపెద్ద స్తంభాలైనా పట్టుకొని ఊపాలని చూస్తావు.

పరాయివాళ్లదగ్గర అల్పమైన వస్తువులకోసం చేయి చాచి యాచిస్తావు. నీకు రాజసమెక్కువ, లోకం మీదపడి ఎన్నో జగడాలు తెస్తావు. నీళ్ళ ప్రవాహాలకి అడ్డుకట్టలు వేయాలని చూస్తావు. ముసలివై నటించుతూ కోతి చేష్టలతో అల్లరి చేస్తూ ఉంటావు. మొలకు గుడ్డ లేకుండా దిగంబరంగా పడి తిరుగుతుంటావు. ఈ దుడుకు చేష్టలన్నీ ఎందుకు చేస్తున్నావో తెలియకుండా ఉంది. నిన్ను భయభక్తులతో నేను అదుపులో పెట్టలేకుండా ఉన్నాననుకొనేగా ఇలా క్రిందు మీదు తెలియకుండా ప్రవర్తిస్తున్నావు?

(ఇందులో యశోద తనకు తెలియకుండగానే భగవంతుని దశావతారాలను స్మరించింది. ఎలా అంటే "మత్స్యావతారం ధరించి, నీటిలో చొరబడతావు. కూర్మావతారం ధరించి, వీపుమీద కొండ నెత్తుతావు. వరాహావతారం ధరించి భూదేవితో ఆడుకుంటావు. అందులోనూ కోరల మీద నిలిపి ఆడుకుంటావు. నర సింహావతారంగా స్తంభాలు కదలిస్తావు. పరశురామావతారంగా రాజులను వేటాడి ముప్పు తెస్తావు. రామా వతారంలో సముద్రానికి వంతెన కడతావు. హలాయుధుడైన బలరాముడితో కలిసి కృష్ణుడుగా సాక్షాత్తు హరివై దిగివస్తావు. బుద్ధావతారంగా దిగంబరత్వం సాధిస్తావు. ఇక నీ కల్కి అవతారం ఎందుకు ఎత్తుతావో తెలియదు. "నిన్ను లొంగదీయడానికి నాకు సాధ్యం కాదనే కదా నీ ధైర్యం? దానితో నీవు క్రిందు మీదు తెలియక మిడిసి పడుతున్నావు. భూమి, ఆకాశం నిండా ఇంకా అవతలా ఇవతలా వ్యాపించి మెరుపులాగా కనిపిస్తున్నావు).

### -: ఉలూఖల బంధన యమళార్జున భంజనాద్యభివర్ణనము :-

వ. అని మర్మంబు లెత్తి పలికి. 378

క. ఆ లలన గట్టె ఱోలన్, లీలన్ నవనీతచౌర్యలీలుం బ్రియ వా
గ్జాలుం బరివిస్మిత గో, పాలున్ ముక్తాలలామ ఫాలున్ బాలున్. 379

క. ఱోలను గట్టువడియు న, బ్బాలుడు విలసిల్లె భక్త పరతంత్రుండై
యాలాన సన్నిబద్ధ వి, శాల మదేభేంద్ర కలభసమరుచి నధిపా! 380

* ఈ విధంగా యశోద, కృష్ణుని అవతార రహస్యాలను గూడ ఎత్తిపొడిచి ఆ దుడుకు బాలుణ్ణి ఒకరోటికి కట్టివేసింది. ఆ బాలకృష్ణుడు వెన్న దొంగిలించడమే క్రీడగా కల్గినవాడు. అందరికీ సంతోషం కల్గించేటట్లు గలగలా మాట్లాడుతాడు. తల్లి తనను కట్టివేసినందుకు ఆశ్చర్యపోతున్నట్టు కనిపిస్తున్నాడు. అతని నొసటన ముత్తెపు బొట్టు అలంకరణగా మెరుస్తూ ఉంది.

పరీక్షిన్మహారాజా! ఆ బాలగోపాలుడు భక్తుల వశంలో ఉండేవాడు గనుక రోటికి కట్టుబడిపోయి ఉన్నాడు. దానికి అతడేమీ బిక్కమొగం వేయలేదు. కట్టుకొయ్యకు కట్టబడిన మదించిన ఏనుగు గున్న వలె హుందాగా వెలిగి పోతున్నాడు.

క. వెలిలోను మొదలు దుది నడు, ములు లేక జగంబు తుదియు మొదలున్ నడుమున్
వెలియును లో నగు నీశ్వరు, నలవడునే కట్టఁ బ్రణతురాల్ గా కున్నన్? 381

* రాజా! నారాయణునకు లోపల, వెలుపల అనేవీ; మొదలు, చివర, మధ్య అనేవీ ఏమీ లేవు. ఈ లోకాలన్నిటికీ మొదలు, చివర మధ్య, లోపల, వెలుపల - అన్నీ ఇతడే! ఇటువంటి నారాయణుని కట్టి వేయా లంటే, శరణాగతి చెందిన పరమభక్తురాలు గనుక యశోదకు సాధ్యమైంది గాని, మరొకరికి మరోవిధంగా సాధ్య మవుతుందా?

ఆ. పట్టి యెల్లబోఁటి పట్టి యూతం డని, గట్టితలఁపుతోడఁ గట్టెఁ గాక
వట్టికడుపు పెక్కు బ్రహ్మాండములు వట్టు, టెఱిఁగె నేనిఁ దల్లి యేల కట్టు? 382

* తన చిన్నికృష్ణుడూ అందరివంటి బాలుడే అనుకొన్నది గనుక యశోదాదేవి అతణ్ణి కట్టివేసింది. ఆ బాలుని కడుపు ఎన్నో బ్రహ్మాండాలను దాచుకో గలిగినదని తెలిస్తే ఆ తల్లి ఎందుకు కట్టి వేస్తుంది?

క. చిక్కఁడు సిరికౌఁగిటిలోఁ, జిక్కఁడు సనకాది యోగిచిత్తాబ్జములం
జిక్కఁడు శ్రుతిలతికావలిఁ, జిక్కె నతఁడు లీలఁ దల్లి చేతన్ ఱోలన్. 383

* ఆ లీలా గోపాలబాలుడు లక్ష్మీదేవి కౌగిటిలో చిక్కలేదు; సనక సనందనాదులైన మహాయోగుల హృదయాలలోనూ చిక్కలేదు. ఉపనిషత్తులలోనూ చిక్కలేదు. అటువంటివాడు లీలగా అవలీలగా తల్లి చేతిలో చిక్కి రోటికి కట్టివేయబడ్డాడు.

వ. ఇట్లు గ్రద్దన నా ముద్దియ ముద్దులపట్టి యుదరంబు గట్ట నడరుచుఁ జతురంబుగఁ జక్క నొక్కత్రాడు సుట్టిన నది రెండంగుళంబులు గడమపడియె, మఱియు నొక్కబంధనంబు సంధించి వలగొనిన నంతియ కొఱంత యయ్యె, వెండియు నొక్కపాశంబు గూర్చి పరివేష్టించిన వెల్తి సూపె నిట్లు. 384

* ఈ విధంగా కృష్ణుణ్ణి చిక్కించుకొని గట్టిగా పట్టుకొన్న యశోద అతణ్ణి గట్టిగా రోటికి కట్టడానికి అతడి నడుముచుట్టూ ఒక త్రాడు చుట్టింది. అది రెండంగుళాలు తక్కువైంది. మరోత్రాడు జతచేసినా అప్పుడుకూడా ఆ రెండు అంగుళాలే తక్కువైంది. మరొక్కత్రాడు ముడివేసి చూచినా అంతే తక్కువైంది.

క. తజ్జనని లోఁగిటం గల, రజ్జుపరంపరలఁ గ్రమ్మఱన్ సుతుఁ గట్టన్
బొజ్జ దిరిగి రా దయ్యె జ, గజ్జాలము లున్న బొజ్జఁ గట్టన్ వశమే? 385

* ఆ తల్లి ఇంట్లో ఉన్న త్రాళ్ళు అన్నీ వరుసగా ముడివేసినా అంతే వెలితి ఉండిపోయింది. ముజ్జగములూ దాగి ఉన్న ఆ చిరుబొజ్జను కట్టడం ఎవరి తరం?

వ. అప్పు డా యవ్వయు గోపికలును వెఱఁగుపడిరి, తదనంతరంబ. 386

* ఆ వింతను పిల్లవాణ్ణి చూచి యశోదా, గోపికలూ నివ్వెరపోయారు.

ఆ. ఒడలఁ జెమట లెగయ నుత్తరీయము జార, వీడి యున్న తుఱుము విరులు రాలఁ
గట్టరాని తన్నుఁ గట్టెద నని చింతఁ, గట్టుకొనిన తల్లిఁ గరుణఁ జూచి. 387

* పాపం! ఈ శ్రమవలన యశోదాదేవికి శరీరమంతా చెమటలు పోశాయి. పైటకొంగు జారిపోయింది. కొప్పు సడలిపోయి పూలు రాలి పడిపోయినాయి. కట్టడానికి శక్యంకాని తనను కట్టి వేయాలనే పట్టుదలతో తంటాలు పడుతున్న తల్లిని చూచి నల్లనయ్య జాలిపడ్డాడు.

క. బంధవిమోచనుఁ డీశుఁడు, బంధింపఁ బెనంగు జనని పాటోర్చి సుహృ
ద్బంధుఁడు గావున జననీ, బంధంబునఁ గట్టువడియెఁ బాటించి నృపా! 388

* పరీక్షిన్మహారాజా! శ్రీహరి భవబంధాలను తొలగించి మోక్షాన్ని ప్రసాదించేవాడు. ఆ భగవంతుడు బాలకృష్ణుడై ఇప్పుడు కన్నతల్లి కష్టం చూడలేక ఆమె కట్టుతున్న త్రాటికే కట్టువడిపోయినాడు. అతడు ఆప్తులైన వారికి ఆత్మబంధువు గదా!

క. సంగడిఁ దిరిగెడు శంభుఁడు, నంగాశ్రయ యైన సిరియు నాత్మజుఁడై యు
ప్పొంగెడి పద్మజుఁడును గో, పాంగన క్రియఁ గరుణ వడయ రఖిలేశ్వరుచేన్. 389

* పరీక్షిన్మహారాజ! ప్రియమిత్రుడై మెలగే శివుడుగానీ, ఆయన వక్షస్థలాన్ని ఆశ్రయించుకొని ఉన్న లక్ష్మీదేవిగానీ, ఆయన కొడుకునని విర్రవీగే బ్రహ్మదేవుడుగానీ శ్రీహరివలన యశోద పొందిన అనుగ్రహాన్ని పొందలేక పోయినారు.

క. జ్ఞానులచే మౌనులచే, దాసులచే యోగసంవిధానులచేతం
బూని నిబద్ధుం డగునే, శ్రీనాథుఁడు భక్తియుతులచేతం బోలెన్? 390

* భక్తులకు పట్టుబడినట్లుగా భగవంతుడు జ్ఞానులకుగానీ, మౌనులకుగానీ, దానపరులకుగానీ, యోగీశ్వరులకుగానీ పట్టుబడడు గదా!

వ. అంత న య్యశోద యింటికడం బనుల వెంటం దిరుగఁ గృష్ణుండు దొల్లి నారదు శాపంబున నిరుమద్దు లై యున్న నలకూబర మణిగ్రీవులను గుహ్యకుల నిద్దఱం గని ఱో లీడ్చుకొని చనియె నని చెప్పిన శుకయోగివరునకు భూవరుం డి ట్లనియె. 391

* యశోదాదేవి కృష్ణుని అలా రోటికి కట్టివేసి, ఇంటిపనులలో మునిగిపోయింది. బాలకృష్ణుడు ఆ యింటి పెరట్లో ఉన్న రెండు పెద్దపెద్ద మద్దిచెట్లను చూచాడు. నలకూబరుడు, మణిగ్రీవుడు అనే ఇద్దరు యక్షులు నారదుని శాపం వలన ఆ మద్దిచెట్లుగా చాలకాలంనుంచీ పడి ఉన్నారు. వారిద్దరినీ చూచి కృష్ణుడు రోలు ఈడ్చుకొంటూ ఆ చెట్ల దగ్గరకు వెళ్లాడు.'' ఇలా శుకమహర్షి చెప్పగానే పరీక్షిత్తు ఈ విధంగా అడిగాడు.

క. 'నారదుఁ డేల శపించెను?, వా రా వృక్షత్వమునకు వచ్చిన పనికిం
గారణ మెయ్యది? యోగి కు, లారాధ్య! యెఱుంగఁ జెప్పుమయ్య! వినియెదన్.' 392

* "మహానుభావా! లోకంలోని మహాయోగు లందరూ నిన్ను ఆరాధిస్తూ ఉంటారు. నీవే నా సంశయాలు తొలగించగలవు. ఆ యక్షులను నారదుడు ఎందుకు శపించాడు? వారు ఆ శాపం పొందటానికి చేసిన అపచార మేమిటి?"

**వ. అనిన శుకుం డిట్లనియె - 'మున్ను కుబేరుని కొడుకు లిరువురు శంకరకింకరులై యహంకరించి వెండికొండమీఁద విరుల తోఁటలం బాడెడి చేడియలం గూడికొని కరేణుసంగతంబు లైన యేనుంగుల భంగి సురంగంబు లైన మందాకినీ తరంగంబులం గ్రీడింప, నారదుండు వచ్చిన నచ్చెలువలు సెచ్చెర వలువలు ధరియించిరి, మదిరా పానపరవశులు గావున వారలిరువురు వివస్త్రులై మెలంగుచున్న నా మునీశ్వరుండు సూచి శపియించువాఁడై ప్రతీతంబగు గీతంబు వాడె, వినుము. 393**

* అని అడుగగా పరీక్షిత్తుతో శుకుడు ఇలా అన్నాడు. "పూర్వం కుబేరుని కొడుకు లిద్దరు నలకూబర, మణిగ్రీవు లనేవారు శివునికి సేవకులుగా ఉండేవారు. యక్షరాజు కొడుకులము, పై గా పరమశివుని అను చరులము గదా అని వారు అహంకారంతో సంచరిస్తూ ఉండేవారు ఒకనాడు వారు ఇద్దరూ వెండికొండపైన ఉద్యాన వనాలలో తమ ప్రియు రాంద్రతో కలసి విహరిస్తూ ఉన్నారు. ఆ ప్రియకాంతలు గంధర్వకన్యలు. చాల మనోహరంగా పాటలు పాడుతున్నారు. ఈ విధంగా వారు ఆడ ఏనుగులతో కూడిన మదపు టేనుగులులాగా తమ కాంతలతో అందమైన ఆకాశగంగా తరంగాలలో జలక్రీడలు సాగించారు. స్వచ్ఛమైన ఆ నదీ జలాలను అల్ల కల్లోలం చేయసాగారు. ఇంతలో ఆ మార్గాన నారద మహర్షి విచ్చేశాడు. ఆయనను చూచి గంధర్వస్త్రీలు గబగబా వస్త్రాలు ధరించారు. మద్యపు కైపుతో నిండి ఉన్న నలకూబర మణిగ్రీవులు మాత్రం పొగరుకొద్దీ దిగంబరులుగానే ఉండిపోయారు. ఆ దృశ్యం చూచిన నారదుడు వారిని శపించబోతూ, ఒకచక్కని సత్యాన్ని చెప్పాడు. సంగీత విద్యామయుడైన నారదమహర్షినోట అది ఒక పాటగా రూపుదిద్దుకుంది. అది తరువాత చాల ప్రసిద్ధంకూడా అయింది.

**శా. 'సంపన్నుం డొరుఁ గానలేఁడు తనువున్ సంసారమున్ నమ్మి హిం**
**సింపం జూచు దరిద్రుఁ డెత్తువడి శుష్కీభూతుఁడై చిక్కి హిం**
**సింపండన్యుల నాత్మకున్ సములుగాఁ జింతించునట్లౌటఁ ద**
**త్సంపన్నాంధున కంజనంబు వినుమీ దారిద్ర్య మూహింపఁగన్. 394**

* ధనవంతుడు ఎవరినీ లెక్కచేయడు. తన ధర్మాన్నీ, శరీరాన్నీ, సంసారాన్నీ నమ్ముకుని ఇతరులను హింసించాలనే చూస్తాడు. దరిద్రుడు దారిద్ర్యదేవతకు చిక్కి కష్టాలు అనుభవించుతూ కూడా ఇతరులను హింసించడు. వారూ తనవంటివారే కదా అని ఆలోచిస్తాడు. ఇది లోక రీతి. కనుక ధన మదాంధులైన వారికి దారిద్ర్యమే చక్కని అంజనం అవుతుంది."

**వ. అని గీతంబు వాడి తన మనంబున. 395**

**క. కలవాని సుతుల మనుచును, గలకంఠులతోడఁ గూడి కానరు పరులం**
**గలలో నైనను, వీరికిఁ, గల క్రొ వ్వడఁగించి బుధులఁ గలుపుట యొప్పున్. 396**

* ఈ విధంగా గీత పాడి, నారదుడు తన మనస్సులో ఇలా అనుకున్నాడు. " ఈయక్షరాజ పుత్రులు ధనవంతుని కొడుకులమని గర్వించి ఉన్నారు. ఇక ప్రేయసులతో కలిసి ఉన్నప్పుడు చెప్పే దేముంది? వీరికి కలలోనైనా పెద్దాచిన్నా కనిపించరుగదా! వీళ్ళ క్రొవ్వు అణచి మళ్ళీ వీళ్ళను సత్పురుషులుగా మార్చడం సముచితమైన పని!"

**వ. అని చింతించి విజ్ఞాన విశారదుండగు నారదుండు నలకూబర మణిగ్రీవులం జూచి మీరలు స్త్రీ మదాంధులరు గావున భూలోకంబున నర్జున తరువులై నూఱుదివ్య వర్షంబు లుండుం, డట మీఁద గోవింద చరణారవింద పరిస్పందంబున. 397**

**క. ముక్తులరై నారాయణ, భక్తులరై పరమసాధుభావ శ్రీ సం**
**సక్తులరై సురలోక, వ్యక్తుల రయ్యెదరు నాదువాక్యము కతనన్. 398**

* ఇలా అలోచించుకొని విశేషమైన జ్ఞానం కల నారదుడు నలకూబర మణిగ్రీవులతో ఇలా అన్నాడు. "మీరు ఐశ్వర్యమదంతో కొట్టు కుంటున్నారు గనుక మద్దిచెట్లుగా భూలోకంలో నూరు దివ్యసంవత్సరాలు పడి ఉండండి. ఆ తరువాత నందనందనుని పాదారవింద స్పర్శ వలన మీకు విముక్తి సంప్రాప్తిస్తుంది. ఆ విధంగా ముక్తులై శ్రీమన్నారాయణ భక్తులై, సత్ప్రవర్తనమందు ఆసక్తులై మళ్ళీ దేవలోకంలో ప్రవేశించ గలుగుతారు. ఇది నా అనుగ్రహం."

**వ. అని యిట్లు వలికి, నారదుండు నారాయణాశ్రమంబునకుం జనియె. వా రిరువురును సంగడి మద్దులైరి. పరమభాగవతుండైన నారదు మాటలు వీటింబుచ్చక పాటించి. 399**

* ఈ విధంగా శాపమూ, శాపవిమోచనమూ చెప్పి, నారదుడు నారాయణాశ్రమానికి వెళ్ళిపోయాడు. ఆ యక్షులిద్దరూ జంట మద్ది చెట్లుగా భూలోకంలో జన్మించారు. నారదుడు పరమభాగవతోత్తముడు గనుక, కృష్ణుడు ఆయన మాటలను పాటించ దలచాడు.

**క. ముద్దుల తక్కరి బిడ్డఁడు, మద్దులఁ గూల్పంగఁ దలఁచి మసలక తా నా**
**మద్దికవ యున్న చోటికి, గ్రద్దన ఱో లీడ్చుకొనుచుఁ గడఁకం జనియెన్. 400**

* టక్కులమారి ముద్దుకృష్ణుడు ఆ మద్దిచెట్లను కూల్చి వేయాలని సంకల్పించాడు. ఏ మాత్రం ఆలస్యం చేయకుండా ఆ కొంటెకన్నయ్య జంటమద్దిచెట్లు ఉన్న చోటికి అమాంతంగా రోటిని ఈడ్చుకుంటూ వెళ్ళాడు.

**వ. చని యా యూర్జిత మహాబలుండు నిజోదరదామ సమాకృష్యమాణ తిర్యగ్భవదులూఖలుండై యా రెండు మ్రాఁకుల నడుమం జొచ్చి ముందటికి నిగుడుచు. 401**

* ఆ బాలకృష్ణుడు స్థిరమైన మహాబలం కలవాడు. అతని పొట్టకు కట్టబడిన త్రాటి ఊపుకు రోలు అడ్డం తిరిగిపోయింది. అతడు చెరచెరా రెండు మద్ది చెట్ల మధ్య నుంచి రోటిని ఈడ్చుకుంటూ ముందుకు వెళ్లి పోయాడు.

**క. బాలుఁడు ఱో లడ్డము దివ, మూలంబులు వెకలి విటపములు విఱిగి మహా**
**భీలధ్వనిఁ గూలెను శా, పాలస్యవివర్జనములు యమళార్జునముల్. 402**

* బాలుడు రోలు అడ్డం త్రిప్పి లాగగానే, ఆ మద్దిచెట్లు రెండూ వేళ్లతో సహా పెకలించుకొనిపోయి, కొమ్మలు విరిగిపోతూ మహాభయం కరమైన ధ్వనితో నేలకూలి పోయినాయి. చాలాకాలం తరువాత వాటికి శాపాలు తొలగిపోయినాయి.

**వ. ఇట్లు నిర్మూలంబు లయి పడిన సాలంబులలోనుండి కీలికీలలు వెల్వడు పోలిక నెక్కుడు తేజంబున దిక్కులు పిక్కటిల్లం బ్రసిద్ధులై న సిద్ధు లిద్దఱు వెడలివచ్చి ప్రబుద్ధులై భక్తలోక పాలకుండైన బాలకునకు మ్రొక్కి లేచి కరకమలంబులు మొగిచి యిట్లనిరి. 403**

* ఈ విధంగా మొదలంటా కూలిపోయిన ఆ మద్దిచెట్లలోనుండి అగ్నిజ్వాలలు వెలువడినట్లు దిక్కులలో నిండిన తేజస్సులతో ఇద్దరు యక్షులు నిద్ర మేల్కొన్నట్లు ప్రత్యక్షమైనారు. భక్తు లందరినీ రక్షించే బాలకృష్ణునికి తలవంచి నమస్కారం చేసి చేతులు జోడించి ఇలా అన్నారు.

**క. బాలుఁడవె నీవు? పరుఁడ వ, నాలంబుఁడ వధికయోగి వాద్యుఁడవు తను**
**స్థూలాకృతి యగు విశ్వము, నీ లీలారూపమండ్రు నిపుణులు కృష్ణా! 404**

* కృష్ణా! నీవు బాలుడవా? కాదు కాదు, పరబ్రహ్మవు, నీకు నీవే కాని వేరే ఆధారం అక్కరలేనివాడవు. మహాయోగివి. అన్నిటికీ మొదటివాడవు నీవు. అత్యంత సూక్ష్మం నుండి అతిస్థూలం వరకూ ఈ విశ్వమంతా నీ రూపమే అని వివేకవంతులు అంటారు.

**సీ. ఎల్లభూతంబుల కింద్రియాహంకృతి ప్రాణంబులకు నధిపతివి నీవ!**
**ప్రకృతియుఁ బ్రకృతి సంభవ మహత్తును నీవ, వీని కన్నిటికిని విభుఁడ వీవ,**
**ప్రాకృతగుణవికారములఁ బొందక పూర్వ సిద్ధుండ వగు నిన్నుఁ జింత సేయ**
**గుణవృతుం డోపునే? గుణహీన! నీ యంద, కల గుణంబుల నీవ కప్పఁబడుదు,**

**తే. మొదల నెవ్వని యవతారములు శరీరు, లందు సరిదొడ్డు లేని వీర్యములఁ దనువు,**
**లడర జన్మించి వారలయందుఁ జిక్క, వట్టి పరమేశ! మ్రొక్కెద మయ్య! నీకు. 405**

* అన్ని జీవరాసులకీ, ఇంద్రియాల అహంకారానికీ, ప్రాణాలకూ నీవే అధిపతివి. ప్రకృతివీ నీవే; దాని నుండి పుట్టిన మహత్తూ నీవే. అయినా వీటికి వేటికీ అందకుండా అధికారం చూపేదీ నీవే. ప్రకృతి గుణాలు నీలో ఏ మార్పులూ కలిగించలేవు. ఎందుకంటే నీవు వాటికన్న ముందునుండి ఉన్నవాడవు. నీలో నుంచి అవి పుట్టుకు వస్తాయి. ఇక గుణాలతో ఆవరింపబడినవాడు నిన్ను గూర్చి యెలా ధ్యానం చేయగలడు? నీకూ ఏ గుణాలూ లేవు. నీ నుండి గుణాలు వస్తూ ఉంటాయి. వాటిచేత కప్పబడి రహస్యంగా దాగిఉంటావు. ఈ శరీరం ధరించిన ఎవరూ కూడా నీ అవతార వైభవాలకి సాటిరారు. నీ రూపాలు వేరు, వీళ్ళ రూపాలు వేరు. ఈ జీవులంతా నీ తేజస్సుతో శరీరాలు ధరించి పుడతారు. కనుక నీవు వాళ్ళకి అంతుపట్టవు. అలాంటి నీకు నమస్కారం చేస్తున్నాము.

క. భువనములు సేయఁ గావఁగ, నవతీర్ణుఁడ వైతి కాదె యఖిలేశ్వర! యో
గి వరేణ్యా! విశ్వమంగళ!, కవిసన్నుత! వాసుదేవ! కల్యాణనిధీ! 406

* ఈ లోకాల నన్నింటినీ సృష్టించడానికీ, రక్షించడానికీ అవతరించావుగదా! నీవు ఈ అంతటికీ ఈశ్వరుడవు. యోగులందరూ నిన్ను దైవంగా వరించారు. ఈ సృష్టికి శుభాలు చేకూర్చేవాడవు నీవు. సృష్టిలోని శుభాలు అన్నీ నీ నుండే పుట్టుతూ ఉన్నవి.

ఉపేంద్ర వజ్ర.
తపస్వివాక్యంబులు దప్ప వయ్యెన్, నెపంబునం గంటిమి నిన్నుఁ జూడం
దపంబు లొప్పెన్, మముఁ దావకీయ, ప్రపన్నులం జేయుము భక్తమిత్రా! 407

* మహాతపస్వి అయిన నారదమునీంద్రుని మాటలు తప్పకుండా జరిగినాయి. ఆయన శాపం పుణ్యమా అని నిన్ను చూడగలిగాము. ఇన్ని సంవత్సరాలూ నిన్ను చూడాలనే తపించిపోయాము. ఇప్పటికి మా తపస్సు ఫలించింది. నీవు భక్తులైనవారికి పరమ మిత్రుడవు. మమ్ములను నీ భక్తులుగా మన్నించి అనుగ్రహించు.

శా. నీ పద్యావళు లాలకించు చెవులున్ ని న్నాడు వాక్యంబులున్
నీ పేరం బనిసేయు హస్తయుగముల్ నీ మూర్తి పైఁ జూపులున్
నీ పాదంబుల పొంత మ్రొక్కు శిరముల్ నీ సేవపైఁ జిత్తముల్
నీపై బుద్ధులు మాకు నిమ్ము కరుణన్ నీరేజపత్త్రేక్షణా! 408

* కమలపత్రాలవంటి నేత్రాలుగల మహానుభావా! నీపై రచించిన స్తుతి వింటూవుండే చెవులనూ, నిన్ను గురించే మాట్లాడే వాక్కునూ మాకు అనుగ్రహించు. ఏ పనిచేసినా నీ పేరనే నీ పనిగా చేసేటట్లూ, మా చూపులన్నీ నీ రూపం పై ననే ఉండేటట్లూ, మా బుద్ధులు నీ పైననే ఉండే టట్లూ దయతో మమ్మల్ని అనుగ్రహించు."

వ. అని యిట్లు కీర్తించిన గుహ్యకులంజూచి నగుచు నులూఖల బద్ధుండైన హరి యిట్లనియె. 409

* ఈ విధంగా తనను కీర్తించిన నలకూబర మణిగ్రీవులను చూచి, రోటికి కట్టబడి ఉన్న బాలకృష్ణుడిలా అన్నాడు.

క. 'తమతమ ధర్మము దప్పక, సములైనను నమ్మి తిరుగు సభ్యులకును బం
ధము నన్నుఁ జూడ విరియును, గమలాప్తుఁడు వొడమ విరియు ఘనతమము క్రియన్. 410

* "తమ తమ ధర్మాలు తప్పకుండా అందరియెడల సమత్వంతో ప్రవర్తిస్తూ నన్ను నమ్మి తిరుగుతూ ఉండేవారు సజ్జనులు. అటువంటి వారికి నన్ను చూడగానే సూర్యోదయంతో దట్టమైన చీకటి విరిసి పోయినట్లు బంధం విడిపోయి, మోక్షం లభిస్తుంది.

క. **కారుణ్యమానసుం డగు, నారదు వచనమునఁ జేసి నను౯ం బొడఁగనుటన్**
**మీరు ప్రబుద్ధుల రైతిరి, చేరెన్ నామీఁది తలఁపు సిద్ధము మీకున్. 411**

* నారదమహర్షి కరుణతో ఇచ్చిన శాపం కారణంగా మీరు నన్ను చూడగలిగారు. ఈ నాటితో మీ శాపం తొలిగి మీరు నిద్రమేల్కొన్నట్లు మేల్కొన్నారు. ఈ నాటినుంచీ మీకు నా పైని భక్తీ చేకూరుతుంది.

వ. **అని యీశ్వరుండు 'మీరు మీ నెలవులకుం బొం'డని యానతిచ్చిన మహాప్రసాదం బని వలగొని పెక్కు మ్రొక్కులిడి వీడుకొని నలకూబర మణిగ్రీవు లుత్తర భాగంబున కరిగి, రంత నందాదులయిన గోపాలకులు నిర్మూలంబులయి పడిన సాలంబుల చప్పుడు పిడుగుచప్పు డని శంకించి వచ్చిచూచి. 412**

* ఇక మీ లోకాలకు మీరు పోవచ్చును, అని కృష్ణుడు అనుజ్ఞ ఇవ్వగానే, యక్షులు మహాప్రసాదం అంటూ అతనికి ప్రదక్షిణాలు చేసి పెక్కు విధాలుగా మ్రొక్కి సెలవు తీసుకొని తమ స్థానమైన ఉత్తర దిక్కుకు వెళ్ళిపోయారు.

ఇక్కడ నందుడు మొదలైన గోపకులు మద్దిచెట్లు విరిగిన చప్పుడు విని, పిడుగు పడిందేమో అని భయపడి పరుగెత్తుకుని వచ్చి చూచారు.

క. **'ఈ పాదపములు గూలఁగ, నీ పాపఁ డులూఖలమున నిటు బద్ధుండై**
**యే పగిది బ్రదికెఁ? గంటిరె!, వాపోవఁడు, వెఱవఁ, డెట్టివాఁడో యితఁడున్. 413**

"అయ్యో! ఈ చెట్లు ఇలా కూలిపోతే, రోటికి కట్టివేయబడి ఉన్న ఈ చిన్నపాపడు ఎలా బ్రతికి ఉన్నాడో? చూశారా, చూశారా! వీడు ఏడవనైనా ఏడవలేదు. భయపడనూ లేదు. ఎలాంటి పిల్లవాడమ్మా వీడు?

ఆ. **పిడుగు వడదు, గాక పెనుగాలి విసరదు, ఖండితంబు లగుట గానరాదు,**
**బాలుఁ డితఁడు, వట్టి పడఁద్రోయఁ జాలఁడు, తరువు లేల కూలె ధరణిమీఁద?' 414**

* "అసలు ఈ మహావృక్షాలు ఎలా నేల కూలాయి? పిడుగు పడలేదు. పోనీ పెద్దగాలి అయినా వీచలేదు. ఎవరూ నరికిన సూచనలు లేవు. వ్రేళ్ళతో పెల్లగిల్లి పడిపోయాయి. పోనీ వీడు పడద్రోశాడా అంటే ఈ పసివాడు వీటిని త్రోయగలడా? ఇంత చెట్లు ఎలా కూలిపోయాయి?''

వ. **అని పెక్కండ్రు పెక్కువిధంబుల నుత్పాతంబులు గావలయునని శంకింప నక్కడ నున్న బాలకు లిట్లనిరి. 415**

* ఈ విధంగా పదిమందీ పది విధాలుగా అనుకుంటూ ఉండగా, అక్కడ ఆడుకుంటూ ఉన్న గోపాలబాలకులు ఇలా అన్నారు.

క. **"నందుని కొమరుఁడు వినుఁ డీ, సందున మును దూఱి త్రోలు సరి యడ్డముగా**
**ముందటి కీడ్చిన మద్దులు, గ్రందుకొనం గూలె, జనులఁ గంటి మిరువురన్." 416**

* "నందుని కుమారుడైన కృష్ణుడు ఆ చెట్ల సందులోనుండి ముందు తాను దూరాడు. తరువాత రోలు అడ్డంత్రిప్పి ముందకు లాగాడు. అంతే! మద్ది చెట్లు ఫెళఫెళ లాడుతూ కూలిపోయినాయి. ఆ తర్వాత అక్కడ ఎవరో ఇద్దరూ మనుష్యులుకూడా కనిపించారు."

వ. అని యిట్లు పలికిన బాలకాలాపంబులు విని కొందఱు మిథ్యారూపంబు లనిరి, కొందఱు నానా విధంబుల సందేహించి రంత నందుండు వికసిత వదనారవిందుం డగుచుఁ బట్టి కట్టు విడిచె, నట్టియెడఁ దనతెఱం గెవ్వరు నెఱుంగ కుండవలెనని కపటకుమారుండు. 417

* ఈ విధంగా గోపబాలకులు చెప్పగా కొందరు "అబద్ధాలాడు తున్నారు"అన్నారు. మరికొందరు మరికొన్ని విధాలుగా సందేహించారు. అప్పుడు నందుడు తన కొడుకు బ్రతికి బయటపడినందుకు సంతోషించాడు. అతడు ముందుకు వచ్చి కృష్ణునికి కట్టిన త్రాళ్ళు విప్పి వేశాడు. అప్పుడు లీలావినోదియైన కృష్ణుడు ఈ విషయంనుండి గోపజనుల మనస్సులను మరలించడానికిగాను బాలునివలె నటింపసాగాడు.

శా. పాడున్ మందునిభంగి, గోపవనితల్ పాణిధ్వనుల్ సేయఁగా
నాడున్ జంత్రముకైవడిం, బరవశుండై హస్తముల్ ద్రిప్పుచుం,
జూడ న్నే రని వాని భంగి జనులం జూచున్, నగున్, బాలురం
గూడుం బెద్దలపంపు సేయఁజను, డాఁగున్ మట్టిఁ జిట్టాడుచున్. 418

* అమాయిక బాలునివలె పాటలు పాడుతాడు, గోపవనితలు చేతులతో లయబద్ధంగా చప్పట్లు చరుస్తూ ఉంటే కీలుబొమ్మవలె పరవశుడై చేతులు త్రిప్పుతూ నాట్యం చేస్తాడు. చూడడం అంటే ఏమిటో తెలియని వానివలె జనులవంక పలుకరింపుగా చూస్తాడు. నవ్వుతాడు. తోడిపిల్లలతో కలిసి గంతులువేస్తాడు. పెద్దవారు ఏమైనా చెబితే బుద్ధిమంతునిలాగా చేస్తాడు. తలుపుచాటున దాక్కుంటాడు. మట్టితో ఆడుకుంటాడు.

క. 'చుంచెదుగుఁ బాలు ద్రావు ము, దంచితముగ' ననుడు బాలుద్రావి జననితోఁ
జుం చెదుగ దంచు లీలా, చుంచుం డై యతఁడు చుంచుఁ జూపు నరేంద్రా! 419

* ఒకనాడు బాలకృష్ణుడు పాలు త్రాగకుండా పేచీపెడుతూ ఉంటే యశోద "పాలు త్రాగితే జుట్టు చక్కగా పెరుగుతుంది" అని ఆశ పెట్టింది. అతడు పాలు త్రాగి "చేతితో తల తడువుకొంటూ నేర్పుగా, గడుసుగా "ఇదిగో జుట్టు ఎదగదేమి?" అంటూ ముంగురులు చూపాడు.

క. సెలగోల వట్టుకొని జల, కలశములో నీడఁ జూచి కలశయుతుండై
సెలగోలఁ బాపఁ డొకఁ డిదె, తలఁచెన్ ననుఁ గొట్ట ననుచుఁ దల్లికిఁ జెప్పెన్. 420

* చిన్నికృష్ణుడు ఒక నాడు సెలగోల చేతిలో పట్టుకుని, గిన్నెలో ఉన్న నీళ్ళలోకి చూచాడు. అక్కడ తన ప్రతిబింబమే కనిపించింది. ఆ గిన్నె పట్టుకుని తల్లివద్దకు వెళ్ళి "అమ్మా! ఇదిగో ఎవరో ఒక పాపాయి కర్రపుచ్చుకుని నన్ను కొట్టవస్తున్నాడు - చూడు!" అంటూ పసివానివలె ప్రవర్తిస్తూ పలికాడు.

క. భిక్షులు వచ్చెద రేడ్చిన, భిక్షాపాత్రమున వైచి బెగడించి నినున్
శిక్షించెద, రని చెప్పిన, భిక్షులఁ గని, తల్లిఁ గనియు భీతిల్లు నృపా! 421

* కృష్ణుడు ఏడుస్తూ పేచీపెడుతూ ఉంటే, “ఇదిగో బిచ్చగాళ్ళు వస్తున్నారు. నువ్వు ఏడ్చావంటే నిన్ను వాళ్ళు గిన్నెలోపెట్టి పట్టుకొని పోయి కొట్టేస్తారు జాగ్రత్త”అని తల్లి బెదిరిస్తే అతడు వాకిట్లోకి వచ్చిన భిక్షుకులను చూచి, తల్లి వంక చూచి భయపడుతున్నట్లు నటిస్తాడు.

## -: నందాదులు బృందావనంబునకు నరుగుదెంచుట :-

వ. ఇట్లు కృష్ణుండు బహువిధంబులఁ గపటబాలలీలల వినోదింప, బృహద్వనంబున నందాదు లైన గోపవృద్ధులు మహోత్పాతంబు లగుటయు, వానివలన బాలుం డుత్తరించుటయుఁ జూచి యే కాంతంబున నొక్కనాఁడు విచారింప నుపనందుండను వృద్ధగోపకుండు దన యెఱుక మెఱసి యిట్లనియె. 422

* ఈ విధంగా కృష్ణుడు బాల్యక్రీడలు చూపుతూ గోపీగోపకులను వినోదింప జేస్తున్నాడు. ఒకనాడు ఆ వ్రేపల్లెలోని ఒక పెద్దతోపులో నందుడు మొదలైన గోపకు లందరూ సమావేశమైనారు. అప్పటివరకూ సంభవించిన భయంకరమైన ఉత్పాతాలూ, వాటిని కృష్ణుడు తప్పించు కోవడం అనేకవిషయాలు చెప్పుకుని సమాలోచనలు సాగించారు. వారిలో ఉపనందుడనే ఒక వృద్ధగోపాలకుని బుద్ధిలో అకస్మాత్తుగా దైవసంకల్పం వలన ఒక ఆలోచన మెరిసింది. అతడు ఇలా అన్నాడు.

ఉ. 'ఇక్కడ నుందురే మనుజు? లీ మన కృష్ణున కెగ్గు సేయఁగా
రక్కసురాలు చ న్నొసఁగె, ఱాలపయిన్ సుడిగాలి వీచెఁ, బైఁ
గ్రిక్కిఱియం దరుల్ వడియెఁ, గేశవు సత్కృపఁ దప్పెఁ, జాలు నేఁ
డెక్కడి కైనఁ బోవలయు నిం కిట గోపకులార! వింటిరే? 423

* “ఇది అసలు మనుష్యులు ఉండే ప్రదేశమా? మన ఈ చిన్ని కృష్ణునికి అపకారం చేయడానికే రాక్షసి ఒకతె చనుబాలు ఇచ్చింది. రాళ్ళతో సహా సుడిగాలి వీచింది. దట్టమైన చెట్లు వానిపైన పడిపోయినాయి. ఇన్ని అపాయాలూ శ్రీమన్నారాయణమూర్తి దయవలన తప్పిపోయాయి. ఇక చాలు, ఇప్పటికైనా మరో క్షేమంకరమైన ప్రదేశానికి వెళ్ళి పోవడం మంచిది. వింటున్నారా?

క. కసవు గల దిరవు పసులకు, లసదద్రినదీ మహీజ లతికావలి పెం
పెసఁగును, గాఁపురమునకును, బొసఁగును బృందావనంబు వొదఁ డచ్చటికిన్. 424

* “బృందావనం“అనే ప్రదేశం ఉన్నది. అక్కడ పశువులకు మేత పుష్కలంగా ఉంటుంది. అది విహరించడానికి చక్కని పర్వతాలూ, నదులూ, చెట్లూ, తీగలూ కలిగి ఎంతో అందంగా ఉంటుంది. అక్కడికి పోదాం పదండి.”

వ. అని పలుకు నుపనందుని పలుకుల కార్యులైన గోపకు 'లిదియ కార్యంబు మందల' యని కొం దల మందక యాల మందల నమంద గమనంబున ముందర నడవం బనిచి పిఱుందం గ్రందు కొనకుండ, బాలవృద్ధనారు లెక్కిన తేరులు సాగించి తారు తనుత్రాణ తూణీర బాణధరులై విండ్లఁ బట్టు కొని నడవ, బండ్లవెనుకం గొమ్ము లిమ్ములం బూరించుచు నవార్యంబులగు తూర్య రవంబులు సెలంగ నార్యపురోహిత సమేతులై వేడుకలు కొనలు నిగుడ మొన లేర్పఱచుకొని పావనం బగు బృందావనంబునకుం జని రప్పుడు. 425

* ఉపనందుడిలా చెప్పగానే పెద్దలూ పూజ్యులైన గోపకులందరూ అంగీకరించారు, ఒక క్రమపద్ధతిలో ముందుగా ఆవులమందలను వేగంగా బృందావనానికి తోలించారు. వాటికి రక్షగా వెనుకనే వారి బండ్లు బయలుదేరినాయి. వానిలో బాలకులు, స్త్రీలు వృద్ధులు పయనం సాగించారు. వానిప్రక్కనే గోపకులు కవచాలు, ధనుర్బాణాలు, అమ్ములపొదులు పట్టుకొని బయలుదేరారు. బండ్లకు వెనుకగా బాకాలు మొదలైన తూర్యములు మ్రోగుతూ ఉండగా, పూజ్యులైన పురోహితులు వెంటనడువగా పల్లెలోని మిగిలిన వారందరూ బయలుదేరారు. గుంపులు గుంపులుగా ఈ మొత్తమంతా ఉప్పొంగే ఉత్సాహంతో పుణ్యభూమియైన బృందావనానికి బయలుదేరారు.

తరలము.

పసుపు లాడి యురోజకుంకుమ పంకశోభితలై లస
ద్వసనలై కచభారచంపకదామలై సులలామలై
పసిఁడిమాడల కాంతు లఱ్ఱులఁ బర్వఁ దేరులమీఁదఁ బెం
పెసఁగఁ బాడిరి వ్రేత లా హరిహేల లింపగు నేలలన్. 426

* గోపికలు చక్కగా పసుపురాచుకొని స్నానాలు చేసి వక్షస్థలం పైన కుంకుమపూతలు పూసుకొని తళతళలాడే వస్త్రాలు ధరించారు. అందంగా తిలకములు దిద్దుకున్నారు. పెద్దకొప్పులపై సంపెంగపూల దండలు ధరించారు. మెడలోని బంగారుకాసులపేరు కాంతులు రొమ్ములపై ప్రసరిస్తున్నాయి. వారు బండ్లలో ఎక్కికూర్చుని, చక్కని కంఠాలతో మాధవునిమీద మధురమైన ఏలపాటలు పాడుతూ ఉన్నారు.

వ. అప్పుడు రోహిణీయశోద లేక రథంబునఁ బరిపూర్ణ మనోరథలై రామకృష్ణుల ముందట నిడుకొని వారల వినోదంబులకుఁ బ్రమోదంబు నొందుచుం జని, రిట్లు గోపకులు బృందావనంబు సొచ్చియం దర్ధచంద్రాకారంబుగ శకట సందోహంబు నిలిపి మందల విడియించి వసియించిరి. 427

* రోహిణి, యశోద ఒకేబండిలో కూర్చున్నారు. ఏ కోరికలు లేని ఆనందస్థితిలో బలరామకృష్ణులను ఎదుట కూర్చోబెట్టుకుని వారి ఆటపాటలతో చాల ఆనందించుచూ ప్రయాణం సాగించారు. ఈ విధంగా గోకులంలోని ప్రజలంతా ప్రయాణమై బృందావనంలో ప్రవేశించారు. బండ్లను అర్ధచంద్రాకారంగా నిలబెట్టి, ఆవుల మందలను మధ్యలో ఉంచారు. అలాగే ఇండ్లనుకూడా కట్టుకుని అక్కడ నివసించారు.

**క. చెందిరి బలమాధవులభి, నందించుచుఁ బరమపావనము సంచిత కా**
**ళిందీసంజీవనమున్, బృందావనమున్ మునీంద్రబృందావనమున్. 428**

* ఆ విధంగా బలరామకృష్ణులు సంతోషంతో పరమపావనమైన బృందావనంలో ప్రవేశించారు. ఆ బృందావనం కాళిందీ నదికే ప్రాణాలు పోసినట్లున్నది. మునీంద్రుల నందరినీ రక్షించేది అదే.

**వ. ఇట్లు బృందావనంబుఁ జెంది యందుఁ గొంతకాలంబునకు రామకృష్ణులు సమానవయస్కులైన గోపబాలకులం గూడికొని వేడుక లూఁడుకొన దూడలఁ గాచుచు. 429**

* "ఇలా బృందావనం చేరిన కొంతకాలానికి బలరామకృష్ణులు వేడుకతో తమ యీడు గోపబాలురతో కలిసి ఆనందంగా దూడలను కాచుకోసాగారు.

**సీ. వేణువు లూఁదుచు వివిధరూపములతో గంతులు వైతురు కౌతుకమున,**
**గురుకంబళాదుల గోవృషంబులఁ బన్ని పరవృషభము లని ప్రతిభటింతు,**
**రల్లులు దట్టించి యంఘ్రుల గజ్జెలు మొరయఁ దన్నుదు రోలి ముమ్మరముగఁ**
**బన్నిదంబులు వైచి ఫలమంజరులఁ గూల్చి వ్రేటు లాడుదురు ప్రావీణ్య మొప్ప,**

**తే. వన్యజంతుచయంబుల వాని వాని, పదురు పదురుచు వంచించి పట్టఁబోదు,**
**రంబుజాకరములఁ జల్లులాడఁ జనుదు, రా కుమారులు బాల్యవిహారు లగుచు. 430**

* ఆ రామకృష్ణులు వేణువులు ఊదుతూ రకరకాల వేషాలతో ఉత్సాహంతో గంతులు వేయసాగారు. పెద్దపెద్ద కంబళ్ళతో వృషభాల రూపాలు తయారుచేసి, అవి శత్రు వృషభాలని వాటితో యుద్ధం చేయ సాగారు. గుడ్డలతో బొమ్మలు చేసి, వాటిని గట్టిగా తన్నుతూ ఉంటే, కాళ్ళగజ్జెలు ఘల్లు మంటూ మ్రోగసాగాయి. పందాలు వేసుకొని, పండ్ల గుత్తులను గురిచూచి రాళ్లతో కొడుతూ ఉంటారు. అడవి జంతువుల కూతలను, అరుపులను అనుకరించి అరుస్తూ ఆ జంతువులు దగ్గరకు రాగానే వాటిని పట్టుకోబోతారు. తామరపూవులు నిండియున్న కొలనులలో ప్రవేశించి ఒకరిపై ఒకరు నీళ్ళు చల్లుకుంటూ ఆడుతూ ఉంటారు. ఈ విధంగా ఆ రాజపుత్రులు గోపబాలకులై బాల్యక్రీడలలో చరించసాగారు.

**క. పోరుదురు గికురు వొడుచుచుఁ, దూఱుదురు భయంబు లేక తోరపుటిరవుల్,**
**జాఱుదురు ఘనశిలాతటి, మీఱుదు రెన్నంగరాని మెలఁకువల నృపా! 431**

* ఒకరితో ఒకరు ఉత్తుత్త యుద్ధాలు చేస్తూ, దొంగదెబ్బలు కొట్టుకుంటారు. అందమైన స్థలాలలోనికి జంకులేక ప్రవేశిస్తూ ఉంటారు. పెద్దబండరాళ్లపైకి ఎక్కి జారుతూ ఉంటారు. పెద్దలకి ఊహించరాని నేర్పరితనాలలో ఒకరి నొకరు మించిపోతూ ఉంటారు.

**వ. అంత నొక్కనాఁడు యమునాతీరంబున నా కుమారులు గోపకుమారులుం దారును గ్రేపుల మేప నొక్క రక్కసుండు క్రేపురూపున వచ్చి వారల హింసింపం దలంచి. 432**

* ఒకనాడు బలరామకృష్ణులు యమునానదీ తీరాన గోపబాలకులతో కలిసి గోవత్సాలను మేపుతూ ఉండగా ఒక రాక్షసుడు వారిని చంపాలని వచ్చి, తానుకూడా ఒక కోడె దూడ రూపం ధరించాడు.

## -: వత్సాసుర బకాసురుల వధ :-

క. క్రేపుల యఱ్ఱులు నాకుచుఁ, గ్రేపులతో నిదియె మంచి క్రే పనఁగఁ గడుం
జూపట్టి భక్తి సంగతిఁ, గ్రేపై చనువాని మ్రోలఁ గ్రేపై తిరిగెన్. 433

* వాడు దూడలలో దూడయై కలిసిపోయి, మిగిలిన దూడల మెడలు నాకుతూ, 'ఉన్నవాటిలో ఇదే మంచి దూడ''అనిపించేటట్లు సంచరించాడు. భక్తులవెంట దూడవలె సంచరించే కృష్ణుని వెనుక ఆ రాక్షసుడు దూడ రూపంలో తిరుగసాగాడు.

వ. వాని నెఱింగి కృష్ణుండు రామునకుం జెప్పి. 434

* శ్రీ కృష్ణుడు ఆ రాక్షసుని గుర్తించి బలరామునితో చెప్పాడు.

చ. 'ఇది యొక మంచిలేఁగ, వినుఁ డెంతయు నొప్పెడి' నంచు దాని త
త్పదములఁ దోఁకయున్ బిగియఁబట్టి వెలంగి వెలంగ మ్రానితోఁ
జదియఁగ నొక్క పెట్టుగొని చంపెఁ గుమారుఁడు లేఁగరక్కసుం,
గుదులుకొనంగ బాలకులు గోయని యార్వ నఖర్వలీలతోన్. 435

* "కృష్ణుడు నెమ్మదిగా'' ఆహా! ఈ దూడ ఎంత మంచిదో చూచారా? ఎంత చక్కగా ఉందో చూడండి!'' అంటూ దగ్గరికి వెళ్లాడు. గభాలున కాళ్ళు, తోక గట్టిగా పట్టుకుని పైకెత్తి, పెద్దపెట్టున వెలగచెట్టు కేసి మోదాడు. ఆ దెబ్బకు ఆ దూడ చితికి పచ్చడైపోయింది. ఈ విధంగా దూడరూపంలో వచ్చిన వత్సాసురుడు అనే రాక్షసుడు గిలగిల కొట్టుకొని చచ్చిపోయాడు. గోపబాలకులు ఆనందంతో ఒకపెట్టున పెద్దగా కేకలు వేశారు.

వ. ఇట్లు రక్కసుండు వ్రేటుపడి విశాలంబగు సాలంబుతో నేలంగూలె, నప్పుడు. 436

* ఇలా ఆ రాక్షసుడు దెబ్బ తిని చచ్చి నేలకూలిపోయాడు. ఆ దెబ్బకు అందపెద్ద వెలగచెట్టు కూడా కూలిపోయింది.

క. గొంగడు లెగురఁగ వైచుచుఁ, జంగున దాఁటుచును జెలఁగి చప్పట లిడుచుం
బొంగుచుఁ గృష్ణునిఁ బొగడుచుఁ, ద్రుంగిన రక్కసునిఁ జూచి త్రుళ్ళిరి కొమరుల్. 437

* గోపకుమారులు చచ్చిపడిన రాక్షసుని చూచి, పట్టరాని ఉత్సాహంతో గొంగళ్ళు ఎగరవేశారు. ఎగిరిదూకారు. చప్పట్లుకొట్టారు. త్రుళ్ళింతలతో పొంగిపోయారు. కృష్ణుని బలాన్ని పొగిడారు.

వ. ఆ సమయంబున వేలుపులు విరులవానలు గురియించి, రివ్విధంబున. 438

* ఆ సమయంలో దేవతలు పుష్పవర్షాలు కురిపించారు.

క. **వత్సముల పగిది జగముల, వత్సలతన్ మనుపఁ జూచువాఁడై యుంటన్**
**వత్సముల మేపు చుండియు, వత్సాసురుఁ జంపె భక్త వత్సలుఁ డధిపా!** **439**

* పరీక్షిన్మహారాజా! ఆవు తనదూడను రక్షించేటట్లు ఈ లోకాలన్నింటినీ వాత్సల్యభావంతో రక్షించడానికి అవతరించాడు గనుక, భక్తులను కన్నబిడ్డలవలె కాపాడే కృష్ణుడు దూడలను మేపుతూ ఉండి కూడా దుర్మార్గుడైన వత్సాసురుణ్ణి చంపివేశాడు.

వ. **మఱియు నొక్కనాఁడు రేపకడ గోపకుమారులు క్రేపులం గొంచు నడవికిం జని యొడంబడి మెండుకొనిన దప్పిని బెండువడిన తమతమ లేఁగకదుపుల నేర్పరించి నిలువరించుకొని కలంకంబు లేని యొక్క కొలంకున నీరు ద్రావించి, తారును జలపానంబు సేసి వచ్చునెడ నందు.** **440**

* ఒకనాడు ఉదయాన్నే గోపకుమారులు దూడలను తోలుకొని అడవికి వచ్చారు. ఎండ తీవ్రంగా కాయడంవలన వారికి చాలా దాహం వేసింది. ఆవుదూడలకు కూడ దాహం వేసి, వాడిపోయినాయి. తమ దూడల గుంపులను చక్కగా ఒక కొలనువద్దకు తోలుకొని పోయారు. అక్కడ తమ గోవత్సములకు కలకలు లేని ఆ కొలను నీటిని త్రాగించి, తామూ దాహం తీర్చుకున్నారు. అనంతరం వెనుదిరిగి బయలు దేరారు.

క. **అకలంకులు బాలురు గని, రకుటిలదంభోళిహతసితాద్రి శిఖర రూ**
**పకమున్ హరిహింసారం, భకమున్ బకమున్ విశాల భయదాంబకమున్.** **441**

* అలా తిరిగివచ్చే సమయంలో పుణ్యమూర్తులైన ఆ బాలకులు ఒక మహాభయంకరమైన కొంగను చూచారు. పూర్వం ఇంద్రుని వజ్రాయుధం రెక్కలను విరుగగొట్టగా క్రిందబడిన పెద్ద కొండశిఖరమా అన్నట్లు ఆ కొంగ నిలబడి ఉన్నది. భయంకరమైన పెద్ద కన్నులతో కృష్ణుని చంపటానికి అక్కడ అది వేచి ఉన్నది.

వ. **కని దానియొడలి పొడవునకు వెఱఁగుపడి చూచు చుండ.** **442**

* ఆ గోపకుమారులు ఆ దొంగకొంగ యొక్క పొడవును చూస్తూ నిర్ఘాంతపోయి నిలబడిపోయినారు.

ఆ. **ఎల్లపనులు మాని యేకాగ్రచిత్తుఁడై, మౌనివృత్తి నితర మమత విడిచి**
**వనములోన నిలిచి వనజాక్షుపై దృష్టిఁ, జేర్చి బకుఁడు దపసి చెలువుఁ దాల్చె.** **443**

* ఆ కొంగ అన్నిపనులూ మానివేసి, ఏకాగ్రచిత్తంతో ఆ అడవిలోని కొలనిలో మునిలాగా నిలబడి ఉన్నది. ఇంక ఏ విధమైన కోరికలూ లేవు. ఒక్క కృష్ణుని పైననే దాని దృష్టి కేంద్రీకరింపబడి ఉంది. శత్రువై కృష్ణుని చంపజూచినా, ఆ ప్రయత్నంలో మహర్షులు చేయదగిన తపస్సు దానికి సిద్ధించింది.

వ. **ఇ వ్విధంబున నొదుఁగు వెట్టికొని యుండి.** **444**

* ఈ విధంగా నీటిలో మాటువేసి ఉన్నాడు ఆ బకాసురుడు.

ఉ. చంచువు దీటి పక్షములు జల్లున విచ్చి పదంబు లెత్తి కు
ప్పించి నభంబుపై కెగసి, భీషణ ఘోషణ వక్త్రుఁడై విజృం
భించి గరుత్సమీరమున భిన్నము లై తరులోలిఁ గూలఁగా
మించి బకాసురుం డొడిసి మ్రింగె సహిష్ణునిఁ జిన్ని కృష్ణునిన్. 445

* ఆ టక్కరి కొక్కెర ఒక్కసారిగా కృష్ణునివైపు కుప్పించి దూకింది. ముక్కు విదలించింది. రెక్కలు జల్లున విప్పి, పాదాలు పైకి ఎత్తి ఆకాశంలోనికి ఎగిరింది. భయంకరంగా కూతపెడుతూ విజృంభించింది. దాని రెక్కల గాలికి అక్కడిచెట్లు విరిగి కూలిపోగా - సరేచూద్దాం - అని ఓర్పు వహించిన కృష్ణుణ్ణి తన ముక్కుతో బకాసురుడు ఒడిసి పట్టి మ్రింగివేశాడు.

క. సంగడిలోకము లన్నియు, మ్రింగుచుఁ గ్రక్కుచును బయల మెలఁగించుచు ను
ప్పొంగెడు, వేడుకకాఁ డటు, మ్రింగుడువడె బకునిచేత మీఁ దెఱిఁగి నృపా! 446

* రాజా! ప్రక్క ప్రక్కనే ఉండే ఈ బ్రహ్మాండాల నన్నింటినీ తనలోనుండి పుట్టిస్తూ మళ్ళీ మ్రింగివేస్తూ, ఆడిస్తూ ఉండే క్రీడామయుడైన కృష్ణుడు బకాసురునిచేత మ్రింగుడు పడ్డాడు. అయితే అన్ని తెలిసే అలా మ్రింగుడు పడ్డాడు ఆ దొంగ కృష్ణుడు.

క. దనుజుఁడు మ్రింగినఁ గృష్ణునిఁ, గనలేక బలాది బాలకప్రముఖు లచే
తనులై వెఱఁ గందిరి చ, య్యనఁ బ్రాణము లేని యింద్రియంబుల భంగిన్. 447

* ఆ విధంగా రాక్షసుడు మ్రింగివేయగా బలరాముడు మొదలైన గోపాలబాలకులు కృష్ణుడు కనిపించకపోయేసరికి ప్రాణంలేని అవయవాలవలె అచేతనులై భయంతో కంపించి పోయినారు.

వ. ఇట్లు మ్రింగుడువడి లోనికిం జనక. 448

శా. కంఠోపాంతము దౌడలున్ మెఱముచుం గాలాగ్ని చందంబునం
గుంఠీభూతుఁడు గాక వేంద్రమగు నాగోపాలబాలున్ జయో
త్కంఠున్ బ్రహ్మగురున్ మహామహిముఁ జక్కన్ మ్రింగ రాదంచు ను
ల్లుంఠం బాడుచు వాఁడు గ్రక్కె వెడలన్ లోకంబశోకంబుగన్. 449

* ఈ విధంగా మ్రింగబడినా, కృష్ణుడు ఆ రాకాసికొంగ గొంతును దాటి లోపలికి పోలేదు. ఆ బకాసురుని కంఠం ముందుభాగమూ, దౌడలూ కాలాగ్నివలె మండిస్తూ విజృంభించాడు కృష్ణుడు. ఆ గోపాలబాలుడు నిప్పుముద్దలాగా బకాసురుని కంఠానికి అడ్డుపడ్డాడు. అతడు విజయం సాధించే ప్రయత్నంలో ఉన్నాడు. బ్రహ్మదేవు నంతటి వాడికి తండ్రి అతడు. మహామహిమ కలిగిన అతడు మ్రింగుడు పడడం లేదని నిందిస్తూ ఆ బకాసురుడు కృష్ణుణ్ణి మళ్ళీ బయటికి వెళ్లగ్రక్కాడు. అలా కృష్ణుడు బయటపడటం చూచి లోకం అంతా సంతోషించింది.

క. క్రక్కి మహాఘోషముతోఁ, జక్కఁగఁ దనుఁ బొడువరాఁగఁ జంచులు రెండున్
 స్రుక్కఁగఁ బట్టి తృణముక్రియ, గ్రక్కున హరి సీరె బకునిఁ గలహోత్సుకునిన్. 450

* అలా బయటికి క్రక్కివేసిన కృష్ణుణ్ణి ఆ కొక్కెరరక్కసి ముక్కుతో పొడిచి చంపాలని భీకరంగా అరుస్తూ నోరుతెరచి ముందుకు దూకాడు. కలహానికి కాలుత్రవ్వే ఆ కొంగముక్కు రెండు భాగాలనూ కృష్ణుడు రెండుచేతులతోనూ పట్టుకొని గడ్డిపరకను చీల్చినట్లు నిలువున చీల్చివేశాడు.

వ. అప్పు డా నందనందనునిమీఁద వేలుపులు చాలుపులుగా నందన మల్లికాది కుసుమవర్షంబులు హర్షంబునం గురియించిరి, దేవవాద్యంబులు మొరసె, రామాదిగోపకుమారులు ప్రాణంబులతోఁ గూడిన యింద్రియంబులునుం బోలెఁ గ్రమ్మఱఁ గృష్ణునిం గని రమ్మని కౌఁగిలించుకొని కృష్ణ సహితులయి లేఁగ దాఁటుల మరల దాఁటించుకొని మందగమనంబున మంద కరిగిరి, వారల చేత నా వృత్తాంతం బంతయు విని వెఱంగుపడి గోపగోపికాజనంబులు. 451

* అలా బకాసురుని చంపగానే కృష్ణునిపైన దేవతలు సంతోషంగా రకరకాల పూలవానలు కురిపించారు. ఆకాశంలో దుందుభిధ్వనులు వినిపించాయి. ప్రాణాలు రాగానే ఇంద్రియాలుకూడా ఎలా సచేతనము లవుతాయో అలాగే బలరాముడు మొదలైన గోపకుమారులందరూ బ్రతికామని సంతోషించారు. "బ్రతికి వచ్చావా కృష్ణా!"అంటూ అతణ్ణి కౌగిలించుకున్నారు. అందరూ కలసి మందలను మళ్ళించుకొని నెమ్మదిగా తమ ఇండ్ల వద్దకు చేరుకున్నారు. బకాసురవధను గురించిన కథ అంతా వారు చెప్పగా గోకులంలోని గోపగోపికా జనాలు విని నివ్వెర పోయారు.

క. ఆపదలమీఁద నాపద, లీ పాపనిఁ జెంది తొలఁగె, నీ యర్భకుపై
వే పడిన ఖలులు దహనుని, వైపున శలభముల పగిదిఁ బడిరి ధరిత్రిన్. 452

* "ఈ లేతపాపనికి ఆపదలపై ఆపదలు వచ్చినట్లే వచ్చి తొలగిపోయినాయి. పసివాడుగదా అని కృష్ణునిపై విజృంభించిన దుర్మార్గు లెవరైనా సరే, అగ్నిదేవునిలో పడిన మిడుతలలాగా భస్మమై పోతారు"అనుకున్నారు గోపకులు.

వ. అని పలికిరి, మఱియు నా రామకృష్ణులు క్రేపులం గాచుతఱి. 453

సీ. కపులమై జలరాశిఁ గట్టుదమా యని కట్టుదు రడ్డంబు గాలువలకు,
మునులమై తపములు మొనయుదమా యని మౌనులై యుందురు మాట లేక,
గంధర్వవరులమై గానవిద్యలు మీఱఁ బాడుదమా యని పాడఁజొత్తు,
రప్సరోజనులమై యాడుదమా యని యాఁడు రూపులఁ దాల్చి యాడఁ జనుదు,

ఆ. రమర దైత్యవరులమై యబ్ధిఁ ద్రత్తమా, యని సరోవరములయందు హస్త
దండచయముఁ ద్రిప్పి తరుతురు తమయీడు కొమరు లనుసరింపఁ గొమరు మిగుల. 454

* ఆ బలరామకృష్ణులూ గోపాలబాలురూ దూడలను కాచే సమయాలలో రకరకాల ఆటలు ఆడుకునేవారు. "మనమందరం కోతుల మట సముద్రానికి వారధి కట్టుదమా?" అంటూ కాలువలకు

అడ్డం కట్టుతూ ఉంటారు. "మనం మునులమట - తపస్సు చేసుకుందామా?"అంటూ కన్నులు మూసికొని మునులవలె మౌనంగా ఉండిపోతారు. "మనం గంధర్వశ్రేష్ఠుల మట - ఎవరు పాటలు పాడుతారో" అంటూ పాటలు పాడుతారు. "మనమందరం అప్సరసలమట నాట్యంచేద్దామా?" అంటూ ఆడువారి వేషాలు వేసుకొని నాట్యాలు చేస్తారు. "మేము దేవతలం, మీరు రాక్షసులట. సముద్రాన్ని మథించుదామా!" అంటూ చెరువులలో చేతులతో నీళ్ళు చిలుకుతారు. బలరామకృష్ణులు ఏ పని చేస్తే మిగిలిన గోపకులందరూ వారినే అనుసరించి ఆ పనిచేస్తారు. ఈ విధమైన ఆటపాటలతో వారందరూ అందరికీ ముద్దుగొలిపేటట్లు కన్నులవిందు చేస్తూ ఉండేవారు.

## -: శ్రీకృష్ణుఁడు గోపకులతో బంతి చల్దులు గుడువ వనమున కేగుట :-

వ. అంత నొక్కనాఁడు రామకృష్ణులు గాంతారంబున బంతి చలుదులు గుడువ నుద్యోగించి ప్రొద్దున లేచి, గ్రద్దనం దమ యింటి లేఁగకదుపులఁ గదలించి, సురంగంబులకు శృంగంబులు పూరించిన విని, మేలుకని, సంరంభంబున గోపడింభకులు చలిదికావడులు మూపుల వహించి, సజ్జంబులగు కజ్జంబులు గట్టికొని, పదత్రాణవేత్రదండధరులై, లెక్కలకు వెక్కసంబైన తమతమ క్రేపుకదుపులం జప్పుడించి రొప్పుకొనుచుఁ, గాననంబు సొచ్చి, కాంచనమణి పుంజగుంజాది భూషణభూషితు లయ్యును, ఫల కుసుమ కోరక పల్లవ వల్లరులు దొడవులుగా నిడుకొని, కొమ్ము లిమ్ముగఁ బూరించుచు వేణువు లూఁదుచుఁ, దుమ్మెదలం గూడి పాడుచు, మయూరంబుల తోడం గూడి యాడుచు, బింకంబులం గలసి కూయుచు, శుకంబులం జేరి రొదలు సేయుచుఁ, బులుఁగుల నీడలం బాఱుచు సరాళంబులగు వాఁగులు గడచుచు, మరాళంబుల చెంత నడచుచు, బకమ్ములం గని నిలుచుచు, సారసంబులంజోపి యలంచుచు, నదీజలంబులం దోఁగుచుఁ, దీవయుయ్యేలల నూఁగుచుఁ, బల్లంబులన్ డాఁగుచు, దూరంబుల కేగుచుఁ, గపుల సంగడిఁ దరువు లెక్కుచు, ఫలంబుల మెక్కుచు, రసంబులకుం జొక్కుచు, నింగికి నిక్కుచు, నీడలు సూచి నవ్వుచుఁ, గయ్యంబులకుం గాలు ద్రవ్వుచుఁ, జెలంగుచు, మెలంగుచు, వ్రాలుచు, సోలుచు బహుప్రకారంబుల శరీర వికారంబులు సేయుచు మఱియును. 455

* ఒకనాడు బలరామకృష్ణులూ గోపబాలురూ అందరూ కలిసి వనభోజనాలు చేయాలని సరదాపడ్డారు. ప్రొద్దుటే లేచి, గబగబా తమ యింటి లేగదూడలను బయటికి తోలుకొని వచ్చారు. అందమైన కొమ్ము బూరాలను పూరించి ఊదగానే మిగిలిన గోపకుమారు లందరూ మేల్కొన్నారు. చల్ది అన్నపు కావడులను భుజాలకు తగిలించుకున్నారు. తల్లులు సిద్ధంచేసి ఉంచిన రకరకాల పిండివంటలు మూటలు కట్టుకున్నారు. కాళ్ళకు చెప్పులు, చేతి కర్రలు ధరించారు. లెక్కపెట్టడానికి కూడా కష్ట మనిపించే తమతమ లేగల మందలను "హెహెయ్"అనే కేకలతో తోలుకుని బయలుదేరారు. పరుగులతో ఆయాసపడుతూ అడవిలో ప్రవేశించారు. బంగారు, మణిభూషణాలు ధరించి ఉన్నా, పూలను, చివుళ్ళను, చిన్నచిన్న పండ్లను అలంకారాలుగా ధరించారు. (కృత్రిమత్వంకన్నా, ప్రకృతికి దగ్గరగా ఉండడమే వారికి ఇష్టం). కొమ్ము బూరాలు పూరించుతూ, పిల్లనగ్రోవులు

ఊదుతూ, తుమ్మెదలతోబాటు ఝుమ్మనిపాడుతూ, నెమళ్ళతో సమానంగా నాట్యంచేస్తూ, కోకిలలను, మిగిలిన పక్షులను అనుకరించి కూతలు కూస్తూ, చిలుకలతోపాటు అరుస్తూ కేరింతలు కొట్టారు. పైన పక్షులు ఎగురుతూ ఉంటే వాటి నీడలతోపాటు తామూ పరుగులెత్తారు. జలజలపారే సెలయేళ్లను చెంగున దాటారు. హంసల ప్రక్కనే అనుకరిస్తూ నడిచారు. కొంగలతోపాటు ఒంటికాలిపై నిలబడ్డారు. బెగ్గురు పక్షులను తరిమి తరిమి అలసిపోగొట్టారు. నదీ జలాలలో స్నానాలు చేశారు. తీగెల ఊయెలలు ఊగారు. గోతులలో దాక్కున్నారు. దూరాలకు పరుగు పందాలు వేసుకున్నారు. కోతులతో చెట్లు ఎక్కారు. పండ్లు తిని, ఆ రుచులకు పరవశించిపోయారు. కుప్పించి దూకి, తమనీడలను చూచి నవ్వుకున్నారు. ఒకరితో ఒకరు పోట్లాడుకున్నారు. కేరింతలు కొడుతూ, పరుగెడుతూ, పడుకుంటూ, అలసిపోతూ- ఇలా ఎన్నో రకాలుగా ఆటలు ఆడుకున్నారు.

**క. ఒకనొకని చల్దికావడి, నొకఁ డొకఁ డడకించి దాఁచు, నొకఁ డొకఁ డది వే**
**ఱొకఁ డొకని మొఱఁగి కొని చన, నొకఁ డొకఁ డది దెచ్చి యిచ్చు నుర్వీనాథా! 456**

* ఒకని చల్దికావడిని మరొకడు బెదిరించి లాక్కుని దాచివేశాడు. వాడిని మోసగించి ఇంకొకడు తీసుకుని వెళ్లిపోతే, వేరొకడు ఆ కావడిని తెచ్చి మొదటివాడికి ఇచ్చాడు.

**క. ఒక్కఁడు ము న్నే మఱి చన, నొక్కఁడు బలుబొబ్బ వెట్టి నులికిపడన్, వే**
**ఱొక్కఁడు మిట్టి తటాలున, నొక్కని కనుదోయి మూయు నొక్కఁడు నగఁగన్. 457**

* ఒకడు పరధ్యానంగా నడుస్తూ ఉంటే మరొకడు వెనుకనుండి వచ్చి పొలికేక పెట్టి జడిపించాడు. ఇంకొకచోట ఒకడు ఇంకొకని కన్నులు వెనకనుండి మూస్తే, మరొకడు అది చూచి నవ్వుతున్నాడు.

**క. తీపుగల కజ్జ మన్యుఁడు, గోపింపఁగ నొడిసి పుచ్చుకొని త్రోపాడం**
**బైపడి యది గొని యొక్కఁడు, క్రేపులలో నిట్టునట్టుఁ గికురించు నృపా! 458**

* తీయని పిండివంట ఒకడి చేతిలోనుండి మరొకడు లాక్కుని పారిపోతూ ఉంటే, ఇంకొకడు అది లాక్కుని పోయి, దూడల మధ్య అటూ యిటూ పరుగెత్తుతూ, అందకుండా ఏడిపించాడు. పిండివంట పోగొట్టుకున్న వాడికి కోపం వచ్చింది.

**క. వనజాక్షుఁడు ము న్నరిగిన, 'మునుపడఁగా నతని నేనె ముట్టెద' ననుచుం**
**జని మును ముట్టనివానిన్, మును ముట్టినవాఁడు నవ్వు మొనసి నరేంద్రా! 459**

* కృష్ణుడు దూరంగా నడుస్తూ నడుస్తూ ఉంటే ఇద్దరు బాలకులు "కృష్ణుణ్ణి ఎవరు ముట్టు కుంటారో"అని పరుగులెత్తారు. ముందు ముట్టుకో గలిగినవాడు ముట్టుకోలేనివాణ్ణి చూసి పకపక నవ్వాడు.

**వ. ఇ వ్విధంబున. 460**

**ఉ. ఎన్నఁడునైన యోగివిభు లెవ్వని పాదపరాగ మింతయుం**
**గన్నులఁ గానరట్టి హరిఁ గౌఁగిటఁ జేర్చుచుఁ జెట్టఁబట్టుచుం**

దన్నుచుఁ గ్రుద్దుచున్ నగుచుఁ దద్దయుఁ బైపడి కూడి యాడుచున్
మన్నన సేయు వల్లవకుమారుల భాగ్యము లింత యొప్పునే? 461

* "మహారాజు! మహాయోగులు కూడా ఏ పరమ పురుషుని పాదపద్మాల ధూళి కొంచెంకూడా చూడనుకూడా చూడలేరో అటువంటి కృష్ణునితో గోపబాలకులు కలసి మెలసి ఆడుకున్నారు. అతన్ని కౌగిలించుకుంటూ, అతనితో చెట్టపట్టాలు పట్టుకుంటూ, తన్నుతూ, గ్రుద్దుతూ, హాస్యాలాడుతూ మీదపడుతూ కలసి ఆడుకుంటూ ప్రేమిస్తున్నారు. ఈ గోపబాలకుల భాగ్యం ఎంతటిదని చెప్పవచ్చు?

క. విందులకును బ్రహ్మసుఖా, నందం బై భక్తగణమునకు దైవత మై
మందులకు బాలుఁడగు హరి, పొందుఁ గనిరి గొల్ల! లిట్టి పుణ్యులు గలరే? 462

* యోగులకు బ్రహ్మానంద స్వరూపుడూ, భక్తులకు ఆరాధ్యదైవ మైనవాడూ అయిన ఆ భగవంతుడు అజ్ఞానులకు బాలునివలె కనిపిస్తున్నాడు. ఆయన ఎవరు ఏవిధంగా భావిస్తే ఆ విధంగా అనుగ్రహించేవాడు. అటువంటి కృష్ణుని సాన్నిధ్యాన్ని పొందినవారు గోపాలకులు! ఆహా! ఇలాంటి పుణ్యాత్ములు ఎక్కడైనా ఉన్నారా.''

వ. అని పలికి శుకయోగీంద్రుండు మఱియు ని ట్లనియె. 463

* ఈ విధంగా చెప్పి శుకయోగీంద్రుడు పరీక్షిన్మహారాజుతో ఇంకా ఇలా అన్నాడు.

క. అమరు లమృతపానంబున, నమరినవా రయ్యు నే నిశాటుని పంచ
త్వమునకు నెదుళ్ళు సూతురు, తము నమ్మక యట్టి యఘుఁడు దర్పోద్ధతుఁడై. 464

క. బకునికిఁ దమ్ముఁడు గావున, బకమరణము దెలిసి కంసుపంపున గోపా
లక బాలురతోఁగూడను, బకవై రినిఁ ద్రుంతు ననుచుఁ బటురోషమునన్. 465

* ఇలా ఉండగా కొంతకాలానికి అఘాసురుడు అనే వాడు బయలుదేరాడు. దేవతల అమృతం త్రాగి మరణం లేనివారైనా ఈ అఘాసురునిపేరు చెబితే ధైర్యం పోగొట్టుకొంటారు. అఘాసురుడు ఎప్పుడు మరణిస్తాడా అని వారు ఎదురుచూస్తూ ఉంటారు. వాడు బకాసురుని తమ్ముడు. తన అన్నను చంపినవాడిని తోడి బాలకులతో సహా చంపుతానని గర్వంతోనూ, రోషంతోనూ రెచ్చిపోయి బయల్దేరాడు. అతడుకూడా కంసుని సేవకుడే. కంసుని ఆజ్ఞానుసారమే అతడూ బయలుదేరాడు.

క. 'బాలురు ప్రాణంబులు గో, పాలురకు, మదగ్రజాతు ప్రాణము మా ఱీ
బాలురఁ జంపిన నంతియు, చాలును, గోపాలురెల్ల సమసినవారల్. 466

* వాడు తనలో ఇలా అనుకున్నాడు. "గోపాలకులకు ప్రాణాలు ఈ బాలురు ఇద్దరే. మా అన్న బకాసురుని ప్రాణానికి బదులుగా ఈ ఇద్దరు బాలురనూ చంపితే చాలు, గోపాలకు లందరూ చచ్చిపోయినట్లే!''

వ. అని నిశ్చయించి, యోజనంబు నిడుపును, మహాపర్వతంబు పొడవును, గొండతుదల మీఱిన కోఱలును, మిన్ను దన్ని పన్నిన నల్లమొగిళ్ళ పెల్లుగల పెదవులును, బిలంబులకు నగ్గలం బైన యి గుళ్ళ సందులును, నంధకారబంధురంబైన వదనాంతరాళంబును, దావానల జ్వాలాభీలంబైన దృష్టి జాలంబును వేఁడిమికి నివాసంబులైన యుచ్ఛ్వాస నిశ్వాసంబులును మెఱయ, నేల నాలుకలు పఱచుకొని ఘోరంబగు నజగరాకారంబున. 467

* ఈ విధంగా నిశ్చయించుకున్న అఘాసురుడు ఘోరమైన కొండచిలువ రూపం ధరించాడు. ఆ కొండచిలువ యోజనము వెడల్పున, మహాపర్వత మంత పొడవున ఉన్నది. దానికోరలు పర్వతశిఖరాలను మించిపోయి ఉన్నాయి. నల్లని మేఘాలవంటి పెదవులు తెరచి ఉండగా, పై పెదవి ఆకాశాన్ని తన్ను తున్న ట్లుంది. పర్వత గుహలవలె ఉన్న కోరల మధ్యనున్న సందులతో అంధకార బంధురమైన నోటితో భయంకరంగా ఉన్నది. దాని చూపులనుండి అగ్నిజ్వాలలు వెలువడుతూ ఉన్నాయి. దాని ఉచ్ఛ్వాస నిశ్వాసములు భరించలేనంత వేడిగా, నిప్పులు కురుస్తూ ఉన్నాయి. నాలుకలు కదలిస్తూ నేలపైన పరచుకుని పడుకుని ఉన్నది ఆ రాకాసి కొండచిలువ.

క. జాపిరము లేక యిప్పుడు, గ్రేపుల గోపాలసుతులఁ గృష్ణునితోడన్
గీపెట్టఁగ మ్రింగెద నని, పాపపు రక్కసుఁడు త్రోవఁ బడి యుండె నృపా! 468

* "కృష్ణునితోపాటు గోపబాలురనూ ఆ దూడలనూ కూడా కలిపి ఇప్పటి కిప్పుడే మింగేస్తాను. వాళ్ళు గిల గిల లాడుతూ కొట్టుకోవాలి" అనుకుంటూ ఆ పాపిష్ఠి రాక్షసుడు దారిలో అలా నోరుతెరచి పడుకొని ఉండి పోయాడు.

వ. ఆ సమయంబున. 469

మ. 'ఒక వన్యాజగరేంద్ర మల్లదె గిరీంద్రోత్సేధ మై దావ పా
వక కీలా పరుష ప్రచండతర నిశ్వాసంబుతో ఘోర వ
హ్ని కరాళాతత జిహ్వతోడ మనలన్ హింసింప నీక్షించుచున్
వికటంబై పడిసాఁగి యున్నది పురోవీథిం గనుంగొంటిరే? 470

వ. అని యొండొరులకుం జూపుచు. 471

* గోపబాలురు ఆ దారిన వస్తూ ఆ కొండచిలువను చూచారు. "అదిగో! ఒక అడవికొండచిలువ పర్వతమంత శరీరంతో పడుకొని ఉన్నది చూచారా? అగ్నిజ్వాలలతో తీక్ష్ణమైన భయంకరమైన బుసలు కొడుతూ ఉన్నదిరా! ఆ చాచిన నాలుకలనుండికూడా దారుణమైన అగ్నిజ్వాలలు రేగుతున్నాయి చూచారా? మనలను చంపడానికి ఎదురుచూస్తూ మన ఎదుట దారిమధ్యలో భయంకరంగా పడుకొనిఉంది" అని ఒకరి కొకరు చూపించుకున్నారు.

మ. బకునిం జంపిన కృష్ణుఁ డుండ మనకుం బాముంచుఁ జింతింప నే
టికి? రా పోదము దాఁటి, కాక యది కౌటిల్యంబుతో మ్రింగుడున్
బకువెంటం జనుఁ గృష్ణుచేత' ననుచుం బద్మాక్షు నీక్షించి యు
త్సుకు లై చేతులు వ్రేసికొంచు నగుచున్ దుర్వారులై పోవఁగన్. 472

* కాని ఎవరూ భయపడలేదు. "బకాసురుని చంపిన కృష్ణుడు ఉండగా మనకు ఈ పాములంటే భయమేమిటి? రండ్రా దాటిపోదాము! కాదు వంకరబుద్ధితో మనల నది మ్రింగితే బకాసురుని మాదిరిగానే అదీ కచ్చితంగా చచ్చిపోతుంది!'' అనుకుంటూ కృష్ణునికేసి చూస్తూ గోపబాలకు లందరూ చేతులు పట్టుకుని నవ్వుకుంటూ ముందుకు సాగి పోయారు. వారిని వారించడం ఎవరికీ సాధ్యం కాదనిపించింది.

వ. వారలం జూచి హరి దన మనంబున. 473

ఉ. 'అర్భకు లెల్లఁ బాము దివిజాంతకుఁ డౌట యెఱుంగ, రక్కటా!
నిర్భయులై యెదుర్కొనిరి నేఁ గల నంచు విమూఢు లంచు నా
విర్భవదాగ్రహత్వమున వెన్తగులం దమలేఁగ పిండుతో
దుర్భర ఘోర సర్పఘన తుండ బిలాంతముఁ జొచ్చి రందఱున్. 474

* అప్పుడు కృష్ణుడిలా అనుకున్నాడు. "అయ్యో ! అర్భకులందరూ ఇది మామూలు పాము కాదనీ మహారాక్షసుడనీ తెలుసుకోలేదు. నేనున్నాననే మొండి ధైర్యంతో నిర్భయంగా దానిని ఎదుర్కొంటున్నారు.''

కృష్ణునికి వెంటనే రాక్షసునిపై కోపం వచ్చింది. అతడు కూడా వారి వెనుకనే పాము నోటిలో ప్రవేశించాడు. బాలకు లందరూ తమ తమ లేఁగల గుంపులతో సహా భయంకరమైన ఆ చిలువ నోటిలో ప్రవేశించారు.

వ. అ య్యవసరంబున. 475

శా. వేల్పుల్ సూచి భయంబు నొంద గ్రసనావేశంబుతో నుజ్జ్వల
త్కల్పాంతోజ్జ్వలమాన జిహ్వ దహనాకారంబుతో మ్రింగె న
స్వల్పాహీంద్రము మాధవార్పిత మనోవ్యాపార సంచారులన్
స్వల్పాకారుల శిక్యభారులఁ గుమారాభీరులన్ ధీరులన్. 476

* అప్పుడు అఘాసురుడు వారందరినీ మ్రింగివేసే ఆవేశంతో నోరు ఒక్కసారిగా అప్పళించాడు. ప్రళయ కాలంలో భగ్గున జ్వలించే భయంకర జ్వాలలవలె మంటలు మండుతున్న తననాలుకలతో వారి నందరినీ నోటిలోనికి లాక్కుని మ్రింగివేశాడు. దేవతలందరూ ఆ మహాసర్పం వారిని మ్రింగివేయడం చూచి భయపడి పోయారు. ఆ గోపబాలకుల మనస్సులన్నీ ఎప్పుడూ కృష్ణుని చుట్టునే తిరుగుతూ ఉంటాయి. వారు శారీరకంగా బలవంతులు కారు, చిన్న పిల్లలు. తాము మోస్తున్న చిక్కములు కూడా వారికి బరువే! అయితే ఆ గోపకుమారులు కృష్ణునికి తమను తాము సమర్పించుకున్నారు. కనుక చాలా ధైర్యవంతులుగా ఉన్నారు.

వ. ఇట్లు పెనుఁబాముచేత మ్రింగుడుపడు సంగడికాండ్రగమిం జూచి కృష్ణుండు. 477

చ. 'పడుచులు లేఁగలుం గలసి పై కొని వత్తురు తొల్లి కృష్ణ! మా
కొడుకు లదేల రా?' రనుచు గోపిక లెల్లను బల్కనేక్రియన్
నొడివెద? నేఁడు పన్నగము నోరికి వీరికి నొక్కలంకెగా
నొడఁబడ నేలచేసె? విధి యోడక సేయుఁగదయ్య క్రౌర్యముల్! 478

* ఈ విధంగా ఆ భయంకర సర్పంచేత మ్రింగబడుతూ ఉన్న తన మిత్రులందరినీ చూచి కృష్ణుడు తనలో తాను ఇలా అనుకున్నాడు.

నేను ఇంటికి వెళ్ళేసరికి గోపికలు ఎదురువస్తారు. "ఇంతవరకూ మా పిల్లలూ, లేగదూడలూ కలసి పరుగెత్తుకుంటూ ఇంటికి వచ్చేవారు. కృష్ణా! ఈ నాడు మా కొడుకులు రారేమి? ఏమయినారు?" అని అడుగుతారు. వారికి నేనేమని జవాబు చెప్పగలను? ఈ నాడు వీరిని లంకె తగిలించినట్లు పామునోటికి అప్పగించాడు బ్రహ్మదేవుడు. ఈ విధి ఎప్పుడూ ఇలాంటి క్రూరకృత్యాలే చేస్తాడేమి?"

వ. అని తలపోసి, నిఖిలలోచనుండును, నిజాశ్రితనిగ్రహ మోచనుండును నైన తమ్మికంటి, మింటితెరువరులు మొఱలిడ రక్కసు లుక్కుమిగుల వెక్కసంబగు నజగరంబయి యున్న యన్నర భోజను కుత్తుకకుఁ బొత్తుగొని మొత్తంబు వెంటనంటం జని తమ్ము నందఱఁ జిందఱవందఱ సేసి మ్రింగ నగ్గలించు నజగరంబు కంఠద్వారంబున సమీరంబు వెడలకుండఁ దన శరీరంబు వెంచి గ్రద్దన మిద్దె సఱచి నట్లుండ. 479

* కృష్ణుడు సర్వమూ చూడగలవాడు. అందరి చూపూ తానే అయిన వాడు. తనను ఆశ్రయించిన వారి కష్టాలను తొలగించేవాడు. తామరరేకుల వంటి కన్నులు గలవాడు. ఆ రాక్షసు డా మహాభయంకరుడు దేవతలు కూడా అతడు చేసిన పనికి భయపడి మొరపెట్టుకుంటున్నారు. రాక్షసులందరూ గర్వంతో మిడిసి పడసాగారు. అటువంటి ఈ రాక్షసుడు కొండచిలువ రూపంతో బాలకులను లేగదూడలను మ్రింగుతూ ఉంటే కృష్ణుడు కూడా వారి వెనుకనే లోపలికి ప్రవేశించాడు. ఆ కొండచిలువ నాలుకలతో అందరినీ చిందర వందరచేసి కొద్దికొద్దిగా మ్రింగడానికి ప్రయత్నించుతూ ఉంటే కృష్ణుడు కంఠద్వారం దగ్గరచేరి, తన శరీరాన్ని విపరీతంగా పెంచి, దిమ్మెసకొట్టినట్లు అక్కడ ఉండిపోయాడు. ఇక పాముకు ఊపిరివెళ్ళే దారిలేదు.

క. ఊపిరి వెడలక కడుపున, వా పొదవినఁ బాము ప్రాణవాతంబులు సం
తాపించి శిరము వ్రక్కలు, వాపికొనుచు వెడలి చనియెఁ బటు ఘోషముతోన్. 480

* ఆ పాముకు ఊపిరి ఆడలేదు. లోపల చేరిన గాలి బయటికి వెళ్ళక కడుపు ఉబ్బసాగింది. ప్రాణ వాయువులు లోపల తుకతుక లాడిపోయినాయి. అవి వ్యాకోచించి చివరకు పాము తలను ప్రక్కభాగాలను బ్రద్దలు కొట్టుకుంటూ బయటికి వచ్చేశాయి. అలా శరీరం బ్రద్దలై ప్రాణవాయువులు బయటికి వస్తున్నప్పుడు పెద్దశబ్దం వెలువడింది.

శా. క్రూరవ్యాళ విశాల కుక్షిగతులన్ గోవత్ససంఘంబుతోఁ
గారుణ్యామృతవృష్టిచేత బ్రదుకంగాఁ జూచి వత్సంబులున్
వారుం దాను దదాస్యవీథి మగుడన్ వచ్చెన్ ఘనోన్ముక్తుఁడై
తారానీకముతోడ నొప్పెసఁగు నా తారేశుచందంబునన్. 481

* క్రూరసర్పం కడుపులో దూరిపోయిన గోపబాలకులను లేగ దూడలతోసహా కృష్ణుడు తన కరుణ అనే అమృత వర్షంతో బ్రతికించాడు. ఆ పాము నోటిలోనుంచి తాను, తనతోపాటు గోపబాలురు, లేగదూడలు కూడా బయటికి వస్తూ ఉంటే, ఆవరించిన మేఘాలు విరిసి పోగానే చంద్రుడు నక్షత్రాలతో బయటపడినట్లుగా ఉన్నది.

ఆ. అమరవరులకొఱకుఁ గమలజాండం బెల్ల, బలిఁ దిరస్కరించి బలియు వడుగు
గోపసుతులకొఱకుఁ బాపపుఁ బెనుఁబాము, గళము దూఁటుగట్ట బలియకున్నె! 482

* స్వార్థపరులై దేవతలకోసమై మంచివాడైన బలిచక్రవర్తిని ధిక్కరించి, బ్రహ్మాండమంతా ఆక్రమించిన వామనమూర్తి గదా విష్ణువు! అమాయకులైన గోపబాలకులకోసం పాపిష్ఠి పాముగొంతుక బ్రద్దలై పగిలి పోయేటట్లు మేను పెంచి వ్యాపించడంలో ఆశ్చర్యమేముంది?

ఉ. ఆ పెనుఁబాము మేన నొక యద్భుతమైన వెలుంగు దిక్తటో
ద్దీపకమై వడిన్ వెడలి దేవపథంబునఁ దేజరిల్లుచుం
గ్రేపులు బాలురున్ బెదరఁ గృష్ణునిదేహము వచ్చి చొచ్చె నా
పాపఁడు సోచ్చి ప్రాణములఁ బాపిన యంతన శుద్ధ సత్త్వమై. 483

* అప్పుడు ఆ మహాసర్పం శరీరం నుండి దిక్కులు వెలిగిపోయే అద్భుతమైన వెలుగు వేగంగా వెలువడి ఆకాశంలో వెలుగుతూ వచ్చి కృష్ణుని శరీరంలో ప్రవేశించింది. అది చూచిన గోపబాలురు లేగలతో పాటు బెదరిపోయారు. అంతటి పాపిష్ఠి పామూ కృష్ణుని స్పర్శతో ప్రాణం విడవగానే శుద్ధసత్త్వమయం అయిపోయింది.

క. తన రూ పొక మా ఱైనను, మనమున నిడికొనినఁ బాపమయు నైనను లోఁ
గొని చను హరి దను మ్రింగిన, దనుజునిఁ గొనిపోవకున్నె తన లోపలికిన్? 484

* శ్రీహరి రూపాన్ని ఒక్కమారైనా మనస్సులో నిల్పుకుంటే ఎంతటి పాపాత్ముడినైనా శ్రీహరి తనలోనికి స్వీకరిస్తాడు. అటువంటి తననే మ్రింగిన రాక్షసుని తనలోనికి స్వీకరించడంలో ఆశ్చర్య మేమున్నది?

వ. తదవసరంబున,సురలు గుసుమవర్షంబులు గురియించిరి, రంభాదు లాడిరి, గంధర్వాదులు పాడిరి, మేఘంబులు మృదంగంబుల భంగి ఘోషించె, సిద్ధగణంబులు 'జయజయ' భాషణంబులు భాషించి రంత. 485

* అప్పుడు దేవతలు పూలవర్షం కురిపించారు. రంభ మొదలైన అప్సరసలు నాట్యం చేశారు. గంధర్వులు గానంచేశారు; మేఘాలు మృదంగాలవలె ధ్వనించాయి. సిద్ధులు కృష్ణునికి జయజయధ్వానాలు పలికారు.

**శా. ఆ వాద్యంబులు, నా మహాజయరవం, బా పాట లాయాటలుం**
**దేవజ్యేష్ఠుఁడు పద్మజుండు విని ప్రీతిన్ భూమి కేతెంచి నేఁ**
**డీ వత్సార్భకులన్ భుజంగపతి హింసింపంగ నీ బాలకుం**
**డేవెంటన్ బ్రదికించె? మే, లనుచు నూహించెం గడున్ నివ్వెఱన్. 486**

* దేవతలందరికీ పెద్దవాడైన బ్రహ్మదేవుడు ఆ జయ జయ ధ్వానాలూ, ఆ వాద్యాలూ, పాటలూ విని, ఏదో లోకకల్యాణం జరిగినదని సంతోషంతో భూలోకానికి వచ్చాడు. "ఇంతటి మహాసర్పం లేగలను, బాలకులను చంపడానికి ప్రయత్నిస్తే, ఈ కుర్రవాడు వారి నెలా బ్రతికించాడో! ఆశ్చర్యంగా ఉందే!"అని నివ్వెరపోయాడు.

**వ. అంత న య్యజగరచర్మంబు గొన్ని దివసంబుల కెండి పెద్ద కాలంబు గోపాలబాలురకుం గేళిబిలంబై యుండె, నిట్లు కౌమార విహారంబున నైదవయేఁటఁ గృష్ణుం డఘాసురునిం దెగఁ జూచుటయుఁ దమ్ముం గాచుటయు, నాఱవ యేఁటిదైన పౌగండవృత్తాంతం బని చిత్తంబులం గోపకుమారులు దలంచు చుందు రని చెప్పిన నప్పుడమితేఁ డప్పరమయోగీంద్రున కిట్లనియె. 487**

* ఆ కొండచిలువ చర్మం కొన్నాళ్ళకు ఎండిపోయి, చాలకాలం పాటు గోపబాలురకు ఆటలాడుకొనే గుహలాగా పనికి వచ్చింది. ఈ విధంగా కృష్ణుడు కౌమారవయస్సులో అంటే ఐదవయేట అఘాసురుని సంహరించాడు. అయితే ఈ సన్నివేశం పౌగండ వయస్సులో అంటే ఆరుసంవత్సరాల వయస్సులో జరిగిందని గోపబాలకులు అనుకొన్నారు." ఇలా శుకయోగి చెప్పగానే పరీక్షిత్తు ఇలా అన్నాడు.

**సీ. 'అయిదేండ్లు కౌమార, మటమీఁద నై దేండ్లు పౌగండ మనియెడు ప్రాయ మందు,**
**నయిదేండ్ల వాఁడైన యబ్జాక్షుచరితంబు పౌగండ మని గోపబాలు రెల్లఁ**
**దలఁతు రంటివె? యెట్లు దలఁతురు వారలు? నిరుడు సేసినపని నేఁటి దనఁగ**
**వచ్చునే? యిదినాకు వరుసతో నెఱిఁగింపు' మనవుడు యతిచంద్రుఁడైన శుకుఁడు**

**ఆ. యోగదృష్టిఁ జూచి యొక్కింత భావించి 'వినుము రాజవర్య! వినయధుర్య!**
**పరమగుహ్య మనుచుఁ బల్కుదు రార్యులు, శిష్యజనుల కీవు సేయు తలఁపు. 488**

* "మహర్షి! మొదటి ఐదేళ్ళ వయస్సును కౌమారము అంటారు. తరువాతి ఐదేళ్ళను పౌగండమని అంటారు. ఐదేళ్ళవాడైన కృష్ణునికథ పౌగండములో జరిగినకథ అని గోపబాలురు తలచుకుంటూ ఉన్నారని చెప్పావు. అదెలా సంభవం? వాళ్ళు అలా ఎలా అనుకోగలరు? నిరుడు చేసిన పని ఈ నాటిది అనుకోవడం ఎవరికైనా ఎలా సాధ్యం? ఇదేదో నాకు విపులంగా చెప్పు." ఇలా పరీక్షిత్తు అడుగగానే శుకయోగి యోగదృష్టితో

చూచి, కొంచెంసేపు ఆలోచించాడు. "మహారాజా! నీవు వినయంగా వేసే ప్రశ్నలు ముందు ముందు రాబోయే శిష్యులందరికీ ఎంతో మేలు చేకూరుస్తాయి. నీ తలపు పరమ రహస్యమైనదని పెద్దలు భావిస్తారు.

**క. ప్రియురాలివలని వార్తలు, ప్రియజనులకు నెల్లప్రొద్దుఁ బ్రియ మగు భంగిన్**
**బ్రియుఁడగు హరిచరితంబులు, ప్రియభక్తుల కెల్లయెడలఁ బ్రియములు గావే! 489**

* ప్రియురాలిని గురించిన వార్తలు ఎప్పుడు చెప్పినా ప్రియులకు చాలా ఇష్టంగా ఉంటాయి. ప్రియునికథలు ప్రియురాలికికూడ అంతేకదా! జీవులు అందరూ ప్రియురాళ్ళు. అయితే భగవంతుడు వారికి ప్రియుడైనవాడు. అతని కథలు ప్రియభక్తులకైతే మరీ ప్రియమైనవిగదా!"

**వ. అని పలికి యోగీంద్రుండు రాజేంద్రున కిట్లనియె. న ట్లఘాసురు మొగంబు వలనం గడ చనిన లేఁగల గోపకుమారులన్ బ్రదికించి వారును దానునుం జని చని. 490**

* ఈ విధంగా పలికి శుకయోగి పరీక్షిత్తుతో ఇలా అన్నాడు. "అలా కృష్ణుడు చనిపోయారనుకున్న లేగలను, గోపకుమారులను అఘాసురుని బారినుంచి బ్రతికించాడు. వారితో పాటు తానుకూడ ముందుకు సాగిపోయాడు.

**మ. కనియెం గృష్ణుఁడు సాధునీరము మహాగంభీరముం బద్మ కో**
**కనదాస్వాద వినోద మోదమదభృంగ ద్వంద్వ ఝంకారమున్**
**ఘనకల్లోల లతావితాన విహరత్కాదంబ కోలాహల**
**స్వనవిస్ఫారము మందవాయుజకణాసారంబుఁ గాసారమున్. 491**

* అలా వెళ్లిన కృష్ణుడు ఒక కొలనును చూచాడు. అది స్వచ్ఛమైన నీటితో నిండి ఉన్నది. ఎంతో లోతైనది. పద్మాలు, ఎఱ్ఱకలువలు ఆ చెరువులో వికసించి ఉండగా, వాటి సుగంధాలకు ఆనందించి మదించిన తుమ్మెదల జంటలు ఝుంకారం చేస్తూ ఆ పూవులపైననే తిరుగుతున్నాయి. ఆ కొలనిలో నీటి అలల మధ్యగా హంసలు ఈదులాడుతూ కోలాహలం చేస్తూ ఉంటే ఆ ధ్వని చెవుల పండువుగా వినవస్తూ ఉంది. చల్లని పిల్లగాలికి నీటి తుంపురులు ఎగురుతూ కొలనినిండా వ్యాపించి కనిపిస్తున్నాయి.

## -: గోపాలబాలురు కృష్ణునితోఁ గూడి చల్దు లారగించుట :-

**వ. కని తమ్మికంటి తమ్ముల యింటి సొబగునకు నిచ్చ మెచ్చుచుఁ జెచ్చెర గాలి నోలిం గదలెడు కరళ్లతుంపురుల జల్లు పెల్లున నొడళ్లు గగురుపొడువఁ గొలంకుఁ గెలంకులఁ గాయపండుల గొలల వ్రేఁగున వీఁగి పట్టు గల చెట్టుఁదుటుము నీడల నొప్పుచున్న యిసుక తిప్పల విప్పు సూచి వేడుక పిచ్చలింప నెచ్చెలుల కిట్లనియె. 492**

* ఆ కొలనును చూచిన కృష్ణుడు తామరపూలతో నిండిన దాని అందానికి చాలా ఆనందించాడు. చెరువులోని నీరు గాలికి కెరటాలుగా లేచి మరోదిక్కునుండి వచ్చిన మరో గాలితెరకు చెదరిపోయింది నీటి తుంపురులు ఆ గాలితెరతో పాటు వచ్చి జల్లులాగా తాకగానే ఒళ్ళు గగుర్పొడుస్తున్నది. ఆ కొలను ఒడ్డున

ఎన్నో ఫలవృక్షా లున్నాయి. కాయలు పండ్లు గుత్తులు గుత్తులుగా వ్రేలాడుతూ ఉంటే ఆ చెట్లు ఆ బరువుకు ఊగిపోతున్నా, బలంగానే నిలబడి ఉన్నాయి. అలాంటి చెట్ల గుంపుల నీడలలో విశాలమైన ఇసుక తిన్నెలను చూడగానే కృష్ణునిలో ఉత్సాహం చెలరేగింది. అతడు స్నేహితులతో ఇలా అన్నాడు.

**శా. "ఎండన్ ద్రుగ్గితి రాఁకటం బడితి రిం కేలా విలంబింపఁగా**
**రం డో బాలకులార! చల్ది గుడువన్ రమ్యస్థలం బిక్క డీ**
**దండన్ లేఁగలు నీరు ద్రావి యిర వందం బచ్చికల్ మేయుచుం**
**దండం బై విహరించుచుండఁగ నమందప్రీతి భక్షింతమే! 493**

* "మిత్రులారా! ఇప్పటికే ఎండలో డ్రుగ్గిపోయారు; ఆకలితో నక నకలాడుతున్నారు. ఇంకా ఆలస్యం దేనికి? చల్దులు తినడానికి అనువైన అందమైన చోటు ఇది. లేగదూడల మందలు ఈ కొలనిలో నీరు త్రాగి, ఈ ప్రక్కనే ఉన్న పచ్చిక బయళ్ళలో స్వేచ్ఛగా మేస్తూ విహరిస్తూ ఉంటాయి. మనం హాయిగా చల్దులు ఆరగించుదామా?"

**వ. అనిన "నగుఁగాక"యని వత్సంబుల నుత్సాహంబున నిర్మలంబులగు జలంబులు ద్రావించి, పచ్చికల మొల్లంబులు గల పల్లంబుల నిలిపి చొక్కంబులగు చల్దుల చిక్కంబులు సక్కడించి. 494**

* కృష్ణుడిలా అనగానే గోపబాలకు లందరూ "అలాగే" అన్నారు. లేగదూడలకు నిర్మలమైన నీటిని త్రాగించి, చిక్కని పచ్చిక బయళ్ళలో మేతకు వదలిపెట్టారు. నోరూరించే చల్దులును చిక్కములనుంచి బయటికి తీశారు.

**మ. జలజాంతస్స్థితకర్ణికం దిరిగిరా సంఘంబులై యున్న తే**
**కుల చందంబునఁ గృష్ణునిం దిరిగిరాఁ గూర్చుండి వీక్షించుచున్**
**శిలలుం బల్లవముల్ దృణంబులు లతల్ చిక్కంబులున్ బువ్వు లా**
**కులు కంచంబులుగా భుజించి రచటన్ గోపార్భకుల్ భూవరా! 495**

* తామరపువ్వులో మధ్యఉన్న కర్ణికచుట్టూ వరుసలు వరుసలుగా రేకులు పరుచుకుని ఉంటాయి. అలాగే కృష్ణుడు కర్ణికలాగా మధ్యన కూర్చుని ఉండగా గోపబాలు రందరూ చుట్టూ రేకుల్లాగా సర్దుకుని కూర్చున్నారు. అందరూ కృష్ణుణ్ణే చూస్తున్నారు. వారికి కంచాలు అంటూ వేరే ఏమీ లేవు. విశాలమైన రాతి పలకులు, లేత తామర ఆకులు; వెడల్పైన గడ్డిపోచలతోను, తీగెలతోను, పొడుగాటి పొన్నపూలవంటి పూవులతోను అల్లిన చదరలు; తోడ తెచ్చుకున్న చిక్కాలు; చెట్లు ఆకులు - వీటినే కంచాలుగా ఉపయోగించు కొని గోపాలబాలకులు చక్కగా చల్దులు ఆరగించారు.

**సీ. మాటిమాటికి వ్రేలు మడిచి యూరించుచు నూరుఁగాయలు దినుచుండు నొక్కఁ,**
**డొకని కంచములోని దొడిసి చయ్యన మ్రింగి "చూడు లే" దని నోరు సూపు నొక్కఁ,**

డేగు రార్గుర చల్ది లెలిమిఁ బన్నిద మాడి కూర్కొని కూర్కొని కుడుచు నొక్కఁ
డిన్ని యుండఁగఁ బంచి యిడుట నెచ్చలితన మనుచు బంతెనగుండు లాడు నొకఁడు,

ఆ. కృష్ణుఁ జూడు మనుచుఁ గికురించి పరుమ్రోల, మేలి భక్ష్యరాశి మెసఁగు నొకఁడు
నవ్వు నొకఁడు, సఖుల నవ్వించు నొక్కఁడు, ముచ్చటాడు నొకఁడు, మురియు నొకఁడు. 496

* వ్రేళ్ళమధ్యలో ఊరుగాయ ముక్కలు ఇరికించుకుని మాటి మాటికీ ప్రక్కవాడిని ఊరిస్తూ తింటున్నా డొక గోపబాలుడు. మరొకడు ప్రక్కవాని కంచంలోనిది గభాలున లాక్కుని మ్రింగివేసి, వాడు చూడవచ్చేసరికి 'ఏదీ ఏమీ లేదే?' అని తన నోరు చూపించాడు. మరొకడు పందెంవేసి, ఐదారుమంది తినే చల్దిని నోట కూరు కుని కూరుకుని తింటున్నాడు. "ఒరే ! ఇన్ని పదార్థాలున్నాయి, స్నేహమంటే ఒకరి దొకరికి పంచి యివ్వాలట్రా!" అంటూ ఒక్కొక్కరి కంచంలోనిది ఒక్కొక్కటి తీసుకుంటూ 'బంతెనగుండ్లు' అనే ఆట ఆడుతున్నాడు మరొకడు. "ఒరే! కృష్ణుడు ఎలా నవ్వుతున్నాడో చూడు!" అంటూ మాయచేసి, మిత్రుని ముందున్న మధురపదార్థాలు తినేస్తున్నాడు వేరొకడు. ఒకడు నవ్వుతున్నాడు. మరొకడు తాను నవ్వకుండా ప్రక్కవారిని నవ్విస్తున్నాడు. ఇంకొకడు ముచ్చటలు చెబుతున్నాడు. వేరొకడు అవి వింటూ మురిసి పోతున్నాడు.

వ. అ య్యవసరంబున. 497

సీ. కడుపున దిండుగాఁ గట్టిన వలువలో, లాలిత వంశనాళంబుఁ జొనిపి
విమల శృంగంబును వేత్రదండంబును జాటి రానీక డాచంక నిఱికి
మీఁగడ పెరుఁగుతో మేళవించిన చల్ది ముద్ద డాపలిచేత మొనయ నునిచి
చెలరేఁగి కొసరి తెచ్చిన యూరుఁగాయలు వ్రేళ్ల సందులయందు వెలయ నిఱికి

ఆ. సంగడీల నడుమఁ జక్కఁగఁ గూర్చుండి, నర్మభాషణముల నగవు నెఱపి
యాగభోక్త కృష్ణుఁ డమరులు వెఱఁగంద, శైశవంబు మెఱసి చల్ది గుడిచె. 498

* అప్పుడు కృష్ణుడు నడుము చుట్టూ దట్టీ కట్టుకొని దానిలో తన వేణువును ఏటవాలుగా దూర్చాడు. కొమ్ము బూరా, చేతి కర్ర ఈ రెండింటినీ జారిపోకుండా ఎడమచంకలో ఇరికించి పట్టుకున్నాడు. మీగడ పెరుగుతో కలసిన చల్దిముద్ద ఎడమచేతిలో పట్టుకున్నాడు. ఇంటివద్ద అల్లరిచేసి, కొసరికొసరి కట్టించుకొని వచ్చిన ఊరుగాయ ముక్కలను కుడిచేతి వ్రేళ్ళసందులో ఇరికించి పట్టుకున్నాడు. స్నేహితులకు సరిగా నట్ట నడుమ చక్కగా కూర్చున్నాడు. ఛలోక్తులతో వారినందరిని నవ్విస్తూ ఉన్నాడు. అతడు సర్వ యజ్ఞాలలోను యజ్ఞఫలాన్ని భుజించే శ్రీహరి గదా! అటువంటివాడు బాల్యక్రీడలతో చెలరేగుతూ అలా కూర్చుండి చల్ది ఆరగిస్తూ ఉంటే దేవతలందరూ నివ్వెరపోయి నోళ్ళు తెరచుకొని చూస్తున్నారు.

వ. ఇట్లు కృష్ణసహితు లయిన గోపకుమారులు చల్దులు గుడుచు నెడఁ గ్రేపులు మేపులకుం జొచ్చి పచ్చనిగఱికి జొంపంబుల గుంపుల కుఱికి, లంపులు మేయుచు, ఘోరంబగు నరణ్యంబు నడుమ దోరంబగు దూరంబు సనిన, వానిం గానక వెఱచుచున్న గోపడింభకులకు నంభోజనయనుం డిట్లనియె. 499

* ఈవిధంగా ఇక్కడ కృష్ణునితోపాటు గోపకుమారులు చల్దులు ఆరగిస్తూ ఉండగా అక్కడ లేగదూడలు పచ్చిక మేస్తున్నాయి. పచ్చని పచ్చికలున్న గుబుర్లలోనికి జొరబడి, దొంగమేతలు మేస్తూ, భయంకర మైన అరణ్యంలో చాలాదూరం వెళ్ళిపోయాయి. గోపబాలకులు భోజనాలు చేస్తూ లేగలకోసం చూస్తే అవి కనిపించ లేదు. వారు కంగారు పడుతూ ఉంటే కృష్ణుడిలా అన్నాడు.

**మ. వినుఁ డో బాలకులార! క్రేపు లటవీవీథిన్ మహాదూరముం**
**జనియెం గోమల ఘాసఖాదన రతోత్సాహంబుతో నెందుఁ బో**
**యెనొ యే మయ్యెనొ క్రూరజంతువులచే నే యాపదం బొందెనో?**
**కని తెత్తుం! గుడువుండు చల్దిఁ గొఱఁతల్ గా కుండ మీ రందఱున్? 500**

* "మిత్రులారా! మన లేగదూడలు లేత పచ్చికల మేతలలో లీనమై ఉత్సాహంతో అడవిలో చాలాదూరం వెళ్ళిపోయినట్టున్నాయి. ఎక్కడికి వెళ్ళాయో, ఏమైపోయినాయో? ఏక్రూరజంతువులకైనా చిక్కి ఆపదలో పడినాయో ఏమిటో? నేను వెదకి తెస్తాను. మీరు కంగారు పడకుండా చల్దులు ఆరగిస్తూ ఉండండి."

## -: బ్రహ్మ గోవత్సములను గోపబాలకులను నంతర్థానంబు సేయుట :-

వ. అని చెప్పి. 501

**శా. కర్ణాలంబిత కాకపక్షములతో గ్రైవేయహారాళితో**
**స్వర్ణభ్రాజిత వేత్రదండకముతో సత్పింఛదామంబుతోఁ**
**బూర్ణోత్సాహముతో ధృతాన్న కబళోత్ఫుల్లాబ్జ హస్తంబుతోఁ**
**దూర్ణత్వంబున నేగె లేఁగలకునై దూరాటవీవీథికిన్. 502**

* ఈ విధంగా చెప్పి, కృష్ణుడు బయలుదేరాడు. జులపాల జుట్టు చెవులవరకూ వ్రేలాడుతూ ఉన్నది. మెడలో హారాలు మెరుస్తున్నాయి. బంగారంలా మెరుస్తున్న వెదురుకర్ర చేతిలో ఉంది. తలపై చక్కని నెమలిఫించము కన్నుల పండువుగా కదులుతున్నది. పట్టుకుని ఉన్న అన్నపు ముద్ద ఎర్రని అరచేతిలో తెల్లగా మెరుస్తున్నది. ఈ విధంగా ఉత్సాహం నిండిన కృష్ణుడు, లేగదూడలను వెదకడానికి చాల వేగంగా అడవిలో ఎంతో దూరం వెళ్లిపోయాడు.

వ. ఇ ట్లేగుచు. 503

**క. ఇచ్చోఁ బచ్చిక మేసిన, విచ్చోఁ ద్రావినవి తోయ, మేగిన విచ్చో,**
**నిచ్చోట మంద గొన్నవి, యిచ్చోఁ బాసినవి జాడ యిదె యిదె యనుచున్. 504**

* అలా వెదుతూ కృష్ణుడు లేగల జాడలు కనిపెట్టాడు. "ఇవిగో! ఇక్కడ పచ్చిక మేశాయి; ఇక్కడ నీరు త్రాగాయి; ఇదిగో ఇక్కడ మళ్ళీ బయలుదేరాయి; ఇక్కడ ఒక్కచోటికి మందగా చేరాయి; ఇదిగో! ఇక్కడనుంచి మంద విడిపోయింది".

**క. కంజదళాక్షుఁడు వెదకెను, గొంజక లేఁగల నపార గురుతృణ వనికా**
**పుంజంబుల భీకర మృగ, కుంజంబులఁ దరుల గిరులఁ గొలఁకుల నదులన్. 505**

* ఇలా కృష్ణుడు వెనుకాడకుండా లేగలను వెదుకసాగాడు. దట్టమైన అడవిలో పచ్చిక గుబురులలోనూ, భయంకర మృగాలుండే చెట్ల గుంపులలోనూ, చెట్లవెనుకా, పర్వతాలపైనా, కొలనులచెంతా, నదుల దగ్గరా అంతటా వెదికాడు.

**వ. అంత. 506**

**శా. బాలుం డయ్యు నితం డఘాసురుఁడు ద్రుంపన్ బాలురం గ్రేపులన్**
**ఏలీలన్ బ్రదికించెనొక్కొ? భువి నూహింపం గడుం జోద్య మం**
**చాలో నంబుజసంభవుండు సని మాయాబాలు శుంభద్బలం**
**బాలోకింపఁ దలంచి డాఁచె నొకచో నాలేఁగలన్ బాలురన్ 507**

* అప్పుడు భూమికి దిగివచ్చిన బ్రహ్మదేవుడు ఇదంతా చూచి ఇలా అనుకున్నాడు. "ఇతడు పసిబాలుడు గదా! అఘాసురుడు మ్రింగి వేసిన గోపబాలురను, లేగలను ఎలా రక్షించగలిగాడు! ఇది ఈ భూలోకంలోచాల ఆశ్చర్యకరమైన విషయమే!" అనుకున్నాడు. కృష్ణుడు అటువెళ్ళిన సమయం చూచి ఈ మాయాబాలుని మహాశక్తి ఎలాంటిదో పరీక్షచేసి చూద్దా మనుకున్నాడు బ్రహ్మయ్య. ఇటు అడవిలోని లేగలనూ అటు భోజనాలు చేస్తున్న బాలురనూ ఒక రహస్యప్రదేశంలో దాచి వేశాడు.

**వ. ఆ సమయంబున దూడలు వోయిన జాడ యెఱుంగక, తప్పి య ప్పద్మలోచనుం డెప్పటి కొలంకు కడకు వచ్చి, యచ్చోట నెచ్చెలులం గానక వారిం జీరి, లేకుండుట నిశ్చయించి గోవిందుండు విశ్వ విదుండు గావున నిది విరించి మొఱం గని యెఱింగి తిరిగి పోవుచు. 508**

* అప్పుడు కృష్ణుడు దూడల జాడలు కనబడక తిరిగి కొలను వద్దకు వచ్చాడు. అక్కడ గోపబాలురుకూడా ఆయనకు కనుపించలేదు. ఇక్కడ ఏదో మాయ జరిగిందని నిశ్చయించుకున్నాడు. కృష్ణుడు విశ్వంలోని రహస్యాలన్నీ ఎరిగినవాడు. ఇది బ్రహ్మదేవుని మోసమని గ్రహించాడు. వెంటనే గిరుక్కున వెనుదిరిగాడు.

**శా. వంచింపం బనిలేదు బ్రహ్మ కిచటన్ వత్సంబులన్ బాలురన్**
**వంచించెం గనుఁబ్రామి, తన్ను మరలన్ వంచించు టాశ్చర్యమే?**
**వంచింపన్ మనకేల! తెచ్చుటకునై వల్దంచు బ్రహ్మాండము**
**ల్వంచింపన్ మరలింప నేర్చు హరి లీలన్ మందహాసాస్యుఁడై. 509**

* ఈ మా బాలురను మా లేగదూడలను వంచనచేసి మాయం చేయవలసిన అవసరం బ్రహ్మకు ఏమీ లేదు. అయినా నా కన్ను గప్పి మోసం చేశాడు. అతణ్ణి తిరిగి మోసం చేయడం నాకు పెద్ద కష్టమైన

విషయం కాదు. ఐనా వారిని తిరిగి తీసుకొని రావడానికిగాను అతణ్ణి వంచించడం మనకెందుకు? వద్దులే? అంటూ పెదవులపై చిరునవ్వులు చిందించాడు. ఈ బ్రహ్మాండాలనే వంచించడం, మరలించడం అనే విద్యలు తెలిసినవాడుగదా శ్రీహరి!

**క. గోపాలసుతులు లే రని, గోపికలకుఁ జెప్పనేల? గోపాలకులున్**
**గోపికలు నలర బాలుర, క్రేపులరూపముల నేఁ జరించెద ననుచున్. 510**

* "ఇంటికి తిరిగివెళ్లి మీ పిల్లలు లేరమ్మా అని గోపికలకు చెప్పడం దేనికి? నేనే గోపబాలుర రూపాలలోనూ, గోవత్సాల రూపాలలోనూ సంచరిస్తాను. గోపికలు, గోపకులు కూడా ఎప్పటిలాగే చాల సంతోషిస్తారు.".

**మ. కరముల్ పాదములున్ శిరంబు లవలగ్నంబుల్ ముఖంబుల్ భుజాం**
**తరముల్ ముక్కులుఁ గన్నులున్ శ్రవణముల్ దంతాదులున్ దండ కాం**
**బర స్రగ్వేణు విషాణ భూషణ వయో భాషా గుణాఖ్యాన త**
**త్పరతల్ వీడ్వడకుండఁ దాల్చె విభుఁ డా వత్సార్భకాకారముల్. 511**

* ఇలా అనుకున్న కృష్ణుడు ఆ యా లేగదూడల ఆకారాలు, ఆ యా గోపబాలుర ఆకారాలు తానే ధరించాడు. చేతులు, కాళ్ళు, తలలు, నడుములు, ముఖాలు, భుజాలు, వక్షస్థలాలు, ముక్కులు, కన్నులు, చెవులు, దంతాలు, మొదలైనవి అన్నీ అచ్చం ఆ యా బాలుర పోలికల్లోనే ఉన్నాయి. అంతేకాకుండా ఆ యా బాలురు ధరించే చేతికర్రలు, వస్త్రాలు, దండలు, వేణువులు, కొమ్ముబూరాలు, ఆభరణాలు, వారి వయస్సులు, గుణాలు, మాట్లాడడంలోని విచిత్రమైన యాసలు- ఏ ఒక్కటీ వదలకుండా ఆయా బాలుర, లేగల ఆకారాలు అన్నీ తానే ధరించాడు. ఈశ్వరుడైన శ్రీహరిగదా అతడు!

**క. రూపంబు లెల్ల నగు బహు, రూపకుఁ డిటు బాలవత్సరూపంబులతో**
**నే పారు టేమి చోద్యము?, రూపింపఁగ నతని కితరరూపము గలదే? 512**

* ఈ జగన్నాటకంలో అందరి రూపాలూ ధరించే అంతర్యామి స్వరూపుడు గోపాలకృష్ణుడు. ఆ మహానటుడు ఇలా బాలుర, లేగల రూపాలు ధరించడం ఏమి ఆశ్చర్యం? ఏ రూపంలోనైనా ఉన్నవాడు అతడే. జాగ్రత్తగా గమనిస్తే అతనికి ఈ అంతర్యామి రూపం కాక వేరే రూపం లేదు గదా!

**క. మరలుపు మనియెడు కర్తయు, మరలించు కుమారకులును మరలెడి క్రేపుల్,**
**పరికింప దాన యై హరి, మరలం జనె లీలతోడ మందకు నధిపా! 513**

* "ఇక లేగలను ఇళ్ళకు మళ్ళించండి" అని చెబుతున్న కృష్ణుడూ, మరలించే గోపబాలురూ, మరలింపబడే లేగదూడలూ అన్ని తానే అయి ఆ లీలా గోపాలబాలుడు తమ గోకులానికి తిరిగి బయలు దేరాడు.

వ. ఇట్లు బాలవత్సరూపంబులతో విహరించుచు మందకు వచ్చి వారివారి దొడ్ల నయ్యె వత్సంబుల ముందఱికందువల నిలిపి, తత్తద్బాలరూపంబుల నందఱి గృహంబులం బ్రవేశించి వేణునాదంబులు సేసిన, 514

* ఈవిధంగా బాలుర, లేగల రూపాలతో విహరిస్తూ గోకులానికి తిరిగివచ్చి, వారి వారి దొడ్లలో లేగలను ఆ యా స్థానాలలో కట్టివేసి, ఆ బాలకుల రూపంలో ఆ యా ఇండ్లలో ప్రవేశించి, వారి వారి వేణువుల ద్వారా వేణునాదం చేశాడు.

చ. కొడుకుల వేణునాదములు గొబ్బున వీనులకుం బ్రియంబు లై
ముడివడ లేచి యెత్తికొని మూర్కొని తల్లులు గౌఁగిలించుచుం
జడిగొనఁ జేఁపు వచ్చి తమచన్నులయందు సుధాసమంబు లై
వెడలెడి పాలు నింగుకొను వేడుక నిచ్చిరి తత్సుతాళికిన్. 515

* గోపబాలకుల తల్లులు కొడుకుల వేణునాదాలు విన్నారు. అవి వీనుల విందుగా వినిపించి వారి మనస్సులను పరవశింపజేశాయి. ఆ తల్లులు వెంటనే లేచి, కుమారులను కౌగిలించుకొని, శిరస్సులను మూర్కొన్నారు. వారికి పాలిండ్లలో పాలు ఉవ్వెత్తుగా చేపువచ్చాయి. గోపికలు అమృతంతో సమానమైన ఆ పాలు నిండైన ప్రేమతో కొడుకులకు త్రాగించారు.

వ. మఱియుఁ దల్లు లుల్లంబులఁ బెల్లుగ వెల్లిగొను వేడుకలం దమనందనులకు నలుంగు లిడి, మజ్జనంబులు గావించి, గందంబు లలంది తొడవులు దొడిగి నిటలతటంబుల రక్షాతిలకంబులు వెట్టి, సకలపదార్థ సంపన్నంబు లయిన యన్నంబు లొసంగి సన్నములు గాని మన్ననలు సేసిరి. 516

* ఆ తల్లుల హృదయాలు ఆనందంతో పరవళ్ళు త్రొక్కాయి. వారు ఎంతో వేడుకతో కొడుకులకు నలుగు పెట్టి, తలంటి స్నానం చేయించారు. గంధాలు పూశారు. చక్కని ఆభరణాలు అలంకరించారు. నుదుటిపై రక్షాతిలకాలు పెట్టారు. అన్నిరకాల పదార్థాలతోను భోజనాలు పెట్టారు. ఎంతో ప్రేమతో వారిని ఆదరించారు.

క. ఏ తల్లుల కే బాలకు, లే తెఱఁగునఁ దిరిగి ప్రీతి యొసఁగింతురు ము
న్నా తల్లుల కా బాలకు, లా తెఱఁగునఁ బ్రీతిఁ జేసి రవనీనాథా! 517

* ఇంతకు ముందు ఏబాలకులు ఏ తల్లులకు ఏ యే విధాలుగా ఆనందం కలిగించేవారో, ఇప్పుడూ అలాగే ఆ బాలకులు ఆ తల్లులకు అదే విధమైన ఆనందం కలిగించారు.

వ. ఆ సమయంబున. 518

ఉ. పాయని వేడ్కతో నునికిపట్టులకుం జని గోవులెల్ల నం
బే యని చీరి హుమ్మనుచుఁ బేరిచి మూర్కొని పంచితిల్లి పె
ల్లై యతిరేకమై పొదుఁగులం దెడలేక స్రవించుచున్న పా
లాయెడ నాకుచున్ సుముఖలై యొసఁగెన్ నిజవత్సకోటికిన్. 519

* ఆ సమయంలో దొడ్లలో ఉన్న ఆవులు తమదూడలను చూడగనే 'అంబే' అంటూ బిడ్డలను కేకవేసి పిలిచాయి. హుమ్మంటూ దూడలను వాసన చూచి, ఆనందంతో కొంచెం మూత్రం విడిచాయి. ప్రేమతో దూడలను నాకుతూ పొదుగులనుండి కోకొల్లలుగా కురుస్తున్న పాలను లేగదూడలకు త్రాగించాయి.

క. వ్రేతలకును గోవులకును, మాతృత్వము సాలఁ గలిగె మఱి మాధవు పై
మాత లని హరియు నిర్మల, కౌతూహల మొప్పఁదిరిగెఁ గడు బాల్యమునన్. 520

* గోపికలకు గోవులకు కూడ తమ తమ బిడ్డల రూపంలో ఉన్న కృష్ణునిపై మాతృప్రేమ ఎంతో కలిగింది. శ్రీహరికూడా వారిని తల్లులు అంటూ ఎంతో స్వచ్ఛమైన ప్రేమతో పసిపిల్లవాడుగా వారిమధ్య ప్రవర్తించాడు.

ఆ. ఘోషజనుల కెల్లఁ గుఱ్ఱలపై వేడ్క, పూఁటపూఁట కెలమిఁ బొటకరించె
నిచ్చ క్రొత్త యగుచు నీరజాక్షునిమీఁద, వేడ్కఁ దమకుఁ దొల్లి వెలసినట్లు. 521

* ఈ గోపబాలురపైన గోకులంలోని జనులందరికీ రోజురోజుకీ ప్రేమలు చిగుళ్లు తొడిగాయి. ఏ రోజు కారోజు క్రొత్తగానే ఉండేది ఆ ప్రేమ. బాల కృష్ణునిపైన కూడా వారికి పూర్వంలాగే రోజు రోజుకూ ప్రేమలు క్రొత్త చిగుళ్ళు తొడుగుతూ ఉండేవి.

వ. ఇట్లు కృష్ణుండు బాలవత్సరూపంబులు దాల్చి తన్నుఁ దాన రక్షించుకొనుచు, మందను వనంబున నమందమహిమంబున నొక్కయేఁడు క్రీడించె. నా యేఁటికి నై దాఱు దినంబులు కడమవడి యుండ నం దొక్కనాఁడు బలభద్రుండును, దానును వనంబునకుం జని మందచేరువ లేఁగల మేప నతి దూరంబున గోవర్ధన శైలశిఖరంబున ఘాసంబులు గ్రాసంబులు గొనుచున్న గోపు లా లేఁగలం గని. 522

* ఈ విధంగా బాలకృష్ణుడు బాలుర రూపాలూ, లేగల రూపాలూ తానే ధరించి, ఇందరి రూపాలలోనూ ఉన్న తననుతాను రక్షించు కొంటూ, ఆ బృందావనంలో ఉన్న గోకులంలో మహా మహిమతో ఒక్క యేడాది పాటు ఆడుకున్నాడు. ఒక ఏడాదికి ఐదారు రోజులు తక్కువగా ఉన్నదనగా ఒకనాడు తాను, బలరాముడు అడవికి వెళ్ళి మందకు దగ్గరగా లేగదూడలను మేపుతున్నారు. ఆ ప్రదేశానికి చాలాదూరంగా గోవర్ధనపర్వత శిఖరంపై గోపకులు ఆవులను మేపుతున్నాడు. ఆ ఆవులు ఈ దూడలను చూచాయి.

చ. ముదమున హుంకరించుచును, మూఁపులపై మెడ లెత్తి చాఁచుచుం
బదములు నాల్గు రెండయిన బాగునఁ గూడఁగఁ బెట్టి దాఁటుచున్
వదనములన్ విశాలతర వాలములన్ వడి నెత్తిపాఱి యా
మొదవులు సన్నులం గుడిపె మూఁతుల మ్రింగెడిభంగి నాకుచున్. 523

* ఆవులు ఆనందంతో ఒక్కసారిగా హుంకారం చేశాయి. మూపుల పైదాకా మెడలు ఎత్తి చాచి, నాలుగుకాళ్ళూ రెండుకాళ్ళుగా కనిపించేటంత వేగంగా చెంగుచెంగున దాట్లు వేస్తూ పరుగెత్తాయి. తోకలు

విశాలంగా ముఖాలపై దాకా వచ్చేటట్లు ఎత్తి, వేగంగా లేగదూడలవద్దకు పరుగెత్తుకుంటూ వచ్చాయి. లేగలమూతులను మ్రింగివేస్తాయా అన్నంత ఆత్రంగా నాకుతూ, ఆ ఆవులు లేగలకు కడుపులనిండా పాలు కుడిపాయి.

**వ. అంత గోపకులు గోవుల వారింప నలవి గాక, దిగ్గన నలుకతోడి సిగ్గు లగ్గలంబుగ దుర్గమ మార్గంబున వానివెంట నంటి వచ్చి లేఁగల మేపుచున్న కొడుకులం గని. 524**

* ఆ ఆవులను ఆపుచేయడం గోపకులకు సాధ్యం కాలేదు. ఇంత వరకు ఎప్పుడూ తమ మాటలను ఆవులు ధిక్కరించలేదు. వారికి కోపంతో పాటు సిగ్గుకూడా ముంచుకు వచ్చింది. ఆవుల వెనుకనే తుప్పలలో నుంచి, బండలపై నుంచి కష్టమైన దారులలో పరుగెత్తుకుని వచ్చారు. అక్కడ లేగలను మేపుతున్న తమ బిడ్డలను చూచారు. వారు కోపాలు సిగ్గులు అన్నీ మరచిపోయారు.

**ఉ. అయ్యలఁ గంటి మంచుఁ బులకాంకురముల్ వెలయంగఁ గుఱ్ఱలం**
**జయ్యన డాసి యెత్తుకొని సంతస మందుచు గౌఁగిలించి తా**
**రయ్యెడ నౌఁదలల్ మనము లారఁగ మూర్కొని ముద్దు సేయుచున్**
**దయ్య మెఱుంగు, గోపకులు దద్దయు నుబ్బిరి నిబ్బరంబుగన్. 525**

* "మా చిన్ననాన్నలను చూడగలిగాము" అంటూ బిడ్డల వద్దకు చేరి, వారిని ఎత్తుకున్నారు. ఒడలంతా పులకలెత్తుతూ ఉండగా, సంతోషంతో కౌగిలించుకుని, తలలను మూర్కొని ముద్దుచేశారు. ఆ బిడ్డలలో ఉన్న దైవాన్ని తెలుసుకున్నారా అన్నట్లు ఎంతో సంతోషంతో పొంగిపోయినారు. అది పాలపొంగువంటిది కాదు; స్థిరత్వం కూడా ఉన్నపొంగు అది.

**వ. ఇట్లు బాలకాలింగనంబుల నానందబాష్ప పూరితనయనులై గోపకులు గోవుల మరలించుకొని తలంగి చన వారలం జూచి బలభద్రుండు దనలో నిట్లని తలంచె. 526**

* ఇలా కుమారులను కౌగిలించుకొని, ఆనందబాష్పాలు నిండిన కన్నులతో గోపకులు చివరికి కుమారులను వదలిపెట్టి, గోవులను మళ్ళించుకొని దూరంగా వెళ్లిపోయారు. వారిని చూచి బలరాముడు తనలో తాను ఇలా అనుకున్నాడు.

**సీ. చన్ను మానినయట్టి శాబకశ్రేణిపై గోగణంబులకును గోపకులకు**
**నిబ్భంగి వాత్సల్య మెబ్భంగి నుదయించె? హరిఁ దొల్లి మన్నించునట్లు వీరు**
**మన్నించు చున్నారు మమతఁ జేయుచుఁ బ్రీతి నంబుజాక్షునిఁ గన్నయట్లు నాకుఁ**
**బ్రేమమయ్యెడి, డింభబృందంబుఁ గనుఁగొన్న నిది మహాద్భుత మెందు నెఱుఁగరాదు**

**తే. మనుజదైవత దానవ మాయయొక్కొ?, కాక నా భర్త యగుచున్న కమలనయను**
**మాయయో కాక యితరులమాయ నన్నుఁ, గలఁప నోవదు విభుమాయ గాఁగ నోపు. 527**

* "తల్లిపాలు విడిచిన వయస్సులో ఉన్న బిడ్డలపైనా, లేగలపైనా గోపకులకు గోవులకు ఇంత ఎక్కువగా వాత్సల్యం ఎలా పుట్టుకుని వచ్చింది? వీరు ఇదివరకు కృష్ణుని యెడ మమకారంతో ఎంత ప్రేమ చూపేవారో, ఇప్పుడు తమ బిడ్డలపైన ఆ విధంగా ప్రేమ చూపుతున్నారు. నాకు కూడా ఈబిడ్డలనూ, లేగలనూ చూస్తుంటే కృష్ణుని చూచినట్లే ప్రేమా, ఇష్టమూ కలుగుతున్నాయి. ఇది మహాద్భుతంగా ఉంది. ఇంతకుముందు ఇటువంటిది యెన్నడూ ఎరుగను. మానవులుగాని, దేవతలుగాని, దానవులుగాని చేసిన మాయ కాదు గదా! లేక నా స్వామి అయిన విష్ణువుయొక్క మాయ యేమో! ఇతరుల మాయ అయితే నన్ను మోసగించ లేదు. నా స్వామి మాయయే అయి ఉంటుంది."

**క. అని మున్న ముగ్ధుఁ డయ్యును, దనయందుల దివ్యదృష్టిఁ దప్పక బుద్ధిం**
**దన చెలికాండ్రను గ్రేపుల, వనజాక్షుం డనుచుఁ జూచె వసుధాధీశా! 528**

* బలరాముడు ఇలా ఆలోచించి, ఇతవరకు మోహం చెంది ఉన్నా, ఇప్పుడు దివ్యదృష్టితో శ్రద్ధగా చూచాడు. తన స్నేహితులు, లేగదూడలు అన్నీ కృష్ణుడే అని గ్రహించాడు.

**వ. ఇట్లు విజ్ఞానదృష్టిం జూచి యెఱింగియు నమ్మక బలదేవుండు గొందలంపడుచుఁ గృష్ణుం జూచి 'మహాత్మా! తొల్లి యెల్ల క్రేపులును ఋషుల యంశం బనియును, గోపాలకులు వేల్పుల యంశం బనియును దోఁచు చుండు, నిపుడు వత్సబాలక సందోహంబు సందేహంబు లేక నీవ యని తోఁచుచున్న, దిదియ యేమి?'యని యడిగిన నన్నకు నున్నరూపు వెన్నుండు మన్ననసేసి క్రన్నన యెఱింగించె, నతండు నెరింగె నవ్విధంబున హరి బాలవత్సంబులు దానయై సంచరించిన యేఁడు విరించికిఁ దన మానంబున నొక్క త్రుటి మాత్రంబైన, విరించి చనుదెంచి వత్సబాలకాకారుండైన కృష్ణబాలకుం జూచి వెఱంగు పడి యిట్లని వితర్కించె. 529**

* ఇలా యోగదృష్టితో చూచినా బలరాముడు నమ్మలేక కంగారు పడ్డాడు. కృష్ణుని ఇలా అడిగాడు; "మహాత్మా! ఇంతకు ముందువరకు లేగదూడలన్నీ ఋషుల అంశలతో జన్మించినవనీ, గోపాలకులందరూ దేవతల అంశలనీ నాకు అనిపిస్తూ ఉండేది. ఇప్పుడు చూస్తే లేగలూ, బాలకులూ అందరూ నిస్సందేహంగా నీవే అని నాకు అనిపిస్తూ ఉంది. కనిపిస్తూ ఉంది. ఈ వింత ఏమిటి?" ఇలా అడుగగానే కృష్ణుడు అన్నగారి యెడల అనుగ్రహంతో 'ఉన్న' రహస్యం విప్పి చెప్పాడు. బలరాముడుకూడా గ్రహించాడు. ఈ విధంగా శ్రీహరి బాలురు, లేగలు తానే అయి చరించినది ఒక యేడాది. ఆ కాలం బ్రహ్మదేవునికి తన కాలమానంలో ఒక్క త్రుటికాలంగా కనుపించింది. అతడు వచ్చి లేగల రూపంలో బాలకుల రూపంలో కనుపిస్తున్న బాలకృష్ణుని చూచి నివ్వెరపోయి ఇలా ఆలోచించుకున్నాడు.

**శా. మందం గల్గిన వత్సబాలకులు నామాయా గుహాసుప్తులై**
**యెందుం బోవరు, లేవ రిప్పుడును వేఱే చేయ నాకన్య లొం**
**డెందున్ లేరు, విధాతలుం బరులు, వీ రెవ్వార లె ట్లైరొకో!**
**యెం దేతెంచిరొ కృష్ణుతో మెలఁగువా? రేఁడయ్యెడిన్ నేఁటికిన్. 530**

* "ఈ గోకులంలోని అసలైన బాలకులు, లేగలు నా మాయాగుహలో ఇప్పటికీ నిద్రపోతున్నారు. ఎక్కడికీ పోలేదు. మళ్ళీ ఎవరైనా సృష్టిచేశారా అనుకుంటే, నాకు బదులు మరొక బ్రహ్మ ఎవరూ లేరు. మరి వీరెవరు? ఎలా తయారైనారు? నేటికి భూలోకంలో ఏడాది అయింది. ఈ కృష్ణునితో విహరిస్తున్న వీరంత ఎక్కడినుంచి వచ్చారో మరి!

**మత్త కోకిలము**

**బ్రహ్మపంపునఁ గాని పుట్టదు ప్రాణిసంతతి యెప్పుడున్**
**బ్రహ్మనొక్కఁడఁగాని వేఱొకబ్రహ్మ లేఁడు సృజింపఁగా**
**బ్రహ్మ నేను సృజింప నొండొక బాలవత్సకదంబ మే**
**బ్రహ్మమందు జనించె? నొక్కట బ్రహ్మ మౌనది చూడఁగాన్.** 531

* బ్రహ్మ సృష్టిస్తేగాని, ఈ జీవరాసులేవీ పుట్టవుగదా! సృష్టిచేసే బ్రహ్మ అంటే నే నొక్కడనే గాని రెండవవాడు లేడుగదా! బ్రహ్మగా నేను సృష్టించిన గొల్లపిల్లలు, దూడలు కాక, వేరేగొల్ల పిల్లలూ దూడలూ ఎలా వచ్చాయి? వీటిని ఏ బ్రహ్మ సృష్టించాడు? ఇందరిలో ఒక్కడుగా ఉన్న పరబ్రహ్మ కాదు గదా వీటి సృష్టికర్త?

**వ. అని యిట్లు సకలంబును సుకరంబున నెఱింగెడి నెఱవాది ముదుక యెఱుక గల ప్రోడ వెఱంగుపడి గ్రద్దనఁ బెద్దప్రొద్దు దద్దయుం దలపోసి కర్జంబు ముందల యెఱుంగక కొందలం పడుచు నాందోళనంబున.** 532

* సర్వస్వాన్నీ తేలికగా తెలుసుకొనే నేర్పరియైన ఆ పితామహుడు ఆ జ్ఞానవృద్ధుడు ఆ బ్రహ్మదేవుడు నివ్వెరపోయాడు. కంగారుపడి తనలో తాను ఎంతో ఆలోచించాడు. ఇకముందు చేయవలసిన కార్య విధాన మేమిటో తెలియలేదు. బిక్కమొగం వేసి అందోళనలో పడ్డాడు.

**క. మోహము లేక జగంబుల, మోహింపఁగఁ జేయ నేర్చి మొనసిన విష్ణున్**
**మోహింపించెద ననియెడు, మోహమున విధాత దాన మోహితుఁ డయ్యెన్.** 533

* శ్రీహరి మోహం అంటనివాడు. కాని తాను జగత్తు లన్నిటినీ మోహింపజేయగల నేర్పరి. అటువంటి విష్ణువును మోహింప జేద్దామనుకొని మోహపడిన బ్రహ్మ తానే మోహితుడై పోయాడు.

**తే. పగలు ఖద్యోతరుచి చెడుపగిది రాత్రి,మంచు చీఁకటి లీనమై మాయుమాడ్కి**
**విష్ణుపై నన్యమాయలు విశద మగునె?, చెడి నిజేశుల గరిమంబుఁ జెఱుచుఁగాక.** 534

* పగటివేళ మిణుగురు పురుగుల కాంతి తేలిపోతుంది. రాత్రివేళ మంచు చీకటిలో లీనమై మాయమైపోతుంది. అలాగే విష్ణువు మాయకు పుట్టినిల్లు. అటువంటి విష్ణువుపై ఇతరులమాయలు పనిచేస్తాయా? ఆ మాయలూ పస చెడి విడిపోతాయి. తమను ప్రయోగించినవారి గౌరవాన్ని కూడా చెడగొట్టేస్తాయి.

**వ. మఱియును.** 535

క. పుట్టితి, బుద్ధి యెఱింగితిఁ, బుట్టించితి జగము, సగము వోయెను బ్రాయం,
బిట్టివి నూతన సృష్టులు, పుట్టుట లే, దౌర! యిట్టి బూమెలు భూమిన్. 536

* ఏనాడో పుట్టాను. పుట్టిన తరువాత బుద్ధి తెలిసింది. ఈ జగత్తు నంతటినీ పుట్టించాను. వయస్సు సగం గడచిపోయింది. ఇంతవరకూ ఇలా క్రొత్త సృష్టులు పుట్టడం నే నెన్నడూ ఎరుగను. ఔరా! నేను పుట్టించిన ఈ భూమిపైన నాకు అందని ఇన్ని మాయలా?

వ. అని యిట్లు దలవాకిట వాణిగల పోఁడిమిచే వాఁడిమి కెక్కిన నలుమొగంబుల తక్కరిగొంటు పెను దంట పలువెంటలం దన మనంబున వితర్కించి, విచారించునెడ, నతండు గనుంగొను చుండ నబ్బాలకులు మేఘశ్యాములును, హారకుండల కిరీట వనమాలికాభిరాములును, శ్రీవత్స మంగళాంగద నూపుర కనక కటక కంకణ కటిఘటిత కాంచీగుణోద్దాములును, నాపాద మస్తక తులసీదళదాములును, విలస దంగుళీయకస్తోములును, శంఖ చక్ర గదా కమల హస్తులును, చతుర్భుజప్రశస్తులును, బీతకౌశేయవాసులును, జంద్రికాధవళహాసులును, గరుణాకటాక్ష వీక్షణవిలాసులును, రవికోటిభాసులును, ననంత సచ్చిదానంద రూపమహితులును, నణిమాదిగుణో పేతులును, విజాతీయభేద రహితులును, శ్రీ మన్నారాయణ ప్రతిమాన విగ్రహస్వరూపులును నయి తమకుఁ బరతంత్రు లగుచు నృత్తగీతాది సేవావిశేషంబులకుం జొచ్చి మెలంగుచు మూర్తిమంతంబులయిన బ్రహ్మాది చరా చరంబులును నణిమాదిసిద్ధులును, మాయాప్రముఖంబులైన శక్తులును, మహదాది చతుర్వింశతి తత్త్వం బులును, గుణక్షోభ కాలపరిణామ హేతుసంస్కారకామ కర్మగుణంబులును సేవింప వేదాంతవిదులకైన నెఱుంగ రాని తెఱంగున మెఱయుచుఁ గానంబడిన వారలం గనుంగొని. 537

* బ్రహ్మదేవుడు తన తలవాకిట (నోటిలో) సరస్వతి ఉన్నదనే అభిమానంవలన కొంత గర్వపడుతూ ఉండేవాడు. నాలుగు మొగాలున్న ఆ మాయగాడు జంకి వెనుకకు తగ్గుతూ తన మనస్సులో ఎన్నో రకాలుగా ఆలోచించి చూచాడు. ఆలోచిస్తూ ఒక్కసారి బాలురవంక చూచాడు. అందరూ మేఘశ్యామల మూర్తులు. హారాలు, కుండలాలు, కిరీటాలు, వైజయంతీ వనమాలికలు ధరించి చాల అందంగా ఉన్నారు. వక్షఃస్థలంపైన శ్రీవత్సమనే పుట్టుమచ్చ, శుభకరములైన బాహుపురులు, కాలిగజ్జెలు, బంగారు కడియాలు, నడుములకు కాంచీకలాపాలతో కనిపిస్తూ బ్రహ్మను బెదరగొట్టారు. పాదాలనుంచి శిరస్సులవరకూ తులసీదళాల మాలలు ధరించారు. వ్రేళ్ళకు రవ్వల ఉంగరాలు మెరుస్తున్నాయి. అందరికీ నాలుగేసి బాహువు లున్నాయి. నాలుగు చేతులలో శంఖం, చక్రం, గద, పద్మం ధరించి ఉన్నారు. బంగారురంగు పట్టువస్త్రాలు ధరించి ఉన్నారు. వెన్నెలవంటి చల్లని, తెల్లని చిరునవ్వులు వెదజల్లుతున్నారు. కన్నులనుండి కరుణాకటాక్షాలు వెలువడు తున్నాయి. కోటిసూర్యుల కాంతితో వెలిగిపోతున్నారు. సత్, చిత్, ఆనందము తామే అయిన అనంత రూపాలతో విలసిల్లుతున్నారు. అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశిత్వము, వశిత్వము అనబడే ఎనిమిది సిద్ధుల గుణాలూ తమలోనే ధరించి ఉన్నారు. అందరూ అంతర్యామి స్వరూపులే గనుక, ఇది మాకు పరాయిది అనే భేదం వారికి లేదు. లక్ష్మీదేవితో కూడిన నారాయణుని ప్రతిబింబాలైన రూపాలతో విలసిల్లుతున్నారు.

సృష్టిలోఉన్న బ్రహ్మదగ్గరనుంచి చరాచరములైన జీవరాసులు అణిమ మొదలైన సిద్ధులు, మాయ మొదలైన శక్తులు, (మహత్తు, అహంకారము, బుద్ధి, మనస్సు, పంచ మహాభూతాలు, పంచతన్మాత్రలు, పంచజ్ఞానేంద్రియాలు, పంచ కర్మేంద్రియాలు మొదలైన)ఇరవైనాలుగు తత్త్వాలు, మూడుగుణముల కలయిక, కాలము, మార్పు, కారణము, సంస్కారము, కామము, కర్మము వాని గుణాలు- ఇవన్నీ రూపాలు ధరించి, నృత్యాలూ, గానాలూ మొదలైనవి చేస్తూ ఈ నారాయణ స్వరూపులైన బాలకులకు లోబడి సేవిస్తూ ఉన్నవి. వేదాంతమంతా తెలిసినవారికైనా ఈ విశ్వరూపాలు తెలియవు. ఈ విధంగా దేదీప్యమానంగా ప్రకాశిస్తున్న బాలురను బ్రహ్మదేవుడు చూచాడు. ఇలా అనుకున్నాడు.

**ఉ. బాలురఁ గంటి నాచెయిదిఁ బాసినవారిని మున్నవారి నేఁ**
**బోలఁగఁ జూచునంతటన భూరినిరర్గళ దుర్గమప్రభా**
**జాలముతోడఁ జూపులకుఁ జాలమిఁ దెచ్చుచు, నున్నవార, లే**
**మూలమొ? మార్గ మెయ్యదియొ? మోసము వచ్చెఁగదే! విధాతకున్. 538**

* "నా చేష్టకు లోబడక తప్పించుకున్న బాలురను ముందునుంచీ చూస్తూనే ఉన్నాను. వారు చూడగా చూడగా గొప్పతేజస్సుతో కనబడుతున్నారు. ఆ తేజస్సు మహాప్రవాహంలాగా చూపులతోనైనా సమీపించడానికి వీలు కాకుండా ఉన్నది. వారి వర్చస్సు చూడటానికి నా చూపులకు శక్తి చాలడం లేదు. దీని కంతటికీ మూలకారణ మేమిటి? ఇప్పుడు నే నేమిటి చేయడం? ఆహా! సృష్టికర్త అయిన బ్రహ్మకే మోసం వచ్చింది గదా!"

**వ. అని సకలేంద్రియంబులకు వెక్కసంబయిన స్రుక్కి. 539**

* ఆ బాలుర రూపాలు బ్రహ్మదేవుని అన్ని ఇంద్రియాలకూ భరించరానివై పోయినాయి. చూచి చూచి అతడు చేష్టలు దక్కి డస్సి పోయాడు.

**ఉ. ఏ పరమేశుతేజమున నీసచరాచరమైన లోక ము**
**ద్దీపిత మయ్యె నట్టి విభుతేజముఁ గన్నులఁ జక్కఁ జూడఁగా**
**నోపక పారవశ్యమును నొందుచు సంస్తిమితాఖిలేంద్రియుం**
**డై పరమేష్ఠి మైమఱచె నప్పుడు చిత్రపు రూపు కై వడిన్. 540**

* ఈ సృష్టి కంతటికీ పరముడైన ఈశ్వరుడు విష్ణువు. తేజస్సు అనేది అతనినుండి పుట్టింది. దానివలన చరాచరమైన ఈ సృష్టి అంతా రూపొంది కాంతిమంతమైకన్నులకు కనబడుతున్నది. ఆ తేజస్సులో బ్రహ్మదేవుడు ఒక భాగం మాత్రమే కనుక ఆ తేజస్సును బ్రహ్మదేవుని కన్నులు చూడలేకపోయినాయి. అతడు పరవశించి పోయాడు. అన్ని ఇంద్రియాలకూ చీకటి క్రమ్మింది. అప్పుడు బ్రహ్మ బొమ్మగీసినట్లు ఒడలు తెలియక నిశ్చేష్టుడై నిలబడి పోయాడు.

వ. ఇట్లు మాయాతీతుండును, వేదాంత విజ్ఞాన దుర్లభుండును, స్వప్రకాశానందుండును నైన తన బాహుళ్యంబుఁ జూచి నివ్వెఱ పడిన బ్రహ్మం గని యీశ్వరుండు. 541

* ఈశ్వరుడైన కృష్ణుడు బ్రహ్మను చూచాడు. మాయకు అతీతుడు, వేదాంతాలు చదివినంతమాత్రాన దొరకనివాడు, తన వెలుగులో తాను ఆనందమై ఉన్నవాడు అయిన తన విశ్వరూపాన్ని చూచి బ్రహ్మ నివ్వెరపోయి ఉండడం గమనించాడు.

శా. 'బాలుండై చతురాననుండు తన యీ బ్రహ్మాభిమానంబునన్
లోలుండై మతిదప్పి నామహిమ యాలోకింప నేతెంచెఁ దా
నాలోకింపఁగ నెంతవాఁ?డనుచు మాయాజాలమున్ విప్పి త
ల్లీలారూపము లెల్ల దాఁచెనటఁ గేళీచాతురీధుర్యుఁడై. 542

* "ఈ బ్రహ్మదేవుడు తనకు నాలుగు తలలున్నా యనుకుంటున్నాడు. బాలభావంతో తన ఈ బ్రహ్మపదవిని చూచుకొని అహంకారంలో మునిగిపోయాడు. అజ్ఞానంలో నిమగ్నుడైపోయి, నా మహిమ ఎంతటిదో చూడాలని వచ్చాడు. ఇంతటి మహామహిమను చూడటానికి తానెంత? కుర్రవాడు గదా!'' అని జాలిపడి భగవంతుడైన బాలకృష్ణుడు మాయాజాలాన్ని విప్పివేశాడు. తాను సృష్టించిన లీలారూపాల నన్నింటినీ అక్కడి కక్కడే దాచివేశాడు. ఆటలాడడంలోగానీ, ఆడించడంలోగానీ ఆయన చాతుర్యం ఊహించరానిది!

వ. అంతలోన నజీవుండు సజీవుండైన తెఱంగున నెనిమిదికన్నులు గల వేలుపుగమికాఁడు తేఱి తెప్పిఱి కాలుఁ గేలుఁ గదలించి, చెచ్చెరం గన్నులు విచ్చిచూడ సమర్థుండై ముందటఁ గని, వెనుకఁ జూచి, దివి విలోకించి, దిక్కులు వీక్షించి, యెల్ల యెడలం గలయ దర్శించి తన పురోభాగంబున హరి సంచరించుటంజేసి జాతి వైరంబులు లేని నరపక్షి మృగాదులకు నాటపట్టయి సిరి గలిగి కామక్రోధాది రహితులకు జీవనంబైన బృందావనంబుం బొడగాంచి యుందె. 543

* ఇంతలో ఎనిమిది కన్నులున్న దేవతలపెద్ద బ్రహ్మదేవుడు మృతిచెందినవాడు బ్రతికి వచ్చినట్లు తేరుకుని తెప్పరిల్లాడు. కాళ్ళు చేతులు కదలించి చూచుకున్నాడు. తరువాత కన్నులు విప్పి చూడటానికి శక్తి వచ్చింది. ముందువైపు చూచాడు. వెనుకవైపు చూచాడు. తల పైకెత్తి చూచాడు. అన్నిదిక్కులూ చూచాడు. అప్పుడు అన్ని చోట్లా పరిశీలనగా చూచాడు. ఎదుట బృందావనం కనుపించింది. తన యెదుటనే కృష్ణుడు ఉన్నా మొదట అతడు బ్రహ్మకు కనిపించలేదు. కృష్ణుడు ఉండడం వలన నరులు, పక్షులు, జంతువులు తమతమ జాతి సహజమైన శత్రుత్వాలను మరచి తిరుగుతూ ఉండడం గమనించాడు. ఆ బృందావనంలో సంపద ఉన్నది. అందులో ఉన్న వారికెవరికీ కామక్రోధాలు లేవు. ఆ బృందావనం చూచిన తరువాత, అందులోనే కృష్ణుని చూడగలిగాడు బ్రహ్మదేవుడు.

సీ. తన కన్యములు లేక తనరారి ముమ్మాల విభుఁడయ్యుఁ గ్రేపుల వెదకువాని
నఖిలజ్ఞుఁడై యొక్కఁడయ్యు నజ్ఞాకృతిఁ జెలికాండ్రఁ బెక్కండ్రఁ జీరువాని
బహిరంతరాద్యంత భావశూన్యుండయ్యు నంతంత నడుగు చొప్పరయువాని
గురుగభీరుండయ్యు గురువులు వాఱుచు నట్టిట్టుఁ బాతరలాడువాని

**ఆ. జాతిరహితుఁ డయ్యుఁ జతుర గోపార్భక, భావ మెల్ల నచ్చుపడిన మేని**
**చెలువువాని హస్త శీతాన్న కబళంబు, వానిఁ గాంచె నపుడు వాణిమగఁడు. 544**

* సృష్టికి మూలములైన త్రిగుణాలకూ ఆధారము, ప్రభువు అయినవాడు; తనకు తాను ఒక్కడే అయినా, లేగలకోసం వెదుకుతున్నాడు కృష్ణుడు సర్వం తెలిసినవాడు, తాను ఒక్కడే సత్యం అయిన వాడైనా ఎందరో స్నేహితులున్నట్లు పిలుస్తున్నాడు. బయట, లోపల, మొదలు, తుద అనే భావాలేవీ లేనివాడైనా అక్కడక్కడ లేగల అడుగుజాడలు వెదకుతున్నాడు, ఎంతో లోతైన వాడు అయినా, పరుగులు తీస్తూ ఇటూ అటూ చూస్తూ అడుగులు వేస్తున్నాడు. అతనికి జాతి అనేది లేదు. అయినా నేర్పరియైన గోపబాలుని లక్ష ణాలన్నీ చక్కగా అచ్చుపోసినట్లు ఉన్న శరీరం అందంగా వెలుగొందుతున్నది. చేతిలో చలిది అన్నపుముద్ద పట్టుకుని ఉన్నాడు. ఇలా అన్ని లక్షణాలు మేళవించిన కృష్ణుని, కేవలం వాక్కుకు మాత్రమే అధిపతియైన బ్రహ్మదేవుడు చూచాడు.

**వ. కని సంభ్రమించి విరించి రాయంచ డిగ్గనుఱికి కనక దండసుకుమారంబైన శరీరంబుతోడ నేలఁ జాఁగిలంబడి మణిగణ సుప్రకాశంబులైన తన కిరీటశిఖరప్రదేశంబు లాకుమారుని పాదపద్మంబులు మోవ మ్రొక్కి తోరంబులగు నానంద బాష్పజలపూరంబుల నతని యడుగులు గడిగి మఱియును.545**

* కృష్ణుని చూడగానే బ్రహ్మ తత్తరపాటుతో హంసవాహనం మీద నుండి దభాలున క్రిందికి దుమికాడు. బంగారు శలాకవలె రంగులీనుతూ ఉండి, సుకుమారంగా ఉన్న తన శరీరంతో నేలపై సాగిలపడ్డాడు. ఎన్నో మణులతో వెలుగుతున్న తన కిరీటాలు కృష్ణుని పాదపద్మాలకు తాకేటట్లు మ్రొక్కాడు. ఆనందబాష్పాలు ధారలుగా కారుతూ ఉండగా అతని అడుగులు కడిగాడు.

**క. అడుగులపైఁ బడు లేచుం, బడుఁ గ్రమ్మఱ లేచు, నిట్లు భక్తిన్ మును తాఁ**
**బొడగనిన పెంపుఁ దలఁచుచు, దుడుకని మహిమాబ్ధి నజుఁడు దుడు కడిచె నృపా! 546**

* పరవశత్వంతో బ్రహ్మదేవుడు కృష్ణుని పాదాలపై పడతాడు, లేస్తాడు, మళ్ళీపడతాడు, మళ్ళీ లేస్తాడు. ఇలా భక్తి పరవశుడై, ఇంతకు ముందు తాను చూచిన విశ్వరూపం తలచుకొని ఆ బాలుని మహిమ అనే మహాసముద్రంలో మునిగి పోయాడు.

**వ. అంత నల్లనల్లన లేచి నిలుచుండి నయనారవిందంబులు దెఱచి, గోవిందుని సందర్శించి చతుర్ముఖుండు ముఖంబులు వంచి కృతాంజలియై దిగ్గన డగ్గుత్తిక యిడుచు నేకచిత్తంబునఁ జతుర్ముఖంబుల నిట్లని స్తుతియించె. 547**

* తరువాత బ్రహ్మదేవుడు నెమ్మదిగా లేచి నిలుచుండి, కనులు తెరచి గోవులను కాస్తూ ఉన్న గోవిం దుని చక్కగా దర్శనం చేసుకున్నాడు. తన ముఖాలను వంచి చేతులు జోడించి, ఏదో మనవి చేయ బోయాడు, డగ్గుత్తిక పడింది. ఏకాగ్రమైన మనస్సుతో నాల్గు ముఖాలతోను ఈ విధంగా స్తుతించాడు.

సీ. శంపాలతికతోడి జలదంబు కైవడి మెఱుఁగు టొల్లియతోడి మేనివానిఁ
గమనీయ మృదులాన్న కబళ వేత్ర విషాణ వేణుచిహ్నంబులు వెలయువానిఁ
గుంజా వినిర్మిత కుండలంబులవాని శిఖిపింఛవేష్టిత శిరమువాని
వనపుష్పమాలికా వ్రాత కంఠమువాని నలినకోమల చరణములవానిఁ

ఆ. గరుణ గడలుకొనిన కడగంటివాని గో, పాలబాలుభంగిఁ బరఁగువాని
నగుమొగంబువాని నను(గన్న తండ్రిని, నిను భజింతు మ్రొక్కి నీరజాక్ష! 548

* మెరపుతీగెతో కూడిన మేఘంవలె నీ శరీరం బంగారు రంగు ఉత్తరీయంతో ప్రకాశిస్తున్నది. నీ చేతిలో ఉన్న చలిదిముద్ద మృదువుగా అందంగా ఉన్నది. వెదురుకర్ర, కొమ్ముబూర, మురళి, మొదలైన వాటితో ప్రకాశిస్తున్నావు. ఏనుగు దంతంతో తయారైన నీ కుండలాలు, నెమలిపింఛంతో చుట్టబడిన నీ శిరస్సు, అడవి పువ్వుల మాలికతో అలంకరించబడిన నీ కంఠం, తామరపువ్వులవలె సున్నితములైన నీ పాదాలు ఎంతో అందంగా ఉన్నాయి. అదిగో కడగంటితో నన్ను చూస్తున్న నీ చూపులో కరుణ తొణికిసలాడుతున్నది. నీ గోపాల బాలుని రూపాన్ని నేను స్తుతిస్తూ ఉంటే నన్ను చూచి నవ్వుతున్న నీ ముఖం చాలా రమణీయంగా ఉన్నది. కమల దళాలవంటి కన్నులు గల నీవు నన్ను కన్న తండ్రివని ఇప్పుడు గుర్తించాను. నీకు మ్రొక్కి నిన్ను సేవించుకుంటున్నాను.

మ. నను మన్నించి భవజ్జనంబులకు నానందంబు నిండించు నీ
తనురూపం బిదె నామనంబున కచింత్యం బయ్యె, నీ యుల్లస
ద్ఘ న విశ్వాకృతి నెవ్వఁడోపు? నెఱుఁగం గైవల్యమై యొప్పు నా
త్మ నివేద్యంబగు నీదు వైభవము చందం బెట్టిదో యీశ్వరా! 549

* ఈశ్వరా! నన్ను అనుగ్రహించు. నీ జనులకు అందరకూ ఆనందం నిండించే నీ ఈ చిన్న రూపమే నా మనస్సుకు ఊహించడానికి సాధ్యము కాకపోయింది. నీవు ఉల్లాసంతో ధరించిన మహా విశ్వరూపాన్ని తెలిసికోవడానికి సమర్థులు ఎవ్వరు? నీ రూపం నీ రూపమే. నాలో 'నేను'గా నున్న నీకు మాత్రమే తెలియదగిన నీ వైభవం ఎంత విశేషమైనదో ఎవరికి తెలుసు?

క. విజ్ఞాన విధము లెఱుఁగక, తదజ్ఞులు నీ వార్తఁ జెప్పఁ దను వాఙ్మనముల్
యజ్ఞేశ! నీకు నిచ్చిన, యజ్ఞులు నినుఁ బట్టి గెలుతు రజితుఁడ వైనన్. 550

* ఎంతటి పండితులైనా తాము వివరించదలచిన దానిని 'అది' అని వివరిస్తారు. శరీరాన్ని, వాక్కును, మనస్సును, ఆపదంతోనే వాడుకుంటారు. అంతేకాని అందులో ఉన్న "నేను" అనబడే నిన్ను తెలుసుకోలేరు. దానిని తెలుసుకోవటమే విజ్ఞానం. దాన్ని పొందే విధానాన్ని గమనించరు. "నేను" అనే అంతర్యామి "అది"అనే తాళంతో బిగించబడి ఉంటుంది. దాన్ని తీసే విధానం వాళ్ళలో ఉన్న "నేను" అనుకునే అహంకారానికి అందదు. అందరిలో ఉన్న 'నేను'గా ఉంటుంది. అంటే అంతర్యామి అయిన నీవుగా ఉంటుంది. అలాంటి నీ అనుగ్రహమే దానిని తెలుసుకొనే మార్గం తప్ప వాళ్ళవాళ్ళ సొంత తెలివి కాదు. ఈ అనుగ్రహం కలిగినప్పుడు ఏమీ తెలియనివాళ్ళు కూడా ఎవరిచేతా జయించని నిన్ను లొంగదీసుకొంటారు.

క. శ్రేయములు గురియు భక్తినిఁ, జేయక కేవలము బోధసిద్ధికిఁ దపముం
జేయుట విఫలము, పొల్లున, నాయము సేకుఱునె తలఁప నధికం బైనన్. 551

* భక్తి అనేది సర్వ శుభాలనూ వర్షిస్తుంది. అటువంటి శక్తిని వదలిపెట్టి కేవలం జ్ఞానం కోసం తపస్సు చెయ్యడం వ్యర్థం. ఎంత ఎక్కువగా కూడబెట్టినా బియ్యంపైన ఉండే ఊకవలన ఏమి ఆదాయం వస్తుంది?

క. నిజముగ ని న్నెఱుఁగఁగ మును, నిజవాంఛలు నిన్నుఁ జేర్చి నీ కథ వినుచున్
నిజకర్మలబ్ధభక్తిన్, సుజనులు నీ మొదలిటెంకిఁ జొచ్చి రధీశా! 552

* నిన్ను తెలుసుకోవడం కోసం ముందుగా తమ కోరికలన్నీ నీ యందు సమర్పించి, నీ కథలు వింటూ ఉండాలి. అప్పుడు తాము చేసిన సత్‌కర్మలకు ఫలితంగా భక్తి అనేది లభిస్తుంది. ఇలా లభించిన భక్తితో సజ్జనులైన వారు నీ మొట్టమొదటి నివాస స్థానాన్ని ప్రవేశించ గలిగారు.

సీ. విక్రియాశూన్యమై విషయత్వమును లేని దగుచు నాత్మాకారమై తనర్చు
నంతఃకరణ మొక్క యధికసాక్షాత్కార విజ్ఞానమునఁ బట్టి వే ఱొరులకు
నెఱుఁగంగ రానిదై యే పొరి యుండుటఁ జేసి నీ నిర్గుణ శ్రీవిభూతి
బహిరంగవీథులఁ బాఱక దిరములై యమలంబులగు నింద్రియములచేత

ఆ. నెట్టకేలకైన నెఱుఁగంగ నగుఁగాని, గుణవిలాసి వగుచుఁ గొమరుమిగులు
నీగుణవ్రజంబు నేర రా దెఱుఁగంగ, నొక్క మితము లేక యుంట నీశ! 553

* నీ నిర్గుణ వైభవంలో ఏ మార్పులూ ఉండవు గనుక తెలియటాని కేమీ ఉండదు. పైగా తనకన్న వేరే లక్ష్యం అంటూ తనకు వెలుపల ఏదీ ఉండదు. దానినే 'తాను' అంటాము. అది అన్నిటిలోపలా అంతర్యామియైన ప్రయోజనంగా ఉంటుంది. అది ఇంద్రియాలకి ఎదుట కనిపించటానికి వీలులేదు. ఎందుకంటే - అంతకు ముందున్న "విజ్ఞానం" అనే అలవాటు ఉన్నప్పుడే ఇంద్రియాలు తెలుసుకోగలవు. అది నీకు తప్ప ఇంకొకళ్ళకి తెలియదు. ఎందుకనగా దానికి అదేగాని "ఇంకొకళ్ళు" ఉండరు. అది యెప్పుడూ వెలుపల కనిపించదు కనుక ఇంద్రియాలను లోపలికి త్రిప్పితే తనకు తాను అనిపిస్తుంది. ఇలా త్రిప్పలుపడి ఎలాగో అలాగ నీ నిర్గుణ తత్త్వాన్ని తెలుసుకోవచ్చు. అది కష్టం అనుకుంటారు గాని, నిజానికి నీ సగుణరూపం తెలుసుకోవటమే అసాధ్యం. నీవు ప్రదర్శించే గుణాలు ఎవరికీ అంతుపట్టవు. నీవు గుణాలతోనుండి మాత్రమే గోచరిస్తూ ఉంటావు. మరి నీ గుణాలకి ఒక లెక్క అంటూ లేదు గనుక నీ కనిపించే రూపాలను తెలుసుకోవటమే అసాధ్యం!

క. తారాతుషారశీకర, భూరజములకైన లెక్క బుధు లిడుదురు, భూ
భారావతీర్ణకరుఁ డగు, నీ రమ్యగుణాలి నెన్న నేర రగణ్యా! 554

* ఆకాశంలో మెరిసే తారలను మంచుతుంపురులను భూమి మీది ధూళికణాలను అయిన లెక్కలు వెయ్యడం సాధ్యం కావచ్చు కాని భూభారాన్ని తగ్గించడానికి అవతరించిన నీ మనోహరమైన గుణాలను ఎంతటి పండితులూ లెక్కపెట్టలేరు. నీవు అన్ని లెక్కలకూ పై నున్న వాడవు.

శా. 'ఏవేళం గృపఁ జూచు నెన్నఁడు హరిన్ వీక్షింతు' నంచాఢ్యుఁడై
నీ వెంటంబడి తొంటి కర్మచయమున్ నిర్మూలముం జేయుచున్
నీవాఁడై తనువాఙ్మనోగతుల ని స్సేవించు విన్నాణి వో
కైవల్యాధిపలక్ష్మి నుద్దవడిఁ దాఁ గైకొన్నవాఁ డీశ్వరా! 555

* ఈశ్వరా! "శ్రీహరి నన్ను ఏనాటికి దయతో చూస్తాడో? ఎప్పుడు నేను శ్రీహరిని చూడగలుగు తానో?''అనే ఆర్తితో ఉన్నవాడు నిజమైన సంపన్నుడు. నీ భక్తుడైనవాడు నీవెంట పడుతాడు. ఆ మార్గంలో ప్రయాణం సాగిస్తూ తన పూర్వకర్మల మొత్తాన్ని మొదలంటా తొలగించుకోగలుగుతాడు. ఇలా చేసుకొని కర్మఫలితాలను నాశనం కాకుండా, వాటికి మూలమైన తన స్వభావంలోని బీజాలనుకూడా తొలగించు కోవాలంటే అతడు 'నీ వాడు' కావాలి. మనస్సుతోనూ, వాక్కుతోను, చేష్టలతోనూ నిన్నే సేవించాలి. అతడు నిజమైన నేర్పరి. అటువంటి నేర్పరికి గాని మోక్షలక్ష్మిని పూర్తిగా అందుకోవడం సాధ్యం కాదు.

ఉ. మాయలు గల్గువారలను మాయలఁ బెట్టెడి ప్రోడ నిన్ను నా
మాయఁ గలంచి నీ మహిమ మానముఁ జూచెద నంచు నేరమిం
జేయఁగ బూనితిం గరుణ సేయుము, కావుము, యోగి రాజ వా
గ్గేయ దవాగ్నిఁ దజ్జనితకీలము గెల్చి వెలుంగ నేర్చునే? 556

* యోగిరాజు లందరూ తమ వాక్కులతోను, పాటలతోను నిన్ను స్తుతిస్తూ ఉంటారు! ఓ గడుసరి వాడా! మాయగలవారిని నీవు మాయలో పడవేస్తూ ఉంటావు. అటువంటి నిన్ను నా మాయతో ఇబ్బందిపెట్టి, నీ మాయను లెక్కవేద్దా మనుకున్నాను. చేతగాని అపచారం చేయడానికి సాహసించాను. ప్రభూ! నన్ను కరుణతో రక్షించు. దావాగ్ని నుండి పుట్టిన ఒక అగ్నిజ్వాల ఆ దావాగ్నిని మించి వెలగ గలగడం సాధ్యమవు తుందా?

సీ. సర్వేశ! నే రజోజనితుండ, మూఢుండఁ, బ్రభుఁడ నేనని వెఱ్ఱిప్రల్లదమున
గర్వించినాఁడను, గర్వాంధకారాంధ నయనుండఁ, గృపఁజూడు ననుఁ, బ్రధాన
మహదహంకృతి నభోమరుదగ్ని జలభూమి పరివేష్టితాండకుంభంబులోన
నేడు జేనలమేన నెనయునే నెక్కడ నీ దృగ్విధాండంబు లేరి కైన?

తే. సంఖ్య సేయంగ రానివి, సంతతంబు, నోలిఁ బరమాణువుల భంగి నొడలి రోమ
వివరములయందె వర్తించు విపులభాతి, నెనయుచున్న నీ వెక్కడ? నెంతకెంత? 557

* సర్వేశ్వరా! నేను రజోగుణమునుండి పుట్టినవాడను. కనుక మోహం చెంది ఉన్నాను. నేనే ప్రభువు ననుకొని వెర్రి అహంకారంతో గర్వించాను. గర్వం అనే చీకటితో నా కన్నులు చీకట్లు క్రమ్మినాయి. ప్రధాన

పురుషుడు, అతనిచుట్టూ మహత్తు, అహంకారము, ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూమి, ఇలా ఒకదాని చుట్టూ మరియొకటి ఆవరించి ఉన్న ఈ బ్రహ్మాండ భాండంలో ఏడు జేనల పొడవున ఉన్న నేనెంతవాడను? వేరికీ లెక్కించ నలవి కానన్ని ఇలాంటి బ్రహ్మాండాలు ఎన్నింటినో నిత్యమూ ఒకదానివెంట ఒకటిగా నీ శరీరంలోని రోమకూపాలలో పరమాణువులుగా ధరిస్తూ ఉన్న నీ వెక్కడ? నే నెక్కడ? ఎక్కడి కెక్కడికి పోలిక?

**తరలము.**

**కడుపులోపల నున్న పాపఁడు గాలఁ దన్నినఁ గిన్కతో**
**నడువఁబోలునె క్రాఁగి తల్లికి? నాథ! సన్నము దొడ్డ నై**
**యడఁగి కారణకార్యరూపమునైన యీ సకలంబు నీ**
**కడుపులోనిది గాదె? పాపఁడఁ గాక నే మఱి యెవ్వఁడన్?** 558

* ప్రభూ! కడుపులో ఉన్నపాపడు కాలితో తన్ని బాధపెట్టినా తల్లి కోపగించి కొట్టదుకదా! సూక్ష్మము, స్థూలము అయి, కారణ రూపము, కార్యరూపము అయిన ఈ సృష్టి అంతా నీ కడుపులోనిది కదా! మరి నేను నీ పాపడనుగాక మరెవ్వడను?

**క. భూరి లయజలధి నిద్రిత, నారాయణ నాభికమల నాళమున నజుం**
**డారయఁ బుట్టె ననుట నిజ, మోరాజీవాక్ష! పుట్టె నోటు తలంపన్.** 559

* "మహాప్రళయ సమయంలో ఆ సముద్ర జలాల నడుమ నిద్రిస్తూ ఉన్న నారాయణుని బొడ్డు తామరనుండి బ్రహ్మదేవుడు పుట్టినాడు"అనే మాట సత్యం. నేను పుట్టినప్పుడే నాతోపాటు నా ఓటమి కూడా పుట్టింది.

**సీ. నళినాక్ష! నీ వాదినారాయణుండవు, జలము నారము జీవచయము నార**
**మందు నీ వుంట నీయం దవి యుంటను నారాయణుండను నామ మయ్యె**
**సకలభూతములకు సాక్షి వధీశుండ, వబ్ధి నిద్రించు నారాయణుఁడవు**
**నీ మూర్తి యది నీకు నిజమూర్తి యనరాదు, నలిననాళముత్రోవ నడచి మున్ను**

**తే. కడఁగి నూఱేండ్లు వెదకి నేఁ గాననయితి, నేకదేశస్థుఁడవు గా వనేక రుచివి**
**జగములో నుందు, నీలోన జగములుండు, నరుఁడు, నీమాయ నెట్లైన నగుచు నుందు.** 560

* తామరరేకులవంటి కన్నులు గలవాడా! నీవు త్రిమూర్తులకూ మూలమైన ఆదినారాయణుడవు. జలములు, ఈ జీవరాసులు నారములు అని పిలువబడుతాయి. నారములలో నీవు ఉండడం వలన నీ యందు అవి ఉండడంవలన నీకు నారాయణుడు అనేపేరు మేము పెట్టుకొన్నాము. అన్ని భూతములు, జీవరాసులు వస్తూపోతూ ఉంటే నీవు సాక్షిగా ఉంటావు. నీవు వాటి కన్నింటికీ అధిష్ఠానమైన ఈశ్వరుడవు.

సముద్రంలో నిద్రించే ఓ నారాయణా! అదే నీ నిజమైన రూపం అనడానికి వీలులేదు. నేను పూర్వం తామరతూడులోపల నడుస్తూ నూరేండ్లు వెదకినా నీ అసలు రూపమేమిటో చూడలేక పోయినాను గదా! నీవు ఒకచోట ఉంటావని చెప్పడానికి వీలులేదు. నీవు ఎన్నో రూపాలు కాంతులు గలవాడవు. సృష్టిలో నీవుంటావు, నీ లోపల సృష్టి ఉంటుంది. నీ మాయా ప్రభావంతో ఏ విధంగానైనా ఉండగలవు.

**మ. వినుమో యీశ్వర! వెల్పలన్ వెలుఁగు నీవిశ్వంబు నీమాయ గా**
**క నిజంబైన యశోద యెట్లు గనియెం? గన్నార నీకుక్షిలోఁ**
**గనెఁ బో క్రమ్మఱఁ గాంచెనే? భవదపాంగశ్రీఁ బ్రపంచంబు చ**
**క్కన లోనౌ, వెలి యౌను, లోను వెలియుం గాదేఁ దదన్యం బగున్? 561**

* ఓ యీశ్వరా! వెలుపల కనిపిస్తూ ఉన్న ఈ విశ్వం అంతా నీ మాయకాక నిజమే అయినట్లయితే యశోద కన్నులారా నీ కడుపులో ఈ విశ్వాన్ని ఎంతో ఏలా చూచింది? చూచిందే అనుకో; మళ్ళీ ఏ నాడైనా చూడగలిగిందా? నీ కడగంటి చూపుతో ఈ ప్రపంచమంతా నీ లోపలా ఉంటుంది. నీ బయటా ఉంటుంది. లోపల, వెలుపల కాకపోతే మూడవది లోపల, వెలుపలకూడా అవుతుంది.

**మ. ఒకఁడై యుంటివి, బాలవత్సములలో, నొప్పారి తీ వంతటన్**
**సకలోపాసితులౌ చతుర్భుజులునై సంప్రీతి నేఁ గొల్వఁగాఁ**
**బ్రకట శ్రీగలవాఁడ వైతి, వటుపై బ్రహ్మాండముల్ సూపి యొ**
**ల్లక యిట్లొక్కఁడ వైతి నీవివిధ లీలత్వంబుఁ గంటిం గదే? 562**

* మొదట నీ వొక్కడవే ఉన్నావు. తరువాత గోపబాలురలో లేగదూడలలో వెలుగొందావు. ఆ తరువాత అందరిచేత నమస్కారాలు అందుకొంటున్న చతుర్భుజులైన విష్ణువుల రూపాలలో కనిపించి, నన్ను ఆనందపరచి, నీ వైభవాన్ని చక్కగా ప్రదర్శించావు. ఆ తరువాత బ్రహ్మాండాలన్నీ చూపించావు. తరువాత అది ఇష్టం లేక మళ్ళీ ఇప్పుడు ఇలా ఒక్కడవుగా కనిపిస్తున్నావు. ఆహా! ఇన్నాళ్ళకు నీవు ఇన్ని రకాల లీలలు చూపడం చూచానుగదా!

**క. ఎఱుఁగని వారికిఁ దోఁతువు, నెఱిఁ బ్రకృతిం జేరి జగము నిర్మింపఁగ నా**
**తెఱఁగున రక్షింపఁగ నీ, తెఱఁగున బ్రహరింప రుద్రు తెఱఁగున నీశా! 563**

* నీవు ప్రకృతితోకూడి జగత్తును నిర్మిస్తున్నప్పుడు నావలెనూ, రక్షిస్తూ ఉన్నప్పుడు నీ వలెను, లయం చేస్తూఉన్న సమయంలో రుద్రునివలెనూ ఆ అజ్ఞానులకు కనిపిస్తావు.

**క. జలచర మృగ భూసుర నర, కులముల జన్మించి తీవు కుజనులఁ జెఱుపం**
**జెలిమిని సుజనుల మనుపను, దలపోయఁగ రాదు నీవిధంబు లనంతా! 564**

* నీవు దుర్మార్గులను శిక్షించడానికీ, సజ్జనులను ప్రేమతో రక్షించడానికీ, జలచరములుగా, మృగ ములుగా, బ్రాహ్మణులుగా, సాధారణ మానవులుగా ఎన్నో అవతారాలు ఎత్తావు. నీ మార్గాలు ఈ విధాలుగా ఉంటాయని ఊహించడం సాధ్యం కాదు. నీ వలెనే నీ మార్గాలుకూడ అంతం లేనివి.

ఆ. బ్రమ్ముగొలిపి యోగమాయ నిద్రించిన, యో పరాత్మభూమ! యోగిరాజ!
యే తెఱంగు లెన్ని యెప్పు డెచ్చోట నీ, హేల లెవ్వఁ డెఱుఁగు నీశ్వరేశ! 565

* నీ కన్న ఇతరులుగా జీవిస్తున్న జీవులందరూ ఎవరికి వారు 'నేను' అనీ మిగిలిన వారిని 'వారు' అనీ అనుకుంటున్నారు. వారందరిలో ఉన్న 'నేను' నివాసంగా నీవు ఉన్నావు. దానిని దర్శించటానికి సాధన చేసే వారే యోగులు. వారి యోగంగా వారిలో వెలుగుతూఉన్నది నీవే! మిగిలినవారు ఈ నీయందు మరుపుకలిగి ఉంటారు. తాము ఉన్నామనే తెలివి మైకంగా కప్పుతుంది. ఈ మైకాన్ని కలిగించి నీవు లోపల ఉంటే వారికి నీవు నిద్రిస్తున్నట్లు ఉంటావు. అలాంటి యోగనిద్రలో ఉన్న నీ లీలలు ఎవరికి తెలిసినాయి, ఎప్పుడు తెలిసి నాయి, ఎక్కడ తెలిసినాయి?

సీ. అది గాన నిజరూప మనరాదు, కలవంటిదై బహువిధదుఃఖమై విహీన
సంజ్ఞానమై యున్నజగము సత్సుఖబోధ, తనుఁడవై తుదిలేక తనరు నీదు
మాయచేఁ బుట్టుచు మనుచు లే కుండుచు నున్న చందంబున, నుండుచుండు,
నొకఁడ, వాత్ముఁడ, వితరోపాధిశూన్యుండ, వాద్యుండ, వమృతుండ, వక్షరుండ,

ఆ. వద్వయుండవును, స్వయంజ్యోతి, వాపూర్ణుఁ, డవు, పురాణపురుషుఁడవు, నితాంత
సౌఖ్యనిధివి, నిత్యసత్యమూర్తివి, నిరం, జనుఁడ వీవు, దలఁపఁ జనునె నిన్ను? 566

* కనుక ఇది నీ అసలురూపం అని అనరాదు. ఈ జగత్తు అంతా కలవంటిది. ఎన్నో రకాల దుః ఖాలు కలది; అజ్ఞానంలో మునిగి ఉన్నది. అటువంటి జగత్తుఅంతా నీ మాయచేత పుట్టుతూ, ఉంటూ, లేకుండా పోతూ ఉన్నట్లు అనిపిస్తుంది. నీవు మాత్రం సత్యం. అంతము అంటూ లేనివాడవు నీవు ఒక్కడవే! ఆత్మస్వరూపుడవు నీవు; మరో శరీరం అక్కర లేనివాడవు; నీవే అంతటికీ మొదటి వాడవు; అంతము లేని వాడవు. తరిగిపోవడం అంటూ ఉండని వాడవు. నీకు సాటి రెండవవాడు లేడు. నీయంత నీవు వెలుగుతూ ఉన్నావు; మొదటినుండీ సర్వమూ నీలోనే ఉన్నవాడవు; ప్రాచీనులలోకెల్లా ప్రాచీనుడవైన మొట్ట మొదటి పురుషుడవు నీవే. నిరంతరమైన, సంపూర్ణమైన సుఖమునకు నిధానమైనవాడవు నీవు. సమస్త సృష్టికీ నిత్యమూ ఆధారమైన సత్యము నీవే! షోడశ కళాపూర్ణ స్వరూపుడవు నీవు. ఇటువంటి నిన్ను మనస్సుతో ఆలోచించాలంటే సాధ్యమా?

వ. దేవా! యిట్టి నీవు జీవాత్మ స్వరూపకుండవును, సకలాత్మలకు నాత్మయైన పరమాత్మ స్వరూపకుండవు నని యెవ్వ రెఱుఁగుదురు, వారు గదా గురువనియెడు దినకరుని వలనఁ బ్రాప్తంబైన యుపనిషదర్థజ్ఞానం బను సునేత్రంబునంజేసి సంసార మిథ్యాసాగరంబుఁ దరించిన చందంబున నుండుదురు, రజ్జువందు రజ్జువని యెఱింగెడి యెఱుక లేకుండ, న య్యెఱుంగమి నది సర్పరూపంబయి తోఁచిన పిదప నెరింగినవారి వలన రజ్జువు రజ్జువని యెఱుంగుచుండ, సర్పరూపంబు లేకుండు కైవడి, నాత్మ య ప్పరమాత్మయని యెవ్వరెఱుంగరు వారి కయ్యెఱుంగమివలన సకల ప్రపంచంబుఁ గలిగి తోఁచు,

**నాత్మ య ప్పరమాత్మయని యెవ్వరెఱుంగుదురు, వారి కయ్యేఱుకవలనఁ బ్రపంచంబు లేకుండు, నజ్ఞానసంభావిత నామకంబులైన సంసార బంధమోక్షంబులు, జ్ఞానవిజ్ఞానంబులలోనివి గావు! కావునఁ గమలమిత్రున కహోరాత్రంబులు లేని తెఱంగునఁ, బరిపూర్ణజ్ఞానమూర్తి యగు నాత్మయందు నజ్ఞానంబులేమిని బంధంబును సుజ్ఞానంబు లేమిని మోక్షంబును లే, వాత్మవైన నిన్ను దేహాదికంబని తలంచియు, దేహాదికంబు నిన్నుఁగాఁ దలంచియు, నాత్మ వెలి నుండు నంచు మూఢులు మూఢత్వం బున వెదకుచుందురు, వారి మూఢత్వంబుఁ జెప్ప నేల? బుద్ధిమంతులై పరతత్త్వంబు గాని జడంబును నిషేధించుచున్న సత్పురుషులు తమ శరీరంబులయందు నిన్నరయుచుందు రది గావున. 567**

* ఓ దేవా! ఇటువంటి నీవు జీవాత్మ స్వరూపుడవనీ అన్ని ఆత్మలకు ఆత్మయైన పరమాత్మ స్వరూపుడ వనీ గ్రహించ గలిగిన వారు గురువు అనే సూర్యుని వలన ఉపనిషత్తుల జ్ఞానం అనే కన్నును పొందినవారు. అటువంటివారు సంసారమనే ఈ మాయ సముద్రాన్ని దాటినట్లు కనుపిస్తారు. త్రాటిని చూచినపుడు అది త్రాడే అనే జ్ఞానం లేకపోవడం వలన అది పాములాగా కనబడుతుంది. తరువాత తెలిసిన వారివలన అది త్రాడే అని తెలుసుకొన్న తర్వాత ఇంక పాము అనే రూపం ఉండదు. అలాగే తనలో నున్న ఆత్మయే పర మాత్మయని తెలియనివారికి ఈ ప్రపంచమంతా ఉన్నట్లుగా కనిపిస్తుంది. తరువాత తాను ఆత్మ అనీ, ఆత్మయే పరమాత్మ అనీ తెలిసిన తరువాత, వారికి ఆ జ్ఞానం కారణంగా ఈ ప్రపంచమంతా తనకు కని పించినదే అనీ, నిజంగా అక్కడ ఏమీ లేదని తెలుస్తుంది. సంసార బంధము అనేది అజ్ఞానం వలన పుట్టి నది. సంసార మోక్షం కూడా అజ్ఞానం వలననే పుట్టినది. ఈ బంధమోక్షాలు జ్ఞానవిజ్ఞానాలలోనికి చేరవు. సూర్యుని చుట్టూ భూమి పరిభ్రమణం వలన మనకు రాత్రింబవళ్ళు ఉన్నాయి గాని, సూర్యునికి రాత్రి, పగలు లేవు. అలాగే సంపూర్ణుడైన జ్ఞానస్వరూపుడైన ఆత్మకు అజ్ఞానం లేనందువల్ల బంధమోక్షాలు ఉండవు. ఆత్మవైన నిన్ను శరీరమనీ, శరీరాదులు నీవనీ భావించేవారు, శరీరానికి బయట ఎక్కడో ఆత్మ ఉంటుంద నుకునే వారు మూఢులు. అంటే మోహం చెందినవారు, ఆ మోహంలోనే పడి ఆత్మకోసం వెదకు లాడుతూ ఉంటారు. వారి మూఢత్వం "ఇంత"అని చెప్పడమెందుకు? జడపదార్థంలోకూడా పరమాత్మనే దర్శనం చేసేవారు బుద్ధిమంతులైన సత్పురుషులు. వారు తమ శరీరాలలోనే నిన్ను చూడగలుగుతూ ఉంటారు.

**శా. దేవా! నీచరణ ప్రసాద కణలబ్ధిం గాక లేకున్న నొం**
**డేవెంటం జను నీ మహామహిమ నూహింపంగ నెవ్వారికిన్?**
**నీవారై చనువారిలో నొకఁడనై నిన్ గొల్చు భాగ్యంబు నా**
**కీవే యిప్పటి జన్మమం దయిన నొం డెం దైన నోయీశ్వరా! 568**

ఓ ప్రభూ! నీ మహామహిమను ఊహించాలంటే, నీ పాదములనుండి అనుగ్రహింపబడిన ధూళికణం వలన మాత్రమే సాధ్యం కాని, లేకపోతే ఎవరికి సాధ్యం? నీ వారుగా జీవించగల ధన్యులలో నేను ఒకడనుగా ఉండి నిన్ను సేవించుకునే భాగ్యాన్ని నాకు ప్రసాదించు. ఈశ్వరా! ఈ జన్మలో కాకపోతే మరో జన్మలోనైనా సరే ఆ మహాభాగ్యం నాకు ప్రసాదించు.

తరలము.

క్రతుశతంబులఁ బూర్ణకుక్షివి, కాని నీ విటుక్రేపులున్
సుతులునై చనుఁబాలు ద్రావుచుఁ జొక్కియాడుచుఁ గౌతుక
స్థితిఁ జరింపఁగఁ దల్లులై విలసిల్లు గోవుల గోపికా
సతుల ధన్యత లెట్లు సెప్పఁగఁ జాలువాఁడఁ గృపానిధీ! 569

* ఓ కృపానిధీ! నీవు యజ్ఞపురుషుడవు. వందలకొద్దీ యజ్ఞాలు నీ కడుపులో దాగి ఉన్నాయి. అయినా నీవు ఈ విధంగా లేగలుగానూ, గోపబాలురుగానూ రూపాలు ధరించే ఉన్నావు. గోవులవద్ద గోపికలవద్ద నీవు పాలుత్రాగి పరవశిస్తూ, ఆటలు ఆడుతూ, ఎంతో ఉత్సాహంతో సంచరిస్తున్నావు. నీకు తల్లులు కాగ లిగిన ఆ గోవులు, గోపికలు ఎంత పుణ్యం చేసుకున్నారో ఎలా చెప్పగలను? నీవు కరుణామయుడవు కనుకనే ఆ గోవులు, గోపికలు అంత ధన్యత్వాన్ని అందుకోగలిగారు.

క. పరిపూర్ణంబుఁ బురాణముఁ, బరమానందంబునైన బ్రహ్మమె చెలికాఁ
డరు దరుదు నందఘోష, స్థిరజనముల భాగ్యరేఖ చింతింపంగన్. 570

* అంతా తనయందు ధరించినది, అన్నిటికీ మొదటిది, పరమానంద స్వరూపము అయిన పరబ్రహ్మమే ఈ నందగోపకులంలోని జనులకు చెలికా డైనాడట! ఆహా! ఇది ఎంత అపురూపమైన విషయం! వీరి భాగ్యరేఖ ఎంత అద్భుత మైనదో ఊహించడం కూడా విధాతనైన నాకే సాధ్యం కావడంలేదు.

సీ. ఏకాదశేంద్రియాధీశులు చంద్రాదు లేను ఫాలాక్షుండు నిట్లు సూడఁ
బదుముప్పురము నెడపడక యింద్రియపాత్రముల నీ పదాంభోజముల మరంద
మమృతంబుగాఁ ద్రావి యమర నేకైకేంద్రి యాభిమానులమయ్యు నతికృతార్థ
భావుల మైతిమి, పరఁగ సర్వేంద్రియ వ్యాప్తులు నీ మీఁద వ్రాల్చి తిరుగు

తే. గోపగోపికా జనముల గురు విశిష్ట, భాగ్య సంపదఁ దలపోసి ప్రస్తుతింప
నలవిగా దెవ్వరికి నైన నంబుజాక్ష! భక్తవత్సల! సర్వేశ! పరమపురుష! 571

* సర్వేశ్వరా! పరమపురుషా! చంద్రుడు మొదలైన పదునొకండు ఇంద్రియాలకు అధిపతులు, నేను, శివుడు ఈ పదుముగ్గుర మే నీ యందు ఏమరుపాటు చెందకుండా ఉన్నవారము. మేము మా మా ఇంద్రియాలు అనే పాత్రలలో నీ పాదపద్మములనుండి పుట్టిన మకరందాన్ని అమృతంవలె త్రాగుతున్నాము కనుకనే ఒక్కొక్క ఇంద్రియానికి వేరువేరుగా అధిపతులమైనాము. ఎంతో ధన్యులమైనాము. అటువంటిది అన్ని ఇంద్రియాల ప్రవృత్తులూ నీ పైననే ఉంచుకో గలుగుతున్న గోపగోపికల భాగ్యం ఎంత గొప్పదో, ఎంత విశిష్టమైనదో? దానినిగురించి ఆలోచించడానికి గాని, స్తోత్రం చేయడానికి గాని ఎవరికీ సాధ్యంకాదు. పుండరీకాక్షా! నీవు భక్తులయెడల వాత్సల్యం కలవాడవు గనుకనే గోపగోపీజనులకు ఇంతటి భాగ్యం లభించింది.

శా. 'ఏలా బ్రహ్మపదంబు? వేదములకున్ వీక్షింపఁగా రాని ని
న్నీలోకంబున నీవనాంతరమునం దీమందలోఁ గృష్ణ యం
చాలాపాది సమస్త భావములు నీ యందే సమర్పించు నీ
ప్రేలం దొక్కని పాదరేణువులు పై వేష్టించినం జాలదే? 572

* "వేదాలు నిన్ను గురించి చెబుతాయె గాని నిన్ను దర్శించలేవుగదా! అటువంటి నిన్ను ఈ భూలోకంలో, ఈ అడవిలో, ఈ గోకులంలో సహచరుడుగా పొందగలిగారు ఈ గోపకులు! 'కృష్ణా! కృష్ణా!' అంటూ మాటల దగ్గరనుంచీ అన్ని భావాలూ నీయందే సమర్పించుకుంటున్నారు. ఈ గొల్లలలో ఒక్కని పాదరేణువులలో ఒక్కకణం నా శిరస్సుపైన ధరించ గలిగితే చాలదా? ఈ బ్రహ్మపదవి ఎందుకయ్యా నాకు!"

మ. నిను హింసించిన పూతనాదులకు మున్ నీ మేటిసంకేత మి
చ్చిన నీకుం బుర దార పుత్ర గృహ గో స్త్రీ ప్రాణ దేహాదు లె
ల్లను వంచింపక యిచ్చు గోపకులకున్ లక్షింప నే మిచ్చెదో!
యని సందేహము దోఁచుచున్నది ప్రపన్నానీక రక్షామణీ! 573

* భక్తుల కందరికీ రక్షామణివైన ఓ కృష్ణా! నిన్ను చంపదలచి వచ్చిన పూతన మొదలైన రాక్షసులకే అద్భుతమైన మోక్షాన్ని ప్రసాదించావు. అటువంటి నీకు గోపకులందరూ తమ ఊరిని, భార్యలను, పుత్రులను, ఇండ్లను, గోవులను, ఇతర స్త్రీలను, ప్రాణాన్ని, శరీరం మొదలైన వాటిని అన్నింటినీ సందేహం లేకుండా సమర్పణ చేసుకున్నారు. అటువంటి వారికి ఆ మోక్షం కన్నా ఇంకా ఎక్కువైనది ఏమి ఇస్తావో అని నాకు సందేహం కలుగుతూ ఉంది.

క. దేహము కారాగేహము, మోహము నిగళంబు, రాగముఖరములు రిపు
వ్యూహములు భక్తి తో ని, న్నూహింపని యంతదడవు నో కమలాక్షా! 574

* కమలములవంటి కన్నులుగల కృష్ణా! భక్తితో నిన్ను స్మరించనంత కాలమూ ఎవరికైనా శరీరం కారాగారమూ, మోహము అనేది సంకెళ్ళూ, రాగద్వేషాదులు శత్రువ్యూహాలూ అవుతాయి.

ఆ. ఆశ్రయించు జనుల కానందసందోహ, మీఁ దలంచి వివిధ హేలతోడ
నప్రపంచకుండ వయ్యుఁ బ్రపంచంబు, వెలయఁజేయు దీవు విశ్వమూర్తి! 575

* విశ్వమంతటా అంతర్యామిగా ఉన్న విశ్వమూర్తీ! నీకు ప్రపంచం అంటూ నిజంగా లేదు. అయినా నిన్ను భక్తితో ఆశ్రయించిన జనులకు ఆనందాన్ని ప్రసాదించటానికి ఎన్నో విలాసములతో ఈ ప్రపంచాన్ని సృష్టించి నడుపుతూ ఉంటావు.

**క. ఎఱిఁగినవార లెఱుంగుదు, రెఱుఁగన్ బహుభాష లేల? యీశ్వర! నీ పెం**
**పెఱుఁగ మనోవాక్కులకున్, గుఱి సేయం గొలఁది గాదు గుణరత్ననిధీ! 576**

* ఈశ్వరా! నిన్ను తెలియవలెనంటే, అది ఎలాగో జ్ఞానులకే తెలుసు. ఇన్నిమాట లెందుకు? నీ గొప్ప తనం తెలుసుకోవడానికి మనస్సునుగానీ, వాక్కునుగానీ ఉపయోగించడం కష్టంగా ఉంది. ఈ సృష్టిలోని సమస్త గుణరత్నాలూ నీ యందే జన్మిస్తున్నాయి.

**క. సర్వము నీవ యెఱుంగుదు, సర్వవిలోకనుఁడ వీవ, జగదధిపతివిన్,**
**సర్వాపరాధు నను నో, సర్వేశ! యనుగ్రహింపు, చనియెద నింకన్. 577**

* సర్వేశ్వరా! అన్నీ నీవే ఎఱుగుదువు. నీవు అన్నీ చూడగలిగిన వాడవు. ఈ జగత్తు అంతటికీ అధిపతివీ నీవే! అన్ని విధాలైన అపచారాలూ చేసిన నన్ను మన్నించి అనుగ్రహించు. నేనింక సెలవు తీసుకుంటాను.

**క. జిష్ణు! నిశాటవిపాటన!, వృష్ణికులాంభోజసూర్య! విప్రామర గో**
**వైష్ణవసాగరహిమకర!, కృష్ణా! పాషండధర్మగృహదావాగ్నీ! 578**

* కృష్ణా! నీవు సాక్షాత్తూ విష్ణుమూర్తివి! రాక్షసులను సంహరించడానికి అవతరించావు. వృష్ణికులము అనే తామరపూవును వికసింపజేసే సూర్యుడవు నీవు. బ్రాహ్మణులు, దేవతలు, గోవులు, విష్ణుభక్తులు అనే పాలసముద్రంలో ప్రభవించి వారిని సంతోషింపజేసి చల్లగా చూచే చంద్రుడవు నీవు. ఈ అవతారంలో ప్రత్యేకంగా వేదాలకు విరుద్ధమైన పాషండ ధర్మం అనే ఇంటిని దహించే అగ్ని హోత్రుడవు.

**వ. దేవా! నీకుఁ గల్పపర్యంతంబు నమస్కరించెద నని యివ్విధంబున సంస్తుతించి మువ్మాఱు వల గొని పాదంబులపైఁ బడి వీడ్కొని బ్రహ్మ దన నెలవునకుం జనియె, నతని మన్నించి భగవంతుండైన హరి తొల్లి చెడి తిరిగి వచ్చిన వత్స బాలకులం గ్రమ్మఱం గైకొని పులినంబుకడఁ జేర్చె, నిట్లు. 579**

* దేవా! నా ఈ ఆయుర్దాయం ఉన్న అన్నిరోజులూ (ఈ కల్పమంతా) నీకు నమస్కరిస్తూనే ఉంటాను - అని స్తుతించి బ్రహ్మదేవుడు మూడుమార్లు కృష్ణునకు ప్రదక్షిణం చేసి, పాదాలకు మ్రొక్కి, సెలవు తీసికొని తన సత్యలోకానికి వెళ్లిపోయాడు. కృష్ణుడు అతనిని క్షమించి గౌరవించాడు. ఇంతకు ముందు మాయమై తిరిగివచ్చిన లేగలనూ, గోపబాలకులనూ మళ్ళీ ఇసుక తిన్నెలవద్దకు చేర్చాడు.

**క. క్రించుఁ దనంబున విధి దము, వంచించిన యేఁడు గోపవరనందను లొ**
**క్కించుక కాలంబుగ నీ, క్షించిరి రాజేంద్ర! బాలకృష్ణుని మాయన్. 580**

* మహారాజ! ఈ విధంగా బ్రహ్మదేవుడు తమను దాచిపెట్టి మోసగించిన ఏడాది కాలాన్నీ కృష్ణునిమాయ కారణంగా గోపబాలకులు కొద్దిసేపుగా భావించారు.

**ఆ. ఏ మహాత్ము మాయ నీవిశ్వమంతయు, మోహితాత్మక మయి మునిఁగి యుండు**
**నట్టి విష్ణుమాయ నర్భకు లొక్క యేఁ, డెఱుఁగ కుండి రనుట యేమి వెఱఁగు? 581**

* మహాత్ముడైన విష్ణుదేవుని మాయవలన ఈ విశ్వమంతా మోహంలో మునిగిపోయి ఉంటుంది. అటువంటి విష్ణుమాయవలన గోపబాలకులు ఏడాది కాలాన్ని తెలుసుకోలేకపోయినారంటే అందులో ఆశ్చర్యమేముంది?

**వ. అప్పుడు. 582**

**మ. 'చెలికాఁడా! యరుదెంచితే యిచటికిన్? సేమంబునం గ్రేపులున్**
**నెలవుల్ సేరె నరణ్యభూమివలనన్ నీ వచ్చునందాఁకఁ జ**
**ల్దులు వీ రించుక యెవ్వరుం గుడువ, రాలోకింపు, ర' మ్మంచు నా**
**జలజాక్షుండు నగన్ భుజించి రచటన్ సంభాషలన్ డింభకుల్. 583**

* అప్పుడు ఇసుకతిన్నెలపైన కూర్చొని చల్దులు ఆరగిస్తూ నడుమంతరంగా ఆపుచేసిన గోపబాలురు కృష్ణుని చూచి యిలా అన్నారు, "చెలికాడా! వచ్చావా? ఇదుగో లేగదూడలు అరణ్యమధ్యంలోనుండి ఇప్పుడే తిరిగి వచ్చేశాయి. నీవు తిరిగి వచ్చేవరకూ మాలో ఎవరమూ చల్దులు తినలేదు చూడు! త్వరగా రా, తిందాము!"అంటూ పిలిచారు. కృష్ణుడు నవ్వుతూ వచ్చి వారిమధ్య కూర్చోగానే, అందరూ కబుర్లు చెప్పుకుంటూ చల్దులు ఆరగించారు.

**వ. ఇట్లు బాలకులతోడఁజల్ది గుడిచి వారలకు నజగర చర్మంబు సూపుచు వనంబు నుండి తిరిగి. 584**

* ఈ విధంగా కృష్ణుడు చల్దులు ఆరగించి, వారికి కొండచిలువ చర్మం చూపుతూ వనంలోనుండి తిరిగి బయలుదేరాడు.

**పంచచామరము.**
**ప్రసూనపింఛమాలికా ప్రభావిచిత్రితాంగుఁడుం**
**బ్రసిద్ధ శృంగ వేణునాద పాశబద్ధ లోకుఁడుం**
**బ్రసన్న గోప బాలగీత బాహువీర్యుఁ డయ్యు ను**
**ల్లసించి యేఁగె గోపకుల్ సెలంగి చూడ మందకున్. 585**

* శ్రీకృష్ణుడు తలలో అడవిపూలు, నెమలిపింఛం ధరించాడు. వాటి రకరకాల కాంతులు అంతటా ప్రతిఫలించి అతని శరీరభాగాలను అలంకరిస్తున్నాయి. కృష్ణుని కొమ్ముబూరా మ్రోత, అతని వేణుగానం అందరికీ పరిచయమైనవి. అవి వినబడగానే లోకమంతా పరవశమై ఆకర్షించబడుతుంది. గోపబాలురు సంతోషంతో అతని బాహుబలాన్ని స్తోత్రం చేశారు. కృష్ణుడు గోపబాలురతోకూడి ఉల్లాసంతో మందకు చేరుకుంటూ ఉంటే గోపకులందరూ సంతోషంతో వారిని ఆదరించారు.

**వ. ఆ సమయంబున. 586**

**క. పెనుఁబాము దమ్ముఁ ద్రింగిన, మన నందసుతుండు పాము మర్దించి మమున్**
**మనిచె నరణ్యములోపల, నని ఘోషించిరి కుమారు లాఘోషములోన్. 587**

* అప్పుడు గోపబాలకులు గోకులంలో అడుగు పెడుతూనే అందరికీ వినిపించేటట్లు కేకలువేస్తూ, "మన నందగోపుని కుమారుడు అడవిలో ఒక పెద్దపామును చంపి, మమ్ములను అందరినీ రక్షించాడు" అని చాటి చెప్పారు.

**వ.** అనిన విని నరేంద్రుం డిట్లనియె. **588**

**క.** 'కని మనిచి యెత్తి పెంచిన, తనుజన్మలకంటె నందతనయుం డా ఘో
ష నివాసులకు మనోరం, జనుఁ డెట్లయ్యెను? బుధేంద్ర! చను నెఱిఁగింపన్' **589**

* శుకయోగి ఈ విధంగా చెప్పగానే పరీక్షిన్మహారాజు ఇలా అన్నాడు.

"మునీంద్రా! గోకులంలోని జనులకు తాము కనిపెంచిన తమ బిడ్డలకన్నా కృష్ణుడు ప్రేమపాత్రుడు ఎలా అయినాడు? నీవు జ్ఞానులలో శ్రేష్ఠుడవు. నాకు వివరించడం నీకే సాధ్యపడుతుంది."

**వ.** అనిన శుకుం డిట్లనియె. **590**

* పరీక్షిన్మహారాజు ఇలా అడుగగానే శుకమహర్షి ఈ విధంగా చెప్పసాగాడు.

**సీ.** అఖిల జంతువులకు నాత్మవల్లభమైన, భంగి బిడ్డలు నిండ్లుఁ బసిఁడి మొదలు
వస్తువు లెవ్వియు వల్లభంబులు గావు, సకలాత్మకుండైన జలజనేత్రుఁ
డఖిల జంతువులకు నాత్మ గావున ఘోష వాసుల కెల్లను వల్లభత్వ
మునను మిక్కిలి యొప్పె మూఁడులోకములకు హితము సేయఁగ జలజేక్షణుండు

**ఆ.** మాయతోడ మూర్తి మంతుఁడై యొప్పారుఁ, గలఁడతండు నిఖిల గణములందు
భవతిధాతు వెట్లు భావార్థమై సర్వ, ధాతు గణమునందుఁ దనరు నట్లు. **591**

* అన్ని జీవరాసులకూ తనకు "తాను" ఇష్టమైనట్లు, బిడ్డలుగగానీ, ఇండ్లుగాగాని, బంగారం మొదలైన వస్తువులుగాగానీ ప్రియమైనవి కావు. అన్నిటియందు ఆత్మగా ఉన్న విష్ణువు అన్ని జీవరాసులలో ఆత్మస్వరూపుడుగా ఉన్నాడు. కనుకనే గోకులనివాసుల కందరికీ ప్రియుడుగా చక్కగా వెలుగొందుతున్నాడు. పద్మములవంటి కన్నులు గల విష్ణువు మాయతో కలిసి ఒక రూపం ధరించి ప్రకాశిస్తున్నాడు. ఇదంతా మూడు లోకాలకూ మేలు చేయడానికే. క్రియలను తెలిపే అన్నిధాతువులకూ "భవతి" అనే ధాతువు భావంగా అంతర్లీనమై ఉంటుంది. (ఉండుట అనేది లేకపోతే క్రియ ఏదీ ఉండనే ఉండదు). అలాగే చరాచర సృష్టిలోని అన్నిటియందూ విష్ణువు ఉన్నాడు.

**క.** శ్రీపతి పదమను నావను, బ్రాపించి భవాబ్ధి వత్సపదముగ ధీరుల్
రూపించి దాఁటి చేరుదు, రాపత్పద రహితు లగుచు నమృతపదంబున్. **592**

* బుద్ధిమంతు లైనవారు శ్రీహరిపాదము అనే నావను ఆధారంగా చేసుకొని, సంసారం అనే సముద్రాన్ని ఒక లేగదూడ అడుగును అంగవేసి దాటినంత తేలికగా దాటి, ఆపద అనేస్థితిని పొందకుండా, అమృత స్థితిని చేరుకుంటారు. అంటే తనలోని 'నేను' మరణం లేనిదని గ్రహిస్తారు.

**ఆ. అఘునిఁ జంపి కృష్ణుఁ డాప్తులుఁ దానును, జల్ది గుడిచి జలజసంభవునకుఁ**
**జిద్విలాసమైన చెలువు సూపిన కథఁ, జదువ వినినఁ గోర్కి సంభవించు. 593**

* శ్రీకృష్ణుడు అఘాసురుని సంహరించడం, ఆప్తులైన గోపబాలురతో కూడి చల్ది అన్నం ఆరగించడం, బ్రహ్మకు తానే అన్నిటియందూ అన్ని రూపాలలో ఉండటం అనే తన లీలలు చూపడం మొదలుగా గల ఈ కథను ఎవరు చదివినా, ఎవరు విన్నా వారు కోరిన కోరిక తీరుతుంది.''

**వ. అని చెప్పి మఱియు వ్యాసనందనుం డిట్లనియె. 594**

* ఇలా చెప్పి వ్యాసుని కుమారుడైన శుకయోగి ఇంకా ఇలా అన్నాడు.

**క. రాగంబున బలకృష్ణులు, పౌగండవయస్సు లగుచుఁ బశుపాలకతా**
**యోగంబున బృందావన, భాగంబునఁ గాచి రంతఁ బశువుల నధిపా! 595**

* బలరామ కృష్ణులు ఆ విధంగా పౌగండ వయస్సు గలవారై, ఆసక్తితో పశువులనూ మేపుతూ, గోపబాలురతో కలసి బృందావనంలో విహరించారు.

**వ. అయ్యెడఁ గృష్ణుం డొక్కనాఁడు రేపకడ లేచి, వేణువు పూరించి బలభద్ర సహితుండై గోపకుమారులు దన్ను బహువారంబులు గైవారంబులు సేయ మ్రోల నాలకదుపుల నిడికొని నిరంతర ఫల కిసలయ కుసుమంబులును, గుసుమ మకరంద నిష్యంద పానానందదిందిందిర కదంబంబును, గదంబాది నానాతరు లతా గుల్మసంకులంబును, గులవిరోధరహిత మృగపక్షి భరితంబును, భరితసరస్సరోరుహ పరిమిళిత వనంబును నయిన వనంబుఁ గని యందు వేడుకం గ్రీడింప నిశ్చయించి వెన్నుం డన్న కిట్లనియె. 596**

* ఒకనాడు కృష్ణుడు సూర్యోదయానికి ముందే మేల్కొని, వేణుగానం చేశాడు. గోపకుమారు లందరూ వెంటనే మేల్కొని, లేగల మందలను తోలుకొని కృష్ణునివద్దకు చేరారు. కృష్ణుడు బలరామునితో కలసి గోప బాలకులు తనను పదే పదే పొగడుతూ ఉండగా, ఆవుల మందలను తోలుకుంటూ అడవికి బయలు దేరాడు. ఆ అడవిలో అన్ని ఋతువులలోనూ పళ్లు, పూలు, చిగుళ్లు లభిస్తాయి. పూవులలో తేనెలు పొంగి పొరలుతూ ఉంటే ఆ తీయ తేనెలను త్రాగడానికి వచ్చి, ఝుమ్మ ఝుమ్మని ధ్వనులు చేసే తుమ్మెదల గుంపులు ఆనందం కలిగిస్తూ ఉన్నాయి. కడిమి మొదలైన అనేకవిధాల చెట్లు, తీగెలు, పొదరిళ్ళు ఆ అడవి నిండా అడుగడుగునా ఉన్నాయి. అక్కడి జంతువులు, పక్షులు తమ తమ జాతి సహజములైన శత్రుత్వాలను మరచిపోయి ప్రవర్తిస్తూ ఉన్నాయి. అక్కడి సరస్సులలోని నీళ్ళు తామరపూల పుప్పొడిచేత చక్కని పరిమళం వెదజల్లుతూ ఉన్నాయి. ఆ అడవిలో ఉత్సాహంగా ఆడుకోవాలని కృష్ణుడు నిశ్చయించుకున్నాడు. అన్నగారైన బలరామునితో ఇలా అన్నాడు.

శా. శాఖాపుష్పఫల ప్రభార నతలై చర్చించి యో దేవ! మా
శాఖిత్వంబు హరింపు' మంచు శుకభాషన్ నీ కెఱింగించుచున్
శాఖాహస్తములం బ్రసూనఫలముల్ సక్కన్ సమర్పించుచున్
శాఖిశ్రేణులు నీపదాబ్జముల కోజన్ మ్రొక్కెడిం జూచితే! 597

* "అన్నా! ఈ చెట్లు చూచావా? కొమ్మలనిండా నిండిఉన్న పూలగుత్తుల బరువుతో పండ్ల భారంతో వంగిపోయి నీ పాదాలు స్పృశిస్తూ నమస్కరిస్తున్నాయి. తమపై నున్న చిలుకల వాక్కులతో ' ఓ దేవా! మా యీ వృక్షజన్మను పరిహరించి, ఉత్తమ జన్మ ప్రసాదించ వలసింది' అని తమ కోరికను నీకు విన్నవిస్తూ ఉన్నాయి. తమ కొమ్మలు అనే చేతులతో పూవులు, పండ్లు నీకు చక్కగా సమర్పిస్తూ, ఈ చెట్ల వరుసలన్నీ నీ పాదపద్మాలకు చక్కగా మ్రొక్కుతూ ఉన్నాయి.

సీ. నిఖిలపావనమైన నీకీర్తిఁ బాడుచు నీ తుమ్మెదలు వెంట నేగుదెంచె
నడవిలో గూఢుండవైన యీశుఁడ వని మునరి కొల్వఁగ వచ్చె మునిగణంబు
నీలాంబరముతోడ నీవు జీమూత మవని నీలకంఠంబు లాడఁ దొడఁగెఁ
బ్రియముతోఁ జూచు గోపికల చందంబున నినుఁ జూచె నదె హరిణీచయంబు

ఆ. నీవు విందవనుచు నిర్మలసూక్తులు, వలుకుచున్న విచటఁ బరభృతములు
నేఁడు విపినచరులు నీవు విచ్చేసిన, ధన్యులైరి గాదె తలఁచి చూడ. 598

* ఈ తుమ్మెదలు, అన్నిటినీ పావనం చేయగల నీ కీర్తిని గానం చేస్తూ, నీ వెనుకనే ఎగిరివస్తూ ఉన్నాయి. ఈ ఋషిపక్షులు, నీవు ఈ అరణ్యంలో రహస్యంగా ఉన్న ఈశ్వరుడవని గుమిగూడి నిన్ను సేవించడానికి వస్తూ ఉన్నాయి. నల్లని వస్త్రం ధరించిన నిన్ను చూచి, మేఘము అనుకొని నెమళ్ళు నాట్యం చేస్తున్నాయి. గోపికలు నిన్ను ప్రేమతో చూచినట్లు ఈ ఆడులేళ్ళు నిన్ను అనురాగంతో చూస్తూ ఉన్నాయి. నీవు తమ అతిథివని కోకిలలు నీకు రాగయుక్తంగా స్వాగతం పాడుతున్నాయి. ఇక్కడ ఉండే వనచరులైన జనులు నీ రాకచేత ధన్యులు అయినారు.

సీ. నీ పాదములు సోఁకి నేఁడు వీరుత్తృణ పుంజంబుతో భూమి పుణ్య యయ్యె
నీ నఖంబులు దాఁకి నేఁడు నానాలతా తరుసంఘములు గృతార్థంబు లయ్యె
నీ కృపాదృష్టిచే నేఁడు నదీశైల ఖగమృగంబులు దివ్యకాంతిఁ జెందె
నీ పెన్నురము మోవ నేఁడు గోపాంగనా జనముల పుట్టువు సఫల మయ్యె

ఆ. నని యరణ్యభూమి నంకించి పసులను, మిత్రజనులు దాను మేపు చుండి
నలినలోచనుండు నదులందు గిరులందు, సంతసంబు మెఱయ సంచరించె. 599

* అన్నా! నీ పాదాలు సోకి ఈనాడు భూదేవి పూపొదలతో పెరిగిన పచ్చికలతో పావనమైపోయింది. రకరకాల తీగలూ చెట్లూ అన్నీ ఈనాడు నీ గోళ్ళుతాకి ధన్యములు అయినాయి. ఇక్కడ ఉన్న నదులూ

పర్వతాలూ పక్షులూ జంతువులూ నేడు నీ కరుణామయమైన దృష్టి సోకి దివ్యమైన కాంతిని పొందాయి. నీ విశాలమైన వక్షస్థలం తాకిన గోపికల జన్మలు ధన్యమైనాయి.''

ఈ విధంగా అంటూ వనభూములలో ప్రవేశించి తన మిత్రులతో పాటు తాను పశువులను మేపుతూ కృష్ణుడు నదుల తీరాలలోనూ, పర్వత సానువుల పైనను ఆనందంగా విహారం చేశాడు.

వ. మఱియు న య్యీశ్వరుండు. 600

**సీ. ఒకచోట మత్తాళియూథంబు జు మ్మని మ్రోయంగ జుమ్మని మ్రోయుచుండు**
**నొకచోటఁ గలహంస యూథంబు గూడి కేంకృతులు సేయంగఁ గేంకృతులు సేయు**
**నొకచోట మదకేకియూథంబు లాడంగ హస్తాబ్జములు ద్రిప్పి యాడఁదొడఁగు**
**నొకచోట వనగజయూథంబు నడవంగ నయముతో మెల్లన నడువఁజొచ్చుఁ**
**ఆ. గ్రౌంచచక్ర ముఖర ఖగము లొక్కొకచోటఁ, బలుక వానియట్ల పలుకుఁ గదిసి**
**పులుల సింహములను బొడగని యొకచోటఁ, బఱచు మృగములందుఁ దఱచుఁ గూడి.** 601

* బాలకృష్ణుడు వనవిహారం చేస్తూ, ఒకచోట మదించిన తుమ్మెదలు జుంజుమ్మని ఎగురుతూ ఉంటే తానుగూడా వాటితోపాటు ఝుంకారం చేయసాగాడు. మరొకచోట కలహంసపంక్తులు క్రేంకారాలు చేస్తూ ఉంటే తానుగూడా వాటితోపాటు క్రేంకారాలు చేశాడు. ఇంకొకచోట మదించిన నెమళ్ళు నాట్యం చేస్తూ ఉంటే తానుగూడా తామరపూవుల వంటి చేతులు త్రిప్పుతూ నాట్యంచేశాడు. వేరొకచోట మదపు టేనుగుల గుంపు మందమందంగా నడుస్తూ ఉంటే తానుకూడా వానివలెనే మెల్లగా నడువసాగాడు. అలాగే క్రౌంచపక్షులు, చక్రవాక పక్షులు మొదలైనవి ఒక్కొక్కచోట కూతలు పెడుతూ ఉంటే వాటి ననుకరించి తానూ రెట్టించి కూతలు పెట్టాడు. ఒకచోట పులులూ సింహాలూ లంఘిస్తూ ఉంటే తాను కూడా ఆ మృగాలతోపాటు దూకుతూ పరుగులు తీశాడు.

వ. మఱియును. 602

**సీ. రా పూర్ణచంద్రిక! రా గౌతమీ గంగ! రమ్ము భగీరథరాజతనయ!**
**రా సుధాజలరాశి! రా మేఘబాలిక! రమ్ము చింతామణి! రమ్ము సురభి!**
**రా మనోహారిణి! రా సర్వమంగళ! రా భారతీదేవి! రా ధరిత్రి!**
**రా శ్రీమహాలక్ష్మి! రా మందమారుతి! రమ్ము మందాకిని! రా శుభాంగి!**
**ఆ. యనుచు మఱియుఁ గలుగు నాఖ్యలు గలగోవు, లడవిలోన దూరమందు మేయ**
**ఘనగభీరభాషఁ గడునొప్పఁ జీరు నా, భీరజనులు వొగడఁ బెంపు నెగడ.** 603

* ఆవులు అడవిలో దూరదూరాల్లో మేస్తూ ఉంటే శ్రీకృష్ణుడు మేఘగర్జనవంటి గంభీరమైన కంఠస్వరంతో పేరుపేరునా వాటిని పిలువ సాగాడు. "ఓ ! పూర్ణచంద్రికా! ఓ గౌతమీగంగా! ఓ భాగీరథీ! రండి! రండి! ఓ సుధాజలరాశీ! ఓ మేఘమాలికా! ఓ చింతామణీ! ఓ సురభీ! రండీ! రండి! ఓ మనోహారిణీ! ఓ సర్వమంగళా!

ఓ భారతీదేవీ! ఓ ధరిత్రీ! రండి! రండి! ఓ శ్రీమహాలక్ష్మీ! ఓ మందమారుతీ! ఓ మందాకినీ! ఓ శుభాంగీ! రండి! రండి!''అంటూ ఇంకా ఎన్నెన్నో పేర్లు పెట్టి ఆవులను పిలుస్తూ ఉంటే, ఆ పిలుపులలోని గాంభీర్యానికి, మాధుర్యానికి గోకులంలోని గోపకులు ఆనందించి ఎంతో మెచ్చుకొంటున్నారు.

క. **కాంతారవిహారమ్ముల, శ్రాంతుండై గోపకాంకశయుఁడగు నన్నన్**
**సంతుష్టిఁ బొందఁజేయు ని, రంతరకరచరణ మర్దనాదుల నధిపా!** 604

* రాజా! బలరాముడు అడవిలో తిరిగి తిరిగి ఒక్కొక్కప్పుడు అలసిపోయి గోపబాలుర తొడలమీద తలపెట్టుకొని విశ్రాంతి తీసుకొనే వాడు. అప్పుడు కృష్ణుడు అన్నగారివద్దకు చేరి, ఆయన కాళ్లు, చేతులు ఒత్తి అలసట పోగొట్టి సంతృప్తి పరచేవాడు.

క. **పాడుచు నాడుచు మందట, లాడుచు నొండొరులఁ దాఁకు నాప్తులఁ గని బి**
**ట్టాడుచుఁ జేతులు వ్రేయుచుఁ, గ్రీడింతురు నగుచు బలుఁడు గృష్ణుఁడు నొకచోన్.** 605

* గోపబాలకులు ఆటలాడుతూ, పాటలు పాడుతూ, పరుగు పందాలు వేసుకుంటూ ఉంటారు. ఆ ఆటలలో వారు పరుగెత్తుకుంటూ వచ్చి, బలరామ కృష్ణులను తాకుతూ ఉంటారు. అటువంటి ఆప్తులైన గోపబాలురను చూచి బలరాముడూ, కృష్ణుడూ నవ్వుతూ, వారితో ఆడుతూ పాడుతూ, మాట్లాడుతూ, చేతులతో చక్కిలిగింతలు పెడుతూ, క్రీడించ సాగారు.

వ. **ఇవ్విధంబున.** 606

సీ. **వేదాంతవీథుల విహరించు విన్నాణి, విహరించుఁ గాంతారవీథులందు**
**ఫణిరాజశయ్యపైఁ బవళించు సుఖభోగి పల్లవ శయ్యలఁ బవ్వళించు**
**గురుయోగి మానస గుహలఁ గ్రుమ్మరు మేటి గ్రుమ్మరు నద్రీంద్ర గుహలలోనఁ**
**గమలతోడఁ బెనఁగి కడు డయ్యు చతురుఁ డా భీరజనులతోడఁ బెనఁగి డయ్యు**

ఆ. **నఖిలలోకములకు నాశ్రయుండగు ధీరుఁ, డలసి తరులనీడ నాశ్రయించు**
**యాగభాగచయము లాహరించు మహాత్ముఁ, డడవిలోని ఫలము లాహరించు.** 607

* ఈ విధంగా వేదాంత వీథులలో విహరించే విన్నాణి ఈనాడు విపిన వీధులలో విహరిస్తూ ఉన్నాడు. మృదువైన ఆదిశేషుడు అనే శయ్యపై పవళించే పరమభోగి ఇప్పుడు చిగురాకు ప్రక్కలమీద పవళిస్తూ ఉన్నాడు. గొప్పయోగుల అంతరంగాలలోపల సంచరిస్తూ ఉండే మహానుభావుడు ఇక్కడ గొప్ప కొండగుహలలో తిరుగుతూ ఉన్నాడు. లక్ష్మీదేవితో క్రీడించి అలసిపోయే చతురుడు ఈనాడు గోపాలబాలురతో ఆటలాడి అలసి పోతున్నాడు. అన్నిలోకాలకు తానే ఆశ్రయమిచ్చి కాపాడే ధీరుడు, ఈనాడు అలసిపోయి విశ్రాంతికై చెట్లనీడలను ఆశ్రయిస్తూ ఉన్నాడు. మహామునీంద్రుల యజ్ఞాలలోని హవిర్భాగాలను భుజించే భగవంతుడు అడవిలోని కాయలూ పండ్లూ తింటున్నాడు.

వ. **ఆ సమయంబున.** 608

సీ. అలసినచోఁ గొంద ఱతిమోదమున వీఁపు లెక్కించుకొని పోదు రేపు మెఱసి
సొలసి నిద్రించినచో నూరుతల్పంబు లిడుదురు కొందఱు హితవు గలిగి
చెమరించి యున్నచోఁ జిగురుటాకులఁ గొంద ఱొయ్యన విసరుదు రుత్సహించి
ద వ్వేఁగి నిలుచుచోఁ దడయక కొందఱు పదము లొత్తుదు రతిబాంధవమున,

ఆ. గోపవరులు మఱియుఁ గొందఱు ప్రియమున, మాధవునకుఁ బెక్కు మార్గములను
బనులు సేసి రెల్లభవములఁ జేసిన, పాపసంచయములు భస్మములుగ. 609

* ఆ సమయంలో కృష్ణుడు అలసిపోతే కొందరు గోపబాలకులు చాల సంతోషంతో తమ వీపులమీద ఎక్కించుకొని తీసుకుని వెడతారు. కృష్ణుడు సొమ్మసిల్లి నిద్రపోతే తమ ఒడిలోనే ఎంతో ఇష్టంగా పడుకో బెట్టుకుంటారు. కృష్ణునికి చెమటలు పోస్తే కొందరు ఉత్సాహంతో చిగురుటాకులతో విసరుతారు. కృష్ణుడు కొంతదూరం నడిచి నిలబడిపోతే కాళ్ళు నొప్పులు పుట్టాయని కొందరు ఎంతో ప్రేమతో పాదాలు ఒత్తుతారు. ఇంకా కొందరు కృష్ణునిమీది ప్రేమతో ఎన్నో విధాల సేవలు చేస్తుంటారు. ఆ సేవలతో పూర్వజన్మలలో చేసిన పాపాలన్నీ పటాపంచలై పోతాయి.

వ. అ య్యవసరంబున శ్రీదామనామధేయుండైన గోపాలకుండు రామకేశవులం జూచి యిట్లనియె. 610

* ఇలా కొంతసేపు విహారాలు అయిన తరువాత శ్రీదాముడు అనుపేరుగల గోపాలబాలుడు బలరామకృష్ణులను చూచి ఇలా అన్నాడు.

## -: గార్దభాకారుండైన ధేనుకాసురుని బలభద్రుఁడు వధించుట :-

క. దూరంబునఁ దాలతరు, స్ఫారం బగు వనము గలదు, పతితానుపత
ద్భూరిఫలసహిత మది, యే, ధీరులు సారవెఱతు రందు ధేనుకుఁ డుంటన్. 611

* మిత్రులారా! ఇక్కడకు దూరంగా తాటిచెట్లతో నిండిన ఒక వనమున్నది. అక్కడ ఎన్నో తాటిపండ్లు, ఎంతో పెద్దవి ఒకదాని వెంట మరొకటి వాటంతట అవే రాలుతూ ఉంటాయి. అయితే అందులో ధేనుకుడు అనే రాక్షసుడు ఉండడం వలన ఎంతధైర్యం గల్గిన వారు కూడా ఆ వనంలో ప్రవేశించడానికి జంకుతారు.

వ. ఆ ధేనుకాసురుండు మహాశూరుండును, ఖరాకారుండునునై సమానసత్త్వ సమేతులైన జ్ఞాతులుం దానును మనుష్యులం బట్టి భక్షించుచుండు, నయ్యెడఁ బరిమళోపేతంబులైన నూతన ఫలవ్రాతంబు లసంఖ్యాకంబులు గలవు. వినుఁడు. 612

* ఆ ధేనుకుడు అనే రాక్షసుడు మహాబలవంతుడు. వాడు భయంకరమైన గాడిద రూపంలో ఉంటాడు. తనతో సమానమైన బలం గల్గిన తన బంధువులతోపాటు తాను మనుష్యులను పట్టుకొని తింటూ ఉంటాడు. అక్కడ చక్కని సువాసనలు వెదజల్లుతూ ఎన్నో క్రొత్త క్రొత్త పండ్లు లెక్కపెట్ట లేనన్ని ఉన్నాయి, వింటున్నారా?

**క. ఫలగంధము నాసాపుట, ములఁ జొచ్చి కలంచి చిత్తములఁ గొనిపోయెన్**
**ఫలముల నమలింపుఁడు మము, బలియురకును మీకు దైత్యభటు లడ్డంబే? 613**

* ఆ పండ్లవాసనలు మా ముక్కులలో చొరబడి మమ్మల్ని వ్యాకుల పెడుతూ మనస్సులను అటు లాగివేస్తూ ఉన్నాయి. ఎలాగైనా ఆ పండ్లను మాకు తినిపించండయ్యా! మీరు మహాబలవంతులు, మీకు ఆ సామాన్య రాక్షసులు అడ్డమా?

**వ. అని పలికిన చెలికాని పలుకు లాదరించి విని నగి వారునుం దారును నుత్తాలంబగు తాల వనంబు నకుం జని యందు. 614**

* ఇలా చెప్పిన మిత్రుని మాటలు విని బలరామకృష్ణులు చిరునవ్వుతో అంగీకరించారు. వారితోపాటు ఆ తాళవనంలో ప్రవేశించారు.

**క. తత్తఱమున బలభద్రుఁడు, తత్తాలానోకహములఁ దనభుజబల సం**
**పత్తిఁ గదల్చుచు గ్రక్కున, మత్తేభముభంగిఁ బండ్లు మహిపై రాల్చెన్. 615**

* బలరాముడు తొందర తొందరగా ఆ తాళవృక్షాలను పట్టుకొని తన భుజబలంతో మదించిన ఏనుగులా కదలించగానే ముగ్గిన తాటిపండ్లు దబదబ నేలమీద రాలాయి.

**వ. అప్పుడు పండ్లు రాల్చిన చప్పుడు సెవులకు దెప్పరంబయిన నదిరిపడి రిపుమర్దన కుతుకంబున గర్దభాసురుండు. 616**

* అడవిమధ్యలో ఉన్న గాడిదరాక్షసుడు పండ్లు రాల్చిన చప్పుడు విన్నాడు. ఆ ధ్వని చెవిలో శూలంలాగా నాటుకోగానే అదరిపడి శత్రువులను వెంటనే చంపివేయాలనే కోరికతో బయల్దేరాడు.

**మ. పదవిక్షేపములన్ సవృక్షధరణీభాగంబు గంపింపఁగా**
**రదముల్ దీటుచుఁ గత్తిరించిన చెవుల్ రాజిల్ల వాలంబు భీ**
**తిదమై తూలఁగఁ గావరంబున సముద్దీపించి గోపాలకుల్**
**బెదరన్ రాముని ఱొమ్ముఁ దన్నె వెనుకై బీరంబు దోరంబుగన్. 617**

* భయంకరంగా విజృంభించి వస్తూ ఉన్న ఆ రాక్షసుని కాలి తాకిడికి అక్కడ ఉన్న భూ భాగము చెట్ల తో సహా అదరిపోయింది.అతడు కత్తిరించిన చెవులతో, భయంకరంగా నాట్యంచేస్తూ ఊగుతున్న తోకతో పళ్ళు పటపట కొరకుతూ, కొవ్వెక్కి, కోపంతో పరుగెత్తుకు వచ్చాడు. గోపాలకులు అందరూ బెదరిపోయేటట్లు బలరాముని వక్షస్థలంమీద వెనుకకాళ్ళతో జాడించి ఒక్క తన్ను తన్నాడు.

**క. మఱియును దనుజుఁడు రామునిఁ, గఱవఁగ గమకించి తెఱపి గానక యతనిం**
**జుఱచుఱఁ జూచుచు శౌర్యము, పఱివోవఁగ నింత నంతఁ బదములఁ దన్నెన్. 618**

* తన్నడంతో ఊరుకోక ఆ రాక్షసుడు బలరాముని కరవడానికి ప్రయత్నించాడు. కాని బలరాముడు అందలేదు. ఇంక చేసేది లేక ఆ రాక్షసుడు చురచుర చూస్తూ ఇటొక తన్నూ అటొకతన్నూ తన్నసాగాడు. అయితే అందులో అతని బలం క్షీణించినట్లు తెలిసిపోతూ ఉన్నది.

**వ. అంత బలభద్రుండు రౌద్రాకారంబున గర్దభాసురుపదంబులు నాలుగు నొక్కకేల నంటం బట్టి బెట్టు దట్టించి త్రిప్పి విగత జీవునిం జేసి. 619**

* అప్పుడు బలరాముడు రౌద్రాకారం ధరించి ఆ గాడిదరాక్షసుని నాలుగుకాళ్ళు ఒక్కచేత్తో కలిసి ఒడిసిపట్టుకొని మహావేగంగా గిరగిర త్రిప్పి నేలపైకొట్టి వాణ్ణి మట్టుపెట్టాడు.

**మ. ఒక తాలాగ్రముఁదాఁక వైవ నది కంపోద్రిక్తయై త్రుళ్ళి వే**
**ఱొక తాలాగ్రము పైఁబడ న్నదియు నయ్యుగ్రాహతిన్ నివ్వ కొం**
**డొక తాలాగ్రముపైఁ బడన్ విఱిగి యిట్లొండొంటిపైఁ దాల వృ**
**క్షకముల్ గూలెఁ బ్రచండమారుతము దాఁకం గూలు చందంబునన్. 620**

* అలా చచ్చిన రాకాసిగాడిదను బలరాముడు ఒక తాటిచెట్టు కేసి విసరికొట్టాడు. ఆ వేగానికి ఆ చెట్టు విరిగి మరొక తాటిచెట్టుపై పడింది. ఇలా ఎన్నోచెట్లు ఒకదానిదెబ్బకు మరొకటి సుడిగాలి దెబ్బకు విరిగిపోయినట్లే నేలపై కూలిపోయినాయి.

**ఉ. తంతువులందుఁ జేలము విధంబున నే పరమేశు మూర్తియం**
**దింతయుఁ బుట్టునట్టి జగదీశుఁ డనంతుఁడు దైత్యమాత్రు ని**
**ట్లంతము సేయు టెంతపని? యద్భుత మే వినుమంతలోన వాఁ**
**డంతముఁ బొందుటెల్లఁ గని యాతని బంధులు గార్దభంబులై. 621**

* దారపు పోగులు మూలపదార్థమై ఉండగా, వాటి ఆధారంతో వస్త్రం అల్లిక చేయబడుతూ ఉంది. ఆ విధంగా పరమేశ్వరుని రూపము ఈ జగత్తుకు మూలపదార్థము కాగా, ఈ సృష్టి అంతా అతనియందు అల్లిక చేయబడుతూ ఉన్నది. అటువంటి స్వామి ఒక సామాన్య రాక్షసుని ఇలా చంపగలగడంలో ఆశ్చర్య మేముంది? పరీక్షిన్మహారాజా! ఇంకా విను. ఆ రాక్షసుడు చనిపోవటం చూచి అతని బంధువు లందరూ గాడిదరూపాలతో కృష్ణుని పైకీ, బలరామునిపైకీ వచ్చి పడ్డారు.

**క. బలకృష్ణులపైఁ గవిసిన, బలియుర ఖరదైత్యభటులఁ బశ్చిమపాదం**
**బులు పట్టి తాలశిఖరం, బుల కెగురఁగ వైచి వారు పొరిగొని రధిపా! 622**

* ఆ బలరామ కృష్ణులు తమపైకి వచ్చిన బలవంతులైన ఆ రాకాసిగాడిదలను వెనుక కాళ్ళు పట్టుకొని గిరగిర త్రిప్పి తాటిచెట్ల తలలపైకి విసరికొట్టి మట్టు పెట్టారు.

**వ. అప్పుడు. 623**

**క. ఆలమున నోలిఁ గూలిన, తాలద్రుమ ఖండదైత్య తనుఖండములన్**
**గీలితయై ధర జలధర, మాలావృతమైన మింటిమాడ్కిన్ వెలిఁగెన్. 624**

* అప్పుడు ఆ యుద్ధంలో కూలిపోయిన తాటిచెట్ల ముక్కలూ రాక్షసుల శరీరఖండాలూ కలిసి భూమిపై పరచుకొని ఉంటే, మేఘ శకలాలతో ఆవరించబడిన ఆకాశంలా కనిపించిందా నేల.

క. ధేనుకవనమున నమలిరి, మానవు లావేళఁ దాటిఁ బ్రాఁకుల ఫలముల్,
ధేనువులు మెసఁగెఁ గసవులు, ధేనుకహరభక్త కామధేనువు గలుగన్. 625

* ఎన్నాళ్ళ తరువాతో, ఆ నాడు ధేనుకవనంలో గోపకులు ఆ తాటిపండ్లు తనివితీరా తిన్నారు. ఆవులు ఆ వనంలోని పచ్చికలు కడుపులనిండా మేశాయి. ధేనుకాసురుని చంపిన స్వామి భక్తులపాలి కామధేనువై ఉండగా వారి కోరికలు తీరడం అది ఎంత పని?

వ. ఆ సమయంబున సురలు విరులవానలు గురియించి దుందుభులు మొరయించి, రంతఁ గమలలో చనుండు గోపజన జేగీయమాన వర్తనుండై యన్నయుం దానును గోగణంబులం దోలుకొని మందకుం జనియె, నయ్యెడ. 626

* ఆ శుభసమయంలో దేవతలు పుష్పవర్షం కురిపించి దుందుభులు మ్రోగించారు. అప్పుడు కృష్ణుడు అన్నగారితోనూ, గోపాలబాలకులతోనూ, గోవులతోనూ కలసి గోకులానికి తిరిగి వచ్చాడు. గోపకులు అందరూ రామకృష్ణుల పరాక్రమాన్ని ప్రవర్తననూ ప్రస్తుతించారు.

మ. గోపదరేణు సంకలిత కుంతల బద్ధమయూరపింఛు; ను
ద్దీపిత మందహాస శుభదృష్టి లసన్ముఖు నవ్యపుష్ప మా
లా పరిపూర్ణు గోపజనలాలిత వేణురవాభిరాము నా
గోప కుమారునిం గనిరి గోపసుతుల్ నయనోత్సవంబుగన్. 627

* గోకులంలోని గోపికలు గోపకుమారుడైన కృష్ణుని కన్నుల పండువుగా చూచారు. ఆ కృష్ణుడు గోధూళి ఆవరించిన తలవెంట్రుకలపై నెమలి ఫించం ధరించి ఉన్నాడు. వెలుగులు చిమ్ముతున్నా చిరునవ్వులతో, శుభాన్ని కల్గించే చూపులతో అతని ముఖము ప్రకాశిస్తూ ఉన్నది. క్రొత్త క్రొత్త పూలమాలికలను ధరించి ఉన్నాడు. గోపకులందరూ బతిమలాడితే వేణునాదం చేస్తూ అందరి మనస్సులకూ ఆనందం కలిగించాడు.

ఆ. కమలనయను వదనకమల మరందంబుఁ, దవిలి నయన షట్పదములవలనఁ
ద్రావి దిన వియోగతాపంబు మానిరి, గొపకాంతలెల్ల గోర్కు లలర. 628

* గోకులంలోని గోపకాంత లందరూ కృష్ణుని ముఖ కమలంలో నుంచి వెలువడుతూ ఉన్న తేనెలను తమ కన్నులు అనే తుమ్మెదలు త్రాగుతూ ఉండగా, రోజంతా తమకు కల్గిన వియోగ సంతాపాన్ని తగ్గించుకున్నారు. వారిలో ఏవేవో అందమైన కోరికలు పుట్టుకొచ్చాయి.

వ. ఇట్లు గోపికలు సాదరంబుగం జూడ వ్రీడాహాసన వినయంబులం జూచుచుఁ గ్రీడాగరిష్ఠుం డయిన ప్రోఢ గోష్ఠంబు ప్రవేశించె, నంత రోహిణీయశోదలు గుఱ్ఱలవలని మచ్చికలు పిచ్చలింప నిచ్చకు

వచ్చిన ట్లయ్యెవేళల దీవించిరి. వారును మజ్జనోన్మర్దనాదు లంగీకరించి సురభి కుసుమ గంధంబులు గైకొని, రుచిరచేలంబులు గట్టికొని, రసోపపన్నంబు లయిన యన్నంబులు గుడిచి, తృప్తులై మంజుల శయ్యల సుప్తులయి యుండి, రందు. 629

* ఈ విధంగా గోపికలు తనను ప్రేమతో చూస్తూ ఉంటే, ఎక్కడి ఆటలు అక్కడ ఆడగల్గిన నేర్పరి అయిన కృష్ణుడు వారిని సిగ్గుతోనూ, చిరునవ్వుతోనూ, వినయంతోను చూస్తూ గొల్లపల్లెలో ప్రవేశించాడు. అప్పుడు రోహిణీ యశోదలు కుమారులయందలి ప్రేమలు పొంగి పొరలగా మనసుతీరా వారిని దీవించారు. బలరామ కృష్ణులకు నలుగుపెట్టి తలంటుపోశారు. చక్కని సువాసనలు వెదజల్లే పువ్వులను గంధాలను అలంకరింపజేశారు. అందమైన దుస్తులు తొడిగి ఎన్నో రుచులతో కూడిన భోజనం పెట్టారు. తృప్తిగా భుజించిన తర్వాత సుఖమైన శయ్యలపైన పరుండబెట్టి హాయిగా నిద్రబుచ్చారు.

## -: శ్రీకృష్ణుఁడు కాళియమర్దనము గావించుట :-

సీ. 'ఒకనాఁడు బలభద్రుఁ డొక్కఁడు రాకుండ గోపాలకులు దానుఁ గూడి కృష్ణుఁ
డడవికిఁ జని యెండ నా గోవులును గోపకులు నీరు వట్టనఁ గుంది డస్సి
కాళిందిలో విషకలిత తోయముఁ ద్రావి ప్రాణానిలంబులు వాసి పడిన
యోగీశ్వరేశుండు యోగివంద్యుఁడు గృష్ణుఁ డీక్షణామృతధార లెలమి గురిసి

ఆ. పసుల గోపకులను బ్రదికించె మరలంగ, వారు దమకుఁ గృష్ణువలన మరల
బ్రదుకు గలిగె నంచు భావించి సంతుష్ట, మానసములఁ జనిరి మానవేంద్ర! 630

* ఓ పరీక్షిన్మహారాజా! ఒకనాడు కృష్ణుడు గోపాలకులతోకూడి గోవులను తోలుకొని అడవికి వెళ్లాడు. ఆ పూట బలరాముడు మాత్రం వెళ్ళలేదు. తీవ్రంగా ఉన్న ఎండలో గోవులూ, గోపాలకులూ, దాహంతో తపించిపోయి సొమ్మసిల్లిపోయారు. వారంతా యమునా నది మడుగులో విషం కలిసిన నీళ్ళు త్రాగి ప్రాణాలు కోల్పోయి పడిపోయారు. యోగీశ్వరులకు ప్రభువూ, యోగులందరికీ వందనీయుడూ ఐన కృష్ణుడు తన చూపులు అనే అమృతవర్షంతో, పశువులను గోపకులను మళ్ళీ బ్రతికించాడు. వారందరూ కృష్ణుడు తమకు పునర్జన్మ ప్రసాదించాడని సంతోషించి ఇళ్ళకు వెళ్ళిపోయారు.

క. కాళియఫణిదూషిత యగు, గాళిందిఁ బవిత్రఁ జేయఁగా నుత్సుకుఁడై
కాళిందీ జలవర్ణుఁడు, కాళియు వెడలంగ నడిచెఁ గౌరవముఖ్యా! 631

* మహారాజా! కాళియుడు అనే నాగునిచేత విషంతో నిండిపోయిన కాళిందీనదిని పరిశుద్ధం చేయడానికి కృష్ణుడు సంకల్పించాడు. కాళిందీనదీ జలాలవలె నీలవర్ణుడైన కృష్ణుడు కాళియుడనే సర్పాన్ని కాళిందీనదిలోనుంచి వెళ్ళగొట్టాడు.

వ. అనిన 'నయ్యగాధజలంబు వలన మాధవుం డెట్టి నేర్పున సర్పంబు దర్పంబు మాపి వెడలించె, నందుఁ బెద్దకాలం బా వ్యాళం బేలయుండె? నెఱింగింపుము. 632

* అని శుకమహర్షి చెప్పగా పరీక్షిన్మహారాజు ఇలా అడిగాడు. "ఆ లోతు తెలియని కాళిందీజలాలనుండి మాధవుడు ఎంతటి నేర్పుతో ఆ సర్పరాజును వెళ్ళగొట్టాడో? ఆ అహీంద్రుని అహంకారాన్ని ఎలా అణచి వేశాడో? అసలు నదిలో ఆ పాము అంత ఎక్కువ కాలమెందుకున్నదో?" ఇదంతా నాకు తెలియచెప్ప వలసింది.

**క. తొఱ్ఱులఁ గాచిన నందుని, కుఱ్ఱని చరితామృతంబు గొనకొని చెవులన్**
**జుఱ్ఱంగఁ దనివి గల్గునె!, వెఱ్ఱుల కయినను దలంప? విప్రవరేణ్యా!' 633**

* బ్రహ్మ వేత్తలలో ఉత్తముడవైన శుకయోగీంద్రా! గోవులను గాచిన నందకుమారుని కథ అనే సుధారసాన్ని చెవులతో అప్యాయంగా జుర్రుతూంటే ఎటువంటి వానికైనా సంతృప్తి కల్గుతుందా!

**వ. అనిన శుకుం డిట్లనియె. 634**

* అప్పుడు శుకమహర్షి ఇలా అన్నాడు.

**సీ. మానవేశ్వర! యొక్కమడుఁగు కాళిందిలోఁ గల, దది యెప్పుడుఁ గాళియాహి**
**విషవహ్ని శిఖలచే వేఁచు చుండును, మీఁదఁ బఱతెంచి నంతన పక్షులైనఁ**
**బడి మ్రగ్గు, నందుఁ దద్భంగశీకరయుక్త పవనంబు సోఁకినఁ బ్రాణు లెవ్వి**
**యైన నప్పుడ చచ్చు? నట్టి యా మడుఁగులో నుదకంబు వొంగుచు నుడుకుచుండఁ**

**తే. జూచి వెఱఁగంది కుజనుల ప్రుక్కఁజేయ, నవతరించిన బలువీరుఁ డాగ్రహించి**
**భుజగవిషవహ్ని దోషంబు వొలియఁజేసి, సుజలఁ గావించి యీనదిఁ జూతు ననుచు. 635**

* "మహారాజా! విను. యమునానదిలో ఒక మడుగు ప్రత్యేకంగా ఉన్నది. కాళియుడనే నాగేంద్రుని విషజ్వాలలచేత అది ఎప్పుడూ తుకతుక ఉడుకుతూ ఉంటూంది. ఆ మడుగుపైన ఎగిరే పక్షులుకూడా ఆ విషప్రభావానికి లోనై అందులోపడి చచ్చిపోతాయి. ఆ మడుగు కెరటాలనుండి చెలరేగిన నీటితుంపురులతో కూడిన గాలి సోకితే చాలు; ఏ ప్రాణులైనా సరే అప్పటికప్పుడు పడి చచ్చిపోవలసిందే! ఆ మడుగులో నీరు ఎప్పుడూ ఉడుకుతూ పొంగిపోతూ ఉంటుంది.

అటువంటి ఆ మడుగును చూచి కృష్ణుడు నిర్ఘాంతపోయాడు. దుర్మార్గులను అణచివేయడానికి అవతరించిన ఆ మహా పరాక్రమవంతునికి తీవ్రమైన కోపం వచ్చింది. సర్పవిషంతో నిండిన ఆ నదీజలాల దోషాన్ని పోగొట్టి మళ్ళీ ఆ నదిని నిర్మల జలాలతో నిండి ఉండేటట్లు చేస్తాను"అని నిశ్చయించుకున్నాడు.

**వ. కృతనిశ్చయుండై, పూర్వజన్మ భాగ్యంబులం దన చరణ సంస్పర్శంబునకు యోగ్యంబై, తత్సమీపం బున విశాలవిటప శాఖాకదంబంబుతో నున్న కదంబభూజంబు నెక్కి. 636**

* ఆ మడుగులో ఒడ్డునే ఒక కడిమిచెట్టు ఉన్నది. పూర్వజన్మ భాగ్యంచేత శ్రీకృష్ణుని పాదస్పర్శకు నోచిన చెట్టు అది. విశాలమైన పెద్ద పెద్ద కొమ్మలతో చిన్న చిన్న రెమ్మలతో నిండి ఉన్న ఆ చెట్టుమీదకు కృష్ణుడు ఎక్కాడు.

మ. కటిచేలంబు బిగించి పింఛమునఁ జక్కం గొప్పు బంధించి దో
స్తటసంస్ఫాలన మాచరించి చరణద్వంద్వంబుఁ గీలించి త
త్కుటశాఖాగ్రము మీఁదనుండి యుఱికెన్ గోపాలసింహంబు ది
క్తటముల్ మ్రోయ హ్రదంబులో గుభ గుభధ్వానం బనూనంబుగన్. 637

* నడుముకు ఉన్న దట్టీని గట్టిగా బిగించి చుట్టుకున్నాడు. తలవెంట్రుకలను నెమలి ఫించంతో గట్టిగా బిగించి కట్టుకున్నాడు. భుజాలు చరచి, రెండుపాదాలు గట్టిగా ఊది పట్టి, ఆ గోపాలసింహుడు ఆ చెట్టుకొమ్మమీద నుంచి మడుగులోకి కుప్పించి దూకాడు. ఆ మడుగులోనుండి గభీలుమని పెద్ద చప్పుడు లేచింది. నిశ్శబ్దమైన వాతావరణంలో ఆ శబ్దము దిక్కులలో ప్రతిధ్వనించింది.

ఉ. భూరిమహాప్రతాప పరిపూర్ణ భయంకర గోపబాల కం
ఠీరవ పాతవేగ వికటీకృత దుర్విషభీషణోర్మి సం
పూరితమై వడిం గలఁగి పొంగి ధనుశ్శత మాత్రభాగ వి
స్తారము వొంగె నమ్మడుఁగు తప్తపయఃకణబుద్బుదోగ్రమై. 638

* గొప్పదైన ప్రతాపంతో నిండిపోయి సింహకిశోరంవలె కనుపిస్తూ ఉన్న గోపబాలకుడు గభాలున దూకగానే, ఆ వేగానికి మడుగులోని నీరు అంతా విషపూరితమైన భయంకర తరంగాలతో వికటనృత్యం చేస్తూ ఒక్కసారిగా పైకి పొంగింది. ఎటుచూచినా నూరు ధనుస్సుల (600 అడుగుల) మేర కుతకుత లాడుతూ ఉన్న నీటిలో బుడగలు లేచాయి.

శా. పాఠీనాకృతిఁ దోయరాశి నడుమన్ భాసిల్లి మున్నాఢ్యుఁడై
కాఠిన్యక్రియ నీఁదు నేర్పు దనకుం గల్మిన్ భుజంగేంద్ర హృ
త్పీఠాగ్రంబున రోషవహ్ని లెగయన్ భీమంబుగా నీఁదె ను
ల్లోలోత్తుంగ తరంగమై మడుఁగు దుర్లోక్యంబుగా బాహులన్. 639

* మత్స్యావతారంలో సముద్ర మధ్యంలో విహరించుతూ ఈదడం అనేది విష్ణువుకు ఇంతకుముందే అభ్యాసం అయింది. కృష్ణుడు ఆ మడుగులోని నీరు అల్లకల్లోలమై ఉవ్వెత్తున కెరటాలు లేచేటట్లు బాహువులతో కలచివేస్తూ అటూ ఇటూ ఈదాడు. ఆ దృశ్యం చూడడానికే మహాభయంకరమైనది. ఆ మడుగులోపల ఉన్న కాళియ నాగేంద్రుని గుండెల్లో రోషాగ్ని జ్వాలలు రేగాయి.

వ. ఆ సమయంబున. 640

శా. 'బాలుం డొక్కఁడు వీఁడు నామడుఁగు విభ్రాంతోచ్చలత్కీర్ణ క
ల్లోలంబై కలఁగం జరించె నిట నే లో నుంటఁజూడండు, మ
త్కీలాభీల విశాలదుస్సహవిషాగ్ని జ్వాలలన్ భస్మమై
కూలంజేసెద నేఁడు లోకులకు నాకోపంబు దీపింపఁగన్.' 641

* ఆ కాళియుడు ఇలా అనుకున్నాడు. వీడొక కుర్రవాడు! నా మడుగును కల్లోలం చేసి, కలచివేసి, ఎగసి పడుతున్న అలలతో కన్నులు చెదరిపోయేటట్లు ఇందులో దిగి ఈదులాడుతూ ఉన్నాడు. ఇక్కడ లోపల నేనున్నాను అని కూడా లెక్కించకుండా ఉన్నాడు. భయంకరమైన భరింప శక్యము కాని నా విషాగ్ని జ్వాలలతో వీడిని భస్మం చేసి కూల్చివేస్తాను. లోకు లందరికీ నా కోప మెంతటిదో ఈనాడు తెలిసి రావాలి."

వ. అని తలంచి విజృంభించి. 642

ఉ. ఘోరవిషానల ప్రభల గొబ్బునఁ గ్రమ్మఁగ సర్పసైన్య వి
స్ఫారుఁడు గాళియోరగుఁడు పాటివడిం గఱచెం బయోధరా
కారుఁ బయోవిహారు భయకంప విదూరు మహాగభీరు నా
భీరకుమారు వీరు నవపీత శుభాంబరధారు ధీరునిన్. 643

* ఈ విధంగా అనుకొని కాళియుడు విజృంభించాడు. ఆ సర్పరాజు తన సర్పసైన్యంతో సహా అతివేగంగా కృష్ణుని సమీపించాడు. తన ఘోరవిషాగ్ని జ్వాలల కాంతులు గప్పుగప్పున ప్రసరిస్తూ ఉండగా కృష్ణుణ్ణి పెద్దకాటు వేశాడు. ఆ కృష్ణుడు నీలమేఘంవలె ఉన్నాడు. ఆ నీళ్ళలో యథేచ్ఛగా విహరిస్తూ ఉన్నాడు. భయమూ, కంపమూ ఏ కోశానా కనిపించటం లేదు. మహాగంభీరుడుగా ఉన్నాడు. ధైర్యవంతుడు, వీరుడు అయిన ఆ గోపకుమారుడు బంగారు రంగులో వెలుగుతూ ఉన్న శుభమైన పట్టువస్త్రాన్ని ధరించి ఉన్నాడు.

క. కఱచి పిఱుతివక మఱియును, వెఱవక నిజవదనజనిత విషదహనశిఖల్
మెరయఁ దన నిడుద యొడలిని, నెఱి హరిఁ బెనఁగొనియె భుజగనివహపతి వడిన్. 644

* ఆ సర్పరాజైన కాళియుడు కాటువేసి అంతటితో ఊరుకోలేదు. భయపడకుండా, వెనుకంజ వేయకుండా తన పొడుగాటి శరీరంతో గట్టిగా పెనవేసి కృష్ణుని అతివేగంగా బంధించి వేశాడు. పడగ పైకెత్తి పెట్టిన అతని నోటినుండి విషాగ్ని జ్వాలలు ధగధగలాడుతూ ప్రసరిస్తున్నాయి.

వ. ఇట్లు భోగిభోగ పరివేష్టితుండై, చేష్టలు లేనివాని తెఱంగునఁ గానంబడుచున్న ప్రాణసఖునిం గనుంగొని తత్ప్రభావంబు లెఱుంగక, తత్సమర్పిత ధనదార మనోరథ మానసులు గావున. 645

* ఈ విధంగా కృష్ణుడు ఆ నాగరాజు పొడవైన శరీరంచేత చుట్టబడి నిశ్చేష్టుడై పడిఉన్నట్లు ఉన్నాడు. గోపబాలకులు తమ ప్రాణమిత్రుణ్ణి ఆ స్థితిలో చూచి భయపడిపోయారు. వారు అతని ప్రభావం తెలియని వారు; తమ ధనము, కోరికలు మనస్సులు అన్నీ కృష్ణుని యందే సమర్పించి ఉన్నవారు.

చ. అదె మన కృష్ణునిం గఱచె, నంతటఁ బోక భుజంగమంబు దు
ర్మదమున మేనఁ జుట్టికొని మానక యున్నది, యింక నేమి సే
యుద? మొఱఁజొత్త. మే పురుషు లోపుదు రీయహి నడ్డపెట్ట నె
య్యది సదుపాయ? మంచుఁ బడి రార్తరవంబులఁ దూలి గోపకుల్. 646

* ఆ గోపకులు "అదిగో! అదిగో ! ఆ పాడుపాము మన బాలకృష్ణుణ్ణి కాటు వేసింది. అంతటితో వదలిపెట్టలేదు. చాల మదంతో మనవాడి శరీరాన్ని చుట్టి వేసింది. అయ్యో! వదలిపెట్టడం లేదు. ఇంక ఏమిటి చేయడం? ఎక్కడికి పరుగెత్తాలి? ఈ పామును అడ్డుకోవడానికి ఏ మగధీరుడికి సామర్థ్యం ఉంది? ఇంక ఈ ఆపదనుండి గట్టెక్కడానికి చక్కని ఉపాయమేదీ లేదా?" అంటూ ఆర్తనాదాలతో తూలి పడిపోయారు.

**క. గోపకుమారక శేఖరు, నేపున సర్పంబు గఱచు టీక్షించి వగన్**
**మేపులకుఁ దొలఁగి గోవులు, వాపోవుచు నుండె వృషభవత్సంబులతోన్. 647**

* గోపాలకృష్ణుణ్ణి కాళియసర్పం కరవడం చూచి అక్కడ ఉన్న ఆవులూ ఆబోతులూ లేగదూడలూ అన్నీ దుఃఖంతో మేత మానివేసి అలాగే చూస్తూ ఉండి పోయాయి.

**క. భూతలము వడఁకె నుల్కా, పాతంబులు మింటఁ గానఁబడె ఘోషములో**
**వ్రేతలకును గోపక సం, ఘాతములకు నదరెఁ గీడుకన్ను లిలేశా! 648**

* భూమి కంపించింది. ఆకాశంలోనుండి ఉల్కలు రాలిపడుతూ కనిపించాయి. గోకులంలో బాలకులకు ఎడమకన్నూ, గోపికలకు కుడికన్నూ అదిరాయి.

**వ. అంత నా దుర్నిమిత్తంబులు వొడగని బెగడు గదిరిన చిత్తంబుల నుత్తలపడుచు మందనున్న నందయశోదాదులైన గోపగోపికాజనంబులు హరి దళసరి యెఱుంగక గోపాలగోగణ పరివృతుండైన కృష్ణుం డెక్కడ నైనం జిక్కనోపునని పొక్కుచుం బెక్కువలయిన మక్కువలు చెక్కులొత్త నొక్క పెట్ట బాలవృద్ధ సమేతులై మహాఘోషంబున నా ఘోషంబు వెలువడి. 649**

* యశోదానందులు మొదలైన గోపీగోపకులు దుశ్శకునాలు చూచి భయం నిండిన మనసులతో ఆందోళన పడ్డారు. శ్రీకృష్ణుని శక్తి తెలియక, అతడు గోపాలకులతో, గోవులతో సహా ఎక్కడనైనా ఆపదలో పడ్డాడేమో అని వారందరూ దుఃఖించారు. ప్రేమలు ఉవ్వెత్తున పొంగుకు రాగా ఒక్కుమ్మడిగా పిల్లలతో ముసలివాళ్ళతోకూడా పెద్దపెట్టున కేకలు వేసుకుంటూ గోకులంనుండి బయల్దేరారు.

**క. వా రిబ్బంగి నెఱుంగని, వారై హరిఁ జూడఁబోవ వడిగఁగొని నగుచున్**
**వారింపఁ డయ్యె రాముఁడు, వారిని హరి లావెఱుంగువాఁ డయ్యు నృపా! 650**

* గోకుల వాసులంతా అజ్ఞానంతో వేగంగా కృష్ణుని జాడ తెలుసుకోవడానికి పరుగిడుతూ ఉంటే బలరాముడు నవ్వుతూ ఊరుకున్నాడు. కృష్ణుని శక్తి తెలిసినవాడై కూడా వారిని నివారించలేదు.

**వ. అంతలోన వారునుం దానును గాంతారమార్గంబు వట్టి పోవుచు నెడనెడ గోపగోష్పదంబుల సందుల నింత నంత నక్కడక్కడ యవాంకుశ హల కమల కులిశ చక్ర చాప కేతనాది రేఖాలంకృతంబులై మార్గాభరణంబులైన హరిచరణంబుల జాడఁ గని చొప్పు దప్పక చని దుర్ఘటంబయిన యమునా తటంబు సేరి, వారిమధ్యంబున నితరుల కసాధ్యంబైన సర్పంబుచేతఁ గాటు వడి దర్పంబుసూపక**

**భోగిభోగపరివృతుండైన కృష్ణునిం గృష్ణ కృష్ణేతివిలాపంబులఁ దాపంబులం బొందుచుఁ దత్కాలం బునం బ్రతికూలం బయ్యె ననుచు దైవంబు దిట్టు గోపకులను, గోపకులం గలసి మేఁత లుడిగి ఱెప్పలిడక కృష్ణునిం దప్పక చూచుచు నొరలుచున్న గోవులం గని, రందు గోపికలు యశోదం బట్టుకొని విలపించుచుఁ గృష్ణు నుద్దేశించి యిట్లనిరి. 651**

* వారితోపాటు బలరాముడు తానుకూడా అడవిలో ప్రవేశించి కృష్ణుని జాడ వెదుకసాగాడు. గోపకుల గోవుల కాలిగుర్తుల మధ్యలో అక్కడక్కడ కొద్దికొద్దిగా కృష్ణుని కాలిజాడలు కనిపించాయి. కృష్ణుని అడుగు జాడలలో యవరేఖ, అంకుశరేఖ, హలరేఖ, వజ్రరేఖ, చక్రరేఖ, చాపరేఖ, ధ్వజరేఖ మొదలైన శుభలక్షణాలన్నీ కనిపించుతున్నాయి. నేలపైన కనిపిస్తూ ఉన్న కాలిగుర్తులతో జాడలు వెదుకుతూ ముందుకు సాగారు. కృష్ణుని అడుగుజాడలు ఆ మార్గానికే ఆభరణమై ప్రకాశిస్తూ ఉన్నాయి. వారందరూ చివరకు సమీపించడానికి సాధ్యంకాని కాళియుడు ఉన్న యమునానది రేవు చేరారు. నదీజలాల మధ్యలో ఇంతవరకూ ఎవరికీ జయించ సాధ్యము కాని మహాసర్పంచేత కాటుపడి పాముపడగలచేత ఆవరించబడిన కృష్ణుణ్ణి చూచారు. అతడు శక్తిని కోల్పోయినట్లు సొమ్మసిలి పడి ఉన్నాడు. అది చూచి "కృష్ణా! కృష్ణా"అంటూ విలపిస్తూ గోకుల వాసు లందరూ దుఃఖంతో తపించి పోసాగారు. "ఇన్నాళ్ళూ దయ చూచిన దైవం ఈనాడు ప్రతికూలమైనదా ఏమి?" అని గోపకులు దుర్విధిని తిట్టుకుంటూ ఉన్నారు. గోవులు, లేగలతో కలసి, మేతలు మానివేసి రెప్పలార్పక, కృష్ణుణ్ణే చూస్తూ కన్నీళ్ళు కారుస్తూ ఉన్నాయి. గోపికలు యశోదను పట్టుకొని ఏడుస్తూ కృష్ణుణ్ణి ఉద్దేశించి ఇలా అన్నారు.

**సీ. ఎదురువచ్చినఁ జాల నెదురుగాఁ జనుదెంతు, వెదురు వచ్చిన నేఁడదేల రావు?**
**చూచినఁ గృపతోడఁ జూచు చుందువు నీవు, సూచినఁ గనువిచ్చి చూడ వేల?**
**డాసిన నఱలేక డాయంగ వత్తువు, డాసిన నేటికి డాయ విచటఁ?**
**జీరిన 'నో' యని చెలరేఁగి పలుకుదు, విది యేమి సీరిన నెఱుఁగ కుంట?**

**ఆ. తలఁపు సేయునంతఁ దలపోయుచుందువు, తలఁపు సేయ నేఁడు దలఁప వకట!**
**యనుచు భక్తివివశ లాడెడి కైవడి, వ్రేత లెల్ల నాడి వివశలైరి. 652**

* "గోపాలకృష్ణా! మేము ఎదురువస్తే రోజూ నీవు మాకు ఎదురు వచ్చేవాడివి. ఈనాడు మేము వచ్చినా నీవు రావేమి? మేము చూస్తే నీవు దయతో మమ్ములను చూచేవాడివి. నేడు మేము చూచినా నీవు చూడవేమి? మేము నీదగ్గరకు వస్తే నీవు మాదగ్గరకు వచ్చే వాడివి. మేము సమీపించినా నీవు మా చెంతకు రావేమి? మేము "కృష్ణా!" అని పిలిస్తే "ఓ" అని ఉత్సాహంగా పలికేవాడవు. నేడు మేము గొంతెత్తి పిలిచినా నీవు పలుకవేమి? మేము నిన్ను స్మరిస్తే చాలు, నీవూ మమ్మల్ని స్మరించేవాడవు. ఈనాడు మేము స్మరించినా మమ్ములను తలచవేమి? అయ్యో! ఇదేమిటి?" అంటూ భక్తితో పరవశు లైనవారు మాట్లాడే విధంగా గోపిక లందరూ పలుకుతూ చేష్టలు దక్కి పడిపోయారు. భగవంతునికీ భక్తులకూ ఉన్న సంబంధము గోపికల నోటివెంట అప్రయత్నము గానే వెలువడింది. భక్తుడు భగవంతునికి ఎదురు వెళితే, భగవంతుడు కూడా భక్తునికి ఎదురు వస్తాడు. భక్తులలో కెల్ల మహాభక్తులు కదా గోపికలు!

వ. ఆ సమయంబున నందయశోదాదులు హరిం జూచి యధికంబైన శోకంబున నిట్లనిరి. 653

* నందుడు, యశోద మొదలైనవారు కృష్ణుణ్ణి చూచి పొంగి పొరలే శోకంతో ఇలా అన్నారు.

క. విషకుచయుగ యగు రక్కసి, విషకుచదుగ్ధంబు ద్రావి విషవిజయుఁడవై
విషరుహలోచన! యద్భుత, విషయుండగు నీకు సర్పవిష మెక్కెఁ గదా! 654

* "కృష్ణా! విషాన్ని పాలిండ్లలో పెట్టుకొని వచ్చిన దుష్టురాలైన పూతన ఇచ్చిన పాలు త్రాగి, దానిని జయించిన అద్భుత మూర్తివి నీవు. కమలాక్షా! అటువంటి నీకు ఈనాడు ఈ పామువిషం ఎక్కినదంటే ఇంతకంటే ఆశ్చర్య మేముంది?

క. కట్టా! క్రూరభుజంగము, గట్టలుకన్ నిన్నుఁ గఱవఁ గంపించితివో?
తిట్టితివో పాపపు విధి?, పట్టీ! మముఁ దలఁచి కాఁకఁ బలవించితివో? 655

* అయ్యో! కన్నతండ్రీ! ఆ క్రూరమైన పాము కోపంతో నిన్ను కాటువేస్తూ ఉంటే భయంతో ఎంతగా కంపించి పోయినావో? ఈ పాపిష్ఠి విధిని ఎంత తిట్టుకొన్నావో? మమ్ములను తలచుకుని ఎంత బాధపడ్డావో?

క. పన్నగము మమ్ము గఱవక, ని న్నేటికిఁ గఱచెఁ గుఱ్ఱ! నెమ్మి గలిగి నీ
వున్నను మము రక్షింతువు, నిన్నున్ రక్షింప నేము నేరము తండ్రీ! 656

* చిన్ని కన్నయ్యా! ఈ పాపిష్ఠిపాము మమ్ములను కరవకుండా నిన్నెందుకు కరిచిందిరా? నీవు క్షేమంగా ఉంటే మమ్ములను రక్షిస్తావు. నీవు ఆపదలో పడితే మేము నిన్ను రక్షించలేము గదా తండ్రీ?

ఉ. చూడ వ దేమి గౌరవపుఁజూపుల మమ్ము? సఖాలితోడ మా
టాడ వ దేమి? నర్మముగ నందెలు పాదములందు మ్రోయ? నేఁ
డాడ వ దేమి నర్తనము? లవ్వలమ్రోలను గోపికావళిం
గూడ వ దేమి నవ్వులకు? గోపకుమార వరేణ్యా! చెప్పుమా! 657

* మా గోకులంలో పుట్టిన వారందరిలోనూ నీవే ఉత్తముడవు. ఇప్పుడు తల్లిదండ్రులమైన మమ్ములను గౌరవంగా చూడవేమి? నీ తోడిమిత్రులతో మాటలాడవేమి? నీ పాదాల అందెలు మనోహరమైన శబ్దాలు చేస్తూ ఉండగా నాట్యమాడవేమి? నీ తల్లుల యెదుట గోపికలతో హాస్యాలాడవేమి? మాట్లాడవేమి నాయనా?

సీ. శ్రవణరంధ్రంబులు సఫలతఁ బొందంగ నెలమి భాషించువా రెవ్వరింకఁ?
గరచరణాదులకలిమి ధన్యత నొంద నెగిరి పైఁ బ్రాఁకువా రెవ్వరింక?
నయనయుగ్మంబు లున్నతి గృతార్థములుగా నవ్వులు సూపువా రెవ్వరింక?
జిహ్వలు గౌరవశ్రీఁ జేరఁ బాటల యెడఁ బలికించువా రెవ్వ రింక?

ఆ. దండ్రి! నీవు సర్పదష్టుండవై యున్న, నిచట మాకుఁ బ్రభువు లెవ్వ రింక?
మరగి పాయ లేము, మాకు నీ తోడిద, లోక మీవు లేని లోక మేల? 658

* చెవు లున్నందుకు సార్థకంగా మేము వినేటట్లు ఇంక మాతో ఎవరు మాట్లాడుతారు. కాళ్ళుచేతులు సార్థక మయ్యేటట్లు మా పైకి ఎగ్రబాకి ఎత్తుకోమని ఇంకెవరు మమ్ములను అడుగుతారు? కన్నులు కృతార్థము లయ్యేటట్లు ఇంక ఎవ్వరు చిరునవ్వు కురిపించుతారు? మా నాలుకలు ధన్యము లయ్యేటట్లు మాచేత పాటలెవరు పాడిస్తారు? తండ్రీ! నీవు పాముకాటు పాలయితే ఇంక మాకు ప్రభువు లెవరు? నిన్ను పోగొట్టుకొని వెనుదిరిగి పోలేము. మాకు నీతోనే లోకం. నీవు లేని ఈ లోకం, ఈ జీవితం మా కెందుకు?

వ. అని యొండొరులం బట్టుకొని విలపించుచుం గృష్ణునితోడన మడుఁగు జొత్తము, చత్త' మనుచుఁ గృష్ణవిరహ వేదనానల భారతప్తులై మడుఁగుఁ జొరఁ బాఱుచున్న వారలఁ గనుంగొని భగవంతుండైన బలభద్రుండు 'మీరు మీఁదెఱుంగరు, ధైర్యంబు విడుచుట కార్యంబు గాదు. సహించి చూడుఁ' డనుచు వారిని వారించె. 659

* ఇలా దుఃఖిస్తూ ఒకరి నొకరు పట్టుకొని ఏడుస్తున్నారు. "కృష్ణునితో పాటే ఆ మడుగులో పడి మనమూ చచ్చిపోదాము" అంటూ కృష్ణుని విరహం భరించలేక, దుఃఖాగ్నిలో తపించిపోతూ మడుగులో పడబోతున్న యశోద మొదలైనవారిని చూచి బలరాముడు "మీరు ముందు ఏమి జరుగబోతున్నదో తెలుసుకోలేకుండా ఉన్నారు. ధైర్యం వదలి పెట్టడం వలన ప్రయోజనం లేదు. ఓర్పు వహించి చూస్తూ ఉండండి" అన్నాడు. అతడు భగవంతుని అంశ. కృష్ణుని శక్తి ఎటువంటిదో తెలిసినవాడు.

క. తనుఁ గూర్చి యి వ్విధంబున, వనితలు బిడ్డలును దారు వాపోయెడి ఘో
షనివాసులఁ గని కృష్ణుఁడు, మనుజుని క్రియ నొక ముహూర్తమాత్రము జరిపెన్. 660

* "తనను గురించి గోకులనివాసులైన స్త్రీలు, బిడ్డలు అందరూ దుఃఖించడం చూస్తూ కృష్ణుడు ఒక్క ముహూర్తకాలం మానవమాత్రుని వలె మౌనం వహించి ఊరకున్నాడు.

శా. అంతం గృష్ణుఁడు మేను వెంప భుజగుం డావృత్తులం బాసి తా
సంతప్తాయతభోగుఁ డై కఱచుటల్ సాలించి నిట్టూర్పుతో
శ్రాంతుండై తలలెత్తి దుర్విషము నాసావీథులం గ్రమ్మ దు
శ్చింతన్ దిక్కులు సూచుచుం దలఁగి నిల్చెన్ ధూమకాష్ఠాకృతిన్. 661

* మరుక్షణంలో కృష్ణుడు వున్నట్లుండి తన శరీరం ఒక మాటుగా బాగా పెంచాడు. కాళియుని దేహం కుమిలిపోయి, చుట్టలు సడలిపోయాయి. పడగలు వేడెక్కిపోయి, అవయవాలు సడలిపోయాయి. అతడు కరవడం మాని అలసిపోయి ఆయాసంతో పెద్దగా నిట్టూర్పులు విడుస్తూ తలలు నెమ్మదిగా పైకి ఎత్తాడు. ముక్కులనుండి రక్తం చిమ్ముతూ ఉండగా, విషాదంతో దిక్కులు చూస్తూ కృష్ణుని వదలి దూరంగా నిలబడ్డాడు. పొగచూరిన కట్టెవలె తేజస్సు కోల్పోయాడు.

చ. వెఱ మెఱ లేనియట్టి బలువీరుఁడు కృష్ణకుమారుఁ డొక్కచేఁ
జఱచి ఖగేంద్రుచందమునఁ జక్కన దౌడలు వట్టి కన్నులం
జొఱచొఱ దుర్విషానలము జొబ్బిలు చుండఁగ నెత్తి లీలతో
జిఱజిఱఁ ద్రిప్పి వైచెఁ బరిశేషిత దర్పముఁ గ్రూరసర్పమున్. 662

* భయంగానీ, సంకోచంగానీ ఏమాత్రమూ లేకుండా మహా వీరుడైన కృష్ణుడు తన చేత్తో కాళియుని పడగలపై ఒక చరపు చరచాడు. గరుత్మంతునివలె దౌడలవద్ద గట్టిగా ఒడిసిపట్టి, ఆ పామును గిరగిర త్రిప్పి విసరికొట్టాడు. ఆ పాము కన్నులనుంచి దుష్టవిషం అగ్నిజ్వాలలతో వెలువడింది. అంతటితో ఆ క్రూరసర్పంలోని గర్వం సర్వం అణగిపోయింది.

వ. ఇట్లు వేగంబుగ నాగంబు వీచి వైచి జగజెట్టియైన నందునిపట్టి రెట్టించిన సంభ్రమంబున. 663

* ఈ విధంగా పామును వేగంగా త్రిప్పిత్రిప్పి విసరికొట్టి జగజెట్టి కృష్ణుడు రెట్టింపు ఉత్సాహంతో విజృంభించాడు.

సీ. ఘనయమునానదీ కల్లోల ఘోషంబు సరసమృదంగ ఘోషంబు గాఁగ
సాధుబృందావన చరచంచరీక గానంబు గాయక సుగానంబు గాఁగ
గలహంస సారస కమనీయమంజు శబ్దంబులు దాళశబ్దములు గాఁగ
దివినుండి వీక్షించు దివిజ గంధర్వాది జనులు సుఖాసీనజనులు గాఁగఁ
తే. బద్మరాగాదిరత్న ప్రభాసమాన, మహితకాళియ ఫణిఫణామండపమున
నళినలోచన విఖ్యాత నర్తకుండు, నిత్యనైపుణ్యమునఁ బేర్చి నృత్య మాడె. 664

* ఆ కాళియుని పడగలు అనే విశాల మంటపంమీద బాలకృష్ణుడు అనే ప్రఖ్యాత నర్తకుడు ఎక్కి నిలబడి, అతి నైపుణ్యంతో నృత్యం చేశాడు. ఆ పాము పడగల మంటపం పద్మరాగాలు మొదలైన రత్నాలచేత ప్రకాశిస్తున్నది. ఆ నృత్యానికి సహకారం చేస్తున్నట్లు యమునా నదిలో కదలే తరంగాల ధ్వనులు చక్కని మృదంగ ధ్వనులుగా ఉన్నాయి. ఆ బృందావనంలో తిరుగుతూ ఉన్న తుమ్మెదల మధుర సంగీతం, గాయకుల గానం లాగా వినబడుతున్నది. కలహంసలు, సారసపక్షులు చేస్తున్న శ్రావ్యమైన శబ్దాలు చక్కని తాళధ్వనులను సంతరిస్తున్నాయి. ఆకాశం లోనుండి చూస్తూ ఉన్న దేవతలు గంధర్వులు మొదలైనవారు సభలో ఆసీనులై ఉన్న ప్రేక్షకుల్లాగా ఉన్నారు.

శా. కుక్షిన్ లోకములున్న గౌరవముతో గోపాకృతి న్నున్న యా
రక్షోహంత వడిన్ మహాఫణిఫణారంగ ప్రదేశంబుపై
నక్షీణోద్ధతి నాఁడుఁ, బాడుఁ, జెలఁగున్, హాసంబుతోడం బద
ప్రక్షేపంబులు సేయుఁ గేళిగతులం బ్రాణైకశేషంబుగన్. 665

* గోపాల బాలకుని రూపంలో ఉన్న ఆ కృష్ణుడు తన కడుపులో లోకాలన్నీ దాచుకున్నవాడు. ఆ బరువుతో సహా, రాక్షస సంహారకుడైన ఆ కృష్ణుడు కాళియుని పడగలనే రంగస్థలం మీద చాలా ఉల్లాసంగా నాట్యంచేశాడు. పాటలు పాడాడు. నవ్వుతూ ఎగిరి గంతులువేశాడు. పాదాలతో బలంగా పడగలపై త్రొక్కుతూ ఆటలాడాడు. కాళియునికి తల ప్రాణాలు తోకకు వచ్చాయి.

**క. ఘనతర సుషిరానంద, స్వనములతో సిద్ధ సాధ్య చారణ గంధ**
**ర్వ నిలింప మునిసతులు చ, య్యనఁ గురిసిరి విరులవాన లాడెడు హరిపై. 666**

* అలా నాట్యమాడుతున్న నందనందనునిపై ఆకాశంనుంచి సిద్ధులు, సాధ్యులు, చారణులు, గంధర్వులు, దేవతలు, దేవర్షులు, వారి భార్యలు పూలవానలు కురిపించారు. అమృతం త్రాగడంవలన ఆనందం వెల్లివిరిసే కంఠధ్వనులతో జయజయ ధ్వానాలు చేశారు.

**వ. ఇట్లు దుష్టజన దండధరావతారుండైన హరి వడి గలిగిన పడగల మీఁదఁ దాండవంబు సలుప, బెండువడి యొండొండ ముఖంబుల రక్తమాంసంబు లుమియుచుఁ గన్నుల విషంబు గ్రక్కుచు నుక్కుసెడి చిక్కిదిక్కులు సూచుచుం గంఠగతప్రాణుండై ఫణీంద్రుండు తన మనంబున. 667**

* ఈ విధంగా దుష్టులపాలిటి కాలయముడైన కృష్ణుడు చాలా వేగంగా కాళియుని పడగలపై ప్రచండతాండవం చేశాడు. కాళియుడు బలహీనుడై పోయాడు. ఒక్కొక నోటినుంచీ రక్తం, మాంసంక్రక్కాడు. కన్నులనుండి విషం చిమ్మింది. పౌరుషం నశించి నీరసించిపోయాడు. ప్రాణాలు గొంతుక వరకూ వెళ్లుకుని వచ్చేశాయి. దిక్కులు చూస్తూ తనలో ఇలా అనుకున్నాడు కాళియుడు.

**ఉ. 'వేలుపులైన లావులుసెడి వేదనఁ బొందుచు నావిషానల**
**జ్వాలలు సోఁకినంతటన చత్తురు, నేఁడిది యేమి చోద్య? మా**
**భీలవిషాగ్ని హేతిచయపీడకు నోర్చియుఁ గ్రమ్మఱంగ నీ**
**బాలుఁడు మత్ఫణాశతము భగ్నముగా వెసఁ ద్రొక్కి యాడెడిన్. 668**

* "నా విషాగ్ని జ్వాలలు సోకితే చాలు, దేవతలైనా నీరసించి పోయి గిలగిల కొట్టుకొని చచ్చిపోతారు. అయ్యో! ఇదేమి ఆశ్చర్యం? నా విషాగ్ని జ్వాలల ధాటికి ఓర్చుకోవడమేకాక ఈ కుర్రవాడు నా నూరు పడగలనూ చితక త్రొక్కుతూ నాట్యం చేస్తున్నాడేమిటి?

**క. ఈతఁడు సర్వచరాచర, భూతేశుండైన పరమపురుషుఁడు సేవా**
**ప్రీతుఁడు శ్రీహరి యగు నని, భీతిన్ శరణంబు నొందె బిట్టలసి నృపా! 669**

* ఇదంతా చూస్తూ ఉంటే ఈ బాలుడు ఆ శ్రీహరియే అయి ఉంటాడు. సమస్త చరాచర జీవులకూ అధిపతి, పరమపురుషుడు అయిన శ్రీహరి తనను భక్తితో సేవించితే సంతోషిస్తాడు"అనుకుంటూ భయపడి పోయి, అలసిపోయి కృష్ణుని శరణు కోరుతున్నాడు కాళియుడు.

## -: కాళియుని భార్యలైన నాగాంగనలు శ్రీకృష్ణుని నుతించుట :-

వ. అట్లు క్రూరంబులైన హరిచరణ ప్రహారంబులం బడగ లెడసి నొచ్చి చచ్చిన క్రియం బడియున్న పతిం జూచి నాగకాంతలు దురంతంబైన చింతాభరంబున నివ్వటిల్లెడు నెవ్వగల నొల్లంబోయి పల్లటిల్లిన యుల్లంబుల. 670

* ఈ విధంగా తాండవకృష్ణుని దారుణమైన కాలితాపులకు పడగలన్నీ చితికిపోయి, బాధపడుతూ, చచ్చినట్లు పడిఉన్న కాళియుని చూచి, అతని భార్యలు ఎంతో దుఃఖపడ్డారు. భరించరాని శోకంతో వారి మనస్సులు కలవర పడిపోయినాయి.

మ. కచబంధంబులు వీడ భూషణము లాకంపింప గొఁదీవియల్
కుచయుగ్మంబుల వ్రేఁగునం జడియఁ బై కొంగుల్ వడిన్ జాఱఁగాఁ
బ్రచురభ్రాంతిఁ గలంగి ముందట రుదద్బాలావలిం గొంచు స్రు
క్కుచు, భక్తిం జని కాంచి రాగుణమణిన్ గోపాలచూడామణిన్. 671

* కాళియుని భార్యలు కృష్ణుణ్ణి సందర్శించడానికి బయలు దేరారు. కొప్పుముడులు విడిపోయాయి; ఆభరణాలు చెదరిపోయాయి; వక్షోజాల బరువుకు తీగెలవంటి సన్నని నడుములు అల్లాడిపోయాయి; పైటకొంగులు జారిపోయాయి. దిక్కుతెలియని భ్రాంతితో కలవరపడిపోయారు. బావురుమని ఏడుస్తున్న బిడ్డలను ముందుపెట్టుకొని తీసుకు వచ్చారు. జంకుతూ గొంకుతూ భక్తి పూర్వకంగా భగవంతుడైన బాలగోపాలుని దర్శనం చేసుకున్నారు.

వ. కని దండప్రణామంబు లాచరించి నిటలతట ఘటిత కరకమలలై యిట్లనిరి. 672

* కాళియుని భార్యలు కృష్ణునికి సాష్టాంగ నమస్కారం చేసి, నుదుట చేతులు జోడించి ఇలా విన్నవించుకున్నారు.

క. క్రూరాత్ముల దండింపఁగ, ధారుణిపై నవతరించి తనరెడి నీ కీ
క్రూరాత్ముని దండించుట, క్రూరత్వము గాదు సాధుగుణము గుణాఢ్యా! 673

* "సర్వసద్గుణ సంపన్నుడవైన గోపాలకృష్ణా! క్రూరులను దండించడానికి భూమిపై అవతరించిన మహానుభావుడవు నీవు. క్రూరుడైన ఈ కాళియుని శిక్షించడం నీకు వీరత్వమేగాని క్రూరత్వం కాదు.

క. పగవారి సుతుల యందును, బగ యించుక లేక సమతఁ బరఁగెడి నీకుం
బగ గలదె? ఖలుల నడఁచుట, జగదవనముకొఱకుఁ గాక జగదాధారా! 674

* జగత్తులకు అన్నిటికీ ఆధారమైన ప్రభూ! శత్రువుల కొడుకుల యెడలకూడా శత్రుత్వం చూపకుండా సమానత్వం చూపుతావు నీవు. నీకు శత్రుత్వం ఎందుకు ఉంటుంది? నీవు దుష్టులను శిక్షించడం అనేది లోకాలను రక్షించడానికే!

క. నిగ్రహమె మము విషాస్యుల, నుగ్రుల శిక్షించు టెల్ల? నూహింప మహా
నుగ్రహము గాక మా కీ, నిగ్రహము విషాస్యభావనిర్గతిఁ జేసెన్. 675

* నోట విషం ధరించే వాళ్ళమూ, తీవ్రకోపం కలవాళ్ళమూ అయిన మా వంటివారిని శిక్షించడం నిజానికి దండన అనిపించుకోదు. ఇది మాయెడల మహానుగ్రహమే! నీ యీ దండన వలన మాకు విషం కలవాళ్ళమనే పొగరు దిగిపోయింది.

ఉ. ఎట్టి తపంబు సేసెనొకొ? యెట్టి సుకర్మము లాచరించెనో?
యెట్టి నిజంబు వల్కెనొకొ? యీ ఫణి పూర్వభవంబునందు ము
న్నెట్టి మహానుభావులకు నెన్నఁడుఁ జేరువగాని నీవు నేఁ
డిట్టి వినోదలీలఁ దలలెక్కి నటించెద వీ ఫణీంద్రుపై. 676

* ఈ కాళియుడు పూర్వజన్మలో ఎటువంటి తపస్సు చేశాడో? ఎటువంటి మంచి చేశాడో? ఎన్ని నిజాలు పలికాడో?ఎటువంటి మహానుభావులకూ ఏనాడూ దగ్గరగా వెళ్ళని నీవు ఈ ఫణిరాజు పడగల పైన నాట్యం చేశావంటే అదెంతటి భాగ్యమో?

మ. బహుకాలంబు దపంబు సేసి వ్రతముల్ వాటించి కామించి నీ
మహనీయోజ్జ్వల పాదరేణుకణ సంస్పర్శాధికారంబు శ్రీ
మహిళారత్నము దొల్లి కాంచె నిదె నేమం బేమియున్ లేక యీ
యహి నీ పాదయుగాహతిం బడసె నేఁడత్యద్భుతం బీశ్వరా! 677

* పూర్వం స్త్రీలందరిలోనూ ఉత్తమురాలైన లక్ష్మీదేవి, ఎంతో కాలం తపస్సుచేసి, పట్టుదలతో వ్రతాలు చేసి గొప్ప తేజస్సుతో వెలుగొందే నీ పాదధూళిలో ఒక్క కణాన్ని తాకే అర్హత సంపాదించుకున్నది. అటువంటిది ఈ పాము ఏ తపస్సు చేయకుండానే నీ పాదాల పవిత్ర స్పర్శకు నోచుకున్నది. ఇది ఎంతటి అద్భుతం!

ఉ. ఒల్లరు నిర్జరేంద్రపద మొల్లరు బ్రహ్మపదంబు నొందఁగా
నొల్లరు చక్రవర్తిపద మొల్లరు సర్వరసాధిపత్యము
న్నొల్లరు యోగసిద్ధి మఱి యొండు భవంబుల నొందనీని నీ
సల్లలితాంఘ్రి రేణువుల సంగతి నొందిన ధన్యు లెప్పుడున్. 678

* అతిమనోహరములైన నీ పాదరేణువుల స్పర్శ పొందిన ధన్యులు దేవేంద్రపదవికి ఇష్టపడరు. బ్రహ్మపదవిని గానీ, చక్రవర్తి పదవిని గానీ కోరరు. వరుణుని పదవినిగానీ యోగసిద్ధినిగానీ ఇష్టపడరు. అటువంటి నీ పాదరేణువుల స్పర్శ ఏ జన్మలోనూ ఎవరూ పొందలేనిది.

క. ఘనసంసారాహతులగు, జను లాకాంక్షింపఁ గడు నశక్యం బగు శో
భనము సమక్షంబున నహి, గనియెం దామసుఁడు రోషకలితుం డయ్యున్. 679

* ఎంతో గొప్ప సంసార భారంచేత క్రుంగిపోయిన జనులు కోరడానికి కూడా సాధ్యంకాని పరమశుభం నీ పాదస్పర్శ. అటువంటి భాగ్యాన్ని ఈ కాళియుడు - క్రోధం నిండినవాడు, రోషం నిండినవాడు అయిన ఈ సర్పరాజు పొందగలిగాడు. ఇది నీ సాన్నిధ్యంయొక్క మహిమ!

**వ. దేవా? సకలపురుషాంతర్యామి రూపత్వంబువలనఁ బరమపురుషుండ వయ్యున పరిచ్ఛిన్నత్వంబు వలన మహాత్ముండ వయ్యును, నాకాశాదిభూత సమాశ్రయత్వంబువలన భూతవాసుండ వయ్యును, భూతమయ త్వంబువలన భూతశబ్ద వాచ్యుండ వయ్యును, గారణాతీతత్వంబువలనఁ బరమాత్ముండ వయ్యును, జ్ఞానవిజ్ఞానపరి పూర్ణత్వంబు గలిగి నిర్గుణత్వ నిర్వికారత్వంబుల వలన బ్రహ్మంబ వయ్యును, బ్రకృతి ప్రవర్తకత్వంబువలన ననంతశక్తివై యప్రాకృతుండ వయ్యును, గాలచక్రప్రవర్తకత్వంబువలనఁ గాలుండ వయ్యును, గాల శక్తి సమా శ్రయత్వంబువలనఁ గాలనాభుండ వయ్యును, సృష్టి జీవనసంహారాది దర్శిత్వంబువలనం గాలావయవసాక్షి వయ్యును నొప్పు నీకు నమస్కరించెదము, మఱియును. 680**

* "దేవా! నీవు అందరిలో నిండియున్న వాడవు గనుక, జీవు డనబడే పురుషుడవు కాక, అందులోని అంతర్యామివి కనుక పరమపురుషుడవు. విడివిడిగా కాకుండా అందరిలో నిండి ఉన్నావు గనుక మహాత్ముడవు. ఆకాశం మొదలైన పంచభూతాలకు ఆశ్రయ భూతుడవు గనుక నీవు భూతవాసుడవు. సమస్త భూతములు నీలో ఉన్నవి గనుక నీవు భూతమయుడవు. నీకు కారణం ఏమీ లేదు. గనుక నీవు పరమాత్మవు. పరిపూర్ణమైన జ్ఞానం, విజ్ఞానం కలిగి ఉన్నావు గనుకనూ, గుణాలు అంటక మార్పులు లేక ఉన్నావు కనుకనూ బ్రహ్మముకూడా నీవే. ఈ ప్రకృతిని కూడా నీవే ప్రవర్తింపజేస్తున్నావు. గనుక అనంతశక్తి స్వరూపుడవు. కాని ఆ ప్రకృతి అంటని వాడవు. కాలచక్రాన్ని నడుపుతూ ఉన్నావు గనుక కాలస్వరూపుడవు. కాలంయొక్క శక్తిని ఆశ్రయించి ఉన్నావు గనుక కాలనాభుడవు. ఈ సృష్టిలోని జీవులు పుట్టటం, పోవటం చూస్తూ ఉన్నావు గనుక సర్వసాక్షివి నీవు. అలాంటి నీకు నమస్కరిస్తున్నాము.

**సీ. విశ్వంబు నీవయై విశ్వంబుఁ జూచుచు, విశ్వంబు సేయుచు విశ్వమునకు**
**హేతువవై పంచభూతమాత్రేంద్రియములకు మనఃప్రాణబుద్ధి చిత్త**
**ముల కెల్ల నాత్మవై మొనసి గుణంబుల నావృత మగుచు నిజాంశభూత**
**మగు నాత్మచయమున కనుభూతి సేయుచు మూఁ డహంకృతులచే ముసుఁగువడక**

**తే. నెఱి ననంతుఁడవై దర్శనీయరుచివి, గాక సూక్ష్ముఁడవై నిర్వికారమహిమఁ**
**దనరి కూటస్థుఁడన సమస్తంబు నెఱుఁగు, నీకు మ్రొక్కెద మాలింపు నిర్మలాత్మ! 681**

* ఈ సమస్త విశ్వమూ నీవే. దీన్ని నిర్మిస్తూ ఉన్నదీ నీవే. ఈ విశ్వంగా ఉండి విశ్వాన్ని చూస్తూ ఉన్నవాడివికూడా నీవే. ఈ విశ్వానికి కారణంకూడా నీవే. పంచ తన్మాత్రలు, పంచేంద్రియాలు, మనస్సు, బుద్ధి, చిత్తం, ప్రాణం ఉన్నాయని మేము గమనిస్తున్నాముగాని నీవే ఇన్నిగా ఉన్నావు. ఈ గుణాలచేత ఆవరించబడి ఉన్నావు. నీ అంశగా నీలో కొంతభాగంగా ఇన్ని ఆత్మలు వర్తిస్తూ ఉంటే, వాటికి అనుభూతి కలిగించే మొత్తంగా నీవు ఉన్నావు. సత్త్వరజస్తమస్సుల రూపంలో మూడు అహంకారాలూ పనిచేస్తూ ఉన్నా

వాటితో కప్పబడకుండా అంతులేని ప్రకాశం కలిగి ఉన్నావు. గమనించటానికి వీలులేని సూక్ష్మరూపుడవై ఉన్నావు. ఇన్ని మార్పులూ పొందకుండానే ఇన్నిటిలో దాగి ఉన్నావు గనుక, ఇన్నిటినీ ఎరుగుదువు. అలాంటి నిర్మలాత్ముడవైన నీకు నమస్కరిస్తున్నాము.

**వ. మఱియుఁ గలఁడు లేడు, సర్వంబు నెఱుంగు, నించుక యెఱుంగు, బద్ధుండు, విముక్తుండొ కం, డనేకుండు నను నివి మొదలుగాఁగల వాదంబులు మాయవలన ననురోధింపుదురు గావున నానావాదానురోధకుండ వయ్యును, నభిధానాభిధేయ శక్తిభేదంబువలన బహుప్రభావప్రతీతుండ వయ్యును, జక్షురాది రూపంబులవలనఁ బ్రమాణరూపకుండ వయ్యును, నిరపేక్షజ్ఞానంబు కలిమిం గవి వయ్యును, వేదమయ నిశ్వాసత్వంబువలన శాస్త్రయోని వయ్యును, సంకర్షణ వాసుదేవ ప్రద్యుమ్నానిరుద్ధ రూపంబులవలనఁ జతుర్మూర్తి వయ్యును, భక్త జనపాలకుండ వయ్యును, నంతఃకరణ ప్రకాశకత్వంబు గలిగి సేవకజన ఫలప్రదానంబుకొఱకు గుణాచ్ఛాద కుండవయ్యును. జిత్తాదివర్తనంబులఁ గానం దగిన గుణంబులకు సాక్షివై యొరుల కెఱుంగరామి నగోచరుండ వయ్యును, దర్కింపరాని పెంపు వలన నవ్యాహతవిహారుండ వయ్యును, సకలకార్యహేతు వయ్యు, నంతః కరణప్రవర్తకత్వంబువలన హృషీకేశుండ వయ్యును, సాధనవశంబుగాని యాత్మారామత్వంబువలన ముని వయ్యును, స్థూలసూక్ష్మగతుల నెఱుంగుచు నెందుం జెందక నీవు విశ్వంబు గాకయు విశ్వంబు నీవ యయ్యును, విశ్వభావాభావసందర్శనంబు సేయుచు విద్యావిద్యలకు హేతువయిన నీకుం ప్రణామంబు లాచరించెద మవ ధరింపుము. 682**

* దేవుడున్నాడనీ, లేడనీ వాదిస్తూ ఉంటారు. వాడికి అన్నీ తెలుసుననీ, జీవికి కొంచెం తెలుసుననీ అంటారు. జీవుడు ఒకప్పుడు బంధంలో చిక్కుకున్నాడనీ అటుపైన మోక్షం పొందాడనీ అంటారు. దేవుడు ఒకడే అనీ, అనేక రూపాలలో ఉన్నాడనీ అంటారు. ఇలాంటి వాదాలన్నీ మాయవలన కలుగుతూ ఉంటాయి. నీవు చూస్తే అనేక వాదాల చిక్కులుగా ఒకమాటు కనిపిస్తావు. పేర్లు కలవాడివిగా ఒక మాటూ, పేరుపెట్టి తెలుసుకునే శక్తిగా ఒకమాటూ కనిపిస్తావు. అనేక ప్రభావాలతో తెలియబడుతూ ఉంటావు. కన్ను మొదలైన ఇంద్రియాలకి కనిపించే రూపంగా గమనింపబడుతూ ఉంటావు. ఆ గమనింపులుగా కూడా ఉంటావు. నీ యందున్న జ్ఞానానికి ఆధారాలు, సంకేతాలు అక్కరలేదు. అయినా అన్నిటినీ కల్పిస్తూ కవిగా ప్రవర్తిస్తావు.

నీవు ఈ లోకాలరూపంలో వెలువరించే నిశ్వాసమే వేదం. దాని నుండే అన్నీ తెలుసుకోబడుతూ ఉంటాయి. ఇలా తెలుసుకోవటమే శాస్త్రం. ఈ శాస్త్రాలకి ఉత్పత్తి స్థానంగా పనిచేయటానికి నాలుగు యంత్రాలను పనిముట్లుగా తయారుచేశావు. అవే సంకర్షణుడు, వాసుదేవుడు, ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు అనబడే నీ అర్చామూర్తులు. ఈ వ్యూహాలలో జీవులను ఇరికించినా చూస్తూ ఊరుకోవు. నీ యందు భక్తి పుట్టినవాళ్లని నీవే సాకుతూ ఉంటావు. ఎవడి హృదయంలోంచి వాడుగా వెలువడుతుంటావు. దానితో ఒకరి కొకరు సేవచేసుకోవలసి వస్తుంది. ఆ సేవ నీకు చేసేదే అని తెలిసినవాళ్ళు నీ సేవకులు. వాళ్ళకి ఆ యా ఫలితాలు అందించడానికే వాళ్ళవాళ్ళ గుణాలతో ప్రవర్తిస్తూ ఉంటావు. ఈ గుణాలు ఈ చిత్తం మొదలైన వ్యూహాలకే గోచరిస్తాయి. అందరూ తమకు గోచరిస్తున్నాయనుకుంటారు. నువ్వు మాత్రం వాళ్ళకి

గోచరించకుండా సాక్షిగా వాళ్లలోనే ఉంటావు. తర్కం ఈ వ్యూహాల నుండి పుట్టింది గనుక, ఈ వ్యూహాలలో ఉన్న నీవు దానికి అందకుండా విహరిస్తూ ఉంటావు. జరిగే పనులన్నీ నీ దగ్గరనుండే బయలుదేరుతాయి గనుక నీవు ఒక్కడవే హేతువు. ఇంద్రియాలలో వర్తిస్తూ ఉంటావు గనుక, ఇంద్రియాలకు అధిపతిగా (హృషీకేశుడుగా) కూడా ఉంటావు. నిన్ను నీవు తెలిసి ఉంటావు గనుక సాధనలకు లొంగే వాడివి కాదు. మునివై మౌనంగా అందరిలో ఉంటావు. అన్నీ నీకు తెలుసు. తెలిసినదేదీ నీవే కాని, నీది కాదు. అయినా ఈ సమస్తం నీవే అయి నీదిగాకూడా ఉంచుతావు. నీవుగా సంకల్పించినపుడు ఈ సృష్టి లేదు. నీదిగా సంకల్పించినపుడు ఈ సృష్టి ఉంది. ఈ రెండింటిలో మొదలిటిది తెలివి. రెండవది మరపు. ఈ రెండింటికీ కారణం నీవే! అలాంటి నీకు నమస్కరిస్తున్నాము.

**క. లోక జని స్థితి లయములు, గైకొని చేయుదువు త్రిగుణ కలితుఁడవై కా**
**లాకారమున నమోఘు, శ్రీకలితుఁడ వగుచు నిచ్చ సెందక యీశా! 683**

* ఈశ్వరా! తిరుగులేని లక్ష్మీసంపన్నుడవై త్రిగుణాలతోనూ కలసి ఈ లోకాలను పుట్టించి, నిలబెట్టి, మళ్ళీ లయం చేస్తూ ఉంటావు. ఆ సమయంలో నీవు కాలస్వరూపుడవు కాని నీకు ఎటువంటి అపేక్ష లేదు.

**క. నీశాంతలు గాని తనువు, లీశా! యీ మూఢజాతు లీ సజ్జాతుల్**
**నీ శాంతతనువులందుఁ బ్ర, కాశింతువు ధర్మహితముగా సుజనులలోన్. 684**

* ఓ పరమేశ్వరా! ఈ మా జన్మలన్నీ ఒకరియందు మరొకరికి కల రాగంతో బ్రతుకుతూ ఉన్నాయి. ఇవి మూఢజన్మలు. ఈ జన్మలు శాంతి లేకుండా బ్రతికేవి. నీవు శాంతమైన నీ రూపంతో మంచివాళ్ళలో మాత్రం అనుభవానికి వస్తూ ఉంటావు. ధర్మానికి హితం చేకూర్చే రూపంలో ప్రకాశిస్తూ ఉంటావు.

**ఉ. నేరము లెన్న నెక్కడివి? నేము దలంచు తలంపులోపలన్**
**నేరుపు లున్నవే? సుతుల నేరమిఁ దండ్రులు త్రోచిపుచ్చరే?**
**నేరము సేయువారి ధరణీపతు లొక్కొకమాటు గావరే?**
**నేరము గల్గు మద్విభుని నేఁడిటఁ గావఁ గదే కృపానిధీ! 685**

* నీ సన్నిధిలో నేరములంటూ ఏముంటాయి? మాకు కల్గే ఆలోచనలలో నిన్ను మెప్పించగల నేర్పులు ఉండడం సాధ్యమా? బిడ్డలు నేరం చేశారే అనుకో! తండ్రులు క్షమించరా! రాజులు ఒక్కొక్క సారి నేరం చేసేవారినికూడా క్షమిస్తూ ఉంటారు కదా? మా భర్త ఈ కాళియుడు నేరమే చేశాడు. అయినా క్షమించు. కరుణకు పుట్టినిల్లవుకదా నీవు!

**శా. బాలుండీతఁడు మంచివాఁడనుచుఁ జెప్పన్ రాము క్రూరుండు దు**
**శ్శీలుండౌ నవు నైన నేము సుభగశ్రీఁ బాసి వైధవ్య దు**
**ష్టాలంకారముఁ బొంద నోడెద మనాథాలాప మాలింపవే?**
**చాలున్ నీ పదతాండవంబు, పతిభిక్షం బెట్టి రక్షింపవే? 686**

* ఈ కాళియుడు అమాయకుడని మంచివాడనీ అనడం లేదు. ఇతడు క్రూరుడు, దుష్టుడు నిజమే! అయినా మేము సౌభాగ్యాన్ని పోగొట్టుకొని విధవలమై అసహ్యమైన రూపాలను ధరించలేము. మేము అనాథలము. మా దీనాలాపాలను ఆలించు. నీ పాదతాండవం ఇక చాలించు. మాకు పతిభిక్ష పెట్టి మమ్మ పాలించు.

**ఉ. ఆకులమయ్యె భోగ మిదె యౌఁదల లన్నియు వ్రస్సెఁ బ్రాణముల్**
**రాకలఁ బోకలం బొలిసె రాయిడి వెట్టక మా నిజేశుపై**
**నీ కరుణాకటాక్షములు నిల్పఁగదే తగ నో సమస్త లో**
**కైకశరణ్య! యో యభయకారణ! యో కమలామనోహరా! 687**

* ఇతని శరీరమంతా నలిగి చితికిపోయింది. తలలు పగిలి పోయాయి. ప్రాణాలు వస్తున్నాయా, పోతున్నాయా, అన్నట్లు ఉన్నాయి. ఇంకా బాధపెట్టకుండా, మా భర్తపైన కరుణతో కూడిన నీకడగంటి చూపులు ప్రసరింపచేసి రక్షించవా? ఈ లోకంలో గానీ, మరే లోకంలో నైనా గానీ నిన్ను గాక మరి ఎవరినీశరణు కోరుకోగలము? భయం లేకపోవడం నీ వల్లనే కల్గాలి. లక్ష్మీదేవికి భర్తవైన నీకు భక్తుల విషయంలో భార్యలు పొందే ఆవేదన ఎలా ఉంటుందో తెలియకపోదు.

**ఆ. మమ్ముఁ బెండ్లిసేయు మా ప్రాణవల్లభు, ప్రాణ మిచ్చి కావు భక్తవరద!**
**నీవు సేయుపెండ్లి నిత్యంబు భద్రంబుఁ, బిన్ననాఁటి పెండ్లి పెండ్లి గాదు. 688**

* మాకు ప్రాణప్రియుడైన ఈ కాళియుని ప్రాణాన్ని ప్రసాదించి, అతనితో మాకు మళ్ళీ కల్యాణం కల్పించి మమ్మ చల్లగా రక్షించు. భక్తులైన వారికి వరాలనిచ్చే మహానుభావా! చిన్ననాడు మాకు జరిగిన పెండ్లి ఒక పెండ్లి కాదు. ఇప్పుడు నీవు చేసే పెండ్లి శాశ్వతంగా ఉండేదీ, క్షేమకరమైనదీను!

**ఇంద్రవజ్ర.**
**నీయాన, యెవ్వారిని నిగ్రహింపం, డా యుగ్ర పాపాకృతి నందఁ డింకన్,**
**నీ యాజ్ఞలో నుండెడు నేఁటఁ గోలెన్, మా యాశుప్రాణంబులు మాకు నీవే! 689**

* నీ మీద ఒట్టుపెట్టి చెబుతున్నాము; ఇతడు ఇంకెవ్వరినీ ఏనాడు బాధపెట్టడు. భయంకరమైన పాపిష్ఠి రూపము ఇంకెప్పుడూ ధరించడు. నేటినుండి నీవు చెప్పినట్లు నడచుకుంటాడు. మా భర్త ప్రాణాలను మాకు ప్రసాదించు".

**వ. అని యిట్లు తమపెనిమిటి బ్రదుకుఁ గోరెడి భుజగసతుల యందు శరణాగత రక్షకుండైన పుండరీకాక్షుండు గరుణించి, చరణఘట్టనంబు సాలించి, తలంగిన నెట్టకేలకుఁ బ్రాణేంద్రియంబుల మరలం బడసి, చిదిసి నలఁగిన తలలు సవరించుకొని వగర్చుచు భుజగపతి జలజనయనునికి నంజలి సేసి మెల్లన నిట్లనియె. 690**

* ఈ విధంగా తమ భర్త బ్రతుకును కోరుతున్న కాళియుని భార్యలను కృష్ణుడు కరుణించాడు. తన కాలితాపులు ఆపుచేసి ప్రక్కకు తప్పుకున్నాడు. శరణు జొచ్చే వారిని రక్షించేవాడు కదా కృష్ణుడు! చివరకు ఎలాగైతేనేమి తన ప్రాణాలను మరల దక్కించుకున్న నాగేంద్రుడు, చితికి నలిగిపోయిన తలలను సవరించుకుని, ఆయాసంతో వగరుస్తూ కృష్ణునికి తలవంచి నమస్కారం చేసి, నెమ్మదిగా ఇలా అన్నాడు.

**చ. మలఁకలు మా ప్రచారములు, మా ముఖముల్ విషవహ్ని ఘోరముల్,**
**ఖలులము, రోషజాతులము, గర్వుల, మే మొక మంచివారమే?**
**నళినదళాక్ష! ప్రాణులకు నైజ గుణంబులు మాన నేర్చునే?**
**వెలయవె? మా వికారములు వింతలె? మే లొనరించి తీశ్వరా! 691**

* "కృష్ణా! సర్వేశ్వరా! మా నడకలు వంకరటింకరైనవి. మా ముఖాలు విషాగ్నులతో ఘోరమైనవి. దుర్మార్గులము. రోషం గల్గిన జాతివారము. రోషంలోనే పుట్టిన వాళ్ళము. పొగరుబోతులము. మేమూ ఒక మంచివాళ్ళమేనా? ఈ సృష్టిలో నున్న ప్రాణులందరికీ తమ సహజమైన గుణాలు అలాగే ఉంటాయి గాని లేకుండా పోతాయా? కమలాక్షా! మా వికృత చేష్టలన్నీ సృష్టికర్తవైన నీకు వింతలు కాదు గదా! అయినా ఈనాడు నాకు చాల ఉపకారం చేశావు.

**సీ. వివిధ భావాకార వీర్యబీజాశయ జవయోనియుతముగా జగము లెల్ల**
**నీవ చేసితి మున్న, నే మా జగంబులో సహజకోపనులము సర్పములము,**
**దుర్వారమైన నీ తోరంపు మాయ నే మెఱిఁగి దాఁటెడు పని కెంతవార?**
**మంతకుఁ గారణ మఖిలేశ్వరుండవు సర్వజ్ఞుఁడవు నీవు జలజనయన!**

**తే. మనిచె దేనిని మన్నించి మనుపు నన్ను నిగ్రహించెద వేనిని నిగ్రహింపు,**
**మింక సర్వేశ! మా యిమ్ము లెందుఁ గలవు, చిత్తమందున్న క్రమమునఁ జేయఁదగును. 692**

* సర్వేశ్వరా! పూర్వము ఈ జగత్తు లన్నిటినీ వివిధ భావాలు, ఆకారాలు, వీర్యములు, వీర్యాతిశయములు జనన స్థానాలతో సహా నీవే సృష్టించావు. అటువంటి నీ సృష్టిలో మేము సహజంగా కోపం గల్గిన సర్పాలము. నీ మాయ దాటరానిది. అటువంటి నీ అద్భుతమైన మాయను తెలుసుకుని దాటాలంటే అది మాకు సాధ్యమా? ఈ సర్వానికి ఈశ్వరుడవు. అన్నీ తెలిసిన వాడవైన నీవే అన్నింటికీ కారణము. కనుక కమలనయనా! మమ్ములను క్షమింపదలచుకుంటే క్షమించు, రక్షించు; శిక్షించ దలచుకుంటే శిక్షించు, ఇంకా మా యిష్టాలు ఎక్కుడున్నాయి? నీ దివ్య చిత్తం ఎలా ఉంటే అలా చెయ్యి.

**క. నా పుణ్య మేమి సెప్పుదు? నీ, పాదరజంబుఁ గంటి నే, సనకాదుల్**
**నీ పాదరజము గోరుదు, రే పదమం దున్ననైన నిఁక మేలు హరీ! 693**

* శ్రీహరీ! నీ పాదధూళిని నేను పొందగల్గాను. నా పుణ్యమేమని చెప్పను! సనకాది దివ్యమునులు కూడా నీ పాదధూళినే కావాలని కోరుకుంటారు. ఏ స్థితిలో ఉన్నా ఇక నాకు క్షేమమే!"

వ. అని విన్నవించినఁ గాళియు పలుకులు విన నవధరించి కారుణ్య మానసుండయిన సర్వేశ్వరుం డతని కిట్లనియె. 694

* ఈ విధంగా విన్నవించిన కాళియుని మాటలు ఆలకించి అనుగ్రహించిన శ్రీకృష్ణుడు ముందు జరుగవలసిన పనిని దృష్టిలో పెట్టుకుని ఇలా అన్నాడు.

క. 'గోవర్గముతో మనుజులు, ద్రావుదు రీ మడుఁగు నీరు, తగ దిం దుండన్,
నీవును నీ బాంధవులును, నీ వనితలు సుతులుఁ జనుఁడు నేఁ డంబుధికిన్. 695

* "కాళియుడా! ఈ మడుగులోని నీరు గోవులతోపాటు మనుష్యులూ త్రాగుతూ ఉంటారు. ఇక నీ విందులో ఉండరాదు. నీవూ నీ భార్యలూ, కుమారులూ, బంధువులూ అందరు కలసి ఈనాడే సముద్రంలోకి వెళ్లిపోవాలి."

క. నిను నే శాసించిన కథ, మనమునఁ జింతించి రేపు మాపును గీర్తిం
చిన మనుజులు నీ భయమును, విను మెన్నఁడుఁ బొంద రెందు విషవిజయముతోన్. 696

* నిన్ను నేను దండించిన ఈ కథను మనస్సులో స్మరించి ఉదయము, సాయంత్రము చదువుకున్న మనుష్యు లెవ్వరూ ఇక మీజాతిని గురించి భయపడరు. ఎప్పుడూ విషాన్ని జయించి సురక్షితంగా ఉంటారు.

చ. ఇది మొదలెవ్వరైన నరు లీ యమునాతటినీ హ్రదంబులో
వదలక తోఁగి నన్ను నుపవాసముతోడఁ దలంచి కొల్చుచుం
గదలక దేవతాదులకుఁ గా జలతర్పణ మాచరించినన్
సదమలచిత్తులై దురిత సంఘముఁ బాయుదు రాక్షణంబునన్. 697

* ఈనాటినుండి ఏ మానవులైన ఈ యమునానది మడుగులో స్నానం చేసి, ఉపవాసం చేసి, నన్ను పూజించి, దేవతలు మొదలైన వారికి జల తర్పణాలు వదలితే, ఆ క్షణంలోనే వారి మనస్సునుండి దోషములు తొలగిపోయి, స్వచ్ఛమైన మనస్సు గలవారవుతారు.

ఆ. గరుడభీతి రమణకద్వీప మొల్ల కీ, మడువుఁ జొచ్చి తీవు, మత్పదాబ్జ
లాంఛనములు నీతలను నుంటఁజూచి యా, పక్షిరాజు నిన్నుఁ బట్టఁ డింక. 698

ఇంతకుముందు నీవు రమణక ద్వీపంలో ఉంటూ గరుత్మంతుని వలన భయంతో ఈ మడుగులోనికి వచ్చావు. కాని నా పాదాల గుర్తులు నీ తల మీద ఉండడం చూచి, పక్షిరాజైన గరుత్మంతుడు ఇక నిన్నేమీ చేయడు.

వ. అని యిట్లు విచిత్రవిహారుండైన గోపాలకృష్ణకుమారుం డాన తిచ్చిన, నియ్యకొని, చయ్యన నయ్యహీంద్రుండు దొయ్యలులుం దానును నెయ్యంబున న య్యీశ్వరునకు నవ్యదివ్యాంబరాభరణ రత్నమాలికానులేపనంబులు సమర్పించి, తేఁటి తండంబులకు దండయగు నీలోత్పలంబుల దండ యిచ్చి, పుత్రమిత్రకళత్ర సమేతుండై, బహువారంబులు గైవారంబు సేసి, వలగొని, మ్రొక్కి, లేచి, వీడ్కొని రత్నాకరద్వీపంబునకుం జనియె, నిట్లు. 699

* విచిత్రమైన ప్రవర్తనలు కల్గిన గోపాలకృష్ణుడు ఈ విధంగా ఆజ్ఞాపించగానే కాళియుడు వెంటనే అంగీకరించాడు. తాను తన భార్యలు కలసి, కృష్ణునికి సరికొత్త దివ్యవస్త్రాలు, ఆభరణాలు, రత్నహారాలు సుగంధద్రవ్యాలు సమర్పించి, తియ్యతేనెలు వెల్లివిరిసే నల్లకలువల దండ సమర్పించాడు. కొడుకులు, స్నేహితులు, భార్యలతో కలసి ఎన్నోసార్లు నందనందనునకు నమస్కారాలు చేసి ప్రదక్షిణలు చేసి మొక్కాడు. కృష్ణునివద్ద సెలవు తీసికొని తనవారితో కలసి సముద్రం లోని ఒక ద్వీపం చేరుకున్నాడు.

క. **వారిజలోచనుఁ డెవ్వరు, వారింపఁగ లేని ఫణినివాసత్వంబున్**
**వారించిన యమున సుధా, వారిం బొలుపారె నెల్లవారికిఁ బ్రియమై.** 700

* కమలాలవంటి కన్నులు గల కృష్ణుడు ఎవరికీ సాధ్యంకాని విధంగా యమునానదిలో కాళియుని నివాసాన్ని తొలగించగానే యమునా నది అమృతంవంటి నీళ్ళతో నిండి అందరికీ అత్యంత ప్రియమై పోయింది.

## -: కాళియుని పూర్వకథ :-

వ. అనిన విని **'మునీంద్రా! యేమి కారణంబునఁ గాళియుండు భుజగనివాసంబయిన రమణకద్వీపంబు విడిచె? నతం డొక్కరుండును గరుడున కేమి తప్పు దలంచె?'**నని నరవరుం డడిగిన మునివరుం డిట్లనియె. 701

* ఇలా శుకయోగి చెప్పగానే పరీక్షిత్తు ఇలా అడిగాడు. "మునీంద్రా! పాములకు నివాసమైన రమణక ద్వీపాన్ని కాళియుడు ఎందుకు వదలిపెట్టాడు? అత డొక్కడూ గరుత్మంతుని కేమి అపచారం చేశాడు?

అప్పుడు శుకమహర్షి ఇలా అన్నాడు.

సీ. **'సర్పభీరువులైన జను లెల్ల నెలనెల సరసభక్ష్యములు వృక్షముల మొదల**
**సర్పంబులకుఁ బెట్ట, సర్పంబులును మును సర్పాంతకుఁడు దమ్ముఁ జంప కుండఁ**
**బ్రతిమాసమును దమభాగ భక్ష్యంబు లా పక్షిరాజున కిచ్చి బ్రదుకు చుండ**
**విషవీర్య దుర్మదావిష్టుఁడై కాళియుఁ డహికులాంతకుని పా లపహరించి**

తే. **యూక తనపాలి బలిభాగ మెల్లఁ దినిన, విని ఖగేంద్రుఁడు కోపించి 'వీని' తలలు**
**సీరి చెండాడి భోగంబు చించి వైచి, ప్రాణములఁ బాపి వచ్చెదఁ బట్టి' యనుచు.** 702

* పూర్వం పాములంటే భయపడే జనులందరూ నెలనెలా మధురమైన పదార్థాలు పాములకు నైవేద్యంగా చెట్ల మొదళ్ళలోపెట్టి వెళ్ళేవారు. గరుత్మంతుడు తమను చంపకుండా తమ భాగాలకు వచ్చిన పదార్థాలన్నీ ప్రతిమాసమూ ఖగరాజుకు కానుకగా సమర్పించి సర్పరాజులు బ్రతుకుతుండేవారు. కాళియుడు మాత్రము ఒకసారి తన విషం చాలా గొప్పదనే దురహంకారముతో మదించిపోయి, గరుత్మంతుని భాగం ఎగగొట్టి అంతా తానే తినివేశాడు. ఇది విన్న గరుత్మంతుడు కోపించి, "వీని తలలు చీల్చి చెండాడి, పడగలు చించి, ప్రాణాలు తీసివస్తాను"అంటూ బయల్దేరాడు.

క. అక్షీణ కనకసన్నిభ, పక్ష యుగోద్భూత ఘోర పవమాన మహా
విక్షేప కంపితానే, క క్షోణిధరేంద్రుఁ డగుచు గరుడుఁడు వచ్చెన్. 703

బంగారు రంగులో మెరిసిపోతూ ఉన్న గరుత్మంతుని రెక్కల నుండి పుట్టిన బ్రహ్మాండ మైన వాయువు మహాఘోరమైన ఎన్నో పర్వతాలనే కంపింప చేసింది. అంతటి మహావేగంతో గరుత్మంతుడు కాళియుని పైకి వచ్చాడు.

ఉ. వచ్చిన సర్పవైరిఁ గని వ్రాలక లేచి మహాఫణావళుల్
విచ్చి దృగంచలంబుల నవీనవిషాగ్ని కణంబు లొల్కఁగా
నుచ్చలదుగ్రజిహ్వలు మహోద్ధతిఁ ద్రిప్పుచు నూర్పు లందుఁ గా
ర్చి చ్చెగయంగఁ బాఱి కఱచెన్ విహగేంద్రు నహీంద్రుఁ డుగ్రతన్. 704

* అలా వస్తూ ఉన్న గరుత్మంతుని చూచి కాళియుడు పడగలు వంచి పారిపోలేదు. తన బ్రహ్మాండమైన పడగ లన్నింటినీ విప్పి, కనుగొనలనుండి వినూత్న విషాగ్ని కణాలు రాలుతూ ఉండగా, నాలుకలు చాచి, మహావేగంతో తల త్రిప్పుతూ ఉచ్ఛ్వాస నిశ్వాసాలలో నుండి అనల జ్వాలలు ప్రసరింపజేస్తూ, ముందుకు దూకి గరుత్మంతుని కాటు వేశాడు కాళియుడు.

క. కఱచిన భుజగము రదములు, విఱుగఁగ వదనములు విషము వెడలఁగ శిరముల్
పఱియలుగ నడిచె గరుడుఁడు, తఱిమి కనకరుచులు గలుగు తన డాఱెక్కన్. 705

* కాళియుడు అలా కాటువేయగానే గరుత్మంతుడు విజృంభించాడు. కాళియుని తరుముకుంటూ వెళ్లి బంగారు రంగులు చిమ్ముతూ ఉన్న తన ఎడమ రెక్కతో ఒక దెబ్బ కొట్టాడు. ఆ దెబ్బకు కాళియుని కోరలు విరిగిపోయాయి. నోళ్ళవెంట రక్తం క్రక్కుకున్నాడు. తలలు చితికి చీలికలు అయిపోయాయి.

వ. ఇట్లహికులారాతిచేత వ్రేటువడి వెఱచి పఱతెంచి కాళియుం డీ గభీరంబయిన మడుఁగుఁ జొచ్చె, మఱియు నొక్కవిశేషంబు గలదు. 706

* ఈ విధంగా గరుత్మంతునిచేత దెబ్బతిని భయపడి పారిపోయి కాళియుడు ఈ లోతైన మడుగులో ప్రవేశించాడు. ఇక్కడ ఒకవిశేషం కూడా ఉంది.

సీ. మున్ను సౌభరి యను ముని యీ హ్రదంబునఁ దపము సేయుచు నుండ ధరణిలోన
నాఁకలిగొని పన్నగాంతకుఁ డొకనాఁడు సనుదెంచి యిందుల జలచరేంద్రు
నొడిసి భక్షించిన నున్న మీనము లెల్ల ఖిన్నంబులై వగఁ గ్రిస్సి యున్నఁ
జూచియు మునిరాజు శోకించి కోపించి 'గరుఁడుడు నేఁడాది గాఁగ నిందుఁ

తే. జొచ్చి మీనంబులను మ్రింగఁ జూచెనేనిఁ, జచ్చుఁగావుత' మని యుగ్రశాప మిచ్చెఁ
గాళియుం డొక్కఁ డా శాపకథ యెఱుంగు, నితర భుజగంబు లెవ్వియు నెఱుఁగ వధిప! 707

* పూర్వము 'సౌభరి' అనే ముని ఈ మడుగులో తపస్సు చేసుకుంటూ ఉండేవాడు. గరుత్మంతు డొకనాడు ఆకలిగొని ఈ మడుగు వద్దకు వచ్చాడు. ఇందులో ఉన్న చేపలరాజును పట్టుకుని చంపి తిని వేశాడు. మిగిలిన చేపలన్నీ దుఃఖంతో ఉసూరుమంటూ ఏడుస్తూ ఉంటే ఆ మహర్షి వాటిశోకం చూచి చాల బాధపడ్డాడు. అతడు కోపించి "ఈ నాటి నుండి గరుత్మంతుడు వచ్చి ఇందులో ఉన్న చేపలను మ్రింగడానికి ప్రయత్నించాడంటే వెంటనే చచ్చిపోతాడు"అని భయంకరమైన శాపం ఇచ్చాడు. కాళియు డొక్కడే ఈ శాప మెరుగును. మిగిలిన పాము లేవీ ఎరుగవు.

వ. అది కారణంబుగాఁ గాళియుం డీ మడుఁగుఁ జొచ్చియున్న, గో మనుజ రక్షణార్థంబు కృష్ణుండతని వెడలించె, నిట్లు దివ్య గంధాంబర సువర్ణమణిగణ మాలికాలంకృతుండై, మడుఁగు వెడలి వచ్చిన మాధవుం గని, ప్రాణలాభంబులం బొందిన యింద్రియంబులం బోలె, యశోదారోహిణీ సమేతలయిన గోపికలును, నంద సునందాదులైన గోపకులును మూర్ఛలం బాసి, తేటి, తెప్పిటి,లేచి, పరమానందం బునం బొందిరి, బల భద్రుండు తమ్ముని నాలింగనంబు సేసె, నప్పుడు. 708

* ఆ కారణంచేత కాళియుడు ఈ మడుగులో ప్రవేశించి ఉంటున్నాడు. కృష్ణుడు గోవులనూ, గోపాలకులనూ రక్షించడానికి అతనిని అక్కడనుండి వెళ్ళగొట్టాడు. ఈ విధంగా దివ్యగంధాలు, వస్త్రాలు, మణులతో కూడినహారాలు అలంకరించుకుని కృష్ణుడు మడుగులో నుంచి బయటకు వచ్చాడు. అలా మడుగు వెడలి వచ్చిన మాధవుణ్ణి చూడ గానే ఇంద్రియాలకు ప్రాణాలు వచ్చినట్లు గోకులవాసు లందరికీ ప్రాణాలు లేచి వచ్చాయి. యశోదా రోహిణుల తోపాటు గోపికలు, నందుడు సునందుడు మొదలైన గోపకులు అందరూ మూర్ఛలలోనుంచి తేరుకుని తెప్పరిల్లి, లేచి పరమానందం పొందారు. బలరాముడు తమ్ముణ్ణి కౌగిలించుకున్నాడు.

క. ఱంకెలు వై చె వృషభము ల, హంకారముతోడ, లేఁగ లట్టి ట్టుటికెం,
బొంకముల నొప్పె ధేనువు, లంకురితము లయ్యెఁ దరువు లా హరిరాకన్. 709

* ఆబోతులు సంతోషంతో రంకెలు వేశాయి. లేగదూడలు ఆనందంతో అటూ ఇటూ చెంగనాలు వేశాయి. ఆవులు ఉప్పొంగి పోయాయి. అక్కడున్న చెట్లు కూడా కృష్ణుని రాకతో చిగురించాయి.

క. 'నీ సుతుఁ డహిచే విడివడె, నీ సురుచిర భాగ్యమహిమ నిశ్చల' మనుచున్
భూసురులు సతులు దారును, భాసురవచనముల నందుఁ బలికి రిలేశా! 710

* బ్రాహ్మణులు తమ భార్యలతో కలసి, నందుని ఉద్దేశించి "నీ కొడుకు పాము నోటినుండి బయటపడ్డాడు. యోగ్యమైన నీ భాగ్యము ఎంతగొప్పది! ఇక దానికి తిరుగులేదు" అని అభినందించి, ఆశీర్వదించారు.

శా. 'ని న్నా యుగ్రభుజంగమంబు గఱవన్ నీవాపదం బొందుచున్
న న్నే మంటి తనూజ! యోడవు గదా నాకూన! నా తండ్రి! రా
వన్నా!' యంచు శిరంబు మూర్కొని నిజాంకాగ్రంబుపై నిల్పుచుం
గన్నీ రొల్కఁగఁ గౌఁగిలించెఁ దనయున్ గారాముతోఁ దల్లి దాన్. 711

* యశోద కృష్ణుణ్ణి ఒడిలో కూర్చుండబెట్టుకుని అతని తల మూర్కొని, ఇలా అన్నది. "నా కూనా! నా తండ్రీ! నా బాబూ! నిన్ను ఆ భయంకరమైన పాము కరుస్తూ ఉంటే, ఆపదలో చిక్కుపడి పోయినప్పుడు నన్నేమని కేకవేశావు నాయనా? బెంబేలు పడలేదు గదా! అంటూ కన్నీళ్ళతో అతణ్ణి గట్టిగా కౌగిలించుకొని గారాబం చేసింది.

వ. ఇట్లు పరమసంతోషులై ఘోషజను లారేయి కాళిందీతటంబున నాఁకలి నీరువట్టుల డస్సి క్రుస్సి, గోవులం దారు నుండ, నగణ్యంబగు న య్యరణ్యంబున నొక్క దవానలంబు పుట్టి చుట్టు ముట్టికొని నడురేయి నిద్రితంబైన వ్రజంబుమీదఁ గదిసిన నదరిపడి, లేచి, దందహ్యమానదేహులయి సకల జనులును మాయామనుజ బాలకుండైన హరికి శరణాగతులై యిట్లనిరి. 712

* ఈ విధంగా గోకులవాసులు పరమసంతోషంతో ఈ రాత్రి యమునానది తీరంలోనే ఉండి పోయారు. ఎవరికీ అన్నము, నీళ్ళులేవు. అందరూ నీరసించి గోవులతోపాటు అక్కడ ఉండిపోయారు. ఆ మహారణ్యంలో ఆ రాత్రి ఒక పెద్ద దావాగ్ని పుట్టింది. నిద్రిస్తూ ఉన్న గోకులవాసులను చుట్టు ముట్టి మీది మీదికి వచ్చింది. వారందరూ శరీరాలు కాలిపోతూ ఉంటే, మాయా గోపాలుడైన శ్రీహరికి శరణాగతులై ఇలా ప్రార్థించారు.

### -: గో గోప గోపికా సంఘమును గార్చిచ్చు చుట్టుకొనుట :-

మ. 'అదె వచ్చెన్ దవవహ్ని ధూమకణ కీలాభీల దుర్వారమై
యిదె కప్పెన్ మమునెల్ల వారినిట మీఁ దేలాగు రక్షింపు నీ
పదపద్మంబుల కాని యొండెఱుఁగ, మో పద్మాక్ష!, యో కృష్ణ! మ్రొ
క్కెద మో రామ! మహాపరాక్రమ! దవాగ్నిన్ వేగ వారింపవే! 713

* "అదిగో! అదిగో! దావాగ్ని వచ్చేస్తూ ఉంది. పొగ, నిప్పురవ్వలు అవిగో! అగ్ని జ్వాలలుకూడా! ఆపడానికి వీలులేకుండా వచ్చేస్తున్నది. ఇదిగో, మమ్మల్ని అందరినీ ఆవరించింది. ఇంక ఏమిటి చేయటం? ఓ కృష్ణా! ఓ పద్మాక్షా! ఓ మహా పరాక్రమవంతుడవైన బలరామా! మీకు నమస్కారం చేస్తాము. మీ పాదపద్మాలేగాని ఇంక మేమేమీ ఎరుగము. ఈ దావాగ్నిని త్వరగా నివారించి, రక్షించరా?

క. నీ పాదంబులు నమ్మిన, నాపద లెక్కడివి? జనుల కత్యుగ్ర మహా
దీపిత దావజ్వలనము, పైపడ కుండెడి విధంబు భావింపఁ గదే.' 714

* కృష్ణా! నీ పాదాలు నమ్మిన వారికి ఆపదలు ఎక్కడుంటాయి? అతి తీవ్రమై, భయంకరంగా విజృంభిస్తూ ఉన్న ఈ దావాగ్నిని మీదకు రాకుండా ఆపుచేసే విధానం ఆలోచించలేవా?"

వ. అని ఘోషించు ఘోషజనులం గరుణించి జగదీశ్వరుండగు ననంతుం డన శక్తియుతుండై గహనంబు నిండిన దావదహనంబు పానంబు సేసిన, విజయగానంబు దశదిశల నిగిడె, నంతం గృష్ణుండు గో గణజ్ఞాతి సహితుండై మందయానంబున మందకుఁ జనియె, నిట్లు రామకేశవులు గోపాలబాల వేషంబులం గ్రీడించు సమయంబున. 715

* ఈ విధంగా ఘోషపెడుతూ ఉన్న గోకులవాసులను కృష్ణుడు కరుణించాడు. జగదీశ్వరుడై అనంతుడైన కృష్ణుడు అనంతమైన తన మహాశక్తితో ఆ అడవిలో వ్యాపించిన దావాగ్నిని త్రాగివేశాడు. అతనిని స్తుతిస్తూ జయ జయ గానాలు పది దిక్కులలోనూ ఒక్కసారిగా వ్యాపించాయి. తరువాత కృష్ణుడు గోవులతోనూ, తన వారితోను కలిసి నెమ్మదిగా బృందావనానికి వెళ్లాడు. ఈ విధంగా బలరామకృష్ణులు గోపాల బాలుర వేషాల్లో క్రీడిస్తూ ఉన్న సమయంలో, ఒకసారి వేసవి కాలం వచ్చింది.

## -: గ్రీష్మర్తు వర్ణనము :-

**సీ. దినము లంతంతకు దీర్ఘంబులై యుండ దిననాథుఁ డుత్తరదిశఁ జరించె,**
**నాఁటి నాఁటికి నెండ నవ్యమై ఖర మయ్యె, వెచ్చని గాడ్పులు విసరఁ జొచ్చె,**
**మేదినీ రేణువుల్ మింట సంకుల మయ్యె, నేఱులుఁ గొలఁకులు నిగిరిపోయెఁ,**
**బానీయశాలలఁ బథిక సంఘము నిల్చెఁ, జప్పరంబుల భోగిచయము డాఁగెఁ,**

**ఆ. దరులఁ గుసుమచయము దళములతో వాడె, మిథునకోటికి రతి మెండు దోఁచె,**
**నఖిలజంతుభీష్మమైన గ్రీష్మము రాకఁ, గీలి యడవులందుఁ గేలి సలిపె. 716**

* ఆ గ్రీష్మ ఋతువులో పగటి సమయాలు అంతకంతకూ పొడుగు అవుతున్నాయి. సూర్యుడు ఉత్తరదిక్కులో సంచరిస్తున్నాడు. ఎండ రోజురోజుకీ క్రొత్త తీక్షత్వం చూపుతున్నది. వెచ్చని గాడ్పులు విసురుతున్నాయి. భూమినుండి లేచిన ధూళిరేణువులు గాలిలో ఆకాశమంతా వ్యాపించినాయి. సెలయేళ్ళలో, కొలనులలో నీళ్ళు ఇగిరిపోయాయి. చలివేంద్రశాలలలో బాటసారులు ఎక్కువగా చేరుతున్నారు. పాములు ఎండ భరించలేక పొదలలోపల దూరిపోయినాయి. చెట్లమీద పూవులు ఆకులతో సహా వాడిపోయినాయి. దంపతులకు శృంగారక్రీడలపై ఆసక్తి ఎక్కువైంది. సర్వజీవులకూ భయంకరమైన గ్రీష్మఋతువు రావడంతో అగ్నిదేవుడు అడవులలో ఆడుకొనసాగాడు.

**ఆ. వాఁడిరుచులు గలుగువాని వేఁడిమి గ్రీష్మ, కాలమందు జగము గలయఁబడియె**
**బ్రహ్మ జనులకొఱకు బ్రహ్మాండఘటమున, నుష్ణరసముఁ దెచ్చి యునిచె ననఁగ. 717**

* తీక్ష్ణమైన కిరణాలు గల సూర్యుని వేడికి ఆ వేసవికాలంలో లోకమంతా కలవరపడిపోయింది. ఈ జనులందరికోసం బ్రహ్మదేవుడు, ఈ బ్రహ్మాండమనే భాండంతో ఉష్ణరసాన్ని నింపాడా అన్నట్లు ఉన్నది.

**వ. ఇట్లాభీలం బయిన నిదాఘకాలంబు వర్తింప బృందావనంబు రామగోవింద మందిరంబైన కతంబున నిదాఘకాల లక్షణంబులం బాసి, నిరంతర గిరినిపతిత నిర్ఝరశీకర పరంపరాభాసిత పల్లవిత కుసుమిత తరులతం బయ్యును, దరులతా కుసుమపరిమళ మిళిత మృదుల పవనం బయ్యును, బవనచలిత కమలకహ్లార సరోవర మహాగభీరనదీ హ్రదం బయ్యును, నదీహ్రద కల్లోల కంకణ ప్రభూత పంకం బయ్యును, బంకసంజనిత హరితాయమాన తృణనికుంజం బయ్యును, జనమనోరంజనంబైన వసంత కాల లక్షణంబులు గలిగి లలిత మృగపక్షి శోభితం బయి యొప్పుచుండె, మఱియు నందు. 718**

* ఈ విధంగా భయంకరమైన వేసవికాలం నడుస్తూఉంటే బృందావనం మాత్రం బలరామకృష్ణుల నివాసం అయినందువల్ల చల్లగా ఉన్నది. వేసవికాలపు లక్షణాలు అక్కడ కనుపించడం లేదు. కొండల మీదనుండి ఎప్పుడూ ప్రవహిస్తూ ఉన్న సెలయేళ్ళనుండి నీటి తుంపురులు తెరలుతెరలుగా వస్తూ ఉంటే అక్కడి చెట్లు, తీగలు, చిగిర్చి పూలు పూస్తున్నాయి. ఆ పూల నుండి వెలువడే సువాసనలు గాలిలో తేలితేలి వస్తూ ఉన్నాయి. అక్కడ కొలనులలో లోతైన నదులలో, మడుగులలో కలువపువ్వులు, తామరపువ్వులు, మందమారుతాలకు కదలి ఊయల లూగుతున్నాయి. నదులలోను మడుగులలోను రేగిన అలలనుండి నీటికణాలు ఎగిరివచ్చి ప్రక్కనున్న నేలను బురద బురదగా తడుపుతున్నాయి. ఆ బురదల్లో పచ్చని పచ్చిక గుబుర్లు పుట్టి పెరుగుతూ ఉన్నాయి. ఆ బృందావనం జనుల మనస్సును సంతోషరుస్తూ వసంతకాలపు లక్షణాలతో అందమైన మృగాలతో పక్షులతో చాల మనోహరంగా ఉన్నది.

క. **పికముల కోలాహలమును, శుకసంఘము కలకలంబు సుభగ మయూర**
**ప్రకరము కేకారవ, మళి, నికరము రొదయును జెలంగె నెఱి నయ్యడవిన్.** 719

* కోకిలల కోలాహలము, చిలుకల కలకల ధ్వనులు, నెమిళ్ళ కేకలు, తుమ్మెదల రొదలు కలసి ఆ అడవిలో చక్కని వాతావరణం నెలకొల్పాయి.

క. **ఆతత యమునా సరసీ, జాత తరంగాభిషిక్త జలరుహ గంధో**
**పేతానిల మడఁచె నిదా, ఘాతత దావాగ్ని పీడ న వ్వనమందున్.** 720

* అగ్నిని వాయువు రెచ్చగొట్టడం సహజము. కాని యమున మడుగులోని కెరటాలు తామరపూలను తడుపుతూ ఉంటే ఆ తడిసిన సువాసనలను మోసుకొని వస్తున్నది అక్కడి గాలి. ఆ చల్లని గాలి వలన అడవిలోని వేసవికాలపు దావాగ్ని అణగిపోయింది.

వ. **ఇట్లామని కందువ తెఱంగు గల్గి సుందరంబైన బృందావనంబునకు బలకృష్ణులు గోవుల రొప్పికొని చని గోపకులుం దారును నొండొరులతో నగుచుఁ,దెగడుచుఁ, జెలంగుచుఁ,దలంగుచు, జిఱజిఱం దిరుగుచుఁ, దరులసందుల కరుగుచు, దాఁగిలి మూఁతలాడుచు, గీతంబులు వాడుచు, వేణునాదంబులు ఘటియించుచు, నటియించుచు, గతులు దప్పినక్రియ నొఱఁగుచుఁ, గుప్పల కుఱుకుచుఁ, జటలు గొట్టుచుఁ, గందుకంబులం దట్టుచు, నుప్పరం బెగసి, దర్దురంబుల చందంబున దాఁటుచు, నామలక బిల్వాది ఫలంబుల మీటుచుఁ, గుటవిటపంబులఁ గదల్చుచు, మృగంబుల నదల్చుచుఁ, బెరల రేఁపుచు, మధుమక్షికలఁ జోపుచుఁ, దేనియలు ద్రావుచు, సొమ్మలు వోవుచు, గురుశిష్య కల్పనంబులం బనులు సేయుచుఁ, గాకపక్షధరులై ముష్టియుద్ధంబులకు డాయుచుఁ,బన్నిదంబులు సఱచుచుఁ బులుఁగుల భంగి నఱచుచు, బహురూపంబులు వన్నుచు, నెగిరి తన్నుచు, సేవ్యసేవక మిత్రామిత్ర భావంబులు వహించుచు నుత్సహించుచు, మఱియు ననేకవిధంబులఁ గ్రీడించి, రందు.** 721

* వసంతఋతువు ఆవరించి ఉన్నట్లు అందంగా ఉన్న బృందావనానికి బలరామకృష్ణులు గోవులను తోలుకుని వెళ్ళారు. గోపకులు తాము ఒకరి నొకరు హాస్యాలాడుకుంటూ, నెట్టుకుంటూ, తిట్టుకుంటూ, ఎగురుతూ, తప్పుకుంటూ, తిరుగుతూ, చెట్లసందులకు పరుగెత్తుతూ, దాగుడుమూత లాడుతూ, పాటలు పాడుతూ, వేణువులు వాయిస్తూ, నాట్యంచేస్తూ, నడకలు తడబడినట్లు పడిపోతూ, కుప్పల మీదకు దూకుతూ, చప్పట్లు చరుస్తూ, బంతులాడుతూ, పై కెగిరి కప్పలవలె దాటుతూ, ఉసిరిక మారేడు మొదలైన పండ్లను ఎగురవేస్తూ, చెట్లను ఊపివేస్తూ, జంతువులను తోలుతూ, తేనె తెట్టెలను రేపుతూ, తేనెటీగలను దూరంగా తోలుతూ, తేనెలు త్రాగుతూ, మత్తెక్కి పడిపోతూ, గురువు - శిష్యులు అనే ఆటలతో తమ పనులు నెరవేర్చుకుంటూ, పిల్లజుట్లు ఎగురుతూ ఉండగా ముష్టి యుద్ధాలు చేస్తూ, పందాలు కాస్తూ, పక్షులవలె అరుస్తూ, ఎన్నోవేషాలు వేస్తూ, ఎగిరి ఎగిరి తన్నుతూ, సేవకుడు - యజమాని, మిత్రుడు - శత్రువు, మొదలైన భావాలు కల్పించుకుంటూ, ఉత్సాహంతో ఇంక ఎన్నో విధాలుగా ఆటలు ఆడుకున్నారు.

**క. మాపాలిక బలకృష్ణులు, భూపాలకు లంచు నెరిగి బొబ్బ లిడుచు న**
**గ్గోపాలురు మోతురు ప్రమ, దాపాదకు లగుచు వల్లికాందోళికలన్. 722**

* "మా పాలిటికి బలరామకృష్ణులే రాజులు" అని జేజేలు కొడుతూ ఆ గోపాలకులు, తీగలతో అల్లిన పల్లకీలలో వారిని కూర్చుండబెట్టి, మోస్తూ, ఎంతో సంతోషంతో ఉన్నారు.

**క. గోపకు లందఱు నాడుచు, దీపింపఁగ రామవాసుదేవుల వెనుకం**
**బై పడి పాఠక గాయక, రూపంబులఁ బొగడుదురు నిరూఢాత్మకులై. 723**

* ఈ విధంగా ఆటలలో గోపబాలకు లందరూ ఉత్సాహంతో బల రామకృష్ణుల వెనుక నడుస్తూ, స్తోత్రపాఠకులలాగ మంచిమనస్సులతో పొగడుతుండేవారు.

**క. ప్రీతిన్ గోపకు లందఱు, గీతంబులు వాడఁ దరుల క్రిందను నగుచుం**
**జేతులు ద్రిప్పుచు వెడవెడ, పాతర లాడును యశోదపాపం డడవిన్. 724**

* గోపకుమారు లందరూ చెట్టక్రింద చేరి ఎంతోప్రీతిగా పాటలు పాడుతూ ఉంటే, కృష్ణుడు నవ్వుతూ చేతులు త్రిప్పుతూ, అప్పుడప్పుడు నాట్యాలు చేస్తూ ఉండేవాడు.

**మ. జలజాక్షుండును రాముఁడున్ నటనముల్ సల్పంగ గోపాల మూ**
**ర్తులతో వారలఁ గొల్చు నిర్జరులు సంతోషించి, వేణుస్వనం**
**బులు గావించుచు గొమ్ము లూఁదుచు శిరంబుల్ ద్రిప్పుచుం బాడుచున్**
**వలనొప్పన్ వినుతించి రప్పుడు నటుల్ వర్ణించు చందంబునన్. 725**

* బలరామకృష్ణులు నాట్యాలు చేస్తూ ఉంటే వారిచుట్టూ గోపాలకులుగా ఉంటూ ఉన్న దేవతలు సంతోషించేవారు. వేణుగానాలు చేస్తూ కొమ్ముబూరా లూదుతూ, తలలు త్రిప్పుతూ, పాటలు పాడుతూ చక్కగా స్తోత్రాలు చేసేవారు. నటులు ఏ విధంగా నటనలు చేస్తూ, వర్ణనలు చేస్తూ ఉంటారో అలాగే వీరూ ఆడుతూ పాడుతూ ఉండేవారు.

## -: బలభద్రుండు ప్రలంబాసురుని వధించుట :-

వ. ఇట్లు రామకృష్ణులు నదనదీతీరంబులఁ, గొలంకుల సమీపంబుల, గిరులచఱుల, సెలయేఱుల పొంతల, మడుఁగుల చెంతలఁ, బొదల క్రేవలఁ, బసిమిగల కసవుజొంపంబులఁ బసుల మేపుచుండఁ బ్రలంబుండను రక్కసుం డుక్కు మిగిలి గోపాలరూపంబున వచ్చి వారల హింససేయం దలంచు చుండ న య్యఖిల దర్శనుం డగు సుదర్శనధరుం డెఱింగియు నెఱుంగని తెఱంగున. 726

* ఈ విధంగా బలరాముడు, శ్రీకృష్ణుడు నదనదీ తీరాలలో, సరస్సుల సమీపాన, కొండల దాపున, సెలయేళ్ళ దగ్గర, మడుగులచెంత, పొదలపొంత, పచ్చని పచ్చిక గుబురుల్లో పశువులను మేపుతూ ఉంటారు. అప్పుడు ప్రలంబుడనే రాక్షసుడు గోపబాలుని రూపం ధరించి శౌర్యాటోపంతో వారి కడకు వస్తాడు. రామకృష్ణులను ఏ తీరున హింసించడమా అని ఆ అసురుడు ఆలోచిస్తుంటాడు. అన్నిటినీ ఎరిగిన శ్రీకృష్ణుడు ఆ వచ్చినవాడెవడో తెలిసికూడ తెలియన ట్లుంటాడు.

క. ఆ రాముని సహజన్ముఁడు, రా రమ్మని వానిఁజీరి రాకం బోకన్
గారాముసేసి మెల్లన, పోరామి యొనర్చెఁ బిదపఁ బొరిగొనుకొఱకున్. 727

* బలరాముని తోబుట్టువైన కృష్ణుడు ప్రలంబుణ్ణి హతమార్చేటందుకు ఒక పన్నాగం పన్నుతాడు. ఆ దానవుణ్ణి చెంతకు రమ్మని ప్రియంగా పిలిచి రాకపోకలలో వానితో నెమ్మదిగా చెలిమి పెంపొందించు కుంటాడు.

వ. ఇట్లు ప్రలంబునితోఁ జెలిమిసేయుచుఁ, గృష్ణుండు గోపాలకులకు నిట్లనియె. 728

* ఇలా ప్రలంబుడితో నెయ్యం నెరపుతూ శ్రీకృష్ణుడు గోపబాలుర నుద్దేశించి ఇట్లన్నాడు.

ఆ. 'మనకుఁ బ్రొద్దుపోదు మన మిందఱము రెండు, గములవార మగుచుఁ గందుకముల
శిలలు గుఱులు సేసి చేరి క్రీడింతము, రండు వలయు జయపరాజయములు.' 729

* "మనకు ప్రొద్దుపోవడం లేదు. మనమంతా రెండుపక్షాలుగా ఏర్పడి రాళ్లను గురిచేసి బంతులు విసురుతూ ఆటలాడుదాం. ఎవరు గెలుస్తారో ఎవరు ఓడుతారో చూద్దాం."

వ. అని యిట్లు పలికి, తానును బలభద్రుండును బెన్నుద్దులై యితర వల్లవులెల్ల నుద్దించుకొని చిఱుద్దులై వచ్చిన సమయంబున విభజించుకొని, రెండుగములవారై మార్గంబులందుఁ దృణదారు శిలాకల్పి తంబులగు గుఱులొడ్డి, కందుక శిలాది ప్రక్షేపణంబుల లక్ష్యంబులఁ దాఁకవైచి, జయపరాజయ నిర్ణయంబులు గైకొని, వాహ్యావాహక లక్షణంబుల జేతలను నిర్జితులు వహించి క్రీడించుచు, బల రామునికి వానిచందంబు రహస్యంబున నెఱింగించి పసుల వెల్చుచు భాండీరకంబను వటంబు సేరి; రా సమయంబునఁ గ్రీడయందు శ్రీదామనామధేయుండైన గోపకుండు శ్రీకృష్ణుని వహించె; భద్రసేనుండు వృషభు నెక్కించు కొనియె; బలభద్రుండు ప్రలంబు నారోహించె; నప్పుడు. 730

* ఈ రీతిగా పలికి శ్రీకృష్ణుడు తానూ, తన అన్న బలరాముడూ పెద్ద ఉద్దులై చెరొక పక్షానికి నాయకులుగా నిలబడతారు. తక్కిన గొల్లపిల్లలు చిఱ్ఱుద్దులుగా చీలి కొందరు కృష్ణుని తట్టూ, మరికొందరు బలరామునివైపూ చేరిపోతారు. వారు గడ్డితో, కొయ్యలతో, రాళ్ళతో లక్ష్యాలు ఏర్పరచుకొని వాటిని బంతుల తోనూ, శిలలతోనూ గుఱిచూచి కొడుతూ గెలుపోటములు నిర్ణయించుకుంటారు. ఆటలో గెలిచినవారు ఓడిన వారి మీద ఎక్కాలి; ఓడినవారు గెలిచినవారిని మోయాలి. ఇలా వారు దారిలో క్రీడిస్తున్నవేళ శ్రీకృష్ణుడు రహస్యంగా తన అన్న బలరాముడికి ప్రలంబాసురుడి వృత్తాంతం తెలియపరుస్తాడు. గోపాలకులు పశువులను అదలిస్తూ కదలి భాండీరకమనే మఱ్ఱిచెట్టు చెంగటికి చేరుతారు. అప్పుడు బల రాముని పక్షంలో ఉన్న శ్రీదాముడనే గొల్లపిల్లవాడు క్రీడలో ఓడినందున కృష్ణుణ్ణి తన మీద ఎక్కించుకొని మోస్తాడు. అలాగే కృష్ణుని వైపున భద్రసేనుడూ, ప్రలంబుడూ పరాజయం పొందినారు గనుక వారిద్దరూ వరుసగా వృషభుడికీ, బలరాముడికీ వాహనా లవుతారు.

**మ. 'వనజాక్షున్ బలిమిన్ బలాఢ్యుఁడు దృణావర్తుండు మున్ మింటికిం**
**గొనిపోఁజాలక చిక్కినాఁ డితని నాకున్ మోవరా' దంచు నా**
**దనుజారిన్ గొనిపోఁ దలంపక వడిన్ దైత్యేశుఁ డయ్యాటలోఁ**
**గొనిపోయెన్ గిరి దాఁటి రాము నఖిలక్రూరక్షయోద్దామునిన్. 731**

* పూర్వం మహాబలవంతుడైన తృణావర్తుడనే దైత్యుడు కృష్ణుణ్ణి గగనతలానికి ఎత్తుకపోలేక అతని చేతిలో చిక్కి హతమయ్యాడు. అందువల్ల అతణ్ణి భరించడం తనకు సాధ్యం కాదని ప్రలంబుడు రాక్షసాంతకుడైన శ్రీకృష్ణుని కొనిపోవడానికి సంకల్పించక క్రూరుల నందరినీ అంతరింపజేసే బలదేవుణ్ణి తనమూపున వహించి మోస్తూ దింపవలసిన చోట దింపక ఎల్లదాటి వడివడిగా పరుగెత్తిపోయాడు.

**వ. ఇట్లు క్రీడాకల్పిత వాహనుండైన ప్రలంబుండు బలభద్రునిం గొనిపోవుచు. 732**

**మ. గురుశైలేంద్ర సమానభారుఁడగు నా గోపాలకున్ మోవ లే**
**క రయోద్రేకము మాని దైత్యుఁడు నరాకారంబు సాలించి భీ**
**కర దైత్యాకృతి నేగె హేమకటకాకల్పంబుతో రాముతో**
**మురు వొప్పంగఁ దటిల్లతేందుయుత జీమూతంబు చందంబునన్. 733**

* ఇలా ఆటలో వాహనమైన ప్రలంబుడు బలరాముణ్ణి కొనిపోతూ గొప్ప పర్వతరాజంవలె మహాభారంగా ఉన్న ఆ బలరాముణ్ణి మోయలేక పోతాడు. గమనవేగం మాని ఆ దానవుడు మానవస్వరూపం విడిచి అతిభీకరమైన అసురాకారంతోనే పోసాగాడు. బంగారు కడియాలు ధరించిన తెల్లని బలరాముణ్ణి మోసుకొని వెళుతున్న నిశాచరుడు మెరుపులతో మిల మిలలాడే చందమామను పొదివియున్న కారుమబ్బు కైవడి ప్రకాశించాడు.

**ఉ. మోసము లేక వాని పెనుమూఁపున నుండుచు నా హలాయుధుం**
**డా సమయంబునం గనియె హాటకరత్న కిరీటకుండలో**

ద్భాసిత మస్తకున్ భ్రుకుటి భాసుర దారుణనేత్రు నుగ్ర దం
ష్ట్రాసహితుం బ్రలంబు నురుశౌర్యవిలంబు మదావలంబునిన్. 734

* మూపుమీద ఏమరుపాటులేక కూర్చొనియున్న బలభద్రుడు ప్రలంబాసురుణ్ణి తేరిపారజూచాడు. సువర్ణ ఖచిత రత్నకిరీటంతోనూ, చెవిపోగులతోనూ వాని శిరస్సు మిక్కిలి వెలుగొందుతూ ఉంది. వాని కండ్ల బొమముడితో పరమదారుణంగానూ, వాని కోరలు మహాభయంకరంగానూ మెరుస్తూ ఉన్నవి. దొడ్డశౌర్యానికి, దుర్గర్వానికి అతడు ఆటపట్టుగా ఉన్నాడు.

వ. కని నక్తంచరుం డని యించుక శంకించి వెఱవక. 735

* బలరాముడు వాడు రక్కసుడని కొంచెం సంశయించాడు. అయినా ఏ మాత్రం భయపడలేదు.

క. కడువడిఁ దను దివికిం గొని, వడిఁ జనియెడు దనుజుశిరము వ్రయ్య హలధరుం
డడరి పటుచటులతర మగు, పిడికిట వెస విసిరి పొడిచె బిఱుసున నలుకన్. 736

* నాగలి ఆయుధంగా కల బలరాముడు విజృంభించి, తన్ను వడివడిగా గొనిపోతున్న ఆ రక్కసుని తల వ్రక్కలయేటట్లు అత్యుగ్రమైన తన పిడికిలి బిగించి పెఠీలు పెఠీలుమని పొడిచాడు.

క. హలధరు బలుపిడికిటి హతిఁ, దల పగిలిన రుధిరజలము దనువివరములం
దొలఁక మొఱయిడుచు దనుజుఁడు, బలరిపుపవి నిహత నగము పగిదిం బడియెన్. 737

* బలరాముని పిడికిటి పోటుకు దనుజుని శీర్షం పగిలి బ్రద్దలైంది. నెత్తురు నవరంధ్రాలనుండి వెల్లుబికి ప్రవహించింది. దేవేంద్రుని వజ్రాయుధపు వ్రేటుకు పర్వతంలాగా వాడు మొఱ్ఱో అంటూ నేలగూలి ప్రాణాలు గోల్పోయాడు.

మత్తకోకిలము.

'మేలు మేలు గదయ్య! రాముఁడు మేటిరక్కసు నొక్కఁడున్
నేలఁ గూలిచె నొక్కపోటున నేఁడు విస్మయ' మంచు గో
పాలకుల్ గని చచ్చి వచ్చిన భ్రాతఁ గన్న విధంబునం
జాల దీవన లిచ్చి రాముని సత్కరించిరి వేడుకన్. 738

* "బలే! బలే! నేడు మన బలరాముడు మేటి రక్కసుణ్ణి ఒక్క దెబ్బతో ఉక్కడగించాడు. ఇది మహాద్భుత'' మంటూ గోపాల బాలకు లందరూ చచ్చి మరల బ్రతికి వచ్చిన సహోదరుణ్ణి చూచినట్లుగా మిక్కిలి సంతోషంతో పెక్కు దీవనలిస్తూ ఆయనను గౌరవించారు.

క. బలవంతుఁడగు ప్రలంబుఁడు, బలుముష్టిన్ నిహతుఁడైన బ్రదికితి మనుచున్
బలసూదనాది దివిజులు, బలుపైఁ గుసుమములవానఁ బరఁగించి రొగిన్. 739

* బలాఢ్యుడైన ప్రలంబాసురుడు బలదేవుని పిడికిటి పోటుకు చచ్చేసరికి ఇంద్రాది దేవతలు "అమ్మయ్య బ్రతికి పొయ్యా'' మని ఊరట పొంది ఒక్క పెట్టున బలరామునిపై పువ్వులవాన కురియించారు.

## -: శ్రీ కృష్ణుఁడు దావాగ్నిని మ్రింగి గో గోపక సంఘమును కాపాడుట :-

**వ. ఇట్లు గోపకులు క్రీడింప గోవు లంతంతఁ గాంతారంబున వింత కసవులు మెసవుచు, మేఁతవడి నొం డడవికి దూరంబు సని యందు దవదహనపవన సంస్పర్శంబు సైరింపక కంపించి దప్పినొప్పు సెడి ఘోషించిన. 740**

* ఇలా గోపాలబాలకులు ఆటలో మునిగి యుండగా ఆవులు అడవిలో రకరకాల కసవులను మేస్తూ తృణాశచే పోయి పోయి మరొక కారడవిలో దూరాయి. అక్కడ చెలరేగిన కార్చిచ్చు గాలివేడికి తట్టుకోలేక అవి బెదరి, గడగడ వణకిపోతూ, దప్పికతో "అంబా" అని ఆక్రోశించాయి.

**శా. ఆ గోపాలకు లందఱుం బసుల కుయ్యాలించి కౌమార కే**
**ళీగాఢత్వము మాని గోఖురరదాళిచ్ఛిన్న ఘాసంబుతో**
**బాగై యున్న పథంబునం జని దవాపన్నంబు గాకుండ వే**
**వేగన్ గోగణమున్ మరల్చి రటవీవీథిన్ జవం బొప్పఁగన్. 741**

* ఆ గొల్లపిల్ల లందరూ పశువుల ఘోష నాలకించారు. పిల్లాటల మీది ప్రీతి చాలించారు. ఆవుల గిట్టలచే నలిగి, వాటి దంతాలచే తునిగి ఉన్న గడ్డి గుర్తులనుబట్టి అవి వెళ్ళిన దారిలో తామూ వేగంగా వెళ్ళారు. అలా వెళ్ళి మంటలపాలు గాకుండా ఆ అరణ్యం నుండి తమ గోవులను మరలించారు.

**క. జలధర గభీర రవమున, నలినదళాక్షుండు దమ్ము నామాంకములం**
**బిలిచిన విని ప్రతిఘోషణ, ములు సేయుచుఁ బసులు దిరిగె ముదమున నధిపా! 742**

* మేఘగర్జనవలె గంభీరమైన కంఠస్వరంతో శ్రీకృష్ణుడు గోవులను పేరుపేరున పిలిచాడు. పిలువగనే ఆ ధేనువులు మిక్కిలి సంతోషంతో "అంబా"యని మారుధ్వనులు చేస్తూ మరలి వచ్చాయి.

**వ. అంత న వ్వనంబున దైవయోగంబునం బుట్టిన కార్చిచ్చు బిట్టు విసరెడి కరువలి వలన మిన్నుముట్ట మిట్టిపడి గట్టు చెట్టనక దరికొని, యట్టె క్రాలుచుఁ జుట్టుకొని, పఱవం గని పల్లటిల్లిన యుల్లంబులతో వల్లవు లెల్లఁ దల్ల డిల్లి సబలుండైన హరికి మృత్యుభీతుల రీతిం జక్క మ్రొక్కి యిట్లనిరి. 743**

* ఆ వనంలో దైవికంగా జనించిన దావాగ్ని ఈడ్చి విసరే వాయువువల్ల పెచ్చుపెరిగి అంబర మంటు తున్నది; గట్టనక, పుట్టనక అడ్డమైన వాటిని పట్టి పడగాలుస్తూ, అడవి నలుమూలలా అలముకొన్నది. అది చూచి గొల్లపిల్లల గుండెలు తల్లడిల్లినాయి. వారు మరణభయంతో కలత పొందినవారి కైవడి బలరామ సహితుడై ఉన్న శ్రీకృష్ణునికి సాగిలపడి మ్రొక్కి ఇలా అన్నారు.

క. అభ్రంకష ధూమాయిత, విభ్రాంత మహాస్ఫులింగ విసరోగ్ర శిఖా
విభ్రష్ట దగ్ధలోకా, దభ్రంబై వచ్చెఁ జూడు దవశిఖి కృష్ణా! 744

* కృష్ణా! ఆ కార్చిచ్చును చూడు! పొగలతో ఆకసాన్ని ఆవరించింది. వెరపు గొలిపే పెద్దపెద్ద నిప్పురవ్వలు విరజిమ్ముతూ ఉంది. పై కెగసే పెనుమంటలు లోకాలను మాడ్చి మసిబూది కావిస్తున్న ట్లున్నాయి.

శా. నీ చుట్టాలకు నాపదల్ గలుగునే! నే మెల్ల నీవార; మ
న్యాచారంబు లెఱుంగ, మీశుఁడవు మా; కాఖీలదావాగ్ని నేఁ
డే చందంబున నింక దాఁటుదుము? మమ్మీక్షించి రక్షింప వ
న్నా! చంద్రాభ! విపన్నులన్ శిఖివితానచ్ఛన్నులన్ ఖిన్నులన్. 745

* చందమామవలె చల్లనైన శ్రీకృష్ణా! నీ ఇష్టబంధువులకు ఇట్టి కష్టాలు కలుగవచ్చునా? మేమంతా నీ వారమేగదా! ఇతర విషయాలేమీ మాకు తెలియవు. మా ప్రభుడవు నీవే! ఈ దారుణమైన కారుచిచ్చును ఇప్పుడెలా దాటడం? మంటలలో తగుల్కొని అలమటిస్తున్న మమ్ము కనులెత్తి చూచి కాపాడు.

వ. అని విన్నవించి రంత. 746

ఉ. బంధుజనంబుచేత నిటు ప్రార్థితుఁడై హరి విశ్వరూపుఁ డో
బంధువులార! మీ నయనపంకజముల్ ముకుళింపుఁ డగ్ని నీ
సంధి నడంతు నే ననినఁ జక్కన వారలు నట్ల చేయుడున్
బంధురదావపావకముఁ బట్టి ముఖంబునఁ ద్రావె లీలతోన్. 747

* అని ఈ విధంగా విన్నవించుకొన్నారు గోపకులు. బంధువులు ఇట్లు వేడకోగా విశ్వరూపుడైన శ్రీకృష్ణుడు వారితో- " ఓ బంధుమిత్రులారా! మీరు కండ్లు మూసికొనండి. ఈ లోపల నేను అగ్గిని అణచి వేస్తా" నన్నాడు. వారు అలాగే అని అక్షులు మూసుకున్నారు. వెంటనే అతడు దారుణమైన దావానలాన్ని అలవోకగా నోటితో పీల్చి త్రాగివేశాడు.

వ. ఇట్లు నిజయోగ వైభవంబున దావదహనంబు పానంబు సేసి నిమిషమాత్రంబున గోపకుల నందఱ భాండీరక వటసమీపంబునకుం దెచ్చి విడిచిన వారు వికసిత నయన కమలు లయి కృష్ణుని యోగమాయా ప్రభావంబున నెరగలి చిచ్చు ప్రుగ్గె నని యగ్గించుచుఁ దమ మనంబులందు. 748

* ఇలా తన యోగమహిమచేత మాధవుడు దావాగ్నిని త్రాగివేసి గోపబాలకులను భాండీరక వటవృక్షము దగ్గరకు తెచ్చి విడిచిపెట్టాడు. వారు సంతోషంతో విప్పారిన కన్నులు గలవారై శ్రీకృష్ణుని యోగమాయా మహిమవల్ల కార్చిచ్చు సమసి పోయిందని భావించి ఆయనను పొగడుతూ తమ మనస్సుల్లో ఇట్లా తలపోశారు.

క. 'కార్చి చ్చార్చు పటుత్వము, నేర్చునె నరుఁ డొకఁడు? శౌరి నేఁ డిదె కార్చి
చ్చార్చి మనల రక్షింపఁగ, నేర్చె! నితం డజుఁడొ హరియొ నిటలాక్షుండో!' 749

* దావానలాన్ని చల్లార్చే శక్తి ఒక మానవునకు ఒనగూడుతుందా? నేడు శ్రీకృష్ణుడు కార్చిచ్చు నార్పివేసి మనలను సంరక్షించాడు. ఇతడు విరించియో, విష్ణువో, ముక్కంటియో అయి ఉండాలి.

వ. అని వితర్కించి రంతఁ గృష్ణుండు సాయాహ్నసమయంబున రామసహితుండై వంశనాళంబు పూరించుచు గోపగణ జేగీయమానుండై గోష్ఠంబు ప్రవేశించె నప్పుడు. 750

* ఈ విధంగా గొల్లపిల్లలు భావించారు. అంతట శ్రీకృష్ణుడు బలరామునితో గూడి సంజవేళ వేణువు నూదుతూ గోపబాలురు తన్ను కొనియాడుతుండగా గోశాలలో ప్రవేశించాడు.

క. కమలాక్షునొద్ద నుండని, నిమిషము యుగశతముగాఁగ నెగడిన గోప
ప్రమదలు సంభ్రమమున నా, కమలాక్షునిఁ జూచి ముదముఁ గనిరి మహీశా! 751

* కృష్ణుని దగ్గర నివసించని ఒక క్షణకాలం గోపికలకు నూరుయుగాలుగా తోస్తుంది. కనుక కమలాక్షుణ్ణి సందర్శించగనే వారికి పరమానందం కలిగింది.

వ. ఆ సమయంబున గోపకు లిండ్లకడ నున్న వృద్ధకాంతాజనంబులకు రామకృష్ణుల చిత్రచరిత్రంబులు సెప్పిన, విని వారు వారిని గార్యార్థులై వచ్చిన వియచ్చరవరు లని తలంచి రంత. 752

* అటుపిమ్మట గోపబాలకులు ఇండ్ల వద్దనున్న వృద్ధులకూ, స్త్రీలకూ, బలరాముడు ప్రలంబాసురుని తెగటార్చటం, శ్రీకృష్ణుడు తమ్మూ, గోవులనూ దావాగ్ని బారినుండి కాపాడటం అనే అద్భుత కృత్యాలను చెప్పారు. ఆ మాటలు వా రాలకించి రామకృష్ణులు ఏవో మహాకార్యాలు నెరవేర్చటం కోసం గోకులంలో అవతరించిన దేవతాశ్రేష్ఠు లని భావించారు.

## -: వర్షర్తు వర్ణనము :-

సీ. పూర్వవాయువులు ప్రభూతంబులై వీచెఁ బడమట నింద్రచాపంబు దోఁచెఁ
బరివేషయుక్తమై భానుమండల మొప్పె మెఱవు లుత్తరదిశ మెఱవఁ దొడఁగె
దక్షిణ గాములై తనరె మేఘంబులు జలచరానీకంబు సంతసించెఁ
జాతకంబుల పిపాసలు కడపలఁ జేరెఁ గాంతార వహ్నుల గర్వ మడఁగె

ఆ. నిజకరాళివలన నీరజబంధుండు, దొల్లి పుచ్చుకొన్న తోయ మెల్ల
మరల నిచ్చుచుండె మహి కర్షకానంద, కందమైన వాన కందువందు. 753

* వర్షాకాలం వచ్చింది. తూర్పుగాలులు మిక్కుటంగా వీచాయి. పడమట ఇంద్రధనుస్సు గోచరించింది. సూర్య మండలం గాలిగుడితో ఒప్పారింది. ఉత్తర దిక్కులో మెరుపు మెరిసింది. మబ్బులు దక్షిణ దిశకు తరలిపోసాగాయి. జలచరసమూహానికి సంతోషం సమకూడింది. చాతకపక్షులకు దప్పిక తీరింది.

అడవులలోని దావాగ్ని అణగిపోయింది. సూర్యుడు తన కిరణ సముదాయంతో మునుపు స్వీకరించిన నీటి నంతటినీ హాలికులకు ఆనందదాయకమైన వర్షాకాలంలో మరల ఇచ్చివేశాడు.

**క. వర్షాకాలభుజంగుఁడు, హర్షముతో నిడిన నవ నఖాంకము లని యు**
**త్కర్షింప భూమిసతిపైఁ, గర్షక హలరేఖ లమరె గహనాంతమునన్. 754**

* వర్షాకాలమనే విటుడు భూమి అనే అంగనపై ఆనందంతో ఉంచిన క్రొత్త కొనగోటి నొక్కులవలె నేలపై కర్షకు లిడిన నాగటిచాళ్లు ఒప్పినాయి.

**క. చెలువుఁడు ప్రావృట్కాలుఁడు, పొలసినఁ బులకించు భూమి పులకము లనఁగా**
**మొలచి తల లెత్తి నిక్కుచు, సలలితగతి జాలువాఱె సస్యము లధిపా! 755**

* పరీక్షిన్మహారాజా! వర్షాకాలమనే ప్రియుడు సమీపించగా పుడమికి కలిగిన గగుర్పాటో అన్నట్లు మొలచి మోసులెత్తిన పైరులు సొగసుగా శోభిల్లాయి.

**వ. మఱియుఁ జటుల పవన చలితంబులై మిన్ను దన్ని, లెక్కకు మిక్కిలియై, ఱెక్కలు గల నీలగిరుల సిరుల మీఱి, కాఱుకొని తెఱపిపడక, నిబిడంబులై, శిశిరకిరణ తరణి మండలంబుల చొప్పు దప్పించి, విప్పు కలిగి, చదలు గప్పుకొనిన లీలంగ్రాలు నీలమేఘంబులును, మేఘవిముక్తంబులయి జలదసమయ విటుండు సరసగతి ధరణిసతి యురమ్మున దర్పించి నేర్పున సమర్పించు కర్పూరఖండంబుల వడువునఁ బుడమిఁ బడు కరకలును, గరకానుగతంబులై యసితభోగిభోగంబుల బాగున నీలమణి మాలికా విశేషంబు విధంబున నెడపడక పడు సలిలధారలును, ధారాధర విగళిత విమల సలిలంబులం దోఁగుచు, మదజలాభిషిక్త మత్త మాతంగంబుల సొబగున నుండు కొండలును, గొండల తుదలనుండి గండ శైలంబులపైఁ బడి వికీర్యమాణంబులగు గిరినిర్ఝరంబుల శీకరంబులును, శీకరపరంపరలఁ జొదుగులు మదుగులఁ గొనినఁ బిదపిద నగుచుఁ జిదుకు చిదుకు మను రొంపులును, రొంపులు గ్రొచ్చి క్రచ్చఱ నుచ్చలితంబు లయి పఱచు వఱదలును, వఱదలవలన మెదలి కదలి పొఱెడి యేఱులును, నేఱుల వెంటగఱులు త్రిప్పుచు గములు గొని క్రొన్నీటి కెదురు నడుచు మీనంబులును, మీననయనల మెఱుంగు సొంపుపెంపు సైరింపక కంపించి తిరిగి సురిఁగి చనియెడి కరణి మేఘ మధ్యంబులం బొలసి మలసి నిలువక మరలి చను క్రొమ్మెఱుంగులును, మెఱుంగుల తెఱంగున మగువలు పురుషులం దగిలి నిలువ రని జనుల కెఱుంగ నలువ మొఱయిడిన తెఱంగున మొరయు నుఱుములును, నుఱుముల కులికిపడక కికురు పొడుచుచుఁ బించెంబులు గొంచెంబులు సేయక విప్పి దెప్పరంబుగ రొప్పుచు నర్తనంబులు సేయు మయూరంబులును, మయూర ఘోషంబులు భీషణములై చెవులు సోఁక ననూనంబులైన మానంబుల నాసలు సెడి యొండొరులకుఁ గ్రిందుపడి క్రందుకొను విరహిజనులును, జనులకు రేపు మా పని నిరూపింపరాక మాలతీకుసుమ విసరవికసన విదితావసానంబు లగు దుర్దినంబులును, దినావసాన సమయంబున మినుకుమినుకుమని మెఱయుచుం దిరుగు ఖద్యోతంబులును, ఖద్యోతసందర్శనంబు గోరుచు నుడుగక విడువక కురియు జడింబడి వలిగొని వడఁకుచు నశనయత్నంబులు వర్జించి ఖర్జూర జంబూఫల భక్షణంబుల దేహ సంరక్షణంబు**

**లాచరించు వనచరులును, వనచరానందకారిణులయి వారరమణుల రుచి ననవరతభుజగ సమేతలగు కేతకులును, గేతకీ కదంబ యూథికా కుటజ కుసుమ పరిమళ మిళితంబు లగు విపినమార్గంబులును, మార్గ నిరోధంబు లగుచుం బెరిఁగి రసికంబులై పసరు దొలంకుచు హరిన్మణికిరణ పుంజంబుల భంగి రంజిల్లి తొంగలించుచు జొంపంబులు గొనిన కసవులును, గసవులు మెసవి మిసమిసం దనువులు మెఱవ వలుఁద పొదుఁగుల బరువునం గదలక నిలిచి నెమ రమర నిడు ధేనువు లును గలిగి ధేనువ్రజంబు కైవడిఁ బయఃకణ మనోహరంబై, హరకరంబుభంగిఁ బరిపూర్ణ సారంగ భాసురంబై, సురగిరి చెలువున హరిశరాసన విభీషణంబై, విభీషణ హృదయంబు పోలికం బ్రకటిత హరి శబ్ద వైభవంబై, భవపూజనంబు చందంబున నింద్రగోపాదివిభవ జనకంబై జనక యాగంబు భాతి సీతాప్రకరణాలంకృతంబై,కృతయుగంబు సొంపున బహువర్షంబునై వర్షాగమంబు చెలువొందె నప్పుడు. 756**

* ఆ వర్షాకాలంలో ప్రచండమైన మారుతాలకు కదలివచ్చి మబ్బులు గగనమండలమంతా ఆక్రమించినాయి. గణనాతీతమైన ఆ మేఘాలు రెక్కలు కలిగిన నీలికొండలవలె వ్యాపించి సందులేకుండా దట్టంగా క్రమ్ముకున్నాయి. సూర్యచంద్రమండలాల దీప్తులు మాయించి మహా వ్యాపకాలై ఆకాశతలం ఆవరించినాయి. వర్షాసమయమనే వలపుకాడు సవిలాసంగా పుడమిపడతి యెడదపై సమర్పించిన కర్పూర ఖండాలవలె మొయిళ్లనుంచి వడగండ్లు రాలినాయి. ఆ వడగండ్లవెంట నల్లత్రాచు పడగల విధంగా, ఇంద్రనీలమణిహారాల తీరున అవిచ్ఛిన్నంగా జలధారలు జాలువారినాయి. జలధారలనుంచి కారుతున్న నిర్మలనీరాలతో తడిసిన గిరులు మదజలాలతో అభిషేకింపబడ్డ మత్తగజాల మాదిరి చెలువొందినాయి.

అద్రి శిఖరాలనుండి చట్టుబండలమీద పడిన సెలయేటి నీటిధారలు చెల్లా చెదరైనాయి. వాటి నీటి తుంపరలకు చెమ్మగిల్లి నేల చిత చిత లాడుతూ అడుసు అయింది. ఆ బురదమీద దొరలి పొరలిన నీరు వరదలై ప్రవహించింది. వాగులు వంకలు ఏకమై ఏరులై పారినాయి. ఆ యేళ్ళలో రెక్కలాడిస్తూ గుంపులుగట్టి చేపలు వరదనీటికి ఎదురీదినాయి. ఆ చేపలవంటి బెళుకుకన్నులు గల చేడెల నెమ్మేని తళతళలకు తాళలేక వణకుతూ పారిపోతున్నవా అనినట్లు మబ్బులమధ్య తళుక్కున మెరసి మరుక్షణంలోనే మెరుపుతీవలు మటుమాయమై పోయాయి. ఆ మెరుపుల్లాగా చంచల చిత్తలైన పొలతులు పురుషులచెంత నిలుకడగా నిలువరు సుమా అని జనులకు బ్రహ్మదేవుడు ఎలుగెత్తి చాటుతున్నాడో అన్నట్లుగా ఉరుములు ఉరిమినాయి. ఆ ఉరుములకు రవంతైననూ జంకక పింఛాలు చక్కగా విప్పుకొని నెమళ్ళు కేకారవాలు చేస్తూ నాట్యమాడినాయి. నెమిలికూతలు భీకరంగా చెవులబడేసరికి విరహంతో వేగుతున్న దంపతులు అభిమానం వదలుకొని ఒకరి కొకరు దాసు లయ్యారు.

మబ్బులు క్రమ్మడం మూలాన ఇది పగలు, ఇది రేయి అని నిరూపించటానికి వీలుగానప్పటికీ మాలతీపుష్పాలు పూచి సంధ్యాసమయాన్ని సూచించాయి. పగలు ముగియగనే మినుకు మినుకుమని మెరుస్తూ మిణుగురు బూచులు మింట తిరుగులాడాయి. ఎడతెరపి లేకుండా కుండపోతగా కురుస్తున్న జడివానలో చలికి గడగడ వణకుతూ సూర్యసందర్శనం వాంఛిస్తూ వంటప్రయత్నాలు మాని కిరాతులు ఖర్జూరఫలాలతో, నేరేడు పండ్లతో ఆకలి బాపుకొన్నారు. ఎల్లప్పుడు విటకాంద్ర పొత్తువీడని వారవనితలలాగా

సదా సర్పాల పొత్తుబాయని మొగిలిపూలు చెంచులకు సంతోషం సమకూర్చాయి. అడవి త్రోవలు విరబూచిన మొగలి, కడిమి, మొల్ల, గోరంటపూల గుబాళింపులతో నిండిపోయాయి. ఇంద్రనీల మణికాంతుల నెగ జిమ్ముతూ దారి కడ్డంగా పసరు వెలిగ్రక్కే పచ్చిక గుబురుగా పెరిగింది. ఆ పచ్చిక జొంపాలు మెసవి ఒడలు మిసమిసలాడగా కుండపొదుగుల బరువుచే కదలలేక నిలిచి మొదవులు నెమరువేయ సాగినాయి.

ఆ వానకారు క్షీరసంపన్నమైన ఆవులమందలాగా జలబిందువులతో ఇంపారింది. జింకతో చెలువారే శివుని చెయ్యిలాగా మిక్కుటమైన వానకోయిలలతో సొంపారింది; విష్ణువనే బాణం అధిష్ఠించడంచేత భీకరమైన మేరుశైలం లాగా ఇంద్రచాపంచేత చెలువారింది; హరినామ సంకీర్తన వైభవంతో కూడిన విభీషణుని హృదయం లాగా భేకముల బెకబెక ధ్వనులతో ఎసలారింది. ఇంద్రుడు, గోవిందుడు మొదలగు వారికి ఐశ్వర్యాపాదకమైన శివపూజలాగా ఆరుద్ర పురుగులతో అలరారింది. సీతామహాదేవి వృత్తాంతంతో జనకచక్రవర్తి యాగంలాగా నాగలి చాళ్ళతో సొబగారింది. బహుసంవత్సరాలు గలిగిన కృతయుగంలాగా మెండైన వానలతో నిండారింది.

**క. వాడక వ్రాలక తెవుళులఁ, గూడక తన నల్ల గెఱలుకొని నవకములై**
**చూడఁగ భద్రము లగుచును, వీడెన్ సస్యంబు లిడుమ వీడెం బ్రజకున్.** 757

* ఎండకు వాడి నేలవ్రాలక చీడపీడలకు గురిగాక, నవనవలాడుతూ నలుపెక్కి పైరు ఏపుగా పెరిగింది. ప్రజకు సంకటం తీరింది.

**క. జీవనము సాలఁ గలిగియుఁ, గావరమున మిట్టిపడని ఘనునిక్రియ నదీ**
**జీవనములు సొర జలనిధి, ప్రావృట్కాలమున డిందుపడియుండె నృపా!** 758

* పరీక్షిన్నరేంద్రా! ఎంత సంపన్ను డైనప్పటికీ గొప్పవాడు తలపొగరుతో మిడిసి పడడు. ఆ విధంగానే నదులనుండి దండిగా నీరు వచ్చి చేరుతున్నా ఆ వానకాలంలో సాగరుడు హద్దుమీరక అణగి మణగి ఉండినాడు.

**శా. ఆ వర్షాగమమందు గోవుల నరణ్యాంతంబులన్ మేపుచున్**
**గోవిందుండు ప్రలంబవైరియుతుఁడై గోపాలవర్గంబుతోఁ**
**బ్రావీణ్యంబునఁ గందమూలఫలముల్ భక్షించుచున్ మంజుల**
**గ్రావాగ్రంబులఁ బ్రీతిఁ జల్ది గుడిచెం గాసారతీరంబులన్.** 759

* ఆ వర్షఋతువులో శ్రీకృష్ణుడు అడవుల అంచుల్లో ఆవులను మేపుతూ ప్రలంబాసురుణ్ణి వధించిన బలరామునితో, గోపాలబాలకులతో గూడి కందమూలాలు, ఫలాలు ఆరగిస్తూ మడుగుల గట్ల మీద, మనోహర మైన శిలాతలాలమీద గూర్చుండి సంతోషంగా చలుదులు భుజించాడు.

**వ. ఆ సమయంబున.** 760

సీ. విశ్వమోహనమైన వేణునినాదంబు సరసగంభీరగర్జనము గాఁగ
మహనీయ నిర్మల మందహాసద్యుతి లలిత సౌదామనీ లతిక గాఁగఁ
దలచుట్టు బాగుగఁ దనరు ఫించపుదండ శైలభేదన శరాసనము గాఁగఁ
గరుణాకటాక్ష వీక్షణ సుధా వర్షంబు సలిలధారా ప్రవర్షంబు గాఁగ

తే. జాడ నేతెంచు గోపాలజన మునీంద్ర, చాతకంబుల దురవస్థ సక్కఁ జేసి
కృష్ణమేఘంబు బహుతరకీర్తి నొప్పె, విమల బృందావనాకాశవీథియందు. 761

* అప్పుడు నిర్మలమైన బృందావనమనే వినువీథిలో శ్రీకృష్ణుడనే మేఘం మిక్కిలి విఖ్యాతంగా విహరించింది. భువనాలను సమ్మోహపరచే వేణుగానమే ఆ నీలమేఘానికి రసవంతమైన, గంభీరమైన గర్జన మయింది! ఉదాత్తము, స్వచ్ఛము అయిన దరహాసశోభయే మెరుగారు మెరుపుతీవ అయింది. తలచుట్టు చక్కగ విలసిల్లే నెమలిపింఛ కలాపమే ఇంద్రచాప మయింది. కరుణామయమైన కడగంటి చూపులనుండి ప్రసరించే అమృతవర్షమే నీటిజల్లులు జాలువార్చే వాన అయింది. ఇలా సంచరించిన ఆ శ్రీకృష్ణజీమూతం తన్ను అనుసరించే గోపాలురు, మునీంద్రులు అనే చాతకపక్షుల తాపాలను రూపుమాపింది.

క. గోవుల వృషవత్సంబుల, వావిరిఁ బూజించి పిదప వర్షాకాల
శ్రీవనితను బూజించెను, శ్రీవల్లభుఁడయ్యు గోపశేఖరుఁ డధిపా! 762

* రాజా! లక్ష్మీ వల్లభుడైన ఆ యదునందనుడు గోవులను, కోడెదూడలను పూజించాడు. ఆ పై వర్షాకాల లక్ష్మిని అర్చించాడు.

వ. ఇట్లు కృష్ణుండు విహితవిహారంబుల వర్షాకాలంబు పుచ్చె నంత. 763

* ఈ విధంగా నందనందనుడు యథోచిత విహారాలతో వర్షాకాలం గడపినాడు. అంతట శరదృతువు వచ్చింది.

## -: శరదృతు వర్ణనము :-

క. జొంపములు గొనియె వనములు, రొంపు లిగిరె; నెమిలిగములరొద లుడిగె; నదుల్
పెంపులకుఁ బాసె; నుఱుముల, శంపల సంపదలు మానె శారదవేళన్. 764

* ఆ శరత్కాలంలో అరణ్యాలన్నీ గుబురుగా పెరిగినాయి. బురద లెండినాయి. నెమలి గుంపుల కేకాధ్వనులు ఆగిపోయినాయి. ఉరుముల మెరుముల ఆడంబరం అణగింది.

వ. మఱియు జీవనంబులు విడిచి, విమలజ్ఞానవశంబున ముక్తులగు పురుషరత్నంబుల చెన్నున నన్ను వదలి, మిన్ను విడిచి, వాయువశంబులై, వెల్లివిరిసి చను మేఘంబులును; మేఘపటల రహితంబును గలశభవముని సహితంబునునై, విజ్ఞానదీపవిలసితం బగు యోగిహృదయంబు చందంబున శుభ్రం బయిన యభ్రంబును; నభ్రంబున నీలదుకూల వితానసంయుక్త ముక్తాఫలంబుల వడువున నెగడు

నుడుగణంబులును, నుడుగణ మయూఖంబు క్రొవ్వు లువ్వెత్తుగొని నివ్వటిల్లుచు బ్రహ్మాండ కరండకర్పూర ఖండాయమానంబులగు చంద్రకిరణంబులును, జంద్రకిరణ సంస్పర్శనంబున సగర్భం బులై భూమికి దుర్భరంబు లగుచు నిండి పండి హాలిక కర నిశిత లవిత్ర ధారాసంరంభంబుదలంచి తల్లడిల్లి వెలువెలుకం బాఱుచుఁ దల్లియగు విశ్వంభరకు మునుకొని ప్రణతంబులై వడంకుచు నెఱుఁగ మొఱయిడుచున్న పెంపున సంపన్నంబు లయిన యెన్నుల వ్రేఁగున వ్రాలి గాలిం దూలుచు మర్మర ధ్వనుల సారస్యంబులగు కలమాది సస్యంబులును; సస్యమంజరీ పుంజంబులఁ గొంచక చంచువులఁ ద్రుంచి కబళించి పిల్ల పెంటి తండంబులం గూడి కడుపులు నిండ మెక్కి విక్కవిరిసి చొక్కుచుఁ ద్రిక్కులు గొని మహోత్తుంగ సమంచిత మంచప్రదేశంబు లెక్కి సంచరించుచు వెన్నుల కావలియున్న యన్నుల కెమ్మోవులు బింబఫలంబు లని కఱచి తత్కారాస్ఫాలనంబుల నులికిపడి యెగసి చను శుకనికరంబుల కలకలంబులును, గలహంస కోక సారస కోలాహల మండితంబులై నిండిన నిర్మల జలంబులు గల జలాశయంబులును, జలాశయంబుల జలంబు లనుదినంబునిగుర గృహంబుల బ్రదుకు దినంబులు సనుట యెఱుంగని మనుజుల గమనికం దిరుగు జలచరంబులును, జలచరహృదయంబుల బెదరు గదుర డొంకి యింకిన నదులును, నదులందుఁ గర్పూర మండపం బుల తెఱంగున, మణికుట్టిమంబుల మాడ్కిని, సౌధసోపానమార్గంబుల జాడను, విలోకితంబులగు నూతన సైకతంబులును, సైకతప్రదేశంబుల నుదయవేళల నిత్యకర్మానుష్ఠాన నిరతులగు ముని లును, మునికన్యకా కరకలశ సలిలాభిషిక్త మూలంబు లగు తపోవన బాలరసాల సాలంబులును, సాలవిటపి వాసంతికా కుంజపుంజంబుల తఱచున నిముడుకొని దినకర కిరణం బులకుం గరువలికిం జొర వెరవుపడని వనమ్ములును, వనమ్ములం దరులకొనల నాకలములు నేకలములై మెసంగి మసరుకవిసి క్రొవ్వి కొమ్ముకొనల సూటి నేటిదరులు త్రవ్వి చిమ్మి క్రుమ్మి కోరాడెడి వనగజంబులును, గజకుంభ కనకకుంభ రుచిర కుచభార భీరుమధ్య సమంచిత లగు చెంచితలును, జెంచితల క్రూరమ్ములగు వాలమ్ముల సారమ్ములు సెడి ఖేదమ్మునఁ బాదమ్ములు దొట్రుపడఁ బెనుగా తమ్ములం బడు వరాహ పుండరీకంబులును, బుండరీక కుముద కురంటకాది కుసుమ మకరం దంబులు గ్రోలి తేలి సోలి వాలి మహాహంకృతుల ఝుంకృతులు సేయు తేఁటికదుపులును, గదుపులం గలయక యెడగలిగి మదమున నదనుపద నెఱింగి మదనమార్గణ ప్రేరితంబులై పెంటి తుటుముల వెంటం జని యొండొంటి గెంటించుచుఁ దగుల నెక్కి గర్భంబులు నెక్కొలుపు మృగ వృషభ రాజంబులును గలిగి, రాజరాజ గృహంబు పగిది విలసిత కుందపద్మ సౌభాగ్యంబై, భాగ్యహీను కర్ణరేఖగతి నశ్రుత నీలకంఠ శబ్దంబై, శబ్దశాస్త్రవేది హృదయంబు బాగున విశదప్రకాశాభిరామంబై, రామసంగ్రామంబుకైవడి బాణాసనాలంకృతంబై, కృతాంతహృదయంబు కరణి నపంకంబై, పంకజాసను గేహంబు సొంపున రాజహంస విరాజమానంబై, మానధనుని చరిత్రంబు సొబగున నకల్మషజీవనంబై, వననిధిపొలుపున సమ్మిళిత భూభృద్వాహినీ సంకులంబై, కుల వధూ రత్నంబు చెలువున నదృష్ట పయోధరం బై ధరణికిం దొడ వగుచు శరత్కాలంబు వచ్చె నంత. 765

* బ్రదుకులు వదలి నిర్మలజ్ఞాన ప్రభావంతో ముక్తికేగు పురుష పుంగవుల మాదిరి అంబుదాలు వాయువశాన అంతరిక్షం నుంచి వికావికలై వెళ్ళిపోయాయి. విజ్ఞానమనే దీపంతో వెలుగొందే యోగిచిత్తంలాగా అంబరతలం మబ్బులు వీడి అగస్త్య నక్షత్రంతో కూడి స్వచ్ఛమై ప్రకాశించింది. అట్టి ఆకాశవీథిలో చుక్కల గుంపులు నీలిపట్టు చాందినీకి గూర్చిన ముత్యాల విధంగా విలసిల్లినాయి. ఆ నక్షత్ర కాంతుల విజృంభణం అరికడుతూ చంద్రకిరణాలు బ్రహ్మాండ మనే పేటికలో కర్పూరఖండాలై రంజిల్లినాయి. ఆ చంద్రకిరణాలు సోకి పొట్టకు వచ్చిన వరిమొదలైన పైరులు బాగుగా పండి భూమికి నిండుదనం చేకూర్చాయి. అవి రైతుల చేతి కరకైన వాడి కొడవళ్ళ పదను తలంచి తల్లడమంది వెలవెలబారినాయి. నిండైన వెన్నుల భారంతో వ్రాలి గాలికి తూగుతూ మర్మరధ్వనులు సల్పుచున్న ఆ వరిపంట పుడమి తల్లికి ప్రణమిల్లి వడవడ వణకుతూ రక్షింపుమని మొరపెట్టుకుంటున్నట్లు అనిపించింది.

చిలుకల బారులు వరి వెన్నుల గుంపులను త్రుంచి ముక్కులతో కబళించి తమపిల్లలతో, పెంటిగుంపుతో చేరి కడుపార మెక్కి, సొక్కుతూ సోలుతూ పయనించాయి. అలా పోతూ పోతూ ఎత్తైన మంచెలెక్కి వాటిమీద అటూ ఇటూ తిరుగుతూ పైర్లకు కావలిఉన్న పడతుల ఎఱ్ఱని పెదవులు దొండపండ్లని భ్రమించి కరిచాయి. అలా కరిచి ఆ చెలువల చేతి విసురులకు ఉలికిపడి కిలకిల ధ్వనులు గావిస్తూ రివ్వున ఎగిరిపోయాయి. తేట నీటితో నిండిన సరస్సులు కలహంసలు, చక్రవాకాలు, బెగ్గురుపక్షుల కలకల నినాదంతో చెలువారినాయి.

ఇండ్ల లోపల ఇంకెన్నినాళ్ళు జీవించడమో తెలియని మనుజుల మాదిరి తటాకాలలోని జలం దినదినానికి ఇంకిపోవడం గమనింపక జలచరాలు అందు సంచరించసాగాయి. ఆ జలచరాల చిత్తాలలో భీతి జనింపగా నదులు నానాటికి తగ్గి ఇంకబారినాయి. ఆ నదులలో క్రొత్తగా మేటవేసిన ఇసుక తిన్నెలు కర్పూర మండపాలలాగా, మణులు దాపిన స్థలాల మాదిరిగా, మేడమెట్ల పోలికగా చూడ సొబగైనాయి. ఆ సైకతప్రదేశాలలో ప్రాతస్సమయాన మునులు నిత్య కర్మాచరణలో నిమగ్నులయ్యారు. అక్కడి తపోవనాలలోని గున్నమామిడిచెట్ల పాదులలో మునికన్యలు చేతిబిందెలతో నీళ్ళు పోయసాగారు.

ఆ వనాలు మద్దిచెట్లు, మొల్లతీవలు అల్లి బిల్లిగా అల్లుకోవడం వల్ల భాను కిరణాలకూ, పవనాలకూ బొత్తిగా చొరవీలుగాని వయ్యాయి. అడవి యేనుగులు అడవి చెట్ల కొమ్మలలోని ఆకులు అలములు యథేచ్ఛగా మేసి క్రొవ్వెక్కి దంతాగ్రాలతో ఏటిగట్టులను క్రుమ్మి క్రుచ్చి కోరాడినాయి. అక్కడ చెంచితలు కరికుంభాలు, కనక కలశాలవంటి చక్కని చనుగుబ్బల బరువుకు వణకుతున్న సన్నని నడుములు గలవారై ఉన్నారు. ఆ బోయతల వాడిబాణాల ఘాతలకు చేవ గోల్పోయి అడవి పందులు, పులులు దుఃఖంతో కాళ్ళు తొట్రుపడగా వెళ్ళి పెద్దపల్లాలలో పడిపోయాయి. తుమ్మెద కదుపులు కమలములు, కలువలు, గోరంటలు మొదలైన పూలలోని తీయతేనెలు గ్రోలి మత్తెక్కి సొక్కిసోలుతూ జుంజుమ్మని రొద చేశాయి.

మృగశ్రేష్ఠాలు, వృషభరాజాలు మందలతో చేరక మదమెక్కి దూరంగా సంచరిస్తూ కామప్రేరితాలై ఒకదాని నొకటి త్రోసికొంటూ పెంటిగుంపు వెంటబడి వాటిని దాటినాయి.

ఆ శరత్కాలం కుందము పద్మము అనే నిధులతో నివ్వటిల్లే కుబేరుని మందిరం లాగా మొల్లలతో, తామరలతో ఒప్పారింది. శివ శబ్దం విననోచని అభాగ్యుని చెవిలాగా నెమళ్ళ రవళి కర్ణగోచరం గాని దయింది. తేటయైన తెలివితో చెలువారే వ్యాకరణ శాస్త్రవేత్త హృదయంలాగా తెల్లని ప్రకాశముచేత మనోహరమయింది. ధనుస్సుతో చెలువారిన రాముని యుద్ధంలాగా నల్లగోరంట వేగిస చెట్లతో విలసిల్లింది. పాపరహితమైన యమధర్మరాజు మనస్సులాగా బురద లేనిదయింది. రాజహంసలతో రాజిల్లే చతుర్ముఖుని సౌధంలాగా రాయంచలతో రాణించింది, పాపరహితమైన జీవనంతో చెలువారే మానధనుడి నడవడిలాగా నిర్మలజల సహితమై నివ్వటిల్లింది. పర్వతాలతోనూ, నదులతోనూ కూడిన కడలిలాగా కలిసికొన్న రాజసేనలు కలది అయింది. చనుకట్టు కనుపట్టని ఇల్లాలిలాగా కనరాని మబ్బులు కలది అయింది. ఆ శరదృతువు అవనీ మండలానికే అలంకార మయింది.

**క. వాజుల నీరాజనములు, రాజుల జయగమనములును రాజిత లక్ష్మీ**
**పూజలు దేవోత్సవములు, రాజిల్లెను జగతియందు రాజకులేంద్రా! 766**

* ఓ రాజపుంగవా! ఆ శరత్తులో అశ్వాలకు హారతు లెత్తినారు. రాజుల విజయ ప్రస్థానాలు, లక్ష్మీ పూజలు, దేవతోత్సవాలు జరిగాయి.

**క. చేగ గల చెఱకువింటను, బాగుగ నీలోత్పలంబు బాణంబుగ సం**
**యోగంబు సేసి మదనుఁడు, వేగంబున విరహిజనుల వేఁటాడె నొగిన్. 767**

* మన్మథుడు తన చేవగల చెరకు వింట నల్లగలువను శరంగా సంధించి వేగిరంగా వియోగులను వేటాడినాడు.

**వ. ఇట్లు భాసురంబు లయిన శరద్వాసరంబుల గోవిందుండు గోబృంద సమేతుండై బృందావనంబునఁ బసులఁ బొసంగ మేపుచు. 768**

* ఈ విధంగా పసందై కనువిందైన ఆ శరత్కాలపు రోజులలో శ్రీకృష్ణుడు హాయిగా ఆలమందలతో గూడి బృందావనంలో పశువులను మేపినాడు.

**సీ. కర్ణావతంసిత కర్ణికారప్రభ గండభాగద్యుతిఁ గడలుకొలుప**
**భువనమోహనమైన భ్రూవిలాసంబుతో వామభాగానతవదన మొప్ప**
**నపసవ్యకరమృదులాంగుళి చాతురి షడ్జధ్వనికి మర్మసరణిఁ జూప**
**డాకాలిమీఁద నడ్డము సాఁచి నిల్పిన పదనఖద్యుతి భూమిఁ బ్రబ్బికొనఁగ**

**తే. మౌళిపింఛముఁ గంఠదామమును మెఱయ, విలసిత గ్రామముగ నొక్కవేణువందు**
**బ్రహ్మగాంధర్వగీతంబు పరగఁ జేసెఁ, జతురనటమూర్తి గోపాలచక్రవర్తి. 769**

* నిపుణనటనాభిరాముడైన ఆ గోపాల సార్వభౌముడు పిల్లనగ్రోవి చేతబూని స్వరభేదాలు వెలయిస్తూ బ్రహ్మగాంధర్వగీతి ఆలపించాడు. ఆయన చెవుల సందున చెరివిన కొండ గోగుపూవుల రంగు చెక్కిళ్ల

శోభను ఇనుమడింప జేసింది. ఎడమవైపుకు వంగిన ముఖం విశ్వాన్ని మోహింపజేసే బొమముడి సోయగంతో పొలుపారింది. కుడిచేతి కోమలమైన వ్రేళ్ళ నైపుణ్యం షడ్జస్వరానికి ధ్వని రహస్యాలు గరపింది. ఎడమ కాలిమీద అడ్డంగా సాచి ఉంచిన కుడికాలిగోళ్ళ కాంతి పుడమిపై ఆవరించింది. సిగలోని నెమలి పించెము, మెడలోని వైజయంతీమాల మిలమిల మెరిశాయి.

**వ. ఇట్లు హరి వేణునాదంబు పూరించిన మారవికారహేతువగు తద్గీతం బాలించి సిగ్గులు చాలించి మక్కువలు సెక్కులొత్త గోపిక లోపికలు లేక తమతమ పొత్తుకత్తెలుం దారును దత్తరంబునఁ బదుగురు నేగురుఁ దుటుములు గట్టి జిలిబిలి ముచ్చటలకుం జొచ్చి తమలోన. 770**

* ఈ లా శ్రీకృష్ణుడు మురళి మ్రోగించాడు. కామోద్దీపకమైన ఆ పిల్లనగ్రోవి పాటవిని గొల్ల చేడియలు సిగ్గులు వీడినారు. వలపులు చిగురింపగా ఆ గోపికలు ఓపికలు వహింపలేక తమ తమ చెలికత్తెలతో ససంభ్రమంగా ఐదుమంది, పదిమంది గుంపులుగా గూడి తమలో తాము ముద్దుముచ్చటలకు ఉపక్రమించారు.

**మ. శ్రవణోదంచితకర్ణికారకముతో స్వర్ణాభచేలంబుతో**
**నవతంసాయిత కేకిపింఛకముతో నంభోజదామంబుతో**
**స్వవశుండై మధురాధరామృతముచే వంశంబుఁ బూరించుచున్**
**ఉవిదా! మాధవుఁ డాలవెంట వనమం దొప్పారెడిం జూచితే! 771**

* చెలీ! శ్రీకృష్ణుడు చెవియందు కొండగోగుపువ్వు చెరివికొన్నాడు. పసిడివన్నె పట్టుపుట్టం కట్టినాడు. సిగలో నెమలిపురి ధరించాడు. మెడలో తామరపూల దండ తాల్చినాడు. పారవశ్యంతో పిల్లనగ్రోవి రంధ్రాలను మోవిసుధచే పూరిస్తూ బృందావనంలో గోబృందం వెంట విహరిస్తున్న ఆ వెన్నుణ్ణి తిలకించావటే?

**శా. రావే సుందరి! యేమె బోటి! వినవే! రాజీవనేత్రుండు బృం**
**దావీథిం దగ వేణు వూఁదుచు లసత్సవ్యానతాస్యంబుతో**
**భ్రూవిన్యాసము లంగుళీక్రమములుం బొల్పార షడ్జంబుగాఁ**
**గావించెన్ నటుభంగి బ్రహ్మమగు తద్గాంధర్వసంగీతమున్. 772**

* సుందరీ! ఇలారా!చెలీ! ఏమి సంగతి? విన్నావటే సఖీ! అరవిందాక్షుడు బృందావన వీథిలో వేణువు ఊదుతూ ఎడమవైపుకు వంచిన ముఖంతో కనుబొమ లాడిస్తూ వ్రేళ్ళవిన్యాసాలు వెలయిస్తూ నటునివలె షడ్జస్వరంతో బ్రహ్మ గాంధర్వ గీతాన్ని ఆలపిస్తున్నాడు.

**క. తలఁకెను గొబ్బునఁ జిత్తము, నలినాక్షుని మధురవేణునాదము నా వీ**
**నులు సోఁకినంత మాత్రన, చెలియా! యిఁక నేటివెఱపు చింతింపఁ గదే! 773**

* సఖీ! ఆ పద్మాక్షుని మధురమైన మురళీ రవం చెవుల సోకేసరికి నా మనసు చలించింది. ఇక భయ మెందుకు? ఏదైనా ఉపాయం ఆలోచించు.

క. నాతోడ వెఱవ వలదే?, నాతోడనె కొనుచుఁ బోయి నలినదళాక్షున్
నీతోడుతఁ బలికించెద, నీతోడి జనంబు మెచ్చ నీతోడు సుమీ! 774

* చెలీ! నాతో రావడానికి భయపడవద్దు, నీ తోటివారు మెచ్చేటట్లు నిన్ను నావెంట గొంపోయి గోవిందుడు నీతో మాట్లాడేటట్లు చేస్తాను. నీ మీద ఒట్టు.

వ. అని పెక్కుభంగుల నోర్తోర్తె నుద్దేశించి పలుకుచు, గోపసుందరులు బృందావనంబునకు గోవిందుని కెదురు చని పరమానందంబున నతనిం దమమనంబులఁ బ్రతిపదంబును నాలింగనంబు సేసిన వార లగుచు, రామకృష్ణుల నుద్దేశించి. 775

* అని పలురీతులుగా ఒకరితో ఒకరు మాట్లాడుకుంటూ గొల్లపడుచులు బృందావనంలో అరవింద దళ నేత్రుణ్ణి మనస్సులో మాటి మాటికీ కౌగిలించుకున్నారు. అలా చేసి వారు బలరామ కృష్ణులను ఉద్దేశించి తమలో తాము ఇలా చెప్పుకున్నారు.

మ. నవగోస్థానక రంగమందుఁ బరమానందంబుతోఁ జూత ప
ల్లవ నీలోత్పల పింఛపద్మదళ మాలావస్త్ర సంపన్నులై
కవయై వేణువు లూఁదుచున్ బహునటాకారంబులం గేళితాం
డవముల్ సేసెద రీ కుమారకులు; వేడ్కం గామినుల్ గంటిరే? 776

* ఈ బలరామకృష్ణులు ఎంతో సంతోషంగా మామిడి చివుళ్ళు, నల్లగలువలు, నెమలిపింఛాలు, తామర పూదండలు, పట్టుపుట్టాలు ధరించారు. క్రొత్తవైన మందపట్టుల్లో జతగూడి ఈ సుకుమారులు మురళి మొరయిస్తూ నిత్యం పెక్కునట వేషాలతో అత్యంత మనోహరంగా నృత్యం చేస్తున్నారు. వెలదులారా! ఈ వేడుక కనుగొన్నారా?

క. ఓ చెలువలార! వినుఁడీ, వాచాశతకంబులేల? వర్ణింపంగా
లోచనముల కలిమికి ఫల, మీచెలువురఁ జూడఁగలుగు టింతియ సుండీ? 777

* అతివలారా! ఆలకించండి. నూరు మాటలతో వర్ణించడ మెందుకు? కన్ను లున్నందుకు ఫలం ఈ సొబగుకాంద్రను చూడగలగడమే సుమా!

వ. అని పలికి; రందుఁ గొందఱు గోవిందు నుద్దేశించి. 778

మ. ఒనరన్ వ్రేతల కించుకేనియును లే కుండంగ గోపాల కృ
ష్ణుని కెమ్మోవి సుధారసంబు గొనుచుం జోద్యంబుగా మ్రోయుచుం
దన పర్వంబులు నేత్రపర్వములుగా దర్పించెఁ బూర్వంబునన్
వనితా! యెట్టితపంబు సేసెనొకొ యీ వంశంబు వంశంబులోన్. 779

* మరి కొందరు కృష్ణుణ్ణి ఉద్దేశించి ఇలా అన్నారు. విరిబోణి! ఈ వేణువు మునుపేమి తపమాచరించి వెదురు వంగడంలో జన్మించిందో? ఈ పిల్లనగ్రోవి గొల్లభామలకు ఇసుమంతైనా మిగల్చకుండా గోపాల

కృష్ణుని అరుణాధరసుధను ఆస్వాదిస్తూ వింతమ్రోత లీనుతున్నది. తన పర్వాలతో కనులపర్వం గావిస్తూ గర్వంతో మిడిసిపడుతున్నది.

**మ. ముదితా! యే తటినీపయః కణములన్ మున్ వేణు వింతయ్యె నా**
**నది సత్పుత్రునిఁ గన్నతల్లి పగిదిన్ నందంబుతో నేఁడు స**
**మ్మద హంసధ్వనిపాటగా వికచపద్మశ్రేణి రోమాంచమై**
**యొదవం దుంగతరంగ హస్తనటనోద్యోగంబు గావింపదే! 780**

* సుందరీ! ఏ నదీజల బిందువులతో ఈ వేణువు ఇంతగా వర్ధిల్లిందో, ఆ నదీమతల్లి మంచి కొడుకును గన్న మాతృదేవతలాగా మహానందంతో మత్తిల్లిన రాయంచల రవళియే గానంగా, చెలరేగిన అలలనే హస్తాలతో ఈనాడు నాట్యం చేయకుండా ఉంటుందా?

**క. నలినోదరుభక్తునిఁ గని, కులజులు నందాశ్రుజలము గురియు పగిది ద్రుమాఁ**
**కులు పూఁదేనియ లొలికెడు, నలినాక్షుని చేతివంశనాళము మ్రోఁతన్. 781**

* పద్మనాభుని భక్తుని పరికించి అతని కులంవారు ఆనందబాష్ప బిందువులు విడిచినట్లుగా కమలాక్షుని కమ్మని పిల్లనగ్రోవి పాటలు విని పాదపములు పూదేనియలు జారుస్తున్నాయి.

**శా. నా మోసంబున కెద్దిమేర? వినవే నా పూర్వజన్మంబులన్**
**లేమా! నోముల నోఁచుచో నకట! కాళిందీతటిన్ వేణువై**
**భూమిం బుట్టెద నంచుఁగోరఁ దగదే? బోధిల్లి యట్లైన నీ**
**బామం దిప్పుడు మాధవాధరసుధాపానంబు గల్గుంగదే! 782**

* అయ్యో! చెలీ! నేనెంత వంచితురాల నైతినే. విను. నేను పూర్వజన్మంలో నోములు నోచేటప్పుడు యమునానదీ తీరంలో వెదురు మొకగా పుట్టాలని తెలివితో కోరుకొనక పోతిని గదా! ఆ జన్మలో అలాకోరి ఉంటే ఇప్పు డీజన్మలో మాధవుని అధరామృతం ఆస్వాదించి ఉందును గదా!

**క. కాళిందీకూలంబున, నాళీ! యీ నందతనయు నధరామృతముం**
**గ్రోలెడి వేణువ నగు నో, మేలాగున నోఁచవచ్చు నెఱిఁగింపఁగదే! 783**

* చెలియా! యమునా తీరంలో శ్రీకృష్ణుని మోవి సుధను పీల్చే పిల్లనగ్రోవిగా అయ్యే నోము ఎలా నోమవలెనో తెలుపవే!

**క. వనితా కృష్ణుఁడు నల్లని, ఘన మనియున్ వేణురవము గర్జన మనియున్**
**మనమునఁ దలంచి రొప్పుచు, ననవరతము నెమలితుటుము లాడెడిఁ గంటే! 784**

* కాంతా! నళినాక్షుడు నల్లని మేఘమనీ, మురళీ నినాదం ఉరుమనీ మదిలో భావించి ఎడతెరపి లేకుండా కేకారవాలు గావిస్తూ నెమళ్ళు పురివిచ్చి నాట్యం చేస్తున్నాయి. చూచావా?

క. గిరిచరమిథునము లోలిం, బరికింపఁగఁ గృష్ణపాద పద్మాంకితమై
సురరాజు నగరికంటెను, దరుణీ!బృందావనంబు దద్దయు నొప్పెన్. 785

* అంగనా! అరవిందనాభుని అడుగుదమ్ముల చిన్నెలతో గూడి ఈ బృందావనం అమరావతి కంటె మిక్కిలి అందంగా భాసిస్తున్నది. గిరిచరుల జంటలు ఇక్కడి సౌభాగ్యాన్ని అదేపనిగా అవలోకిస్తున్నారు.

మ. అమరేంద్రాంగన లాకసంబున విమానారూఢలై పోవుచుం
గమలాక్షున్ శుభమూర్తిఁ గాంచి మురళీగానంబు లందంద క
ర్ణములన్ నిల్పుచు మేఖలల్ వదలఁగా నాథాంకమధ్యంబులం
బ్రమదా! వ్రాలిరి చూచితే వివశలై పంచాశుగభ్రాంతలై. 786

* ఓ పడతీ! అదిగో దేవతాస్త్రీలు విమానాలెక్కి విహాయసవీథిలో వెళుతూ మంగళమూర్తియైన మాధవుని తిలకించి ఆయన వేణుగానం వీనుల బడగానే పులకించి పోకముళ్ళు వీడిపోయి వశం తప్పి మదనపీడితలై పతుల ఒడులలో ఒరిగిపోతున్నారు. చూచావా?

ఉ. కానల నుండుచున్ సరసగాన వివేకవిహీన జాతులై
వీనుల నేఁడు కృష్ణముఖ వేణురవామృతధార సోఁకినన్
మేనులు మేఁతలున్ మఱచి మెత్తని చూడ్కి మృగీ మృగావళుల్
మానిని! చూడవమ్మ! బహుమానము సేసెఁ గృతార్థచిత్తలై. 787

* ఓ మానవతీ! అడవిలో నివసించే ఈ పెంటిపోతు మెకాల గుంపులన్నీ మధుర సంగీత జ్ఞానం బొత్తిగా లేనట్టివి. అయినా నేడు ముకుందుడు చిందిస్తున్న మురళీనినాద సుధారసం చెవుల బడగానే అవి ఒడలు మరచి మేతలు విడిచి సుతిమెత్తని చూపులతో, పరవశించిన మనసులతో నందగోపుణ్ణి అభినందిస్తున్నాయి. అవలోకిస్తున్నావా?

ఉ. తల్లుల చన్నుఁబాలు మును ద్రావు తఱిన్ దమకర్ణవీథులన్
వల్లభమైన మాధవుని వంశరవామృతధార సొచ్చినం
ద్రుళ్ళక పాలురాఁ దివక దూఁటక మానక కృష్ణుమీఁద దృ
గ్వల్లులు సేర్చి నిల్చె నదె! వత్సము లంగనలార! కంటిరే! 788

* వనితలారా! లేగలు తల్లులపాలు కుడిచేవేళ ప్రియమైన మాధవుని వేణుగాన సుధాధార చెవుల బడటం వల్ల త్రుళ్ళిపడుతూ పాలు పీల్చక, పొదుగును గ్రుమ్మక, ఊరక చన్నులను నోటనుంచుకొని చిన్నకృష్ణుని మీదనే కన్నులుంచి అలాగే చూస్తూ నిల్చిపోయాయి. చూచారా?

మ. మమతన్ మోములు మీఁది కెత్తుకొని రోమంథంబు సాలించి హృ
త్కమలాగ్రంబులఁ గృష్ణు నిల్పి మురళీగానామృతశ్రేణి క

ర్ణములం గ్రోలుచు మేఁత మాని గళితానందాశ్రులై చిత్రితో
పమలై గోవులు సూచుచున్న వదిగోఁ, బద్మాక్షి! వీక్షించితే? 789

* ఓ కమలాక్షీ! అదిగో ఆవులు మమకారంతో మోరలు పైకెత్తు కొన్నాయి. నెమరువేయడం చాలించాయి. హృదయకోశంలో యదునందనుణ్ణి నిలుపుకొన్నాయి. వేణునాదామృతం వీనులతో త్రావుతూ మేతమేయడం మానినాయి. ఆనందబాష్పాలు విడుస్తున్నాయి. బొమ్మలలాగా కదలక మెదలక నిలిచి శ్రీకృష్ణుని వైపే చూస్తున్నాయి. పరికించావా?

మ. జగతీజంబులశాఖ లెక్కి మరళీశబ్దామృతస్యందమున్
మిగులన్ వీనులఁ ద్రావి వ్రేఁగుపడి నెమ్మిం గృష్ణు రూపంబు చి
త్తగమై యుండఁగ నడ్డపెట్టుక్రియ నేత్రంబుల్ దగన్ మూసి, యీ
ఖగముల్ సొక్కెడిఁ జూచితే! మునిజనాకారంబులం గామినీ! 790

* ఓ వగలాడీ! పిట్టలు చెట్ల కొమ్మలపై చేరినాయి. వేణుగానమనే సుధారసపూరాన్ని మిక్కిలిగా కర్ణపుటాలతో ఆస్వాదించి మత్తుగొన్నాయి. చిత్తంలో నెలకొన్న చిన్నారి కృష్ణుని రూపం వెలికి వెళ్ళనీకుండా విధిస్తున్నవా అన్నట్లు అవి కళ్ళుమూసుకొని మునిజనం లాగా సొక్కుతున్నాయి. గమనించావా?

మ. క్రమ మొప్పన్ నదు లెల్ల వంశరవ మాకర్ణించి సంజాత మో
హములన్ మన్మథ సాయక క్షత విశాలావర్తలై హంస వా
క్యములం జీరి తరంగహస్తముల నాకర్షించి పద్మోప హా
రములం గృష్ణపదార్చనంబు సలిపెన్ రామా! విలోకించితే? 791

* ఓ రమణీ! నదులన్నీ వరుసగా వేణునాదం విన్నాయి. మోహం పైకొనగా మదనబాణాలవల్ల కలిగిన గాయాలవలె తమ సుడిగుండాలు చూపట్టగా, అంచల పలుకులనే తమమాటలతో అంబుజోదరుణ్ణి ఆహ్వానిస్తున్నాయి. అలలనే చేతులతో చెంతకు లాగుకొని కమలములనే కానుకలతో పురుషోత్తముని పాదాలను పూజిస్తున్నాయి. వీక్షించావా?

అ. వనిత! నేఁడు కృష్ణు వంశనినాదంబు, విని పయోధరంబు విరులు గురిసి
తన శరీర మెల్ల ధవళాతపత్రంబుఁ, జేసి మింట నీడఁ జేసెఁ గంటె. 792

* నెలతా! నేడు శ్రీకృష్ణుని మురళీధ్వని విని నీలమేఘం పూలసోన గురిసింది. ఆ పైని తన విపుల దేహం వెల్లగొడుగుగా చేసి ఆకసం నుండి అచ్యుతునకు నీడ గల్పించింది, ఆలోకించావా!

క. మంచి ఫలంబులు హరిచే, నించి కరాలంబనముల నెగడుచు నిదె క్రీ
డించెద, రంగన! చూడుము, చెంచితలం బింఛపత్రచేలాంచితలన్. 793

* అలరుబోడి! ఆ బోయపడతులను చూడు. నెమలి యీకల గుత్తులూ, ఆకులూ కోకలుగా ధరించి ఎంతో మురువు గొల్పుతున్నారు. వారు మధురమైన మంచిమంచి మాగినపండ్లు మాధవున కిచ్చి అతని కరములు తమకరములందు గీలించి ఆనందంతో ఆడుతున్నారు.

క. ఉల్లసిత కుచభరంబుల, నల్లాడెడి నడుముతోడ నలరుల దండన్
భిల్లి యొకతె హరి కిచ్చెను, హల్లోహలకలిత యగుచు నంగన! కంటే! 794

* ఓ మానినీ! ఒక బోయత ఉప్పొంగుచున్న కుచముల బరువుచే నడుము జవ్వట్లాడగా భావావేశంతో ప్రసూనమాలికను జనార్దనుడికి సమర్పించింది. కనుగొన్నావటే!

క. గిరు లెల్ల జలము లయ్యెం, దరు లెల్లను బల్లవించె ధరణి గగన భూ
చరు లెల్లను జొక్కిరి హరి, మురళీరవామృతము సోఁక ముద్దియ! కంటే! 795

* ఓ ముగుదా! కృష్ణుని మురళీగానామృతం సోకగానే కొండలన్నీ కరిగినీరైనాయి. క్షితిలోని చెట్లన్నీ చిగురించాయి. ఖేచరులు, భూచరులు అందరు సొక్కిసోలిపోయారు. ఆలోకించావా?

మ. బలకృష్ణాంఘ్రి సరోజసంగమముచే భాసిల్లుచున్ ధన్యమై
ఫలపుష్పంబులఁ గానికల్ గురిసి సంభావించి మిన్నందుచున్
జలఘాసంబుల గోవులం దనిపి చంచద్భూజరోమాంచమై
వెలసెం జూడఁ గదమ్మ! యీ గిరిపురోవీథిన్ సరోజాననా! 796

* ఓ కమలముఖీ! ఎట్ట యెదుటనున్న ఈ కొండను చూడవమ్మా! ఈ పర్వతం బలరామకృష్ణుల చరణాంబుజముల సంస్పర్శచే ధన్యత గాంచి ప్రకాశిస్తున్నది. పండ్లు పూలు అనే కానుకలను సమర్పించి వారిని సత్కరిస్తున్నది. ఆనందంతో అంబర మంటుతున్నది. నీటితో, కసవుతో, ధేనువులకు తనివి సమకూరుస్తున్నది. అందమైన తరువులనే గగుర్పాటుతో కనువిందు చేస్తున్నది.

వ. అని యిట్లు బృందావన విహారియైన గోవిందుని సందర్శించి పంచబాణభల్ల భగ్నహృదయ లయి వల్లవకాంత లేకాంతంబులఁ జింతించుచుఁ దత్పరతంత్ర లయియుండి రంత. 797

* ఇలా అనుకుంటూ గోపకాంతలు బృందావనంలో విహరిస్తున్న మాధవుని చూచి మదనశరపీడిత స్వాంతలై ఏకాంతంలో తదేక ధ్యానపరాయణలై ఉండిపోయారు.

## -: హేమంతఋతు వర్ణనము :-

క. శామంతికాస్రగంచిత, సీమంతవతీ కుచోష్ణజితశీతభయ
శ్రీమంతంబయి గొబ్బున, హేమంతము దోఁచె; మదనుఁ డేఁచె విరహులన్. 798

* అంతలో శ్రీమంతమైన హేమంతం హఠాత్తుగా అవతరించింది. చేమంతి పూబంతులు దాల్చిన చెలువల కుచముల వేడిమిచే పురుషులకు చలి భయం వదలింది. మన్మథుడు వియోగులను బాగా వేధించాడు.

క. ఉత్తరపుగాలి విసరె వి, యత్తలమునఁ దుహినకిరణుఁ డహితుం డయ్యెన్
బొత్తు జరిగె మిథునములకు, నెత్తమ్ములు దఱిఁగె హిమము నెలకొనియె నృపా! 799

* రాజా! ఉత్తరపు గాలులు వీచాయి. మింట చలివెలుగు సహింపరాని వాడయ్యాడు. దంపతులకు పొత్తు కుదిరింది. అంతటా మంచు అలముకుంది. తామరలకు శోభ తరిగిపోయింది.

**క. అహములు సన్నము లయ్యెను, దహనము హితమయ్యె దీర్ఘ దశలయ్యె నిశల్;**
**బహు శీతోపేతంబయి, యుహుహూ యని వడఁకె లోక ముర్వీనాథా! 800**

* పరీక్షిన్మహారాజా! పవళ్ళు కురుచ లయ్యాయి. అగ్ని హాయి గూర్చింది. రాత్రిప్రొద్దులు హెచ్చాయి. మిక్కిలి చలివల్ల లోకం "ఉహుహూ" అని గడగడ వణకింది.

**క. అన్నుల చన్నుల దండ వి, పన్నులు గా కెల్లవారు బ్రదికిరిగా కీ**
**చన్నుల మీఱిన వలి నా, పన్నులు గాకుండఁ దరమె బ్రహ్మాదులకున్. 801**

* ఆ హేమంతంలో పడతుల పయోధరాల చెంత పురుషు లందరూ ఆపదకు లోనుగాక జీవింపగలిగారు. అవే లేకపోతే బ్రహ్మాది దేవతలైనా చలిబాధ పొందకుండా ఉండగలరా?

**ఆ. పొడుపుఁ గొండమీఁదఁ బొడుచుట మొదలుగాఁ, బరువువెట్టి యినుఁడు పశ్చిమాద్రి**
**మఱుఁగుఁ జొచ్చెఁగాక మసలినఁ జలిచేతఁ, జిక్కెఁజిక్కె ననఁగఁ జిక్కకున్నె. 802**

* సూర్యుడు ఉదయాద్రిపై ఉదయించినది మొదలు ఎక్కడా ఆగకుండా పరుగుతీసి అస్తగిరి మాటున చేరుకొన్నాడు. అలా కాకుండా దారిలో ఆలసించి ఉంటే 'చిక్కినాడు చిక్కినా' డని పదుగురు పరిహసింపగా చలిచేతిలో చిక్కి ఉండేవాడు గదా!

**క. చెంగల్వ విరుల గంధము, మంగళముగఁ గ్రోలుచున్న మధుపము లొప్పె**
**న్నంగజ వహ్నులపై ను, ప్పొంగి విజృంభించు పొగలపోలిక నధిపా! 803**

* పరీక్షిన్మహారాజా! ఎఱ్ఱగలువపువ్వుల పరిమళం శుభప్రదంగా ఆస్వాదిస్తున్న తుమ్మెదలు మన్మథాగ్నుల మీదినుండి ఉవ్వెత్తుగ పై కెగసే పొగల మాదిరి పొడకట్టినాయి.

**ఆ. శంభుకంట నొకటి జలరాశి నొక్కటి, మఱియు నొకటి మనుజ మందిరముల**
**నొదిగెఁగాక మెఱసియున్న మూఁడగ్నులు, చలికి నులికి భక్తి సలుపకున్నె? 804**

* చలిదెబ్బకు తట్టుకోలేక ఆహవనీయం, గార్హపత్యం, దక్షిణాగ్ని అనే మూడగ్నుల్లో ఒకటి శివుని ఫాలనేత్రంలో అణగిపోయింది. మరొకటి సాగరగర్భంలో చొచ్చింది. ఇంకొకటి గృహస్థుల ఇండ్లలో ఒదిగి పోయింది. ఇలా కాకుండా అవి బట్టబయట ఉండి ఉంటే చలికి జంకి కొంకర్లు పోయి ఉండేవి.

**శా. ఈ హేమంతము రాకఁ జూచి రమణీహేలాపరీరంభ స**
**త్సాహాయ్యంబునఁగాని వీని గెలువన్ శక్యంబుగా దంచుఁ దా**
**రూహాపోహవిధిం ద్రిమూర్తులు సతీయుక్తాంగు లైనారు గా**
**కోహో! వారలదేమి సంతతవధూ యోగంబురాఁ గందురే? 805**

* హేమంత ఋతువు రావడం జూచి విలాసవతుల బిగికౌగిళ్ళ తోడ్పాటుతోగాని దీనిని జయించడానికి వీలుపడదని ఊహించుకొన్నవారై బ్రహ్మ విష్ణు మహేశ్వరులు సరస్వతీ లక్ష్మీపార్వతులను తమ ఒడళ్ళకు అంటగట్టుకొన్నారు. ఔనౌను. కారణమది కాకుంటే ఆ త్రిమూర్తులు సదా స్త్రీమూర్తులతో ఇలా అవినాభావ సంబంధం ఎందుకు కలిగి ఉంటారు?

**క. ఈ హేమంతము రాకకు, శ్రీహరి యొక్కింత వడఁకి చింతింపంగా**
**నోహో! వెఱవకు మని తా, మా హరికిని శ్రీకుచంబు లభయం బిచ్చెన్. 806**

* హేమంతం రాకకు శ్రీమహావిష్ణువు కొంచెం వణకి బాధపడి పోయాడు. అప్పుడు భయపడకు మంటూ శ్రీమహాలక్ష్మి వక్షోజాలు ఆయన కభయ మిచ్చాయి.

**వ. ఇట్లు నితాంతంబగు హేమంతంబున మొదలినెల తొలిదినంబు నందు నందుని మందం గల గోప కుమారికలు రేపకడ లేచి చని కాళిందీజలంబులం దోఁగి; జలతీరంబున నిసుమునం గాత్యాయ నీరూపంబుఁ జేసి, సురభి కుసుమగంధంబు లిడి, ధూపదీపంబు లిచ్చి, బహువిధోపహారంబులు సమర్పించి; 807**

* ఇలా ఆసన్నమైన ఆ హేమంతఋతువు ప్రథమమాసం మార్గశీర్షంలోని తొలిరోజున నందుని మందలో ఉన్న గోపకన్యలు వేకువనే నిద్రలేచారు.కాళిందీనదికి వెళ్ళి స్నానం గావించారు. నదిగట్టున గౌరీ దేవి ప్రతిమను రూపొందించారు. సురభిళకుసుమాలతో అలంకరించారు. చందనం పూశారు. ధూపదీపా లిచ్చారు. పలువిధాలైన నైవేద్యాలు సమర్పించారు.

**క. 'ఓ కాత్యాయని! భగవతి, నీకున్ మ్రొక్కెదము నేము నేఁ డనుకంపన్**
**మా కిందఱకును వైళమ, శ్రీకృష్ణుఁడు మగఁడు గాఁగఁ జేయుము తల్లీ! 808**

* భగవతీ! కాత్యాయనీ! నేడు మేము నీకు నమస్కరిస్తున్నాం. దయతో మా అందరికీ శీఘ్రంగా శ్రీకృష్ణుణ్ణి పతిగా ప్రసాదించవమ్మా!

**క. ఓ తల్లి! మాకుఁ గృష్ణుఁడు, చేతోవిభుఁ డైననాఁడు చెలువల మెల్లన్**
**నేతివసంతము లాడుచు, జాతర సేసెదము భక్తిచాతురితోడన్. 809**

* ఓ తల్లీ! శ్రీకృష్ణుడు మాకు ప్రాణేశ్వరుడైన రోజు మేమందరమూ నేతి వసంతా లాడుతూ పరమభక్తితో నీకు జాతర చేస్తాం.

**వ. అని నమస్కరించి హవిష్యంబులు గుడుచుచు న వ్విధంబున మాసవ్రతంబు సలిపి రందొక్కనాఁడు. 810**

* అని దేవికి నమస్కరించి దైవనివేదితమైన అన్నం ఆరగిస్తూ వారు ఒక్కనెల కాత్యాయనీ వ్రతం సాగించారు.

## -: గోపికా వస్త్రాపహరణము :-

**మ. రమణుల్ ప్రొద్దుల మేలుకాంచి సఖులన్ రం డంచు నాత్మీయ నా**
**మములం జీరి, కుచద్వయీ భరములన్ మధ్యంబు లల్లాడఁగాఁ**

భ్రమదోద్దామ గజేంద్రయాన లగుచుం బద్మాక్షునిం బాడుచున్
యమునాతీరముఁ జేరఁ బోయిరి గృహీతాన్యోన్య హస్తాబ్జలై. 811

* ఒకనాడు గోపికలు ప్రాతః కాలంలోనే మేల్కొన్నారు. "రండు రండ"ని తమ నెచ్చెలులను పేరుపేరున పిలిచారు. చనుగవ బరువుతో నడుము లసియాడగా, ఒకరి చేయి మరొకరు పట్టుకొని బయలు దేరినారు. కమలాక్షుని మీద పాటలు పాడుతూ సమద గజేంద్రగమనలై యమునా నదీతీరానికి చేరుకొన్నారు.

వ. ఇ ట్లా నదీతీరంబు సేరం జని గజగమనలు విజనస్థలంబున వలువలు విడిచి యిడి మది శంక లేక యకలంకలై క్రుంకులిడఁ జలంబుల జలంబులు సొచ్చి. 812

* ఇలా ఆ గజయానలు కాళిందీ నదీతీరం చేరి ఒక ఏకాంత స్థలంలో కోకలు విడిచారు. కళంకరహితలగు ఆ పంకజనయనలు నదిలో జంకులేక జలకాలాడుటకై పట్టుదలతో నీట ప్రవేశించారు.

క. వారిజలోచనుఁ బాడుచు, వారిజలోచనలు వారివారికి వేడ్కన్
వారివిహారము సలిపిరి, వారి విహారములు జగతివారికిఁ గలవే? 813

* ఆ పద్మనేత్రలు పద్మాక్షుని మీద పాటలు పాడుతూ తమ ఇచ్చకొలది వేడుకతో జలక్రీడ లాడినారు. వారి ఆ విహారాలు, ఆ ఆనందపారవశ్యాలు లోకంలోని వారికున్నాయా?

వ. ఆ సమయంబున. 814

క. తోయజనయనలు యమునా, తోయములం దుండు టెఱిఁగి దూరగుఁ డయ్యుం
దోయజనయనుఁడు హరి తన, తోయము గోపకులు దానుఁ దోతెంచె నృపా! 815

* అప్పుడు రాజా! ఆ పద్మదళనేత్రలు యమునానదీజలాలలో మునుగుతున్నారని దూరంలో ఉన్న శ్రీకృష్ణుడు తెలుసుకున్నాడు. వెంటనే తోడి గోపబాలకులతో అక్కడికి వచ్చాడు.

తరలము:

కదలకుం డని తోడివారలఁ గన్ను సన్నల నిల్పుచుం
బదము లొయ్యన నేలఁ బెట్టుచుఁ బద్మనేత్రుఁడు మౌనియై
పొదల మాటున నల్లనల్లన పొంచి పొంచి నతాంగుఁడై
యదను గోరుచు డాసి వ్రేతల యంబరంబులు దొంగిలెన్. 816

* అలా వచ్చి, "కదలకుండా ఉండండి" అని గోపాలకులకు కనుసైగచేశాడు. చప్పుడు గాకుండా అడుగు లిడుతూ మౌనంగా పొదలమాటుననే మెల్ల మెల్లగా పొంచి పొంచి వంగి వంగి నడిచాడు. సరిగా సమయం చూచి సమీపించి ఆ గొల్ల చెలువల వలువలు అపహరించాడు.

వ. ఇట్లు దొంగిలి. 817

శా. ఉద్యద్గంధగజేంద్ర గౌరవముతో యోషాంబరంబుల్ విభుం
డాద్యుం డర్భకుభంగి నర్భకులతో హాసార్థియై కొంచుఁ ద
న్నద్యంభఃకణ శీతవాత జనితానందంబుతో నెక్కెఁ దా
సద్యోముక్త దురంతపాదప జనుస్సంతాపమున్ నీపమున్. 818

* ఆ విధంగా వలువలు దొంగిలించి విశ్వవిభుడూ, తొలివేలుపూ అయిన ఆ పరమాత్ముడు పిల్ల వానిలాగా తోడిపిల్లలతో గూడి పరియాచకమునకై ఆడువారి అంబరములు అపహరించి మత్తకరీంద్రంలాగా యమునానదీ జలకణాలచే చల్లబడిన పిల్లవాయువులవల్ల కలిగిన ఆనందంతో నడచి ఒక కడిమి చెట్టును ఎక్కినాడు. ఆత డధిష్ఠించగానే ఆ చెట్టు వృక్షజన్మంవల్ల తనకు కలిగిన సంతాపాన్ని వెంటనే పోగొట్టుకున్నది.

వ. అప్పు డయ్యింతు లిట్లనిరి. 819

క. 'మామా వలువలు ముట్టకు, మామా! కొనిపోకు పోకు మన్నింపు తగన్
మా మాన మేల కొనియెదు?, మా మానసహరణ మేల? మానుము కృష్ణా! 820

* కడిమిచెట్టు నెక్కిన కమలాకాంతునితో ఆ వ్రజకాంత లిట్లన్నారు. "మామా! మా కోకలు ముట్టుకోవద్దు! ఎత్తుకొని పోవద్దు! మమ్మల్ని మన్నించు. మా మాన మెందుకు హరిస్తావు? మా మనస్సులను ఎందుకు అపహరిస్తావు. ఈ పని మాను.

సీ. బహుజీవనముతోడ భాసిల్లి యుండుటో గోత్రంబు నిల్పుటో కూర్మితోడ?
మహి నుద్ధరించుటో? మనుజ సింహంబవై ప్రజలఁ గాచుటొ? కాక బలిఁ దెరల్చి
పిన్నవై యుండియుఁ బెంపు వహించుటో? రాజుల గెల్చుటో రణములందు?
గురునాజ్ఞ సేయుటో? గుణనిధి వై బల ప్రఖ్యాతిఁ జూపుటో భద్రలీల?

ఆ. బుధులు మెచ్చ భువిఁ బ్రబుద్ధత మెఱయుటో, కలికితనము సేయ ఘనత గలదె?
వావి లేదు వారి వారు నా వా రని, నెఱుఁగ వలదె వలువ లిమ్ము కృష్ణ! 821

* కృష్ణా! ఇదేమి పని! దొడ్డ బ్రతుకుతో వన్నె కెక్కుటమో! (జలరాశిలో విలసిల్లుట- మత్స్యావతారము), కూర్మితో కులమునకు ప్రతిష్ఠ కలిగించడమో (కొండను మూపున నిల్పుట-కూర్మావతారము), భూమిని రక్షించడమో (భూదేవిని పైకి లేవనెత్తుట-వరాహావతారము), పురుష పుంగవుడవై జనులను కాపాడడమో (నరకేసరియై భక్తజనులను రక్షించుట-నృసింహావతారము), వయసున పసివాడవై యుండియు దుష్టులైన బలవంతులను నిగ్రహించి ప్రఖ్యాతి వహించడమో (వటురూపమున బలిచక్రవర్తి నణచి పేరొందుట- వామనా వతారము), యుద్ధాలలో రాజులను గెలవడమో (ఇరువదొక్కసార్లు క్షత్రియులను జయించుట- పరశురామా వతారము), పెద్దల యాజ్ఞ పాటించడమో (తండ్రి యానతి తలదాల్చుట-శ్రీరామా వతారము), గుణవంతుడవై మంగళకరమైన పద్ధతిలో పరాక్రమాటోపం ప్రదర్శించడమో (బలభద్రుడై ప్రలంబాదులను నిర్జించుట- బలరామావతారము), పండితులు ప్రశంసింపగా ప్రబుద్ధుడవై ఇలలో వెలుగొందడమో (బుద్ధావతారము)-

తగును గాని ఇటువంటి వంచకత్వం చేత మంచిపేరు లభిస్తుందా? (కల్కిపదముచే కల్కి అవతారము) నీకు వావివరుసలు లేనట్లున్నది. తనవారు, పెరవారు అనే వివేకం అక్కరలేదా? (భగవంతునకు స్వపక్ష, పర పక్షములు లేవు) మా వస్త్రాలు మాకీయవయ్యా?

**క. కొంటివి మా హృదయంబులు;, గొంటివి మానంబు; లజ్జ గొంటివి; వలువల్**
**గొంటి; వికనెట్లు సేసెదొ;, కొంటెవు గద! నిన్ను నెఱిగికొంటిమి కృష్ణా! 822**

* కృష్ణా! మా మనసు లపహరించావు. మా మానం కొల్లగొట్టినావు. మా సిగ్గులు దోచావు. మా వస్త్రాలు దొంగిలించావు. ఇంకా ఏమిచేయనున్నావో ఎరుగము. కొంటె గోపాలా? నీగుట్టు కనిపెట్టి నామయ్యా!

**సీ. రాజసంబున నీవు రంజిల్లు టెఱుఁగమే చెలరేఁగి వింతలు సేయుచుండ?**
**సత్త్వసంపద గల్గి జరగుటఁ దలఁపమే, సిరి గల్గి యన్యులఁ జెనకుచుండ?**
**గురుతర శక్తియుక్తుఁడ వౌట యెఱుఁగమే తామసంబున నెగ్గు దలఁచుచుండ?**
**నొకభంగితో నుండకుంటఁ జింతింపమే మాయావివై మాఱుమలయుచుండ?**

**ఆ. నేమి జాడవాఁడ? వేపాటి గలవాఁడ, వే గుణంబు నెఱుఁగ వెల్ల యెడల**
**నొదిఁగి యుండనేర వోరంత ప్రొద్దును, బటము లీఁగదయ్య! పద్మనయన! 823**

* తామరరేకులవంటి కన్నులు గలవాడా! నీవు విజృంభించి విచిత్రమైన కార్యాలు చేస్తూ ఉంటావు. అందుచే నీవు రజోగుణంతో ఒప్పినవాడవని మాకు తెలియదా? సిరి ఉండికూడ పరులను ఎదిరిస్తూంటావు. అందుచే నీవు సత్త్వగుణ సంపన్నుడవని మేమూహించలేమా? తమోగుణంతో నీవు దుర్మార్గులకు ఎగ్గులు తలపెడుతుంటావు. అందుచే మిక్కిలి గొప్పశక్తితో కూడిన వాడవని మేమనుకోవడం లేదా? మాయతో గూడిన వాడవై తిరుగుతూ ఉంటావు. అందుచే ఒక తీరుగా ఉండేవాడివి కావని మేము భావించడం లేదా? కృష్ణా! నీ జాడలేమిటి? (భగవంతుని పోకడలు ఇట్టివట్టివని తెలియవు), నీవు ఏమాత్రపు వాడవు? (పరిమాణ రహితుడనుట), నీవు గుణ మెరుగని వాడివి (త్రిగుణాతీతు డనుట), ఎల్ల ప్రొద్దు ఒకచోట కుదురుగా ఉండవు (భగవంతుడు సర్వవ్యాపి; కాలాతీతు డనుట), మా వస్త్రములు మాకీయవయ్యా!

**క. రాజుల నెఱుఁగవు బలిమిని, రాజిల్లెదు చీర లీవు రమణుల మింకన్**
**రాజున కెఱిఁగించెద; మో రాజీవదళాక్ష! నీవు రాజవె ధరకున్? 824**

* రాజీవలోచనా! రాజుల మర్యాదలంటే ఏమో నీకు తెలిసినట్టు లేదు. బలవంతుడవైనట్లు ప్రవర్తిస్తున్నావు. మేము అబలలము. మావలువలు మా కీయకున్నావు. మేము నందమహారాజున కీ విషయం చెపుతాము. నీవేమి ఈ పుడమికి రాజు వటయ్యా?

**వ. అని పలికిన కన్నియల పలుకు లాలించి మందహాససుందర వదనారవిందుండై గోపాలబాలకుల కరంబులం గరంబులు వ్రేసి య ముద్దియల నుద్దేశించి నెఱవాది చతురుం డిట్లనియె. 825**

* ఇలా గోపికలు పలికినారు. శ్రీకృష్ణుడు వారి మాటలు విన్నాడు. ఆయన ముఖపద్మం ముసి ముసి నవ్వులతో అందగించింది. తోడి గొల్లపిల్లల చేతులు తనచేతులతో చరుస్తూ నెరజాణలలో మేటియైన శ్రీకృష్ణుడు ఆ యింతులతో ఇట్లన్నాడు.

**శా. రామల్ రాజులతోడ నీ పనికి నారంభింతురే మీ క్రియన్**
**మోమో టేమియు లేక దూఱెదరు మీ మోసంబు చింతింప; రం**
**భోమధ్యంబున నుండి వెల్వడి వెసం బూర్ణేందు బింబాననల్**
**మీ మీ చీరలు వచ్చి పుచ్చుకొనుఁడీ? మీ కిచ్చెదం జెచ్చెరన్' 826**

* నిండు జాబిలివలె గుండ్రని మోములు గల ముగుదలారా! ఆడువారు అవనీపతులతో మీవలె ప్రవర్తిస్తారా? కొంచెమైనా మొగమాటం లేక నన్ను నిందిస్తున్నారే కాని మీతప్పు మీరు ఆలోచించడం లేదు. నీటినుండి వెంటనే వెలువడి నా దగ్గరకు రండి. మీ వలువలు తీసుకొనండి. ఇదిగో ఇప్పుడే మీ కిచ్చివేస్తాను.

**వ. అనిన న మ్మానవతు లొండొరుల మొగంబులు సూచి నగుచు, మర్మంబుల నాఁటు న మ్మాటలకు మగుడం బలుక సిగ్గుపడుచు, నగ్గలంబైన చలిని వలిగొని కంఠ ప్రమాణజలంబులం దుండి డోలాయమాన మానసలై యిట్లనిరి. 827**

* శ్రీకృష్ణుని పలుకులు విని అభిమానవతులైన ఆ గోప యువతులు ఒకరి మొగం ఒకరు చూచి నవ్వుకొన్నారు. మనసులు ఉవ్వెత్తుగా హరించే మాధవుని మాటలకు బదులు పలకడానికి వారు లజ్జించారు. మిక్కుటమైన చలికి గడగడ వణకుతూ గొంతులోతు నీళ్ళలో నిల్చుండి వెనుకకూ ముందుకూ ఊగిస లాడుతున్న ఉల్లములతో వారిలా అన్నారు.

**క. 'మా వలువ లాగడంబున, నీ వేటికిఁ బుచ్చుకొంటి? వీ వల్పుఁడవే?**
**నీ వెఱుఁగని దేమున్నది, నీ వందఱిలోన ధర్మనిరతుఁడవు గదే? 828**

* అల్లరివాడవై మా వలువ లెందు కపహరించావు? అందరిలో నీవు మహా ధర్మపరుడవుగదా! నీ వేమి తక్కువ వాడవటయ్యా? నీకు తెలియని దేముంది?

**శా. ఇంతుల్ తోయము లాడుచుండ మగవా రేతెంతురే? వచ్చిరా**
**యింతల్ సేయుదురే? కృపారహితులై యేలోకమందైన నీ**
**వింతల్ నీ తలఁబుట్టెఁ గాక! మఱి యేవీ కృష్ణ! యో చెల్ల! నీ**
**చెంతన్ దాసులమై చరించెదము మా చేలంబు లిప్పింపవే! 829**

* కృష్ణా! ఆడువారు స్నానము చేసేటప్పుడు మగవారు ఆ చాయలకు వస్తారా? వచ్చారనుకో! దయమాలి ఎక్కడైనా ఈ మాదిరి అల్లరి పనులు చేస్తారా? ఔరా! ఈ చిత్రచర్యలు నీకే సరిపోయాయి; మరెక్కడా లేవు. నీకు బానిసలమై ఉంటాము. మా కోకలు మా కిప్పించు.

**క. వచ్చెదము నీవు పిలిచిన; నిచ్చెద మేమైనఁగాని; యెటఁ జొరు మనినం**
**జొచ్చెదము; నేఁడు వస్త్రము, లిచ్చి మముం గరుణతోడ నేలుము కృష్ణా? 830**

* కృష్ణా! నీవు పిలవగానే వస్తాము. నీవేది కోరినా ఇస్తాము. నీ వెక్కడికి పొమ్మన్నా పోతాము. ఇపుడు మా చీరలు మా కిచ్చి దయతో మమ్మేలుకో!

**వ. అనిన దరహసిత వదనుండై హరి యిట్లనియె. 831**

**క. 'ఏ తరుణుఁడు మగఁ డౌటకు, మీ తపములు సెప్పుఁడింక మీ యానలు సుం**
**డీ తప్పిన నీ కూరిమి, మీ తలలనె పుట్టెనోటు మేదిని లేదే?. 832**

* గోపికల మాటలు విని చిఱునవ్వుతో శ్రీకృష్ణు డిట్లన్నాడు. "ఓ పడతులారా! ఏ పడుచువాణ్ణి పతిగా కోరి మీ రీ వ్రతం చేస్తున్నారో నిజం చెప్పండి. అసత్య మాడితే మీ మీద ఒట్టు! ఈ వలపు మీతోనే జన్మించ లేదు. సర్వత్రా ఉర్విలో ఉన్నదే!

**క. ఎవ్వనిఁ గని మోహించితి, రెవ్వఁడు మీ మానధనము లెల్ల హరించెన్?**
**నివ్వటిలె మీకుఁ గూరిమి, యెవ్వనిపైఁ? బలుకరాదె? యే నన్యుఁడనే? 833**

* మీరు ఎవణ్ణి చూచి మోహించారు? మీ మానధనం అపహరించిన ఆ మగవా డెవడు? ఎవడిమీద మీకు ప్రణయం నెలకొన్నది? నేను పెరవాడనా? నిజం చెప్పండి."

**వ. అనిన విని సుందరు లన్యోన్యసందర్శనమ్ములు సేయుచు, హృదయారవిందంబులందుఁ గందర్పుండు సందడింప నగుచు నిరుత్తరలయి యున్న లోకోత్తరుం డిట్లనియె. 834**

* ఆ మాటలు విని గొల్లచేడియలు ఒకరినొకరు చూచుకొన్నారు. వారి హృదయ పద్మాలలో మరులు హెచ్చింది. వారు నవ్వుతూ మిన్నకున్నారు. అపుడు లోకమాన్యుడైన శ్రీకృష్ణు డిట్లన్నాడు.

**క. నా యింటికి దాసులరై, నా యాజ్ఞ వహించి మీరు నడిచెదరేనిన్**
**మీ యంబరమ్ము లిచ్చెదఁ, దోయంబులు వెడలి రండు తొయ్యలులారా! 835**

* ఓ కలువకంటులారా! నా యింట దాస్యం చేస్తూ నా ఆజ్ఞప్రకారం మీరు నడుచుకుంటామంటే మీ చీరలు మీకిస్తాను. నీటి నుండి వెలుపలికి రండి.

**వ. అనిన విని హరిమధ్యలు చలికి వెఱచి సలిలమధ్యంబున నిలువనోపక. 836**

* మాధవుని మాటలు విన్న సింహం నడుమువంటి సన్నని నెన్నడుములు గల ఆ గొల్లచెలువలు చలికి భయపడి ఉదక మధ్యంలో ఉండలేకపోయారు.

**క. కొందఱు వెడలుద మందురు, కొందఱు వెడలుటయు సిగ్గుగొను గోవిందుం**
**డందురు; కొందఱు దమలోఁ, గొందల మందుదురు వడఁకుగొని మనుజేంద్రా! 837**

* ఓ పరీక్షిన్మహారాజా! చలికి గడగడ లాడుతూ ఆ కన్నెలలో కొందరు వెలుపలికి వెళదామంటారు. వెళితే శ్రీకృష్ణుడు మన సిగ్గుదీయడం తథ్యమంటారు మరికొందరు. ఇంక కొందరు ఎటూ తోచక తమలో ఆందోళన చెందుతారు.

వ. మఱియు నెట్టకేలకుఁ జిత్తంబులు గట్టిపఱచుకొని తనుమధ్యలు తోయ మధ్యంబు వెలువడి.838

* చిట్టచివరకు ఎలాగో మనసులు దిట్టపరచుకొని సన్నని నడుములు గల గోపకన్యలు నీటినుండి వెలుపలికి వచ్చారు.

క. చంచత్పల్లవ కోమల, కాంచన నవరత్నఘటిత కంకణరుచిరో
దంచిత కరసంఛాదిత, పంచాయుధగేహ లగుచుఁ బడఁతులు వరుసన్. 839

* ఆ పడతులు చిగురాకువలె మృదువైనవీ, నవరత్నాలు పొదిగిన బంగారు గాజుల కాంతితో మిల మిల మెరసేవీ అయిన చేతులతో తమ మర్మాంగాలు మాటుపరచుకొని మడుగునుండి వరుసగా వెలువడ్డారు.

వ. చని ప్రౌఢలైన సుందరుల ముందట నిడుకొని మందగమనలు మందహాసంబుతోడ నెదుర నిలిచిన నరవిందనయనుం డిట్లనియె. 840

* మెల్లగ నడిచే ఆ గొల్ల పడుచులు తమలో గడుసరులైన పడతులను ముందు నిలుపుకొని చిరు నవ్వులు చిందిస్తూ కమలనేత్రుని ఎదుట నిలిచారు. అప్పుడు వారితో కృష్ణు డిట్లన్నాడు.

సీ. శృంగారవతులార! సిగ్గేల? మిముఁగూడి పిన్ననాఁటను గోలెఁ బెరిఁగినాఁడ
నెఱుఁగనే మీలోన నెప్పుడు నున్నాడ నేను జూడని మర్మ మెద్ది గలదు?
వ్రతనిష్ఠలై యుండి వలువలు గట్టక నీరు సొత్తురె మీరు నియతి దప్పి?
కాత్యాయనీ దేవిఁ గల్లసేయుట గాక యీ రీతి నోమువా రెందుఁ గలరు?

ఆ. వ్రతఫలంబు మీరు వలచినఁ జక్కఁగ, నింతు లెల్లఁ జేతు లెత్తి మ్రొక్కి
చేరి పుచ్చుకొనుఁడు చీరలు; సిగ్గవో, నాడనేల యెగ్గు లాడనేల? 841

* ఒయ్యారులారా! ఎందుకు సిగ్గుపడతారు? చిన్నప్పటినుంచీ మీతోనే పెరిగాను. ఎప్పుడూ మీతోనే ఉన్నాను. నాకు తెలియదా? నేను చూడని రహస్య మేముంది? మీరు కాత్యాయనీ వ్రతదీక్ష నవలంబించికూడ చీరలు ధరింపక నియమం వదలి జలకా లాడవచ్చునా? ఇది అంబికకు అపరాధం కావించటమే కదా! ఇవ్విధంగా నోము నోచే జవ్వనులు ఎక్కడైనా ఉంటారా? వ్రతఫలం దక్కాలని మీరనుకుంటే చక్కగా చేతులెత్తి నాకు నమస్కరించండి. నా చెంతకు వచ్చి మీ పుట్టములు పుచ్చుకొనండి. సిగ్గు చెడేటట్లు చెప్పడ మెందుకు? ఇలా దెప్పడ మెందుకు?

వ. అనిన విని మానవతులు దమలోన. 842

మ. వ్రతముల్ సేయుచు నొక్క మాటయిన నెవ్వానిన్ విచారించినన్
వ్రతభంగంబులు మానునట్టి వరదున్ వామాక్షు లీక్షించియున్
గతచేలాప్లవనంబు నేఁడు వ్రతభంగం బంచు శంకించి ఫా
ల తటన్యస్త కరాబ్జలై సరసలీలన్ మ్రొక్కి రట్లందఱున్. 843

* అభిమానవతులైన ఆ యువతులు పరమపురుషుని పలుకులు విన్నాడు. అభిమతాలైన వ్రతాలాచరిస్తూ ఒక్కసారి ఏ ఉత్తమశ్లోకుణ్ణి స్మరిస్తే వ్రతభంగాలన్నీ తొలగిపోతాయో అట్టి వరాలు ప్రసాదించే పరాత్పరుణ్ణి ఆ గొల్ల ముద్దియలు వీక్షించారు. కట్టుకోకలు విడిచి స్నానమాడటం వ్రతభంగ మన్న సంగతి తెలుసుకొని వారప్పుడు జంకుగొన్నారు. అందరూ అరవిందాలవలె అందమైన తమ హస్తాలను నుదుట నుంచుకొని యదువల్లభునకు ఒయ్యారంగా వంగి వందనం కావించారు.

**క. బాలలకు హస్తకీలిత, ఫాలలకు నితాంతశీత పవనాగమ నా**
**లోలలకు నంబరములు కృ, పాలుఁడు హరి యిచ్చె భక్తపాలకుఁ డగుటన్. 844**

* శ్రీకృష్ణుడు దయాలవాలుడు, భక్తజన పరిపాలకుడు, అందుకనే మిక్కుటమైన చలిగాలికి వణకుతున్నవారూ, నెన్నొసట కేలుమోడ్చినవారూ అయిన ఆ చెలువలకు వలువ లొసగినాడు.

**ఆ. 'చీర లపహరించి సిగ్గులు విడిపించి, పరిహసించి యైనఁ బరఁగ మనకు**
**ఘనుఁడు నోము కొఱఁతగాకుండ మ్రొక్కించె, ననుచు హరి నుతించి రబల లెల్ల. 845**

* చీరలు దొంగిలించినా, సిగ్గులు దీసినా, ఎగతాళిచేసినా, చివరకు వ్రతలోపం జరగకుండా మన వందనాలు అందుకున్నాడంటూ ఆ సుందరు లందరూ నందనందనుణ్ణి అభినందించారు.

**క. ఉల్లములు నొవ్వ నాడినఁ, గల్లలు సేసినను నగినఁ గలఁచిన నైనన్**
**వల్లభులు సేయు కృత్యము, వల్లభలకు నెగ్గు గాదు; వల్లభ మధిపా! 846**

* రాజా! మనసులు నొచ్చునట్లు మాట్లాడి నప్పటికినీ, మోసగించి నప్పటికినీ, అపహసించి నప్పటికినీ, కలత కలిగించి నప్పటికినీ ప్రియులు చేసేపని ప్రియురాంద్రకు బాధాకరం కాదు. అది ఎంతో ప్రియంగానే ఉంటుంది.

**వ. ఇట్లు హరి వలువ లిచ్చినం గట్టుకొని సతు లతనియందు బద్ధానురాగ లయ్యుఁ జలింపక ఱెప్పలిడక తప్పక చూడ నా ప్రోడ యెఱింగి చేరి వారి కిట్లనియె. 847**

* ఇలా నారాయణు డొసగిన చీరలు ఆ నారీమణులు ధరించినారు. అధోక్షజుని పట్ల అచంచలమైన ప్రణయం కలవారై నప్పటికీ కనురెప్పలు మూయక చలింపక అలాగే నవనీతచోరుణ్ణి అవలోకిస్తూ నిలబడ్డారు. చతురుడైన స్వామి వారి చెంతకు చేరి ఇట్లన్నాడు.

**సీ. లక్షణవతులార! లజ్జించి చెప్పరు గాని మీ మర్మముల్ గానఁబడియె;**
**ననుఁగొల్వఁ జింతించినారు నా చేతను సత్యంబు మీ నోము సఫల మగును;**
**గామితార్థంబుల కలిమిఁ జెప్పఁగ నేల? ననుఁ గొల్వ ముక్తికి నడవవచ్చుఁ;**
**గడమ కూడఁగ నంబికాదేవి నోమంగ నటమీఁద రాత్రులయందు మీకు**

ఆ. నన్నుఁ బొందఁ గల్గు నమ్మి పొండని హరి, పల్క నింతు లెల్ల భ్రాంతిఁ జనిరి
తపము పండె ననుచుఁ దత్పదాంభోజముల్, మానసించు కొనుచు మందకడకు. 848

* ఓ శుభలక్షణవతులైన సుదతులారా! బిడియపడి చెప్పకున్నారు కానీ మీ హృదయరహస్యం నా కెరుకపడింది. మీరు నన్ను పతిగా బడయుటకై వ్రతం సంకల్పించినారు. నిజంగా నా వల్ల మీ నోము పండు తుంది. నన్ను సేవిస్తే కైవల్యమే కరతలామలక మవుతుంది. ఇక కోరిన కోరికలు ఈడేరుతా యని వేరుగా చెప్పడ మెందుకు? ఇందుకు తోడుగా మీరు గౌరీవ్రతం పరిసమాప్తి చేస్తే రాత్రులందు నా కలయిక మీకు లభిస్తుంది. నా మాటలు నమ్మి మీరు ఇండ్లకు పొండి- అని కృష్ణుడు పలికినాడు. గోపికలు తమ తపస్సు ఫలించిందని ముకుందుని చరణారవిందాలు మదిలో ధ్యానించుకుంటూ ఆనందంగా వ్రేపల్లెవాడకు వెళ్ళి పోయారు.

## -: మునిభార్య లన్నముఁ దీసికొని వచ్చి శ్రీకృష్ణుని నారగింపఁ జేయుట :-

వ. ఇట్లు గోపకన్యకలందుఁ బ్రసన్నుండై గోవిందుండు బృందావనము దాఁటి దూరంబున ధేనువులమేపు చుండఁ, జండకిరణుని యెండంబడి దండిచెడి తరులదండ నండగొనుచు నాతపత్రాకారంబులై నీడలు సేయు చున్న వృక్షంబుల నీక్షించి కృష్ణ బల శ్రీదామ దేవప్రస్థ విశాలార్జున ప్రముఖులకుం దక్కిన గోపకులిట్లనిరి. 849

* ఇలా గోవిందుడు గోపకన్యలను అనుగ్రహించి బృందావనం దాటి దూరంలో గోవులను మేపుతుం టాడు. అది మంచివేసవికాలం. భానుతాపం భరించలేక గోపకులు బడలిపోయారు. వృక్షాలను ఆశ్రయిస్తూ గొడుగులవలె నీడ లిస్తున్న ఆ చెట్లను చూచి శ్రీకృష్ణుడు, బలరాముడు, శ్రీదాముడు, దేవ ప్రస్థుడు, విశాలుడు, అర్జునుడు మొదలైన వారితో తక్కిన గోపాలబాలకులు ఈ విధంగా పలికారు.

మ. 'అపకారంబలు సేయ వెవ్వరికి నేకాంతంబులందుండు నా
తప శీతానిల వర్ష వారణములై త్వగ్గంధ నిర్యాస భ
స్మ పలాశాగ్ర మరందమూల కుసుమచ్ఛాయా ఫలశ్రేణిచే
నుపకారంబులు సేయు నర్థులకు నీ యుర్వీజముల్ గంటిరే?' 850

* "ఈ చెట్లు చూడండి. ఎవ్వరికి కీడు చేయవు. ఏ జోలీ లేకుండా ఏకాంతంగా ఉంటాయి. ఎండ, వాన, గాలి, మంచుల బారినుండి ఆశ్రితులను కాపాడుతాయి. అర్థిజనులకు తమ పట్టలు, గంధము, జిగురు, బూడిద, చివురుటాకులు, తేనె, వేళ్ళు, పూలు, నీడలు, పండ్లు ఇచ్చి మేలుచేస్తాయి.''

వ. అని చిగురాకు పువ్వు గాయ పండు తండంబుల వ్రేఁగున వీఁగిన తరువుల నడిమి తెరువునంబసుల దాఁటుల దాఁటించి, యమునకుం జని, వెడఁదమడుఁగుల మెల్లన చల్లని నీరు ద్రావించి, తత్స మీపంబున మేపుచు, వల్లవులెల్ల మూఁకలు గొని, యాఁకలి గొంటిమని విన్నవించినఁ దనకు భక్తు రాండ్రగు విప్రభార్యలవలనం బ్రసన్నుండై వారలం జూచి రామసహితుండైన హరి యిట్లనియె. 851

* ఇలా పలుకుతూ చివురుటాకులు, పువ్వులు, కాయలు, పండ్లు- వీటి బరువున వంగిన చెట్ల సందుల నడిమిబాటలో పసులమందలను తోలుకొని గోపబాలకులు యమునానదికి వెళ్ళినారు. అక్కడ పెద్ద మడుగులలో  నెమ్మదిగా పశువులను చల్లని నీరు త్రాగించి ఆ సమీపంలో వాటిని మేపుతూ వారు ఆకలి వేయుచున్నదని కన్నయ్యకు విన్నవించుకొన్నారు. బలరామ సహితుడైన శ్రీహరి తన భక్తురాండ్రగు బ్రాహ్మణపత్నులను అనుగ్రహింప దలచి ఆ యాదవబాలకులతో ఇట్లన్నాడు.

సీ. వల్లవులార! యీ వనమున విప్రులు బ్రహ్మవాదులు దేవభవనమునకు
నరుగుట కాంగిరసాహ్వయ సత్త్రంబు సలుపుచునున్నారు సనుఁడు మీరు
మా నామములు సెప్పి మైత్రితో నడిగిన నన్నంబు వెట్టెద రనుచుఁ బలుక
వారలు చని విప్రవరుల కెల్లను మ్రొక్కి పసుల మేపుచు బలభద్రకృష్ణు

తే. లలసి పుత్తెంచి రిట మమ్ము నన్న మడుగ, ధర్మవిదులార! యర్థిప్రదాతలార!
పెట్టుఁ డన్నంబు; శ్రాంతులఁ బిలిచి తెచ్చి, పెట్టుదురు గాదె మిముబోఁటి పెద్దలెల్ల. 852

* " ఓ గోపాలబాలకులారా! ఈ వనంలో భూసురు లున్నారు. వారు వేదవేత్తలు. స్వర్గమున కరుగుటకై 'ఆంగిరస' మనే సత్త్రయాగం చేస్తున్నారు. మీరు వారి కడకు వెళ్ళండి. నా పేరూ, మా అన్నగారి పేరూ చెప్పి అనురాగపూర్వకంగా వారి నర్థించండి. మీకు అన్నం పెడతారు.'' ఇలా శ్రీకృష్ణుడు చెప్పగా గొల్లపిల్లలు ఆ బ్రాహ్మణోత్తముల దగ్గరికి వెళ్ళి నమస్కరించాడు. "ఓ ధర్మవేత్తలారా! అర్థిజనులకు అడిగిన విచ్చే మహనీయులారా! బలరామకృష్ణులు పశువులను మేపుతూ బడలిపోయారు. మమ్ము పంపినారు. దయచేసి అన్నం పెట్టండి. మీవంటి పెద్దలు ఆకలిగొన్నవారిని పిలిచి పెడతారుగదా!.''

క. 'ఘన దీక్షితునకు నైనం, జనుఁ గుడువఁగఁ; బశువధంబు సౌత్రామణియుం
జనిన వెనుక దోషము లే, దనఘాత్మకులార! పెట్టుఁ డన్నము మాకున్.' 853

" ఓ పుణ్యాత్ములారా! యజ్ఞదీక్ష వహించినది మొదలు పశువిశసనం జరుగువరకూ సౌత్రామణి యాగము కంటె భిన్నమైన జన్నమందు యజమానుడు అన్నము భుజించినను దోషము కాదు. ఇతరులకు పెట్టిననూ పాపము రాదు. కనుక మాకు అన్నము పెట్టండి''

వ. అని గోపకులు పలికిన. 854

మ. క్రతువున్ మంత్రము దంత్రమున్ ధనములుం గాలంబు దేశంబు దే
వతయున్ ధర్మము నన్యముల్ దలఁప నెవ్వాఁడట్టి సర్వేశ్వరున్
మతి నూహింపక గోపబాలుఁ డనుచున్ మందస్మితిం జూచి దు
ర్మతులై యన్నము లేదు లేదనిరి సమ్మానక్రియాశూన్యులై. 855

* అని గోపాలురు పలుకగా యాగములు, వేదమంత్రములు, క్రియాతంత్రములు, హవిస్సులు, దర్శపూర్ణమాస సంక్రమణాదికములైన పుణ్యకాలములు, కాశి లోనగు దివ్యస్థలాలు, ఇంద్రాగ్నిసోమాది దేవతలు, యాగఫలమైన ధర్మము, యాగదీక్షితుడగు యజమానుడు మొదలైన ఈ సమస్తం ఏ మహా విష్ణు స్వరూపాలై ఉన్నాయో అట్టి మహావిష్ణువే శ్రీకృష్ణుడని వారు అజ్ఞతవల్ల అంతరంగాలలో భావింపలేక పోయారు. కేవలం గోపబాలకుడనే తలంచారు. ఆ విప్రులు దుర్బుద్ధితో, కృష్ణుడు పంపిన గొల్లపిల్లలను ఆదరించడం మాని అన్నం 'లేదు లే' దని అదలించి పొమ్మన్నారు.

**వ. అంత గోపకులు నిరాశులై వచ్చి యెఱింగించిన హరి లౌకికానుసారి యగుచు 'మీరయ్యార్యుల నడుగక, వారి భార్యలకు మా రాకఁ జెప్పుం; డన్నంబు వెట్టెద' రని పంచిన వారలు సని బ్రాహ్మణ సతుల దర్శించి నమస్కరించి సంపూజితులయి యిట్లనిరి. 856**

* అపుడు గోపబాలకులు నిరాశతో మరలివచ్చి శ్రీకృష్ణునకు విషయం వివరించారు. గోవిందుడు లోకవ్యవహారము ననుసరిస్తూ వారితో "మీరు మరల ఆ పెద్దల నడగకండి. రామకృష్ణులు ఈ వనమున కేతెంచినారని వారి పత్నులకు చెప్పండి; అన్నం పెడతారు. వెళ్ళండి'' అని మళ్ళీ గొల్లపిల్లలను పంపినాడు. వారు యజ్ఞవాటికకు వచ్చి భూసుర పత్నులను దర్శించి నమస్కరించారు. తమ్ము ఎంతో సంతోషంతో ఆదరించిన ఆ యిల్లాండ్రతో గొల్లపిల్ల లిలా అన్నారు.

**క. 'గోవుల మేపుచు నాఁకొని, గోవిందుం డన్న మడిగికొని రం డని మ**
**మ్మీ వేళం బుత్తెంచెను, ధీవిలసితలార! రండు; తెం డన్నంబుల్.' 857**

* "ఓ బుద్ధిమతులారా! శ్రీకృష్ణుడు గోవులను మేపుతూ ఆకలిగొన్నాడు. మిమ్మడిగి అన్నం పెట్టించుక రండని మమ్ము ఇచ్చటికి పంపినాడు. రండమ్మా! అన్నం పెట్టండమ్మా!''

**వ. అనిన విని గోవింద సందర్శన కుతూహలలై ధరణీసుర సుందరులు సంభ్రమానందంబులుడెందంబుల సందడింప, భక్ష్య భోజ్య లేహ్య చోష్య పానీయ భేదంబులు గలిగి, సంస్కార సంపన్నంబులైనయన్నం బులు కుంభంబుల నిడుకొని సంరంభంబుల సముద్రంబునకు నడచు నదుల తెఱంగున. 858**

* గోపబాలకుల మాటలు వింటూనే దేవకీనందనుని సందర్శించాలని ఆ ఉవిదలు ఉబలాట పడ్డారు. హృదయాలలో సంబరమూ సంతోషమూ చెలరేగగా భక్ష్యములు, భోజ్యములు, లేహ్యములు, చోష్యములు అనే చతుర్విధాహారాలు, పలురకాలైన పానీయాలు, పక్వంగా వండిన అన్నమూ పాత్రలలో నింపుకొన్నారు. సాగరుణ్ణి చేర నరిగే నదులలాగా వారు వేగిరం బయల్దేరినారు.

**క. బిడ్డలు మగలును భ్రాతలు, నడ్డము చని వల దనంగ నటు దలఁడని మా**
**ఱొడ్డుచు జగదీశ్వరునకు, జడ్డన నన్నంబు గొనుచుఁ జని రా సుదతుల్. 859**

* బిడ్డలు, పతులు, తోబుట్టువులు అడ్డంవచ్చి వలదని వారిస్తున్నా వారు 'మమ్ములను అడ్డగించకండి, తప్పుకోండి' అని బదులు చెపుతూ జగన్నాథునకు అన్నం తీసుకొని చెరచెరా వెళ్ళిపోయారు.

వ. చని యమునా సమీపంబున నవపల్లవాతిరేకంబును విగత వనచర శోకంబును నైన యశోకంబు క్రింద నిర్మలస్థలంబున. 860

*వా రలా వెళ్ళి కాళిందీ నదీతీరంలో క్రొంజిగురు జొంపాలతో సొంపారుతూ వనచరుల క్లేశాలు హరించే ఒక అశోకవృక్షం క్రింద నిర్మలప్రదేశంలో ఉన్న నందనందనుణ్ణి సందర్శించారు.

సీ. ఒక చెలికానిపై నొకచేయి సాఁచి వే ఱొకచేత లీలాబ్జ మూఁచువానిఁ
గొప్పున కందని కొన్ని కుంతలములు సెక్కుల నృత్యంబు సేయువానిఁ
గుఱుచ చుంగులు వుచ్చి కొమరారఁ గట్టిన పసిఁడి వన్నియ గల పటమువాని
నొఁదలఁ దిరిగి రా నలవడఁ జుట్టిన దట్టంపుఁ బించెపు దండవాని

తే. రాజితోత్పల కర్ణపూరములవాని, మహిత పల్లవ పుష్పదామములవాని
భువన మోహన నటవేషభూతివానిఁ, గనిరి కాంతలు కన్నుల కఱవు దీఱ. 861

* ఆ గోకులవిహారి ఒక మిత్రుని మూపుపై చేయి వైచుకొని రెండవచేతితో విలాసపద్మాన్ని త్రిప్పుతున్నాడు. ముడికి చాలని కొన్ని ముంగురులు ఆయన నునుచెక్కిళ్ళపై చిందులు వేస్తున్నాయి. ఆయన కురుచ కుచ్చెలు వచ్చునట్లుగా పసిడిమెరుగు దువ్వలువ కట్టినాడు. తలచుట్టూ తిరిగి వచ్చేటట్లు గుబురైన నెమలిపించెపు దండ ధరించాడు. చెవి సందున కళకళలాడుతున్న కలువపువ్వు చెరివికొన్నాడు. చివుళ్ళు, పూలు చేర్చికట్టిన వనమాల మెడలో అలంకరించాడు. ఆయన జగములను సమ్మోహపరిచే నటవేషంతో విరాజిల్లుతున్నాడు. అట్టి లీలామానుష విగ్రహుణ్ణి భూసురాంగనలు కన్నుల కరవు తీరేటట్లు కనుగొన్నారు.

క. కని లోచనరంధ్రంబుల, మునుమిడి హరిలలితరూపమును లోఁగొని నె
మ్మనములఁ బరిరంభించిరి, తనుమధ్యలు హృదయజనిత తాపము వాయన్. 862

* సూక్ష్మమైన నడుములు గల ఆ సుదతులు హరిస్వరూపాన్ని ఆలోకించి వరుసపెట్టి తమ నయనద్వారాలగుండా నళినాయతాక్షుని సుందరమూర్తిని హృదయమందిరాలలోనికి ప్రవేశింపజేసుకున్నారు. ఆధ్యాత్మికము, ఆధిభౌతికము, ఆధిదైవికము అనే త్రివిధతాపాలూ ఉపశమింపగా హృదయాలతో అతనిని కౌగిలించుకున్నారు.

వ. ఇ వ్విధంబున. 863

క. వారిత సర్వస్పృహలై, వా రందఱుఁ దన్నుఁ జూడ వచ్చుట మదిలో
వారిజనయనుఁడు వొడగని, వారికి నిట్లనియె నగి యవారితదృష్టిన్. 864

* ఈ రీతిగా ద్విజాంగనలు అన్ని అపేక్షలు వదలుకొని తన్ను దర్శించు తహతహతో రావడం సర్వదర్శనుడైన పద్మపత్రనేత్రుడు గ్రహించి ఒక చిరునవ్వు నవ్వి అలాగే వారివైపు చూస్తూ ఇలా అన్నాడు.

శా. 'కాంతారత్నములార! మీ గృహములం గల్యాణమే! యేమి గా
వింతున్ మీ? కిటు రండు; మమ్ము నిచటన్ వీక్షింప నేతెంచి నా
రెంతో వేడుకతో; నెఱుంగుదురు నిర్ద్వైతుస్థితిన్ నన్ను ధీ
మంతుల్ మీ క్రియఁ జేరి కందురు గదా మత్సేవలన్ సర్వమున్. 865

* ఓ మహాభాగలారా! ఇటు రండి. ఇండ్లలో మీ కందరకూ కుశలమే కదా! మీకు మేమేమి చేయవలెనో చెప్పండి. ఎంతో ఉల్లాసంగా మా దర్శనానికి మీరు ఏగుదెంచినారు. ఫలాపేక్ష లేకయే మీరు వచ్చారని మాకు తెలుసు. విజ్ఞానులు మీవలెనే నాకడకు వచ్చి సేవ లొనర్చి సకలమూ పొందగలరు.

వ. కావున గృహస్థులైన మీ పతులు మిమ్ముం గూడి క్రతువు నిర్విఘ్నంబుగా సమాప్తి సేసెదరు; మీరు యాగవాటంబునకుం జనుం' డనిన విప్రభార్య లిట్లనిరి. 866

* గేస్తులైన మీ భర్తలు మీతో కూడి యజ్ఞం నిరాటంకంగా నెరవేర్చడానికి మీ రిప్పుడే యాగవాటికకు వెళ్ళండి' అని శ్రీకృష్ణుడు పలుకగా వా రిట్లన్నారు.

మ. 'తగునే మాధవ! యిట్టి వాఁడి పలుకుల్? ధర్మంబులే మా యెడన్?
మగలున్ బిడ్డలు సోదరుల్ జనకులున్ మమ్మున్ నివారింప మ
చ్చిగ నీ యంఘ్రులు సేరినార; మటఁబోఁ జేకొందురే వార? లా
పగి దే మొల్లము; కింకరీజనులఁగా భావించి రక్షింపవే!' 867

"లక్ష్మీ మనోహరా! మాతో ఇట్టి పరుషవచనా లాడడం నీకు తగునా? మా యెడ ఇది న్యాయమా? పతులు, సుతులు, భ్రాతలు, పితలు మమ్ము వారిస్తున్నా తిరస్కరించి చనవుతో నీ చరణాల చెంతకు చేరినాము. మే మక్కడికి వెళితే వారు మరల మమ్ము గైకొంటారా? ఇక ఇండ్ల కేగుటకు మే మంగీకరింపము. మమ్ము నీ దాసీజనంగా భావించి కాపాడు."

వ. అనిన జగదీశ్వరుండు. 868

సీ. నా సమీపమున నున్నారంచు నలుగరు బంధులు భ్రాతలు పతులు సుతులు
మిమ్ము దేవతలైన మెత్తు రంగనలార! నా దేహసంగంబు నరుల కెల్ల
సౌఖ్యానురాగ సంజనకంబు గాదు; ముక్తి ప్రదాయకము; నా కీర్తనమున
దర్శనాకర్ణన ధ్యానంబులను గర్మ బంధ దేహంబులఁ బాసి మీరు

తే. మానసంబులు నాయందు మరగఁజేసి, నన్నుఁ జేరెద రటమీఁద; నమ్ముఁ' డనుచుఁ
బలికి వారలు దెచ్చిన భక్షణాదు, లాప్తవర్గంబుతో హరి యారగించె. 869

* అని బ్రాహ్మణపత్నులు పలుకగా శ్రీకృష్ణుడు " ఓ ద్విజపత్నులారా! మీరు నాకడ నున్నారని మీ చుట్టములు, సోదరులు, మగలు, బిడ్డలు మిమ్ము కోపగించుకొనరు. వేల్పులైనను మిమ్ము ప్రస్తుతిస్తారు. నరుల శరీరసంగమంవలె నా సాంగత్యం సౌఖ్యానురాగాలు ఇచ్చేది కాదు. ఇది కేవలం ముక్తిదాయకం.

నన్ను స్తుతించటం వల్లా, నన్ను దర్శించటం వల్లా, నా కథలు వినటం వల్లా, నన్ను ధ్యానించటం వల్లా మీరు కర్మానుబంధమైన కాయం విడిచి మనసు నాయందే లగ్న మొనర్చి ఉచితకాలంలో నన్ను పొందగలరు. నా మాటలు నమ్మండి'' అంటూ వాసుదేవుడు వారు తెచ్చిన ఆహారాలు ఆప్తమిత్రులతో కలిసి ఆరగించాడు.

**క. పరమేశ్వరార్పణంబుగఁ, బరజనులకు భిక్ష యిడినఁ బరమపదమునం**
**బరఁగెద రఁట! తుది సాక్షా, త్పరమేశుఁడు భిక్ష గొన్న ఫల మెట్టిదియో? 870**

* పరీక్షిన్మహారాజా! ''శ్రీకృష్ణార్పణ'' మంటూ పరులకు భిక్షపెట్టితేనే పరమపదం లభిస్తుంది. మరి సాక్షాత్పరమేశ్వరుడైన దేవకీ తనయుడు ప్రియంగా స్వయంగా భిక్ష స్వీకరించినపుడు కలిగే ఫలం ఇట్టిదని చెప్పశక్యం కాదు గదా!

**వ. ఇట్లు సర్వేశ్వరుం డయిన హరికి భిక్ష యిడి తమ తమ భార్య లతని వలనం గృతార్థ లగుట యెఱింగి భూసురవరులు తమలో నిట్లనిరి. 871**

* ఈ విధంగా అఖిలాండేశ్వరుడైన హరికి ఆహారం నివేదించి తమ పత్నులు ఆయన అనుగ్రహంచేత ధన్యురాండ్రు కావడం తెలిసి ఆ బ్రాహ్మణ పుంగవులు తమలో తాము ఇలా చింతించారు.

**చ. 'కటకట! మోసపోయితిమి; కాంతల పాటియు బుద్ధి లేదు; నేఁ**
**డిట హరిఁ గానఁబో నెఱుఁగ; మేము దురాత్ముల; మేము కల్మషో**
**ద్భటులము; విష్ణు దూరగుల ప్రాజ్ఞత లేల? తపంబు లేల? ప**
**ర్యటనము లేల? శీలములు యాగములున్ మఱి యేల కాల్పనే? 872**

* ''అయ్యో! ఎంత వంచితుల మయ్యాము. ఆడువారికున్న బుద్ధి మనకు లేకపోయెనే! శ్రీహరిని నేడు సందర్శించుట కరుగమైతిమే! మనము దుష్టచిత్తులం. పరమ పాపాత్ములం. విష్ణువునకు దూరమై పోయాము. మన ప్రజ్ఞ లెందుకు? తపస్సు లెందుకు? తీర్థయాత్ర లెందుకు? నియమ నిష్ఠ లెందుకు? యజ్ఞా లెందుకు? తగుల వేసేటందుకా?

**క. జపహోమాధ్యయనంబులు, దపములు వ్రతములును లేని తరుణులు హరి స**
**త్కృపఁ బడసి, రన్ని గలిగియుఁ, జపలతఁ బొందితిమి భక్తి సలుపమి నకటా! 873**

* జపములు, హోమములు, వేదాధ్యయనాలు, తపస్సులు, వ్రతములు ఇవేవీ లేకుండా అబలలు అరవిందాక్షుని అనుగ్రహానికి పాత్ర మయ్యారు. ఇన్నీ ఉన్నప్పటికీ భక్తి హీనులమై మనము బుద్ధి చాంచల్యము నకు గురియైనాము.

**క. సురగురులగు యోగీంద్రుల, నరుదుగ మోహితులఁ జేయు హరిమాయ మమున్**
**నరగురుల మూఢవిప్రుల, నురవడి మోహితులఁ జేయ నోపక యున్నే? 874**

* సురగురువులగు యోగీంద్రులనే విష్ణుమాయ మోహింపజేస్తుంది. మరి నరగురువులమూ, జడవిప్రులమూ అయిన మనలను భగవన్మాయ మోహంలో ముంచకుండా ఉంటుందా?

మ. క్రతువుల్ ధర్మము మంత్ర తంత్ర ధనముల్ గాలంబు దేశంబు దే
వతయున్ వహ్నులు మేదినీసురులు నెవ్వాఁడిట్టి సర్వేశుఁ డీ
క్షితి రక్షింప జనించినాఁ; డెఱుఁగ; మా శ్రీభర్తకుం గర్తకుం
గుతలోద్ధర్తకు మేము మ్రొక్కెదము రక్షోనాథ సంహర్తకున్'. 875

* యాగములు, మంత్రము, తంత్రము, ద్రవ్యము, కాలము, దేశము, దేవత, అగ్ని, భూసురులు- ఏ పరమేశ్వర మయములో అట్టి పరమేశ్వరుడే మానుషవేషాన శ్రీకృష్ణుడుగా జగద్రక్షకై అవతరించినాడని ఎరుగక పోయితిమి. రమానాథుడూ, సకలమునకు కర్తా, భూమండలము నుద్ధరించువాడూ, రాక్షసరాజులను సంహరించువాడూ ఐన ఆ నందనందనునకు ఇవే మా వందనాలు.''

## -: నందాదు లింద్రయాగము సేయ శ్రీకృష్ణునితో నాలోచించుట :-

వ. అని మఱియు ననేకవిధంబులఁ బశ్చాత్తాపంబులం బొంది హరిం దలంచి శమింపుమని మ్రొక్కి బ్రాహ్మణులు కంసభీతులయి బలకృష్ణసందర్శనంబు సేయంజనరై; రంత నక్కడ నఖిలదర్శనుండైన హరి యింద్రయాగంబు సేయం దలంచి తన కడకు వచ్చిన నందాది గోపవృద్ధులం గని నమస్కరించి నందున కిట్లనియె. 876

* ఈ విధంగా ఆ విప్రపుంగవులు పరిపరివిధాల తమ చేసిన తప్పునకు చింతిస్తూ శ్రీహరిని స్మరిస్తూ తమ అపరాధం సైరింపుమని ప్రణమిల్లినారు. కాని ఆ భూసురులు కంసుడి భయంవల్ల బలరామకృష్ణులను సందర్శించడానికి వెళ్ళలేదు.

అటుపిమ్మట గోకులంలో ఇంద్రయాగం చేయదలచి నందుడు మొదలైన గొల్ల పెద్దలు తన దగ్గరకు రాగా సర్వజ్ఞుడైన శౌరి నందమహారాజును చూచి ఇట్లన్నాడు.

సీ. యాగంబు సేయంగ నర్థించి వచ్చితి; రీ యాగమున ఫల మేమి గలుగు?
నెవ్వాఁడు దీనికి నీశ్వరుం? డధికారి యెవ్వఁడు? సాధన మెంత వలయు?
శాస్త్రీయమో, జనాచారమో కార్యంబు? వైరుల కెఱిఁగింపవలదు గాని
యెఱిఁగెడి మిత్రుల కెఱిఁగింపఁ దగుఁ జేరి యెఱిఁగి చేసినఁ గోర్కు లెల్లఁ గలుగుఁ

ఆ. బగయుఁ జెలిమి లేక పరఁగిన మిముబోఁటి, మంచివారి కేల మంతనంబు?
తలఁపు లెల్ల మాకుఁ దగ నెఱిఁగింపవే, తాత! వాక్సుధాప్రదాత వగుచు. 877

* మీరేదో యాగం సంకల్పించి ఇక్కడికి వచ్చినట్లున్నారు. ఈ యజ్ఞం వల్ల ప్రయోజన మేమిటి? ఎవరి నుద్దేశించి చేయనెంచారు? ఈ క్రతువు కావించడానికి అధికారి ఎవరు? ఈ సవనానికి కావలసిన సాధన సంపత్తి ఎట్టిది? మీరు చేయబూనుకొన్న ఈ జన్నం శాస్త్రపద్ధతి ననుసరించినదా? లేక లోకుల ఆచారాన్ని బట్టి వచ్చినదా? శత్రువులకు వివరం చెప్పరాదు గాని తెలుసుకోగోరు మిత్రులకు చెప్పవచ్చు.

తెలిసి కర్మల నాచరిస్తే కార్యసిద్ధి అవుతుంది. తెలియక చేస్తే కాదు. మిత్రుడు శత్రువు అనే భేదంలేని మీవంటి సత్పురుషులకు దాచదగిన రహస్యాలు లేవు. జనకా! మీ పలుకు లనెడు సుధలు చిలుకుతూ ఈ యజ్ఞం సంకల్పించడంలో మీ ఉద్దేశమేమో నా కెరింగించండి.

**వ. అని పలికిన ప్రౌఢకుమారునికిఁ దండ్రి యిట్లనియె. 878**

* ఈ విధంగా ఆ గడుసరికొడుకు ముకుందుడు అడుగగా తండ్రియైన నందు డిట్లన్నాడు.

**సీ. పర్జన్యుఁ డధికుండు భగవంతుఁ డమరేంద్రుఁ డతనికిఁ బ్రియమూర్తు లగుచు నున్న**
**మేఘబృందంబులు మేదినీతలముపై నతని పంపున భూతహర్షణముగ**
**జలములు గురియుఁ, దజ్జలపూరములఁ దోఁగి పండు సస్యంబు లా పంట దమకు**
**ధర్మార్థకామ ప్రదాయకంబుగ లోకు లెల్లను బ్రదుకుదు; రింత యెఱిఁగి**

**తే. మేఘవిభుఁడైన యింద్రుండు మెచ్చుకొఱకు, నింద్రయాగము సేయుదు రెల్ల నృపులు**
**కామ లోభ భయ ద్వేష కలితు లగుచుఁ, జేయ కుండిన నశుభంబు సెందుఁ బుత్ర! 879**

* కుమారా! వర్షాధిపతియైన పర్జన్యుడు గొప్పవాడు. అతడు భగవంతుడగు దేవేంద్రుడే సుమా! ఆయనకు ఇష్టమూర్తులైన మబ్బుల గుంపులు అతని యాజ్ఞచే సర్వజీవులకు సంతోషకరంగా నేలమీదవర్షాలు వర్షిస్తాయి. ఆ నీటివల్ల పంటలు పండుతాయి. ఆ పంటలవల్ల ధార్మార్థకామములు సిద్ధించగా జనులు హాయిగా జీవనం చేస్తారు. కనుక మేఘాలకు అధిపతి యైన ఇంద్రుడు మెచ్చేటందుకుగాను రాజు లందరూ "ఇంద్రయాగం" చేస్తారు. కామం వల్లనో, లోభం వల్లనో, భయం వల్లనో, ద్వేషం వల్లనో, ఈ యజ్ఞం చేయక పోతే మనుజులకు శుభములు సంప్రాప్తించవు.

**వ. అదియునుం గాక. 880**

**ఆ. మఖము సేయ వజ్రి మది సంతసించును, వజ్రి సంతసింప వాన గురియు**
**వాన గురియఁ గసవు వసుమతిఁ బెరుఁగును, గసవు మేసి ధేనుగణము బ్రదుకు. 881**

* అంతేకాక యజ్ఞం చేస్తే వజ్రాయుధుడైన దేవేంద్రుడు సంతోషిస్తాడు. ఆయన హర్షిస్తే మేఘం వర్షిస్తుంది. వాన కురిస్తే భూమిపై గడ్డి పెరుగుతుంది. గడ్డిమేసి మన ఆలమందలు బ్రతుకుతాయి.

**క. ధేనువులు బ్రదికెనేనిన్, మానదు; ఘనమైన పాఁడి మందలఁ గలుగున్**
**మానుగను బాఁడి గలిగిన, మానవులును సురలఁ దనిపి మనుదురు పుత్త్రా! 882**

* నాయనా! ఆవులు హాయిగా జీవిస్తే మందలలో పాడి ప్రబలుతుంది. చక్కగా పాడి ఉంటే నరులు, సురలు సంతృప్తిగా జీవిస్తారు.

**వ. అని యిట్లు నొడివిన నందుని వచనంబులు విని యింద్రునికిఁ గోపంబు దీపింప దనుజదమనుండు తండ్రి కిట్లనియె. 883**

* అని నందగోపుడు పలికిన పలుకులు విని దేవేంద్రునకు కినుక హెచ్చునట్లు నందనందనుడు తన తండ్రితో ఇట్లన్నాడు.

**క. కర్మమునఁ బుట్టు జంతువు, కర్మముననె వృద్ధిఁ బొందుఁ గర్మమునఁ జెడుం**
**గర్మమె జనులకు దేవత, కర్మమె సుఖదుఃఖములకుఁ గారణ మధిపా! 884**

* మహారాజా! తాను చేసిన కర్మము చేతనే ప్రాణి పుడుతున్నది. కర్మంచేతనే వృద్ధి పొందుతున్నది. ఆ కర్మంచేతనే లయిస్తున్నది. కనుక కర్మమే జనులకు దైవం. కర్మమే జీవుల దుఃఖానికీ, సుఖానికీ హేతువు.

**క. కర్మములకుఁ దగు ఫలములు, కర్ములకు నిడంగ రాజు గాని సదా ని**
**ష్కర్ముఁడగు నీశ్వరుండును, గర్మవిహీనునికి రాజు గాఁడు మహాత్మా! 885**

* మహాత్మా! కర్మము లాచరించు వానికి తగిన ఫలాలు ఆయా కర్మలే ఇస్తుండగా మధ్యలో ఈశ్వరుని ప్రసక్తి ఎందుకు? ఆ ఈశ్వరుడైనా కర్మలు చేసేవానికి మాత్రమే ఫలిత మిస్తాడు గాని ఏ కర్మ చేయని వానికి ఎన్నటికీ ఫలిత మీయడు గదా!

**వ. కావునఁ గర్మానుయాతంబు లయిన భూతంబులకుఁ బురుహూతునివలన భీతి యేటికి? పురాతనజన్మ సంస్కారంబులు గుప్పలు గొని కప్పినఁ గర్మంబులఁ దప్పించి పెంపు వడయ నప్పరమేశ్వరుండును నేరఁ, డితరులం జెప్పనేల? సురాసుర నరానీకంబులతోడి లోకంబు నిజసంస్కారవశంబై యంద డిందియున్నది; సందేహంబు లేదు. దేహి కర్మవశంబున గురుతను దేహంబులం జొచ్చి వెడలు; నొజ్జ, వేలుపు, నెచ్చెలి, పగఱు, చుట్టంబులు, కర్మంబులు; జీవుండు కర్మంబు తోడన వర్తించు; నతనికిఁ గర్మంబు దైవతంబు. కర్మంబునం బ్రదుకుచు నితరసేవ సేయుట సతి పతిని విడిచి జారుం జేరిన చందంబగు; విప్రుండు వైదికకర్మంబున మెలంగు; నృపతి ధరణీపాలనంబున సంచ రించు; వైశ్యుండు వాణిజ్య కృషికుసీద గోరక్షణాదుల వర్తించు; శూద్రుం డగ్రజన్ముల సేవించిబ్రదుకు; సత్త్వ రజ స్తమో గుణంబు లుత్పత్తి స్థితి లయ కారణంబు; లందు రజంబున జగంబు జన్మించు; రజోగుణ ప్రేరితంబు లయి మేఘంబులు వర్షించు; వర్షంబునం బ్రజావృద్ధి యగు; నింద్రుం డేమి సేయంగల వాఁ డదియునుం గాక. 886**

* కాబట్టి కర్మానుగుణంగా సుఖదుఃఖాలు అనుభవించే ప్రాణులు ఇంద్రునివల్ల భయపడవలసిన పనిలేదు. పూర్వజన్మ సంస్కారాలు కుప్పలవలె కప్పగా జీవులు కర్మలు ఆచరిస్తున్నారు. అట్టి కర్మఫలాలు తప్పించడం కడకు ఆ పరమేశ్వరుడికైనా శక్యం కాదు. ఇక ఇతరుల మాట చెప్పడమెందుకు? దేవతలతోనూ, రాక్షసులతోనూ, మనుష్యులతోనూ గూడిన ఈ జగమంతా తన స్వభావమునకు అధీనమై మెలగుతూఉంది. ఇందులో అనుమానం లేదు. జీవుడు తన స్వభావానుగుణమైన కర్మముచేతనే కర్మానురూపమైన నానావిధ దేహాలను పొందుతూ విడుస్తూ ఉంటాడు. గురువు, దేవత, మిత్రుడు, శత్రువు, బంధువు- అంతా కర్మమే. జీవుడు స్వభావానురూపమైన కర్మమునే ఆచరిస్తాడు. అతని పాలిటికి కర్మమే దైవతం. కర్మనే అతడు దైవంవలె ఆరాధించాలి. కర్మంచేత జీవిస్తూ దానిని విడిచి మరియొక దానిని భజించడం అనేది పతివల్ల బ్రతుకుతూ అతణ్ణి సేవించక విటకానిని సేవించే రంకుటాలి విధ మవుతుంది.

బ్రాహ్మణుడు వైదిక కర్మచేత బ్రతుకుతాడు. క్షత్రియుడు పుడమిని పాలిస్తాడు. వైశ్యుడు కృషి గోరక్షణ, వాణిజ్యము, సొమ్ము వడ్డీ కిచ్చుట సాగిస్తాడు. శూద్రుడు త్రివర్ణముల వారికి సేవజేసి జీవిస్తాడు. సత్త్వము, రజస్సు, తమస్సు అనే మూడు గుణాలు ప్రాణుల పుట్టుకకు, పెరుగుదలకు, వినాశమునకు హేతువులుగా ఉన్నాయి. రజోగుణంవల్ల జగత్తు పుడుతుంది. రజోగుణం వల్లనే మేఘాలు వర్షిస్తాయి. వానవల్ల ప్రజలు వృద్ధిచెందుతున్నారు. కనుక ఇందులో మహేంద్రుని ప్రమేయం ఏముంది? ఏమీలేదు.

**శా. కోపింపన్ బనిలేదు శక్రునికిఁ, దాఁ గోపించుఁగా కేమి సం**
**క్షేపం బయ్యెడి దేమి? పట్టణములుం గేహంబులున్ దేశముల్**
**వ్యాపారంబులు మీకుఁ బోయెడినె? శైలారణ్యభాగంబులన్**
**గోపత్వంబున నుండుచున్ మనకు సంకోచింపఁగా నేటికిన్? 887**

* ఈ విషయంలో ఇంద్రునకు కోపం రావలసిన పని లేనే లేదు. ఒక వేళ కోపగించుకున్నాడే చూడు; అందువల్ల మనకు కలిగే కొరత ఏమీ లేదు. పట్టణాలు, భవనాలూ, దేశాలూ, వ్యాపారాలూ పోతాయనిమనకు భయమా? మనము పర్వతాలలో వనాలలో జీవిస్తున్నవాళ్ళం. మనం దేవేంద్రుణ్ణి జూచి జంకవలసింది లేదు.

**సీ. పసులకుఁ గొండకు బ్రాహ్మణోత్తములకు మఖము గావించుట మంచి బుద్ధి**
**యింద్రయాగంబున కేమేమి దెప్పింతు రవి యెల్లఁ దెప్పింపుఁ డరసి మీరు**
**పాయసంబులు నపూపములు సైఁదపుఁబిండి వంటలుఁ బప్పును వలయునట్టి**
**ఫలశాకములు వండఁబంపుండు హోమంబు సేయుఁడు; ధేనుదక్షిణల నిచ్చి**

**తే. బహురసాన్నంబు పెట్టుఁడు బ్రాహ్మణులకు, నచలులై పూజ లొనరింపుఁ డచలమునకు**
**నధమ చండాల శునక సంహతికిఁ దగిన, భక్ష్యముల నిండు కసవులు పసుల కిండు. 888**

* కనుక మనకు జీవన హేతువులైన పశువులకూ, మన పశువులను తృణజలాదులచే నిత్యమూ పోషిస్తున్న పర్వతానికీ, మనకు దీవన లొసగే విప్రవర్యులకూ సంతుష్టి కలుగు నట్లుగా యజ్ఞం చేయడం మంచిబుద్ధి అవుతుంది. ఇంద్రయాగానికి ఏమేమి సంభారాలు తెప్పించ దలచారో అవన్నీ విచారించి ఇప్పుడు తెప్పించండి. పరమాన్నములు, అప్పాలు, గోధుమ పిండివంటలు, పప్పు, కూరలు వండించండి. హోమాలు చేయించండి. భూసురోత్తములకు గోదక్షిణలతోకూడ సరస పదార్థసంపన్నాలైన అన్నాలు పెట్టండి. అచంచల భక్తితో అద్రికి పూజలు గావించండి. పతితులకూ, అనాథులకూ భోజనాలు పెట్టండి. కుక్కలు మొదలైన జంతువులచే భక్ష్యాలు తినిపించండి. పశువులకు గడ్డినొసగండి.

**శా. గంధాలంకరణాంబరావళులచేఁ గైసేసి యిష్టాన్నముల్**
**బంధుశ్రేణియు మీరలుం గుడిచి నా భాషారతిన్ వేడుకల్**

సంధిల్లన్, గిరిగో ద్విజానల నమస్కారంబు గావింపుఁ డో
జం ధర్మంబని తోఁచెనేని జనకా! జన్మంబు ధన్యం బగున్. 889

* తండ్రీ! మీకు ధర్మమని తోచినట్లయితే నామాటపై నమ్మకముంచి మీరూ, బంధువులూ చందనం పూసుకొని, ఆభరణాలు అలంకరించుకొని, క్రొత్త వస్త్రములు ధరించి, ఇష్టపదార్థాలు హాయిగా భుజించి, ఎంతో వేడుకగా గిరికీ, గోవులకూ, బ్రాహ్మణులకూ, అగ్నిహోత్రమునకూ ప్రదక్షిణ నమస్కారాలు గావించండి. మీ జన్మ ధన్య మవుతుంది.''

వ. అని మఱియు నిలింపపతి సొంపు దింపుతలంపున ని మ్మఖంబు దనకు సమ్మతంబని గోవిందుండు పలికిన, నందాదులు మేలు మే లని తద్వచన ప్రకారంబునం బుణ్యాహవాచనంబులు సదివించి ధరణీసురులకు భోజనంబు లిడి పసులకుం గసపు లొసంగి, రప్పుడు. 890

* అంటూ వెన్నుడు వేల్పులరాయని గర్వ ముడుపుటకై ఈ క్రొత్తయాగం తనకు సమ్మత మైనదని చెపుతాడు. అది విని నందుడు మొదలైనవారు "అవు నవును; ఇది లెస్స'' అని కృష్ణుడు చెప్పిన తీరుగానే చేస్తారు. పుణ్యాహవాచనాలు చదివించి బ్రాహ్మణులకు తృప్తిగా భోజనాలు పెడతారు. పశువులకు కడుపు నిండా కసవు వేస్తారు.

మ. సకలాభీరులు వీఁడె కృష్ణుఁ డన నైజంబైన రూపంబుతో
నకలంకస్థితినుండి శైలమిదె మీ రర్చింప రం' డంచుఁ దా
నొక శైలాకృతిఁ దాల్చి గోపకులతో నొండొండ పూజించి గో
పక దత్తాన్నము లాహరించె విభుఁ డా ప్రత్యక్షశైలాకృతిన్. 891

* శ్రీ కృష్ణుడు ఎప్పటి రూపుతో గొల్లల నడుమ నిశ్శంకంగా నిష్కళంకంగా ఉంటూ, వారితో "ఇదిగో! పర్వతం. దీనిని పూజించడానికి మీరంతా రండి'' అని తాను తత్క్షణం పర్వతాకృతి ధరించాడు. ఆ గోపాలకులతోనే కలసి గిరిరూపం దాల్చిన హరి తన్ను తానే ప్రత్యేకంగా పూజించుకుంటూ గొల్లలిడిన నైవేద్యమంతా ఆరగించాడు.

మ. 'వినుఁ డీ శైలము కామరూపి; ఖలులన్ వేధించు; నాజ్యాన్నముల్
మన మొప్పించిన వాహరించె; మనలన్ మన్నించెఁ; జిత్తంబులో
ననుకంపాతిశయంబు సేసె మనపై నంచున్ సగోపాలుఁడై
వనజాక్షుండు నమస్కరించె గిరికిన్ వందారు మందారుఁడై. 892

* కై మోడ్చు వారికి కల్పవృక్షమైన కమలాయతాక్షుడు "ఓ గోపకులారా! ఆలించండి. ఈ గిరి ఇచ్చవచ్చిన రూపం ధరించగలదు. మనము ఆరగింపు చేసిన నేతి బువ్వలు అప్పటంగా భుజించింది. మనలను ఆదరించింది. మనయెడ మిక్కలి కారుణ్యం చూపింది. తన్ను అనాదరించే దుర్మార్గులను ఈ కొండ పట్టి పీడిస్తుంది'' అంటూ వారితో పాటు తానూ ఆ శైలానికి కేలు మోడ్చాడు.

**వ. ఇట్లు గోపకులు హరిసమేతులై గిరికిం బూజనోపహారంబులు సమర్పించి, గోధనంబులం బుర స్కరించుకొని భూసురాశీర్వాద వచనంబులతో గిరికిం బ్రదక్షిణంబు సేసి, రా సమయంబున. 893**

**క. గుబ్బముల పరువు మెచ్చని, నబ్బలఁ గట్టిన రథంబు నందప్రముఖుల్**
**గుబ్బల యార్పులు సెలఁగఁగఁ, దొబ్బుల గమి వెంట నంటఁ దోలి రిలేశా! 894**

* ఈ విధంగా గోపాలకులు శ్రీహరితో గూడి అద్రికి పూజలూ, కానుకలూ సమర్పించారు. అనంతరం ఆలమందలను మున్నిడుకొని బ్రాహ్మణాశీస్సులతో ఆ క్షితిధరానికి అందరూ ప్రదక్షిణం గావించారు.

పరీక్షిన్మహారాజా! పిల్లలు ఉత్సాహంతో కేరింతలు కొడుతుండగా గుబ్బాల దౌడును మించిపోయే యెడ్ల బండ్లలో నందుడు మున్నగువారు ఎక్కి ఆవులమంద వెంట అంటదోలించారు.

**క. పాటించి గానవిద్యా, పాటవమునఁ దేరు లెక్కి బహుతానములం**
**బాటలగంధులు కృష్ణునిఁ, బాటలఁ బాడిరి విరోధిపాటనుఁ డనుచున్. 895**

* కలిగొట్టు పూలవలె కమ్మని దేహపరిమళం గల గొల్లభామలు తమ సంగీత కళాకౌశలం తేటపడునట్లు ఆ బండ్లెక్కి రాగాలాపన చేస్తూ శత్రువులను చీల్చివైచిన శ్రీకృష్ణునిపై పాటలు పాడినారు.

**క. కుండ నిభాపీనంబులు, మండితవర్ణములు వివిధమహితాకృతులున్**
**నిండిన కడుపులు గన్నుల, పండువులుగఁ బాడి కుట్టిపదువులు నడచెన్. 896**

* కుండలవంటి పొదుగులు, మెరుగారు వన్నెలు, పలుతెరగులైన గొప్ప ఆకారాలు, నిండిన పొట్టలు గల పాడియావుల మంద కన్నులవిందు గావిస్తూ కదలింది.

**క. పొగ రెక్కిన మూఁపురములు;, దెగ గల వాలములు, శైలదేహంబులు, భూ**
**గగనములు నిండు ఱంకెలు, మిగుల మెఱయు వృషభగణము మెల్లన నడచెన్. 897**

* బలసిన చెండ్లు, నిడుపైన తోకలు, కొండలవంటి మేనులు, భూమ్యాకాశాలు నిండిన ఱంకెలు ఉద్దీపింపగా ఎద్దుల గుంపు మెల్లగ నడచింది.

**వ. ఇట్లు పర్వతప్రదక్షిణంబు నేసి గోపకులు మాధవసమేతులై మందకుం జని రంత మహేంద్రుం డంతయు నెఱింగి మహాకోపంబునఁ బ్రళయప్రవర్తకంబులగు సంవర్తక మేఘంబులం జీరి యిట్లనియె. 898**

* ఈలా గిరి ప్రదక్షిణం చేసి గోపాలురు కృష్ణునితో మంద పట్టుకు వెళ్ళిపోయారు. అప్పుడు దేవేంద్రుడు జరిగిన దంతా తెలుసుకొని మిక్కిలి కుపితుడై ప్రళయంకరములైన సంవర్తకములనే మేఘగణాన్ని పిలిచి ఇట్లన్నాడు.

**మ. 'పెరుఁగుల్ నేతులు ద్రావి క్రొవ్వి భువి నాభీరుల్ మదాభీరులై**
**గిరిసంఘాత కఠోరపత్త్రదళన క్రీడా సమారంభ దు**

ర్భర దంభోళిధరుం బురందరు ననుం బాటించి పూజింప క
గ్గిరికిం బూజలు సేసి పోయి రదెపో కృష్ణుండు ప్రేరేపఁగన్. 899

* "పెరుగులు, నేతులు ద్రావి గొల్లలు క్రొవ్వినారు. పొగరెక్కి జంకు గొంకులు వీడినారు. పర్వత పంక్తుల కర్కశాలైన ఱెక్కలు అవలీలగా ముక్కలు చేసే అమోఘ వజ్రాయుధం ధరించిన మహేంద్రుణ్ణి నన్ను, సగౌరవంగా పూజించక శ్రీకృష్ణుడు ప్రోత్సహిస్తే భూధరానికి పూజలు సల్పి వెళ్ళిపోయారు.

క. గురుదేవహీను బాలుని, గిరిభూజ ప్రముఖవాసుఁ గృష్ణు ననీశుం
బరిణామశీలుఁ గులగుణ, విరహితుఁ జేపట్టి యింద్రు విడిచిరి గొల్లల్. 900

* గురువూ, దైవమూ లేనివాడూ; బాలుడూ, అద్రులలో అడవులలో నివసించేవాడూ, విభుత్వములేని వాడూ; చంచల స్వభావుడూ; కులమూ, గుణమూ లేనివాడు అగు శ్రీకృష్ణుని మాటలు మన్నించి గొల్లలు నన్ను వదలివేశారు.

ఆ. విమల ఘనతరాత్మ విజ్ఞానవిద్యచే,నిగుడలేక యుడుప నిభము లగుచుఁ
గర్మమయములైన క్రతువుల భవ మహా, ర్ణవముఁ గడవఁ గోరినారు వీరు. 901

* ఈ గొల్లలు నిర్మలము, మిక్కిలి గొప్పది అగు బ్రహ్మవిద్యను ప్రాపించలేక తెప్పలతో సమానములై కర్మమయములైన ఇట్టి యాగాలతో సంసారమనే సముద్రాన్ని దాట నెంచుతున్నారు.

శా. ఉద్యత్సంపద నమ్మి నందతన యోద్యోగంబునన్ వెఱ్ఱులై
మద్యాగంబు విసర్జనీయ మని రీ మర్త్యుల్ వడిన్ మీరు మీ
విద్యుద్వల్లులఁ గప్పి గర్జనములన్ వేధించి గోవుల్ జనుల్
సద్యోమృత్యువుఁ బొంద జాల్ గురియుఁడీ! శౌర్యం బవార్యంబుగన్. 902

* ఓ సంవర్తక మేఘములారా! ఈ వెఱ్ఱి గొల్లలు తమ ధనసంపత్తిని నమ్మి కృష్ణుని ప్రేరణవల్ల నా యాగం విడచిపెట్టినారు. పొండి! మెరుపులచే కనుల మిరుమిట్లు గొలిపి, ఉరుములచేత పీడించి, అనివార్యమైన శౌర్యంతో వ్రేపల్లెలోని గోవులు, గోపకులు హఠాన్మరణం పాలయేటట్లు రాలవాన గురియండి.

క. మీ వెంట వత్తు నే నై, రావణనాగంబు నెక్కి రయ మొప్పంగా
దేవగణంబులతోడను, గోవిందుని మంద లెల్ల గొందలపెట్టన్. 903

* గోవిందుని మందలను కలత నొందించుటకు నేను ఐరావతగజాన్ని అధిరోహించి దేవతా సమూహంతో మీవెంట వేగంగా వస్తాను."

వ. అని యిట్లు పలికి జంభవైరి సంరంభంబున దంభోళి జళిపించి, బింకంబున శంకింపక, కింకతోడ సంకలియ లూడ్చిన, మహానిలప్రేరితంబులయి చని, నందుని మందమీఁద నమోఘంబు లైన మేఘంబులు మహౌఘంబులై పన్ని, ప్రచండగతిం జండమరీచి మండలంబుఁ గప్పి, దివినుండి,

**దిశ లావరించి, రోదోంతరాళంబు నిరంతర నీరంధ్ర నిబిడాంధకార బంధురంబుగ నిరోధించి, బలిభంజన ద్వితీయ పాదపల్లవభగ్నంబైన బ్రహ్మాండ భాండంబు చిల్లుల జల్లించినఁ దొఱఁగు బహిస్సముద్ర సలిలనిర్ఝంబుల వడువున నెడతెగక తోరంబులైన నీరధారలం గురియుచు, శిలల వర్షించుచుఁ, బిడుగుల ఱువ్వుచు నుండ, మిఱ్ఱు పల్లంబులు సమతలంబులయి, యేకార్ణవంబు రూపుసూపిన, నందు దుడు కడుచుచు నీఁదుచు, విలయశిఖి శిఖాసంరంభ విజృంభమాణ విద్యుల్లతా విలోకంబున రిమ్మలుగొని, సొమ్మలు వోవుచున్న లేఁగలును; లేఁగలమూతు లడ్డంబు లిడి ప్రళయభైరవ భేరీభాంకార భీషణంబులగు గర్జన ఘోషణంబులఁ జెవుడువడి చిందఱవందఱ లైన డెందంబులం గంది కుంది వ్రాలు ధేనువులును; ధేనువుల వెనుక నిడుకొని దురంతకల్పాంత కాలకీలి కరాళకాలకంఠ కర విశాల గదాఘాత ప్రభూతంబులైన నిర్ఘాతపాతంబులకు భీతంబులై హరికి మ్రొక్కి, రక్షరక్షేతి శబ్దంబులు సేయుకైవడి విడువని జడిం బడి, సైరింపక శిరంబులు వంచుకొని, గద్గదకంఠంబున నంభారవంబులు సేయు వృషభంబులును,వృషభాది గోరక్షణంబు సేయుచు దుర్వారఘోర శిలాసారంబుల సారంబులు సెడి శరీరంబులు భారంబులైన మ్రానువడు గోపకులును; గోపకులం బట్టుకొని దట్టంబయిన వానకొట్టునం బెట్టువడి బడుగు నడుములు నుసులువడ వడవడ వడంకుచు గోవిందునిం జీరు గోపికలును, గోపికాజన కఠిన కుచ కలశ యుగళంబుల మఱుంగునం దలలు వెట్టుకొని పరవశులైన శిశువులునుం గలిగి, మహాఘోషంబుతోడ నష్టంబైన ఘోషంబుఁ జూచి ప్రబుద్ధులైన గోపవృద్ధులు గొందఱు దుర్జనశిక్షకుండును సజ్జనరక్షకుండును నైన పుండరీకాక్షునకు మ్రొక్కి యిట్లనిరి. 904**

* జంభాసురుని సంహరించిన పురందరు డిలా పలికి సరభసంగా వజ్రాయుధం జళిపించాడు. అతడు బింకం వహించి శంకలేక కినుకతో సంవర్తక మేఘాల సంకెళ్లు తొలగించాడు. ఆ మేఘాలు పెనుగాలులచే ప్రేరితాలై పెద్ద గుంపులు గట్టి నందగోకులాన్ని ఆవరించాయి; ప్రచండంగా సూర్యమండలాన్ని ఆచ్ఛాదించాయి; గగనంలో కార్మొక్కాన్నాయి; దిక్కులలో క్రిక్కిరిసిపోయాయి. నింగికీ, నేలకూ నడుమ ఎడం లేకుండా దట్టంగా కారుచీకట్లు క్రమ్మించాయి. త్రివిక్రముని రెండవకాలి తాకిడికి పగిలి బ్రద్దలైన బ్రహ్మాండ భాండం చిల్లులలోనుంచి కారుతున్న బహిస్సముద్రజల ప్రవాహాలలాగా పెద్ద పెద్ద జలధారలు విరామం లేకుండా కురిశాయి. ఆ నీలజీమూతాలు వడగండ్లు వర్షించాయి; పిడుగులు రువ్వినాయి. మిట్టపల్లాలు సమతలం గావిస్తూ వర్షజలం ఏకార్ణవ మయింది.

ఆ నీటి వెల్లువలో లేగలు ఈదులాడుతూ ప్రళయాగ్ని కీలా విజృంభణం ఎసకొల్పుతూన్న మెరుపు తీవల్ని చూచి స్తంభించిపోయి మూర్ఛిల్లాయి. ఆ లేగల మూతులు అడ్డంగా ఉంచుకొని ఆవులు ప్రళయకాలంలో భీకరాలైన భేరీభాంకారాలవలె ఘోరమైన ఉరుముల మ్రోతవల్ల చెవులు చీదరగొనగా చిందరవందరలైన డెందాలతో కుందుతూ నేల వ్రాలిపోయాయి. ఆ గోవుల్ని వెనుక నుంచుకొని ఎద్దులు ప్రళయకాలాగ్నివలె ప్రచండుడైన రుద్రుని చేతి పెనుగదా ప్రహారాల నుంచి ఉప్పతిల్లిన పిడుగుపాట్లకు బెదరి కృష్ణునకు మ్రొక్కి "రక్షించు, రక్షించు'' మని మొరపెట్టుకుంటున్నవో అన్నట్లు ఎంతకూ వదలని వర్షానికి తట్టుకోలేక మోరలు వంచుకొని గద్గదకంఠంతో "అంబా" యని అరిచాయి.

ఎద్దులు మొదలైన తమ పశువులను సంరక్షించుకుంటూ అడ్డగింపరాని ఆ దారుణ శిలావర్షంలో చేవచెడి శరీరాలు భారాలు కాగా గోపాలురు కొయ్యబారినారు. ఆ గోపకులను బట్టుకొని దట్టమైన వానదెబ్బకు మిక్కిలి దెబ్బతిని నిరుపేద నడుములు తూలిపోగా గడగడ వణకుతూ గోపికలు గోవిందుణ్ణి పిలిచారు. గొల్లవెలదుల కలశాలవంటి కఠిన స్తనాల మాటున తలలు ఉంచుకొని వారి శిశువులు ఒడలు మరచారు. ఇలా పెను కోలాహలంతో గగ్గోలు పడిన పల్లెను జూచి వృద్ధులూ, ప్రబుద్ధులూ ఐన యాదవులు దుష్టశిక్షకుడూ, శిష్టరక్షకుడూ ఐన శ్రీకృష్ణుడికి నమస్కరించి ఇట్లన్నారు.

**ఉ. అక్కట! వానఁ దోఁగి వ్రజ మాకుల మయ్యెఁ గదయ్య! కృష్ణ! నీ**
**వెక్కడ నుంటి? వింత తడవేల సహించితి? నీ పదాబ్జముల్**
**దిక్కుగ నున్న గోపకులు దీనత నొంద భయాపహారివై**
**గ్రక్కునఁ గావ కిట్లునికి కారుణికోత్తమ! నీకుఁ బాడియే! 905**

* "కృష్ణా! దయావంతులలో మేటి యైనవాడా! అయ్యో! జడివానలో తడిసి గోకులమంతా ఆకులపాటు నొందింది గదయ్యా! ఇంతసేపు నీ వెక్కడున్నావయ్యా! ఎందు కాలసించావయ్యా! నీ చరణార విందాలు శరణాలుగా నమ్మి యున్న గోపాలకులు దైన్యం పాలు కాగా, వారి భయం బాపి వెంటనే రక్షించక ఇలా చూస్తూ ఊరకుండడం నీకు న్యాయమటయ్యా!

**క. ఈ యుఱుములు నీ మెఱుములు, నీ యశనుల ఘోషములును నీ జలధారల్**
**నీ యాన తొల్లి యెఱుఁగము, కూయాలింపం గదయ్య! గుణరత్ననిధీ! 906**

* గుణము లనెడు మణులకు నిధివంటివాడవు! నీ మీద ఒట్టువేసి చెబుతున్నాము. ఈ ఉరుములు, ఈ మెరుములు, ఈ పిడుగుల మ్రోతలు, ఈ నీటి ధారలు- ఇంతకు మునుపు మే మెరుగము. మా మొరాలకించవయ్యా!

**క. వారి బరు వయ్యె మందల, వారికి; నిదె పరులు లేరు వారింపంగా;**
**వారిద పటల భయంబును, వారిరుహదళాక్ష! నేఁడు వారింపఁగదే! 907**

* నీరజనయనా! గోపకులకు ఈ వర్షం దుర్భరంగా ఉంది. ఈ బాధ నివారించే వారు నీవు గాక మరెవ రున్నారు? మేఘబృందం వల్ల కలిగిన భీతిని తొలగించు.

**వ. అనిన విని సర్వజ్ఞుండైన కృష్ణుం డంతయు నెఱింగి. 908**

* గోపవృద్ధుల మాటలు విని సర్వజ్ఞుడైన శ్రీకృష్ణుడు అదంతా దేవేంద్రుడి పని అని గ్రహించాడు.

**ఉ. తన్నొక యింత గైకొనరు; తప్పిరి; యాగము 'సేసి' రంచుఁ దా**
**మిన్నుననుండి గోపకులమీఁద శిలల్ గురియించుచున్న వాఁ**

**డున్నత నిర్జరేంద్ర విభవోత్థిత గర్వనగాధిరూఢుఁడై**
**కన్నులఁ గానఁ డింద్రుఁ డిటు; గర్వపరుం డొరుఁ గాన నేర్చునే? 909**

* ఉన్నతమైన అమరాధిపత్యం అబ్బిందని దేవేంద్రుడు గర్వపర్వతం ఎక్కి కూర్చున్నాడు. కన్ను గానని అహంకారి పరులను ఎలా కనగలడు? గోపకులు తన్ను తృణీకరించి ఇంద్రయాగం చేయడం మాని వేశారని మింటినుండి ఇలా శిలావర్షం కురిపిస్తున్నాడు.

**క. దేవత లందఱు నన్నును, సేవింతురు; రాజ్యమదముఁ జెందరు, చెఱుపం**
**గా వలదు; మానభంగము, గావింపఁగ వలయు శాంతి గలిగెడుకొఱకై. 910**

* వేల్పు లందరూ నన్ను భక్తితో కొలుస్తారు. వారికి రాజ్యమదం లేదు. కనుక వారికి చెరుపు చేయరాదు. వారి అహంకారం అణగి పోయేటట్లు వారికి గర్వభంగం చెయ్యాలి.

**వ. అని చింతించి శిలావర్షహతులై శరణాగతులైన ఘోషజనుల రక్షించుట తగ వని, సకలలోక రక్షకుం డయిన విచక్షణుండు. 911**

* అని ఆలోచించి శిలావర్షంవల్ల ఆపన్నులై తన్ను శరణుజొచ్చిన గోకులవాసులను రక్షించడం న్యాయమని సమస్త భువనాలను కాపాడే గోపాలకృష్ణుడు నిశ్చయించాడు.

**చ. కలఁగకుఁడీ వధూజనులు! కంపము నొందకుఁడీ వ్రజేశ్వరుల్!**
**తలఁగకుఁడీ కుమారకులు! తక్కినవారలు ఱాలవానచే**
**నలఁగకుఁడీ! పశువ్రజము నక్కడ నక్కడ నిల్వనీకుఁడీ!**
**మెలపున మీకు నీశ్వరుఁడు మేలొసఁగుం గరుణార్ద్రచిత్తుఁడై. 912**

* ఓ నెలతలారా! కలత చెందకండి. ఓ గోపనాయకులారా! కొందల మందకండి. బాలకులారా? తొలగిపోకండి. మిగిలిన వారంతా శిలావర్షంచే నలిగిపోకండి. పసుల మందలను అక్కడక్కడ గాక ఒక్క చోటికి చేర్చండి. దయామయ హృదయంతో పరమేశ్వరుడు మీకు మేలు చేస్తాడు.''

## -: శ్రీకృష్ణుఁడు గోవర్ధన పర్వతము నెత్తుట :-

**వ. అని పలికి. 913**

**క. కిరియై ధర యెత్తిన హరి, కరి సరసిజముకుళ మెత్తుగతిఁ ద్రిభువన శం**
**కరకరుఁడై గోవర్ధన, గిరి యెత్తెం జక్క నొక్క కేలన్ లీలన్. 914**

* ఇ వ్విధంగా పలికి ఆదివరాహమూర్తియై అవనిని పైకెత్తిన అచ్యుతుడు దంతావళం తామరమొగ్గను పైకెత్తునట్లు ముల్లోకాలకు మోదం సమకూర్చడానికి అవలీలగా ఒక్క హస్తంతో గోవర్ధనాద్రిని గొడుగులా పై కెత్తినాడు.

క. దండిని బ్రహ్మాండంబులు, చెండుల క్రియఁ బట్టి యెగురఁ జిమ్మెడు హరికిన్
గొండఁ బెకలించి యెత్తుట, కొండొక పనిగాక యొక్క కొండా తలఁపన్? 915

*బ్రహ్మాండాలను బంతులవలె ఎగురవేసే గోవిందుడికి ఒక కొండను పెల్లగించి పైకెత్తడం అలతిపనిగాక ఘనకార్యమా?

వ. ఇట్లు గిరి యెత్తి. 916

శా. బాలుం డాడుచు నాతపత్ర మని సంభావించి పూగుత్తి కెం
గేలం దాల్చిన లీల లేనగవుతోఁ గృష్ణుండు దా నమ్మహా
శైలంబున్ వలకేలఁ దాల్చి విపులచ్ఛత్రంబుగాఁ బట్టె నా
భీలాభ్రచ్యుత దుశ్శిలాచకిత గోపీగోపగోపంక్తికిన్. 917

* ఇలా కొండనెత్తి పసిబాలుడు ఆటలాడుతూ పూలగుత్తిని గొడుగుగా భావించి తన చేత ధరించినట్లు శ్రీకృష్ణుడు చిరునవ్వుతో గోవర్ధన మహాపర్వతాన్ని ఎత్తి కుడిచేత ధరించాడు. దారుణమైన మేఘాలనుండి రాలుతున్న వడగండ్ల వానకు భయమొందిన గోపికలకూ, గోపకులకూ, గోగణమునకూ ఆ కొండను పెద్ద గొడుగుగా పట్టుకొన్నాడు.

వ. ఇట్లు గోత్రంబు ఛత్రంబుగాఁ బట్టి గోపజనులకు గోపాలశేఖరుం డిట్లనియె. 918

* గోపాల శిరోమణియైన శ్రీకృష్ణుడు కొండను గొడుగుగా పట్టుకొని గోపాలురతో ఇట్లన్నాడు.

క. రా తల్లి! రమ్మ తండ్రీ!, వ్రేతలు గోపకులు రండు! వినుఁడీ గర్త
క్ష్మాతలమున నుండుఁడు గో, వ్రాతముతో మీరు మీకు వలసినయెడలన్. 919

* తల్లీ! రా! తండ్రీ! రమ్ము! వ్రేతలారా! గోపకులారా! రండి, రండి. వినండి. మీరు వచ్చి మీకు నచ్చినచోట గో సమూహంతో ఈ కొండక్రింద నిలవండి.

శా. బాలుం డీతఁడు, కొండ దొడ్డది; మహాభారంబు సైరింపఁగాఁ
జాలండో? యని దీని క్రింద నిలువన్ శంకింపఁగాఁ బోల; దీ
శైలాంభోనిధి జంతు సంయుత ధరాచక్రంబు పైఁ బడ్డ నా
కే లల్లాడదు; బంధులార! నిలుఁ డీ క్రిందం బ్రమోదంబునన్. 920

* ఓ బంధువులారా! ఇతడు బాలుడు, కొండ చాలాపెద్దది. మిక్కిలి భారమైంది. మోస్తాడో, మోయలేడో అని దీని క్రింద నిలవడానికి సందేహించకండి. పర్వతములూ, పారావారములూ, ప్రాణిసమూహములూ నిండిన ఈ భూమండలమంతా మీదబడినా నాచేయి చలించదు. మీ రందరూ ఆనందంగా దీని క్రింద నిలవండి.

వ. అని పలుకుచున్న హరిపలుకులు విని నెమ్మనమ్ముల నమ్మి కొండ యడుగునం దమ తమ యిమ్ములం బుత్త్ర మిత్త్ర కళత్త్రాది సమేతులై గోవులుం దారును గోపజనులు జనార్దన కరుణా విలోకనామృత వర్షంబున నాఁకలి నీరువట్టుల చొప్పెఱుంగక కృష్ణకథా వినోదంబుల నుండి; రివ్విధంబున. 921

* ఈ విధంగా పలుకుతున్న పరంధాముని పలుకులు గోపకులు మనస్ఫూర్తిగా విశ్వసించారు. వారు తమ పుత్రులు, మిత్రులు, భార్యలు మొదలైన వారితోనూ, ధేనువులతోనూ, కమలామనోహరుని కరుణా కటాక్ష వీక్షణామృత వర్షంలో ఆకలి దప్పులు లేక, ఆ కృష్ణుడి కథలు వేడుకగా చెప్పుకొంటూ, వింటూ తమ తమ స్థానాల్లో ఉండి పోయారు.

మ. హరిదోర్దండము గాను; గుబ్బశిఖరం; బాలంబిముక్తావళుల్
పరఁగన్ జాఱెడు తోయబిందువులు; గోపాలాంగనాపాంగ హా
స రుచుల్ రత్నచయంబు గాఁగ, నచలచ్ఛత్రంబు శోభిల్లెఁ ద
ద్గిరిభిద్దుర్మదభంజియై జలధరాక్లిన్న ప్రజారంజియై. 922

* శ్రీకృష్ణుడు ధరించిన గోవర్ధనగిరి అనే గొడుగు పర్వతాలను భేదించే దేవేంద్రుడి దురహంకారాన్ని భంజిస్తూ, ప్రళయమేఘాల జలధారలచే స్రుక్కిన ప్రజలను రంజిస్తూ ప్రకాశించింది. ఆ కొండగొడుగునకు పురుషోత్తముని భుజాదండమే కఱ్ఱ; శిఖరమే గుబ్బ, చక్కగా జారుతున్న జలబిందువులే నాలుగు ప్రక్కలా వ్రేలాడుతున్న ముత్యాలజాలరులు. గోపికల కడగంటి చూపులతో కూడిన చిఱునవ్వుల జిలుగులే రత్నాల వెలుగులు.

క. రాజీవాక్షునిచే నొక, రాజీవముభంగి శైలరాజము మెఱసెన్;
రాజేంద్ర! మీఁద మధుకర, రాజిక్రియ మేఘరాజి రాజిల్లెఁ గడున్. 923

* ఓ పరీక్షిన్మహారాజా! అంభోజాక్షుని చేతిలో ఆ పర్వతరాజం ఒక అంబుజంవలె అలరారింది. తోయజం మీద తుమ్మెదల పిండువలె మేదినీధరం మీద మేఘపటలి శోభిల్లింది.

క. వడిగొని బలరిపు పనుపున, నుడుగక జడి గురిసె నే డహోరాత్రము; ల
య్యెడ గోపజనులు బ్రదికిరి, జడిఁ దడియక కొండగొడుగు చాటున నధిపా! 924

* రాజా! బలుడనే రక్కసుని ఉక్కడగించిన దేవేంద్రుని ఆజ్ఞచే ఎడతెరపిలేక ఏడుపవళ్ళు, ఏడు రాత్రులు భోరున జడివాన కురిసింది. ఆ అచలచ్ఛత్రం మాటున గొల్ల లెల్లరూ ఏమాత్రం వానకు తడవకుండా జీవించారు.

వ. ఇట్లు హరి యే డహోరాత్రంబులు గిరి ధరించిన గిరిభేది విసిగి వేసరి కృష్ణు చరితంబులు విని వెఱఁగుపడి విఫలమనోరథుండై మేఘంబుల మరలించుకొని చనియె; నంత నభోమండలంబు విద్యోతమాన ఖద్యోతమండలం బగుట విని గోవర్ధన ధరుండు గోపాలకుల కిట్లనియె. 925

* ఈ మాదిరి సప్తవాసరాలు హరి గోవర్ధనగిరి ధరించాడు. శైలభేదనుడైన పురందరుడు విసిగి వేసారి శ్రీకృష్ణుని వీరచరితం విని విస్మయం చెందినాడు. అతడు తన యత్నం వమ్ము కాగా మబ్బులను మరలించుకొని వెళ్ళిపోయాడు. వాన వెలియగానే గగనతలం భానుమండలదీప్తితో పరిఢవిల్లింది. అప్పుడు గోవర్ధనగిరిధారి గొల్లలతో ఇట్లన్నాడు.

క. 'ఉడిగెను వానయు గాలియు, వడిసెడి నదులెల్లఁ బొలిచె; వఱద లిగిరెఁ, గొం
డడుగున నుండక వెడలుఁడు, కొడుకులుఁ గోడండ్రు సతులు గోవులు మీరున్'. 926

* "గోపకులారా! వాన వెలిసింది. గాలి నిలిచింది. నదుల ఉరవడి తగ్గింది. వరదలు ఆగిపోయాయి. కొండ అడుగున ఉండక మీ కొడుకులతో, కోడళ్ళతో, కులకాంతలతో, గోవులతో వెలుపలికి రండి.''

వ. అనిన విని సకల గోపజనులు శకటాద్యుపకరణ సమేతులయి గోవులుం దారును గొండ యడుగు విడిచి వచ్చి; రచ్యుతుండును జెచ్చెరఁ దొల్లింటి యట్ల నిజస్థానంబున గిరి నిలిపె; నంత వల్లవు లెల్లం గృష్ణుం గౌఁగిలించుకొని సముచిత ప్రకారంబుల సంభావించి దీవించిరి; గోపికలు సేసలిడి, దధ్యన్నకబళంబు లొసంగుచు నాశీర్వదించిరి; నంద బలభద్ర రోహిణీ యశోద లాలింగనంబు సేసి భద్రవాక్యంబులు పలికిరి; సిద్ధ సాధ్య గంధర్వవరులు విరులు గురియించిరి; సురలు శంఖదుందుభులు మ్రోయించిరి; తుంబురు ప్రముఖు లయిన గంధర్వులు పాడి; రప్పుడు. 927

* "ఆ మాటలు విని గోపకు లందరూ బండ్లు మొదలైన ఉపకరణాలతో, ఆవులతో అద్రి అడుగునుండి వెడలి వచ్చారు. శ్రీకృష్ణుడు శీఘ్రంగా ఆ పర్వతాన్ని మునుపటివలె యథాస్థానంలో ఉంచాడు. అంతట గోపిక లందరూ అచ్యుతుణ్ణి ఆలింగనం చేసుకొని తగు విధంగా సన్మానించి దీవించారు. యాదవ కాంతలు అక్షతలు చల్లి పెరుగన్నపు ముద్దలు తినిపిస్తూ ఆశీర్వదించారు. నందుడు, బలరాముడు, రోహిణి, యశోద. కృష్ణుణ్ణి కౌగిలించుకొని శుభవాక్యాలు పలికినారు. సిద్ధులు, సాధ్యులు, గంధర్వులు పూలు వర్షించారు. వేల్పులు శంఖాలూ, దుందుభులూ మొరయించారు. తుంబురుడు మొదలైన గంధర్వగాయకులు గానం చేశారు.

క. వల్లవకాంతలు దన కథ, లెల్లను బాడంగ నీరజేక్షణుఁ డంతన్
వల్లవబలసంయుతుఁడై, యొల్లన గోష్ఠంబు సేరె నుర్వీనాథా? 928

* పరీక్షిన్మహారాజా! యాదవాంగనలు తన కథలన్నీ గానం చేయగా ఆ పద్మనేత్రుడు గొల్లలతో, బలరామునితో కూడి మెల్లగా వ్రేపల్లె చేరుకున్నాడు.

వ. అ య్యవసరంబునఁ గృష్ణు చరిత్రంబులు దలంచి వెఱఁగుపడి గోపజనులు నందున కిట్లనిరి. 929

* అట్టి తఱి కృష్ణుని కథలు స్మరించి ఆశ్చర్యచకితులై గోపాలజనం నందునితో ఇట్లన్నారు.

సీ. కన్నులు దెఱవని కడుఁజిన్ని పాపఁడై దానవిఁ జనుఁబాలు ద్రాగి చంపె
మూఁడవ నెలనాఁడు ముద్దుల బాలుఁడై కోపించి శకటంబుఁ గూలఁ దన్నె

నేఁడాది కుఱ్ఱఁడై యెగసి తృణావర్తు మెడఁ బట్టుకొని కూల్చి మృతునిఁజేసెఁ
దల్లి వెన్నలకునై తను ఱోలఁ గట్టినఁ గొమరుఁడై మద్దులఁ గూల నీడ్చెఁ;

తే. బసులఁ గ్రేపులఁ గాచుచు బకునిఁ జీరె, వెలఁగతో వత్సదైత్యుని వ్రేసి గెడపె
సబలుఁడై ఖరదైత్యుని సంహరించె, నితఁడు కేవలమనుజుఁడే యెంచిచూడ! 930

* కన్నులు దెరవని కసుగందుగా ఉన్నప్పుడే చన్నులపాలు గ్రోలి రక్కసియైన పూతనను చంపినాడు. మూడునెలల ముద్దుబాలుడుగా ఉన్నప్పుడే కోపంతో శకటాసురుణ్ణి కూలదన్నినాడు. ఏడాది కుఱ్ఱడుగా ఉన్నప్పుడు మెడబట్టుకొని తృణావర్తుని పడద్రోసి పరిమార్చినాడు. బాలుడుగా ఉన్నప్పుడు పడతి యశోదమ్మ కినిసి రోటికి గట్టగా ఈడ్చుకొనిపోయి జంటమద్దులను కూలద్రోశాడు. ఆవులను లేగలను కాస్తూ బకాసురుని చీల్చివేశాడు. వత్సరాక్షసుణ్ణి వెలగచెట్టుతో కొట్టి మట్టుపెట్టినాడు. బలవంతుడైన ఖరుడనే దానవుణ్ణి నిర్మూలించారు. ఈ శ్రీకృష్ణుడు మానవమాత్రుడు గాడు.

క. తెంపరియై రామునిచేఁ, జంపించెఁ బ్రలంబు; మ్రింగెఁ జటులదవాగ్నిన్;
సొంపు సెడఁ ద్రొక్కి కాళియుఁ, ద్రుంపక కాళింది వెడలఁ దోలెన్ లీలన్. 931

* సాహసంతో ప్రలంబాసురుణ్ణి బలరామునిచే చంపించినాడు. దారుణమైన దావానలం మ్రింగివేశాడు. తలపొగరు దిగేటట్లు కాళియుని అవలీలగా త్రొక్కి ప్రాణాలు తీయకుండా యమునా హ్రదము నుంచి వెడల దోలినాడు.

క. ఏడేండ్ల బాలుఁ డెక్కడ?, క్రీడం గరి తమ్మియెత్తు క్రియ నందఱముం
జూడ గిరి యెత్తు టెక్కడ?, వేడుక నొకచేత నేఁడు వెఱఁగొఁ గాదే. 932

* ఏడేండ్ల బాలుడెక్కడ? దంతావళం తామరపువ్వును ఎత్తిన చందంగా మన మందరం చూస్తుండగా ఒకచేత ఉర్వీధరమును పై కెత్తడ మెక్కడ? వింతగా లేదా?

క. ఓ నంద! గోపవల్లభ, నీ నందనుఁ డాచరించు నేర్పరితనముల్
మానవులకు శక్యంబులె? మానవమాత్రుండె నీ కుమారుఁడు తండ్రీ! 933

* గోపనాయకా! నందరాజా! నీ కుమారుడు గావించే విన్నాణపు పనులు మనుజులకు సాధ్యములవుతాయా? తండ్రీ? నీ కొడుకు మానవ మాత్రుడు కాడయ్యా!

వ. అనిన విని నందుండు వారలం జూచి మున్నుతనకు గర్గమహాముని చెప్పిన సంకేతంబుఁ దెలిసి శంక లేదు; కృష్ణుండు లోకరక్షకుం డయిన పుండరీకాక్షుని నిజాంశ యనుచు నంతరంగంబునం జింతింతు'నని పలికిన వెఱఁగుపడి గోపకులు కృష్ణుం డనంతుం డని పూజించి; రంత. 934

* ఆ మాటలు విని నందుడు వారిని జూచి మునుపు గర్గమహాముని చెప్పిన రహస్యం స్మృతికి దెచ్చుకొని 'అవునవును; అనుమానం లేదు. శ్రీకృష్ణుడు జగద్రక్షకుడైన నారాయణుని నిజాంశ అని చిత్తంలో

భావిస్తున్నాను' అన్నాడు. ఆ మాటలు విని గోపకులు ఆశ్చర్యచకితులై శ్రీకృష్ణుడు అచ్యుతుని అవతారమని భావించి సేవించారు.

**మ. హరి కేలన్ గిరి యెత్తి వర్షజలఖిన్నాభీర గోరాజికిన్**
**శరణంబై నఁ ద్రిలోక రాజ్యమదముం జాలించి నిర్గర్వుఁడై**
**సురభిం గూడి బలారి వచ్చి కనియెన్ సొంపేది దుష్టప్రజే**
**శ్వర దుర్మాన నిరాకరిష్ణుఁ గరుణావర్ధిష్ణు శ్రీకృష్ణునిన్. 935**

* శ్రీకృష్ణుడు తన చేతితో క్షితిధరం ఎత్తి వర్షజలంవల్ల క్లేశపడుతున్న గొల్లలనూ, గోవులనూ రక్షింపగా, త్రిలోకసామ్రాజ్యాధిపతి ననే అహంకారం విడిచి అణకువతో కామధేనువును మున్నిడుకొని దేవేంద్రుడు అమరావతినుంచి అరుగుదెంచాడు. దుష్టులైన మానవేంద్రుల దురహంకారం దూరం చేసేవాడూ, అపార కరుణాశాలి అయిన నందనందనుణ్ణి సందర్శించాడు.

**క. కని యింద్రుఁడు పూజించెను, దినకరనిభ నిజకిరీట దీధితిచేతన్**
**ముని హృదలంకరణంబులు, సునతోద్ధరణములు నందసుతు చరణంబుల్. 936**

* ఇట్లు సందర్శించి సురపతి భానుదీప్తితో సమానమై ధగధగ మెరిసే తన మకుట కాంతులతో మునీంద్రుల హృదయాల నలంకరించేవీ, వినతులైన వారి నుద్ధరించేవీ అయిన నందకుమారుని పాదారవిందాలు పూజించాడు.

**వ. ఇట్లు నమస్కరించి కరకమలంబులు ముకుళించి హరికి హరిహయుం డిట్లనియె. 937**

**సీ. పరమ! నీ ధామంబు భాసురసత్త్వంబు; శాంతంబు; హతరజస్తమము; నిత్య**
**మధికతపోమయ; మట్లు గావున మాయ నెగడెడి గుణములు నీకు లేవు**
**గుణహీనుఁడవు గాన గుణముల నయ్యెడి లోభాదికములు నీలోనఁ జేర**
**వైన దుర్జన నిగ్రహము శిష్ట రక్షయుఁ దగిలి సేయఁగ దండధారి వగుచు**

**తే. జగముభర్తవు; గురుఁడవు; జనకుఁడవును, జగదధీశుల మను మూఢజనులు దలఁక**
**నిచ్చ పుట్టిన రూపంబు లీవు దాల్చి, హితము సేయుదు గాదె లోకేశ్వరేశ! 938**

* ఇలా వందన మాచరించి హస్త పద్మాలు మోడ్చి కృష్ణునితో జిష్ణు డిట్లన్నాడు.

పరమపురుషా! నీ స్వరూపం శుద్ధసత్త్వమయము. శాంతమైనది. రజస్తమో విరహితం. శాశ్వతం. మిక్కుట మైన తపోదీప్తితో నిండినది. అందుచే మాయవల్ల జనించే గుణాలు నీకు లేవు. నీవు త్రిగుణాతీతుడవు కనుక ఆ గుణాలవల్ల సంక్రమించే లోభం మొదలైనవి నీలో నెలకొనవు. ఐనను దుర్జనులను శిక్షించుటకూ, సజ్జనులను సంరక్షించుటకూ దండమును ధరిస్తున్నావు. నీవు జగములకు పతివి. ఆచార్యుడవు. కన్న తండ్రివి. తామే లోకేశ్వరులం అని భావించే ఖలులు భీతిల్లేటట్లు ఇచ్చవచ్చిన రూపాలు ధరించి మేలు చేకూరుస్తావు. స్వామీ! నీవు లోకాధిపతులకు అధిపతివి.

క. నావంటి వెఱ్ఱివారిని, శ్రీవల్లభ! నీవు శాస్తి చేసితి వేనిం
గావరము మాని పెద్దల, త్రోవల జరుగుదురు బుద్ధితోడుత నీశా! 939

* ఇందిరానాథా! నమవంటి మూర్ఖులను నీవు శిక్షిస్తే తక్కినవారు గర్వం విడిచి పెద్దలు నడచిన మార్గం బుద్ధికలిగి అనుసరిస్తారు.

క. ఒక్కొక లోకముఁ గాఁచుచు, నెక్కుడు గర్వమున 'నేమె యీశుల' మనుచుం
జొక్కి నమబోఁటి వెఱ్ఱులు, నిక్కము నీ మహిమఁ దెలియనేర రనంతా! 940

* అనంతా! ఒక్కొక్క లోకమునే పాలిస్తూ మిక్కుటమైన గర్వంతో నిక్కి నీల్గి నిఖిలమునకు మేమే ప్రభువులమంటూ ఒడలు మరచి వర్తించే నావంటి ఉన్మాదులు నిజంగా నీ ప్రభావం గుర్తించలేరు.

ఆ. వాసుదేవ! కృష్ణ! వరద! స్వతంత్ర! వి, జ్ఞానమయ! మహాత్మ! సర్వపుణ్య
పురుష! నిఖిలబీజ భూతాత్మక బ్రహ్మ!, నీకు వందనంబు నిష్కలంక! 941

* వాసుదేవా! వరదా! నీవు స్వతంత్రుడవు! విజ్ఞానమయుడవు! మహాత్ముడవు! సకలపుణ్యపురుషుడవు! నిఖిలబీజ భూతాత్మకుడవైన పరబ్రహ్మవు! నిష్కళంకుడవు! కృష్ణా! నీకు నమస్కారము.

శా. నీ సామర్థ్య మెఱుంగ మేఘములచే నీ ఘోషమున్ భీషణో
గ్రాసారంబున ముంచితిన్ మఖము నాకై వల్లవుల్ సేయ రం
చో సర్వేశ! భవన్మహత్త్వమున నాయుద్యోగ మిట్లయ్యె నీ
దాసున్ నన్నుఁ గృతాపరాధుఁ గరుణన్ దర్శింపవే మాధవా! 942

* సర్వేశ్వరా! నీ సామర్థ్యం ఎట్టిదో తెలుసుకోలేకపోయాను. "నా కొరకు గోపకులు యజ్ఞం చెయ్యడం మానివేశారు" అని కారు మేఘాలను బంపి దారుణమైన తీవ్రవర్షంలో నీ మందను ముంచివేశాను. నీ ప్రభావంవల్ల నా ప్రయత్నం వమ్మయినది. లక్ష్మీపతీ! నీ దాసుణ్ణి. తప్పు సైరించి నన్ను కరుణతో నీ కడగంట వీక్షించు.

మ. నిను బ్రహ్మాదు లెఱుంగలేరు; జడతా నిష్ఠుండ లోకత్రయా
వన దుర్మాన గరిష్ఠుఁడన్ విపుల దుర్వైదుష్య భూయిష్ఠుఁడన్
వినయత్యాగ వరిష్ఠుఁడన్; గుజనగర్వి శ్రేష్ఠుఁడన్ దేవ! నీ
ఘనలీలా విభవంబు పెంపుఁ దెలియంగా నెవ్వఁడన్? సర్వగా! 943

* దేవా! నిన్ను బ్రహ్మ మున్నగువారే తెలియలేరు. నేను జడత్వంలో మునిగినవాణ్ణి. ముల్లోకాలను బ్రోచుచుంటి నన్న దురహంకారంలో పడ్డ దొడ్డవాణ్ణి అధికమైన దుష్పాండిత్యముతో నిండినవాణ్ణి వినయం విడిచిపెట్టుటలో శ్రేష్ఠుణ్ణి. దుర్జనులలో, గర్వపరులలో అగ్రేసరుణ్ణి. ఓ సర్వాంతర్యామీ! నీ విచిత్ర లీలావైభవం ఎరుగుటకు నే నెంతవాణ్ణి?

వ. అనిన విని, నగుచు, జలధర గంభీర రవంబుల శక్రునకుం జక్రి యి ట్లనియె. 944

* ఇంద్రుని మాటలు విని నవ్వుతూ మేఘ గంభీరమైన కంఠధ్వనితో వాసుదేవుడు అతడితో ఇట్లన్నాడు.

మ. 'అమరాధీశ్వర! లక్ష్మితోఁ దగిలి యి ట్లంధుండవై యున్న నీ
సమదోద్రేకము ద్రుంచి వైచుటకు నీ జన్నంబుఁ దప్పించితిం;
బ్రమదశ్రీకులు దండధారి నగు నన్ భావింప; రెవ్వాని ని
క్కము రక్షింపఁ దలంతు వాని నధనుం గావింతు జంభాంతకా? 945

* జంభాసురుని గూల్చిన ఓ సురేశ్వరా! నీవు సంపదచే కన్నుగాన కున్నందున నీ మదాతిరేకం మాన్పుటకై నీ యాగం నిలిపి వేయించాను. సంపత్తివల్ల మత్తిల్లినవారు దండధారి నగు నన్ను తలంపరు. నిజంగా నే నెవణ్ణి రక్షింప నెంచుతానో వాణ్ణి ధనహీనుణ్ణి గావిస్తాను.

క. నా యాజ్ఞ సేయుచుండుము, నీ యధికారంబునందు నిలుపు; సురేంద్రా!
శ్రీయుతుఁడవై మదింపకు, శ్రేయంబులు గల్గుఁ; బొమ్ము సితకరిగమనా! 946

* ఐరావతవాహనా! నా యాజ్ఞ నిర్వర్తిస్తూ నీ యధికారం నిర్వహించుకో. ఇంద్రాధిపత్యంవల్ల గర్వించకు. ఇక వెళ్లు. నీకు భద్ర మగుగాక!

వ. అని యిట్లు జిష్ణునిం బలుకుచున్న కృష్ణునికి మ్రొక్కి గోగణసమేత యయిన కామధేనువు భక్తజన కామధేను వయిన యీశ్వరున కిట్లనియె. 947

* అని యీ విధంగా దేవేంద్రుడనకు చెపుతున్న గోవిందునకు గోగణంతో కూడియున్న కామధేనువు నమస్కరించి, భక్తజనుల పాలిటి కామధేనువైన ఆ పరమేశ్వరుడితో ఇట్లా అన్నది.

క. 'విశ్వేశ! విశ్వభావన!, విశ్వాకృతి! యోగివంద్య! విను నీచేతన్
శాశ్వతుల మైతి మిప్పుడు, శాశ్వతముగఁ గంటి మధిక సౌఖ్యంబు హరీ! 948

* "విశ్వేశ్వరా! విశ్వభావనా! విశ్వస్వరూపా! యోగులచే నమస్కరింప దగినవాడా! గోవిందా! విను. ఇపుడు నీచేత సుస్థిరుల మైనాము. సుస్థిరమగు గొప్ప సౌఖ్యం మాకు సమకూడింది.

వ. దేవా! మాకుం బరమదైవతంబ; వింద్రుండవు; భూసుర గో సుర సాధు సౌఖ్యంబుల కొఱకు నిన్నిం ద్రుని జేసి పట్టంబు గట్టు మని విరించి నియమించి పుత్తెంచె; నీవు భూతలభూరి భార నివారణంబు సేయ నవతరించిన హరి' వని పలికి యంత. 949

* దేవా! నీవు మాకు పరమదైవం. నీవే మాకు ప్రభువు. బ్రాహ్మణులు, ధేనువులు, దేవతలు, సాధువులు- వీరి సుఖంకొరకు నీకు పట్టం గట్టుమని బ్రహ్మదేవుడు నన్ను నియమించి పంపినాడు. నీవు ఈ సమస్త భూమండల మహాభారాన్ని నివారించడానికి అవతరించిన ఆదినారాయణుడివి' అని పలికింది.

మ. సురభిక్షీరములన్ సురద్విపమహా శుండా లతానీత ని
ర్ఝర గంగాంబువులన్ నిలింపజననీ సన్మౌనిసంఘంబుతో
సురనాథుం డభిషిక్తుఁ జేసి పలికెన్ సొంపార గోవిందుఁ డం
చు రణాక్రాంతవిపక్షుఁ దోయజదళాక్షున్ సాధుసంరక్షణున్. 950

* అనంతరం అమరవల్లభుడు అదితితోనూ మునీశ్వరులతోనూ కూడినవాడై కామధేనువు పాలతో, ఐరావతగజం తనతొండం నిండా కొని తెచ్చిన మందాకినీ నదీజలాలతో, ఆహవములందు అరివర్గాన్ని శిక్షించే వాడునూ, సాధువులను సంరక్షించేవాడునూ అయిన పుండరీకాక్షుణ్ణి అభిషేకించాడు.

సీ. తుంబురు నారదాదులు సిద్ధచారణ గంధర్వులును హరికథలు వాడి;
రమరకాంతలు మింట నాడిరి; వేల్పులు గురియించి రంచిత కుసుమవృష్టి;
జగములు మూఁడును సంతోషమును బొందెఁ; గుఱ్ఱుల చన్నులఁ గురిసెఁ బాలు;
నవజలంబులతోడ నదులెల్లఁ బ్రవహించె; నిఖిల వృక్షములుఁ దేనియలు వడిసె;

తే. సర్వలతికల ఫలపుష్పచయము లమరెఁ; బర్వతంబులు మణిగణప్రభల నొప్పెఁ;
బ్రాణులకు నెల్ల ఁదమలోని పగలు మానె; వాసుదేవుని యభిషేక వాసరమున. 951

* అరవిందలోచనుని అభిషేకమునాడు తుంబురుడు, నారదుడు మున్నగువారూ, సిద్ధులూ, చారణులూ, గంధర్వులూ విష్ణుచరిత్రములు పాడినారు. అచ్చరలు ఆకాశంలో ఆడినారు. దేవతలు మనోజ్ఞమైన పుష్పవర్షం కురియించినారు. ముల్లోకాలు మోదం పొందినాయి. పాడి మొదవుల చన్నులనుంచి పాలు జాలువారినాయి. క్రొత్త నీటితో నదులు పొంగి పారినాయి.. మహీజములన్నీ మకరందం చిందినాయి. తీవలన్నిటా పండ్లు, పూలు నిండినాయి. శైలాలు రత్న సమూహకాంతులతో రాజిల్లినాయి. సహజవైరం గల ప్రాణికోటికి తమలో విరోధం సమసిపోయింది.

వ. ఇట్లు గోప గోగణ పతిత్వంబునకు గోవిందు నభిషిక్తుం జేసి వీడ్కొని పురందరుండు, దేవగణంబులతో దివంబున కరిగె నంత. 952

* ఇలా దేవేంద్రుడు గోవులకూ, గోపకులకూ గోవిందుణ్ణి అధిపతిగా అభిషేకించి దేవతాసమూహంతో దివిజలోకానికి వెళ్ళినాడు.

## -: శ్రీకృష్ణమూర్తి నందుని వరుణ నగరమునుండి కొనితెచ్చుట :-

సీ. నందుఁ డేకాదశినాఁ డుపవాసంబు చేసి శ్రీహరిపూజ చేసి దనుజ
వేళ యెఱుంగక వేగక ముందర ద్వాదశీస్నానంబు దగ నొనర్ప
యమునాజలము సొర నప్డు వరుణుదూత నందుని వరుణుని నగరమునకుఁ
గొనిపోవఁ దక్కిన గోపకు లందఱు నందగోపకునిఁ గానక కలంగి

తే. రామకృష్ణులఁ బేర్కొని రవము సేయఁ, గృష్ణుఁ డీశుండు తమ తండ్రిఁ గికురువెట్టి
వరుణభృత్యుండు గొనిపోయి వరుణుఁ జేర్చు, టెఱిఁగి రయమున నచ్చోటి కేఁగె నధిప! 953

* పరీక్షిన్మహారాజా! నందరాజు ఏకాదశీ పుణ్యదివసాన ఉపవాసం చేసి విష్ణుపూజ గావించాడు. అసురవేళ యని గమనింపక తెల్లవారక మునుపే ద్వాదశీస్నానం చేయడానికని యమునానది కేగి నీటిలో దిగినాడు. అపుడు వరుణునిదూత నందుణ్ణి పట్టుకొని వరుణపట్టణానికి గొనిపోయాడు. మిగిలిన గోపకులందరూ నందగోపుణ్ణి గానక కలతచెందినారు. వారు బలరామకృష్ణులను బిగ్గరగా కేకలు పెట్టి పిలిచినారు. అది విని శ్రీకృష్ణభగవానుడు తమ జనకుణ్ణి మోసగించి వరుణభృత్యుడు అపహరించుకపోయి వరుణలోకానికి చేర్చడం తెలిసికొన్నాడు. అప్పుడే వేగంగా తానుకూడ అక్కడి కరిగినాడు.

వ. అప్పుడు. 954

క. వచ్చిన మాధవుఁ గనుఁగొని, చెచ్చెర వరుణుండు పూజ సేసి వినతుఁడై
యచ్చుగ నిట్లని పలికెను, విచ్చేసితి దేవ! నా నివేశంబునకున్. 955

* ఆ సమయాన వరుణుడు తన నగరానికి విచ్చేసిన రమాపతిని వీక్షించి, శీఘ్రంగా పూజ గావించి నమస్కరించి "ప్రభూ! నా గృహానికి తమరు విజయం చేశారు" అని ఆప్యాయంగా పలికినాడు.

ఉ. ఏ విభుపాదపద్మరతు లెన్నఁడు నెవ్వరుఁ బొందలేని పెం
ద్రోవఁ జరింతు రట్టి బుధతోషక! నీ వరుదెంచుటం బ్రమో
దావృత మయ్యెఁ జిత్తము; గృతార్థత నొందె మనోరథంబు; నీ
సేవఁ బవిత్రభావమును జెందె శరీరము నేఁడు మాధవా! 956

* "మాధవా! పండితులను ప్రమోదపరచువాడవు! ఏ ప్రభుని అడుగుదామరలందు ఆసక్తి గలవారు ఎప్పుడూ, ఎవ్వరూ, పడయలేని గొప్పమార్గంలో సంచరింప గలుగుతారో అట్టి నీవు రావడంవల్ల నామనస్సు ఆనందంతో నిండిపోయింది. నా కోరిక సఫలమైంది. నీసేవవల్ల నా తనువు పావనమైంది.

ఉ. ఏ పరమేశ్వరున్ జగము లిన్నిటిఁ గప్పిన మాయ గప్పఁగా
నోపక పారతంత్ర్యమున నుండు మహాత్మక! యట్టి నీకు ను
ద్దీపిత భద్రమూర్తికి సుధీజన రక్షణవర్తికిం దనూ
తాపము వాయ మ్రొక్కెద నుదార తపోధన చక్రవర్తికిన్. 957

* ఓ మహాత్మా! లోకము లన్నిటినీ కప్పివేయగల మాయ, పరమేశ్వరుడివైన నిన్ను కప్పలేక నీకు అధీనమై ఉంటుంది. నీవు సర్వాంగశోభతో ప్రకాశించు మంగళమూర్తివి. సద్బుద్ధి గలవారలను సంరక్షించడంలో సర్వదా ప్రవర్తిస్తుంటావు. మహాతపమే ధనముగా గల సాధుజనులకు నీవు సార్వభౌముడవు. అట్టి నీకు నా శరీరతాపం తొలగేటందుకు నమస్కరిస్తాను.

**చ. ఎఱుఁగఁడు వీఁడు నాభటుఁ డొకించుక యైన మనంబులోపలం**
**దెఱుకువ లేక నీజనకుఁ దెచ్చెఁ; దయం గొని పొమ్ము; ద్రోహమున్**
**మఱవుము; నన్ను నీభటుని మన్నన సేయుము; నీదు సైరణన్**
**వఱలుదుఁ గాదె యో జనకవత్సల! నిర్మల భక్తవత్సలా! 958**

* నీవు పితృభక్తి పరాయణుడవు! నిర్మలహృదయం గల భక్తులయందు ప్రేమ గలవాడవు! నా భృత్యుడు వీడు కొంచెమైనా వివేకం లేక నీ తండ్రి నిక్కడికి గొనితెచ్చాడు. దయతో నీ జనకుని గొనిపొమ్ము. చేసిన తప్పు మన్నించి నన్నూ, నా భటుణ్ణి రక్షించు. నీవు క్షమాగుణ శోభితుడవు గదయ్యా!

**వ. అని యిట్లు వలుకుచున్న వరుణునిం గరుణించి తండ్రిం దోడ్కొని హరి దిరిగివచ్చె; నంత నందుండు దన్ను వెన్నుండు వరుణ నగరంబుననుండి విడిపించి తెచ్చిన వృత్తాంతం బంతయు బంధువుల కెఱింగించినవారలు కృష్ణుం డీశ్వరుండని తలంచి; రఖిలదర్శనుండయిన యీశ్వరుండును వారల తలం పెఱింగి వారికోరిక సఫలము సేయుదునని వారి నందఱ బ్రహ్మహ్రదంబున ముంచి యెత్తె.959**

* అని నుడువుతున్న వరుణుణ్ణి హృషీకేశుడు కరుణించాడు. ఆయన తన జనకుని తోడ్కొని గోకులానికి తిరిగివచ్చాడు. అంతట నందుడు వెన్నుడు తన్ను వరుణపురినుంచి విడిపించుకొని వచ్చిన విషయమంతా చుట్టాలకు చెప్పినాడు. వారు శ్రీకృష్ణుడు సాక్షాద్భగవంతు డని భావించారు. సర్వజ్ఞుడైన పరమాత్ముడు తన బంధువుల భావం గ్రహించాడు. వారి మనోరథం ఈడేర్చడానికని వాళ్లను బ్రహ్మకుండంలో (యమునా నది మడుగులో) ముంచి యెత్తినాడు.

**ఆ. ప్రకృతి కామకర్మ పరవశమై యుచ్చ, నీచగతులఁ బొంది నెఱయ బ్రమసి**
**తిరుగుచున్న జనము తెలియనేరదు నిజ, గతివిశేష మీ జగంబునందు'. 960**

* "ప్రకృతి సంబంధమైన కామకర్మలలో తగులం వహించి ఉత్తమాధమ స్థితులను పొంది భ్రాంతిలో చరిస్తున్న ఈ జనం ఇహలోకంలో అసాధారణమైన నా నిజస్థితి విశేషాలను గ్రహించలేకుండా ఉంది.'' అని తలంచినాడు''.

**మ. అని చింతించి దయాళుఁడైన హరి మాయాదూరమై జ్యోతియై**
**యనిరూప్యం బయి సత్యమై, యెఱుకయై, యానందమై, బ్రహ్మమై**
**యనఘాత్ముల్ గుణనాశమందుఁ గను నిత్యాత్మీయ లోకంబు గ్ర**
**క్కునఁ జూపెం గరుణార్ద్రచిత్తుఁ డగుచున్ గోపాలక శ్రేణికిన్. 961**

* అలా భావించి దయాస్వభావుడైన ఆ పరమాత్ముడు మాయకు అతీతమై, జ్యోతిస్స్వరూపమై, ఇట్టి దని వివరింప రానిదై, సత్యమై, జ్ఞానానందమయ పరబ్రహ్మమై, పుణ్యాత్ములు త్రిగుణ రాహిత్యమున దర్శించే శాశ్వతమైన తన లోకాన్ని కరుణామయ హృదయంతో గోపకు లందరికీ చూపించాడు.

వ. ఇట్లు హరి ము న్నక్రూరుండు వొందిన లోక మంతయుఁ జూపి బ్రహ్మలోకంబు సూపినం జూచి, నందాదులు పరమానందంబునుం బొంది వెఱఁగుపడి హంసస్వరూపకుండైన, కృష్ణునిఁ బొడగని పొగడి పూజించి రంత. 962

* ఈలా శ్రీహరి, పూర్వం అక్రూరుడు పొందిన బ్రహ్మలోకాన్ని చూపగా నందుడు మొదలైనవారు సందర్శించారు. పరమానందం చెందారు. హంసస్వరూపుడైన శ్రీకృష్ణుణ్ణి వారు ఆశ్చర్యంతో అవలోకించి, వినుతించి అర్చించారు.

చ. కలువల మేలికందువలు, కాముని కయ్యపుఁ బాళెముల్, వియో
గులఁ దలఁకించు వేళలు, చకోరకపంక్తుల భోగకాలముల్,
సెలువలు సైరణల్ విడిచి చిక్కు తఱుల్, ఘనచంద్ర చంద్రికా
జ్వలితదిశల్ శరన్నిశలు జారక దుర్దశలయ్యె నయ్యెడన్. 963

* అనంతరం నిండుచందురుని వెన్నెలతో దిక్కులను దీపింపజేస్తూ, జారులకు దుర్దశ ఘటిస్తూ, శారదరాత్రులు తారసిల్లినాయి. అవి కలువలకు పసందైన విందులు. మదనుడు కదనానికై దండువిడిసే ప్రదేశాలు. విరహులను భయపెట్టే వేళలు. చక్రవాకశ్రేణులకు భోగసమయాలు. యువతులు పంతములు మాని పతులకు లొంగే సుముహూర్తాలు.

ఆ. కామతంత్రటీక, కలువల జోక, కం, దర్పు డాక, విటులతాల్మి పోక,
చకితచక్రవాక, సంప్రీత జనలోక, రాక వచ్చె మేలు రాక యగుచు. 964

* మదనశాస్త్రమునకు వివరణ మైనదీ, కలువలను వికసింపజేసేదీ, కామోద్దీపక మైనదీ, జారుల సహనం పోగొట్టేదీ, జక్కవపిట్టలకు జంకు కలిగించేదీ, జనసందోహానికి సంతోషం సమకూర్చేదీ, తన రాకతో మేలొదవించేదీ అయిన రాకాపూర్ణిమ వచ్చింది.

క. పతి దన కరములఁ గుంకుమ, సతి మొగమున నలఁదుభంగి సముదయ వేళాం
చిత కరరాగమున నిశా, పతి రంజించెన్ నరేంద్ర! ప్రాక్సతి మొగమున్. 965

* పరీక్షిన్మహారాజా! ప్రియుడు తన హస్తాలతో ప్రియురాలి మోమున కుంకుమ అద్దే రీతిగా చంద్రుడు తానుదయించే వేళ ఒప్పిదమైన కిరణాల అరుణిమతో తూర్పుదిక్కు అనే తొయ్యలి వదనం రంజింపజేశాడు.

సీ. విటసేనపై దండు వెడలెడు వలతేని గొల్లెనపై హేమకుంభ మనఁగఁ
గాముకధృతి వల్లికలు ద్రెంప నెత్తిన శంబరాంతకుచేతి చక్ర మనఁగ
మారుండు పాంథుల మానాటవుల గాల్పఁ గూర్చిన నిప్పులకుప్ప యనఁగ
విరహిమృగమ్ముల వేఁటాడ మదనుండు దెచ్చిన మోహనదీప మనఁగ

ఆ. వింతనునుపు గల్గి వృత్తమై యరుణమై, కాంతితోఁ జకోరగణము లుబ్బఁ
బొడువుఁగొండ చక్కిఁ బొడిచె రాకాచంద్ర, మండలంబు గగనమండలమున. 966

* చిత్రమైన స్నిగ్ధత కలిగి, గుండ్రనై, ఎఱ్ఱనై, తన కాంతితో వెన్నెల పులుగులకు ఆనందం కలిగిస్తూ, పూర్ణిమాచంద్రబింబం గగనవీథిలో ఉదయపర్వతం చెంత ఉదయించింది. అది జారులనే సైన్యం పైకి దండెత్తు చెరకువిలుకాని శిబిరంమీది బంగారు కలశం వలె భాసిల్లింది. మరులు గొన్నవారి ధైర్యమనే తీవలు త్రుంచడానికి పంచశరుడు చేత ధరించిన చక్రమో అన్నట్లు చెలువారింది. విరహుల అభిమానమనే అరణ్యాలను దహించడానికి పుష్పధన్వుడు ప్రోగుచేసిన నిప్పుల కుప్పగా నివ్వటిల్లింది. వియోగులనే మెకాలను వేటాడుటకై మన్మథుడు కొని తెచ్చిన మోహనదీపంగా దీపించింది.

## -: శరద్రాత్రి గాన మొనర్చు కృష్ణుసన్నిధికి గోపికలు వచ్చుట :-

**వ. ఇట్లు పొడమిన నవకుంకుమాంకిత రమాముఖ మండలంబునుం బోలె నఖండంబైన చంద్రమండలం బుం బొడగని పుండరీక నయనుండు యమునా తటవనంబున జగన్మోహనంబుగ నొక్కగీతంబుఁ బాడిన విని, తదాయత్తచిత్తలై తత్తఱంబున వ్రేత లే పనులకుం జేతు లాడకయు, గోవులకుం గ్రేపుల విడువకయు, విడిచి విడిచియాడకయు, నీడి యాడి నీడిన పాలు కాఁపకయు, గాఁచి కాఁచియుఁ, గాఁగిన పాలు డింపకయు, డించి డించియు, డించినపాలు బాలురకుం బోయకయుఁ, బోసి పోసియుఁ బతు లకుఁ బరిచర్యలు సేయకయుఁ, జేసి చేసియు నశనంబులు గుడువకయుఁ, గుడిచి కుడిచియుఁ గుసు మంబులు ముడు వకయు, ముడిచి ముడిచియుఁ, దొడవులు దొడుగకయుఁ, దొడిగి తొడిగియు గోష్ఠంబుల పట్టుల నుండకయుఁ, బాయసంబులు నెఱయ వండకయు, నయ్యెయెడల నిలువం బడకయుఁ, గాటుకలు సూటి నిడకయుఁ, గురులు సక్కనొత్తకయుఁ, గుచంబుల గంధంబులు కలయ మెత్తకయుఁ, బయ్యెదలు విప్పి కప్పకయు, సఖులకుం జెప్పకయు, సహోదరులు, మగలు, మామలు, మఱందులు, బిడ్డలు నడ్డంబు చని నివారింపం దలారింపకయు, సంచలించి పంచభల్లుని భల్లంబుల మొల్లంపు జల్లుల పెల్లునం దల్లడిల్లి, డిల్లపడి, మొగిళ్ళగమి వెలువడి; యుల్లసిల్లు తటిల్లతల పొందున మందగమనలు మందగమనంబుల మందవెలువడి గోవింద సందర్శనంబునకుం జని రప్పుడు. 967**

* ఈ విధంగా ఉదయించి క్రొత్తకుంకుమతో అలంకృతమైన లక్ష్మీవదన మండలంవలెనిండైన చంద్రమండలాన్ని చూచి తెల్లదామరల వంటి కన్నులు గల శ్రీకృష్ణుడు యమునాతీరంలో బృందా వనంలో లోకమును సమ్మోహింపజేసే ఒక మోహనగీతం మురళిపై ఆలపించినాడు. ఆ మధురగానానికి అధీనమైన చిత్తాలతో గొల్లజవరాండ్రుతత్తరపాటు చెందినారు. ఏ పనులుచేయడానికీవారికి చేయాడ లేదు. వారు ఆవులకు దూడలను విడువ మరచారు. విడిచికూడా పాలు పిదుకలేదు. పిదికికూడా పిదికిన పాలు కాచలేదు. కాచికూడ కాగినపాలు దించలేదు. దించికూడ దించినపాలు పిల్లలకు పోయ లేదు. పోసికూడ భర్తలకు సేవ చేయలేదు. చేసికూడ అన్నము ఆరగించలేదు. ఆరగించి కూడపూలు ధరింపలేదు. ధరించికూడ సొమ్ములు దాల్చలేదు. తాల్చికూడ మందపట్టులకడ ఉండటం లేదు. ఆ గొల్లమిటారులు పరమాన్నములు కలియ వండలేదు. నిలిచిన చోటుల నిలువలేదు. కాటుకలు చక్కగా దిద్దుకొనలేదు. కేశములు సవరించుకొనలేదు. స్తనములపై చందనము అలందుకోలేదు.పైటలు విప్పి కప్పుకోలేదు చెలిమికత్తెలకు చెప్పలేదు. తోబుట్టువులు, పతులు, మామలు, మరదులు, పిల్లలు

అడ్డము వచ్చి వలదని వారించిననూ వెనుకకు మరలినవారు కారు. ఆ గొల్లబోటులు మనసులు సంచలించి పంచబాణుని మిక్కుటమైన బాణవర్షపు దెబ్బకు తల్లడిల్లి సొమ్మసిల్లినారు. మబ్బుల గుంపునుండి వెలువడి వెలుగొందే మెరుపుల చందంగా ఆ మందయానలు తొందర తొందరగా నడచి గోకులమునుండి బయలుదేరి నందనందనుని సందర్శనానికి వెళ్ళినారు.

**మ. తరుణుల్ గొందఱు మూలగేహముల నుద్దండించి రారాక త**
**ద్విరహాగ్నిం బరితాప మొందుచు మనోవీథిన్ విభున్ మాధవుం**
**బరిరంభంబులు సేసి జారుఁ డనుచున్ భావించియుం జొక్కి పొం**
**దిరి ముక్తిన్ గుణదేహముల్ విడిచి ప్రీతిన్ బంధనిర్ముక్తలై. 968**

* కొందరు సుందరాంగులు నట్టింట్లలోనుంచి ఒక్కుమ్మడి ధైర్యంతో వెడలి రాలేకపోయారు. వారు కృష్ణ విరహాగ్నితో తపించిపోతూ ప్రభువైన రమాపతిని పతిగా నెంచుకొని తమ మనస్సీమలలోనే ఆలింగనం చేసుకొని పరవశించిపోయారు. ప్రారబ్ధ పుణ్యాపాపాత్మకమైన సంసార బంధాలనుండి విడివడి సత్త్వ రజ స్తమో మయమైన శరీరం వదలి ముక్తిని పొందినారు.

**వ. అనిన నరేంద్రుం డిట్లనియె. 969**

**క. జారుఁడని కాని కృష్ణుఁడు, భూరిపరబ్రహ్మ మనియు బుద్ధిఁ దలంపన్**
**నేరరు; గుణమయదేహము, లే రీతిన్ విడిచి రింతు? లెఱిఁగింపు శుకా! 970**

* ఆ మాట విని పరీక్షిన్మహారాజు ఇట్లన్నాడు. ఓ శుకమహర్షీ! ఆ గోపికలు శ్రీకృష్ణుని కేవలం తమకు వన్నెకానిగానే భావించారుగాని గొప్ప పరబ్రహ్మమని కాదుగదా! అలాంటి విషయాసక్తి గలవారు సత్త్వాదిగుణమయాలైన కాయాలను ఏలాగు విడువగలిగినారో నాకు తెలుపవయ్యా!

**వ. అనిన శుకుం డిట్లనియె. 971**

* అని రాజు ప్రశ్నింపగా శుకు డిట్లన్నాడు- అని రాజు ప్రశ్నింపగా శుకు డిట్లన్నాడు-

**మ. 'ముసు నేఁ జెప్పితిఁ జక్రికిం బగతుఁడై మూఢుండు చైద్యుండు పెం**
**పునఁ గైవల్యపదంబు నొందెఁ; బ్రియులై పొందంగ రాకున్నదే?**
**యనఘుం డవ్యయుఁ డప్రమేయుఁ డగుణుండై నట్టి గోవిందు మూ**
**ర్తి నరశ్రేణికి ముక్తిదాయిని సుమీ! తెల్లంబు భూవల్లభా! 972**

* రాజోత్తమా! ఇంతకు మునుపే నీకు చెప్పియున్నాను. హరి విరోధి అయినప్పటికీ మూర్ఖుడైన శిశుపాలుడు మోక్షపదవి చూరగొన్నాడు. మరి నారాయణునకు ప్రియమైనవారు పొందరాని పద మున్నదా? పాపరహితుడూ, అనంతుడూ, వాఙ్మనస్సులకు అగోచరుడూ, ప్రాకృత గుణరహితుడూ అయిన శ్రీకృష్ణుని అవతారం మానవులకు మోక్షప్రదాయక మనటంలో ఏ మాత్రమూ సందేహం లేదు.

**ఆ. బాంధవమున నైనఁ బగనైన వగనైనఁ, బ్రీతినైనఁ బ్రాణభీతినైన**
**భక్తినైన హరికిఁ బరతంత్రులై యుండు, జనులు మోక్షమునకుఁ జనుదు రధిప! 973**

* చుట్టరికంతోనైనా, విరోధంతోనైనా, కామంతోనైనా, సంతోషంతోనైనా, ప్రాణభయంతోనైనా, భక్తితోనైనా ముకుంద ధ్యానపరతంత్రులై ఉండే జనులు ముక్తిని పొందుతారు.

**వ. అటు గావునఁ బరమపురుషుండును, నజుండును, యోగీశ్వరేశ్వరుండును నైన హరిని సోఁకిన స్థావరం బయిన ముక్తం బగు; వెఱఁగుపడ వలవ, దివ్విధంబున.** 974

* కాబట్టి పురుషోత్తముడూ, పుట్టుక లేనివాడూ, యోగీశ్వరేశ్వరుడూ అయిన నారాయణుణ్ణి స్పృశించినంత మాత్రాన కొండలూ, చెట్లూ మున్నగు స్థావరాలుకూడా ముక్తిని పొందగలవు. ఈ విషయంలో ఆశ్చర్యపడనక్కర లేదు.

**క. ఘన మధురగీత నినదము, విని వచ్చిన గోపికలను వీక్షించి నయం**
**బున మేటి సుగుణి నేర్పరి, తన వాగ్వైభవము మెఱయఁ దగ నిట్లనియెన్.** 975

* అధికుడునూ, కల్యాణగుణాలు కలవాడునూ, చతురుడునూ అయిన ముకుందుడు తన తీయని పాట రవళిని విని వచ్చిన గొల్లచేడెలను చూచి మృదువుగా మాటలనేర్పు తేటపడగా ఇట్లన్నాడు.

**శా. మేలా మీకు? భయంబు పుట్టదు గదా మీమందకున్? సింహ శా**
**ర్దూలానేకపముఖ్యముల్ దిరిగెడిన్ దూరంబు లేతెంతురే?**
**యేలా వచ్చితి రీ నిశాసమయమం? దిచ్చోట వర్తింతురే?**
**చాలుంజాలు లతాంగులార! చనుఁడీ సంప్రీతితో మందకున్.** 976

* ఓ తీవబోడులారా! మీకు శుభమే కదా! మీ గోకులానికి ఎటువంటి భయమూ లేదుగదా! సింహాలూ, పెద్దపులులు, ఏనుగులు మొదలైన క్రూరజంతువులు సంచరిస్తున్న ఈ సమయంలో మీరింత దూరం రావచ్చునా? ఈ రాత్రివేళ ఎందుకు వచ్చారు? ఈ ప్రదేశంలో తిరుగవచ్చునా? చాల్చాలు! ఇక మీ మందపట్టునకు ఆనందంతో మరలిపొండి.

**శా. మీ రేతెంచిన జాడఁ గానక వగన్ మీతల్లులుం దండ్రులున్**
**మీ రాముల్ మఱఁదుల్ తనూజులు గురుల్ మీ సోదరుల్ బంధువుల్**
**'మేరల్ మీఱిరి లేరు పోయి' రనుచున్ మీ ఘోషభూభాగమం**
**దేరీతిం బరికించిరో తగవులే యీ సాహసోద్యోగముల్?** 977

* మీరు వచ్చిన జాడ తెలియక విచారంతో మీ తల్లులూ, తండ్రులూ, మగలూ, మరదులూ, కొడుకులూ, కులంపెద్దలూ, తోబుట్టువులూ, చుట్టాలు మీరు హద్దు మీరిపోయారని వ్రేపల్లెలో ఎక్కడెక్కడ వెదకుతున్నారో ఏమో? ఈ తెగువతో కూడిన పనులు మీకు తగవు.

**చ. ఇలువడి సున్నసేసి హృదయేశుల సిగ్గులు పుచ్చి యత్త మా**
**మల నెరియించి సోదరుల మానము సూఱలు పుచ్చి తల్లి దం**

త్రుల రుచి మాన్చి బంధులకు రోఁత యొనర్చుచు జారవాంఛలన్
వలనఁటి సత్కులాంగనలు వత్తురె? లోకులు సూచి మెత్తురే? 978

* ఇంటిమర్యాద బుగ్గిలో కలిపి, మగలను సిగ్గుల పాలుచేసి, అత్తమామలకు పరితాపం కల్గించి, తోబుట్టువుల పరువుదీసి, తలిదండ్రుల ఆసలు అడియాస లొనరించి, చుట్టాలకు రోతపుట్టిస్తూ, మంచికులంలో పుట్టినవారు మారుమగలమీది కోరికతో రాదగునా? లోకులు చూచి మెచ్చుకుంటారా?

సీ. ప్రాణేశుఁ డెఱిఁగిన బ్రాణంబునకుఁ దెగు దండించు నెఱిఁగిన ధరణివిభుఁడు
మామ యెఱింగిన మనువెల్లఁ జెడిపోవుఁ దలవరి యెఱిఁగినఁ దగులు సేయుఁ
దలిదండ్రు లెఱిఁగిన దల లెత్తకుండుదు రేరా లెఱింగిన నెత్తిపొడుచు
నాత్మజు లెఱిఁగిన నాదరింపరు చూచి బంధువు లెఱిఁగిన బహి యొనర్తు

ఆ. రితరు లెఱిఁగిరేని నెంతయుఁ జుల్కగాఁ, జూతు; రిందు నందు సుఖము లేదు;
యశము లేదు నిర్భయానందమును లేదు, జారుఁ జేరఁ జనదు చారుముఖికి. 979

* సాధ్వీమణికి జారునితోడి పొత్తు వాంఛనీయం కాదు. ప్రాణేశ్వరుడికి తెలిస్తే ప్రాణం మీదికి వస్తుంది. క్షితిపతికి తెలిస్తే శిక్షిస్తాడు. మామకు తెలిస్తే మనువు తెగత్రెంపు లవుతుంది. తలారికి తెలిస్తే తంటా వస్తుంది. తల్లిదండ్రులకు తెలిస్తే పదిమందిలో తల ఎత్తుకోలేరు. తోడికోడలికి తెలిస్తే ఎత్తిపొడుస్తుంది. కొడుకులకు తెలిస్తే గౌరవించరు. చుట్టాలకు తెలిస్తే వెలివేస్తారు. ఇతరులకు తెలిస్తే ఎంతో చులకనగా చూస్తారు. జారిణికి ఇహంలో గానీ, పరంలో గానీ సుఖం లేదు; కీర్తి లేదు; జంకు లేని సంతోషం లేదు.

క. నడవడి గొఱ గాకున్నను, బడుగైనఁ గురూపియైనఁ బామరుఁ డైనన్
జడుఁడైన రోగి యైనను, విడుచుట మరియాద గాదు విభు నంగనకున్. 980

* దుశ్శీలుడైనా, అశక్తుడైనా, రూపహీనుడైనా, అజ్ఞుడైనా, మందుడైనా, రోగియైనా మగణ్ణి పరిత్యజించడం మగువకు మర్యాద కాదు.

చ. ఇది యమునానదీజల సమేధిత పాదపపల్లవ ప్రసూ
న దళవిరాజితంబగు వనంబు; మనంబులు మేర దప్పెనో?
పొదఁడటు నేడ్చు బిడ్డలకుఁ బోయుఁడు పాలు; విడుండు లేఁగలన్
మొదవులకున్; నిజేశ్వరుల ముద్దియలార! భజింపుఁ డొప్పుగన్. 981

* ఓ ముగ్ధలారా! ఇది కాళిందీ నదీజలాలచే ప్రోది గాంచిన చిగుళ్ళతో, పూలతో, ఆకులతో సొబగారు చెట్లున్న బృందావనం. మీ మనసులు హద్దు నతిక్రమించాయి. ఇక మందకు వెళ్ళండి. ఏడుస్తున్న మీ పిల్లలకు పాలివ్వండి. ధేనువులకు దూడలను వదలండి. చక్కగా ప్రాణవల్లభులకు సపర్యలు సలపండి.

చ. వనితలు నన్నుఁ గోరి యిట వచ్చితి, రింతఁ గొఱంత లేదు; మే
లొనరె; సమస్త జంతువులు నోలిఁ బ్రియంబులు గావె? నాకు; నై
నను నిలువంగఁ బోలదు, సనాతన ధర్మము లాఁడువారికిం
బెనిమిటులన్ భజించుటలు; పెద్దలు సెప్పుచు నుందు రెల్లెడన్. 982

* ఓ కాంతలారా! నన్ను గోరి మీ రిచ్చటికి వచ్చారు. కొంచెము గూడా కొరతలేదు. అది యుక్తమే. సకలప్రాణులూ నాకు ప్రియమైనవే! కాని మీరిచట నిలువగూడదు. పడతులకు పతిపరిచర్యయే పరమధర్మం. ఎక్కడనైనా పెద్దలిట్లే అంటుంటారు.

క. ధ్యానాకర్ణన దర్శన, గానంబుల నా తలంపు గలిగినఁ జాలుం
బూనెదరు కృతార్థత్వము, మానవతుల్! చనుఁడు మరలి మందిరములకున్. 983

* చెలువలారా! నన్ను చింతించుట, నన్ను గూర్చి వినుట, నన్ను చూచుట, నాపైని పాటలు పాడుట- ఇలా నాయెడ మనసుంచితే చాలు. మీరు ధన్యురాం డ్రవుతారు. ఇక మీరు మీ గృహాలకు మరలిపొండి.

వ. అని పలికిన విని. 984

సీ. 'విరహాగ్నిశిఖలతో వెడలు నిట్టూర్పుల ముమ్మరంబులఁ దాఁకి మోవు లెండఁ
గన్నుల వెడలెడి కజ్జలధారలు కుచకుంకుమంబుల గ్రొచ్చి పాఱఁ
జెక్కులఁ జేర్చిన చేతుల వేఁడిమి మోముఁదమ్ముల మేలి మురువు డిందఁ
బొరిఁ బొరిఁ బుంఖానుపుంఖంబులై తాఁకు మదను కోలల ధైర్యమహిమ సెదర

తే. దుఃఖభరమున మాటలు దొట్రుపడఁగఁ, బ్రియము లాడని ప్రియుఁ జూచి బెగ్గడిల్లి
చరణముల నేల వ్రాయుచు సంభ్రమమునఁ, గొంత లెల్లను వగల నా క్రాంత లగుచు. 985

* అని శ్రీకృష్ణుడు చెప్పగా విని, విరహమనే మంటలతో వెడలిన మిక్కుట మైన దీర్ఘనిశ్వాసాలు సోకి ఆ గోపికల పెదవులు ఎండిపోయాయి. కన్నులనుంచి కారే కాటుక కన్నీరు స్తనాలపై వారు పూసుకొన్న కుంకుమ చెదరేటట్లు ప్రవహించింది. చెక్కిట జేర్చిన చేతుల వేడిమికి వదనారవిందాల అందమంతా కందిపోయింది. ఎడతెరపి లేకుండా తాకుతున్న మన్మథబాణాలకు ధైర్యసారం చెదరిపోయింది. అగ్గలమైన దుఃఖంవల్ల మాటలు తడబడగా, ప్రియవచనాలు పలుకని ప్రియుణ్ణి చూచి వారు భయపడి పాదాలతో నేల వ్రాస్తూ తొట్రుపాటు చెందారు. విచారంలో మునిగిపోయారు.

వ. ఇట్లనిరి. 986

మ. 'అకటా! నమ్మితి మేము; క్రూరుఁడన ని న్నర్హంబె? మా యిండ్లలో
సకల వ్యాప్తుల డించి నీ పదసరోజాతంబు లర్చింపఁ జి
క్కక యేతెంచితి, మీశుఁ, డాఢ్యుఁడవు; మోక్షాసక్తులం గాచు పో
లికఁ గావందగుఁ గావవే? విడువ మేలే కాంతలన్ భ్రాంతలన్. 987

* యాదవాంగన లిలా అన్నారు

* అని రాజు ప్రశ్నింపగా శుకు డిట్లన్నాడు-'అయ్యో! నిన్ను నమ్ముకున్నాము. నిన్ను క్రూరు డనడం తగదు. మా ఇండ్లలో అన్ని వ్యవహారాలూ దిగవిడచి అరవిందాలవంటి నీ అడుగులు పూజించడాని కని తప్పించుక వచ్చాము. నీవు ప్రభుడవు, ఆదిపురుషుడవు. ముముక్షువులను సంరక్షించే విధంగా కావదగిన మమ్ము కాపాడుస్వామీ! వేదురుగొన్న వెలదులను మమ్మల్ని విడిచిపెట్టడం నీకు తగునా?

**మ. పతులన్ బిడ్డల బంధులన్ సతులకుం బాటించుటే ధర్మ ప**
**ద్ధతి యౌ నంటివి; దేహధారిణులకున్ ధర్మజ్ఞ! చింతింపుమా;**
**పతి పుత్త్రాదిక నామమూర్తి వగుచున్ భాసిల్లు నీయందుఁ ద**
**త్పతి పుత్త్రాదిక వాంఛలన్ సలిపి సంభావించు టన్యాయమే?** 988

* పెనిమిటులనూ, బిడ్డలనూ, బంధువులనూ అనువర్తించడమే పతివ్రతలకు ధర్మమని అన్నావు. మరి ధర్మవేత్తవు నీవే ఆలోచించు. మగడు, కొడుకు మున్నగు పేర్లు ధరించినవాడవై ప్రకాశించే నీ యందు దేహధారిణులైన స్త్రీలు పతిసుతాదులపట్ల తమకున్న కోరికలు తీర్చుకోవడం అన్యాయ మంటావా?

**మత్తకోకిలము:**
**నీపయిన్ రతి సేయుచుందురు నేర్పరుల్, సతతప్రియో**
**ద్దీపకుండవు; గాన నెవ్వగఁ దెచ్చు నాథసుతాదులం**
**జూప నేటికి? మన్మహాశలు సుట్టి నీకడ నుండఁగాఁ**
**బాప నేల? మదీయతాపముఁ బాపఁ బోలు కృపానిధీ!** 989

* శాస్త్రనిపుణు లైనవారు ఆత్మభూతుడవైన నీయందే ఆసక్తి చూపుతుంటారు. నీవు ఎడతెగని ప్రీతిని కలిగించేవాడవు. దుఃఖ మొదవించే పెనిమిటులూ, బిడ్డలూ మొదలైన వారిని మా కెందుకు చూపుతావు? మా జీవితాశ లన్నీ నిన్ను చుట్టుకొని ఉంటే ఎందుకు త్రుంచివేస్తావు? స్వామీ! నీవు కరుణకు పెన్నిధివి. మా తాపం బాపు.

**సీ. నీ పాదకమలంబు నెమ్మి డగ్గఱఁ గాని తరలి పోవంగఁ బాదములు రావు;**
**నీ కరాబ్జంబులు నెఱి నంటి తివఁ గాని తక్కిన పనికి హస్తములు సారవు;**
**నీ వాగమృతధార నిండఁ గ్రోలఁగఁ గాని చెవు లన్యభాషలు సేరి వినవు;**
**నీ సుందరాకృతి నియతిఁ జూడఁగఁ గాని చూడ వన్యంబులఁ జూడ్కి కవలు;**

**ఆ. నిన్నె కాని పలుకనేరవు మా జిహ్వ, లొల్ల ననుచుఁ బలుకనోడ వీవు**
**మా మనంబు లెల్ల మరపించి దొంగిలి, తేమి సేయువార మింకఁ? గృష్ణ!** 990

* కృష్ణా! నీ చరణపద్మాలను సంప్రీతితో చేరడానికే తప్ప మరలి పోవడానికి మాకు కాళ్ళు రావు. నీ హస్తకమలాలను పట్టుకోవడానికే తప్ప వేరు పనులకు మా చేతులు పూనుకోవు. నీ వచనసుధారసం

ఆప్యాయంగా ఆస్వాదించడానికే తప్ప ఇతరమైన మాటలు వినడానికి మాచెవులు ఇష్టపడవు. నీ మనోహరాకారం ఎల్లప్పుడూ చూడడానికే తప్ప మా కనులు మరి వేటినీ కాంచనొల్లవు. నీనామ గుణాలను తప్ప మరిదేనినీ మా నాల్కలు ఉచ్చరించవు. మరి నీవో మమ్మల్ని ఒల్లనని పలుకడానికి జంకడం లేదు. మా మనసులను మురిపించి అపహరించావు. ఇంక మే మేమి చెయ్యగలం?

**చ. సిరికి నుదారచిహ్నములు సేయు భవచ్చరణారవిందముల్**
**సరసిజనేత్ర! మా తపముసంపదఁ జేరితి మెట్టకేలకున్**
**మరలఁగ లేము మా మగల మాటల నొల్లము; పద్మగంధముల్**
**మరగిన తేఁటు లన్యకుసుమంబుల చెంతను జేరనేర్చునే? 991**

* కమలాక్షా! శ్రీమహాలక్ష్మికి వన్నెచిన్నెలు చేకూర్చు నీ పాదపద్మాలకడకు మా నోముల ఫలంగా ఎట్లో చేరగలిగాము. ఇక ఇక్కడి నుండి మరలిపోలేము. మా పతులసంగతి అంగీకరించం. తామర పూలసుగంధం మరగిన తుమ్మెదలు ఇతర పుష్పాలచెంతకు చేరబోవు కదా!

**ఆ. సవతు లేక నీ విశాలవక్షస్థలిఁ, దులసితోడఁ గూడఁ దోయజాక్ష!**
**మనుపు మనుచు నెపుడు మాకాంత నీపాద, కమలరజముఁ గోరుఁ గాదె కృష్ణ! 992**

* నీరజాక్షా! నీ వెడంద ఉరమ్ముపై తులసితో కలసిమెలసి విలసిల్లునట్లు కటాక్షింపుమని ఎప్పుడునూ శ్రీమహాలక్ష్మి నీ పాదపద్మపరాగాన్ని కోరుతుంది గదా!

**ఉ. అత్తలు మామలున్ వగవ నాఉడి కోడక నాథులన్ శుగా**
**యత్తులఁ జేసి యిల్వరుస లాఉడి వోవఁగ నీదు నవ్వులన్**
**మెత్తని మాటలన్ మరుఁడు మేకొని యేఁచిన వచ్చినార; మే**
**పొత్తుల నొల్లమో పురుషభూషణ! దాస్యము లిచ్చి కావవే! 993**

* పురుషులకు అలంకార మైనవాడా! అత్తమామలు ఆక్రోశింపగా, భర్తలను దుఃఖాల పాలుచేసి, నిందకు జంకక, కులమర్యాదలు గోలుపుచ్చి, నీ నవ్వులకూ, నీ మృదువచనాలకూ ముచ్చటపడి పచ్చవిల్తుడు బాధింపగా వచ్చాము. ఇక మా కెవ్వరి పొత్తూ వద్దు. నీ పాదదాస్య మిచ్చి రక్షించు.

**మ. మగువల్ సిక్కరె తొల్లివల్లభులకున్? మన్నించి తద్వల్లభుల్**
**మగపంతంబు దలంపరే? తగులముల్ మాపాలనే పుట్టెనే?**
**మగవా రాడెడు మాటలే తగవు నీ మాటల్ మనోజాగ్నిచేఁ**
**బొగులం జాలము; కౌఁగిలింపుము మముం; బుణ్యంబు పుణ్యాత్మకా! 994**

* పూర్వము వాల్గంటులు వల్లభులను వలచినవారు కారా? వల్లభులు వారి నాదరముతో దనుపరా? మమతలు మాయెడనే జనించినవా? నీ పలుకు మాటలు మగవారు పలుకు మాటలేనా? ఇవి నీకు ఏ

మాత్రము తగవు. మన్మథాగ్నిచే పరితపించి పోలేకున్నాము. ఓ పుణ్యాత్ముఁడా! మమ్ము ఆలింగన మొనర్చు కొనుము. నీకు పుణ్యముంటుంది.

ఉ. కుండలదీప్త గండమును గుంచితకుంతల ఫాలమున్ సుధా
మండిత పల్లవాధరము మంజులహాస విలోకనంబునై
యుండెడు నీ ముఖంబుఁ గని యుండఁగ వచ్చునె? మన్మథేక్షు కో
దండ విముక్త బాణముల దాసుల మయ్యెద; మాదరింపవే. 995

* చెవికమ్మలచే చెలువారు చెక్కిళ్లనూ, ముసిరిన ముంగురులచే ముద్దులొలుకు ఫాలతలమునూ, అమృతము చిందు చిగురు మోవియూ, చొక్కపు చిరునవ్వుతోడి చూడ్కులునూ గల నీవదనం వీక్షించి నిలువగలమా? మదనుని చెరకువింటినుండి వెడలిన శరపరంపరలకు దాసుల మయినాము. మమ్ము కాపాడు.

సీ. నీ యధరామృత నిర్ఝరంబుల నేఁడు సేరి వాతెఱలపైఁ జిలుకకున్న
నీ విశాలాంచిత నిర్మలవక్షంబుఁ గుచకుట్మలంబులఁ గూర్పకున్న
నీ రమ్యతర హస్త నీరజాతంబులు చికురబంధంబులఁ జేర్పకున్న
నీ కృపాలోకన నివహంబు మెల్లన నెమ్మొగంబుల మీఁద నెఱపకున్న

ఆ. నీ నవీన మాననీయ సల్లాపంబు, కర్ణరంధ్రదిశలఁ గప్పకున్న
నెట్లు బ్రదుకువార? మెందుఁ జేరెడువార? మధిప! వినఁగఁ దగదె యాఁడుకుయులు. 996

* గోకులవల్లభా! చెంతకు జేరి నీ అధరసుధారసపూరం మా చిగురుపెదవులపై చిలికించు. విశాలమైన, ఒప్పిదమైన, విమలమైన నీ ఉరమును మా చను మొగ్గలపై గదించు. పరమసుందరములైన నీ కరకమలాలను మా కొప్పులపై ఉంచు. నీ కరుణాకటాక్ష శ్రేణిని మెల్లగా మా నెమ్మోములపై పొలయించు. ఆదరింపదగిన నీక్రొంగ్రొత్త పలుకుతేనియ మా చెవులలో ఒలికించు. లేకుంటే మే మెలా జీవింపగలం? ఎక్కడికి పోగలం? ఆడువారి మొరాలకించు.

మ. భవదాలోకన హాసగీతజములై భాసిల్లు కామాగ్నులన్
భవదీయాధరపల్ల వామృతముచేఁ బాపం దగుం, బాప వే
ని వియోగానల హేతిసంహతులచే నీఱై, భవచ్చింతలన్
భవదంఘ్రిద్వయవీథిఁ బొందెదము నీ పాదంబులానం బ్రియా! 997

* ప్రాణేశ్వరా! నీమీద ఒట్టిడి చెపుతున్నాము. నీ చూపులచే, నవ్వులచే, పాటలచే జనించి జ్వలించే మన్మథాగ్నులను నీ చిగురుమోవి సుధ చింది చల్లార్చు. చల్లార్చవేని నీ విరహానల జ్వాలాజాలంతో భస్మమై పోయి నిన్నే స్మరిస్తూ నీ అడుగుల జంటనే చేరుతాము.

క. తరుమృగఖగ గోగణములు, కర మొప్పెడు నిన్నుఁ గన్న గానము విన్నం
గరఁగి పులకించు; నబలలు, గరఁగరె నినుఁ గన్న నీదు గానము విన్నన్? 998

* మిక్కిలి ప్రకాశించు నిన్ను కనుగొన్నా, నీ సంగీతము విన్నా చెట్లూ, మృగాలూ, పక్షులూ, ధేను సమూహమూ కరగి పులకించి పోతాయి. మరి అంగనలు నిను కనీ, నీ గానం వినీ ద్రవించిపోరా?

**సీ. ఈ పంచబాణాగ్ని నేమిట నార్తుము నీ మంజువాగ్వృష్టి నెగడదేని?**
**నీ మన్మథాంభోధి నే త్రోవఁ గడతుము నీ దృష్టి నావయై నిలువదేని?**
**నీ చిత్తజధ్వాంత మే జాడఁ జెఱతుము నీ హాసచంద్రిక నిగుడదేని?**
**నీ దర్పకజ్వర మే భంగి నడఁతుము నీ నవాధరసుధ నింపవేని?**

**ఆ. నెట్లు నిర్వహింతు? మే లాగు మాలాగు;, కరుణ సేయ వేనిఁ గదియ వేని**
**మరుఁడు నిర్దయుండు మన నిచ్చునే? యశో, దా కుమార! యువతి ధైర్యహార! 999**

* మానినీమానసచోరా! యశోదాకుమారా! నీ యింపైన పలుకులనే వాన కురియకుంటే ఈ మన్మథాగ్నిని దేనితో చల్లార్చగలం? నీ చూడ్కి అనే నావ లేకుంటే ఈ మదన సాగరాన్ని ఎట్లా దాటగలం? నీ నవ్వనే వెన్నెల లేకుంటే ఈ కామాంధకారాన్ని ఎట్లా పారదోలగలం? నీ నూతనమైన అధరామృతం చిలుకకుంటే ఈ స్మరజ్వరాన్ని ఎట్లా శమింపజేయగలం? నీవు కరుణించి హత్తుకొనకుంటే ఎట్లా మనుగడ సాగించగలం? మా గతి ఏమిటి? దర్పకుడు దయమాలినవాడు. మమ్ము బ్రతుకనిస్తాడా?

**ఆ. అమరులఁ గాచిన హరిక్రియఁ, గమలేక్షణ! నీవు నేఁడు కరుణ నభయ హ**
**స్తము మా యురముల శిరములఁ, బ్రమదంబున నిడుము మూర్ఛ పాల్పడకుండన్. 1000**

* తామరసాక్షా! శ్రీమహావిష్ణువు దేవతలను రక్షించిన విధంగా, మేము మూర్ఛపాలుగాకుండా ఇప్పుడే దయతో నీ అభయహస్తాన్ని మా రొమ్ములపైనా, తలలపైనా ప్రీతితో నుంచు.

**క. కట్టా! తలమునుకలునై, దట్టపు విరహాగ్ని శిఖలు తరుణుల నేఁచన్**
**నెట్టున్ బలుకవు చూడవు, కట్టిఁడివి గదా కుమార! కరుణోదారా! 1001**

* దయామయా! నందతనయా! అయ్యో! గాఢవియోగ మనెడు మంటలు మేరమీరి యువతులను మమ్ము కాలుస్తున్నా ఏమియూ మాటాడవు. కన్నెత్తి చూడవు. నీ వెంత కఠినుడవయ్యా!

**వ. అని యిట్లు కుసుమశరుని శరపరంపరా పరవశలై యోపికలు లేక పలికిన గోపికల దీనాలాపంబులు విని, నవ్వి యోగీశ్వరుం డయిన కృష్ణుం డాత్మారాముండై వారలతో రమించె నప్పుడు. 1002**

* ఈ రీతిగా పుష్పబాణుని బాణపరంపరలకు విహ్వలత్వం పొంది సైరణ విడిచి వ్రజసుందరీమణులు పల్కిన దీనవచనాలు ఆకర్ణించి యోగీశ్వరేశ్వరుడూ, ఆత్మారాముడూ అయిన శ్రీకృష్ణుడు నవ్వి వారితో రమించాడు.

**మ. కరుణాలోకములం బటాంచల కచాకర్షంబులన్ మేఖలా**
**కర బాహు స్తన మర్శనంబుల నఖాంకవ్యాప్తులన్, నర్మ వా**

**క్ఫురిరంభంబుల మంజులాధర సుధాపానంబులం గాంతలం**
**గరఁగించెన్ రతికేళిఁ గృష్ణుఁడు గృపం గందర్పుఁ బాలార్చుచున్. 1003**

* శ్రీకృష్ణుడు దయతోడి చూపులతో, చేలాంచల కేశాకర్షణలతో; పిరుదులు, భుజములు, స్తనాలు స్పృశించుటతో; నఖక్షతాలు ఉంచుటతో, మేలము లాడుటతో, ఆలింగనం సల్పుటతో, మధురమైన అధరామృతాలు అస్వాదించుటతో కందర్పుని గర్వమణస్తూ గోపికలను కరుణతో కామకేళిలో కరగించాడు.

**క. మక్కువ వికసిత వదనలు, సక్కఁగఁ దనుఁ గొల్వ హాసచంద్రికతోడన్**
**మిక్కిలి మెఱసెను గృష్ణుఁడు, చుక్కలగమి నడిమి పూర్ణసోముని భంగిన్. 1004**

* అచ్యుతుడు అనురాగంతో విప్పారిన మోములు గల ఆ గోపాంగనలు చుట్టుచేరి తన్ను చక్కగా కొలుస్తుండగా నక్షత్రసమూహాల నడుమ నిండు జాబిలిమాదిరి చిరునవ్వు వెన్నెలలతో మిక్కిలి ప్రకాశించాడు.

**ఆ. సతులు దన్నుఁ బాడ సంప్రీతి నాడుచు, నఱుత నున్న వైజయంతితోడ**
**వనజలోచనుండు వనభూషణుం డయ్యె, యువతిజన శతంబు లోలిఁ గొలువ. 1005**

* వందలకొలది తరుణులు తన్ను కొలుస్తుండగా, యువతులు తన్ను గూర్చి పాటలు పాడుతుండగా, సంతోషంతో ఆడుతూ, కంఠమందలి వైజయంతి అనే వనమాలతో వనజదళాక్షుడు ఆ బృందావనానికి అలంకారభూతు డైనాడు.

**ఉ. చిక్కక యీశుఁడై యెదిరిఁ జిక్కులఁ బెట్టెడి మాయలానికిం**
**జిక్కి కృతార్థలై మరుని చిక్కులఁ జొక్కి లతాంగు లుండఁగా**
**మక్కువ శాంతి సేయుటకు మన్నన సేసి ప్రసన్నుఁ డౌటకుం**
**జక్కన నా విభుండు గుణశాలి దిరోహితుఁ డయ్యె నయ్యెడన్. 1006**

* పరమేశ్వరుడై ఎవరికీ చిక్కక ఎదుటివారిని చిక్కుల్లో ముంచే మాయలానికి, దక్కి ధన్యురాండ్రై ఆ గోపాంగనలు మదనకేళిలో సొక్కిసోలిపోయారు. ఆ సమయంలో వారి కామోత్కంఠకు శాంతి కలిగించే టందుకూ, అనంతరం ఆదరంతో అనుగ్రహించేటందుకూ, కల్యాణగుణ పరిపూర్ణుడైన ఆ పరమాత్ముడు అదృశ్య మైనాడు.

**వ. ఇట్లు హరి గను మొఱంగి చనిన కరిం గానక తిరుగు కరేణుల పెల్లున నుల్లంబులు దల్లడిల్ల వల్లవకాంతలు తదీయగమన హాసవిలాస వీక్షణ విహార వచనరచనానురాగంబులం జిత్తంబులు గోల్పడి, వివిధచేష్టలకుం బాల్పడి, తదాత్మకత్వంబున నేన నేన కృష్ణుండ నని కృష్ణగుణావేశంబులం జరియించుచు. 1007**

* ఈ లాగున మాధవుడు కనుగప్పి వెళ్ళినవేళ ఆయనను కనుగొన లేక మగ ఏనుగును బాసి సంచరించే ఆడుఏనుగులవలె హృదయాలు సంచలింపగా, గోపకాంతలు నందనందనుడి గమనలీలలూ, హాసవిలాసాలూ, చూపులూ, విహారాలూ, ఆటలూ, మాటలు మొదలైన వాటిమీద అనురాగంతో తమ

మనస్సులు మనస్సులలో లేక పలుచేష్టలకు పాల్పడినారు. తన్మయత్వంతో "నేనే మాధవుణ్ణి" అంటూ గోవిందుని గుణచేష్టితాలు అనుకరిస్తూ తిరుగసాగినారు.

**క. భూతములలోనఁ వెలిఁ బ్ర, ఖ్యాతుం డగు నట్టివాని; గాంతలు కాళిం**
**దీ తీరవనాంతరముల, బ్రాఁతిన్ వెదుకంగఁ జనిరి పాడుచు నధిపా!** 1008

* ఓ పరీక్షిన్మహారాజా! చరాచరములైన సమస్త భూతముల లోపలనూ, వెలుపలనూ నివసించియున్న ఆ వాసుదేవుణ్ణి వల్లవాంగనలు యమునాతీర వనమధ్యంలో ప్రేమతో పాడుతూ వెదకుటకు వెళ్ళినారు.

**సీ. పున్నాగ! కానవే పున్నాగవందితుఁ; దిలకంబ! కానవే తిలకనిటలు;**
**ఘనసార! కానవే ఘనసారశోభితు; బంధూక! కానవే బంధుమిత్రు;**
**మన్మథ! కానవే మన్మథాకారుని; వంశంబ! కానవే వంశధరునిఁ**
**జందన! కానవే చందనశీతలుఁ గుందంబ! కానవే కుందరదను;**

**తే. నింద్రభూజమ! కానవే యింద్రవిభవుఁ, గువలవృక్షమ! కానవే కువలయేశుఁ;**
**బ్రియకపాదప! కానవే ప్రియవిహారు; ననుచుఁ గృష్ణుని వెదకి రయ్యబ్జముఖులు.** 1009

* ఓ పున్నాగభూజమా! పురుషపుంగవుల వందనా లందుకునే వానిని నీవు చూచినావా? ఓ బొట్టుగు చెట్టా! ఫాలమున తిలకం ధరించిన వానిని తిలకించినావా? ఓ కర్పూర పాదపమా! గొప్పబలిమిచే భాసిల్లు వానిని కనుగొన్నావా? ఓ మంకెనమహీజమా! అందరికీ బంధుమిత్రుడైన వానిని కాంచినావా? ఓ వెలగమ్రాకా! అంగజుని వంటి ఆకారంగల వానిని అవలోకించావా? ఓ వెదురు తరువా! వేణువు దాల్చిన వెన్నుని వీక్షించావా? ఓ చందన ద్రుమమా! చందనమువలె చల్లనైన వానిని సందర్శించావా? ఓ మొల్ల లతికా! మొల్ల మొగ్గలవంటి దంతములు గలవానిని పరికించావా? ఓ మరువకమా! దేవేంద్రవైభవం గలవానిని కంటివా? ఓ రేగుచెట్టా! భూమండలమునకు అధినాథుడైన వాని నాలోకించావా? ఓ ప్రేంకణమా! ప్రియ విహారము గల వానిని అరసినావా? అంటూ తామరరేకులవంటి మోములు గల గోపభామినులు బృందావనంలో అందాల కృష్ణుని వెదకినారు.

**వ. మఱియును.** 1010

**ఉ. నల్లనివాఁడు పద్మనయనంబుల వాఁడు కృపారసంబు పైఁ**
**జల్లెడివాఁడు మౌళిపరిసర్పిత పింఛమువాఁడు నవ్వు రా**
**జిల్లెడు మోమువాఁ డొకఁడు చెల్వల మానధనంబుఁ దెచ్చె నో**
**మల్లియలార! మీ పొదలమాటున లేఁడు గదమ్మ చెప్పరే?** 1011

* ఇంకనూ ఈ విధంగా అడుగసాగారు.

* నల్లనివాడూ, కమలములవంటి కన్నులు గలవాడూ, కరుణారసము చిందించేవాడూ, సిగపై వ్యాపించిన నెమలిపురి కలవాడూ, చిరునగవు చెలువారే మొగము గలవాడూ అయిన ఒకానొక కుఱ్ఱవాడు,

మానినుల మానధనం దోచితెచ్చినాడు. ఓ మల్లెతీవలారా! మీ పొదలమాటున లేడు గదా! ఉన్నట్లయితే కొంచెం చెప్పండమ్మా!

ఉ. అంగజునైనఁ జూడ హృదయంగముఁడై కరఁగించు వాఁడు శ్రీ
రంగదురంబు వాఁడు మధురంబగు వేణురవంబు వాఁడు మ
మ్మంగజు పువ్వుఁదూపులకు నగ్గము సేసి లవంగ లుంగ నా
రంగములార! మీకడకు రాఁడు గదా! కృప నున్నఁ జూపరే! 1012

* ఓ లవంగవృక్షములారా! మాదీఫల తరువులారా! నారింజ చెట్టులారా! దర్శించిన మాత్రాన మదికింపు గొలిపి మన్మథునికూడా కరగించేవాడూ, సిరిగల వక్షమువాడూ, మోహనమైన మురళీనినాదము గలవాడూ అయిన శ్రీకృష్ణుడు మమ్ము మారుని కుసుమ శరాల బారి కప్పగించి మీ దగ్గరకు రాలేదు గదా! వస్తే మాకు దయతో చూపండమ్మా!

సీ. మానినీమన్మథు మాధవుఁ గానరే సలలితోదార వత్సకములార!
సలలితోదార వత్సక వైరిఁ గానరే సుందరోన్నత లతార్జునములార!
సుందరోన్నత లతార్జునభంజుఁ గానరే ఘనతర లసదశోకంబులార!
ఘనతర లసదశోకస్ఫూర్తిఁ గానరే నవ్యరుచిర కాంచనంబులార!

ఆ. నవ్య రుచిర కాంచన కిరీటుఁ గానరే, గహనపదవి కురవకంబులార!
గహనపదవి కురవక నివాసిఁ గానరే, గణికలార! చారుగణికలార! 1013

* మనోహరములూ, గొప్పవీ అయిన కొడిసె వృక్షములారా! పడతుల పాలిటి పంచశరుడైన లక్ష్మీవల్లభుని చూచారా? అందమైన పొడవైన కొమ్మలతో కూడిన మద్దితరువులారా! అందమైనవాడూ, ఉదారుడు, వత్సాసురుని తెగటార్చినవాడూ అయిన అచ్యుతుని కనుగొన్నారా?

ఉన్నతములై ఒప్పుచున్న కంకేళి పాదపములారా! సుందరములూ, సుదీర్ఘములూ అగు శాఖలతో గూడిన యమళార్జునములను భంజించిన హరిని అవలోకించారా? సరిక్రొత్త ఒప్పిదము గల సంపెంగలారా! దుఃఖరహితుడై వెలయుచున్న తోయజాక్షుని వీక్షించారా? ఎఱ్ఱగోరింటచెట్టులారా! నూతనమైన బంగారుకిరీటము గల శౌరిని ఈ వనమధ్యంలో పరికించారా? ఓ అందమైన అడవి మొల్లలారా! సుందరమైన నెల్లిచెట్టులారా! బృందావనమందలి ఎఱ్ఱగోరింట పొదలలో సంచరించే వెన్నుని కన్నారా?

సీ. అదె నందనందనుం డంతర్హితుం డయ్యెఁ బాటలీతరులార! పట్టరమ్మ!
హేలావతులఁ గృష్ణ! యేల పాసితి వని యైలేయ లతలార! యడుగరమ్మ!
వనజాక్షుఁ డిచటికి వచ్చి డాఁగఁడు గదా! చూతమంజరులార! చూడరమ్మ!
మానినీమదనుతో మారాక యెఱిఁగించి మాధవీలతలార! మనుపరమ్మ!

ఆ. జాతిసతులఁ బాయ నీతియే హరి కని, జాతులార! దిశలఁ జాటరమ్మ!
కదళులార! పోయి కదలించి శిఖిపింఛ, జూటుఁ దెచ్చి కరుణఁ జూపరమ్మ! 1014

* అడుగో! నందగోపుని తనయుడు ఉన్నట్టుండి అంతర్ధాన మైనాడు. ఓ కలిగొట్టు చెట్టులారా! పట్టు కొనండి. 'కృష్ణా! విలాస వతులను ఎందుకు వదలివేశా' వని ఓ మిరియపు తీవలారా! ఆయన్ని అడగండి. పద్మనేత్రుడు ఇక్కడికి వచ్చి దాగుకొనలేదు గదా! ఓ మామిడి గుత్తులారా! చూడండి. ఓ బండి గురివెంద తీవలారా! మగువల పాలిటి మన్మథుడైన మాధవునకు మా రాక తెల్పి మమ్ము బ్రతికించండి. జాజులారా! సత్కుల సంజాత లయిన సతుల నెడబాయుట శ్రీహరికి నీతి గాదని దిక్కులలో చాటండి. ఓ కదళీ వృక్షములారా! మీరు వెళ్ళి నెమలిపురిని తలలో ధరించిన కంజనేత్రుణ్ణి కదలించుకొని వచ్చి కరుణతో మాకు చూపండి.

క. హరిచరణములకుఁ బ్రియవై, హరి నిను మన్నింప భద్ర మందెదు తులసీ!
హరి నీ దెస రాఁడు గదా, హరి చొప్పెఱిఁగించి శుభము లందింపఁగదే! 1015

* ఓ తులసీ! నీవు గోవింద చరణారవింద ప్రియురాలవు గదా! మాధవు డాదరింపగా మంగళములు పొందుచున్నావు. శ్రీకృష్ణుడు నీ చెంతకు చేరరాడు గదా! వచ్చినచో అతడు వచ్చిన మార్గం తెలిపి మాకు క్షేమం కలిగించు.

తే. పొగడఁ దగువానిఁ గానరె పొగడలార!, యీ డెఱుంగని విభుఁ జూపుఁ డీడలార!
మొల్లమగు కీర్తివాఁ డే డి మొల్లలార!, శుకనిగదితునిఁ జెపుఁడు కింశుకములార! 1016

* పొగడలారా! పొగడదగిన పురుషోత్తముణ్ణి చూచారా? ఓ ఎర్రకిత్తలి చెట్టులారా? సాటిలేని పురుషోత్తముని మాకు చూపండి. ఓ మొల్లలారా! వెల్లివిరిసిన కీర్తిగల నల్లనయ్య ఎక్కడ? ఓ మోదుగు వృక్షములారా! శుకునిచే వర్ణింపబడిన వనమాలి ఏడి? చెప్పండి.

క. తరుణీకుచ కుంకుమయుత, హరికంధర దామగంధ మడరెడుఁ జూడ్కుల్
హరిఁ గనిన పగిదిఁ దనరెడి, హరిణీ! హరిజాడఁ బుణ్య మయ్యెడిఁ జెపుమా! 1017

* ఓ ఆడులేడీ! యువతులు స్తనాలపై పులుముకొన్న కుంకుమ పూత లంటుకొని హరికంఠంలోని పుష్పమాలికా పరిమళం బుగులు కొలుపుతున్న నీ చూపులు పరికింపగా గోపాలుణ్ణి చూచినట్లే ఉన్నాయి. నీకు పుణ్యముంటుంది. శ్రీకృష్ణుని జాడ తెలుపు!

క. కిటియై కౌఁగిటఁ జేర్చెను, వటుఁడై వర్ధిల్లి కొలిచె వడిఁ గృష్ణుండై
యిటఁ బద చిహ్నము లిడెఁ గ్రిం, దటి బాముున నేమి నోఁచి తమ్మ ధరిత్రీ! 1018

* ఓ భూదేవీ! వరాహావతారం ధరించినప్పుడు నిన్ను కౌగిట జేర్చుకొన్నాడు. త్రివిక్రమ స్వరూపధరుడై నిన్ను కొలిచాడు. ఇప్పుడు కృష్ణుడై నీ పై అడుగు లుంచాడు. పూర్వజన్మలలో నీ వెట్టి నోములు నోచావో!

వ. అనుచు మదనోన్మాదచిత్తలై తదాత్మకత్వంబున కృష్ణలీలల ననుకరించుచు. 1019

* ఈ విధంగా అంటూ గోపికలు యౌవనోద్రేకంచే వేదురుగొన్న మనసులు గలవారై కృష్ణతాదాత్మ్యాన్ని పొంది ఆ భగవంతుని లీలలు అనుకరింపసాగినారు.

సీ. పూతనయై యొక్క పొలఁతి చరింపంగ శౌరియై యొక కాంత చన్నుఁ గుడుచు;
బాలుఁడై యొకభామ పాలకు నేడ్చుచో బండి నే నను లేమఁ బాఱఁ దన్ను;
సుడిగాలి నని యొక్క సుందరి గొనిపోవ; హరి నని వర్తించు నబ్జముఖియు
బకుఁడ నే నని యొక్క పడఁతి సంరంభింపఁ బద్మాక్షుఁడను కొమ్మ పరిభవించు

ఆ. నెలమి రామకృష్ణు లింతు లిద్దఱు గాఁగ, గోపవత్సగణము గొంద ఱగుదు;
రసురవైరి ననుచు నబల యొక్కతె చీరుఁ, బసుల మనెడి సతుల భరతముఖ్య! 1020

*గోపికల్లో ఒకతె పూతనవలె మెలగగా, కృష్ణుని మాదిరి అభినయిస్తున్న ఇంకొకతె చనుగుడిచింది. ఒకతె తన్ను శిశువుగా భావించుకొని పాలకేడుస్తూ, శకటాసురుడివలె వర్తించే మరియొకతెను కాలితో తన్నింది. ఒకతె తృణావర్తుడి మాదిరి నటిస్తూ- నేను కృష్ణుణ్ణి అని భావించే మరొకతెను ఎగురవేసుకపోయింది. ఒకతె నేను బకాసురుణ్ణి అని విజృంభించగా నేను వాసుదేవుణ్ణి అంటూ మరొకతె దానిని పరాభవించింది. ఇద్దరు పొలతులు రామకృష్ణులు కాగా మరికొందరు గోపకులూ, క్రేపులూ అయ్యారు. మేము పసులమంటూ పలుకుతున్న చెలువలను నేను నందకుమారుణ్ణి అనే వెలది పిలిచింది.

ఆ. లోకమెల్లఁ గుక్షిలోపల నున్నది, మాధవుండ నేను మాత వీవు
చూడు మనుచు నొక్క సుందరి యొకతెకు, ముఖముఁ దెఱచి చూపు ముఖ్యచరిత! 1021

* ఉత్తమ చరిత్రుడవైన పరీక్షిన్మహారాజా! ఒకతె మాధవుడై విశ్వమంతా నా కుక్షిలో ఉంది చూడుమంటూ యశోదమ్మగా నటిస్తున్న మరొకతెకు తన నోరు తెరచి చూపింది.

క. వెన్నలు దొంగిలి తినియెడి, వెన్నుఁడ నని యొకతె నుడువ వేఱొక్కతె చే
సన్నల యశోద నంచును, గ్రన్నన కుసుమముల దండఁ గట్టు నిలేశా! 1022

* అవనీనాథా! నేను నవనీతచోరుడైన నందనందనుణ్ణి అని ఒకతె పలుకగా, వేరొకతె నేను యశోదాదేవి నని చేసన్నలు చేస్తూ దానిని వెంటనే పూదండచేత బంధించింది.

క. 'కాళియఫణి యిది వీరలు, కాళియఫణిసతులు మ్రొక్కఁ గడఁగిరి నే గో
పాల కుమారుఁడ' ననుచును, లీలాగతి నాడు నొక్క లేమ నరేంద్రా! 1023

* "ఇది కాళియసర్పం. వీరు అతని పత్నులు. నాకు మ్రొక్కుతున్నారు. నేను నందతనయుణ్ణి" అంటూ ఒక కులుకులాడి కులుకసాగింది.

క. **తరుణులు గోపకు లందఱు, హరిహయుఁ డిదె వానఁ గురిసె హరి నే' నని భా**
**సుర చేలాంచల మొక్కతె, గిరి నెత్తెద ననుచు నెత్తుఁ గెంగేల నృపా? 1024**

* "ఈ చెలు లందరూ గోపాలకులు, ఆమె దేవేంద్రుడు. ఇదిగో రాలవాన కురుస్తున్నది. నేను శ్రీకృష్ణుణ్ణి. ఇదిగో గోవర్ధన గిరి నెత్తుతున్నాను" అంటూ ఒకతె కెంగేలితో చీరకొంగు పయికెత్తి పట్టుకుంది.

క. **'మీరలు గోపకు లే నసు, రారిని దావాగ్ని వచ్చె నటు సూడకుఁడీ**
**వారించెద' నని యొక్కతె, సేరి బయల్ కబళనంబు సేయు నరేంద్రా!' 1025**

* పరీక్షిన్మహారాజా! "మీరంతా గోపకుమారులు. నేను రాక్షసవిరోధి నయిన కృష్ణుణ్ణి. కార్చిచ్చు వస్తున్నది. అటు చూడకండి. నేను దానిని నివారిస్తాను" అంటూ ఒక గోపిక బయలును మ్రింగింది.

వ. **ఇట్లు తన్మయత్వంబున గోపసుందరులు బృందావనంబునం గల తరులతాదుల హరి నడుగుచు, దుర్గమంబు లయిన విపినమార్గంబుల సరోజాత కేతన హల కులిశ కలశాంకుశాది శుభలక్షణ లక్షితంబు లయి మనోహరంబు లయిన హరిచరణంబుల చొప్పుఁ గని తప్పక చెప్పికొనుచుఁ దమలో నిట్లనిరి. 1026**

* ఇట్లు తనువులు మరచి గోపాంగనలు బృందావనంలోని మ్రాకులనూ, తీవలనూ శ్రీహరి జాడ లడుగుతూ, చొరరాని అడవి దారుల్లో కమలం, ధ్వజం, నాగలి, వజ్రం, కలశం, అంకుశం మొదలైన శుభలక్షణాలచే మనోజ్ఞములైన గోవిందుని అడుగులు గుర్తించి గొప్పగా చెప్పుకొంటూ తమలో ఇట్లనుకొన్నారు.

సీ. **కొమ్మకుఁ బువ్వులు గోసినాఁ డిక్కడ మొనసి పాదాగ్రంబు మోపినాడు**
**సతి నెత్తుకొని వేడ్క జరిగినాఁ డిక్కడఁ దృణములోఁ దోఁపదు తెఱవజాడ**
**ప్రియకు ధమ్మిల్లంబు వెట్టినాఁ; డిక్కడఁ గూర్చున్న చోటిదె కొమరు మిగులు**
**నింతికిఁ గెమ్మోవి యిచ్చినాఁ డిక్కడ వెలఁది నిక్కిన గతి విశదమయ్యె**

ఆ. **సుదతితోడ నీరు సొచ్చినాఁ డిక్కడఁ, జొచ్చి తా వెడలిన చోటు లమరెఁ**
**దరుణిఁ గాముకేళిఁ దనిపినాఁ డిక్కడ, ననఁగి పెనఁగియున్న యంద మొప్పె. 1027**

* ఇక్కడ మగువకై మాధవుడు పూలు కోసినాడు కాబోలు! మునివ్రేళ్ళు మాత్రమే నేలపై మోపినాడు. ఇక్కడ ప్రీతితో చెలువ నెత్తుకొని ముందుకు వెళ్ళినాడు కాబోలు! ఈ పచ్చిక పట్టుపై దాని అడుగులు కనిపించడంలేదు. ఇక్కడ కొమరాలి కొప్పు సవరించి చక్కదిద్దాడు కాబోలు! ఇద్దరూ కూర్చున్నచోటు సొగసుగా ఉంది. ఇక్కడ అతివకు అరుణాధర మిచ్చాడు కాబోలు! నెలత నిక్కిన తీరు తేటపడుతున్నది. పడతితో ఇక్కడ ఈ కొలని నీటిలో ప్రవేశించాడు కాబోలు! నీటినుండి వెడలిన తావులు స్పష్టంగా కనబడు తున్నాయి. ఇక్కడ సుదతిని మదనకేళిలో తనిపినాడు కాబోలు! ఇరువురూ అనగి పెనగిన ఆనవాలు కానవస్తున్నది.

వ. మఱియును. 1028

సీ. ఒక యెలనాఁగ చేయూఁదినాఁ డిక్కడ సరస నున్నవి నాల్గుచరణములును
నొక నీలవేణితో నొదిఁగినా డిక్కడ మగజాడలో నిదె మగువజాడ
యొక లేమ మ్రొక్కిన నురివినాఁ డిక్కడ రమణి మ్రొక్కిన చొప్పు రమ్యమయ్యె
నొక యింతి కెదురుగా నొలసినాఁ డిక్కడ నన్యోన్యముఖములై యంఘ్రు లొప్పె

ఆ. నొకతె వెంటఁ దగుల నుండక యేగినాఁ, డడుగుమీఁదఁ దరుణి యడుగు లమరె
నబల లిరుగెలంకులందు రాఁ దిరిగినాఁ, డాఱుపదము లున్నవమ్మ! యిచట. 1029

* ఇంతేకాదు. ఇక్కడ నందసూను డొక చేడియ చేయి పట్టుకొని నడచినాడు కాబోలు నాలుగు చరణా లున్నాయి. ఒక ఒయ్యారితో ఇక్కడ ఒదిగినాడు కాబోలు, మగజాడలో మగువజాడ గోచరిస్తున్నది. ఒక పొలతి మ్రొక్కగా ఇక్కడ ఒడిసి పట్టుకున్నాడు కాబోలు రమణి మ్రొక్కిన తీరు రమ్యంగా ఉంది. ఒక చెలువకు అభిముఖంగా అరిగినాడు కాబోలు, ఇక్కడ ఎదు రెదురుగా అడుగు లేర్పడినాయి. ఒక లేమ వెంబడింపగా ఆగక ఏగినాడు కాబోలు, ఇక్కడ అతని అడుగులమీద అతివ అడుగులు అమరి ఉన్నాయి. ఇదిగో చూడండమ్మా! ఇరుప్రక్కలా ఎలనాగలు అనుసరింప తిరిగినాడు కాబోలు, ఇక్కడ ఆరు పాదాలున్నాయి.

సీ. ఈ చరణంబులే యిందునిభానన! సనకాది మునియోగసరణి నొప్పు;
నీ పాదతలములే యెలనాఁగ! శ్రుతివధూ సీమంతవీథులఁ జెన్ను మిగులు;
నీ పదాబ్జంబులే యిభకులోత్తమయాన! పాలేటిరాచూలిపట్టుఁ గొమ్మ;
లీ సుందరాంఘ్రులే యిందీవరేక్షణ! ముక్తికాంతా మనోమోహనంబు;

ఆ. లీ యడుగుల రజమె యింతి! బ్రహ్మేశాది, దివిజవరులు మౌళిదిశలఁ దాల్తు
రనుచుఁ గొంద ఱబల లబ్జాక్షుఁ డేగిన, క్రమముఁ గనియు నతనిఁ గానరైరి. 1030

* ఓ చంద్రముఖీ! ఈ చరణాలే సనక సనందాది మునీశ్వరుల ధ్యానమార్గమున వెలుగొందేవి.ఓ వెలదీ! ఈ పాదములే వేదము లనెడి భామినుల పాపటపై భాసిల్లేవి. ఓ గజరాజగమనా! ఈ పద్మముల వంటి పాదములే క్షీరసాగర పుత్రికయైన లక్ష్మికి ఆధారాలు. ఓ కలువకంటీ! ఈ అందమైన అడుగులే మోక్షమనెడు మగువ మనసును మోహింపజేసేవి. ఓ పడతీ! ఈ పాదధూళియే బ్రహ్మరుద్రాదులైన దేవతా శ్రేష్ఠులు ఔదల ధరించేది- అంటూ కొంతమంది యువతులు వనజాక్షు డరిగిన తెరువు గుర్తించి కూడా అతనిని కనుగొనలేక పోయారు.

వ. అప్పుడు. 1031

సీ. పతుల దైన్యంబును భామల క్రౌర్యంబుఁ జూపుచు విభుఁ డొక్క సుదతితోడ
విహరింప నది యెల్ల వెలఁదుల వర్జించి నాయొద్ద నున్నాఁడు నాథుఁ' డనుచు
గర్వించి రాఁ జాలఁ గమలాక్ష! మూఁపున నిడుకొను మనుఁడు న య్యీశ్వరుండు
మొఱఁగిపోయినఁ దాపమును బొంది 'యో కృష్ణ! యెక్కడఁ జనితి? ప్రాణేశ! రమణ!

తే. నీకు వరవుడ నయ్యెద నిలువు' మనుచు, వగవఁ గొందఱు కాంత లా వనితఁ జూచి
వరుఁడు మన్నింప గర్వించి వనజనేత్ర, చిక్కె నేఁడని వెఱగును జెంది రపుడు. 1032

* ఆ సమయాన పతులు పణతులకు లొంగిపోయి పొందే దైన్యమునూ, స్త్రీలు చూపే దౌర్జన్యమునూ తెలుపడానికని కృష్ణుడొక చెలువతో కలసిమెలసి విహరించినాడు. అంతలో ఆ చేడియ తక్కిన తరుణు లందరినీ వదలి వల్లభుడు తన్నే వలచి తనకడనే ఉన్నాడని విఱ్ఱవీగింది. ఆ గర్వంతోనే అది- ' ఓ కమలాక్షా! ఇక నడచి రాలేను. నన్ను నీ మూపుపై నెక్కించుకొని కొనిపో!'' అని పలికింది. ఆ మాట అన్నంతనే అచ్యుతుడు అంతర్ధానము చెందాడు. అప్పుడు ఆ తరుణి పరితాపం పొంది "ఓ కృష్ణా! ఓ ప్రాణేశ్వరా! ఓ వల్లభా! ఎక్కడి కేగినావు? నీకు చరణదాసి నవుతాను నిలువు'' మంటూ పలవించింది. అపుడు కొందరు గోపయువతులు ఆ సుదతిని జూచి మగని మన్ననచే దర్పించి ఈ వాల్గంటి ఇటువంటి ఇక్కట్లకు గురియైనది- అని విస్మయం పొందినారు.

వ. మఱియును. 1033

సీ. 'ఈ పొదరింటిలో నిందాఁకఁ గృష్ణుండు నాతోడ మన్మథనటన మాడె
నియ్యోల మగుచోట నిందాఁకఁ జెలువుండు గాఢంబుగా నన్నుఁ గౌఁగిలించె
నీ మహీజము నీడ నిందాఁక సుభగుండు చిట్టంటు చేఁతల సిగ్గుగొనియె
నీ పుష్పలత పొంత నిందాఁక దయితుండు నను డాసి యధరపానంబు సేసె

ఆ. నీ ప్రసూనవేది నిందాఁక రమణుండు, గుసుమదామములను గొప్పుఁ దీర్చె
ననుచుఁ గొంద ఱతివ లంభోజనయనుని, పూర్వలీలఁ దలఁచి పొగడి రధిప! 1034

* పరీక్షిన్మహారాజా! ఇంకా విను గోపకాంతల వింతచేష్టలు. ఈ పొదరింటిలో ఇంతకు ముందే కృష్ణుడు నాతో మన్మథక్రీడ సల్పినాడు. ఈ మాటుగా నున్నచోట ఇంతకుముందే వల్లభుడు నన్ను గట్టిగా కౌగిలించుకున్నాడు. ఈ తరుచ్ఛాయలో ఇందాక మనోహరుడు నఖక్షతాలతో నా సిగ్గు హరించాడు. ఈ పుష్పనికుంజ సమీపాన ఇంతకుముందే ప్రాణేశ్వరుడు నన్ను జేరి నా కెమ్మోని జుఱ్ఱినాడు. ఈ పూలతిన్నెపై ఇందాక ప్రియుడు నా కొప్పులో పూదండలు చెరివినాడు అంటూ కొందరు కొమరాండ్రు వనజనేత్రుడు మునుపు చేసిన శృంగార చేష్టలను మాటిమాటికి తలచుకొని కొనియాడినారు.

మ. అని యిబ్భంగి లతాంగు లందఱును బృందారణ్యమం దీశ్వరున్
వనజాక్షుం బరికించి కానక విభున్ వర్ణించుచుం బాడుచున్

మనముల్ మాటలుఁ జేష్టలుం గ్రియలు న మ్మానాథుపైఁ జేర్చి వే
చని ర య్యామున సైకతాగ్రమునకున్ సంత్యక్త గేహేచ్ఛలై. 1035

* ఈ విధంగా ఆ తీవబోడు లందరూ బృందావనమందు భగవంతుడైన పద్మనేత్రుణ్ణి వెదకి వెదకి దర్శింపలేకపోయారు. ఆ ప్రభుని గుణ చేష్టితాలను వర్ణించి పాడుతూ తమ మనోవాక్కాయాలను ఆ లక్ష్మీవల్లభుడి మీదనే చేర్చి ఇండ్లకు పోవలెనన్న కోరికలు వీడి యమునానదిలోని ఇసుకతిన్నెల మీదకు వెళ్ళినారు.

వ. చని గోపికలు హరి నుద్దేశించి యిట్లనిరి. 1036

* అలా వెళ్ళి ఆ గొల్లజవరాండ్రు హరి నుద్దేశించి ఇలా అన్నారు.

## -: గోపికా గీతలు :-

క. నీవు జనించిన కతమున, నో వల్లభ! లక్ష్మి మంద నొప్పె నధికమై
నీ వెంటనె ప్రాణము లిడి, నీ వా రరసెదరు చూపు నీ రూపంబున్. 1037

* నాథా! నీవు జనించిన కారణాన గోకులంలో సిరి పెంపు సొంపారుతున్నది. ప్రాణా లరచేత నుంచుకొని నీ వారమైన మేము నీ కోసం వెదకుతున్నాము. నీ రూపం చూపు.

క. శారదకమలోదరరుచి, చోరకమగు చూపువలన సుందర! మిమ్ముం
గోరి వెల యీని దాసుల, ధీరత నొప్పించు టిది వధించుట గాదే? 1038

* అందగాడా! శరత్కాలపు కమలగర్భంలోని జిగిని దొంగిలించు నీ చూపువల్ల నిన్ను వలచి జీతబత్తెములు లేని దాసికల మయ్యాము. అటువంటి మమ్మ ధీరుడవై ఇలా వేధించుక తినడం నిజంగా చంపడమే గదా!

ఆ. విషజలంబువలన విషధరదానవు, వలన ఱాలవానవలన వహ్ని
వలన నున్న వానివలనను రక్షించి, కుసుమశరునిబారిఁ గూల్పఁ దగునె? 1039

* యమునానదీ జలాలలో విషం గ్రక్కు కాళియునివల్ల, సర్పరూపుడగు అఘాసురునివల్ల, ఇంద్రుడు కురిపించిన రాలవానవల్ల, అడవిలో చెలరేగిన కార్చిర్చువల్ల, తక్కిన ఎన్నో భయాలవల్ల మమ్మ కాపాడి ఇప్పుడు పంచబాణుని బారి కప్పగించడం నీకు న్యాయమా?

ఉ. నీవు యశోదబిడ్డఁడవె? నీరజనేత్ర! సమస్తజంతు చే
తో విదితాత్మ వీశుఁడవు తొల్లి విరించి దలంచి లోక ర
క్షా విధ మాచరింపు మని సన్నుతి సేయఁగ సత్కులంబునన్
భూవలయంబుఁ గావ నిటు పుట్టితి గాదె మనోహరాకృతిన్. 1040

* కమలాక్షా! నీవు కేవలం యశోదకుమారుడవే కాదయ్యా! నిఖిలదేహధారుల బుద్ధికి సాక్షిభూతుడవైన అంతరాత్మవు. పరమేశ్వరుడివి. పూర్వం విరించి నిన్ను స్మరించి విశ్వరక్షణం గావింపుమని నిన్ను వేడుకోగా భూమండలాన్ని ఉద్ధరించేందుకు ఇలా మనోజ్ఞస్వరూపంతో మేటి యదువంశంలో ఆవిర్భవించావు.

**ఆ. చరణసేవకులకు సంసారభయమును, బాపి శ్రీకరంబు పట్టు గలిగి**
**కామదాయియైన కరసరోజంబు మా, మస్తకముల నునిచి మనుపు మీశ! 1041**

* నీ పాదాలను కొలిచేవారికి సంసారంవల్ల కలిగే భయాన్ని తొలగించేదీ, లక్ష్మీదేవి హస్తాన్ని గ్రహించేదీ, అభీష్టములు అందించేదీ అయిన నీ కరకమలాన్ని మా శిరములపై ఉంచి మమ్ము బ్రదికించు స్వామీ?

**ఉ. గోవులవెంటఁ ద్రిమ్మరుచుఁ గొల్చినవారల పాపసంఘముల్**
**ద్రోవఁగఁజాలి శ్రీఁ దనరి దుష్టభుజంగ ఫణాలతాగ్ర సం**
**భావితమైన నీ చరణపద్మము చన్నులమీఁద మోపి త**
**ద్భావజ పుష్పభల్ల భవబాధ హరింపు వరింపు మాధవా! 1042**

* లక్ష్మీవల్లభా! ఆవులవెంట సంచరించునదీ, సేవించువారి పాపసమూహాలను పోగొట్టగలిగినదీ, సిరిచే నొప్పునదీ, క్రూరుడైన కాళియుని పడగలపై నటించేదీ అయిన నెత్తమ్మివంటి నీ పాదాన్ని మా కుచాల మీద మోపి మాకు మన్మథుని కుసుమశరాలవల్ల ప్రాప్తించిన బాధ పరిహరించు. మమ్ము స్వీకరించు.

**క. బుధరంజనియును సూక్తయు, మధురయు నగు నీదు వాణి మరఁగించెను నీ**
**యధరామృతసంసేవన, విధి నంగజతాపమెల్ల విడిపింపఁగదే! 1043**

* పండితులకు ఇంపు గూర్చునదీ, చక్కగా ఉచ్చరింపబడునదీ, తీయనిదీ అయిన నీ పలుకు మమ్ము మరులు కొల్పింది. నీ యధరామృతం జుర్రజేసి మా మదనతాపమంతా తొలగించు.

**క. మగువలయెడ నీ క్రౌర్యము, దగునే? నిజభక్తభీతి దమనుఁడ వకటా!**
**తగదు భవద్దాసులకును, నగు మొగముం జూపి కావు నళినదళాక్షా! 1044**

* కమలాక్షా! అయ్యో! ఆడువారిపట్ల ఇంతటి క్రూరత్వము చూపదగునా? నీవు భక్తుల భయం పోకార్చు వాడవుగదా! మరి నీ దాసుల మైన మాకు నీ నగుమోము చూపి కాపాడు.

**మ. ఘనలక్ష్మీ యుతమై వినన్ శుభదమై కామాది విధ్వంసియై**
**సనకాది స్తుతమై నిరంతరతప స్సంత ప్తపున్నాగ జీ**
**వనమై యొప్పెడు నీ కథామృతము ద్రావం గల్గునే భూరి దా**
**న నిరూఢత్వము లేనివారలకు మానారీమనోహారకా! 1045**

* రమామనోరమణా! గొప్పసిరితో గూడినదై, శ్రవణమాత్రమున శుభము లిచ్చునదై, కామ క్రోధాదులను నిర్మూలించు నట్టిదై, సనక సనందనాది యోగీశ్వరులచే కొనియాడబడునదై, ఎడతెగని

తపములచే తపించుచున్న పురుషపుంగవులకు జీవనమై యొప్పుచున్న నీ కథాసుధను ఎన్నెన్నో గొప్పదానము లొనర్చి ప్రసిద్ధి నందని వారు గ్రోలజాలరు.

**క. నీ నగవులు నీ చూడ్కులు, నీ నానావిహరణములు నీ ధ్యానంబుల్**
**నీ నర్మాలాపంబులు, మానసముల నాఁటి నేఁడు మగుడవు కృష్ణా! 1046**

* కృష్ణా! నీ నవ్వులూ, నీ చూపులూ, పలువిధములైన నీ విహారాలూ, నీ ధ్యానములూ, నీ పరిహాసవచనాలూ మా హృదయాలలో నాటుకొని నేడు మరలిపోలేకున్నవి.

**ఆ. ఘోషభూమి వెడలి గోవుల మేపంగ, నీరజాభమైన నీ పదములు**
**గసవు శిలలుఁ దాఁకి కడునొచ్చునో యని, కలఁగు మా మనములు కమలనయన! 1047**

* కమలాక్షా! నీవు గోవులను మేపుటకై మందపట్టునుంచి వెడలినవేళ అంబుజాలతో సమానమైన నీ అడుగులు గడ్డిమొలకలు, గులకరాలు తాకి మిక్కిలి నొచ్చునని మా డెందాలు కుందుతుంటాయి.

**ఉ. మాపటివేళ నీవు వనమధ్యము వెల్వడి వచ్చి గోష్పద**
**ప్రాపిత ధూళిధూసరిత భాసిత కుంతలమై సరోరుహో**
**ద్దీపిత మైన నీ మొగము ధీరజనోత్తమ! మాకు వేడ్కతోఁ**
**జూపి మనంబులన్ మరునిఁ జూపుదు గాదె క్రమక్రమంబునన్. 1048**

* ధీరపుంగవా! నీవు రాత్రివేళ, బృందావనాంతరంనుంచి వచ్చి ధేనువుల కాలిదుమ్ము సోకి ధూసరవర్ణం పొందిన ముంగురులు గలదై, పద్మంవలె భాసిల్లే నీ ముఖం మాకు ప్రీతితో కనబరచి మా చిత్తాలలో అంత కంతకు మరులు హత్తుకొలుపుతుంటావు కదా!

**ఆ. భక్తకామదంబు బ్రహ్మ సేవిత మిలా, మండనంబు దుఃఖమర్దనంబు**
**భద్రకరమునైన భవదంఘ్రియుగము మా, యురములందు రమణ! యునుపఁ దగదె? 1049**

* ప్రియతమా! భక్తులకు అభీష్టము లిచ్చునదీ, బ్రహ్మచే కొలువబడునదీ, పుడమికి భూషణమైనదీ, దుఃఖముల రాపాడునదీ,శుభము లొసంగి కాపాడునదీ అయిన నీ అడుగులజంట మా వక్షములపై నుంచరాదా?

**ఆ. సురతవర్ధనంబు శోకాపహరణంబు, స్వరిత వంశనాళ సంగతంబు**
**నన్యరాగ జయమునైన నీ మధురాధ, రామృతమునఁ దాప మార్పు మీశ! 1050**

* నాథా! సంభోగప్రీతి పెంచునదీ, దుఃఖములను తొలగించునదీ, మ్రోగునట్టి పిల్లనగ్రోవి ముద్దులందు కొనేదీ, ఇతరములైన అనురాగములను అతిశయించునదీ అయిన నీ తీయని కెమ్మోవి పానకముచే మా తాపం చల్లార్చు.

ఉ. నీ వడవిం బవల్ దిరుగ నీ కుటిలాలక లాలితాస్య మి
చ్ఛావిధిఁ జూడకున్న నిమిషంబులు మాకు యుగంబులై చనుం
గావున రాత్రులైన నినుఁ గన్నుల నెప్పుడుఁ జూడకుండ ల
క్ష్మీవర! ఱెప్ప లడ్డముగఁ జేసె నిదేల? విధాత క్రూరుఁడై. 1051

* రమానాయకా! నీవు పగటిపూట బృందారణ్యంలో తిరగడం వల్ల ఉంగరాలు తిరిగిన ముంగురులచే అందాలు చిందే నీ వదనం తృప్తి తీరేటట్లు తిలకించలేక పోతున్నాము. అందువల్ల మాకు క్షణాలు యుగాలుగా గడుస్తాయి. పోనీ రాత్రివేళలంద యినా ఎడతెగకుండా కన్నులనిండా నిన్ను కనుగొందా మనుకుంటే క్రూరుడైన బ్రహ్మదేవుడు కండ్లకు ఈ రెప్ప లడ్డంగా సృష్టించాడు కదా!

ఉ. అక్కట! బంధులున్ మగలు నన్నలుఁ దమ్ములుఁ బుత్రకాదులున్
వెక్కొని రాత్రిఁ బోకుఁడన నీ మృదుగీతరవంబు వీనులన్
వెక్కసమైన వచ్చితిమి వేగమె మోహము నొంది నాథ! నీ
వెక్కడఁ బోయితో? యెఱుఁగ మీక్రియ నిర్దయుఁ డెందుఁ గల్గునే? 1052

* మనోవల్లభా! చుట్టాలు, భర్తలు, అన్నలు, తమ్ములు, కొడుకులూ మొదలైనవారు మమ్మ రాత్రిపూట ఇలువెళ్ళవద్దని చెపుతున్నప్పటికీ నీ మెత్తని పాటసవ్వడి చెవులలో నిండగానే మోహితలమై పరుగుపరుగున వచ్చాము. నీ వెక్కడి కేగినావో యెరుగము. నీ వంటి జాలిమాలిన వా డెందైనా ఉంటాడా?

తే. మదనుఁ దార్చంగ నీవాడు మంతనములు, నవరసాలోకనంబగు నగు మొగంబు
కమల కిరవైన మహితవక్షస్స్థలంబు, మా మనంబుల లోఁగొని మరపెఁ గృష్ణ!" 1053

* కృష్ణా! ఏకాంతమున నీవు పలికే వలపులొలికే పలుకులూ, నవరసమయములైన నీ చూపులు, నీ నవ్వు మొగమూ, సిరికాటపట్టయిన నీ విశాలవక్షమూ, కామోద్దీపనకరాలై మా మనసులను ఆకర్షించి మమ్మ మురిపించాయి.

మ. అరవిందంబులకంటెఁ గోమలములై యందంబులై యున్న నీ
చరణంబుల్ కఠినంబులై మొనయు మా చన్నుంగవల్ మోవఁగా
నెరియంబోలు నటంచుఁ బొక్కుదుము నీ యీ కర్కశారణ్య భూ
పరి సంచారము కృష్ణ! నీ ప్రియలకుం బ్రాణవ్యథం జేయదే! 1054

* అచ్యుతా! జలజములకంటె సుకుమారములై, సుందరములై ఒప్పుతున్న నీ యడుగులు బిరుసులైన మా కుచాల ఒత్తిడికి కందిపోతాయని కుందుతాము. అటువంటి పాదాలతో కఠినములైన కానన భూములలో నీవు సలిపే సంచారం నీప్రియురాండ్రమైన మాకు ప్రాణాంతకమైనంత వంత కలిగిస్తుంది.

క. కట్టా! మన్మథు కోలలు, నెట్టన నో నాఁట బెగడి నీ పాదంబుల్
పట్టికొనఁగ వచ్చిన మము, నట్టడవిని డించి పోవ న్యాయమె? కృష్ణా! 1055

*మాధవా! మన్మథుని బాణాలు నివారింపరానివై మమ్ము పీడించగా భయపడి నీ కాళ్ళు పట్టుకోడానికి వచ్చాము. ఇలాంటి మమ్ము నట్టడవిలో ఇట్టే వదలిపెట్టి వెళ్ళడం నీకు ధర్మమా?

**క. హృదయేశ్వర! మా హృదయము, మృదుతరముగఁ జేసి తొల్లి మిక్కిలి; కడ నీ**
**హృదయము కఠినము చేసెను, మదీయ సౌభాగ్య మిట్టి మందము గలదే? 1056**

* ప్రాణేశ్వరా! మా చిత్తాలను మిక్కిలి మెత్తనివిగా చేసి నీమనసును కడకు కర్కశం కావించిన మా మందభాగ్యాన్ని ఏమనుకోవాలి?

**ఉ. క్రమ్మి నిశాచరుల్ సురనికాయములన్ వడిఁ దాఁకి వీఁక వా**
**లమ్ముల తెట్టెముల్ వఱప నడ్డము వచ్చి జయింతు వండ్రు; ని**
**న్నమ్మిన ముగ్ధలన్ రహితనాథల నక్కట! నేఁడు రెండు మూఁ**
**డమ్ముల యేటుకాఁ డెగవ నడ్డము రాఁ దగదే కృపానిధీ! 1057**

* కరుణానిధీ! రక్కసులు ఒక్కపెట్టున చెలరేగి దేవతాసమూహాల నెదిర్చి పట్టుదలతో వారిపై వాడి శరాలు గుప్పిస్తుంటే అడ్డుపడి రాక్షసులను శిక్షిస్తావని పెద్ద లంటారే. మరి మేము నిన్ను నమ్ముకున్న ముద్దియలం. పతులను పరిత్యజించి వచ్చిన పడతులం. అయ్యో! ఇట్టి మమ్ము తుంటవిలుకాడు వెంటాడగా అడ్డుపడవేమి స్వామీ?

**క. తియ్యవిలుకాఁడు డీకొని, వ్రయ్యలుగాఁ దూఱనేసె వనితల మనముల్**
**వియ్యాన నింక నయినం, గు య్యాలింపం గదయ్య గోవింద! హరీ! 1058**

* ఓ గోవిందా! ముకుందా! ఇంచువిలుకాడు ఎదిరించి మా గుండెలు దూరేటట్లు శస్త్రాలు ప్రయోగించాడు. మన పరస్పర సంబంధాన్ని భావించి యికనైన మా మొరాలకించరాదా?

**మ. అని యిట్లంగన లంచితస్వరముతో నంకించుచుం బాడుచుం**
**దను 'రావే' యని చీరి యేడువ జగత్రాణుండు త్రైలోక్య మో**
**హనుఁడై మన్మథ మన్మథుం డయి మనోజ్ఞాకారియై హారియై**
**ఘనపీతాంబరిధారియై పొడమెఁ దత్కాంతాసమీపంబునన్. 1059**

* ఈ విధంగా ఆ కాంతలు మధురమైన కంఠస్వరంతో కృష్ణుని గుణాలను స్తుతిస్తూ, పాడుతూ, "ప్రియతమా, రమ్ము" అని విలపించగా లోకాలను రక్షించే ఆ పరమాత్ముడు త్రిజగన్మోహనుడై మన్మథ మన్మథుడై, సుందరస్వరూపుడై, మనోహరములైన హారములు ధరించి పచ్చని పట్టుపుట్టము గట్టి వారిముందు సాక్షాత్కరించాడు.

**క. వచ్చిన వల్లభుఁ గనుఁగొని, విచ్చేసె నటంచు సతులు వికసితముఖులై**
**యచ్చుగ ప్రాణము లొడలికి, వచ్చిన నిలుచుండు నవయవంబుల భంగిన్. 1060**

* అలా వచ్చిన మనోహరుణ్ణి చూచి తమ రమణుడు విజయం చేసినాడని ఆ వెలదులు వికసించిన మోములు గలవారై, పోయిన ప్రాణాలు మరల వచ్చిన దేహేంద్రియములవలె లేచి నిలువబడినారు.

సీ. అబల యొక్కతె భక్తి నంజలి గావించి ప్రాణేశు కెంగేలు వట్టికొనియె
నింతి యొక్కతె జీవితేశ్వరు బాహువు మూఁపున నిడికొని ముదము నొందె
వనిత యొక్కతె తన వల్లభు తాంబూల చర్వితం మాత్మహస్తమునఁ దాల్చెఁ
బడఁతి యొక్కతె ప్రియుపదములు విరహాగ్ని తప్తకుచంబులఁ దాపుకొనియె

ఆ. భామ యొకతె భ్రుకుటిబంధంబు గావించి, ప్రణయభంగ రోషభాషణమున
దష్టదశన యగుచు దండించు కైవడి, వాఁడి చూడ్కిఁగముల వరునిఁ జూచె. 1061

* ఒకపడతి భక్తితో దోసిలొగ్గి జీవితనాథుని ఎర్రని హస్తాన్ని పట్టుకుంది. మరొక పల్లవపాణి ప్రాణవల్లభుని బాహువు తన మూపుపై వైచుకుని మురిసిపోయింది. వేరొక వనిత తనప్రియుడి తాంబూల చర్వితాన్ని తన చేతితో అందుకుంది. ఇంకో సరోజముఖి రమణుని చరణాలు వియోగాగ్నిచే ఉడికిపోతున్న తన ఉరోజాలపై ఉంచుకుంది. మరొక మగువ కనుబొమలు ముడిచి ప్రణయభంగం కావించడంవల్ల కినుక గదిరిన మాటలతో, పెదవి కొరుకుతూ, కొట్టే దానివలె వరుణ్ణి చురుకు చూపులతో చూచింది.

క. హరిముఖకమలముఁ జూచుచుఁ, దరుణి యొకతె ఱెప్పలిడక తనియక యుండెన్
హరిపదకమలముఁ జూచుచు, మరగి తనివి లేని సుజను మాడ్కి నరేంద్రా! 1062

* ఓ పరీక్షిన్నరేంద్రా! ఇంకొక సుందరి నందకిశోరుని చరణకమలం సందర్శిస్తూ రుచిమరిగి సంతృప్తి పొందని సత్పురుషునివలె అట్లే రెప్పవ్రాల్చక యదుకిశోరుని వదనపద్మాన్ని అవలోకిస్తూ తనివి పొందలేదు.

ఉ. ఒక్కలతాంగి మాధవుని యుజ్జ్వలరూపము సూడ్కితీవలం
జిక్కఁగఁ బట్టి హృద్గతముఁ జేసి వెలిం జనకుండ నేత్రముల్
గ్రక్కున మూసి మేనఁ బులకంబులు గ్రమ్మఁగఁ గౌఁగిలించుచుం
జొక్కములైన లోచవులఁ జొక్కుచు నుండెను యోగికైవడిన్. 1063

* ఒక తీవబోడి దేదీప్యమానంగా వెలుగొందే గోపాలుని రూపాన్ని చూపులనే తీగలచే బంధించింది. తన హృదయంలోనికి జొనిపి మళ్ళీ ఆ రూపం వెలుపలికి వెళ్ళకుండా తటాలున కండ్లు మూసుకుంది. తనువున గగుర్పాటు గదురగా ఆలింగనం చేసుకుంటూ యోగి మాదిరి సొంపైన లోచవులతో సొక్కిపోయింది.

సీ. ఎలయించి ప్రాణేశ! యెందుఁ బోయితి వని తోరంపు టలుకతో దూఱె నొకతె
జలజాక్ష! ననుఁ బాసి చనఁగ నీ పాదంబు లెట్లాడెనని వగ నెయిదె నొకతె;
నాథ! నీ వరిగిన నాప్రాణ మున్నది కూర్మియే యిది యని కుందె నొకతె
యీశ్వర! నను నిన్ను నిందాఁకఁ బాపెనే పాపపు విధియని పలికె నొకతె

ఆ. తలఁగి పోవునట్టి తప్పేమి సేసితి?, నధిప! పలుకు ధర్మ మనియె నొకతె
యేమినోము ఫలమొ హృదయేశ! నీమోము, మరలఁగంటి ననుచు మసలె నొకతె. 1064

* "ప్రాణేశ్వరా! నన్ను మోసగించి ఎక్కడికి వెళ్ళినావు?" అని ఒక అన్నులమిన్న మిక్కిలి కినుకతో వెన్నుని నిందించింది. "కమలనయనా! నను వీడి వెళ్ళడానికి నీకు కాళ్ళు ఎలా ఆడినాయి?" అని ఒక వనిత వాపోయింది. "నాథా! నీవు ఏగినప్పటికీ ఇంకా ప్రాణంతోనే ఉన్నానే; స్నేహమంటే ఇదేనా!" అని ఒక ఇంతి చింతించింది. "ప్రియతమా! ఇంతదనుక పాపపుదైవం మన పొత్తెడబాపె గదా!" అని ఒక చెలువ పలవించింది. "వల్లభా! నను బాసిపోయేటంత తప్పు నేనేమి చేశానో చెప్పు. నీ కిది న్యాయమా?" అని ఒక పడతి అడిగింది. "జీవితేశ్వరా! నా నోముల ఫల మెట్టిదో మళ్ళీ నీముఖ సందర్శనం నాకు లభించింది" అని ఒక తెరవ పరవశించింది.

**క. 'పలికినఁ బ్రతిజ్ఞ దప్పెడిఁ, బలికించినఁ గాని రమణుఁ బలుక' నటంచుం**
**గలకంఠి యొకతె చెలితోఁ, బలుకుల నమృతములు గురియు పగిదిం బలికెన్. 1065**

* కమ్మని కంఠస్వరం గల ఒకచాన "నేను ముందుగా తనతో మాట్లాడితే నా చేసిన ప్రతిజ్ఞ తప్పిపోతుంది. ప్రియుడు పలుకరిస్తేనే కాని పలుకను" అంటూ పలుకులలో అమృత మొలికేటట్లు తన చెలితో పలికింది.

**క. పట్టినఁ గాని మనోవిభుఁ బట్టఁ గదా? యంచు నొక్క బాలిక సఖి చే**
**పట్టుకొని చెప్పె ధైర్యము, పట్టెల్లను మరుని టెంకిపట్టుగ నధిపా! 1066**

* పరీక్షిన్మహారాజా! ఒక నెరజాణ "ప్రాణవిభుడు నన్ను తాకనిచో నేను అతణ్ణి తాకను గదా!" అని ఒక చెలిచేయి పట్టుకొని చెప్పింది. కాని ఆమె ధైర్యమంతా కడకు మన్మథు డెగుర గొట్టినాడు.

**క. చెలువుఁడు సెప్పక పోయిన, సొలపున నొకముగ్ధ మున్ను చూడ ననుచు నౌ**
**దల వంచి యుండఁ జాలక, తల యెత్తెను లోన మరుఁడు దలయెత్త నృపా! 1067**

* పరీక్షిన్మహారాజా! విను. ప్రియుడు తనకు చెప్పకుండా వెళ్లినాడనీ, అందుచే తాను ముందుగా అతనిని చూడననీ వైముఖ్యం వహించిన ఒక అమాయకురాలు తన హృదయంలో మరులు సందడింపగా అట్లే తలవంచుకొని ఉండలేక తలపైకెత్తి చూచింది.

**వ. ఇవ్విధంబున. 1068**

**క. హరిసురుచిర లలితాకృతిఁ, దరుణులు గని ముక్తవిరహ తాపజ్వరలై**
**పరమోత్సవంబు సలిపిరి, పరమేశ్వరుఁ గనిన ముక్తబంధుల భంగిన్. 1069**

* ఈ రీతిగా భగవంతుణ్ణి దర్శించి భవబంధాలనుంచి విముక్తి పొందిన భాగవతుల లాగా నందనందనుని ఉజ్జ్వలసుందరాకారం సందర్శించి ఆ గోపకామినులు విరహంవల్ల జనించిన తాపజ్వరం త్యజించినవారై పరమానందభరిత లైనారు.

**వ. అంత న క్కాంతుండు గాంతాజనపరిక్రాంతుడై వనాంతరంబున శక్తినికర సంయుక్తుండైన పరమ పురుషుండునుంబోలె వారలం దోడ్కొని మందారకుందకుసుమ పరిమళ మిళిత పవమాన మానిత**

**మధుకర నికర ఝుంకార సుకుమారంబును, శరత్కాల చంద్రకిరణ సందోహ సందళితాంధకారంబును, యమునా తరంగసంగత కోమల వాలుకాస్ఫారంబునునై యమలినంబైన పులినంబు ప్రవేశించె. వారును జ్ఞానకాండంబున నీశ్వరుం గని విరహవేదనలు విడిచి పరిపూర్ణమనోరథలై. 1070**

* అప్పుడు బృందావనంలో గొల్లపడతుకలు తనచుట్టూ బలసి కొలువగా శ్రీకృష్ణుడు శక్తినికరములు పరివేష్టించిన పరమాత్మవలె ప్రకాశించాడు. వాసుదేవుడు ఆ వ్రజసుందరులను వెంటనిడుకొని మందార సుమసౌరభంతో, మొల్లపువ్వుల నెత్తావితోగూడిన మందమారుతములకు మూగి మృదువుగా జుంజుమ్మని రొదచేస్తున్న తుమ్మెద తుటుము గలదీ, శరత్కాల చంద్రకిరణ సమూహాలచే చెదరగొట్టబడిన చీకటులు గలదీ, యమునానదీ తరంగాలచే సంతరింపబడిన మెత్తని ఇసుకచే ఎసలారేదీ, స్వచ్ఛమైనదీ అయిన సైకతస్థలానికి చేరినాడు. అక్కడ గోపికలు జ్ఞానోదయంచే పరమాత్మను దర్శించి కృష్ణవిరహం వల్ల కలిగిన తాపం పోగొట్టుకొన్నారు. వారి కోరికలన్నీ చక్కగా నెరవేరాయి.

**క. పాఠీన నయన లెల్ల న, కాఠిన్య పటాంచలములఁ గౌతుకములు హృ**
**త్పీఠముల సందడింపఁగఁ, బీఠముఁ గల్పించి రంతఁ బ్రియునకు నధిపా! 1071**

* చేపలవంటి కన్నులు గల ఆ అన్నుల మిన్నలు హృదయసీమలలో ఉబలాటం మెండుకోగా ప్రియునకు తమ మెత్తని పయట చెరగులచేత ఆసనం కల్పించారు.

**ఆ. పరమయోగిహృదయ భద్రపీఠంబుల, నుండు మేటి వ్రజవధూత్తరీయ**
**పీఠమున వసించి పెంపారెఁ ద్రిభువన, దేవి లక్ష్మి మేనఁ దేజరిల్ల. 1072**

* యోగీశ్వరుల హృదయములు అనే సుఖాసనములందు అధివసించే ఆ పరమాత్ముడు ముల్లోకాల సౌందర్యలక్ష్మి తన మేన ఉద్దీపించగా గొల్లముద్దియలు పయ్యెదకొంగులతో కల్పించిన శయ్యమీద ఆసీను డయ్యాడు.

**మ. మదనోద్దీపకుఁడైన నాథునికి సమ్మానంబు గావించుచున్**
**ముదితల్ హాసవిలోకవిభ్రమములన్ మోదించుచుం జేరి త**
**త్పదముల్ హస్తతలంబులం బిసుకుచుం బైముట్టుచున్ దూఱుచుం**
**జదురుల్ వల్కుచుఁ గూర్మి నిట్లనిరి యీషత్కోపదీప్తాస్యలై. 1073**

* ఆ ముద్దరాండ్రు మరులు రెక్కొల్పుతున్న వల్లభుణ్ణి ఆదరిస్తూ, నగవుతో కూడిన చూపుల సింగార మొలకబోస్తూ సంతోషంతో చుట్టూచేరి, ఆయన పాదాలను తమ చేతులతో ఒత్తుతూ, ఆయనను స్పృశిస్తూ, తూలనాడుతూ, సూటిపోటు మాటలాడుతూ ఇంచుక కోపం దీపిస్తున్న మోములు గలవారై ప్రేమతో ఇట్లా అన్నారు.

**క. 'కొలిచినఁ గొలుతురు కొందఱు, గొలుతురు దముఁ గొలువకున్నఁ గొందఱు పతులం**
**గొలిచినను గొలువకున్నను, గొలువరు మరికొంద ఱెలమి గోపకుమారా!' 1074**

* నందనందనా! కొందరు తమ్ము కొలిచిన వారినే కొలుస్తారు. మరికొందరు తమ్ము కొలువని వారిని సైతం కొలుస్తారు. ఇక కొందరు సంతోషంతో తమ్ము కొలిచే వారినీ, కొలువని వారినీ కూడా కొలువరు. (ఇందు నీ వే తెగకు చెందిన వాడివో వివరించు.)

**వ. అని త న్నుద్దేశించి రహస్యంబుగాఁ బలికిన సుందరుల పలుకులు విని గోపాల సుందరుం డిట్లనియె.1075**

* ఈలా తన్నుగూర్చి నర్మగర్భంగా పలికిన ఆ సౌందర్యవతుల మాటలు విని వ్రజసుందరుడు ఇట్లా అన్నాడు.

**సీ. 'కొలిచినఁ గొలుతురు కొందఱు పశువుల భజనము భంగిని ఫలము కొఱకు**
**నై; సఖ్యధర్మములందుఁ సిద్ధింపవు కొందఱు తండ్రుల గుణముఁ దాల్చి**
**దయ గలవారలు తగిన సుహృత్తులు గొలువని వారలఁ గొల్తు రెపుడు**
**ధర్మకామంబులు దనరంగఁ గొందఱు కొలువని వారిని గొలుచువారిఁ**

**ఆ. గొలుచు తలఁపులేమిఁ గొలువ రాత్మారాము, లాప్తకాము లజ్ఞు లతికఠినులు**
**వారియందుఁ బిదపవానిఁగాఁ జింతించి, యే లతాంగులార! యిట్టు లనుట. 1076**

* ఓ తీవ బోడులారా! పశువులను ఫలాపేక్షతో కొలిచిన విధంగా కొలిచిన వారినే కొందరు కొలుస్తారు. వారు స్వప్రయోజనం మాత్రమే కాంక్షించేవారు. వారికి స్వార్థం మీదనే కన్ను. కొలిస్తేనే తిరిగి కొలవడం స్నేహం అనిపించుకోదు. ధర్మ అని పించుకోదు. ఇక కొందరు దయగలవారు, మంచి మనసు గలవారు. తండ్రులు తమ కొమాళ్ళను వలె తమ్ము కొలువనివారిని గూడా కొలుస్తారు. వారికి గల స్నేహధర్మాలు ప్రతిఫలాపేక్షలేనివి. మరికొందరు కొలిచే ఉద్దేశం లేనందున తమ్ము కొలిచే వారినీ, కొలవనివారినీ కూడా కొలవరు. వారు ఆత్మయందే రమించువారు. ఆప్తకాములు- భోగేచ్ఛ లేనివారు. మరికొందరు చేసిన మేలు మరుచువారు; మిక్కిలి కఠినులు. వీరిలో నన్ను కడపటితెగకు చెందినవానిగా నెంచి మీరు ఇట్లంటున్నారు. అవునా?

**క. ఏ నిం దెవ్వఁడ నయినం, గా నంగనలార! పరమకారుణికుండన్**
**మానసబంధుఁడ నిత్య, ధ్యానము మీ కొసఁగవలసి తలఁగితిఁ జుండీ! 1077**

* మెలతలారా! మీరాడిన వారిలో నేను ఎవ్వడనూ కాను. నేను మిక్కిలి కరుణ గలవాణ్ణి, మీకు ఆత్మబాంధవుణ్ణి. నా యెడ మీకు అవిరతమైన ధ్యానం సమకూర్చడానికని కనుమరుగైనాను.

**మ. నను సేవించుచునున్న వారలకు నే నా రూపముం జూపఁ; జూ**
**చినఁ జాలించి మదించి వారు మఱి నన్ సేవింపరో యంచు; ని**
**ర్ధనికుం డాత్మధనంబు సెడ్డ నెపుడుం దత్పారవశ్యంబుఁ దా**
**ల్చిన భంగిన్ ననుఁ బాసి మత్ప్రియుఁడు దాఁ జింతించు నా రూపమున్. 1078**

* ప్రత్యక్షంగా నన్ను దర్శిస్తే అంతతో గర్వించి నన్ను సేవించరని కొలిచేవారికి నారూపం చూపించను. దరిద్రుడు తనకున్న డబ్బు పోయినప్పుడు తదేకచింతలో మునిగినట్లు నేను అగపడకుండా ఉంటేనే నన్ను కోరేవారు నా రూపాన్ని ధ్యానిస్తూ ఉంటారు.

తరలము:

తగవు ధర్మముఁ జూడనొల్లక తల్లిదండ్రుల బంధులన్
మగల బిడ్డలఁ బాసివచ్చిన మన్నిషక్తల మిమ్ము నేఁ
దగదు; పాసితిఁ దప్పు సైపుఁడు; తద్వియోగభరంబునన్
వగలఁ బొందుచు మీర లాడిన వాక్యముల్ వినుచుండితిన్. 1079

* నా యందు మీ మనస్సులను లగ్నంచేసి న్యాయమూ, ధర్మమూ పాటించక మీ తలిదండ్రులనూ, చుట్టాలనూ, పతులనూ, బిడ్డలనూ వదలి నా కడకు వచ్చారు. మీకు వియోగవ్యథ కలిగించాను. నా చేసిన తప్పును మన్నించండి. నా విరహవేదనతో ఎంతో నొగిలిన మీరు ఆడిన మాటలు వింటూనే ఉన్నాను.

ఉ. పాయని గేహశృంఖలలఁ బాసి నిరంతర మత్పరత్వముం
జేయుచు నున్న మీకుఁ బ్రతిసేయ యుగంబులనైన నేర; నన్
బాయక కొల్చు మానసము ప్రత్యుపకారముగాఁ దలంచి నా
పాయుటఁ దప్పుగాఁ గొనక భామినులార! కృపన్ శమింపరే!' 1080

* ఓ భామలారా! వీడరాని సంసారమనే సంకెళ్ళను వీడి నా యందే ఎడతెగక మనస్సు లీన మొనర్చిన మీకు, యుగపరిమాణం గల దీర్ఘకాలం చెల్లిపోయినా ప్రత్యుపకారం చేయలేను. నేను మిమ్మెడబాయుట కృతజ్ఞత లేనందున కాదు. నన్ను నిరంతరం మీరు స్మరించడం కోసమే. ఇదే మీకు నే నొనర్చిన ప్రత్యుపకారంగా నెంచి మిము బాసిన దొక తప్పుగా తలంచబోకండి! నామీది కరుణతో ఓర్చుకొనండి.

క. చక్కగ హరి యిటు పలికిన, చక్కని వాక్యముల నతని సంగమమున లో
నిక్కిన వియోగతాపము, లొక్కట విడిచిరి లతాంగు లుర్వీనాథా! 1081

* మహారాజా! ఇలా చక్కగా పలికిన మాధవుని మాటలు విని ఆయన కలయికచే ఎదలో నెలకొన్న విరహతాపాన్ని గోపకాంతలు ఒక్కసారిగా వదలిపెట్టినారు.

## -: రాసక్రీడాభివర్ణనము :-

ఉ. ఆ సమయంబునన్ విభు డనంతుఁడు గృష్ణుఁడు చిత్రమూర్తియై
చేసెను మండలభ్రమణశీల పరస్పరబద్ధబాహు కాం
తా సువిలాసమున్ బహువిధ స్ఫురితానన హస్త పాద వి
న్యాసము రాసముం గృతవియచ్చరనేత్ర మనో వికాసమున్. 1082

* ఆ శరత్కాలంలో అంతర్యామీ, అంతములేనివాడూ అయిన ఆ శ్రీకృష్ణుడు చిత్రాకారుడై రమణీ మణులతో రాసక్రీడ సలపడానికి ఆరంభించాడు. గోపికలు గోవిందుని చుట్టూ వలయాకారంగా ఏర్పడి ఒకరి చేతులు ఒకరు సవిలాసంగా పట్టుకొని తిరిగినారు. పలురీతుల స్ఫురించే ముఖవిన్యాసాలతో, హస్త విన్యాసాలతో, పాద విన్యాసాలతో ఆ రాసగోష్ఠి భాసిల్లింది. తిలకిస్తున్న ఖేచరుల లోచనాలకూ, మనస్సులకూ అది ఆనందాన్ని సమకూర్చింది.

వ. ఇట్లు బహుగతులం దిరుగ నేర్పరి యగు హరి దర్పించి తన యిరుగెలంకుల నలంకృతలయి కళంక రహిత చంద్రవదన లిద్దఱు ముద్దియ లుద్దిగొని వీణ లందుకొని వీణలం బ్రవీణలై, సొంపుమెఱసి యింపుగ వాయించుచు నానందలహరీ నిధానం బగు గానంబు సేయ నవిరళంబై తరళంబుగాని వేడుక సరళంబగు మురళంబు లీలం గేల నందుకొని మధురంబగు నధరంబునం గదియించి మించి కామినీజన కబరికా సౌగంధిక గంధ బంధుర కరాంగుళీ కిసలయంబులు యతిలయంబులం గూడి వివరంబుగ మురళీవివరంబుల సారించి పూరించుచు సరిలేని భంగిం ద్రిభంగియై కమలకర్ణికాకారంబున నడుమ నిలిచి, మఱియు గోపసుందరు లెంద ఱందఱకు నందఱయి సుందరుల కవలి యెడలం దానును దన కవలియెడల సుందరులును దేజరిల్ల, నృత్తవిద్యా మహార్ణవ వేలావలయ వలయితంబై, విస్మితాఖండలంబైన రాసమండలంబుఁ గల్పించి, వేల్పులు హర్షంబునం గుసుమవర్షంబులు గురియ నందుఁ బ్రసూన మంజరీ సహచరంబులైన చంచరీకంబుల మించు ప్రకటించుచు సువర్ణమణి మధ్యగంబులైన మహేంద్రనీలంబుల తెఱంగు నెఱపుచుఁ, గరిణీవిహార బంధురంబులైన సింధురంబుల చెలువుఁ గైకొనుచుఁ బల్లవిత కుసుమిత లతానుకూలంబులైన తమాలంబుల సొబగు నెగడించుచు మెఱపుఁదీవల నెడ నెడం బెడం గడరు నల్ల మొగిళ్ళ పెల్లు సూపుచు, తరంగిణీ సంగతంబు లయిన రోహణాచల శృంగంబుల బాగు లాలించుచు, జగన్మోహనుండై యుండి రక్తకమలారుణంబులును, జంద్రశకల నిర్మల నఖర సంస్ఫురణంబులును, శ్రుతినితంబినీ సీమంత వీథికాలంకరణంబులును, సనక సనందనాది యోగీంద్ర మానసాభరణం బులును నయిన చరణంబులు గదియ నిడి సమస్థితి నంజలిపుటంబులం బుష్పంబు లుల్లసిల్లఁ జల్లి, సల్లలిత కమలప్రశస్తంబు లయిన హస్తంబులు వల్లవీజనుల కంఠంబులపై నిడి, తాను గీతానుసారంబగు విచిత్ర పాదసంచారంబులు సలుపుచు, వర్తులాకార రాసబంధంబుల వర్తనంబునం బ్రవర్తించి, వెండియు వ్రేతలుం దానును శంఖ పద్మ వజ్ర కందుక చతుర్ముఖ చక్ర వాళ చతుర్భద్ర సౌభద్ర నాగ నంద్యావర్త కుండలీకరణ ఖురరీబంధ ప్రముఖంబు లయిన విశేష రాసబంధంబులకుం జొచ్చి యేకపాద సమపాద వినివర్తిత గతాగత వలిత వైశాఖ మండల త్రిభంగి ప్రముఖంబులైన తానకంబుల నిలుచుచుఁ, గనకకింకిణీ మంజులమంజీర శింజనంబులు జగజ్జనకర్ణ రంజనంబులై చెలంగ; ఘటిత మర్దిత పార్శ్వగ ప్రముఖంబులైన పాదకర్మభేదంబులు సేయుచు, సమపాద శకటవదన మతల్లీశుక్తి ప్రముఖంబులైన పార్థివచారి విశేషంబులును నపక్రాంత డోలాపాద సూచీ ప్రముఖంబులైన వ్యోమచారి విశేషంబులనుం జూపుచు, సురేంద్రశాఖి శాఖామనోహరం బులును, నపహసిత దిక్కరీంద్ర కరంబులును, ద్రిలోక క్షేమంకరంబులును నగు కరంబులం దిరంబులగు రత్న కటకంబుల మెఱుంగులు నింగి చెఱంగులం దఱచుకొన నర్ధచంద్ర కర్తరీముఖ కపిత్థ కటకాముఖ శుకతుండ లాంగూల పద్మకోశ పతాక ప్రముఖంబులైన స్వస్వభావ సూచక నానావిధకరభావంబు లాచరించుచుఁ గటినిబద్ధ సువర్ణ చేలాంచల ప్రభానికరంబులు సుకరంబులై దిశాంగనా ముఖంబులకు హరిద్రాలేపన ముద్రాలంకారంబు లొసంగుచు, నాస్కందిత భ్రమరశకటాసన ప్రముఖంబులైన జానుమండల భేదంబులును, నలాత దండలాత లలిత విచిత్ర ప్రముఖంబులైన

దైవమండలంబులు నొనర్చుచుఁ గమనీయ కంబుకంఠాభిరామంబులు నుద్దామతేజ స్తోమంబులునైన నీలమౌక్తిక వజ్రవైదూర్య దామంబుల రుచు లిందిరాసుందరీ మందిరంబు లయి సుందరంబులైన యురంబులం దిరుగుడువడి కలయంబడ నగాంతర వాహ్యాలగ్నచ్ఛత్ర ప్రముఖంబులైన భ్రమణ విశేషంబుల విలసించుచు, నిద్దంబులగు చెక్కుటద్దంబుల నుద్దవిడిం దదయుం బ్రభాసిత చంద్రమండలంబులందు కుండలంబుల మెఱుంగు మొత్తంబులు నృత్యంబు లొనరింపఁ గటిభ్రాంత దండరచిత లలాట తిలక మయూర లలిత చక్రమండల నికుంచిత గంగావతరణ ప్రముఖంబులైన కరణంబు లెఱింగించుచు, వెలిదమ్మివిరుల సిరులఁ జెన్ను మిగులు కన్నుల వలన దీనజనదైన్య కర్కశంబులై తనరు కటాక్షదర్శన జాలంబులు జాలంబులై కామినీజన నయనమీనంబుల నావరింప లలితకుంచిత వికాసముకుళ ప్రముఖంబు లయిన చూడ్కులం దేజరిల్లుచు, ననేక పరిపూర్ణ చంద్రసౌభాగ్య సదనంబులగు వదనంబులఁ బ్రసన్న రాగంబులు ప్రకటించుచు, నుదంచిత పింఛ మాలికా మయూఖంబు లకాలశక్రచాపంబుల సొంపు సంపాదింప, నికుంచి తాకుంచిత కంపి తాకంపిత పరివాహిత పరావృత్త ప్రముఖంబులైన శిరోభావంబులు నెఱపుచు, మృగనాభితిలకంబులు గల నిటలఫలకంబులఁ జికురంబుల నికరంబులు గప్ప, నపరాజిత సూచికావిద్ధ పరిచ్ఛిన్న విష్కంభ రేచిత ప్రముఖంబులగు నంగహారంబుల విలసిల్లుచుఁ, జరణకటికర కంఠరేచకంబు లాచరించుచు నొప్పె; నప్పు డా రాసంబు సంజనితసకల జన మానసోల్లాసకరంబై సుధార్ణవంబునుం బోలె నుజ్జ్వల రసాభిరామంబై, రామరాజ్యంబునుంబోలె రాగపరిపూర్ణంబై, పూర్ణచంద్ర మండలంబునుంబోలెఁ గువలయానందంబై, నందనవనంబునుం బోలె భ్రమరీవిరాజమానంబై, మానధను చిత్తంబునుంబోలెఁ బ్రధానవృత్తి సమర్థంబై, సమర్థ కవివిలసనంబునుంబోలె బహుప్రబంధ భాసురంబై, సురలోకంబు నుంబోలె వసుదేవనందన విశిష్టంబై, శిష్టచరితంబునుంబోలె ధరణీగగన మండలసుందరంబై, సుందరీ రత్నంబునుంబోలె నంగహార మనోహరంబై, హరవధూ నిలయంబునుంబోలె ననేకచారి సుకుమారంబై, సుకుమార వృత్తంబునుంబోలె నుద్దీపితవంశంబై యుండె; నందు. 1083

* ఈ విధంగా పలుపోకలు పోనేర్చిన ఆ పురుషోత్తముడు విజృంభించి రాసక్రీడకు ఉపక్రమించాడు. మచ్చలేని చంద్రబింబాలవంటి ముఖాలు గల ముద్దియ లిద్దరు కైసేసికొని వీణలు చేబూనినారు. వారు వీణావాదనంలో ప్రావీణ్యం కలవారు. సొంపుగా, మది కింపుగా వాయిస్తూ ఆనంద ప్రవాహాన్ని వెల్లిగొలిపే గీతాన్ని గానం చేశారు. కృష్ణుడు ఎడతెగని నిశ్చలమైన వేడుకతో సమ్మోహకమైన మురళిని సవిలాసంగా చేతనందుకున్నాడు. దానిని తన తియ్యని కెమ్మోవికి గదించాడు. గొల్లభామలు కొప్పులలో చెరివికొన్న కలువపూల కమ్మని వాసనలను వీడని తన చిగుళ్ళవంటి చేతివ్రేళ్ళను యతిలయబద్ధంగా ఆ మురళీరంధ్రాల మీద సారిస్తూ పూరించాడు. తామరరేకుల నడుమ దుద్దువలె గోపాంగనా మధ్యంలో అతడు మువ్వంపులతో మురిపె మొలుకుతూ నిలిచాడు.

ఎందరు గోపకాంతలో అందరకూ తానొక్కడే అందరైనాడు. గోపికప్రక్క తానూ, తనప్రక్క గోపికా ఉండేలాగున నిలిచి రాసమండలం కల్పించాడు. అది నృత్తవిద్యా మహాసముద్రానికి చుట్టూ ఏర్పడిన

చెలియలికట్ట చందంగా పొలుపారింది. ఆ రాసమండలం వేయికన్నుల దేవేంద్రుడికి సయితం అచ్చెరువు గొలిపింది. వేల్పులు సంతోషంతో వినువీథినుంచి పూలజల్లులు కురిపించారు. ఆ పూగుత్తులలో తిరుగాడు తుమ్మెదల వన్నియను పురుడిస్తూ పలువురు కృష్ణులు విరాజిల్లినారు. బంగారుమణుల మధ్యనున్న మహేంద్ర నీలమణుల మాదిరి వారు వెలుగొందినారు. ఆడేనుగులతో కలిసి విహరించడంలో ఆసక్తి వహించిన మగయేనుగుల అందాన్ని వారు చిందించినారు. చిగిర్చి పూచిన తీగలతో ఆవరింపబడిన కానుగుచెట్ల అందచందాలను ఆ గోపాలమూర్తులు పుణికిపుచ్చుకున్నారు. మెరుపుతీగలతో కూడిన నీలమేఘాల పోలికను అందుకున్నారు. జలజల ప్రవహించే కొండకాల్వలతో నిండిన రోహిణగిరి శిఖరాల సామ్యాన్ని వారు సంతరించుకున్నారు.

లోకాలను మోహింప జేసే శ్రీకృష్ణుడు ఎర్రదామరలవలె అరుణము లైనవీ, చంద్రఖండాలవలె స్వచ్ఛమగు గోళ్లు గలిగినవీ, ప్రాబలుకు చెలువల పాపటలకు అలంకారమైనవీ, సనక సనందనాది యోగీంద్రుల మనస్సులకు ఆభరణము లైనవీ అయిన తన చరణాలను ఒండొంటితో చేర్చినాడు. అతడు సమంగా నిలిచి దోసిటితో పూలు చల్లినాడు. మిక్కిలి సుందరములై అరవిందములవలె ప్రశస్తములైన తన రెండు హస్తాలనూ తనకు ఈవ లావల నున్న గోపికల మెడలపై నుంచినాడు. పాటకు అనుగుణంగా, అచ్చెరువుగా అడుగులు వేశాడు. వలయాకృతిలో ఉన్న రాస బంధాలలో అతడు నాట్యం కావించాడు. అచ్యుతుడు ఆ గోపకాంతలతో కలిసి శంఖము, పద్మము, వజ్రము, కందుకము, చతుర్ముఖము, చక్రవాళము, చతుర్భద్రము, సౌభద్రము, నాగము, నంద్యావర్తము, కుండలీకరణము, ఖురరీబంధము మొదలైన విశేష రాసబంధాలలో ప్రవేశించాడు.

వారందరూ ఏకపాదము, సమపాదము, వినివర్తితము, గతాగతము, వలితము, వైశాఖము, మండలము, త్రిభంగి మొదలైన భంగిమలతో నిలిచారు. వారి బంగరు చిరుగంటల చప్పుడు, మనోజ్ఞము లైన అందెల రవళి జగమందలి జనుల వీనులకు విందుచేశాయి.

ఆ రాసక్రీడలో వారు ఘటితము, మర్దితము, పార్శ్వగము మొదలైన పాదవిన్యాసాలు ప్రదర్శించారు. సమపాద, శకట, వదన, మతల్లి, శుక్తి ప్రముఖాలైన పార్థివచారి విశేషాలు చూపినారు. అపక్రాంతము, డోలా పాదము, సూచి మున్నగు గగనచారి విశేషాలు ప్రకటించారు. కల్పతరు శాఖలవలె మనోహరాలైనవీ, దిగ్గజముల తుండాలను గేలిచేసేవీ, ముల్లోకాలకూ క్షేమంకరము లయినవారి కరము లందలి రత్నకంకణ కాంతులు అంబరతలం నలుమూలలా వ్యాపించాయి.

వారు అర్ధచంద్రమూ, కర్తరీముఖము, కపిత్థము, కటకాముఖము, శుకతుండము, లాంగూలము, పద్మకోశము, పతాకము మొదలుగా- తమతమ మనోభావాలను సూచించే నానావిధములైన హస్తాభి నయాలను చూపినారు. వారు నడుములందు ధరించిన బంగరుచాయ పట్టువస్త్రాల అంచుల దీప్తులు దిక్కులనే ముగుదల మొగములకు పసుపు పూతలను పూసినాయి. ఆస్కందితము, భ్రమరము, శకటాసనము మున్నుగా గల జానుమండల భేదాలనూ; అలాత, దండలాత, లలిత, విచిత్రాది దైవమండ లాలనూ వారు

ప్రదర్శించారు. రమ్యములైన శంఖాలవంటి మెడలకు అందం సమకూర్చేవీ, మిక్కుటమైన కాంతిపుంజం కలిగినవీ, ఇంద్రనీలములు, వజ్రములు, వైదూర్యములు అనే మణులతో కూర్చబడినవీ అయిన హారాలశోభలు లక్ష్మీనివాస స్థానాలుగా ఉన్న తమ వెడద రొమ్ములపై పరిభ్రమించి చిక్కుపడగా వారు అంగాంతరము, బాహ్యలగ్నము, ఛత్రము మున్నగు భ్రమణ వైఖరులతో విలసిల్లినారు. కాంతిచే చంద్రమండలాన్ని జయించిన కుండల ప్రభలు అద్దములవలె నునుపైన వారి చెక్కిళ్ళపై చౌకళించాయి.

వారు కటిభ్రాంతము, దండరచితము, లలాటము, తిలకము, మయూరము, లలితము, చక్ర మండలము, నికుంచితము, గంగావతరణము మున్నగు కరణము లాచరించారు. తెల్లదామరపూల శోభతో ఒప్పెసగు చూపులు దరిద్రుల దైన్యమును పారదోలుతూ ముగుదల కనులనే చేపలకు వలలై ఆవరింపగా వారు లలితము, కుంచితము, వికాసము, ముకుళము మున్నగు చూడ్కులతో తేజరిల్లినారు. అనేక పూర్ణచంద్రబింబాల అందానికి మందిరాలుగా ఉన్న తమవదనాలలో నిర్మలమైన అనురాగాన్ని వారు ప్రస్ఫుటింప జేశారు. ఒప్పిదములైన నెమలిపురి కాంతులు కాలంగాని కాలంలో ఇంద్రధనువుల సొంపును వెలువరించగా వారు నికుంచితము, ఆకుంచితము, కంపితము, ఆకంపితము, పరివాహితము, పరావృత్తము అనే శిరోభావాలు చూపినారు. కస్తూరితిలకాలు దిద్దిన పలకలవంటి నుదుళ్ళపై అలకలు ఆవరింపగా వారు అపరాజితము, సూచికావిద్ధము, పరిచ్ఛిన్నము, విష్కంభము, రేచితము మొదలైన అంగవిక్షేపాలు ప్రకటించారు. అడుగులు, నడుములు, చేతులు, మెడలు ఆడించారు.

ఈలా ఆ రాసక్రీడ చూపరుల మనస్సులకు ఉల్లాసాన్ని రేకెత్తించింది. అది దీప్తిగల ద్రవంతో అమృత సాగరంవలె, శృంగారరసంతో పొంగారింది. అనురాగభరితమైన రామరాజ్యం విధంగా, శంకరాభర ణాది రాగాలతో నిండిపోయింది. కలువలకు ఆనందం సమకూర్చే నిండు చందురుని చందంగా భూమండలానికి సంతోషాన్ని సంధించింది.

తుమ్మెదల గుంపుతో నందనవనంలాగా భ్రమరం మున్నుగా గల హస్తాభినయ విశేషాలతో అలరారింది. అభ్యుదయంతో గూడిన అభిమానవంతుని మనస్సులాగా ఉత్తరోత్తరాభివృద్ధితో ఒప్పెసలారింది. నానా ప్రకారములైన ప్రబంధాలు కూర్చే చతురుడైన కవి విలాసంలాగా, ప్రకృష్టములైన నాట్యబంధాలతో విలసిల్లింది. వసువులతో, దేవతలతో, నందనవనంతో చెలువారే దేవలోకం తీరున వసుదేవ నందనుడితో పూజనీయమైంది. సదాచారవంతుని నడవడిలాగా అవనీమండలానికీ, ఆకాశమండలానికీ అలంకారమైంది. మేన హారము దాల్చిన మెలతలాగా అవయవముల కదలికతో మనసులు హరించింది. గౌరీనిలయమైన హిమవంతంలాగా నానావిధానాలు గల సంచారాలతో శోభిల్లింది. గుణవంతుడైన కుమారునివల్ల కులం ప్రకాశించినట్లు వేణువిలాసంతో ఆ రాసలీల భాసించింది.

**చ. నడుములు వీఁగి యాడఁ, జిఱునవ్వులు నివ్వటిలంగ, హారముల్**
**సుడివడ, మేఖలల్ వదలఁ, జూడ్కి మెఱుంగులు పర్వ, ఘర్మముల్**

**వొడము౯ గురుల్ చలింప, శ్రుతిభూషణముల్ మెఱయన్ సకృష్ణలై**

**పడ(తుక లాడుచుం జెల(గి పాడిరి మేఘతటిల్లతాప్రభన్. 1084**

* నడుములు జవజవలాడగా, మందహాసాలు క్రందుకొనగా, మెడలోని దండలు మెలివడగా, మొలనూళ్ళు సడలగా, చూపుల నిగ్గులు పొలయగా, చెమటలు క్రమ్మగా, అలకలు చెదరగా, చెవికమ్మలు మెరయగా, ఆ బింబాధరలు నీలిమబ్బుల నడుమ మెరుపు తీగల్లాగా దీపిస్తూ కృష్ణునితో గూడి ఉల్లాసంగా ఆడినారు; పాడినారు.

**క. అంకరహితేందు వదనలు, పంకజలోచనుని౯ గూడి పర(గ నటింపం**

**గింకిణుల నూపురంబుల, కంకణముల మ్రో(త లెస(గె౯ గర్ణోత్సవమై. 1085**

* మచ్చ లేని చందురునివంటి మోములు గల ఆ మచ్చెకంటులు కమలాక్షునితో గూడి చక్కగా నాట్యం సల్పేవేళ, వారి నడుముల చిరుగంటలు, కాలి అందెలు, కరకంకణాలు గల్లుమని మ్రోగుతూ చెవుల పండువు చేశాయి.

**క. హరిణీనయనలతోడను, హరి రాసక్రీడ సేయ నంబరవీథిన్**

**సురనాథులు భార్యలతో, సొరిది విమానంబు లెక్కి చూచి రిలేశా! 1086**

* పరీక్షిన్మహారాజా! విను. లేడికన్నులవంటి కన్నులు గల ఆ అన్నులమిన్నలతో రాజీవాక్షుడు గావించే రాసక్రీడను వినువీథిలో దేవవల్లభులు వారి భార్యలతోగూడి బారులు దీరి విమానా లెక్కి వీక్షించారు.

**క. కురిసెం బువ్వుల వానలు, మొరసెన్ దుందుభులు మింట ముదితలు౯ దారున్**

**సరసన్ గంధర్వపతుల్, వరుసన్ హరి౯ బాడి రపుడు వసుధాధీశా! 1087**

* ఓ రాజా! అప్పుడు పువ్వులవానలు కురిశాయి. గగనతలాన భేరులు మ్రోగినాయి. గంధర్వనాయకులు తమ తరుణులు సరస నుండగా, జనార్దనుని గుణగానం చేశారు.

**క. రామలతోడను రాసము, రామానుజు౯ డాడ౯ జూచి రాగిల్లి మనో**

**రాములమీ(ద వియచ్చర, రామలు మూర్ఛిల్లి పడిరి రాజకులేంద్రా! 1088**

* రాజవంశోత్తమా! గోవిందుడు గోపవధువులతో రాసలీల సలుపుతుండగా చూచి కామపీడితలై ఖేచరభామినులు పారవశ్యంతో తూలి సోలి తమ ప్రాణపతుల మీద వాలిపోయారు.

**క. తారాధిప నిభ వదనలు, తారాధిప వంశ్యు౯ గూడి తారు నటింపం**

**దారలతోడ సుధాంశు(డు, దారును వీక్షింప రేయి దడవుగ జరిగెన్. 1089**

* సోమునితో సమానమైన మోములు గల ఆ గొల్లభామలు చంద్రవంశాన జన్మించిన శౌరితో చేరి నటింపగా, చుక్కలతో గూడి చంద్రుడు ఆ నాట్యాన్ని చూస్తూ ఉండడంచేత రాత్రి ఆలస్యంగా గడచింది.

**మ. యమునా కంకణ చారియై వనజ పుష్పామోద సంచారియై**
**రమణీఘర్మ నివారియై మదవతీ రాసశ్రమోత్తారియై**
**ప్రమదామానస నవ్యభవ్యసుఖ సంపత్కారియై చేరి యా**
**కమలాక్షుం డలరంగ గాలి విసరెం గళ్యాణభావంబునన్. 1090**

* కాళిందీ జలకణాలను చిలుకుతూ, తమ్మిపూల తావులను విరజిమ్ముతూ, చెలువల చెమటల నుడుపుతూ, రమణులకు రాసక్రీడవల్ల గలిగిన బడలికలను బాపుతూ, మగువల మనసుల్లో నూతనమైన సుఖసంపత్తిని సమకూరుస్తూ సారసనేత్రుడు శ్రీకృష్ణుడు సంతోషించేటట్లు మంగళకరంగా మందమారుతం వీచింది.

**వ. అప్పుడు. 1091**

**చ. ప్రమద యొకర్తు మాధవుఁడు పాడ విపంచి ధరించి కేల సం**
**భ్రమమునఁ దంత్రి మీటుచుఁ దిరంబుగ ఠాయము సేసి యొక్క రా**
**గము దగ నాలపించి సుభగస్వరజాతులు వేఱు వేఱు కా**
**నమరఁగఁ బాడెఁ దన్ రమణుఁ డౌనన దారువు లంకురింపఁగన్. 1092**

* ఆ సమయాన ఒక రాజీవాక్షి రమావల్లభుడు పాడుతుండగా వీణను చేతబట్టి సవిలాసంగా తీవలు మీటింది. అతడు మేలు మేలని మెచ్చగా మ్రోళ్ళు చిగురింపగా నిలుకడగా స్వరస్థాయి నందుకొని రాగమొకటి రమ్యంగా ఆలాపించి షడ్జాదులైన స్వరభేదాలూ, జాతులూ కలియబడకుండా పాట పాడింది.

**క. ఆడుచుఁ బాడుచు నందొక, చేడియ మంజీర మంజు శింజిత మమరం**
**గూడి హరికరము సనుఁగవ, పై డాయఁగ దిగిచె జఘనభారాలసయై. 1093**

* ఆ గోపవధువులలో ఒకతె కాలి యందెలు గల్లు గల్లుమని శబ్దింపగా ఆడుతూ పాటపాడుతూ, పిరుదుల బరువుచేత అలసత వహించి అనంతుని హస్తాన్ని లాగి తన చనుదోయిపై నుంచుకుంది.

**క. చందనలిప్తంబై యర, విందామోదమున నొప్పు విపులభుజము గో**
**విందుఁ డొక తరుణిమూఁపునఁ, బొందించిన నది దెమల్చి పులకించె నృపా! 1094**

* ఓ రాజా! పద్మపరిమళం గుబాళిస్తూ మంచిగంధం పూతచే పాలుపారుతున్న తన బలిసిన బాహువును గోవిందు డొక సుందరిమూపుపై నుంచగా అది చలించి గగుర్పాటు వహించింది.

**సీ. చెలువ యొక్కతె చెక్కుఁ జెక్కుతో మోపిన విభుఁడు దాంబూలచర్వితము వెట్టె**
**నాడుచు నొకలేమ యలసినఁ బ్రాణేశుఁ డున్నతదోఃస్తంభ మూఁత సేసెఁ**
**జెమరించి యొకబాల సేరినఁ గొనగోరఁ జతురుఁడు కుచఘర్మజలము వాపె**
**నలకంబు లొక యింతి కలికచిత్రకరేఖ నంటినఁ బ్రియుఁడు వాయంగ దువ్వెఁ**

ఆ. బడఁతి యొకతె పాటపాడి డస్సిన నధ, రామృతమున నాథుఁ డాదరించె
హార మొక్క సతికి నంసావృతంబైనఁ, గాంతుఁ డురముఁ జేర్చి కౌఁగిలించె. 1095

* ఒక చక్కని చుక్క కృష్ణుడి చెక్కిలితో తన చెక్కిలి గదింపగా ఆయన తన పుక్కిటివిడియం దాని చోట నుంచివాడు. ఒక అతివ ఆడుతూ అలసట చెందగా ప్రాణేశ్వరుడు స్తంభంలాగా ఉన్నతమైన తన బాహువును దానికి ఊతగా నొసగినాడు. ఒక ముద్దుగుమ్మ చెమటగ్రమ్మి చెంతకు జేరగా దాని స్తనాలపై క్రందుకొన్న స్వేదబిందువులను ప్రియుడు కొనగోట చిమ్మినాడు. ఒక బాల ఫాలతలంలోని తిలకాని కంటుకున్న ముంగురులను ప్రియుడు పైకి దువ్వినాడు. ఒక పడతి పాటపాడి అలసిపోగా నాథుడు అధరామృత మిచ్చి ఆదరించినాడు. ఒక చెలికి హారం మూపున చిక్కుపడగా దానిని చక్కదిద్ది చెలువుడు కౌగిలించు కున్నాడు.

క. హాసంబులఁ గరతల వి, న్యాసంబుల దర్శనముల నాలాపములన్
రాసశ్రాంతల నా హరి, సేసెన్ మన్ననలు కరుణసేసి నరేంద్రా! 1096

* రాజోత్తమా! చిరునగవులతో, హస్తవిన్యాసాలతో, చూపులతో, రాగాలాపనలతో, రాసకేళియందు బడలిన ముదితలను పరమపురుషుడు కరుణతో ఆదరించాడు.

క. హరితనుసంగ సుఖంబునఁ, బరవశలై వ్రేత లెల్లఁ బయ్యెదలు నిజాం
బరములు నెఱుఁగమి చోద్యమె?, సురసతు లీక్షించి కరఁగి చొక్కిరి మింటన్. 1097

* ఆ అంగనలు అచ్యుతుని అంగసంగమసుఖంచేత ఎంతో పారవశ్యం చెంది పయటలు, కట్టు పుట్టములు జారిపోవడం కూడా తెలియలేక పోయారనడం వింత కాదు. దేవతాంగనలు మాత్రం అంబరతలం నుండి ఆ రాసక్రీడా విలాసమంతా తిలకించి కరగి సమ్మోహిత లయ్యారు.

వ. ఇట్లు భగవంతుండైన కృష్ణుం డాత్మారాముం డయ్యును గోపసతు లెంద ఱందఱకు నందఱై నిజప్రతి బింబంబులతోడం గ్రీడించు బాలుపోలిక రాసకేళి సలిపిన. 1098

* ఇలా భగవంతుడైన శ్రీకృష్ణుడు ఎందరు గోపవధువులో, అందరికీ తానందరై ఆత్మారాముడై నప్పటికీ- బాలుడు తన ప్రతిబింబాలతో ఆడుకునేటట్లు వారితో రాసలీల సాగించాడు.

క. తగఁ గూడి యాడి మనముల, నగెఁ జూచెం బలికె నందనందనుఁ డనుచున్
మగువలు పెద్దఱికముతోఁ బొగడిరి తమ పూర్వజన్మపుణ్యశ్రేణిన్. 1099

* నందకుమారుడు కలసి మెలసి నవ్వుతూ, చూస్తూ, సల్లాపాలు సలుపుతూ మెలగినా డని ఆ యిందుముఖులు తమ పూర్వజన్మ పుణ్యాలను మిక్కిలి శ్లాఘించుకొన్నారు.

## -: జలక్రీడాభివర్ణనము :-

వ. ఇట్లు హరి రాసకేళి సాలించి, కరకాంచితలగు తటిల్లతల చెలువున ఘర్మసలిల కణాక్రాంతలగు కాంతలం గూడి జలక్రీడాకుతూహలుండై యమునా జలంబులు సొర, నందు ముందర సుందరులు సొచ్చి పదప్రమాణంబు, జానుదఘ్నంబు, కటిద్వయసంబు, మధ్యమాత్రంబు, కుచంబులబంటి యని పలుకుచుం గుచ నయన నాభివివర కుంతలంబులు చక్రవాక జలచరావర్త శైవాలంబుల చందంబున నందంబుగ నీడు వొందిన, యేఱులని కళిందనందన గరంబులు సాఁచి పరి రంభం బులకు నారంభించు కైవడి నెదురు చనుదెంచి తాఁకు తరంగంబులకు నులుకుచు, సారసంబులకుం గరంబులు సాఁచుచు, మరాళంబులం జోపుచుఁ, జెన్ను మిగిలిన యన్నుల చన్నుల యెత్తువత్తు మను నెపంబులం దపంబులు నీటఁ గావించు మాడ్కిని సంచరించు చక్రవాకంబులం దోలుచు, నితాంతకాంతి సదనంబులగు వదనంబులకు నోడి వ్రీడం జెంది కంది చందురుండు సలం బుడిగి జలంబునం బడి కంపించుకరణి, నిజకర చలిత జలప్రతిబింబితుండై కదలు చంద్రునిం గని మెచ్చి సోలుచు, సలిలావగాహ సమయ సముచ్చలిత వారిశీకర పరంపరలవలన మకరంద పానమత్త మధుకర పక్ష విక్షేపణ సంజాత వాత సముద్ధూత కుముదాది పరాగపటలంబులం జెఱుచు, మోముఁ దమ్ముల కమ్మఁదనంబునకు మూఁగి, జుమ్మురను తుమ్మెదలకు వెఱచుచుఁ గరంబుల నీ రెగయం జఱచుచు, నీలనీరద నిపతిత పయోబిందు సందోహంబులం దడియు పువ్వుఁదీవియల బాగునఁ గృష్ణకరద్వయ తోయంబులం బెక్కు తోయంబులం దడియుచుఁ, గ్రందుకొని సుడియుచు, నసమబాణుని పులుగడిగిన కుసుమ బాణంబుల పగిది మేనులు మెఱయ సలిలావగాహన పరాయత్త చిత్త లగుచు, మొత్తంబులై సరస భాషణములం ద్రుళ్లుచుఁ, గరంబుల నీరు నించి హరిమీఁదం జల్లుచుఁ, జల్లునెడం దడఁబడన్ దాఁటుచు, దాఁటి చనక నిలువరించుచు వినోదింప, హరియుం గరేణుకర వికీర్ణ నీరధారాభిషిక్తంబగు శుండాలంబు లీల నాభీరకామినీ కరసముజ్ఝిత జలాసారంబులం దోఁగుచు, వ్రజవధూజన హస్తప్రయుక్త కల్హార కైరవ పరాగపటలంబు వలన భూతిభూషణు సిరి వహించుచు, గోపికాజన పాణికిసలయ సమున్ముక్త కమలదళంబుల వలన సహస్రనయనుని రూపుఁ జూపుచు గోపాలబాలికా కుచకలశ కుంకుమ పంకంబు వలనఁ బ్రభాతబాల భానునిభంగి భాసిల్లుచు, ఘోష యోషా కటాక్ష విక్షేపణంబువలన మధుపపరివృత హరిచందన సౌందర్యంబు నొందుచు, వల్లవీహాసరుచుల వలనఁ జంద్రికా ప్రభా భాసిత నీలశైలంబుక్రియ నమరె; నంత. 1100

* ఈ విధంగా గోపతనయుడు రాసలీల చాలించి వడగండ్లతో నొప్పు మెరుపుదీవలవలె చెమట బిందువుల దోగిన ఆ చెలువలతో గూడి జలక్రీడ లాడటానికి ఉబలాటపడ్డాడు. అతడు కాళిందీజలాలలో ప్రవేశించాడు. అతనికన్న ముందుగా గోపాంగనలు యమునలో ప్రవేశించి ఇక్కడ అడుగులోతు; ఇక్కడ మోకాలిలోతు; ఇక్కడ మొలలోతు; ఇక్కడ నడుములోతు; ఇక్కడ రొమ్ముల లోతూ అంటూ ఏటినీటిలోనికి దిగినారు. ఆ చెలువల కుచాలు చక్రవాకాలతో, కండ్లు మీనములతో, బొడ్డు సుడులతో, తలవెండ్రుకలు నాచుతో సరిపోలడంవల్ల వారూ తన వంటివారే అని భావించి కౌగిలించుకోడానికై యమున చేతులు చాచిన విధంగా తరంగాలు ఎదురుగా వచ్చి వారిని తాకినాయి. వారు ఉలికిపడి చూచారు. అక్కడి బెగ్గురు పక్షులను పట్టడానికి ఆ చెలులు చేతులు సాచారు. హంసలను తోలారు. సొబగుమీరిన ఆ సుదతుల

స్తనాలకు సాటి రాగలమని నీటిలో తప మాచరిస్తున్నవో అన్నట్లు అక్కడ సంచరిస్తున్న జక్కవ పిట్టలను వారు తరిమివేశారు. ఆ అన్నుమిన్నల హస్తచలితములైన జలాలలో ప్రతిఫలించిన చుక్కలరాయడు అధికమైన కాంతికి ఆస్పదాలుగా నున్న ఆ నెలతల ముఖాలకు ఓడి సిగ్గుతో వెలవెలబారుతూ, ఈసు విడిచి నీట బడి వణకుతున్నాడో అన్నట్లున్నాడు. అతణ్ణి జూచి వారు పరవశించారు.

తేనె ద్రావి మదించిన తుమ్మెదల రెక్కలగాలికి రేగుతున్న కలువలు మొదలైన పూల పుప్పొడి, వారు నీట మునిగి నపుడు పైకి చెదరిన నీటి తుంపురుల గుంపులవల్ల అణగిపోయింది. తమ ముఖపద్మ సౌరభానికి మూగి ఝంఝుమ్మనే భ్రమరాలను జూచి వారు భయపడ్డారు. అవి పై కెగిరేటట్లు అరచేతులతో నీటిని చరిచారు. నీలిమబ్బులనుండి రాలిన జలధారలవలన పూలతీవలవలె వారు శ్రీకృష్ణుడు దోసిటితో చల్లు నీటివలన పలువిధాలుగా తడిసిపోయారు. గుంపుగూని త్రొక్కిసలాడినారు. మన్మథుని మాలిన్య మెడలిన పుష్పశరాలవలె తళ తళ మెరుస్తున్న మేనులు గల ఆ మెలతలు నీట మునగడానికి ఉబలాటపడ్డారు. వారు సరససల్లాపాలతో త్రుళ్ళిపడుతూ చేతులనిండా నీరు గైకొని తొట్రుపడుతూ నల్లనయ్యమీద చల్లినారు. ఒకరికంటె ఒకరు ముందడుగు వేసి శ్రీకృష్ణుని దాటి వెళ్ళనీక వినోదించారు. ఆడేనుగులు తొండాలచే విరజిమ్మిన నీటి జల్లులలో మదపుటేనుగు మాదిరి శ్రీకృష్ణుడు గోపకామినులు ఎగజిమ్మిన జలధారలచే తడిసిపోయాడు. వ్రజవధూటులు కరాలతో హరిమీదికి ఎర్ర, తెల్ల కలువలు విసరినారు. ఆ పువ్వుల పుప్పొడి నెమ్మేని కంటుకొని ఆయన విభూతి ధరించిన పరమశివునివలె భాసించాడు.

ఆ పూబోండ్లు చిగురుటాకులవంటి చేతులతో తామరపూరేకులు విభుని మీదికి వెదజల్లినారు. అప్పు డాయన వేయికన్నుల వేలుపుదొరలాగా వెలుగొందినాడు. ఆ కాంతలు కుంకుమ పూసిన కుంభాల వంటి కుచాలతో అచ్యుతుని ఆలింగనం చేసుకోగా ఆయన ఉదయకాలమందలి బాలభాస్కరునివలె ప్రకాశించాడు. ఆ పడతులు తమ కడగంటి చూడ్కులు రమణునిమీద ప్రసరింప జేయగా ఆయన తుమ్మెదకదుపులు ముసిరిన పచ్చని గంధపు మ్రాకువలె పరిఢవిల్లినాడు. ఆ మెరుగుబోండ్లు చిరునవ్వు నిగ్గులు చెలికానిపై వెల్లిగొల్పగా ఆయన వెన్నెల వెలుగులచే విలసిల్లు అంజనాద్రివలె రంజిల్లినాడు.

**మ. సతులుం దానును నీటిలో వెడలి భూషాగంధచేలాద్యలం**
**కృతుఁడై కుంభికరేణు యూథములతోఁ గ్రీడించు చందంబునన్**
**లతలందుం దరులందుఁ బుష్పమయ లీలాశయ్యలందున్ సుఖో**
**న్నతుఁడై కృష్ణుఁడు క్రీడలం దనిపె నా నారీలలామంబులన్.** **1101**

* అప్పుడు అతిశయమైన ఆనందంతో నందనందనుడు గోపసుందరీ మణులతో నీటినుండి వెడలివచ్చి సొమ్ములు, మంచిగంధము, వస్త్రములు మొదలైనవి అలంకరించుకున్నాడు. గజరాజు ఆడుగజముల గుంపుతో క్రీడించే విధంగా తీవపొదరిండ్లలో, చిక్కని చెట్ల నీడలలో, చక్కని పూసెజ్జలలో ఆ కన్యారత్నములతో క్రీడించి వారిని సంతోషపెట్టినాడు.

**వ. ఇట్లు శరత్కాలంబున వెన్నుం డింద్రియస్ఖలనంబు సేయక గోపికలతోడ రమించె నని చెప్పిన మునివరునకు భూవరుం డిట్లనియె. 1102**

* ఈ రీతిగా గోవిందుడు ఆ శరత్కాలంలో అస్ఖలితేంద్రియుడై రమణులతో రమించాడు అని చెప్పగా శుకయోగీంద్రునితో పరీక్షిన్మహారాజు ఇట్లా అన్నాడు.

**మత్తకోకిలము**

**ధర్మకర్తయు ధర్మభర్తయు ధర్మమూర్తియు నైన స**
**త్కర్ముఁ డీశుఁడ ధర్మశిక్షయు ధర్మరక్షయుఁ జేయఁగా**
**నర్మిలిన్ ధరమీఁదఁ బుట్టి పరాంగనాజనసంగ మే**
**ధర్మ మంచుఁ దలంచి చేసె? నుదాత్తమానస! చెప్పుమా! 1103**

* మహాత్మా! పరమేశ్వరుడు ధర్మమునకు కర్త; ధర్మమునకు భర్త; ధర్మమే స్వరూపముగా గలవాడు; సత్కర్మ లాచరించువాడు. అతడు అధర్మమును శిక్షించుటకూ, ధర్మాన్ని రక్షించుటకూ అవనిలో అవతరించినవాడు గదా! అట్టి భగవంతుడే మరెట్టి ధర్మమని పరసతులతో సంగమించినాడో దయచేసి నాకు చెప్పవలసింది.

**వ. అనిన శుకుం డిట్లనియె. 1104**

* మహీపతి మాటలు విని శుకు డిట్లనియె.

**ఆ. సర్వభక్షుఁ డగ్ని సర్వంబు భక్షించి, దోషి గాని పగిది దోష మైనఁ**
**జేసి దోషపదముఁ జెందరు తేజస్వు, లగుటఁ జంద్రవాసవాదు లధిప! 1105**

* రాజా! సర్వభక్షకుడైన అగ్ని సమస్తము భుజించికూడా దోషి కాడు. ఇట్లే చంద్రుడూ, ఇంద్రుడూ, మొదలైన తేజస్వంతులు దోషయుక్తములైన కార్యాలు చేసినప్పటికినీ దోషఫలాన్ని పొందరు.

**క. ఈశ్వరుఁడు గానివాఁడు న, రేశ్వర! పరకాంతఁ దలఁచి యెట్లు బ్రదుకు? గౌ**
**రీశ్వరుఁడు దక్క నన్యుఁడు, విశ్వభయదవిషము మ్రింగి వెలయం గలఁడే? 1106**

* రాజోత్తమా! ఈశ్వరులు శాస్త్రవశ్యులు కారు. తమ ఇష్టము ననుసరించి ప్రవర్తిస్తుంటారు. శాస్త్రోక్త ధర్మాలను ఉల్లంఘిస్తుంటారు. వారి కది తప్పుకాదు. ఈశ్వరులు కానివారు పరపత్నులను స్పృశించి బ్రదుకగలరా? గౌరీపతి తప్ప ఇతరుడు లోకభయంకరమైన హాలాహలం మ్రింగి జీవింపగలడా? ఈశ్వరుడు కాలకూటవిషం ఆరగించాడని శాస్త్రవశ్యుడు, కర్మవశ్యుడు అయిన అనీశ్వరుడు అలా చేయగలడా?

**క. సత్యము ప్రభువుల వచనము, నిత్యముఁ దద్వచనవీథి నిలుతురు పెద్దల్;**
**సత్యాసత్యము గావున, సత్య మనుచుఁ జనరు వారిచరితమున నృపా! 1107**

* ఈశ్వరుల వచన మొకటే సత్యం; అదే ప్రమాణం. కాని వారి చేష్టితం కాదు. వారి మాటలనే ఆర్యులు అనవరతం అనుసరిస్తారు గాని ఆచారాన్ని కాదు. ఒకప్పుడు వారిచేష్టితం వారిమాటకు విరుద్ధంగా ఉంటుంది. ఒకప్పుడు అనుకూలంగానూ ఉంటుంది. అనుసరింపవలసి వస్తే వారిమాటకు అవిరుద్ధమైన చర్యనే అనుసరించాలి. వారి చేష్టలన్నీ సత్య మని అనుసరింపగూడదు.

**మ. ఘనులై యెవ్వని పాదపంకజపరాగ ధ్యానసంప్రాప్త యో**
**గ నిరూఢత్వముచే మునీంద్రులు మహాకర్మంబులం బాసి బం**
**ధ నిరోధంబులు లేక విచ్చలవిడిన్ దర్పింతు, రా దివ్య శో**
**భనుఁ డెట్లుండిన నుండెఁగాక! కలవే బంధంబు లుర్వీశ్వరా! 1108**

* రాజేంద్రా! నారాయణుని చరణారవింద పరాగముల ధ్యానయోగ సామర్థ్యంచేత సనక సనందనాదులైన యోగీశ్వరులు కర్మబంధాలు వీడి ఎట్టి కట్టుబాటులు లేక ఇచ్ఛకొలది మెలగుతుంటారని చెపుతుంటారు. అటువంటప్పుడు క్రీడార్థమై శుద్ధసత్త్వమయ శరీరం స్వీకరించిన ఆ దివ్యమంగళ విగ్రహుడు ఎలా నడుచుకుంటే నేమి? ఏమి చేసినప్పటికిన్నీ ఆయనకు బంధాలు లేవు.

**ఆ. గోపజనములందు గోపికలందును, సకలజంతులందు సంచరించు**
**నా మహాత్మునకుఁ బరాంగన లెవ్వరు?, సర్వమయుఁడు లీల సలిపెఁ గాక? 1109**

* గోపాలకులలో గోపికలలో తక్కిన జీవరాసులలో ఎవడు అంతరాత్మయై వ్యవహరిస్తున్నాడో ఆ మహనీయుడికి పరాంగన లెవరు? క్రీడార్థ మవతరించిన ఆ సర్వవ్యాపి- ఇలా క్రీడించినాడే గాని ఇందులో దోషం లేదు.

**వ. అని చెప్పి శుకుం డిట్లనియె నంత బ్రాహ్మముహూర్తంబునం గృష్ణు వీడ్కొని గోపిక లిచ్చ లేకయు నిండ్లకడ కేఁగినం గృష్ణమాయామోహితులై గోపకులు వారలం గోపింపనేరరై రివ్విధంబున. 1110**

* అని చెప్పి శుకయోగి మళ్ళీరాజుతో ఇట్లన్నాడు. తెల్లవారు జామున ఇష్టం లేకున్నా ఎట్లో కష్టంమీద గోపాంగనలు కృష్ణుణ్ణి వదలి తమ యిండ్లకు వెళ్ళినారు. అతని మాయచే భ్రాంతివహించిన గోపాలురు గోపికలను కోపగించుకోలేదు.

**ఇంద్ర వజ్ర**

**గోపాలకృష్ణుండును గోపకాంతల్, ప్రాపించి క్రీడించిన భంగు లెల్లన్**
**రూపించి వర్ణించి నరుండు హృత్సం, తాపంబులన్ బాయును దత్ప్రసక్తిన్. 1111**

* ఈ విధంగా గోపాలకృష్ణుడూ, గోపికలూ రాసక్రీడ సలిపిన సరణిని ఏ పురుషుడు అభివర్ణిస్తాడో, ఆకర్ణిస్తాడో అతడు రాసలీలా ప్రసంగం వల్ల సమస్త మనస్తాపాలనుంచి విముక్తు డౌతాడు.

## -: సర్పరూపియగు సుదర్శనుండను గంధర్వుని శాపవిమోచనము :-

వ. అంత నొక్కనాఁడు నందాదులైన గోపకు లంబికావనంబునకు శకటంబు లెక్కి, జాతరకుం జని సరస్వతీనదీ జలంబుల స్నానంబులుసేసి, యుమామహేశ్వరుల నర్చించి కానిక లిచ్చి, బ్రాహ్మణులకు గో హిరణ్య వస్త్రాన్నదానంబు లొసంగి, జలప్రాశనంబు సేసి, నియమంబున నుండ దైవయోగంబున నాఁకొని యొక్క మహోరగంబు నిదురవోయిన నందునిం గఱచి మ్రింగ నగ్గలింప నతండు 'కృష్ణ కృష్ణే'తి వచనంబులం దన్ను విడిపింపు మని మొఱ యిడిన విని. 1112

* అప్పు డొకరోజు నందుడు మొదలైన గొల్ల పెద్దలు పశుపతిజాతరకై ఎడ్లబండ్ల నెక్కి అంబికావనానికి వెళ్ళారు. వా రక్కడ సరస్వతీనదిలో స్నానం చేసి పార్వతీపరమేశ్వరులను పూజించి కానుక లర్పించారు. విప్రులకు ధేనువులు, బంగారము, వస్త్రాలూ, అన్నమూ దానం చేశారు. తాము నీరుమాత్రమే పుచ్చుకొని నియమంతో ఉన్నారు. అప్పుడు ఆకలిగొన్న ఒక మహాసర్పం దైవికంగా, నిద్రపోతూన్న నందుణ్ణి చుట్టి పట్టుకొని మ్రింగడానికి యత్నించింది. అతడు "కృషా!, కృష్ణా! నన్ను విడిపించు" అంటూ మొరపెట్టుకున్నాడు. ఆయన ఆక్రందనం గోపకు లందరూ విన్నారు.

క. గోపకు లందఱు మేల్కొని, కోపముతోఁ బెద్దగుదెలఁ గొఱవుల మొత్తన్
దాపము నొందియు వదలక, పాపపుఁ బెనుబాము నందుఁ బట్టె నృపాలా! 1113

* రాజా! గొల్లలందరూ మేలుకున్నారు. వారు కోపం వహించి దుడ్డుకర్రలతో కొరవులతో భుజంగాన్ని మోదసాగారు. కాని ఆ మహాసర్పం ఆ కర్రపెట్టులకు బాధ చెందుతున్నదే కాని నందమహారాజును విడువలేదు.

వ. అ య్యవసరంబునఁ గృష్ణుండు దర్పించి పాదతాడనంబు సేసి త్రొక్కిన సర్పంబు సర్పరూపంబు విడిచి విద్యాధరేంద్ర రూపంబుఁ దాల్చి హరికి మ్రొక్కిన నతనికి హరి యిట్లనియె. 1114

* ఆ సమయంలో శ్రీకృష్ణుడు విజృంభించి ఆ సర్పాన్ని కాలితో త్రొక్కి ఒకతన్ను తన్నాడు. వెంటనే అది పాము రూపు విడిచి విద్యాధర నాయకరూపం దాల్చి శ్రీహరికి నమస్కరించింది. మురళీధరుడు ఆ విద్యాధరుడితో ఇట్లా అన్నాడు.

ఉ. మండితమూర్తితోఁ గనకమాలికతో శుభలక్షణుండవై
యుండెడు నీకుఁ గష్టపు మహోరగ దేహ మిదేల వచ్చె? నె
వ్వండవు? నామ మెయ్యది? భవంబున కెద్ది మిషంబు? నాకు నొం
డొండ యెఱుంగఁ జెప్పుము బుధోత్తమ! నీ పని చోద్య మయ్యెడిన్. 1115

* "అలంకృతమైన ఆకారంతో, బంగారు మాలిక ధరించి, శుభలక్షణాలతో సొబగు మీరే నీకు క్రూరమైన ఈ పెనుబాము రూపు ఎందుకు వచ్చింది? నీ వెవరు? నీ పేరేమిటి? ఈ సర్పాకారం సంభవించడానికి కారణ మేమిటి? స్పష్టంగా సమాధానం చెప్పు. నీ చర్య వింత గొలుపుతున్నది."

వ. అనిన వాఁడిట్లనియె: 'దేవా! యేను సుదర్శనుండను విద్యాధరుండ; విమానారూఢుండనై రూపసంపద్గ ర్వంబులం జొక్కి దిక్కులం జరించుచు నొక్కయెడ నాంగిరసులైన ఋషులం గురూపులైన వారలం గని నగిన వారును నీవు రూపదర్పంబున మమ్ము నగితివి; గావున మహాసర్పంబవై యుండు' మని శపించి పిదప నే వేఁడుకొనిన నిట్లనిరి. 1116

* కృష్ణుడి మాటలకు వా డిట్లా అన్నాడు- నేను విద్యాధరుణ్ణి. నాపేరు సుదర్శనుడు. సౌందర్యగర్వంతో దర్పించి విమానమెక్కి దిక్కులలో తిరుగుతుంటాను. ఒకనాడు అంగిరసుని సంతతివారూ, వికారరూపం కలవారూ అయిన ఋషులను చూచి నేను నవ్వినాను. వారు "ఓరీ! నీవు సౌందర్యమదంతో మమ్ము గేలి చేశావు. కనుక పెనుబామువై పడి ఉండుమని నన్ను శపించారు. నేను వేడుకోగా ఇట్లా అనుగ్రహించారు.

చ. యదుకులమందు భక్తుల భయంబు హరించుటకున్ జనార్దనుం
డుదయము నొంది యీ యడవి కొక్కదినంబున రాఁగలండు త
త్పదమున నీవు తన్నఁబడి పన్నగదేహము తోడఁ బాసి నీ
మొదలిటి మేను గాంచెదవు మూఢుఁడ! పొమ్మని రా దయానిధుల్. 1117

* "ఓరీ మూఢుడా! భక్తుల భయం నివారించడానికి యాదవవంశంలో విష్ణువు అవతరించి ఈ యడవి కొకరోజు వస్తాడు. అపుడాయన కాలి తన్ను తిని నీవు పన్నగశరీరం విడిచి మునుపటి దేహం పొంద గలవు'' అని ఆ కృపానిధులు పలికినారు.

మ. నినుఁ జింతించిన విన్నఁ బేరుకొనినన్ నిర్మూలమై క్రుస్సి పా
పనికాయంబు వినష్టమౌ నఁట! భవత్పాదంబు నామీఁదఁ బె
ట్టినఁ దద్బ్రాహ్మణశాప సంజనిత కౌటిల్యంబు దా నిల్చునే?
వనజాతేక్షణ? నేఁడు వాసె నురగత్వం బెల్ల నేఁ బోయెదన్. 1118

* ఓ కమలాక్షా! నిన్ను ధ్యానించినా, నీ కథలు విన్నా, నీ నామం కీర్తించినా పాపరాశి మొదలంటా క్షీణించి నశిస్తుందని చెపుతారు. మరి నామీద అడుగుమోపినావు గదా! విప్రశాపంవల్ల ఏర్పడిన వికృతాకారం ఎలా నిలుస్తుంది? నీ దయవల్ల నాకు నేటితో సర్పజన్మ తొలగిపోయింది. నేనిక సెలవు గైకొంటాను.''

వ. అని విన్నవించి హరికిం బ్రదక్షిణంబు వచ్చి, మ్రొక్కి, సుదర్శనుండు దివంబునకుం జనియె, సర్పం బువలన నందుండు విముక్తుం డయ్యెఁ; దత్ప్రకారంబు విని వెఱఁగుపడి గోపకులు దేవతా మహో త్సవంబు సమాప్తి నొందించి కృష్ణకీర్తనంబు సేయుచు మరల మందకుం జని రంత. 1119

* అని విజ్ఞప్తి చేసి సుదర్శనుడు జనార్దనుడికి వలగొని నమస్కరించి దేవలోకానికి వెళ్ళిపోయినాడు. నందమహారాజు పామునుండి విముక్తు డయినాడు. ఇలా శ్రీకృష్ణునివల్ల సుదర్శనునకు శాపవిమోచనం జర గడం గ్రహించి గోపకులు ఆశ్చర్యపడినారు. దేవతామహోత్సవం పూర్తిచేసి దేవకిపట్టిని స్తుతిస్తూ మళ్ళీ గోకులానికి వెళ్ళిపోయారు.

## -: శ్రీకృష్ణుఁడు కుబేరభటుండగు శంఖచూడుం డను గుహ్యకుని సంహరించుట :-

చ. మఱి యొకనాఁటి రాత్రి బలమాధవు లుజ్జ్వల వస్త్రమాలికా
ధరులును లేపనాభరణ ధారులునై చని మల్లికాది పు
ష్ప రసనిమగ్న మత్తమధుపంబుల గీతము వించుఁ దద్వనాం
తరమున వెన్నెలన్ వ్రజనితంబిను లుండఁగఁ బాడి రింపుగన్. 1120

* మరియొక వెన్నెలరాత్రి బలరాముడూ, శ్రీకృష్ణుడూ స్వచ్ఛములైన వస్త్రాలు పూలదండలూ సొమ్ములూ ధరించారు. చందనం పూసుకున్నారు. మల్లె మొదలైన విరితేనియలు ఆస్వాదించి మత్తెక్కిన తుమ్మెదల ఝంకారాలు వింటూ బృందావనంలో గోపసుందరులు తమ చుట్టూ పరివేష్టించి ఉండగా మనోహరంగా మధురగీతాలు ఆలపించినారు.

క. ఆ పాట సెవుల సోఁకిన, నేపాటియు దేహలతల నెఱుఁగక దృగ్వా
చా పాటవములు సెడి పడి, రా పాటలగంధులెల్ల నటవీవీథిన్. 1121

* రామకృష్ణుల పాట చెవిని బడగానే కలిగొట్టు పూలవంటి దేహపరిమళం కలిగిన గోప వధువులు కన్నూ, నాలుకా మొదలైన యింద్రియాల వ్యాపారం కట్టువడిపోగా ఏ మాత్రమూ ఒడ లెరుగక ఆ వనసీమలో అట్టే పారవశ్యంలో మునిగిపోయారు.

వ. ఇట్లు సకలభూత సమ్మోహనంబగు గానంబు సేయుచు, నిచ్చావర్త నంబులం బ్రమత్తుల చందంబున రామకృష్ణులు క్రీడింపఁ గుబేరభటుండు శంఖచూడుం డనువాఁడు రామకృష్ణ రక్షితలగు గోపికలం దన యోగబలంబున నుత్తరపు దిక్కునకుం గొనిపోవ నయ్యోషిజ్జనంబులు 'రామకృష్ణే' తి భాషణంబులం జీరి పులికి నగపడిన మొదవుల క్రియ మొఱయిడిన విని. 1122

* ఇలా సర్వ ప్రాణులకూ సమ్మోహం కలిగించే విధంగా గానం చేస్తూ బలరామకృష్ణులు మత్తిల్లిన వారి మాదిరి వనంలో విచ్చలవిడిగా విహరిస్తున్నారు. ఆ సమయంలో కుబేరుని భటుడు శంఖచూడుడనే వాడు రామకృష్ణుల రక్షణలోఉన్న గోపకాంతలను తన యోగబలంతో బలాత్కారంగా పట్టుకొని ఉత్తరదిశకు తీసుకుపోసాగాడు. అపు డాభామినులు "బలరామా, శ్రీకృష్ణా" అంటూ బెబ్బులిబారిబడ్డ ఆవులవలె ఆక్రందనం చేశారు. రామకృష్ణులు వారి మొర ఆలకించారు.

ఉ. గ్రద్దన సాలవృక్షములు గైకొని బల్లిదు లన్నదమ్ము లా
యిద్దఱుఁ గాలమృత్యువుల యేపున వే చని 'యోడకుండుఁ డో
ముద్దియలార' యంచుఁ దను ముట్టినఁ జూచి కలంగి గుహ్యకుం
డుద్దవిడిం దగం బఱచె నుత్తర మింతుల డించి భీతుఁడై. 1123

* బలవంతులైన ఆ అన్నదమ్ము లిద్దరూ వెంటనే మద్దిచెట్లు చేతగైకొన్నారు. కాలుడు, మృత్యువు ఏలాగో ఆలాగున చెలరేగి సరభసంగా వెళ్ళి- "ఓ ముగ్ధలారా! మీరు భయపడకండి" అంటూ గోపికలకు ధైర్యం చెప్పి గుహ్యకునితో తలపడినారు. వాడు రామకృష్ణులను చూచి కలతచెంది ఆ నెలతలను అక్కడ వదలి తత్తరపాటుతో ఉత్తరదిక్కునకు మహావేగంగా పరువెత్తసాగాడు.

వ. ఇట్లు గుహ్యకుని చేత విడివడిన గోపికల 'రక్షించుకొని యుండు' మని బలభద్రునిం బలికి. 1124

* అప్పుడు గోపాలకృష్ణుడు గుహ్యకుని చెరనుంచి విడుదల పొందిన గోపికలను కాపాడుతూ ఉండు మని బలరామునితో పలికినాడు.

శా. 'ఓరీ! గుహ్యక! పోకుపోకు మని రోషోక్తిన్ బకారాతి వాఁ
డే రూపంబున నెందుఁ జొచ్చె నెటఁ బోయెం దోడఁ దా నేఁగి దు
ర్వారోదంచిత ముష్టి వానితల ద్రెవ్వం బట్టి తద్వీరు కో
టీర భ్రాజితరత్నముం గొనియె దండిన్ గోపికల్ సూడఁగన్. 1125

* బకాసురుణ్ణి భంజించిన ఆ పరమాత్ముడు-"ఓరీ! యక్షుడా! పారిపోకు పారిపోకు" మని సరోషంగా పలుకుతూ గుహ్యకు డేరూపంతో ఎక్కడ ప్రవేశిస్తున్నాడో, ఎక్కడికి వెళుతున్నాడో తానూ వానితో అక్కడ ప్రవేశించి, అక్కడికి వెళ్ళి వానిని పట్టుకున్నాడు. సాటిలేని తన పెనుపిడికిటి పోటుతో వాని శిరం తునిగిపడే టట్లు పొడిచాడు. ఆ వీరుని కిరీటంలో వెలుగొందే మణిని గోపికలు చూస్తుండగా గైకొన్నాడు.

వ. ఇట్లు శంఖచూడునిం జంపి వాని శిరోరత్నంబు దెచ్చి బలభద్రుని కిచ్చి మెప్పించె; మఱియు నొక్కదినంబునం గృష్ణుండు వనంబులకుం జనిన నతని లీలలు వాడుచు నిండ్లకడఁ దద్విరహ వేదనానల భరంబు సహింపక గోపికలు దమలో నిట్లనిరి. 1126

* ఈ విధంగా గోవిందుడు శంఖచూడుని సంహరించి వాని చూడామణిని దెచ్చి బలరాముని కిచ్చి అన్నను సంతోషపెట్టాడు. అటు తరువాత ఇంకొకరోజు శ్రీకృష్ణుడు వనంలోకి వెళ్ళాడు. అప్పుడు ఆయన లీలలనే ఇండ్లలో పాడుకుంటూ విరహతాపానికి తాళలేక గోపికలు తమలోతాము ఇలా అనుకోసాగారు.

శా. భ్రూవిక్షేపముతోడ దాపలి భుజంబుం జెక్కుఁగీలించి కె
మ్మోవిన్ వేణువుఁగూర్చి సుస్వరముగా మ్రోయించుచు న్నంగుళీ
ప్రావీణ్యంబు విభుండు సూపఁ గని సప్రాణేశలై యుండియున్
నీవీబంధము లూడఁ బొక్కుదురువో నింగిన్ నిలింపాంగనల్. 1127

* నవనీతచోరుడు దాపలి మూపుపై దాపటి చెక్కిలి అనించి, అరుణాధరమందు పిల్లనగ్రోవి నుంచి, కనుబొమలు ద్రిప్పుతూ, వ్రేళ్ళను వేణురంధ్రాలమీద నేర్పుతో సారిస్తూ మధురస్వర మొలికేటట్లు గానం చేస్తున్నప్పుడు, మగలతోపాటు మింట నిలిచి కనుగొంటున్న అచ్చరమచ్చెకంటులు పోకముళ్లు జారగా మదనవేదన పాలవుతూ ఉంటారే!

మ. నవమాధుర్యము గల్గు కృష్ణు మురళీ నాదామృత స్యందముల్
సెవులం జొచ్చి హృదంతరాళముల భాసిల్లన్ సవత్సంబులై
యువిదా! మేపులకుం దొఱంగి మృగగోయూథంబు లుత్కంఠతో
దివికిం గంఠము లెత్తి లో వదలుఁ బో దేహేంద్రియవ్యాప్తులన్. 1128

* ఓ చెలీ! క్రొత్తతీపి గల మురారి మురళీ నినాదమనే అమృతస్రావం వీనులలో జొరబడి హృదయం లోనికి చేరగానే మేతలు మేయడం చాలించి లేగలతోపాటు ఆవులూ, తక్కిన మృగాలూ పారవశ్యం చెందు తాయి. ఆకసానికి మోరలెత్తుకొని దేహమునకు సంబంధించిన ఇంద్రియ వ్యాపారా లన్నింటినీ వదలివేస్తాయి.

శా. ఓ కంజేక్షణ; కృష్ణుఁ డుజ్జ్వలిత హారోద్దాముఁడై గాన వి
ద్యా కౌతూహలితన్ మనోజ్ఞమురళీ ధ్వానంబు గావింపఁగా
నాకర్ణించి సశంపమై మొఱయు నీలాభ్రంబుగాఁ జూచుచుం
గేకారావము లిచ్చుచున్ మురియుఁ బో కేకీంద్రసంఘాతముల్. 1129

* ఓ తమ్మికంటీ! తళతళలాడే ముత్యాలహారం ధరించిన శ్రీకృష్ణుడు గాంధర్వవిద్యలో తనకున్న కుతూహలంకొద్దీ మనోహరమైన వేణుగానం చేస్తాడు. ఆ గానం ఆలకించి అతణ్ణి మెరుపుతో గూడిన నీలమేఘంగా భావిస్తూ, కేకారావాలు గావిస్తూ మయూర సమూహాలు మైమరచి నాట్యమాడుతాయి.

మ. లలనా! యేటికిఁ దెల్లవాఱె? రవి యేలా తోఁచెఁ బూర్వాద్రిపైఁ?
గలకాలంబు నహంబు గాక నిసిగాఁ గల్పింపఁ డా బ్రహ్మ దా
వలతేఁడుం గృప లేఁడు; కీరములు దుర్వారంబు; లెట్లో కదే!
కలదే మాపటివేళయుం గలుగునే కంజాక్షు సంభోగముల్. 1130

* ఓ చెలీ! ఎందుకు తెల్లవారిందే! తూర్పుకొండపై ఎందుకు భాను డుదయించాడే! ఉన్న పగళ్లన్నీ ఎన్నటికీ తెల్లవారని రాత్రిళ్లుగా బ్రహ్మదేవు డెందుకు చేయడో! మన్మథుడుకూడా మరీ కరుణ మాలినవా డయ్యాడు. చిలుకలను వారించే వారే లేరు. ఎలాగమ్మా! ఈ పగలు వేగించడం? రాత్రివేళ వస్తుందా? కమలనేత్రుడితో ఆనందించే అదృష్టం లభిస్తుందా?

ఉ. ఎప్పుడు ప్రొద్దు గ్రుంకు? హరి యెప్పుడు గోవుల మేపి వచ్చు? నా
కెప్పుడు తన్ముఖాంబుజ సమీక్షణ మబ్బు? నతండు వచ్చి న
న్నెప్పుడు గారవించుఁ? దుది యెప్పుడు మద్విరహాగ్ని రాశికిం
జెప్పఁగదమ్మ! బోఁటి! మరుచేఁతల నుల్లము దల్లడిల్లెడిన్. 1131

* లలనా! ఎప్పుడు ప్రొద్దు గ్రుంకుతుంది? గోవులను మేపి గోపాలు డెప్పుడు వ్రేపల్లెకు వస్తాడు? ఎప్పుడు నాకు నాథుని ముఖపద్మ దర్శన మౌతుంది? చెంతకు జేరి అతడు నన్నెపుడు ఆదరిస్తాడు? నా విరహానలం చల్లారే దెప్పుడో చెప్పవమ్మా! మదనుడు వాడిశరాలు గుప్పించడంవల్ల నా ఉల్లం తల్లడిల్లి పోతున్నది.

మ. చెలియా! కృష్ణుఁడు నన్నుఁ బాసి వనముం జేరంగ నయ్యా క్షణం
బులు నా కన్నియు నుండ నుండఁగఁ దగన్ బూర్ణంబులై సాఁగి లో
పలఁ దోఁచుం బ్రహరంబులై దినములై పక్షస్వరూపంబులై
నెలలై యబ్దములై మహాయుగములై నిండారు కల్పంబులై. 1132

* చెలీ! శ్రీకృష్ణుడు నన్ను వీడి వని కేగినపుడు ఆ యా క్షణాలు అంతకంతకూ దీర్ఘములై సాగిసాగి జాములుగా, దినాలుగా, పక్షాలుగా, మాసాలుగా, సంవత్సరాలుగా, మహాయుగాలుగా, కల్పాలుగా గోచరిస్తూ ఉన్నవి.

**వ. అని మఱియుఁ గృష్ణవిరహ దుఃఖంబున బహువిధంబులఁ బశ్చాత్తాపంబు నొందుచు గోపిక లోపికలు లేక యెట్టకేలకు దినంబు గడపి దినాంత సమయంబునందు. 1133**

* ఈ విధంగా శ్రీకృష్ణ వియోగ విషాదంతో పలురీతుల తపించిపోతూ మదనవేదన భరించలేక గోపికలు చివరకెట్లో పగలు వెళ్ళబుచ్చుతారు. సంధ్యాసమయం ఆసన్న మవుతుంది.

**మ. 'అదె భానుం డపరాద్రిఁ జేరె? నిదె సాయంకాల మేతెంచె; న**
**ల్లదె గోపాదపరాగ మొప్పెసఁగె, బృందారణ్యమార్గంబు నం**
**దిదె వీతెంచె వృషేంద్రఘోషము; ప్రియుం డేతెంచె రం డంచుఁ దా**
**మెదు రేతెంతురు మాపు కృష్ణునికి న య్యింతుల్ పరిభ్రాంతలై. 1134**

* ఆ సాయంసమయంలో "అదిగో! సూర్యుడు పడమటి కొండకు చేరబారినాడు. ఇదిగో ! సాయంకాల మయింది. అదిగో! గోవుల గొరిజల దువ్వ రేగింది. బృందావన వీథినుంచి ఎద్దుల రంకెలు వినవస్తున్నవి. వల్లభుడు వస్తున్నాడు రండమ్మా! రండి!" అంటూ గోపకాంతలు సంభ్రమ స్వాంతలై ప్రియకాంతునికి మాపటివేళ ఎదురేగుతారు.

**వ. ఇట్లు తన కెదురు వచ్చిన మచ్చిక న చ్చెలువల నచ్యుతుం డిచ్ఛానువర్తనంబుల గారవించె నంత నొక్కనాఁడు. 1135**

* ఇలా తన కెదురు వచ్చిన మచ్చెకంటులను వారి యిచ్చ కనుగుణంగా మచ్చికతో మాధవు డాదరిస్తాడు. ఇలా ఉండగా ఒకానాడు ఒకసంఘటన సంభవించింది.

## -: వృషభాసుర సంహారము :-

**సీ. ఎవ్వని మూఁపుర మీక్షించి మేఘంబు లద్రిశృంగం బని యాశ్రయించు?**
**నెవ్వని అంకె కర్ణేంద్రియంబులు సోఁక గర్భపాతంబగు గర్భిణులకు**
**నెవ్వని పదహతి నెగయు పరాగంబు లంధకారారాతి నావరించు**
**నెవ్వఁడు గొమ్ముల నెదిరించి చిమ్మినఁ బృథ్వీధరంబులు పెల్ల గిల్లు**

**తే. నట్టి వృషభాసురేంద్రుఁ డహంకరించి, వాలలత యెత్తి పెనుఱంకె వైచి నేలఁ**
**గాలు ద్రవ్వుచు నిశితశృంగములు సాఁచి, మంద బెగడంగఁ గవిసె నమందగతిని. 1136**

* ఎవని మూపురం చూచి మేఘాలు పర్వతశిఖరమని భ్రమించి పైన వ్రాలుతాయో, ఎవడి రంకె చెవిబడ్డ మాత్రాన గర్భవతులకు గర్భపాత మవుతుందో, ఎవడి కాలి త్రొక్కిడికి ఎగిరే దుమ్ము సూర్యుణ్ణి

క్రమ్ముతుందో; ఎవడు కొమ్ములొడ్డి ఎగజిమ్మితే కొండలు పెల్లగిల్లుతాయో అటువంటి వృషభాసురుడు సుదీర్ఘమైన వాలం పైకెత్తి అహంకారంతో రంకెలు వేస్తూ నేలను కాలద్రవ్వుతూ, కూచి కొమ్ములు సాచి మంద గడగడలాడే టట్లు మహావేగంతో వచ్చిపడ్డాడు.

**వ. అట్లు వృషభాకారంబున నరిష్టుఁడు హరికి నరిష్టంబు సేయం దలంచి పై కుఱికిన. 1137**

* అలా ఎద్దురూపం ధరించిన అరిష్టు డనే ఆ రాకాసి కేశవునకు కీడు చేయదలచి పైకి దూకాడు.

**ఉ. క్రేపులు వాతె గోవులకుఁ, గ్రేపులు గోవులు గోవృషంబులం**
**బైపడె; వత్స ధేను వృషభంబులు గోపకులందుఁ జొచ్చె; నా**
**గోపకు లా వృషేంద్రములు గోవులు లేఁగలు విచ్చి పాఱఁగా**
**గోపచమూవిభుండు గనె గోవృషదైత్యుఁడు వెంటనంటఁగన్. 1138**

* వృషభరూపం దాల్చిన దనుజుడు వెంటనంటగా దూడలు ఆవుల కడకు పరుగెత్తి పోయాయి. దూడలు, ఆవులు చేరి ఎద్దులలో వచ్చి పడ్డాయి. దూడలు, ఆవులు, ఎద్దులు ఏకమై గోపకుల దాపునకు చేరాయి. గొల్లలూ, ఎద్దులూ, ఆవులూ, దూడలూ చెల్లాచెదరు కావడం గోపనాయకుడైన గోవిందుడు పరికించాడు.

**వ. ఇట్లు భయభ్రాంతులై కాంతలుం దారును గృష్ణ; కృష్ణ! రక్షింపు రక్షింపు మనియెడు గోపకులకు నడ్డంబు వచ్చి దీనజన రక్షకుండైన పుండరీకాక్షుం డిట్లనియె. 1139**

* ఈ తీరున భయంతో పరిభ్రమిస్తూ తామూ, తమ కాంతలూ "కృష్ణా, కృష్ణా" కాపాడు మంటూ గోపకులు శౌరిని శరణు జొచ్చారు. దీనులను సంరక్షించువాడునూ, తెల్ల దామరలవంటి కన్నులు గల వాడునూ అయిన స్వామి వారికి అడ్డుపడి దైత్యునితో ఇలా అన్నాడు.

**ఉ. 'బాలుర నింతులం బసులఁ బాఱఁగఁ దోలుట బంటుపంతమే**
**చాలు, వృషాసురేంద్ర! బలసంపదఁ జూపఁగ నెల్లబోఁటి గో**
**పాలురమంద గాదు; చను పై ఁబడితేనిఁ బ్రచండ కృష్ణ శా**
**ర్దూలము నేఁడు నీగళముఁ ద్రుంపక చంపక పోవనిచ్చునే? 1140**

* "ఓరీ! వృషభాసురా! బాలురనూ, భామలనూ, పశువులనూ పారదోలడం పరాక్రమమా? నీ ప్రతాపం చాలించు. నీ బలిమి చూపి భయపెట్టుటకు మేము గోపగోపీజనం కాము. వెళ్ళు. పైకి వచ్చావా ఈ కృష్ణుడనే భయంకరమైన బెబ్బులి నీ కంఠం ఖండింపకుండా నిన్ను చంపకుండా విడిచిపెట్టదు సుమా!'

**ఆ. అనుచు ధిక్కరించి హస్తతలంబులఁ, జప్పుడించి నగుచుఁ జలము మీఱఁ**
**బన్నగేంద్ర భయద బాహుదండము సాఁచి, దండి మెఱసి దనుజు దండ నిలిచె. 1141**

* ఇలా రక్కసుణ్ణి ధిక్కరించి గరుడధ్వజుడు కరతలంతో బుజమప్పళించి నవ్వుతూ, సర్పరాజంవలె భీతిగొలిపే తన హస్తాన్ని సాచి శౌర్యం దీపించగా, ఆ దానవుని చెంత నిలబడ్డాడు.

వ. అప్పుడు. 1142

చ. ఖురముల నేలఁ ద్రవ్వుచు నకుంఠితవాల సమీరణంబులన్
విరవిరఁ బోయి మేఘములు విచ్చ విషాణము లొడ్డికొంచు దు
స్తర తరమూర్తియై వృషభదైత్యుఁడు కన్నుల నిప్పు లొల్కఁగా
దురదుర వచ్చి తాఁకె రిపుదుర్మదమోచనుఁ బద్మలోచనున్. 1143

* అప్పుడు ఆ వృషభాసురుడు గిట్టలతో నేలద్రవ్వుతూ, గిరిగిర త్రిప్పు తనవాలం గాలికి మబ్బులు విరవిర విచ్చిపోగా కొమ్ములొడ్డుతూ, నిరోధింపరాని స్వరూపంతో కండ్లనుంచి గుప్పుగుప్పున నిప్పులు రాలుతుండగా, శాత్రవుల దుర్గర్వం ఉడిపేవాడూ, తామరరేకులవంటి కన్నులు గలవాడూ అయిన కృష్ణుణ్ణి రివ్వురివ్వున వచ్చి ఎదుర్కొన్నాడు.

ఉ. యాదవకుంజరుండు వృషభాసురు కొమ్ములు రెండుఁ బట్టి య
ష్టాదశ పాదమాత్రము గజంబు గజంబును ద్రొబ్బు కైవడిన్
భేదిల ద్రొబ్బ న య్యసుర బిమ్మిటి నొంది చెమర్చి మ్రొగ్గి దు
ర్మాదముతోడ డీ కొనెఁ బ్రమత్తవిమర్దను నా జనార్దనున్. 1144

* యాదవులలో మేటి అయిన యశోదానందనుడు వృషభాసురుని రెండు కొమ్ములూ పట్టుకున్నాడు. ఏనుగు మరొక ఏనుగును పడద్రోసినట్లు వాణ్ణి పద్దెనిమిది అడుగుల దూరం పడ నెట్టివేశాడు. అపు డా నక్తంచరుడు తల్లడిల్లి సొమ్మసిల్లి దేహాన చెమ్మటలు గ్రమ్మగా నేలవ్రాలి తెప్పరిల్లి మళ్లీ దనుజమర్దనుడైన జనార్దనుణ్ణి దుర్మదంతో డీకొన్నాడు.

ఆ. అంత గోపసింహుఁ డసురకొమ్ములు వట్టి, ధరణి ద్రొబ్బి త్రొక్కి దైత్యభటుల
కొమ్ము వీఁగ సురలకొమ్ము వర్ధిల వాని, కొమ్ము వెఱికి మొత్తి కూల్చె నధిప! 1145

* రాజా! విను. అంత యదుసింహుడైన శ్రీహరి దనుజుని కొమ్ములు పట్టి నేలపై పడగూల్చి కాలితో త్రొక్కిపట్టాడు. దానవవీరుల ఉత్సాహం అణగారి పోగా, దేవతల ఉల్లాసం మితిమీరి పోగా వాని కొమ్ము పెరికి దానితోనే వాణ్ణి చావబాదాడు.

క. ఉక్కు సెడి రోఁజి నెత్తురు, ముక్కున వాతను స్రవింప మూత్రశకృత్తుల్
మిక్కిలి విడుచుచుఁ బసరపు, రక్కసుఁ డని సమసెఁ బ్రజకు రాగం బమరన్. 1146

* బల ముడిగి రొప్పుతూ, ముక్కుతూ, ముక్కునా, నోటా నెత్తురు గ్రక్కుతూ, మలమూత్రాలు మిక్కుటంగా విడుస్తూ అసురుడు ఉసురులు గోల్పోయాడు. ప్రజలకు ప్రమోదం కలిగింది.

వ. ఇట్లు వృషభాసురుం జంపిన, నిలింపులు గుంపులు గొని విరులు వర్షింప, గోపకులు హర్షింప గోపసతు లుత్కర్షింప బలభద్రుండును దానును గోవిందుండు పరమానందంబున మందకుంజనియె నంత. 1147

* ఈలా వృషభదైత్యుని సంహరించగానే వేల్పులు గుంపులై గోపాలునిపై కుసుమములు వర్షించారు. గోపకులు హర్షించారు. గోపాంగనలు ఉప్పొంగి పోయారు. గోవిందుడు బలరామునితో మిక్కిలి ఆనందిస్తూ మందకు మరలి వెళ్ళినాడు.

చ. ఘనుఁ డొకనాఁడు నారదుఁడు గంసునితోడ యశోద గూఁతుఁ దాఁ
గనుటయుఁ జక్రి దేవకికి గర్భజుఁ డౌటయు మున్ను రోహిణీ
తనయుఁడు రాముఁ డౌటయును దద్విభు లిద్దఱు మంద నున్న వా
రని యెఱుఁగంగఁ జెప్పిన మహాద్భుతమంచుఁ జలించి కిన్కతోన్. 1148

* అనంతరం ఒకనాడు మహానుభావుడైన నారదుడు కంసునికడకు వచ్చి అతడితో-" ఆ కన్నె యశోద కన్నకూతురు. శ్రీకృష్ణుడు దేవకీ గర్భసంభూతుడు. బలరాముడు రోహిణికొడుకు. ఆ రామకృష్ణు లిద్దరూ నందుని మందలో ఉన్నారు" అంటూ తెలియజెప్పాడు. ఆ మాటలు ఆలకించి ఆశ్చర్యపడి ఆగ్రహావేశంతో కంసుడు కంపించిపోయాడు.

చ. కొడుకుల మందలోన నిడి గొంటుతనంబున మోసపుచ్చె నీ
బడుగును బట్టి చంపు టిది భావ్య మటంచుఁ గృపాణపాణియై
వడి వసుదేవునిం దునుమ వచ్చిన కంసునిఁ జూచి నారదుం
డుడుగుము చంపఁ బోల దని యోడక మానిచి పోయె మింటికిన్. 1149

* "ఈ బడుగు వసుదేవుడు కొడుకులను నందవ్రజంలో భద్రంగా దాచిపెట్టి మంచిమాటలతో నన్ను వంచించాడు. ఈ దిక్కుమాలిన వాణ్ణి, ఈ మోసగాణ్ణి పట్టి పరిమార్చడం యుక్తం"- అంటూ ఖడ్గం చేబూని వెంటనే వసుదేవుణ్ణి చంపడానికి కంసుడు ఉద్యుక్తు డయినాడు. అతణ్ణి చూచి నారదమహర్షి 'వసుదేవుని చంపవద్దు. ఇది నీ వంటివానికి తగదు' అని వానిని వారించి దేవలోకానికి తరలిపోయాడు.

వ. మఱియు నలుకదీఱక కంసుండు దేవకీవసుదేవుల లోహపాశ బద్ధులంజేసి కేశి యనువానిం బిలిచి రామకేశవులం జంపు మని పంపి, మంత్రి భటగజారోహక చాణూర ముష్టిక సాల్వకోసల ప్రముఖుల రావించి యిట్లనియె. 1150

* అంతటితో కంసునికి అలుక తీరలేదు. అతడు దేవకీవసుదేవులను లోహపు సంకెళ్ళతో బంధించాడు. కేశి అనేవాణ్ణి పిలిచి గోకులానికి వెళ్ళి రామకృష్ణులను చంపి రమ్మని పంపించాడు. తరువాత మంత్రులనూ, భటులనూ, మావటి వాండ్రనూ, చాణూరుడు, ముష్టికుడు అనే జెట్టులనూ, సాల్వుడు,కోసలుడు మొదలైన ముఖ్యులనూ పిలిపించి వారితో ఇలా అన్నాడు.

శా. ఎందున్ నన్నెదిరించి పోరుటకు దేవేంద్రాదులుం జాల రీ
బృందారణ్యము మంద నిప్పుడు మదాభీరార్భకుల్ రామ గో
విందుల్ వర్ధిలుచున్న వారఁట రణోర్విం గంసునిం ద్రుంతు' మం
చుం దర్పంబులు పల్కు చుందురఁట; యీ చోద్యంబులన్ వింటిరే? 1151

* "ఎందైననూ నన్నెదిరించి పోరాడటానికి ఇంద్రాదులకు సైతం శక్తి చాలదు. బలరామకృష్ణులు అనే మదించిన గొల్లపిల్లలు ఇప్పుడు బృందావనంలో పెరుగుతున్నారట! కదనభూమిలో కంసుణ్ణి చంపుతామంటూ బీరాలు పలుకుతున్నారట! మీ రీ వింతమాటలు విన్నారా!"

క. పట్టణజనములు సూతురు, దట్టంబుగ మల్లరంగతల పార్శ్వములం
బెట్టింపుఁడు తమకంబులు, పుట్టింపుఁడు వీట మల్లుపో రనుమాటన్. 1152

* జెట్టిపోరు ఏర్పాటు చేయండి. మల్లరంగానికి నాలుగువైపులా మంచె లమర్చండి. పురప్రజలు వచ్చి చూస్తారు. నగరం నలుమూలల్లో ఈ సంగతి చాటండి.

శా. విన్నాణంబులఁ బోర నేర్తురు మహావీర్యప్రతాపాది సం
పన్నుల్ మీరలు మేటి మల్లుగములం బ్రఖ్యాతులై పెంపుతో
మన్నా రా బలకృష్ణులం బెనఁకువన్ మర్దించి మత్ప్రీతి కా
పన్నుల్ గండు పురీజనుల్ పొగడ నో చాణూర! యో ముష్టికా! 1153

* ఓ చాణూర ముష్టికులారా, మీరు చాతుర్యంతో మల్లయుద్ధం సలుపగల దిట్టలు. గొప్ప శౌర్యప్రతాపాలు గలవారు. జెట్టులలో జగజెట్టులై పెంపుగన్నవారు. పట్టణప్రజలు ప్రశంసింపగా మల్లయుద్ధంలో ఆ రామకృష్ణులను మట్టు పెట్టి నాకు ప్రీతి పాత్రులు కండి.

శా. రా రా హస్తిపకేంద్ర! గండమద ధారాగంధ లోభాంధ గం
భీరాళి వ్రజమైన మత్కువలయాపీడ ద్విపేంద్రంబు మ
ద్ద్వారోదంచిత దేహళీ పరిసర స్తంభంబు డాయంగ నా
భీరుల్ రా నదలించి డీకొలుపు నీ బీరంబు తోరంబుగన్. 1154

* ఓరీ మావటీ! ఇలా రా. ఆ గోపాలకులు మన భవనద్వార సమీపంలో ఉన్న ఆలాన స్తంభంవద్దకు రాగానే నీ ప్రతాపం ప్రదర్శించు. చెక్కిళ్ళమీది మదజలధారల సౌరభాలచేత గండుతుమ్మెదల పిండును ఆసగొలిపి ఆకర్షించే కువలయాపీడ గజరాజాన్ని అదలించి వారిమీదికి డీ కొలుపు.

క. పశు విశసనములు సేయుఁడు, పశుపతికిం బ్రియము గాఁగ భావించి చతు
ర్దశినాఁడు ధనుర్యాగము, విశదంబుగఁ జేయవలయు విజయముకొఱకున్. 1155

* చతుర్దశినాడు విజయంకోసం వైభవోపేతంగా ధనుర్యాగం చెయ్యాలి. రుద్రుడికి ప్రీతిగా జంతుబలులు గావించండి.

వ. అని తనవారి నందఱ నయ్యై పనులకు నియమించి యదుశ్రేష్ఠుండగు నక్రూరునిం బిలిపించి చెట్ట వట్టికొని యిట్లనియె. 1156

* ఈ విధంగా కంసుడు తనవాళ్ళ నందరినీ ఆ యా పనులకు పురికొల్పి యాదవులలో ఉత్తముడైన అ క్రూరుణ్ణి పిలిపించాడు. అతడి చేయి తనచేతితో పట్టుకొని ఇట్లన్నాడు.

శా. అక్రూరత్వముతోడ నీవు మనఁగా నక్రూరనామంబు ని
ర్వక్రత్వంబునఁ జెల్లె మైత్రి సలుపన్ వచ్చున్ నినుం జేరి నీ
వక్రోధుండవు మందలోన బలకృష్ణాభీరు లస్మద్వినా
శ క్రీడారతులై చరింతు రఁట యోజం దెచ్చి యొప్పింపవే? 1157

* క్రూరకృత్యాలకు జొరకుండా మనుగడ సాగించడం వల్ల అక్రూరుడనే సార్థకనామం నీకు తగి పోయింది. నీతో కలసిమెలసి నెయ్యం చెయ్యవచ్చు. నీవు కోపం లేనివాడివి. నందవ్రజంలో గొల్లలైన రామకృష్ణులు నన్ను చంపడానికి ఆసక్తితో ఉద్యుక్తు లవుతున్నారట! ఉపాయంతో వారిని తెచ్చి నాకు అప్పగించు.

ఆ. నాకు వెఱచి సురలు నారాయణుని వేఁడి, కొనిన నతఁడు వచ్చి గోపకులము
నందుఁ గృష్ణమూర్తి నానకదుందుభి, కుదితుఁ డయ్యె ననఁగ నొకటి వింటి! 1158

* వేల్పులు నాకు భయపడి వేడుకోగా విష్ణువు యదువంశమందు వసుదేవునకు కృష్ణుడై జన్మించాడని ఒకమాట విన్నాను.

వ. కావున నీవు గోపకులచేత నరులు గొని ధనుర్యాగంబుఁ జూడ రండని వారలం దోడ్కొని రమ్ము. వచ్చిన. 1159

* కాబట్టి నీవు నందాదులయిన గొల్లపెద్దలకు చెప్పి ఒప్పించి కప్పం గైకొని ధనుర్యాగం చూడడానికి రండని వారిని పిలుచుకొని రావాలి.

శా. కొండల్ గూలఁగ ద్రొబ్బు గొమ్ముల తుదిం గోపించి కోరాడుచో
దండిన్ దండి నధఃకరించు నొకవేదండంబు నాయింట బ్ర
హ్మాండం బైనఁ గదల్ప నోపు బలకృష్ణాభీరులం బోరిలో
ఖండింపం దడ వెంత దాని? కదియుం గాదేని నక్రూరకా! 1160

* నా యింటనున్న కువలయాపీడమనే కుంజరరాజం తన దంతాగ్రాలతో కొండలనుకూడా కూల దోస్తుంది. కోపంతో డీకొన్నప్పుడు నిండు మగటిమితో దండధరుణ్ణి సైతం క్రిందుపరుస్తుంది. బ్రహ్మాండాలను గూడా కదలించే శక్తి దానికుంది. అటువంటి గజరాజానికి బలరామకృష్ణులను డీకొని చీల్చిచెండాడటానికి క్షణకాలం పట్టదు. ఒకవేళ అది వారిని మ్రందించ లేకపోతే అక్రూరా! విను.

శా. చాణూరుండును ముష్టికుండును సభాసంఖ్యాతమల్లుల్ జగ
త్ప్రాణున్ మెచ్చరు సత్త్వసంపదల బాహాబాహి సంగ్రామ పా
రీణుల్ వారలు రామకృష్ణుల బలోద్రేకంబు సైరింతురే?
క్షీణప్రాణులఁ జేసి చంపుదురు సూ సిద్ధంబు యుద్ధంబునన్. 1161

*చాణూరుడు, ముష్టికుడు సభలలో గణింపదగిన మల్లవీరులు. బలసంపదలో వారు ప్రభంజనుణ్ణి సయితం మెచ్చరు. బాహాబాహి కదనంలో కడునేర్పు గలవారు. వారు బలరామకృష్ణుల బలాధిక్యం ఏ మాత్రం సహించరు. పోరాటంలో ప్రాణాలు తోడి వారిని తెగటారుస్తారు. ఇది ముమ్మాటికి యథార్థం.

సీ. ఆ రామకేశవు లంతరించిన వసుదేవముఖ్యులఁ జంపి తెగువ మెఱసి
వృష్ణి భోజ దశార్హ వీరులఁ దెగటార్చి ముదుకఁడు రాజ్యకాముకుఁడు ఖలుఁడు
నగు నుగ్రసేను మా యయ్యఁ గీటడఁగించి పినతండ్రి దేవకుఁ బిలుకుమార్చి
మఱియు వైరుల నెల్ల మర్దించి నే జరాసంధ నరక బాణ శంబరాది
ఆ. సఖులతోడ భూమిచక్ర మేలెదఁ బొమ్ము, తెమ్ము వేగమ వసుదేవసుతుల
మఖము పేరు సెప్పి మంత్రభేదము సేయ, వలయుఁ బెంపఁజనదు వైరిజనుల. 1162

* రామకృష్ణు లిద్దరూ నేలకూలిన వెంటనే వసుదేవుడు మున్నగు ప్రముఖులను హతమారుస్తాను. సాహసంతో వృష్ణి, భోజ, దశార్హ వంశజులైన వీరులను పరిమారుస్తాను. రాజ్యాభిలాష గలవాడూ, ముసలి వాడూ, దుర్మార్గుడూ అయిన మా తండ్రి ఉగ్రసేనుణ్ణి నిర్మూలిస్తాను. మా పినతండ్రియైన దేవకుణ్ణి కడముట్టిస్తాను. ఇంకా మిగిలిన శాత్రవులను పిలుకుమారుస్తాను. జరాసంధుడు, నరకుడు, బాణుడు, శంబరుడు మొదలైన నా చెలికాండ్రతో గూడి ఈ ధరావలయాన్ని పరిపాలిస్తాను. ధనుర్యాగ మనే మిషతో శీఘ్రంగా నీవు వసుదేవతనయులను ఇక్కడికి పిలుకొనిరా! పో! పగవారి గుట్టు భేదించాలి. విరోధులను వృద్ధి కానీయరాదు.

వ. అనిన నక్రూరుం డిట్లనియె. 1163

ఉ. పంపినఁ బోని వాఁడనె నృపాలక! మానవు లెన్నఁ దమ్ము నూ
హింపరు దైవయోగముల నించుక గానరు తోఁచినట్లు ని
ష్కంపగతిం జరింతు రది గాదన వచ్చునె? యీశ్వరేచ్ఛఁ ద
ప్పింపఁగ రాదు నీపగతు బిడ్డలఁ దెచ్చెదఁ బోయి వచ్చెదన్. 1164

* కంసుడి మాటలు విని అక్రూరుడు ఇలా అన్నాడు. "రాజా! నీవు ఆజ్ఞాపిస్తే వెళ్ళకుండా ఉండగలనా? యథార్థం ఆలోచిస్తే- నరులు తమ శక్తి ఎట్టిదో దైవశక్తి ఎలాంటిదో కొంచెమైనా గ్రహించలేరు. తమ బుద్ధికి తోచిన విధంగా పట్టుదలతో ప్రవర్తిస్తుంటారు. కాదనడానికి వీలుగాదు. విధి నిర్ణయం తప్పించుట ఎవరి తరమూ కాదు. నేను వెళ్ళి నీ విరోధిపుత్రులను ఇక్కడికి తీసుకువస్తాను".

## -: శ్రీ కృష్ణుఁడు కేశివ్యోమాసురుల సంహరించుట :-

వ. అని పలికి రథం బెక్కి యక్రూరుండు సనిన సకలజనుల వీడుకొలిపి కంసుం డంతిపురంబునకుం జనియె; నంతఁ గంసప్రేరితుండై. 1165

* ఈ విధంగా పలికి రథమెక్కి అక్రూరుడు వ్రేపల్లెకు బయలుదేరి వెళ్ళాడు. కంసుడు తక్కిన వారందరికి సెలవిచ్చి అంతఃపురంలో అడుగుపెట్టాడు.

సీ. ఖురపుటాహతిఁ దూలి కుంభినీచక్రంబు ఫణిరాజఫణులకు బరువుసేయ
భీషణహేషా విభీషితులై మింట నమృతాంధు లొండొరు నండ గొనఁగఁ
జటుల చంచల సటాచ్ఛటల గాడ్పుల మేఘములు విమానములపై ముసుఁగు వడఁగ
వివృతాస్యగహ్వర విపులదంతంబులు ప్రళయాగ్నికీలల పగిది మెఱయఁ

తే. గాలపాశలీలగా వాల మే పార, వాహ మగుచు గంధవాహగతుల
విజితశక్రపాశి వీర్యపయోరాశి, కేశి వచ్చె మంద క్లేశ మంద. 1166

* ఇంద్రుణ్ణి, వరుణుణ్ణి మించినవాడూ, శౌర్యానికి సముద్రం లాంటివాడూ ఐన కేశి అనే రక్కసుడు కంసుని ప్రోత్సాహంతో వారువమై వాయువేగంతో నందుని మందలో ప్రవేశించి సంకటం కలిగించాడు. అతని దిట్టమైన గిట్టల తాకిడికి చలించిన భూవలయం నాగరాజైన ఆదిశేషుని పడగలకు భారమయింది. ఆతని భీతిగొలిపే సకిలింతలకు మిక్కిలి భయపడి ఆకాశంలో దేవతలు ఒకరినొకరు గట్టిగా పట్టుకొన్నారు. అతను తన జూలు అటూ ఇటూ ఆడించడంవల్ల జనించిన గాలికి మేఘాలు ఎగిరిపోయి విమానాలను క్రమ్ముకున్నాయి. తెరువబడిన అతని బిలమువంటి నోటిలోని పెద్దపండ్లు ప్రళయకాలంలోని అగ్నిజ్వాలల విధంగా మెరిశాయి. అతని తోక యమపాశంలాగా భాసించింది.

క. భీషణ ఘోటక దానవ, హేషానిర్ఘోషభిన్న హృదయ నిఖిల గో
యోషా పురుషార్భకమై, ఘోషము హరి సూడ దైన్యఘోషం బయ్యేన్. 1167

* దారుణమైన అశ్వాకారంలో ఉన్న ఆ రాక్షసుని సకిలింత వినేసరికి అక్కడి ఆవులు, దూడలు, ఆడువారు, మగవారు, బిడ్డలు- అందరి హృదయాలు దద్దరిల్లాయి. గోవిందుడు చూస్తుండగనే ఆ ఘోషమంతా దీనదీనంగా ఘోషించింది.

వ. అ య్యవసరంబున. 1168

ఉ. పేదల ఘోషగోపకుల బిట్టదలించుట వీరధర్మమా?
కాదు; వ్రజంబులో దనుజ ఘస్మరుఁ డేఁ డని తన్ను రోయు క్ర
వ్యాదునిఁ జూచి గోపకుల కడ్డము వచ్చి నిశాట! యింకఁ బో
రా దని శౌరి చీరె మృగరాజు క్రియ న్నెదిరించె దైత్యుఁడున్. 1169

* ఆ సమయంలో- "బలహీనులైన మందలోని గొల్లలను భయపెట్టడం, తరుమ గొట్టడం నావంటి వీరునికి ధర్మం కాదు; ఈ గొల్లపల్లెలో దానవహంత కృష్ణు డెక్కడ?" అంటూ తన్ను వెదకుతున్న అసురుణ్ణి వెన్నుడు చూచాడు. గోపాలురకు అడ్డంగా వచ్చి గోవిందుడు "ఓరి దైత్యుడా! ఇక పోలేవు!" అంటూ సింహంలాగా గర్జించి వానిని పోరికి పిలిచాడు. ఆ నిశాచరుడు యశోదాత్మజుణ్ణి ఎదిరించాడు.

ఆ. నిష్ఠురోగ్రసింహ నినదంబుతో నింగి, మ్రింగుభంగి నోరు మిగులఁ దెఱచి
కఱవరాఁగ నతఁడు గాటు దప్పించినఁ, దన్నె నెగసి తురగదానవుండు. 1170

* అశ్వరూపంలో ఉన్న ఆ క్రవ్యాదుడు కర్కశంగా, భయంకరంగా సకిలిస్తూ, ఆకాశమునే మ్రింగబోయేటట్లు నోరు పెద్దగా తెరచి కమలాక్షుణ్ణి కరవడానికి ఉంకించాడు. కృష్ణుడు ఆ పాటు తప్పించుకోగా వాడు నందనందనుణ్ణి ఎగసి తన్నినాడు.

ఉ. తన్నిన తన్నునం బడక దానహంత సమీకరంత యై
కన్నులఁ గెంపు పెంపెనయ గ్రక్కున ఘోట నిశాటు పాదముల్
వన్నె సెడంగఁ బట్టి వడి వైచె ధనుశ్శతమాత్ర దూరముం
బన్నగడింభమున్ విసరి పాఱఁగ వైచు ఖగేంద్రుకైవడిన్. 1171

* తిన్నగా ఆ తన్ను తప్పించుకున్నాడు కృష్ణుడు. రాక్షసాంతకుడు రణోత్సాహం వహించాడు. కోపంతో గోవిందుని కనులు జేవురించాయి. వెంటనే అశ్వరాక్షసుని పొంగు శమించేటట్లు వాని కాళ్లు పట్టుకొని, గరుత్మంతుడు పాము పిల్లను విసరి పారవేసిన విధంగా నాలుగువందల మూరల దూరంలో పడవేశాడు.

ఉ. వైచిన మ్రొగ్గి లేచి వెస వాజినిశాటుఁడు హుంకరించి సం
కోచము లేక పైఁబడిన గోపకులేంద్రుఁడు దిగ్గజేంద్ర శుం
డా చటుల ప్రభాబల విడంబకమైన భుజార్గళంబు దో
షా చరు నోటిలో నిడియెఁ జండఫణిన్ గుహ నుంచు కైవడిన్. 1172

* ఆ విధంగా విసరి పడవేయగా నిశాచరుడు నేలకు వ్రాలి వేగంగా పయికి లేచి అహంకారంతో హుంకరిస్తూ జంకుగొంకులు మాని దామోదరుని మీదికి విజృంభించాడు. అపు డా యదుకుంజరుడు భయంకర సర్పాన్ని పర్వత గుహలోనికి జొప్పించిన విధంగా దిగ్గజతుండము వలె నిగనిగ లీను బలిష్ఠమైన తన బాహుదండమును వాని నోటిలోనికి జొనిపినాడు.

శా. దంభోళి ప్రతిమాన కర్కశ మహోద్యద్వామ దోఃస్తంభమున్
శుంభల్లీల నఘారి వాని రదముల్ చూర్ణంబులై రాలఁగా
గంభీరంబుగఁ గుక్షిలోఁ జొనిపి వీఁకన్ వృద్ధిఁ బొందింపుచున్
గుంభించెం బవనంబు పిక్కటిలఁ దత్కుక్షిన్ నరేంద్రోత్తమా! 1173

* పరీక్షిన్మహారాజా! అఘాసురుని హరించిన హరి వజ్రాయుధంవలె కఠినమై, స్తంభంవలె నున్న తన వామహస్తమును ఆ దైత్యుని దంతాలు పొడిపొడియై రాలిపోవునట్లు అవలీలగా వాని కడుపులోనికి చొప్పించాడు.

వాని కడు పుబ్బునట్లు తన బాహువును అంతకంతకూ బలుపుచేస్తూ ఆ దానవుని ప్రాణ వాయువును నిరోధించాడు.

**క. వాయువు వెడలక నిలిచినఁ, గాయంబు సెమర్పఁ గన్నుగవ వెలి కుఱుకన్**
**మాయ సెడి తన్నుకొనుచును, గూయుచు నశ్వాసురుండు గూలెన్ నేలన్. 1174**

* గాలి వెలుపలికి వెడలక నిలిచిపోగా రాక్షసుని దేహాన చెమట పొటమరించింది. కనుగ్రుడ్లు వెలికి వచ్చాయి. తన మాయలు పనిచేయక పోగా వాడు విలవిలా తన్నుకుంటూ పెనుబొబ్బలిడుతూ నేలపై కూలినాడు.

**ఆ. ఘోటకాసురేంద్రు కుక్షిలోఁ గృష్ణుని, బాహు వధిక మైనఁ బట్టలేమిఁ**
**బగిలి దోసపండు పగిదిఁ దద్దేహంబు, వసుమతీశ! రెండు వ్రయ్య లయ్యె. 1175**

* ఓ రాజా! అశ్వాసురుని కుక్షిలో కృష్ణుని బాహువు మీదు మిక్కిలి పెరిగి పట్టుటకు చోటు లేనందున వాని దేహం దోసపండు మాదిరి రెండుగా చీలిపోయింది.

**క. నలినాక్షుఁడు లీలాగతి, విలయముఁ బొందించె నిట్లు వీరావేశిన్**
**బలలాశిన్ జగదభినవ, బలరాశిన్ విజితశక్రపాశిం గేశిన్. 1176**

* వీరావేశం కలవాడూ, మాంసాశనుడూ, లోకంలో నూతనశక్తి రాశిగా నున్నవాడూ, ఇంద్రునీ వరుణునీ జయించినవాడూ అయిన కేశిని తామరరేకులవంటి కన్నులు గల శ్రీకృష్ణుడు అలవోకగా అంతమొందించాడు.

**వ. ఆ సమయంబునం బుష్పవర్షంబులు గురియించి సురలు వినుతించి; రంత హరిభక్తి విశారదుండైన నారదుండు వచ్చి గోవిందుని సందర్శించి రహస్యంబున నిట్లనియె. 1177**

* ఆ సంతోషసమయంలో దేవతలు పూలవానలు కురిపిస్తూ స్తోత్రాలు చేశారు. అంతలో విష్ణుభక్తి విశారదుడైన నారదుడు వచ్చి నందనందనుని సందర్శించి ఏకాంతంగా ఇట్లా అన్నాడు.

**సీ. 'జగదీశ! యోగీశ! సర్వభూతాధార! సకలసంపూర్ణ! యీశ్వర! మహాత్మ!**
**కాష్ఠగతజ్యోతి కైవడి నిఖిల భూతములందు నొకఁడవై తనరు దీవు**
**సద్గూఢుఁడవు; గుహాశయుఁడవు సాక్షివి నీయంతవాఁడవై నీవు మాయఁ**
**గూడి కల్పింతువు గుణముల; వానిచేఁ బుట్టించి రక్షించి పొలియఁ జేయు**

**ఆ. దీ ప్రపంచమెల్ల నిట్టి నీ విప్పుడు, రాజమూర్తు లయిన రాక్షసులను**
**సంహరించి భూమిచక్రంబు రక్షింప, నవతరించినాఁడ వయ్య! కృష్ణ! 1178**

* కృష్ణా! జగదీశ్వరా! అచింత్య ప్రభావము గల యోగీశ్వరా! అఖిల ప్రాణులకు ఆధార మైనవాడా! వాడా! సర్వనియామకుడా! అంతటనూ నిండిన మహానుభావా! కట్టెలలో అగ్నివిధంగా, సమస్త ప్రాణులలో ప్రవేశించి ఎట్టి వికారాలకు లోనుగాక ఏకరూపుడవై విలసిల్లుతున్నావు. హృదయకుహరమందు గూఢంగా

ఉన్నావు. జీవు లొనర్చే క్రియాకలాపమునకు కేవలము సాక్షిమాత్రుడవై ఉన్నావు. నీవు సర్వస్వతంత్రుడవు. నీ కధీనమైన మాయాశక్తిచే సత్త్వరజ స్తమోగుణాలను కల్పిస్తున్నావు. ఈ త్రిగుణాలచేత జగత్తును సృజిస్తున్నావు; పాలిస్తున్నావు; సంహరిస్తున్నావు. రాజుల ఆకారాలు ధరించియున్న రాక్షసులను నిర్మూలించి, ఈ భూమండలాన్ని కాపాడుటకై నీవు అవతరించావు స్వామీ!

**వ. దేవా! నీచేత నింకఁ జాణూర ముష్టిక గజ కంస శంఖ యవన ముర నరక పౌండ్రక శిశుపాల దంత వక్త్ర సాల్వ ప్రముఖులు మడిసెదరు; పారిజాతం బపహృతం బయ్యెడిని; నృగుండు శాపవిముక్తుం డగు; శమంతకమణి సంగ్రహంబగు; మృత బ్రాహ్మణపుత్ర ప్రదానంబు సిద్ధించు; నర్జున సారథివై యనేకాక్షౌహిణీ బలంబుల వధియించెదవు; మఱియును. 1179**

* ఓ ప్రభూ! ఇకముందు చాణూరుడు, ముష్టికుడు, గజుడు, కంసుడు, శంఖుడు, కాలయవనుడు, మురుడు, నరకుడు, పౌండ్రకుడు, శిశుపాలుడు, దంతవక్త్రుడు, సాల్వుడు మొదలైనవారు నీచేతిలో మరణిస్తారు. దేవలోకంనుంచి పారిజాతవృక్షాన్ని పెకలించి తెస్తావు. నీవల్ల నృగునకు శాపవిముక్తి కలుగుతుంది. శమంతకమణిని స్వీకరిస్తావు. మృతులైన బ్రాహ్మణకుమారులను తిరిగితెచ్చి యివ్వడం జరుగుతుంది. అర్జునునకు సారథివై పెక్కు అక్షౌహిణుల సైన్యాన్ని సంహరిస్తావు.

**శా. కృష్ణా! నీ వొనరించు కార్యములు లెక్కింపన్ సమర్థుండె? వ**
**ర్ధిష్ణుండైన విధాత మూఁడు గుణముల్ దీపించు లోపించు రో**
**చిష్ణుత్వంబున నుండు నీవలన; నిస్సీమంబు నీరూపు నిన్**
**విష్ణున్ జిష్ణు సహిష్ణు నీశు నమితున్ విశ్వేశ్వరున్ మ్రొక్కెదన్. 1180**

* ఓ కృష్ణా! వర్ధనశీలుడైన పరమేష్ఠి కూడా నీవు చేసే పనుల లెక్కించుటకు సమర్థుడు కాడు. నీవల్లనే సత్త్వ రజస్తమో గుణములు జనించి వృద్ధిపొంది అణగిపోతాయి. నీ రూపమునకు మేర లేదు. నీవు సర్వవ్యాపివి! జయశీలుడవు! సహనశీలివి! పరమేశ్వరుడవు; ప్రమాణ రహితుడవు; ప్రపంచ నియామకుడవు. ఇట్టి నీకు నమస్కరిస్తాను.

**వ. అని వినుతించి వీడుకొని నారదుం డరిగె; నంత నొక్కనాఁడు కృష్ణసహితు లయి గోపకుమారు లడవికిం జని పసుల మేపుచు నొక్క కొండదండ నిలాయనక్రీడ సేసి రందు. 1181**

* ఈ విధంగా దేవదేవుని కొనియాడి సెలవు పుచ్చుకొని నారద మహర్షి వెళ్ళిపోయాడు. అటుతర్వాత ఒక దినమందు గోపబాలురు కృష్ణునితో గూడ అడవికి అరిగినారు. అక్కడ పసులను మేపుతూ ఒకపర్వతం పొంత "దాగుడుమూతలాట" ఆడటం ఆరంభించారు.

క. కొందఱు గొఱియల మంచును, గొందఱు పాలకుల మంచుఁ గుటిలత్వమునం
గొందఱు దొంగల మనుచును, జెంది కుమారకులు క్రీడసేసిరి తమలోన్. 1182

* అందులో కొందఱు గొఱ్ఱెలుగా, కొందరు కాపరులుగా, కొందరు గజదొంగలుగా ఏర్పడి, గోప బాలురు తమలో తాము కనుమూసిగంతలాట ఆడసాగినారు.

శా. ఆలో దొంగలలో మయాసురసుతుం డాద్యుండు వ్యోముండు గో
పాలుండై చని మేషకల్పనలతో భాసిల్లి క్రీడించు త
ద్బాల వ్రాతము నెల్ల మెల్లన చతుఃపంచావశిష్టంబుగా
శైలాంతర్గుహలోనికిం గొని చనెం జౌర్యం బవార్యంబుగన్. 1183

* అంతలో మయుడనే రాక్షసుని పెద్దకొడుకు వ్యోమాసురుడు గోపాలకరూపం ధరించాడు. వాడు అడ్డులేని దొంగతనంతో ఆ యాటలో గొఱ్ఱెలుగా నటిస్తున్న గొల్లకుఱ్ఱలలో నలుగు రైదుగురిని తప్ప తక్కిన వారందరినీ మెల్లగా ఒక పర్వతగుహలోనికి తీసుక వెళ్ళినాడు.

వ. ఇట్లు కొండగుహలోనఁ గ్రమక్రమంబున గోపకుమారుల నిడి, యొక్క పెనుఱాతఁ దద్వారంబుఁ గప్పి యెప్పటియట్ల వచ్చిన. 1184

* వాడు క్రమక్రమంగా గోపాలబాలకులను ఆ శైలకందరంలో చేర్చి పెద్దబండతో వాకిలి మూసివేసి మునుపటి మాదిరి అక్కడి ఆటలోనికి వచ్చి చేరినాడు.

ఉ. వీరుఁడు మాధవుం డఖిలవేది నిశాచరభేది నవ్వుతో
'నోరి! నిశాట! దొంగతన మచ్చుపడెన్ నెఱదొంగ వౌదు; వా
భీరుల నెల్ల శైలగుహఁ బెట్టితి చిక్కినవారిఁ బెట్టరా!
రార యటంచుఁ బట్టె మృగరాజు వృకాఖ్యముఁ బట్టు కైవడిన్. 1185

* సర్వజ్ఞుడూ, గర్వాంధులైన దనుజులను దునుమాడేవాడూ, మహావీరుడూ అయిన మాధవుడు నవ్వుతూ "ఓరీ! రాక్షసా! నీ గుట్టు బట్టబయ లయింది. నీవు గడిదేరిన గజదొంగవు. గొల్లపిల్ల లందరినీ కొండగుహలో దాచిపెట్టినావు. మిగిలిన వారినిగూడా పెడుదువుగాని రారా!" అంటూ సింహము తోడేలును పట్టుకునే మాదిరి వాణ్ణి ఒడిసి పట్టుకున్నాడు.

ఉ. పంకజలోచనుం డొడిసి పట్టిన శైలనిభాసురాకృతిన్
బింకముతోడఁ బొంగి విడిపించుకొనంగ బలంబు లేమి లో
శంకిలి బిట్టు తన్నుకొనఁ జక్కన యా రణభీము వ్యోమునిం
గొంకకఁ గూల్చె న విభుఁడు గోయని మింట సుపర్వు లార్వఁగన్. 1186

* పద్మాలవంటి కన్నులు గల కృష్ణుడు గట్టిగా పట్టుకోగానే వాడు గొల్ల రూపు విడిచి కొండంత రాక్షసాకారంతో ఉప్పొంగి మిడిసిపడినాడు. విడిపించుకునే శక్తి లేనందున లోలోపల సందేహిస్తూ గిజగిజ గుంజులాడినాడు. అపుడు గోవిందుడు సంగ్రామభీముడైన ఆ వ్యోముణ్ణి జంకు గొంకులు లేక కూల్చివేశాడు. అప్పుడు ఆకసంనుంచి దేవతలు "ఓహో!" యని హర్షధ్వానాలు ఆచరించారు.

**ఆ. ఘోరదనుజు నేలఁ గూల్చి పర్వతగుహ, వాత నున్న ఱాయి వ్రయ్యఁ దన్ని**
**గుహ చరించుచున్న గోపాలకులఁ గొంచు, బల్లిదుండు గొల్లపల్లె కరిగె. 1187**

* బలవంతుడైన కృష్ణుడు భయంకరుడైన దానవుని నేల గూల్చి పర్వతగుహా ద్వారమును మూసియున్న రాతిని ముక్కలయ్యేట్టు తన్నినాడు. గుహలో తిరుగాడుతున్న గోపాలబాలకులను వెంటబెట్టుకొని గొల్లపల్లెకు వెళ్ళినాడు.

**వ. అంత నారాత్రి మధురానగరంబున నక్రూరుండు వసియించి నియతుండయి మఱునాఁడు రేపకడ లేచి, నిత్యకృత్యంబు లాచరించి, రథంబెక్కి కదలి నందగోకులంబునకుం బోవుచుం దెరువునఁ దనలో నిట్లనియె. 1188**

* అక్కడ అక్రూరు డానాటి రాత్రి మధురానగరంలో ఉండి మరునాటి ప్రాతఃకాలం లేచి నియమముతో నిత్యకర్మానుష్ఠానములు తీర్చుకొని రథమెక్కి నందగోకులానికి పయనమై వెళ్లుతూ దారిలో ఇట్లనుకున్నాడు.

## -: కంసుని పంపున నక్రూరుండు బృందావనంబునకుఁ జనుదెంచుట :-

**ఉ. ఎట్టి తపంబు సేయఁబడె? నెట్టి చరిత్రము లబ్ధ మయ్యెనో?**
**యెట్టిధనంబు లర్థులకు నీఁబడెనో తొలిబామునందు! నా**
**యట్టి వివేకహీనునకు నాదిమునీంద్రులు యోగదృష్టులం**
**బట్టఁగ లేని యీశ్వరుని బ్రహ్మమయున్ హరిఁ జూడఁగల్గెడిన్. 1189**

* కడచిన జన్మలో నే నెట్టి తపస్సు చేసినానోగదా! ఎట్టి నడవడి గల్గియుంటినో! తగినవారికి ఎటువంటి దానములు చేసినానో! ఆద్యులైన పరమయోగుల యోగదృష్టికికూడా గోచరంగాని భగవంతుడూ, బ్రహ్మస్వరూపుడూ అయిన శ్రీకృష్ణుని తెలివిమాలిన వాడనైన నేను చూడబోతున్నాను.

**ఉ. సూరులు దొల్లి యే విభుని శోభిత పాదనఖ ప్రభావళిం**
**జేరి భవాంధకారములఁ జిక్కక దాఁటుదు రట్టి దేవునిన్**
**వైరముతోడనైన గెలువన్ ననుఁ బంచి శుభంబు సేసె ని**
**ష్కారణమైన ప్రేమ; నిదె; కంసునిఁ బోలు సఖుండు గల్గునే? 1190**

* మునుపు ప్రాజ్ఞులైన ప్రహ్లాదాంబరీషాదులు ఏ దేవ దేవుని కాలి గోళ్ళ కాంతిపుంజము నాశ్రయించి జననమరణాలనే చీకట్లలో చిక్కుకొనక తరించినారో అట్టి భగవంతుని అవతారమే గదా ఈ కృష్ణుడు! ఈయనను వైరబుద్ధితో జయించడానికై పిలుచుక రమ్మని నిష్కారణ ప్రేమతో నన్ను పంపి కంసుడు నాకెంతో మేలు చేసినాడు. అతనివంటి చెలికాడు మరొకడు లభించడు.

**మ. 'ఇతఁ డా కంసునిచేతఁ బంపువడి నన్ హింసింప నేతెంచి నాఁ**
**డతిదుష్టుం'డని చూచునో సకలభూతాంతర్బహిర్మధ్య సం**
**గతుఁ డౌటం దలపోసి నన్ను సుజనుంగాఁ జూచునో యెట్టి యు**
**న్నతి గావించునొ యే క్రియం బలుకునో? నాభాగ్య మె ట్లున్నదో? 1191**

* "ఈ అక్రూరుడు ఆ కంసుని పంపున నన్ను హింసించడానికి వచ్చిన పరమ దుర్మార్గు"డని శ్రీకృష్ణుడు నన్ను అనుమానిస్తాడో! నిఖిల ప్రాణుల లోపల, వెలుపల, నడుమ బాగుగ వ్యాపించి ఉన్నవాడు గనుక ఆలోచించి అభిమానిస్తాడో! నన్ను ఎలా మన్నిస్తాడో! నాతో ఏ రీతిగా సంభాషిస్తాడో! ఇంతకూ నా అదృష్టం ఎట్లా ఉన్నదో గదా!

**వ. అని మఱియును. 1192**

**మ. అలకభ్రాజితమై సుధాంశునిభమై హాసప్రభోద్ధామమై**
**జలజాక్షంబయి కర్ణకుండల విరాజద్గండమై యున్న యా**
**జలజాతాక్షు ముఖంబు సూడఁ గలుగున్ సత్యంబు వో నాకు నా**
**వల దిక్కేఁగుచు నున్న నీ వనమృగ వ్రాతంబు లీత్రోవలన్. 1193**

* ఈ విధంగా తలపోస్తూ ఇంకా ఇలా అనుకున్నాడు. ముంగురులతో ముచ్చటగా ప్రకాశించునదీ, చంద్రునితో సమానమైనదీ, నవ్వు నిగ్గులతో నివ్వటిల్లునదీ, కమలదళాలవంటి కన్నులు గలదీ, చెవుల కమ్మలకాంతులతో చెలువారు చెక్కిళ్లు గలదీ అయిన ఆ పుండరీకలోచనుని మోము దర్శింపబోతున్నాను. ఇది తథ్యం. నేను వెళ్ళే దారులలో అడవిమృగములు నాకు ప్రదక్షిణంగా వెళ్లుతూ శుభాన్ని సూచిస్తున్నాయి.

**ఉ. మాపటివేళ నేను జని మాధవు పాదసమీపమందు దం**
**డాపతితుండనైన నతఁ డాశుగకాలభుజంగ వేగ సం**
**తాపిత భక్తలోక భయ దారణమైన కరాబ్జ మౌదలన్**
**మోపి హసించి నా కభయముం గృపతోడుత నీయకుండునే? 1194**

* రాత్రిసమయంలో నేను వెళ్ళి మాధవుని చరణసమీపంలో సాగిలబడి నమస్కరిస్తాను. ఆ ప్రభువు గబ గబ పరువెత్తే కాలమనే సర్పం ధాకకు తల్లడిల్లిపోయే భక్తుల భయాన్ని తొలగించే తన కరకమలాన్ని నా శిరమున నిలుపక పోవునా? చిరునవ్వు నవ్వుతూ కరుణతో నాకు అభయ ప్రదానం సలుపకపోవునా?

వ. అని మఱియు నక్రూరుం డనేకవిధంబుల గోవింద సందర్శనంబుఁ గోరుచు నమంద గమనంబున సుందర స్యందనారూఢుండై చని చని. 1195

* అని యింకనూ అక్రూరుడు అనేక విధాలుగా యశోదానందనుని సందర్శనం కోరుకుంటూ రథము నెక్కి వేగంగా పయనించి వెళ్ళాడు.

క. ముందటఁ గనె ఘనచందన, కుంద కుటజ తాల సాల కురవక వట మా
కందన్ నందితబల గో, విందన్ వికచారుణారవిందన్ బృందన్. 1196

* అలా వెళ్లివెళ్లి గొప్పవైన చందనం, మొల్ల, మల్లె, తాడి, మద్ది, గోరంట, మఱ్ఱి, మామిడి మొదలైన తరువులతో నిండినదీ, వికసించిన ఎఱ్ఱతామరలు గలది కనుకనే బలరామకృష్ణులను సంతసింపజేసేది అయిన బృందావనమును తనముందు కనుగొన్నాడు.

వ. కని బృందావనంబు దఱియం జొచ్చి యందు సాయంకాలంబున నడవికి నెఱిగల మేఁతల వెం బడిం దిగంబడి రాక చిక్కిన కుఱ్ఱ కోడె పడ్డ తండంబులం గానక; పొద, యిఱుము, మిఱ్ఱు పల్లం బనక తూఱి, పాఱి, వెదకి కానక చీరెడు గోపకుల యాహ్వానశబ్దంబు లాకర్ణింపుచుఁ గోమల ఘాస ఖాదన కుతూహలంబులం జిక్కి మక్కువం గ్రేపులం దలంచి తలారింపక, తమకంబులం దమతమ యంత నంభారవంబులు సేయుచు నూధంబులు స్రవింపఁ బరువులిడు ధేనువులును, ధేనువులకు నోసరించుచు సద్యోజాతంబులగు తర్ణకంబుల వహించి, నవసూతికలు వెనుదగులుట వలన దామహస్తులై చను వల్లవుల మెల్లన విలోకించుచు, మంద యిరుగెలంకులం గలంకరహితులైపులి సివంగి వేఁగి లోనగు వాలుమెకంబుల మొత్తంబులవలన నప్రమత్తులయి కుఠార కుంత శరాసన ప్రముఖాయుధంబులు ధరియించి, కావలి తిరుగు వ్రేలం గడచి, నానావిధ సరసతృణకబళ ఖాదన గరిష్ఠలై గోష్ఠంబులు ప్రవేశించి, రోమంథలీలాలసలై యున్న ధేనువులును, జన్నులు గుడిచి తల్లుల మ్రోలఁ బెల్లురేఁగి క్రేళ్లుఱుకు లేఁగలును, వెదలైన మొదవులం బైకొని పరస్పర విరుద్ధంబులై డీకొని కొమ్ముల యుద్ధంబులు సలుపు వృషభంబులును, నకుంఠిత బలంబులం గంఠరజ్జువులం ద్రెంచు కొని, పొద లుఱికి, దాఁటి తల్లులం దూఁటి, కుడుచు తఱపి దూడల దట్టించి పట్టనోపక గ్రద్దనఁ బెద్దలం జీరు గోపకుమారులును, గొడుకుల మగల మామల మఱందుల వంచించి పంచా యుధభల్ల భగ్నహృదయలై గృహకృత్యంబులు మఱచి శంకిలక సంకేతస్థలంబులఁ గృష్ణాగమన తత్పరలైయున్న గోపకామినులును, గోష్ఠప్రదేశంబుల గోవులకుఁ గ్రేపుల విడిచి యొడ్డుచు, మరలం గట్టుచు, నీ డ్చుచుం, గ్రీడించు గోపకులును, గోఖుర సముద్ధూత కరీష పరాగ పటలంబుల వలన నుల్లారి దులదులనైన ధేనుదోహనవేళా వికీర్ణ పయోబిందు సందోహ పరంపరా సంపాదిత పంకం బులును, దోహనసమయ గోపకరాకృష్ట గోస్తన నిర్గతంబు లయి కలశంబులందుఁ బడియెడు క్షీర ధారల చప్పుళ్లును, మహోక్షకంఠ సంస్పర్శన స్నిగ్ధంబులైన మందిరద్వార దారుస్తంభంబుల పొంతల నుండి, యులికిపడి నలుదిక్కులు గనుంగొని నూతనజన విలోకన కుపితంబులై కరాళించు సార మేయం బులుం గలిగి, బలరామకృష్ణ బాహుదండ ప్రాకారరక్షా విశేషభూషంబైన ఘోషంబుఁబ్రవేశించి యందు. 1197

* అక్రూరుడు బృందావనంలో ప్రవేశించాడు. సంజవేళలో దూడలు, కోడెలూ, తొలిచూలు గేదెలూ గుంపులు గుంపులుగా మేతకై వెళ్ళి అందందు పచ్చని పచ్చికలు మేస్తూ ఎంతకూ ఇంటికి మరలిరాక పోతే వాటిని వెదకుటకై పోయి పొదలు, మరుగులూ, మిట్టపల్లాలు లెక్కింపక పొదలలో దూరి పరువెత్తుతూ వెదుకులాడి కనుపించక ఒకరి నొకరు ఎలుగెత్తి పిలిచే గోపాలుర సవ్వడి ఆలించాడు. మెత్తని పచ్చిక మేసే కుతూహలంతో ఆగి అంతలో తమ లేగదూడలను తలచుకొని తడవుసేయక మమకారంతో తమకుతామే అంభారవాలు సలుపుతూ, పొదుగుల నుండి పాలు కార్చుకుంటూ పరుగెత్తి వస్తూన్న ఆవులను ఆలోకించాడు. అపుడే పుట్టిన దూడలను అరకడ నుంచుకొని పలుపులు చేతపట్టుకొని క్రొత్తగా ఈనిన బాలెంత గోవులు వెంబడింపగా మెల్లగా వెళ్లుతున్న వల్లవులను విలోకించాడు. చిరుతలు , సివంగులు, పెద్దపులులు మొదలైన క్రూరజంతువుల బారిపడకుండా జాగరూకులై మందకు రెండువైపులా గండ్రగొడ్డళ్లు, ఈటెలు, విండ్లు ధరించి కావలికాస్తున్న కాపరులను దాటి ముందుకు సాగాడు.

అక్కడ పలురకాలైన మిసిమిగల కసవులు మేసి బలిసి కొట్టాలలో చేరి అవులు మెల్లగా నెమరు వేస్తున్నవి. దూడలు పాలుగుడిచి తల్లులయెదుటే చెలరేగి చెంగుచెంగున దుముకుతున్నాయి. ఎదకు వచ్చిన ఆవులపై బడి దాటుతూ వృషభాలు ఎదురు నిలిచి ఒండొంటితో డీకొని కొమ్ములతో కుమ్ములాడు తున్నాయి. ఆరునెలల వయసు గల దూడలు మొక్కవోని బలంతో మెడపలుపులు త్రెంచుకొని పొదలు దూరి కుప్పించి దుముకుతూ తల్లిపొదుగులను పొడిచి పొడిచి పాలు కుడుస్తున్నాయి. వాటిని అదలించి ఇవతలకు పట్టి ఈడువలేక పిల్లలు పెద్దలను పిలుస్తున్నారు. కొడుకులను, భర్తలను, మామలను, మరదులను కికురించి మన్మథశరపీడితలై గొల్ల మగువలు ఇంటిపనులు మరచి జంకువీడి సంకేతప్రదేశాలకు చేరి కృష్ణుని రాకకై వేచి ఉన్నారు. గోపకులు పసుల కొట్టాలలో ఆవులకు దూడలను విడుస్తూ, తిరిగి కట్టివేస్తూ మరలపట్టి యీడుస్తూ క్రీడిస్తున్నారు. ఆవుల గిట్టలవల్ల పొడిపొడియై పరుచుకొన్న ఎండుపేడ దుమ్ము గోవులను పిదికేటప్పుడు చెదరిన పాలతుంపరల మొత్తముచే తడిసి అణగిపోయి అడుసుగా మారింది. గోపాలురు పాలు పిండునపుడు ఆవుల చనులనుండి చెంబులలోనికి కారే క్షీరధారలు జుంజుమ్మని చప్పుడు చేస్తున్నాయి. ఆబోతులు మెడ దురద తీర్చుకోవడాని కని ఒరసికొనగా నునుపారిన గృహద్వారసీమలలోని స్తంభాల సమీపాన ఉన్న కుక్కలు ఉలికిపడి క్రొత్తగా వచ్చిన వారిని చూచి కోపంతో మొరుగుతున్నాయి. ఈ విధంగా ఉన్న బలరామకృష్ణుల భుజదండములనే ప్రాకారంతో పరిరక్షింపబడుతున్న ఆ వ్రేపల్లెలోనికి అక్రూరుడు ప్రవేశించాడు.

**క. జలజాంకుశాదిరేఖలు, గల హరిపాదముల చొప్పు గని మోదముతోఁ**
**బులకించి రథము డిగి యు, త్కలికన్ సంతోషబాష్ప కలితాక్షుండై. 1198**

* పద్మము, అంకుశము మొదలైన శుభలక్షణములు గల కృష్ణుని అడుగుల చొప్పు సంతోషంతో తిలకించి మేను పులకించి ఆనందబాష్పాలతో నిండిన కన్నులు గలవాడై అక్రూరుడు ఉత్కంఠతో రథంనుంచి దిగినాడు.

మ. కనె నక్రూరుఁడు పద్మనేత్రులను రంగద్గాత్రులన్ ధేను దో
హన వాటీగతుల న్నలంకృతుల నుద్యద్భాసులం బీత నీ
ల నవీనోజ్జ్వలవాసులం గుసుమమాలాధారులన్ ధీరులన్
వనితాకాములఁ గృష్ణరాముల జగద్వంద్యక్రమోద్దాములన్. 1199

* తామరరేకులవంటి కన్నులు గలవారూ,రంగారు మేనులు గలవారు, చక్కగా గ్గైసేసి కొన్నవారు, వెల్లివిరిసే కాంతులు గలవారు. పచ్చనైన నల్లనైన కొంగ్రొత్త వలువలు ధరించినవారు, పూలదండలు తాల్చిన వారు, ధీరులు, యువతుల పాలిటి నవమన్మథాకారులు, పాలుపితికే వాడలలో చేరి ఉన్నవారు అయిన శ్రీకృష్ణ బలరాములను అక్రూరుడు సందర్శించాడు.

క. కని వారల పాదములకు, వినయంబున మ్రొక్కి భక్తివివశుం డగుచుం
దనువునఁ బులకాంకురములు, మొనయఁగ నానందబాష్పములు జడి గురియన్. 1200

* అలా చూచి భక్తి పరాధీనుడై పులకితగాత్రుడై అక్రూరుడు ఆనందాశ్రువులు జల్లు గురియగా ఆ రామకృష్ణుల పాదాలకు వినయంతో నమస్కరించాడు.

వ. తదనంతరంబ. 1201

క. అక్రూరులైన జనుల న, వక్రగతిం గాచు భక్తవత్సలుఁ డంత
న్నక్రూరుఁ గౌఁగిలించెను, జక్రాంకిత హస్తతలముఁ జాఁచి నరేంద్రా! 1202

* అటుపిమ్మట ఓ పరీక్షిన్మహారాజా! సాధువులైన మానవులను చక్కగా కాపాడే భక్తవత్సలు డయిన శ్రీకృష్ణుడు చక్రాయుధ చిహ్నితమైన హస్తం చాచి అక్రూరుణ్ణి ఆలింగనం చేసుకున్నాడు.

వ. మఱియు నక్రూరుండు బలభద్రునికిం బ్రణతుండైన నతండు గౌఁగిలించి చెట్ట వట్టుకొని కృష్ణ సహితుండై గృహంబునకుం గొనిపోయి మే లడిగి గద్దియ యిడి పాదప్రక్షాళనంబు సేసి మధుపర్కంబు సమర్పించి, గోవు నిచ్చి, యాదరంబున రసవదన్నంబు పెట్టించి తాంబూల గంధ మాల్యంబులొసంగె నయ్యవసరంబున నందుం డుపవిష్టుండైన యక్రూరుని సత్కరించి యిట్లనియె. 1203

* అనంతరం అక్రూరుడు బలభద్రునకు ప్రణమిల్లినాడు. అతడు అక్రూరుని కౌగిలించి, అతని చేయి పట్టుకొని కృష్ణునితోకూడా తమ గృహానికి తీసుకువెళ్ళినాడు. కుశలప్రశ్న గావించాడు. గద్దెమీద కూర్చుండ బెట్టి కాళ్ళు కడిగినాడు. మధుపర్కం సమర్పించాడు. ఆవు నొసగినాడు. సాదరంగా కమ్మని భోజనం పెట్టించినాడు. తాంబూలం, చందనం, పూదండలు ఇచ్చాడు. ఆ సమయాన నందుడు ఆసీనుడై ఉన్న అక్రూరుని ఆదరించి ఇలా అన్నాడు.

క. చెలియలు మొఱయిడ నల్లుర, ఖలుఁడై పొరిగొనిన యట్టి కంసుఁడు బ్రదుకం
గలదే మనికి దశార్హుల, కిలపై? మీసేమ మింక నే మని యడుగన్? 1204

* "అక్రూరా! చెల్లెలు మొరపెట్టుతుండగా నీచుడై అల్లుళ్లను చంపిన నృశంసుడు ఆ కంసుడు బ్రతికి యుండగా దశార్హవంశపు వారైన మీకు భూమిపై బ్రతుకున్నదా? ఇక మీ క్షేమాన్ని గూర్చి ఏమని అడిగేది?"

**వ. అని పలికె నంత నక్రూరుం డొక పర్యంకంబున సుఖోపవిష్టుండై యుండ హరి యిట్లనియె. 1205**

* అనంతరం అక్రూరుడు ఒక మంచంపై సుఖంగా కూర్చొని ఉండగా కృష్ణుడు అతనితో ఇలా అన్నాడు.

**మ. శుభమే నీకుఁ? బ్రమోదమే సఖులకుం? జుట్టాలకున్ సేమమే?**
**యభయంబే ప్రజకెల్ల? గోత్రజుల కాత్మానందమే? మామ ము**
**క్త భయుండే? వసుదేవ దేవకులు తత్కారాగృహంబందు మ**
**త్ప్రభవ వ్యాజ నిబద్ధులై బ్రతికిరే ప్రాణానిలోపేతులై? 1206**

* అక్రూరా! నీకు కుశలమేనా? చెలికాండ్రందరకు సంతసమే గదా? చుట్టాలకు క్షేమమా? ప్రజలందరు భయం లేక ఉన్నారా? కులబంధువు లందరికీ ఆనందమేనా? మా మామ కంసుడు నిర్భయంగా ఉన్నాడా? నన్ను కన్నారన్న సాకుతో కారాగారంలో నిర్బంధింపబడిన దేవకీ వసుదేవులు ప్రాణాలతో బ్రతికి ఉన్నారా?

**మ. నెఱి నేఁ డిక్కడ నీవు రాఁగ వగతో నీతోడ నేమైన నా**
**కెఱుఁగం జెప్పు మటంచుఁ జెప్పరు గదా యేమందు?రా వార్త యే**
**తెఱఁగున్ లేదని డస్సిరో వగచిరో దీనత్వముం జెందిరో**
**వెఱతో నాతలిదండ్రు లెట్లుపడిరో? విన్పింపు మక్రూరకా! 1207**

* అక్రూరా! నీ విక్కడికి వస్తుండగా విచారంతో నా కెరిగింపు మని నా తల్లిదండ్రులు నీతో ఏమైనా చెప్పినారా. వారేమన్నారు? నావృత్తాంతం తమ కేమి తెలియ లేదనివారు శుష్కించి పోయినారేమో? దుఃఖపడుతున్నారు కాబోలు! దైన్యాన్ని చెందినారేమో! కంసుని భయంతో వారెట్టి పాట్లు పడినారో నాకు వినిపించు.

**వ. మఱియు నీవేమి కారణంబున వచ్చి? తని హరి యడిగిన నతండు కంసునికి నారదుండు వచ్చి చెప్పిన వైరానుబంధ ప్రకారంబును గంసుండు దేవకీవసుదేవుల వధియింపం గమకించి మానిన తెఱంగును, ధనుర్యాగంబు పేరు సెప్పి పుత్తెంచిన ప్రకారంబును నెఱింగించిన రామకృష్ణులు నగి రంత తమ్ముం బరివేష్టించిన నందాది గోపకులం జూచి కృష్ణుం డిట్లనియె. 1208**

* మరి నీ వేమి కారణంగా ఇచ్చటికి వచ్చినావో తెలుపు- అని కృష్ణుడు అడిగాడు. అప్పుడు అక్రూరుడు, నారదుడు వచ్చి చెప్పిన సంగతులూ, కంసునకు యాదవులందు ఏర్పడిన విరోధభావమూ, అతడు

దేవకీవసుదేవులను చంప నుంకించి మానిన విషయమూ, ధనుర్యాగమను మిషతో తన్ను పంపిన ప్రకారమునూ వినిపించాడు. అది విని రామకృష్ణులు పక్కున నవ్వినారు. ఆ మీదట చుట్టూ చేరి ఉన్న నందుడు మొదలైన గొల్లపెద్దలను చూచి శ్రీకృష్ణుడు ఇలా అన్నాడు.

శా. భూనాథుండు మఖంబుఁ జూడఁ బిలువం బుత్తెంచినాఁ; డవ్విభుం
గానం బోవలెఁ; బాలు నెయ్యి పెరుఁగుల్ గట్నంబులుం గానుకల్
మీ నేర్పొప్పఁగఁ గూడఁబెట్టుఁడు తగన్ మీమీ నివాసంబులన్;
యానంబుల్ గొని రండు పొండు మథురా యాత్రాభిముఖ్యంబుగన్. 1209

వ. అని నియమించె; నంత నక్రూరుండు మథురకు హరిం గొనిపోయెడి నని యెఱింగి వ్రేతలు గలంగి. 1210

* "రాజైన కంసుడు ధనుర్యాగం దర్శించడానికై పిలువ నంపినాడు. ఆ ప్రభువును చూచుటకు వెళ్లాలి. మీమీ ఇళ్ళలో గల పాలు, పెరుగు, నెయ్యి, కట్నాలు, కానుకలు మీ చాతుర్యం మెరసేటట్లు సమకూర్చండి. బండ్లను ఆయత్తపరచుకొని రండి. మనం మథురా నగరానికి వెళ్ళాలి" అని ఆనతిచ్చాడు. అక్రూరుడు రామకృష్ణులను వెంటబెట్టుకొని మథురకు వెళతాడనే వార్త తెలియగానే గోపవనితలు కలత చెందినారు.

మ. హరినవ్వుల్ హరిమాటలున్ హరిమనోజ్ఞాలాపముల్ లీలలున్
హరివేడ్కల్ హరిమన్ననల్ హరికరాబ్జాలంబనాహ్వానముల్
హరిణీలోచన లందఱున్ మఱి యుపాయం బెట్లొకో యంచు లో
నెరియన్ ముచ్చటలాడి రంత గములై యేకాంత గేహంబులన్. 1211

* శ్రీ కృష్ణుని చిరునవ్వులూ, మాటలూ, మనసులు హరించే సరససల్లాపాలు, విలాసాలూ, వినోదాలూ, ఆదరాభిమానాలూ, ఆయన కమలం వంటి తనచేతితో పట్టుకొని పిలుచుటలూ- ఇవన్నీ ఇకపై అనుభవించే ఉపాయాలు ఏమిటా అని ఆ లేడికన్నుల అన్నుమిన్నలు ఖిన్నలై కుములుతూ ఏకాంతగృహాలలో గుంపులై కూడి ముచ్చటించుకున్నారు.

వ. మఱియుఁ దమలో నిట్లనిరి. 1212

ఉ. మేటిగృహస్థు బ్రహ్మ యని మిక్కిలి నమ్మితి మమ్మ! చూడ నే
పాటియు లేదు మాకుఁ బరిపాలకుఁడైన సరోజనేత్రు ని
చ్చోట వసింపనీక యొకచోటికిఁ బో విధియించి పిన్న బి
డ్డాటలు చేసె నీదుడుకు లక్కట! భారతికైనఁ జెప్పరే! 1213

* ఇంకా వారు ఈ విధంగా తమలో తాము తలపోసుకున్నారు. బ్రహ్మదేవుడు దొడ్డ సంసారి అని చాల విశ్వసించాము గదమ్మా! ఆలోచింపగా ఆయనలో ఏ మాత్రం ధర్మమూ లేదు. మన ప్రభువైన పుండరీకాక్షుణ్ణి ఇక్కడ ఉండనీయక వేరొకచోటికి తరలునట్లు చేసి చిన్న పిల్లవానివలె ఆటలాడుతున్నాడు. అయ్యో! అతని ఈ దుండగపు చేష్టలనుగూర్చి ఆయన ఇల్లాలు సరస్వతికైనా చెప్పండి.

వ. అని విధి దూఱుచు మదనతాపాయత్తచిత్తలై. 1214

* ఈ విధంగా బ్రహ్మను నిందిస్తూ గోపికలు మన్మథతాపానికి అధీనమైన చిత్తాలు కలవారైనారు.

ఉ. రమ్మని చీరినంతనె పురంబున కేఁగెడుఁ గాన నన్ను నీ
కొమ్మలు నమ్మినారు మరుకోలల కగ్గము సేసి పోవఁగా
ముమ్మరమైన తాపముల ద్రొగ్గుదురో యనఁ డంబుజాక్షుఁ డా
యమ్మలు గోపవృద్ధులుఁ బ్రయాణము వల్దనరైరి చెల్లరే! 1215

* ఇంకా ఆ గోపకాంతలు ఇలా అనుకున్నారు- రమ్మని పిలిచినంత మాత్రాన మథురకు పయనిస్తున్నాడే కాని మన కమలాక్షుడు మనకన్నయ్య"నన్నీ గొల్లపడతులు నమ్ముకొని ఉన్నారే, అట్టివారిని మదన బాణాల పాలు చేస్తే మిక్కుటమైన తాపంతో కుమిలిపోతారేమో'' అని అనుకోవడం లేదు. ఇక మన అమ్మలక్కలు- మన గొల్లముదుసళ్లు మథురకు పోవద్దని అచ్యుతునితో మాటవరుసకైనా అనరు.

శా. అక్రూరుండని పేరువెట్టుకొని నేఁ డస్మన్మనోవల్లభుం
జక్రిన్ మాకడఁ బాపికొంచు నరుగం జర్చించి యేతెంచి నాఁ
డక్రూరుం డఁట క్రూరుఁ డీతఁడు నిజం బక్రూరుఁ డౌనేని ని
ర్వక్రత్వంబునఁ గృష్ణుఁ బెట్టి తన త్రోవం బో విచారింపఁడే? 1216

* అక్రూరు డని పేరు పెట్టుకొని మా హృదయేశ్వరుడైన యదుకిశోరుణ్ణి మావద్ద నుండనీయక వేరు చేసి తీసికొని వెళ్ళడానికై వచ్చాడు. ఈతడు అక్రూరుడు కాదు. నిజంగా ఈతడు క్రూరుడు. అక్రూరు డయితే కుటిలత్వము మాని మన కృష్ణుని దిగవిడిచి తన దారిని తాను వెళ్లాలని తలపోయడా?

ఉ. ఫుల్లసరోజ లోచనలు పూర్ణసుధాంశుముఖుల్ పురాంగనల్
మెల్లనె యెల్లి పట్టణము మేడలనుండి సువర్ణలాజముల్
సల్లఁగ వారిఁ జూచి హరి సంగతి సేయఁ దలంచుఁ గాక వ్రే
పల్లె వసించు ముద్దియలపైఁ బడ నేల తలంచు నక్కటా! 1217

* వికసించిన పద్మములవంటి కన్నులు గలవారునూ, పున్నమనాటి చందురునివంటి మోములు గలవారునూ అగు మథురాపురిలోని మగువలు రేపు మేడలెక్కి బంగారపు లాజలు మెల్లగా తనపై చల్లగా, వారిని చూచి వారిజలోచనుడు వారితో స్నేహం చెయ్యాలని తలంచునేగాని అయ్యో! గొల్లపల్లెలోని గోపికలపొందు ఎందుకు కోరుతాడు?

క. పురసతుల విలోకనములు, సరసాలాపములు నర్మసంభోగములున్
మరగి హరి మనల నొల్లఁడు, నరవరు లోయమ్మ! నూతన ప్రియులు గదే. 1218

* పట్టణంలోని నీటుకత్తెల చూపులు, రసవంతములైన భాషణాలు, తెరచాటు కలయికలు మరగి మాధవుడు మనలను ఇచ్చగించడు. ఓ యమ్మా! రాజులు క్రొత్తలను కోరుతుంటారు గదా!

క. పుట్టెన్నఁడు హరి నెఱుఁగని, పట్టణసుందరుల కితనిఁ బతిఁ జేసి కడున్
దట్టపు విరహాగ్నులకును, గట్టిఁడి దైవంబు ఘోషకాంతల వెదకెన్. 1219

* క్రూరపు దైవం పుట్టినది మొదలు కృష్ణుణ్ణి దర్శింపని నగరంలోని నారీమణులకు అతణ్ణి పతిగా చేశాడు. మిక్కుటమైన వియోగాగ్నికి ఆహుతి గావించడానికై వ్రేపల్లె వెలదులను వెదకికొన్నాడు.

మ. 'హరి నేలా కొనిపోయె' దంచు మన మా యక్రూరుఁ బ్రార్థింతమా?
'హరిఁ బోనీకుఁడు నిల్వరే' యనుచు నేఁ డర్చింతమా' వేల్పులన్?
హరిపాదంబుల కడ్డముల్ పడుదమా; 'హా దైవమా'! యంచు నా
తరుణుల్ కొప్పులుఁ జీరలున్ మఱచి కందర్పజ్వర భ్రాంతలై. 1220

* ఇలా తలపోస్తూ వ్రేపల్లెలోని విరిబోణులు మదనతాపంతో కంది భ్రమచెంది తమ కొప్పులు, కోకలు వీడిపోగా- "కృష్ణుణ్ణి ఎందుకు కొనిపో తా" వని అక్రూరుణ్ణి ప్రార్థించుదామా! లేకపోతే ఆ నందసూనుని పోనీక ఇక్కడే నిలుపుమని దేవతలను పూజించుదామా? కాకపోతే "ఓ దేవుడా!" అంటూ ఆ హరికాళ్ళకు అడ్డం పడదామా అనుకున్నారు.

మ. ఉవిదల్ సిగ్గులు మాని కన్గవల నీ రొండొండ వర్షింపఁగా
వివశత్వంబులతోఁ గపోలతట సంవిన్యస్త హస్తాబ్జలై
పవనోద్ధూతలతాభలై 'మముఁ గృపం బాలింపు గోవింద! మా
ధవ! దామోదర' యంచు నేడ్చిరి సుజాతంబైన గీతంబులన్. 1221

* కొంద రంగనలు సిగ్గువీడి కనుదోయినుండి జొటజొట కన్నీరు కారుస్తూ స్వాధీనం తప్పి చక్కని చెక్కిళ్ళపై కరకమలాలు చేర్చి గాలికి కంపించుతున్న తీగలవలె "ఓ గోవిందా, మాధవా, దామోదరా, మమ్ము దయతో కాపాడు" అంటూ స్వరబద్ధంగా తాళబద్ధంగా పాటలు పాడుతూ ఏడ్చినారు.

వ. అంత మఱునాఁడు సూర్యోదయకాలంబునం గృష్ణుండు దన తోడఁ బయనంబునకు గమకించి నడచు గోపికలను 'మఱలివత్తు' నని దూతికా ముఖంబున నివర్తించి, కృష్ణుఁడు శకటంబులందుఁ గానికలు గోరసంబులు నిడుకొని నందాదు లయిన గోపకులు వెను తగుల నక్రూర చోదితం బయిన రథం బెక్కి మథురాభిముఖుండై చను సమయంబున. 1222

* శ్రీకృష్ణుడు మరునాటి సూర్యోదయ సమయాన తనవెంట వస్తామని తత్తరపాటుతో వస్తున్న గోపికా స్త్రీలకు "మరలివస్తా" నని దూతికల ద్వారా చెప్పించి, వారిని వెనుకను మరలించాడు. బండ్ల నిండా కానుకలు, పాలు, పెరుగు, వెన్న, నెయ్యి మున్నగు వాటిని ఎత్తించుకొని నందుడు మొదలుగా గల గోపకులు వెంటనంటి రాగా అక్రూరుడు తోలే రథమెక్కి శ్రీకృష్ణుడు మథురకు అభిముఖంగా పయనించాడు.

చ. 'అదె చనుచున్నవాఁడు ప్రియుఁ డల్లదె తేరదె వైజయంతి య
ల్లదె రథ ఘోటకాంఘ్రిరజ మాదెస మార్గము చూడుఁ డంచు లో

నొదవెడి మక్కువన్ హరిరథోన్ముఖలై గములై వ్రజాంగనల్
గదలక నిల్చిచూచి రటు గన్నుల కబ్బిన యంత దూరమున్. 1223

* ఆ సమయంలో ఘోషయువతులు "మన ప్రియుడైన శ్రీకృష్ణుడు అడుగో పోతున్నాడు" "అదిగో రథం!", "అల్ల దే రథంమీది జెండా!", "రథానికి పూన్చిన గుఱ్ఱముల పాదములనుండి లేచిన దుమ్ము అదిగో!", "ఆ దిశలో కృష్ణు డేగు మార్గం చూడండి"- అంటూ కన్నుల కగుపడునంత దవ్వు కదలక మెదలక అలాగే చూస్తూ నిలబడ్డారు.

వ. ఇట్లు బలభద్రాక్రూరసహితుండై చని. 1224

క. అవలోకించెను గృష్ణుఁడు, ప్రవిమల కల్లోల పవనభాసిత జన్య
న్న వసన్న పాపసైన్యన్, గవిజనమాన్యన్ గళిందకన్యన్ ధన్యన్. 1225

* ఈ విధంగా బలరామ సహితుడైన శ్రీకృష్ణుడు అక్రూరునితో కలిసి వెళ్ళి నిర్మలమైన పెద్దతరంగములపై నుంచి వెడలే చల్లని వాయువులతో కూడినదీ, పాపసంచయాన్ని నశింపజేసేది, పండితు లయినవారు గౌరవించేదీ, పరమ ధన్యాత్ముూరాలు, కళిందపర్వతం కూతురూ అయిన యమునానదిని దర్శించాడు.

వ. కని తత్కాళిందియందుఁ బరిక్షుణ్ణ మణిగణ సముజ్జ్వలంబు లగు జలంబులు ద్రావి, తరుసమూహ సమీపంబున రామసహితుండై కృష్ణుండు రథంబు ప్రవేశించె; నంత నక్రూరుండు వారలకు మ్రొక్కి వీడ్కొని కాళిందీహ్రదంబు సొచ్చి విధిపూర్వకంబుగ వేదమంత్రంబులఁ జపించుచు. 1226

* ఈ విధంగా కాళిందిని చూచి సానబెట్టిన మణి సముదాయంవలె, తళ తళ మెరుస్తున్న ఆ నదీ జలాన్ని త్రావి కృష్ణుడు బలరామునితోగూడ చెట్ల సమీపాన ఉన్న రథాన్ని అధిరోహించాడు. అప్పుడు అక్రూరుడు వారిద్దరికీ నమస్కరించి అనుజ్ఞ పుచ్చుకొని కాళిందీనదిలో దిగి యథావిధిగా వేదమంత్రాలు జపిస్తూ స్నానం చేశాడు.

## -: అక్రూరుండు యమునలో రామకృష్ణులను దర్శించి నుతించుట :-

ఉ. స్నానము సేసి చేసి నది చల్లని నీటను రామకృష్ణులన్
మానుగఁ జూచి వీరు రథమధ్యమునన్ వసియించి యున్న వా
రీ నది నీటిలోపలికి నెప్పుడు వచ్చి? రటంచు లేచి మే
ధానిధి సూచె వారిని రథస్థుల భక్తమనోరథస్థులన్. 1227

అక్రూరుడు స్నానం చేస్తూ చేస్తూ ఆ చల్లని నదీజలంలో బలరామకృష్ణులను చక్కగా సందర్శించాడు. "వీరు ఇందాక రథంలో కూర్చున్నారుగదా! మరి ఈ యమునానదీ జలమధ్యంలోకి ఎప్పుడు వచ్చినారు" అనుకుంటూ లేచి బుద్ధిమంతుడైన ఆ అక్రూరుడు భక్తుల మనోరథాలు చేకూర్చే వారిద్దరూ మళ్ళీ ఆ రథంలో ఉండడం చూచాడు.

వ. చూచి వెఱఁగుపడి. 1228

శా. 'కంటిన్ మున్ను రథంబుపై; జలములోఁ గంటిన్ దుదిం; గ్రమ్మఱం
గంటిం దొంటి రథంబుమీఁద; నిదె యీ కల్యాణచారిత్రు లే
వెంటం దోఁచిరి రెండు దిక్కుల; మనోవిభ్రాంతియో? నీటిలో
నుం టాశ్చర్యము; చూతు నంచు మఱియు న్మూహించి మగ్నాంగుఁడై. 1229

* అలా చూచి ఆశ్చర్యపడి "తొలుత రథంలో వీక్షించాను. తరువాత నీటిలో దర్శించాను. మరల వారు మొదటి మాదిరిగా రథం మీదనే ఉండటం చూచాను. మంగళస్వరూప రూపగుణులైన రామకృష్ణులు ఏ విధంగా ఇక్కడా అక్కడా రెండుచోట్లా అగపడినారు? నా మనస్సుకు భ్రమ ఏర్పడిందా? నీళ్ళలో వీరుండటం అచ్చెరువు గొల్పుతున్నది. మరలా కనుగొంటాను"- అని తలంచి తిరిగి నదీజలాలలో మునిగినాడు.

ఉ. పోషితబాంధవుండు యదుపుంగవుఁ డాజలమందుఁ గాంచె స
ద్భాషు సహస్రమస్తకవిభాసితభూషు నహీశు భూమిభృ
ద్వేషుఁ గృపాభిలాషుఁ బ్రతివీర చమూ విజిగీషు నిత్య సం
తోషు నరోషు నిర్దళితదోషు ననేకవిశేషు శేషునిన్. 1230

* బంధువులను పోషించేవాడూ, యాదవులలో గొప్పవాడూ అయిన అక్రూరుడు ఆ నదీజలాలలో అశేషమైన విశేషాలు గల ఆదిశేషుణ్ణి చూచాడు. అ ఫణిరాజు వ్యాకరణసమ్మతంగా భాషించునట్టివాడు. వేయితలలపై వెలుగొందే విభూషణాలు కలవాడు. అతడు పన్నగాలకు ప్రభువు. రాజవేషము ధరించినవాడు. దయార్ద్రహృదయుడు. శత్రుసైన్యాన్ని జయించుటకు ఇచ్ఛగించేవాడు. ఎడతెగని సంతోషం గలవాడు. కోపం లేనివాడు. అతడు నిష్కళంకుడు.

వ. మఱియు నీలాంబర సంయుతుండును, సిద్ధోరగాది సన్నుతుండునునై యొప్పు నప్పాఁపఱేనిం దప్పక కనుంగొని. 1231

* నల్లనివస్త్రం ధరించి సిద్ధులు, నాగులు మొదలైన వారిచే చక్కగా కొనియాడ బడుతున్న సర్పరాజును కనురెప్పవాల్చక చూచాడు అక్రూరుడు.

సీ. ఆ భోగి భోగపర్యంక మధ్యంబున వలనొప్పు పచ్చని వలువవాని
మేఘంబుపైనున్న మెఱుఁగు చందంబున నురమున శ్రీదేవి యొప్పువాని
ముసురు తేఁటులు విప్ప ముఖచతుష్కము గల తనయుఁ డాడెడి బొడ్డుఁదమ్మివానిఁ
గదలిన బహుపదక్రమవిశేషంబుల రవము సూపెడి నూపురముల వాని

ఆ. జలజగర్భ రుద్ర సనక సనందన,సద్విజామర ప్రశస్యమాన
చరితుఁడైన వాని సౌందర్యఖనియైన, వాని నొక్క పురుషవర్యుఁ గాంచె. 1232

* ఆ ఆదిశేషుణ్ణి పానుపుగా చేసుకొని ఆ మధ్య భాగంలో శయనించి ఉన్న అందాలగని యైన పురుషోత్తముణ్ణి అవలోకించాడు అక్రూరుడు. ఆ దివ్యపురుషుడు మిసిమి గల పసుపువన్నె పట్టువస్త్రం

కట్టుకున్నాడు, మేఘంలో మెరిసే మెరుపులాగా అతని వక్షఃస్థలంలో లక్ష్మీదేవి ఒప్పుతున్నది. మూగిన తుమ్మెదలు చెదరగా ఆయన నాభికమలంలో నలుమోముల నందనుడు ఆడుకుంటున్నాడు. కదలినపుడు ఆ పురుషోత్తముని కాలిఅందెలు పదము, క్రమము మొదలగు విశేషాలతో వేదనినాదాలు వెలువరిస్తున్నాయి. బ్రహ్మ, ఈశ్వరుడు, సనక సనందనులు, సద్బ్రాహ్మణులు, వేల్పులు అతని చరిత్రను శ్లాఘిస్తున్నారు.

**వ. మఱియును జారు లక్షణ లక్షిత నఖ పాద గుల్ఫ జాను జంఘోరు కటి నాభి మధ్యోదరుండును, సాదరుండును; శ్రీవత్సకౌస్తుభ వనమాలికా విరాజిత విశాల వక్షుండును, బుండరీకాక్షుండును; శంఖ చక్ర గదా పద్మ హస్తుండును, సత్త్వగుణ ప్రశస్తుండును; బ్రహ్మసూత్ర కటిసూత్ర హార కేయూర కటక కంకణ మకర కుండల కిరీటాది విభూషణుండును, భక్తజనపోషణుండును; సుందర కపోల ఫాల నాసాధర వదన కర్ణుండును, నీలనీరద వర్ణుండును; గంబుకంధరుండును, గరుణాగుణ బంధురుండును; బ్రహ్లాద నారద సునంద నందప్రముఖ సంభావితుండును, శ్రీ పుష్టి తుష్టి కీర్తి కాంతీలోర్జా విద్యాఽవిద్యా శక్తి మాయాది సేవితుండునునై యొప్పు న ప్పరమేశ్వరునకు మ్రొక్కి భక్తిసంభ్రమంబు లగ్గలంబు లుగ గద్గదకంఠుండై దిగ్గనం గరంబులు ముకుళించి యిట్లని వినుతించె. 1233**

* రమ్యములైన శుభలక్షణాలతో గూడిన గోళ్లు, పాదములు, మడమలు, మోకాళ్లు, పిక్కలు, తొడలు, కటిప్రదేశము, నాభి, నడుము, కడుపు గలవాడును; ఆదరముతో గూడినవాడును; శ్రీవత్సమనే పుట్టుమచ్చ, కౌస్తుభమనే మణి, వనమాల అనే పేరు గలిగి పువ్వులు ఆకులు చేర్చి కట్టి మెడనుండి కాళ్ళ వరకు వ్రేలాడు తోమాల- వీటితో విరాజిల్లే వెడదయైన ఱొమ్ము కలవాడును, తెల్లదామరలవంటి కన్నులు గల వాడును; శంఖము, చక్రము, గద, పద్మము- వీటిని చేతులందు ధరించిన వాడును; సత్త్వగుణ సంపన్నుడైన వాడును; జందెము, మొలనూలు, ముత్యాలపేరు, బాజుబందులు, అందెలు, కంకణాలు, మకరకుండలాలు, కిరీటము మొదలైన ఆభరణాదులతో అలంకృతుడైన వాడును; భక్తులను కాపాడేవాడును, చక్కని చెక్కిళ్లు, నొసలు, ముక్కు, పెదవి, ముఖము, చెవులు కలవాడును; నీలమేఘంవంటి దేహకాంతి కలవాడును, శంఖంలాంటి మెడ గలవాడునూ, దయాగుణంతో నిండినవాడునూ, ప్రహ్లాదుడు, నారదుడు, సునందుడు, నందుడు మున్నగువారిచే పూజింపబడువాడునూ; లక్ష్మి, పుష్టి, తుష్టి, కీర్తి, కాంతి, ఇల, ఊర్జ, విద్య, అవిద్య, శక్తి, మాయ మున్నగు తేజోమూర్తులు శక్తులచే సేవింపబడేవాడును అయిన ఆ పరమేశ్వరునికి అక్రూరుడు మ్రొక్కినాడు. భక్తిసంభ్రమాలతో తటాలున చేతులు జోడించి డగ్గుత్తికతో ఈ విధంగా స్తోత్రం చేసినాడు.

**దండకము:**

**వ. శ్రీమానినీమానచోరా! శుభాకార! వీరా! జగద్ధేతుహేతుప్రకారా! సమస్తంబు నస్తంగతంబై మహాలోల కల్లోల మాలాకులాభీల పాథోనిధిం గూలఁగా, బాలకేళీగతిం దేలి నారాయణాఖ్యం బటుఖ్యాతి శోభిల్లు నీ నాభి కంజంబులో లోకపుంజంబులం బన్ను విన్నాణియై మన్న యా బమ్మ యుత్పన్నుఁ డయ్యెం గదా! పావ కాకాశ వాతావనీ వార్యహంకార మాయామహామానసాదుల్ హృషీకాదులున్ లోకముల్ లోక**

బీజంబులున్ నిత్యసందోహమ్మై నీ మహాదేహమం దుల్లసించున్; వసించున్, నశించున్, జడత్వంబు లేకాత్మరైయై యొప్పు నీయొప్పిదం బెల్ల నోచెల్ల; చెల్లన్ విచారింపఁదా రెంతవా? రెంతవారైన మాయాదు లా మాయతోఁగూడి క్రీడించు లోకానుసంధాత యీధాత నిర్ణేతయే? నీ కళారాశికిం గొంద ఱంభోజ గర్భాదు లధ్యాత్మలందున్న శేషాధిభూతంబులందు న్ననేకాధిదైవంబులందున్ సదా సాక్షివై యుందు వంచుం దదంతర్గతజ్యోతి వీశుండ వంచుం, త్రయీపద్ధతిం గొంద ఱింద్రాది దేవాభి ధానంబులన్, నిక్క మొక్కండ వంచున్ మఱిం గొంద రారూఢకర్మంబులం ద్రుంచి, సంసారముం ద్రెంచి, సన్న్య స్తులై మించి విజ్ఞానచక్షుండ వంచున్, మఱిం బాంచరాత్రానుసారంబుగాఁ దన్మయత్వంబుతోఁ గొంద ఱీ వాత్మ వంచున్, మఱిం గొంద ఱా వాసుదేవాది భేదంబులన్ నల్వురై చెల్వు వాటింతు వంచున్; మఱిన్ నీవు నారాయణాఖ్యుండ వంచున్ శివాఖ్యుండ వంచున్, మఱిం బెక్కుమార్గంబులన్ నిన్ను నగ్గింతు; రెగ్గేమి? యేఱుల్ పయోరాశినే రాసులై కూడు క్రీడన్ విశేషంబు లెల్ల న్నశేషంబులై డింది నీయం దనూనంబు లీనంబులౌ; నేకరాకేందు బింబంబు కుంభాంత రాళంబులం బింబితంబైన వేఱున్నదే? యెన్న నేలా? ఘటాంతర్గతాకాశముల్ తద్ఘటాంతంబులం దేకమౌ రేఖ లోకావధిన్ వీఁక నే పోకలం బోక; యేకాకివై యుండు; దీశా! కృశానుండు నెమ్మోము, సోముండు భానుండు కన్నుల్, దిశల్ కర్ణముల్, భూమి పాదంబు, లంభోనిధుల్ గుక్షి, శల్యంబు లద్రుల్, లతాసాలముల్ రోమముల్, గాలి ప్రాణంబు, బాహుల్ సురేంద్రుల్, ఘనంబుల్ కచంబుల్, నభోవీథి నాభిప్రదేశంబు, రేలుంబగళ్లున్ నిమేషంబు, లంభోజగర్భుండు గుహ్యంబు, వర్షంబు వీర్యంబు, నాకంబు మూర్ధంబుగా నేకమై యున్న నీ మేనిదండం బయోజాత గర్భాండముల్ మండి తోదుంబరానోకహానేకశాఖా ఫలాపూరి తానంతజంతు ప్రకాండంబు లీలం బ్రసిద్ధోదరాశిస్థ జంతుప్రకారంబుగా నిండి యుండున్; మహారూప! నీ రూపముల్ వెగ్గలం బుగ్గడింపన్; లయాం భోధిలో మీనుమేనన్ విరోధిన్ నిరోధించి మున్ వేధ కున్ వేదరాశిం బ్రసాదింపవే? త్రుంపవే కైటభ శ్రీ మధుం జక్రివై మొత్తవే! యెత్తవే మందరాగంబు రాగంబుతోఁ గూర్మలీలా పరిష్పందివై పందివై మేదినిన్ మీఁదికిం ద్రోచి దోషాచరుం గొమ్ములన్ నెమ్ములన్ జిమ్ముచున్ గ్రువ్వవే త్రవ్వవే ఘోరవైరిన్ నృసింహుండవై, దండివై దండి వైరోచనింజూచి యాచింపవే? పెంపవే మేను బ్రహ్మాండము న్నిండఁ, బాఱుండవై రాజకోటిన్ విపాటింపవే, రాజవై రాజబింబాస్యకై దుర్మదారిన్ విదారింపవే, నొంపవే క్రూరులన్ వాసుదేవాది రూపంబులన్, శుద్ధ బుద్ధుండవై వైరి దారాంతరంగంబుల న్నంత రంగంబులుంగా గరంగింపవే? పెంపు దీపింపవే?కల్కి మూర్తిం బ్రవర్తించి, నిన్నెన్న నే నెవ్వఁడన్, నన్ను మాయావిపన్నున్ విషణ్ణుం బ్రసన్నుం డవై ఖిన్నతంబాపి మన్నింపవే! పన్నగాధీశతల్పా! కృపాకల్ప!, వందారుకల్పా! నమస్తే నమస్తే నమస్తే నమః 1234

* అభిమానవతియైన లక్ష్మీదేవి అంతరంగాన్ని అపహరించిన వాడా! మంగళకరమైన స్వరూపం కలవాడా! ఓ వీరుడా! నిఖిల ప్రపంచ సృష్టికి కారణమైన పృథివ్యాది పంచమహాభూతాలకు కారణమైనవాడా! మిక్కిలి చలించు తరంగశ్రేణిచే కలత నొందిన భయంకర జలరాశిలో సర్వప్రపంచం రూపుమాసి లీనమై పోయినపుడు నీవు నారాయణ నామంతో ఖ్యాతిని వహించి బాలుడవై అందు తేలియాడినావు.

అప్పుడు నీ నాభికమలం నుంచి సకలభువనాలను సృజించే విజ్ఞాన సంపన్నుడైన బ్రహ్మదేవు డుద్భవించాడు. అగ్ని, ఆకాశము, వాయువు, భూమి, నీరు, అహంకారము, మాయ, మహత్తత్త్వము, మనస్సు మొదలైనవీ; ఇంద్రియములూ, ఇంద్రియవృత్తులైన శబ్ద స్పర్శ రూప రస గంధములూ, లోకములూ లోక కారణములూ- ఈ సమస్తమూ నీ మహాశరీరం నుండి పుట్టి పెరిగి నశిస్తూ ఉంటాయి. జడస్వభావం లేక ఆత్మస్వరూపుడవై యున్న నీ మహిమ ఇలాంటిదని వర్ణించుటకు ఎంత గొప్పవా రయిననూ సమర్థులు కారు. మాయ మున్నగు ముప్పది యారు తత్త్వములు జడములు గాన నీ స్వరూపం గ్రహించలేవు. లోకాలను సృజించే పరమేష్ఠి మాయాసంబంధమైన గుణాలచే ఆవరింపబడి యున్నాడు గనుక అతడు నిన్ను ఇట్టి వానినిగా నిర్ణయింపలేడు. హిరణ్యగర్భుడు మున్నగువారు నిన్ను అధ్యాత్మ, అధిదైవ, అధిభూతములకు అనగా దేహేంద్రియాధి దేవతలకు సాక్షిగా, అంతర్యామిగా, నియామకుడైన ఈశ్వరునిగా భావిస్తారు.

వేదమార్గగాములైన కొందరు కర్మయోగులు నీ వొక్కడవే ఇంద్రాది నామధేయాలతో నెగడు తుంటావు, ఇది నిజ మంటున్నారు. మరి కొందరు జ్ఞానయోగులు అన్నికర్మలను వదలి సంసారం త్యజించి సన్న్యాసులై నిన్ను విజ్ఞాన స్వరూపునిగా పేర్కొంటున్నారు. వేరొక కొందరు పాంచరాత్రాగమ పద్ధతి ననుసరించి నీవు వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్నా నిరుద్ధభేదాలతో నలువురై సొంపు ఘటిస్తున్నా వంటున్నారు. కొందరు నీవు నారాయణుడవనీ, కొందరు శివుడవనీ అనేక మార్గాలలో నిన్ను శ్లాఘిస్తున్నారు.

ఇందులో తప్పులేదు. ఏరులన్నీ సాగరాన్నే చేరుతున్నట్లు విశేషాలన్నీ నిశ్శేషంగా నీలోనే లీన మౌతున్నాయి. ఒకే పూర్ణచంద్రబింబం ఘటాలలోని జలాలలో పెక్కులుగా ప్రతిఫలించిన మాత్రాన దానికంటె ఈ ప్రతిబింబాలు వేరు కావుగదా! ఘటాంతర్గతమైన ఆకాశం ఘటం నశించగానే మహాకాశంలో చేరినట్లు లోకాలన్నీ నశింపగానే నీవు ఏ జాడలం ద్రొక్కక ఒంటరివాడవై ఉంటావు. ఓ ప్రభూ! అగ్ని నీ ముఖము. చంద్రసూర్యులు నీ కన్నులు. దిక్కులు నీ చెవులు. భూమి నీ పాదములు. సముద్రాలు నీ కుక్షి. కొండలు నీ యెముకలు. తీగలు చెట్లు నీ రోమములు. గాలి నీ ప్రాణము. ఇంద్రాదులు నీ బాహువులు. మేఘాలు నీ తలవెంట్రుకలు. ఆకాశం నీ నాభి, రేయింబవళ్ళు నీ రెప్పపాట్లు. బ్రహ్మ నీ మేఢ్రము. వర్షము నీ వీర్యము. స్వర్గము నీ శిరస్సు. ఇలా నీ శరీరములో బ్రహ్మాండములు అత్తిచెట్టు కొమ్మలలో ఉన్న పండ్ల యందుండు అనంత ప్రాణి సమూహంవలె, మహాసముద్రంలో జంతువుల మాదిరి నిండి ఉన్నాయి.

ఓ విరాట్పురుషా! నీ రూపములు పొగడ్తకు అందనివి. మునుపు మత్స్యాకృతితో ప్రళయసాగరమందు శత్రువగు సోమకు నెదిరించి సాధించి వేదప్రపంచాన్ని బ్రహ్మకు ప్రసాదించావు కదా! హయగ్రీవుడవై చక్రము చేబూని మధుకైటభులను చంపినావు గదా! కూర్మరూపంతో సంచరిస్తూ మందరగిరి నెత్తినావు గదా! వరాహరూపం ధరించి క్రుంగుతున్న భూమండలాన్ని లేవనెత్తి హిరణ్యాక్షుని ఎముకలు విరుగునట్లు కోరలతో పొడిచి చంపినావు గదా! భయంకర శత్రువగు హిరణ్యకశిపుని నరసింహాకృతితో నీవు సంహరింపలేదా! ప్రతాపశాలివగు నీవు వామనమూర్తివై బలిచక్రవర్తిని యాచింపలేదా? బ్రహ్మాండములు నిండునట్లు మేను

పెంచలేదా? భార్గవరాముడవై క్షత్రియసమూహమును వధించలేదా? దశరథరాముడవై చంద్రబింబమువంటి మోముగల జానకి కొరకు దుర్మదంతో కూడిన రావణుని దునుమాడ లేదా? వాసుదేవాది రూపములను దాల్చి కూళలను శిక్షింపలేదా? శుద్ధబుద్ధ స్వరూపుడవై శత్రుభార్యల మనస్సులు రహస్యముగ కరగించినావు గదా! కల్కిరూపము ధరించి పెంపుతో వెలుగొందవా!

నిన్ను పొగడుటకు నేను ఏ పాటివాణ్ణి? నేను మాయచే ఆపదపాలైన వాణ్ణి. దుఃఖము చెందినవాణ్ణి. అనుగ్రహబుద్ధితో నా దిగులు దీర్చి నన్నాదరించు. ఆదిశేషుడు తల్పముగా గలవాడా! కరుణయే అలంకారముగా గలవాడా! నమస్కరించు వారికి కల్పవృక్షము వంటి వాడా! నీకు నమోవాకము; నీకు వందనము; నీకు ప్రణామము.

**మ. కలలం బోలెడి పుత్త్రమిత్ర వనితాగారాది సంయోగముల్**
**జలవాంఛారతి నెండమావులకు నాసల్ సేయు చందంబునం**
**దలఁతున్ సత్యము లంచు; మూఢుఁడ వృథాతత్త్వజ్ఞుఁడన్ నాకు నీ**
**విలసత్పాదయుగంబు సూపి కరుణన్ వీక్షింపు లక్ష్మీపతీ! 1235**

* లక్ష్మీనాథుడవైన కృష్ణా! దప్పిక తీర్చుకోడానికి జలమువలె తోచే ఎండమావులకు ఆసపడు విధంగా, స్వప్నసమానము లయిన పుత్రులు, మిత్రులు, కళత్రము, గృహములు- ఈ మొదలైన జంజాటము సత్యమని భావిస్తుంటాను. నేను మూఢుణ్ణి. మిథ్యాతత్త్వజ్ఞుణ్ణి. ఇలాంటి నాకు ప్రకాశించు నీ పాదాలజంటను చూపి కరుణతో కటాక్షించు.

**వ. అని మఱియును వినుతింప నక్రూరునికి యమునా జలంబుల లోనన తన మొదలి మేను సూపి చాలించి నటునికైవడిం దిరోహితుండైన నక్రూరుండు నీరు వెడలి వెఱంగుపడుచు వచ్చి రథారోహణంబు సేసిన హరి యిట్లనియె. 1236**

* అని మళ్ళీ తన్ను స్తోత్రం చేస్తున్న అక్రూరునకు తన పూర్వరూపం చూపి నటుడు తన నాట్యాన్ని వలె మరల దానిని మరుగుపరచి భగవంతుడు అంతర్ధానమై పోయాడు. అక్రూరుడు నీటినుండి వెలువడి ఆశ్చర్యపడుతూ వచ్చి రథాన్ని అధిరోహించాడు. అప్పుడు కృష్ణుడు అతనితో ఇలా అన్నాడు.

**క. జలములు చేరువ నున్నవి, తలపోయఁగ నీవు పోయి తడ వయ్యె! నదీ**
**జలముల నభమున ధరణిం, గలుగని చోద్యములు నీకుఁ గానం బడెనే? 1237**

* నీళ్ళు దగ్గరలోనే ఉన్నాయి. నీవు స్నానానికి వెళ్ళి చాలా సేపయింది. ఆకాశంలో, భూమిలో లేని వింత లేమైనా నదీజలాలలో నీకు కన్పించాయా?

**వ. అనిన నతం డిట్లనియె. 1238**

**క. 'నీలోన లేని చోద్యము, లే లోకములందుఁ జెప్ప రీశ్వర! నీటన్**
**నేలన్ నింగిని నున్నవె?, నీలోఁ జోద్యంబు లెల్ల నెగడు మహాత్మా!' 1239**

* ఇలా అడిగిన కృష్ణునితో అక్రూరుడు ఈ విధంగా అన్నాడు- స్వామీ! నీలో లేని వింతలు ఏ లోకాలలోనైనా ఉంటాయని పెద్దలు చెప్పలేదు. ఇక నీటిలో, నేలలో, నింగిలో ఉంటాయా? మహాత్మా! విచిత్రము లన్ని నీలోనే ఉన్నాయి.

**వ. అని పలికి సాయంకాలంబునకు నక్రూరుండు మథురానగరంబు సేర రథంబు, గడపె; నంత నటమున్న చని నందాదులు పురోపవనంబున విడిసి యుండ వారలం గూడికొని కృష్ణు డక్రూరునిం జూచి రథంబు గొనుచు నగరంబునకుం జనుము; మేము వెనుక వచ్చెద' మనిన నతం డిట్లనియె. 1240**

* ఇలా చెప్పి అక్రూరుడు సాయంసమయానికి మథురాపురి చేరేటట్టుగా రథాన్ని నడపినాడు. ముందుగా వెళ్ళిన నందుడు మొదలైన వారు పొలిమేరలోని తోపులో బసచేసి ఉన్నారు. కృష్ణుడు వారిని కలుసుకుని అక్రూరుణ్ణి చూచి 'నీవు రథాన్నీ తోలుకుని పట్టణానికి వెళ్ళు. మేము తర్వాత వస్తాము' అని చెప్పగా అతడు ఇట్లా అన్నాడు.

**క. 'నా యింటికి విచ్చేయుము, నీ యంఘ్రి సరోజరేణునికరము సోఁకన్**
**నా యిల్లు పవిత్రం బగు శ్రీ యుత! నీ భటునిఁ బెద్ద సేయం దగదే? 1241**

**వ. అని మఱియుఁ బ్రార్థించిన హరి యిట్లనియె. 1242**

* "లక్ష్మీసంపన్నుడవైన కృష్ణా! నీవు నాయింటికి విజయం చేయవలె. నీ పద్మాలవంటి పాదాల ధూళి సమూహం పోకి నా యిల్లు పావన మవుతుంది. నీ బంటునైన నన్ను ఆ మాత్రం ఆదరింపకూడదా?" అంటూ మరీమరీ వేడుకుంటున్న అక్రూరునితో వెన్ను డిలా అన్నాడు.

## -: శ్రీ కృష్ణమూర్తి మథురానగర ప్రవేశము సేయుట :-

**క. యదుకుల విద్వేషణుఁడై, మదమున వర్తించు కంసు మర్దించి భవ**
**త్సదనంబుఁ జూడ వచ్చెదఁ, బొద యీ స్యందనము గొనుచుఁ బురమున కనఘా!. 1243**

* పాపరహితుడవగు అక్రూరా! యాదవవంశమునకు శత్రువై గర్వంతో సంచరిస్తున్న కంసుణ్ణి సంహరించిన తర్వాత నీ గృహం సందర్శించడానికి వస్తాను. ఇప్పుడు నీవు ఈ రథాన్ని తీసుకొని నగరానికి వెళ్ళు.

**వ. అని పలికిన నక్రూరుండు పురంబునకుం జని రామకృష్ణులు వచ్చి రని కంసున కెఱింగించి తన గృహంబునకుం జనియె; నంత నపరాహ్ణంబున బలభద్రగోపాల సహితుండై కృష్ణుండు. 1244**

* ఈ విధంగా శ్రీకృష్ణుడు చెప్పగా అక్రూరుడు నగరంలోకి వెళ్ళి రామకృష్ణులు వచ్చారని కంసుడికి తెల్పి తనయింటికి వెళ్ళినాడు. కృష్ణుడు అపరాహ్ణకాలంలో బలరామునితో గోపకులతో కూడినవాడై మథురా నగరం ప్రవేశించాడు.

 మ. పరిఖల్ గోటలుఁ గొమ్మలుం బడగలుం బ్రాసాదముల్ వీథులున్
హరులుం దేరులు వీరులున్ గజములున్ హర్మ్యంబులున్ వాద్యముల్
తరుణుల్ ధాన్యములున్ ధనంబులు మహోద్యానంబులున్ దీర్ఘికల్
గర మాశ్చర్యరుచిం దనర్చు మథురన్ గాంచెన్ విభుం డంతటన్. 1245

* కృష్ణు డల్లంతలో అగడ్తలు, కోటలు, బురుజులు, పతాకలు, రాజభవనాలు, వీథులు, గుఱ్ఱాలు, రథాలు, వీరులు, ఏనుగులు, మేడలు, వాద్యాలు, యువతులు, ధాన్యాలు, ధనాలు, గొప్ప ఉద్యానాలు, నడ బావులు- వీనివల్ల అత్యద్భుతమైన శోభతో ఒప్పునట్టి మథురను చూచాడు.

వ. కని య ప్పురంబు ప్రవేశించి వచ్చు సమయంబున. 1246

ఉ. 'నంద తపఃఫలంబు, సుగుణంబుల పుంజము, గోపకామినీ
బృందము నోముపంట; సిరి విందు; దయాంబుధి; యోగి బృందముల్
డెందములందుఁ గోరెడు కడింది నిధానము సేరవచ్చె నో
సుందరులార! రండు చని చూతము కన్నుల కోర్కి దీఱఁగన్. 1247

* ఇలా చూచి ఆ పట్టణంలో ప్రవేశించి వస్తున్న సమయంలో- "ఓ రమణులారా! నందుని తపస్సునకు ఫలమైనవాడు, మేలిగుణాల ప్రోవు, గొల్ల బోటుల నోములపంట, ఇందిరాసుందరి డెందమునకు ఆనందం కూర్చేవాడు, కరుణకు సముద్రుడు, యోగిసమూహములు తమ మనసుల్లో కోరుకునే అపురూపమైన పెన్నిధీ అయిన అచ్యుతుడు వస్తున్నాడు. కన్నుల కాంక్ష తీరేటట్లు వెళ్లి దర్శిద్దాము; రండి."

వ. అని మఱియు గోవిందసందర్శన కుతూహలంబులఁ బౌరసుందరులు పరస్పరాహూయమానలై భుంజానలై భోజనభాజనంబులు దలంగఁ ద్రోచియు, శయానలై లేచియు, నభ్యజ్యమానలై జలంబు లాడకయు గురుజన శిక్ష్యమాణలై యోడకయు, గృహకార్య ప్రవర్తమానలై పరిభ్రమింపకయు, రమణ రమమాణలై రమింపకయు, శిశుజన బిభ్రాణలై డించియు, నలంకుర్వాణలై యన్యోన్య వస్త్రాభరణ మాల్యానులేపనంబులు వీడ్వడ ధరించియు నరిగి. 1248

* అంటూ పురమందలి అందకత్తెలు గోవిందుణ్ణి సందర్శించడానికి ఉబలాటపడి ఒకరి నొకరు పిలుచు కున్నారు. వారు అన్నము తింటున్నప్పటికీ కంచాలను అవతలికి నెట్టినారు. పరుండి ఉన్నప్పటికీ పడకనుంచి లేచారు. తలంటు కొనుచున్నప్పటికీ నీరాడలేదు. పెద్దలచే దండింపబడుతున్నప్పటికీ జంకినవారు కారు. మగలతో క్రీడిస్తున్నప్పటికీ క్రీడించడం చాలించారు. పసిపాపలను పట్టుకొనుచున్న వారైనప్పటికీ దింపివేశారు. అలంకరించుకుంటున్న వారయినప్పటికీ పరస్పరం చీరలు, నగలు, పూలదండలు, మైపూతలు తారుమారుగ ధరించి వెళ్ళినారు.

క. వీటఁ గల చేడె లెల్లను, హాటకమణిఘటిత తుంగహర్మ్యాగ్రములం
గూటువలు గొనుచుఁ జూచిరి, పాటించి విశాలవక్షుఁ బద్మదళాక్షున్. 1249

* ఆ పట్టణంలో ఉండే స్త్రీలందరూ రత్నాలు కూర్చబడిన ఎత్తయిన బంగారు మేడలపై గుంపులు గూడి, విశాలమైన వక్షము కలవాడూ, తామరరేకులవంటి కన్నులు కలవాడూ అయిన శ్రీకృష్ణుణ్ణి చూచారు.

సీ. వీఁడటే రక్కసి విగతజీవగఁ జన్నుఁబాలు ద్రావిన మేటిబాలకుండు!
వీఁడటే నందుని వెలఁదికి జగమెల్ల ముఖమందుఁ జూపిన ముద్దులాఁడు!
వీఁడటే మందలో వెన్నలు దొంగిలి దర్పించి మెక్కిన దాఁపరీఁడు!
వీఁడటే యెలయించి వ్రేతల మానంబు సూఱలాడిన లోకసుందరుండు!
తే. వీఁడు లేకున్న పుర మటవీస్థలంబు, వీనిఁ బొందని జన్మంబు విగతఫలము
వీనిఁ బలుకని వచనంబు విహగ రుతము, వీనిఁ జూడని చూడ్కులు వృథలు వృథలు. 1250

* అసురాంగన అసువులు వీడునట్లు స్తన్యపానం చేసిన అసాధ్యుడైన అర్భకుడు వీడేనటే? నందుని ఇల్లాలికి తన నోట జగములు చూపించిన ముద్దుబిడ్డడు వీడేనటే? గర్వించి మందలోని వెన్నలు దొంగిలించి భక్షించిన దొంగ వీడేనటే? హృదయాలు కరిగించి గొల్లకన్నెల మానాన్ని కొల్లగొట్టిన భువనైకసుందరుడు వీడేనటే? ఇతడులేని పట్టణం అరణ్యప్రదేశం. ఇతణ్ణి కలియని జన్మ నిరుపయోగం. ఇతణ్ణి పలుకరించని పలుకు పక్షి పలుకు. ఇతణ్ణి దర్శింపని చూపులు నిజంగా వ్యర్థములు.

మ. చెలియా! గోపిక లీ కుమార తిలకుం జింతించుచుం బాడుచుం
గలయం బల్కుచు నంటుచున్ నగుచు నాకర్షింపుచున్ హస్త గా
మలకక్రీడకుఁ దెచ్చి నిచ్చలును సమ్మానంబులం బొందఁగాఁ
దొలి జన్మంబుల నేమి నోఁచిరొ కదే దుర్గప్రదేశంబులన్? 1251

* ఓ చెలీ! పడుచువారిలో మిన్నయగు ఈ కృష్ణుణ్ణి గోపికాస్త్రీలు చేతిలో ఉసిరికకాయ మాదిరి క్రీడకు తెచ్చి ధ్యానించుచు, కీర్తించుచు, సంభాషించుచు, స్పృశించుచు, నవ్వుచు, లాగుచు, లాలించుచు నిత్యము ఆనందించుచున్నారు. వారు ఇటువంటి ఆదరాన్ని పొందటానికి కడచిన పుట్టువులందు ఏ అరణ్యాలలో ఎటువంటి నోములు నోచినారో కదా!

క. అని మఱియుఁ బౌరకాంతలు, మునుకొని హరిరూపు నేత్రముల వెంటను లోఁ
గొని తాల్చిరి హృదయములను, జనిత ప్రమదమున విరులు సల్లుచు నధిపా! 1252

* ఓ పరీక్షిన్మహారాజా! ఈ విధంగా ఆ పట్టణప్రమదలు అదేపనిగా తమ నేత్రాలతో హరిరూపాన్ని ఆస్వాదిస్తూ హృదయములందు నిల్పుకున్నారు. సంతోషంతో పూలజల్లులు చల్లినారు.

వ. మఱియును. 1253

క. నానావిధగంధములుఁ బ్ర, సూనఫలాదులును హరిత శుభ లాజములుం
గానిక లిచ్చుచు విప్రులు, మానుగఁ బూజించి రా కుమారోత్తములన్. 1254

* అనంతరం ఆ మథురానగరంలోని బ్రాహ్మణులు పలువిధములగు చందనద్రవ్యాలను, పూలు, పండ్లు మున్నగువానినీ, శుభకరములైన పచ్చని అక్షతలనూ కానుకలుగా ఇస్తూ ఉత్తములైన ఆ వసుదేవ కుమారులను ఉత్సాహంగా పూజించారు.

వ. ఆ సమయంబున నగరద్వారంబు నుండి వచ్చు రాగకారుండగు నొక్క రజకుం గని హరియిట్లనియె.1255

* ఆ సమయంలో నగరము వాకిటినుండి వస్తున్న రంగులు వేసే ఒక చాకివాణ్ణి చూచి శ్రీకృష్ణుడు ఇలా అన్నాడు.

## -: శ్రీకృష్ణుఁడు రజకుని జంపి వాయక సుదాము లొసంగు పూజల నంగీకరించి మే లొసంగుట :-

ఉ. విందులమై నరేశ్వరుని వీటికి వచ్చితి మేము; మాకు మా
మందలలోనఁ గట్టికొన మంచిపటంబులు లేవు; నీ ముడిన్
సుందరధౌత చేలములు శోభిలు చున్నవి; తెమ్ము; నిన్ను మే
లందెడు; నిమ్ము; రాజుదెస నల్లుర; మో రజకాన్వయాగ్రణీ! 1256

* ఓ రజకకుల శిరోమణీ! మేము మీ రాజుగారి నగరానికి అతిథులమై అరుగుదెంచాము. మా మందలో మాకు ధరించడానికి మంచిగుడ్డలు లేవు, నీ మూటలో ఉతికిన అందమైన బట్టలు ఉన్నట్లున్నాయి. మేము రాజుగారికి అల్లుళ్ళం. ఆ వస్త్రాలు మాకు ఇచ్చెయ్యి. నీకు మేలు కలుగుతుంది.

వ. అనిన రోషించి వాఁ డిట్లనియె. 1257

శా. ఎట్టెట్టా! మనుజేంద్రు చేలములు మీ కీఁ బాడియే? మీరలుం
గట్టం బోలుదురే? పయో ఘృత దధి గ్రాసంబులన్ మత్తులై
యిట్టాడం జనెఁగాక గొల్లలకు మీ కెబ్బంగి నోరాడెడిన్?
గట్టా! ప్రాణముఁ గోలుపోయెదు సుమీ కంసోద్ధతిన్ బాలకా! 1258

* ఆ మాటలకు ఆ రజకుడు కోపించి ఇలా అన్నాడు. ఏమిరా డింభకా! ప్రభువుగారి వస్త్రాలు మీ కివ్వమంటావా? ఇది న్యాయమా? మీరు ఆ వస్త్రాలు ధరించడానికి యోగ్యులా? పాలు నెయ్యి పెరుగు ఆహారించి తలక్రొవ్వి ఇలా కూశారు. కాకపోతే గొల్లలైన మీకు ఇలాంటి మాటలు నోటి కెలా వస్తాయి? అయ్యో! కంసమహారాజుగారి ఆగ్రహానికి పాత్రమై నీవు ప్రాణాలు పోగొట్టుకుంటావు సుమా!

క. మా రాజుసొమ్ముఁ గైకొన, నే రాజులు వెఱతు; రింత యెల్లిదమే నీ;
కీ రాజరాజగృహమున, నీ రాజసమేల? గొల్ల! యేఁగుము తలఁగన్. 1259

* ఓ గొల్లపిల్లవాడా! మారాజుగారి సొమ్ము అంటుకోవడానికి ఏ రాజులైనా భయపడతారు. నీ కింత వేళాకోళంగా ఉందా? రాజులకు రాజైన ఈ కంసుని రాజ్యంలో నీ కింత రాజసమా? తొలగి దూరంగా పో!

వ. అనిన విని రోషించి. 1260

క. ఘోరకరాగ్రతలంబున, ధీరుఁడు కృష్ణుండు శిరము దెగిపడఁ గొట్టెం
బౌరుల గుండెలు వగులఁగ, వీరోద్రేకిన్ మదావివేకిన్ జాకిన్. 1261

* రజకుని మాటలకు గోపాలునికి కోపం వచ్చింది. ధీరుడైన శ్రీకృష్ణుడు బీరంతో రెచ్చినవాడూ, పొగరుబోతూ, తెలివిమాలిన వాడూ అయిన ఆ చాకివాణ్ణి భయంకరమైన తన ముంజేతితో తల ఊడిపడు నట్టు కొట్టినాడు. దీనిని చూచి పురవాసుల గుండెలు పగిలిపోయాయి.

వ. ఇట్లు భగ్నుండైన రజకుని జూచి వానివారలు పటంబులు డించి వెఱచి పఱచిన రామకృష్ణులు వలసిన వస్త్రంబులు ధరియించి కొన్ని గోపకుల కొసంగి చనుచుండ. 1262

* ఈలా నేలగూలిన చాకలిని చూచి వాని మనుషులు బట్టలు అక్కడ వదలి భయంతో పరుగెత్తి పోయారు. అంతట బలరాముడూ, శ్రీకృష్ణుడూ తమకు కావలసిన పుట్టములు కట్టుకొని కొన్ని గోపకుల కిచ్చి ముందుకు సాగారు.

క. అంతట నొక వాయకుఁ డా, క్రంతన్ వసుదేవసుతులఁ గని బహువర్ణా
త్యంత మృదుపటాభరణము, లెంతయు సంతసముతోడ నిచ్చెన్ మెచ్చన్. 1263

* ఆ సమయంలో ఒక చేనేతపనివాడు ఆ దారిలో వస్తున్న వసుదేవుని కుమారులైన రామకృష్ణులను జూచి వారు మెచ్చుకొనునట్లు పలురంగులు కలిగి మిక్కిలి మెత్తనివైన వస్త్రాలనూ, ఆభరణాలనూ పరమసంతోషంతో ఇచ్చాడు.

శా. కారుణ్యంబున వానిఁ గైకొని యలంకారంబు గావించి శృం
గారోదంచిత దిగ్గజేంద్ర కలభాకారంబులం బొల్చి రా
శూరుల్, మాధవుఁ డంత వాయకుని శుశ్రూషన్ మహాప్రీతుఁడై
సారూప్యంబును లక్ష్మియు న్నొసఁగె నైశ్వర్యాది సంధాయియై. 1264

* శూరులైన రామకృష్ణులు వాటిని దయతో స్వీకరించి అలంకరించుకొని సింగారింపబడిన దిగ్గజాల గున్నలమాదిరి చెన్ను వహించారు. అంతట మాధవుడు ఆ చేనేత పనివాని పరిచర్యకు మిక్కిలి సంతుష్టుడై వానికి ఐశ్వర్యాదులను అనుగ్రహించి, తన సారూప్యమును సంపత్తినీ ప్రసాదించాడు.

వ. అంత నా రామకృష్ణులు సుదాముండను మాలాకారు గృహంబునకుం జనిన నతండు గని లేచి గ్రక్కున మ్రొక్కి చక్కన యర్ఘ్యపాద్యాదికంబు లాచరించి సానుచరు లయిన వారలకుఁ దాంబూల కుసుమగంధంబు లొసంగి యిట్లనియె. 1265

* అనంతరం రామకృష్ణులు పూలదండలు కట్టే సుదాముని యింటికి వెళ్ళినారు. అతడు వీరిని చూచిన వెంటనే లేచి నమస్కరించాడు. చక్కగా అర్ఘ్యము, పాద్యము మొదలైన విధులతో సత్కరించాడు, రామకృష్ణులకూ, అతనివెంట వచ్చిన వారికీ తాంబూలములు, పూలు, గంధములు ఇచ్చి ఈ రీతిగా అన్నాడు.

**ఉ. పావన మయ్యె నా కులము; పండెఁ దపంబు; గృహంబు లక్ష్మికిన్**
**సేవిత మయ్యె; నిష్టములు సేకుఱె: విశ్వనిదానమూర్తులై**
**భూవలయంబు గావ నిటు పుట్టిన మీరలు రాకఁ జేసి నే**
**నే విధ మాచరింతుఁ? బను లెయ్యవి? బంట; నెఱుంగఁ జెప్పరే! 1266**

* ప్రపంచానికి ఆదికారణమూర్తులై ధరణీచక్రాన్ని సంరక్షించడంకోసం ఇట్లా అవతరించిన మహానుభావులు మీరు, మీ రాకవల్ల మావంశం పవిత్ర మయింది. నాతపస్సు ఫలించింది. నా యిల్లు సిరి సంపదలతో నిండింది. నా కోరికలు ఈడేరినాయి. నేను ఏ ప్రకారం నడచుకోవాలి? ఏ పనులు చెయ్యాలి? నేను మీ బంటును; సెలవివ్వండి.

**వ. అని పలికి. 1267**

**క. దామోదరరాముల కు, ద్దామ యశోహసిత తుహినధాములకు వధూ**
**కాములకుఁ దెచ్చియిచ్చె సు, దాముఁడు ఘనసురభి కుసుమదామము లధిపా! 1268**

* అని పలికి అతిశయించిన కీర్తిచే చంద్రుణ్ణి అపహసించువారూ, మగువలపాలిటి మన్మథులూ అయిన ఆ రామకృష్ణులకు సుదాముడు మిక్కిలి పరిమళముతో గూడిన పూలమాలలు సమర్పించాడు.

**క. వారును మాలికుఁ డిచ్చిన, భూరి కుసుమ దామములను భూషితులై ' నీ**
**కోరిన వర మిచ్చెద' మని కారుణ్యము సేయ నతఁడు గని యిట్లనియెన్. 1269**

* వారునూ సుదాము డిచ్చిన దండలతో అలంకరించుకొని 'ఏమి కావాలో కోరుకో! నీవు కోరిన వర మిస్తాము' అని దయతో పలుకగా అతడు శ్రీకృష్ణునితో ఇట్లన్నాడు.

**క. 'నీ పాదకమల సేవయు, నీ పాదార్చకులతోడి నెయ్యమును నితాం**
**తాపార భూతదయయును, దాపసమందార! నాకు దయసేయఁ గదే! 1270**

* తపస్వులకు కల్పవృక్షం వంటివాడా! కృష్ణా! కమలముల వంటి నీ పాదాల పరిచర్యనూ, నీ పాదాలు పూజించే భక్తులతో చెలిమినీ, అఖిలప్రాణులమీద అత్యంతమైన అపరిమితమైన, దయనూ నాకు ప్రసాదించు.

**వ. అని వేఁడికొనిన నిచ్చి మఱియు మాధవుం డమ్మాలికునకు బలాయుఃకీర్తిసంపద లొసంగి వాని గృహంబు వెడలి రాజవీథిం జనిచని. 1271**

* ఇలా వేడుకొన్నవన్నీ అనుగ్రహించి ఇంకను శ్రీకృష్ణుడు సుదామునికి బలము, ఆయుష్యము, తేజము, యశము, సిరిసంపదలు కరుణించి వాని ఇంటినుండి బలరామసహితుడై బయలుదేరి రాజవీథిలో సాగిపోయాడు.

**క. ఆ నలినాక్షుఁడు గాంచెను, నానాలేపముల భాజనము సేకొనుచుం**
**బూని చనుదెంచు దానిని, నానన రుచి నిచయ వినమితాబ్జం గుబ్జన్. 1272**

* అలా పోతూ కమలములవంటి కన్నులు గల శ్రీకృష్ణుడు పలురకాల మైపూత లుంచిన పాత్ర పట్టుకొని వస్తున్న కుబ్జను చూచాడు. దాని ముఖద్యుతిముందు పద్మం తలవంచుకుంటుంది.

**వ. కని యిట్లనియె. 1273**

* అబ్జనేత్రుడు కుబ్జను చూచి ఇలా అన్నాడు.

**క. 'ఎవ్వరిదానవు? లేపము, లెవ్వరికిం గోరికొనుచు నేఁగెదు? నీ పే**
**రెవ్వతె' మా కి మ్మిన్నియు, నివ్వటిలెదు చక్కనగుచు నీరజనేత్రా!' 1274**

* ఓ పద్మాక్షీ! నీ వెవరిదానివి? ఈ కలపములు ఎవరికోసం తీసుకవెళుతున్నావు? నీ పేరేమిటి? ఈ లేపనములన్నీ మా కివ్వు. అలా ఇస్తే నీవు చక్కగా ప్రకాశిస్తావు.

**వ. అనిన న య్యబల యిట్లనియె. 1275**

**ఉ. చక్కని వాఁడ వౌదు; సరసంబుల నొంపకు; మెల్లవారికిన్**
**జిక్కఁదనంబు లెక్కడివి? చారుశరీర! త్రివక్ర యండ్రు; నే**
**నిక్కము కంసుదాసిని; వినిర్మల లేపన విద్యదాన; నన్**
**మిక్కిలి రాజు మెచ్చుఁ; దగ మీరు విలేపనముల్ ధరింపరే? 1276**

* ముకుందుని పలుకులు విని ఆ ముగుద ఇలా అన్నది- ఓ సుందరాంగా! నీవు బలే అందగాడివేలే. సరసాలతో నన్ను వేధించకు. అందరికీ అందా లెక్కడినుంచి వస్తాయి? నన్ను 'త్రివక్ర' అంటారు. నేను కంసుడి దాసిని. అచ్చమైన మైపూతలు చేయడమే నా నేర్చిన విద్య. నన్ను రాజు మిక్కిలి మెచ్చుకుంటూ ఉంటాడు. మీరు ఈ విలేపనాలు పూసుకొనరా?

**క. అని పలికి యా కుమారుల, తనువులు నగవులును, వీక్షితమ్ములు మాటల్**
**తన చిత్తముఁ గరఁగించిన, ననులేపము లిచ్చె వారి కబల ప్రియముతోన్. 1277**

* ఇలా పలికి పడుచువారైన ఆ బలరామకృష్ణుల నెమ్మేనులు, నవ్వులు, చూపులు, పలుకులు తన మనస్సును కరగింపగా ఆ కుబ్జ ప్రేమతో వారికి మైపూతలు ఇచ్చింది.

**సీ. ఇ వ్విధంబునఁ గుబ్జ యిచ్చిన లేపంబు, లన్నియు, దాను దేహమున నలఁది**
**కొని ప్రసన్నత నొంది కుబ్జ మువ్వంకల, యొడలు సక్కఁగ నొత్తి యునుపఁ దలఁచి**

తత్పదంబుల మీఁదఁ దన పదంబులు ద్రొక్కి హస్తాంగుళ ద్వయ మబల గౌద
క్రింద విప్పుగ నిడి కృష్ణుఁడు మీఁదికి, నెత్తిన వక్రత లెల్ల మాని

ఆ. చక్కనైన చిత్తజన్మబాణము క్రియఁ, గొమరు మిగిలి పిఱుఁదు గుచయుగంబు
సొంపు సేయఁ దరుణి సుందరమూర్తియై, కమలనయనుఁ జూచి కాంక్షతోడ. 1278

* ఈలా కుబ్జ యిచ్చిన విలేపనము లన్నింటినీ వెన్నుడు తన ఒంటినిండా పూసుకొని ప్రసన్నుడైనాడు. ముప్వంపులు గల దాని దేహాన్ని చక్కనొత్త దలచాడు. దాని మీగాళ్ళమీద తన అడుగు లుంచి త్రొక్కి పట్టినాడు. తన చేతిరెండువ్రేళ్ళను దాని గడ్డము క్రింద పెట్టి దేహము చక్కగా సాగునట్లు పైకెత్తినాడు. అంతతో అది వంపులు దీరి మన్మథుని సమ్మోహనాస్త్రం మాదిరి పొలుపారింది. పిరుదులు, చనుగవ సొంపు నింపగా కుబ్జ చక్కని చుక్కయై కమలాక్షుని వైపు కాంక్షతో చూచింది.

క. 'వేంచేయుము నా యింటికిఁ, బంచశరాకార!' యనుచుఁ బై కొం గాక
ర్షించి హరిఁ దిగిచెఁ గామిని, పంచాశుగ బాణజాల భగ్నహృదయయై. 1279

* కాముకురాలైన కుబ్జ మదనుని బాణసమూహముచే చెదరిన హృదయము గలది అయింది. 'మన్మథాకారా! నా యింటికి దయచెయ్యి' అంటూ పద్మనాభుని పయిపుట్టము చెరగు పట్టుకొని లాగింది.

క. కామిని తిగిచినఁ గృష్ణుఁడు, రాముని వీక్షించి నగుచు రాజానన! మ
త్కామితముఁ దీర్చి పిదపన్, నీ మందిరమునకు వత్తు నేఁ డలుగకుమీ! 1280

* ఆ కాముకురాలు అలా తన్ను లాగగా కృష్ణుడు బలభద్రుని జూచి నవ్వుతూ ఆమెతో ఇలా అన్నాడు- ఓ చంద్రముఖీ! నా వచ్చిన పని సాధించిన తర్వాత నీ గృహానికి వస్తాను. నేడు కోపింపకు!

వ. అని వీడుకొలిపి కృష్ణుండు విపణిమార్గంబునం జని చని తాంబూల మాలికా గంధంబులును బహువిధంబు లయిన కానికలును బౌరు లిచ్చినం బరిగ్రహించుచు ధనుశ్శాల కరిగి యందు. 1281

* ఇలా అంటూ ఆమెను సాగనంపి కృష్ణుండు అంగడివీథిలో వెళ్ళి వెళ్ళి పురప్రజ లిచ్చిన తమ్మలములు, పూలదండలు, చందనములు ఇంకా పలువిధాలైన కానుకలను స్వీకరిస్తూ ధనుశ్శాలకు వెళ్ళినాడు.

క. సురరాజు వింటికైవడి, గురుతరమై భూరి వీరగుప్తంబయి దు
స్తరమైన విల్లు పొడగని, నరులు వల దనంగ బట్టి నగి వికసితుఁడై. 1282

* దేవేంద్రుని ధనుస్సువలె మిక్కిలి గొప్పదై, మేటివీరులచే రక్షింపబడుతున్న దుర్భరమైన ఆ వింటి నతడు వీక్షించాడు, రక్షకులు వద్దనుచుండగా పక్కున నవ్వి విప్పారిన మోము గలవా డైనాడు.

శా. బంధుల్ మేలన వామహస్తమునఁ జాపం బెత్తి మౌర్వీలతా
సంధానం బొనరించి కొంచెపుఁదెగన్ శబ్దించుచున్ ధీరతా
సింధుం డాహరి దాని ఖండితముగాఁ జేసెన్ జనుల్ చూడఁగా
గంధేభంబు రసాలదండము నొగిన్ ఖండించు చందంబునన్. 1283

* ధైర్యమునకు సముద్రము వంటివాడగు శ్రీకృష్ణుడు తన చుట్టాలు మెచ్చగా, ఎడమచేతితో ధనుస్సును పైకెత్తినాడు. తీవవంటి అల్లెత్రాటిని తగిలించి నారిని మొరయిస్తూ మదపుటేనుగు చెరకు గడను తునుము రీతిగా జనులు చూస్తుండగా దానిని రెండుగా విరిచివేశాడు.

క. కోదండ భంగనిర్గత, నాదము వీనులకు భీషణం బయి యాశా
రోదోంతరములు నిండుచు, భేదించెన్ భోజవిభుని బింకము నధిపా! 1284

* పరీక్షిన్మహారాజా! విల్లు విరిగినప్పుడు పుట్టిన చప్పుడు చెవులకు భీతి గొలుపుతూ దిగంతరాలను పూరిస్తూ, భోజభూపాలుడైన కంసుని ధైర్యాన్ని భేదించింది.

వ. అప్పుడు. 1285

ఉ. 'అద్దిర! రాచవిల్ విఱిచె నర్భకుఁ డెంతయు శంక లేక నేఁ
డుద్దవిడిన్ సహింపఁ దగ దుగ్రతఁ బట్టుద' మంచుఁ గ్రుద్ధులై
గ్రద్దన లేచి తద్ధనువు కావలివా రరుదేర వారి న
య్యిద్దఱుఁ గూడి పట్టి మడియించిరి కార్ముకఖండ హస్తులై. 1286

* ఆ సమయంలో 'ఆశ్చర్యం! ఈ బాలు డే మాత్రం సందేహించక శౌర్యంతో ఇపుడు రాజుగారి ధనుస్సు ఖండించాడు. ఇది సహింపరాని సాహసకార్యం. ఇతణ్ణి పౌరుషంతో పట్టాలి' అంటూ చాపరక్షకులు కోపోద్రేకంతో వెంటనే లేచి మీదికి వచ్చారు. అంతట రామకృష్ణు లిద్దరూ ఆ వింటితుంటలు చేత పుచ్చుకుని వారిని పట్టి కొట్టి మట్టు పెట్టారు.

వ. అట్లు రామకృష్ణులు మథురాపురంబున విహరించి వెడలి విడిదలకుం జని రంత. 1287

* ఈ విధంగా బలరామకృష్ణులు మథురానగరంలో విహారం చేసి అక్కడి నుంచి బయలుదేరి తమ విడుదులకు వెళ్ళిపోయారు.

## -: సూర్యాస్తమయ చంద్రోదయముల వర్ణనము: :-

మ. గగనారణ్య చరాంధకార గజముం గాలాహ్వయవ్యాధుఁ డ
చ్చుగఁ బట్టన్ గమకించి మ చ్చిడుటకై చూతాంకురశ్రేణిచే
నొగిఁ గల్పించిన కందుకంబనఁగ సూర్యుం డంత వీక్షింపఁగాఁ
దగె మందప్రభతోడ పశ్చిమమహా ధాత్రీధరేంద్రంబునన్. 1288

* కాలమనే కిరాతుడు ఆకాశమనే అరణ్యంలో చీకటి అనే ఏనుగును పట్టడానికై పూనుకొని మచ్చు పెట్టుటకు తయారుచేసిన మామిడి చిగుళ్ళ కందుకమా అన్నట్లుగా మార్తాండుడు మందగించిన కాంతితో పడమటి పర్వతంమీద చూడ ముచ్చటగొలిపాడు.

క. తరుణుఁడగు శీతకరునిన్, మరగి వియల్లక్ష్మి దన్ను మాని ముదుకఁడున్
ఖరకరుఁడు ననుచు ద్రొబ్బిన, కరణిన్ రవి పశ్చిమాద్రికడఁ గ్రుంకె నృపా! 1289

* ఓ రాజా! ఆకాశలక్ష్మి, పడుచువాడూ, చల్లనిచేతుల వాడూ అయిన చంద్రుణ్ణి వలచి వృద్ధుడూ, కరకుచేతులవాడూ అంటూ తన్ను త్రోసిరాజన్న విధంగా భానుడు పడమటికొండదగ్గర అస్తమించాడు.

**క. కళలు కలుగుఁగాక కమల తోడగుఁగాక!, శివుని మౌళిమీఁదఁ జేరుఁగాక!**
**నన్యు నొల్లఁ దపనుఁడైన మత్పతి యని, సాధ్విభంగిఁ గమలజాతి మొగిడె. 1290**

* తాను కళలు కలిగినవా డగుగాక! లక్ష్మి తోబుట్టు వగుగాక! శివుని సిగనెక్కి నిక్కుగాక! అన్యుడైన చంద్రుడి పొత్తు మా కక్కరలేదు. తపింపజేసే వాఁడైనప్పటికీ మా భర్త సూర్యుడే అని పతివ్రతవలె పద్మినీజాతి మూతిముడుచుకుంది.

**క. సుందరసాయంసంధ్యా, వందన విప్రార్ఘ్యతోయ వజ్రహతోద్య**
**న్మందేహాసుర రక్త, స్యందము క్రియఁ గెంపుసొం పెసఁగె నపరదిశన్. 1291**

* అందమైన ఆ సాయంకాలం సంధ్యావందనమున బ్రాహ్మణులు సలుపు అర్ఘ్యప్రదానం అనే వజ్రాయుధంతో కొట్టబడిన మందేహ రాక్షసుల రక్తస్రావంవలె పడమటిదిశలో ఎర్రదనం ఎసలారింది.

**ఆ. భూమి నుండి మింటఁ బూర్ణమై కర్కట, మకర మీనరాశి మహితమైన**
**హరియశస్సుధాబ్ధియందుల తుంపురు, లనఁగ జుక్క లొప్పె నాకసమున. 1292**

* భూమ్యాకాశాలు నిండి కర్కట, మకర, మీనరాశులచే భాసించు నారాయణుని కీర్తి అనే పాలసముద్రంలోని తుంపరలా అన్నట్లు మింట చుక్కలు మెరిశాయి.

**క. ఎల్లదిశలు నిండిన శ్రీ, వల్లభు గుణమహిమ బ్రహ్మ వాసించుటకై**
**చల్లిన మృగమద మనఁగా, వెల్లివిరిసెఁ దమము గగనవీథుల నెల్లన్. 1293**

* అన్ని దిక్కులందు వ్యాపించిన లక్ష్మీనాథుని మహిమను పరిమళింపజేయుటకై బ్రహ్మదేవుడు చల్లిన కస్తూరి కాబోలు అన్నట్టు ఆకాశవీథు లన్నిటిలో చీకట్లు ముసురుకున్నాయి.

**క. ఆ చీఁకటి వెనుతగిలినఁ, బ్రాచీదిశనుండి గంతుఁ బరువున రవి భ**
**ర్మాచలము మలఁక త్రోవను, వే చనియెంగాక నిలిచి విఱుగక యున్నే? 1294**

* చీకటి వెన్నాడగా రవి, తూర్పుదిక్కునుండి పరుగున గంతులిడుతూ మేరుపర్వతం చుట్టు దారిలో వేగంగా వెళ్ళినాడు. అలాకాక అతడు నిలిచిఉంటే ఈ పాటికి విరిగిపోయేవాడే!

**ఉ. మీకును వైరి; యెప్పుడును మిక్కిలి మాకును వైరి; రాజు దో**
**షాకరుఁ; డింక వచ్చు జలజాతములార! మదీయ బాలురం**
**జేకొనుఁ డంచు బాలకులఁ జీఁకటి దాఁచిన భంగిఁ జిక్కి రా**
**రాక వసించెఁ దుమ్మెదలు రాత్రి సరోరుహ కుట్మలంబులన్. 1295**

* 'ఓ తమ్ములారా! చంద్రుడు మీకూ, మాకూ శత్రువే. అతడు దోషాకరుడు- అంటే రాత్రిని కలుగ జేసేవాడు. అడుగో రాబోతున్నాడు. మా బాలకులను స్వీకరించి భద్రంగా మీ కడుపులలో పెట్టుకొని కాపాడండి' అంటూ చీకటి తన పిల్లలను దాచుటకు అప్పగించిన రీతిగా తుమ్మెదలు తామరమొగ్గలందు చిక్కుకుని వెలుపలికి రాలేక రేయి అంతా అక్కడే నివసించాయి.

**సీ. ప్రాచీదిశాంగనా ఫాలతలంబున, దీపించు సిందూరతిలక మనఁగ**
**దర్పించి విరహుల ధైర్యవల్లులు ద్రెంప, దర్పకుం డెత్తిన దాత్ర మనఁగ**
**నలిగి కాలకిరాతుఁ డంధకారమృగంబు ఖండింప మెఱయించు ఖడ్గ మనఁగ**
**గగనతమాల వృక్షము తూర్పుకొమ్మను, లలితమై మెఱయు పల్లవ మనంగఁ**

**ఆ. దొగలు సంతసిల్ల దొంగలు భీతిల్లఁ, గడలి మిన్ను ముట్టి కడలుకొనఁగఁ**
**బొడిచె శీతకరుఁడు భూరిచకోరక, ప్రీతికరుఁడు జారభీతికరుఁడు. 1296**

* చకోరపక్షులకు ప్రీతిని, విటకాండ్రకు భీతినీ కలిగిస్తూ చంద్రుడు ఉదయించాడు. అతడు తూర్పుదిక్కనే తొయ్యలిముఖంపై దీపించే కుంకుమబొట్టు అన్నట్లుగానూ, వియోగుల ధైర్యమనే తీగలను త్రెంచడానికి గర్వంతో మన్మథు డెత్తిన కొడవలి అన్నట్టు గానూ, కాలుడు అనే బోయ చీకటి అనే మృగాన్ని ఛేదించుటకు ఝళిపించే కరవాలం అన్నట్టుగానూ, ఆకసమనే కానుగుచెట్టు యొక్క తూర్పుకొమ్మలోమెరిసే మెత్తని చిగురాకు అన్నట్టుగానూ ఉన్నాడు. అతణ్ణి చూచి కలువలు వికసించాయి. దొంగలు భయపడ్డారు. అంభోరాశి తరగలెత్తి అంబర మంటింది.

**క. దర్పితతారాధిప పరి, సర్పిత కిరణౌఘమిళిత సకలదివంబై**
**యేర్పడి కమలభవాండము, గర్పూరపుఁ గ్రోవి భంగిఁ గనుపట్టె నృపా! 1297**

* ఓ రాజా! త్రుళ్ళిపడుతున్న నక్షత్రవిభుడైన చంద్రుని కిరణ సమూహం నలుగడలా వ్యాపింపగా బ్రహ్మాండం ఒక కర్పూర కరండంవలె కనుపించింది.

**క. ఆ రేయి గోపయుతులై, క్షీరాన్నము గుడిచి రామకృష్ణులు మదిఁ గం**
**సారంభ మెఱిఁగి యిష్ట వి, హారంబుల నప్రమత్తులై యుండి రిటన్. 1298**

* రామకృష్ణులు ఆ రాత్రి గోపకులతో కలిసి పాలబువ్వ ఆరగించి మనసులో కంసుని ప్రయత్నాలన్నీ గమనిస్తూ యథేచ్ఛావిహారాలతో ఆ నగరోపవనంలో జాగరూకులై గడిపారు.

**క. తన పురికి రామకృష్ణులు, సనుదెంచి నిజానుచరులఁ జంపుటయు మహా**
**ధనువు గదిసి విఱుచుటయును, విని కంసుఁడు నిదుర లేక విహ్వలమతియై. 1299**

* కంసుడు తన పట్టణానికి బలరామకృష్ణులు రావటమూ, తన అనుచరులను వధించటమూ,పెను ధనుస్సును విరిచివేయటమూ విన్నాడు. అతనికి నిద్ర పట్టలేదు. మనసు కలకబారింది.

సీ. కర్ణరంధ్రములు చేఁ గప్పిన లోపలి ప్రాణఘోషము వినఁబడక డిందెఁ
దోయాదికములందుఁ దొంగిచూచిన యంతఁ దల గానరా దయ్యెఁ దనువుమీఁదఁ
గరశాఖ నాసికాగ్రంబుపై నిడి చూడ గ్రహతారకలు రెండుగా నగపడె
వెలుఁగున నిలుచుండి వీక్షింపఁగా మేని నీడ సరంధ్రమై నేలఁ దోఁచె

ఆ. నడుగుజాడ దృష్టమౌట లే దయ్యెను, దరువులెల్ల హేమతరువు లగుచు
మెఱయుచుండెఁ గాలమృత్యువు డగ్గఱ, బుద్ధి యెల్లఁ గలఁగె భోజపతికి. 1300

* భోజవిభుడైన కంసునికి, చేతులతో చెవిరంధ్రాలను మూసినపుడు తనలోపలి ప్రాణవాయుశబ్దం వినబడకుండా పోయింది. నీటిలోనూ అద్దములోనూ తొంగిచూచినపుడు తన శరీరముపై శిరము కాన్పించ లేదు. వ్రేలు ముక్కుకొననుంచి చూడగా అదిత్యాదిగ్రహాలూ, అశ్విన్యాది నక్షత్రాలు ఒక్కొక్కటీ రెండు రెండుగా అగుపించాయి. వెలుతురులో నిలుచుని చూడగా తన మేనినీడలో ఛిద్రములు గోచరించాయి. నేలమీద తన అడుగులగుర్తు కనబడటం లేదు. చెట్లన్నీ బంగారువన్నెతో భాసించాయి. కాలమృత్యువు సమీపించగా అతని బుద్ధి కలత చెందింది.

క. గరళముఁ దినుటయుఁ బ్రేతముఁ, బరిరంభించుటయు నగ్నభావుఁ డవుటయున్
శిరమునఁ దైలము వడుటయు, ఖరపతి నెక్కుటయు నతఁడు కలలోఁ గనియెన్. 1301

* విషం మ్రింగినట్లు, మృతులయిన వారిని కౌగిలించుకొన్నట్లు, దిసమొలతో ఉన్నట్లు, తలపై నూనె పడినట్లు, గాడిదపై నెక్కినట్లు కంసుడు కలలు గన్నాడు.

వ. మఱియు రక్త కుసుమ మాలికాధరుండై యొక్కరుండును నెక్కడ నేనియుం జనుచున్న వాఁడ నని కలగాంచి మరణహేతుక భ్రాంతిఁ జింతాక్రాంతుండై నిద్రఁజెందక వేగించుచున్న సమయంబున.1302

* మరియు ఎఱ్ఱని పూలదండలు ధరించి ఏకాకియై ఎక్కడికో వెళుతున్నట్లు అతడు కలగాంచాడు. మృతికి కారణమైన భీతితో దుఃఖాక్రాంతుడై నిదురపోక ఆ రేయి ఎలాగో వేగించాడు.

## -: సూర్యోదయ వర్ణనము: :-

క. అరుణ హరినఖర విదళిత, గురుతిమిరేభేంద్రకుంభకూట వినిర్ము
క్త రుధిరమౌక్తికముల క్రియ, సురపతిదిశఁ గెంపుతోడఁ జుక్కలు మెఱసెన్. 1303

* అరుణుడు అనే సింహం గోళ్ళతో చీల్చిన చీకటి అనే గజేంద్రుని కుంభస్థలం నుంచి వెలువడ్డ నెత్తుటితో కలిసిన ముత్యాల మాదిరి తూర్పుదిక్కున ఎఱ్ఱదనంతో నక్షత్రాలు మెరిశాయి.

సీ. పౌలోమి దన బాలు పాన్పుపైఁ గనుపట్టఁ బన్నిన పవడంపు బంతి యనఁగ
నాయురర్థముల వ్యయంబు లొత్తిలి చాటు కాలజాంఘికుచేతి ఘంట యనఁగ
ఘనజంతు జీవిత కాలరాసుల విధి కొలువ నెత్తిన హేమకుంభ మనఁగఁ
బశ్చిమదిక్కాంత పరఁగఁ గైసేయుచో ముందట నిడుకొన్న ముకుర మనఁగఁ

తే. గోక తాపోపశమ దివ్యఘుటిక యనఁగఁ, బద్మినీకాంత నోములఫల మనంగ
మూఁడుమూర్తుల సారంపు ముద్ద యనఁగ, మిహిరమండల ముదయాద్రిమీఁద నొప్పె. 1304

* సూర్యబింబం తూర్పుకొండపై ఉదయించింది. అది శచీదేవి తన పిల్లవాని పానుపుమీద కనిపించేటట్టు చిలుకల పందిరికి అమర్చిన పగడాలబంతియా అన్నట్లుంది. ఆయుస్సనే ధనం వ్యయమై పోతున్నది అని గట్టిగా చాటుతున్న కాలమనే వార్తాహరుని చేతిలోని గంటయా అన్నట్లుంది. బ్రహ్మదేవుడు ప్రాణుల జీవిత కాలమనే ధాన్యరాసులను కొలవడానికి ఎత్తిన బంగారుకుంచమా అన్నట్లుంది. పడమటిదిక్కు అనే అంగన అలంకరించుకునేటప్పుడు ముందుంచుకున్న అద్దమా అన్నట్లుంది. జక్కవల పరితాపం మాన్పే దివ్యమైన మందుగుళికయా అన్నట్లుంది. పద్మిని అనే నాయిక వ్రతఫలమా అన్నట్లుంది. ముమ్మూర్తుల వెలుగుముద్దయా అన్నట్లుంది.

క. వచ్చెం జల్లని గాడ్పులు, విచ్చెం గమలములు; దమము విరిసి బిలంబుల్
చొచ్చెం; బద్మమరందము, మెచ్చెం దుమ్మెదలు గ్రోలి మిహిరుఁడు వొడమన్. 1305

* సూర్యోదయ సమయంలో చల్లని గాలులు వీచాయి. పద్మాలు పూచాయి. చీకట్లు పటాపంచలై గుహలలో దూరాయి. తుమ్మెదలు తమ్మిపూదేనియను త్రాగి ఆనందించాయి.

క. సంకాశితోదయాచల, పంకజసఖ కిరణరాగ పరిపూర్ణంబై
పంకేరుహ గర్భాండము, కుంకుమ సలిలంపుఁ గ్రోవి కొమరున నొప్పెన్. 1306

* తూరుపుకొండపై ఉదయించిన సూర్యుని కిరణాల అరుణిమతో నిండినదై, బ్రహ్మాండము కుంకుమ నీటితో కూడిన బుడ్డివలె సొబగారింది.

వ. తదనంతరంబ. 1307

సీ. పాషాణ వల్మీక పంకాదిరహితంబు మృదుల కాంచననిభ మృణ్మయంబు
గమనీయ కస్తూరికా జలసిక్తంబు బద్ధచందనదారు పరివృతంబు
మహనీయ కుసుమదామ ధ్వజతోరణ మండితోన్నత మంచమధ్యమంబు
బ్రాహ్మణ క్షత్రాది పౌరకోలాహలం బశ్రాంత తూర్యత్రయాంచితంబు

ఆ. నిర్మలంబు సమము నిష్కంటకంబునై, పుణ్యపురుషు మనముఁ బోలి కంస
సైన్య తుంగ మగుచు సంతుష్ట లోకాంత, రంగమైన మల్లరంగ మొప్పె. 1308

* అప్పుడు మహారాజు కంసుడు మల్లయుద్ధానికి సిద్ధం చేయించిన క్రీడారంగము రాళ్ళు, పుట్టలు, బురద లేనిదై, మెత్తని బంగరువన్నెమట్టితో ఒప్పింది. అది కమ్మని కస్తూరిజలంతో తడుపబడింది. దానికి చుట్టూ గందపు కర్రలతో కంచె అమర్చబడింది. గొప్పపూలదండలతో, పతాకలతో, తోరణాలతో అలంకృత మయింది. ఎత్తైన ఆసనములమధ్య ఆ రంగం నిర్మించబడింది. బ్రాహ్మణులు, క్షత్రియులు- అదిగా గల పురప్రజల కోలాహలంతో అది నిండిఉంది. ఎడతెగకుండా మ్రోగుతున్న వాద్యధ్వానాలతో ఎసలారింది, అది పుణ్యపురుషుని మానసం మాదిరి మాలిన్యం లేనిదై, సమమై, కంటకరహితమై శోభిల్లింది. కంసుని సైన్యంతో ఉన్నతమై చెన్నుమీరింది. జనుల హృదయాలకు సంతోషం సమకూరుస్తున్నది.

క. ఆ మల్లరంగపరిసర, భూమిస్థిత మంచమందు భోజేంద్రుఁడు మా
న్యామాత్యసంయుతుండై, భూమీశులు గొలువ నుండెఁ బొక్కుచు నధిపా! 1309

* ఆ మల్లరంగానికి సమీపాన ఉన్న ఉన్నతాసనమందు భోజరాజేంద్రుడైన కంసుడు మాన్యులగు మంత్రులతో గూడి, సామంతులు సేవిస్తుండగా, ఖేదపడుతూ కూర్చుని ఉన్నాడు.

మ. సకలాంభోనిధి మేఖలావహనముం జాలించి యేతెంచు నా
గ కులాగంబుల భంగి నొప్పుచుఁ దగం గైసేసి చాణూర ము
ష్టికకూటుల్ శలతోసలుల్ గురువులన్ సేవించుచున్ రంగ ధా
త్రికి నేతెంచిరి తూర్య ఘోషముల నుద్రేకం బనేకంబుగన్. 1310

* సమస్త సముద్రాలు మొలనూలుగా ఉన్న భూమండలాన్ని మోయడం మానుకొని నడిచివస్తున్న కులపర్వతాల మాదిరి ఒప్పుతూ, తగినట్లు అలంకరించుకొని చాణూరుడూ, ముష్టికుడూ, శలుడూ, తోసలుడూ తమ ఉపాధ్యాయులను కొలుస్తూ, నానావిధాలైన వాద్యశబ్దాలకు ఉద్రేకం చెలరేగగా రంగస్థలానికి చేరినారు.

క. నందాదులైన గోపకు, లందఱుఁ జని కానుకలు సమర్పించి నృపున్
సందర్శించి తదనుమతిఁ, జెంది మహామంచముల వసించిరి వరుసన్. 1311

* నందుడు మొదలైన గోపాలు రందరూ వెళ్ళి కంసరాజును సందర్శించి కానుకలు సమర్పించి అతని అనుజ్ఞతో పెద్ద పెద్ద ఆసనాలపై వరుసగా కూర్చున్నారు.

వ. అంత రామకృష్ణులు నలంకృతులై మల్లదుందుభి నినదంబు విని సందర్శన కుతూహలంబున. 1312

* అంతట బలరామకృష్ణులు అలంకరించుకొన్నవారై జెట్టీల భేరీనినాదాలు విని మల్లరంగం చూడటానికి ఉబలాటపడ్డారు.

క. ఓడక రంగద్వారము, జాడం జని వారు కనిరి సమద కువలయా
పీడంబున్ భిన్నపరా, క్రీడంబుం బ్రమదకంటకిత చూడంబున్. 1313

* రామకృష్ణులు జంకూ గొంకూ లేకుండా రంగస్థలం వాకిలి దగ్గరకు వెళ్ళి మదంతో కూడిన కువలయాపీడమనే కుంజరాన్ని చూచారు. అది గ్రొచ్చి కోరాడటంలో ఇతర గజాలను క్రిందుపరుస్తుంది. ఆ మత్తేభరాజం అధికమదంతో గగుర్పొడిచిన ముందల గలది.

**వ. కని తత్కరిపాలశ్రేష్ఠుండైన యంబష్ఠునికి మేఘనాద గంభీర భాషణంబుల రిపుభీషణుండగు హరి యిట్లనియె. 1314**

* అరిభయంకరుడైన శ్రీహరి ఆ మదేభాన్ని అవలోకించి మేఘగర్జనంవలె గంభీరమైన కంఠంతో మావటివాళ్లకు నాయకుడైన వానిని చూచి ఇట్లన్నాడు.

## -: శ్రీ కృష్ణుఁడు కువలయాపీడ మను గజంబును వధించుట :-

**శా. ఓరీ! కుంజరపాల! మా దెసకు నీ యుద్యన్మదేభేంద్రముం**
**బ్రేరేఁపం బనిలేదు; త్రిప్పు; మరలం బ్రేరేఁచినన్ నిన్ను గం**
**భీరోగ్రాశని తుల్యముష్టి హతులన్ భేదించి నేఁ డంతకుం**
**జేరం బుత్తు మహత్తరద్విపముతో సిద్ధంబు యుద్ధంబునన్. 1315**

* ఓరీ! మావటీ! మా వైపుకు ఈ మత్తమాతంగాన్ని తోలవలసిన పని లేదు. వెనుకకు మరలించు, డీ కొలిపినావా పోరాటంలో నీ మదపుటేనుగుతో పాటు నిన్ను గంభీరమైన, దారుణమైన, పిడుగుపాటులవంటి నాపిడికిలి పోటులతో పొడిచి చంపుతాను. యముని పాలికి ఇపుడే పంపుతాను. ఇది తథ్యం.

**వ. అని పలికి. 1316**

**ఉ. మించిన కొప్పుఁ జక్కనిడి మేలనఁ బచ్చని చీర కాసె బం**
**ధించి లలాటకుంతలతతిన్ మరలించుచు సంగరక్రియా**
**చుంచుతఁ బేర్చి బాలకుఁడు చూచు జనంబులు దన్ను 'బాపురే'?**
**యంచు నుతింప డగ్గఱియె హస్తజితాగము గంధనాగమున్. 1317**

* ఇలా పలికి చొక్కమైన జట్టుముడిని చక్కచేసికొని, మెల్లగా పీతాంబరాన్ని దట్టిగా బిగించి కట్టుకొని, నుదుటవ్రేలాడే ముంగురులను పైకిత్రోసుకుంటూ యుద్ధకార్య నైపుణ్యంతో విజృంభించి బాలుడైన కృష్ణుడు చూచేవారు సెబాసని తన్ను మెచ్చుకుంటుండగా తొండంతో కొండలను పిండిచేసే ఆ మత్తవేదండాన్ని సమీపించాడు.

**క. అంజక బాలకుఁ డనియును, గొంజక దయమాలి రాజకుంజర! యంతం**
**గుంజరమును డీ కొలిపెను, గుంజరపాలకుఁడు గోపకుంజరుమీఁదన్. 1318**

* ఓ రాజోత్తమా! మావటివాడు బాలుడని సందేహింపక కరుణమాలి కంసుని ఆజ్ఞానుసారం గోపకుల శ్రేష్ఠుడైన శ్రీకృష్ణునిపైకి ఏనుగును డీకొలిపినాడు.

వ. మఱియు న య్యనేకపం బనేకపపాలక ప్రేరితం బయి, మహావాత సంఘాత సముద్ధూతంబగు విలయకాల కీలికేళిని బిట్టు మిట్టిపడి, మృత్యుదేవత యెత్తునం, గాలుపోలిక, శమనుని గమనిక, నెదిరి మదసలిల పరిమళ లుబ్ధ పరిభ్రమద్భ్రమర గాయక ఝుంకృతు లహంకృతి సంపాదింపం, గులకుంభినీధర గుహాకుంభ గుంభనంబుగ ఘీంకరించి, రోషభీషణ శేషభోగిభోగ భయంకరంబగు కరంబున శౌరిం జీరి, చీరికిం గొనక, పట్టిన నట్టిట్టు గెంటి, విధుంతుద వదన గహ్వరంబువలన విడివడి యుఱుకు తరణికరణి దర్పించి కుప్పించి, పాదమధ్యంబునకు నసాధ్యుండై దూఁటి మాటుపడినం గ్రోధబంధురంబై సింధురంబు మహార్ణవమధ్య మంథాయమాన మంథర మహీధరంబు కైవడి జిఱజిఱం దిరిగి, కానక భయానకంబై గాలివెరవునం గని పొంగి చెంగటం బ్రళయదండిదండ ప్రశస్తంబగు హస్తంబు వంచి వంచించి చుట్టిపట్టి పడవేయం గమకించినం జలింపక తెంపున హరి కరి పిఱింది కుఱికి మహారాహువాల వల్లికా కర్షణోదీర్ణుం డగు సుపర్ణు తెఱంగున నెగిరి శుండాలంబు వాలంబు లీలం గేల నొడిసిపట్టి జళిపించి పంచవింశతి బాణాసన ప్రమాణదూరంబు బీరంబునం ద్రిప్పివైవ, న వ్వారణంబు దుర్నివారణంబై రణంబున కోహటింపక సవ్యాపసవ్య పరిక్రమణంబుల నవక్రంబై కవిసిన, నపసవ్య సవ్యక్రమంబులఁ దప్పించి, రొప్పి కుప్పించి యెదుర్కొనినఁ గర్కశుం డయి, మేచకాచల తుంగ శృంగ నిభంబగు కుంభికుంభంబు చక్కటిప్రక్కలై చెక్కలెగయ దురంత కల్పాంత జీమూత ప్రభూత నిర్ఘాత నిష్ఠురంబగు ముష్టి సారించి యూఁచి పొడిచినం దద్వికీర్ణపూర్ణ రక్త సిక్త మౌక్తికంబులు వసుంధరకు సంధ్యారాగ రక్తతారకాచ్ఛన్నం బగు మిన్ను చెన్నలవరింప నిలువరింపక మ్రొగ్గి మోఁకరిలి, మ్రొగ్గక దిగ్గన న గ్గజంబు లేచి, చూచి, త్రోచి, నడచి, సంహారసమయ సముద్రసంఘాత సంభూత సముత్తుంగ భంగ సంఘట్టితం బగు కులాచలంబు క్రియఁ గ్రమ్మఱ న మ్మహాభుజుని భుజాదండంబులవలన ఘట్టితంబై, కట్టలుక ముట్టి నెట్టి, డీకొని ముమ్మరంబుగం గొమ్ములం జిమ్మిన, న మ్మేటి చేసూటి మెఱసి హస్తాహస్తి సంగరంబునఁ గరంబొప్పి దప్పింబడక నొప్పించిన, నకుంఠిత కాలకంఠ కఠోర భల్లభగ్నం బగు పురంబు పగిది, జలధిం జటుల ఝంఝానిల వికలంబగు కలంబు కైవడి న మ్మదకలంబు బలంబు దక్కిచిక్కి స్రుక్కువడి లోభికరంబునుం బోలె దానసలిలధారా విరహితంబై, విరహి తలంపునుం బోలె నిరంతర చిత్త జాతవిగ్రహంబై, గ్రహణ కాలంబునుం బోలెఁ బరాధీనఖరకరంబై, ఖరకరోదయంబునుం బోలె, భిన్నపుష్కరంబై, పుష్కరవైరి విలసనంబునుం బోలె నభాసిత పద్మకంబై యున్న సమయంబున. 1319

* ఇంకను పలువురు మావంతులు ఆ కువలయాపీడమును పురికొల్పినారు. పెనుగాలిగుంపుచే పైకెగసిన ప్రళయకాలంలోని అగ్నిజ్వాల విధంగా, ఆ మత్తగజం త్రుళ్ళిపడుతూ మృత్యుదేవత మాదిరీ, కాలపురుషుని కైవడీ, యముని తీరునా కృష్ణుణ్ణి ఎదుర్కొన్నది. తన మదజల వాసనమీది ఆసచే చుట్టూ తిరుగాడే తుమ్మెదలనే గాయకుల ఝంకారం వల్ల ఆ గజం అహంకరించింది. అది కులపర్వత గుహలవంటి కుంభాలను తన ఘీంకారంతో పూరించింది. ఆగ్రహోదగ్రుడైన ఆదిశేషుని పడగవలె భయం గొలిపే తన తుండంతో నిర్లక్ష్యంగా శౌరిని పట్టుకుంది. అసాధ్యుడైన హరి అంతట అటునిటు పెనగి రాహువు ముఖగహ్వరం నుంచి తప్పించుకొని వెలికురికే భాస్కరుని మాదిరి, చెంగున ఎగిరి దాని కాళ్ళనడుమ దూరి దాగుకొన్నాడు.

గోవిందుడు కనిపించక పోయేసరికి కువలయాపీడానికి క్రోధం పెల్లుబికింది. మహాసాగరమధ్యంలో పరిభ్రమించే మందరగిరిలాగా అది గిరగిర తిరుగాడింది. వాసన పసికట్టి కృష్ణుడున్న చోటు తెలిసికొని ఉప్పొంగిపోయింది. ప్రళయకాలంలోని యమదండంలాగా ప్రచండమైన తన తొండాన్ని క్రిందికి వంచి అది పద్మలోచనుణ్ణి వంచించి చుట్టి పట్టుకుని పడమొత్తటానికి ప్రయత్నించింది. మాధవుడు చలింపక తెంపుతో దాని వెనుకవైపునకు ఉరికినాడు. రాహువుతోకను పట్టిలాగే జగజెట్టి గరుడునిచందంగా శ్రీకృష్ణుడు ఒక్క ఎగురు ఎగిరి ఆ ఏనుగువాలాన్ని చేతితో ఒడిసి పట్టుకున్నాడు. పరాక్రమంతో వందమూరల దూరానికి దానిని గిరగిర త్రిప్పి విసరివేశాడు.

ఆ మదేభం అడ్డుకొనరానిదై, అవక్రపరాక్రమంతో పోరాటానికి వెనుదీయక కుడిఎడమలుగా తిరుగుతూ మళ్ళీ మాధవుడి మీదికి ఉరికింది. అప్పుడు కృష్ణుడు కుంజరం కుడిప్రక్కకు తిరిగినప్పుడు తాను ఎడమ ప్రక్కకు, అది ఎడమవైపుకు తిరిగినప్పుడు తాను కుడివైపుకూ తిరుగుతూ దానికి బాగా రొప్పు తెప్పించాడు. అతడు కాఠిన్యం వహించి దానిపైకి చెంగలించాడు. ప్రళయకాల మేఘాలనుండి పడిన కఠోరమైన పిడుగులాంటి తన పిడికిలి బిగించి ఈడ్చి ఆ గజ కుంభస్థలాన్ని గ్రుద్దినాడు. ఎత్తయిన అంజనగిరిశిఖరం లాంటి దాని కుంభస్థలం పగిలి ముక్కచెక్కలై ఎగిరిపడింది. ఆ ఇభకుంభంనుంచి నెత్తుటితో తడిసి చెదరి నేలరాలిన ముత్యాలు సంజకెంజాయలో ఎఱ్ఱటి నక్షత్రాలతో కప్పబడిన మింటిసొబగును ధరణికి సంతరిం చాయి. ఆ శుండాలం అంతతో ఆగక మ్రొగ్గి మోకరిల్లి సంబాళించుకొని వెంటనే లేచింది. అటునిటు చూచింది. ముందుకు ఉరవడించింది. ప్రళయవేళలో సముద్రాల సముత్తుంగ తరంగాలచే కొట్టబడిన కులపర్వతం మాదిరి అది మళ్ళీ భుజబల సమేతుడైన శ్రీకృష్ణునిచే కొట్టబడింది. మిక్కుటమైన క్రోధంతో కువలయాపీడం గోవిందుణ్ణి ఒక్కుమ్మడిగా తన కొమ్ములతో చిమ్మింది. నందసుతుడు హస్తలాఘవం మీరగా బాహాబాహి యుద్ధంలో మిక్కిలి విజృంభించి దానిని తల్లడిల్ల చేశాడు.

అప్పుడు ఆ మదగజం మొక్కవోని ముక్కంటి బల్లెముచే భగ్నమైన పురంలాగా, సముద్రంలో తీవ్రమైన ఝంఝామారుతంవల్ల పాడైన ఓడలాగా శక్తి కోల్పోయింది. బక్కచిక్కి స్రుక్కిపోయింది. దానోదకధారలు లేని పిసినారి చెయ్యి విధంగా అది మదజలధారలు లేనిది అయ్యింది. ఎడతెగని మదనుని పోరుగల వియోగి హృదయంలాగా ఎడతెగక మదిలో జన్మించిన విరోధం కలది అయింది. పరాధీనుడైన ప్రభాకరుడు గల గ్రహణవేళమాదిరి ఎండిన తొండము గలది అయింది. పూచిన తామరలు గల సూర్యోదయం లాగా చీలిన తొండపు కొనగలది అయింది. ప్రకాశింపని పద్మాలు గల చంద్రప్రకాశం మాదిరి, వెలవెలపోయిన ముఖమందలి బిందువులు కలది అయింది.

శా. కాలం ద్రొక్కి సలీలుఁడై నగవుతోఁ గంఠీరవేంద్రాకృతిం
గేలన్ భీషణదంతముల్ వెఱికి సంక్షీణంబుగా మొత్తి గో
పాలగ్రామణి వీరమౌళిమణియై ప్రాణంబులం బాపె నా
శైలేంద్రాభముఁ బ్రాణలోభము నుదంచత్సారగంధేభమున్. 1320

* ఆ సమయంలో గోపాలశేఖరుడూ, వీరశిరోరత్నమూ అయిన ముకుందుడు పర్వతరాజముతో సమానమైనదీ, ప్రాణాలపై ఆస కలదీ అయిన ఆ మత్తకరీంద్రమును మహాసింహం మాదిరి సవిలాసంగా నవ్వుతూ, కాలితో త్రొక్కి, చేతితో భయంకరమైన దాని దంతాలు ఊడబెరికి, బక్కచిక్కునట్లు బాది ప్రాణాలు తీసివేశాడు.

**వ. మఱియు దంతిదంతతాడనంబుల దంతావళపాలకులం గాలుఁబ్రోలి కనిపి తత్ప్రదేశంబు వాసి. 1321**

* తర్వాత ఆ ఏనుగు దంతాలతోనే మావటివాండ్రను యమపురికి పంపించి ఆ చోటు వదలిపెట్టాడు.

**మ. కరిదంతంబులు మూఁపులందు మెఱయన్ ఘర్మాంబువుల్ మోములన్**
**నెరయం గోపకులంత నంత మలయన్ నిత్యాహవస్థేము లా**
**హరిరాముల్ సనుదెంచి కాంచిరి మహోగ్రాడంబరాపూరితా**
**మర మర్త్యాది జనాంతరంగము లసన్మల్లావనీరంగమున్. 1322**

* కదనరంగంలో కాలు కదపక పోరాడే ఆ రామకృష్ణులు ఏనుగుదంతాలు తమ మూపులపై మెరుస్తుండగా, స్వేదబిందువులు ముఖములందు నిండగా గోపాలకులు తమ్ము పరివేష్టించగా బయలుదేరి వచ్చి మల్లభూమిని చూచారు. అది దేవమానవుల హృదయాలను మహాభయంకరమైన ఆడంబరంతో కలవరపెడుతూ ఉంది.

**సీ. మహితరౌద్రంబున మల్లుర కశనియై నరుల కద్భుతముగ నాథుఁ డగుచు**
**శృంగారమునఁ బురస్త్రీలకుఁ గాముఁడై నిజమృత్యువై కంసునికి భయముగ**
**మూఢులు బీభత్సమును బొంద వికటుఁడై తండ్రికి దయరాఁగఁ దనయుఁ డగుచు**
**ఖలులకు విరసంబుగా దండియై గోపకులకు హాస్యంబుగాఁ గులజుఁ డగుచు**

**ఆ. బాంధవులకుఁ బ్రేమ భాసిల్ల వేలుపై, శాంత మొనర యోగిజనుల కెల్లఁ**
**బరమతత్త్వ మగుచు భాసిల్లె బలునితో, మాధవుండు రంగమధ్యమందు. 1323**

* మల్లరంగంమధ్యలో బలరామసహితుడైన మధుసూదనుడు రౌద్రరసంతో మల్లురకు పిడుగువలె కనుపించాడు. అద్భుతరసంతో ప్రజలకు ప్రభువుగా తోచాడు. శృంగారరసంతో పౌరవనితలకు పంచ శరుడుగా భాసించాడు, భయానక రసంతో కంసునికి వానిపాలిటి మృత్యువుగా మూర్తీభవించాడు. బీభత్సరసంతో మూర్ఖులకు వికటమైన వా డనిపించాడు. కరుణరసంతో తండ్రికి కన్నబిడ్డడుగా కాంతి ల్లినాడు. వీరరసంతో దుర్మార్గులకు విద్వేషం కలిగించాడు. హాస్యరసంతో గోపకులకు కులదీపకుడు గా గోచరించాడు. ప్రేమరసంతో చుట్టాలకు దేవుడుగానూ, శాంతరసంతో యోగిజనులకు పరబ్రహ్మస్వరూపు డుగానూ ప్రకాశించినాడు.

**వ. అప్పుడు. 1324**

క. చచ్చిన కుంభీంద్రంబును, వచ్చిన బలమాధవులను వరుసం గని తా
నొచ్చిన చిత్తముతోడుతఁ, జెచ్చెరఁ గడు వెఱచె భోజసింహుం డధిపా! 1325

* ఓ రాజా! ఆ సమయంలో చచ్చిన కువలయాపీడమునూ, వచ్చిన రామకృష్ణులనూ క్రమంగా చూచి భోజకులావతంసుడైన కంసుడు నొచ్చిన మనస్సుతో మిక్కిలి భయపడినాడు.

ఉ. ధీరుల వస్త్రమాల్య మణిదీప్త విభూషణధారులన్ మహా
కారుల సర్వలోక శుభకారుల మానవ మానినీ మనో
హారుల రంగభూతల విహారుల గోపకుమారులన్ మహా
వీరులఁ జూచి చూచి తనివిం దుదిముట్టక లోకు లందఱున్. 1326

* ధీరులూ; వస్త్రములూ, పూలదండలూ, రత్నాలతో వెలుగొందే నగలు ధరించినవారూ, నటుల వేషములో నున్నవారూ, సకల జగాలకూ క్షేమం కలిగించే వారూ, మగవారియొక్క మగువల యొక్కమనసులు ఆకర్షించే వారూ, మల్లరంగంలో విహరిస్తున్నవారు, మహావీరులు అయిన ఆ గోపకుమారులను జనులందరూ తనివితీరక మాటిమాటికీ చూచారు.

ఉ. సన్నుత రామకృష్ణ ముఖచంద్రమయూఖ సుధారసంబులం
గన్నులఁ ద్రావు చందమునఁ గాంచుచు జిహ్వల నంటి చూచు లీ
ల న్నుతి సేయుచుం గరములం బరిరంభము సేయుభంగి న
త్యున్నతిఁ జూపుచుం దగిలి యొండొరుతోడ రహస్యభాషలన్. 1327

* అందమైన రామకృష్ణుల ముఖచంద్ర బింబాలనుండి ప్రసరించే అమృతరసాన్ని కన్నులతో త్రాగేవిధంగా చూస్తూ, నాలుకలతో చప్పరించి చవిచూచే విధంగా స్తుతిస్తూ, చేతులతో కౌగిలించే విధంగా మున్ముందుకు తూలుతూ అక్కడివారంతా ఒకరితో ఒకరు గుజగుజలు పోయినారు.

క. వసుదేవు నివాసంబున, వసుధన్ రక్షింప వీరు వైష్ణవతేజో
ల్లసనమునఁ బుట్టినారఁట, పసిబిడ్డ లనంగఁ జనదు పరదేవతలన్. 1328

* వీరు విష్ణుదేవుని తేజోవిలాసంతో భూమిని కాపాడుటకై వసుదేవుని గృహంలో జన్మించినారట. పర బ్రహ్మస్వరూపు లయిన వీరిని పసిపాప లనడం తగదు అనుకున్నారు.

సీ. చంపెఁ రక్కసిఁ బట్టి; చక్రవాకునిఁ గూల్చెఁ బడద్రొబ్బె మద్దుల; బకుని జీరె;
నఘదైత్యుఁ బొరిగొనె; నడరి వత్సకుఁ ద్రుంచె; గిరి యెత్తి దేవేంద్రుఁ గ్రిందు పఱిచెఁ
గాళియు మర్దించె! గహనానలముఁ ద్రావెఁ; గేశి నంతకుపురికేఁగ కనిచె;
మయుపుత్రుఁ బరిమార్చె; మఱియును దానవ భటుల మర్దించి గోపకులఁ గాచె;

తే. గోపకాంతల మనములఁ గోర్కెఁ దీర్చె, నీ సరోరుహలోచనుం డీ శుభాంగుఁ
డీ మహామహుఁ డీ దిగ్గజేంద్రనిభుఁడు, మనుజమాత్రుండె తలపోయ మాధవుండు? 1329

* నళినములవంటి నయనములు కలవాడూ, మంగళకరమైన అంగసౌష్ఠవము గలవాడూ, గొప్పతేజస్సు కలవాడూ, దిగ్గజేంద్రమునకు దీటైనవాడూ, లక్ష్మికి పతియైనవాడూ అయిన శ్రీకృష్ణుడు రక్కసియైన పూతనను పట్టి చంపినాడు. సుడిగాలియైన తృణావర్తుని హతమార్చినాడు. మద్దిమ్రాకులను పడగూల్చినాడు. బకాసురుని సంహరించినాడు. అఘుడనే అసురుణ్ణి పొరిగొన్నాడు. విజృంభించి వత్సాసురుణ్ణి వధించినాడు. గోవర్ధనగిరి నెత్తి దేవేంద్రుణ్ణి అవమానించినాడు. కాళియుడనే నాగరాజును మర్దించినాడు. కార్చిచ్చును త్రాగివేసినాడు. కేశి అనే దానవుణ్ణి యమునిచెంతకు పంపినాడు. మయుని కొడుకైన వ్యోమాసురుని నిర్మూలించినాడు. ఇంకనూ ఎందరో దనుజవీరులను దునుమాడి గోపకులను కాపాడినాడు. వ్రేతల మనసులోని కోరికలను ఈడేర్చినాడు. ఆలోచించగా ఇతడు సామాన్య మానవుడు కాడు.

## -: శ్రీకృష్ణ బలరాములు చాణూర ముష్టికులను వధించుట :-

**వ. అని పలుకుచుఁ బౌరజనులు సూచుచుండ రామకృష్ణులకుఁ జాణూరుం డిట్లనియె. 1330**

* ఈ విధంగా అనుకుంటూ పురప్రజలు రామకృష్ణులను చూస్తున్నారు. అప్పుడు చాణూరుడు రామకృష్ణులతో ఇలా అన్నాడు.

**మ. వనమార్గంబున గోపబాలకులతో వత్సంబులన్ మేపుచుం**
**బెనఁగన్ మిక్కిలి నేర్చినా రనుచు నీ పృథ్వీజనుల్ సెప్ప మా**
**మనుజేంద్రుం డిట మిమ్ముఁ జీరఁ బనిచెన్ మల్లాహవక్రీడకుం;**
**జనదే కొంతపరాక్రమింప మనకున్ సభ్యుల్ విలోకింపఁగన్. 1331**

* అడవిదారులలో గొల్లబుడుతలతో కలిసి దూడలు మేపుతూ జెట్టిపోరులో మిక్కిలి నేర్పు గడించారని ఈ పుడమిలో జనులు చెప్పుకుంటుండగా విని మా మహారాజు మల్లయుద్ధక్రీడకు మిమ్మ ఇక్కడికి పిలిపించాడు. ఇప్పుడు ఇక్కడి సభ్యులు చూస్తుండగా మనం మన మన పరాక్రమాలు కొంత ప్రదర్శించడం సముచితం.

**మ. జవసత్త్వంబులు మేలె? సాము గలదే? సత్రాణమే మేను? భూ**
**ప్రవరుం బోసన మి మ్మనంగ వలెనే? పాళీ లభీష్టంబులే?**
**పవివో? కాక కృతాంత దండకమవో? ఫాలాక్షు నేత్రాగ్నివో?**
**నవనీతంబుల ముద్దగాదు; మెసఁగన్ నా ముష్టి గోపార్భకా! 1332**

* ఓ గొల్లకుఱ్ఱా! నీకు జవసత్త్వాలు బాగున్నవా? సాము నేర్చినావా? తనువు శక్తియుక్తమా? రాజును క్షీర మిప్పించమని చెప్పవలెనా? జూదాలంటే నీ కిష్టమేనా? నా పిడికిటి పోటంటే ఏమిటో తెలుసా? ఇది పిడుగువంటిది! లేదా యముని కాలదండంలాంటిది. లేదా ముక్కంటి కంటిమంట వంటిది. అర్థమయిందా? నా పిడికిలిగ్రుద్దు వెన్నముద్ద కాదు తింటానికి!

క. జనములు నేర్చిన విద్యలు జననాథునికొఱకుఁ గాదె? జననాథుఁడు నీ
జనములు మెచ్చగ యుద్ధం, బున మనముం గొంత ప్రొద్దు పుత్తమె? కృష్ణా! 1333

* ఓయి కృష్ణా! జనులు విద్యలు నేర్వడం ప్రభువుల మెప్పుకోసమే కదా! రాజూ, ఈ ప్రజలూ మెచ్చుకొనేటట్లు మనం మల్లయుద్ధంతో కొంత కాలక్షేపం చేద్దామా!

వ. అనిన విని హరి యిట్లనియె. 1334

ఉ. సాములు లేవు; పిన్నలము; సత్త్వము గల్దన రాదు; మల్ల సం
గ్రామవిశారదుల్ గులిశ కర్కశ దేహులు మీరు! మీకడ
న్నేము చరించు టెట్లు? ధరణీపతి వేడ్కలు సేయువారముం
గాము; వినోదముల్ సలుపఁ గాదన వచ్చునె యొక్కమాటికిన్. 1335

* వా డిట్లనగా కృష్ణు డిలా అన్నాడు. 'మాకు సాములు తెలియవు. మేము పిన్నవాళ్ళం. సత్తువ ఉందని చెప్పలేము. మీ రలో మల్లయుద్ధంలో నిష్ణాతులు. వజ్రాయుధం మాదిరి కరకైన శరీరాలు కలవారు. ఇట్టి మీతో మే మెట్లా తలపడడం? మీరాజు గారికి వినోదం కలిగించే వాళ్ళమూ కాము. కాని పోరాటకు మీరు ఆహ్వానిస్తే ఒక్కసారిగా కాదని ఎలా అంటాము?

క. నీతోడుత నేఁ బెనఁగెదఁ, బ్రీతిన్ ముష్టికునితోడఁ బెనఁగెడి బలుఁ డు
గ్రాతత మల్లాహవమున, భూతలనాథునికి మెచ్చుఁ బుట్టింతు సభన్. 1336

* నీతో నేను పెనగులాడుతాను. ముష్టికునితో మా అన్న బలరాముడూ ఉత్సాహంతో పెనగులాడుతాడు. భయంకరమైన మల్లయుద్ధంతో భూతలమునకు ప్రభువైన కంసునకు సభలో ప్రీతి కలిగిస్తాను.'

వ. అనిన విని చాణూరుం డిట్లనియె. 1337

శా. నాతోఁ బోరఁగ నెంతవాఁడ? విసిరో నా పాటియే నీవు? వి
ఖ్యాతుండం; గులజుండ; సద్గుణుఁడ సత్కర్మస్వభావుండ! నీ
కేతాదృగ్విభవంబు లెల్లఁ గలవే? యీ వీటఁ బోరాడుటల్
ప్రేతల్ సూడఁగఁ గుప్పిగంతు లిడుటే? వీక్షింపు గోపార్భకా! 1338

* హరి మాటలు విని చాణూరుడు ఇలా అన్నాడు. 'అవురా! గొల్లపిల్లవాడా! నాతో పెనగులాడుటకు నీ వెంతవాడివి? నీవు నాకు సమానుడ వవుతావా? నేను ప్రసిద్ధుణ్ణి, శుద్ధమైన కులంలో పుట్టినవాణ్ణి, మంచి గుణములు గలవాణ్ణి, సత్కర్మ లాచరించే స్వభావం కలవాణ్ణి, నీకు ఇలాంటి గొప్పతన ముందా? ఈ రాచ వీటిలో పోరాటమంటే గొల్లలముందు కుప్పిగంతులు వేయడం కాదుసుమా! బాగా ఆలోచించుకో!

శా. స్థాణున్ మెచ్చఁడు; బ్రహ్మఁ గైకొనఁడు; విష్వక్సేను నవ్వున్; జగ
త్ప్రాణున్ రమ్మనఁ డీడుగాఁ డని; మహాబాహాబలప్రౌఢి న

క్షీణుం; డాజికి నెల్లి నేఁ డనఁడు! వైచిత్రిన్ వినోదించు ని
చ్చాణూరుం డొక గోపబాలు ననికిన్ శక్తుండు గాకుండునే? 1339

* ఈ చాణూరుడు ఈశ్వరుణ్ణి మెచ్చుకోడు. బ్రహ్మదేవుణ్ణి లెక్కచేయడు. విష్వక్సేనుణ్ణి గెలిచేస్తాడు. తనకు సాటిరాడని వాయుదేవునిసైతం రణరంగానికి రమ్మని పిలవడు. మిక్కుటమైన భుజబలాతిరేకం తరగనివాడు. యుద్ధానికి రేపుమాపు అనడు, చిత్రవిచిత్రంగా అలవోకగా ఆహవం చేస్తాడు. ఇట్టి జగజెట్టి చాణూరుడు ఒక గొల్లకుఱ్ఱని పనిపట్టడానికి చాలకపోతాడా?

క. ప్రల్లద మేటికి గోపక!, బల్లిదుఁడను; లోకమందుఁ బ్రఖ్యాతుఁడ; నా
చల్లడముక్రింద దూఱని, మల్లురు లే రెందు ధరణిమండలమందున్. 1340

* గోవులను మేపే కుర్రవాడా! ప్రగల్భా లెందుకు? నేను మహాబలవంతుణ్ణి, లోకంలో ప్రసిద్ధి గాంచిన వాణ్ణి, భూమండలంలో ఎక్కడగానీ ఓడిపోయి నా లంగోటాక్రింద దూరని జెట్టులే లేరు సుమా!

సీ. చలమున ననుడాసి జలరాశిఁ జొరరాదు నిగిడి గోత్రముదండ నిలువ రాదు
కేడించి కుంభిని క్రిందికిఁ బోరాదు; మనుజసింహుఁడ నని మలయ రాదు;
చేరినఁ బడవైతుఁ జెయిసాఁపగా రాదు; బెరసి నాముందటఁ బెరుఁగరాదు
భూనాథహింసకుఁ బోరాదు నను మీఱి; శోధింతుఁ గానలఁ జొరఁగ రాదు

ఆ. ప్రబలమూర్తి ననుచు భాసిల్లఁగా రాదు, ధరఁ బ్రబుద్ధుఁడ నని తలఁప రాదు
కల్కితనము చూపి గర్వింపఁగా రాదు, తరము గాదు; కృష్ణ! తలఁగు తలఁగు. 1341

* ఓ కృష్ణా! మచ్చరంతో నన్ను సమీపించిన తర్వాత సాగరంలో ప్రవేశించడానికి సాధ్యం కాదు (మత్స్యావతారం). పర్వతంచెంత నిక్కి నిలవడానికీ శక్యం కాదు (కూర్మావతారం). అలక్ష్యంతో భూమిక్రిందకు దూరడానికి వీలులేదు (వరాహావతారం). సింహమువంటి పురుషుణ్ణి అని పొగరుగా తిరగడానికి కుదరదు (నృసింహావతారం). దగ్గరకు వస్తే పడద్రోస్తాను. కనుక చేయి సాచడానికి సందు దొరకదు (వామనావతారం). పెనగి నా ఎదుట పెచ్చు పెరగటం అలవికాని పని (త్రివిక్రమ స్ఫురణ). నన్ను దాటి రాజును హింసించడం శక్యపడదు (పరశురామావతారం), గాలిస్తాను గనుక అరణ్యాలలో ప్రవేశించటానికి అవకాశం లేదు (శ్రీరామావతారం). ప్రబలమైన ఆకారం కలవాడనని విర్రవీగుటకు వీలుండదు (బలరామావతారం). పుడమిలో 'నేను ప్రబుద్ధుణ్ణి' అని భావించకు (బుద్ధావతారం). కల్కితనంతో (తెలివితేటలతో) గర్వింపరాదు సుమా! (కల్క్యవతారం). నాతో యుద్ధం చేయడం నీ తరం గాదు. తొలగి పో!

వ. అదిగాక నీవు శ్రీహరి నంటేని. 1342

* అదీగాక నీవు 'ఆదినారాయణుడను' అంటావా? అలా అయితే విను!

సీ. మహిమతో నుండంగ మథురాపురము గాని పొలుపార వైకుంఠపురము గాదు
గర్వంబుతో నుండఁ గంసునిసభ గాని, సంసార రహితుల సభయుఁ గాదు
ప్రకటించి వినఁగ నా బాహునాదము గాని నారదు వీణాస్వనంబు గాదు
చదురు లాడఁగ మల్లజన నిగ్రహము గాని, రమతోడి ప్రణయవిగ్రహము గాదు

తే. వెలసి తిరుగంగ వేదాంతవీథి గాదు, మొఱఁగిపో మునిమనముల మూల గాదు
సాఁగి నడవంగ భక్తుల జాడ గాదు, శౌరి! నా మ్రోల నీ వెందుఁ జనియె దింక? 1343

* వైభవోపేతంగా నివసించడానికి ఇది వైకుంఠపురం గాదు, మధురానగరం, దర్పంతో మెలగడానికి ఇది సన్యాసుల సభకాదు, కంసుని ఒడ్డోలగం. స్వచ్ఛందంగా వినడానికి ఇది నారదుని వీణానినాదంకాదు, నా భుజాస్ఫాలనశబ్దం. చతురోక్తు లాడడానికి ఇది లక్ష్మీదేవితోడి ప్రణయకలహం కాదు, మల్లురతోడి రణ రంగం. యథేచ్ఛగా సంచరించడానికి ఇది వేదాంతవీథి కాదు. దాగి ఉండడానికి ఇది మునిమనఃకుహరం కాదు. ముందుకు వెళ్ళడానికి ఇది భక్తుల సంగతి కాదు. గుర్తుంచుకో! కృష్ణా! ఇక్కడి నుంచి నీ వెక్కడికీ వెళ్ళలేవు.

వ. అని పలికి. 1344

సీ. రోషాగ్ని ధూమప్రరోహంబు కైవడి శిరమున సన్నపుశిఖ వెలుంగ
నాశామదేభేంద్రహస్త సన్నిభములై బాహుదండంబులు భయదములుగ
లయసమయాంతకోల్లసిత దంష్ట్రలభంగిఁ జాఁగిన కోఱమీసములు మెఱయ
నల్లని తెగ గల నడగొండ చాడ్పున నాభీలనీలదేహంబు మెఱయఁ

ఆ. జరణహతుల ధరణి సంచలింపఁగ నభో, మండలంబు నిండ మల్ల సఱచి
శౌరిదెసకు నడచెఁ జాణూరమల్లుండు, పౌరలోకహృదయభల్లుఁ డగుచు. 1345

* అని పలికి మల్లుడైన చాణూరుడు గగనమండలం నిండేటట్లు భుజాస్ఫాలనం చేశాడు. కోపమనే అగ్ని నుంచి ప్రసరించే సన్నని పొగమాదిరిగా అతని తలపై పిలకజుట్టు ప్రకాశించింది. దిగ్గజముల తొండాలకు సమానమైన పొడుగాటి చేతులు భీతిని కలిగిస్తున్నాయి. ప్రళయకాలంలోని యమధర్మరాజు పదునైన కోరల విధంగా పొడవైన కోరమీసాలు మెరుస్తున్నాయి. నల్లని నిడుపైన నడగొండలాగా భయంకరమైన నల్లని దేహం పెల్లుబుకుతున్నది. అడుగుల తాకిడికి పుడమి దద్దరిల్లగా చాణూరమల్లుడు కృష్ణుడివైపు నడిచాడు. ఈ దృశ్యం పట్టణప్రజల హృదయాలకు బల్లె మయింది.

వ. ఇ ట్లగ్గలంబగు నగ్గలిక డగ్గఱిన మల్లునిం గని మెల్లన మొల్లంబగు బీరంబు వెల్లిగొన, వల్లవవల్లభుం డుల్లసిల్లి బాహునాదంబున రోదోంతరాళంబు పూరించి మించి కవిసె; ని ట్లిద్దఱు నుద్దవిడి నున్నత విషమంబులగు తాణ లిడి, కరి కరియును, హరి హరియును, గిరి గిరియునుం దాఁకు వీఁకం దలపడి, యితరేతర హేతిహింసితంబులగు దవానలంబుల తెఱంగునఁ బరస్పర దీర్ఘనిర్ఘాత ఘట్టితంబులగు మహాభ్రంబుల విభ్రమంబున. నన్యోన్య తుంగ తరంగ తాడితంబులగు కల్పాంతకాల సముద్రంబుల

రౌద్రంబున నొండొరుల ముష్టిఘట్టనంబుల ఘట్టితశరీరులై దద్దరిలక డగ్గఱి, గ్రద్దన న య్యిద్దఱుం దిరుగునెడ హరి సొచ్చి పేర్చి యార్చి జెట్టిం బట్టి పడం దిగిచి పాదంబుల జాడించి సముల్లాసంబున నెసకంబునకు వచ్చిన మెచ్చి, నొచ్చి య చ్చపలుండు మీఱి మోర సారించి, తెరలక, పొరలం ద్రొబ్బిన న బ్బలానుజుం డుబ్బి, గొబ్బున మేను వర్ధిల్ల నర్ధాంగకంబున నుండి జానువుల నొత్తుచు, నురవడిం గరవడంబున నున్న నా దుర్నయుండును 'బాల! మేలు మే' లని లీలం గాలు సార నిచ్చి, త్రోచినం జూచి యేచి ఖేచరు లగ్గించి యుగ్గడింప న గ్గోపకుమారుండు పాటవంబున రాటవంబునకుం జని వెన్నెక్కి నిక్కిన నక్కంసభటుండు మదజలరేఖా బంధురంబగు గంధసింధురంబు చందంబునఁ బదంబునుఁ బదంబునం, గరంబును గరంబునన్ గ్రహించి, సహించి, వహించి నైపుణంబున లోపలం దిరిగి యట్టిట్టు దట్టించిన దిట్టతనంబునం దిటవు దప్పక య ప్పద్మలోచనుండు కేడించి, యేచి సమతలంబున వైచి ప్రచండంబగు వాని పిచండంబు వాగించి కాలం గాలు గీలించి డొక్కరంబు గొనిన న య్యభ్యాసి సభ్యులు సన్నుతింపం గ్రమ్మఱించి జడ్డనం గా లడ్డగించి, రక్షించుకొనిన నా రక్షోవైరి వాని కటిచేలంబు పట్టి యెత్తి యొత్తి నడుమ రాగె యిడి, సందువెట్టి నవ్విన నవ్విరోధికాలు కాలిలో నిడి వేధించి నిరోధించిన నిరోధంబుఁ బాసి తిరిగి వసుదేవుపట్టి పట్టిసంబుగొని దట్టించిన నుబ్బరిక చేసి చాణూరుండు హరికరంబు పట్టి హుమ్మని నెమ్మొగంబునం గా లిడి మీఁదైనం గేళి బాలకుండు కాలిం గాల నివారించి మీఁ దై నెగడి యుండనీక దుర్వారబలంబున విదలించి లేచి గృహీత పరిపంథిచరణుండై విపక్షుని వక్షంబు వజ్రివజ్ర సన్నిభంబగు పిడికిటం బొడిచిన వాఁడు వాఁడి చెడక విజృంభించి యంభోరాశి మధ్యంబునం దిరుగు శైలంబుపోలిక నేల జిఱ జిఱం దిరిగి తన్నిన వెన్నుండు కుప్పించి యుప్పరం బెగసి మీఁద నుఱికిన నతండు కృష్ణపాద సంధి పరిక్షిప్త పాదుండై యెగసి లేచి సముద్ధతుం డయ్యె నయ్యెడ. **1346**

* ఈలా మిక్కిలి పూనికతో సమీపించిన మల్లుణ్ణి గోపాలశేఖరుడు చూచాడు. మెల్లగా పరాక్రమాటోపం అతిశయిల్లగా అత డుల్లాసంతో భుజ మప్పళించాడు. ఆ నినాదం భూనభోంతరాళంలో నిండిపోయింది. అతడు జెట్టిపైకి ఉరికినాడు. వారిద్దరూ మహావేగంతో హెచ్చుతగ్గైన స్థానాలలో నిలిచి ఏనుగు ఏనుగుతో, సింహము సింహంతో, కొండ కొండతో ఢీకొన్నట్లు ఒకరితో నొకరు తలపడినారు. రెండు కార్చిచ్చులు తమ తమ అగ్నిజ్వాలలతో ఒండొంటిని పీడించుకొన్నట్లుగా, రెండు మహామేఘములు తమపై పరస్పరం పెద్దపెద్ద పిడుగులు రాల్చుకొన్నట్లుగా, ప్రళయకాలంలోని రెండుసముద్రాలు ఒకదానినొకటి సముత్తుంగ తరంగాలతో కొట్టుకున్నట్లుగా వారిద్దరూ రౌద్రంతో ఒకరినొకరు పిడికిళ్ళతో గ్రుద్దుకున్నారు. తబ్బిబ్బుపడక ఇరువురు దగ్గరకు చేరుకుని వేగంగా మల్లరంగంలో పరిభ్రమించారు.

అప్పుడు హరి విజృంభించాడు. బొబ్బరిస్తూ జెట్టిని పట్టి పడ లాగినాడు. కాళ్ళు జాడించి మిక్కిలి ఉల్లాసంతో ఆ మల్లుడు విజృంభించటం వీక్షించి గోవిందుడు మెచ్చుకున్నాడు. చపలుడైన చాణూరుడు బాధితు డైనప్పటికీ మెడ నిక్కించి తొలగిపోక మురారిని పొరలాడేటట్టు త్రోసినాడు. అంతట బలరామ సోదరుడు శరీర ముప్పొంగగా తటాలున అర్ధాంగకంలో ఉన్నవాడై మోకాళ్ళతో వానిని ఒత్తినాడు. వేగంగా

'కరవడ' మనే ఒక మల్లబంధం పట్టులో ఉండినాడు. అపుడు దుర్నీతిపరుడైన మల్లుడు 'డింభకా! మేలు మే' లని పలుకుతూ అలవోకగా కాలు చొప్పించి కృష్ణుని పడద్రోసినాడు. అప్పుడు వెన్నుడు చెలరేగి వేల్పులు ప్రస్తుతింపగా చాతుర్యంతో వెనుకకు వెళ్ళి చాణూరుని వీపుపై నెక్కి నిక్కినాడు. కంసుని భృత్యుడైన చాణూరుడు మదజలధారల చారికలతో నిండిన మదపుటేనుగువలె మాధవుని పాదాన్ని తన పాదంతో, చేతిని తన చేతితో పెనవేసి పట్టుకొని నేర్పుతో మల్లరంగంలో తిరుగుతూ అటూ ఇటూ కుదిలించివేశాడు.

కమలలోచనుడు దిట్టతనమున దిటవు గోల్పోక తొలగి చెలరేగి జెట్టిని సమతలంమీద పడద్రోసి పెద్దదైన వాని కడుపుమీద మోదినాడు. తన కాలితో వాని కాలిని మెలిపెట్టి 'డొక్కర' మనే మల్లబంధవిశేషాన్ని చూపినాడు.

మల్లవిద్యాభ్యాసం కల చాణూరుడు సభలోని వారు తన్ను పొగడుతుండగా కృష్ణుని వెనుకకు మరలించి తటాలున తన కాలితో అడ్డగించి తన్ను రక్షించుకున్నాడు. రాక్షసవిరోధి యగు కృష్ణుడు వాని దట్టి పట్టి యెత్తి ఒత్తి రాగెయిడి సందు పెట్టి నవ్వినాడు. పగతుడైన మల్లుడు తన కాలిని కృష్ణుని కాలితో చేర్చిబాధించి నిరోధించాడు. వాసుదేవుడు విరోధి నిరోధాన్ని తప్పించుకొని అడ్డకత్తి చేబూని అదలించాడు. చాణూరుడు చెలరేగి శ్రీహరి బాహువు పట్టుకొని హుమ్మని హుంకరించి ముఖాన కాలుపెట్టి మీదు మిగిలాడు.

లీలామానుష బాలుడైన శ్రీకృష్ణుడు చాణూరుని కాలిని తన కాలితో అడ్డగించి వాని విజృంభణ మణచి అడ్డుకొనరాని బలిమితో విదిలించుకొని లేచాడు. పగవాని పాదాన్ని త్రొక్కిపట్టి వజ్రాయుధం వంటి పిడికిలితో వాని వక్షంపైన పొడిచాడు. వాడు పోడిమి చెడక చెలరేగినాడు. మథనవేళ సాగరమధ్యమున తిరిగే మందర పర్వతం మాదిరి వాడు నేలమీద గిరిగిర తిరుగుతూ కృష్ణుణ్ణి తన్నినాడు. వెన్నుడు కుప్పించి గగనమున కెగిరి వానిపై దూకినాడు. కృష్ణుని పాదాల తాకిడికి తన పాదాల సంధిబంధాలు తొలగగా వాడు ఎగిరి పైకి లేచి విజృంభించాడు.

**క. బలభద్రుఁడు ముష్టికుఁడును, బలములు మెఱయంగఁ జేసి బాహాబాహిం**
**ప్రలయాగ్నుల క్రియఁ బోరిరి, వెలయఁగ బహువిధములైన విన్నాణములన్.** **1347**

* అదే సమయంలో పలురకాలైన బలవిన్యాసాలతో బలరాముడు ముష్టికుడు తమ బలం చూపుతూ ప్రళయకాలంలో అగ్నుల చందాన బాహువులతో ఒకరినొకరు త్రోసుకుంటూ పోరాటం సాగించారు.

**వ. ఇ వ్విధంబున.** **1348**

**క. వల్లవులు పెనఁగి రున్నత, గల్లులతో భిన్న దిగిభకరవల్లులతో**
**మల్లులతో రిపుమానస, భల్లులతో భీతగోపవల్లులతోడన్.** **1349**

* ఈ మాదిరిగా నిక్కిన చెక్కిళ్లు గలవారూ, దిగ్గజాల తొండాలను భేదించే తీవలవంటి చేతులు గలవారూ, శత్రువుల మనస్సులకు బల్లెముల వంటివారూ, గోపకుల సమూహానికి భయము కల్గించే వారూ అయిన ఆ మల్లులతో గోపాలబాలకులైన బలరామకృష్ణులు పోరాడినారు.

వ. ఆ సమయంబునఁ బౌరకాంతలు మూఁకలు గట్టి వెచ్చనూర్చుచు ముచ్చటలకుం జొచ్చి తమలో నిట్లనిరి. 1350

* అప్పుడు మథురలోని మానినులు గుంపులు గూడి వేడి యూర్పులు విడుస్తూ తమలో ఈ విధంగా ముచ్చటించుకున్నారు.

ఉ. మంచి కొమారులం గుసుమమంజు శరీరులఁ దెచ్చి చెల్లరే!
యంచిత వజ్రసారులు మహాద్రి కఠోరులు నైన మల్లురం
గ్రించులఁ బెట్టి రాజు పెనఁగించుచుఁ జూచుచు నున్నవాఁడు; మే
లించుక లేదు; మాను మనఁ; డిట్టి దురాత్ముని మున్ను వింటిమే? 1351

* ఔరా! కుసుమాలవలె కోమలములైన శరీరాలు కల మంచి బాలురను రప్పించి వజ్రసారులూ, పర్వతాలవలె కఠోరులు అయిన వీరులతో మల్లయుద్ధం చేయిస్తూ రాజు వినోదం చూస్తున్నాడు. ఇందులో మంచి ఏ కొంచెం కూడా లేదు. పోరు మానండి అని పలుకడు. ఇలాంటి దుర్మార్గులను మునుపు ఎన్నడైనా విన్నామా! కన్నామా!

క. చూచెదరు గాని సభికులు, నీ చిన్న కుమారకులకు నీ మల్లురకున్
ఓ చెల్ల! యీడు గాదని, సూచింపరు పతికిఁ దమకు శోకము గాదే? 1352

* సభాసదులు చూస్తున్నారే కాని ఈ పసిపిల్లలకూ, ఈ మల్లురకూ జోడు కుదరదని రాజుకు చెప్పలే కున్నారు. ఇది అధర్మం. ఇది తమకూ, తమ రాజుకూ శోకం కలిగించకపోదు.

సీ. వేణునాళముల మై వెలసిన మాధవుం డధరామృతము లిచ్చి యాదరించుఁ
బింఛదామములమై పెరిఁగిన వెన్నుండు మస్తకంబునఁ దాల్చి మైత్రి నెఱపుఁ
బీతాంబరములమై బెరసిన గోవిందుఁ డంసభాగమునఁ బాయక ధరించు
వైజయంతికలమై వ్రాలినఁ గమలాక్షుఁ డతికుతూహలమున నఱుతఁ దాల్చుఁ;

తే. దనరు బృందావనంబునఁ దరులమైనఁ, గృష్ణుఁ డానందమునఁ జేరి క్రీడ సల్పు
నెట్టి నోముల నయిన ము న్నిట్టివిధము, లేల కామైతి మోయమ్మ! యింక నెట్లు? 1353

* మనము పిల్లనగ్రోవులమై ఉంటే మాధవుడు కెమ్మోవిసుధ లిచ్చి మన్నించేవాడు. నెమలిపురి దండలమై ఉంటే వెన్నుడు నెత్తిపై నిడుకొని నెయ్యం నెరపేవాడు. పచ్చని పట్టువలువలమై ఉంటే గోవిందుడు భుజాలపై విడువక ధరించి ఉండేవాడు. వనమాలికలమై ఉంటే కమలాక్షుడు మిక్కిలి ఆసక్తితో కంఠాన కైసేసి ఉండేవాడు. అందమైన బృందావనంలో వృక్షాలమై ఉంటే కృష్ణు డానందముతో దరిచేరి క్రీడించేవాడు. ఓ యమ్మా! పూర్వజన్మాలలో ఎట్టి వ్రతాలనైన ఆచరించి ఈలా ఎందుకు కాలేకపోయామో! ఇపు డింకేమి చేయగలం?

ఉ. పాపపు బ్రహ్మ! గోపికల పల్లెలలోన సృజింపరాదె ము
న్నీపురిలోపలన్ మనల నేల సృజించె? నటైన నిచ్చలున్

**జేపడుఁ గాదె యీ సుభగుఁ జెందెడి భాగ్యము సంతతంబు నీ**
**గోపకుమారుఁ బొంద మును గోపకుమారిక లేమి నోఁచిరో! 1354**

* పాపిష్ఠియైన బ్రహ్మ మునుపే మనలను ఆ వ్రేపల్లెలో పుట్టించి ఉండకూడదా? ఈ మథురలో ఎందుకు పుట్టించాడో! ఆ గొల్లపల్లెలోనేనె పుట్టించి ఉంటే ఈ సుందరాంగుని పొందే సౌభాగ్యం సంతోషం ఎల్లప్పుడు మనకు సమకూడి ఉండేవి కదా! ఈ గోపకుమారుణ్ణి పొందడానికి ఆ గోపికలు పూర్వమెట్టి నోములు నోచారో?

**క. గోపాలకృష్ణుతోడను, గోపాలన వేళలందుఁ గూడి తిరుగు నా**
**గోపాలు రెంత ధన్యులొ, గోపాలుర కైన నిట్టి గురురుచి గలదే? 1355**

* గోవులు మేసే సమయంలో గోపాలకృష్ణునితో కలసిమెలసి తిరిగే ఆ గోపాలకు లెంత పుణ్యాత్ములో! భూమిని పాలించే ప్రభువులకైనా ఇట్టి గొప్ప అనుభవం ఉన్నదా?

**క. శ్రమజల కణసిక్తంబై, కమలదళేక్షణుని వదనకమలము మెఱసెన్**
**హిమజల కణసిక్తంబై, కమనీయం బగుచు నున్న కమలము భంగిన్. 1356**

* మంచునీటి చుక్కలచే తడిసి మనోహరంగా ఉండే పద్మం మాదిరి, కమలాక్షుని ముఖకమలం చెమటబిందువులచే తడిసి ప్రకాశిస్తున్నది.

**ఆ. సభకుఁ బోవ రాదు; సభవారి దోషంబు, నెఱిఁగి యూరకున్న నెఱుఁగకున్న**
**నెఱిఁగి యుండియైన నిట్టట్టు వలికినఁ, బ్రాజ్ఞుఁడైనఁ బొందుఁ బాపచయము. 1357**

* సభకు వెళ్ళరాదు. వెళితే, సభలోనివారు చేసే తప్పిదాలను తెలిసి ఉపేక్షించినప్పటికీ, ఆ దోషాలు తెలుసుకోలేక పోయినప్పటికీ,దోషాలు తెలిసి కూడ న్యాయవిరుద్ధంగా పలికినప్పటికీ ఎంత పండితుడైనా పాపం అనుభవించి తీరుతాడు.

**వ. అని పెక్కండ్రు పెక్కు విధంబులం బలుకుచుండఁ దద్బాహు యుద్ధంబున. 1358**

**క. ధృతి సెడి లోఁబడె మల్లుం, డతులిత భవజలధితరికి హతరిపు పురికిన్**
**జితకరికిన్ ధృతగిరికిం, దత హరిరవభరిత శిఖరిదరికిన్ హరికిన్. 1359**

* ఈ విధంగా పలువురు పలురీతుల పలుకుతుండగా ఆ ముష్టియుద్ధంలో సాటిలేని సంసారమనే సముద్రాన్ని దాటడానికి నావవంటివాడూ, శత్రుపురాలనూ ధ్వంస మొనర్చినవాడూ, కువలయాపీడ గజాన్ని జయించినవాడూ, గోవర్ధనగిరి నెత్తినవాడు, విరివియైన సింహగర్జనంతో పర్వతగుహలను పూరించినవాడూ అయిన శ్రీకృష్ణునికి చాణూరుడు ధైర్యం చెడి లోబడిపోయాడు.

**క. హరికిని లోఁబడి బెగడక, హరియురము మహోగ్రముష్టి నహితుఁడు పొడువన్**
**హరి కుసుమమాలికాహత, కరిభంగిఁ బరాక్రమించెఁ గలహోద్ధతుఁడై. 1360**

* విరోధియైన చాణూరుడు కృష్ణునకు లోబడినప్పటికీ, భయపడక మహాభయంకరమైన పిడికిలితో వెన్నుని రొమ్మును పొడిచాడు. పూలదండచే కొట్టబడిన ఏనుగుచందంగా ఆ పోటును లెక్కచేయక శ్రీహరి యుద్ధమందు విజృంభించి పరాక్రమం చూపినాడు.

**క. శౌరి నెఱిఁజొచ్చి కరములు, క్రూరగతిన్ బట్టి త్రిప్పి కుంభిని వైచెన్**
**శూరుం గలహ గభీరున్, వీరుం జాణూరు ఘోరు వితతాకారున్. 1361**

* పరాక్రమవంతుడూ, యుద్ధమందు గంభీరుడూ, భీతిగొలిపే వాడూ, దొడ్డదేహం కలవాడూ, వీరుడూ అయిన చాణూరుణ్ణి కృష్ణుడు చొచ్చుకొనిపోయి కర్కశంగా వాని చేతులు పట్టుకొని గిరగిర త్రిప్పి నేలపై కొట్టినాడు.

**క. శోణితము నోర నొలుకఁగ, జాణూరుం డట్లు కృష్ణసంభ్రామణ సం**
**క్షీణుండై క్షోణిం బడి, ప్రాణంబులు విడిచెఁ గంసుప్రాణము గలఁగన్. 1362**

* ఆ విధంగా అచ్యుతునిచేత గిర గిర త్రిప్పబడిన చాణూరుడు బాగా నలిగినవాడై నోటినుంచి నెత్తురు కారగా పుడమి మీదతబడి ప్రాణాలు విడిచాడు. అతని ప్రాణం పోగానే కంసుని ప్రాణం కలకబారింది.

**క. బలభద్రుండును లోకులు, బలభద్రుం డనఁగఁ బెనఁగి పటుబాహుగతిన్**
**బలభేది మెచ్చఁ ద్రిప్పెను, బలవన్ముష్టికునిఁ గంసు బలములు బెగడన్. 1363**

బలభద్రుడు నిజంగా బలభద్రుడే (బలముచే క్షేమం కలవాడు) అంటూ లోకులు అంటుండగా, ఇంద్రుడు మేలుమేలని మెచ్చుకోగా బలరాము డపారమైన బాహుబలంతో బలవంతుడైన ముష్టికుణ్ణి పట్టుకొని ఇటూ అటూ త్రిప్పినాడు. అది చూచి కంసుడి సేన బెదరిపోయింది.

**ఆ. త్రిప్పి నేల వైవ దిగ్గన రక్తంబు, వదనగహ్వరమున వఱదవాఱ**
**ముష్టికుండు ఘోరముష్టి సత్త్వము సెడి, కూలె గాలిఁ దరువు గూలినట్లు. 1364**

* బలరాముడు అలా త్రిప్పి త్రిప్పి నేలపై దబ్బున పడవేయగా ముష్టికుని గుహవంటి నోటినుంచి నెత్తురు వరదలై పారింది. బలరాముని ఘోరమైన ముష్టిఘాతంతో ముష్టికుడు సత్తువ కోల్పోయి పెనుగాలివల్ల మహావృక్షం కూలినట్లు నేలపై గూలినాడు.

**వ. మఱియును. 1365**

**క. పాటవమునఁ బలుపిడికిట, సూటిం బడఁబొడిచె బలుఁడు శోషిత ఘన బా**
**హాటోప నృపతి కీటుం, గూటున్ వాచాటు నధిక ఘోర లలాటున్. 1366**

* గొప్ప భుజబలాటోపం కల రాజునకు చీడపురుగులాంటి వాడు, కల్లరీడూ, వదరుబోతూ, మిక్కిలి భయంకరమైన నుదురు కలవాడూ అయిన ముష్టికుణ్ణి బలభద్రుడు దిటవైన తన పిడికిలితో సూటిగా పడబొడిచినాడు.

వ. అంత న ద్దనుజాంతకుండు చరణప్రహరణంబుల భిన్నమస్తకులం జేసి వాని చెలులం గూట తోసల శలుల నంతకాంతికంబున కనిచిన. 1367

* అటు పిమ్మట రాక్షసులకు అంతకుడైన బలరాముడు ముష్టికుణ్ణి, మిత్రులైన కూటుడు, తోసలుడు, శలుడు అనువారిని తన కాలితాపులతో తలలు పగులగొట్టి యమునిచెంతకు పంపించాడు.

క. వల్లవబాలకు లని మన, మల్లవరులు పెనఁగి నేఁడు మడిసిరి వీరల్
బల్లిదులు; తలఁడు తలఁడని, చెల్లాచెదరైరి పాఱి చిక్కిన మల్లుల్. 1368

* కేవలం గోపాలబాలకు లనే భావంతో వారితో యుద్ధం చేసిన మన మల్లశ్రేష్ఠులు మరణించారు. రామకృష్ణులు బలవంతులు; 'తొలగుడు, తొలగుడు' అంటూ తక్కిన మల్లురు చెల్లాచెదరై పారిపోయారు.

ఉ. మల్లురఁ జంపి గోపక సమాజములో మృగరాజు రేఖ శో
భిల్లఁగఁ బాదపద్మములఁ బెల్లుగ నందెలు మ్రోయ వచ్చు నా
వల్లవ రాజనందనుల వారక చూచి మహీసురాదు ల
ల్లల్లన సంస్తుతించిరి ప్రియంబుగఁ గంసుఁడు దక్క నందఱున్. 1369

* మల్లులను చంపి గొల్లలమధ్య సింహాలవలె శోభిల్లుతూ అడుగుదామరలందు అందెలు మ్రోగుతూ ఉండగా వస్తూన్న గొల్లలరాజైన నందుని నందనులను బ్రాహ్మణులు మొదలైన వారందరూ రెప్పవాల్పక చూచి ప్రీతితో పొగడినారు. ఒక్క కంసుడు మాత్రం మచ్చరంతో వారిని మెచ్చుకోలేదు.

## -: శ్రీ కృష్ణుఁడు కంసుని వధించుట :-

వ. అంత సభాజనంబుల కలకలంబు నివారించి మంత్రులం జూచి కంసుం డిట్లనియె. 1370

* అంతట సభాసదుల కోలాహలాన్ని నివారించి కంసుడు తన మంత్రులను చూచి ఈ విధంగా అన్నాడు.

ఉ. వల్లవబాలురన్ నగరివాకిటికిన్ వెడలంగ ద్రొబ్బుఁ; డీ
గొల్లల ముట్టికోల్ గొనుఁడు; క్రూరుని నందునిఁ గట్టుఁ; డుర్వికిం
దెల్లము గాఁగ నేఁడు వసుదేవునిఁ జంపుఁడు; తండ్రి గాఁడు వీఁ
డెల్లవిధంబులం బరుల కిష్టుఁడు కావకుఁ డుగ్రసేనునిన్. 1371

* ఈ గోపబాలకులను పట్టణద్వారం దాటి వెళ్ళేటట్లు త్రోసివేయండి. ఈ గొల్లలను ముట్టడించండి, క్రూరుడైన నందుణ్ణి బంధించండి. లోకానికి వెల్లడి అయ్యేటట్లు ఇప్పుడే వసుదేవుణ్ణి చంపివేయండి. ఉగ్రసేనుణ్ణి రక్షించవద్దు. వీడు నాకు తండ్రి కాడు. సకల విధాలా శత్రువులకు ఇష్టమైనవాడు.

వ. అని పలుకు సమయంబున. 1372

శా. జంఘాలత్వముతో నగోపరి చరత్సారంగ హింసేచ్ఛ ను
ల్లంఘింపన్ గమకించు సింహముక్రియన్ లక్షించి పౌరప్రజా
సంఘాతంబులు తల్లడిల్ల హరి కంసప్రాణహింసార్థియై
లంఘించెం దమగంబు మీఁదికి రణోల్లాసంబు భాసిల్లఁగన్. 1373

* ఈ ప్రకారంగా కంసుడు పలుకుతుండగా పిక్కబలంతో కొండశిఖరాన తిరిగే జింకను సంహరించటానికి కుప్పించి దుమికే సింహకిశోరం లాగున శ్రీకృష్ణుడు కంసుని సంహరింప దలచినవాడై గురిచూచి మంచెమీదికి యుద్ధోత్సాహంతో దూకినాడు. కొలువులో ఉన్నపురప్రజలంతా తల్లడిల్లినారు.

క. తమగమున కెగురు యదు స, త్తమగణ్యునిఁ జూచి ఖడ్గధరుఁడై యెదిరెం
దమ గమివారలు వీరో, త్తమగణవిభుఁ డనఁగ గంసధరణీపతియున్. 1374

* తానున్న మంచెమీదికి ఎగిరి దుముకుతున్న యదుకుల సింహమైన కృష్ణుణ్ణి చూచి మథురాధినాథుడైన కంసుడు, ఖడ్గాన్ని చేత ధరించి ఎదిరించాడు. అతని పక్షంలోని వారంతా కంసుడు వీరోత్తంసుడని ప్రశంసించారు.

శా. పక్షీంద్రుం డురగంబుఁ బట్టు విధ మొప్పన్ గేశబంధంబు లో
క క్షోభంబుగఁ బట్టి మౌళిమణు లాకల్పాంత వేళాపత
న్నక్షత్రంబులభంగి రాల రణసన్నాహంబు డిందించి రం
గ క్షోణిం బడఁద్రోచెఁ గృష్ణుఁడు వెసన్ గంసున్ నృపోత్తంసునిన్. 1375

* పక్షులకు ప్రభువైన గరుత్మంతుడు పామును పట్టే రీతిగా శ్రీకృష్ణుడు కంసుని జుట్టుముడి పట్టుకున్నాడు. సభలోని జనులంతా భయభ్రాంతు లైనారు. ప్రళయకాలంలో నక్షత్రాల మాదిరి అతని కిరీటంలోని మణులు జలజల నేల రాలినాయి. యుద్ధసన్నాహం అణగించి క్షాత్రకులావతంసుడైన కంసుణ్ణి యదువల్లభుడు మల్లరంగస్థలం మీదికి పడద్రోసివేశాడు.

శా. మంచాగ్రంబుననుండి రంగధరణీ మధ్యంబునం గూలి యే
సంచారంబును లేక చిక్కి జను లాశ్చర్యంబునుం బొందఁగాఁ
బంచత్వంబును బొందియున్న విమతున్ బద్మాక్షుఁ డీడ్చెన్ వడిన్
పంచాస్యంబు గజంబు నీడ్చు పగిదిన్ బాహాబలోల్లాసియై. 1376

* కంసుడు మంచెమీది నుంచి మల్లక్రీడారంగ మధ్యంలో వచ్చి పడి ఎట్టి కదలిక లేక కట్టెలాగాబిగుసుకొనిపోయాడు. అక్కడి జను లబ్బురపడుతూ చూస్తుండగా ఆ దుర్మతి అక్కడి కక్కడే మరణించాడు. పద్మపత్రాక్షుడైన శ్రీకృష్ణుడు భుజబల విజృంభణంతో కేసరి ఏనుగును ఈడ్చిన విధంగా అతణ్ణి ఈడ్చినాడు.

క. రోష ప్రమోద నిద్రా, భాషాశన పానగతులఁ బాయక చక్రిన్
దోషగతిఁ జూచి యైన వి, శేషగతిన్ గంసుఁ డతనిఁ జెందె నరేంద్రా! 1377

* ఓ పరీక్షిన్మహారాజా! కంసుడు రోషంలో, సంతోషంలో, నిద్రలో, సంభాషణసమయంలో, భోజనవేళలో, నీరు త్రావేపట్టులో చక్రాయుధుడైన శ్రీకృష్ణుని ద్వేషబుద్ధితోనే, దోషబుద్ధితోనే చూచాడు. అయినప్పటికీ అతడు భగవంతునే పొంది ఉత్తమగతి అందుకొన్నాడు.

వ. అ సమయంబున. 1378

క. గోపాలుఁ డొక్కఁ డద్దిర!, భూపాలకుఁ జంపె వీనిఁబొడువుం డేత
ద్రూపాలస్యము లేలని, తాపాలఘురోషు లగుచు దర్పోద్ధతులై. 1379

* ఆ సమయంలో 'ఒక్క గొల్లపిల్లవాడు ప్రభుని చంపినాడు. ఔరా! ఎంత ఆశ్చర్యం. వీనిని చుట్టు ముట్టండి. ఇంకా ఆలస్యం ఎందుకు?' అంటూ పరితాపంతో అగ్గలమైన కోపంతో పొగరుబోతులై-

శా. న్యగ్రోధుండును గహ్వుఁడున్ మొదలుగా నానాయుధానీక సా
మగ్రిన్ గంసుని సోదరుల్ గవియుడున్ మాద్యద్గజేంద్రాభుఁడై
యుగ్రుండై పరిఘాయుధోల్లసితుఁడై యొండొండ చెండాడి కా
లాగ్రక్షోణికిఁ బంచె రాముఁడు గరీయస్స్థేముఁడై వారలన్. 1380

* కంసుని తోబుట్టువులు న్యగ్రోధుడు, గహ్వుడూ మొదలైనవారు అనేకవిధాలైన యుద్ధపరికరాలతో కృష్ణుని మీదికి విజృంభించారు. అప్పుడు మహాబలుడైన బలభద్రుడు రౌద్రమూర్తియై పరిఘ అనే ఆయుధం ధరించి మత్తమాతంగం లాగా ఒక్కొక్కరిని చెండాడి యముని సన్నిధికి పంపినాడు.

వ. అ య్యవసరంబున. 1381

క. చేతులఁ దాళము లొత్తుచు, జేతోమోదంబుతోడ సిగముడి వీడన్
బాతర లాడుచు మింటను, గీతము నారదుఁడు పాడెఁ గృష్ణా! యనుచున్. 1382

* ఆ సమయంలో చేతులతో తాళాలు వాయిస్తూ, జుట్టుముడి వీడగా నారదమహర్షి ఆనందంతో ఆకాశంలో 'కృష్ణా' అని పాటలు పాడుతూ నాట్యం చేశాడు.

క. వారిజభవ రుద్రాదులు, భూరికుసుమవృష్టి గురిసి పొగడిరి కృష్ణున్
భేరులు మ్రోసెను నిర్జర, నారులు దివి నాడి రధిక నటనముల నృపా! 1383

* పరీక్షిన్మహారాజా! బ్రహ్మ ఈశ్వరుడు మున్నగు వేల్పులు కొల్లలు కొల్లలుగా పూలజల్లులు కురియిస్తూ శ్రీకృష్ణుణ్ణి స్తోత్రం చేశారు. దేవదుందుభులు మ్రోగినాయి. దేవతాంగనలు అనేక విధాలుగా ఆకసంలో ఆడినారు.

వ. అంతం గంసాదుల కాంతలు భర్తృమరణ దుఃఖాక్రాంతలై కరంబుల శిరంబులు మోఁదుకొనుచు నశ్రుధారా పరిషిక్తవదనలై సదనంబులు వెలువడి వచ్చి వీరశయ్యానిద్రితు లయిన విభులం గౌఁగిలించుకొని సుస్వరంబుల విలపించిరి. అందుఁ గంసభార్య లిట్లనిరి. 1384

* అంతట కంసుడు మొదలగువారి పత్నులు భర్తల మృతివల్ల శోకాక్రాంతలై చేతులతో తలలు బాదుకుంటూ, కన్నీటిధారలతో తడిసిన ముఖాలతో తమ తమ మందిరాల నుండి వచ్చారు. వీరశయ్యలందు దీర్ఘనిద్ర చెందిన తమ పతులను పరిష్వంగం చేసుకొని రమణీయ గద్గద కంఠధ్వనులతో ఏడ్చినారు. వారిలో కంసుని భార్యలు ఇట్లన్నారు.

సీ. గోపాలసింహంబు కోపించి వెల్వడి నిను గజేంద్రుని భంగి నేఁడు గూల్చె
యాదవేంద్రానిల మాభీలజవముల నిను మహీజముమాడ్కి నేల వ్రాల్చె
వాసుదేవాంభోధి వారి యుద్వేలమై నిను దీవి కైవడి నేఁడు ముంచె
దేవకీసుతవజ్రి దేవత లలరంగ నినుఁ గొండక్రియ నేఁడు నిహతుఁ జేసె

తే. హా మనోనాథ! హా వీర! హా మహాత్మ!, హా మహారాజ! నీ విట్లు హతుఁడ వయిన
మనుచు నున్నార మక్కట! మమ్ముఁబోలు, కఠినహృదయలు జగతిపైఁ గలరె యెందు? 1385

* జీవితేశ్వరా! గోపాలుడనే మృగేంద్రం కోపంతో వెడలివచ్చి గజేంద్రునివంటి నిన్ను హతమార్చింది. నాథా! యదునాథుడనే మారుతం దారుణవేగంతోవృక్షమునువలె నిన్ను నేలపై వ్రాల్చింది.మహానుభావా! వాసుదేవుడనే సముద్రజలం చెలియలికట్టను అతిక్రమించి దీవినివలె నిన్ను ఇప్పుడు ముంచివేసింది. మహారాజా! దేవకీ పుత్రుడనే దేవేంద్రుడు దేవతలు సంతోషించే విధంగా కొండవంటి నిన్ను చెండివేశాడు. అయ్యో! నీ విలా చనిపోయినప్పటికీ మేము బ్రతుకుతున్నాము. అక్కటా! మావలె కఠినహృదయం కలవారు భూమిమీద ఎక్కడైన ఉన్నారా?

క. భూతముల కెగ్గుసేసిన, భూతంబులు నీకు నెగ్గుఁ బుట్టించె వృథా
భూత మగు మనికి యెల్లను, భూతద్రోహికిని శుభముఁ బొంద దధీశా! 1386

* ప్రాణులకు నీవు కీడు చేయగా ఆ ప్రాణులే నీకు కీడుచేశాయి. ప్రాణులకు ద్రోహం చేసినవానికి మేలు కలుగదు. బ్రతుకంతా వ్యర్థ మౌతుంది.

క. గోపాలకృష్ణుతోడను, భూపాలక! మున్ను దొడరి పొలసినవారిన్
నీ పాల బుధులు సెప్పరె, కోపాలస్యములు విడిచి కొలువం దగదే. 1387

* మహారాజా! గోపాలకృష్ణుణ్ణి ఎదిరించి ప్రాణాలు కోల్పోయిన వారిని గురించి పూర్వం నీ సమక్షంలో పండితులు చెప్పలేదా! క్రోధమూ, జడత్వమూ వీడి గోవిందుని సేవించితే ఎంత బాగుండేది.

వ. అని విలపించుచున్న రాజవల్లభల నూరార్చి, జగద్వల్లభుం డయిన హరి కంసాదులకుఁ బరలోక సంస్కారంబులు సేయం బనిచి దేవకీవసుదేవుల బంధనంబు విడిపించి, బలభద్ర సహితుండయి, వారలకుఁ బ్రణామంబులు సేసిన. 1388

* ఈ మాదిరిగా ఏడుస్తున్న రాచయిల్లాండ్రను ఓదార్చి లోకేశ్వరుడైన శ్రీకృష్ణుడు కంసుడు మొదలైన వారికి పారలౌకికక్రియలు సల్పేందుకు ఆదేశించాడు. దేవకీవసుదేవులను చెఱ విడిపించి బలరామునితో గూడి వారికి నమస్కారాలు చేశాడు.

## -: శ్రీ కృష్ణుఁడు దేవకీ వసుదేవుల చెఱమాన్పి యుగ్రసేనునికి పట్టము కట్టుట :-

మ. కని లోకేశులుగాని వీరు కొడుకుల్ గారంచుఁ జిత్తంబులన్
జనయిత్రీ జనకుల్ విచారపరులై శంకింపఁ గృష్ణుండు దా
జన సమ్మోహినియైన మాయఁ దదభిజ్ఞానంబు వారించి యి
ట్లనియెన్ సాగ్రజుఁడై మహావినతుఁడై యానందసంధాయియై. 1389

* తల్లిదండ్రులైన దేవకీవసుదేవులు తమ కుమారులను చూచి 'వీరు లోకాలకు ప్రభువులైన దేవతలేగాని సాధారణ మానవులు గారు' అని ఆలోచిస్తూ తమ మనస్సులలో సంశయింప సాగారు, అపుడు శ్రీకృష్ణుడు అన్న బలభద్రునితో గూడినవాడై, జనులను సమ్మోహింపజేసే మాయాశక్తిని ప్రయోగించి వారి ఎఱుకను తొలగిస్తూ వినయవినమ్రుడై యిట్లన్నాడు.

సీ. మమ్ముఁ గంటిరి గాని మా బాల్య పౌగండ కైశోర వయసులఁ గదిసి మీర
లెత్తుచు దింపుచు నెలమి మన్నింపుచు నుండు సౌభాగ్యంబు లొంద రైతి;
రా కాంక్ష గలిగియు న్నది దైవయోగంబు తల్లిదండ్రులయొద్దఁ దనయు లుండి
యే యవసరమున నెబ్భంగి లాలితు లగుచు వర్ధిల్లుదు రట్టి మహిమ

తే. మాకు నిన్నాళ్ళు లేదయ్యె మఱియు వినుఁడు, నిఖిలపురుషార్థ హేతువై నెగడుచున్న
మేని కెవ్వార లాఢ్యులు మీర కారె, యా ఋణముఁ దీర్ప నూఱేండ్ల కైనఁ జనదు. 1390

* అమ్మా! నాన్నా! మమ్ము ప్రసవించినారే గాని మా బాల్యం, పౌగండం, శైశవం అనే ప్రాయముల్లో ప్రీతితో ఎత్తుకుంటూ, దింపుతూ లాలించి, పాలించే భాగ్యాన్ని మీరు పొందలేదు. కోరిక ఉండికూడ దైవ యోగముచే అది తీరలేదు. తలిదండ్రుల సమక్షంలో బిడ్డలుండి ఏ సమయంలో ఏ విధంగా బుజ్జగింపులు పొందుతూ ఎదుగుతారో అట్టి అదృష్టం మా కిన్నాళ్ళూ లేకపోయింది. ధర్మార్థకామమోక్షములనే పురుషార్థములు సాధించడానికి కారణమైన ఈ శరీరాలకు కర్త లెవరు? జననీ జనకులైన మీరే కదా! నూరేండ్లకయినా మీ ఋణం తీర్చుకోడానికి మాకు శక్యం గాదు.

క. చెల్లుబడి గలిగి యెవ్వఁడు, తల్లికిఁ దండ్రికిని దేహధనముల వృత్తుల్
సెల్లింపఁ డట్టి కష్టుఁడు, ప్రల్లదుఁ డా మీఁద నాత్మపలలాశి యగున్. 1391

* సమర్థుడై ఉండికూడా తన దేహముతో ధనముతో తన తల్లిదండ్రులకు ఎవడు సేవచేయడో అట్టి వాడు కష్టుడు, దుష్టుడు. వాడు చచ్చి పరలోకాన తన మాంసం తానే తింటాడు.

క. జననీజనకుల వృద్ధులఁ, దనయుల గురు విప్ర సాధు దారాదుల నే
జనుఁడు ఘనుఁ డయ్యుఁ బ్రోవక, వనరును జీవన్మృతుండు వాఁడు ధరిత్రిన్. 1392

* ఏ మానవుడు తలిదండ్రులనూ, వయోవృద్ధులనూ, చిన్న బిడ్డలనూ, గురువులనూ, బ్రాహ్మణులనూ, సాధువులనూ ఇల్లాలు మొదలైనవారిని సమర్థుడై ఉండికూడా పోషింపక దీనాలాపము లాడుతాడో అట్టివాడు ఈ భూమిపై బ్రతికియూ చచ్చినవాడే.

వ. అదియుం గాక. 1393

శా. కారాశాలల మా నిమిత్తము మిముం గంసుండు గారింపఁగా
వారింపంగ సమర్థతల్ గలిగియున్ వారింపఁగా రాక ని
ష్కారుణ్యాత్ములమైన క్రూరుల మహాకౌటిల్య సంచారులన్
సారాతిక్షములార! మమ్ముఁ గొఱఁతల్ సైరించి రక్షింపరే! 1394

* అంతే కాక జననీజనకులారా! మీరు మిక్కిలి ఓర్పుగల వారు. మా కారణంగా మిమ్మ కంసుడు చెరసాలలో ఉంచి బాధిస్తూ ఉంటే వాణ్ణి వారించే సామర్థ్యం ఉండి కూడా వారించని దయమాలినవాళ్ళం; క్రూరులం; కపటవేషధారులం. మా లోపాలు సహించి మమ్ములను మన్నించండి.

వ. అని యిట్లు మాయామనుష్యుం డయిన హరి పలికిన పలుకులకు మోహితులై, వారల నంకపీఠంబుల నిడుకొని, కౌఁగిలించుకొని, కన్నీటం దడుపుచుఁ బ్రేమపాశబద్ధులయి, దేవకీవసుదేవు లూరకుండిరి. అంత వాసుదేవుండు మాతామహుం డయిన యుగ్రసేనునిఁ జూచి. 1395

* ఈ విధంగా మాయామానుష విగ్రహుడైన శ్రీకృష్ణుడు పలికినాడు. ఆ మాటలకు దేవకీ వసుదేవులు మోహము చెందినారు. వారు తమ పుత్రులను ఒడులలో కూర్చుండబెట్టుకున్నారు. గట్టిగా కౌగిలించు కున్నారు. కన్నీళ్ళతో వారి శిరస్సులు తడిపారు. ప్రేమాతిశయంతో మాటలురాక మౌనం వహించారు. అప్పుడు శ్రీకృష్ణుడు తన తల్లికి తండ్రిగారైన ఉగ్రసేనుణ్ణి తిలకించి ఇలా అన్నాడు.

చ. అనఘ! యయాతిశాపమున యాదవవీరులకున్ నరేశ్వరా
సనమున నుండరాదు; నృపసత్తమ! రాజవు గమ్ము భూమికిన్;
నినుఁ గొలువంగ నిర్జరులు నీ కరివెట్టుదు రన్యరాజులం
బనిగొను టెంత! రమ్ము జనపాలనశీలివి గమ్ము వేడ్కతోన్. 1396

* పుణ్యాత్ముడవైన రాజేంద్రా! యయాతిశాపంవల్ల వీరులై నప్పటికీ యాదవులు రాజపీఠం అధిష్ఠించటానికి వీలుకాదు, కాబట్టి ఈ భూమికి నీవే అధిపతిగా ఉండు. మేము నిన్ను సేవిస్తుంటాము. దేవతలే నీకు కప్పం చెల్లిస్తారు. ఇక ఇతరరాజులు నీ ఆజ్ఞ శిరసావహిస్తారని వేరుగా చెప్పడ మెందుకు? వేడుకతో ప్రజాపరిపాలనకు సిద్ధపడు.

వ. అని పలికి. 1397

క. మన్నించి రాజుఁ జేసెను, వెన్నుఁడు సత్యావధాను విశ్రుతదానున్
సన్నుతమానున్ గదన, చ్ఛిన్నాహితసేను నుగ్రసేనున్ దీనున్. 1398

* ఈ విధంగా పలికి సత్యమందు ఏకాగ్రత కలవాడూ, దానములు సల్పడంలో ప్రసిద్ధుడూ, అభిమాన వంతుడని పొగడ్త కాంచినవాడూ, సమరంలో శత్రుసైన్యాలను సంహరించేవాడూ, దర్పం లేనివాడూ, అయిన ఉగ్రసేనుణ్ణి వాసుదేవుడు సంభావించాడు, మథురానగరానికి రాజును గావించాడు.

వ. తదనంతరంబ తొల్లి కంసభీతులై విదేశంబులం గృశియించు చున్న యదు వృష్ణి భోజ మరుదశార్హ కుకురాంధక ప్రముఖులగు సకల జ్ఞాతి సంబంధులను రావించి, చిత్తంబు లలర విత్తంబు లిచ్చి వారి వారి నివాసంబుల నుండ నియోగించె; న వ్విధంబున. 1399

* అటుపిమ్మట శ్రీకృష్ణుడు పూర్వం కంసుడి భయంవల్ల ఇతరదేశాలలో గాసి చెందుతున్న తన జ్ఞాతులూ, చుట్టాలూ అయిన యదువులు, వృష్ణులు, భోజులు, మధువులు, దశార్హులు, కుకురులు, అంధకులు, అదిగా కల వారి నందరినీ పిలిపించాడు. వారి మనసులు సంతసించేటట్లు వారికి ధనాదికం బహూకరించి వారి వారి గృహాలలో నివసించడానికి ఏర్పాట్లు చేశాడు.

క. మధుసూదన సత్కరుణా, మధురాలోకన విముక్త మానస భయులై
మధురవచనములఁ దారును, మథురానగరంబు ప్రజలు మనిరి నరేంద్రా! 1400

* కరుణారసంతో నిండిన మధుసూదనుని మధురాతి మధుర మైన కటాక్షవీక్షణాలతో మనసులోని భీతి తొలగినవారై తీయతీయని సల్లాపాలతో వారూ, మథురాపట్టణంలోని ప్రజలూ కలసిమెలసి జీవించారు.

వ. అంత నొక్కనాఁడు సంకర్షణ సహితుండై నందునిం జీరి గోవిందుం డిట్లనియె. 1401

* అనంతరం ఒకనాడు గోవిందుడు బలరామునితో కలిసి నందునివద్దకు వెళ్ళి యిట్లన్నాడు.

శా. తండ్రిం జూడము తల్లిఁ జూడము యశోదాదేవియున్ నీవు మా
తండ్రిం దల్లియు నంచు నుండుదుము సద్ధర్మంబులం దొల్లి యే
తండ్రుల్ బిడ్డల నిట్లు పెంచిరి? భవత్సౌజన్య భావంబులన్
దండ్రీ! యింతటివార మైతిమి గదా! తత్తద్వయోలీలలన్. 1402

* జనకా! మేము తండ్రిని చూడలేదు. తల్లిని చూడలేదు. యశోదాదేవీ నీవూ మాతల్లిదండ్రులని భావిస్తూ ఉంటిమి. ఇంతకుముందు ఏ తల్లిదండ్రులు తమ బిడ్డలను ఇంత గారాబంగా పెంచారు? నీ మంచితనంవల్ల ఆ యా వయసుకు తగిన ఆటపాటలతో పెరిగి ఇంతవారమైనాము!

ఉ. ఇక్కడ నున్న బాంధవుల కెల్లను సౌఖ్యము సేసి వత్తు మే
మక్కడికిన్; మదీయులకు నందఱకున్ వినిపింపు మయ్య నే

**మెక్కడనున్న మాకు మది నెన్నఁడు బాయవు మీ వ్రజంబులో**
**మక్కువతోడ మీరు కృప మా కొనరించు క్రియావిశేషముల్.** **1403**

* ఇక్కడ మథురానగరంలో ఉన్న చుట్టా లందరికీ మేలు కలిగించి అక్కడికి వ్రేపల్లెకు మేము వస్తాము. ఈ సంగతి మన వారందరికీ చెప్పండి. మీరు గోకులంలో ఎంతో మక్కువతో, దయతో మాకు చేసిన ఉపచారాతిశయాలు మే మెక్కడున్నా మా మనసునుండి ఎన్నటికినీ మరలిపోవు.

**వ. అని పలికి వస్త్రభూషణాదు లొసంగి సాదరంబుగం గౌఁగిలించు కొని గోవిందుం డనిచిన నందుండు ప్రణయ విహ్వలుండై బాష్పజల పూరిత లోచనుం డగుచు వల్లవులుం దానును వ్రేపల్లెకుం జనియె; నంత.** **1404**

* ఈ ప్రకారంగా పలికి శ్రీకృష్ణుడు వస్త్రాలు, ఆభరణాలు మొదలైన వాటి నిచ్చి ఆదరంతో కౌగిలించుకొని సాగనంపివాడు. నందుడు అనురాగంతో విలవిలలాడుతూ కన్నీళ్ళతోనిండిన కన్నులు గలవాడై గొల్ల పెద్దలతో కలసి వ్రేపల్లెకు వెళ్ళిపోయాడు.

**క. గర్గాదిభూసురోత్తమ, వర్గముచే నుపనయనము వసుదేవుఁడు స**
**న్మార్గంబునఁ జేయించెను, నిర్గర్వ చరిత్రులకును నిజపుత్త్రులకున్.** **1405**

* అనంతరం వసుదేవుడు గర్వరహితమైన చరిత్ర కల తన కుమారులకు గర్గుడు మొదలైన బ్రాహ్మణ పురోహితుల సన్నిధిలో యథావిధిగా ఉపనయన సంస్కారం జరిపించాడు.

**క. ద్విజరాజ వంశవర్యులు, ద్విజరాజ ముఖాంబుజోపదిష్ట వ్రతులై**
**ద్విజరాజత్వము నొందిరి, ద్విజరాజాదిక జనంబు దీవింపంగన్.** **1406**

* చంద్రవంశజులలో అగ్రగణ్యులై అలరారుతున్న బలరామకృష్ణులు బ్రాహ్మణోత్తముల ముఖకమలాల నుండి ఉపనయన మంత్రోపదేశములను గ్రహించినవారై విప్రులు, రాజులు ఆదిగా గల జనులూ, గరుత్మంతుడు, ఆదిశేషుడు మొదలైనవారూ దీవన లీయగా ద్విజత్వం (క్షత్రియత్వం) అందుకున్నారు.

**వ. ఉపనయనానంతరంబున వసుదేవుండు బ్రాహ్మణులకు సదక్షిణంబులుగా ననేక గోహిరణ్యాది దానంబు లొసంగి తొల్లి రామకృష్ణుల జన్మసమయంబులందు నిజమనోదత్తలైన గోవుల నుచ్చరించి యిచ్చి కామితార్థంబుల నర్థులకుం బెట్టె; నిట్లు బ్రహ్మచారులై.** **1407**

* ఉపనయన మైన అనంతరం వసుదేవుడు ధరణీసురులకు దక్షిణలతో గూడ ధేనువులు, బంగారము మొదలైన అనేకదానాలు చేశాడు. మునుపు రామకృష్ణుల జననకాలంలో తాను మనస్సుతో సంకల్పం చేసి దానం చేసిన గోవులను ఇప్పుడు ప్రత్యక్షంగా దానమిచ్చాడు. యాచకులకు వారు కోరిన సమస్తవస్తువుల సమర్పించాడు.

శా. ఉర్విన్ మానవు లెవ్వరైన గురువాక్యోద్యుక్తులై కాని త
త్పూర్వారంభము సేయఁ బోల దనుచున్ బోధించు చందంబునన్
సర్వజ్ఞత్వముతో జగద్గురువులై సంపూర్ణులై యుండియుం
గుర్వంగీకరణంబు సేయఁ జని; రా గోవిందుఁడున్ రాముఁడున్. 1408

* ఈ విధంగా బ్రహ్మచర్యవ్రతాన్ని అవలంబించిన బలరామకృష్ణులు పుడమిలో మనుజు లెవ్వరు గాని గురుకులవాసం చేసి గురువుల ఉపదేశాలు శ్రద్ధతో ఆలకించితే తప్ప విద్యావంతులు కాలేరు సుమా! అని లోకానికి బోధించాలని భావించారు. సమస్తము నెఱిగిన వా రయినప్పటికినీ, జగద్గురువు లయినప్పటికినీ పరిపూర్ణు లయినప్పటికినీ బలరామకృష్ణులు ఆచార్యుణ్ణి అన్వేషించుతూ బయలుదేరారు.

వ. చని మహావైభవరాశియైన కాశిం జేరి తత్తీరంబున నవంతీపుర నివాసియు, సకలవిద్యా విలాసియు నైన సాందీపని యను బుధవర్యుం గని యథోచితంబుగ దర్శించి, శుద్ధభావవర్తనంబుల భక్తి సేయుచుండ, వారలవలన సంతుష్టుండై. 1409

* రామకృష్ణులు గొప్పవైభవములకు కాణాచియైన కాశీ పట్టణం చేరుకున్నారు. అక్కడ ఉంటున్న అవంతీపట్టణ వాస్తవ్యుడూ, సమస్తవిద్యలచే విలసిల్లువాడూ అయిన సాందీపని అనే పండితోత్తముని సముచిత రీతి సందర్శించారు. స్వచ్ఛమైన మనస్సుతో, సత్ప్రవర్తనతో, ప్రగాఢమైన భక్తితో ఆయనను సేవించారు. ఆచార్యుడు ఆ శిష్యుల వినయవిధేయతలకు ఎంతో సంతోషించాడు.

శా. వేదశ్రేణియు నంగకంబులు ధనుర్వేదంబుఁ దంత్రంబు మ
న్వాదివ్యాహృత ధర్మశాస్త్రములు నుద్యన్న్యాయముం దర్క వి
ద్యా దక్షత్వము రాజనీతియును శుద్ధప్రక్రియం జెప్పె నా
భూదేవాగ్రణి రామకృష్ణులకు సంభూత ప్రమోదంబునన్. 1410

* బ్రాహ్మణోత్తముడైన సాందీపని సంతోషితస్వాంతుడై రామకృష్ణులకు నాలుగు వేదములు, శిక్ష, వ్యాకరణము, ఛందము, నిరుక్తము, జ్యోతిషము, కల్పము అను ఆరు వేదాంగములు; ధనుర్వేదము, తంత్రము, మనువు మున్నగువారిచే చెప్పబడిన ధర్మశాస్త్రాలు, ఒప్పిదమైన న్యాయశాస్త్రము, తర్కశాస్త్రము, రాజనీతి మొదలైన వాటిని తేట తెల్లంగా బోధించినాడు.

క. అఱువది నాలుగు విద్యలు, నఱువది నాలుగు దినంబు లంతన వారల్
నెఱవాదులైన కతమున, నెఱి నొక్కొకనాఁటి వినికి నేర్చి రిలేశా? 1411

* పరీక్షిన్మహారాజా! రామకృష్ణులు మిక్కిలి నేర్పరు లైనందున అరవైనాలుగు కళలనూ అరవైనాలుగు రోజులలో చక్కగా ఒక్కొక్కనా డొక్కొక్క కళవంతున వినికిడిచేతనే నేర్చుకున్నారు.

క. గురువులకు నెల్ల గురులై, గురులఘుభావములులేక కొమరారు జగ
ద్గురులు త్రిలోకహితార్థము, గురుశిష్యన్యాయలీలఁ గొలిచిరి వేడ్కన్. 1412

* గురువులకే గురువు లయినవారూ, ఇతడెక్కువ అతడు తక్కువ అనే భేదభావములు లేక ప్రకాశించు లోకగురువులూ అయిన రామకృష్ణులు సంతోషంతో గురుశిష్యన్యాయంతో ఒజ్జయైన సాందీపనిని సేవించారు.

**వ. ఇట్లు కృతకృత్యులైన శిష్యులం జూచి వారల మాహాత్మ్యంబునకు వెఱఁగుపడి సభార్యుండైన సాందీపని యిట్లనియె. 1413**

* ఈ విధంగా కృతార్థులైన శిష్యులను చూచి వారి ప్రభావానికి ఆశ్చర్యపడి భార్యతో ఆలోచించి సాందీపని రామకృష్ణులతో ఇట్లన్నాడు.

**శా. అంభోరాశిఁ బ్రభాసతీర్థమున ము న్నస్మత్తనూసంభవుం**
**డంభోగాహముసేయుచున్ మునిఁగి లేఁ డయ్యెం గృపాంభోనిధుల్**
**శుంభద్వీర్యులు మీరు మీ గురునికిం జోద్యంబుగా శిష్యతన్**
**గాంభీర్యంబునఁ బుత్రదక్షిణ యిడం గర్తవ్య మూహింపరే! 1414**

* నాయనలారా! మా కుమారుడు మునుపు సముద్రంలో ప్రభాసమనే ఘట్టాన స్నానం చేస్తూ నీటిలో మునిగిపోయాడు. అంతే; మళ్ళీ అగుపించలేదు. దయకు సముద్రంలాంటివారూ, ప్రకాశించే ప్రతాపం గల వారూ అయిన మీరు మాకు శిష్యులైనారు కనుక మాకు గురుదక్షిణగా అందరికీ అచ్చెరువు గలుగునట్లుగా మా కుమారుణ్ణి తెచ్చి ఇవ్వండి. ఇది మీ కర్తవ్యంగా గుర్తించండి.

**క. శిష్యులు బలాఢ్యులైన వి, శేష్యస్థితి నొంది గురువు జీవించును; ని**
**ర్దూష్యగుణ బలగరిష్ఠులు, శిష్యులరై గురుని కోర్కి సేయం దగదే? 1415**

* శిష్యులు అత్యంత బలవంతులైతే గురువు విశేషగౌరవంతో కూడిన ఉత్తమస్థితి నొంది తలెత్తుకొని జీవిస్తాడు. అనింద్య గుణములతో, అఖండపరాక్రమంతో విరాజిల్లే మీరు శిష్యులై యుండి గురుని కోరిక నెరవేర్చడం న్యాయం కదా!

**వ. అనిన విని రామకృష్ణులు గుర్వర్థంబుగా దుర్వార రథారూఢులై రయంబునం జని రౌద్రంబున సముద్రంబుఁ జేరి యిట్లనిరి. 1416**

* ఆచార్యుడైన సాందీపని పలుకులు విని రామకృష్ణులు గురువుగారి కోరిక తీర్చడంకోసం ఎదురులేని రథాన్ని అధిరోహించారు. తత్క్షణం సముద్రుని సమీపానికి వెళ్ళి కోపంతో ఇలా అన్నారు.

**క. 'సాగర! సుబుద్ధితోడను, మా గురుపుత్రకునిఁ దెమ్ము మా జూడిన నీ**
**వాగడ మగుదువు; దుస్సహ, వేగరణాభీల నిశిత విశిఖాగ్నులకున్'. 1417**

* ఓ సముద్రుడా! మంచిబుద్ధితో మా గురువుగారి కుమారుని తెచ్చి మాకు అప్పగించు. బదులు మాట్లాడితే సహింపరాని వేగం కలవీ, రణరంగ భయంకరాలూ అయిన మా పదునైన బాణాలు విరజిమ్మే అగ్ని జ్వాలలకు నీవు గుఱి అవుతావు.

వ. అనిన వారలకు జలరాశి యిట్లనియె. 1418

ఉ. 'వంచన యింత లేదు యదువల్లభులార! ప్రభాసతీర్థమం
దంచితమూర్తి విప్రసుతుఁ డార్యుఁడు తోయము లాడుచుండ ను
త్పంచలితోర్మి యొక్కటి ప్రచండగతిం గొనిపోయెఁ బోవఁగాఁ
బంచజనుండు మ్రింగె నతిభాసురశీలుని విప్రబాలునిన్. 1419

వ. అని వాని వసియించు చో టెఱింగించిన. 1420

* రామకృష్ణుల పలుకులు విని సాగరు డిట్లన్నాడు. 'యాదవేశ్వరులారా, నామాటలలో మోసం లవలేశం కూడా లేదు. ప్రభాసతీర్థంలో అందమైన ఆకారం గలవాడు, మంచివాడు అయిన బ్రాహ్మణబాలుడు స్నానం చేస్తుండగా తరంగ మొకటి పై కెగసి భయంకర వేగంతో అతణ్ణి లోనికి గొంపోయింది. అలా తీసుకొని పోగా మిక్కిలి ఒప్పిదమైన స్వభావం కల ఆ భూసుర కుమారుణ్ణి పంచజను డనే దైత్యుడు మ్రింగివేశాడు' అంటూ సముద్రుడు ఆ రాక్షసు డుండే చోటు రామకృష్ణులకు తెలిపినాడు.

శా. శంఖారావముతోడ బంచజనుఁడున్ శంకించి చిత్తంబులో
సంఖిన్నుండుగ వార్ధిఁ జొచ్చి దహనజ్వాలాభ హేమోజ్జ్వల
త్పుంఖాస్త్రంబునఁ గూల్చి వాని జఠరంబున్ వ్రచ్చి గోవిందుఁ డ
ప్రేంఖచ్చిత్తుఁడు బాలుఁ గానక గురుప్రేమోదితోద్యోగుఁడై. 1421

* శ్రీ కృష్ణుడు శంఖం పూరించాడు. ఆ శంఖారావం విని పంచజనుడు భయసందేహాలతో కంపించి పోయాడు. శ్రీకృష్ణుడు సాగరజలంలో ప్రవేశించాడు. అగ్నిజ్వాలలతో సమానములై, బంగారుపింజలతో రంగారు బాణాలతో పంచజనుని పడగూల్చి వాని పొట్టను చీల్చినాడు. అచంచల మనస్కుడైన శ్రీకృష్ణునకు పంచజనుని కడుపులో విప్రకుమారుడు కన్పించలేదు. అతడు గురువుపట్ల గలప్రీతిచే కార్యతత్పరు డయినాడు.

క. దానవుని దేహజంబగు, మానితశంఖంబు గొనుచు మసలక బలుఁడుం
దో నేతేరఁగ రథియై, దానవరిపుఁ డరిగె దండధరపురికి నృపా! 1422

* పరీక్షిన్నరేంద్రా! రాక్షసవిరోధియైన శ్రీకృష్ణుడు నక్తంచరుడైన పంచజనుని శరీరంనుంచి జనించిన 'పాంచజన్య' మనే గొప్పశంఖాన్ని తీసుకున్నాడు. ఆలసించక బలభద్ర సహితుడై రథము నధిరోహించి యముని పట్టణానికి వెళ్ళినాడు.

వ. చని సంయమనీనామ నగరంబుఁ జేరి తద్ద్వారంబునఁ బ్రళయకాల మేఘగంభీర నినదభీషణం బగు శంఖంబు పూరించిన విని వెఱఁగుపడి. 1423

* అలా వెళ్ళి శ్రీకృష్ణుడు 'సంయమని' అనే పేరుగల ఆ యమపురాన్ని చేరి ఆ పట్టణం వాకిట ప్రళయకాల మేఘంవలె గంభీర ధ్వనితో భీతిగొలిపే తన శంఖాన్ని పూరించాడు. ఆ శంఖఘోషం విని యమ ధర్మరాజు వెరగుపడ్డాడు.

శా. అస్మద్బాహుబలంబుఁ గైకొనక శంఖారావమున్ మాన సా
పస్మారంబుగ నెవ్వఁ డొక్కొ నగర ప్రాంతంబునం జేసె? మ
ద్విస్మేరావహ రోషపావకునిచే విధ్వస్తుఁడై వాఁడు దా
భస్మంబై చెడు నంచు నంతకుఁడు కోపప్రజ్వలన్మూర్తియై. 1424

* నా భుజబలాన్ని లెక్కచెయ్యక నా మనసుకు క్రోధావేశం కలిగేటట్టు పురంపొంత ఎవడో శంఖం పూరిస్తున్నాడు. వాడు అద్భుతావహమైన నా క్రోధాగ్నికి బూడిద అయిపోతాడు' అంటూ దండధరుడు కోపంతో మండిపడుతూ వచ్చాడు.

వ. వచ్చి రామకృష్ణులం గని వారు లీలామనుష్య లయిన విష్ణుమూర్తులని యెఱింగి; భక్తితోడం బూజ చేసి సర్వభూతమయుండగు కృష్ణునకు నమస్కరించి 'యేమి సేయుదు నాన'తి మ్మనిన న మ్మహాత్ముం డిట్లనియె. 1425

* అలా వచ్చి అంతకుడు బలరామకృష్ణుల నవలోకించాడు. వారు లీలలు నెరపుటకై నరులుగా అవతరించిన నారాయణులని గ్రహించాడు. భక్తితో పూజించాడు. సకలభూతహృదయ నివాసియైన ఆ పరమాత్మకు నమస్సులు సమర్పించి నేనేమి చెయ్యాలో ఆజ్ఞాపించమని అడిగినాడు. యముని మాటలు విని అచ్యుతు డిట్లా అన్నాడు.

క. 'చెప్పెద మా గురునందనుఁ, దప్పు గలుగఁ జూచి నీవు దండనమునకున్
దెప్పించినాఁడ వాతని, నొప్పింపుము మాకు వలయు నుత్తమచరితా!' 1426

* పుణ్యశీలుడవైన యమధర్మరాజా! చెపుతాను విను. మా గురుపుత్రునిలో తప్పు కలుగబట్టి దండించడానికై తెప్పించుకున్నావు. అతణ్ణి ఇప్పుడు మాకు అప్పగించు. మా కతడు కావాలి.

క. అనిన విని 'వీఁడె వీనిం, గొని పొం'డని భక్తితోడ గురునందను ని
చ్చినఁ గృష్ణుడు వీడ్కొనియెను, ఘనదుర్జనదమను మహిషగమనున్ శమనున్. 1427

* శ్రీకృష్ణుని మాటలు విని యమధర్మరాజు 'ఇడుగో వీడే వీనిని తీసుకపొండి' అని భక్తితో గురుపుత్రుని ఇచ్చివేశాడు. కృష్ణుడు దుర్మార్గులను అణచివేసేవాడూ, దున్నపై స్వారిచేసేవాడూ అయిన యముణ్ణి వీడ్కొని గురుకుమారుణ్ణి తోడ్కొని బయలుదేరి వెళ్ళినాడు.

వ. ఇట్లు జము నడిగి తెచ్చి రామకృష్ణులు సాందీపనికిం బుత్త్రుని సమర్పించి 'యింక నేమి సేయవలయు? నానతిం' డనిన నతం డిట్లనియె. 1428

* ఈ విధంగా యమునివద్దనుండి పుత్రుణ్ణి తెచ్చి గురువర్యుడైన సాందీపని కిచ్చి రామకృష్ణులు 'ఇంకా ఏమి చెయ్యవలెనో సెలవివ్వండి' అని అడిగారు. అప్పుడు సాందీపని వారితో ఇలా అన్నాడు.

క. 'గురునకుఁ గోరిన దక్షిణఁ, గరుణన్ ము న్నెవ్వఁ డిచ్చె? ఘనులార! భవ
ద్గురునకుఁ గోరిన దక్షిణఁ, దిరముగ నిచ్చితిరి మీరు దీపితయశులై. 1429

* 'వీరకుమారులారా! గురువునకు కోరిన దక్షిణ తెచ్చి యిచ్చారు. మీ యశస్సు దిగంతాలలో ప్రకా శింప జేశారు. ఇంతవరకు ఎవడైనా తన గురువునకు అత డడిగిన ఇటువంటి దక్షిణ దయతో ఈ విధంగా ఇచ్చినవా డున్నాడా?'

క. కాలుని వీటికిఁ జని మృత, బాలకుఁ దే నొరుల వశమె? భవదీయ కృపన్
మేలు దొరకొనియె మాకు; వి, శాల మగుంగాత మీ యశము లోకములన్. 1430

* యమసదనానికి వెళ్ళి చచ్చిన పిల్లవానిని తెచ్చియిచ్చుట ఇతరులకు సాధ్యమా? ఎంతో శ్రద్ధాభక్తులతో మాకు మేలు కలిగించారు. మీ కీర్తి లోకాలలో విస్తరిల్లు గాక!

వ. మహాత్ములారా! 'యేను గృతార్థుండ నైతి' నని దీవించిన సాందీపని వీడ్కొని కృతకృత్యులై రామకృష్ణులు రథారోహణంబు చేసి మథురకుం జనుదెంచి పాంచజన్యంబు పూరించినఁ గని నష్టధనంబులు గనినవారి భంగిం బ్రజలు ప్రమోదించి; రంత నొక్క నాఁ డేకాంతంబున. 1431

* ఓ పుణ్యాత్ములారా! 'నేను ధన్యుడ నయినాను' అని సాందీపని వారిని దీవించినాడు. గురువుదగ్గర సెలవు పుచ్చుకొని కృతార్థులై రామకృష్ణులు తేరెక్కి మథురానగరానికి వెళ్ళి శంఖాన్ని ఒత్తినారు. అపుడు ప్రజలు తాము పోగొట్టుకొన్న ధనాన్ని తిరిగిపొందిన చందాన సంతోషించారు.

## -: శ్రీ కృష్ణుఁడు గోపకాంతల చెంతకు నుద్ధవునిఁ బంపుట :-

శా. నాపైఁ జిత్తము లెప్పుడున్ నిలుపుచున్ నా రాకఁ గాంక్షించుచున్
నాపే రాత్మల నావహించుచు వగన్ నానాప్రకారంబులన్
గోపాలాంగన లెంత జాలిఁపడిరో? కోపించిరో? దూఱిరో?
వ్రేపల్లెన్ నిజనర్మ గేహములలో విభ్రాంతచైతన్యలై. 1432

* ఒకనాడు శ్రీకృష్ణుడు ఏకాంతంగా ఇలా తలపోశాడు- వ్రేపల్లెలోని గొల్లముద్దియలు సదా నామీదనే మనసు లగ్నంచేస్తారు. నా ఆగమనాన్ని ఎదురుచూస్తారు. నా పేరు ఆత్మలో ధ్యానిస్తారు. ప్రణయపారవశ్యంతో తమ రహస్య గృహాలలో అనేక విధాలుగా వగ చెందుతుంటారు. పాపం వారెంత దైన్యం పాలవుతున్నారో? నాపై ఎంత కినుక వహించారో! నన్నెంతగా దూషించుతున్నారో!

వ. అని చింతించి. 1433

క. సిద్ధవిచారు గభీరున్,వృద్ధవచోవర్ణనీయు వృష్ణిప్రవరున్
బుద్ధినిధి నమరగురుసము, నుద్ధవునిం జూచి కృష్ణుఁ డొయ్యన పలికెన్. 1434

* ఇలా ఆలోచించి నిశ్చితమైన భావాలు గలవాడు, గంభీరుడు, పెద్దలు మెచ్చదగినవాడు, వృష్ణివంశస్థులలో ఉత్తముడు, బుద్ధికి గనివంటివాడు, దేవతాగురువైన బృహస్పతితో సమానుడు అయిన ఉద్ధవుణ్ణి పిలిపించి అతనితో శ్రీకృష్ణుడు మెల్లగా ఇట్లన్నాడు.

**కా. రమ్మా యుద్ధవ! గోపకామినులు నా రాకల్ నిరీక్షించుచున్**
**సమ్మోహంబున నన్నియున్ మఱచి యే చందంబునం గుందిరో**
**తమ్మున్ నమ్మినవారి డిగ్గ విడువన్ ధర్మంబు గాదంద్రు; వే**
**పొమ్మా! ప్రాణము లే క్రియన్ నిలిపిరో ప్రోద్యద్వియోగాగ్నులన్. 1435**

* ఉద్ధవా! ఇలా రా! ప్రణయమూర్తులైన గోపికలు నా ఆగమనాన్ని ఎదురుచూస్తూ నామీది వ్యామోహంతో అన్నీ మరచి పోయి ఎంతగా దుఃఖపడుతున్నారో! నమ్ముకున్న తమ్ము విడవడం ధర్మం కాదని వారంటూ ఉండేవారు, వేగంగా వెళ్లు. పెచ్చరిలుతున్న వియోగమనే అగ్ని జ్వాలలతో వారెలా ప్రాణాలు భరించి ఉన్నారో!

**క. లౌకిక మొల్లక న న్నా, లోకించు ప్రపన్నులకును లోఁబడి కరుణా**
**లోకనములఁ బోషింతును, నా కాశ్రితరక్షణములు నైసర్గికముల్. 1436**

* లోకధర్మాలను దిగవిడచి నాయెడ చూపు నిలిపి నాయందు ప్రపత్తి చేసే వారికి నేను లోబడి దయామయ దృష్టులతో వారిని కాపాడుతాను. ఆశ్రయించిన వారిని ఆదుకోవడం నాకు స్వభావ సిద్ధమైన గుణం.

**క. 'సందేహము మానుం డర, విందాననలార! మిమ్ము విడువను వత్తున్**
**బృందావనమున' కని హరి, సందేశము పంపె ననుము సంకేతములన్. 1437**

* కమలముల వంటి కన్నులుగల కాంతలారా! సంశయం మానండి. మిమ్ము వదలిపెట్టను. బృందావనానికి వస్తాను- అని కృష్ణుడు వార్త పంపినాడని నీవు రహస్యంగా గోపికలతో చెప్పు.

**వ. అని మందహాస సుందర వదనారవిందుండై కరంబు కరంబున నవలంబించి, సరసవచనంబు లాడుచు వీడుకొలిపిన నుద్ధవుండును రథారూఢుండై సూర్యాస్తమయ సమయంబునకు నందవ్రజంబుసేరి వనంబులనుండి వచ్చు గోవుల చరణరేణువులం బ్రచ్ఛన్నరథుండై మెచ్చి నందుమందిరంబు ప్రవేశించిన. 1438**

* అని చిరునవ్వుతో అందమైన అరవిందంవంటి మోము గల గోవిందుడు ఉద్ధవుని చేతిని తన చేతితో పట్టుకొని రసవంతములైన మాటలు పలుకుతూ సాగనంపినాడు. ఉద్ధవుడు అరదము నెక్కి అర్కుడు అస్తమించే వేళకు వ్రేపల్లెకు చేరినాడు. అడవులలో మేత మేసి వచ్చే ఆలమందల పాదధూళులు అతని రథాన్ని కప్పివేస్తుండగా ఉద్ధవుడు గోకులం చేరి నందుని మందిరంలో ప్రవేశించాడు.

**శా. ఆ పుణ్యాత్మునిఁ గౌఁగిలించుకొని నందాభీరుఁ డానందియై**
**'మా పాలింటికిఁ గృష్ణుఁ డీతఁ' డనుచున్ మన్నించి పూజించి వాం**
**ఛా పూర్ణంబుగ మంజులాన్న మిడి మార్గాయాసముం బాపి స**
**ల్లాపోత్సాహముతోడ నిట్లనియె సంలక్షించి మోదంబునన్. 1439**

* నందుడు ఆనందంతో ఆ పుణ్యాత్ముణ్ణి ఆలింగనం చేసుకున్నాడు. ఇతడు మా పాలిట గోపాలకృష్ణు డంటూ సాదరంగా పూజించాడు. కోరిక తీరేటట్టు కమ్మని భోజనం పెట్టినాడు. ప్రయాణం వల్ల కలిగిన శ్రమ పోగొట్టినాడు. అతణ్ణి చూచి ముచ్చటింప గోరి ఎంతో సంతోషంతో ఇట్లన్నాడు.

**క. నా మిత్రుఁడు వసుదేవుఁడు, సేమంబున నున్నవాఁడె? చెలువుగఁ బుత్రుల్**
**సేమంబున సేవింప మ, హామత్తుండైన కంసుఁ డడఁగిన పిదపన్. 1440**

* నాయనా! ఉద్ధవా! నా చెలికాడు వసుదేవునకు క్షేమమే కదా! గర్వాంధుడైన కంసుడు కడతేరిన తర్వాత తన కుమారుల సేవలు అందుకుంటూ సుఖంగా ఉన్నాడు కదా?

**శా. అన్నా! భద్రమె? తల్లిదండ్రుల మమున్ హర్షించి చింతించునే?**
**తన్నుం బాసిన గోపగోపికల మిత్రవ్రాతమున్ గోగణం**
**బు న్నిత్యంబుఁ దలంచునే? వన నదీ భూముల్ ప్రసంగించునే?**
**వెన్నుం డెన్నఁడు వచ్చునయ్య! యిట మావ్రేపల్లెకు న్నుద్ధవా! 1441**

* అన్నా ఉద్ధవా! అక్కడ అందరూ కుశలమేనా? కృష్ణుడు తలిదండ్రులమైన మమ్ము సంతోషంతో తలచుకొంటూ ఉంటాడా? తన కెడమైన గోపకులనూ, గోపికలనూ, చెలికాండ్రనూ, ఆలమందలనూ ఎల్లప్పుడు స్మరిస్తాడా? ఇక్కడి వనాలనూ, నదులనూ గూర్చి ముచ్చటిస్తుంటాడా? ఇటు మావ్రేపల్లెకు వెన్నుడు ఎప్పుడు వస్తాడయ్యా?

**క. అంకిలి కలుగక మా కక, లంకేందుని పగిదిఁ గాంతిలసితంబగు త**
**త్పంకజ నయనుని నెమ్మొగ, మింక విలోకింపఁ గలనె యీ జన్మమునన్? 1442**

* కందులేని చందురుని చందంగా అందాలు చిందుతూ కాంతులు వెదజల్లే ఆ కమలాక్షుని ముద్దుల ముఖం స్వేచ్ఛగా ఆలోకించే అదృష్టం ఈ జన్మలో నాకు లభిస్తుందా?

**క. అని హరి మున్నొనరించిన, పను లెల్లను జెప్పి చెప్పి బాష్పాకుల లో**
**చనుఁడై డగ్గుత్తికతో, వినయంబున నుండె గోపవీరుం డంతన్. 1443**

* ఈ విధంగా గోపాలవరేణ్యుడైన నందుడు శ్రీకృష్ణుడు మునుపు చేసిన కృత్యము లన్నింటినీ పలుమారు చెప్పి చెప్పి బొంగురువోయిన కంఠంతో మాటాడలేక కన్నీటితో కలకబారిన కన్నులు గలవాడై మిన్నకున్నాడు.

క. పెనిమిటి బిడ్డని గుణములు, వినుతింప యశోద ప్రేమవిహ్వలమతియై
చను మొనలఁ బాలు గురియఁగ, గనుఁగొనలను జలము లొలుకఁగా బెగ్గిలియెన్. 1444

* ఈ విధంగా తనపతి గోపాలకృష్ణుని గుణాలు ఉగ్గడిస్తుండగా యశోద ప్రేమతో పరవశమైన మనసు గలదై చనుమొనల నుండి పాలు జాలువారగా కనుగొనలనుండి కన్నీటి ధారలు కారగా చలించి పోయింది.

వ. ఇట్లు గోవింద సందర్శనాభావ విహ్వలులైన యశోదానందులకు నుద్ధవుం డిట్లనియె. 1445

* ఈ విధంగా కృష్ణసందర్శనం లేమిచే కలత చెందిన యశోదానందులతో ఉద్ధవు డిట్లన్నాడు.

క. జననీజనకుల మిమ్ముం,గనుఁగొన శీఘ్రంబె వచ్చుఁ గని భద్రంబుల్
వనజాక్షుం డొనరించును, మనమున వగవకుఁడు ధైర్యమండనులారా! 1446

* మీరు ధైర్యంగా ఉండండి. తలిదండ్రులైన మిమ్ము దర్శించడానికి కమలాక్షుడు త్వరలోనే వస్తాడు. మిమ్ము చూచి మీకు శుభములు చేకూరుస్తాడు, చింతించకండి.

మ. బలుఁడుం గృష్ణుఁడు మర్త్యులే? వసుమతీ భారంబు వారింప వా
రల రూపంబులఁ బుట్టినాఁడు హరి నిర్వాణప్రభుం; డెవ్వఁ డు
జ్జ్వలుఁడై ప్రాణవియోగకాలమునఁ దత్సర్వేశుఁ జింతించు, వాఁ
డలఘుశ్రేయముఁ బొందు బ్రహ్మమయుఁడై యర్కాభుఁడై నిత్యుఁడై. 1447

* రామకృష్ణులు సామాన్యమానవులా? మోక్షమునకు అధినేత యైన శ్రీమహావిష్ణువు భూభారాన్ని తొలగించుటకై రామకృష్ణుల రూపాలలో భూమిమీద అవతరించాడు. ఏ మానవుడు జ్ఞానవంతుడై ప్రాణ ప్రయాణకాలంలో, సర్వమునకు ప్రభువైన ఆ భగవంతుణ్ణి సంస్మరిస్తాడో అట్టివాడు బ్రహ్మస్వరూపుడై, సూర్యునివలె తేజోవిరాజితుడై నిత్యత్వం పొంది ముక్తిరూపమైన శ్రేయాన్ని చూరగొంటాడు.

సీ. అట్టి నారాయణుం డఖిలాత్మభూతుండు కారణ మానవాకారుఁడైనఁ
జిత్తంబు లతనిపైఁ జేర్చి సేవించితి రతికృతార్థుల రైతి; రనవరతము
శోభిల్లు నింధనజ్యోతి చందంబున నఖిలభూతములందు నతఁ; డతనికి
జననీ జనక దార సఖి పుత్త్ర బాంధవ శత్రు ప్రియాప్రియజనులు లేరు;

ఆ. జన్మకర్మములును జన్మంబులును లేవు;, శిష్టరక్షణంబు సేయుకొఱకు
గుణవిరహితుఁ డయ్యు గుణి యయి సర్వ ర, క్షణ వినాశకేళి సలుపుచుండు. 1448

* అట్టి నారాయణుడు అన్ని ప్రాణులయందు ఆత్మగా ఉన్నాడు. కారణవశంగా మానుషవిగ్రహం గైకొన్న ఆయనపై మీరు మనసులు చేర్చి కొలిచారు. మీరు పరమధన్యులు. కట్టెలలో నిప్పుచొప్పున అత డెప్పుడూ సకలప్రాణులందూ ప్రకాశిస్తుంటాడు. ఆయనకు తల్లి, తండ్రి, పెండ్లము, స్నేహితుడు, చుట్టము, విరోధి, ఇష్టుడు, అనిష్టుడు అంటూ ఎవ్వరూ లేరు. జననమరణాలు లేవు. సజ్జనులను సంరక్షించుటకొరకై త్రిగుణ రహితు డైనను, గుణములు ధరించి సృష్టిస్థితిలయాలు అనే లీలలు సాగిస్తుంటాడు.

వ. అని మఱియుఁ బెక్కువిధంబుల హరిప్రభావము లుపన్యసించుచు నా రేయి గడపి మఱునాఁడు దధిమథనశబ్దంబు లాకర్ణించుచు లేచి కృతానుష్ఠానుండై యుద్ధవుం డొక్క రహస్య ప్రదేశంబున నున్న సమయంబున. 1449

* అని పలువిధాల ఉద్ధవుడు శ్రీకృష్ణుని మహిమలు గూర్చి ముచ్చటిస్తూ ఆ రాత్రి గడిపాడు. వేకువనే పెరుగు చిలికే చప్పుళ్ళు విని నిద్రలేచాడు. సంధ్యోపాసనాది నిత్యానుష్ఠానాలు నెరవేర్చుకుని ఒక ఏకాంతస్థలంలో ఉన్నాడు.

శా. 'రాజీవాక్షుఁడు సుందరాస్యుఁడు మహోరస్కుండు పీతాంబరుం
డాజానుస్థితబాహుఁ డంబురుహ మాలాలంకృతుం డుల్లస
ద్రాజ త్కుండలుఁ డొక్క వీరుఁ డిచటన్ రాజిల్లుచున్నాఁడు; మా
రాజీవాక్షుని భంగి' నంచుఁ గని రా రాజాన్వయున్ గోపికల్. 1450

* ఆ సమయంలో గొల్లచెలువలు అక్కడికి వచ్చారు. వారు పద్మములవంటి కన్నులు గలవాడును, అందమైన మోము గలవాడును, విశాలమైన వక్షము గలవాడును, పచ్చని పట్టుపుట్టము కట్టినవాడును, మోకాళ్ళ వరకు వ్రేలాడు చేతులు గలవాడును, కమలమాలా విభూషితుడును, మెరుగారు కుండలములు దాల్చిన వాడును అయిన ఒకానొక పురుషపుంగవుడు మా కృష్ణునివలె ఇక్కడ ప్రకాశిస్తున్నాడు అని చెప్పుకుంటూ చంద్రవంశ్యుడైన ఉద్ధవుణ్ణి చూచారు.

వ. కని లజ్జాసహిత హాసవిలోకనంబులు ముఖంబులకుం జెలు వొసంగ నిట్లనిరి. 1451

* అలా చూచి సిగ్గుతో కూడిన నవ్వులు, చూపులు తమ వదనాలకు సొంపు సంపాదించగా ఆ గోపకాంతలు ఉద్ధవుడితో ఇలా అన్నారు.

## -: భ్రమరగీతలు :-

చ. ఎఱుఁగుదు మేము నిన్ను వనజేక్షణ మిత్రుఁడ వీవు; కూరిమిన్
మెఱయుచుఁ దల్లిదండ్రులకు మే లెఱిఁగింపఁ బ్రియుండు పంపఁగా
వఱలెడు భక్తి వచ్చితివి; వారల నైన మనంబులోపలన్
మఱవఁడు శౌరి మేలు; మఱి మాన్యులు రాజున కెవ్వ రిచ్చటన్. 1452

* అయ్యా! ఉద్ధవా! మేము ని న్నెరుంగుదుము. నీవు కమలములవంటి కన్నులు గల శ్రీకృష్ణుని నెచ్చెలివి. ఆయన తన క్షేమం తలిదండ్రులకు తెలుపగోరి నిన్నిక్కడికి పంపగా ప్రస్ఫుటభక్తితో వచ్చావు. ప్రియుడైన యదుపతి తన జననీజనకుల నైనా మరచిపోలేదు, ఎంతో నయం! మరి యీ వ్రేపల్లెలో ఆయనకు సంభావింప దగినవారు మ రెవ్వరున్నారో మాకు తెలియదు.

క. మునివరు లైనను బంధుల, ఘనసఖ్యము విడువలేరు గాక విడువరే
సనిమిత్తసఖ్య మా(కటి, పని దీఱిన నళులు విరుల( బాయునొ లేదో? 1453

* సర్వసంగ పరిత్యాగులైన మునిసత్తములు కూడ బంధువుల తోడి స్నేహానుబంధం వదలుకోలేరు. మఱి శ్రీకృష్ణుడు తన జననీ జనకులకు ప్రియ మాచరించడంలో వింత ఏముంది? ఇతరులతో చేసే చెలిమి ఒక ప్రయోజనాన్ని బట్టి ఏర్పడుతుంది. ఆ ప్రయోజనం తీరగనే ఆ స్నేహబంధం కూడా వదలి పోతుంది. ఆకలి తీరిన పిదప తుమ్మెదలు పూలను విడవడం లేదా?

చ. అని యిటు గోపికల్ పలుక నం దొక గోపిక కృష్ణపాద చిం
తనమున( జొక్కి చేరువను దైవవశంబున( గాంచె నుజ్జ్వల
త్సునిశిత సద్వివేకము( బ్రసూన మరంద మదాతిరేకమున్
ఘన మృదు నాదసంచలిత కాముక లోకము( జంచరీకమున్. 1454

* అని యీ ప్రకారం గొల్ల చేడెలు పలుకుతుండగా వారిలో ఒక గోపిక శ్రీకృష్ణచరణధ్యాన పరవశురాలైంది. ఆమె తన సమీపంలో విధివశాన చురుకైన తెలివితేటలు గలదీ, పూదేనెను గ్రోలి మత్తిల్లినట్టిదీ, తన మధురమంజుల ఝుంకారస్వనంతో కాముకులను కలవరపెట్టునదీ అయిన ఒక గండు తుమ్మెదను చూచింది.

వ. కని హరి తన్నుం బ్రార్థింప( బుత్తెంచిన దూత యని కల్పించుకొని, యుద్ధవునికి నన్యాపదేశంబై
యెఱుకపడ న య్యళికిం దొయ్యలి యిట్లనియె. 1455

* అలా చూచిన ఆ గోపిక తన్ను వేడుకొనుటకై ప్రియుడు పంపిన దూతగా కల్పించుకొని ఉద్ధవునికి అన్యాపదేశంగా తాకునట్లు ఆ భ్రమరంతో ఇట్లనింది.

మ. భ్రమరా! దుర్జనమిత్ర! ముట్టకుము మా పాదాబ్జముల్ నాగర
ప్రమదాళీ కుచకుంకుమాంకిత లసత్ప్రాణేశ దామప్రసూ
న మరందారుణితాననుండ వగుటన్ నాథుండు మన్నించు( గా
క మము న్నేపుచు( బౌరకాంతల శుభాగారంబులన్ నిత్యమున్. 1456

* ధూర్తమిత్రుడ వైన ఓ మధుపా! నీవు మా పాదపద్మాలు స్పృశించవద్దు. మథురాపురకాంతల స్తనకుంకుమ అంటుకొన్న మా ప్రాణవల్లభుని పుష్పమాలికలోని మకరందం గ్రోలి ఆ కుంకుమచేత ఎఱ్ఱబడిన ముఖము గలవాడవు గదా నీవు! మమ్ము విరాళిబారి ద్రోచి, పౌరాంగనల శోభనగృహాలలో నిత్యము కులుకుతున్న నిన్ను అతడు మన్నించునేమో కాని మేము మాత్రం మన్నించము.

మ. ఒకపువ్వందలి తేనె ద్రావి మధుపా! యుత్సాహివై నీవు వే
ఱొకటిం బొందెడు భంగి మ మ్మధరపీయూషంబునం దేల్చి మా
యకలంకోజ్జ్వల యౌవనంబు( గొని యన్యాసక్తు( డయ్యెన్ విభుం;
డకటా! యాతని కెట్లు దక్కె సిరి? మిథ్యాకీర్తి నమ్మెం జుమీ! 1457

* ఓయీ! మధుపాయీ! ఒక పువ్వులోని మకరందాన్ని పానంచేసి దానిని దిగవిడిచి, ఉత్సాహంతో మరొక్కపువ్వును నీవు ఆశ్రయించినట్లే శ్రీకృష్ణుడు తన అధరసుధారసాన్ని ఒకసారి మమ్ము గ్రోలనిచ్చి మా అచ్చమైన పచ్చియౌవనం కొల్లగొని అన్యకాంతాసక్తు డైనాడు. అయ్యయ్యో! అతడు ఉత్తమశ్లోకుడన్న బూటకపు మాటలు నమ్మి శ్రీమహాలక్ష్మి అట్టి చంచలచిత్తునకు కైవస మయినది.

**శా. భృంగా! కృష్ణుఁడు మంచివాఁ డనుచు సంప్రీతిం బ్రశంసించె; దీ**
**సంగీతంబున నేము సొక్కుదుమె? తచ్చారిత్రముల్ వింతలే?**
**యంగీకారము గావు మాకుఁ; బురకాంతాగ్రప్రదేశంబులన్**
**సంగీతం బొనరింపు వా రిడుదు రోజ న్నీకు నిష్టార్థముల్. 1458**

* ఓ భృంగరాజా! శ్రీకృష్ణుడు మంచివాడని అతని నెంతో సంతోషంతో కీర్తిస్తున్నావు. నీ గానం విని మేము సొక్కిపోలిపోతా మనుకున్నావా? అతని కథలు మాకు క్రొత్తవా యేమి? నీ సంగీతం మేము అంగీ కరించం. ఆ మథురానగరిలో మగువల యెదుట నీ విద్య ప్రదర్శించు. వారు మెచ్చుకొని నీకు అభిమతార్థము లిస్తారు.

**మ. సమదాళీశ్వర! చూడు ముజ్జ్వలితహాస భ్రూవిజృంభంబులన్**
**రమణీయుండగు శౌరిచేఁ గరఁగరే రామల్ త్రిలోకంబులం?**
**బ్రమదారత్నము లక్ష్మి యాతని పదాబ్జాతంబు సేవించు; ని**
**క్కము మే మెవ్వర మా కృపాజలధికిం గారుణ్యముం జేయఁగన్. 1459**

* ఓ తుమ్మెదల రాయడా! మనోహరుడగు శ్రీకృష్ణుని మందహాస ద్యుతులకూ, బొమముడి విలాసము లకూ కరగిపోని కాంతలు స్వర్గ మర్త్య పాతాళ భువనములందు కలరా? లేరు. అన్నుల మిన్న యైన ఆ కమలాదేవియే అతని చరణకమలాలను సేవిస్తుండగా ఆ దయాసాగరుని అనుగ్రహించుటకు మే మేపాటి వారము?

**శా . రోలంబేశ్వర! నీకు దౌత్యము మహారూఢంబు; నీ నేరుపుల్**
**చాలున్; మచ్చరణాబ్జముల్ విడువు మస్మన్నాథపుత్రాదులన్**
**లీలం బాసి పరంబు డించి తనకున్ లీనత్వముం బొందు మ**
**మ్మేలా వాసె విభుండు? ధార్మికులు మున్నీ చందముల్ మెత్తురే? 1460**

* ఓ చంచరీకమా! రాయబారం నడపటంలో నీవు చాల గడుసరివి. నీ నేర్పు లిక చాలు. మా చరణ పద్మములను విడిచిపెట్టు. మా భర్తలను, పుత్రాదులను చులకనగా వదలి సద్గతిమాట తలపెట్టక తనతో లీనమై ఉన్న మమ్ము అతడేల పరిత్యజించాడు? ధర్మాత్ములు ఇలాంటి నడవడులు మెచ్చుదురా?

**శా. వాలిం జంపెను వేఁటకాని పగిదిన్ వంచించి; దైత్యానుజన్**
**లోలం బట్టి విరూపఁ జేసెను; బలిన్ లోభంబుతోఁ గట్టి యా**

త్రైలోక్యంబు మొఱంగి పుచ్చుకొనియెన్; ధర్మజ్ఞుఁడే మాధవుం?
డేలా షట్పద! యెగ్గు మావలన నీ కెగ్గింపఁగా నేటికిన్? 1461

* తాను వేటకానివలె వంచించి వానరరాజైన వాలిని వధించాడు. తనపై మరులు గొన్న రావణుని చెల్లెలు శూర్పణఖను ముక్కు చెవులు కోసి విరూపను కావించాడు. పేరాసతో బలిచక్రవర్తిని బంధించి మోసపుచ్చి ముల్లోకాలు పుచ్చుకున్నాడు. లక్ష్మీవల్లభుడగు ఆ శ్రీకృష్ణుడు ధర్మ మెరిగినవాడా? మా వల్ల తప్పేమున్నది? నీ వతనిని కొనియాడు టెందుకు?

ఉ. పన్నుగ మింటిపై కెగసి పాఱు విహంగములైన వీనులం
ద న్నొకమాటు విన్న గృహదార సుతాదులఁ బాపి విత్త సం
పన్నత డించి సంసరణపద్ధతిఁ బాపెడువాఁడు నిత్య కాం
క్ష న్నెతీ నున్న మా బ్రదుకు సైఁచునె యేల మధువ్రతోత్తమా! 1462

* స్వేచ్ఛగా గగనతలంలో ఎగిరిపోయే పక్షులు సైతం చెవులారా అతనిపే రొక్కమారు వింటే ఇల్లు, ఇల్లాలు, పిల్లలు మున్నగువారిని ఎడచేసి, విత్తాదికం విసర్జింపజేసి, సంసారమార్గం పోకార్చే ఆ కృష్ణుడు ఎడతెగని కోరికలతో న్యాయము తప్పకున్న మా బ్రతుకులు సహిస్తాడా?

మ. కమనీయం బగు వేఁటకానిపలు కాకర్ణించి నిక్కంబుగాఁ
దమ చిత్తంబులఁ జేర్చి చేరి హరిణుల్ తద్బాణ నిర్భిన్నలై
యమితోగ్రవ్యథనొందు భంగి హరిమాయాలాపముల్ నమ్మి దుః
ఖములం జెందితి మంగజాస్త్ర జనితోగ్రశ్రాంతి నిందిందిరా! 1463

* ఓ భ్రమరమా! ఆడుజింకలు ఆకర్షణీయమైన వేటగాని పలుకు లాలకించి పారవశ్యంతో చెంతకు చేరి వాని బాణాలకు గురియై అతిదారుణమైన బాధను పొందు విధంగా శ్రీకృష్ణుని మాయమాటలు నమ్మి మన్మథశరాల తాకిడికి స్రుక్కి మేము దుఃఖాలపాలైనాము.

ఉ. బంధుల బిడ్డలన్ మగల భ్రాతలఁ దల్లులఁ దండ్రులన్ మనో
జాంధతఁ జేసి డించి శరణందిన మమ్ముఁ వియోగదుర్దశా
సింధువులోనఁ ద్రోచి యిటు చేరక పోవుట పాడి గాదు; పు
ష్పంధయ! మీ యధీశునకుఁ బాదములంఁ బడి యొత్తి చెప్పవే! 1464

* ఓ షట్పదా! చుట్టాలనూ, సుతులనూ, భర్తలనూ, అన్నదమ్ములనూ, తలిదండ్రులనూ కామాంధత్వముచే విడనాడి తన్నే శరణుజొచ్చినాము. ఇట్టి మమ్ము విరహసాగరమున త్రోసివైచి ఈ రీతి మావంక చేర రాకుండుట న్యాయము కాదని ఏలికయైన శ్రీకృష్ణునకు పాదప్రణామం చేసి గట్టిగా నొక్కిచెప్పు.

సీ. కాంచనరత్న సంఘటిత సౌధంబులే మా కుటీరంబులు మాధవునకు
వివిధ నరేంద్రసేవిత రాజధానియే మా పల్లె యదువంశ మండనునకు?

సురభి పాదప లతాశోభితారామమే మా యరణ్యము సింహమధ్యమునకుఁ
గమనీయ లక్షణ గజతురంగంబులే మా ధేనువులు కంసమర్దనునకు?

తే. రూప విభ్రమ నైపుణ రూఢలైన, మగువలమె మేము మన్మథమన్మథునకు?
నేల చింతించు మముఁ గృష్ణుఁ డేల తలఁచుఁ?, బృథివి నధిపులు నూతనప్రియులు గారె! 1465

* లక్ష్మీవల్లభుడైన శ్రీకృష్ణునకు మాపూరి గుడిసెలు బంగారముతో మణులతో నిర్మింపబడిన మేడలా? యదుకులమునకు అలంకారమైన వెన్నునకు మా పల్లెటూరు పలువురు రాజులచే సేవింపబడు ముఖ్యపట్టణమా యేమి? సింగమునడుమువంటి నడుము గల శ్రీహరికి మా అడవి సువాసనలీను చెట్లతో పూదీగలతో చెలువారు ఉద్యానవనమా? కంసవిధ్వంసి యగు కృష్ణునకు మాగోవులు సర్వశుభ లక్షణలక్షితములైన ఏనుగులా? గుఱ్ఱములా? మన్మథునికి మన్మథుడైన ఆ వన్నెకానికి గొల్లపడతుల మగు మేము రూపవిభ్రమ విలాసములతో గణుతింపదగిన కాంతామణులమా యేమి? కనుక ఆ శ్రీకృష్ణుడు మమ్ముగురించి ఎందు కాలోచిస్తాడు? ఎందుకు మమ్ము స్మరిస్తాడు? లోకంలో ప్రభువులు నవప్రియులు గదా!

వ. అని మఱియు నిట్లనేక విధంబులఁ గృష్ణసందర్శన లాలస లయి పలుకుచున్న గోపికల వచనంబులు విని యుద్ధవుండు మధురాలాపంబుల నూరార్చుచు నిట్లనియె. 1466

* అని ఇంకా నానాప్రకారాలుగా కృష్ణసందర్శనమందు ఆశ గలవారై మాట్లాడుతున్న గోపవధూటుల మాటలు ఉద్ధవుడు విన్నాడు. విని తీయటి నుడులతో వారిని ఊరడిస్తూ ఇలా అన్నాడు.

మ. జప దాన వ్రత హోమ సంయమ తపస్స్వాధ్యాయ ముఖ్యంబులన్
నిపుణుల్ గోరియు నే విభున్ మనముల న్నిల్పంగలే రట్టి స
ద్విపులాకారునిపై మహామహిముపై విశ్వేశుపై మీ కజ
స్ర పటుధ్యానము లిట్లు నిల్చునె? భవచ్చారిత్రముల్ చిత్రముల్. 1467

* జపము, తపము, దానము, హోమము, ఆత్మనిగ్రహం, వేదాధ్యయనం మొదలగు వాటిచే నేర్పరులైనవారు కూడ ఏ పరమేశ్వరుణ్ణి తమ మనసుల్లో ప్రయత్నించియూ నిలుపుకొనలేరో, అట్టి మహీయసుడూ, మహామహిమోపేతుడూ, జగదధీశ్వరుడూ అయిన శ్రీకృష్ణునిపై మీకు నిరంతరం దృఢమైన ధ్యానం ఈ విధంగా నెలకొన్నది గదా! ఔరా! మీ చరిత్రలు వింతగొలుపుతున్నవి.

క. నను మీ కడకుం గృష్ణుఁడు, పని పంపెడు వేళఁ బిలిచి పలికిన పలుకుల్
వినుఁ; డన్నియు వివరించెద, వనజేక్షణలార! మీరు వగవకుఁ డింకన్. 1468

* తామరరేకులవంటి కన్నులు గల గోపికలారా! శ్రీకృష్ణుడు నన్ను మీకడకు కార్యార్థంగా పంపేటప్పుడు నాతో చెప్పిన మాటలన్నీ మీకు వివరిస్తాను. వగపు మాని సావధానంగా ఆలకించండి.

వ. అని హరివచనంబులుగా నిట్లనియె. 1469

* అని ఉద్ధవుడు హరి చెప్పిన మాటలెల్ల వారి కిట్లు వినిపించాడు.

సీ. ఎల్లకార్యములకు నేను బ్రధాన కారణము గావున మీరు రమణులార!
కలుగదు మద్వియోగము చరాచర రూపములలో మహాభూతములు వసించు
కరణి నుండుదు సర్వగతుఁడనై నే మనః ప్రాణబుద్ధి గుణేంద్రియాశ్రయుండ
నాత్మయం దాత్మచే నాత్మఁ బుట్టింతు రక్షింతును ద్రుంతు హృషీకభూత

తే. గుణగణాకార మాత్మలోఁ గొమరు మిగులు, నిబిడమాయానుభవమున నిత్యశుద్ధ
మాత్మ విజ్ఞానమయమునై యమరు గుణముఁ, బ్రకృతికార్య మనోవృత్తిఁ బట్టి పొందు. 1470

* ఓ రమణీమణులారా! నేను సమస్తకార్యములకు ముఖ్యకారణమై ఉన్నాను. నా యెడబాటు మీకు కలుగదు. స్థావరజంగమాత్మకములైన సకలప్రాణులలో పృథివ్యప్తేజో వాయ్వాకాశములనే పంచమహాభూతాలు ఉండే విధంగా నేను మనస్సునకు, పంచప్రాణాలకు, బుద్ధికి, ఇంద్రియవృత్తులైన శబ్దస్పర్శరూప రసగంధాలకు, జ్ఞానకర్మేంద్రియాలకు ఆధారభూతుడనై ఉన్నాను. నాయందే నా సంకల్పమహిమతో, నాలో సూక్ష్మరూపమున అణగియున్న చరాచరప్రపంచాన్ని స్థూలరూపంతో సృజిస్తాను, రక్షిస్తాను, నశింపజేస్తాను.

స్వరూపముచేత నిర్మలుడు, జ్ఞానస్వరూపుడు అయిన జీవునకు ప్రపంచస్వరూపం సత్త్వాదిగుణములు లేదా భూతేంద్రియ గుణాలతో కలుగుతున్నది.

మాయాకార్యములైన జాగ్రత్స్వప్న సుషుప్త లనే మనోవృత్తులందు అతడు దేవమనుష్యాది రూపాలతో తోచుచున్నాడు.

క. కలఁగని లేచి మున్ను గలఁగన్న సమస్తవిధంబుఁ గల్లఁగాఁ
దలఁచిన భంగి మానస పదార్థముచే నిఖిలేంద్రియార్థముల్
బలమునఁ గట్టి తద్జ్ఞుఁడు ప్రపంచము లేదనుఁ దన్మనంబుఁ దా
రలయక కట్టుడున్ బుధుల కవ్వల నొండొక భేద మున్నదే? 1471

* నిదురించి మేలుకొన్నవాడు తాను స్వప్నంలో చూచిన దెల్ల అసత్యమని భావించినట్లు తత్త్వవేత్త మనసనే పదార్థంతో శబ్దస్పర్శాది సకలవిషయాలను దృఢంగా నిరోధించి తనకన్న భిన్నంగా ప్రపంచం లేదని చెపుతాడు. ఆ మనస్సును పండితులు వేసట చెందక అరికట్టగా అటుపై భేదభావం పొడసూపదు.

ఆ. సాంఖ్య యోగ నిగమ సత్య తపో దమ, ములు మనోనిరోధములు గడపలఁ
గాఁగ నుండు జలధి కడపలగాఁ గల, నదులభంగి నళిననయనలార! 1472

* కమలములవంటి కన్నులు గల గోపికలారా! నదు లన్నియు కదలిపోయి కడకు కడలిని చేరునట్లు ఆత్మానాత్మ విచారరూపమైన సాంఖ్యము, యమనియమాదికమైన అష్టాంగయోగము, వేదము, సత్యము, తపము, ఇంద్రియ నిగ్రహమైన దమము- ఇవన్నీ ఒక్క మనోనిగ్రహమందే పరిసమాప్తి చెందుతున్నాయి.

మ. చెలువల్ దవ్వుల నున్న వల్లభులపైఁ జిత్తంబులం గూర్తు రు
త్కలికం జేరువ వారికంటె నదియుం గాకెప్పుడున్ నన్ను మీ
రలు చింతించుచు నుండఁగోరి యిటు దూరస్థత్వముం బొందితిన్
దలఁకం బోలదు నన్నుఁ గూడెదరు నిత్యధ్యానపారీణలై. 1473

* స్త్రీలు సమీపంలో ఉన్నవారికన్నా దూరంలో ఉన్న ప్రియుల పట్ల తహతహపాటుతో చిత్తములందు అనురక్తి కలవారై ఉంటారు. అంతేకాక, మీ రెల్లప్పుడు నన్నే స్మరిస్తూ ఉండాలి అని మీకు దూరంలో ఉన్నాను. భయపడకండి, నిరంతర ధ్యానపారంగతలై మీరు నన్నే పొందగలరు.

వ. అని మీకుం జెప్పుమని కృష్ణుండు సెప్పె ననవుడు నుద్ధవునికిం గోపికలు సంతసించి యిట్లనిరి. 1474

* అని మీకు చెప్పుమని శ్రీకృష్ణుడు నాకు చెప్పిపంపినాడు అని ఉద్ధవు డన్నాడు. ఆ పలుకులు విని గోపికలు సంతోషించి ఆయనతో ఇలా అన్నారు.

ఉ. ఇమ్ములనున్నవాఁడె హరి? యిక్కడి కెన్నఁడు వచ్చు? వచ్చి మా
యుమ్మలికంబు వాపునె? ప్రియుం డిట వచ్చెద నన్న సైఁతురే
య మ్మథురాపురీరమణు లడ్డము వత్తురుగాక చెల్లరే!
మమ్ము విధాత నిర్దయుఁడు మన్మథవేదనపాలు సేసెనే! 1475

* శ్రీ కృష్ణుడు సుఖంగా ఉన్నాడా? ఆయన ఇక్కడి కెప్పుడు వస్తాడు? వచ్చి మా పరితాపం తీరుస్తాడా? మాప్రాణేశ్వరు డిచటికి వస్తానంటే ఆ మథురాపట్టణంలోని అతివలు అడ్డగిస్తారే గాని సహిస్తారా?

అయ్యయ్యో! దయమాలిన బ్రహ్మ మమ్ము మన్మథబాధలకు గురిచేశాడు గదా!

క. మఱచునొకో మదిం దలఁచి మాధవుఁ డా యమునాతటంబునం
దఱచుగ దివ్యసౌరభ లతా గృహసీమల నేము డాఁగఁగా
మఱువులనుండి నీడలకు మ మ్మెలయించి కలంచి దేహముల్
మఱచినఁ దేర్చి నాల్కొలిపి మన్మథలీలలఁ దేల్చు చందముల్. 1476

* లక్ష్మీవల్లభుడగు శ్రీకృష్ణుడు యమునానది యొడ్డున దివ్యపరిమళాలు వెదజల్లు పూ పొదరిండ్లలో దాగిన మమ్ము పొంచి చూచేవాడు. అతడు పొదరిండ్ల నీడలకు మమ్ము జేర్చి నలచి కలచి మేము మైమరపు చెందగా బుజ్జగించి ప్రోత్సహించి మమ్ము మన్మథక్రీడలలో తేల్చిన ఘట్టాలు మరచునా యేమి?

శా. నీతో నర్మగృహంబులం బలుకునే నే మెల్ల వంశోల్లస
ద్గీత భ్రాంతలమై కళిందతనయా తీరంబునం జేరినం
జేతోజాత సుఖంబులం దనిపి మా చిత్తస్థితుల్ చూడ లీ
లా తంత్రజ్ఞత డాఁగి మెల్లన మదాలాపంబు లాలించుటల్. 1477

* మే మందరం వేణుగాన విభ్రాంతలమై యమునా తీరానికి రాగా మమ్ము మదనలీలల తనిపినాడు. ఆ పై మా మనోగతులు తెలుసుకోడానికి విలాసతంత్రజ్ఞుడు కనుక ఎచ్చటనేని దాగియుండి మెల్లగా మా మాట లాలించేవాడు. శ్రీకృష్ణుడు నీతో ఏకాంతంలో ఈ వృత్తాంత మంతా చెపుతాడా?

**క. ముచ్చట వేళలఁ జెప్పునె, యచ్చుగ మును నేము నోము నప్పుడు జలముల్
సొచ్చిన మా చేలంబులు, ముచ్చిలి యిచ్చిన విధంబు మూలం బెల్లన్. 1478**

* శ్రీకృష్ణుడు నీతో ముచ్చటాడు వేళలో కాత్యాయనీవ్రతం కావించుటకు మేము వివస్త్రలమై స్నానార్థం నీళ్ళలో ప్రవేశించి యున్నపుడు మా వలువలు దొంగిలించి మళ్ళీ మా ప్రార్థనలపై చీరలిచ్చిన ఉదంతము తెలుపునా?

**శా. ఏకాంతంబున నీదుపై నొరగి తా నేమేని భాషించుచో
మా కాంతుండు వచించునే రవిసుతా మధ్యప్రదేశంబునన్
రాకాచంద్ర మయూఖముల్ మెఱయఁగా రాసంబు మాతోడ నం
గీకారం బొనరించి బంధనియతిం గ్రీడించు విన్నాణముల్. 1479**

* నీవునూ, హరియూ ఒంటరిగా నున్నప్పుడు నీ మీదికి ఒరగి నీతో ఏవో రహస్య సంభాషణములు సలుపునపుడు పున్నమ వెన్నెలరేయి యమునానదీ మధ్యభాగంలో మాతో రాసక్రీడలు నెరపుతూ బంధరతు లొనర్చిన నేర్పులు అతడు ఉగ్గడిస్తాడా?

**సీ. తనుఁబాసి యొక్కింత తడవైన నిటమీఁద నేలపై మేనులు నిలువ మనుము
నేలపై మేనులు నిలువక యట మున్న ధైర్యంబు లొక్కటఁ దలఁగు ననుము
ధైర్యంబు లొక్కటఁ దలఁగిన పిమ్మటఁ జిత్తంబు లిక్కడఁ జిక్క వనుము
చిత్తంబు లిక్కడఁ జిక్కక వచ్చినఁ బ్రాణంబు లుండక పోయి ననుము**

**తే. ప్రాణములు వోవ మఱి వచ్చి ప్రాణవిభుఁడు, ప్రాణిరక్షకుఁ డగు తన్నుఁ బ్రాణు లెల్లఁ
జేరి దూఱంగ మఱి యేమి సేయువాఁడు, వేగ విన్నప మొనరింపవే మహాత్మ! 1480**

* ఓ మహానుభావా! ఉద్ధవా! మా మాటలుగా ప్రాణేశ్వరుని కిట్లు విన్నవించు.

తన్ను విడిచి యిటమీద ఇంచుకసేపైన మా దేహములు ఉర్విపై ఉండవని చెప్పుము. నేలపై మా శరీరములు నిలువక మునుపే ఒక్కసారిగా మా మనోధైర్యములు తొలగిపోవునని చెప్పుము. మా మనోధైర్యము లొక్కసారిగా తొలగిపోయిన పిదప మా మనసు లిక్కడ ఉండవని చెప్పుము. ఇక్కడ మనసులు నిలువకపోగా మా ప్రాణములు ఎగిరిపోవునని చెప్పుము. మా ప్రాణములు ఎగిరిపోయిన పిమ్మట ప్రాణేశ్వరుడగు తాను వచ్చిననూ, జీవరక్షకుడగు తన్ను జీవులందరూ గుమిగూడి నిందింపగా ఏమి చేయగలడు? నీ వీ సంగతి వెంటనే అతనికి విజ్ఞప్తిచేయుము.

**క. తగులరె మగలను మగువలు?, దగులదె తను మున్ను కమల! తగవు విడిచియుం
దగిలిన మగువల విడుచుట, దగదని తనుఁ దగవు వలుకఁ దగుదువు హరికిన్. 1481**

* పొలతులు పురుషులను ప్రేమించరా? లక్ష్మి మునుపు తన్ను ప్రేమించలేదా? న్యాయము వీడియు తన్ను ప్రేమించు బోటులను వీడుట తగదను న్యాయమును దామోదరునకు తెల్పుటకు నీవే తగినవాడవు.

**సీ. విభుఁడు మా వ్రేపల్లె వీథుల నేతేరఁ జూతుమే యొకనాఁడు చూడ్కు లలరఁ**
**బ్రభుఁడు మాతో నర్మభాషలు భాషింప విందుమే యొకనాఁడు వీను లలరఁ**
**దనువులు పులకింప దయితుండు డాసినఁ గలుగునే యొకనాఁడు కౌఁగిలింపఁ?**
**బ్రాణేశ! మమ్మేల పాసితి వని దూఱ దొరకునే యొకనాఁడు తొట్రుపడఁగ?**

**తే. వచ్చునే హరి మే మున్నవనముఁ జూడఁ?, దలఁచునే భర్త మాతోడితగులు తెఱఁగుఁ?**
**దెచ్చునే విధి మన్నాథుఁ దిట్టువడక, యెఱుఁగఁ బలుకు మహాత్మ! నీ కెఱుఁగ వచ్చు. 1482**

* మా ప్రియతముడు వ్రేపల్లెవీథులకు రాగా ఒకనాడైనను కనులపండువుగా మేము కనగల్గుదుమా? మా ప్రభువు మాతో ప్రియభాషణములు భాషించగా ఒకనాడైనను వీనులవిందుగా వినగల్గుదుమా? వల్లభుడు చెంతకు రాగా ఒకనాడైనను ఒడలు గగుర్పొడువ కౌగిలించుకొను భాగ్యము మాకు కల్గునా? ఓ ప్రాణనాయకా! మ మ్మెందులకు ఎడబాసితి వని తొట్రుపడ తన్ను దూషించుట కొకనాడైనను అవకాశ మేర్పడునా?

హరి యేనాటి కైనను మే మున్న ఈ వనము గనవచ్చునా? మా మనోవల్లభుడగు శ్రీకృష్ణుడు తనకు మాతో గల సంబంధమును స్మరించునా? మాచే తిట్టుపడకముందే బ్రహ్మ మా నాథుని మాకడకు గొనితెచ్చునా? ఓ మహాత్మా! ఇన్నియు నీకు తెలిసియుండును గాన మాకు వివరముగా తెలుపుము.

**వ. అని 'దుఃఖార్ణవ మగ్నంబైన గోకులంబు నుద్ధరింపుము రమానాథ' యని గోపికలు వగచి తదనంతరంబ మఱియు నుద్ధవ నిగదితం బయిన కృష్ణసందేశంబులవలన విరహవేదనలు విడిచి యుద్ధవునిం బూజించి; రిట్లు కృష్ణలీలావర్ణనలు సేయుచు వ్రేపల్లె నుద్ధవుండు గొన్నినెల లుండి నందాదుల వీడ్కొని మరలి రథారూఢుండై చని చని. 1483**

* రమాపతీ! దుఃఖ మనెడు సముద్రములో మునిగినట్టి గోకులాన్ని ఉద్ధరింపుమా అనుచు ఉద్ధవునిముందు గోపికలు శోకించారు. అటు పిమ్మట ఉద్ధవుడు తెల్పిన శ్రీకృష్ణసందేశం ఆలకించి వారు విరహవేదనలు విడిచి అతణ్ణి పూజించారు.

ఇలా శ్రీకృష్ణలీలలు వర్ణిస్తూ ఉద్ధవుడు కొన్ని మాసాలు వ్రేపల్లెలో గడపినాడు. పిదప నందాది యదుపుంగవులను వీడ్కొని రథముపై నెక్కి మథురకు బయలుదేరి వెళ్ళాడు.

**క. సారమతిఁ బ్రణుతి సేయుచు, నారయ నుద్ధవుఁడు గాంచె నఘసంహారిన్**
**హారిన్ మథురానగర వి, హారిన్ రిపుజన మదాపహారిన్ శౌరిన్. 1484**

* ఆ విధంగా స్థిరచిత్తంతో శ్రీహరిసంకీర్తనం కావిస్తూ వెళ్ళిన ఉద్ధవుడు పాపాలను పోకార్చేవాడూ, శత్రుజనుల మదము నణచేవాడు, మథురాపురిలో విహరించేవాడు అయిన శ్రీకృష్ణభగవానుణ్ణి చూచాడు.

వ. కని యథోచితంబుగా భాషించుచుఁ దనచేత నందాదులు పుత్తెంచిన కానుకలు బలకృష్ణులకు నుగ్రసేనునికి వేఱు వేఱ యిచ్చెనని చెప్పి శుకుండు పరీక్షిన్నరేంద్రున కిట్లనియె. 1485

* చూచి ఉద్ధవుడు అతనితో తగురీతి మాట్లాడుతూ తనచే నందుడు మున్నుగువారు ఇచ్చి పంపిన బహుమానాలు కృష్ణబలరాములకు, ఉగ్రసేన మహారాజుకు వేర్వేరుగా సమర్పించాడు అని పల్కి శుకయోగీంద్రుడు మళ్లీ పరీక్షిన్నరేంద్రునితో ఈ విధంగా అన్నాడు.

## -: శ్రీ కృష్ణుఁడు ఉద్ధవునితోఁ జేరి కుబ్జాగృహంబునకు నరుగుట :-

మ. తను మున్నంగజకేళిఁ గోరిన లతాతన్విన్ రతిక్రీడలం
దనుపం గోరి జనార్దనుం డరిగె రత్నస్వర్ణమాల్యాను లే
పన భూషాంబర ధూపదీప పరిదీప్తంబై మనోజ ప్రదీ
పనమై యున్న తదీయ గేహమునకుం బంచేషుపంచేషుఁడై. 1486

* మన్మథమన్మథుడైన శ్రీకృష్ణుడు పూర్వం తన్ను మన్మథక్రీడకై ఆహ్వానించిన ఆ కుబ్జాలతాంగిని శృంగారకేళిలో తృప్తి నొందింప దలచి ఆ వాల్గంటి ఇంటికి వెళ్ళినాడు. ఆ సుందరీ మందిరము మణులు, బంగారము, పూలదండలు, మంచిగంధపు మైపూతలు, నగలు, వస్త్రములు, ధూపములు, దీపములు- వీటితో విలసిల్లుతూ మన్మథోద్దీపనకరంగా ఉన్నది.

వ. ఇ ట్లరిగి తద్గేహమధ్యంబున. 1487

ఆ. కాముశరమువోలెఁ గమలారి కళవోలెఁ, మెలఁగి యాడనేర్చు మెఱపుఁ బోలె
నిఖిలభువన మోహినీ దేవతయుఁ బోలెఁ, జెలువు మెఱసియున్న చెలువఁ గనియె. 1488

* ఈ విధంగా వెళ్ళిన గోవిందుడు ఇంటి నడిమిభాగంలో అందచందాలతో అలరారుతున్న కుబ్జను చూచాడు. ఆమె మన్మథబాణంలాగా, చంద్రకళ మాదిరిగా, కదలాడు మెరుపుదీవవలె, సకల జగత్తులనూ సమ్మోహపరచే దేవతరీతిగా వెలిగిపోతూ ఉంది.

మ. హరి యేతెంచిన లేచి సంభ్రమముతో నాళీసమూహంబుచే
సిరి యొప్పన్ విహితోపచారములు తాఁ జేయించి సౌవర్ణ సుం
దర తల్పస్థితుఁ జేసి యుద్ధవుని నుద్యత్ప్రీతిఁ బూజించి భా
సుర పీఠంబున నుండు మంచు మది నౌత్సుక్యంబు శోభిల్లఁగన్. 1489

* శ్రీకృష్ణుడు రాగానే ఆమె సంభ్రమంతో దిగ్గున లేచింది. చెలికత్తెలచే తగురీతి వైభవోపేతంగా ఉపచారాలు చేయించింది. అందమైన మేల్మిపసిడిమంచం మీద ఆయనను కూర్చోపెట్టింది. ఉద్ధవుణ్ణి మిక్కిలిప్రీతితో పూజించి ప్రకాశించే పీఠంమీద కూర్చోమని చెప్పింది. ఆమె మది ఉబలాటంతో ఉవ్విళ్లూరింది.

క. ఆళీనివహ నివేదిత, మాలా మృగనాభిపంక మణిమయ భూషా
చేలాలంకృత యగుచును, హేలావతి గోరె వనరుహేక్షణుఁ గవయన్. 1490

* చెలికత్తెలు ఆమెను పూలదండలతో, కస్తూరిలేపనంతో, మణులు చెక్కిన నగలతో, విలువైన వలువలతో అలంకరించారు. విలాసవతియైన కుబ్జ తామరరేకులవంటి కన్నులు గల శ్రీకృష్ణునితో సంగమింప దలచింది.

క. లీలావతీకృతోల్లస, దేలా కర్పూరమిళిత హిత మధుర మహా
హాలారసపాన మద, శ్రీలాలిత యగుచు నబల చేరెం గృష్ణున్. 1491

* ఏలకులు, పచ్చకర్పూరము కలిపి విలాసవతులు తయారుచేసిన హితమైన, తియ్యనైన ఆసవము సేవించి మైమరచి చెలువు గులుకు కలువకంటి కుబ్జ కృష్ణుణ్ణి సమీపించింది.

మ. సరసాలోకనవృష్టి పైఁ గురియుచున్ సమ్యగ్వచో వైఖరిం
గరఁగంజేసి సువర్ణకంకణసమగ్రం బైన సైరంధ్రి కేల్
కరపద్మంబునఁ బట్టి తల్పమున కాకర్షించి గంభీరతం
బరిరంభాదుల నాన పుచ్చి మరుసంభావించుచున్ వేడుకన్. 1492

* శ్రీకృష్ణుడు శృంగారరసం వెల్లివిరిసే చూపులసోన కుబ్జపై క్రుమ్మరిస్తూ సరసపుమాటలతో ఆమె హృదయాన్ని కరగించాడు. పద్మమువంటి తనచేతితో కనకకంకణభూషితమైన ఆమె చేతిని పట్టుకొని సెజ్జ మీదికి తార్చినాడు. గట్టిగా కౌగిలించుకున్నాడు. సిగ్గు వల్ల కలిగిన జంకుగొంకులు మాన్పినాడు. కామకేళికి ఉత్సహించాడు.

ఉ. జాతియుఁ గాలముం గళయు సత్త్వము దేశము భావచేష్టలున్
ధాతువుఁ బ్రాయముం గుణముఁ దద్దశయున్ హృదయంబుఁ జూడ్కియుం
బ్రీతివిశేషముం దెలిసి పెక్కు విధంబులఁ దొయ్యలిన్ మనో
జాత సుఖంబులం దనిపె శౌరి వధూహృదయాపహారియై. 1493

* చెలువల చిత్తములను హరించే శ్రీకృష్ణుడు జాతి, కాలము, కళ, బలము, దేశము, భావము, చేష్ట, ధాతువు, ప్రాయము, గుణము, దశ, హృదయము, దృష్టి, సంతుష్టి- ఇన్నిటి నెరిగి అనేక విధముల ఆ సైరంధ్రిని మన్మథసౌఖ్యాలలో ఓలలాడించి తృప్తి పరచాడు.

క. కరపద్మంబుల మాధవుఁ, గరమొప్పం గౌఁగిలించి కామానలముం
గరభోరువు వర్జించెను, గర మరు దని తోడిశీతకరముఖు లలరన్. 1494

* లక్ష్మీవల్లభుడైన ముకుందుని సుతిమెత్తని తొడలు గల కుబ్జ తామరపూలవంటి తన చేతులతో గట్టిగా కౌగిలించుకుని మదనతాపాన్ని దిగవిడిచింది. చంద్రబింబమువంటి మోములు గల ఆమె చెలులందరూ ఇది అపూర్వమైన అదృష్టమని భావించారు.

**మ. సనకాదుల్ తలపోసి కానని విభున్ సర్వప్రభున్ దుర్లభున్**
**మును దా నిచ్చిన యంగరాగ సుకృతామోదంబునం గూడియున్**
**ఘననిర్వాణవిభూతి యిమ్మనక యా కంజాక్షి 'యేఁ బాయఁ జా**
**ల ననుం గొన్నిదినంబు లంగభవలీలం దేల్పవే? నావుడున్. 1495**

* దేవర్షులైన సనకసనందనాదు లెంత ధ్యానించినను అతడు దర్శింపరాని ప్రభువు. అఖిలలోకములకు అధీశ్వరుడు, దుర్లభుడు. అట్టి పరమాత్ముని కమలములవంటి కన్నులు గల కుబ్జ పూర్వం తాను సమర్పించిన మైపూతలవల్ల సమకూడిన పుణ్యావాసనచేత కలియ గల్గింది. తనకు గొప్పదగు కైవల్యసంపదను ఇమ్మని అడుగక 'కృష్ణా నీ పొందు విడిచి ఉండలేను. నన్ను కొన్నాళ్ళు మన్మథలీలలలో తేల్చు' మని వాంఛించింది.

**ఆ. వనిత గోరుకొనిన వర మిచ్చి శౌరి యా, యుద్ధవుండుఁ దాను నువిదయిల్లు**
**వెడలె నపుడు తియ్యవిలుకాఁడు సురభితోఁ, దీఁగెయిల్లు వెడలు తెఱఁగు మెఱయ. 1496**

* మాధవుడు ఆమె కోరుకున్న వరం అనుగ్రహించాడు. మదనుడు వసంతునితో పొదరింటినుండి వెలువడే చందంగా శ్రీ కృష్ణుడు ఉద్ధవునితో కుబ్జాగృహంనుంచి బయలుదేరినాడు.

**క. ఏ వేదంబులుఁ గానని, దేవోత్తముఁ గాంచి ముక్తితెరు వడుగక రా**
**జీవేక్షణ రతి యడిగెను, భావింపఁ దదీయకర్మఫల మెట్టిదియో! 1497**

* పద్మములవంటి నయనములు గల కుబ్జ వేదములకు గూడ అందరాని దేవతాశిరోమణియైన శ్రీకృష్ణుని సందర్శించి కూడా మోక్షపదవి నడుగక తుచ్ఛమైన విషయసుఖం అపేక్షించింది. ఆలోచింపగా ఆమె కర్మ ఫల మెటువంటిదో కదా!

**క. కారుణ్యంబునఁ గృష్ణుఁడు, తారుణ్యము మెఱసి మదనతంత్రంబుల లీ**
**లారణ్యవీథి దేల్చెను, సైరంధ్రిన్ విభవవిజిత శక్రపురంధ్రిన్. 1498**

* సౌభాగ్యమునందు శచీదేవిని సైతము జయించిన కుబ్జను దయతో శ్రీకృష్ణుడు జవ్వన మతిశయిల్లగా మదనశాస్త్రవిధుల ననుసరించి శృంగారవిలాసములనే వనవీథులలో విహరింప జేసి తృప్తినొందించాడు.

**వ. తదనంతరంబ కృష్ణుం డుద్ధవ రామ సహితుండై హస్తినాపురమునకు నక్రూరునిం బనుపం దలంచి తద్గృహంబునకుఁ జనిన నతండు వారలం గని లేచి రామకృష్ణులకు నమస్కరించి యుద్ధవుం గౌఁగిలించుకొని వారి నందఱను యథావిధిం బూజించి హరిపాదంబులు దన తొడలమీఁద నిడుకొని యిట్లనియె. 1499**

* అటు పిమ్మట కృష్ణుడు హస్తినాపురికి అక్రూరుని పంప నెంచినవాడై బలరామునితో, ఉద్ధవునితో గూడి అతని యింటికి వెళ్ళినాడు. అక్రూరుడు వారిని చూడగనే లేచి బలరామకృష్ణులకు వందనం కావించినాడు. ఉద్ధవుణ్ణి కౌగిలించుకున్నాడు. ఆయన వారి నందరినీ తగురీతి పూజించాడు. అచ్యుతుని అడుగులు తన ఒడియం దుంచుకొని ఒత్తుతూ ఇట్లన్నాడు అక్రూరుడు.

క. అనుచరులుఁ దాను గంసుఁడు, సనియెన్ నీచేత జముని సదనంబునకున్
ఘనులార! మీ బలంబున నొనరఁగ యాదవులవంశ ముద్ధృత మయ్యెన్. 1500

* ఆర్యులారా! మీ శౌర్యంచేత కంసుడూ, వాని అనుయాయులూ యమమందిరానికి వెళ్ళిపోయారు. యాదవకులం ఉద్ధరింపబడింది.

వ. మహాత్ములారా! విశ్వాదిపురుషులరు, విశ్వకారణులరు, విశ్వమయులరగు మీకుం గార్యకారణంబులు లే; వవధరింపుము. పరమేశ్వరా! నీవు రజోగుణంబున నఖిలంబు సృజియించి, కారణరూపంబునఁ దదనుప్రవిష్టుండవై శ్రుతదృష్టకార్యరూప ప్రపంచాకారంబున దీపించుచుందువు. కార్యరూప చరాచర దేహంబులకుం గారణంబు లయిన భూప్రముఖంబు లనుగతంబులును, గార్యరూప దేహంబులు నయి ప్రకాశించు చందంబున నొక్కండవు, కారణరహితుండవు, నాత్మతంత్రుండవు నై యుండియు విశ్వాకారంబునం బెక్కగుదువు. సృష్టి స్థితి లయంబులం జేయుచుండియు విజ్ఞానమూర్తి వగుటం బరిభ్రాంతుండైన జీవుని భంగి గుణకర్మ బద్ధుండవు కావు. కావున సిద్ధంబు తన్నిమిత్తంబున బంధహేతువును సిద్ధింపదు. 1501

* మహాత్ములారా! మీరు విశ్వమునకు ఆదిపురుషులు, విశ్వమునకు కారణభూతులు, విశ్వమయులు కావున మీకు కార్యకారణములు లేవు. దేవా! చిత్తగించు. నీవు రజోగుణముచే సమస్తము సృష్టించి కారణరూపముతో దానియందు ప్రవేశిస్తావు. కార్యరూపమైన చరాచర శరీరాలకు కారణములైన పృథివ్యప్తేజోవాయ్వాకాశములు అనుగతములై కార్యరూప దేహములై తేజరిల్లు విధంగా కారణ రహితుడవు, ఆత్మతంత్రుడవు అగు నీవు ఒక్కడవై ఉండికూడ విశ్వరూపంతో పెక్కుగా కన్పడుతావు. సృష్టిస్థితి లయములు సలుపుచుండియూ విజ్ఞానమూర్తి వగుటచేత నీవు పరిభ్రాంతుడైన జీవునివలె గుణకర్మబద్ధుడవు కావు. అందుచే నీకు బంధహేతువుకూడ కల్గదు.

సీ. పరఁగ జీవునికైన బంధమోక్షము లంట వంటునే పరతత్త్వమైన నిన్ను
నంటునే యీశ! దేహాద్యుపాధులు ననిర్వచనీయములు గాన వరుస నీకు
జన్మంబు జన్మసంశ్రయభేదములు లేవు కావున బంధమోక్షములు లేవు
గణుతింప ని న్నులూఖల బద్ధుఁ డనుటయు నహిముక్తుఁ డనుటయు నస్మదీయ

ఆ. బాలబుద్ధిఁ గాదె? పాషండ ముఖర మా, ర్గములచేత నీ జగద్ధితార్థ
మైన వేదమార్గ మడఁగిపో వచ్చిన, నవతరించి నిలుపు దంబుజాక్ష! 1502

* పరమేశ్వరా! బంధమోక్షములు జీవునికూడ అంట వనగా జ్ఞానస్వరూపుడ వగు ని న్నంటునా? దేహాదులైన ఉపాధులు నిరూపించబడక పోవుటవల్ల నీకు జన్మముగాని, అందుకు కారణమైన అవిద్యకాని లేదు. ఆకారణంవల్లనే నీకు బంధమోక్షములు లేవు. ఆలోచించగా నిన్ను రోటికి కట్టువడినవాడనీ, యమునా

స్రవంతిలో కాళియ విముక్తుడనీ అనడం అవివేకం వల్లనేసుమా! నాస్తిక మార్గములచేత ప్రాచీనమగు వేదపథం అణగారిపోతున్న కాలాన జగము మేలుకొఱకు నీవు అవతరించి ధర్మమును కాపాడుతావు.

**క. ఆ నీవు ధరణిభారము, మానిచి రక్కసుల నెల్ల మర్దించుటకై**
**యానకదుందుభియింటను, మానుగ జన్మించితివి సమంచితకీర్తిన్. 1503**

* నీవు భూభారం తొలగించి రక్కసుల నుక్కడంచుటకై వసుదేవు గృహమున కీర్తిశాలివై జన్మించావు.

**మ. త్రిజగత్పావనపాద తోయములచే దీపించి వేదామర**
**ద్విజముఖ్యాకృతివైన నీవు కరుణన్ విచ్చేయుటం జేసి మా**
**నిజగేహంబులు ధన్యతం దనరెఁబో! ని న్నార్యు లర్చింపఁగా**
**నజితత్వంబులు వారి కిత్తు వనుకంపాయత్త చిత్తుండవై. 1504**

* ముల్లోకాలను పవిత్రీకరించు పాదజలముచే ప్రకాశిస్తూ దేవబ్రాహ్మణ వేదాది స్వరూపుడవైన నీవు కృపతో విచ్చేయడంవల్ల మా గృహాలు పావనమైనాయి. నిన్ను పెద్దలు పూజించగా కృపాధీన మనస్కుడవై వారికి జయశీల మనుగ్రహిస్తావు.

**శా. ఏ పుణ్యాతిశయప్రభావముననో యీ జన్మమం దిక్కడన్**
**నీ పాదంబులఁ గంటి ని న్నెఱిఁగితిన్ నీవుం గృపాళుండవై**
**నాపై నర్మిలిఁ జేసి మాన్పఁ గదవే నానాధనాగార కాం**
**తా పుత్త్రాదులతోడి బంధనము భక్తవ్రాత చింతామణీ! 1505**

* భక్తులపాలిటి చింతామణివైన శ్రీకృష్ణా! ఏ మహాపుణ్య మహిమవల్లనో ఈ జన్మలో ఇక్కడ నీ చరణపద్మాలు దర్శించగల్గినాను. నిన్ను తెలుసుకొన గల్గినాను. నీవును దయాస్వభావుడవై నాయెడనున్న ప్రేమువిచే నాకు గృహ విత్త దార సుతాదుల మీది మోహపాశమును తొలగించుము.

**వ. అని పలికిన నగుచు నక్రూరునికి మాటలవలన సంసారసంబంధం బగు మోహంబును గీలుకొలుపుచు హరి యిట్లనియె. 1506**

* అని అక్రూరుడు వచింపగా నవ్వుతూ తన వాక్కులచే సంసార సంబంధమగు వ్యామోహమును నెక్కొల్పుతూ శ్రీకృష్ణుడు ఆయనతో ఇట్లన్నాడు.

## -: శ్రీకృష్ణుఁ డక్రూరుని హస్తినాపురంబునకుఁ బంపుట :-

**క. బంధుండవు సద్యోహిత, సంధుండవు వావిఁ జూడ జనకుఁడవు కృపా**
**సింధుండ వెల్లగుణముల, నంధుండవు గావు ప్రోవ నర్హుఁడ వెందున్. 1507**

* నీవు మాకు బాంధవుడవు. మేలు సమకూర్చువాడవు. వావిచేత పినతండ్రివి. దయకు సముద్రుడవు. గుణములచే గ్రుడ్డివాడవు కావు. మమ్ము కాపాడుటకు సమర్థుడవు.

**చ. కొలుతురు మర్త్యు లిష్టములు గోరి శిలామయ దేవసంఘమున్**
**జలమయతీర్థ సంఘమును సంతతము న్నటు వారు గొల్వఁగా**
**వల దనరాదు గాక భగవత్పద భక్తులరైన మీ క్రియన్**
**సొలయక దేవతీర్థములు చూచిన యంతనె కోర్కు లిచ్చునే? 1508**

* మానవులు కోరికలు పడయగోరి శిలానిర్మితములైన దేవతాప్రతిమలనూ, జలమయములైన గంగానది పుణ్యతీర్థములనూ నిరంతరం సేవిస్తారు. వా రలా సేవిస్తుండగా వలదని వాకొనడం పాడిగాదు. కాన నిజం పరికిస్తే భగవత్పాద భక్తులైన మీవలె దైవత విగ్రహారాధనము, పుణ్యతీర్థసేవనము దర్శన మాత్రముననే అభీప్సితార్థములు అనుగ్రహించలేవు.

**వ. మహాత్మా! పరమభాగవతుండవైన నీవు మా కభీష్టంబుల నొనరింప నర్హుండవు; వినుము. పాండురాజు పరలోకగతుం డైనఁ గుంతీసహితు లయిన పాండవులు ధృతరాష్ట్రు శాసనంబున నేతెంచి కరిపురంబున నున్నవారఁట. నిజపుత్త్రమోహితుం డగు న య్యంధ నృపతి వారియందు సమత్వంబునం జరింపం డటు గావున. 1509**

* మహాత్మా! భాగవతోత్తముడవైన నీవు మా కోరిక లీడేర్ప తగినవాడవు. ఆలకింపుము. పాండురాజు చనిపోగా తల్లియగు కుంతితో పాండవులు ధృతరాష్ట్రుని ఆజ్ఞచే విచ్చేసి హస్తినాపురిలో ఉన్నారు. గ్రుడ్డిరాజగు ఆంబికేయుడు దుర్యోధనాదులైన తన కొడుకులయందలి వ్యామోహముతో కురుపాండవులయందు సమ బుద్ధిగల్గి మెలగుట లేదు.

**క. వారలు బంధులు గావున, వారలకును మే లొనర్చి వా రలరంగా**
**వారింప వలయు దుస్థితి, వారిజరిపువంశ! పొమ్ము వారిం జూడన్. 1510**

* ఓ సోమకులావతంసమా! వారును వీరును చుట్టాలే గనుక ఇరుపక్షాల వారికిని మేలు చేకూర్చి వారూ వీరూ సంతోషించేటట్లు దుఃస్థితిని నివారించుటకై నీవు హస్తినలో వారిని చూడబొమ్ము.

**వ. అని పలికి సంకర్షణోద్ధవ సహితుండై హరి నిజగృహంబునకుం జనుటయు నక్రూరుండు కౌరవరాజధాని యగు కరిపురి కరిగి యందు ధృతరాష్ట్ర భీష్మ విదుర బాహ్లిక భారద్వాజ గౌతమ దుర్యోధన కర్ణా శ్వత్థామాదులం గుంతీసహితులైన పాండవులం దక్కిన బంధువులనుం గని యథోచిత సత్కారంబుల నొంది తత్తద్వర్తనంబు లెఱిఁగికొనుచుఁ గొన్ని దినంబు లుండ నొక్కనాఁడు విదురుండు విన నేకతంబున నక్రూరునికిఁ గుంతి యిట్లనియె. 1511**

* అని వచించి ఉద్ధవబలరామ సహితుడై శ్రీకృష్ణుడు తన భవనమునకు వెళ్లినాడు. అక్రూరుడు కురు రాజధానియైన హస్తినాపురానికి పోయాడు. ధృతరాష్ట్రుడు, భీష్ముడు, విదురుడు, బాహ్లికుడు భారద్వాజుడు, గౌతముడు, దుర్యోధనుడు, కర్ణుడు, అశ్వత్థామ మున్నగువారినీ; కుంతితో గూడియున్న పాండవులనూ, తక్కుంగల చుట్టాలనూ అచ్చట చూచి తగిన సత్కారాలు పడసినాడు. అక్కడ వారి వారి

వర్తనము లెట్టివో తెలిసికొంటూ కొన్ని దినాలున్నాడు. అంత నొక్కనాడు విదురుడు మాత్రమే వినుచుండగా కుంతీదేవి అక్రూరునితో ఇట్లన్నది.

**శా. అన్నా! తల్లులు దండ్రులున్ భగినులు న్నల్లుండ్రు మద్భ్రాతలున్**
**నిన్నుం బొమ్మనువేళ నే మనిరి? మా నెవ్వల్ విచారింతురే?**
**యున్నారా సుఖయుక్తులై? మృగి వృకవ్యూహంబులో నున్న రే**
**ఖ న్నే నిక్కడ నున్నదానఁ గుమనః కౌరవ్యమధ్యంబునన్.** **1512**

* అన్నా! తలిదండ్రులు, చెల్లెండ్రు, అల్లుండ్రు, మా తమ్ములు ని న్నిక్కడికి పంపేవేళ నీతో ఏమి చెప్పినారు? మాదుఃఖాలు వారు ఆలోచింతురా? వారందరూ సుఖంగా ఉన్నారా? నేనిక్కడ దుర్బుద్ధులగు కౌరవుల నడుమ తోడేళ్ల గుంపులో ఆడుజింక ఉన్న విధంగా ఉన్నాను.

**మ. కఱపించెన్ ఫణికోటిచే లతికలం గట్టించి గంగానదిన్**
**నెఱిఁ ద్రోపించె విషాన్వితాన్న మొసఁగెన్ నిద్రారతిం జెంది యే**
**మఱి యుండం బొడిపించె నాయుధములన్ మత్పుత్రులం దేమియుం**
**గొఱగాఁ డీ ధృతరాష్ట్రసూనుఁడు మహాక్రూరుండు గార్యంబులన్.** **1513**

* ధృతరాష్ట్రుని కుమారుడైన దుర్యోధనుడు మిక్కిలి క్రూరుడు. నా బిడ్డలకు బొత్తిగా కొఱగానివాడు. వాడు నా పిల్లలను పాములచే కరపించాడు. తీగలచే కట్టించి గంగానదిలో త్రోయించాడు. విషాన్నము తినిపించాడు. ఏమరి నిద్రించే వేళ ఆయుధాలతో పొడిపించాడు.

**మ. బలుఁడుం గృష్ణుఁడు నెన్నడైనఁ దమలో భాషించి మేనత్త బి**
**డ్డలకున్ మేలు దలంతురే? వగపులన్ డయ్యంగఁ బాలై రయో!**
**జలజాతాక్షుఁడు భక్తవత్సలుఁ డిలాచక్రంబు భాగించి యి**
**మ్ముల నిప్పించునె నాకుమారకులకున్ ముఖ్యప్రకారంబులన్.** **1514**

* బలరామకృష్ణులు ఎన్నడేని తమలో తాము భాషించుకొని మేనత్తబిడ్డల క్షేమము తలంతురా? పుండరీకాక్షుడగు శ్రీకృష్ణుడుండ మేము దుఃఖములచే కృశింపవలసివచ్చెనా? భక్తవత్సలుడగు శ్రీహరి భూమిని సమభాగాలుగా భాగించి న్యాయప్రకారం నా పుత్రుల కిప్పించునా?

**వ. అని పలికి, కృష్ణునిఁ జిత్తంబున నిల్పి నమస్కరించి సంకీర్తనంబు చేసి, 'సర్వాత్మక! సర్వపాలక! పుండరీకాక్ష! శరణాగత నైన నన్ను రక్షింపు మని' వగచుచున్న కుంతికి నక్రూరుండు విదురసమేతుండై ప్రియ వచనంబుల దుఃఖోపశమనంబు సేసి వీడ్కొని బంధుమిత్ర మధ్యంబున సుఖోపవిష్టుండై యున్న ధృతరాష్ట్రున కిట్లనియె.** **1515**

* అని పలికి శ్రీకృష్ణుని తన మనసులో నిల్పి నమస్కరించి సంకీర్తన కావించి 'ఓ కమలపత్రాక్షా! నీవు సర్వాత్మకుడవు. సర్వపాలకుడవు; ప్రపన్నురాల నగు నన్ను కాపాడవే' యని దుఃఖిస్తున్న కుంతీదేవికి

విదురునితోపాటు అక్రూరుడు ఇంపైన మాటలతో దుఃఖశాంతి చేశాడు. ఆమెను వీడ్కొని బంధుమిత్రుల నడుమ సుఖముగ కూర్చుండియున్న ధృతరాష్ట్రుని జేరి అతనితో అక్రూరుడు ఇట్లు పలికినాడు.

## -: అక్రూరుండు ధృతరాష్ట్రునితో హితోపదేశముగా సంభాషించుట :-

**ఉ. నీ యనుజుండు పాండుధరణీవిభుఁ డీల్గిన నీవు భూమి ధ**
**ర్మాయతబుద్ధి నేలుచుఁ బ్రజావళిఁ గాచుచు గౌరవంబుతోఁ**
**బాయక లోకులందు సమభావన చేసితి వేనిఁ గీర్తియున్**
**శ్రేయము గల్గు; వే ఱొకటి చేసిన దుర్గతి గల్గు భూవరా! 1516**

* ధృతరాష్ట్ర మహారాజా! నీ తమ్ముడగు పాండుభూపతి మరణానంతరం నీవు పుడమికి ఒడయడవైనావు. ప్రజలను ధర్మబుద్ధితో పరిపాలిస్తూ, కాపాడుతూ, గౌరవంతో, సమదృష్టితో వారిని చూచు కొందు వేని నీకు యశస్సు, క్షేమం లభిస్తాయి. ఇందుకు వ్యతిరేకంగా వర్తిస్తే దుర్గతి కలుగుతుంది.

**సీ. అవనీశ! పాండవులందు నీ నందను లందు సమానుండ వగుట బుద్ధి**
**యెవ్వనితో యోగ మిం దెవ్వనికి నిత్య మంగనాగార పుత్త్రాదికముల**
**వలన నయ్యెడి దేమి? వసుమతి నొకజంతు వుదయింప నొకజంతు వుక్కడంగు**
**నొకఁడు పుణ్యముఁ జెందు నొకఁడు పాపము నొందు మీనజీవనభూత మిళిత జలము**

**ఆ. తత్తనూజు లెట్లు ద్రావుదు రట్లు మూ, ఢాత్ము విత్తమెల్ల నపహరింతు**
**రహితులైన కొడుకు లటమీఁద మనియైనఁ, జచ్చియైనఁ దండ్రిజాడఁ జనరు. 1517**

* రాజా! పాండుకుమారులందును, నీ కుమారులయందును సమబుద్ధితో మెలంగుట నీకు మంచిది. ఏ యొక్కనికీ ఈ లోకమందు మరొక్కనితో ఉనికి శాశ్వతం కాదు. మరి పుత్రకళత్ర గృహాదులవల్ల ఒరగునది ఏమున్నది? భూమిలో ఒకప్రాణి పుడుతూనే మరో ప్రాణి గిడుతుంది. ఒకడు పుణ్యం సంపాదించగా మరొకడు పాపం సంపాదిస్తాడు. తల్లిచేపకు జీవనమైన నీళ్లను దాని పిల్లలు త్రాగు విధంగా బుద్ధిహీనుడైన తండ్రి ధనమంతయూ అతని పుత్రులే శత్రువులై హరిస్తారు. అటుపై ఆ తండ్రి చచ్చినా బ్రతికినా అతని విషయం వారు పట్టించుకోరు.

**క. కావున మూఢాత్ముఁడవై, నీ వార్జించిన ధనంబు నీ పుత్త్రులు దు**
**ర్భావులు పుచ్చుకొనంగా, భూవర! నిందితుఁడ వగుదు భూనాకములన్. 1518**

* కావున ఓ రాజా! నీవు అధర్మపరుడవై గడించిన విత్తమెల్ల దుర్బుద్ధులైన నీ కొడుకులు గైకొనగా భువియందును, దివియందును నిందలు పొందుతావు.

**శా. నిందం బొందకు మయ్య! యీ తనువు దా నిద్రాకళా దృష్టమౌ**
**సందోహంబు విధంబు నిల్వదు సుమీ! జాత్యంధతం బొందియున్**

**మందప్రజ్ఞత లేల చేసెదవు సమ్యగ్ జ్ఞానచక్షుండవై**
**సందేహింపక యిమ్ము పాండవులకున్ సర్వంసహాభాగమున్. 1519**

* ఈ శరీరం స్వప్న దృష్ట వస్తుసముదాయంవలె నిల్చునది కాదు. అనిత్య మైనది. నీవు పుట్టంధుడ వైనను మందబుద్ధివి మాత్రము కావద్దు. జ్ఞాననేత్రుడవై సంశయము మాని పాండవులకు వారి భూభాగం ఇచ్చివేయి.

**వ. అనిన ధృతరాష్ట్రుం డిట్లనియె. 1520**

* అని అక్రూరుడు పలుకగా అతనికి ప్రతివచనంగా ధృతరాష్ట్రుడు ఇట్లన్నాడు.

**సీ. నీమాట మంచిది నిశ్చయ; మగునైన నస్థిరంబయిన నాయంతరంగ**
**మందు నిల్వదు సుదామాచలస్ఫటిక శిలాతలోద్యత తటిల్లతిక భంగి;**
**నమృతంబు నొందియు నానందితుఁడు గాని నరుమాడ్కి నేను నానంద మొంద;**
**నీశ్వరాజ్ఞావిధ మెవ్వఁడు దప్పింపనోపు విజ్ఞానియై యుండియైన**

**ఆ. విశ్వమెల్లఁ జేసి విభజించి గుణముల, నెవ్వఁ డనుసరించె నెవ్వఁ డవని**
**భారమెల్లఁ బాయఁ బ్రభవించె దేవకి, కెవ్వఁ డాత్మతంత్రుఁ డీశ్వరుండు. 1521**

**వ. అట్టి కృష్ణునకు నమస్కరించెద; ఆ నందనందనుని దివ్యచిత్తమునం గల తెఱంగునం బ్రతుకం గలవార మని వీడ్కొలిపిన, నక్రూరుం డతని తలం పెఱింగి యిట్లనియె. నీ తలంపు గనుంగొంటి. నీ కిష్టం బగునట్లు వర్తింపుమని పలికి, మరల మధురకుం జనుదెంచి, తదీయవృత్తాంతంబు రామకృష్ణుల కెఱింగించె. 1522**

* నీవు పల్కినమాట నిజ మైనది. మంగళకర మైనది. ఐనను అది సుదామపర్వతమందలి స్ఫటికశిలా ప్రదేశంలో ఉదయించి తళుక్కున మెఱసి అణగిపోయే మెరుపు మాదిరి నా మదిలో స్థిరంగా నిలువదు.

అమృతమును పొందియు ఆనందించని మరణశీలి యగు మనుజునివలె నేనును నీమాటలకు ఆనంద మొంద లేను. తానెంత వివేకవంతుడైనను పరమేశ్వర సంకల్పము నెవడు తప్పించగలడు? ఎవడు తనమాయచే ఈ విశ్వమును సృజించి అందులో ప్రవేశించి జీవులొనర్చిన కర్మలకు తగిన ఫలములను విభాగించి ఇచ్చుచున్నారో, ఎవడు భూభారం మాన్పుటకు దేవకీదేవికి సుతుడై జన్మించినాడో, తెలియ శక్యముగాని సంసార చక్రభ్రమణానికి ఎవడు కారణమో అట్టి పరమ పురుషుడగు శ్రీకృష్ణునకు వందనము లర్పిస్తున్నాను. ఆ మహామహుని దివ్యచిత్తమున నెట్లున్నదో అట్లే జరుగగలదు అని వీడ్కొలిపినాడు.

అక్రూరుడు 'నీ యభిప్రాయము గ్రహించాను. నీ కేది ఇష్టమో అట్లే కావింపు' మని పలికి హస్తినాపురినుండి మరలి మధురకు చేరి ధృతరాష్ట్రునిచంద మంతయూ కృష్ణబలరాముల కెరిగించాడు.

**వ. అంతఁ గంసభార్య లగు నస్తియుం బ్రాస్తియు, విధవలయి, దుఃఖింపుచుం దమదండ్రి యయిన జరాసంధుని కడకుం జని. 1523**

* అంతట కంసుని భార్యలైన అస్తి, ప్రాస్తి అనేవారు విధవలై దుఃఖిస్తూ తమ తండ్రియైన జరాసంధుని దగ్గరకు వెళ్ళారు.

**-: జరాసంధుఁడు మథురాపట్టణము మీఁద దండెత్తివచ్చి కృష్ణునితో యుద్ధము చేయుట :-**

**శా. వాండ్రున్ వీండ్రును రాజులే యనుచు గర్వప్రౌఢితో యాదవుల్**
**వేండ్రంబైన బలంబుతో మథురకున్ వే వచ్చి నిష్కారణం**
**బాండ్రున్ బిడ్డలు బంధులున్ వగవఁ గంసాది క్షమానాథులన్**
**దండ్రీ! చంపిరి కృష్ణుచేత నిటు వైధవ్యంబు వచ్చెన్ జుమీ! 1524**

* వారు తమ జనకునితో 'తండ్రీ! లోకంలోని వారూ, వీరూ రాజులేనా అని యాదవులు మిక్కిలి గర్వించి దుస్సహమైన సైన్యంతో వచ్చి మథురాపట్టణాన్ని ముట్టడించారు. భార్యలు, పిల్లలు, చుట్టాలు ఆక్రందిస్తుండగా కంసుడు మున్నగు భూపతులను వధించారు. ఈ విధంగా మాకు కృష్ణునివల్ల వైధవ్యం సంప్రాప్తించింది.

**వ. అనిన విని, ప్రళయకాలానలంబు తెఱంగున మండిపడి శోకరోషంబులు బంధురంబులుగా జరాసంధుం డిట్లనియె. 1525**

* అని వా రివురును చెప్పగా జరాసంధుడు విని ప్రళయకాలాగ్ని విధంగా మండిపడ్డాడు. శోకరోషములు మనమున పెనగొనగా ఇట్లన్నాడు.

**శా. ఏమీ! కంసునిఁ గృష్ణుఁడే రణములో హింసించె నోచెల్ల! నా**
**సామర్థ్యంబుఁ దలంపఁ డించుకయు మచ్చండప్రతాపానలో**
**ద్దామార్చుల్ వడి నేఁడు గాల్చు యదుసంతానాటవీ వాటికన్**
**భూమిం గ్రుంగిన నింగిఁ బ్రాఁకిన మహాంభోరాశిలోఁ జొచ్చినన్. 1526**

* ఏమీ! కంసుణ్ణి సంగ్రామంలో శౌరి సంహరించాడా? ఔరా! అతడు నా సమర్థత ఒకించుకయు భావించడేమో! అతడు భూమిలో దాగినా, ఆకసమున నెగబ్రాకినా, పారావారములో ప్రవేశించినా చెలరేగుతున్న నా ప్రతాపాగ్ని జ్వాలలు యాదవసమూహ మనే అరణ్యమును నేడే దహించివేయగలవు.

**క. యాదవ విరహిత యగుఁ బో, మేదిని నాచేత నేఁడు మీఁదు మిగిలి సం**
**పాదితబలులై హరి రు, ద్రాదులు నింద్రాదు లెవ్వ రడ్డం బైనన్. 1527**

*తమ తమ బలములతో హరిహరేంద్రాదు లెవరు అడ్డుపడెదరో అదియు కనుగొందు గాక! ఈ మహీమండల మంతయు నేడు నాచేత యాదవరహిత మగుగాక!

**వ. అని పలికి, సమరసన్నాహ సంకులచిత్తంబునఁ గోపంబు దీపింప సంగరభేరి వేయించి కదలి. 1528**

* అని శపథంచేసి జరాసంధుడు కోపము జ్వలించగా యుద్ధ సమాయత్త చిత్తుడై సంగ్రామభేరి వేయించి కదలినాడు.

క. దక్షుండై యిరువది మూఁ, డక్షౌహిణులైన బలము లనుగతములుగా
నా క్షణమ జరాసంధుఁడు, ప్రక్షోభముతోడ మథురపైఁ జనియె నృపా! 1529

* పరీక్షిన్మహారాజా! జరాసంధుడు దక్షుడై ఇరువది మూడు అక్షౌహిణుల సైన్యం తన్ను వెంబడించగా ఆ క్షణమే సరభసంగా యాదవరాజధానియైన మథురపైకి దాడివెడలినాడు.

క. గంధేభ తురగ రథ భట, బంధుర చరణోత్థితోగ్ర పాంసుపటల యో
గాంధీభూతములై దివి, మంథరగతి నడచె నపుడు మార్తాండహరుల్. 1530

* ఆ సమయంలో రథ గజ తురగ పదాతుల పాదఘట్టనలచే ఎగసిన దుమ్ముమవల్ల కండ్లు కనిపించక సూర్యుని రథాశ్వములు గగనతలంలో మెల్లగా నడిచాయి.

వ. ఇట్లు చని నిరంతర కిసలయ పత్ర కోరక కుసుమ ఫలభార వినమిత వృక్షవిలసిత మహోద్యానంబును, ఉద్యానవనభాగ వలమాన జలోన్నయన దారుయంత్రలతానిబద్ధ కలశ విముక్త సలిలధారాశీకర పరంపరా సంపాదిత వర్షాకాలంబును, కాలకింకర సదృశ వీరభట రథతురగ సామజానీక సంకులంబును,గులాచార ధర్మప్రవీర పౌరజన భాసురంబును, సురాభేద్యమాన మహోన్నతాట్టాలక యంత్ర భయంకర ప్రాకారచక్రంబును, జక్ర సారస హంసాది కలకలరవ కలిత సరోవరంబును, సరోవర సంపుల్ల హల్లక కమల పరిమళమిళిత పవన విరాజితంబును, జితానేక మండలేశ్వరభూషణ మణిగణ రజోనివారిత మదగజేంద్ర దానజలప్రభూత పంకంబును, బంకరహిత యాదవేంద్రదత్త సువర్ణాచల కల్పతరు కామధేను సమ్మర్దిత విద్వజ్జన నికేతనంబును,గేతన సన్నిబద్ధ చామరమయూర చాప శింజినీనినద పరిపూరితాభ్రంబును, నభ్రంలిహ మహాప్రాసాద సౌధ గవాక్షరంధ్ర నిర్గత ఘనసార ధూపధూమపటల విలోకన సంజనిత జలధరభ్రాంతి విభ్రాంత శిఖండితాండవ రుచిరంబును, జిరతరానేక దేవాలయ ఘోషుష్యమాణ తూర్యనినద పరిభావిత పారావారకల్లోల ఘోషంబును, ఘోషకామినీ ప్రాణవల్లభ బాహుదండ పరిరక్షితంబునునై, పరులకు నలక్షితంబైన మథురానగరంబు చేరి, వేలాలంఘనంబు చేసి, వెల్లివిరిసిన మహార్ణవంబు తెఱంగున పట్టణంబునకు ముట్టణంబు చేసి, చుట్టును విడిసిన జరాసంధుని బలౌఘంబు గని, వేళావిదుండగు హరి తన మనంబున. 1531

* ఈ విధంగా పోయి పోయి జరాసంధుని సేనలు మథురాపురం చేరినాయి. ఆ మథురాపట్టణం దట్టమైన చిగురుటాకులతో, ఆకులతో, మొగ్గలతో, పూలతో, పండ్లబరువుతో వినమ్రములైన చెట్లతో చెలువారు ఉద్యానవనాలు కలిగి ఉంది. ఆ ఉద్యానవన భాగాలలో నీటిని పైకి తెచ్చే దారుయంత్రాలు గిర్రున తిరుగుతూ, వాటికి బిగించబడిన గిండిగల నుంచి నీటిని పైకి ఎగజిమ్ముతుండగా ఆ నీటితుంపరలు పట్టణంలో కృత్రిమ వర్షాకాలాన్ని సృష్టిస్తున్నాయి.

యమకింకరులతో సమానులైన వీరభటులతో, రథగజతురంగాలతో నగరం సంకులంగా ఉంది. కులాచారములు గల ధర్మవీరులైన పౌరులతో పట్టణం పరిఢవిల్లుతున్నది. ఆ మథురాపురం దేవతల కైనను భేదించరాని మిక్కిలి ఎత్తైన కోటబురుజులందలి శిలాప్రక్షేపణ యంత్రాలతో గూడి వెఱపు పుట్టించు ప్రాకారాలు కలిగి ఉంది.

జక్కవపిట్టలు, బెగ్గురుపక్షులు, హంసలు మొదలగు విహంగముల కిలకిలారావములతో నిండిన సరస్సులతో ఆ నగరం అందగిస్తున్నది. సరస్సులలో వికసించిన కలువలు, కమలాలు- వీటి పరిమళాలతో మేళవించిన వాయువులతో ఆ ప్రోలు పొలుపారుతున్నది.

నిర్జితులైన రాజుల మణిభూషణాల రాయిడిచే రాలిన పొడివల్ల పట్టణంలో మదగజముల దానధారలతో ఏర్పడిన పంకములు అణగిపోయాయి. పాపరహితులైన యదుప్రముఖులచేత ఈయబడిన కనకాచల, కల్పవృక్ష, కామధేనువులతో క్రిక్కిరిసిన మథురలోని పండితుల యిండ్లు ప్రకాశిస్తున్నాయి.

మథురానగర గగనతలం టెక్కెములకు కట్టబడిన వింజామరలు, నెమళ్లు, విండ్లు వీనియొక్క మ్రోతలతో ఆవరింపబడింది.

ఆకసము నంటియున్న రాజభవనాలయొక్క సౌధాలయొక్క గవాక్షరంధ్రాల నుంచి వెలువడుతున్న కర్పూరధూప ధూమాలను చూచి అవి మబ్బుల గుంపు లని భ్రమించి నెమిళ్ళు పురివిచ్చి మనోహరంగా నృత్యం చేస్తున్నాయి.

ఆ పట్టణంలో చిరకాలంగా దేవాలయములందు మ్రోగింపబడుతున్న మంగళవాద్యధ్వనులు సముద్ర తరంగఘోషను తిరస్కరిస్తున్నాయి.

యాదవభామినుల ప్రాణపతులయొక్క బాహుదండములచే కాపాడబడుతూ అన్యులకు తేరిపారజూడ శక్యము గాని ఆ మథురానగరం చేరి చెలియలికట్ట నతిక్రమించి పొంగివచ్చే మహాసముద్రం వలె పట్టణమును ముట్టడించి చుట్టూ విడిసియున్న జరాసంధుని సైనిక శిబిరాలను జూచి సమయజ్ఞుడైన శ్రీహరి తన మనసులో ఇ ట్లాలోచించాడు.

**మ. ఐదున్నాలుగు నాఱు రెండు నిరు మూఁడక్షౌహిణుల్ సుట్టి సం**
**ఛాదించెన్ బురమెల్ల మాగధు నెడన్ సామంబు దానంబు సం**
**భేదంబున్ బనిలేదు దండవిధి శోభిల్లం బ్రయోగించి యీ**
**భూదేవీ తనుభార మెల్ల నుడుపన్ బోలున్ జయోద్భాసినై. 1532**

* ఇరవైమూ డక్షౌహిణుల సేన పట్టణాన్ని చుట్టి ముట్టడించి ఉంది. జరాసంధునిపట్ల సామదానభేదాలు అనే ఉపాయాలు నిరుపయోగాలు. కాబట్టి నాల్గవదైన దండోపాయం ప్రయోగించి జయంతో వెలుగొందుతూ భూభారం తొలగించాలి.

క. ఏ నవతరించు టెల్లను, మానుగఁ జతురంతధరణి మండలభరమున్
మానుపుకొఱకుం గాదే, పూనెద నిది మొదలు దగిలి భూభర మణఁపన్. 1533

* నేను అవతరించుట నాల్గుచెఱగుల నేలబరువు నివారించుట కొరకే గనుక నేటినుంచి భూభారం హరించుటకు ఉద్యమిస్తాను.

ఆ. మగధనాథుఁ బోర మడియింపఁ బోలదు, మడియకున్న వీఁడు మరలి మరలి
బలము గూర్చికొంచుఁ బఱతెంచుఁ బఱతేరఁ, ద్రుంపవచ్చు నేల దొసఁగు దొఱఁగ. 1534

* యుద్ధంలో మగధేశ్వరుడైన జరాసంధుణ్ణి చంపరాదు. వీడు చావకుంటే మళ్లీ మళ్లీ సైన్యాన్ని సమకూర్చుకొని వస్తుంటాడు. అప్పుడు అందరినీ చంపి ధరాభారం ఉడిపి అవతల వీణ్ణి చంపవచ్చు.

వ. అని యిట్లు చింతించుచున్న సమయంబున నభోభాగంబుననుండి మహాప్రభా సమేతంబులును, సపరిచ్ఛద సూతంబులును, ననేక బాణ బాణాసన చక్రాది వివిధాయుధోపేతంబులు నైన రథంబులు రెండు మనోరథంబులు పల్లవింప దైవయోగంబునం జేరవచ్చినం జూచి హరి సంకర్షణున కిట్లనియె. 1535

* అని గోవిందుడు తలపోశాడు. అత డట్లు తలపోస్తుండగా మిక్కిలి కాంతిగలవీ; సారథులతో, ధ్వజకవచాదులతో కూడినవీ; శరములు, విండ్లు, చక్రములు మొదలైన నానావిధాయుధాలతో ఒప్పునవీ అయిన రెండురథాలు మనోరథాలు (కోరికలు) చిగిరింపగా ఆకాశవీథి నుంచి దైవయోగంవల్ల వచ్చి చేరాయి. వాటిని చూచి బలదేవునితో పద్మనేత్రు డిట్లన్నాడు.

శా. కంటే రామ! రథంబు లాయుధములున్ గాఢప్రకాశంబులై
మింటన్ వచ్చెను; వీనిఁ గైకొని సురల్ మెచ్చన్ నృపశ్రేణులన్
బంటింపం బనిలేదు చంపుము; ధరాభారంబు వారింపు; మీ
వెంటన్ నీ యవతారమున్ సఫలమౌ; వేవేగ లె మ్మాజికిన్. 1536

* అన్నా! బలరామా! చూచావా? పరమప్రభావంతము లైన రథాలు ఆయుధాలతో ఆకసం నుంచి అరుదెంచాయి. వీటిని గైకొని దేవతలు హర్షించగా శత్రురాజులను జాగుచేయక సంహరించు. ఈ విధంగా నీ అవతార ప్రయోజనం నెరవేరుతుంది. కావున కదనమునకు శీఘ్రంగా సిద్ధం కమ్ము.

వ. అని పలికి. 1537

* అని వాసుదేవుడు పలికినాడు.

క. ఖరులై దృఢకవచ ధను, శ్శరులై యధిగత రథానుచరులై మదవత్
కరులై ఘనహరులై బల, హరు లయ్యెడ నాజి కేగి రరిభీకరులై. 1538

* బలరామాచ్యుతులు వాడిమి గలవారు. గట్టి కవచములు, ధనుర్బాణములు గలవారు. మదగజములు, గొప్ప అశ్వములు కలవారు. వారు రథములు, అనుచరులు గలవారై, శత్రువులకు భయము

గలిగించువారై యుద్ధరంగమున కరిగినారు. 'బలహరులు' అన్న చోట బలరామాచ్యుతులు అను నర్థముతోపాటు శాత్రవబలము హరించువారు అన్న అర్థము కూడ ప్రతీయమాన మగును.

**వ. ఇట్లు సమరసన్నాహంబునం బురంబు వెడలి. 1539**

**ఉ. అన్యులు దల్లడిల్ల దనుజాంతకుఁ డొత్తె గభీరఘోష కా**
**రిన్య మహాప్రభావ వికటీకృత పద్మభవాండ జంతు చై**
**తన్యము ధన్యమున్ దివిజ తాపస మాన్యముఁ బ్రీత భక్త రా**
**జన్యము భీత దుశ్చరిత శాత్రవ సైన్యముఁ బాంచజన్యమున్. 1540**

* ఈ రీతిగా సమరసన్నాహం వహించి కేశవ బలరాములు పట్టణంనుంచి వెలువడినారు. వైరులు చలించగా దైత్యవిధ్వంసియైన శ్రీకృష్ణుడు గంభీరము, కర్కశము అగు నినాదమహిమచే బ్రహ్మాండములోని జీవరాసుల చైతన్యాన్ని వికటీకరించు నదియు, దేవమునులచే మన్నింపబడు నదియు, భక్తులైన రాజులను సంతోషపెట్టు నదియు, చెడునడత గల శాత్రవసైన్యమునకు భయము గల్గించునదియు, ధన్యమై నదియు అగు పాంచజన్యమనే తన శంఖాన్ని పూరించాడు.

**క. సింధుర భంజన పూరిత, బంధురతర శంఖనినద భారమున జరా**
**సంధునికిని గల సైన్యము, లంధములై సంచరించె నాహవభూమిన్. 1541**

* గజములను భంజిస్తూ పురుషోత్తముడు పూరించిన నిబిడతరమైన పాంచజన్య నినాదభారంతో జరాసంధునికున్న సేనలన్నీ కదనభూమిలో కన్నులు కానరాక సంచలించి పోయాయి.

**వ. అ య్యవసరంబున మాగధుండు మాధవున కిట్లనియె. 1542**

* ఆ తరుణంలో మగధాధిపతి మధురాధిపతితో ఇట్లన్నాడు.

**సీ. అదలించి రొప్పంగ నాలమందలు గావు గంధగజేంద్రసంఘములు గాని**
**పరికించి వినఁగ నంభారవంబులు గావు వాజీంద్ర హేషారవములు గాని**
**పదహతిఁ గూల్పంగఁ బ్రాఁతబండ్లును గావు నగ సమాన స్యందనములు గాని**
**ప్రియము లాడంగ నాభీరలోకము గాదు కాలాభ వైరివర్గంబు గాని**

**తే. యార్ప వనవహ్ని గాదు బాణాగ్ని గాని, మురియు బృందావనము గాదు మొనలు గాని**
**యమున గాదు నటింప ఘోరాజిగాని, పోరు నీకేల గోపాల! పొమ్ము పొమ్ము. 1543**

* ఓరీ! కృష్ణా! ఇవి మత్తమాతంగ యూథములు గాని, అదలించి పారదోలుటకు ఆవులమందలు గావు. ఇవి జవనాశ్వముల సకిలింత చప్పుళ్లు గాని, వీనులొగ్గి వినుటకు ఆలపోతుల అంభారావాలు కావు. ఇవి అద్రిసమానములైన అరదములు గాని పాదహతులతో పడగూల్చుటకు పాతబండ్లు గావు. ఇది యమునితో సమానమైన శాత్రవసమూహము గాని, కోరి ముచ్చట లాడుటకు గొల్లల గుంపుగాదు. అర్పివేయుటకు ఇది బాణాగ్ని గాని దావానలం కాదు. మురిసి తిరుగుటకు ఇది బృందావనం కాదు;

సేనావ్యూహము. నర్తనమాడుట కిది దారుణయుద్ధభూమి గాని, యమునా నదీతీరభూమి గాదు. కావున గోపాలా! ఈ కదనము నీకేల? పోపొమ్ము.

**మ. తరుణిం జంపుటయో బకుం గెడపుటో ధాత్రీజముల్ గూల్చుటో**
**ఖరముం ద్రుంచుటయో ఫణిం బఱపుటో గాలిన్ నిరోధించుటో**
**గిరి హస్తంబునఁ దాల్చుటో లయమహాగ్నిస్ఫార దుర్వార దు**
**ర్భర బాణాహతి నెట్లు నిల్చెదవు సప్రాణుండవై గోపకా! 1544**

* ఓ గోపకిశోరా! ఇది యువతిని చంపుట కాదు; కొంగను ద్రుంచుట గాదు. చెట్లను గూల్చుట కాదు.. గాడిదను గెడపుట కాదు; పామును పారదోలుట గాదు. గాలిని నిర్బంధించుట గాదు. శైలమును చేత ధరించుట గాదు, ప్రళయకాలాగ్నివలె దీపించు దుర్వారములు, దుస్సహములు అయిన నా శరాహతులకు ఎట్లోర్చి నీవు ప్రాణాలతో నుండగలవు?- (వరుసగా పూతనాహరణము, బకాసురవధ, యమళార్జున భంజనము, గర్దభాకారుడైన ధేనుకాసురుని వధ, కాళియమర్దనము, తృణావర్త సంహారము, గోవర్ధనోద్ధరణము అను శ్రీకృష్ణచర్యలు అనుసంధేయాలు.)

**వ. అదియునుం గాక. 1545**

* అంతే కాదు.

**సీ. గోపికావల్లకీ ఘోషణంబులు గావు శింజినీరవములు చెవుడుపఱచు**
**వల్లవీకరముక్త వారిధారలు గావు శరవృష్టిధారలు చక్కసేయు**
**ఘోషాంగనాపాంగ కుటిలాహతులు గావు నిశితాసి నిహతులు నిగ్రహించు**
**నాభీరకామినీ హస్తాబ్జములు గావు ముష్టిఘాతంబులు మురువు డించు;**

**తే. నల్ల వ్రేపల్లె గాదు ఘోరావనీశ, మకరసంఘాత సంపూర్ణ మగధరాజ**
**వాహినీ సాగరం బిది వనజనేత్ర! , నెఱసి నిను దీవి కైవడి నేఁడు ముంచు. 1546**

* ఇవి గొల్లపడతుల వీణానినాదాలు కావు, అల్లెత్రాటి మ్రోతలు నీచెవులు చిల్లులు పడుతాయి సుమా! ఇవి ఘోషతరుణులు చేతులతో చల్లే నీటిజల్లులు కావు, బాణాలనే వర్షధారలు. నీ శరీరాన్ని కండతుండెములు గావిస్తాయి. ఇవి గొల్లబోటుల క్రీగంటిచూపులు గావు, వాడికత్తివ్రేటులు, నిన్ను నిగ్రహిస్తాయి. ఇవి వ్రజవధూటుల తామరలవంటి చేతులు గావు, పిడికిటి పోటులు; నీ పోడిమిని పోకారుస్తాయి. ఇది వ్రేపల్లె కాదు, ఉగ్రులైన రాజులనే మొసళ్ళ మొత్తంతో నిండిన జరాసంధుని సేనాసముద్రం; ఈ మహా సముద్రం పెల్లుబికి దీవిని ముంచునట్లు నిన్ను ముంచివేస్తుంది.

**వ. అనిన శ్రీహరి యిట్లనియె. 1547**

**ఉ. పంతము లేల? తొల్లి జనపాలురఁ బోరుల గెల్చినాఁడ వం**
**ద్రంతియ చాలదే? బిరుదు లాడుట బంటుతనంబు త్రోవయే?**

**యింతటఁ దీఱెనే? మగధ! యేటికిఁ బ్రేలెదు? నీవ యేల క**
**ల్పాంత మహోగ్రపావకునినైన హరింతు వరింతు సంపదన్.** 1548

* ఈ విధంగా పలుకుతున్న జరాసంధునితో శ్రీకృష్ణు డిలా అన్నాడు.-

ఓ మాగధుడా! బీరము లెందుకు? మునుపు కొందరు రాజులను నీవు కదనంలో గెలిచినా వంటారు. అది చాలదు. డంబాలు పలకడం శౌర్యపద్ధతి గాదు. ఇంతటితో తీరిపోయిందా? ఎందుకు పదరుతావు? ప్రళయకాలంలోని భయంకరాగ్నినైనా హరిస్తాను. విజయలక్ష్మిని వరిస్తాను.

**క. గోపాలుఁడ వని పలికితి, భూపాలక! దీన నేమి? పోరాడంగా**
**గోపాలమహీపాల, వ్యాపారాంతరము దెలియవచ్చుం బిదపన్.** 1549

* ఓ రాజా! నన్ను పసులకాపరి అన్నావు. ఇందువల్ల నాకు కలిగిన లోటు లేదు. సమరంలో గోపాల భూపాలకుల తారతమ్యం ఏమిటో ఇప్పుడే నీకు తెలిసివస్తుంది.

**వ. అనిన రోషబంధురుండై జరాసంధుం డిట్లనియె.** 1550

* అని శ్రీకృష్ణుడు పలుకగా క్రోధావిష్టుడై జరాసంధు డిట్లన్నాడు.

**ఉ. బాలుఁడ వీవు కృష్ణ! బలభద్రునిఁ బంపు రణంబు సేయ; గో**
**పాలక బాలుతోడ జనపాల శిఖామణియైన మాగధుం**
**డాలము సేసె నంచు జను లాడెడి మాటకు సిగ్గు పుట్టెడిం**
**జాలుఁ దొలంగు దివ్యశరజాలుర మమ్ము జయింప వచ్చునే?** 1551

* కృష్ణా? నీవు పిల్లవాడవు. నాతో పోరడానికి మీ అన్న బలరాముణ్ణి పంపు. గొల్లపిల్లకాయతో రాజ చూడామణియైన మగధపతి యుద్ధం చేసినాడని లోకులు మాట్లాడుతుంటే మేము సిగ్గుతో తల వంచుకోవలసి వస్తుంది. చాలులే. అవతలకి పో. మేము అమోఘశరాలు కలవాళ్ళం, మమ్మ గెలవడం నీతరం కాదు.

**వ. అనిన నగి నగధరుం డిట్లనియె.** 1552

* ఆ మాటలకు నవ్వి గోవర్ధనగిరిధారి ఇలా అన్నాడు.

**క. పొగడుకొనుదురే శూరులు?, మగఁటిమిఁ జూపుదురు గాక! మాగధ! నీకున్**
**మగతనము గలిగెనేనిం, దగు మెఱయ వికత్థనములు దగ వీ పోరన్.** 1553

* జరాసంధా! వీరులైనవారు పౌరుషం చూపుతారే గాని నీ మాదిరిగా తమ్ము తాము ఊరక పొగడు కోరు. పౌరుష ముంటే భండనంలో నీ ప్రతాపం ప్రదర్శించు. ఆత్మస్తుతి చాలించు.

**వ. అని రోషించి.** 1554

**చ. పవనుఁడు మేఘరేణువుల భానుకృశానులఁ గప్పు కైవడిన్**
**వివిధబలౌఘముం బనిచి వేగమ మాగధుఁ డావరించె భూ**

మ్యవన చరిష్ణులం గువిమతావనినాథ నిరాకరిష్ణులన్
దివిషదలంకరిష్ణుల నతిస్థిరజిష్ణుల రామకృష్ణులన్. 1555

* ఆ మాటలకు జరాసంధుడికి ఆగ్రహం వచ్చింది. వాయువు మబ్బులతో, ధూళితో సూర్యాగ్నులను కప్పే విధంగా మాగధుడు భూసంరక్షణార్థం అవతరించి చరించే వారూ, విరోధిరాజులను నిరాకరించేవారూ, దేవతల కలంకారమైన వారూ, మిక్కిలి స్థిరమైన విజయం కలవారూ అయిన రామకృష్ణులను నానాసేనలను ముందుకు నడిపి చుట్టుముట్టినాడు.

మ. హయహేషల్ గజబృంహితంబులు రథాంగారావముల్ శింజినీ
చయ టంకారములున్ వివర్ధిత గదాచక్రాస్త్ర నాదంబులున్
జయశబ్దంబులు భేరిభాంకృతులు నిస్సాణాది ఘోషంబులున్
భయద ప్రక్రియ నొక్కవీఁక నెగసెస్ బ్రహ్మాండభేదంబుగన్. 1556

* ఆ సమయంలో గుఱ్ఱాల సకిలింపులు, గజముల ఘీంకారాలు, రథచక్ర ధ్వానాలు, వింటినారి మ్రోతలు, పెచ్చు పెరుగుతున్న గద, చక్రం, బాణం మున్నగు ఆయుధముల శబ్దాలు, జయజయారావాలు,భేరి మొదలైన చర్మవాద్యముల నినాదాలు భయజనకములై బ్రహ్మాండాన్ని భేదించేటట్లు ఒక్క పెట్టున చెలరేగినాయి.

వ. మఱియు నయ్యెడ మాగధ మాధవ వాహినులు రెండు నొండొంటిం దాఁకి రౌద్రంబున సంవర్త సమయ సముద్రంబుల భంగి నింగికిం బొంగి చెలంగి చలంబునం దలపడి పోరునెడ మసరు కవిసి మహారణ్యంబులు వెలువడి మార్కొను మదగజంబుల మాడ్కిని, మహోత్కంఠంబులగు కంఠీరవంబుల తెఱంగున, దుర్లభంబులగు శరభంబుల చాడ్పునం, బ్రచండంబులగు గండభేరుం డంబుల గమనికం, దమతమ మొనలకుం దలకడచి వీరరసంబులు వివిధరూపంబులైన విధంబునం బదుగురు, నూర్వురు, వేవురు గములై కులకుధర గుహాంతరంబులు నిండ సింహనాదంబు లొన ర్చుచు, నార్చుచు, నట్ట హాసంబులు సేయుచు, నరివీరుల రోయుచుఁ, బటహ కాహళ భేరీ శంఖ శబ్దంబులకు నుబ్బుచు, గర్వంబునం బ్రబ్బుచు, గదల వ్రేయుచుఁ, గాండంబుల నేయుచు, ముద్గరం బుల నొత్తుచు, ముస లంబుల మొత్తుచు, గుంతంబులం గ్రుచ్చి యెత్తుచుఁ, గరవాలంబులం ద్రెంచుచుఁ, జక్రంబులం ద్రుంచుచు, శస్త్రంబులం దఱుఁగుచుఁ, జిత్రంబుగఁ దిరుగుచుఁ, బరిఘం బులఁ ద్రిప్పికొట్టుచు, బ్రాసంబులం బెట్టుచు, శూలంబులఁ జిమ్ముచు, సురియలం గ్రుమ్ముచు, బహుభంగులఁ బరా క్రమించు వీరభటులును, నిబిడ నీరంధ్ర నేమినిర్ఘోషంబుల నాకాశంబు నిరవ కాశంబుగ ననర్గళచక్ర మార్గంబులం బడు పదాతులు చదియ నరదంబులు దోలి, వివిధాయుధ ప్రయోగంబుల వైరుల వ్రచ్చి, చిందఱవందఱ లాడు రథికులును, రథిక శరపరంపరలఁ గంపింపక మహామోఘ మేఘ ధారలకుం జలింపని ధరణీధరంబుల చాడ్పున రథంబులకుం గవిసి, కల్పాంతకాల దండిదండ ప్రచండంబులగు శుండాదండంబులు సాఁచి పూఁచి కడనొగ లొడిసి తిగిచి కుదిచివిఱిచి, కూబర ములు నుఱుములుగఁ జిఱజిఱఁ ద్రిప్పివైచియు, భటులం జటులగతి బంతుల క్రియ

**నెగుర వైచి దంతంబుల గ్రుచ్చియు, ఘోటకంబుల వ్రచ్చియు విచ్చలవిడిం దిరుగు కరులును, వజ్రి వజ్ర ధారలకుం దప్పి కకుప్పులకు నెగయు తెక్కలు గల గిరుల సిరులం బక్కెరల తోడ హేషారవ భీషణంబులై మనోజవంబులగు తురంగంబులం బఱపి తురంగ పద పాంసుపటల ప్రభూత బహుళాంధకారంబులు గరకలిత కఠోర ఖడ్గ మరీచిజాలంబుల నివారించుచు నానాప్రకారంబులం బ్రతి వ్యూహంబులం జించి చెండాడు రాహుత్తులుం గలిగి సంగ్రామంబు భీమం బయ్యె నందు. 1557**

* అపుడు కృష్ణజరాసంధుల సేనలు పరస్పరం ఎదుర్కొని రౌద్రంతో ప్రళయకాలమందలి సముద్రాల మాదిరి ఆకస మంటేటట్లు ఉప్పొంగి పౌరుషంతో పోరాడసాగినాయి. మదమెక్కి మహారణ్యాల నుంచి వెలువడి ఢీకొనే మదపుటేనుగులవలె, మిక్కిలి వేగిరపాటు గల సింహాలవిధంగా, అపూర్వములైన శరభముల లాగా, భీతి పుట్టించే గండభేరుండముల పోలికగా యోధులు తమ తమ సేనల్ని దాటి వీరరసం పలురూపులు గైకొన్నట్లు పదిమంది, నూరు మంది, వెయ్యిమంది వంతున గుంపులై కులపర్వత గుహాంతరాళాలు నిండేటట్లు పెడబొబ్బలు పెట్టినారు. వెడనవ్వులు నవ్వినారు. శత్రువీరులను నెమకినారు. పటహము, కాహళ, భేరి, శంఖం అనే వాద్యాల శబ్దాలకు వారు ఉద్రేకం పొందినారు. గర్వంతో చెలరేగినారు. అరివీరులను గదలతో మోదినారు. శరములు ప్రయోగించినారు. సమ్మెటలతో మర్దించినారు. రోకళ్ళతో మొత్తినారు, బల్లెములతో గ్రుచ్చి పై కెత్తినారు. కత్తులతో ఖండించినారు. చక్రాలతో ఛేదించినారు. శస్త్రాలతో తరిగినారు. వింతగా తిరుగుతూ ఇనుపకట్ల గుదియలతో త్రిప్పికొట్టినారు. ఈటెలు, శూలాలు చిమ్మినారు. చురకత్తులతో క్రుమ్మినారు. ఈ రీతిగా వీరభటులు పలురకాల పరాక్రమించారు. ఎడతెరపిలేని రథచక్రఘోషలతో ఆకసం నిండిపోయింది. చక్రాల క్రిందపడి పదాతిదళాలు నలిగేటట్లు అరదములు తోలించి అనేక విధములైన ఆయుధాలు ప్రయోగించి రథికులు శత్రువులను చీల్చి చెండాడినారు. రథికుల శరపరంపరలకు చలించక మహావర్ష ధారలకు చలించని పర్వతాలమాదిరి ఏనుగులు తేరుల మీదికి కవిసి ప్రళయకాలంలోని యమదండంవలె భయంకరమైన దండములవంటి తొండాలు సాచి పూనికతో కడనొగలను ఒడిసిపట్టి లాగి కుదించి జిరజిర త్రిప్పి విరిచి పొడిపొడి గావించాయి. భటులను బంతుల మాదిరి ఎగురవేసి దంతాలతో క్రుమ్మినాయి. గుఱ్ఱాలను చీల్చి వేసి విచ్చలవిడిగా విహరించాయి. దేవేంద్రుని వజ్రాయుధపు వ్రేటులు తప్పించుకొని దిగంతాలకు ఎగిరిపోయే రెక్కలున్న కొండలకైవడి భాసిస్తూ జీనులతో గూడినవై, దారుణంగా సకిలిస్తూ మనస్సువలె వడిగలిగిన వారువాలు విజృంభించాయి. వాటిని ఉసికొలిపి తోలేటప్పుడు వాటి కాలిడెక్కల దుమ్ముచే కారుచీకట్లు వ్యాపించాయి. ఆ కారుచీకట్లను తమచేతిలోని కరకు కత్తులకాంతి పుంజంతో నివారిస్తూ గుఱ్ఱపురౌతులు శత్రువుల ప్రతివ్యూహాలను పటాపంచలు గావించారు. ఈ విధంగా భీషణసమరం జరిగింది.

**క. చెడురథములుఁ దెగు హరులును, బడు కరులును మడియు భటులుఁ బఱచు రుధిరమున్**
**మడియు తల లొఱగు తనువులుఁ, బొడి యగు తొడవులును మధురిపుని దెసఁ గలిగెన్. 1558**

* శ్రీకృష్ణుని పక్షంలోని అరదములు భగ్న మయినాయి. అశ్వాలు తెగిపడ్డాయి. ఏనుగులు కూలిపోయినాయి. భటులు మరణించారు. నెత్తురు ప్రవహించింది. తలలు తునిగినాయి. దేహములు వ్రాలి పోయాయి. భూషణాలు పొడిపొడియై రాలిపోయాయి.

క. భీతంబై హత సుభట, వ్రాతంబై భగ్న తురగ వారణ రథ సం
ఘాతంబై విజయశ్రీ, వీతంబై యదుబలంబు విఱిగె నరేంద్రా! 1559

* పరీక్షిన్మహారాజా! యాదవసైన్యం భీతిల్లింది. మేటివీరులు మరణించారు. హయములు, ఏనుగులు, రథసమూహాలు భగ్న మయినాయి. విజయలక్ష్మి విరహితమై యాదవబలం వెనుకకు తగ్గింది.

శా. 'యోధాగ్రేసరుఁ డీ హలాయుధుఁడు లోకోత్కృష్ట బాహాబల
శ్రీధౌరేయుఁడు కృష్ణుఁ డిట్టి ఘనులం జిత్రంబు;నేఁ డిట్లు సం
రోధించెన్; బలముం దెరల్చె; మగధేంద్రుం' డంచు నీక్షించుచున్
సౌధాగ్రంబులఁ బౌరకాంతలు మహాసంతప్తలై రెంతయున్. 1560

* 'బలరాముడు వీరులలో అగ్రగణ్యుడు. శ్రీకృష్ణుడు లోకోన్నత భుజబల సంపన్నుడు. ఇట్టి మహా మహులను జరాసంధుడు అడ్డగించి వారి సేనలను తరిమికొట్టడం ఎంతో వింతగా ఉంది' అని పురస్త్రీలు మేడలమీద జేరి మిక్కిలి పరితాపం పొందినారు.

వ. ఇట్లు తన మొనలు విఱిగి పాఱినం గనుంగొని, సమరసంరంభంబున హరి విశ్వంభరాభరణ వేదండ తుండాభంబులగు బాహుదండంబులు వెంచి, విజృంభించి, బ్రహ్మాండకుహర కుంభ పరిస్ఫోటనం బగు పాంచజన్య నినదంబు నిబిడ నిర్ఘాత శబ్దంబుగా, నుదంచిత పింఛదామంబు సంక్రందన చాపంబుగాఁ, బ్రశస్తహస్త లాఘవంబున శరాకర్షణ సంధాన మోక్షణంబు లేర్పడక, నిర్వక్ర చక్రా కారంబుతోడ మార్తాండమండల ప్రభా ప్రచండంబగు శార్ఙ్గకోదండంబు క్రొమ్మెఱుంగులుగా, దిగ్గజేంద్ర కర్ణభీషణంబులగు గుణఘోషణంబులు ఘుమఘుమారావ దుస్సహంబు లయిన గర్జనంబులుగా, రథ తురంగను రింఖా సముద్ధూత పరాగపటల పరంపరా సంపాదిత పుంజీభూతంబగు పెంజీఁకటి యిరులుగా, నసమసమర సన్నాహ చాతురీ విశేషంబులకుం జొక్కి, నిక్కి కరంబు లెత్తి నర్తనంబులం బ్రవర్తించు నారద హస్తవిన్యాసంబులు లీలాతాండవ మండిత మహోత్కంఠంబు లగు నీల కంఠంబులుగా, సుందర స్యందననేమి నిర్ఘోషభీతులయి కుంభి కుంభములపై వ్రాలు వీరులు మత్తమయూర కేకారవ చకితులై యువతీకుచ కుంభంబులమీఁద వ్రాలెడు కాముకులుగా, నానానరేంద్ర రక్తపిపాసా పరవశంబులై వాచఱచుచున్న భూతవ్రాతంబులు వర్షవర్షేతి నిస్వనంబు లొసంగు చాతకంబులుగా, నభంగ సంగర ప్రేరకుండగు హలాయుధుండు వృష్టికారణంబగు మందసమీరణం బుగా, ననల్పకల్పాంతకాల నీలవలాహకంబు భాతిం బరగు మేనిచాయతోడం దోయజనాభుం డరాతి చతురంగ దేహక్షేత్రంబులం బుంఖానుపుంఖంబులుగ నసంఖ్యాత బహువిధ దివ్యబాణవర్షంబు గురియునెడ శస్త్రాస్త్రపరంపరా సంఘట్టన జనితంబులగు మిడుఁగుఱులు వర్షాకాల విహిత విద్యోత మాన ఖద్యోతంబులుగ, విశిఖ వికీర్ణ వీరకోటీర ఘటిత పద్మరాగ శకలంబు లింద్రగోపంబులును, మహిత మార్గణ విదళిత మత్తమాతంగ కుంభ మౌక్తికంబులు వడగండ్లుగఁ, జటులార్ధచంద్ర శరచ్ఛిన్న చరణంబు లయి 'కృష్ణ! కృష్ణ! నిలు నిలు' మని పలుకుచుం గూలెడు మేనులు కృషీవల కర పరశుధారా విదళిత మూల విశాలసాలంబులుగ, భాసుర భల్ల భగ్నంబు

లయిన వదన గహ్వరంబుల వలన డుల్లెడు దంతపుంజంబులు మాలతీకుసుమ మంజరులుగ, నవ్యనారాచభిన్న దేహంబు లయి దిగ్గనఁ గ్రొగ్గండ్లవలన వెడలు రక్తస్యంద సందోహంబులతో సంచరింపక ప్రాణంబులు విడుచు శుండాలంబులు సెలయేఱులతోడి కొండలుగఁ, గఠోరకాండ ఖండితంబు లయిన భుజాదండంబులతోడఁ గలసి పడిన వజ్రమయ కంఠికాభరణంబులు భోగిభోగ సమేత కేతకీకుసుమంబులుగఁ, బ్రళయార్ణవ కల్లోల శబ్ద సన్నిభంబు లయిన భేరీరవంబులు భీకర భేకీ నికరారవంబులుగ, దారుణేషు విలూన వాహ వారణ మనుజ మస్తిష్కంబు రొంపిగ, సొంపు మెఱయ నాభీల కీలాల ప్రవాహంబులు ప్రవహించె; నందు భుజములు భుజంగంబులుగఁ గపాలం బులు కమఠంబులుగ, శిరోజంబులు శైవాలంబులుగఁ, గరంబులు మీనంబులుగ, హయంబులు నక్రంబులుగ, గజంబులు దీవులుగ, ధవళచ్ఛత్రంబులు నురువులుగఁ, జామరంబులు గలహం సంబులుగ, భూషణరత్నరేణురాసులు పులినంబులుగ నొప్పె; నప్పుడు. 1561

*తన సేనలు ఓడి పారిపోవడం చూచి సమరాటోపంతో శ్రీహరి భూభారం వహించే దిగ్గజతుండాలతో సమానము లయిన తన భుజదండాలు సారించి విజృంభించాడు. బ్రహ్మాండభాండం బ్రద్ద లయ్యేటట్లు పాంచజన్యశంఖం పూరించాడు. ఆ శంఖధ్వని పెళపెళ మను పిడుగుల మ్రోతవలె ఉండినది. తాను ధరించిన నెమలిపించం ఇంద్రధనుస్సువలె చూపట్టింది.

మెచ్చ దగిన హస్తలాఘవంచేత బాణములు అల్లెత్రాటియందు కూర్చడం, లాగడం, విడవడం తెలియ రాకుండా మండలాకారంతో సూర్యమండలప్రభవలె తేరిచూడరానిదై అతని శార్ఙ్గమనే చాపం క్రొత్తమెరుపువలె తేజరిల్లింది. దిగ్దంతుల చెవులకు వెరపు గలిగించే అతని ధనుష్టంకారాలు ఘుమఘుమ ధ్వనులతో సహింపరానివై ఉరుముల చప్పుళ్ళుగా ఒప్పినాయి. రథానికి గట్టిన గుఱ్ఱాల గిట్టల తాకిడికి లేచిన ధరాధూళిమూలాన ఏర్పడ్డ చీకటియే అంధకారమై తోచింది. అతని సాటిలేని యుద్ధసన్నాహ నైపుణ్యానికి పరవశించి నిక్కి చేతులెత్తి నాట్యం చేస్తున్న నారదమహర్షి హస్తవిన్యాసాలే, మిక్కిలి సంబరంతో తాండవనృత్యం సలిపే నెమళ్ళుగా నెగడినాయి. అందమైన ఆయన రథచక్రాల రవళికి జంకి ఏనుగుల కుంభస్థలాలపై ఒరగుతున్న వీరులు మదించిన నెమళ్ళకూతలకు ఉలికిపడి తరుణుల కుండలవంటి కుచాలమీద వ్రాలే కాముకులుగా దీపించారు.

నానారాజుల నెత్తురు ద్రావు కోరికతో పరవశములై పెనుబొబ్బలు పెట్టు పిశాచబృందాలు వర్షమో వర్షమో అని పలవరించే చాతకాలుగా ద్యోతక మయినాయి. అమోఘ యుద్ధప్రేరకు డయిన బలరాముడు వర్షానికి కారణమైన మందమారుత మయినాడు. ఘోరవిలయ సమయంలోని కారుమబ్బుకైవడి ప్రకాశించే శరీరచ్ఛాయ గల కమలనాభుడు శత్రువులకు సంబంధించిన రథగజాశ్వపదాతుల దేహాలనే భూములందు పుంఖానుపుంఖంగా లెక్కింపరాని పలురకాలైన దివ్యశరాలు అనే వర్షం కురిపించాడు.

అలా అతడు శరవర్షం కురిపించేటప్పుడు శస్త్రాస్త్రముల రాపిడికి పుట్టిన నిప్పురవ్వలు వానకారులోని మిణుగురు పురువులుగా నెగడినాయి. బాణాలచే చెదరిన వీరుల కిరీటములందు తాపబడిన పద్మరాగమణి ఖండాలు ఆరుద్ర పురుగుల మాదిరి ఉండినాయి. గొప్పతూపులచే చీల్చబడిన మదగజ కుంభాలలోని ముత్యాలు వడగండ్లుగా ఉండినాయి. తీవ్రము లయిన అర్ధచంద్ర బాణాలచే కాళ్ళు ఖండింప బడగా కృష్ణా కృష్ణా నిలు నిలుమని పలుకుతూ నేలపై గూలుతున్న శరీరాలు సేద్యగాండ్ర చేతులలోని గండ్రగొడ్డళ్ళచే నరకబడి కూలుతున్న పెనువృక్షాలుగా ఉండినాయి. వాడిబల్లెములచే భగ్నము లయిన గుహలవంటి నోళ్ళనుంచి రాలుతున్న దంతముల సమూహం మొల్లపూగుత్తులుగా ఉండినాయి. నిశితబాణాలు నాటిన శరీరాలు గలవై క్రొత్త గాయాలనుండి పిలపిల నెత్తురు ప్రవహింపగా, తిరుగలేక ప్రాణాలు విడిచే ఏనుగులు, సెలయేళ్ళతో కూడిన కొండలుగా ఉండినాయి. కర్కశములైన శరాలచే ఖండింపబడిన బాహుదండాలతో కలసి నేలపై బడిన వజ్రమయ కంఠాభరణాలు పాము పడగలతో కూడిన మొగలిపూలు అయినాయి.

ప్రళయకాలమందలి సముద్రతరంగఘోషకు సాటివచ్చే భేరీస్వనాలు దారుణమైన కప్పల బెకబెక ధ్వను లయినాయి. భీషణము లయిన బాణములచే కోయబడిన గుఱ్ఱముల, ఏనుగుల, మనుష్యుల మెదడు రొంపియై సొబగుమీరింది. భయంకరమైన నెత్తురువెల్లువలు ప్రవహించాయి. ఆ ప్రవాహంలో బాహువులు పాములుగా, తలపుఱ్ఱెలు తాబేళ్ళుగా, తలవెండ్రుకలు నాచుగా, చేతులు చేపలుగా, గుఱ్ఱాలు మొసళ్ళుగా, ఏనుగులు దీవులుగా, తెల్లగొడుగులు నురుగులుగా, వింజామరలు రాయంచలుగా, ఆభరణ రత్నాల ధూళులు ఇసుక తిన్నెలుగా ఎసగినాయి.

**లయవిభాతి.**

> **హసిత హరినీలనిభ వసనము విశాలకటి నసమనయనాద్రి పరిలసిత మేఘో**
> **ల్లసనము వహింపఁ గరకిసలయము హేమమణి విసర వలయ ద్యుతులు దెసల తుదలందున్**
> **బసలు గురియంగ సరభసమున బలుండు దరహసితము ముఖాబ్జమున నెసఁగ ఘనకాలా**
> **యస మయ మహోగ్రతర ముసలము వడిన్ విసరి కసిమసఁగి శత్రువుల నసువులకుఁ బాపెన్. 1562**

* బలరాముని విశాలమైన కటిప్రదేశంలో ఇంద్రనీలమణితో సమానమైన నీలాంబరం కైలాసగిరి యందు లెస్సగా ప్రకాశించు మేఘంవలె చెలువు గులికింది. అతని చిగురుటాకులవంటి చేతులకు గల కనక ఖచిత రత్నకంకణముల కాంతులు దిగంతములందు ఇంపెసలారాయి. బలభద్రుడు పద్మమువంటి మోమున చిరునవ్వు చెలువొందగా దృఢమైన ఇనుముతో నిర్మింపబడి మిక్కిలి భయ మొదవించే తన రోకలిని మహావేగంతో గిరిగిర త్రిప్పుతూ విజృంభించి విరోధుల ప్రాణాలు హరించాడు.

**లయవిభాతి.**

> **ప్రలయసమయాంతకుని చెలువునఁ గటాక్షముల నలఘు చటులాగ్ని కణములు సెదరఁ గోలా**
> **హలముగ సువర్ణ మణివలయ నిచయోజ్జ్వలిత హలము వడిఁ జాచి శిరములు నురములు న్ని**

**ర్దలితములుగన్ శకలములుగ నొనరింపఁ గని బెలుకుఁటి జరాసుతుని బలము రణవీథిన్**
**జలితదనుజావలికి బలికి భయభీత సుర ఫలికిఁ ద్రిజగచ్ఛలికి హలికిఁ దల డించెన్. 1563**

* రక్కసుల గుంపును కలవరపెట్టువాడు, ప్రబలమైన బలము గలవాడు, భయత్రస్తులకు కల్పవృక్షము వంటివాడు, ముల్లోకాలను గడగడలాడించేవాడు, హలాయుధమును ధరించేవాడు అయిన బలరాముడు ప్రళయకాల యమునిచందంగా ప్రకాశించాడు. అతని కడగన్నులందు మిక్కిలి భయంకరములైన నిప్పు రవ్వలు గుప్పుగుప్పున వెలువడినాయి. కనకరత్న ఖచితములైన కడియాల చుట్టలచే శోభిల్లు తన ఇనుప నాగలిని వేగంగా విసరుతూ అతడు విరోధుల తలలు రొమ్ములు చీల్చి ముక్కలు ముక్కలు చేశాడు. అది చూచి జరాసంధుడి సైన్యం భయంతో విలవిలలాడుతూ రణరంగంలో తల్లడిల్లింది.

**శా. రోషోద్రేక కళాభయంకర మహారూపంబుతో నొక్కచే**
**నీషాదండము సాఁచి లాంగలము భూమీశోత్తమగ్రీవలన్**
**భూషల్ రాలఁ దగిల్చి రాఁదిగిచి సంపూర్ణోద్ధతిన్ రోఁకటన్**
**వేషంబుల్ సెడ మొత్తె రాముఁడు రణోర్విన్ నెత్తురుల్ జొత్తిలన్. 1564**

* బలరాముడు కోపవిజృంభణంతో మహాభయంకరమైన రూపంతో విలసిల్లినాడు. ఒకచేతితో ఏడి కోల సాచి నగలు రాలిపడేటట్లు నాగలిని ఆ రాజశ్రేష్ఠుల మెడకు తగిలించి దగ్గరకు లాగినాడు. అమితదర్పంతో వారివేషాలు చెరచి రణరంగంలో నెత్తురులు పారేటట్లు మరొకచేతిలోని రోకలితో నెత్తిపై మొత్తినాడు.

**క. హలిహలహృత కరికుంభ, స్థలముక్తాఫలము లోలిఁ దనరెఁ గృషిక లాం**
**గల మార్గ కీర్ణ బీజా, వలి కైవడి నద్భుతాహవక్షేత్రమునన్. 1565**

* అచ్చెరువు కలిగించు ఆ యుద్ధభూమియందు బలభద్రుని నాగటిచే బద్దలు కొట్టబడిన ఏనుగు కుంభస్థలము లందలి ముత్యాలు నేల రాలి కర్షకుల నాగటిచాళ్ళలో చల్లబడిన విత్తనాల విధంగా విలసిల్లినాయి.

**క. తఱిమి హలి హలము విసరుచు, నెఱిఁ గదిసిన బెగడి విమత నికరము లెడలై**
**వెఱఁగుపడు నొదుఁగు నడఁగును, మఱుపడుఁ జెడు మడియుఁ బొరలు మరలుం దెరలున్. 1566**

* బలభద్రుడు తరుముతూ, తన నాగలిని త్రిప్పుతూ సమీపించగా శత్రుసమూహాలు భయపడి దూరంగా పారిపోతాయి. ఆశ్చర్యం పొందుతాయి. ప్రక్కకు తొలగుతాయి. లోపడుతాయి. చాటుకు పోతాయి. చెడిపోతాయి. చనిపోతాయి. నేలబడి పొరలుతాయి. వెనుకకు మరలిపోతాయి. కలత చెందుతాయి.

**క. హరి తిగ్మగోశతంబుల, హరిదంతర మెల్లఁ గప్పు నాకృతిఁ గడిమిన్**
**హరితిగ్మగోశతంబుల, హరిదంతర మెల్లఁ గప్పె నతిభీకరుఁడై. 1567**

* సూర్యుడు వందలకొలది వాడికిరణాలచే దిగంతాలను కప్పేవిధంగా పరాక్రమశాలి అయిన శ్రీకృష్ణుడు మిక్కిలి భయంకరుడై వందలకొలది వాడి అమ్ములతో దిగంతాలను కప్పివేశాడు.

సీ. పదుగు రేగురు దీర్ఘబాణముల్ గాఁడిన గుదులు గ్రుచ్చినభంగిఁ గూలువారు
దలలు ద్రెవ్విన మున్ను దారు వీక్షించిన వారల నొప్పించి వ్రాలువారు
పదములు దెగిపడ్డ బాహులఁ బోరి నిర్మూలితబాహులై మ్రొగ్గువారు
క్షతముల రుధిరంబు జల్లింప నిర్ఝరయుత శైలములభంగి నుండువారు

ఆ. భ్రాతృ పుత్త్ర మిత్ర బంధువుల్ వీఁగిన, నడ్డ మరుగుదెంచి యణఁగువారు
వాహనములు దెగిన వడి నన్యవాహనా, ధిష్ఠు లగుచు నెదిరి త్రెళ్ళువారు. 1568

* నిడుపైన నారాచములు నాటగా పదిమంది ఐదుమంది వంతున గుదులు గ్రుచ్చినట్లుగా కూలుతున్నారు కొందరు. తలలు తెగిపడగా పూర్వం తాము చూచిన వారిని బాధించి మరికొందరు వ్రాలుతున్నారు. కాళ్ళు తెగిపడినప్పటికీ చేతులతో పోరాడి అవికూడ తునిగిపోగా మ్రొగ్గుతున్నారు వేరొక కొందరు. గాయాలనుండి నెత్తురు చిందుతుండగా సెలయేళ్ళతో గూడిన శైలాలవలె ఇంకకొందరున్నారు. సోదరులు, పుత్రులు, స్నేహితులు, చుట్టాలు ఓడిపోగా అడ్డమువచ్చి కొందరు హత మవుతున్నారు. గుఱ్ఱములు తెగిపడగా వెంటనే ఇతర హయములు ఎక్కి వచ్చి ఎదిరించి మరికొందరు మరణిస్తున్నారు.

వ. మఱియును. 1569

శా. ఈ కాయంబులఁ బాసినంతటనె మా కెగ్గేమి? జేతృత్వమున్
నీకుం జెల్లదు కృష్ణ! నిర్జరులమై నిన్నోర్తు మామీఁదటన్
వైకుంఠంబున నంచుఁ బల్కుక్రియ దుర్వారాస్త్ర భిన్నాంగులై
యాకంపింపక కొంద ఱాడుదురు గర్వాలాపముల్ కృష్ణునిన్. 1570

* ఇంకనూ మరికొందరు కృష్ణా! ఈ శరీరాలు విడిచినమాత్రాన మాకు కలిగే కీడు ఏమీ లేదు. నీకు విజయం లభించడం కల్ల. ఎందుకనగా మేము చచ్చి ఆ మీద అమరులమై వైకుంఠంలో నిన్నోడిస్తాము అంటూ వారింపరాని శస్త్రాలచే ఛేదింపబడిన కాయములు కలవారై, ఏమియు చలింపక కొందరు శ్రీకృష్ణునితో గర్వోక్తులాడినారు.

వ. ఇ వ్విధంబున. 1571

క. జగదీశ! యేమి సెప్పుదు?, నగణిత లయవార్ధి భయదమై మూఁగిన య
మ్మగధేశుబలము నెల్లను, దెగఁ జూచిరి హరియు హలియుఁ దీవ్రక్రీడన్. 1572

*ఈ లాగున పరీక్షిన్మహారాజా! ఏమని చెప్పేది? ప్రళయకాల సాగరంవలె భయజనకమై చుట్టుముట్టిన ఆ మగధరాజు సైన్యమంతటినీ శ్రీకృష్ణుడూ బలరాముడూ అవక్రవిక్రమంతో చక్కాడినారు.

క భువన భవస్థితివిలయము, లవలీలం జేయు హరికి నరినాశన మెం
త విషయమైన మనుజుఁడై, భవ మొందుటఁ జేసి పొగడఁబడియెం గృతులన్. 1573

* లోకములను అవలీలగా పుట్టించనూ, పెంచనూ, గిట్టించనూ, శక్తిమంతుడైన నారాయణునకు శత్రునాశన మొనర్చుట ఒక లెక్కలోనిది కాదు. మానవుడై పుట్టినందున కావ్యములందు అలా శ్లాఘింప బడినాడు. మరేమియు కాదు.

వ. ఆ సమయంబున. 1574

శా. అంహఃకర్మలు తల్లడిల్ల భయదాహంకారుఁడై సీరి దో
రంహం బొప్ప హలాహతిన్ రథ ధనూరథ్యంబులం గూల్చి త
త్సంహారస్పృహఁ జొచ్చి పట్టెను జరాసంధున్ మదాంధున్ మహా
సింహంబుం బ్రతిసింహముఖ్యము బలశ్రీఁ బట్టు నేర్పేర్పడన్. 1575

* ఆ సమయంలో పాపకర్మలు తల్లడిల్లునట్లు బలరాముడు విరోధులకు వెరపు కలిగించే గర్వంతో బహువేగంగా నాగటిపోటులతో అరదాలనూ, ధనుస్సులనూ, గుఱ్ఱాలనూ కూల్చివేశాడు. శత్రుసంహారమందలి కాంక్షతో మహాసింహ మొకటి ప్రత్యర్థి అయిన మరో సింహాన్ని పట్టుకునే నేర్పు తేటపడగా కావరంతో కన్నుగానని జరాసంధుణ్ణి ముందు కురికి అతడు పట్టుకొన్నాడు.

వ. ఇట్లు పట్టుకొని. 1576

ఉ. కుంఠితులై పరుల్ బెగడ ఘోరబలుండు బలుండు వాని సో
ల్లుంఠము లాడుచున్ దిగిచి లోకభయంకరమైన ముష్టిచేఁ
గంఠగతాసుఁ జేసి తమకంబున మొత్తఁగ భూభర క్షయో
త్కంఠుఁడు చక్రి మీఁదెఱిఁగి కార్యము గల్దని మాన్పి యిట్లనున్. 1577

* అలా పట్టుకొని శత్రువులు చెదరి బెదరిపోగా భయంకర బలశాలి అయిన బలభద్రుడు వానిని ఎత్తి పొడుపు మాటలతో పడమొత్తి లాగి, లోకాలకు వెరపు కలిగించే తన పిడికిటి పోటుతో కంఠగతప్రాణుణ్ణి గావించాడు. భూభార మడగింప నెంచిన చక్రాయుధుడు భావికార్యం తలపోసి జరాసంధవధ మాన్పి మాగధునితో ఇట్లన్నాడు.

శా. దుఃఖింపం బనిలేదు; పొమ్ము; బలసందోహంబులం దెమ్ము; చే
తఃఖేదం బెడలంగ రమ్ము; రిపులం దండింపు; కాదేని భూ
స్వఃఖేలజ్జన మెల్ల మెచ్చ నృప! నీ శౌర్యోన్నతుల్ సూపి మే
దఃఖండంబులు భూతముల్ దినఁ దనుత్యాగంబు సేయం దగున్. 1578

* ఓ నరపతీ! నీవు దుఃఖింప నవసరంలేదు. పొమ్ము. నీ సేనలను కూర్చుకొని మనోవ్యథ తొలగునట్లు మరల రమ్ము, వైరులను శిక్షింపుము. అలా చేయలేకపోతే భువియందు, దివియందు విహరించే జనులు మెచ్చునట్లు నీ పరాక్రమాతిశయం చాటి నీ మెదడు ముక్కలు పిశాచాలు తినేలా, నీ దేహాన్ని వదలిపెట్టు. అలా చేయడం మంచిది.

వ. అని నగుచు విడిపించిన, చిడిముడికి నగ్గలం బయిన సిగ్గున గ్రుగ్గి నెమ్మొగంబు సూపక, కోప కపట భావంబులు మనంబునం బెనంగొనఁ దపంబు చేసియైన వీరలం జయించెద నని, పలా యితులైన రాజులం గూడుకొనుచు జరాసంధుఁడు విఱిగి చనియె; సురలు గుసుమ వర్షంబులు గురియ హలియు హరియును మథురానగర జనవంది మాగధ జేగీయమానులై వీణా వేణు మృదంగ శంఖ దుందుభి నినదంబు లాకర్ణించుచు, మృగమద జలసిక్త విమలవీథికా శతంబును, వివిధ విచిత్ర కేతనాద్య లంకృతంబును, సువర్ణమణిమయ జయస్తంభ నిబద్ధతోరణ సంయుతంబును,వేద నాద నినాదితంబును, సంతుష్టజన సంకుల గోపురంబును నైన పురంబును బ్రవేశించిరందు. 1579

* అని పలికి నవ్వుతూ వాణ్ణి విడిచిపుచ్చాడు. వాడేమో తొట్రుపాటును మించిన సిగ్గుతో కుమిలిపోయి మొగ మెత్తుకోలేక కోపం, కుటిలత్వం మనసులో మెలివడగా తపస్సు చేసి అయినా వీళ్ళను జయించాలి అనుకున్నాడు. పారిపోయిన పార్థివసమాజంతో కూడి మరలిపోయాడు. అపుడు దేవతలు బలరామకృష్ణుల మీద పూలవాన కురిపించారు. బలరాముడు, శ్రీకృష్ణుడు తమ్ము మథురానగరవాసులూ, వందిమాగధులూ కీర్తింపగా వీణలు, వేణువులు, మృదంగాలు, శంఖాలు, దుందుభులు మొదలైన మంగళతూర్యారావాలు ఆలకిస్తూ పురప్రవేశం చేశారు. అపుడు మథురానగరవాసులు వీథులను శుభ్రంగా చిమ్మి కస్తూరి కలిపిన నీళ్లతో తడిపినారు. అనేక విచిత్రములైన జెండాలు మున్నగు వాటితో పుర మలంకరించారు. కనకరత్న మయములైన విజయస్తంభాలకు తోరణాలు కట్టినారు. ఊరంతా వేదధ్వనులతో ప్రతిధ్వనించింది. సంతుష్ట హృదయులైన ప్రజలతో ఆ పట్టణపు వాకిళ్ళు కళకళలాడినాయి.

ఉ. వెల్లువలైన వైరినృపవీరుల నెల్ల జయించి వీటికిన్
బల్లిదులైన కృష్ణబలభద్రులు వచ్చుచు నున్న వారు రం;
డుల్లములారఁ జూత మని యున్నత సౌధము లెక్కి వారిపైఁ
బల్లవ పుష్ప లాజములు పౌరపురంధ్రులు సల్లి రెల్లెడన్. 1580

* 'వెల్లువలా పెల్లుబికి వచ్చిన వీరులయిన శత్రురాజు లందరినీ జయించి బలవంతులైన బలరామ కృష్ణులు విజయం చేస్తున్నారు. రండి రండి మనసార దర్శిద్దాము' అని ఎత్తైన మేడలెక్కి పురస్త్రీలు వారి మీద చిగుళ్లూ, పూలు, సేసలూ చల్లినారు.

## -: కాల యవనుండు శ్రీకృష్ణుని మీఁద దండెత్తి మథురాపురమును ముట్టడి వేయుట :-

వ. ఇట్లు పురంబు ప్రవేశించి యుద్ధప్రకారం బెల్ల నుగ్రసేనున కెఱింగించి కృష్ణుం డిచ్ఛావిహారంబుల నుండె; మఱియు నెక్కువ మత్సరంబున నమ్మాగధుండు మహీమండలంబునం గల దుష్టమహీపతుల నెల్లం గూడికొని సప్తదశవారంబులు సప్తదశాక్షౌహిణీబల సమేతుండై మథురానగరంబుపై విడిసి, మాధవభుజా ప్రకార రక్షితు లగు యాదవులతోడ నాలంబు సేసి, నిర్మూలిత బలుండై పోయి క్రమ్మఱ నష్టాదశ యుద్ధంబునకు వచ్చునెడం గలహవిద్యా విశారదుం డగు నారదుండు కాలయవను కడకుం జని యిట్లనియె. 1581

* ఈలా రామకృష్ణులు పట్టణంలో ప్రవేశించారు. యుద్ధ మెలా జరిగిందో ఉగ్రసేన మహారాజుకు తెలిపి శ్రీకృష్ణుడు యథేచ్ఛావిహారాలతో ఉండినాడు, కాని, జరాసంధుడు పెనుమచ్చరంతో భూవలయంలోని దుష్టరాజు లందరినీ చేర్చుకొని పది హేడు సారులు పదిహేడు అక్షౌహిణుల సేనతో మథురపై దండెత్తినాడు. మాధవుని భుజములనే ప్రాకారాలతో పరిరక్షితులైన యాదవులతో అతడు కయ్యం గావించాడు. తడవ తడవకూ తన బలము లన్నీ నశించి పోయినప్పటికీ జరాసంధుడు మళ్ళీ పదునెనిమిదవ పర్యాయం కదనానికి సిద్ధపడి కదలి వస్తుండగా కలహవిద్యలో ఆరితేరిన నారదుడు కాలయవనుడి దగ్గరకు వెళ్ళి యిట్లన్నాడు.

**మ. యవనా! నీవు సమస్త భూపతుల బాహాఖర్వ గర్వోన్నతిం**
**బవనుం డభ్రములన్ హరించు పగిదిన్ భంజించియు న్నేల యా**
**దవులన్ గెల్వవు? వారలన్ మఱచియో? దర్పంబు లేకుండియో?**
**యవివేకస్థితి నొందియో? వెఱచియో? హైన్యంబునుం జెందియో? 1582**

* ఓ కాలయవనా! వాయువు వారిదములను ఎగురగొట్టే విధంగా నీవు సకలరాజులను భుజగర్వాతి శయంతో విరిచివేసికూడా ఎందుకు యాదవులను జయించకుండా ఉన్నావు? వాళ్లను మరచిపోయావా? దర్పం లేకనా? అవివేకమా? భయమా? లేక అల్పత్వమా?

**క. యాదవులలోన నొక్కఁడు, మేదినిపై సత్త్వరేఖ మెఱసి జరాసం**
**ధాదులఁ దూలన్ దోలెన్, దాదృశుఁ డిల లేఁడు వినవె తత్కర్మంబుల్. 1583**

* యాదవులలో ఒకడు బలాధిక్యంతో పుడమిపై తేజరిల్లుతూ జరాసంధుడు మున్నగు వారిని తొలగ గొట్టినాడు. అట్టివా డీ భూమిలో మరొక్కడు లేడు. అతని కృత్యములు నీవు వినలేదా?

**వ. అనిన విని, కాలయవనుం డిట్లనియె. 1584**

* ఆ మాటలు విని కాలయవనుడు ఇట్లన్నాడు.

**శా. ఏమీ! నారద! నీవుచెప్పిన నరుం డే రూపువాఁ? డెంతవాఁ?**
**డే మేరన్ విహరించు? నెవ్వఁడు సఖుం? డెందుండు? నేపాటి దో**
**స్సామర్థ్యంబునఁ గయ్యముల్ సలుపు? నన్మద్బాహుశౌర్యంబు సం**
**గ్రామక్షోణి భరించి నిల్వఁగలఁడే? గర్వాఢ్యుఁడే? చెప్పుమా! 1585**

* ఏమేమీ! నారదా! నీవు చెప్పిన ఆ మానవుడు ఎట్టివాడు? ఎంతటివాడు? ఏ తీరున వ్యవహరిస్తాడు? ఎక్క డుంటాడు? వానికి మిత్రు డెవడు? ఏపాటి భుజబలంతో యుద్ధం చేయగలడు? మా బాహుపరాక్రమమునకు తాళి రణరంగంలో ఎదురొడ్డి నిలువగలడా? దర్పోద్ధతుడేనా? చెప్పు.

**వ. అనిన విని, దేవముని యిట్లనియె. 1586**

* అతని మాటలకు దేవర్షి అయిన నారదు డిట్లన్నాడు.

సీ. నీలజీమూత సన్నిభ శరీరమువాఁడు తామరసాభనేత్రములవాఁడు
పూర్ణేందుబింబంబుఁ బోలెడి మోమువాఁ డున్నత దీర్ఘబాహువులవాఁడు
శ్రీవత్సలాంఛనాంచిత మహోరమువాఁడు కౌస్తుభమణి పదకంబువాఁడు
శ్రీకర పీతకౌశేయ చేలమువాఁడు మకరకుండలదీప్తి మలయువాఁడు

తే. రాజ! యింతంతవాఁ డనరాని వాఁడు, మెఱసి దిక్కుల నెల్లను మెఱయువాఁడు
తెలిసి యే వేళ లందైన నఁ దిరుగువాఁడు, పట్టనేర్చినఁ గాని లోఁబడనివాఁడు. 1587

* యవనేశ్వరా! విను. అతడు నల్లని మేఘంవంటి దేహం కలవాడు. తామరపూలవంటి కండ్లు కలవాడు. పూర్ణచంద్రబింబంవంటి ముఖం కలవాడు. పొడవైన ఎగుభుజాలు కలవాడు. శ్రీవత్సమనే పుట్టుమచ్చతో పొలుపారు విశాలవక్షం కలవాడు. అతడు కౌస్తుభమణి ధరిస్తాడు. సంపత్కరమైన పసుపుపచ్చని పట్టు పుట్టాలు కడతాడు. చెవులందు మకరకుండలాలు కలవాడు. ఇంతవాడు, అంతవాడు అని చెప్ప శక్యం కానివాడు.అన్ని దిక్కులలో నిండి ప్రకాశించేవాడు. ఎల్లవేళలందును సంచరించేవాడు. పట్టనేరిస్తేనే గాని లోపడనివాడు.

వ. అని మఱియు నతని లక్షణంబులు చెప్పిన విని, సరకుసేయక యవనుం డిట్లనియె. 1588

* అని మరీ మరీ వర్ణించి నారదుడు శ్రీకృష్ణుని లక్షణాలు చెప్పగా విని లెక్కచేయక కాలయవను డిట్లన్నాడు.

ఉ. యాదవుఁ డెంతవాఁడు ప్రళయాంతకుఁడైన నెదిర్చె నేనియున్
గాదనఁ బోర మత్కలహ కర్కశ బాహుధనుర్విముక్త నా
నా దృఢ హేమపుంఖ కఠిన జ్వలదస్త్ర పరంపరా సము
త్పాదిత వహ్నికీలముల భస్మముఁ జేసెదఁ దాపసోత్తమా! 1589

* ఓ మునిపుంగవా! యాదవు డనగా నెంతవాడు? ప్రళయకాల యము డైనప్పటికి నన్నెదిరిస్తే కాదని చెప్పను. కదనంలో కఠినమైన నా బాహువులనుంచి వెలువడే గట్టి బంగారు పింజలు గల పలువిధాలైన నిశితాస్త్ర పరంపరలు జనింపజేసే అగ్నిజ్వాలలలో అతణ్ణి బూది గావిస్తాను.

వ. అని పలికి కాలయవనుండు మూఁడుకోట్ల మ్లేచ్ఛవీరులం గూడుకొని, శీఘ్రగమనంబున దాడివెడలి, మథురాపురంబుమీఁద విడిసినం జూచి, బలభద్రసహితుం డయి కృష్ణుం డిట్లని వితర్కించె. 1590

* ఈ విధంగా నారదునితో వీరోక్తులాడి కాలయవనుడు మూడుకోట్ల మ్లేచ్ఛవీరులను కూర్చుకుని వేవేగ దాడి వెడలి మథురానగరాన్ని ముట్టడించాడు. అది చూచి బలరామునితో శ్రీకృష్ణుడిలా ఆలోచించాడు.

## -: విశ్వకర్మ కృష్ణ నియోగంబున సముద్రములో ద్వారకా నగరమును నిర్మించుట :-

సీ. యవనుండు పురమెల్ల నావరించెను నేఁటి యెల్లింటిలోపల నీ నడుమను
మాగధుండును వచ్చి మనమీఁద విడియును యవన మాగధులు మహాప్రబలులు

పురి రెండువంకలఁ బోరుదు రట్టిచో నోపినభంగి నొక్కొక్కచోట
మనము యుద్ధము సేయ మఱియొక్కఁ డెడసొచ్చి బంధుల నందఱఁ బట్టి చంపు

తే. నొండెఁ గొనిపోయి చెఱఁబెట్టు నుగ్రకర్ముఁ, డైన మాగధుఁ; డదిగాన నరివరులకు
విడియఁ బోరాడఁగా రాని విషమభూమి, నొక్కదుర్గంబు సేసి యం దునుపవలయు. 1591

* యవనుడు పట్టణాన్ని ముట్టడించాడు. నేడో, రేపో, ఎల్లుండో మాగధుడు కూడా మనమీద దాడి సల్పుతాడు. కాలయవనుడు, జరాసంధుడు మిక్కిలి బలవంతులు. వారు పురం రెండు వైపుల జేరి పోరాడుతారు. అపుడు శక్తికొలది మన మొకచోట యుద్ధం చేస్తున్నప్పుడు, మరొకడు సందుచూచుకొని వచ్చి మనచుట్టా లందరినీ పట్టి చంపవచ్చు. లేదా పట్టుకొనిపోయి చెరబెట్టవచ్చు. జరాసంధుడు క్రూరకర్ముడు. కాబట్టి వైరులు దండు విడియుటకు, పోరుసల్పుటకు వీలుగాని విషమప్రదేశంలో ఒక దుర్గం నిర్మించి అందులో మనవారి నందరినీ ఉంచాలి.

వ. అని వితర్కించి సముద్రు నడిగి సముద్రమధ్యంబునఁ బండ్రెండు యోజనంబుల నిడుపు, నంతియ వెడల్పుం గల దుర్గమప్రదేశంబు సంపాదించి, తన్మధ్యంబునం గృష్ణుండు సర్వాశ్చర్యకరంబుగ నొక్క నగరంబు నిర్మింపు మని విశ్వకర్మం బంచిన. 1592

* అని ఆలోచించి శ్రీకృష్ణుడు సముద్రుణ్ణి అడిగి సాగరమధ్యంలో పండ్రెండు ఆమడల పొడవు, అంతే వెడల్పుగల ఒక దుర్గమప్రదేశాన్ని సంపాదించాడు. దానిమధ్య సర్వజనులకు అచ్చెరువు కూర్చునట్టి ఒకపట్టణం నిర్మించుమని దేవశిల్పి అయిన విశ్వకర్మను ఆజ్ఞాపించాడు.

ఆ. వరుణపురముకంటె వాసవు పురికంటె, ధనదువీటికంటె దండధరుని
నగరికంటె బ్రహ్మనగరంబుకంటెఁ బ్ర, స్ఫుటముగాఁగ నొక్క పురముఁ జేసె. 1593

* వరుణుడు, దేవేంద్రుడు, కుబేరుడు, యముడు, బ్రహ్మ- వీరి పట్టణాలకంటె దృఢముగా విశ్వకర్మ సముద్రమధ్యంలో ఒక పురం నిర్మించాడు.

వ. అందు. 1594

క. ఆకసము తోడిచూ లనఁ, బ్రాకారము పొడవు గలదు పాతాళమహా
లోకముకంటెను లోఁతెం, తో కల దా పరిఖ యెఱుఁగ దొరక దొకరికిన్. 1595

* ఆ పట్టణంలో ప్రాకారం ఆకసానికి అప్పజెల్లెలుగా ఉంది. కందకం పాతాళంకంటె లోతయినది. దానిలోతు ఎంతో ఎవరికీ అంతు చిక్కదు.

క. కోటయు మిన్నును దమలోఁ, బాటికి జగడింప నడ్డపడి నిల్చిన వా
చాటుల రుచిఁ దారకములు, కూటువలై కోటతుదలఁ గొమరారుఁ బురిన్. 1596

* ఔన్నత్యవిషయమున కోటయు, ఆకాశము కలహించుకోగా అడ్డుపడి నిలిచిన వదరుబోతులవలె కోట అగ్రభాగాన చుక్కల గుంపులు ప్రకాశిస్తుంటాయి.

శా. సౌధుద్వార కవాట కుడ్య వలభి స్తంభార్గళా గేహాళీ
వీథీవేది గవాక్ష చత్వర సభావేశ్మ ప్రఘాణ ప్రపా
సౌధాట్టాలక సాల హర్మ్య విశిఖా సోపాన సంస్థానముల్
శ్రీధుర్యస్థితి నొప్పుఁ గాంచనమణి స్నిగ్ధంబులై య ప్పురిన్. 1597

* ఆ పురమందు చక్కని ద్వారములతో, తలుపులతో, గోడలతో, ముంజూరులతో, స్తంభములతో, గడియలతో, గడపలతో, వీథియరుగులతో, కిటికీలతో, ముంగిళ్ళతో, చావళ్ళతో, వాకిటి గదులతో, పానీయ శాలలతో కూడిన సౌధములు, కోటబురుజులు, ప్రాకారములు, మేడలు, రాజమార్గములు, సోపానములు హేమరత్నమయములై శోభాసమృద్ధితో సొంపారుతుంటాయి.

క. కూడి గ్రహంబులు దిరుగఁగ, మేడలతుది నిలువులందు మెలఁగెడి బాలల్
క్రీడింపరు పురుషులతో, వ్రీడం దద్వేళలందు విను మా వీటన్. 1598

* ఆ పట్టణపు మేడల చివరి అంతస్తులలో సూర్యాదిగ్రహములు సంచరిస్తూండటంవల్ల ఆ సమయాలలో అక్కడ నివసించే కన్యలు సిగ్గుచేత పురుషులతో క్రీడించడం మానివేస్తారు.

ఉ. ఆయతవజ్ర నీలమణి హాటకనిర్మిత హర్మ్యసౌధ వా
తాయనరంధ్ర నిర్యదసితాభ మహాగరు ధూపధూమముల్
తోయదపంక్తులో యనుచుఁ దుంగమహీరుహ రమ్యశాఖలం
జేయుచు నుండుఁ దాండవవిశేషము లప్పురిఁ గేకిసంఘముల్. 1599

* ఆ నగరంలో విరివియగు వజ్రాలు, ఇంద్రనీలమణులు, బంగారం అనేవాటితో కట్టిన మేడల, మిద్దెల కిటికీలనుంచి నల్లని అగరు ధూపధూమాలు వెలువడుతూంటవి. అవి మేఘమాలికలనే భ్రమ కలిగిస్తాయి. అందుచే అక్కడ ఎత్తయిన చెట్లకొమ్మలపై చేరి నెమిళ్ళగుంపులు నాట్యం చేస్తుంటాయి.

ఆ. సరస నడచుచుండి సౌధాగ్రహేమ కుం, భములలోన నినుఁడు ప్రతిఫలింప
నేర్పరింపలేక యినులు పెక్కం డ్రంచుఁ, బ్రజలు సూచి చోద్యపడుదు రందు. 1600

* సమీపాన సంచరిస్తుండి భవనోపరిభాగములందున్న బంగారు కలశాలలో సూర్యుడు ప్రతిబింబించగా చూచి నిర్ధారణ చెయ్యలేక సూర్యులు పలువు రున్నారని అక్కడి ప్రజలు భ్రమ చెందు తుంటారు.

ఉ. శ్రీరమణీయ గంధములఁ జెన్ను వహించుఁ బురీవనంబులం
గోరక జాలక స్తబక కుట్మల పుష్పమరందపూర వి
స్ఫార లతాప్రకాండ విటపచ్ఛద పల్లవ వల్లరీ శిఫా
సార పరాగమూల ఫలసంభృత వృక్షలతా విశేషముల్. 1601

* అక్కడి ఉద్యానవనాలలో నానావిధ వృక్షాలు, లతలు మదికి ఇంపుగొల్పుతూ, మొగ్గలతో, పసరు మొగ్గలతో, అరవిరి మొగ్గలతో, విచ్చిన పూలతో, తేనెలతో, బోదెలతో, కొమ్మలతో, ఆకులతో, చిగురాకులతో, పూచిన లేగొమ్మలతో, ఊడలతో, దట్టమైన పుప్పొడితో, వేళ్లతో, పండ్లతో కూడినవై కమ్మని సువాసనలు విరజిమ్ముతుంటాయి.

**క. శ్రీకరములు జనహృదయ వ, శీకరములు మందపవన శీర్ణమహాంభ**
**శ్శీకరములు హంస విహం, గాకరములు నగరి కువలయాబ్జాకరముల్. 1602**

* ఆ పురిలో కలువలతో, కమలములతో కూడిన సరస్సులు శ్రీకరములై, జనుల మనస్సులను వశీకరించు తున్నవై, పిల్లగాలులచే చెదరగొట్టబడిన విస్తారమైన నీటితుంపరలు గలవై, హంసలు మొదలైన పక్షులకు నివాసంగా ఉంటాయి.

**క. నవకుసుమామోద భరా, జవనము రతిఖిన్న దేహజ స్వేదాంభో**
**లవనము సమధిగతవనము, పవనము విహరించుఁ బౌరభవనములందున్. 1603**

* క్రొత్తపూల తావులను విరజిమ్ముతూ, సురతశ్రాంతుల శరీరాలమీది చెమట బిందువులను తొలగిస్తూ ఉద్యానవనాల నుంచి వస్తున్న మలయమారుతం ఆ పట్టణమందిరాలలో విహరిస్తుంది.

**క. బ్రహ్మత్వము లఘువగు నని, బ్రహ్మయు బిరుదులకు వచ్చి పట్టఁడుగా కా**
**బ్రహ్మదికళలఁ దత్పురి, బ్రహ్మజనుల్ బ్రహ్మఁ జిక్కుపఱుపరె చర్చన్. 1604**

* బ్రహ్మత్వము తేలిక అవుతుందని బ్రహ్మదేవుడు పంతాలకు రాడు గాని వస్తే ఆ వీటిలోని విప్రులు బ్రహ్మవిద్యాచర్చల్లో అతణ్ణి చిక్కుపరచగలరు.

**క. నగరీభూసుర కృత లస, దగణిత మఖధూమ పిహితమై కాక మహా**
**గగనము నీలం బగునే?, మిగులఁగ బెడఁగగునె గ్రహసమృద్ధం బయ్యున్. 1605**

* ఆ పురిలోని బ్రాహ్మణులు సలిపే యజ్ఞములందు పొడమిన హోమధూమం ఆవరించడం మూలాన ఆకాశం నల్లబడింది. అంతే కాని సూర్యచంద్రాది గ్రహాలతో కూడిన దైనను అంబరం అలా కావడానికి మరో కారణం లేదు.

**క. తిరుగరు పలు కర్థులకును, సురుఁగరు ధన మిత్తు రితరసుదతీమణులన్**
**మరగరు రణమునఁ బిఱిఁదికి, నరుగరు రాజన్యతనయు లా నగరమునన్. 1606**

* ఆ నగరంలోని రాజకుమారులు ఆడినమాట తప్పరు. అర్థిజనులకు ధన మిచ్చుటలో వెనుదీయరు. పరకాంతల పొందు కోరరు. సమరంలో వెనుకకు జారరు.

**క. రత్నాకరమై జలనిధి, రత్నము లీ నేర దేటి రత్నాకరమో?**
**రత్నములఁ గొనుదు రిత్తురు, రత్నాకరజయులు వైశ్యరత్నములు పురిన్. 1607**

* సముద్రము రత్నాలకు నిలయమని పేరుపడసిందే గాని ఎవరి కే రత్నా లివ్వదు. మరి అదేమి రత్నాకరమో! కాని ఇక్కడి వైశ్యరత్నాలు మాత్రం రత్నాలు కొంటారు, అమ్ముతారు. వారు నిజంగా రత్నాకరమునే జయించారు.

**క. తుంగంబులు కరహత గిరి,శృంగంబులు దానజల వశీకృత భంగీ**
**భృంగంబులు పటుశైల స, మాంగంబులు నగరి మత్తమాతంగంబుల్. 1608**

* ఆ నగరమందలి మదపుటేనుగులు ఎత్తయినవి. తొండాలచే కొండశిఖరాలనైనా పగులగొట్టగలవు. మదజలాలచే ఆడుతుమ్మెదలను మగతుమ్మెదలను వశపరచుకుంటాయి. అవి కొండలవంటి దేహాలు కలవి.

**క. ప్రియములు జితపవన మనో, రయములు కృతజయము లధికరమణీయ గుణా**
**న్వయములు సవినయములు ని, ర్భయములు హతరిపు చయములు పట్టణహయముల్. 1609**

* ఆ పురిలోని అశ్వాలు అందమైనవి. వాయువేగ మనోవేగాలను జయించినవి. విజయము చేకూర్చేవి. మిక్కిలి చక్కని గుణాలూ, జాతీ కలవి. అవి భయరహితములు; అణకువ గలవి; శాత్రవ సమూహాలను హతమార్చేవి.

**క. పులుల పగిదిఁ గంఠీరవ, ముల క్రియ శరభముల మాడ్కి ముదిత మదేభం**
**బుల తెఱఁగున నానావిధ, కలహమహోద్భటులు భటులు గల రా వీటన్. 1610**

* ఆ వీటిలోని వీరభటులు, పులులు, సింహాలు, శరభాలు, మత్తగజాల వంటివారు నానావిధ యుద్ధాలలో ఆరితేరినవారు.

**క. ఆ వీట నుండువారికి, భావింపఁగ లేవు క్షుత్పిపాసాదులు త**
**ద్గోవింద కృపావశమున, దేవప్రతిమాను లగుచు దీపింతు రిలన్. 1611**

* ఆ పట్టణంలోని ప్రజలకు ఆకలిదప్పులు లేవు. గోవిందుని కరుణావశమున వారు దేవతలతో సమానులై తేజరిల్లుతుంటారు.

**సీ. ఆసక్తి కృష్ణముఖావలోకనమంద హరిపాదసేవనమంద చింత**
**వెఱపు నారాయణ విముఖకార్యములంద పారవశ్యము విష్ణుభక్తియంద**
**బాష్పనిర్గతి చక్రిపద్య సంస్తుతులంద పక్షపాతము శార్ఙ్గిభక్తులంద**
**లేమి గోవిందాన్య లీలాచరణమంద శ్రమము గోవిందపూజనములంద**

**తే. బంధ మచ్యుతేతర దుష్టపథములంద, జ్వరము మాధవ విరహిత క్షణములంద**
**మచ్చరము లీశకైంకర్య మతములంద, నరవరోత్తమ! వినుము తన్నాగరులకు. 1612**

* పరీక్షిన్మహారాజా! విను, ద్వారకాపురిలో ప్రజలకు నందనందనుని వదనారవింద సందర్శనమందే అపేక్ష. గోవిందుని చరణాలు కొలుచుటలోనే వారు తలంపుగల్గి ఉంటారు. భగవద్విరుద్ధములైన పనులంటేనే

వారు భయపడతారు. విష్ణుభక్తియందే వారికి మైమరపు. చక్రధరునిపై పద్యాలల్లి ప్రస్తుతించుటయందే వారు ఆనందబాష్పాలు విడుస్తారు. శౌరిభక్తు లంటేనే వారి కభిమానం. అచ్యుతునికంటె అన్యములైన లీలలను ఆచరించుటయందే వారికి లేమిడి. పురుషోత్తముని పూజించుటయందే వారు శ్రమపడతారు. పరమాత్మను పొందించని కుమార్గములే వారికి చెర. క్షణకాలం పద్మనేత్రుని విడిచితే వారు పరితపించిపోతారు. పరమేశ్వరుని కైంకర్యము లందే వారికి పట్టుదల.

**వ. మఱియు న ప్పురవరంబున హరికిం బారిజాతమహీజంబును సుధర్మ యనియెడి దేవసభయును దేవేంద్రుం డిచ్చె. కర్ణైకదేశంబుల నలుపు గలిగి మనోజవంబులును, శుక్లవర్ణంబులు నైన తురంగం బుల వరుణుం డొసంగె. మత్స్య కూర్మ పద్మ మహాపద్మ శంఖ ముకుంద కచ్ఛప నీలంబులను నెనిమిది నిధులఁ గుబేరుండు సమర్పించె. నిజాధికార సిద్ధికొఱకుఁ దక్కిన లోకపాలకులును దొల్లి తమకు భగవత్కరుణా కటాక్షవీక్షణంబుల సంభవించిన సర్వసంపదల మరల నతిభక్తితో సమర్పించి రివ్విధంబున. 1613**

* మరియు శ్రేష్ఠమగు ఆ పట్టణంలో నివసించే శ్రీహరికి పారిజాతవృక్షమునూ, 'సుధర్మ' అనే దేవసభనూ దేవేంద్రు డిచ్చాడు. ఒక చెవిమాత్రమే నలుపురంగు గలిగి తక్కిన ఒడలెల్ల తెల్లనై, మనోవేగం కలిగిన గుఱ్ఱాలను వరుణు డిచ్చాడు. మత్స్యం, కూర్మం, పద్మం, మహాపద్మం, శంఖం, ముకుందం, కచ్ఛపం, నీలం అనే పేర్లుగల ఎనిమిది నిధులను కుబేరు డొసగినాడు. తక్కిన లోకపాలకు లందరూ తమ తమ అధికారాల సిద్ధికోసం మునుపు తమకు భగవంతుని అనుగ్రహంవల్ల లభించిన సకలవిభూతులను మరల అచ్యుతునికే అతిభక్తితో సమర్పించారు.

**క. దర్పించి చేసి పురము స, మర్పించెను విశ్వకర్మ మంగళగుణ సం**
**తర్పిత గహ్వరికిన్ గురు, దర్పితదుఃఖప్రవాహతరికిన్ హరికిన్. 1614**

* ఈ విధంగా విశ్వకర్మ పరమనైపుణ్యంతో పట్టణం నిర్మించి తన కల్యాణగుణాలతో ధరణిని సంతృప్తి పరచినవాడునూ, మహావిజృంభణం కలిగిన దుఃఖమనే ప్రవాహానికి నావవంటి వాడునూ అయిన శ్రీహరికి సమర్పించాడు.

**వ. ఇట్లు విశ్వకర్మ నిర్మితంబైన ద్వారకానగరంబునకు నిజయోగప్రభావంబున మథురాపురజనుల నందఱఁ జేర్చి, బలభద్రున కెఱింగించి తదనుమతంబున నందనవనము నిర్గమించు పూర్వదిగ్గజంబు పెంపున, మేరుగిరి గహ్వరంబు వెలువడు కంఠీరవంబు తెఱంగున, హరిహయ దిగంతరాళంబున నుదయించు నంధకార పరిపంథికైవడి మథురానగరంబు వెలువడి నిరాయుధుండై యెదురు వచ్చుచున్న హరిం గని. 1615**

* ఈ విధంగా విశ్వకర్మచే నిర్మింపబడిన ద్వారకాపట్టణానికి శ్రీకృష్ణుడు తన యోగమహిమచేత మథురానగరప్రజ లందరినీ చేర్చి బలభద్రునకు తెలిపినాడు. ఆయన అనుమతితో నందనవనం నుంచి

వెలువడే ఐరావతగజం మాదిరీ, మేరుపర్వత గుహనుంచి బయలు మెరసిన వీరకేసరిమాదిరీ, ప్రాగ్దిశయందు ఉదయించే ప్రభాకరుని మాదిరీ మాధవుడు మథురాపురం నుంచి వెలువడినాడు. అతడు ఆయుధాలు లేకుండా వస్తుండడం కాలయవనుడు చూచాడు.

### -: శ్రీకృష్ణుఁడు నిరాయుధుండై కాలయవనుఁడు వెంటనంటఁ బరువెత్తుట :-

**మ. కరిసంఘంబులు లేవు; రావు తురగౌఘంబుల్; రథవ్రాతముల్**
**పరిసర్పింపవు; రారు శూరులు; ధనుర్బాణాసి ముఖ్యాయుధో**
**త్కరముం బట్టఁడు; శక్రచాపయుత మేఘస్ఫూర్తితో మాలికా**
**ధరుఁ డొక్కం డదె నిర్గమించె నగరద్వారంబునం గంటిరే? 1616**

* అలా చూచి కాలయవనుడు తనవారితో ఇలా అన్నాడు. 'ఏనుగుల గుంపులు లేవు. గుఱ్ఱాల పౌజులు రావు. తేరుల బారులు నడువవు. శూరులు వెంటరారు. చాపము, బాణములు, ఖడ్గము మొదలగు ఆయుధాలు ధరింపడు. మెడలో హారం ధరించి ఇంద్రధనుస్సుతో గూడిన మేఘంవలె శోభిస్తూ పట్టణద్వారం నుంచి ఒంటరిగా వస్తున్న అతణ్ణి చూచారా?

**శా. ఎన్నే నయ్యె దినంబు లీ నగరిపై నేతెంచి పోరాటకున్**
**మున్నెవ్వండును రాఁడు వీఁడొకఁడు నిర్ముక్తాయుధుం డేగు దెం**
**చె న్నన్నోర్వఁగనో ప్రియోక్తులకునో శ్రీఁ గోరియో చూడుఁ డం**
**చు న్నాత్మీయజనంబుతోడ యవనేశుం డిట్లు తర్కింపఁగన్. 1617**

* ఈ మథురానగరిపైకి దండెత్తి ఎన్నోదినము లయినాయి. మును పెవ్వరూ ఇలా రాలేదు. ఆయు ధాలు విడిచి వీ డెవడో వస్తున్నాడు. నన్ను జయించడానికో, ప్రియంగా మాట్లాడటానికో, ఏదైనా సంపదను అడగటానికో తెలియకుండా ఉంది. చూడండి,' అంటూ ఆ యవనాధిపతి తన వారితో చర్చించాడు.

**క. విభులగు బ్రహ్మప్రముఖుల, కభిముఖుఁడై నడవకుండునట్టి గుణాఢ్యుం**
**డిభరాజగమన మొప్పఁగ, నభిముఖుఁడై నడచెఁ గాలయవనున కధిపా! 1618**

* ఓ పరీక్షిన్మహారాజా! బ్రహ్మ మొదలైన వేల్పులకుకూడా ఎదురు మొగమై ఏగనట్టి కల్యాణగుణ సంపన్నుడైన శ్రీకృష్ణుడు కరిరాజునడకవంటి నడకతో కాలయవనుడికి అభిముఖంగా నడిచాడు.

**వ. ఆ సమయంబున న య్యాదవేంద్రు నేర్పడం జూచి. 1619**

* అట్టి సమయాన యదునాయకుడైన శ్రీకృష్ణుని కాలయవనుడు తేరిపారజూచి తనలో ఇలా అనుకున్నాడు.

**మ. 'వనజాతాక్షుఁడు సింహమధ్యుఁడు రమావక్షుండు శ్రీవత్సలాం**
**ఛనుఁ డంభోధరదేహుఁ డిందుముఖుఁ డంచద్దీర్ఘబాహుండు స**

ద్వనమాలాంగద హారకంకణ సముద్యత్కుండలుం డీతఁ డా
ముని సూచించిన వీరుఁడౌ' ననుచు న మ్మూఢుండు గాఢోద్ధతిన్. 1620

* తామరలవంటి కన్నులు గలవాడును, సింహంనడుము వంటి నడుము గలవాడును, వక్షస్థలాన లక్ష్మి గలవాడును, శ్రీవత్స మనే పుట్టుమచ్చ కలవాడును, సోమునివంటి మోము గలవాడును, ఒప్పుతున్న పొడుగాటి చేతులు గలవాడును; చక్కని వనమాల, బాహుపురులు, ముత్యాలదండలు, కంకణాలు, కమ్మలు కలవాడును అయిన వీడు ఆ నారదముని సూచించిన శూరుడు కావచ్చు. ఇలా భావించి మూర్ఖుడైన కాలయవనుడు మిక్కిలి కావరంతో మిడిసిపడ్డాడు.

సీ. చటులవాలాభీల సైంహికేయునిభంగి లాలితేతర జటాలతిక దూలఁ
బ్రళయావసర బృహద్భాను హేతిద్యుతిఁ బరుషారుణ శ్మశ్రుపటలి వ్రేలఁ
గాదంబినీఛన్న కాంచనగిరిభాతిఁ గవచ సంవృత దీర్ఘకాయ మమర
వల్మీక సుప్త దుర్వారాహి కైవడిఁ గోశంబులో వాలు కొమరు మిగుల

ఆ. నార్చి పేర్చి మించి యశ్వంబు గదలించి, గమలసంభవాది ఘనులకై నఁ
బట్టరాని ప్రోడఁ బట్టెద నని జగ, దవనుఁ బట్టఁ గదిసె యవనుఁ డధిప! 1621

* పరీక్షిన్మహారాజా! బ్రహ్మ మొదలైన వేల్పు పెద్దలకుకూడ పట్ట నలవిగాని నెఱజాణ శ్రీకృష్ణుడు. లోక రక్షకుడైన అతణ్ణి పట్టుకొనడాని కని, కాలయవనుడు తన అశ్వాన్ని కదిలించి గర్జిస్తూ సమీపించాడు. అప్పుడు భయం కొల్పుతున్న రాహువుతోకవలె కాలయవనుని తీగవంటి కఠినమైనజడ కదలుతూ ఉంది. ప్రళయకాలంలోని అగ్నిశిఖలవంటి కాంతితో అతని కఱుకైన పల్లమీసాలు వ్రేలాడుతున్నాయి. మబ్బులగుంపుచే కప్పబడిన మేరుపర్వతం లాగా అతని సమున్నతదేహం కవచంతో కప్పబడి ఉంది. పుట్టలో నిదురిస్తున్న పాములాగా అతని ఒరలో ఖడ్గం దీపించింది.

క. ఇటు దన్నుఁ బట్టవచ్చినఁ, బటుతర జవరేఖ మెఱసి పట్టువడక ది
క్తటము లదర హరి వాఱెం, జటులగతిన్ వాఁడు దోడఁ జనుదేరంగన్. 1622

* ఈ విధంగా తన్ను పట్టడానికై యవనుడు రాగా కృష్ణుడు పట్టుపడకుండా మిక్కిలి వేగంగా దిక్కు లదరేటట్లు పరుగెత్తినాడు. కాలయవనుడు అతనివెంట పడ్డాడు.

వ. అప్పుడు కాలయవనుం డిట్లనియె. 1623

* ఈ విధంగా వెంటబడి తరుముతూ కాలయవనుడు కమలనయనునితో ఇట్లన్నాడు.

మ. యదువంశోత్తమ! పోకు పోకు రణ మీ నర్హంబు; గంసాదులన్
గదనక్షోణి జయించి తీ వని సమిత్కామంబునన్ వచ్చితిన్;
విదితఖ్యాతులు వీటిఁబోవ నరికిన్ వెన్నిచ్చి యి బ్భంగి నే
గుదురే రాజులు? రాజమాత్రుఁడవె? వైగుణ్యంబు వచ్చుం జుమీ! 1624

* ఓ యదువంశశ్రేష్ఠుడా! నిలు నిలు. పారిపోకు! నాతో పోరాడు. నీవు సంగరరంగంలో కంసుడు మొదలైన వాళ్ళను జయించిన వీరుడవని విని కలహకాంక్షతో నేను వచ్చాను. నీవంటి రాజులు గడించిన పేరు ప్రఖ్యాతులు చెడేటట్లు విరోధికి వెన్ను చూపి ఈలా పారిపోతారా? నీవు సాధారణరాజువు కాదు గదా! నీకు అపఖ్యాతి వస్తుంది సుమా!

**మ. బలిమిన్ మాధవ! నేఁడు నిన్ను భువనప్రఖ్యాతిగాఁ బట్టుదున్**
**జలముల్ సొచ్చిన, భూమిక్రిందఁ జనినన్, శైలంబుపై నెక్కినన్**
**బలిదండన్ విలసించినన్ వికృతరూపంబుం బ్రవేశించినన్**
**జలధిన్ దాఁటిన నగ్రజన్మహలికాశ్వాటాకృతుల్ దాల్చినన్. 1625**

* మాధవా, నీవు నీటిలో ప్రవేశించిననూ (మత్స్యావతారం), భూమిక్రింద దూరిననూ (కూర్మావతారం), కొండపై నెక్కిననూ (వరాహావతారం), బలి సమీపాన చేరిననూ (వామనావతారము), వికారరూపం గైకొన్ననూ (నృసింహావతారం), సాగరాన్ని దాటిననూ (రామావతారం), బ్రాహ్మణుని యొక్కయు, హాలికుని యొక్కయు, అశ్వాటునియొక్కయు రూపం దాల్చిననూ (పరశురామ, బలరామ, కల్క్యవతారములు), లోకంలో నాకు ప్రఖ్యాతి లభించేటట్లు బలిమితో నేడు నిన్ను పట్టుకుంటాను.

**వ. అదియునుం గాక. 1626**

**మ. శరముల్ దూఱవు; మద్ధనుర్గుణలతాశబ్దంబు లేతేరఁ వా**
**హరిరింఖోద్ధతధూళి గప్ప; దకటా! హాస్యుండవై పాఱె; దు**
**ర్వరపై నే క్రియఁ బోరితో కదిసి మున్ వాతాశితోఁ గేశితోఁ**
**గరితో మల్లురతో జరాతనయుతోఁ గంసావనీనాథుతోన్. 1627**

* అంతేకాక ఇంతకూ నా బాణాలు నీ శరీరంలో నాటనే లేదు. నా వింటి అల్లెత్రాటిమ్రోతలు వినిపించనే లేదు. నా గుఱ్ఱాల కాలిడెక్కల ధూళి నిన్ను కప్పివేయనే లేదు. అయ్యయ్యో! అప్పుడే పారిపోతున్నావే! మునుపు కాళియుడితో, కేశితో, కువలయాపీడంతో, జెట్టిమల్లులతో, జరాసంధునితో కంసరాజుతో ఏ విధంగా పోరాడితివో కదా!

**వ. అని పలుకుచుఁ గాలయవనుండు వెంట నరుగుదేర సరకుసేయక మందహాసంబు ముఖారవిందం బునకు సౌందర్యంబు నొసంగ 'వేగిరపడకు; రమ్ము ర' మ్మనుచు హరియును. 1628**

* ఈ విధంగా అంటూ కాలయవనుడు వెన్నుని వెంబడించాడు. శ్రీకృష్ణుడు వానిమాటలు లెక్కపెట్టక చిరునవ్వు తనమోము నలంకరింపగా 'తొందరపడకు రమ్ము, రమ్ము' అని పలికినాడు.

**సీ. 'అదె యిదె లోఁబడె' నని పట్టవచ్చినఁ గుప్పించి లంఘించుఁ గొంతతడవు**
**పట్టరా; దీతని పరు వగ్గలం' బని భావింపఁగా సమీపమున నిలుచు**

నడరి పార్శ్వంబుల కడ్డంబు వచ్చినఁ గేడించి యిట్టట్టు గికురువెట్టు
వల్మీకతరు సరోవరము లడ్డంబైన సవ్యాపసవ్య సంచరతఁ జూపుఁ

తే. బల్లముల డాఁగు దిబ్బల బయలుపడును, నీడలకుఁ బోవు నిఱుముల నిగిడి తాఱు
నన్నుఁబట్టిన నీవు మానవుఁడ' వనుచు, యవనుఁ డెగువంగ బహుజగదవనుఁ డపుడు! 1629

* ఇదిగో తనకు దొరకినాడు. అదిగో తనకు చిక్కినాడు అని కాలయవనుడు పట్టుకొనుటకు రాగా కృష్ణుడు కుప్పించి దుముకుతాడు. ఇతని వేగం అధికం. వీణ్ణి పట్టుకోలేను అని కాలయవనుడు భావించినపుడు దామోదరుడు దగ్గరగా వచ్చి నిలబడతాడు. అతడు బంధించడానికి ప్రక్కలకు అడ్డం వచ్చినపుడు శ్రీహరి మోసంతో తప్పించుకొని వెళతాడు. పుట్టలు, చెట్టులు, సరస్సులు అడ్డం వచ్చినపుడు గోవిందుడు కుడి, ఎడమవైపులకు పరుగుదీస్తాడు. పల్లపునేలలలో దాగుకొంటాడు. మిట్టలెక్కి బయటపడుతాడు. నీడలలోనికి వెళతాడు. మారుమూలలలో తారాడుతాడు. నన్ను పడితేనే నీవు మగవాడవు అంటూ లోకరక్షకుడైన శ్రీకృష్ణుడు కాలయవనుణ్ణి ముప్పతిప్పలు పెట్టాడు.

వ. మఱియును. 1630

సీ. సకలభూతవ్రాత సంవాసుఁ డయ్యును వనములు నగములు వరుస దాఁటు
లోకోన్నతుండును లోకచక్షుఁడు నయ్యు మాటిమాటికి నిక్కి మగిడి చూచుఁ
బక్ష విపక్ష సంబంధ శూన్యుం డయ్యుఁ, దను విపక్షుఁడు వెంటఁ దగుల నిగుడు
విజయాపజయభావ విరహితుం డయ్యుఁ దా నపజయంబును జెందినట్లు తోఁచు

ఆ. నభయ భయ విహీనుఁ డయ్యు భీతునిమాడ్కిఁ, గానఁబడును సర్వకాలరూపుఁ
డయ్యుఁ గాలచకితుఁడైన కైవడి వన, మాలి పఱచు వెఱపుమాలి యధిప! 1631

* పరీక్షిన్నరేంద్రా! వనమాలాధరుడైన వనజాక్షుడు భయమువీడి పరుగిడుతాడు. నిఖిలభూతములలో నివసించు వాడయినప్పటికీ అడవులు కొండలు వరుసగా దాటుతాడు. లోకాలలో అధికుడు, లోకాలకు కన్నువంటివాడు అయినప్పటికీ సారెసారెకూ నిక్కి నిక్కి చూస్తాడు. తనవారు, పెరవారు అనే భేదం లేనివా డయిననూ తన్ను శత్రువు వెంబడించగా ముందుకు పరుగెత్తుతాడు. గెలుపోటములు రెండూ లేనివాడైనప్పటికీ అపజయం పొందినట్లే గోచరిస్తాడు. భయనిర్భయాలు లేనివా డయిననూ భయపడ్డ వానివలె కనిపిస్తాడు. కాలస్వరూపు డయిననూ కాలానికి (కాలయవనుడికి) వెఱచిన వానిలాగా కనబడతాడు.

వ. ఇ వ్విధంబున. 1632

క. దారిత శాత్రవ భవను న, పార మహావేగ విజిత పవనున్ యవనున్
దూరము గొని చని కృష్ణుఁడు, ఘోరంబగు నొక్క శైలగుహ వడిఁ జొచ్చెన్. 1633

* ఈ విధంగా శ్రీకృష్ణుడు శత్రుమందిరాలను భేదించినవాడూ, అంతులేని గొప్పవేగంచే గాలినోడించిన వాడూ అయిన యవనుణ్ణి దూరంగా తీసుకొని పోయి భయంకరమైన ఒక కొండగుహలో చటుక్కున ప్రవేశించాడు.

క. అదె లోఁబడె నిదె లోఁబడె, నదె యిదె పట్టెద నటంచు నాశావశుఁడై
యదుసింహుని పదపద్ధతి, వదలక గిరిగహ్వరంబు వాఁడుం జొచ్చెన్. 1634

* 'అదిగో దొరికినాడు, ఇదిగో దొరికినాడు, అదిగో పట్టుకుంటాను, ఇదిగో పట్టుకుంటాను' అని ఆశకు లోపడి ఆ యదుశ్రేష్ఠుని అడుగుల జాడ ననుసరించి కాలయవనుడు తాను కూడా ఆ పర్వతగుహలో ప్రవేశించాడు.

వ. ఇట్లు సొచ్చి మూఢహృదయంబునుం బోలెఁ దమఃపూర్ణంబయిన గుహాంతరాళంబున దీర్ఘతల్ప నిద్రితుండై గుఱకపెట్టుచున్న ఒక మహాపురుషునిం గని శ్రీహరిగాఁ దలంచి. 1635

* ఈలా చొరబడి మూఢుని హృదయం మాదిరి అజ్ఞానంతో (చీకటితో) నిండిన గుహలోపల పెద్ద పాన్పుమీద నిద్రలో మునిగి గురకపెడుతున్న ఒక మహాపురుషుణ్ణి చూచి అతడే శ్రీకృష్ణుడని తలంచాడు.

ఉ. ఆలము సేయలేక పురుషాధమ! దుర్లభ కంటకద్రుమా
భీల మహాశిలా సహిత భీకరకుంజర ఖడ్గసింహ శా
ర్దూల తరక్షు సంకలిత దుర్గపథంబునఁ బాఱుతెంచి యీ
శైలగుహన్ సనిద్రుక్రియఁ జాఁగి నటించినఁ బోవనిత్తునే? 1636

* ఓరీ పురుషాధమా! నాతో యుద్ధం చెయ్యలేక ముండ్లచెట్లు, పెనురాళ్ళు, ఏనుగులు, ఖడ్గమృగాలు, సింహములు, శార్దూలములు, సివంగులు మొదలైన జంతువులచేత భీతికొల్పుతూ నడవడానికి వీలుగాని దారిలోపడి పరుగెత్తివచ్చి ఈ కొండగుహలో దూరి నిద్రించే వాని మాదిరి నటిస్తున్నావు. నిన్ను పోనిస్తా ననుకుంటున్నావా?

క. ఎక్కడ నెవ్వారలకును, జిక్క వనుచు నారదుండు సెప్పెను నాకుం
జిక్కితి వెక్కడఁ బోయెదు?, నిక్కముగా నిద్రపుత్తు ని న్నీకొండన్. 1637

* నీవు ఎక్కడా ఎవ్వరికినీ చిక్కవని నారదుడు చెప్పినాడు. ఇక్కడ నాకు నీవు చిక్కినావు? ఇంకెక్కడికి వెళతావు? నిద్రనటిస్తున్న నిన్ను నిజంగా ఈ కొండగుహలోనే దీర్ఘనిద్రపుచ్చుతాను.

ఆ. అనుచు యవనుఁ డట్టహాసంబు గావించి, చటుల కఠిన కులిశ సదృశమైన
పాదమెత్తి తన్నెఁ బాఱి తద్దేహంబు, నగగుహం బ్రతిస్వనంబు నిగుడ. 1638

* అంటూ కాలయవనుడు వికారపు నవ్వు నవ్వి కర్కశమైన వజ్రాయుధంవంటి తనకాలితో ఎగిసి ఆ నిద్రపోతున్న పురుషుణ్ణి తన్నినాడు. ఆ కాలిదెబ్బకు పర్వతగుహ మారుమ్రోగింది.

ఉ. తన్నిన లేచి నీల్గి కనుఁదమ్ములు మెల్లన విచ్చి లోపలన్
సన్నపుఁ గిన్క వర్ధిల దిశల్ గని దృష్టి సమిద్ధ విగ్రహో

త్పన్నమహాగ్ని కీలముల భస్మముసేసె నతండు సాయక
చ్ఛిన్న విరోధికంఠవను శ్రీభవనున్ యవనున్ లఘుక్రియన్. 1639

* అలా వాడు తన్నడంతోనే నిద్రలేచి ఒడలు విరుచుకుంటూ ఆ పురుషుడు పద్మాలవంటి కండ్లు విచ్చి, పొటమరించిన కోపం వృద్ధిపొందగా నాలుగుమూలలు చూచాడు. తన చూపులలో మహోగ్రమైన ఆగ్రహంవల్ల జనించిన పెద్ద అగ్నిజ్వాలలతో ఆ పురుషుడు శత్రువుల కుత్తుక లనే అడవులను తన కత్తితో ఛేదించినవాడూ, సంపదలకు నిలయమైనవాడూ అయిన కాలయవనుణ్ణి అలవోకగా బూది గావించాడు.

వ. ఇట్లేక క్షణమాత్రంబున యవనుండు 'నీఱయ్యె' ననిన విని రా జిట్లనియె. 1640

* అలా ఒక్క క్షణకాలంలో యవనుడు భస్మమైపోయాడు అని శుకమౌని చెప్పగా విని పరీక్షిత్తు ఇట్లన్నాడు.

## -: ముచుకుందుని పూర్వకథాభివర్ణనము :-

ఆ. 'ఎవ్వఁడాతఁ? డితని కెవ్వండు దండ్రి ఘో, రాద్రిగుహకు నేటి కతఁడు వచ్చి
నిద్రవోయె? యవను నిటు గాల్ప నెట్లోపెఁ?, దెలియఁ బలుకు నాకు ధీవరేణ్య!' 1641

* బుద్ధిమంతులలో శ్రేష్ఠుడా, ఆ పురుషు డెవరు? అతని తండ్రి యెవరు? భయంకరమైన కొండగుహ లోనికి వచ్చి అతడెందుకు నిద్రపోయాడు? అతడు కాలయవనుణ్ణి ఎలా కాల్చివేయ గలిగినాడు? ఈ విషయమంతా నాకు విపులంగా వివరించు.

వ. అనినం బరీక్షిన్నరేంద్రునకు నతికుతూహలంబుతో శుకయోగివర్యుం డిట్లనియె; నిక్ష్వాకుకుల సంభవుండు మాంధాత కొడుకు ముచుకుందుండను రాజు రాక్షసభీతులైన వేల్పులం బెద్దకాలంబు సంరక్షించిన మెచ్చి, వా రమరలోక రక్షకుండైన యా రాజకుమారునికడం జేరి వరంబు వేఁడు మనిన వారలం గనుంగొని, మోక్షపదం బడిగిన వారలతని కిట్లనిరి. 1642

* అని ఇలా ప్రశ్నించిన పరీక్షిన్మహారాజుకు మిక్కిలి కుతూహలంతో యోగిపుంగవుడైన శుకుడిట్లా అన్నాడు. ఆ పురుషుడు ఇక్ష్వాకు వంశంలో జనించిన మాంధాతయొక్క కుమారుడు అయిన 'ముచుకుందు' డనే మహారాజు. అతడు అసురులకు భయపడిన దేవతలను బహుకాలం సంరక్షించాడు. దేవలోకాన్ని కాపాడిన ఆ రాకుమారుణ్ణి మెచ్చుకొని వేల్పులు అతని దగ్గరచేరి వరం కోరుకొమ్మన్నారు. అపుడు ముచుకుందుడు దేవతలను చూచి నాకు మోక్షమనుగ్రహించండని వేడగా వారతనితో ఇట్లన్నారు.

మ. జగతి న్నిర్గతకంటకం బయిన రాజ్యంబున్ విసర్జించి శూ
ర గణాగ్రేసర! పెద్దకాలము మమున్ రక్షించితీ; లోన నీ
మగువల్ మిత్రులు బంధులున్ సుతులు సంబంధుల్ భువిన్ లేరు, కా
ల గతిం జెందిరి; కాల మెవ్వరికి దుర్లంఘ్యంబు దా నారయన్. 1643

* ఓ వీరాగ్రేసరా, మానవలోకంలో శత్రువులే లేని నీ రాజ్యాన్ని వదలి వచ్చి చిరకాలం మమ్మల్ని సం రక్షిస్తూ ఇక్కడే ఉండి పోయావు. ఈ లోపల నీ పత్నులు, స్నేహితులు, చుట్టాలు, కుమారులు నీకు

సంబంధించిన ఇతరు లందరూ భూమిని విడిచారు. వారంతా మరణించారు. ఎంతటి వారయినా కాలప్రభావాన్ని గడవలేరు.

**క. కాలము ప్రబలులకును బలి, కాలాత్ముం డీశ్వరుం డగణ్యుఁడు జనులం**
**గాలవశులుగాఁ జేయును, గాలము గడవంగలేరు ఘను లెవ్వారున్. 1644**

* కాలం మహాబలవంతులకంటె బల మయినది. భగవంతుడే కాలస్వరూపుడు. అత డిట్టివాడని నిరూపింప శక్యం కాదు. అతడు జనులను కాలానికి లోబరుస్తాడు. ఎంత దొడ్డవారయినా కాలాన్ని దాటలేరు.

**క. వర మిచ్చెద మర్థింపుము, ధరణీశ్వర! మోక్షపదవి దక్కను మే మె**
**వ్వరమును విభులము గా మీ, శ్వరుఁడగు హరిదక్క మోక్షసంగతిఁ జేయన్. 1645**

* ఓ రాజా, కైవల్యం తప్ప మరి ఏ వరమయినా కోరుకో ఇస్తాము. మోక్ష మివ్వడానికి భగవంతుడు నారాయణుడు తప్ప అందుకు మే మధికారులం కాము.

**వ. అని పలికిన దేవతలకు నమస్కరించి, ముచుకుందుండు నిద్రం గోరి దేవదత్త నిద్రావశుండై పర్వతగుహాంతరాళంబున శయనించి యుండె; యవనుండు నీఱైన పిమ్మట, హరి ముచుకుందుని ముందట నిల్చిన. 1646**

* దేవత లిట్లా చెప్పగా వారికి అభివాదనం చేసి ముచుకుందుడు నిద్రను కోరుకున్నాడు. దేవత లిచ్చిన నిద్రకు లోపడి అతడు కొండగుహలోపల ఇంతకాలమూ పవళించి ఉండినాడు. కాలయవనుడు భస్మమైన పిదప ముకుందుడు ముచుకుందుని ఎదుట సాక్షాత్కరించాడు.

**సీ. వనరుహలోచను వైజయంతీదాము శోభితు రాకేందు సుందరాస్యు**
**మకరకుండల కాంతి మహిత గండస్థలుఁ గౌస్తుభాలంకృతు ఘనశరీరు**
**శ్రీవత్సలాంఛనాంచితవక్షు మృగరాజ మధ్యుఁ జతుర్బాహు మందహాసు**
**గాంచన సన్నిభ కౌశేయవాసు గాంభీర్యసౌందర్యశోభితుఁ బ్రసన్ను**

**ఆ. న మ్మహాత్ముఁ జూచి యాశ్చర్యమును బొంది, తన్మనోజ్ఞదీప్తి దనకుఁ జూడ**
**నలవిగాక చకితుఁడై యెట్టకేలకుఁ, బలికెఁ బ్రీతి నవనిపాలకుండు. 1647**

* కమలములవంటి కన్నులు గలవాడు, వైజయంతి అనే వనమాలతో విలసిల్లువాడు, పున్నమ చంద్ర బింబంవలె అందమైన మోము కలవాడు, మకరకుండలాల కాంతితో నిండిన కపోలతలములు కలవాడు, కౌస్తుభమణితో అలంకరింపబడినవాడు, ఉన్నత దేహం కలవాడు, శ్రీవత్సమనే పుట్టుమచ్చతో ఒప్పుతున్న ఉరం కలవాడు, సింగం నడుమువంటి నడుము కలవాడు, నాల్గుచేతులు గలవాడు, చిరునవ్వు చిందువాడు, పసిడివన్నె పట్టువలువ కలవాడు, గాంభీర్యసౌందర్యాలతో భాసిల్లేవాడు, అనుగ్రహం కలవాడు అయిన ఆ మహానుభావుణ్ణి రాజైన ముచుకుందుడు చూచాడు. ఆశ్చర్యం పొందినాడు. నారాయణుని మనోహరమైన కాంతి చూడటానికి అశక్య మైనందున అతడు సంభ్రమం చెంది ప్రీతితో చివరి కిట్లన్నాడు.

**మ. శశివో? యింద్రుఁడవో? విభావసుఁడవో?చండప్రభారాశివో?**
**శశిచూడామణివో? పితామహుఁడవో? చక్రాంకహస్తుండవో?**
**దిశలున్ భూమియు మిన్ను నిండె నిదె నీతేజంబుఁ జూడంగ దు**
**ర్వశమై; యెవ్వఁడ? వేల వచ్చి తిచటన్ వర్తించె దేకాకివై? 1648**

* అయ్యా! నీవు చంద్రుడవో, మహేంద్రుడవో, అగ్నివో, సూర్యుడవో, చంద్రశేఖరుడవో, బ్రహ్మ దేవుడవో, చక్రపాణివో తెలియడం లేదు. పరికింపగా నీ ప్రకాశం చూడటానికి అశక్యమై దిక్కు లందునూ భూమ్యాకాశము లందునూ నిండి వుంది. నీ వెవడవు? ఇక్కడి కెందుకు వచ్చావు? ఎందు కిచట ఒంటరిగా ఉన్నావు?

**క. ఈ యడవి విషమకంటక, భూయిష్ఠము ఘోరసత్త్వ పుంజాలభ్యం**
**బో యయ్య? యెట్లు వచ్చితి? నీ యడుగులు కమలపత్త్ర నిభములు సూడన్. 1649**

* ఈ అరణ్యం మిట్టపల్లాలతో, ముండ్లతో నిండి ఉంది. భయంకర జంతుజాలంవల్ల దుర్గమంగా ఉంది. నీ పాదతలములు పద్మపత్రాలమాదిరి ఉన్నాయి. ఎలా ఇక్కడికి నడచి వచ్చావు?

**వ. మహాత్మా! యేను నీకు శుశ్రూషణంబు సేయం గోరెద; నీ జన్మగోత్రంబు లే నెఱుంగ నర్హుండనేని నెఱింగింపుము; నే నిక్ష్వాకు వంశసంభవుండ; మాంధాతృ నందనుండ; ముచుకుందుం డనువాఁడ; దేవ హితార్థంబు చిరకాల జాగర శ్రాంతుండ నయి నిద్ర నొంది యింద్రియ సంచారంబులు మఱచి. 1650**

* మహాత్మా, నీకు సేవ చెయ్యాలని కోరుకుంటున్నాను. నీ కులం, గోత్రం నే నెరుగను. ఇష్టమయితేనే చెప్పు. నేను ఇక్ష్వాకు వంశంలో జన్మించాను. మాంధాత పుత్రుణ్ణి, నాపేరు ముచుకుందు డంటారు. దేవతల మేలుకొరకు బహుకాలం మేలుకొని ఉండినందున బడలిపోయి నిద్రలో మునిగి ఇంద్రియ వ్యాపారాలు మరచి ఉన్నాను.

**శా. ఏ నిద్రించుచు నుండ నొక్క మనుజుం డేతెంచి దుష్కర్ముఁడై**
**తా నీతై చెడె నాత్మకిల్బిషమునన్ దర్పోగ్రుఁడై; యంతటన్**
**శ్రీనాథాకృతివైన నిన్నుఁ గని వీక్షింప న్నశక్తుండనై**
**దీనత్వంబును జెందితిన్; నను఼ఁ గృపాదృష్టిన్ విలోకింపవే. 1651**

* నేను నిద్రిస్తుండగా ఎవడో ఒకడు వచ్చాడు. వాడు దుర్మార్గుడు . దారుణమైన గర్వం కలవాడు. వాడు తన పాపంవల్ల భస్మమై నశించాడు. పిదప నారాయణ స్వరూపుడ వైన నిన్ను దర్శించి తేరిపారచూడ డానికి అశక్తుడనై దైన్యం పొందినాను. నన్ను దయతో గూడిన చూపులతో కటాక్షించు.

**వ. అనిన విని మేఘగంభీర భాషణంబుల హరి యిట్లనియె. 1652**

* ముచుకుందుని పలుకులు విని మేఘగంభీరమైన కంఠంతో గోవిందు డిలా అన్నాడు.

సీ. భూరజంబులనైన భూనాథ! యెన్నంగఁ జనుఁగాని; నా గుణజన్మ కర్మ
నామంబు లెల్ల నెన్నంగ నెవ్వరుఁ జాల రది యేల? నాకును నలవిగాదు
నేలకు వ్రేఁగైన నిఖిల రాక్షసులను నిర్జించి ధర్మంబు నిలువఁబెట్ట
బ్రహ్మచే మున్ను నేఁ బ్రార్థింపఁబడి వసుదేవు నింటను వాసుదేవుఁ డనఁగఁ

ఆ. గరుణ నవతరించి కంసాఖ్యతో నున్న, కాలనేమిఁ జంపి ఖలుల మఱియుఁ
ద్రుంచుచున్నవాఁడఁ దొడరి నీ చూడ్కి, నీ,ఱైనవాఁడు కాలయవనుఁ డనఘ! 1653

* ఓ రాజేంద్రా, భూరేణువుల నైనా లెక్కించడం శక్యమౌతుంది గాని నాకు గల గుణములు, జన్మ ములు, కర్మములు, నామములు- ఇన్ని అని ఎవరూ గణింపలేరు. ఇంత యేల? నాకునూ సాధ్యం కాదు. పుడమికి భారభూతులైన రక్కసు లందరినీ జయించి ధర్మాన్ని స్థాపించడానికై బ్రహ్మ పూర్వం నన్ను ప్రార్థించాడు. నేను సరేనని యదుకులాన వసుదేవుని గృహంలో లోకానుగ్రహ కాంక్షతో అవతరించాను. వసుదేవ నందనుణ్ణి కనుక నన్ను వాసుదేవు డంటారు. కంసనామంతో ఉన్న కాలనేమిని సంహరించాను. ఇంకా దుర్జనులను దునుమాడుతున్నాను. ఓ దోషరహితుడా, నీ చూపు తగిలి దగ్ధ డైనవాడు కాలయవనుడు.

వ. వినుము; తొల్లియు నీవు నన్ను సేవించిన కతంబున ని న్ననుగ్రహింప నీ శైలగుహకు నేతెంచితి; నభీష్టంబు లయిన వరంబు లడుగు మిచ్చెద. మద్భక్తులగు జనులు క్రమ్మఱ శోకంబున కర్హులు గా రనిన హరికి ముచుకుందుండు నమస్కరించి, నారాయణదేవుం డగుట యెఱింగి, యిరువది యెనిమిదవ మహాయుగంబు నందు నారాయణుం డవతరించునని మున్ను గర్గుండు చెప్పుటఁ దలంచి. 1654

* అవనీపతీ! ఆలకించు, పూర్వం నీవు నన్ను ఆరాధించావు. ఆ కారణాన నిన్ను అనుగ్రహించడానికై ఈ పర్వతగుహకు వచ్చాను. నీ కిష్టమైన వరాలు అడుగు ఇస్తాను. నా భక్తు లైనవారు ఇక శోకం పొందుటకు తగరు.

హరి ఈలా చెప్పగా ముచుకుందుడు నందపుత్రునికి నమస్కరించి అతడు సాక్షాన్నారా యణుడని తెలిసి ఇరువదెనిమిదవ మహాయుగంలో భూమిపై పుండరీకాక్షు డవతరిస్తాడని తొల్లి గర్గాచార్యులు చెప్పినమాట జ్ఞప్తికి తెచ్చుకొని ఇలా అన్నాడు.

## -: ముచుకుందుఁడు శ్రీకృష్ణుని స్తోత్రము చేయుట :-

క. నీ మాయఁ జిక్కి పురుష, స్త్రీమూర్తికజనము నిన్ను సేవింపదు; వి
త్తామయ గృహగతమై సుఖ, తామసమై కామవంచితం బయి యీశా! 1655

* సర్వేశ్వరా, నీ మాయచేత మోహితులై స్త్రీలును, పురుషులును నిన్ను భజింపరు. సుఖలేశం తోపించు విత్తమునందును, గృహాదులందునూ, తగులం పొంది వారు వంచితు లవుతున్నారు.

ఉ. పూని యనేక జన్మములఁ బొంది తుదిం దన పుణ్యకర్మ సం
తానముపేర్మిఁ గర్మ వసుధాస్థలిఁ బుట్టి ప్రపూర్ణదేహుఁడై
మానవుఁడై గృహేచ్ఛఁబడు మందుఁ డజంబు తృణాభిలాషియై
కానకపోయి నూతఁబడు కైవడి నీ పదభక్తిహీనుఁడై. 1656

* జీవి పలుజన్మము లెత్తియెత్తి తుదకు పుణ్యాకార్యముల ఫలంగా కర్మక్షేత్రమైన ధరాతలంలో పూర్ణ దేహంతో మానవుడుగా పుడతాడు. పుట్టికూడా మూఢతవల్ల నీ పదభక్తి లేనివాడై మేక గడ్డిమీది ఆశతో కనులు గానక వెళ్ళి వెళ్ళి నూతిలో పడిన విధంగా గృహాదులందలి వాంఛకు వశుడై చెడుతున్నాడు.

క. తరుణీపుత్రధనాదుల, మరగి మహారాజ్యవిభవ మదమత్తుఁడనై
నరతను లుబ్ధుఁడ నగు నా, కరయఁగ బహుకాల మీశ! యాఁబడిఁబోయెన్. 1657

* పరమేశ్వరా, ఆలు, బిడ్డలు, డబ్బు మున్నగు వాటియందు తగులము పొంది మహారాజ్య సంపత్తిచేత మదించిన మనసు గలవాడనై శరీరమునందు పేరాస వహించి యున్న నాకు వ్యర్థముగా చాలాకాలం గడచిపోయింది.

క. ఘట కుడ్య సన్నిభం బగు, చటుల కళేబరముఁ జొచ్చి జనపతి నంచుం
బటు చతురంగంబులతో, నిటు నటుఁ దిరుగుదును నిన్ను నెఱుఁగక యీశా! 1658

* ప్రభూ! కుండ, గోడవలె జడమైన, చంచలమైన ఈ దేహంలో ప్రవేశించి నేను రాజునంటూ రథ, గజ, తురగ, పదాతులతో వీర్రవీగుతూ, భూమియందు అటునిటు క్రుమ్మరుచుంటినే గాని నిన్ను తెలుసుకోలేక పోతిని.

ఆ. వివిధకామభోగ విషయలాలసు మత్తు, నప్రమత్తవృత్తి నంతకుండ
వైన నీవు వేళ యరసి త్రుంతువు సర్ప, మొదిఁగి మూషికంబు నొడియు నట్లు. 1659

* పలువిధములైన మనోరథములు, శబ్దాది విషయములందు ఆస వహించి ఏమరియుండగా నీవు మాత్రం ఏమరుపాటు చెందక అంతకస్వరూపుడవై పాము కనిపెట్టి యుండి తటాలున ఎలుకను ఒడిసి పట్టుకున్నట్లు సమయం రాగానే పట్టి విషయ లాలసులను హరిస్తావు.

క. నరవర సంజ్ఞితమై రథ, కరిసేవితమైన యొడలు కాలగతిన్ భీ
కర మృగ భక్షితమై దు, స్తర విట్క్రిమి భస్మసంజ్ఞితం బగు నీశా! 1660

* గోవిందా! 'ప్రభువు' అని పేరు వహించి రథాలమీద, ఏనుగుల మీద ఎక్కి తిరిగిన శరీరం కాల వశమై భయంకరములైన జంతువులచే భక్షింపబడటం వల్ల పురీష మని, ముగిగిపోతే పురుగు లనీ, కాలిపోతే బూది అనీ వ్యవహరింపబడుతోంది.

ఆ. సకలదిశలు గెలిచి సములు వర్ణింపంగ, జారుపీఠ మెక్కి సార్వభౌముఁ
డైన సతుల గృహములందుఁ గ్రీడాభోగ, వృత్తినుండు; నిన్ను వెదకలేఁడు. **1661**

* అన్ని దిక్కులనూ జయించి సాటివారు కొనియాడగా ఉన్నతపీఠం అధిష్ఠించిన చక్రవర్తి అయినప్పటికీ సుందరీమణుల మందిరాలలో కామసుఖాలు అనుభవిస్తాడేగాని నిన్ను అన్వేషించడు.

ఆ. మానసంబుఁ గట్టి మహితభోగంబులు, మాని యింద్రియముల మదము లడఁచి
తపము సేసి యింద్రతయుఁ గోరుఁ గాని నీ, యమృతపదము గోరఁ డజ్ఞుఁ డీశ! **1662**

* ఈశ్వరా! జ్ఞానహీనుడు మనస్సును బంధించి, గొప్ప భోగములను విడనాడి, ఇంద్రియాటోపమును అణచివేసి, తపస్సు చేసి ఇంద్రపదవి నభిలషిస్తాడే కాని నీ అమృతస్థానమును కోరడు.

సీ. సంసారియై యున్న జనునకు నీశ్వర! నీకృప యెప్పుడు నెఱయఁ గల్గు
నప్పుడు బంధంబు లన్నియుఁ దెగిపోవు; బంధమోక్షంబైనఁ బ్రాప్త మగును
సత్సంగమంబు; సత్సంగమంబున నీదు భక్తి సిద్ధించు;నీ భక్తివలన
సన్ముక్తి యగు; నాకు సత్సంగమునకంటె మును రాజ్యబంధ నిర్మూలనంబు

తే. గలిగినది దేవ! నీ యనుగ్రహము గాదె?, కృష్ణ! నీ సేవ గాని తక్కినవి వలదు
ముక్తిసంధాయి వగు నిన్నుఁ ముట్టఁ గొలిచి, యాత్మబంధంబు గోరునే యార్యుఁ డెందు? **1663**

* అచ్యుతా, నీ అనుగ్రహం ఎపుడు కలుగుతుందో అపుడే సంసారమందు పరిభ్రమిస్తున్న పురుషుడికి ఆ సంసారబంధాలు వదలిపోతాయి. సంసారనివృత్తి కలిగినప్పుడు సత్పురుషులతో సహవాసం లభిస్తుంది. సత్సంగంచేత నీయందు భక్తి సిద్ధిస్తుంది. నీయందు నెలకొన్న భక్తివల్ల ముక్తి చేకూరుతుంది. నాకు భాగవతోత్తముల సాంగత్యమునకు పూర్వమే రాజ్యపాశ నిర్మూలనం జరిగింది. ఇదంతా నీ కృప కృష్ణా! నాకు నీ పాదసేవనం తప్ప తక్కిన వేమియూ వద్దు. విజ్ఞుడైనవాడు ముక్తిదాయకుడ వైన నిన్ను సేవించి తనకు ప్రతిబంధకాలైన శబ్దాది విషయభోగాలను వాంఛింపడు గదా!

వ. కావున రజస్సత్త్వ తమోగుణంబుల యనుబంధంబు లగు నైశ్వర్య శత్రు మరణ ధర్మాది విశేషంబులు విడిచి, యీశ్వరుండును విజ్ఞానఘనుండును, నిరంజనుండును, నిర్గుణుండును, నద్వయుండును నైన పరమ పురుషుని నిన్నాశ్రయించెదఁ; జిరకాలంబు గర్మఫలంబులచేత నార్తుండనై క్రమ్మఱం దద్వాసనల సంతప్తుండనై తృష్ణం బాయక శత్రువులైన యింద్రియంబు లాఱింటిని గెలువలేని నాకు శాంతి యెక్కడిది? విపన్నుండ నైన నన్ను నిర్భయుం జేసి 'రక్షింపు' మనిన ముచుకుందునికి హరి యిట్లనియె. **1664**

* కాబట్టి సత్త్వము, రజస్సు, తమస్సు- అను త్రిగుణాలను అనువర్తించునట్టి ఐశ్వర్యము, శత్రుమరణము, ధర్మము ఇత్యాది విశేషము లన్నింటినీ వదలి నేను ఈశ్వరుడూ, విజ్ఞానఘనుడూ, మాయా కార్యము లైన రాగాదులు లేనివాడూ, త్రిగుణాలతో సంబంధము లేనివాడూ, తనకు సమానుడూ, తనకంటె అధికుడు

కలుగనివాడూ, పురుషులలో ఉత్తముడూ అయిన నిన్ను శరణు పొందుతాను. బహుకాలం ప్రారబ్ధకర్మఫల మనుభవిస్తూ దుఃఖితుడనై ఇంకా పూర్వజన్మ వాసనలచే సంతాపాన్ని పొందుతూ ఆశ వదలక శత్రువులైన కన్ను, ముక్కు, చెవి, చర్మము, నాలుక , మనస్సు అనే ఆరు జ్ఞానేంద్రియాలను జయించలేని నాకు శాంతి ఎలా లభిస్తుంది? ఆపన్నుడ నైన నన్ను మన్నించి భయరహితుణ్ణి గావించి కాపాడుమంటూ వేడుకొన్న ముచుకుందుడితో ముకుందుడు ఇట్లా అన్నాడు.

**ఉ. మంచిది నీదు బుద్ధి నృపమండన! నీవు పరార్థ మెట్లు వ**
**ర్తించిన నైనఁ గోరికల దిక్కునఁ జిక్కవు మేలు; నిర్మలో**
**దంచితవృత్తి నన్ గొలుచు ధన్యు లబద్ధులు నెట్లు నీకు ని**
**శ్చంచలభక్తి గల్గెడిని సర్వము నేలుము మానవేటికిన్. 1665**

* రాజులకు అలంకార మయినవాడా, నీ బుద్ధి మంచిది. నీవు ఇతరులకోసమై ఎలా ప్రవర్తించి నప్పటికి కోరికలకు ప్రలోభం చెందలేదు. నిర్మలమనస్సుతో నన్ను సేవించువారు ధన్యాత్ములు. వారు సంసారబద్ధులు కానేరరు. నీకు నాయందు దృఢమైన భక్తి ననుగ్రహిస్తున్నాను. నాయందు మనసుంచి సమస్తం పరిపాలించు. మానవలసిన పనిలేదు.

**వ. 'నరేంద్రా! నీవు తొల్లి క్షత్త్రధర్మంబున నిలిచి, మృగయా వినోదంబుల జంతువుల వధియించినాఁడవు; తపంబునఁ దత్కర్మవిముక్తుండవై తర్వాతిజన్మంబున సర్వభూత సఖిత్వంబు గలిగి, బ్రాహ్మణ శ్రేష్ఠుండవై నన్నుం జేరెద' వని వీడ్కొలిపిన హరికిం బ్రదక్షిణంబు వచ్చి నమస్కరించి గుహ వెడలి సూక్ష్మప్రమాణ దేహంబులతో నున్న మనుష్య పశు వృక్ష లతాదులం గని కలియుగంబు ప్రాప్తంబగు నని తలంచి, యుత్తరాభిముఖుండై తపోనిష్ఠుం డగుచు, సంశయంబులు విడిచి సంగంబులు పరిహరించి విష్ణునియందుఁజిత్తంబుఁ జేర్చి గంధమాదనంబు ప్రవేశించి, మఱియు నరనారాయణ నివాసంబైన బదరికాశ్రమంబు చేరి, శాంతుండై హరి నారాధించుచుండె. నిట్లు ముచుకుందుని వీడ్కొని. 1666**

* ఓ రాజోత్తమా! పూర్వం నీవు క్షాత్రధర్మం అవలంబించి వేట మొదలైన వేడుకలతో జంతువులను చంపినావు. కనుక తపస్సు చేసి ఆ పాపం బాపుకో. మరుసటి జన్మలో బ్రాహ్మణుడవై, ప్రాణులందు మైత్రి కలిగి నన్ను పొందగలవు- అని నారాయణుడు అతనికి వీడ్కోలిచ్చాడు. ముచుకుందుడు మురవైరికి ప్రదక్షిణం చేసి ప్రణమిల్లి గుహనుంచి వెలుపలికి వచ్చాడు. అతడు మనుష్యులు, పశువులు,చెట్లు, తీవలు అల్పపరిమాణాలై ఉండడం చూచాడు. కలియుగం రాబోతున్నదని తలంచి ఉత్తరదిక్కునకు బయలుదేరాడు ఆయన తపోదీక్ష వహించి అనుమానాలు వదలిపెట్టి, అన్నిటియందు ఆసక్తి మాని హరిమీద మనస్సు లగ్నం చేసి గంధమాదన పర్వతాన్ని ప్రవేశించాడు. అక్కడినుంచి నరనారాయణులకు నెలవైన బదరికాశ్రమాన్ని చేరి శాంతుడై అచ్యుతుని ఆరాధింపసాగాడు.

శా. అచ్ఛిద్రప్రకట ప్రతాపరవిచే నాశాంతరాళంబులం
బ్రచ్ఛాదించుచుఁ గ్రమ్మఱన్ మథురకుం బద్మాక్షుఁ డేతెంచి వీ
డాచ్ఛాదించి మహానిరోధముగఁ జక్రాకారమై యున్న యా
మ్లేచ్ఛవ్రాతము నెల్లఁ ద్రుంచె రణభూమిం బెంపు సొంపారఁగన్. 1667

* ఈలా ముచుకుందుని వీడ్కొలిపి పద్మములవంటి లోచనములు గల శ్రీకృష్ణుడు లోపంలేని ప్రతాపమనే భానుతేజంతో దిగంతరాళాలను కప్పివేస్తూ మరల మథురానగరానికి విచ్చేశాడు. అతడు పట్టణ మంతటినీ చక్రాకారంతో ఆవరించి, ముట్టడించియున్న యవను లందరిని సమరభూమిలో పెంపుసొంపారగా నిర్మూలించాడు.

## -: జరాసంధుఁడు ప్రవర్షణగిరిని దహించుట :-

వ. ఇట్లు మ్లేచ్ఛబలం బొరిగొని మఱియు న మ్మథురానగరంబునం గల ధనంబు ద్వారకానగరంబునకుం బంచిన, మనుష్యులు గొనిపోవు నెడ. 1668

* ఈలా మ్లేచ్ఛులను సంహరించి, మథురానగరంలో ఉండే సిరిసంపదలను ద్వారకాపురికి తరలించడానికి మనుషులను ఏర్పాటు చేశాడు. వారు విత్తాన్ని గైకొని వెళ్ళే సమయంలో.

సీ. ఘోటకసంఘాత ఖుర సమున్నిర్గత ధూళి జీమూతసందోహముగను
మహనీయ మదకల మాతంగ కటదాన ధారలు కీలాలధారలుగను
నిరుపమ స్యందన నేమి నిర్ఘోషంబు దారుణ గర్జిత ధ్వానముగను
నిశిత శస్త్రాస్త్ర మానిత దీర్ఘరోచులు లలితసౌదామనీ లతికలుగను

తే. శత్రురాజ ప్రతాపాగ్ని శాంతముగను, వృష్టికాలము వచ్చు న వ్విధము దోఁప
నేఁగుదెంచె జరాసంధుఁ డిరువదియును,మూఁడు నక్షౌహిణులు దన్ను మొనసి కొలువ. 1669

* జరాసంధుడు ఇరవైమూడు అక్షౌహిణుల సేనతో మథురాపట్టణం మీదికి దండెత్తి వచ్చాడు. అతని గుఱ్ఱాల గుంపుయొక్క డెక్కలనుండి పైకి రేగిన దుమ్ము మబ్బుల గుంపువలె ఉన్నది. దొడ్డవైన మదపుటేనుగుల చెక్కిళ్ళనుంచి స్రవించే మదజలధారలు వర్షజలధారలను పురుడించాయి. కదిలే రథచక్రాల రొద ఘోరమైన ఉరుముల మ్రోత అనిపించింది. వాడియైన శస్త్రాస్త్రాల పెనుకాంతులు మెరిసే మెరుపు తీవలను పోలినాయి. శత్రురాజుల శౌర్యమనే అగ్నిని చల్లార్చే వర్షాకాలం మాదిరి అతడి సైన్యం గోచరించింది.

చ. ఇటు చనుదెంచియున్న మగధేశ్వర వాహినిఁ జూచి యుద్ధ సం
ఘటనము మాని మానవులకైవడి భీరుల భంగి నోడి ముం
దటి ధనమెల్ల డించి మృదుతామరసాభ పదద్వయుల్ క్రియా
పటువులు రామకేశవులు పాఱిరి ఘోరవనాంతరంబులన్. 1670

* ఈ విధంగా మథురానగరం మీదికి దండెత్తి వచ్చిన మగధరాజు జరాసంధుడి సైన్యాన్ని చూచి యుద్ధప్రయత్నం మానుకుని కేవలం సామాన్య మనుజుల వైఖరి, రణభీరువుల కైవడి జంకిపోయి తమ విత్త

మంతటివి అక్కడ దిగవిడచి మెత్తటి తామరదళాల వంటి అడుగులు కలవారూ, కార్యశూరులూ అయిన రామకృష్ణులు భయంకరారణ్యంలో పడి పరుగెత్తసాగారు.

**వ. ఇట్లు పఱచుచున్న కృష్ణబలభద్రులం జూచి వారల ప్రభావంబు లెఱుంగక పరిహసించి. 1671**

* అలా పారిపోతున్న బలరామకృష్ణులను చూచి వారి మహిమలు గుర్తింపలేక జరాసంధుడు ఎగతాళి చేశాడు.

**ఉ. 'ఓ యదువీరులార! రభసోద్ధతిఁ బాఱకుఁ; డిట్లు పాఱినం**
**బోయెడువాఁడఁ గాను; మిము భూమి నడంగిన మిన్ను బ్రాఁకినం**
**దోయధిఁ జొచ్చినం దగిలి ద్రుంచెద'నంచు సమస్తసేనతోఁ**
**బాయక వచ్చె వెంటఁబడి బాహుబలాఢ్యుఁడు మాగధేశుఁడున్. 1672**

* భుజబల సంపన్నుడైన ఆ మగధరాజు ఇలా అన్నాడు 'ఓ యాదవవీరులారా! మహావేగంతో పారిపోకండి. ఇలా పరుగెత్తి వెళుతున్నా మిమ్ము విడిచిపెట్టేవాణ్ణి కాను. భూమిలో దాగినా, అకసాని కెగిరినా, సాగరంలో ప్రవేశించినా వెంటనంటి మిమ్మల్ని హతమారుస్తాను'- అంటూ అతడు వదలక సకల సేనలతో వారి వెంట పడ్డాడు.

**వ. మఱియుం బలాయమానులై బహుయోజనంబుల దూరంబు సని విశ్రాంతులై దనకు డాఁగ నెల వగునని యింద్రుండు మిక్కిలి వర్షింపఁ బ్రవర్షణాఖ్యంబై పదునొకండు యోజనంబుల పొడవును నంతియ వెడలుపును గల గిరి యెక్కి రంత. 1673**

* రామకృష్ణులు పరుగెత్తి పరుగెత్తి పెక్కామడల దూరం వెళ్ళి సేదదీర్చుకోడానికి, దాగుకోడానికి తగిన చోటని తలచి దేవేంద్రుడు అధికంగా వానలు కురియించడం చేత ప్రవర్షణమనే పేరు వహించి, పదకొండు ఆమడల పొడవు అంతే వెడల్పు గల ఒక పర్వతాన్ని ఆరోహించారు.

**కా. ఆ శైలేంద్రముఁ జుట్టిరా విడిసి రోషావిష్టుఁడై మాగధో**
**ర్వీశుం డా వసుదేవ నందనులఁ దా వీక్షింపఁగా లేక త**
**న్నాశేచ్ఛన్ బిలసాను శృంగములఁ బూర్ణక్రోధుఁడై కాష్ఠముల్**
**రాసుల్ గా నిడి చిచ్చువెట్టఁ బనిచెన్ రౌద్రంబుతో భృత్యులన్. 1674**

* మగధదేశాధీశుడైన జరాసంధుడు కోపవివశుడై ఆ పర్వతరాజం చుట్టూ దండు విడిశాడు. అక్కడ రామకృష్ణులను కనుగొనలేక పోయాడు. వారి వినాశం కోరి అ కొండగుహల్లో, చరియల్లో, శిఖరాల్లో కట్టెల గుంపులు పేర్చి దహించివేయం డని రౌద్రంతో సేవకులను అజ్ఞాపించాడు.

**వ. ఇట్లు జరాసంధపరిజన ప్రదీపితంబైన మహానలంబు దరికొనియె నందు. 1675**

* ఈలా జరాసంధుని భృత్యులచేత ముట్టించబడిన మహాగ్ని దరికొని ఆ పర్వతాన్ని కాల్చివేసింది.

**క. పొగ లెగసెఁ బొగల తుదలను, మిగులుచు మిడుఁగుఱులు నిగిడె మిడుఁగుఱుగమి ము
న్నుగ బ్రహ్మాండము నిండెను, భగ భగమని మంట లొదవె భయదము లగుచున్. 1676**

* పొగలు పై కెగిసినాయి. పొగలమీద మిక్కుటంగా నిప్పురవ్వలు వ్యాపించాయి. ఆ మిణగురు గుంపులచే బ్రహ్మాండం నిండింది. అటుపై భయం గొల్పుతూ భగభగమని మంటలు లేచాయి.

**వ. మఱియు న మ్మహానలంబు బిల సాను శృంగ వృక్ష లతా కుంజపుంజంబుల దరికొని, శిఖలు కిసలయంబులుగ, విస్ఫులింగంబులు విరులుగ, సముద్ధూత ధూమపటలంబులు బంధురస్కంధ శాఖావిసరంబులుగ, నసోకహంబు కైవడి నభ్రంకషంబై ప్రబ్బి కఠోరసమీరణ సమున్నత మహోల్కాజాల తిరోహిత వియచ్చర విమానంబును, వివిధ విధూమ విస్ఫులింగ విలోకనప్రభూత నూతనతారకాభ్రాంతి విభ్రాంత గగనచరంబును, సంతప్యమాన సరోవర సలిలంబును, విశాలజ్వాలాజాల జాజ్వల్యమాన తక్కోలచందనాగరు కర్పూరధూమ వాసనావాసిత గగనకుహరంబును, గరాళకీలాజాల దందహ్యమాన కీచకనికుంజ పుంజసంజనిత చిటపటారావ పరిపూరిత దిగంతరాళంబును, భయంకర బహుళతర శాఖాభిద్యమాన పాషాణఘోషణ పరిమూర్ఛిత ప్రాణిలోకంబును, సంతప్యమాన శాఖిశాఖాంతర నిబిడ నీడనిహిత శాబకవియోగ దుఃఖడోలాయమాన విహంగకులంబును, మహోహేతి సందీప్యమాన కటిసూత్ర సంఘటిత మయూరపింఛ కుచకలశ యుగళ భారాలస శబరకామినీ సమాశ్రిత నిర్ఘరంబును, దగ్ధానేకమృగ మిథునంబు నై యేర్చునెడ. 1677**

* ఆ మహాగ్ని గుహలందునూ, చరియలందునూ, శిఖరము లందునూ గల చెట్లను, తీవలను, పొదలను అంటుకొని మండింది. జ్వాలలే చిగుళ్ళుగా, మిణుగురులే పూలుగా, పైకిలేచిన పొగల ప్రోగులే దట్టమైన బోదెలుగా, కొమ్మలుగా కనిపించగా ఆ అగ్ని ఒక మహావృక్షంవలె ఆకసమంటుతూ వ్యాపించింది. దారుణమైన వాయువుచేత లేచిన గొప్ప నిప్పుకణికలు ఖేచరవిమానాలను మరుగుపరిచాయి. పొగ లేక కణకణలాడే పలురకాల మిణుగురులను చూచి అవి క్రొత్తనక్షత్రా లని అంబరచారు లైన వేల్పులు విభ్రాంతి చెందినారు. సరస్సులలోని నీరు సలసల క్రాగిపోయింది. పెనుమంటలు అంటుకొని కాలుతున్న అగరు, తక్కోల, చందన, కర్పూర వృక్షాల పొగల సుగంధంతో ఆకాశమండల మంతా పరిమళించింది. భయంకరమైన మంటలతో మిక్కిలి మండుతున్న వెదురుపొదల గుంపునుండి పుట్టిన చిటపట ధ్వనులు దిక్కుల నడిమి భాగాన్ని నింపివేశాయి. ఘోరములు, మిక్కుటములు అయిన మంటలచే పగిలిపోతున్న రాళ్ళమ్రోతవల్ల భూతజాలం మూర్ఛిల్లింది. దగ్ధమవుతున్న చెట్ల కొమ్మల నడుమ దట్టమైన గూండ్లలో నివసిస్తున్న తమ పిల్లల ఎడబాటువల్ల ఏర్పడిన దుఃఖంతో పక్షిసమూహం కలత చెందింది. తమ మొలనూళ్ళయందు కట్టు కున్న నెమలి యీకలకు మంట లంటుకోగా, కుండలవంటి కుచాల బరువుచే మందగమనలై చెంచితలు సెలయేళ్ళ నాశ్రయించారు. ఆ అగ్ని అనేక మృగమిథునాలను దహించివేసింది.

**క. ఇల నేకాదశయోజన, ముల పొడవగు శైలశిఖరమున నుండి పడిన్
బలకృష్ణులు రిపుబలముల, వెలి కులికిరి కానఁబడక విలసితలీలన్. 1678**

* ఆ సమయంలో పదకొండామడల పొడవైన ఆ కొండ కొమ్మునుంచి బలరామకృష్ణులు జరాసంధుని బలముల కంటబడకుండా కుప్పించి వెలుపలికి దుమికారు.

**వ. ఇట్లు శత్రువుల వంచించి యాదవేంద్రులు సముద్రపరిఖంబైన ద్వారకా నగరంబునకుం జనిరి. జరాసంధుడు వారలు దగ్ధు లైరని తలంచుచు బలంబులుం దానును మగధదేశంబునకు మరలి చనియె; నంత. 1679**

* ఈ విధంగా విరోధులను మోసగించి యదుకుల విభులైన రామకృష్ణులు సాగరమే అగడ్తగా కలిగిన ద్వారకాపురికి చేరుకున్నారు. జరాసంధుడు వారు కాలిపోయారని భావించి తనసేనలతో మగధదేశానికి మరలిపోయాడు.

## -: రుక్మిణీ కల్యాణ కథాప్రారంభము :-

**క. ఆ వనజగర్భు పంపున, రైవతుఁడను రాజు దెచ్చి రాముని కిచ్చెన్**
**రేవతి యనియెడు కన్యను, భూవర! మును వింటి కాదె బుద్ధిం దెలియన్. 1680**

* పరీక్షిన్మహారాజా! బ్రహ్మదేవుని ఆజ్ఞ ననుసరించి రైవతుడనే రాజు 'రేవతి' అనే పేరుగల కన్యను దెచ్చి బలరాముని కిచ్చి వివాహం చేశాడు. ఇంతకు మునుపే ఈ విషయం వివరంగా విన్నావు గదా!

**వ. తదనంతరంబ. 1681**

**మ. ఖగనాథుం డమరేంద్రు గెల్చి సుధ మున్ గైకొన్న చందంబునన్**
**జగతీనాథులఁ జైద్యపక్షచరులన్ సాళ్వాదులం గెల్చి భ**
**ద్రగుఁడై చక్రి వరించె భీష్మకసుతన్ రాజీవగంధిన్ రమా**
**భగవత్యంశభవన్ మహాగుణమణిన్ బాలామణిన్ రుక్మిణిన్. 1682**

* ఆ విధంగా బలరాముడికి పెండ్లి కాగానే పూర్వము పక్షిరాజైన గరుత్మంతుడు దేవేంద్రునిజయించి అమృతాన్ని ఆత్మీయం చేసుకున్న రీతిగా చేదిదేశాధీశ్వరుడైన శిశుపాలుణ్ణీ, అతనిపక్షం వహించిన సాళ్వుడు మొదలైన నరపతులనూ ఓడించి మంగళకరుడూ చక్రాయుధుడూ ఐన శ్రీకృష్ణుడు భీష్మకమహారాజు కొమార్తె యగు రుక్మిణిని పెండ్లాడినాడు. ఆ రుక్మిణీదేవి పద్మంవంటి దేహపరిమళం గలది. లక్ష్మీదేవి అంశతో జన్మించింది. గొప్ప గుణవంతురాలు. కన్నెలలో మిన్న.

**వ. అనిన రాజిట్లనియె. మున్ను రాక్షసవివాహంబున స్వయంవరంబునకు వచ్చి హరి రుక్మిణిం గొనిపోయె నని పలికితివి. కృష్ణుం డొక్కరుం డెవ్విధంబున సాళ్వాదుల జయించి తన పురంబునకుం జనియె; నదియునుం గాక. 1683**

* ఈ విధంగా శుకయోగీంద్రుడు చెప్పగా విని పరీక్షిత్తు ఇట్లన్నాడు. మునీంద్రా! మునుపు గోవిందుడు స్వయంవరానికి వచ్చి రుక్మిణీదేవిని రాక్షస వివాహపద్ధతితో తీసుకవెళ్ళినాడని చెప్పినావు. ఏ విధంగా అత డొక్కడే సాళ్వుడు మొదలైన రాజులను జయించి ద్వారకాపట్టణానికి ఆమెను తోడ్కొని వెళ్లినాడు?

శా. కల్యాణాత్మకమైన విష్ణుకథ లాకర్ణించుచున్ ముక్త వై
కల్యం డెవ్వఁడు తృప్తుఁ డౌ; నవి వినంగాఁ గ్రొత్త లౌచుండు సా
కల్యం బేర్పడ భూసురోత్తమ! యెఱుంగం బల్కవే! రుక్మిణీ
కల్యాణంబు వినంగ నాకు మదిలోఁ గౌతూహలం బయ్యెడిన్. 1684

* బ్రాహ్మణోత్తమా! శుభదాయకాలైన శ్రీహరికథలు వింటే చాలు- మనోవికారాలన్నీ మాయమవు తాయి. ఆ గాథలు ఆలకిస్తూ 'ఇక చాలు' అని ఎవడు తృప్తిపడతాడు? విష్ణుకథలు ఎన్నిసారులు విన్నా సరి కొత్తగానే ఉంటాయి. కాబట్టి నాకు 'రుక్మిణీకల్యాణ' కథ వివరంగా వినిపించు, వినవలెనని మదిలో ఉబలాటంగా ఉన్నది.

క. భూషణములు సెవులకు బుధ, తోషణము లనేక జన్మదురితౌఘ విని
శ్శోషణములు మంగళతర, ఘోషణములు గరుడగమను గుణభాషణముల్. 1685

* గరుడవాహనుని గుణగణాలు వర్ణించే సంభాషణాలు చెవులకు భూషణాల వంటివి. అవి పండితులకు సంతోషం సమకూరుస్తాయి. పలుజన్మల నుంచి సంపాదించుకొన్న పాపాలను పోకారుస్తాయి. అవి వాస్తవంగా శుభప్రదాలైన శబ్దాలు.

వ. అని రా జడిగిన శుకుం డిట్లనియె. 1686

* అని పరీక్షిన్మహారాజు అడుగగా శుకమహర్షి ఇట్లన్నాడు.

చ. వినుము విదర్భదేశమున వీరుఁడు కుండినభర్త భీష్మకుం
డను నొక దొడ్డరాజు గల; డాతని కేవురు పుత్త్రు లగ్రజుం
డనయుఁడు రుక్మి నాఁ బరఁగు; నందఱకున్ గడగొట్టు చెల్లెలై
మనుజవరేణ్య! పుట్టె నొక మానిని రుక్మిణి నాఁ బ్రసిద్ధయై. 1687

* అధిపా! ఆకర్ణించు. విదర్భదేశంలో కుండిన నగరముంది. దానికి భీష్మకుడు ప్రభువు. అతడు వీరుడు; గొప్పరాజు, ఆయనకు ఐదుగురు కుమారులు; పెద్దవాడు రుక్మి. అతడు నీతిమాలినవాడు. ఈ ఐదుగురు కొమాళ్లకు కడగొట్టు చెల్లెలై భీష్మకమహారాజుకు ఒకకూతురు కల్గింది. ఆమె 'రుక్మిణి' అనే పేరుతో ప్రసిద్ధి వహించింది.

క. బాలేందురేఖ దోఁచిన, లాలిత యగు నపరదిక్కులాగున ధరణీ
పాలుని గేహము మెఱసెను, బాలిక జన్మించి యెదుగ భాసుర మగుచున్. 1688

* నెలపొడుపుచే పడమటి దెస భాసిల్లినట్లు రుక్మిణి పుట్టి పెరుగుతుండగా భీష్మకమహారాజు మందిరం దేదీప్యమానంగా తేజరిల్లింది.

వ. మఱియు దినదినప్రవర్ధమానయై. 1689

సీ. పేర్వేర బొమ్మలపెండ్లిండ్లు సేయుచు నబలలతోడ వియ్యంబు లందు
గుజ్జెనగూళ్ళను గొమరొప్ప వండించి చెలులకుఁ బెట్టించుఁ జెలువు మెఱసి
రమణీయ మందిరారామదేశంబులఁ బువ్వుఁ దీఁగెలకును బ్రోదివెట్టు
సదమల మణిమయ సౌధభాగంబుల లీలతో భర్మడోలికల నూఁగు

తే. బాలికలతోడఁ జెలరేగి బంతులాడు, శారికా కీరపం క్తికిఁ జదువు సెప్పు
బర్హిసంఘంబులకు మురిపములు గఱపు, మదమరాళంబులకుఁ జూపు మందగతులు. 1690

* రుక్మిణి దినదిన ప్రవర్ధమానురా లవుతూ ఉంది. బాలామణి యైన రుక్మిణి బొమ్మలకు పేరులు పెట్టి పెండ్లిండ్లు చేస్తూ తోడిబాలికలతో వియ్యాలు నెఱపుతుంది. పప్పు, బియ్యాలు గిన్నెలలో పోసి కమ్మగ గుజ్జెనగూళ్లు వండించి తన స్నేహితురాండ్రకు వైనంగా వడ్డన గావిస్తుంది. సుందరమైన మందిరోద్యానము లందు పుష్పలతలకు ఎరువువేసి, నీళ్లుపోసి, పంది ళ్లమర్చి పరిపోషణ చేస్తుంది. స్వచ్ఛమైన మణిమయ భవనాలలో బంగారు టుయ్యాలల్లో ఊగుతుంది. ఈడుపిల్లలతో చెండాట లాడుతుంది. గోరువంకలకూ, చిలుకలకూ పలుకులూ, నెమళ్ళగుంపునకు నాట్యాలూ, మదించిన రాయంచలకు నడకలూ నేర్పుతుంది.

వ. అంత. 1691

సీ. దేవకీసుతు కోర్కి తీఁగెలు వీడంగ వెలఁదికి మైదీఁగె వీడఁ దొడఁగెఁ;
గమలనాభుని చిత్తకమలంబు వికసింపఁ గాంతి నింతికి ముఖకమల మొప్పె;
మధువిరోధికి లోన మదనాగ్ని పొడసూపఁ బొలఁతికి చనుదోయి పొడవు సూఁపె;
శౌరికి ధైర్యంబు సన్నమై డయ్యంగ జలజాక్షి మధ్యంబు సన్నమయ్యె;

ఆ. హరికిఁ బ్రేమబంధ మధికంబుగాఁ కేశ, బంధ మధిక మగుచు బాల కమరెఁ
బద్మనయను వలనఁ బ్రమదంబు నిండార, నెలఁత యౌవనంబు నిండి యుండె. 1692

* దేవకీపుత్రునకు రుక్మిణిని పెండ్లాడవలెనన్న కోరిక కొనలు సాగునట్లుగా కోమలికి తీగవలె సన్ననైన శరీరం పెరుగుతున్నది. గోవిందునకు హృదయపద్మం విప్పారునట్లుగా కాంతకు వదనసరోజం కాంతితో కళకళలాడింది. మాధవునకు మనసులో వలపు రగుల్కొన్నట్లుగా మగువకు చనుదోయి బిగు వెక్కింది. శౌరికి ధైర్యం సన్నగిల్లు విధంగా సారసనేత్రకు నడుము సన్ననయింది. పద్మనాభునకు ప్రణయ మధిక మగునట్లుగా వెలదికి తలకట్టు వృద్ధిపొందింది. నందనందనునకు హృదయానందం నిండగా ఎలనాగకు ఎలజవ్వనం ఎసలారింది.

వ. ఇట్లు రుక్మి, రుక్మరథ, రుక్మబాహు, రుక్మకేశ, రుక్మనేత్రులను నేవురకుం జెలియలైన రుక్మిణీదేవి తన యెలప్రాయంబున. 1693

**క. తన తండ్రి గేహమునకుం, జనుదెంచుచు నున్న యతిథిజనులవలనఁ గృ**
**ష్ణుని రూపబల గుణాదులు, విని కృష్ణుఁడు దనకుఁ దగినఁ విభుఁడని తలఁచెన్. 1694**

* ఇలా రుక్మి, రుక్మరథుడు, రుక్మబాహువు, రుక్మకేశుడు, రుక్మనేత్రుడు అనే ఐదుగురకు తోబుట్టువైన రుక్మిణీదేవి తొలిజవ్వనంలో తన తండ్రిగారి ఇంటికి వస్తున్న అతిథులవల్ల శ్రీకృష్ణుని రూపం, బలం, సద్గుణాలు మున్నగువాటిని విన్నది. తన కతడే తగిన మగడని నిర్ణయించుకున్నది.

**క. ఆ లలన రూపు బుద్ధియు, శీలము లక్షణము గుణముఁ జింతించి దగన్**
**బాలారత్నముఁ దన కి, ల్లాలుగఁ జేకొందు ననుచు హరియుం దలఁచెన్. 1695**

* శ్రీకృష్ణుడు కూడ కన్యామణియగు రుక్మిణిరూపం, వివేకం, సత్ప్రవర్తన, శుభలక్షణాలు, సద్గుణాలు అన్నీ గ్రహించాడు. ఆ ఒప్పులకుప్పను తప్పక పరిణయ మాడాలని నిశ్చయించుకున్నాడు.

**వ. అంత. 1696**

**ఉ. బంధువు లెల్లఁ గృష్ణునకు బాలిక నిచ్చెద మంచు శేముషీ**
**సింధువులై విచారములు సేయఁగ వారల నడ్డపెట్టి దు**
**స్సంధుఁడు రుక్మి కృష్ణునెడఁ జాల విరోధముఁ జేసి మత్త పు**
**ష్పంధయవేణి నిత్తు శిశుపాలున కంచుఁ దలంచె నంధుఁడై. 1697**

* ఇలా వారు ఒకరి నొకరు పెండ్లాడవలెనని తీర్మానించుకున్న సమయంలో మతిమంతులైన చుట్టాలందరూ కృష్ణునకు రుక్మిణీదేవి నిచ్చి పెండ్లిచేయాలని కృతనిశ్చయు లయ్యారు. దుష్టులతో మైత్రి పాటించి జ్ఞానహీను డగు రుక్మి మాత్రము వెన్నునిపట్ల ప్రబలవిరోధం వహించాడు. ఆ మదాంధుడు బంధుజనుల ప్రయత్నం వారించి గండుతుమ్మెదల పిండువలె నల్లని శిరోజాలు గల తన చెల్లెలిని చేది దేశాధిపతి శిశుపాలునకు కట్టబెట్టవలెనని సంకల్పించాడు.

**ఉ. అన్నతలంపు దా నెఱిఁగి యన్నవనీరజగంధి లోన నా**
**పన్నత నొంది, యాప్తుఁడగు బ్రాహ్మణు నొక్కనిఁ జీరి గర్వ సం**
**ఛన్నుఁడు రుక్మి నేఁడు ననుఁ జైద్యున కిచ్చెద నంచు నున్న వాఁ**
**డెన్ని విధంబులం జని బుధేశ్వర! చక్రికి విన్నవింపవే! 1698**

* క్రొందామరల సుగంధాలు వెదజల్లే రుక్మిణి అగ్రజుని చెడుతలంపు గుర్తించింది. రానున్న ప్రమాదం తలచుకొని మనసులో ఎంతో బాధపడింది. తన మేలుగోరే అగ్నిద్యోతనుడనే ఒక విప్రుణ్ణి రావించి ఇలా విన్నవించింది. 'ఓ విద్వన్మణీ! గర్వంతో కన్నులు గానక మా పెద్దన్న రుక్మి నన్నిప్పుడు శిశుపాలున కిచ్చుటకు సిద్ధమైనాడు. ఏ విధంగా నైనా నీవు ద్వారకాపురికి వెళ్ళి చక్రాయుధునకు నా పరిస్థితి విన్నవించు.

**క. అయ్యా! కొడుకు విచారము, లయ్యయు వారింపఁ జాలఁ డటు గాకుండన్**
**నెయ్య మెఱిఁగించి చీరుము, చయ్యన నిజసేవకానుసారిన్ శౌరిన్. 1699**

* ఓ బ్రాహ్మణోత్తమా! తండ్రికూడా తనయుని ఆలోచన తగదని వారింపలేకున్నాడు. మా అన్న ఆటలు సాగకుండా నీవు వెంటనే వెళ్ళి నిజసేవకుల చిత్తవృత్తి ననుసరించే శౌరికి నా ప్రణయ మెరిగించి ఇక్కడికి పిలుకొని రావాలి'.

**వ. అని కొన్ని రహస్యవచనంబులు సెప్పిన విని బ్రాహ్మణుండు ద్వారకా నగరంబునకుం జని, ప్రతీహారుల వలనఁ దనరాక యెఱింగించి య న్నగధరుం డున్న నగరుఁ బ్రవేశించి,యందుఁ గనకాసనాసీనుండై యున్న పురుషోత్తముం గాంచి 'పెండ్లికొడుకవు గ' మ్మని దీవించిన ముసిముసి నగవులు నగుచు బ్రహ్మణ్యదేవుండైన హరి తన గద్దియ దిగ్గన డిగ్గి, బ్రాహ్మణుం గూర్చుండ నియోగించి, తనకు దేవతలు సేయు చందంబునం బూజలు సేసి, సరసపదార్థ సంపన్నంబైన యన్నంబు పెట్టించి, రెట్టించిన ప్రియంబున నయంబున భాసురుండైన భూసురుం జేరి లోకరక్షణ ప్రశస్తంబయిన హస్తంబున నతని యడుగులు పుడుకుచు మెల్లన నతని కిట్లనియె. 1700**

* అని మరికొన్ని రహస్యపు మాటలు రుక్మిణీదేవి ఆ విప్రునకు చెప్పిపంపింది. ఆ పలుకులన్నీ విని అగ్నిద్యోతనుడు వెంటనే ద్వారకా నగరానికి వెళ్ళినాడు. తన రాక వార్తాహరులద్వారా లోపలికి చెప్పిపంపి గోవర్ధన గిరిధారి నివసించే భవనం ప్రవేశించాడు. అక్కడ బంగారు గద్దెపై కూర్చున్న ఆ పరమ పురుషుణ్ణి తిలకించాడు. 'పెండ్లికుమారుడవు' కమ్మని ఆశీర్వదించాడు. బ్రాహ్మణులను దైవంగా భావించే ఆ మురారి ముసి ముసి నవ్వులు నవ్వుతూ తటాలున పీఠం దిగి అతణ్ణి కూర్చోబెట్టి వేల్పులు తన్ను పూజించు నట్లు పూజించాడు. పిదప షడ్రుచులతో నిండిన కమ్మని భోజనం పెట్టించి ప్రేమతో బ్రహ్మతేజస్సంపన్ను డైన ఆ బ్రాహ్మణుని చెంతకు జేరినాడు. జగద్రక్షణములో ఆరితేరిన తన చేతితో అతని అడుగులు పుడుకుతూ నెమ్మదిగా ఇట్లన్నాడు.

**సీ. జగతీసురేశ్వర! సంతోషచిత్తుండ వై యున్న నీధర్మ మతిసులభము**
**వృద్ధసమ్మత మిది విత్త మెయ్యది యైనఁ బ్రాపింప హర్షించు బ్రాహ్మణుండు**
**తనధర్మమున నుండుఁ దరలఁ డా ధర్మంబు గోరిక లతనికిఁ గురియుచుండు**
**సంతోషి గాఁ డేని శక్రుఁడైన నశించు నిర్ధనుం డైనను నింద్రుఁ బోలు**

**ఆ. సంతసించెనేని, సర్వభూతసుహృత్త, ములకుఁ బ్రాప్తలాభ ముదిత మాన**
**సులకు శాంతులకును సుజనులకును గర్వ,హీనులకును వినతు లే నొనర్తు. 1701**

* విప్రపుంగవా! నీవు నిత్యసంతోషివి. నీ వర్తనం అనుసరణీయం. ఆర్యులకు అంగీకారం. బ్రాహ్మణుడు ఏ కొంచెపాటి విత్తం లభించినప్పటికీ సంతోషిస్తాడు. తన ధర్మం నెరవేరుస్తాడు. నిజధర్మాన్ని అతిక్రమించడు. ఇట్టి విప్రుడికి సర్వవాంఛలూ సఫల మవుతాయి. తృప్తిలేకపోతే ఇంద్రునంతటివాడైనా నాశన మవుతాడు. సంతృప్తి గలవాడు ధనహీనుడైనా ఇంద్రునితో సమాను డవుతాడు. సకల జీవరాశికి హితము కోరేవారూ, సమకూడిన దానితో సంతోషించే మనస్సు కలవారూ, శాంతస్వభావులూ, గర్వరహితులూ అయిన సత్పురుషులకు నేను నమస్కారాలు చేస్తాను.

ఉ. ఎవ్వని దేశమం దునికి; యెవ్వనిచేఁ గుశలంబు గల్గు మీ;
కెవ్వని రాజ్యమందుఁ బ్రజలెల్ల సుఖింతురు వాఁడు మత్ప్రియుం
'డివ్వనరాశి దుర్గమున కె ట్లరుదెంచితి వయ్య! నీవు? లే
నవ్వులు గావు; నీ తలఁపునం గల మే లొనరింతు ధీమణీ! 1702

* పండితోత్తమా! మీది ఏ దేశం? ఏ రాజు మీ క్షేమం విచారిస్తున్నాడు? ఏ రాజ్యంలో ప్రజలందరు సుఖపడుతున్నారో ఆ రాజే నా కిష్టుడు. నీవు సాగరమధ్యమందున్న మా కోటలోనికి ఎలా వచ్చావయ్యా? పరియాచకపు మాటలు గావు. నీ మనోవాంఛ ఏమో చెప్పు? తప్పక తీరుస్తాను.

వ. అని యిట్లు లీలాగృహీత శరీరుండైన యప్పరమేశ్వరుం డడిగిన ధరణీసురవరుం డతనికి సవినయంబుగ నిట్లనియె. దేవా! విదర్భదేశాధీశ్వరుండైన భీష్మకుండను రాజు గలం; డా రాజుకూఁతురు రుక్మిణి యను కన్యకామణి గల; ద య్యిందువదన నీకుఁ గైంకర్యంబు సేయంగోరి వివాహమంగళ ప్రశస్తంబయిన యొక్క సందేశంబు విన్నవింపు మని పుత్తెంచె నవధరింపుము. 1703

* ఈ విధంగా లీలామానుష విగ్రహుడైన శ్రీకృష్ణుడు పలుకగా బ్రాహ్మణోత్తముడైన అగ్నిద్యోతనుడు అడకువతో ఇట్లన్నాడు. దేవా! విదర్భదేశాన్ని భీష్మకుడనే రాజు పాలిస్తున్నాడు. ఆయన కొక కూతురున్నది. ఆ కన్యామణి నామధేయం రుక్మిణి. ఆ చంద్రముఖి మీకు సపర్యలు సలుప నెంచి మంగళకరమైన వివాహ శుభవార్త దేవరవారికి మనవి చేయుమని నన్ను మీ పాలికి పంపింది. స్వామీ! సందేశం చిత్తగించండి.

సీ. ఏ నీ గుణములు కర్ణేంద్రియంబులు సోఁక దేహతాపంబులు దీఱిపోవు
నే నీ శుభాకార మీక్షింపఁ గన్నుల కఖిలార్థలాభంబు గలుగుచుండు
నే నీ చరణసేవ లేప్రొద్దుఁ జేసిన భువనోన్నతత్వంబు బొందఁ గలుగు
నే నీ లసన్నామ మే ప్రొద్దు భక్తితోఁ దడవిన బంధసంతతులు వాయు

తే. నట్టి నీ యందు నాచిత్త మనవరతము, నచ్చి యున్నది నీ యాన నాన లేదు,
కరుణఁ జూడుము కంసారి! ఖలవిదారి!, శ్రీయుతాకార! మానినీ చిత్త చోర! 1704

* కంసాంతకా! ప్రశస్తములైన నీ గుణాలు చెవులబడితే చాలు శరీర తాపాలన్నీ శమిస్తాయి. ఓ కళ్యాణ స్వరూపా! మంగళకరమైన నీ స్వరూపం తిలకిస్తే చాలు నేత్రాలకు నిఖిల ప్రయోజనాలు సిద్ధిస్తాయి. దుష్టులను దునుమాడువాడా! నిరంతరం నీ పాదసేవచేస్తే చాలు లోకంలో మహోన్నతి నొందవచ్చు. మానవతుల మనసులు హరించువాడా! సంతతమూ నీ దివ్యనామం సంస్మరిస్తే చాలు బంధాలన్నీ పటాపంచలవుతాయి. నీ మహిమ ఎక్కడ? నే నెక్కడ? అని సిగ్గుచెందక నా హృదయం నీయందు లగ్నమయింది. ఇది నిజం. నన్ను కరుణతో కటాక్షించు.

**శా. ధన్యున్ లోకమనోభిరాముఁ గులవిద్యారూపతారుణ్య సౌ**
**జన్యశ్రీబలదాన శౌర్యకరుణా సంశోభితున్ నిన్ను నే**
**కన్యల్ గోరరు? కోరదే మును రమాకాంతా లలామంబు రా**
**జన్యానేకపసింహ! నావలననే జన్మించెనే మోహముల్? 1705**

* శత్రురాజులనే గజాలను సంహరించే సింహంవంటి శ్రీ కృష్ణా! నీవు ధన్యుడవు. లోకుల మనస్సులను రంజింపజేసేవాడవు. వంశము, విద్య, చక్కదనము, జవ్వనము, మంచితనము, సంపద, బలము, దానము, పరాక్రమము, కారుణ్యము అనే గుణాలతో అలరారుతున్నావు. ఇటువంటి నిన్ను ఏ కన్యలు వరించకుండా ఉండగలరు? ఉవిదలలో ఉత్తమురాలైన శ్రీమహాలక్ష్మి అలనాడు నిన్ను చెట్టబట్టలేదా? నే నొక్కతెనే నిన్ను మోహించానా ఏమి? వలపు అనేది నావల్లనే జన్మించిందా?

**ఉ. శ్రీయుతమూర్తి! యో పురుషసింహమ! సింహముపాలి సొమ్ము గో**
**మాయువు గోరు చందమున మత్తుఁడు చైద్యుఁడు నీ పదాంబుజ**
**ధ్యాయినినైన నన్ను వడిఁ దాఁ గొనిపోయెద నంచు నున్న వాఁ**
**డా యధమాధముం డెఱుఁగఁ డద్భుతమైన భవత్ప్రతాపమున్. 1706**

* ఓ మంగళమూర్తీ! పురుషులలో సింహమువంటి వాడవు నీవు. సింహమునకు చెందవలసిన పదార్థము నక్క వాంఛించునట్లు నీ చరణ సరోజాలను స్మరించే నన్ను మదోన్మత్తుడైన శిశుపాలుడు శీఘ్రంగా హరించుకు పోవడానికి యత్నిస్తున్నాడు, అల్పులలో అల్పుడైన ఆ చేది దేశపురాజు ఆశ్చర్యజనకమైన నీ పరాక్రమం ఎరుగడు సుమా!

**మ. వ్రతముల్ దేవ గురు ద్విజన్మ బుధ సేవల్ దానధర్మాదులున్**
**గతజన్మంబుల నీశ్వరున్ హరి జగత్కల్యాణుఁ గాంక్షించి చే**
**సితి నేనిన్ వసుదేవ నందనుఁడు నా చిత్తేశుఁ డౌఁగాక ని**
**ర్జితులై పోదురుగాక సంగరములోఁ జేదీశ ముఖ్యాధముల్. 1707**

* పూర్వజన్మములందు నేను జగన్నాయకుడూ, లోకాలకు శుభాలు కలిగించేవాడూ అయిన గోవిందుణ్ణి పతిగా గోరి నోములు నోచి ఉంటే దేవతలకూ, గురువులకూ, బ్రాహ్మణులకూ, విద్వాంసులకూ సేవ లొనర్చి ఉంటే, దాన ధర్మాది పుణ్యకార్యాలు సల్పి ఉంటే వసుదేవుని కుమారుడైన శ్రీకృష్ణుడు నాకు ప్రాణేశ్వరు డౌతాడు. శిశుపాలుడు మొదలుగా గల నీచులు భండనంలో పరాజితు లవుతారు.

**ఉ. అంకిలి సెప్పలేదు; చతురంగబలంబులతోడ నెల్లి యో**
**పంకజనాభ! నీవు శిశుపాల జరాసుతులన్ జయించి నా**
**వంకకు వచ్చి రాక్షస వివాహమునన్ భవదీయ శౌర్యమే**
**యుంకువ సేసి కృష్ణ! పురుషోత్తమ! చేకొని పొమ్ము వచ్చెదన్. 1708**

* ఓ పద్మనాభా! నీకు ఇక్కడ అడ్డ మేమీ లేదు. రేపే రథ గజ తురగ పదాతులనే చతురంగబలాలతో వచ్చి శిశుపాల జరాసంధులను ఉగ్రరణంలో ఓడించు. ఓ పరమపురుషా! నీ పరాక్రమమే ఓలిగా ఇచ్చి బలాత్కారమున రాక్షస వివాహపద్ధతితో నన్నెత్తుకొని వెళ్ళు. నేను నీవెంట వచ్చుటకు సిద్ధంగా ఉన్నాను.

**సీ. లోపలి సౌధంబులోన వర్తింపంగఁ దేవచ్చునే నిన్నుఁ దెత్తునేనిఁ**
**గావలివారలఁ గల బంధువులఁ జంపి కాని తేరా దని కమలనయన!**
**భావించితేని నుపాయంబు సెప్పెద నాలింపు కులదేవయాత్రఁ జేసి**
**నగరంబు వెలువడి నగజాతకును మ్రొక్కఁ బెండ్లికి మునుపడఁ బెండ్లికూఁతు**

**తే. నెలమి మావారు పంపుదు రేను నట్లు, పురము వెలువడి యేతెంచి భూతనాథు**
**సతికి మ్రొక్కంగ నీవు నా సమయమందు, వచ్చి కొనిపొమ్ము నన్ను నవార్యచరిత! 1709**

* 'రుక్మిణీ! నీవు కన్యాంతఃపురంలో ఉంటావు గదా? నిన్ను వెంటబెట్టుకుని వెళ్ళడానికి ఎలా శక్యమవుతుది? అలా తీసుకొని వెళ్ళవలెనంటే అంతఃపుర రక్షకులనూ, నీ బంధుజనాలనూ చంపవలసి వస్తుంది గదా'! అని, నీరజాక్షా! నీవు భావిస్తే ఈ రభసతో నిమిత్తం లేని ఒక చక్కని ఉపాయం మనవి చేస్తాను. చిత్తగించు. పెండ్లికి ముందుగా పెండ్లి కొమార్తెను మా ఇలువేల్పు మంగళగౌరిని కొలవడానికి మావారు పంపుతారు. నేను ఊరి వెలుపల నున్న దుర్గగుడికి మ్రొక్కుచెల్లించడానికై నగరినుండి బయలు దేరి వస్తాను. నీవు అడ్డగింపరాని నడవడి గలవాడవు. ఆ తరుణంలో నన్ను నిరాటంకంగా నీ వెంట తోడ్కొని పో!

**మ. ఘను లాత్మీయ తమోనివృత్తికొఱకై గౌరీశుమర్యాద నె**
**వ్వని పాదాంబుజతోయమందు మునుఁగన్ వాంఛింతు రే నట్టి నీ**
**యనుకంపన్ విలసింపనేని వ్రతచర్యన్ నూఱుజన్మంబులన్**
**నినుఁ జింతించుచుఁ బ్రాణముల్ విడిచెదన్ నిక్కంబు ప్రాణేశ్వరా! 1710**

* నాథా! మహాత్ములు అజ్ఞానరాహిత్యం కొరకు పరమేశ్వరుని లాగా ఏ పరమపురుషుని పాదపద్మాలలో ప్రభవించిన గంగాజలాలలో ఓలలాడ నెంచుతారో అట్టి తీర్థపాదుడవైన నీ అనుగ్రహానికి నేను అర్హురాలను కాకపోతే బ్రహ్మచర్య వ్రతనిష్ఠ వహించి నూరుజన్మాలకైనా నీవే నా పతివి కావాలని నిన్నే ధ్యానిస్తూ నా ప్రాణాలు నీకే అర్పిస్తాను. ఇది నా మనోనిశ్చయం.

**సీ. ప్రాణేశ! నీ మంజుభాషలు వినలేని కర్ణరంధ్రంబుల కలిమి యేల?**
**పురుషరత్నమ! నీవు భోగింపఁగా లేని తనులతవలని సౌందర్య మేల?**
**భువనమోహన! నిన్నుఁ బొడగానఁగా లేని చక్షురింద్రియముల సత్త్వమేల?**
**దయిత! నీ యధరామృతం బానఁగా లేని జిహ్వకు ఫలరససిద్ధి యేల?**

**ఆ. నీరజాతనయన! నీ వనమాలికా, గంధ మబ్బలేని ఘ్రాణ మేల?**
**ధన్యచరిత! నీకు దాస్యంబు సేయని, జన్మ మేల? యెన్ని జన్మములకు? 1711**

* ప్రాణవల్లభా! నీ మధురవాక్కులు విననోచని చెవులవల్ల ప్రయోజనం శూన్యం. పురుషోత్తమా! నీ వనుభవింపని సుందర సుకుమార శరీరలావణ్యం ఎందుకూ కొరగాదు. జగన్మోహనమూర్తీ! నిన్ను సందర్శింప నోచని కనుల కలిమి దండుగ. జీవితేశ్వరా! నీ అధరసుధారసం ఆస్వాదింపని నాలుకకు ఫలరసముల ప్రాప్తి ఎందుకు? కమలాక్షా? నీవు ధరించు వనమాలికా సౌరభం ఆఘ్రాణించని ఈనాసిక ఏల? ధన్యచరిత్రా! నీ పాదపరిచర్యకు ఉపకరింపని ఈ జన్మ ఎన్ని జన్మలెత్తినా ఏమి లాభం?

**వ. అని యిట్లు రుక్మిణీదేవి పుత్తెంచిన సందేశంబును, రూపసౌందర్యాది విశేషంబులును బ్రాహ్మణుండు హరికి విన్నవించి 'కర్తవ్యం బెద్ది సేయ నవధరింపు' మని సవర్ణనంబుగా మఱియు నిట్లనియె. 1712**

* ఈ విధంగా అగ్నిద్యోతనుడు రుక్మిణీదేవి పంపిన సందేశం, ఆమె ఆకార సౌందర్యం మొదలైన విశేషాలను వెన్నునకు విజ్ఞప్తిచేసి 'కర్తవ్య మేమో ఏలినవారే ఆలోచించాలి' అంటూ మరల వైదర్భీవర్ణనకు ఉపక్రమించి ఇట్లన్నారు.

**సీ. పల్లవవైభవాస్పదములు పదములు గనకరంభా తిరస్కారు లూరు;**
**లరుణప్రభా మనోహరములు గరములు గంబు సౌందర్య మంగళము గళము**
**మహిత భావాభావ మధ్యంబు మధ్యంబు చక్షురుత్సవదాయి చన్నుదోయి**
**పరిహసితార్ధేందు పటలంబు నిటలంబు జితమత్త మధుకరశ్రేణి వేణి**
**ఆ. భావజాశుగముల ప్రాపులు చూపు లు, కుసుమశరుని వింటికొమలు బొమలు**
**చిత్తతోషణములు చెలువ భాషణములు, జలజనయన ముఖము చంద్రసఖము. 1713**

* రుక్మిణీదేవి చరణములు చిగురుటాకుల జిగిని మించుతాయి. తొడలు పసిడి అరటిబోదెలను పరిభవిస్తాయి. అరచేతులు బాలారుణప్రభవలె మనోహరాలు. కంఠం శంఖం మాదిరి కడు రమణీయం. నడుము ఉన్నదా లేదా అనిపిస్తుంది. చనుగవ కనులపండువు గావిస్తుంది. నెన్నుదురు నెలవంకను గేలి చేస్తుంది. జడ గండుతుమ్మెదల బారును జయిస్తుంది. చూపులు మన్మథుని తూపులు. కనుబొమలు మదనుని వింటికొనలు. మాటలు మనస్సంతోష సంధాయకాలు. ఆమె వదనం చంద్రబింబం.

**ఉ. ఆ యెలనాఁగ నీకుఁ దగు; నంగనకుం దగు దీవు; మా యుపా**
**ధ్యాయుల యాన పెండ్లి యగుఁ; దప్పదు; జాడ్యము లేల? నీవు నీ**
**తోయమువారిఁ గూడుకొని తోయరుహాననఁ దెత్తుగాని వి**
**చ్చేయుము; శత్రులన్ నుఱుముసేయుము; సేయుము శోభనం బిలన్. 1714**

* కృష్ణా! మా ఒజ్జలమీద ఒట్టు వేసి చెపుతున్నాను. నీకు రుక్మిణీ, రుక్మిణికి నీవూ ఈడు జోడుగా ఉంటారు. మీకు వివాహం తప్పక జరుగుతుంది. ఆలస్య మింకెందుకు? నీవు నీ వారితో గూడి ఆ వనజముఖిని కొనితేవటానికి వెంటనే బయలుదేరు. వైరివర్గాన్ని నుగ్గు నుగ్గు గావించు. లోకానికి మేలు చేకూర్చు.

## -: శ్రీకృష్ణుఁడు కుండిన నగరంబునకు రథారూఢుండై చనుట:-

వ. అని యిట్లు పలికి, బ్రాహ్మణునివలన విదర్భరాజతనయ పుత్తెంచిన సందేశంబును, రూప సౌందర్యాది విశేషంబులును విని, యవధరించి, నిజకరంబున నతని కరంబుఁబట్టి నగుచు న య్యాదవేంద్రుం డిట్లనియె. 1715

* ఈ రీతిగా పలుకుతున్న ఆ భూసురునివల్ల విదర్భరాజకుమారి పంపిన వార్తనూ, ఆమె రూపం, చక్కదనం మున్నగు విశేషాలనూ ఆ యదుకుల చక్రవర్తి సావధానంగా ఆలకించాడు. తన చేతితో అగ్ని ద్యోతనుని చేయిపట్టుకొని నవ్వుతూ ఇలా అన్నాడు.

ఉ. కన్నియమీఁద నాతలఁపు గాఢము; కూరుకు రాదు రేయి నా
కెన్నఁడు; నా వివాహము సహింపక రుక్మి తలంచు కీడు నే
మున్నె యెఱుంగుదున్; బరులమూఁక లడంచి కుమారిఁ దెత్తు వి
ద్వన్నుత! మాను ద్రచ్చి నవవహ్నిశిఖన్ వడిఁ దెచ్చు కైవడిన్. 1716

* పండితప్రశంసలు పడసినవాడా! రుక్మిణిమీద నాకు అగ్గలమైన కోరిక. కనుకనే రేయి నే నెన్నడూ నిద్రించి ఎరుగ. రుక్మి మా పెండ్లి కోర్వలేక చెడుతలంపుతో నున్నాడని నా కింతకు మునుపే తెలుసు. కొయ్యను మథించి కొత్తదగు అగ్నిజ్వాలను వెలికి తెచ్చిన విధంగా శత్రువర్గాన్ని ఛేదించి కన్యారత్నాన్ని గైకొంటాను.

క. వచ్చెద విదర్భభూమికిఁ;, జొచ్చెద భీష్మకుని పురము; సురుచిరలీలన్
దెచ్చెద బాలన్; వ్రేల్మిడి, వ్రచ్చెద నడ్డంబు రిపులు వచ్చినఁ బోరన్. 1717

* నేను విదర్భదేశం వస్తాను. అలవోకగా కుండిన నగరం ప్రవేశిస్తాను. చిటికెలో రుక్మిణిని తెస్తాను. విరోధులు నిరోధిస్తే ఆహవరంగంలో హతమారుస్తాను.

వ. అని పలికి, రుక్మిణీదేవి పెండ్లినక్షత్రంబు దెలిసి, తన పంపున రథసారథియైన దారుకుండు శైబ్యసుగ్రీవ మేఘపుష్ప వలాహకంబులను తురగంబులం గట్టి, రథ మాయత్తంబు చేసి తెచ్చిన, నమోఘమనో రథుండైన హరి తానును, బ్రాహ్మణుండును రథారోహణంబు సేసి యేకరాత్రంబున నానర్తక దేశం బులు గడచి, విదర్భదేశంబునకుం జనియె; నందుఁ గుండిన పురీశ్వరుండైన భీష్మకుండు కొడుకు నకు వశుండై, కూఁతు శిశుపాలున కిత్తునని తలంచి, శోభనోద్యోగంబు సేయించె; నప్పుడు. 1718

* గోవిందుడు ఈ విధంగా వచించి వివాహ ముహూర్త మెపుడో అగ్నిద్యోతనుణ్ణి అడిగి తెలుసుకున్నాడు. తన ఆజ్ఞానుసారం సారథియైన దారుకుడు శైబ్యం, సుగ్రీవం, మేఘపుష్పం, వలాహకం అనే నాలు గశ్వాలను పూన్చి ఆయత్తపరచుకొని తెచ్చిన రథాన్ని సిద్ధసంకల్పుడైన శ్రీకృష్ణుడు అగ్నిద్యోతనునితో పాటు అధిరోహించాడు. ఒకేరాత్రి పయనించి ఆనర్తకదేశాలు దాటి వెన్నుడు విదర్భకు విచ్చేశాడు. అక్కడ కుండిన నగరాధిపతి భీష్మకుడు కుమారునకు లోపడి కొమార్తెను శిశుపాలున కిచ్చుటకు ఒప్పుకొని శుభకార్యప్రయత్నాలు చేయింపసాగాడు.

సీ. రచ్చలు క్రంతలు రాజమార్గంబులు విపణిదేశంబులు విశదములుగఁ
జేసిరి; చందనసిక్త తోయంబులు గలయంగఁ జల్లిరి; కలువడములు
రమణీయ వివిధతోరణములు గట్టిరి సకలగృహంబులఁ జక్క సేసి;
కర్పూర కుంకుమాగరు ధూపములు వెట్టి రతివలుఁ బురుషులు నన్నియెడల

ఆ. వివిధవస్త్రములను వివిధమాల్యాభర, ణానులేపనముల నమరియుండి
రఖిలవాద్యములు మహాప్రీతి మ్రోయించి, రుత్సవమున నగర మొప్పి యుండె. 1719

* నగరమంతా అలంకరించారు. మండపాలు, సందులు, రాజవీథులు, అంగడిప్రదేశాలు చిమ్మి శుభ్రం చేశారు. మంచిగంధం కలిపిన నీరు అంతటనూ చల్లినారు. కలువపూదండలతో మనోహరములైన నానావిధతోరణాలు కట్టినారు. అన్ని యిండ్లను చక్కబరచి కర్పూరముతో, కుంకుమతో, ముగ్గులు పెట్టి అగరుధూపాలు వేశారు. అన్నిచోట్ల ఆడవారు మగవారు రంగురంగుల వస్త్రాలతో, రకరకాల పూదండలతో, క్రొంగ్రొత్త వలువలతో, నగలతో, మైపూతలతో ఒప్పినారు. అనేక మంగళతూర్యాలను పరమసంతోషంతో మ్రోగించారు. పట్టణమంతా మహావైభవంతో పరిఢవిల్లింది.

వ. అంత నా భీష్మకుండు విహిత ప్రకారంబునం బితృదేవతల నర్చించి బ్రాహ్మణులకు భోజనంబులు వెట్టించి, మంగళాశీర్వచనంబులు సదివించి, రుక్మిణీదేవి నభిషిక్తం జేసి, వస్త్రయుగళభూషితం గావించి, రత్నభూషణంబు లిడం జేసె; ఋగ్యజుస్సామాథర్వణ మంత్రంబుల మంగళాచరణంబు లొనరించి, భూసురులు రక్షాకరణంబు లాచరించిరి; పురోహితుండు గ్రహశాంతికొఱకు నిగమ నిగదిత న్యాయంబున హోమంబుఁ గావించె; మఱియు నా రాజు దంపతుల మేలుకొఱకుఁ దిల ధేను కలధౌత కనక చేలాది దానంబులు ధరణీదేవతల కొసంగె నయ్యవసరంబున. 1720

* ఆ తర్వాత భీష్మకుడు శాస్త్రములో చెప్పిన రీతిగా పితృదేవతలను పూజించాడు. భూసురులకు భోజనం పెట్టించి వారిచే మంగళాశీర్వాదాలు పఠింపజేశాడు. రుక్మిణికి తలంటు స్నానం చేయించి ఆమెను వస్త్రద్వయంతో, రత్నాభరణాలతో అలంకరింపజేశాడు. బ్రాహ్మణులు ఋక్కు, యజుస్సు, సామము, అథర్వము అనే నాల్గు వేదాలలోని మంత్రాలతో స్వస్తిపుణ్యాహవాచనములు చేసి నిర్విఘ్నంగా పరిణయ మహోత్సవం పరిసమాప్తి చెందడానికి రక్షాకరణములు గావించారు. పురోహితుడు గ్రహశాంతికై వేదోక్తవిధానంతో హోమం గావించాడు. భీష్మకుడు నూత్నదంపతుల క్షేమానికై బ్రాహ్మణులకు నువ్వులు, గోవులు, వెండి, బంగారం, వస్త్రాలు మొదలైన దానాలు చేశాడు.

మ. భటసంఘంబులతో రథావళులతో భద్రేభయూథంబుతోఁ
బటువేగాన్విత ఘోటకవ్రజముతో బంధుప్రియశ్రేణితోఁ
గటుసంరంభముతో విదర్భతనయం గైకొందు నంచున్ విశం
కట వృత్తిం జనుదెంచెఁ జైద్యుఁడు గడున్ గర్వించి య ప్పీటికిన్. 1721

* ఆ సమయంలో విదర్భరాజపుత్రిని చేపడతానంటూ మదోన్మత్తుడైన శిశుపాలుడు భటుల పటాలంతో, తేరులబారుతో, భద్రజాతికి చెందిన కుంజర బృందంతో, కడువడిగా పరుగిడే గుఱ్ఱాల పౌజుతో బంధుమిత్ర సమేతంగా మహాటోపంతో కుండిన నగరానికి వచ్చాడు.

ఉ. బంధులఁ గూడి కృష్ణబలభద్రులు వచ్చినఁ బాఱఁ దోలి ని
ర్మంథరవృత్తిఁ జైద్యునికి మానినిఁ గూర్చెద మంచు నుల్లస
త్సింధుర వీరరథ్య రథసేనలతోఁ జనుదెంచి రా జరా
సంధుఁడు దంతవక్త్రుఁడును సాల్వవిదూరకపౌండ్రకాదులున్. 1722

* బాంధవసహితులైన బలరామకృష్ణులను తరిమికొట్టి నిరాటంకంగా నెలతను శిశుపాలునకిచ్చి పెండ్లి జరిపిస్తామంటూ జరాసంధుడూ, దంతవక్త్రుడు, సాల్వుడు, విదూరకుడు, పౌండ్రక వాసుదేవుడు మొదలైనవారు మదపుటేనుగులు, వీరభటులు, అశ్వములు, అరదములు అనే చతురంగ బలాలతో కదలివచ్చారు.

వ. మఱియు నానాదేశంబుల రాజు లనేకు లేతెంచి; రందు శిశుపాలు నెదుర్కొని పూజించి భీష్మకుం డొక్క నివేశంబున నతని విడియించె; నంత నా వృత్తాంతంబు విని. 1723

* ఇంకా దేశదేశాల రాజులు పెక్కుమంది వచ్చారు. భీష్మకుడు శిశుపాలున కెదురేగి పూజించి అతనికి ఒకచోట విడిది ఏర్పాటు చేశాడు. ఆ సమాచారం విన్నాడు బలరాముడు.

చ. హరి యొకఁ డేగినాఁడు మగధాదులు చైద్యహితానుసారులై
నరపతు లెందఱేనిఁ జనినారు కుమారికఁ దెచ్చుచోట సం
గర మగుఁ; దోడు గావలయుఁ గంసవిరోధికి నంచు వేగఁ దా
నరిగె హలాయుధుండు గమలాక్షుని జాడ ననేక సేనతోన్. 1724

* వెన్ను డొక్కడే వెళ్ళినాడు. శిశుపాలునికి సహాయంగా జరాసంధుడు మొదలగు రాజు లెందరో కుండినపురానికి పోయినారు. కన్యకను తెచ్చేటప్పుడు కదనం జరుగుతుంది. తమ్ముడు శ్రీకృష్ణునికి సహాయపడవలె నంటూ హలధరుడైన బలభద్రుడు అనుజు డేగిన మార్గాన అసంఖ్యాకమైన సైన్యంతో అరుదెంచినాడు.

క. ఆ లోపల నేకతమున, నాలోల విశాల నయన యగు రుక్మిణి త
న్నా లోకలోచనుఁడు హరి, యాలోకము చేసి కదియఁడని శంకితయై. 1725

* ఆ సమయంలో వాలుకన్నుల బాల రుక్మిణి ఏకాంత మందిరంలో కూర్చుని లోకములకు కన్నువంటి వాడైన యదువల్లభుడు తన సందేశం తిలకించి తన్ను చేరరాడేమో అనే సందేహంతో లోలోపల ఆందోళన చెందసాగింది.

శా. లగ్నం బెల్లి; వివాహముం గదిసె; నేలా రాఁడు గోవిందు? డు
ద్విగ్నం బయ్యెడి మానసంబు; వినెనో వృత్తాంతమున్; బ్రాహ్మణుం

**డగ్నిద్యోతనుఁ డేటికిం దడసె? నా యత్నంబు సిద్ధించునో**
**భగ్నంబై చనునో విరించికృత మెబ్భంగిన్ బ్రవర్తించునో?** **1726**

* సుముహూర్తం రేపే. పెండ్లి దగ్గరపడుతున్నది. ఇందీవరశ్యాము డెందుకు రా డబ్బా? నా మనస్సు ఆందోళన చెందుతున్నది. ఆయనకు వార్త అందిందో లేదో? అస లీ భూసురుడు ఎందు కింత ఆలసించాడు? ఇంతకూ నా ప్రయత్నం ఫలిస్తుందో ఫలించదో? దైవనిర్ణయం ఎలా ఉందో ఏమో?

**మ. ఘనుఁ డా భూసురుఁ డేఁగెనో? నడుమ మార్గశ్రాంతుఁడై చిక్కెనో**
**విని కృష్ణుం డిది తప్పుగాఁ దలఁచెనో? విచ్చేసెనో? యీశ్వరుం**
**డనుకూలింపఁ దలంచునో తలఁపఁడో? యార్యామహాదేవియున్**
**నను రక్షింప నెఱుంగునో యెఱుఁగదో? నా భాగ్య మెట్లున్నదో?** **1727**

* మహనీయుడైన ఆ బ్రాహ్మణోత్తముడు ద్వారకకు వెళ్ళినాడో? లేదో? మార్గాయాసంతో మధ్యలోనే నిలిచి పోయినాడేమో? నందనందనుడు నా సందేశాన్ని విని తప్పుగా భావించినాడేమో? లేక ఇక్కడికే వచ్చియున్నాడో? పరమేశ్వరు డీ పనికి అనుకూలిస్తాడో? అనుకూలించడో? గౌరీమహాదేవి నన్ను కాపాడుతుందో? కాపాడదో? ఇంతకు నా అదృష్టం ఎట్లుందో ఏమో?

**వ. అని వితర్కించుచు.** **1728**

**ఉ. పోఁ డను బ్రాహ్మణుండు యదుపుంగవు వీటికి; వాసుదేవుఁడున్**
**రాఁడను; నింకఁబోయి హరి రమ్మని చీరెడి యిష్టబంధుఁడున్**
**లేఁడను; రుక్మికిం దగవు లేదిటఁ జైద్యున కిత్తు నంచు మ**
**న్నాఁడను; గౌరి కీశ్వరికి నావలనం గృప లేదు నేఁడనున్.** **1729**

* ఇలా అనేకవిధాల భావిస్తుంది. అగ్నిద్యోతనుడు అసలు ద్వారకాపురికి అరిగి ఉండడు; అందుచేతనే వసుదేవనందనుడు రాలేదని సందేహిస్తుంది. మరల ద్వారకకు వెళ్ళి మాధవుని ఆహ్వానించే ఆత్మబంధువు తనకు ఎవ్వడూ లేడు కదా అనుకుంటుంది. అన్న నీతిమాలి తన్ను శిశుపాలునికి ఇయ్యటానికి సిద్ధపడినాడే అని విచారిస్తుంది. పరమేశ్వరికి తనపై నేడు కృప తప్పింది అని చింతిస్తుంది.

**ఉ. చెప్పదు తల్లికిం దలఁపుఁ జిక్కు; దిశల్ దరహాసచంద్రికం**
**గప్పదు; వక్త్రతామరసగంధ సమాగత భృంగసంఘమున్**
**రొప్పదు; నిద్రఁ గైకొన దురోజపరస్పర సక్తహారముల్**
**విప్పదు; కృష్ణమార్గగత వీక్షణపంక్తులు ద్రిప్ప దెప్పుడున్.** **1730**

* కన్యకామణి రుక్మిణి తన మనస్సులోని ఆవేదన తల్లికి చెప్పుకోదు. దిక్కులలో చిరునవ్వు వెన్నెలలు చిందింపదు. ముఖపద్మ సౌరభానికి ముసురుకుంటున్న తుమ్మెదల గుంపును తోలదు. నిదుర పోదు. వక్షఃస్థలాన ఒండొంటితో మెలివడిన ముత్యాలదండల చిక్కు సడలింపదు. తామరసనేత్రుడు వచ్చేదారిపై నిలిపిన చూపులను క్షణకాలమైనా ప్రక్కకు మరలింపదు.

చ. తుడువదు కన్నులన్ వెడలు తోయకణంబులు; కొప్పుఁ జక్కఁగా
ముడువదు; నెచ్చెలిం గదిసి ముచ్చటకుం జన; దన్న మేమియుం
గుడువదు; నీరముం గొనదు; కూరిమి కీరముఁ జేరి పద్యమున్
నొడువదు; వల్లకీగుణ వినోదము సేయదు; డాయ దన్యులన్. 1731

* ఆ రాజపుత్రి రుక్మిణి కనులనుండి కారే కన్నీటిబొట్లు తుడువదు. చక్కఁగా కొప్పు సవరించుకోదు. స్నేహితురాలితో ముచ్చటింపదు. అన్నము బొత్తిగా ఆరగింపదు. మంచినీళ్లయినా ముట్టదు. చెలిమితో చెంతకు జేరిన చిలుకకు పద్యము చెప్పదు. వీణాతంత్రులను మీటుతూ వినోదింపదు. చెలికత్తెలతో చేరదు.

సీ. మృగనాభి యలఁదదు మృగరాజ మధ్యమ జలముల నాడదు జలజగంధి
ముకురంబుఁ జూడదు ముకురసన్నిభముఖి పువ్వులు దుఱుమదు పువ్వుఁబోఁణి
వనకేళిఁ గోరదు వనజాతలోచన హంసంబుఁ బెంపదు హంసగమన
లతలఁ బోషింపదు లతికా లలిత దేహ తొడవులు దొడవదు తొడవు తొడవు

ఆ. తిలక మిడదు నుదుటఁ దిలకినీ తిలకంబు, కమలగృహముఁ జొరదు కమలహస్త
గారవించి తన్నుఁ గరుణఁ గైకొన వన, మాలి రాఁడు తగవుమాలి యనుచు. 1732

* మురళీధరుడు తన మొరాలించి దయతో తన్ను గైకొనుటకు రాడయ్యెనే? తగవుతప్పెనే అని, సన్నని నడుము గల ఆ యన్నుల మిన్న కస్తూరి ఒడలికి పూసికొనదు. అద్దమువంటి మోము గల ఆ ముద్దులగుమ్మ అద్దము చూడదు. ఆ పువ్వుబోణి జడలో పువ్వులు పెట్టుకోదు. జలజముల వంటి నయనములు గల ఆ చెలియ జలక్రీడ లాడదు. అంచనడకల వంటి నడకలు గల ఆ కలువ కంటి అంచను పోషించదు. లతవలె మృదువైన శరీరము గల ఆ నెలత లతికలను సాకదు. అలంకారములకే అలంకారమైన ఆ అతివ ఆభరణములు ధరింపదు. చెలువలకు సిగబంతిగా నున్న ఆ ఇంతి నుదుట తిలకము దిద్దదు. కమలములవంటి కరములు గల ఆ కలికి కమలాకరం ప్రవేశింపదు.

వ. మఱియును. 1733

మ. మలఁగున్ మెల్లని గాలికిం; బటురటన్మత్త ద్విరేఫాళికిం
దలఁగుం; గోయిల మ్రోఁతకై యలఁగు; నుద్యత్కీర సంభాషలం
గలఁగున్; వెన్నెల వేడిమి న్నలఁగు; మాకందాంకుర చ్ఛాయకుం
దొలఁగుం గొమ్మ మనోభవానల శిఖాదోదూయ మానాంగియై. 1734

* రుక్మిణీదేవి మదనాగ్ని జ్వాలలలో క్రాగుతున్న శరీరము గలదై, మందమారుతాన్ని అంగీకరింపదు. మత్తిలి జుంజుమ్మని మొరయుచున్న తుమ్మెదల బారునకు తొలగిపోతుంది. కోయిల కూతకు కోపం

వహిస్తుంది. చిలుక బోదల కలికి పలుకులకు ఉలికిపడుతుంది. వెన్నెల వేడిమికి కలత చెందుతుంది. గున్నమామిడి నీడలకు దూర మేగుతుంది.

**వ. ఇట్లు హరిరాక కెదురు సూచుచు సకల ప్రయోజనంబులందును విరక్తయై మనోజానలంబునం బొగిలెడి మగువకు శుభంబుఁ జెప్పు విచందంబున వామలోచనభుజంబు లదరె నంతఁ గృష్ణ నియోగంబున వేగంబున బ్రాహ్మణుండు సనుదెంచిన, నతని ముఖలక్షణం బుపలక్షించి యా కలకంఠి మహోత్కంఠతోడ నకుంఠితయై మొగంబునం జిఱునగవు నిగుడ నెదురు సని నిలువంబడిన బ్రాహ్మణుం డిట్లనియె. 1735**

* ఇలా పద్మాక్షుని రాకను ప్రతీక్షిస్తూ అవసర కృత్యాలపై గూడ అపేక్ష లేక మన్మథాగ్నిలో మగ్గుతున్న ఆ మగువకు శుభం సూచిస్తున్న విధంగా ఎడమకన్ను, ఎడమభుజం అదిరినాయి. అచ్యుతుని ఆజ్ఞానుసారం శీఘ్రంగా వచ్చిన అగ్నిద్యోతనుని ముఖలక్షణాలు గమనించి కమ్మని కంఠస్వరం గల రుక్మిణి మిక్కిలి తహతహతో ముఖమున మందస్మితం చిందులాడగా సత్వరంగా ఎదురేగింది. అప్పు డా సరోజాక్షిని వీక్షించి ఆ విప్రుడు ఇట్లన్నాడు.

**ఉ. మెచ్చె భవద్గుణోన్నతి; కమేయ ధనావళు లిచ్చె నాకుఁ; దా**
**వచ్చె సుదర్శనాయుధుఁడు వాఁడె; సురాసురు లెల్ల నడ్డమై**
**వచ్చిన నైన రాక్షసవివాహమునం గొనిపోవు నిన్ను; నీ**
**సచ్చరితంబు భాగ్యమును సర్వము నేఁడు ఫలించెఁ గన్యకా! 1736**

* బాలామణీ! సుదర్శనాయుధుడు నీ ఉత్తమగుణాలు మెచ్చుకున్నాడు. నాకు మితిలేని ధనరాశు లిచ్చినాడు. ఇదిగో ఇప్పుడే వచ్చేసినాడు. దేవదానవులు ఏకమై ఎదురొడ్డి నిలిచినప్పటికీ రాక్షస వివాహ విధానంతో నిన్ను గొనిపోతాడు. నీ మంచినడవడి, నీ యదృష్టం నేటికి ఫలించాయి తల్లీ!

**వ. అనిన వైదర్భి యిట్లనియె. 1737**

**మ. జలజాతేక్షణుఁ దోడితెచ్చితివి నా సందేశమున్ జెప్పి; నన్**
**నిలువం బెట్టితి; నీ కృపన్ బ్రదికితిన్; నీయంత పుణ్యాత్మకుల్**
**గలరే? దీనికి నీకుఁ బ్రత్యుపకృతిం గావింప నే నేర; నం**
**జలిఁ గావించెద; భూసురాన్వయమణీ! సద్బంధుచింతామణీ! 1738**

*అగ్నిద్యోతనుడి పలుకులు ఆలకించి విదర్భరాజపుత్రి ఇలా అన్నది.

* బ్రాహ్మణవంశమునకు శిరోమణివంటి వాడా! బంధువుల పాలిటికి చింతామణివంటివాడా! నా సందేశము నెరిగించి తోయజదళాక్షుని తోడ్కొని వచ్చినావు. నన్ను ప్రాణాలతో నిలిపినావు. నీ కరుణచే జీవించాను. నీ వంటి పుణ్యాత్ములు ఈ పుడమిలో లేరు. నీ వొనర్చిన ఈ యుపకారానికి ప్రత్యుపకార మేమిచేయాలో ఎరుగని దానిని, భూసురోత్తమా! నీకు దోసిలొగ్గి నమస్కరిస్తాను.

వ. అని నమస్కరించె; నంత రామకృష్ణులు తమ కూఁతు వివాహంబునకు వచ్చుట విని, తూర్యఘోషంబు లతో నెదుర్కొని, విధ్యుక్తప్రకారంబునం బూజించి మధుపర్కంబు లిచ్చి, వివిధాంబరాభరణంబులు మొదలైన కానుక లొసంగి, భీష్మకుండు బంధుజనసేనా సమేతులైన వారలకుం దూర్ణంబున సకల సంపత్పరిపూర్ణంబులైన నివేశంబులు కల్పించి విడియించె; నిట్లు కూడిన రాజుల కెల్లను వయోవీర్య బలవిత్తంబు లెట్లట్ల కోరిన పదార్థంబు లెల్ల నిప్పించి పూజించె; నంత విదర్భపురంబు ప్రజలు హరి రాక విని వచ్చి చూచి నేత్రాంజలులం దదీయ వదనకమల మధుపానంబు సేయుచు. 1739

* అని అంజలి ఘటించింది. అంతట భీష్మకమహారాజు బలరామకృష్ణులు తమ తనయ స్వయంవరానికి తరలి వచ్చారని తెలిసి మంగళవాద్యధ్వనులతో ఎదురేగి శాస్త్రోక్తవిధానంతో వారిని పూజించాడు. మధు పర్కాలు ఇచ్చాడు. నానావిధాలైన అంబరాలు నగలు మొదలైన కానుక లర్పించాడు. చుట్టాలతో సేన లతో ఏతెంచిన ఆ రామకృష్ణులకు సత్వరం సమస్త సౌకర్యాలున్న విడుదులు ఏర్పాటుచేశాడు. ఈ విధంగా కుండినపురికి చేరిన రాజు లందరికీ వారి వారి వయసుకూ, శక్తికీ, సంపత్తికీ తగినట్లుగా వారు కోరినవస్తువు లన్నింటినీ తెప్పించి ఇప్పించి ఆదరించాడు భీష్మకుడు. అంతట విదర్భపట్టణప్రజలు శ్రీకృష్ణభగవానుడు అరుదెంచిన వార్త ఆకర్ణించిన వారై అరుగుదెంచి, అవలోకించి తమ కన్ను లనే దోసిళ్ళతో గోవిందుని వదనారవింద సౌందర్యాన్ని ఆస్వాదించుతూ ఇలా పలికారు.

మ. తగు నీచక్రి విదర్భరాజసుతకుం; దథ్యంబు వైదర్భియుం
దగు నీచక్రికి; నింతమంచి దగునే? దాంపత్య మీ యిద్దఱిం
దగులం గట్టిన బ్రహ్మ నేర్పరి గదా! దర్పాహతారాతియై
మగఁడౌ గావుతఁ జక్రి యీ రమణికిన్ మా పుణ్యమూలంబునన్. 1740

* ఈ చక్రాయుధుడు విదర్భ రాజకుమారికి ఎంతో తగియున్నాడు. నిజంగా వైదర్భి ఈ చక్రికి మిక్కిలి తగిఉంది. ఆహా! ఎంత చక్కని దాంపత్యం! వీరిద్దరినీ అలుమగలుగా జతగూర్చిన ఆ విధాత ఎంత నెరజాణ. మా పుణ్యఫలంగా ఈ చక్రాయుధుడు తన పరాక్రమంతో శత్రువులను పారదోలి మా రాకుమారిని పెండ్లాడు గాక!

వ. అని పలికి రా సమయంబున. 1741

సీ. సన్నద్ధులై బహుశస్త్ర సమేతులై బలసి చుట్టును వీరభటులు గొలువ
ముందట నుపహారములు గానుకలుఁ గొంచు వర్గంబులై వారవనిత లేఁగఁ
బుష్ప గంధాంబర భూషణ కలితలై పాడుచు భూసురభార్య లరుగఁ
బణవ మర్దల శంఖ పటహ కాహళ వేణు భేరీధ్వనుల మిన్ను పిక్కటిలఁగఁ

ఆ. దగిలి సఖులు గొలువఁ దల్లులు బాంధవ, సతులుఁ దోడ రాఁగ సవినయముగ
నగరు వెడలి నడచె నగజాతకును మ్రొక్క, బాల చికుర పిహిత ఫాల యగుచు. 1742

* ఇలా అనుకుంటున్న సమయంలో ఫాలతలాన ముంగురులు ముసురుకొనగా, రుక్మిణీకన్య గౌరీదేవి నర్చించుటకై అంతఃపురంనుండి సపరివారంగా అమ్మవారిగుడికి బయలుదేరింది. వీరభటులు కవచాలు తొడుగుకొని పలువిధాలైన ఆయుధాలు ధరించినవారై ఆమెను పరివేష్టించి నడిచారు. వారకాంతలు తినుబండములు కానుకలు చేకొని బారులుదీరి రాజకుమారి ముందు సాగిపోయారు. బ్రాహ్మణ సువాసినులు పూలు పెట్టుకొని, చందనము పూసుకొని, క్రొత్తచీరలు గట్టి, సొమ్ములు దాల్చి, పాటలు పాడుతూ ఆమె ననుసరించారు. ఉడుక, మద్దెల, శంఖము, తప్పెట, బాకా, పిల్లనగ్రోవి, భేరి మొదలైనవాద్యాల మ్రోతలు గగన మంటినాయి. చెలికత్తెలు, దాదులు, బాంధవస్త్రీలు ఆమెను వెంబడించారు.

వ. మఱియు సూత మాగధ వంది గాయక పాఠకజను లంతంత నభినందించుచుం జనుదేర మంద గమనంబున, ముకుంద చరణారవిందంబులు డెందంబునం దలంచుచు నిందుధరసుందరీ మంది రంబు సేరి సలిలధారా ధౌత కరచరణారవిందయై వార్చి శుచియై, గౌరీసమీపంబునకుం జనియె; నంత ముత్తైదువలగు భూసురోత్తముల భార్యలు భవసహితయైన భవానికి మజ్జనంబు గావించి గంధాక్షతంబు లిడి, వస్త్రమాల్య భూషణాదుల నలంకరించి, ధూపదీపంబు లొసంగి, నానావిధోప హారంబులు సమర్పించి, కానుక లిచ్చి, దీపమాలికల నివాళించి రుక్మిణీదేవిని మ్రొక్కించి రప్పుడు. 1743

* సూతులు, వందిమాగధులు, గాయకులు, స్తుతిపాఠకులు కైవారాలు గావిస్తూ వెంటరాగా, రుక్మిణి గోవిందుని పాదారవిందాలు హృదయంలో స్మరిస్తూ హంసగమనంతో అంబికాలయానికి వచ్చింది. కాలుసేతులు కడుగుకొని ఆచమించి పరిశుద్ధురాలై పరమేశ్వరి సన్నిధికి చేరింది. అప్పుడు ముత్తైదువ లయిన బ్రాహ్మణసతులు పరమేశ్వర సహితంగా భవానికి అభిషేకం గావించారు. గంధాక్షతలు సమర్పించారు. వస్త్రాలతో, పూదండలతో, అభరణాలతో అమ్మవారిని అలంకరించారు. ధూపదీపా లిచ్చారు. పలురకాల పిండివంటలు నైవేద్యం పెట్టారు. కానుకలు అర్పించినారు. దీపాలతో హారతు లెత్తినారు. అనంతరం రుక్మిణీదేవిని దుర్గాదేవికి మొక్కించినారు.

ఉ. నమ్మితి నా మనంబున సనాతనులైన యుమామహేశులన్
మిమ్ముఁ బురాణదంపతుల మేలు భజింతు గదమ్మ! మేటి పె
ద్దమ్మ దయాంబురాశివి గదమ్మ హరిం బతి సేయు మమ్మ నిన్
నమ్మినవారి కెన్నఁడును నాశము లేదు గదమ్మ యీశ్వరీ! 1744

* అప్పుడు రుక్మిణి భవానిని ఇలా ప్రార్థించింది. అమ్మా! గౌరీ! శాశ్వతులూ, ఆదిదంపతులూ అయిన పార్వతీ పరమేశ్వరులను మిమ్ము మదిలో నమ్ముకొని ఉన్నాను. భక్తితో కొలుస్తున్నాను. అమ్మలలో నీవు

మేటివి. దయకు సముద్రమువంటిదానవు. వెన్నుని నాకు విభుని గావించు తల్లీ! నిన్ను నమ్ముకొన్న వారికి ఎన్నటికినీ నష్ట మనేది లేదు గదా!

వ. అని గౌరీదేవికి మ్రొక్కి పతులతోడం గూడిన బ్రాహ్మణభార్యలకు లవణాపూపంబులును, దాంబూల కంఠసూత్రంబులును, నిక్షుదండంబులు నిచ్చి రుక్మిణీదేవి వారలం బూజించిన. 1745

* ఇలా వేడుకుంటూ వైదర్భి దుర్గకు నమస్కరించి భర్తృసమేతలైన బ్రాహ్మణపత్నులకు ఉప్పు, అప్పములు, తాంబూలాలు, మంగళసూత్రములు, చెఱకుగడలు ఇచ్చి పూజించింది.

ఆ. వార లుత్సహించి వలనొప్ప దీవించి, సేస లిడిరి యువతిశిరమునందు;
సేస లెల్లఁ దాల్చి శివవల్లభకు మ్రొక్కి, మౌననియతి మాని మగువ వెడలె. 1746

* ఆ ముత్తైదువలు ఉత్సాహంతో దీవన లిచ్చి రుక్మిణీరమణి తలపై అక్షత లుంచారు. ఆ మంగళాక్షతలు ధరించి ఆమె శివకామినికి వందన మొనర్చి మౌనవ్రతం మాని గుడినుండి వెడలింది.

వ. ఇట్లు మేఘమధ్యంబు వెలువడి విలసించు క్రొక్కారు మెఱుంగు తెఱంగున, మృగధర మండలంబు నిర్గమించి చరించు మృగంబు చందంబునఁ, గమలభవ నర్తకుం డెత్తిన జవనిక మఱుఁగు దెరలి పొడసూపిన మోహినీదేవత కైవడి, దేవ దానవ సంఘాత కరతల సవ్యాపసవ్య సమాకృష్యమాణ పన్నగేంద్ర పాశ పరివలయిత పర్యాయ పరిభ్రాంత మందరాచల మంథాన మథ్యమాన ఘూర్ణిత ఘుమఘుమాయిత మహార్ణవమధ్యంబున నుండి చనుదెంచు నిందిరాసుందరీ వైభవంబున, బహువిధ ప్రభా భాసమానయై, యిందుధర సుందరీమందిరంబు వెడలి మానస కాసార హేమకమల కానన విహరమాణ మత్త మరాళంబు భంగి, మందగమనంబునఁ గనక కలశ యుగళ సంకాశ కర్కశ పయోధరభార పరికం ప్యమాన మధ్యయై, రత్నముద్రికాలంకృతం బైన కెంగేల నొక్క సఖీలలామంబు కైదండ గొని, రత్న నివహ సముదంచిత కాంచన కర్ణపత్ర మయూఖంబులు గండభాగంబుల నర్తనంబులు సలుప, నరవింద పరిమళ కుతూహలావతీర్ణ మత్తమధుకరంబుల మాడ్కి నరాళంబులైన కుంతలజాలంబులు ముఖమండలంబునఁ గ్రందుకొన, సుందర మందహాస రోచులు దిశలందు బాలచంద్రికా సౌందర్యం బు నావహింప, నధరబింబఫలారుణ మరీచిమాలికలు రదనకుంద కుట్మలం బుల కనురాగంబు సంపాదింప, మనోజాత కేతన సన్నిభంబైన పయ్యెదకొంగు దూఁగ, సువర్ణమేఖలా ఘటిత మణికిరణ పటలంబు లకాల శక్రచాప జనకంబులై మెఱయఁ, జెఱకువిలుతుం డొఱవెఱికి వాఁడి యిడి జళిపించిన ధగద్ధగాయమానంబు లగు బాణంబుల పగిది, సురుచిర విలోకన నికరంబులు రాజవీరుల హృదయంబులు భేదింప, శింజాన మంజు మంజీర నినదంబులు చెవుల పండువులు సేయఁ, బాదసంచారంబున హరిరాక కెదురుచూచుచు, వీరమోహినియై చనుదెంచుసమయంబున. 1747

*అలా వెడలివచ్చిన రుక్మిణి మబ్బుల నడుమనుండి వెలువడి ప్రకాశించే తొలకరి మెఱుపులాగా ఉన్నది. చంద్రమండలంనుంచి వెలికివచ్చి సంచరించే లేడిలాగా ఉన్నది. బ్రహ్మదేవుడనే నటుడు ఎత్తిన

తెరమరుగు బాసి రంగమున ప్రత్యక్షమైన మోహినీదేవతలాగా ఉన్నది. వాసుకి అనే సర్పరాజును కవ్వపుత్రాడుగాను, మందరగిరిని కవ్వముగాను చేసి సురాసుర సమూహం కుడియెడమలుగా చిలికే వేళ ఘూర్ణమానమై ఘుమఘుమ ధ్వనులతో నిండిన మహాసాగరమధ్యం నుంచి నిర్గమించిన రమారమణిలాగా విరాజిల్లింది. ఇలా పలుకాంతులతో విలసిల్లుతూ రుక్మిణి కాళికాలయం నుంచి బయలుదేరింది. మానస సరోవరమందు పసిడితామరల గుంపులో విహరించే కొదమ రాయంచలాగా ఆమె మెల్లగా నడిచింది. బంగారుగిండ్లకు సాటివచ్చే పయోధరాల భారంతో తూలియాడుతున్న నడుము గల రాకుమారి రత్నాంగుళీయకముతో విరాజిల్లే అరుణారుణ హస్తంతో అనుగుచెలి హస్తం పట్టుకొంది. మణిఖచితాలైన సువర్ణతాటంకాల కాంతులు ఆమె చెక్కిళ్ళపై చిందులు వేస్తున్నాయి. పద్మగంధం మీది ఆసక్తితో క్రమ్మిన గండుతుమ్మెదల వంటి ఉంగరాల ముంగురులు ఆమె ముద్దుల మోముపై మూగుతున్నాయి. ఆమె అందమైన చిరునవ్వుల వెలుగులు దిక్కులలో లేతవెన్నెల సొబగు నెలకొన జేశాయి. ఆమె దొండపండువంటి అధరం అరుణకాంతులు మొల్లమొగ్గలవంటి దంతాలకు ఎఱ్ఱదనం కూరుస్తున్నాయి. మన్మథపతాక చందాన ఆమె పైటచెంగు తూగాడుతున్నది. ఆమె పసిడి ఒడ్డాణంలో చెక్కిన మణుల ధగధగ దీప్తులు కాలము గాని కాలాన ఇంద్ర చాపాన్ని సృష్టించుతున్నాయి. కందర్పుడు ఒరనుండి పైకితీసి పదనుబెట్టి జళిపించిన వేళ తళుకు తళుక్కు మని మెరిసే వాడి తూపుల మాదిరి ఆమె సుందరమైన చూపులు వీరాధివీరులైన రాజుల గుండెలను చెండి వేస్తున్నాయి. అందమైన కాలియందెల రవళి, చెవులకు విందు సేయగా ఆ సుందరి ముకుందుని రాక ప్రతీక్షిస్తూ వీరమోహినియై కాలినడకతో వస్తున్నది.

మ. అలినీలాలకఁ బూర్ణచంద్రముఖి నేణాక్షిం బ్రవాళాధరం
గలకంఠిన్ నవపల్ల వాంఘ్రియుగళన్ గంధేభకుంభస్తనిం
బులినశ్రోణి నిభేంద్రయాన నరుణాంభోజాతహస్తన్ మహో
త్పల గంధిన్ మృగరాజమధ్యఁ గని విభ్రాంతాత్ములై రందఱున్. 1748

* తుమ్మెదలవంటి నల్లని ముంగురులు, నిండుచందురునివంటి నెమ్మోము, లేడిచూపులవంటి చూపులు, పగడమువంటి పెదవి, అవ్యక్తమధురమైన కంఠం, క్రొంజివురుటాకులవంటి అడుగులజంట, మత్తగజకుంభాలవంటి కుచాలు, ఇసుకతిన్నెలవంటి పిరుదులు, గజరాజ గమనమువంటి గమనము, కెందామరలవంటి చేతులు, సింహమునడుమువంటి నడుము గలిగి పద్మసుగంధాలు వెదజల్లే రుక్మిణీదేవిని చూచి అందరూ ఆశ్చర్యచకితు లయ్యారు.

వ. మఱియు న య్యింతి దరహాస లజ్జావలోకనంబులం జిత్తంబు లేమఱి ధైర్యంబు దిగనాడి, గాంభీర్యంబులు విడిచి, గౌరవంబులు మఱచి, చేష్టలు మాని, యెఱుక లుడిగి, యాయుధంబులు దిగవైచి గజతురగ రథారోహణంబులు సేయనేరక, రాజులెల్ల నేలకు వ్రాలి; రా యేణీలోచన తన వామకరనఖంబుల నలకంబులు దలఁగం ద్రోయుచు నుత్తరీయంబు సక్కనొత్తుచుఁ గడగంటి చూపులం గ్రమంబున నా రాజలోకంబు నాలోకింపుచు. 1749

* అంతేకాదు, ఆ చెలువ చిరునవ్వులవల్లా, సిగ్గుతో కూడిన చూపులవల్లా అక్కడి రాజకుమారులకు మనసులు చలించాయి. వారు ధైర్యం వీడినారు; గాంభీర్యం వదలినారు; గౌరవం మరచినారు. చేష్టలుడిగినారు. తెలివి మాలినారు. ఆయుధాలు జారవిడిచినారు. ఏనుగులు, గుర్రాలు, అరదాలు ఎక్కలేక భూమిపై వ్రాలినారు. లేడిచూపులు గల రుక్మిణి తన ఎడమచేతి గోళ్లతో ముంగురులు ఎగదోసికొంటూ, పయట సరిదిద్దు కుంటూ, కడగంటి చూడ్కులను రాజసమూహంమీద ప్రసరింప జేసింది.

**మ. కనియెన్ రుక్మిణి చంద్రమండలముఖుం గంఠీరవేంద్రావ ల**
**గ్ను నవాంభోజదళాక్షుఁ జారుతరవక్షున్ మేఘసంకాశ దే**
**హు నగారాతి గజేంద్ర హస్తనిభబాహుం జక్రిఁ బీతాంబరున్**
**ఘనభూషాన్వితుఁ గంబుకంఠు విజయోత్కంఠున్ జగన్మోహనున్. 1750**

* అలా చూస్తూ చంద్రబింబమువంటి ముఖమూ, సింగము నడుమువంటి నడుమూ, క్రొందామరలవంటి కన్నులూ, పరమరమణీయమైన వక్షము, నీలమేఘమువంటి నెమ్మేనూ, ఐరావత గజతుండము వంటి కరములూ, పచ్చని పట్టుపుట్టములూ చక్రాయుధమూ కలవాడు, విజయమునందు ఆసక్తి యున్నవాడు, జగములను మోహింప చేసేవాడు అయిన శ్రీకృష్ణుని రుక్మిణీదేవి దర్శించింది.

## -: శ్రీకృష్ణుఁడు శత్రురాజులు చూచుచుండ రుక్మిణీదేవిని గొనిపోవుట :-

**వ. కని తదీయ రూపవయోలావణ్య వైభవ గాంభీర్య చాతుర్యతేజో విశేషంబులకు సంతసించి, మనోభవ శరాక్రాంతయై రథారోహణంబు గోరుచున్న వరారోహం జూచి, పరిపంథి రాజలోకంబు సూచుచుండ మందగమనంబున గంధసింధురంబు లీలం జనుదెంచి ఫేరవంబుల నడిమి భాగంబు గొనిచను కంఠీరవంబు కైవడి నిఖిల భూపాలగణంబుల గణింపక తృణీకరించి రాజకన్యకం దెచ్చి హరి తన రథంబుమీఁద నిడికొని భూ నభోఽంతరాళంబులు నిండ శంఖంబు పూరించుచు బలభద్రుండు తోడ నడవ. యాదవవాహినీ పరివృతుండై ద్వారకానగర మార్గంబు వట్టి చనియె; నంత జరాసంధవశు లయిన రాజు లందరు హరిపరాక్రమంబు విని సహింప నోపక. 1751**

* అలా చూచి శ్రీకృష్ణుని రూపం, లావణ్యం, గాంభీర్యం, నేర్పు, తేజస్సు, ఐశ్వర్యం- ఈ విశేషాలకు హర్షించింది. ఆమె మదనబాణాలకు గురియై త్వరగా రథ మెక్కడానికి కుతూహలపడింది. రుక్మిణీదేవిని పుండరీకాక్షుడు అవలోకించాడు. శత్రురాజసమూహం చూస్తుండగనే మత్తమాతంగం మాదిరి మెల్లని నడకతో సవిలాసంగా చనుదెంచాడు. నక్కల నడుమ నున్న ఆమిషం హర్యక్షం ఎత్తుకొని పోయినట్లు సకలరాజ లోకాన్ని లెక్కచేయక తిరస్కరించి రాకుమారిని రథ మెక్కించుకున్నాడు. భూమ్యాకాశాలు ప్రతిధ్వనించేటట్లు పాంచజన్యం పూరించాడు. బలరాముడు వెంటరాగా శ్రీకృష్ణుడు యాదవసైన్యంతో ద్వారకానగర మార్గం పట్టాడు. అపుడు జరాసంధునకు లోబడిన భూపాలకు లందరూ వెన్నుని విక్రమాటోపం సహింపలేక పోయారు.

**మ. ఘనసింహంబుల కీర్తి నీచమృగముల్ గైకొన్న చందంబునన్**
**మన కీర్తుల్ గొని బాలఁ దోడ్కొనుచు నున్మాదంబుతో గోపకుల్**
**సనుచున్నా రదె? శౌర్య మెన్నటికి? మీ శస్త్రాస్త్రముల్ గాల్పనే?**
**తనుమధ్యన్ విడిపింపమేని నగరే ధాత్రీజనుల్ క్రంతలన్. 1752**

* అదిగో! గొప్ప సింహముల కీర్తిని ముక్కడి మృగాలు హరించిన విధంగా గొల్లవాళ్లు మన యశస్సు దోచుకొని కన్య నెత్తుకొని కావరంతో కదలి వెళుతున్నారు. ఇప్పటికి కొరగాని మన ప్రతాపం మరి ఎప్పటికి? మన శస్త్రాస్త్రాలు మంటలో వేయడానికా? సన్నని నడుము గల ఆ కన్నియను వారి బారినుండి తప్పించలేకపోతే సందుగొందుల్లో సైతం మనలను ప్రజలు పరిహసించరా?

**వ. అని యొండొరులం దెలుపుకొని, రోషంబులు హృదయంబుల నిలుపుకొని, సంరంభించి, తనుత్రాణంబుల వహించి, ధనురాది సాధనంబులు ధరియించి, పంతంబు లాడి, తమ తమ చతురంగబలంబులం గూడికొని, జరాసంధాదులు యదువీరుల వెంటనంటి, తాఁకి నిలు నిలుండని ధిక్కరించి పలికి యుక్కు మిగిలి, మహీధరంబుల మీఁద సలిలధారలు గురియు ధారాధరంబుల చందంబున బాణవర్షంబులు గురిసిన యాదవసేనలం గల దండనాయకులు కోదండంబు లెక్కిడి, గుణంబులు మ్రోయించి, నిలువంబడి రప్పుడు. 1753**

* ఈ విధంగా ఒకరి కొకరు చెప్పుకొని రోషాలు మనసుల కెక్కించుకున్నారు. పూనిక వహించారు. కవచాలు ధరించారు. విండ్లు మొదలైన యుద్ధసాధనాలను చేకొన్నారు. ప్రజ్ఞలు పలికినారు. జరాసంధుడు మొదలైన రాజు లందరూ చతురంగబలాలతో యాదవవీరులను వెంబడించి, 'నిలవండి, నిలవండి' అని ధిక్కరించి హుంకరించి పలికినారు. శైలాలమీద జలధారలు వర్షించే మేఘాలమాదిరి వారు శరవర్షం కురియించారు. అప్పుడు యాదవసైన్యంలోని సేనాధిపతులు, చాపాలు ఎక్కుపెట్టి ధనుష్టంకారం గావిస్తూ నిలబడ్డారు.

**క. అరిబల భట సాయకముల, హరిబలములు గప్పఁబడిన నడరెడు భీతిన్**
**హరిమధ్య సిగ్గుతోడను, హరివదనముఁ జూచెఁ జకితహరిణేక్షణయై. 1754**

* ఆ సమయంలో శత్రువీరులు శ్రీకృష్ణునిసేనను బాణాలతో కప్పివేయడం చూచి భీతిల్లి సింగంనడుము వంటి నడుము కలది, బెదరిన జింకకన్నులవంటి కన్నులు గలది అయిన రుక్మిణి సిగ్గుతో శ్రీకృష్ణుని ముఖం అవలోకించింది.

**వ. ఇట్లు చూచిన. 1755**

**క. చొచ్చెద రదె యదువీరులు, వ్రచ్చెద రరిసేన నెల్ల వైరులు పెలుచున్**
**నొచ్చెదరును విచ్చెదరును, జచ్చెదరును నేఁడు చూడు జలజాతాక్షీ! 1756**

* ఇలా రుక్మిణి చూడగానే శ్రీకృష్ణుడు 'ఓ కమలనయనా! చూస్తూ ఉండు, మన యాదవవీరులు శత్రుసైన్యంలో ప్రవేశించి చీల్చిచెండాడుతారు. విరోధులు నొచ్చి విచ్చిపోతారు, చచ్చిపోతారు అన్నాడు.

వ. అని రుక్మిణీదేవిని హరి యూఱడించె; నంత బలభద్రప్రముఖులైన యదువీరులు ప్రళయవేళల మిన్నునం బన్ని బలుపిడుగు లడరించు పెనుమొగిళుల వడువున జరాసంధాది పరిపంథిరాజ చక్రంబుమీఁద నవక్రపరాక్రమంబున శిఖి శిఖా సంకాశ నిశిత శిలీముఖ నారాచ భల్ల ప్రముఖంబులైన బహువిధ బాణపరంపరలు గురియ, నదియును విదళిత మత్తమాతంగంబును, విచ్ఛిన్న తురంగంబును, విభిన్న రథవరూథంబును, వినిహత పదాతియూథంబును, విఖండిత వాహ వారణ రథారోహణ మస్తకంబును, విశకలిత వక్షో మధ్య కర్ణ కంఠ కపోల హస్తంబును, వికీర్ణ కేశజాలంబును, విపాటిత చరణ జానుజంఘంబును, విదళిత దంతసంఘంబును, విఘటిత నీరమం జీర కేయూరంబును, విభ్రష్ట కుండల కిరీట హారంబును, విస్మృత వీరాలాపంబును, విదార్యమాణ గదా కుంత తోమర పరశు పట్టిస ప్రాస కరవాల శూల చక్ర చాపంబును, వినిపాతిత కేతన చామ రచ్ఛత్రంబును, విలూన తనుత్రాణంబును, వికీర్యమాణ ఘోటకసంఘ రింఖా సముద్ధూత ధరణీ పరాగంబును, వినష్ట రథవేగంబును, వినివారిత సూత మాగధ వంది వాదంబును, వికుంఠిత హయ హేషా పటహ భాంకార, కరటిఘటా ఘీంకార, రథనేమి ఘటాత్కార, తురగనాభిఘంటా ఘణఘణాత్కార, వీర హుంకార, భూషణ ఝణఝణాత్కార, నిస్సాణ ధణధణాత్కార, మణినూపుర క్రేంకార, కింకిణీగణ కిణాత్కార, శింజినీ టంకార, భట పరస్పర ధిక్కారనాదంబును, వినిర్భిద్యమాన రాజసమూహంబును, విద్యమాన రక్తప్రవాహంబును, విశ్రూయమాణ భూతబేతాళ కలకలంబును, విజృంభమాణ ఫేరవ కాక కంకాది సంకులంబును, బ్రచలిత కబంధంబును, బ్రభూత పలల గంధంబును, ప్రదీపితమేదో మాంస రుధిర ఖాదంబును, బ్రవర్తిత డాకినీ ప్రమోదంబునునై యుండె; నప్పుడు. 1757

* ఈ విధంగా పలుకుతూ వాసుదేవుడు రుక్మిణీదేవిని ఊరడించాడు. అంతట బలరాముడు మొదలైన యదువంశవీరులు ప్రళయకాలంలో మింట వ్యాపించి పిడుగులు రాల్చే పెనుమబ్బుల చందాన విజృంభించారు. జరాసంధుడు మొదలైన శత్రురాజుల మీద మొక్కవోని కడిమితో అగ్నిజ్వాలలతో సమానమైన వాడి శిలీముఖాలు, నారాచములు, భల్లములు మొదలుగా పలువిధములైన శరపరంపరలను వర్షించారు. ఆ బాణవర్షానికి శాత్రవసైన్యంలోని మదపుటేనుగులు తునాతునుక లైనాయి. గుర్రములు చెదరిపోయాయి. రథాల పై కప్పులు విఱిగిపడ్డాయి. కాల్బలము కూలిపోయింది. గజాశ్వరథారోహకుల తలలు తెగి నేల రాలాయి. గుండెలు, నడుములు, మెడలు, చెక్కులు, చేతులు తునుకలు తునుక లయ్యాయి. పుర్రెలు బ్రద్ద లయ్యాయి. తల వెంట్రుకలు నేలమీద పరుచుకున్నాయి. పాదాలు, మోకాళ్ళు, పిక్కలు తెగిపోయాయి. పండ్లు రాలినాయి. వీరమద్దియలు, భుజకీర్తులు వీడిపోయాయి. చెవిపోగులు, కిరీటాలు, ముత్యాలదండలు జారిపడినాయి. సింహనాదాలు మూగవోయాయి. గదలు, బల్లెములు, గుదియలు, గండ్రగొడ్డళ్ళు, అడ్డకత్తులు, ఈటెలు, ఖడ్గాలు, శూలాలు, చక్రాలు, ధనువులు విరిగి ముక్కలైనాయి. జెండాలు, గొడుగులు, వింజామరలు కూలిపోయాయి. కవచాలు పగిలినాయి. గుర్రాల పౌజు గిట్టల తాకిడికి రేగిన దుమ్ము అంతటా నిండింది. రథాలవేగం ఆగింది. వందిమాగధ, వైతాళికుల స్తోత్రపాఠాలు కట్టువడినాయి. గుఱ్ఱాల సకిలింపులు , తప్పెటల

భాంకారాలు, గజబృందాల ఘీంకారాలు, రథచక్రముల పటపటాత్కారాలు, గుఱ్ఱాల నడుము గంటల ఘణఘణాత్కారాలు, వీరుల హుంకారాలు, ఆభరణాల ఝణ ఝణాత్కారాలు, నగారాల ధణధణాత్కారాలు, మణిమంజీరాల క్రేంకారాలు, మువ్వల కిణకిణాత్కారాలు, అల్లెత్రాళ్ల టంకారాలు, భటుల అన్యోన్యధిక్కారాలు అణగిపోయాయి. రాజుల సమూహం చెదరింది. నెత్తురు టేరులు ప్రవహించాయి. భూతబేతాళాల కలకల ధ్వని కర్ణగోచరమైంది. నక్కలు, కాకులు, గ్రద్దలు, రాబందులు- వీటి అరుపులు చెలరేగినాయి. మొండెములు కదలాడినాయి. మాంసపుగౌలు కొట్టింది. మెదడు, మాంసము భక్షిస్తూ, నెత్తురు త్రాగుతూ ఉన్న డాకిని మున్నగు పిశాచాలకు ఆ రణరంగం ఆనందం కలిగించింది.

చ. మగిడి చలించి పాఱుచును మాగధముఖ్యులు గూడి యొక్కచో
వగచుచు నాలిఁ గోల్పడినవాని క్రియన్ గడు వెచ్చనూర్చుచున్
మొగమున దప్పిదేరఁ దమ ముందటఁ బొక్కుచు నున్న చైద్యుతోఁ
బగతుర చేతిలోఁ బడక ప్రాణముతోడుత నున్నవాఁడవే. 1758

* ఆ సమయంలో భయంతో వెనుదిరిగి పరుగిడుతూ జరాసంధుడు మొదలైన ప్రముఖు లందరూ ఒకచోట చేరినారు. పెళ్ళాన్ని పోగొట్టుకున్న వాడివలె ఏడుస్తూ, వేడినిట్టూర్పులు విడుస్తూ, వడలిన ముఖంతో తమ యెదుట దుఃఖిస్తున్న శిశుపాలుణ్ణి చూచారు. 'శత్రువుల చేతుల్లో బడక ప్రాణాలతో బ్రతికే ఉన్నావు గదా!' అని ఓదార్చారు.

వ. అని మఱియును. 1759

ఆ. బ్రతుకవచ్చు నొడలఁ బ్రాణంబు లుండిన, బ్రతుకు గలిగెనేని భార్య గలదు;
బ్రతికి తీవు; భార్యపట్టు దైవ మెఱుంగు, వగవ వలదు చైద్య! వలదు వలదు. 1760

* ఇలా ఓదారుస్తూ వారంతా మళ్లీ అతనితో ఇలా అన్నారు. 'నాయనా! బొందిలో ప్రాణాలుంటే ఎలాగైనా బ్రతకవచ్చు. బ్రతికిఉంటే భార్య దొరక్కపోదు. పెండ్లముమాట దేవు డెరుగు! ముందు నీవు బ్రతుకుటయే మాకు పదివేలు; ఊరక వాపోవవద్దు.'

వ. వినుము. దేహధారి స్వతంత్రుఁడు గాఁడు. జంత్రగానిచేతి జంత్రపు బొమ్మకైవడి నీశ్వరతంత్ర పరాధీనుండై, సుఖదుఃఖంబులందు నర్తనంబులు సలుపు. తొల్లి నేను మథురాపురంబుమీఁదఁ బదియేడు మాఱులు పరాక్రమంబునన్ విడిసి, చక్రిచేత నిర్మూలిత బలచక్రుండనై, కామపాలుచేతం బట్టువడి, యీ కృష్ణుండు కరుణతో విడిపించిన వచ్చి, క్రమ్మఱ నిరువదిమూఁ డక్షౌహిణులం గూడికొని, పదునెనిమిదవ మాఱు దాడిచేసి, శత్రువులం దోలి, విజయంబు చేకొంటిని. జయాపజయంబులందు హర్షశోకంబుల నెన్నండును జెంద; నేఁటిదినంబున నీ కృష్ణుని కెదిరి పోర మన రాజలోకంబు లెల్ల నుగ్రాక్షుం గూడుకొని, యెదిరి పోరిన నోడు. ఇంతియ కాక దైవయుక్తంబైన కాలంబునం జేసి, లోకంబులు పరిభ్రమించుచు నుండు; నదియునుం గాక. 1761

* అప్పుడు జరాసంధుడు ఇలా అన్నాడు- శిశుపాలా! విను. మానవుడు అస్వతంత్రుడు, బొమ్మ లాడించేవాడి చేతిలో కీలుబొమ్మలాగా అతడు ఈశ్వరమాయాకు లోనై సుఖదుఃఖాలలో నాట్యమాడు తుంటాడు. మునుపు నేను మథురపై పరాక్రమంతో పదిహేడు పర్యాయలు దండెత్తినాను. కృష్ణుని చేతిలో నా సమస్తసైన్యం ఓడిపోయింది. నేను బలరాముడిచేత పట్టుబడ్డాను. ఆ కృష్ణుడు దయతలచి విడిచి పెట్టగా వచ్చాను. మరల ఇరవైమూడక్షౌహిణుల సైన్యం సమకూర్చుకొని పద్దెనిమిదవసారి దండెత్తిపోయి శత్రువులను తరిమివైచి విజయం సాధించాను. నే నెన్నడూ గెలుపోటములలో మోదఖేదములు పొందింది లేదు. దైవప్రేరితమైన కాలంవల్ల లోకాలు సాగుతుంటాయి.

**మ. తమకుం గాలము మంచిదైన మనలం ద్రైలోక్య విఖ్యాత వి**
**క్రములం గెల్చిరి యాదవుల్ హరిభుజాగర్వంబునన్ నేఁడు; కా**
**లము మేలై చనుదెంచెనేని మనమున్ లక్షించి విద్వేషులన్**
**సమరక్షోణి జయింత మింతపనికై శంకింప నీ కేటికిన్. 1762**

* ఇంతేకాదు. యాదవులకు కాలం కలిసివచ్చింది. ముల్లోకాలలో ప్రసిద్ధిగన్న విక్రమాఢ్యులమైన మనలను గోవిందుని బాహుదర్పంతో వారు ఈనాడు గెలువగలిగినారు. కాలం మనకు అనుకూలించినపుడు పంతగించి పగవారిని భండనభూమిలో చెండాడగలం. ఈ మాత్రానికి ఇంత చింతింప నవసరం లేదు.

**వ. అని యిట్లు జరాసంధుండును, నతని యొద్దిరాజులును, శిశుపాలుని పరితాపంబు నివారించి, తమ తమ భూములకుం జనిరి. శిశుపాలుండు ననుచర సేనాసమేతుం డయి తన నగరంబునకుం జనియె; నంత రుక్మి యనువాఁడు కృష్ణుండు రాక్షసవివాహంబునం దన చెలియలిం గొనిపోవుటకు సహింపక, యేకాక్షౌహిణీబలంబు తోడ సమరసన్నాహంబునం గృష్ణుని వెనుదగిలి పోవుచుఁ, దన సారథితో నిట్లనియె. 1763**

* ఈ విధంగా జరాసంధుడూ, అతని చెంతనున్న సామంత రాజులూ శిశుపాలుని మనోవేదన తొలగించి తమతమ దేశాలకు వెళ్ళిపోయారు. శిశుపాలుడు తన పరివారంతో, సైన్యంతో తన నగరానికి అరిగినాడు. అంతట రుక్మిణి అన్న అయిన రుక్మి కృష్ణుడు రాక్షస వివాహవిధానంతో తన సోదరిని ఎత్తుకపోవడం ఓర్చు కోలేక ఒక అక్షౌహిణి సేనతో యుద్ధసంరంభం వహించి వెన్నుని వెన్నాడి వెళ్లుతూ సారథితో ఇట్లన్నాడు.

**ఉ. బల్లిదు నన్ను భీష్మజనపాల కుమారునిఁ జిన్నఁజేసి నా**
**చెల్లెలి రుక్మిణిం గొనుచుఁ జిక్కని నిక్కపు బంటువోలె నీ**
**గొల్లఁడు వోయెడిన్; రథముఁ గూడఁగఁ దోలుము; తేజితోల్లస**
**ద్భల్ల పరంపరన్ మదముఁ బాపెదఁ జూపెద నా ప్రతాపమున్. 1764**

* నేను భీష్మకప్రభుని పుత్రుడను. మహాబలవంతుణ్ణి. బల్లిదుడనైన నన్ను పిల్లవానివలె చులకన చేసి నా చెల్లెలిని రుక్మిణిని గైకొని ఈ గొల్లవాడు అసహాయ శూరునివలె అరుగుచున్నాడు. మన అరదమును అంటతోలుము. పదును గలిగి ప్రకాశించు బాణాలను ప్రయోగించి వాని పొగరణుస్తా! నా పరాక్రమం చూపిస్తా!

వ. అని యిట్లు రుక్మి హరి కొలంది యెఱుంగక సారథి నదలించి రథముఁ గూడ దోలించి 'గోపాలకా! వెన్నముచ్చ! నిమిషమాత్రంబు నిలు నిలు, మని తిరస్కరించి, బలువింట నారి సారించి మూఁడు వాఁడితూపుల హరి నొప్పించి యిట్లనియె. 1765

* ఈ విధంగా రుక్మి శౌరి శక్తిసామర్థ్యాలు ఎంతటివో తెలియక సారథిని గద్దించి రథమును కూడ దోలించి 'ఓ యాదవా! వెన్నదొంగా! క్షణ మాగుము' అని నిర్లక్ష్యంగా పలికి ధనుష్టంకార మొనర్చాడు. మూడు వాడి బాణాలతో వాడు పంకజాక్షుని సంకటపరచి ఇట్లన్నాడు.

సీ. మా సరివాఁడవా మా పాపఁ గొనిపోవ? నేపాటి గలవాఁడ? వేది వంశ?
మెందు జన్మించితి? వెక్కడఁ బెరిఁగితి? వెయ్యది నడవడి? యెవ్వఁ డెఱుఁగు?
మానహీనుఁడ వీవు? మర్యాద లెఱుఁగవు; మాయఁ గైకొని కాని మలయ రావు;
నిజరూపమున శత్రునివహంబుపైఁ బోవు; వసుధేశుఁడవు గావు వావి లేదు;

ఆ. కొమ్మ నిమ్ము; నీవు గుణరహితుండవు, విడువు; విడువ వేని విలయకాల
శిఖిశిఖా సమాన శిత శిలీముఖముల, గర్వ మెల్లఁ గొందుఁ గలహమందు. 1766

* కృష్ణా! మా చెల్లిలిని తీసుకువెళ్ళడానికి నీవు మాతో సమానుడవా? (దైవమునకు సమానుడుగాని, అధికుడు గాని లేడనుట). నీవెంత మాత్రపువాడివి? (అప్రమేయు డనుట). నీ వంశ మేది? (భగవంతునకు కులం లేదు). ఎక్కడ పుట్టితివో? ఎక్కడ పెరిగితివో? నీ ప్రవర్తన మెట్టిదో ఎవరికినీ తెలియదు. (పుట్టుట పెరుగుట జీవులకే గాని దేవునికి లేదు. బ్రహ్మరుద్రాదులకునూ అతని నడవడి తెలియదనుట). నీకు అభిమానం లేదు, మట్టు మర్యాదలు తెలియవు (కొలతలకు అందనివాడూ, హద్దులు లేక అంతట నుండువాడు అనుట). వంచనము వహింపక ఎదుటపడవు? (మాయను స్వీకరించి అవతారము లెత్తువా డనుట). స్వస్వరూపంతో వైరివర్గం మీదికి వెళ్లవు (భగవంతునకు రూపం లేదు. అన్ని రూపులు తన రూపమైనవా డనుట). నీవు క్షత్రియుడవు కావు (దైవమునకు జాతి లేదు). నీకు వావివరుసలు లేవు. (మానవులకు దప్ప సర్వజీవాంతర్యామికి లేవనుట). నీకు మంచి గుణాలు లేవు. (అతడు త్రిగుణరహితు డనుట). మా చెల్లెలిని వదలిపెట్టు; వదలకపోతే ప్రళయకాలంలోని అగ్నిజ్వాలలతో సమానమైన వాడి బాణాలతో కదనరంగంలో నీ గర్వం సర్వం హరిస్తాను.

వ. అని పలికిన నగధరుండు నగి, యొక్క బాణంబున వాని కోదండంబు ఖండించి, యాఱు శరంబుల శరీరంబు దూఱనేసి, యెనిమిది విశిఖంబుల రథ్యంబులం గూల్చి, రెండమ్ముల సారథిం జంపి, మూఁడు వాఁడితూపులం గేతనంబు ద్రుంచి, మఱియు నొక్క విల్లందినం ద్రుంచి, వెండియు నొక్క ధనువు వట్టిన విదళించి, క్రమంబున పరిఘ పట్టిస శూల చర్మాసి శక్తి తోమరంబులు ధరియించినం దునుకలు సేసి, క్రమ్మఱ నాయుధంబు లెన్ని యెత్తిన నన్నియు శకలంబులు గావించె. నంతటం దనివి సనక వాఁడు రథంబు డిగ్గి, ఖడ్గ హస్తుండై, దవానలంబుపైఁ బడు మిడుతచందంబునం గదిసిన, ఖడ్గ కవచంబులు చూర్ణంబులు సేసి, మెఱుంగులు చెదర నడిదంబు వెఱికి ఝళిపించి

**వాని శిరంబుఁ దెగవ్రేయుదు నని గమకించి, నడచుచున్న నడ్డంబు వచ్చి రుక్మిణీదేవి హరి చరణారవిందంబులు పట్టుకొని యిట్లనియె.** **1767**

* రుక్మి ఈ విధంగా పలుకుతుండగానే నల్లనయ్య నవ్వుతూ ఒకబాణంతో అతడిచాపం త్రుంచాడు. ఆరు తూపులతో వాని దేహం తూట్లు చేశాడు. ఎనిమిది అమ్ములతో వాని రథాశ్వాలను కూల్చినాడు. రెండు సాయకాలతో వాని సారథిని చంపినాడు. మూడు వాడి నారసాలతో వాని టెక్కెం ఖండించినాడు. రుక్మి వేరొక ధనువు అందుకోగా దాన్ని విరుగగొట్టినాడు. వాడు మరొకచాపం ధరింపగా ముక్కలు చేశాడు. క్రమంగా అతడు పట్టిన పరిఘ, పట్టిసం, శూలం, అసి, శక్తి, డాలు, తోమరం అనే ఆయుధాలను తునుకలు గావించాడు. ఎన్ని ఆయుధాలు ఎత్తినాడో అన్నిటినీ ముక్కలు చేసినాడు. అంతటితో రుక్మికి తనివితీర లేదు. అతడు రథంనుండి దిగి కార్చిచ్చుమీది కురికే మిడుత మాదిరి కత్తి బూని కమలాక్షుణ్ణి సమీపించాడు. శ్రీకృష్ణు డతని కత్తినీ, కవచాన్ని పొడిపొడి గావించాడు. కాంతులు కడలందు క్రమ్ముకోగా హరి ఒరనుంచి ఖడ్గం దూసి జళిపిస్తూ రుక్మిశిరం తెగనరకడానికి ముందుకు వస్తుండగా రుక్మిణీదేవి అడ్డం వచ్చి ప్రాణేశ్వరుని పాదపద్మములు పట్టుకొని ఇలా అన్నది-

**మత్త. నిన్ను నీశ్వరు దేవదేవుని నిర్ణయింపఁగ లేక యో**
**సన్నుతామరకీర్తి శోభిత! సర్వలోక శరణ్య! మా**
**యన్న యీతఁడు నేఁడు చేసె మహాపరాధము నీ యెడన్**
**నన్ను మన్నన చేసి కావు మనాథనాథ! దయానిధీ!** **1768**

* సత్పురుషులు శ్లాఘించు శాశ్వతకీర్తిచే శోభిల్లువాడా! సకల భువనాలను బ్రోచేవాడా! ఈశ్వరా! నీవు దేవదేవుడ వని నిశ్చయించ లేక మా అన్న అయిన ఈ రుక్మి ఇపుడు మీ పట్ల చాల అపచారం గావించాడు. దిక్కులేని వారికి దిక్కయినవాడా! దయకు నిలయుడా! నన్ను ఆదరించి మా అన్నను కాపాడు.

**మత్త. కల్ల లేదని విన్న వించుట గాదు వల్లభ! యీతనిన్**
**బ్రల్లదుం దెగఁజూచితేనియు భాగ్యవంతుల మైతి మే**
**మల్లుఁ డయ్యె ముకుందుఁ డీశ్వరుఁ డంచు మోదితు లైన మా**
**తల్లిదండ్రులు పుత్త్రశోకముఁ దాల్చి చిక్కుదు రీశ్వరా!** **1769**

* నాథా! మా అన్న దోసకారి కాడని మనవి చేయడం లేదు. ఇతడు నిజంగా దుష్టుడే, కాని ప్రభూ! జగన్నాయకు డగు అచ్యుతుడు మాకు అల్లు డైనాడనీ, మేము అదృష్టవంతులమనీ సంతోషించు మా జననీ జనకులు పుత్రదుఃఖంతో పొగిలిపోతారు.

**మ. అని డగ్గుత్తికతో మహాభయముతో నాకంపితాంగంబుతో**
**వినత శ్రాంత ముఖంబుతో శ్రుతిచలద్వేణీ కలాపంబుతోఁ**
**గనుదోయిన్ జడిగొన్న బాష్పములతోఁ గన్యాలలామంబు మ్రొ**
**క్కిన రుక్మిం దెగవ్రేయఁ బోక మగిడెన్ గృష్ణుండు రోచిష్ణుఁడై.** **1770**

* ఈ విధంగా ప్రార్థిస్తూ కన్నెలలో మిన్నయైన రుక్మిణి గద్గదకంఠంతో, మిక్కిలి భయంవల్ల వణుకు తున్న శరీరంతో, వాడిన, వంచిన ముఖంతో, చెవులమీదికి పడుచున్న జడ వెంట్రుకలతో, కను గొలకులలో తొలకాడు కన్నీళ్ళతో నారాయణునకు నమస్కరించింది. దివ్యతేజోవిరాజమానుడైన దేవకీ నందనుడు రుక్మిని ఖడ్గంతో ఖండింపక వెనుకకు మరలినాడు.

వ. ఇట్లు చంపక బావా! రమ్మని చిఱునగవు నగుచు, వానింబట్టి బంధించి గడ్డంబును మీసంబును దలయును నొక కత్తి వాతి యమ్మున రేవులు వాఱఁ గొఱిగి విరూపిం జేసె; నంతట యదువీరులు పరసైన్యంబులం బాఱఁదోలి, తత్సమీపంబునకు వచ్చి; రప్పుడు హతప్రాయుండై కట్టువడి యున్న రుక్మిం జూచి కరుణచేసి, బలభద్రుండు బంధంబులు విడిచి హరిని డగ్గఱి యిట్లనియె. 1771

* యదువల్లభుడు రుక్మిని చంపక 'బావా! ర'మ్మని చిరునవ్వు నవ్వుతూ దగ్గరకు తీసుకొన్నాడు. వానినిపట్టి బంధించి గడ్డం, మీసం, తల కత్తితో పాయలు పాయలుగా గొరిగి కురూపిని గావించాడు. అదే సమయంలో యాదవవీరులు శత్రుసైన్యాన్ని తరిమివేసి సారసనేత్రుని సముఖానకు వచ్చారు. అప్పుడు బలభద్రుడు జీవన్మృతుడై బంధింపబడి యున్న రుక్మిని కనుగొని కరుణతో వాని కట్లు విప్పి కమలాక్షునితో ఇట్లన్నాడు.

క. తల మనక భీష్మనందను, తలయును మూతియును గొఱుగఁ దగవే! బంధుం
దలయును మూతియు గొఱుగుట, తల దఱుగుటకంటె దుచ్ఛతరము మహాత్మా! 1772

* మహాత్మా! ఇతణ్ణి దూరంగా వెళ్లిపొమ్మని చెప్పక తల, మూతి గొరుగుట, నీకు న్యాయమా? చుట్టమైన వాడి తల, మూతి గొరుగుట తల దరుగుటకన్న మిక్కిలి నీచం గాదా!

క. కొందఱు రిపు లని కీడును; గొందఱు హితు లంచు మేలు గూర్పవు; నిజ మీ
వందఱియందును సముఁడవు, పొందఁగ నేలయ్య! విషమబుద్ధి ననంతా! 1773

* ఆదిమధ్యాంత రహితా! శత్రువులని కొందరికి కీడుచేయవు. మిత్రులని మరికొందరికి మేలు గూర్పవు. వాస్తవంగా అందరియెడ సమభావంతోనే మెలగుతావు. మరి ఈ భేదబుద్ధి నీ కెందుకు కలిగిందో!

## -: సహోదరుని భంగమునకు ఖిన్నయగు రుక్మిణీదేవిని బలభద్రుం డూరార్చుట :-

వ. అని వితర్కించి రుక్మిణీదేవి నుపలక్షించి యిట్లనియె. 1774

* బలరాముడిలా అచ్యుతుని అదలించి రుక్మిణీదేవి నవలోకించి ఇట్లన్నాడు.

శా. తోడంబుట్టిన వాని భంగమునకున్ దుఃఖించి మా కృష్ణు నె
గ్గాడం జూడకు మమ్మ! పూర్వభవ కర్మాధీనమై ప్రాణులన్
గీడున్ మేలును జెందు; లేఁడొకఁడు శిక్షింపంగ రక్షింప నీ
తోడంబుట్టువు కర్మ శేష పరిభూతుం డయ్యె నేఁ డియ్యెడన్. 1775

* అమ్మా! అగ్రజుడు అవమానింపబడ్డాడని ఖేదంతో మా కృష్ణుని నిందించవద్దు. గత జన్మల్లో చేసిన కర్మములను బట్టి జీవులు మంచిచెడ్డ లనుభవిస్తుంటారు. శిక్షించుటకు రక్షించుటకు కర్త ఒకడంటూ లేడు. నీ తోబుట్టినవాడు కర్మశేషంతో ఈనా డిక్కడ ఈ విధమైన పరాభవం పొందినాడు.

**క. చంపెడి దోషము గలిగినఁ, జంపఁ జనదు బంధుజనులఁ జను విడువంగాఁ**
**జంపిన దోషము సిద్ధము, చంపను మఱి యేల మున్న చచ్చినవానిన్. 1776**

* చంపదగిన నేరం చేసినప్పటికీ బంధువులను చంపరాదు. క్షమించి విడిచిపెట్టుటయే న్యాయం. చంపితే పాపం తప్పదు. అవమానంతో అసలే చస్తున్నవాణ్ణి మళ్ళీ చంపడ మెందుకు?

**ఆ. బ్రహ్మచేత భూమిపతుల కీ ధర్మంబు, కల్పితంబు రాజ్యకాంక్షఁ జేసి**
**తోడిచూలు నైనఁ దోడఁబుట్టిన వాఁడు, చంపుచుండుఁ గ్రూరచరితుఁ డగుచు. 1777**

* తామరసగర్భునిచే దండనీతి ధరణీపతులకు విహిత కృత్యంగా విధించబడింది. రాజ్యకాంక్షతో తోబుట్టువును తోడబుట్టిన వాడే క్రూరహృదయుడై చంపుతుంటాడు.

**క. భూమికి ధన ధాన్యములకు, భామలకును మానములకుఁ బ్రాభవమునకుం**
**గామించి మీఁదు గానరు, శ్రీమదమున మానధనులు చెనకుదు రొరులన్. 1778**

* మానవంతులు ధనమదాంధులై ధరణికోసం, ధనధాన్యాల కోసం, అంగనల కోసం ఆత్మాభ్యున్నతి కోసం, ఐశ్వర్యంకోసం అన్యులను హింసిస్తారు.

**వ. వినుము. దైవమాయం జేసి దేహాభిమానులైన మానవులకున్ బగవాఁడు, బంధుండు, నుదాసీనుండు నను మోహంబు సిద్ధంబై యుండు; జలాదులయందుఁ జంద్ర సూర్యాదులును, ఘటాదులయందు గగనంబును బెక్కై కానంబడు భంగి, దేహధారుల కందఱికి నాత్మ యొక్కం డయ్యును బెక్కండ్రై తోఁచు; నాద్యంతంబులు గల యీ దేహంబు ద్రవ్య ప్రాణ గుణాత్మకంబై, యాత్మయందు నవిద్య చేతఁ గల్పితంబై, దేహిని సంసారంబు నం ద్రిప్పు. సూర్యుండు తటస్థుండై యుండఁ బ్రకాశమానంబు లయిన దృష్టిరూపంబులుంబోలె నాత్మ తటస్థుండైయుండ దేహేంద్రియంబులు ప్రకాశమానంబు లగు; నాత్మకు వేఱొక్కటితోడ సంయోగ వియోగంబులు లేవు; వృద్ధిక్షయంబులు చంద్రకళలకుం గాని చంద్రునికి లేని కైవడి, జన్మనాశంబులు దేహంబునకుఁ గాని, యాత్మకుఁ గలుగనేరవు. నిద్ర వోయినవాఁ డాత్మను విషయఫలానుభవంబులు సేయించు తెఱంగున, నెఱుక లేనివాఁడు నిజము గాని యర్థమునందు ననుభవము నొందుచుండుఁ గావున. 1779**

* రుక్మిణీ! విను. దైవమాయవల్ల దేహాభిమానం గల మానవులకు ఇతడు శత్రువు, ఇతడు బంధువు, ఇతడు తటస్థుడు అనే భేదబుద్ధి జనిస్తుంది. నీటియందు సూర్యచంద్రాదులు, ఘటాదులందు గగనము అనేకములై కన్పించునట్లు ప్రాణులందరికి ఆత్మ ఒక్కటే అయినప్పటికీ పెక్కులుగా గోచరిస్తుంది. పుట్టుక, చావు గల ఈ శరీరం పృథివి, జలం, అగ్ని, వాయువు, ఆకాశం అనే ఐదుభూతాలతోడనూ; ప్రాణం,అపానం,

వ్యానం, ఉదానం, సమానం అనే ఐదుప్రాణాల తోడనూ; సత్త్వం, రజస్సు తమస్సు అనే మూడు గుణాల తోడనూ కూడినదై అజ్ఞానంచే ఆత్మయందు కల్పించబడింది. ఈ దేహం జీవుణ్ణి సంసారచక్రంలో పరిభ్రమింపజేస్తున్నది. సూర్యుడు దేనితోనూ సంబంధం లేక ఉదాసీనుడై ఉండగా గోచరమయ్యే దృష్టి, రూపం అనే వానివలె ఆత్మ ఉదాసీనుడై యుండగా శరీరమూ మరియు చర్మమూ, చక్షువూ, శ్రోత్రమూ, జిహ్వా, ఘ్రాణమూ అనే ఐదు జ్ఞానేంద్రియములు; వాక్కు, పాణి, పాదం, పాయువు, ఉపస్థ అనే ఐదు కర్మేంద్రియాలూ ప్రకాశమాన మవుతాయి. ఆత్మకు మరొక్క దానితో కూడిక గాని, ఎడబాటుగాని లేదు. హాని వృద్ధులు చంద్రకళలకే గాని చంద్రుడికి లేనట్లు చావుపుట్టుకలు శరీరానికే గాని ఆత్మకు కలుగవు. నిద్రించిన వాడు విషయాల వలని సుఖదుఃఖాలు ఆత్మను అనుభవింపజేసేటట్లు జ్ఞానహీనుడు అసత్యమైన అర్థమునందు అనుభవం కల్గించుకుంటాడు.

**క. అజ్ఞానజ మగు శోకము, విజ్ఞాన విలోకనమున విడువుము నీకుం**
**బ్రజ్ఞావతికిం దగునే, యజ్ఞానుల భంగి వగవ నంభోజముఖీ! 1780**

* పద్మముఖీ! రుక్మిణీ! అజ్ఞానంవల్ల కలిగే దుఃఖాన్ని విజ్ఞానమనే చూపుతో విడిచిపెట్టు, నీవు మతిమంతురాలవు. అజ్ఞానుల మాదిరి శోకించటం నీకు తగదు.

**వ. ఇట్లు బలభద్రునిచేతఁ దెలుపంబడి, రుక్మిణీదేవి దుఃఖంబు మాని యుండె; నట రుక్మి యనువాఁడు ప్రాణావశిష్టుండై, విడువఁబడి తన విరూపభావంబునకు నెరియుచు, హరిం గెల్చికాని కుండిన పురంబుఁ జూడ నని ప్రతిజ్ఞ సేసి, తత్సమీపంబున నుండె నివ్విధంబున. 1781**

* ఈ రీతిగా బలభద్రుడు ప్రబోధించాడు. రుక్మిణీదేవి విచారం విడిచిపెట్టింది. ఇది ఇట్లుండగా ప్రాణాలతో వదలి పెట్టబడ్డ రుక్మి తన వికార రూపానికి పరితపిస్తూ శౌరిని జయించిగాని కుండిన నగర ప్రవేశం చెయ్యనని ప్రతిజ్ఞ పట్టి పట్టణ సమీపంలోనే ఉండిపోయాడు.

**క. రాజీవలోచనుఁడు హరి, రాజసమూహముల గెల్చి రాజస మొప్పన్**
**రాజిత యగు తన పురికిని, రాజాననఁ దెచ్చె బంధురాజి నుతింపన్. 1782**

* ఈ విధంగా నళినములవంటి నయనములు గల నారాయణుడు రాజసంతో రాజలోకాన్ని జయించి, విభ్రాజమానమైన తన పట్టణానికి చుట్టాలందరూ స్తుతింపగా, ఇందుముఖిని తోడ్కొని వచ్చాడు.

## -: శ్రీకృష్ణుఁడు రుక్మిణీదేవినిఁ బెండ్లి యాడుట :-

**వ. అంత న య్యాదవేంద్రుని నగరంబు సమారబ్ధ వివాహకృత్యంబును, బ్రవర్తమాన గీతవాద్య నృత్యంబును, బ్రతిగృహాలంకృత విలసితాశేష నర నారీవర్గంబును, బరిణయ మహోత్సవ సమాహూయమాన మహీపాల గజఘటా గండమండల దానసలిల ధారాసిక్త మార్గంబును, బ్రతిద్వార మంగళాచార సంఘటిత క్రముక కదళికా కర్పూర కుంకుమాగరు ధూపదీప పరిపూర్ణ కుంభంబును, విభూషిత సకల గృహవేదికా కవాట దేహళీ స్తంభంబును, విచిత్ర కుసుమాంబర రత్నతోరణ విరాజితంబును, సముద్ధూత కేతన విభ్రాజితంబును నై యుండె; న య్యవసరంబున. 1783**

* అప్పుడు యదువల్లభుని పురంలో పెళ్ళిపనులు ప్రారంభింపబడినాయి. గాత్రసంగీతములు, వాద్య గానములు, నాట్యములు జరిగినాయి. ఇంటింటా ఆడువారు, మగవారు అందరూ అలంకారాలు చేసుకున్నారు. వివాహ మహోత్సవానికి ఆహ్వానా లందుకొని అవనీధవు లందరూ వచ్చారు. వారి గజసమూహాల గండస్థలాల నుంచి స్రవించిన మదజలాలతో రాజమార్గాలు తడిసిపోయాయి. మంగళా చారానికై ద్వారపార్శ్వాలలో పోక మొక్కలు, అరటిబోదెలు కట్టినారు. కర్పూర కుంకుమములతో రంగవల్లికలు తీర్చినారు. అగరుధూపాలు వేశారు. పూర్ణకుంభాలు ఉంచారు. ఇంటి అరుగులను, తలుపులను, గడపలను, కంబాలను కైసేసినారు. వింత వింత పూలతో, మేలుకట్లతో, రత్నతోరణాలతో, గాలికి రెపరెపలాడు జెండాలతో ద్వారకానగరం విల సిల్లింది.

**శా. ధ్రువకీర్తిన్ హరి పెండ్లి యాడె నిజ చేతోహారిణిన్ మాన వై**
**భవ గాంభీర్య విహారిణిన్ నిఖిల సంపత్కారిణిన్ సాధు బాం**
**ధవ సత్కారిణిఁ బుణ్యచారిణిఁ మహాదారిద్ర్య సంహారిణిన్**
**సువిభూషాంబర ధారిణిన్ గుణవతీ చూడామణిన్ రుక్మిణిన్.** **1784**

* ఆ శుభసమయాన తన మనస్సును హరించునదీ, ఆత్మోన్నతీ, గాంభీర్యమూ అనే గుణాలతో ఒప్పేది, సకలసంపదలు కలిగించేదీ, సుజనులనూ చుట్టాలనూ ఆదరించేదీ, పుణ్యసంచారిణీ; దారిద్ర్య పరిహారిణీ, కల్యాణవేష భూషణధారిణీ, రమణీశిరోమణీ అయిన రుక్మిణిని శ్రీకృష్ణమూర్తి పెండ్లాడినాడు. ఆయన యశస్సు నలుదెసలా వ్యాపించింది.

**క. సతులుం దారును బౌరులు, హితమతిఁ గానుకలు దెచ్చి యిచ్చిరి కరుణో**
**న్నత వర్ధిష్ణులకును మా, నిత రోచిష్ణులకు రుక్మిణీకృష్ణులకున్.** **1785**

* అఖండతేజో విరాజితులూ, అపారకృపా వర్ధిష్ణులూ అయిన రుక్మిణీ కృష్ణులకు ద్వారకా పురవాసులు, తమ భార్యలతో కలసి మంచి మనసులతో కానుకలు తెచ్చి సమర్పించారు.

**క. హరి పెండ్లికిఁ గైకేయక, కురు సృంజయ యదు విదర్భ కుంతినరేంద్రుల్**
**వరమానందముఁ బొందిరి, ధరణీశులలోన గాఢతాత్పర్యములన్.** **1786**

* ముకుందుని వివాహానికి కేకయ, కురు, సృంజయ, యదు, విదర్భ, కుంతి దేశాల రాజులు ఇతర రాజులకంటే అపరిమితమైన ఆనందం అనుభవించారు.

**క. హరి యీ తెఱఁగున రుక్మిణి, నరుదుగఁ గొనితెచ్చి పెండ్లి యాడుట విని దు**
**ష్కరకృత్య మనుచు వెఱఁగం, దిరి రాజులు రాజసుతులు దిక్కుల నెల్లన్.** **1787**

* శ్రీకృష్ణుడు ఈ విధంగా రుక్మిణీదేవిని తెచ్చి పెండ్లాడటం అనన్యసామాన్య మైన కార్యమని ఆయా దేశములందలి రాజులూ, వారి రాణులూ ఆశ్చర్యం చెందినారు.

**ఆ. అనఘ! యాదిలక్ష్మి యైన రుక్మిణతోడఁ, గ్రీడ సలుపుచున్న కృష్ణుఁ జూచి**
**పట్టణంబులోని ప్రజ లుల్లసిల్లిరి, ప్రీతు లగుచు ముక్తభీతు లగుచు. 1788**

**వ. అని చెప్పి. 1789**

* పాపరహితుడవైన ఓ పరీక్షిన్మహారాజా! ఆదిలక్ష్మి అవతారమైన రుక్మిణితో సుఖిస్తున్న శ్రీకృష్ణుని చూచి పట్టణంలోని ప్రజలందరూ భయం విడనాడి ఎంతో సంతోషంతో విలసిల్లినారు- అని శుకయోగీంద్రుడు పరీక్షిన్నరేంద్రునకు రుక్మిణీకల్యాణగాథ వినిపించాడు.

**క. కువలయరక్షాతత్పర, కువలయదళ నీలవర్ణ కోమలదేహా!**
**కువలయనాథ శిరోమణి!, కువలయజన వినుత విమలగుణ సంఘాతా! 1790**

* భూమండలాన్ని రక్షించటంలో ఆసక్తి గలవాడా! కలువరేకులవలె నల్లనికాంతితో విరాజిల్లే మృదువైన దేహం కలవాడా! ధరామండలేశ్వరులకు శిరోభూషణ మైనవాడా! పుడమిజనుల పొగడ్త గన్న సుగుణసమూహం కలవాడా!

**మాలిని. సరసిజనిభహస్తా! సర్వలోకప్రశస్తా!, నిరుపమ శుభమూర్తీ! నిర్మలారూఢకీర్తీ!**
**పరహృదయవిదారీ! భక్తలోకోపకారీ!, గురు బుధజన పోషీ! ఘోర దైతేయ శోషీ! 1791**

* అంబుజాలతో సమానమైన హస్తాలు గలవాడా! ఎల్లలోకాలలో శ్రేష్ఠుడా! సాటిలేని మంగళస్వరూపుడా! స్వచ్ఛమై వన్నె కెక్కిన కీర్తి గలవాడా! శాత్రవుల గుండెలను ఖండించువాడా! భక్త సమూహానికి మేలు చేయువాడా! పెద్దలను, పండితులను పోషించేవాడా! భయంకరులైన రక్కసుల ఉక్కణచినవాడా!

**గ. ఇది శ్రీపరమేశ్వర కరుణాకలిత కవితావిచిత్ర కేసనమంత్రిపుత్ర సహజపాండిత్య పోతనామాత్య ప్రణీతంబయిన శ్రీమహాభాగవతంబను మహాపురాణమునందు దేవకీదేవి వివాహంబును, గగనవాణీశ్రవణంబును, కంసోద్రేకంబును, వసుదేవ ప్రార్థనంబును, యోగమాయాప్రభావంబును, బలభద్రుని జన్మంబును, బ్రహ్మాది సురస్తోత్రంబును, నందపుత్రోత్సవంబును, పూతనాసంహారంబును, శకట భంజనంబును, తృణావర్తు మరణంబును, గర్గాగమనంబును, నారాయణాది నామ నిర్దేశంబును, బాలక్రీడయును, మృద్భక్షణంబును, వాసుదేవ వదన. గహ్వార విలోక్యమా నాఖిల లోకాలోకనంబును, నవనీత చౌర్యంబును, యశోదా రోషంబును, ఉలూఖల బంధనంబును, అర్జునతరు యుగళ నిపాతనంబును, నలకూబర మణిగ్రీవుల శాపమోక్షణంబును, బృందావన గమనంబును, వత్సపాలనంబును, వత్సాసురవధయును, బకదనుజవిదారణంబును, అఘాసుర మరణంబును, వత్సాపహరణంబును, నూతన వత్స బాలక కల్పనంబును, బ్రహ్మ వినుతియును, గోపాలనంబును, గార్దభాసుర దమనంబును, కాళియఫణి మర్దనంబును, గరుడ కాళియనాగ విరోధ**

కథనంబును, ప్రలంబాసుర హింసనంబును, దవానల పానంబును, వర్షర్తు వర్ణనంబును, శరత్కాల లక్షణంబును, వేణువిలాసంబును, హేమంతసమయ సమాగమంబును, గోపకన్యాచరిత హవిష్య వ్రతంబును, కాత్యాయనీ సేవనంబును, వల్లనీ వస్త్రాపహరణంబును, విప్రవనితా దత్తాన్నభోజనం బును, ఇంద్రయాగ నివారణంబును, నందముకుంద సంవాదంబును, పర్వతభంజనం బును, పాషాణసలిల వర్షంబును, గోవర్ధనోద్ధరణంబును, వరుణకింకరుండు నందునిం గొనిపోయిన హరి దెచ్చుటయు, వేణు పూరణంబును, గోపికాజన ఘోషనిర్గమంబును, యమునాతీర వనవిహారణం బును, కృష్ణాంతర్ధా నంబును, ఘోష కామినీ గణ పరిదేవనంబును, గోపికాన్వేషణంబును, గోపికా గీతలును, హరిప్రసన్న తయును, రాసక్రీడనంబును, జలకేళియును, సర్పరూపకుం డయిన సుదర్శన విద్యాధరుండు హరిచరణ తాడనంబున నిజరూపంబు వడయుటయును, శంఖచూడుండను గుహ్యా కుని వధించుటయును, వృషభాసుర విదళనంబును, నారదోపదేశంబున హరికథ నెఱిఁగి కంసుండు దేవకీ వసుదేవుల బద్ధులం జేయుటయును, ఘోటకాసురుం డయిన కేశి యను దనుజుని వధించుట యును, నారద స్తుతియును, వ్యోమదానవ మరణంబును, అక్రూరాగమనంబును, అక్రూర రామ కృష్ణుల సల్లాపంబును, ఘోషనిర్గమంబును, యమునా జలాంతరాళంబున నక్రూరుండు హరి విశ్వరూపమును గాంచుటయును, అక్రూరస్తవంబును, మథురానగర ప్రవేశంబును, రజక వధయును, వాయక మాలికులచే సమ్మాన మొందుటయును, కుబ్జా ప్రసాదకరణంబును, ధనుర్భంగంబును, కంసుదుస్స్వప్నంబును, కువలయాపీడ పీడనంబును, రంగస్థలప్రవేశంబును, చాణూరముష్టికుల వధయును, కంస వధయును, వసుదేవ దేవకీ బంధమోక్షణంబును, ఉగ్రసేను రాజ్యస్థాపనంబును, రామకృష్ణులు సాందీపనివలన విద్య లభ్యసించుటయును, సంయమనీ నగర గమనంబును, గురుపుత్త్రదానంబును, ఉద్ధవుని ఘోషయాత్రయును, భ్రమరగీతలును, కుబ్జావాస గమనంబును, కరినగరంబునకు నక్రూరుండు సని కుంతీదేవి నూరార్చుటయు, కంస భార్యలగు నస్తి ప్రాస్తులు జరాసంధునకుఁ గంసుమరణం బెఱింగించుటయును, జరాసంధుని దండయాత్రయును, మథురా నగర నిరోధనంబును, యుద్ధంబున జరాసంధుండు సప్తదశవారంబులు పలాయితుం డగుటయు నారదప్రేరితుండై కాలయవనుండు మథురపై దాడి వెడలుటయును, ద్వారకానగర నిర్మాణంబును, మథురాపుర నివాసులం దనయోగబలంబున హరి ద్వారకానగరంబునకుఁ దెచ్చుటయు, కాల యవనుండు హరివెంటం జని గిరిగుహయందు నిద్రితుండైన ముచుకుందుని కోపదృష్టివలన నీఱగుటయును, ముచుకుందుండు హరిని సంస్తుతి చేసి తపంబునకుం జనుటయును, జరాసంధుఁ డు గ్రమ్మఱ రామకృష్ణులపై నేతెంచుటయును, ప్రవర్షణ పర్వతారోహణంబును, గిరిదహనంబును, గిరి డిగ్గ నుఱికి రామకృష్ణులు ద్వారకకుం జనుటయు, రుక్మిణీ జన్మంబును, రుక్మిణీ సందేశంబును, వాసుదేవాగమనంబును, రుక్మిణీగ్రహణంబును, రాజలోక పలాయనంబును, రుక్మి యనువాని భంగంబును, రుక్మిణీ కల్యాణంబును ననుకథలు గల దశమస్కంధంబునందుఁ బూర్వభాగంబు సంపూర్ణము. 1792

* శ్రీ మహాభాగవతం అనే ఈ మహాపురాణం పరమేశ్వరదయాలబ్ధ కవితావైచిత్రి కలవాడూ, కేసన మంత్రి పుత్రుడూ, సహజ పాండిత్యుడూ అయిన బమ్మెరపోతనామాత్యులవారు రచించారు.

దేవకీదేవి పెళ్లి, ఆకాశవాణిని కంసుడు ఆలకించుట, అతడు ఉద్రేకపడుట, వసుదేవుని ప్రార్థన, యోగమాయయొక్క మహిమ, బలరాముని పుట్టుక, బ్రహ్మ మొదలగు దేవతలయొక్క స్తుతి, శ్రీకృష్ణ భగవానుడు అవతరించుట, నందవ్రజములో ప్రవేశించుట, యోగనిద్రకథ, నందుడు కావించిన పుత్రోత్సవం, కృష్ణుడు పూతనను చంపుట, శకటాసురుని కూల్చుట, తృణావర్తుని మృతి, యాదవ పురోహితుడైన గర్గా చార్యులవారు మందకు చనుదెంచుట, నారాయణాదినామ నిర్వచనము, శ్రీకృష్ణుని బాలక్రీడ, అతడు మన్ను తినుట, యశోదాదేవి గోవిందుని ముఖ గహ్వరములో సకల చరాచర ప్రపంచమును చూచుట, శ్రీకృష్ణుడు వెన్నలు దొంగిలించుట, యశోదాదేవి శ్రీకృష్ణుని కోపించుట, ఆమె రోటికి బాలకృష్ణుని బంధిం చుట, కృష్ణుడు అమడమద్దులను పడగూల్చుట, అర్జునవృక్షములై యున్న నలకూబరుడు, మణిగ్రీవుడు అనే గంధర్వుల శాపవిముక్తి, నందాదులు బృందావనమున కరుగుట, శ్రీకృష్ణుడు లేగలను మేపుట, అతడు వత్సాసురుని సంహరించుట, బకరూపము దాల్చిన దైత్యుని చీల్చిచంపుట, బకుని తమ్ముడూ, సర్పరూపధారీ అయిన అఘాసురుని శ్రీకృష్ణుడు రూపుమాపుట, బ్రహ్మదేవుడు ఆవుదూడలను అంతర్ధానము చేయుట, శ్రీకృష్ణుడు క్రొత్తగా గోవత్సములను, గోపబాలకులను సృజించుట, బ్రహ్మశ్రీకృష్ణుని స్తుతించుట, కృష్ణుడు గోవులను పాలించుట, గర్దభాకారము ధరించిన ధేనుకాసురుని నిర్మూలించుట, కాళియ మర్దనము గావించుట, గరుత్మంతునకు కాళియునకు వైర మేర్పడిన వైనము, బలరాముడు ప్రలంబాసురుని ద్రుంచుట, శ్రీకృష్ణుడు దావాగ్నిని మ్రింగుట, వర్షఋతువర్ణనం, శరదృతులక్షణం, వేణుగానవినోదం, హేమంత ఋతువు రాక, గోపకన్యలు గావించిన హవిష్యవ్రతం, గోపికలు కాత్యాయనిని భజించుట, గొల్లెతల కోకలు కృష్ణుడు అపహరించుట, బ్రాహ్మణపత్నులు తెచ్చి యిచ్చిన అన్నములు స్వామి ఆరగించుట, వాసుదేవుడు ఇంద్ర యాగము మాన్పించుట, నందముకుందుల సంభాషణ, కృష్ణుడు గోవర్ధనగిరిని పెల్లగించుట, ఇంద్రుడు రాలవాన గురియించుట, కృష్ణమూర్తి గోవర్ధనపర్వతము నెత్తుట, వరుణుని భటుడు వరుణ పట్టణమునకు నందుని గొనిపోగా శ్రీకృష్ణుడు మరల తెచ్చుట, గోవిందుడు పిల్లనగ్రోవి నూదుట, గోపికలు మందనుండి వెడలి కృష్ణుని సన్నిధికి వచ్చుట, యమునానదీ తీరమందలి వనములో శ్రీకృష్ణుడు విహరించుట, కృష్ణుడు అదృశ్య మగుట, గొల్లచేడియలు కృష్ణుని గానక విలపించుట, గోపికలు కృష్ణుని వెదకుట, గోపికాగీతలు, శ్రీకృష్ణుడు ప్రసన్ను డగుట, రాసక్రీడాభివర్ణనము, జలక్రీడాభి వర్ణనము, సర్పరూపి యగు సుదర్శను డను విద్యాధరుడు శ్రీకృష్ణుని కాలితాపుతో స్వస్వరూపమును పొందుట, కృష్ణుడు కుబేరభటుడైన శంఖచూడు డను గుహ్యకుని చంపుట, వృషభాసుర సంహారము, నారదుని మాటల వల్ల కృష్ణుని జన్మవృత్తాంత మెరిగి కంసుడు దేవకీవసుదేవులను బంధించుట, అశ్వరూపధరుడైన కేశి యను దనుజుని శ్రీహరి వధించుట, నారదుడు గోవిందుని సంస్తుతించుట, వ్యోమాసురుని శౌరి సంహరించుట, అక్రూరుడు నందగోకులమునకు వచ్చుట, అక్రూర బలరామకృష్ణులు ముచ్చటించు కొనుట, అక్రూరుడు నందవ్రజమునుంచి కృష్ణబల

భద్రులతో మథురకు బయలుదేరుట, అక్రూరుడు యమునా నదీజలాలలో శ్రీహరి విశ్వరూపమును దర్శించుట, అతడు శ్రీకృష్ణపరమాత్మను సంస్తుతించుట, కృష్ణుడు మథురలో ప్రవేశించుట, అక్కడ చాకివానిని సంహరించుట, సాలెవా డొసగిన వస్త్రములు, సుదాముడను మాలాకారుడు సమర్పించిన పూలదండలు రామకృష్ణులు స్వీకరించుట, శ్రీకృష్ణుడు కుబ్జయెడ ప్రసన్ను డగుట, అతడు ధనుశ్శాల కరిగి వింటిని విరచుట, కంసుడు చెడుకల గాంచుట, కువలయాపీడ మనే ఏనుగును కృష్ణుడు చంపుట, కృష్ణుడు మల్లరంగములో ప్రవేశించుట, శ్రీకృష్ణబలరాములు చాణూరుడు, ముష్టికుడు అను మల్లులను మ్రందించుట, కంసుని సంహరించుట, శ్రీకృష్ణుడు దేవకీవసుదేవుల చెర మాన్పుట, ఉగ్రసేనునకు రాజ్యపట్టము కట్టబెట్టుట, రామకృష్ణులు సాందీపని వల్ల చతుష్షష్టి విద్యలు నేర్చుట, శ్రీకృష్ణుడు గుర్వర్థమై యమపట్టణ మైన సంయమనీ నగరమునకు పోవుట, యము నడిగి తెచ్చి రామకృష్ణులు సాందీపనికి అతని కుమారు నొసగుట, ఉద్ధవుడు గోకులమునకు వచ్చుట, భృంగాపదేశము, శ్రీకృష్ణుడు కుబ్జయింటి కరుగుట, హస్తినాపురమునకు అక్రూరుడు వెళ్లి కుంతీదేవి నోదార్చుట, కంసుని పత్నులగు అస్తి, ప్రాప్తి అనువారు తమ జనకు డగు జరాసంధునకు భర్తృమరణము దెల్పుట, జరాసంధుడు కృష్ణుని పైకి దాడి వెడలుట, జరాసుతుడు మథురాపురమును ముట్టడించుట, జరాసంధుడు సంగ్రామములో పదునేడుసారులు పరాజితుడై పారిపోవుట, నారదుని ప్రేరణచే కాలయవనుడు మథురానగరిపై దండయాత్ర సల్పుట, హరి ఆదేశముచే విశ్వకర్మ సముద్రములో ద్వారకా నగరమును నిర్మించుట, కృష్ణుడు తన యోగమహిమచే మథురా పట్టణ ప్రజలను ద్వారకాపురికి జేర్చుట, కాలయవనుడు మాధవుని వెంట నరిగి ఒక శైలగుహలో నిద్రిస్తున్న ముచుకుందు డను రాజుయొక్క కోప దృష్టి వలన భస్మ మగుట, ముచుకుందుడు నారాయణుని స్తోత్ర మొనర్చి తపము సల్పుటకు వెళ్లుట, జరా సంధుడు మరల రామకృష్ణులపైకి దాడి వెడలుట, బలరామాచ్యుతులు ప్రవర్షణగిరి నెక్కుట, జరాసంధుడు ప్రవర్షణశైలమును దహించుట, రామకృష్ణులు పర్వతము నుండి దుమికి ద్వారకాపురికి వచ్చుట, రుక్మిణీదేవి పుట్టుక, ఆమె కృష్ణునకు పంపిన సందేశము, మాధవుడు కుండిన నగరమునకు ఏతెంచుట, రుక్మిణి నెత్తుకపోవుట, రాజసమూహము యుద్ధమందు ఓడి పారిపోవుట, రుక్మిణి అన్న యగు రుక్మి భంగపాటు, రుక్మిణీదేవి వివాహము అను కథలు గలిగిన ఈ దశమస్కంధ పూర్వభాగము ముగిసినది.

**శ్రీ కృష్ణార్పణ మస్తు.**

T.T.D. Religious Publications Series N0.639 - D
Price : Rs. 220/-

విష్ణుకథలు కల్యాణాత్మకమైనవి. అంటే శుభాలను ప్రసాదించేవి. అవి ఎన్ని మార్లు విన్నా, ఎప్పటికప్పుడు కొత్తవిగానే ఉంటాయి. భాగవతం అలాంటి పవిత్ర కథలకు నిలయం. ఈ పురాణరత్నం సహజకవి పోతన అమృతహస్తం నుండి మధుర భక్తిమయ కావ్యంగా తెలుగులో అవతరించిన నాటినుండీ ఎందరో భక్తులకు, కవులకు, వాగ్గేయకారులకు ఉపాదేయమై, అనేకవిధాల మార్గదర్శకమై అలరారుతోంది.

"పోతన్న తెనుగుల పుణ్యపేటి" అన్న విశ్వనాథ వారి మాటలు అక్షరసత్యాలు. పోతన తెలుగులో భాగవతాన్ని శ్రీకైవల్యపదాన్ని చేరడానికి రచించినా, ఆ గ్రంథాన్ని చదివినవాళ్లందరికీ కూడా మోక్షాన్ని సిద్ధింపజేశారు. భాగవతంలోని ప్రతిపద్యం ఎంతో హృద్యం. తెలుగునాట పోతన గారి పద్యం నోటికి రాని పండితుడు గాని, పామరుడు గాని లేడంటే అతిశయోక్తి కాదు.

అలాంటి ఉత్తమగ్రంథమైన భాగవత సందేశాన్ని, పోతనకవితా వైశిష్ట్యాన్ని, ఎన్నో వ్యాపకాలతో సతమతమయ్యే నేటి 'సగటుమనిషి'కి ప్రత్యేకించి యువతరానికి వీలైనంత సమగ్రంగా, సరళంగా అందించాలనే ఉదారాశయంతో తిరుమల తిరుపతి దేవస్థానం ఆంధ్రమహాభాగవతాన్ని కరుణశ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి గారి ప్రధాన సంపాదకత్వంలో తాత్పర్యసహితంగా ప్రచురించింది. ఈ సంపుటాలకు అనేకమంది పండితులు చక్కటి తాత్పర్యాన్ని సమకూర్చారు. ఇప్పటికి ఐదుసార్లు ముద్రితమైన ఈ సంపుటాలు పరిష్కరింపబడి పునర్ముద్రితమై వెలువడ్డాయి. పాఠకులు యథాపూర్వం ఆదరించగలరు!

"భాగవతపురాణఫలరసాస్వాదన
పదవిఁ గనుఁడు! రసికభావ విదులు!"

Published by I.Y.R.Krishna Rao, I.A.S., Executive Officer, T.T.Devasthanams, Tirupati
and Printed at Prajasakti Daily Printing Press, Hyderabad - 500 020.

# పోతన భాగవతము

*(సరళ గద్యానువాద సహితము)*

## ఐదవ సంపుటము

**దశమ స్కంధము - ఉత్తర భాగము & 11, 12 స్కంధములు**


*అనువాదకులు*

**డా॥ అమరేంద్ర**

**శ్రీ డి. నాగసిద్ధారెడ్డి**

**డా॥ ప్రసాదరాయ కులపతి**

**శ్రీ టి. భాస్కర రావు (స్ఫూర్తిశ్రీ)**

*ప్రధాన సంపాదకులు*

**డా॥ జంధ్యాల పాపయ్యశాస్త్రి**



*ప్రచురణ*

**కార్యనిర్వహణాధికారి**

**తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి**

**2010**

**POTANA BHAGAVATAMU,** with Lucid Prose
Fifth Volume - Second Part of 10th Skandha and 11th & 12th Skandhas

**Author :** Potana Mahakavi

**Prose Rendering :** Dr. A. Amarendra
Sri D. Nagasiddha Reddy
Dr. Prasadaraya Kulapathi
Sri T. Bhaskar Rao (Sphurthi Sri)

**Edited by :** Dr. Jandhyala Papaiah Sastry. "Karuna Sri"



T.T.D Religious Publication Series No. 639-E

**First Edition** : 1987
**Re-prints** : 1998, 2004, 2005, 2008, 2010
**Revised Edition** : 2015

**Copies :** 5,000

**Published by**

Dr. D.Sambasiva Rao , I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati.

**D.T.P**

Sri Asangananda Graphics
Sri Vyasasramam, Yerpedu.
Ph:08578-287528

**Printed at**

# ముందుమాట

బ్రహ్మదేవుని చతుర్ముఖాలనుండి పురాణాలు, తరువాత వేదాలు వినిస్సృతాలైనట్లు తెలుస్తుంది. కాగా పురాణాల అనాదిత్వం పావనత్వం విద్యోతిత మవుతుంది. ఏనాటినుంచో సజీవంగా వెలిగేదే పురాణమంటారు. 'పురాపి నవం పురాణం'- ఎంత పాతదైనా పురాణం సరికొత్తగానే ఉంటుందన్నమాట!

సర్గం, ప్రతిసర్గం, వంశం, మన్వంతరం, వంశానుచరితం - అని పురాణాలు అయిదు లక్షణాలు కలిగి ఉంటాయి. ఈ లక్షణాలతో కూడిన పురాణాలు పద్దెనిమిది. ఉపపురాణాల సంఖ్యకూడా అంతే. ఈ పురాణాలన్నీ వేదవ్యాస మహర్షి విరచితాలే అని ప్రతీతి. ఇవి భిన్న కర్తృకాలు అనే ప్రవాదం కూడా ఉన్నది. ఏమైనా పురాణాలు ప్రాచీన సంస్కృతి సంప్రదాయాలకు ఆదర్శం లాంటివే కాకుండా, పూర్వ రాజవంశాలను గురించికూడ తెలపడంవల్ల ఒక విధంగా చరిత్రగ్రంథాలుగా కూడా ఉపకరిస్తాయి.

కథలద్వారా ప్రజలకు నీతి ధర్మాలు ఉపదేశించడం వీటి పరమాశయంగా కనిపిస్తుంది. భాగవత రచనవల్ల వ్యాసభగవానుడికి మనశ్శాంతి చేకూరిందనడంలో పురాణ ప్రభావం ఏమిటో విదిత మవుతుంది.

అష్టాదశ పురాణాలలో ప్రశస్తి వహించిన శ్రీమద్భాగవతాన్ని బమ్మెరపోతనామాత్యులు తెలుగులోనికి అనువదించి ఆంధ్రలోకానికి మహోపకారం చేశారు. పరమభాగవతోత్తముడైన పోతనగారు తన సహజ పాండిత్యముతో అనితరభక్తితో భాగవతాన్ని రచించారు. మహాతపస్వి పోతరాజుగారి లేఖిని నుండి జాలు వారిన కవితా ప్రవంతి ఆంధ్ర జనహృదయ కేదారాలను తడుపుతూ తాపత్రయాన్ని హరిస్తున్నదనడం సత్యం. భాగవతంలోని ప్రతి పద్యం ఎంతో హృద్యం. తెలుగునాట పోతనగారి పద్యం నోటికి రాని పండితుడు గాని, పామరుడుగాని లేడంటే అతిశయోక్తి కాదు.

ఇలా తెలుగునాట ప్రముఖస్థానాన్ని అలంకరించిన ఆంధ్రమహాభాగవతం అక్షరాస్యులందరికీ సులభ గ్రాహ్యం అయ్యేందుకు తి.తి.దేవస్థానంవారు ప్రముఖ విద్వాంసులచేత సులభశైలిలో తాత్పర్యాలు వ్రాయించి, ముద్రించారు.

ప్రధాన సంపాదకులైన డా॥ జంధ్యాల పాపయ్యశాస్త్రి (కరుణశ్రీ) గారికి, ఆయా సంపుటాల తాత్పర్య రచయితలకును మా అభినందనలు. తి.తి.దేవస్థానం వారు ప్రచురించిన పోతన భాగవత సంపుటాల ప్రతులన్నీ చెల్లిపోయినందున పాఠకుల సౌకర్యార్థమై పరిష్కరించి పునర్ముద్రించటం జరిగింది. పాఠకులు యథాపూర్వం ఆదరించగలరు.

శ్రీనివాసుని కృపతో తిరుమల తిరుపతి దేవస్థానంవారు చేస్తున్న ధార్మిక గ్రంథ ప్రచురణలపట్ల తెలుగునాట బహుళామోదం లభిస్తున్నందుకు సంతోషం.

**కార్యనిర్వహణాధికారి,**

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

## అనువాదకులు

డా॥ అమరేంద్ర - 10 వ స్కంధం - ఉత్తరభాగం (1-535 పద్యములు)

శ్రీ డి. నాగసిద్ధారెడ్డి - 10 వ స్కంధం - ఉత్తరభాగం (536-1342 పద్యములు)

డా॥ ప్రసాదరాయ కులపతి - (ఏకాదశ స్కంధము)

శ్రీ టి. భాస్కర రావు (స్ఫూర్తి శ్రీ) - (ద్వాదశ స్కంధము)

# పోతన భాగవతము

**అనువాదకులు** | **స్కంధములు**

**మొదటి సంపుటము**

| | | | |
|---|---|---|---|
| 1. | డా॥ జంధ్యాల పాపయ్య శాస్త్రి | --- | ప్రథమ స్కంధము |
| 2. | డా॥ సముద్రాల లక్ష్మణయ్య | --- | ద్వితీయ స్కంధము |
| 3. | డా॥ ఆశావాది ప్రకాశరావు | --- | తృతీయ స్కంధము |

**రెండవ సంపుటము**

| | | | |
|---|---|---|---|
| 4. | శ్రీ శనగన నరసింహస్వామి | --- | చతుర్థ స్కంధము |
| 5. | డా॥ సర్వోత్తమరావు | --- | పంచమ స్కంధము |
| 6. | శ్రీ తలమర్ల కళానిధి | --- | షష్ఠ స్కంధము |

**మూడవ సంపుటము**

| | | | |
|---|---|---|---|
| 7. | శ్రీ జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రి | --- | సప్తమ స్కంధము |
| 8. | శ్రీ జి. చెన్నయ్య | --- | అష్టమ స్కంధము |
| 9. | డా॥ బి. భాస్కర చౌదరి | --- | నవమ స్కంధము |

**నాల్గవ సంపుటము**

| | | | |
|---|---|---|---|
| 10. | డా॥ ఎక్కిరాల కృష్ణమాచార్య | --- | దశమ స్కంధము (పూర్వభాగం 1- 725 పద్యములు) |
| 11. | శ్రీమాన్ ముదివర్తి కొండమాచార్యులు | --- | దశమ స్కంధము (పూర్వభాగం 726 - 1791 పద్యములు) |

**ఐదవ సంపుటము**

| | | | |
|---|---|---|---|
| 12. | డా॥ అమరేంద్ర | --- | దశమస్కంధము - ఉత్తరభాగము ( 1- 535 పద్యములు) |
| 13. | శ్రీ డి. నాగసిద్ధారెడ్డి | --- | దశమస్కంధము - ఉత్తరభాగము (536 - 1342 పద్యములు) |
| 14. | డా॥ ప్రసాదరాయ కులపతి | --- | ఏకాదశ స్కంధము |
| 15. | శ్రీ టి. భాస్కర రావు (స్ఫూర్తిశ్రీ) | --- | ద్వాదశ స్కంధము |

# ప్రవేశిక

## *( 1 వ పద్యం నుండి 535 వ పద్యం వరకు )*

అభిజ్ఞ రసజ్ఞులకు అభివాదాలు. ఇప్పుడు తమ చేతిలో ఉన్న గ్రంథం పోతన భాగవతం దశమస్కంధంలోని ఉత్తరభాగం.

గరుడ మహాపురాణంలో భాగవత ప్రశస్తి ఈవిధంగా పేర్కొన బడింది-

**అర్థోఽయం బ్రహ్మసూత్రాణాం భారతార్థ వినిర్ణయః,**
**గాయత్రీ భాష్యరూపోఽసౌ వేదార్థ పరిబృంహితః.**
**పురాణానాం సారరూపః సాక్షాద్భగవదోదితః**
**ద్వాదశ స్కంధ సంయుక్తః శతవిచ్ఛేద సంయుతః,**
**గ్రంథోఽష్టాదశ సాహస్రః శ్రీమద్భాగవతాభిధః.**

ఈ భాగవతం బ్రహ్మసూత్రాల పరమార్థం. భారతార్థాన్ని నిర్ణయం చేసే గ్రంథం. గాయత్రీ మహామంత్రానికి ఇది భాష్యం. వేదార్థ పరిపోషకం. సమస్త పురాణాల సారం. సాక్షాత్ భగవత్స్వరూపుడైన శుకమహర్షిచే ప్రోక్తం. ఈ మహాగ్రంథం ద్వాదశ స్కంధాలతో కూడింది. నూరు పరిచ్ఛేదాలు కలది. పద్దెనిమిది వేల శ్లోకాలతో నిండింది. ఈ మహాగ్రంథం పేరు శ్రీ మద్భాగవతం.

**"రాగములు గూర్చె కాకర్ల త్యాగరాజు;**
**గుడులు కట్టించె కంచెర్ల గోపరాజు;**
**పుణ్యకృతి చెప్పె బమ్మెర పోతరాజు;**
**రాజు లీ మువ్వురును భక్తి రాజ్యమునకు."**

అన్నట్లు పుణ్యపురుషుడైన పోతన్నగారు ఈ పుణ్యకృతిని తెనుగుచేశారు,.

పోతన్నగారు ప్రారంభంలోనే "నా పూర్వపుణ్య వశంవల్ల నన్నయ తిక్కనాది మహాకవులు భాగవతాన్ని తెలుగు చేయకుండా నా కోసం వదలి పెట్టారు. ఈ మహాగ్రంథాన్ని తెలుగుచేసి నా జన్మ సార్థకం చేసుకుంటాను'' అన్నారు. ఆయన పుణ్యం వల్ల మహాభాగవతం అయనకు చిక్కింది; మనపుణ్యం వల్ల పోతన భాగవతం మనకు దక్కింది.

ఈ భాగంలో ప్రద్యుమ్నాభ్యుదయం, శ్యమంతకోపాఖ్యానం, సత్యభామాపరిణయం, నరకాసుర సంహారం, ఉషాకల్యాణం, బాణాసుర గర్వభంగం, నృగమహారాజ చరిత్రం, పౌండ్రక వాసుదేవ వధ అనే కథాఘట్టాలు ఉన్నాయి.

శంబరాసురుణ్ణి సంహరించి రతి సహితుడై ద్వారకా నగరానికి చేరుకున్న ప్రద్యుమ్నుణ్ణి చూచి అంతఃపురకాంతలు పొందిన కలవర పాటును చిన్న పద్యంలో ఎంతో మిన్నగా వర్ణించారు పోతన్నగారు. చిత్తగించండి-

**హరి యని వెనుచని పిదపన్**
**హరిఁబోలెడు వాఁడు గాని హరి గాఁడనుచున్**
**హరిమధ్య లల్లనల్లన**
**హరి నందను డాయవచ్చి రాశ్చర్యమునన్.** **10 ఉ.28**

ఎప్పుడో చిన్నప్పుడు తప్పిపోయిన పిల్లవాడు పెరిగి పెద్దవాడై కంటబడితే కన్న తల్లి గుండెల్లో ప్రేమానురాగాలు పెల్లుబుకుతాయి. తన "తొలుచూలి పాపనికి బోర్లాడించి చన్నిచ్చి" నిద్రపోతుంటే ఏ పాపాత్ముడో వచ్చి(శంబరాసురుడు) ఎత్తుకపోయాడు. ఆ బాలుడు ఇప్పటిదాకా బ్రతికి ఉంటే ఇంతవాడై ఉండేవాడు అనుకుంటుంది ప్రద్యుమ్నుణ్ణి తిలకించిన రుక్మిణీదేవి.

**ఇందాక వాఁడు బ్రతికిన**
**సందేహము లేదు; దేహ చాతుర్య వయ**
**స్సౌందర్యంబులు లోకులు**
**వందింపఁగ నితనియంతవాఁడగుఁ జుమ్మీ!** **10 ఉ. 33**

కమనీయమైన కన్నతల్లి కామనకు కమ్మని ప్రతిబింబం ఈ పద్యం. ప్రతిభాషకీ కొన్ని ప్రత్యేకమైన భావ వ్యక్తీకరణ పద్ధతులు ఉంటాయి. "మా తమ్ముడు" అనటానికి బదులుగా "మా వాడు" అని అనటం మన తెలుగువాళ్ల సంప్రదాయం. వేటకు వెళ్లిన ప్రసేన జిత్తు ఎంతకీ తిరిగి రానందుకు చింతిస్తూ సత్రాజిత్తు-

**"మణి కంఠంబునఁ దాల్చి నేఁ డడవిలో మావాఁడు వర్తింపఁగా**
**మణికై పట్టి వధించినాఁడు; హరికిన్ మర్యాద లేదు............"** **10 ఉ. 58**

అని కృష్ణుణ్ణి నిందిస్తాడు. పోతన్నగారి తెలుగు మర్యాదవిధానానికి పై పద్య పంక్తులలోని "మా వాఁడు" అన్నమాట ఉదాహరణం.

సత్రాజిత్తు పలుకులకు స్పందించిన గోవిందుడు **"ఏ వ్రణమున్ నా యెడ లేదు; నింద గలిగెన్; వారించు టేరీతియో?"** అని అనుకోవటం కూడా తెలుగుదనాన్ని స్ఫురింప జేస్తుంది.

అలాగే పశ్చాత్తప్త చిత్తుడైన సత్రాజిత్తు-

**"మణిని గూఁతు నిచ్చి మాధవు పదములు పట్టు కొంటి నేని బ్రతుకు గలదు."** **10 ఉ. 79**

అని నిశ్చయించుకోవటంలో సైతం తెలుగువారి తీరు తియ్యాలు కనిపిస్తాయి

ఒకే పదాన్ని భిన్నార్థాలతో పదే పదే ప్రయోగించటం పోతన్న గారికి అభీష్టమైన విలక్షణ లక్షణం.

**రాజునగరి యడబాలలు**
**రాజీవము కడుపు వ్రచ్చి రాజనిభాస్యున్**
**రాజశిశువు గని చెప్పిరి**
**రాజీవ దళాక్షియైన రతికి నరేంద్రా!** **10 ఉ.7**

అన్నప్పుడు-

**మణి యిచ్చినాఁడు వాసర**
**మణి; నీకును మాకుఁ గలవు మణులు; కుమారీ**
**మణి చాలు నంచు కృష్ణుఁడు**
**మణి సత్రాజిత్తునకును మరలఁగ నిచ్చెన్.** **10 ఉ. 82**

అన్నప్పుడు-

**నారి మొరయించె రిపు సే**
**నారింఖణ హేతువైన నాదము నిగుడన్**
**నారీమణి బలసంప**
**న్నారీభాదికము మూర్ఛనంద నరేంద్రా!** **10 ఉ. 176**

అన్నప్పుడు-

**మగువ మగవారి ముందఱ**
**మగతనములు సూప రణము మానుట నీకున్**
**మగతనము గాదు; దనుజులు**
**మగువల దెసఁ జనరు మగల మగ లగుట హరీ!** **10 ఉ. 189**

అన్నప్పుడు ఈ విధమైన పదప్రయోగ నైపుణ్యం గోచరిస్తుంది.

పాత్రల స్వరూప స్వభావాలను చక్కగా ఆకళించుకొని చిక్కగా ప్రకటించటం పోతన్న గారి ప్రత్యేకత. శ్రీకృష్ణుడు ఇంద్రప్రస్థనగరానికి వచ్చి పాండవులను పలుకరించిన సందర్భం పరికించండి-

**"వా రఖిలేశ్వరుండైన హరిం గౌఁగిలించుకొని కృష్ణుని దివ్యదేహ సంగమంబున నిర్ధూత కల్మషులై యనురాగహాస విభాసితంబైన ముకుంద ముఖారవిందంబు సందర్శించి యానందంబు నొందిరి. గోవిందుండును యుధిష్ఠిర భీమసేనుల చరణంబులకు నభివందనములు చేసి, యర్జును నాలింగనంబున సత్కరించి, నకుల సహదేవులు మ్రొక్కిన గ్రుచ్చియెత్తి యుత్తమపీఠంబున నాసీనుండై యుండె."** **10 ఉ.103**

కృష్ణుడు తనకంటె పెద్దవాళ్లు కావటం వల్ల ధర్మరాజుకీ భీముడికి పాదనమస్కారం కావించాడు. తనతో సమాన వయస్కుడు కావటంవల్ల అర్జునుణ్ణి ఆలింగనం చేసుకున్నాడు. తనకన్న చిన్నవాళ్లు కనుక ప్రణమిల్లిన నకులుణ్ణీ సహదేవుణ్ణీ ఆదరంతో లేవనెత్తాడు. అనంతరం క్రొత్త పెండ్లికూతురైన ద్రౌపది కొంచెం సిగ్గు పడుతూ కృష్ణుడికి మ్రొక్కిందట. ఆపైన కృష్ణుడు కుంతీదేవి వద్దకు వెళ్లి నమస్కరించి ఇలా అన్నాడు.

**అత్తా! కొడుకులు కోడలు**
**చిత్తానందముగ పనులు సేయఁగ నాత్మా**
**యత్తానుగవై యాజ్ఞా**
**సత్తాదులు గలిగి మనుదె సమ్మోదమునన్?** **10 ఉ. 106**

“అత్తయ్యా! నీ కొడుకులూ, కోడలూ, నీకు నచ్చిన విధంగా, నీవు మెచ్చిన విధంగా పనులు చేస్తున్నారా? చేయవలసిన పనులుచెబుతూ సంతోషంగా ఉంటున్నావు కదా! “అన్న మేనల్లుడి మాటలకు అ మేనత్త “ప్రేమ విహ్వలత నందుచు గద్గద భాషణంబులం గనుఁగవ నశ్రుతోయములు గ్రమ్మగ’’ సముచితంగా సంభాషించింది.

లోకకంటకుడైన నరకాసురుడిపైకి యుద్ధానికి సిద్ధమై వెళుతున్న శ్రీకృష్ణుణ్ణి చేతులు మోడ్చి ఇలా వేడుకుంటుంది సత్యభామ.

**దేవా! నీవు నిశాటసంఘముల నుద్దీపించి చెండాడ నీ**
**ప్రావీణ్యంబులు సూడఁగోరుదు గదా ప్రాణేశ! మన్నించి న**
**న్నీ వెంటం గొనిపొమ్ము, నేఁడు కరుణన్, నేఁజూచి యేతెంచి నీ**
**దేవీసంహతి కెల్లఁ జెప్పుదు భవద్దీప్తప్రతాపోన్నతుల్.** **10 ఉ.151**

భార్య సమరరంగానికి వస్తానంటే ఏ భర్తా నమ్మతింపడు. అందు వల్ల సంభాషణాచతుర అయిన సత్యభామ “స్వామీ! సంగ్రామసీమలో మీ వీరవిజృంభణాన్ని వీక్షించాలని కుతూహలంగా ఉన్నది. అంతేకాదు తిరిగి వచ్చిన తరువాత మీ ప్రతాపప్రాభవాన్ని నా సపత్ను లందరికీ వివరించి చెబుతాను’’ అని కాదనటానికి వీలులేని విధంగా అడిగింది. అయితే అందుకు అంత అనాయాసంగా అంగీకరిస్తాడా ఆ సత్యభామాధవుడు! అయన ఆమెను వద్దని ముద్దుముద్దుగా ఇలా వారించాడు.

**సమద పుష్పంధయ ఝంకారములు కావు**
**భీషణ కుంభీంద్ర బృంహితములు;**
**వాయు నిర్గత పద్మవన రేణువులు కావు**
**తురగరింఖా ముఖోద్ధూత రజము;**
**లాకీర్ణ జలతరంగాసారములు కావు**
**శత్రు ధనుర్ముక్త సాయకములు;**
**కలహంస సారస కాసారములు కావు**
**దనుజేంద్ర సైన్య కదంబకములు;**
**కమల కల్హార కుసుమ సంఘములు కావు**
**చటుల రిపు శూల ఖడ్గాది సాధనములు;**
**కన్య! నీ వేడ! రణరంగ గమన మేడ?**
**వత్తు వేగమ; నిలుపుము; వలదు వలదు.** **10 ఉ. 153**

సమానమైన సీసపద్యపాదాలలో సత్యభామప్రస్తుత పరిస్థితినీ, సమర రంగపు భీషణస్థితిగతినీ సరిసమానంగా వర్ణించి కళ్లకు కట్టించారు పోతన్నగారు. మొదటి పాదాలలో పరుషమైన సంస్కృత సమాసాలనీ ప్రయోగించి రచనలోనే గొప్ప వైచిత్ర్యం ప్రదర్శించారు. చిట్టచివరకు తేటతెలుగు పలుకులతో ‘త్వరగా

తిరిగి వస్తాను. ఆగిపో. రావద్దు' అని తేల్చి వేయటం ఆమెను బుజ్జగించే ధోరణికి అనుకూలంగా ఉన్నది.

**కొందఱకు తెనుఁగు గుణమగు**

**కొందఱకును సంస్కృతంబు గుణ మగు; రెండుం**

**గొందఱకు గుణము లగు; నే**

**నందఱ మెప్పింతు కృతుల నయ్యై యెడలన్.**

అన్న సహజపాండిత్యుని శపథం ఇక్కడ మనకు గుర్తుకు వస్తుంది.

యుద్ధభూమికి రాకుండా ఉద్యానభూమిలోనే ఉండమంటున్న కృష్ణుడితో సద్యస్స్ఫూర్తి గల సత్య-

**"దానవులైన నేమి! మఱి దైత్యసమూహములైన నేమి! నీ**

**మానిత బాహుదుర్గముల మాటున నుండఁగ నేమి శంక?............''** 10 ఉ. 155

అని చేతులు జోడించింది. ఆ వీరనారిని అనురాగంతో అవలోకించి వెంట బెట్టుకొని గరుత్మంతుణ్ణి అధిరోహించాడు శ్రీకృష్ణుడు.

**"శుంభద్రాజబింబోపరిస్థల శంపాన్విత మేఘమో!"**

అన్నట్లు గరుడారూఢుడై సత్యభామతో సంభాషిస్తున్న శ్రీకృష్ణుడు ఉన్నాడట. ఎంత చక్కని ఉత్ప్రేక్ష!

భర్తతో యుద్ధానికి సన్నద్ధు డౌతున్న నరకాసురుణ్ణి చూచి ఏ మాత్రం కలవరపడకుండా కేశపాశం ముడివేసి, నడుం బిగించి లేచి నిలచిన వీరనారి సాత్రాజితిని పోతన్నగారు ఎలా దర్శించారో గమనించండి.

**వేణిన్ జొల్లెము వెట్టి సంఘటిత నీవీబంధయై భూషణ**

**శ్రేణిం దాల్చి ముఖేందు మండల మరీచీజాలముల్ పర్వఁగా**

**పాణిం బయ్యెద చక్కఁగా ఁదుఱిమి శుంభద్వీరసంరంభయై**

**యేణీలోచన లేచి నిల్చె తన ప్రాణేశాగ్ర భాగంబునన్.** **10 ఉ. 170**

ఇందులో "పాణిం బయ్యెద చక్కగా తుఱిమి'' అన్న పదగుంఫన లోకపరిశీలనా దృష్టి ఎంత నిశిత మైనదో వ్యక్తం చేస్తుంది. సమర్థుడైన వడ్డాది పాపయ్యగారివంటి చిత్రకారుడికి వెంటనే పని కల్పించే చలత్సౌందర్య చిత్రణం ఇది. ఈ సందర్భంలోనే పోతన్నగారి అమృత లేఖిని నుండి జాలువారిన మరొక అద్భుతమైన పద్యాన్ని అవలోకించండి-

**పరుఁ జూచున్ వరుఁ జూచు నొంప నలరింపన్ రోషరాగోదయా**

**విరత భ్రూకుటి మందహాసములతో వీరంబు శృంగారమున్**

**జరగం గన్నులఁ గెంపు సొంపుఁ బరఁగం జండాస్త్రసందోహమున్**

**సరసాలోక సమూహమున్ నెఱపుచుం జంద్రాస్య హేలాగతిన్.** **10 ఉ. 178**

ఆమె నరుకుణ్ణి చూస్తున్నది. నాథుణ్ణీ చూస్తున్నది. అయితే ఆ చూపుల్లో తేడా ఉన్నది. పరుణ్ణి చూచే చూపు సంతాపింప జేస్తున్నది. పరుడిపైన రోషం, విరత భ్రూకుటి, వీరం, కెంపు చండాస్త్ర సందోహం ప్రదర్శిస్తున్నది. వరుడి పైన రాగోదయం, మందహాసం, శృంగారం, సొంపు, సరసాలోక సమూహం ప్రసరిస్తున్నది. పూర్తిగా పరస్పర విరుద్ధమైన అంశాలను మేళవించి రసికరసాయనంగా అందించారు పోతన్నగారు. ఈ పద్యం "అరిఁ జూచున్ హరిఁజూచు" అన్న నాచనసోమన్నగారి పద్యం కన్న ఎంతగానో అందగించింది.

ఈ క్రింది పద్యంలోని రూపకాలంకాల సమలంకరణ సౌభాగ్యాన్ని సమీక్షించండి-

**జ్యావల్లీధ్వని గర్జనంబుగ, సురల్ సారంగ యూథంబుగా,**
**నా విల్లింద్రశరాసనంబుగ, సరోజాక్షుండు మేఘంబుగా,**
**తా విద్యుల్లత భంగి నింతి సురజిద్దావాగ్ని మగ్నంబుగా,**
**ప్రావృట్కాలము సేసె బాణచయ మంభశ్శీకరశ్రేణిఁగాన్.** **10 ఉ. 182**

నారిధ్వని అను ఉరుముతోనూ, దేవతలు అనే చాతక సమూహంతోనూ, విల్లుఅనే ఇంద్రధనుస్సుతోనూ, కృష్ణుడు అనే నీలిమబ్బుతోనూ, సత్యభామ అనే మెఱుపుతీగతోనూ, రాక్షసులు అనే దావాగ్నితోనూ, శర పరంపర అనే వర్షధారతోనూ ఆ సమరసమయం వర్షాసమయంగా మారి పోయిందట.

సత్య వదనం హరికి రాకేందు బింబంగానూ, అరికి రవిబింబం గానూ కనపడింది. సత్య చేలాంచలం హరికి కందర్ప కేతువుగానూ, అరికి ఘన ధూమకేతువుగానూ దర్శన మిచ్చింది. సత్యధనుస్సు హరికి భావజు పరిధిగానూ, అరికి ప్రళయార్కు పరిధిగానూ ప్రత్యక్షమైంది. సత్య సందర్శనం హరికి అమృత ప్రవాహంగానూ, అరికి అనల సందోహంగానూ అనిపించింది. సత్య బాణవృష్టి హరికి హర్షదాయిగానూ, అరికి మహారోషదాయిగానూ సాక్షాత్కరించింది.. శృంగార వీరరసాల సరస సమన్వయం ఈ క్రింది సీసపద్యంలో చోటుచేసికొన్నది. ఆచార్య క్షేమేంద్రుడు చెప్పిన రస సంకరౌచిత్యానికి ఎత్తిన పతాక ఈ పద్యం. ఇది అమూలకం.

**రాకేందు బింబమై రవిబింబమై యొప్పు**
**నీరజాతేక్షణ నెమ్మొగంబు;**
**కందర్ప కేతువై ఘనధూమకేతువై**
**యలరు పూఁబోడి చేలాంచలంబు;**
**భావజు పరిధియై ప్రళయార్కు పరిధియై**
**మెఱయు నాకృష్ణమై మెలఁతచాప;**
**మమృత ప్రవాహమై యనల సందోహమై**
**తనరారు నింతి సందర్శనంబు;**
**హర్షదాయియై మహారోషదాయియై**
**పరగు ముద్దరాలి బాణవృష్టి;**

**హరికి నరికి చూడ సందంద శృంగార**

**వీరరసము లోలి విస్తరిల్ల.** **10 ఉ. 183**

మాటల్లో విరుపుపెట్టి మహార్థాన్ని సాధించటం మన మహాకవికి మంచినీళ్ల ప్రాయం.

**లేమా! దనుజుల గెలువఁగ**

**లేమా? నీవేల కడగి లేచితి? విటురా**

**లే! మాను! మానవేనిన్**

**లేమా! విల్లంది కొనుము లీలం గేలన్.** **10 ఉ. 172**

ఈ పద్యం వంపుసొంపులలో మొదటి పాదంలో పౌరుషం, రెండవ పాదంలో సందేహం. మూడవ పాదంలో నిషేధం, నాల్గవ పాదంలో అంగీకారం స్ఫురిస్తున్నాయి. ఇలాంటిదే ఇంకొక అందమైన కందం-

**కొమ్మా! దానవనాథుని**

**కొమ్మాహవమునకుఁ దొలఁగె, గురు విజయము గై**

**కొమ్మా! మెచ్చితి నిచ్చెద**

**కొమ్మాభరణములు నీవు కోరిన వెల్లన్.** **10 ఉ. 187**

ఇవే కాకుండా "బొమ్మ పెండ్లిండ్లకు పోనొల్ల నను బాల", "వీణచక్కఁగఁబట్ట వెర వెఱుంగని కొమ్మ", "సౌవర్ణ కంకణ ఝణ ఝణ నినదంబు" - ఇవన్నీ మూలంలో లేని పోతన్న గారి సొంత పద్యాలే.

ఇక శ్రీకృష్ణుని సందర్శించిన పాండవులు"ప్రాణంబుం గనిన యింద్రియముల భంగి" ఉన్నారన్నప్పుడు, నాగ్నజితి స్వయంవర సందర్భంలో అడ్డు వచ్చిన శత్రువులను అర్జునుడు "శశకంబుల సింహము చంపు కైవడి" చంపినా డన్నప్పుడు, బాణాసురుడి బారి నుండి అనిరుద్ధుణ్ణి కాపాడటానికి యాదవసైన్యాలు కృష్ణుని వెంట "భగీరథు రథము వెనుక ననుగమించు వియన్నది ననుసరించి" వస్తున్నా యన్నప్పుడు, వాసుదేవుడి సుదర్శన చక్రంవల్ల పౌండ్రకుడు "కులిశాహతిన్నొరగు శైలేంద్రాకృతిన్" నేలకూలాడన్నప్పుడు, ఉపమాలంకారం ఉప్పొంగి పోయింది.

నరకాసురుడు చెరసాలలో చింతాక్రాంతలై కాలం గడుపుతున్న కాంతలు పదహారువేలమందీ తమను చెర విడిపించిన శ్రీకృష్ణుడి దివ్య మంగళ స్వరూపాన్ని తిలకించి ఇలా పులకించిపోయారట-

**వనజాక్షి! నేఁ గన్క వై జయంతిక నైన**

**కదసి వ్రేలుదుగదా కంఠ మందు;**

**బింబోష్ఠి! నేఁ గన్క పీతాంబరము నైన**

**మెఱసి యుండుదు గదా మేను నిండ;**

**కన్నియ! నేఁ గన్క కౌస్తుభమణి నైన**

**నొప్పు చూపుదుగదా యురము నందు;**

**బాలిక! నేఁ గన్కఁ బాంచజన్యము నైన**
**మొనసి చొక్కుదు గదా మోవిఁగ్రోలి;**
**పద్మగంధి! నేను బర్హదామము నైన**
**చిత్రరుచుల నుందు శిరము నందు;**
**ననుచు పెక్కు గతుల నాడిరి కన్యలు**
**గములు గట్టి గరుడగమునుఁ జూచి.** **10 ఉ. 212**

జాగ్రత్తగా పరిశీలిస్తే ఇవన్నీ పరవశించిన పోతన్న గారి భావాలే అనిపిస్తాయి. ఈ సందర్భంలోనే మనం రెండు విషయాలు గుర్తించాలి. ఒకటి లోకకంటకుడైనప్పుడు కన్నకొడుకునైనా సరే కనికరింపక సంహరిస్తాననే శ్రీకృష్ణుని భగవత్తత్త్వం. రెండవది నరకుడు చెరపట్టిన కన్య లందరినీ తాను వివాహమాడి సంఘంలో వారికి సమున్నతస్థానము కల్పించిన మాధవుడి మహోదార స్వభావం. ఇక పోతన్న గారికి ఎంతో ఇష్టమైన అంత్యానుప్రాసల విలాసం ఈ క్రింది పంక్తుల్లో లాస్యం చేస్తుంది.

"ప్రభాత్త దిగంతము నా స్యమంతమున్."
"దుర్గన్ గృతకుశలమార్గం దోషిత భర్గన్."
"భామామనోహారికిన్ దనుజాధీశ విదారికిన్ హరికిన్."
"చక్రముం బరిహతదైత్య చక్రముఁ బ్రభాచయ మోదిత దేవశక్రమున్".
"హలిచే నాశ్రిత నిర్జర ఫలిచేఁ ద్రైలోక్య వీరభటగణ బలిచేన్."
"తపనుని బాలికన్ మదన దర్పణ తుల్య కపోలపాలికన్."
"మిత్రవిందను నిత్యాపూరిత సుజనానందన్ చారుచికుర కాంతి విజిత షట్పదబృందన్."
"వృషభంబులఁ బర్వత సన్నిభంబులన్."
"అరిగర్వ విమోచనుఁ బద్మలోచనున్."
"సమద మృగేక్షణన్ నయవిచక్షణ లక్షణఁ బుణ్యలక్షణన్."
"పాంచజన్యము విముక్త ప్రాణిచైతన్యమున్."
"ధాత్రీజనమాన్యలన్ గుణవతీ వ్రతధన్యల రాజకన్యలన్."
"చేతోధనచోరు రత్నమకుట స్ఫారున్ మనోహారునిన్."
"త్రిజగదభిరామ గుణధామ చారుసత్యభామ సత్యభామ."
"సద్ధర్మచారిణి విశ్లేషిణి వీతతోషిణి పురంధ్రీగ్రామణిన్ రుక్మిణిన్."
"ఖగవాహున్ రుచిరదేహుఁ గలితోత్సాహున్."
"అతిమృదువాణికిం గిసలయారుణ పాణికి నీలవేణికిన్."
"జితారిన్ హారిన్ సన్నుతసూరిన్ సీరిన్ రైవత సుతార్ద్ర చిత్త విహారిన్."
"సగణ స్థాణున్ నిర్దళితాసమబాణున్ దాండవధురీణు భక్తత్రాణున్."

"శిశిరకర చారు రుచిరేఖ చిత్రరేఖ."

"వనధిగభీరు నుదారుని ననిరుద్ధకుమారు విదళితాహితవీరున్."

"కలిత పరిశుద్ధు నఖిలలోకప్రసిద్ధు చతురు ననిరుద్ధు నంగనాజన నిరుద్ధు."

"జనసంతాప నివారకన్ సుజనభాస్వత్తారకన్ ద్వారకన్."

"నిన్నుఁ జూడగంటి నీ కృప కనుఁగొంటి నఖిల సౌఖ్యపదవు లందఁగంటి."

**కవి వ్యక్తిత్వ ముద్రను భద్రపరచుకొన్న ఈ క్రింది సూక్తుల సౌందర్యాన్ని సందర్శించండి-**

"అన్యుల యాచింపరు రాజన్యులు."

"తరుణులు పెక్కంద్రయినను, పురుషుఁడు మనలేఁడు సవతిపోరాటమునన్."

"ఎఱుక వలదె! నిర్జరేంద్రత కాల్పనే!"

"సిరియును వంశము రూపము సరియైన వివాహ సఖ్యసంబంధంబుల్ జరుగును."

"ఎద్దు క్రొవ్వి పెలుచ న్నాబోతుపై ఱంకె వైచిన చందంబు."

"పలుకుల తన్నుతా పొగడ పాతక మందురు."

"గుణహీనజనుల తగునే తగులన్?"

"తల్లి వచనంబు కూఁతున కభిమతంబు గాదె!"

"వనజాసను కృతము గడచువా రెవ్వ రిలన్?"

"విప్రతతి సొమ్ము కంటెను విషము మేలు."

"మఱపున ననలము ముట్టిన దరికొని వెసఁగాల్పకున్నె తను వెరియంగన్."

"తను నమ్మినవారి విడువఁదగునే హరికిన్?"

చదివిన కొలదీ చవులూరించే జాతీయాలు కుప్పలు తెప్పలుగా కనువిందు కావిస్తాయి ఈ సంపుటంలో. చిత్తగించండి. నోచికాంచిన తల్లి, చన్నులు సేపు, బోర్కాడించు, చన్నిచ్చి నిద్రించు, గుండెల్ జల్లను, ఈ దేహము గాల్పనే, పదివేలు వచ్చె, గ్రుచ్చియెత్తి, క్రొత్త పెండ్లి కూఁతురు, కాలుద్రవ్వు, ముత్తునియలు, తిల లంతలు, బొమ్మపెండ్లిండ్లు, మగతనములు, పువ్వులు కురియు. గములు గట్టి, అడుగులొత్తు. దొడ్డుగ జూచు, చెక్కిట చెయ్యిచేర్చు, మోమరవాంచు, చిత్త మిగురొత్తు, నవ్వులకు నాడిన మాటలు, కోరిక లీరిక లెత్తు, పిల్లచెఱకీనిన కైవడి, తామర తంపర, చూపోపక, ఎకసక్కెము, కికురించు, మొగమోటము, పెట పెట పండ్లు కొఱుకు, కన్నుల నిప్పులుప్పతిల్లు, చెవులకు ములుకులు, ముఖంబున వ్రేలినయట్లు, కళవళమందు, సన్న లేఁజెమట, తొంగలి ఱెప్పలు, కన్నీటి వఱద, నునుసిగ్గు, కన్నీరు మున్నీరు, గుజ గుజ వోవు, చిందఱ వందఱ, కాందిశీకులు, మఱుఁగు సొచ్చు, ఎదురెదురే చూచు, అచ్చున నొత్తు; రింగులు వాఱు; గుండె లవియు, మిఱుమిట్లు గొలుపు, ఖణిల్లని ఱంకెవైచు, పీనుంగు పెంటలు, నెత్తుటజొత్తిలు, చక్కాడు, అల్లననవ్వు, ఏ దిక్కుగానక, కోయని యార్చు. తనయాడు గోపకుమారులు, చే చఱచు, ఒకానొక వేళ, సిగ్గువో దట్టు, పొరపొచ్చెము- ఇటువంటి తీయతీయని జాతీయాలు మన కవీంద్రుడి సహజపాండిత్యానికి నిదర్శనాలు.

